కృష్ణా పుష్కరాలు
**2016**

# కృష్ణాతీరం

చరిత్ర - సంస్కృతి - సమాజం




సంపాదకులు :

డా॥ జి. వి. పూర్ణచందు

పర్యవేక్షక సంపాదకులు :

డా॥ దీర్ఘాసి విజయభాస్కర్





**ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ**

ప్రచురణ

# కృష్ణాతీరం

(చరిత్ర - సంస్కృతి - సమాజం)

2016 కృష్ణా పుష్కరాల సందర్భంగా ప్రచురణ

సంపాదకులు

**డా॥ జి.వి. పూర్ణచందు**

పర్యవేక్షక సంపాదకులు

**డా ॥ దీర్ఘాసి విజయభాస్కర్**

వెల : రూ. **800/-**

**ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ**
ఘంటసాల వేంకటేశ్వరరావు ప్రభుత్వ సంగీత నృత్య కళాశాల ప్రాంగణం,
దుర్గాపురం, విజయవాడ.

**Printed at :**
**Ravella Offset & Chaitanya Offset,**
**Vijayawada.**

# కృష్ణాతీరంలో...

## నదీ ప్రశస్తి



## చరిత్ర

## ఆధ్యాత్మికం

## తెలుగు భాష



## సామాజికం

## సాహిత్యం

# శాస్త్ర సాంకేతిక రంగం



# సాంస్కృతిక రంగం



# ప్రముఖులు

# ప్రత్యేక వ్యాసాలు

# పరిశోధనా తృష్ణను తీర్చే ఉద్గ్రంథం కృష్ణాతీరం

*డా ॥ దీర్ఘాసి విజయభాస్కర్,*

*సంచాలకులు, ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ*

సంస్కృతి అనేది కదంబవృక్షం. కళల సమూహంతో శాఖలుగా వెలుగులీనుతూ విస్తరించి ఉంటుంది. రాగాలు, అనురాగాలు, చేతనావృతాలు, చేతనావర్తనాలతో గంధబంధురంగా ఒప్పుతుంది. కళల గలగలలతో పారే కృష్ణమ్మ ఒడిలో ఈ కదంబవనం కళలూరుతూ రాగరంజితంగా విలసిల్లుతుంటుంది..

భారతీయ పరంపరకు సంస్కృతి ఒక ప్రతిబింబం. పరంపరాగతమైన సాహితీ సాంస్కృతిక ధార కృష్ణాజలధారలా నిరంతరంగా నిరాఘాటంగా సాగుతూనే ఉంది.

తెలుగు వారి సంస్కృతి ఈ దేశపు అతిప్రాచీన సంపదల్లో ఒకటి. సహజీవనం, సమీప వర్తిత్వాల కారణంగా తెలుగు మరియు సంస్కృత భాషా పరివ్యాప్తమైన సంస్కృతుల మధ్య ఆదాన ప్రదానాలు రెండూ జరిగాయి. తెలుగులో కనిపించే ఒక సంస్కృతపదం తెలుగులోంచి సంస్కృతానికి వెళ్ళినదా లేక సంస్కృతంలోంచి తెలుగులోకి వెళ్ళినదా అనే ప్రశ్న ఇప్పుడు పండితుల్లో చర్చనీయాంశంగా ఉంది. ఇది తెలుగు భాష ప్రాచీనతను చాటుతున్న విషయం. తెలుగువారికి గర్వకారణం కూడా!

ఈ పుస్తకం పూర్తికావస్తున్న తరుణంలో 2016 ఆగష్టు 8న తెలుగు కన్నడ భాషలకు ప్రాచీనతా హోదా ఇవ్వటానికి ఇన్నాళ్ళూ అవరోధంగా ఉన్న ఒక కేసును చెన్నై హైకోర్టు కొట్టివేసిన వార్త వెలువడింది. ఈ తీర్పు ద్వారా తెలుగు కన్నడ భాషలు అత్యంత ప్రాచీన భాషలుగా నిర్ధారణ అయ్యాయి. అంతేకాదు, ఈ తీర్పుతో వెయ్యేళ్ళ ప్రాచీనత కలిగిన భాషగా తమిళాన్ని, పదేనువందల యేళ్ళ ప్రాచీనత కలిగిన భాషగా సంస్కృతాన్ని, రెండు వేల యేళ్ళు ప్రాచీనత కలిగిన భాషగా తెలుగు కన్నడ భాషలను చెన్నై హైకోర్టు నిర్ధారించి నట్టయ్యింది. ఈ కేసులో ఒక కక్షిదారుగా ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ తనవంతు బాధ్యతను నెరవేర్చింది.

విజయవాడ, తిరుపతి, విశాఖపట్టణాలలో వారాంత కార్యక్రమాలు నిర్వహిస్తూ కళలకు, కళాకారులకూ ప్రభుత్వ ఆదరణలో కొరత లేకుండా ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ కృషి చేస్తోంది. పేద కళాకారులకు పెన్షన్ అందించటానికి ప్రథమ ప్రాధాన్యం ఇస్తోంది.

సాంస్కృతికంగా నవ్యాంధ్రప్రదేశ్ ఒక విలక్షణత కలిగిన రాష్ట్రం. ప్రాచీనాంధ్రుల రాజధాని నగరాలు విలసిల్లిన నేల ఇది. ఒక భాషకు దేవుడు ఉన్న అరుదైన అదృష్టం ఆంధ్రులది. ఆంధ్ర మహావిష్ణువు "బాసదేవర"గా కృష్ణాజిల్లా శ్రీకాకుళంలో కొలువై ఉన్నాడు. నారాయణ తీర్థులు, క్షేత్రయ్య, సిద్ధేంద్రయోగి, అల్లూరి వెంకటాద్రిస్వామి, మహనీయులకు, ప్రాతఃస్మరణీయులకు, ఎందరో సాంస్కృతిక ప్రముఖులకు పుట్టినిల్లు ఈ నేల.

నవ్యాంధ్రప్రదేశ్ రాష్ట్రానికి మరో విలక్షణత కూడా ఉంది. తుంగభద్ర, గోదావరి, కృష్ణ మూడు నదుల పుష్కరాలు ఆంధ్రప్రదేశ్‌లో ప్రధానంగా జరగటం ఒక విశేషమైతే, కృష్ణా, గోదావరి పుష్కరాలు సరిగ్గా ఒక సంవత్సరం వ్యవధిలో వెంటవెంటనే రావటం మరో విశేషం. అంతే కాదు, ఈ పుష్కర సందర్భాన్ని మహోత్సవాలుగా మార్చి, తెలుగువారి పన్నెండేళ్ళపండుగలా ప్రతిష్ఠాత్మకంగా నిర్వహించేందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పూనుకోవటం గొప్ప విషయం. ఇది దేశ ప్రజలందరూ శ్లాఘిస్తున్న అంశం.

పన్నెండేళ్ళ కొకసారి వచ్చే ఈ పుష్కరాలు తెలుగు వారి సాంస్కృతిక వైభవాన్ని దేశీయులకు గుర్తు చేస్తుంటాయి. కృష్ణాపుష్కరాలు ఆదినుండీ తెలుగువారి సాంస్కృతిక ప్రతిభను చాటేవిగానే సాగుతాయి. కృష్ణజలధార మరియు సాంస్కృతిక ధార ఒకదాని కొకటిగా పెనవేసుకుని, కృష్ణవేణి ఆంధ్రుల 'సాంస్కృతిక మాత'గా కొలువై ఉంది.

తాత్కాలికంగా ఇప్పుడు కృష్ణలో జలధార తగ్గినా ప్రాభవ వైభవాలు కలిగిన సాంస్కృతిక ధారకు కొదువ లేదు. అది నిరంతర ప్రవాహం. నిరాఘాటంగా సాగే ప్రవాహం కూడా! నీటిని బంధించగలరు గానీ, 'మేటి'ని నిలువరించలేరు కదా!

పుష్కరాలను పుష్కలం చేయాలనేది మాన్య ముఖ్యమంత్రివర్యులు గౌ. శ్రీ నారాచంద్రబాబునాయుడు గారి సంకల్పం.

అనితరసాధ్యంగా, ప్రపంచంలోనే అత్యుత్తమమైనదిగా ఈ పుష్కరాల నిర్వహణ జరగాలని, ఆంధ్రుల ప్రతిష్ఠ నిలబడాలనేది ప్రభుత్వ లక్ష్యం. ప్రభుత్వ నిర్దేశాను సారం భాష, సంస్కృతి, చరిత్ర, సమాజమూ ముఖ్యాంశాలుగా అపురూపమైన ఆకర గ్రంథాలను ప్రచురించాలని ఆంధ్రప్రదేశ్ తెలుగు భాష సాంస్కృతిక శాఖ సమాయత్తమయ్యింది.

1944 కృష్ణా పుష్కరాల సందర్భంగా స్థానిక పెద్దలు కలిసి ఆంగ్లంలో వెలువరించిన ఒక ప్రత్యేక సంచికలో కొన్ని ముఖ్యమైన వ్యాసాలను ఎంపిక చేసి, పునర్ముద్రించే ఆలోచన కూడా చేయటం జరిగింది. నిపుణులైన కొందరు పెద్దల సహకారంతో ఆ వ్యాసాలకు తాజా సమాచారాన్ని జోడించి, ఆ సంచికను ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ పక్షాన పునర్ముద్రించాము. 72 ఏళ్ళ నాటి సామాజిక పరిస్థితుల గురించి పరిశోధకులకు ఒక అవగాహన కలిగించేందుకు ఈ పునర్ముద్రణ ఎంతగానో తోడ్పడుతుందని ఆశిస్తున్నాము.

ఇదే సందర్భంలో ఇంచుమించు 225 మంది పరిశోధకుల విలువైన వ్యాసాలతో 'కృష్ణాతీరం' పేరున మరో ఉద్గ్రంథ ప్రచురణకు ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ పూనుకొంది. తెలుగు భాష, సంస్కృతి, సాహిత్యాలకు, సామాజికాంశాలకూ, శాస్త్ర సాంకేతిక రంగానికీ, నీటిపారుదల, వ్యవసాయ రంగాలకూ పెద్ద పీట వేస్తూ ఈ గ్రంథ సంకలనం సాగింది. ప్రముఖ పాత్రికేయులు శ్రీ రామోజీరావు, శ్రీ వీరాజీ, ప్రసిద్ధ సాహితీ వేత్త, నటుడు శ్రీ గొల్లపూడి మారుతీ రావు, నాట్యాచార్యులు శ్రీ నటరాజ రామకృష్ణ ఇంకా ఎందరో ప్రముఖులు ఆలోచనా స్ఫోరకమైన రచనలు ఇందులో చోటు చేసుకున్నాయి. వర్ధమాన, వర్తమాన, కీర్తిశేషులైన సాహితీ వేత్తలు, పరిశోధకులు, సామాజిక వేత్తల విలువైన రచనలు సమీకరించి సంకలనం చేసిన ఒక అపురూప గ్రంథం ఇది.

కృష్ణాజిల్లా రచయితల సంఘం పక్షాన 15కు పైగా ప్రసిద్ధి చెందిన పరిశోధనాత్మక ఉద్గ్రంథాల రూపకర్త డా.జి.వి. పూర్ణచందు సంపాదకుడుగా ఎంతో శ్రమించి ఈ పుస్తకానికొక ఆకృతి తెచ్చారు. పరిశోధనాంశాలు, పరిశోధకుల ఎంపిక

సంకలనకర్తలకు కత్తి మీద సాము లాంటిది. సంపాదకమండలి సభ్యులు, దికల్చరల్ సెంటర్ ఆఫ్ విజయవాడ అమరావతి సీఈవో, డా. ఈమని శివనాగిరెడ్డి, కృష్ణాజిల్లా రచయితల సంఘం అధ్యక్షులు శ్రీ గుత్తికొండ సుబ్బారావు, విక్టరీ పబ్లిషర్స్ అధినేత శ్రీ ఇమ్మిడిశెట్టి రామకుమార్ అందించిన సహకారం గొప్పది.

ఒక వంద సంవత్సరాల కాలంలో కృష్ణాతీర ప్రగతికి ఈ గ్రంథం అక్షర రూపం కల్పిస్తోంది. చరిత్ర పూర్వ యుగాల నుండి అమరావతి నగర నిర్మాణం వరకూ అనంతంగా సాగిన కృష్ణాతీర చరిత్రకు ఈ గ్రంథం అద్దంపడుతోంది.

కృష్ణా, గుంటూరు, కర్నూలు జిల్లాలతో పాటు కృష్ణకు ఆవలిదరిలో ఉన్న మహబూబ్ నగర్, నల్గొండ జిల్లాలలో కృష్ణవెంట సాగుతున్న సాంస్కృతిక ధారను వివరించే ప్రయత్నం ఈ గ్రంథంలో కనిపిస్తుంది.

గ్రంథ విస్తరభీతి మమ్మల్ని మేము నియంత్రించుకునేలా చేసింది. నిజానికి ఇంకా ఇన్ని రచనలకు అవకాశం ఇచ్చేంత సమీకరణ జరిగింది. ఎంతో ఉత్సాహంతో రచయితలు ముందుకు వచ్చారు. వారికి ధన్యవాదాలు.

2016 కృష్ణాపుష్కరాలను అత్యంత సాంకేతికంగా నిర్వహించేందుకు పథక రచన చేసిన నవ్యాంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి వర్యులు మాన్యులు శ్రీ నారాచంద్రబాబునాయుడు గారు సమీక్షాసమావేశాల్లో ఈ పుస్తకం గురించి ప్రస్తావిస్తూ, ఒక ప్రతిష్ఠాత్మక ప్రచురణగా దీన్ని అభివర్ణించారు. వారి లక్ష్య నిర్దేశాన్ని నెరవేర్చేందుకు ప్రయత్నించాము. ఈ "కృష్ణాతీరం" ప్రచురణకు పెద్ద మనసుతో సహకరించిన మాన్యమంత్రివర్యులు, విద్యావేత్త శ్రీ పల్లె రఘునాథరెడ్డిగారి సహకారం మరవలేనిది.

ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఉపసభాపతి శ్రీ మండలి బుద్ధప్రసాద్ మానసపుత్రిక ఈ "కృష్ణాతీరం" ఉద్గ్రంథం. వారి సలహా సంప్రదింపులు ఈ పుస్తకానికి విలువను కలిగించాయి. ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ ముఖ్యకార్యదర్శి శ్రీ నీరబ్ కుమార్ ప్రసాద్ గారి సహకారంతోనే ఈ పుస్తకప్రచురణ సాధ్యం అయ్యింది.

రచనలను అందించిన సాహితీవేత్తలకు కళాకారులకు, చరిత్ర పరిశోధకులకు ప్రతి ఒక్కరికీ కృతజ్ఞతలు తెలియచేసుకుంటున్నాను.

# తరతరాల తెలుగు సంస్కృతికి ప్రతిరూపం "కృష్ణాతీరం"

*డా॥ జి.వి.పూర్ణచందు, సంపాదకులు.*

కృష్ణాతీరం సాంస్కృతిక ప్రతిభకు నెలవు కావటానికి ప్రాచీనాధారాలు అనేక కారణాలను విశ్లేషిస్తున్నాయి.

నాట్యానికి నాగులు, గానానికియక్షులు, భాషా సాహిత్యాలకు ఆంధ్రులు ఇంకా ఎన్నో జాతుల మిశ్రమంగా ఒక సంలీన సంస్కృతి ఈ కృష్ణాతీరాన మొగ్గ తొడిగిందని చరిత్ర వేత్తలు చెప్తారు.

ఫ్రాంక్లిన్ సి సౌత్‌వర్త్ అనే పరిశోధకుడు తొలిద్రావిడ ప్రజలు నైలూనుండి బయలుదేరి కృష్ణాగోదావరి ముఖద్వారాల నుండి తెలుగు నేలమీద కాలూనారని, ఇక్కడ స్థిరపడి స్థానిక ప్రజలతో సంలీనం చెందారనీ, ఈ ప్రజలే కర్ణాటక, మహరాష్ట్ర, గుజరాతుల మీదుగా సింధునగరాలకు చేరి అక్కడ సింధునగరాల నిర్మాణంలో పాల్పంచుకున్నారనీ పేర్కొన్నారు. కృష్ణా గోదావరీ పరీవాహక ప్రాంతాలలో వర్ధిల్లిన తొలి నాగరికతకు ఈ పరిణామం ముఖ్యమైన అంశం కాగా, కౌండిన్య సుచంద్రుడి ఆంధ్రసేన ఇక్కడ ఆంధ్రసామ్రాజ్యాన్ని ఏర్పరచటం, అందుకు కృష్ణాజిల్లా శ్రీకాకుళం రాజధాని కావటం మరో ముఖ్యపరిణామం. కృష్ణాతీరంలో తెలుగు భాషా సంస్కృతుల బీజావాపనకు ఈ పరిణామాలు సహకరించాయి.

కృష్ణాతీరం కళలకు పుట్టినిల్లు కావటానికి ఇలాంటి చారిత్రక సన్నివేశాలెన్నో సహకరించాయి. కృష్ణాపుష్కరాలను చిరస్మరణీయం చేయటానికి సంకల్పం చెప్పుకుని, నవ్యాంధ్రప్రదేశ్ ప్రభుత్వం ముందుకొచ్చి కృష్ణాతీర ప్రశస్తిని లోకానికి చాటాలనే ఆలోచన చేయటం గొప్ప విషయం "కృష్ణాతీరం" సాంస్కృతిక చారిత్రక పరిశోధనా సంపుటిని వెలువరించటానికి ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ సమాయత్తమై ఈ ఉద్గ్రంథ ప్రచురణకు పూనిక వహించింది.

ఏదైనా బృహత్కార్యం విజయవంతం కావటానికి ముఖ్యభూమిక వహించే వ్యక్తుల సంకల్ప బలం ప్రధాన కారణం అవుతుంది. 2016 కృష్ణాపుష్కరాలను సాంస్కృతిక పరమైన పండుగలా నిర్వహించాలని సంకల్పించిన మాన్య ముఖ్యమంత్రివర్యులు గౌ.నారాచంద్రబాబు నాయుడు గారి స్ఫూర్తితో ఈ గ్రంథం ఈ రూపాన్ని సంతరించుకోగలిగింది.

కృష్ణాజిల్లా రచయితల సంఘం గౌరవాధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఉపసభాపతి మాన్యులు శ్రీ మండలి బుద్ధప్రసాద్, ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ సంచాలకులు, ప్రసిద్ధ నాటకరచయిత, సంగీత నాటక అకాడెమీ పురస్కార గ్రహీత డా. దీర్ఘాసి విజయభాస్కర్ ఈ ఇద్దరి పూనికతో ఈ కల సాకారమయ్యింది. దీన్ని సంకలనం చేసే గురుతర బాధ్యత వప్పగించినందుకు సంపాదకమండలి పక్షాన వారికి కృతజ్ఞతలు.

ప్రముఖ చిత్రకారులు, ది కల్చరల్ సెంటర్ ఆఫ్ విజయవాడ & అమరావతి, సీఈవో, ఆచార్య ఈమని శివనాగిరెడ్డి, కృష్ణాజిల్లా రచయితల సంఘం అధ్యక్షులు శ్రీ గుత్తికొండ సుబ్బారావు గార్ల సహకారం వలనే ఈ గ్రంథ సంకలనం సాధ్యం కాగా విక్టరీ పబ్లిషర్స్ అధినేత శ్రీ ఇమ్మడిశెట్టి రామకుమార్‌గారు ఈ పుస్తకం ముద్రణ విషయంలో తన కార్యాలయ సిబ్బంది సహకారం పూర్తిగా అందించారు. వారికి అభివాదాలు.

తెలుగు భాషా సంస్కృతుల ప్రాచీనతను, తరతరాలుగా కృష్ణాతీరంలో విలసిల్లిన సంస్కృతిని, ఇక్కడ ప్రభవించిన నాగరికతను, ఇక్కడ పురుడు పోసుకున్న స్వాతంత్రోద్యమాన్ని, ఇక్కడ పరిఢవిల్లిన సాంస్కృతిక వైభవాన్ని ఇందులోని వ్యాసాలు కళ్లకు కట్టించాయి. వాటి మూలాలను అనేక రీతుల్లో విశ్లేషించాయి. కొన్ని అపురూప వ్యాసాలను కూడా సేకరించి ఈ పుస్తకంలో ప్రచురించటం జరిగింది.

తరతరాల కృష్ణాతీర ప్రగతిని స్పర్శామాత్రంగా సమీక్షించే ఒక ప్రయత్నానికి అక్షర రూపం ఈ గ్రంథం. నేటి తరానికి మన భాషా సంస్కృతుల మూలాల సమాచారాన్ని అందించటమే ఈ పుస్తక లక్ష్యం. భవిష్యత్తును కాంతిమంతం చేసుకోవటానికి తీసుకోదగిన చర్యల గురించి నీటి పారుదలలు, భూగర్భ జలాలు, పర్యావరణం, ఇంకా ఇతర రంగాల ప్రముఖులు అందించిన సమాచారం ఎంతో విలువైనదిగా భావిస్తున్నాం. సమయం తగినంతగా ఇవ్వలేక పోయినప్పటికీ వ్యాసకర్తలు అందించిన సహకారం వలనే ఈ పుస్తకం ఇంత స్థాయిలో వెలువడ గలిగింది. అందరికీ కృతజ్ఞతాభివాదాలు సమర్పించుకుంటున్నాం.



**Sri N. Chandrababu Naidu**

Chief Minister
of
Andhra Pradesh

# సందేశం

తెలుగుజాతి మూలాలు కృష్ణాతీరంలో వెదికితే ఎన్నెన్నో దొరుకుతాయని చరిత్రవేత్తలు ఎంతగానో ప్రస్తుతించిన అత్యంత ప్రాచీన నదీతీరం ఇప్పుడు పుష్కరశోభని సంతరించుకొంటోంది.

కృష్ణాపుష్కర వైభవాన్ని చాటిచెప్పే విధంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం విస్తృతమైన ఏర్పాట్లు చేస్తోంది. ప్రపంచంలోని తెలుగు వారంతా పవిత్ర కృష్ణాతీరంలో పుణ్యస్నానాలు ఆచరించటానికి తరలివస్తోన్న మహత్తర సందర్భం ఇది.

తెలుగుభాష, తెలుగు సంస్కృతులకు కృష్ణాతీరం పేరెన్నికగన్నది. ఎన్నెన్నో సాహిత్యోద్యమాలు, సాంస్కృతిక ఉద్యమాలు, సంస్కరణోద్యమాలతో పాటు స్వాతంత్రోద్యమానికి తొలిబీజాలు నాటిన పుణ్యభూమి ఇది.

సినీమారంగం విద్యారంగం, పత్రికా రంగం, రాజకీయ రంగాలకు కృష్ణాతీరం వేదికై నిలిచింది. నవ్యాంధ్రప్రదేశ్ రాజధాని నగరం - అమరావతి కృష్ణమ్మ ఒడ్డున నెలకొనడం ఒక విశేషం. చరిత్రగమనంలో తొలినాటి శ్రీకాకుళం నుంచి మొన్నటి అమరావతి వరకూ వివిధకాలాలలో వర్ధిల్లిన ఎన్నెన్నో రాజధానులు నేడు కుగ్రామాలుగా ఉన్నప్పటికీ, ఇక్కడ ఏ రాయిని తాకినా చరిత్ర చెప్తుంది. ఏరాయిని మీటినా రాగ, తాళ, నాట్య లాస్య విన్యాసాలు ధ్వనిస్తాయి.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా నిర్వహిస్తున్న 2016 కృష్ణా పుష్కరాలను పురస్కరించుకుని ఆంధ్రప్రదేశ్ తెలుగు భాషా సాంస్కృతిక శాఖవారు దాదాపు 220 మంది పరిశోధకులైన విద్వాంసుల రచనలతో అపూర్వమైన రీతిలో "కృష్ణాతీరం" ఉద్గ్రంధాన్ని వెలువరిస్తున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది.

ఈ మహాగ్రంథం కృష్ణాతీర సర్వస్వాన్ని ఆవిష్కరించగలిగే ఒక ఉత్తమ సంకలనంగా చిరకాలం నిలిచిపోయేలా రూపొందుతున్నందుకు అభినందిస్తున్నాను.

పుష్కరాలకోసం చేపట్టిన ప్రాజెక్టులు, పుస్తకాలే చివరికి పదిలంగా వుంటాయన్నది నిజం. "కృష్ణాతీరం" నవ్యాంధ్రప్రదేశ్ ప్రగతిని, ప్రాచీనతను, ప్రాభవాన్ని చాటి చెప్పేదిగా రూపొందుతుందని ఆశిస్తున్నాను.

కృష్ణాతీరాన్ని సందర్శించి, పుణ్యస్నానాలు ఆచరించే తెలుగు ప్రజలకు తెలుగేతరులకూ స్వాగతం పలుకుతూ శుభాకాంక్షలందిస్తున్నాను. ఈ సందర్భంగా ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ వారిని అభినందిస్తున్నాను.

**శ్రీ నారా చంద్రబాబునాయుడు**

ముఖ్యమంత్రి



**Dr. K. Siva Prasad Rao**

Hon'ble Speaker,
Legislative Assembly
Andhra Pradesh

# సందేశం

కృష్ణా పుష్కర పుణ్య మహోత్సవాలను రాష్ట్రప్రభుత్వం అత్యంత ప్రతిష్ఠాత్మకంగా నిర్వహిస్తున్న తరుణంలో ఆంధ్రప్రదేశ్ తెలుగు భాషా సాంస్కృతిక శాఖవారు చిరకాలం నిలచిపోయే ఒక తీపి గుర్తులా "కృష్ణాతీరం" బృహద్గ్రంథాన్ని వెలువరించనున్నందుకు సంతోషంగా ఉంది. ఈ పుస్తకం రాష్ట్ర ప్రజలకు, ప్రభుత్వానికి కూడా ఒక గర్వకారణమైన ప్రచురణ కాగలదని ఆశిస్తున్నాను.

ప్రపంచీకరణ నేపథ్యంలో నేటి యువతరానికి మన భాష, మన చరిత్ర, మన సంస్కృతుల మూలాల గురించిన అవగాహన కల్పించి, మన మాతృభాష పట్ల వారికి గౌరవభావాన్ని కల్గించటానికి ఈ పుస్తకం తోడ్పడుతుందని నేను నమ్ముతున్నాను.

నవ్యాంధ్రప్రదేశ్‌లోని వివిధ ప్రాంతాలనుండి ఇతర రాష్ట్రాల నుండి రచయితలు, పరిశోధకులు, మహాపండితులు తెలుగుజాతి ప్రాచీనతని, విశిష్టతని చాటిచెప్పే రచనలు చేసినందుకు అందరినీ మన:పూర్వకంగా అభినందిస్తున్నాను.

*ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖవారికి నా శుభాకాంక్షలు.*

**శ్రీ కోడెల శివప్రసాదరావు**
ఆంధ్రప్రదేశ్ శాసన సభ స్పీకర్



**Sri K.E. Krishnamurthy**

Andhra Pradesh
Deputy Chief Minister
Minister for Revenue,
Stamps & Registration

# సందేశం

2016 కృష్ణాపుష్కరాలు 12రోజుల పాటు వైభవంగా జరుగుతున్న సందర్భంగా తెలుగు ప్రజలందరికీ నా శుభాకాంక్ష లందిస్తున్నాను. 'కృష్ణాతీరం' అనగానే ఎవరికైనా తెలుగు భాషా సాహిత్య కళా సంస్కృతుల ఇతోధిక వికాసం జ్ఞాపకానికి వస్తుంది. కృష్ణాతీరం కళలకు కాణాచి. పత్రికలు, విద్య, వ్యవసాయాలతో పాటు తెలుగు సినిమా రంగానికి ఆయువు పోసింది ఈ కృష్ణాతీరమే!

బోధనారంగం, పరిపాలనా రంగం, ప్రసారమాధ్యమాలు ఇంకా వివిధ సామాజిక రంగాలను ప్రభావితం చేయగల కృష్ణాతీరాన్ని సవివరంగా విశ్లేషిస్తూ ఒక బృహద్గ్రంథాన్ని కృష్ణాతీరం పేరుతో 'కృష్ణాపుష్కర ప్రత్యేక సంచిక' గా వెలువరిస్తున్నందుకు నిర్వాహకులను మనఃపూర్తిగా అభినందిస్తున్నాను.

ఈ పుస్తకంలో ఎన్నెన్నో విలువైన, ఎందరో ప్రసిద్ధుల రచనలు ఇందులో చోటుచేసుకున్నాయి. రేపటి తరానికి తెలుగుభాష, తెలుగు సంస్కృతుల గురించి ఒక అవగాహన కల్గించటానికి ఈ పుస్తకం తోడ్పడగలదని నా ప్రగాఢవిశ్వాసం

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగు భాషా సంస్కృతుల పరిరక్షణకు కట్టుబడి వుందని ఈ సందర్భంగా మరొకసారి ఉద్ఘాటిస్తున్నాను.

ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖవారు ఎంతో శ్రమకోర్చి ఈ ఉద్గ్రంథ ప్రచురణకు పూనుకున్నందుకు వారిని, వారి సంబంధిత నిర్వాహకులను మనసారా అభినందిస్తున్నాను.

**శ్రీ కె.ఇ. కృష్ణమూర్తి**

**ఉప ముఖ్యమంత్రి, రెవెన్యూ శాఖ**



Andhra Pradesh
Deputy Chief Minister
Minister for Home,
Disaster Management

**Sri N. Chinarajappa**

# సందేశం

కృష్ణాపుష్కరాల సందర్భంగా "కృష్ణాతీరం" పేరుతో ఒక పరిశోధనా గ్రంథాన్ని వెలువరించిన ఆంధ్రప్రదేశ్ భాషా,సాంస్కృతిక శాఖకు అభినందనలు తెల్పుతున్నాను. పన్నెండేళ్ళకొకసారి అపురూపంగా వచ్చే ఇలాంటి ప్రత్యేక సందర్భాలలో శాశ్వతంగా నిలిచి పోయేవి నదీతీరాల అభివృద్ధికి చేపట్టిన పనులు ఒక ఎత్తుకాగా, కొన్ని తరాల పాటు నిలిచే సమాచారంతో 2016 కృష్ణా పుష్కరాల తీపిగుర్తుల్ని పదిలపరిచే ఇలాంటి పుస్తకాలు మరోఎత్తుగా నిలుస్తాయి.

ప్రజలందరూ ఈ పుష్కరాల సందర్భంగా ఏదైనా ఒక మంచికార్యాన్ని చేసి, ఆ జ్ఞాపకాన్ని పదిలపరచుకోవటం ఒక ఘనమైన విషయంగా భావిస్తున్నాను.

తెలుగుభాషా సంస్కృతుల పరిరక్షణకు, అభివృద్ధికి ఈ ప్రభుత్వం కంకణం కట్టుకున్నదన్న సత్యానికి ఈ పుస్తకం అద్దంపడుతుంది. భవిష్యత్తరాలకు తెలుగువారి భాషాసంస్కృతుల పరిశోధకులకు కరదీపికగా ఈ ఉద్గ్రంథం కలకాలం నిలిచిపోతుందని ఆశిస్తున్నాను.

ఆంధ్రప్రదేశ్ భాషాసాంస్కృతిక శాఖవారు కవులు, కళాకారులు, పరిశోధకులు, మేధావులందరినీ సమీకరించి తెలుగు భాషా సంస్కృతుల చైతన్యాన్ని కలిగించే ఇలాంటి మరిన్ని కార్యక్రమాలను చేయాలని ఆకాంక్షిస్తూన్నాను.

**2016 కృష్ణాపుష్కరాల సందర్భంగా తెలుగు ప్రజలందరికీ నా శుభాకాంక్షలు.**

**శ్రీ ఎన్. చిన రాజప్ప**

**ఉప ముఖ్యమంత్రి, హోంమంత్రి**



Andhra Pradesh Minister for
Culture, Information & Public Relations
Information Technology & Communications
N.R.I. Empowerment & Relations
Minority Welfare & Empowerment

**Sri P. Raghunatha Reddy**

# సందేశం

తెలుగుభాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు మొదలైన వాటి పరిరక్షణ, ప్రచారం, ప్రోత్సాహాలకోసం ఉద్దేశించిన ఆంధ్రప్రదేశ్ తెలుగుభాషా సాంస్కృతిక శాఖ కేవలం ఆంధ్రప్రదేశ్‌లోనే కాక, ఇతర రాష్ట్రాలలో, దేశాలలో నివసించే తెలుగువారికి కూడా సాంస్కృతిక సేవలు అందిస్తోంది. తెలుగు వారు ఎక్కడ స్థిరపడినా, వారిలో నూతన ఉత్తేజాన్ని కల్గించడంతోపాటు తెలుగుభాష, తెలుగు సంస్కృతుల గురించి అవగాహనను కలిగించి వాటిని నిలబెట్టుకోవాలనే తపనను ప్రజలలో కల్గించడం ఈ శాఖ విధి.

ఆగస్టు 12 నుండి 23 వరకూ జరగనున్న కృష్ణా పుష్కరాలు – 2016 సందర్భంగా సాంస్కృతికశాఖ పక్షాన రెండు ప్రత్యేక సంచికలు రూపొందించి ప్రచురించనుంది. పుష్కరాల సమయంలో వివిధ నాట్య, నాటక, సంగీత, సాహిత్యవేత్తలతో కార్యక్రమాలు నిర్వహించడం, సదస్సులు ఏర్పాటు చేయడం, జానపద గిరిజన కళాకారుల ప్రతిభా విన్యాసాలను ప్రదర్శింపచేయటం లాంటి ఎన్నో కార్యక్రమాలకు సాంస్కృతిక శాఖ సమాయత్తమౌతోంది.

'కృష్ణాతీరం' 2016 కృష్ణాపుష్కర ప్రత్యేక ప్రచురణలో తెలుగు భాష, సాహిత్యం, లలితకళలు, జానపద, గిరిజన కళారూపాలు, శాస్త్రసాంకేతిక విజ్ఞానం, ప్రసార, ప్రచార మాధ్యమాలు వంటి పలు అంశాల మీద కృషి చేస్తున్న పండితులతో వ్యాసాలు వ్రాయించి ఈ గ్రంథాన్ని వెలువరిస్తున్నాము.

తెలుగు సారస్వతాభిమానులకు ఒక ఆకరగ్రంథంగా ఈ పుస్తకం ఉండాలని మా ఆకాంక్ష. దాదాపు 220మంది ప్రసిద్ధులైన వారు వివిధరంగాలకు సంబంధించి 'కృష్ణాతీరంలో ప్రగతి' ని సమీక్షించటం, ప్రాచీనతను నిరూపించటం ధ్యేయంగా వ్యాసాలు అందించారు. వారందరికి ధన్యవాదాలు తెల్పుతున్నాను.

ఈ సంచికకు సందేశాలందించి ఆశీస్సులు తెల్పిన పెద్దలకు, సకాలంలో ఈ సంచికను వెలువరించడంలో సహకరించిన ప్రతిఒక్కరికి కృతజ్ఞతలు.

ఎంతో శ్రమకోర్చి, 220 పైగా విలువైన వ్యాసాలను, వ్యాసకర్తలను సమీకరించి, ప్రతిభావంతంగా ఈ ఉద్గ్రంథాన్ని ఈ రూపంలో తీసుకురావటానికి కారకులైన సంపాదకులు డా॥జి.వి.పూర్ణచందు, పర్యవేక్షక సంపాదకులు డా॥దీర్ఘాసి విజయభాస్కర్‌గార్లను అభినందిస్తున్నాను. సంపాదక మండలిలో సభ్యులుగా వున్న డా॥ఈమని శివనాగిరెడి, శ్రీగుత్తికొండ సుబ్బారావు, శ్రీ ఇమ్మడిశెట్టి రామకుమార్ గార్లకు నా శుభాకాంక్షలు. గౌరవ సలహాదారులుగా వ్యవహరించిన గౌరవనీయ ఉపసభాపతి శ్రీ మండలిబుద్ధప్రసాద్ గారు, సాంస్కృతిక శాఖ ముఖ్య కార్యదర్శి, శ్రీ నీరభ్ కుమార్ ప్రసాద్, శ్రీ పొట్లూరి హరికృష్ణ, శ్రీ కూచిభోట్ల ఆనంద్ గార్లకు నా శుభాకాంక్షలు.

పరిశోధనాత్మక రచనలను, ఉన్నత సాహితీ విలువలున్న రచనలను కోరుకునే పాఠకులకు ఈ పుస్తకం తృప్తి నిస్తుందని భావిస్తున్నాను.

**శ్రీ పి. రఘునాధ రెడ్డి**
సాంస్కృతిక శాఖ



Sri P. Manikyala Rao

Andhra Pradesh Minister for Endowments

# సందేశం

పన్నెండేళ్ల కొకసారి అపురూపంగా వచ్చే కృష్ణా పుష్కరాలను నవ్యాంధ్ర ప్రదేశ్ రాజధాని ఈసారి ఆతిధ్యం ఇవ్వటం ఒక విశేషం. మాన్య ముఖ్యమంత్రి పర్యవేక్షణలో కృష్ణా పుష్కరాలు అపూర్వమైన రీతిలో నిర్వహించబడటం, ప్రాముఖ్యతను సంతరించుకుంది.

అత్యంత ప్రతిష్ఠాత్మకంగా జరగనున్న ఈ పుష్కర మహోత్సవ తరుణంలో ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు భాషా సాంస్కృతిక శాఖవారు చిరకాలం తీపిగుర్తుగా మిగిలిపోయేలా 'కృష్ణాతీరం' పేరుతో ఒక ఉద్గ్రంధాన్ని ప్రచురించటం ముదావహం. ఈ పుస్తకం నవ్యాంధ్ర ప్రదేశ్‌కు గర్వకారణంగా వుంటుందని ఆశిస్తున్నాను. కృష్ణాతీరంలోని పుణ్యక్షేత్రాల సమాచారాన్ని సమగ్రంగా ఈ గ్రంథంలో అందించడం సంతోషం.

ఈనాటి తరానికి తెలుగు ప్రజల ప్రాచీనత గురించి, భాష ప్రాచీనత గురించి, సంస్కృతి ప్రాచీనత గురించి తెలియచెప్పే పరిశోధనా వ్యాసాలను గుదిగ్రుచ్చి ఒక మహాగ్రంథంగా వెలువరిస్తున్నందుకు భాషా సాంస్కృతిక శాఖ వారిని, వ్యాస రచయితలను ప్రత్యేకించి సంపాదక వర్గాన్ని దేవదాయ ధర్మాదాయ శాఖ పక్షాన నా అభినందనలు తెలుపుతున్నాను.

ఆంధ్రప్రదేశ్ తెలుగు భాషా సాంస్కృతిశాఖ వారికి నా మనఃపూర్వక అభినందనలు.

**శ్రీ పి. మాణిక్యాలరావు**

దేవాదాయ శాఖామాత్యులు



**Sri P. Narayana**

Andhra Pradesh Minister For
Municipal Administration &
Urban Development,
Urban Water Supply And
Urban Planning

# సందేశం

కృష్ణా పుష్కర వైభవం - 2016 ప్రాముఖ్యతని, ప్రాభవాన్ని చాటుతూ "కృష్ణాతీరం" పేరుతో ఒక పరిశోధక గ్రంథం ప్రచురిస్తున్నందుకు ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖ వారిని మనఃస్ఫూర్తిగా అభినందిస్తున్నాను.

పదికాలాలపాటు నిలిచిపోయే గ్రంథాలను ప్రభుత్వపరంగా ప్రచురించటం వలన ఇది ప్రభుత్వానికి కూడా ప్రతిష్ఠాత్మకంగా వుంటుందని భావిస్తున్నాను.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అనితరసాధ్యం అనదగిన రీతిలో నిర్వహిస్తున్న ఈ కృష్ణా పుష్కరాలు - 2016 జ్ఞాపకాలను ఈ పుస్తకం పదిలపరుస్తుందని నమ్ముతున్నాను.

కళలకు పెద్ద పీట వేస్తూ, కవులు, కళాకారులు, పరిశోధకులు మేధావుల పట్ల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి నిబద్ధాత వుంది. గత ఏడాది గోదావరి పుష్కరాలు, ఈ ఏడాది కృష్ణా పుష్కరాలను ప్రభుత్వపరంగా జరుగుతున్న ఈ కార్యక్రమాలు ప్రభుత్వ నిబద్ధతని ఘనంగా చాటుతున్నాయని విశ్వసిస్తున్నాను.

కళలకు ప్రభుత్వాదరణ ప్రోత్సాహాలను అందించటంలో రాష్ట్ర సాంస్కృతిక శాఖ కనబరుస్తున్న శ్రద్ధను ప్రత్యేకంగా అభినందిస్తున్నాను. తెలుగు ప్రజలందరికీ కృష్ణా పుష్కర శుభాకాంక్షలు అందిస్తున్నాను.

**శ్రీ పి. నారాయణ**

మున్సిపల్ శాఖామాత్యులు



Andhra Pradesh Minister for
Irrigation, Command Area
Development & Water
Resources Management

**Sri D. Uma Maheswara Rao**

# సందేశం

కృష్ణాతీరం కళలకు కాణాచి. తెలుగు జాతి ప్రాచీనత సాక్ష్యాలు కృష్ణాతీరంలో దొరుకుతాయని చరిత్రవేత్తలు ప్రకటిస్తున్నారు. తెలుగు భాషా సంస్కృతులకు పుట్టినిల్లయిన ఈ కృష్ణాతీరం ఇప్పుడు పుష్కర శోభను సంతరించుకుంటోంది. ఇక్కడ 'వసంత వైభవం' నేడు వెలుగులు విరజిమ్ముతోంది.

సంగీత, సాహిత్యాలు, భాషా సంస్కృతుల రాజధానిగా వున్న కృష్ణాతీరం ఇప్పుడు నవ్యాంధ్రప్రదేశ్ రాజధాని కావటం విశేషం. పుష్కర యాత్రీకులకు స్వాగతం పలుకుతోంది నవ్యాంధ్ర రాజధాని.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా నిర్వహిస్తున్న 2016 కృష్ణా పుష్కరాలను పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ తెలుగు భాషా సాంస్కృతిక శాఖ వారు దాదాపు 220 మంది పరిశోధకులు వివిధ రంగాలలో కృష్ణా తీర ప్రగతిని సమీక్షిస్తూ వ్రాసిన పరిశోధనాత్మక వ్యాసాలను అద్భుతమైన రీతిలో సంకలనం చేసి ఒక "మహాగ్రంథం"గా రూపొందించారు. ఈ గ్రంథం "కృష్ణాతీరం" రాష్ట్ర ప్రభుత్వానికి అత్యంత ప్రతిష్ఠాత్మకమైనదిగా భావిస్తున్నాను.

రచయితలకు, సంపాదకులకు, ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ వారికి నా హృదయపూర్వక అభినందనలు.

**శ్రీ డి. ఉమామహేశ్వరరావు**
నీటిపారుదల శాఖామాత్యులు



Andhra Pradesh Minister for
Agriculture, Agri-Processing,
Marketing & warehousing,
Animal Husbandry,
Dairy Development and Fisheries

## Sri Prathipati Pulla Rao

# సందేశం

కృష్ణాతీరం అనగానే మనసులో ఎవరికైనా భాషా సాంస్కృతిక రంగ వైభవం స్ఫురణకు వస్తుంది. కృష్ణాతీరం కళలకు పుట్టిల్లు.

12 రోజులపాటు పుణ్యప్రదంగా జరుపుకునే "పుష్కర పండుగ"ను చిరస్మరణీయం చేసే విధంగా "కృష్ణాతీరం" పేరుతో ఒక ఉద్గ్రంధాన్ని ప్రచురిస్తున్న ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ వార్ని మనసారా అభినందిస్తున్నాను.

వ్యాసరచయితలు, సంపాదకులను ఈ సందర్భంగా సముచిత రీతిని నా అభినందనలతో సత్కరిస్తున్నాను.

తెలుగు సారస్వతాభిమానులకు ఒక ఆకరగ్రంథంగా ఈ పుస్తకం ఉండాలని మా ఆకాంక్ష. దాదాపు 220మంది ప్రసిద్ధులైన వారు వివిధరంగాలకు సంబంధించి 'కృష్ణాతీరంలో ప్రగతి' ని సమీక్షించటం, ప్రాచీనతను నిరూపించటం ధ్యేయంగా వ్యాసాలు అందించారు. వారందరికి ధన్యవాదాలు తెల్పుతున్నాను.

తెలుగు ప్రజలందరికి "కృష్ణా పుష్కర వైభవం - 2016" సందర్భంగా శుభాకాంక్షలందిస్తున్నాను.

**శ్రీ ప్రత్తిపాటి పుల్లారావు**

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ శాఖామాత్యులు



**Sri Ravela Kishore Babu**

Andhra Pradesh Minister
For Social Welfare,
TribalWelfare & Empowerment

# సందేశం

కృష్ణాపుష్కర వైభవాన్ని చాటిచెప్పే విధంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం విస్తృతమైన ఏర్పాట్లు చేస్తోంది. ప్రపంచంలోని తెలుగు వారంతా పవిత్ర కృష్ణాతీరంలో పుణ్యస్నానాలు ఆచరించటానికి తరలివస్తోన్న మహత్తర సందర్భం ఇది.

బోధనారంగం, పరిపాలనా రంగం, ప్రసారమాధ్యమాలు ఇంకా వివిధ సామాజిక రంగాలను ప్రభావితం చేయగల కృష్ణాతీరాన్ని సవివరంగా విశ్లేషిస్తూ ఒక బృహద్గ్రంథాన్ని కృష్ణాతీరం పేరుతో 'కృష్ణాపుష్కర ప్రత్యేక సంచిక' గా వెలువరిస్తున్నందుకు నిర్వాహకులను మన:పూర్తిగా అభినందిస్తున్నాను.

భవిష్యతరాలకు మన భాషా సంస్కృతులు వివరాలు అందించటానికి ఈ పుస్తకం ఎంతగానో ఉపకరిస్తుందని నమ్ముతున్నాను. ఇంత బృహత్కార్యక్రమాన్ని భుజస్కంధాలమీద వహించిన భాషా సాంస్కృతిక శాఖ వారిని మనసారా అభినందిస్తున్నాను.

తెలుగు ప్రజలకు మరొకసారి కృష్ణాపుష్కర పండుగ శుభాకాంక్షలు.

**శ్రీ రావెల కిషోర్‌బాబు**
ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమ శాఖమాత్యులు



**Sri Kollu Ravindra**

Andhra Pradesh Minister for
BC Welfare & Empowerment,
Handlooms & Excise

# సందేశం

అత్యంత ప్రతిష్ఠాత్మకంగా జరగనున్న ఈ పుష్కర మహోత్సవ తరుణంలో ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు భాషా సాంస్కృతిక శాఖవారు చిరకాలం తీపిగుర్తుగా మిగిలిపోయేలా 'కృష్ణాతీరం' పేరుతో ఒక ఉద్గ్రంథాన్ని ప్రచురించటం ముదావహం. ఈ పుస్తకం నవ్యాంధ్ర ప్రదేశ్‌కు గర్వకారణంగా వుంటుందని ఆశిస్తున్నాను. కృష్ణాతీరంలోని పుణ్యక్షేత్రాల సమాచారాన్ని సమగ్రంగా ఈ గ్రంథంలో అందించడం సంతోషం.

కళలకు ప్రభుత్వాదరణ ప్రోత్సాహాలను అందించటంలో రాష్ట్ర సాంస్కృతిక శాఖ కనబరుస్తున్న శ్రద్ధను ప్రత్యేకంగా అభినందిస్తున్నాను. తెలుగు ప్రజలందరికీ కృష్ణా పుష్కర శుభాకాంక్షలు అందిస్తున్నాను.

రచయితలకు, సంపాదకులకు, ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ వారికి నా హృదయపూర్వక అభినందనలు.

**శ్రీ కొల్లు రవీంద్ర**

ఆంధ్రప్రదేశ్ బి.సి. సంక్షేమ సాధికారిక శాఖామాత్యులు



**Dr. Parakala Prabhakar**

Communications Advisor,
Andhra Pradesh Government

# సందేశం

2016 కృష్ణాపుష్కరాలు 12రోజుల పాటు వైభవంగా జరుగుతున్న సందర్భంగా తెలుగు ప్రజలందరికీ నా శుభాకాంక్ష లందిస్తున్నాను. 'కృష్ణాతీరం' అనగానే ఎవరికైనా తెలుగు భాషా సాహిత్య కళా సంస్కృతుల ఇతోధిక వికాసం జ్ఞాపకానికి వస్తుంది.

పుష్కరాల సమయంలో వివిధ నాట్య, నాటక, సంగీత, సాహిత్యవేత్తలతో కార్యక్రమాలు నిర్వహించడం, సదస్సులు ఏర్పాటు చేయడం, జానపద గిరిజన కళాకారుల ప్రతిభా విన్యాసాలను ప్రదర్శింపచేయటం లాంటి ఎన్నో కార్యక్రమాలకు సాంస్కృతిక శాఖ సమాయత్తమౌతోంది.

కృష్ణాతీరం కళలకు కాణాచి. పత్రికలు, విద్య, వ్యవసాయాలతో పాటు తెలుగు సినిమా రంగానికి ఆయువు పోసింది ఈ కృష్ణాతీరమే!

బోధనారంగం, పరిపాలనా రంగం, ప్రసారమాధ్యమాలు ఇంకా వివిధ సామాజిక రంగాలను ప్రభావితం చేయగల కృష్ణాతీరాన్ని సవివరంగా విశ్లేషిస్తూ ఒక బృహద్గ్రంథాన్ని కృష్ణాతీరం పేరుతో 'కృష్ణాపుష్కర ప్రత్యేక సంచిక' గా వెలువరిస్తున్నందుకు నిర్వాహకులను మన:పూర్తిగా అభినందిస్తున్నాను.

ఆంధ్రప్రదేశ్ భాషాసాంస్కృతిక శాఖవారు కవులు, కళాకారులు, పరిశోధకులు, మేధావులందరినీ సమికరించి తెలుగు భాషా సంస్కృతుల చైతన్యాన్ని కలిగించే ఇలాంటి మరిన్ని కార్యక్రమాలను చేయాలని ఆకాంక్షిస్తున్నాను.

డాక్టర్ పరకాల ప్రభాకర్
ఆంధ్రప్రదేశ్ కమ్యూనికేషన్స్ సలహాదారులు



**Sri Mandali Buddha Prasad**

Deputy Speaker of Andhra Pradesh

# సందేశం

2016 కృష్ణా పుష్కరాల సందర్భంగా తెలుగు ప్రజలందరికీ పుష్కర పండుగ శుభాకాంక్షలు.

ఇది 12 ఏళ్ళకొకసారి వచ్చే అపురూప అవకాశం. దీన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అత్యంత ప్రతిష్ఠాత్మకమైన రీతిలో నిర్వహిస్తోంది. 12 ఏళ్ళకొకసారైనా జలాలను పరిరక్షించుకునే కార్యక్రమాలు చేపట్టవలసిందిగా పుష్కరాలు మనకు సందేశం ఇస్తున్నాయి. ఎప్పటికప్పుడు నవీకరణలు (Update) చేసుకోవటం ఒక మంచి అలవాటు ప్రభుత్వం చిత్తశుద్ధితో ఈ బాధ్యతలను నిర్వహిస్తున్నందుకు నాకు ఎంతో సంతోషంగా వుంది.

ప్రజలందరూ ఈ పుష్కరాలను చిరస్మరణీయం చేసుకునేలా తమ తమ వ్యక్తిగత స్థాయిలలో కొన్ని మంచికార్యాలు చేసి వాటి జ్ఞాపకాలను పదిలపరచుకోవటం ఒక ఆచారం. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చిరస్మరణీయమైన పథకాలు చేపట్టి ప్రజల హృదయాలలో కలకాలం నిలిచి పోయేలా కృషి చేస్తోంది.

అలా చిరస్థాయిగా నిలిచిపోయే విధంగా "కృష్ణాతీరం" పేరుతో ఒక ఉద్గ్రంథాన్ని ఈ సందర్భంగా వెలువరించ నున్నందుకు ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతి శాఖ వారిని నేను మనసారా అభినందిస్తున్నాను.

పుష్కరానికొకసారైనా జాతి పురోగతిని సమీక్షించే ఇలాంటి ప్రచురణలు వస్తూ వుండటం వలన మన చరిత్ర, మన సంస్కృతులు పదిలంగా వుంటాయని నేను నమ్ముతున్నాను. నదులు జీవన ప్రదాతలు. నదుల పట్ల మన భక్తిని, గౌరవాన్ని, ఆత్మీయతను ప్రదర్శించుకునే గొప్ప సందర్భం ఇది.

పుష్కరాల సందర్భాల్లో జరిగే మంత్రాలతో కూడిన అంశాలు మాత్రమే మతపరమైనవి. అవి మినహాయిస్తే త్రాగునీటి అవసరాలకు ఆరోగ్యప్రదంగా అందరం కలిసి కాపాడుకోవటమే కృష్ణా పుష్కర సందేశంగా భావిస్తున్నాను.

మనం నదులనుండి సంస్కారాన్ని, సంగమకళను నేర్చుకుని, మన జీవితాలను నదివలె నిర్మలంగా, నిశ్చలంగా సాగించినట్లైతే నది చివరకు సాగరుని చేరినట్టు మనమూ జీవితాన్ని సారవంతం చేసుకోగలం.

2016 కృష్ణా పుష్కరాలు మనల్ని జలసంపద పట్ల భక్తిని పెంపొందించు కోవాలని సూచిస్తున్నాయి. "కృష్ణాతీరం" ఉద్గ్రంథం ఈ సందేశాన్ని భవిష్యత్తరాలకు అందిస్తుందని భావిస్తున్నాను. పుస్తక రూపకర్తలందరికి మనసారా శుభాకాంక్షలందిస్తున్నాను.

**శ్రీ మండలి బుద్ధప్రసాద్**

**ఉపసభాపతి**



**Sri Kesineni Srinivas (Nani)**

M.P.
Vijayawada Constituency

# సందేశం

'కృష్ణాతీరం'లో చైతన్యవంతమైన ప్రముఖ ప్రాంతానికి పార్లమెంటు సభ్యునిగా ప్రాతినిధ్యం వహించటం నాకెంతో గర్వకారణం. 12 ఏళ్ళకొకసారి వచ్చే కృష్ణా పుష్కరాలు ఎప్పటికప్పుడు విజయవాడ పరిసర ప్రాంతాల అభివృద్ధికి ఎంతగానో దోహదపడ్డాయి. 2016 పుష్కరాలు కృష్ణాతీర ప్రాంతాలలో నిర్మాణాత్మక ప్రగతికి తోడ్పడతాయని ఆశిస్తున్నాను.

నవ్యాంధ్రప్రదేశ్ రాజధాని నిర్మాణం ఈ 2016 పుష్కరాల సందర్భంగా మరింత వేగవంతం అయ్యిందని భావిస్తున్నాను.

ఈ పుష్కర మహోత్సవాలను పురస్కరించుకుని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ భాషా సాంస్కృతిక శాఖవారు "కృష్ణాతీరం" పేరుతో ఒక మహాగ్రంథాన్ని వెలువరించనుండటం ముదావహం.

భాష, సంస్కృతి, కళలపట్ల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి గల చిత్తశుద్ధికి ఈ పుస్తకం ప్రత్యక్ష నిదర్శనం కాగలదని నమ్ముతున్నాను.

వేలమంది కళాకారులతో ఈ పుష్కరం 12 రోజులు సాంస్కృతిక కార్యక్రమాలు, సదస్సులతో తెలుగు ప్రజలను ఆనందపరవశుల్ని చేసేందుకు కార్యభారాన్ని వహిస్తున్న సాంస్కృతిక శాఖ వారిని మనసారా అభినందిస్తున్నాను.

*'కృష్ణాతీరం' గ్రంథ రచయితలందరికీ నా అభివాదాలు.*

**శ్రీ కేశినేని శ్రీనివాస్ (నాని)**

**విజయవాడ పార్లమెంటు సభ్యుడు**



Sri Koneru Sreedhar

MAYOR
Vijayawada Muncipal Corporation

# సందేశం

**అతిథి దేవోభవ అన్నారు.**

కృష్ణా పుష్కరాలు మా విజయవాడ నగరం ఆతిథ్యం ఇవ్వనున్నందుకు మాకెంతో సంతోషంగా వుంది. అత్యంత భక్తి భావనతో పవిత్ర స్నానాలు ఆచరించటానికి తరలివస్తున్న అశేష భక్తికోటికి నేను స్వాగతం పలుకుతున్నాను.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మాన్య ముఖ్యమంత్రి గౌ॥ శ్రీ చంద్రబాబు నాయుడుగారి నేతృత్వంలో అత్యంత ప్రతిష్ఠాత్మకంగా నిర్వహిస్తున్న ఈ 2016 కృష్ణా పుష్కరాల సందర్భంగా, చిరస్మరణీయంగా నిలిచిపోయేలా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ భాషా సాంస్కృతిక శాఖ వారు “కృష్ణాతీరం” అనే ఉద్గ్రంధాన్ని వెలువరించడం నాకు చాలా సంతోషాన్ని కలిగిస్తోంది.

భవిష్యతరాలకు మన భాషా సంస్కృతులు వివరాలు అందించటానికి ఈ పుస్తకం ఎంతగానో ఉపకరిస్తుందని నమ్ముతున్నాను. ఇంత బృహత్కార్యక్రమాన్ని భుజస్కంధాలమీద వహించిన భాషా సాంస్కృతిక శాఖ వారిని మనసారా అభినందిస్తున్నాను.

*తెలుగు ప్రజలకు మరొకసారి కృష్ణాపుష్కర పండుగ శుభాకాంక్షలు.*

**శ్రీ కోనేరు శ్రీధర్**

*మేయర్, విజయవాడ మున్సిపల్ కార్పొరేషన్*



Principal Secretary to Government
(Youth Advancement, Sports & Culture)

Sri Neerabh Kumar Prasad, IAS

# సందేశం

ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖవారు అపూర్వమైన రీతిలో "కృష్ణాతీరం" ఉద్గ్రంథాన్ని వెలువరిస్తున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. కృష్ణా పుష్కరాలు 2016 సందర్భంగా ఈ పుస్తకం ఒక తెలుగు ప్రజలకు చిరస్మరణీయమైన కానుకగా భావిస్తున్నాను. కృష్ణాతీర సర్వస్వాన్ని ఆవిష్కరించగలిగే ఒక ఉత్తమ సంకలనంగా నిలిచిపోయేలా రూపొందుతున్నందుకు అభినందనలు అందచేస్తున్నాను.

పుష్కరాల కోసం చేపట్టిన ప్రాజెక్టులు, పుస్తకాలే చివరికి పదిలంగా వుంటాయన్నది నిజం. "కృష్ణాతీరం" ఉద్గ్రంథం నవ్యాంధ్రప్రదేశ్ ప్రగతిని, ప్రాముఖ్యతను, ప్రాభవాన్ని చాటి చెప్పేదిగా రూపొందుతుందని ఆశిస్తున్నాను.

కృష్ణాతీరాన్ని సందర్శించి, పుణ్యస్నానాలు ఆచరించే తెలుగు ప్రజలకు, తెలుగేతరులక్కూడా స్వాగతం పలుకుతూ శుభాకాంక్షలందిస్తున్నాను. ఈ సందర్భంగా ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ సంచాలకుల కృషి, దీక్షలను మనసారా అభినందిస్తున్నాను.

"కృష్ణాతీరం" గ్రంథంలో వ్యాసరచనలను అందించిన పరిశోధకులకు, సంకలనం చేసిన సంపాదకులకు నా శుభాకాంక్షలు.

**శ్రీ నీరబ్‌కుమార్ ప్రసాద్**

సాంస్కృతిక శాఖ ముఖ్య కార్యదర్శి



Sri J.S.V. Prasad, IAS

Principal Secretary to
A.P. Government
Endowments

# సందేశం

కృష్ణా పుష్కర పుణ్య మహోత్సవాలను రాష్ట్రప్రభుత్వం అత్యంత ప్రతిష్ఠాత్మకంగా నిర్వహిస్తున్న తరుణంలో ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖవారు చిరకాలం నిలచిపోయే ఒక తీపి గుర్తులా “కృష్ణాతీరం” బృహద్గ్రంథాన్ని వెలువరిస్తున్నందుకు సంతోషంగా ఉంది. ఈ పుస్తకం రాష్ట్రప్రజలకు, ప్రభుత్వానికి కూడా ఒక గర్వకారణమైన ప్రచురణ కాగలదని ఆశిస్తున్నాను. కృష్ణా తీరంలోని ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలు, పవిత్ర తీర్థాల వివరాలు ఈ గ్రంథంలో వివరంగా వుండటం ముదావహం.

ప్రపంచీకరణ నేపథ్యంలో నేటి యువతరానికి మన భాష, చరిత్ర, సంస్కృతుల మూలాల గురించిన అవగాహన కల్పించి, మన మాతృభాష పట్ల వారికి గౌరవభావాన్ని కల్గించటానికి ఈ పుస్తకం ఎంతగానో తోడ్పడుతుందని నేను నమ్ముతున్నాను.

నవ్యాంధ్రప్రదేశ్‌లోని వివిధ ప్రాంతాలనుండి ఇతర రాష్ట్రాల నుండి రచయితలు, పరిశోధకులు, మహాపండితులు తెలుగుజాతి ప్రాచీనత, విశిష్టతలను చాటిచెప్పే రచనలు చేసినందుకు అందరినీ మన:పూర్వకంగా అభినందిస్తున్నాను.

*ఆంధ్రప్రదేశ్ భాషా, సాంస్కృతిక శాఖవారికి నా శుభాకాంక్షలు.*

**శ్రీ జె.ఎస్.వి.ప్రసాద్,** ఐ.ఏ.ఎస్.,

**దేవాదాయ, ధర్మాదాయ శాఖ ముఖ్యకార్యదర్శి**



Sri Babu A, IAS

Collector & District Magistrate,
Krishna District

# సందేశం

తెలుగు ప్రజలందరికి "కృష్ణా పుష్కర వైభవం - 2016" సందర్భంగా శుభాకాంక్షలందిస్తున్నాను. 12 రోజులపాటు పుణ్యప్రదంగా జరుపుకునే ఈ "పుష్కర పండుగ"ను చిరస్మరణీయం చేసే విధంగా "కృష్ణాతీరం" పేరుతో ఒక ఉద్గ్రంథాన్ని ప్రచురిస్తున్న ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ వార్ని మనసారా అభినందిస్తున్నాను.

కృష్ణాతీరం అనగానే మనసులో ఎవరికైనా భాషా సాంస్కృతిక రంగ వైభవం స్ఫురణకు వస్తుంది. కృష్ణాతీరం కళలకు పుట్టిల్లు అని కదా లోకోక్తి...

మన భాష, మన సంస్కృతి, మన కళల మూలాలను తవ్వితీసే రచనలెన్నో ఈ పుస్తకంలో చోటు చేసుకుంటున్నాయి. రేపటితరం కోసం ఇందులోని విలువైన పరిశోధనాంశాలు ఎంతో సమాచారాన్ని నిక్షిప్తం చేస్తున్నాయి.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగు భాషా సంస్కృతుల పరిరక్షణకు కట్టుబడి వుందని ఈ సందర్భంగా మరొకసారి ఉద్ఘాటిస్తున్నాను.

'కృష్ణాతీరం' పుస్తకం విజయవంతంగా ప్రచురణ అవుతున్నందుకు కారకులైన ప్రతి ఒక్కరినీ మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను.

శ్రీ బాబు ఏ. ఐ.ఏ.ఎస్.

జిల్లా కలెక్టర్ మరియు డిస్ట్రిక్ట్ మేజిస్ట్రేటు కృష్ణాజిల్లా



Sri Kantilal Dande, IAS

Collector & District Magistrate,
Guntur District

# సందేశం

పన్నెండేళ్ల కొకసారి అపురూపంగా వచ్చే కృష్ణా పుష్కరాలను నవ్యాంధ్ర ప్రదేశ్ రాజధాని ఈసారి ఆతిధ్యం ఇవ్వటం ఒక విశేషం. మాన్య ముఖ్యమంత్రి పర్యవేక్షణలో కృష్ణా పుష్కరాలు అపూర్వమైన రీతిలో నిర్వహించబడటం, ప్రాముఖ్యతను సంతరించుకుంది.

అత్యంత ప్రతిష్ఠాత్మకంగా జరగనున్న ఈ పుష్కర మహోత్సవ తరుణంలో ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు భాషా సాంస్కృతిక శాఖవారు చిరకాలం తీపిగుర్తుగా మిగిలిపోయేలా 'కృష్ణాతీరం' పేరుతో ఒక ఉద్గ్రంధాన్ని ప్రచురించటం ముదావహం. ఈ పుస్తకం నవ్యాంధ్ర ప్రదేశ్‌కు గర్వకారణంగా వుంటుందని ఆశిస్తున్నాను.

కృష్ణాతీరంలోని పుణ్యక్షేత్రాల సమాచారాన్ని సమగ్రంగా ఈ గ్రంథంలో అందించడం సంతోషం.

ఈనాటి తరానికి తెలుగు ప్రజల ప్రాచీనత గురించి, భాష ప్రాచీనత గురించి, సంస్కృతి ప్రాచీనత గురించి తెలియచెప్పే పరిశోధనా వ్యాసాలను గుదిగ్రుచ్చి ఒక మహాగ్రంథంగా వెలువరిస్తున్నందుకు భాషా సాంస్కృతిక శాఖ వారిని, వ్యాస రచయితలను ప్రత్యేకించి సంపాదక వర్గాన్ని దేవదాయ ధర్మాదాయ శాఖ పక్షాన నా అభినందనలు తెలుపుతున్నాను.

ఆంధ్రప్రదేశ్ తెలుగు భాషా సాంస్కృతిశాఖ వారికి నా మనఃపూర్వక అభినందనలు.

**శ్రీ కాంతిలాల్ దండే**

జిల్లా కలెక్టర్ మరియు డిస్ట్రిక్ట్ మేజిస్ట్రేటు

గుంటూరు

డా॥ పాలవర్తి శ్యామలానందప్రసాద్

# అధికాం సర్వతీర్థానాం కృష్ణవేణీం నమామ్యహమ్

భారతదేశంలో ప్రవహించే ప్రతినదికీ, దాని పుట్టుకకు, ఒక కథ తప్పకుండా ఉంటుంది. భారతీయ వైదిక సంస్కృతిని విశ్వసించే భారతీయులు, విదేశీయులు కూడా ఆ విశ్వాసంతో తీర్థయాత్రలు చేస్తారు. నదులకు పూజలు చేస్తారు. హారతులు ఇస్తారు. నదుల్లో స్నానాలు చేసి దేవతలకు, పితృదేవతలకు తర్పణాలు, పిండప్రదానాలు చేస్తారు. యథాశక్తి భక్తిశ్రద్ధలతో దానధర్మాలు నదీతీరాల్లో చేయటం పుణ్యదాయకంగా భావిస్తారు. భారతదేశంలో పెద్దనదులన్నీ దాదాపు పడమర నుంచి తూర్పుకు ప్రవహించేవే. ఉత్తరభారతం, దక్షిణ భారతాల్లో ఉన్నవే ప్రపంచంలో ప్రాచీన సంస్కృతులు ఏవయినా నదీతీరాల్లో ఏర్పడినవే. భారతీయ సంస్కృతి ఒకటిగా ఉన్న తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణ ప్రాంతాలలో నదీతీరాలలో ఆచారవ్యవహార భేదాలు ఏర్పడుతూనే ఉన్నాయి. మానవజాతిమనోవికాసానికి కంకణం కట్టిన మహర్షులు దేశాటనము, భౌగోళికవిజ్ఞానము, సహనము, సామరస్యము, పర్యావరణ, విజ్ఞానము, త్యాగబుద్ధి, కృతజ్ఞత, దానగుణం వంటి వ్యక్తిత్వవికాసాంశాలతో వ్యక్తులను సంస్కరించటం ద్వారా ధర్మరక్షణ భారతఖండ సమగ్రతా పరిరక్షణలకు శాశ్వత ప్రణాళికగా పుష్కరాలను, కుంభమేళావంటి నదీమహోత్సవాలను ఏర్పరిచారు. తీర్థాలతో పాటు క్షేత్రదర్శనాలు దేశం నలుమూలలా జరుగుతాయి. తప్పించుకోవటానికి వీలులేకుండా పితృదేవతలకు పిండప్రదానాలు తప్పనిసరి చేశారు. కంటికి కనపడేవి, కనపడనివీ ఇతర ఖండాలలో, గ్రహాలలో ఉన్న మూడున్నరకోట్ల నదులన్నీ సూక్ష్మరూపంలో ఒక నదిలోకి వస్తాయి. అక్కడ స్నానం చేస్తే అన్ని నదులలో చేసిన పుణ్యం ఒక్కచోటే వస్తుంది. ముప్ఫయి మూడుకోట్ల దేవతలు, పితృదేవతలు అందరూ అక్కడికే వస్తారు. యుగాలు మారినా, రాజులూ, రాజ్యాలూ మారినా చెక్కుచెదరని వ్యవస్థ జీవనది సమ్మానపూర్వక పుష్కరోత్సవాలు. వింధ్యపర్వతం అడ్డుగా ఉన్నరోజుల్లో అటువారిటూ, ఇటువారటూ శ్రమకోర్చి పన్నెండు సంవత్సరాలలో దేశం నాలుగు ప్రక్కలా కాళ్లరిగేలా కళ్లారా చూసి వచ్చేవారు. ఇప్పుడు గంటల్లో తిరిగే దూరాలు అప్పుడు ఏళ్లూపూళ్లూ పట్టేవి కదా ! జీవితంలో ఒక్కసారి పన్నెండు నదుల పుష్కరస్నానం చేస్తే ఆయురారోగ్యభోగభాగ్యాలు లభించిన వారి పుణ్యాన్ని మాటల్లో చెప్పటం సాధ్యం కాదు. మన మహర్షులు అసాధారణ మేధావులు. అవ్యాజకరుణామూర్తులు. దుర్ముఖినామ సంవత్సరం శ్రావణశుద్ధనవమి నాడు బృహస్పతి సింహరాశిలో నుంచి కన్యారాశిలోకి ప్రవేశిస్తాడు. అప్పుడు కృష్ణానదిలోకి పుష్కరుడు ప్రవేశిస్తాడు. కృష్ణానది అంటే కృష్ణవేణి అని అర్థం. సహ్యాపర్వతంపై తెల్లరావిచెట్టు వేళ్లనుంచి విష్ణుమూర్తి నదిగానూ, ఉసిరిచెట్టు వేళ్లనుంచి పరమేశ్వరుడు వేణినదిగానూ ప్రవహించారు. అప్పుడది కృష్ణవేణి అయింది. బ్రహ్మ తన దత్తపుత్రికగా భూలోకానికి పంపటం వలన త్రిమూర్తి స్వరూపిణి అయింది. కృష్ణవేణి పుట్టుక, ప్రయాణం, సాగర సంగమం దారిలో చూపిన మహిమలు, ప్రత్యేకతలు అన్నిటినీ వ్యాస మహర్షి స్కాంద పురాణంలోని సనత్కుమార సంహితయందలి సహ్యాద్రి ఖండంలో శ్రీకృష్ణామహత్యం శీర్షికతో ఇరవైమూడు అధ్యాయాలుగా రచించాడు. అవి చదివితే ఒళ్ళు పులకరిస్తుంది.

పంచభూతాత్మకమైన సృష్టి నీటితోనే మొదలవుతోంది. 'అపఏవస సర్జాదౌ' (నీరే మొదటి సృష్టి) నీటితోనే సృష్టి మొదలైంది. జీవులు తిండి లేకపోయినా బ్రతగ్గలరు గాని నీరు ప్రాణాధారం. అటువంటి నీటిని మానవుడు అనేకవిధాలుగా భౌతికంగా కలుషితం చేస్తున్నాడు. పుణ్యస్నానాలు చేసి నదులను పాపపంకిలం చేస్తున్నాడు. కలి యుగంలో ఈ బాధ మరీ ఎక్కువౌతుంది ? ఎలా అని బ్రహ్మ విష్ణువుని ప్రార్థించాడు. 'నువ్వు నీ లెక్కప్రకారం మిగిలిన నదులన్నిటినీ సృష్టించు. నేను జలావతారంగా కృష్ణానదిగా భూలోకానికి పోతాను. పాప పంకిలమైన నదులన్నీ వచ్చి నాలో చేరి పరిశుద్ధమై మళ్లీ పుణ్య నదులుగా ఉంటాయి' అని శ్రీమహావిష్ణువు పరిష్కారం చెప్పాడు. బ్రహ్మ ఆనందంతో ఈ సంగతిని కైలాసంలో పరమేశ్వరునికి చెప్పాడు.

శివుడు అలాగైతే నేనూ నదీరూపంలో శ్రీహరితో కలిసి భూలోకంలో ప్రవహిస్తానన్నాడు. స్కాందపురాణంలోని ఈ సన్నివేశాన్ని బట్టి మిగిలిన నదులన్నీ బ్రహ్మసృష్టి. ఒక్క కృష్ణవేణి మాత్రమే బ్రహ్మ చేయి తగల కుండా దిగివచ్చిన శివకేశవజలావతారం. ఇది కృష్ణానది ప్రత్యేకత ఇటువంటి నది తనలో నుంచి ప్రవహించాలని సహ్యాపర్వతం ప్రార్థిస్తే శ్రీమహావిష్ణువు అంగీకరించాడు. ఆ కొండపైన బ్రహ్మ తపస్సు చేసిన శరీరం బ్రహ్మగిరి. వేదాలు తపంచేసిన శరీరం వేదగిరి. ఈ రెండు శిఖరాల్లో బ్రహ్మగిరి పైన తెల్లరావిచెట్టు వేళ్లలో నుంచి నీటిధారగా శ్రీమన్నారాయణుడు కృష్ణానదిగా బయలుదేరాడు. ప్రక్కన వేదగిరిపై నుంచి ఉసిరిచెట్టు వేళ్లలోనుంచి వేణీనాదిగా ఆవిర్భవించాయి. ఈ రెండు పాయలు కలిసి కృష్ణవేణిగా ప్రవహించిన అద్భుతఘట్టం మరేనది పుట్టుకలోనూ కనపడదు. త్రిమూర్తుల ప్రమేయంతో ప్రణాళికతో ఏర్పడిన నది కృష్ణానది ఒక్కటే. ఈ విషయాన్ని శ్రీమహావిష్ణువు స్వయంగా చెప్పాడు.

**విష్ణుప్రకటన :**

**తజ్జలం పిబతాం తావత్ తదాత్మాహం స్వయంహృది**
**ప్రవిశ్య వర్ధయామ్యాశు జ్ఞానం భవభయాపహమ్ (అధ్యా.2)**

(జీవులారా ! కృష్ణవేణీ జలాన్ని త్రాగండి. నేనే ఆ నదిని. నేను స్వయంగా మీ హృదయాల్లో ప్రవేశిస్తాను. భవభయహరమైన జ్ఞానాన్ని మీకు కలిగిస్తాను ! అన్నారు. కృష్ణనీరు అంతగొప్పది.

**బహునా కింవదిష్యామి ధృతధర్మాం నదీమిమాం**
**స్పృశన్ సర్వగతోవాయః పావయత్యఖిలం జగత్**

కృష్ణానది ధర్మస్వరూపిణి. ఈ నదిని తాకి అంతటా వ్యాపించే వాయువు అన్ని లోకాలను పావనం చేస్తాడు. కృష్ణ గాలి తగిలినా పవిత్రులౌతారు.

**కార్యద్వయీ సముద్దిశ్య కృష్ణవేణీభవామ్యహం**
**జగతాం రక్షణార్థాయ మద్భక్తానాంచముక్తయే**

రెండు పనుల కోసం నేను కృష్ణవేణిగా అవతరించాను. ఒకటి లోకాన్ని రక్షించటం, రెండు నా భక్తులకు మోక్షాన్ని ఇవ్వటం.

**అస్తిముక్తే రూపాయో ఉన్యో యోగాభ్యాసతో పుష్కరః**
**సుకరస్త్వేష సర్వేషాం కృష్ణవేణ్యా ఉపాశ్రయః**

మానవుల ముక్తికి యోగాభ్యాసమనే ఉపాయం కూడా ఉంది. కాని అది చాలా కఠినం. అందరికీ సులభమైన మార్గం కృష్ణవేణిని ఆశ్రయించటం. కృష్ణానదీస్నానం వల్ల అందరికీ ముక్తి తేలికగా లభిస్తుంది. అని శ్రీమన్నారాయణుడు స్వయంగా ప్రకటించారు.

**శివప్రకటన :**

**నదీనామగ్రజననాన్మాహాత్మ్యచ్చ మహత్త్వతః**
**సర్వం కర్షతి చాఘౌఘంతేన కృష్ణా ప్రకీర్తితాం (అధ్యా.3)**

నదులలో ముందు పుట్టటం మాహాత్మ్యం కలిగి ఉండటం, ఎక్కువగా ఉండటం అనే గొప్ప గుణాలవల్ల అన్ని పాపాలను, అందరి పాపాలను కర్షణం చేసే శక్తి ఉండటం వల్ల ఇది కృష్ణానదిగా పిలువ బడుతుంది అని సాక్షాత్తు పరమేశ్వరుడు పెట్టిన పేరు గలది.

**కల్పాద్యస్యకృతస్యాదా వియం దేవ్యవసత్పురా**
**వైష్ణవీ బ్రహ్మణః పుత్రీ పూజ్యమానా సురర్షిభిః**
**తథా పుణ్యమయీ కృష్ణా సర్వత్ర సుధియో జనాః**

కల్పారంభంలో కృతయుగం మొదట్లో కూడా విష్ణురూపిణి, బ్రహ్మపుత్రి, దేవతలు, ఋషుల పూజలందుకున్నది అయిన కృష్ణానది ఉంది. పుణ్యనది అయిన కృష్ణానదిని బుద్ధిమంతులై సేవించండి.

ఇలా పరమేశ్వరుడు కృష్ణవేణిని కీర్తించాడు.

వశిష్ఠ విశ్వామిత్రాది ఋషులు కృష్ణానదిని స్తుతించారు. కృష్ణ ఒడ్డున తపస్సు చేశారు. వారిద్దరూ స్పర్థతో ఒకరినొకరు గెలవాలని కర్కోటకతీర్థంలో (పెదకళ్లేపల్లి) విశ్వామిత్రుడు వేణుగోపాలస్వామిని గురించి, వశిష్ఠుడు నాగేశ్వరస్వామి గురించి తపస్సుచేశారు. వారిద్దరూ కృష్ణానదిని స్తుతించారు. విశ్వామిత్ర స్తుతి స్కాందపురాణం, పద్మపురాణాల్లో రెండుచోట్లా వేరుగా ఉంది.

**నమస్తే సర్వపాపఘ్ని ! సంసారభయనాశిని !**
**నారాయణి ! జగన్మాతః ! త్రాహిమాం శరణాగతమ్**
**స్తోత్రం ప్రగల్భ్యతేతస్యాం పరబ్రహ్మస్వరూపిణి !**
**సహ్యజే తే నమస్తుభ్యాం స్తుత్యాహృష్టా క్షమస్వమే (స్కాంద)**

కృష్ణవేణీ! నారాయణీ! జగన్మాతా! పాపహారిణీ! నేను నిన్ను శరణు వేడుతున్నాను. నన్ను కాపాడు. నువ్వు పరబ్రహ్మస్వరూపిణివి. నా స్తోత్రంతో సంతోషించి నన్ను క్షమించు. అంటూ స్కాందంలో విశ్వామిత్రుడు కృష్ణానదిని బ్రతిమాలుకున్నాడు.

పద్మపురాణంలో విశ్వామిత్రమహర్షి చెప్పిన కృష్ణానదీ అష్టకం కృష్ణవేణీ స్వరూపాన్ని, స్వభావాన్ని, మహిమను, మహత్యాన్నీ తెలియజేసే గొప్ప స్తోత్రం. 'కృష్ణవేణి నమామ్యహమ్' అనే మకుటంతో చదువుతుండగా కృష్ణవేణి కళ్లకు కనపడేటట్లు విశ్వామిత్రమహర్షి అద్భుతంగా రచించిన ఈ అష్టకంలోని వర్ణననే కృష్ణవేణిమాత విగ్రహంగా మలిచారు. ఇప్పుడు మనందరికీ కనపడే కృష్ణవేణీమూర్తి అదే.

**విశ్వామిత్రకృత కృష్ణానద్యష్టకమ్ ।**

1. శంఖచక్రధరాందేవీంనీలోత్పలదళప్రభాం !
   విష్ణురూపాంకితాందేవీం కృష్ణవేణీం నమామ్యహమ్ ।
2. శుద్ధస్ఫటిక సంకాశాంద్విభుజాంపద్మధారిణీం ।
   శివమూర్తిధరాందేవీం కృష్ణవేణీం నమామ్యహమ్ ॥
3. కమండలుధరాం పుణ్యాంజపమాలాధరాంశుభాం ।
   బ్రాహ్మీంసువర్ణవర్ణాభాం కృష్ణవేణీం నమామ్యహమ్ ॥
4. స్మరణాత్సర్వదోషఘ్నీం ధర్మనాత్స్వర్గదాయినీం ।
   స్నానేమనముక్తిదాంపుణ్యాం కృష్ణవేణీం నమామ్యహమ్ ॥
5. కల్యాణాంబువహాంనిత్యంస్రూణాం సౌభాగ్యదాయినీం ।
   దుఃఖదారిద్ర్య విధ్వంసీం కృష్ణవేణీం నమామ్యహమ్ ॥
6. సర్వదేవమయీంసాక్షాద్బ్రహ్మవిష్ణుశివాత్మికాం ।
   ఫలదాంసర్వతీర్థానాం కృష్ణవేణీం నమామ్యహమ్ ॥
7. పవిత్రాత్యంత నైర్మల్య మహాపుణ్యాంబు వాహినీం ।
   త్రైలోక్యపావనీం దేవీం కృష్ణవేణీం నమామ్యహమ్ ॥
   త్రైలోక్యపావనీందేవీం కృష్ణవేణీం నమామ్యహమ్ ॥
8. స్వర్గారోహణ సోపాన మహాపుణ్యతరంగిణీం ।
   అధికాంసర్వతీర్థానాం కృష్ణవేణీం నమామ్యహమ్ ॥

ఇల గంగమ్మకు లేదు గౌతమికి లేదీయోగ మా విష్ణువే
వెలసెన్ నీవయి కృష్ణవేణి ! కలిలో వేవేల పాపమ్ములన్
తొలగం జేయగ ముక్తినీయగ కళాదుర్గమ్మవై క్షీరదో
హలవై కూర్తువు భుక్తిముక్తులను సస్యశ్యామలానందినీ

ఇలా కృష్ణవేణిని ప్రసాదించి ప్రస్తుతించిన త్రిమూర్తులకు ఇంద్రాది దేవతలకు, వశిష్ఠ విశ్వామిత్రాది ఋషులకు, యోగులకు, యతీశ్వరులకు సర్వవర్ణాలవారికీ దుర్ముఖినామ సంవత్సర కృష్ణా పుష్కరాలకు స్వాగతం చెబుతూ.... స్వస్తి.

---

గోదావరీ భీమరథీ కృష్ణవేణ్యా తథాపరా
తుంగభద్రా సుప్రయోగా వాహ్యాకావేర్య థాపగా
సహ్యపాద వినిస్క్రాంతో ఇత్యేతాః సరిదుత్తమాః

– మార్కండేయ పురాణం

గోదావరీ భీమరథీ కృష్ణవేణ్యాది కాస్తథా
సహ్యపా దోద్భవానద్యః స్మృతాః పాపభయాపహాః॥

–విష్ణుపురాణం

సహస్ర శిరసం వింధ్యం నానాద్రుమ లతాయుతం
నర్మదాంచ నదీందుర్గాం మహారగనిషేది తాం ।
తతో గోదావరీరమ్యాం కృష్ణవేణీం మహానదీం
వరదాంచ మహాభాగాంచ మహోరగనిషేదితాం ॥

– రామాయణం కిష్కింధకాండ

శ్రీ దీవి నరసింహాచార్యులు

# కృష్ణానదీ జన్మ కథనము

"గోదావరీ భీమరథీ కృష్ణవేణ్యాదికాస్తథా ।

సహ్యపాదోద్భవానద్యః స్మృతాఃపాపభయావహాః॥

అని విష్ణుపురాణమున సహ్యాద్రియందుఁ బుట్టిన నదులను వ్యాస భగవానుడు వర్ణించెను. శ్రీమన్నారాయణుఁడు బ్రహ్మతో కలియుగ ధర్మములం జెప్పుచు. కలియుగము నందు జన్మించు జనులు అల్పాయుష్కులుగను, కర్మలయందల్ప శ్రద్ధఁగలవారుగ నుందురు. కనుక వారికి కూడ స్నానదర్శనాదుల వలననే క్రతుకర్మానుష్ఠాన జన్మఫలములు కలుగునట్లు, పవిత్రములును, సర్వపాపహర ప్రభావఁతములు నగు సలిలములతోఁగూడిన నదీనదములను, పుణ్యహ్రదములను సృజింపుమనియు, తాను "కృష్ణా"నది నగుదునని యీశ్వరుని "వేణి" యగు నట్లాజ్ఞాపింతుననియు నానతిచ్చెను. భగవదనుజ్ఞ ననుసరించి బ్రహ్మయు, తీర్థస్నాన పానాదులచేతనే, దురితక్షయ మొనర్పఁజాలు నిర్మలోదక పూరితంబులగు తీర్థంబులు కల నదులను పవిత్ర క్షేత్రంబులను పర్వతంబులను సృజించెను. సహ్యాద్రి యొక్క ఉత్తరశృంగమున బ్రహ్మనారాయణునిఁ గూర్చి తపంబొనర్చెను. అందువలన దానికి "బ్రహ్మనగ" మని పేరు కలిగెను. అప్పుడు శ్రీమన్నారాయణుఁడు బ్రహ్మదేవునికి "శ్వేతాశ్వర్థ" రూపమున ప్రత్యక్షమయ్యెను. ఇట్లే యీశ్వరునిఁ గూర్చి వేదములు మూర్తివంతములై సహ్యగిరి దక్షిణ శృంగమున తపంబొనర్చెను. అప్పుడీశ్వరుఁడు "అమలకవృక్ష" (ఉసిరిచెట్టు) రూపమున సాక్షాత్కరించెను. కొంతకాలమునకు శ్వేతాశ్వర్థము జలమయమై ప్రవహింపమొదలిడెను. అందువలన దీనికి "కృష్ణా" యని పేరు కలిగెను. మరికొంతకాలమునకు ఆమలకవృక్ష రూపమున వెలిసిన యీశ్వరుఁడు కూడ భగవదానతి జలమయమై "వేణి" యను పేరు వహించి తానుకూడ ప్రవహించి కృష్ణలోఁ గలిసెను. అందుచే నిది "కృష్ణవేణి" యను పేరుతో ప్రసిద్ధిఁగాంచినది. కనుకనే పురాణములలో "కృష్ణా కృష్ణాంగ సంభూతా" అనియు "కృష్ణా విష్ణు తనుస్సాక్షాద్వేణీ దేవో మహేశ్వరః తయోస్సంగమోయత్రకోటి తీర్థసమంస్మృతం" అని నిర్వచింపఁబడినది: ఈ రెండును "సతారా" పట్టణమున కైదుమైళ్ళ దూరములో కలియుచున్నవి. అక్కడనుండి యేకముఖమై "కృష్ణవేణి" ప్రవహించుచున్నది. ఈ కృష్ణవేణియందు తుంగభద్ర, నారాయణి, కుముద్వతి, వైష్ణవి, విశాల, విజయ, కకుద్మతి, మలాపహారిణి, కౌశిక, భీమనది, అరుణ, భాస్కరి, ముసి, వైఘు, తామ్రపర్ణి యను యుపనదులు మరికొన్ని కలియుచున్నవి. ఈ నదిని గూర్చి మహాభారతములో "సదానిరామయాం కృష్ణాం మందగాం మందగామినీం" అని వ్యాస మహర్షి వర్ణించియుండిరి, మరియు నీ నది యుత్కృష్టమైనదని యనేక పురాణములు నిర్వచించినవి. గంగానది విష్ణుపాదోద్భవియగుటచేతను, కృష్ణ "కృష్ణాంగసంభూతా" అనియు "విష్ణుతనుస్సాక్షాత్త"ను ప్రమాణముల వలన విష్ణు శరీరమేయగుటచేతను, యితర నదుల కంటె నివి యత్యంత ప్రబావంతములైన వనుటకు సందేహము లేదు. మరియు నిది పశ్చిమ కనుమలనుండి పూర్వ (తూర్పుగా) వాహినిగా ప్రవహించి, యీ దుర్గాక్షేత్రమునుండి దక్షిణముగా "వ్యాఘ్రేశ్వరము", (పులిగడ్డ) వరకు వచ్చి, అచ్చటనుండి రెండు వాహినులుఁగా చీలి యొకటి తూర్పుగను, మరియొకటి దక్షిణముగ ప్రవహించెను. తూర్పుగా ప్రవహించిన పాయకు "కృష్ణా" అనియు, దక్షిణముగా ప్రవహించిన పాయకు "వేణి" యనియు పేర్లు. వేణి యింతవరకు అంతర్వాహినిగా నడచినది. తూర్పుగా ప్రవహించిన "కృష్ణాతరంగిణి" "ఉభయనాగేశ్వర క్షేత్రమగు" కడలుపురి, లేక కదలీపురము (పెదకళ్ళేపల్లి) వరకు తూర్పుగానడచి అక్కడనుండి తిరిగి ఉత్తరవాహినీగా "హంసలదీవి" వద్ద సాగరమున కలియుచున్నది. అందువలన దీనిని "కృష్ణా సాగర సంగమ" మందురు. ఇచ్చట గొప్ప గోపాలక్షేత్ర మొకటి కలదు.

ఇది స్వయంభువమని కృష్ణామహాత్మ్యమున పేర్కొనఁబడినది. ఇంక వేణి యను నది పులిగడ్డ నుండి దక్షిణాభి ముఖముగా ప్రవహించి సముద్రమునఁ గలిసెను. వేణి తొలుత సంగమించిన స్థలమునకు

"సంగమేశ్వరమ"ని పేరు. ఇది శివక్షేత్రము. తరువాత యీ వేణి దక్షిణముగ "యేటిమొగ" అను గ్రామమువరకు ప్రవహించి, అచ్చట మూడుపాయలై, మొదటి పాయ తిరిగి తూర్పుగా నడిచి "గుల్లలమోద" అను గ్రామమువద్ద "Kistna Havelock Point" (కృష్ణాహావ్ లాక్ పాయింటు) అనుస్థలమున కల దీపగృహము (Light House) వద్ద కలియుచున్నది. దీనికి 'గోలుముట్టు పాయ' లేక 'బల్లలేరు' అని పేరు. రెండవ పాయ "నాచుగుంట, ఈతచెట్ల దిబ్బ" లను గ్రామముల మధ్యగా ఆగ్నేయ దిక్కుగా ప్రవహించి సముద్రమునఁ గలియుచున్నది. దీనిని 'నడిమి యేరందురు'. ఇంక మూడవపాయ "లంకవేణి దిబ్బ' మీదుగా ప్రవహించి "చాపలమండి" అను తావున "బీకన్" (Beacon) వద్ద కలసినది. ఇట్లు యిది మూడు పాయలుగా జడ కుచ్చుల వలె నుండుటచే దీనిని "వేణి" యను పేరుతో వ్యవహరించిరి. కనుక దీనికి "త్రివేణీ సాగరసంగమమ"ని పేరు. ఈ కృష్ణవేణీ నది శక్తి ప్రభావము లధికములని వేరే చెప్పనక్కరలేదు. అనగా యేనది ప్రవాహమునకు యెదురు నడుచునో దానిశక్తి అధికము. అట్లు అన్ని నదులను ప్రవహింప నేరవు. శ్రీ విష్ణుపాదోద్భవి యగుటచే గంగానదియు సాక్షద్విష్ణు తనూద్భవియగుటచే నీ కృష్ణానదియు తప్ప మిగిలిన యేనదులకు నిట్టి శక్తి ప్రభావములు లేవు. స్కాందము సహ్యాద్రి ఖండము అష్టాదశోధ్యాయమున "కృష్ణామహాత్మ్యము" నుఁ గూర్చి ఋష్యాదులు, 'కృష్ణామహాత్మ్యమతులం శ్రోతుమిచ్ఛా మహోవయం' అని నారద మహర్షిని యడిగినట్లును; 'శృణ్వం తుమున యస్సర్వె కృష్ణా మహాత్మ్యం చోత్తమం' అని ప్రారంభించి 'స్నానం దానం జపో హోమ స్స్వాధ్యాయః పిత్రుతర్పణం యవమాత్రంతు యోకుర్యాద నంతం ఫలమశ్నుతె' అని నారదుడుపదేశించినట్లును కలదు. మరియు కొన్ని నదలు తమ శక్తి ప్రభావములను కొంత కాలము నకు కోలు పోవుననియు, యీ కృష్ణానది మాత్రమే కేవలము హరిహరాత్మకమైన దగుటచే అన్ని నదులవలెఁగాక. తన ప్రభావమును విడువకపోగా యితర నదుల శక్తినిఁగూడ తానే గ్రహించి ప్రవర్ధమాన మగుచుండునని 'కతాకృ' షైవాఉ వశిష్యతె' అను పురాణోక్తి వలన తెలియుచున్నది. ఈ నదీ జలముల కిట్టి ప్రభావముండునా? అను సందియము పాఠకులకు కలుగవచ్చును. నదీ సలిలముల కిట్టి ప్రభావమున్న దన్నప్పుడు పరిహసించిన పాశ్చాత్య దేశస్తులు కొందరును, అర్యావర్త మున కూడ పాశ్చాత్యవిద్యా విజ్ఞాన వేత్తలు కొందరును కలరు. కాని సుమారు పదిహేను సంవత్సరముల క్రిందట కలకత్తా (Tropical Medical College) లో, పాశ్చాత్య ప్రకృతి శాస్త్రవేత్తలును, రసాయన శాస్త్ర కోవిదులును, పదార్థవిజ్ఞాన శాస్త్ర పండితులును పలువురు "గంగానదీ నీరము" ను తెప్పించి, దాని యందు అనేకవిధములైన విషక్రిములను వేసి పరీక్షించిరి. ఆ క్రిములన్నియు నశించిపోయినవి. ఆ నీరు చూచుటకెంత కలుషముగ కన్పించుచున్నను. ఆ నీటియందు ఆరోగ్యమునుఁ జెరుపఁగల పురుగులేమియు లేవనియు, మనము వేసినను అట్టి విషక్రిములు బ్రతుకఁజాలవనియు నిర్ణయించిరి. మరియు దీని మహత్త్య మెన్నియో యుగములకు పూర్వమే మన భారతీయులు కనుఁగొని,ఈ నది మహాపవిత్రమైనదనియు, సర్వక్రిమి సంహారమును, సర్వరోగహర సమర్థమునై యున్నదని పురాణముల యందు వాకొని యున్నారు. ఇందుకు పాశ్చాత్య ప్రకృతి రసాయన శాస్త్ర పండితులు ఆశ్చర్యమొంది యిట్టి పరమపవిత్రమైన నదీ జలములను పావనమని తలచు సనాతన ధర్మ నిరతులను మన మాక్షేపింప రాదనియు, వారెన్నడో ఈ తీర్థమహిమను గుర్తించిరనియు, మనము వారిని మూర్ఖులనుకొనుట, మన మూర్ఖత్వమును వెల్లడిపర్చుకొనుటె యగుననియు, "మాంచెస్టరు గార్డియన్" (Mamchester Gardian) యను పత్రికలో ప్రకటించిరి. దీని యనువాదము 1932 సంవత్సరం మే నెల 5 వ తేదీన వెలువడిన 'హిందు'పత్రికలో ప్రకటింపఁబడినది. యిట్టి పుణ్య నదులలో "కృష్ణవేణి" యొకటి.

## తీర్థములు-క్షేత్రములు

ఈ నదికి జన్మస్థానము పడమటి కనుమలలోని సహ్యగిరి. దీని తీరమున అనేక తీర్థములును, క్షేత్రములును కలవు. తీర్థములనగా, దేవతలచేతను ఋషీశ్వరులచేతను, సిద్ధుల చేతను, ఆర్యులచేతను, తపస్సు చేయబడి తత్తపఃఫలమును ఆయా ఘట్టములు గల తీరము లందు ధారాగ్రహితము చేయఁబడుటచేతను, వారి సాన్నిధ్యమువలనను శక్తిపాతము కలిగి మహిమాన్వితములైన నదీతర ఘట్టములు క్షేత్రములనగా నిట్లే దేవతాదులచేతను, ప్రభువులచేతను, తమ తమ ఉపాస్యదైవతములను ప్రతిష్టింపబడిన దేవాయతనములు. ఇట్టి వెన్నియో యీ నది కిరుపార్శ్వములనుఁ గలవు. కృష్ణా తీరమునఁగల తీర్థములు 60.

1. అనంత 2. అష్టతీర్థ 3. అఘహరి 4. అమరజ 5. ఆమలక 6. ఆదిత్య 7. ఇంద్ర 8. కకుద్మిని 9. కంక 10. కర్కోటక 11. కుబ్జేశ్వర 12. కులతారక 13. కౌశిక 14. క్రౌంచ 15. కూర్మ 16. చక్ర 17.జంబు 18.జాతిస్మర 19. పౌలస్త్య 20.ఫల్గున 21. పాతాళ గంగ 22. బ్రహ్మ 23.భారత 24. భైరవ 25. త్రిశూల 26. నారాయణ 27. నిర్ఝర 28. మధు 29. మహాతీర్థ 30. మార్కండేయ 31. మలాపహారిణి 32. మునితీర్థ 33. ముక్తితీర్థ 34. మూర్తిదర్శన 35. దుర్గా 36. యజ్ఞవాట 37. ఋణాపహరణ 38. నృసింహ 39. లింగతటి 40. విష్ణు 41. రుద్ర 42. విశాల 43. విష్ణుచ్ఛాయ 44. వేద 45.వేణీసంగమ 46. విహంగమ 47.వాసుకి 48. వైధస

49. వ్యాఘ్ర 50. శంఖ 51. శతలింగ 52. శుక్ల 53. సప్తరుషి 54. సప్తకోటి 55. శూరదర్పహర 56. స్కందపుర 57. సప్తసాగర 58. సప్తకులోద్ధార 59. సోమ 60. సూర్య.

వీటి ప్రభావముల నంతములు. ఇంక క్షేత్రములనుం గూర్చి వివరింతును.

## గోకర్ణక్షేత్రము

దీనినే మహాబలేశ్వర మందురు. రావణుం డీశ్వరునిం గూర్చి తపస్సుం జేసెను. ఈ తపస్సునుకు యీశ్వరుండు మెచ్చి తన ఆత్మ లింగము నొసంగెను. దేవత లిట్టి దుష్టున కిచ్చుట యనర్ధదాయకమని యొంచి విఘ్నేశ్వరునింబంపిరి. విఘ్నేశ్వరుండు రావణునింజూచిసంధ్య వేళ యయ్యెనుకదాం సంధ్యావందన మాచరింపవాంయని యడిగెను. నే నిప్పుడే వత్తును. దీనిని నీవు పుచ్చుకొనుమని విఘ్నేశ్వరుని రావణుండు వేడెను. ఆతను మూడు తడవలు పిలిచెదననియు నీవు రానిచో దీనిని యిక్కడనే దింపి పోవుదునని చెప్పెను. అందుకంగీకరించి రావణుండు కృష్ణకుం బోయెను. అంత విఘ్నరాజు ముమ్మారు రావణునిం బిల్చెను. కాని యతండు వినిపించుకొనలేదు. విఘ్నేశ్వరుండు శివలింగమును యచ్చుట పాదుకొల్పెను. అంత రావణుండు వచ్చి జరిగిన యుదంతమును తెలిసికొని తన బలమునంతయు వినియోగించి యా లింగమును పెకలింప ప్రయత్నించెను. అప్పుడా లింగము గోకర్ణాకృతిగ సాగెను. అందువలన దీనికి "గోకర్ణక్షేత్ర" మని పేరు కలిగెను. రావణుం డతి బలమును యుపయోగించుటచేత "మహాబలేశ్వర" మని కూడ పేరు కలిగినది. నరహరిపురము (నర్సోవాడా) గాణుగాపురము (కురుగడ్డి ప్రదేశము) ఇది దత్తాత్రేయ అవతార స్థలము. శ్రీశైలము, మల్లిఖార్జునక్షేత్రము ఇక్కడ దేవేరి భ్రమరాంబ "శ్రీశైల శిఖరందృష్ట్వా పునర్జన్మన విద్యతె" అను ఆర్యోక్తి కలదు. ఇది త్రిలింగ దేశ సరిహద్దులలో పశ్చిమ సరిహద్దుగా చరిత్రకారులచే పరిగణింపంబడినది. మున్ను బౌద్ధారామముగ నుండెడిది. వీర శైవుల కాలమున మార్చంబడినది. ముక్త్యాల (ముక్తిపురక్షేత్రము వేదాద్రి, జగ్గయ్య పేట సమీపమునం గలదు యోగనారసింహక్షేత్రము సాలిగ్రామ శిల. కృష్ణలో నుండును. పిశాచగ్రస్తులు పెక్కండ్రు యీ స్వామిని సేవించి స్వస్థులగుచున్నారు. అమరావతి పంచారామములో నొకటి. అమృతలింగఖండము దేవేంద్రునిచే ప్రతిష్ఠింపంబడినది. దీనినే "అమరారామ" మందురు. పూర్వము బౌద్ధకేంద్రము. అపూర్వములైన చిత్రములు శిలలపై చెక్కంబడి యున్నవి. శ్రీ కనకదుర్గాక్షేత్రము బెజవాడ. ఈమె పూసపాటివారి యిలవేల్పు. ఇంద్రకీలాద్రిపై నెలకొన్నది. సీతానగరం హనుమంతక్షేత్రము, ఉండవల్లి అనంతపద్మనాభక్షేత్రము ఒకప్పుడు బౌద్ధమతముగ నుండెడిది. ఇప్పుడు పాడుపడి యున్నది. ఇది సీతానగరమునకు రెండు మైళ్ళు పశ్చిమముగ నున్నది. మంగళగిరి. ఇది లక్ష్మీనృసింహ క్షేత్రము. ఈ కరాళమును సాలిగ్రామ శిలయే. ఈ దేవుని పానకాలరాయుండందురు. ఉభయరామేశ్వరము (అయిలూరు చిలుమూరు) ఉభయసోమేశ్వరము (పాపనాశనము కోటిపల్లి), ఉభయముక్తేశ్వరము (వేకనూరు మూరతోట), ఉభయ నాగేశ్వరము (కడలుపురి లేక కదళీపురము), పెదకళ్ళేపల్లి, పిట్టలలంక ఇది కర్కోటక క్షేత్రము, దీనినే దక్షిణ కాశియందురు. ఇచట కృష్ణ ఉత్తరవాహిని. ఉభయ నారాయణ క్షేత్రము. (అవనిగడ్డ నల్లూరు) ఈ పది క్షేత్రములు శ్రీరామచంద్ర పరమాత్మచే ప్రతిష్ఠింపంబడినవి. శ్రీకాకుళము ఆంధ్ర విష్ణుక్షేత్రము. ఇచ్చట నవబ్రహ్మలు తపస్సు చేసినట్లు స్థలపురాణములవలన తెలియుచున్నది. ఈ ఆంధ్ర విష్ణువునే "తెలుంగు వల్లభుండు" "తెలుంగు రాయుడు" అందురు. ఇది ఆంధ్ర సామ్రాజ్యమునకు తొలి రాజధానీ నగరము నేటికిని "ఆంధ్ర నాయకుండని" వ్యవహారసిద్ధి కలదు. ఇచ్చట "యేకరాత్రి ప్రసన్నమల్లికేశ్వరు"ని మహాత్మ్య మద్భుతమైనది. ఈయన క్షేత్రపాలకుండు. శుక్లపురి (వెల్లటూరు) సుప్రసిద్ధ గణపతి క్షేత్రము. వ్యాఘ్రపాదపురము (పెదపులివర్రు) ఇది వరద రాజక్షేత్రము. సరికోత్తారకక్షేత్రము. (నడకుదురు) ఈశ్వర క్షేత్రము. ఇచ్చట క్షేత్రపాలకుండు లక్ష్మీనారాయణుండు. వ్యాఘ్రేశ్వరము. (పులిగడ్డ) వ్యాఘ్రపాదాశ్రమము, సంగమేశ్వరము, వేణీ సాగర సంగమ స్థలము. మోపిదేవి సుప్రిసద్ధ సుబ్రహ్మణ్య క్షేత్రము. ఇచట క్షేత్రపాలకుండు సకలేశ్వరుండు. అగస్త్యక్షేత్రము. (టేకుపల్లి) దీనిని కృష్ణా మహాత్మ్యమున "టేకువన" మని ప్రశంసించిరి. హంసలదీవి వేణుగోపాలక్షేత్రము. స్వయం వ్యక్తము. ఇదియే కృష్ణాసాగర సంగమ పుణ్యక్షేత్రము. వీటిలో శ్రీ కనకదుర్గా క్షేత్రమొకటి.

శ్రీ ఎ. మోహన్ మురళీ కుమార్

# కృష్ణ : : నదీ - నేల

పవిత్ర కృష్ణానది పేరు వినగానే మనకు గుర్తుకువచ్చేది, విజయ వాడ, ఇంద్రకీలాద్రి కొండ మీద ఉన్న 'కనకదుర్గాదేవి' అమ్మవారు, ప్రకాశం బ్యారేజీలు. కృష్ణానదికి ఉన్న విశిష్టత ఏమంటే, ప్రజలు తమ పాపాలు పోగొట్టుకోవటానికి నదులలో పవిత్రస్నానాలు చేస్తుం టారు. అందువల్ల వారి పాపాలు నదులకు అంటుకుంటాయి. పురా ణాల ప్రకారం, నదులన్ని విష్ణుమూర్తి దగ్గరకు వెళ్ళి ఆయనచేత పాపాలు పోగొట్టుకుంటాయట. కాని కృష్ణానది మాత్రం తనకు తానే శుభ్రపరుచుకొని మళ్ళీ పవిత్రంగా ఉంటుందట.

కృష్ణానది నీటి పరిమాణంగా చూస్తే దేశంలో నాలుగవ పెద్దనది. గంగా, గోదావరి, బ్రహ్మపుత్ర నదుల తరువాత నాలుగవ స్థానంలో కృష్ణా నది ఉంటుంది. కృష్ణానది మహారాష్ట్రలోని మహాబలేశ్వరం దగ్గర పడమటి కొండల్లో 1300 అడుగుల ఎత్తులో పుట్టి 'కర్ణాటక, తెలంగాణా, ఆంధ్రప్రదేశ్‌ల గుండా ప్రవహించి తూర్పు కోస్తాలో, ఆంధ్రప్రదేశ్‌లోని కృష్ణాజిల్లాలో ఉన్న 'కోడూరు' అనే గ్రామం దగ్గర ఉన్నహంసలదీవి దగ్గర బంగాళాఖాతం సముద్రంలో కలుస్తుంది. ఇంకొక పాయ 'నాగాయలంక' గ్రామం దగ్గర ఉన్న బంగాళాఖాతంలో కూడ కలుస్తుంది కాని ఇది అంతగా ప్రాచుర్యంలోకి రాలేదు. హంసల దీవి దగ్గర 'వేణుగోపాల స్వామి' ఆలయం ఉంది. దీనినే సంగమ స్థానం అని, సాగర సంగమం అనికూడా అంటారు. పర్వదినాలలో యాత్రీకులు వచ్చి వేణుగోపాలస్వామిని దర్శించుకొని కృష్ణానది సంగమంలో స్నానాలు చేసి చరితార్థులవుతారు.

కృష్ణానది షుమారుగా 1300 కిలోమీటర్లు దూరం ప్రవహిస్తుంది (పుట్టినచోటునుంచి అంటే మహాబలేశ్వరం దగ్గర నుంచి బంగాళా ఖాతంలో కలిసేదాకా). కృష్ణానది ప్రవహించినంత మేర భూములన్నీ సారవంతమై అన్నిరకాల పంటలు పండటానికి దోహదపడుతుంది. నల్లరేగడి, ఎర్రరేగడి, రాతినేలలు, ఒండ్రు, ఎర్ర మరియు నల్లరేగడి మిశ్రమ నేలలు, ఇసుక నేలలు, మొదలగునవి కనపడతాయి. కృష్ణానది ప్రాంతమంతా 'శాతవాహనులు, ఇక్ష్వాకు సూర్యవంశరాజులు పరి పాలించారు. విజయవాడ, కృష్ణానది ఒడ్డున ఉన్న పెద్ద నగరం. వరదల సమయంలో కృష్ణానది చాలా ఉధృతంగానూ, చాలా భయంక రంగానూ, ప్రవహిస్తుంది. ఒక్కొక్కసారి వరదలలో షుమారు 75 అడుగుల ఎత్తునగూడ ప్రవహించటం కద్దు. అంతేగాక కృష్ణానది మామూలు రోజుల్లో చాలా శాంతంగా ప్రవ హిస్తుంది. అందుకే మరాఠీలో ఒక సామెత చెబుతారు. 'శాంత వాహతే కృష్ణామాయి'. అంటే అందరూ కూడా కృష్ణానదిలాగా శాంతంగా ఉండాలి కృష్ణానదిని చూసి నేర్చుకోవాలి.

కృష్ణానదికి 'తుంగభద్ర' ఒక ముఖ్యమైన ఉపనది. కాని తుంగభద్ర కన్నా పొడవైన ఉపనది 'భీమా'నది. 'సంగ్లి' దగ్గర మూడు ఉపనదులు వచ్చి కలుస్తాయి. ఇవి చాలా పవిత్రమైనవి. ఎంత పవిత్రమైనవంటే, కృష్ణానది ఒడ్డున ఉన్న 'ఔదుంబర వృక్షం' 'దత్తాత్రేయుల వారు' కొన్నాళ్ళు నివసించారట.

కృష్ణానదికి ఏ రాష్ట్రంలోనూ లేని ఒక విచిత్రమైన పరిస్థితి మన రాష్ట్రంలో ఉంది. అది ఏమిటంటే మహారాష్ట్ర, కర్ణాటక రాష్ట్రాలలో కృష్ణానది పూర్తిగా ఆ రెండు రాష్ట్రాల గుండా ప్రవహిస్తుంటే తెలంగాణా రాష్ట్రం ఏర్పడకముందు కృష్ణానది కర్ణాటక రాష్ట్రం నుంచి ఆంధ్రప్రదేశ్ లోకి ప్రవేశించి హంసలదీవి వద్ద సముద్రంలో కలిసేది. కాని తెలం గాణా రాష్ట్రం ఏర్పడిన తరువాత కృష్ణానది ఇరు రాష్ట్రాలగుండా ప్రవహిస్తున్నది. అంటే నల్లగొండ జిల్లా వరకు కృష్ణానదికి ఒకవైపు తెలంగాణా ఉంటే మరొకవైపు ఆంధ్రరాష్ట్ర సరిహద్దులున్నాయి. తుంగభద్ర నది ఆలంపురం, మెహబూబ్‌నగరం, తెలంగాణా జిల్లాల్లో ప్రవహిస్తుంటే, ఆంధ్రప్రదేశ్‌లో మంత్రాలయం దగ్గరనుంచి ప్రవహి స్తున్నది. ఆ విధంగానే, శ్రీశైలం డ్యామ్‌కి ఒకపక్కన ఆంధ్రప్రదేశ్ (కర్నూలు జిల్లా ఉంటే, రెండోవైపు నల్గొండ జిల్లా (తెలంగాణలో) ఉన్నది. నాగార్జునసాగర్ డ్యాముకు ఒకవైపు గుంటూరు జిల్లా ఉంటే రెండోవైపు కూడా చిట్యాల నల్లగొండజిల్లా ఉన్నది. అక్కడనుంచి పులి చింతల డ్యాము, ముక్తేశ్వరం, అమరావతి, ఇబ్రహీమ్ పట్నం (పూర్తిగా

కృష్ణాజిల్లాలోనే ఉన్నాయి) నుంచి అవనిగడ్డ దగ్గర రెండుగా పాయలుగా చీలి ఒక పాయ కోడూరు దగ్గర హంసలదీవి దగ్గర రెండోది నాగాయ లంక దగ్గర సముద్రంలో కలుస్తున్నది. రెండు రాష్ట్రాల సరిహద్దుల గుండా ప్రవహించుటచేత, శ్రీశైలం డ్యాము, నాగార్జునసాగర్ డ్యాము దగ్గర ఉన్న నీటిని ఇరు రాష్ట్రాలు పంచుకోవలసివస్తున్నది.

ఇటీవల కృష్ణానదిలో నీటి లభ్యత తక్కువగా ఉండటం కారణంగా, 2015వ సంవత్సరంలో పోలవరం కుడి కాలువద్వారా పట్టిసీమ ఎత్తిపోతల ద్వారా గోదావరి నదిని కృష్ణాజిల్లాలోని ఇబ్రహింపట్నం దగ్గర కృష్ణానదితో అనుసంధానం చేశారు. దీనివలన ప్రకాశం బ్యారేజి దగ్గర నీటినిల్వలు పెరుగుతాయి.

కృష్ణానది హిందువులకు చాలా పవిత్రమైనది. కృష్ణానదిలో స్నానం చేయటం వలన పాపహరణ జరుగుతుందని హిందువులకు గాఢమైన నమ్మిక. కృష్ణానది మాత్రమే తనలో స్నానం చేసిన వారి పాపాలను హరించి పవిత్రులను చెయ్యటమే కాకుండా తనను తాను, భక్తులు స్నానమాచరించటం వలన తనకు అంటుకున్న పాపాలను కూడా కడిగివేసుకునే శక్తి ఉందని పురాణాల కథనం.

కృష్ణానదికి అతి ముఖ్యమైనవి కృష్ణా పుష్కరాలు. ఇవి పన్నెండేళ్ళకొకసారి నిర్వహించబడతాయి. కృష్ణానదిలో పుష్కరస్నానాలకోసం చాలా చోట్ల, అంటే మహారాష్ట్రలో, కర్ణాటకలో, తెలంగాణా ఆంధ్రప్రదేశ్‌లలో చాలాచోట్ల పుష్కరఘాట్లు ఏర్పాటుచేయబడ్డాయి. ఆంధ్రప్రదేశ్, తెలంగాణాలో కృష్ణాపుష్కరాలు పన్నెండేళ్ళకొకసారి వచ్చే పెద్ద పండుగ. బృహస్పతి, కన్యారాశిలో ప్రవేశించే సమయంలో పుష్కరాలు ఏర్పడతాయి. కుల, మత, ప్రాంత, జాతి మత భేదాలు లేకుండా అన్నివైపుల నుంచి ఈ కృష్ణా పుష్కరాల సమయంలో పుష్కరస్నానం కోసం అతిశ్రద్ధతో, భక్తితో పవిత్ర స్నానం కోసం భక్తులు వస్తారు. కృష్ణా పుష్కరాలకొరకు విజయవాడ అతిపెద్ద కూడలి. ఇంకా చాలా చోట్ల ఉన్నప్పటికి కృష్ణాపుష్కరాలంటే విజయవాడ గుర్తుకొస్తుంది. ఈ సమయంలో కృష్ణానదిలో స్నానం చెయ్యటం చాలా పవిత్రంగా భావిస్తారు.

కృష్ణాపుష్కరాల సమయంలో నదిలో స్నానం చేసి దివంగతులైన పెద్దలకు తర్పణాలు వదులుతారు. తర్పణాలు వదలడం మూలాన పెద్దలకు ముక్తి కలుగుతుందని భావిస్తారు. ఇవే కాకుండా పూజలు కూడా చేస్తారు. కృష్ణా పుష్కరాలు ఆగస్టు నెల 12, 2016 నుంచి ఆగస్టు 23 వరకు నిర్వహించబడతాయి. కృష్ణా పుష్కరాలను పురస్కరించుకొని భక్తులు స్నానాలాచరించటానికి అనేక పుష్కరఘాట్లు ఏర్పాటు చేయబడ్డాయి. వాటిలో దుర్గాఘాట్, పుష్కర ఘాట్, పద్మావతి ఘాట్, మెట్ల బజారు ఘాట్, సీతానగరం ఘాట్, పున్నమి ఘాట్ మరియు శివక్షేత్రం ఘాట్లు ఏర్పాటుచేయబడ్డాయి.

మొదటగా కృష్ణానది ఒడ్డున పరమపవిత్ర పుణ్యక్షేత్రమైన 'మహా గణపతి మందిరం ఉన్నది. దీనినే దక్షిణ్‌కాశివాయి అనికూడా అందురు. దత్తదేవ మందిరం, నృసింహవాడి, ఔదుంబదరం క్షేత్రం, హరిపురంలో సంగమేశ్వర ఈశ్వరాలయం మహారాష్ట్రలో ఉన్నాయి. ఇక మన రాష్ట్రానికి వస్తే, విజయవాడలో ఇంద్రకీలాద్రిపై ఉన్న 'కనకదుర్గాదేవి' ఆలయం. ఎక్కడెక్కడనుంచో భక్తులు వచ్చి కృష్ణానదిలో పవిత్ర స్నానమాచరించి అమ్మవారి దర్శనం చేసుకొని మొక్కులు తీర్చుకుంటారు. తరువాత 'శ్రీశైలం'లో ఉన్న భ్రమరాంబ మల్లికార్జునస్వామి కొలువై ఉన్న చోటు. ఇది నల్లమల అడవులలో ఉన్నది. మహాశివరాత్రి నాడు పెద్ద ఎత్తున ఉత్సవాలు జరుగుతాయి. అర్ధరాత్రి పన్నెండు గంటలకు లింగోద్భవం అవుతుంది. పగలంతా ఉపవాసం ఉండి, రాత్రంతా జాగారంచేసి స్వామి నామస్మరణ చేస్తూ కాలం గడుపుతారు. శ్రీశైల శిఖరదర్శనం చేసుకొన్నవాళ్ళకి పునర్జన్మ ఉండదని పురాణ గాథలు. ఇది చాలా ప్రశస్తమైన దేవాలయం, నల్లమల అడవులలో ఉండటం వలన, అడవి జంతువులు ఉన్నాయి. అంతేకాకుండా ప్రకృతి చాలా రమణీయంగాను ఉంటుంది. శ్రీశైలం తరువాత 'అమరావతి'లో ఉన్న అమరేశ్వర స్వామి. ఈ అమరావతికే 'ధరణికోట', 'ధాన్యకటకం' అను పేర్లు కూడా కలవు. ఈ ప్రాంతంలో బౌద్ధమతం వ్యాప్తిలో ఉందని పురావస్తుశాఖల త్రవ్వకాల వలన బయటపడ్డ సమాచారం. ఈ అమరావతి పేరునే 'ఆంధ్రప్రదేశ్' రాజధానికి పెట్టారు. తెలంగాణలో ఉన్న 'ఆలంపురం'లో దత్తదేవ దేవాలయం, 'సంగమేశ్వర శివాలయాలు' ఎంతో ప్రసిద్ధి చెందినవి.

కృష్ణానది తీరాన పొడుగూతా, సారవంతమైన నేలలు, అడవులు ఉన్నాయి. నల్లమల అడవులు, మడ అడవులు ముఖ్యమైనవి. అంతే కాకుండా 'వన్యమృగ సంరక్షణ' కేంద్రంగా కూడా ప్రకటించబడ్డది. వన్యమృగ సంరక్షణా కేంద్రంలో, అనేకరకాలైన దేశ, విదేశాల నుండి వచ్చిన పక్షులు, అడవి పిల్లులు, మొసళ్ళు, మచ్చల జింకలు, సాంబారులు, బ్లాక్ బక్కులు, రాకాసి బల్లులు, మరియు నక్కలులాంటివి అభయారణ్యంలో చూడవచ్చు. అంతేకాకుండా ఈ అడవులలో పెద్ద పెద్ద వృక్షాలు, లతలు, ఎంతో పచ్చదనంతో కూడినది. కృష్ణానదీ తీరాన దాదాపుగా 17 అభయారణ్యాలున్నాయి. అందులో మచ్చుకు రెండు, 1. నాగార్జునసాగర్– శ్రీశైలం టైగరు రిజర్వు ఫారెస్టు 2. కాసు బ్రహ్మానందరెడ్డి జాతీయ వనము.

ఇంతేకాకుండా చాలా అందమైన, ఎత్తైన జలపాతాలు కూడా ఉన్నాయి. **ఉదా** : ఎత్తిపోతల, మల్లెల తీర్థం మొదలగునవి. వరదలకు అడ్డుకట్ట వెయ్యటానికి, తాగు, సాగునీటి కోసము కృష్ణానది మీద చాలా ఆనకట్టలు కట్టబడినవి. మనరాష్ట్రంలో అయితే శ్రీశైల,

నాగార్జున సాగరు, ప్రకాశంబ్యారేజి మొదలగునవి. పులిచింతల, పోలవరం డ్యాములు కూడా నిర్మాణంలో ఉన్నాయి.

అక్టోబరు, 2009లో కృష్ణానదికి 1000 సంవత్సరాల కాలంలో రాని వరదలు వచ్చాయని చెపుతారు. చాలా ఉధృతంగా ప్రవహించింది అప్పుడు కృష్ణానది. ఈ వరదల మూలాన కర్నూలు, మహబూబ్ నగరం, గుంటూరు, కృష్ణాజిల్లాలు, పంటల విషయంలో, ప్రజల నిర్వాసితుల విషయంలో, నివాస గృహాలవిషయంలో కోలుకోని దెబ్బ తగిలింది. ఒక్క కర్నూలు పట్టణంలో మూడు రోజులపాటు 10 అడుగుల నీటిలో మునిగి ఉంది.

ధోమ్ డ్యాము, హిప్పగిరి బ్యారేజి, ఆల్‌మట్టి, నారాయణ పురం, శ్రీశైలం, జూరాల, నాగార్జునసాగరు, పులిచింతల డ్యాములు, ప్రకాశం బ్యారేజి, మొదలగునవి కృష్ణానది మీద నిర్మించబడ్డవి. కృష్ణానది మీద విద్యుదుత్పత్తి కేంద్రాలు కూడా నిర్మించబడ్డవి.

కృష్ణానది ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లోకి కర్ణాటక రాష్ట్రంనుండి ప్రవేశిస్తుంది. ఇప్పుడయితే తెలంగాణలోకి ప్రవేశించి తరువాత కృష్ణాజిల్లాలోని హంసలదీవి వద్ద సముద్రంలో కలుస్తుంది. కృష్ణానది పరీవాహక ప్రాంతాలైన కృష్ణా, గుంటూరు, కర్నూలు, మహబూబ్‌నగర్, నల్గొండ జిల్లాల గురించి తెలుసుకుందాం.

## గుంటూరు జిల్లా

గుంటూరు జిల్లా వైశాల్యం11,391చ.కిమీ. జనాభా షుమారుగా 44,55,445 మంది. ఇందులో పురుషులు-షుమారుగా 22,45,704 మంది, స్త్రీలు షుమారుగా 22,09,741 మంది, అక్షరాస్యత 40.22 శాతం. ఓటర్లు షుమారుగా 45,65,956 మంది. కలకత్తా నుండి చెన్నై పోయే రహదారి ఈ జిల్లానుండే వెళుతుంది. పార్లమెంటరీ స్థానాలు 3, శాసనసభాస్థానాలు 17. ఎన్నో మతాలకు ఆలంబనగా, మరెన్నో రాజకుటుంబాల పాలనకు రాజధానిగా, శౌర్య పరాక్రమాలకు పుట్టినిల్లుగాను, జాతీయ, ఆంధ్రోద్యమాలకు పుట్టినిల్లుగాను గుంటూరు జిల్లా ప్రసిద్ధి చెందినది. శాతవాహన రాజులు, ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు, వెలనాటి చోళులు పరిపాలించారు. పల్నాటియుద్ధం మాచెర్ల దగ్గర జరిగింది. బ్రిటిష్‌వారిని ఎదిరించిన హనుమంతు, ప్రముఖ స్వాతంత్ర్య యోధుడు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య పన్నుల నిరాకరణ ఉద్యమం ఈ జిల్లాలోనే జరిగింది. ఈ జిల్లాలో నల్లమల అడవులు, ఎత్తయిన పర్వతాలు ఉన్నాయి. కృష్ణానది మీద బహుళార్ధ సాధక ప్రాజెక్టు నాగార్జునసాగరు వద్ద నిర్మింపబడినది. ఐదు వ్యవసాయపరిశోధనా కేంద్రాలున్నాయి. రైలు, రోడ్డు సౌకర్యాలు బాగా విస్తరించబడ్డాయి. పాల ఉత్పత్తి ఫ్యాక్టరీ, చెరకు మిల్లు, సిమెంటు ఫ్యాక్టరీలు ఉన్నాయి. ముఖ్యపంటలు వరి, జొన్న, పెసలు, మినుములు, పసుపు పొగాకు, వేరుశెనగ, మిరప, ప్రత్తి, మొక్కజొన్న, జనుము పంటలను సాగుచేస్తారు. అమరావతి, కోటప్పకొండ, ఉండవల్లి గుహలు, మంగళగిరి (పానకాల స్వామి) మొదలగునవి ప్రముఖ యాత్రాస్థలాలు.

## కృష్ణాజిల్లా

వైశాల్యం – 8,727 చ.కిమీ. జనాభా షుమారుగా 42,18,416 మంది. (అక్షరాస్యత – 69.94 శాతం). ఇందులో పురుషులు – షుమారుగా 21,51,187 మంది, స్త్రీలు షుమారుగా 20,67,229 మంది. ఓటర్లు షుమారుగా 23,39,256 మంది. కలకత్తా నుండి చెన్నై పోయే రహదారి ఈ జిల్లానుండే వెళుతుంది. పార్లమెంటరీ స్థానాలు 2, శాసనసభా స్థానాలు 16, జిల్లా ముఖ్యపట్టణం మచిలీపట్నం. ఈ జిల్లా పారిశ్రామికంగానూ, వ్యవసాయకంగానూ, రాజకీయంగాను ఎంతో అభివృద్ధి చెందిన ప్రాంతం. జాతీయ, ఆంధ్రోద్యమాలకు పుట్టినిల్లు. జాతీయోద్యమంలో ప్రముఖులైన పట్టాభి సీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, అయ్యదేవర కాళేశ్వరరావు, పింగళి వెంకయ్యగార్లు ఈ జిల్లాకు చెందినవారే. మచిలీపట్నం ఆంగ్లేయులకు ప్రధాన స్థావరమైనది. అంతకుముందు ఈ ప్రాంతాన్ని శాతవాహనులు, విష్ణుకుండినులు, బృహత్పలాయనులు గోల్కొండ నవాబులు, కొండవీటి రెడ్డి రాజులు, విజయనగర చక్రవర్తులు పరిపాలించారు. ఈ జిల్లాలోను పర్వతాలు, అడవులు ఉన్నాయి. కృష్ణానది మీద బహుళార్ధసాధక ప్రాజెక్టు నాగార్జునసాగరు వద్ద నిర్మింపబడినది. సిమెంటు ఫ్యాక్టరీలు, చక్కెర కర్మాగారాలు, కొండపల్లి వద్ద ఆటవస్తువులు తయారీ, ఇబ్రహీమ్ పట్నం వద్ద థర్మల్ విద్యుత్ కేంద్రాలున్నాయి. విజయవాడ ముఖ్యమైన రైలు కూడలి. రైలు, రోడ్డు సౌకర్యాలు బాగా విస్తరించబడ్డాయి. ముఖ్య పంటలు వరి, జొన్న, పెసలు, మినుములు, పసుపు, పొగాకు, చెరకు,

### చూడదగ్గ ప్రదేశాలు

కూచిపూడి, కొండపల్లి బొమ్మలు, కలంకారీ పరిశ్రమ (మచిలీపట్నం) శ్రీకాకుళం, ఘంటసాల, విజయవాడ కనకదుర్గ ఆలయం (ఇంద్రకీలాద్రి) మొదలగునవి.

## కర్నూలు జిల్లా

వైశాల్యం–17,658 చ.కిమీ. జనాభా షుమారుగా 35,24,073 మంది. (అక్షరాస్యత–54.43 శాతం). ఇందులో పురుషులు–

షుమారుగా 17,93,573 మంది, స్త్రీలు షుమారుగా 17,30,500 మంది. ఓటర్లు షుమారుగా 22,37,014 మంది. పార్లమెంటు స్థానాలు 2, శాసనసభా స్థానాలు 14. జిల్లా ముఖ్యపట్టణం కర్నూలు. ఈ కర్నూలు జిల్లాను స్వాతంత్ర్యమునకు పూర్వం కందెనోలు, కంద నూలై అని పిలిచేవారు. ఈ ప్రాంతాన్ని చోళులు, చాళుక్యులు, కాకతీయులు, ఢిల్లీ సుల్తానులు, అరవీటి వంశస్థులు, రెడ్డిరాజులు, విజయ నగర రాజులు కర్నూలు నవాబులు, మరాఠీలు, పాలెగాళ్ళు చివరికి బ్రిటిష్‌వాళ్ళు పరిపాలించారు. 1953లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పుడు కర్నూలు రాజధానిగా చేయబడింది. జిల్లాలో నల్లమల, ఎర్రమల అనే రెండు పర్వతశ్రేణులు ప్రకృతి శోభతో అలరారుతున్నాయి. ఇంకా అనేక ప్రసిద్ధి చెందిన కొండలు ఉన్నాయి. జిల్లాలో 5 శాతం అడవులు వ్యాపించి ఉన్నాయి. ముగ్గురాయి ఖనిజం ముఖ్యమైనది. ఎమ్మిగనూర్ వస్త్ర పరిశ్రమ, 14 భారీ సిమెంటు ఫ్యాక్టరీలు, పాలీష్ రాళ్ళు, చలువ రాళ్ళ పరిశ్రమలు స్థాపించబడ్డాయి. వరి, జొన్న, వేరుశెనగ, కంది వంటి పంటలు పండించబడుతున్నాయి. తుంగభద్ర, హగిరి, కుందేరు, నదులద్వారా నీటి సౌకర్యం లభ్యమవుతున్నది. దక్షిణ కాశీగా పిలవ బడుతున్న శ్రీశైల క్షేత్రం ఈ జిల్లాలోనే ఉన్నది. నల్లమల అడవులు, టైగర్ ప్రాజెక్టులు ఈ జిల్లాలో విస్తరించి ఉన్నాయి. మంత్రాలయ రాఘవేంద్రస్వామి, సంగమేశ్వరం, శ్రీశైలం, మహానంది, అహోబిలం చూడదగ్గ ప్రదేశాలు.

## నల్గొండజిల్లా

వైశాల్యం 14,240 చ.కిమీ. జనాభా షుమారుగా 32,45,400 మంది. (అక్షరాస్యత - 58.19 శాతం). ఇందులో పురుషులు - షుమారుగా 16,51,100 మంది, స్త్రీలు షుమారుగా 15,94,389 మంది. ఓటర్లు షుమారుగా 26,19,930 మంది. పార్లమెంటు స్థానాలు 2, శాసనసభా స్థానాలు 13. జిల్లా ముఖ్యపట్టణం నల్గొండ. పూర్వం ఈ ప్రాంతాన్ని నీలగిరిగా పిలిచేవారు. ఈ ప్రాంతాన్ని శాత వాహనులు, కదంబ వంశస్థులు, చాళుక్యులు, కాకతీయులు, బహమనీ సుల్తానులు, కుతుబ్‌షాహి వంశస్థులు, మొగలాయీలు, నిజాం వంశస్తులు ముఖ్యులు పరిపాలించారు. నిజాం వ్యతిరేక ఉద్యమంలో, భారతీయ జాతీయోద్యమంలో ఈ ప్రాంతపు ప్రజలు చురుకుగా పాల్గొన్నారు. అడవులు, సేద్యపు భూములు ఉన్నాయి. నాగార్జునసాగర్ ఎడమ కాలువ, శాలిగౌరవం ప్రాజెక్టు, సోలిపేట ప్రాజెక్టుల ద్వారా సేద్యపు భూములకు నీరందించబడుతున్నది. ప్రత్తి, మిర్చి, వేరుసెనగ వంటి వాణిజ్యపంటలు పండించబడుతున్నాయి. సిమెంటు ఫ్యాక్టరీలు, చెక్కర కర్మాగారం ఉన్నాయి. పోచంపల్లి చేనేత చీరలకు ప్రసిద్ధి. యాదగిరి గుట్ట లక్ష్మీనరసింహస్వామి, బౌద్ధస్థూపాలు, రేపాల గ్రామంలో నృసింహస్వామి కోవెల యాత్రికులను విశేషంగా ఆకర్షిస్తాయి.

## మహబూబ్‌నగర్ జిల్లా

వైశాల్యం-18,432 చ.కిమీ. జనాభా షుమారుగా 35, 09,182 మంది. (అక్షరాస్యత-45.52 శాతం). ఇందులో పురుషులు - షుమారుగా 17,81,667 మంది, స్త్రీలు షుమారుగా 17,27,515 మంది. ఓటర్లు షుమారుగా 24,18,634 మంది. పార్లమెంటు స్థానాలు 2, శాసనసభా స్థానాలు 14. జిల్లా ముఖ్యపట్టణం మహబూబ్‌నగర్. పూర్వం ఈ ప్రాంతాన్ని చోళులు, కాకతీయులు, బహమనీసుల్తానులు, కుతుబ్‌షాహి వంశస్థులు, మొగలాయీలు, నిజాం వంశస్తులు ముఖ్యులు పరిపాలించారు. నిజాం వ్యతిరేక ఉద్యమంలో, భారతీయ జాతీయోద్యమంలో ఈ ప్రాంతపు ప్రజలు చురుకుగా పాల్గొన్నారు. అడవులు, సేద్యపు భూములూ ఉన్నాయి. ఆస్‌బెస్టాస్, క్వార్ట్జ్, ముగ్గురాయి, ఫెల్స్‌ఫార్, బంకమన్ను ఈ జిల్లాలో లభిస్తాయి. మక్తల్ ప్రాంతం వద్ద కృష్ణానది ఈ జిల్లాలో ప్రవేశిస్తున్నది. గద్వాల్, అలంపూర్ ప్రాంతాలలో తుంగభద్ర ప్రవహిస్తున్నది. జిల్లాలో ఎక్కువగా మెట్ట పంటలు పండుతాయి. జొన్న, మొక్కజొన్న, రాగులు, వేరుసెనగ, ఆముదం,ఉలవపంటలు పండుతాయి. శంకర సముద్రం, శ్రీహరి సముద్రం చెరువుల ద్వారా సాగు భూములకు నీరందుతున్నది. రాయచూర్, చెన్నయ్, సికింద్రాబాద్ - బాంబే - గుంతకల్ రైలు మార్గాలు ఈ జిల్లాలో ఉన్నాయి. అలంపూర్ వద్ద జోగులాంబ దేవి పీఠం, గద్వాల్ కోట, నవబ్రహ్మ ఆలయం యాత్రాస్థలాలు. పామూరు విశ్వవిద్యాలయం కూడా ఉన్నది.

కృష్ణాతీరంలో ఉన్న గుంటూరు, కృష్ణా, కర్నూలు జిల్లాలు చాలా సుసంపన్న మయినవి. విద్యా, వైజ్ఞానిక వ్యాపారరంగాలలో చాలా అభివృద్ధి చెందినవి. వ్యవసాయ రంగంలో యంత్రాలవాడకం, పరిశోధనలు వలన మేలైన వంగడాలు సృష్టించి రెట్టింపు దిగుబడులతో ముందంజ వేస్తున్నాయి. మిగతా రాష్ట్రాలకు ఆదర్శంగా నిలుస్తున్నాయి. అయినా గూడా అప్పుడప్పుడు సరియైన వర్షాలు సకాలంలో కురవక ఆహారానికి కరువు ఏర్పడుతున్నది. తెలుగుభాషకు ప్రాచీన హోదాకోసం

నిరంతరం శ్రమించి ఫలితం సాధించారు. తెలుగుభాషకు పూర్వ వైభవం కోసం సాహితీ సభలు, ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వ హించి అన్ని రాష్ట్రాల కవులను ఒకచోట చేర్చి తెలుగుభాష పరిపుష్టి చేయటం కోసం నిరంతరం సమాలోచనలు చేస్తున్నారు. విజయవాడ, గుంటూరుజిల్లాల్లో ప్రజలుమాట్లాడే భాష (యాస) ఒకటిగా ఉంటుంది. కర్నూలుజిల్లా ప్రజలు మాట్లాడే యాస కొంచెం (మాత్రమే) తేడాగా ఉంటుంది.

తెలంగాణా జిల్లాలయిన నల్గొండ, మహబూబ్‌నగర్ జిల్లాలు చాలాకాలం పాటు నిజాం పాలనలలో ఉండటం వలన వాళ్ళు మాట్లాడే తెలుగుభాషలో ఎక్కువగా ఉర్దూ మిళితమై ఉంటుంది. అలాగే ఆ రెండు జిల్లాల్లో వర్షధార భూములవటం వలన ఎక్కువగా మెట్ట భూములవడం వలన వాణిజ్యపంటలు ఎక్కువగా పండిస్తుంటారు. వర్షాలు కురవనప్పుడు ఆ జిల్లాల్లో కరువు తాండవిస్తుంటుంది. అక్కడ చాలామంది పేదరికంలోనే ఉంటారు. మహబూబ్‌నగర్ జిల్లాల్లో ఒకటైన పాలమూరు గ్రామం నుంచి కరువు రోజుల్లో వలసలు వెళు తుంటారు. ఉమ్మడి రాష్ట్రంలో (ఆంధ్రప్రదేశ్) ఉన్నప్పుడు ఈ రెండు జిల్లాలను బాగా అభివృద్ధి చెందేలా చర్యలు చేపట్టారు. రాష్ట్రం విడిపోయి తెలంగాణా ఏర్పడినప్పుడు వాటి అభివృద్ధి కొరకు ఇంకా కృషిచేస్తున్నారు. ఆ జిల్లాల్లో కూడా విద్య, వైజ్ఞానిక, వ్యాపార, వ్యవసాయరంగాలలో చెప్పుకోదగిన అభివృద్ధి చెందుతున్నది. అక్కడ కూడా తెలుగుభాషా వ్యాప్తికి అనేక సాహితీసంస్థలు వెలసి కవి సమ్మేళనాలు, పుస్తకాలు ప్రచురించటం జరుగుతున్నది.

ఈ నదీతీరాన ఉన్న అన్ని ప్రదేశాలలో, పన్నెండేళ్ళకొకసారి వచ్చే పుష్కరాలకు చాలా ప్రాధాన్యత ఉంది. అందుకే ఈ నదీతీరాన కృష్ణా పుష్కరాలు ఘనంగా గతంలో నిర్వహించారు. 2016లో (అంటే ఈ సంవత్సరంలో)కొత్తగా ఏర్పడిన నవ్యాంధ్రలో మరింత ఘనంగా నిర్వ హించటానికి ఏర్పాట్లు చేస్తున్నారు. నవ్యాంధ్రచరిత్రలో కృష్ణా పుష్కరాలు ఒక విశిష్టతను సంతరించుకొంటాయనటంలో సందేహం లేదు.

ఏది ఏమైనా నది పరివాహక ప్రాంతాలు, సముద్రం ఒడ్డున వెలసిన నగరాలు చెప్పుకోదగిన అభివృద్ధిని సాధిస్తాయనటంలో సందేహం లేదు.

**"శ్రీకంఠమూర్తి పుణ్య**
**శ్లోకు మహాభాగు నిఖి లోకారాధ్యున్**
**నాకేశభోగి సత్య గు**
**ణాకరు నచలాత్మ మల్లికార్జునదేవున్"**

**- నన్నిచోడుడు కుమారసంభవం నుండి**

**చిరునామా :** *ఎ. మోహన్ మురళి కుమార్, బి.ఎఫ్.1, మైహోం కాంప్లెక్సు, మాచవరం, ఏలూరు రోడ్డు, విజయవాడ - 520 004. చరవాణి. 9849635488.*

ఆచార్య బూదాటి వేంకటేశ్వర్లు

# కవుల గళాల్లో కృష్ణమ్మ

ప్రతి నదీ మాతృస్వరూపిణియే. తల్లిస్తన్యమిచ్చి బిడ్డల్ని పోషించి నట్లు నదీమాత తన జలక్షీరధారలతో లోకాన్ని సంరక్షిస్తుంది. మన నాగరికతలన్నీ నదీ నాగరికతలే. అందుకే శేషేంద్ర అంటాడు.

**"నదులు కవులు భూగోళపు రక్తనాళాలు**
**నదులు ప్రవహిస్తాయి కవితల్లా**
**పశువుల కోసం, పక్షులకోసం, మనుష్యులకోసం,**
**నదులు కనే కలలు ఫలిస్తాయి పొలాల్లో**
**కవులు కనే కలలు ఫలిస్తాయి మనుషుల్లో"**

జీవనదికి ఒడ్డునిండా తీర్థాలే. సుక్షేత్రాలే. భూమాతకు పచ్చుల పచ్చుదాన్ని కానుకపెట్టే నదీ మాతృకలు ప్రాణికోటికి జీవాధారాలు. తనకు జీవాధారమైన నదిని మాతృమూర్తితో అభేదంగా భావించి వర్ణించిన కవులకు ఏ సాహిత్యంలోనూ కొదవలేదు. అసలు నదీ సౌందర్యాన్ని చూడకుండా ఏ కళాకారుడు పరిపూర్ణుడు కాలేదు. అది గంగైనా, గోదావరైనా, కృష్ణయినా, తుంగయినా ఏదయినా కావచ్చు. నదులు సౌందర్యపు ఎదలు. నదులు – ఉపనదులు కలిసి ప్రాణికోటికి జీవధనమే అయ్యాయి. వేదంలో కూడా పృథ్వీ సూక్తంతోపాటు నదీ సూక్తం కూడా ఉంది. మన సరస్వతీ సూక్తాన్ని చూడండి !

**ఇయం శుష్మేభి ర్బిసఖా ఇవారుజత్**
**సాను గిరీణాం తవిషేభి రూర్మిభిః ।**
**పారావత ఘ్నీ మనసే సువృక్తిభి**
**సరస్వతీ మావివాసేమ ధీతిభిః ॥ (ఋగ్వేదం 6-61-2)**

(గిరి సానువులపైకి యెగిరిన అలలతో ఈ సరస్వతి వేగమున ప్రవహించుచుండగా తమ్మితూడులను తిన్న హంసల ఋతములు పుట్టుచున్నవి. కూలముల నొరసికొని బ్రద్దలు కొట్టగల వేగమున ప్రవహించు నీ సరస్వతి రూపమున వసింతుము గాక ! బుద్ధిబలము రూపమున మేము ఎడబాటు లేక ఆమెయందు వసింతుము గాక !)

**సరస్వతి దేవనిదో నిబర్హయ**
**ప్రజాం విశ్వస్య వృసయస్య మాయినః ।**
**ఉతక్షితిభ్యోవనీర విందో**
**విషమే భ్యో అస్రవో వాజినీవతి ॥ (ఋగ్వేదం 6-61-3)**

(వేగవంతములైన ప్రవాహములు గలదానా! సరస్వతీ ! దేవతలను నిందించువారిని చీల్చుము అసురమాయల నుండి సర్వజీవులను రక్షింపుము క్షీణదశనుండి నదులను కాపాడుము. మిట్టపల్లముల నుండి జలములను కాపాడుము)

**"ప్రణోదేవీ సరస్వతీ**
**వాజేభి ర్వాజినీ వతీ**
**ధీనా మవిత్ర్యవతు ॥" (ఋగ్వేదం 6-61-4)**

(వేగవంతములైన ప్రవాహములు గలదియగు సరస్వతి మా బుద్ధులను పరిపాలించునదియై, తన ప్రవాహ వేగములతో మమ్ము కాపాడు గాక !)

**"అంబితమే నదీతమే దేవితమే సరస్వతి !**
**అప్రశస్తా ఇవశ్మసి ప్రశస్తమ్ అంబనస్కృధి ॥"**
**(ఋగ్వేదం 2-41-16)**

(సరస్వతీ! నీవు ఉత్తమమైన మాతృదేవతవు; నదులలో శ్రేష్ఠమైన దానవు ; దేవతలలో నుత్తమురాలవు ; నీవుప్రకాశమూర్తివలెనున్నావు. అయినను మాకు ప్రశస్తిని కలుగజేయుము)

నదుల సౌందర్యాన్ని మన ప్రాచీన కవులువర్ణించినంతగా ఆధునిక కవులు వర్ణించలేదు. దానికి కారణం ఆనాటిప్రకృతి రమణీయ దృశ్యాలే కవులచేత అలా గానం చేయించింది. ప్రకృతిలో భాగమైన నదిని, సముద్రాన్ని అష్టాదశ వర్ణనల్లో భాగంగా ప్రాచీన కవులు చేర్చి వర్ణించారు.

మన ప్రాచీన తెలుగు సాహిత్యంలో గంగనో, గోదావరినో వర్ణించని తెలుగు కవులు లేరు. శ్రీనాథుని భీమేశ్వర పురాణం గోదావరి నదీ తీరాన్ని వర్ణించటానికే వ్రాసినట్లుగా అనిపిస్తుంది. ప్రాచీన కవులలో కృష్ణానదిని ప్రత్యేకంగా వర్ణించిన సందర్భం కనిపించదు. అయితే అక్కడక్కడా కృష్ణానది పేరును సందర్భాన్ని బట్టి పేర్కొనడం

కనిపిస్తుంది. తాము రాసే కావ్యాలలో ఏదైనా నదిని వర్ణించవలసివస్తే ఏ కవయినా తాను చూసిన పరిసరంలోని నదినే వర్ణిస్తాడు. అసలు ఏ కవయినా చేసేపని అదే. తన అనుభవంలోకి రానివి, అనుభూతికి అందనివి ఏ కవయినా కళాకారుడయినా సమర్థంగా చిత్రించలేడు ! అలా చిత్రిస్తే 'వైర్‌లెస్ తీగల మీద చిలుకలు మాట్లాడుకుంటున్నాయని రాసినట్లే'ఉంటుంది. నన్నయ్య నదీ వర్ణనలలో గోదావరి, తిక్కన నదీ వర్ణనలలో పినాకినీ కృష్ణా నదులు, ఎఱ్ఱనగారి నదీ వర్ణనలో గుండ్లకమ్మ – కృష్ణానదులు, శ్రీనాథుని నదీ వర్ణనలలో కృష్ణా – గోదావరులు పోతనగారి నదీ వర్ణనలో గోదావరి తలస్పర్శిగా తగులుతాయి. తెనాలి రామకృష్ణుడు చంద్రభాగానదిని వర్ణించినా కృష్ణమ్మయే కనిపిస్తుంది.

### ఎఱ్ఱనగారి భవనాశిని :

ఎఱ్ఱనగారి తన పోషకులైన రెడ్డిరాజులు శ్రీశైలంలో పాతాళగంగకు సోపానక్రమాన్ని ఏర్పాటుచేశారని, అహోబిల క్షేత్రంలోని భవనాశినికి కూడా సోపానాలు నిర్మించినవైనాన్ని శాసనాలు చెపుతున్నాయి. కాని ఎఱ్ఱనకు కథాగమన రీత్యా హరివంశంలో కృష్ణానదిని ఆ పేరుతో వర్ణించవలసిన సందర్భం తారసపడలేదు. నృసింహపురాణంలో మాత్రం కృష్ణవేణీ స్మరణ కనిపిస్తుంది. భవనాశిని వర్ణన కూడా దర్శనమిస్తుంది. గాలవుడు తీర్థ సేవలను గురించి చెప్పే సందర్భంలో 'కృష్ణవేణిఁ దతిసె'– నని మాత్రమే ప్రస్తావించాడు. కావ్యం చివర 'భవనాశిని' యైన భవనాశినీ జలాన్ని దాని మహాత్మ్యాన్ని స్వామి చెప్పినట్లుగా వర్ణిస్తాడు.

భవము అంటే పుట్టుక, పాపము వంటి అర్థాలున్నాయి. ఆ అర్థశ్లేషతో చెప్పినదే ఈక్రింది పద్యం.

క॥ భవనాశిని భవనాశిని
భవనాశిని యనుంచు బలుకు భక్తజనులకున్
భవనాశిని భవనాశిని
యవుటకు భువియందు సందియంబును గలదే. (నృసి. 5-151)

శ్రీహరి కరుణరసంలాగా, శుభాల ఆకృతి వహించినట్లు దివిజ గంగలా, పుణ్య శ్లోకితమై భవనాశిని ప్రకాశిస్తుందని చెపుతూ –

ఉ॥ నా కరుణారసంబు భవనాశిని నాన వినాశనాకృతిన్
శ్రీకరవాహిని తనుతఁ జేకొని నాకమనుష్యలోకద
ర్వీకర గేహగాహిత పవిత్ర జలౌఘమునన్ మహాజన
శ్లోకితయై తనర్చు నతిలోక విలోక సుపాక భవ్యతన్ (నృసి. 5-152)

ఈ పై వర్ణన కేవలం భక్తితో పవిత్రతను గానం చేసినట్లుగా ఉంది. ఈ క్రింది పద్యంలో ఎఱ్ఱనగారి ప్రబంధపరమేశ్వరత్వం కనిపిస్తుంది. చూడండి –

సీ. అసురాంగనా కుంకుమాంగ రాగంబున
నరుణోదయచ్ఛాయ నమరు నెడలు
మునివర నియమనిర్ముక్త కుశాక్షత
ములఁ దెట్టువలు గట్టి పొలుచు నెడలు
శబరికా శ్రవణ ప్రశస్త బర్హిచ్ఛద
చిత్రితోర్ముల విలసిల్లు నెడలు
మదకల కాంతార మాతంగ మదజలో
ద్వేలాంబువుల నిగ్గుదేఱునెడలు

గీ. నగుచుఁ బ్రతిదివసంబును నతినవంపు
టొప్పిందంబులు దనుఁజెంద నుల్లసిల్లు
సకల కళ్యాణ కౌలీన సత్ప్రవాహ
భవ్య యీభవనాశినీ పరమతటిని. (నృసి. 5-153)

రాక్షస స్త్రీల కుంకుమ పరాగం కలసి అరుణోదయ కాలపు అరుణిమతో ప్రకాశిస్తోందని, నియమవ్రతులైన మునీశ్వరుల చేత విడిచి వేయబడిన దర్భలు, అక్షతలు తెట్టువలు కట్టాయని, బోయవాళ్ళు చెవులకు ధరించిన నెమలీకలవలె అలలతో ప్రకాశిస్తోందని, మదపు టేనుగుల మదజలధారలు అతివేగంగా కలసి నిగ్గుతేరుతున్నాయని ప్రతిరోజు నవ్యతతో ఒప్పి ప్రకాశిస్తున్న సకల కళ్యాణ శీలయని భవనాశినీ ప్రవాహాన్ని వర్ణిస్తాడు.

### తెనాలి రామకృష్ణుడు :

ప్రాచీన కవులలో తెనాలి రామకృష్ణుడు కృష్ణానదికి ఉపనదియైన తుంగభద్రను వర్ణిస్తూ –

శా॥ గంగాసంగమ మిచ్చగించునె మదిన్ గావేరి దేవేరిగా
నంగీకార మొనర్చునే యమునతో నానందముంబొందునే !
రంగత్తుంగ తరంగ హస్తముల నారత్నకరేంద్రుడు నీ
యంగంబంటి సుఖించునేని గుణభద్రా ! తుంగభద్రానదీ ! (పాండు 1-139)

తుంగ, భద్ర అనే రెండు ఉపనదుల కలయికే తుంగభద్ర. తుంగ అన్నా, భద్ర అన్న ఎత్తైన అనే అర్థమే ఉంది. ఈ రెండు నదులు కర్ణాటకలోని పడమటి కనుమలలో ఎత్తైన ప్రాంతం నుండి ఉద్భృతమైన ఉరవడితో ప్రవహిస్తుంది. కృష్ణానది సముద్రునితో సంగమిస్తుంది కాని, తుంగభద్ర అలా సముద్రుడిని చేరదు. నదులన్నీ సముద్రుని భార్యలుగా వర్ణించటం కవి సమయం. ఆ కవి సమయం మీద తెనాలి రామకృష్ణుడు చేసిన చమత్కారమిది. గుణభద్రా తుంగభద్రానదీ ! చలించే ఎత్తైన అలలనే చేతులతో సముద్రుడు నీతో సుఖించి నట్లయితే గంగానది పొందును కోరడని, కావేరిని దేవేరిగా అంగీకరించడని, యమునతో ఆనందాన్ని పొందడని రామకృష్ణుడు చమత్కరించాడు. అయితే యమునానది కూడ సముద్రునిలో ప్రత్యక్షంగా కలవదు. అది గంగకు ఉపనది. ప్రయాగలో గంగతో కలిసి ప్రవహిస్తుంది. ఆ

విధంగా తెనాలి రామకృష్ణుడిని సమర్థించవచ్చు. భూవలయంలో ఉన్న నదులన్నీ బాహ్యమైన తాపాన్ని పోగొడితే అంతర్గతమైన తాప త్రయాలను తుంగభద్ర పోగొడు తుందని త్రిభువనాలను పవిత్రీకరించే సమర్థ చరిత్ర కలదని, బంగారు తామర పూల పరిమళంతో కూడిన రసౌషధం లాంటి నదీ జలంతో ప్రవహిస్తోందని వర్ణిస్తాడు.

## కృష్ణానది త్రిమాతా స్వరూపం :

తాతంభట్టు గురుమూర్తి శాస్త్రిగారు కృష్ణామహాత్మ్యం అనే గ్రంథాన్ని వ్రాశారు. అందులో కృష్ణానదిని ఇలా వర్ణిస్తారు.

**శా॥ ఆవర్తోపమానాభియై కమలయై యబ్జస్ఫురద్దేహయై**
**శ్రీ విజ్ఞాన సమగ్రయై కలుషరాజీవార్తిదజ్యోత్స్నయై**
**యా వైరించికి భార్యయై తలఁపఁ బ్రత్యక్షంపు వాగ్దేవియై**
**యే విశ్వేశ్వరి యొప్పెఁగృష్ణ ధరలో నేఁగొల్తుఁ దద్వాహినిన్."**
**(కృష్ణామాహాత్మ్యం 1-301)**

కృష్ణానది నడిమి భాగంలోని సుడిగుండాన్ని బొడ్డులా సంభావించి, ఆ నదీజలరూపం కమలాస్వరూపంతో ప్రకాశిస్తోందని వర్ణిస్తున్నాడు. పద్మాలతో పద్మంలా ప్రకాశిస్తున్న దేహం గలదానది. శ్రీ విద్యా సంబంధ మైన శోభాజ్ఞానం పరిపూర్ణంగా ఆ నదికి ఉంది. పాపాలనే పద్మాలకు బాధ కలిగించే వెన్నెల ఆ నది. బ్రహ్మదేవుని నుదుటి నుండి ప్రభవించిన రుద్రునికి ఆమె భార్య. ఆ నది సరస్వతీ స్వరూపంతో ప్రకాశిస్తూ లోకాలను పాలించే పరాశక్తిగా విరాజిల్లుతూ భూలోకంలో కృష్ణానదిగా వెలసిందని కవి సంభావించాడు.

## ఆనంద సుందరీచాతుర్య విలాసం :

దీనికర్త బసవరాజు నాగేంద్రకవి. ఈ కావ్యంలో కృష్ణానదీ వర్ణన కనిపిస్తుంది. చూడండి

**ఉ॥ క్షోణిప ! యాతడక్కుధర కూట శిఖాంతరమందుఁ గాంచెన**
**క్షీణ జలోచ్చలన్మదజశీకర బంధుర సింధురార్భక**
**శ్రేణిని హంసకోకబక చిత్రితరమ్యవిశాలసైకత**
**శ్రోణిని దీర్ఘవేణినిఁ బశుప్రభురాణినిఁ గృష్ణవేణినిన్"**

నదిలో అంతులేని నీరుంది. అందులో ఏనుగు గున్నల గుంపు కేరింతలు కొడుతూ క్రీడిస్తుంది. తమ పిల్ల ఏనుగుల జలక్రీడలను గమనిస్తున్న మదపుటేనుగుల మదజలం తుంపరులై ఎగిరివచ్చి గున్న ఏనుగుల్ని కమ్ముతోంది. అలా మదజలశీకరాలతో ఒప్పారుతూ జలక్రీడలాడే ఏనుగు గున్నల గుంపును కృష్ణవేణీనది భరిస్తోంది. హంసలు – చక్రవాకపక్షులు – కొంగలు కనిపిస్తూ అందంగా విశాలంగా నున్న ఇసుకతిన్నెయే జఘనంగా వహిస్తున్న దీర్ఘవేణి, శివునిరాణియైన ఆ కృష్ణవేణీనదిని నాగేంద్ర కవి ఇలా అందంగా వర్ణించాడు.

## విశ్వనాథ సత్యనారాయణ :

విశ్వనాథ కృష్ణామండలాన్ని వర్ణిస్తూ బందరును బృందావనమని, తిరుపతి వేంకటకవులు బంధురకవితా సుందరికి విందులు కూర్చారని వర్ణిస్తారు. హైకోర్టు ప్రథమ న్యాయమూర్తి రాజమన్నారు "తెలుగు భూమాత విజ్ఞాన తేజమైనాడని, ఇంద్రకీలాద్రి చేరువలో విజయుని పేర విజయవాడ వెలసిందని, కృష్ణునిపై విజయునికిగల ప్రేమకు చిహ్నంగా ప్రక్కనే ప్రవహించే నదిని కృష్ణా అని విజయుడు పిలిచాడని సంభావిస్తూ ఇలా కృష్ణానదిని వర్ణిస్తాడు.

**చ॥ విజయుని చెంత కృష్ణుఁడతి – వేడుకతో చరియించునట్లుగా**
**సుజలయుతంబు కృష్ణకడు సొంపుగఁబాఱుచునుండ విజ్యవా**
**డజరమునైన కీర్తిఁగొని అద్భుతరీతిని వ్యాప్తి నొందుచున్**
**విజయుని నాఁపుకీర్తి యను వింతగు బొజ్జయెఁ దెల్గు మాతకున్.**

**సీ॥ విజయవాడ ప్రౌఢ – విఖ్యాత కంఠపు**
**మండిత వజ్రాల – దండయనఁగ**
**మాగాణి భూములఁ – దోగాడు జలముల**
**పిల్లకాల్వలపిల్ల – తల్లియనఁగ**
**లంక భూములపైకి – లంఘించు వెల్లువ**
**నురుగుఁ గ్రక్కెడు క్రూర – యురగ మనగ**
**జలధినాథునిమేన – జలములన్ జల్లుచు**
**జలకమాడించెడు – జాణయనగ**

**తే॥గీ॥ నురుగు గ్రక్కుచు – చెరచెరఁ బరుగులిడుచు**
**భంగురంబైన సుడిగుండ పొంగుటలల**
**తృష్ణఁదీర్చెడు నాట్యంబు – కృష్ణవేణి**
**తెలుఁగు వెలుగుల తొలకరి – నొలుకు కులుకు.**

**తే॥గీ॥ తకిటి తద్దిమి దిమ్మను – తాళగతుల**
**కృష్ణ కులుకుల నాట్య సంగీత కూచి**
**పూడి నాట్యము క్షేత్రయ్య – పుణ్యకృతులు**
**తెలుఁగు టవనిసతి నితంబ – కులుకులొఱ**

విజయవాడ అనే ప్రౌఢ ధరించిన వజ్రాల కంఠహారంలా ఉన్నదని, మాగాణి భూములలో దోగాడే పిల్లకాల్వల తల్లిగా, లంక భూములపైకి వెల్లువ సమయంలో నురుగులు గ్రక్కుతూ కనిపించే క్రూర సర్పంగా సముద్రుని మీదికి జలాన్ని చల్లుతూ, సముద్రుని స్నానమాడించే జాణగా, తెలుగు వెలుగుల తొలకరి కులుకుగా కృష్ణవేణి ప్రవహిస్తోం దని విశ్వనాథవారు కమనీయంగా భావన చేశారు.

**ముక్త్యాలకోట :**

"కల్పవృక్ష" అవతారికలో కావ్య శ్రోతలను పేర్కొంటూ వేంకట కృష్ణారావుగారితో తన సంబంధాన్ని ఉద్దేశించి "మాది కృష్ణ ఒడ్డు జాతి" యని పేర్కొంటాడు. కృష్ణానది ఒడ్డున ఉన్న ముత్యాల కోటను వర్ణిస్తూ అటు వేదాద్రి, ఇటు భరద్వాజుని ఆశ్రమాన్ని కాపాడిన చోట, కృష్ణానది ఉత్తర వాహినిగా పవిత్రమై మలుపు తిరిగినచోట, వారణాసి లాగ ప్రళయకాలంలో కూడ విపత్తులేని చోట, కృష్ణానది పాయ జలదుర్గభూతంలాగ కోటను చుట్టేచోట, "ఒక్క సితరాజ హంసమ్ము నొడ్డు నందు రెక్క ముడుచుక కూర్చున్న ఫక్కితోపఁ" - ముక్త్యాల కోటను స్వర్గానికి వేసిన రత్నాల నిచ్చెనల మెట్లులాగ కట్టారని వర్ణిస్తారు. ఇందులో కోటకంటే కృష్ణానది సౌందర్యమే మనల్ని ఆకర్షిస్తుంది.

**నాగార్జునసాగరం :**

గుంటూరు మండలాన్ని వర్ణిస్తూ తిక్కనను, నాగార్జునుడిని అమరావతి బౌద్ధ విహారాల్ని, అమరావతిని పేర్కొంటాడు. అమరావతి లో కృష్ణానదిని "తెలుగు భూమాత కటకమై వెలయు కృష్ణ"అని అంటాడు. తెనాలి రామకృష్ణుణ్ణి, రాయప్రోలును, బ్రహ్మనాయుణ్ణి, నాగమ్మను, బాలచంద్రుణ్ణి, మగువమాంచాలను, కొండవీటి రెడ్డిరాజు లును, శ్రీనాథుణ్ణి నోరారా కీర్తించి,నాగార్జున సాగర జలాలు "సర్వ ప్రపంచ విశాల యశముగ" చెప్పి, దాని కుడికాలువ నీటితో తడిసి పండే పంటలన్నీ కూడా "తెలుగు భూమాత బంగారు దీప్తులుగా" పేర్కొంటాడు. పెన్నానదిని నెల్లూరుకు విన్నాణమని, సస్యవిరివికి నెలవని కీర్తిస్తాడు.

కర్నూలు మండలాన్ని గురించి వర్ణిస్తూ తుంగభద్ర వైభవాన్ని నోరారా గానం చేస్తాడు. తెలుగువాళ్ళ తొలి తెలుగు రాజధానియైన శ్రీకాకుళాన్ని వర్ణిస్తూ వేదకాలం నాటి ముత్తైదువులాగ కళ్ళకు కనిపిస్తుందని, "శ్రీ కృష్ణవేణీ గరిష్ఠ పాథస్తరంగాహత ప్రాకారమైన యదీ" అని వర్ణిస్తాడు.

**సి. నారాయణరెడ్డి :**

నడిచే నాగార్జున సాగరంగా ఖ్యాతికెక్కిన జ్ఞానపీఠ, కవితా పద్మభూషణుడు సి.నా.రె. కృష్ణవేణిని బహుధా వర్ణించాడు. 'కృష్ణవేణి' - అనే చలనచిత్రంలో కృష్ణానదిని వర్ణించిన తీరు చూడండి. నాయి కానాయకుల వలపు గీతంగా సాగే ఈ గీతంలో నాయిక నదిని కీర్తిస్తుంటే నాయకుడేమో తన ప్రేయసికి నదికీ అభేదాన్ని పాటించి వర్ణిస్తాడు.

నాయిక కృష్ణవేణి తెలుగింటి విరిబోణిగా, శ్రీశైలపు లోయలలో సాగి విద్యుల్లతలను వికసింపచేసి నాగార్జున కొండనుండి బీళ్లను బంగారు చేలుగా మారుస్తుందని, అమరావతిలో రాళ్లను రమణులుగా మారుస్తుందని, అభిసారికగా హంసలదీవిలో కలుస్తుందని తెలుగు నాట కృష్ణవేణీ స్వరూపాన్ని వివరిస్తుంది. నాయకుడేమో నదితో అభేదాన్ని పాటించి, నాయిక సౌందర్యాన్ని వర్ణిస్తూ ఊహల పల్లకిలో ఊరేగుతాడు చూడండి...

**ఆమె** : "కృష్ణవేణీ తెలుగింటి విరిబోణీ !

**అతడు** : కృష్ణవేణీ నాయింటి అలివేణీ !"

**ఆమె** : "శ్రీగిరి లోయల సాగే జాడల
విద్యుల్లతలు కోటి వికసింపజేసేవు"

**ఆమె** : లావణ్యలతవై ననుచేరువేళ
శతకోటి చంద్రికలు వెలిగించు కృష్ణవేణీ !॥ కృష్ణవేణీ ॥

**ఆమె** : "నాగార్జున గిరి కౌగిట ఆగి
బీళ్లను బంగారు చేలుగా మార్చేవు"

**అతడు** : "నా జీవనదివై ఎదలోన ఒదిగే
పచ్చని వలపులు పండించు కృష్ణవేణీ !" ॥ కృష్ణవేణీ ॥

**ఆమె** : "అమరావతిగుడి అడుగుల నడయాడి
రాళ్లను అందాల రమణులుగ తీర్చేవు !"

**అతడు** : "ఏ శిల్ప రమణులు
ఏ దివ్య లలనలు
నోచని అందాలు దాచిన కృష్ణవేణీ !"

**ఆమె** : "అభిసారికవై హంసల దీవిలో
సాగర హృదయాన సంగమించేవు" ॥ కృష్ణవేణీ ॥

కృష్ణవేణీ నదిని సి.నా.రె. చాలాచోట్ల వర్ణించాడు. నాగార్జున సాగరమనే కావ్యంలో ఆంధ్రభూనందనోద్యానవనంలోకి నవ్యాప్స రోంగన భంగి ప్రవేశించినదని, బౌద్ధము రసాకృతి దాల్చి తరలివచ్చిన ట్లుగా భాసిస్తోందని, ఒక్కసారి మనసార పొంగిందంటే క్రుంగిపోయిన శాతవాహనుల వైభవోన్నతి ఆకాశమంటేలా తన తరంగాలతో తాకు తుందని, ఒక్కసారి మనసారా పలికిందంటే పదివేలమంది కిన్నెరలు, కిన్నరులు కలసి హృదయతంత్రికల్ని మ్రోయించినట్లనిపిస్తుందని, ఒక పర్యాయమదరిపోయిచూస్తే, అమరావతీ మందిరంలో నిద్రించే అప్సరోభామల మెయివిరుపులే తోస్తాయని, ఆమె కనుబొమ్మలకు సాటియైన చాపములేదని,ఆమె తరగలు పొందని రూపంలేదని బహు విధాలుగా వర్ణిస్తాడు. జోత్స్నాభి సారికలు ధరించిన సన్ననివస్త్రాలు చలించినట్లుగా, శరత్కాలపుటాకాశంలోపింజలుపింజలుగా విడిపోయి కదిలిపోయే మేఘ మాలికలాగా ఉన్నదని వెన్నెలలో కృష్ణమ్మను వర్ణిస్తాడు. ఆమె కెరటాలు చిత్రాతి చిత్రమైన గతులతో పయనించే కవితల్లాగా ఉన్నాయట. కృష్ణానదీ తరంగాలు బోధిసత్వుని మూర్ధాన్ని

సదాపరివేష్టించే దుర్నిరీక్ష్య మహోలహరులాగా, శాక్యముని కడకంటి చాయలలో వెల్లువలై దూకే కరుణార్ద్రమైన లలితభావనలలాగా ఉన్నాయట. నదీతీరంలోకి పచ్చిక బయళ్లన్నీ కృష్ణవేణీమాత ఒడిలో నిద్రావస్థలోనున్న శిశువుల్లాగా ఉన్నాయట. ఆ నదీమాత దక్షిణహస్తాన్ని అందుకొని పవ్వళించిన శ్రీ పర్వతుడు రాశీభూతసహనుడై కనిపిస్తున్నాడట. ఇంత అందంగా కృష్ణానదిని వర్ణించిన సి.నా.రె.ను మనం భళారె అనకుండా ఉండగలమా ?

"అదిగొ కృష్ణమ్మ న
వ్యాప్సరోంగన భంగి
నడయాడె నాంధ్ర భూ
నందనోద్యానమున
అల్లదిగొ కృష్ణవే
ణమ్మభాసించె బౌ
ద్ధరమురసాకృతి దాల్చి
తరలివచ్చె ననంగ
ఆమె ఒకసారి మన
సార పొంగిన చాలు ;
ఈనాడు క్రుంగిపో
యిన శాతవాహనుల
వైభవోన్నతి మిన్ను
వాక తరగల దాకు
ఆమె ఒకమారు నో
రార పల్కిన చాలు ;
పదివేల కిన్నెరలు
పదివేల కిన్నరులు
హృదయ తంత్రికల మ్రో
యించినటులనిపించు,
ఆమె ఒక పర్యాయ
మదరిపోయినచాలు
అమరావతీ మంది
రాంతర కుసుమశయ్య
లందు నిద్దుర లేచు
అప్సరోభామినుల
మెయి విరుపులే తోచు

సుమనోజ్ఞ వసనాంచ
లములు సన్నని గాడ్పు
లకు చలించిన యటుల
శరదంబరమున పిం
జలు పింజలుగ వీడి
మెల్ల మెల్లగ సాగు
మేఘమాలికలటుల ;
ఆమె కెరటాలు చి
త్రాతి చిత్రములైన
గతులతో పయనించు
కవితలే యనిపించు
బోధిసత్త్వుని మూర్ధ
మును సదాపరివేష్ట
నము సేయుదుర్నిరీ
క్ష్య మహోలహరులటు ;
శాక్యర్షి కడకంటి
చాటులందునవెల్లు
వలుదూకు కరుణార్ద్ర
లలిత భావనలట్లు ;
ఆమె కెరటాలుది
వ్యాతి దివ్యములైన
రూపురేకల దాల్చు
చూపుకందకనిల్చు
ఆమె యొడిలోన ని
ద్రావస్థలోనున్న
శిశువుల విధాన ప
చ్చిబయళ్ళొప్పారు

హొయలు మెరుపులు వీచు
ఆమె కన్నొమల కెన
యైన బాపము లేదు
ఆమె తరగలు పొంద
నట్టి రూపము లేదు
జ్యోత్స్నాభిసారికల

ఆమె దక్షిణహస్త
మందికొని పవళించు
శ్రీపర్వతుండు రా
శీభూతసహనుండు...
(నాగార్జునసాగరం 2, 3, 4 పేజీలు)

**కరుణశ్రీ :**

లలిత హృదయుడైన కరుణశ్రీ కృష్ణానదిని నిత్యకల్యాణిగా ఇలా వర్ణిస్తాడు.

**సీ॥ భారత జనయిత్రి గారాబు బిడ్డవై**
**తెలుగు సంస్కృతి తీర్చి దిద్దినావు**
**పంచగంగలలోని ప్రఖ్యాతి గడియించి**
**కలికల్మషముల పోకార్చినావు**
**తంగేళ్ళబీళ్ళలో బంగారు పండించి**
**పేదల కన్నంబు పెట్టినావు**
**ఆంధ్ర పౌరుషమున కద్దాలమేడవై**
**వెలుగు వెల్లువలతో వెలసినావు**
**కనకదుర్గా ప్రదత్త ప్రకాశ కలిత**
**లలిత మణిమేఖలా సముజ్జ్వలిత మధ్య !**
**తెలుగు బిడ్డల ఆశీర్వదింపు మమ్ము !**
**అమృత రసములవెల్లి ! కృష్ణమ్మ తల్లి !**

సహ్యా పర్వతరాజు సౌధాంగణనంలో అల్లారుముద్దుగా ఆటలాడిందని, తుంగభద్రా పరిష్వంగంతో సముత్తుంగ తరంగాలతో పొంగి పొరలిందని, శైవ, వైష్ణవ, బౌద్ధ సంస్కృ తులను మేళవించి అల్లిన నీలవేణిని ధరించిందని, వేదాద్రి నరసింహునికి అమరేశ్వరునికి, దుర్గాంబకు, ఆంధ్ర విష్ణువుకు పాదాభివందనం చేసి, కడలి రాయని ఇంటిలో అడుగుపెట్టిన నిత్యకల్యాణి కృష్ణవేణి భవాని అని ప్రశంసిస్తాడు. కృష్ణానదిలో స్నానం చేస్తే భాగీరథీ స్నాన ఫలమబ్బుతుందని, సకల తీర్థాలలో జలకమాడినట్లేనని, నర్మదానదిలో యజ్ఞం చేసినట్లేనని, యమునానది ముంగిట సంవత్సరం తపస్సు చేసినట్లేనని ప్రస్తుతిస్తాడు. హరిహరుల దివ్య తేజస్సును పొంది, కృష్ణగా, వేణిగా ప్రవహించిందని, "ఆర్తజన కల్పవల్లి కృష్ణమ్మ తల్లి" అని కీర్తిస్తాడు. పాపాత్ములు చాలామంది తమ పాపాలు కడుక్కోవటానికి వచ్చారని,వీళ్ళ పాపాలను ఎలా భరిస్తావని కృష్ణమ్మ తల్లిని ప్రశ్నిస్తూ ఆశ్రితానంద కల్పవల్లిగా వర్ణిస్తాడు. పన్నెండేళ్ళకొకసారి తమ పాపాల్ని పోగొట్టే తల్లివి నీవున్నా

వన్న నమ్మకంతో ఉప్పొంగిపోయి, పగలు - రాత్రి ఎన్నో పాపాలు చేసిన కృపాహీనులు, త్రపాహీనులు కళ్ళుకానని దుండగీండ్రు వచ్చి నిన్ను ఆశ్రయిస్తుంటే వాళ్ళ పట్ల నీవు చూపే కారుణ్యం ఎంతటిదో కదా! పాపాలకు పశ్చాత్తాపపడే దీనజనాన్ని దయతో క్షమించి, వాళ్ళ పాపాలు, శాపాలు, తాపాలు తీర్చవమ్మా తల్లీ ! అని అభ్యర్థిస్తాడు.

శాపవశాన గంగానది కాకి రూపంలో వచ్చి మునగగా, దానికి హంసదేహం లభించడం చేత హంసలదీవి అనే పేరు వచ్చిందని ఐతిహ్యం. దానవుడు నదిలో మునిగి, మళ్ళీ మనిషిగా మానవత్వాన్ని గ్రహిస్తున్నాడు. మరి మానవుడు ఈ నదిలో మునిగితే ఏ మహామహిమను పొందుతాడోనని చెప్పే ఈ పద్యాన్ని గమనించండి.

**తే॥గీ॥ "గంగ" మును "కాకి"యై మునుగంగ "హంస"**
**దేహము లభించె హంసలదీవి నంద్రు !**
**"దానవుడు" మున్గి మానవత్వమ్ము గనిన**
**"మానవుడు" మున్గియే మహామహిమ గొనునొ !!**

ముక్కుమూసుకొని ఒక్కసారి మునకవేస్తే చాలు పూర్వ పుణ్యాలన్నీ ఒక్కసారి పులకరిస్తాయని, దోసెడు నీళ్ళు పోసుకుంటే సంసారతాపాలు సమసిపోతాయని, కందోయి నిండుగా చూచి మ్రొక్కితే పాతకాలు సమసిపోతాయని, కెరటాల గాలి సోకినంతమాత్రానే కైవల్య లక్ష్మి స్వాగతం పలుకుతుందని, కృష్ణా అని ఒక్కసారి పలికితే చాలు మనసు లోని వ్యథలన్నీ తొలగిపోతాయని, ఆర్తజన కల్పవల్లిగా కృష్ణమ్మతల్లిని కరుణశ్రీ రసార్ద్రంగా భావించాడు. కడుపు చల్లని తల్లిగా, బంగారు వెల్లిగా, సకలజన కల్పవల్లిగా కృష్ణమ్మ తల్లి పుష్కరవేళ పొంగి ప్రవహిస్తోందని, అర్థజన కల్పవల్లిగా కృష్ణవేణి నదిని సంభావిస్తారు.

**"జయతు జయతు కృష్ణా శాంతి నిశ్రాంత తృష్ణా**
**జయతు జయతు వేణీ సంభృతామ్నాయ వాణీ**
**జయతు విజయదాత్రీ సహ్యశైలేంద్ర పుత్రీ**
**కలుష మపనయంతే కృష్ణవేణీ స్రవంతీ" (కృష్ణమ్మతల్లి)**
**తుమ్మల సీతారామమూర్తి చౌదరి**

తెనుగులెంక తుమ్మల సీతారామ మూర్తిగారి కమనీయ భావనలో కృష్ణమ్మను చూడండి.

**గీ॥ తల్లి ! కృష్ణానదీ ! భవత్తటమునందె**
**మ్రోసె నాంధ్ర పతాక ముమ్మొదటి దెగసి**
**తెనుంగు నావలు నీదు దీవనలు పడసి**
**యెత్తెం దెరచాప, దీవుల నెల్లనొత్తె.**
**ఆ॥వె॥ సుకృతఖనివి నీవు ; సకల భూముల వారి**
**యర్చలందు మల్లికార్జునుందు**
**కనకదుర్గనీకు గాదిలి చుట్టముల్**
**నతసమాజ ! సహ్యనగతనూజ !**
**గీ॥ నీవు కరుణా నిధివి కాన నీ తటమ్ము**
**లాశ్రయము లయ్యె బౌద్ధ విహారములకు ;**
**సుగత సంస్కృతి నిపుడేని పగటు నిచటి**
**జనతః పున్నెపుదొంతి ! కృష్ణా స్రవంతి !**
**ఆ॥వె॥ వాసిరెడ్డివారు నీ సన్నిధిన్ బ్రజ**
**నేలునాడు లోక హితము నెంచి**
**విడుచు దానధార వడకారు నందేని**
**నింపెనీకు వఱద సొంపు కృష్ణ !**
**ఆ॥వె॥ నిన్ను దుర్గవీట నిలిపి తల్లి ! వేగి,**
**నాటినుండి కమ్మనాటి దనుక**
**జీవనార్తి నుడిపెనే విజ్ఞుండా దయా**
**పేటి కేటికోళ్ళు "కాటను"నకు.**

అమ్మా! కృష్ణమ్మా! నీ తీరంలోనే తెలుగు పతాకం తొలుత వెలసింది. తెలుగు సామ్రాజ్యం కృష్ణాతీరంలోనే కదా! మొదట వెలసింది. నీ దీవెనలతోనే తెలుగునావలు తెరచాపలెత్తి వర్తకాన్ని కొనసాగించాయి. సహ్యాద్రి పుత్రికయైన నీకు మల్లికార్జునుడు, కనకదుర్గమ్మ గాదిలి చుట్టాలు. నీజలార్చనలతో వారిని సేవిస్తున్నావు. నీవు కరుణానిధివి కాబట్టే నీ ఒడ్డులు బౌద్ధవిహారాలకు ఆశ్రయమయ్యాయి. వాసిరెడ్డివారు నీ సన్నిధిలోనే ప్రజలనేలారని, విజయవాడలో బ్యారేజీని నిర్మించిన కాటన్‌కు వందనాలని ఇలా కృష్ణమ్మను మధురమధురంగా భావన చేస్తాడు.

**జాషువా కలగానం :**

కవికోకిల జాషువా కమనీయగానంలో కృష్ణమ్మ చూడండి. నాగార్జునసాగరంగా కృష్ణమ్మ గ్రహించే సందర్భంలో -

**సీ॥ ఉరవళ్ళున్ బరవళ్ళు ద్రొక్కుచు ప్రాగాఘోర్మిచ్ఛటా లాస్య సుం**
**దరియై, చక్కని పిల్లకాల్వలు మహేంద్రక్షోణికిన్ కోటివం**
**త్సరముల్ శ్యామల సస్యభూషణములన్ సంధింప, భాషాకవీ**
**శ్వర పూజా విధులందు కొమ్మలఘు కృష్ణావాహినీ మోహినీ!**

అని పరవశించి ప్రస్తుతించాడు. అప్పటి నాగార్జున సాగర మఖిలాంధ్రుల కల. ఇప్పటి నాగార్జునసాగరం రెండు తెలుగు రాష్ట్రాలమధ్య పంపిణీ రాజకీయాల వ్యథ.

శ్రీనాథుడు పలనాటి తీరంలో సంచరిస్తూ అంగడి యూరలేదని, వరి యన్నము లేదని, శుచిత్వమేమి లేదని రకరకాలుగా బాధపడ్డాడు.

ఇప్పటి నాగార్జునసాగరపు ఫలాన్ని గమనిస్తే శ్రీనాథుడలా అనలేడంటూ ఇలా చమత్కరిస్తాడు.

**ఉ॥ "అంగడి యూరలేదు, వరియన్నము లేదు, శుచిత్వమేమిలే**
**దంగన లింపులేరనుచు నప్పుడు వల్కితి విప్పుడందువా**
**అంగనలందరిందుదమయంతులుగా వరియన్న మంతయుం**
**బంగరు బువ్వగా బలికివ్రాయవె నైషధకావ్యముల్ కవీ !"**

ఇప్పుడంతా బంగారు బువ్వేనని, స్త్రీలంతా దమయంతులేనని శ్రీనాథుడు వర్ణిస్తాడని జాషువా అంటాడు.

**ఉ॥ నీవొక సాగరంబవయి నిల్చితి గంగమ్మతల్లి వార్ధికిన్**
**సేవలు చేయు బాధముగిసెన్ ఘనమైనది దేశసేవ, నీ**
**పావనమైనతోయములవంబులభించిన లక్షభూములే**
**కావొక లక్ష జిహ్వలు సుఖంపడు పుణ్యమునీకు దక్కెడిన్**

అంటూ కృష్ణవేణిని ఉద్దేశించి పలికిన మాటలు జాతి కామనయే.

**సత్యం శంకరమంచి :**

అమరావతి కథల్లో ప్రతి కథలో – కృష్ణానది ప్రస్తావన ఉంది. నాకైతే జలభాషతో కృష్ణమ్మ, మనుషుల్ని గూర్చి తరాలనాటి కథల్ని చెప్పినట్లనిపిస్తుంది. ఈ సంపుటిలో కృష్ణానదిని ఎన్నిరకాలుగా వర్ణించాడో చూడండి.

"ఆ ఊర్ని వడ్డాణంలా చుట్టి గలగల పారుతున్న కృష్ణానది" (వరద పు. 30)

"అప్పటికి ఇప్పటికీ సాక్షి ఆ కృష్ణవేణి. గతాన్ని కడుపులో దాచుకొని ఏమీ తెలియనట్టు నిండుగా ప్రవహిస్తుంది. (పు. 31)

"కనుసారించి చూస్తే రెండు కొండల మధ్యనుంచి వచ్చే కృష్ణ, కావలసిన చుట్టం ఊరినుంచి వస్తున్నట్టుంది. తలంటుపోసుకుని విప్పుకున్న జుట్టులా పాయలు పాయలుగా పారుతోంది. ఆ జుట్టును బంధించి జడగా అల్లినట్లు ఏకపాయగా పారుతుంది". (పు. 31)

"కృష్ణమ్మ నల్లటి చీరకు పువ్వుల అంచులా వొడ్డునిండా ఆడవాళ్ళ వరుస" (నీరు నిలువదు, పు. 134)

"పసిపిల్లవాడు తల్లి ఒడిలో ఒదిగిపోయినట్లు కృష్ణమ్మని మనసారా కౌగిలించు కుంటున్నాడు. (మనసు నిండుకుంది, పు. 215)

"రంగణ్ణి తల్లి ఒళ్ళోకి తీసుకొని నిమిరితే రంగడికి కృష్ణమ్మ కడుపులో స్నానమాడి నట్లనిపించింది.(తల్లి కడుపు చల్లగా, పు. 232)

**కృష్ణలో వాన :**

"సంతత ధారగా వాన పడిపోతున్నది. నీళ్ళలో నీళ్ళు! ధారలో ధార! ప్రవాహంలో ప్రవాహం. వాన చినుకులు కృష్ణలో పడుతుంటే పెద్దక్క ప్రేమగా హత్తుకొంటే వొళ్ళు జలదరించినట్టు ఆ ప్రవాహం మీద ఓ జలదరింపు. ఓ పులకరింపు. సిగ్గుతో నవ్వినపుడు బుగ్గమీద సొట్టలా చినుకుపట్ట చోట చిన్నగుంట. అంతలో ఆ గుంటమాయం. మళ్ళీ చినుకు, మళ్ళీ గుంట,మళ్ళీ మళ్ళీ చినుకులు. అంతలో మళ్ళీ మళ్ళీ గుంటలు, కృష్ణంతా చినుకులు; కృష్ణంతాపులకరింతలు. ఇసుక మీద చినుకులు. కసకస చినుకులు. రేణు రేణువుకీ చినుకులు. విసవిస, సరసర, చినుకులు – చినుకులు కృష్ణనిండా, ఇసుకనిండా, నేలనిండా చినుకులు చినుకులు. రెండు గంగలు కలిసిపోయినట్లు, నింగినేలా ఒకటే అన్నట్లు, ఈ జగత్తులో నీళ్ళు తప్ప ఇంకేమీ లేనట్లు అన్నిటికీ నీళ్ళే ఆధారమన్నట్లు వాన, వర్షం, గంగమ్మ, కృష్ణమ్మ, సంద్రం అదేదో దానికి, నువ్వేపేరైనా పెట్టుకో" (రెండు గంటలు, పు. 45)

ఇందులో చిన్న చిన్న వచనఖండాలు వర్షస్ఫూర్తిని కలిగించటం లేదూ.

'నాన్న–నది' అనే కథ గొప్ప చిత్రీకరణ. అందులో తండ్రి అంత్య క్రియలు పూర్తిచేసి కృష్ణకి స్నానానికొచ్చి, కృష్ణని చూచిన సీతయ్య మనోభావాల్ని చూడండి.

'అదే కృష్ణ. నాన్న స్నానాలు చేయించిన కృష్ణ. నాన్న ఈతలు కొట్టించిన కృష్ణ. ఈతలు కొట్టించిన నాన్న మునకలు వేసిన కృష్ణ, జన్మంతా నీ నీళ్ళు తాగిన నాన్న. వెళ్ళిపోయాడమ్మా, నేనూ నీ నీళ్ళే తాగి బతుకుతున్నానమ్మా, నాకు నాన్న కావాలమ్మా'అని భోరుమన్నాడు. సీతయ్య శరీరం కృష్ణ. సీతయ్య ఊపిరి కృష్ణ. సీతయ్య రక్తం కృష్ణ. సీతయ్య ప్రాణం కృష్ణ. సీతయ్య కన్నీళ్ళు కృష్ణ. కృష్ణ కృష్ణలో కలిసి పోతోంది. కృష్ణ కృష్ణని అడుగుతోంది నాన్న కావాలని.

కృష్ణ నిండుగా ప్రవహిస్తోంది. సీతయ్య మాటలు వింటూ నిబ్బరంగా సాగి పోతుంది. నిట్టూర్పుగా సాగిపోతుంది. కాలం ఆగదన్నట్లు గబగబా వెళ్ళిపోతోంది. (నాన్న–నది, పుట. 158)

నా...నా అంటూ సరసర వెళ్ళిపోయే కృష్ణ తరువాతి తరాన్ని సీతయ్యకు ఎలా గుర్తుచేసిందో హృద్యంగా వర్ణించటం ఇందులోని శిల్పం. నాన్న–నది గొప్ప దృశ్యం.

**మాఘపౌర్ణమి రాత్రి :**

'నల్లటి కృష్ణమ్మ వెన్నెట్లో తెల్ల జరీచీర కట్టుకున్నట్లుంది. కంఠాన అలంకరించిన మణిమాలలో నక్షత్రాలు ప్రతిఫలిస్తున్నాయ్. విరిగి పడుతున్న అలలకి వెన్నెల ముక్కలవుతుంటే కృష్ణమ్మ సిగ్గుతో ముసిముసి నవ్వులు నవ్వుతున్నట్లుంది. ప్రవాహంలో నురగలు, నిడివైన కృష్ణమ్మ పూలజడలో కూర్చిన మల్లెల్లా ఉన్నాయి'. (సంగమం, పు. 250)

### కార్తీక దీపాలు :

కృష్ణ నిండా దీపాలు. పాటపాడుతున్నట్లు అటూ ఇటూ వూగుతూ ప్రవాహంలో తేలిపోతున్నాయి. కొన్ని వందల ఆవునేతి దీపాలు ; కృష్ణమ్మ ముత్యాలహారం ధరించినట్లు; ఆకాశం నక్షత్రాలు వర్షించినట్లు కృష్ణలో దివ్వెలబారులు.

### నిశ్శబ్దంలో :

అంత పెద్ద చింతచెట్టు కదలక మెదలక మూగపోయిన వేళ కృష్ణమ్మ సనసన్నగ ముందుకెళ్తోంది. గలగల మోతలేదు. కిలకిల నవ్వులేదు. తక్కుతూ తారుతూ చీకట్లలో కలసిపోయి ముందుకెళ్తోంది. కృష్ణమ్మ అడుగు తడబడ్డప్పుడు అందె మోగినట్టు, ఉండుండి చేపపిల్ల చెంగున ఎగురుతోంది. తంబురా తక్కువ శృతిలోవేసినట్టు సాగి పోతుంది. కృష్ణ భూమాత కాటుక కన్నులా ఉంది. కృష్ణ – సర్వదా జాగృతమైన ఆత్మలా కన్ను మూయలేదు కృష్ణ. (నేనూ మేల్కొనే ఉన్నాను, పు. 367)

### కృష్ణానదీ గీతం :

అడివి బాపిరాజు వరదగోదావరిని వర్ణించినట్లు, కృష్ణానదిని వర్ణించే శంకర మంచివారి ఈ భావావేశాన్ని మనం కృష్ణగీతంగా స్వీకరించటంలో ఔచిత్యం లాస్యమాడు తుందని భావిస్తున్నాను. చూడండి.

'కృష్ణ పాట'గా దీన్ని చెప్పొచ్చు, చూడండి...

'హరహర మహాదేవ !

అల్ల ! ఆ నల్లకొండలోంచి పరుగుపరుగున వచ్చిందమ్మా కృష్ణమ్మా
నెమల పింఛవు చాయ పట్టురైకా కట్టి
కొండపుప్పొడి తేనె వొడిలోన వొంపుకొని
కోన పక్షుల రవము కొంగులో కప్పుకొని
వాగుల్ల వంకల్ల రాసుకుంటూ, దూసుకుంటూ
గట్టుపుట్టల మీంచి గబాగబా దూకుతూ
అందెల్లు ఘల్లుమన
ఝణఝణా
ఫెళ ఫెళా
గలగలా
సరసరా
ఉరకలతో పరుగులతో తరలి వచ్చిందయ్యా కృష్ణమ్మ
ఆ వొడ్డు ఈ వొడ్డు అంతనీ తాకుతూ
అమ్మ తల్లిలా
అలల చేతులు అన్నివైపులా విప్పుతూ
పిలుస్తోందయ్యా కృష్ణమ్మ !.....

అని పుణ్యనదులకు ఆత్మలా వచ్చిందయ్యా వాహిని. (పు. 384)

ఈవిధంగా తెలుగు కవుల భావనాగీతంలో కృష్ణమ్మ పరవళ్ళు తొక్కింది.

---

శా॥ యాదోరాశి గంభీరమూర్తి రఘునాథాదీశుదుద్దండ బా
హా దర్పాంధ సపాద మల్కిక నిజామానీకముల్ ద్రుంప
న్యా దూరస్థితి బాచారు కృష్ణకును గృష్ణాంకంబు నాడబ్బె బి
బ్బీ దీవ్యన్నయ నాబ్జకజ్జల జాలా భీల ప్రవాహంబునన్

–వసుచరిత్ర

చిరునామా : ఆచార్య బూదాటి వేంకటేశ్వర్లు, *తెలుగు శాఖ, బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం, వారణాసి*

శ్రీ గ్రంథి మోహన్

# కృష్ణానది

**నమామి సుకృతశ్రేణీం కృష్ణవేణీం తరంగిణీమ్**
**యద్వీక్షణం కోటిజన్మకృత దుష్కర్మ శిక్షణం**

దర్శనము చేసినంత మాత్రమున కోటి జన్మలలో చేసిన పాపము లను నాశనము చేసి, పుణ్యమును ప్రసాదించునట్టి కృష్ణవేణి నదికి నా నమస్కారము (తీర్థ ప్రబంధము)

పరమానంద స్వరూపుడైన భగవంతుని పొందుటకు ఉన్న అనేక మార్గములలో సులభమైన ఒక మార్గము తీర్థయాత్ర. తరత్యనేనేతి తీర్థం అని తీర్థము యొక్క నిర్వచనము. మానవులను సంసార సాగ రము నుంచి తరింప చేయునది తీర్థము. తీర్థము మరియు తీర్థ మాహాత్మ్యము గురించి స్కాందపురాణము కాశీఖండము ఆరవ అధ్యా యము ఎంతో విపులముగా చర్చించినది. తీర్థమునకు అంతటి ప్రభావము లభించుటకు కారణము చెబుతూ

**ప్రభావాదద్భు తాద్భూమేం సలిలస్య చ తేజసః**
**పరిగ్రహాన్మునీనాంచ తీర్థానాం పుణ్యతా స్మృతా   కాశీ. 6.44**

భూమి ప్రభావము వలనను, ఆయా క్షేత్రముల జలముల ప్రభా వము వలనను మననశీలురైన మహర్షులు ఆమోదించినందువలనను తీర్థములకు పావనత్వము కలిగినది.

తీర్థములు స్థావర, జంగమ, మానసములని మూడు విధములు. నైమిషము, కురుక్షేత్రము, కాశి, బృందావనము, పురుషోత్తమ క్షేత్రము (జగన్నాథ పూరి), గంగ సాగర సంగమము వంటి ఎన్నో క్షేత్రములు స్థావర తీర్థములు. సాధువులు, సజ్జనులు జంగమ తీర్థములు. సకల భోగ విషయములందు వైరాగ్యము కలిగి మనస్సును సదా భగవంతుని యందు లగ్నము చేయుట వలన మనస్సు నిర్మలమగును. దాని వలన సత్యము, క్షమా, ఇంద్రియ నిగ్రహము, భూతదయ, ఆర్జవము, దానము, దమము, సంతోషము, బ్రహ్మచర్యము, ప్రియభాషణము, జ్ఞానము, ధృతి, తపస్సువంటి ఉత్తమ గుణములు కలుగును. అటువంటి మనస్సు మానస తీర్థము. అటువంటి మనస్సు కలిగిన వాడు సదా పునీతుడగును. జంగమ తీర్థముల గురించి శ్రీ మద్భా గవతములో ఇలా చెప్పబడినది.

**భవద్విధా భాగవతాస్తీర్థ భూతాః స్వయం విభో**
**తీర్థీ కుర్వన్తి తీర్థాని స్వాన్తః స్థేన గదభృత**

అయ్యా! భగవంతుని ఎల్లప్పుడు మీ హృదయములో నిలిపి సంచ రించు మీవంటి భక్తులు తీర్థములే. మీరు ఎక్కడ ఉంటే ఆ ప్రదేశమును తీర్థముగా మార్చివేయగలరు.

బ్రహ్మదేవుడు మానవుల శ్రేయస్సు కోరి తన కమండలములో నున్న పుష్కరునితో ఒక తీర్థమును సృష్టించెను. ఆ తీర్థములో మూడు న్నర కోట్ల తీర్థములు సదా వసించును. ఆ తీర్థమును సేవించి నంత మాత్రమున మానవులకు సమస్త తీర్థములలో స్నానము చేసిన ఫలము లభించును. ఈ కథ పద్మ పురాణములోని సృష్టి ఖండములో ఉన్నది.

ఇంతటి పవిత్రమైన పుష్కరములో నిత్యము స్నానము చేయాలన్న కోరికతో బృహస్పతి పుష్కరునితో తీర్థరాజమా! నేను గ్రహము నైనందున నిత్యము మేషాది పన్నెండురాశులలో సంచరించుచుం దును. నీ మాహాత్మ్యము తెలిసి ప్రతిరోజు నీలో స్నానము ఆచరిం చాలనుకుంటున్నాను. అందువలన నీవు నాతో కలిసి రావలయును. కానీ పుష్కరుడు బ్రహ్మను వదలి వెళ్ళుటకు అంగీకరించలేదు. అలా వెళ్లవలసి వచ్చినచో బ్రహ్మ కూడా తనతో రావాలని కోరెను. దీనితో వీరిరువురికి వివాదము కలిగినది. ఈ వివాదము గురించి తెలిసి బ్రహ్మ, గురువు ప్రతి రాశిలోనూ ప్రవేశించునప్పుడు అనగా సంక్రమణ కాలము నుంచి పన్నెండు రోజులు మరియు ఆ రాశిని విడిచినప్పుడు చివరి పన్నెండు రోజులు పుష్కరుడు గురువుతో ఉండునని చెప్పి వారి వివాదమును పరిష్కరించెను. గురువు ఒక్కొక్క సంవత్సరము

ఒక్కొక్క రాశిలో ప్రవేశించునప్పుడు ఒక్కొక్క నదికి పుష్కరము ఏర్పడుతుంది. ఆ వివరములు ఇవి.

| గురువు | నది |
|---|---|
| మేషరాశిలో ప్రవేశించినప్పుడు | గంగానది పుష్కరములు |
| వృషభరాశిలో ప్రవేశించినప్పుడు | నర్మదానది పుష్కరములు |
| మిధునరాశిలో ప్రవేశించినప్పుడు | సరస్వతి నది పుష్కరములు |
| కర్కాటకరాశిలో ప్రవేశించినప్పుడు | యమునా నది పుష్కరములు |
| సింహరాశిలో ప్రవేశించినప్పుడు | గోదావరి నది పుష్కరములు |
| కన్యారాశిలో ప్రవేశించినప్పుడు | కృష్ణనది పుష్కరములు |
| తులారాశిలో ప్రవేశించినప్పుడు | కావేరి నది పుష్కరములు |
| వృశ్చికరాశిలో ప్రవేశించినప్పుడు | భీమ నది పుష్కరములు (తామ్రపర్ణి తమిళనాడులో) |
| ధనస్సు రాశిలో ప్రవేశించినప్పుడు | తపతి నది పుష్కరములు |
| మకర రాశిలో ప్రవేశించినప్పుడు | తుంగభద్రా నది పుష్కరములు |
| కుంభరాశిలో ప్రవేశించినప్పుడు | సింధు నది పుష్కరములు |
| మీనరాశిలో ప్రవేశించినప్పుడు | పరినీత నది పుష్కరములు |

ఈ పుష్కర కాలములో సమస్త దేవతలు, ఋషులు, పితరులు, మూడున్నర కోట్ల తీర్థములు ఆయా నదీ జలములలో ప్రవేశించును. అందువలన ఆ సమయములో ఆ నదీ జలములు మహిమాన్వితమై శుభప్రదమై, ఫలప్రదమై ఉండును. ఆ సమయములో ఆ నదీ ప్రాంతములో చేసే స్నానము, దానము, జపము, అర్చన, హోమములు మొదలైన కార్యములు ఎన్నో రెట్లు అధిక ఫలమునిచ్చును.

ఈ సంవత్సరము గురుడు కన్యారాశిలో ప్రవేశించుచున్నందు వలన కృష్ణా నది పుష్కరములు జరుగును. కృష్ణానది చాలా విశిష్టమైనది. రేవా తీరంలో తపస్సు, గంగా తీరంలో మరణము, కురుక్షేత్రములో దానము, గోదావరిలో ఈ మూడు మానవుని తరింపచేయును. కానీ కృష్ణానది, దర్శనము చేసినంత మాత్రముననే పుణ్యము లభించును.

లోక పితామహుడైన బ్రహ్మదేవుడు ఒకసారి శ్రీమన్నారాయణుని దర్శించుటకు వైకుంఠమునకు వెళ్ళెను. నారాయణునికి నమస్కరించి స్వామి! రాబోయే కలియుగములో మానవులు మందబుద్ధులు, పాప కార్యములను ఆచరించుట వలన వారు మిక్కిలి పాపమును పొందుదురు. అటువంటి వారి పాపమును పోగొట్టుటకు ఏదైన ఉపాయము చెప్పవలయును. బ్రహ్మ మాటలు విన్న శ్రీహరి సంతోషించి తన అంశతో ఒక స్త్రీ రూపమును సృష్టించి బ్రహ్మతో ఇలా పలికెను. ఓ బ్రహ్మదేవా! నా అంశమున అవతరించిన ఆ స్త్రీ సమస్త పాపములను తొలగించగలదు. ఈమె నీ ఆజ్ఞానుసారము నది రూపములో ప్రవహించి దర్శనమాత్రము చేత దోషములను దూరము చేసి స[illegible] కోరికలను తీర్చును. బ్రహ్మ విష్ణువు వద్ద శెలవు తీసుకొని కృష్ణ[illegible] తీసుకొని బ్రహ్మ లోకమునకు వెళ్ళెను. కొంతకాలము గడిచిన పిదప సహ్యాద్రి పర్వతము ముని రూపము ధరించి నారాయణుని కోసము తీవ్రమైన తపము నాచరించెను. ఆ ముని తపమునకు మెచ్చి శ్రీహరి ప్రత్యక్షమై వరము కోరుకోమనగ స్వామి! నీ అంశ రూపమైన కృష్ణ నది నా మీదుగా ప్రవహించు గాక. విష్ణువు బ్రహ్మను పిలచి కృష్ణానదిని సహ్యాద్రి పర్వతముపై అవతరింప చేయును. నారా యణుని ఆజ్ఞను అనుసరించి బ్రహ్మదేవుడు వెంటనే కృష్ణానదిని సహ్యాద్రి పర్వతముపై అవతరింప చేయుము. నారాయణుని ఆజ్ఞను అను సరించి బ్రహ్మదేవుడు వెంటనే కృష్ణానదిని సహ్యాద్రి పర్వతముపై ఆవిర్భవించును.

మహారాష్ట్రలోని అరేబియా సముద్రము నుంచి 40 మైళ్ళ దూరములో సముద్రమట్టమునకు 4700 అడుగుల ఎత్తులో కృష్ణానది ఉద్భవించినది. (పూనా నుంచి 78 మైళ్ళ దూరములలో) మహాబలే

శ్వరము వద్ద పడమటి కనుమలలో సహ్యా పర్వతము శిఖరముపై జన్మించినది. అక్కడినుంచి 14 కిలోమీటర్ల దూరములో, ఒక కుండములో పడి అక్కడి నుంచి గోముఖము ద్వారా బయటకు పారుతుంది. గోముఖము ద్వారా బయటకు పారుతున్న కృష్ణానది చిన్నదే అయిననూ మార్గములో కోయిన, వరాన, పంచగంగా, ఘటప్రభా, మలప్రభ, భీమరధి, తుంగభద్రా, మూసి, దిండి, పాలేరు, అహల్య, మున్నేరు, వైష్ణవి, వైశ్య, విజయ, విశాల, కుముద చంద్రవంక, నాగులేరు, మలాపహరిణి వంటి ఎన్నో ఉపనదులు కలసి ఇది మహానది అయినది. ఈ విధముగా మహారాష్ట్రలో ఆవిర్భవించి కర్నాటక, తెలంగాణ రాష్ట్రముల మీదగా పయనించి ఆంధ్ర రాష్ట్రములో ప్రవేశించినది. పెద్ద నదులలో ఒకటైన కృష్ణానది సుమారు 1400 కి.మీ. దూరము పయనించి హంసలదీవి వద్ద సముద్రమును చేరును.

కృష్ణా నదీ తీరములో ఎన్నో పుణ్యక్షేత్రములు ఉన్నవి. శ్రీశైలములో భ్రమరాంబ మల్లికార్జున దేవస్థానము, అమరావతిలో అమరేశ్వర స్వామి దేవస్థానము, విజయవాడలో దుర్గా మల్లేశ్వర దేవస్థానము ఉన్నవి. పంచ నరసింహ క్షేత్రములలో మట్టపల్లి శ్రీలక్ష్మి నరసింహస్వామి, వేదాద్రి యోగానంద లక్ష్మి నరసింహ స్వామి కృష్ణా నదీతీరములో ఉన్నవి. మంగళగిరి పానకాల నరసింహస్వామి క్షేత్రము కృష్ణనదికి కొంచెము దూరములో ఉన్నది. పుష్కరములు జరుగునప్పుడు ఆయా నదుల వద్ద చేసే స్నానము, దానము, జపము, పితృ తర్పణములు మొదలైనవి గొప్ప ఫలములనిచ్చును.

గోదావరీం నర్మదాంచ బాహదాంచ మహానదీమ్
శతద్రూం చంద్రభాగాంచ యమునాంచ మహానదీమ్

– మహాభారతం, భీష్మపర్వం

"నర్మదా తాపీపయోష్ణీ గోదావరీ కావేరీ
భైమరథ వేణా కృష్ణవేణా వంజులా
తుంగభద్రా తామ్రపర్ణీ ఉత్పలావతీ
రావణ గంగాద్యానద్యాః

– రాజశేఖరుని కావ్యమీమాంస

చిరునామా : *శ్రీ గ్రంథి మోహన్, దొడ్డబొమ్మ సంద్ర, బెంగుళూరు-560097*

శ్రీ కాకా కాలేల్కర్

# కృష్ణానదీ సంస్మరణ

**1**

## కృష్ణానది సంస్మరణ

ఆ రోజు ఏకాదశి బండిమీద మేము 'మాహోలీ' వెళ్ళాము. మహారాష్ట్ర దేశపు రాజధాని 'సాతారాకు' కొద్దిదూరంలో 'మాహోలీ' ఉన్నది. దారిలో కుడిప్రక్క శ్రీ శాహుమహరాజ్ గారి కుక్కల సమాధి వస్తుంది. దారిలో మాలాగే చాలామంది బళ్ళను 'మాహోలీ' వైపు పరుగెత్తిస్తున్నారు. చివరకు మేము నదీతీరం చేరుకున్నాము. అక్కడ ఒక ఇనుప గొలుసు ఎత్తుగా, ఆ గట్టునుంచి యీగట్టు వరకు బిగించి దానికి ఒక నావలాటిది త్రాళ్ళతో కట్టారు. అది ఆ వయసులో నా కళ్ళకు చాలా అద్భుతమైన దృశ్యంలా తోచినది. ఒడ్డున కనపడేరాళ్ళు బాగా నున్నగా నల్లగా ఉన్నాయి. దృష్టి ఒక ఊయిమీద నుంచి రెండవదానిమీదకు పరుగెత్తుతున్నది. దీనికంటె అది చాలా బాగున్నది అనిపిస్తుంది. ఇంతలోనే నీటిలో మరొక రాయి, కవిరి రంగుచారలది, కనబడగానే మనస్సు దానిమీదకు పోతుంది. ఆ రోజు నాకు కృష్ణానది ప్రథమ దర్శనం అయినది. కృష్ణామాయికూడా నన్ను గుర్తుపట్టడానికి అదే మొదటిసారి. అప్పుడు నేనామెను పోల్చుకునేటంత పెద్దవాడను కాను. పిల్లవాడు పోల్చుకోలేకపోయినా తల్లి వాడిని స్వంతం చేసుకోగలదు. పిల్లలం అంతా బట్టలువదలి, నీళ్ళలోకి గెంతి, అల్లరి చేస్తూ హాయిగా స్నానాలు చేసాము. పడవ మీదకు ఎక్కి నదిలోకి ఉరికాము. కృష్ణలో బాగా జలవిహారం చేసాక పైకిరాగానే ఆకలి దంచేసింది.

కృష్ణానది ప్రథమ దర్శనంతోపాటు కారపు వేరుశనగపలుకుల ఫలహారం కూడా ఇక్కడ మొదటిసారి లభించినది. ఈ యాత్రలో నెమిలిఫించపు టోపీలు పెట్టుకొని, వాసుదేవులనేవారు 'మంజీరల'తో భజన చేసుకుంటూ, యాచనార్థం వచ్చారు. వాసుదేవులు చక్కగా పాడుతూ చేసే భజనను ఆ రోజు మొదటిసారి విన్నాను. తరువాత కొంతసేపు కృష్ణామాయి మందిరంలో విశ్రాంతి తీసుకొని ఇంటికి బయలుదేరాము. కృష్ణానది సహ్యాద్రిదగ్గర అడవిలో మహాబలేశ్వరుని సన్నిధినుండి బయలుదేరి 'సాతారా' దాకా ప్రవహించటానికి ఎక్కువ సేపు పట్టదు. ఈలోగా కృష్ణను కలిసేందుకు 'వేణ్యా' వస్తుంది. ఈ సంగమం వలన 'మాహులీ'కి మాహాత్మ్యం వచ్చినది. చక్కగా ఒకరి బుజాల మీద ఒకరు చేతులు వేసుకొని ఇద్దరు బాలికలు ఆడుకుందుకు వచ్చినట్లు కనిపించే అదృశ్యం గత ముప్పయి మూడేళ్లబట్టి నా హృదయానికి హత్తుకునే ఉన్నది.

కృష్ణకుటుంబం చాలా పెద్దది, చిన్నవీ పెద్దవీ చాలానదులు వచ్చి ఆమెను కలుస్తాయి. 'గోదావరి'తో పాటు కృష్ణనుకూడా మహారాష్ట్ర మాత అనవచ్చు. ప్రస్తుతం వాడుకలో ఉన్న మరాఠీభాష పుట్టకపూర్వం యావత్తు మహారాష్ట్ర దేశానికి కృష్ణానది సరిహద్దు.

**2**

'నరసోబాచీవాడీ' వెళ్ళేటప్పుడు బండిని దోనెమీద ఎక్కించి మేము కృష్ణను దాటాము. అప్పుడు మళ్ళీ రెండవసారి దర్శనమయినది. ఇక్కడ ఒకప్రక్క ఎత్తైన గట్టు. అవతలప్రక్క దూరంగా విస్తరించిన కృష్ణలంక – అందులో పుష్కలంగా వంకాయలు, దోసకాయలు, పుచ్చకాయలు, కర్జూరాలు పండే అమృతంలాటి పొలం! ఈ కృష్ణఒడ్డున కాసే వంకాయలు జన్మలో ఎవరైనా ఒకటి రెండు సార్లు తింటే వారు స్వర్గంలోకూడా ఇవే తెమ్మంటారు. రెండేసి నెలలు ఏకాధ్రిగా తిన్నా వంకాయలు తృప్తితీరదు. అటువంటి పరిస్థితుల్లో ఎవరికీ సహించక పోవటం, ఆ రుచి అనేవి ఎల్లా ఉంటాయోకూడా తెలియదు.

**3**

కృష్ణాతటిపై సంగలివద్ద నేను 'మహారాష్ట్ర ప్రభుత్వ రాజవైభవం' మొదటిసారి కళ్ళారా చూశాను. వైభవోపేతమైన విశాల నదీఘట్టం,

చక్కని బిందెలలోకి నిండుగా నీరు నింపుకొని వెళ్ళే మహారాష్ట్ర, లల నలు, గట్టుపైన ఉన్నవాళ్ళు తడిసి ముంచెత్తేలా నీళ్ళలో దుమికే పోగరు మోతులు, మెడలోని చిన్న చిన్న గంటలుచేసే తాళబద్ధమైన శబ్దాలతో తమ ఆగమనాన్ని సూచించే పర్వతాల్లాటి ఏనుగులు, కర్రుమని ఏక శృతిలో చప్పుడు చేసే చెరకురసం అమ్మేవారి గానుగలు – ఇక్కడ నేను మూడవసారి కృష్ణామాయి దర్శనం చేసుకున్నాను.

నాకు బాగా యీతరాదు. ఒకసారి ఒక పెద్ద రాగికాగును బోర్లించి దానితో నదిని దాటుదామని నీటిలో దిగాను. ఊబిలో ఒకచోట ఎల్లా కూరుకుపోయానంటే ఒకకాలు పైకి లాగుతోంటే రెండవది ఇంకా బురదలో కూరుకుపోతోంది. బురద నల్లటి వెన్నలా ఉన్నది. తల క్రిందుగా పాతిన చెట్టులా అక్కడే స్థావరమైపోతానేమోనని భయం వేసింది. ఆ రోజు నేనుపడ్డ గాబరా ఇప్పటికి మర్చిపోలేదు.

## 4

మాకు చించలీ స్టేషన్లో కృష్ణనీరు త్రాగటం అలవాటు. కాస్త పరిచయమున్న ఒక పెద్ద మనిషి అక్కడ స్టేషనుమాస్టరుగా ఉండేవారు. ఆయన చాలా ఆప్యాయంగా మాకు ఒకటి రెండు గ్లాసుల మంచితీర్థం తెప్పించి ఇచ్చేవారు. దాహం వేసినా వేయకపోయినా ఆ గంగను భక్తిపూర్వకంగా పుచ్చుకోమని మా నాన్నగారి సెలవు. కృష్ణ మహారాష్ట్రుల ఆరాధ్యదేవత. కృష్ణనీరు ఒక్కచుక్క కడుపులో పడితేచాలు ఎవరైనా పవిత్రులవుతారు. ఆ ఒక్కబిందువు లోపల పడితే తాము మహారాష్ట్రుల మనే సంగతి ఎన్నటికీ మర్చిపోరు.

కృష్ణానది కుటుంబవాత్సల్యం చేతనే మహారాష్ట్రులలో సాధు త్వము, వీరత్వము, న్యాయనిష్ఠ, రాజనీతిజ్ఞత, ధర్మం, సదాచారం, దేశసేవ, విద్యాసేవ, స్వతంత్రత, ఉదారతలు చక్కగా పోషింపబడ్డా యని శ్రీ సమర్థ రామదాసు, శివాజీ మహరాజు, సాహూ బాజీరావు, ఘోర్‌పడే, పట్వర్ధన్, నానాఫడ్నవీస్, రామశాస్త్రి ప్రభువులు అంతా సెలవిచ్చారు. దేహూ, ఆళందీజలాలు కృష్ణలో వచ్చి కలుస్తాయి. పండరిపురంలో చంద్రభాగకూడా భీమ అనే పేరుతో కృష్ణలో కలు స్తోంది. "గంగలో స్నానం తుంగలో పానం" అనే సూక్తి గౌరవాన్ని పొందిన తుంగభద్ర తన ప్రాచీన కర్ణాటక వైభవాన్ని సంస్మరిస్తూ చివరకు కృష్ణలోనే లీనమవుతోంది. మహారాష్ట్రం, కర్ణాటకం, తెలం గాణా (ఆంధ్ర) యీ మూడు ప్రాంతాలు కృష్ణానది క్షీరాన్ని గ్రోలినవే! కృష్ణకు పక్షపాతం, ప్రాంతీయత అన్నవిలేవు.

## 5

కాలేజీరోజులలో నాకు పెద్ద పెద్ద ఆశయాలుండేవి. పూనానుండి బయలుదేరి మా అన్నగారిని కలుసుకునేందుకు వెళ్ళాను. నేను ఇంటికి చేరుకోకమునుపే ఆయన పరలోకగతులయ్యారు. పవిత్రమైన కృష్ణానది జిల్లాల్లో ఆయన అస్థికలను కలిపే బాధ్యత నామీద పడినది. నిమజ్జనం కోసం 'బేల్‌గావ్' నుంచి 'కూడిచి' వెళ్ళాను. సంధ్యా సమయం, రైలు వంతెన క్రింద కృష్ణానదికి పూజచేసి మా అన్నగారి అస్థికలను కృష్ణా నదిగర్భంలో కలిపాడు. స్నానంచేసి జీవన మరణాలను గురించి ఆలోచిస్తూ కూర్చున్నాను.

కృష్ణానది జిల్లాలో ఎంతోమంది మహారాష్ట్రవీరుల, వారి శత్రువుల రుధిరం కలసి ఉంటుంది. ఎంతోమంది రైతులను వారి పంటలతో సహా జలసమాధిచేసి ఉంటుంది. మదోన్మత్తగజాలు ఆ నీటిలో విహారం సల్పనీ, విరక్తులైన సాధువులు ఆ గట్టునే తపశ్చర్యసల్పనీ – కృష్ణకు వీటితో ఏమీ నిమిత్తంలేదు. రెండూ ఆమె దృష్టికి సమానమే. మా అన్నగారి అస్థికలకు కంకరణాళ్ళకు కృష్ణ దృష్టిలో ఏమీ వ్యత్యాసంలేదు. 'మాహులీ' లో నున్న తన భుజస్కంధాలపై నిలబెట్టి నీటిలో దూకించి ఆటలాడించిన మా పెద్దఅన్నయ్య అస్థికలనునా చేతులతో నేను యీ కృష్ణానదీ జలాలకు అర్పించాల్సి వచ్చింది. జీవనలీల ఎంత ఆగమ్యం!

## 6

మా తమ్ముడు బ్రహ్మచారీ అనంతబుయామర్డేకర్ వయసులో నా కంటె చిన్న వాడయినా దేశసేవావ్రతంలో నాకంటె ఘటికుడు. అతనుకూడా కృష్ణానదీ గర్భంలో శాశ్వతంగా నిద్రపోయాడు. అతను స్వదేశీ, రాష్ట్రీయశిక్ష, గోసేవ ఇవన్నీ చేస్తూ శరీరత్యాగం చేశాడు. నాతో గంగోత్రీ అమరనాధ యాత్రలుచేసి చివరకు కృష్ణాతీరం చేరు కున్నాక అతను పరమపదించాడు. తన భక్తిధోరణిలో మంచీ చెడ్డా చూసుకోక అతడనేకసార్లు టోకరా తిన్నాడు. ఈ సంగతి నాకు హిమాలయ యాత్రలో చాలాసారులు అనుభవమైంది. మందలించి చూసాను. అతను వినిపించుకోలేదు. సాత్త్వికచింతనలతో శ్రీ సమర్థ రామ దాసస్వామి వారి ప్రవచనాలలో మునిగి తేలుతూ ఉండేవాడు. కృష్ణకుకూడా అతడ్ని మందలించాలని తోచిఉంటుంది. దేవాలయ ప్రదక్షిణం చేస్తూ కాలుజారి నీటిగుండంలో పడి పరలోకగతుడ య్యాడు.. 'వాయు' కఠినశిలాభూములను దాటి ప్రవహించే గంగను స్మరించేటప్పుడు, కృష్ణలో ప్రతివర్షాకాలం శిరస్నానం చేసి దేవాలయ శిఖరాల దర్శనం చేసేటప్పుడు కృష్ణానదీగర్భంలో శాశ్వతంగా చేరు కున్న మా తమ్ముని ఉదంతం జ్ఞాపకం రాకమానదు; దానితో ప్రేమ

సుకుమారాలు మూర్తీభవించిన ఆ తపోనిష్ఠామూర్తి 'అనంతబువా' దర్శనంకూడా కాకుండా ఉండదు.

**7**

అది 1929 వ సంవత్సరం! ఒక ఏడాదిలో స్వరాజ్యం సంపాదించాలని భారతదేశం ప్రతిజ్ఞ చేసింది. హిందువులు ముస్లిములు ఏకమైనారు. దేవతా సమానులై ముప్పయి మూడుకోట్లమంది భారతీయులు ఏకముఖంగా ఆలోచించసాగారు. స్వరాజ్యఋషి లోకమాన్యతిలకు స్మృత్యర్థం 'తిలకు స్వరాజ్య నిధి'కి ఒక కోటిరూపాయలు ప్రోగుచేయాలి. జాతీయ సంస్థకోసం పనిచేసే సభ్యులు కోటిమంది కావాలి. గోవర్ధనోద్ధారి శ్రీకృష్ణుని సుదర్శనచక్ర సమానమైన రాట్నచక్రం యీ ధర్మభూమిలో ఇంటింటా తిరగాలి. ఇందుకోసం విజయవాడలో భారతీయులంతా కలిసారు. శ్రీ అబ్బాస్‌సాహేబ్, పుణతాంబేకర్, గిద్వానీ, నేనూ అంతా ఒక్కసారే విజయవాడ చేరుకున్నాము. ఈ శుభసమయంలో కృష్ణాంబిక విరాట్దర్శనం చేసే అదృష్టం కలిగింది. 'వాయి' లో నేను కృష్ణఒడ్డున కూర్చుని సంధ్యావందనం చేసుకుని న్యాయనిష్ఠుడైన రామశాస్త్రి రాజకార్య నిపుణుడైన నానాఫడ్న వీసును గూర్చిన సంగతులు ఆలోచించేవాడిని.ఆ చిన్నారి కృష్ణను ఇక్కడ ఇంత పెద్దరూపంలో చూసి నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను. మహుతీ వద్దనున్న చిన్నపాయ ఎక్కడ–ఐరోపా అమెరికాలను జోడించే కేబులు త్రాడులాటి యీ నది ఎక్కడ? స్నానంచేయటానికి జనం అసంఖ్యాకంగా వచ్చారు. మనదేశం అన్ని మూలల నుంచి జనం వచ్చి ఆంధ్రసోదరులతో కలిసిమెలిసి తిరిగారు. సర్వత్రా రాష్ట్రభాష హిందీ వినపడ సాగింది. వేణ్యా, వారణా, కోయనా, భీమా, తుంగభద్ర వచ్చి కృష్ణానదిలో కలిసినట్లు, మారుమూల గ్రామాలనుంచి వచ్చిన ప్రజలు విజయవాడలో కలిసి పోయారు. అందరితో కలిసి రోజూ కృష్ణలో స్నానంచేసే అవకాశం లభించినది. జన్మకాలక్షీరం ప్రసాదించిన కృష్ణానది స్వరాజ్యకాంక్షి, జాతిపిత మహాత్మాగాంధీ దర్శనంకూడా చేయించింది. జయకృష్ణా! నీకు జయమగుగాక! భారతవర్షం ఏక మగుగాక! స్వతంత్రమగుగాక! జూలై, 1929.

యత్పూర్శ పుణ్యోౖౖ హరహరః ప్రవృద్ధం
పాపం జనానాం మిధునోతి వాయుః
ధ్వాంతం యథార్కో జగతాం వివృద్ధ
స్తాం విస్తరాత్ వర్ణయికం ఈశః
నైత చ్ఛిత్ర మితి ప్రచుః
త్వత్త్వజ్ఞా స్తు మహర్షయః
కృష్ణం చ కృష్ణవేణీం చ
శితానాం కిన్ను దుర్లభమ్
జపో దానం తపో హోమ
శ్రాద్ధం సద్గురు సేవనం
అక్షయంతు భవే దత్ర
పాపం చాపి వినశ్యతి"

శ్రీ కేకలతూరి కృష్ణయ్య

# కృష్ణవేణి పరవళ్ళు

కృష్ణానది నీరు నీలిరంగులో తేటగా కనపడుతుండడం వలన, ఆ నీలం రంగు శ్రీకృష్ణుని శరీర వర్ణం కాబట్టి కృష్ణానదికి కృష్ణవేణిగా పేరు వచ్చింది.

ఈ నది గంగా, గోదావరి, బ్రహ్మపుత్ర నదుల తరువాత మేటి ప్రవాహము, పరివాహక ప్రాంతంతో పోల్చితే, నాల్గవ పెద్ద నది. ఇది మహారాష్ట్ర, కర్నాటక, తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో పెద్ద నీటి వనరు.

## కృష్ణమ్మ పుట్టుక - సముద్రునితో సంగమం

మహారాష్ట్రలోని సతారా జిల్లాలో నెలకొని ఉన్న సహ్యాద్రి పర్వత శ్రేణుల్లోని మహాబలేశ్వరం దగ్గరలో ఉన్న నిద్రపుకొండల క్రింది భాగంలో ... సముద్రమట్టానికి 4,383 అడుగుల ఎత్తున అతి పురాతన మైన మహదేవుని ఆలయం ఉంది. ఈ ఆలయం దగ్గర గోముఖ ఆకారంలో ఉన్న సొరంగమే కృష్ణమ్మ పుట్టినిల్లు. ఈ ఎత్తైన శిఖరాల నుంచి వాటిల్లో ఉన్న లోయలోనుంచి పడుతూ, లేస్తూ, గెంతుతూ, త్రుళ్ళుతూ ప్రవహించిన కృష్ణమ్మతో 'వేణజ్' ప్రవాహం చెలిమి చేసి చెట్టాపట్టాలేసుకొని 'కృష్ణమ్మ'గా రూపుదాల్చింది.

మహారాష్ట్ర నుండి దక్షిణదిశగా పయనించి 306 కి.మీ.ల తరువాత కర్ణాటకలోని బెల్గాం జిల్లా ఐనాపూర్‌ను పావనం చేసింది. ఇక్కడ 482 కి.మీ. దూరాన్ని పవిత్రం చేసి తెలంగాణా... మహబూబ్ నగర్ జిల్లాలో వెలసిన ఆలంపూర్ క్షేత్రానికి సమీపంలో ఉన్న కృష్ణ అనే పల్లె ప్రాంతాన్ని పలకరించి ముందుకుసాగి ఆంధ్రప్రదేశ్... కర్నూలు జిల్లా శ్రీశైలంతో కబుర్లు చెప్పి, నల్గొండజిల్లా నాగార్జునసాగర్ కష్ట సుఖాలు పంచుకొని, గుంటూరుజిల్లా అమరావతి ప్రాశస్త్యాన్ని పొగిడి, కృష్ణాజిల్లా విజయవాడను కరుణించి, పులిగడ్డ చేరి, ఆపై రెండు పాయలుగా చీలిపోయింది. తూర్పు పాయ కృష్ణా నాగేశ్వర క్షేత్రంగా ప్రసిద్ధిచెందిన పెదకళ్ళేపల్లిని దాటి దివిసీమలో హంసలదీవి వద్ద సముద్రునితో సంగమించింది. తెలంగాణా, ఆంధ్రప్రదేశ్‌లలో మొత్తం 612 కి.మీ.ల దూరం అలుపెరుగని ప్రయాణం చేసింది.

దక్షిణపాయ మరో మూడు పాయలుగా చీలింది. గుల్లల మోద, ఏలచెట్టు దుబ్బ, చేపలమండి అనే వేర్వేరు ప్రాంతాలలో ఇవి సముద్రంలో (బంగాళాఖాతం) సంగమిస్తున్నాయి. ఇలా మొత్తం మీద పుట్టినింటి నుంచి మెట్టినింటివరకూ కృష్ణమ్మ ప్రయాణాన్ని లెక్కకడితే 1400 కి.మీ. దూరం తేలుతుంది. కోయినా, మానేరు, పంచగంగ, ఘటప్రభ, మలప్రభ, భీమా, వరుణ, తుంగభద్ర అనే ఉపనదులతో భేదభావం లేకుండా కలసిపోతుంది నదీమతల్లి.

దూద్‌గంగ, దిండి పెద్దవాగు, హాలియా,పాలేరు ఇవేకాక యేరాల్, వార్నియా, ఇడ్‌గామ్ వంటి చిన్న చితకా నదులు ఎన్నో కలుస్తుంటాయి. కృష్ణానదికి ఆఖరునది, ముఖ్యమైన ఉపనది మూసీ నది. దీని తీరంలోనే భాగ్యనగరం (హైదరాబాద్) నిర్మింపబడినది.

## పుష్కర వైశిష్ట్యం

కృష్ణానదీ పుష్కరాలు ఇటీవల 2004 సంవత్సరంలో జరిగినవి. పుష్కరం (12 ఏళ్ళు) తరువాత 2016 ఆగస్టు 12 నుంచి 23 వరకు జరుగుతున్నాయి. నవగ్రహములలో అధిక శుభుడు గురుడు. అంతరిక్షమున పండ్రెండు నక్షత్ర రాశులు కలవు. అవి మేషము మొదలు మీనము వరకు ఉండును. గురుడు ఒక్కో రాశిలో ఒక్కొక్క సంవత్సరం చొప్పున మొత్తం పన్నెండు రాశులలోనూ పండ్రెండు సంవత్సరాలపాటు సంచరించి ఒక ఆవృత్తిని పూర్తిచేయును.

భారతదేశమునందు ప్రసిద్ధములగు నదులు పండ్రెండు. అవి. 1. గంగ 2. నర్మద 3. సరస్వతి 4. యమున 5. గోదావరి 6. కృష్ణవేణి 7. కావేరి 8. తామ్రపర్ణి 9. భీమ 10. తుంగభద్ర 11. సింధువు 12. రేవ అనునవి.

1. గురుడు మేషరాశిలో ప్రవేశించినపుడు గంగా పుష్కరములు
2. వృషభరాశిలోకి నర్మదా పుష్కరము
3. మిధునరాశిలోకి సరస్వతీ పుష్కరము
4. కర్కాటములో యమునా పుష్కరము

5. సింహములో గోదావరి పుష్కరము
6. కన్యలో కృష్ణా పుష్కరము
7. తులలో కావేరి పుష్కరము
8. వృశ్చికములో తామ్రపర్ణీ పుష్కరము
9. ధనూరాశిలో భీమా పుష్కరము
10. మకరములో తుంగభద్రా పుష్కరము
11. కుంభములో సింధు పుష్కరము
12. మీనములో రేవా పుష్కరము

పుష్కరుడు బృహస్పతితో కలసి ఏ నదిలో ప్రవేశిస్తాడో ఆ నది పుట్టినచోటు నుంచి సముద్రములో కలిసేటంత మేరా కూడా అపూర్వమైన మహిమతో ఒప్పుతూ ఉంటుంది.

విశాల భారతదేశంలో నలుమూలలా ఉన్న నదులన్నింటికి ఒక్కొక్క నదికి ఒక్కొక్క సంవత్సరం పుష్కరకాలమని నిర్ణయించి, ఆ నదిలో పుష్కర కాలంలో ఆ నదీతీరం వారే కాకుండా, మిగిలిన దేశంలోని ప్రజలందరూ స్నాన, దాన, పిండ ప్రదానాలను ఆచరిస్తే, అనంతపుణ్యం ప్రాప్తిస్తుందనీ, పితృదేవతలు ప్రసన్నులవుతారనీ చెప్పి, దేశానికి ఐకమత్యం సాధించింది వైదిక ధర్మం. అన్ని నదుల తీరాన ఎన్నో పవిత్రమైన తీర్థాలు, క్షేత్రాలు, దేవాలయాలు ఉన్నాయి.

## కృష్ణవేణి ప్రవాహము - దాని ఉపనదులు

వర్షాకాలంలో చాలా ఉధృతంగా ప్రవహించి, అక్కడక్కడా భూమిని కోతలకి గురిచేస్తుంటుంది కృష్ణమ్మ. కానీ మహారాష్ట్రలో దీనిని ప్రశాంతంగా ప్రవహించే నది అంటారు. ఒక్కొక్కప్పుడు 75 అడుగుల లోతులో కూడా ప్రవహిస్తుంది.

తుంగభద్రానది 71,417 చ.కి.మీ. పరివాహక ప్రాంతం కలిగి, 531 కి.మీ.ల దూరం ప్రవహించి కృష్ణానదిలో కలుస్తుంది. భీమా నది 70,614 చ.కి.మీ. పరివాహక ప్రాంతం కలిగి, 861 కి.మీ. దూరం ప్రవహించి కృష్ణానదిలో కలుస్తుంది. మరియు వెన్న, ఉర్మోడి, తర్లి, కోయ్‌నా అనే నాలుగు నదులు కూడా సతారా జిల్లాలో ప్రీతి సంఘం (Lover's Meeting point) అనే ప్రదేశంలో కృష్ణానదిలో కలుస్తాయి.

ఇంకో మూడు నదులు సంగ్లి వద్ద కృష్ణాజిల్లాలో కలుస్తాయి. ఈ ప్రదేశాలను చాలా పవిత్రమైనవిగా భావిస్తారు. అక్కడి ఔదుంబర్ అనేచోట కృష్ణానదీ ఒడ్డున భగవాన్ దత్తాత్రేయుడు కొలువై ఉన్నట్లు చెబుతారు. కర్నూలు జిల్లాలో తుంగభద్ర, భావనాశి నదులు కృష్ణలో కలిసే చోటు సంగమేశ్వరం. ఇక్కడే ప్రసిద్ధమైన సంగమేశ్వర ఆలయం ఉంది. శ్రీశైలం దగ్గర కృష్ణానదికి ఆనకట్ట కట్టినందున, వర్షాకాలంలో ఈ గుడి నీట మునిగిపోతుంది. వేసవిలో నీరు తగ్గిన తర్వాత తిరిగి బయటపడుతుంది.

## కృష్ణానదిలో కలిసే ఉపనదులు, భౌగోళిక వివరాలు

| క్ర.సం. | నదిపేరు | కలిసే ప్రదేశం | జిల్లా | రాష్ట్రం | ఎటువైపు | నిర్మించినఆనకట్ట |
|---|---|---|---|---|---|---|
| 1. | వెన్న | సంఘం మౌలి | సతారా | మహారాష్ట్ర | కుడి | |
| 2. | ఉర్మోడి | కాశిల్ | సతారా | మహారాష్ట్ర | కుడి | |
| 3. | తరలి/కాళిగంగ | ఉమ్‌బ్రాజ్ | సతారా | మహారాష్ట్ర | కుడి | |
| 4. | మండ్ | ఉమ్‌బ్రాజ్ | సతారా | మహారాష్ట్ర | కుడి | |
| 5. | కొలంబ | తసవాడే | సతారా | మహారాష్ట్ర | ఎడమ | |
| 6. | కోయ్‌నా | కరాడ్ | సతారా | మహారాష్ట్ర | కుడి | |
| 7. | యేర్లా | బ్రహ్మనాల్ | సాంగ్లి | మహారాష్ట్ర | ఎడమ | |
| 8. | వార్న | హరిపూర్ | సాంగ్లి | మహారాష్ట్ర | కుడి | |
| 9. | పంచగంగ | నర్సోబావాడి | సాంగ్లి | మహారాష్ట్ర | కుడి | |
| 10. | దూద్‌గంగ | యదూర్ | బెల్గాం | కర్నాటక | కుడి | హిప్పగిరి |
| 11. | ఘటప్రభ | ఆల్మట్టి | భాగల్‌కోట్ | కర్నాటక | కుడి | ఆల్మట్టి |
| 12. | మలప్రభ | కుడలసంఘం | భాగల్‌కోట్ | కర్నాటక | కుడి | బసవసాగర్ |

## కృష్ణవేణి పరవళ్ళు

| క్ర.సం. | నదిపేరు | కలిసే ప్రదేశం | జిల్లా | రాష్ట్రం | ఎటువైపు | నిర్మించినఆనకట్ట |
|---|---|---|---|---|---|---|
| 13. | దోని | అమ్మాపూర్ | కల్బుర్గి | కర్నాటక | ఎడమ | |
| 14. | భీమ | కొడలూరు | రాయచూరు | కర్నాటక | ఎడమ | జురాల, లోయర్ జూరాల |
| 15. | తుంగభద్ర | ఆలంపూర్ | మహబూబ్‌నగర్ | తెలంగాణ | కుడి | శ్రీశైలం |
| 16. | దిండి | నల్గొండ | నల్గొండ | తెలంగాణ | ఎడమ | నాగార్జున సాగర్ |
| 17. | హాలియా | చిట్యాల | నల్గొండ | తెలంగాణ | ఎడమ | నాగార్జున సాగర్ టెయిల్ పాండ్ |
| 18. | మూసి | వజీరాబాద్ | నల్గొండ | తెలంగాణ | ఎడమ | పులిచింతల |
| 19. | పాలేరు | ముక్త్యేశ్వర పురం | కృష్ణా | ఆంధ్ర ప్రదేశ్ | ఎడమ | |
| 20. | మున్నేరు ఇబ్రహీంపట్నం | అమరావతి కృష్ణా | గుంటూరు | ఆంధ్ర ప్రదేశ్ | ఎడమ కుడి కాలువ | పోలవరం |
| 21. | కొండవీటి వాగు | ఇబ్రహీంపట్నం | కృష్ణా | ఆంధ్ర ప్రదేశ్ | ఎడమ ముంపు కాలువ | బుడమేరు |
| 22. | అమరావతి పట్టణం | విజయవాడ పట్టణం | | | | ప్రకాశం బ్యారేజ్ |

### కృష్ణా పరీవాహక ప్రాంతంలో పారుదల వివరములు

1. భీమా ఎగువ ప్రాంతం - 17.58 శాతం
2. భీమా దిగువ ప్రాంతం - 9.29 శాతం
3. కృష్ణా ఎగువ ప్రాంతం - 21.39 శాతం
4. కృష్ణా మధ్య ప్రాంతం - 8.73 శాతం
5. కృష్ణా దిగువ ప్రాంతం - 15.50 శాతం
6. తుంగభద్ర ఎగువ ప్రాంతం - 11.20 శాతం
7. తుంగభద్ర దిగువ ప్రాంతం - 16.31 శాతం

కృష్ణా పరీవాహక పరిధి పెరిగిన మొత్తం ప్రాంతం 2,58,948 చ.కి.మీ. ఇది మనదేశ భౌగోళిక ప్రాంతతో పోల్చితే 8 శాతం. కర్నాటకలోని పరీవాహక ప్రాంతం 1,13,271 చ.కి.మీ. తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ కలిపి 76,252 చ.కి.మీ. మహారాష్ట్రలో 69,425 చ.కి.మీ.

కృష్ణానది పడుమటి కనుమల్లో సముద్రమట్టానికి 1337 మీటర్ల ఎత్తులో మహాబలేశ్వరానికి ఉత్తరదిశలో అరేబియా సముద్రానికి 64 కి.మీ. దూరంలో జన్మించింది. మొత్తం 1400 కి.మీ. ప్రయాణించి బంగాళాఖాతంలో కలుస్తుంది. దీనికి ఘటప్రభ, మలప్రభ, భీమ, తుంగభద్ర, మూసీ నదులు ముఖ్యమైన ఉపనదులు.

కృష్ణా పరీవాహక ప్రాంతం ఉపరితల సరాసరి నీటి సామర్థ్యం 78.1 ఘ.కి.మీ. గా అంచనా వేశారు. అందులో 58.0 ఘ.కి.మీ. నీరు ఉపయోగపడుతున్నది. ఈ పరీవాహక ప్రాంతంలో ఉపయోగ కరమైన ప్రాంతం సుమారు 2,03,000 చ.కి.మీ. ఇది మనదేశం

మొత్తంమీద ఉపయోగపడే ప్రాంతంలో 10.4% మాత్రమే. ఇప్పుడు కృష్ణానది నీరు మన అవసరాలకు సరిపోవడం లేదు. కాబట్టి గోదావరి నదికి సంబంధించిన పోలవరం కుడి కాలవనుండి పట్టిసీమ నుండి ఎత్తిపోతల పథకం ప్రారంభించి ఆ నీటిని 2015లో కృష్ణానదికి అనుసంధానించారు. ఆ నీటిని ప్రకాశం బ్యారేజి ద్వారా ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ పనులకు ఉపయోగించుచున్నారు.

కృష్ణానదీ పరీవాహక ప్రాంతంలో కర్నాటకలో ముల్లయానగిరి శిఖరం సముద్రమట్టమునకు 1,930 మీటర్ల ఎత్తైన ప్రదేశం.

## ఆలయాలు, పుణ్యక్షేత్రాలు

కృష్ణానదిని హిందువులు చాలా పవిత్రంగా భావిస్తారు. కృష్ణలో స్నానం చేస్తే పాప పరిహారమవుతుందని విశ్వసిస్తారు. ఈ నది పొడవునా ఆలయ క్షేత్రాలున్నాయి. కృష్ణానది ఒడ్డున ఉన్న మొట్టమొదటి పవిత్ర క్షేత్రం "దక్షిణ కాశి వాయ్"గా పిలవబడే మహాగణపతి మందిరం మరియు కాశీవిశ్వేశ్వరఆలయం. ఇక్కడ నదికి ఏడు ఘట్టాలు ఉన్నాయి. మహారాష్ట్ర ప్రజలు ఎంతో పవిత్రంగా భావించే ఆలయాలు ముఖ్యంగా శ్రీ దత్తాత్రేయ ఆలయాలు కృష్ణానది ఒడ్డున ఎన్నో ఉన్నాయి. సాంగ్లి సమీపంలోని నృసింహ వాడి, ఔదుంబర్ వంటివి ప్రముఖమైనవి. ఈ నదీ తీరంలో సాంగ్లి సమీపంలోని రామలింగ ఆలయం, హరిపూర్‌లో సంగమేశ్వర శివాలయం, విజయవాడలో కనకదుర్గ ఆలయం, శ్రీశైలంలోని మల్లికార్జున ఆలయం, అమరావతిలోని అమరేశ్వరాలయం, దత్తదేవాలయం, ఆలంపూర్‌లో సంగమేశ్వరాలయం, రామలింగేశ్వరాలయం ఉన్నవి.

## సమృద్ధిగా వృక్షజాలం - జంతుజాలం

విశాలమైన కృష్ణానదీ పరీవాహక ప్రాంతంలో వృక్షజాలమూ, జంతుజాలమూ ఉన్నాయి. కృష్ణానదీ ముఖద్వారంలో ఉన్న మడ అడవులను కృష్ణా క్రూర జంతువుల వనంగా ప్రకటించారు. ఈ ప్రదేశం పెద్ద సంఖ్యలో ఉన్న పక్షులకు, వలస పక్షులకు నిలయమై ఉన్నది. అనేక ఇతర చిన్న చిన్న జంతువులు, పాములు, మొసళ్ళు, దుప్పి, నక్కలు వంటి జంతువులకు నెలవై ఉన్నది. గొప్ప జాతుల వృక్ష సంపద ఉంది.

## క్రూర జంతువులకు అభయారణ్యాలు ప్రకటించిన కొన్ని ప్రాంతాలు :

1. నాగార్జునసాగర్ - శ్రీశైలం పులుల సంరక్షక ప్రాంతం
2. రోళ్ళపాడు క్రూర జంతువుల సంరక్షక కేంద్రం
3. భద్ర క్రూర జంతువుల సంరక్షక కేంద్రం
4. ఘటప్రభ క్రూర జంతువుల సంరక్షక కేంద్రం
5. గుదవి క్రూర జంతువుల సంరక్షక కేంద్రం
6. కోయ్‌నా క్రూర జంతువుల సంరక్షక కేంద్రం
7. రాధానగిరి క్రూర జంతువుల సంరక్షక కేంద్రం
8. గ్రేట్ ఇండియన్ బట్టమేక / బట్టబాతు సంరక్షక కేంద్రం
9. ఛందోలి నేషనల్ పార్కు
10. ఖుద్రేముఖ్ నేషనల్ పార్కు
11. మహావీర్ హరిణ వనస్థలి నేషనల్ పార్కు
12. మృగవాణి నేషనల్ పార్కు
13. పఖ్ఖల్ క్రూర జంతువుల సంరక్షక కేంద్రం
14. రానెబెన్నూరు నల్లబాతు సంరక్షక కేంద్రం
15. షెట్టిహళ్ళి క్రూర జంతువుల సంరక్షక కేంద్రం
16. దారోజి స్లాత్ ఎలుగుబంటి సంరక్షక కేంద్రం, బళ్ళారి.

## నదీ ప్రవాహంలో జలపాతాలు

మాణిక్యధార జలపాతం కర్నాటకలోని చిక్‌మగుళూరు తాలూకాలో ఉంది. ఇది హిమాలయాలకు, నీలగిరి పర్వతాలకు మధ్యలో ఉన్న ఎత్తైన ముల్లయానగిరి పర్వతం నుంచి జాలువారుతోంది. బర్కానా జలపాతం మనదేశంలో రెండవ పెద్ద వర్షపాతం నమోదయ్యే ఆగుంబె కొండలనుంచి జాలువారుతుంది.

## ఇతర ముఖ్యమైన జలపాతాలు :

1. ఎత్తిపోతల 2. గోడ్చినమలకి 3. గోకక్ 4. కునె 5. మల్లెల తీర్థం 7. కల్హట్టి 7. సిరిమానె

## కృష్ణానదిపై కట్టిన కొన్ని ప్రసిద్ధ వంతెనలు

**1. కృష్ణావంతెన :** ఈ వంతెన మహారాష్ట్రలోని వాయ్ పట్టణ ప్రాంతంలో ధర్మపురి పేట వద్ద ఉంది. ఇది బ్రిటీష్ పాలకులు నిర్మించిన పురాతన వంతెన. దీనికి నల్లరాతితో కట్టిన తొమ్మిది కమాన్లు ఉన్నవి. నదిలోని నీరు ఈ వంతెనపై రోడ్డు మీదకి వస్తే, అది వరదముప్పుగా వాయ్‌కర్ వాసులు భావిస్తారు.

**2. ఇర్విన్ వంతెన, సాంగ్లి :** ఇది బ్రిటిషు కాలంలో నిర్మించబడిన చారిత్రాత్మకమైన పెద్ద పాత వంతెన, దీనిని ఎరుపురంగు రాయితో నిర్మించారు. నీటిని చూడడానికి వంతెన మధ్యలో క్రిందకి దిగడానికి దారి ఏర్పరచబడింది.

**3. బి.సౌందట్టి వంతెన, రాయ్‌బాగ్ :** ఇదికూడా చాలా పాత వంతెన. ఇది మహారాష్ట్ర, కర్నాటకలను కలుపుతుంది.

**4. తంగడగి వంతెన :** ఇదికూడా పురాతన వంతెన. ఇది కర్నాటకలోని బీజాపూర్, భాగల్‌కోట్ జిల్లాలను కలుపుతుంది. ఇక్కడ నీలాంబరి దేవాలయం ఉన్నది.

## కృష్ణానదీ పరీవాహక ప్రాంతంలో లభించే ఖనిజాలు

కృష్ణానది పరీవాహక ప్రాంతంలో పలు ఖనిజాలు లభిస్తాయి.

1. కృష్ణా గోదావరి ప్రాంతం - చమురు, సహజవాయువుల నిక్షేపాలు
2. మెల్లందు - బొగ్గు
3. బయ్యారం గనులు - ఇనుము
4. ఖుద్రేముఖ్ - ఇనుము
5. దోనిమలై - ఇనుము
6. జగ్గయ్యపేట గనులు - డోలోమైట్
7. నల్గొండ - యురేనియం నిల్వలు
8. కొల్లూరు గనులు - వజ్రాలు
9. హట్టి గనులు - బంగారం.

### కృష్ణానదిపై ఆనకట్టలు

1. దోమ్ ఆనకట్ట 2. హిప్పగిరి ఆనకట్ట 3. అల్మట్టి ఆనకట్ట 4. నారాయణపూర్ ఆనకట్ట 5. శ్రీశైలం ఆనకట్ట 6. జూరాల ఆనకట్ట 7. నాగార్జున సాగర్ ఆనకట్ట 8. నాగార్జునసాగర్ టెయిల్ పాండ్ 9. పులిచింతల ఆనకట్ట 10. ప్రకాశం బ్యారేజ్ 11. అమర్ ఆనకట్ట 12. కనూర్ ఆనకట్ట 13. పులిచింతల ఆనకట్ట

### కృష్ణానదిపై ఉన్న జలవిద్యుత్ కేంద్రాలు

కృష్ణానది నీటితో ఎక్కువ జలవిద్యుత్ ఉత్పత్తి చేస్తారు. అందులో కొన్నిటి వివరాలు దిగువన ఇవ్వబడ్డాయి.

| క్ర.సం | విద్యుత్ కేంద్రం పేరు | విద్యుదుత్పత్తి |
|---|---|---|
| 1. | కోయ్‌నా జలవిద్యుత్ కేంద్రం | 1920 మెగావాట్లు (MW) |
| 2. | ముల్షి ఆనకట్ట | 300 మెగావాట్లు (MW) |
| 3. | తోకర్‌వాడి ఆనకట్ట | 72 మెగావాట్లు (MW) |
| 4. | ఉజ్జని ఆనకట్ట | 12 మెగావాట్లు (MW) |
| 5. | అల్మట్టి ఆనకట్ట | 290 మెగావాట్లు (MW) |
| 6. | భద్ర ఆనకట్ట | 39 మెగావాట్లు (MW) |
| 7. | తుంగభద్ర ఆనకట్ట | 127 మెగావాట్లు (MW) |
| 8. | జూరాల జలవిద్యుత్ కేంద్రం | 240 మెగావాట్లు (MW) |
| 9. | దిగువ జూరాల ప్రాజెక్టు | 240 మెగావాట్లు (MW) |
| 10. | శ్రీశైలం ఆనకట్ట | 1670 మెగావాట్లు (MW) |
| 11. | నాగార్జునసాగర్ ఆనకట్ట | 960 మెగావాట్లు (MW) |
| 12. | నాగార్జునసాగర్ టెయిల్ పాండ్ | 50 మెగావాట్లు (MW) |
| 13. | పులిచింతల ఆనకట్ట | 120 మెగావాట్లు (MW) |

### కృష్ణానది పరివాహక ప్రాంతంలోని బొగ్గు ఆధారిత విద్యుత్ కేంద్రాలు

| క్ర.సం | విద్యుత్ కేంద్రం పేరు | విద్యుదుత్పత్తి |
|---|---|---|
| 1. | విజయవాడ థర్మల్ విద్యుత్ కేంద్రం | 1760 మెగావాట్లు (MW) |
| 2. | రాయ్‌చూర్ థర్మల్ విద్యుత్ కేంద్రం | 1470 మెగావాట్లు (MW) |
| 3. | బళ్ళారి థర్మల్ విద్యుత్ కేంద్రం | 1700 మెగావాట్లు (MW) |
| 4. | యర్మాస్ థర్మల్ విద్యుత్ కేంద్రం | 1600 మెగావాట్లు (MW) |
| 5. | సోలాపూర్ థర్మల్ విద్యుత్ కేంద్రం | 1320 మెగావాట్లు (MW) |
| 6. | కుడ్గి సూపర్ థర్మల్ విద్యుత్ కేంద్రం | 2400 మెగావాట్లు (MW) |
| 7. | యాదాద్రి సూపర్ థర్మల్ విద్యుత్ కేంద్రం | 7500 మెగావాట్లు (MW) |

## కృష్ణానది వరదలు

అక్టోబరు 2009లో వచ్చిన వరదలు దాదాపు 350 గ్రామాలకు బయటి ప్రపంచంతో సంబంధాలు లేకుండా చేశాయి. కొన్ని లక్షల మందిని నిరాశ్రయులుగా చేశాయి. ఇటువంటి వరదలు గత వెయ్యి సంవత్సరాలలో ఎన్నడూ రాలేదని తెలిసింది. ఈ వరదలు కర్నూలు, మహబూబ్‌నగర్, గుంటూరు, కృష్ణా, నల్గొండ జిల్లాలకు బాగా నష్టం కలిగించాయి. కర్నూలు పట్టణం దాదాపు మూడు రోజులపాటు సుమారు పది అడుగుల నీటిలో ఉంది.

ప్రకాశం బ్యారేజి వద్ద నీటి ప్రవాహాన్ని 1,110,000 ఘనపు టడుగులుగా నమోదుచేశారు. 1903లో వచ్చిన వరదలకు నీటి ప్రవాహం 1,08,000 ఘనపుటడుగులు మాత్రమే.

## కృష్ణానది - కాలుష్యం, ఇతర సమస్యలు

అనేక కారణాలవల్ల ప్రస్తుతం కృష్ణానది క్షీణిస్తోంది. ఇటీవలి కాలంలో, వ్యవసాయానికి నీటిని అధికంగా వినియోగించుకోవడంతో నదీ జలాలు సముద్రంలో కలవలేకపోతున్నాయి. అనేక నగరాలలోని వ్యర్థాలు నదీ జలాలలో కలిసిపోయి నదీ పరివాహక ప్రాంతమంతా కాలుష్యంతో నిండిపోతోంది. పర్యావరణపరంగా నదికి మేలు చేసే విధంగా సగటు పరిమాణంలోనైనా నదీ జలాలు సముద్రంలో కలవడం లేదు. ఫలితంగా నదీ ప్రవాహం ఉప్పు నిల్వలను సముద్రంలోకి తీసుకుపోలేక, పరీవాహక ప్రాంతంలోని దిగువ ప్రాంతాల నేలలలో క్షారత్వం పెరిగి వాటి సామర్థ్యం తగ్గిపోతోంది. ఇవే కాకుండా బొగ్గు ఆధారిత విద్యుత్ కేంద్రాలు విసర్జించే బూడిద వల్ల నదీజలంలో క్షారత్వం పెరిగిపోయి, అగ్గిరాయి నిక్షేపాలు ఏర్పడి నదీ ప్రవాహం పరిధి తగ్గిపోతోంది.

ఇందుకు విరుగుడుగా ప్రభుత్వం వాగు అవసరమైన చర్యలు చేపట్టాలి. ప్రజలు నదిని కలుషితం చేయకుండా జాగ్రత్త వహించాలి.

కొన్ని లక్షల ఎకరాలను సస్యశ్యామలం చేస్తూ, ఎందరో మనుషులకు, ఎన్నో ఇతర ప్రాణులకు జీవనాధారమైన కృష్ణానదిని కాపాడుకోవాలి.

"శ్రీ కృష్ణవేణీ ప్లవనాయ భూమౌ
వాంఛంతి దేవా ఖలుమర్త్యజన్మ
తస్యాః ప్రభావం సకల ప్రవక్తుం
శివో హరిర్వా బ్జభవో న శక్తః
సభాగ్యాస్తే గరా లోకే
తే చ దేశా శ్శుభోదయాః
తా న్యేవ పుణ్యక్షేత్రాణి
యత్ర కృష్ణా మహిష్యతి"

చిరునామా : కేకలతూరి కృష్ణయ్య, 8-3-678/46, ప్రగతి నగర్, యూసఫ్‌గూడ, హైదరాబాద్ - 500 045.
ఫోన్ : 040-23747172, సెల్ : 9394033678

డా॥ భువనచంద్ర

# కృష్ణవేణి అలల గీతాలు

1. పదహారు కళలతో
పరువులెత్తే కృష్ణ
పరువులెడుతూ పల్లె
పాట పాడే కృష్ణ

2. పడుచు గాలులతోటి
పలుకులాడే కృష్ణ
వొంపు వొంపున చిలిపి
హొయల నొలికే కృష్ణ

3. దుర్గమ్మ పదములకు
పసుపునిచ్చే కృష్ణ
మల్లన్న శ్రీమతికి
మల్లెలిచ్చే కృష్ణ

4. కార్మికుల కష్టాన్ని
తుడిచిపెట్టే కృష్ణ
అన్నదాతకు సిరుల
విరులనిచ్చే కృష్ణ

5. జలకమాడే యువతి
జడను లాగే కృష్ణ
మునకలేసే చెలిని
ముద్దులాడే కృష్ణ

6. పొరలి పోయే కృష్ణ
చిరువాన చినుకులకు
పరవశించే కృష్ణ
జడివానతో పొంగి

7. దేవతల శిరసుపై
నాట్యమాడే కృష్ణ
తపియించు మనసులను
చల్లబరిచే కృష్ణ

8. వీరులకు తిలకాన్ని
దిద్దిపంపే కృష్ణ
వీరమాతల బొట్టు
చెరగనివ్వని కృష్ణ

9. స్వాతంత్ర్యయోధులకు
జన్మనిచ్చిన కృష్ణ
కవిగాయకుల ఎదలో
నడయాడునది కృష్ణ

10. సద్గురువు లెందరినొ
అందించినది కృష్ణ
ఆనంద కెరటాల
తేలించినది కృష్ణ

11. వెండితెరపై వన్నె
చిన్నె లోలికిన కృష్ణ
వెండితెర వెలుగులను
అందించినది కృష్ణ

12. శరణన్న వారలను
కరుణ జూచే కృష్ణ
ముష్కరుల తుష్కరుల
ముంచి వేసిన కృష్ణ

13. మన్మథుడి విల్లుకై
చెరకునిచ్చిన కృష్ణ
ప్రణయ కావ్యాలకే
స్ఫూర్తినిచ్చిన కృష్ణ

14. పసిబిడ్డలా జనుల
పలుకరించె కృష్ణ
ప్రౌఢలా మనసులను
మరపించునది కృష్ణ

15. సంగీత సాహిత్య
సమ్మేళనమె కృష్ణ
నాట్యశాస్త్రాలకే
తలమానికము కృష్ణ

16. విశ్వనాథులవారి
వేయిపడగల కృష్ణ
మల్లాది కథలుగా
మరులుగొల్పిన కృష్ణ

17. మువ్వగోపాలుడై
మురళినూదిన కృష్ణ
క్షేత్రయ్య గళములో
నడయాడినది కృష్ణ

18. ఇరువైపులా గుడుల
కొలువు దీరిన కృష్ణ
గుడిగంటలతో బాటు
రవళించునది కృష్ణ

19. బౌద్ధ భిక్షువులకూ
విడుదులిచ్చిన కృష్ణ
ఆర్య నాగార్జునుని
ఆదరించిన కృష్ణ

20. దర్గాలు చర్చిలతో
పులకించినది కృష్ణ
మతములన్నింటినీ
కలుపుకొన్నది కృష్ణ

21. ఎన్నెన్నో పత్రికల
పుట్టినిల్లీక్రిష్ణ
మహితాత్ములెందరికో
మెట్టినిల్లీ కృష్ణ

22. సిద్ధేంద్రునికి నాట్య
యోగమిచ్చిన కృష్ణ
నృత్య రాత్నావళిని
వెలయించినది కృష్ణ

23. గ్రంథాలయాలకై
నినదించినది కృష్ణ
సమరశంఖాలనే
పూరించినది కృష్ణ

24. విద్యాలయాలతో
వెల్లువెత్తిన కృష్ణ
వైజ్ఞానికుల తీర్చి
దిద్దినది మన కృష్ణ

25. పశువుల పక్షుల
తృష్ణ తీర్చే కృష్ణ
ప్రకృతిలో ప్రకృతై
పరిఢవిల్లే కృష్ణ

26. సకల సంపదలనూ
ప్రేమతో మనకిచ్చి
సాగరుని వొడిలోకి
సాగిపోయే కృష్ణ

27. నిస్వార్థ నాయకుల
నెలవు మన కృష్ణమ్మ
ఒకసారి స్మరియిస్తే
తరియించు నీ జన్మ

28. శతకోటి దండాలు
తల్లి కృష్ణమ్మా
నీ దీవెనలు తెలుగు
జాతికివ్వమ్మా !!!

# బిర బిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను

కృష్ణానదిని తలుచుకోగానే మనసు ఉప్పొంగిపోతుంది. ఎన్నెన్నో మధురమైన ఊహలు రెక్కలు విప్పుకొని అంబరాన్ని చుంబిస్తాయి. నేను పుట్టింది నూజివీడు తాలూకా గుళ్లపూడిలో. అది కృష్ణాజిల్లాలోని ఓ బుల్లి అందమైన గ్రామం. మా వూరిని ఆనుకుని ఉన్నది అమ్మలాంటి 'తమ్మిలేరు'. తమ్మిలేరుకి ఇవతలి ఒడ్డు కృష్ణాజిల్లా అయితే అవతలి ఒడ్డు పశ్చిమగోదావరి జిల్లా. అలా నేను ఇద్దరమ్మల ముద్దుబిడ్డ నయ్యాను. పుట్టింది గుళ్ళపూడి, పెరిగింది చింతలపూడి.

నాకు 'కృష్ణ' అంటే విశ్వనాథ్, కరుణశ్రీ, తెన్నేటి హేమలత, పెద్దిభొట్ల, కె.ఎల్‌రావుగారు. వీరందరినీ చూచే భాగ్యం కలిగింది. వారితో సంభాషించే అదృష్టమూ కలిగింది.

మిత్రులు జొన్నవిత్తుల రామలింగేశ్వరరావుగారూ, కీ॥శే॥ ఓంకార్, రచయిత శ్రీ లల్లాదేవి అందరం కలిసింది 'లత'గారి ఇంట్లోనే. నన్ను సినిమాలకెళ్ళమని ప్రోత్సహించిందీ లతమ్మే.

కృష్ణ ప్రవహించే దారుల్లో నేనూ పయనించాను. ఎందరెందరో రచయితలు, రచయిత్రులు, వ్యాపారవేత్తలు, విద్యావేత్తలు, సామాజిక సేవకులు, రాజకీయ నాయకులు... అందరినీ కలిపే పుణ్యనది కృష్ణవేణి. విజయవాడ వెడితే ఇప్పటికీ గంటలకి గంటలు గడుపుతూ కృష్ణమ్మని చూస్తూ... కృష్ణమ్మతో వూసులాడుతూ... ఎంత చూసినా తనివి తీరదు. ఆ గాలులనెంత పీల్చినా ఆర్తి తీరదు. అది అమృత తుల్యమైన అమ్మమనసు లాంటిది. ఒక్కో తరంగమూ ఒక్కో తరమై యుగయుగాలుగా సాగిపోతూనే ఉంది. మానవజీవనసారం సంపూర్ణంగా తెలిసిన కృష్ణమ్మ మనసుకి ఓ నెచ్చెలి. మనిషికి దైవం. అక్షరాల కందని సౌందర్యం కృష్ణవేణిది. ఎందరు ఎన్నివిధాలుగా వర్ణించారో...! ఎన్నెన్ని పదాలతో కీర్తించారో! ఎందరెందరు ఆమె ఒడిలో 'సేద'దీరారో!

ఆ తల్లికి మనఃస్ఫూర్తిగా నమస్కరిస్తూ, చలనచిత్ర గీతాల్లో ఆ తల్లిని స్తుతించిన పదాల్ని చూద్దాం.

"బంగారు బొమ్మలు" చిత్రంలో అద్భుతమైన రాసిన పాట

**"నేనీదరినీ నువ్వాదరినీ**
**కృష్ణమ్మ కలిపింది ఇద్దరినీ"**

ఇద్దరు ప్రేమికులని కలిపిన కృష్ణమ్మ ఎంత ప్రేమమయి. ఒక పెద్దాయన యీ పాట విని, ముఖ్యంగా పల్లవి విని అద్భుతమైన అర్థం చెప్పేవారు.కృష్ణానది 'కాలా'నికి సంకేతమంట. ఎందుకంటే 'జీవ' నది గనక. అటు పరమాత్మ వుంటే ఇటు వుండేది ఆత్మట. అంటే, అటువైపు దేవుడు...ఇటువైపు జీవుడు. దేవుడినీ జీవుడినీ అంటే ఆత్మనీ పరమాత్మనీ కలిపే, లేక ఆత్మ పరమాత్మలో ఏకమయ్యే సంగమస్థానం 'కృష్ణ' అనేవారు. ముఖే ముఖే సరస్వతి. K.V మహదేవన్ స్వరపరచగా బాలు సుశీల పాడిన ఆ పాట కృష్ణమ్మ పరుగులిడుతున్నట్లు మన గుండెల్లో మారుమ్రోగుతూనే వుంటుంది.

ఒకరిని మహాకవి అంటాం, ఒకరిని 'యుగకర్త' అంటాం. ఇలా మన గౌరవాన్ని అనేక బిరుదులతో చాటుకుంటాము. మరి మన వేటూరి గారికి ఏ బిరుదునివ్వాలీ?బిరుదలకి అతీతుడాయన. కృష్ణానది ఎంత చల్లగా అందర్నీ కలుపుకుని ప్రవహిస్తుందో వేటూరి కలమ్మూ అంతే. కృష్ణాజిల్లాలో పుట్టారుగనక కృష్ణవేణి అంటే ఆయనకి ప్రాణం. ఆయన కృష్ణానది మీద రాసినన్ని పాటలు మరే రచయితా వ్రాయలేదు.

**ఇదే నా సమాధానం** చిత్రంలో ప॥ నేపాడనా నవరాగాల తెలుగు పాట అని పల్లవించి, చరణంలో

**"గోదారిగంగమ్మ తొలికోడలై**
**అలివేలి కృష్ణమ్మ మలికోడలై"** అంటారు.

రెండు జీవనదుల్ని కోడళ్ళను చేసిన ఘనత వేటూరిది.

అంతేకాదు 'పరదేశి' చిత్రంలో

**"తాజ్‌మహలే ప్రణయ జీవుల పావురం**
**కృష్ణవేణీ శిల్ప రమణీ నర్తనం"** అంటారు.

రెండుపంక్తులలో ఉత్తర దక్షిణాలకి ఉయ్యాలకట్టిన మహానుభావుడాయన.

**"నా వాలుజడ కృష్ణవేణి**
**నా పూలజడ వెన్నెల గోదారి"** (చిత్రం : అమెరికా అల్లుడు)

**"నాగార్జున కొండ కోనలో**
**నాట్యరాణి కృష్ణవేణి** (చిత్రం : సిరిసిరిమువ్వ ప॥ గజ్జ ఘల్లుమంటుంటే)

ఎంతటి భావుకత... ఎంతటి భావచిత్రం !

**"కదలైన కృష్ణమ్మ పొంగగా...**
**కదలేని మాగాణి పండగా"** అంటూ పల్నాటిసింహం చిత్రం, **"పాలుపొంగేగడ్డ పల్నాటిసీమనే"** పాటలో అణోరణీయాన్ మహీలో మహీయాన్ కృష్ణవేణమ్మని కడవలో నింపారు. కదలేని మాగాణిని పండించారు.

కృష్ణ, గోదావరులు ఆయనకి రెండు కళ్ళు. పక్షపాతం చూపలేదు.

**"మమతల మాగాణమే మసియైపోగా**
**తెలుగుతల్లి విలపించెను భోరుభోరున**
**సాగే కన్నీరే కృష్ణాగోదావరిలా....॥** అంటారు.

ఊరికి మొనగాడు చిత్రంలో "కదలిరండి మనుషులైతే" పాటలో అలాగే "సరిగమలు" చిత్రంలో **"గోదావరి పయ్యెద కృష్ణమ్మ నీ వాల్జడ"** అన్నా

'ముత్యమంతముద్దు' చిత్రంలో 'ప్రేమలేఖరాశా నీకందివుంటది' పాటలో "కృష్ణాగోదావరిలో ఏది బెస్టో చెప్పమంటా" అంటూ మనకి ఛాయిస్ ఇచ్చినా,

కృష్ణవేణి చిత్రంలో **"కృష్ణవేణి మా ఇంట అలివేణి"** అన్నా, అది వేటూరికే చెల్లింది. ఎందుకంటే ఆయన కలమే ఓ హలం.

ఒకసారి కవులందరూ సరదాగా శ్రీ కోదండపాణి ఆడియో వీడియోలో (SPKP రికార్డింగ్. థియేటర్ లేక SP బాలు గారి థియేటర్)లో కలిసినప్పుడు మళ్ళీ కృష్ణా, గోదావరుల ప్రసక్తి వచ్చింది. వేటూరిగారు అర్ధనిమీలిత నేత్రాలతో మాట్లాడుతూ...

**"నాసిరికా కొలను చిన్నది"** కావ్యంలో,

**"కలలన్ని అలలైన సిరికాకొలను రాణి**
**గలగలని నేడు సాగిన కృష్ణవేణి"** అన్నారు.

వరుసనే క్రింది పెండ్యాలవారలు. అందులోనే అలివేణి వ్యక్తిత్వాన్ని, ఔన్నత్యాన్ని వర్ణిస్తూ "కృష్ణా జలతరంగా నిర్నిద్రగాన పరితోషిత" అన్నారు. కృష్ణమ్మ మీద ఎంత ప్రేమో!

ఇక శంకరాభరణం సంగతి చెప్పఖ్ఖర్లేదు. 'రాగం...తానం...పల్లవి' పాట ప్రజల హృదయాల్లో మారుమ్రోగిపోయింది. తెలుగుని పట్టించుకోని తమిళనాడులో కూడా శంకరాభరణం పాటలు గుండె సవ్వడుల్లా ప్రతిధ్వనించాయి.

కొంతమందైతే మన తెలుగుని వారి తమిళంలోకి మార్చి, "సంగరా...నాత శరీరాబరా' అని కూడా సిన్సియర్‌గా పాడారు. ఆ సంగతి వేరనుకోండి.

'రాగం తానం పల్లవి' పాటలో **"కృష్ణా తరంగాల సారంగ రాగాలు...కృష్ణలీలా తరంగిణీ భక్తిగీతాలు"** అన్న వేటూరి మాటలు చిరంజీవులుగా మా హృదయాల్లో నిలిచిపోయాయి. అక్షరాలతో అక్షరమైన పూజ సలిపారు కృష్ణవేణికి.

ముద్దులప్రియుడు చిత్రంలో వారే **"తుంగభద్రా కృష్ణ ఉప్పొంగుతున్న పొంగుదాచే అందాలెన్నమ్మో"** అనీ,

యువరత్న రాజా సినిమాలో **'మా కల్యాణ సీతమ్మ' పాటలో-**

**"కృష్ణవేణి వాల్జడ కనకదుర్గ వేయగా**
**గౌతమంత చీరగా కట్టుకోవె సీతలా"** అంటారు.

కృష్ణవేణికి కనకదుర్గమ్మ వాల్జడ వేసిందా ?

సీత గౌతమిని చీరెలా కట్టుకుందా (కట్టుకోవాలా) ?

అసలీ పూతం మరో పది జన్మలెత్తినా అందుతుందా ?

'శుభోదయం' సినిమాలో,

**"కంచికి పోతావా కృష్ణమ్మా -**
**ఆ కంచివార్తలేమి కృష్ణమ్మా"** అంటారు.

ఏ కథ చేరినా కంచికేగా !

"కృష్ణమ్మ పెన్నమ్మ పెనవేసుకున్నట్టు - పెదవుల్ని కలిపేయనా" అంటారు.

అయ్యా ; వేటూరిగారి 'శ్వాస కృష్ణ...వేటూరిగారి 'ఆశ' కృష్ణ.. వేటూరిగారి 'బాస' కృష్ణ...వేటూరిగారి 'యాస' కృష్ణ. ఆ మహానుభావుడికి మనఃస్ఫూర్తిగా వందనాలర్పిస్తున్నాను. కృష్ణ గలగలల్లో వేటూరి వారి ఎదసవ్వడి ఎప్పటికీ వినిపిస్తూనే ఉంటుంది.

**దేశోద్ధారకులు** : సినిమాలో మోదుకూరి జాన్సన్‌గారు కూడా కృష్ణమ్మకు తనదైన శైలిలో ప్రాధాన్యత కల్పించారు.

'స్వాగతం...సుస్వాగతం' పాటలో

**"గోదావరి పాదాలకు నీళ్ళివ్వగా... పినాకిని పిలిచి నీకు పీటవేయగా, కృష్ణవేణి వచ్చి నీకు కడుపు నింపగా...కన్నతల్లి కడుపుతీపి తాంబూలమివ్వగా"** అంటారు. ఎంత చక్కనిమాట....కృష్ణమ్మ కోటానుకోట్లమందికి కడుపు నింపుతూనే వున్నది. నింపుతూనే ఉంటుంది.

శ్రీ ఇంద్రకంటి శ్రీకాంతశర్మగారికి కూడా కృష్ణానదితో అవినాభావసంబంధం వుంది. నెలవంక సినిమాలో వారే

**'ఈ కోవెలవాకిలిలో..ఏదో అడుగుల సవ్వడి' పాటలో,**

**"నీ కన్నుల వెన్నెల చూసి...మనసే చిరు తరగయ్యిందీ**
**కృష్ణవేణి పరుగయ్యిందీ..."** అని హృద్యంగా వర్ణిస్తారు.

ఎంత చక్కని భావం...మనసు చిరుతరగై, కృష్ణవేణి పరుగయిందిట. అదీ కృష్ణాజలాల మహిమ అంటే !!!

ఇక సి. నారాయణరెడ్డిగారు స్పృశించని అంశంలేదు. విశ్వంభరుడాయన. అక్షరకర్పూర హారతులిచ్చే కర్పూర వసంతరాయుడాయన

"ఆడవే జలకమ్ములాడవే" అంటూ కథానాయికని ఉత్సాహపరిచారు. ఉర్రూత లూగించారు. ఆంధ్రప్రేక్షకులనీ, శ్రోతలనీ... తమ పాటలతో, ఇంతకీ ఆమె ఎక్కడ జలకాలాడాలట?

**"నాగార్జునుని బోధనలు ఫలియించినచోట**
**బౌద్ధమత వృక్షమ్ము పల్లవించిన చోట**
**కృష్ణవేణీ తరంగిణీ జాలిగుండెయె సాగరమ్మై**
**రూపు-సవరించుకొనునీట..."** జలకాలాడాలిట.

జ్ఞానపీఠాన్ని అధిరోహించిన కవిచక్రవర్తీ...సలామ్...కలంతో ఎన్ని హొయలొలికించారు జనాబ్...!! బాణీ కట్టింది I.V. రాజుగారయితే,

(నేటి భానురాజుగారి తండ్రిగారు) పాడింది అమరగాయకులు ఘంటసాలవారు...వారికి జంటగా పాడినది అచ్చతెలుగు ఆడపడుచు పి. సుశీలగారు. చిత్రం – విచిత్రకుటుంబం.

మళ్ళీ I.V. రాజుగారి సారథ్యంలో The Great రఫీగారు గానం చేసిన పాట. 'గోపాలబాల నిన్నేకోరి' రఫీ రఫీనే...మరొకరితో వారిని పోల్చలేము. ఘంటసాలగారికి రఫీగారంటే ఇష్టం.ఇక SP బాల సుబ్రహ్మణ్యంగారయితే వారి SP కోదండపాణి రికార్డింగ్ స్టూడియో ఎంట్రన్స్‌లోనే రఫీగారి చిరునవ్వులు చిందించే చిత్రాన్ని ప్రతిష్టింపజేశారు. ఎంటర్ అవగానే రఫీ దాన్ని చూస్తే, ఆ రోజంతా అద్భుతంగా గడిచేది. SPB కి రఫీగారంటే ప్రాణం.

ఆ అమరగాయకుడు,

"ఏ మూథులు కాదంటున్నా–నా మనసు నీదేనన్నా

పూజారి అడ్డం వున్నా... నా దైవం నీవేనన్నా

కృష్ణమ్మా...

నిను నమ్మిన వాణ్ణి నట్టేటముంచేస్తావో..." అని ఖంగున పాడితే,

కృష్ణమ్మ లక్ష అడుగుల ఎత్తున నిలబెడుతుందిగానీ, నీటిలో ఎలా ముంచుతుందీ? అదీ రఫీసాబ్‌ని !

ఒక సరదా విషయం ఇక్కడ ప్రస్తావించాలి. ఆత్రేయ, ఆరుద్ర వేటూరి వీరంతా ఉధృతంగా రచనలు చేసే సమయంలో ఒక పదీ పదకొండు నెలలు అటూఇటుగా మేం నలుగురం రచయితలూ చిత్రసీమలోకి అడుగుపెట్టాం. ముందుగా ఎంటరైంది సిరివెన్నెల సినిమానే. ఇంటిపేరుగా చేసుకున్న చేంబోలు సీతారామశాస్త్రిగారు.

తరవాత వొచ్చింది, ఉభయ భాషాప్రవీణ, తెన్నేటి హేమలత గారు 'షట్‌శాస్త్ర చక్రవర్తి' అని ముద్దుగా పిలిచే జొన్నవిత్తుల రామలింగేశ్వరరావుగారు.

ఆ తరవాత వచ్చింది అద్భుతమైన ప్రజ్ఞ, అసాధారణ ధారణశక్తీ కలిగిన వెన్నెలకంటి రాజేశ్వరప్రసాదు. ఇతన్నే నేను ముద్దుగా 'బుల్లెబ్బాయ్' అనీ, 'తమ్ముడా' అని పిలుచుకునేది.

చివరిగా వచ్చింది నేను. భగవంతుని దయవల్ల నలుగురము, మా మావద్దతుల్లో గత 30 యేళ్ళుగా సినీరంగంలోనే కొనసాగుతున్నాం.

జొన్నవిత్తులకీ కృష్ణానదికీ విడదీయరాని సంబంధం. ఆ 'చాలు' లో పుట్టినవాడు గదా మరీ ? కృష్ణమ్మమీద ఆయన రాసినన్ని ప్రయివేట్ సాంగ్స్ ఎవరూ రాసివుండరు. మేమిద్దరం సినిమాల్లోకి రాకముందే ఆయన వ్రాసిన

"సుస్వాగతమిదే నీకు కృష్ణవేణీ" అన్న గీతం ప్రజల హృదయాల్లో మారుమ్రోగిపోయేది. గత పుష్కరాల్లో ఆ గీతం విడుదలై మరోసారి మళ్ళీ ప్రజల హృదయాల్లో తిష్ట వేసింది.

ఆయనే "దేవుళ్ళు" సినిమాలో

"మహాకనకదుర్గా విజయకనకదుర్గా" అనే పల్లవితో మొదలయ్యే పాటలో "ఓంకార రావాల అలల కృష్ణాతీరము" అని అద్భుతంగా కృష్ణాతీరాన్ని వర్ణించారు.

ఇక మా 'బుల్లెబ్బాయ్' అని నేను పిలిచే చి॥ వెన్నెలకంటి 'మహానది' అనే కమల్‌హాసన్‌గారి సినిమాలో కృష్ణమ్మని గుండెనిండుగా కొనియాడారు.

**"శ్రీరంగ రంగనాథుని దివ్యరూపమే చూడవే**

**శ్రీదేవి రంగనాయకీ నామం సంతతం పాడవే**

**నీలవేణిలో నీటిముత్యాలు**

**కృష్ణవేణిలో అలలగీతాలు,**

**నీలవేణిలో నీటిముత్యాలు నీరజాక్షునికి పూలుగా**

**కృష్ణవేణిలో అలలగీతాలు కృష్ణగీతాలే పాడగా" ॥శ్రీరంగ॥**

ఎంత చక్కని పదాలు... ఎంత హృద్యమైన అక్షరాలూ !!

'కృష్ణానది' పేరు విన్నప్పుడల్లా గుర్తొచ్చే రెండు పాటలున్నాయి. నా చిన్నతనం నుంచీ నేను పాడుకున్న పాటలు...మనిషికీ మనసుకి ఉత్తేజాన్నీ ఉత్సాహాన్నీ కలిగించే పాటలు అవి. తెలుగుజాతి ఉన్నంత కాలం చెక్కుచెదరని పాటలు. తెలుగుజాతికి జాతీయగీతం లాంటి పాటలు.

ఒకదాన్ని శంకరంబాడి సుందరాచారిగారు రచించిన 'మా తెలుగు తల్లికీ మల్లెపూదండ' పాట. దేశవిదేశాల్లో ఏ సభలు ఏ సమావేశాలు జరిగినా తెలుగువారి గొంతులో నినదించే పాట పాడింది టంగుటూరి సూర్యకుమారిగారు. చాలామందికి తెలియని విషయం ఏమంటే, ఈ పాటను స్వరపరిచిన స్వరకర్త పేరు.

ఈ మధ్యనే మ్యూజికాలజిస్ట్ 'రాజా' ద్వారా తెలిసింది. దీనిని స్వరపరిచినవారు R. సుదర్శనంగారని చాలాగొప్ప సంగీత దర్శకుడాయన. ఒక పాట దశాబ్దాలపాటు నిలిచిపోవడానికి కారణం, రచనలోని గొప్పదనం...ట్యూన్‌కి వున్న బలం + గాయనీ గాయకుల ప్రతిభ. ఆ మూడూ రంగరించిన అద్భుత గేయం..! మా తెలుగు తల్లికీ మల్లె పూదండ" అందులో ఒక చరణంలో,

**"గలగలాగోదారి కదలిపోతుంటేను**

**బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను**

బంగారు పంటలే పండుతాయీ
మురిపాల ముత్యాలు దొరలుతాయీ..  ॥మా తెలుగు॥

వేములపల్లి శ్రీకృష్ణగారు గొప్ప స్ఫూర్తిదాతలు. మాటల్లో వారి ఖచ్చితత్వమే వారి పాటలోనూ ప్రతిఫలించింది. నా చిన్నతనం నుంచీ నన్ను ఉత్తేజపరిచిన పాట, "చెయ్యెత్తిజైకొట్టు తెలుగోడా" ఏ సభకి వెళ్ళినా యీ పాటలోని 'ఏదో ఓ చరణాన్ని పాడటం నాకు అలవాటూ, ఇష్టమూ. నా దృష్టిలో యీ పాటని కూడా ప్రతి తెలుగువాడు నేర్చుకోవాలి. బాలబాలికలకి నేర్పాలి. ఈ పాటలో ఓ చరణం..

"కల్లోలగౌతమీ...వెల్లువల కృష్ణమ్మ
తుంగభద్రా పెన్న పొంగిపొరలిన చాలు
ధాన్యరాశులు పండు దేశానా
కూడు గుడ్డకు కొదువ లేదోయీ...  ॥చేయెత్తి॥

అయ్యలారా ! అమ్మలారా... మన తెలుగుని మన బిడ్డలకు అందించాలి. అపారమైన సంపద మన తెలుగుజాతిది. మన తరువాతి తరాలకి అందించాలంటే, ఇంగ్లీషునో మరో పరభాషనో చదవొద్దని అనను. ముందు మాతృభాష నేర్పి ఆ తరువాత ఎన్ని భాషలైనా నేర్పచ్చు. దయచేసి తెలుగుని అశ్రద్ధ చెయ్యకండి. మన జాతికి పునాది తెలుగు. మనజాతికి వెలుగు 'తెలుగు'. "ఏ దేశమేగినా ఎందు కాలిడినా ...నిలుపరా నీ జాతి నిండు గౌరవము" అని అన్నట్టు మన జాతి గౌరవం మన చేతుల్లోనే వుంది. ఆచంద్రతారార్కం అది నిలుపుకుందాం... జై తెలుగుతల్లి... జైహింద్. – భువనచంద్ర

అయ్యా...తెలుగుజాతి కన్నతల్లివంటి కృష్ణానది గురించిన సినీ గీతాలతో నేను ఉదహరించినవి అతికొద్ది మాత్రమే. కారణం స్థలాభావం. ఇంకా ఎన్నెన్నో సినీ, ప్రయివేటు గీతాలున్నాయి. కొండంత దేవుడికి కొండంతపత్రిని తేలేనట్టుగానే, యుగయుగాలుగా ప్రవహిస్తున్న యీ సజీవమూర్తికి సాష్టాంగ నమస్కారం చేస్తూ –

తెలుగుబిడ్డలందరూ యీ పుష్కరాల్లో పాల్గొనాలని కులమత భేదం లేకుండా... నిండు మనసుతో మనసునీ శరీరాన్నీ పవిత్రపరుచుకోవాలనీ ఆకాంక్షిస్తూ...

తెలుగువెలుగు విశ్వమంతా వ్యాపించాలని మనఃస్ఫూర్తిగా కోరుకుంటూ, యీ అవకాశాన్ని నాకు ఇచ్చిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారికి హృదయపూర్వక ధన్యవాదాలు తెలియజేసుకుంటున్నాను.

"పొంగిపొరలే కృష్ణ" కవిత.

నేనూ 'కృష్ణ'పై నా పాటల్లో ఒక లైన్ వ్రాయడంజరిగింది. సినిమా పేరు జా...లకటక. .పాట గుడివాడ స్టేషనూ ఎప్పుడైన చూశావా.. బెజవాడ కృష్ణలో మునకలేసివచ్చావా కాకినాడ బుల్లెమ్మా...సీటు చూసుకోవమ్మా.... సర్కారు బండొచ్చిందీ సిగ్నలిచ్చినారమ్మా ॥

"కృష్ణవేణి నమస్తుభ్యం సర్వపాప ప్రణాశిని ।
త్రిలోకే పావనజలే రంగత్తుంగ తరంగిణి ॥"

డా॥ వేదగిరి రాంబాబు

# కృష్ణవేణి

అరేబియా సముద్రానికి 64 కి.మీ. దూరంలో మహారాష్ట్రలోని మహాబలేశ్వరము నందలి సహ్యాద్రి పర్వతాలలో ఉద్భవించిన కృష్ణానది సుమారు 480 కి.మీ. దూరం ప్రయాణించి, త్రోవలోని నదులతో సంగమిస్తూ కర్నాటకలోని బెల్గాం జిల్లా ఐనాపూరులో ప్రవేశించి 291 కి.మీ. దూరం పయనించి రాయచూరు జిల్లాలోని దేవర్భుగర్ వద్ద కర్నాటక రాష్ట్రాన్ని వదుల్తోంది. మహారాష్ట్ర, కర్నాటక సంస్కృతులను వెంటగొని వచ్చిన కృష్ణానది ఆంధ్రప్రదేశ్‌లోని మహబూబ్‌నగర్ జిల్లా మక్తల్ తాలూకాలోని తార్గిడికి అనే గ్రామంలో ప్రవేశిస్తోంది. భీమ, తుంగభద్ర మూసీ అనే ఉపనదులను కలుపుకొని తుంగభద్రా నదితో సంగమించి ప్రయాణిస్తూ కర్నూలు జిల్లాను ఉత్తర సరిహద్దుగా గల్గి గుంటూరు నల్గొండ జిల్లాలను కూడ విభజిస్తోంది. ఆ తర్వాత ఎత్తైన నల్లమల కొండలలోని సన్నని త్రోవగుండా ప్రవహించి కోరమండల తీరాన్ని సమీపిస్తోంది. తర్వాత దక్షిణంగా దిగువకు ప్రవహించి విజయవాడను జేరి అచట సుమారు 1,188 మీ. వెడల్పు గల్గి తూర్పుగా మరలి దక్షిణదిక్కుగా ప్రవహించి ఎడమవైపున కృష్ణా, కుడివైపు గుంటూరు జిల్లా సరిహద్దును సూచిస్తోంది. అక్కడినుంచి ఈశాన్య దిశగా 160 కి.మీ. దూరం ప్రవహించి తూర్పు కనుమలను చేరుకొంటూంది. తదుపరి కృష్ణాజిల్లా దివిసీమలోని హంసలదీవి దగ్గర పాలకాయతిప్ప, నాచుగుంట అనే రెండు ప్రదేశాలలో పాయలుగా చీలి మహాసాగరంలో కలుస్తుంది.

రెండు తెలుగు రాష్ట్రాలలో కృష్ణానది సుమారు 720 కి.మీ. ప్రవహించి మార్గమధ్యంలో కొన్నిచోట్ల అత్యంతవేగంగానూ, మరికొన్ని చోట్ల మందముగానూ, తమ గమనాన్ని కొనసాగిస్తూ ఆ పరీవాహక ప్రాంతాన్ని సస్యశ్యామలం చేసి ప్రజల నాగరికతను, ఆర్థికాభివృద్ధిని, వాళ్ళ జీవనవిధానాన్ని తీర్చిదిద్దడానికి ఎంతో దోహదం చేస్తోంది.

చారిత్రక దశకు చేరుకున్న ఈ నదీ పరీవాహక ప్రాంతంలో క్రీ.పూ.4వ శతాబ్దం నుండి క్రీ.శ.16వ శతాబ్దం వరకు మౌర్య, శాతవాహన, ఇక్ష్వాకు, పల్లవ, చాళుక్య, చోళ, కాకతీయ, రెడ్డి, విజయ నగర సామ్రాజ్యాలు తమ అధికారాన్ని వివిధ ప్రాంతాల్లో నెరపి ఆయా కాలాల్లో శిల్పకళా శోభితాలైన స్థూపాలు, చైత్యాలు, విహారాలు దేవాలయాలు, దుర్గాలు నిర్మించినట్లుగా శిథిలావశేషములను బట్టి, శాసనాలు బట్టి తెలుస్తోంది. ఈ ప్రాంతంలో అమరావతి, విజయపురి (నాగార్జునకొండ), కూడురు (గూడూరు) కొండపల్లి రాజధానులుగా వివిధ కాలాల్లో వర్థిల్లాయి. ఈ నదీ తీరానికి ఇరువైపులా చెప్పుకోదగ్గ అనేక ప్రసిద్ధ చారిత్రక స్థలాలు, పుణ్యక్షేత్రాలు ఎన్నో ఉన్నాయి.

ఈ నదీలోయ ప్రాంతంలో క్రీస్తుపూర్వం మొదలు విరాజిల్లిన వాటిలో బౌద్ధ, జైన, వైదికమతాలు, నాగార్జునకొండ, అమరావతి, ధరణికోట, భట్టిప్రోలు, జగ్గయ్యపేట, ఘంటసాల, గుడివాడ ముఖ్యమైన బౌద్ధస్థూపాలు.

శాతవాహన, ఇక్ష్వాకుల కాలంలో బౌద్ధమతం ఉచ్ఛస్థితిలో ఉంది. మాధ్యమిక శష్యన్యవాదాన్ని ప్రతిపాదించిన ఆచార్య నాగార్జునుడు శ్రీపర్వతంపై (నేటి నాగార్జునకొండ) అంతర్జాతీయ విశ్వవిద్యాలయ నెలకొల్పాడు. ఇతడు రచించిన ఇరవైనాల్గు సంస్కృత గ్రంథాల "ప్రజ్ఞాపారమితశాస్త్ర" శాతవాహన రాజుకు వ్రాసిన సన్మార్గోపదేశమైన "సుహృల్లేఖ" అతి ముఖ్యమైనవి.

వర్తమాన మహావీరుని జైనమత ప్రభావం ఈ నదీలోయలో విస్తరించింది. విజయవాడ, వడ్డమాను, గుడివాడ, శివగంగ, నందిగామ, జగ్గయ్యపేట మొదలైనవి పేర్కొనదగ్గ జైన స్థావరాలు.

వైదిక మతాచరణలో దేవాలయ నిర్మాణాలు క్రీ.శ. 1–2 శతాబ్దాల నుండి ఉన్నట్లుగా ఇటీవల లభ్యమైన దేవాలయ కట్టడాల పునాదు లాధారంగా తెలుస్తోంది. వైదిక మతం శైవ, వైష్ణవమతాలుగా విభజన జరిగి అనేక శైవ, వైష్ణవ ఆలయాలు వెలిసాయి. గుహాలయ నిర్మాణాల్లో పేర్కొనదగినవి, క్రీ.శ. 4–5 శతాబ్దాలకు చెందిన విజయవాడలోని మొగల్రాజపురం, ఉండవల్లి, అక్కన్నమాదన్న గుహాలయాలు. ఇవి త్రిమూర్త్యార్పితములుగా చెప్పబడుతున్నాయి. గుహోపరిభాగాన "అపస్మార పురుష" రూపంలో గల నటరాజ విగ్రహం దక్షిణ భారతదేశంలోకెల్లా అతి ప్రాచీనమైనది. శైవగణానికి చెందిన శృంగి, భృంగి, వారికి చేరువలో వినాయకుడు శక్తి మొదలగు విగ్రహాలు ఉన్నాయి.

శ్రీశైలం, అమరావతి, రూపాల సంగమేశ్వరం, అలంపూరు, కూడలి సంగమేశ్వరం, విజయవాడ దుర్గా మల్లికార్జున ఆలయం మొదలైనవి ప్రసిద్ధి పొందిన శివాలయాలు.

మాచెర్ల, శ్రీకాకుళం, మంగళగిరి మొదలైనవి వైష్ణవ మతానికి ప్రధాన కేంద్రాలు. కృష్ణానదీ తీరానగల పంచనృసింహ ఆలయాలు వేదాద్రి, మంగళగిరి, మెట్టపల్లి, వాడపల్లి, కామెపల్లిలలో ఉన్నాయి.

కృష్ణానదీ లోయ ప్రాంతంలో మచిలీపట్నం, ఘంటసాల, మోటుపల్లి ప్రసిద్ధ రేవుపట్టణాలుగా శాతవాహనుల కాలంలో రోమ్ వ్యాపారం అభివృద్ధిలో ఉన్నట్లు తెలుస్తోంది.

మచిలీపట్నం, కలంకారీ అద్దకాలకు, కొండపల్లి కొయ్యబొమ్మలకు ప్రసిద్ధి చెందింది.

కృష్ణానదీ పరీవాహక ప్రాంతము చారిత్రక యుగంలో మౌర్యుల ఆధీనంలోకి వచ్చింది.మౌర్యుల అధికారం అస్తమించినతర్వాత తీరాంధ్రంలో శాతవాహనులు వచ్చేదాక కొంతమంది స్థానిక ముఖ్యులు అధికారం చెలాయించారు. వీరి తర్వాత ధాన్యకటకము (అమరావతి) రాజధానిగా, శాతవాహనులు పశ్చిమ ప్రాంతాలనుంచి రాకపూర్వము, సదవంశ మొకటి తీరాంధ్రమును పాలించిందని చరిత్రకారులు అభిప్రాయం.

### శాతవాహన రాజుల ఆధిపత్యము

పశ్చిమ కృష్ణా నదీపరీవాహక ప్రాంతము శాతవాహనుల ఆధీనములో ఉండేది. సిముకుడు, ప్రథమ శాతకర్ణి, ద్వితీయ శాతకర్ణి మొదలు గౌతమీపుత్ర శాతకర్ణి వరకు ఈ ప్రాంతమంతా వారి ఆధీనములో ఉండేది.

### ఇక్ష్వాకు రాజులు

ఇక్ష్వాకు రాజుల రాజధాని నేటి నాగార్జునకొండ లేక విజయపురి పట్టణము. శ్రీ చాంతమూలుడు ప్రథమ పాలకుడు చివరి శాతవాహన రాజును ఓడించి గుంటూరు - కృష్ణా ప్రాంతములో తన రాజ్యమును స్థాపించాడు.

### బృహత్పలాయనులు

బృహత్పలాయన గోత్రుడగు జయవర్మ మహారాజు రాజ్యాన్నె పాలించాడు. ఈ వంశములో చరిత్రకు తెలిసిన రాజు ఇతనొక్కడే. ఇతని రాజధాని కూదూరు. ఇది కృష్ణాజిల్లా బందరు తాలూకాలోని గూడూరు రాజధానిగా గుర్తించారు.

### సాలంకాయనులు

వీరు దానము గావించిన గ్రామాలలో కొన్ని బృహత్పలాయనుల కూడా రహారములోనివే. వీరు కృష్ణానది దక్షిణ తటము నాక్రమించలేదు.

### ఆనందగోత్రులు

వీరు కృష్ణానది దక్షిణ తటాక ప్రాంతాన్ని ఆక్రమించారు.

### పల్లవులు

పల్లవులు, బృహత్పలాయనుల తరువాత కృష్ణానదీ దక్షిణ తట ప్రాంతము ఆక్రమించారు కొన్నాళ్ళు.

### బాదామి చాళుక్యులు

కృష్ణానదీ పరీవాహక ప్రాంత కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లాల లోని భాగాలను, నలవాడి విషయమును జయించి కర్నూలు, మహబూబ్‌నగర్ ప్రాంతాలను బాదామి చాళుక్యరాజు ప్రథమ కీర్తి వర్మ (క్రీ.శ. 567-597) హస్తగతం చేసుకొన్నారు.

### రాష్ట్రకూటులు

నల్గొండ, మహబూబ్‌నగర్ జిల్లాలలోని కొన్ని భాగాలు కృష్ణానదీ పరీవాహక ప్రాంతాలై బాదామి చాళుక్య పాలన నుండి రాష్ట్రకూటుల ఆధిపత్యానికి లోబడ్డాయి.

### తూర్పు చాళుక్యులు

కృష్ణానదీలోయ పశ్చిమ ప్రాంతంలో రాష్ట్రకూటులు పాలన రాగా, తూర్పు ప్రాంతాల్లో క్రీ.శ. 624 నాటికే బాదామి చాళుక్యరాజు రెండవ పులకేశి తమ్ముడు కుబ్జ విష్ణువర్ధనుడు వేంగి సామ్రాజ్యాన్ని స్థాపించారు.

### చాళుక్య చోళులు

కృష్ణా, గుంటూరు జిల్లాలోని కృష్ణానదీ తీరప్రాంతాలు రాజరాజ నరేంద్రుని కుమారుడైన కులోత్తుంగచోళుని అతని సంతతివారి ఆధీనంలో ఉండేది. వీరిని చరిత్రకారులు చాళుక్యచోళులని పిలిచారు.

ఈ విధంగా కృష్ణానదీపరీవాహక ప్రాంతంలో అనేక సంగ్రామాలు జరిగి రాజకీయాధికారము రెడ్డి, విజయనగర వెలమ ప్రభువుల చేతులు మారుతూ వచ్చింది.

### ఆలంపూరు

తుంగభద్రా నదీతీరాన పశ్చిమంగాగల ఆలంపూరులోని నవబ్రహ్మ ఆలయాలు, దక్షిణ కాశీగా వ్యవహరింపబడుతూ, ఇండో-ఆర్యన్ (నాగర) వాస్తు నిర్మాణమే కాక, ద్రవిడ ఆలయ సంప్రదాయాన్ని కూడా సంతరించుకొన్నది. స్వదేశపు వాస్తురీతిని కల్గి, చాళుక్యరీతిలో ఐహోల్, పట్టడకల్ కన్న విభిన్నమైన రీతిలో లీనమై ప్రత్యేకతను కనబరుస్తు న్నాయి. నవబ్రహ్మ ఆలయాలనుండి కొనిరాబడిన శిల్పాల ఖజాన అలంపూరు మ్యూజియం. ఈ ఆలంపూరులోని ఆలయాలు, రాతితో దృఢంగా నిర్మించిన గోడలు, 30 బురుజులతో, పశ్చిమంగా తుంగ భద్రానది, మిగతా మూడుప్రక్కలా కందకం కల్గి రక్షింపబడు తున్నాయి.

## సోమశిల కొల్హాపూరు, జటప్రోలు

కృష్ణానదిపైగల శ్రీశైలం ప్రాజెక్టు, మహబూబ్‌నగర్, కర్నూలు జిల్లాలలోని 107 గ్రామాలను ముపుకు గురిచేసింది. ఇరవై ముఖ్యమైన దేవాలయాలు ముంపుకు గురౌతాయనే భయం వల్ల కూలగొట్టి, వేరొకచోటికి చేర్చి పునర్నిర్మాణం అదేవిధంగా గావించారు. సోమశిల (భవనాసి, కృష్ణానదితో వేడుకగా సంగమించిన ప్రదేశం), కొల్హాపూర్, జటప్రోలు - విధమైన దేవాలయ పునర్నిర్మాణం గావించిన ప్రదేశాలు వీనిలో మదన గోపాలస్వామి యొక్క స్థలమైన ఆలయాలు, విజయ నగర రీతిలో నిర్మించి,జలాశయాలతో,ఆలయ ప్రాంగణంలో శిల్పాలను చేర్చి ఉన్నారు. ఆలయ పునర్నిర్మాణం చేపట్టారంటే అది వాస్తు నిర్మాణంలో సాహసం, క్రొత్త మార్పులు చేయు సాంకేతిక నిపుణత్వం, ఘన కార్యంగా చెప్పవచ్చు.

శ్రీశైలం ప్రాజెక్టు నిర్మాణపు పనులలో కృష్ణానది ఎగువభాగాన పేర్కొనదగిన ప్రదేశాలు మరుగయ్యాయి. మల్లేశ్వరం, కొల్హాపూరుకు 11 కి.మీ. దూరంలో పర్వతాల మధ్య, కృష్ణానదీ తీరాన ఉంది. అగస్త్యేశ్వర ఆలయంగా ప్రసిద్ధిపొందింది. కృష్ణా సంగమేశ్వరంలో వేణి, తుంగ, భద్ర, భీమరధి అనే ఐదు నదుల నీటిని కలిపి కృష్ణానది తెస్తూ సప్తనదీ సంగం వద్ద భవనాసితో కలుస్తోంది. ఇదే ముక్తి-క్షేత్రంగా పేరొందింది.

## శ్రీశైలం

శ్రీశైలం, సముద్రమట్టానికి 1500"ల ఎత్తులో ఉంది. కర్నూలుకు 180 కి.మీ.దూరంలో ఒక పర్వతశిఖరంపై,త్రోవలోప్రకృతి సహజమైన సుందర ప్రదేశాలు గల్గి నల్లమల కొండలకు ఉత్తరంగా ఉన్న పీఠభూమి శ్రీశైలం, శ్రీశైలంలోని భ్రమరాంబ మల్లికార్జునస్వామి దేవాలయం దక్కనులో అతి పురాతనమూ, పవిత్రమూ అయింది. ఇచ్చట లోతైన, సన్నని త్రోవగుండా కృష్ణానది ప్రవహిస్తూ ఉంటుంది. శ్రీశైలం, శ్రీగిరి - శ్రీ-పర్వతం, రుద్ర-పర్వతం శేషాచలంగా పురాతన గ్రంథాల్లో పేర్కొనడం జరిగింది. పురాణాల్లోను మతపరమైన సంప్రదాయాల్లోనూ శ్రీశైలం మిక్కిలి ప్రాముఖ్యం వహించింది. ఎందరో గొప్ప ప్రభువులు చాళుక్యరాజులు, కృష్ణదేవరాయలు, శివాజీ యిచ్చటి దేవతను అర్చించారు. ఆదిశంకరాచార్య ఈ ప్రాంతపు అందచందాలను గాంచి ఇక్కడే తపస్సు చేశాడట.దేశంలోనిద్వాదశజ్యోతిర్లింగాలలో శ్రీశైలంలోని లింగము కూడా ఒకటి. భ్రమరాంబ ఆలయం చుట్టూరా శిల్పాలతో నిండివుంది. శ్రీశైలంలో మహాశివరాత్రి పర్వదినాన్ని జాతీయ పర్వ దినంగా జరుపుతారు. హిందూ యాత్రికులు మల్లికార్జునుని అర్చించ టానికి, పాతాళగంగలో పవిత్ర స్నానమాచరించటానికి వస్తారు. ఇక్కడ కృష్ణానది అత్యంత వైభవంతో ప్రవహించి శ్రీశైల ప్రాంతాన్ని అత్యంత రమణీయ ప్రాంతంగా మారుస్తోంది.నదీప్రవాహపు ఆనకట్ట తలుపులు తెరవగానే నది నురగలతో ఉప్పొంగి ఒక మనోహరమైన సుందర దృశ్యాన్ని తిలకింపజేస్తుంది.

## నాగార్జున కొండ

అంతర్జాతీయ సంపదగా పేర్కొనబడుతున్న బౌద్ధమతానికి చెందిన అవశేషాలు. అక్కడ గల పేరొందిన పురాతన కట్టడాలు. 1700 సం॥ల నాటి వి. శ్రీలంక, బర్మా, ఇండోనేషియా దీవులు, థాయ్‌లాండ్, ఇండోచైనా, చైనా దేశాలనుండి సేకరించిన కళాఖండాలు, వ్యవసాయా నికి మాత్రమే పనికివచ్చే ప్రాజెక్టు నిర్మాణం వల్ల కృష్ణానదీలోయ భవితవ్యం లేని జలాశయంగా మారటంతో ముంపుకు గురైనాయి. ప్రభుత్వ బాధ్యతను నెరవేర్చుకోవాలనే సంకల్పంతో అతివేగంగా తొలగిం చిన పురాతన వస్తువులు అక్కడి కొండపైగల ప్రదర్శనశాలలో అమర్చ బడి, ప్రసిద్ధిపొందిన కళాఖండాల అవశేషాలు మనకు గోచరిస్తాయి.

నాగార్జునకొండ శ్రీపర్వతంగా మూడవ శతాబ్దిలో వర్ధిల్లింది, శాతవాహనుల తరువాత రాజులైన ఇక్ష్వాకుల కాలంలో విజయపురి రాజధాని. అప్పటి రాచరికపు స్త్రీలచే అత్యంత వైభవోపేతమై వృద్ధి చేయబడిన కట్టడములు ఈ లోయలో ముంపుకు గురియై సమాధియైనవి.

నాగార్జునకొండ నేడు ఒంటిగా, విచార ద్వీపంగా చుట్టూరా జలమ యమై ఉంది. త్రవ్వకాలలోని ముఖ్యమైన కట్టడాలు మాత్రం మిక్కిలి శ్రమతో తరలించబడినప్పటికీ, వాలి పురాతన వైభవపు విలువ ఖండితంగా మరుగైపోయింది.

మార్చి 1926లో ఎ.ఆర్.సరస్వతిగారిచే అత్యద్భుతమైన నాగార్జునకొండలోని పురాతనవస్తువులు వెలుగులోనికి తేబడ్డాయి. ఇవి కొన్ని ఇటుక దిబ్బలు, శిల్పములతో కూడిన రాతిస్తంభములు అమరావతి శిల్ప చెక్కడాలను పోలినవి కనుగొన్నారు. ఎ.హెచ్. లాంగ్‌హర్స్ట్ గారిచే ఆ స్థలంయొక్క నేల స్వభావం ముందుగా పరీక్షింపబడి, 1931 వరకు ఈ లోయలో క్రమపద్ధతిలో త్రవ్వకాలు నిర్వహించారు. చిన్నతరహా ప్రాజెక్టు క్రింద జరుపబడిన త్రవ్వకముల కార్యక్రమం 1938 నుండి 1940 వరకు శ్రీ టి.ఎస్.రామచంద్రన్‌చే చేపట్టడం జరిగింది. ముఖ్యంగా విశ్వవిద్యాలయం కొన్ని గజవృక్ష చైత్యాలు, విహారాలు, మండపం కనుగొన్నారు. కాని ఎక్కువగా ఆరు సంవత్సరాల పాటు వంద గ్రామాలకు పైగా డా.ఆర్. సుబ్రహ్మణ్యం గారిచే స్థల పరిశోధనలు జరుపబడి మహాచైత్యాలు, స్థూపాలు, చైత్యగృహాలు, స్థూపచైత్యాలు, ఛాతురకందరాలు, దుర్గాలు, అండాకృతి గల రంగభూమి, దేవాలయములు, రోమను నాణేలు, సున్నపురాతి శిల్పాలు, టెర్రకొట్టబొమ్మలు, శాసనాలు వెలుగులోనికి తెచ్చారు.

### గోలి

నాగార్జునకొండకు 18 మైళ్ళ దిగువ ప్రాంతంలోని గోలేరు అనే ఏరు కృష్ణానదితో కలిసి రెండుమైళ్ళ దిగువగా గోలి గ్రామంలో వుంది. 1926లో జరిపిన త్రవ్వకాలలో అత్యధికంగా అలంకరించబడిన బౌద్ధస్థూపం వెలుగులోకి వచ్చింది.

గోలిలో లభ్యమైన శిల్పాలు, అమరావతి మొదటి దఫాలో లభించిన శిల్పాలకు సమకాలికంగా 3వ శతాబ్దికి చెందివున్నాయి. నందిని చిత్రీకరించిన సున్నపురాతితో మలిచిన శిల్పాలు మద్రాసు మ్యూజియంకు తరలించేసారు. అనామధేయునిచే అపహరించబడిన ఒక పొడవైన శిలాఫలకం న్యూయార్క్‌లోని మెట్రోపాలిటిన్ మ్యూజియం ఆఫ్ ఆర్ట్స్ వారిచే సేకరించబడి, ఆ ప్రదర్శనశాలలో వుంచారు.

### ఎత్తిపోతల

మాచర్లకు ఈశాన్యంగా 6 కి.మీ. దూరంలో తాళ్ళపల్లి గ్రామానికి ఎగువ భూమివద్ద చంద్రవంక వాగు కృష్ణానదితో సంగమించే ప్రదేశంలో సుమారు 21 మీ. ఎత్తున నుండి విభ్రాంతిని కలుగజేసే విధంగా రమ్యంగా ప్రవహించే జలపాతమే ఎత్తిపోతల.

### మట్టపల్లి

హుజూర్‌నగర్‌కు 32 కి.మీ. దూరంలో గల మట్టపల్లి కృష్ణానది తీరానగల నరసింహక్షేత్రం అతి పవిత్రస్థలంగా పరిగణించబడింది. ఇచటి పురాతన గుహాలయం నేడు పూర్తిగా పునర్నిర్మించబడింది. ఇచ్చట దేవతా విగ్రహం "స్వయంభు" అనీ, స్వయం ప్రకాశమనీ నమ్మకం. దేవాలయ ప్రాంగణానికి అంచున గల కృష్ణానది ప్రకృతి శోభను ప్రశాంతతను కలుగజేస్తుంది.

### జగ్గయ్యపేట

విజయవాడకు 77 కి.మీ. దూరంలో హైద్రాబాదు – విజయవాడ జాతీయరహదారిలో గల జగ్గయ్యపేట చారిత్రక గుర్తింపు కల్గిన ప్రదేశం. దీనిని పూర్వం చేతవేలు అని పిలిచేవారు. 18వ శతాబ్దంలో జమిందారైన రాజావాసిరెడ్డి వెంకటాద్రినాయుడుగారిచే వారి తండ్రి పేరుమీద "జగ్గయ్యపేట" అని నామకరణం చేయడం జరిగింది. బ్రిటీషువారితో జరిగిన ఒడంబడికతో రాజధానిని ఇక్కడనుండి అమరావతికి మార్చి ప్రపంచప్రసిద్ధిగాంచిన బౌద్ధస్తూపనాశనానికి కారకులయ్యారు. అక్కడ వున్న అవశేషాలను బట్టి జగ్గయ్యపేటలో బౌద్ధమతం మిక్కిలి ప్రబలి ఉన్నట్లు దృఢమౌతుంది. ధనంబోడు అనే పూర్వపు స్థూపం నిర్వికారమైంది. కొన్ని మద్రాసు మ్యూజియంలో భద్రపరిచారు. వీటిలో చక్రవర్తి–మాంధాత అత్యంత ప్రముఖమైంది.

### అమరావతి

దివ్యమైన శిల్పాలకు ప్రసిద్ధిగాంచిన అమరావతి గుంటూరుకు ఉత్తరంగా 21 మైళ్ల దూరంలో కృష్ణానది తీరాన కుడివైపుగా వుంది. క్రీ.పూ. 3వ శతాబ్ది నుండి దాదాపు 1600 సం॥లు అంతర్జాతీయ బౌద్ధకేంద్రంగా ఒకానొకప్పుడు పరిగణించిన ఆ ప్రదేశంలోని శోభాయమానమైన చిహ్నాలు అదృశ్యమై మిక్కిలి నిరుత్సాహపరుస్తున్నాయి. వెలలేని ఈ కళాసంపద దుష్టులైనవారి మూర్ఖత్వంచే, కఠినత్వంతో నియమం లేకుండా చేసిన త్రవ్వకాలవల్ల కట్టడాల్లోని శిలాఖండాలు భావాన్ని కోల్పోయాయి. భారతీయ రాజవంశాల్లోఇక్ష్వాకులు, పల్లవులు, చాళుక్యులు, చోళులు. వారి వారి చెక్కడాల్లో చూపించిన భిన్నమైన భావాలు గల కళాఖండాల ప్రభావం, క్రొత్తగా ప్రవేశపెట్టబడిన అన్నం, థాయ్‌లాండ్, ఇండోనేషియా దీవులు, శ్రీలంక, ఆఫ్ఘనిస్తాన్ దేశాలలోని అనేకవిధాలైన కళాఖండాల్లో చూపడం జరిగింది. అమరావతి త్రవ్వకాల్లో బయల్పడిన కొన్నిశిల్పాలు దూరప్రాంతాలైన మద్రాసు, కలకత్తా, హైదరాబాదు, లండన్, ప్యారిస్, బోస్టన్ నగరాల్లోని ప్రదర్శనశాలలకు తరలించారు. అమరావతిలో మాత్రం బహుకొద్ది శిల్పాలు మాత్రమే మిగిలి ఉన్నాయి.

1794లో శ్రీ రాజావాసిరెడ్డి వెంకటాద్రినాయుడు గుంటూరుజిల్లా, చింతపల్లి జమిందారుగా వున్నపుడు ఈస్ట్ ఇండియా కంపెనీవారి పటాలంతో కలత చెంది అమరావతికి నివాసాన్ని మార్చడానికి జగ్గయ్యపేటవాసులతో, అతని అనుచరులతో తరలివెళ్ళాడు. అమరావతి పట్టణ జనాభాను, అక్కడి వైభవాన్ని చూసి, తమ భవన నిర్మాణమునకై కావలసిన సామగ్రి సమకూర్చుకోవడానికి జరిపిన త్రవ్వకాల్లో స్థూపాలను వెలికితీయించాడు. ఈ పనిలో అతని అనుచరులు అంచనా వేయలేని శిల్ప ఫలకాలను ధ్వంసం చేసి, సున్నం కోసం వాటిని కల్చావేశారు. కొన్ని ఫలకాలు అమరేశ్వరస్వామి దేవాలయంలో రాజవారిచే పునర్నిర్మాణం గావించినప్పుడు మెట్లుగా ఉపయోగించారు.

### విజయవాడ

ఆంధ్రప్రదేశ్‌లోని పెద్ద పట్టణాల్లో విజయవాడ చెప్పుకోదగింది. చిత్రోపమయమైన కొండల మధ్యనగల ఈ ప్రదేశం. కృష్ణానదీ తీరాన ఉత్తర దిశగా గల డెల్టా ప్రాంతంలోని పురాతన గ్రామం నుండి వృద్ధి చెందిన నగరమిది. ఇది విష్ణుకుండీన రాజైన మూడవ మాధవవర్మ రాజధానిగా క్రీ.శ. 6వ శతాబ్దిలో వృద్ధిచెందినట్లు స్థానిక చరిత్ర. చారిత్రకంగా విజయవాడ–విజయవాటిక. బీజపురం, కనకప్రభ, కనకపురము, కనకవాడ, జయపురి, విజయపురి, ఫల్గుణక్షేత్రం, జగన్నాథపురం గాను కొన్ని శాసనాల్లో రాజేంద్రచోళపురంగాను కూడ పేర్కొనబడింది. ఇంద్రకీల పర్వతంపై గల కనకదుర్గ ఆలయం ఇచట ప్రఖ్యాతిగాంచి పూజింపబడుతోంది.

విజయవాడలోని మొగల్రాజపురం కొండ శాతవాహనుల కాలం నాటి స్థూపాలను కలిగివుంది. రాతితో మలచబడిన మెట్లు కల్గిన దేవాలయాలు విష్ణుకుండినుల కాలానికి చెందినవి. కృష్ణానదికి దక్షిణపు ఒడ్డున విజయవాడకు4 కి.మీ. దూరంలో నది నుండి బ్యారేజీ మీదుగా మలుపు తిరిగిన ప్రదేశంలో ఉండవల్లి గ్రామం ఉంది. ఇచట క్రీ.శ. 420లో పరిపాలించిన విష్ణుకుండినుల కాలం నాటి గుహలు ప్రసిద్ధి గాంచాయి. వారి వంశమూల దేవతయైన అనంతపర్మనాభస్వామికి ఈ గుహలు అంకితం గావించారు. వాస్తుశాస్త్ర పరిజ్ఞానంలో ఈ గుహాలయాలు అజంతా గుహలతో పోల్చినట్లయితే వాటి ప్రభావం ఏమాత్రం తీసికట్టుకాదు. రాతిలో దొలిచిన దేవాలయాలు, మండపాలు, శిల్పాలు, ప్రదర్శించబడిన శాల, నాల్గంతస్థులు కలిగిన ఈ దేవాలయ ప్రాంతాన్ని అందంగా తీర్చిదిద్దాయి. మూల విగ్రహమైన విష్ణువు శయనమూర్తిగా యున్నట్లు మూడవ అంతస్థులో రమణీయంగా మలచారు.

## మంగళగిరి

విజయవాడకు7 మైళ్ల దూరంలో మద్రాసు వెళ్ళే జాతీయ రహదారిపై "మంగళప్రదమైన కొండ","మంగళగిరి" ఉన్నది. బ్రూస్‌ఫూట్‌చే ఇక్కడ ప్రాక్ చార్త్రక(రాతియుగపు) అవశేషాలు కనుగొనడం జరిగింది. కొండపై గల లక్ష్మీనరసింహస్వామి ఆలయం ఎంతో ఘనత వహించింది. ఈ ఆలయంలో ముఖ్య విశేషమేమిటంటే పానకం (బెల్లపునీరు) విగ్రహం నోటిలో పోస్తే దానిలో సగం భక్తులకు ప్రసాదంగా తిరిగి నోటినుండి వెలువడుతుంది. అందువల్లనే స్వామి పానకాల నరసింహ స్వామిగా పేరుపొందారు. కొండపైగల ఈ దేవాలయం పొంచియున్న ఏనుగువలె కన్పడుచు, చుట్టుప్రక్కల ప్రదేశాలకు కొన్ని మైళ్ళదూరం వరకు మహనీయమైన దృశ్యంగా కన్పడుతుంది.

## కూచిపూడి

కూచిపూడి గ్రామం నృత్యవిద్యకు పుట్టినిల్లు. ఆ గ్రామం పేరు మీదనే నాట్యానికాపేరు వచ్చింది. ఈ గ్రామంలోనే ఈ నాట్యభంగిమలను విరచించిన సిద్ధేంద్రయోగి జన్మించారు. అప్పటినుండి కూడా పరంపరగా పురాతన స్వచ్ఛతను కోల్పోకుండా ఇక్కడ నాట్యాన్ని నేర్పుతూనే ఉన్నారు.కాని ఈ కూచిపూడి నాట్య ప్రదర్శనలు అంతర్జాతీయ ప్రేక్షకుల ప్రశంసలతో ఖ్యాతినార్జించి వర్తక రీతిలో విస్తారంగా ప్రదర్శనలిస్తున్నారు.

## మొవ్వ

కూచిపూడికి సమీపంలోనే మొవ్వ గ్రామం ఉంది. సంగీతానికి పదాలను కూర్చిన క్షేత్రయ్యవల్ల ఈ గ్రామానికి ప్రాముఖ్యత కల్గింది. ఎనిమిది శతాబ్దాల క్రితం నిర్మించిన వేణుగోపాలస్వామి ఆలయం నేటికి మిక్కిలి ప్రసిద్ధిగాంచే ఉంది.

## భట్టిప్రోలు

రేపల్లెకు ఉత్తరంగా 10 కి.మీ. దూరంలోగల భట్టిప్రోలులోని బౌద్ధస్థూపం దేశంలోని పురాతన స్థూపాల్లో ఒకటి అని తెలియజేస్తోంది. పబ్లిక్ వర్క్స్ డిపార్టుమెంట్ వారు అవివేకంతో చాలాకాలం క్రితం స్థూపంలోని శిలాఫలకాలను, మధ్యలోగల భరణెలను పగులుగొట్టారు. మూఢతచే స్థూపాలంకరణములైన చెక్కడపు రాళ్ళను భట్టిప్రోలుకు రెండుమైళ్ళ దూరానగల, కాలువ తూము నిర్మాణానికి ఉపయోగించారు. ఈ పురాతన నగరం విక్రమాదిత్యుని కాలంలో అతని మంత్రియైన భట్టు పేరుమీద నిర్మించడంతో 'భట్టిప్రోలు' అని పిలుస్తున్నారు.

## శ్రీకాకుళం

కూచిపూడి గ్రామానికి 8 కి.మీ. దూరంలో కృష్ణానది తీరానగల శ్రీకాకుళం శాతవాహన రాజ్యంలో బలిష్టమైనదిగా అంగీకరించాలి. ఇక్కడ పురాతనమైన ఆంధ్ర మహావిష్ణువు దేవాలయం ఉంది. కృష్ణదేవరాయలు ఈ ఆలయాన్ని సందర్శించి శ్రీ మహావిష్ణువుకు అంజలి ఘటించేవాడు దేవాలయ ప్రాంగణంలోని మండపం క్రిందనే కృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదను రచించినట్లు కథనం.

## హంసలదీవి

హంసలదీవి నుండి5 కి.మీ. దూరంలోపాలకాయతప్పి ప్రాంతంలో కృష్ణానది బంగాళాఖాతంలో విలీనమౌతోంది. ఇది పవిత్ర యాత్రా స్థలం. చోళుల పరిపాలనాకాలంలో నిర్మించిన వేణుగోపాలస్వామి ఆలయం ముఖ్యంగా పూజించదగిన ప్రదేశం. కృష్ణానది యె ప్రవాహంతో, సముద్రపు పోటు కలిసెడు స్థలంలో, అలలు నెమ్మదిగా కదుల్తూ సముద్రంలో జేరుతూ వుంటే హంసలబారు ఒకే వరుసలో కదిలినవిధంగా ఉంటుంది. కనుకనే ఈ ప్రదేశానికి "హంసలదీవి" అని పేరు వచ్చింది.

నాగార్జునసాగర్, శ్రీశైలం హైడ్రో ఎలక్ట్రిక్ ప్రాజెక్టులు వ్యవసాయాభివృద్ధికి తోడ్పడి ఈ లోయ ప్రాంతానికేగాక యావద్భారతావనికి అన్నపూర్ణగా భాసిల్లుతున్నాయనడం అతిశయోక్తి కాదు. ఈ ప్రాజెక్టుల నిర్మాణ ఫలితంగా ఈ నదిలోయలోని ప్రాచీన కట్టడాలు, శిల్పసంపదకు ఏర్పడ్డ ముంపు ప్రమాదం నుండి రక్షించడానికై భారత ప్రభుత్వ పురావస్తు సర్వేక్షణశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పురావస్తుశాఖ, అనేక పరిరక్షణ చర్యలను భారీఎత్తున చేపట్టి సురక్షితమైన ఎత్తైన ప్రదేశాలకు తరలించి,యథాతథంగా పునర్నిర్మాణం గావించేబృహత్ కార్యక్రమాన్ని జయప్రదంగా నిర్వహించటం జరిగింది.

డా॥ సర్వా సీతారామ చిదంబరశాస్త్రి

# కృష్ణాపుష్కర వైశిష్ట్యం

"శంనోదేవీ రభీష్టయ ఆపోభవంతు పీతయే
శంయోరభిస్రవంతునః"

'దివ్యములైన ఈ జలాలు మంగళకరాలై మా అభీష్టాన్ని తీర్చుగాక! మాకు త్రాగడానికి తగిన నీటిని ఇచ్చుగాక ! మా వైపు ప్రవహించుగాక!' అని జల వైశిష్ట్యాన్ని పరిపూర్ణంగా అర్థం చేసికొన్న వేదర్షులు త్రికరణ శుద్ధిగా జలదేవతను ప్రార్థించిన మంత్రం ఇది.

'పృథివ్యాపస్తేజో వాయురాకాశాత్'-అని పంచభూతాలు అయిదు. అందులో మొదటిది భూమి. రెండవది జలం. పవిత్రమైన భారతావనిపై ఉన్న ప్రాణికోటి మనుగడకు అత్యంతావశ్యకమైనది నీరు. ఈ నీరు నిరంతరం ప్రవహించే నదుల ద్వారా జీవుల ప్రాణాన్ని నిలుపుతుంది. ఎల్లప్పుడు ప్రవహించే నదుల్ని జీవనదులన్నారు. నదులు దేశాభ్యుదయానికి జీవనాడులు. జాతి అభ్యుదయానికి ప్రధాన సోపానాలు. ఇవి ఎవ్వరి సొత్తు కావు. తాము పుట్టిన స్థానానికిగాని, ప్రవహించే ప్రదేశాలకుగాని పరిమితంగావు. ఇవి భగవద్వర ప్రసాదితాలు. జాతి, కుల, మత ప్రాంతీయ భేదాలు లేకుండా అందరికి అందుబాటులో ఉండి దేశప్రగతికి దోహదమవుతుంటాయి.

భగవత్ప్రసాదితాలైన నదీమతల్లుల్ని అర్చించే సంస్కృతి భారతీయులది. భగవంతుడు ఎక్కడో లేడని, మనచుట్టూ ఉన్న ప్రకృతిలోనే శక్తియుతుడై ఉన్నాడని గ్రహించి మనం ఆయా ప్రకృతిని ఆరాధిస్తాం. పర్వతాలు-వృక్షాలు-నదులు మొదలయినవి అన్నీ పరమేశ్వరుడు సృష్టించిన ప్రకృతి సంపదయే. మన జీవనదులన్నీ కేవలం నీటి ప్రవాహాలు మాత్రమేగాక ఆత్మీయుత జీవ స్వరూపాలై జీవకోటి మనస్సులలో మధురానుబంధంతో పెనవేసికొని ఉంటాయి. ఇవి అమ్మలా లాలిస్తాయి. పోషిస్తాయి. అంతేగాదు. అద్భుతమైన నాగరికతను, పచ్చదనాన్ని, చల్లదనాన్ని, సాత్త్విక సంస్కృతిని, చక్కని సంప్రదాయాన్ని అందించే నదుల్ని జగన్మాత స్వరూపాలుగా దర్శించి పూజించడం మనకు అనాదిగా వస్తున్న ఆచారం.

ఈ భరత భూమిపై ప్రవహించే నదుల్లో గంగ-యమున - సరస్వతి-గోదావరి-కృష్ణ-కావేరి-మున్నగునవి మిక్కిలిగా ప్రసిద్ధి నొందాయి. వీటిలో ఆంధ్రరాష్ట్రంలో ప్రవహించే కృష్ణానదికి ఒక విశిష్ట స్థానముంది. ఇప్పుడు కృష్ణానదికి పుష్కరశోభ ఏర్పడింది. మనం ఈ దుర్ముఖినామ సంవత్సర శ్రావణ శుద్ధ నవమి నుండి అనగా ది.12-08-2016వ తేదీ నుండి 12 రోజులపాటు కృష్ణా పుష్కరాన్ని జరుపుకొంటున్నాం.

***మరి కృష్ణానది యొక్క విశిష్టత ఏమిటో చూద్దామా!***

## కృష్ణానది యొక్క పుట్టుక

ప్రతి నది యొక్క పుట్టుకకు పురాణ గాథలు ఎన్నో ఉన్నాయి. అలాగే కృష్ణకు కూడ గాథలున్నాయి. 'కర్షతి చిత్తమితి కృష్ణః కృష-విలేఖనే' అని ధాతువు. 'కృష్ణ అనగా మనస్సును ఆకర్షించేది' అని వ్యుత్పత్తి. నలుపు రంగు- బరియం అని అర్థాలున్నాయి.

పద్మపురాణం ఉత్తర ఖండంలో కృష్ణానది పుట్టుకను గూర్చి ఇలా చెప్పబడింది.

చాక్షుష మన్వంతరంలో బ్రహ్మ సహ్యగిరి శిఖరంపై యజ్ఞం చెయ్యాలని భావించి దేవతలందరిని పిలిచాడు. ఆయనకు స్వరరామి, గాయత్రి అనేవారు భార్యలు. యజ్ఞ ప్రారంభ ముహూర్త సమయానికి స్వరరామి రాలేదు. రెండవ భార్యయైన గాయత్రితో కలిసి, బ్రహ్మ యజ్ఞాన్ని జరిపించాడు. యజ్ఞం పూర్తయిన తర్వాత స్వరరామి వచ్చింది. జరిగినదంతా గ్రహించింది. ఆమెకు తీవ్రమైన కోపం ఉదయించింది. విచక్షగా జ్ఞానం కోల్పోయిన ఆమె అక్కడ ఉన్న వారినందరిని నిమ్నగలు అనగా నదులు కమ్మని శపించింది. ఈ హఠాత్పరిణామానికి ఆశ్చర్యపడినా గాయత్రికి కూడ కోపం రావడంతో ఆమె స్వరరామికి కూడ అదే శాపమిచ్చింది. అప్పుడు దేవతలు మేమంతా నదులమైతే లోకాలన్నీ లుప్తమైపోతాయి గనుక శాపాన్ని ఉపసంహరించుకొమ్మని స్వరరామిని కోరారు. అప్పుడామె యజ్ఞా

రంభంలో విఘ్నేశ్వర పూజ జరపకపోవడం వల్ల అలా జరిగిందని, శాపాన్ని మళ్ళించే శక్తి తనకు లేదని వాపోతుంది. మీరు మీ మీ అంశలతో నదులు గమ్మని సూచిస్తుంది. ఆమె గాయత్రితో కలిసి గంగగా అవతరిస్తుంది. ఆ పైన తమ తమఅంశలతో విష్ణువు కృష్ణా నదీత్వాన్ని, పరమేశ్వరుడు వేణ్యానదీత్వాన్ని, బ్రహ్మ కకుద్మతీనదీ త్వాన్ని, తక్కుం గల దేవతలందరు వివిధ నదీ రూపాల్నిపొంది సహ్యాద్రి నుండి పూర్వ వాహినులుగా ప్రవహిస్తారు. కృష్ణవేణీనది ఇలా హరి హరాంశలతో కూడిన పావన నదిగా ప్రసిద్ధి చెందింది.

కృష్ణానది పుట్టుకను గూర్చి మరియొక విధంగా కూడా ఉంది. ప్రాచీన కాలంలో యమధర్మరాజు తన లోకానికి వచ్చే పాపుల సంఖ్య విపరీతంగా పెరగడంతో వారిని శిక్షించే శక్తి తనకు మించిపోయిందని భావించి సత్యలోకానికి వెళ్ళి బ్రహ్మగారితో తన బాధ చెప్పుకుంటాడు. ఆయనకు కూడా ఏం చెయ్యాలో తోచక యముని వెంటనిడుకొని వైకుంఠానికి వెళ్ళి శ్రీమన్నారాయణుని ఉపాయం చెప్పుడని వేడు కొంటాడు. అప్పుడు శ్రీహరి యముని బాధను తొలగించడానికై తన అంశతో ఒక నదిని సృజించి సహ్యాద్రి వదలుతాడు. తన కోసం తపస్సు చేసే సహ్యముని కోరిక తీర్చడానికి, ప్రజల పాప నివృత్తికి విష్ణువు ఆ నదిని, వదిలాడు. అయ్యదియే కృష్ణానది. నీలమేఘ శ్యాము డైన విష్ణ్వంశతో ఉత్పన్నమైనది గావున అది కృష్ణ అయింది. హరి ఆజ్ఞను అనుసరించి కృష్ణ సహ్యముని తపంచేసే ప్రదేశం నుండి ప్రవ హించసాగింది. దాని నీరు లేత నీలిరంగులో ఉంటుంది. పాపాత్ములు ఆ నీటిలో స్నానాదులు చేసి పవిత్రులు అవడంతో యమ లోకంలో పాపుల సంఖ్య క్రమంగా తగ్గబడింది. యమునికి విశ్రాంతి దక్కింది.

ఇతర నదులు స్నాన దానాదులచేత పాపాన్ని పోగొట్టి ప్రజల్ని పుణ్యవంతున్ని చేస్తుండగా కృష్ణానది కేవలం స్మరించడం వల్లనే పుణ్యం కలిగిస్తుంది.

**"కృష్ణవేణీతి యోబ్రూయాత్ సప్తజన్మార్జి తాన్యపి**
**మహాపాపాని నశ్యంతి విష్ణులోకం సగచ్ఛతి"**

'కష్ణవేణీ' అని ప్రతినిత్యం ఎవడు తలచుకుంటాడో వాడు ఏడు జన్మల్లో చేసిన మహాపాపాలన్నీ నశించి విష్ణు లోకానికి వెడతాడని చెప్పబడింది.

మానవుల పాపాలేగాక దేవతల పాపచయాన్ని కూడ హరించే శక్తి కృష్ణా జలాలకుంది. అదెట్లంటే -

జగత్పావనియైన గంగ ప్రతి రాత్రిసమయంలో నల్లకాకి రూపంలో వచ్చి కృష్ణలో స్నానంచేసి తెల్ల హంసలా మారి తన స్థానానికి పోతుంది. ఎందుకంటే పాపులు గంగలో స్నానం చేసి పునీతులవుతారు. వారి పాపాలు తనలో కలవడం వల్ల గంగ నల్లగా మారుతోంది. కృష్ణలో స్నానం చెయ్యడం వల్ల పాప పరిహారమై తెల్లని హంసలా మారు తోంది. కృష్ణ నల్లగానే ఉంటుంది గదా! ఆమెకు రంగు మారడమనేది లేదు. పావన గంగనే పునీతం చెయ్యగల శక్తి కృష్ణకు ఉందంటే కృష్ణ యొక్క అమోఘ శక్తి ఎట్టిదో తెలుసుకోవచ్చు.

లోకాల్ని తరింపజేయడానికి కృష్ణ పరమాత్మ సహ్యాద్రిపై అశ్వత్థ రూపంలో అనగా రావిచెట్టుగా నిలిచాడని, ఆ చెట్టు యొక్క వేర్లనుండి కృష్ణ అవతరించిందని చెబుతారు.

మునులు కలియుగంలో ప్రాణుల పాపప్రక్షాళనకై ఏదైనా ఉపా యం చెప్పమనగా పరమేశ్వరుడు లింగాకృతిలో సహ్యపర్వతంపై వెలిసాడని, అక్కడ ఉన్న ఆమలక అనగా ఉసిరిక చెట్టు వ్రేళ్ళనుండి వేణీనది అవతరించి కృష్ణతో ఏకమై కృష్ణవేణిగా మారిందని పెద్దలంటు న్నారు. కృష్ణవేణి ఇలా శివకేశవ స్వరూపిణి అయింది.

ఇలా సహ్యముని తపః ఫలితంగా భూప్రవేశం చేసిన కృష్ణానది మహారాష్ట్రలో ప్రసిద్ధినొందిన మహాబలేశ్వరంలో పుట్టి తూర్పుగా ప్రవ హించింది. ఈ నది సముద్ర మట్టానికి 4500 అడుగుల ఎత్తులో ఉంది. ఈ ప్రదేశం సహ్యాద్రి అని పేరొందింది. ఇది పశ్చిమ కనుమల అంతర్భాగం. మహారాష్ట్రలో పుట్టిన కృష్ణమ్మ కర్ణాటక రాష్ట్రం, ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రవహించి కృష్ణాజిల్లాలోని విజయవాడ దగ్గరలో గల 'హంసలదీవి' వద్ద బంగాళాఖాతంలో కలుస్తుంది.

పరమ పవిత్రము, పతితపావని అయిన కృష్ణానదికి ఇప్పుడు పుష్కర సమయం. మనం ఎంతో భక్తి శ్రద్ధలతో కృష్ణాపుష్కరాన్ని జరుపుకోదలచాం. అసలు ఇంతకీ పుష్కరమంటే ఏమిటి? అంటారా!

## పుష్కరమంటే

'పుష్పత్యవకాశమితి పుష్కరమ్ - పుష - పుష్టౌ - అవకాశమును పొందించునది - ఆకాశం' అని అర్థం.

'పోషయతీతి పుష్కరమ్ - శోషించునది - నీరు' అని అర్థం.

'శ్రాంతం పుష్ణాతీతి పుష్కరమ్ - బడలిన వాని పోషించునది - తామర పువ్వు' అని అర్థం.

'స్థల పద్మినీ మూలత్వేన పుష్కరస్య మూల మిదం పుష్కరమ్ - నేలతామర దుంపం' అని అర్థం.

ఇంకా ఏనుగు తొండపుకొన, మద్దెల మొదలయిన వాయిద్యాల ముఖం, కత్తివాదర అనే అర్థాలు కూడ పుష్కర శబ్దానికున్నాయి.

భూమిపై ఉన్న సప్తద్వీపాల్లో పుష్కరమనేది ఒకటి.

ఇక్కడ పుష్కర శబ్దానికి నీరు అనే అర్థం తీసుకోవాలి. పుష్కరమంటే పన్నెండు ఏళ్ళకు ఒకసారి వచ్చేది అని అర్థం.

పూర్వం ఒకానొక సమయంలో నారద మహర్షి తండ్రియైన బ్రహ్మ దగ్గరకు వెళ్ళి 'తండ్రీ! పుష్కరమంటే ఏమిటి? పుష్కరుని తండ్రి ఎవరు? పుష్కరుడు తీర్థరాజెలా అయ్యాడు? చెప్పమనగా బ్రహ్మ-

"తిస్రః కోట్యర్థ కోట్యశ్చయాని తీర్థాని సంతివై
యత్రోత్పన్నాని పుణ్యాని తత్తీర్థం పుష్కరస్స్మృతః"

సార్ధత్రికోటి అనగా మూడున్నర కోట్ల తీర్థాలు ఎక్కడ ఉంటాయో ఆ తీర్థానికి పుష్కరమని పేరు. దీని విషయమై ఒక కథ చెబుతాను విను అని ఇలా చెప్పసాగాడు.

పూర్వం తుందిలకుడు అనే ఒక ముని ఉన్నాడు. ఆతడు పరమ ధార్మికుడు. రేయింబవళ్ళు శివార్చనంజేసి శివానుగ్రహం వల్ల పుష్కరుడు అయ్యాడు. అనగా శివుని అష్టమూర్తుల్లో ఒక్కటైన జలరూపాన్ని పొందాడు. అటు పిమ్మట కొన్నినాళ్ళకు నేను తపంజేసి శివుని ఆరాధించి సామ మంత్రాలతో శివుని స్తుతించి లోక సృష్టికి సహాయం కావించుమని వేడుకొన్నాను. అప్పుడు పరమ శివుడు తీర్థ రూపియైన పుష్కరుని నాకిచ్చాడు.

నేను ఆ పుష్కరుని నా కమండలంలో ఉంచుకొని సృష్టి చెయ్యనారంభించాను.

ఇలా ఉండగా ఒకసారి అంగీరసుని కుమారుడు బృహస్పతి తపస్సు చేసి నన్ను మెప్పించాడు. అప్పుడు నేను ఆతనిని 'నీకేం వరం కావాలో కోరుకొమ్మన్నాను.' నీవు నాకు ప్రసన్నుడవైతే నాకు గ్రహాధిపత్యం, దేవతల్లో గౌరవం, సర్వజ్ఞత్వం ఇచ్చి నీ కమండలంలో ఉన్న తీర్థరాజు పుష్కరుడు నా వశం అయ్యేటట్లుగా చేయు'మన్నాడు. నేను 'తథాస్తు' అన్నాను.

వెంటనే నేను నా కమండలంలో ఉన్న పుష్కరుని పిలిచి 'నిన్ను బృహస్పతికి ఇచ్చివేసాను. ఈ రోజు నుండి ఆతనిని అనుసరించు'మని చెప్పాను. కాని పుష్కరుడు 'నేను మిమ్మల్ని వదిలి వెళ్ళలే'నన్నాడు. నేను నిన్ను బృహస్పతికిచ్చాను. వెళ్ళక తప్పదని నేను నిష్కర్షగా చెప్పగా పుష్కరుడు 'నేను మీతోనే ఉండి, మీరు ఎక్కడకు వెడితే అక్కడికే వస్తానుగాని ఈయనతో వెళ్ళనన్నాడు'. అప్పుడు నేను 'ఓ పుష్కరా! బృహస్పతి మేషాది రాశుల్లోకి వెళ్ళిన నాటి నుండి పన్నెండు రోజులు అహోరాత్రుళ్ళు సంవత్సరమంతా మధ్యాహ్న సమయంలో రెండు ముహూర్తాల పాటు నీవు అయా నదుల్లో ఉండాలి. అప్పుడు నేను కూడా నీతోనే ఉంటాను' అని చెప్పాను. అందుకు పుష్కరుడు అంగీకరించాడు.

ఆనాటి నుండి బృహస్పతి పుష్కరుని తీసుకొని పోయి మేషాది రాశుల్లోకి తాను ప్రవేశించినప్పుడు గంగాది నదుల్లో పుష్కరుడు సార్థ త్రికోటి తీర్థాలతో సహా ఉంటున్నాడు. ఆ సమయం ఎంతో పుణ్యప్రదం. ఆకారణంగా ఆ సమయంలో చేసిన దానాదులు అనంతకోటి ఫలితాలు ఇస్తాయి.

బృహస్పతి పుష్కరుడు మూడున్నరకోట్ల దేవతాబృందంలో ఆయా నదుల్లోకి ప్రవేశించడానికి కారణమేమిటంటే – బృహస్పతి నవగ్రహాల్లో ఒకడు. ప్రమాణంలో బరువులో పెద్దవాడు. దేవగణానికి గురువు. బృహస్ అనగా బుద్ధి. దానికి నాయకుడు గాన బృహస్పతి. కనుకనే ఆయన సమస్త విజ్ఞానానికి అధిపతి. బృహత్తులకు మండలాలకు అధిష్టాన దేవుడు. తన మేధాశక్తితో ప్రపంచంలోని అజ్ఞాన తిమిరాన్ని పోగొట్టి విజ్ఞాన జ్యోతిని వెలిగిస్తూ సకల మానవాభ్యుదయానికి పథదర్శనుడై గురుస్థానాన్ని పొందినవాడు. కనుక అట్టి గురువు సమస్త నదుల్లోకి ప్రవేశించినప్పుడు అవి అతి పవిత్రా వైవర్ణనతీతమైన దైవత్వాన్ని పొందుతాయి. తమలో మునిగిన సకల ప్రాణుల సమస్త పాపరాశిని పోగొడతాయి.

పుష్కరుని పుట్టుకను గూర్చి మరొక కథ. వేద కాలంలో మహర్షులు భరత వర్షానికి పవిత్రతను కల్పించడం కోసం మరియు పుణ్య నదుల్ని మహా మహిమాన్వితాలయిన తీర్థాలుగా తీర్చిదిద్దాలనే సత్సంకల్పంతో తీర్థాలన్నింటికి రాజైన వరుణుణ్ణి సకల తీర్థ సహితంగా గంగాది ద్వాదశ నదుల్లో సంవత్సరానికి ఒక్కనది చొప్పున ఉండమని మనస్పూర్తిగా ప్రార్థించాడు. వారి ప్రార్థనను మన్నించిన వరుణుడు అంగీకరించాడు. అయితే సంవత్సర కాలాన్ని ఎలా గణించాలను కొన్నప్పుడు మాత్రం సూర్యచంద్రుల గమనాన్ని బట్టికాకుండా బృహస్పతి సంచారాన్ని బట్టి గణించాలని పుష్కరుడు షరతు విధిస్తాడు. పుష్కరుడనగా వరుణుడే. ఆనాటి నుండి బృహస్పతి మేషాది రాశుల్లోకి ప్రవేశించినప్పుడు గంగాది నదులకు పుష్కర ప్రవేశం కలిగి అవి పవిత్ర పుణ్యప్రదాలు అవుతున్నాయి.

మరొక్క కథనం. ఒకప్పుడు దేవేంద్రుడు తన పాపపరిహారార్థం పుష్కరతీర్థంలో మునిగి తన పాపాన్ని పోగొట్టుకొన్నట్లు చెప్పబడుతూ ఉంది.

బ్రహ్మదేవుని మానస పుత్రిక అహల్య అతిలోక సుందరి. అట్టి అద్వితీయ సౌందర్యవతిని బ్రహ్మ గౌతముడనే మునికిచ్చి వివాహం గావిస్తాడు. ఆమె అందానికి తట్టుకోలేని ఇంద్రుడు మదన తాపంతో వివేకహీనుడై ముందు వెన్కలు ఆలోచించకుండా ముని ఇంట్లోలేని సమయంలో మాయతో అహల్యను పొంది తన కోరిక తీర్చుకుంటాడు. ఈ సంగతి తెలిసికొన్న గౌతముడు అహల్యను రాయిగా మారిపొమ్మని శపిస్తాడు. అసహ్యకరమైన శరీరంతో సహస్రమోనివి కమ్మని ఇంద్రుని శపించాడు ముని. ఋషి శాప ప్రభావంతో ఇంద్రుని శరీరం ఎవ్వరూ చూడలేని విధంగా ఏహ్యంగా మారిపోయింది. దానికి సురపతి చింతిస్తూ తనకు పూర్వ శరీరం ప్రసాదించే ఉపాయంకోసం విధాతను వేడుకుంటాడు. ఇంద్రుని ప్రార్థనను విన్న బ్రహ్మ ఒక సరస్సును సృష్టించి అందులోనికి తన కమండలంలో ఉన్న నీటిని ప్రవహింపచేయగా వికృతశరీరుడైన ఇంద్రుడు ఆ సరస్సులో స్నానం చేసి తన పాప పంకిలాన్ని వదిలించుకొని అంతకు ముందున్న శరీరంతో చక్కగా ప్రకాశిస్తాడు. ఇంద్రుడు స్నానమాచరించిన సరస్సుకు పుష్కరతీర్థం అనిపేరు ఏర్పడింది.

ఏది ఎలాగైనా పుష్కరుడు ఏ నదిలోకి ప్రవేశిస్తే ఆ నదికి పుష్కరం ఏర్పడుతుందని ఆ నదిలో మునిగిన మానవాది ప్రాణుల పాపాల న్నింటినీ పుష్కరుడు పోగొట్టి వారిని పునీతులుగా చేస్తాడని ఆర్యులంటున్నారు.

### ఏఏ నదికి ఎప్పుడెప్పుడు పుష్కరాలు

మేషరాశిలో బృహస్పతి ఉన్నప్పుడు గంగానదికి – వృషభరాశిలో ఉన్నప్పుడు నర్మదా నదికి – మిథున రాశిలో ఉన్నప్పుడు సరస్వతీ నదికి – కర్కాటక రాశిలో ఉన్నప్పుడు యమునా నదికి – సింహరాశిలో ఉన్నప్పుడు గోదావరీ నదికి – కన్యారాశిలో ఉన్నప్పుడు – కృష్ణానదికి – తులారాశిలో ఉన్నప్పుడు కావేరీ నదికి – వృశ్చిక రాశిలో ఉన్నప్పుడు తామ్రపర్ణీ నదికి – ధనూరాశిలో ఉన్నప్పుడు సింధునదికి – మకర రాశిలో ఉన్నప్పుడు భద్రానదికి – కుంభరాశిలో ఉన్నప్పుడు భీమరథీ నదికి –మీనరాశిలో ఉన్నప్పుడు ప్రణీతానదికి పుష్కరాలు చెప్పబడ్డాయి.

### కృష్ణా పుష్కరాలు

"కన్యాగతో యదా జీవో బ్రహ్మసూనురుదారధీః
కృష్ణా పుష్కర యోగోయం పాపినామపి మోక్షదః
తస్మిన్ దత్తసువర్ణాన్నా ద్యనంత ఫలదం స్మృతమ్
పితౄణాం పిండదోయశ్చ స్వర్గవాసం కరోతిహి"

బృహస్పతి కన్యారాశిలోకి ప్రవేశించినప్పుడు పుష్కరుడు కృష్ణలోకి వస్తాడు. అప్పుడు నదులన్నీ అన్ని తీర్థాలతో సహా అక్కడకు వచ్చి చేరుతాయి. హరి హరబ్రహ్మలు, ఇంద్రాది దేవతలు, ఋషులు, పితృ దేవతలు అందరు స్నానాలు చేసి ఆ నదిలోనే ఉంటారు. కావున ఆ సమయంలో చేసిన స్నాన దానాదులు, పిండ ప్రదానాలు అక్షయ ఫలితాన్ని ఇస్తాయి.

### పుష్కర సమయంలో ఏం చెయ్యాలి

గ్రహణ సమయం – పుష్కర సమయాల్లో చేసిన స్నాన, దాన, పూజ, తర్పణాదుల వల్ల జీవులు అంతులేని పుణ్యాన్ని మూటగట్టు కుంటారు. పుష్కరవేళ నదీపూజ –పుష్కరపూజ – బృహస్పతి పూజలతో పాటుగా స్నానం – తీర్థోపవాసం – క్షౌరం – పిండ ప్రదానం – దాన ధర్మాలు చెయ్యాలి.

"అత్యంత మలినఃకాయః నవఛిద్రసమన్వితః
స్రవత్యేవ దివానక్తం ప్రాతః స్నానం విశోధనమ్"

నవరంధ్రాలతో కూడిన ఈ శరీరం నుండి రాత్రింబవళ్ళు మలిన పదార్థాలు బయట పడుతుంటాయి. అందువల్ల బాహ్యశౌచానికి స్నానం అవశ్యాచరణీయం. అయితే స్నానం కన్నా పూర్వం ఉన్న స్థితి కన్నా స్నానం చేసిన తరువాతనే మరింత మనోనైర్మల్యం కలుగుతుంది. స్నానం చేసిన తర్వాత ఒక్కసారైనా భగవంతునికి నమస్కారం చెయ్యాల నిపిస్తుంది. అట్టి చిత్త నైర్మల్యాన్ని ఇచ్చే శక్తి నీటిలో మాత్రమే ఉందని భావించిన మహర్షులు నదీ స్నానాన్ని చెయ్యాలన్నారు.

కృష్ణాస్నానంవల్ల కోటిజన్మాల్లో చేసిన పాపమంతా పటాపంచలవుతుంది.

"యస్మిన్ దినే సురగురుః కన్యారాశితో భవేత్
తస్మింస్తు కృష్ణాస్నానంతు కోటిజన్మాఘ నాశనమ్"

పుష్కర సమయంలో కృష్ణానదీలో స్నానమాచరించడం వల్ల ప్రతిరోజు గంగలో ప్రాతఃస్నానం చేసిన పుణ్యం కల్గుతుంది. మరియు గంగ, యమున సంగమ స్థానంలో సంవత్సరకాలం స్నానం చేసిన పుణ్యం లభిస్తుంది. నర్మదా నదీ తీరంలో నాల్గు యుగాలపాటు తపస్సు చేస్తే ఎంత పుణ్యఫలం కల్గుతుందో అంత పుణ్యఫలం పుష్కర సమ యంలో కృష్ణాస్నానం వల్ల కల్గుతుంది. మానవుడు కృష్ణా స్నానం వల్ల దేవ – ముని – పితృఋణాల నుండి ముక్తుడౌతాడు అని పద్మపురాణం చెబుతోంది.

"భాగీరథ్యాం స్నానమేకం ప్రాత స్నానేన యత్ఫలమ్
కృష్ణవేణ్యాం జలంస్పృష్ట్వా లభతే కన్యాగతే గురౌ
స్నానేన వర్షకే పుణ్యం గంగా యమున సంగమే
కృష్ణవేణి జలం పీత్వా లభేత్ కన్యాగతే గురౌ
తపసాయత్ కృతే పుణ్యం నర్మదాయాంచతుర్యుగే
కృష్ణవేణ్యాం సకృత్ స్నాత్వా ముచ్యతేన ఋణ త్రయాత్
నర్మదాయాం తపఃకుర్యాత్ వారణాస్యాం తనుత్యజేత్
దానం దద్యాత్ కురుక్షేత్రే ఇచ్ఛేన్ముక్తిపదం నరః
త్రివిధం కృష్ణవేణ్యాంతు ఇత్థం ధర్మపరోనరః"

నది యొక్క పూజ – స్నానం – స్మరణం అనే మూడు పాపవిముక్తిని కలిగిస్తాయని సౌరసంహితలో చెప్పబడింది.

"తీర్థసేవాంచ తీర్థేషు స్నానం తీర్థస్మృతిస్తథా
సర్వపాపవిశుద్ధ్యర్థం ప్రవదంతి మహర్షయః"

పుట్టినది మొదలుగా మానవాళి చేసే పాపాలు పుష్కరకాలంలో త్రికరణ శుద్ధిగా చేసే పుణ్యనదీజల స్నానం మాత్రం చేతనే నశిస్తాయని పెద్దలు అంటున్నారు.

"జన్మ ప్రభృతియత్ పాపంస్త్రియా వా పురుషేణ వా
పుష్కరే స్నాన మాత్రస్య సర్వమేవ ప్రణశ్యతి".

### స్నాన సంకల్పం

పూర్వాపరకర్మల్లో మనం దేనిని ఉద్దేశించి మనస్ఫూర్తిగా చేస్తామో ఆ పని నెరవేరడానికై చేసే ప్రక్రియ సంకల్పం. సంకల్పం లేకుండా ఏ పనీ చెయ్యరాదు. అలాగే స్నాన విషయంలో కూడా. కృష్ణా పుష్కర స్నాన సంకల్పం ఇలా ఉండాలి.

..............ఏవం గుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్..........గోత్రః..........నామధేయః.........ధర్మపత్నీసమేతః; శ్రీమతః........గోత్రస్య.......నామధేయస్య.......ధర్మపత్నీ సమేతస్య మమ ఉపాత్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య, శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం మమ ఇహ జన్మని జన్మాంతరేషు చ బాల్యయౌవన కౌమార వార్ధకేషు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థాసు జ్ఞానతోఽ జ్ఞానతోవా కామతో కామతః స్వతః పరప్రేరణేనవా సంభావితానాం సర్వేషాం పాపానాం అపనోదన ద్వారా ఇష్టదేవతా ప్రీత్యర్థం ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థం క్షేమస్థైర్యవిజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్య అభివృద్ధ్యర్థం ఉత్తరోత్తరాభి వృద్ధ్యర్థం కన్యాం గతే దేవగురౌ సార్థత్రికోటి తీర్థసహిత పుష్కర ప్రయుక్త మహాపర్వణి పుణ్యకాలే పుష్కరా శ్రిత కృష్ణవేణీ మహానదీ స్నానమహం కరిష్యే – అని చెప్పుకోవాలి. ఇలా ముమ్మారు మునిగి ఆపైన కృష్ణవేణికి నమస్కరించాలి ఇలా.

**"నమామి సుకృతశ్రేణిం కృష్ణవేణీం తరంగిణీమ్**
**యద్వీక్షణం కోటి జన్మకృత దుష్కర్మశిక్షణమ్"**

దర్శనమాత్రంచేతనే కోటి జన్మల పాపాల్ని పోగొట్టడం వల్ల పుణ్య పరంపరలకు హేతువైన కృష్ణవేణీ నదికి నమస్కరిస్తున్నాను అని భావం.

ఇలా చేసిన తర్వాత యథాశక్తి భగవత్ పూజలు, దానధర్మాలు చెయ్యడం పరిపాటి. పుష్కరాలు జరిగే పండ్రెండు రోజులు చెయ్య వలసిన దానానదుల వివరాలు.

**మొదటి రోజు :** బంగారం – వెండి – ధాన్యం – భూమి – దానం చెయ్యాలి. దీనివల్ల సూర్యలోక ప్రాప్తి కల్గుతుంది.

**రెండవ రోజు :** వస్త్రం – లవణం–గోవు –రత్నాలు దానమివ్వాలి. దీనివల్ల వసురుద్రత్వ లోకాన్ని పొందుతారు.

**మూడవ రోజు :** బెల్లం – కూరలు – గుర్రం – పండ్లు దానమివ్వాలి. దీనివల్ల అశ్వినీ దేవతా లోకం సిద్ధిస్తుంది.

**నాల్గవ రోజు :** నెయ్యి – నూనె – తేనె – పాలు దానం చెయ్యాలి. దీనివల్ల వైకుంఠ ప్రాప్తి లభిస్తుంది.

**అయిదవ రోజు :** ధాన్యయుత శకటం – దున్నపోతు – ఎద్దు – నాగలి – దానం ఇవ్వాలి. దీనివల్ల కైలాస ప్రాప్తి కల్గుతుంది.

**ఆరవ రోజు :** ఔషధం – కర్పూరం – కస్తూరి – మంచిగంధం దానమివ్వాలి. దీనివల్ల అమిత ధనం సమకూరుతుంది.

**ఏడవ రోజు :** ఇల్లు – పీట – శయ్య – పల్లకి–దానం చెయ్యాలి.

**ఎనిమిదవ రోజు :** మంచి గంధపు చెక్క – పువ్వులు – దుంపలు – అల్లం దానమివ్వాలి. దీనివల్ల వైకుంఠ లోకం లభిస్తుంది.

**తొమ్మిదవ రోజు :** పితృశ్రాద్ధం – పిండదానం – దాసి – కన్య – దానం చెయ్యాలి. దీనివల్ల అమూల్య వస్తు ప్రాప్తి కల్గుతుంది.

**పదవ రోజు :** హరిహర పూజ – లక్ష్మీపూజ – గౌరీపూజ ఆచరించాలి. దీనివల్ల అక్షయ పుణ్యలోక ప్రాప్తి లభిస్తుంది.

**పదునొకండవ రోజు :** ఏనుగు – గుర్రం – దాసదాసీజనం – దానంగా ఇవ్వాలి. దీనివల్ల విష్ణులోక ప్రాప్తి లభిస్తుంది.

**పన్నెండవ రోజు :** నువ్వులు – మేకలు – షోడశ మహాదానాలు చెయ్యాలి. దీనివల్ల సర్వపాప నివృత్తి కల్గుతుంది.

## పుష్కర సమయంలో పితృశ్రాద్ధం :

'శ్రద్ధయాదేయమ్' అన్నారు. శ్రద్ధగా చేయబడుతుందిగాన శ్రద్ధం అన్నారు. మనం నిత్యం ఇళ్ళల్లోను, గుళ్ళలోను దేవతా పూజాదులు ఎలా చేస్తామో అలాగే చనిపోయిన పెద్దవారిని గూర్చి కూడ మరణించి నప్పుడు కర్మకాండలు – మాసికాలు – తద్దినాలు – మహాలయాలు – తీర్థశ్రాద్ధాలు–పుష్కర శ్రద్ధాలు మొదలయిన వాటి రూపంలో శ్రద్ధగా అర్చన చెయ్యాలి. వాళ్ళు కూడ దేవతలే. వారిని పితృదేవలతంటారు. వారిని గూర్చి చేసే కర్మకాండల్ని చేస్తే వారు సంతోషించి ఆయువు – సంతానాభివృద్ధి –విద్య –ధనం – గౌరవం–సుఖం –కీర్తి – రాజ్యం – స్వర్గం – మోక్షం మున్నగు వాటిని కల్గిస్తారు అని చెప్పబడింది.

**"ఆయుః ప్రజాంధనం విద్యాం స్వర్గం మోక్షం సుఖాని చ**
**ప్రయచ్ఛంతి తథారాజ్యం నృణాంప్రేతాః పితామహాః"**

అందువల్ల పుత్రులయిన వారు పితరులు తరించడానికి వారిని ఉద్దేశిస్తూ పిండ – తర్పణ – దానాది పనులు తప్పక చెయ్యాలి.

## ఇంతకీ అసలు పుత్రుడంటే :

**"పున్నామోనరకాద్యస్మాత్ త్రాయతే పితరం సుతః**
**తస్మాత్ పుత్ర ఇతిప్రోక్తః స్వయమేవస్వయంభునా"**

అని. 'పుం'అనే భయంకరమైన నరకంనుండి పితృదేవతల్ని రక్షించి తరింపజేస్తాడు గనుక 'పుత్రు'డని బ్రహ్మయే స్వయంగా చెప్పాడు.

**'పూరణాత్ త్రీయత ఇతి పుత్రః'** అని బృహదారణ్యకోపనిషత్‌లో చెప్పబడింది.

**"యదా ప్రైష్యన్మన్యతేఽథపుత్ర మహత్వం**

బ్రహ్మత్వం యజ్ఞస్యం లోక ఇతి సపుత్రః ప్రత్యాహాహం బ్రహ్మాహం యజ్ఞోఽహం లోక ఇతి (1.అధ్యాయం, 5.బ్రాహ్మణమ్; 17. మంత్రం) అని పుత్రశబ్దానికి నిర్వచనం చెప్పబడింది. దీనికి శ్రీశంకరా చార్యులవారు తన భాష్యంలో ఇలా చెప్పారు.

# కృష్ణా పుష్కర వైశిష్ట్యం

'చనిపోతానని తెలిసిన పిమ్మట తండ్రి తన భారాన్ని అప్పగిస్తూ కొడుకుతో 'నీవే బ్రహ్మ - నీవే యజ్ఞం - నీవే లోకం' అంటాడు. అప్పుడు కొడుకు తండ్రితో 'నేనే బ్రహ్మ - నేనే యజ్ఞం - నేనే లోకం' అని అంటాడు. 'నేనేమో నాకు ఓపిక ఉన్నంత వరకు వేదాధ్యయనం చేసాను. దాని తర్వాత ఏదైనా మిగిలి ఉంటే అది నీవు చెయ్యాలి. యజ్ఞ యాగాదులతో చెయ్యవలసిన శేషం ఉంటే అది నీవు చెయ్యి. నీకు జయించవలసిన అనగా పొందవలసిన లోకాలకై ఏమైన నేను చెయ్యవలసి ఉంటే వాటిని నీవు చేయవలసిందని తండ్రి కోరతాడు. అంతట కొడుకు తన అంగీకారాన్ని తెలుపుతాడు. ఇలా తండ్రి చెయ్య వలసిన పనుల్ని పూర్తి చేయడం అనే పూరణం చేస్తాడు కనుక పుత్రు డనబడతాడు. అందువల్ల పుత్రుడు చెయ్యవలసింది ఏమిటంటే -

**"జీవతో వాక్యకరణాత్ మృతే పిండాది దానతః**
**గయాయాం పిండదానాచ్చ భవేత్ పుత్రస్య పుత్రకా"**

తండ్రి జీవించి ఉన్నప్పుడు ఆయన మాటననుసరించి చెప్పినట్లు చెయ్యడం - మరణించాక పిండ, తర్పణ, దానాదులు ఇవ్వడం - ఆపైన గయాశ్రాద్ధం చెయ్యడం అనే కర్మల ద్వారానే పుత్రుడు పుత్రుడని పించుకొంటాడు కాని ఆస్తిపాస్తులు పంచుకోవడానికి మాత్రం కాదు. అస్తిపాస్తులు అనేవి అనుభవించడానికేగాని పితృముక్తికి కాదు.

కొడుకులు ఎక్కువమంది కలగాలని తలిదండ్రులు కోరుకోవాలిట. ఒక్కకొడుకు కొడుకుకాదని, ఒక్కకొడుకున్న తల్లి గొడ్రాలుతో సమానమని శాస్త్రాలో చెప్పబడింది. ఎక్కువమంది పుత్రులుంటే వారిలో అందరు అన్ని కర్మలు తమను గూర్చి చెయ్యలేకపోయినా కనీసం ఒక్కడైనా చేస్తాడని వారి ఆశ. ఒక్కడే ఉన్నచో వాడు విషయలంపటుడు - అయిష్టుడు - భార్యా విధేయుడు - తీరికలేనివాడు - ధనహీనుడు - అకాల మృత్యువశం అయినవాడు అయి పితరుల గూర్చి పట్టించు కోకపోవచ్చు. కనుక కనీసం ఇద్దరైన కొడుకులుండాలి.

పితరులనుద్దేశించి వీరు కోరే విధంగా పిండ, జలతర్పణ, దానా దులు కొడుకులు తప్పనిసరిగా చేస్తూ శ్రాద్ధం ఆచరించాలి. పితరులు అన్నపుడు 'మాతా పితాచ పితరౌ' అని తల్లిదండ్రులు ఇద్దరికి అని అర్థం. పుత్రులు తల్లి తండ్రి మొదలగు పితృదేవతల్ని ఉద్దేశించి 'షణ్ణ వతి' శ్రాద్ధాలు చెయ్యాలని చెప్పబడింది.

మన్వాదులు - 14; మహాలయాలు-16 (భాద్రపద బహుళ పాడ్యమి నుండి ఆశ్వయుజ శుద్ధపాడ్యమి వరకు); యుగాదులు-4; సూర్యసంక్రమణాలు-12; అమావాస్యలు-12; వ్యతీపాతాలు-13; వైధృతులు-13; అన్వష్టకాలు-12 మార్గశిర-పుష్య-మాఘ-ఫాల్గున మాసాల్లోని బహుళ సప్తమి-అష్టమి-నవమి తిథులు); ఈ మొత్తాన్ని షణ్ణవతి అంటారు. ఈ రోజుల్లో పితృదేవతా తృప్తి కొరకు పిండ, జలతర్పణ, దానాదులు చెయ్యాలన్నారు.

నేడు తల్లిదండ్రుల నుద్దేశించి తద్దినం పెట్టేవారే కరవయ్యారు. ఏ కొద్దిమందియో మినహా. అసలు చనిపోయినప్పుడు తలకొరివి పెట్టేవారే లేక ఎవరెవరో పెడుతున్న రోజులివి. కాలమహిమ. పితృ దేవతల శాపాలకు గురియై బాధలు పడకుండా ఉండాలంటే కొడుకులు వారిని ఉద్దేశించి కర్మకాండలు తప్పక ఆచరించాలి.

పుష్కరాది శ్రాద్ధాదుల్లో ఎవరెవరిని ఉద్దేశిస్తూ పిండ, తర్పణాలు చెయ్యాలంటే -

**"ఆదౌపితా, తథామాతా సాపత్నీ జననీ తథా**
**మాతా మహాస్సపత్నీకాః ఆత్మీపత్న్యస్త్వనంతరః**
**సుతభ్రాతృ పితృవ్యాశ్చ మాతులా స్వప భార్యకాః**
**దుహితా భగినీచైవ దౌహిత్రో భాగినేయకః**
**పితృష్వసా మాతృష్వసా జామాతా భావుక స్నుషా**
**శ్వశురో స్యాలకశ్చైన స్వామినో గురు రర్థినః"**

తండ్రి - తండ్రి తండ్రి - తండ్రి తాత; తల్లి - తల్లి తండ్రి - తల్లి తాత; (వీరిని వర్గత్రయమంటారు). తన భార్య కొడుకులు; అన్నదమ్ములు; పెద తండ్రులు; పిన తండ్రులు; మేనమామమలు; కూతుళ్ళు; అక్కచెల్లెళ్ళు; కూతురు కొడుకులు; అక్క చెల్లెళ్ళ కొడుకులు; మేనత్తలు (తండ్రి అక్కచెల్లెళ్ళు); పిన తల్లులు - పెద తల్లులు (తల్లి అక్కచెల్లెళ్ళు); అల్లుళ్ళు; బావలు అనగా అక్కచెల్లెళ్ళ భర్తలు; కోడళ్ళు; పిల్లనిచ్చిన అత్తమామలు; బావమరుదులు అనగా భార్య అన్నదమ్ములు; సవతి తల్లులు; వారిపిల్లలు; రాజు; గురువు; అర్థులు అనగా ఎవరైనా తమకోసం పిండాలు వేయుము అని చెబితేవారు. వీరందరికి పుష్కర శ్రాద్ధంతో పిండాదులు ఇవ్వాలి. వీరిలో పురుషుల యొక్క భార్యలకు, స్త్రీల యొక్క భర్తలకు పిండాలు వదలాలి. వీరిలో చనిపోయిన వారికే గాని బ్రతికి ఉన్నవారికి పిండాలు వేయరాదు. అలాగే తండ్రి జీవించి ఉన్నవారు ఏ రకమైన శ్రద్ధాలు చెయ్యకూడదు. వీటిని గూర్చి అందరు తెలుసుకోవాలి.

ఏది ఏమైనా జీవనదులు మన దేశంలో ప్రవహించడం మన అదృష్టం. అవి మనకు భగవంతుడిచ్చిన ప్రకృతి సంపదలు. వాటి పుణ్యమా అని మనం ఇంత తిని నల్గురకు పెట్టగలుగుతున్నాం. అందుకు కృతజ్ఞతగా మనం వాటిని పుష్కర సమయంలోను, ఇతర వేళల్లోను పూజించాలి. స్నానాదులు చెయ్యాలి. దానధర్మాలు చెయ్యాలి. పితృదేవతలకు శ్రద్ధాదులు ఆచరించి వారికి ప్రీతి కల్గించాలి. ఈ కృష్ణా పుష్కర సమయంలో అందరు ఇవన్నీ చేసి తరిస్తారని ఆశిద్దాం.

చిరునామా : డా॥ సర్వాసీతారామ చిదంబరశాస్త్రి, జగ్గయ్యపేట-521175. చే పలుకు :- 9885383741

**శ్రీ వేటూరి సుందరరామ్మూర్తి**

# ధీరసమీరే... కృష్ణాతీరే

పరమ పవిత్రమైన పశ్చిమ పర్వతాలలో భూకైలాసంగా పేరు పొందిన గోకర్ణక్షేత్రంలో మహాబలేశ్వరంలో జన్మించిన కృష్ణానది ఆంధ్రదేశంలో తరంగ తాండవ మాడే పైరు పచ్చమాగాణమే - నేటి కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాలు. కాలక్రమేణా పరిపాలనా సౌలభ్యంకోసం విభజించిన తర్వాత మచిలీపట్నం కేంద్రంగా ఇప్పటి కృష్ణాజిల్లా ఏర్పడిన సంగతి అందరికి తెలిసిందే. ఇది పశ్చిమోత్తరంగా నల్గొండ జిల్లా సరిహద్దుగా ఏర్పడిన ప్రదేశము. ఒకవైపు కృష్ణానది, మరొకవైపు సముద్రము ఉత్తరాన పశ్చిమ గోదావరి జిల్లా దీనికి హద్దులుగా ఉన్నా హద్దెరుగని అంతులేని కళాసాహితీ సంగీత నృత్య సాంస్కృతిక రాజకీయ రంగాలకు అగ్రస్థానం వహించిన జిల్లా ఇది. ముక్త్యాల, వేదాద్రి, విజయవాడ, అయిలూరు, కపిలేశ్వర పురం, శ్రీకాకుళం, పాపవినాశనం, నడకుదురు, మోపిదేవి, విశ్వనాథ పల్లి, పెదకళ్లేపల్లి, హంసలదీవి వంటి హైందవ క్షేత్రాలతోపాటు జగ్గయ్యపేట, ఘంటశాల, వంటి బౌద్ధక్షేత్రాలు కూడ వెలసిన ప్రదేశమిది. కూచిపూడి, మొవ్వ, అవనిగడ్డ వంటి కళా సాంస్కృతిక క్షేత్రాలకు కూడ ఇది పుట్టినిల్లు. కేంద్రస్థానమైన బందరు సరేసరి. అది ఒకనాటి కళాసాంస్కృతిక విద్యావైజ్ఞానిక రాజధాని అని చెప్పవచ్చు.

ఇక సినిమా రంగానికొస్తే తొలి తెలుగు సినిమా ఆవిర్భావానికి నాందీ గీతము పలికిన శ్రీ రఘుపతి వెంకయ్య కృష్ణాజిల్లా వారే. తొలి తెలుగు సినీ నటి, మోహినీ రుక్మాంగద కథానాయిక అమ్ముల కృష్ణవేణి దివిసీమలోని నంగిగడ్డ నివాసిని. 1936లో ఆమె నటించిన ఆ చిత్రం తొలినాళ్ల తెలుగు చిత్రమని చెప్పవచ్చు. చలన చిత్ర పితామహుడైన రఘుపతి వెంకయ్యగారి పేర విశిష్టమైన సినీ కళాకారులకోసం రాష్ట్ర ప్రభుత్వం ఒక ఎవార్డుని నెలకొల్పిన సంగతి తెలిసినదే. ఆ తర్వాత ఆయన కుమారుడు రఘుపతి ప్రకాష్ తొలి థియేటరు నిర్మాతగా ప్రదర్శకులలో అగ్రస్థానీయుడు. మద్రాసులో తొలి తెలుగు స్టూడియో శోభనాచల స్టూడియో నిర్మాత మీర్జాపురం రాజాగారు ఈ జిల్లాకు చెందిన ప్రముఖులే. అలాగే చల్లపల్లి రాజా సారథి స్టూడియో నిర్మాత. సంఘ ప్రయోజనం కోసం ఆదర్శవంతమైన చిత్రాలను నిర్మించిన శ్రీ గూడవల్లి రామబ్రహ్మం ఈ జిల్లా ప్రముఖుడే. అలనాటి మేటినటి శ్రీమతి కన్నాంబ అవనిగడ్డ ఆడబిడ్డ. మహానటుడు శ్రీ యస్.వి.రంగారావు కృష్ణాజిల్లా నూజివీడుకు చెందినవారే. కళారాజకీయ రంగాలను ప్రభావితం చేసిన కథానాయకుడు శ్రీ నందమూరి తారక రామారావు, చలన చిత్ర సీమలో షష్టివత్సర కీర్తిమాన్ అయిన శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, నటభూషణ శ్రీ శోభన్‌బాబు ఈ జిల్లా ముద్దు బిడ్డలే. అలనాటి కాంచన నుంచి కుమారి, బెజవాడ రాజరత్నం వంటి వారి నుంచి నేటి రవళి వరకు కృష్ణాజిల్లాలో జన్మనెత్తినవారే. మహాదర్శకులు కె.యస్.ప్రకాశరావు, తాతినేని ప్రకాశరావు, వేదాంతం రాఘవయ్య, తాతినేని రామారావు, ప్రత్యగాత్మ, హాస్యబ్రహ్మ శ్రీ జంధ్యాల అన్నింటికి మించి విజయవాడ నివాసి కళాతపస్వి శ్రీ కె. విశ్వనాథ్, శ్రీ కె. రాఘవేంద్రరావు, వి.బి. రాజేంద్రప్రసాద్, కె.వి. నందనరావు, విజయభాస్కర్, కృష్ణమ్మ కన్నబిడ్డలే. ఈ రంగంలో చిరస్మరణీయులు పౌరాణిక బ్రహ్మ శ్రీ కమలాకర కామేశ్వరరావు వారి సోదరులు ప్రఖ్యాత పాత్రికేయులు శ్రీ కమలాకర వెంకటరావుగార్లను విధిగా స్మరించాలి.

## కృష్ణ సంగీతం

తిరువయ్యారులో నెలకొన్న శ్రీ త్యాగబ్రహ్మపాదాలను ఆశ్రయించి అంతేవాసులై శ్రీ ఆకుమళ్ల వెంకటసుబ్బయ్యగారు ఆ సంగీత బీజాన్ని తెచ్చి కృష్ణాతీరంలో పెదకళ్లేపల్లిలో నాటిన సుముహూర్తం ఎటువంటిదోగాని అది శాఖోపశాఖలై శ్రీ సుసర్ల దక్షిణామూర్తి ముఖద్వారాన మహా సంగీత కుటుంబమై వర్ధిల్లినది. సుసర్లవారి శిష్యులు శ్రీ పారుపల్లి రామకృష్ణయ్యగారు శిష్యులు జగత్ ప్రసిద్ధులు

డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణగారు ఈ కుటుంబంలోని వారే. శ్రీ క్రోవి సత్యన్నారాయణగారు, సీతారామయ్యగారు, హరినాగ భూషణంగారు, వారణాసి ఘంటయ్యగారు ఇత్యాదులెందరో మహా గాయకులు ఈ మండలానికి చెందినవారే. కర్ణేంద్రియాలకు హాయి కపిలవాయి రామనాధశాస్త్రి, తెలుగింటి రాధగా పేరు పొందిన శ్రీ పారుపల్లి సుబ్బారావు ఆంధ్ర బాల గంధర్వులనదగ్గ శ్రీతుంగల చలపతి, శ్రీ ద్వైతాగోపాలం, శ్రీ జొన్నవిత్తుల శేషగిరి రావు, రంగస్థల సంగీతానికి చేసిన సేవ చిరస్మరణీయం.

కర్ణాటక ఔత్తరాహిక సంగీతాలతోపాటు తన పేర ఒక సంగీత సంప్రదాయాన్ని సృష్టించి రసజగత్తుని ఉయ్యాల లూగించిన నవరస రాగాలడోల అమర గాయకుడు శ్రీ ఘంటసాల దివిసీమలోని టేకుపల్లి గ్రామ నివాసి. ఆంధ్రుల కీర్తిని ఐక్యరాజ్యసమితి జనరల్ ఎసెంబ్లీ వేదికపై ప్రపంచ దేశాల ప్రతినిధుల ముందు రాగయుక్తంగా చాటిన ఘనుడు మన ఘంటసాల. ఇటీవలే ఆయన పేర తపాలా బిళ్లను విడుదల చేసి భారత ప్రభుత్వం తనను తాను గౌరవించుకుంది.

## కృష్ణ సాహిత్యం

ఇది ఒక అనంతసాగరం. శ్రీనాధ మహాకవి వారసత్వానికి సాక్ష్యం. ఆ కవి సార్వభౌముని స్వస్థలం బందరుచేరువలో ఉన్న "కలుపటము ఒండే కాళీపట్నము" అని ఆయనే చెప్పుకున్నారు. ఇక ఉదయనంబి విలాసకర్త అజ్జరపు పేరయ్యా కవి ఈ జిల్లావాడే. కిం కవీంద్ర ఘటాపంచానన శ్రీ తిరుపతి వేంకట కవుల అవధానోద్య మానికి ఆటపట్టు కృష్ణామండలమే. అజరామరులైన ఈ జంట కవుల శిష్య కుటుంబం అనర్ఘరత్న భాండాగారము. పద్యరచనతోపాటు వచన రచనకు వన్నె, వాసి కల్పించిన వారు శ్రీ చెళ్లపిళ్ళ వేంకటశాస్త్రిగారు. సాహిత్య సరస్వతిని పల్లీయులకు, పామరులకు అందించిన అభ్యుదయ కవులు శ్రీ తిరుపతి వేంకట కవులు. అంతేకాదు పంచమ వేదమైన భారతగాధను "పాండవోద్యోగ విజయాల పేరిట" సామాన్యులకు అందుబాటులోకి తెచ్చిన మహనీయులు వారు.

ఆంధ్ర సాహితీ క్షేత్రంలో చెయ్యని వ్యవసాయం లేదు పండించని పంటలేదు అనిపించుకున్న బహుముఖ ప్రజ్ఞాశాలి మహాకవి శ్రీ విశ్వనాథ సత్యన్నారాయణ కృష్ణాతరంగ పంక్తిలో త్రుళ్లింతలాడిన ఉత్తుంగ తరంగము. మహా పరిశోధకుడు లఘు కావ్యకర్త. అన్నమయ్యను ఆంధ్రులకు ఉద్ధరించి చూపించిన చరిత్రకారుడు పండిత ప్రకాండులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి కృష్ణామండల మణి దీపమే. మహా పండితులు శ్రీ వేలూరి శివరామశాస్త్రి, సౌందర్య నంద కావ్యకర్తలు. పింగళి కాటూరి కవులు. హంపి క్షేత్ర కావ్యరచన ద్వారా భావ కవితకు బీజావాపన చేసిన శ్రీ కొడాలి సుబ్బారావు ఈ జిల్లావారే.

సినీ కవులైనా మహాకవులనతగిన శ్రీ మల్లాది రామకృష్ణ శాస్త్రి, శ్రీ పింగళి నాగేంద్రరావు కృష్ణాజిల్లా చిట్టిగూడూరు భోగిరెడ్డి పల్లి వాస్తవ్యులే. జానపద కవితా రసరాజు శ్రీ కొసరాజు రాఘవయ్య చౌదరి. శ్రీ జాలాది కృష్ణాజిల్లాకు సంబంధంతోపాటు బాంధవ్యం కూడ ఉన్నవారే. శ్రీ జంధ్యాల సినీ సంభాషణల రచనలోనేగాక కథా రచనలోను, దర్శకత్వంలోను అగ్రశ్రేణులుగా వెలుగొందారు. నార్ల చిరంజీవి, నేటి పరుచూరి బ్రదర్స్ సంభాషణల రచనలో పేరు గడించినవారే. తన కలం పోటుతో సాహిత్యం ద్వారా సాంఘిక విప్లవాన్ని తీసుకువచ్చిన శ్రీ గుడిపాటి వెంకట 'చలం' కృష్ణాజిల్లా తేలప్రోలు నివాసి. తొలి తెలుగు సాహితీ పత్రికను ప్రకటించడంతో పాటు అనేక మంది మహాకవుల కావ్యాలను నవలలను అంకితం తీసుకోవడమేకాక వెలుగులోకి తెచ్చిన సాహితీ హృదయులు శ్రీవాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాదు, బౌద్ధ వాఙ్మయాన్ని పరిశోధించి అనేక గ్రంధాలు రాసిన శ్రీ వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాదు, శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, 'నా జీవిత నౌక' గ్రంథం ద్వారా రచయితగా ప్రసిద్ధులైన సుప్రసిద్ధ రాజకీయవేత్త శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య, నిష్కామకర్మగా కృష్ణాపత్రిక సంపాదకులుగ ఆంధ్రజాతికి వైతాళికులుగ నిలిచిన శ్రీ ముట్నూరి కృష్ణారావు ఆంధ్రపత్రిక, ఆంధ్ర సచిత్రవారపత్రిక, భారతి పత్రికల ద్వారా సాంస్కృతిక పునరు జ్జీవనానికి రాజకీయ చైతన్యానికి సంస్కరణోద్యమానికి ఎనలేని సేవ చేసిన దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు కృష్ణవేణమ్మ సిగపూవులే. అలాగే శ్రీ శివలెంక శంభుప్రసాదు, ఆంధ్రప్రభ ద్వారా దిన పత్రికలకే కొత్త ఒరవడి తెచ్చిన ప్రతిభాశాలి శ్రీ నార్లవెంకటేశ్వర రావు కృష్ణా మండల వాసులే. విజయవాడ వేదికగా తెలుగు మాట్లాడే వారి నందరిని తనవార పత్రిక ద్వారా ఉర్రూతలూగిస్తున్న 'స్వాతి' పత్రిక సంపాదకుడు శ్రీ వేమూరి బలరామ్ కృష్ణాజిల్లావాసులే. ఆంధ్రుల దృక్పథాన్ని మార్చి కళాసాంస్కృతిక రాజకీయ వాణిజ్య రంగాలలో అగ్రగామిగా ఉండి ఆంధ్రరాష్ట్రాన్ని అగ్రస్థానంలో నిలబెట్టాలని కలలు కంటున్న 'ఈనాడు' పత్రిక వ్యవస్థాపకుడు సంపాదకుడు శ్రీ రామోజీరావుగారు కృష్ణామండలం కీర్తనకు ప్రాణప్రదమైన పల్లవి లాంటివారు శ్రీ ఏ.బి.కె.ప్రసాద్, శ్రీ కొల్లూరి కోటేశ్వరరావు, శ్రీ సామల రమేష్‌బాబు వంటి సంపాదకులు.

ఆనాడు ఎన్నడో 'శశిలేఖ' పత్రిక ద్వారా శ్రీ చల్లా సూర్యనారాయణ గారు ప్రారంభించిన సాహితీ వ్యాసాంగాన్ని కొనసాగించి ఇటీవలి వరకు పత్రికా రచనలో కృషి చేసిన శ్రీ రావూరి సత్యనారాయణరావు, శ్రీ రెంటాల గోపాలకృష్ణ, వి.వి.నరసింహారావు వి.వై.ఎల్ నరసింహారావు, జొన్నలగడ్డ రాథాకృష్ణయ్య, తుర్లపాటి కుటుంబరావు, లంక వెంకటరమణ ఈ జిల్లాకు చెందిన వారే. గోదావరి తీరాన చేరి యావదాంధ్ర గురుకులాన్ని నిర్మించి అద్వితీయ సాంస్కృతిక వికాసానికి, విద్యకు శిఖరాయమానులై వెలసిన బ్రహ్మర్షి శ్రీ రఘుపతి వెంకట రత్నం నాయుడుగారు బందరులో ఉదయించిన జ్ఞాన భాస్కరులు. శ్రీ కోపల్లె హనుమంతరావు, డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య, శ్రీ కాశీనాధుని పూర్ణమల్లికార్జునుడు, ప్రొ॥ కె.టి. రామారావు (కుర్తాళం పీఠాధిపతి) వంటి విద్యావేత్తలు బందరు నగరానికి వెలుగుబావుటాలు. నాస్తిక వాదంతో చాంధసత్వాన్ని చీల్చి చెండాడిన శ్రీ గోపరాజు రామచంద్రరావు (గో.రా) ఆంధ్ర నాటక కళాపరిషత్తుకు జీవం పోసిన శ్రీ.ఎమ్.ఆర్.అప్పారావు, సాహితీవేత్త తెలుగు వచన రచనలో తేనెలు కురిపించిన విమర్శకుడు, వ్యాఖ్యాత శ్రీ ఎమ్.వి.ఎల్ ఇలా ఎన్నో వివిధ రంగాలకు చెందిన మాన్యులు జన్మించిన ప్రదేశమే ఈ కృష్ణామండలం. ముకుందమాల రచించిన లీలాశుకుడు, కృష్ణలీలాతరంగిణి కర్తశ్రీ శివనారాయణ తీర్థులు శ్రీకాకుళం, వెల్లటూరు, వేదాద్రి, ఇత్యాది కృష్ణాతీర ప్రాంతాలకు చెందిన వారని ప్రతీతి.

## కృష్ణ కళారంగం

మొదట చెప్పిన ఎన్.టి.రామారావు, అక్కినేని నాగేశ్వరరావులతో పాటు విజయవాడ వాసిని విమల నటనా యశస్విని, మనస్విని అయిన మహానటి సావిత్రి కృష్ణామండలానికి చెందిన కళాకారిణి. అంతటి మహానటి, నవలామణి, పురాణపురంధ్రి, సాంఘిక చిత్రనటి ఇంతవరకు దక్షిణ భారత చలన చిత్ర సీమలో లేదంటే అతిశయోక్తి కాదు. నటిగ కేంద్ర, రాష్ట్ర అవార్డులు అందుకున్న నటీమణులు అర్చన, లయ కృష్ణాజిల్లా వారే. అలాగే గిరిజ, నిర్మల, అన్నపూర్ణ వగైరాలు కూడ. నేటి ప్రముఖ నటులు జగపతిబాబు, జె.డి.చక్రవర్తి, శ్రీహరి, వేలు వీరభద్రరావు, కోట శ్రీనివాసరావు కృష్ణానది కెరటాలే. మెరుపులా మెరిసి 'సీతాలు సింగారం మా లక్ష్మి బంగారం' అని పేరు తెచ్చుకున్న తాళ్లూరి రామేశ్వరి, ఒకనాటి నటులు పెరుమాళ్లు, చదలవాడ కుటుంబరావు, నటుడుగానే కాక నాటకరంగ చరిత్ర కారులుగా వన్నెకెక్కిన శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి ఇక్కడి వారే. హిందీ దిగ్దర్శకులు శ్రీ శాంతారామ్ పూర్వీకులది కృష్ణామండలమని ప్రతీతి. 'మధుర గాయకుడు మల్లిక్, నర్తకి మంజుభార్గవి, వేదాంతం సత్యనారాయణ, వెంపటి చినసత్యం, అయ్యంకి తాండవకృష్ణ, సంగీత సాహితీ ప్రతుడు శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు (ఆకాశవాణి). టి.వి. నటుడుగ, అచిరకాలంలోనే ప్రసిద్ధిగాంచి ఇటీవలే కన్నుమూసిన శ్రీ అచ్యుత్ కృష్ణాజిల్లావారే.

## కృష్ణా కదంబం

ఆంధ్ర రత్న శ్రీ దుగ్గిరాల గోపాల కృష్ణయ్య, ఆంధ్ర పితామహ శ్రీ మాడపాటి హనుమంతరావు, సుప్రసిద్ధ సాహితీవేత్త డా॥ కొమర్రాజు లక్ష్మణరావు, శాసనసభ తొలిస్పీకరు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు వీరందరు కృష్ణాజిల్లా పెనుగంచిప్రోలు, నందిగామ ప్రాంతీయులు, జాతీయ పతాక నిర్మాత శ్రీ పింగళి వెంకయ్య, జెండావీరుడు శ్రీ తోట నరసయ్య నాయుడు, జగత్ప్రసిద్ధ ఇంజనీరు కేంద్రమంత్రిగా పనిచేసిన డా॥ కె.ఎల్.రావు, శాసనమండలి అధ్యక్షుడు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య, వైద్యశాస్త్ర డైరక్టరు జనరల్‌గా పేరు తెచ్చుకున్న డా॥ కామరాజుగడ్డ నరసింహారావు (డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి అల్లుడు) నేటి వైద్యశాస్త్ర విశారదుడు డా॥ కాకర్ల సుబ్బారావు, సి.పి.ఐ. ప్రధాన కార్యదర్శిగ పేరుగాంచిన శ్రీ చంద్ర రాజేశ్వరరావు, మహానాదస్వర విద్వాంసులు దాలిపర్తి పిచ్చిహరి, సూర్యనారాయణ సోదరులు బందరు జాతీయ వీరులు శ్రీ తోట నరసయ్య, క్రికెట్‌క్రీడలో యావద్భారత కీర్తినార్జించిన శ్రీ సి.కె.నాయుడు శ్రీ సి.యస్.నాయుడు, జమ్ములమడక పిచ్చయ్య, కామినేని ఈశ్వరరావు, దండమూడి రాజగోపాలరావు, అర్జా జనార్దన్‌రావు, గ్రంథాలయోద్యమ సారధి శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య, మహారచయిత్రి శ్రీ తెన్నేటి హేమ 'లత', హిందూ లా (HINDU LAW) గ్రంధ రచయిత శ్రీ రెంటాల వెంకటసుబ్బారావు, త్రిదండి రామానుజ జియ్యర్ (వైష్ణవ గురువు) ఆంధ్రనాయక శతకకర్త కాసుల పురుషోత్తమ కవి, బహుకావ్య రచయిత శ్రీ నాదెండ్ల పురుషోత్తమ కవి సంస్కృతాంధ్ర పండితులు గురువు శ్రీమాన్ ఎస్.టి.జి. వరదాచార్యులు, ఆయుర్వేద వైద్యరంగాలలో అద్వితీయులై ఇతర రాష్ట్రాలలో కూడ పేరు తెచ్చిన ఆయుర్వేదాశ్రమ నిర్మాత దీవి గోపాలాచార్యులు ఆయన శిష్యులు శ్రీ వేటూరి శంకర శాస్త్రి, వడ్లపూడి నారింజతో సకల రోగాలు నిర్మూలించిన డా॥ కోకా అహోబలరావు, మహోపన్యాసకుడు, ఉపదేశకుడు శ్రీ చెరుకువాడ నరసింహం పంతులు, కృష్ణమ్మ కీర్తి చంద్రికలు. ఆరుకాలాల ఆమని కోయిల శ్రీమతి జానకి, శ్రీమతిరావు బాల

సరస్వతి కృష్ణా తీర బృందావనాలలో మధుర గానం చేసిన వారే. అలనాటి మహా వీరులు జాయపసేనాని, మరాఠి వెంకటబొట్లు శంకరపీఠాధిపతి సోమశివాచార్యులు, కృష్ణాజిల్లా దివిసీమవారే. అపర ధన్వంతరి కదళీ మహాత్మ్యకావ్య కర్త శ్రీ వేటూరి సుందరశాస్త్రి, హరికథకుడు గాయకులు జంత్రగాత్ర ప్రవీణులు శ్రీనేతి శ్రీరామశర్మ, ముట్నూరు కుటుంబరావు భాగవతార్, అమ్ముల విశ్వనాధభాగవతార్ దివిసీమవారే. శ్రీనాధపాత్రధారిగ చిరస్మరణీయులు శ్రీ జంధ్యాల గౌరీనాధ శాస్త్రి. శ్రీ జలసూత్రం రుక్మిణీనాధశాస్త్రి, రాజకీయాలలో పేరెన్నికగన్న ప్రజ్ఞావంతులు డా॥ లంక సుందరం, శ్రీ కొల్లిపర వెంకటరత్నం నాయుడు, శ్రీ కాకాని వెంకటరత్నం, శ్రీ అడుసుమిల్లి గోపాలకృష్ణయ్య, శ్రీ పేట బాపయ్య, గుత్తివంకాయ కూర ఘుమ ఘుమలు నర్తకి వేషంలో నల్గురికి వెదజల్లిన శ్రీ బి.వి. నరసింహారావు, కొమరవోలు ఆశ్రమ నిర్మాత శ్రీ ఎర్నేని సుబ్రహ్మణ్యం (ఈ ఆశ్రమ వాసిగ అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములు గాంధేయ జీవితాన్ని గడిపారు) శ్రీ సాధు రామకృష్ణయ్య శ్రీ సుసర్ల కృష్ణమూర్తి వంటివారు కృష్ణతీరంలో గాంధీతత్వ ప్రచారానికి కృషి చేశారు.

### మీది బందరా?

మాది బందరు అంటే ఒకప్పుడు ఎంతో గొప్ప. అచట పుట్టిన చిగురు కొమ్మైన చేవ అని బందరు పేరు తెచ్చుకుంది. ఇది శ్రీ జంధ్యాల ఒక చిత్రంలో ఎంతగానో చొప్పించి అద్భుత హాస్యం సృష్టించారు. ఒకనాడు బందరు అఖిలభారత విద్యావైజ్ఞానిక సాంస్కృతిక వాణిజ్య కేంద్రాలలో ఒకటిగా వెలుగొందింది. తొక్కుడు లడ్డు నుంచి జీడిపప్పు పాకం వరకు బందరు మిఠాయి అంటే ప్రసిద్ధి. రోల్డుగోల్డు కవరింగు ఆభరణాలకు బందరు పెట్టిందిపేరు. తింటే బందరు చామదుంపలకూరే తినాలి అని రసికులు చెప్పుకునేవారు.

ఆ బందరు మహానగరం ఈనాడు గత శతాబ్దపు ప్రాభవానికి శిధిలసాక్షిగ మిగిలిందంటే అది ఆంధ్రుల దురదృష్టం. డా॥ అనిబిసెంట్, మహాత్మాగాంధీ, ఛటోపాధ్యాయ మున్నగు మహనీయులు అనేక సార్లు బందరు వచ్చి అక్కడ విద్యా సాంస్కృతిక రంగాలకు చేయూత నిచ్చినవారే. ఆ కృషిలో భాగస్వాములైన వారే. శ్రీ కోపల్లె హనుమంత రావుగారు ప్రారంభించిన జాతీయ విద్యాకేంద్రము (National College) సహాయార్థం మహాత్మాగాంధీ ఏ.ఐ.సి.సి. నిధులనుంచి వేలరూపాయలు పంపించడం కన్న ఆ విద్యాలయ విశిష్టతకు సాక్ష్యమేమి కావాలి? అలాగే అనిబిసెంటమ్మగారు Theosophical Society నిధులనుంచి భూరి విరాళాన్ని పంపిన సందర్భం మరపురానిది. భారత పూర్వరాష్ట్రపతి డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ అధ్యాపకులుగ చాలాకాలం బందరులో ఉండేవారు. తొలి శాస్త్రీయ పరిశోధక కేంద్రం ఆంధ్రాసైంటిఫిక్ కంపెనీ. బందరులో డా॥ పట్టాభిగారి దూరదృష్టికి నిదర్శనం. ఆంధ్రాబ్యాంకు వంటి వాణిజ్య ఆర్థిక సంస్థను స్థాపించిన బహుముఖ ప్రజ్ఞాశాలి డా॥ పట్టాభిగారు. అఖిలభారత కాంగ్రెసుకు అధ్యక్షులై 'History of Congress' అనే మహాగ్రంధ రచనతో ఆంధ్రదేశానికి ఖ్యాతి తెచ్చిన డా॥ పట్టాభి బందరు వాస్తవ్యులు. బందరే పట్టాభి. పట్టాభే బందరు. అన్న నానుడి పుట్టింది పట్టాభిగారికి బందరుతో ఉన్న అద్వితీయ అనుబంధం వల్లనే. "నా శరీరంలో ఉన్న నీరు, నిప్పు, గాలి, ఆకాశం, మట్టి బందరువే. నేను నడుస్తున్న బందరుని, రేపు నా శరీరం బందరు మట్టిలోనే కలిసిపోవాలి." అని కలలుగన్న డా॥ పట్టాభి చివరకు హైదరాబాదులో కన్నుమూయడం జరిగినా యావజ్జీవితం బందరుకే అంకితం చేశారు ఆయన. గాంధీ మహాత్ముని అంతరంగికుడుగా, సూత్రధారిగా సుప్రసిద్ధులు పట్టాభిగారు.

"చిక్కుచు మోకాళ్ళ జేతులూదుచును
వంగుచు వ్రాలుచు తొంగుచు జనుచు
చేదుకో మల్లయ్య చేదుకొమ్మనుచు
గమకని పాటలకట్టి పాడుదము"

–పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్ర నుండి

శ్రీ నాగినేని లీలాప్రసాద్

# పుష్కరాలు - ప్రాశస్త్యము

తుందిలుడు అనే ఒక మహానుభావుడు ఉండేవాడు. ఆయన శివుని గూర్చి ఘోర తపస్సుచేశాడు. ఆ తపస్సుకు ఎంతో సంతోషించి శివుడు ప్రత్యక్షమయ్యాడు. ఏంకావాలో కోరుకొమ్మన్నాడు. తుందిలుని ఆనందానికి అవధుల్లేవు – "భగవన్! నీలో శాశ్వతంగా నాకోస్థానం కావాలని కోరుకొన్నాడు. ఈశ్వరుడు ఆనందపడి తన అష్టమూర్తులలో ఒకటైన జలంలో శాశ్వత నివాసం కల్పించాడు.

సకల జీవరాశులును పోషించే శక్తి జలంలోనే ఉందిగదా! జలం లేకపోతే ప్రాణమే లేదు–అన్నింటికి మూలము జలమ్ –అసలు జల ప్రాంతాలనుండి మనసంస్కృతి ప్రారంభమైందని కూడచరిత్ర చెప్పుంది. ఎందుకంటే అతి ప్రాచీనకాలంలో మానవుల సహజీవనం నదీ ప్రాంతాల నుండే ప్రారంభమైంది గదా! అంతటి ప్రభావవంతమైంది జల ప్రాంతం అటువంటి జలాల్లోనే ఆయనకు శాశ్వత స్థానం లభించింది.

శివుని ఆజ్ఞ ప్రకారం తుందిలుడు జలాల్లో నివసిస్తూ జనులకు పోషకుడయ్యాడు. పోష్యతే ఇతి పుష్కర: అందుకే ఈ తుందిలుడే పుష్కరుడు అనికూడ పిలువబడసాగాడు.

ఈ తప:ప్రభావం గల పుష్కరుని నివాసంలో నదీజలాలు గొప్ప ప్రభావం కలవిగా అయ్యాయి. ఇది ఇలా ఉండగా

బ్రహ్మదేవుడు సృష్టిచేసే కార్యక్రమంలో నిమగ్నమయ్యాడు. అప్పుడా యనకు నీటితో ఎంతో అవసరం ఏర్పడింది. జలంకోసం పరమశివుని గూర్చి తపస్సుచేశాడు. గంగాధరుడు ప్రత్యక్షమయ్యాడు – 'జలమంత టికి అధిపతి పరమపవిత్రుడైన పుష్కరుని తనకు ప్రసాదింపమని కోరాడు – అదిలోకోపకారం కోసమైన కోరిక కాబట్టి – అడిగినవాడు బ్రహ్మదేవుడు కాబట్టి ఎంతో ఆనందంగా అంగీకరించాడు శివుడు. ప్రసన్నుడయ్యాడు – పుష్కరునకు ఆదేశాలిచ్చాడు బ్రహ్మ దేవునితో ఉండమని. పుష్కరుడు జలరూపదేవుడు కావున బ్రహ్మగారి కమండలంలో ప్రవేశించాడు – అక్కడే స్థానమేర్పరచుకున్నాడు.

అత్యవసర సృష్టికార్యం నెరవేర్చిన బ్రహ్మను దేవతా గురువైన బృహస్పతి సందర్శించి "అయ్యా! నీవు సృష్టించిన ఈ సకలచరాచర జీవకోటికి ప్రాణాధారం జలం గదా! వీటన్నింటికినీ జీవనక్రియను నెరవేర్చడానికి జలాన్ని నాకు ప్రసాదించమని" కోరాడు.

ఆ కోరికను కూడ ప్రాణుల జీవనాధారానికే కోరాడు బృహస్పతి – అని గ్రహించాడు బ్రహ్మదేవుడు–ఎంతో ఆనందించాడు – పుష్కరుని పిలిచి బృహస్పతి కోరిక ప్రకారం అతనిని అనుసరించి వెళ్ళమన్నాడు.

పుష్కరుడు అందుకు అంగీకరించలేదు–దానికి కారణం బ్రహ్మదేవుని వదలి ఉండలేనని చెప్పాడు. అటువంటి సమయాన బృహస్పతి – బ్రహ్మదేవుడు– పుష్కరుడు ముగ్గురూ కలిసి ఒక నిర్ణయానికి వచ్చారు.

ఆ నిర్ణయం ప్రకారం బృహస్పతి సూక్ష్మరూపంలో గురుగ్రహంగా మారి మేషం మొదలు పన్నెండు రాశులలో ప్రవేశించేటప్పుడు బృహ స్పతితో పుష్కరుడు కలిసి ఆయానదులలో ప్రవేశించాలి. ప్రవేశించినది మొదలు పన్నెండురోజులు సంవత్సరం మొదటి పన్నెండు రోజులు – సంవత్సరం చివరి రోజులలో – పూర్తికాలం (ఇరవైనాలుగు రోజుల పాటు)బృహస్పతితోనే ఉండాలి. ఈ మధ్యకాలంలో మాత్రం మధ్యాహ్న సమయాల్లో రెండు ముహూర్తాల కాలంపాటు బృహస్పతితో, పుష్కరుడు ఉండాలనే ఒక ఒప్పందం కుదుర్చుకున్నారు – ఆయాసమయాలను తప్పిస్తే మిగిలిన సమయమంతా బ్రహ్మగారి కమండలమే తనకు శాశ్వత నివాసమౌతుంది కాబట్టి ఈ నిర్ణయానికి పుష్కరుడు ఎంతో ఆనందించాడు–బృహస్పతిని అనుసరిస్తూ ఆయాసమయాల్లో ఆయనతో పాటు నదీ ప్రవేశం చేయసాగాడు. అదే పుష్కరకాలంగా (పుష్కరుడు ప్రవేశించిన సమయం కాబట్టి) పరిగణింపబడుతూ వచ్చింది.

**రాశులను బట్టి బృహస్పతి ప్రవేశించే నదులు**

| | |
|---|---|
| మేషరాశి – గంగానది | తులారాశి – కావేరీనది |
| వృషభరాశి– నర్మదానది | వృశ్చికరాశి – భీమానది |
| మిధునరాశి– సరస్వతీనది | ధను:రాశి – పుష్కరవాహిని – రాధ్యసాగరనది |
| కర్కాటకరాశి–యమునానది | మకరరాశి – తుంగభద్రానది |

సింహరాశి - గోదావరి నది కుంభరాశి - సింధునది
కన్యారాశి - కృష్ణానది మీనరాశి - ప్రాణహితనది.

ఈ రాశులను బట్టి బృహస్పతి ఆయా నదులలో ప్రవేశిస్తాడు. అప్పుడు ఆ నదులకు పుష్కరకాలంగా లెక్కింపబడుతుంది. ఆ రాశి ఉన్నంతకాలం ఆ నదికి పుష్కర సమయంగా పరిగణింపబడుతుంది. సాధారణంగా ఒక సంవత్సరకాలం పుష్కరకాలంగా లెక్కిస్తారు.

పుష్కరుడు బృహస్పతితో పూర్తిగా కలిసి ఉండేకాలం కాబట్టి పుష్కర సంవత్సరంలో మొదటి పన్నెండు రోజులను ఆది పుష్కరమని, చివరి పన్నెండు రోజులను అంత్య పుష్కరమని అంటారు. ఆది పుష్కరానికంటే అంత్య పుష్కరానికే అధిక ప్రాముఖ్యం ఉంటుందని ప్రజల ప్రబల విశ్వాసము. ఇవి పుష్కర ప్రత్యేక ప్రభావిత రోజులని విశ్వసిస్తారు.

ఎప్పుడైతే బృహస్పతి రాశికాలాన్నిబట్టి నదిలో ప్రవేశింపనున్నాడో ఆ రాశి ప్రవేశ సమయాన సప్తఋషులు గురుదేవుడైన బృహస్పతికి ఆహ్వానం పలకటానికి సూక్ష్మరూపధరులై ఆయానదులలో ప్రవేశిస్తారు. ఇంత ప్రభావవంతులున్నారు గదా అని ఆధ్యాత్మిక పరులు కావున దేవతలంతా కలిసి ఆనందంతో సూక్ష్మరూపధారులై ఆ సప్తఋషులతో పాటు ఆ నదిలో ప్రవేశిస్తారు.

అంటే... ఇప్పుడు పుష్కరుడు, బృహస్పతి, సప్తఋషులు, సకల దేవతలు సూక్ష్మరూపధరులై ఆనదిలో ప్రవేశించి ఉన్నారన్నమాట చూడండి. ఒకేసారి పుష్కర సమయాన ఎంతోమందితో కలిసి ఉందో ఆనది.మరి అప్పటి ఆ నదీజలప్రభావాన్ని, పవిత్రతను అంచనావేయ గల శక్తి ఎవరికుంటుంది చెప్పండి.

ఆ సమయాన నదీజలానికి ఇంత పవిత్రత వస్తుంది కాబట్టే తర్పణం,పిండప్రదానం,శ్రార్ధ కర్మలు చేసి పితృదేవతలను తృప్తి పరచి ఆశీస్సులను అందుకోవడం ఎంతో శ్రేయోదాయకమని ప్రజలమన స్ఫూర్తి విశ్వాసం -ఇంత గొప్ప ప్రభావం కలిగి ఉంటుంది. కాబట్టే ఎక్కడ ఏనదికి పుష్కరాలు జరిగినా దూరదూర ప్రాంతంలో నుండి ప్రజావాహిని కదిలివచ్చి ఈ పుణ్యనదులలో స్నానాలాడి పితృదేవతలకు పిండప్రదానాలు చేసి ఎంతో తృప్తి పొందుతారు. పితృదేవతలకూ తృప్తిని కలిగిస్తారు.

అయితే ఈ పుష్కర సమయంలో ఈ నదీపరీవాహక ప్రాంతాలలో ఉన్నవారు ఎంతో పవిత్రంగా ఆరాధనా భావంతో మొదటి చివరి పన్నెండు రోజులు తప్పనిసరిగా మిగిలిన రోజులలో వీలైనన్నిమార్లు పుష్కరస్నానాలుచేస్తారు. పసుపు కుంకుమ, పూలు పళ్ళతో పూజిస్తారు. తప్పనిసరిగా పిండ ప్రదానాలు చేస్తారు-బంధుమిత్రాదులను ఆహ్వానించి వారి చేతకూడ పూజాది కార్యక్రమాలు చేయిస్తారు. ఇంత పవిత్ర భావాన్ని కల్పింపజేసిన వీరిలో ఒక అభిప్రాయం మాత్రం గట్టిగా నాటుకొనిపోయింది. దానికి సరైన నిర్దిష్టమైన "ఇదీ" అని చెప్పటానికి కారణం మాత్రం లభించుటలేదు అదేమంటే....

ఈ పుష్కరనదికి సమీపంలో ఉన్న నివాసులు ఆ పుష్కర కాలంలో అంటే పుష్కరం ప్రారంభమై ముగిసేంతవరకు అంటే ఒక సంవత్సరం కాలం పాటు వివాహాది శుభకార్యాలేవీ చేయరు.

ఒకవేళ అటువంటి శుభకార్యక్రమాలు ఏవైనా తప్పనిసరిగా నిర్వహింపవలసివస్తే ఆ నదీ ప్రాంతానికి దూరంగా వేరే ప్రాంతాలకు పోయి అక్కడ "అయ్యింది" అనిపించుకొని రావటం ఒక ఆనవాయితీగా జనంలో ఆచారంగా మారింది.

అనారోగ్య కారణానగాని - మరేవిధమైన అడ్డంకులు కలిగిన ఇతరకారణాలవల్లగానిస్నానం చేయటానికి అవకాశమే కలగక బాధపడే పరిస్థితే ఏర్పడితే నదివద్దకు పోయి - నదీమతల్లికి మనసారా కనుల నిండుగా పండుగగా దర్శించి నమస్కరించి మూడుమార్లు శిరస్సుపై ఉదకాన్ని చల్లుకొంటే పుష్కరస్నా పవిత్రత తప్పక లభిస్తుంది అంటారు.

ప్రజలలో ప్రగాఢమైన నమ్మిక మరొకటి ఉంది.

ఏమనిషైనా మనసావాచా కర్మణా పరిశుద్ధమైన భావంతో ఒక్కసారి పుష్కరస్నానంగాని చేస్తే.... పన్నెండు సంవత్సరాల కాలంలో పన్నెండు పుణ్యనదులలో స్నానంచేసిన గొప్ప పుణ్యం లభిస్తుందని అశ్వమేథయాగం చేసినంతటి పుణ్యం లభిస్తుందని ప్రజల ప్రగాఢ నమ్మిక మాత్రమే కాదు-ఋషుల అతి ప్రభావ పవిత్రవాక్కు కూడ

## అయితే పుష్కర సమయాన స్నానంచేసిన తరువాత దానం చేయవలసిన వస్తువులు

బంగారం,వెండి,ధాన్యం, భూమి, వస్త్రాలు,లవణం,బెల్లం, రత్నాలు, అశ్వం,ఫలాలు, నెయ్యి, నూనె, పాలు, తేనె, శకటం, వషభం, నాగలి, ఔషధం, కర్పూరం, చందనం, కస్తూరి, గృహం, పీట, మంచాలు, కందమూలాలు, పుష్పాలు, పుష్పమాలలు, దాసీజనం, కన్యలు, కంబళి, కూరగాయలు సాలగ్రామం, పుస్తకాలు, ఏనుగులు, తిలలు..

ఇవేగాక చెప్పులు-గొడుగులు, నిత్యావసరవస్తువులు(దానం పుచ్చుకొనేవారికి అవసరమైనచో) ఇత్యాదులను కూడ దానం చేయవచ్చును

వీటిని అన్నిటిని ప్రస్తుత కాలంలో దానం చేయటం చాల కష్టదాయకమైనపని - కనుక తమతమ వీలునుబట్టి - దానం చేయగల ఓపికను బట్టి ఇందులో ఏవేని దానం చేసిన అంతటి పుణ్యాన్ని పొందవచ్చు -ఈ దానపుణ్యఫలం పొందటానికి ముఖ్యంగా కావలసింది - త్రికరణ

శుద్ధి అంటే మనసా వాచా కర్మణా పరిపూర్ణమైన సద్భావనతో దానం చేయటమే ముఖ్యం.అటువంటి భావనతో ఇచ్చిన చిన్నదానమైనా ఇవన్నీ ఇచ్చిన దానఫలితాన్ని పొందగలరు - అని శాస్త్రాలే చెప్తున్నాయి

దాహాన్ని తొలగించడం, దేహాన్ని శుభ్రపరచడం నీటికి గల బాహ్య శక్తులైతే మేధ్యం (పాపాలు పోగొట్టటం) యజ్ఞనం (వివిధద్రవ్య శుద్ధి) నీటికి గల ఆంతరంగిక శక్తులని పురాణాలు చెప్తున్నాయి -

తీర్థస్నానం ఉత్తమమని -దానికంటె నదీస్నానం ఉత్తమోత్తమ మని, దానికంటె పుష్కరస్నానం ఉత్తమోత్తమ పరమపవిత్రమని ఋషి వాక్కు మోక్షప్రాప్తి కలుగుతుందని బ్రహ్మాండ పురాణం చెబుతుంది.

తైత్తరీయ ఉపనిషత్తు ఇంకా వివరంగా ఈ విషయాన్ని తెలియ జేస్తుంది.

నదీజలాలలో పవిత్రభావంతో స్నానం చేస్తే సకల పాపాలు కడిగి వేయబడతాయని నదీ జలస్నాన ఫలితంగానే బుద్ధిమాంద్యం, అలసత్వం, శారీరక రుగ్మతలు నశించి పరిపూర్ణ ఆరోగ్యం కలుగుతుందని స్పష్టంగా చెప్పబడిఉంది.

## పుష్కర విధులు

"కన్యాగతే గురౌ యద్యత్సప్తకోట్యఘనాశం
స్నానమాత్రేణ సర్వేషాం తావత్పుణ్య వివర్ధనం
భూతలే యానితీర్థాని తాని కన్యాగతే గురౌ
ఆయాంతి కృష్ణవేణీంతు మహాపుణ్య ఫలాయ చ
బ్రహ్మ విష్ణు రుద్రశ్చ ఇంద్రాద్యా స్సర్వ దేవతాః
పితరో ఋషయశ్చై వతత్రైవ నివసంతి హి
కృష్ణాయాః పుష్కరే కృత్వాస్నానం దానం చ పైతృకం
గంగాయాః కోటిగుణితం ఫలమాప్నోతి మానవః
యస్యాం తిథౌ గురుర్యాతి కన్యయా చ సమాగమం
కృష్ణాయాంతు తదా స్నానం ప్రయత్నేన సమాచరేత్"

శ్రీ కృష్ణవేణీ పుష్కర స్నానం ఏడు జన్మల ఏడు కోట్ల పాపాలను తొలగించి కోటికోటి పుణ్యాలను కలగజేస్తుంది. సర్వదేవతా సన్నిహిత మైన కృష్ణలో సర్వ ప్రయత్నాలు చేసి విధిగా పుష్కర స్నానం చేయాలి. పుష్కర విధులు నిర్వర్తించాలి.'పుణతిశుభంకరోతి ఇతిపుణ్యం' అని అమరకోశ వివరణం, దేహానికి, ఆత్మకు దేహాత్మలను అనుసంధానం చేసే మనస్సుకు శుభప్రదమైన సంస్కార సన్నిహితం చేసే అనుభూతి పుణ్యం. అట్టి పుణ్యానుభూతిని పుష్కలంగా ప్రసాదించేది పుష్కరం.

పూర్వకాలంలో సౌవీర దేశాన్ని సుమతి అనేరాజు పాలించేవాడు. అతని ఏకైక పుత్రుడు చిత్రరథుడు. కృత్స్నమదుడు అనే మహర్షి కృష్ణా పుష్కరయాత్రకు బయలుదేరి మార్గమధ్యంలో సౌవీర దేశంలో మకాం చేశాడు. ఆ మునిని సుమతి అనేరాజు ఆహ్వానించి యథోచిత అతిథి పూజ చేసి తన ఏకైక పుత్రుని జాతకం పరిశీలింపమని ప్రార్థించాడు. జాతకం సాధారణ దృష్టితో చూచాడు. తరువాత దివ్య దృష్టితో విషయం గ్రహించాడు.

"పూర్వం చోళదేశంలో సుధర్ముడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతని కుమారుడు సుశర్మ. సుశర్మ వేదవేదాంగ పారంగతుడు. సుధర్ముడు తల్లి బాధ్యత సుశర్మకు అప్పగించి తామ్రపర్ణీనదీతీరానికి వెళ్ళి యోగసిద్ధిపొంది ముక్తుడయ్యాడు. తల్లి సుఖ జీవనానికి పాటుపడే సుశర్మ కృషికి భార్యమూలంగా అంతరాయం కలిగింది.తల్లికి ఇల్లాలుకి మధ్య యేర్పడిన కలహం మూలంగా తల్లిని ఇంటినుండి సుశర్మ వెడల గొట్టాడు. తల్లి వ్యాధితో, వృద్ధాప్యంతో అనాధగా తుదిశ్వాస వదిలింది. మాతృపీడా పాపంమూలంగా సుశర్మ మరణించాడు. ఇతర పుణ్య విశేషం మూలంగా చిత్రరథుడనే నీ కుమారుడుగా జన్మించాడు. మాతృ పీడా దోషం మూలంగా చిత్రరథుడు అల్పాయుష్మంతుడయ్యాడు. ఇక మూడు యామములతో ఆ కాలమృత్యువు పాలవుతాడు" అని కృత్స్నమద మహాముని సుమతికి వివరించాడు. సుమతి మునిని తనకు పుత్రభిక్ష అనుగ్రహించమని అర్థించాడు.

"కల్పోక్త ప్రకారం కృష్ణా పుష్కర వ్రతాచరణం మాత్రమే నీ పుత్రుడికి దీర్ఘాయువు వస్తుంది. రాజా! నీవు వెంటనే పుష్కర దీక్ష వహించి నీ కుమారునితో కృష్ణానదిని సమీపించి కల్పోక్త ప్రకారం పుష్కర వ్రతం ఆచరించి నీ ఏకైక పుత్రుని అపమృత్యువు నుండి రక్షించుకొనుము. పుష్కర విధులు ఒక రోజులోనే ముగించే అత్యవసర కల్పం కూడా ఉంది. నీ కుమారుని ఆయువు అతి స్వల్పంగా ఉంది. మహారాజువైన నీవు12 రోజుల పుష్కర వ్రతకల్పం ఒక రోజులో ముగించి నీ పుత్రుని శతాయుష్మంతు కావించుకొనుమని" కృత్స్నమదముని రాజు సుమతికి ఉపదేశించాడు. సుమతి తనకుమారుడైన చిత్రరథునితో యథాశాస్త్రీ యంగా,విధివిధానంగా కల్పోక్త కృష్ణా పుష్కర వ్రతం ఆచరించి పుత్రుని అకాల మృత్యువునుండి రక్షించుకొన్నాడు. కృష్ణా పుష్కరవ్రతం అకాల మృత్యుభయాలను, అపమృత్యు దోషాలను నివారించి ఇష్ట కామ్యార్థ సిద్ధులను, సముచిత సర్వసుఖాలను, సకలశుభాలను, కలుగజేస్తుంది.

అతి ప్రధానమైన కృష్ణాపుష్కర వ్రతవిధులు మనం అవగాహన చేసికొని ఆచరణలో పెట్టాలి. కల్పోక్త కృష్ణాపుష్కర వ్రతాచరణం ద్వారా ధర్మాచరణం ద్వారా ఆత్మకళ్యాణం, సమాజ కళ్యాణం, దేశలోక కళ్యాణ

పరంపరలు పొందుదాము. ధార్మిక జీవనం సఫలం కావించుకోవ డానికి మనకు లభించిన ఒక అపూర్వమైన అవకాశం కృష్ణా పుష్కరం. ఇది ప్రతి12 సంవత్సరాలకు ఒకసారి వచ్చే ఒక పవిత్రనదీ మహోత్సవం. నిత్యం మనం కావించే స్నాన, దాన, జప, దేవతారాధనలకు పుష్కర పవిత్ర పర్వసమయం సహస్రాధిక ఫలితాలను సమకూరుస్తుంది. పుష్కర విధులలో అందరూ విధిగా ఆచరించవలసింది సంకల్ప పూర్వక మైన స్నానం.ఋగ్వేదం, తైత్తిరీయ సంహిత, అథర్వణవేదంఅన్నీ జల ప్రశంసలు, నదీజల ప్రశంసలు కావించాయి. 'ఆపోవా ఇదగ్ంసర్వం' అని శ్రుతివాక్యం. 'ఆపేవససర్జాదౌ' అంటే 'జలాన్నే మొదట సృష్టించెను అని శ్రుతి చెప్తోంది. సర్వానికి మమూలం జలం.దేహాన్ని శుభ్రపరచడం - దాహాన్ని తీర్చడం జనం కావించే ప్రాథమిక విధులు.

'మేధ్యం', 'యజ్ఞం'అనే పవిత్ర విధులను కూడా జలం నిర్వహి స్తోంది. 'మేధ్యం' అనే జలశక్తి స్నాన, ఆచమనాలు చేసిన జనుల పాపాలను హరిస్తుంది. 'యజ్ఞం' అనే జలశక్తి ప్రోక్షణ ద్వారా ద్రవ్యశుద్ధికి దోహదం చేస్తుంది; జలం కనిపించే ప్రాథమిక విధులను అమలు చేస్తోంది. కనిపించని పవిత్ర విధులను అమలు చేస్తోంది. ఇట్టి అపూర్వమైన మహిమ కలిగిన జలంలో కృష్ణానదీ పుష్కర పవిత్ర జలంలో స్నానం చేయడం ముక్తి హేతువని బ్రహ్మాండ పురాణం శాసిస్తోంది. కృష్ణాపుష్కర స్నానం మూడుకోట్ల యాభై లక్షల దివ్య తీర్థాలలో చేసిన అపూర్వమైన అమృత ఫలితాన్ని అనుగ్రహిస్తుంది. పుష్కర స్నానం ప్రభాత సమయం లో చేయడం ఉత్తమం. మధ్యాహ్న స్నానం మధ్యమం. అపరాహ్ణ స్నానం అధమం. సంకల్ప పూర్వకంగా సుప్రభాతసమయంలో కృష్ణా పుష్కరస్నానం చేయడం శుభప్రదం, పుణ్యప్రదం.

పుష్కరస్నానం తరువాత మార్తాండునకు, కృష్ణవేణీ నదికి, సరస్వతీ సహిత బ్రహ్మదేవునకు, గౌరీశంకరులకు, లక్ష్మీనారాయణులకు, తీర్థరాజైన పుష్కరునకు తారాసహిత బృహస్పతికి, ఇంద్రునకు వాలఖి ల్యాది సప్తఋషులకు పితృదేవతలకు, సనకాది మహాజనులకు భక్తి ప్రపత్తులతో యథావిధిగా దోసిళ్ళతో అర్ఘ్య ప్రధానంకావించాలి. 'కృష్ణా పుష్కర మహాకల్పం'లోని కృష్ణానదీ అష్టోత్తర శతనామాలతో కృష్ణవేణీ ప్రతిమకు షోడశోపచారాలతో పూజకావించాలి.కృష్ణవేణీ పూజపిమ్మట దేవగురుడైన బృహస్పతిని, తీర్థరాజైన పుష్కరుని కూడా షోడశోప చారాలతోను అష్టోత్తర శతనామాలతోను భక్తిపురస్సరంగా పూజ కావించాలి.ఆ విధంగా కృష్ణా పుష్కర యాత్రికుడు కృష్ణా,గురు, పుష్కర పూజలు కావించి కృష్ణానదీమాత, బృహస్పతి, పుష్కరుల అనుగ్రహానికి పాత్రులు కావాలి. పుష్కర స్నాన కల్పం నిర్దేశించిన విధంగా స్నానం, అర్ఘ్య ప్రధానం, నదీ గ్రహ పుష్కర దేవతారాధనం కావించడం సంపూర్ణ కృష్ణా పుష్కర స్నానఫలితం భక్తునకు సమకూరుస్తుంది.

పుష్కర స్నానం పిమ్మట పుష్కర సమయ దానాలకు ప్రాముఖ్యం ఉంది.అహంకార, మమకారాలతో ఆర్జించిన దానిని ఉపకార భావంతో, సహకార సేవా దృక్పథంతో త్యజించే సాధనం దానం. దానం దాతను, ప్రతిగ్రహీతను ధన్యం చేస్తుంది. ధనవ్యామోహం, వస్తువాహన వ్యామోహం నుండి విముక్తి కలిగిస్తుంది. ఆర్జించింది త్యజించడంలో నిస్వార్థం, నిర్మోహత్వం, నిరాడంబరత్వం అలవడుతాయి. దుష్ట సంపాదనం, దుష్టజీవనం నుండి దానం మానవుని దూరం చేస్తుంది శాస్త్రం నిర్దేశించిన పుష్కర కల్పం విధించిన దానవిధులు కృష్ణా పుష్కర యాత్రికులు నిర్వహించడం శ్రేయస్కరం.

**"యశ్శాస్త్ర విధి ముత్సృజ్య వర్తతే కామకారకః**
**న ససిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్**
**తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థౌ**
**జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మ కర్తు మిహార్హసి"**

శ్రీ కృష్ణుడు "శాస్త్ర విధిని విడచి వ్యవహరించేవాడు సిద్ధి పొంద లేడు. సుఖం కాని, స్వర్గమోక్షాలు కాని అందుకోలేడు. విధినిషేధాలు గ్రహించాలి. శాస్త్రం ప్రమాణం, శాస్త్రం విధించే కర్మలనే ఆచరించాలి. కర్మల్ని శాస్త్రప్రకారం చేయాలి" అని అర్జునునకు ఉపదేశించాడు. శాస్త్రం ఆదేశించిన కర్మలలో పితృదేవతారాధనం ఒకటి.

భీష్ముడు గయలో పితృ శ్రాద్ధం పెట్టాడు.పిండప్రదాన సమయంలో తండ్రి శంతన మహారాజు చేయి రత్నకంకణాలంకృతమైన పిండం అందుకోవడానికి వచ్చింది. శాస్త్ర ధర్మ ప్రకారం పిండాలు దర్భలపై ఉంచాలి;భీష్ముడు శాస్త్రవిధేయుడై పిండాలను దర్భలపైఉంచాడు కాని తండ్రి శంతన మహారాజు చేతిలో ఉంచలేదు. శాస్త్రసమ్మతంగా కర్మ చేసి భీష్ముడు మనకు ఆదర్శ ప్రాయుడు, అనుసరణీయుడు అయ్యాడు.

పుట్టిన ప్రతి మానవుడు దేవ, ఋషి పితృ ఋణాలు తీర్చుకోవాలి. శ్రాద్ధ, కర్మలు ఆచరించడం ద్వారా పితృఋణం తీరుతుంది. ప్రతి భారతీయుడు నిత్యం బ్రహ్మ, దేవ, పితృ, మనుష్య, భూతయజ్ఞాలు అనే పంచమహాయజ్ఞాలు ఆచరించాలి. పితృ మహాయజ్ఞ రూపంలో పితృఋణం తీర్చుకోవాలి. పుష్కర సమయంలో నదిలో దేవతలు పితరుల్ని నరుల్ని అనుగ్రహించడానికి అధివసించి ఉంటారు.

నదీతీరంలో పితృదేవతలు తమవంశీకులు కావించే పితృదేవతా ర్చనలు అందుకొని, దేవతల దీవెనలు సమకూర్చు ఉత్తర గతులు పొందడానికి నిరీక్షిస్తుంటారు. శాస్త్రం పుష్కర సమయంలో పితృయజ్ఞం కావించడం, తర్పణాలు వదలడం, పిండ ప్రదానాలు చేయడం, తీర్థవిధులు నిర్వహించడం నిర్దేశించింది. పుష్కర సమయంలో మొదటి

రోజున హిరణ్య శ్రాద్ధం, 9వ రోజున అన్న శ్రాద్ధం, 12వ రోజున ఆరు శ్రాద్ధాలు, ముఖ్యంగా ఆచరించాలి. అలా సాధ్యం కానివారు పుష్కరాలలో 9వ రోజున తీర్థ శ్రాద్ధం జరుపుకోవడం ముఖ్యం. కాని పక్షంలో పితృదేవతల పుణ్యతిథినాడు గాని, లేకపోతే 12 రోజులలో ఏదో ఒక రోజున తీర్థవిధులు నిర్వహించాలి. మాతృ, పితృవర్గాలకు మాతామహ వర్గత్రయానికి భ్రాతృ, పితృ, భగినీ, భావుక, శ్వశుర, స్యాలక, గురు, రిక్థి ఆదిగా గలవారికి మరణించిన బంధు సంబంధు లకు పిండ ప్రదానం పుష్కర సమయంలో చేయాలి.

మిత్రులకు, సేవకులకు, ఆశ్రితులకు, విష, అగ్ని, జల ఆదిగా అంశాల మూలంగా బలాత్కారమరణం పొందినవారికి, క్షయ, కుష్ఠాది రోగాల పాలై చనిపోయిన వారికి, అనాథలకు, వికలాంగులకు, కర్మ, ధర్మ, భ్రష్టులకు, హంతకులకు, మహా పాపాత్ములకు "ధర్మ పిండ ప్రదానం" కావింపబడుతుంది. ఆ విధంగా వారికి ఉత్తర ఉత్తమగతి కలగడానికి పుష్కర సమయంలోని ధర్మ పిండ ప్రదానం దోహదం చేస్తుంది. జన్మించి జీవించే జనులకు సుఖాలు, శుభాలు కలిగించడానికి, అందరు మృతజీవులకు అమృతత్వం అందించడానికి పుష్కర సమయంలో దోహదం చేస్తుంది.

అసలు శ్రాద్ధ అంటే ఏమిటి? "శ్రద్ధయా కురుతే కర్మ శ్రాద్ధమిత్య భీధీయతే" అన్నది శ్రాద్ధనిర్వచనం. శ్రద్ధతో చేసే ప్రతి కర్మ శ్రాద్ధమవు తుంది. పితృదేవతలకు సమర్పించే పిండ ప్రదానానికి శ్రాద్ధం అని రూఢి యేర్పడింది.

శ్రీకృష్ణుడు జాంబవంతుని గుహలోకి వెళ్ళి వారం రోజుల వరకు బయటకురాలేదు. శ్రీ కృష్ణుడు మరణించాడని ద్వారకావాసులు అపోహపడి శ్రాద్ధం పెట్టారుట. జాంబవంతునితో పోరాడుతున్న నీరసిం చిన శ్రీకృష్ణునకు శ్రాద్ధ ఆహారం వలన బలం వచ్చి అతణ్ణి అణచగలి గాడు. మనం ఎవరిని ఉద్దేశించి తద్దినం రోజున ఆహారం సమర్పిస్తు న్నామో వారికి అందుతుందని శాస్త్రం వక్కాణిస్తోంది. "పశ్చిమ దేశవాసులు కూడా చనిపోయిన ఆత్మీయులతో ఒక గంట సేపు సన్నిహిత సంబంధం కావాలని– ఆ అనుభవం కోసం ఎదురు చూస్తుంటారట. అట్టి పితృదేవతల సన్నిహిత సంబంధం పొందినవాడు ఆరోగ్యవంతుడవుతాడు; సహాయకుడవుతాడు; సక్రమ ఆలోచనా సరళి కలవాడవుతాడు; ప్రేమ స్వరూపుడవుతాడు". ఇది మహాకవి టెన్నిసన్ భావన. పితృదేవతల సన్నిహిత సంబంధం గూర్చిన టెన్నిసన్ మహాకవి తీవ్రమైన తపన ఇది. నవంబరు 7వ తేదీన క్రైస్తవ మతస్తులు దేహం విడచిన వారికి తద్దినాలు పెడతారు. మృతుల గోరీల వద్ద భక్తి శ్రద్ధలతో పుష్పాలు, తినుబండారాలు సమర్పిస్తారు. పిల్లల గోరీలవద్ద ఆటవస్తువులు, బొమ్మలు, ఊయలలు అర్పిస్తారు. హిందువుల శ్రాద్ధ కర్మలు వివిధ మత సంప్రదాయాలలో ఏదో ఒక రూపంలో అమలు జరుగుతున్నాయి. యూదు, ఇస్లాము మత విధానాలలో సహితం మృతుల ఆరాధన ఉంది.

దేహం తల్లి గర్భంలో కుండలాగా తయారు చేయబడుతుంది. దాన్ని తయారు చేసుకొనేవాడు జీవుడు. కర్మాగారం వంటిది తల్లి గర్భం. అందులో కార్మికుడు వంటివి మనసు, బుద్ధి ఇంద్రియశక్తులు, జీవశక్తులు. వీరందరినీ ఎరిగి ఉన్న ప్రాచీన శాస్త్రం వీళ్ళకి దేవతలు అని పేరు పెట్టింది. అందులో తల్లిగర్భంలో జీవుణ్ణి ఆధారం చేసి పెంచే దేవతలు పితృదేవతలు అనబడే వర్గంలో ఒక అంతర్భాగం. వాళ్ళు చంద్రకిరణాలు, చంద్రకళలు ఆధారంగా చేసుకొని గర్భంలో పిండాన్ని నిర్మాణం చేస్తారు. కనుకనే చంద్రుడు భూమిచుట్టూ ఒకసారి తిరిగే కాలవ్యవధి (28 రోజులు) స్త్రీ ఋతుకాలానికి, కాలమానం లాగ పనిచేస్తుంది. జీవుడు దేహం విడచినప్పటి నుండి తల్లిగర్భంలో పడే లోపున జరగవలసిన పరిశుద్ధి కొంత ఉంటుంది. దేహాన్ని విడచినపుడు దహనం చేసే వరకు కొన్ని కర్మలు, అటుపైన ప్రేతత్వాన్ని లేకుండా చేయడానికి పదిరోజులవరకూ కుమారుడు ఆచరించే కర్మలూ ఒక తరగతికి చెందినవి.

అలాగే దేహం విడచిన సంవత్సరములో ప్రతి మాసంలో అదే తిథి నాడు ఆచరించే కర్మలు మాసికాలు. అటుపైన ప్రతి సంవత్సరమూ ఆ మాసంలో ఆ తిథినాడు ఆచరించే వేదోక్త కర్మను ఆబ్దికం లేక తద్దినం అంటారు. నాలికమీద మందు పడితే మోకాలిలో ఉన్న నొప్పి ఎలా తగ్గుతుందో అలాగే ఒక బ్రతికి ఉన్న వాడికి భోక్తగా పూజించి శ్రాద్ధ కర్మ చేస్తే చనిపోయినవాడికి ఉన్న పూర్వకర్మ దోషాలు తొలగు తాయి. దానితో ఆ దేహం వదలిన వారికి, సూక్ష్మ శరీరంలోని దుష్కర్మ బంధాలు తొలగి, పవిత్రమైన శరీరంతో మరల జన్మ లభిస్తుంది.

ఆ పరిశుద్ధికి సంబంధించినవే చనిపోగానే చేసే శ్రాద్ధ కర్మలు. ఆ జీవి మళ్ళీ తల్లిగర్భంలో ఉత్తమ జన్మ పొందటానికిచేసే శాస్త్రీయమైన కర్మ కాండయే తద్దినం. పిండ పితృ యజ్ఞం, పుష్కర శ్రాద్ధం కొన్నివేల సంవత్సరాలనుండి మహా పురుషులు పుష్కర శ్రాద్ధం పేర పితృ కర్మలు ఆచరించినట్లుపురాణాలలో వర్ణింపబడిఉంది. మనం కూడా వారి మార్గాన్ని అనుసరించి వారిచ్చిన విజ్ఞానాన్ని వినియోగించు కోవడం మంచిది. ప్రాచీన, నవీన శాస్త్రాలలో దేనినీ కాదనడం శాస్త్రీయ దృక్పథం కాదు. పన్నెండు సంవత్సరాలకు ఒక మారు వచ్చే ఈ సదవకాశాన్ని అందరూ వినియోగించుకొని పితృకర్మలు ఆచరించి, తమ పెద్దలైన పితరులకు సుఖ శాంతులు కల్పించడం శ్రేయోదాయకం.

అందుచేత కృష్ణా పుష్కర సమయంలో మధ్య తరగతికి చెందిన వాడైనా పారణ విధానంగానైనా శ్రాద్ధం చేయడం ఉత్తమం. పక్షాంతరం లో ఆమ్రశ్రాద్ధాన్ని, లేకపోతే హిరణ్యశ్రాద్ధాన్ని చేయాలి. ఆ విధంగా చేయడం వలన పితృదేవతల అనుగ్రహం లభిస్తుంది. వంశాభివృద్ధి కలుగుతుంది. కుటుంబం సుఖశాంతులతో వర్ధిల్లుతుంది. కృష్ణా పుష్కర శుభసమయంలో పుష్కరవిధులు నిర్వహించిన పిమ్మట ఇంద్రకీలాద్రిపై వెలసిన శ్రీ కనకదుర్గను గాని, శ్రీశైల మల్లికార్జుణ్ణి గాని, లేదా మీ దగ్గరలోనున్న దేవాలయాన్ని సందర్శించి మీ యిష్ట దైవాన్ని సేవించటం ఉత్తమం.

**"నేరను మంత్ర యంత్రములు, నేరను బీజములంబ! ధ్యానమున్**
**నేరను, ముద్ర లే నేఱుగ, నేరను నిన్ నితియింప, పిల్వగా**
**నేరను నిన్ను, ఆర్తిమెయినే విలపించుట యే నెఱుంగ, నిన్**
**జేరినవారి క్లేశములు చేరవటం బొకటే యెఱుంగుదున్".**

**"లేదు నను బోలు పాపియు, లేదు నిన్ను**
**బోలు పాపఘ్నియును పెక్కులేల పలుకు?**
**లంబ! నీ దివ్య చిత్తాన నవధరించి**
**యోగ్య మెది అది నీవ చేయుము భవానీ!"**

– శ్రీ శంకరాచార్యకృత దేవ్యపరాధక్షమాపణ స్తోత్రమునకు స్వర్గీయ శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు కావించిన అనువాదం నుండి.

ఆ విధంగా విజయవాడ కనకదుర్గ భవానికి ఆత్మనివేదనం కావించుకొని ఆమె కృపకు పాత్రులమై సంపూర్ణ కృష్ణా పుష్కర యాత్రా ఫలాన్ని పొందుదాము.

శ్రీ కృష్ణమ్మ తల్లికి జేజేలు! శ్రీ కనకదుర్గమ్మ తల్లికి పూలదోసిళ్ళు!!

## కృష్ణా పుష్కరము

"సహ్యపాదోద్భవా దేవీ శ్రీశైలోత్సంగగా మినీ
కృష్ణవేణీతి విఖ్యాతా మమపాపం వ్యపోహతు
సహ్యపాదోద్భవా దేవీ కృష్ణవేణీతి విశ్రుతా
సర్వపాప విశ్రుత్యర్థం స్నాస్యదేవీతి వాంఛసే
శంఖచక్రధరాం దేవీం నీలోత్పలదల ప్రభావమ్
విష్ణురూపాంతు తాం దేవీం కృష్ణవేణీం నమా మ్యహం
శుద్ధస్ఫటిక సంకాశాం ద్విభుజాం పద్మధారిణీం
శివమూర్తిధరాం దేవీం కృష్ణవేణీం నమా మ్యహం
విష్ణుపాదోద్భవా గంగా అపర దేవసంభవా
ఏకత్ర శస్యతే స్నానం పాన మేకత్ర శస్యతే
కృష్ణవేణి నమస్తుభ్యం సర్వపాపప్రణాశిని
భక్త్యా దత్తం మయా దేవి గృహాణార్ఘ్యం సరిద్వ రే
విష్ణు దేహసముత్పన్నా శ్రీశైలోత్సంగగామినీ
కృష్ణవేణీతి విఖ్యాతా మమపాపం వ్యపోహతు"

కృష్ణవేణీ స్తోత్రము

చిరునామా : *శ్రీ నాగినేని లీలాప్రసాద్, జె.బి. నగర్ 4-120/6, ఎసిసి పోస్టు, మంచిర్యాల 504209, ఆదిలాబాద్ జిల్లా*
*సెల్ : 9247335387*

డా॥ కంపల్లె రవిచంద్రన్

# బిరబిరా కృష్ణమ్మ

తెలుఁగు నేల పొలాలకు జలము లొసఁగి
తెలుఁగు వారల మతులకు తేజమిచ్చి
తెలుఁగుదేశమ్ము కీర్తికి వెలుగుకూర్చు
కృష్ణవేణీనదీ! నమస్కృతులు గొనుమ!

– దివాకర్ల వేంకటావధాని

నిఖిల కల్మషహారిణులైన ప్రముఖ మహా నదులలో కృష్ణకూడా ఒకటని భక్తుల నమ్మిక.స్వర్గారోహణ సోపాన మహాపుణ్య తరంగిణిగా ప్రసిద్ధి పొందిన కృష్ణానదికి ఈ సంవత్సరం ఆగష్టు 12వ తేదీ నుండి పుష్కరాలు ప్రారంభమవుతాయి.

కృష్ణానది అందాలరాశి –మహారాష్ట్రలోని సహ్యాద్రి ఉత్తర శిఖరమైన 'బ్రహ్మ గిరి'లో అవతరించిన కృష్ణానది కొండకోనలను దాటి... వేదగిరిలో వేణీనదితో కలిసి కృష్ణవేణిగా సుదీర్ఘప్రయాణం చేసి..కృష్ణా జిల్లా హంసలదీవి, ఏటి మొగలదగ్గర బంగాళాఖాతంలో సాగరసంగమం అవుతుంది.

కృష్ణానది, ఆమె ఉపనదుల పరీవాహక ప్రాంతంలో అనేక సామ్రాజ్యాలు వెలిశాయి. శాలివాహన, ఇక్ష్వాక, పల్లవ, విష్ణు కుండిన, చాళుక్య, బహమనీ, విజయనగర, మరాఠా మొదలైన రాజవంశాలవారు పాలించారు. మౌర్య, కాకతీయ, గజ పతుల రాజ్యభాగాలు ఈ నదినధిగమించి విస్తరించాయి.

ఈ నది పరిసరాలలో ఎన్నో పుణ్య క్షేత్రాలు, తీర్థాలు అవతరించాయి.వెడల్పు తక్కువైనాఎక్కువకాలం నిండుగా ప్రవహించే జీవనది కృష్ణవేణి. ఈ నది ప్రవహించే ప్రాంతంలో ఎన్నో శతాబ్దాల నుండి చిన్నచిన్న వాగులపైనా, వంకల పైనా ఆనకట్టలు కట్టి జలాశయాలను నిర్మించారు. కాకతీయులు, విజయ నగరపాలకులు ఈ నిర్మాణాలను చేశారు. వేంగిని పాలించిన తూర్పుచాళుక్యులు ఏటి కాలువల ద్వారా వ్యవసాయాన్ని పెంచారు. ప్రాచీనకాలం నుండి ఈ నదికి రెండువైపుల నివసించే రైతన్నలు బంగారుపంటలు పండిస్తున్నారు. ఈ ప్రాంతాన్ని ధాన్యాగారంగా మార్చారు. ఈ విషయాన్నే శంకరంబాడి సుందరాచారి మన 'రాష్ట్రగీతం'లో..

గలగలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయీ
మురిపాల ముత్యాలు దొర్లుతాయి

అని అన్నాడు.

సామాన్యులు, అసామాన్యులు, అతి సామాన్యులు, కృష్ణవేణీ మాతను భయభక్తులతో కొలుస్తారు. కన్నతల్లిగా ఆరాధిస్తారు. కృష్ణవేణీమతల్లి కూడా తన జలహస్తాలతో బిడ్డలకు శాంతిని, దాంతిని ప్రసాదిస్తోంది.

శ్లో॥ కృష్ణవేణీతి యో బ్రూయాత్
సప్తజన్మార్జితాన్యపి
మహాపాపాని నశ్యంతి
విష్ణులోకం సగచ్ఛతి ॥

ఏ మానవుడు జీవితంలో ఒక్కసారి "కృష్ణవేణి" అని స్మరిస్తాడో వాని జన్మజన్మల పాపాలు పటాపంచలై పోవడమేగాక వాడు విష్ణు సాయుజ్యాన్ని పొందుతాడు.

గంగా యమునాసరస్వతులు ఉత్తర భారతదేశాన్ని పవిత్రీభూతం చేస్తే గోదావరి, కృష్ణా,కావేరీ, తుంగభద్రలు దక్షిణ భారత దేశానికి జీవనాధారమై నిలుస్తున్నాయి.ప్రాచీన ప్రపంచంలో నదీతీరాలు నాగరకతా నిలయాలు అని చరిత్ర చెబుతోంది.మన దేశంలోకూడా అత్యున్నతమైన ప్రాచీన నాగరకత సింధునదీ తీరప్రాంతంలో పరిఢవిల్లింది. ఆంధ్రదేశపు నదులకు కూడా అట్లాంటి చరిత్రేఉంది. కృష్ణవేణి కిరు వైపులా మహోన్నత నాగరకత వ్యాపించినట్టు చరిత్ర కథనం. అందువల్ల నదులచుట్టూ ఐతిహ్యాలు, కథలు,గాథలు అల్లుకున్నాయి. నదులు,ఆతత్తీర వాసులకు ప్రత్యక్ష దైవాలు, నిత్యారాధ్యదేవతలు. కన్నతల్లులతో మాత్రమే పోల్చదగిన మాతృమూర్తులు. నదులు కావ్య వస్తువులు కాని భాషాసాహిత్యాలు లేవు. తెలుగువారికి కృష్ణా, గోదావరి, పెన్నలుప్రకృతి ప్రసాదించిన దివ్యవరాలు. ఈ నదులు వస్తువులుగా,

నేపథ్యాలుగా తెలుగులో ఎంతో సాహిత్యం వచ్చింది. కావ్యాలు, కథలు వచ్చాయి.

కృష్ణానదీ ప్రాశస్త్యాన్ని, పావనత్వాన్ని కృష్ణా పరీవాహక ప్రాంతంలోని పుణ్యక్షేత్రాల వైశిష్ట్యాన్ని, కృష్ణాస్వాదుజలాలతో పండిన పంటలను ప్రాచీనకవులు, ఆధునికకవులు అనే భేదం లేకుండా, ప్రాంత వివక్షలేకుండా అన్ని కాలాల్లో, అన్ని ప్రాంతాల్లోని కవులందరూ ముక్తకంఠంతో కీర్తించి తరించారు.

ముఖ్యంగా కృష్ణవేణి పడమటి కనుమలలో సహ్యాద్రిలో జన్మించి సముద్రంతో కలిసేవరకూ తాను పునీతం చేసిన ప్రాంతాల కథలను, గాథలను, చరిత్రను, కళలను కావ్యాలలో వర్ణించారు.

## జగత్తంతా నీటికి ప్రతిరూపమే!

భారతభూమి కర్మక్షేత్రం.భారతీయుడు కర్మయోగి.జిజ్ఞాసువులైన భారతీయులు ప్రధానంగా ప్రకృతిఆరాధకులు. సృష్టి వాళ్లకు ఆనందోత్సవ కారిగా,అద్భుతవర్షిణిగా, సహకారిగా, సహచరిగా, భయావహంగా కూడా గోచరించింది.కర్మపరతంత్రుడూ, ప్రాజ్ఞుడూఐన భారతీయుడు విచిత్రంగా నదీనదాలు,సూర్యచంద్రులు, గ్రహాలు,తారకలు.. ఇలా సృష్టి సర్వస్వాన్నీ ఇహపర సాధకంగా భావిస్తూ అందుకు అనుగుణంగానే తననూ, తనతోటి సమాజాన్ని మలచుకున్నాడు. అందుకే చేతనాచేతనమైన ఈ జగత్తు మొత్తం ప్రకృతి సహజపరిణామాలకు స్పందిస్తూ ఉంటే-మానవుడు ఆ ప్రకృతి స్పందనంలో, ఆ విలాస విన్యాసంలో, ఆ విజృంభణలో, ఒక విశిష్టమైన అనుభూతిని పొందుతూ, ఒక దివ్యప్రబోధాన్ని వింటూ, ఒక వినూత్నమైన అర్థాన్ని దర్శిస్తూ నిత్యకర్మిష్ఠి కాగలి గాడు. ఈ ప్రకృతితో ఉత్తేజితుడైన తొలివిజ్ఞాని తనకు తోచినరీతిలో ప్రకృతిని స్తుతిస్తూ కవి, ద్రష్ట కాగలిగాడు. ఈ స్తుతులలో పృథ్వీ, గ్రహాలతో పాటు- నదులు, పర్వతాలు కూడా చోటుచేసుకున్నాయి. అంటే ప్రకృతి మనకు చేసిన ఉపకృతిని పురస్కరించుకుని ఆ ఋణ విముక్తికోసం కృతజ్ఞతా సూచకంగా, సంస్కార చిహ్నంగా, మనం ఆ సేవలను స్తోత్రపూర్వకంగా స్మరిస్తున్నా మని భావించవచ్చు.లేదా భారతీయమైన విశిష్టసంప్రదాయంలో తరతరాలకు ప్రకృతి రహస్యాలను అందించడానికీ, విజ్ఞానవ్యాప్తికీ ఇదొక ఉత్తమ మార్గంగా భావించవచ్చు.అందుకేనేమో ఈనాటికీమన నిత్య నైమిత్తికవిధుల్లో, శుభాశుభకర్మసందర్భాల్లో వంశగోత్ర నామాలతో పాటు దేశ, కాల, ప్రాంతాలతోపాటు దిక్కులు, పర్వతాలు, నదులు మొదలైనవాటి వివరాలుకూడా పేర్కొనాల్సివస్తుంది.

అనునిత్యం అనిరోధగతిలో భ్రమించే ఖగోళ భ్రమణంలో తటస్థపడే గ్రహస్థితులుసైతం భూగోళంపైగల అఖండవాసులపై వారిసామూహికజీవనరీతిపై, పరిసరాలపై, ప్రభావాన్ని కనబరుస్తూ ఉంటాయి. విచిత్రంగా ఈ ప్రభావం నదులపై కూడా ప్రసరిస్తూ- ఆలోచనా చక్షువైన మానవుణ్ణి పరిపరివిధాల ఆలోచింపజేస్తున్నాయి.

సర్వాంతర్యామి అయిన శ్రీమహావిష్ణువు 'నారాయణ' శబ్దవాచ్యుడు. హరిహరసమాగమసందర్భంలో

**"నారా ఆపః సమా ఖ్యాతా స్తాసా మయనమానితః**
**యత స్వం భూతభవ్యేశ తన్నారా యణశబ్దితః"**

అంటూ హరి వంశం ఆ నారాయణ శబ్దానికి నిఘంటువును కూడా ఇచ్చింది. ఈ భాగాన్ని అనువదిస్తూ నాచనసోమన ఉత్తర హరివంశంలో "నారంబులన జలంబులం దయనంబు నీక గుట నారాయణత్వము వహించితి" అంటూ అనువదించాడు. ఈ మాటల ఆధారంగా పరిశీలించి చూస్తే సృష్టిలో నీటికి ఉన్న ప్రాధాన్యం తెలిసివస్తుంది.సర్వసృష్టికర్త అయిన శ్రీహరికే విశ్రమస్థానంగా, విడిదిపట్టుగా, గమన మార్గగతిగా ఏర్పడగలిగిన నీటిని గురించి స్వల్ప బుద్ధి ప్రసారం కలిగిన మనం ఇంతకన్నా మిన్నగా ఏం భావించ గలం? అనే సంకోచం ఏర్పడుతూ ఉంది. అన్నగతమైన ప్రాణకోటికీ అంతెందుకూ ఈ సర్వజగత్తుకూ నీళ్లే ప్రాణాధారం. అందుకేనేమో ఈ నీళ్లకు 'జీవనం' అనే పేరుకూడా ఉంది. 'జీవం' అంటే ప్రాణం,ఆ జీవాన్ని ఇచ్చే కారణంతో నీటికి జీవనంఅనే పేరు సార్థకమైనట్లు మనం భావించవచ్చు. నీరు ఈ జీవలోకపు ఉనికికీ, మనికికీ ప్రథమకారణం. నీరు కేవలం జీవి దాహోపశమనానికి మాత్రమే కాకుండా,సూర్యరశ్మివలే సకలజీవజంతువుల ఆరోగ్యానికీ, పారిశుద్ధ్యానికీ తప్పక కావాల్సినవి. నిత్య నైమిత్తికకర్మలలో జల ప్రాధాన్యం లేని క్రియావిశేషం లేదంటే అతిశ యోక్తికాదు. అందుకే గృహమేధికి అగ్నితోపాటు నీరుకూడాపోరానిచుట్టమైంది. ఆచమనం మొదలుకొని, తర్పణంవరకూ, పాదప్రక్షాళనం మొదలుకొని అఘమర్షణ స్నానంవరకూ, నీటికి ప్రాధాన్యం ఉంది.నీళ్లతో సంప్రోక్షణం జరగనిదే ఏ పదార్థమూ పరిశుద్ధిని పొందదు. అందుకే మనపూజావిధుల్లో ప్రముఖస్థానాన్ని సంతరించుకుంది-ఈ సంప్రోక్షణం. కృతజ్ఞతా బద్ధులైన మన ప్రాచీనులుతమకు ఉపకరిస్తూ, తమజీవితంలో పాలు పంచుకొంటున్న ప్రతివస్తువులో, వ్యక్తిలో దైవశక్తిని చూస్తూ ఆ వ్యక్తి, వస్తువిశేషాన్నంతటినీ దేవతలుగా భావిస్తూ నతులర్పించారు.

ఉదాహరణకు -

**తదేవాగ్ని స్తదాదిత్య స్తద్వాయు స్తదు చంద్రమాః**
**తదేవ శుక్రం తద్బ్రహ్మ తా ఆపః సుప్రజాపతిః**

ఈ యజుర్వేద మంత్రాన్నీ, మంత్రార్థాన్నీ పురస్కరించుకుని చూస్తే ప్రాచీనఆర్యులు సర్వప్రకృతిలో బ్రహ్మపదార్థాన్ని చూడగలిగి నట్లు భావించవచ్చు. ప్రాచీనులు తమసుఖమయజీవితానికి ఉనికి

పట్టుగా నీటిసమృద్ధి కలిగినప్రదేశాన్ని అనుగ్రహించమంటూ కోరినట్లు కన్పిస్తుంది. ఇట్లే అథర్వవేద దీర్ఘాయుసూక్తంలో –

**సం మాసించస్తు నద్యః సంమాసించస్తు సింధవః**

**సముద్రః సమస్మాన్ సించతు ప్రజయా చ ధనేన చ**

అంటూ ప్రార్థించిన సన్నివేశాన్ని పురస్కరించుకొని చూస్తే ప్రాచీనులను అనుసరించి, ప్రజోత్పత్తికీ, ధనాదులవృద్ధికీ నీరే కారణమైనట్లు కన్పిస్తుంది. అందుకే వాళ్ల ప్రజాధనాభి వృద్ధులకోసం జలపూర్ణాలైన నదీనదసముద్రాల్ని అర్థించారు.

ఈ జగత్తులో జీవనదులన్నీ జీవులైతే సముద్రుడు పరమాత్మ. ఒకే పరమాత్మ అనేకదేహాలలో ఉండి చివరకు ఆ జీవులను తనలో లీనం చేసుకున్నట్లు సముద్రుడు తన నీటిని ఆవిరిరూపంలో మేఘాలుగా చేసి, నదులకు చేర్చి, ఆ నీటిని మరల తనలో కలుపుకుంటున్నాడు. పరమాత్మ నుండి విడివడిన జీవాత్మ ఎన్నటి కైనా తిరిగి పరమాత్మను చేరవలసిందే! అలాగే సముద్రజలాలు నదులై చివరకు సముద్రుణ్ణి చేరుకొంటాయన్నమాట.

అందుకే

**'ఆపః స్వభావతో మేధ్యాః' అన్నాయి శాస్త్రాలు. అంటే – 'నీళ్లు ఆత్మలాగా స్వభావసిద్ధంగానే పవిత్రమైనవి'** అని.

పుష్కరాలలో నదులు రెట్టింపుఉత్సాహంతో ఉరకలు వేస్తాయి. నదీతీరాలకు దూరదూరంగా ఉండే ప్రజలంతా పన్నెండు సంవత్సరాలకు ఒకసారి వచ్చే ఈ పుష్కర సమయంలోనైనా నదీ తీరానికి చేరుకుంటారు. పవిత్రనదీనదస్నానం బాహ్యశుద్ధినే గాక అంతఃశుద్ధిని కూడా కల్గించి సత్సంకల్ప సంధానానికి, సదాశయ సంవిధానానికి మూలకందమై ఆత్మసాక్షాత్కారానికి ఆయువుపట్టుగా నిలుస్తోంది. అందుకే శ్రీనాథమహాకవి

**కాలు చేయాడు కాలంబె కదలవలయు**

**తీర్థసేవకు దేహ మస్థిరము గాన"**

"కాళ్లచేతులు సక్రమంగా పనిచేస్తున్నప్పుడే పుణ్యనదీస్నానం కోసం కదలాలిసుమా!ఈ దేహం సంగతి ఎప్పటికప్పుడుసందేహమే" అని హెచ్చరించాడు. కాబట్టి, ప్రతివ్యక్తి పుణ్యనదీ స్నానం ఆచరించాలి. అందులోనూ పుష్కరకాలంలో ఆచరిస్తే అది మరింత మహత్వపూర్ణమైంది.

నిరంతరం ప్రవహించే ఈ పుష్కరనదులు మనకు బోధించే దొక్కటే – **"నా ఒడ్డున నిలబడ్డ నువ్వు నాలోని నీటిని చూసి 'నది' అనుకుంటున్నావు. కానీ నువ్వు 'నది' అనుకున్న ఆ నీటిని చెయ్యెత్తి చూపించేలోపు ఆ నీరు బారెడు దూరంపోతుంది. అప్పటికి నీ ఎదుట క్రొత్తనీరు ప్రత్యక్షమవుతుంది. నాలో నిరంతరం జీవనం (నీరు) ప్రవహిస్తుంది కనుక నన్ను జీవనది అంటున్నావు. నిజానికి నాలో పాతజీవనం పోతుంటే, క్రొత్త జీవనం వస్తుంటుంది. నా జీవనం నిర్విరామంగా ప్రయాణించి ఎన్ని ఆనకట్టలు వచ్చినా ఓర్పుతో, ఓపికతో వాటిని అధిగమించి చివరకు సముద్రాన్ని చేరుతుంది. అలానే నీ జీవనాన్ని కూడా పరమాత్మ వైపు సాగించు. ఎన్ని జన్మలెత్తినా జీవికి జీవనపరమావధి పరమాత్మేనన్న సంగతి మరచిపోకు. ఈ విషయాన్ని పుష్కరానికి ఒక్కసారైనా నన్ను చూసి గుర్తుకుతెచ్చుకో"** అని. ఇలా తీర్థక్షేత్రాలకు అధిక ప్రాధాన్యమిచ్చే మన సంస్కృతిలో కృష్ణానదికి విశేషప్రాముఖ్యముంది.

ఇంతటి పవిత్రమైన పుష్కరఉత్సవపుణ్యసమయంలో ఆ ఉత్సవానికి సిద్ధమైన కృష్ణవేణి నదీమతల్లిని అనేక విధాల స్మరిద్దాం! తరిద్దాం!!

## ఆవిర్భావం

పడమటి కనుమలలోని సహ్యపర్వతశ్రేణిలోని మహాబలేశ్వరంలో గోముఖక్షేత్రం నుండి కృష్ణానది జన్మించింది.

నీలిమేఘాలతో,గాలి విసురులతో మహాబలేశ్వరుడు గంభీరంగా నిలబడి ఉంటే, ఆయన మేనుపై నడయాడుతూ రూపుదిద్దుకున్న కృష్ణానదిని పోలవరపు కోటేశ్వరరావు అతి మనోజ్ఞంగా వర్ణించారు.

**జలబిందువై/ రమ్య కరుణాంగివై**

**పరమేశు మెప్పించు నవనృత్తమై,**

**మమ్మేలు కమనీయ కల్యాణివై,**

**రూపొంది నావమ్మ! / మాపాలి భాగ్యమ్మ! మాతల్లి కృష్ణమ్మ!**

**మా వందనాలందుకొమ్మా! / మా చందనాలలది కొమ్మా!**

మహాబలేశ్వరుని ఒడినుండి జారుతూ, బిందువై, ధారయై, వాగై, వంకై వడిపెంచుక గెంతుతూ, కృష్ణవేణి కదిలింది. అడుగులు వేసి పరుగులు తీసింది.

**కదిలింది, కదిలింది, కాలిగజ్జెలు మ్రోయ,**

**కదిలిందిలే కృష్ణ, దూకిందిలే**

**కనులకాంతులు చిమ్మె / మేను ఝురియై దూకె**

**త్రాచులా బుసపెట్టె / రేచులా పరువెత్తె,**

**చరచరా, బిరబిరా, కదిలిందిలే**

ప్రకృతి కరిగిపోతుంటే, గాలి జాలిగా మూల్గుతుంటే, తియతీపులతో నిండిపోతుంటే, భిషగ్వరుల ప్రశంసలనందుకుని సాగిందికృష్ణ. పవిత్రనదులు గాయత్రి, సావిత్రి, కుముద్వతి కలిశాయి.

శ్రీకృష్ణుని అంశగా రూపొందిన కృష్ణ, పరమేశ్వరుని అంశ అయిన వేణీనదిని, సతారాకు ఆరుకిలోమీటర్ల దూరంలో మహతీ వద్ద కలుపుకుంది. కృష్ణవేణిగా పేరుపొంది, శివకేశవుల అభేద రూపంగా పూజించబడుతోంది.

భక్తులు మనసారా కృష్ణవేణిని కొలుస్తారు.

**కృష్ణవేణి నమస్తుభ్యం / పాపౌఘ పరిహారిణి!**
**సహ్యజే! సర్వఫలదే / విష్ణుదేహ సముద్భవే ॥**

## కృష్ణవేణీ నదీ ప్రశస్తి

**శ్లో॥ కృష్ణాతరంగ సంభూత పవనస్పర్శమాత్రతః**
**నిర్ధూత పాతకాస్సర్వే జనా విష్ణు పదం యయుః**

కృష్ణానదీ తరంగాలపైని గాలిసోకినా చాలు పాపాలన్నీ నశించి జనులు విష్ణులోకాన్ని పొందుతారు.

**శ్లో॥ సకృత్ యత్పాద సంస్పర్శాత్**
**గంగాఽభూత్ స్మర్తృమోక్షదా**
**తస్యవిష్ణోస్తను స్సాక్షాత్**
**కృష్ణేయం కథమీడ్యతే**

శ్రీమహావిష్ణువు పాదాలనుండి పుట్టినగంగమోక్షాన్ని ప్రసాదించ గలుగుతూ ఉంటే సాక్షాత్ విష్ణుదేహోద్భవయైన కృష్ణ మహాత్మ్యాన్ని ఇంత అని కొనియాడడం సాధ్యమా? కృష్ణవేణిలో గ్రుక్కెడు నీళ్లు గ్రోలినా చాలు జన్మతరిస్తుంది.

## పురాణాలు - కృష్ణవేణి

వేదసంహితలే కాకుండా పురాణాలు కూడా ఈ నదీమతల్లిని ప్రస్తావించాయి. ప్రశంసించాయి.

సహ్యపర్వతోద్భవాలైన వరనదీ పట్టికలో విష్ణుపురాణం కృష్ణా నదిని చేరుస్తూ ఇది కూడా గోదావరి వలే పాపభయాపహారి అంటూ తెలియజేసింది.

మార్కండేయ పురాణం గోదావరీ, భీమరథీ,కృష్ణవేణీ నదులను **'సరిదుత్తమాః'** అంటూ చెప్పి కృష్ణానదిని ఉత్తమనదుల పట్టికలో చేర్చింది. ఇట్లే వాయుపురాణం భువనవిన్యాసప్రకరణంలో సహ్యాసాను నిస్సృతాలైన దక్షిణాపథ పుణ్యనదుల్లో కృష్ణానదికి మూడో స్థానాన్ని కల్పించింది. కూర్మపురాణం కేతుమాలాది వర్షవర్ణనం చేస్తూ దక్షిణానదీ వర్ణనావసరంలో పాపహరాలైన నదులపట్టికలో కృష్ణానదిని చేర్చింది.

మత్స్యపురాణం శ్రాద్ధప్రకరణంలో శ్రాద్ధ యోగ్యతీర్థాలను పేర్కొంటూ చెప్పిన సందర్భంలో గోదావరి మొదలైన వాటి తర్వాత కృష్ణానదిని కూడా కలిపి ఆ నదికి యోగ్యతను చేకూర్చింది.

ఇట్లే వామనపురాణం కూడా భువనకోశవర్ణనావసరంలో కృష్ణా, గోదావరీ మొదలైన నదులను సహ్యపర్వత నిస్సృతాలైన మహానదులుగా పేర్కొంటూ **"జగతో మాతరః సర్వాః సాగర యోషితః"** అంటూ చెప్పి జగత్తుకు తల్లులవంటివైన ఈ నదులన్నీ సాగర పత్నులంటూ సపత్నీత్వాన్ని ఈ నదులకు చేర్చింది.

శ్రీమద్భాగవతంలో పంచమస్కంధంలోభూగోళ,ఖగోళ వర్ణనలో మరియు దశమస్కంధంలో బలరామయాత్రావర్ణన ప్రసక్తిలో కృష్ణానది ప్రముఖ స్థానాన్ని వహించింది.

దాదాపు పురాణాలన్నీ కావేరీ, కృష్ణా, గోదావరీ, తుంగభద్రా, భీమరథీ, బాహ్యా, వేణువా, సుప్రయోగా అనే నదులను సహ్య పర్వత నిస్సృతాలుగా పేర్కొన్నాయి.

## ఇతిహాసాలు - కృష్ణవేణి

భారతాది ఇతిహాసాలూ, రామాయణాది కావ్యాలన్నీ పుణ్యనదులనూ,ఆ నదుల ఉత్పత్తిస్థానాలనూ పేర్కొన్నాయి.మహాభారతం సభా పర్వంలో వరుణదేవుని సభను వర్ణిస్తూ ఆ సభ అంతస్సలి లాలు రత్నమయాలైన ఫలవృక్షాదులతో కూడి,ఎంతో సుఖవంతంగా ఉండడమే కాకుండా అందులో శ్రేష్ఠులూ, దేవతలూ, పర్వతాలూ, పుణ్యనదులూ వాసం చేస్తుంటాయి అని చెప్పిన సందర్భంలో ఆ పుణ్యనదుల్ని పేర్కొంటూ

**గోదావరీ కృష్ణవేణ్యాకావేరీచ సరిద్వరా**
**కింపునాచ విశల్యా చ తథా వైతరణీనదీ (9-26)**

అని చెప్పి ఆ పుణ్యనదుల పట్టికలో కృష్ణవేణీ నదిని చేర్చింది. మహాభారతవనపర్వంలో యుధిష్ఠిరుడు వేరువేరుతీర్థాలను సేవిస్తూ, ఆయా తీర్థ ప్రభావాలనుచెప్పే సందర్భంలోనూ, మరో చోట అంటే సహనానుక, అగ్నిజలప్రవేశం చేసి తిరిగి అంగిరుని ప్రయత్నంతో ప్రాకటాన్ని పొందిన సందర్భంలోనూ గోదావరి మొదలైన నదులతో పాటు కృష్ణానది కూడా అగ్నికి మాతృస్థాన మైనట్లు పేర్కొన్నది. భీష్మపర్వం కూడా ఈ కృష్ణానదిని మందగామినీ, నిరామయగా పోలుస్తూ మందవాహినిగా పేర్కొంది. ఇదే పర్వంలో కృష్ణవేణి ఉపనదియైన దేవకుండంలో స్నానం చేసిన వారికి,వారి వారి పూర్వ జన్మలస్పృహ వస్తుందని తెలుపబడింది. ఇదే పర్వం కృష్ణవేణిని మిగతా అన్ని నదులలోను ముఖ్యమైనదిగా తెలియజేసింది.

## తెలుగు సాహిత్యం- కృష్ణవేణి

వీరశైవమతస్థాపనకు నడుంకట్టి,అస్పృశ్యతను వద్దన్నస్త్రీ పురుష సమానత్వాన్ని చాటి చెప్పిన పరమమహేశ్వరుడు బసవేశ్వరుడు మనసారా కీర్తించిన నేల ఇది. పాల్కురికి సోమన పలుకులల్లిననేల కృష్ణ.వీరి పండితారాధ్య చరిత్రలో శ్రీశైలంలో ప్రవహిస్తున్న కృష్ణా నదిని పాతాళగంగగానూ, కృష్ణవేణిగాను రెండుపేర్లతో వ్యవహరించాడు.

నందికేశ్వరుని సుతుడైన పర్వతుడు శివునిగంగ భాగీరథి గంగ పాతాళగంగ భీమరథి సౌగంధిక... వేదవతియు, శుక్ర ప్రభాసవేణి

పుష్కరకృష్ణవేణి మొదలైనన్నింటిని తన తలమీద ఉండే టట్లు' ప్రార్థించాడు.

ఈ కవియే సంగమేశ్వరక్షేత్రాన్ని వర్ణిస్తూ **"... జగత్ ఖ్యాతిత లీల నరినొప్పుగూడలి సంగమేశ్వరము దనరారు తుంగభద్రయు కృష్ణవేణియును గూడ గూడలి యననొప్పుజూడ..."** (పర్వత.540) అని తుంగభద్ర, కృష్ణవేణి నదుల సంగమంచే ఈ క్షేత్రం కూడలి సంగమేశ్వరంగా సార్థకమైనట్టు తెల్పాడు.

తిక్కన తన ఆంధ్రమహాభారతంలో భీష్మపర్వంలో సంజయుడు ధృతరాష్ట్రునికి భూపరిమాణాన్ని వివరించే సందర్భంలో కృష్ణవేణి, తుంగభద్ర, పెన్న, గోదావరి, బాహుదా మొదలగు నదుల్ని పేర్కొన్నాడు. ఎఱ్ఱాప్రెగడ తన నృసింహపురాణంలో అహోబిలం, సింహాచలం, వేంకటాచలం, పుష్పగిరి, సిద్ధాచలం మొదలైన పుణ్యక్షేత్రాలతోపాటు గోదావరి, కృష్ణవేణితీర్థాలను కూడా వర్ణించాడు. భాస్కరరామా యణంలో ఆంజనేయాది వానరశ్రేష్ఠులు సీతమ్మకోసం కృష్ణవేణీ తీరప్రదేశాలను కూడా గాలించారు.

శ్రీనాథకవిసార్వభౌముడు పల్నాటివీరచరిత్రలో చంద్రభాగ, నాగలేరులాంటి నదులను పేర్కొంటూ పలనాటిసీమలో ఉన్న చంద్రభాగ 'కృష్ణకుసమం' అని ప్రస్తుతించాడు.

రాచమర్యాదలతో వైభవంగా వెలిగిన శ్రీనాథుని జీవితంలో అవసానదశ మాత్రం దయనీయంగా ముగిసిందన్న విషయం అందరికీ తెలిసిందే. శ్రీనాథుని విషాదజీవితానికి కృష్ణానది హేతువు కావడం దురదృష్టకరం.

**కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము**
**బిలబిలాక్షులు దినిపోయె దిలలు పెసలు**
**బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి**
**నెట్లు చెల్లింతు టంకంబు లేడునూర్లు**

అని కృష్ణానదీ తీరంలో బొడ్డుపల్లిలో వ్యవసాయానికి దిగి పన్నులుచెల్లించలేక దివిజకవివరుగుండియల్ దిగ్గురనగ శ్రీనాథుడు స్వర్గానికి వెళ్లిపోయాడు.

బమ్మెఱ పోతనామాత్యుడు తన ఆంధ్రభాగవతంలో **"తుంగభద్రయు, కృష్ణవేణియు, చంద్రభాగయు, భీమరథియు, గోదావరియు.. మహానదులును భారతవర్షమున కలవు. అందు సుస్నాతులై మానవులు ముక్తి చెందుదురు"** అని వర్ణించాడు.

శ్రీనాథుని సమకాలికుడైన గౌరన తన **'నవనాథచరిత్ర'**లో కృష్ణవేణీ నదీ గమన సోయగాన్ని తనివితీరా వర్ణించాడు. **'లోకుల పాతకంబులఁ దన్ను దలచిన మాత్రానఁ దొలగింపజాలి వెలసినదే కృష్ణవేణి'** అని ఉగ్గడిస్తూ గౌరన **'కృష్ణాజలాలు, అక్కడి వృక్షాలు మునిముఖ్యుల కెల్ల కాలంబు వసియింపగ నిరవై'** నవని హృద్యంగా వర్ణించాడు.

భోజరాజీయం రచించిన అనంతామాత్యుడు **'విలసితంబగు కృష్ణవేణీ మలాపహారిణి భీమరథి నా ధరిత్రియందు దనరు నదీ త్రయాంతర్వేది యగు పావన క్షేత్రము'** అని తన నివాసస్థానమైన పెరుమగూరు కృష్ణవేణి, మలాపహారిణి, భీమరథి నదులు కలిసిన ప్రదేశం 'అంతర్వేది' కి సమీపంలో ఉందని పేర్కొన్నాడు. వెన్నెల కంటిసూరన, కొరవిగోపరాజు, మడికిసింగన కృష్ణ, గోదావరి భీమరథి, నర్మద, తుంగభద్ర, కావేరి నదులలో మునిగితే **'నాకలోక సౌఖ్యంబు'** గలుగుతుందని వర్ణించారు.

**'కృష్ణాగౌతమి మధ్య భూమ్యస్తోత్కలరాట్పురీ హరణ లీలావార్య శౌర్యోదయు'** దని అల్లసానిపెద్దన శ్రీకృష్ణదేవరాయలను అభివర్ణించాడు. కృష్ణా గౌతమీ నదుల నడుమ ఉన్న వేంగిదేశంపై దాడిచేసి జమ్మిలోయ, కోనసీమ మొదలైన మన్యసీమలను జయించిన వీరుడు కృష్ణరాయలని దీని భావం. ధూర్జటి శ్రీ కాళహస్తీశ్వర మహాత్మ్యంలో నత్కీరుడు, తీర్థయాత్రాపరులకు సురతరువు కొమ్మయైన గుండ్లకమ్మ నదిలో,సుకృతి భూత పాతకశ్రేణియగు కృష్ణవేణిలోమునిగి పవిత్రీభూత చేతస్కుడయ్యాడు. శ్రీ కాళహస్తీ శ్వరమహాత్మ్యంలోనే అగస్త్యుడు **'గౌతమీ కృష్ణవేణ్యవగాహనముల సేసి శ్రీశైలనాథు దర్శించి'** నాడని చెప్పబడింది.

తెనాలి రామకృష్ణుని 'పాండురంగమాహాత్మ్యం' లో కలశసూతుడైన అగస్త్యునికి కుమారస్వామి గంగ, పెన్న, విపాశ, చంద్రభాగ, శరావతి, వేత్రవతి, బాహుద, కృష్ణవేణి, కావేరి, కపిశ, మంజీర, భవనాశిని (సరయూనది), తుంగభద్ర, గౌతమి మొదలగు నదీ తీర్థాల దివ్యచరిత్రలను వినిపించాడు.

**క॥ ఈ గంగాదిక తీర్థము**
**లీగంగానీవు తమ సమిద్ధాంబువులన్**
**దోఁగెడు వారల గనగనఁ**
**గ్రాఁగెడు నంగార సింధుకల్లోములన్ (1-150)**

"పైన చెప్పబడ్డ గంగ మొదలైన తీర్థాలు, మిక్కిలి పవిత్రాలైన తమ జలాల్లో మునిగేవారిని గనగన మండుతుండే నిప్పుటేటి అలల్లో మునుగనీయవు, అంటే పవిత్రమైన గంగాదితీర్థాలలో మునిగే వారికి నరకలోకంలోని వైతరిణినదిలో గనగన మండే నిప్పు అలలలో మునగాల్సిన అవసరం లేదు. వారు నరకానికి వెళ్లరు. పుణ్యలోకాలు పొందుతారు."

చేమకూరవేంకటకవి 'విజయవిలాసం'లో తీర్థయాత్రలకు బయలుదేరిన అర్జునుడు 'కృష్ణవేణ్యాది పుణ్యతరంగిణులలో మునిగి సుభద్ర కౌగిలిలో తేలాడు.

ఇంకా పింగళి సూరన, రామ రాజభూషణుడు అద్దంకి గంగాధరకవి, చరిగొండ ధర్మన, భైరవకవి, మల్లన, కుమారధూర్జటి, దోనేరు కోనేరునాథుడు, బిజ్జుల తిమ్మభూపాలుడు పాలవేకరి కదిరీపతి అందుగుల వెంకయ్య, దామెర్ల వెంగళనాయకుడు, వెలగపూడి కృష్ణయామాత్యుడు, అయ్యలరాజు నారాయణామాత్యుడు మొదలైన కవులెందరో తమ సాహిత్యంలో కృష్ణానదిని ప్రస్తావించినవారే.

ఆధునిక కవులకు జాతీయోద్యమ కాలంలో తెలుగునేల, తెలుగు జాతి తెలుగుచక్రవర్తులు, తెలుగుదేశాన్నేలిన నదులు ప్రేరకాలుగా నిలిచాయి.

**కృష్ణాతరంగపంక్తిన్ ద్రొక్కి త్రుళ్ళింత**
**నాంధ్రనౌకలు నాట్యమాడునాడు**

కృష్ణానదిలో ఆంధ్రనౌకలు ఆనందవిహారం చేసిన నాటి వైభవాన్ని వర్ణించి రాయప్రోలుసుబ్బారావు ఆంధ్రజాతిని ఉత్తేజితులను చేశారు.

**జయము జయము ఆంధ్రజగజ్జననీ మముగన్న తల్లి**
**పూజించెద మెదల మేము తేజోమయ విగ్రహమ్ము**
**తరళ కృష్ణవేణి గోదావరీ హృదయహార**
**చరణోజ్జ్వల సాగర! మణికిరణోజ్జ్వల మంజీరా!**

అని రాయప్రోలు సుబ్బారావు కృష్ణ, గోదావరి, మంజీర బంగాళాఖాతాలతో కూడుకున్న ఆంధ్రజగజ్జననికి జయోఽస్తులు పలికారు.

తిరుపతి వేంకటకవులు

**సకల కలుష హంత్రీ సర్వసౌఖ్య ప్రదాత్రీ**
**విమలసలిల శోభా కృష్ణవేణీ నదీయం**
**నిఖిల మనుజ నిత్యస్నానపానాది యోగ్యా**
**జయతి విజయవాట ప్రాంత దేశే నితాంతం**

అని సుసంస్కృతహృదయంతో కృష్ణాయశోగీతికల నాలపించారు.

వేటూరిప్రభాకరశాస్త్రి కృష్ణాతీరంలోనున్న విజయవాడను వర్ణించిన తీరు రమణీయం.

**ఈ యింద్రకీలాద్రి నింద్రజు దభవుతో**
**పోరి పాశుపతంబు పొసగ నందె**
**నీ పుణ్యగరిమయందు నీశుండు భూమీ**
**సురున కర్థిసాయుజ్య మొనయనిచ్చె**
**నీ పట్టణంబున నెలమి మాధవవర్మ**
**ఘనముగా గురియించె కనకవర్ష**
**మీ క్షేత్రమున శమీవృక్షంబునను వహ్ని**
**బటుచేల చేగట్టె పండితయ్య**
**భవ్య కృష్ణానదీ తటప్రాప్త భోగ**
**దక్ష సన్మోక్ష లక్ష్మి ప్రధానమనగ**
**చెలగె మల్లేశ లింగనస్థితి నిరూఢి**
**పుణ్యనిలయంబు బెజవాడ పురంబు.**

బంగారుతల్లి కనకదుర్గ. విజయవాడ, అనగానే కనకదుర్గ – కనకదుర్గ అనగానే విజయవాడ గుర్తుకు వస్తుంది. అమ్మ దుర్గ వరాల తల్లి. దుర్గమ్మ శాంత – సుందరమూర్తి. ఆ తల్లి వదనం వాత్సల్య ప్రకాశం. అలంకారంలో అమ్మను దర్శించడానికి మానవనేత్రాలు చాలవు. కనకదుర్గ విజయవాడకు అధిష్ఠాత్రీ దేవి. కృష్ణానదీ తీరాన ఈ దేవి స్వయంవ్యక్త యి వేంచేసి ఉన్నారు. ఆమె కాలాతీత. యుగాలపూర్వం వెలసినదేవి, మాత, తల్లి, అమ్మ. కష్టాలు తొలగించి సుఖాలు కలిగించే వరాల కనకదుర్గను, దర్శించటానికి నిత్యం వేలవేల యాత్రికులు చేరుతుంటారు.

కవిసమ్రాట్ విశ్వనాథసత్యనారాయణ అస్వతంత్ర జాతి హైన్యాన్ని, దైన్యాన్ని రూపుమాపాలంటే తెలుగునదులన్నీ పొంగి ముంచి వేయాలని ఆవేశంగా అంటారు.

**గౌతమీ కృష్ణవేణీ తరంగములు తా**
**రాధ్వమ్మునందు నైక్యము భజించి...**

గౌతమీ కృష్ణాతరంగాలు తారకలు తిరుగాడే మార్గంలో అంటే ఆకాశం దాకా ఎగసి ముంచివేయాలి. లేకపోతే ఈ బ్రతుకు తెన్నువారు భరించలేరని ఉద్వేగమహితంగా అంటారు.

**గోదావరీ పావనోదార వాఃపూర**
**మఖిల భారతము మాదన్న నాడు**
**తుంగభద్రా సముత్తుంగ రావముతోడ**
**కవులగానము శ్రుతిఁగలయునాడు**
**కృష్ణాతరంగ నిర్ణిద్ర గానము తోడ**
**శిల్పమ్ము తొలిపూజ సేయునాడు**
**అక్షరజ్ఞానమెరుగదో ఆంధ్రజాతి**
**విమల కృష్ణానదీ సైకతముల యందు**
**కోకిలపుపాట పిచ్చుకగూండ్లు కట్టి**
**నేర్చుకొన్నది పూర్ణిమా నిశలయందు**

–అన్న విశ్వనాథ పద్యం అతి ప్రసిద్ధం. విశ్వనాథ కృష్ణవేణి మీదుగా వచ్చే గాలులకు ప్రకృతి అంతా తన్మయానికి లోనయిందంటారు. కృష్ణవేణీ తరంగ నిర్నిద్రమధురలీలా స్వనమ్ముతో గలసిమెలసి వచ్చు మలయ మంజుల సాంధ్యవాతములకు ప్రకృతి

యంతయు తన్మయత్వమ్ము నొందెనని విశ్వనాథ పరవశంతో పలుకుతారు.

విజయవాడ ప్రోఢ విఖ్యాత కంఠపు
మండిత వజ్రాలదండయనగ
మాగాణి భూముల దోగాడు జలముల
పిల్లకాల్వల పిల్లతల్లి యనగ
లంక భూములపైకి లంఘించు వెల్లువ
నురుగుగ్రక్కెడు క్రూరయురగమనగ
జలధినాథుని మేన జలములన్ జల్లుచు
జలకమాడించెడు జాణయనగ
నురుగుగ్రక్కుచు చెరచెర బరుగులిడుచు
భంగురంబైన సుడిగుండ పొంగుటలల
తృష్ణ దీర్పెడు నాట్యంపు కృష్ణవేణి

తెలుగువెలుగుల తొలకరి నొలుకు కులుకు- అని వజ్రాల హారంగా, పిల్లతల్లిలాగ, క్రూరసర్పంలాగ, నెరజాణలాగ భిన్న భిన్నంగా విశ్వనాథ వర్ణించారు.

కృష్ణానదిపై నాగార్జునసాగరం ఆనకట్ట కట్టిన 1955లో గేయ కవితాచక్రవర్తి డా॥సి.నారాయణరెడ్డి నాగార్జునసాగరం పేరుతో ఒక రమ్యమైన గేయకావ్యాన్ని రచించి ఆంధ్ర భారతికి హారతిగా సమర్పించారు.

1) అదిగొ కృష్ణమ్మ నవ్యాప్సరోంగన భంగి
తృష్ణ దీర్పెడు నాట్యంపు కృష్ణవేణి

2) ఆమె ఒకమారు నోరార పల్కిన చాలు
పదివేల కిన్నరుల పదివేల కిన్నెరల హృదయ
తంత్రికలపైమోయించినటులనిపించు

ఖండగతిలో ఐదు ఐదు మాత్రలతో ఈ గేయం నడుస్తుందన్న మాట.

3) ఆమె కన్బొమలకెనయైన చాపము లేదు
ఆమె తరగలు పొందనట్టి రూపము లేదు

4) ఆమె కెరటాలు చిత్రాతివిచిత్రములైన గతులతో
పయనించు కవితలే యనిపించు

5) ఆమె యొడిలోన నిద్రావస్థలోనున్న
శిశువుల విధాన పచ్చిక బయళ్లొప్పారు

ఈ విధంగా సినారె గేయం కృష్ణాప్రవాహవేగంతో సమంగా కదం తొక్కింది.

ప్రసిద్ధ రచయిత పైడిపాడి సుబ్బరామశాస్త్రి 'త్రిలింగదేశం మనదేనోయ్ తెలుంగులంటే మనమే నోయ్' అనే గేయంలో ఆంధ్రభాషా మాధుర్యం, కృష్ణరాయలు, తిక్కనలాంటి మహనీయుల సంస్మరణం, శ్రామిక సౌభాగ్యం మొదలైనవి పేర్కొంటూ..

గోదావరి కృష్ణా తుంగభద్రా పెన్నా
కావేరీ పంపా కని పెంచినవోయ్ తెలుగు జాతిని

– అని పైడిపాటివారు గోదావరి కృష్ణాస్వాదు జలాలలో ఆంధ్రులు ఎదిగారని సంభావించారు.

వేములపల్లి శ్రీకృష్ణ రాసిన 'చేయెత్తి జైకొట్టు తెలుగోడ' అనే గేయం ఆంధ్రావని అంతా మారుమ్రోగిపోయిన ప్రసిద్ధగీతం. అందులో...

కల్లోల గౌతమీ / వెల్లువల కృష్ణమ్మ
తుంగభద్ర తల్లి / పొంగిపారిన చాలు
ధాన్యరాసులు పండుదేశాన / కూడు గుడ్డకు కొదువ లేదోయి

– అని కృష్ణానదీప్రాశస్త్యాన్ని గానం చేశారు.

## పుష్కర సంరంభాలు

తిమిరంతో సమరం జరిపిన మహాకవి దాశరథి- 'ఒకవైపు కృష్ణవేణిక ఉబ్బి తబ్బిబ్బు / లైసాగి తెల్గింట సేసపెట్ట' సుజలయై తెలుగుతల్లి శోభిస్తున్నదనీ. 'నా తల్లి కృష్ణవేణమ్మ కన్నీరొత్తుకొనుచు నాపై ప్రేమమినుమడింప జేసిందనీ, 'కృష్ణానదీ తరంగాలు తృష్ణ దీర్పు సుదాఝరులనీ దాశరథి తృప్తిచెందారు.

క్షితి నెన్నెన్ని యుగాలనుండి భవదక్షిణ ప్రవాహము భా
రత దేశస్థ మహేంద్రమున్ తడిపెనో! రత్నాలు పండించెనో!
పతియౌ అంబుధి నిన్ను వీచికలతో బంధించి ప్రేమించెనో!
నతులందింతును పుష్కరవ్రతవిధిన్ నాతల్లి! కృష్ణాపగా!
పుష్కరము వేళ నీనీట మునుగు మాకు
పూత మందాకినీ గాహ పుణ్యమబ్బు
ఈ మహాపర్వమందు తల్లీ! త్వదీయ
వారిధారల గ్రుంకుట వలన ముక్తి
స్నానదానాలు నీపుష్కరాన జరుప
మానవాళి యఘములు మాసిపోవు
యెంత చల్లనితల్లివే! యెదదలోని
మంటలారును నీవారినంటగానే
తనువు తాపము; మానసతాప మెడల
తల్లి! నీ పాదతీర్థమ్ము త్రావినాము,
నీదు బిడ్డల గుండెలనిండ నీవు
ధారవోతువు కరుణాసుధారసమ్ము
ఇంద్ర కీలాచలమ్మెంత యెత్తో, అంత

**లోతు నీ గుండె! మా దివ్యమాత వమ్మ!**

**కృష్ణవేణమ్మ! తెలుగమ్మ! తృష్ణవాపి**

మాకు జ్ఞానదానము జేసి మనుపుమమ్మ" - అని దాశరథి పాపాలను పోగొట్టి, పుణ్యాలనిచ్చి ఎదలోని మంటలార్పే చల్లని తల్లిగా కృష్ణానదిని అభివర్ణించారు.

కరుణశ్రీ జంధ్యాలపాపయ్యశాస్త్రి - కృష్ణవేణి పుష్కరాలకు ఇలా ఆహ్వానం పలికారు.

**కదలిరావే కృష్ణవేణి!**

**కదలిరా నిత్యకల్యాణి!**

**కదలికదలిరా కడుపుచల్లనితల్లి!**

**జలజలా పొంగుతూ కిలకిలానవ్వుతూ**

**కోటితీర్థాలు నీ నోటిలో దాచి ము**

**క్కోటిదేవతలు నీ పైటలో ముడివైచి**

**కదలిరా కదలిరా కదలిరాయని రాణి!**

**ఎదురుచూచుచునున్న ఓ తెల్గుమాగాణి**

**గురుడు కన్యారాశి కరుదెంచు శుభవేళ**

**విరబూచునంట పుష్కరము నీ కెరటాల**

**నీవారిలో మునుగు మావారి కరుణింప**

**దేవతలు నీ మహిమ కైవార మొనరింప**

అని పుష్కరాలవేళ కృష్ణానదిలో మునిగే జనులను పునీతులను చేయగ- **గళమెత్తి పాడుతూ నలుదెసల చాటుతూ, కలహంస గమనవై కలికలుష శమనవై** - రమ్మంటూ కరుణశ్రీ స్వాగతం పలికారు.

ప్రఖ్యాతచారిత్రక నవలారచయిత నోరినరసింహశాస్త్రి కృష్ణానదిలో స్నానమాచరించి తమ పూర్వయౌవనాన్ని, ఉత్సాహాన్ని పొందాలని ప్రార్థిస్తున్న పద్యం గమనిద్దాం.

**నీ కల్లోల కరాబ్జ సంతతుల మేనిం దాకవే చల్లగా**

**నా కాయంబును ముంచి తేల్చవే త్వ దంభశ్శీకరా సార ధా**

**రా కేలిన్ తనియింపవే శ్రవణముల్ గాంధర్వ సంపత్తిచే**

**నా కౌమార మిగిర్చి నిల్పగదే కృష్ణామాత! జన్మాంతమున్**

కృష్ణానది సంవత్సరకాలంలో సగం శుష్కించి ఉంటుంది. వర్షాకాలంలోనే దాని విజృంభణమంతా. దీన్ని దృష్టిలో పెట్టుకొని నోరినరసింహశాస్త్రి–

**నిన్నా మొన్నటి దాక నెండబడి ఎంతే జాలిగా జాలుగా**

**ఉన్నా వోపిక లేక నాకు వలెనే, ఒక్కుమ్మడిన్ నేడు సం**

**పన్నాత్మీయ మహాప్రవాహమున సివ్వాలాడుచున్నావు నే**

**నిన్నీనాడును పోలి పొంగగలనంటే తల్లి కృష్ణాపగా!**

ముందు పద్యం సలక్షణమైన గ్రాంథికంలో రాసి ఈ పద్యాన్ని విలక్షణమైన వ్యావహారికంలో రాసి ఉభయ రచనాకోవిదులయ్యారు నోరివారు. యౌవనంలో రకరకాల విషయాల్లో ఉత్సాహంతో పొంగులువారడం సహజం. వార్ధక్యం వచ్చాక శరీరంకృశించి, శక్తి హీనమయ్యాక మునుపటి ఉత్సాహం, ఓపిక లేని తనస్థితిని కృష్ణానది కన్వయించడంలో తమ నేర్పు చూపారు.

తెలుగులెంక తుమ్మల సీతారామమూర్తిగారు **'ఈ పుష్కర సుదినమ్ముల నీపావనతీర్థముల మునింగి తను హృద్దీపక శుచితా సంపద నాపోవలంచువారి'** నభినందింతునన్నారు.

**తల్లి! కృష్ణానదీ! భవత్తటమునందె**

**మ్రోసె నాంధ్రపతాక మమ్మొదటి దెగసి**

**తెలుగునావలు నీ దీవనలు గడించి**

**యెత్తె తెరచాప దీవుల నెల్ల నొత్తె**

**నీవు కరుణానిధివి**

అని కృష్ణానది పావనత్వానికి జోహారులర్పించారు.

చరిత్ర, సంస్కృతి, సంపదలతోపాటు జనజీవనానికి ఆధారభూతమైన ఆహారధాన్యాలను పుష్కలంగా పండించుకోను కృష్ణవేణీమతల్లి రైతులకెంతగానో తోడ్పడుతుంది. తొలకరివానకు మెత్తబడిన భూమిపై కృష్ణానది జలాలను నింపుకొని, రైతులు వ్యవసాయపు పనులు ప్రారంభిస్తారు. ఆడుతూ, పాడుతూ ఏరువాక పండుగను ఘనంగా చేసుకుంటారు. "ఏరుముందా? ఏరో పౌర్ణముందా?' అని నాగలి పన్నుతారు.

**ఏరువాకొచ్చిందిరా! రైతన్న నేడు**

**మేడిపట్టి దున్నాలిరా!**

**తొలకరిజల్లుకు పుడమికి పులకరింత వేసింది,**

**నిదురలేచి నీకొరకే నేలతల్లి సూత్తోంది,**

**విత్తనం వేయాలి, కలుపు తీసిపెంచాలి,**

**పొట్టవేసి కంకులన్ని పిగిలి పిగిలి రావాలి,**

**కంకి బరువు తలవంచిన పైరులక్ష్మి చూడరా!**

**కాటన్‌దొర పేరు చెప్పి కొడవలంది కోయరా!**

**కుప్పనూర్చి పోతపోసి పొలిగాడిని పిలవరా!**

**దేశానికి వెన్నుపూస మనకన్నా ఎవరురా?**

**పొలియోపొలీ! పొలియోపొలీ!**

**రావేలు గలవాడ - రార పొలిగాడ!**

కర్షకజనావళి ఆనందోత్సవాలతో అందించే క్రొత్తపంటల తొలి రుచుల్ని చవిచూస్తూ, పిల్లా మేకా చల్లంగుండాలని దీవిస్తుంది కృష్ణవేణి.

రైతులు కృష్ణమ్మను చూసి మురిసిపోతారు. పూసిన తంగేడులా ఉన్న ఆమె రూపు వారికి ఆరాధ్యదైవం. ప్రత్యక్షరూపం.

**అమ్మతల్లి కిట్టమ్మకు హారతిచ్చి మొక్కరా!**
**రైతు కూలి బిడ్డలకు ఆమె పేరు ముందురా!**
**ఝున్నన ననన ఝున్నన - ఝున్నన ననన ఝున్నన.....**

అల్లంత దూరంతో పైరుగాలికి కదిలే సముద్ర కెరటాలు వాటి కమ్మని సంగీతాలు విన్పిస్తుంటాయి. పల్లెకారుల శ్రమగీతాల బాణీలు శ్రుతిపక్వంగా లయ కలుపుతుంటాయి. ప్రకృతి మనో హరంగా ఉంటుంది. తెరచాపల రెపరెపలు, పక్షుల కిలకిలా రావాలు, జలచరాల త్రుళ్లింతలు మనోజ్ఞంగా ఉంటాయి. కృష్ణవేణి గంగపుత్రుల పాటలకు మురిసిపోతుంటుంది.

**అమ్మో! కిట్టమ్మో! మాయమ్మో! కిట్టమ్మో!**
**అక్కడెక్కడో పుట్టావు, ఇక్కడికే వచ్చావు,**
**పిల్లపాపల నందరి చల్లంగా ఏలేవు.**
**ఇటువైపున ఘంటసాల, అటువైపున భట్టిప్రోలు**
**ఎదురుగ హంసలదీవికి ఎంతోపేరు తెచ్చావు.**
**నిన్ను నమ్మి జీవించే మమ్ముల కాయవె తల్లీ!**
**చల్లగ నీ వడిలోబడి సాగిపోవు మా జీవిక.**
**వరదొస్తే నీ రూపం వొడ్డొరసే నీ కోపం**
**చూడలేము మాతల్లో! ఇద్దరి అద్దం ఏకం.**
**జీవధార నీవమ్మా! జీవనాధార వమ్మ**
**పూలూ బుక్కాయిపెట్టి పూజింతుము మాతల్లో!**

### అడుగడుగున గుడి ఉంది

కృష్ణానది పుట్టినదాదిగా సాగరసంగమం వరకు సాగేదారిలో ఎన్నో పుణ్యక్షేత్రాలు ఉన్నాయి. వాటిలో... ముఖ్యమైనవి ఇవి అని చెప్పలేము. ప్రముఖంగా శ్రీకాకుళఆంధ్రమహావిష్ణువును స్మరించి తీరాలి. ఈ ఆలయం కృష్ణాతీరంలో చాలా ప్రసిద్ధి పొందిన క్షేత్రం. శ్రీకృష్ణదేవరాయలకు స్వామి కలలో కనిపించి ఆముక్త మాల్యద వ్రాయమనడం, కళింగవిజయం ప్రాప్తిస్తుందని చెప్పడం, 'దేశ భాషలందు తెనుగులెస్స' అని స్వామి అనడం ఆ ప్రబంధంలో రాయలు వ్రాసుకున్నాడు. శ్రీకాకుళాంధ్రమహావిష్ణువును గురించి ఎన్నోకథలు రెక్కలు కట్టుకొని లోకంలో విహరిస్తున్నాయి. ఏది ఏమైనా ఆంధ్రభోజుని కావ్యకన్యక ప్రభవించిన మహత్తర ప్రదేశం ఇది. ఇక్కడి దేవుణ్ణి రాయలు ఇలా వర్ణించాడు.

**సీ॥ నీలమేఘము డాలు డీలు సేయఁగఁ జాలు**
**మెఱుఁగుఁ జామన చాయమేని తోడ,**
**నరవిందముల కచ్చులడగించు జిగిహెచ్చు**
**నాయతంబగు కన్నుదోయి తోడఁ**
**బులుగురాయని చట్టుపల వన్నెనొరవెట్టు**
**హొంబట్టు జిలుఁగు రెంటెంబుతోడ**
**నుదయార్కబింబంబు నొఱపు విడంబంబు**
**దొరలంగ నాడు కౌస్తుభముతోడఁ**

**తే.గీ. దమ్మికేలుండఁ బెఱకేల దండయిచ్చు**
**లేములుడిపెడు లేఁజూపు లేమతోడఁ**
**దొలకు దయఁ దెల్పు చిఱునవ్వుతోడఁ గలఁద**
**దంధ్ర జలజాక్షుఁడిట్లని యానతిచ్చె (1-12)**

స్వప్నంలో తోచిన ఆంధ్రవిష్ణువు రూపవర్ణన ఇది. నల్లని మబ్బుల కాంతిని క్రిందుచేసే మెఱుగుచామనచాయమేను ముందు కన్పించింది. ఒక నీలకాంతిపుంజము కనిపించి అదే శరీరంగా పరిణమించినట్లు, అందులో తామరపూలగర్వాన్ని ధిక్కరించగల విస్తారమైన కనుదోయి తోచింది. అంటే శిరస్సు దృగ్గోచరమైంది. తరువాత గరుత్మంతుని రెక్కలకాంతికి వన్నెపెట్టగల బంగారు పట్టువస్త్రం ఆ శరీరాన్ని ఆవరించి ఉంది. వక్షఃస్థలం మీద కౌస్తుభ రత్నం అరుణార్కబింబసౌందర్యాన్ని ధిక్కరిస్తోంది. అంటే ఆయన వక్షఃస్థలం నీలాకాశం లాగా కౌస్తుభరత్నం అక్కడ ఉదయిస్తున్న సూర్యునిలాగా ఉందనిధ్వని. ప్రక్కన లక్ష్మీదేవి ఒకచేత పద్మాన్ని ధరించి మరొకచేతితో భర్త హస్తాన్ని గ్రహించి ఉండగా మంద హాసం నుండి కారుణ్యం తొణికిసలాడుతుండగా కలలో కన్పించిన తెలుగురాయడు అలా ఆజ్ఞాపించాడట.

కృష్ణాతీరంలో మరో మహిమాన్విత క్షేత్రం అమరేశ్వరం. అమ రేశ్వరస్వామి కేవలం భక్తుల కోరికలు తీర్చటానికి వరాలు ప్రసాదించడానికి కృష్ణానది దక్షిణ తీరాన నిలిచి ఉన్నారు. దేవేం ద్రుడు-కపిలమహర్షి కృష్ణాతీరపు అమరేశ్వరస్వామిని సేవించు కున్నారు. వరాలు పొందారు. కావుననే అమరావతి పవిత్రక్షేత్రంగా విరాజిల్లుతున్నది. వర్ధిల్లుతున్నది.

అమరావతి కృష్ణానదిలో అనేక పవిత్రమైన నదీజలాలు చేరి ఉన్నాయి. కావున, శ్రద్ధాభక్తులతో కృష్ణలో స్నానంచేసి అమరేశ్వ

రుని ఆరాధించినవారు సమస్తపాపాలనుండి విముక్తులు అవుతారు. అట్టివారికి పునర్జన్మ ఉండదు.

అమరావతిలో మూడురాత్రులు ఉండాలి. మనసులో అమరేశ్వ రుని నిలుపుకోవాలి. భక్తిసమన్వితుడై కృష్ణలో స్నానం చేయాలి. అమరేశ్వరస్వామిని ధ్యానిస్తూ అనన్యంగా అర్చించాలి.

అట్టివానికి శివసాయుజ్యం సంప్రాప్తం అవుతుంది.

ఈ ధాన్యకటకం అమరావతియే కాక వారణాసి. అమరావతి కృష్ణయే కాశీగంగ. అమరేశ్వరుడే కాశీవిశ్వనాధుడు. అమరావతి కృష్ణలో స్నానంచేసి, అమరేశ్వరుని దర్శించి జపతపాదులు చేసిన వారికి కాశీలో కలుగునటువంటి సమస్త పుణ్యఫలితాలు లభిస్తాయి.

అమరావతికి క్రౌంచపురి - అమరేశ్వరునికి క్రౌంచనాథుడు అనే నామాంతరాలు ఉన్నాయి.

ఒకప్పుడు రాక్షసులకు దేవతలకు యుద్ధం జరిగింది. దేవతలు పరాజితులు అయినారు. దేవతలు శివుని దగ్గరికి వెళ్లారు. తమను రక్షించుమని ప్రార్థించారు. శివుడు రాక్షససంహారం చేస్తానని మాట ఇచ్చాడు. శివుడు రాక్షససంహారం చేసేదాకా దేవతలు - అమరులు ధాన్యకటకంలో నివసించారు.అందువల్ల అమరావతి అనిపేరు కలిగింది.

అమరేశ్వరఆలయం సుందర కృష్ణానదీతీరాన ఉంది. ఇక్కడ కృష్ణమ్మ నెలవంపుతో సాగుతుంది.

కృష్ణానది పడమటినుంచి తూర్పుకు ప్రవహిస్తుంది.కానీ, అమరావతి లో ఆలయప్రాంతాన తూర్పునుంచి పడమటికి ప్రవహిస్తుంది. తర్వాత మళ్లీ తూర్పుగా ప్రవహించి సాగరుని వడిలో ఒదిగిపోతుంది.

ఈ విధంగా నదీతీరంలో దేవాలయం ఉండడం పవిత్రం,వరప్రదం అని శాస్త్రాలు వక్కాణిస్తున్నాయి.అమరేశ్వరం పుణ్య క్షేత్రం.ఇందుకు అవసరం అయిన 1) మహాలింగం 2) నది 3) స్థలపురాణం ఉన్నాయి.

అమరేశ్వరం విశాలం- సుందరగోపురసంయుక్తం - పవిత్రం. ఈ పుణ్యక్షేత్రంలో శివస్వామి 1) ప్రణవేశ్వర 2) అగస్త్యేశ్వర 3) కోసలేశ్వర 4) సోమేశ్వర 5) పార్వతీశ్వర రూపాల్లో ఉన్నారు.

అమరేశ్వరస్వామి దేవేరి బాలచాముండిక. అష్టాదశశక్తుల్లో ఈ దేవిది నాల్గవస్థానం.

అరుణోదయ ప్రశాంతతలో సుస్వర వేదరుద్రమంత్రాలతో శివ స్వామికి అభిషేకం. కనువిందు, మానసకమలవికాసం!

తారకాసురయుద్ధంలో కుమారస్వామి శరాఘాతానికి తారకాసు రుని కంఠంలోని శివలింగం పంచశకలాలైంది.అట్టి పంచశకలాలు ఆంధ్రదేశంలో గోదావరి ప్రాంతంలో నాలుగు, కృష్ణ ప్రాంతం అమరావతి ధాన్యకటకంలో ఒకటి పడ్డాయి. అమరావతిలో పడిన శివలింగం అన్నిటికన్న పెద్దది! ఆ విధంగా పంచారామాలు ఏర్పడ్డాయి.

ద్రాక్షారామ కథనంలో ఇంద్రుడు శివలింగపు అతిపెద్ద ముక్క పడిన చోటుకు చేరుకున్నాడు. తెల్లని ఆ శివలింగం సజీవం అయింది. పెరుగసాగింది. అడ్డుకునేట్లు లేదు. ఆకాశాన్ని తాకే ట్లుంది! ఇంద్రుడు - దేవగురువు బృహస్పతిని అడిగాడు. అతడు శివలింగాన్ని వెంటనే ప్రతిష్ఠించమని ఆదేశించాడు. ఇంద్రుడు ఇప్పుడు ఉన్నతంగా పెరిగిన శివలింగాన్ని - కృష్ణాతీరాన ధాన్య కటక అమరావతిలో ప్రతిష్ఠించాడు. అమరావతి దేవభూమి.

ఇంద్రుడు ప్రతిష్ఠించి, దేవతలు అర్చించినందున ఆ స్వామి అమరేశ్వరుడు - దేవతలకు దేవత అయ్యాడు. అమరేశ్వరలింగ స్థాపన జరిగింది. అప్పుడు రాక్షసగురువు శుక్రాచార్యుడు వచ్చాడు. నది ఒడ్డున లింగం పెట్టావు - వరద వస్తే కొట్టుకుపోదా! అని బృహస్పతిని అడిగాడు. "ఆచార్య! అమరేశ్వరలింగం క్రౌంచ పర్వతం మీద ఉంది. ఆ పవిత్ర పర్వతమూలాలు పాతాళందాకా ఉన్నాయి. కృష్ణకు వరద వస్తే తన దారి మార్చుకోవలసిందే. లింగాన్ని తాకజాలదు" అని చెప్పాడు.

ఇంకా కృష్ణాతీరంలో... శ్రీభ్రమరాంబమల్లేశ్వరస్వామిఆలయం (తోట్లవల్లూరు); శ్రీముక్తేశ్వర, భవానీఅమ్మవార్ల దేవాలయాలు (ముక్త్యాల); వల్లీదేవసేనాసహిత శ్రీసుబ్రహ్మణ్యేశ్వరాలయం (మోపి దేవి); శ్రీశోభనాచల వ్యాఘ్రలక్ష్మీనరసింహస్వామిఆలయం (ఆగిరి పల్లి); పాండురంగస్వామి దేవాలయం (చిలకలపూడి); శ్రీలక్ష్మీనారా యణస్వామి ఆలయం (అవనిగడ్డ); ఉభయరామేశ్వరాలయం (ఐలూరు); దాసాంజనేయస్వామిఆలయం (మాచవరం); శ్రీరంగ నాయకస్వామి ఆలయం (శ్రీరంగాపూర్); శ్రీఆంజనేయస్వామి ఆలయం (పెద్దచింత రేవుల); శ్రీవేంకటేశ్వరస్వామిఆలయం (వేకనూరు) మొదలైనవి.

### కళలకు కాణాచి

ప్రకాశంబారేజి దాటుకుని వెళ్లిన కృష్ణవేణమ్మ రసమయ జగత్తు లోకి అడుగుపెట్టింది. తన ఒడ్డున కళకళ్లాడే పల్లెసీమలు, పల్లెల్లో ప్రతిఇంటిముంగిటా కళ్లాపి జల్లిన ప్రాంగణాలు, వాటి మీద తెల్లగా మెరిసిపోతూ తీర్చిదిద్దిన రంగవల్లులు, గట్టుమీద ఊరూరా చిన్నదో పెద్దదో ఒక దేవాలయం,అందులో నిత్యదూప దీపనైవేద్యాలతో కూడిన ఆరాధనలు, పంటచేలల్లో నాట్లువేస్తూనో కలుపుతీస్తూనో, కోతలు కోస్తూనో క్షణం తీరికలేకుండా శ్రమించే శ్రామికులు,వారినోటి నుండి జాలువారే జానపదగీతాలు, గడ్డి బీడుల్లో మేతమేసే ఆలమందలు, వాటి మెళ్ళో మువ్వలు చేసేసవ్వడులు,ఆధునికనాగరకతకు చిహ్నంగా వెలసిన హోటళ్ల నుండి, సినిమా హాళ్ల నుండీ వచ్చే మైకులజోరు, అంతలోకే ఏమూలనుండో సన్నగా శాస్త్రీయసంగీతం, మువ్వగోపాల

పదమూ, లయబద్ధమైన అడుగుల విన్యాసం, ఓ జావళీ ఇవన్నీ చూస్తూ వింటూ మరీ మందగమనంతో అడుగుతీసి అడుగువేస్తూ, అలతీసి అలవదులుతూ కదులుతుంటుంది. కృష్ణవేణమ్మ.

## ఆకర్షించే కొండపల్లి బొమ్మలు

కృష్ణాజలాలతో సారవంతమైన,సుభిక్షమైన ఈ ప్రాంతంలో ప్రజల జీవితాలు సుఖసంతోషాలకు నిలయమై, కళలు వికసించి పరివ్యాప్తమై, కమనీయమైనకళాప్రపంచం రసహృదయుల జీవితాన్ని రాగరంజితం చేస్తోంది. రంగురంగుల కొండపల్లిబొమ్మలు, దేశ విదేశాల్లో బాగా ప్రాచుర్యం పొందాయి. విజయవాడ సమీపంలోని కొండపల్లి గ్రామంలో గ్రామీణ కళాకారులకుటుంబాలు కొన్ని ఈ కళలను అంటిపెట్టుకుని జీవిస్తున్నాయి. నిజానికి ఈ కుటుంబాల వారు వెనకెప్పుడో రాజస్థాన్ నుండి వలస వచ్చి ఇక్కడ స్థిరపడి పోయి, తెలుగువారి కళాప్రపంచంలో ఒక అంతర్భాగంలో అయిపోయారు. కొండపల్లి అడవుల్లో లభించే ఒకరకమైన తేలిక పాటి పుణికికర్రతో తయారు చేసే ఈ బొమ్మల్లో తెలుగు జానపద జీవితం ముమ్మూర్తులా దర్శన మిస్తుంది. కొండపల్లి బొమ్మల్లో రాజుగారి ఏనుగు అంబారీ, రాజుగారి ఏనుగు అంబారీ, దశావతారాలు ఎక్కువ ప్రసిద్ధిపొందాయి.

## కూచిపూడి సంప్రదాయ నృత్యం

కృష్ణాతీరంలోని కూచిపూడి గ్రామం తెలుగువారి ప్రత్యేక నృత్య శైలిగా ఈనాడు గుర్తింబడుతున్న సంప్రదాయ కూచిపూడి నృత్యానికి జన్మస్థలం. అభినయం, ఆంగికం,వాచ్యం ముప్పేటల గొలుసు లాగా అల్లుకున్న ఒక విశిష్టమైననృత్యరీతే కూచిపూడి నృత్యం. సిద్ధేంద్ర యోగి మార్గదర్శకత్వంలో ఈ నృత్యం మొగ్గతొడిగిపుష్పించి పరిమళా లను వెదజల్లుతోంది. సిద్ధేంద్రుని సత్యభామ సగర్వంగా నిలబడి, వయ్యారాలు పోతూ, వాల్జడను ప్రదర్శిస్తూ జగద్విఖ్యాతి పొందింది.

భామనే! సత్యా భామనే!
భామనే పదియారు వేలా
కోమలూ లందరీలోనా
రామరో! గోపాల దేవుని
ప్రేమ దాననై సత్యాభామనే

సిద్ధేంద్రుని సత్యభామతో సరసాలాడి, మురిపించు శృంగారి మువ్వపురి క్షేత్రయ్య పదకవితలోని మధురభావమే కృష్ణవేణి!

స్మరణాత్ సర్వపాపఘ్నీం
దర్శనాత్ పుణ్యదాయినీమ్!
స్నానేన ముక్తిదాం కృష్ణాం
వాహినీమ్ ప్రణమామ్యహం ॥

లోకమునెల్ల నీతనువులోనివ! నీవట యెంతకల్గుదో
నాకస పద్మసంభవ జనార్దనులాదిగ నెల్ల పెద్దలున్
నీకొలదింతయంత యననేరక మ్రొక్క దొడంగిరన్న ని
న్నే కరణిన్ నుతింతు పరమేశ్వర! శ్రీగిరి మల్లికార్జునా"!

–పండితారాధ్యుని మల్లికార్జున శతకం నుండి

*చిరునామా : – డా॥ కంపల్లె రవిచంద్రన్, 98487 20478*

కుళం అంటే నది. కా+కుల='కా' (నల్లని) నది. దాన్నే సంస్కృతీకరించి కృష్ణానదిగా పిలిచారు. కాకులం అంటే కృష్ణానది. కాకులేశ్వరుడు 'కృష్ణ ఒడ్డు దేవు'డన్న మాట. 'కా' దేవత కృష్ణా తీరాన ఇలా దేవుడిగా వెలిసింది. కాకుళేశ్వరుడు ఉన్న ఈ ఊరు శ్రీకాకుళంగా ప్రసిద్ధి పొందింది.

నైజీరియాలో "Ka River" ఉంది. అది నైగర్ నదిలో కలుస్తుంది. అక్కడే 'El Kurru' అనే నగరం ఉంది. కృష్ణాజిల్లా నిడుమోలు దగ్గర కూడా ఎలకుర్రు ఉంది. అది కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి జన్మస్థలి. ఎల్లకర్రు అనే ఊరు నెల్లూరు జిల్లాలో కూడా ఉంది. అక్కడ రాతి యుగం నాటి అనేక ఆధారాలు దొరికాయి. తద్దినం పెట్టే అలవాటు ఈ 'కా' ప్రజలకుంది. వారి నుండే మనకు సంక్రమించి ఉండవచ్చు. కాకుల్ని పితృదేవతలుగా (harbingers) భావించే అలవాటు వీళ్లకీ ఉంది.

రాయలసీమలోనూ,బళ్ళారిలో కూడా ఇలాంటి ఆధారాలు అనేకం కనిపిస్తాయి.ఇక్కడినుండి బయల్దేరిన ద్రావిడ గణాలు కొంకణి, గుజరాతు మీదుగా సింధునగరాలకు చేరి,ఆ నాగరికతలో ముఖ్యపాత్ర పోషించార న్నది 'ఫ్రాంక్లిన్ సి సౌత్ వర్త్' అనే భాషా చారిత్రకవేత్త పరిశోధన.

## ఆంధ్రవిష్ణు

కౌండిన్య సుచంద్రుడి కొడుకు ఆంధ్రవిష్ణువనే రాజు, ఈ 'కా' రాజ్యాన్ని ఏలే నిశుంభుణ్ణి ఓడించాడు. ఆంధ్ర సామ్రాజ్యం నెలకొల్పాడు. ప్రజలు ఆంధ్రవిష్ణువుని ఆరాధించ సాగారు. "నిరీశ్వరా పరేదేశా: ఆంధ్ర: ఏకోస్తి సేశ్వర:/ యాత్రాస్తే భగవాన్ విష్ణుః ఆంధ్రనాయక సంజ్ఞయా – దేశపరమైన దేవుడు ఒక్క ఆంధ్ర దేశానికే ఉన్నాడు. ఆయన ఆంధ్రభాషా దేవుడైన ఆంధ్రవిష్ణువు. ఆంధ్ర నాయకుడు, తెలుగు రాయడు అని ఆయనకు పేర్లున్నాయి.

సంకిచ్చ జాతకం, ఘటజాతకం అనే బౌద్ధ జాతక కథలలో అంధకవెణ్ణు పేరుతో ఆంధ్రవిష్ణువు గురించిఉంది.బుద్ధుడు వసుదేవుడు (కృష్ణుడు)గా పుట్టి, ద్వారకా నగరానికి కావలిగా ఉన్న ఒక గొప్ప గాడిద కాళ్ళు పట్టుకుని మచ్చిక చేసుకొని, దాని సాయంతో ద్వారకను బంధించాడట. ఈ వసుదేవకృష్ణుణ్ణి సంకిచ్చ జాతకకథ అంధకవెణ్ణుగా పేర్కొంది.అది ఆంధ్ర విష్ణు శబ్దానికి అంధకవెణ్ణు పాళీ భాషా రూపం కావచ్చు. ఈ వసుదేవుడంతటి వాడు గాడిద కాళ్ళు పట్టుకొన్నాడనే సామెత తెలుగు నేలమీదే ఎక్కువ ప్రాచుర్యంలో ఉండటానికి కారణం అంధవెణ్ణు ఆంధ్రవిష్ణువు కావటమే!

## కాట్టి దేవత

క్రీ.శ. తొలిశతాబ్దాలనాటి కుమార విష్ణువు అనే పల్లవరాజు ఇచ్చిన శాసనాలలో కాట్టిశర్మ, కొట్టిశర్మ, తూర్క శర్మ లాంటి పేర్లు కనిపిస్తాయి. కాట్టి, కొట్టి, తూర్క అనేవి ఆనాటి దేవతల పేర్లే! 'కాట్టు' లేదా కాట్టి దేవత పేరున కాట్రేడుపాడు లాంటి ఊళ్ళ పేర్లు ఏర్పడి ఉండొచ్చు. కాటమరాజు పేరులోని కాటయ్య ఈ కాట్టి లేదా కాట్టు దేవతే అయి ఉంటాడు. పల్నాటి కాటేశ్వరుడి దయవలన కాటమరాజు పుట్టాడని అతని కథలో ఉంది. కొండవీటి రెడ్డి రాజుల్లో కాటయ్య వేముడు ఉన్నాడు. కాట్టు'కు 'కాడు' (అడవి) వికృతి రూపం అయితే కాట్టురేడు అడవిదేవర అవుతాడు. 'కాడువెట్టి' అంటే కాట్టు దేవుడి దాసుడని! ఇది పల్లవరాజుల్లో బిరుదునామం. కాడవరాయ అనేది దీని రూపాంతరంగా పండితులు భావించారు.

## కొట్టి

కొట్టి ఇంటి పేరు గలవారు ఈనాటికీ ఉన్నారు. తొలి పల్లవుల కాలానికి అంటే 1700 యేళ్ళక్రితం కొట్టి దేవత ఆరాధన ప్రాచీన కాలంలో కృష్ణాతీరంలో ఘనంగా ఉండేదన్న మాట. అయితే, వైదిక ధర్మాలను స్వీకరించి బ్రాహ్మణులుగా మారిన వ్యక్తులు శర్మ శబ్దాన్ని తమ పేర్లకు చేర్చుకుని దానాలు పొంది ఉండవచ్చు. వైదిక ధర్మాలను స్థాపించడానికి ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు, పల్లవులు కూడా విశేష కృషి చేసిన సంగతి చరిత్ర ప్రసిద్ధమే!

## తుర్క

దుర్గ అనే దేవత పేరుకు ఈ తుర్క దేవత మూలరూపం కావచ్చు నని శ్రీ వేదం వెంకటరాయ శాస్త్రి అభిప్రాయ పడ్డారు. తూర, తువర అంటే వర్షతుంపర. వర్షాది దేవతగా 'తూర' 'తూర(క)' లేదా 'తుర్కా' దేవతనుకొలిచివుంటారని గోష్టి వారుప్రచురించిన"తెలుగు మఱుగులు" గ్రంథంలో ఒక అభిప్రాయం కనిపిస్తుంది. అయితే, తువర శబ్దానికి సుక్షేత్రం,మంచి వాసనగల నేల అనే అర్థాలు కూడాఉన్నాయి. నేలతల్లిని తురదేవతగా కొలిచి ఉండవచ్చు.'తువరి కంది''తువరక' అనే మొక్కలు కూడా ఉన్నాయి. తువరకుడు అంటే గడ్డం మీసం లేనివాడు. బహుశా అనార్యుడు అనే అర్థంలో ఈ పదం ఏర్పడి ఉండవచ్చు ననుకుంటాను.

## చిత్ర రథ స్వామి

సాలంకాయనులు తాము "చిత్రరథస్వామి పాదానుజ్ఞాతస్య = చిత్రరథస్వామి పాదాను రక్తుల" మని శాసనాలలో పేర్కొన్నారు. అప్పటికి ఆ దేవత సాలంకాయనుల కులదేవత కావచ్చు. శివుడి అవతారంగా ఈ దేవుణ్ణి భావించి ఉండవచ్చు. త్రిపురాసుర సంహార

సమయంలో భూదేవి రథంగా మారి శివునికి సహకరించింది. అలా చిత్రరథం కలవాడు కాబట్టి, శివునికి చిత్రరథస్వామి అనే పేరు వచ్చి ఉంటుందని పండితుల భావన.

### పులుమావి

క్రీ.పూ. 1వ శతాబ్ది నాటి శాతవాహనుల శాసనాలలో ఎక్కువగా కనిపించిన దేవత ఈ పులుమావి. పులుమావి పేరుని తమ పేర్లలో శాతవాహన ప్రభువులు చేర్చుకునే వాళ్ళు 'వాసిష్ఠీ పుత్ర పులుమావి' ఇలా. "రణ్ణోవాసిట్ఠీ పుతన సిరి పులుమావిస" అనీ, "అరహణకు వాహిట్ఠీ మాకణకు తిరు పులుమావికు" అనీ శాసనాలలో పులుమావి పేరు కనిపిస్తుంది. 'పులిల అంటే 'తెల్లుగడ్డి' 'మావి' అంటే పిండాన్ని అవరించి ఉండే పొర.పులుమావి అంటే రెల్లుగడ్డి మావిపొరగా పుట్టిన వాడు అని! ఇది కుమార స్వామికి సంబంధించిన కథ. కుమారస్వామి తమిళ దేవుడనే వాదానికి ఈ శాతవాహన శాసనం ఒక అపవాదు. కుమారస్వామి ఆరాధన తొలుత తెలుగు నేలమీదే ఆరంభమయ్యింద నటానికి ఆధారాలున్నాయి. 'పులు', 'మావి' ఈ రెండూ తెలుగు మాటలే!పులు, పూరి, కసవు అనేవి గడ్డికి తెలుగు పేర్లు.కసవు శబ్దంలో కుశ ఏర్పడిందని, పులకేశి అనే పేరులో కేశి ఇదేనని రాంభట్ల కృష్ణమూర్తి పేర్కొన్నారు. పురి లేదా పూరి మొక్క నెమలి పురి విప్పినట్టు ఉంటుంది. పురి విప్పటం అనేది ఈ పురి మొక్కని బట్టే వచ్చి ఉండవచ్చు.

### శ్రీ ఉత్పత్తి పిడుగు

ఉత్పథము అంటే చెడ్డదారి. దాని పాలిట పిడుగు అయిన దేవుడు "శ్రీ ఉత్పత్తి పిడుగు". కాలాముఖ శైవులు కొలిచిన కాలాముఖ అర్జున దేవత ఈ శ్రీ ఉత్పత్తి పిడుగు అని పరిశోధకులు చెప్తారు.

### ఎంకి

సుమేరియన్ దేవతల్లో ఒకరు ఈ ఎంకి. భూమి దేవత. రాంభట్ల కృష్ణమూర్తి గారు ఈ ఎంకి వెంకటేశ్వరుడిగా మారి ఉండవచ్చునని అభిప్రాయపడ్డారు. భూమికి ఆకాశానికీ మధ్య ఉన్న వాయువుని ఎన్లిల్ అంటారు. 'అను', 'ఎన్'లిల్', 'ఎన్''కి', 'నిన్' హుర్సగ్' వీళ్ళంతా సుమేరియన్ దేవతలు. సుమేరియన్ చక్రవర్తి సార్గన్ మన పురాణే తిహాసాలలో సగరుడుగానూ, అతని కొడుకు ఆహ్ 'మెనిస్ అసమంజ సుడిగానూ కనిపిస్తారు. శాతవాహనులకు పూర్వకాలం నుండి గుప్తుల కాలం వరకూ జరిగిన వర్తక వాణిజ్యాల పుణ్యాన మధ్యధరా సముద్ర తీరంలోని సుమేరియన్, బాబిలోనియన్ సంస్కృతులకు చెందిన వర్తకులు కూడా ఇక్కడ స్థిరపడి ఉండవచ్చు. వారిద్వారా వారి దేవతలూ ఈ నేలమీద కొలుపులు పొంది ఉండవచ్చు. వారంతా తెలుగు సమాజంలో కలిసిపోయి ఉండవచ్చు.

### ఎల్లి

ఎల్లి కూడా సుమేరియన్ దేవతే! ఎల్లమ్మ, ఏకూరయ్య ఏకో రామయ్య లాంటి దేవతానామాలకు మూలం ఈ ఎల్లి కావచ్చుని రాంభట్లగారు పేర్కొన్నారు.

### బెజవాడ కనక దుర్గ

ఇంద్రకీలాద్రి మీద అనేక యుగాలలో అనేక దేవతలు వెలిశారు. వారిలో చివరి దేవత కనకదుర్గమ్మ కావచ్చు. తన అన్నల చేత అనుమానించబడి ఆత్మహత్య చేసుకున్న ఒక శీలవతి గ్రామ దేవతగా మారగా, జనం ఆమెకు గుడి కట్టి పూజించారని ఆమె దుర్గగా మారిందని నేలటూరి వెంకట రమణయ్య గారు వ్రాశారు. ఈ కథ ఏ కాలంనాటిదో తెలీదు. విష్ణుకుండిన ప్రభువు బెజవాడ మాధవశర్మ తన కొడుక్కి మరణ శిక్ష విధించి అశ్రితపక్షపాతం లేని పాలన అందించినందుకు మెచ్చి దుర్గమ్మ కనకవర్షం కురిపించి కనకదుర్గ అయ్యిందని శాసనాధార ఐతిహ్యం చెప్తోంది.

### కాకతి

కాకతి ఒక జైన కులదేవత. ఏకవీర దేవతారాధకులుగా బయలు దేరిన కాకతీయులు ప్రోలయరాజు వరకూ జైనులుగా ఉండి, ఆ తరువాత శైవులుగా మారారు. యథారాజా తథా ప్రజా అన్నట్టే ప్రజలూ రాజుని అనుసరించారు. 'రాజానుమతం ధర్మం' అని కదా ఆర్యోక్తి.

### ఏకవీర

ఏకవీర కూడా శైవదేవతే అయి ఉంటుందనిసురవరం వారన్నారు. "కాకతమ్మకు సైదోడు ఏకవీర అని ప్రసిద్ధి. రెడ్డి రాజుల కాలంలో కూడా ఏకవీరని కొలిచారని సాహిత్యాధారాలు చెప్తున్నాయి. వీరశైవులు జైన మఠాలకు పోటీగా గోళకీ మఠాలను స్థాపించారు. కాకతి గణపతి దేవుడు కృష్ణాతీరాన గోళకీ మఠం అధిపతి విశ్వేశ్వర శివాచార్యుడికి ఒక ఆయుర్వేద ఆసుపత్రి, ప్రసూతి చికిత్సా కేంద్రం, మూలికా వనాల ఏర్పాటుకు ఇచ్చిన దాన శాసనం 'మందడం' గ్రామంలో ఉంది.

పాలమూరు దగ్గర ఈ గోళకీ మఠాన్నే గొల్లక్క గుళ్ళుఅని పిలుస్తున్నా రని సురవరం ప్రతాపరెడ్డిగారు వ్రాశారు. కొటప్పకొండ దగ్గర కూడా ఒక గొల్లక్క గుడి ఉంది. కాకతీయ రాజుల ఆదరణ పెరుగుతున్న కొద్దీ శైవంలోకి బ్రాహ్మణుల ప్రవేశం పెరుగుతూ వచ్చింది. బ్రాహ్మణుల చేరికతో వీరత్వాన్ని తగ్గించుకుని శైవం వర్ధిల్ల సాగింది. సహజంగానే వీళ్ళు శివాలయాల్లో పూజారులుగా స్థానం సంపాదించుకున్నారు. అప్పటివరకూ పౌరోహిత్యం నెరపిన తంబళ్ళు ఆ స్థానాన్ని కోల్పోసాగారు. "ముని శివుడిచట బుట్టిననాట నుండీ చేసిన తంబళి భజించిన చొప్పలేదు"అని బసవపురాణంలో సోమనాథుడు ఈ స్థితిని పేర్కొన్నాడు.

శైవాన్నే నమ్ముకుని ఇతర వృత్తి వ్యాపకాలకు దూరమైన తంబళ్ళు (తమ్మళ్ళు, దమ్మళ్ళు) సమాజంలో వెనుకబాటుతనాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. ఈ నాటికీ అదే స్థితి వారి విషయంలో కొనసాగుతుంది.

**జోగులాంబ**

జోగుల అంబ అనే పేరునుబట్టి ఈమె తొలుత జైనుల దేవత కావచ్చునని చరిత్ర వేత్తల అభిప్రాయం. బౌద్ధం ముందుగానే అంతరించగా, జైనం మరో 500 యేళ్ళ తరువాత తెలుగు నేలమీద అంతరించింది. మన తొలి ప్రాచీన దేవతలు, బౌద్ధ దేవతలూ, జైన దేవతలు వీళ్ళంతా శైవ దేవతలుగా మారిపోయారు. అదొక సామాజిక పరిణామక్రమం. ఇప్పటికీ గ్రామ దేవతలంతా శైవ సాంప్రదాయం లోనే పూజలందుకుంటూ ఉండటం గమనార్హం.

**రేణుక**

ఆలంపూర్‌లోని బ్రహ్మేశ్వరాలయంలో తలలేని నగ్న దేవత విగ్రహం గురించి సురవరం ప్రతాపరెడ్డిగారు ప్రస్తావించారు. కాకతి దేవత నగ్న దేవత అనీ, ఆలంపూరులో ఈ విగ్రహం కాకతి దేవతా విగ్రహమే కావచ్చునని ఆయన అభిప్రాయం. స్థానికులు దీన్ని ఎల్లమ్మ విగ్రహంగా పిలుస్తుంటారు. ఎల్లమ్మ, రేణుక ఈ ఇద్దరూ కాకతి దేవతా రూపాలేనని పండితులు చెప్తారు. పరశురాముడు తన తల్లి తల నరికిన కథని బట్టి తలలేని ఈ విగ్రహాన్ని రేణుకగా భావిస్తున్నారేమో తెలియదు. రేణుక లేదా ఎల్లమ్మ సంతానదేవతగా కొలువులు చేస్తారు.

**మైలారు దేవుడు**

మైలారు దేవుడు కాకతీయుల కాలంలో పూజలందుకున్న దేవుడే! తొలుత జైన దేవుడు, తదుపరి భైరవుడి అవతారంగా మారి ఉండవచ్చు. "కలౌ మైలారు భైరవా" – కలి యుగంలో మైలారు దేవుడే భైరవుడు అని ప్రజలు నమ్మి కొలిచారు.

**వీరగుడ్డములు**

వీరమరణం పొందిన వీరుడిని పూజించే ఆచారం గురించి సురవరం వారు వ్రాశారు. పల్నాటి యుద్ధంలో అసువులు బాసిన వీరులను పూజించేవారు. ఈ పూజ కోసం ప్రత్యేకంగా వీరగుడ్డాలుండేవి.

**కలని పోతులయ్య, గురిజాల గంగాంబ:** శ్రీనాథుడు క్రీడాభిరామంలో –

"కులము దైవతంబు గురిజాల గంగాంబ
కలని పోతులయ్య చెలిమికాడు
పిరికి కండలేని యరువది యేగురు
పల్లెనాటి వీరబాంధవులకు"

అనే పద్యంలో కలని పోతులయ్య, గురిజాల గంగాంబ, పిరికి కండలేని27 మంది పల్నాటి వీరుల్ని దేవతలుగా పేర్కొన్నాడు. బహుశా పల్నాటి వీరులు కావచ్చు. లేదా ఆ కాలంనాటి గ్రామ దేవతలు కావచ్చు.

**గోగులమ్మ :** "కోమలార్ధేందు ధరుకొమ్మ గోగులమ్మ"

**శ్రీ మండతల్లి :** "మహిత గుణము తల్లి శ్రీమండ తల్లి" ఇలా స్తుతిపాత్రమైన అనేక దేవతలు ఆకాలంలో ఉండేవారు.

వీళ్ళు కాక **నూకాంబ, ఘట్టాంబిక, మాణికాదేవి** పేర్లు కూడా కనిపిస్తాయి.

ఆ కాలంనాటి సింహాసన ద్వా త్రింశతిలో "కామాక్షికిని, మహాకాళికి, చండికి/ నక్కజియ్యకు, కాశి కంబికకును / వింధ్యవాసిని, కేక వీరకు, మున్నుగా నెల్ల వేల్పులకు బిందించి మ్రొక్కి" ఈ పట్టికలో ఆనాటి వేల్పుల పేర్లు మనకు కనిపిస్తాయి. కామాక్షి, మహాకాళి, చండి, కాశిక, అంబిక, వింధ్యవాసిని, ఏకవీర వీళ్ళంతా శైవదేవతలే! ఇందులో 'బిందించి మొక్కటం' అనే పదానికి కల్లు బిందె(కుండ)ని ఇచ్చి మొక్కటంగా సురవరంవారు ఒక అర్థాన్ని చెప్పారు.

**మూలకూరమ్మ**

మూలకూరమ్మ అనే ఒక దేవత రెడ్డి రాజులకు కులదేవత. ఈమె దేవాలయం గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా లోని అమీనాబాదు గ్రామంలో ఉందని రెడ్డి సంచిక (పుట 69)ని ఉటంకిస్తూ సురవరం వారు వ్రాశారు.

"వీరులు దివ్యలింగములు" అనే ప్రసిద్ధ చాటుపద్యంలో ఆ చాటు కవి. "చనిపోయిన వీరులు లింగములై పూజలందిరి" అని వ్రాశాడు. ఈ పద్యం చెన్నకేశవ స్వామే బ్రహ్మనాయుడనీ, కల్లు పోతరాజు కాలభైరవుడని, అంకమ్మ అనే దేవత అన్నపూర్ణ అయ్యిందని చెప్తుంది.

ప్రాచీన దేవతలే వివిధ కాలాలో వివిధ పేర్లతో ప్రసిద్ధి పొందారని, బలి, సుర, చద్ది వీటిని నైవేద్యాలుగా సమర్పించుకునే వారనీ అర్థం అవుతోంది. ఈ దేవతలలో పూజాదులు బ్రాహ్మణేతరులే చేసేవాళ్లు. కాలక్రమంలో ఈ గుడి పూజారులుగా బ్రాహ్మణుల ప్రవేశం తరువాత గ్రామ దేవతలు కూడా అష్టోత్తర శతనామాలతో ముగ్గురమ్మల మూల పుటమ్మ అవతారాలుగా పూజలందటం ఒక ముఖ్య పరిణామం.

తెలుగు నేలంతా సాగిన ఈ దేవతల సంలీనానికి కృష్ణాతీరం ఒక్క ప్రత్యక్ష సాక్షి. శైవానికి పుట్టినిల్లయిన ఈ నేలమీద ఎందరో వేల్పులు శైవదేవతలుగా ఈనాటికీ కొలువులందుతున్నారు.

శ్రీ కుందూరి ఈశ్వరదత్తు

# పురాణయుగములో ఆంధ్ర దేశము

సర్వసాధారణముగా పురాణములనగా వెంటనే రామాయణ, భారత, భాగవత గ్రంథములు మనకు స్ఫురణకు వచ్చును. పురాణములు పదునెనిమిది. అందు భాగవతమొకటి. మిగిలిన పదునేడు, బ్రహ్మ, పద్మ, విష్ణు, శివ, నారద, మార్కండేయ, అగ్ని, భవిష్య, బ్రహ్మవైవర్త, లింగ, వరాహ, స్కాంద, వామన, కూర్మ, మత్స్య, గరుడ, బ్రహ్మాండమనునవి. రామాయణ భారతములు సహితము పురాణములలోనికే గణనకు వచ్చును. నన్నయభట్టు రాజరాజకొల్వు కూటమును వర్ణించుచు, దానిలో భారతరామాయణాద్యనేక పురాణప్రవీణులు పరివేష్టించియున్నట్లు వ్రాసియున్నాడు. పురాణ శబ్దమునకర్థము పూర్వవృత్తము. పురాతనాఖ్యానము ప్రతిపాదించునదియే పురాణము. పురాణములలో జెప్పబడిన ముఖ్యవిషయములు ఐదు. వీనినే పంచ లక్షణములందురు. అవి యేవనగా సృష్టి, ప్రతి సృష్టి మునుల దేవతల వంశక్రమము, మన్వంతరములు, చంద్రసూర్య వంశ రాజన్యుల చరిత్రములు. అన్ని పురాణములలో నీయైదు విషయములుండ వచ్చును. లేకపోవచ్చును. ప్రాచీన భారతదేశ చరిత్ర కుపయుక్తములుగా నున్న విషయములెన్నో యీ పురాణములందు గలవు. వానిలో ముఖ్యముగా భూగోళ విన్యాసమును గూర్చి ప్రశంసయొకటి. నేడు భూమండలము నంతయు, ఆసియా, ఐరోపా,అమెరికా, ఆస్ట్రేలియాయని వేర్వేరు ఖండములుగా విభజించినట్లే మన ప్రాచీనులు సహితము భూభాగము నేడు ద్వీపములుగను,నేడు సముద్రములుగను విభజించిరి.

**'సప్తద్వీపావసుమతీ'** యని మార్కండేయము.

**'సప్తదీపవతీమహీ'** యని బ్రహ్మాండము.

## సప్తద్వీపములు - జంబూద్వీపము

సప్తద్వీపములేవియనగా జంబు, ప్లక్ష, కుశ, క్రౌంచ, శాక, శాల్మలి, పుష్కరములు. పురాణములలో వర్ణింపబడిన ప్రకారము జంబూ ద్వీపమే యీ యేడు ద్వీపములకు నడుమనున్నది. ఈ జంబూ ద్వీపమే, ఇప్పటి ఆసియా (Asia) ఖండమునకును, దానికి తూర్పు దక్షిణములో గల ద్వీపములకును సరివచ్చును. ఈ జంబూద్వీపములోని మొదటి పదము, నేటి జమ్ము-కాశ్మీరము (Jammu-Kashmir) అను రాష్ట్రములో జమ్ము విభాగములో శేషించియున్నది.

## భరతవర్షము

జంబూద్వీపము మరల తొమ్మిది వర్షములుగ విభజింపబడినది. ఈ జంబూ ద్వీపములో నేడు కులపర్వతములు గలవు. అవి హిమవంతము,హేమకూటము, నిషధము, మేరువు, నీలగిరి,శ్వేతా చలము, శృంగవంతముననునవి. ఈ కులపర్వతమునంటుకొని యేడు వర్షములు గలవు. అవి ఇలావృత, భద్రాశ్వ, కేతుమాల, హరి, కింపురుష, రమ్యక, హిరణ్మయ, కురు, భరతవర్షములు. వాయు పురాణములో,

**నవవర్షం ప్రవక్ష్యామి జంబూద్వీపం యథాతథా**
**ఉత్తరం యస్సముద్రస్య హిమవద్దక్షిణం చయత్ ।**
**వర్షం తద్భారతం నామ యత్రేమాం భారతప్రజాః**
**పూర్వేకిరాతా ప్యాస్యాంతే పశ్చిమే యవనాః స్మృతాః ।**
**బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా మధ్యే శూద్రాశ్చ భాగశః**
**యదిదం భారతం వర్షం యస్మిబీ స్వాయభువాదయః ॥**

హిమవన్నగమునకు దక్షిణమునను, సముద్రమున కుత్తరమునను భరతవర్షముల గలదనియు, ఈ భరతవర్షమునకు తూర్పున కిరాతులు, పశ్చిమమున యవనులు, మధ్యమమున బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు గలరనియు వ్రాయబడినది. ఈ భారతవర్షాంతర భాగమే నేటి భరతఖండము. హిందూదేశము, భరతఖండము అని (India i.e., Bharat) రాజ్యాంగ శాసనమునందు గలదు. భరత ఖండమునకీ పేరు ఏల గల్గెనో పురాణములందు దెలుపబడినది. స్వాయంభువమనువు తనయుడైన ప్రియవ్రతునకు తొమ్మండుగురు పుత్రులు. వారిలో అగ్నీధ్రుడను పుత్రుని జంబూద్వీప పాలకునిగా నియమించెను. ఈ అగ్నీధ్రునికి దొమ్మండుగురు పుత్రులు వారిలో ఋషభుడను వానిని హిమవంతమునకు దక్షిణఖండమున కధిపతిగా

జేసెను. ఋషభునకు భరతుడను కుమారుడు గలడు. ఋషభుని తర్వాత భరతుడీ భూమండలమును బాలించెను. కావున నీ ఖండము నకు భరతఖండమనీ పేరు వచ్చెను.

## భరతఖండము - ఆంధ్రదేశము

భరతవర్షము మన పురాణములో తొమ్మిది విభాగములుగ జేయ బడినది. వాని నామములు, ఇంద్ర, కేతుమంత, తామ్రవర్ణ, గభస్తి మంత, నాగ, సౌమ్య, గాంధర్వ, వారుణ, కుమారికాద్వీపములు. నాటి కుమారికా ద్వీపమే, నేటి హిందూ దేశముతో సరిపోవును. ఈ కుమారీద్వీపమేడు విషయములుగ విభజింపబడినది. అవి, మధ్య, ఉదీచ్య, ప్రాచ్య, దక్షిణాపథ, అపరాంత, వింధ్య, హిమాలయ ప్రదేశ ములు. ఇందలి దక్షిణాపథమే నేటి డక్కన్ పీఠభూమి. ఈ దక్షిణా పథదేశములలో, పాండ్య, కేరళ, చోళ, కుల్య, మహారాష్ట్ర, మహిష, కలింగ, విదర్భ, కుండల, ఆంధ్రదేశములు తెలుపబడినవి. మార్కం డేయ పురాణాదులలో ఆంధ్రదేశము దక్షిణాపథదేశములలో జెప్ప బడినది. కాని నాటి దేశముల యెల్లలు పురాణములలో వివరింప బడలేదు. స్థలనిర్దేశము ననుసరించి, ఆంధ్రదేశము కళింగదేశమునకు దక్షిణముగను, ద్రావిడ దేశమునకుత్తరముగను, కర్ణాటక మహారాష్ట్ర దేశములకు పశ్చిమమున నున్నట్లు మాత్రము చెప్పవచ్చును. ఈ స్థలనిర్దేశము సంస్కృత కావ్యయుగమునందును,తర్వాత శిలా శాసన ములందును స్పష్టం చేయబడినది.

## రామాయణ-భారతములు-ఆంధ్రదేశము

నేటికిని మనము సంకల్పములో 'జంబూద్వీపే, భరతఖండే, దండకారణ్యే, కృష్ణాగోదావరీ మధ్యదేశే' అని చెప్పుకొందుము. నేటి ఆంధ్రదేశము సగముభాగము దండకారణ్యములోను, సగము భాగము కిష్కింధారాజ్యములో నిమిడియుండెను. వింధ్య పర్వతమును దక్షిణ మునను, కృష్ణాస్రవంతి కుత్తరమునకు మలయ మహేంద్ర పర్వతము లకు మధ్యమమున, దండకారణ్యముండెను. దానిలో దూర్పు భాగము జనస్థానము. కృష్ణకు దక్షిణమున కిష్కింధారాజ్యముండెను. రామా యణ కాలమున రావణుని సోదరుడగు ఖరుడు ఈ జనస్థానమున కధిపతి.ఈ జనస్థానమందే పంచవటి కలదు. శ్రీ రామభద్రుడు సీతా సౌమిత్రిసమేతుడై, ఈ పంచవటియందే కొంతకాలము కాపుర ముండెను. ఇచ్చటనే సీతాపహరణము జరిగినది. ఈ పంచవటి ఆంధ్రదేశములోని తూర్పుగోదావరీ మండలములో భద్రాచల క్షేత్ర మునుకుత్తరముగా నిరువది రెండు మైళ్ళ దూరముననున్నది. శ్రీ మద్రామాయణము, కిష్కింధాకాండములో హనుమదాదులను సీతను వెదుకుటకై దక్షిణదిక్కునకుబోయి, దండకారణ్యమున కరిగి, యచట గిరివనదుర్గముల, గోదావరీతీరముల, నంద్రపుండ్ర కేరళకురు దేశముల బరికించి రండని యాజ్ఞాపించినట్లు గలదు. కాని క్రీ.శ. పూర్వమాఱవ శతాబ్దమున వాల్మీకి రామాయణము రచింపబడె ననియు, దానిలో దాక్షిణాత్యములైన ఆంధ్ర, చోళ, పాండ్యాది దేశముల ప్రశంస ప్రక్షిప్తమనియు, నాటికాపేర ప్రజలుగాని, రాజ్యములుగాని యుండలేదని గొందఱు చరిత్రకారులు వ్రాయుచున్నారు.

మహాభారతములో సభాపర్వమునందలి సభాక్రియాపర్వణాధ్యా యమునందును, సహదేవుని దక్షిణ దిగ్విజయ యాత్రాసందర్భ మునను, నియంత్రితరాజానుగమనములోను, భీష్మపర్వములో భార తీయనద్యాదికథనములోను ఆంధ్రదేశప్రశంస యున్నది. ధర్మజుని కొల్వు కూటమును బరివేష్టించియుండిన నృపాలురలో ఆంధ్రభూమీ శుడు కలడు. ఈతని పేరు తెలియదు. తిక్కన సోమయాజియు ఆంధ్రీ కృత భారతములో ఆంధ్రదేశమును మూలమున కనుగుణముగా, దాక్షిణాత్యజనపదములలో నొకటిగా వ్రాసెను. భీష్మపర్వములోని ఆంధ్ర జనపదము కృష్ణాగోదావరీ మధ్యదేశమని

**ఆంధ్రకాః కృష్ణాగోదావర్యోర్మధ్యే విద్యమానదేశః ॥**

అని వ్యాఖ్యానమున గలదు. కురుపాండవ సంగ్రామములో దాక్షిణాత్యజన పదములైన, ఆంధ్ర, కేరళ, టేంకణ, కర్ణాట, కోసల, కాళింగ, కుంతల, విదర్భములు కౌరవపక్షమునజేరును. పాండ్యచోళ జానపదములు మాత్రము పాండవపక్షమున గలిసెను. కర్ణునికి బ్రాపై పుళింద, టేంకణ, బాహ్లిక, ఆంధ్రసైన్యములు పోరినట్లును, పాండీడైన మలయధ్వజుడీ సైన్యములతో బోరాడి నిహతుండైనట్లును కర్ణ పర్వమునందు గలదు.

## ఆంధ్రదేశము-తెలుగుదేశము

మన భాష తెలుగు భాషయనియు, మనము తెలుగు వార మనియు మన దేశమునకు తెలుగుదేశమనియు పేర్లు గలవు గదా. పురాణములలో నత్యంత ప్రాచీనమైన వానిలో మార్కండేయ పురాణ మొకటి. ఇది క్రీ.శ. నాల్గు, ఆఱవ శతాబ్దముల మధ్యమున రచింప బడెనని పురాణములన్నింటిని గూలంకషముగా బరిశోధించిన, హైందవ ఆంగ్ల పరిశోధకుల యభిప్రాయములు. ఈ పురాణములను బరిష్కరించి, ప్రచురించిన పర్గిటార్ దొరగారు (Pargitar) తత్పు రాణములలో కూర్మ సంస్థాపన వర్ణనమునందలి కూర్మదక్షిణ కుక్షి యందలి దేశవిభాగములో గల క్రింది శ్లోకము గూర్చి ఇట్లు వ్రాసి యున్నారు.

**తిలింగో కుంజరదరీ కచ్ఛవాసాశ్చ యే జనాః ।**
**తామ్రపర్ణీ తథాకుక్షిరితికూర్మస్య దక్షిణః ॥**

పై శ్లోకములోని తిలంగులనువారు నేటి తెలుగువారనియు వారు నివసించు దేశమే తెలుగుదేశమనియు, దీని ప్రసక్తిననుసరించి, ప్రాచీ

నాంధ్ర జనపదమునకు సరివచ్చుననియు వ్రాసియున్నారు. మనము తిలింగులమనియు, కావుననే మన భాషకు తిలింగ భాషయనియు, దేశమునకు తిలింగ దేశమనియు మొదట పేర్లుగల్గి, తర్వాత తిలంగ పదమే, తెలుగుగా మాఱెననియు జెప్పవచ్చును. ఈ మార్కండేయ పురాణములో దక్క ఈ పద మీ రూపమున నేపురాణములలో నెక్కడను లేదు. కాని యొక విచిత్రమేమనగా క్రీ.శ. 1876వ సంవత్సరములో తెలుగులిపిలో ముద్రింపబడిన సంస్కృత మార్కండేయ పురాణములో, ఈ శ్లోకములోని తిలింగపదము త్రిలింగ పదముగా బరిష్కర్తలు దిద్దినారు. మార్కండేయ పురాణములోని యీ తిలింగపదము ఆంధ్ర భాషా చరిత్ర కారులకేమి, ఆంధ్రచరిత్ర పరిశోధకులకేమి యత్యంత ప్రాధాన్యమైన విషయము. మారన ఆంధ్రీకృత మార్కండేయ పురాణ ములో కూర్మసంస్థాపన వర్ణనమును సంక్షిప్తముగా నొనర్చి మూలము లోని వేర్వేఱు జనపదవాసుల వర్ణింపలేదు. ఈ విషయ మిదివఱకు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రి 28వ సంపుటము 4వ సంచికలో సవిమర్శముగా జర్చించియున్నాను.

## స్కాంద బ్రహ్మాండ పురాణములు త్రిలింగ దేశము

మన భాష ఆంధ్రభాష, తెలుగుభాష, మనదేశము ఆంధ్రదేశము, తెలుగుదేశమని యెట్లు వ్యవహరింపబడుచున్నదో, అట్లె మన భాష త్రిలింగభాష. మనదేశము త్రిలింగదేశమనియు వ్యవహరింపబడు చున్నది. కాని నేడు త్రిలింగ పదమునకు బహుళ వ్యాప్తిలేదు. త్రిలింగ దేశవిభాగము స్కాంద బ్రహ్మాండ పురాణములందు మాత్రము గలదు. స్కాంద పురాణములో త్రైలింగులనువారు వింధ్య దక్షిణ వాసులలో నొకరుగబేర్కొనబడిరి. ఆంధ్రదేశము శ్రీశైలము, భీమేశ్వరము, కాళేశ్వ రములను మూడు శివక్షేత్రములమధ్యగల దేశమని వ్రాయబడినది. శ్రీశైలము కర్నూలు మండలములోని సుప్రసిద్ధ శివక్షేత్రము. భీమే శ్వరము తూర్పుగోదావరీ మండలములోని దాక్షారామమను మఱి యొక శివక్షేత్రము. కాళేశ్వరము నైజాము రాష్ట్రములోని నెలగందల మండలమునగల మంథని (మంధెన) యను గ్రామ సమీపమునగల వేఱొక శివక్షేత్రము.

బ్రహ్మాండ పురాణమునుసరించి 'ఆంధ్రవిష్ణు' వనువాడు శ్రీశై లము, భీమేశ్వరము, కాళేశ్వరము, మహేంద్రపర్వతమును గూడ గలిగియున్నట్లుగా బ్రాకారములు నిర్మించి, యామూటిని ద్వార ములుగా జేసెననియు, నీద్వారములయందీశ్వరుడు శూలపాణియై ప్రమథగణములచే గొలువబడుచు లింగరూపములను దాల్చి యుండె ననియు, ఆంధ్రవిష్ణువు మరల సాహాయ్యమునొంది దానవాగ్రేసరుడగు శంభునితో బదుమూడు యుగములు యుద్ధముచేసి వానిని హతుని గావించి, గోదావరీ తటమునందలి ఋష్యాశ్రములలో వాని నివాసము నాక్రమించుకొనెననియు నప్పటినుండియు నీ దేశము త్రిలింగ దేశమని పేరబరగుచున్నదనియు, దెలియుచున్నది. ఈ త్రిలింగపదము, తిలింగ పదమున కన్న ప్రాచీనమైనదని చెప్పరాదు. స్కాంద బ్రహ్మాండ పురాణ ములలో లెక్కలేనన్ని సంహితలు, ఖండములు, మహాత్మ్యములు, ఎవరికి దోచినవి వారు, ఎప్పటికప్పుడు చేర్చుచుండిరి.

వీనిలోని విషయములు పెక్కు భాగములు ఆధునికములు. ఈ త్రిలింగ పదము ఆంధ్రదేశములో కాకతీయుల కాలమున శైవమతము విజృంభించిన సమయమున, నుత్పత్తి నొందియుండును. పదమూడవ పదునాల్గవ శతాబ్దములనాటి ఆంధ్రదేశపు శాసనములలో త్రిలింగ పదములు బహుళముగా బ్రయోగింపబడెను. ఆనాటి సంస్కృత కావ్యములందు త్రిలింగపదముగా కవులు ప్రయోగించిరి. కాకతీయ ప్రభువులు త్రిలింగ పరమేశ్వరులని వర్ణింపబడిరి. ఈ త్రిలింగ దేశ ప్రసక్తి కాకతీయ రాజ్యకాలమున బ్రభవించి, రెడ్ల రాజ్య కాలమున సారస్వతములోను, శాసనములలోను బహుళవ్యాప్తిని గావించెనని ఘంటా పథముగ జెప్పవచ్చును. తెలుగు పదము వేఱు, త్రిలింగ పదము వేఱు, త్రిలింగ పద తద్భవము తెలుగు కాదు. ఆ కాలమునాటి పండితులెవరో త్రిలింగ సంబంధమైన శ్లోకమును బ్రహ్మాండ, స్కాంద పురాణములలో పదునాల్గవ శతాబ్దముననో తరువాతనో చేర్చి యుందురు. పాశ్చాత్య చరిత్రకారులలో కొందఱు ఈ రెండు పురాణ ములలోని విషయము లర్వాచీనములనియు, ననేక విషయములు ప్రామాణ్య రహితములనియు వ్రాసియున్నారు.

పురాణములలో ఆంధ్రులు కిరాత, హూణ, పుళింద, యవన దేశీయులతో చేర్చి, వీరు నికృష్ణజాతిగ వర్ణింపబడిరి. భాగవతము ద్వితీయ స్కంధములో,

**"కిరాతహూణాంధ్రపుళిందపుల్కసా అభీరకంకాయవనాఃకషాదయః**
**యేఽన్యేచ పాపా యదుపాశ్రయాశ్శుధ్యంతి తస్మైప్రభవిష్ణవేనమః"**

అని ఆంధ్రులు పాపజాతిగ వర్ణింపబడిరి. మఱియు నవమ స్కంధములో భవిష్యద్రా జేతిహాసములో దుష్యంతుని కుమారుడగు భరతుడు ఆంధ్రహూణయవనదేశీయులను జయించెననియు, వీరం దఱు మ్లేచ్ఛులనియు చెప్పబడెను.

**"కిరాతహూణాః యవనాంధ్రాః వంగాః కషాః**
**అబ్రహ్మణ్యాన్నృపాంశ్చాహః మ్లేచ్ఛాః దిగ్విజయే బలాత్"** ॥

ఆంధ్రీకృతభాగములో శక, శబర, బర్బర, కిరాతక, హూణ, మ్లేచ్ఛదేశములు మాత్రము పేర్కొనబడి, ఆంధ్రులమాట వదలివేయ బడినది. భాగవతము ద్వాదశస్కంధములో నాంధ్రరాజ్యస్థాపకుడొక వృషలుడని ఈక్రిందివిధముగా వ్రాయబడినది.

"మఱియు గణ్వవంశజుడను సుశర్ముండను రాజుదయించిన వాని హింసించి తద్భృత్యుం డంధ్రజాతియుండైన వృషలుండధర్మ మార్గ వర్తియై వసుమతీ చక్రం బవక్రుండై యేలె"

ఆంధ్రులు మగధరాజగు జరాసంధునితో జేరి యాదవులతో బోరాడిరి. చాణూరుడను ఆంధ్రమల్లుడు శ్రీ కృష్ణునితో మల్ల యుద్ధము నందు నిహతుడయ్యెను. శ్రీ మహావిష్ణువునకు జాణూరాంధ్ర నిషూద నుడను పేరు విష్ణుసహస్రనామములలో నొకటి. ఈ విష్ణు సహస్ర నామములు మహాభారతములో అనుశాసనిక పర్వాంతర్భాగము.

మత్స్యపురాణ మాంధ్రదేశచరిత్ర కత్యంత ప్రధానమైనది. ప్రాచీ నాంధ్ర రాజ్యస్థాపకులగూర్చి యిందు విపులముగ వ్రాయబడినది. కాణ్వవంశీయులగు బ్రాహ్మణ ప్రభువులలో గడపటివాడగు సుశర్మ యనువానిని సంహరించి ఆంధ్రుడగు శ్రీ శిశుకుడనువాడు శుంగ రాజ్యాధికారమును నిర్మూలించి ఆంధ్రభూమిశుడయ్యెదని చెప్పబడినది.

"కాణ్వాయనస్తతో భూపాః సుశర్మాణః ప్రసహ్యతామ్ ।
శుంగానాంచైవ యచ్ఛేషం క్షిపిత్వాతుబలీయసః ॥
శిశుకోంధ్రః సజాతీయః ప్రాప్స్యతీమాం వసుంధరామ్
త్రయోవింశసమా రాజా శిశుకస్తు భవిష్యతి ॥ **273-అధ్యాయము**

ఈ శిశుకుడే విష్ణుపురాణములో శ్రీపకుడనియు, సింధకుడని వాయు పురాణములోను చెప్పబడెను. మత్స్యపురాణములో పందొ మ్మండుగురు ఆంధ్రరాజులు నాల్గువందల యఱువది వత్సరములు పాలించినతర్వాత వారి రాజ్యము భృత్యవంశములపాలయ్యెనని కలదు.

"తేషాంవర్ష శతానిస్స్యుశ్చ త్వారిషష్టి రేవచ ।
ఆంధ్రాణాం సంస్థితో రాజ్యేతేషాం భృత్యాస్వ యేనృపాః ॥

పైవిధముగ పురాణములలో నాంధ్రదేశమును గూర్చియు, ఆంధ్రులను గూర్చియు దిక్ప్రదర్శముగ వివరించి, ప్రసంగమును వివరించుచున్నాను.

*(ఆంధ్రసాహిత్య పరిషత్తు పత్రిక నుండి)*

"తీర్థం కృష్ణానదీ యత్ర క్షేత్రం పాశుపతం మహత్
దైవతౌ యత్ర నై స్వర్ణః దుర్గాంబామల్లి కార్జునౌ"
"కృష్ణవేణ్ణా తరంగణి యంధ్రలక్ష్మి ని
త్య తరంగ తాండవంబాడు చోటు
పాశుపతాస్త్రంబు భవునిచే విజయుండు
ఘన తపస్ఫూర్తి గైకొనిన చోటు
భక్తుల పాలి కల్పకశాఖి కనుక దు
ర్గాంబిక కాస్థానమైన చోటు
బహే మహామహు లద్రి గుహలలో వసియించి
నిర్వికల్ప సమాధి నెగడు చోటు
నాడు నేడును సిరుల దనర్చు చోటు
ఆంధ్రభూనాభి దేశమై యలరు చోటు
పావన చరిత్రమును వ్రాలు బ్రాలుగల్గి
వెలయు ప్రజతోడ కలదుగా విజయవాడ

-దివ్య దర్శనము

డా॥ చింతలపాటి మురళీకృష్ణ

# భారతదేశాన్ని యేలిన తొలి తెలుగు రాజులు - శాతవాహనులు

**1.0.0** భారతదేశచరిత్రలో ఆంధ్రుల ప్రాధాన్య అనాదికాలం నుంచీ స్పష్టంగానే కనిపిస్తుంది. తరానికొక్కడు అన్నట్టుగా తరతరాలుగా ఎవరో ఒక మహానుభావుడు జన్మిస్తూ తెలుగుతల్లి కీర్తిపతాకను దిగంతాలకు వ్యాపింపజేస్తూనే ఉన్నారు. ఆ క్రమంలో మున్ముందుగా చెప్పుకోవాల్సిన మూలపురుషులు ఆంధ్ర శాతవాహన చక్రవర్తులు. క్రీస్తు పుట్టకమునుపే ఆంధ్ర సామ్రాజ్యాన్ని నిర్మించి పావనకృష్ణాతీరం నుంచి తూర్పు పశ్చిమ సముద్రాలపర్యంతమూ, దక్షిణ సముద్రం నుంచి ఉత్తరాన గంగా తీరం వరకు తమ యేలుబడిలో నిలుపుకున్న ఘనకీర్తి ఆంధ్ర శాతవాహనులకే దక్కింది. ఇప్పటి ఒరిస్సా, కర్ణాటక, మహారాష్ట్ర, కేరళ, తమిళనాడు, మధ్యప్రదేశ్, గుజరాత్, బీహార్, రాష్ట్రాలన్నీ ఆనాడు ఆంధ్ర శాతవాహనుల రాజ్యంలో కలిసిపోయి ఆంధ్ర చక్రవర్తులచేత పాలించబడ్డాయి. చరిత్రగతిని మరిచిపోతూ భారతదేశ ఐక్యత మొగల్‌చక్రవర్తులకాలంలోనో, తూర్పిండియా కంపెనీ పాలనలోనో జరిగిందని చెప్పటం, దానికి తెలుగువాళ్ళు కూడా మూగమనసులతో కామోసనుకోవటము, ఇప్పటి తెలుగువాళ్ళు అమాయకత్వానికి నిదర్శనం.

**1.1.0.** క్రీ.పూ. 271వ సంవత్సరంలో సిముకుడు అనే ఆంధ్ర శాతవాహన చక్రవర్తి-శాతవాహన సామ్రాజ్యాన్ని స్థాపించాడు. ఆయననే శ్రీముఖుడు అంటారు. అప్పటి శాతవాహనరాజ్య రాజధానిగా చెప్పబడిన కృష్ణాజిల్లా శ్రీకాకుళంలోని ఆంధ్ర మహావిష్ణువు దేవాలయం ఆయనపేరుతోనే నిర్మించబడిందంటారు. శాతవాహనుల తొలి రాజధానిగా చెప్పబడే శ్రీకాకుళానికి ఆదినుంచీ అదే పేరు ఉన్నట్టుగా కనబడదు. ఎందుకంటే ఈ పేరు సంస్కరించబడిన శబ్దాలతో ఏర్పాటయ్యింది తప్ప దీనిలో తెలుగుతనం లేదు. ఇది సంస్కృత సమాసంగా ఉంది. శ్రీకి ఆకరమైనది-శ్రీకాకరం- అంటే సంపదలకు నిలయమైన ప్రదేశం అని అర్థం. ఇదే సమాసం క్రమంగా శ్రీకాకురం-శ్రీకాకుళంగా మారేందుకు అవకాశం ఉంది. అయితే ఇక్కడ ఈ నామోత్పత్తికి కొంత చరిత్ర తెలిస్తే పూర్వనామం తెలిసేవీలుంది. ఆరోజుల్లో ప్రాకృతం పాలించిన సందర్భంలో సిరి శబ్దం వాడుకలో ఉండేది అని చెప్పొచ్చు. సిరికి ఈ ప్రదేశం నిలయస్థానం అనే అర్థంలో ఈ ప్రదేశం అప్పట్లో యేటి తీరంలో ఒక సరస్సు మాదిరి ఉండేది కనుక ఇది ఒక కొలనుగా కనిపించి సిరికి ఆకరమైన కొలను అనే ఊహలో సిరికాకొలను-సిరికాకొలం-శ్రీకాకొళం-శ్రీకాకుళంగా రూపాంతరం చెందే వీలుంది. ఆవిధంగా ఇప్పటి శ్రీకాకుళం గ్రామనామం యేర్పడియుండవచ్చు. కానీ ఇది ఆంధ్రశాతవాహనులచేతనే కొత్తగా కట్టబడియుండాలి. ఎందుకంటే ఈ పరిసరాల్లో ఉన్న ఘంటసాల, భట్టిప్రోలు, మొదలైన గ్రామాలు అప్పటికే వెలుగులో ఉండి ఉండాలి. ఏ గ్రామంలోనైనా పురాతన శివాలయం ఉందంటే అది అతి ప్రాచీనమైన గ్రామంగా గుర్తించవచ్చు. విష్ణ్వాలయాలు తరువాతికాలంలో నిర్మించబడ్డాయి. కనుక శ్రీకాకుళానికన్నా ఘంటసాల చాలా పూర్వీకమైన గ్రామమని అక్కడి జలధీశ్వరస్వామి ఆలయాన్ని బట్టి తెలుస్తుంది. కానీ ఘంటసాల నామ ఆవిర్భావాన్ని గురించి పూర్వచారిత్రకులు గౌతమబుద్ధుని అశ్వం పేరు ఘోటకమనీ, కొంటకమనీ చెబుతూ ఆ పేరుమీదుగా కొంటకసైల-ఘంటసాల అని రూపొందినట్లు ఊహించారు. అప్పుడు ఘంటసాల బౌద్ధుల కాలంలోనే నిర్మాణమైన గ్రామంగా చెప్పాలి. మరి ఇక్కడి చారిత్రికాంశాలనుబట్టి అంటే ఇక్కడి జలధీశ్వరాలయము, రేవు పట్టణము, విదేశీవ్యాపారము, టంకాలకు ఉపయోగించుకుని ఉండే అంశము, మొదలైనవన్నీ చూస్తే -బౌద్ధుల కాలానికన్నా ముందే ఘంటసాల ఒక టంకసాలగా పేరుగాంచిన అతిప్రాచీననగరంగా కనిపిస్తుంది.

**1.1.1.** శాతవాహనులకు శాలివాహనులు అనికూడా నామాంతరం ఉంది. కొన్ని ప్రాంతాల వాడుకలో ఒక ఐతిహ్యం చెప్పబడుతూంది. శాలివాహనులు అంటే కుమ్మరులు అనీ, ఈ శాలివాహన రాజులు కుమ్మరి వంశీయులని చెబుతారు. చక్రధారి అనే సంస్కృత పదం శ్రీ మహావిష్ణువుకూ, కుమ్మరి వంశీయులకూ ఉభయులకూ అన్వయిస్తుంది. అందుకు సాక్ష్యంగా కృష్ణాజిల్లా శ్రీకాకుళం దగ్గరలో ఇప్పటికీ ఉన్న ఒక కుగ్రామం కుమ్మరిపాలెం. శాలివాహనుడు ఇక్కడివాడే అనీ, తమవాడే అనీ స్థానికులలో పెద్దవాళ్ళు చెప్పుకుంటూ ఉంటారు. అలాగే ఇంకొక కథకూడా వాడుకలో ఉంది. శ్రీముఖుడు

అని పేర్కొనబడుతున్న శాలివాహనుడు చరిత్ర పురుషుడనీ, చిన్నతనం నుంచీ ధైర్యసాహసాలకు పేరుపొందినవాడనీ, కనుకనే బాల్యంలోనే పులులను మచ్చికచేసుకుని వాటిపై స్వారీ చేసేవాడనీ, ఆ దృశ్యం చూసిన వారెవరైనా తక్షణమే అక్కణ్ణుంచి పారిపోయేవారనీ, శ్రీముఖుని బలపరాక్రమాలకు, ధైర్యసాహసాలకూ ఇదే నిదర్శనమనీ చెప్పే కథలు కొన్ని ప్రచారములో ఉన్నాయి. బహుశా ఇందులో కొంత నిజం ఉండి ఉండవచ్చు. పులిస్వారీ సంగతియేమోకానీ శ్రీముఖుడు ధైర్యసాహసాలు గలవాడు అనటానికి అభ్యంతరం లేదు. అలా కాకపోయి ఉంటే అంతటి మహాసామ్రాజ్యాన్ని నిర్మించగలిగి ఉండేవాడు కాదేమో కదా ! అలాగే శ్రీముఖుతే ఆంధ్ర మహావిష్ణువు అని చెప్పటం, దానికి అనుగుణంగా కృష్ణాజిల్లాలోని శ్రీకాకుళం గ్రామంలోని ఆంధ్రమహావిష్ణ దేవాలయములోని శ్రీకాకుళేశ్వరస్వామివారికి వెండి మీసాలు అలంకరిస్తూ ఉండటం ఒక ఆచారంగా వస్తోంది. కారణమేమంటే ఇక్కడి స్వామి వారు రాజరికం చెలాయించారనీ ఆ రాజచిహ్నాలుగా మహావిష్ణు ఆయుధాలతోపాటు మీసాలు కూడా అలంకరిస్తామనీ అర్చకులు చెబుతారు. ఇప్పటికాలంలోనే కాదు-పూర్వం నుంచీ కూడా ఆ అలయంలోని ఆంధ్ర మహావిష్ణువు శ్రీముఖుడేనని ప్రచారం ఉంది. అప్పటినుంచే మనవాళ్ళలో "నా విష్ణుః పృథివీపతేః" అంటే విష్ణువు కానివాడు పృధివీపతి కాడు అనే వాడుక యేర్పడింది. మధ్య యుగాల నాటికి ఐరోపాలో యేర్పడిన "రాజు దైవాంశ సంభూతుడు" అనే విశ్వాసానికి ఇది మూలం అయి ఉండవచ్చు. అంటే ఆంధ్ర శాత వాహనుల ప్రభావం భారతదేశంలోనే కాకుండా ఐరోపా పర్యంతమూ ఆనాడు ప్రభావం చూపి ఉంటుందని యూహించవచ్చు.

**1.1.2.** దీనికి ఇంకొక నిదర్శనం కూడా కనిపిస్తుంది. నాటినుంచే కృష్ణా గోదావరీ తీరాలలో ఉన్న నదీ రేవులనుంచి తూర్పు పశ్చిమ సముద్రాలమీదుగా ఇతర దేశాలకు వర్తకం జరుగుతూండేదని చారిత్రక ఆధారాలున్నాయి. వర్తకంతోపాటు సహజంగానే మన భాష, ఆచార వ్యవహారాలు కూడా అక్కడకు ఎగుమతి అయ్యేందుకు అవకాశం యేర్పడింది. దాని ఫలితంగా ఇలాంటి విశ్వాసం అక్కడ యేర్పడి యుండవచ్చు. ఈ భావజాలాన్ని వదిలించుకోటానికి పశ్చిమదేశాల వాళ్ళు ఆధునిక కాలంలో బ్రిటన్‌లోనూ, ఫ్రాన్స్‌లోనూ జర్మనీలోనూ తిరుగుబాట్లు చేయాల్సివచ్చింది. ఆంధ్రదేశాన్నుంచి పాకిన ఒక విశ్వాసం యుగాలతరబడి ప్రపంచవ్యాప్తమై చరిత్రపునాదుల్ని కదిలించిందటే ... అటువంటి మహత్తర సంఘటనను మనం మరిచిపోయామంటే ... మనకన్నా అమాయకులు మరొకరు ఉండరేమోనని పిస్తుంది !! ఇక్కడ ఇంకొక నిదర్శనాన్ని కూడా మనం గమనించవచ్చు. ఎప్పుడో 16వ శతాబ్దంలో కాన్‌స్టాంటినోపిల్ నగరం తురుష్కుల వశమై నప్పుడు భారతదేశానికి వేరొక సముద్రమార్గాన్ని అన్వేషించేందుకు మాజిలాన్, మార్కోపోలో, కొలంబస్ వంటివాళ్ళని ఇటలీ పోర్చుగీసు, స్పెయిన్ దేశాలవాళ్ళు ప్రోత్సహించి పంపినట్లు వాళ్ళలో వాస్కోడి గామా ఇండియాకి చేరినట్టూ ఘనంగా చరిత్రలో రాశారు. కానీ క్రీస్తుకు పూర్వమే నాటుపడవల్లో ఇవే మహాసముద్రాలను దాటి వ్యాపా రం చేసిన తెలుగువాళ్ళ ఘనతను ఎవ్వడూ గుర్తించలేదేమి? పైగా అప్పటికి ఇన్ని రకాల సాధనాలు-అంటే దిక్సూచి, తుపాకిమందు వంటివి యేవీ లేవుకదా ! అలాంటి రోజుల్లో చేసిన సాహసాలే కదా ఘనమైనవి ! మరి వాటికి గుర్తింపు యేది ? ఇప్పటికైనా ఆ గమనింపు ఎవ్వరికైనా ఉందా ?

**1.1.3.** ఈ సంఘటనకు మరొక నిదర్శనం కూడా ఉంది. ఆ కాలంలో సముద్ర తీరాలు ఇప్పటిమాదిరిగా లేవు. ముఖ్యంగా భారతదేశపు తూర్పు తీరం ఇప్పటిలా ఉండేది కాదు. అప్పటికీ ఇప్పటికీ సముద్రం వందలమైళ్ళు తూర్పుగా తరలిపోయింది. తన గర్భంలోని ఇసుకప్రదేశాల్ని బయటపడేసింది. దాంతో ఆనాటి సముద్రతీరపు రేవులు మెరక ప్రాంతాలైనాయి భౌగోళికంగా అనేక మార్పులు ఈ పరిస్థితులవలనచోటు చేసుకున్నాయి. కొత్త నగరాలు, కొత్త రేవులూ యేర్పడ్డాయి. కనుక ఇప్పటి ప్రాదేశిక పరిస్థితుల్ని దృష్టిలో పెట్టుకొని అప్పటి చరిత్రని సమీక్షించకూడదు. అప్పటి కాలమానాన్ని బట్టి మాత్రమే అంచనా వెయ్యాలి. ఆ దిశలో మరొక చారిత్రక సత్యం ఇక్కడ గమనించాలి. అదేమిటంటే క్రీస్తుపూర్వం నుంచీ ఐరోపా దేశాల్లో ఉండిన సామాజికవ్యవస్థకూ మనదేశంలోని సామాజికవ్యవస్థకూ ఉన్న సామ్యాలు. ఇవ్వాళ సాధారణ మానవుడు మొదలు కాస్తో కూస్తో చదువుకున్నవాడి వరకూ అందరూ హిందూమతంలో కులవ్యవస్థ అనేది ఒక కంటకంగా చెబుతున్నారు. అదే కులవ్యవస్థ మనదేశంలో పూర్వకాలం నుంచీ ఉంది. పైగా వర్ణవ్యవస్థ హిందూ ధర్మానికి ఒక సంకేతంగా కూడా చెబుతారు. ఇది ఒక సామాజిక బలహీనతగా పరిగణిస్తుంటారు. ఇదే వ్యవస్థ ఐరోపాలో కూడా ఆధునికయుగం వరకూ కొనసాగింది. ఈ వ్యవస్థపై జరిగిన తిరుగుబాట్లే ఫ్రాన్స్‌లోనూ, జర్మనీలోనూ ఇంకోరకం పేరుతో చరిత్రలో వ్రాయబడ్డాయి. ఐరోపాలో ఇటువంటి సామాజికఅంతరాలు మొదటినుంచీ యేర్పడటానికి యేవైనా కారణాలు ఉండాలిగా! అవియేవై ఉంటాయో ఊహించారా?

**1.1.4.** క్రీస్తుపూర్వం నుంచీ ఆధునికయుగం వరకూ మధ్య ప్రాచ్యలో గానీ, ఆసియా మైనర్‌లోగానీ, ఐరోపాలోగానీ యేవిధమైన చారిత్రక సామాజికసంఘటన జరిగినా దానికి మూలకారణం ఇండియా నుంచే బయలుదేరుతుండేది. ఈ నేపథ్యాన్ని గమనిస్తే ఐరోపాలో యేర్పడిన సామాజికవ్యవస్థలో 1. రాజకుటుంబీకులు, 2. మతాధికారులు, 3. సామాన్య ప్రజలు (వ్యాపారులు కూడా వీరిలోనే ఉండేవారు) అనే వర్గీకరణకు మూలం వైదిక కులవ్యవస్థయే.

**1.1.5.** క్రీస్తుకు పూర్వమే శాతవాహనులు కృష్ణా, గోదావరీ తీరాల రేవులనుండి బయలుదేరి సముద్రమార్గం ద్వారా గ్రీసు, రోము దేశాలను చేరుకుని అక్కడ వ్యాపారం చేసేవారు. వ్యాపారంతోబాటే సాంస్కృతిక రవాణా కూడా అనుకోకుండా జరిగిపోయేది. అది ఐరో

పాలో యేర్పడిన వర్ణవ్యవస్థను బలపరిచింది. అప్పట్లో ప్రపంచ దేశాలకు భారతదేశమే మార్గదర్శకంగా ఉండేది. ప్రస్తుతం అన్ని విషయాల్లో మనకూ, ప్రపంచానికీ ఇంగ్లాండు యేవిధంగా మార్గదర్శకం అవుతోందో – అలాగే ఆ రోజుల్లో మనదేశమే ప్రపంచానికి మార్గదర్శకంగా ఉండేది. అంటే ఆ రోజుల్లో శాతవాహనుల ప్రభావం కూడా అంత బలంగానూ ఉండేది. ఆ సంగతి ఇప్పుడు చెబితే కనీసం నమ్మను కూడా నమ్మరు. శాతవాహనరాజుల్లో రెండవ శాతకర్ణి 56 యేళ్ళు రాజ్యం చేశాడు. శాతవాహనరాజులు తమ నాణాలపై ఓడ గుర్తును ముద్రించటం ఆ రోజుల్లో వీరు చేసిన విదేశీ వ్యాపారానికి నిదర్శనం. ఆంధ్రులు ఈనాడు సంపన్నులని ఎవరెవరో పేర్కొనటం కాదు. ఆంధ్రులు ఆనాడే భాగ్యవంతులు. వీరు సంపాదించినదాన్ని వీరు ఎక్కడెక్కడ పెట్టుబడి పెట్టారోఆ ప్రాంతాలన్నీ భాగ్యనగరాలైనాయి.

**2.0.0.** శాతవాహనరాజులు విదేశీ యానాన్నీ, వ్యాపారాన్నీ ప్రోత్సహించారు. ఫలితంగా తూర్పు పశ్చిమ దిశలుగా ఆంధ్రులు సముద్రయానం చేసి జావా, సుమత్రా, బోర్నియో, మలయా, లంక, గ్రీసు, రోము, పర్షియా,మధ్యధరాప్రాంతాలకు వ్యాపారనిమిత్తం తమ నావలలో ప్రయాణించారు. సముద్ర ప్రయాణములో తమ క్షేమంకోసం ఇప్పటి ఘంటసాలలోని జలదీశ్వర స్వామివారికి మొక్కులు, ముడుపులు సమర్పించుకునేవారట. జలధీశ్వరస్వామి అనే పేరులోనే ఆ చరిత్ర వినిపిస్తోంది. ఆ రోజుల్లో ఇప్పటి ఘంటసాల సముద్రపుతీరపు రేవు పట్టణం. శ్రీకాకుళం శాతవాహనుల రాజధాని అయితే, ఘంటసాల ఆ రోజుల్లో టంకసాలగా (నాణేలు అచ్చువేసే కేంద్రంగా) ఉండేదట. ఇప్పటి ఘంటసాలలో గ్రామ నడిబొడ్డున భూస్థాపితమై నామమాత్రంగా కనిపించే పెన్నేరమ్మ గుడికూడా ఈ చరిత్రకు సాక్ష్యం చెబుతుంది. పెన్నేరు అంటే సముద్రం. సముద్రంపై వెళ్ళే వాళ్ళకు ఈ దేవత క్షేమాన్ని కలిగించేదని వ్యాపారులు విశ్వసించేవాళ్ళు. ఒక రకంగా ఆంధ్ర శాతవాహనులకు ఎంత చరిత్ర ఉందో ఘంటసాల గ్రామానికి అంత చరిత్ర ఉంది. ఈ సందర్భంగా దాన్ని చర్చించుకోకపోతే చరిత్రకు మనం కూడా అన్యాయం చేసిన వాళ్ళమవుతాం.

**2.0.1.** ఇవ్వాళ కృష్ణాజిల్లా ఘంటసాలను చూస్తే మౌనంగా వేలసంవత్సరాలనాటి చరిత్రను దయనీయంగా చెబుతున్నట్టు కనిపిస్తుంది. ఎందుకంటే ఈ వూరికి అడుగున మరొకవూరు భద్రంగా దిగబడిపోయి ఉన్న వైనాలు అనేకచోట్ల జరిపిన త్రవ్వకాల్లో బయటపడ్డాయి. చరిత్రకారుల నిర్లక్ష్యం వల్ల ఘంటసాల పొందవలసినంత కీర్తిని పొందలేకపోయింది గానీ, నిజానికి సింధునాగరికతను మించిన పురాతననాగరికత ఘంటసాలలో దాగి ఉంది. ఇప్పటికాలంలో భూమి పైన కనిపించే విశాలమైన వీధులకంటే మరింత వెడల్పైన వీధులు, రాజమార్గాలుగా ఆనాడు ఉన్నట్లు భూగర్భ త్రవ్వకాల్లో బయలుపడ్డాయి. పచ్చిరాతి ఇటుకలతో నిర్మించిన గోడలు ప్రతిచోటా దాదాపు ఒక గజం మందంతో కట్టబడిన రాజగోపురాలు, బావులు, తటాకాలు, విభిన్న వృత్తులవారి వాడలూ, రకరకాల వృత్తి పనిముట్లు బయల్పడ్డాయి. ఇటీవలికాలంలో కూడా బావులు త్రవ్వుతూంటే కుండలలో దాచిన బంగారు నాణేలు బయల్పడ్డట్లు గ్రామస్థులు చెబుతూండేవారు. మా చిన్నతనాల్లో కూడా ఎవరు ఇల్లు కొనేందుకు పునాదులు తవ్వుతున్నా చాలాచోట్ల వాటికింద ఇంకో ఇంటి ఆనవాళ్ళు కనిపించడం, బావులు త్రవ్వుతూంటే అడుగున మరొక బావి తగిలి పనివాళ్ళు దానిలో పడిపోతూ ఉండటం ఇక్కడ పరిపాటిగా జరిగేవి. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే సింధు నాగరికత గురించి చరిత్రలో ఎంత వైభవంగా చెప్పారో – అంతకన్నా ఘనంగా ఇక్కడ ఘంటసాలలో పురాతన కట్టడాలు భూగర్భంలో ఉన్నట్లు చరిత్రకారులు పేర్కొన్నారు. వాటన్నిటినీ వెతికితీయాలంటే ఇప్పటి ఊరు మొత్తాన్నీ తవ్వేస్తేనే అవి కనిపిస్తాయి. అంటే అంత ఖచ్చితంగా ఈ ఊరుకింద ఇంకొక పురాతన గ్రామం నిక్షిప్తమై ఉందన్నమాట. 1960 నుంచి 1995 మధ్యలో పురావస్తు శాఖవారు చేపట్టిన త్రవ్వకాల్లో అనేక పురాతనకట్టడాలు బయల్పడ్డాయి. పాలరాతితో చెక్కిన బౌద్ధ ప్రతిమలు, చక్రాలు, రథాలు, గౌతమబుద్ధుని ఆకారాలు, ధర్మచక్రాలూ ఎన్నెన్నో 1970 వరకూ గ్రామకేంద్రంలోనే చూపరులకు కనువిందుచేస్తూ దర్శనమిచ్చేవి. ఈ సాక్ష్యాలన్నిటినీ బట్టి శాతవాహనులు వైదికధర్మంతోపాటు బౌద్ధధర్మాన్ని కూడా సమానంగానే ఆదరించారని తెలుస్తుంది.

**2.1.0.** పైన చెప్పిన చరిత్ర చాలామంది విశ్వసించలేకపోవచ్చు. కారణమేంటంటే ఇవ్వాళ మనకు కనిపిస్తున్నది వేరు. నేను చెబుతున్నది వేరు. ఇదంతా శాతవాహనుల కాలంలో కృష్ణాగోదావరుల తీరాలు రేవులుగా ఉండటం, సముద్రతీరాలుగా ఉండటం అంటే ఆ పరిస్థితులు ఇవ్వాళ కనిపించటం లేదు. ఈ పరిస్థితులు స్పష్టంగా చెప్పాలంటే క్రీ.శ. 624-1323 మధ్యలో పూర్తిగా మారిపోయాయి. కనుక ఇవ్వాళ్టి పరిస్థితుల్ని బట్టి మేం నమ్మలేమంటే చరిత్రను నమ్మలేమని చెప్పటమే అవుతుంది.

**2.1.1.** ఇప్పటివరకూ చెప్పినదాని సారాంశమేమంటే 1. శాతవాహనరాజులు క్రీ.పూ. నుండియే ద్వీపకల్ప భారతం మొదలు గంగా తీరం వరకూ అఖండ భారతాన్ని పాలించిన తెలుగురాజులు. 2. ఆనాటి వైదిక మతాచారాలైన వర్ణవ్యవస్థ మొదలైన సామాజిక పరిస్థితులతోబాటు బౌద్ధ ధర్మాన్నీ ప్రాచ్య దేశాలతోపాటు మధ్యధరా పర్యంతమూ వ్యాపింపజేశారు. 3. క్రీ.పూ. నుండియే సముద్రయానం చేసి ఆసియా ఐరోపా దేశాలతో వర్తకవ్యాపారాలు నిర్వహించి సంపదను ఆర్జించారు.

**3.0.0.** భాషాసాంస్కృతిక రంగాల్లో శాతవాహనులు ప్రపంచానికే దారి చూపారు. ఇప్పటి తెలుగు భాషకు మాతృక అయిన దేశీ భాషను వారు అనుసరించారు. ఆ రోజుల్లో భారతదేశమంతటా ప్రాంతీయభేదాలతో వివిధ ప్రాకృతాలు వ్యవహారంలో ఉండేవి. అవంతీ, శౌరసేనీ, మాగధీ, పైశాచీ, ఆంధ్రీ ప్రాకృతాలు బహుళ ప్రచారంలో ఉండేవి. అవి సంస్కృతం కాదు. అలాగని ప్రాకృతం కూడా కాదు. రెండిటినీ మేళవించుకున్న దేశీయమైన భాషలు. కనుకనే నన్నయకానీ, చిన్నయకానీ తెలుగు వ్యాకరణాన్ని చెబుతూ సంస్కృత ప్రాకృతాలను స్మరించారు. ద్రావిడభాషను గానీ, మరొక సింధీ భాషను గానీ స్మరించలేదు. శాతవాహన రాజులలో 17వ వాడైన హాలుడు గాథాసప్తశతిని వ్రాశాడు. ఇది 700 కథలతో కూడుకున్న వచనకావ్యం. కథలు చెప్పటంలో ఆంధ్రులు గొప్పవారు అనటానికి ఇదొక చక్కని నిదర్శనం. హాలుడు సంస్కృత ప్రాకృతభాషలలో పాండిత్యం లేనివాడు. అతని భార్య ఆ భాషలలో గొప్ప విదుషీమణి. స్త్రీలు కూడా పాండిత్యం గలవారు అనటానికి ఆనాడే స్త్రీలు విద్యావంతులు అనటానికీ ఇదొక నిదర్శనం. ఒకనాడు హాలుడు, అతని రాణీ సరిగంగస్నానాలు చేస్తుంటే రాజు రాణిపై నీటిని దోసిళ్ళతో చిమ్మసాగాడు. దానికి రాణి అలా చిమ్మవద్దు అనటానికి సంస్కృతంలో "మోదకైస్తాడయ" అన్నదట. అంటే మ ఉదకైః తాడయ - అంటే నీటితో కొట్టవద్దు అని అర్థం. కానీ రాజుకు ఇది అర్థం కాకపోవటం చేతను, దేశీ భాషలో మోదకాలంటే ఉండ్రాళ్ళు కావటం వల్లనూ ఉండ్రాళ్లు తెప్పించి వాటితో కొట్టసాగాడట. రాజు అవివేకానికి రాణి పరిహసించిందట. రాజు తన భాషావిహీనతకు సిగ్గుపడి గుణాఢ్యుడు అనే పండితుణ్ణి పిలిపించుకుని 6 నెలలలో తనను బహుభాషా కోవిదునిగా తయారుచేయ మన్నాడట. ఆ రకంగా ప్రాకృతం నేర్చుకుని ఆ భాషలో గాథాసప్తశతిని వ్రాశాడు. హాలునికి ప్రాకృతం నేర్పిన గుణాఢ్యుడు పైశాచీ భాషలో బృహత్కథను వ్రాశాడు. కానీ అది పైశాచీ భాషలో ఉండటం వల్ల దాన్ని ఎవ్వరూ - యేరాజూ పోషించటానికి అంగీకరించపోవటంతో గుణాఢ్యుడు ఒక మర్రివృక్షం కింద చితిని పేర్చి, తన బృహత్కథలోని ఒక్కొక్క కథనూ చదివి దానిని ఆ చితిలో వేయసాగాడట. దీనిని గమనించిన కొందరు పామరులు ఆయనను వారించి మిగిలిన కావ్యాన్ని వారు ఊరేగింపుగా గ్రామంలోనికి తీసుకువెళ్ళి భద్రపరచారట. తరువాతి కాలంలో క్షేమేంద్రుడుఈ బృహత్కథలోని మిగిలిన భాగాన్ని ఆధారంగా చేసుకుని సంస్కృతంలో "కథాసరిత్సాగరం" అనే కథాకావ్యాన్ని వ్రాశాడట. అంటే ఇప్పుడే కాదు. ఆనాడే నాటి దేశీభాషలో ఎన్నెన్నో రచనలు వచ్చాయనటానికి ఇదొక చక్కని నిదర్శనం. మహానుభావులు కీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రి వంటి ఉద్దండులు పరిశోధించి ప్రాచీన వ్రాతప్రతులకు సరియైన పాఠాలు వ్రాసి పరిష్కరించి అందించారు కనుక ఇవ్వాళ మనం ఈపాటి కావ్యాలనైనా చదువుకుంటున్నాం కానీ అలాకాకుండా ఇప్పటి మనలాగా ఉన్నవే బరువని వదిలేస్తే మనకు ఈ కొన్నైనా మిగిలేవి కావు. ఇలాంటి పూర్వనేపథ్యాలవల్లనే నన్నయ భారతానికన్నా ముందు మరింకేమైనా కావ్యాలు వ్రాయబడి ఉన్నాయేమో అనే విమర్శ సాహిత్యకారుల్లో ఉంది. మహానుభావులు నిడుదవోలు వేంకటరావు వంటి పరిశోధకులు ఈనాడు కరువైపోతున్నారు. కాకుంటే పూర్వాంధ్ర సాహిత్యాన్ని వెలుగులోకి తేవటానికి ఇంకెన్నో పరిశోధనలు అవసరమై ఉన్నాయి. ఏ విశ్వవిద్యాలయాన్ని చూసినా, ఏ పరిశోధకుని చూసినా శ్రీశ్రీ గురించో ఆరుద్ర గురించో పరిశోధిస్తా అంటాడేగానీ ప్రాజ్ఞనన్నయకాలం గురించి దమ్ముతో పరిశోధిస్తే ఎంతో విలువైన తెలుగు సాహిత్యం బయటపడుతుంది. హాలుని గాథాసప్తశతిని తరువాతకాలంలో శ్రీనాథమహాకవి పద్యకావ్యంగా వ్రాసి "నూనూగు మీసాల నూత్నయవ్వనమున శాలివాహన సప్తశతి నుడివితి" అని చెప్పుకున్నాడు. హాలుని ప్రాకృత కావ్యాన్ని శ్రీనాథుడు తెలుగులో పద్యకావ్యంగా వ్రాశాడు. దీనినిబట్టి ఆంధ్రభాష క్రీస్తు పూర్వమే శాతవాహనులకాలంలోనే దేశీభాషగా మొదలై, సంస్కృత ప్రాకృత భాషలవల్ల పరిపుష్టిని పొంది, ద్రావిడభాషల స్నేహంతో దిటవును సంపాదించుకుని, దక్కను సుల్తానులు, మొఘలుల కాలంలో పార్శీ ఉరుదూలతో జట్టుకట్టి, తూర్పిండియా కంపెనీ కాలం నుంచీ ఆంగ్లాన్ని నోటికి అంటించుకుని, నానాటికి పెరుగుతున్నదేగానీ యేనాడూ ముడుచుకుపోలేదు. సంస్కృతం వెనుకబడింది. ప్రాకృతం పారిపోయింది. ద్రావిడం పరిమితమైంది. ఇంగ్లీషు ఆకాశానికెక్కింది. అన్నిటినీ కలుపుకున్న ఆంధ్రం తెలుగువాళ్ళనోళ్ళలో తాంబూలంలాగా నెమరు వేయబడుతూనే ఉంది.

**3.1.0.** చరిత్రకాలంనుండి శాతవాహనుల యేలుబడి మొదలు తరువాత అన్ని కాలాలలోనూ ఆంధ్రులు తమ స్వాతంత్ర్య పిపాసను ప్రదర్శిస్తూనే వచ్చారు. శాతవాహన రాజైన రెండవ పులోమావి క్రీ.పూ. 28వ సం.లో నందరాజుల తరువాత మగధను (బీహార్) ఆక్రమించి కన్యాకుమారి నుండి గంగాతీరం వరకు తెలుగువాడు రాజు అనిపించాడు. శాతవాహనులలో 23వ రాజైన గౌతమీపుత్ర శాతకర్ణి యావత్ ద్వీపకల్పాన్నీ వశం చేసుకుని వింధ్యను దాటి మాళవ, ఉజ్జయినీ (మధ్యప్రదేశ్, రాజస్థాన్, కొంత ఉత్తరప్రదేశ్)ల వరకు జయించి 28 సం.లు పాలించాడు. ఆంధ్రుల అఖండతేజాన్ని భారతదేశంలో ఆనాడే చాటిచెప్పాడు. శాతవాహనరాజులలో నౌకావ్యాపారాన్ని ఇనుమడింపజేసిన రాజు యజ్ఞశ్రీ శాతకర్ణి. ఇతడు తన నాణేలపై నౌకల గుర్తులను ముద్రించాడు.

**3.2.0.** శాతవాహనరాజులు వైదికమతంతోబాటు బౌద్ధమతాన్ని కూడా ఆదరించారు. యజ్ఞయాగాది క్రతువులతోపాటు బౌద్ధారామాలు, విహారాలు, చైత్యాల నిర్మాణాలను జరిపించారు. మత సామరస్యానికి నిదర్శనంగా పాలించారు. ప్రజలకు ఎటువంటి ప్రత్యేక విపత్తులూ కల్పించకుండానే నీతివంతమైన పాలనను అందించారు. అమరావతి,

నాగార్జునకొండ, భట్టిప్రోలు, ఘంటసాల, జగ్గయ్యపేట వంటి చోట్ల బౌద్ధారామాలను నిర్మింపజేశారు.

**4.0.0.** ఆరోజుల్లో రకరకాల పరిశ్రమలను శాతవాహనులు పోషించారు. వివిధరకాలైన పారిశ్రామిక ఉత్పత్తులతోనే మనవాళ్ళు విదేశాలతో నౌకా వ్యాపారాలు సాగించారు. ఆరోజుల్లోనే మన వస్త్రాలకు విదేశాల్లో మంచి గిరాకీ ఉండేది. సుగంధద్రవ్యాలు, చేతి వస్తువులు, తిండిగింజలు, గుర్రాలు, ఆవులు వ్యవసాయిక ఉత్పత్తులు ఎగుమతి చేసేవారు. రాజ్యంలోని యేగ్రామానికి ఆ గ్రామం స్వయం పోషకంగా ఉండేవి.

**4.1.0.** శాతవాహనుల రాజధాని గురించి భిన్నవాదనలు విని పిస్తున్న మాట నిజమే. కానీ వాస్తవానికి అవన్నీ సుదీర్ఘకాలం ముఘ లులు పాలించలేదు. బ్రిటిష్‌వాళ్ళు పాలించలేదు. కాకతీయులా ? రెడ్లా? చోళులా? చాళుక్యులా? పీష్వాలా? ఎవరు? ఎవరు పాలించారు అంత సుదీర్ఘకాలం? ఒక్క శాతవాహనులు మాత్రమే పాలించారు. ఇన్ని వందల యేండ్ల పాలనలో వాళ్ళు మొదటికాలంలో శ్రీకాకుళాన్ని రాజధానిగా చేసుకున్నారు. అప్పట్లో కృష్ణా గోదావరీ నదులకు కరకట్టలు లేవు గదా ! వరదల భీభత్సాలు చాలా ఘోరంగా ఉండేవి. శాతవాహనుల రాజధాని వరదల్లో కొట్టుకుపోతే దగ్గరలోని గుంటూరు జిల్లా ధరణికోటకు రాజధానిగా తరలివెళ్ళారు. అదికూడా భద్రత కాకపోవటము, సామ్రాజ్యం విస్తరించటమువల్ల మహారాష్ట్రలోని ప్రతిష్ఠానపురం - పైఠాన్ రాజధానిగా చేసుకుని పాలించారు.

**4.1.1.** శాతవాహనుల రాజధాని శ్రీకాకుళం కొట్టుకుపోగా అక్కడి ఆంధ్ర మహావిష్ణు ఆలయం కూడా కొట్టుకుపోయింది. తరువాత రోజుల్లో శాతవాహనులే దాన్ని మళ్ళీ మళ్ళీ ప్రతిష్టిస్తూ వచ్చారు. వారి పాలనానంతరం శ్రీకాకుళం వైభవం మసకబారింది. వారు ప్రతిష్ఠించిన విగ్రహం నీళ్ళపాలయ్యింది. కానీ ప్రభుభక్తి పరాయణులైన భక్తులు, తరువాతి కాలాలరాజులు దాన్ని నిలుపుకుంటూ వచ్చారు. ఆ విగ్రహం కూడా వరదల్లో కొట్టుకుపోతే చల్లపల్లి జమీందారుగారి ఆస్థానకవి కాసులపురుషోత్తమకవి మంత్రశాస్త్ర ప్రసిద్ధుడు. కవితాశక్తితో అద్భుతాలు చేసిన గొప్ప ఉపాసకుడు. ఆంధ్రనాయకశతకాన్ని మొదలు పెట్టాడట. ఒక్కొక్క పద్యానికి ఒక్కొక్క అంగుళం చొప్పున కృష్ణలో కూరుకుపోయిన స్వామివారి విగ్రహం పైకి లేచి 108 పద్యాలు పూర్తయ్యేసరికి 9 అడుగుల ఎత్తున నిలిచి భక్తులకు దర్శనమిచ్చాడట. ఆ స్వామి విగ్రహాన్ని తెచ్చి చల్లపల్లి రాజావారు ఇప్పటి శ్రీకాకుళంలో ప్రతిష్ఠింపజేశారు.

**4.1.2.** శ్రీకాకుళాంధ్ర మహావిష్ణు మహిమలకు మరొక దృష్టాంతం ఈ వ్యాసరచయితకు కలిగిన అనుభవాన్ని తెలుసుకుంటే అర్థం అవుతుంది. 1990 ప్రాంతాల్లో ఆంధ్రమహావిష్ణు శ్రీకాకు ళేశ్వరస్వామివారి ఆలయం దీనావస్థలో ఉండేది. ఆముక్తమాల్యద కావ్యం వ్రాసిన శ్రీకృష్ణదేవరాయలు ఈ ఆలయంలో స్వప్నాన్ని పొంది ఆ కావ్యరచనకు శ్రీకారం చుట్టిన స్వామివారి కళ్యాణమండపం శిథిలమై దిబ్బగా ఏర్పడిపోయింది. బడిపిల్లలు ఆ దిబ్బపైకెక్కి ఆడుతూ ఉండేవారు. అప్పట్లో ఈ వ్యాసరచయిత భారతీయ సాహిత్యపరిషత్తు అనే సంస్థను స్థాపించి తద్వారా సాహితీ సేవ చేస్తూండేవారు. ఈ ప్రదేశపు దయనీయస్థితిని చూసి ద్రవించి అప్పటి మండలాధ్యక్షులు ప్రముఖులు శ్రీ గొర్రెపాటి వెంకట రామకృష్ణగారిని ఆశ్రయించి, ఈనాడు పత్రికవారిని స్పందింపజేసి అప్పటి జిల్లా కలెక్టరు చిత్రా రామచంద్రన్ గారిని పిలిచి పరిస్థితిని వివరించారు. ఆమె స్పందించి ప్రభుత్వానికి సిఫార్సు చేశారు. గ్రాంటు మంజూరైంది. రాయలవారు స్వప్నాన్ని పొందిన స్వామివారి కళ్యాణమండపం నిర్మించబడింది. తరువాత గౌ. శ్రీ మండలి బుద్ధప్రసాదుగారు స్థానిక ప్రజల చిరకాల వాంఛను గమనించి రాయలవారి విగ్రహాన్ని మండపంలో ప్రతిష్ఠింప జేశారు. ఆ తరువాత గౌ. బుద్ధప్రసాద్‌గారి ఆధ్వర్యంలో ఆలయం మరింతగా అభివృద్ధిచెందింది. శ్రీకాకుళాంధ్రమహావిష్ణువు కథనంత టినీ ఈ వ్యాసకర్త డా. చింతలపాటి మురళీకృష్ణ "సిరికోవెల" పేరుతో 3 అశ్వాసాల పద్యప్రబంధముగా 2010లో వ్రాశారు. దానిని తిరుమల తిరుపతి దేవస్థానం వారు అచ్చు వేయించారు. అద్భుతమైన పద్యకావ్యంగా సిరికోవెల ప్రముఖుల ప్రశంసలను అందుకొంటున్నది.

**5.0.0.** అయితే శాతవాహనుల పాలనవల్ల ఈ ప్రాంతమంతా ఇప్పటికీ సంపన్న ప్రదేశంగానే విరాజిల్లుతోంది. ఇక్కడే కాదు. ఆంధ్రదేశమంతటా వారి వైభవం చిరస్థాయిగా నిలచి ఉంది. అయితే శాతవాహనులతోటే ఆంధ్రుల వైభవం ఆగిపోలేదు. తరువాత కాలాల్లో ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు, తూర్పు చాళుక్యులు, బృహత్పలా యనులు, పల్లవులు, చోళులు, రెడ్డిరాజులు, కాకతీయులు, విజయ నగర రాజులు, దక్కన్ సుల్తానులు, తూర్పిండియా కంపెనీ పాలన ల్లోనూ ఆంధ్రులు తమ గుర్తింపును నిలుపుకుంటూనే వచ్చారు. ఆంధ్రుల వలన ఎవరైనా లాభపడ్డారుగానీ ఆంధ్రులు ఎవరివల్లనూ లాభపడలేదనేది చారిత్రక సత్యం.

శ్రీ ఎ.ఎ.వి. ప్రసాద్

# "సింధు-కృష్ణ లోయల నాగరికతలు"

ఇక్కడ అధ్యయనానికి ఎంచుకున్న అంశం స్థలకాలాల రీత్యా ఎంతో విస్తారమైనది. దీనిమీద మన అధ్యయనం ముందుకు సాగాలంటే ఎన్నో విరుద్ధాంశాలను సమన్వయం చేసుకోవలసి ఉంటుంది. అందుబాటులో ఉన్న పురావస్తు ఆధారాలనూ, వేదాలు, జ్యోతిషం, పురాణేతిహాసాలు, భాషాశాస్త్ర, చారిత్రక ఆధారాలనూ దృష్టిలో పెట్టుకుని ముందుకుసాగవలసి ఉంటుంది. ఉదాహరణకు మహాభారత యుద్ధకాలాన్ని, రామకృష్ణుల జనన తేదీలనూ నిర్ధారించడానికి జ్యోతిషం మీద ఆధారపడే చరిత్రకారుల గురించి మనకు తెలుసు. వారు తేల్చిచెప్పిన తేదీల మీద వివాదం రేగడమూ చూస్తూనే ఉన్నాం. ఇక్కడ ఒక ముఖ్యమైన అంశాన్ని నిర్ధారించడంలో జ్యోతిషశాస్త్ర పాత్రను పరిశీలిద్దాం. రాముడు సూర్యవంశ క్షత్రియుడని, కృష్ణుడు చంద్రవంశ క్షత్రియుడని ప్రాచీన రచనలు ప్రకటించడమూ, తదుపరి కాలాల్లో ప్రతిరోజూ తాను ఆ రెండు వంశాలలో ఏదో ఒకదానికి చెందినవాడినని వంశ క్రమాన్ని రాయించుకోవడమూ తెలిసిందే. రాముడు మిట్టమధ్యాహ్నం, కృష్ణుడు అర్ధరాత్రి పుట్టాడని ప్రాచీన రచనలు చెబుతున్నాయి. జ్యోతిషశాస్త్రం ప్రకారం మిట్ట మధ్యాహ్నం పుట్టిన వాడి జాతకంలో సూర్యుడు బలంగా ఉంటాడు. అర్ధరాత్రి పుట్టినవాడి జాతకంలో చంద్రుడు అతిబలీయుడు. బహుశా దీని ఆధారంగానే రామకృష్ణులను సూర్య, చంద్ర వంశవృక్షాలకు మూలపురుషులుగా పరిగణించి ఉంటారు. కాని, తదుపరి రాజులు ఏ సమయంలో పుట్టినా, పూర్వ రచనలు వారిని ఈ రెండు వంశవృక్షాలలో ఏదో ఒకదానికి అంటు కట్టేయడం గమ్మత్తుగా అనిపిస్తుంది.

ఏ రచన అయినా పైచూపులకు కాగితం మీద టూ డైమెన్షనల్‌గా కనిపిస్తుంది. కాని, నిజానికి అది ఫోర్‌డైమెన్షనల్ కన్‌స్ట్రక్ట్. ముఖ్యంగా మన పురాణేతిహాసాలను నాలుగు కొలతల నిర్మితిగా చెప్పుకోవచ్చు. ఈ నమూనాలో ఐన్‌స్టెయిన్ చెప్పిన కాలం నాలుగో కొలత అన్నమాట. లక్షల సంవత్సరాలకు విస్తరించే యుగాలను, కల్పాలను మన పురాణాలు ఆలంబనగా తీసుకొని, చారిత్రక పురుషులనూ, ఘటనల క్రమాన్ని కాలరేఖపై అటూ ఇటూ జరిపేయడం చూస్తే, భారతీయ రచనలలో కాలానికున్న ప్రాధాన్యం అర్థం అవుతుంది. ప్రక్షిప్తం చేయడమనే ప్రక్రియ కాలరేఖపై విన్యాసాలకు ఎంతో వెసులుబాటు కల్పించింది. ఈ మోడల్‌కాలం తర్వాత రచయిత దృష్టికోణాన్ని, అది ఆపాదించే ఉద్దేశాలను మూడో కొలతగా పరిగణించాలి. వ్యక్తులు, జనసమూహాలు, మొదటి కొలత అయితే, సంఘటనలను రెండవ కొలతగా పరిగణించాలి. సినిమాల్లో, గేమింగ్ పరిశ్రమలో యానిమేషన్‌కు వాడే త్రీడీ మోడల్‌కు ఈ ఫోర్ డి మోడల్ ఏ విధంగానూ తీసిపోదు.

ఇప్పుడు ప్రాచుర్యంలో ఉన్న కొన్ని మోడల్స్ ప్రకారం ఆర్యుల, ద్రావిడుల మూలవాసం భారత ఉపఖండమే. దీనితో విభేదించే మోడల్స్ కూడా ఉన్నాయి. నేను ఎంచుకున్న నమూనా కూడా ఆర్యులూ, ద్రావిడులూ బయటనుంచి వలస వచ్చి, క్రమంగా భారతదేశమంతటా వ్యాపించారన్న వాదాన్నే ప్రామాణికంగా తీసుకొంటుంది. ఈ మధ్య వెలువడిన శాస్త్రీయ అధ్యయనాలు, దాదాపు అరవై వేల ఏళ్ళ క్రితం ఆధునిక మానవులు అంటే హోమోసేపియన్స్ ఆఫ్రికా నుంచి బయటి ప్రాంతాలకు వలసవెళ్ళారని తేలుస్తున్నాయి. దాదాపు 14,000 ఏళ్ళ క్రితం చివరి హిమయుగం ముగిసింది. అటుపైన యూరప్, ఉత్తర అమెరికాలలో హిమనదాలు కరిగిపోయి, సముద్ర మట్టాలు పెరిగిపోయాయి. ప్రపంచంలో అనేక సంస్కృతులలో వ్యాప్తిలో ఉన్న జలప్రళయ గాథలకు ఇదే మూలం కావచ్చు. ఈ వాతావరణ మార్పులే ఆర్యులనూ, ద్రావిడులనూ వలసలకు పురిగొల్పి ఉండవచ్చు. సుమేరియన్ రచనలలో సప్త రుషుల ప్రస్తావన ఉండటం, విశ్వ ఆవిర్భావం గురించి ఋగ్వేదంలోని సృష్టిసూక్తాన్ని పోలినవి బాబిలోనియా, ఈజిప్ట్‌లకు చెందిన ప్రాచీన సాహిత్యంలోనూ కనిపించడం బట్టి, మధ్యప్రాచ్యం మీదుగా ఈ వలసలు జరిగి

ఉంటాయనిపిస్తోంది. ఋగ్వేదంలో సింధు, సరస్వతి నదుల ప్రస్తావన ఉండగా, మలి వేదాలు, స్మృతులు భారతదేశంలోని ఇతర ప్రాంతాల గురించి చెప్పడం చూస్తే వాయవ్య దిశ నుంచి తూర్పు, దక్షిణ భారతాల దిశగా వలసలు సాగాయని స్పష్టమవుతోంది. పురాద్రావిడులు, ముఖ్యంగా ఆంధ్రులు కూడా ఉత్తరాపథం నుంచి దక్షిణానికి వలస వచ్చారనే వాదాన్ని నా మాడల్ ప్రామాణికంగా తీసుకొంటుంది.

ఈ మాడల్‌ను ఒక మైండ్ ఎక్స్‌పెరిమెంట్‌గా స్వీకరించాలి. అందుబాటులో ఉన్న ఫ్యాక్టాయిడ్స్ అంటే సత్య శకలాల ఆధారంగా లోతైన ప్రశ్నలు వేయడం, వాటికి జవాబులు ప్రతిపాదించి, ప్రయోగాలు చేసి, పూర్తి సత్యాన్ని అవగాహన చేసుకోవడానికి ప్రయత్నించడం శాస్త్ర పరిశోధకుల ఆనవాయితీ. సత్యావిష్కరణకు రకరకాల మాడల్స్‌ను ప్రతిపాదిస్తూ, క్వాంటమ్ శాస్త్రజ్ఞులు ఇలాంటి మైండ్‌గేమ్స్ ఆడతారు. ఆంధ్రుల చరిత్రకు సంబంధించి చెల్లాచెదురుగా ఉన్న సమాచార శకలాల మధ్య సంబంధాన్ని ఏర్పరచడానికి ప్రయత్నిస్తూ నేను కూడా ఒక మాడల్‌ను ప్రతిపాదిస్తున్నాను.

శ్రీకృష్ణుడు అంధక-వృష్ణి తెగకు చెందినవాడన్న వ్యాస భారత ప్రకటన, అంధకులు, ఆంధ్రులు ఒక్కరేనన్న బౌద్ధుల ప్రతిపాదన నా మాడల్‌కు ప్రాతిపదికలు. ఆ మధ్య పురాతత్వ పరిశోధకుడొకరు శ్రీకృష్ణుడు తెలుగువాడేనని ప్రకటించడం, నాలో ప్రశ్నలు రేపింది. పూర్ణచంద్‌గారి 'తెలుగే ప్రాచీనం' గ్రంథం ఘట జాతకకథలోని కృష్ణుడి ఉదంతాన్ని ఉల్లంఘించింది. నందగోప, అంధకవెణ్ణు అనే దంపతుల వద్ద దేవకీపుత్రులు పదిమంది పెరిగారని ఈ జాతక కథ చెబుతుంది. భాగవతంలో నందగోపుడు పురుష పాత్ర అయితే, ఘట జాతకంలో అది స్త్రీపాత్రగా మారిపోయింది. ఆమె భర్తగా చెప్పబడిన అంధకవెణ్ణు పూర్ణచంద్‌గారు ప్రతిపాదించిన ఆంధ్ర మహావిష్ణువు కావచ్చు. లేదా అంధక-వృష్ణి తెగకు చెందిన నందగోపుడి వద్ద కృష్ణుడు పెరిగాడని అనుకోవచ్చు. అంధకవెణ్ణు అనేది అంధక వృష్ణికి అపభ్రంశ రూపమైనా ఆశ్చర్యం లేదు. అలాగే ద్రావిడవెణ్ణు సంస్కృత విష్ణువుగా రూపాంతరం చెందాడనే వాదం శ్రీకృష్ణుడు తెలుగువాడేనని వాదించడానికి ఆస్కారమిస్తోంది. కృష్ణుడు ఆచార్యుడని అంబేద్కర్‌తో పాటు గుసేవా అనే రష్యన్ పరిశోధకురాలు కూడా వ్యాఖ్యానించారు. పాండవులు కూడా బహుభర్తృత్వం ఆచారంగా కలిగిన పర్వత ప్రాంత ఆనార్య తెగ అని బౌద్ధ సాహిత్యం పేర్కొన్నది. అర్జునుడు – సుభద్ర; అభిమన్యు –శశిరేఖల పరిణయాలు మేనరికం వివాహాలని, ఇప్పటికీ ఉత్తర భారతంలో మేనరికాలు నిషిద్ధమని గమనిస్తే, కృష్ణుడు ఆంధ్రుడు కావచ్చుననే వాదానికి మరింత బలం చేకూరుతుంది.

అసలు కృష్ణుడి కథ, కురుపాండవుల సంగ్రామ కథ వేర్వేరని, వాటిని ఒక్కటి చేసి, మరికొన్ని కథలు, ఉపకథలు, తాత్విక బోధలను కలగలిపి మహాభారత అంతిమ రూపాన్ని తయారుచేశారనేది మరొక వాదన. 8,800 శ్లోకాలతో మొదలైన వ్యాసభారతాన్ని ఇలాంటి ప్రక్షిప్తాలతో దాదాపు లక్ష శ్లోకాలకు విస్తరించారని పండితులు అంటారు.

అసలు ఏ ఉద్దేశంతో ఈ ప్రక్షిప్త ప్రక్రియ నడచిందనే ప్రశ్న వస్తుంది. దీనికోసం ఒకసారి కాలరేఖపై వెనక్కు నడుద్దాం. క్రీస్తు పూర్వం ఆరో శతాబ్దినాటికే సమాజంలో అంతరాలను పెంచి పోషించి, నిరంకుశ రాజ్యపాలనకు పట్టం కడుతున్న భావజాలాన్ని ధిక్కరిస్తూ బౌద్ధజైనాలు, వివిధ దర్శనాలు, ఉపనిషత్తులు, కృష్ణుని దేవుడిగా కొలిచే భగవతివాదం వ్యాప్తిలోకి వచ్చాయి. మావో చెప్పినట్లు అది నూరు పూలు వికసించి, వేయి భావాలు సంఘర్షిస్తున్న కాలం. ఈ నేపథ్యంలో జాతి హార్డ్‌డిస్క్‌లో విస్తరిస్తున్న అనైక్యతా వైరస్‌పై సంధించిన ఐక్యతా అస్త్రాలుగా అంటే కిల్‌బాట్‌లుగా పురాణేతిహాసాలను వర్ణించవచ్చు. అని జాతి స్మృతిలో ఎంబెడెడ్ సాఫ్ట్‌వేర్‌గా కూడా పనిచేశాయి. దీనికి మనం ముందే చెప్పుకున్న ఫోర్‌డి మాడల్ టెంప్లేట్‌గా ఉపకరించింది. ఈ మాడల్ భరతఖండమంతా ఒకటేనన్న దృష్టికోణాన్ని భారతీయ జనసమూహాల మానసిక క్షేత్రంలోకి ఇంకించడానికి, అంటే ఎంబెడ్ చేయడానికి, రామకృష్ణుల జీవిత ఘటనలనూ, మహాభారత సంఘటనలను కాలరేఖపై వెనక్కూ ముందుకూ యానిమేట్ చేస్తూ రమణీయ భావకావ్యాలను రచించింది. మనసు తెరలలో ఎంబెడ్ చేసిన ఈ సాఫ్ట్‌వేర్‌ను మన పూర్వకవులు ఎప్పటికప్పుడు అప్‌గ్రేడ్ చేస్తూ, భారతీయుల చైతన్య క్షేత్రంతో క్రీడించారు. ప్రాచీన కవుల సాహిత్య కల్పన కృష్ణలీలకు ఏమాత్రం తీసిపోదు. మొదట మనోక్షేత్రంలో రూపుదిద్దుకున్న ఈ ఐక్యతా మాడల్‌కు జనాదరణ కరెంటుగా పనిచేసి, ఆసేతు హిమాచల పర్యంతం భారతదేశం ఒక్కటేనన్న భావనను భౌతికంగా సాకారం చేయించింది కాని, ఈ మాడల్ ఎప్పటికప్పుడు సవాళ్ళకు లోనవుతూనే ఉంది.

ప్రస్తుతం తెలుగునాట కూడా అనైక్యతా వైరస్ విజృంభిస్తోంది. తెలుగుజాతి తన ఔన్నత్యాన్ని, ఘన చరిత్రనూ చూసుకుని గర్వపడేలా చేయడం ద్వారా ఐక్యతా సాధనకు కృషి చేయవలసి ఉంది. అనైక్యతా వ్యాధి ముదరకుండా టీకాలు వేయాలి. దీనికోసం ఒక కొత్త మాడల్‌ను తయారుచేయాలి. జాతి ఐక్యతకు ఉపకరించే చరిత్ర శకలాలను ప్యాటరన్ రికగ్నిషన్ సాఫ్ట్‌వేర్‌ను పోలిన మనస్తత్వంతో ఏరి, కూర్చి

కొత్త మాడల్‌ను తయారుచేసుకోవచ్చు. ఉదాహరణకు శ్రీకృష్ణుడిని ఆలంబనగా తీసుకొని తెలుగుజాతి ఘనచరిత్రను రచించవచ్చు.

ఈ సందర్భంలో కృష్ణుడు చారిత్రక పురుషుడా లేక కాల్పనిక వ్యక్తా అని ప్రశ్న వస్తుంది. కృష్ణుడు వాస్తవిక వ్యక్తేనన్న దృష్టికోణాన్ని నా నమూనా అనుసరిస్తుంది. దీనికి ఆధారాలుగా తీసుకున్న తేదీలను ఇక్కడ ఇస్తున్నాను.

క్రీ.పూ. 1900 నుంచి 1500 సంవత్సరాల మధ్య రుగ్వేదం రూపుదిద్దుకొంది. అందులో కృష్ణుడి ప్రస్తావన లేదు.

మహాభారత యుద్ధం క్రీ.పూ. 1200 నుంచి 1000 సంవత్సరాల మధ్య జరిగి ఉండవచ్చు. అందులో కృష్ణుడు పాల్గొన్నాడు. కాబట్టి చరిత్రకు తెలిసిన ఆంధ్రుల కథ కూడా అక్కడినుంచే ప్రారంభమవుతుందని ప్రతిపాదిస్తున్నా.

క్రీ.పూ. ఏడు లేక ఎనిమిదవ శతాబ్దికి చెందిన ఛాందోగ్య ఉపనిషత్తు కృష్ణుని దేవకీ పుత్రుడిగా వర్ణించింది. జయ అనే పేరుతో వ్యాస భారత రచన కూడా బహుశా అప్పుడే మొదలై ఉండవచ్చు.

క్రీ.పూ. 4వ శతాబ్దికి చెందిన పాణిని అష్టాధ్యాయి వాసుదేవ కృష్ణుడి గురించి, అతడి అంధక-వృష్ణి తెగల గురించి ప్రస్తావించింది. ఇదే శతాబ్దంలో అలెగ్జాండర్‌ను ఎదుర్కొన్న పురుషోత్తముడి సేనలు తమ ధ్వజం మీద హెరాక్లిస్, అనగా కృష్ణుడి బొమ్మను చిత్రించుకున్నాయని గ్రీకురచయితలు రాశారు. చాణుక్యుడు కూడా కృష్ణుడి గురించి, అంధక - వృష్ణి తెగల గురించి, కృష్ణ భక్తుల గురించి రాశారు. అంటే, అప్పటికి కృష్ణుని భగవంతుని అవతారంగా ఆరాధించే సంప్రదాయం నెలకొన్నదన్నమాట.

క్రీ.పూ. 2వ శతాబ్దంలో పతంజలి కృష్ణుడిని భగవానుడిగా పేర్కొన్నారు.

బౌద్ధ జాతకం కథల రచనా కాలం క్రీ.పూ. 200-250 అంటారు. ఘట జాతక కథ కృష్ణుడి కథ చెప్పింది. సెరివణిజ జాతక కథ ప్రకారం ఇదేకాలంలో మహానది ఉపనది అయిన తేల్ తీరంలో అంధకపురం నిర్మితమైంది.

చారిత్రక పురుషుడుగా మొదలైన కృష్ణుడు మహాభారత యుద్ధం ముగిసిన కొన్ని శతాబ్దాలకు మరోవైపు, మహాభారత యుద్ధం తర్వాత ద్వారకలో ముసలం పుట్టి నశించి పోయారనుకున్న అంధకులు, ఐతరేయ బ్రాహ్మణ కాలమైన ఆరవ శతాబ్దిలో యమునకు దక్షిణాన బతికేఉన్నారు. ఇప్పటికింకా వైదిక మతానుయాయులు కృష్ణుడికి దైవత్వం ఆపాదించి ఉండరు. అందుకేనేమో, ఐతరేయ బ్రాహ్మణం అతడి తెగవారైన అంధకుల గురించి లోకువగా మాట్లాడింది. ఈ బ్రాహ్మణానికి వంద సంవత్సరాల ముందో వెనుకో రాసిన ఆపస్తంబ స్మృతి, యమునకు దక్షిణాన సాళ్వ దేశం అంధకుల ఆవాసమని పేర్కొని ఉంది. మహాభారత యుద్ధం తర్వాత అంధకులు ద్వారక నుంచి మహారాష్ట్ర, మగధల మీదుగా దక్షిణ భారతం వరకు విస్తరించారని ఇక్కడ ప్రతిపాదించవచ్చు. విశ్వామిత్రుని సంతానమైన ఆంధ్రులు శాపవశాన అనార్యులైన అంధకులలో కలిసిపోయినట్లు ఐతరేయ బ్రాహ్మణం ఉటంకించింది. ఇక్కడ అంధకులు, ఆంధ్రులు వేర్వేరుగా కనిపిస్తారు. కాని, తదుపరి కాలాల్లో వెలువడిన బౌద్ధ జాతక కథలు ఆ భేదాన్ని పాటించలేదు.

అంబేద్కర్ వాదం ప్రకారం మహాభారత యుద్ధం ఉదార వాదులకూ, కులవ్యవస్థను పెంచి పోషించిన మత ఛాందసవాదులకూ మధ్య నడచిన సమరం. ఇందులో ఉద రవాదులకు కృష్ణుడు నాయకత్వం వహిస్తే, ఏకలవ్యుని పట్ల ఘోరమైన విపక్ష ప్రదర్శించిన ద్రోణుడు ఛాందసవాదులకు గురువుగా వ్యవహరించాడు. బానిస విధానానికీ, నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా కృష్ణుడి నాయకత్వంలో జరిగిన పోరులో అంధకులు పాల్గొన్నారు. అందుకే భారత యుద్ధానంతరం జనసామాన్యం కృష్ణుని ఆరాధించడం మొదలుపెట్టిందని స్పష్టమవుతోంది. వైదిక కర్మకాండలనునిరసించిన బౌద్ధ, జైనాలుకూడా సమాంతరంగా జనబాహుళ్య ఆదరణకు, ముఖ్యంగా ఆంధ్రుల ఆదరణకూ నోచుకున్నాయి.

ఈ రెండు మతాలనూ అవలంభించిన మౌర్యులకు ఆంధ్ర శాతవాహనులు సామంతులు. శాతవాహనులను బౌద్ధవైష్ణవులంటే అతిశయోక్తి కాదు. క్రీ.పూ. 185లో కడపటి మౌర్యరాజును వధించి సింహాసనమెక్కిన పుష్యమిత్ర శుంగుడే నిరంకుశమను ధర్మ స్మృతిని రచింపజేశాడని అంబేద్కర్ వాదన. ఆంధ్రులేమో అపస్తంబ స్మృతి అనుయాయులు. శుంగులతో పోరాడినదీ, వారి తర్వాత మగధను ఏలిన కణ్వులను సింహాసనచ్యుతుల్ని చేసినదీ ఆంధ్ర శాతవాహనులే. శాతవాహనుల ఏలుబడిలో బౌద్ధం పరిఢవిల్లింది. వారు మనుధర్మానికి పట్టం కట్టలేదన్నమాట. మొత్తంమీద ఉత్తరాపథంలో మహాభారత యుద్ధకాలం నుంచి కులపరమైన భావజాలాన్ని, దానిమీద నిర్మితమైన నిరంకుశ రాజ్యాలనూ ఆంధ్రులు ప్రతిఘటిస్తూ వచ్చారు. ఇది ఛాందస వర్గానికి కంటగింపు కలిగించింది. అందుకే, ఆంధ్రుడు కలలోకి వస్తే తలంటు పోసుకోవాలని ఆర్యావర్తంలోని మనువాద పండితులు ప్రచారం చేశారు.

శాతవాహనులు తెలంగాణ నుంచి మహారాష్ట్రకు వలసవెళ్ళారన్నది ప్రస్తుతం రాజకీయంగా ఖచ్చితమైన వాదం. అంధకులే ఆంధ్రులన్న నా మాడల్ కింద ఈ విస్తరణ ఉత్తరం నుంచి దక్షిణానికి జరిగిందని

ప్రతిపాదిస్తున్నాను. అంధక వృష్ణి తెగకు సౌరాష్ట్రలోని ద్వారక రాజధాని అని మహాభారతం చెప్పింది. అదే భారతంలో అంధకులంతా అంతర్యుద్ధంలో నశించిపోయారని చెప్పింది. అయితే, హిరోషిమా, నాగసాకీలపై ఆటం బాంబులు పడినాక కూడా అక్కడ కొంతమంది బతికి బట్టకట్టారు. కాబట్టి, అంధకులంతా కనుమరుగయ్యారనడం అతిశయోక్తి అని భావిస్తున్నాను. కృష్ణుని అస్తమయం, ద్వారక సముద్రంలో మునిగిపోవడం జరిగాక, కాలక్రమంలో ఆంధ్రులు పొరుగునే ఉన్న మహారాష్ట్రకు చేరారని ప్రతిపాదిస్తున్నాను. శాతవాహనుల తొలి రాజధాని ప్రతిష్ఠానపురం ఇక్కడిదే. శాతవాహన రాజ్యం క్రమంగా దక్షిణాదికి వ్యాపించింది. వారి ఏలుబడిలోనే కృష్ణాతీరం మతపరంగా, వాణిజ్యపరంగా ఉచ్ఛస్థితిని అందుకున్నది. మహాభారత యుద్ధకాలం నుంచి నిరంకుశ రాజ్యాధికారంతో, ఆపైన మనుధర్మ ప్రబోధకులతో సంఘర్షిస్తూ వచ్చిన ఉదారవాద ఆంధ్రులు, కృష్ణాతీర మూలవాసులైన నాగులు, యక్షులతో సత్సంబంధాలు ఏర్పరచుకోవడంలో ఆశ్చర్యమేముంది ?

కృష్ణాతీరంలో తూర్పు చాళుక్య, కాకతీయ రాజ్యాల పతనం జరిగాక ఆంధ్రుల కార్యసీమ తుంగభద్రతీరానికి మళ్ళింది. విజయనగర జనాభాలో సగం మంది కన్నడిగులైతే, మిగతా సగం తెలుగువారని పోర్చుగీస్ యాత్రికుడు నునిజ్ రాశాడు. విజయనగర రాజ్యాన్ని ఉచ్ఛస్థితికి తీసుకెళ్ళిన శ్రీకృష్ణదేవరాయలు కన్నడిగుడని అంటున్నారు. కాగా, పూర్ణచంద్‌గారు రాయల తల్లి తెలుగు వనిత అని నిర్ధారించారు. ఇక్కడ మరికొన్ని సత్య శకలాలను తీసుకుని, వాటి మధ్యనున్న సంబంధాన్ని ఆవిష్కరిద్దాం. కన్నడ శాసనాలు తెలుగు వర్తకులను రణరంగ రాములు, సంగ్రామ భీములని పొగిడాయని మల్లంపల్లి సోమశేఖర శర్మ రాశారు. ఆ వర్తక శ్రేణుల వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడానికి రాజులు సైతం సాహసించేవారు కారని తెలిపారు. ఇవే శ్రేణులు ఆయుధపాణులై సంచరించేవని, రాజులు తమ కలహాలలో ఈ శ్రేణుల సహాయాన్ని స్వీకరించేవారని కంభంపాటివారు రాశారు. కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయ ఆచార్యుడు సంజయ్ సుబ్రహ్మణ్యం పరిశోధన ప్రకారం, మధుర నాయక రాజుల కాలంలో కోరమాండల్ తీర వర్తకం అచ్యుతప్ప, వెంకటప్ప అనే ఇద్దరు తెలుగు వర్తకుల చేతిలో ఉండేదని, వీరు నాయక రాజుల బంధువులని రాశారు. కాబట్టి, విజయనగర కాలంలో తెలుగువారు అంగ, అర్థ బల సంపన్నులని తేలుతోంది. రాయలు సింహాసనానికి రాగానే మొదట యుద్ధం ప్రకటించినది కన్నడ తిరుగుబాటుదారుల మీదనే. అతడి మంత్రి తిమ్మరుసు తెలుగువాడు. రాయల సైన్యంలో అధికభాగం తెలుగు నాయకుల ఆధిపత్యంలో ఉండేది. రాయలు తన కూతురిని ఇచ్చినది మళ్ళీ తెలుగువాడికే. ఆయన రచనలు చేసినదీ తెలుగులోనే. ఆదరించినదీ తెలుగు కవులనే. రాయలు, ఆయన తమ్ముడు అచ్యుతదేవరాయలు తెలుగు నాయకులనే మధుర తంజావూరు రాజ్యాలకు పాలకులుగా పంపారు. కన్నడిగుడైన రాయలకు తెలుగువారి మీద ఎందుకు ఇంత పక్షపాతమని ప్రశ్నిస్తున్నా దానికి జవాబుగా తెలుగువారు లేనిదే రాయలు లేడని చెప్పే సాహసం చేస్తున్నా మహాభారత, శాతవాహన యుగాలలో నిరంకుశత్వాన్ని ధిక్కరించిన తెలుగువారు, కృష్ణాతీరం నుంచి తుంగభద్ర తీరానికి వెళ్ళి 200 సంవత్సరాలపాటు విదేశీ దండయాత్రికులను ఎదిరించి పోరాడిన ధీరులు, తెలుగువారే రాయల సామ్రాజ్యానికి మూల స్తంభాయమానులు.

ఇప్పుడు విజయవాడ శాసనంలో చాళుక్య రాజ్య మూలస్తంభాయమానులుగా పేర్కొనబడిన తెలికివేపురు గురించి కూడా ప్రశ్నించుకుందాం. తివిరి నూనె తీసేవారిగా పరిగణించడం జరుగుతోంది. నేటి అమెరికాకైనా, నాటి రోమన్ సామ్రాజ్యానికైనా మూలస్తంభాలు ఆర్థిక, సైనిక శక్తులే. ఇప్పటి అరబ్ రాజ్యాలకు ఆలంబన అయిన పెట్రోలియంలానే, నాటి చాళుక్య రాజ్యానికి వంటనూనె ఆర్థిక ఆలంబన అని భావించవచ్చునా! ఆ రాజ్యంలో నూనె గింజల పంట విస్తీర్ణమెంత ? చాళుక్య రాజ్య ఖజానాకు సమకూరే నిధులలో వంట నూనె వర్తకానిదే సింహభాగమా ? తెలికివేపురు అర్థబలంతో పాటు సైనిక బలాన్ని కూడా సమకూర్చే వారా? కేవలం శాసన భాషకే అంటిపెట్టుకుని సంతృప్తిపడిపోకుండా ప్రతిదాన్ని ప్రశ్నిస్తూ, సమాధానాలు కనుగొంటూ, చరిత్ర రచనను ఓపెన్ ఎండెడ్‌గా సాగించాలి. ప్రశ్నలు వేయకుంటే చరిత్ర క్లోజ్డ్ ఎండెడ్‌గా, మృతప్రాయంగా మిగిలిపోతుంది.

చివరగా, ఇంతవరకు చెప్పుకున్నది జింగోయిస్టిక్‌గా, అంటే తెలుగుజాతి దురభిమానంగా ధ్వనించవచ్చు. కాని, జాతి ఐక్యతను పెంపొందించడానికి ఒక్కొక్కప్పుడు జాతీయ దురభిమానమే మంచి మందులా పనిచేస్తుందని తమిళ సోదరుల నుంచి మనం నేర్చు కోవచ్చు.

మూలం : శ్రీ ఐరావతం మహదేవన్
అనువాదం : డా. జె. వి. సత్యవాణి

# హరప్ప నాగరికత - ఆంధ్రుల వారసత్వం : కొత్తకోణం

**1. ముందుమాట :**

1.1 ఉత్తర, మధ్య ద్రావిడ ఉపశాఖలకు చెందిన ప్రజలు చాలా వరకు, హరప్ప నాగరికతానంతర కాలంలో, అప్పుడప్పుడే ప్రాధాన్యతను సంతరించుకుంటున్న ఇండో-ఆర్యన్ భాషల్ని వ్యవహరించటం మొదలుపెట్టారు. మిగిలిన భాషా సంబంధీకులంతా, అంటే మధ్య-ఉత్తర, దక్షిణోత్తర శాఖలకు చెందినవారు, తెలుగువారు మినహా, సాహిత్యం లేని లేదా మౌఖిక భాషావేత్తలే ! ఇవి మాట్లాడే తెగలవారు ఆటవికులో, సుసంస్కృతిని సంతరించుకోనివారో ! అందువల్ల, ఈ భాషలేవీ నగర నాగరికతనూ, సుసంస్కృతమైన సంస్కృతి గల హరప్పా నాగరికతను సూచించే పదాల్ని నిలిపి ఉంచుకునే అవకాశం లేదు. తొలినాళ్ళల్లో ఆంధ్రులరాజ్యం ఇప్పటి ఆంధ్ర ప్రదేశ్ కన్నా పశ్చిమోత్తరాలకు ఎక్కువగా వ్యాపించి ఉండేది. దైమాబాద్ హరప్ప నాగరికతకు సంబంధించిన దక్షిణ కొనలోని ప్రాంతంగా గుర్తింపబడింది. అది అప్పటి ఆంధ్రదేశంలోనో, ఎల్లల్లోనో, గోదావరీ నదీప్రవాహం ప్రాంతంలోనో, పశ్చిమ దక్కనులోనో ఉండి ఉండాలి.

1.2. తెలుగు, మధ్య, ఉత్తర శాఖల్లోని భాషలతో, భాషా విషయకంగా సన్నిహితసంబంధాలు కలిగి ఉన్నా, సాహిత్య విషయంలో దాక్షిణాత్యభాషలతో ఎక్కువ సంబంధం కలిగి ఉంది. అందువల్ల తెలుగుభాష, అతి ప్రాచీన కాలంనుంచి దక్షిణ, ఉత్తర ద్రావిడ సంస్కృతులవల్ల మధ్య వారధిగా నిలిచింది. ఆంధ్రుల ప్రసక్తి తొలిసారిగ ఐతరేయ బ్రాహ్మణంలో కన్పిస్తోంది. (ఐతరేయ బ్రాహ్మణం 7.18 ; క్రీ.పూ. సుమారు 1000సం॥).ఐతరేయబ్రాహ్మణం, ఆంధ్రులు వైదికమతస్థుల జనావాసాలకు వెలుపల ఉండేవారని అంటుంది. అశోకుడి శిలాశాసనం (13. క్రీ.పూ. 3వ శతాబ్ది నాటి) ఆంధ్రదేశం అశోకుడి సామ్రాజ్యంలోని భాగంగా గుర్తిస్తుంది.

1.3. శాతవాహనుల పాలనా కాలంలోనే ఆంధ్రదేశం సాంస్కృతికంగా ముందంజ వేసింది. (సుమారు క్రీ.పూ. 3 శ॥ - క్రీ.శ. 3 శ॥ దాకా). కొన్ని విషయాల్లో ఈ సంస్కృతి సింధూ నాగరికతను పోలి ఉంది. వాటిలో కొన్ని :

నదీ ప్రాంతాల్లో స్థిరపడి, వ్యవసాయరంగంలో కృషిచేస్తూ, ఆవాసాలేర్పరుచుకున్న అధికసంఖ్యాక ప్రజలు

**ప్రజలు చాకచక్యం, నేర్పు ఉన్నవారు**
**మంచి భవనాలున్న పెద్ద పెద్ద భవనాలు**
**ఉన్నతస్థాయి దేశ, విదేశీ వాణిజ్యం**
**లిపి, రాత గురించి విజ్ఞానం**

ఈ కారణాల వల్ల సింధూ నాగరికతలోని తొలికాలపు ద్రావిడ సంస్కృతి మూలాలను, తెలుగు సంస్కృతి, పూర్వ తెలుగు భాషల్లో వెతకాల్సిన అవసరం ఏర్పడింది.

1.4. ఇటువంటి ప్రత్యేకతలున్నా, ప్రాచీన తెలుగు [illegible]చీన తమిళంతో పోలిస్తే కొంత వెనుకబడిపోతోంది ; ఇందు[illegible]ం తమిళంలో తెలుగు కన్నా కొన్ని శతాబ్దాల ముందు లిఖిత [illegible]ించటమే! తెలుగులోని తొలి శాసనం క్రీ.శ. 6 శ॥ నాటిక, [illegible]చన 11శ॥నికి చెందినవి. తమిళ బ్రాహ్మీ లిపిలో క్రీ.పూ. 2 శ॥ నుంచీ శాసనాలు, క్రీ.శ. 1 శ॥ నుంచి విస్తారమైన 'సంగ' సాహిత్య సంపద ఉంది. ఇటువంటి లిఖితాధారాలున్నది ద్రావిడ భాషల్లో తమిళానికే ! ఇంతేకాకుండా, సంగసాహిత్యంలో కన్పించే కొన్ని అక్షర చిత్రాలను జాగ్రత్తగా పరిశీలిస్తే, పొగ చూరినట్లు కన్పించే ప్రాచీన ద్రావిడుల చరిత్రలోని కొన్ని సంఘటనలు బయటపడవచ్చు. (ఉదా : 'వేళిర్'లు అగస్త్యుడి నాయకత్వంలో ద్వారకనుండి దక్షిణానికి వలస వెళ్ళటం - పుట - 201)

1.5. ప్రాచీన కాలపు తెలుగు - తమిళ భాషల మధ్యనున్న ఈ ముఖ్య భేదానికి కారణం రాజకీయమైంది. చారిత్రకంగా తమిళదేశం తొలినాళ్ళలోనే స్వాతంత్ర్యంగా ఉండటంవల్ల, వాళ్ళ మాతృభాషనే దేశభాషగా, రాజభాషగా పాలన సంబంధిత వ్యవహారల్లోనూ,

రోజువారీ పనుల్లోనూ కూడా వాడుకునే అవకాశం లభించింది. ఆంధ్ర-కర్ణాటకాలు తొలినాళ్ళలో మౌర్యుల పరిపాలనలో ఉండటంవల్ల, వాళ్ళ వాడుక భాషైన ప్రాకృతమే ఈ ప్రదేశాల్లోనూ పాలనాభాషగా ఉండేది. మౌర్యులకు తొలినాళ్ళలో సామంతులుగా ఉన్న శాతవాహనులూ, వాళ్ళ తర్వాత ఆంధ్రదేశాన్ని పాలించిన ఇక్ష్వాకులూ, పల్లవులూ మొదలైన ఏలికలందరూ, క్రీ.శ. 5వ శతాబ్దం దాకా ప్రాకృతాన్నే, రాజభాషగా వాడుకున్నారు.

## 2. ద్విభాషా ప్రాంతాల్లో సమాంతరత :

2.1. హరప్పా నాగరికత మూలాలను ఉత్తర-మధ్య భారతదేశంలో మాట్లాడబడుతున్న ఇండో-ఆర్యన్ భాషలనుంచి ఎలా వెలికితీయాలన్న ప్రశ్నను డా. ఐరావతం మహాదేవన్‌గారు పదేపదే వేస్తూనే ఉన్నారు. ఆ భాష, తొలి చారిత్రక యుగంలో ఆంధ్ర - కర్ణాటక ప్రదేశాల్లో పాలనా మాధ్యమంగా ఉండేది. ఈ ప్రశ్నకు సమాధానం వెతికే దిశలో డా. మహాదేవన్‌గారు కొన్ని ద్విభాషా ప్రాంతాల్లో సమాంతర భాషా సూత్రాల్ని ప్రతిపాదిస్తున్నారు.

- సింధూ శాసనాల్లో ఎక్కువగా పేర్లూ, బిరుదులూ కన్పిస్తున్నాయి.
- కొన్ని ముఖ్యమైన పేర్లూ, బిరుదులూ హరప్ప నాగరికత కాలంలో ఇండో-ఆర్యన్ భాషల్లో ఎరువు తెచ్చుకోడ్డాయి. కొన్నిసార్లు అవి అనువాదం కూడా చేయబడ్డాయి. (అంటే ఎరువు తెచ్చుకున్న పదాలు ఆ భాషాతీరుకనుగుణంగా మార్చబడ్డాయి).
- సింధూ చిత్రలిపిలోని ధ్వనులను, ద్విభాషా సమాంతరతను ఉపయోగించుకొని, ఆ చిత్ర లిపికి తగిన అర్థాన్ని గుర్తించడానికి (ధ్వనిని గుర్తించలేకపోయినా) గుర్తించడానికి ప్రయత్నించవచ్చు.

2.2. ఆంధ్ర సంస్కృతిలోని ఉదాహరణాలతో, వారు ప్రతిపాదించిన విధానాన్ని రచయిత ఇలా వివరిస్తున్నారు.

ఏదెలా ఉన్నా, ఈ విధానాన్ని ఇతర ప్రాంతాలకు కూడా వాడుకుని (అక్కడ మాట్లాడుతున్న భాషల ఆధారంగా) అవి ద్రావిడ భాషలైనా, ఇండో-ఆర్యన్ భాషలైనా సరే పదాల్ని, వాటి అర్థాల్ని గుర్తించడానికి ప్రయత్నించవచ్చంటున్నారు. కారణం, ఆ భాషా వ్యవహర్తలందరూ సింధూ నాగరికతలో భాగమే !

## 3. అంబు గుర్తు : నామవాచక విభక్తి

3.1. సింధూ చిత్రలిపిలోని ఈ గుర్తును 'అంబు' అని చాలా సులభంగా గుర్తించవచ్చు. ఈ గుర్తు నామవాచక ప్రత్యయంగా పేర్లూ, బిరుదుల చివరే అగుపిస్తుంది. ద్రావిడ భాషల్లోని నామవాచకాల్లో ప్రాతిపదిక + లింగ, వచన విభక్తులు వస్తాయి.

3.2. ద్రావిడ భాషల్లో 'బాణం' అనే అర్థాన్నిచ్చే పదం - 'అంపు' (త, మ) లేదా 'అంబు' (తె; కం) (DEDR - 178)

-(అ)ంపు (అ)ంబు ద్రావిడ అమహద్వాచక ఏకవచన విభక్తి ప్రత్యయాల్లో ఒకటి.

ప్రాచీన తెలుగు : (అ)ంబు , -(అ)బు, -(అ)ము

ప్రాచీన కన్నడం : -(అ)మ్, -(అ)ము, -(అ)వు

తమిళం : -(అ)మ్

**ఉదా :** నాగబు - అమరావతీస్థూపంలో చెక్కబడ్డ పేరు (క్రీ.పూ. 2 శ॥ నాటిది)

సంవత్సరంబుళ్ - క్రీ.శ. 6 శ॥ చిక్కుళ్ళశాసనం

కటుంతీరంబు : వేగమైన తీరు కలిగిన (క్రీ.శ. 600సం॥ చెందిన మహేంద్ర పల్లవుని శాసనం)

3.3. రెబస్ విధానాన్ననుసరించి, అంబు గుర్తును ద్రావిడ భాషల్లోని అమహదేకవచన ప్రత్యయంగా విశ్లేషించి చూపవచ్చు. -(అ)ంపు

4. కూజా గుర్తు / కుండ గుర్తు : ( )

ఈ కూజా / కుండ గుర్తు సింధూలిపిలో అతి విరివిగా అగుపిస్తుంది. ఈ గుర్తు చెవులూ, నోరూ ఉన్న ఒక పాత్రను సూచిస్తుంది. ఇది సాధారణంగా పదాంతంలోనే వస్తుంది. ఇది పేర్లూ, నామవాచకాల చివర నామవాచక ప్రత్యయంగా వాడబడింది. ఈ కుండగుర్తూ, అంబు గుర్తూ ప్రయోగ విధానంలో ఒకేలాంటివి, అయితే రెండూ వేర్వేరు అర్థాల్ని బోధిస్తాయి. అంబు గుర్తు అమహాదేకవచన - (అ)ంబు అయితే, దాని కవలలా దాంతో పాటూ లేదా దానికన్నా ఎక్కువగా కన్పిస్తున్న ఈ కుండ గుర్తు మహాదేక వచన ప్రత్యయంగా గుర్తింపబడింది.

-(అ)న్టు / (అ) న్తు

ప్రాచీన తెలుగు : -(అ) న్టు > ఉ

ప్రాచీన తమిళం : -(అ) న్త్ > -(అ) న్

4.2. కుండ గుర్తును కూడా రెబస్ విధానంలో ధ్వని శాస్త్రపరంగా ప్రత్యేక 'ధ్వని'గా గుర్తించవచ్చు.

**కూజా/కుండగుర్తు :** (చిత్రలిపి) గొళ్ళాలు గల బాన లాంటిది. కన్నడం : అండిగె ; తెలుగు : అండెము, అండియము, అడిగము (DEDR 127)

కొ : అండి - పాలకుండ ; తా : అడేయ్ - బంకమట్టికుండ

క : అండె - పిడి ఉండే వెదురు పాత్ర

తు : అండె - వెదురు లేదా కొబ్బరికాయవంటి కాయల గట్టి చిప్పల్తో తయారుచేసే పాత్ర (DEDR 130)

త : అంతై - (నైఘంటుకార్థం) నితై (కొలత)

మూలద్రావిడం : -(అ)న్ట్ / -(అ) న్త్

రెబస్ (చిత్రలిపిని ధ్వనులుగా మార్చే) విధానం ప్రకారం ఈ గుర్తును ధ్వనిగా మారిస్తే అది మహాదేక వచన ప్రత్యయమవుతుంది. మూలద్రావిడంలో -(అ)న్ట్ / -(అ)న్త్ రెండూ మాండలిక భేదాలుగా అన్పిస్తాయి.

### 5. సింధూ శాసనాలూ - ప్రాచీన తెలుగు లింగం :

సింధూశాసనాల్లో కన్పించేవి రెండే ఏకవచన ప్రత్యయాలు. వీటిని జాగ్రత్తగా పరిశీలిస్తే, అవి ప్రాచీన తెలుగుకు సంబంధించినవని తెలుస్తుంది. మూల ద్రావిడ భాషా లక్షణాల్లో తెలుగు నిలుపుకున్న వాటిల్లో ముఖ్యమైంది, లింగ విధానం. ఏకవచనంలో మహాద్వాచకం, మహాద్వాచకేతరం అని రెండే భాగాలు అగుపిస్తాయి.

| లింగం | ఏకవచనం | బహువచనం |
|---|---|---|
| మహత్ | మహాద్వాచకం | మహత్ + మహతీ |
| అమహత్ | మహతీ,తిర్యగ్జడాలు | అచలాలు తిర్యగ్జడాలు + అచలాలు |

### 6. సింధూలిపిలో లింగ ప్రత్యయాలు :

( ) మహద్వాచక ఏకవచనం -(అ)న్ట్ / (అ)న్త్

( ) మహద్వాచకేతర ఏకవచనం - (అ)ంపు / ంబు

|| గౌరవబహువచనం -అర్ / -ఇర్

|| (ఈ గౌ.బ. చిత్రలిపిలోని కొన్ని గుర్తులతోటే ప్రయోగింపబడుతోంది)

### 7. ప్రాచీన తెలుగు శాసనాలు - న్టు - ంబు

అంక్కపాసున్టు - అంక్కపాసుంబు

ఇవి సుమారు క్రీ.శ. 6 శతాబ్దానికి చెందిన మహేంద్ర పల్లవుని గుహాలయశాసనాల్లో అగుపిస్తున్నాయి. ఈ పదాలకు పోరులో అల్లె తాడు వాడేవాడు లేదా బిగించేవాడని అర్థం.

పైనున్న రెండు పదాంతాలను జాగ్రత్తగా పరిశీలిస్తే, ఒకే పదం రెండు ప్రత్యయాలతోనూ కన్పిస్తోంది.

### 8. ఆంధ్రశబ్ద పుట్టుక :

వేదకాలంలో, ఆర్యేతరులు, ఇండో-ఆర్యన్ భాషలు మాట్లాడే, ఆర్యజన పదాలకు వెలుపల నివసించేవారనీ, వాళ్ళల్లో 'ఆంధ్రులు' ఒకరనీ ఐతరేయ బ్రాహ్మణం పేర్కొంటుంది. దాబాపు ప్రతి మహద్వాచక నామం - (అ)న్టు తో పూర్తవడం గమనించదగ్గది. ఈ మహద్వాచక ప్రత్యయం చుట్టుప్రక్కల జీవిస్తున్న ఇండో-ఆర్యన్ భాషస్థులను ఆకట్టుకుంది. తమ పక్కనే నివసిస్తున్న ద్రావిడుల్ని పిలవడానికి వారు ఆ ప్రత్యయాన్ని నామవాచకంగా మార్చుకున్నారు.

అదే ద్రావిడ -(అ)న్టు > అన్త > అంద్ర > ఆంధ్రగా వాడుకలోకి వచ్చింది.

### 9. హరప్ప నాగరికతలోనూ ప్రాచీన ఆంధ్రసంఘంలోను అగుపించే అధికారవర్గ స్థాయీ భేదాలు :

ఈ కుండగుర్తు నామవాచక ప్రత్యయంగా పదాంతాల్లో కన్పిస్తోందని తెలుసుకున్నాం. ఈ గుర్తు మరో రెండు గుర్తులతో పాటుగా విరివిగా ప్రయోగింపబడింది. ఆ రెండింటినీ బట్టి చూస్తే, మూడు అధికార వర్గస్థాయీ భేదాలను, అవి సూచిస్తున్నాయని తెలుస్తుంది. ఆసక్తికరమైన విషయం ఏంటంటే, ఈ అధికార వర్గస్థాయీ భేదాలు, హరప్పకు చెందిన పరిపాలనా వ్యవస్థలోను, ప్రాచీనాంధ్ర సమాజంలోను కూడా అగుపిస్తున్నాయి.

( ) కుండ ద్రావిడ -

**వివరణ :** -. అణ్ క. అణకు - తగ్గించు, అణచు ; తె. అణంగు 'లోబడి ఉండు' (DEDR 112)

2. కుటి (డి) > జాతి - కుటుంబం లేదా వంశం అని అర్థం (DEDR 1655)

(ఈ నాటికీ తమిళంలో 'కుడిమగన్' ఒక ప్రదేశవాసి, habitat అనే అర్థంలో ఉంది)

### 10. ఆంధ్ర రాజవంశం - 'సాత'కు కుండ గుర్తే ఆది

సింధూలిపి హరప్పానంతర కాలంలో రచనారీతి మార్గం ఏర్పడినపుడు, ఈ కుండ గుర్తు మతాధికారుల్నీ, రాజవంశాల్ని గుర్తించే చిహ్నాలతో కలిపి ఎక్కువగా వాడుకలోకి వచ్చింది. వేదవిహితకర్మల్లో వాడబడే ఒక బలినిదే పాత్రకు 'సత' అనిపేరు. (VS. SB) ప్రాకృతంలో 'సత' అంటే బలికోసం ఏర్పాటుచేసిన భోజనపదార్థాలు లేదా ఆ భోజనపదార్థాలను ఉంచే పాత్ర అని అర్థం. కన్హేరిలోని, శాతవాహనుల కాలానికిచెందిన బౌద్ధ గుహాలయ శాసనాల్లో ఉన్న (గుహాలయ శాసనాలు 985, 986) 'సత', 'పానియక' శబ్దాలు జంటపదాలుగా 'భోజన', 'పానీయాల'ను సూచిస్తున్నాయి. (JeSI 1979 : 46-49) మార్పులు, చేర్పులతోడి కొత్త (పతి) దీన్ని తె. సాదము ; త. చాతం (అన్నం) లతో పోల్చవచ్చు. 'సత' భోజనాన్ని ఉంచే పాత్ర అనే అర్థం నుంచి బలిభోజనం అన్న అర్థాన్ని పొందింది. ఆంధ్రుల తొలి రాజవంశంగా అన్పిస్తున్న 'సాత' వాహనుల పేరును ఈ వెలుగులో పరిశీలిస్తే కొత్తకోణం అగుపిస్తుంది.

### 11. హరప్పా నాగరికతలో ఆంధ్రరాజ వంశ బీజాలు :

| | | | |
|---|---|---|---|
|  | కుండ (గొళ్ళాలతో) | సత-కర్ణ సాత-కర్ణి | బలిపాత్ర చెవులు (గొళ్ళాలు) ఆంధ్రరాజవంశం పేరు |
|  | అంబు | శల్య | అంబు (బాణం),. ఈటె |
|  | మోసేవాడు | వహన | మోస్తున్నవాడు, వహిస్తున్నాడు |
|  | కుండ మోసేవాడు | సత+వహన సాతవాహన | కుండ మోసేవాడు > భోజనం మోసేవాడు > ఆంధ్రరాజవంశం పేరు |
|  | అంబు మోసేవాడు సాలివాహన | శల్య - వహన సాలివాహన | అంబు మోసేవాడు > ఆయుధం ధరించినవాడు > ఆంధ్రరాజవంశం పేరు |

### 12. ఆంధ్రుల పరం పరానుగత హరప్ప సంస్కృతి : సూక్ష్మ వివరణ

సింధూ నాగరికత నాటి సింధూలిపిలో దాదాపు 9 పేర్లు, లేదా బిరుదులు ఆంధ్రుల చరిత్రకు సంబంధించినవిగా గుర్తింప బడ్డాయి.

ఆ పదాలను ఈక్రిందివిధంగా చూపవచ్చు.

అ. ద్రావిడ వ్యాకరణాంశాలు :

-(అ)న్ట్ ; -(అ)ంపు, -అర్ / -ఇర్

ఆ. ద్రావిడ భాషలనుండి ఇండో-ఆర్యన్ భాషలకు వెళ్ళిన పదాలు:

-(అ)న్ట్     > అన్త     > అంధ్ర

2. ఎరువు పదాల సంస్కృతీకరణ లేదా అనువాద సంస్కృతీకరణ

ఆంధ్రభృత్య -     ఆంధ్రజాతి

ఈ. ద్రావిడ భాషనుంచి ఇండో-ఆర్యన్ భాషలకు వెళ్ళిన పదాల అనువాదం :

సాతకర్ణి, సాతవాహన, సాలివాహన

### 13. హరప్పా నాగరికత మౌల్యాలూ భారత చారిత్రిక పరంపర :

సింధూ నాగరికత మూలాలను ఆ తర్వాతి కాలంలో అటు ద్రావిడులూ, ఇటు ఇండో-ఆర్యన్‌లు కూడా నిలుపుకున్నారని తన పరిశోధన ఫలితంగా, డా. మహదేవన్‌గారు పేర్కొంటున్నారు. ద్రావిడులు భాషాశాస్త్రపరమైన మూలాలను పదాల రూపంలో, కొద్ది మార్పులతో నిలుపుకున్నారు. ఇండో-ఆర్యన్ విషయంలో వాళ్ళు సంస్కృతి మూలాల్ని పదానువాదాల రూపంలోనూ, సామ్యపదాల రూపంలోనూ, కొన్నిచోట్ల అర్థంలో మార్పుతోనూ నిలుపుకున్నారు. ఈక్రింది పటం సింధూ లిపిలోని 'మోసేవాడు' అనే అర్థాన్నిచ్చే గుర్తు మార్పులకు లోనైన విధానాన్ని వివరిస్తోంది. ఇందులోని మరో ఆసక్తికరమైన విషయం ఏంటంటే, మనదేశం పేరు 'భారత్' కూడా సింధూచిత్రలిపిలోని ఈ కుండ గుర్తునుంచి ఏర్పడ్డదే !

| | | | | |
|---|---|---|---|---|
| **హరప్పా నాగరికత** | : | మోసేవాడు | కుండ మోసేవాడు (భోజనం) | అంబు-మోసేవాడు (ఆయుధాలు) |
| **వైదిక నాగరికత** | : | భరత | భారద్వాజ | భరన్త |
| **పౌరాణికాంధ్రం** | : | వహన | సాతవాహన | సాలివాహన |
| **ప్రాచీనతమిళం** | : | ఇరుం పొత్తై | (సా) తన్‌పొత్తైయాన్ | |
| (సంగకాలం) | | పొత్తైయన్ | కురుక్షేత్రంలో భోజన సదుపాయం చేసినవాడు) | |
| **మతాచారాదులు** | : | కావడి (తెలుగు, తమిళం) ; | కావడియా (హిందీ) | |

వివరణ :

1. 'భరత' 'భృ' అనే ధాతువునుంచీ వచ్చిన పదం ; 'వహ్' అనే ధాతువు దేన్నైనా మోయటం అనే అర్థాన్నిస్తుంది.
2. 'వాజ' అంటే అన్నం. బలికోసం లేదా యజ్ఞయాగాదుల్లో సమర్పించే అన్నం.
3. 'భరన్త' అంటే ఆయుధాల్ని ధరించేవాడు (సాయన)
4. ఇరు(ం) పొఱై, ఒక చేర రాజు. ఈ పేరును 'ఇరు-పొఱై' జంట బరువుగా చెప్పవచ్చు. సులభంగా చెప్పాలంటే ఈ పేరుకు కావడిగల వాడని అర్థం.
5. ఈ 'ఇరుపొఱై' అనే చేర రాజు కురుక్షేత్ర యుద్ధకాలంలో ఇరు పక్షాలవారికీ భోజనం అందించేవాడని పుఱనానూఱు (2) చెప్తుంది. ఇది సింధూలిపిలోని అన్నంకుండల కావడి గుర్తు నుంచి తీసుకోబడ్డదే అనటంలో అనుమానం అక్కర్లేదు. (అన్నం - కావళ్ళు అన్న పదం తెలుగులో వ్యవహారంలోంచి తప్పుకున్నా తెలుగు భాషలో మాత్రమే ఈ ప్రయోగం ఉండేదనవచ్చు. తమిళ - భాషలో అన్నం కావడి వాడుకలో ఉన్నట్టు కనపడదు. ఇవి ఒక సాంస్కృతికాంశంగా గుర్తించవచ్చు. దక్షిణ భారతంలో వరి సమృద్ధి ఆంధ్రదేశంలోనే ఎక్కువ కావడం కూడా అన్నం - కావళ్ళ వాడుకకు కారణం అయి ఉండవచ్చు).
6. ఉత్తర, దక్షిణ భారతాల్లో బాగా ప్రచారంలో ఉన్న మత సంబంధిత మైన, మొక్కులు తీర్చుకునేటప్పుడు సమర్పించే వాటిని కావడిలో మోసుకెళ్లటం అన్నది ఈ ఆధారాల్ని బట్టి చూస్తే, హరప్పా నాగరికత నుంచీ వచ్చినదేననిపిస్తోంది. (Indus Script A Dravidian model - Dr. Iravatam Mahadevan గారి పుస్తకాన్ని సంప్రదించండి)

"కన్యాగతే గురౌ యద్యత్సప్తకోట్యఘునాశం
స్నానమాత్రేణ సర్వేషాం తావత్పుణ్య వివర్ధనం
భూతలే యానితీర్థాని తాని కన్యాగతే గురౌ
ఆయాంతి కృష్ణవేణీంతు మహాపుణ్య ఫలాయ చ
బ్రహ్మా విష్ణు రుద్రశ్చ ఇంద్రాద్యా స్సర్వ దేవతాః
పితరో ఋషయశ్చై వత్రైవ నివసంతి హి
కృష్ణాయాః పుష్కరే కృత్వాస్నానం దానం చ పైతృకం
గంగాయాః కోటిగుణితం ఫలమాప్నోతి మానవః
యస్యాం తిథౌ గురుర్యాతి కన్యయా చ సమాగమం
కృష్ణాయాంతు తదా స్నానం ప్రయత్నేన సమాచరేత్"

చిరునామా : *డా॥ సత్యవాణి, అసోసియేటు ప్రొఫెసరు, డిపార్ట్‌మెంట్ ఆఫ్ లాంగ్వేజి టీచింగ్ టెక్నాలజీ, ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పం - 517425. Cell No. 9441134856.బి*

డా॥ వీరగంధం జయప్రద

# రాష్ట్ర కూట దేవాలయములు - భవనాసి సంగం

(కర్నూలు జిల్లా)

భవనాసి. కృష్ణానదుల సంగమ ప్రదేశములో భవనాసి సంగం కలదు. ఈ ప్రదేశమునందు అద్భుత కళా సంపదతో కూడియున్న దేవాలయములు రాష్ట్రకూటులచే నిర్మించబడినవి. వీనిలో రూపాల సంగమేశ్వరాలయము, భుజంగేశ్వరాలయము మరియు సంగమేశ్వరా లయములు ప్రసిద్ధమైనవి.

**రూపాల సంగమేశ్వరాలయము :**

ఆలయ నిర్మాణము, ముఖ మండపము, పోర్చి మహా మండ పము, అంతరాళము, గర్భగృహములతో పదబంధ అధిష్టానముకలిగి యున్నది. పదబంధ పద్ధతినందు ఉపానము, జగతి, కంప, అంత రిత, కాంత మరియు కపోతములు కలవు. మహామండపము గోడలకు మధ్య భాగమున ముందుకు చూపబడిన భద్రగవాక్షములు పై సింహ ములు భారవాహకులు, గణములు,భద్రగవాక్షములు క్రింది భాగమున చూడవచ్చును.

పోర్చి యొక్క ఉపపీఠము చిన్న చిన్న స్తంభములుగా చెక్కబడినది. గర్భగృహము యొక్క వెలుపలి గోడలకు భద్ర అప్ సెట్, చివరలో కర్ణము, మధ్యలో రీసీస్‌తో నిర్మాణము జరిగినది. గోడ భాగమునందు చిన్న స్తంభములు ఉండి క్రింది భాగమున కుంభము మకర తోరణము అలంకారము కలదు. కొన్ని భాగములందు కుంభము ఆక్టోగన్‌ల్‌గా కూడా కనిపించును. అటువంటి ప్రదేశములందు భద్ర గవాక్షములు చిత్రఖండ స్తంభములు గలిగి, జాల వాతాయనములతో మకర తోరణ అలంకారములతో చూడవచ్చును.

అంతరాళము నందలి నిషికు ఇరువైపుల మకరములు తలలు పైకి ఉన్నట్లుగా, తెరచిన వాని నోటినుండి లతా తోరణములు వచ్చు చున్నట్లుగా చూపబడెను. తోరణము యొక్క చివర పద్మము ఆకార ములో ఉన్న పోటికలు జారుచున్నట్లు కలవు. తూర్పు వైపు గోడకు గల కిటికి చిత్ర తోరణ అలంకరణతో కలదు. లింటల్ మధ్యభాగమున స్త్రీ వింజామరతో ద్విపద్మపీఠంపై కూర్చొని యున్నట్లు, ఆమెకు మరొక వైపు నుండి లతలు, పద్మములు కాడలతో గణ విగ్రహముపై నుండి జారుచున్నట్లు చూపబడినది. శాంక్టము గోడకు మధ్యలో రెండు మకర ములు నోరు తెరచి కన్పించును. గోడపై గర్భగృహము గోడలపై కోష్టపంజరములు చెక్కబడినవి. తూర్పు వైపు గంగా, యమున, దక్షిణ మున, శివ, శివనటరాజ, మన్మధ, శివ త్రిపురాంతకమూర్తి, పడమర భాగము నందు హరిహర మరియు ఉత్తరమున నటరాజ విగ్రహములు అత్యంత అద్భుతమైన దేవ ప్రతిమలక్షణములతో కనిపించును. గోడకు పైభాగమునందు హంసమాల కలదు. శిఖరము రెండు తలములు కల్గి ప్రతి తలమునందు కూట,శాల,పంజరములు కలవు. చిన్న దేవతా విగ్రహములు, భారపుత్రులు పరిచార దేవతలు అభకసు నందు కలరు. శిఖరము పై భాగము నాలుగు పలుకలుగా ఉండి స్తూపితో ఉన్నది.

దేవాలయమునకు ముందు భాగమున పోర్చి చిత్ర ఖండ స్తంభ ములతో ఉత్తరము, దక్షిణము వైపుల నుండి పైకి మెట్లు కలవు. పోర్చి పైకప్పు లోపలిభాగమునందు నటరాజు, అష్టదిక్పాలకులు కన్పిం చును. మహామండపమునందు నాలుగు చిత్ర ఖండస్తంభములు,షాప్టు, క్యూబు భాగముల కీర్తి ముఖము, లతాపత్ర అలంకరణ, పైన కప్పు లోపలి భాగమునందు పద్మకళము, ఉమామహేశ్వరులు, అష్ట దిక్పాలురు కలరు.

అంతరాళము రెండు స్తంభములతో ముఖ మండపము కన్న కొంచెము ఎత్తులో నిర్మించబడినది. గర్భగృహము యొక్క ద్వార బంధము, మూడు పట్టీలలో పద్మము, పత్రము, లతలతో స్తంభము కలిగి, గంగా, యమున పట్టీల దిగువ భాగమున, గర్భగృహము మధ్యభాగమున లింగపీఠము కలదు.

**భుజంగేశ్వరాలయము :**

రూపాల సంగమేశ్వరాలయమునకు పశ్చిమమున ముఖ మండపము, అంతరాళము, గర్భగృహము గలిగిన చిన్న ఆలయము, వాస్తు శిల్ప రీత్యా సంగమేశ్వరాలయమును పోలియుండును. అంతరాళము, గర్భగృహము ఉన్నవి కాని ముఖ మండపము కనిపించదు. టోరస్ విధానము గలచెక్కడము గోడల మధ్య భాగమున మరియు చివర భాగములో కొంచెము ముందుకు రాబడిన భాగములలో కనిపించుట ముఖ్య లక్షణము. భద్ర భాగము నందు దేవకోష్టములు, కర్ణభాగము లందు లోపలికి పెట్టబడిన నిషిలు కలవు. తదుపరి దిక్పాలుల ప్రతిమలు చెక్కబడినవి. నిషిలందు ఎలాంటి ప్రతిమలు లేవు. దేవకోష్ట ముల పైభాగమున మకరతోరణ అలంకారము, రూపాల సంగమేశ్వ రాలయమును పోలియుండును. నిషి పై భాగమున గణప్రతిమలతో కూడిన సింహ వ్యాళ తోరణము కనిపించును. శిఖరము ఒక తల ముతో పొడవైన అందమైన స్థూపితో కలదు.

అంతరాళము నందు చిత్ర ఖండ స్తంభములు రెండు కలవు. ద్వారబంధము మూడు పట్టీలు కలిగి లతాపత్రపుష్పములతో స్తంభము, పద్మదళములతో అలంకరించబడినది. ద్వారము పై భాగము వ్యాళ, కపోత చెక్కడము, గర్భగృహము లోపలి భాగమున లింగ పీఠము కలదు. వెనుక వైపు గోడకు మహేశ్వర ప్రతిమ కలదు.

**సంగమేశ్వరాలయము :**

ఈ ఆలయము గర్భగృహము, అంతరాళము, ముఖ మండపము కలిగియున్నది. అధిష్ఠానము మంచబంధా విధానములతో ఉపాన, జగతి, పట్టిక చెక్కడము కలిగి కపోతభాగము సాదాగా ఉన్నది.

శిఖరము ఫాంసనా (Stepped Pyramidal) విధానములతో ఏడు అంతస్తులుగా నిర్మించబడింది. శిఖరము నందు సాదా పలకములు గలవు. గర్భగృహము ద్వార బంధము నాలుగు పట్టీలతో లలాటమున గజలక్ష్మితో ఉన్నది.

ముఖ మండపమునకు మూడువైపుల ద్వారములు కలిగి మూడవ ద్వారము మూసి వేయబడినది. అంతరాళము ద్వారము రెండు వైపుల కిటికీలు కలవు. గోడ భాగము తరువాత కాలములోని నిర్మాణము జరిగినట్లు తెలియుచున్నది. ముఖమండపము లోపల చిత్రఖండ స్తంభములు, కప్పు పైభాగమున పద్మదళము కలదు.

ప్రధాన దేవాలయమునకు ఉత్తరము, తూర్పు, దక్షిణ భాగము లందు పరివార ఆలయములు ఉన్నవి. ఉత్తర భాగమున గల ఆలయ మునకు శిఖరము లేదు. ద్వారబంధము నాలుగు పట్టీలు కలిగి యుండి లతాపత్ర పుష్పములు, క్రింది భాగమున ద్వార పాలకులు గంగా, యమున కనిపించును. తూర్పు వైపు ఆలయము ద్వార బంధము మూడు పట్టీలతో గంగా,యమున కలరు. దక్షిణము వైపు ఆలయము ఫాంసన పద్ధతిలో కట్టబడియున్నది. అధిష్ఠానము, ఉపాన, జగతి, ప్రీతి భాగములతో మంచబంధ విధానమునకు చెంది గోడ భాగము సాదాగా యున్నది.

బాదామి చాళుక్య రాజ్యపతనము తరువాత 8వ శతాబ్దము మధ్య భాగమున కృష్ణ, భవనాసి సంగం ప్రాంతం రాష్ట్ర కూటులు అధిష్టించినట్లు ఎల్లోరాలోని దంతి దుర్గని శాసనము ప్రకారము కర్నూలు సీమను శ్రీశైల దేశముగా పేర్కొనినట్లు తెలియుచున్నది. ధారావర్ష ధృవ క్రీ.శ.781వ సంవత్సర శాసనము అతని జనరల్ బలవర్మరాస అలంపురం ద్వారము నిర్మాణము చేసినట్లు, ఆ సమయ మున ఆ ప్రాంతము రాష్ట్ర కూటుల ఏలుబడిలో ఉన్నట్లు చెప్పుచున్నది.

భవనాసి సంగం నందలి దేవాలయములు శిఖరములతో నిర్మా ణము జరిగియున్నది. రూపాల సంగమేశ్వరాలయము, అలం పురం నందలి నగరి పద్ధతిలో నిర్మాణము జరిగిన దేవా లయములను పోలియుండును. మండపమునందు భద్రగవాక్షముల నిర్మాణము ఎల్లోరా లోని కైలాసనాథ దేవాలయము పద్ధతిలో కలదు. మకర తోరణములు, పట్టడకల్‌లోని విరూపాక్ష ఆలయము, ఎల్లోరాలోని కైలాస దేవాలయములతో పోల్చబడినవి. చిత్రఖండ స్తంభములు కైలాస దేవాలయముల స్తంభముల వలె కన్పించును. పై కప్పు భాగము నందలి అష్టదిక్పాలకులు, శివనటరాజు, ఉమామహేశ్వర మొదలగు దేవతా మూర్తులు బాదామి చాణుక్యుల కర్ణాటక ఆంధ్రశైలిలో కని పించును. శిఖరము రెండు తలలు కలిగి ఫలకల ఆకారములో సుఖ నాశి లేకుండా ఉండుట మన ఆంధ్ర దేవాలయములలో చూడవచ్చును. రూపాలసంగమేశ్వర దేవాల్యయమునందలి హరిహర, మన్మధా, శివ నటరాజు, శివత్రిపురాంతక, గంగా, యమున మొదలైన విగ్రహములు దేవప్రతిమా లక్షణ శాస్త్రము ప్రకారము 8వ శతాబ్దమునకు చెంది నవిగా చెప్పవచ్చును. శాసనముల ద్వారా గాని శిల్పరీతి వలన గాని పై దేవాలయము 8వ శతాబ్దము చివరిభాగమునకు చెందినట్లుగా తెలియుచున్నది.

భుజంగేశ్వరాలయము అన్ని విధముల రూపాల సంగమేశ్వరా లయమును పోలి ఉండుట వలన అదే కాలమునకు చెందినట్లు పరిగణించవచ్చును.

సంగమేశ్వరాలయము యొక్క సముదాయము ఫాంసన (Stepped Pyramidal) పద్ధతిలో నిర్మించబడి సాదాగా కనిపించును. కాని స్తంభములపైన చెక్కడము కనిపించుచున్నందు వలన ఈ దేవాలయమును 9వ శతాబ్దమునకు చెందినదిగా భావించవచ్చును.

1961వ సంవత్సరములో కృష్ణానదిపై శ్రీశైలం, పాతాళగంగ వద్ద ఆనకట్ట ప్రారంభించుట వలన కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లాలలో 117 గ్రామములు ముంపునకు గురి కాగా వానిలో దాదాపు 251 చరిత్ర, పురావస్తు, ప్రాముఖ్యత గల వానిగా గుర్తించడమైనది. ప్రాజెక్టు ముంపునకు గురైన ప్రాంతంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ శాఖలు, నాగార్జున యూనివర్శిటీ చేపట్టిన పురావస్తు పర్యవేక్షణలో భుజంగేశ్వర,భవనాసి సంగమేశ్వర, 8-9 శతాబ్ధములకు చెందిన దేవాలయములు గుర్తింపబడినది.

సంగమేశ్వర మరియు భుజంగేశ్వర ఆలయములలో మొదటి ఆలయమును దేవాదాయశాఖ ఊడదీసి కర్నూలుసమీపములోని జగన్నాథ గట్టు మీద పునర్నిర్మించిరి. భుజంగేశ్వరాలయమును నాగార్జున యూనివర్శిటీ ఆధ్వర్యంలో ఊడదీయగా పునర్నిర్మాణము మాత్రము రాష్ట్ర ప్రభుత్వ పురావస్తు శాఖ చేపట్టి, 1980-81వ సంవత్సరములో శ్రీశైలం ప్రాజెక్టునందు మేము పనిచేయు సమయమున కీ॥శే॥ ఆచార్య ఆర్.సుబ్రమణ్యంగారి ఆధ్వర్యంలో జూపాడు (బన్నూరు బంగ్లా, ఆత్మకూరు -కర్నూలు దారిలో) తిరిగి నిర్మాణము జరిపి 'కళాన్యాస' కార్యక్రమమును నిర్వర్తించి దేవాలయమునకు జీవకళ చేకూర్చి యున్నాము.

ఈ ఆలయములు సుందరవస్తు విన్యాసంతో, అనల్పశిల్ప రూప లావణ్యంతో కల్పించిన కుడ్య శిల్పములు రాష్ట్రకూట శిల్పుల కళా కౌశల్యాన్ని హస్తకళా లాఘవాన్ని చాటి చెప్తాయి.

**References :**

Srinivasan K.R. - Temples of South India.

Rajendra Prasad B. - Rastrakuta Temples at Bhavanasi Sangam,

Vol.XXXIV 2/3, PP211-244

Soundar Rajan, K.V. Indian Temple Styles.

కదలిరావే కృష్ణవేణీ
కదలిరా నిత్య కల్యాణీ
కదలిరా కదలిరా కడుపు చల్లని తల్లి
జలజలా పొంగుతూ కిలకిలా నవ్వుతూ
కోటితీర్థాలు నీ నోటిలో దాచి
ముక్కోటి దేవతల నీ పైటలో ముడివైచి
కదలిరా కదలిరా కదలిరా రాణి
ఎదురుచూచుచున్న ఓ తెల్గు మాగాణీ

-కరుణశ్రీ

*చిరునామా : డా॥ వీరభద్రం జయప్రద, ఎం.ఎ.,పి.హెచ్.డి. సహాయ సంచాలకులు (విశ్రాంత), పురావస్తు మరియు ప్రదర్శనశాలల శాఖ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, గుంటూరు.*

డాక్టర్ రాయదుర్గం విజయలక్ష్మి

# నాగార్జునుడు సంస్కృతంలోనే ఎందుకు గ్రంథరచన చేశాడు?

మానవుడు ప్రకృతిపై ఎన్ని విజయాలు సాధించినా 'కాలం' అనే ఒక ప్రవాహం చేతిలో ఎప్పటికప్పుడు అడ్డుకోబడుతూనే వుంటాడు. అయినా, మళ్లీ వచ్చిన అవకాశాన్ని అందిపుచ్చుకుని పైకిలేవడంలోనే అతని ప్రతిభ దాగి వుంది.ఇది ఒక్క మనిషి విషయంలోనే కాదు మత చరిత్రలలో కూడ నిజమని విశ్వసంస్కృతిని పరిశీలిస్తే గమనించగలం.

సాంఘిక సమానత్వం ప్రధాన లక్షణంగా, మానవత్వానికి మరో రూపంగా వికసించిన మతం బౌద్ధం. సామాన్య ప్రజానీకానికి అందు బాటులో వుండాలని ప్రజల వ్యవహారభాష అయిన పాళీలోనే ధర్మ ప్రచారం గావించాడు బుద్ధుడు.బుద్ధుని మహాపరినిర్వాణానంతరం ఒకటి తర్వాత ఒకటిగా మూడు మహాసంగీతులు (బౌద్ధమహాసభలు) జరిగి, బౌద్ధ త్రిపిటకాలను పాళీ భాషలోనే గ్రంథస్థం చేశాయి. కాని అపర బుద్ధుడని పేరుగాంచి, బౌద్ధమత వ్యాప్తికి ఎంతో తోడ్పడిన, మాధ్యమిక వాద స్థాపకుడైన నాగార్జునాచార్యులు మాత్రం తన గ్రంథాల్ని సంస్కృత భాషలో రచించాడు. అంతవరకున్న బౌద్ధ సంప్రదాయంప్రకారం పాళిలోగాని, నాడు దక్షిణభారతంలో ప్రజాభాషగా జనవ్యవహారం లోనున్న ప్రాకృతంలోగాని, తన మాతృభాష అయిన తెలుగులోగాని ఆయన తన గ్రంథాల్ని ఎందుకు వ్రాయలేదు? ఒకవేళ ఆయన ఏవైనా తెలుగు గ్రంథాలు వ్రాసివుంటే అవి యితర మతాల అసూయాగ్రహాలకు లోనై నశింపబడినవా? ఇవన్నీ మామూలుగా తలెత్తే ప్రశ్నలు?

వాదోపవాదాలకు అనుగుణంగా పండితులకు సులభసాధ్యమైన సంస్కృత భాషలో నాగార్జునుడు తన గ్రంథాల్ని రచించాడన్న విమర్శ కాభిప్రాయంలోని సత్యం పాక్షికమైనదే! చరిత్రలో నాగార్జున నామధేయులు ముప్పరనీ, నల్వురనీ భిన్నాభిప్రాయాలున్నాయి. మాధ్యమిక వాదస్థాప కుడైన ఆచార్య నాగార్జునుడు క్రీ.శ. 2వ శతాబ్దానికి చెందిన యజ్ఞశ్రీ శాతకర్ణికి సమకాలికుడు.

అశోకచక్రవర్తి తర్వాత స్వతంత్రరాజులైన శాతవాహనులు మొదట పైఠాను రాజధానిగా ఆంధ్రదేశాన్ని పరిపాలించినా, క్రమంగా విజయ పురిని రాజధానిగా చేసుకున్నారు. ఆ విజయపురి శ్రీపర్వత ప్రాంతమే. నాగార్జునుని పోషించిన శాతవాహనచక్రవర్తి మాధ్యభారతం వరకు విస్తరించిన సామ్రాజ్యాన్ని పరిపాలించాడని యువాన్‌త్సాంగ్ రచనవల్ల తెలుస్తోంది. ఆ చక్రవర్తి త్రిసముద్రాధీశుడని బాణకవి వర్ణించాడు. ఈ విశాలమైన శాతవాహన సామ్రాజ్యంలో జనవ్యవహారంలో నున్న భాష ప్రాకృతం అని సామాన్య దృష్టికి కనిపించినా,ప్రాకృతంతో బాటు మరికొన్ని భాషలు కూడా జనవ్యవహారంలో అప్పుడప్పుడే చోటు చేసు కుంటున్న రోజులవి. ప్రథమశతాబ్దం నాటికి మూల ద్రావిడ భాషనుండి విడివడి తమిళ కన్నడ తెలుగు మలయాళ భాషలు స్వతంత్ర భాషలుగా స్థిరపడే ప్రయత్నం ప్రారంభమైంది. తమిళసంగవాఙ్మయం ద్వారా ప్రథమ శతాబ్దానికే తమిళభాషాసాహిత్యం సంఘాలు సమావేశమై సాహిత్య చర్చలు జరిగి సుసంపన్నమైన సాహిత్య సంపద తమిళంలో ఏర్పడింది. కాని అటువంటి సాహిత్య రచనా ప్రయత్నమేదీ తెలుగు భాషలో జరిగిన చారిత్రక ఆధారాలు లేవు! శాసనాలలో కనిపించే తెలుగు పద్యాలు ప్రామాణికమైనవే అయినా సంఖ్యలో చాలాతక్కువ విస్తారమైన జానపద సాహిత్యమున్నా అది ప్రజల వ్యవహారానికే పరిమితమైనది తప్ప గ్రంథస్థం కాలేదు.

నాగరికాంశాలు ఎన్నింటిలోనో ముందుండే తెలుగువారు తమ భాష స్వతంత్రభాషగా ఏర్పడిన వేయి సంవత్సరాల దాకా ఆ భాషలో గ్రంథరచనకు ఎందుకు పూనుకోలేదు? 11వ శతాబ్దంలో రాజరాజ నరేంద్రుని అభ్యర్థన మేరకు మాత్రమే నన్నయ భారత ఆంధ్రీకరణకు పూనుకొన్నాడు. సోదర భాషలైన తమిళ కన్నడాలలో అప్పటికే సాహిత్య సంపద ఉన్నప్పటికీ తెలుగులో గ్రంథరచన 11వ శతాబ్దంలోనే జరిగింది. దీనికి గల సామాజికపరమైన కారణాలేవి, అని పరిశీలిస్తే 2వ శతాబ్దానికి చెందిన నాగార్జునాచార్యులు తెలుగులో ఎందుకు గ్రంథరచన చేయలేదో గుర్తించగలం.

శాతవాహనులు మొదట తమ రాజభాషగా ప్రాకృతాన్ని కలిగి వున్నప్పటికీ క్రమంగా సంస్కృతాన్ని ఆదరించారనడానికి గుణాఢ్య

పండితుని బృహత్కథరచన, తదుపరి విశేషాల ద్వారా తెలుస్తోంది. రాజభాషగా ఉన్న సంస్కృతంగాక యితర భాషల పరిస్థితి ఆనాటి సమాజంలో ఎలా వుంది అని పరిశీలిస్తే మనం కొన్ని ఆసక్తికరమైన అంశాలను గమనించగలం !

ప్రథమ శతాబ్దం నాటిదని చెప్పబడుతున్న 'లీలావతి కథ' అనే ప్రాకృత కావ్యం వలన జనవ్యవహారానికే పరిమితమైన భాషల పట్ల గ్రాంథిక వాదులైన సంస్కృతజ్ఞులు నిరసన చూసేవారని తెలుస్తోంది. ఆ కావ్యమాధారంగా, ప్రజల వ్యవహారభాషల్ని 'సంస్కృతజ్ఞులు' జటిలమైన లక్షణశాస్త్రంతో దిగద్రొక్కడానికి ప్రయత్నించేవారనీ, కాని ప్రజలు మాత్రం వీలున్నంత వరకూ, సంస్కృత లక్షణ శాస్త్రాలను గౌరవిస్తూ యిక సహించడందుర్భరం కాగానే తెగించితమ వాఙ్మయాన్ని ప్రత్యేకింప పూనుకొనేవారని తెలుస్తోంది. బహుశాః ద్రావిడ భాషలు కూడా యీ పరిస్థితులలోనే మూల ద్రావిడ భాషనుండి విడివడి ప్రత్యేక భాషలుగా ఏర్పడి వుండవచ్చు! అయినా 11వ శతాబ్దం దాకా తెలుగులో గ్రంథరచన జరగకపోవడానికి ప్రత్యేక కారణాలేవి ?

వ్యవహారంలో ఉన్న భాషలు కాబట్టి వీటిలో దేశీశబ్దాలు కోట్ల సంఖ్యలో వచ్చి చేరేవి. ఈ శబ్దాలన్నిటికీ వ్యాకరణం ఏర్పరచి గ్రంథ ప్రయోజనార్థతను నిరూపించడానికైనా సాధ్యపడనంతటి నైపుణ్యం ఆ శబ్దాలకుంది. పండితులచేత ఈ భాషలుఅపభ్రంశాలని, గ్రామ్యాలని నిరసింపబడేవి. శబ్ద శాస్త్రాన్ని ఎరుగనివాడికిమాట్లాడడానికి వీలుకాదనీ, లక్షణ శాస్త్రాన్ని అనుసరించలేని భాష పరిహాస పాత్రమౌతుందనీ, ప్రాకృతలో రచనలు చేసిన కవుల మీద రాజులకు ఫిర్యాదులు చేసే వారనీ,సంస్కృతపండితులు పరిహాసాలకులోనై సంస్కృతంలో కావ్యాలు, మత గ్రంథాలు వ్రాసినారనీ, అలా రాసి రెండువైపులా విమర్శలకు గురయినవారున్నారనీ యిలా ఎన్నో అంశాలవలన సంస్కృతభాష వ్యాకరణశాస్త్రాన్ని అడ్డు పెట్టుకొని నాటి వ్యవహార భాషలనెలా నిరసించేదో తెలుస్తోంది. అందుకే ఆనాడు పండితులభాషగా సంస్కృతం, పండితులు కాని వారి భాషగా ప్రాకృతం కావ్యరచనకు వాడబడేది.

పిల్లలకొరకు, స్త్రీల కొరకు, మందబుద్ధుల కొరకు రచనలు చేసేవారు ప్రాకృతంలోనే రచనలు చేయాలన్నది నాటి నియమం" పండితులు కాని వీరిని అనుగ్రహించాలనుకున్న తత్త్వవేత్తలుగా ఉన్న పెద్దలు ప్రాకృతంలో రచనలు చేసేవారనడం, స్త్రీలు బాలలూ చదివే నిమిత్తం జైనులు ప్రాకృతంలోరచనలు చేశారనటం, యివన్నీ గమనిస్తే ప్రజల భాషలో బోధనలుగావించిన జైన, బౌద్ధాలను పతనం చెందించే ప్రయత్నంలో భాగంగా ప్రాకృతభాషల నిరసన ఏ స్థాయిలో వుందో గమనించవచ్చు. ఈ నిరసన భావనవల్లనే ఉన్నతవర్గాల వారి భాషగా సంస్కృతం స్థానం సంపాదించుకుంటే,ఆ సంస్కృతాధ్యయానికి, స్త్రీలు, ఇతర వర్ణాలవారుదూరం చేయబడుతూ రూపుదిద్దుకున్న ఒక చారిత్రక పరిణామం ఏర్పడింది. స్త్రీల సామాజిక అణచివేత కూడా యిక్కడే బలపడుతూ రావడం జరిగింది.

క్రీ.శ. 4వ శతాబ్దానికి చెందిన భరతముని, తన నాట్యశాస్త్రంలో పాత్రోచిత భాషలను గురించి చెప్పిన వివరాలు గమనించదగినవి. ఉత్తమ పాత్రలు మాత్రమే సంస్కృతం మాట్లాడాలి అని చెప్తూ తక్కిన ఏయే ప్రాంతాలకు ఏయే వ్యవహారభాషలు వాడాలో వివరించాడు. అయితే అందులో బర్బరులు, కిరాతులు, ఆంధ్రులు మాట్లాడే భాష ఏ పాత్రలకూ వాడరాదని చెప్పాడు. బహుశా అప్పటికింకా ఆంధ్రభాష నాగరికుల భాషగా గుర్తింపబడలేదేమో !

ప్రాకృత కావ్యమైన కువలయమాలా కథలో గల 18 దేశభాషల ప్రస్తావనలో, ఆంధ్రభాష, ఆ ప్రజల ప్రధాన లక్షణం గూర్చిన ప్రసక్తి వుంది. ఈ కావ్యకర్త అయిన ఉద్యోతనుడు (దాక్షిణ్య చిహ్నసూరి అని యితనికే మరోపేరు) 9వ శతాబ్దానికి చెందినవాడు. అంటే క్రీ.శ. 9వ క్రీ.శ॥ నాటికి ఆంధ్రభాష ఒక ప్రత్యేక భాషగా గుర్తించబడింది. అయినా క్రీ.శ. 13వ శతాబ్దం దాకా తెలుగు కన్నడ భాషలకు ఒకే లిపిని వాడేవారనీ, 13వ శతాబ్దం తర్వాత మాత్రమే ఈ రెండు భాషలకు వేర్వేరు లిపులు ఏర్పడ్డాయని తెలుస్తోంది.

11వ శతాబ్దంలో భారత రచనకు పూనుకున్న నన్నయ, తెలుగు భాషకు'ఆంధ్రశబ్ద చింతామణి' పేర సంస్కృతంలో ఒక వ్యాకరణ గ్రంథాన్ని రచించాడన్న విషయం ఒకటి ప్రచారంలో ఉంది. అయితే ఆధునిక విమర్శకులీ సంగతిని అంగీకరించడంలేదు. కాని అంతవరకు గ్రంథస్థ రచనజరుగని భాష కాబట్టి, జన వ్యవహారం వలన విస్తారమైన శబ్దాలు వచ్చి చేరిన భాష గాబట్టి,ఆ శబ్దాలు గ్రంథ రచనార్హత కలిగి వున్నాయని నిరూపించే ఏదో ఒక ప్రయత్నాన్ని మాత్రం నన్నయ చేసి వుండాలి !

అంతేగాదు ఆనాడు పండిత పరిషత్తులున్నాయని,తన భారతాంధ్రీ కరణ విషయంలో ఆ పరిషత్తులను ఒప్పించి మెప్పించి వుండాలని మనం ఊహించవచ్చు. అందుకే, సారమతులైన కవీంద్రులు మెచ్చుకొనే విధంగా ప్రసన్న కథా కవితార్థ యుక్తిని, యితరులు ఆదరించేవిధంగా అక్షరరమ్యతను ఛందోలంకార పరిపుష్టంగా భారతాంధ్రీకరణను జగద్ధితంబుగా చేస్తున్నామనన్నాడు నన్నయ". అంటే సంస్కృతం కన్నా భిన్నమైన భాషతో జరిగే రచన కాబట్టి, యిది స్త్రీ బాల వృద్ధుల నుద్దేశించి మాత్రమే వ్రాయలేదనీ, పండితులకొరకు కూడ అని చెప్పడానికి నన్నయ ప్రయత్నం చేశాడనటానికి పద్యం నిదర్శనం !

11వ శతాబ్దం నాటి పరిస్థితే యిలా వుంది కాబట్టే రెండవ శతాబ్దంలో నివసించిన నాగార్జునాచార్యులు తెలుగులోగాని, ప్రాకృతం లోగాని తన రచనల్ని రాయలేదు.

ఆచార్య నాగార్జునుని కాలంలో బౌద్ధం యితర మతాలతో అస్థిత్వ పోరాటం సాగిస్తూ, కొనసాగుతున్నదనే మాట చారిత్రక సత్యం.

థేరవారం కన్నా భిన్నమైన మాధ్యమిక వాదానికి మూల పురుషుడు, అపరబుద్ధుడుగా పేరుగాంచిన వాడు యజ్ఞశ్రీ శాతకర్ణి ప్రభువుకు మిత్రస్థానంలో ఉన్నవాడు. ఎన్నో బౌద్ధగ్రంథాలకు కర్త అయిన నాగార్జునుడు దుర్మరణానికి గురికావడం, ఆ తర్వాత అనతికాలంలోనే ఆర్యదేవుడు హత్యకు గురికావడం ఈ అంశాలు ఎంతటి ప్రతికూల పరిస్థితుల్లో బౌద్ధం నిలద్రొక్కుకుంటూ వచ్చిందో చెబుతున్నాయి.

అశోక చక్రవర్తి ఆధ్వర్యంలో జరిగిన మూడవ సంగీతిలో బౌద్ధం థేరవాద, మహా సాంఘిక వాదాలుగా చీలడం జరిగింది. ప్రాచీన ఆచారాల్ని విశ్వసించే వారిని థేరులనీ, స్థవిరులనీ, సంఘనియమాల్లో నూతనత్వాన్ని కోరేవారిని మహాసాంఘికాలనీ అంటారు. ఈ ముఖ్యమైన చీలికకు అంధకశాఖలైన చైత్యక శైల, వేతుల్య వాదులు ప్రముఖపాత్ర వహించినట్లు కథావర్థు ప్రకరణం ఆధారంగా తెలుస్తోంది "బౌద్ధవాఙ్మయం ఆంధ్రులనే అంధకులని వ్యవహ రించింది. మహాసాంఘికవాద పరిణామమే మాధ్యమికవాద/ మహా యానాలు. థేరవాదుల రచనలన్నీ పాళీలోనే ఉన్నాయి.నిరసనకు గురవుతున్న వ్యవహారిక భాషలో గాక,బాగా వ్యాప్తిలో ఉన్న సంస్కృతభాషలో రచనలు చేయడంవల్ల మత సిద్ధాంతాలకు విస్తారమైన పరిధి నేర్పరచవచ్చునని నాగార్జునుడు భావించివుండవచ్చు.

ఎవరి నిర్వాణాన్ని వారే సాధించాలన్న థేరవాద సిద్ధాంతానికి భిన్నంగా,సమస్త మానవాళి దుఃఖాన్ని బాపి నిర్వాణ పథాన్ని చూపే దివ్య స్వరూపుడు బుద్ధుడు అన్న భావన మహాయానంలో బాగా వ్యాపించింది. ఫలితంగానే, మానవాతీతులు, లోకోత్తర మూర్తులైన బోధిసత్వమూర్తి కల్పన మహాయానంలో జరిగింది. ప్రధానంగా పరివ్రాజక దీక్షననుసరించిన బౌద్ధంలో బుద్ధుని కాలంలోనే గృహస్థులైన బౌద్ధభక్తులుండేవారు. మహాయానంలో ఇది యింకా విస్తృత రూపం దాల్చి, పరివ్రాజకులకు, గృహస్థులైన ఉపాసకులకు మధ్య వ్యత్యాసాన్ని తగ్గించింది. ధర్మబద్ధమైన గార్హస్థ్య జీవితం ధర్మసాధనకు గాని, నిర్వాణ సాధనకు గాని అడ్డుకాదని మహాయానం చాటింది. బౌద్ధపోషకులైన కర్మకారులు, గృహపతులు, శ్రేష్టివర్గాలు, ప్రభువులు మొదలగువారికి బౌద్ధంతో ప్రత్యక్ష భాగస్వామ్యం కల్గించవలసిన ఒక చారిత్రక అవసరం ఆంధ్ర బౌద్ధులకు ఏర్పడింది. సామాన్య ప్రజానీకంలో బౌద్ధం అప్పటికే బాగా వ్యాప్తిలో ఉంది గాబట్టి పై ఉన్నత వర్గాలవారినుద్దేశించి చేపట్టిన రచనకు నాగార్జునాచార్యులు సంస్కృతాన్నే ఎంచుకున్నాడు.

బౌద్ధ జైన మతాల అణచివేతలో ఒక భాగంగా ప్రారంభమైన జన వ్యవహారభాషా నిరసన, సంస్కృతభాషావ్యాప్తి ఒకదానితో ఒకటి పెనవేసుకొని జరిగిన సాంఘిక పరిణామాలే అయినా ఈ భావాలు రెండవ శతాబ్దం నాటికి యింకా ఉధృతంగా వ్యాపించలేదు. కాబట్టే బౌద్ధమత గ్రంథాలకు విస్తారతను, గౌరవాన్ని ఆపేక్షించిన నాగార్జునుడు సంస్కృతభాషలో రచనలు చేశాడు.

బౌద్ధమత పతన చరిత్రలో సంస్కృతభాషావ్యాప్తి కింత స్థానముంది కాబట్టే క్రీ.శ. 3వ శతాబ్దంశ్రీపర్వతవిహారంలోని సింహళ బౌద్ధభిక్షువుల విహారంలోను,శాలిహుండం, భావికొండ విహారాల్లోనూ, కళింగ రాజ్యాంతర్గతమైన ఉత్తరాంధ్రలోని విహారాల్లోను గల థురవాద బౌద్ధులు బౌద్ధమత పునరుజ్జీవనోద్యమంలో భాగంగాపాళీభాషా పునరుద్ధరణకు పూనుకొనవలసివచ్చింది. ఇందులో భాగంగానే బుద్ధఘోషుని, పాళీభాషా అధ్యయనార్థం సింహళానికి పంపారన్న సత్యం మతాల పోరాట చరిత్రలో భాషలు పోషించిన పాత్రలకు సాక్ష్యం పలుకుతూంది.

మహాయానం ఫలితంగా ఆంధ్ర బౌద్ధభిక్షువులు పరివ్రాజక దీక్షలో మాత్రం తృప్తిపడలేదు.బౌద్ధ దర్శనాల్లో పాండిత్యంసాధించారు. సునిశిత చర్చలలో గ్రంథాలను రచించారు. శ్రీ పర్వతవిహారంలో వేదవేదాం గాలు జైనబౌద్ధాలు వ్యాకరణ న్యాయవైశేషికాది దర్శనాలతోబాటు వైద్యజ్యోతిష సర్వవిద్యలు లలిత కళలు బ్రాహ్మణ బ్రాహ్మణేతర విద్యార్థులకు, విదేశాలనుండి వచ్చిన వారికి బోధించేవారని 'కువలయమాల' కావ్యం వలన తెలుస్తోంది. అంటే క్రీ.శ. 9వ శతాబ్దం నాటికే బౌద్ధం తన ప్రత్యేకతను కొంచెం కొంచెంగా ఎలా కోల్పోయిందో, బౌద్ధం తన పునాదుల మీద హిందూమత పునరుజ్జీవనోద్యమానికి సంస్కృత భాష ఎలా తోడ్పడిందో అనే కాలం ప్రకటించిన సత్యాన్ని మనం ఒప్పుకోక తప్పదు.

ఈ భావి పరిణామాన్ని యింత సూటిగా ఊహించలేని నాగార్జునాచార్యులు, తన కాలంనాటి స్థితిగతుల కనుగుణంగా బౌద్ధగ్రంథాలను సంస్కృతంలో రచించి, బౌద్ధంలో నూత్నోత్సాహాన్ని కలిగించాడ కూడా చెప్పక తప్పదు.

**ఉపయుక్త గ్రంథాలు :**


1. ఆంధ్రదేశంలో జైన బౌద్ధమతాలు
   డా॥B.S.C. హనుమంతరావు
   తెలుగు అకాడమి, హైదరాబాదు
   1. Ed. 1994
2. శ్రీ ప్రాకృత గ్రంథకర్తలూ, ప్రజాసేవానూ
   పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి,
   ప్రాచీ పబ్లికేషన్స్, హైదరాబాదు.
   1. Ed. 1994

డాక్టర్ జి.వి. కృష్ణారావు

# యుగయుగాల నుండి భావ ప్రపంచాన్ని ఉర్రూతలూపుతున్న నాగార్జునుడు

నాగార్జునుడు బౌద్ధధర్మమును సాధారణ ప్రజలలో బహుళ ప్రచారిత మొనర్చి స్థూప-చైత్య-విహారముల నిర్మాణం గావించుటకు కృషిచేసి, గుంటూరు మండలమును పుణ్యభూమిగా రూపొందించి యావత్ప్రపంచమున పేరు ప్రఖ్యాతులు వర్ధిల్లజేసిన మహాపురుషుడు.

వర్ణ సమామ్నయంలో ఱ కారానికి ఉన్న స్థానమే భారతదేశ చరిత్రలో ఆంధ్రులకున్నట్లు వెలువడుతున్న చరిత్రగ్రంథాలనుబట్టి ఊహించ వలసివస్తుంది. కాని ప్రపంచసంస్కృతికి, భారత తత్త్వశాస్త్రానికి ఆంధ్రులు చేసిన సేవ యిచ్చిన దోహదం అనల్పం ; అవిస్మరణీయం. ప్రపంచ సాహిత్యావన వాటిలో బృహత్కథా గాథా సప్తశతులు దివ్య పారిజాతాలు. తత్త్వక్షేత్రంలో ఆర్యనాగార్జునుడు, ఆర్యదేవుడు, భావ వివేకుడు, దిఙ్నాగుడు, ధర్మకీర్తి, విత్తిపెంచి ప్రోది చేసిన బోధివృక్షాల అంట్లే ప్రవృద్ధాలై టిబెట్, మంగోలియా, చైనా, జపాను దేశాలలోని జిజ్ఞాసువులకు జ్ఞానమూలికలు ప్రసాదించాయి. ఆర్ష దర్శనాభినివిష్టు లకు వాత్స్యాయన భాష్యం, కుమారిలుని వార్తికాలు అమూల్యాలు. ఇలా సంస్కృతికీ, విచారధారకు దోహదమిచ్చిన వారి పేర్లు ఎన్నయినా చెప్పవచ్చును. కాని తమజాతి కీర్తిప్రతిష్ఠలను నిలబెట్టిన మహాపురు షుల పుస్తకాల పేర్లుగాని, వారి సిద్ధాంతాలుగాని, ప్రపంచచరిత్రలో వానికున్న స్థానంగాని, ఆంధ్రులైనా గ్రహించకపోవటం శోచనీయం.

ఉదాహరణకు ఆర్యనాగార్జునుని విషయమే తీసుకోవచ్చు. ఆంధ్ర ప్రజానీకానికి నాగార్జునకొండ ఎక్కడున్నదో అచట దొరుకుతున్న శిధిలా వశేషాలు ఎట్టివో తెలుసు. కాని ఆ ప్రదేశానికి ప్రఖ్యాతి చేకూర్చిన మహనీయుని చరిత్రకాని, కృతులుకాని, అతని భావాల విలువకాని, తత్ప్రబుద్ధ దేశనామాలుగాని ; తత్ప్రతి పాదిత నవ్యప్రపంచ సమస్యా పరిష్కారమార్గాలుగాని ఆంధ్రులకు తెలియవు. తెలిసి ఉన్నట్లయితే ప్రకృతం నాగార్జునసాగరమన్న పేరుతో సాగుతున్న ప్రాజెక్టుకు 'నంది కొండ ప్రాజెక్టు అను పేరు పెట్టాలన్న ఊహయినా మొదట్లో కలిగి ఉండేది కాదు.

సంఖ్యకు భారతదేశంలో దర్శనాలు అనేకాలు బయలుదేరినా నిశితంగా పరామర్శించి చూస్తే నిలిచే దర్శనాలు మూడే. ఒకటి మాధ్యమికవాదం, రెండు విజ్ఞానవాదం,మూడు అద్వైతవాదం. మొదటి వాదానికి నాందీకారుడు కాకపోయినా శాస్త్రీయరూపం నిబంధిం చినవాడు ఆచార్య నాగార్జునుడే. దానిని విశదీకరించినవారు ఆర్య దేవుడు, బుద్ధపాలితుడు, చంద్రకీర్తి, శాంతిదేవుడు. యూరప్‌లో కాంట పరతత్త్వవాదం ఆవిర్భవించి జర్మనీని విచారధారతో స్నిగ్ధంచేసి వివిధ తాత్త్విక భాషాలను మోసులెత్తించింది. అలాగే మాధ్యమిక వాదం కూడ భారతదేశంలో జిజ్ఞాసను రేకెత్తించి అనేక వాదాలకు జీవం పోసింది. స్వతంత్ర మాధ్యమికవాదం, విజ్ఞానవాదం, మాధ్యమిక యోగాచారం, సౌత్రాంతిక యోగాచారం, అద్వైతం మున్నుగాగల వాదాలన్నీ మాధ్యమిక వాదంనుంచి సాక్షాత్తుగా ఉత్పన్నం కాకపోయినా దాని ప్రభావం అంతో యింతో ఉన్నదనే చెప్పాలి.

అంతేగాదు, నాగార్జునుడు తొలిసారిగా తన ప్రతిభావిశేషంతో సాపేక్షతా వాదాన్ని క్రీ.శ. 1వ శతాబ్దిలోనే సాకల్యంగా ప్రతిపాదించిన 20వ శతాబ్దిలోని ఐన్‌స్టీన్‌ను ముందుగానే ఊహించగలిగాడు. ప్రపం చం ఒక భావమని ప్రతిపాదించిన హెగెల్ సిద్ధాంతాన్ని సవిశేషంగా కాకపోయినా స్థూలంగానైనా ఊహించి యీతడు ఖండించాడు.

రెండోదయిన విజ్ఞానవాదానికి సుస్థిర స్వరూపం సంపా దించినవారు దిఙ్నాగుడు, ధర్మకీర్తి . వీరి తత్త్వధాటికి ప్రాచీనన్యాయం బీటలువారి నవ్యరూపం సంతరించింది.

ఈ రెండు దర్శనాలను మొత్తంమీద వ్యవస్థాపించినవారు ఆంధ్రులు. కాని వారిని యీనాడు సగర్వంగా స్మరించే ఆంధ్రులు ఎందరున్నారు ? అసలు వారి వాదాలు తెలిసినవారు కూడా స్వల్ప సంఖ్యాకులు. భాష్యానికి వివరణమో, భాషానువాదమో వ్రాసి ఫలాని వాడు మా ఆంధ్రుడని సగర్వంగా చెప్పుకొంటున్నాం గాని స్వతంత్ర సిద్ధాంతంతో ప్రపంచానికి వెలుగుబాటలు చూపి జాతి వర్ణ భేదాలతో

నిమిత్తం లేని సామాజిక వ్యవస్థకై పాటుపడిన మహామహుల పేర్లనైన స్మరింపలేకపోతున్నాము.

ఈ స్థితి అత్యంత శోచనీయం. ఏ జాతి అయినా ఏ దేశమైనా తన ప్రాచీనచరిత్రను, సంస్కృతిని తెలియక వర్తమానాన్ని అర్థంచేసు కోలేదు. భవితవ్యాన్ని నిర్ణయించుకోజాలదు. అందువలన ఆంధ్రదేశ చరిత్రలో, భారత సంస్కృతి ఇతివృత్తంలో, మానవతత్త్వాన్వేషణలో విస్మారితమైన ఒక ఘట్టం యిట క్లుప్తంగా దిఙ్మాత్రంగా ప్రదర్శి తమౌతుంది.

మాధ్యమికవాద స్థాపనాచార్యుడు ఆర్య నాగార్జునుడు. ఇతని జీవిత చరిత్ర ముందుగా పరిశీలించాలి.

భారతదేశ చరిత్రలో మహా పురుషుల కృతులు తెలిసినంతగా వారి జీవిత విశేషాలు తెలియవు. దీనికి కొలది అపవాదాలుంటే ఉండవచ్చు. కాని మొత్తంమీద యిది యథార్థమే. కాళిదాసు కృతులు సుపరిచితాలే కాని అతని జీవిత విశేషాలు యిప్పటివరకూ తెలియవు. కాకపోతే చరిత్రకు అగ్రాహ్యాలైన కట్టుకథలు అభూతకల్పనలు అనేకాలు ఉంటే ఉండవచ్చు. నాగార్జునుని చరిత్రకూడా యిలాంటిదే. కాని యితని విషయంలో యీ కథ మరొక మెట్టు పైకిపోయింది. "వాస్త వంగా నాగార్జునుడనే వ్యక్తి లేడు, అది కేవలం కల్పితనామ"మని వ్రాసినవారున్నారు. నాగార్జునకొండవద్ద బయల్పడిన పురావస్తుసామగ్రి బట్టి నాగార్జునుడు కల్పితవ్యక్తి కాదని తేలిపోయింది. ఇక నాగార్జు నుడను వ్యక్తి ఒకరా అనేకులా అన్న ప్రశ్న బయలుదేరింది. కొందరు ఒకరన్నారు. మరికొందరు ఇద్దరన్నారు, ఇంకొందరు ముగ్గురన్నారు. ఇంకా కొందరు బుద్ధిమంతులు నాగార్జునుని సంఖ్యను ఐదింటిదాకా పెంచారు. మొత్తంమీద ఆచార్య నాగార్జునుడు ఒక వ్యక్తి అనీ, సిద్ధ నాగార్జునుడు వేరొక వ్యక్తి అనీ, అదే పేరుతో తాంత్రికాచార్యుడు మరొకడున్నాడనీ చెబుతున్నారు.

ఇక్కడ మనకు ముఖ్యుడు మాధ్యమిక దర్శన ప్రవర్తకుడైన ఆర్య నాగార్జునుడు. ఇతడు ఎప్పటివాడో తేల్చుకోవలసి ఉంది. క్రీ.శ. 405 ప్రాంతంలో కుమారజీవుడు నాగార్జునుని జీవిత చరిత్ర చైనా భాషలోకి అనువదించాడు. కాబట్టి నాగార్జునుడు క్రీ.శ. 405కి ముందే ఉండాలి. కుమారజీవుని రచనను బట్టి ఈ క్రింది విశేషాలు తెలుస్తున్నవి. నాగార్జునుడు పుట్టుకతో దాక్షిణాత్య బ్రాహ్మణుడు. అతడు నాల్గు వేదాలు, సర్వశాస్త్రాలు క్షుణ్ణంగా చదువుకొన్నాడు. అణిమాది అష్ట సిద్ధులు సంపాదించి వాని ప్రభావం వలన అదృశ్యమై సంచరించే వాడట. ఆ సిద్ధుల మహిమతో అతడు ముగ్గురు మిత్రులతో కలిసి అదృశ్యులై రాజాంతఃపురానికి రాకపోకలు సాగిస్తూ వచ్చాడట. ఇలా సాగిస్తూ ఉండగా ఒకసారి మిత్రసమేతంగా రాజభటులకు పట్టుపడి యీ గండంగడిచి పిండం బయటపడితే బౌద్ధభిక్షువు నౌతానని మ్రొక్కు కొన్నాడట. రాజు ఏ కారణంవల్లనో అతని మిత్రులు ముగ్గురిని ఉరి తీయించి, అతనిని మాత్రం వదలివేశాడట. నాగార్జునుడు మొక్కు కొన్నట్లే బౌద్ధభిక్షుత్వం స్వీకరించి తొంభైరోజుల్లో 'త్రిపిటకాలు' చదివి దానితో తృప్తిపొందక సూత్రగ్రంథాలకోసం అన్వేషించాడట. తుదకు హిమాలయవాసియైన ఒక భిక్షువు వల్ల దాని భాష్యం సంపాదించాడట. అతడు దీక్షతో దక్షిణదేశంలో బౌద్ధమత ప్రచారం సాగిస్తూ 300 సంవత్సరాలు మతాచార్యుడుగ ఉన్నట్లు కుమారజీవుడు వ్రాశాడు.

అలాకాదు. 600 సంవత్సరాలు నాగార్జునాచార్యుడు జీవించాడని భోటదేశస్థుల ప్రచారం. అతనికి సిద్ధవిద్యయందేగాక, రసవిద్య, వైద్య శాస్త్రం, ఖగోళశాస్త్రం, రత్నశాస్త్రం మున్నయిన వాటిలో కూడ నైపుణ్య మున్నట్లు కుమారజీవుని రచన తెల్పుతున్నది.

ఈ పేర్కొన్నవాటిలో పుక్కిటి పురాణాలను మినహాయిస్తే మిగిలే విషయాలు చాలా తక్కువ. నాగార్జునుడు దాక్షిణాత్య బ్రాహ్మణుడనీ, వివిధ శాస్త్ర పారంగతుడనీ తెలుస్తున్నది. వింటర్ నిడ్జ్ మొదలైనవారు అతడు విదర్భవాసియనీ క్రీ.శ. 2వ శతాబ్ది ఉత్తరార్థంలో ఉన్నాడనీ అంగీకరిస్తున్నారు. శ్రీపర్వతం అతని వాసస్థానమని నాగార్జునుని కొండ వద్ద బౌద్ధవిశ్వవిద్యాలయం నెలకొల్పాడనీ, అమరావతికి ప్రాకారాలు జీర్ణాలు కాగా తిరిగి కట్టించాడనీ, నాటి శాతవాహన చక్రవర్తి యీతనికి మిత్రుడనీ సుహృల్లేఖ యీ చక్రవర్తికి వ్రాసినదేననీ చరిత్రజ్ఞులు చెబు తున్నారు. సుహృల్లేఖను ఆబాలగోపాలం పవిత్ర గ్రంథంగా పారాయణ చేసిందని చైనాయాత్రికుని వ్రాత వలన తెలుస్తున్నది. ఈ పుస్తకం మూలం మాత్రం లభించటం లేదు. టిబెట్ చైనా భాషానువాదాలు మాత్రం ఈనాటికీ నిలిచి ఉన్నవి.

నాగార్జునుడు దక్షిణాపథ మందలి వేదలి నివాసియైన బ్రాహ్మ ణుడని లంకావతారం స్పష్టంగా చాటుతున్నది.

**'దక్షిణాపథ వేదల్యాం**
**భిక్షుఃశ్రీమాన్ మహాయశాః**
**నాగాహ్వాయః స నామ్నా తు**
**సదసత్ పక్షదారకః** **పే॥ 280 శ్లో ॥65**

విదర్భవాసి ఐతే ఈ శ్లోకం ఆ విషయాన్ని చెప్పి ఉండేది. అట్లు చెప్పటానికి ఛందస్సు అడ్డురాదు కాగా యీ వేదలి అన్నది ఎక్కడున్నది? చరిత్రజ్ఞులు తలుస్తున్నట్లు విదర్భ ప్రాంతంలోనిదే అయితే నాగార్జున కృతియైన 'రత్నావళి'లో లభిస్తున్న కొన్ని విషయాలకు వారు సమా ధానం చెప్పుకోవాలి.

నాగార్జునుని కాలంలో మహాయానం నిందింపబడుతూ వచ్చింది. నాటి రాజుకూడ మహాయాన ప్రతికూలుడుగా కనిపిస్తున్నాడు. (నింద్యతే చాద్యమహాయానం మోహాత్ స్వపరవైరభిః 4-79. ధర్మాధి కారాయే చాన్యే పూర్వరాజప్రవర్తితాః దేవద్రోణ్యాదయన్తేపి ప్రవర్త్యంతామ్

యథాస్థితాః 4-18) ఇట్టి సందర్భంలో విదర్భదేశంనుంచి వచ్చిన వ్యక్తి తెలుగు గడ్డలో బౌద్ధ విశ్వవిద్యాలయం స్థాపించడానికీ, అమరావతికి ప్రాకారాలు తిరిగి నిర్మించటానికి ఎట్లు సాధ్యపడింది ? ఎక్కడ నుంచో వచ్చిన వ్యక్తికి యిందు పలుకుబడి ప్రజాసహకారం ప్రాప్తించటం దుర్లభం కాదా? తత్త్వశాస్త్ర నైపుణ్యమే దీనికి కారణమనటానికి వీలులేదు కదా! పైగా మహాయానం నాడు మూలలనుంచి ప్రతిఘటింపబడుతూ ఉంది.

కాబట్టి నాగార్జునుడు గుంటూరు, కృష్ణా, గోదావరి ప్రాంతాల వాడనటానికి అవకాశం కన్పిస్తున్నది. కాని విదర్భవాశి అనటానికి అవకాశం కల్పించటంలేదు.

తాత్త్వికరంగంలో నాడు నాగార్జునునకు ప్రాతికుల్యం ఉన్నది. రాజుకూడ విముఖుడే కాని సుముఖుడు కాడు. అయినపుడు అతడు ఎలా ప్రజానురాగం సంపాదించగల్గాడు ? ఏదో ఒక తీరున అతడు ప్రజలకి తోడ్పడిఉండాలి. ఆ ప్రజాసేవ ఏమిటి ? తత్త్వనిరూపణం, ధర్మపన్నాలు ప్రజల్ని ఆకర్షించి ఉంటాయనటానికి వీల్లేదు. కాబట్టి కుమారజీవుడు పేర్కొన్న నాగార్జునుని వైద్యశాస్త్ర పారంగతత్వం యథార్థం కావచ్చు. ఆ నైపుణ్యంతోనే అతడు ప్రజలకు సేవచేసి వారి అనురాగం పొంది విశ్వవిద్యాలయాదికం నిర్మించి ఉండవచ్చును.

ఇక నాగార్జునుని కాలం నిర్ణయించవలసి ఉంది. సుహృల్లేఖ, రత్నావళి అను రెండు రచనలు శాతవాహన రాజులను ఉద్దేశించే నాగార్జునుడు వ్రాశాడని చరిత్రజ్ఞులందరు అంగీకరిస్తున్నారు. కాని ఏ రాజునుద్దేశించి అని వ్రాయబడ్డవి అన్న ప్రశ్నకు సమాధానం చెప్పుకోవలసి ఉంది.

నాగార్జునుడు క్రీ.శ. రెండవ శతాబ్దిలో ఉన్నాడని చెప్పేవాళ్లు గౌతమీ పుత్ర యజ్ఞశ్రీనుద్దేశించి అతడు వ్రాశాడని అంటారు. కాని రత్నావళిని బట్టి నాటి రాజు మహాయాన ప్రతికూలుడుగా కన్పిస్తున్నాడు. పైగా ఆ మతం మీద అతనికి ద్వేషం కూడా ఉంది. అందువలననే దేవద్రోణ్యాది ఉత్సవాలను అతడు నిషేధించాడు. నాగార్జునుడు అతనికి హితం బోధిస్తూ "బుద్ధుల వచనం గ్రహించటం కష్టం. కాబట్టి ఏకయాన త్రియానోక్తాలనుంచి ఆత్మను ఉపేక్షచే రక్షించుకో. ద్వేషం వలన పాపం తప్ప, శుభం కలుగదు. ఆత్మ కాములు మహాయానాన్ని ద్వేషించరాదు" అని స్పష్టంగా ఘోషించాడు. యజ్ఞశ్రీకి మహాయానమందు ద్వేషమున్నట్లు చరిత్ర చెప్పటంలేదు. దీనికితోడు నాగార్జునుడు సూచన ప్రాయంగా నిరసించిన కీర్తికాముకత్వం కూడా ఇతనిలో అంతగా కన్పించటంలేదు. నాగార్జునుడు పేర్కొన్న లక్షణాలన్నీ గౌతమీపుత్ర శాతకర్ణియందే కన్పిస్తున్నవి. అతడు "ఏక బ్రాహ్మణుడు. ఏకాంకుశుడు. ఏకశూరుడు, త్రిసముద్రతోయ పీతవాహనుడు, వినివర్తిత చాతుర్వర్ణ్యసంకరుడు" అని శాసనము పేర్కొంటున్నది.

ఇది యిలా ఉండగా యీ కాలాన్ని సమర్థించటానికి మరొక విషయం కూడా తోడ్పడుతున్నది. దశ సహస్రప్రజ్ఞా పారమిత క్రీ.శ. 148లోనే చైనా భాషలోకి అనువదింపబడినట్లు చరిత్రజ్ఞులు చెబుతున్నారు. పారమితలకు ప్రాముఖ్యం, ప్రాచుర్యం నాగార్జున కృతుల వల్లనే యేర్పడింది కాని, అంతకుముందే ఏర్పడిందని ఊహించడానికి అవకాశం లేదు. ప్రయాణసౌకర్యాలు నికృష్టంగా ఉన్న ఆ కాలంలో ఒక పుస్తకం భారతదేశంలో ప్రసిద్ధిపొంది అది చైనాకు ప్రాకి అచట ఆ భాషలో అనువదింపబడాలంటే కనీసం యాభై, అరవై సంవత్సరాలైనా పడుతుంది. కాబట్టి క్రీ.శ. 1వ శతాబ్దంలో నాగార్జునుడు ఉండి వుండవచ్చును అనటం నిర్హేతుకం కాజాలదు. ఇది నిజమైతే అప్పటి శాతవాహన చక్రవర్తి గౌతమీపుత్ర శాతకర్ణే కాని యజ్ఞశ్రీ కాడు.

నాగార్జునుడు గౌతమీపుత్ర శాతకర్ణికి సమకాలికుడని చెప్పవచ్చును. అంతేకాని అతడు ఫలాని సంవత్సరంలో జన్మించి, ఫలాని సంవత్సరంలో అస్తమించాడని దొరుకుతున్న సాధన సామాగ్రిని బట్టి చెప్పలేము.

ఇక అతని జీవిత విశేషాలు కూడా ఇంతకుముందు చెప్పుకొన్న వానికంటె అధికంగా తెలియటంలేదు. రత్నావళిని జాగ్రత్తగా పరిశీలించినపుడు మాత్రం ఈ క్రింది విశేషాలు కనుపించక మానవు.

మహాయానం నాగార్జునునకు ముందే ఉన్నది కాని అతడు కొత్తగా ప్రతిపాదించి ప్రచారించింది కాదు. ఎందుకంటే "నింద్యతే ఉద్య మహాయానం మోహాత్ స్వపరవైరిభిః" అని అతడు స్పష్టంగా చెబుతున్నాడు. మహాయానం కొత్తగా వెలువడి నిందింపబడుతున్నట్లైతే అతడు అంతగా బాధపడవలసిన అవసరం లేదు. కొత్తగా బయలుదేరినదాన్ని అపార్థం చేసికోవటంలో క్రొత్తదనం ఏమీలేదు. అలాకాక అది ప్రాచీనమయి అపార్థానికి పాల్పడుతూ ఉంటే నాగార్జునుడు నొచ్చుకోవటంలో అర్థం ఉంటుంది. కాబట్టి నాగార్జునునికి ముందే మహాయానం లోకంలో వ్యాపించి ఉండాలి.

తన కాలంలో మహాయానం తీవ్ర విమర్శనకు పాల్పడుతూ వచ్చింది. అందువల్లనే ప్రతివాదుల విమర్శల నుండి తన వాదం నిల్పుకోవలసిన ఆవశ్యకత నాగార్జునునకు కలిగింది. అందువల్లనే అతడు తన మేధాసంపత్తిని ప్రదర్శించి గ్రంథాలు వ్రాశాడు. అంతేకాని ఉబుసుపోక, జిజ్ఞాసా సమారాధన కోసం, అతడు గ్రంథకర్త కాలేదు. తను ప్రదర్శించిన యుక్తులతో తృప్తిపడక మహాయానంమీద తొట్టిమొట్టి విమర్శలు ప్రతిపక్షులు సాగిస్తూ ఉంటే నాగార్జునుడు విసిగి గండరించి, మాధ్యమిక దర్శనం 'తీర్థిక పశు భయంకరం' అని అంటానికి కూడా వెనుకాడలేదు.

ధర్మానికి తప్ప మరొక లౌకిక శక్తికి తల ఒగ్గే స్వభావం నాగార్జునునకు లేదని రత్నావళి చాటుతున్నది. అందులో అతడు ఇలా

వ్రాస్తున్నాడు. "రాజా ! సామాన్యునికైనా అప్రియమయిన హితం చెప్పి వినిపించటం కష్టం.మరి రాజులకు చెప్పి వినిపించటం ఎంత కష్టమో వేరే చెప్పాలా ! అందులో నీవు అతి భౌముడవు. నేను కేవలం సద్భిక్షు వును. అయినా నేనొక్కణ్ణే నీకు మిక్కిలి అప్రియమయినప్పటికీ పథ్యం చెబుతాను. నీయందలి స్నేహం, లోకమందలి అనుకంపయే దీనికి కారణం. ఇంతేకాదు, మరొక అడుగు ముందుకువెళ్ళి మద్యసేవనం మానుకో. దానివల్ల లోకంలో పరాభవం, కార్యహాని, ధనక్షయం సంభ విస్తాయి. పైగా చేయరానిపని చేయిస్తుంది," అని అతడు రాజదోషా లను ఒత్తి చికిత్స చేయటానికి ప్రయత్నించాడు.

నాగార్జునుడు విచారశీలుడేకాక పరైకాంతహితబుద్ధి అని రత్నావళి వ్యక్తం చేస్తున్నది. "సత్యం అంటే ఆది సంవాదకం అయినది కాదు. సత్య గుణోద్భూతమూ కాదు. పరైకాంత హితమే సత్యం" అని అతడు ఎలుగెత్తి చాటాడు. ఈ పరైకాంతబుద్ధిని పురస్కరించుకొని ఆయన నాడు కారాగార సంస్కరణలు సూచించాడు.

"దుష్టులను సన్మార్గానికి మరల్చటమే రాజునకు కోరదగిన విష యం. అంతేకాని ప్రతీకారబుద్ధితో అధికార ప్రదర్శనా అహంకారంతో రాజు శిక్ష విధించరాదు. న్యాయపురస్సరంగా దండ ప్రహారాదులు దోషులకు విధించబడినా, నీవు కృపాళుడువై రక్షించాలి. నిజంగా మహాత్ముల కృపకు అస్పదులైన వారు తీవ్రపాపులు, హింస్రులు కాక పోతే మరెవరు ? కారాగార బద్ధులలో శుష్కిస్తున్నవారిని రోజుకో అయిదు రోజులకో ఒకసారి విడిచిపెట్టు. కారాగారంలో ఉన్నంతకాలం వారి స్నానాన్న పానాదులకు, మందుమాకులకు, వస్త్రాలకు, క్షురకర్మా దులకు కావలసిన సదుపాయాలు చేయవలసింది" అని అతడు రాజుకు బోధించి తన కృపాళుత్వాన్ని చరిత్ర ప్రసిద్ధం చేసుకొన్నాడు.

పైగా ప్రపంచ చరిత్రలో మొట్టమొదటసారిగా శిక్షాస్మృతినుంచి మరణదండనాన్ని తొలగింపవలసిందని ఆర్య నాగార్జునుడు ప్రచారం చేశాడు.మనుస్మృతి పురాణేతి హాసాలలో ఇలాంటి సూచనలేక పోలేదు. కాని ఈ సూత్రాన్ని బ్రాహ్మణులకు మాత్రమే అన్వయించాలని మనవార న్నారు. నాగార్జునుడు అలాకాక మరణదండన పరిహరణం సర్వసామాన్యం కావాలని బోధించాడు."లెస్సగా పరామర్శించి,లోతుగా తెలిసికొని ప్రదుష్టులను, ఘటకులగు నరులను చంపక పీడించక, రాజ్యా న్నుంచి బహిష్కరించు" అని శాతవాహన చక్రవర్తిని హెచ్చరించాడు. ఆనాడతడు చాటిన సంస్కరణలను నేటికీ ఆచరించ లేకపోతున్నాము.

అంధులు, వ్యాధిపీడితులు, వికలాంగులు, అనాధులు, బిచ్చ గాండ్రు, అవిఘట్టితులై, అపరిభూతులై, యితరులతో సమంగా అన్న పానాలు పొందునట్లు చేయటం రాజధర్మమని చెప్పాడు. అర్థింపక పోయినా, అన్యరాజ్య సంస్థానాలలో వున్నా, కోవుదలైన సత్పురుషులను అనుగుణ సత్కారాలతో రాజు ప్రోత్సహించాలని అతడు సూచించాడు.

దీనినిబట్టి నేటి నోబెల్ బహుమానాలవంటి వానిని యేర్పరచాలని ఆనాడే నాగార్జునుడు ఊహించాడన్నమాట.

మత విషయంలో ఇతడు సాగించిన ప్రబోధం ఆధునికయుగానికి కూడా శిరోధార్యం. "మతవిషయంలో సత్యం గ్రహించటం దుష్కరం కాబట్టి ఉపేక్ష వహించడం మేలు. ఉపేక్ష పాపంకాదు. ద్వేషమే పాపం. ఈ ద్వేషం వల్ల శుభం కలుగదు. ఆత్మకాములైనవారు ఉపేక్ష చేత తమ ఆత్మను రక్షించుకోవాలి" అని అతడు రాజునకు ఉపదేశించాడు. దీనినిబట్టి చూస్తే ఆనాడే మత ప్రసక్తిలేని పరిపాలనను అతడూహించి ప్రచారం చేశాడా అని అనిపిస్తుంది.

నాగార్జునుని విశిష్టతను చాటే విశేషం మరొకటుంది. ప్రాచీన కాలంనుంచి తమ మత సిద్ధాంతాలను అంగీకరించని వారినందరిని నాస్తికులని నిందించటం పరిపాటి. ముఖ్యంగా మాధ్యమికుల విష యంలో ఇది తీవ్రరూపం వహించింది. ఇటీవల ఒక అద్వైత పండి తుడు మాధ్యమిక వివాదాన్ని గూర్చి ముచ్చటిస్తూ మీరు నాస్తికులని మాధ్యమికులపై నిందారోపణ చేస్తే నాగార్జునుడు కాని, చంద్రకీర్తిగాని దానిని త్రోసివేయలేదని వ్రాశాడు. ఇది కేవలం సాహసం అనే అనాలి. ఎందుకంటే నాగార్జునుడే స్వయంగా రత్నావళిలో యిలా వ్రాశాడు–

**లోభ వ్యాపాద నాస్తిక్యా**
**దృష్టీనాం పరివర్జనమ్**
**ఏతే కర్మపథా శుక్లాః**
**నాస్తికో దుర్గతిం యాతి**
**సుగతిం యాతి చాస్తికః**
**యథాభూతపరిజ్ఞానాత్**
**మోక్షమద్వయ నిశ్రితః** **1–57**
**వినాశయతి దుర్జ్ఞాతో**
**ధర్మో ఽయ మనిపశ్చితమ్**
**నాస్తితా దృష్టిసమలే**
**యస్మాదస్మిన్ నిమజ్జతి** **2–19**

ఈ విధంగా నాస్తికతను పూర్ణంగా నిరసించటమే కాక నాగా ర్జునుడు ఈ సమస్యను ఆమూలాగ్రం పరిశీలించి హేతువాదు లందరికి అంగీకార్యమైన ఉత్తమోత్తమపరిష్కారమార్గం సూచించాడు. అదేమంటే కర్మకు ఫలం ఉండదనేవాడు నాస్తికుడు. ఫలం ఉంటుం దనేవాడు ఆస్తికుడు. వివిధ మతాలకు సమన్వయం కుదిర్చి ద్వేషం పరిహరించాలంటే యింతకన్నా మేలైన మార్గం ఏమున్నది ? ఈ నిర్వచనం ప్రకారం చెప్పవలసివస్తే నేటి కమ్యూనిస్టులుగూడా తాము నాస్తికులమని చెప్పుకోగలరా ?

నాగార్జునుడు కేవలం జ్ఞానశూరుడేకాక, కార్యశూరుడు గూడా. శుష్కతర్కాలు, క్రియా శూన్యోపదేశాలు, మెట్టవేదాంతాలు, కుహనా

తపఃక్రియలు ఆయనకు గిట్టవు. అందువల్లనే అతడు యిలా అన్నాడు. "కేవలశరీర తాపనం వల్ల ధర్మం నెలకొనదు. దానివల్ల పరద్రోహం అంతరించదు. పరులకు అనుగ్రహం వాటిల్లదు. దాన శీలక్షమాస్పష్ట మయిన సద్ధర్మ పథం అంగీకరించక కాయక్లేశం అంగీకరించి దండకో త్పథాలు పట్టి పోయేవాడు, క్లేశవ్యాలావలీఢాంగుడై అనంతజన పాదపము, ఘోరము అయిన సంసారాటవిలో సుదీర్ఘం వసిస్తాడు".

నాగార్జునునకు తత్వశాస్త్రంలోను, సాంఘికోద్యమంలోను మాత్రమే కాక సంస్కృత వాఙ్మయంలో కూడ విశిష్టస్థానం ఏర్పడుతుంది. అతనికి పూర్వం శాస్త్రగ్రంథాలు సూత్రబద్ధాలై ధారణయోగ్యాలుగా ఉండేవి. అర్థగ్రహణకు వాని భాష్యాలు తోడ్పడుతుండేవి. కాబట్టి సూత్రపద్ధతిలో శబ్దలాఘవమేకాని సుబోధకత్వం మృగ్యం. భాష్యపద్ధతిలో అర్థసు బోధకత్వమే కాని ధారణాసౌలభ్యం లేదు. సూత్రపద్ధతిలోని శబ్దలా ఘవం. ధారణా సౌలభ్యమూ, భాష్య పద్ధతిలోని అర్థసుబోధకత్వము, వివరణము ఏకత్రితం చేయటానికి అతను నూతన మార్గం అవ లంబించి కారికారచన పద్ధతిని మొట్టమొదటగా సంస్కృతంలో ప్రవేశ పెట్టాడు. అతని తర్వాతనే సంస్కృతంలో కారికారచన బహుళ ప్రచారం పొందింది. సాంఖ్య కారికలు, గౌడపాద కారికలు మున్నెనవి అతని రచనలకు తరువాతనే వెలువడ్డవి. కాబట్టి కారికారచనయందు అగ్ర తాంబూలం నాగార్జునునిదే. ఇంతేకాదు కావ్యభేదాలలో ఒకటిగా ధ్వన్యాలోకాదులు పేర్కొన్న పరికథకు గూడా శ్రీకారం చుట్టినవాడు నాగార్జునుడేమో ?

ఇలా వివిధ రంగాలలో అనల్పకృషి చేసిన నాగార్జునుని కీర్తి రోళ్ళా, రోకళ్ళా పలికింది. స్వతంత్ర విచారశక్తి ఉన్న ప్రతి మేధావి నాగార్జునుని కృతులను దూషించటమో భూషించడమో చేశాడేకాని ఔదాసీన్యం వహించలేదు. దొరుకుతున్న గ్రంథాలను బట్టి చెప్ప వలసివస్తే అతని వాదాన్ని భూషించిన వారికంటే అపార్థం చేసికొని దూషించినవారి సంఖ్య మెండు. ఒకవిధంగా అతను వివిధ దేశాలలో ప్రామాణికత్వం సంపాదించాడు. ఇది మరొకవిధంగా అతని కీర్తికి అవరోధమే అయినది. ఎందుకంటే తమ కృతులగు ప్రామాణికత్వం సంపాదించాలని పెక్కుమంది తమ రచనల కర్తృత్వం నాగార్జునునకు అంటగట్టారు. అందువల్ల నాగార్జునుడు ఏయే గ్రంథాలు వ్రాశాడో నిస్సందేహంగా నిర్ణయించటం కష్టం. అతడు 24 గ్రంథాలు వ్రాసి నట్లు చైనా త్రిపిటకాలు పేర్కొంటున్నవి.

నాగార్జునుని ప్రధానకృతులు ఆరని బూష్టను వ్రాశాడు. అవి 1. మూలమాధ్యమిక కారికలు 2. శూన్యతాసప్తతి 3. యుక్తిషష్టిక 4. విగ్రహ వ్యావర్తిని 5. వైదల్యసూత్రము ప్రకరణము 6. వ్యవహారసిద్ధి

## మూలమాధ్యమికకారికలు

అద్వైతులకు బ్రహ్మసూత్రాలు ఎలాంటివో మాధ్యమికులకు ఈ కారికలు అలాంటివి. ఇందులో మొత్తం 27 అధ్యాయాలు 448 కారికలు ఉన్నవి. ప్రతి అధ్యాయం ఏదో ఒక పదార్థాన్నో వాదాన్నో పరీక్షిస్తుంది. వీనికి నాగార్జునుడు, బుద్ధపాలితుడు, భావవివేకుడు, గుణమతి, స్థిరమతి, చంద్రకీర్తి, గుణశ్రీ మున్నెనవారు సంస్కృతంలో ఎనిమిది వ్యాఖ్యానాలు వ్రాశారు. చంద్రకీర్తి వ్రాసిన ప్రసన్నపద తప్ప తక్కిన వ్యాఖ్యలు కనిపించటంలేదు. వీని భోటభాషానువాదాలు మాత్రం దొరుకుచున్నవి.

పైన చెప్పిన గ్రంథాలేకాక నాగార్జునుడు మరికొన్ని కృతులు వ్రాశాడు. రత్నావళి, చతుస్తవము, ప్రతీత్యసముత్పాద హృదయం అనునవి నిస్సందేహంగా అతని కృతులే. ఉపాయహృదయం, మహా యాన వింశకం, అబుద్ధబోధకం, భవసంక్రాంతి, సూత్రవృత్తి, ప్రజ్ఞా దండం, ధర్మసంగ్రహం కూడా నాగార్జునుని రచనలుగా పేర్కొన బడ్డాయి. దీనిలో మహాయాన దశకం, భవసంక్రాంతి, సూత్రవృత్తి, నాగార్జునుని రచనలు కావచ్చును.

మహాప్రజ్ఞాపారమితా శాస్త్రము, ద్వాదశభూమిని భాషాశాస్త్రం. ద్వాదశనికాయముఖ శాస్త్రం, ఏకశ్లోక శాస్త్రం కూడా నాగార్జునుని రచనలేనని చైనా త్రిపిటకాలు చెబుతున్నవి. వీనిలో ఏ ఒకటీ సంస్కృత భాషలో లభించటంలేదు.

ఇవికాక రసరత్నాకరం మున్నెనవైద్య శాస్త్రాదిక గ్రంథాలు నాగార్జునుని పేరుతో కనుపిస్తున్నవి. వైద్యంతో ప్రజాసేవ చేసి నాగార్జు నుడు ప్రజానురాగం సంపాదించి ఉంటే వీనిని కూడా అతడే వ్రాశాడని చెప్పవచ్చును. కాని వైద్యశాస్త్రం తెలిసినవారికి మాధ్యమిక దర్శనం కాని, మాధ్యమిక దర్శనం తెలిసినవారికి వైద్యశాస్త్రం కాని సాధారణంగా తెలియవు. అందువల్ల రసరత్నాకరాదుల కర్తృత్వం ఇంకా పరిశీలించ వలసి ఉన్నది.

ఆర్య నాగార్జునుడు తన దార్శనిక గ్రంథాలు రాయక పోయి నట్లయితే ఈనాడు అతన్ని పేర్కొనవలసిన అవసరం లేదు. అతడు వైద్యగ్రంథాలు వ్రాసిఉన్నా, సాంఘిక రాజకీయాభివృద్ధికోసం బహుధా పాటుబడిఉన్నా వాటికి చారిత్రక ప్రాముఖ్యం తప్ప మరొక విశిష్టత లేదు. ఎందుకంటే ఈ విషయాల్లో ఆధునికయుగం ఎంతో అభ్యు దయం సాధించింది. నాటికీ నేటికీ వైద్యరంగంలో ఎన్నో నూతన విశేషాలు కనుగొనటం జరిగింది. అతని రాజకీయభావాలు నాడు ఉత్తమోత్తమాలు కావచ్చును కాని యివ్వాళ అవి సర్వసామాన్యాలు. పోతే అతని దార్శనిక భావాలు మాత్రం అలాంటివి కావు. విజ్ఞాన శాస్త్రంలో మనం ఎంతో పురోగమించి ఉండవచ్చును. కృతకోప గ్రహ

లకు భూచంద్రుల చుట్టూ ప్రదక్షిణం చేయవచ్చును. రేపు కుజగ్రహానికి పోయి సేద్యం చేస్తూ పంటతో తిరిగి రావచ్చును. నాడు కూడా అతని దార్శనిక భావాలు ఆలోచనీయాలే.

ఇంతకూ నాగార్జునుని దర్శనం ఏమి చెబుతున్నది ? అందులో ఉన్న విశిష్టత ఏమిటి ?

ఈ ప్రశ్నకు సమాధానం చెప్పకముందు ఒక విషయం గ్రహిం చాలి. అతని దర్శనం అంత తేలికగా అర్థంకాదు. పైగా అపార్థం చేసికోవటానికి అవకాశాలు మెండు. ఈ విషయాన్ని నాగార్జునుడే అనుకరిస్తూ మాధ్యమిక వాదం అతి గంభీరమనీ ఒక మాత్రాన బోధ పడదనీ అన్నాడు. దుర్భుక్తమైన అన్నం విషమై హాని కలిగిస్తున్నట్లే దుర్జ్ఞాతమైన మాధ్యమికవాదం ఘోర నీచస్థితికి కొనిపోతుందని అతడు హెచ్చరించాడు. ఇలాంటి క్లేశం ఉండటంవల్లనే వైదిక మతాను యాయులేమి, తదన్యులేమి అతనిని అర్థంచేసికొన్నవారు చాలా తక్కువ. ఈ కారణంవల్ల శతాబ్దులనుంచి మాధ్యమిక వాదం దూషణకు పాల్పడుతూ వచ్చింది.

## మాధ్యమిక వాదం

నాగార్జునుని వాదం మాధ్యమికవాదమనీ, శూన్యవాదమనీ, అద్వయ వాదమనీ, ప్రతీత్య సముత్పాదవాదమనీ, అజాతవాదమనీ పిలవబడుతున్నది. కేవలం శబ్దాన్ని బట్టి యీ వాదాన్ని అర్థం చేసికో వటానికి పూనుకుంటే అపోహలకు పాల్పడకతప్పదు.

నాగార్జునుని సిద్ధాంతం యుక్తిమీద ఆధారపడుతున్నదేకాని వైదిక దర్శనాలవలె శ్రుతిమీద ఆధారపడటంలేదు. ఇక ఈ యుక్తి ఇతరులను సంస్కరించి ఒప్పించటం కోసం కాక ఎవనికి వాడుగ తత్త్వం గ్రహించ టానికి ఉద్దేశింపబడ్డది. మాధ్యమిక మతంలో యుక్తిఆధ్యాత్మిక జుగుప్స.

మానవుడు తన జీవితంలో విభిన్నానుభవాలు పొందుతుంటాడు. ఈ అనుభవిస్తున్న అవస్థలలో ఒకప్పుడు ఏది సత్యం ? అన్న జిజ్ఞాస అతనిలో అంకురిస్తుంది. ఈ అంకురం తల యెత్తనంతవరకు అతనికి కనువిప్పు కలుగదు. అపుడే అతడు ఆలోచనకుపక్రమిస్తాడు. "అలా చెప్పుకొంటే యిందులో యీ చిక్కులున్నవి ; ఇలా చెప్పుకొంటే యీ బాధలున్నవి" అని మానవుడు తనకుతాను పరామర్శించుకొంటాడు.

ఈ పద్ధతినే మాధ్యమికులు అనుసరిస్తారు. దీనినే ప్రాసంగిక పద్ధతి అంటారు. ఈ పద్ధతి ఒక దృక్పథాన్ని కాని, వాదాన్ని కాని నిరాకరించటానికి ఉపయోగపడుతుందే కాని ఒక సిద్ధాంతాన్ని వ్యవస్థా పించటానికి ఉపకరించదు. ఒక వాదం ఒక అర్థాన్ని ప్రతిపాదించి నపుడు ప్రాసంగిక పద్ధతి దానిని ఎదుర్కొని అందులోని అనిష్టాలను వెల్లడించి తద్వారా ఆ వాదాన్ని త్రోసివేస్తుంది. ఇలా చేయాలంటే నిరాకరించే వాదవిధానాన్ని పురస్కరించుకొని దోషాలను వెల్లడించ వలసి ఉంటుంది. ఉదాహరణకు న్యాయవాదపరామర్శం తీసికొందాం. ఆ న్యాయసిద్ధమైన అనుమానం చేతనే ఆ వాదమందలి దోషాలను చూపాలి ప్రాసంగిక పద్ధతి ఈ మార్గాన్నే అనుసరిస్తుంది. ఇక్కడ ఒకశంక కలుగవచ్చు. ఒక ప్రతిజ్ఞను మాధ్యమికుడు త్రోసి వేస్తున్నా డంటే తద్విరుద్ధ ప్రతిజ్ఞను అతడు అంగీకరించినవాడు కావటం లేదా?

రాజుగారి పెద్దభార్య పతివ్రత అంటే చిన్నభార్య పతివ్రత కాదనే కదా అర్థం. మాధ్యమికులు ఈ అర్థాన్ని అంగీకరించరు. రాజుగారి పెద్దభార్య ప్రవృత్తి తెలిసి ఉండవచ్చును. దానిని బట్టి ఆమెను పతివ్రత అనవచ్చును. చిన్నభార్య గుణగణాలు తెలియకపోవచ్చును. కాబట్టి ఆమె శీలాన్ని గూర్చి చెప్పకపోవచ్చును. అంతేకాని అగ్రమహిషీ ప్రశంసా కనిష్ఠ భార్యాగర్హణం ఉద్దిష్ట మనటం శాస్త్ర సమ్మతం కాదు. రెండు వస్తువులలో ఏదో ఒకటి ఉండటానికి వీలుండె ఒకటి లేదని తేలిపోతే విధిగా రెండవది ఉందని చెప్పవచ్చును. అంతేకాని పెక్కులు ఉండటా నికి వీలున్నపుడు, ఒకటి కాదు అనినంతమాత్రాన తద్విరుద్ధాన్ని అంగీ కరించినట్లు భావించరాదు. ఒక ఆవు తెల్లనిది కాదన్నపుడు అది నల్లనిదని అర్థం కాదు. అది పుల్లావు కావచ్చును, లేదా మైలావు కావచ్చును, లేదా దోరావు కావచ్చును. అలాగే తత్త్వం కూడా బహు విధాలుగ ఉండవచ్చును గదా ! అలాంటప్పుడు ఒక ప్రతిజ్ఞను కాదని నిరాకరించినంతమాత్రాన తద్విరుద్ధ ప్రతిజ్ఞను ఆమోదించినట్లు కాదు. ఉదాహరణకు ఒకడు సత్కార్యవాదాన్నే నిరాకరించాడనుకొందాం అంత మాత్రాన అసత్కార్యవాదాన్నే ఆమోదించాడని చెప్పటానికి వీలులేదు. సత్కార్యవాచ ప్రతిషేధం కేవలం తన్నిరాకరణాన్ని తెలుపుతుందేకాని దానికి విరుద్ధమైన అసత్కార్యవాద ఆమోదాన్ని తెల్పదు. ఈ ప్రతిషేధం కేవలం ప్రసజ్య ప్రతిషేధమే కాని విరుద్ధార్థ విధానం కాదు.

సామాన్యంగా ఏవిషయంలోనైనా దృష్టులేమి, అభిప్రాయలేమి, వాదాలేమి నాల్గు విధాలుగా ఉండవచ్చును. అంతకుమించి ఉండటానికి వీలులేదు. ఒకవేళ ఉంటే ఈ నాలుగింటిలో దేనిలోనో ఒకదానిలో అంతర్భవించక తప్పదు. 1. సత్కోటి 2. అసత్కోటి 3. సదసత్కోటి 4. అనుభయకోటి

## కార్యకారణ భావం

కార్యకారణ భావంలోకూడ ఈ నాల్గు దృష్టులే కనబడుతున్నవి. 1. సత్కార్యవాదం 2. అసత్కార్యవాదం 3. సదసత్కార్యవాదం 4. తదనుభయవాదం.

సత్కార్యవాదం కారణకార్యములకు అభేదాన్ని, అసత్కార్యవాదం భేదాన్ని, సదసత్కార్యవాదం భేదాభేదాన్ని, అనుభయ కార్యవాదం భేదాభేదాల అనుభయత్వాన్ని ప్రతిపాదిస్తుంది.

మాధ్యమిక వాదం ప్రసంగాపాదము గాన ఈ నాల్గువాదాలను నిరాకరిస్తుంది. కారణ కార్యములు అభిన్నాలని ప్రతిపాదించే సత్కార్య వాదాన్ని అంగీకరిస్తే కారణము, కార్యము ఒకటి కావాలి. ఈ పక్షాన తనవలన తానే పుట్టవలసివస్తుంది. ఉదాహరణకు విత్తనాన్ని మొలకను తీసుకొందాం. సత్కార్యవాదం విత్తనం, మొలక ఒకటేనని చెబుతున్నది. అప్పుడు విత్తనం నుంచి విత్తనం కాని, మొలకనుంచి మొలక కాని పుట్టవలసివస్తుంది. కాని విత్తనంనుంచి విత్తనం మొలక నుంచి మొలక కాని పుట్టటంలేదు. కార్యకారణాలు ఒకటే అయితే ఈ పుట్టుకకు అర్థం లేదు. పైగా దీనికి ఆది అంటూ లేక అనవస్థాదోషం ఏర్పడు తుంది. "దోషాలు రానీ, పోనీ; యిదే యథార్థం,తత్త్వం. ఇలా ఉన్న పుడు మనమేమి చేయగలం ?" అని అంటే, అన్న భక్షకులను అమేధ్య భక్షకులని చెప్పవలసివస్తుంది. వాస్తవానికి మానవుడు అన్నం తింటు న్నాడు కాని అమేధ్యం భక్షిస్తున్నాడా ?

## శ్రుతిప్రమాణ మంగీకరించని శూన్యవాదం

ఈ సందర్భాన సత్కార్యవాది తన అసమ్మతిని సూచిస్తూ ఇలా అడ్డుతగులవచ్చును. "మేమలా చెప్పటంలేదు. అనభివ్యక్తమైన దానిని కారణమనీ, అభివ్యక్తమైనదానిని కార్యమనీ చెబుతున్నాం. బీజంలో అంకురం అనభివ్యక్తంగా ఉన్నది. కాబట్టి బీజాన్ని కారణమంటున్నాం. బీజంవల్ల అంకురం అభివ్యక్తమౌతున్నది. ఇలా అభివ్యక్తమౌతున్న అంకురాన్ని కార్యమంటున్నాం" అని తన వాదాన్ని సమర్థించుకోవచ్చు. మాధ్యమికుడు యిది సమర్థనీయం కాదని త్రోసివేస్తూ ఇలా ప్రశ్నిస్తాడు. "మీరు చెప్పిన అనభివ్యక్తికి అభివ్యక్తికి భేదం ఉన్నదా లేదా, భేదం లేదంటే ఇంతకుముందు చెప్పిన దోషాలన్నీ వెన్నాడుతూనే వున్నవి. ఉన్నదంటే అసత్కార్యవాదులౌతున్నారు కాని సత్కార్యవాదులు కావటం లేదు. కాబట్టి తమ సత్కార్యవాదం ఆదరణీయం కా"దని పెదవి విరుస్తాడు.

## అసత్కార్యవాద ఖండన

పోనీ అసత్కార్యవాదం అంగీకరించటానికి వీలౌతుందా ? కారణం వేరు, కార్యము వేరని నైయాయిక వైశేషికాదుల సిద్ధాంతం. ఇదే యథార్థమైతే కారణానికి కార్యానికి సంబంధం ఏర్పడటానికి వీలులేదు. అపుడు దేనినుంచి ఏదైనా కలగవచ్చును. ఇసుక నుంచి తైలం, గండ శిలాగుళికలనుంచి అంకురాలు, వ్రణం నుంచి క్షీరం, స్తనం నుంచి చీము పుట్టవలసివస్తుంది. కాబట్టి ఇది సమ్మతం కాజాలదు.

ఈ సందర్భాన అసత్కార్యవాది ఇలా అనవచ్చును. "అయ్యా ! మీరు తొందరపడుతున్నారు. కార్యకారణ భావం నియమరహితమని మేము చెప్పటంలేదు. ఏది విధిగా ముందుగా ఉండటంవల్ల మరొకటి తరువాత కలుగుతున్నదో, ఏది లేక ఈ మరొకటి ఉండదో ఆ మరొక దానిని కార్యమంటున్నాం. దేనివల్ల ఉత్తరకాలంలో కార్యం కలుగు తున్నదో, దానిని కారణమంటున్నాం. అంతేకాని నియమ రహితంగా ఉన్న వస్తువులకు కార్యకారణభావం మేము చెప్పటంలేదు. కాబట్టి మీ దూషణ మా వాదానికి వర్తించదు".

మాధ్యమికావతార కర్తయైన ఆచార్య చంద్రకీర్తి దీనిని ఇలా ప్రత్యుత్తరిస్తున్నాడు. ఇలాంటి కార్యకారణవాదిని ఈ విషయం అడగాలి. వరి మొలకకు గింజయే కాని గురిగింజ కారణం కాదు. వరిగింజకు మొలకయే కాని గురివెంద కార్యం కాదు. ఈ రూపం ఉన్న ఈ నియ మం దేనివలన కలుగుతున్నది ? అని ప్రశ్నిస్తే ప్రతివాది, నియమం కనిపిస్తున్నది కాబట్టి అని సమాధానం చెబుతాడు. ఈ నియమం ఎందుకు కనిపిస్తున్నది కాబట్టి ఉన్నది అని చెప్పవచ్చును. ఇలా చెప్పటం అంటే హేతువును చెప్పకపోవటమే. కాబట్టి అసత్కార్యవాది ఇంతకుముందు చెప్పిన దోషాలనుంచి తప్పించుకోలేడు. కాగా అసత్కార్యవాదం అంటే కారయోగ్యం కాదు.

## సదసత్కార్యవాద ఖండన

మరి సదసత్కార్యవాదం సమర్థనీయమా ? ఈ వాదాన్ని అను సరించి కార్యకారణాలకు ఒక విధంగా అభేదం, మరొకవిధంగా భేదం కలుగుతుంది. జైనులు హెగెల్ మొదలైనవారు ఈ వాదాన్నే ప్రతిపాదిస్తున్నారు. ఈ వాదంలో ఇంతకుముందు పేర్కొన్న వాద ద్వయంలోని దోషాలన్నీ పుంజీభవించి సాక్షాత్కరిస్తున్నవి. పైగా పరస్పర విరుద్ధ ధర్మాలు ఏక కాలంలో ఏకస్థానంలో ఉండటం అసంభవం. వెలుగు చీకట్లు పరస్పరం విరుద్ధాలు. ఈ రెండూ ఒకేచోట ఒకే కాలంలో ఉండవు. కాబట్టి కార్య కారణ భావానికి భేదాభేదం ప్రతిపాదించటం సమంజసం కాదే. వాస్తవానికి విరుద్ధ ధర్మాధ్యాస వంతమయిన ఏక పదార్థం కాదు. కాగా ఈ వాదం కూడా అనాదర ణీయమే అవుతున్నది.

## సదసదనుభయకార్యవాదఖండన

ఇక మిగిలినది సదసదనుభయ కార్యవాదం. ఈ వాదాన్ని ఎవరు ప్రతిపాదించారో తెలియక మొత్తముమీద హేతువు లేకుండానే కార్యో త్పత్తి జరుగుతుందని ఈ వాదం చెబుతున్నట్లు అర్థం చేసికొన వలసివస్తున్నది. ఇదే యథార్థమయితే నాటువేయకుండానే రైతు పంట కోసం సంచులు పట్టవలసివస్తుంది. పైగా వాదరీత్యా కూడా వ్యాఘా తం కలుగుతున్నది. వాదాన్ని ప్రతిపాదించేవారు హేతువు లేదని సమర్థించుకోవాలి. సమర్థనకై అతడు హేతువును ఉదాహరిస్తే ప్రతిజ్ఞాభంగం కల్గుతుంది. ఉదాహరింపక మానివేస్తే కేవల ప్రతిజ్ఞ వలన ప్రయోజనం కలుగదు.

కాగా ఈ నాల్గువాదాలలో ఏదీ సమర్థనీయం కాదు. ఆదరణీయమూ కాదు. ఐతే ఇంక దేనిని ఆదరించాలి. అన్న ప్రశ్న కలగక తప్పదు. దీనికి మాధ్యమికవాదం చెప్పే సమాధానం ఒకటే ఉన్నది. ఏ వాదమూ సమర్థనీయం కాదు. కాబట్టి ఏవాదంలోనూ అభినివేశం పనికిరాదు. బోధిసత్వులు దృష్టినే పరిహరించాలి. దృష్టి అన్నది ఉన్నంత కాలం, సంసార నిమజ్జనోన్మజ్జనాలు తప్పవు.

ఇంతకుముందు పరీక్షించిన నాల్గువాదాలను సంగ్రహంగా చెప్పాలంటే సద్వాదమని, అసద్వాదమని చెప్పవచ్చును. ఈ రెండు వాదాలను త్రోసివేస్తున్నది కాబట్టి మాధ్యమికవాదానికి అద్వయవాదమన్న పేరు వచ్చింది. ఈ అద్వయసమగ్రార్థం ముమ్ముందు స్పష్టమౌతుంది.

మనం అనేక వస్తువులను చూస్తున్నాము. ఊహిస్తున్నాము. అనుభవిస్తున్నాము. ఈ వస్తువుల తత్త్వమేమిటి? మాధ్యమికుడు ఇవన్నీ ప్రతీత్యసముత్పన్నాలు అని అంటాడు. ముందు ప్రతీత్యసముత్పాద మన్న దానికి అర్థం తెలుసుకోవాలి. దీనికి చంద్రకీర్తి వివరణ ఎంతైనా తోడ్పడుతుంది.

అతడు చూపిన ప్రక్రియనుబట్టి ప్రతీత్య అని కాని ప్రతీత్యము అని కాని సిద్ధిస్తుంది. 'ఇ' అనునది గత్యర్థకధాతువు. 'ప్రతి' అనునది ఉపసర్గ. ఉపసర్గ వల్ల ధాతువు అర్థం అనేక విధాల మారుతుంది. ప్రతి అనుఉపసర్గతో గూడిన 'ఇ' ధాతువు యొక్క కృదంతరూపం ప్రతీత్యము. మిక్కిలి భంగురమయిన ఉత్పాదము ప్రతీత్యసముత్పాదము. ఈ అర్థం సర్వాస్తివాదులకేగాని మాధ్యమికులకు సమ్మతం కాదు. ప్రతి అనుఉపసర్గతో గూడిన 'ఇ' అను ధాతువుయొక్క ల్యబంత రూపం ప్రతీత్య. ఇది అవ్యయం. దీనికి పొంది అని అర్థం. పొంది పుట్టటమే ప్రతీత్య సముత్పాదం. అనగా కారణాలను పొంది పుట్టుట అని భావం.

ప్రపంచంలోని భావాలన్నీ కారణాలు పొంది కలుగుతున్నవి. ఉత్పత్తిస్థితిలయాలుకల దానిని భావమంటారు. ఈ భావాలు కారణాల వల్ల కలుగుతున్నవి. కారణాలు లేనప్పుడు కలగటం లేదు. ఉదాహరణకు ఘటాన్ని తీసుకొందాము. ఈ ఘటమనే భావం మట్టి, కుమ్మరి, సారె, దండము. మున్నైన కారణసామగ్రి ఉన్నప్పుడు ఏర్పడుతుంది. ఆ సామగ్రి లేనప్పుడు ఏర్పడదు. వాస్తవానికి ఈ ఘటం మట్టిలో లేదు. ఉంటే దానిని ఘట మంటామే కాని మట్టి అని అనము. అలాగే ఈ ఘటం కుమ్మరిలో లేదు. అతని వ్యాపారంలోనూ లేదు. అతని దండంలో కాని, సారెలో కాని లేదు. ప్రత్యేకంగా దీనిలో ఒక్కొక్క దానిలో లేకపోవచ్చును. కాని వాని సామగ్రిలో ఉండవచ్చును గదా అని తోచవచ్చును. నిజానికి వాని అన్నిటిలో గూడా లేదు. అంటే వాటినన్నిటిని కలిపి కుండ అనాలి. అంటున్నామా? లేదు. కాబట్టి వాని సామగ్రిలో లేదు. పైన పేర్కొన్న వానిలో ఎందులోనూ లేదు. కాబట్టి ఘటం నిఃస్వభావం. నిఃస్వభావం కాబట్టి శూన్యం.

ఘటంలాగానే సర్వభావాలు శూన్యాలు. కారణాలు పొంది పుట్టేది స్వభావం కలది కాదు. (ప్రతీత్యయద్ యద్ భవతి సహితావత్ తదేవ తత్ – మా.కా. 18–10) అప్రతీత్య సముత్పన్నమయిన ధర్మం కూడా లేదు. కాబట్టి అశూన్యమయిన ధర్మమూ లేదు. (అప్రమతీత్యసముత్పన్నో ధర్మోకశ్చిన్నవిద్యతే । యస్మాత్ తస్మాత్ అశూన్యోహి ధర్మః కశ్చిన్న విద్యతే ॥ మా. కా. 24–19) కారణాలు పొంది కలుగునది స్వభావంచేత శాంతమే కాని వేరొకటి కాదు. (ప్రతీత్య యద్ భవతి తత్ తత్ శాంతం స్వభావతః మా.కా. 7–16).

ఇక్కడ శూన్యమన్న శబ్దాన్ని సరిగా అర్థం చేసుకోవలసిఉంది. శూన్యమనగానే వ్యవహార బలాన్ని బట్టి లేనిదనికాని, వైనాశికమని కాని అర్థం చేసుకొంటాము. నాగార్జునునికి పూర్వీకులు, అర్వాచీనులు అలాగే అర్థంచేసుకొని మాధ్యమిక వాదాన్ని గ్రహించలేక లేనిపోని దురర్థాలు కల్పించి దూషించారు. కాని మాధ్యమికుల శూన్యశబ్దానికి అర్థం అది కాదు. కారణప్రత్యయాపేక్షమైనది అని అర్థం. అంతేకాని అత్యంత అభావమని అర్థం చేసుకోరాదు. కారణాలుంటే అది వుంటుంది, లేకపోతే ఉండదు. ఉదాహరణకు ప్రతిబింబం తీసుకొందాము. ప్రతిబింబం ఎప్పుడు కనిపిస్తుంది? అద్దం అనేది ఒకటి ఉండాలి. దానిముందు ఒక వస్తువుండాలి. అంతమాత్రాన చాలదు. కటికచీకటిలో ఈ రెండూ ఉన్నా ప్రయోజనం లేదు. వెలుగు కూడా కావాలి. అప్పుడు ప్రతిబింబం కలుగుతుంది. కాని దాని జ్ఞానం పొందటానికి ద్రష్ట ఒకడు కావాలి. అప్పుడే ప్రతిబింబం ఉన్నది అని చెప్పటానికి వీలౌతుంది. ఈ పేర్కొన్న కారణాలలో ఏది లోపించినా ప్రతిబింబజ్ఞానం కలుగదు గదా. మాధ్యమికులు ఇదే చెపుతున్నారు.

ఈ ప్రతిబింబజ్ఞానం పారమార్థికమా? అన్నది ప్రశ్న. కాదని నాగార్జునుడు అంటాడు. హేతు ప్రత్యయాలవల్ల కలుగుతున్నదంతా వ్యావహారికమే కాని పారమార్థిక సత్యం కాదని అతని సిద్ధాంతం. ఈ సిద్ధాంతం ఎలా కలుగుతున్నది?

ఇంతకుముందు ఘటోత్పత్తిని గూర్చి కొంత చెప్పుకొన్నాము. ఘటం మృత్తికలో కాని, కుమ్మరిలో కాని, అతని పనిలో కాని, అతని దండచక్రాదులలో కాని లేదు. కాబట్టి అది పారమార్థిక సత్యం ఎలా అవుతుంది?

ఈ విషయాన్ని స్థూలంగానైనా అర్థం చేసుకోవాలంటే ఈ క్రింది దృష్టాంతం కొంతవరకు తోడ్పడుతుందేమో. ఒక కొండను మనం దూరాన్నుంచి చూస్తాము. అప్పుడు మనకు ఒక ఆకారం కనుపిస్తుంది. దానిని సమీపిస్తున్న కొలది భిన్నభిన్న రూపాలు గోచరిస్తవి. అలాగే ఆ కొండను యితర దిశలనుంచి సమీపిస్తున్నప్పుడు గూడా పూర్వ రూపాల కంటె భిన్న రూపాలు గోచరిస్తవి. ఇలా అనంతరూపాలను పొందటానికి

వీలున్నది. కొండ, చూపరి, ఒకే స్వరూపం కలవారనుకొన్నా అనంత రూపాలను పొందటానికి అవకాశమున్నది. ఈ అనంతరూపాలలో ఏది సత్యం ? ఏది అసత్యం ? ఇక్కడ మళ్ళీ వెనుక పరిశీలించిన నాలుగు దృక్పథాలను ఏర్పడటానికి వీలున్నది. 1. అన్నీ సత్యాలు. 2. అన్నీ అసత్యాలు. 3. అన్నీ సత్యాసత్యాలు 4. అన్నీ అనుభయాలు. ఈ నాలుగు దృక్పథాలలో ఏదీ సమర్థనీయం కాదు. ఈ విషయం కార్యకారణ పరీక్షలో చూచాము.

ఇంతకంటె సులభగ్రాహ్యమైన మరొక దృష్టాంతం తీసుకొందాము. పచ్చద్దాల జోడు పెట్టుకొని చూచినప్పుడు వస్తుప్రపంచమంతా పచ్చగాను, నీలి అద్దాల జోడు పెట్టుకొని చూచినప్పుడు నీలంగానూ కనుపిస్తున్నది. కాబట్టి ప్రపంచం అద్దాలనుబట్టి మారు తున్నది. మనం స్వాభావిక నేత్రాలతో చూచినప్పుడు మరొక విధంగా కనిపిస్తున్నది. పచ్చద్దాలు ప్రపంచాన్ని పచ్చగా చూపించినట్లే మన కన్నులు కూడా ఉన్నదానిని మరొక తీరుగా చూపించవచ్చునుగదా ! కాని వ్యవహార బలాన్ని బట్టి కన్నులు చూసే రూపమే యదార్థమనీ, అద్దాలు చూపే రూపం అయదార్థమని భావిస్తున్నాము. వాస్తవానికి అద్దాలు చూసే రూపం ఎలాంటిదో అద్దాలు లేని కన్నులు చూసే రూపం కూడా అలాంటిదే. ఇలా అంటున్నప్పుడు రెండూ ఒకటేనని అర్థం చేసుకోరాదు. అద్దం ద్వారా పొందుతున్న రూపం కారణ సామగ్రివల్ల కలుగుతున్నది. కారణ సామగ్రిలోని భేదాన్ని బట్టి ఈ రెండు రూపాలలో భేదం ఏర్పడుతున్నది. ఈ భేదం నారింజ పండుకు, నిమ్మపండుకు ఉన్నటువంటిదే. నారింజపండు యథార్థమని నిమ్మపండు అయదార్థమనీ అనటానికి వీలున్నదా? కాని వ్యవహారం ఒకటే సత్యమని నమ్మేవారు మాత్రం నిర్దుష్టమైన కన్నుచూపేది మాత్రమే యధార్థమనీ, అద్దాలు మున్నైనవి చూపేవి అయదార్థాలనీ అంటున్నారు. ఇలా అనటమంటే నిమ్మ, నారింజ పండ్లకు ఒకటి యదార్థం, మరొకటి అయదార్థమని యనటమే ఇది హాస్యాస్పదం.

ఈ సందర్భంలో నిర్దిష్టమైన కనులు చేసే గారడీని కూడా కొంత విచారణపూర్వకంగా నాగార్జునుడు ప్రదర్శించాడు.

**ఇంద్రియై రుపలబ్ధస్య విషయ స్యాకృతిం మనః**
**ఉపలభ్య వ్యతీతస్య కల్పయున్ మన్యతే సుఖమ్ రత్నా 4-53**

ఇంద్రియలబ్ధమైన విషయాన్ని పొంది మనస్సు గతించినదానిని కల్పిస్తూ సుఖమని భావిస్తున్నది. అని శ్లోకానికి అర్థం. అయితే గతించిన దానిని మనస్సు కల్పిస్తున్నదా ? అన్న ఆశ్చర్యం కలుగుతుంది. సావకాశంగా ఆలోచిస్తే యిందులో విస్మయపడవలసినదియేమీ లేదు.

ఆధునిక పదార్థ విజ్ఞానశాస్త్రం ఏమి చెబుతున్నది ? వెలుగు కిరణం మనం చూస్తున్న వస్తువునుంచి బయలుదేరి కంటిపాపమీద పడాలి. ఆ పడినది, మనస్సుకు చేరాలి. వెలుగు వేగం ఎంత అధికమైనా బయలుదేరిన కాలానికి తేడా ఉన్నదని ఒప్పుకోవాలి. ఇది అత్యంత సూక్ష్మమని అనవచ్చును. ఎంత సూక్ష్మమైనా తేడా తేడాయే. అంటే పూర్వక్షణంలో బయలుదేరినది ఉత్తరక్షణంలో కాని మనస్సుకు చేరటంలేదు. అంటే పూర్వక్షణంలోని దానిని ఉత్తరక్షణంలో కాని చూడటం లేదు. అంటే మనం వర్తమానమని భావిస్తున్న కాలం వాస్తవానికి భూతకాలం.

ఈ విషయాన్ని ఆధునిక ఖగోళశాస్త్రం చక్కగా విశదీకరిస్తున్నది. కొన్ని నక్షత్రాలనుండి వెలుగు కిరణం భూలోకం చేరటానికి కొన్ని లక్షల సంవత్సరాలు పడతాయట. ఇప్పుడు భూలోకంలో ఉండి చూస్తున్న ఆ నక్షత్రం నశించి ఉండవచ్చునని శాస్త్రకారులంటున్నారు. కాబట్టి మనం వర్తమానమనుకుంటున్నది వాస్తవానికి వర్తమానం కాదు.

కన్నుమున్నైన యింద్రియాలవల్ల వ్యావహారిక జ్ఞానం కలుగుతున్నది. తల్లిదండ్రుల వల్ల పుత్రజననంలాగానే చక్షూరూపద్వయంవల్ల ఈ జ్ఞానం కలుగుతున్నది (రత్నావళి 4-55) ఇది పరమార్థం కాదు.

ఇక పరమార్థం ఎలాంటిదన్న ప్రశ్న వస్తుంది. ఇంద్రియాలవల్ల, మనస్సువల్ల కేవలం వ్యావహారిక రూపమే లభిస్తున్నది. కాని వాస్తవ స్వరూపం ఏమిటి ? నాగార్జునుడు ఇది శూన్యమంటాడు. శూన్యమంటే అభావం కాదు. అభావం వ్యావహారికమే కాని, పారమార్థికం కాదు. ఇది భావమూ కాదు. భావాభావమూ కాదు. అనుభయమూ కాదు. ఈ భావాదులన్నీ వ్యావహారికాలు. అచింత్యగుణం కావటంవల్ల తత్త్వం శూన్యమనటం సంభవిస్తున్నది. వాస్తవానికది వాచామగోచరం. దానికి కారణం లేదు. ఉత్పత్తిలయాలు లేవు. దానిని మాటలచే ప్రపంచించరాదు. అది నామజాత్యాది యోజనారహితం. అనానార్థం. అది నశించదు. పొందబడదు. అనుచిన్నం, అశాశ్వతం.

**అపరప్రత్యయం, శాంతం, ప్రపంచైరప్రపంచితమ్**
**నిర్వికల్ప మనానార్థమే తత్ తత్త్వస్యలక్షణమ్**
**అప్రహీణ మసంప్రాప్త మనుచ్ఛిన్న మశాశ్వతమ్**
**అనిరుద్ధ మనుత్పన్న మేతన్ నిర్వాణముచ్యతే**

**మా.కా. 189-9, 25-3**

ఈవిధంగా ప్రతిభావం కారణాలు పొంది కలుగుతున్నది. అందువల్ల అది ప్రతీత్య సముత్పన్నం. కారణాలవల్ల కలుగుతున్నదంతా వ్యావహారికం. కారణ వినిర్ముక్తమైనప్పుడది నిఃస్వభావం, శూన్యం. వాచామగోచరం ; ఇది పారమార్థికం. ఈవిధంగా రెండు రూపాలు ఏర్పడుతున్నవి. 1. వ్యావహారిక రూపం 2. పారమార్థిక రూపం. మొదటిది సాపేక్షం. రెండవది నిరపేక్షం. ఈవిభాగం మాధ్యమిక దర్శనానికి అత్యంత ముఖ్యం. ఈ రెండూ సత్యాలే. ఈ భేదం గ్రహించ

లేనివానికి మాధ్యమిక దర్శనం అడవిగాచిన వెన్నెలే అవుతుంది. అందుకనే నాగార్జునుడు మూలమాధ్యమిక కారికలలో యే ఉ నయో ర్న విజానంతి విభాగం.

**సత్యయోర్ద్వయోః ।**
**తేత తత్త్వం న విజానంతి గంభీరం బుద్ధశాసనే 24-9**

ఈ ప్రపంచమంతా ప్రతీత్యసముత్పన్నమే. ప్రతీత్య సముత్పన్న మైనదంతా వ్యావహారికమే. పరమార్థం నిఃస్వభావం. నిఃస్వభావం కాబట్టి శూన్యం. అంతేకాని ఈ ప్రపంచంలో ఏ వస్తువు, ఏ సిద్ధాం తమూ ఏ దృష్టీ పరమసత్యం కాదు. మాధ్యమిక కారికలు ఒక్కొక్క పరిచ్ఛేదంలో శాస్త్ర వ్యవహార ప్రసిద్ధమైన ఒక్కొక్క విషయాన్ని తీసుకొని అది ప్రతీత్య సముత్పన్నమనీ, అందువల్ల అది నిఃస్వభావమనీ, నిః స్వభావం కావడం వల్ల శూన్యమనీ నిరూపిస్తవి.

మాధ్యమిక సిద్ధాంతాన్ని అనుసరించి ప్రపంచంలోని ప్రతి వస్తువు సాపేక్షం. అంతేకాని పారమార్థికం కాదు. దేశకాలాలు, జీవేశ్వరులు, సంసారనిర్వాణాలు, ఇహపరాలు, స్థితిగతులు, ప్రమాణ ప్రమేయాలు, సదసత్తులు, సామాన్య విశేషాలు, బహిరంతరాలు, వ్యష్టిసమాజాలు, ధర్మాధర్మాలు, దేవదానవత్వాలు, శీతోష్ణాలు, జాతీయతాంతర్జాతీ యతలు మున్నైన సర్వద్వంద్వాలు జ్ఞాతజ్ఞానజ్ఞేయాలు, భూతభవిష్యత్ వర్తమానాలు, ఉత్తమ మధ్యమాధ్యమత్వాలు, సృష్టి స్థితి లయాలు, మున్నైన సకలత్రికాలు ; రూప శబ్ద గంధ రసస్పర్శ ధర్మాలు మున్నైన సకల బహుత్వాలు హేతు ప్రత్యయ సముత్పన్నాలు. ఆయా హేతువులు ఉన్నప్పుడుంటవి ; లేనప్పుడు ఉండవు. కాబట్టి భావాలు వ్యావహారికాలే కాని పారమార్థికాలు కావు. పరమార్థం వాచామగోచరం ; అచింత్యం. "చాలుంజాలు విచారముల్ సలుపుచో సత్యంబు సాధింతురా ?" అని మాధ్యమికులు ప్రశ్నిస్తారు.

ఇంతకూ పరమార్థం ఉన్నదా ? ఉంటే దాని లక్షణాలేమిటి ? లేకపోతే పరమార్థం అన్న పదానికే ప్రసక్తి కలుగదు కదా !

సత్తాసత్తలు పరస్పరాపేక్షకాలు. హేతు ప్రత్యయసముత్పన్నాలు. కాబట్టి అవి వ్యావహారికాలు. పరమార్థం సత్తన్నా, ఆసత్తన్నా భావమే అవుతుంది. భావం వ్యావహారికం. (ఉత్పాదస్థితి భంగాలకు పాల్పడు తుంది). కాబట్టి పరమార్థం సత్తనికూడా చెప్పడానికి వీలులేదు. కాని దానిని గుర్తించటం అవసరం. అందుకనే అది అనిరోధం, అనుత్పాదం, అనుచ్ఛేదం,అశాశ్వతం, అనేకార్థం,అనానార్థాం, అనాగమం, అనిర్గమం అని మాధ్యమికులు అంటారు. ఈ లక్షణాలతో చేసే సూచనకూడా వ్యవహారం ఆశ్రయించి చేసే సూచనే కాని పరమార్థం కాదు.

ఇలాంటి పరమార్థంనుంచి ఉత్పాదస్థితి భంగాలు కలిగిన జగత్తు ఎలా వచ్చింది? సంసార నిర్వాణాలకున్న సంబంధం ఏమిటి ?

సంసారనిర్వాణాలు విభిన్న పదార్థాలు కావని నాగార్జునుల సిద్ధాం తం. అందువల్లనే అతడు రెంటినికూడా శూన్యతా శబ్దంతో పేర్కొం టాడు. దృష్టి సమవచ్చిన్నమైనది సంసారమనీ, దృష్టి విరహితమైనది పరమార్థమనీ అతని తాత్పర్యం. అద్దము, ముఖము, మున్నైన హేతు ప్రత్యయాలు ఉన్నప్పుడు ప్రతిబింబం ఏర్పడుతున్నట్లే దృష్టి ఉన్నంత వరకూ ఈ జగత్తూ, ఈ సంసారం ఉంటుంది. హేతుప్రత్యయాలు లేనప్పుడు ప్రతిబింబం లేనట్లే జగత్తుకూడా ఉండదు. గారడీవాని కుందేలు వాస్తవానికి పుట్టటమూలేదు, గిట్టటమూలేదు. కనుకట్టువల్ల అది పుట్టినట్లుగా గిట్టినట్లుగా కనిపిస్తున్నది. అలాగే ఈ జగత్తు కూడా పుట్టటమూ లేదు గిట్టటమూ లేదు. ఇలా చెప్పటంవల్లనే మాధ్యమిక వాదానికి అజాతవాదమని పేరుకూడా వచ్చింది.

వ్యావహారికంగా జగత్తు ఉన్నది కదా ! ఇది యెట్లు వచ్చింది ? నాగార్జునుడు కాని, ఇతర మాధ్యమికులు కాని ఈ ప్రశ్నకు సమాధానం చెప్పలేదని కొంతమంది తమ అసంతృప్తిని వెలిబుచ్చుతున్నారు. కాని జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ సందేహం పటాపంచలు కాక మానదు.

నాగార్జునుల మతాన్ని బట్టి ప్రతిభావం హేతు ప్రత్యయాలు వల్ల పుడుతున్నది. కాబట్టి ఇది సాపేక్షం. సాపేక్షమైనదంతా వ్యావహారిక సత్యమే కాని పారమార్థిక సత్యం కాదు. ఈ జగత్తు కూడా ఒక భావం. ఈ భావం హేతు ప్రత్యయాల వల్ల పుడుతున్నది. కాబట్టి వ్యావహారిక మౌతున్నది కాని పారమార్థికం కావటంలేదు. విమర్శకులు కోరుతు న్నట్లు నాగార్జునుడు హేతు ప్రత్యయాలను వరుసగా పేర్కొంటాడే పో, దానివల్ల ప్రయోజనమేమిటి? ఆ హేతు ప్రత్యయాలు పారమార్థిక సత్యాలు కావు. కేవలం వ్యావహారికాలే అవుతై. నేడొక వాదం వస్తుంది. రేపీ వాదం అంతరించి మరొకవాదం వస్తుంది. అంతేకాక ఈ వ్యావ హారిక వాదం నిత్యం సత్యం కాదుగదా నిత్య సత్యాన్వేషణమే తత్త్వా న్వేషికి ముఖ్యం కాని వ్యావహారిక సత్యం కాదు. వ్యావహారిక సత్యం చాటవలసినవారు విజ్ఞానశాస్త్రకారులు కాని తత్త్వాన్వేషకులు కారు. ఒకవేళ నాగార్జునుడు జగత్తు ఎలా పుట్టిందో విజ్ఞానశాస్త్రకారుడై వివరించాడనుకొందాం. ఆ వివరణ వ్యావహారిక సత్యమే అవుతుంది కాని తత్త్వ ప్రతిపాదన కాజాలదు. వైశేషిక, సాంఖ్య అద్వైతవాదులు మున్నైనవారు సృష్టిక్రమాన్ని వర్ణించారు. నేడు ఆ వర్ణనలకున్న విలువ యేమిటి ? కేవలం కట్టుకథలే కదా !

అది అలా వుంచుదాము. డార్విన్ మున్నైన జీవశాస్త్రజ్ఞులు, భూగర్భ శాస్త్రజ్ఞులు, ఖగోళశాస్త్రజ్ఞులు సృష్టిని గూర్చి ఎన్నో వాదాలు లేవదీశారు. అవన్నీ పరమసత్యాలా ? భవిష్యత్తులో అవి యెన్ని సంస్కారాలకు పాల్పడాలో ఎవరు చెప్పగలరు? నిజానికి ఆ యా శాస్త్రజ్ఞులు ఏమిచెపు తున్నారు? ఈయా కారణాలను బట్టి యా యా అనుభవాలను బట్టి, ఈ యా విధంగా ఉండవచ్చునని చెపుతున్నారే కాని యిదే పరమ

సత్యమని చెపుతున్నారా? ఒకవేళ అలా చెపితే వారు విజ్ఞాన శాస్త్ర కారులేకాదు.

ఈ సాపేక్షతను, ప్రతీత్య సముత్పన్నతను గుర్తించే నాగార్జునుడు కాని మాధ్యమిక వాదంగాని సృష్టి క్రమాన్ని గూర్చి యెలాంటి కట్టు కథలు అల్లలేదు. ఒకవేళ అల్లి ఉంటే వారు ప్రతీత్యసముత్పాదవాదులై ఉండేవారు కారు. మరొక శంక:సర్వభావాలు ; నిఃస్వభావాలు కావటం వల్ల అవి శూన్యాలని కదా నాగార్జునుని సిద్ధాంతం. ఈ వాదాన్ని బట్టి మాధ్యమికవాదం గూడా ఒక భావమే.కాబట్టి అది శూన్యం.ఇక్కడ శూన్య శబ్దానికి వ్యావహారికము. ఆ పారమార్థికము అన్న అర్థం గ్రహించే ప్రశ్నిస్తున్నాము. మాధ్యమిక వాదం కూడా వ్యావహా రికమే అవుతున్నది.అప్పుడీవాదం ఇతరవాదాలకంటే ఎలా విశేషిస్తున్నది ?

ఈ ప్రశ్నను నాగార్జునుడు ముందుగానే గ్రహించి తన సిద్ధాంతాన్ని దీని కనుగుణంగా ఆమూలాగ్రం దిద్ది తీర్చుకున్నాడు. తనవాదం కూడా వ్యావహారికమే అని స్పష్టంగా చాటుతున్నాడు. హేతు ప్రత్యయాల వల్ల తన వాదం ఉద్భవించిందని అంగీకరిస్తున్నాడు. అంటే నాటి శాశ్వత వాదాన్ని ఉచ్ఛేదవాదాన్ని పురస్కరించుకొని తన వాదం వచ్చిందని, ఆ రెండు వాదాలలో దేనిని అంగీకరించక తన సిద్ధాంతం మధ్యే మార్గం త్రొక్కుతున్నదని తెల్పుతున్నాడు. అంతేకాని తాను పట్టిన కుందేటికి మూడేకాళ్ళని అతడు చెప్పటంలేదు.

అందువల్లే పారమార్థికంగా మాధ్యమికులకు ప్రతిజ్ఞాహేతు దృష్టాంతాలు, ప్రమాణాలు లేవనీ నాగార్జునుడు స్పష్టంగా చెప్పాడు. ఈ వాక్యాన్ని గూడా అపార్థం చేసికొని కానీ, ఈర్ష్యాద్వేషాలకు పాల్పడి గానీ ప్రమాణాలు అంగీకరింపని ఉన్మత్తులతో వాదమే లేదని కప్ప దాటుతో తప్పుకొన్నవారున్నారు.

తనవాదం వ్యావహారికమని చెప్పటమే కాక మాధ్యమిక సిద్ధాంతం పరమసిద్ధాంతంగా విశ్వసించేవానికి నివృత్తి అసంభవమనీ నాగార్జునుడు ముక్తకంఠంతో ఉద్ఘోషించాడు. భాష్యకారుడైన చంద్రకీర్తి ఈ అర్థాన్నే సోదాహరణంగా ఇలా వివరించాడు, పొరపాటున ఒకడు విషం మ్రింగాడనుకోండి. మ్రింగిన ఆ విషాన్ని కక్కించి ప్రాణం రక్షించ టానికి అతనిచేత మరొక ఔషధం త్రాగిస్తాము. ఈ ఔషధం లోపలికి పోయి అచటి విషాన్ని బయటకు నెట్టివేసి తాను విషమైఅక్కడ కూర్చుంటే ఆ నిర్భాగ్యుణ్ణి ఏ వైద్యుడు రక్షిస్తాడు? ఏ మందు కాపాడుతుంది? అలాగే శూన్యతావాదం పరమ సిద్ధాంతమని నమ్మేవానిని ఏ వాదమూ రక్షింపజాలదు. అతనికెవడూ మోక్షభిక్ష ప్రసాదించలేడు.

ఇంత గట్టిగా మాధ్యమికులు ఎందుకని హెచ్చరించవలసి వచ్చిందా అని శంకించవచ్చును. కాని శూన్యతావాదం పరమసిద్ధాంత మని నమ్మేవాడు దానిని ఆ భావ ప్రాతిపదిక వాదంగా అర్థంచేసికోక తప్పదు. అలాంటి వానికి ధర్మాధర్మాలు కూడా లోపిస్తవి. అలాంటివాని కింకాముక్తి ఎలా కలుగుతుంది ?

మాధ్యమక వాద విశిష్టత ఏమిటి అన్న ప్రశ్న ఇంకా అలాగే ఉన్నది. జాగ్రదవస్థ, స్వప్నావస్థ ఈ రెండూ వ్యావహారికాలే. ఎందుకంటే రెండూ ప్రతీత్య సముత్పన్నాలు. అంతమాత్రాన జాగ్రదవస్థే స్వప్నావస్థ, స్వప్నావస్థే జాగ్రదవస్థ అని యెవడు వ్యావహారికంగా చెప్పడు. జాగ్రద వస్థలో అనుభవించిన అర్థాలు, యథార్థాలనీ, స్వప్నావస్థలోనివి ఆ యథార్థాలని చెపుతున్నాము. కారణమేమిటి? మొదటివి యుక్తి యుక్తాలు కావు. అలాగే మాధ్యమిక వాదం జాగ్రదవస్థార్థ సదృశం. ఇతర వాదాలు స్వాప్నికార్థసదృశాలు. యుక్తియుక్తం కాకపోతే మాధ్య మక వాదం ఆదరించవలసిన అవసరం లేదు. అంతమాత్రంచేత ఇతర వాదాలు నిర్హేతుకాలని భావించరాదు. ఇతర వాదాలకంటే మాధ్యమక వాదం సముచింతరం.

ఇప్పటికి మాధ్యమకవాదం యుక్తియుక్తంగాను కనిపించవచ్చు. రేపింతకంటే మిక్కిలి యుక్తి యుక్తమైనవాదం రావచ్చునుగదా ! అంటే దీనిని నాగార్జునుడు కాదనటంలేదు. తన వాదం పరమ సత్యంగా స్వీకరించేవానికి ముక్తిలేదు అన్న వాక్యాన్ని జ్ఞప్తికి తెచ్చుకొన్నప్పుడు ఈ సంశయం నిర్మూలనం కాక మానదు.

ఈ శూన్యవాదంవల్ల ప్రయోజనం ఏమిటి ? నేటి ప్రపంచం వివిధ సమస్యలలో మునిగి తేలుతున్నది. జాతీయంగాను, అంతర్జాతీయం గాను పెక్కు సమస్యలు పేర్కొంటున్నవి. నాగార్జునుని కాలం వేరు, సామాజికస్థితిగతులు వేరు. సర్వం శూన్యమని గ్రహించినంత మాత్రాని క్షుధార్తులకు, కుక్షులు నిండవు ;స్పర్థలు సంఘర్షణలు తప్పవు; రోగాదికం వలన బాధ తొలగదు.

### జగత్తు ఒకప్పుడు పుట్టనూ లేదు మరొకప్పుడు గిట్టనూ బోదు

మాధ్యమికుడు ఈ వ్యావహారిక జగత్తును, భల్లోచిత ప్రపంచాన్ని త్రోసివేయటంలేదు. క్షుధార్తుడు, రోగపీడితుడు, రాగద్వేషాది వివశుడు, సంగీతం, నాట్యం, సాహిత్యం, మున్నెనవాటిని ఆనందించలేనట్లే అవిద్యాపీడితుడు శూన్యతావాదం గ్రహించలేడు. దానివల్ల మేలుకూడా పొందలేడు. సర్వం శూన్యమని జపించినంతమాత్రాన వ్యావహారిక వస్తువులు అదృశ్యం కావు. అద్దం మున్నెనవి ఉన్నంతకాలం ప్రతిబింబం లభిస్తున్నట్లే పంచస్కంధాలు వున్నంతకాలం ఈ ప్రపంచం ఉంటుంది. కాని శూన్యతావాదం గ్రహించినవాడికి, ప్రపంచం తత్త్వమేమిటో మనకు తెలుసు, కాని పిచ్చుకలు మున్నెన వాటికి దాని తత్త్వం తెలియదు. ప్రతిబింబత్వం తెలిసిన మానవుడు దానిని తిలకధారణ అలంకరణ మొదలైనవానికి ఉపయోగించుకొంటున్నాడు. ఆ తత్త్వం తెలియని పిచ్చుకలు మున్నెనవి రాగద్వేషాదులకు లోనై పెక్కుపాటులు

పడుతున్నవి. అలాగే మాధ్యమకతత్త్వం అర్థంచేసికొన్నవానికి, చేసికొనని వానికి భేదమేర్పడుతున్నది. ఇతరులతోపాటీ మాధ్యమికుడు జగత్తు కంటక మయమని అంగీకరిస్తాడు. కాని కర్తవ్యతా విషయంలోనే అతడు ఇతరులకంటె విశిష్టుడవుతున్నాడు. జగత్తును సంచరణ యోగ్యం చేయాలంటే రెండు మార్గాలున్నాయి.

1. జగత్తునంతా రత్న కంబళంతో కప్పటం
2. పాదుకలు ధరించటం

రెండవది చాలా తేలిక. అలాగే ప్రపంచాన్ని మార్చి భూలోక స్వర్గం స్థాపించాలని ప్రయత్నించేకంటే ముందుగా తన దృష్టిని మార్చు కొనటం చాలా తేలిక, కాబట్టి మాధ్యమక వాదం వ్యక్తిని ముందుగా తన దృష్టిని సంస్కరించుకోవాలని హెచ్చరిస్తున్నది.

ఇంతకూ వ్యక్తియందు మాధ్యమకవాదం ఎలాంటి సంస్కారం ఏర్పడాలని కోరుతున్నది ?

సంసార ప్రవృత్తికి ప్రధాన కారణాలు రెండు, ఒకటి ఆత్మ వ్యామోహం. రెండు కార్యవ్యామోహం. ప్రపంచంలోని సర్వానర్థాలకు ఆత్మవ్యామోహమూ మంచికి కార్యవ్యామోహమూ కారణం. కాబట్టి విజ్ఞుడైనవాడు "నా" అన్న విషబీజాన్ని ఒకేసారి కాకపోయినా క్రమంగా నైనా పరిహరించాలి. అలా చేయలేని వానికి నివృత్తిలేదు.

సర్వభావాలు వ్యావహారికాలే గాని పరమార్థికాలు కావని గ్రహిం చినవాడు. వానిని యితరులకోసం త్యజించ సంకోచించడు, ఒకవేళ సంకోచిస్తే వానికి ఇంకా శూన్యత సిద్ధించలేదనీ ఆత్మవ్యామోహం తొలగలేదనీ గ్రహించవచ్చు, అంతేగాక ధర్మమాత్సర్యం, లాభమా త్సర్యం, ఆవాసమాత్సర్యం, కుశలమాత్సర్యం, వర్ణమాత్సర్యం, అన్న పంచమాత్సర్యాలు ఉన్నంతకాలం ఆత్మవ్యామోహం ఇంకా చిగుర్చు తూనే ఉన్నదని గ్రహించాలి. కుల, మత, జాతి, భేదాలన్ని ప్రవర్తించే వాడు ఆత్మవ్యామోహ ఉపహతుడేకాని శూన్యతావాదతత్త్వం ఆకళించు కొన్నవాడు కాదు. అతడు పెడత్రోవ పడతాడు. ఇక్కడ ఒక సందేహం కలుగవచ్చు. సర్వభావాలు శూన్యాలయినపుడు కర్మలు కూడా శూన్యమే కదా ! అపుడు ధర్మాధర్మాలు పాపపుణ్యాలు కూడా శూన్యాలే. ఇంకా ధర్మం ఆచరించాలి, అధర్మం పరిహరించాలి, అన్న విధినిషేధాలు దేనికి ? "అన్నమయితేనేమిరా మరి సున్నమయితేనేమిరా, అందుకనే ఈ పాడు పొట్టకు అన్నమే వేతమురా" అని చెప్పటం కాదా !

ఇంత దూరం వచ్చిన తరువాత ఈ ప్రశ్న అసందర్భప్రలాపమే అవుతుంది. ఎందుకంటే సర్వభావాలు శూన్యాలంటే వ్యావహారికంగా అవి లేవని అర్థంకాదు. బీజానుగుణంగా అంకురం ఉద్భవిస్తున్నట్లు కర్మానుగుణంగా ఫలం వ్యావహారికంగా కలుగుతున్నది. సత్కర్మలకు సత్ఫలం, దుష్కర్మలకు దుష్ఫలం, వ్యావహారికంగా అనివార్యం. పార మార్థికంగా మాత్రమే సుకృత దుష్కృతాలు ఉండవు. అందువలననే శూన్యవాది సోపధి నిర్వాణం (జీవన్ముక్తి) పొందినా పుణ్యకర్మలను పరిహరించడు. దానికి స్వర్గనరకాలు ప్రాప్తిస్తవన్న రాగభయాలు హేతు వులు కావు. సంసారకూపంలో పడి మ్రగ్గుతున్న ప్రాణిలోకమందలి మహాకరుణే కారణం. ఇతరులకు తాను సాయం చేస్తున్నానని కాని తన కీర్తి భూలోకంలో సుస్థిరంగా యిల్లు కట్టుకొంటుందని కాని, స్వర్గంలో తనకు శాశ్వత నివాసం లభిస్తుందని కాని, తనవలన సాయం పొందుతున్న జీవలోకం తన్ను శ్లాఘించాలని కాని అతడు కాంక్షించడు. తన వలెనే సమస్త సత్త్వలోకం సంసారం తరించి నిర్వాణం పొందాలని ఆశిస్తాడు. ఈవిధంగా అతడు నిష్కామకర్మ ఆచరించవలసి ఉంటుంది.

ప్రతివాడు షట్పారమితలను ఆచరించాలి. దానం, శీలం, వీర్యం, క్షాంతి, ధ్యానం, ప్రజ్ఞ, పాటించాలి. మొదట రెండు పారమితలు సమాజాభ్యున్నతికి, తర్వాతి రెండూ వ్యక్తి అభ్యున్నతికి, ఆ తరువాతి రెండు పారమితలు మోక్షప్రాప్తికి తోడ్పడుతవి. మొదటి పారమిత లైదింటికి ప్రజ్ఞ నాయకత్వం వహించాలి. అంటే దానాదులు ప్రజ్ఞా చోదితాలై ప్రవర్తిల్లాలి. ఇచట 'ప్రజ్ఞ' అంటే యథార్థ జ్ఞానం, లేదా భూత పర్యవేక్ష.

పారమితలను గూర్చి వివరించక ముందే సామాజిక వైయష్టిక విషయాలలో మాధ్యమితుల అభిప్రాయం తేల్చుకోవాలి. సమాజం ప్రధానం వ్యక్తి అప్రధానమని ప్రతిపాదించే వాదాల్లోకాని తత్ విపరీత వాదాలలో గాని వ్యక్తి – సమాజాలకు తుల్య ప్రాధాన్యమిచ్చే వాదాల్లో గాని రాజ్యం కోసం పోరుదున్నాడు అన్నవాదాన్ని గాని తత్ విపరీత వాదాన్ని కాని మాధ్యమిక వాదం అంగీకరించదు. ఈ వాదాలన్ని వ్యావహారికాలు. ఆయాదేశ కాల పాత్రలను బట్టి పుడుతూ గిడుతూ ఉంటవి. ఈ వాదాల లాగానే మానవుడు స్వభావతః మంచివాడన్న సూత్రాన్ని పురస్కరించుకొని వెలువడిన వాదాలుగాని దుష్టుడన్న సూత్రాన్ని పురస్కరించుకొని వెలువడిన వాదాలు గాని మాధ్యమికుడు అంగీకరింపడు. సర్వభావాలు హేతు ప్రత్యయ సంజాతాలు కాబట్టి నిఃస్వభావాలు. మానవుడుకూడ హేతు ప్రత్యయ సంజాతుడే కాని అన్యుడు కాదు. కాబట్టి అతడు స్వభావంచేత శూన్యుడు అనిర్వచనీయుడే కాని అటు దేవుడూ కాదు. యిటు దానవుడూ కాదు.

ఈ విషయాలను గ్రహించినపుడు నేటి సమాజంలో మాధ్యమి కుడు ఏలా ప్రవర్తిస్తాడో స్థూలంగానైనా ఊహించుకోవచ్చు. 'నా' 'మా' అనువానికి తావుండదు. కాబట్టి అతడు దానశీలి కావాలి. కులమత జాతి దేశ భేదాలు పాటించక అతడు అందరికి తోడ్పడాలి. వీడు తీర్థికుడు. వీడు పంచముడు, వీడు శ్రావకయాన సమాశ్రితుడు, వీడు మహాయాన సమాశ్రితుడు కాబట్టి వీడు దానానికి అపాత్రుడు వీడు పాత్రుడు అన్న విషమబుద్ధి అతనికి కలుగరాదు.

## విశ్వమానవ కళ్యాణానికి మార్గం

మానవమాత్రుడైన ప్రతివాడు మాధ్యమకవాదానికి అధికారే. అంతమాత్రం చేత గ్రహణధారణ విచారణ తారతమ్యాలు లేవని అర్థంకాదు. వైద్యుడు రోగాన్ని బట్టి మందు వాడుతున్నట్టే, వినేయుని మానసిక, పక్వావస్థనుబట్టి మాధ్యమికుడు తన ఉపదేశాన్ని కొనసాగి స్తూంటాడు. మాధ్యమక దర్శనం ఏ ఉపదేశం చేసినా దానికి మాధ్య మాప్రతిపత్తే గమ్యం. అంతేకాని అపశూద్రాధికరణాలకు అందులో ఎక్కడా తావులేదు. బౌద్ధంలో శీలానికున్న ప్రాముఖ్యం సుప్రసిద్ధమే. ప్రతి మాధ్యమకుడు చతుర్ బ్రహ్మ విహారాలు అంటే మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష పాటించాలి. అద్వేషం, అలోభం, అమోహం అన్న త్రికుశల మూలాలను పొందాలి. సిద్ధాంత వైరుధ్యం తాండవిస్తున్న ఆధునిక యుగంలో అతడు తన దర్శనాన్ని బట్టి ఎలా నడుచుకోవాలో తేలికగా చెప్పుకోవచ్చు. అన్ని వాదాలు వ్యావహారికాలేగాని పారమార్థి కాలు కావు. మాధ్యమకవాదం కూడా సర్వపదవాచ్యాంతర్గతమే. కాబట్టి తనవాదమందలి దురభిమానంతో అతడు యితరవాదాలను ద్వేషించ గూడదు. సంసారంలో మునుకలువేసే సత్త్వకోటికి తోడ్పడే యే మార్గ మయిన రాగద్వేషాతీతుడై అతడు అనుసరించవచ్చు. తన శాస్త్రాలు చెప్పలేదని తన సంప్రదాయానికి విరుద్ధంగా ఉన్నాయని యెంచి ఆధునిక విజ్ఞానశాస్త్రం కనుగొన్న విషయాలను, సౌలభ్యాలను అతడు త్రోసివేయరాదు. వానిని అతడువిధిగా లోకసంగ్రహార్థం వాడుకొంటాడు. పైగా తన సిద్ధాంత మంగీకరించమని వానిని ద్వేషించటా నికి స్వపక్షాభిమానంతో చిందులు త్రొక్కటానికి అతనికి అధికారం లేదు.

వీర్యం క్షమ అన్న పారమితులు రెండు వ్యక్తి అభ్యున్నతికోసం ఉద్దిష్టాలు. జీవితం సుఖతరయాత్రగాదు. ఎన్నో ఆటుపోటులు కల్గు తుంటాయి. ఎన్నో సంక్షోభాలు ఎన్నో అంతరాయాలు సంభవిస్తాయి. కాబట్టి వానిని ఎదుర్కొనగలిగిన స్తోమత అవసరం. ఆ జీవికాభయం, శోకభయం, మరణభయం, దుర్గతిభయం, పర్షదసాధ్యభయం, అన్న పంచభూతాలను త్యజించాలి. ఈ భయాలను అధిగమించని వానికి తత్త్వవిచారంకాని పరైకాంత హితాచరణం కాని అసాధ్యం. పైగా తాను నిర్ణయించుకొన్న మార్గం గమించటానికి కూడ వీర్యం అవసరం.

పూర్వోక్త విషయాలను విన్న పిమ్మట యిలా అనిపించవచ్చు. అన్ని మతాలు, అన్ని వాదాలు మంచి పనులే చేయాలని చెబుతున్నవి గదా ! యింకా మాధ్యమికవాదంలో విశేషమేమిటి ? సర్వం ప్రతీత్య సముత్పన్నం, కాబట్టి షట్పారమితలద్వార అనిర్వచనీయమైన నిర్వాణం పొందడమే కర్తవ్యమనేవానికి దేశ కాలేశ్వరాభిమానంతో చిందులు త్రొక్కటానికి అతని దర్శనాన్ని బట్టి అధికారంలేదు. జీవేశ్వరాదులు నిత్యమనో, మిథ్యయనో శబ్దైక శరణులై బ్రహ్మసాయుజ్యమో, బ్రహ్మై క్యమో లక్ష్యంగా భావించేవానికి ప్రవర్తనలో వ్యత్యాసం లేదా ! మాధ్య మకుడు నివృతహృదయులు, శబ్దైక శరణులు సంవృతచిత్తులు. దేశ కాల పాత్రలను తెలిసి అధిగమించి మొదటివాడు చూడగలడు. రెండవ వాడు తన ప్రామాణిక గ్రంథ ఆవరణ దాటలేడు. ఇంతమాత్రం చేత నాగార్జునుడు నాటి సంఘాన్ని ఆచారాన్ని భావాలను విశ్వాసాలను పూర్ణంగా అధిగమించి సర్వకాల సర్వావస్థలకు అనుగుణమయిన స్థితిని తాను చూచి యితరులకు చూపాడని ఊహించరాదు.. ఆయన వాదమే ప్రతిభావం ప్రతీత్యసముత్పన్నమని మాధ్యమికవాదం కూడా అలాంటిదేనని ఘంటాపదంగా చెబుతున్నది. జీవేశ్వరులు శూన్యులని చెప్పినా అతడు వారిని వ్యావహారికంగా ఆమోదించాడు. అందువలననే అతనికి త్రికాయాలలోను షడ్గతులలోను జన్మ పరంపరలోను, పంచ బుద్ధులలోను,సప్తతథాగతులలోను, షోడశనరకాలలోను నమ్మకము న్నది. అందువలననే రత్నావళిలో అతడు ధర్మాస్పదం నిర్మించాలని మహాయాన నిందకులు వీచీ నరకంలో మ్రగ్గుతారని రాజుకు సూచించాడు.

మొత్తముమీద చెప్పాలంటే మాధ్యమిక వాదం సహేతుకవాదమే కాని ప్రాచీనులు అపవదించినట్లు నాస్తికవాదమూ కాదు, వైనాశిక వాదమూ కాదు. తార్కికంగా చెప్పవలసివస్తే శూన్యతావాదాన్ని ఖండించ లేము. నిజానికే ఆధునిక ప్రపంచ సమస్యా పరిష్కారానికీ, అంధ విశ్వాస విధ్వంసానికి విశ్వమానవ కళ్యాణానికి ఇంతకంటే మేలైన మార్గమేమున్నది?

Dr. C. MARGABANDHU

# AN UNIQUE AMULETIC PENDANT FROM NAGARJUNAKONDA

Pendants and amulets are generally worn on the person set within necklaces or in other ornaments. Sometimes they are worn alone, emphasising special significance.

Pendants in general belong to various types. Some are simple, while others are decorated. They may not have any specific significance; they were worn merely for their aesthetic beauty, as an ornament. But amulet has some special significance. They have shapes having some intrinsic value to the wearer. It is an object worn on the person for some magico- religious reason, i.e., to cure disease, to get strength, luck etc.

During the Early Historic Period (C 300 B.C.-300 A.D.) quite a variety of them were found throwing light on an aspect of ornament having some religious or devout purpose regarding the conventional rituals and beliefs of the times. This was a period during which there was growth and development of religious literature and were put to written shape. Hence many of the religious symbols were given iconic shape, with full meaning and content.

Large number of such amulets appear from the beginning of the Early Historic Period of about the third century B.C. and continue to the fifth-sixth century A.D.

One such amulet has been reported from Nagarajuna konda, the meaning and significance of which constitute the theme of the present paper.

During the course of his visit to the island Museum of Nagarjunakonda[1] the author had an opportunity to find this particular type of amulets among the excavated objects. It can be conveniently called "elephant face and trunk amulet" (PL.I) It is small and measures 2x1.5x0.5 cm., with a horizontal perforation at top. It is very light and can be comfortably worn on the person. It comprises of the broad front face of the elephant having the curved trunk below. The trunk is curved either on the left or the right side. More than two dozen of them were found at Nagarjunakonda excavations. All of them are reported from levels of the Ikshvaku Period (C.225-400 A.D.)

They bear neat finish, well fired, having thick red core. The back is flat and plain which evidently indicate that they were prepared from moulds. The finest of them are made from kaolin clay. Some of them bear thick red slip.

Some are plain, while a majority of them are decorated. The upper part in a few are richly decorated either by painting or incision. Painting is made in black over bright red surface consisting of a beaded design and dots divided by lines on the sides; in a few of them the bead-design spreads sideways divided by curved lines. Incised decoration consists of beads with raised ridges, in between bordered by lines.

The curved trunk has also been decorated with incisions and paintings consisting of rope indentations bordered by lines.

All of them have been perforated horizontally at top for hanging, evidently, it represented a central pendant

in a neck ornament. The curvature of trunk is so made as to be equal to the flat back of the top portion, so that it is not uneven and very unbalanced.

This amulet is quite unique in the sense that it has not been found reported in other sites. Not even sites contemporary to the period such as at Bahal, Bhokardan, Brahmapuri, Kondapur, Nasik, Nevasa, Paithan and Ter have yielded objects bearing this symbol. At Nagarjunakonda[2] it is found throughout the cultured levels of the Ikshavaku Period.

Though this type is absent in other sites representation of elephant in amulet is not uncommon. It comprises of the complete shape of the elephant with a horizontal perforation for threading. A few of them are known from Taxila.[3] They are made from glazed steatite and carnelian datable to the first and the third century A.D. Two of them have also been reported from Kausambi,[4] made in jasper and banded gate.

It is more due to the reason that it has not been found anywhere else, it becomes all the more important to evaluate its significance in the light of its occurrence at Nagarjunakonda.

An argument can be put forward in this respect. Since it represents elephant face and trunk only, the makers of the amulet had something more than elephant as their symbol. Since the amulet has been found decorated especially the front face and trunk, it is definitely an object of veneration and treated with religious respect. Since it is very small and light with a perforation at top, it was meant to wear on the neck as a pendant singly or in bead-necklace.

It is not impossible to trace out something more than the animal aspect in this amulet. Among the animal species elephant is big and of gigantic proportions that attracted the admiration of the people. It was perhaps depicted as a symbol on the amulets as a propitiatory measure invoking safety from the animal.[5]

It is well known that elephant is the vahana (Airavata) of Indra. Further, elephants of the four quarters are (dig-gajas) supposed to support heavens in the four directions of the compass.

In the Buddhistic[6] legend the future Buddha is said to have left Tusita heaven and was conceived by his mother Maya in a dream who saw him descend from the heaven in the form of a white elephant. A similar type of legend in also contained in the birth of Mahavira whose mother Trisala is reported to have had a dream of a four-tusked elephant when she conceived him.[7] In pre-Buddhist work Srisukta[8] there is a description of how Sri or Lakshmi is gladdened by elephant... bathed by elephant kings with golden vessels. She is essentially a goddess of Agriculture, the Mother-goddess bathing with the "Waters of life", to maintain the continuity of life cycle in the vegetative world. Many of the coins of the kings of Kausambi, Ayodhya and Ujjayini and also some of the rulers of North India of the first century B.C. and after, represent the figure of Gajalakshmi i.e., Sri or Lakshmi taking a bath assisted by two elephants.[9] Incidentally it should be pointed out that in ancient times an elephant was painted with sandal paste and led in a procession by men dressed as women with the hope that it would attract rains, i.e., the generative fluid which fertilizes the Universe.[10]

Further, in all the Early Buddhist Monuments (Bharhut, Bodhgaya and Sanci) her figure flanked by two elephants can be traced out as a favourite motif of the artist. As a matter of fact, elephant has been represented as a Vahana of Yakshis such as at Bharhut,[11] Mathura etc. All these are representations of elephant essentially as an animal and venerated either for its huge size or as a symbol of the life-giving force of nature and thereby associated with the Mother-Goddess, which is conceived as the prime source of life.

Hence nowhere during this period (C.300 B.C.-100 B.C.) is the elephant considered sacred or a semi-divine being to be worshipped. It is not clear, when the animal was elevated to a higher position, for by about the first and second century of the Christian era, the animal is invested with iconic features, since to this

లోని గన్నవరం గ్రామప్రజలు దండుపన్ను క్రింద 60 గద్యాణాలు చెల్లించేవారని స్థానిక రికార్డుల వల్ల తెలుస్తున్నది.

క్రీస్తుశకం 1507వ సంవత్సరం నాటి బెజవాడ శాసనం (ఎస్.ఐ.ఐ.వా-4 నంబరు 803 శాసనం) ప్రకారం సాళువ తిమ్మయ్య పెండ్లి సుంకాలను వీరనరసింహరాయల పుణ్యంగా గుత్తిసీమ, పెన్నబడిసీమలో రద్దు చేసినట్లు తెలుస్తున్నది. పన్నులు విధించేది దేశ ప్రజలందరి మీదనే అయినా ప్రత్యక్ష సుంకాలు గాని, పరోక్ష పన్నులుగా గాని అధిక భాగం కులరీత్యా వైశ్యుల పైన, వృత్తిరీత్యా వర్తకులపైనే పడేది. వైశ్యుల గురించి ప్రస్తావన ఏ రవ్వంత వచ్చినా వివరణ చెప్పవలసివచ్చినపుడు తీగ తీస్తే డొంకంతా కదిలిన చందమవుతుంది. చాతుర్వర్ణ విభజనలో వీరిది తృతీయ స్థానమయినా సమాజాన్ని నడిపిస్తున్నది వీరే ! చరిత్రలో వీరి గురించి ప్రస్తావనలు, సమాజంపై వీరి ప్రభావం, వారు చేసిన చేస్తున్న దానధర్మాలు చూస్తే ఆశ్చర్యం కలుగకమానదు.

## వైశ్య పాలకులు

ఆంధ్రదేశంలో వైశ్య శబ్దానికి పర్యాయంగా కోమట్లు, శెట్లు, శ్రేష్ఠి శబ్దాలు వాడకంలో ఉన్నాయి. అయితే కొందరు చరిత్రకారుల సిద్ధాంతం ప్రకారం కోమట్ల కులం వేరు, వైశ్యులు వేరు, కాగా శెట్టి శబ్దం కులవాచకం కాకుండా వృత్తి వాచకమైంది. కొందరి సిద్ధాంతం ప్రకారం ఆదిలో వైశ్యులు ఉండగా జైనమతంతో ప్రభావితులైనవారు కోమట్లు అయ్యారు. కోమటి శబ్దాన్ని మొదటిసారిగా భద్ర భూపాలుడు వ్రాసిన 'నీతిశాస్త్ర ముక్తావళి'లో కనిపిస్తుంది. ద్రాక్షారామ శాసనాల్లో చాలాచోట్ల 'డాకరేమికోమట్లు' లేదా 'డాకరేమి కోమటి' అని వస్తుంది. డాకరేమి అంటే ద్రాక్షారామం. ఇక్కడ అర్థం కాని విషయం ఒకటి ఉంది. డాకరేమి కోమటి అనేది కోమట్లలో ఒక శాఖ కావచ్చు. లేదా దాక్షారామానికి చెందిన కోమటి కావచ్చు. ఈ రెండింటిలో ఏది సమంజసమన్నది నిశితమైన పరిశోధనలో గాని నిర్ధారణ కాదు.

వైశ్యులు గురించి చెప్పేటప్పుడు 'శ్రేష్ఠి' శబ్దం కూడా వినవస్తుంది. ఉదాహరణకు చెప్పాలంటే నేటి పశ్చిమ గోదావరి జిల్లా పెనుగొండకు చెందిన మాధవశ్రేష్ఠి అనే ఒక వైశ్యప్రముఖునికి చెందని ఒక శాసనం (ఏ.ఆర్.ఇ.91) ఉంది.ఏమైనప్పటికి వైశ్య, శ్రేష్ఠి పదాలు రెండూ కుల వాచకాలు కాగా ఒకదానికొకటి పర్యాయంగా వాడబడినట్టు కనిపిస్తుంది.

వ్యాపారం అంతా వైశ్యులకు, కోమట్లకు లేదా శ్రేష్ఠులకు గుత్త కాకపోయినప్పటికీ ప్రధాన జీవనోపాధిగా ఉన్నట్టు కనిపిస్తుంది. ఎందువల్లనంటే బలిజలు, పెరికలు, గవరలు, తెలిక కులాలు కూడా వర్తక వ్యాపారాలను జీవనోపాధిగా ఎంచుకోవడం కనిపిస్తుంది. అంతేకాక వైశ్యులు, పెరికలు బలిజలు కులపురాణాలు వ్రాసుకొన్నారు. వైశ్యులు కన్యకాపురాణం వ్రాసుకొన్నప్పటికి అపారమైన సిరిసంపదలు కూడబెట్టుకొన్నందువల్ల వారికి కుబేర ప్రతిపత్తి కల్గింది. రాజపూజ్యత కూడా లభించింది. ప్రత్యక్షంగా పరిపాలనలో అనగా రాజరికం వెలగ బెట్టినవారు చాలా తక్కువ. అయితే ప్రభుత్వం నెరపిన వారికి వీరేమి వెనుదియ్యలేదు. ఈ సందర్భంగా అవచి తిప్పయ్యచెట్టి పేరు ప్రస్తావించక తప్పదు.

అవచి తిప్పయ్యశెట్టి అమలిన శివపూజా దురంధరుడు. ధీరగంభీమూర్తి. వ్యాపార కుశలుడు, ఆయన గురించి శ్రీ నాథమహాకవి తన హరవిలాసం కావ్యంలోని ఆశ్వాసాంత, ఆశ్వాస ఆరంభ పద్యాల్లో వేనోళ్ళ పొగిడాడు.

ఘందువా, ఢిల్లీ రాధాదిపట్టణముల

యలధిపతులు మౌళిదాల్చు రత్నాంకురంబు అవచి త్రిపురాంత కానీత

యవనపాత్ర సింహళ ద్వీప మండిత కృతఝరులు..... అని శ్రీనాథ మహాకవి తిప్పయ్య శెట్టిగారి పేరుకు ఆంధ్రసాహిత్యం నిలచి నంతకాలం శాశ్వతత్వం చేకూర్చారు. అవచి అప్పయ్యశెట్టిగారు చేసిన దానధర్మాలకు అంతులేదు. ఆయన చేసిన పుణ్యమే ఆయన వంశానికి కస్తూరి పరిమళాలు ప్రసాదించింది. నేటికి మనకు వినిపించే ఏ.వి.ఎం. ప్రొడక్షన్స్ అధినేతలైన మెయ్యప్పన్ చెట్టియార్ వంశం అవచి వంశమే !

## బెజవాడలో !

బెజవాడలో కనకదుర్గ శిథిలమండపం స్థంభంపైన శకవర్షం 1057 నాటి తొమ్మిదిలైన్ల శాసనం ఉంది. నేటి పశ్చిమ గోదావరి జిల్లా సోమిశెట్టి కుమారుడైన బోమ సెట్టికి గల అయిదుగురు పుత్రులు వేయించిన శాసనం అది. సోమిశెట్టి, కొమిరిశెట్టి, అతమశెట్టి, కామిశెట్టి, నామిశెట్టి బెజవాడ మల్లీశ్వరస్వామికి దీపారాధన కోసం 305 గేదెలను దానం చేశారు. శకవర్షం 1057 అంటే క్రీస్తుశకం 1135కి సమానం. అప్పుడు బెజవాడ త్యాగి వంశీకుల పాలనలో ఉండేది.

1. స్వస్తి శ్రీ శకవర్షంబులు 1057
2. చైత్ర బహుళ ఆదివారాన పెనుగొండ నాభిల
3. గోత్ర సోమిశెట్టి కొడుకు బోమశెట్టి కొడుకులు నామి
4. శెట్టి 5 గురు స్వస్తి శ్రీ చతుర్థశభువనాధీశ్వరుడైన వి
5. జెయువాడ మల్లీశ్వర శ్రీ మహాదేవరకు అర
6. దీపానకునిత్యసోలెండు నెయి కామసానిమారెబో
7. ని కొడ్కు వీరమర... పుత్రాను పౌత్రికంబు
8. న అచంద్ర తారకంబు నడుపువాండు

ఈ శాసన కాలంలో బెజవాడను విజయవాడ అనేవారు. ఆ కాలంలో నాభిలగోత్రోత్పవులైన వైశ్యుల ప్రభావం వర్తక, వ్యాపారాలు మీదనేగాక పరిపాలకులపైన కూడా అమితంగా ఉండేదనడానికి ద్రాక్షారామ భీమేశ్వరస్వామి ఆలయం తూర్పువైపు గోడమీదగల శాసనమే సాక్ష్యం. క్రీస్తుశకం 1138వ సంవత్సరం మాఘ బహుళ చవితిరోజున నాభిల గోత్రుడు సామిశెట్టి కొడుకు బొమ్మశెట్టి వేయించిన శాసనం అది. రవాణా చేసే విషయంలో ప్రభువుకు చెల్లించవలసిన సుంకంపై వివాదం వచ్చిన సందర్భంగా కుదిరిన పరిష్కారానికి సంతోషపడి భృగురేశ్వరదేవరకు తమ సంఘం తరపున వెండి పడిగలు సమర్పించినట్టు ఆ శాసనంలో ఉంది.

ద్రాక్షారామ శాసనంలో చెప్పిన నాభిలగోత్రుడు సోమిశెట్టి కుమారుడు బొమ్మశెట్టి బెజవాడ మల్లీశ్వరదేవరకు దానం చేసిన సోమిశెట్టి పుత్రులలో ఒకడు బొమ్మశెట్టి బహుశా ఆనాటి వర్తక సంఘానికి పెద్దనాయకుడై ఉండాలి. సుంకం చెల్లించే విషయంలో వివాదం రాగా నేటివలె వర్తకసంఘ ప్రతినిధులతో బొమ్మశెట్టి ప్రభువును కలుసుకొని చర్చలు జరిపి ఉండాలి. సంప్రదింపులు సఫలమైనందుకు కృతజ్ఞతాపూర్వకమైన భక్తిభావనతో వర్తక సంఘం పక్షాన స్వామివారికి వెండి పడిగలు సమర్పించారు.

## బెజవాడకు వైశ్య ప్రభువు

క్రీస్తుశకం 1214వ సంవత్సరం ప్రాంతాల్లో గొంటూరి పట్టపు మల్లిశెట్టి అనే వైశ్యకుల తిలకుడు పాలకుడుగా ఉండేవాడు. బెజవాడలో మల్లేశ్వరస్వామి ఆలయం ఉత్తర ద్వారా మండపస్తంభం మీద నాలుగులైన్ల శాసనం ఉన్నది. మొదటి పంక్తిలోని కొన్ని అక్షరాలు చెరిగిపోయాయి. మొదటి రెండు లైన్లు సంస్కృతంలోను, తరువాత రెండులైన్లు తెలుగులోను కనిపిస్తాయి.

శకవర్షం 1165కు సమానమైన క్రీస్తుశకం 1214లో శివరాత్రి పర్వదినం సందర్భంగా గొంటూరి పరువలమల్లిశెట్టి మల్లీశ్వరుని అఖండదీపానికి ఇరవై అయిదు ఆవులు దానం చేశాడు. ఈ దానాన్ని స్వీకరించినది రామనబోయని కుమారులు మా సెబోయడు. మెత్తు బోయడు. వీరు దానం స్వీకరించిన తరువాతస్వామివారికి అఖండదీపం ఎత్తించడానికి ప్రతినిత్యం మానెడు నెయ్యి పొయ్యాలి. ఈ శాసనపాలన ప్రతి గ్రహీతకు పుత్రపౌత్రానికంగా కొనసాగించాలని కూడా శాసనకర్త ఆదేశించాడు.

**శాసన మూలం :**

1. శ్రీ కాంతాధిప నాభీ, సరోజసంభవోద్భూత వైశ్యాన్వయాః దురిభూత్యాయుత -వ-నా1
2. ణమ్ముదువనాణ్యాః సూనురాసీత్తః పరాహన్నాహ్వాయ సత్సుతః పృధుయశోభూ మాంబికా నంనదః శకాబ్దములు 1163 నేంటి శివరాత్రినాం
3. డు పెనుగొండ శాసనుండ పెంటికుల గోత్రుండు గొంటూరి పరువల మల్లిశెట్టి మల్లీశ్వరమహాదేవరకు అఖండదీపానికిచ్చిన మొదాలు 25 వీనింజే
4. కొని రామనబోని కొడ్కులు మానెబోయుండు బుత్ర పౌత్ర క్రమాన నిత్య మానెందు నేతి పది నడుపువారు

ఈ శాసనంలో శాసన కర్త పేరు గొంటూరి పరువల మల్లిశెట్టి అని ఉంది. శాసనం ప్రకారం అతడు పెనుగొండ ప్రభువు. తండ్రిపేరు తిన్నగా తెలియడంలేదు గాని, తల్లిపేరు భూమాంబ, పెంటికలగోత్రుడు. సరిగా మరుసటి సంవత్సరంలో – అనగా శకవర్షం 1164కు సమానమైన క్రీస్తుశకం 1242లో మల్లిశెట్టి ద్రాక్షారామ భీమేశ్వరునికి అఖండదీపందానం చెయ్యడానికి సంబంధించిన శాసనం వేయించాడు.

అయితే ఆ శాసనంలో అతడి పేరు పట్టపుమల్లిశెట్టి తల్లిపేరు భూమాంబ గోత్రం పెంటికుల. ఇంతవరకు బెజవాడ శాసనం వేయించిన మలిశెట్టికి సరిపోతున్నాయి. అయితే ఇతడు పెనుగొండ శాసనకర్త అని ఉంది. అంటే పెనుగొండను రాజధానిగా చేసుకొని పాలించినవాడని అర్థమా? ఈ పరువల మల్లిశెట్టి ఇంటిపేరు గుంటూరివారు. వైశ్యులలో ఈ ఇంటిపేరు గలవారున్నారు.

శాసనకర్త అయినంతమాత్రాన పరిపాలకుడు కానక్కరలేదు. శాసనం వేయడానికి కారకుడు అన్న అర్థంలో మల్లిశెట్టి పెనుగొండ వాస్తవ్యుడై ఉండాలి. ద్రాక్షారామ శాసనంలో పట్టపుల్లిసెట్టి అని ఉంది.

సుప్రసిద్ధ చరిత్రకారులుతురగా కృష్ణమూర్తిగారి సిద్ధాంతం ప్రకారం 'పట్టపు' అనేది బిరుదవాచకం. అనగా ప్రధాన పాలకుని ప్రతినిధిగా పరిపాలన సాగించేవాడని అర్థం. ఇంతవరకు లభ్యమైన తెలుగుచోడుల శాసనాలలో 'పట్టపు' బిరుదవాచక గలవి రెండు లభ్యమయ్యాయని, వారిద్దరు బెజవాడ స్థానిక పాలకులనీ, ఆవిధంగా పట్టపు మల్లిసెట్టి బెజవాడ పాలకుడు కావచ్చునని కృష్ణమూర్తిగారి వాదన. అయితే ద్రాక్షారామ శాసనం (ఎ. ఆర్. నెం. 265–డిఆఫ్ 1893) దాఖలాగా ఈ మల్లిసెట్టి వైశ్యుడు కాడు. చతుర్థకులజుడై వుండాలి.

కూలంకషమైన పరిశోధనలోగాని నిర్ధారణ కాని పాలకుల కులగోత్రలు ఎక్కువగా వైశ్యులు, తెలుగు చోడులలో కనిపిస్తాయి. అందుకు కారణం చతుర్థకులజులలో కూడా సెట్టి నామాంతంగలవారు ఉండడమే! ద్రాక్షారామ శాసనం ప్రకారం మల్లిసెట్టి ఒరయూరు పురవరేశ్వరుడు అనగా చోడ వంశానికి చెందినవాడనిపిస్తున్నది.

చోడులు కరికాల చోడుని వంశానికి చెందినవారనీ, సూర్యవంశ క్షత్రియులని చెప్పుకోవడం వారికి పరిపాటి. స్థూలంగా చోడులు ద్రవిడచోడులు. చాలామందికి వరయూరు రాజధాని. రెండవ తెగ తెలుగు చోడులు. ఆంధ్రదేశానికి వచ్చి ఇక్కడే స్థిరపడి చిన్న చిన్న రాజ్యాలు ఏర్పరచుకొన్నవారు. వీరిని తెలుగుచోడులు అంటారు. ఈ తెలుగు చోడుల్లో లెక్కలేనన్ని శాఖలు ఉన్నాయి. ముఖ్యంగా కొణిదెనచోడులు బలమైనశాఖ బహుశా తమిళదేశం నుంచి నేటి ప్రకాశం జిల్లా అద్దంకి సమీపానగల కొణిదెనను కేంద్రంగా చేసుకొని పాలించిన తెగ. వీరిని కొణిదెన చోడులంటారు.

ఈ శాఖల గోల అటుంచి ద్రాక్షారామ శాసనాన్ని పరిశీలిస్తే పట్టపుమల్లి సెట్టి గుంటూరి చోడవంశానికి చెందినవాడై ఉండాలని బోధపడుతుంది. లేదా గుంటూరి ప్రభువుకు ప్రతినిధిగా బెజవాడను కేంద్రంగా చేసుకొని పాలించి ఉండాలి. అలాగాక బెజవాడ శాసనంలో చెప్పిన విధంగా మల్లిసెట్టి పెనుగొండకు చెందినవాడైతే వైశ్యుడై ఉండాలి.

**నానాగోత్రికుల శాసనం :**

మల్లీశ్వరాలయం ముందుగల స్థంభం మీద ఒకదాని తరువాత మరొకటి 42 లైన్లు గల రెండు శాసనాలు ఉన్నాయి. ఒకటి పృథ్విపైన గల నానాగోత్రీకులు వేయించిన శాసనం కాగా మరొకటి పినకూను తలాబత్తుని కూతురు మాచల్దేవి వేయించిన శాసనం. ఈ రెండూ ఏ సంవత్సరంలో వేయించిందీ, ఆ శిలపైన లేదు. అయితే ఈ ఆలయం లోనే మరోచోట పినకూనుతలాబత్తుని కూతురు శీరామాయ వేయించి క్రీస్తుశకం 1437వ సంవత్సరం నాటి శాసనాన్ని బట్టి మాచల్దేవి వేయించిన శాసనం కూడా కుడి ఎడమగా అదేకాలం నాటిదని చెప్పుకోవచ్చు.

మాచల్దేవి శాసనం వేరు. శీరామాయశాసనం వేరు. అయితే ఈ వేర్వేరు శాసనాలలో శాసనకర్తల తండ్రి ఒక్కడే (పేరునుబట్టి తండ్రి పినకూనుబత్తు అనుకోవచ్చునో లేక ఆ పేరును బట్టి తల్లి అనుకోవాలో తెలియదు. పినకూనుబత్తు అనేది స్త్రీ వాచకమో, పురుష వాచకమో అంతుబట్టదు) కనుక నానాగోత్రీకుల శాసనం కూడా 1437వసంవత్సరానిదో లేక అటు తరువాతదో అనుకోవలసివస్తున్నది.

పృథ్విపైన గల నానాగోత్రికులు అంటే ఎవరో బోధపడటంలేదు. బహుశా ఒక కులవర్గానికి చెందిన వ్యాపారవర్గం కాకుండా వ్యాపారమే వ్యావృత్తిగా పెట్టుకొన్న అనేక కులాలవారు ఒక వర్గంగా ఏర్పడి ఉండవచ్చును. అలాంటి వర్గం నానాగోత్రిక వర్గంగా పిలిచేవారేమో! తెలికలవలె వీరు కూడా బలమైన సంఘటిత దృష్టిగల వారై ఉండవచ్చు నని ఆ శాసనాన్ని బట్టి అర్థమవుతున్నది.

ఆ శాసనంలో ముందుగా కనిపించేది నానాగోత్రీకుల ప్రస్తావనం. బహుశా సంఘానికి చెందినవారంతా బెజవాడలో సమావేశమై తమదగ్గర ఉద్యోగం చేస్తున్నవారికి చెల్లించే జీతాల్లో రూపాయికి రెండు దమ్మిడీలు, పెళ్ళి చేసినట్టయితే రెంణంకాలు' ధర్మకార్యాలకోసం వసూలు చెయ్యాలని ఒప్పందం చేసుకొని ఉంటారు. ఒప్పందం తరువాత 33 లైన్ల శాసనం వేయించారు.

నానాగోత్రీకులకు పినకూనుబత్తుని మాచల్దేవికి సంబంధం ఏమిటో అర్థం కావడంలేదు. ఆమె తన పుణ్యంకోసం ఈ నానా గోత్రీకులకు అపారమైన తన ఆస్తిని దానం చేస్తూ వేయించిన శాసనం అందులో ఉంది.

**శాసనమూలం : (మొదటి ప్రక్క)**

1. బెజవాడ పాపవినాశెనదేవర



బెజవాడ పాపవినాశదేవరకు మాచలదేవి కొన్ని దానాలు చేస్తూ వేసిన శాసనం

2. కున్ను రుద్రపాదలకున్ను పృథివి
3. గల గోత్రవారు దండం
4. పెట్టి ఇచ్చిన ధర్మశాసనము - మా
5. కు అన్ని రాజ్యాలనుంగలవార్కి
6. ఆయాస్థానాల చెల్లిజీతానను
7. 1కి ద2న్ను పెండ్లి రెంణంకాలు మే
8. ళానను వోకపాలున్నూ ఇధర్మపు
9. పనులకును ఆ చంద్రార్కస్తాయి
10. గాను ఇస్తిమి ! ఇందుకు ఇంద్రకీ
11. లపర్వతమున్ను కృష్ణవేణ్యాను
12. మల్లికార్జున దేవరాను సాక్షి

13. బెజవాడ పాపావినాశనదేవ
14. ర రుద్రపాదాల స్తనాల ధర్మా
15. ల్కు పినాకూను తలాబత్తుని కూ
16. తురు మాచల్దేవి తనకు జెల్లి
17. ప్రతిక్షేత్రాలు ప్రాతూరను (పు)
18. పెట్టుండు క్షేత్రమును తాడేపల్లిజె
19. ని పుట్టెండు క్షేత్రమును పెనుం
20. బాకను పెట్టుండు క్షేత్రమున్ను గొల్ల
21. పూండిని పుట్టెండు క్షేత్రమున్ను నరుగూ
22. రిగ్రామానను పుట్టెండు క్షేత్రమూను
23. నున గ్రామానను పుట్టెండు క్షేత్రము
24. న్ను గుండాదల గ్రామానను పుట్టెండు
25. క్షేత్రమున్ను వెనకపద్ది గ్రామనను
26. పుట్టెండు క్షేత్రమును ఈ పరిగ్రామా
27. ల కేసరిపాటి పుదిపుట్ల క్షేత్రమున్ను
28. పృథ్వింగల గోత్రం వారికి బుణ్యము
29. గను ధారావోణిఇచ్చిన ధర్మశాస
30. నం మంగళమహా శ్రీ శ్రీ జేయున్
31. పట్టుమెట్ట గ్రామాన పుట్టెండు క్షే
32. త్రమున్ను పులుపాక గ్రామన
33. పుట్టెండు క్షేత్రమును
(రెండవ ప్రక్క తొమ్మిది లైన్లు ఉన్నాయి)
34. బెజవాడ మల్లేశ్వరదేవరు
35. నాలువాల్ల స్తానపతులున్ను పిన
36. కూను మాచబత్తున్కి ఇచ్చిన
37. శాసనం మల్లీశ్వర దేవరకు
38. ంగల గ్రామాలను పాపవినశి

### ఈ శాసనంలో చెప్పిన గ్రామాలు :

ప్రాతూరు (ప్రోటూరు),తాడేపల్లి (కొత్తూరు), పెనుంబాక (పెనుమ మాక), గొల్లపూడి(గొల్లపూడి -బెజవాడ ఇలాకా), నరూరు (నవులూరు), నున్న (నున్న),గుడుందల(గుణదల), వెనకపెద్ది(ఎనికెబాడు), పట్టుమెట్ట (పడమట),పులుపాక (పులిపాక) – ఇవన్నీ నేడు గుర్తించడానికి వీలైన గ్రామాలే. ఈ పది గ్రామాలలో చెప్పిన తాడేపల్లి బరాజ్‌ను ఆనుకొన్న తాడేపల్లి అయిఉండదు. మరొకమాట – పడమట అన్న గ్రామం అసలు పేరు పఠానుల పేటఅనీ, పఠానులు కాలనీగా ఏర్పాటుచేసు కొన్న గ్రామమని ఏ పండితుడు ప్రచారంలోకి తెచ్చాడో తెలియదు. అది కుహనా పాండిత్యంతో ఎవరో ఊహించి, తాను చరిత్ర తెలిసిన వాడనన్న కీర్తికోసం చేసిన సిద్ధాంతమేగాని మరొకటి కాదు.

ఈ దానం చేసిన మాచల్దేవి,మరో శాసనంలో చెప్పిన 'శీరామాయ' అప్పచెల్లెళ్ళయి ఉండాలి. వీరిద్దరు వృత్తిరీత్యా ప్రసిద్ధ నర్తకీమణులు. ప్రవృత్తిరీత్యా శివసాన్నిధ్యవర్తినులు. మాచల్దేవి శ్రీనాథమహాకవి క్రీడాభిరామలో చెప్పిన మాచల్దేవి అవునోకాదో ఈ శాసనం చెప్పడం లేదుగానీ, శీరామాయ శాసనంలో నాలుగు అందమైన రేఖాచిత్రాలు ఉన్నాయి. మాచాబత్తు అన్నపేరు క్రింద మృదంగం వాయిస్తున్న స్త్రీ రేఖాచిత్రం ఉన్నది. సూచిముద్రతో మాచల్దేవి బొమ్మ ఉన్నది. నిలబడి మృదంగం వాయిస్తున్న బొమ్మకింద మాచాబత్తుడు అని ఉంది. నాల్గవ చిత్రంపైన 'శిరమర్క' అన్నపేరు ఉంది.ఈ చిత్రం త్రిభంగిమలో కనిపి స్తుంది. నృత్యశాస్త్ర పరిశోధకులకు ఆసక్తిదాయకమైన శాసనం ఇది.

శీరామాయశాసనంలో తన దానాన్ని కాపాడిన వారికి తాను దాసదాసినని చెప్పుకొన్నది. ఇది శకసంవత్సరం 1359 సంవత్సరం శ్రావణబహుళ పంచమి సోమవారం నాడు వేయించిన శాసనం. శీరామయ తాను మల్లీశ్వరస్వామి గుడి బోగమునని చెప్పుకున్నది.

### బత్తినేని దానం :

ఇలాంటి శాసనమే మరొకటి మల్లీశ్వరాలయంలో ఉన్న విఘ్నేశ్వ రాలయం ముందుగల స్తంభం పైన ఉంది. శక సంవత్సరం 1381 బహుధాన్య మార్గశిర బహుళసప్తమి సోమవారం నాడు వేయించిన ఏడులైన్ల శాసనం అది. బెజవాడ మల్లీశ్వర మహాదేవనగురు కొలిచెడి బోగం బత్తినేని పెరారి కుమారుడు శ్రీగిరిభక్తుండు పృథ్వింగల గోత్రము వారి పుణ్యముగా మల్లీశ్వరాలయమునకు దక్షిణమున వినాయకదేవర గుడి కట్టించే సందర్భమున వేసిన శాసనం అది.

### మారిశెట్టి శాసనం :

అధమస్థితినుంచి ఉన్నతస్థితికి చేరడం అన్నది వ్యక్తులపరంగా ఆకస్మికంగా జరుగవచ్చు. ఏ లాటరీలోనో కోట్లకు కోట్లు రాత్రికి రాత్రే వచ్చి తెల్లారేసరికి కుబేరుడు కావచ్చును. తెల్లవారేసరికి మహాసంపన్నులుయాచకస్థితికి రావచ్చును. ఇది కోలా సాంప్రదాయం. ఇంకోలా జరిగినా జరగవచ్చును. నిజంగానే సిరితావచ్చిన వచ్చును. సలలిత ముగా నారికేళసలిలములాగా! అలా జరగడం నూటికి కాదు. కోటిలో ఒకరుంటారేమో! కానీ, ఒక కులానికి కులం మొత్తం సంపన్నంగా, సమాజంలో బలీయమైన వర్గంగా ఎదగడం అన్నది ఆకస్మికంగా జరగదు. కొన్ని వందల సంవత్సరాలపాటు క్రమక్రమంగా జరగాలి. ఇది సమాజంలో నిరంతరం జరిగే పరిణామం.

ఆంధ్రదేశ చరిత్రనే పరిశీలిస్తే ముఖ్యంగా నేటి కృష్ణ గుంటూరు మండలాల్లో ఈ పరిణామాలు స్పష్టంగా గోచరిస్తాయి. తాము క్షత్రియులమనీ, సూర్యవంశ సంభవులమనే, చంద్ర వంశోద్భవులమని ఎంత చెప్పుకొన్నప్పటికీ ఈ రెండు వంశాలు తన ప్రాబల్యాన్ని రెండువేల సంవత్సరాల క్రితమే కోల్పోయినాయి. అసలు ఈ మండలాలను పరిపాలించారని చెప్పబడుతున్న క్షత్రియులన్నవారు నిజంగా క్షత్రియులేనా అన్న అనుమానం కలుగుతుంది.

చరిత్ర తెలిసినంతవరకు కులపరంగా ముందుగా బెజవాడను పరిపాలించింది బ్రాహ్మణులు. వీరి పరిపాలన దాదాపు నాలుగు వందల సంవత్సరాలపాటు జరిగింది. ఎంత గొప్పగా సాగిందో క్రమంగా అంత నీచాన పడింది. పాలకులైన వాళ్ల సేవకులయ్యారు. లేదా సామంతులయ్యారు. లేదా దానాలు పట్టేవారయ్యారు. ఎనిమిదవ శతాబ్దం నుంచి పరిపాలన చతుర్థకులజులపాలైంది. అప్పటినుంచి బ్రాహ్మణులు నేటివరకు కోలుకోలేదు.

కాలచక్రభ్రమణంలో గడియారం ముళ్ళు రెండూ చండప్రచండంగా సూర్యుడు వెలుగొందే సమయానికి అనగా మధ్యాహ్నం పన్నెండు గంటలకు కలుసుకొంటాయి. ఎలా కలుసుకొంటాయో అలాగే ఒక వ్యక్తి లేదా కులం, బలం, తేజం, ధృతి తారాస్థాయిలో ఉంటుంది. మళ్ళీ సాయంత్రం ఆరు గంటలకు తలక్రిందులైనట్లు వ్యక్తి కులవర్గం స్థాయి అధమస్థితికి చేరుతుంది.

ఆంధ్రదేశంలో ముఖ్యంగా బెజవాడ ప్రాంతంలో బహుశా పదవ శతాబ్దం నుంచి చతర్థకుల ప్రభువుల పాలైంది. పరిపాలనలో ఉన్న తెలుగుచోడులలో చాలమంది బలిజ కులస్థులు. వర్తక వ్యాపార, వాణిజ్యాలలో ఈ కులస్థుల ప్రాబల్యం ఆధిక్యం అత్యధికమైంది. ఈ కులం ఆధిక్యత చూస్తే నేటి ఆంధ్రదేశంలో అత్యధిక ప్రాబల్యం గల కులంకంటే అనేక రెట్లు అధికంగా సంపాదించారు. వీరి కనుసన్నలలోనే అన్ని కులాలు అంతరించాయి. అదంతా ఒక ఆసక్తికరమైన విచిత్ర చరిత్ర.

మరొక ఆసక్తికరమైన విశేషమేమంటే తెలిక కులస్థుల ప్రాబల్యం. విజయవాడలో వారి ఆధిక్యం నేడు కాలగతమైపోయింది. ఇందు చారిత్రక కారణాలను అన్వేషించడం కంటే ఈ కులజులలో ప్రబలమైన ఆధిక్యభావమే మిగతా సమాజం నుంచి దూరం చేసింది. తమకంటే పైవారిని తమకంటే తక్కువగా భావించడం, తక్కువ వారిని దూరంగా ఉంచడంవల్ల కులవర్గాలలో ఏ వర్గంలోను ఇమడలేకపోయారు. అందువల్ల మహా అయితే మండలేశ్వరుల స్థాయికి మాత్రమే ఎదిగారు. నిజానికి ఇది సామాన్యమైన విషయం కాదు. అయితే వీరు ఉన్నతి, అధోగతి అనేవి అనివార్యమన్న సామాజిక వాస్తవాన్ని విస్మరించిన కారణంగా ఆధిక్యాన్ని కోల్పోయారు.

లారీడ్రైవర్ స్వయంకృషితో పది లారీలుకొనుగోలుచేసిన తరువాత యజమానిగానే వ్యవహరించాలి. అలాకాకుండా లారీడ్రైవర్‌గానే ఉంటూ సంపాదన పెంచుకోవాలంటే గౌరవ ప్రతిపత్తులు పోతాయి. తెలిక కులస్తులులాగా కొందరు బాగా సంపన్నులై రాజ్యాధికారం కూడా చేపట్టిన తరువాత కూడా నూనె గానుగ పట్టే వృత్తిని వదలలేదు. గానుగ సిద్ధాయం ఎవరికి చెల్లించాలి? గానుగ సిద్ధాయం అంటే గానుగ ఆడించేందుకు పన్ను. నిజానికి ఆ పన్ను వసూలు చేసే స్థాయికి ఎదిగిన తెలిక ప్రభువులు తాము కూడా చెల్లించేవారు. అంటే ఖజానాకు జమ చేసేవారు.

తెలికల పని గానుగ ఆడించడం మాత్రమే. ఈ నూనెను పిండిన వైశ్యులు కొనుగోలు చేసి అమ్మడం రివాజు. కాని తెలికలు స్వయంగా నూనె అమ్మడం ప్రారంభించారు. బలిజె కులస్థులలోను వైశ్యులలోను నూనె విక్రయించే వారంతా తెలికలపై కత్తికట్టారు. ఈ సామాజిక అంతర్మథనం 16వ శతాబ్దంలో మొదలైంది. క్రమంగా తెలికలు ప్రధాన జీవన వాహినికి దూరమయ్యారు. ప్రాబల్యం కోల్పోయారు. ద్రాక్షారామ భీమేశ్వర శాసనాలలో కానవచ్చే ఇమ్మడిశెట్టి, గోపిశెట్టి, ముత్తంశెట్టి వైశ్యుల్లో బలిజలో తెలియనంతటి స్థాయికి నేడు ఇంటిపేర్లు జటిలమయ్యాయి.

శ్రీ లంక వెంకటరమణ
డా॥ జి.వి. పూర్ణచందు

# కృష్ణాతీరంలో ఆధ్యాత్మిక తీవ్రవాదం

తాను పైకి రావాలంటే ప్రక్కవాడుఅణగారిపోవాలని అనుకోవడం మనిషికి సహజమేమో! ఒకవేళ ప్రక్కవాడు తాను అనుకొన్నట్లు పతనం కాకపోతే అతడిని అణగద్రొక్కడానికి కూడా వెనకాడడేమో! ఆర్థిక రంగంలో మాత్రమే కాదు, ఆధ్యాత్మిక రంగంలో కూడా ఈ ప్రవృత్తి కనిపించడం విచిత్రమే! వర్గ శత్రు సంహారం వల్ల సమానత్వం కాదు సమాజం వల్లకాదు అవుతుంది. శత్రుత్వం వల్ల శత్రుత్వమే జనిస్తుంది. సమాజంలో సమానత్వ సాధనకు ఈ వర్గ శత్రు సంహార సిద్ధాంతం ఏమీ ఉపకరించకపోగా ఈ హింసాగ్నిలో శలభాల్లామాడిపోక తప్పదని 'ఆధ్యాత్మిక నక్సలైట్లు' ఇప్పటికి 1200సంవత్సరాలకు పూర్వమే నిరూపించి ఊరు పేరు లేకుండా పోయారు. వారి ఉద్యమం గత కాలపు కథావిశేషమైపోయింది. ఈ ఉద్యమానికి కేంద్రం విజయవాడ.

విజయవాడ అక్కన్న మాదన్న గుహపైన, ఉండవల్లి గుహల ప్రవేశ ద్వారం పైన, కనకదుర్గ ఆలయంలో రెండు శిలా శాసనాలలో కనిపించే 'శ్రీ ఉత్పత్తి పిడుగు' అన్నమాట ఒకనాటి 'ఆధ్యాత్మిక నక్సల్‌బారీ ఉద్యమం' సంకేతపదమని పరిశోధకులు భావిస్తున్నారు. ఆంధ్రదేశంలో దాదాపు 30 చోట్ల ఈ ఉత్పత్తి పిడుగు శాసనాలున్నాయని అంచనా! ఇప్పటికీ వరకు తెలిసిన సమాచారాన్ని బట్టి విజయవాడ మొగల్ రాజపురం, అక్కన్న మాదన్న గుహలు కనకదుర్గమ్మ ఆలయంలో రెండుచోట్ల, ఉండవల్లిలో కనిపిస్తున్నాయి. ఇంకా వెలుగులోకి రానివెన్ని ఉన్నాయో తెలియదు గానీ, బెజవాడలోనే ఇన్ని కనిపించడాన్ని బట్టి ఇప్పటికి 1200 సంవత్సరాల క్రితం ఈ నగరం ఆధ్యాత్మిక నక్సల్‌బరీ ఉద్యమానికి కేంద్రంగా ఉండేదేమోనని అనిపిస్తున్నది.

'శ్రీఉత్పత్తి' ఆధ్యాత్మిక ఉగ్రవాదానికి గల సంబంధాన్ని పరిశీలించే ముందు ఆ నాలుగు అక్షరాల సంస్కృత పదానికి గల అర్థం ఏమిటో విచారించాలి. నిజానికి ఇది రెండు మాటలతో కూడిన సమాసం. ఈ రెండు మాటలు కలిపి ఏడు, ఎనిమిది శతాబ్దుల కాలపు తెలుగు, కన్నడ లిపిలో ఆంధ్రదేశమంతటా అనేక నిర్మాణాలపైన శాసనాలవలె కనిపిస్తున్నాయి. కొన్నిచోట్ల ఇంకా మరికొన్ని మాటలు కలిసి ఉండగా (ఉదాహరణగా కనకదుర్గ ఆలయ స్తంభం) ఉండవల్లి గుహలాంటి చోట్ల కేవలం 'శ్రీ ఉత్పత్తి పిడుగు' అని మాత్రమే కనిపిస్తుంది.

అర్థవివరణలోకి వస్తే శ్రీ ఉత్పత్తి అనేది ఒక మాట కాగా పిడుగు అనేది మరోమాట! వంద సంవత్సరాల క్రితమే చరిత్ర పరిశోధకులు ఈ శాసనాలను కనుగొన్నా సరైన అర్థవివరణ చెప్పలేకపోయారు. ఎవరో అజ్ఞాత వ్యక్తి బిరుదు అయివుంటుందని వివరణ చెప్పారు.

సంస్కృతం విచిత్రమైన భాష. ధాతువుల నుంచి పదాలు రూపొందుతాయి. ఉపసర్గల వల్ల విశేషమైన అర్థాలు సంతరించు కొంటాయి. అలాంటి ఉపసర్గాలలో కొన్నింటికి ఎన్నో అర్థాలు ఉన్నాయి. 'ఉత్' అనేది అలాంటి ఒక ఉపసర్గ. ఈ ఉపసర్గను చేర్చడం వల్ల పైకి, పై నుంచి అనే అర్థాలు వస్తాయి. కొన్ని సందర్భాల్లో పెడమార్గానికి, చెడు వైపునకు అనే అర్థం కూడా వస్తుంది.

'పథిక' అనే మాటకు పర్యాయంగా 'పత్తి' అని కూడా ఉంది. అంటే పాదచారి అని అర్థం. అనగా 'ఉత్పత్తి' అంటే చెడుమార్గాన నడిచేవాడు అని అర్థం. అలా పెడమార్గం పట్టిన వాడి పట్ల పిడుగు పాటుగా వ్యవహరించేవాడే శ్రీ ఉత్పత్తి పిడుగు.

కొన్ని శాసనాల్లో శ్రీ ఉత్పత్తి పిడుగు అన్న మాటతో పాటు 'ఏకస్తవాసి' అన్న మాట కూడా కనిపిస్తుంది. అంటే శ్రీ ఉత్పత్తి పిడుగు ఏకాంతవాసి అన్నమాట. అంటే సమాజానికి దూరంగా ఇప్పటి నక్సలైట్ల వలె అడవుల్లో, కొండల్లో ఒంటరిగా జీవించేవారన్నమాట. అంటే జీవితంలో పెడదారి పట్టినవారిపట్ల బుద్ధి చెప్పే కార్యక్రమాల్లో పాల్గొంటూ సమాజానికి దూరంగా ఏ అడవుల్లోనో, కొండల్లోనో జీవించే వారన్నమాట.

మరికొన్ని శాసనాల్లో 'శ్రీ ఉత్పత్తి పిడుగు ఏకాస్తవాసి' అన్న మాటలతోపాటు 'లోక శీలాభిమాన' అన్న మాట కూడా కనిపిస్తుంది. అంటే లోకమంతా మంచి శీలంతో నడవాలని ఆకాంక్షించే వాడన్న మాట! ఇప్పుడు సంపూర్ణమైన అర్థ వివరణ ఇలా ఉంటుంది. 'లోక శీలాన్ని అభిలషించే వాడును, ఏకాంత వాసం కోరుకొనేవాడు, విరాగి మాత్రమే గాక దుర్మార్గ వర్తనులను అంతం చేసేవాడు.

ఈ మహత్తరమైన ఆశయంతో అనేకమంది ఒక ఉద్యమంగా కార్యక్రమాలు చేపట్టిన ఒక వ్యవస్థగా క్రీస్తుశకం ఏడు, ఎనిమిది శతాబ్దాలలోఉండేవారనీ,బహుశా అలాంటి సంస్థకుబెజవాడ కేంద్రంగా ఉండేదని చెప్పవచ్చు. ఇది భావరాజు వెంకట కృష్ణారావు గారి వాదన. కొంతవరకు చీమకుర్తి శేషగిరిరావుగారి వాదన కూడా!

ఇక్కడ ఒక విషయం ప్రత్యేకంగా చెప్పుకోవాలి. క్రీస్తుశకం ఏడు, ఎనిమిది, తొమ్మిది శతాబ్దాలలో కాలముఖ శైవం ఆంధ్రదేశంలో ప్రబలంగా ఉండేది. శాసనాల్లోని ఆ మాటలకు లాంఛన పూర్వకమైన అర్థం వివరించడానికి ముందు కాలాముఖ శైవంగురించి చర్చించాలి.

శివుడే సృష్టి, స్థితి, లయకారుడనీ, మనుషులంతా పశువులనీ, పరమ శివుడు పశుపతి అని శైవమతం బోధిస్తుంది. మళ్ళీ శైవమతం లో తొమ్మిది శాఖలు ఉన్నాయి. వాటిలో కాలాముఖం ఒక ప్రభేదం. శైవమతానికి సంబంధించిన ప్రాచీన సాహిత్యం ఏదీ లభ్యం కావడం లేదు. తొమ్మిదవ శతాబ్దం తరువాత వచ్చిన సాహిత్యమే లభ్యమవు తున్నది. అయితే ప్రాచీన సాహిత్యంలో కొన్ని శైవ సంప్రదాయాల పేర్లు కనిపిస్తున్నాయి. అలాంటి సంప్రదాయాల్లో కాలాముఖ సంప్రదాయం ఒకటి.

కాలముఖశైవం పట్ల నిష్ఠాగరిష్టులైనవారు సంసార సుఖాలను, ఐహిక భోగాలను త్యజించి వీతరాగులై, ఏకాంతవాసులై శైవధర్మ ప్రచారం చేయడం బాధ్యతగా స్వీకరించారు. ధర్మ ప్రచారం లక్ష్యంగా గ్రహించిజీవించే కాలముఖ శైవులు హింసామార్గంఅవలంబించే వారు. ఉత్పత్తి పిడుగులుగా(పెడదారి పట్టిన వారిపట్ల పిడుగుపాటుగా) వ్యవ హరించేవారు. ఇది ఆధ్యాత్మికరంగంలో ఒక విచిత్రమైన పరిణామం.

అప్పటికి ఆంధ్రదేశంలో బౌద్ధమతం చీలిక, వాలికలైంది. నీతి బాహ్యంగా మారింది. హీనయానం, మహాయానం అనే శాఖలుగా ఏర్పడ్డాయి. మహాయానపు తాత్విక చింతన 'శూన్యవాదం'పై ఆధారపడి ఉంది. అది క్రమంగా వజ్రయానంగా గుహ్యసమాజంగా మారి పోయింది. నీతి బాహ్యంగా పరిణమించింది.

సరిగా ఆ కాలంలోనే ఆంధ్రదేశంలో పాలనా వ్యవస్థ చాలా దుర్భరంగా ఉండేది. కుట్రలు, కుతంత్రాలు తిరుగుబాట్లు, యుద్ధాలతో ఆంధ్రదేశం విలవిలలాడింది. ప్రజలకు మార్గ నిర్దేశనం చేసే బాధ్యతను కాలాముఖశైవాచార్యులు చేపట్టారు. ప్రజలలో కూడా ఈ శైవాచార్యుల పట్ల భక్తి విశ్వాసాలుగా వారుకూడా ఈ ఆధ్యాత్మిక పునర్నిర్మాణ కార్యక్రమానికి మద్దతు పలికారు.

'శ్రీఉత్పత్తి పిడుగు' ఒక ఆధ్యాత్మిక కార్యక్రమంగా విప్లవంగా సాగుతున్న కాలంలో సమాజంలో నీతి బాహ్యతకు కారణమైన బౌద్ధమతాన్ని అంతం చేయడం కూడా కాలాముఖ శైవుల ఆశయమైంది. కాలాముఖులు చేతిలో గదలాంటి ఆయుధం పట్టుకొని తిరిగేవారు. వీళ్ళు అడవుల్లో దిగంబరులుగా గద పట్టుకుని తిరిగేవాళ్ళు. ఆత్మరక్షణతోపాటు ధర్మ పరిరక్షణకు కూడా ఈ 'లకుటం ఆయుధాన్ని (గద) ఉపయోగించే వాళ్ళు. సమాజంలో నైతిక పతనానికి కారణమైన బౌద్ధుల ఆరామాలను, ఇతర కట్టడాలను ధ్వంసం చేశారు. లకుటం కాలాముఖ శైవుల చేతిలో ఆయుధం మాత్రమే కాదు, వారి ఉద్యమానికి అది సంకేతం.

శూన్యవాదం శ్రేయస్కరమనీ ఈ వాదానికి గదలోని బంతిలాంటి వృత్తం సంకేత దేశ శ్రేయస్సుకు, లోకశీలానికి భంగకరంగా జరిగే పనులను మట్టుపెట్టడం ఆ పనులకు పాల్పడేవారిని అంతంచేయడం కోసం లకుటాన్ని ఉపయోగించేవారు.



మొగల్‌రాజపురం 4వ నెంబరు గుహ ప్రవేశ ద్వారం వద్ద కనిపించే శ్రీఉత్పత్తి పిడుగు శాసనం

విరక్తులై, వీతరాగులైన కాలా ముఖ శైవాచార్యులుఇంతటి హింసా మార్గానికి దారి తీయవలసి నంతటి స్థితికి బౌద్ధం దిగజారి పోయింది. అందువల్లనే కాలాముఖ శైవులు బౌద్ధ నిర్మాణాలను ధ్వంసం చేశారు. తమ ఉనికిని చాటిచెప్పు కునేందుకు ప్రసిద్ధమైన కట్టడాలపైన 'శ్రీ ఉత్పత్తి పిడుగు'అని అక్షరాలు చెక్కారు. తమ కార్యక్రమాలకు సంకేతమైన 'లకుటం' కూడా చెక్కారు. లకుటం ప్రధానమైన శైవం కనుక కాలాముఖ శైవాన్ని లాకులీశైవం అనికూడా అనేవాళ్ళు.

నిజానికి ఈ కాలాముఖశై వుల బలాధిక్యత ఏ కాలంలో అధికంగా ఉండేదన్న విషయమై రకరకాల వాదనలున్నాయి. బి.ఎన్.ఎల్. హనుమంతరావుగారి వాదన ప్రకారం 9 నుంచి 'శతాబ్దం' వరకు ఈ కాలాముఖ శైవుల ప్రాబల్యం అధికంగా ఉండేది. చీమకుర్తి శేషగిరి రావు అభిప్రాయం మేరకు 7వ శతాబ్ది నుంచి ఈ శైవ ప్రబోధం బాగా ఉండేది.

ఈ కాలాముఖ శైవం గురించిన తొలి ప్రస్తావన తూర్పు చాళుక్య ప్రభువు రెండవ అమ్మరాజు వేయించిన తాటికొండ తామ్రశాసనం, బెజవాడ శాసనాల్లో కనిపిస్తుంది. ముఖ్యంగా బెజవాడ, అమరావతి లాంటి నగరాలలో సింహపరిషదుకు సంబంధించిన ప్రస్తావన ఉంది. తాటికొండ శాసనం ఆంధ్రదేశంలోని కాలాముఖ శైవం ఏ కాలంలో ప్రవేశించిందో నిర్ధారించడానికి దోహదం చేస్తుంది. ఈ శాసనం తొమ్మిది మంది ఆచార్యుల పరంపర క్రమాన్ని వివరిస్తుంది. పునరుక్తి దోషం లేకుండా ఆచార్య పరంపరకు సంబంధించినంతవరకు తాటికొండ శాసనాన్ని పరిశీలిద్దాం.

## బెజవాడ ఒక కేంద్రం

ప్రతి యుగంలోను ధర్మం నశించినపుడు ధర్మవధ ప్రదర్శకులైన స్వయంభువులైన మునీశ్వరులు రుద్రాంశతో జన్మిస్తారని కాలాముఖుల విశ్వాసం. వీరికి శత్రువే ప్రమాణం. వీరంతా రాజపూజితులు తమను ఆరాధించేది పాలకులే కనుక వారి ప్రోద్బలంతో దేవాయతనాలు నిర్మించు కున్నారు. వారు కొన్ని ప్రాంతాలను ధర్మస్థానాలుగా నిర్ణయించుకున్నారు. అంటే ధర్మపీఠం అన్నమాట. ఈ కాలముఖ మహేశ్వరులు అమరావతి లో అమర కోటేశ్వరాలయాన్ని పరమ పవిత్రంగా భావించుకొన్నారు.

కాలాముఖ సంతతిలో ఆదిపురుషుడు లాకశివుపశుపతి. ఆ మునిపుంగవుడు తన ధర్మశరీరాన్ని సుజల, శాక, ఫల, కందమూలాల తోనే పోషించుకుని దివ్య తేజస్వి అయ్యాడు. ఆయన శిష్యుడు ప్రభూతరాశి. ఆయన సాక్షాత్తు ధర్మావతారుడన్న గౌరవం పొందాడు. ప్రభూతరాశికి విద్యేశ్వరుడు నామేశ్వరుడని ఇద్దరు శిష్యులు, కాగా రెండవ అమ్మరాజుకు విద్యేశ్వరుడు ప్రభూతరాశికి భువనరాశివలుని అనే తమ్ముడు ఉండేవారు. అయితే శాసనంలో భువనరాశి మునని ప్రభూత రాశికి 'భ్రాత' అని మాత్రమే పేర్కొన్నారు. సంస్కృతంలో భ్రాత అంటే సోదరుడు. మరి ప్రభూతరాశి, భువనరాశి ఏక గర్భజని తులో లేక ప్రభూతుని పర్యవేక్షణలో లేదా ఆదరణలో ఆశ్రమం స్వీకరిం చిన కారణంగా భ్రాత అయ్యారేమో తెలియదు.

తిరిగి భువనరాశికి ఇద్దరు శిష్యులున్నారు. ఒక శిష్యుని పేరు పశుపతి, ఇతడి మరోపేరు కాలాముఖేంద్రుడు, రెండవ శిష్యుని పేరు తిరిగి ప్రభూతరాశి, ఇతడికి 'పరహితవ్యసని' అనే బిరుదు ఉండేది. కాలాముఖేంద్రుని శిష్యుడే విద్యేశ్వరుడు. ఇతడే అమ్మరాజు గురువు.

దీనినిబట్టి అమ్మరాజు కాలం నాటికి బెజవాడ ఒక ప్రసిద్ధమైన సింహపరిషద కేంద్రమని బోధపడుతుంది. అంతేగాక అమ్మరాజు రాజధాని బెజవాడ తాటికొండ శాసనంలో కాలాముఖ శైవం ఆది గురువు లకులీశ్వరుని ప్రస్తావన ఉంది. ఆయన కాలంలోనే కాలాముఖ శివ యోగులు చాలామంది ఉండేవారట. వారంతా ఆయన శిష్యులు కావచ్చును.

లింగ, వాయు పురాణాలు రుద్రుని అవతారాలలో కడపటివాడు. కడపటివాడు లకులీశ్వరుడని చెబుతున్నాయి. ఇక శాసనాలను చూస్తే కర్ణాటక, లాట (గుజరాత్) దేశాలలో లభించే అనేక శాసనాల్లో ఈ లకులీశుని పేరు చాలా చోట్ల కనిపిస్తుంది. గుజరాత్‌లో చాలాచోట్ల లకులీశుని విగ్రహాలు కనిపిస్తాయి. దీనిని బట్టి కూడా క్రీస్తుశకం 9వ శతాబ్దానికి పూర్వమే ఆంధ్ర – గుజరాత్ మధ్య సన్నిహిత సంబంధాలు ఉండేవని బోధపడుతుంది.

గుజరాత్‌లోని బడోదా (బరోడా) ప్రాంతంలోని సోరద్‌జిల్లా దేవ పట్టణంలో ఒక శాసనం ఉండేది. 20 అంగుళాల వెడల్పు, 42 అంగుళాల పొడవుగల నల్లరాతి మీద చెక్కిన శాసనం. ఆ శాసనం ఎలా చేరిందో పోర్చుగల్‌కు చేరింది. ఇప్పుడది లిస్బన్ నగరంలోని మ్యూజియంలో భద్రంగా వుంది. ఆ శాసనం సారంగదేవుని కాలం నాటిది. అంటే 13వ శతాబ్దం నాటిదన్నమాట. ఆ శాసనాన్ని 'చింత ప్రశస్తి' శాసనం అని కూడా అంటారు. లకులీశుడు స్వీకృత రుద్రమూర్తి అయిన స్వయంభువనీ, ఆయనకు కుశిక, గార్గ్య, కౌరుష, మైత్రేయ అనే నలుగురు శిష్యులుండేవారని ఆ శాసనం చెబుతున్నది. సరిగా లింగవాయు పురాణాలు కూడా ఈ విషయాన్నే చెబుతున్నాయి కూడా!

లకులీశముని పాశపతవ్రతం ప్రతిపాదించాడనీ, ఈ వ్రతానికి ఆదిపీఠం బరోడా (బడోదా) సమీపంలోని కారోహణ (ఇప్పుడు కార్వాన్) గ్రామంలో ఉన్నదని చింత్రప్రశస్తి శాసనం చెబుతున్నది.

రెండవ అమ్మరాజు గురువైన విద్యేశ్వరపండితుని ప్రస్తావన తమిళనాడులోని కొడుంబాతారులో దొరికిన పదవశతాబ్దం నాటి శాసనం చెబుతున్నది. ఈ శాసనం మల్లికార్జునయోగి అనే కాలాముఖుడు వేయించిన శాసనం. తాను విద్యారాశి, తోపరాశి అనేఇద్దరికి శిష్యుడనని పేర్కొన్నాడు.

ఆయన (మల్లికార్జునయోగి) విక్రమ కేసరి రాజు గురువు. తన ఇద్దరు రాణుల పేరిట, తన పేరిట మొత్తం మూడు శివాలయాలు నిర్మించాడని మల్లికార్జున యోగి తన శాసనంలో చెప్పాడు. దీనిని బట్టి కాలా ముఖశైవం ఆంధ్రదేశం నుంచి తమిళనాడుకు విస్తరించిం దని చెప్పవచ్చు. అందుకు బెజవాడ ప్రధానకేంద్రమై ఉండవచ్చు. అయితే తమిళనాడులో ఈ కాలాముఖశైవులను 'మహావ్రతులు' అనే పేరుతో పిలిచేవారు.

సర్ బిరుదాంకితుడైన రామకృష్ణ గోపాలభండార్కర్ అనే తంత్ర కారుడు కాలాముఖులనీ, శివయోగులని పిలువబడే ఈ శైవ సంప్రదాయ అనుయాయులనే మహావ్రతులని అంటారని సిద్ధాంతం చేశాడు. అయితే మరికొందరు పండితులఅభిప్రాయంలో మహావ్రతులు కాలాముఖులు కావచ్చునేమో గానీ కాపాలికులు మాత్రం కాదు. కాపాలికులు వేరు కాలాముఖులు వేరు.

## బెజవాడలో సింహపరిషత్

కాకతీయులు అధికారంలోకి వచ్చిన తొలికాలం నాడు శ్రీశైలంలో కాలాముఖ సంప్రదాయానికి చెందిన శిలా మఠానికి అధిపతి రామేశ్వర పండితుడు. ఆయన లాకులీశ్వరసిద్ధాంత ప్రతిపాదకుడని అంటారు. అయితే బెజవాడలో కాలాముఖ శైవ పీఠానికి అధిపతి లాగశివుడు. ఆ పేరును బట్టి ఆయన పాశుపత సంప్రదాయానికి చెందిన వాడని పిస్తున్నదంటారు హనుమంతరావుగారు. నిజానికి కర్ణాటకలో ఇప్పటికి పాశుపతులను కాలాముఖులని అంటారు. కనుక పాశుపతులకు, కాలాముఖులకు సంప్రదాయం రీత్యా చాలా సారూప్యం ఉన్నట్టు

తోస్తున్నది. ఏమైనా తేడాలు చాలా స్వల్పమైనవే! ఈ కాలాముఖా చార్యుల పేర్లు రాశి, శక్తి, పండిత నామాలంతాలై ఉంటాయి.

వీరికి అమరావతి, బెజవాడ మాత్రమే కాక శ్రీశైలం కూడా ప్రధానమైన కేంద్రం. చిత్రమైన విషయమేమంటే ఈ సంప్రదాయ వాదులకు ఎందువల్లనో మల్లికార్జునుడంటే మహాప్రీతి, భక్తి. వీరి మఠాలు మల్లికార్జున క్షేత్రాలలోనే ఎక్కువగా కనిపిస్తాయి.

కాలాముఖులకు,పాశుపతులకు సిద్ధాంత సారూప్యత, సమీప్యాలు ఉన్నాయి. అయితే కాపాలికులలో పోలిక రావడం విడ్డూరమే ! ఇది రామానుజులు తెచ్చి పెట్టిన గందరగోళం. ఆయన వ్రాసిన శ్రీభాష్యం ప్రాతిపదికగా రామకృష్ణ గోపాల భండార్కర్ కాలాముఖుల ఆచార వ్యవహారాలను ఇలా వివరించారు.

ఒకటి – వీరు శ్మశానాలలో లభ్యమయ్యే మానవ కపాలాలలో భోజనం చేస్తారు. రెండు – శ్మశానాలలో శవాన్ని దహనం చేసిన తరువాత చితినుంచి తీసిన భస్మాన్ని శరీరమంతా పులుముకుంటారు. మూడు – శ్మశానంలో శవాల బూడిదను మింగుతారు. నాలుగు – వీరి చేతిలో గదలాంటి ఆయుధం ఉంటుంది. అయిదు – నిరంతరం కల్లుముంత ఒకటి ఉంటుంది వారి దగ్గర. ఆరు – ఆ కల్లుముంతలో పరమశివుడు ఉపవిష్టుడై ఉన్నట్టు భావించి పూజిస్తారు.

అయితే ఇవేవి కాలాముఖుల ఆచారవ్యవహారాలు కావు. కాపాలికుల పద్ధతులు నన్నెచోడుడు తన కుమారసంభవం కావ్యంలో ఈ ఆచారాలన్నింటిని పేర్కొంటూ వాటిని మహావ్రతులు పాటిస్తారని వ్రాశాడు.అసలు పరమ శివుడే మహావ్రతుడనిపేర్కొన్నాడు. నన్నెచోడుడు శైవ మతస్తుడు. ఆయన వ్రాసినదే సమంజసం. ఆయనకు ఇంచు మించు సమకాలీనుడైన రామానుజుడు వ్రాసినది పట్టించుకోనక్కరలేదు. ఆయనకు శివుడంటే ద్వేషం. శైవమంటే ద్వేషం. శ్మశాన వాసి అయిన పరమ శివుని తత్త్వంఏమిటో ఆయనకుబోధపడిఉండదు. భస్మోద్ధూళిత సర్వాంగం, నాగాభరణ భూషితమైన శివస్వరూపం, ఆయనకు వికారంగా తోచి ఉండవచ్చు. శ్మశాన, భూత పిశాచగణ పరివేష్టితుడు. అస్థిమాలాభూషణుడైన మహావ్రతుడు రామానుజుడికి ఎలా బోధపడతాడు?

నిజానికి ఆంధ్రదేశంలో కాపాలిక సంప్రదాయం దాదాపుగా లేదనే చెప్పాలి. అయితే పాశుపతశైవం బాగా వృద్ధి చెందింది.

సిద్ధాంతపరమైనఅంశాలను అటు పెట్టి ఆంధ్రదేశంలో కాలాముఖ శైవం పోషించిన పాత్రను చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. రాజపోషణ కూడా లభించింది. కనకనేమో వీరు శుద్ధ వైదిక సంప్రదాయంలోనే వ్యవహరించేవారు. ఆలయ అర్చకులను (శైవ) సమాదరించారు. సత్రాలు నడిపారు. ఆకలిగొన్నవారికి అన్నం పెట్టారు. నిరుపేదలను పోషించారు. ఉన్నత విద్యాకేంద్రాలైన ఘటికా స్థానాలు నెలకొల్పారు. మఠాలు ఏర్పాటుచేసి సాధారణ ప్రజలలో ఆస్తిక్యతా భావనను పెంపొందించారు.

## పన్నెండు లైన్ల శాసనం :

మల్లీశ్వరస్వామి ఆలయం ముందు మండపం స్తంభం మీద పన్నెండు లైన్ల శాసనం ఒకటి ఉంది. ఇది ఏ సంవత్సరం శాసనమో తెలియదు. ఘల్లగంటి కూనిసెట్టి అనే పెద్దమనిషి పినకూను మాచాబత్తునికి ఇచ్చిన దానానికి సంబంధించిన వివరం గల శాసనం. కూనిసెట్టి కుమార తెలుగు రాయని వద్ద 1200 టంకాల అప్పు తీసుకున్నారు. ఆ అప్పు ఇప్పించింది మాచాబత్తు, కూనిసెట్టి వడ్డీతో సహా తెలుగు రాయనికి చెల్లించాలి. అయితే కూనిసెట్టి బాకీ తీర్చలేక పోయాడు. మధ్యవర్తి అయిన మాచాబత్తు సూరవరం గ్రామ ప్రజల ముందు అసలు ధనం ఇవ్వగలనని బాకీదారుకు పత్రం వ్రాసి ఇచ్చాడు. బాకీ తీర్చలేని స్థితిలో వున్నాననీ, అకంపల్లిలో తవ్వించిన చెరువు, తోటలు, మామిడి చెట్ల ఫలసాయాన్ని పినకూనమాచాబత్తుకి అసలు బాకీదారు అయిన – కూనిసెట్టి ధారపోశాడు.

ఇలాంటి విచిత్రమైన శాసనమే మరొకటి ఉంది. చెన్నశెట్టి అనే వైశ్యప్రముఖుడు ఉండేవాడు. ఆయన మహాసంపన్నుడు. కేతవరం, ఉయ్యూరు, సీతానగరం గ్రామాలలో చెరువులు తవ్వించాడు. ప్రతిఫలాపేక్షలేని ఆ మహాదాత చెరువులు త్రవ్వించేటప్పుడు ఒక షరతు పెట్టాడు. చెరువును ఉపయోగించుకొనే గ్రామ ప్రజలు పన్ను చెల్లించాలి. ఒక వంతు చెరువు పోషణ కింద గ్రామనిధికి జమ చెయ్యాలి. మరో వంతు ధర్మకార్యాలకు వెచ్చించాలి. ఇక మూడవ వంతు తనకు చెల్లించాలి. తాను మరిన్ని ధర్మ కార్యాలు చేయడం కోసం మాత్రమే తనకు వాటా చెల్లించాలని షరతు పెట్టాడు. అయితే తీర్థయాత్రలకు వచ్చిన యాత్రికులు తాను నిర్మించిన సత్రంలో మూడుసార్లు ఉచితంగా భోజనం చేసి బస చేయవచ్చును. రోజుకు 24 గంటలు ఎవరు ఎప్పుడు వచ్చినా భోజనం చేయడానికి తగిన వసరులు ఏర్పాటుచేశాడు చెన్నశెట్టి.

అడిగినవాళ్ళకు కాదనకుండా దానం చేసిన చెన్నశెట్టి చివరకు దివాలా తీశాడు. చివరకు ఆయన స్థితి ఎంత దిగజారిపోయిందంటే తాను నెలకొల్పిన సత్రంలోనే తాను తింటూ రోజులు గడపవలసి వచ్చింది. చెన్నశెట్టి దుస్థితి తెలియని ఒక బ్రాహ్మణుడు కోనసీమ నుంచి వచ్చాడు. తన కుమార్తెకు వివాహం చేయవలసి వున్నదనీ, అందుకు చెన్నశెట్టి ఏమైనా సహాయం చేయగలడేమోనని తలచి బెజవాడలోని సత్రంలో చెన్నశెట్టిని ఆ బ్రాహ్మణుడు కలుసుకొని తాను వచ్చిన పని ఏమిటో చెప్పాడు. అయితే తాను కలుసుకొన్నది చెన్నశెట్టినే అన్న సంగతి తెలియదు. చెన్నశెట్టి సహాయం చేయాలనుకొన్నాడు. అయితే తాను నిర్ధనుడైన స్థితిలో వున్నాడు. ఏమీ పాలుపోలేదు.

తాను బాగా బ్రతికిన కాలంలో త్రవ్వించిన చెరువుల నుంచి తన వాటా రావలసి ఉన్న సంగతి గుర్తుకువచ్చి ఆ గ్రామాలకు వెళ్ళి గ్రామపెద్దలను కలుసుకొన్నాడు. కొన్ని సంవత్సరాల తరువాత ఆ గ్రామాలకు వెళ్లిన చెన్నశెట్టిని ఎవరూ గుర్తించలేదు. ప్రయోజనం లేకపోయింది. చివరకు ఒకప్పుడు తనవల్ల సహాయం పొంది ఎంతో సంపద కూడబెట్టిన సంపన్నుడి దగ్గరకువెళ్ళి తనకుఅప్పు కావాలన్నాడు. ఎంత వద్దన్నా చెన్నశెట్టి అప్పు పత్రం వ్రాసి ఇస్తూ గడువులోగా బాకీ తీర్చలేకపోతే తాను చేయించిన పెళ్ళిళ్ళు, శుభకార్యాల వల్ల వచ్చిన పుణ్యాన్ని ధారపోస్తానని వ్రాసి ఇచ్చాడు.

ఈ శాసనాలు ఏ కాలంనాటివో తెలియదుగాని ఒకనాడు బెజవాడలో వెల్లివిరిసిన ధర్మకార్యాలు ప్రజలలో న్యాయధర్మ నిరతి ఎలాంటివో చాటి చెబుతున్నాయి.

**తరిదేవి కథ :**

డాక్టర్ నాయని కృష్ణకుమారి గారు 'తెలుగు జానపద గేయగాథలు' అన్న తన సిద్ధాంత గ్రంథంలో 'తరిదేవి కథ' చెప్పారు. ఆమె సేకరించిన గేయ గాథల్లో ఈ కథ ఉన్నది. తరిదేవి సాధ్వి, భర్త సిద్ధరాజు, సంతానం లేదు. బ్రహ్మదేవుడు ఆ దంపతులకు చెబుతాడు. 'బెజవాడ మల్లికార్జునుని గుట్టావాడు బద్దాది, ఆ గుట్ట మీరు పూజ చేసితే సంతానంబు మీకు గల్గున్' అని చెప్పాడట.

ఆ సమయంబున సతీపురుషులు ఏకార్తులై
యా రోజు బెజవాడ మల్లికార్జున గుట్ట
జేరబోయినారు. పోయేటి వరకల్లా
గుళ్ళు ఎట్ల ఉన్నాయి
పాడుబడి గూళ్ళూ పాడుగొట్టు
కారుతా ఉన్నాయి
కోనేరు తోడించినారు
పువ్వుల చెట్లకు నీళ్ళుబోసేరు
గుళ్ళల ఉండా దిగుడు బావుల మెట్లా
ధర్మ తరిదేవి
పవిట కొంగుతోని
ఎత్తి పోసన్నాది కోనేట్ల నీళ్ళూ
బంగారు బిందెలాతో
మోసి కొదువాలేక ఉదకము తెచ్చి
గుడి సుద్ధి చేసినారు మల్లెసల్వలు దెచ్చి
లింగాన్ని దండ వేసినారూ
రాత్రింబగళ్ళు సతి పురుషులు
పూజ జేస్తయున్నారు
ఆ సమయంబున మల్లికార్జున దేవుడు
వారి భక్తి పూజలు మెచ్చి
మీ అష్టకష్టాలు ఈడేరి పోయినావి
మీకు సంతానఫలంబూ
మీకు దొరుకుతాదీ
ఈ అయిదు మల్లెపుష్పములు
నీవు ఆరగించవమ్మా
నీ ధర్మతరిదవి
ఆ సమయంబున తరిదేవి జంగమయ్య ఇచ్చిన
మల్లెపుష్పములు ఆదరించి నాది ధర్మ తరిదేవి
అయిదుగురు మొగకుమారుంద్రు
ఒక్క ఆడ కుమార్తె కలిగినది -

ఈ మహిమాన్వితమైన కథలో తరిదేవి, ఆమె భర్త తమ ఊరుకు నైరుతి దిశనగల బెజవాడ మల్లికార్జున గుట్ట ఉన్నట్టు వివరించబడింది. ఆ ఊరు పేరు గంజవెల్ల ఈ జానపదగీతంలో ఒక విశేషం ఉంది. ఇంద్రకీలాద్రిని మల్లికార్జునుడి గుట్ట అని కూడా అనేవాళ్ళన్నమాట.

భక్తులు, మహారాజులు, మాన్యులు, సామాన్యులు ఎందరెందరి కొలువులనో వందలాది సంవత్సరాలనుంచి అందుకుంటూ దుర్గా మల్లేశ్వరస్వామి భక్త జనుల కోర్కెలు తీర్చుతూ కల్పవృక్షంగా అభయహస్తమిస్తున్నాడు.

కృష్ణా మండలవాసులకు సిరిసంపదలు సమకూర్చి జీవితంపట్ల అనురక్తి, దైవం పట్ల భక్తిని పెంచడానికి అవసరమైన సహజవనరులు ఈ జిల్లాలో ఉన్నాయి. నాడీ కేంద్ర మన తగిన విజయవాడ నగరం చుట్టూ ఎంతో చరిత్ర అల్లుకొని వుంది. ఇంద్రకీలాద్రిపై కొలువు చేసిన కనకదుర్గామహాదేవి 'సామ్రాజ్యాల లక్ష్మీ ప్రద'. ఆ తల్లిని కొలిస్తే అధికారం లభిస్తుందన్న విశ్వాసం పూర్వం కూడా అధికార లాలసులకు ఉండేది. చాలామంది గోరంత కానుకలిచ్చి కొండంత ప్రతిఫలం ఆశించారు. తామేమి దానం చేసింది ప్రకటిస్తూ శాసనాలు వేయించారు. కొన్ని శిలాశాసనాలు కాగా కొన్ని తామ్ర శాసనాలు.

శాసనాలు మన గత చరిత్రకు ఆకారాలు. మన సంస్కృతికి దర్పణాలు. సంగీత, శిల్ప, సాహిత్య కళారూపాలను ఆవిష్కరించే కావ్యాలు. మన జీవితాలను ప్రభావితం చేసే, లేదా స్పృశించే అన్ని అంశాలను చాటిచెప్పే వక్తలు. చివరకు మనం మాట్లాడే బండ బూతులు కూడా కనిపిస్తాయి.

ప్రయకంగా శాసనాలు చాలావరకు ఆలయాలలో కనిపిస్తాయి. ఆలయాలు అందరికీ కావలసినవి. నిజానికి గుడులు వర్ణవివక్షను

సమర్థించవు. నడమంత్రపు కాలం ఎప్పటినుంచి మొదలైందో అప్పటి నుంచి మాత్రమే కొన్ని వర్గాలను కొన్ని వర్గాలు దూరం చేశాయి. అయినా గుడులు, గోపురాలు అందరికి కావలసినవి కనుక శాసనాలు గుడులలోనే వేస్తారు.

ఆంధ్రదేశానికి, ముఖ్యంగా కృష్ణాజిల్లాకు గొప్ప పేరు తెచ్చిన ఆలయాలలో అమరావతి,శ్రీశైలం,దాక్షారామం తరువాత విజయవాడ కనకదుర్గ ఆలయం (మల్లేశ్వరస్వామి ఆలయం) ఈ గుడిలోగాని, నగరంలోగాని, లేదా ఈ గుడిని గురించి ప్రస్తావనలు గల శాసనాలు ఇతర ప్రాంతాలలోగాని వందల సంఖ్యలోనే ఉన్నాయి. ముఖ్యంగా విజయవాడలోనే దాదాపు110 శిలా శాసనాలు, రెండు తామ్ర శాసనాలు లభ్యమయ్యాయి. ఇవన్నీ తూర్పు చాళుక్య, నిడుదవోలుచాళుక్య, పశ్చిమ చాళుక్య, తెలుగుచోడ, కాకతీయ రెడ్డి, విజయనగర, అసఫ్‌షాహి, నైజాంరాజు వంశాల ప్రముఖులు వేయించినవి. వీటిని సమగ్రంగా అధ్యయనంచేస్తే కనకదుర్గ ఆలయం,విజయవాడనగరం దశవిదశలను పరిపోషించుకుంటూ ఎలా అభివృద్ధి చెందిందో అర్థమవు తుంది.

సాహిత్యపరంగా ఈ నగర చరిత్రను అందజేసే సామాగ్రి పెద్దగా ఏమీ లేదు. ఇందుకు కారణం ఒక్కటే. ఆంధ్ర సాహిత్య సృజన జరిగే కాలం నాటికి ఈ నగరం అంత ప్రసిద్ధమైనది కాదు.

అక్షాంశాలు, రేఖాంశాల పరిభాషలో విజయవాడ 15, 43 డిగ్రీల ఉత్తర అక్షాంశం, 17.1 డిగ్రీల తూర్పు రేఖాంశం కలిసే చోట ఈ నగరం వుంది. ఇది ఒకప్పుడు గిరిదుర్గం. 1838 వరకు ఒక ప్రాచీన కాలం నాటి కోట ఉన్నట్టు ప్రభుత్వ రికార్డులో వుంది.

విజయవాడ నగరానికి గల పేర్లు చూస్తే విస్మయం కలుగుతుంది. నిజానికి ఈ నామాల వ్యుత్పత్తులను పరిశీలించినా గొప్ప చరిత్ర ఆవిష్కృతమవుతుంది. ఉచ్చారణలో వ్యత్యాసాలను కూడా పరిగణిస్తే దాదాపుగా 25 పేర్లు చరిత్రలో కనిపిస్తాయి. ఈ నామ విశ్లేషణ జరిపే ముందు ఒక విషయం. ఆసక్తికరమైన విషయం గమనించ తగును. బెజవాడ ఎంత ప్రాచీనమైన పేరో విజయవాడ కూడా అంత ప్రాచీనమైనదే.

1. బెజవాడ, 2. బెజ్జంవాడ, 3. బెజ్జువాడ, 4. వెత్సవాడ, 5. వెచ్చవాడ, 6. పెత్సవాడ, 7. విజైవాడ, 10. విజయువాడ, 11. విజుయువాడ, 12. జయవాడ, 13. జయవాడ, 14. కనకపురం 15. కనకపురి 16. విజయవాటిక 17. విజయువాటిక, 18. చోలరాజేంద్రవిజయపురం, 19. మల్లికార్జునపురం, 20. మల్లికార్జున మహాదేవపురం, 21. జయపురం, 22. మల్లికార్జున మహాదేవపురం.

అధ్యయనంలో ఇప్పటివరకు ఇన్ని పేర్లు వెలుగులోకి వచ్చాయి. ఇవిగాక బ్రిటిషర్లు పలకడం చేతగాక బెజ్జోరా, బెస్వారా, బెజ్‌వాడ్ అనికూడా అనేవాళ్లు. ఎన్ని పేర్లు వున్నా మనకు మిగిలిన పేర్లు, బెజవాడ, విజయవాడ మాత్రమే.

ఆ స్వామి కరుణాకటాక్షం ఎప్పుడు లభ్యమవుతుంది ?

యజమానిని సేవకుడు మెప్పిస్తే యజమాని దయచూస్తాడు. ఉపాధ్యాయుడిని మెప్పిస్తే విద్యార్థికి చదువు వస్తుంది. తండ్రి మాట వింటే పుత్రునికి శుభం. ఇది అనాది విశ్వాసం మాత్రమే కాదు వాస్తవం కూడా !

ఏ మతమైనా చెప్పేది ఒక్కటే ! శాంతి, సామరస్యం, ప్రేమ, కరుణ సహజీవన సౌభ్రాంతంతో బ్రతకమని చెబుతాయి. వీటిని మరచి ప్రలోభాలకు లోనై మతం మత్తులో పడినా, ద్వేషంతో హనిన విధానానికి పాల్పడినా, చెక్క భజనలు చేసినా ఏ దేముడు కరుణించడు.

శ్రీమన్న గరనాయకి జగదేకమాత. ఆ తల్లికి అంతా బిడ్డలే ! తల్లికి అనుంగుపుత్రులుగా బ్రతికితే అందరి జీవితాలు చరితార్థమవు తాయి. అందరికీ శుభం కలుగుతుంది. కలగాలని ఆశిస్తున్నాం.

బ్రహ్మజ్ఞానం గయాశ్రాద్ధం
దానం చ కురు జాంగలే
కృష్ణవేణీ పయః పానం
సమ మేత చ్చతుష్టయమ్”

డా॥ వి. అనూరాధ

# కృష్ణాతీరంలో శైవక్షేత్రం - శ్రీశైలం

శ్రీశైల పర్వతానికి శ్రీపర్వతం, శ్రీశైలమల్లికార్జునము శ్రీకైలాసము మొదలగు పేర్లున్నట్లు శాసనాలు, పురాణాలు, సాహిత్యం తెలుపుతున్నాయి. మధ్యయుగంనాటికి మహిమాన్వితమైన శ్రీశైలక్షేత్రానికి ఎన్నో గాథలతో మత సాంప్రదాయ సాహిత్యం అపారంగా పెంపొందించబడింది.

కర్నూలు జిల్లాలోని ఎఱ్ఱగుడిలోను, గుంటూరుజిల్లాలోని అమరావతిలోను లభించిన అశోకుని శాసనాల వలన నల్లమల కొండల ప్రాంతమంతా అశోకుని సామ్రాజ్యంలో భాగంగా తెలుస్తున్నది.

మౌర్యుల అనంతరం ఆంధ్రదేశాన్ని పాలించిన శాతవాహనులు కూడ ఈ ప్రాంతాన్ని పాలించినట్లు వారి శాసనాల వలన తెలుస్తున్నది. గౌతమీపుత్ర నాసిక్ ప్రశస్తిలో 'చకోర', 'సెటగిరి', 'సిరితాన' పర్వత శ్రేణులు గురించి తెలపబడింది. 'చకోర' అనేది శ్రీశైల పర్వతశ్రేణులని 'సెటగిరి' మరియు 'సిరితాన' నాగార్జునకొండ అమరావతి లేక ధాన్య కటకముగాను చరిత్రకారులు ధృవీకరించారు.

కర్నూలుజిల్లాలోని 'శాతానికోట', 'శిద్ధేశ్వరము', 'వీరాపురము'లో జరిపిన పురావస్తు త్రవ్వకాల వలన క్రీ.శ. ఒకటి నుండి మూడవ శతాబ్ది వరకు కట్టినటువంటి కోట, దేవాలయాలు బయల్పడినాయి. శాతానికోటలో లభించిన నాణేలు, రోమను నాణెము, మరియు ఇతర ఆధారాల వలన ఇది ఒక వ్యాపార కూడలి. ఇక్కడ ఒక పాలనా యంత్రాంగముతో కూడిన ప్రభుత్వ వ్యవస్థ వున్నదని చరిత్రకారులు తెలియజేశారు. ఈ త్రవ్వకాలలో బయల్పడిన దేవాలయాలన్నీ శివుని దేవాలయాలు. అందువలన ఈ ప్రాంతమంతా శైవ మతము ప్రాబల్యంలో వున్నట్లు అవగతమవుతోంది. ఈ ప్రాంతాన్ని పరిపాలించిన శాతవాహన సామంతులైన మహారథులు శైవులు. వీరి నాణేల మీద శైవమత చిహ్నమైన నంది వుంది.

శ్రీశైల ప్రస్తావన మొదటిసారిగా మహాభారతంలోని అరణ్యక పర్వంలో శివునికి, దేవికి పవిత్రమైన స్థానంగా తెలుపబడింది. చరిత్రకారులు అరణ్యకపర్వం రచనాకాలం క్రీ.శ. మూడవశతాబ్దిగా నిర్ధారించారు. క్రీ.శ. మూడవశతాబ్ది నాటికే శ్రీశైలము ప్రసిద్ధిచెందిన శైవక్షేత్రముగా పరిగణింపబడింది. మత్స్యపురాణంలో శివునికి ఎనిమిది గుప్తస్థానాలున్నట్లు అందులో ఒకటి శ్రీశైలమని తెలపబడింది.

క్రీ.శ. తొలి శతాబ్దాలలో ఆంధ్రప్రదేశ్‌లోని సముద్రతీరప్రాంతాలన్నీ బౌద్ధమతం ప్రబలంగా వ్యాప్తిచెంది వున్నది. ప్రజలందరూ బౌద్ధమతాన్ని ఆదరించి మత కట్టడ నిర్మాణాలకు తమ వంతు సాయం చేశారు. ఇదేకాలంలో శ్రీశైలము నుండి కృష్ణానదీ పరివాహక ఎగువ ప్రాంతాలలో బౌద్ధం కానరాదు. ఈ ప్రాంతమంతా శైవమతం ప్రబలంగా వుండి ప్రాముఖ్యతను పొంది వుంది.

శాతవాహనుల తదనంతరము ఇక్ష్వాకులు నాగార్జునకొండలోని విజయపురిని రాజధానిగా చేసుకొని (క్రీ.శ 225-300) పరి పాలించారు. వీరికాలంలో విజయపురిలో కృష్ణానదీ తీరాన శైవమత దేవాలయాల నిర్మాణం జరిగింది. శ్రీశైలము విజయపురికి కృష్ణానదీ తీరాన 80 కిలోమీటర్ల ఎగువున వుంది. ఇక్ష్వాకుల పాలనలో నేటి కడప, కర్నూల్ జిల్లాల ప్రాంతాన్ని హిరణ్యారాష్ట్రమనీ దీని పాలకుడుగా వీరి సామంతరాజైన మహాసేనాపతి,మహతలవం 'ఖంద-చలిక-రెమ్మణక' అనీ శాసనాల వలన తెలుస్తున్నది. తరువాత కాలంలో ఇతని వారసులే చాళుక్య రాజ్యాన్ని స్థాపించారు. వారే బాదామి చాళుక్యులు.

ఇక్ష్వాకుల అనంతరం ఈ ప్రాంతమంతా ప్రాచీన పల్లవుల ఆధీనములోనికి వెళ్ళింది. పల్లవరాజైన శివస్కంధవర్మ (క్రీ.శ. 310-355) చివర రాజ్యకాలంలో కదంబ మయూరశర్మ దండెత్తి పల్లవులను ఈ ప్రాంతం నుండి వెడలకొట్టాడు. ఈ యుద్ధంలో ఇతనికి సహాయ పడిన బృహత్‌బాణులు శ్రీశైలప్రాంతంలో వున్నట్లు, శ్రీశైల ప్రాంతమంతా దట్టమైన అడవిగా వున్నట్లు కదంబ మయూరశర్మ 'తాలిగుండ' శాసనం వలన తెలుస్తున్నది. క్రమంగా బాణులు శ్రీశైల ప్రాంతంనుండి కడప, చిత్తూరు, అనంతపురం ప్రాంతాలను పరిపాలించారు.

ఎల్లోరా గుహలను శాసనం ప్రకారం రాష్ట్రకూట రాజైన దంతిదుర్గ (క్రీ.శ. 735-755) కంచి, కళింగ, కోసల మరియు శ్రీశైల దేశాలను జయించినట్లు తెలుస్తున్నది. ఈ శాసనం ప్రకారం కాంచీదేశము, కళింగదేశము వలె శ్రీశైల దేశము కూడా ముఖ్యమైన రాజకీయ భౌగోళిక భాగమైనట్లు తెలుస్తున్నది.

లేములవాడ చాళుక్య రాజైన అరికేశరి - I (క్రీ.శ 750-793) ఇచ్చిన శాసనంలో శ్రీపర్వతము శైవక్షేత్రమని ఏలేశ్వరము శ్రీపర్వతానికి ఉత్తర ద్వారమని తెల్పబడింది. ఈ శాసనం ప్రకారం క్రీ.శ. ఎనిమిదవ శతాబ్ధినాటికి నాలుగు దిక్కులా నాలుగు ద్వారాలతో ముఖ్యమైన మహా పుణ్యక్షేత్రంగా విలిసిల్లింది. జగద్గురు శంకరాచార్యులు తపస్సు చేసిన పవిత్రస్థలం. ఇక్కడ వుండే శంకరాచార్యులవారు 'శివానందలహరి', 'భ్రమరాంబాష్టకాన్ని' రచించారు. ఏడవ శతాబ్ధినాటికి చాలా శాసనాలలో శ్రీపర్వతము మహాపుణ్యక్షేత్రంగా తెల్పబడింది. శాసనాలలో అశంసన (benedictory) అభిశంసన (imprecatory) భాగంలో శ్రీపర్వతాన్ని పొందుపరచబడింది. అనగా ఇచ్చిన శాసనములోని అంశాన్ని పాటించిన పుణ్యము జరుగునని లేని యెడల శాపము కల్గునని చెప్పే విధానం శ్రీశైలంలో పుణ్యం పొందినవారు అవుతారు - లేనియెడల పాపం చేసిన వారవుతారని తెల్పబడిన విధానం చాలా శాసనాలలో తెల్పారు. ప్రజల మనస్సులో అతి పవిత్రమైన మహిమాన్వితమైన పుణ్యక్షేత్రంగా శ్రీశైలము స్థానం పొందింది.

శ్రీశైలంలోని భ్రమరాంబమల్లికార్జున దేవాలయం దక్షిణ భారతీయులకు మహాపుణ్య శైవక్షేత్రం. ద్వాదశ జ్యోతిర్లింగాలలో రెండవదియైన మల్లికార్జునలింగం, అష్టాదశశక్తిపీఠాలలో ఒకటైన శ్రీభ్రమరాంబ దేవి ఈ క్షేత్రాధిపతులు. శ్రీశైలక్షేత్రం నల్లమల పర్వతశ్రేణులతో, అందమైన లోయలతో, దట్టమైన అడవులతో, ఎంతో ఔషధమూలికా సంపదతో, తీర్థాలతో, పుష్కరిణిలతో, నిరంతర ప్రవహించే జలధారలతో రమణీయమైన ప్రకృతి నిలయం.

ఉత్తరదక్షిణాలుగా వ్యాప్తిచెందిన నల్లమల పర్వతశ్రేణులు ఎత్తైన పర్వతాలు లోతైన లోయలతో కూడి పడమర నుండి తూర్పుకు 40 కిలోమీటర్ల వెడల్పు కలిగి వున్నాయి. కర్నూలు జిల్లా ఆత్మకూరు తాలూకాలో గల నల్లమల కొండలలో ఒక పర్వతం మీద అర్ధచంద్రాకృతి గల సమతల పీఠభూమి వుంది. ఈ పీఠభూమి తూర్పు పడమరలుగా షుమారు 6 కిలోమీటర్ల వెడల్పు కలిగి ఉత్తరదక్షిణాలు 10 కిలోమీటర్లు పొడవు వుండి మూడువైపులా అనగా పడమర, ఉత్తర, తూర్పువైపున కొండచుట్టూ లోయలో కృష్ణానది (పాతాళగంగ) ప్రవహిస్తున్నది. ఈ పీఠభూమి చుట్టూ ఎత్తైన కొండలు వృత్తాకారంగా ఏర్పడ్డాయి. అన్ని శిఖరాలలోను ఎత్తైన శిఖరం శ్రీశైలశిఖరం సముద్రమట్టానికి 2830 అడుగుల ఎత్తులో వుంది. విశాలమైన పీఠభూమిగల ఈ పర్వతాన్ని ఈశ్వరకుప్పంగా చెప్పబడింది. ఈ పర్వతమే శ్రీపర్వతం లేక శ్రీశైలము.

శ్రీశైలక్షేత్రం $16^{0}.12$ ఉత్తర అక్షాంశము మీద, $78^{0}.55$ తూర్పు రేఖాంశముల మీద సముద్రమట్టానికి 1500 అడుగుల (476 మీటర్లు) ఎత్తులో వుంది. షుమారు వంద మీటర్ల వెడల్పుతో కృష్ణానది మూడు వైపులా కొండను చుట్టూతా షుమారు వెయ్యిమీటర్ల లోతైన లోయలో ప్రవహిస్తున్నది. కృష్ణానదికి కుడివైపున వున్న శ్రీశైల పర్వతం లింగాకృతిగల పీఠభూమి కల్గి, రమణీయమైన ప్రకృతి సంపదతో, ఎటు చూచినా జలవనరులతో గల ఈ ప్రదేశంలో స్వయంభూగా వెలసిన పర్వతేశ్వరుని భక్తులు ఎన్నో కష్టములకోర్చి ఏనాటినుండియో దర్శించుచూ, పూజించుచూ, అభిషేకించుచూ తరించుచున్నారు. శ్రీశైల మల్లికార్జున మహాలింగాన్ని ధూళితదర్శనం చేసుకొని, స్పృజించి భక్తులు పారవశ్యాన్ని పొందిన మహత్తర దివ్యక్షేత్రమిది.

శ్రీశైలక్షేత్రం సాక్షాత్తు శివ స్వరూపమని తెలుగువారు ప్రతి క్రతు కార్యక్రమాల సంకల్పంలో తమయొక్క ఉనికిని ఈ పుణ్యక్షేత్రానికి ఏ దిశలో వుండి నిర్వహిస్తున్నారో భౌగోళికంగా ఈనాటికీ తెలుపు కుంటున్నారు. స్వయంభూలింగమైన ఈ శైవక్షేత్రము ఉత్తరాన వున్న కాళేశ్వరము (కరీంనగరుజిల్లా), తూర్పున వున్న దాక్షారామ భీమే శ్వరము (తూర్పు గోదావరి జిల్లా)లో కలిసి త్రిలింగదేశంగా ప్రసిద్ధి చెందింది. శ్రీశైలం శైవక్షేత్రంగా పూజలందుకుంటూ స్మార్తసాంప్రదాయానికి ఆవాసమై, ఎన్నో శైవశాఖల అభివృద్ధికి కేంద్రమయ్యింది. క్రమంగా మధ్యయుగం నాటికి శ్రీశైలము కేంద్రముగా నాలుగు దిక్కులందు నాలుగు ప్రధాన ద్వారాలతో, నాలుగుమూలలా నాలుగు ఉప ద్వారాలు వృద్ధిచెంది, 30 ఆమడల పొడవు (384 కి.మీ.), 30 ఆమడల వెడల్పుతో షుమారు, 1,50,000 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంతో పుణ్యతీర్థాస్థలంగా తెలుగువారి మత సాంస్కృతిక జీవితంలో ఒక ప్రముఖ స్థానాన్ని పొందింది.

ప్రకాశంజిల్లాలోని త్రిపురాంతకం తూర్పుద్వారంగాను, కడప జిల్లాలోని సిద్ధవటం దక్షిణద్వారంగాను, మహబూబ్‌నగర్ జిల్లాలోని ఆలంపురము పశ్చిమ ద్వారంగాను, అదే జిల్లాలోని ఉమామహేశ్వరం ఉత్తర ద్వారంగానూ, నాలుగు ఉపద్వారాలుగా నెల్లూరు జిల్లాలోని సోమశిలక్షేత్రము ఆగ్నేయ ద్వారం గాను, కడప జిల్లాలోని పుష్పగిరి నైఋతి ద్వారంగాను, కర్నూలు జిల్లాలోని సంగమేశ్వరము వాయువ్య ద్వారంగాను, నల్గొండజిల్లాలోని ఏలేశ్వరము ఈశాన్య ద్వారంగాను శ్రీశైలమహాక్షేత్రానికి ఎల్లలుగా తెలుపుతూ శ్రీ భ్రమరాంబ సమేతుడైన శ్రీ మల్లికార్జునస్వామికి ఈ ఎనిమిది క్షేత్రాలు అష్టదళ పుష్పాశనమని స్కాందపురాణం తెలుపుతోంది.

శ్రీశైలదేవాలయ సముదాయం శ్రీభ్రమరాంబ సమేత మల్లికార్జునస్వామి దేవస్థానముగా ప్రసిద్ధిచెందింది. ప్రధాన దేవాలయమైన

శ్రీ మల్లికార్జున దేవాలయము తూర్పుముఖంగా గర్భగుడి వుండి ముందు కక్ష్యలో అంతరాళము, మహామండపము, వీరశిరో మండపము, నందిమండపము, ధ్వజస్తంభము కలిగి, దేవాలయము ఎడమవైపున వసంత మండపము, బలిపీఠము వృద్ధమల్లికార్జున దేవాలయము, సహస్రలింగేశ్వర దేవాలయము, క్షేత్రవృక్షము వుంది. గర్భగుడికి కుడివైపున మల్లికాకుండముతో గల ప్రాంగణము చుట్టూ ఉప ప్రాకారముంది. ఈ ప్రాకారానికి లోపలవైపు సాలు మండపాలుండి ఈ ప్రాంగణములో చాలా ఉపదేవాలయాలున్నాయి.

శ్రీ మల్లికార్జున దేవాలయానికి నైఋతివైపున ప్రత్యేక ఉప ప్రాకారంతో ఎత్తైన ప్రదేశంలో శ్రీ భ్రమరాంబదేవి దేవాలయముంది. ఈ ఉపప్రాకారము లోపలవైపు చుట్టూ సాలు మండపాలుండి తూర్పున వెడల్పయిన గోపుర ద్వారముంది. గర్భగుడి ముందున్న మండపములోని స్తంభాలు శిల్పానికి ప్రసిద్ధిచెందింది.

శ్రీ మల్లికార్జున, భ్రమరాంబ దేవాలయాల ఉపప్రాకారాల చుట్టూ పెద్ద కోటగోడవలె పటిష్టమైన రాతి ప్రాకారముండి దానికి నాలుగు దిక్కుల నాలుగు ప్రవేశమార్గాలకు నాలుగు ఎత్తైన గోపుర మండపాలున్నాయి. తూర్పు గోపురం ముందు ఇరువైపులా సాలు మండపాలు గల తేరు వీధి వుంది. దక్షిణ గోపురాన్ని హరిహరగోపురమని, ఉత్తర గోపురాన్ని శివాజీ గోపురమని పిలవబడుతున్నాయి. ఈ ప్రాకార గోడ వెలుపలవైపు 9 వరసల ఉబ్బెత్తు శిల్పాల బారులతో అలంకరించబడింది. ఇందులో పొందుపరచిన శిల్పం బారులు తీరిన పురాణ కథాగమనంతో వుండటం ప్రత్యేక ఆకర్షణ. ప్రదక్షిణ చేసే భక్తులకు ఇది ఒక శిల్ప ప్రదర్శనశాలగా (Open aik musium) వుండి వారి యొక్క భక్తిపారవశ్యాన్ని ఇనుమడింపచేస్తున్నది.



శ్రీశైల దేవస్థానానికి దగ్గరగా వున్నటువంటి ముఖ్యమైన అనుబంధ స్థలము శిఖరేశ్వరము. ఇది శ్రీశైలమునుండి డోర్నాలకు వెళ్ళే మార్గంలో ఎనిమిది కిలోమీటర్ల దూరంలో వుంది. శ్రీశైల కొండలతో ఎత్తైన కొండ శిఖరం, 'శ్రీశైల శిఖర దర్శన మాత్రాన పునర్జన్మ వుండదు' అని పురాణాలలో కొనియాడబడింది. ఈ శిఖరేశ్వరునికి కొద్ది దూరములో హటకేశ్వరము, సాక్షి గణపతి, పాలధార - పంచధార అనే దర్శనీయ పుణ్యస్థలాలున్నాయి.

శ్రీశైల దేవస్థానానికి వెనుక ఏనుగుల చెఱువుంది. అది దాటిన తరువాత వాయువ్యదిశలో శ్రీశైల దేవాలయానికి ఎన్నో శతాబ్దాల పాటు ఆలయ నిర్వహణలోను, ఆధ్యాత్మికరంగంలోను, ప్రత్యేక పర్వదినాలలోను, భక్తులకు సదుపాయాలు నిర్వహించడంలోను, విద్యాలయాలుగాను తమవంతు బాధ్యతలను నిర్వర్తించిన మఠాలు కాలగర్భంలో కలసిపోగా మిగిలిన మఠాలు పంచమఠాల పేరుతో జీర్ణస్థితిలో వున్నాయి. అవి ఘంటామఠం, భీమశంకరమఠం, విభూతి మఠం, రుద్రాక్షమఠం, సారంగమఠం.

నల్లమల పర్వతశ్రేణులలో కృష్ణవేణీ స్రవంతి తీరాన దట్టమైన అరణ్యమధ్యన క్రూరమృగాలు సంచరిస్తున్న ప్రదేశంలో స్వయంభూగా వెలసిన స్వామిని అనాగరికులైన చెంచువారే అధిక భక్తితో ఆత్మబంధువుగా కొలుచుకున్నారు. ఈనాటికీ పరిచర్యలు చేసుకొంటున్నారు. శ్రీశైల మల్లికార్జునస్వామిని చెవిటి మల్లయ్య, చెంచుమల్లయ్యా అని కొలుచుకుంటున్నారు. కాలక్రమంగా వివిధ రాజవంశీయులు, ప్రజల చేత ఆరాధింపబడి క్రమముగా మధ్యయుగంనాటికి పటిష్టమైన దేవాలయపట్టణంగా అభివృద్ధిచెంది తెలుగుజాతి ప్రజల జీవనంలో విడదీయలేని బంధం ఏర్పడింది.



చిరునామా : డా॥ వి. అనురాధ, సెల్ : 93472 32342

శ్రీ కె. వెంకటేశ్వరరావు

# కృష్ణానదీతీరంలో జైనక్షేత్రాలు

పవిత్ర కృష్ణానది లేక కృష్ణవేణి గంగా, బ్రహ్మపుత్ర, గోదావరి నదుల తరువాత దేశంలో నాల్గవ పెద్ద నదిగా పరిగణింపబడుతున్నది. ఈ నది మహారాష్ట్రలో సతారా జిల్లాలోని మహాబలేశ్వర్ వద్ద జోర్ అనే గ్రామంవద్ద వున్న కొండల్లో సముద్రమట్టానికి షుమారు 3000 అడుగుల ఎత్తులో పుట్టి దారిలో అనేక ఉపనదులను కలుపుకుంటూ మహారాష్ట్ర, కర్నాటక, తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో 1290 కి.మీ. ప్రవహించి ఆంధ్రరాష్ట్రంలో వున్న కృష్ణాజిల్లాలో అనేక పాయలుగా చీలి, చివరకు హంసలదీవి వద్ద బంగాళాఖాతంలో కలుస్తుంది. ఈ సుదీర్ఘ ప్రయాణంలో అనేక కొండలను గుట్టలను, ఎత్తుపల్లాలను, అడవులను, కీకారణ్యాలను దాటుకుంటూ ఆయా ప్రాంతాల భూములను సస్యశ్యామలం చేస్తూ తన జలాలతో ఎన్నో కోట్ల కుటుంబాలకు జీవనోపాధి కల్పిస్తూ జీవనదిగా నిలుస్తున్నది. ఈ నదిలో ప్రవహించే నీటిని వ్యవసాయానికే కాక విద్యుత్ఉత్పత్తికి,తాగునీటికి వినియోగిస్తున్నారు.

కృష్ణానది మహబూబ్‌నగర్‌జిల్లాలో ఉజ్జిలి అనే గ్రామం వద్ద తెలంగాణలో ప్రవేశిస్తుంది. ఇంతటి సుదీర్ఘమైన ప్రయాణంలో తెలుగు రాష్ట్రాలలో నదికి రెండు వైపులా అనేక జైనక్షేత్రాలు విలసిల్లాయి. కృష్ణాతీరగ్రామమైన ఉజ్జిలి కోటలో వున్న జినాలయంలో వున్న చాళుక్య సోమేశ్వర IV 1097లో వేయించిన శాసనం ప్రకారం జినాలయానికి అంగరంగభోగ, నైవేద్య, దీప, ధూప, తాంబూలంకోసం, దేవాలయ జీర్ణోద్ధరణ కోసం కొంతభూమిని దానంచేసినట్లు చెప్పబడింది. అదే జిల్లాలోని పూడూరులోని 6వ విక్రమాదిత్యుని (క్రీ.శ. 1076-1126) శాసనంలో పూడూరు ప్రభువైన పల్లవరస ఆ గ్రామంలో ఐదంతస్తుల సర్వతోభద్ర జినాలయాన్ని నిర్మించి, అతనికి జినదీక్షను ఇచ్చిన కాంచనసేన భట్టారకునికి పూడూరు ఇంటికాల, గ్రామాలలోని భూములు, తోటలు, గృహాలు, దుకాణాలు దానం ఇచ్చినట్లుగా చెప్పబడింది. పూడూరు గ్రామంలో పార్శ్వనాథుని విగ్రహాలు అనేకం దొరికినట్లుగా తెలుస్తున్నది. ఇదే జిల్లాలోని కృష్ణాతీర గ్రామమైన జటప్రోలు శివారు గ్రామమైన సింగవరం గట్టుమీద బయ్యన్నగా పిలవబడే 11వ శతాబ్దికి చెందిన పార్శ్వనాథుని రాతివిగ్రహం వున్నది. ఇదే జిల్లాలోని పాపకల్లు గ్రామంలో వున్న 1వ సోమేశ్వరుని 1054 సం॥ నాటి శాసనం ప్రకారం ఆ గ్రామంలో వున్న జైన బసదికి 10 మరుతరులు భూమి దానం చేసినట్లు తెలియచేస్తున్నది. ఇదే జిల్లాలోని జడ్చర్ల మండలం ఆల్వాన్‌పల్లి గ్రామంలో 13వ శతాబ్దానికి చెందిన జైనదేవాలయం వున్నది. ఇదే జిల్లాలోని కృష్ణాతీర గ్రామమైన కొల్లాపూర్ గ్రామంలో 1045 సం॥పు చాళుక్య మొదటి సోమేశ్వరుడు వేయించిన శాసనం ప్రకారం ఆ గ్రామంలో సోమ సిద్ధాంతి జినాలయాన్ని స్థాపించాడని తెలియచేస్తున్నది. ఇదే జిల్లాలో వున్న గుమ్మడం గ్రామంలో 11వ శతాబ్దానికి చెందిన జినాలయము వున్నది. కందూరు చోళులకు కొంతకాలం రాజధానిగా వున్న వర్ధమానపురంలో క్రీ.శ. 11వ శతాబ్దానికి చెందిన వర్ధమాన జినాలయము వున్నది. ఈ ఆలయం వలననే ఈ గ్రామానికి వర్ధమానపురం అనే పేరు వచ్చి వుంటుంది. ఇంకా ఇదే జిల్లాలో వనపర్తికి సమీపంలో వున్న పానగల్లు, సిరికొండ, గంగాపురం గొల్లథగుడి మొదలైన గ్రామాలలో జైన దేవాలయాలు వున్నాయి. కళ్యాణి చాళుక్యుల పరిపాలనలో జైనమతానికి మంచి ఆదరణ లభించి అనేక దేవాలయాలు, జైన బసమలు నిర్మించబడి వాటి నిర్వహణకు భూములు దానం చేసినట్లుగా అనేక దాన శాసనాలు వెలుగులోకి వచ్చాయి. ఈ సామ్రాజ్య పతనంతో జైనమతానికి రాజాదరణ కరువై జైన దేవాలయాలు, బసదులు హిందూ దేవాలయాలుగా మార్చివేయబడినాయి.

మహబూబ్‌నగర్‌జిల్లా తరువాత కృష్ణాతీరంలోనే వున్న నల్లగొండ జిల్లా జైనమతానికి ఆయువుపట్టుగా వుండేది. కళ్యాణి చాళుక్య యువరాజైన కుమార తైలపుడు నల్లగొండజిల్లాలో వున్న కొలనుపాకలో 11వ శతాబ్దంలో ఒక జైన దేవాలయాన్ని నిర్మించాడు. అటు తరువాత క్రీ.శ. 1110వ సం॥లో కుమార సోమేశ్వరుడు కూడా అక్కడి జైన బసతికి భూదానం చేశాడు. రాష్ట్రకూటుల పరిపాలనా కాలంలోనే కొలనుపాక (జైనుల కీల్‌పాక్) ఒక ప్రసిద్ధ జైనక్షేత్రంగా పేరుపొందింది.

అక్కడ వున్న జైన దేవాలయం (ఋషభనాథ దేవాలయం) విష్ణు కుండి నుల పరిపాలనలోనే ప్రారంభమై నేటికీ వేలమంది జైన ఉపాసకులను ఆకర్షిస్తూనే వున్నది. అక్కడి దేవాలయంలో వున్న మానస్థంభంపై వున్న 1125వ సం॥పు శాసనం ప్రకారం కేశిరాజు అనే వ్యక్తి అక్కడ వున్న అంబర తిలకమనే జైన బసదిలో అంబికకు ఒక ఆలయాన్ని నిర్మించి, మానస్థంబాన్ని నిలిపి, మకరతోరణంతో అలంకరించిన ట్లుగా తెలుస్తున్నది. అక్కడ 20 జైన శాసనాలు, నిషిది రాళ్ళు, జైన విగ్రహాలు (మహావీరుడు, పద్మావతి, ఇతర తీర్థంకరులు మొదలైనవి) కొలనుపాక శ్వేతాంబర జైనక్షేత్ర చరిత్రకు మౌనసాక్షులు. పై శాసనంలో అక్కడ కానూర్‌గణ, మూలసంఘ, మేష-పాషాణగచ్ఛకు చెందిన మేఘ చంద్ర దేవుడనే జైనాచార్యుని ప్రస్తావన కూడా వున్నది. పూర్వం కొలనుపాకను బింబవాటిపురం, కొట్టియపాక, కొల్లిహాన్, కొల్లిపాక, మరియు కోలన్‌పాక అనే పేర్లతో వ్యవహరించేవారు. ఆ గ్రామంలో పాఠశాల భవనానికి పునాదులు తీస్తుండగా అనేక జైన విగ్రహాలు లభించగా వాటిని స్థానికపు పురావస్తుసంగ్రహాలయంలో ప్రదర్శించారు.

ఇదే జిల్లాలో వున్న సైదాపూర్‌లోని క్రీ.శ. 1034వ శాసనంలో రాజగురువు, రాజవైద్యుడు, వైద్య రత్నాకర ప్రాగాచార్యుడు, అగ్గలయ్య, ఇక్కురికి, ముచ్చనపల్లి అనే గ్రామంలో రెండు జినాలయాలు నిర్మించా డని చెప్పబడింది. జైనాచార్యుడు ప్రసిద్ధ వైద్యాచార్యులని కూడ ఈ శాసనం వలన తెలుస్తున్నది. మిర్యాలగూడ సమీపంలోని వాడపల్లి, అడవిదేవుని పల్లి గ్రామాలు కూడా క్రీ.శ.11-12 శతాబ్దాలనాటిజైన కేంద్రాలుగా విలసిల్లాయి. కళ్యాణి చాళుక్యుల తరువాత ఆంధ్రదేశాన్ని పరిపాలించిన కాకతీయుల కాలంలో కూడా కొలనుపాక గొప్ప జైన పుణ్యక్షేత్రంగా కొనసాగింది. క్రీ.శ. 1276 సం॥పు కోగలితీర్థ శాసనంలో కొలనుపాక జైనులకు తీర్థయాత్రాస్థలమని పేర్కొనటాన్ని ఈ సందర్భంగా ప్రస్తావించాల్సి వుంటుంది. కొలనుపాక జైనాలయం మొగల్ చక్రవర్తి ఔరంగజేబు కుమారుడైన మొదటి బహదూర్‌షా గారి ఆదరణగొన్న విషయం విస్మయం కలిగిస్తున్నది.

కొలనుపాకలో వున్న క్రీ.శ. 1711వ సం॥పు అరబిక్ శాసనంలో దిల్లీశ్వర-పాతసావాశ్రీ ఔరంగజేబు ఆలంగిరపుత్ర శ్రీబహదూర్‌షా అని మొదటి బహదూర్‌షా గుణగణాలను కీర్తిస్తూ, తపోగచ్ఛకు చెందిన భట్టారక విజయరత్నసూరి సమక్షంలో, ధర్మకుశలుని శిష్యుడైన కేసరి కుశలుడు, ఢిల్లీపాలకుడైన ఆలంగిర్ ఔరంగజేబు కుమారుడైన మొదటి బహదూర్‌షా సుబేదార్ నవాబ్ మహమ్మద్ యూసుఫ్‌ఖాన్ సహకా రంతో ఇక్కడున్న ఒక చైత్యాలయానికి జీర్ణోద్ధరణ చేసి, అందులో మాణిక్యస్వామి (పార్శ్వనాథు)ని ప్రతిష్టించినట్లు, ఆ చైత్యాలయం చుట్టూ ఒక ప్రాకారాన్ని కట్టించినట్లూ పేర్కొనబడింది. కృష్ణాతీరం పరమతసహనాన్ని ఉగ్గుబాలతో పెంచి పోషించిందని ఈ శాసనం నిరూపిస్తున్నది. బౌద్ధమతంలాగే జైనమతాన్ని, కూడా కృష్ణాతీరం అక్కున చేర్చుకొన్నది. నల్లగొండజిల్లాలో పానగల్లు బైరాన్‌పల్లి గ్రామాలు కూడా ఒకనాటి జైనక్షేత్రాలే.

కృష్ణానదికి కుడివైపున వున్న గుంటూరు జిల్లాలో అనేక జైనక్షేత్రాలు విలసిల్లాయి. నాగార్జునకొండపైన కొండవీటి రెడ్డిరాజులు మూడంచెలు వున్న కోటను నిర్మించి దానిని తమ సరిహద్దు సైనికస్థావరంగా యేర్పాటు చేసుకున్నారు. వారు విజయపురిలో జినాలయాన్ని రాతితో నిర్మించి, గర్భగుడిలో నల్లరాతితో చేసిన ఆశీనులైవున్న, మహావీరుని విగ్రహాన్ని ప్రతిష్టించారు. గర్భగుడిలో వున్న పీఠంపై మహావీర తీర్థం కరుని లాంఛనం (వాహనం) అయిన సింహాన్ని చూడవచ్చును. క్రీ.శ. 13-14 శతాబ్దాలకు చెందిన ఈ జైనదేవాలయాన్ని విజయనగర రాజుల పరిపాలనా కాలంలో వైష్ణవ దేవాలయంగా మార్చి గరుడ విగ్రహం వున్న పీఠాన్ని, జైన పీఠంపై ప్రతిష్టించిన విధానం నా కొండపై పునఃనిర్మించిన దేవాలయంలో కనిపిస్తుంది. మహావీరుని విగ్రహాన్ని కొండపై నిర్మించిన వస్తు సంగ్రహాలయంలో చివరి గ్యాల రీలో ప్రదర్శించారు. వేంగీ చాళుక్యరాజైన రాజరాజనరేంద్రుని కాలంలో గుంటూరుజిల్లాలోని సత్తెనపల్లి ఫిర్కాలో వున్న మూనుగోడు గ్రామం ముఖ్య జైనక్షేత్రంగా వుండేది. అదేవిధంగా కుళోత్తుంగచోళుని కాలంలో (11వ శతాబ్దం) ఇదే జిల్లాలో వున్న చందవోలు (చందోలు) గ్రామం లో ప్రిద్వితిలక జినాలయాన్ని నిర్మించి, దాని ధూప, దీప నైవేద్యానికి కొంత భూమి దానం చేసినట్లుగా శాసనం ద్వారా తెలుస్తున్నది. ఇదే జిల్లాలో అమరావతిలో శ్వేతాంబరశాఖకు చెందిన పార్శ్వనాథ జైనదేవాలయాన్ని కోటకేత రాజులు నిర్మించినట్లుగా తెలుస్తున్నది. ఆ దేవాలయంలో వున్న పార్శ్వనాద విగ్రహాన్ని కేంద్రపురావస్తుశాఖ వారి వస్తు సంగ్రహాలయంలో ప్రదర్శించారు. జైన ప్రముఖులు ఇప్పుడున్న జైన దేవాలయంలో పార్శనాద తీర్థంకరుని కొత్త విగ్రహాన్ని ప్రతిష్టించి పూజలు నిర్వహిస్తున్నట్లుగా తెలుస్తున్నది.

జైన గ్రంథం 'ఆవశ్యక సూత్రం' వ్యాఖ్య ప్రకారం 24వ తీర్థం కరుడైన వర్ధమానమహావీరుడు కళింగదేశం ద్వారా మోసలికి ప్రయా ణించాడని తెలుస్తున్నది. మోసలిని కృష్ణాతీరంలో వున్న మచిలీ పట్నంగా కొందరు చరిత్రకారులు గుర్తించారు. అమరావతికి దగ్గర్లోనే వున్న వడ్డమాను (వర్ధమానపురం)లో బిర్లా కల్చరల్ సెంటర్‌వారు నిర్వహించిన త్రవ్వకాలలో క్రీ.పూ. 3వ శతాబ్దినాటి జైన స్థూపపు అవ శేషాలు (సంప్రతివిహారం) బయల్పడినాయి. రాతిపైన, మట్టి పాత్రల పైన వున్న బ్రాహ్మీ భాషలో వున్న శాసనాలలో జైన గణాలకు, విహారా లకు సంఘాలకు దానంచేసిన వివరాలు వున్నాయి. ఇదే జిల్లాలో బాపట్లకు సమీపంలో వున్న కర్లపాలెం మండలం పేరలి అనే గ్రామంలో క్రీ.శ. 4-5 శతాబ్దాల నాటి అజితనాద (రెండవ తీర్థం

కరుడు) తీర్థంకరుని కంచు విగ్రహం లభించటంతో జైనం కొద్దికొద్దిగా వేళ్లూనుకొందని అర్థం అవుతున్నది.

వేంగీ చాళుక్యుల కాలంలో జైనం ఆంధ్రతీరంలో, ప్రత్యేకించి కృష్ణా తీరంలో ఆదరించబడింది. తూర్పు (వేంగి) చాళుక్య వంశ స్థాపకుడైన కుబ్జ విష్ణువర్ధనుని పట్టపురాణి అయ్యణదేవి విజయవాటిక (విజయవాడ)లోని నడుంబి అనే జైన బసది, జినాలయం కోసం చంద్రప్రభాచార్యులకు తొరక్-నతవాడి విషయంలో వున్న ముసిని కొండ అనే గ్రామాన్ని దానంచేసినట్లుగా చెప్పబడింది. కుబ్జ విష్ణువర్ధనుడు (క్రీ.శ. 614-641) సౌరాష్ట్ర (గుజరాత్) యువరాజుగా, రాజప్రతినిధిగా వున్నప్పుడు చంద్రప్రభాచార్యునితో పరిచయం ఏర్పడి అయ్యణదేవి ఆచార్యుని శిష్యురాలైంది. విష్ణువర్ధనుడు వేంగికి వచ్చినప్పుడు చంద్రప్రభాచార్యుని బెజవాడకు ఆహ్వానించారు. ఈ నడుంబిబసది విజయవాడ పాత నగరంలో వున్న జమ్మి దొడ్డి ప్రాంతంలో వుండేదని గుర్తించారు. చాళుక్యరాజులైన మూడవ విష్ణువర్ధనుడు (క్రీ.శ. 718-752), రెండవ అమ్మరాజు (క్రీ.శ. 947-970) జైన మతాన్ని ప్రోత్సహించి, జైన బసదిలకు అనేక దానాలు చేసినట్లుగా శాసనాలు తెలియజేస్తున్నాయి. విమలాదిత్యుడు (క్రీ.శ. 1011-1018) మహావీరుని అనుయాయిగా ప్రకటించుకున్నాడు. మూడవ విష్ణువర్ధనుడు (క్రీ.శ 718-752) ముసినికొండ రాగిరేకుల శాసనంలో ఇంతకుముందు అయ్యణదేవి నడుంబివసదికి ఇచ్చిన దానాన్ని పునరుద్ధరించినట్లు చెప్పబడింది. దానాన్ని పొందిన జైనా చార్యుడు కళిభద్రాచార్యుడు, చంద్రప్రభాచార్య పరంపరలో, ఏడవ ఆచార్యుడని తెలుస్తున్నది. ముసినికొండను తిరువూరు తాలూకాలోని ముష్టికుంటగా చరిత్రకారులు గుర్తించారు. ఇదే కాలంలో విజయవాడ శివారులో వున్న అంబాపురం కొండల్లో శ్వేతాంబర జైనశాఖ యాప నీయ విభాగానికి చెందిన ఒక గుహను 8వ శతాబ్దంలో చెక్కించారు. ఈ గుహ గర్భాలయంలో వర్ధమాన మహావీరుడు, అర్ధమండప గోడలపైన పార్శ్వనాథుడు, యక్షిణి అంబిక విగ్రహాలు చెక్కబడినాయి. ఈ జైన గుహను ప్రఖ్యాత పురాతత్వవేత్త డా॥ ఈమని శివనాగిరెడ్డి సందర్శించి, తెలుగు నేలలో శ్వేతాంబరులకు చెందిన ఒకే ఒక గుహగా ఆయన అభిప్రాయపడ్డారు. క్రీ.శ. 10వ శతాబ్దికి చెందిన మహావీరుని రాతి శిల్పం మచిలీపట్నంలో వున్న లక్ష్మీదేవి దేవాలయంలో వున్న దాని మచిలీపట్నం సర్వస్వం గ్రంథ రచయిత మహమ్మద్ సిలారు తెలియ చేశారు. బందరు రాబర్ట్సన్ పేటలో వున్న రఘునాథస్వామి దేవాలయపు రాజగోపురం మీద దిగంబర శాఖకు చెందిన జైన విగ్రహము చెక్కబడినదని, ఆశీనులై వున్న మహావీరుని విగ్రహము బందరులోని శివగంగ దేవాలయ ప్రాంగణంలో గోడకుఆనించి పెట్టబడినదని, మహావీరుని శిథిలమైన గుడి దిబ్బమీద చల్లపల్లి జమిందారు శివగంగగా పిలవబడే దుర్గగుడిని కట్టించారని సిలార్ గారు తమ గ్రంథంలో తెలిపారు. రఘునాథ దేవాలయం మొదట జైనమందిరమే అయివుండవచ్చని వారి అభిప్రాయం. దాని ప్రక్కనే వున్న రామలింగేశ్వర దేవస్థానం కూడా మొదట బౌద్ధమందిరమే అయివుండవచ్చునని, ఈ జైన, బౌద్ధమందిరాలు ఆనాడు ప్రక్కప్రక్కనే వున్న విషయం గమనించవచ్చునని సిలార్గారు అభిప్రాయపడ్డారు.

వేంగి చాళుక్యరాజు రెండవ అమ్మరాజు విడుదల చేయించిన పెదగాదిలపర్రు (గుడివాడ దగ్గర వున్న పెదపాలపర్రు గ్రామం) తామ్రశాసనం వెలనాడులో రెండు జినాలయాలు నిర్మించే నిమిత్తం జైనమతాచార్యుడు భీమేశ్వర నరవాహనునకు ఆ గ్రామాన్ని దానంచేసింది. ఆ జైన దేవాలయాలలో వున్న మహావీరుని విగ్రహాలన్నీ తొలగించి, శివాలయంగా మార్చి భీమేశ్వరాలయంగా పిలుస్తున్నారు. రెండవ జైనాలయంలో వున్న పార్శ్వనాథుని విగ్రహాన్ని స్థానిక మార్వాడీలు గుడివాడలో కొత్తగా నిర్మించిన జైనమందిరంలో ప్రతిష్ఠించి పూజిస్తున్నారు. ఇవేకాక కృష్ణాజిల్లాలో పెనుగంచిప్రోలు, మేడూరు, గుడివాడ, లక్ష్మిపురం (చల్లపల్లి మం.) నందిగం (నందిగామ మండలం) నందిగామ (పెదన మండలం) మొదలైన గ్రామాలలో జైన విగ్రహాలు లభించాయి.

విజయవాడలో నడుంబిబసదే కాక ఇంద్రకీలాద్రి పర్వతం దిగువన వున్న అక్కన్న మాదన్న గుహలు కూడా జైనగుహలే అని నిక్కచ్చిగా చెప్పవచ్చును. వేంగి చాళుక్య రెండవ అమ్మరాజు సామంతుడైన దుగ్గరాజు కోరికపై కృష్ణాతీరంలోని మలియం పుండి (మెల్లంపూడి) గ్రామాన్ని దానంచేసినట్లుగా తెలుస్తున్నది. దుగ్గరాజు సేనానాయకులైన భీమ, నరవాహనులు బెజవాడలో ఒక బసదిని, రెండు జైనాలయాలను నిర్మించారు. ఈ బసదిలోని జయసేనాచార్యుని సేవిస్తున్న శ్రావక, క్షుల్లక, క్షపణక, అజ్జికల కోసం పెదగాదెలపర్రును దానం చేసినట్లుగా చెప్పబడింది. బెజవాడలోని పాత శివాలయంలోని కాశీవిశ్వేశ్వరాలయం, నాలుగు ద్వారాలతో నిర్మింపబడిన సర్వతోభద్రజైనాలయమే. ఇందులోని క్రీ.శ. 10వ శతాబ్దికి చెందిన జైన చౌముఖశిల్పం విక్టోరియా జుబిలీ మ్యూజియం (ప్రస్తుతం బాపు పురావస్తు సంగ్రహాలయంగా వ్యవహరింపబడుతున్నది)లో ప్రదర్శింపబడింది.

గుంటూరుజిల్లా బాపట్లలో 10 అంగుళాలు ఎత్తు వున్న అనేక జైన కంచు విగ్రహాలు లభించాయి. వర్ధమానమహావీరుడు, పార్శ్వనాథుడు, పద్మప్రభ అంబిక మొదలైన ఈ విగ్రహాలు క్రీ.శ. 10వ శతాబ్దికి ఈ ప్రాంతం జైనమత ప్రభావంలో వున్నట్లుగా తెలియజేస్తున్నాయి. ప్రస్తుతం ఈ విగ్రహాలు హైదరాబాద్లోని రాష్ట్ర పురావస్తు ప్రదర్శనశాలలో ప్రదర్శింపబడినాయి. ఇదే జిల్లాలో తెనాలి సమీపంలోని కొల్లూరు నుంచి పరిపాలన చేసిన కళ్యాణి చాళుక్యులు సేనా

నాయకుడైన అనంతపాలుడు చేబ్రోలులో అనంత జినాలయాన్ని నిర్మించాడు. ఇదే జిల్లాలో వున్న తెనాలిలోని రామలింగేశ్వరాలయంలో క్రీ.శ. 10వ శతాబ్దికి చెందిన మహావీరుని శిల్పం వున్నది. ఈ దేవాలయం ఒకప్పటి జైన బసది అని ఈ విగ్రహం వలన తెలుస్తున్నది. తెనాలిలో జైన బసదిని నిర్మూలించి ఆ ప్రదేశంలో ముక్కంటి రామ లింగేశ్వరునికి ఆలయం నిర్మించినట్లుగా తెలుస్తున్నది. శ్రీశైలంలోని క్రీ.శ. 1512వ సం॥పు. శాసనంలో అక్కడి జైన మునులను వీరశైవుడైన శాంత లింగప్ప వధింపగా, శ్రీకృష్ణదేవరాయలు, తన ప్రతినిధి వెలుగోటి తిమ్మానాయని పంపి, శాంత లింగప్పను శిక్షించి జైనులకు అండ కల్పించాడని శాసనాలు తెలియచేస్తున్నాయి.

ఆంధ్రదేశంలో అసంఖ్యాకంగా వున్న జైనస్థలాలు, జైన శాసనాలు, తీర్థంకరుల విగ్రహాలు జైనగుహలు, ప్రాచీన జైనావాసాలు క్రీ.పూ. 4వ శతాబ్దం నాటికే జైనమతం వ్యాప్తిచెందిందని నిర్ణయించటానికి దోహదం చేస్తాయి. ఆంధ్రదేశం మారుమూల గ్రామాలకు సైతం జైనమతం వ్యాప్తి చెందిందని బ్రిటీషు పురాతత్వవేత్త రాబర్ట్ సీవెల్ అభిప్రాయపడ్డారు.

ఈ పైన పేర్కొన్న ఆధారాలను బట్టి కృష్ణాతీర ప్రాంతాలు ఆనాటి నుండి జైనమతాన్ని ఆదరించి ఆ మత వ్యాప్తికి దోహద పడినట్లుగా స్పష్టమౌతున్నది. ఈ విధంగా కృష్ణాతీరప్రాంతాలు వైదిక మతాలతోపాటు, వైదికేతర మతాలైన బౌద్ధ, జైన మతాలను కూడా సుమారు 1800 సంవత్సరాలపాటు సమాదరించి, గౌరవించినట్లుగా అర్థం అవుతున్నది. ఆంధ్రదేశంలో "పాడు" అనే పేరు (దానవులపాడు, గరికపాడు, గుడిపాడు, దొండపాడు, ఏలూరుపాడు మొదలైన) వున్న గ్రామానికి, జైనమతానికి సంబంధం వున్నదని కొందరి చరిత్రకారుల అభిప్రాయం.

తీర్థములు మానసములు యుక్తి ప్రదములు<br>
తరుణీ యివి మేలు బాహ్య తీర్థముల కంటే<br>
మానవుండివి యేమతీ మధురవాసి<br>
బాహ్య తీర్థములాడ నిష్ఫలము సూవె<br>
తీర్థంబు సత్యమింద్రియ నిగ్రహము తీర్థ<br>
మనసూయ తీర్థంబు వనరుహాక్షి<br>
తీర్థంబు దానంబు తీర్థంబు సంతోష<br>
మనుకంప తీర్థంబు కనకగౌరి<br>
బ్రహ్మచర్యంబు తీర్థంబు తీర్థముధృతి<br>
యమము తీర్థము విద్రుమాధ రోష్ఠి<br>
సమత తీర్థంబు విజ్ఞానంబు తీర్థంబు<br>
పుణ్యంబు తీర్థంబు పువ్వుబోఁడి<br>
తీర్థములు మానసమ్ముల ధీవిశుద్ధి<br>
యతిశయిల్లంగా నివియాడ కాడినట్టి<br>
పంచజనులకు గలహంస పక్షిగమన<br>
బాహ్య తీర్థావలులు తీర్థ ఫలము నీవు

–శ్రీనాథుడు – కాశీఖండం, III, 72,

చిరునామా : కొసరాజు వేంకటేశ్వరరావు, పురాతత్వవేత్త, ఫోన్ : 9490636659

శ్రీ కె. వెంకటేశ్వరరావు

# కృష్ణాతీరంలో మన పురాతన నగరాలు - విజయపురి

భారతదేశంలో 4వ పెద్దనదిగా పిలవబడే కృష్ణానది మహా రాష్ట్రలోని సతారా జిల్లాలోని మహాబలేశ్వర కొండల్లో సముద్రమట్టానికి 2999 అడుగుల ఎత్తులో, పుట్టి అనేక ఉపనదులను కలుపుకుంటూ మహారాష్ట్ర, కర్నాటక, తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో షుమారు 1290 కి.మీ ప్రవహించి, ఆంధ్రరాష్ట్రంలో కృష్ణాజిల్లాలో అనేక పాయ లుగా చీలి చివరకు హంసలదేవి వద్ద సముద్రంలో (బంగాళా ఖాతం) కలుస్తుంది. ఈ సుదీర్ఘ ప్రయాణంలో ఆయా ప్రాంతాల భూములను సస్యశ్యామలం చేస్తూ, అనేక కొండలను, అరణ్యాలను దాటుకుంటూ జీవనదిగా ప్రవహిస్తున్నది. కృష్ణానది డెల్టా భూములు చాలా సార వంతమైనవి. ఈ పవిత్ర కృష్ణానది తన జలాలద్వారా కొన్ని కోట్ల కుటుంబాలకు జీవనోపాధి కలిపిస్తున్నది. ఈ నదీతీరంలో అనేక పుణ్యక్షేత్రాలు వున్నాయి. కర్నూలు జిల్లాలో సంగమేశ్వరం వద్ద తుంగ భద్ర, భావనాసి ఉపనదులు కృష్ణానదిలో కలుస్తాయి. హిందువులకు పుణ్యక్షేత్రమైన సంగమేశ్వరం, శ్రీశైలం ఆనకట్ట మూలంగా ముంపుకు గురైంది. షుమారు 1290 కి.మీ ఈ సుదీర్ఘప్రయాణంలో ఈ నదిపై ఎన్నో ఆనకట్టలు, బ్యారేజి నిర్మించి, నీటిని సముద్రంలోకి వృథాగా పోనీయకుండా వ్యవసాయానికి, విద్యుత్ ఉత్పత్తికి, త్రాగునీటికి విని యోగిస్తున్నారు. ప్రముఖ శక్తిపీఠమైన ఆలంపూరులో వెలిసిన జోగు లాంబ దేవాలయం శ్రీశైల మల్లికార్జునుడు, అమరావతి అమరేశ్వర స్వామి, బెజవాడ కనకదుర్గాదేవి మొదలైన దేవాలయాలు, పుణ్యతీర్థాలు ఎన్నో ఈ నది ఒడ్డునే వుండటం విశేషం. ఇవేకాక ఎంతో చారిత్రక ప్రాధాన్యం వున్న ప్రాచీన నగరాలు, పురాతన రాజధాని పట్టణాలు ఈ పవిత్ర నది ఒడ్డునే నిర్మించబడి ఉన్నాయి. ఆంధ్రదేశంలో వున్న ప్రాచీన నగరాలలో క్రీ.శ. 3,4శతాబ్దాలలో ఇక్ష్వాకుల రాజధాని నగర మైన విజయపురి పట్టణం కృష్ణానదిపైననే వున్న విషయం అందరకూ తెలిసిన విషయమే.

ప్రాచీన విజయపురి పట్టణం, గుంటూరుజిల్లాలో కృష్ణానది కుడి ఒడ్డున మాచర్లకు సుమారు 24 కి.మీ. దూరంలో పశ్చిమంగా వున్నది. ఈ పట్టణానికి (16:31" ఉద, 79:14 తూ.అక్షాంశ రేఖాంశాలు) తూర్పున ఫిరంగి మోటు (మోటు అనగా పర్వతం) దక్షిణాన యద్దన మోటు 185 మీ. సముద్రమట్టానికి 245 మీ. ఉత్తరాన నాగార్జున కొండ 310 మీ. (శ్రీ పర్వతం), పశ్చిమాన కృష్ణానది హద్దులుగా వున్నాయి. ప్రముఖ పురాతత్వవేత్త H. సర్కారు అభిప్రాయం ప్రకారం శాతవాహన రాజైన విజయశాతకర్ణి పేరున ఈ పట్టణం క్రీ.శ. 213-14 సం॥లో నిర్మించబడివుంటుంది. ఇంకొక చరిత్రకారుడైన D.C. సర్కారు అభిప్రాయం ప్రకారం మొదటి ఇక్ష్వాకురాజైన చాంతమూలుడు విజయనామ సంవత్సరంలో క్రీ.శ. 219-20 సం॥లో ఈ పట్టణాన్ని నిర్మించివుంటాడు. ఈ చారిత్రక పట్టణం విషయంలో చరిత్రకారులలో ఏకాభిప్రాయం లేదన్నది మాత్రం సత్యమే. విజయపురి పట్టణాన్ని తమ రాజధానిగా చేసుకుని 4గురు ఇక్ష్వాకు రాజులు (చాంతమూలుడు, వీరపురుషదత్తుడు, యహువల చాంతమూలుడు, రుద్రపురుషదత్త మొదలైనవారు) క్రీ.శ. 3, 4 శతాబ్దాలలో ఆంధ్రదేశాన్ని పరిపాలిం చారు. ఇక్ష్వాకులు ధాన్యకటకాన్ని రాజధానిగా చేసుకుని పరిపాలించిన శాతవాహనుల వద్ద సామంతులుగా వ్యవహరించేవారు. ఇక్ష్వాకునకు చింతమూలుడు, శాతవాహనసామ్రాజ్యం క్షీణదశలో చేరినపుడు పులు మావి III ను ఓడించి సర్వస్వతంత్రునిగా క్రీ.శ. 227లో ఘోషించి, ఇక్ష్వాకు సామ్రాజ్యాన్ని ఏర్పరచి విజయపురిని రాజధానిగా చేసుకుని షుమారు 81 సంవత్సరాలు ఆంధ్రదేశాన్ని యేలినట్లుగా వారి శాసనాల ద్వారా తెలియవస్తున్నది. పురాణాలు వీరిని శ్రీపర్వతీయ ఆంధ్రులుగా పేర్కొన్నాయి. 24 చ. మైళ్ళ వైశాల్యంలో వున్న విజయ పురి లోయలో అతితక్కువ వర్షపాతం వుండగా (387 నుండి 508 మిల్లీమీటర్లు) మే, జూన్ నెలలలో వేడి $49^0$ డిగ్రీలు వుండేది. విజయ పురి పట్టణం శాతవాహనులకు ఉపరాజధానిగా వున్నట్లు అక్కడ లభించిన శాసనాలద్వారా తెలుస్తున్నది. ఆ పట్టణం చుట్టూ, రాయి ఇటుక మరియు మట్టితో నిర్మించిన కోటగోడ వుండేదని, ఆ కోటకు తూర్పు (మాచర్లవైపు) పడమర (కృష్ణానదివైపు) వైపు ద్వారాలు మరియు శ్రీపర్వతం (నాగార్జునకొండ) వైపు రహస్యమార్గం వుండేదని 1954-60 సంవత్సరాలలో రాయప్రోలు సుబ్రహ్మణ్యంగారు నిర్వ

హించిన త్రవ్వకాలలో బయటపడినాయి. కోటకు వెలుపల లోతైన, వెడల్పైన కందకం (అగడ్త) వున్నట్లుగా త్రవ్వకాలలో వెలుగుచూసింది. ఈ కోటలో దక్షిణంవైపు పెద్దకుందేళ్ళగుట్ట ఉత్తరంవైపున చిన్న కుందేళ్ళగుట్ట వుండేది. కోటలోపల రాజప్రాసాదాలు, సామాన్యజనుల, సైనికుల నివాస గృహాలు, పశువులకు యేర్పాటుచేసిన వసతులు, తొట్లు, స్నానవాటికలు, శౌచాలయాలు, అశ్వమేదవేదిక - అనుబంధ సౌకర్యాలున్న దాఖలాలు బయటపడ్డాయి. 24 చ.కి.మీల విస్తీర్ణమున్న ఈ లోయలో అన్ని లక్షణాలతో సుమారు 30కు పైగా బౌద్ధ స్థూపాలు, విహారాలు వర్ధిల్లినట్లుగా తెలుస్తున్నది. విజయపురిలో బౌద్ధమతం, హిందూమతం ప్రక్కప్రక్కనే విలసిల్లినట్లుగాను, శైవ, వైష్ణవమతాలు సహజీవనం చేసినట్లుగా అక్కడ నిర్వహించిన పురావస్తు త్రవ్వకాల ద్వారా తెలిసింది.

బౌద్ధమత దార్శనికుడు ఆచార్య నాగార్జునుని పేర వెలసిన ప్రాంతాన్నే నాగార్జునకొండగా మొదటగా విజయనగర కాలపు శాసనాలలో పేర్కొనబడినట్లుగా తెలుస్తున్నది. దీనికి ముందు నాగార్జునుని పేరు ఏ శాసనాలలోను ప్రస్తావించబడలేదు. ఆచార్య నాగార్జునునకు శ్రీపర్వతానికి అవినాభావసంబంధము వున్నదన్న సంగతి అందరకూ తెలిసినదే.

శ్రీపర్వత విజయపురిని గురించి మొదటి శాసనాధారం శ్రీలంక కాండేజిల్లాని లిధినిమలైలో లభించిన రాజాకనిత్థతిస్స (క్రీ.శ. 226-244) శాసనంలో పేర్కొనబడింది. గౌతమిబాలశ్రీ నాసిక్ శాసనం, గుంటుపల్లి శాసనంలో పేర్కొన్న సెరగిరిని శ్రీ పర్వత ప్రాంతంగా చరిత్రకారులు గుర్తించారు. విజయపురి పట్టణంలో హిందూ దేవాలయాలు, స్నానవాటికలు, స్మశానవాటికలు, అశ్వమేధయాగ వేదిక పశ్చిమంవైపున వున్న కృష్ణానది ఒడ్డున నిర్మింబడినట్లుగాను, బౌద్ధ స్థూపాలు విహారాలు పట్టణం మధ్యన, తూర్పువైపున చిన్న కుందేళ్ళ గుట్ట, పెద్దకుందేళ్ళగుట్టపైన, రాజప్రాసాదం పట్టణం మధ్యలోను నిర్మించబడినట్లుగా విజయపురిలో నిర్వహించిన త్రవ్వకాలలో వెలుగులోకి వచ్చాయి. షుమారు రెండువేల సంవత్సరాలకు పూర్వం శ్రీపర్వతం కాశ్మీర, గాంధార, వంగ, వనవాస చీన, చిలాట, తోసలి, అపరాంత, యవన దమిళ, శ్రీలంక మొదలైన దూరప్రాంతాలనుండి బౌద్ధ భిక్షువులను, పరివాజకులను, యాత్రికులను, విద్యార్థులను ఆకర్షించింది. థేరవాద బౌద్ధులకు బుద్ధగయలాగ, మహాయానులకు ధాన్యకటకం లాగా, మహాసాంఘిక థేరవాదులకు శ్రీపర్వతం గొప్ప బౌద్ధక్షేత్రంగా భాసిల్లింది. త్రవ్వకాలలో లభించిన రోమను బంగారు నాణాల ఆధారంగా శ్రీపర్వతం రోము, గ్రీకు, సిథియన్ దేశాలతో పాటు, చైనా, బర్మా, శ్రీలంక దేశాలతో ఇక్కడి ప్రజలు సముద్రమార్గం, కృష్ణానది ద్వారా వ్యాపార సంబంధాలు కలిగివున్నట్లుగా తెలుస్తున్నది. గ్రీకులు, రోమనులు ఇక్కడ నివసించినట్లుగా నాగార్జున కొండ శిల్పాలలో చూడవచ్చును. ఇచ్చట జరిపిన త్రవ్వకాలలో ప్రాచీన శిలాయుగం, నవీన శిలాయుగం, బృహత్‌శిలాయుగానికి చెందిన ఆదిమానవుడు రాతితో చేసిన పనిముట్లు, కుండపెంకులు, మట్టి పాత్రలు, పూసలు, లభించినదానిని బట్టి ఆదిమానవుడు ఈ లోయలో నివసించినట్లుగా స్పష్టమౌతున్నది.

ప్రఖ్యాత బౌద్ధక్షేత్రమైన శ్రీపర్వత-విజయపురి గురించి 1926కు ముందు బయటి ప్రపంచానికి తెలియదు. విజయపురి దగ్గరలోనే వున్న నాగులవరం అనే గ్రామంలో ఉపాధ్యాయునిగా పనిచేస్తున్న సూరపురాజు వెంకట్రామయ్య విజయపురిలోయలో రాతి (సున్నపు రాయి)పై వున్న తనకు తెలియని భాషలో వున్న కొన్ని అక్షరాలను చూసి, అదే విషయాన్ని మద్రాసులో వున్న భారత పురావస్తు శాఖవారి దృష్టికి తేవటం జరిగింది. ఆ శాఖలో శాసన పరిశోధకునిగా ఉద్యోగం చేస్తున్న A.R. సరస్వతిగారు నాగార్జునకొండకు వచ్చి రాతిపై బ్రహ్మి భాషలో వున్న శాతవాహన ఇక్ష్వాకుల కాలంనాటి శాసనాలను చదివి, ఆ ప్రాంతపు ప్రాముఖ్యతను గ్రహించి నాగార్జునకొండ బౌద్ధక్షేత్రాన్ని గురించి బయటి ప్రపంచానికి తెలియచేశాడు. మద్రాసులో భారత పురావస్తుశాఖాధికారిగా పనిచేస్తున్న హమీద్ ఖురేషి 1927లో విజయపురిని దర్శించి అచ్చటి పురావస్తు అవశేషాల్ని గమనించి, ఆ స్థల ప్రాముఖ్యాన్ని, చారిత్రక ప్రాముఖ్యాన్ని గుర్తించి కేంద్రప్రభుత్వానికి ఒక నివేదికను సమర్పించారు. ప్రభుత్వలిపి శాస్త్రజ్ఞుడు హీరానందశాస్త్రి విజయపురిలోయలో వున్న శాసనాల నకళ్ళను తీసి J. PH. Vogel గారి ద్వారా "ఎపిగ్రాఫికా ఇండియా"లో ఆ శాసనాలను ప్రకటించాడు. భారతపురావస్తుశాఖ అధ్యక్షులుగా వున్న ఎ.హెచ్.లాంగ్ హర్ట్స్ 1927-31 సంవత్సరాలలో ఈ లోయలో శాస్త్రీయంగా త్రవ్వకాలు నిర్వహించి అనేక విహారాల, స్థూపాల, హిందూ దేవాలయాల శిథిలాలను, శిల్పాలను, శాసనాలను వెలుగులోకి తెచ్చారు. అదే శాఖకు చెందిన టి.యన్. రామచంద్రన్ ఈ లోయలో త్రవ్వకాలు జరిపి అనేక పురావస్తు అవశేషాలను వెలికితీశారు.

విజయపురికి 10 కి.మీ దిగువనవున్న కృష్ణానదిపై ఆనకట్ట నిర్మించాలని కేంద్రప్రభుత్వ ప్రతిపాదన మూలంగా నాగార్జునకొండ లోయ నీటమునిగి మన వారసత్వ సంపద శాశ్వతంగా కోల్పోయే ప్రమాదమేర్పడినపుడు వారసత్వ చిహ్నాలను పరిరక్షించి, వాటిని ఎత్తైన ప్రదేశంలో పునర్నిర్మించి భావితరాలకు అందించాలనే ఉద్దేశ్యంతో భారత పురావస్తుశాఖవారికి ఆదేశాలు జారీచేసింది. భారత పురావస్తు శాఖ రాయప్రోలు సుబ్రహ్మణ్యంగారిని ప్రత్యేక అధికారిగా నియమించిన 1954-60 మధ్యకాలంలో నాగార్జునకొండ లోయలో అణువణువూ శాస్త్రీయంగా త్రవ్వకాలు జరిపించి 130కు పైగా నివేశన స్థలాలను గుర్తించి ఆదిమానవుని ఆనవాళ్ళు బౌద్ధారామాలను, దేవాలయాల అవశేషాలను, దగ్ధమైన రాజప్రాసాదాల చిహ్నాలను శాసనాలను, శిలాఫలకాలను, చిద్రమైన వాస్తుకళాశకలాలను వెలుగులోకి తెచ్చారు. 1955లో అప్పటి ప్రధానమంత్రి జవహర్‌లాల్

నెహ్రూగారు నాగార్జునసాగర్ ప్రాజెక్ట్ శంకుస్థాపన సందర్భంగా నాగార్జునకొండలోయలో జరుపుతున్న పురావస్తు త్రవ్వకాలను చూసి ఈజిప్టులోని నైలునదిపై ఆనకట్ట (అశ్విన్) నిర్మించినపుడు నుబియా లోయలో వున్న పురావస్తు కట్టడాలను "అబూసెంబల్" వద్ద పునః నిర్మించిన విధంగానే, విజయపురి త్రవ్వకాలలో వెలుగుచూసిన పురావస్తు అవశేషాలను నాగార్జునకొండపైన పునర్నిర్మించి శిల్పాలను, శాసనాలను, శిలాఫలకాలను, నాణాలను, బుద్ధుని ధాతుపేటికలను, బంగారు ఆభరణాలను భారతదేశంలో మొట్టమొదటి ద్వీపకల్ప వస్తు సంగ్రహాలయాన్ని స్థాపించి శిల్పసంపదను భద్రపరచవలసినదిగా ఆదేశించారు. వారి ఆదేశం ప్రకారమే భారతపురావస్తుశాఖవారు నాగార్జునకొండతో రాతితో వస్తు సంగ్రహాలయాన్ని స్థాపించి, శిలాఫలకాలను, రాతివిగ్రహాలను (హిందూ, బౌద్ధ, జైనమతాలకు చెందినవి), ప్రాచీన శిలాయుగపు రాతి పనిముట్లను, అలంకృత రాతి స్థంబాలు, శాసనాలను అందులో ప్రదర్శించారు. వస్తుసంగ్రహాలయ భవనానికి అప్పటి కేంద్ర సాంస్కృతిక, వైజ్ఞానిక మంత్రివర్యులు శ్రీ హుమయూన్ కబీరుగారు 1962లో శంఖుస్థాపన చేయగా 1966లో అప్పటి కేంద్రవిద్యాశాఖమంత్రివర్యులు శ్రీ ఎమ్.సి. చాగ్లాగారు ప్రారంభోత్సవం చేశారు. మహాస్థూపం, సింహళవిహారం, అశ్వమేధ యాగవేదిక, స్నానవాటిక , వైష్ణవాలయం, లోహాయుగపునాటి సమాధి చైత్యగృహం, స్వస్తిక ఆకారంలో వున్న స్థూపపు పునాది మొదలైన 11 పురాతన కట్టడాలను యథాతథంగా, అదే ఆకృతిలో రిజర్వాయరు నీటికి 14 మీటర్ల ఎత్తులో వున్న నాగార్జునకొండపైన, బౌద్ధారామాలు, విహారాలు (నాగార్జున విశ్వ విద్యాలయం, హారీతి దేవాలయం, రంగస్థలం మొదలైన కట్టడాలను, 14వ శతాబ్దిలో నెల్లూరు (సింహపురి) పాలకుడు మనుమసిద్ధి విజయపురిలో నిర్మించిన శ్రీరంగనాథుని దేవాలయం అనుపు అనే ప్రదేశంలో పునఃనిర్మించారు. ఈ ప్రాంతాన్ని, శాతవాహనులు, ఇక్ష్వాకులు, పల్లవులు, విష్ణుకుండినులు, వేంగి చాళుక్యులు, కాకలు, కాకతీయులు, కొండవీటిరెడ్డిరాజులు, గజపతులు, విజయనగర రాజులు, గోల్కొండ నవాబులు, బ్రిటీషు వారు పరిపాలించినట్లుగా చరిత్ర తెలియచేస్తున్నది. కుతుబ్‌షాహీ రాజుల శాసనం ప్రకారం నాగార్జునకొండ దుర్గాన్ని పుష్పగిరి (కడపజిల్లా) పీఠాధిపతికి అగ్రహారంగా దానం ఇచ్చినట్లు తెలుస్తున్నది. కొండవీటిని రాజధానిగా చేసుకుని రెడ్డిరాజులు పరిపాలించిన కాలంలో నాగార్జున కొండ ప్రాంతంవారి పరిపాలనాయంత్రాంగంలోని సీమగా వుండేది. నాగార్జునకొండపైన వీరు మూడు అంచెలుగల కోటను నిర్మించారు. ఈ కోట వీరికి సైనిక స్థావరంగా, వారి రాజ్యానికి దక్షిణ దుర్గంగా, కృష్ణాతీర ప్రాంతానికి ముఖ్య కేంద్రంగా వుండేది. గజపతులు నాగార్జునకొండను వశపరచుకొని, దానిని ప్రాముఖ్యంగల దుర్గంగా గుర్తించారు. పురుషోత్తమ గజపతి తన ప్రతినిధిగా శ్రీనాథ రాజసింగ రాయమహాపాత్రుని నియమించినట్లుగా క్రీ.శ. 1491 నాటి తెలుగు శాసనం ద్వారా తెలుస్తున్నది. శ్రీకృష్ణదేవరాయలు, గజపతుల సైనిక స్థావరాన్ని వశం చేసుకుని అయ్యలయ్య, వీరభద్రయ్య అనే సేనానులను నియమించి నాగార్జున కొండను రాజకీయ పాలనా కేంద్రంగా చేశారు. 1565లో జరిగిన తాళికోట యుద్ధంలో విజయనగర రాజుల ఓటమి తరువాత ఈ ప్రాంతం గోల్కొండ నవాబుల ఆధీనంలోకి వెళ్ళింది. ఈవిధంగా ఆదిమానవుని నాగరికతనుండి ఆధునికయుగం వరకు అనేక సంస్కృతులు ఈ లోయలో వెల్లివిరిసినట్లుగా తెలుస్తున్నది.

**బౌద్ధ నిర్మాణాలు :**

శాతవాహనరాజు యజ్ఞశ్రీశాతకర్ణి పోషణనో శ్రీపర్వతం బౌద్ధ నగరి. ఇక్ష్వాకురాజు వీరపురుషదత్తుని కాలంలో శ్రీపర్వత విజయపురి బౌద్ధమహాక్షేత్రం ఇక్ష్వాకురాజులు వైదికమతాన్ని అవలంభించి రాజసూయ, అగ్నిస్తోమ, అశ్వమేథయాగాలు నిర్వహించినారు. బౌద్ధ మతాన్ని కూడా ప్రోత్సహించినారు. రాణులు ఉపాసికలు స్థూపము, విహారము, చైత్యము శిలామంటపాలు నిర్మించి విజయపురిని దక్షిణ భారతదేశంలోకెల్లా పెద్ద బౌద్ధక్షేత్రంగా నిర్మించటంలో పృథ్వీ మూల రాజు కొండవీటి శాసనం ప్రకారం శ్రీపర్వత విజయపురి ప్రసిద్ధ బౌద్ధక్షేత్రంగా క్రీ.శ. 5-6 శతాబ్దాలవరకు విరాజిల్లింది. మహాయాన (మహాసాంఘిక) హీనయాన (దేరవాద), వజ్రాయాన శాఖలు ఇక్కడ విలసిల్లాయి. బౌద్ధంలో అనేక ఉపశాఖలు శ్రీపర్వతంలో వున్నా, ఈ ప్రాంతం అపరశైలీయుల ముఖ్యస్థావరంగా వుండేది. భిన్నశాఖలు ఏర్పడిన సిద్ధాంతాల విభేదాల కారణంగా వివిధ నిర్మాణవిభాగాల్లోను, వాటి విన్యాసంలోను వ్యత్యాసాలు గోచరిస్తాయి. విజయపురిలోని స్థూప, విహార నిర్మాణాలను ఐదు విశిష్టతరగతులుగా గ్రహించ వచ్చును. ఇచ్చటి స్థూప పునాదులు చక్రాకారంలో నిర్మించబడినాయి. షుమారు 22 స్థూపాలు చక్రాకారపునాదిపై నిర్మించబడగా ఒక స్థూపం మాత్రం స్వస్తిక పునాదిపై నిర్మించబడింది. స్థూప భాగాలైన మేధి ఆయకవేధిక అండము ఇటుకలతో నిర్మించబడగా, చతురస్రాకారములో వున్న హర్మిక, చత్రం లేక ఛత్రావళి అలంకృత సున్నపు రాతితో నిర్మించారు. మేది, ఆయనకవేదిక, అండము అలంకృత సున్నపురాతితో కప్పబడి బుద్ధుని జాతక కథలు, బుద్ధుని జీవితములోని ఘట్టాలు శిల్పీకరింపబడివుండి బౌద్ధభిక్షువులకు ఆకర్షణగా వుండేవి. శ్రీపర్వతవిహారాలు ఉన్నతవిద్యాకేంద్రాలుగా వుండి దూరదూర ప్రాంతాలనుండి విద్యార్థులను ఆకర్షించేవి. ఆచార్య నాగార్జునుడు, ఆర్యదేవుడు, భావవివేకుడు, బుద్ధఘోషుడు, బుద్ధపాలిత, ధర్మకార్తి, కుమారవిజయ ఈ విహారాలలో బోధించినట్లుగా తెలుస్తున్నది. బ్రాహ్మణులు, శ్రీమణులు, అనే తేడాలేకుండా ఇక్కడ ఉన్నతవిద్యనభ్యసించేవారు. బౌద్ధధర్మంతోపాటు, జైనధర్మం, వేదాంగాలు, న్యాయ వైశేషికాది దర్శనాలు, లలితకళలు, ఇతర విద్యలు బోధించేవారు.

విజయపురిలో బౌద్ధమతంలో ఈక్రింది శాఖలు అమలులో వున్నట్లు శాసనాల ద్వారా తెలుస్తున్నది. వీరు మహాసాంఘికులు,

బహుశ్రుతీయులు, మహిశాసకులు, తీరవాదులు, మహావిహార వాసినులు,అపరమహావినశౌలీయులు, లోకోత్తర వాదినులు మొదలైన వారు ముఖ్యులు. ఈ శాఖలవారికి విహారాలు వేరువేరుగా నిర్మింప బడినాయి. బోధిసిరి శ్రీలంక దేశంనుండి వచ్చే బౌద్ధభిక్షువుల కోసం సింహళవిహారాన్ని నిర్మించగా, భట్టిదేవి అనే రాణి యహువల శాంత మూలుని కాలంలో బహుశ్రుతీయ విహారాన్ని నిర్మించింది. చంద్రశ్రీ అనే బౌద్ధఉపాసిక అపర మహావినశేలియ శాఖకు చెందిన భిక్షువుల కోసం 9వ నెంబరు స్థూపాన్ని పునరుద్ధరించింది. మహాదేవి కొండ బలిసిరి మహిశాసకశాఖవారి కోసం విహారాన్ని నిర్మించింది. కుమార నందిని అనే వ్యాపారి బుద్ధుని విగ్రహాన్ని ప్రతిష్టించి సంస్కృతంలో శాసనం వేయించాడు. రాకుమార్తె శాంతిసిరి ఒక చైత్యాన్ని నిర్మించింది. యహువల శాంతమూలుని రాజ్యకాలంలో బౌద్ధవిహారాలు విరివిగా నిర్మించబడినాయి. శాంతమూలుడు కోటినాగళ్ళు (శతసహస్ర) హల, నాణాలు, గోవులను దానం చేశాడని శాసనాలు తెలియపరుస్తున్నాయి. వీరపురుషదత్తుని కాలం బౌద్ధానికి స్వర్ణయుగం అని చరిత్రకారులు ప్రశంసించారు. వీర పురుషదత్తుని శాసనాలు నాగార్జునకొండలోనే కాక జగ్గయ్యపేట (బేతవోలు), ఉప్పుగుండూరు అల్లూరు మొదలైన ప్రదేశాలలో లభించాయి. గౌతమబుద్ధుని తరువాత అంతటివాడైన ఆచార్యనాగార్జునుడు శ్రీధాన్యకటకానికి పశ్చిమాన మరియు శ్రీపర్వ తానికి తూర్పునవున్న గ్రామంలో జన్మించినట్లు టిబెట్ గ్రంథాలద్వారా తెలుస్తున్నది.

గుంటూరుజిల్లాలో వున్న వేదలి అతని జన్మస్థలమని చరిత్రకారుల అభిప్రాయం. నలందా విశ్వవిద్యాలయంలో వేదవేదాంగాలు అభ్య సించి తన చివరి జీవితాన్ని శ్రీపర్వతంలో గడిపినట్లుగా తెలుస్తున్నది. ఆయన మహాయానంలో మాధ్యమిక వాదాన్ని స్థాపించి బౌద్ధమత ప్రచారం చేశాడని తెలుస్తున్నది. దురదృష్టవశాత్తూ నాగార్జునుని పేరు



నాగార్జునకొండ ద్వీపం

ఏ శాసనాలలోను ప్రస్తావించబడలేదు. యజ్ఞశ్రీ శాతకర్ణి ఆచార్య నాగార్జుననికై శ్రీపర్వతంలో మహాచైత్యము, విహారాలను నిర్మించాడు. నాగార్జునుడు శ్రీపర్వతంలో విశ్వవిద్యాలయాన్ని, పెద్ద గ్రంథాలయాన్ని నెలకొల్పాడు. నాగార్జునుడు శ్రీధాన్యకటక మహాచైత్యానికి శిల్పాలతో కూడిన ప్రాకారంలో (Railing)ని నిర్మించాడు.నాగార్జునకొండ లోయలో షుమారు 400 ప్రాకృత బ్రాహ్మి, తెలుగు, సంస్కృతంలో వేయించిన శాసనాలు లభించాయి.



సర్వదేవాలయం, విజయపురి



పునఃనిర్మిత మహాస్థూపం, నాగార్జునకొండ

ఇక్ష్వాకు రాజు రుద్రపురుషదత్తుని పల్లవరాజు నరసింహవర్మ క్రీ.శ. 300లో ఓడించి, విజయపురిని తమ రాజ్యంలో కలుపు కున్నాడు. పల్లవులు వైదికమతాన్ని ప్రోత్సహించారు. విష్ణుకుండినులు శ్రీపర్వతస్వామి (బుద్ధుడు) పాదభక్తులమని చెప్పుకున్నారు. చాళు క్యులు హారీతి పుత్రులమని ప్రకటించుకున్నారు. ఇక్ష్వాకుల కాలంలో శ్రీపర్వతంలో ఒక వెలుగు వెలిగిన బౌద్ధం, విష్ణుకుండినుల తరువాత రాజాదరణ లేక క్రమంగా నశించిపోయింది. నాగార్జునకొండ బౌద్ధం కాలగర్భంలో కలిసిపోయింది. ఆ కొండపైన భారత పురావస్తుశాఖ వారు నిర్మించిన పురావస్తు ప్రదర్శనశాలను, ఆ కొండపై పునఃనిర్మింప బడిన ఇక్ష్వాకుల కాలంనాటి స్థూపాలు, విహారాలు, స్నానవాటికలు, స్మశానవాటిక, అశ్వమేధయాగ వేదిక దర్శించటానికి యాత్రికులు దక్షిణ విజయపురినుండి పర్యాటక శాఖవారు నిర్వహిస్తున్న లాంచీలలో ప్రయాణించవలసి వుంటుంది.

పవిత్ర కృష్ణానది తీరంలో క్రీ.శ. 2, 3, 4 శతాబ్దాలలో ప్రపంచ దేశాలవారిని ఆకర్షించిన బౌద్ధమత క్షేత్రం ఆ తరువాతికాలాలలో రాజాదరణ లేక హిందూమతవాదుల వత్తిడిని తట్టుకోలేక కాల గర్భంలో కనుమరుగైంది. ★

చిరునామా : *శ్రీ కె. వెంకటేశ్వరరావు, సెల్ : 94906 36659*

శ్రీ సుభాకర్ మేడసాని

# కృష్ణాతీరంలో జైన,బౌద్ధాలు కవల పిల్లలు

ఆర్యేతర జాతుల్లోని ఆంధ్రులు, భారత జాతీయ జీవన స్రవంతిలో కలవటానికి జైన, బౌద్ధమతాలు సహాయకారులైనాయన్న ప్రముఖ చరిత్రకారులు బి.యస్.ఎల్. హనుమంతరావుగారి అభిప్రాయం సరైనదేనని భావించాలి. బుద్ధుని జీవితకాలంలోని బౌద్ధధర్మం తెలుగునేలలో ఒక భాగమైన నేటి తెలంగాణాలోని కరీంనగర్ ప్రాంతానికి చేరుకొన్నా, అశోకుడు ధమ్మ ప్రచారానికి పంపిన మహాదేవథేరుని ద్వారా బౌద్ధం కృష్ణాతీరంలోకి ప్రవేశించింది. అశోకుడు చెక్కించిన ఎఱ్రగుడి శిలాశాసనల్లోని 13వ శాసనంలో ఆంధ్రులు అప్పటికే బౌద్ధధర్మాన్ని పాటిస్తున్నారని పేర్కొన్నాం. అశోకుని కాలంలో నేడు అమరావతిగా పిలువబడుతున్న ధంఞకడ (ధాన్యకటకం)లో ఒక స్థూపం ఉండేదనీ, దానిచుట్టూ అశోకుని కాలంలోనే రాతి కంచె నిర్మించబడిందనటానికి, ఆ స్థంభాలపై నున్న మౌర్యుల కాలంనాటి బ్రహ్మీశాసనాలు, గిర్నార్ శాసనాక్షరాలను పోలిన అశోకునిదనుకుంటున్న అమరావతిలో బయల్పడిన పాలిష్ చేసిన రాతిపైగల మౌర్యశాసనం, స్థంభాలపై పాలిష్, తవ్వకాల్లో దొరికిన మెరుపు గల నల్లరంగు నగిషీ మట్టిపాత్రలు చక్కటి రుజువులు. భట్టిప్రోలు స్థూపం నుంచి బయల్పడిన అశోకుని కంటే కొద్దిగా ముందు కాలానికే చెందిన రాజా కుబిరకుడు ప్రతిష్టించిన ధాతుపేటికలపై గల శాసనాక్షరాలు, వడ్డమాను స్థూప అవశేషాలు అన్ని ఆధారాలు కలిపి కృష్ణాతీరంలో అశోకుని కంటే ముందే బౌద్ధం వేళ్లూనుకుని, అశోకుని కాలంలో సుస్థిరమైందని చెప్పటానికి అవకాశాన్ని కల్పించాయి.

అంతేకాదు, బౌద్ధం ఆంధ్రులలో సృజనాత్మకతకు, కళాదృష్టికి ప్రేరకమై ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన అమరావతి శిల్పకళను సృష్టించి, దక్షిణాసియా దేశాల్లో బౌద్ధం విస్తరించటానికి కారణభూతమైంది. మహాయాన, వజ్రయాన బౌద్ధవిధానాలకు కృష్ణాతీరమే పుట్టినిల్లైందని ధాన్యకటకంలో దొరికిన ఆధారాలు రుజువు చేస్తున్నాయి. మూలమాధ్య మిక కారిక, మహాప్రజ్ఞాపారమిత శాస్త్రాలను, సుహృల్లేఖ, రత్నావళి లాంటి లేఖా సాహిత్యాన్ని రాసిన మాధ్యమిక తాత్వికవేత్త ఆచార్య నాగార్జునుడు, అతని శిష్యుడు ఆర్యదేవుడు. భావవివేకుడు కృష్ణాతీర వాసులే. అశోకుని తరువాత కృష్ణాతీరాన్ని పాలించిన సదవంశీయులు, శాతవాహనులు, ఇక్ష్వాకులు బౌద్ధాన్ని ఆదరించారు. గౌతమీపుత్ర శాతకర్ణి కాలానికి ధాన్యకటకం రాజధానిగా వెలుగొంది ఆంధ్రనగరిగా పేరుగాంచింది. ఆచార్య నాగార్జునుని పర్యవేక్షణలో ధాన్యకటక మహా చైత్యం, విస్తృతం గావించబడి రాతిప్రాకారం, శిల్పఫలకాలతో అలంకరింపబడింది. ఈ కాలంలోనే వాసిష్ఠీపుత్ర పులుమావి ధాన్యకటక స్థూపం తూర్పువైపు ద్వారాన్ని ఎత్తించినట్లూ, అతడు ధనకటక (ధాన్యకటక) స్వామి అని ఒక అమరావతి శాసనం తెలియజేస్తుంది. ఇక్ష్వాకుల రాజధాని అయిన శ్రీ పర్వత-విజయపురిలో శాతవాహన కాలంలో ప్రారంభమైన బౌద్ధం, క్రీ.శ. 3వ శతాబ్దానికి విలసిల్లి 30 బౌద్ధ స్థావరాలకు నిలయమైంది. ఇక్ష్వాకు రాణులతోపాటు రాజ కుటుంబంలోని స్త్రీలెందరో బౌద్ధాన్ని ఆదరించి అమరావతీ శిల్పం పరిఢవిల్లటానికి తమవంతు చేయూతనిచ్చారు. పల్లవులకాలం (4వ శతాబ్దం)లోనూ, ఆనందగోత్రికులకాలంలోనూ కృష్ణాతీరం బౌద్ధానికి ఆలవాలమైనట్లు శాసనాలు నిరూపిస్తున్నాయి. పల్లవ శివస్కందవర్మ మైదవోలు రాగిరేకు శాసనంలో బౌద్ధకేంద్రమైన ధాన్యకటకం ఆంధ్రా పథానికి రాజధాని అని పేర్కొనబడింది. చేజర్లలోని కపోతేశ్వరాలయం ఆనందగోత్రికుల కాలపుచైత్యగృహమేనని తవ్వకాలు నిరూపించాయి. విష్ణుకుండినుల కాలంలో అంటే క్రీ.శ. 4-6 శతాబ్దాలు కాలంలో వారు శ్రీపర్వత స్వామి పాదపదాను యాయులుగా పేర్కొనబడినారు. శ్రీ పర్వతస్వామి అంటే విజయపురిలోని బుద్ధ భగవానుడేనని పరిశోధకులు గుర్తించారు. శాసనాల్లో వారు పరమ సౌగతులుగా పేర్కొనబడి నారు. తూర్పు (వేంగీ) చాళుక్యుల కాలంలో క్రీ.శ. 639-40 మధ్య చీనీ దేశపు భిక్షుక యాత్రికుడు హుయాన్‌త్సాంగ్ ధాన్యకటకం, నాగార్జునకొండల వద్ద గల బౌద్ధాలయాల స్థితిగతులను

వర్ణించటంలో అప్పటికి కూడా బౌద్ధం ఆదరించబడుతుందనే చెప్పే వీలు చిక్కింది. ప్రత్యేకించి బౌద్ధ విద్యాకేంద్రంగానున్న ధాన్యకటకంలో హుయాన్ త్సాంగ్ త్రిపిటకాల్లో చివరిదైన అభిధమ్మ పిటకాన్ని నేర్చుకొన్నాడంటే అక్కడ పండితులైన బౌద్ధాచార్యులు ఉండేవారని తెలుస్తుంది. ధాన్య కటకం విద్యాపీఠం నమూనాగా టిబెట్‌లోని లాసాలో డాపంగీ విద్యాలయం నిర్మించబడిందని తారానాథుడు తెలియజేశాడు. ధ్యాన కటకంలో క్రీ.శ. 8-9 శతాబ్దాలకు చెందిన వజ్రయాన బౌద్ధ శిల్పాలైన రత్నసంభవ, మహాతార, హేరుక, అవలోకితేశ్వర, మంజుశ్రీ మొదలైన శిల్పాలు బయల్పడి బౌద్ధం ఆ కాలంలో కూడా కొనసాగిం దని తెలియజేశాయి. ఇక్కడ దొరికిన మంజుశ్రీ విగ్రహం కిరీట భాగంలో ధాన్య బుద్ధుడైన అక్షోభ్యుడి బదులు, చైత్యం చెక్కి ఉండటం గమనించాల్సిన విషయం. అమరావతికి సమీపంలో వైకుంఠపురంలో క్రీ.శ. 9వ శతాబ్దినాటి భూమి స్పర్శ ముద్రలోనున్న బుద్ధుని శిల్పం, మంగళగిరి సమీపంలోని నిజముద్రలోగల క్రీ.శ. 10వ శతాబ్దినాటి అమితాభబుద్ధ శిల్పాలు, బౌద్ధకథ భావజాలానికి ఆ రోజుల్లో ఉన్న ఆదరణను నిరూపిస్తున్నాయి.

మధ్యయుగ ప్రారంభకాలంలో కృష్ణాతీరం నుంచి పాలించిన రాజులు, సామంత రాజులు బుద్ధరాజని పేర్లు పెట్టుకున్నారు. క్రీ.శ. 1146 నాటి ఒక బెజవాడ శాసనంలో బుద్ధరాజు ధరణికోటలోని బుద్ధదేవునికి, శాశ్వత దీపదానం చేసినట్లు పేర్కొనబడింది. అలాగే క్రీ.శ 1182 నాటి కోట కేతరాజు ధరణికోట శాసనంలో అక్కడి స్థూపం అత్యంత సుందరంగా శిల్ప, చిత్రకళా శోభితమై వెలుగొందు తుందనీ (స్థూపం అత్యున్నతం నానాచిత్ర సుచిత్రితమ్), అక్కడి బుద్ధ దేవుని దీపారాధనకు అతని వారసులు 110 గొర్రెల్ని దానం చేయగా, అతడు కంతేరు, మేడికొండూరు, డోకిపర్రు గ్రామాలను దానం చేశాడని చెప్పబడింది. అమరేశ్వరాలయంతోపాటు ధాన్యకటకం లోని బౌద్ధ చైత్యం, బుద్ధ చైత్యాలు పూజలందుకుంటూనే ఉన్నాయని ఈ శాసనం రుజువు చేస్తుంది. ఆదరణ సన్నగిల్లినా, ధాన్యకటక బౌద్ధస్థూపం దీపాల దిన్నె పేరుతో బౌద్ధులఆరాధ్యస్థావరంగా ఉండేది. క్రీ.శ. 1344 నాటి శ్రీలంకలోని గదలదీనియ బౌద్ధక్షేత్రంలో ఉన్న ఒక శాసనంలో, ధాన్య కటకంలోని రెండంతస్తులబౌద్ధాలయం శిథిలమై పోగా, ధర్మకీర్తి అనే శ్రీలంక బౌద్ధాచార్యుడు ఆ ఆలయానికి మరమ్మతులు చేయించాడని చెప్పబడింది. కృష్ణాతీరంలో ధాన్యకటకం (అమరావతి), భట్టిప్రోలు, ఘంటసాల, జగ్గయ్యపేట, గోలి, మాజేరు, అల్లూరు, శ్రీపర్వత-విజయపురి, (విజయవాడ, పెనుమాక, సీతానగరం, ఉండవల్లి గుహ లయాలు), నిడుమోలు, గంగూరు, బాపట్ల, గుడివాడ, బుద్ధాం, చందోలు, చుండూరు, చేబ్రోలు, గరికపాడు, మోదుకూరు, వేమూరు, పెద్దమద్దూరు, పెద్దకంచర్ల, రెంటాల, గురజాల, పోలం పల్లి, ఆరుగొలను, వడ్డమాను, కేసానుపల్లి, గుడిమెల్లంక, ఎర్రపాలెం, కేతవరం, పెదకొడమిగండ్ల, గ్రంథసిరి,పంగిడి (మైలవరం), ముప్పాళ, మల్లెపాడు (తెనాలి) లాంటి స్థావరాలు బౌద్ధవాస్తుకు, శిల్పానికి శాసనాలకు అద్దంపడుతున్నాయి. క్రీ.పూ. 3వ శతాబ్ది నుంచి క్రీ.శ. 14వ శతాబ్ది దాకా, బౌద్ధమతం ప్రజల అభిమతమైందనీ, రాజులు, రాణులు, సామంతులు, అమాత్యులు, శెట్లు, సాధారణ గృహపతులు, చర్మకారుల్లాంటి వృత్తిపనివాళ్లు బౌద్ధానికి చేయూతనివ్వటం వల్లనే, స్థూపాలు, చైత్యాలు, విహారాలు రూపుదిద్దుకొని, వాస్తు-శిల్పం వికసించింది.

ఇలా బుద్ధుని కాలంలోనే బౌద్ధధర్మం తెలుగునేలపై ప్రవేశించి, అశోకుని కాలంలో కృష్ణాతీరంలో నిలదొక్కుకుని, శాతవాహనుల కాలంలో లెక్కలేనన్ని బౌద్ధారామాలు, విహారాలు, స్థూపాలు, చైత్యాలు నిర్మింపబడి, ప్రజలందరూ శాంతికాముకులు కావటానికి తోడ్పడింది. థేరవాదులు, బుద్ధ వచనాన్ని యథాతథంగా ఆచరించగా, మహా సాంఘికులు మాత్రం బుద్ధుని లోకోత్తరునిగా కీర్తించి, క్రమక్రమంగా, విగ్రహ రూపంలో బుద్ధుని ఆరాధించటం ప్రారంభించారు. మలిదశలో మహాయాన శాఖగా రూపుదిద్దుకోవటానికి దోహదం చేశారు. బుద్ధునికి దివ్యత్వం, బోధిసత్త్వులపట్ల విశ్వాసం, శూన్యతావాదం, అద్వయ వాదం అందరూ పాటించగల నైతిక నియమాలు, బుద్ధుని ఆరాధన, ఉపాసకులు కూడా నిర్వాణాన్ని పొందే వీలుంటుందని ప్రకటించటం లాంటి ప్రతిపాదనలతో మహాయానం బౌద్ధం కృష్ణాతీరంలో బహుళ ప్రచారానికి నోచుకుంది.

బుద్ధుని తరువాత అంతటివాడుగా పేరుగాంచిన ఆచార్య నాగార్జు నుడు, గౌతమీపుత్ర శాతకర్ణికి సమకాలికుడు. క్రీ.శ. 1వ శతాబ్దిలో బాపట్ల సమీపంలోని యాజిలి (వేదలి) గ్రామానికి చెందినవాడనీ, ధాన్యకటకం, శ్రీపర్వత విజయపురి (నాగార్జునకొండ)లో ఎక్కువకాలం నివసించి, ధమ్మ ప్రచారం గావించాడని పురావస్తు పరిశోధనలు రుజువు చేశాయి. బుద్ధుడు ప్రవచించిన మధ్యమ ప్రతిపతి (మధ్యే మార్గం)కు తాత్విక అర్థాన్ని చెప్పి, బౌద్ధభావనలో కొత్త ఆలోచనల్ని రేకెత్తించాడు నాగార్జునుడు. మాధ్యమిక కోరికకు అకుతోభయ వ్యాఖ్యను రాసి, శూన్యతా వాదానికి వివరంగా సంవృత, పరమార్థ సత్యాలను ప్రవచించి, మాధ్యమిక, లేక శూన్యతావాదాన్ని అందించాడు.

శూన్యతావాదాన్ని విమర్శించిన వారివాదనలను ఖండిస్తూ, విగ్రహ వ్యావర్తని అనే తర్క గ్రంథాన్ని రాశాడు. ఇంకా శూన్యతా సప్తతి, వ్యవహారసిద్ధి, వైద్యులప్రకరణం, యుక్తషష్టిక, చతుస్తవ, సుహృల్లేఖ, రత్నావళి, ప్రతీత్య సముత్పాద హృదయ కోరిక, బోధిచిత్త వివరణ

బోధిసంహారక, నీతిశాస్త్రజంతుపోషక బిందు మొదలైన గ్రంథాలను రాసి, చైనా, జపాన్ టిబెట్ దేశాల్లో సైతం పేరుగాంచాడు. నాగార్జునుని శిష్యుడైన ఆర్యదేవుడు కూడా కృష్ణాతీరంలోనే గడిపి గుంటూరుజిల్లా పొన్నూరు సమీపంలోని నందూరులో నిర్వాణం పొందాడని చరిత్ర కారులు పేర్కొన్నారు. క్రీ.శ.4వ శతాబ్దిలో మరో బౌద్ధాచార్యుడు భావి వివేకుడు కృష్ణాతీరంలో ఉన్న మంగళారణ్యమని పిలవబడిన నేటి మంగళగిరిలోని ఒక గుహలో నివసించాడు. ఇలా బౌద్ధతాత్విక ధోరణులను ప్రసరింపజేసిన తెలుగు బౌద్ధాచార్యులకు కృష్ణాతీరం పుట్టిల్లుగా భాసిల్లింది.

కృష్ణాతీరంలో నిర్మించిన స్థూపాలకు నలువైపులా నాలుగు అరుగులు, వాటిపై సిద్ధార్థ గౌతముని జీవితంలోని ఐదు ప్రధాన ఘట్టాలను సూచించే ఐదు స్థంబాలను నిలబెట్టే సంప్రదాయం కూడా కృష్ణాతీరంలోనే రూపుదిద్దుకుంది. జీవముట్టిపడేట్లు అనేక శిల్పాలున్న శిలాఫలకాలు, వాటిపై ఉన్న అనల్పకల్పనా చాతుర్యాన్ని ప్రతిబింబిస్తున్న అమరావతి శిల్పానికి కూడా కృష్ణాతీరం పుట్టినిల్లే. కృష్ణానది తెలుగు నేలపై కాలిడిన మహబూబ్ నగర జిల్లాలో ఎందుకో బౌద్ధం వేళ్లూనుకోలేకపోయింది. శాతవాహనుల కాలంలో కోస్తాతీరంలో తిసరణాలు మారుమోగుతుండగా, మహబూబ్ నగర్ జిల్లాలో, శైవం పల్లవించింది. జైనానికి ఆలవాలమైంది. ఆ జిల్లాకు అటువైపునున్న నల్లగొండ జిల్లా మాత్రం బౌద్ధాన్ని ఆదరించి అక్కున చేర్చుకొంది. శ్రీపర్వత విజయపురికి ఎదురుగా కృష్ణానది ఎడమగట్టునున్న ఏలేశ్వరంలో క్రీ.పూ. 1 - క్రీ.శ. 4వ శతాబ్దం మధ్యకాలానికి చెందిన బౌద్ధస్థూపాలు, చైత్యాలు, శిలామండపాలు బయల్పడి, నాగార్జునకొండకు సమకాలీన బౌద్ధక్షేత్రంగా విలసిల్లినట్లు తవ్వకాల్లో బయల్పడిన కట్టడాలు, నాణేలు, ఇతర పురావస్తువులు తెలియజేస్తున్నాయి.

నల్లగొండజిల్లాలో జనగామ సూర్యాపేట దారిలో తిరుమలగిరి నుంచి సూర్యాపేటవైపు 6 కి.మీ. దూరంలో ఉన్న ఫణిగిరిలో జరిపిన తవ్వకాల్లో క్రీ.పూ. 2 - క్రీ.శ. 2 శతాబ్దాల మధ్యకాలానికి చెందిన ఒక పెద్ద బౌద్ధాలయం బయల్పడింది. తవ్వకాల్లో మహాస్థూపం, రెండు చైత్యాలు, రెండు శిలామండపాలు, ఏడు మొక్కుబడి స్థూపాలు, ఆరు విహారాలు, బుద్ధపాదాలు, బుద్ధుని ప్రతిమలు, నలుపు-ఎరుపు, ఎరుపు రంగు మట్టిపాత్రలు, శాతవాహన, రోమన్ నాణేలు, శాతవాహన, ఇక్ష్వాకుల శాసనాలు బయల్పడినాయి. ఫణిగిరిలో దొరికిన ఇక ఇక్ష్వాకు శాసనం ప్రత్యేకతను సంతరించుకొంది. ఇప్పటివరకూ ఇక్ష్వాకురాజైన వీర పురుషదత్తుడు 11 సం॥లు మాత్రమే పాలించాడనుకుంటుండగా ఈ శాసనం అతని 18వ పాలనా సంవత్సరాన్ని తెలియజేసింది. ఇదే శాసనం ధర్మచక్ర ప్రశస్తితోపాటు, కంససూదన, మధుసూదన అని కృష్ణుని ప్రస్తావిస్తున్న తొలి శాసనంగా కూడా గుర్తింపు పొందింది. అపురూపమైన అమరావతి శిల్పానికి అద్దంపడుతున్న స్తంభాలు, అడ్డ పట్టీలు, బుద్ధపాదాలు, బుద్ధునిపాదాలు, మాంధాత, ఛంపేయ జాతక కథలున్న శిలాఫలకాలు బయల్పడి ఫణిగిరి ఒకప్పుడు ప్రసిద్ధ బౌద్ధారామమని తెలియజేస్తున్నాయి. ఫణిగిరి చుట్టూ ఐదు కిలోమీటర్ల పరిధిలో వర్ధమానకోట, తిరుమలగిరి, నాగారం, గాజులబండ, సింగారం, అరవపల్లి, ఆళ్లగడ్డగూడెంల వద్దకూడా బౌద్ధ ఆనవాళ్లు బయల్పడి, కృష్ణాతీరంలోనున్న నల్లగొండజిల్లా బౌద్ధానికి పట్టుగొమ్మగా విలసిల్లిందని తెలియజేస్తున్నాయి. 1700 ఏళ్ళ పాటు మనగలిగిన బౌద్ధం,క్రీ.శ. 14వ శతాబ్దం నుంచి కనుమరుగైనా శాంతి సామరస్యం, సౌభ్రాతృత్వం, సమ భావనలు కృష్ణాతీరంలో ఇప్పటికీ ఆచరణలో ఉండటం గమనించాల్సిన అంశం.

బౌద్ధమతంలాగే జైనమతాన్ని కూడా కృష్ణాతీరం అక్కున చేర్చుకుంది. ఆవశ్యక సూత్రం వ్యాఖ్యలో 24వ తీర్థంకరుడైన వర్ధమాన మహావీరుడు, కళింగం ద్వారా మోసలికి ప్రయాణించాడనీ, ఇది కృష్ణాతీరంలోని మచిలీపట్నంగా కొందరు చరిత్రకారులు గుర్తించారు. అమరావతికి దగ్గర్లోని వడ్డమానులో జరిపిన తవ్వకాల్లో క్రీ.పూ. 3వ శతాబ్ది నాటి జైనస్థూప అవశేషాలు బయల్పడినాయి. రాళ్లపైనా, మట్టిపాత్రలపైనా గల బ్రాహ్మీ శాసనాల్లో జైన గణాలకు, విహారాలకు, సంఘాలకు, చేసిన వివరాలున్నాయి. మళ్లీ అటు తరువాత బాపట్లకు సమీపంలోని కర్లపాలెం మండలం,పేరలి అనే గ్రామంలోక్రీ.శ. 4-5 శతాబ్దాల నాటి అజితనాథ తీర్థంకరుని కంచు బొమ్మ దొరకటంతో కృష్ణాతీరంలో ఈ కాలంలో జైనం కొద్దికొద్దిగా వేళ్లూనుకొంటుందని తెలుస్తుంది.

వేంగీ (తూర్పు)చాళుక్యుల కాలంనుంచి జైనం తీరాంధ్రలో, ప్రత్యేకించి కృష్ణాతీరంలో ఆదరించబడినది. తూర్పుచాళుక్య వంశస్థాపకుడైన కుబ్జవిష్ణువర్ధనుని భార్య అయ్యణదేవి, బెజవాడలోని నెడుంచివసది అనే జైన బసది, జినాలయాల కోసం చంద్రప్రభాచార్యులకు తోంక-నతవాడి విషయంలోని ముసినికొండ అనే గ్రామాన్ని దానం చేసినట్లుగా చెప్పబడింది. కుబ్జవిష్ణువర్ధనుడు సౌరాష్ట్రలో (యువరాజుగా) రాజప్రతినిధిగా ఉన్నప్పుడు, చంద్రప్రభాచార్యునితో పరిచయమేర్పడి అయ్యణదేవి, ఆచార్యుని శిష్యురాలైనది. విష్ణువర్ధనుడు, వేంగికి వచ్చినప్పుడు చంద్రప్రభాచార్యుని ఆహ్వానించారు. ఈ నడుంబివసది, విజయవాడ వన్‌టౌనులోని జమ్మిదొడ్డి ప్రాంతంలో ఉండేదని గుర్తించారు. తరువాత మూడో విష్ణువర్ధనుని (కీ.శ. 718-752) ముసినికొండ రాగి రేకుల్లో, ఇంతకుముందు అయ్యణ మహాదేవి నడుంబివసదికి ఇచ్చిన దానాన్ని పునరుద్ధరించినట్లు చెప్పబడింది. దానాన్ని

పొందిన జైనాచార్యుడు కళి భద్రాచార్యుడు, చంద్రప్రభాచార్య పరం పరలో, ఏడవ ఆచార్యుడు. ఇదే కాలంలో విజయవాడ శివారులో నున్న అంబాపురంలో శ్వేతాంబరజైన శాఖ, యాపనీయ విభాగానికి చెందిన ఒక గుహను చెక్కించారు. క్రీ.శ. 8వ శతాబ్దికి చెందిన ఈ గుహ గర్భాలయంలో వర్ధమానమహావీరుడు, అర్ధమండప గోడలపైన పార్శ్వనాథుడు, అంబిక విగ్రహాలు చెక్కబడినాయి. తెలుగునేలకు శ్వేతాంబరులకు చెందిన ఒకే ఒక గుహగా అంబాపురం గుహ గుర్తింపు పొందింది. క్రీ.శ. 10వ శతాబ్దికి చెందిన మహావీరుని శిల్పం మచిలీ పట్నం లోని లక్ష్మీదేవి ఆలయంలో ఉంది. తూర్పు చాళుక్య రాజైన రెండో అమ్మిరాజు (క్రీ.శ. 945-970) విడుదల చేసిన మచిలీ పట్నం రాగిరేకు శాసనాలు ఒక జైనాలయానికి కృష్ణాతీరంలోని పెదగాదెల వర్రు గ్రామాన్ని దానం చేసినట్లు చెబుతున్నాయి. అలాగే అతని సామంతుడైన దుగ్గరాజు కోరికపై కృష్ణాతీరంలోని మలియం పుండి (మెల్లెంపూడి)ని దానం చేసినట్లుగా కూడా ఉంది. అతని సేనా నాయకులైన భీమ, నరవాహనులు, బెజవాడలో ఒక బసదిని, రెండు జైనాలయాలను నిర్మించారు. ఈ బసదిలోని జయసేనాచార్యుని సేవిస్తున్న శ్రావక, క్షుల్లక, క్షపణక, అర్జికల కోసం పెదగాదెలవర్రును దానం చేసినట్లుగా చెప్పబడింది. విజయవాడలోని పాతశివాలయం లోని కాశీవిశ్వేశ్వరాలయం, నాలుగు ద్వారాలతో నిర్మించబడిన సర్వతో భద్ర జైనాలయమే. ఇందులోని క్రీ.శ. 10వ శతాబ్దికి చెందిన శిల్పం విజయవాడ మ్యూజియంలో ఉంది.

బాపట్లలో 10 అంగుళాల ఎత్తున్న అనేక జైన కంచుబొమ్మలు లభించాయి. వర్ధమాన మహావీర, పార్శ్వనాథ, పద్మప్రభ, అంబిక, మొదలైన ఈ విగ్రహాలు క్రీ.శ. 10వ శతాబ్దికి ఈ ప్రాంతం జైనమత ప్రభావంలోనున్నట్లు తెలియజేస్తున్నాయి. ప్రస్తుతం ఇవి హైదరా బాదులోని స్టేట్ మ్యూజియంలో ఉన్నాయి. మహబూబ్‌నగర్ జిల్లా, కృష్ణాతీర గ్రామమైన ఉజ్జిలిలోని క్రీ.శ. 1097వ సం॥పు శాసనంలో ఉజ్జిలి కోటలోని బద్ధి జినాలయంలోని చెన్న పార్శ్వనాథాలయ అంగ భోగ, నైవేద్య, దీప, ధూప, తాంబూలం కోసం దేవాలయ జీవోద్ధరణ కోసం కొంత భూమిని దానం చేసినట్లు చెప్పబడింది. ఇదే జిల్లా పూడూరులోని ఆరో విక్రమాదిత్యుని (క్రీ.శ. 1076-1126) 11వ శతాబ్దపు శాసనంలో పూడూరు ప్రభువైన పల్లవరస, అక్కడొక ఐదంత స్తుల సర్వతోభద్ర జినాలయాన్ని నిర్మించి, అతనికి దీక్షనిచ్చిన కాంచన సేన భట్టారకునికి, పూడూరు, ఇటికాల గ్రామాల్లోని భూములు, తోటలు, దుకాణాలు, ఇళ్లు దానం చేసినట్లు చెప్పబడింది. పూడూరు గ్రామంలో అనేక పార్శ్వనాథ జినుని విగ్రహములు దొరికాయి. ఇదే జిల్లాలోని కృష్ణాతీర గ్రామమైన జటప్రోలు శివారు గ్రామమైన సింగవరం గట్టుమీద బయ్యన్న పేరుమీద పార్శ్వనాథుని విగ్రహ ముంది. ఈ విగ్రహం క్రీ.శ. 11వ శతాబ్దికి చెందింది.

### అనుబంధం -2

కృష్ణాతీరంలోనున్న మహబూబ్‌నగర్‌జిల్లాలో తిజ్జలి, పూడూరు, సింగవరం, గుమ్మిడం గ్రామాలతోపాటు, కందూరు చోళులకు కొంతకాలం రాజధానిగా వర్ధిల్లిన వర్ధమానపురంలో వర్ధమాన మహా వీరునికి ఒక ఆలయముంది. క్రీ.శ. 11వ శతాబ్దికి చెందిన ఈ ఆలయం వల్లే ఈ గ్రామానికి వర్ధమానపురమని పేరొచ్చింది. ఇంకా ఇదే జిల్లాలో, వనపర్తికి సమీపంలోనున్న పానగల్లు, సిరికొండ, అల్వాను పల్లి, గంగాపురంలలో కూడా జైనాలయాలున్నాయి.

మహబూబ్‌నగర్‌జిల్లా తరువాత కృష్ణాతీరంలోనే ఉన్న నల్లగొండ జిల్లా జైనమతానికి ఆయువుపట్టుగా ఉండేది. కళ్యాణచాళుక్య యువరాజైన కుమార తైలపుడు క్రీ.శ. 11వ శతాబ్దంలో ఇక్కడొక జైన దేవాలయాన్ని నిర్మించారు. అటు తరువాత క్రీ.శ 1110వ సం॥లో కుమారసోమేశ్వరుడు కూడా ఇక్కడి జైన బసదికి దానం చేశాడు. ఇక్కడున్న జైన దేవాలయం విష్ణు కుండినుల కాలంలో ప్రారంభమై నేటికీ వేలమంది జైన ఉపాసకులను ఆకర్షిస్తూనే ఉంది. ఇక్కడ 20 జైన శాసనాలు, నిశీధి రాళ్లు, జైనవిగ్రహాలు కొలనుపాక జైనక్షేత్ర చరిత్రకు మౌనసాక్ష్యులు. క్రీ.శ. 1125 నాటి శాసనంలో కేశరాజు ఇక్కడున్న అంబరతిలకమనే జైనబసదిలో అంబికకు ఒక ఆలయాన్ని నిర్మించి,మానస్థంభాన్ని నిలిపి, మకర తోరణంతోఅలంకరించాడని ఉంది. ఇదే శాసనంలో ఇక్కడ మూలసంఘ, కానూర్గణమేష-పాషాణగచ్ఛకు చెందిన మేఘచంద్రదేవుడనే జైనాచార్యుని ప్రస్తావన కూడా ఉంది.

నల్లగొండజిల్లా సైదాపూరులోని క్రీ.శ. 1034వ సం॥ శాసనంలో, రాజగురువు, రాజవైద్యుడు, వైద్యరత్నాకర, ప్రాణాచార్యుడూ, ఆయు ర్వేద వైద్యశాస్త్రజ్ఞుడు, శస్త్రచికిత్సకుడూ అయిన అగ్గలయ్య, ఇక్కడ, ముచ్చనపల్లిలో రెండు జినాలయాలను నిర్మించాడని చెప్పబడింది. జైనాచార్యులు ప్రసిద్ధ వైద్యాచార్యులని కూడా ఈ శాసనం వల్ల తెలు స్తుంది. మిర్యాలగూడ సమీపంలోని కృష్ణాతీరంలో గల అడవిదేవుని పల్లి కూడా క్రీ.శ. 11-12 శతాబ్దాలనాటి జైనకేంద్రము.

కళ్యాణీ చాళుక్యుల తరువాత, కాకతీయుల కాలంలో కూడా కొలనుపాక గొప్ప జైన పుణ్యక్షేత్రంగా కొనసాగింది. క్రీ.శ. 1276వ సం॥పు కోగలితీర్థ శాసనంలో కొలనుపాక జైనులకు తీర్థయాత్రా స్థలమని పేర్కొనటాన్ని ఈ సందర్భంలో ప్రస్తావించాలి.

కొలనుపాక జైనాలయం ఔరంగజేబు కుమారుడైన మొదటి బహ దూర్షా ఆదరణ చూరగొన్న విషయం ఆశ్చర్యాన్ని గొలుపుతుంది.

కొలనుపాకలోనున్న క్రీ.శ. 1711వ సం॥పు శాసనంలో, 'ఢిల్లీశ్వర-పాతసాహ శ్రీ ఓరంగజేబ ఆలంగీరపుత్ర శ్రీ బహదూర్‌షా అని మొదటి బహదూర్‌షాను కీర్తిస్తూ, తపోగచ్ఛకు చెందిన భట్టారక విజయరత్న సూరి సమక్షంలో, ధర్మకుశలుని శిష్యుడైన కేసరి కుశలుడు, ఢిల్లీపాలకుడైన ఆలంగీరు ఔరంగజేబు కుమారుడైన మొదటి బహ దూర్‌షా సుబేదార్ నవాబ్ మహమ్మది యూసుఫ్‌ఖాన్ సహకా రంతో ఇక్కడున్న ఒక చైత్యాలయానికి జీర్ణోద్ధరణ చేసి, అందులో మాణిక్య స్వామి (పార్శ్వనాథు)ని ప్రతిష్ఠించినట్లూ, ఆ చైత్యాలయం చుట్టూ ఒక ప్రాకారాన్ని కట్టించినట్లూ పేర్కొనబడింది. కృష్ణాతీరం పరమత సహనాన్ని ఉగ్గుబాలతో పెంచి పోషించిందని ఈశాసనం నిరూపిస్తుంది. ఇదే కాలంలో తీరాంధ్రం కళ్యాణి చాళుక్యుల పాలనలో ఉండగా తెనాలి సమీపంలోని కొల్లూరు నుంచి పాలన చేసిన కన్నడ సేనా నాయకుడైన అనంతపాలుడు, చేబ్రోలులో అనంత జినాలయాన్ని నిర్మించాడు. చందోలును పాలించిన వెలనాటి మొదటి గొంకరాజు కాలంలో అంటే కులోత్తుంగ చోళుని ముప్పైఏడో సం॥లో అమరావతి సమీపంలోని పృధ్వీతిలకమనే ఒక శ్వేతాంబర జినాలయాన్ని నిర్మించినట్లు, అక్కడినుంచి తరలించి అమరావతి మ్యూజియంలో ఉంచిన శాసనం వల్ల తెలుస్తుంది. తాడికొండ కూడా అప్పుడు ఒక జైన క్షేత్రమే.

తెనాలిలోని రామలింగేశ్వరాలయంలో క్రీ.శ 10వ శతాబ్దికి చెందిన వర్థమాన మహావీరుని శిల్పముంది. తెనాలి ఒకప్పటి జైన బసది అని ఈ విగ్రహం వల్ల తెలుస్తుంది. తెనాలి కైఫీయతులనను సరించి త్రిలోచన పల్లవుడు తెనాలిలో జైనబసదిని నిర్మూలించి, ఆ ప్రదేశంలో ముక్కంటి రామలింగేశ్వరునికి ఆలయాన్ని నిర్మించాడు. కాకతీయుల కాలంలో కూడా చేబ్రోలులో ఒక జైన దేవాలయముంది.

**అనుబంధం -2**

విజయవాడకు సమీపంలోనికొలనుకొండ,చిలువూరు, ఉయ్యూరు, వల్లూరు, కొల్లూరు, చోరగుడి, గుడివాడ, నందిగామ, అంబ(బా)రుపేట క్రీ.శ. 10-12 శతాబ్దాల్లో జైన కేంద్రాలుగా విలసిల్లినట్లు ఆయా గ్రామాల్లోనున్న జైనతీర్థంకర విగ్రహాలే సాక్ష్యం. నాగార్జునకొండ జైనాలయం, అక్కడున్న పార్శ్వనాథ విగ్రహం రెడ్డి రాజులకాలానికి (క్రీ.శ.14వ శతాబ్దికి)చెందింది. శ్రీశైలంలోని క్రీ.శ. 1512వ శతాబ్దపు శాసనంలో అక్కడి జైన మునులను వీరశైవు డైన శాంతలింగప్ప వధింపగా,శ్రీకృష్ణదేవరాయలు, తన ప్రతినిధి వెలుగోటి తిమ్మానాయినిపంపి, జైనులకు అండ కల్పించి,శాంత లింగప్పను శిక్షించాడని చెప్పబడింది. ఇలా కృష్ణాతీరం, వైదిక మతాలతోపాటు, వైదికేతర మతాలైన బౌద్ధ, జైనాలను కూడా సుమారు 1800 సం॥ల పాటు సమాదరించింది.

"శ్రీకాకుళము భక్తలోక చింతామణి
శ్రీకాకుళము సుకృతాకారము
శ్రీకాకుళము ధారలోక వైకుంఠము
శ్రీకాకుళము మర్త్య సేవితంబు
శ్రీకాకుళము వేదసిద్ధాంత మహిమంబు
శ్రీకాకుళము హత వ్యాకులము
శ్రీకాకుళము మహాక్షేత్రవతంసంబు
శ్రీకాకుళము సర్వసిద్ధికరము
తెలియ శ్రీకాకుళంబు నీ దివ్యదేశ
మాంధ్రనాయక! నీవె శ్రీహరివి నిజము
చిత్రచిత్ర ప్రభవ! దాక్షిణ్యభావ!
హత మమతజీవ! శ్రీకాకుళాంధ్రదేవ!"

– ఆంధ్రనాయకశతకం నుండి.

**చిరునామా :** *శ్రీ శుభాకర్ మేడసాని, ప్రధాన కార్యదర్శి, విజయవాడ బుద్ధ విహార, . 306, బాల్లకు ఏ, నిర్మల నివాస్, శ్రీరామచంద్ర నగర్, విజయవాడ -8, సెల్ : 9553245555*

ఆచార్య ఎమ్.రాజగోపాలరావు

# కృష్ణాజిల్లాలో బౌద్ధం

ఈనాడు కృష్ణాజిల్లాలో బౌద్ధరూపురేకలేవీ కనిపించవు. ఒకనాటి బౌద్ధ కేంద్రాల శిథిలాలు మాత్రమే కనిపిస్తాయి. అవి ఆనాటి బౌద్ధ విస్తృతిని అందిస్తాయి. దానిని ఒక క్రమంలో గ్రహించుకోవాలంటే బౌద్ధ విస్తరణలో సంభవించిన ముఖ్యపరిణామాలను సంక్షిప్తంగా నయినా సమీక్షించుకోవలసి ఉంది.

గౌతమబుద్ధుని ధర్మాదేశనతో ప్రారంభమయిన బౌద్ధం తంత్ర యాన అభివృద్ధితో అంతరించి పోయిందని సాధారణ అవగాహన. ఆ మధ్య కాలంలో ఎన్నో మార్పులు చోటు చేసుకొన్నాయి. వాటిని స్థూలంగా మూడు దశలుగా విభజిస్తారు. అవే హీనయాన మనబడే శ్రావక యానం, మహాయానం, తంత్రయానం. ఈ మూడూ ఈనా టికీ ప్రపంచంలో అనేక దేశాలలో శాఖోప శాఖలుగా విస్తరించి కొన సాగుతున్నాయి. ఆ మూడింటి అభివృద్ధికీ ఆంధ్రదేశం కేంద్ర బిందువు అవటం విశేషం.

బుద్ధుని జీవిత కాలంలోనే ఆయన ధర్మం ఆంధ్రదేశం చేరిందని "సుత్తనిపాత" సాక్ష్యం చెబుతున్నది. అంటే శ్రావక యానం ప్రారంభం లోనే ఇక్కడ ప్రవేశించిందని అర్థమవుతుంది. బుద్ధుని మహా పరిని ర్వాణం తరువాత బౌద్ధ స్థవిరులలో తలెత్తిన విభేదాల పరిష్కారానికి 3 సంగతులు - అంటే సభలు జరిగాయి అంటుంది సంప్రదాయం. రెండో సంగతిలో ఆ విభేదాల పర్యవసానంగా మహాసాంఘిక ఉద్య మం- బౌద్ధంలో ఉదారవాదుల ఉద్యమం బయలుదేరింది.అది మహా దేవ ఆధ్వర్యంలో దక్షిణాదికి తరలివచ్చి ఆనాటి ఆంధ్ర రాజధాని ధాన్యకటకలో స్థిరపడి పోయింది. అది పూర్వశైల, అపరశైల, ఉత్తర శైల, రాజగిరీయ, సిద్ధత్థిక వగయిరా శాఖలుగా విస్తరించి ఈ ప్రాంతంలో అనేక కేంద్రాలను స్థాపించుకొంది. ఆ మహాసాంఘికుల భావజాలం నుంచి ఆవిర్భవించిన మహాయానాన్ని ఆచార్య నాగార్జు నుడు తీర్చి దిద్దాడు. అటు తరువాత కాలంలో తాంత్రిక ప్రక్రియలు బౌద్ధంలో ప్రవేశించి తంత్రయానం అభివృద్ధి చెందింది.

ఈ బౌద్ధవిస్తృతిలో మరో ముఖ్య పరిణామం స్తూపాల నిర్మాణం. బుద్ధుని కాలానికే ప్రసిద్ధులకు స్తూపాలు నిర్మించే సంప్ర దాయము ఉండేది. బుద్ధుడుకూడా ఆ సంప్రదాయాన్నే కొనసాగించ మన్నాడనీ దానికి అనుగుణంగా బుద్ధుడు మహాపరి నిర్వాణం చెందిన తరువాత అస్థికల కోసం శాక్యులు మల్లులు ఘర్షణపడి వాటిని ఎనిమిది విభా గాలు చేసుకొని వాటిమీద స్తూపాలు నిర్మించు కొన్నారంటుంది మహా పరినిర్వాణ సుత్తంతం, ఆ సంప్రదాయమే ఆంధ్రదేశంలో మరింతగా విస్తరించింది. ఇక్కడ బుద్ధుని ధాతువుల మీద నిర్మించిన శారీరక స్తూపాలు, బుద్ధుడు ఉపయోగించిన వస్తువుల మీద నిర్మించిన పారి భోగిక స్తూపాలు, భక్తులు నిర్మించిన ఉద్దేశిక స్తూపాలు ఏర్పడ్డాయి. వాటితో పాటు బుద్ధ విగ్రహాన్ని ఆరాధించే చైత్య గృహాలు - వాటికి అనుబంధంగా విహారాలు వగయిరా విస్తృతంగా నిర్మాణమయ్యాయి.

ఈ పరిణామము అంతటికీ ప్రత్యక్ష సాక్షిగా కృష్ణాజిల్లా నిలుస్తుంది. ఆనాటి నిర్మాణాలేవీ ఈనాడు లేకపోయినా వాటి శిధిలాలలో లభించిన విగ్రహాలు, శాసనాలు, నాణాలు, ఆభరణాలు ఆనాటి బౌద్ధ కేంద్రాల వైభవాన్ని అందిస్తాయి. వాటిద్వారా అశోకునికి పూర్వమే బౌద్ధమిక్కడ ప్రవేశించిందనీ మూడు దశల బౌద్ధమూ ఇక్కడ వికసించిందనీ కృష్ణా జిల్లా వైభవం బౌద్ధ వైభవంతో ముడివడి ఉండేదనీ అర్థమవుతుంది.

కృష్ణాజిల్లా ముఖ్యపట్టణం మచిలీపట్టణం చారిత్రకంగా ఎంతో ప్రసిద్ధనగరం. 1940లో ఏర్పడిన ఈనాటి కృష్ణాజిల్లాకే కాదు. అంతకు ముందు 1859 నుంచి 1904 వరకు ఈనాటి గుంటూరు జిల్లాకూడా కలిసిఉన్న కృష్ణాజిల్లాకుకూడా అదే ముఖ్యపట్టణం. అంతకుముందు పాశ్చాత్యులు కూడా జీక్కడినుండే సర్కారు జిల్లాలను పాలించారు. అదే టాలెమీ మైసోలియా, ఆ ప్రాంతమే అశోకుని మహిష మండలం. దగ్గిరలోని మాజేరు బౌద్ధ చరిత్రలో స్థానం పొందింది.

బుద్ధునికీ నాగులకూ ఉన్న సంబంధం "ముచిలిందనాగ" అనే వ్యక్తితోనే ప్రారంభమవుతుంది. ఆ సంప్రదాయమే మాజేరికా నాగు లలో కొనసాగింది. బుద్ధధాతు రక్షణలో బుద్ధ సాహిత్య రక్షణలో

వారు ప్రముఖ పాత్ర వహించారు. ఆంధ్ర శిల్పులు ఆంధ్రనాగులను పడగల ద్వారా శిల్పించారు. నాగశిల్పాల ఫలకాలతో నిండిన స్తూపాలు ఆనాటి నాగుల ప్రాధాన్యాన్ని సూచిస్తాయి. రామ గ్రామంలో నిక్షిప్తం చేసిన బుద్ధ ధాతువులు వరదకు కొట్టుకుపోతూ ఉంటే మాజేరికా నాగులు సేకరించి వజ్రాలతిన్నె సమీపంలో ఈనాటి పరిటాలదగ్గర స్తూపం నిర్మిం చారు. ధాన్యకటక మహాచైత్య ప్రాంతంలో శ్రీలంకలో స్తూపం నిర్మించాలనుకొన్న పాలకుడు వాటిలో కొంతభాగాన్ని మాజే రికా ద్వారా - సముద్ర మార్గంలో తెప్పించుకొన్నాడనీ శ్రీలంక మహా వంశ కథనం. ఆచార్య నాగార్జునునికి ప్రజ్ఞా పారమిత సూత్రాలను అందించిన ఘనతకూడా వీరిదే కావచ్చు. ఈ మాజేరికా నాగుల కృషి కృష్ణాజిల్లాలో బౌద్ధ తొలిదశ ప్రవేశాన్ని అంది స్తుంది.

మాజేరుకి సమీపంలోనే మచిలీపట్నం-మహిషమండలం ఉన్నాయి. అశోకుల ధర్మప్రచార కార్యక్రమంలో పంపించిన మహాదేవ, రెండో మహాదేవ-ఇక్కడ బౌద్ధ ధర్మాన్ని విస్తరింపచేశారు. అప్పుడే స్తూప నిర్మాణ కార్యక్రమాలు ప్రారంభమయి ఉంటాయి. అత్యంత పురాతనమైన స్తూపాలు కృష్ణా జిల్లాలో ఉన్నాయి. బుద్ధుని ధాతు పేటికలు లభించటం పురాతనతకు చిహ్నం. కృష్ణాజిల్లాలో ఘంటశాల, జగ్గయ్యపేట, గుమ్మడిదుర్రు శిధిలాలలో ధాతు పేటి కలులభించాయి. ఇవేకాక గుడివాడ, అల్లూరు, విజయవాడ వంటి ప్రసిద్ధ బౌద్ధ క్షేత్రాలు కృష్ణాజిల్లాలో ఉన్నాయి. శ్రీకాకుళంగూడా ఒకనాడు బౌద్ధ కేంద్రము అనటానికి ఆధారాలు కనిపిస్తున్నాయి.

ఈనాటి ఘంటసాలకు బౌద్ధ చరిత్రలో ఎంతో ప్రాధాన్య ముంది. ఇక్కడి స్తూప ప్రస్తావన ఇతర స్తూపాల శాసనాలలో కనిపిస్తుంది. ఇది బౌద్ధుల కాలంలో కంటకశాల-బుద్ధుని మహాభినిష్క్రమణంలో భాగ మయి చరిత్రప్రసిద్ధమయిన గుర్రం కంటకం. దానిపేరుతో ఈ స్థూపం నిర్మాణమయింది. ఆ గుర్రం సంస్కృతీ కరణమే ఘోటకంగా ఈనాటికీ అక్కడి వారి బనవాడగా సాక్షాత్కరిస్తుంది. కంటకశ్శిలను టాలమీగూడ పేర్కొనటం దానిచారిత్రక ప్రసిద్ధికి నిదర్శనం. ఇక్కడ లభించిన సింహా సనం, ధర్మచక్ర శిల్పాలు - తొలిదశ బౌద్ధం-కూడా ప్రాచుర్యమంది నదని నిరూపి స్తాయి. శ్రావకయాదులు బుద్ధుని విగ్రహాన్ని కాక బుద్ధుని సంకేతా లయిన సింహాసనం, ధర్మచక్రం, బోధివృక్షం పాదాలు వగ యిరాలను ఆరాధించేవారు. మహాయానులే బుద్ధ విగ్రహాన్ని తీర్చి దిద్దారని పండితులు అంగీకరిస్తున్నారు. ఇక్కడ బుద్ధ ప్రతిమ లభిం చటం మహాయానం గూడా ఇక్కడ కొనసాగిందని నిరూపిస్తుంది. ఇక్కడ శిధిల ప్రదేశం మొన్నటిదాకా "లంజె దిబ్బగా" ప్రసిద్ధం. ఇది తంత్రయాన అవసాన దశకు సూచకం. తంత్రయానంలో గుహ్యా చారం-రహస్య ప్రక్రియ ఉండేది. తాంత్రికులు సంభావించిన స్త్రీ పురుష సంబంధాలు ఉదాత్తాలు. వాటిని సామాన్యులు గ్రహించుకో లేరు. దాని ఆసరాగా ప్రత్యర్థులు తాంత్రికులను దూషించి ఉంటారు. అదేప్రాచుర్యంపొంది బౌద్ధపతనానికి దోహదం చేసింది. ఆవిధంగా ఆనాటి కంటకశైలంలో బౌద్ధం అన్నిదశలలోనూ కొనసాగిందని అర్థమవుతుంది.

ధాన్యకటక - నేటి అమరావతి - శాసనంలో పేర్కొన్న అయిదు ప్రముఖ కేంద్రాలలో కంటకశైల ఒకటి. ఇక్కడ ఉన్న అపరశైలీయుల కోసం నిర్మించిన మండపానికి ఒక స్తంభాన్ని దానం చేయటాన్ని పెదవేగి శాసనం ప్రస్తావిస్తుంది. ఇక్కడి మహా చైత్య తూర్పుద్వారానికి ఉపాసిక బోధిసిరి శిలామండపాన్ని నిర్మిం చిందంటుంది నాగార్జున కొండశాసనం. ఇవి ఆనాటి ఈ స్తూప ప్రసిద్ధిని తెలియజేస్తాయి.

కృష్ణాజిల్లాలో మరో ప్రధానమైన బౌద్ధ కేంద్రం జగ్గయ్యపేట. జగ్గయ్యపేట ఇటీవల వచ్చిన పేరు. రాజావాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు తన తండ్రి పేరుతో నిర్మించిన గ్రామం జగ్గయ్యపేట. దాని పక్కనే బేతవోలు ఉంది. దగ్గరలో కృష్ణా తీరంలో ఉన్న వేలగిరి బౌద్ధ చరిత్రలో ప్రముఖ స్థానం పొందింది. దానినిప్పుడు వేదగిరి అంటున్నారు. ధాన్యకటక శాసనం పేర్కొన్న ఉత్తర పర్వత మిదే. అదే ఉత్తర శైలుల స్థావరము అంటున్నారు పండితులు.

అక్కడి శిధిలాలలో శిలాస్తంభాలు, విగ్రహాలు, ధాతుపేటిక లభిం చాయి. అక్కడ లభించిన రెండు శాసనాలలో ఒకటి చాలా ప్రాధాన్యం పొందింది. ఇది ఒక బుద్ధ విగ్రహం అర్ధ చంద్రాకార పీఠంలో ఉంది. దీనిని చంద్ర ప్రభాచార్య వేయించారు. ఈ చంద్ర ప్రభాచార్య తాను నాగార్జునాచార్య శిష్యుడయిన జయప్రభాచార్య శిష్యుడనని చెప్పు కొన్నారు. దానిని బట్టి ఈ చంద్ర ప్రభాచార్యను ఆచార్య నాగార్జునుని మధ్యమకారికకు ప్రసన్న పదవృత్తి రాసిన చంద్రకీర్తిగా గుర్తిస్తున్నారు. ఆ విధంగా అది ఆచార్య నాగార్జునునికి ఈ ప్రాంతంలో ఉన్న సన్ని హిత సంబంధాన్ని నిరూపించే అవకాశం కల్పిస్తున్నది. ఇది మహాయాన కేంద్రమేకాక-మాధ్యమిక వేదకేంద్ర మని గూడా దీని ద్వారా అర్థమవుతుంది.

అటువంటి మరో ప్రాచీన కేంద్రం గుమ్మడిదుర్రు దగ్గర రామిరెడ్డి పల్లె ప్రక్కన ఉండి అక్కడ ధాతు కరండం లభించటమేకాక మహా స్తూపంతో పాటు ఉద్దేశిక స్తూపాలు. అంటే భక్తులు నిర్మించిన చిన్న స్తూపాలున్న ఆధారాలు లభించాయి. బుద్ధుని విగ్రహాలు, స్తంభాలు కూడా దొరికాయి. అక్కడలభించిన సంస్కృత శాసనాలను బట్టి అది తొమ్మిదో శతాబ్దందాకా కొనసాగినట్లు పండితులు భావిస్తున్నారు. అంటే, అది గూడా మూడు దశల బౌద్ధ అభివృద్ధికీ కేంద్రమయినట్లు తేలుతుంది. అక్కడ లభించిన విగ్రహాలు, బంగారుమాల అమరావతి వస్తు ప్రదర్శనశాలలో ఉన్నాయి. బోలుగా, నలుచదరంగా, సున్నిత మయిన నగిషీలతో ఉన్న ఆ బంగారు పూసలు సందర్శకులను విస్తు పోయేలా జేస్తుంటాయి. ఆనాటి స్వర్ణకారుల కౌశల్యానికి అద్దం పడుతుంటాయి.

కృష్ణాజిల్లాలో మరో ముఖ్య బౌద్ధ కేంద్రం గుడివాడ. ఇది ఒకప్పటి కూడూరు దేశ ప్రధాన పట్టణం. దీనిని సంస్కృతీకరించి గృధ్రహార అనటం గూడా శాసనాల్లో కనిపిస్తుంది. ఇక్కడి స్తూపమే కాదు, స్తూప శిధిలావశేషాలు గూడా అంతరించి పోవటం దురదృష్ట కరం. ఈ విహారంలో నివసించిన భదంత బుద్ధరక్షిత ఆచార్యనాగా ర్జునుడు చేపట్టిన ధాన్యకటక మహాచైత్య పునరుద్ధరణా కార్య క్రమాన్ని పర్య వేక్షించాడు అంటుంది ఒక శాసనం. దానితో పాటు అక్కడ గౌతమీపుత్ర, యజ్ఞశ్రీల నాణాలు లభించటం దాని పురాతన తను నిరూపిస్తాయి. గుడివాడ దగ్గర శిధిల ప్రదేశాన్ని కూడా "లంజదిబ్బ" అనే అంటు న్నారు. అందువల్ల అది తంత్రయాన అవసాన దశవరకు కొనసాగినట్లు అర్ధమవుతుంది. ఆనాటి మరో ముఖ్య బౌద్ధకేంద్రం అల్లూరుదగ్గర ఉండేది. ఇక్కడ లభించిన శాసనాలను బట్టి ఇది మహా సాంఘిక పూర్వశైలీయుల కేంద్రమని అర్ధమవుతుంది. బౌద్ధవిహారాల నిర్మాణానికీ బౌద్ధభిక్షువుల పోషణకూ దీపాలకూ దానాలిచ్చిన శాసనాలుగూడా ఇక్కడ లభించాయి. అవి ఆనాడు అన్ని వర్గాల ప్రజలూ బౌద్ధాన్ని ఎంతగా ఆదరించారో స్పష్టంచేస్తాయి.

దివిసీమ కూడూరులో ఒక బౌద్ధ కేంద్రము ఉండేదని ఒక శాసనం ద్వారా తెలియవస్తున్నది. అక్కడ నివసించిన భదంతనాగ, యువ భిక్షువు, ఉపాసక, ఉపాసికలు ధాన్యకటక మహాచైత్య ద్వారానికి దానా లిచ్చారు. నందిగామలో ఇక్ష్వాకుల కాలపు విహారమొకటుండేది. దాని పొలకువలు గూడా దొరకకుండా జేసుకొన్న ఘనత మనది. బౌద్ధ చరిత్రలో గానీ, శాసనాలలో గానీ ప్రస్తావనకు రాకుండా శ్రుతాను శ్రుతంగ ఒకనాటి బౌద్ధ కేంద్రాలుగా భావిస్తున్న రెండు, చారిత్రక ప్రదేశాలు కృష్ణాజిల్లాలో ఉన్నాయి. ఒకటి ప్రస్తుత ప్రసిద్ధ నగరం విజయవాడ. మరొకటి గత ప్రసిద్ధ నగరం శ్రీకాకుళం.

బెజవాడను విజయవాడగా మార్చివేసినా ఆ పేర్లు రెండూ శాస నాలలో కనిపిస్తాయి. బెజవాడ, బెజ్జంవాడ పెచ్చువాడలు, విజయవాటీ, విజయవాటికా, విజెయువాడ పేర్లు శాసనాలలో కనిపిస్తున్నాయి. ఇంద్రకీలాద్రి పర్వతమెప్పటినుంచో ఉంది. అయితే దానిమీద నెలకొని ఉన్న దుర్గాదేవి విగ్రహం గురించి సందేహాలు ఉన్నాయి. అది తంత్ర యానులు ఆరాధించే మంజుశ్రీమూర్తి కావచ్చు నంటున్నారు. మంజుశ్రీ విజయకీలాద్రి వచ్చాడనే ప్రసన్నపద వాక్యాన్ని దానికి ఆధారంగా ఉటంకిస్తున్నారు. ఆ పర్వతగుహలో అర్జునుడు తపస్సు జేశాడనే నానుడిఉండి, ఆ అర్జునుడు నాగార్జునుడు గావచ్చుననీ ఆ విధంగా అది ఒకనాటి మహాయాన-తంత్రయాన కేంద్రమయి ఉండవచ్చుననీ వివరిస్తున్నారు.

శ్రీకాకుళం పేరులోనే కొంత సందిగ్ధతకు అవకాశముంది. ఇక్కడి పునర్నిర్మిత ఆలయం కృష్ణానది లంక నుంచి తరలించిందని తెలిసిన విషయమే. ఆ ఆలయ కుడ్యాలలో చెదురుమదురుగా బిగించివేసిన రాళ్ళమీది శాసనాలను అధ్యయనం చేస్తే అదనపు సమాచారం లభించే అవకాశముంది. ఆ ప్రాంత పరిస్థితిని బట్టిచూస్తే అది రెండు ప్రసిద్ధ బౌద్ధ క్షేత్రాల మధ్య కనిపిస్తుంది. దానికి ఈ వైపు ఘంటసాల-అవైపు భట్టిప్రోలు ఉన్నాయి. ఆ రెండింటి మధ్య ఒక పెద్దలంకలో మరో బౌద్ధ కేంద్రము ఉన్నదనటానికి ఆధారముంది. అక్కడే ప్రధమ శాత వాహన చక్రవర్తి శ్రీముఖుని ప్రధాని అనంతపాల ఒక ఆలయం నిర్మించాడు. ఆ విధంగా అది ఆంధ్రప్రదేశ రాజధానిగా ప్రసిద్ధి చెందింది. శ్రీ కృష్ణదేవరాయలు విడిది చేసింది గూడా ఆ ఆలయ మండపంలోనే. నదీ గమనం మారడంతో అక్కడి వారందరూ ఒడ్డుకు చేరి గ్రామం నిర్మించుకుని అటు తరువాత ఆలయం తరలించు కొన్నారు. ఇదే ఆర్యదేవుని జన్మస్థానమని పండితులు భావిస్తున్నారు. ఆర్యదేవుడు ఆచార్య నాగార్జునుని దర్శించుకొని అభిమానం చూర గొన్నవాడు. నాగార్జునుని దర్శనం వివరిస్తూ గ్రంథాలు రాసినవాడు. ఆర్య దేవుడు దాక్షిణాత్యుడన్నాడు కుమారజీవం ఆయన సింహపురిలో నివసించాడన్నాడు హ్యూన్‌సాంగ్, చైనాలిపిని బట్టి ఆనాటి పరిస్థితు లను బట్టి పరిశీలించి చూస్తే ఆర్య దేవుడు శ్రీకాకుళవాసి కావచ్చునని వివరిస్తున్నారు. ఆచార్య నాగార్జునుడు ఇంద్రకీలాద్రిలో కొన్నాళ్ళు ఉన్నాడని అంగీకరిస్తే, జగ్గయ్యపేట స్తూప శాసనంలో లభించిన చంద్రప్రభాచార్యను చంద్రకీర్తిగా అంగీకరిస్తే, శ్రీకాకుళం ఆర్యదేవుని జన్మ స్థానమని అంగీకరిస్తే మహాయాన మాధ్యమిక వాదాన్ని రూపొం దించి తీర్చిదిద్దిన ముగ్గురు ప్రసిద్ధులు కృష్ణాజిల్లావారేనని తీర్మానించే అవకాశం లభిస్తుంది. మహాయాన క్షేత్రంగా ఈ జిల్లా గుర్తింపు పొందు తుంది. ఇంకా ఇటువంటి కేంద్రాలు-అజ్ఞాతంలో ఎన్ని ఉన్నాయో ఎక్కడున్నాయో ప్రస్తుతం తెలిసేపరిస్థితిలేదు. అయితే అవి బయట పడే అవకాశాలను కాదనలేము. దానికి పురాతత్త్వ శాస్త్ర పరిశోధ కులే పూనుకోనక్కరలేదు. పొలం పనులలో కందకాలు, బావులు తవ్వేటప్పుడు ఇండ్ల గోడలకు పునాదులు తీసేటప్పుడు ఎన్నోచోట్ల ఎన్నో విగ్రహాలు, స్థంబాలు, శాసనఫలకాలు, తామ్ర పత్రాలు లభించిన సందర్భాలున్నాయి. ఆంధ్ర దేశంలో ప్రతి అడుగు స్థలమూ గుప్తబౌద్ధ శిధిల నిధిగ కన్పిస్తున్నది. ఆ విధంగా వెలుగు చూసిన కేంద్రాలను మరింతగా పరిశోధించి విలువైన సమాచారం సేకరించటం జరుగు తున్నది. ఆ విధంగా లభించే సమాచారాన్ని సమన్వయించుకొని చారిత్రకతను బలపరచు కొంటూ ముందుకు సాగటమే మన కర్తవ్యం.

**చిరునామా :** *ప్లాట్ నం.3, మొదటి అంతస్తు, శ్రీసాయి అపార్ట్‌మెంట్స్, 6/18, బ్రాడీపేట, గుంటూరు-522002. ఫోన్ 9866944186*

కడియాల వెంకటేశ్వరరావు

# కృష్ణాతీరంలో కొత్తగా వెలుగుచూసిన బౌద్ధక్షేత్రాలు - ఒక పరిశీలన

కృష్ణాతీరం రెండువైపులా మౌర్యుల కాలంనాటికే బౌద్ధధర్మం వ్యాపించిన ఆనవాళ్ళు లభించాయి. శాతవాహనుల కాలంలోనే అమరావతి బౌద్ధ క్షేత్రం క్రీ.పూ. 3-2 శతాబ్దాల నాటికే నిర్మించ బడినదని ఇంచుమించు అదేకాలంలో నిర్మించిన భట్టిప్రోలు బౌద్ధ స్థూపం ఆంధ్రదేశంలో నిర్మించిన అతి ప్రాచీన బౌద్ధక్షేత్రాలుగా చరిత్ర కారులు గుర్తిస్తున్నారు. ఇప్పటివరకూ నవ్యాంధ్ర ప్రదేశ్‌లో షుమారు 150-160 వరకూ బౌద్ధ క్షేత్రాలు, స్థలాలు గుర్తించబడ్డాయి. కృష్ణాతీరంలోని, గుంటూరు జిల్లాలోని రాష్ట్రంలోనే అత్యధిక సంఖ్యలో షుమారు 45 వరకూ కృష్ణాజిల్లాలో షుమారు 20-25 వరకూ బౌద్ధక్షేత్రాలు గుర్తించబడ్డాయి. గుంటూరుజిల్లాలో శాతవాహనుల, ఇక్ష్వాకుల, విష్ణు కుండినుల, శాలంకాయనుల మొదలైన రాజ వంశాలకు గుంటూరుజిల్లానే పుట్టినిల్లు కావడం వల్ల, శాతవాహనుల, ఇక్ష్వాకుల రాజధానులు కృష్ణాతీరం సమీపంలోని శ్రీధాన్యకటకం మరియు విజయపురి (నాగార్జున కొండ) ముఖ్యపట్టణాలుగా పరిపా లించడం, వారు బౌద్ధమతాన్ని ఆదరించడం వల్ల ఒక్క గుంటూరు జిల్లాలోనే అధిక సంఖ్యలో బౌద్ధ స్థూపాలు నిర్మించ బడ్డాయని భావించ వచ్చు.

బ్రిటీష్‌వారి పరిపాలనలో ఆంధ్రరాష్ట్రంలోని ప్రముఖ బౌద్ధ క్షేత్రాలైన అమరావతి, భట్టిప్రోలు, జగ్గయ్యపేట, గుడివాడ లాంటి అనేక బౌద్ధ క్షేత్రాలను గుర్తించి వెలుగులోకి తెచ్చారు. అమరావతి ప్రపంచానికి తెలియజేశారు తరువాత ఆంధ్రప్రదేశ్ పురావస్తు శాఖ ఏర్పడిన తరువాత మరెన్నో కొత్త చారిత్రక స్థలాలు, బౌద్ధ క్షేత్రాలను గుర్తించారు. అయినా ఇప్పటి కృష్ణాతీరం అంతటా కొండలపైన, చారిత్రక పరిశోధకులు మరెన్నో చారిత్రక, బౌద్ధ క్షేత్రాలను గుర్తించి వాటిని వెలుగులోకి తెచ్చారు. భవన నిర్మాణాల సందర్భంగా, శిథిల దేవాలయాల పునరుద్ధరణ సందర్భంగా, నిధుల కోసం ఎత్తైన పాటి దిబ్బలను, శిథిల దేవాలయాల పునాదులు లోపలి వరకూ జరిపిన త్రవ్వకాల సందర్భంగా మరెన్నో బౌద్ధ క్షేత్రాల ఆనవాళ్లు వెలుగు చూస్తూనే వున్నాయి. పల్నాటి సున్నపు రాతిపై చెక్కిన పొడవైన స్థంబాలు, అమరావతి శిల్ప రీతు లను ప్రతిబింబించే శిలా ఫల కాలను మరెన్నో అమూల్య మైన శిల్ప సంసదలు వెలుగు చూస్తూనే ఉన్నాయి. 1. ఈ సందర్భంగా నేను 2003-2004 సం॥లలో తెనాలి సమీపంలోని మల్లెపాటి దిబ్బగా పిలువబడే క్రీ.పూ. 5 శతాబ్దాల నాటి పాటి దిబ్బలపై ప్రాచీన బౌద్ధ క్షేత్ర ఆనవాళ్ళను కనుగొన్నారు. 2. 2010లో కొండవీటి కొండలపై ఉన్న శాతవాహనుల నాటి బౌద్ధ శిథిల స్థూపాలను, క్రీస్తుపూర్వం 2000 సం॥ ల నాటి ఆదిమ మానవులు నివసించిన గుహలను గుర్తించాను. 3. 2012లో కృష్ణాతీరం మైలవరం (మం) పొందుగల గ్రామానికి 6 కి॥మీ దూరంలోని పంగిడిగా పిలువబడే వ్యవసాయ భూములలో శాతవాహనుల నాటి బౌద్ధ క్షేత్రాల ఆనవాళ్ళు లభించాయి. 4. పంగిడికి గుర్తించాను. పైన పేర్కొన్న బౌద్ధ క్షేత్రాల ఉనికిని గురించి నాకు తెలిసిన వివరాలను ఈ వ్యాసం ద్వారా పాటకులకు తెలియజేస్తున్నాను.

## 1. మల్లెపాడు తెనాలి, బృహత్ శిలాయుగం నాటి పాటి దిబ్బలపై వెలుగు చూసిన ప్రాచీన బౌద్ధక్షేత్ర ఆనవాళ్ళు - ఒక పునఃపరిశీలన

తెనాలి శివారు పరిధిలో మల్లెపాడు క్రీస్తుపూర్వం 5వ శతాబ్దం నాటికే అతి ప్రాచీనమైన జనావాసంగా పురాతత్వ పరిశోధకులచే గుర్తించబడినది. పూర్వం నుండి మల్లెపాడు పినపాడుకు శివారు గ్రామంగానే ఉంది, ఈ ప్రదేశాన్ని మల్లెపాడు దిబ్బఆ పిలుస్తున్నారు. దీన్ని పరిశీలించినప్పుడు షుమారు 3 లేక 4 ఎకరాల పరిధిలో ఉంది. కాని, దీని తాలూకా పాటిమట్టి, పురాతన కుండపెంకులు, పడమరవైపున ఉన్న మద్రాస్ రైల్వే లైను వరకు విస్తరించినట్లుగా కనిపిస్తున్నాయి. ఈ దిబ్బకు పడమరవైపున, దక్షిణంవైపున ఉన్న,

చెఱువులు కూడా ఈ ప్రాచీన ప్రదేశానికి చెందినవిగా భావించబడు తుంది. కనుక మల్లెపాడు దిబ్బ పూర్వం షుమారు 25-30 ఎకరాల పరిధిలో ఉండేదని భావించబడుతుంది. అంతేకాక, పూర్వం పినపాడు, మల్లెపాడు రెండు ప్రదేశాలు కలిసే ఉండేవని, మద్రాసు - ఢిల్లీ రైల్వే లైను నిర్మాణం వల్ల ఈ ప్రదేశం రెండు గ్రామాలుగా విడిపోయినట్లుగా తెలుస్తుంది. తెనాలి - రేపల్లె రైలు మార్గం నిర్మాణం వల్ల తెనాలి - మల్లెపాడు ప్రాంతాలు విడి పోయాయి. పూర్వం నుండి మల్లెపాడు దిబ్బపై బంగారు నాణేలు, బంగారు ఇటుకలు, నగలు దొరుకుతాయని ఒక వినికిడి ఉంది. షుమారు 40-50 సం॥ల క్రితం వరకు కూడా వర్షం పడినప్పుడు యానాదులు ఈ ప్రదేశంలో బంగారం కోసం వెతికేవారని గ్రామస్తులు తెలియజేస్తున్నారు.



మల్లెపాడులో మిగిలి ఉన్న పాటిదిబ్బ షుమారు 7 అడుగుల ఎత్తున ఉండి 30×40 గజాల వైశాల్యం కలిగి ఉంది. తరువాత ఇక్కడ శాతవాహనుల కాలంలో ఒక బౌద్ధ క్షేత్రం నిర్మించినట్లుగా ఈ ప్రదేశంలో లభించిన శాతవాహనుల నాటి అతిపెద్ద ఇటుకలు, బౌద్ధ క్షేత్రాలవద్ద, భిక్షుగృహాల గుమ్మాల ముందు ఉంచబడే అర్ధచంద్రాకార శిలలు కూడా ఈ ప్రాంతంలో లభించాయి. అంతేకాక ఈ దిబ్బపైన పగిలిన రాతి పలకలు, ప్రమిదలు, శంఖాకారపు గిన్నెలు, ఎర్రని కాల్చిన మట్టిబొమ్మలు కూడా అనేకం ఈ ప్రాంతంలో దొరికాయి. ఈ ఆధారాలను బట్టి క్రీస్తు పూర్వం 3 లేక 2 శతాబ్దాల నాటికి ఇక్కడ ఒక ప్రాచీనమైన బౌద్ధ క్షేత్రం ఉండేదని భావించబడుచున్నది. బృహత్ శిలాయుగం నాటి ఈ ప్రాచీన ప్రదేశం తెనాలి పట్నానికి ఆనుకొని మారీసుపేటకు నైరుతీ దిశలో అతి సమీపంలోనే ఉంది.

### అలెగ్జాండర్ రీ పరిశోధనలు :

చారిత్రకపరంగా ఈ మల్లెపాడు దిబ్బను తొలిసారిగా 1892లో అలెగ్జాండర్ రీ, అప్పటి సూపరింటెండెంట్ ఆర్కియాలజి, దక్షిణ ప్రాంత విభాగం అధిపతి, మద్రాసువారు ఈ ప్రదేశాన్ని పరిశీలించారు. పూర్వం రేపల్లె తాలూకాలో ఉన్న చారిత్రక ప్రదేశాలను సర్వే చేసిన సందర్భంగా అనంతవరం, బుద్ధాం, చందవోలు, చుండూరు, కొండముది, మందూరు, మోదుకూరు, మూల్పూరు, పెరవలి గ్రామాలలో ఉన్న పురాతన పాటి దిబ్బలతోపాటు ఈ పినపాడు శివారు మల్లెపాడు దిబ్బను కూడా అలెగ్జాండర్ రీ పరిశీలించడం జరిగింది. ఇది ఒక విడిచిపెట్టిన గ్రామం అని, దీన్ని మల్లెపాటి దిబ్బ అని పిలుస్తారని, ఈ ప్రాచీన అవశేషం తాను చూసేనాటికి 100 గజాల చదరపు విస్తీర్ణంలో మాత్రమే మిగిలి ఉందని, అంతేకాక అప్పటికిని దీనిచుట్టూ ఉన్న వ్యవసాయ భూములు ఈ దిబ్బను ఆక్రమిస్తున్నాయని,



దిబ్బచుట్టూ ఇటుకల తయారీ కేంద్రాలు ఏర్పడ్డాయనీ, ఇటుకరాయి తయారీకోసం విచక్షణా రహితంగా దిబ్బను త్రవ్వివేస్తున్నారని చింతిస్తూ దీనిని కాపాడవలసిన అవసరం ఉందనీ తెలియజేశారు. అంతేకాక అప్పటికి మూడు సంవత్సరాల క్రితం ఈ ప్రదేశంలో రోడ్డు వేసేందుకు మట్టి త్రవ్వినప్పుడు ఒకరికి కొన్ని బంగారు నగలు దొరికాయని తాను విన్నట్లుగా తెలియజేస్తూ, ఈ ప్రదేశాన్ని పరిశీలించినప్పుడు పూర్వం ఈ పాటిదిబ్బ వైశాల్యం విస్తృతంగా ఉండి ఉంటుందని పేర్కొన్నారు. ఈ ప్రదేశంలో లభిస్తున్న వస్తువులు ఇతర ప్రాచీన ప్రదేశాలలో లభిస్తున్న వస్తువులను పోలి ఉన్నాయని తెలియజేస్తూ ఈ ప్రాచీన అవశేషం అప్పటి పరిస్థితిని గురించి అమూల్యమైన సమాచారాన్ని అందచేశారు. అలెగ్జాండర్ రీ 1882లో ప్రఖ్యాత భట్టిప్రోలు బౌద్ధ స్థూపం వద్ద పరిశోధనలు జరిపారు. ఈ సందర్భంగా దగ్గరలోనే ఉన్న మల్లెపాడు దిబ్బను కూడా సందర్శించినట్లుగా ఉంది.

### మల్లెపాడు గ్రామ నామం :

పూర్వం నుండి ఈ ప్రదేశం మల్లెపాడు అనే పేరుతో పిలు స్తున్నారు. కాని ప్రదేశం పూర్వపు నామం తెలియదు. కొత్త రెవెన్యూ



సర్వే రిపోర్టు ప్రకారం ఈ ప్రాచీన పాటిదిబ్బ య. 2-94 సెంట్లలో ఉన్నట్లుగా, దీని సర్వే నెంబరు 197, గ్రామం నెం. 33, లాటిట్యూడ్ 16$^0$, లాంగిట్యూడ్ 80$^0$ గానూ 14శ్రీ, 41జూ లో, సబ్ డివిజన్ సీరియల్ నెం. 197గానూ, జిల్లా కేంద్రం గుంటూరుకు 30 కి.మీ. దూరంలో ఉంది.

షుమారు 50-60 సంవత్సరాలకు పూర్వం ఈ పాదిబ్బ ఒక చిన్నపాటి కొండలాగా ఉండి, 15 నుండి 20 అడుగుల ఎత్తులో ఉండేదని, నాలుగువైపుల ఏటవాలుగా పెద్ద వైశాల్యంలో ఉండేదని ఇప్పటికి చూపినవారు చెబుతున్నారు. మల్‌మలయ్ అనే పదాలు మూల ద్రావిడ భాషకు చెందినవి. 'మలయ్' అంటే కొండ లేక ఎత్తైన ప్రదేశం అనే అర్థాలు ఉన్నాయి. తమిళనాడులో విల్లి మలయ్, అన్నామలయ్, పూన మలయ్, అనే ప్రదేశాలు ఉన్నాయి. చిత్తూరు జిల్లాలో ఉన్న తిరుపతి కొండలను తిరుమల పేరుతో పిలుస్తున్నారు. శ్రీశైలం కొండపై ఉన్న మల్లిఖార్జునస్వామిని మల్లన్నగా పిలుస్తున్నారు. మల్లన్న శివుడైతే మల్లమ్మ పార్వతీ కదా ! ఈ కొండలన్నిటిపైనా దేవాలయాలు ఉన్నాయి. కనుక ఈ ప్రాచీన ఎత్తైన పాటి దిబ్బను ఆకారాన్ని బట్టి మల్లపాడు లేక మాలెపాడుగా పిలిచి ఉండవచ్చు. కాలక్రమంలో ఈ పదం మల్లెపాడుగా మార్పుచెంది ఉండవచ్చని భావించవచ్చు. ఇక్కడ మలయ్ అనగా ఒక ఎత్తైన పాడుబడినదిబ్బ అని అర్థం చెప్పుకోవచ్చు. 'పాడు' అనగా ఒక పాడుబడిన లేక విడిచిపెట్టబడిన గ్రామం లేక నగరంలని అర్థం ఉంది. ఈ పాడు అంత్యపదంగా ఉన్న ప్రదేశాలిన్నింటిలోనూ పాటిమట్టి, కుండ పెంకులతో కలసి ఉంటాయి. కొన్ని కట్టడాలు ఉన్న ప్రదేశాలో మాత్రము ఇటుకలు కూడా కనిపిస్తాయి. ఇవి పూర్వ సంస్కృతులకు చెందిన పాడుపెట్టబడిన గ్రామాలు లేక నగరాలకు చెందినవి. ఇలాంటి పాడుబడిన దిబ్బలు, గ్రామాలు వ్యర్థ పదార్థాలు శిథిలమైన ఇళ్ళపై ఎత్తుగా ఉండేందుకు, మళ్ళీ వాటిపై ఇళ్ళు నిర్మించుకొని కొన్ని వందల సంవత్సరాలుగా నివాసాలు ఏర్పరచుకోవడం, ప్రకృతి వైపరీత్యాల వల్ల ఇంకా అనేక ఇతర కారణాలవల్ల ఈ గ్రామాలు విడిచిపెట్టి పోవటం వల్ల ఇవి పాటిమట్టి దిబ్బలుగా ఏర్పడతాయని, సుమారు 300 లేక 400 సంవత్సరాలకాలంలో ఈ శిథిలాలు పాటిమట్టిగా మార్పు చెందుతుందని చరిత్రకారులు భావిస్తున్నారు.

### మల్లెపాడు బౌద్ధక్షేత్రం - పినపాడు జనావాసం

అలెగ్జాండర్ రీ పేర్కొన్నట్లుగా ఇటుకల తయారీకోసం ఇక్కడ నవశించిన ప్రజలు తరువాతి కాలంలో మరికొంతమందితో కలసి ఇక్కడే చిన్న గ్రామాన్ని ఏర్పరుచుకొని నివశిస్తున్నారని భావించవచ్చు. మల్లెపాడు దిబ్బపైన, చుట్టూ వున్న ఇటుకరాతి పునాదులు, ఇతర ప్రాచీన అవశేషలను బట్టి ఇక్కడ క్రీ.పూ. 300-200 నాటికి శాతవాహనులనాటి బౌద్ధక్షేత్రం ఉండేదని, దీనికి అనుబంధంగా పినపాడు జనావాసంగా ఉండేదని భావిస్తును. పినపాడు అంటే చిన్నపాటి దిబ్బ లేక కొద్దిపాటి ఎత్తైన ప్రదేశంగా భావించవచ్చు. పినపాడు పూర్వం నుండి జనావాసం కలిగి గ్రామంగానే తన ఉనికిని కాపాడుకుంటూ, శిథిలమైన మల్లెపాడును శివారు ప్రాంతంగా కలిగి ఉంది. పినపాడు గ్రామాన్ని పరిశీలించినప్పుడు ప్రస్తుత ప్రదేశం షుమారు 20-25 ఎకరాల పరిధిలో ఉంది. ఈ గ్రామానికి తూర్పు దక్షిణ దిశలుగా ఉన్న పాత ఇళ్ళు, పొలాలలో పూర్వం నుంచి పాటిదిబ్బలు ఉండేవని, ఈ పాటి మట్టిని దగ్గరలో ఉన్న పొలాలు, ఇళ్ళ స్థలాల మెరకల కోసం ఉపయోగించారని, ఇటుకల తయారీకి కూడా ఈ పాటిమట్టి దిబ్బ త్రవ్వబడిందని, 20 సంవత్సరాల క్రితం కూడా ఈ పాటి మట్టి బళ్ళతో ఇతర ప్రాంతాలకు చరవేయబడిందని, ఈ పాటి మట్టి పొరలు భూమిలో షుమారు 8 అడుగుల లోతువరకు ఉన్నాయని గ్రామస్తులు తెలియజేస్తున్నారు. ఈ ఆధారాలవల్ల పినపాడు, మల్లెపాడు రెండు ప్రాంతాలు ఒకే కాలానికి చెందినవిగా భావించవచ్చు. మల్లెపాడు గ్రామంలో విచారించినప్పుడు పూర్వం నుండి గ్రామ వ్యవస్థకు చెందిన వెట్టివారు ఈ దిబ్బను పరిరక్షించేవారని, వారి తాలూకు వారసులు తెలియచేస్తున్నారు.

### గ్రామ శివారులో పోరంబోకు స్థలంలో మిగిలి ఉన్న ప్రాచీన కట్టడాలు :

బహుశ 1892లో జరిగిన పురాతన స్థలాల సర్వేను అనుసరించి ఈ దిబ్బకు ఉన్న ప్రాధాన్యతను గుర్తించి, దీన్ని గ్రామ వ్యవస్థ ద్వారా పరిరక్షంచారని తెలుస్తుంది. షుమారు 35 సంవత్సరాలుగా ఈ

ప్రదేశాన్ని పురావస్తుశాఖ వారు తమ పరిధిలోకి తీసుకొని దీనికి సంరక్షకులను నియమించారని తెలుస్తుంది. ఆంధ్రదేశంలో ఎన్నో శిథిల బౌద్ధ క్షేత్రాలు, ఇతర ప్రాచీన కట్టడాలు, పాటిదిబ్బలు, దగ్గరలో ఉన్న ముఖ్య రెవెన్యూచ గ్రామాలకు శివార్లుగా లేక రెవెన్యూ పోరంబోకుగా మిగిలి ఉన్నాయి. పూర్వం గ్రామాలు, భూములపై సర్వే జరిగినప్పుడు అప్పటి ప్రభుత్వం ఇలాంటి ప్రాచీన ప్రదేశాలను, వీటియొక్క ప్రాచీనత, చారిత్రక ప్రాధాన్యతలను గుర్తించి, వాటిని ప్రభుత్వ స్థలాలుగా రక్షణ కల్పించారు. అందువల్ల మన ప్రాచీన సంస్కృతికి చెందిన, క్రీ.పూ. నుండి మధ్య యుగాలవరకు ఉన్న ఎన్నో ప్రాచీన కట్టడాలు, బౌద్ధ, జైన క్షేత్రాలు, హిందూ దేవాలయాలు, పురాతన కోటలు, యుద్ధభూములు వంటి అపురూపమైన మన ఆంధ్రుల చారిత్రక సంపద కొంతవరకైనా ఇప్పటికీ మనకు మిగిలి ఉంది అనటంలో అతిశయోక్తి లేదు. ఉత్తరాంధ్రా ప్రాంతంలో కూడా గ్రామలకు వెలుపల కొన్ని ఖాళీ ప్రదేశాలు ఉన్నాయి. ఇవి షుమారు 10 నుండి 20 యకరాల పరిధిలో ఉండి వీటిని కల్లాలు అని పిలుస్తారు. ఇవి ఊరికి ఉమ్మడి భూములుగా ఉండి, వరి కుప్పలు, నూర్పిళ్ళు, వరిగడ్డివాములు వేసుకొనేందుకు ఉపయోగిస్తున్నారు. శ్రీకాకుళం జిల్లాలోని వంశధారా నదీ ఉత్తర ఒడ్డున ఉన్న జగతిపాడుగా పిలవబడే కల్లాలపై ఉన్న ప్రదేశంలో నేను 2001లో ఒక పెద్ద బౌద్ధక్షేత్రాన్ని కనుగొన్నాను. పురావస్తుశాఖవారు ఉత్తరాంధ్ర – ఒరిస్సా సరిహద్దులో ఆంధ్రద్రేశ్‌లో నిర్మించిన మొదటి బౌద్ధక్షేత్రంగా గుర్తించారు.

### మల్లెపాడు దిబ్బపై పురావస్తుశాఖ వారి పరిశోధనలు :

ఇక్కడి చారిత్రక ప్రాధాన్యతను గుర్తించి, ఈ మల్లెపాడు దిబ్బపై పురావస్తుశాఖవారు 1987-88, 1988-89 సంవత్సరాలలో రెండుసార్లుగా స్వల్పకాలిక త్రవ్వకాలు నిర్వహించారు.[6] వారి నివేదిక ప్రకారం ఈ పురాతన పాటి మట్టిదిబ్బ 2 మీటర్లు ఎత్తున ఉండి, దిబ్బపై దక్షిణంవైపున నిలువుగా త్రవ్వినప్పుడు ఇక్కడ 9 పొరలు కన్పించాయి. ఈ దశలుగా విడగొట్టినప్పుడు, మొదటి దశ ఇనుప యుగానికి చెందిన క్రీ.పూ. 5 నుండి 3 శతాబ్దాల నాటిదిగా, రెండో దశ తొలి చారిత్రక యుగం నాటిదిగా నిర్ణయించబడినది. (3 బి.సి. నుండి 1 బి.సి.) మూడవ దశ చారిత్రక యుగం 3 ఎ.డి. నుండి 1 ఎ.డి. నాటిదిగా నిర్ణయించారు. అడుగుభాగాన ఉన్న పొరలలో ప్రత్యేకమైన బృహత్ శిలాయుగ కాలానికి చెందిన నలుపు, ఎరుపు, మెరుపు కలిగిన పలుచని కుండ పెంకులు, కుండలు కనిపించాయి. ఈ పొరలలోనే నేలపై ఒక వృత్తాకారంలో ఉండి కొయ్యగుంజలు పాతి పాకలు వేసేందుకు ఉపయోగించిన రంధ్రాలు కన్పించాయని,



ఈ ప్రదేశాన్ని అనుసరించి కొన్ని మట్టి పొయ్యిలు, వీటికి దగ్గరగా కాలిన భూమి కనిపించాయని, ఇలాంటి ప్రదేశాలు మరో రెండుచోట్ల కనిపించటం వల్ల ఇవి బృహత్ శిలాయుగం నాటి జనావాసాలకు చెందిన ప్రదేశంగా పురాతత్వశాఖవారు గుర్తించారు. వాటితోపాటు కొన్ని ఇనుప వస్తువులు కూడా కనిపించాయని, ఇలాంటి ప్రదేశాలు మరో రెండుచోట్ల కనిపించటం వల్ల ఇవి బృహత్ శిలాయుగంనాటి జనావాసాలకు చెందిన ప్రదేశంగా పురాతత్వశాఖవారు గుర్తించారు. వాటితోపాటు కొన్ని ఇనుపవస్తువులు కూడా కనిపించాయని. ఇవి పెద్దవిగా ఉండి, ఆంధ్రదేశంలో అతి ప్రాచీన బౌద్ధ విహారాల కట్టడాలకు ఉపయోగించిన ఇటుకలను పోలి ఉన్నాయని, ఇవి క్రీ.పూ. 300-100 సంవత్సరాల కాలం నాటి తొలి చారిత్రక యుగంనాటివిగా గుర్తించారు. ఈ పొరలో ఇతర దేశాలకు, ప్రాతాలకు చెందిన రౌలెటెడ్ మృణ్మయ పాత్రలకు చెందిన శకలాలు, పూసలు, మట్టితో తయారుచేసిన బొమ్మలు కనిపించినాయి. ముఖ్యంగా ఈ దశలో శాతవాహనులకు చెందిన ఒక నాణెం, ఇక్ష్వాకుల కాలంనాటికి చెందిన మరొక నాణెం కూడా లభించాయి. వీటితోపాటు ఒక ఇనుప ఉంగరం, మట్టితో తయారుచేసిన బొమ్మలు, ఇత్తడి వస్తువులు లభించాయి అంతేగాక మరో పురాతన బోనుతో తయారుచేసిన ఒక నీడిల్ కూడా ఇక్కడ లభించింది. ఇలాంటి బోన్‌తో తయారుచేసిన నీడిల్స్ హరప్ప మరియు మహంజోదారో లాంటి అతి ప్రాచీన (2500-2800 బి.సి.) సంస్కృతులు వర్ధిల్లిన ప్రదేశాలలో లభించాయి. అందువల్ల తెనాలి ప్రాంతంలో శాతవాహనుల, ఇక్ష్వాకుల నాటి ప్రాబల్యం, వారి పాలన ఉన్నట్లు విశదమౌతుంది. ఈ దశ క్రీ.శ. 3 నుండి క్రీ.శ 1గా నిర్ణయించబడింది. ఇతర దేశాలకు చెందిన రౌలెటెడ్ పాత్రలు (వీటికి లోపలి వైపున నొక్కులు పెట్టి ఉంటాయి) సిరామిక్ పాత్రలు కూడా ఈ దశలో లభ్యం కావడంవల్ల తెనాలి ప్రాంతం అతి ప్రాచీన కాలంనుండి ఒక నాగరిక ప్రాంతంగా ఉండి,

ఉత్తర భారతదేశంతో, ఇతర దేశాల, దక్షిణ ఆసియా దేశాలతో వ్యాపార సంబంధాలు కలిగి ఉండేదని తెలుస్తుంది. అంతేకాక, నా పరిశీలనలో 2003-04 సం॥ల కాలంలో ఈ పాటిదిబ్బపై రోమన్ పాత్రలకు చెందిన ఒక గాజుముక్క దొరికింది. పురావస్తుశాఖ వారి పరిశీలనలో ఇది ఒక రోమన్ గ్యాబ్‌లెట్ పాత్రకు చెందిన ఒక భాగంగా గుర్తించారు. ఈ ప్రాంతంలో రోమన్ పాత్రలు, ఇతర దేశాలకు చెందిన పాత్రలు ఉపయోగంచిన నాగరికులు ఈ ప్రాంతంలో నివసించినట్లుగా భావించబడుతుంది. కనుక ఈ ప్రాంతం శాతవాహనుల ఇక్ష్వాకుల నగరం కూడా అయి ఉండవచ్చు.

ఈ స్వల్పకాలిక ఖనన పరిశీలనవల్ల అమరావతి లాంటి ప్రాచీన స్థూపాల వద్ద జరిగిన పరిశీలనలు ఇక్కడ జరపడానికి వీలుకాలేదని, అమరావతిలో మౌర్యుల కాలంనాటి ఉత్తరదేశపు నునుపు కలిగిన నల్లటి మెరుగైన కుండ పెంకులు (నార్తరన్ బ్లాక్ పాలిష్) దొరకటంవల్ల శాతవాహనులకు మౌర్యులతో సంబంధాలు ఉన్నట్లుగా తెలుస్తుందని తెలియజేశారు. పైన పేర్కొన్న అంశాన్ని బట్టి ఇక్కడ పరిశోధనలు చేసిన పురావస్తుశాఖవారు ఈ ప్రదేశంలో కూడా అమరావతి లాంటి ప్రసిద్ధ బౌద్ధ క్షేత్రాల ప్రాచీనతకు ఏమాత్రం తీసిపోదని, ఇక్కడకూడా దీర్ఘకాలిక పరిశోధనలు జరుపవలసిన అవసరం ఉందని భావించారు. కాని, ఇంతవరకు దీర్ఘకాలిక పరిశోధనలు జరుగలేదు. మల్లెపాడులో జరిగిన పరిశీలనలను అనుసరించి ఇనుపయుగం నుండి నగర సంస్కృతి పరిధిని తెలియజేస్తుందని భావించబడుతుంది.

**పూర్వం తెనాలి ప్రాంతం నుండి ప్రవహించిన కృష్ణానది పాయలు :**

పూర్వం కృష్ణా పరివాహక ప్రాంతమైన ఇప్పటి కృష్ణా, గుంటూరు, ప్రకాశం జిల్లాలు కలిపి కృష్ణాజిల్లాగా ఏర్పాటుచేయబడినది. కృష్ణానదికి దక్షిణభాగం నుండి గుళ్ళకమ్మ వరకు పర్వత పంక్తులు కాని, గుట్టలుకాని లేకుండా ఈ ప్రాంతమంతా చదునైన, సారవంతమైన మైదాన ప్రాంతం, కృష్ణానదీ పరివాహక ప్రాంతం అవటంవల్ల పంటలు సమృద్ధిగా పండి, పూర్వం నుండి సస్యశ్యామలంగా ఉండి, ఒక ఉజ్జ్వలమైన నాగరికత ఆవిర్భవించేందుకు వీలు కలిగింది. పూర్వం కృష్ణానదిని పేరకమ్మగా (పెద్దనది) పిలిచేవారు. ఈ పేరకమ్మ గుళ్ళకమ్మ మధ్య ఉన్న ప్రాంతాన్ని కమ్మనాడుగా పిలిచేవారని తెలుస్తుంది. పూర్వం కృష్ణానది దక్షిణపు ఒడ్డునుండి సీతానగరం కరకట్టవద్ద గండిపడి కృష్ణా ప్రవాహం ఉధృతంగా రేవేంద్రపాడు, దుగ్గిరాల మీదుగా తెనాలి గుండా ప్రవహిస్తూ నిజాం పట్నం వద్ద సముద్రంలో కలిసేదని, కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్ తెలియచేస్తుంది. ఈ పూర్వపు కృష్ణాపాయలను అనుసరించి సీతానగరం దగ్గరనుండి బకింగ్‌హామ్ కెనాల్ దుగ్గిరాల వరకు పెద్దదిగా త్రవ్వబడి, దుగ్గిరాల నుండి మూడు చిన్న కాలువలుగా విభజించబడి, అవి దుగ్గిరాలనుండి తెనాలి మీదుగా నిజాం పట్నం వరకు మంచినీటి వసతి కోసం సాగునీటికోసం, పడవల రవాణా కోసం త్రవ్వారు. పూర్వపు కృష్ణాపాయలు తెనాలి ప్రాంతం గుండా ప్రవహించటంవల్ల అయ్యగార్లపాడు (కఠెవరం శివారు సోమసుందర పాలెం), పాత తెనాలి, ఐతానగరం, మల్లెపాడు లాంటి ప్రదేశాలలో నాగరిక జనావాసాలు, బౌద్ధ - జైన, హిందూ క్షేత్రాలు అభివృద్ధి చెందేందుకు, తెనాలి ప్రాంతంలో ఒక ఉజ్జ్వలమైన నాగరికత ఏర్పడేందుకు ఈ కృష్ణానది నుండి దక్షిణంగా ప్రవహించిన ఈ కృష్ణా పాయలే నీటివనరులుగా ఉపయోగించారు అనటంలో సందేహం లేదు. ప్రపంచవ్యాప్తంగా ప్రాచీన నాగరికతలన్నీ ఈ నదీనదాల ఒడ్డుననే ఆవిర్భవించాయనేది చారిత్రక సత్యం. విజయపురి, అమరావతి, భట్టిప్రోలు, చేబ్రోలు, తెనాలి, శేకూరు, చందోలు, బుద్ధాం లాంటి మరెన్నో ప్రాచీన బౌద్ధ నగరాలు, జైన, హిందూ సంస్కృతులు ఈ కృష్ణానదికి దక్షిణ తీరంలోనే వెలసిల్లాయి.



క్షేత్రం కోసం స్థానికులతో కలిసి పయనం

**నా పరిశీలనలో వెలుగుచూసిన ఎన్నో విశేషాలు :**

ఇంత ప్రాచీన చారిత్రక ప్రదేశాన్ని గురించి ఇంకా ఎంతో తెలుసుకోవలసిన చరిత్ర ఉందని భావించి 2003-06 వరకు నేను అనేకసార్లు ఈ పాటి దిబ్బలను, చుట్టూ ఉన్న శిథిలాలను పరిశీలించాను. ఇప్పటికీ నా పరిశీలనలను కొనసాగుతూనే ఉన్నాయి. ముఖ్యంగా ఈ దిబ్బపై ఉన్న స్థూల శిథిలాలను పరిశీలించినప్పుడు, ఈ ప్రాచీన కట్టడం తూర్పు పడమరల దిశలుగా నిర్మించినట్లుగా తెలుస్తుంది. కనుక, పూర్వం ఈ బౌద్ధ కట్టడాలు ఒక నిర్దిష్టమైన సాంకేతిక పరిజ్ఞానంతో నిర్మించేవారని తెలుస్తుంది. పూర్వం ఈ పాటి దిబ్బ షుమారు 15 అడుగుల ఎత్తులో ఉండేదని ఈ దిబ్బ ఉత్తరంవైపు

నుండి చూసినప్పుడు అవతలివైపున ఉన్న మల్లెపాడు గ్రామం కనింపించేదికాదని, గ్రామస్తులు తెలియచేస్తున్నారు. దీన్ని బట్టి ఈ దిబ్బ చారిత్రక ప్రాధాన్యత, విస్తృతి తెలుస్తుంది. ఇప్పటికీ ఈ దిబ్బలపైన దొరికే తెల్లని పాటిమట్టిని, ఇల్లు అలకటానికి, ఇళ్ళముందు పరుచుకొనేందుకు ఈ దిబ్బ త్రవ్వబడుతూనే ఉంది. ఈ దిబ్బకు దక్షిణంవైపున తూర్పు-పడమర దిశగా అడుగున్న ఉన్న ఇసుకపొర వరకు నిలువుగా త్రవ్వబడి ఉంది. ఈ భాగంలో అనేక పొరలు కనిపిస్తున్నాయి. వివిధ కాలాలకు చెందిన (క్రీ.పూ. 5 బి.సి. నుండి 3 ఎ.డి.) చెందిన నలుపు - ఎరుపు రంగు కలిగిన మట్టి పాత్రలు, శంకు ఆకారపు గిన్నెలు, ధాన్యపు గింజలతో ఉన్న మట్టి పాత్రలు కూడా ఇక్కడ కనిపించాయి. వీటితోపాటు సున్నపురాతి ముక్కలు, ప్రమిదలు, అడుగు పొరలలో ఎముకలు బహిరంగంగానే కనిపిస్తున్నాయి. ఇవి బృహత్ శిలా యుగం నాటికి చెందిన వేమో పరిశీలించివలసి ఉంది. ఈ దిబ్బ పైన పాట్ిమట్టికోసం త్రవ్విన పెద్ద గుంట లలో అనేక చోట్ల శాతవాహనుల నాటి బౌద్ధ విహారాలకు చెందిన అతిపెద్ద ఇటుక రాతి పునాదులు 5-6 వరుసలలో కనిపిస్తున్నాయి. ఇక్కడి ఇటుకల పూర్తి పరిమాణాలు మరెక్కడా



లేనివిధంగా అతిపెద్ద సైజులో 59×37×11 సెం.మీ. కొలతను కలిగి ఉన్నాయి. బహుశ ఇవి మౌర్యుల కాలానికి చెందినవి కావచ్చు. ఇంతవరకు ఇంత పెద్ద ఇటుకలు మన రాష్ట్రంలోనే కాకుండా భారతదేశంలోనే మరెక్కడా ఏ బౌద్ధక్షేత్రం వద్దనూ లభించలేదు. వీటితోపాటు బౌద్ధస్థూపాల ముందర, భిక్షు గృహాల గుమ్మాల ముందర కనిపించే అర్ధచంద్రాకార శిలలు కూడా ఇక్కడ కనిపించాయి. పూర్వం ఇలాంటి చంద్రశిలలను అనేకం ఈ దిబ్బలపైన తాము చూసినట్లుగా గ్రామస్తులు తెలియచేస్తున్నారు. ఈ చంద్రశిలలు (హాఫ్‌మూన్ స్టోన్స్), పెద్ద ఇటుకలు ఇక్కడ బౌద్ధస్థూపం ఉన్నదనేందుకు ముఖ్య ఆధారాలుగా ఉన్నాయి. ఈ దిబ్బకు దక్షిణంవైపున మట్టితో చేసి కాల్చబడిన వర్ల బావి తాలూకా శిథిలాలను కూడా గుర్తించాను. ఈ దిబ్బచుట్టూ ఉన్న షుమారు 4 ఎకరాల పరిధిలో అనేక ఇటుకరాతి పునాదులు అన్నివైపులా కనిపిస్తున్నాయి. ఇవి బౌద్ధ స్థూపాలకు, విహారాలకు, బౌద్ధ చైత్యాల నిర్మాణాలకు చెందినవిగా భావించవచ్చు. 1806లో పాటిదిబ్బ వద్ద త్రవ్వకాల సందర్భంగా ఒక నాగరాజు విగ్రహం దొరికినట్లుగా వార్తాపత్రికలలో ప్రచురించారని తెలిసినది. ఆంధ్రదేశంలో ప్రతి బౌద్ధ స్థూపానికి ముందు ఐదు తలల ముచిలింద నాగవిగ్రహం ప్రతిష్ఠింప బడుతుంది. బౌద్ధ గ్రంథాలను అనుసరించి, ఒకప్పుడు బుద్ధుడు ధ్యానంలో ఉండగా వచ్చిన ఒక పెద్ద గాలివాన బారినుండి బుద్ధుని ముచిలిందుడు అనే నాగరాజు కాపాడినట్లుగా



తెలియ చేస్తున్నాయి. ఈ సంఘటన బుద్ధగయాక్షేత్రంలో జరిగినట్లుగా బౌద్ధ సాహిత్యం తెలియజేస్తుంది. అందుకు సూచనగా ఈ ముచిలింద నాగుని విగ్రహం మహాస్థూపాల ముందు ఉంచటం ఒక ఆనవాయితీగా ఉంది. కనుక, ఇక్కడ లభించిన ఈ నాగరాజు విగ్రహం ఈ బౌద్ధ స్థూపానికి చెందిన ముచింలిదనాగవిగ్రహం అయి ఉండవచ్చు. దీనికి సమీపంలో ఉన్న భట్టిప్రోలు బౌద్ధ స్థూపం థేరవాదుల, మహాయానుల బౌద్ధక్షేత్రంగా గుర్తించబడినది. మన జిల్లాలోని మరో ప్రాచీన బౌద్ధక్షేత్రం అమ రావతిలో థేరవాద, మహాయాన, వజ్రయాన పంథాల ఉరి కనిపించటమేకాక ఈ మహాస్థూపం కోటరాజులు, రెడ్డిరాజుల కాలంలో కూడా వర్ధిల్లినట్లు ఇక్కడి బుద్ధదేవరకు దానాలు ఇవ్వబడినట్లుగా ఉన్న శాసనాలు తెలియచేస్తున్నాయి. కనుక ఈ అమరావతి బౌద్ధక్షేత్రం 13వ శతాబ్దం వరకు వర్ధిల్లినట్లుగా ఈ శాసనావల్ల తెలుస్తుంది. మల్లెపాడు స్థూపం పరిధిలో బుద్ధ విగ్రహాలు కాని శిల్పాలు చెక్కిన పలకలు కాని, లభించకపోవడంవల్ల ఇది థేరవాదులకు చెందిన ప్రాచీన బౌద్ధక్షేత్రంగా భావించబడుచున్నది. కానీ ఇప్పటివరకూ స్థూప నిర్మాణం - వాస్తు శైలిని గురించి వివరాలు తెలియవు.

### అమరావతి - మల్లెపాడు బౌద్ధ క్షేత్రాలు వీటి ప్రాచీనత :

మల్లెపాడు స్థూపాన్ని ప్రాచీన అమరావతీ బౌద్ధ స్థూపంతో పోల్చినప్పుడు అమరావతి స్థూపం వద్ద అలెగ్జాండర్ రి గారి (1905 -06, 1908-09) ఖనన పరిశోధన సందర్భంగా ముఖ్యస్థూపానికి ఉత్తరంవైపున ఉన్న చిన్న స్థూపాల క్రింద కొన్ని బృహత్ శిలాయుగం నాటి శారీరక శకలాలు భద్రపరచిన కుండలు (సమాధులు) కొన్ని ఉన్నాయని తెలియచేశారు. ఇక్కడ బృహత్ శిలాయుగంనాటి



సంస్కృతులకు చెందిన కట్టడాలు ధరణికోట, మహాచైత్యం వద్ద కూడా లభించాయని, బహుశ కృష్ణానదీ ప్రవాహానికి ఈ అమరావతీ స్థూపం సమీపంగా ఉండటం వల్ల కృష్ణానదీ వరదలవల్ల ఒండ్రుమట్టి ఈ ప్రాచీన సమాధులను కప్పివేసి ఉంటుందని, స్థూప నిర్మాతలు ఈ సమాధులను గుర్తించి ఉండకపోవచ్చునని తెలియచేశారు. అలానే మల్లెపాడు దిబ్బలో కూడా క్రింది పొరలలో బృహత్‌శిలా యుగంనాటి సంస్కృతులకు చెందిన జనావాసాలు కనిపించాయి. (క్రీ.పూ. 500-300) ఎత్తైన వీటి పైభాగంలోనే శాతవాహనుల నాటి బౌద్ధక్షేత్ర నిర్మాణం జరిగినట్లుగా తెలుస్తుంది. కనుక, పూర్వం బౌద్ధ క్షేత్రాలు ప్రకృతి వైపరీత్యాల నుండి నదీ ప్రవాహాల బారినుండి రక్షించుకొనేందుకు ఎత్తైన ప్రదేశాలలోనే నిర్మించుకునేవారని తెలుస్తుంది.

పురావస్తు శాఖ వారు మల్లెపాడు త్రవ్వకాల సందర్భంగా గుర్తించిన పాకల నిర్మాణాలకు ఉపయోగించిన రంధ్రాలుకాని, మట్టి పొయ్యిలు, ఇక్కడ ఇటుకరాళ్ళతో పేర్చిన ప్రదేశం వీటికి చెందిన ఎలాంటి ఆధారాలు కాని, వాటి ఆచూకీ కాని ఇప్పుడు ఈ ప్రదేశంలో ఏమీ కనిపించవు. వాటికి ఉన్న ప్రాముఖ్యతను బట్టి వీటిని పరిరక్షించ వలసి ఉంది. కానీ నిర్లక్ష్యం వల్ల అన్నీ మట్టిలో కలసిపోయాయి. వందల సంవత్సరాలుగా ఈ పాటిదిబ్బ అస్తవ్యస్తంగా త్రవ్వబడి, మరి కొంత భాగం పురావస్తుశాఖవారి పరిశోధనల సందర్భంగా ఐదుచోట్ల సుమారు 11×6 (యూనిట్లు) సైజులో నిలువుగా పెద్ద గుంటలను త్రవ్వుటవల్ల త్రవ్విన మట్టిని తిరిగి పూడ్చకుండా ఈ మట్టిని తీసి బయట పోయుటవల్ల ప్రాచీన అవశేషాలతోపాటు మిగిలి ఉన్న దిబ్బకూడా అస్తవ్యస్తంగా తయారై మరింత కుదించుకుపోయింది. క్రీ.పూ. 5వ శతాబ్దం నాటి ఈ అవశేషం రూపురేఖలు మారిపోయాయి. చారిత్రక స్పృహతో ఈ ప్రదేశాన్ని చూచినప్పుడు హృదయవిదారకంగా ఉంటుంది. దీన్ని పరిరక్షించి భూమికి సమాంతరంగా (హారిజాంటల్) త్రవ్వకాలు చేపట్టి ఈ కట్టడాలకు చెందిన పునాదుల అధారంగా ఈ చారిత్రక అవశేషాలను పరిశీలించవలసి ఉంది. ఇందువల్ల పునాదులకే పరిమితమై ఉన్న మహాస్థూపం విహారాల పరిధి ప్రాచీనతను తెలుసుకునేందుకు అవకాశం ఉంది. ఇంతటి విశిష్టత కలిగిన ఈ ప్రదేశం ఎందుకు శిథిలమైందో పురావస్తుశాఖ వారి తొలిపరిశీలనలో విశ్లేషించవలసి ఉంది. కానీ, వీరు ఈ విషయాన్ని పట్టించుకున్నట్లుగా లేదు. ఆంధ్రదేశంలోనే క్రీ.పూ. 5వ శతాబ్దానికి చెందిన పురావస్తు అవశేషాలు లభించడం చాలా అరుదు. ఇది మన తెనాలికి ఉన్న ప్రాచీన నాగరికతను ప్రతిబింబిస్తుంది.

## మల్లెపాడు దిబ్బను పరిరక్షించవలసినదిగా పురావస్తుశాఖ వారికి నా విన్నపము

ఈ ప్రాచీన ప్రదేశాన్ని పరిశీలించి, ఇక్కడ బౌద్ధవిహారానికి చెందిన అనేక ఆధారాలు, ఇటుకరాతి పునాదులు ఇక్కడ కనిపించాయని, ఈ ప్రదేశాన్ని పాటిమట్టికోసం అస్తవ్యస్తంగా త్రవ్వుతున్నారని, ప్రస్తుతం 40×30 గజాల పరిధిలోనే ఈ పాటిదిబ్బ తాలూకా అవశేషాలు మిగిలి ఉన్నాయని, పురాతత్వశాఖవారి సర్వేలో కూడా, ఇది క్రీ.పూ. 5వ శతాబ్దం నుండి క్రీస్తు శకం 3వ శతాబ్దం వరకు ఇక్కడి నాగరికత వర్ధిల్లిన ఆధారాలు లభించాయని తెలియచేశారని, కనుక ఈ ప్రదేశానికి రక్షణ కల్పించి, తదుపరి త్రవ్వకాలను జరిపి ఈ ప్రదేశం ప్రాచీన, విశిష్టతలను వెలుగులోనికి తేవలసినదిగా సవివరమైన నివేదికను



28-11-2004న సంచాలకులు, రాష్ట్ర పురావస్తుశాఖ వారికి, అప్పటి తెనాలి గౌరవ శాసనసభ్యులు మరియు ఆంధ్రప్రదేశ్ మాజీ శాసనసభ స్పీకర్ నాదెళ్ళ మనోహర్‌గారి ద్వారా అందజేయడమైనది. అందుకు స్పందించి పురావస్తుశాఖవారు చుట్టూ కంచెను ఏర్పాటుచేసి, ఒక

హెచ్చరిక బోర్డును కూడా ఈ ప్రదేశంలో ఏర్పాటుచేశారు. ఇప్పటి తెనాలి గౌరవ శాసనసభ్యులు ఆలపాటి రాజేంద్రప్రసాద్‌గారు పురావస్తు శాఖ వారికి మల్లెపాడు బౌద్ధస్థూపానికి చుట్టూ కంచెని నిర్మించి పునర్‌నిర్మాణాలను చేపట్టి తదుపరి ఖనన పరిశోధనలు జరుప వలసినదిగా పంపిన నివేదికను పరిశీలించి రాష్ట్ర పురావస్తుశాఖ సంచాలకులు ఇందుకోసం 35,00,000 లక్షల రూపాయలను కేటాయించినట్లుగా తెలియచేశారు. ఈ సంవత్సరం పనులు ప్రారంభించవలసి ఉంది. రెవెన్యూ శాఖవారు ఈ ప్రదేశాన్ని సర్వేచేసి ఈ స్థలం య. 2-94 సెంట్ల ప్రదేశంలో ఉన్నట్లుగా తెలియచేశారు. తరువాత దీనికి దగ్గరలో ఉన్న మరో ప్రాచీన భట్టిప్రోలు స్థూప స్థలాన్ని కూడా 1921లో సర్వే చేసి య.1-82 సెంట్లుగా నిర్ణయించారు. కనుక మల్లెపాడు దిబ్బ, దీనిపైన ఉన్న కట్టడాలు, స్థూపాలతో కూడా శిథిలమైపోయి, కొద్దిపాటి పునాదులు మాత్రమే ఈ పొరలలో మిగిలి ఉన్నాయి. కొలవరం కైఫియత్‌ను అనుసరించి, పూర్వం కృష్ణపాయలు విజయవాడ, సీతానగరం వద్ద గండిపడి, ఉధృతంగా తెనాలి ప్రాంతం గుండా ప్రవహించేదని, ఇందుమూలంగా తెనాలి, కూచిపూడి సంతు గ్రామాలు మునిగిపోయేవని తెలియచేస్తుంది. బహుశ, తరచూ వచ్చే ఈ కృష్ణా ప్రవాహం తాకిడికి ఈ స్థూపం గురై ఉండవచ్చు. అంతేకాక, బౌద్ధ జనాదరణ కోల్పోయిన తరువాత ఈ ప్రదేశం నిర్మానుష్యంగా ఉన్న తరువాత గ్రామ పునర్నిర్మాణాల కాలంలో ఈ పాటిదిబ్బను ముఖ్యంగా ఇటుకల తయారీకి, చుట్టూ ఉన్న పొలాలను మెరక చేసుకునేందుకు బళ్ళతో విస్తృతంగా ఈ మట్టిని పంట పొలాలను తోలినట్లుగా, ఈ ప్రక్రియ గత 40 సం॥ల పూర్వం వరకు కూడా జరిగినట్లుగా గ్రామస్తులు ఇప్పటికీ తెలియచేస్తున్నారు. ఈ మల్లెపాడు ప్రాంతం ఏవిధమైన ఆటంకాలు, ఒడిదుడుకులు లేకుండా బృహత్‌శిలాయుగం నాటినుండి చారిత్రకయుగం వరకు ఇక్కడ నాగరికత వర్ధిల్లినట్లుగా పరిశోధనలో వెల్లడైనది. ఈ జిల్లాలోనే ఉన్న అమరావతి, భట్టిప్రోలు లాంటి ప్రఖ్యాత బౌద్ధక్షేత్రాలకు మల్లెపాడు సమకాలీనం అయి ఉండటంవల్ల, శాతవాహనులకు చెందిన సాంస్కృతిక, మతపరమైన నిర్మాణాలు ఇక్కడ లభించటంవల్ల ఈ ప్రాంతానికి ఎంతో ప్రాముఖ్యత ఉంది. కృష్ణా దక్షిణతీరం తెనాలి ప్రాంతం అంతట ఒకనాడు బౌద్ధధర్మం ప్రతిధ్వనించుకునేందుకు ఎన్నో ఆధారాలు గ్రామ గ్రామాన కనిపిస్తున్నాయి. ఆంధ్రా ప్యారిస్‌గా ప్రసిద్ధిగాంచిన తెనాలి సాంస్కృతిక మూలాలు ఈ మల్లెపాడు చరిత్రతో ముడిపడి ఉన్నాయేమో?

## రిఫరెన్స్ (సంప్రదించిన రచనలు)


1. పురావస్తుశాఖవారి ఖనన పరిశోధనల నివేదికలు 1986-87, 1988-89
2. "చారిత్రక పూర్వయుగంనాటి మల్లెపాడు దిబ్బ - శాతవాహనుల బౌద్ధ క్షేత్రం" పురావస్తుశాఖ సంచాలకులవారికి అందచేయబడిన నివేదిక 1 తేది. 28-11-2004, 2 తేది. 30-02-2006 - కడియాల వెంకటేశ్వరరావు.
3. అలెగ్జాండర్ రీ గారి "సౌత్ ఇండియన్ బుద్ధిస్ట్ మాన్యుమెంట్స్ ఇన్ కృష్ణా డిస్ట్రిక్ట్" - 1894.
4. తెనాలి రెవెన్యూ సర్వే రిపోర్టు ఆన్ మల్లెపాడు దిబ్బ & ప్లాన్.
5. న్యూ బుద్ధిస్ట్ మాన్యుమెంట్స్ ఫౌండ్ ఆన్ నార్త్ - ఈస్ట్ కోస్ట్ డిస్ట్రిక్ట్స్ - పేపర్ సబ్‌మిటెడ్ ఎట్ నేషనల్ సెమినార్ 'రిట్రైవింగ్ ది పాస్ట్ బుద్ధిస్ట్ కల్చర్ - 20 సెంచరీ డిస్కవరీస్ & డెవలప్‌మెంట్', రామచంద్రాపురం, సెప్టెంబర్, 2008- కడియాల వెంకటేశ్వరరావు.
6. పాదసూచక 1.
7. కృష్ణాడిస్ట్రిక్ట్ మాన్యువల్ - జి. మెకంజి.
8. పాదసూచిక 2.
9. కృష్ణాతీరంలో బౌద్ధస్థూప - ఎ.యస్.ఐ. మాన్యువల్ రిపోర్టు, 1905-06, 1908-09 - అలెగ్జాండర్ రి
10. బుద్ధిస్ట్ ఆర్కియాలజీ ఇన్ ఆంధ్రప్రదేశ్ - డా॥ బి. సుబ్రహ్మణ్యం & ప్రొఫెసర్ ఈమని శివనాగిరెడ్డి.
11. పాదసూచిక 3.
12. భట్టిప్రోలు మహాస్థూపం - ఎ.యస్.ఐ డా॥ జి. జితేంద్రదాస్ భారత పురావస్తు శాఖ అధీక్షకులు. హైదరాబాదు & డా॥ బి. ఆంజనేయశర్మ.


*చిరునామా : కడియాల వెంకటేశ్వరరావు, ఔత్సాహిక పురావస్తు పరిశోధకులు, ఏ.పి. హెచ్.సి. సభ్యులు విశ్రాంత ఉపసంచాలకులు, ఏ.పి. క్రీడా ప్రాధికార సంస్థ, తెనాలి (మం) కొలవరం*

శ్రీ డి. జితేంద్రదాస్

# ఘంటశాల ప్రాంతములో లభించిన శాసన సహిత ఛత్రము

కృష్ణాజిల్లాలోని ప్రసిద్ధ బౌద్ధక్షేత్రమైన ఘంటశాల గ్రామములో మరియు దాని పరిసర ప్రాంతములో భారతీయ పురాతత్వ సర్వేక్షణ, హైదరాబాదు మండలము వారు ఇటీవల చేపట్టిన పురాతత్వ పరిశోధన లలో భాగంగా ఘంటశాలలోని మహాచైత్యము శాస్త్రీయ పద్ధతిలో కొనసాగింపబడిన త్రవ్వకముల వలన కొంగ్రొత్త రూపమును సంతరించు కొని పర్యాటకులకు, పరిశోధకులకు ఆకర్షణీయమైన అహ్లాదము నొనరించుచున్నది. ప్రధానంగా పురాతత్వ సంగ్రహాలయము కొత్త హంగులతో అరుదైన బౌద్ధ శిల్ప సంపదతో సందర్శకుల దర్శనార్థం ప్రారంభించబడినది. మరియు ఘంటశాలకు పశ్చిమ దిశగా యున్న యెర్నంపాడు దిబ్బపై శాస్త్రీయరీతిలో త్రవ్వకములు కొనసాగించి బౌద్ధారామ అవశేషములను వెలికి తీయుట జరిగినది.

ఘంటశాల మరియు పరిసర ప్రాంతములలో కొనసాగించిన పురాతత్వ సర్వేక్షణ పరిశోధనల మూలముగా వివిధ విధములైన బౌద్ధ ఖండములు వెలుగులోనికి వచ్చినవి. సమీపమునున్న ఘంటశాల పాలెంలో ఓ విశిష్టమైన సున్నపురాతి నుండి మలచిన బౌద్ధ ఛత్రము కనుగొనబడినది. వృత్తాకారపు ఈ ఛత్రము 43 సెం.మీ. వ్యాసము కల్గి, ఉపరితల భాగమున ఉబ్బెత్తుగాయుండి లోపలి భాగమున 6.5 సెం.మీ × 6.5 సెం.మీ ఛేదమును కల్గియున్నది. ఈ రంధ్రపు పిడి, కొయ్య లేక స్తంభపు కొనపై ఛత్రమునుంచుటకు ఉద్దేశింపబడినది. రంధ్రపు పిడి నుండి నలుమూలలకు విస్తరించియున్న సమాంతర రేఖలతో అలరింపబడిన ఈ ఛత్రపు బాహ్యపుటంచుపై 24 బ్రాహ్మీ అక్షరములతో కూడిన శాసనము చెక్కబడియున్నది. ప్రాచీన లిపి శాస్త్ర ప్రమాణము ప్రకారము ఈ అక్షరశైలి క్రీ.శ. 1 - 2 శతాబ్దమునకు చెందినదిగా భావింపబడినది. ఈ శాసనపు లిపి బ్రాహ్మీ అయినప్పటి కిని, శాసనపు భాష ప్రాకృతము.

**శాసనము**

ఉవాసకప మూలస ఘరణీయ బపీయ దమరామేదేయద(మ) ఛత

**శాసన అనువాదము**

'ఆరాధకుడైన (ఉపాసక) మూల యొక్క పత్ని బపీయచే విహారము (దమరామ) నకు దానం చేయబడిన ఛత్రము'.

గతంలో ఎపిగ్రాఫియా ఆంధ్రికాలో మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు రాసిన ఘంటసాల ప్రాకృత శాసనాలకు ఇది అదనంగా భావించుటయేకాక, ఘంటసాలకు సంబంధించిన శాతవాహనుల కాలమునాటి మరో చారిత్రక ఆధారంగా ఈ శాసనాన్ని భావించవచ్చు.



**ఘంటశాల ప్రాంతములో లభించిన శాసన సహిత ఛత్రము**

చిరునామా : *డి. జితేంద్రదాస్, ఆర్కియాలజికల్ సర్వే ఆఫ్ ఇండియా, హైదరాబాద్ సర్కిల్, సూపరింటెండెంట్, ఆర్కియాలజిస్టు.*

శ్రీ ముంగర జాషువ

# నాగబు పదం గురించి నాలుగు మాటలు

నాగబు తొలి తెలుగు పదం అని నిన్నటి వరకు హేమా హేమీలు అంతా అంగీకరించడంతో తెలుగు ప్రాచీనతా ద్వారాలు క్రీ.పూ. రెండో శతాబ్దంలో శాశ్వతంగా మూసుకుపోయాయని భావించిన తరుణంలో "నాగబు తొలి తెలుగు పదం కాదు" అని సాక్ష్యాధారాలతో ఆచార్య శివనాగిరెడ్డి etal వారు 'మిసిమి' (నవంబర్ 2007)లో రాసి ఆ ద్వారాలను బద్దలు కొట్టడంతో తెలుగు ప్రాచీనత మీద తెలుగు ప్రసరించింది. ఆ వ్యాసంలోనే డా॥ రాజారెడ్డిగారు నాణేల మీద, శాసనాల మీద జరిపిన పరిశోధనలలో క్రీ.పూ. 4-3 శతాబ్దాల నాటి తెలుగు పదాలు బయలుపడిన వైనాన్ని పేర్కొనడంతో తెలుగు ప్రాచీనత ముందుకు జరిగింది.

ఏ భాష ఏ ఒక్క రోజులోనో ఆకసం నుండి ఊడిపడదు. అది వికసించడానికి ఏండ్లు పూండ్లు పడుతుంది. ఇప్పుడు భాష ఎంత ప్రాచీనమైనదైతే అది అంత గొప్పది అనే భావన జనం మనస్సులో నాటుకు పోయింది. పాతదంతా గొప్పకాదు. కొత్తదంతా అల్పమూ కాదు. అందుకని ఆంధ్రులు గూడ తమ భాష గూడ ప్రాచీనమైనదని, అందుకని గొప్పదని, అందుకని నిధులు ఇవ్వాలని కేంద్ర ప్రభుత్వాన్ని కోరుచున్నారు.

ఒక భాష గొప్పదనానికి ప్రాచీనత కొలబద్ద కాదు. అది ఎదిగిన మేర. భావ ప్రసారంలోని అత్యంత సూక్ష్మ భేదాలను, ఛాయలను, అభివ్యక్తీకరించగలిగిన సామర్థ్యం, వాడుకలో భాష ఎదుగుతుంది. ఎదగడంలో దాని గొప్పతనం ఉందని గమనించాలి.

ఏ పరిశోధనలోనైనా సత్యాన్వేషణ ప్రధానం అన్న విషయం అందరికీ తెలిసిందే. నిన్న సత్యం అనుకొన్నది నేడు అర్ధ సత్యం కావచ్చు. రేపు అసత్యంగా మారే అవకాశము గూడ పుష్కలంగా ఉంటాయి. కొత్త విషయాలు వెలికి తీసే క్రమంలో కొంతమంది మేధో జీవులు నిత్యం శ్రమిస్తూనే ఉంటారు. ఇటువంటి సందర్భంలోనే "నాగబు" తొలి తెలుగు పదం కాదు అనే వ్యాసం మిసిమి నవంబరు సంచికలో వెలువడింది.

ఈ వ్యాసం చదివిన తరువాత మొదట ఆశ్చర్యం కలిగింది. తరువాత అనుమానం మెదిలింది. పరిశోధకత్రయం ఆచార్య ఈమని శివనాగిరెడ్డి...ల ప్రతిపాదనలు ఊహాజనితాలా? వాటికి హేతుబద్ధత ఉందా? అసలు నిజం ఏమిటి? అనే ప్రశ్నలు మొలకెత్తాయి.

ఏ లిపి స్వతంత్రం కాదు. లిపి అక్షరాల సముదాయం. అక్షరం ధ్వని సంకేతం. ఏ లిపి ఏ విధంగా మారిందో, ఏ పదం ఏ విధంగా మార్పు చెందిందో భాషావేత్తలు నిగ్గు తేలుస్తారు. శాసన సంబంధిత చరిత్రను నిగ్గు తేల్చడం గూడ క్లిష్ట కార్యమే.

పూర్వం భారతిలో ఈ చర్చలు వాదోపవాదాలు విస్తృతంగా సాగినవి. వేద విద్యలు నిగూఢంగా వుంచి ఒక వర్గానికి మాత్రమే అందచేసే పఠన పాఠన క్రమం, సంకుచిత్వం చాలామందికి తెలిసిన విషయమే. అదే విధంగా లిపి వైదిక కాలంలో కనిపెట్టబడి స్వకీయులకు మాత్రమే అందజేసే క్రమాన్ని బౌద్ధులు, జైనులు వ్యతిరేకించి అందరికీ అందించే కృషి చేశారని ఒక వర్గం పండితుల వాదన సమంజసంగా కనిపిస్తుంది. ఈ విధంగా తిరగబడినప్పుడే చర్చ విస్తృతమై సత్యం బహిర్గతమవుతుంది. ఇటువంటి పనిని ఈ వ్యాసకర్తలు ప్రస్తుతం చేశారనిపిస్తున్నది.

ఈ 'నాగబు' పదం గురించి నాలుగు మాటలు రాయడానికి విషయంపై అధికారం కన్న హేతబద్ధతను పరిశీలించే తార్కిక పద్ధతిని ఎన్నుకోవడం జరిగింది. అంతేగాని పదవ్యుత్పత్తి (etymology), శబ్దరూప నిర్మాణం (morphology) లాంటి అనేకం తెలుసుకొని రాసిన మాటలు కావు ఇవి.

ప్రసిద్ధ చరిత్రకారులు, శాసన పరిశోధకులు కీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రి, ఆయా రంగాలలో ప్రాతఃస్మరణీయులు. అటువంటి శాసన పరిష్కర్త తొలితెలుగు పదంగా నాగబును గుర్తించడం, నిర్ణయించడం, దానిని ఆరుద్రతో సహా అందరు శిరసావహించడం, దశాబ్దాలుగా ఇంతవరకు జరిగిన విషయం.

క్రీ.శ. 1వ శతాబ్దానికి చెందిన శాతవాహనుల కాలం నాటి, అమరావతి స్థూపంలో నాగబు అనే పదం ప్రత్యక్షమైంది. నాగ శబ్దం సంస్కృతం, 'బు' అమహద్వాకప్రథమైన వచన ప్రత్యయమైన 'ము' వర్ణానికి రూపాంతరం. నాగము, నాగమ్ము, నాగంబు అనే రూపాలు ఏర్పడ్డాయని, బిందువు లోపించి, 'నాగబు' అయిందని ఇంతవరకు సామాన్య పాఠకుల నుంచి సాహిత్యవేత్తల వరకు నమ్మిన విషయం.

అమరావతి శాసనాల్లో నాగశబ్దం మీద అనేక పదాలు ఉన్నవని, ఆ పదాలనన్నింటిని వ్యాసకర్తలు విపులంగా చర్చించారు. బౌద్ధం సామాన్యులకు దగ్గరగా వచ్చిన సందర్భంలో అమరావతి శాసనాల్లో స్థూపాల నిర్మాణంలో సామాజికుల పాత్ర ఎంతో ఉందని తెలుస్తున్నది. నాగబుద్ధి అనే పదంలోని, పేరులోని చివరి అక్షరం 'ద్ధి' శిల్పి పొరపాటు వల్లనో సహజంగా శాసనాల్లో కనిపించే అక్షరాల దోషం వల్లనో నాగబుద్ధి అనే పేరు నాగబు అయిందనే వ్యాసకర్తల అభిప్రాయం సమంజసంగా ఉంది.

ఆచార్య వెలమల సిమ్మన్నగారు కూడ నాగబుది అని చెప్పారు. నాగబుది, నాగబుద్ధి అనేవి ఇంచుమించుగా ఒకటిగా ఉన్నాయి. ఈ వాదనలు ప్రముఖ చరిత్రకారుడు డా.బి.యస్.యల్. హనుమంతరావు లాంటివారు ప్రారంభించి, దానిని పరిపుష్టం చేయడానికి పరిశోధక త్రయం ప్రయత్నించారు అంతే!

ఇక ఈ పరిశోధకత్రయంలో తెలుగుభాష పట్ల ఉన్న నిబద్ధత, ఆతురత, చిత్తశుద్ధి ఈ వ్యాసంలో కనిపిస్తాయి. ప్రతిపాదనలు గూడ సమీక్షించవలసిన ఆవశ్యకత గూడ ఉంది. సకల భాషలకు "జన్మ సంస్కృతంబు" అనే ప్రసిద్ధ వాదనను గూడ వ్యతిరేకించి ప్రాకృతమే మూల భాష అని నిర్ధారణ చేశారు. తెలుగు వాచకాలలోని ప్రకృతి, వికృతుల గురించి వీరు చేసిన సమీక్ష ఎంతటివారినైనా సందిగ్ధంలో పడవేస్తుంది. సంగీతంలో గూడ ప్రకృతి, వికృతి స్వరాలున్నవి. అయితే అక్కడ వాటికి సమ ప్రాధాన్యత ఉంది. సాహిత్యంలో ప్రకృతి, వికృతి పదాలకు సమ ప్రాధాన్యం లేదు. ఈ విషయాలను గురించి పరిశోధకత్రయం సంధించిన ప్రశ్నలకు జవాబులు వెదకవలసిన ఆవశ్యకత తెలుగు భాషాభిమానులకు, చారిత్రక పరిశోధకులకు ఏర్పడింది. ఏ పరిశోధనకైనా ఇటువంటి కుదుపు అవసరం.

**తల్లి! కృష్ణానదీ! భవత్తటమునందె**
**మ్రోసెనాంధ్ర పతాక మమ్మొదటి దెగసి**
**తెలుగునావలు నీ దీవనలు గడించి**
**ఎత్తె తెరచాప దీవుల నెల్లనొత్తె**

*చిరునామా : ముంగర జాషువ,* కెనాల్సు "గీతిక" హిల్ కాలని, నల్లగొండ జిల్లా.

శ్రీ అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

# నాగార్జునుడు ఏ భాషలో ఆలోచించాడు?

'భాషలో ఆలోచించడం' అనే ప్రశ్నే చాలామందికి వింతగా కనిపించవచ్చు. జాగ్రత్తగా మనం ఆలోచించే తీరును గమనిస్తే ఇది అంత విచిత్రంగా కనిపించదు. భాష లేకుండ ఆలోచించడానికి ప్రయత్నం చేయండి. మీకే తెలుస్తుంది. ఆధునిక మనోవిజ్ఞానశాస్త్రం "ఆలోచనా ప్రక్రియ" మీద పరిశోధనలు జరిపి, మన ఆలోచనలో అధిక భాగం పదాల (Words) తో నిండి ఉంటుందని తేల్చి, "Thought is implict Speech" అంది. కనుక మనం భాషతో ఆలోచిస్తాం. ఎక్కువమంది మాతృభాషతోనే ఆలోచిస్తారు. లేదా ఒకనికి ఏ భాషమీద ఎక్కువ అధికారం ఉంటే ఆ భాషతో ఆలోచిస్తాడు. అందుకే మనం అప్పుడప్పుడు కొందరిని గురించి "ఇంగ్లీషులో ఆలోచించి తెలుగులో రాస్తూ ఉంటా"రంటాం.

కనుక భాష ఆలోచనా దాదాపుగా ఒకటే అయినప్పుడు, నాగార్జునుడు సంస్కృతంలో ఆలోచించి సంస్కృతంలో రాసి ఉండాలి. ఆయన గ్రంథాలన్నింటిని సంస్కృతంలోనే రాశాడు. ఈ ప్రాతిపదికన చూస్తే నాగార్జునుడు తెలుగువాడుకాడనుకోవలసి వస్తుంది. ఒకవేళ ఆంధ్రుడే అయి ఉంటే అతని కాలంలో అంటే క్రీ.శ. 150 ప్రాంతాల్లో తెలుగుభాషైనా లేదనుకోవాల్సి ఉంటుంది. ఒకవేళ తెలుగు భాష ఉండి ఉన్నా అది జటిల దార్శనిక భావనలను అభివ్యక్తం చేయజాలిన స్థితికి ఎదిగి ఉండకపోవాలి. పరిపుష్టమై ఉండకపోవాలి. పరిపుష్టం కాకపోవడాన్ని కారణంగా అంగీకరించలేం. ఎందుకంటే ఆలోచన సాగేదే భాషలో, భాష ఆలోచనలు కలిసే పయనిస్తాయి. They go together ఈ రోజేదైన నూతన ఆవిష్కరణ జరిగినప్పుడు ఒక నూతన భావం ఉప్పతిల్లినప్పుడు తదనుగుణమైన పదాల సృష్టిని ఆ సృష్టికర్తే చేస్తాడు. ఉదాహరణకు బుద్ధుడే పాళీ భాషలో ఎంతో జటిలమైన భావనలను విశదీకరించాడు. దీనినిబట్టి మనం అనుకోవలసింది ఏమంటే, నాగార్జునుడు తెలుగులో ఆలోచించలేదు. నాడు తెలుగు లేదు. ఉన్నా అతనికి తెలుగురాదు. అతడు తెలుగువాడు కాడు. ఈ ప్రశ్నలన్నింటిని మనం వివరంగా చర్చించాల్సి ఉంది.

నాగార్జునుడు చారిత్రక పురుషుడేనా? అది వట్టి పేరేనా? అతడు విదర్భవాసా? దాక్షిణాత్యుడా? ఆంధ్రుడా? ఎక్కడో పుట్టి శ్రీ పర్వతాన్ని వాసం చేసుకొన్నాడా? తలిదండ్రులెవరు? అతడు రాసిన గ్రంథాలేమిటి? శాతవాహనులలో ఎవరికి సమకాలీనుడు? సుహృల్లేఖను ఎవరి నుద్దేశించి రాశాడు? ఆయన సిద్ధుడా? రసవాదా? ఒకడా, ఇద్దరా, ముగ్గురా, నలుగురా? ఒక పండితుడు ఆయన్ను రాజుగా భావించాడు. ఇలా ఎన్నో ప్రశ్నలు ఆయన గురించి ఉన్నాయి. అయితే ఇప్పటికి లభించిన ఆధారాలను బట్టి అతడు చారిత్రక పురుషుడేనని చెప్పవచ్చు. అతని కాలం బుద్ధ నిర్వాణం తరువాత 700 సంవత్సరాలని, 500 లని, 400 లని వివిధంగా చెప్పారు. బుద్ధుడు చనిపోయింది 483 B.C. ఇలా వివిధంగా చెప్పబడినా, అతడు ఆంధ్ర వాసి అని, శాతవాహనుల కాలం వాడనీ, అందులో ముఖ్యంగా యజ్ఞశ్రీ సమకాలీనుడనీ, ఇరవైకి పైగా పుస్తకాలు రాశాడనీ, సుహృల్లేఖ యజ్ఞశ్రీని ఉద్దేశించి రాశాడనీ, అతడు వైద్యుడనీ, శ్రీపర్వతం మీద నివసించాడనీ చాలామంది పండితులు అంగీకరిస్తారు.

ఏది ఏమైనా అతడు అద్భుతమైన మేధావి. విశ్వవిఖ్యాత పండితుడు, మహాబౌద్ధ దార్శనికుడు, కవి, మహా సాహితీ శక్తి సంపన్నుడు, అన్నింటిని మించి తన జాతిని (మానవజాతిని) ప్రేమించే మహామనిషి.

ఇహ అసలు విషయానికివస్తే, అసలు అతడు ఎక్కడ పుట్టినా, ఆంధ్రదేశంలో శ్రీ పర్వతం మీద ఉన్నాడు గనుక, అమరావతి స్థూపానికి నిర్మాణంతో మెరుగులు దిద్దాడు కనుక తెలుగుగడ్డ తెలుగు ప్రజలతో ఆయనకున్న సంబంధం అత్యంత సన్నిహితమైంది.

మరైతే ఆయన తెలుగులో ఎందుకు ఆలోచించలేదు? ఎందుకు తెలుగులో రాయలేదు? ఆయన రాశాడని భావిస్తున్న ఇరవై పై చిలుకు

గ్రంథాలు సంస్కృతంలోనే రాశాడు. (కొన్నింటిని ఆయన రాశాడని, కొన్నింటిని ఆయనకు ఆపాదించారని అంటారు) బుద్ధుడేమో "ప్రతి ఒక్కరు పవిత్ర గ్రంథాలను తన స్వంత భాషలోనే నేర్చుకోవాలి" అని అనుశాసించాడు. (చుల్లవగ్గ) తన ధమ్మం సామాన్య ప్రజానీకానికి చేరువ కావాలని, ప్రజల భాషలోనే బోధించాడు. అక్కడు బుద్ధుని కాలంలో ప్రజల భాషపాళీ. అందుకని పాళీలోనే బోధించాడు. అందుకని నాటి బౌద్ధ సాహిత్యం అంతా పాళిలోనే వెలువడింది."

బుద్ధుడంతటివాడు బౌద్ధ ధర్మాన్ని ప్రజల భాషలో ప్రచారం చేయాలని ఆదేశిస్తే, నాగార్జునుడు బుద్ధుని సంప్రదాయాన్ని అనుసరించక, సంస్కృతంలో ఎందుకు రాసినట్టు?

నాడు తెలుగు ప్రజల భాష కాకుండపోయి, కేవలం సంస్కృతం మాత్రమే ప్రజల భాషగా ఉందా? ప్రాకృతం ఇంకా ఒకప్పుడైనా కొంతకాలం పాటైనా ప్రజల భాషగా ఉందిగాని, సంస్కృతం ఏనాడూ ప్రజల భాషగా లేదు. సంస్కృతం ఎప్పుడూ పండిత భాషగా మాత్రమే ఉంది. పండితులంతా బ్రాహ్మణులు. అందుకని వారంతా తమ రాతలను సంస్కృతంలోనే సాగించారు. నాగార్జునుడు గూడ బ్రాహ్మణుడే కనుక, బ్రాహ్మణ ప్రభావంతోనే తన రచనలు సాగించాడా? (నాగార్జునుని మీద 'బ్రాహ్మణ' ప్రభావం ఉందని చాలామంది అంగీకరిస్తారు.) బుద్ధుని ఆదేశాన్ని మరి ఎందుకు విస్మరించినట్లు?

ఒకవేళ తెలుగునాడు పరిపుష్ట స్థితిలో ఉన్నా, బౌద్ధిక వాతావరణం (Climate of Opinion) తెలుగుకు అనుకూలంగా ఉండి ఉండకపోవచ్చు. ఎప్పుడూ గూడ ఏ సమాజ సంస్కృతినైనా ఉన్నత వర్గాల విలువలు శాసిస్తూ ఉంటాయి. దీనినే మహా సంప్రదాయం (Great tradition) అంటారు. మనకు తెలుసు నిన్నటి మొన్నటివరకు సంస్కృతభాషలో పొదిగిన విలువలే మన సంస్కృతిని నిర్దేశించాయి. సంస్కృతంలో రాస్తేనే అది కవిత్వం. తెలుగులో రాస్తే అది కవిత్వం కాదు. వేమనకు పట్టిన గతి మనందరకు తెలుసు. మరి ఈ మహా సంప్రదాయం కారణంగా నాగార్జునుడు తెలుగులోనో, పాళిలోనో వ్రాయక సంస్కృతంలో రాశాడా? నాటి తెలుగుభాష స్థితిగతులు మనకు అంతగా తెలియక పోయినా, ప్రాకృతం ఆంధ్రలో రాజభాషగానే ఉంది గదా, మరి ఆ భాషలో అయినా నాగార్జునుడు రాసి ఉండవచ్చు.

"తెలుగు భాషనాడు నిత్య వ్యవహారిక భాషగా గూడలేదు. 'గాథాసప్తశతి'ని బట్టి అక్కడక్కడ 'పొట్ట', 'అత్త', 'కరణి' లాంటి కొన్ని తెలుగు పదాలున్నట్లు తెలుస్తున్నదే కాని, కారకరూపం పొంది వాక్య రూపంలో తెలుగుభాష ఉన్నట్లు దాఖలాలు లేవు. ఉంటే కొన్ని పదసముదాయాలైన శాసనాల్లో కనిపించేవే. కనుక నాడు తెలుగు లేదు" అని వాదిస్తున్నారు కొందరు. దీనికి మనం సమాధానం ఇలా చెప్పవచ్చు. "శాసనాల్లో తెలుగు కనిపించనంత మాత్రాన తెలుగు భాషే లేదనో లేదా సరిగా ఎదగలేదనో నిర్ధారణకు రావడం అంత సమంజసం కాదు. ఎందుకంటే మన పురావస్తు శాఖ త్రవ్వకాలు ప్రాథమికదశలో ఉన్నాయి. పూర్తి త్రవ్వకాలు జరగలేదు. ఉత్తరోత్తర త్రవ్వకాలలో తెలుగుతో ఉన్న శాసనాలు దొరకకూడదనే నియమమేమీ లేదు. ఇంతవరకు దొరికిన శాసనాల స్వభావాన్ని బట్టి సాధారణీకరణం చేయడం అంత శాస్త్రీయ పద్ధతి కాదు."

"అప్పటి శాసనాలన్నీ రాజభాష అయిన ప్రాకృతంలో ఉన్నాయి. అప్పటి లింకుభాష ప్రాకృతం కనుక, తెలుగులో శాసనాలు వేయిస్తే అంత విస్తృతి, ప్రచలనం రావని భావించి సామాన్యులు గూడ తమ శాసనాలను ప్రాకృతంలోనే వేయించి ఉండవచ్చు. రాజభాషే గొప్పదీ, ఆకర్షణీయం కదా. అందుకని సామాన్యులు అదే బాటన నడచి ఉంటారు."

పైవాదం ప్రకారం, సామాన్యులు గూడ ప్రాకృతంలోనే శాసనాలు వేయించారు గనుక, నాడు తెలుగు లేదనో, లేదా ఎదగలేదనో నిర్ణయానికి రావడం సముచితం కాదు. (సామాన్యులు వేయించిన చిన్న చిన్న ప్రాకృత వాక్యాలున్న శాసనాలు అమరావతి నాగార్జున కొండ దగ్గర లభించాయి.)

"ఈ మధ్యకాలంలో అనేక బౌద్ధ ఆరామస్తూపాలు పురావస్తు శాస్త్రజ్ఞుల కంటబడ్డాయి. అనేక ప్రాకృత శాసనాలు వెలికి వచ్చాయి కాని ముచ్చటగానైనా ఆనాటి ఒక్క తెలుగు శాసనం కంటబడలేదు. దీనికి కారణం తెలుగు లేనే లేదని కాదు, పరిశోధన పరిపూర్ణం కాకపోవచ్చు."[1]

అసలు మనకు కారకంతో గూడిన తెలుగు వాక్యాలున్న మొదటి శాసనాలు కడపలో లభించాయి. అని క్రీ.శ. 6వ శతాబ్దికి చెందినవి. మనకు దొరికిన వాటిలోకెల్ల అతి ప్రాచీనమైంది కడప మండలం, కమలాపురం, కలమల్ల శాసనం, ఇది క్రీ.శ. 575 నాటిది. రేనాటి చోళరాజు ధనుంజయుని శాసనం ఇది.

'ఎరికల్ ముతురాజు' అను బిరుదు గల ధనుంజయుడను రాజు రెనాణ్డు ఏలుచుండగా చిఱుంబూరు అనే గ్రామానికి చెందిన రేవణ అను పేరుగల 'కాలు' ఒక ఉద్యోగి లేక (ఆసామి) యొక్క పంపున చెనూరి గ్రామానికి చెందిన 'కాజు...' అని వాక్యం అసంపూర్ణంగా ఉంది. తుదిలో పంచమహాపాతకుడగునని ఈ ధర్మమును చెడగొట్టు వారికి పాపము చెప్పబడెను."[2]

ఈ శాసనా కాలానికి ముందు తెలుగులో వాక్యరచన ఉన్నట్లు మనకు ఇంతవరకు ఏ రకమైన ఆధారాలు లభించలేదు. అయితే

సంస్కృత వాక్యాలు చెదురుమదురుగా, ప్రాకృత వాక్యాలు విరివిగా ఉన్న శాసనాలు నాగార్జునకొండ ప్రాంతంలో దొరికాయి. ఈ ఆరో శతాబ్దం ముందు నుంచి ద్రవిడ, ప్రాకృత, కన్నడ, సంస్కృతం పదాలను కొన్నింటిని ఏరుకొని తనకున్న పద సముదాయంతో కలిపి తెలుగు వాక్యాలు రాయడం మొదలైనట్లు కొన్ని ప్రాచీన శాసనాధ్యయనం వల్ల అవగతమవుతోంది. అంతకు ముందు ప్రాకృతం వ్యవహార భాషగా ఉందనుకొంటే, ఆ భాషా వాక్యాల స్థానంలోకి అనేక తెలుగు వాక్యాలు ప్రవేశించి ఉంటాయి.

ఏ భాష అయినా హఠాత్తుగ ఎక్కడనుంచో ఊడి పడదు. కాలం మీద పరిణామం చెందుతుంది. భాష ఒక స్వరూపం తీసుకోవడానికి ఏండ్లు, పూండ్లు పడుతుంది. అందుకని "అంతకుముందు వాడుకలో ఉన్న భాషల నుంచి పదాలను గ్రహించడం ద్వారా వికాసం ప్రారంభమైంది" అనే దానిని బట్టి మనం ఊహించగలిగింది ఏమంటే, ధనుంజయుని శాసనానికి ముందు కనీసం ఏ మూడు నాలుగువందల సంవత్సరాల నుంచి అయినా తెలుగు ఏ కొద్దిగనైనా వాడుకలో ఉండి ఉండవచ్చు. అంటే 'కారకవాక్య' ఆరంభం క్రీ.శ. నాలుగు లేదా మూడు శతాబ్దులకి మించి వెనక్కు విస్తరించడం అంత సంభవం కాదు. అంటే దీనిని బట్టి మనం చేరే నిర్ణయం ఏమిటంటే, శాసనాల ఆధారంగా చూస్తే తెలుగు పుట్టు పూర్వోత్తరాలు నాగార్జునుని కాలం వరకు పోవు. ఏవో కొన్ని పదాలున్నా, నాగార్జునుని కాలంలో తెలుగు వాడకంలో లేదనే నిర్ధారణకు రావలసి వస్తుంది.

వాఙ్మయపరంగా చూస్తే తెలుగు నాగార్జునునికి ముందు 400 ఏళ్ళ నుంచే ఉన్నట్లు తెలుస్తుంది. "క్రీ.పూ. 200 సంవత్సరాల నాటికే తెలుగు భాషలో పాటలుండినట్లుగా హాలుడు అనే శాతవాహన రాజు సంకలనము చేసిన "గాథాసప్తశతి" అనబడు ప్రాకృత గ్రంథమును బట్టి తెలియుచున్నది."

**"చక్కగా దంచిన సన్న బియ్యపు వన్నెలాంటి వెన్నెల**
**తాను కోరుకొన్నదాని కన్నా కొల్లగా పండిన పైరును**
**పల్లెరైతు చూశాడు. ఆనందంతో ఇచ్చవచ్చినట్టూ**
**పాడుకొన్నాడు" గా.స.శ. 7-89.**
**'పెళ్ళికూతురికి పెళ్ళి కడియాలు తొడిగించి**
**పునిస్త్రీలు మంగళ గీతాలు పాడుతున్నారు**
**ఆ పాటలలో తనకు కాబోయే మగని పేరు**
**అతని వంశం తీరు వర్ణిస్తూ ఉంటే వింటున్న**
**పెళ్ళికూతురికి ఒళ్ళు పులకరించింది' గా.స.శ. 7-42.'[3]**

అంతేకాదు, హాలుడు సంకలించిన గాథాసప్తశతిని బట్టి అనేక తెలుగు పదాలు ప్రాకృత ప్రవేశం చేసినట్లు తెలుస్తున్నది. "సంస్కృతం మాండలికంగా మాత్రమే ఉన్నప్పుడు సర్వజనీనంగా అభివృద్ధి పొందిన ప్రాచీన భాష ప్రాకృతం కూడ ఇతర దేశ్యాలను తననిగా చేసుకొనక పోలేదు."[4]

"తెలుగుదేశాన్ని ఏలిన ఈ కవిరాజు (హాలుడు) సేకరించిన ఈ గాథలలో దేశీ పదాలు, ముఖ్యంగా తెలుగు పదాలూ, సంప్రదాయమూ వెల్లివిరియక మానవుగదా. దీనిలో ప్రయోగించిన అత్త, తుప్ప, మ, ఇ, ల మడహ, కిలించిఅ, పేలుఅ, ఎక్కల, పక్కల మున్నగునవి ప్రాకృతపదాలు కావని, కేవలం దేశ్యాలేనని నిర్ధారించడానికి శ్రీకుల బాలదేవుడు మున్నగు గాథాసప్తశతీ వ్యాఖ్యాతలు, పాదలిప్తాచార్యుడు మొదలు ఆచార్య హేమచంద్రుని వరకూ గల ప్రాకృత వైయాకరణ నిఘంటు కారులూ ప్రమాణం."[5]

ముందర పాళీ, ఆ తరువాత సంస్కృతం రాజభాషలైతే కావచ్చునేమో కాని ఆ రెండు భాషలు ఎప్పుడూ కూడ దక్షిణా పథంలో వ్యవహారభాషలుగా లేవు. "దాక్షిణ్య చిహ్నసూరి కుమారపాల చరితంలోని జాతి వర్ణన, అన్నింటికంటె ముఖ్యంగా కర్ణాటక దేశంలో లభ్యమవుతున్న ప్రాచీన శాసనాలూ దక్షిణాపథంలో పాళీగాని, సంస్కృతంగాని సామాన్య వ్యవహారభాషలుగా లేవనడానికి, ప్రబల నిదర్శనం."[6]

బృహత్కథ రచయిత గుణాఢ్యుడు ఆంధ్రుడు. ఇతడు ప్రాకృత, సంస్కృత, దేశీయ మూడు భాషలను వదిలి వాటికంటె భిన్నమైన భాషలో రాస్తానని ప్రతిజ్ఞ చేశాడు. గుణాఢ్యుడు రాసిన పైశాచీ భాష ఒక ప్రాకృత భాషాభేదంగా నాటికి పరిగణించబడలేదు. అలాగైతే గుణాఢ్యుని ప్రతిజ్ఞ నెరవేరి యుండెడిది కాదు. దీనిని బట్టి ప్రాకృత భాషాభేదంగా నాటికి పరిగణించబడలేదు. అలాగైతే గుణాఢ్యుని ప్రతిజ్ఞ నెరవేరి యుండెడిది కాదు. దీనిని బట్టి ప్రాకృత, సంస్కృత, పైశాచీలు కాని దేశభాష ఒకటి ఉన్నట్లు తెలుస్తోంది. దేశభాష అంటే ప్రజల భాష. ఆ దేశభాష తెలుగేననడంలో సందేహం లేదు. గుణాఢ్యుని బృహత్కథా కాలం క్రీ.పూ. 300.

ఇవ్వాళ సమాజం మీద రాజకీయ ప్రభావం ఎలా ప్రబలంగా ఉందో ఆ రోజుల్లో మత ప్రాబల్యం అంతగా ఉండేది. అందుకని నాటి మతాల పరిణామాలు భాషలను గూడ ప్రభావితం చేశాయి. అలాగే ఆంధ్రదేశంలో ప్రవేశించిన బౌద్ధం, వైదికమతం నాటి వాటి పాళీ, సంస్కృతాల ద్వారా దేశభాష అయిన తెలుగును ప్రభావితం చేశాయి. ఆ విధంగా తెలుగుపాళీ, సంస్కృత పదాలను తనలో కలుపుకొని పరిపుష్టమైంది.

ఆ తరువాత బుద్ధఘోషుడు, 'వినయపిటక'కు వ్రాసిన 'సమంత ప్రసాద' వ్యాఖ్యాన ఉపోద్ఘాతంలో 'అంధకాట్టకాథ' గ్రంథాన్ని

పేర్కొన్నాడు. దీనితోపాటు మరికొన్ని అట్టకథలను తన సమంత ప్రసాద వ్యాఖ్యానంలో అతడు పేర్కొన్నాడు. అవి 'మహాఅట్టకథా', 'మహాపచ్చం అట్టకథ', 'కురింది అట్ట కథ', కురింది నామాదిషు విస్సుతాసు'లు.

మొదటి మూడు పేర్లను బట్టి చూస్తే వాటిని రచించిన, ఉపయోగించిన స్థలాలను బట్టి వాటికా పేర్లు వచ్చాయని తెలుస్తుంది. అలా చూస్తే అంధకాట్టకథ ఆంధ్రదేశానికి చెందిందై ఉండాలి. సంప్రదాయాన్ని బట్టి చూస్తే అది దక్షిణ భారతదేశం కాంచీపురం ప్రవర్తితమైనట్లు నమ్ముతారు.

**"యం పన అంధకాట్ట కథాయామ్ అపరి భట్టె సముఖె**
**అనాపత్తి, భూమియమ్ విన జగతీయా పముఖం సంధాయ**
**కథితం తౌవత్తమ్, తమ్ అంధకరట్టెపాతెక్కమ్**
**సన్నిలెసా ఎకచ్చదనాగబ్బ పాలియ సంధాయవత్తమ్"**

"From this and the analogy of the names of Paccari and the kurundi which were composed on a raft and at the KURUNDUVELA monastry it will be reasonable to suppose that this exposition of the Pitakas called the Andhakattakatha was so called after the place of production, Andhra. And tradition also informs us that it was current at Kanchipura"[7].

ఆ ప్రాచీన వ్యాఖ్యానాలు క్రీ.పూ. 3వ శతాబ్దానికి చెందినవై ఉండాలి. ఎందుకంటే మహేంద్రుడు వాటిని సింహళానికి తీసుకువెళ్ళింది. క్రీ.పూ. 3వ శతాబ్దంలోనే. తరువాత బుద్ధఘోషుడు క్రీ.శ. 5వ శతాబ్దిలో సింహళం వెళ్లి అక్కడ వాటిపై వ్యాఖ్యానించాడు. మరి సంప్రదాయం అంధకాట్ట కథను కాంచీపురంతో కలపడంలో ప్రాచీనత మనకు తెలియదు.

మరి ఈ 'అంధకాట్ట కథ' ఏ భాషలో రాయబడింది? పాళీ అయినట్లయితే నాటికి పాళీ ఆంధ్రలో ఉంది కనుక అంధకాట్ట కథ అయింది. కనుక స్థలాన్ని బట్టి అనుమానం లేకుండ అది ఆంధ్ర అయి ఉంటుందని చెప్పవచ్చు. డా.బి.సి.లా పాళీ సాహిత్య చరిత్ర అనే తన గ్రంథంలో "అంధకాట్ట కథ బహుశ ఒక స్థానిక భాషలో రాయబడి ఉండవచ్చు" అన్నాడు. "చుల్లవగ్గ" లో "ప్రతి ఒక్కరు పవిత్ర గ్రంథాలను తమ మాతృభాషలో నేర్చుకోవాలని ఆదేశించాడని" ఒల్డెన్‌బర్గ్ తన విన పిటిక ఉపోద్ఘాతంలో చెప్పాడు. బుద్ధుడు ఏమి చెప్పినా చెప్పకపోయినా దేశంలో వివిధ ప్రాంతాలలో పవిత్ర గ్రంథాలను ఉపయోగించినప్పుడు వాటిని వారి వారి భాషలోనే ఉపయోగించారనేది నిశ్చయం. టిబెట్టు బౌద్ధమత సంప్రదాయం ప్రకారం థేరగాథలన్నీ పైశాచీ భాషలో ఉన్నాయి. పైశాచీ, పాళీ సన్నిహితాలు. పైశాచీ ఒక ప్రాకృత భేదం పైశాచీ ఆర్యేతరులు మాట్లాడే ఆర్య స్థానిక భాష. ఈ ఆర్యేతరులు వింధ్య సమీప ద్రావిడులు. పాళీగూడ అదే ప్రాంతవాసులు మాట్లాడే స్థానిక ఆర్యభాష. పైశాచీ తన వాయవ్య నివాసం నుంచి దక్షిణాదికి వ్యాపించింది. ఈ భాషా సంబంధాల దృష్ట్యా బుద్ధఘోషుడు ఉటంకించిన అంధకాట్ట కథా భాష ద్రవిడ దేశంలో మాట్లాడే ఆర్యస్థానిక భాష అయి ఉంటుందనే నిర్ణయానికి రావచ్చు. ఈ భాషను సౌకర్యం కోసం పైశాచీ పాళీగా పిలవవచ్చు. కొంతమంది తెలుగుభాషా శాస్త్రవేత్తలు ఈ ఆర్య స్థానిక భాషయే ఆంధ్ర లేదా తెలుగు భాషకు మాతృక అని చెబుతున్నారు. కొంతమంది ఏమో ఈ ఆర్య స్థానిక భాష ద్రావిడ భాషలను అత్యంతంగా ప్రభావితం చేసిందని చెప్పారు.

పాళీ – పైశాచీ తెలుగుకు మాతృక అయినప్పుడు, గుణాఢ్య ప్రతిజ్ఞ నుంచి మనం సాధించిన దేశభాష రెండూ గూడ తెలుగునే సూచిస్తున్నాయి. అంటే తెలుగు భాష ప్రాచీనత క్రీ.పూ. 3వ శతాబ్దం వరకు వెళ్ళింది.

ఇంకా కొంతమంది పరిశోధకులు తెలుగు చరిత్ర ప్రాచీనతను క్రీ.పూ. 2025 వరకు తీసుకుపోతున్నారు. ఇరాక్ త్రవ్వకాలలో లభించిన Ea-Nasir అనే వర్తకుడి ఇల్లు, ఆ యింటిలో లభించిన మృణ్మయ ఫలకాలను బట్టి ద్రవిడ భాషల వివరాలు తెలుస్తున్నాయని "సుమేరియన్ ప్యారడైజ్ లాండ్ తెల్‌మన్ భాష తెలుగు" అని చెప్పారు. అప్పాకి = అప్పా నుండి (తండ్రికి = తండ్రి నుండి) ఇంకా మరికొన్ని ద్రావిడ పదాలను ఇచ్చారు.[9]

మరో కోణం నుంచి తెలుగు ప్రాచీనతను చూస్తే, తెలుగు నేటికి పుట్టి 2500 సంవత్సరాలని తెలుస్తుంది. అంటే తెలుగు లిపి క్రీ.శ. 5వ శతాబ్దం నాటికే తెలుగు లిపి ఉంది. ముందు భాష ఏర్పడి ఆ తరువాత దాని కనుగుణమైన లిపి ఏర్పడుతుంది. లిపి ఉండి భాష లేకపోవడం అంటూ జరగదు. భట్టిప్రోలు లిపి క్రీ.పూ. 3వ శతాబ్ది నాటికే ఉంటే, తెలుగుభాష అంతకు ముందు ఎంతో కాలం నుంచి ఉండి ఉండాలి.

ద్రావిడ భాషా కుటుంబపరంగా ఆలోచిస్తే, ఈ కుటుంబ 24 భాషలతో దక్షిణ ఆసియా అంతట ఆవరించి ఉంది. క్రీ.పూ. 2000 ఏళ్ళ క్రింద ఈ కుటుంబం చీలి దక్షిణ, మధ్య, ఉత్తర ద్రావిడ శాఖలుగా ఏర్పడ్డాయి. క్రీ.పూ. 1500 ప్రాంతంలో దక్షిణ ద్రావిడ శాఖ మరో రెండు ఉపశాఖలైంది. ఒక ఉపశాఖలోని మాండలికాలు ఏడు భాషలయ్యాయి. తమిళం, మలయాళం, కన్నడం, తుళు, తొద,

కోత, కొడగులు. రెండో ఉపశాఖ మళ్ళీ ఏడు ఉపశాఖలైంది. తెలుగు, గోండి, కొండ, కుయి, కువి, పెంగొ, మండ, ఈ భాషల్లో ఎక్కువమంది మాట్లాడేవి తెలుగు, తమిళం, మళయాళం, కన్నడాలు, పై రెండు ఉపశాఖలు వేరైన తరువాత సుమారు క్రీ.పూ. 5,6 శతాబ్దాలకే ప్రత్యేక భాషగా తెలుగు జ్ఞాతి భాషల నుండి వేరైంది.

మనం ఇంతవరకు చేసిన చర్చను బట్టి తెలుగు నాగార్జునుని కాలానికి బాగా వాడుకలోకి వచ్చి ఉండాలి. మరైతే అతడు ఎందుకు తెలుగులో రాయలేదు? దీనికి మనం ఇలా సమాధానాలు చెప్పుకోవాలి?

1. బౌద్ధిక వాతావరణం (Climate of opinion) సంస్కృతానికి అనుకూలంగా ఉంది.
2. బ్రాహ్మణ పండితులంతా సంస్కృతంలో తమ దర్శన చర్చను చేశారు కనుక వారిని ఢీ కొనాలంటే, వారి భాషలోనే వారికి పాఠం చెప్పాలి.
3. తెలుగు అపరిణత కారణం కాదని పైన మనం చర్చించాం.
4. రాజుల ప్రాపకం సంస్కృతానికి పాళీకి మాత్రమే ఉంది.
5. శంకరుడు ప్రచ్ఛన్న బౌద్ధుడైనట్లు, నాగార్జునుడు ప్రచ్ఛన్న బ్రాహ్మణవాది అని కొందరన్నారు. ఇది చాలా దారుణమైన ఆరోపణ. బ్రాహ్మణ మతాంశాలు కొన్ని నాగార్జునుని ప్రభావితం చేసి ఉండవచ్చు కాని, సామాజికాంశాలలో అతడెక్కడా రాజీపడి బ్రాహ్మణ పక్షపాతి కాలేదు.
6. తెలుగులో చెప్పలేదంటే అతడు తెలుగువాడు కాడా? పండితాభిప్రాయం తెలుగువాడనే చెబుతోంది.
7. ఒకవేళ ఔత్తరాహుడై (విదర్భ) ఉండి దక్షిణాదికి వలస వచ్చి తాను చిన్నప్పుడు నేర్చుకొన్న సంస్కృతంలో రాయడం హాయిగా ఉంటుంది కాబట్టి అలా రాశాడా?

ఏది ఏమైనా ఇప్పుడు మనకు లభిస్తున్న సమాచారం మీద ఆధారపడి ఒక స్థిర నిశ్చిత అభిప్రాయానికి రాలేము. ఇదొక శేష ప్రశ్నగానే ఉండిపోతుంది.

**అధోసూచికలు :**

1. కృష్ణశాస్త్రి వి.వి. "గాథాసప్తశతిలో తెలుగు పదాలు" ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ, హైదరాబాద్, 1983, పరిచయం.
2. పరబ్రహ్మశాస్త్రి, "తెలుగులో శాసనాలు", ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్, 1975, పుట. 16.
3. కృష్ణరావు వైద్యుల etal, "తెలుగు సాహిత్య చరిత్ర", తెలుగు అకాడమీ, హైదరాబాదు, 1986 పుట. 9.
4. రామచంద్ర తిరుమల, "గాథాసప్తశతిలో తెలుగుపదాలు", ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ, హైదరాబాద్, 1983, పుట. 1.
5. ibid, p.3.
6. ibid, p.3
7. డా. రాఘవన్ వి. "అంధకాట్ట కథ" "Tournal of Andhra "History and Culture" Jan., 1944 (Prof. M. Venkatarangayya Volume), P. 164.
8. అంధకాట్ట కథలో నుంచి ఈ భాగానికి సంబంధించిన అంశాలను విస్తృతంగా గ్రహించడం జరిగింది.
9. కూనియ్య సంయుక్త, "సుమేరియన్ ప్యారడైజ్ లాండ్ తెల్మన్ తెలుగు" మిసిమి, హైదరాబాద్, అక్టోబరు – 2000 సంచిక.

తల్లి! కృష్ణానదీ! భవత్తటమునందె
మ్రోసెనాంధ్ర పతాక మమ్మొదటి దెగసి
తెలుగునావలు నీ దీవనలు గడించి
ఎత్తె తెరచాప దీవుల నెల్లనొత్తె

శ్రీ వేమూరి రాజేష్

# పారిస్‌లో కొలువైన కృష్ణాతీరపు బౌద్ధ ఆనవాళ్లు

ఆంధ్రప్రాంతం మొత్తంలో విలసిల్లిన బౌద్ధ మత ఆనవాళ్ళు, అవశేషాలు మొత్తం 13 జిల్లాల్లో 22 ప్రాంతాల్లో విస్తరించి ఉన్నాయి. వాటిల్లో పది ప్రాంతాలు కృష్ణాతీరంలోనే ఉన్నాయి. అమరావతి, అల్లూరు, భట్టిప్రోలు, గుమ్మడిదర్రు, కంచికచర్ల, జగ్గయ్యపేట, ఉండవల్లి, నాగార్జునకొండ, అనుపు, ఘంటసాల గ్రామాల్లో వేల ఏళ్లనాడు వర్ధిల్లిన బౌద్ధమతపు ఆనవాళ్ళు ఇప్పటికీ కనిపిస్తాయి. పొలం దున్నుతున్నప్పుడో, ఇంటికి పునాది తీస్తున్నపుడో నేటికీ శిల్పాలు బయట పడుతుంటాయి. అసలు ఈ ప్రాంతపు దరిదాపుల్లోనే దొరకని చలువ రాతితో చేయబడిన శిల్పాలు, స్తంభాలు ఇక్కడికెలా వచ్చాయనేది ఇప్పటికీ వీడని మిస్టరీ. దాదాపు బౌద్ధం వర్ధిల్లిన అన్ని ప్రాంతాల్లోనూ శైవం విలసిల్లింది. ఉదాహరణకి, ప్రసిద్ధ బౌద్ధారామంగా వెలుగొందిన అమరావతిలో బౌద్ధస్తూపంతోపాటు పురాతన అమరేశ్వర దేవాలయం ఉంటే, దానికి 100 కిలోమీటర్ల దూరంలో ఉన్నఘంటసాలలో బౌద్ధ స్తూపంతోపాటు పురాతన జలధీశ్వరస్వామి ఆలయం ఉంది. ఈ రెండు శైవక్షేత్రాల పేర్లు కూడా విభిన్నంగా ఉంటాయి. గత వందేళ్లుగా ఈ ప్రాంతాల్లో బయల్పడిన కొన్ని అరుదైన శిల్పాలు అప్పట్లో మనవారికి చరిత్రమీద, ఈ అవశేషాల మీద అంత అవగాహన లేకపోవటంవల్ల విదేశాలకి తరలిపోయాయి. అమరావతికి చెందిన ఎన్నో శిల్పాలు లండన్ మ్యూజియంలో ఒక ఫ్లోర్ నిండా ఉన్నాయని మనం చాలా సార్లు ప్రసార మాధ్యమాల్లో చూశాము. కాని అమరావతితో పాటుగా కృష్ణాతీరంలో ఉన్న గ్రామాల్లో బయటపడిన బౌద్ధ అవశేషాలు మరో చోట కూడా ఉన్నాయి. అదే పారిస్‌లో ఉన్న గుయ్‌మెట్ మ్యూజియం.

ఘంటసాల గ్రామానికి చెందిన ప్రముఖ చరిత్రకారుడు శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు 1947లో రాసిన "ఘంటసాల చరిత్ర" అనే గ్రంథంలో ఈ విషయాన్ని మొట్టమొదటిసారి వెలుగులోకి తీసుకువచ్చారు. అది చదివిన అప్పటి ఆంధ్రప్రభ సంపాదకులు శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు 1960వ దశకంలో పారిస్ వెళ్ళినపుడు ఈ మ్యూజియంని సందర్శించి ఈ శిల్పాలపై ప్రత్యేక వ్యాసం ప్రచురించారు. తదనంతరం 1966లో "ఘంటసాల చరిత్ర" గ్రంథం ద్వితీయ ప్రచురణలో రాసిన ముందు మాటలోనూ ఈ విషయాన్ని ప్రస్తావించారు. ఈ ముందుమాటని ఆధారంగా చేసుకొని 2013వ సంవత్సరం మే లో నేను పారిస్ వెళ్ళినపుడు ఈ మ్యూజియంని సందర్శించి అక్కడున్న శిల్పాలన్నిటినీ చూడటం జరిగింది.

> శ్రీ వెంకట సుబ్బయ్యగారి "ఘంటసాల చరిత్ర" ప్రథమ ముద్రణను చదివిన తర్వాతనే ఆ గ్రామానికి యాత్ర చేయాలన్న ప్రబలకాంక్ష నాలో రేకెత్తించింది. అక్కడికి వెళ్ళి చూడలేకపోయిన బౌద్ధ శిల్పాలను చూడ్డానికి పారిస్‌లోని "ముసీ్స జిమే"కు నన్ను తీసుకెళ్ళిందికూడా దీని ప్రథమముద్రణే।
>
> నా వలె పెక్కుమందిని ఈ ద్వితీయముద్రణ ఘంటసాల యాత్రికులను చేయగలదని, వారిలో కొందరి చేతనైనా పారిస్ వరకు ఇది ప్రయాణం కట్టించగలదని నమ్ముతున్నాను.
>
> "ఆంధ్రజ్యోతి"
>
> విజయవాడ 19 డిసెంబర్ 1966 — నార్ల వెంకటేశ్వరరావు

ఘంటసాల చరిత్ర గ్రంథంలో నార్లవారి ముందుమాట

గుయ్ మెట్ మ్యూజియం ప్రస్తుతం పారిస్‌లో లేనాఅనే ప్రాంతంలో ఈఫిల్ టవర్‌కి కూతవేటు దూరంలో ఉంది. 1876లో ఫ్రాన్స్ ప్రభుత్వం ఆగ్నేయాసియా, దక్షిణాసియాలలో విలసిల్లిన నాగరికతని పరిశోధించి ప్రజలకి తెలియచేయాలనే ఉద్దేశ్యంతో ఎమిలే ఎటిన్నే గుయ్ మెట్ అనే పారిశ్రామికవేత్తని ప్రజాబోధనా శాఖమంత్రిగా నియమించింది. 1879లో పారిస్‌కి 500 కిలోమీటర్లలో లియాన్అనే ఊరిలో ఈ మ్యూజియాన్ని ప్రారంభించాడు గుయ్‌మెట్. తరువాత 10 సంవత్స

రాలకి 1889లో దీనిని పారిస్‌లో ప్రస్తుతం ఉన్నచోటుకి మార్చారు.

## మ్యూజియం

ఈ పరిశోధనలో భాగంగా చాలామంది ఫ్రెంచ్ పరిశోధనకారులు ఆసియాలో ఉన్న పలు దేశాలని పర్యటించి అక్కడున్ననాగరికతని తెలుసుకోవటంతోపాటు అక్కడ దొరికిన కొన్ని శిల్పాలని, రాత ప్రతుల్ని సేకరించి వాటన్నిటిని పారిస్‌కి చేర్చారు. ఈ క్రమంలోనే 1927లో



కృష్ణాతీరంలో పర్యటించిన డూబ్రియెల్ అనే పరిశోధన కారుదు నాగార్జున కొండ, అమరావతి, భట్టిప్రోలు, ఘంటసాల గ్రామాల్లో దొరికిన బౌద్ధ శిల్పాలని పారిస్ తరలించాడు. ఆసియా ప్రాంతం బయట ఎక్కువ ఆసియా కళాఖండాలు, అవశేషాలు కొలువు దీరిన అతిపెద్ద మ్యూజియం ఇది. కృష్ణాతీరం నుండి తరలించ బడిన 11 ముఖ్యమైన శిల్పాలు ఇక్కడ ఉన్నాయి. వీటిల్లో ముఖ్యమైనది మహాభినిష్క్రమణ.



బుద్ధుడు సకల భోగాలతో జీవనం సాగించే సమయంలో మానవ జీవితంలో దుఃఖ నివారణకి మార్గాన్ని అన్వేషించే ప్రయత్నంలో అర్ధరాత్రి వేళ భార్యాపిల్లలను, రాజ్యాన్ని విడిచి ఒక అశ్వముపై ఎక్కి వెళ్ళిపోతాడు. ఒక బోధిసత్వుని నిష్క్రమణ అతని భటులకు తెలియకుండా ఉండడానికి, అతని గుర్రపు డెక్కల చప్పుడు దేవతలచే ఆపబడిందని చెప్తారు. దీనినే ఒక మహాభినిష్క్రమణ (ది గ్రేట్ డిపార్చర్) అని అంటారు. ఈ ఘట్టాన్ని వివరించే శిల్పాలు రెండు ఈ మ్యూజియంలో ఉన్నాయి. పైన చిత్రంలో ఉన్నది అమరావతిలో దొరికినది కాగా, మరొకటి ఇప్పటి ఉత్తర పాకిస్తాన్‌లోని స్వాత్ ప్రాంతంలో దొరికింది. ఇదే వృత్తాంతాన్ని తెలిపే శిల్పం ప్రస్తు తం ఘంటసాల మ్యూజియంలో కూడా ఉంది. బుద్ధుడు మహాభి నిష్క్రమణలో ప్రయాణించిన ఆ అశ్వము పేరు కంటక. ఆ కంటక పేరిట నిర్మించబడిన గ్రామము కంటకశైలగా ప్రసిద్ధిపొంది ప్రస్తుతం కృష్ణాతీరంలో ఘంటసాల గ్రామంగా నామాంతరం చెందిందని చరిత్రకారులు చెపుతారు. ఎక్కడి కృష్ణాజిల్లా, ఎక్కడి పారిస్, వందేళ్ల క్రితం తరలిపోయిన ఆ శిల్పాలని ఇప్పుడు చూడగలగటం నిజంగా అదృష్టమనే చెప్పాలి. ప్రతి శిల్పం దగ్గరా అవి సేకరించబడిన ప్రాంతం వివరాలు ఉన్నాయి. అమరావతి, నాగార్జునకొండ, ఘంటసాల అనే పేర్లు శిల్పం కింద చూడగానే మనసు పులకించింది. ప్రపంచంలో ఎక్కువమంది టూరిస్టులు సందర్శించే నగరం పారిస్. దాదాపు అన్ని దేశాలనుండి ప్రతిరోజు మిలియన్ల మంది ఈ నగరాన్ని సందర్శించ టానికి వస్తుంటారు. అలా వచ్చిన వారంతా ఈ మ్యూజియంని సందర్శించినప్పుడు మనప్రాంతాల వివరాలని తెలుసుకుంటారు అని ఒకింత గర్వంగా కూడా అనిపించింది. అయితే ఈ విగ్రహాలని ఇక్కడికి తీసుకువచ్చే అవకాశం లేదు కనుక వాటి నకళ్లు ఇక్కడ తయారు చేయించి పెడితే ఈ ప్రాంత ప్రతిష్ట మరింత పెరిగే అవకాశం ఉంది.



అమరావతిలో దొరికిన బుద్ధ విగ్రహం (దీని తల భాగం కూడా వేరుగా ఈ మ్యూజియంలోనే ఉంది)



తలభాగం



ఘంటసాలలో దొరికిన శిల్పం



నాగార్జున కొండలో దొరికిన శిల్పం



ఘంటసాలలో దొరికిన బుద్ధుడు



ఘంటసాలలో దొరికిన శిల్పం



నాగార్జున కొండలో దొరికిన శిల్పం



నాగార్జున కొండలో దొరికిన శిల్పం

శ్రీ బి. హనుమారెడ్డి

## బెజవాడ - కందుకూరు మధ్య 'అద్దంకి'

# పండరంగని పద్యశాసనం

గోదావరి – కృష్ణ నదుల మధ్యప్రదేశం వేంగినాడు. వేంగి చాళుక్యులేలిన ప్రాంతం. పరిపాలనాక్రమంలో రాజ్యం ఎల్లలు మారుతూ వచ్చాయి. కృష్ణానదిని దాటి దక్షిణానికి నెల్లూరు మండలం దాకా వ్యాపించింది చాళుక్య రాజ్యం.

గుణగవిజయాదిత్యుడు వేంగిచాళుక్యరాజు. పండరంగడు ఆయన సర్వసైన్యాధిపతి. మహా పరాక్రమవంతుడు. ఆయన తండ్రి కడెయ రాజు. గుణగవిజయాదిత్యుడు వేంగి రాజ్యాన్ని క్రీ.శ. 848 మొదలు 892 వరకు 44 సంవత్సరాలు పరిపాలించాడు. పండరంగడు బోయ కొట్టములను (బోయ కోటలను) జయించాడు. బోయకొట్టములు నెల్లూరు మండలంలోనివి. బోయలు గొప్ప యోధులు. పేరొందిన విలుకాండ్రు. పూర్వపాలకుల సైన్యంలో సైనికులుగా వున్నారు. అప్పటికి చాళుక్యరాజ్యంలోని బెజవాడ పెద్ద పట్టణమే. పండరంగడు వరుస విజయాలు పొందుతూ కందుకూరు దాకా జయించుచూ వచ్చి కందుకూరును బెజవాడంత పట్టణం చేస్తానన్నాడు.

బెజవాడ – కందుకూరు మధ్యలో అద్దంకి వున్నది. క్రీ.శ. 848 సంవత్సరంలో అద్దంకిని గుణగజయాదిత్యుని సేనాని పండరంగడు సర్వసైన్యాలతో గెల్చుకున్నాడు. పండరంగడు క్రీ.శ. 848లో తన విజయ సంకేతనంగా ధర్మవరంలో ఆదిత్యభట్టారనికి, ఇతరులకు దానాలు ఇస్తూ పలు శాసనాలు చేశాడు. అందులో ఒకటి క్రీ.శ. 848 సంవత్సరంలో అద్దంకిలో వేసిన శాసనం.

### ఆ శాసన పాఠం

పట్టంబుగట్టిన ! ప్రథమంబు నేండు !
బలగర్వమొప్పగ ! బైలేచిసేన
పట్టంబు గట్టించి ! ప్రభుఁబండరంగు !
బంచిన సామ(ం)త ! పదువతో బోయ
కోట్టము ల్వండ్రెండు ! గొని వేంగినాంటి !
గొఱల్చియ త్రిభువనాం ! కుశబాణనిల్పి
కట్టెపుదుర్గంబు గడుబయల్సేసి
కందుకూర్బెజవాడ ! గావించెమెచ్చి

### గద్యము

పండరంగు పరమమహేశ్వరుండుఆదిత్యభట్టారనికి ఇచ్చిన భూమి ఎనుబొది (ఎనిమిది ?) పుట్ల ఆఖ్ల పట్టు నేల ధర్మపురంబున ధర్మువులు వీని రక్షించినవారికి అశ్వమేధంబున ఫలంబు అగు.

### శాసన విషయం

ఈ శాసనమున పండరంగడను నతనికి (ఎవరో యొక భూపాలకుడు) తాను పట్టాభిషిక్తుడైన మొదటి సంవత్సరముననే సైన్యాధిపత్యమిచ్చెననియు, అంతట నా సైన్యాధిపతి సామంత సైన్యముతో బోయి, బోయ కోట్టములు, అనగా బోయరాజుల కోటలు పండ్రెండు పట్టుకొని వేంగీరాజ్యమును విజృంభింపజేసి త్రిభువనాంకుశుల (అనగా త్రిభువనాంకుశ బిరుదముగల వేంగీచాళుక్య భూపతుల) పరాక్రమమును (లేక జెండాను) నిల్పి, కట్టెపుదుర్గమును చాల పాడు వఱిచి, కందుకూరిని మెచ్చి బెజవాడ యంతటి ప్రముఖ మైనదిగజేసి, ధర్మవరమున ఆదిత్యభట్టారనికి కొంత భూదానము చేసెననియు శాసనము తెలుపుచున్నది. (చూ : మల్లంపల్లి సోమశేఖర శర్మ వ్యాసం – పండరంగని శాసనం)

ఈ శాసనం చరిత్రకు ముఖ్యాధారం సాహిత్య చరిత్రకు పెన్నిధి. ఈ శాసనంలోని పంక్తులు ఒక తెలుగు పద్యం. నేటివరకు దొరికిన రాతి శాసన, తామ్రశాసన పద్యములలో ఈ శాసనంలోని మొట్ట మొదటిది. ఇది తరువోజ ఛందస్సులోని పద్యం. యుద్ధమల్లుని బెజవాడ శాసనంలోని మధ్యాక్కర పద్యాలు, ధర్మవరంలోని సీసపద్యాలు వగైరాలు క్రీ.శ. 849, 850 సంవత్సరాల నాటివి. నన్నయ కన్న దాదాపు 200 సంవత్సరాల పూర్వానివి. ఈ పద్యశాసనం. 1900 సంవత్సరం ప్రాంతంలో అద్దంకిలో ఒక వ్యక్తి పెరటిలో మట్టి త్రవ్వే

టపుడు బయటపడింది. భాషా చరిత్రకారులు పరీక్షలు చేసి దానిని 1905లో నెల్లూరు మండల కైఫీయతులలో చేర్చారు. కొమర్రాజు వేంకట లక్ష్మణరావు, బట్టర్ వర్తు, వేణుగోపాలశెట్టి, మానవల్లి రామకృష్ణకవి, జయంతి వెంకటరామయ్య, చిలుకూరి వీరభద్రరావు, వంగూరి సుబ్బారావు, మల్లంపల్లి సోమశేఖర శర్మ వగైరా భాషా చరిత్రకారులు దానిని పరీక్షించి, అది అప్పటి తెలుగు భాషలో తరువోజ ఛందస్సులో చెక్కిన పద్యమని తేల్చారు. శాసనం ఒక ముక్క మాత్రమే దొరికింది. దానిలో ఈ పద్యం ఉన్నది. మరికొంత విరిగిపోయింది. తేలలేదు.

ఇది చాళుక్యలిపిలోని తెలుగు భాషలో చెక్కిన తరువోజ ఛందస్సు లోని పద్యము. 9వ శతాబ్ది నాటికే తెలుగుభాష ఛందో బందోబస్తులతో వుండినది. ఇది వ్రాసిన వారెవరో తెలియదు. ఇది దేశ్యజాతి ఛందము. తరువాత వచ్చిన తెలుగుభారతం మొత్తంలో 19 తరువోజపద్యాలున్నాయి. ఇది నాలుగు పాదాల పద్యం. ప్రతిపాదంలో 3 ఇంద్ర గణాలు+1 సూర్య గణం,3 ఇంద్రగణాలు+1 సూర్యగణం వుంటాయి. 1-3-5-7 గణాల మొదట అక్షరం యతిస్థానం. ప్రతిపాదంలో ప్రాస నియమం ఉన్నది.

పూర్వపు రోకటి పాటలు జానపదాలు తరువోజలేనన్నారు డా: తంగిరాల వెంకట సుబ్బారావు గారు. **ఉదా :** "నాచేతి రోకళ్ళు నల్ల రోకళ్లు చేయించు అన్నయ్య చేవ రోకళ్ళు". "కోడలా కోడలా కొడుకు పెళ్ళామ పచ్చి పాలమీద మీగడేదమ్మా" ఇలా ఉదాహరణలు చెప్పారు. తరువోజ పద్యానికి పేటెంట్ అద్దంకి-ప్రకాశం జిల్లా అన్నారు ప్రముఖ విమర్శకులు శ్రీ రజాహుసేన్‌గారు మాటకు పాటకు పట్టం కట్టిన తెలుగు పద్యానికి తొలిపూజ తరువోజ అని పద్య ప్రకాశానికి తరువోజ వేదిక అని, ప్రాకృత భాషా సంపర్కం నుంచి, సంస్కృతం ప్రభావం నుంచి విడిపోవటానికి నిశ్చయించుకొని తన తనాన్ని చాటు కోవటానికి తెలుగువాడు ప్రయత్నించిన ఓ శుభ ముహూర్తాన వెలసిన అమ్మ చెట్టు(తరువు) తరువోజ అన్నారు. ప్రముఖ పాత్రికేయులు పూర్వ అధికార భాషా సంఘాధ్యక్షులు శ్రీ ఎ.బి.కె. ప్రసాద్‌గారు.

ఈ తరువోజ శాసనం (అసలు) చెన్నైలో నేషనల్ మ్యూజియంలో ఇప్పటికీ భద్రపరచబడివుంది. దానిని దాని ఘనకీర్తిని ప్రజా సందర్శనం కోసం 2005వ సంవత్సరంలో అద్దంకిలో సృజన సాహితీ సంస్థ, ఒంగోలులోని ప్రకాశం జిల్లా రచయితల సంఘం కలిసి ఆ శాసన ప్రతిబింబంను శిల్పకళా విశ్వవిద్యాలయం ద్వారా తయారుచేయించి అద్దంకిలో 1900 సంవత్సర ప్రాంతంలో దొరికినచోటుకు దాపుగ 19-8-2005 తేదీన స్థూపం వేయించారు. ఆ స్థూపంను అప్పటి విద్యాశాఖామంత్రివర్యులు శ్రీమతి నేదురుమల్లి రాజ్యలక్ష్మిగారు ఆవిష్కరణ చేశారు. అంతేగాక దేశంలోని తెలుగు సాహితీకారులు 108 మంది వ్రాసిన దాదాపు 800 తరువోజ పద్యాలతో తరువోజ గ్రంథాన్ని ముద్రించి అప్పటి ఆం:ప్ర: పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ డా: ఆవుల మంజులత గారిచే ఆవిష్కరణ చేయబడింది. ఈవిధంగా పండరంగని తరువోజ పద్య శాసనం రాబోవు తరాలకు స్వార్జిత తెలుగు ఆస్తిగా వుండుటకు అద్దంకిలో వేసిన తరువోజ పద్యశాసన స్థూపాన్ని తరాల తరబడి తెలుగు ప్రజలు వీక్షించవచ్చు. ఆనందించవచ్చు.

## బృహస్పతి రాశి సంచారం.. నదీ పుష్కర నిర్ణయం

| | |
|---|---|
| మేషరాశి | గంగానది |
| వృషభరాశి | రేవానది |
| మిథునరాశి | సరస్వతీనది |
| కర్కాటక రాశి | యమునానది |
| సింహరాశి | గోదావరి నది |
| కన్యరాశి | కృష్ణానది |
| తులా రాశి | కావేరి నది |
| వృశ్చికరాశి | భీమరథి నది |
| ధనూరాశి | పుష్కరవాహిని (తపతి) |
| మకర రాశి | తుంగభద్రా నది |
| కుంభరాశి | సింధూనది |
| మీన రాశి | ప్రాణహితా నది |

**చిరునామా :** బి. హనుమరెడ్డి, న్యాయవాది, రాజాపానగల్ రోడ్, ఒంగోలు, సెల్ : 94402 88080.

డా॥ జయంతి చక్రవర్తి

# బెజవాడ శాసనాలు

బెజవాడ ప్రాంతం చారిత్రకంగా మధ్యాంధ్రయుగంలో ఎంతో ప్రసిద్ధి పొందింది. ఈ కాలంలో శైవమత ప్రాబల్యం ఆంధ్రదేశంలో అమితంగా వ్యాపించటంవల్ల ఎన్నో శైవక్షేత్రాలు ఉచ్ఛస్థితినందుకున్నాయి. శ్రీశైలం, పంచారామాలు, బెజవాడ మల్లికార్జునాలయం వంటి శైవక్షేత్రాలు, వివిధ పాలకుల హయాంలో ఎంతో వైభవోపేత మైన స్థితిని పొందాయి. ఈవిధంగా ప్రసిద్ధిపొందిన దేవాలయాల్లో అటు శైవక్షేత్రంగా ఇటు శక్తిక్షేత్రంగా ప్రాముఖ్యత వహించినవి బెజవాడ దుర్గామల్లేశ్వరాల యాలు. ఈ దుర్గా మల్లేశ్వరస్వామివార్ల దేవాలయానికి సంబంధించిన శాసనాల్లో, శ్రీ మల్లేశ్వరస్వామికి సంబంధించినశాసనాలు, అత్యధికంగా లభించగా శ్రీ కనకదుర్గాలయానికి సంబంధిం చిన శాసనాలు చాలా కొద్దిగా కనిపిస్తాయి. ఇక ఈ శాసనాల్లో 1. తూర్పు చాణుక్యరాజైన యుద్ధమల్లుడి బెజవాడ శాసనం, 2. త్రికోటి బోయడు వేయించిన కిరాతార్జున స్తంభశాసనం 3. పల్లకేతుభూపాలుడి శాసనం 4.మహామాం డలిక సింగదేవమహారాజు వేయించిన శ్రీకనకదుర్గా లయ శాసనం 5.చట్టపుడు వేయించిన పార్థీశ్వరాలయ శాసనం విషయ పరంగా చాలా ముఖ్యమైనవి. కాగా, మిగిలిన ఇతర శాసనాలు మల్లేశ్వరాల యానికి చేయబడిన వివిధరకాల దానధర్మాల గురించి తెలియజేస్తాయి.

## 1. యుద్ధమల్లుడి బెజవాడ శాసనం :

క్రీ.శ. 11వ శతాబ్దానికి చెందిన తూర్పుచాళుక్య వంశపురాజు యుద్ధమల్లుడు. బెజవాడలో ఒక శాసనాన్ని ప్రకటించాడు. తెలుగు వాఙ్మయ చరిత్రలో ఈ శాసనానికి అత్యంత ప్రాధాన్యం వుంది. ఎందుకంటే తెలుగు ఛందస్సుకి సంబంధించిన మధ్యాక్కర మొదటి సారిగా ఈ శాసనంలోనే ఉపయోగించబడింది. ఈ శాసనం మొదటి వైపు 17 పంక్తులు, రెండవవైపు 19 పంక్తులు, మూడోవైపు 10 పంక్తులుగా స్తంభానికి మూడువైపులా చెక్కబడింది. అసంపూర్ణంగా లభించిన ఈ శాసనంలో యుద్ధమల్లుడు సత్యత్రినేత్ర విస్తరుడని, త్రిభువనాభరణుండని, సకలవస్తుసమేతుండని, విఖ్యాత కీర్తివంతుడని, కీర్తించబడ్డాడు. ఈ ప్రభువు శైవమతాభిమాని, ప్రత్యేకంగా శివుడి కుమారుడైన కుమారస్వామి భక్తుడు అందుకనే, నేటి గుంటూరుజిల్లాలో వున్న చేబ్రోలు నుంచి బెజవాడ జాతరకు వచ్చిన కుమారస్వామికి, బెజవాడలో ఒక గుడిని దానికి అనుబంధంగా ఒక మఠాన్ని కట్టించాడు. అంతేకాదు, ఒక కట్టడిని కూడా చేశాడు. అదేమిటంటే? తాను కట్టించిన ఈ మఠంలో శైవభక్తులైన గొరగలు కాకుండా వేరే ఎవరూ బసచేయ రాదని, ఎవరైనా అలా నివసిస్తే, వాళ్ళని ఆ గుడి స్థానాధిపతులు వెళ్ళగొట్టాలని చెప్పాడు. ఇక ఈ శాసనం చివర్లో, యుద్ధమల్లుడి తాతగారైన మల్లపరాజు బెజవాడలో ఒక సుందరమైన దేవాలయాన్ని నిర్మించాడని, తాను ఆ దేవాలయానికి మరమ్మత్తులు చేయించి దానికి ముందు గోపురాన్ని నిర్మించానని కూడా చెప్పుకున్నాడు.

## 2. కిరాతార్జున శిలాస్తంభశాసనం

ఈ శాసనం బెజవాడ కలియమబోయడు అనేవాడి పుత్రుడైన త్రికోటి బోయడు అనే వ్యక్తిచేత వేయించబడింది. అర్జునుడి దశనామా లతో వున్న సంస్కృతశ్లోకంతో ప్రారంభమై, సంస్కృత వచనంలో ఈ శాసనం రచించబడింది. ద్వాపరయుగంలో పాండవ మధ్యముడైన అర్జునుడికి, ఇంద్రకీలపర్వతం మీద తపస్సు చేసుకోవడానికి తగిన స్థలాన్ని చూపించిన యక్షుడే, ఈ జన్మలో త్రికోటి బోయడుగా జన్మించా డని, ఆ యక్షుడిని తనేనని అని, తనకి పూర్వజన్మ జ్ఞాపకం రాగా, అర్జునుడు ఇంద్రకీలాద్రిమీద తపస్సు చేసిన ప్రదేశంలో, కిరాతార్జున ఘట్టానికి సంబంధించిన శిల్పాలతో, రెండువైపులా, మొత్తం 21 పంక్తుల్లో ఈ శాసనాన్ని వేయించాడు. ఈ శాసనం చివర ఇంద్రకీలాద్రి, కృష్ణానది, ఉన్నంతకాలం తన ధర్మం నిలుస్తుందని త్రికోటిబోయడు చెప్పుకోగా, విజయాచార్యుడనే శిల్పి ఈ శాసనాన్ని లిఖించాడు.

ఇలా పూర్తిగా సంస్కృతభాషలో రాయబడిన ఈ శాసనం, పూర్వం ఇంద్రకీలపర్వతం శిఖరం మీద అర్జునుడు తపస్సు చేసిన ప్రాంతంలో వుండేది. ప్రస్తుతం ఇది పురావస్తు శాఖవారి ఆధ్వర్యంలో వున్న అక్కన్న మాదన్న గుహల ప్రాంగణంలో పునః స్థాపించబడింది.

## 3. పల్లవకేతభూపాలుడి మల్లేశ్వరాలయశాసనం

క్రీ.శ. 12వ శతాబ్దానికి చెందిన ముక్కంటి కాడ్వెట్టి వంశీయుడైన పల్లకేతభూపాలుడు వేయించిన శాసనం ఒకటి మల్లేశ్వరాలయ ప్రాంగణంలో లభించింది. సంస్కృతాంధ్రభాషల్లో ఒకశిలాస్తంభం మీద ఈ శాసన మొత్తం25 పంక్తుల్లో చెక్కబడింది. ఈ శాసనంలోని సారాంశం ఏమిటంటే? ఇంద్రకీలాద్రి మీద తపస్సు చేసిన అర్జునుడితో, పరమేశ్వరుడు మల్లయుద్ధం చేసిన కారణంగా ఆయన తనకున్న 'ఈశాన' అనే పేరుని వదిలేసి, మల్లేశ్వరుడు అనే పేరుతో వ్యవహరించబడసాగాడని, అలాగే విష్ణుకుండిన వంశానికి చెందిన ప్రముఖరాజు మాధవవర్మ ఈ ప్రాంత పరిపాలకుడని, అతని హయాంలో "ఒకరోజు ఆ మహారాజు గారి కొడుకు రథంమీద వేగంగా వస్తున్న సమయంలో, చింతకాయలు అమ్ముకొనే జీవించే ఒక బీదరాలి కుమారుడు, ఆ రథంక్రింద పడి మరణించాడని, ఆ విషయాన్ని ఆ బీద స్త్రీ అత్యంత ఆవేదనతో మాధవ వర్మతో మొరబెట్టుకుందని, అది విని ఆ బీదరాలి కుమారుడి మరణానికి కారకుడైన తన కుమారుడికి, న్యాయాధికారులు చెప్పిన ధర్మాన్ని అనుసరించి మరణశిక్ష విధించాడని, అటువంటి స్వార్థరహిత మైన ధర్మప్రభువైన మాధవవర్మ తీర్పుకి, ధార్మికత్వానికి, చాలా సంతోషించిన మల్లేశ్వరస్వామి బెజవాడలో కనకవర్షాన్ని కురిపించాడని, దీనితో పాటు ఆ బీదరాలి కుమారుణ్ణి కూడా బ్రతికించాడనే గొప్ప విషయాన్ని ఈ శాసనం తెలియచేస్తుంది.

అలాగే ఈ విషయంతోపాటు, సుప్రసిద్ధ శైవాచార్యుడు పండిత త్రయంలో ఒకడైన శ్రీపతిపండితారాధ్యుడు, దేవర్షులకన్నా శివభక్తులే గొప్పవారనితెలియచేసేలా, తన ఉత్తరీయంలోనిప్పుకణికల్ని మూటకట్టి, దానిని జమ్మిచెట్టుకొమ్మకి వేలాడదీయగా, ఆయన భక్తికి మెచ్చిన మల్లేశ్వరస్వామి ప్రత్యక్షమయ్యాడని, ఆవిధంగా పండితారాధ్యుడు మల్లేశ్వరుడి మహిమని నిరూపించాడనే విషయం కూడా తెలియచేయ బడింది. ఇక శాసనం చివర్లో 14వ పంక్తి నుంచి 25వ పంక్తి దాకా ఈ శాసనాన్ని ప్రకటించిన పల్లకేతభూపాలుడు, తాను భారద్వాజ గోత్రుడని, ఖట్వాంగధ్వజుడని, వృషభలాంఛనుడని, శ్రీ బెజవాడ మల్లేశ్వర దివ్య పాదపద్మారాధకుడని, తన ప్రశస్తిని గురించి చెప్పు కోవటం జరిగింది.

## 4. మహామండలేశ్వర సింగయదేవరాజుల కనకదుర్గాలయ శాసనం

బెజవాడ దుర్గా మల్లేశ్వరుల దేవాలయాలకు చెందిన శాసనాల్లో ప్రముఖమైంది ఈ శాసనం. శ్రీ కనకదుర్గ దేవాలయానికి సంబంధించిన వివరాలు తెలియచేసే అతిముఖ్యమైన శాసనం ఇది. ఈ శాసనాన్ని క్రీ.శ. 1516లో శ్రీకృష్ణదేవరాయలు పరిపాలన చేసే కాలంలో, మాధవవర్మ వంశానికి చెందిన శ్రీ మన్మహామండలేశ్వరుడైన సింగయదేవరాజు ఇంద్రకీలాద్రి మీదున్న కనకదుర్గాలయ ప్రాంగణంలో వేయించాడు. ఈ శాసనం మొత్తం 240 పంక్తుల్లో చెక్కబడింది. భాష సంస్కృతం, ఆంధ్రం, దీని మొదటి ప్రక్క 59 పంక్తుల్లో 21 శ్లోకాలు సంస్కృతంలో వుండగా, రెండవప్రక్క 70 పంక్తుల్లో వచన సంస్కృతం వాడబడింది. ఇక నాలుగోప్రక్కనున్న 73 పంక్తులు మొత్తం శాసనాన్ని సంక్షిప్తంగా తెలుగు వచనంలో తెలియచేస్తూ చెక్కబడింది.

ఈ శాసనంలో మహామండలేశ్వరుడైన సింగయ దేవరాజు తన తల్లిదండ్రులకి, తన అన్నగారైన బసవరాజుకి, పుణ్యంకలిగేలా, అలాగే తన కీర్తిప్రతిష్టలు ఆ చంద్రార్కంగానిలవాలనే కోరికతోఅనేక ధర్మ కార్యాల్ని నిర్వర్తించాడు. వాటిలో భాగంగా చాంగల గ్రామంలో కేశవ దేవర దేవాలయానికి గోపురాన్ని, ప్రాకారాల్ని, చాంగలమ్మ గుడిని కట్టించాడు. తరువాతతన తల్లి వల్లమదేవి పేరుమీద తిరుమలదేవుడి గుడికి మండపాన్ని, వీధిని నిర్మించి, తన అన్నగారైన తిరుమలరాజు నిలిపిన గుండ్ల మడుగు, తిమ్మసముద్రం అగ్రహారంలో, వినాయక, శివ, విష్ణుదేవాలయాలు,తటాకాలు, ఆరామాలు, ప్రతిష్టించటమేకాక, బెజవాడలో తమ తాతకి ప్రత్యక్షమైన దుర్గాదేవికి, అంతకుముందే నిర్మించ బడిన ఆలయ గర్భగృహానికి ముందున్న అంతరాళికను బాగుచేయించి,దాని ముందర వైపున నల్లని శీనపురాళ్లని పరిపించి,దాని ముందు తొమ్మిది అంకణాల రంగమండపాన్ని, అక్కడే మూడు అంకణాల భోగమండపాన్ని నిర్మించి, భద్రాన్ని, రాతిగోడని పీఠాన్ని కూడా కట్టించాడు. ఈ సమయంలోనే భూమిలోంచి పైకి తీయబడిన కేశవనాథుణ్ణి పీఠం మీద ప్రతిష్టించాడు.

ఆ తరువాత దుర్గాదేవి ఆలయం వున్న కొండ ఉత్తర దిక్కుచుట్టూ, తూర్పు పడమరలు 9 చేతుల పొడవు, 7 చేతుల వెడల్పు ఆ ఎనిమిది చేతుల పొడవు కొలతలతో కొండని తొలిపించి విశాలమైన ప్రదేశాన్ని ఏర్పాటుచేసి, భక్తులకు ప్రదక్షిణా సౌకర్యాన్ని కలిగించాడు. ఇది ఈ శాసనం నాలుగోప్రక్కనున్న 73 పంక్తుల్లో విషయం.

ఇక మొదటి, రెండవ, మూడవప్రక్కన సంస్కృత శ్లోక, వచనాల్లో చెక్కబడిన శాసన సారాంశం ఇలా వుంటుంది. దుర్గావరప్రసాదులైన విష్ణుకుండిన మాధవవర్మవంశంలో కంతమరాజు మనుమడైన పాపరాజుకి, సింగరాజు జన్మించాడు. అమ్మవారి భక్తుడైన ఈ సింగరాజు బెజవాడ ఇంద్రకీలాద్రి మీదున్న దుర్గాదేవి ఆలయానికి అంతరాళికను, రంగమంటపాన్ని, భోగమంటపాన్ని కట్టించి, రాయచూరులో శ్రీరంగ నాథుడికి ఒక గుడిని బావిని నిర్మించి, ఆ రంగనాథుడి నిత్య అంగరంగ వైభవాల కోసం బొమ్మనహళ్లి అనే గ్రామాన్ని దానంగా ఇచ్చాడు. అదేవిధంగా అహోబిలం ప్రాంతంలో సింగవరం అనే అగ్రహారాన్ని నిర్మించాడు. అలాగే కొండవీటి రాజ్యంలో తమ పూర్వనాయంకరమైన పుల్లనంగంటి సీమలో వున్న కొమ్మువరానికి, సింగ వరమనే పేరుపెట్టి అగ్రహారంగా చేసి, సప్త సంతానాధీశ్వరు డయ్యాడు.

వీటితోపాటు విజయనగరంలోశ్రీ పంపా విరూపాక్ష దేవుడి గుడికి పడమటి భాగంలో, ఒక దుర్గగుడిని, అక్కడున్న రామచంద్రదేవుడికి

రథోత్సవ మండపాన్ని, దానిమీద ఉప్పరిగని కట్టించాడు. ఇంత గొప్ప దానకర్ణుడైన 'సింగరాజు' పెద్ద కొడుకు 'పాపరాజు' కూడా తండ్రిలాగా భైరవ దేవాలయానికి పెద్దగంట, జేగంట, భేరి మొదలైన వస్తువుల్ని సమకూర్చాడు. ఈ ఆలయ అంగరంగభోగాలకి 'కడరామాపురపు స్థలంలో వున్న తోటని' సమర్పించాడు. ఇదీ పూర్తి శాసన సారాంశం.

## 5. చట్టపుడి శాసనం

సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజు17వ రాజ్యపాలనా సంవత్సరంలో చట్టపుడు అనే సామంతరాజు ఈ శాసనాన్ని వేయించాడు. ఒక శిలాఫలకంమీద పది పంక్తుల్లో చెక్కబడిన ఈ శాసనం ఇంద్రకీలాద్రి పర్వతం మీద పార్థీశ్వర స్వామిని ప్రతిష్ఠచేసినవిషయాన్ని గురించి తెలియచేస్తుంది. ఈ శాసనం క్రీ.శ. 909 నాటిది. ఈ శాసనంలో పేర్కొనబడ్డ విష్ణువర్ధనుడు, తూర్పుచాళుక్యరాజైన మొదటి భీముడేనని కొందరు చరిత్రకారులంటారు. ఇంద్రకీలాద్రి మీద వున్న గోవిందమఠం దగ్గర ఈ శాసనం లభించింది. పైన చెప్పబడిన శాసనంలో చట్టపుడనే వ్యక్తి ఇంద్రకీలాద్రి మీద పార్థీశ్వర స్వామిని ప్రతిష్ఠచేశాడని ఉంది.

ప్రస్తుతం ఇంద్రకీలాద్రి మీద దుర్గాలయం మల్లేశ్వరాలయ ప్రాంగణాల్లో ఈ పార్థీశ్వరాలయం వున్న చిహ్నాలేవీ మనకి కనిపించవు.కానీ ఈ ఇంద్రకీలాద్రి పర్వత శిఖరం మీద ప్రస్తుతం ఒక శిథిలమైన దేవాలయం చిహ్నాలు మనకి కనిపిస్తున్నాయి. బహుశా ఇదే పార్థీశ్వరా లయం అయివుండవచ్చు. ఎందుకంటే, ఈ శిథిలాలకి దక్షిణంవైపుగా అతితక్కువ దూరంలోనే త్రికోటిబోయడు వేయించిన కిరాతార్జున శిలాస్తంభశాసనం ప్రతిష్ఠించబడింది. మరొక ఆధారం ఏమిటంటే, సరిగ్గా ఈ శిథిలాలయం (పార్థీశ్వరాలయం) క్రిందిభాగంలో వున్న గోవిందమఠం (కోనేరు ప్రాంతం) ప్రాంతంలోనే చట్టపుడు ప్రకటించిన ఈ శాసనం లభించింది.

## 6. దేవాలయ శాసనకర్తలు

మధ్యాంధ్రయుగంలో బెజవాడకు సంబంధించిన చరిత్ర క్రీ.శ. 898లో తూర్పుచాళుక్యరాజు యుద్ధమల్లుడు వేయించిన శాసనంతో ప్రారంభం అవుతుంది. అంతకుముందు కొన్ని శాసనాలున్నప్పటికీ యుద్ధమల్లుడి శాసనంతోనే చారిత్రకంగా బెజవాడకి ప్రాముఖ్యత లభించింది. ఈ బెజవాడలో ఇంద్రకీలాద్రి మీద కొలువున్న శ్రీ దుర్గామల్లేశ్వరస్వామివార్ల దేవాలయాలకు వివిధ రాజ, సామంత, మాండలీక వంశాలవాళ్ళు, సామాన్యప్రజలు మంత్రులు, అనేక దానాలు చేస్తూ శాసనాలు వేయించారు.

ఈ శాసనాలన్నీ సౌతిండియన్ ఇన్‌స్క్రిప్షన్స్ వాల్యూం X, వాల్యూం IV లో, ఎపిగ్రఫియా ఇండికా అనే పుస్తకంలో ప్రకటించబడ్డాయి. దుర్గామల్లేశ్వర దేవాలయాల అభివృద్ధికోసం, ఎన్నో దానాలు చేసి, శాసనాలు ప్రకటించిన ఆ ధర్మాత్ముల పేర్లు ఇవి :

1. యుద్ధమల్లుడు, 2. చట్టపుడు, 3. పల్లకేతుభూపాలుడు, 4. త్రికోటిబోయడు,5.వేంగి మహాదేవరాజు,6. వేంగి మల్లభూపతి గొంక భూపతి, 7. బొద్దన భీమన 8. నాగదేవుడు 9. వాసెన 10. నాగదేవుడు 11.పెనుగొండ నాభిలగోత్రోద్భవులు సోమిశెట్టి, కొమ్మిశెట్టి, అతమశెట్టి, కామిశెట్టి, నామిశెట్టి 12 ముప్పమ(మ్మ) 13. సూరమ సూరపనాయకుడు 14. సోమన ప్రెగ్గడ 15. కట్టారి దాసిరెడ్డి – కొమ్మరెడ్డి 15. నారాయణదేవుడు 16. పెదవేగి బయ్యపదేవ మహారాజు 17. కంటమ(మ్మ) 18. సోమన ప్రెగ్గడ 19. గుడుమూరి ఈశ్వరభట్ట సోమయాజులు 20. మల్లిదేసటి 21. కొన్నాతాడి గంధ సిరి బొల్లిరెడ్డి 22. సుబ్బిరెడ్డి 23. త్యాగి పోతరాజు 24. కొమ్మన బోయుడు 25. మారిరెడ్డి 26. దాడికొమ్మిరెడ్డి 27. వాసుదేవప్పకొడ్కు 28. నెగడాల అన్నిశెట్టి 29. ఈద్బుగంటి సేవకేతినాయుడు 30. కొనకంద్రాడి భీమరాజు 31. దుర్జయ నరేంద్రుడు 32. రాయన ప్రెగ్గడ 33.లామనార్యబోయుడు 34.మారెబోయుడు 35. పారెబోయుడు –నూకిబోయుడు 36. వీరచోడ వల్లభుడు 37. మారిశెట్టి 38. త్రినయన పల్లవసిద్ధయదేవచోడ మహారాజు 39. పోతె బోయుడు 40. వింజరాజు 41. శివయోగి మాదయదేవర 42. గొడ్లప్రోలె బోయుడు 43. బయ్యనిబోయ్యన బోయుడు 44. ఎఱ్ఱిబోయుడు – మారె బోయుడు – పాలుపత్తి ఎఱ్ఱిబోయుడు 45. కొనకంద్రవాడి పోతరాజు 46. లాయన బోయుడు 47. విద్పఱ్ఱ అమరినాయకుడు 48. పోత అనే విప్రుడు 49. లావెన బ్రహ్మనబోయుడు 50. ఎనుమందల నద్పిరెడ్డి 51. గొంటూరి పరువల మల్లిశెట్టి 52. పోతనామాత్యుడు 53. కూచెన ప్రెగ్గడ 54. తమ్మునారి 55. వరిమేడి పోతరాజు 56. మనుమరాజు 57. కేతరాజు 58. అన్నపరెడ్డి 59. సూరెబోయుడు 60. నాదిండ్ల కేతినాయకుడు 61. సూరపరాజు 62. మారిరెడ్డి 63. మీసబ్రహ్మనబోయుడు 64. ప్రోలినాయుడు–ముప్పసాని, దొడ్డదేవర, నగనబోయుడు 65. వలంగలేటి అన్నపనేని 66. నిమ్మనాయకుడు 67. మఱ్ఱెడ్డి – ప్రోలిరెడ్డి 68. ఊడపరెడ్డి, మల్లిరెడ్డి 69. అల్లుదేవరాజు 70. మాంకిరెడ్డి 71. చీడెబోయుని కేతన 72. ఉంగరాల సవ్వరాజు 73.మెల్లగుంట కూనిశెట్టి 74. కాకతీయ ప్రతాపరుద్రుడు 75. కపిలేశ్వర గజపతి 76. అఖిలదేశాల తెలికివేగురు 77. దాసయ చొక్కయి పాత్రుడు 78. శ్రీరామాయ 79. నానాగోత్రీకులు – మాచల్దేవి 80. శ్రీ గిరి భక్తుడు 81. సింగయ దేవరాజు 82. అక్షతల తిరుమలభట్టు 83. నానా దేశాల తెలికివేగురు.

### శాసనాలు లభించిన ప్రదేశాలు

దుర్గామల్లేశ్వరుల దేవాలయాలకి సంబంధించినశాసనాలుపూర్వం మల్లేశ్వరాలయం ముందరవున్న స్తంభాలమీద, ఆ ఆలయ ప్రాంగణంలో వున్న వినాయకదేవర గుడిముందు స్తంభాలమీద, కనకదుర్గాలయ ప్రాంగణంలో వున్న శిలాస్తంభాల మీద, చీకటి కోనేరు ప్రాంతంలో కొండగోడలమీద, దుర్గాకుండం సమీపంలో వున్న గోవింద మఠం

ప్రాంతంలో, ఇంద్రకీలాద్రి శిఖరం మీద ప్రతిష్టించ బడిన కిరాతార్జున శిలాస్తంభం మీద, జమ్మిదొడ్డి ప్రాంగణంలో వుండే మల్లేశ్వరాలయ మండప స్తంభాల మీద దాదాపు 90 శాసనాలు లభించాయి.

వీటిలో కొన్ని లుప్తమైపోగా, కొన్ని మాత్రం కొండ కిందవున్న భ్రమరాంబా మల్లేశ్వరాలయ (పాత శివాలయం) ప్రాంగణంలో భద్రపరచబడ్డాయి. ఈ ప్రాంగణంలో వున్న శాసనాల్లో అత్యంత ప్రముఖమైనది యుద్ధమల్లుడి బెజవాడ శాసనం.

**తూర్పు చాళుక్య రాజు యుద్ధమల్లుడి బెజవాడ శాసనం కాలం క్రీ.శ. 930**



**1. సింగయ దేవరాజుల శ్రీ కనకదుర్గాలయ శాసనం క్రీ.శ. 1516**



**2. త్రికోటిబోయడి కిరాతార్జున శిల్పస్తంభశాసనం**



మొదటివైపు



రెండవవైపు



మూడవవైపు



నాల్గవవైపు

శాసనం లభించిన ప్రాంతం : ఇంద్రకీలాద్రి శిఖరంపైన

**శాసనాల్లో బెజవాడ-పేర్లు**

చారిత్రకంగా మధ్యాంధ్రయుగంలో ప్రముఖ శైవమత క్షేత్రాల్లో ఒకటిగా ప్రసిద్ధిగాంచిన బెజవాడ వివిధ పాలకులు, మాండలీకులు సామాన్య ప్రజలు వేయించిన శాసనాల్లో వివిధరకాలుగా పేర్కొనబడినది.

**బెజవాడ :** ఈ పేరు మొదటిసారి పండరంగడు వేయించిన అద్దంకి శాసనంలో కనిపిస్తుంది. "కందుకూరున్బెజవాడ గావించె మెచ్చి" అని. E.I.Vol XIX P.47 ఆ తరువాత యుద్ధ మల్లుడు వేయించిన శాసనంలో కూడా "బెజవాడ" అని వ్యవహరించటం జరిగింది. "పరగంగ బెజవాడ గొమరస్వామికి భక్తుండై" E.I.Vol XV P.9 అని కనిపిస్తుంది.

**పెచ్చవాడ :** మల్లేశ్వర స్వామి దేవాలయానికి సంబంధించిన శాసనాల్లో త్రికోటిబోయడు వేయించిన శాసనంలో 'పెచ్చవాడ' అనే పేరు వ్యవహరించబడింది. 'పెచ్చవాడ కలియమ బోయిపుత్రః" S.I.I.,X No 33

**విజయవాటీపురం :** బెజవాడ శాసనాల్లో ఒకటైన కలివిష్ణువర్ధనుడి చెఱువు మాధవవరం శాసనంలో 'విజయవాటీపురం' అని చెప్పబడింది. 'J.O.R.S. Vol XXIII Part I

**విజయవాటీ విషయం :** త్యాగిపోతరాజు బెజవాడలో ప్రకటించిన శాసనంలో 'విజయవాటీ విషయం' అని పేర్కొనబడింది. "విజయ వాటీ విషయేచ బహూన్ పుణ్యానగ్రహారాన్ దత్వా" S.I.I.X. No 795

**బెజవాడ కంద్రవాడ :** క్రీ.శ. 12వ శతాబ్దానికి చెందిన ఒక శాసనంలో "బెజవాడ కంద్రవాడ" అని వ్యవహరించబడింది S.I.I.VI No 602

**అర్జునస్య పుర్యాం :** త్యాగివంశీయుడైన పోతరాజు ప్రకటించిన మరో శాసనంలో "అర్జునస్యపుర్యాం" అని వ్యవహరించబడింది. **"అర్జునస్యపుయ్యాన్ మల్లేశ్వరాయఖిల గురవే"** S.I.I X No : 748

**విజయవాడ :** ముప్పల మహాదేవి కరణం కేతరాజు వేయించిన శాసనంలో 'విజయవాడ' అని కన్పిస్తుంది. "(విజ)యవాడ మల్లీశ్వర శ్రీమహాదేవర అఖండ దీపమునకు" S.I.I. IV No : 788

**విజయవాటికాపురం :** దుర్జయనరేంద్రుడి ప్రశస్తిని గురించి తెలియచేసే ఒక శాసనంలో బెజవాడ విజయవాటికాపురం అని పేర్కొనబడింది. ఆ శాసనంలో దుర్జయుడు సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర పరమమాహేశ్వర "విజయవాటికాపురేశ్వర" త్రిసప్తతి గ్రామాధీశ్వర..." అని ప్రశంసించబడ్డాడు. S.I.I. IV 781

ఇలా బెజవాడ చారిత్రకంగా ఇన్ని విధాలుగా వ్యవహరించబడి, చివరికి విజయవాడగా ప్రసిద్ధిపొందింది.

చిరునామా : డాక్టర్ జయంతి చక్రవర్తి, ఎఫ్-1, ఏకశిల అపార్ట్‌మెంట్, భగత్‌సింగ్ రోడ్,
సత్యనారాయణపురం, విజయవాడ-520 011, ఫోన్ : +91 9390 52 62 72

శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్య

# బౌద్ధయుగమున గుంటూరు మండలము

ఆర్యులలో రెండు తెగలున్నట్లు కాననగును.

తూర్పుదేశపు ఆర్యులు అధికభావ ప్రియులు, ఆధ్యాత్మికవాదులు, సంప్రదాయాన్ని పాటించనివారు.

పశ్చిమార్యులు లేక, మధ్య ప్రదేశార్యులు, సంప్రదాయ బుద్ధులు, మార్పుకోరనివారు, శాస్త్ర ప్రియులు.

పూర్వార్యులలో ఉపనిషత్తులలో విజ్ఞానచర్చ - బౌద్ధజైన ఆచార్యులు, సంప్రదాయముపై తిరుగుబాటు, సహజమతము, యోగమార్గ ప్రచారము, ఆధ్యాత్మికసంబంధమైన రసోచిత గీత కావ్యాలు అభివృద్ధి చెందినవి ఇవన్నీ, అయోధ్య మొదలు ఆసాం వరకు.

మధ్య దేశీయ ఆర్యులలో పౌరాణిక భావములు, ధర్మశాస్త్రములు, వ్రతములు, కర్మకాండ ప్రచారములు, స్వర్గనరకములందు విశ్వాసము లధికము.

భారతీయ సాహిత్యము రెండు జాతుల సాహిత్యము.

ఉపనిషత్తులు, బౌద్ధ జైన గ్రంథాలు, దర్శనాలు మొదలగునవి నవ్యభావోదయం కలిగించేవి.

రెండవది సంప్రదాయాన్ని పోషించేవి. అనగా కర్మకాండకు ఆధి కృతగల బ్రాహ్మణగ్రంథాలు, శ్రౌత, గుహ్య సూత్రాలు, స్మృతులు-యితిహాసాలు.

మొట్టమొదటివి, అయోధ్య, కాశీ, మగధాది దేశాల్లో.

రెండవవి కన్యాకుబ్జాది మధ్య దేశాలలో, వైదికకర్మకాండకు మృదు విరోధులు జనకుడు - యాజ్ఞవల్క్యుడు.

ఉగ్రవిరోధులు బుద్ధుడు, మహావీరుడు మొదలగువారు పూర్వ ప్రదేశములోనే ఉద్భవించారు.

క్షత్రియులధికంగా స్వతంత్రాలోచనాపరులు, మార్పు కోరేవారు.

బ్రాహ్మణులెక్కువగా సాంప్రదాయబద్ధులు, కర్మిష్టులు.

ఆంధ్రదేశము సాక్షాత్తు బుద్ధభగవానుని పాదరేణువులచే, పునీతం గాకపోయినా, బౌద్ధమత స్వీకరణంలో అందరికంటే ముందంజ వేసింది. బుద్ధం, శరణం గచ్ఛామి అన్నది.

ఉత్తరదేశాన ఉద్భవించిన బౌద్ధానికి నవ్యతనిచ్చి, నానాదేశాల్లో, అశోకుని అనంతరం వ్యాప్తి గావించినది ఆంధ్రులే.

'ఆంధ్రుల బౌద్ధ స్వీకరణము అశోకుని పూర్వకాలంనాటిదని నిస్సందేహంగా చెప్పవచ్చును' అని ప్రొఫెసర్ కె. ఆర్. సుబ్రహ్మణ్యం గారు ఆంధ్రలో బౌద్ధశిథిలాలు అన్న ప్రత్యేక వ్యాసంలో పేర్కొన్నారు.

ఆంధ్రులు నిత్యనూతనం కోరేవారు. అతివుద్రేకులు, స్వాతంత్ర్య ప్రియులు.

అందుచేతనే యేనూతన అభ్యుదయ భావమైనా, నవ్యాదర్శమైనా, వారిని అతి స్వాభావికంగా ఆకర్షిస్తుంది.

అటువంటి వారవుట చేతనే, విశ్వమానవసౌభ్రాతృత్వాన్ని, జీవ కారుణ్యాన్ని, విశ్వప్రేమనూ, మూఢాచార నిరసనాన్ని, మానవ పరమోత్కృష్ట స్వభావాన్ని ప్రేరేపించే, ప్రచార ప్రబోధాలుగా బౌద్ధధర్మాన్ని చూడగానే వారిని ఆకర్షించింది.

కృష్ణాతీరస్థమైన ఆంధ్రభూమిలో అధికంగా కన్పించే బౌద్ధస్తూపాలే యిందుకు నిదర్శనము.

మన తెలుగువారిలో గూడా రెండు తెగలు లేకపోలేదు.

సహజంగా సాగరాంధ్రులు, సంస్కారప్రియులు. ఉత్తరాదినుండి వచ్చినదేకాదు, ప్రపంచంలో యెక్కడ నవ్యభావం కల్గినా సాదరంతో స్వీకరిస్తారు.

పార్వతాంధ్రులు అధికంగా సంప్రదాయ పోషకులు.

కరుణ, జ్ఞానము, యివి రెండే బుద్ధుని ప్రధాన లక్ష్యాలు. కనుక బుద్ధవచనమేదైనా యీ రెంటిపైనా ఆధారపడినదే.

ప్రపంచముపై కరుణపూని వారి సంక్షేమంకోసం, వారి మేలు కోసం, నల్దిక్కులా పర్యటించడం, ధర్మం బోధించడం, ప్రధాన ధర్మం.

బౌద్ధమునకు కళశరీరము, వాఙ్మయము ప్రాణము, తత్వము హృదయము.

బౌద్ధమతం బుద్ధిని బోధకంటే, ఆయన త్యాగంకంటె, ఆయన శిల్పాలే, ఆ మతాభివృద్ధికి అధికంగా ఆధారమైనవి. నిరక్షరాస్యులైన ప్రజలకు అవి మాట్లాడే బొమ్మలు.

వివిధ దేశాల కరిగినప్పుడు వారి భాష తెలియనప్పుడు శిల్పం ద్వారా అందరిని ఆకర్షించి, ఆ మతంలో కలుపుకున్నారు బౌద్ధులు.

తమ హృదయములో నాటిన భక్తిని చిత్రం రూపం ద్వారా ప్రద ర్శించి, కళద్వారా ప్రచారమొనర్చిన వారిలో బౌద్ధులు ప్రథములు - ప్రముఖులు.

అటువంటి బౌద్ధశిల్పం బౌద్ధ చిత్రకథలు ముఖ్యంగా శిల్పం మహోన్నతస్థాయి అందుకున్న దేశం - మన ఆంధ్రదేశం.

శిల్పం "అమరావతీశైలి" అను ఆంధ్రశైలి విశ్వవిఖ్యాతమైనది.

దీనినే వర్గూసన్ పండితుడు సాధికారంగా "అమరావతీ శిల్పాలు - భారతీయ శిల్పపరమావధిని సూచిస్తాయి" అని అభిప్రాయ మిచ్చారు.

ఆంధ్రదేశమంతటా విలసిల్లిన స్తూపాలు ముప్పది మూడు.

ఉత్తరాన శాలిహుండంనుంచి, దక్షిణాన చినగంజాం వరకు ; తూర్పున ఘంటసాలనుండి పడమట గుత్తి వరకు గలవు.

ఈ స్థూపాలు విశేషంగా ప్రకృతి రమణీయకమైన నదీ తీరముల గాని పర్వత ప్రాంతములగాని కట్టబడినవి. రాకపోకలకు అనుకూ లంగా వుండుటకు నదీ తీరాలనే విశేషంగా కట్టబడినవి.

ఆంధ్రదేశములో అధికంగా కృష్ణానది ఉభయ తీరములలోనూ అందునా విశేషంగా గుంటూరు మండలంలోను వున్నవి. 1. అమ రావతి, 2. నాగార్జునకొండ, 3. భట్టిప్రోలు, 4. గోలి, 5. చేజెర్ల, 6. బుద్ధాం, 7. చేబ్రోలు, 8.కనుపర్తి, 9. మంచికల్లు, 10.రెంటాల, 11. చినగంజాం, 12. పెద గంజాం, 13. వేల్పూరు, 14. సమాధాన పురము మొదలగు ప్రాంతములలో కలవు.

## అమరావతి నాగార్జున కొండ

బౌద్ధ యుగము ఆంధ్రదేశమునకు స్వర్ణయుగము. ఆనాడు ఆంధ్రులు పాటలీపుత్రము వరకు పరిపాలించిరి. సమస్త కళలనూ పోషించిరి. దశదిశలను ఖ్యాతినింపిరి. వస్త్రనిర్మాణములో వర్తక వాణి జ్యములలో నౌకా వ్యాపారములలో బుద్ధబోధా ప్రచారములలో వారికి సాటివారు లేరు.

ఆంధ్రదేశంలోని బౌద్ధస్తూపాలలో అమరావతీ, నాగార్జునకొండ ప్రపంచ ప్రఖ్యాతి గాంచినవి. అవి రెండూ కృష్ణాతీరాన నుండి, గుంటూరు మండలమునకు చెందుట మరొక మహద్విశేషము.

సుప్రసిద్ధ ఫ్రెంచి చరిత్రకారుడగు జోవేడ్ డూబ్రియర్ యిట్లా అంటున్నాడు. "ఈ ఆంధ్రులన్నవారు ఒక మహత్తరమైన జాతివారుగా గోచరిస్తున్నారు. అమరావతీ శిల్ప సాంప్రదాయము, వీరుపెట్టిన భిక్షే. నాగార్జునాచార్యుని తాత్విక సిద్ధాంతము వారిచ్చిన వరమే.

"నిజానికి, అమరావతీ నాగార్జునకొండల కాలము ఒక సాంస్కృ తిక యుగము. భారతీయకళలో ఒక స్వర్ణయుగము. దాని ప్రభ, యే ఒక్క కుడ్య శిల్పశకలము, మిగిలివున్నా, అది కుల,మత, వర్ణ, విచక్షణల, దురాగతాలు, క్రౌర్యాలు, లేక భేద సంఘర్షణకతీతమైన ఒక పరమాదర్శయుతమైన సంఘనిర్మాణానికి మనను ప్రేరేపిస్తూ, ప్రబోధకరంగా మిగిలివుంటుంది" అంటారు నార్లవారు.

## అమరావతి స్తూపము

సత్తెనపల్లి తాలూకాలో కృష్ణాతీరముననున్న అమరావతి గ్రామం నాడు నేడూ జగత్ప్రసిద్ధమైనది. ఈ ప్రసిద్ధకంతకు అక్కడ బయల్పడిన మహాచైత్యము దాని వైభవము కాననగును.

క్రీస్తుకు పూర్వము మూడవ శతాబ్దిలో ఈ స్థూపము నిర్మింప బడినదని ఊహింపబడుచున్నది. ఆంధ్రదేశానికింత పేరు ప్రతిష్ఠలు తెచ్చినది ఈ స్థూపపు శిల్పకళే.

ఈ మహాచైత్యముకు అనుబంధముగ ఒక విద్యాపీఠమును, ఒక శిల్ప విద్యాకేంద్రమును ఉండెడివి.

ఇక్కడ శిల్పులు కళా సమాధిని మునిగి నిరుపమానమైన నిర్మాణ కౌశలము నార్జించి విస్మయ జనకమునగు శిల్ప సాధనను సాధించిరి. విలక్షణమైన ఈ శిల్ప సంప్రదాయముఆంధ్రదేశమునంతటా వ్యాపించి వందలకొలది సుందర శిల్పములను సృష్టించినది.

ఈ సుక్షేత్రమున శిక్షణనొంది, సిద్ధహస్తులైన శిల్పాచార్యులు వారి శిష్యగణముతో సముద్రములను దాటి ప్రాచ్యదేశములకు కూడ పోయి ఈ శిల్ప సంప్రదాయమునకు నూతనశోభను తెచ్చిరి.

ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన అజంతా చిత్రములందు సహితము అమరావతీ కళా సంప్రదాయ ఛాయలు చెన్నారినవి.

అమరావతి శిలా చిత్రములోని చాకచక్యము, నైపుణ్యము, దివ్య మైన సౌందర్యము వర్ణించుటకు ఆదిశేషుడే రావలెను. ఇది భారతీయ శిల్ప ప్రపంచమున సుకుమారమైన సుకదర పుష్పము" అని ఆనంద కుమారస్వామి అంటున్నారు.

అమరావతీ పాలరాళ్ళపైని రమణీయమైన చెక్కడాలలో, జంతు జీవన సౌందర్యము అత్యద్భుత సౌందర్యాన్ని ఒలికించే పరిసరపు

నగిషీ పనితో మిళితమై సుందరాతిసుందరంగా కన్పడుతుంది. అమరావతి శిల్పాలలో మానవరూపము, చిత్ర విచిత్ర భంగిమలలో సజీవ చైతన్యాన్ని ప్రతిబింబిస్తూ, అత్యంత నైపుణ్యముతోనూ, అతి స్వతంత్ర ప్రజ్ఞలతోనూ చెక్కబడింది" అని హేవర్ అన్నాడు.

"అమరావతిలోని చిత్రకళ వైదగ్ధ్యం విస్తృతసంపదలకు, ప్రపంచంలో ఎక్కడైనా ఏమాత్రమైనా పోలిక అంటూ ఉంటే, మళ్లీ అజంతా, బాగ్ చిత్రాలలో మాత్రమే కన్పడుతుంది" అని డాక్టర్ బర్గెస్ అన్నాడు.

"భక్తులైన ఆంధ్రదేశకళోపాసకులు బుద్ధభగవానునికి కానుకగా సమర్పించిన ఇట్టి పూజాకుసుమములలో అమరావతి స్థూపము శ్రేష్ఠమైనది......చలువరాతిపైన చిత్రితమైన ఈ అమరావతి శిల్ప సంపదను సూక్ష్మముగా బరిశీలించినచో చతురులైన బౌద్ధయుగమునాటి ఆంధ్ర శిల్పకళా విశారములచేతిలో నా చలువరాయి తన కాఠిన్యమునంతను వీడి ఎట్లు తీర్చిననట్లు చక్కని మైనపుముద్దగ మాతినదని తోచక మానదు" మల్లంపల్లి సోమశేఖరశర్మ ఈ స్తూప ప్రభావాన్ని గురించి రెజినాల్డు లీమే 'ఆగ్నేయ ఆసియాసంస్కృతి' అన్న గ్రంథంలో ఇలా పేర్కొంటున్నారు.

"అమరావతి శిల్పప్రభావం, సింహళం, మధ్య దక్షిణసయాంలో విస్తరించి దక్షిణాన సుమిత్రా వరకు వ్యాపించింది"

18వ శతాబ్దములో కర్నల్ మెకంజీ అమరావతి స్తూపాన్ని దర్శించేటప్పటికి పెక్కు పాలరాతి చెక్కడాలు జీర్ణమైపోయి వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు 1790లో చింతపల్లినుండి తమ స్థావరాన్ని అమరావతికి మార్చుకొని తాను నూతనంగా కట్టిన భవంతులకు సున్నానికిగాను ఈ పాలరాళ్ళు కొన్నిటిని సున్నపు బట్టీలకు ఎక్కించారు.

ఈ ధ్వంసకాండనుండి తప్పించుకొనిన పాలరాతి చెక్కడాలు ఆర్ష శాఖవారికి అందినవి. మ్యూజియములోనికి కూడా తరలించబడినవి.

ఇప్పుడు అసలుచోట కొద్ది రాళ్ళు మాత్రమే ఉన్నవి.

120 దాకా పాలరాతి చెక్కడాలు లండన్ మ్యూజియములో ఉన్నట్లుంది. విశేషించి మద్రాసు మ్యూజియములో చిన్నా పెద్దా కలిసి 300పై చిలుకు అమరావతి చిత్రాలు ఉన్నవి.

ఆంధ్రశిల్పుల అమూల్య రత్నం సంపదలు ఆంధ్రులే చిన్నాభిన్నం చేయగా దేశాంతరాలకు ఇలా పోవలసినగతి పట్టినది. అవైనా అక్కడ భద్రంగా ఉండటం కీడులో మేలు కదా !

ఇచటనే అమరేశ్వరాలయం కలదు. పంచారామములలో ఇదొకటి. ఇది బహుపురాతనమై విలక్షణముగనున్నది. ఈ ఆలయము మహాచైత్యమునకు సమీపమునే ఉన్నది.

ఈ అమరావతిలో ఒక్క మహాచైత్యమే కాక ఎన్నో చైత్యములుండి ఉండవచ్చును. వీనిలో ఒక చైత్యము అమరేశ్వరాలయముగ మార్చబడినట్లు ఊహించుట కవకాశముంది. ఈ విధముననే చేబ్రోలులోని భీమేశ్వరాలయము, చేజర్లలోని కపోతేశ్వరాలయము కాననగును.

ఇవి మొట్టమొదట బౌద్ధుల చైత్యగుహలు. కట్టడములట్లే ఉంచి దాని మధ్యనున్న చైత్యము తీసివేసి శివలింగమును ప్రతిష్ఠించుట జరిగి యుండును.

అమరావతికి అరమైలు దూరమున ధరణికోట ఉన్నది. దీనికి ధాన్యవాటి, ధాన్యకటకము, దన్నాలకోట అని పేర్లుండెడిది. ధరణికోట నేటి నామము.

చైనా యాత్రికుడు హుయన్‌త్సాంగ్ ధనకటకము మహాంధ్రమునకు రాజధాని. చాలాపెద్ద వైశాల్యము గలిగియుండెడిదని వ్రాసి ఉండెను.

ఈ ప్రాచీన గ్రామములో భూమిని త్రవ్వినప్పుడు అక్కడక్కడా చలువరాతి పలకలు, స్థంభములు కనబడినవి.

వర్షము కురిసినప్పుడు నేటికిని ఎన్నో శాతవాహన నాణెములు దొరకుచున్నవి. ప్రాచీన ధాన్యకటకనగరము ఆరేడు చదరపుమైళ్ళ వైశాల్యము కలిగియుండెడిదని చెప్పవచ్చును.

ధనకటకమను పేరు అమరావతి మహాచైత్యమున మౌర్యలిపిలో రెండు శిలాశాసనములలో కన్పించుచున్నవి. దీనినిబట్టి క్రీస్తుకు పూర్వము 200 సం॥ర నాటికే ఈ నగరము ఉండినదని చెప్పవచ్చును.

## నాగార్జున కొండ

ఇది పల్నాడు తాలూకాలో మాచర్లకు 15 మైళ్ళ దూరంలో నున్నది. బౌద్ధ వాఙ్మయమున సిరిపర్వము (శ్రీపర్వతము) చాలా ప్రాముఖ్యమైనది. ఈ శ్రీపర్వతమును శ్రీశైలముగా మొదట్లో నిర్ణయించిరి. నాగార్జునకొండలో దొరికిన శాసనములను బట్టి ఈ పర్వతమే శ్రీపర్వతమని తేలినది. నాగార్జునుడు ఇక్కడ ఉండుటచే ఆ కాలమున గౌరవార్థముగ ఇది శ్రీపర్వతముగ పిలువబడి వుండవచ్చును. తర్వాత నాగార్జునకొండయని పేరు వచ్చి ఉండవచ్చును.

## నాగార్జునాచార్యుడు

విశ్వ సంస్కృతి ఒక మహా ప్రవాహం. వివిధ భూములనుండి వివిధోపనదులే దానిని బలీయమొనర్చినవి ఒనర్చుచున్నవి.

ఒక్కొక్క కాలమున ఒక్కొక్క దేశము ప్రాముఖ్యము వహించి స్వీయ విజ్ఞాన స్రవంతిని ఈ మహా ప్రవాహముగ సంగమింప చేసినవి.

వేద కాలమున సప్తసింధు ప్రాంతము, బౌద్ధ దేవుని కాలమున కోసల కాశీ మగధ ప్రాంతములు, గ్రీకు తత్వవేత్తల కాలమున యవన భూమి, టోలెమీ కాలమున అలగ్జాండ్రియా, ఇట్టి పుణ్యమును పొంది విశ్వసంస్కృతీ చరిత్ర యందు గణనీయ స్థానమాక్రమించినవి.

అట్టి మహద్భాగ్యమే కృష్ణాతీర్థ ఆంధ్రభూమికి క్రైస్తవ శకారంభ కాలమున కలిగినది.

ఆనాడు ఇచట బైలుదేరిన మహాయాన మాధ్యమిక వాదము తత్వశాస్త్రమున ఒక నూతన యుగోదయము. ఆ వాదప్రవక్త శ్రీ నాగార్జునాచార్యుడు.

నాగార్జునుడు బౌద్ధమత పీఠాధిపతులలో పదునాలుగవవాడు.

నాగార్జునకొండ ఆనాడది పుణ్యభూమి. ఒక మహావిహారము. ఒక సుప్రసిద్ధ విద్యాపీఠము. ప్రపంచ ప్రఖ్యాత విజ్ఞానకేంద్రముగ విలసిల్లినది.

నేలనాలుగు చరగులనుండి ఆ ఆచార్యుని చరణసన్నిధిని తత్త్వ రహస్యమును గ్రహించుటకు జిజ్ఞాసువులు ఇచటికి వచ్చెడివారు. వివిధ దేశముల ప్రభువులు తమ తమ విద్యార్థుల నిమిత్తము విహారములను గట్టించిరి. అట్టివానిలో సింహళ దేశీయుల విహారమొకటి నేడు కనుగొనబడినది.

ఈ శ్రీపర్వత నీడలో ఇక్ష్వాకుల రాజధాని ఉండెడిది. శాతవాహనుల సామంతులుగ వారు ఈ ప్రాంతమును పరిపాలించిరి.

నాగార్జునాచార్యుని కాలములోను ఆయన అనంతరం కొన్ని శతాబ్దాలవరకు కూడా ఈ విజయపురి విశ్వవిద్యాలయముగ నిలిచి నది. 'కాశ్మీర' 'గాంధార' 'చీన' శిలాటతోసలి, అపరంత, వారణాసి, యవనపురి సాలూరదమిళ, తంబపణ్ణి' మొదలగు దేశాలనుండి విద్యార్థులు వచ్చేవారని తెలియుచున్నది. నాగార్జునుడు కేవలం తత్వవేత్తకాదు తార్కికుడు, కవి, వైద్య శాస్త్రజ్ఞుడు, రసవాది.

## నాగార్జున కొండ

నాగార్జున కొండలో మహా చైత్యమేగాక చైత్యములు, విహారములు, ఆంధ్రదేశములో ఎచ్చట గాంచనన్ని ఇచ్చట గాంచగలం.

ఇక్కడ పరిపాలన చేసిన రాజులు అధికంగా హిందువులే అయినా, వారి రాణులు ఎక్కువగా బౌద్ధాన్ని అభిమానించేవారని ఇచట దొరికిన శిలాశాసనాలు పరికించిన విదితం కాగలదు, వీరు ఇచట పెక్కు స్థూపాలను నిర్మించుటేగాక దానధర్మాలు కూడా చేసినట్లు తెలుస్తుంది.

బోధిశ్రీ అనే బౌద్ధ గృహస్తురాలు బహు పుణ్యవతి, మహదైశ్వర్య సంపన్నురాలై రాణివాసము వారికన్న మిన్నయై తనభర్త, అత్త మామలు, తన అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు, మొదలగు సమస్త బంధు కోటి పేరు పేరు వరుసన పుణ్యఫల ప్రాప్తికొరకు అనేక ధర్మకార్యములను ఒనర్చెను.

నాగార్జునకొండ వద్దనే కాక బౌద్ధ ప్రాంతమందలి పెక్కుచోట్ల ఆమె ధర్మాలు చేసినదని తెలుస్తుంది.

బౌద్ధధర్మం పట్ల స్త్రీలకు ఇంతటి భక్తిప్రపత్తులు ఉండెడివని, హృదయపూర్వకముగ తమ సర్వస్వమును అర్పించి ఈ విజయపురి వద్ద అసంఖ్యాకమైన చైత్యాలు, స్థూపాలు, విహారాలు నిర్మించడానికి వెచ్చించారని తెలిసికొనుట అవసరం.

ఈ నాగార్జునకొండ వద్ద 1928, సంవత్సరంలో కొన్ని బౌద్ధ విగ్రహాలు బయలుపడినవి. ఇప్పుడు ఇక్కడ పుల్లారెడ్డిగూడెం అనే గ్రామమున్నది. ఇది పుష్పగిరివారి అగ్రహారం. ఇచటి మట్టిదిబ్బలలో రెండు మూడు శిలా శాసనములు పాళీ భాషలలో వ్రాయబడినవి – బయటకు తలచూపుచుండెను. ఫ్రెంచివారు బహుశా, దూబ్రేలు కావచ్చు, ఈ మట్టిదిబ్బను త్రవ్వించి శిల్పాలను తీసుకొనిపోవుచుండగా పట్టుబడెను. అంతట ఆ విగ్రహములు మద్రాసుకు చేర్చబడెను. ఆర్కిలాజికల్ డిపార్టుమెంటువారు వచ్చిచూసి ఈ స్థలమును పుష్పగిరి పీఠము వారినుండి కొనిరి. ఈ ప్రాంతమును త్రవ్వించగా స్థూపములు, చైత్యములు, విహారములు మొదలగునవి పెక్కు కనుగొనబడెను.

నేడు నాగార్జునసాగర ప్రాజెక్టు నిర్మాణము వలన ఈ ప్రాంత మంతా జలపాతమగునని గ్రహించి ప్రభుత్వంవారు, ఈ ప్రాంతము అంతా త్రవ్వించుచున్నారు. ఈ పని పురాతత్వ పరిశోధన బుద్ధితోగాక నాగార్జునసాగర నిర్మాణార్థమై జరుగుతున్నదని చెప్పవలసి వస్తుంది.

అమరావతి పాల శిల్పాలలాగ, నాగార్జునకొండ శిల్పాలు తరలింపబడి పోలేదు.

ఏ కారణముచేతనయినా ఈ ప్రదేశమంతా త్రవ్వబడి ఆంధ్రుల బౌద్ధశిల్ప ప్రతిభను జగమంతా చాటుటకు అవకాశం చిక్కినందుకు ఆనందింపవలసి ఉన్నది.

ఆంధ్రదేశములోని శిల్పసంపద కొంత పరప్రాంతానికి పోయినది. కాని నాగార్జున శిల్పసంపద ఇచ్చోటనే భద్రపరచబడుటకు ప్రయత్నాలు జరుగుచుండుట మహదానందకరం.

అమరావతి, నాగార్జున కొండలు విశ్వవిఖ్యాతమైనవి.

ఆనాడు నాగార్జునకొండ విద్యా దాహం తీర్చడానికి ప్రయత్నించి నట్లుగానే ఈనాడు నాగార్జున సాగరం కోటానుకోట్ల ఎకరాల భూమిని సస్యశ్యామలం చేసి, కాటక బాధతో, కుమిలిపోతున్న దేశాన్ని సుభిక్షమొనరింపనున్న ఈ ప్రణాళికను నాగార్జునాచార్యుడు కూడా ఆశీర్వదిస్తాడని ఆశిద్దాం.

## భట్టిప్రోలు

రేపల్లె తాలూకాలోని గ్రామము. తెనాలి రేపల్లె రైలు మార్గమందుగలదు. ఈ గ్రామానికి కృష్ణానది నేడు నాలుగు మైళ్ళ దూరమున గలదు. పూర్వము ఇంకను దగ్గరగా నుండి యుండవచ్చును.

ఆంధ్రదేశములోని ప్రాచీన స్థూపాల్లో యిది యొకటి. క్రీ.పూ. మూడవ శతాబ్దమునకు చెందినట్లూహింపబడుచున్నది. ఇది ధాతుగర్భ స్తూపము యిటుకరాళ్ళతో కట్టబడినది.

దీనిని ప్రథమమున ప్రజలు కనిపెట్టి,చలువరాతి పలకలను కృష్ణ కాలువలమీద తూములు కట్టుటకు, యిటుకలను రోడ్లు వేయు టకును దుర్వినియోగము చేసిరి. ఇది అర్కషశాఖవారిచే పరిశోధింపబడినది.

## గోలి

పల్నాడు తాలూకాలో కృష్ణానది ఉపశాఖ గొల్లేరుపైనున్నది. ఇది గుంటూరు మాచర్ల రైలు దారిమీద రెంటచింతల రైలుస్టేషనుకు రెండుమైళ్ళ దూరాన వున్నది.

1882 సం॥లో న్యూయల్ ఈ ప్రాంతమున సంచారము చేయు చుండగా ఈ దిబ్బలో శిల్పములుగల చలువరాతి ఫలకలు రెండు దొరికినవి. 1926 సం॥లో డూబ్రియల్ ఈ దిబ్బను తవ్వించగా 20 శిల్ప ఫలకములు దొరికినవి. యిచ్చట నొక గది గోడలో బిగించబడి యున్నవి. 16 మద్రాసు మ్యూజియమునకు చేర్చబడెను. ఈ స్థూపము క్రీ.శ. మూడవ శతాబ్ది నాటిదిగా వూహింపబడుచున్నది.

## చేజర్ల

ఇది నర్సారావుపేట తాలూకాలోని గ్రామము. దీనికి కపోత కందపురమనే పేరు గూడా గలదు, శిబి చక్రవర్తి యిచ్చటనే కపోతము కొరకై తన మాంసమును కోసి డేగకాహారమిచ్చినట్లు గాథ కలదు.

శిబి జాతకమనే పేరుతో అమరావతీ నాగార్జున స్తూపాలలో శిల్పములు గలవు. ఈ పర్వతారామము ఒకప్పుడు పారావత ఆరా మమైయుండ వచ్చును. అదే హైందవ ప్రాబల్యంలో తిరిగి కపోతేశ్వ రాలయము అయిందని వూహించడానికి అవకాశము వున్నది.

## బుద్ధాం

బాపట్ల తాలూకాలో బాపట్లకు 7 మైళ్ళ దూరాన వున్నది. ఈ గ్రామానికి మొట్టమొదట బుద్ధగ్రామం అని పేరుండి క్రమంగా బుద్ధగామము బుద్ధగాం-తర్వాత బుద్ధాంగా మారవచ్చును.

ఈ గ్రామంలో ఎడమవైపున ఒక దిబ్బ వున్నది. దానిమీద ఒక సత్రం కట్టించారు. ఆ సత్రం కట్టినప్పుడు ఆ దిబ్బపై చింతచెట్టు క్రింద వున్న బుద్ధ విగ్రహాన్ని సున్నం క్రింద కాల్చివేశారు. ఈ దిబ్బను పరిశీలించిన యిది ఒక చైత్యమని తోచును.

ఈ సత్రము వెనుక చతురస్రమైన మరియొక దిబ్బ వున్నది. దీనిమీద పశువులపాక వున్నది. దీనిని రాటలపై గట్టిరి. ప్రతి రాట అడుగునా చక్కని జంతుశిల్పములున్నవి. దానిలో ఒక ముక్కమీద చైత్యము, మరియొక ముక్కపై పూర్ణకలశము చెక్కబడి యున్నవి.

## చేబ్రోలు

తెనాలి తాలూకాలో గుంటూరునకెనిమిది మైళ్ళ దూరమున నున్నది. దీనికి తామ్రపురియని నామాంతర మున్నది. యిచ్చట పెక్కు పురాతనాలయములున్నవి. ఈ గ్రామపు ప్రాగుత్తర భాగమున ఫర్లాంగు వైశాల్యమున పెక్కు దేవాలయాలున్నవి. వీనిలో అనేక శాసనములున్నవి.

యిచ్చట నొక దిబ్బపై చౌడేశ్వర నాగేశ్వర, భీమేశ్వరాలయములు కలవు. ఈ ఆలయములు పరిశీలించిన బౌద్ధయుగ విహారపు పునాదు లున్నవి. అక్కడక్కడా చలువరాతి స్తంభములు భూమిలో నిలచియున్నవి. వాగు దరిని 100 అడుగుల ఎత్తుగల గుట్ట ఒకటి యున్నది. దీనిపైన గూడ విహారముల పునాదులు విరిగిన స్తంభములూ వున్నవి.

## సమాధానపురము

పల్నాడు తాలూకాలోని గొట్టుముక్కలనంటియున్నది. దానిలో స్తంభాల మూల అనే ప్రదేశమొకటి యున్నది.యిది గోలి వాగు కృష్ణా నదిలో కలియుచోట వున్నది. ఈ స్థలమున పెక్కు చలువరాతి స్తంభములున్నవి. వాటిలో కొన్నిటిమీద పరుగెత్తు జంతువుల చిత్ర ములు చెక్కబడియున్నవి. ఈ ప్రదేశమంతా ఒక విహారమని ఈ నిదర్శనములు సాక్ష్యమిచ్చుచున్నవి.

## మాడుగుల

పల్నాడు తాలూకాలో గురజాలకు 3 మైళ్ళ దూరమున వున్నది.

యిచ్చట నొకమూల దేవాలయ ఆవరణ కలదు. యిందు రెండు జీర్ణదేవాలయాలు ఒకటి పూజాదికములు జరుగుచున్న శివాలయము. ఈ శివాలయమున అతిప్రాచీనమైన శిల్పములు గలవు. మహా బలిపురములోని ద్రౌపదీరథమునను బోలి ఒకే రాతిలో చెక్కబడిన 3 అడుగుల ఎత్తు రథమున్నది.

ఆలయావరణలో పొడవైన చలువరాతి స్తంభము లేడెనిమిది యున్నవి. గ్రామ వెలుపల దక్షిణమున నొక దిబ్బ గలదు. ఈ స్తంభ ములీ దిబ్బలోనే దొరికినవని గ్రామస్తులు చెప్పుదురు. ఈ దిబ్బను త్రవ్విన చైత్యములు దొరకవచ్చును.

## రెంటాల

పల్నాడు తాలూకాలో గుంటూరు మాచర్ల రైలుమార్గమున రెంట చింతల స్టేషనుకు రెండు మైళ్ళ దూరమందున్నది.

గ్రామం వెలుపల రెండు కొండలున్నవి. ఒకదాని పైభాగము విశాలముగను సమంగాను వున్నది. దానిపైకి పోవుటకు రాతిమెట్లు

గలవు. కొండమీద నొక ఎత్తయిన ప్రదేశమున్నది. దానిమీద యిటు కలతో కట్టి చైత్యశిథిలములున్నవి. దానిమీద యిక్ష్వాకురాజైన రెండవ శాంతమూలుని నాటి ప్రాకృత శాసనమొకటి యున్నది. ఈ చైత్యము నకెదురుగ నేలమీద నాలుగైదు గదుల పునాదులు కన్పించుచున్నవి. యిదొక విహారము కావచ్చు. దానిని పరిశోధించవలసియున్నది.

## మోటుపల్లి ఓడరేవు

దీనికి ముకుళపురమని, మోసలపురమని నామాంతరములున్నవి. గ్రీకు నావికుడు షిప్టాలస్ క్రీ.శ.1 శతాబ్దినాడు మసోలియా అను ఓడరేవు తూర్పుతీరమున కలదనెను. దానినే టోలమీ-మైసోలియా అనెను. కృష్ణానదికి గ్రీకు నావికులు "మైసనెస్" అని పేరిడిరి. ఈ మోటుపల్లి ఘంటశాలలు బౌద్ధయుగమున గొప్ప ఓడరేవులు యివి, విదేశ వాణిజ్య కేంద్రములుగా వుండెను.

ఈ రేవులనుండి విశేషంగా రోముతో వ్యాపారము జరుగు చుండెడిది. అందుచేతనే ఇవి ఆంధ్రదేశంలో అధికంగా రోము నాణె ములు దొరకుటకు కారణము. ఆ రోమను నాణెములు ఇచ్చట చలా మణి జరుగునంత విశేషంగా వ్యాపారం జరుగుతూ వుండేది. ఆ కాలమున ఆంధ్రదేశము విదేశ వాణిజ్యమువల్ల విస్తార సంపన్న ముగానుండెను.

ఆంధ్రదేశము సింహళము, యవ, సుమిత్రా, భరణి మున్నగు ద్వీపములతోనూ, కామరూప, బ్రహ్మ, చీనా, రోము, గ్రీసు, మున్నగు దేశములతోను విరివిగా వ్యాపారము చేయుచుండెను. విదేశముల కేగు ఈ నౌకలలోనే బౌద్ధ భిక్షువులు మత ప్రచారమునకై పరదేశముల కేగుచుండెడివారు. ఆంధ్రదేశములో బౌద్ధమతాభివృద్ధికి వాణిజ్యం కూడా కారణముగా పేర్కొనబడినది.

"ఆ కాలముననే గొప్ప గొప్ప స్థూపములన్నియు నిర్మింపబడెను. కృష్ణా గుంటూరు మండలములలో క్రీ.శ.2-3 శతాబ్దములలో నిర్మింప బడిన స్థూపములన్నియూ ఆ కాలమునందలి వణిజుల ఐశ్వర్యము నకునూ ధర్మనిష్ఠకునూ నిదర్శనములు" !

ఆ కాలమునాటి వైభవ చిహ్నములు ఇప్పటికినీ యిచ్చట కన్పించు చున్నవి ఈ రేవు చుట్టునుగల చినగంజాం, కొలితిప్ప, పిరంగిదిబ్బ మొదలగు దిబ్బలలో విడివిడిగా ఎన్నో బౌద్ధ శిల్పములు దొరికినవి. మోటుపల్లి రేవులో "చాకలివానిదిబ్బ"మీద కొన్ని రోమన్ నాణెములు దొరికినవి. ఈ ప్రాంతమును పరిశీలించినచో ఎన్నో చైత్యములు శిల్పములు బయల్పడగలవు.

నేటికిని ప్రపంచంలో బౌద్ధులే అధిక సంఖ్యాకులు కాని బౌద్ధం తన జన్మస్థానమున నివసించుటకు కారణములు పెక్కు గలవు. కాని ఈ విషాద గాథకు కారకులు హిందువులలోని ప్రథమవర్ణమువారే అని అనుటకు అనేక ఉదాహరణలున్నవి.

"క్షత్రియులు హిందూదేశమునకు వెన్నెముక వంటివారు. శాస్త్రాభివృద్ధికిని, స్వేచ్ఛకును ఆధారభూతులు. దేశము నందలి మౌఢ్య మును తొలగించుటకు వారొక్కరే యత్నించిరి. బ్రాహ్మణుల క్రూరకృ త్యములు వృద్ధికాకుండ చేసినవారును వారే. వారిలో అనేకులు అజ్ఞా నాంధకారము వారలైనందువలనను, తక్కినవారు మధ్య ఏషియాయొక్క మోటు జాతివారితో వివాహ సంబంధములు చేసుకొని, బ్రాహ్మణుల పాలనము స్థాపించుటకు ఖడ్గమును చేబూనినందువలనను భరత ఖండము పాడయ్యెను" **(స్వామీ వివేకానందుడు)**

బౌద్ధమత ప్రభావము వలన ననేకులు గౌరవము లేక సమతా ధర్మముల స్థాపించుటకు, శైవము, వైష్ణవము ఆరంభమైనవి. కొంత కాలమునకు శైవములో బ్రాహ్మణాధిక్యత హెచ్చి, బ్రాహ్మణులు ఆరా ధ్యులై గురువులయిరి. బౌద్ధములో తమ ఆధిక్యత స్థాపించుటకు అవకాశము లేనందున ఆ మతమే నాశనము గావింపబడినది. ఆ మత సంబంధమైన గ్రంథములన్ని దహనము చేయబడినందుననే ఆంధ్రదేశమునకు దగ్ధ దేశమను పేరువచ్చెను.

బౌద్ధస్థూపములు శైవులచే ఆంధ్రదేశమున నాశనం చెయ్యబడి, శివాలయ పునాదులు కొన్ని వేయబడినవని సుప్రసిద్ధ పరిశోధకులగు ప్రభాకరశాస్త్రిగారు పలికిరి. నాశనం చేసినవి చేయగా, మరికొన్నిటిని హైందవ మతసంబంధంగా మార్చిరి. నేటికి ఎన్ని బౌద్ధమత సంబం ధమైన విగ్రహాలను శివునిగనో విష్ణువునిగనో భావించి పూజించు చున్నామో మనకు తెలియదు. ఎన్నో పాలరాతి ఛత్రదండములను దీర్ఘములైన లింగములుగా మారి శివాలయములైనవో యెరుగము. ఇంత కళాసౌభాగ్యమొసగిన మహదాంధ్రమున పూర్వమువలెనే పాలిం చమని ఆ కారుణ్యమూర్తిని వేడుకొంటూ, 'బుద్ధం శరణం గచ్ఛామి' అందుముగాక !

శ్రీ నార్ల వెంకటేశ్వరరావు

# భారతీయశిల్పానికి మణిమకుటమైన ఆంధ్ర బౌద్ధుల కళాసృష్టి

స్వతంత్ర భారతదేశంలో కల్లా, అతి శైశవప్రాయంలో ఉన్నదైన ఈ ఆంధ్రరాష్ట్రం, సాక్షాత్తూ బుద్ధ భగవానుని పాదచిహ్నాలకు, ఈ నేల, నోచుకోకపోయినా, బౌద్ధ శిల్పం, బౌద్ధ చిత్రకళలు ముఖ్యంగా శిల్పం మహోన్నత స్థాయి నందుకొన్న దేశమై, తక్కిన భారతరాష్ట్రాల కన్నా మిన్నయై వెలసింది. ఆంధ్రులు అశోకునికి చాల పూర్వమే బౌద్ధ మతాన్ని స్వీకరించారు. ప్రొఫెసర్ కె.ఆర్.సుబ్రహ్మణ్యం, విశిష్టంగా రచించిన "ఆంధ్రలో బౌద్ధ శిథిలాలు" అన్న ప్రత్యేక వ్యాస సంపుటిలో, "ఆంధ్రుల బౌద్ధ స్వీకరణం అశోకుని పూర్వకాలం నాటిదని నిస్సందేహంగా చెప్పవచ్చును" అని నుడివారు.

ఆంధ్రులు అతి ఉద్రేక స్వభావులు, అతి శీఘ్రంగా అతి తీవ్రమైన ఉద్రేకాలకు పాల్పడుతారని ఈనాటికి కూడా పేరు పడే ఉన్నారు. వాళ్ళకు ప్రేమకల్గితే అతి ప్రేమ, ద్వేషం కల్గితే అతి ద్వేషంగా అలవి కాకుండా ఉద్వేలగంగా ఉంటుంది. కాని మొత్తంమీద చూసుకొంటే, ఆంధ్రుడు, దయా, దాక్షిణ్యం, అపరిమిత మైత్రీస్వభావం, సహజంగా అతిథి పూజనం కలవాడు. ఒక్కొక్కప్పుడు అతి తిక్కగా, చంచలంగా కనబడ్డాకూడా, స్నేహధర్మం వాళ్ళలో ఉన్నంత మరెచ్చటా ఉండదు. అందుకనే ఏ క్రొత్త అభ్యుదయ భావమైనా, క్రొత్త నూతనాదర్శమైనా, వాళ్ళనిట్టే అతి స్వాభావికంగా ఆకర్షిస్తుంది. అలాంటి తత్వమున్న మనుష్యులవటం చేతనే, విశ్వమానవ సౌభ్రాత్రాన్ని జీవకారుణ్యాన్ని, విశ్వప్రేమ ఆదర్శాన్ని, మూఢాచార నిరసనాన్ని మానవుని పరమోత్కృష్ట స్వభావం ఏది ఉందో దాన్ని ప్రేరేపించే, ప్రచారప్రబోధాలుగల బౌద్ధ ధర్మం వాళ్ళనిట్టే ఆకర్షించి, బౌద్ధునికి సుస్వాగతమిచ్చేటట్లు చేసి ఉంటుంది.

ఏమాత్రం భావుకత గలవారైనా, మధ్యయుగాల మసకచీకటులు చీల్చుకొంటూ చూపుసారిస్తే, ఆజానుబాహులు, తప్తకాంచనవర్ణులు, సుందర దీర్ఘకాయులూ అయిన పూర్వాంధ్ర పురుషులు కోటానుకోట్ల బౌద్ధ ఆరామాలకు పోయి, నవనవోన్మేష భక్తికుసుమాలతో పూజలు చేస్తున్న దృశ్యం కన్నులకు కట్టుతుంది. గోదావరి, కృష్ణ, వంశధారాది జీవస్రోతస్వినీపరివృత సస్యశ్యామల ధాత్రీతలమంతటా కొండలూ, కోనలూ, కూడా "బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి (బుద్ధుడే నాకు శరణు, ధర్మమే నాకు శరణు, సంఘమే నాకు శరణు) అన్న గీతాలాపం ప్రతిధ్వనిస్తుంటాయి. ఇది కేవలం నా భావోన్మత్తతకాదు. ఆంధ్రదేశమంతటా విరజిమ్మబడినట్లున్న త్రింశత్రయ స్థూపాలు. ఈ నా ఊహకు సాక్ష్యం పలుకుతూ నిలుస్తాయి. ఆంధ్రదేశమంతటా విస్తరించుకొని, ఉత్తరాన శాలిహుండం నుంచి దక్షిణాన చినగంజాం దాకా, తూర్పున ఘంటశాల నుంచి పడమట గుత్తి వరకు విరజిమ్మబడ్డట్లున్న స్తూపాలన్నీ ఇదే చెప్తాయి. మిస్టర్ లాంగ్ హర్ట్స్ చెప్పినట్లు "దక్షిణాన ఉన్న మరే ఇతర దేవాలయాది శిల్ప ప్రతిష్టలకన్నా కూడా ఈ బౌద్ధస్థలాలు అత్యధిక శిల్ప ప్రావీణ్య విశేషం గలవి".

ఈ పూర్వస్థలాలు మళ్ళీ త్రవ్వి కనుగొని మన దృష్టికి తెచ్చినందుకు, పురాతత్వ పరిశోధక ప్రథమాచార్యులనదగు సివిల్, మిలటరీ, ఉద్యోగులు, పరిశోధకులెందరికో, ముఖ్యంగా మెకంజీ, ఎల్లియట్, బర్గెస్, సూయెల్, రీ, లాంగ్ హర్ట్స్, రామచంద్రనుల వంటి వైతాళికసములైన పరిశోధకులకెంతో అచ్చి ఉన్నాము.

ఆంధ్రలో బౌద్ధ శిథిలాలున్న స్థలాలనన్నింటిని చూశానని నేను చెప్పుకోవటంలేదు. కాని అమరావతి, నాగార్జునకొండ, జగ్గయ్యపేట, ఘంటశాల, భట్టిప్రోలులో బౌద్ధవిశేషాలను సందర్శించే భాగ్యం మాత్రం నాకు కల్గింది. వీనిలో కూడా మొదటి రెండూ ప్రపంచఖ్యాతి గడించిన స్థలాలు. రెండూ కూడా దక్షిణ దేశపు నదులలో కెల్లా ద్వితీయ స్థానం ఆక్రమించే కృష్ణానదీ తీరాన గుంటూరు మండలంలోనే ఉన్నాయి. ఈనాడు అమరావతి పాడుబడిన పల్లె అయి శతాబ్దాలుగా అక్కడ విలసిల్లిన విశ్వవిద్యాలయమంటూ ఏదీ లేకపోయినా, నాగార్జున కొండ నిర్జల ప్రదేశంగా మిగిలిపోయి ఒకనాటి ప్రఖ్యాత విద్యాకేంద్రం ఏదీ ఇప్పుడు లేకపోయినా, ఆ ప్రదేశాలను దర్శించిన ఎవరికైనా ఈనాటికీ, కృష్ణానదీ స్వచ్ఛజలాల అలల తళుకులలో మిశ్రమమయి, బౌద్ధధర్మంలోని, శాంతగంభీర అనిర్వచనీయానందాలు పరిసరాల

నంతటినీ నింపినట్లు స్ఫురిస్తూనే ఉంటుంది. శిల్పశాస్త్ర నిష్ణాతుడనుగాని సామాన్యుడనగుటచే సాధికారంగా చెప్పలేకపోవచ్చునేమో గాని దేశాటనంలో సర్వ భారతదేశంలోని ప్రతి పెద్ద, చిన్న పూర్వ యుగ శిల్ప విశేషాలను పరికించినవాడను కాబట్టి, తత్తవాచికంగా నేను ఈ అభిప్రాయం చెప్పడానికి కూడా సాహసిస్తున్నాను. ఎన్నో శతాబ్దాల కాలగర్భంలో చివికిపోయి, విగ్రహధ్వంసకుల చేతుల్లో విరిగిపోయి, పాడుపడిపోయినా కూడా, ఈనాటికీ అమరావతి, నాగార్జున కొండలలో లభించిన శిల్పావశేషాలు సునిశిత సౌందర్య మహిమలో గాని ఆధ్యాత్మిక విలాస విశేషంలోగాని, భావగంభీర్య భంగిమలోగాని మరి వేటికి తీసిపోవని మాత్రం గట్టిగా చెప్పగలను.

అమరావతికి, కేవలం ఆంధ్ర చరిత్రలోనేకాక, భారతీయ, ప్రపంచ బౌద్ధచరిత్రలో కూడా విశిష్ట స్థానమున్నదన్న విషయం మీరందరెరిగినదే. శాతవాహన రాజధానియైన ధాన్యకటకానికి అరమైలు మాత్రపు దూరంలో వున్న ఈ ప్రఖ్యాత నగరం, మహాయాన బౌద్ధ సిద్ధాంతానికి ఆటపట్టయిన కేంద్రం. కాని అంతకన్నా కూడా అక్కడ ఉన్న మహాస్థూపం వల్లనే ఈ పురం ఇతోధికమైన ప్రఖ్యాతిలోకి వచ్చింది. ఈ స్తూపం ఎత్తు నూరు అడుగులు. భూచక్రవ్యాసం నూట అరవై రెండు అడుగుల ఏడంగుళాలు (దీనితో పోల్చి చూచుకొంటే, భట్టిప్రోలు స్తూపం నూట నలభై ఎనిమిది అడుగులు -ఘంటసాల, నూట ఇరవై రెండడుగులు-నాగార్జున కొండలో ముఖ్యస్తూపం నూటారు అడుగులు) "అమరావతి మూలచైత్యం క్రీ.పూ. 200 నాటిది. కొన్ని (రిలీఫ్) రాతిపలక చెక్కడాలు క్రీ.పూ. 1, 2 శతాబ్దాల నాటివి. బందేకట్టు పలకలు, చుట్టూ రాతి కటకటాలు, పిట్టగోడ క్రీ.శ. రెండవ శతాబ్ది నాటివి. అధవా క్రీ.శ. 250 తర్వాత నాటివి మాత్రం కావు" అని డాక్టర్ ఆనందకుమారస్వామి అభిప్రాయపడ్డారు. అమరావతి స్తూపానికి మహదాలంకారమైన ఈ గోడని గురించి జేమ్సు ఫెర్గుసన్ ఇలా అన్నారు. "చారిత్రకంగా బర్హూత్ స్తూపం చుట్టూ ఉన్న పిట్టగోడ, భారతదేశ శిథిలాలన్నిటిలోకి ప్రముఖమైనదయినప్పటికీ, శిల్ప వైదగ్ధ్యంలోగాని, వైశద్యంలోగాని అమరావతి స్తూపపు పిట్టగోడకు ఎంత మాత్రమూ దీటురాదు. నిజానికి అమరావతిలోని ఈ పిట్టగోడ, భారతదేశంలోని పూర్వ శిల్ప విశేషాలన్నిటిలోకి కూడా గొప్పదని చెప్పవచ్చును. అసలు బర్హూత్‌లోని పిట్టగోడకిది రెండున్నర రెట్లు పొడవు వుంది. బయటి ప్రాకార వ్యాసం 195 అడుగులు. లోపలి ప్రాకార వ్యాసం 165 అడుగులు ఇదే బర్హూత్‌లో ఉన్నదానికి దాదాపు రెండు రెట్లుంది. ఈ రెండు పిట్టగోడల మధ్య, ఉత్సవ మార్గముంది. అంతకు పూర్వపు కట్టడాలలో ఈ మార్గం టోపీ పైనే ఉండేది. ప్రాకారపు గోడ బయటి ఎత్తు 14 అడుగులు. లోతట్టు ఇదే ఇంతకు రెండడుగులు తక్కువ ఉంటోంది. ఇక లోపలిగోడ ఎత్తు ఆరడుగులు మాత్రమే".

భారతీయ పూర్వ శిల్పకళా, సౌందర్య విలాసాలను బైటి ప్రపంచానికి చాటిచెప్పి, ప్రపంచదృష్టిని ఆకర్షింపజేయుటకు బాధ్యులైనవారు ముఖ్యంగా ఈ ఫెర్గూసన్ పండితుడు. ఇ.బి.హేవెల్, డాక్టర్ ఎ.కె. కుమారస్వామిగారలే !

అమరావతి స్తూప తదితర శిల్ప విశేషాలను నేనంతగా చెప్ప నక్కర లేదు. ఈ స్తూపం నమూనాను ప్లాస్టర్‌లో తయారుచేయించి మిస్టర్ పెర్సీ బ్రౌను, మద్రాసు మ్యూజియంలో నెలకొల్పి వుంచారు. కాని ఒక్క విషయం చెప్పాలనుకొంటాను. ఈ ప్రాకారం ఒక్కటే దాదాపు 17,000 చదరపు అడుగుల విస్తీర్ణం కలిగి అంతటా రిలీఫ్ చెక్కడాలతో నిండి ఉంది.

ఈ రిలీఫ్ చెక్కడపు చిత్రాలు కూడా, మన దౌర్భాగ్యం చేత ఇప్పటికీ చాలా నష్టమయిపోయాయి. 18వ శతాబ్దంలో కర్నల్ మెకంజి అమరావతీ స్తూపాన్ని దర్శించేటప్పటికే ఎన్నో పాలరాతి చెక్కడాలు జీర్ణమయిపోయాయి. అప్పటి పాలకులు 1796లో తమ స్థావరాన్ని అమరావతికి మార్చుకొని అక్కడి పాలరాళ్ళన్నీ త్రవ్వి సున్నపుబట్టీల కెక్కించారు. అమరావతిలోని ధూళి కూడా చరిత్ర సంప్రదాయాలతో నుతికెక్కి ఉంటుంది. అలాంటి మహోత్కృష్ట శిల్పవిశేషాలున్న శిలలు సున్నానికి కూడా లేకుండాపోయాయి. తర్వాత పాపపరిహారార్థం అన్నట్లు అక్కడ అమరేశ్వరాలయం చుట్టూ కొత్త ఊరు కట్టించ ప్రయత్నించారు. ఈ ధ్వంసకాండను తప్పించుకొని కూడా చెదరుగా కొన్ని పాలరాతి చెక్కడాలు దొరికాయి. వాట్లను, లండను, పారిస్, కలకత్తా, మద్రాసు మ్యూజియములకు తరలించారు. ఇప్పుడు అసలు చోట ఏ కొద్దిరాళ్ళు మాత్రమే మిగిలి ఉన్నాయి. 125దాకా పాలరాతి చెక్కడాలు సర్‌వాల్టర్ ఎలియట్ వల్ల లండన్ తరలించబడ్డాయి. వీట్లను అందుకనే "ఎలియట్ మార్బుల్సు" అంటారు.

ఎల్గిన్ పాలరాతితోనూ, అసిరియన్ ప్రాచీన ఫలక శిల్పాలతోనూ సరి సమానంగా పోటీపడుతూ లండన్‌లో ఒక మూల అతి ప్రశాంతమైన ఒక సందులో ప్రాచీన ప్రపంచశిల్పకళా విశేష సర్వస్వానికి కాణాచియైన ఒక పురావస్తుశాలలో ఈ అమరావతీ శిల్పాలు, తమ లాలిత్యాన్ని, రాజసాన్నీ, శక్తిని, వేదనా, తైక్ష్ణాన్నీ వెలివర్చుకొంటూ, నేను లండన్‌లో తిరిగినన్నాళ్లూ నా కంటబడ్డాయి. ఇంగ్లీషు ఛానల్ దాటి పారిస్ నగరం చేరినప్పటికి మళ్ళీ "మ్యూజీగుయ్‌మెట్" మందిరంలో మరో మూడో నాలుగో అమరావతి పాలరాతి శిల్ప ఫలకాలు కనబడ్డాయి. ఈ మధ్య కలకత్తా ఇండియన్ మ్యూజియంలో మరో పద్నాల్గింటిని లెక్కపెట్టాను. ఇక మద్రాసు మ్యూజియంలో, అమరావతి శిల్పంలో చిత్ర శిల్ప నిధులు చిన్నా, పెద్దా అన్నీ కలుపుకొని దాదాపు మూడువందల పైచిలుకు వున్నాయని నేను వేరే చెప్పనక్కరలేదు. ఆంధ్రశిల్పుల అమూల్యరత్న సంపదలు ఇన్నిచోట్ల యిలా విరజిమ్మ పడ్డాయని నాకు కొంచెం విచారం కల్గినా, వున్నచోట్ల మాత్రం ప్రతి

చోటా ఇవి చాలా జాగ్రత్తగా భద్రపరుచబడుతున్నాయని, చక్కగా ప్రతిష్ఠితం చేయబడ్డాయని ఒప్పుకోకతప్పదు. ఒక్కచోట తప్ప ! రెండేళ్ళ క్రితం నేను అమరావతిని రెండవసారి సందర్శించినప్పుడు అక్కడ మిగిలిన కొద్ది పాలరాతి శిల్పఫలకాలను ఒక పాత కొట్టంలో గుట్టగా పోసి వుంచటం చూశాను. వీటిల్లో ఏ ఒక్క చిన్న రాతిముక్కైనా సరే, దాన్ని అందం చందం చూస్తే ఒక్కొక్కటి రాజమందిరం కట్టి దాచి వుంచటానికి అర్హతే !

అమరావతిలోని శిల్పం అంతా ఎక్కువగా రిలీఫ్ శిల్పం. అంటే రాతిపలక మీదే ఉబ్బెత్తుగా చెక్కిన చిత్రాలు తప్ప పూర్వవిగ్రహ రూపంలో వున్నవి తక్కువ. డాక్టర్ కుమారస్వామి చెప్పినట్లు "ఈ చిత్రాలు మంచి ఉధృతంలో కదులుతూన్నట్లు, చైతన్యంలో ఒక్కొక్క ప్పుడు, భక్త్యావేశాన్ని రూపిస్తూ మరొకచో, హాస్యజనకంగా వుంటూ, సర్వత్రా చికిలి మెరురంగు నగిషిపని మెరిపిస్తూ, అతి లాలసాయు తంగా వుంటాయి". చిత్రంలోని ప్రతి చిన్న అలంకరణ విశేషం కూడా అత్యాకర్షణీయంగా నిరూపించబడి, అలంకార చిత్రణంలో విశిష్టాతి విశిష్టాలు కనిపిస్తాయి. నిజానికి అమరావతి శిల్పం ఆంధ్రుల సంపత్తి నుండి ఉద్భవించిన మహోత్కృష్ట ఫలం.

"అమరావతిశిల్పాలు భారతీయ శిల్ప పరమావధినిసూచి స్తాయి" అంటూ సాధికారంగా ఫెర్గుసన్ పండితుడు అభిప్రాయం ఇచ్చాడు. హేవెల్ ఇలా అన్నాడు. "అమరావతి పాలరాళ్ళ పైని రమ ణీయమైన చెక్కడాలలో, జంతు జీవన సౌందర్యం, అత్యద్భుత సౌంద ర్యాన్నొలి కించే పరిసరపు నగిషీ పనితో మిళితమై సుందరాతి సుందరంగా కనబడుతుంది. అమరావతి శిల్పాలలో, మానవరూపం, చిత్ర విచిత్ర భంగిమలలో,సజీవ చైతన్యాన్ని ప్రతిబింబిస్తూ, అత్యంత నైపుణ్యంతోనూ, అతి స్వతంత్ర ప్రజ్ఞతోనూ చెక్కబడింది" అనికూడా ఆయన అన్నాడు.

విస్తృత భావ స్వాతంత్ర్యం, ప్రతి చిన్న రేఖా, వంపు, నిమ్నోన్న తాలన్నీ వేనోళ్ళ భావాన్ని చాటే ప్రజ్ఞ. ఇవి ముఖ్యంగా అమరావతీ శిల్పంలోని అపూర్వ లక్షణాలు. అంతకన్నా ముఖ్యంగా గమనించ వలసింది, ఈ శిల్పం ఈ గడ్డపైన పుట్టిన దేశీయ శిల్పం. అక్కడి ప్రజలలోని అంతః శక్తి వల్ల ఉత్పన్నమయింది. అంతర్వాణి పిలుపుకు జాగృతమయి, ఒక ఆశయసిద్ధితో హృదయార్పణ మొనర్చుకొన్నది. గాంధార, గ్రీకు, రోమన్, శిల్పరీతులకు ఇతః పూర్వం భారతీయ శిల్పాలపై ఏమాత్రమో ప్రభావం ఉండి ఉన్నా, క్రీ.శ. ప్రారంభకాలం నాటికి కృష్ణాతీరాన ఈ శిల్పకళ ఉద్భవించేనాటికి వాట్ల ప్రభావం చాలా సన్నగించిపోయింది. "అమరావతీ శిల్పాలు, బారహత్, ఎల్లోరా శిల్పాలలాగే నిజానికి భారత 'దేశీయ' శిల్పశైలులుగానే గోచరిస్తాయి. మౌర్యశిల్పం, పూర్వసాంప్రదాయ విధానాలు చెడగొట్టు కోకుండా తెచ్చుకోడానికి తడుము లాడిన కాలాన్ననుసరించి వచ్చినవి గను కొంత మౌర్యశిల్పానికి అనుయాయులవటం కూడా కల్గింది. కొన్ని కథా వస్తువులు, శిల్పాలంకార విశేషాలు, వాయువ్య దిశదైన గాంధార శిల్పాన్నుంచి సన్నగా జాలువారి దిగి రానేవచ్చాయి. కానీ ఈ దేశీయ శిల్పం వాట్లను తనలో అంతర్భాగాలుగా జీర్ణింపచేసుకొంది" అని డాక్టర్ మార్షల్ చెప్పిన మాట చాలా నిజమైన మాట.

నేను, ఇతరుల నుంచి ఎరువు తెచ్చుకొని, జీర్ణం చేసుకొన్న విషయం చెప్పుకోటానికి సిగ్గుపడే రకం మనిషిని కాకపోయినా, అమ రావతిలోని బుద్ధుని విగ్రహం శైలిలో, బాహ్య శిల్ప విధాన ప్రభావాలు స్వల్పాతి స్వల్పమని, పురావస్తు పరిశోధక శ్రేష్ఠులే అభిప్రాయం వెలువర్చారు. "బ్రిటిష్ మ్యూజియంలో అమరావతి శిల్పాలు" అన్న గ్రంథంలో మి॥డగ్లస్ బారెట్ ఇలా వ్రాశాడు. "అమరావతి విగ్రహాలు, మధ్యకాలపువుగాని, చివరి కాలపువుగాని చూసుకొంటే, మధుర వాట్లతో పోలినవి బహు స్వల్పంగా ఉంటాయి... నిజానికి అమరావతి విగ్రహంలోనే ఎక్కువ సహజత్వం ఉట్టిపడుతూంటుంది. ఉత్తరాది విగ్రహాలలోకన్నా వీనిలో అలౌకిక విగ్రహ దేవత్వం చాలా తక్కువ. నిజానికి తలపై ముంగురులు, ఉష్ణీషం, ప్రభాచక్రం, ఇవి ఈ శిల్ప మధ్యకాలంలో అతిగా చెక్కబడిన సన్యాసుల విగ్రహాలకు అమర్చి చూచుకోగలిగితే, అమరావతి బుద్ధుని స్వరూపం ఇట్లే గోచరిస్తుంది. ఈ భిక్షుకులకు బోడి తలలున్నాయి. భుజాలు రెంటిని కప్పిన కాషా యాంబరం అతి సహజంగా జీరాడుతుంది".

"అమరావతిలో బుద్ధుని విగ్రహం బ్రహ్మ పదార్థ ధ్యానరతుడయిన వేదాంతి స్వరూపాన్ని కాక, తక్కిన భారతీయ మతాలలో మాదిరిగానే, భక్తితత్పరుడయిన సామాన్య సన్యాసి రూపాన్ని వెలువరిస్తుంది" అని కూడా బారెట్ అంటారు. ఒకవేళ ఆంధ్రశిల్పి, మధుర నుంచి బుద్ధుని రూపకల్పన భావాన్నే కాక కొంత చిత్రశైలిని కూడా స్వీకరించాడని మనం ఒప్పుకొన్నా, తన సృష్టిలో, ఆంధ్రజీవితాన్ని, ఆంధ్రచైతన్యాన్ని పరిసరాలను ప్రకోపింపజేసి అన్నిటినీ జీర్ణింపచేసుకున్న నూతన శిల్ప సృష్టి ఒనర్చాడని నేను అంటాను.

కొన్ని అమరావతి శిల్పాలు ద్రష్టతో గాఢమైన భావచైతన్యం కల్గిస్తాయి. స్వవిషయమే చెప్పుకోవలసివస్తే, మద్రాసు మ్యూజియంలో భద్రపరుచబడిన, నలుగురు భక్తురాండ్ర శిల్పం నన్నెంతో ఉత్తేజపరిచి, నా హృదయాంతరాలనే కదిలించివేసింది.

మద్రాసు మ్యూజియంలోని మరొక అమరావతి శిల్పం చిత్రంలోని అద్భుత ఘటనా విశేషం చేత నన్నాకర్షించింది. ఆ చిత్రంలో, మద గజం "నలగిరి"ని బుద్ధుడు లొంగదీయటం చిత్రించబడినది. కరుణా సముద్రుడయిన ఆ ప్రభువు మ్రోల ఆ ఏనుగులో కలిగిన అద్భుత పరివర్తనాన్ని ఆ శిల్పఖండం అత్యద్భుతంగా చాటి చెపుతూంటుంది.

ఆంధ్రలో తక్కిన బౌద్ధ కళాక్షేత్రాల విషయానికి మరలే లోపుగా, అమరావతి పాలరాతి శిల్పాల విషయంలో మరికొన్ని మాటలు నివేదించుకొనేందుకు అనుమతి వేడుతున్నాను. అమరావతి శిల్పాలు మొదట్లో పల్చని సున్నపు పూత, పై రంగులు వేయబడి రంగు రంగులుగా ఉండి ఉండేవి అని సర్వసామాన్యాభిప్రాయం ఒకటుంది. అదే నిజమయి ఉంటే ఈ పాలరాతి చెక్కడపు చిత్రాలు కూడా, అజంతా, బాగ్‌లలోని త్రివర్ణ చిత్రాలతో తులతూగుతూ ఉండి ఉండేవి అని మనం నమ్మకంగా చెప్పుకోవచ్చును."అమరావతిలోని చిత్రకళా వైదగ్ధ్యం, విస్తృత సంపదలకు, ప్రపంచంలో ఎక్కడైనా ఏ మాత్రమైనా పోలిక అంటూ ఉంటే, మళ్ళీ అజంతా, బాగ్ చిత్రాలలో మాత్రమే కనబడుతుంది" అని డాక్టర్ బర్గెస్ అన్నాడు. అమరావతి స్తూప గోళం కట్టిన పాలరాళ్ళూ, చుట్టూ ఉత్సవమార్గ ప్రాకారమూ, వాటి నావరించి యున్న అలంకరణ చిత్రాలూ సరిగ్గా అర్థం చేసుకోవటానికి అజంతా, ఫ్రెస్కో చిత్రాలతో కూడా కలుపుకొని సమన్వయపరచుకొని పరీక్ష చేసుకొంటేనేగాని, వాళ్ల విశిష్టతలే గోచరించవు. అజంతా చిత్రకారులూ, అమరావతీ శిల్పులూ, చిత్రలేఖనం శిల్పం అన్న రెండు విడి కళలలో ప్రతిభ ప్రదర్శించిన ఒకే ఒక శిల్పులేమో అన్న నా ఊహ తొందరపాటైతే మన్నించగోర్తాను.

నాగార్జున కొండ లేక శ్రీ పర్వతం (పూర్వపు పేరు), పాలరాతి చెక్కడాలు కూడా ఇంతటి విశిష్టత కలవే. ఈ శ్రీపర్వతం నీడలో పూర్వం విజయపురి అన్న చిన్న పట్టణం ఇక్ష్వాకువంశీయుల రాజధానిగా విలసిల్లింది. శాతవాహనుల తర్వాత ఇక్ష్వాకుల వేంగీ సామ్రాజ్యం పాలించినవాడు చుట్టూ మూడు పచ్చపచ్చని పర్వతాలు, ఒకవైపు కృష్ణా తరంగిణీ, కలిగి బహు రమణీయంగా ఉండే ఈ శ్రీ పర్వతపు కోన మహాయాన బౌద్ధమత స్థావరంగా ఉంటూ అమరావతి తర్వాత అమరావతి అంతటి మహోత్కృష్ట బౌద్ధ విద్యాకేంద్రంగా ఉండేది. ఇక్కడ పరిపాలనలు చేసిన రాజులు ఎక్కువగా హిందువులే అయినా, వాళ్ళ రాణులు ఎక్కువగా బౌద్ధాన్ని అభిమానించేవారు. నాగార్జున కొండలో దొరికిన శిలాశాసనాలను పరికిస్తే బౌద్ధాన్ని అభిమానించిన మహారాణి, ప్రప్రథమురాలు ఛాంతిశ్రీ, రెండవ రాణి అడవి ఛాంతిశ్రీ, మనకు తెలిసిన మూడవ మహారాణి అని తెలుస్తుంది. బౌద్ధాన్నభిమానించిన ఆమె పేరు భులచ్చాంతిశ్రీ, ఇక్ష్వాకులకు సంబంధీకురాలు కాక పోయినా, ఉపాసిక బోధిశ్రీ కూడ కషాయ వస్త్రాలు ధరించిన మహా ధనికురాలని రాణివాసపు వారికన్న మిన్న అయిన స్థితిలోనే ఉండేదని నేననుకొంటాను. ఆమె పుట్టుపూర్వోత్తరాల విషయం చాలా సందేహా లున్నాయి. ఆమె సింహళంలోని గోవా గ్రామంలో పుట్టిందని మహా వంశంలో పేర్కొనబడింది.కాని ఈమె ఆంధ్రదేశంలో నాగార్జున కొండ వద్దనే కాక తదితర ప్రదేశాల బౌద్ధారామాలకు కూడా అతి విరాళంగా దానాలు, ధర్మాలు చేసిందని చెప్పటానికి సందేహం లేదు. శ్రీ కె. గోపాలచారి వ్రాసిన ఆంధ్రుల ప్రాచీన చరిత్ర ప్రకారం బోధిసిరి విజయ పురి వద్ద రెండు చైత్యగ్రామాలు కట్టించడానికి సహాయపడింది (ఒకటి విహారం ప్రక్కనున్న దిగువ ధమ్మగిరి వద్దనున్నది. సింహళ పీఠాధిపతులకు చెందినట్లుగానే కట్టబడింది. రెండవది, కులహ విహారం వద్ద కట్టించింది.( సింహళవిహారంలో బోధివృక్షానికి ప్రాకారం కట్టించింది. ధమ్మగిరిలో ఒక గది కట్టించింది. మహా విహారంలో మంటపస్తంభం కట్టించింది.దేవగిరిలో ప్రార్థనామందిరం కట్టించింది. పునాసియల్‌లో చెరువూ, చుట్టూ వసారా, మంటపమూ కట్టించింది. కంటకశిలలో మహాచైత్యానికి ప్రాగ్ద్వారం వద్ద రాతి మంటపం కట్టించింది. హిరుణాధువలో మూడు ఆరామ గదులు, పాపిలవద్ద ఏడు గదులు, విహురవద్ద రాతి మంటపం కట్టించింది. బోధిసిరి వితరణం చవిచూసిన ఈ పేర్లున్న గ్రామాలు స్థలాలు ఏవేవో అని ఇప్పుడు మనం ఆశ్చర్యపడనవసరం లేదు. బౌద్ధ ధర్మంపట్ల ఈ మహాస్త్రీలకు ఇంతటి భక్తి ప్రపత్తులుండేవని, హృదయపూర్వకంగా తమ ధనకనక సర్వస్వాలను, విజయపురివద్ద అసంఖ్యాకులైన చైత్యాలు, స్థూపాలు, విహారాలు నిర్మించటానికి వెచ్చించారనీ తెలిస్తే చాలు.

ఇక్ష్వాకుల రాజధాని అయిన ఈ విజయపురి మహావైభవంతో వెలిగిపోయి ఉండాలి. సుదూర దేశాలనుంచి, వర్తక వ్యాపారాలకు కేవలం వణిజులే కాకుండా, బౌద్ధధర్మజిజ్ఞాసులు, విద్యార్థులు, గురువులు కూడా ఎంతోమంది ఇక్కడికి వచ్చేవారు. విజయపురి ప్రపంచ ప్రఖ్యాతి విజ్ఞానకేంద్రంగా ఇక్ష్వాకుల పూర్వకాలంలోనే పేరు గడించుకొనే ఉండి ఉండాలి. మధ్య మార్గదర్శకుడై "మాధ్యమిక" సిద్ధాంతాన్ని బౌద్ధంలో ప్రవేశపెట్టిన నాగార్జునాచార్యుడు, మహావేదాంతి, తన చివరి రోజుల్లో చాలాకాలం శ్రీ పర్వతం వద్దనే గడిపాడని టిబెటన్ చరిత్ర లున్నాయి. కాని విజయపురి చరిత్రవల్ల సమ్మోహితుడైన ముఖ్య విషయమైన ఆంధ్రా బౌద్ధశిల్ప విషయాలనువదిలి శాఖాచంక్రమణం చేయుట నాకు తగదు.

అయితే అమరావతి పాలరాతి శిల్పాలలాగా, నాగార్జునకొండ శిల్పాలు అంత విస్తృతంగా తరలింపబడిపోలేదు. కాదంటే ఏ నాలుగో అయిదో పారిస్‌లో మ్యూజీగయ్‌మెట్‌లో భద్రపరచబడి, ఆంధ్రుల బౌద్ధశిల్ప ప్రతిభను జగమంతటికీ చాటుతున్నాయి. నాగార్జునకొండ శిల్పాలన్నిటినీ తవ్వి వేయడం కూడా పూర్తికాలేదని చెప్పటం ఇక్కడ నేను విస్మరించరాదు. ఇంకా తవ్వితే ఇంకా ఎన్నో పురాతన శిల్పాలు, శిథిలాలు, వస్తు విశేషాలు గృహాలు అక్కడ బైలుపడే అవకాశం చాలా ఉంది. ఈ తవ్వడపు పనికూడా జరుగుతోందని కాని, పురాతత్వ పరిశోధన బుద్ధితోకాక, నాగార్జునసాగర నిర్మాణార్థమై జరుగుతోందని చెప్పటానికి విచారిస్తున్నాను. ఈ ప్రదేశం అంతా నాగార్జునసాగర్ అడుగున మునిగిపోతుంది. ఒక పవిత్ర చారిత్రక పూర్వవైభవ చిహ్నా

శిథిలం ఇల్లనకినమైన జలప్రణాళికలో జలాంతర్గతమై పోతుందన్నందుకు కూడా, నా మటుకు నేను పెద్దగా ఆక్రోశించను. కారణం ఈ మహానాగార్జున సాగరం, కోటానుకోట్ల ఎకరాల భూమిని పండించి కాటకంతో కుమిలిపోతూన్న దేశాన్ని సుభిక్ష మొనరింపబోతోంది. ఆ మహా బౌద్ధాచార్యులూ కూడా, విశాలహృదయంతో ఈ ప్రణాళికను దీవిస్తాడనే నేను తప్పక నమ్ముతున్నాను.

నాగార్జునాచార్యుని కాలంలోనూ తర్వాత కొన్ని శతాబ్దాల వరకూ కూడా, విజయపురి ప్రపంచ విద్యార్థుల విద్యాదాహాన్ని తీర్చే విశ్వ విద్యాలయంగా నిలిచింది. "కాశ్మీర్, గాంధారా, చీన, చిలాట, తోసలి, అపరంత, వంగ, వారణాసి, యవన, పాలూర, దమిళ, తంబపణ్ణి దేశాలనుంచి విద్యార్థులు తండోపతండాలుగా వేదాంత విద్య నేర్చు కోటానికై వచ్చేవారు. ఇకమీద, పూర్వవైభవానికి ఛాయామాత్రంగా నిలవటం కాక, దాహంతో తపిస్తున్న పరిసర క్షేత్రాలన్నిటికి జలం అందించే జలనిధిగా నిలచి అనేక గృహాలకు ఆనందం చేకూర్చి పెడుతుంది. ఈ గృహాలు ఇప్పుడు దారిద్రంతో అంధమయమై నాగరిక జీవన సౌకర్యాలు లేక కుమిలిపోతున్నాయి. నాగార్జునాచార్యుడు జీవిత ధర్మసందేశాన్ని ఇచ్చాడు గాని శ్మశాన వైరాగ్యం బోధించినవాడు కాదు. మానవ మస్తిష్కాలలోని చీకటి గుహల్లోకి వెలుగును ప్రసరింపజేసి, అజ్ఞానాన్ని, ఆవేదనని పారద్రోలటమే అతని ఆశయం. కాబట్టి, దుర్భర దారిద్ర్యమూ కోరుకొన్నదికాక నెత్తిపై రుద్దిన దారిద్ర్యం, జీవితాలను చేరపట్టిస్తుందనీ, సామాన్య జీవిత విజ్ఞానాన్నే అందచేయలేనప్పుడు ఒక ఆత్మ వికాసాన్నే అసలు అందచేయలేదని చెప్పే వారిలో నాగార్జునా చార్యుడే ముందు ఉండి తీరుతాడు. అందుకని తప్పకుండా, ఈ కోన, సాగరంగా మారి, జీవనదాతగా మారుతుందంటే, అతని ప్రబో ధానికి సాంప్రదాయానికీ అనుగుణంగా ఉన్న మహత్కార్యమే అని అతని ఆత్మ సంతోషించి తీరుతుందనీ ఏమాత్రం విచారించదనీ నేను భావిస్తున్నాను.

ఇంతటితో ఈ విషయం వదిలేద్దాం. కాక నేను చెప్పవలసిందే మిటంటే నాగార్జునకొండ త్రవ్వకంలో బైలుపడిన శిల్పవిశేషాలను, ఎక్కడో ఒకచోట జాతీయసంపదగా మాత్రం భద్రపరుచబడతాయని:

ఈ మధ్య భారత ప్రభుత్వం పంపిన ఒక కమిటీ వారు, శ్రీ పర్వత శిఖరమే ఇల్లాంటి మందిరానికి బాగుంటుందని నిర్ణయించి నట్లు వార్త తెలుస్తోంది. నాగార్జున కొండ అడుగునా ప్రక్కలా అంతటా ఏర్పడబోయే నాగార్జున సాగరంలో మునిగిపోయినా, పర్వతాగ్రం మాత్రం నీటిమట్టానికి చాలా పై వుంటుందట. నాకు కూడా ఈ అభి ప్రాయం బాగుంది. ఇలాగే చేస్తారని ఆశిస్తున్నాను. కాక ఒకవేళ ఇతర అడ్డంకులు వేటివల్లనైనా ఇది వీలుగాకపోతే, మరో కొత్త స్థలం నిర్దేశించినా ఫరవాలేదు. ఎందుకంటే అదే మళ్ళీ ఇంకొక నాగార్జున కొండగానే వెలుస్తుంది. కారణం నాగార్జునుని కీర్తిప్రతిష్టలు, ధర్మ సందేశం, అంతగా అక్కడి శిథిలాల ప్రతి చిన్నరాతిముక్కలోనూ, చెక్కడం విశేషంలోనూ అలుముకొని పోయివున్నాయి.

నేను క్రిందటిసారి అక్కడికి వెళ్ళినప్పుడు, నాగార్జునకొండ శిల్పాలలోని ఒక చిత్రం నన్ను యెంత గాఢంగా ఆకర్షించిందంటారు ! ఆ చిత్రంలో కపిలవస్తు రాజమందిరంలో దుఃఖతరంగం పొర్లుతూన్న దృశ్యం కనబడుతుంది. రాకుమారుడు సిద్ధార్థుడు అన్వేషియై మహాభి నిష్క్రమణమొనర్చాడు. సారథియైన ఛన్నుడీవార్తను మందిరంలో విని పించాడు – శుద్ధోదన మహారాజు క్రుంగిపోయి తలవాల్చుకొని సింహా సనంపై దాదాపు మూర్ఛపోయిన స్థితిలో ఉన్నాడు. ఛన్నుడు శోక మూర్తియై అతని పాదాలవద్ద మోకరిల్లి ఉన్నాడు. రాజపరిచారకుల మొగాలు విషాదాక్తులై వివిధ భావాల ప్రతిబింబిస్తూ అతి నిపుణంగా చెక్కబడ్డాయి. అన్నిటినీ మించిన చిత్రవిశేషం రాజకుమారుని దిగివిడిచి వచ్చిన అశ్వరాజం కంటకము కంట నీరెట్టి వాపోతుంటుంది. ఒక నిముషమాత్రం సేపు, ఆ రాయి రాయే కన్నీటితో కరిగిపోతుందా అన్న విభ్రమావస్థలో పడిపోయాను నేను. నాగార్జున కొండ శిల్ప ప్రభావం అంతటిది. కంటకం వస్తు సమీకరణ మాత్రం కాని చిత్ర విశేష సంపద, బుడిబుడి శోకాల్నిగాక గాఢ వేదనను ప్రేరేపించే సుమనస్కృత, చేతిశాస్త్రపు చిలుక పలుకులు కాక, జీవితార్థ ప్రబోధ కలిగి ఈ శిల్పం అతి విశిష్టశ్రేణికి చెందుతుంది. అక్కడ మిగిలిన చిన్నరాతి బొమ్మ ముక్క కూడా ఉత్తేజిత శక్తిగలదని, చేతివ్రేళ్ళు మాత్రమే మిగిలిన ఒక రాతిబొమ్మ ముక్కను చూసి నేను గ్రహించాను. అది చూడగానే బుద్ధ విగ్రహంలోని భద్రఖండం అని నాకనిపించింది. ధర్మచక్రాన్ని సాగించిన ఆ చేతివ్రేళ్ళ మార్దవం, చక్కదనం, శక్తి, చైతన్యాలను గుర్తించలేని వాళ్ళెవరుంటారు ?

అమరావతి – నాగార్జునకొండ శిల్పాలు, ఆంధ్రదేశంలో బౌద్ధ శిల్పానికి రెండు మహోన్నత శిఖరాలవటంచేతనే ఇంత విరివిగా వాట్లను గురించి చెప్పుకొచ్చాను. ఇంతకన్నా తక్కువ ప్రాముఖ్యం గలవైన గోలి, జగ్గయ్యపేట, భట్టిప్రోలు, ఘంటశాల, గుంటుపల్లి, గరికపాడు, శాలిహుండం, రామతీర్థం ఇత్యాది స్థలాలలోని శిథిలాలు కూడా వాటి పద్ధతిని అవి కొన్ని ప్రత్యేకతలు కలవే. వీటిల్లో కొన్ని స్తూపాలు నాగా ర్జునకొండ, అమరావతిల కన్నా కూడా ప్రాచీనమైనవే. కాని విదేశ ప్రభుత్వోద్యోగుల కళాధ్వంసక స్వభావాల వల్లనూ, స్వార్థ పరత్వాల వల్లనూ ఈ చోటులలో ఎక్కువగా శిల్ప విశేషాలు మిగలలేదు. కాని మిగిలిన కొద్ది రాళ్ళమీద చిత్రాలు కొన్ని కూడా, అమరావతి – నాగార్జునకొండ శిల్ప స్వర్ణయుగానికి ప్రాతిపదికలుగానే స్ఫురిస్తాయి. జగ్గయ్యపేటలో పూర్తి శిథిలావస్థలో ఉన్న స్తూప కుడ్య చిత్రశకలాలు కూడా, సౌందర్యఖనులుగానే ఉంటాయి. ఈ మధ్య

నేనీ ప్రదేశానికి వెళ్ళాను. బొమ్మలన్నీ ముక్కలు ముక్కలై వున్నాయి. మిగిలిన ఒక బుద్ధ విగ్రహం మద్రాసు మ్యూజియంలో ఉంది. ఇది నిజంగా ప్రత్యేక విశేషమే. కేవలం పాడయిపోకుండా మిగిలిందనే కాదు. తక్కిన శిల్పరీతులకు ఈ విగ్రహ శిల్పానికి కాలంలోనూ, శైలిలోనూ కూడా చాలా అంతరం కనబడుతుంది. విగ్రహం దిగువ పద్మంలో ఒక శాసనం చెక్కి వుంది. ఈ అక్షరాలు ఆరవ శతాబ్దం నాటి అక్షరాలు.

**శాసన సారాంశం :**

ఈ విగ్రహం నాగార్జునాచార్యుని శిష్యుడైన జయప్రభాచార్యుల ఆధ్వర్యంలో నిర్మింపబడిందని, అమరావతి స్తూప ప్రథమ దశాకాలం క్రీ.పూ. 200 నాటికి వెళ్తుంది. తక్కిన శిల్పాలు కూడా ఆ కాలానికే చెందుతాయి. ఇది చాలా తర్వాత కాలం నాటిదని నిర్ణయింపబడింది.

జగ్గయ్యపేట పాలరాతి శిల్పాలలో కల్లా అతి ముఖ్యమైనది, ఒక చక్రవర్తిని చూపించే చెక్కడపు చిత్రం. చక్రవర్తి చుట్టూ రాణి, యువరాజు, మంత్రి, పట్టపు ఏనుగు, గుర్రం, అన్న సప్తరత్నాలూ చెక్కబడి ఉంటాయి. ఈ లాంఛనాలు ఇతన్ని మహారాజాధిరాజుగా, చక్రవర్తిగా ప్రకటిస్తాయి. ఈ బొమ్మలో గమనించదగ్గ విషయాలు ; చక్రవర్తి మీద నలుచదరపు నాణాలు ఆకాశం నుంచి జల్లబడు తూంటాయి. మానవుల అలంకారాలు వాళ్ళ సుదీర్ఘ స్వరూపాలు గూడా, మరుగుజ్జ రూపాన్ని చెక్కే గాంధారశిల్ప రీతికి చాలా వ్యత్యా సంగా ఉంటాయి. ఈ మార్పే మానవస్వరూపాన్ని అమరావతి శిల్పాలలో అతి అందమైన దేశాంగాలతో తీర్చిదిద్దేందుకు మూలక మయిందనవచ్చు. జగ్గయ్యపేటలో దొరికిన మరొక శిథిల విశేషం పుణ్యశాల. ఒక రెండంతస్తుల ఆరామ స్వరూపం చెక్కబడి ఉంది.

గుంటూరు జిల్లా, రేపల్లె తాలూకాలోని భట్టిప్రోలు గ్రామం నా చిన్ననాడెప్పుడో చూచాను. అందుచేత అక్కడి స్తూపవిషయాలు నాకం తగా జ్ఞాపకం లేవు. కాని కృష్ణాజిల్లా పురావస్తు పరిశోధన సాగించిన అలెగ్జాండరీ గారి వాక్యాలు ఉటంకిస్తాను. "1820 నాటికి భట్టిప్రోలు స్తూపం ఇటుకలు, పాలరాళ్ళు అన్నీ కూడా కొల్లగొట్టేశారు. ఇటుకలు పెద్దసైజున చాలామంచివై ఉండటం చేత రోడ్ల నిర్మాణంకు విని యోగించారు. పాలరాళ్ళు కృష్ణ కాల్వకు లాకులు కడ్తూ అందులో వాడుకొన్నారు. అయితే ఈ రాళ్ళ మీద ఏమన్నా చెక్కడాలుండేవా అని కొంత సందేహం లేకపోలేదు. దీనికన్నా, భట్టిప్రోలు ముందు సందర్శించిన రాబర్టు సూవెల్ వీట్ల మీద చెక్కడాలున్నాయనే అభిప్రాయ పడ్డాడు. 1878లో మద్రాసు ప్రభుత్వానికి పంపిన నివేదికలో ఈయన ఇలా తెల్పాడు. "అవి నిజంగా చెక్కడాలున్న రాళ్ళే అన్న విషయం వెల్లటూరు లాకు గోడలలోను, నేల చప్టాకు విరివిగా వాడిన ఆ పాల రాళ్ళను బట్టి తెలుస్తుంది. కొన్నిటిమీద అమరావతి పద్ధతిలో బొమ్మలో చెక్కినట్లున్నాయి. కానీ, అంత అందపు చెక్కడాలు కావు" నేను కూడా ఈ అభిప్రాయంతో ఏకీభవిస్తాను. గుంటూరు జిల్లాలో పల్నాడులో దొరికే పాలరాయినే ఈ స్థూపంలో విరివిగా వాడారు. ఈ రాయి సహజంగా అందంగాని, నునుపుగాని, వర్ణవైవిధ్యంగాని కలది కాదు. బండగా మొద్దుగా ఉంటుంది. ఈనాడు సిమెంటు పరిశ్రమలో దీన్ని వాడుతున్నారు. ఇలాంటి బండరాయిలో జీవంపోసి, సుందరాతి సుందరంగా మలచి, ప్రజాబాహుళ్యానికి అమరసందేశం అందించిన ఆంధ్రశిల్పుల హస్తకౌశలమెంతదో ! ఇంత బండరాయి కనకనే శిల్ప విశేషానికి తప్ప, శిల్పి చేతిలో మలచబడిన బొమ్మ చెక్కబడి ఉంటే తప్ప, ఈ పల్నాటి రాతిని, భట్టిప్రోలులో గాని, తదితర స్తూపాలలోగాని స్తూప నిర్మాణంలో వాడి ఉండరని, అధమం, ఏ స్వల్ప శిల్ప విశేషమో, పద్మమో, ధర్మచక్రమో, పడగ విప్పిన పామో, బోధి లేక శ్రీపాదవృక్షమో లేకుండా ఉండి ఉండదని నా నమ్మకం. ఏదైతేనేం భట్టిప్రోలులో స్తూపం ఘంటశాల, నాగార్జునకొండల వాటి మాదిరిగా కాక గట్టి ఇటుకరాళ్ళతో కట్టబడినదైనప్పటికీ, ఈనాడు పూర్తిగా అందుబాటు లేకుండా శిథిలమయిపోయింది.

గుడివాడ బౌద్ధ స్తూపానికి కూడా సరిగ్గా ఇదే గతి పట్టినట్టు తోస్తుంది. "బెజవాడ బందరు మధ్యరాజబాట వెయ్యటానికి 1840లో ఒక యిటుకల గుట్ట నేలమట్ట మొనర్చబడింది" ఈ కళా ధ్వంసకత్వాన్ని నిందిస్తూ రీ యిల్లా వ్రాశాడు. "ఈ కట్టడాలన్నీ కూడా రోడ్లు వెయ్య టానికి, తదితర నిత్యనిర్మాణాల కోసమని ధ్వంసం చెయ్యబడటం బహుశోచనీయం. ఒక ప్రాచీన నాగరికతకు మహోత్కృష్ట చిహ్నాలైన ప్పటికీ కూడా వాటి ప్రాచీనత వాటిని రక్షించలేకపోయింది. ఈ పరిస్థితులలో ధ్వంసకుల చేతిలో పడక మిగిలిన శిథిలాలనే పోగు చేసుకొని ప్రయత్నించవలసి వచ్చింది. చాలాచోట్ల వట్టి గుట్టల్లా కనబడుతున్న ఈ శిథిలాలనుంచే ఆనాటి బౌద్ధశిల్ప వైదగ్ధ్యాన్ని మించిన రీతులు, తర్వాత కాలంలో ఎప్పుడూ కూడా భారతదేశ శిల్ప చరిత్రలోనే కనబడలేదని తెలుసుకోగలిగాము. తర్వాత వచ్చిన ద్రవిడ దేవాలయ శిల్పాలలోపలే కాక, బౌద్ధ ఆలయాలు మహోన్నత శిల్పపు చెక్కడాలు కలిగి ఉండటమే కాక ఆ ఆలయ నిర్మాణమే మహోత్కృష్ట శిల్ప సూత్రాలపై నిర్మితమై ఉండేది".

ఇక్కడ ఇంతగా 'రీ' గారి నుంచి ఉటంకించటానికి ఒక్కటే కారణం ఉంది. "దక్షిణాత్య బౌద్ధ శిల్పాలు కృష్ణా (ఇప్పటి గుంటూరు కూడా) జిల్లాలోని భట్టిప్రోలు, ఘంటశాల, గుడివాడ మొదలైన పురాతన స్తూపాలు" అన్న పేరుతో 1894లో రీ ప్రచురించిన నివేదిక ఈనాడు ఎక్కడా దొరికేటట్టులేదు. నాకు మాత్రం అదృష్టవశాత్తూ ఒక ప్రతి ఈ మధ్యనే పూనాలో లభించింది. ఇల్లాంటి ఉద్గ్రంథ భాగాలను

విస్తృతంగా ఉటంకించాలన్న కుతూహలాన్ని అణుచుకోవటం కొంత కష్టమైనా, ఈ కొద్ది విషయాలు మాత్రమే చెప్పి వదిలేస్తాను. భట్టిప్రోలు వద్ద బౌద్ధపవిత్రాస్థికలున్న రెండు పాత్రలను రీ సంపాదించగలిగాడు. గుడివాడ దిబ్బనుంచి, ఒక గుట్ట ప్రశస్తమైన ప్రాచీన నాణాలు సంపాదించగలిగాడు. అక్కడ దొరికిన వాట్లలో ఒక విచిత్రమైన నాణెం కూడా ఉంది. "ఒకటి గ్రీచుదో, రోమ్‌దో, తెడ్లపడవ, పైతట్టు అర్ధచంద్రాకారంగా ఉండి రెండు తెరచాప కొయ్యలున్న పడవ బొమ్మ ఉన్న నాణెం" దొరికింది. ఇలాంటి వాట్లను త్రవ్వితీసి వెలవర్చిన 'రీ'గారు మన కృతజ్ఞతాభివందనములకెంతయూ పాత్రుడు. ఘంట శాలలో పాలరాతి బొమ్మలను తవ్వితీశే అవకాశం వీరికి కల్గ నందుకు విచారించవలసిందే. అది ఎట్లా జరిగిందోకూడా ముందు చెప్తాను.

భట్టిప్రోలు, గుడివాడలలో శిల్ప విశిష్టతలేమన్నా ఉండి ఉన్నాయా అన్నది సందేహాస్పదమైన విషయమే అయినా ఘంటశాల విషయంలో ఈ అనుమానం అక్కరలేదు. ఘంటశాల మచిలీపట్టణానికి పడమరగా పదహారుమైళ్ళ దూరంలో ఉన్న గ్రామం. కొద్ది ఏళ్ళక్రితం నేనీ ఊరు వచ్చినప్పుడు, స్థూప ప్రాకారంలో రాళ్ళు ఇంకా కొన్ని నిలిచి ఉన్నవి చూశాను. వాట్లమీద సునిశితంగా చెక్కిన ధర్మచక్ర చిత్రాలున్నాయి. ఘంటశాల అసలు పేరు కంటకశైలమని చెప్తారు. నిజానికి 'టోలెమి' కూడా దీన్ని 'కొంటోకొస్సిల' అని పేర్కొన్నాడు. బుద్ధదేవుని అశ్వరాజమైన "కంటకం" పేర ఇది కట్టబడిందని అనుకొంటున్నారు. కంటక చిత్రం ఉన్న కుడ్యశిల్ప భాగం, ఘంటశాల నుంచి తెచ్చినది మద్రాసు మ్యూజియంలో భద్రపరచబడి ఉంది. ఘంటశాల శిలలు మరికొన్ని పారిస్‌లో మ్యూజిగయ్‌మెట్‌లో వున్నాయి. 1954లో నేను పారిస్ వెళ్ళినప్పుడు ఈ శిథిలాలు చూశాను. ఒక పాలరాతి చెక్కడంలో మూడంతస్థుల మందిరమూ భక్తులూ చెక్కబడ్డారు. మరొక చెక్కడంలో పుత్రజనన వార్తవిని ఆనందపరవశుడైన శుద్ధోదనుడు చిత్రించబడ్డాడు. మూడవ దానిలో భార్యపుత్రులను విడనాడి బైలుదేరటానికి నిశ్చయించుకొన్న సిద్ధార్థుని బొమ్మ చెక్కి ఉంది.

బ్రిటీష్ మ్యూజియం ప్రాచ్యవస్తుశాఖ అసిస్టెంటు కీపర్ అయిన డగ్లస్ బారెట్‌గారి అభిప్రాయం ప్రకారం, ఘంటశాల శిల్పాలలో కల్లా ముఖ్యమైన చెక్కడం బోస్టన్‌లో ఉంది. ఆ రాతిపలకకు రెండువైపులా చిత్రాలు చెక్కి వున్నాయి. "ఒక వైపున అమరావతి రాళ్ళలో మాదిరిదైన ఒక స్థూపం సంపూర్ణ చిత్రం చెక్కబడి ఉంది. రెండవవైపు, నిరంజన నదీతీరాన బుద్ధుని విగ్రహం చెక్కబడి ఉంది. ఎడమ మూలపైగా స్తంభం ముక్క కనబడుతుంది" రెండువైపుల చెక్కబడి వుండటమే ఈ శిల ప్రాముఖ్యమూ, నాకు తెలియదు. కాని ఘంటశాల వద్ద స్థూపం చాలా పెద్దదై ఉండటమే కాకుండా, ఆంధ్రలోకెల్లా చాలా ప్రముఖమైనదని కూడా నేను నమ్ముతున్నాను. ఘంటశాల శిల్పరీతులు అమరావతీశిల్పరీతితో తులతూగుతూ ఉంటవి. ఘంటశాలలో దొరికిన బుద్ధ విగ్రహం శిరస్సు, కొన్ని విధాలలో చూస్తే అమరావతీ నాగార్జున కొండ విగ్రహాల కన్నా చాలా శిల్ప విశిష్టత కలదని నా అభిప్రాయము. ఈ ముఖంలో ఎక్కువ ప్రశాంతత ఎక్కువ గాంభీర్యం ద్యోతకమౌతున్నాయి. పెదవుల చిరునవ్వు రేయి తొలిజామున ఆకాశంలో మిలమిలాడుతూ నిశీథాన్ని మరింత రమణీయంగా తోపింపచేసే, నెలవంక రూపంలో వుంటుంది.

ఘంటశాల శిల్పాలు మనకు శాశ్వతంగా కాకుండా పోవటం చాలా విషాదకరమైన విషయం. ఈ పల్లెలో 1890లో పరిశోధన సాగించిన రీ, ముఖ్యస్తూపం పైననే తన దృష్టిని కేంద్రీకరించాడు. ఈ పాడుబడిన దిబ్బనే స్థానికులు 'లంజదిబ్బ' అని పిలుస్తారు. ఒక్క ఘంటశాలలోనే కాదు గుడివాడ, భట్టిప్రోలు, చినగంజాం, మరికొన్ని స్థలాల్లోకూడా, ఈ శిథిల ప్రదేశాలను లంజదిబ్బలనీ, భోగమాళ్ళ దిబ్బలనీ పిలవటం శోచనీయమైన విషయమే. ఇలా పిలువబడనిది నా ఎరుకలో ఒక్క అమరావతి స్తూపం మాత్రమే.

స్థానికంగా దానికి దీపాల దిబ్బని పేరుంది. కాని ఈ దీపాల సందర్భం కూడా గౌరవనీయంగా వచ్చినట్లు కనిపించదు. బౌద్ధ స్థలాల దిబ్బ లెక్కడెక్కడున్నాయో అక్కడి దిబ్బమీద లంజె దీపంతో సంజ్ఞ చేసేదని కథ చెప్పుకుంటారు. చివరి దశలో బౌద్ధ అనుయాయులు ఎంత హీనస్థితిలోకి దిగజారారో ! వజ్రమాన సహజమాన కాలాలలో తాంత్రిక మతాలతో బౌద్ధం దిగజారుటచే ఈ పేరు వచ్చినదని అనుకోవచ్చు. లేదా హైందవమత తీవ్రవాదులు బౌద్ధారామాలను అణగద్రొక్కటంతో ఈ చెడ్డపేరులు కల్పించైనా వుండవచ్చును. నేను ఈ రెండవ అభిప్రాయాన్ని నమ్ముతున్నాను.

కాని అసలు విషయం వదిలి వెళ్తున్నట్టున్నాను. అంటే ఘంటశాల వద్ద, రీ త్రవ్వితీసిన పురావస్తువుల విషయం. ముఖ్య స్థూపం యొక్క వైశాల్యం ఆయన్నాకర్షించింది. అందులోనే ఎక్కువ పరిశోధనలు కావించారు. అందులో పాలరాతి చెక్కడాలు దొరకలేదు. అస్థి నిక్షేప పాత్ర స్థూప పునాదులు మాత్రం బైటపడ్డాయి. అసలిందులో పాలరాతి శిల్పాలు ఉండి ఉండకపోవచ్చును. నిజానికి ఘంటశాల శిల్పాలన్నీ, కోటదిబ్బలో వున్నాయి. రీ ఇది కూడా ఉల్లేఖించే వుంటాడు. ఇదేకాక పొలిమేర దిబ్బ అనే మూడవ దిబ్బ కూడా ఆ ప్రక్కలనే వుంది. కోట దిబ్బ విషయం రీ ఇలా వ్రాశాడు. దక్షిణాన ఊరి పొలిమేర సమీపంలో ఒక చిన్న చెరువుగట్టునానుకొని ఒక చిన్న దిబ్బ ఉంది. ఇటునుంచి అటు 70 అడుగుల వ్యాసం వుండి దాదాపు గుండ్రంగా వుంటుంది. ఇటుక రాతి పునాది గోడలు అక్కడక్కడ కనబడతాయి. రబ్బేసంతటా అలముకొని వుంది. ఇదికూడా ఒక స్థూల శిథిలం అయి వుండవచ్చును.

రీ గారు ఒక పెద్ద పరిశోధన చెయ్యగల ఆస్కారాన్ని ఇక్కడ చెయిజార్చుకున్నారు. తర్వాత 1920లో ఒక రైతు పొలం దున్ను కొంటూ, ఈ కోట దిబ్బ అంచున దున్నుతూంటే దాదాపు 60 శిల్ప శిలలు బైటపడ్డాయి. ప్రతిఒక్కటి శాక్యముని జీవితాన్నో, జాతకకథలనో వర్ణించే చెక్కడపు పనితో నిండి ఉంది. ఆ ఊరి పెద్దలు కొందరు నాకు చెప్పిన కథ ప్రకారం, కొన్నాళ్ళు ఈ రాతి ఫలకాలు గుట్టగా ఒక చెట్టుక్రింద పడేసి వుంచారట. పుదుచ్చేరి నుంచి యం.జి. జోలియస్‌డూ బ్రెయిల్‌గారి ఏజెంటు ఒకడు వచ్చి చూచి గప్‌చిప్‌గా ఈ రాళ్ళ మొత్తం అంతా 5000 రూపాయలకు కొనుక్కుపోయాడు. ఈవిధంగా ఘంటశాల శిల్పనిధులు శాశ్వతంగా మన చెయ్యిజారి పోయి పారిస్ మ్యూజిగుయ్‌మెట్ చేరాయి.

ఆంధ్రలో తక్కిన బౌద్ధస్థలాలను సందర్శించనందువల్ల వాట్లను గురించి స్వంత అభిప్రాయాలను వెల్లడించలేను. అయితే ఈ మధ్యనే శాలిహుండం వద్ద మళ్ళీ త్రవ్వకపు పరిశోధనలు సాగిస్తున్నారనీ, వంశధార దక్షిణపు ఒడ్డున శ్రీకాకుళంలో కూడా పురాశిథిల పరిశోధనలు జరుగుతున్నాయని చెప్పవలసి ఉంటుంది. ఇక్కడ కొన్ని ముఖ్యమైన వస్తువులు దొరికాయని క్రొత్త క్రొత్త విషయాలు వెలుగులోకి వస్తున్నాయనీ కూడా తెలిసింది. అనేక స్థలాలలో మట్టి దిబ్బల అడుగున మాటుపడిపోయి ఆంధ్రలో కాషాయవస్త్రం కలాధేయమై వెలసిన నాటి శిల్ప విశేషాలు శిథిల వస్తువులు మగ్గిపోయి వున్నాయనే, నేను విశ్వసిస్తున్నాను.

నేను జన్మచే గాని, సిద్ధాంత స్వీకృతివల్లగాని బౌద్ధుడను కాను. కాని ఆంధ్రలోని బౌద్ధ శిల్ప కళావిశేషాన్ని చూచి, దేశకాల ప్రాంతాలకు చివరికి ఆ మతానికి కూడా సంకుచితంకాని, నైసర్గిక భారతీయ శిల్పకళా విశేషానికి, వైదగ్ధ్యానికి గర్వపడుతున్నాను. ఒక్క భారతదేశానికే కాక సర్వ ప్రపంచానికి కూడా,ఇది ప్రాచీన దత్తమయిన మహా నిక్షేపమని ఒప్పుకోక తప్పదు. ఈ కళ, జాతి, దేశ, కాల పాత్ర అవధులను అతిక్రమించి విస్తరించింది. క్రైస్తవ శకోదయ కాలంలో కృష్ణానదీ తీరాన ఉద్భవించిన ఈ మహాశిల్పకళ 2000 ఏళ్ళ క్రిందట ఆసియా ఖండంనంతనూ విమోహితమొనర్చిఉగ్రూతలూగించినట్లుగానే ఈనాటికీ మనని ఆకర్షించి,తన ప్రభావంతో మనలను ముంచెత్తుతుంది.

అమరావతి కేంద్రంగా, ఈ జ్యోతిర్మాల దూరదూరాలకు తన వెలుగును ప్రసరింపచేసింది. సముద్రాలను తరించి,సౌత్‌ఈస్ట్ ఏషియా శిల్పులపై తన ప్రభావం ప్రకటించింది. డాక్టర్ రెజినాల్డు లీమే రచించిన "ఆగ్నేయ ఆసియా సంస్కృతి" అన్న గ్రంథంలో ఇలా వ్రాయ బడి ఉంది. "అమరావతి శిల్ప ప్రభావం, సింహళం, మధ్య దక్షిణాసియాలలో విస్తరించి దక్షిణాన సుమత్రా వరకూ కూడా వ్యాపించింది.

ఈ మధ్య వెలువడిన "భారతీయ కళా శిల్పం" అన్న గ్రంథంలో కూడా మిస్టర్ బెంజమిన్ రౌలండు ఈ అమరావతీ శిల్ప ప్రభావాన్నే వర్ణించాడు."ఆంధ్ర సామ్రాజ్య ప్రభావం సాంస్కృతిక, వాణిజ్య, మత, సంబంధబాంధవ్యాల వల్ల, చాలా విస్తృత భూఖండంలో వ్యాపించింది. అమరావతి శిల్పరీతి సింహళంలో వ్యాపించటమే కాకుండా, రెండు మూడు శతాబ్దాలనాటి బుద్ధవిగ్రహాల ఆంధ్ర శిల్ప శైలి, చంపా (నేటి ఇండోచైనా)లో డోంగ్ డువాంగ్, సెలిబీస్‌లోని పెంపగా వరకూ కూడా విస్తరించుకుని వచ్చింది. ఈ డోంగ్ డువాంగ్ మండలానికి కూడా అమరావతి పేరుండటము కేవలం కాకతాళీయమే అంటారా?

నిజానికి అమరావతి, నాగార్జునకొండ, సాంస్కృతిక యుగం భారతీయ కళలో ఒక స్వర్ణయుగం. దాని ప్రభ, ఏ ఒక్క కుడ్య శిల్ప శకలం మిగిలి ఉన్నా అది కుల, మత, వర్ణ విచక్షణలు, దురాగతాలు, క్రౌర్యాలు లేక ద్వేష సంఘర్షణల కతీతమైన ఒక పరమాదర్శయుతమైన సంఘ నిర్మాణానికి మనను ప్రేరేపిస్తూ,ప్రబోధకంగా మిగిలి ఉంటుంది.

*(బుద్ధ జయంతి మహోత్సవ సంచికలోని ఆంగ్ల వ్యాసానికి తెలుగు అనువాదం)*

---

*హే గంగ హే గంగ హే మంగళతరంగ*
*ఇల కృష్ణవేణివై అవతరించి*
*చెలువారు గగనగంగ*
*పాపములన్నియు తొలుగంగ*
*పరమ పవిత్రత గలుగంగ*
*కరుణించగదె సురగంగ*

*-వెల్దండ సత్యనారాయణ*

శ్రీ లంక వెంకటరమణ

# దివిలో సాలంకాయనులు

ప్రాచీన కాలంలో వేంగీ దేశాన్నిపాలించిన రాజవంశాల్లో సాలంకాయన వంశం ముఖ్యమైనది. వేంగి దేశం అంటే స్థూలంగా నేటి కృష్ణా, గుంటూరు,పశ్చిమగోదావరి జిల్లా, తూర్పుగోదావరిలో కొంత భాగం. వేంగి దేశానికి రాజధాని పెదవేగి. ఏలూరు సమీపంలో నేడు దీనంగా కనిపిస్తున్న కుగ్రామం. ప్రాచీన చరిత్రను చాటి చెప్పే ఏవేవో శిధిలాలు మాత్రమే మిగిలిన, ఎవరికీ పట్టని పల్లెటూరు.

ఇక్ష్వాకుల తరువాత, విష్ణుకుండినులకు పూర్వం అనగా ఇంచుమించు 2వ శతాబ్దం నుంచి 150 సంవత్సరాలపాటు వేంగిని పాలించిన ఈ రాజవంశానికి మూలపురుషుడు విజయదేవవర్మ. ఆయన కుమారుడు హస్తివర్మ. హస్తివర్మ కుమారుడు మొదటి నందివర్మ. మొదటి నందివర్మ కుమారుడు చండవర్మ. ఆయనకు రెండవ నందివర్మ, స్కంధ వర్మ అనే ఇద్దరు కుమారులు ఉన్నారు.

సాలంకాయనుల శాసనాలు ఆరు ఉన్నాయి. వాటిలో దాన సంవత్సరాలుగానీ, శకవర్షాలుగాని లేవు. పరోక్ష ప్రమాణాలతో కాల నిర్ణయం జరిగింది. ఎవరికి తోచిన సిద్ధాంతం వారిది. మొత్తం మీద వీరంతా కలసి 150 సంవత్సరాల పాటు పాలించినట్టు అందరూ అంగీకరిస్తారు. వీరి పాలనలో దేశం అన్ని విధాలా అభివృద్ధి సాధించింది. శాలంకాయనులు పాలనా సౌలభ్యానికి తమ దేశాన్ని నేడు మనం రాష్ట్రాలు అనుకున్నట్టు విషయాలుగా విభజించుకొన్నారు. మొత్తం దేశమంతా రెండువిషయాలుగా విభజితమయ్యాయి. ఒక విషయానికి 'రాజధాని' నేడు మనం పిల్చుకునే కోడూరు. ఆ రోజుల్లో 'కూడూరు' అనే వాళ్ళు. నేడు మన రాష్ట్రం 'ఆంధ్రప్రదేశ్' అన్నట్టుగా మొత్తం ఒకనాటి బందరు, దివి, కైకలూరు, గుడివాడ తాలూకాలు కలిసిన ప్రాంతాలను కలిపి 'కూడూరు విషయం' అనే వాళ్ళు.

ఆ రోజుల్లో సూర్యారాధన ఎక్కువగా ఉండేది. వారి కాలంలో శైవ, వైష్ణవ మతాలు, చాలా ప్రబలంగా ఉండేవి. వీరి కాలంలోనే చైనా యాత్రికుడు, హుయాన్ సాంగ్ వేంగి దేశంలో పర్యటించి 30 హిందూ దేవాలయాలు, అరవై బౌద్ధ విహారాలు ఉన్నాయనీ, జైనుల ఉపశ్రమా కనిపించాయని తన డైరీలో వ్రాసుకున్నాడు. అప్పటికే ఘంటసాలలో బౌద్ధ స్తూపం ఉండేది. దీనిని బట్టి జైన, బౌద్ధాలు రెండూ కూడా ప్రబలంగా ఉండేవనుకోవచ్చును. కూడూర విషయంలో గుడివాడ, ఘంటసాల, లక్షీపురం ఇప్పటివరకు రూఢమైన బౌద్ధ క్షేత్రాలు కాగా పెదకళ్ళేపల్లి, చిరువోలు గ్రామాలను కూడా కలుపుకోవచ్చును. నేటి కోడూరులో శాలంకాయనుల కాలంనాటి ఏనేవో శిధిలాలు హుయాన్ సాంగ్ పర్యటలో బయట పడినట్టు చరిత్రకారులు వ్రాశారు.

ఈ రాజవంశం చరిత్ర తెలుసుకొనడానికి ఇంతవరకు ప్రకటిత మైన అయిదారు శాసనాలు ఆధారంగా ఉన్నాయి. సముద్రగుప్తుడు అలహాబాద్‌లో వేయించిన శిలా శాసనంలో వేంగీ రాజైన హస్తివర్మ గురించి చెప్పాడు. రెండవది విజయదేవ వర్మ ఏలూరు శాసనం. ఇందులో లిపి ప్రాచీన పల్లవ లిపిలాగా ఉంటుంది. ఈ విజయవర్మకు గురువు చిప్పభట్టు. శైవమతావలంబి. సూర్యభక్తుడు. సూర్యుడిని చిత్రరథస్వామి అనేవాళ్ళు. అశ్వమేథ యాగం చేశాడు కనుక బ్రాహ్మణుడు అనడానికివీలులేదు.

మూడవ ఆధారం సాలంకాయన మహారాజు విజయ నందివర్మ నేటి కొల్లేరులో వేయించిన తామ్రశాసనం ఈయన మహారాజు చండవర్మ కుమారుడు. నాల్గవ ఆధారం మహారాజశ్రీ నందివర్మ పెదవేగి తామ్రశాసనం. ఈయన హస్తివర్మ మనుమని కుమారుడు. నందివర్మ మనుమడు. చండవర్మకు పెద్దకొడుకు. పరమ వైష్ణవుడు. అధికారంలోకి వచ్చిన దశమ వర్షికోత్సవం చేసుకొన్నాడు. ఆ సందర్భంగా విష్ణుస్వామికి నాలుగు గ్రామాలు దానం చేశాడు. ఆ నాలుగు గ్రామాలేవో తెలియవు.

మహారాజ నందివర్మ (రెండవ) కంతేరులో తామ్రశాసనం వేయించాడు. ఈయన కూడా పరమ భగవతుడే కాదు చిత్రరథస్వామి

పాదానుధ్యాతుడు. ఈయన తన కుల, గోత్ర, యశో, ధర్మాభివృద్ధి కోసం కోడూరు, బందరు మధ్యలో ఏదో గ్రామాన్ని మౌద్గల్యసగోత్రుడైన స్వామి చంద్ర అనే బ్రాహ్మణుడికి పన్నెండు నివర్తనాల భూమిని దానంగా ఇచ్చాడు. నివర్తనం అంటే ఒక్కరోజులో ఎంత మేరకు వృత్తాకారంలో చుట్టు తిరిగి రాగలడో (కాలినడకన) అంత భూమి అంటారు. అలాంటి పన్నెండు నివర్తనాల విస్తీర్ణం గల భూమిని స్వామి చంద్రునికి దానం చేశాడు. రోజులు నలభైమైళ్ళ చుట్టుకొలత గల వృత్తాకార భూమిని చుట్టి రావచ్చుననుకొంటే 480 మైళ్ళ విస్తీర్ణం గల వ్యాస భూమిని దానం చేసి ఉండాలి.

ఈ లెక్కల గజిబిజి ఎందుకుగానీ కురునివాడ గ్రామం గుడివాడ ప్రాంతంలోనిదని కొందరు అంటే కాదు కోడూరు సమీపంలోని గ్రామమని మరికొందరంటారు.

## వేకనూరు గొప్పతనం :

ఇక అయిదవ ఆధారం – దివి ప్రాంతానికి అవసరమైన ఆధారం. మహారాజు విజయస్కంధ వర్మ వేయించిన కంతేరు శాసనం. ఈయన కూడా చిత్రరధ స్వామి పాదానుద్యాతుడు అధికారంలోని వచ్చిన వెంటనే తన కుల,గోత్ర, వంశ, సమస్త ప్రజానీక శాంతి, అభ్యుదయాలను కోరుతూ వేకునూరి గ్రామ వాస్తవ్యుడు మౌద్గల్యస గోత్రీకుడగు శివార్యునికి చిన్నాపురం అనే గ్రామాన్ని దానం చేశాడు. చిన్నాపురం నాడు కూడూరు విషయంలోని గ్రామం. నేడు బందరు సమీపంలోని చిన్నాపురమే. ఇక దాన, గ్రహీత అయిన శివార్యుని స్వగ్రామం వేకునూరు. ఇది ఖచ్చితంగా నేటి వేకనూరు. నేటి వేకనూరులో లభించిన శాసనంలో వేకునూరుగా పేర్కొనబడింది. ఈ గ్రామం కొంత కాలం వరకు వేకునూరుగా చరిత్రలో నిలిచింది. వేకునూరు చెరువులో లభించిన సూర్యయంత్రం అతి ప్రాచీనమైనది. ఈ యంత్రాన్ని ఎవరు సేకరించారో గాని బ్రిటీష్ మ్యూజియంకు తరలిపోయింది. ఆ యంత్రం క్రింద సంస్కృతంలో వ్రాసిన నాలుగు లైన్లు దివి ప్రాంతంలో సూర్యారాధన ఉండేదనడానికి ఆధారం వేకనూరి వాస్తవ్యుడు, మౌద్గల్యస గోత్రజుడు శివార్యుడు నిర్మించిన తిధివార నక్షత్ర శుభాశుభాలకు సూచిక అని చెక్కబడి ఉంది. అనగా నేడు మనకు అరచేతిలో పట్టే వెయ్యి సంవత్సరాల కాలెండర్ లాంటిదన్న మాట. ఈ సూర్యయంత్రం అంతకంటే గొప్పది. సంవత్సరం, నెల వారం మాత్రమే నేటి క్యాలెండర్లు సూచిస్తే ఈ యంత్రం సంవత్సరం, మాసం, వారం, తిధి, నక్షత్రాలను కూడా సూచించే అత్యద్భుతమైన యంత్రం, అయితే శక ప్రమాణం ఏదో తెలియదు.

దీనిని బట్టి తేలేదేమంటే ఆ రోజుల్లో అత్యంత అద్భుతమైన ఖగోళ, గణిత, జ్యోతిష సిద్ధాంతవేత్తలు దివి ప్రాంతంలో ఉండేవాళ్ళు. బహుశా వేకునూరు గ్రామం అలాంటి పండితులకు నెలవేమో! సాలంకాయన మహారాజులు అలాంటి పండితులను పోషించారన డానికి కంతేరు శాసనం నిదర్శనం.

సంస్కృత వాఙ్మయంలో శాలంకాయన పద ప్రశంసవుంది. పాణిని గణపాఠంలో ఈ పదం గురించి చెప్పాడు. టాలెమీ రెండవ శతాబ్దంలో మన దేశం వచ్చి విస్తృతంగా పర్యటించగా బందరు (మైసోలస్) ప్రాంతంలో 'సలికనోయ్' అనే వారుండేవారని వ్రాశాడు. ఈ సలకనోయులే సాలంకాయనులని మారేమండ రామారావుగారి మతం. దీనిని బట్టి క్రీస్తుశకం 2వ శతాబ్దానికే కృష్ణానదీ ముఖద్వారమైన కోడూరు ప్రాంతంలోను, బెంగోరన్ (నేటి పెదవేగి) ప్రాంతంలో సాలంకాయనులు ఉండేవారని చెప్పవచ్చు.

## ఎవరీ సాలంకాయనులు ?

ఇంతకూ సాలంకాయనులు ఎవరు? ఇది చాలా సున్నితమైన ప్రశ్న. చాలా మంది మనసులను కష్టపెట్టే సమాధానాలు వస్తాయి. కొందరు సహజంగానే మురిసిపోతారు. సాలంకాయనులు బ్రాహ్మణులని అంటారు కొందరు. అలాగే అనిపిస్తుంది కూడా.యజ్ఞ యాగాది క్రతువులు చేసే అధికారం బ్రాహ్మణులకు ఉంటుంది. కాని అశ్వమేధ యాగం చేసే అధికారం మాత్రం లేదు మరొకరితో చేయించవచ్చు. విజయదేవ వర్మ అశ్వమేధం చేశాడు. అయితే ప్రవర చూస్తే అంగీరస బార్హస్పత్య భారద్వాజ ప్రవరలోని భారద్వాజ గణానికి చెందిన వాడు కావడం చూస్తే బ్రాహ్మణుడనిపిస్తుంది. వాస్తవానికి క్షత్రియ వంశాల్లోనూ ఇక్ష్వాకుల పాలన అనంతరం క్షత్రియులలో ఇలాంటి ప్రవర కూడా కనిపిస్తుంది. ఇక్ష్వాకులే సాలంకాయనులుగా మారివుంటే ఇక్ష్వాకు వంశజుల ప్రవరే సాలంకాయనులకు కూడా వర్తిస్తుంది. ఇక్ష్వాకులలో అంగీరస, బార్హస్వత భారద్వాజస ప్రవర వినిపిస్తుంది. కనుక సాలంకాయనులు మాజీ ఇక్ష్వాకులని ఊహించిన పండితులున్నారు.

సలకనోయులు పొడవైన దారాలా తీసి మెడలో అలంక రించు కొనేవారట. అంటే యజ్ఞోపవీతాలై ఉంటాయి. బ్రాహ్మణులలో ఎవరి యజ్ఞోపవీతాలు వారే తయారు చేసుకోవడం అన్నది అసలు సాంప్రదాయం. దీనినే సూత్ర యజ్ఞం అంటారు. కొందరు నైష్టికులైతే తమ ధోవతులను పంచెలను కూడా తామే నూలు వడికి నేయించు కుంటారు. అధ్యయన, అధ్యాపనాలతో, త్రేతాగ్నులను వేలార్చడానికి తీరిక లేని వారికి బట్టలు నేసే వ్యవధి ఉండదు. ఈ పవిత్రమైన పనిని పద్మశాలీయులకు అప్పగించారు. ఈ పద్మశాలీయులే శాలం కాయనులని కొందరు అంటారు. ఈ పద్మశాలీయులనే 'సాలె' వాళ్ళు అని అంటారు. సాలెలన్నా, శాలీయులన్నా, పద్మశాలీలన్నా ఒకరే. వారే సాలంకాయనులు, వీరికి కూడా యజ్ఞోపవీతం ధరించే సంప్రదాయం ఉంది. వీరి గోత్రాలు కూడా బ్రాహ్మణ ప్రవరలాగానే

ఉంటాయి. మరీ ఈ పద్మశాలీలే అధికారంలోకి వచ్చినపుడు యజ్ఞయాగాది క్రతువులు చేశారేమో!

గమనించండి పద్మశాలీయులకు తాము బ్రాహ్మణులతో సమానమన్న నమ్మిక ఉన్నది.బ్రాహ్మణ పరమైన యజ్ఞోపవీత ధారణ కనిపిస్తుంది. బ్రాహ్మణులలో వలె, క్షత్రియులలోవలె పద్మశాలీయుల చెవులకు పోగులు కనిపిస్తాయి. క్షాత్రవుల ఆహారపు అలవాట్లు కనిపిస్తాయి.

ఏతావాతా తేలేదేమంటే టాలమీ చెప్పిన సలకనోయిలు బ్రాహ్మణులే అయితే ప్రత్యేకించి సలకనోయిలు ఉన్నారని చెప్పనక్కరలేదు వారిని బ్రాహ్మణులుగా గుర్తించి చెప్పవచ్చును. బ్రాహ్మణులవలె. ఉన్నట్టు గుర్తించి, బ్రాహ్మణులు కారని తెలిసి, మరెవరో అయి వుంటారని భావించి సలకనోయిలుగా చెప్పారు. కనుక నేడు దివి సీమలో కనిపించే పద్మశాలీ కులం ఒకప్పుడు శాలంకాయన వంశీయులు కావచ్చును.

బట్టు ఇంటిపేరు పై మరొకఊహ. భట్టు పదాంతంగా ఉన్న బ్రాహ్మణుల పేర్లు చాలా ఉన్నాయి. నిజానికి వేద శాస్త్రాలలో పండితులైన వారికి బిరుదనామంగా 'భట్టు' చేర్చుతారు. కేశవభట్టు, రామాభట్టువలె ఈ గ్రంథంలోనే చిరువోలు శాసనం గురించిన ప్రస్తావనలో భట్టు పదాంతమైన బ్రాహ్మణుల పేర్లు అసంఖ్యాకంగా వచ్చాయి. అయితే నేడు భట్టు అనిపేరు తగిలించుకొన్నంత మాత్రాన వేదపండితులు కావలసిన పనిలేదు. సాంప్రదాయికంగా వస్తాయి. కొన్ని సందర్భాల్లో పదాంతనామాలు ఇంటి పేరుగా మారతాయి. ఉదాహరణకు లక్ష్మణ సోమయాజులు, కృష్ణ సోమయాజులు, వారుగాని, వారివంశంలో గాని యజ్ఞం చేసి సోమయాజి కావచ్చు. నన్నయగారు మహాభారత రచనకు ఉపక్రమించడానికి ముందు యజ్ఞం చేసి నన్నయ సోమయాజి అయ్యాడు.

మరి 'సోమయాజుల' ఇంటి పేరుగల వారున్నారు. రామావధాని, సుబ్బావధాని వంటి పేర్లు అంతే. వేదంలో అవధానులైన వారు తమ పేరు చివర అవధాని అని చేర్చుకుంటారు.అయితే నామాంతమైన ఈ 'అవధాని' శబ్దం కొందరికి గృహనామమైంది. అలా వచ్చిందే 'అవధానుల' ఇంటిపేరు.

ఇక వేదపండితులైన 'భట్టు'లలో కూడా ఇలానే జరిగింది. భట్టు ఇంటిపేరు కూడా ఇలా నిష్పన్నమైనదే. అయితే బ్రాహ్మణులలో కొందరు తమ ఇంటికి 'శౌద్రముద్ర' పడుతున్నదన్న జుగుప్సతో భట్టుకు విశేషణాలు చేర్చి కొత్త ఇంటిపేర్లు సృష్టించారు. ఉదాహరణకు భాస్కరభట్ల, సోమాభట్ల, రామాభట్ల ఈ ఇంటిపేర్లు తరువాత అసలు పేర్లు వస్తాయి. చిరువోలు శాసనం చూడండి.

బ్రాహ్మణులకు ద్వితీయ శక్తిగా రూపొందిన సాలం కాయనులను అప్పటి బ్రాహ్మణులు గౌరవించితే గౌరవించి ఉండ వచ్చును. గౌరవించారు కూడా, అయితే క్రమంగా బ్రాహ్మణ లక్షణాలను వదిలివేసి, క్షీణించిన క్షాత్రాన్ని అవలంభిస్తూ పద్మ శాలీలుగా, సాలెవాళ్ళుగా మారారు. ఏనాడో 'భట్టు' ఇంటి పేరుగా స్వీకరించి 'భట్టు' వాళ్ళయ్యారు. అయితే ముఖయంత్రాన్ని బట్టివల్ల గానీ, ఇతరేతర కారణాలవల్లగాని 'భట్టు' పదాంత ఉచ్చారణలో 'బట్టు'గా మారింది. అనగా శాలంకాయనులు శాలీలు, సాలీలై వారిలో కొందరు 'భట్టు'లు కాస్తా 'బట్టు' వాళ్ళయ్యారు.

సాలంకాయనులకు పల్లవులకు సన్నిహిత సంబంధా లున్నాయి. పల్లవులు కృష్ణానదీ తీరం వరకు అంటే నేటి గుంటూరు జిల్లా అంతటి వరకు తమ పాలన సాగించారు. వీళ్ళ శాసనాలు బెజవాడలో కూడా ఉన్నాయి. పల్లవుల వలెనే సాలంకాయనులు భరద్వాజ గోత్రీకులు. పల్లవుల పేర్ల చివర 'వర్మ' అని ఉన్నట్టే సాలంకాయనులు కూడా వర్మాభిధులే! ఇరువురు తమ శాసనాలపై నంది ముద్ర వేసిన వారే! ఈ రెండు వంశాల్లోను నందివర్మ, స్కందవర్మ ఉన్నారు. ఏమో! సాలంకాయనులు పల్లవులు ఒకే వంశానికి చెందిన వారేమో!

ఆంధ్ర రాజులలో చివరివాడు చంద్రవాతి శాతవాహనుడు. ఆయన మరణించిన తరువాత సామంతులు స్వతంత్రులయ్యారు. అప్పటికి నాగులు దివి ప్రాంతంలో ప్రబలంగానే ఉన్నారు. వారితో కలసి వీరకూర్చ వర్మ పల్లవ రాజ్యాన్ని స్థాపించాడు. క్రీస్తుశకం 2వ శతాబ్దంలో బృహత్ ఫలాయన వంశజుడైన జయవర్మ కూడూరు విషయంలో కొన్ని గ్రామాలను బ్రాహ్మణులకు (దివిసీమలోని ఆ గ్రామాలేవో తెలియదు) దానం చేశాడు

మూడవ శతాబ్దం మూడవ పాదంలో బృహత్ఫలాయనులు దివిసీమ నుంచి శాలంకాయనులను పారద్రోలారు. బృహత్ ఫలాయనులలో జయవర్మ ఒక్కడే చరిత్రకారులకు తెలిసినవాడు. అతడి తరువాత బృహత్ ఫలాయనులేమయ్యారో తెలియదు.

విజయదేవ వర్మ అశ్వమేధయాగం చేశాడు. అశ్వమేధం చేశాడు కనుక రాజ్యవిస్తరణలో కృతకృత్యుడయ్యాడనవచ్చు. సాలంకాయన విజయదేవవర్మ బృహత్ ఫలాయన జయవర్మనో, లేక అతని సంతతిని వారినో జయించి కూడూరు విషయాన్ని స్వాధీనం చేసుకొన్నాడు.

కూడూరు విషయం ఎప్పుడు ఎవరి చేతులు మారి ఎవరి చేతులకు చిక్కినా శాలంకాయన రాజవంశం క్రీస్తు శకం 450తో అంతమైంది. ఇక శాలంకాయనుల పాలనకు సంబంధించినంత వరకు వారు చాలా చక్కని పరిపాలనా పద్ధతులు పాటించారు. కొల్లేరు శాసనం (అది కూడూరు విషం లోనిదే) లో సాలంకాయనులు దేశాభి

యుక్తక వల్లభరాజ పురుషులు. కంతేరు శాసనంలో "నియోగ నియుక్తాయోక విషయపతి మిత్రు' లని వుంది. అలాగే పెదవేగి శాసనంలో కూడా శాలింకాయన ప్రశస్తి ఉంది.

కల్నల్ ఫ్లీట్ సాలంకాయనుల రాజ్యపాలనపై అధ్యయనం చేశాడు. కొల్లేరు శాసనంలో పేర్కొన్న ఉద్యోగులు గవర్నరుగాని, మంత్రులుగానీ, మహారాజుకు సన్నిహితులుగాని అయివుంటారని వ్రాశాడు. వీరంతా విషయాధిపులు. కూడూరు విషయంలో 'రహస్యాధికృత్' అనే ఉద్యోగి ఉండేవాడు. అతడిని నేడు అంతరంగిక కార్యదర్శిగా పోల్చవచ్చును.

కూడూరు విషయంలో గ్రామాధిపతులను 'ములుద' అనేవారు. రహస్యాధి కృతులు ఉండేవారు. పలుకుబడిగల పౌరులను మిత్రులు అనేవాళ్ళు. ఏదైనా వివాదం వస్తే సాధ్యమైనంత వరకు ఎక్కడికక్కడే పెద్దమనుషులతోనే పరిష్కారమయ్యేది. అందుకే కావచ్చును. ఈ రోజుకు కూడా దివి ప్రాంతంలో ముఖ్యంగా గ్రామస్థులలో ఏదైనా తగాదా వచ్చినపుడు పెద్దమనుషులకు చెబుతా నంటాడు. 'ఏ పెద్దమనిషిని అయినా అడగండి' అంటారు. 'పెద్దమనిషి అయినా వాడెవ్వడూ అలా అనడు' అంటారు.

ఆనాటి వ్యవస్థలో రాజాదరణంగలవారిని, రాజుకు ఇష్టమైన వారిని వల్లభుడు అంటారు. రాజోద్యోగులను రాజ పురుషులు అనే వాళ్ళు.రాజుగారికి ప్రతినిధిగా వ్యవహరించేవారిని ఆయుక్తికుడు అనే పద్ధతి ఉండేది. మంత్రులను నియుక్తులనే వాళ్ళు. రాజ్యపరిపాలనలో ఒక ప్రత్యేక శాఖకు అధిపతిగా వ్యవహరించేవారిని నియోగులనేవాళ్ళు. కాలక్రమంలో వీళ్ళు చిన్నచిన్న ప్రాంతాలను చేజిక్కించుకొని స్వతంత్రులుగా వ్యవహరించేవాళ్ళు. కళ్ళను ప్రెగడ, ప్రెగ్గడ అనే వాళ్ళు. అలాంటి నియోగులు దివి ప్రాంతంలో ఉన్నారు. ఎల్లా ప్రగడ, మల్లాప్రగడ అనే ఇంటి పేర్లుగలవారున్నారు. విషయాధి పతిని నేటి జిల్లా కలెక్టర్‌తోనో లేదా గవర్నర్‌తోనో పోల్చవచ్చునని కల్నల్ ఫ్లీట్ అంటారు.

నేటి అధునాతన జీవితంలో మనుషుల ఆలోచనలలో జటిలత. సంక్లిష్టత ఉన్నట్టుగా ఆరోజుల్లో ఉండేది కాదేమో! రాగద్వేషాలు ఉండకతప్పదు. పెద్ద విషయాలలో తప్పక కానవచ్చేది. అందుకే రాజ్యాలు చేతులు మారినా ప్రజాజీవనం ప్రశాంతంగానే సాగిన రోజులవి.

సత్యభూమిధర సానుభాగంబుల
నాత్మజన్మంబున నందగించి
శ్రీశైలనాథు సుశ్రీపాదపర్యంత
సంచార పరిపూత చరిత మెరసి
వేదాద్రి నరసింహు వివిధార్చనా లబ్ధ
నైర్మల్య భావ సందర్భ మొనసి
అమరావతీశ్వరు నభిషేచన క్రియా
మహనీయ పుణ్యసంపదల మించి
కనకదుర్గా మహాదేవి కనుల తుదల
జాలువారిన సద్దయా లీల గనుచు
అఖిత భారతధాత్రికి అన్నధాత్రి
దివ్య కృష్ణానదికి తూర్పు తీరమందు

ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు

# దివిసీమ - దివ్యసీమ

దివ్యసీమగా, తమ ఆవాస ప్రాంతాన్ని దివిసీమవాసులుగా ఘనంగా చెప్పుకోవడం పరిపాటి. ఇది విన్న ఇతరులకు, ఎవరి ప్రాంతంపై వారికుండే సహజమైన మక్కువను దృష్టిలో వుంచుకుని చెప్పే సాధారణమైన వ్యవహారంగా భాసించడం కద్దు. నిజంగానే ఆ మాట అంటున్న ఇప్పటివారి, అంటే ఆ సీమవాసుల దృష్టి అలాంటిదే కావచ్చు కూడ. కారణమేమంటే ఎవరి జన్మభూమిని వారు ఘనంగా చెప్పుకోవడం సహజమే కనుక. కాని ఆ మాట – 'దివిసీ దివ్యసీమ అనే మాట' అక్షరాలా వర్తిస్తుందంటే అది అతిశయోక్తి ఎంతమాత్రం కాదు. దానికాకీర్తిని సంతరించి పెట్టిన వివిధ విషయాలు దానినే స్పష్టపరుస్తాయి. ఒక వ్యక్తియొక్క ఘనతకు ఆ వ్యక్తి ప్రతిభావ్యుత్పత్తులు నిదర్శనాఉలబి. అలాగే ఒక సమాజం, ఒకజాతి గొప్పదనాన్ని ప్రనతిబింబిచేవి వాటి నాగరికత, సంస్కృతులు, నిజానికివి రెండూ మూలంలో వ్యక్తినిష్ఠాలే. సమాజంలోని అసాధారణ ప్రతిభామూర్తులైన వ్యక్తుల కార్యకలాపాలు, వారి ఆలోచనాధోరణి, అందులో శ్రేయః, కాముకత్వం, వ్యక్తులపరంగా వారికి గొప్పదనాన్ని ఆపాదించి పెట్టడమేఆక, అవి మొత్తం సమాజాన్ని ప్రభావితంచేస్తాయి. అదే సమాజచైతన్యం., కాలక్రమలో వాటిని సంతరించిపెట్టి వ్యక్తులు కనుమరుగవుతారు. కాని సమాజపు నాగరికత సంస్కృతుల చాలు మూలాల్లో అంతర్గతంగా ఆత్మరూపంలో, దానిపై మనసుపెట్టిన వారి మనోనేత్రాలకు గోచరిస్తారు. ఎందరెందరి మహానుభావుల సదాశయాలు, వాటి ఆచరణల ఫలితమో మన ఈ నేటి సాంస్కృతిక జీవనవైభవం. అనంతమైన కాలభ్రమణంలో మన చరిత్రకందిన వ్యక్తులెందరో ! అందనివారు మరెందరో ! ఒక జాతి లేక ఆ జాతికి ఆశ్రయమైన ప్రాంతపు సంస్కృతీపరమైన నేపథ్యం ఇలా వుంటుంది. ఇది సమిష్టిలో చెల్లివచ్చేమాట. కాగా, జాతి విస్తారము, ఆ జాతికావాసమొసగిన భూభాగము అత్యంత విశాలము. అంత విస్తారము, విశాలమయిన భిత్తికలో అంతా, అంటే అన్ని ప్రాంతాలు, అందరు జనులు, ఆ జాతి, ఆ ప్రాంతపు సంస్కృతికి కారకులు కాకపోవచ్చును. కొందరు, కొన్ని ప్రాంతాలు, కొన్నింటికి కారకులుగా వచ్చును. ఉదాత్తములైనవి, అనుసరణీయములై యావత్ప్రాంతముచేత, అందలి జనానీకముచేత ఆచరింపబడతాయి. అట్టిది ఆ ప్రాంతపు సంస్కృతిగా ముద్రపొందుతుంది. ఆ జాతికి చెందని స్ఫురణకు అవి ఆనవాళ్లు అవుతాయి. ఆ ఆనవాళ్లు, ఆ జాతి నేర్చిన సంగీతం, నాట్యం, శిల్పం, కవిత్వం క్రీడలు మతం, నిర్మాణాలు, వివిధవృత్తులలో నైపుణ్యం, రాజకీయపుటెత్తుగడలు, సంఘసంస్కరణలు ఇలా నాగరిక మానవజీవనానికి ఎన్ని ముఖాలుంటాయో, అన్ని ముఖాలలో దర్శనమిస్తాయి. ఇదంతా ఎందుకు చెప్పవలసివచ్చిందంటే, ఈ నేటికాలంలో ఆంధ్రసంస్కృతి అని మనం దేనిని సంభావిస్తున్నామో, అలాంటిది ఏది మనోనేత్రానికి దర్శనమిస్తోందో దానంతటికీ కాకపోయినా, చాలా ఎక్కువ భాగానికి ఓనమాలు దిద్దిన సీమ దివిసీమ అయినపుడు మరి అది దివ్యసీమే కదా !

ఇంతకూ ఈ దివిసీమ ఎక్కడవుందంటారా ! పసిడిమాగాణాలతో మన ఆంధ్రదేశాన్ని తేజరిల్లచేస్తునవి మన పుణ్యనదులు. అందులో కృష్ణాగోదావరులు ముఖ్యమైనవి. ఎన్ని నదులు మన ఆంధ్రదేశంలో లేవు గనుక. అన్నింటికన్నీ ప్రముఖమైనవే. అయితే కొంత భూభాగానికి జిల్లాల పేర్లుగా తమ పవిత్ర నామాలనిచ్చినవి ఆ రెండే కృష్ణ ! ఎంత పవిత్రనామం. ఎక్కడ పుట్టింది. ఏ దేశంగుండా ప్రవహించి, తన పవిత్రజలాలతో పునీతం చేసింది. మానవ నాగరికతా సమస్తానికి మూలం నదులు గదా ! అందుకే భారతీయుల దృష్టిలో అవి కేవలం నీటి ప్రవాహాలు కావు. తమ జీవితాలకు ఏడుగడగా భావించుకున్నారు. అందుకే వాటిపై అంత మమకారం. అంత కృతజ్ఞత. ఆ కృష్ణ పీఠభూమిని అధిగమించి తూర్పు కనుమలు దాటి మైదాన ప్రాంతంలో

అడుగిడి ఆ ప్రాంతానికి తన పేరిచ్చి, సముద్రునిలో ఐక్యమైపోయింది. తాను పేరిచ్చినది గనుక అది కృష్ణామండలమైనది. సాగరసంగమం చేసే ప్రాంతంలో తన విభుడైన సముద్రుని తన బాహువులలో కౌగిలించుకోవాలనే ఉద్దేశంతో కాబోలు, రెండు చేతులు సాచినట్లుగా పులిగడ్డ వద్ద రెండు పాయలలై సముద్రంలో సంగమించింది. ఆ రెండు పాయలనడిమి భాగం దివిసీమ. అంటే అది ఇప్పుడు అలా గోచరిస్తున్న స్థితి. ఒకప్పటి స్థితి అదిగాదు. దాని సంగతి అలా వుంచితే, కృష్ణాజిల్లాలో ఒక మూల ఒదిగిన చిన్న ప్రాంతం ఈ దివిసీమ. భౌగోళికంగా ఇది చిన్నదే. కాని చరిత్ర చాలా ఘనమైనది. దానిని తెలిసికోబోయేముందు, ఆ ప్రాంతపు పూర్వపు నైసర్గిగ స్థితి తెలుసుకుందాము.

దివిసీమ అంటే నేడు కృష్ణ ప్రధానమైన రెండు పాయలు, బంగాళాఖాతానికి నడుమన వున్న భూభాగానికే వర్తిస్తోంది. అంటే స్థానికులు అలా వ్యవహరిస్తారు. కాని దివిసీమ అంటే పూర్వపు దివి తాలూకాకు, దానినంటి వున్న గన్నవరం, బందరు తాలూకాల సరిహద్దు ప్రాంతాల భూభాగమంతా దివిసీమే. కృష్ణానది ఒకప్పుడు నేటి విజయవాడ - మచిలీపట్నం రహదారి హద్దు. కాని, నేడు తోట్లవల్లూరు దగ్గర నుండి పూర్తిగా దక్షిణానికి మరలింది. ఇప్పటి నదీ ప్రవాహంనుండీ, పామర్రుమీదుగా ప్రవహిస్తున్న బందరుకాలువ అని చెప్పబడుతున్న నాగులేరు, (ఇది బందరు దగ్గర సముద్రంలో కలుస్తుంది) ఈ రెంటి మధ్యవున్న భూభాగమంతా దివి. దివి శబ్దం దీవినుండి ఏర్పడింది. నేడు మురుగుకాలువలుగా రూపొందినవన్నీ ఒకప్పటి కృష్ణప్రవాహాలు. నాగులేరు విషయం చెప్పుకున్నాం. ఇక ఏనుగులకోడు, లంజకాల్వ, భీమేరు, గుండేరు, మాజేరు ఇవన్నీ అవే నేటి గుండేరు, ఒకప్పటి నౌకాశ్రయం, ఘంటశాల ఈ ప్రవాహాన్ని అంటివుంది నాటి నావికులు పూజించిన జలధీశ్వరస్వామి ఆలయం దీనంతటికి సాక్ష్యంగా ఇప్పటికీ వుంది. ఇక పులిగడ్డదగ్గర చాలిన పాయ అప్పుడూ వుంది. కనుకనే అక్కడ మోపిదేవి నేటి మోపిదేవి వుంది. గుండేరు నానుకొని పడమటిలంకపల్లి, మాజేరునానుకొని తూర్పులంకపల్లి, భీమేరునానుకొని పెదముత్తీవి. ఇలా లంక, దీవి అనేపేర్లు, ఆనాటి దివిప్రాంతపు నైసర్గిక స్థితిని పట్టి ఇస్తున్న పేర్లు. ఇంకా ఈ గ్రామాల పేర్లు చూడండి. బాగా స్పష్టమవుతుంది. బిరుదుగడ్డ, వక్కలగడ్డ, నడకుదురు, నాగాయలంక, పాలకాయతిప్ప, దింటమెరక, మెంతిదిబ్బ ఇవన్నీ నదీమధ్యలేక, నదిని అంటివున్న భూభాగాన్ని సూచిస్తున్నాయి. పెదకళ్ళేపల్లి పూర్వనామం కడలుపల్లి. కడలి అంటే సముద్రమని తెలిసిందే. అంటే ఒకప్పుడు ఈ ప్రాంతమంతా దీవులమయం. కనుక ఇది దివిసీమ. ఈ దీవులన్నింటిలోకి పెద్దది ఇంతకుపూర్వం చెప్పిన రెండు పెద్ద పాయల నడుమభాగం. అయితే చిన్న చిన్న పాయలు అక్కడ వుండేది. అయినా అది పెద్ద దీవి. అనంతరం కాలంలో వచ్చిన రాజ్యాలకు ఒక రాజధాని అవసరమైంది. ఆ దిశగా పేరు పెదదీవి పురమయింది. అదేనేటి గణపేశ్వరం. దానికి కొంచెం దూరంలో కృష్ణానది సాగరసంగమం చేస్తోంది. ఆ ప్రాంతానికి హంసలదీవి అని పేరు. స్థూలంగా ఇదీ నైసర్గికస్వరూపం. ఇక చరిత్ర విషయం చూద్దాం.

చారిత్రకంగా కూడా ఇది చాలా ప్రాచీనమైనది. గుర్తుపట్ట దగినంతలో దీనికి మొదటి పాలకులు శాతవాహనులు. అయితే వారు పడమటివైపు నుండి ఈ ప్రాంతానికి వచ్చినవారు. వారి రాజధాని శ్రీకాకుళం అంటే శ్రీకాకుళం ఆంధ్రుల తొలి రాజధాని. నిశంభుడనే రాక్షసుని బారినుండి దీనిని విముక్తం చేసిన ఒకానొక శాతవాహన చక్రవర్తినే, అనంతరకాలంలో విష్ణ్వశ సంభూతునిగా భావించి దైవంగా పూజిస్తున్నారని పురాణగాథ దానికి ఆనవాలుగా ఆంధ్రనాయకస్వామి ఆలయం శ్రీకాకుళంలో వుంది. ప్రపంచంలో ఒక జాతి పేరుతో ఏ జాతికైనా దేవుడున్నాడో లేదో తెలియదు. కాని మన జాతికి ఆ అదృష్టమొచ్చింది. ఆంధ్రనాయకస్వామినే, తెలుగురాయడనీ అంటారు. అలా చూసినా, అంటే ఒకజాతి పేరుతో వెలసిన దేవునికి ఆలయప్రాంతంగా చూసినా, ఈ ప్రాంతపు ఘనత తెలుస్తోంది గదా ! బ్రహ్మాండపురాణంలో సుచంద్రుడనే రాజు దీనిని రాజధానిగా చేసికొని పాలించినట్లు చెప్పబడింది. ఈతని ఆస్థానంలోని వైయాకరణుడు కణ్వుడు ఆంధ్రభాషకు వ్యాకరణం వెలయించినట్లు కూడా ఇతర ఆధారావల్ల తెలియవస్తోంది. కాలం సమంగా చెప్పడం కష్టం, కాని క్రీస్తుపూర్వపు నాటివీ సంగతులు అని చెప్పడానికి తగు ఆధారా లున్నాయి. శ్రీకాకుళం తొలి రాజధాని అయితే అమరావతి ఆంధ్రుల మలి రాజధాని అమరావతి అనగానే బౌద్ధం గుర్తుకురావడం సహజం బౌద్ధమత అవశేషాలు దివి ప్రాంతమంతటా కన్పిస్తున్నాయి. దీనికి ఉత్తరపుద్వారం గుడివాడసీమ. ఆ గుడివాడ బౌద్ధానికి, జైనానికి కేంద్రం. ఇక ఈ ప్రాంతంలోపల ఘంటశాల జగద్విదితమైన బౌద్ధక్షేత్రం. వాటి శిల్పాలెన్నో ఇక్కడ దొరికాయి. బౌద్ధ సాహిత్యంలో దీనిపేరు కంటకవైలము. అది కొంచెం ధ్వని మార్పులతో, ఘోటకమనే ప్రాంతం ఘంటశాల గ్రామసరిహద్దులలో గ్రామకంఠభూమిగా ఇప్పటికీ ఉంది. ఆ గ్రామం నుండి దక్షిణంగా మరలితే లక్ష్మీపురం వుంద.ఇ అక్కడ బౌద్ధశిథిలాలున్నాయి. కాగా 8, 9 శతాబ్దాలనాటి శాసనం అక్కడ లభ్యమైంది. దానికి మరికొంత దక్షిణంగా పెదకళ్లేపల్లి.

అక్కడ దుర్గానాగేశ్వరస్వామి ఆలయముంది. ఆ ఆలయస్తంభాలు బౌద్ధశైలిలో వున్నాయి. కొన్ని అవశేషాలూ వున్నాయి. ఆ పరిసరాల్లోనే పెదప్రోలు అనే గ్రామముంది. ఆ గ్రామంలో బౌద్ధచైత్యాన్ని పోలిన దిబ్బ, కొండదిబ్బ అనే పేరుతో వుంది. ఇవి బౌద్ధంతో సరాసరి ముడిపడి వున్న సాక్ష్యాలు. కాగా, ఆంధ్రనాయకస్వామి అనే పేరుతో పూజలందుకుంటున్న స్వామి ఒకే ఒక శాతవాహనాంధ్ర చక్రవర్తి అని ముందుచెప్పడం జరిగింది. నేడు జరుగుతున్న పూజలు, వైష్ణవసంబంధమైనవి. నా విష్ణు పధ్వీపతి అన్నదాని ప్రకారం, రాజైనవాడు విష్ణ్వాలయాల్లో వుండే అర్చామూర్తులకుండే శంఖచక్రాల అమరికకు భిన్నంగా ఇక్కడ వుండడం ఒక విశేషం. కాగా మీసా లుండడం మరో విశేషం. అన్నిటంకి మించి మరో విశేషం, విష్ణ్వాలయాల్లో వార్షిక కల్యాణోత్సవాలు ఫాల్గుణపౌర్ణమికి జరుగుతాయి. ఇక్కడ మాత్రం వైశాఖ పున్నమికి జరుగుతాయి. వైశాఖ పున్నమినే దవనపున్నమి అంటారు. అదే బుద్ధ పూర్ణిమ. అంతేగాక దేవాలయ అంతరాళ ముఖద్వారం వద్ద బౌద్ధ సంబంధి పూర్ణకుంభ శిల్పాలున్నాయి. దీనిని బట్టి ఇది మొదట బుద్ధక్షేత్రమని ఆ పిదప, కాలానుగుణంగా వచ్చిన మార్పులలో విష్ణుమూర్తిగా ఆరాధించడం ప్రారంభమైందని కొందరి చారిత్రకుల ఊహ. అలాగే భావదేవరపల్లి అనే గ్రామంలోని భావనారాయణస్వామిని గూర్చి కూడా ఇలాంటి గాథే చెప్పబడుతోంది. ప్రసిద్ధమైన భావనారాయణస్వామి ఆలయాలు తూర్పుగోదావరిజిల్లా కాకినాడలో, గుంటూరుజిల్లా పొన్నూరు, బాపట్లలో ఉన్నాయి. ఈ అన్నిచోట్లా అర్చామూర్తుల మీసాలుండడం మరో విశేషం. శంఖచక్రాల అమరిక ఆంధ్రనాయకస్వామిని పోలి వుంటాయి. గాంధారశిల్పంలో బుద్ధుడు మీసాలున్నవిధంగా దర్శనమిస్తాడు. ఈవిధంగా శ్రీకాకుళం, భావదేవరపల్లి గ్రామాలు, అక్కడ ఆలయాలు బౌద్ధం యొక్క ఉనికిని చాటుతున్నాయి. ఘంటశాల రేవుపట్నమనేది స్థితిస్థాపక విషయం. ప్లినీ మొదలైన భూగోళ శాస్త్రజ్ఞుల వ్రాతలు దీనిని బలపరుస్తున్నాయి. క్రీస్తు పూర్వం నాటి ఆంధ్రుల సముద్రవ్యాపారానికి చిహ్నాలుగా ఇక్కడ రోమన్ నాణాలు లభ్యమైనాయి. మాజేరు అనేది నేడు ఒక చిన్నగ్రామం. కాని ఆ గ్రామం పేరులో ఏముంది. లంజకాల్వ, గుండేరు, భీమేరు జీలగలగండి దగ్గర దిగువన కల్సిపోయి మాజేరువంటి ప్రవహిస్తూ సముద్రంలో సంగమిస్తోంది. కానీ పూర్వనామం మాజేరే. అందువల్లనే సమీప జనావాసానికా పేరు వచ్చింది. నిజానికా ప్రవాహమే ఒకప్పటి ఘంటశాల రేవుకు ముఖద్వారం. బౌద్ధకాలంనాడు దీని పేరు మంజీరిక. బౌద్ధసాహిత్యంలో ఈ మాట స్పష్టంగా చెప్పబడింది.

ఇదంతా క్రీస్తుపూర్వం మూడవ శతాబ్దం నుండి, క్రీస్తుశకం మూడవ శతాబ్దం వరకూ గల సుదీర్ఘకాలానికి చెందిన మాట. ఇంకా ఈ ప్రాంతపు భూగర్భంలో ఎంత చరిత్ర నిక్షిప్తమైనదో !

అనంతరం ఎనిమిది తొమ్మిది శతాబ్దాల వరకు గల చరిత్రకు తగు ఆధారాలు మృగ్యం. అయితే ఇతర ప్రాంతాల చరిత్రను బట్టి, ఈ ప్రాంతం, శాలంకాయనుల, బృహత్ఫలాయనుల, ఆనంద గోత్రికుల, ఇక్ష్వాకుల పాలనలో ఒదిగి వుందని చెప్పవచ్చు. బృహత్ఫ లాయనులకు చెందిన శాసనం కూడా ఒకటి లభ్యమైంది. దానిని బట్టి కోడూరు ఆనాటికే జలదుర్గంగా ప్రాముఖ్యమొందినట్లు తెలుస్తోంది. ఈ కోడూరు దుర్గమే అనంతరకాలంలో దివిదుర్గంగా పేర్కొనబడింది. ఇంత మారుమూలవున్న ఈ ప్రాంతాన్ని ముఖ్యంగా ఈ దుర్గాన్ని సాధించడానికి శ్రీకృష్ణదేవరాయలు ఎంతో పూనికతో ప్రయత్నించాడంటే, రక్షణ విషయాల దృష్ట్యా దీని ప్రాముఖ్యం గుర్తింపబడిందన్న మాటేకదా ! ఇది అనంతర చరిత్ర. ఈ ఎనిమిది శతాబ్దాల కాలంలో, గుంటూరు పల్నాడు ప్రాంతపు విప్పర్ల పాలకులు ఈ ప్రాంతాన్ని జయించినట్లు తెలుస్తోంది. లక్ష్మీపురంలో శాసనం లభించడం బట్టి, బౌద్ధుల కాలంనాడు ఈ గ్రామానికి గల ప్రాముఖ్యాన్ని బట్టి, బహుశా ఇది ప్రాంతీయ స్థానిక రాజకార్యనిర్వాహక స్థానంగావచ్చును. ఇంతకుమించి ఈ కాలపు విశేషాలు తెలియరావు.

కొంచెం ఇంచుమించుగా, ఈ కాలం తరువాత అంటే సుమారుగా తొమ్మిదో శతాబ్దపు కడపటి వత్సరాల్లో నేడు దివిసీమగా చెప్పబడుతున్న భూభాగం, అంటే రెండేరుల, సముద్రపు మధ్య భూభాగాన్ని అయ్య వంశస్థులు ఆక్రమించారు. నేడు చిన్నగ్రామంగా వున్న గణపేశ్వరం వారి రాజధాని. ఆ కాలంలో దానిపేరు పెదదీవిపురం. నేడు నాగాయ లంక కృష్ణానది తీరాన వుంది. దాని నానుకొని నంగేగడ్డ అనే గ్రామముంది. నాగాయలంకపేరును బట్టే అది నదీమధ్యంలోని భూభాగం అని తెలియవస్తుంది. అయ్యవంశస్థులలోని వాడైన జాయప సేనాని వేయించిన శాసనాన్ని బట్టి నంగేగడ్డరేవుగా చెప్పవడింది. ఈ అయ్యవంశస్థులను కాకతిగణపతి దేవుడు జయించి, వారింటి ఆడుబిడ్డలు నారమ్మ పేరమ్మలను వివాహమాడాడు. ఎక్కడి ఓరుగల్లు, ఎక్కడి దివిసీమ, ఇంత మారుమూలప్రాంతాన్ని తన స్వాధీనంలోకి తెచ్చుకోవడానికి ప్రయత్నించాడంటే, ఇంతకుముందు చెప్పుకున్నట్లుగా రక్షణ విషయాల దృష్ట్యా దీనికై ఎంతో ప్రాబల్యముంది. పైగా సముద్రతీరం గావడం రేవుపట్నం. ఇన్ని విషయాల వలన ఇది పాలకులందరినీ ఆకర్షించింది. శ్రీకృష్ణదేవరాయల సంగతి ముందు చెప్పాము. చరిత్రకథన కాలాన్ని బట్టి మళ్లీ మళ్లీ చెప్పుకోవలసివస్తుంది.

తర్వాత ఇతరులు కూడ దీనిని విడిచిపెట్టలేదు. కాకతిగణపతి, వారంటి ఆడపిల్లలను వివాహమాడి, తిరిగి వారి రాజ్యాన్ని వారికే ఇచ్చివేశాడు. అంటే సంబంధబంధుత్వం ద్వారా ఈ ప్రాంతంపై తన అధికారాన్ని సుస్థిరం చేసుకున్నాడు. అంతేకాదు, బావమరిదియైన జాయపసేనానికి తన గజసైన్యానికి అధ్యక్షునిగా అంటే గజసాహిణిని చేశాడు. చందవోలు రాజ్యానికి అధిపతిని చేశాడు. 'నృత్తరత్నావళికర్త' ఇతడే. ఈ అయ్య వంశస్థులు నాటి అవసరాల దృష్ట్యా తెలుగుచోడులమని చెప్పుకున్నారు. వీరు నిర్మించిందే అవనిగడ్డలోని వీరరాజ చోడనారాయణ దేవర ఆలయం. (నేటి లక్ష్మీనారాయణస్వామి ఆలయం). ఈ వంశస్థులు నిర్మించిన మహాప్రసిద్ధ దేవాలయం కృష్ణానది సంగమస్థలం హంసలదీవిల ఓగినిర్మించిన వేణుగోపాలస్వామి ఆలయం. కాకతి గణపతిదేవుడు స్వర్గస్థుడైనాక ఆయన స్మృత్యంకంగా పెదదీవిపురంలో గణపేశ్వరాలయం నిర్మించాడు జాయపసేనాని. అందువల్లనే పెదదీవి పురం కాలక్రమంలో గణపేశ్వరమైంది. కాకతి రెండవ ప్రతాపరుద్రుడు తరుష్కుల చేతిలో ఓడిపోయిన తరువాత, ముసునూరి ప్రోలయ, కాపయ నాయకులు, కాకతీయ సేనానాయకులు డెబ్బదిరెండుమందిని కూడగొట్టి తిరిగి ఓరుగల్లులో ఆంధ్రరాజ్యాన్ని స్థాపించిన విషయం చరిత్రకు తెలసిందే. అయితే ఆ తిరుగుబాటుకు కావలసిన గెరిల్లాయుద్ధతంత్రాన్ని నేర్పడానికి సైనికులను సుశిక్షితులను చేయడానికి ఉపయోగించిన శిక్షణాకేంద్రం ఈ దివిసీమయే. నైసర్గికంగా ఇది దుర్గమం గావడం, కాకతీయుల బంధుకోటి వారు ఇక్కడ వుండడం, తురుష్కులు ఇది ఎరిగిన ప్రాంతంగాక పోవడమనే మూడు కారణాల వలన ఈ ప్రాంతాన్ని ఆ శిక్షణను ఎన్నుకోవడం జరిగింది. ఆ తరువాత వచ్చిన చాళుక్యుల పాలనకు సంబంధించిన పాలనాపరమైన అవశేషాలేమీ తెలియరావడం లేదు. అయితే ఈ తాలూకాలోని చిరువలో గ్రామానికి కొంత ప్రాముఖ్యముంది. కాలం తెలియని ఒక శాసనం ద్వారా అది బహువిస్తృతి గల గ్రామంగా తెలుస్తుంది. ఇక్కడ సమీపంలోని అవనిగడ్డలో వందలాదిగా వేదాధ్య యనపరులున్నట్లు తెలుస్తుంది. ఘనాపాఠీలు, జటాంత స్వాధ్యా యులు, జ్యోతిష్కుల ప్రస్తావనతోపాటు, ఆయుర్వేద ప్రవీణు లున్నట్లు ఆ శాసనాలలో పేర్కొనబడింది. నిన్నమొన్నటి పండిత డి. గోపాలచార్యులు ఈ ప్రాంతంవారే. నాటినుండి నేటివరకు వేదాధ్యయాన్ని, ఆయుర్వేదాన్ని కాలక్రమేణా గత విద్యగా పరిరక్షించు కుంటూ వస్తున్న వైఖానసులు ఇంచుమించు ఈ తాలూకా అంతటా వున్నారు. బ్రాహ్మణులకు అగ్రహారాలిచ్చి, గ్రామగ్రామానా పురాణ పఠనానికి అవకాశాలు కల్పించినవాడు రాజమండ్రి నేలినరాజు ఆ పురాణ పఠన సంప్రదాయం నిన్నమొన్నటి వరకూ ఇంకా కొన్ని గ్రామాలలో నేటివరకూ నలచి వుంది బహుశా ఇవన్నీ చాళుక్యుల పాలనకు నిదర్శనాలు కావచ్చు. ఏమైనా ఇది ఊహామాత్రమే. సంస్థాపించడానికి తగిన ఆధారాలు మృగ్యం. ఏమీ లభించలేదు. అయితే వారి పాలనను నిర్ధారించే సాక్ష్యాలు ప్రక్కనగల గుడివాడ తాలూకాలో లభించాయి. ఆ కాలంలో ఈ ప్రాంతాన్ని పాలించిన ఇతర రాజుల ప్రస్తావన ఏదీ కనిపించడంలేదు. కనుక ఈ ప్రాంతం కూడా వారి పాలనలో ఉందని చెప్పడానికి ఆస్కారము ఏర్పడుతోంది. ఆ తరువాత గజపతుల పాలన సాగింది. ఆ రాజ కుటుంబాలకు చెందిన శాసనాలు శ్రీకాకుళ ఆంధ్రనాయకస్వామి ఆలయంలో లభిస్తున్నాయి. అంతేగాక వారితో తరలివచ్చిన కొన్ని కుటుంబాలు అనంతరం ఇక్కడే స్థిరనివాసమేర్పరచు కున్న దాఖలాలున్నాయి. ఉత్తరకోస్తాజిల్లాలకు చెందిన గ్రామనామాలు ఇక్కడ కొన్ని కుటుంబాలకు గృహనామాలుగా ఉండడం దీనికి ప్రబలసాక్ష్యం. గజపతుల పాలన కొండవీడు, ఇంకా దిగువన నెల్లూరు వరకు సాగింది. కనుక ఆ ప్రాంతానికీవల ప్రాంతమైన ఇక్కడ కూడ వారి పాలన సాగిందనడంలో విప్రతిపత్తి లేదు. గజపతుల పాలన శ్రీకృష్ణదేవరాయలకు వెనుక ముందు కూడ సాగినట్లు చరిత్ర చెపుతోంది.

ఇక ఆ తరువాత ఈ ప్రాంతం శ్రీ కృష్ణదేవరాయల ఏలుబడిలోనికి వచ్చింది. రాయలు పూర్వ దిగ్విజయ యాత్రలో భాగంగా నేడు కోడూరుగా చెప్పబడుతున్న దివిదుర్గాన్ని సాధించాడు. ఆ ప్రయత్నంలో భాగంగా, ఒక రాత్రి ఆయన శ్రీకాకుళాంధ్ర నాయకస్వామి ఆలయ ప్రాంగణం లేదా ఆ పరిసరాలలో మకాము చేసినట్లు చెప్పబడుతోంది. అయితే ఆయన మకాము చేసింది ఇప్పటి ఆలయంలో కాదని స్పష్టంగా చెప్పడానికి ఆధారాలున్నాయి. వాటిని తరువాత చూడ వచ్చును. ఆంధ్రపంచకావ్యాలలో ఒకటైన ఆముక్తమాల్యద రచనకు అంకురార్పణ ఇక్కడే జరిగింది. ఏ తత్కర్త శ్రీ కృష్ణదేవరాయలు తత్కావ్య ప్రారంభంలో ఈ సంగతి చెప్పడం జరిగింది. రాయలు తన దేవేరులతో ఈ దేవాలయాన్ని సందర్శించాడు. అయిదు గ్రామాలను, దేవాలయపోషణకు సమర్పించారు. అవిగాక ఇతర వస్తురూపమైన కానుకలనుకూడ సమర్పించాడు. ఈ మేరకు దేవాలయంలోని శాసనాలు సాక్ష్యాలు పలుకుతున్నాయి. ఆయన వెంట దిగ్విజయ యాత్రలో పాల్గొన కొన్ని సైనిక, ఇతర రాజోద్యోగకుటుంబాలు ఇక్కడ స్థిరనివాసమేర్పరచుకొన్న దాఖాలాలున్నాయి. బహుశా రాయలు తన పాలనాధికారాన్ని సుస్థిరం చేసే దిశగా వారిని నియమించి వుండాలి. అలాంటి కుటుంబాల్లో మండలివారు ప్రముఖులు.

అనంతరం కృష్ణామండలంలో భాగంగా ఈ ప్రాంతమంతా గోల్కొండ నవాబుల పాలనలోనికి వచ్చింది. మచిలీపట్నం నవాబు పర్యవేక్షణ కొనసాగింది. దీనికి కొంచెం వెనుక ముందుగా దేవరకోట సంస్థానం వెలసింది. దీని పాలకవంశంవారు రేచెర్ల గోత్రజులైన యార్లగడ్డవారు. దేవరకోట అనే గ్రామం, ఘంటశాలకు సమీపంలో వుంది. అయితే రాజకుటుంబంవారు, దీనికి సమీపంలో నాయుడు పేట అనే ఆవాసాన్ని కల్పించుకున్నట్లు తెలుస్తోంది. అనంతర కాలంలో వీరి కార్యస్థానం రెండుమూడుచోట్లకు మారిందని చెపుతారు. కడమ వీరు చల్లపల్లిలో స్థిరపడ్డారు. అందువల్ల వారు చల్లపల్లి జమీం దారులుగా వ్యవహరింపబడ్డారు. అయినా అధికార కార్యకలాపాల్లో దేవరకోట సంస్థానమనే పరిగణన, చల్లపల్లిలో గల నేటి కోటను ఈ వంశంలోని రెండవ అంకివీడు ప్రసాదు నిర్మించారు. ఇది కాశి మహారాజు భవన నమూనాలో నిర్మించారు. శ్రీకాకుళం మోపిదేవి, పెదకళ్లేపల్లి ఆలయాలకు ఈ వంశస్థులు అనువంశిక ధర్మకర్తలు. ఈ వంశంలోని, కోదండరామన్నదేశాహి, శ్రీకాకుళాంధ్ర నాయక స్వామి ఆలయానికి తొమ్మిది వందల ఎకరాలు మాగాణి భూమిని ఇచ్చినట్టు తెలుస్తోంది. ఈ దేవస్థానాల వార్షిక ఉత్సవాల సందర్భంగా జరిగే దేవుని రథయాత్రలో, ఈ పాలకులు గజచోదకులై ముందు సాగడం ఒక ఆచారం. బందరు సమీపంలోని శివగంగ దేవాలయం వీరి కుటుంబానికి చెందిన ప్రత్యేక ఆలయం. భారతదేశంలో శ్రీమంతులని బిరుదునామం గలవి రెండే వంశాలు. ఒకటి పూనాకు చెందిన పీష్వా కుటుంబం రెండవదీ కుటుంబం. వీరికి ఈ బిరుదు రెండవ బాజీరావుపీష్వా ఇచ్చి సత్కరించాడు. వీరి పాలన అయ్యంకి నుండి పులిగడ్డ వద్ద గల కృష్ణ వరకు గల ప్రాంతానికి చెల్లివచ్చింది.

కాగా రెండేరుల నడిమి భాగమైన దివిసీమ ప్రత్యక్షంగా నవాబుల పాలనలో, ఆ తరువా ఇంగ్లీషు వారి కంపెనీ పాలనలో ఉండేది. అయితే డచ్చివారి ప్రాబల్యం కూడ కొంతకాలం సాగినట్లు తెలుస్తోంది. దీనికి సాక్ష్యంగా, కోడూరుకు సమీపంలో డచ్చివారి దేశం హాలెండు పేరుతో వలందాపేట అనే గ్రామముంది. ఇదే పేరుతో ఒక జనావాసం మచిలీపట్నంలో కూడ వుంది. అనంతర కాలంలో ఇది ఆంగ్లేయులకు స్వాధీనమైంది. అంతకు పూర్వం, ఆ తరువాత కొంతకాలం, నూజివీడు పాలకులు పాలనలో ఉంది. అశ్వారావుపాలెం అనే గ్రామం, ఆ జమీందారుల పాలనలో ఏర్పడిందని చెపుతారు.

**కృష్ణాయాః పుష్కరే కృత్వా స్నానం దానం చ పైతృకం**
**గంగాయాః కోటిగుణితం ఫలమాప్నోతి మానవః**

పుష్కర సమయంలో కృష్ణానదిలో పవిత్రస్నానం ఆచరించి,
దానధర్మాలు, పితృకార్యాలు నిర్వహిస్తే గంగాతీరంలో
చేసినదానికన్నా కోటిరెట్లు పుణ్యఫలం లభిస్తుందని శాస్త్రవచనం.

Sri K. SUBBA RAO

# ART OF CHENNAKESAVA TEMPLE AT MACHERLA

Macherla, located in the Guntur District of A.P., has retained some of the important monuments of the medieval times. On the banks of Chandravanka there are monuments belonging to the late Chalukyan and Kakatiya times.

In the present study an attempt is made to describe the sculpture of Sri Chennakesava Svamin Temple at Macherla. The temple faces the east and its abound in all the important components of medieval temple architecture. It has a garbhagriha, antarala, rangamandapa and mukhamandapa. The garbhagriha enshrines Sri Chennakesava Svamin, a form of Vishnu. The antarala is abound in bronze images of Sri Chennakesava Svamin, the processional deities. The rangamandapa is supported by many pillars. The central four pillars are carved with great care and devotion. Each pillar is divided into two cubical parts and on each of the faces narrative sculpture is adorned with themes drawn from the Mahabhagavata, the Mahabharata, the Ramayana, and the Puranas. The pillars and the carvings along with the general architectural features suggest that the temple was constructed during 11th 12th centuries A.D.

There are altogether eleven inscriptions in and around the temple. The earliest inscription is datable to S. 1033 equivalent to 1111 A.D. (S.1.1., X,66). All inscriptions speak of small donations, renovations to the temple, but none of them is the foundation inscription. The donations are continued even during the 14th century A.D. the inscriptions refer to the Haihayas of Palnadu, the Kakatiyas and the local rulers.

The Palnativira charita mentions that the Chennakesava Svamin temple was constructed by the Haihaya Chief Brahmanaidu. But there is no definite proof. The architectural and the sculptural features indicate that the temple has taken its final form during the period of the Kakatiya rulers.

## Architecture

The Chennakesava Svamin temple of Macherla is roughly rectangular on plan. The architectural members are arranged in linear pattern from west to east. The main shrine faces the east. The ground plan comprises of a small garbhagriha followed by an antarala. The antarala is connected to mukhamandapa. The mukha- mandapa leads into a pillared ranga mandapa. The mukhamandapa has four pillars in the centre and they support a flat roof. In the mukhamandapa itself there is a separate shrine for the consort of Sri Chennakesava Svamin. The shrine for the Devi is located in the northern side of the mandapa. The mukhamandapa and the rangamandapa are closed on the northern side by recently constructed walls. The garbhagriha comprises of the base mouldings which include an upapitha,

adhisthana, the bhitti and kapota. Above the kapota is a vedi comprising of a short wall. The crowning member is the vimana.

The vimana in the Chennakesava Svamin temple is built in bricks and mortar. Upto bhitti, however, the construction is made out of dressed stone masonry. Usually temples are built either in stone or in brick. Such temples wherein both stone and brick are employed are commonly known as napumsaka variety. Hence, this temple may be turned has having napumsaka form.

The doorway of the garbhagriha is plain and the antarala is neatly carved. The doorway to the antarala is provided with dwarapalas on either side. The dwarasakha consisted of latapatra. Stambha and padmasakhas. A panel of Gajalakshmi is carved on the lintel. The Devi shrine is otherwise unornamented but the doorways are carved with purnaghatas one above the other. The lintel of the doorway is left undecorated.

With these architectural members the Chennakesava Svamin temple at Macherla shares many features in common with the Kakatiya monuments elsewhere.

## Sculpture

The sculpture of the Chennakesava Svamin temple at Macherla can be broadly classified on the basis of the themes. It appears that the Bhagavata, the Ramayana, the Mahabharata and the Puranas were taken into consideration for choosing proper scenes for depiction.

The Scenes drawn from the Bhagavata included 1. Krishna as Giridhara, 2. Amrita manthana, 3. Vishnu as Trivikrama, 4. Rukmini Parinaya, 5. Bhuvaraha murti, 6. Narasimha, 7. Krishna and Yasoda, 8. Balakrishna and Gopikas, and 9. Sheshasayi.

The scenes drawn from the Mahabharata included 1. Arjuna and Karna in battle, 2. The Kiratarjuniya and 3. The playing of the dice.

The scenes drawn from the Ramayana included 1. Sitapaharana, 2. Lakshmana and Kumbhakarna, 3. Rama and Sugriva 4. Rama and Ravana in battle, 5. Hanuman and Garuda, and 6. Friezes of Vanaras.

The scenes drawn from the Puranas included 1. Mushikasura samhara, 2. Mahisha Mardhini, 3. Tarakasura samhara, 4. Vishnu as Chennakesava, 5. Trimurti with Ganas, 6. Ravana Shaking Kailasa, 7. Umasahitamurti, 8. Siva and Dikpalas, and 9. Nataraja.

In addition to the above scenes there are 1. Salabhanjikas, 2. Nagas, 3. Makaras, 4. Dwarapalakas, 5. Alasakanyas, 6. Soldiers, 7. Musicians, 8. Horse riders, 9. Elephant riders, and 10. Gajalakshmi

The artists here have chosen the four pillars in the rangamandapa for exhibiting their artistic talent. The pillar itself is moulded in such a way and on the faces of the cubical portions sculptures are carved in high relief.

It has become customary to carve stories drawn from the Puranas and Itihasas on the pillars during the medieval times in Vengi and elsewhere. We have such examples from Draksharama, where the Eastern Chalukyan chiefs got puranic themes carved. Similarly, though falling in the Palnadu region, but directly under the impact of the Eastern Chalukyan influence, the Kalyani Chalukyan influence and the Chalukya Chola influence, the artists have imbibed common features of the art of various dynasties mentioned above.

The bodies of the sculptures are well decorated with Kiritamakutas, Kundalas, Maniharas,

Keyuras, Valayas, Nupuras etc. they share common features with the late Chalukyan art. It is true in the arrangement of beaded garlands, necklaces and the festoons of the pillars, there is a remarkable similarity between the Hoysala examples and those of the present temple. But similar ornamentation can be seen in some of the Later Chalukyan sculptures. Thus the sculpture of Sri Chennakesava Svamin temple is abound in Kakatiya and the Chalukyan features in harmony.

Another interesting feature regarding the sculpture at Macherla is that it is mostly narrative in nature. It appears as If they have chosen a number of themes indicating heroism rather than modest devotion.

It is natural that the land in which the temple stands had many heroes who lost their lives in the Palnati war. In addition, the Kakatiyas who out of their own might conquered large tracts of land should have chosen themes which depict heroism for presentation in the temple. The time during which the temple was constructed was full of battles and therefore battle scenes are not ignored by the sculptors.

The Chennakesava Svamin temple at Macherla belongs to the Kakatiya period and it is one of the best examples for understanding the Kakatiya Art.

## పువ్వుల సూరిబాబు

చిన్న వయసునందె వేషధారణఁజేసి
నటనలో మేటియై పటిమఁజూపె
'బాలమిత్ర'ను పేర బాలనాటక సమా
జస్థాపమున ప్రశస్తినొందె
'తారా శశాంక'కు దర్శకత్వముఁ జేయ
వేల ప్రదర్శనల్ విందుఁగూర్చె
చిత్రసీమనుఁజేరి శిష్టపాత్రలు వేసి
'నారద' పాత్రలో అరితేరి
ఖంగు మంచు మ్రోగు 'కంచుకంఠ' మెలర్ప
పద్యగానమందు ప్రతిభఁజూపె
'సూరిబాబు' సాటి యేరి? రంగస్థలిన్
కీర్తి కళల రాణి! కృష్ణవేణి!

-స్మితశ్రీ చింతపల్లి నాగేశ్వరరావు

**Address :** ***K. Subba Rao,*** *Dept. of Archaeology, Telugu University, Srisailam Campus-518 101*

Sri M. KRISHNA MURTHY

# COL. COLIN MACKENZIE AND HIS COLLECTIONS AVAILABLE IN A.P. ARCHIVES

Coloncl Colin Mackenzie's life is quite interesting, because of his multifarious attainments. He was born in 1754 at Stornoway in Western Islands of Scotland. His thirst for discovery and acquisition of knowledge was so deep even from his youth. Under the inspiration of Lord Napier's daughter under East India Company at Madura he cultivated the habit of collecting the huge bulk of historical material for our country's posterity. His collection includes Manuscripts, Coins inscriptions, Maps and Plans bearing on literature, religious history and manners and customs of the people and tribes of South India in as many scripts and languages.

Mackenzie was more attracted by the administrative records known as Dandakaviles or Kaviles or village registers containing information about the political religious, social and economic conditions of the village. These were in custody of those village officers to record all important events that happened during his times, in addition to the already available material handed over to him oral or the written and thereafter by his successors. These Kaviles thus grew in bulk from generation to generation.

Following the methods of John Hester, Mackenzie employed local pandits like Kavali Venkata Buraiah, Laxmaiah and others (See Plate1) for assisting him to collect the material from different parts of Andhra area. These pandits collected several Dandakaviles and copied every inscription of the village recorded either on stone or copper plate. In some cases when village officers refused to part with the original Kaviles, they prepared digests out of the village registers maintained by the karanams. These are popularly known as kaifiyat and they yielded very valuable historical information. In Telangana area Mackenzie employed Pandits viz, Venkata Rao and Narayana.

## MACKENZIES COLLECTIONS

The entire collection should be thoroughly studied and published as the same contains a valuable source material for reconstructing the history of South India in general and Andhra Pradesh in particular. A few following illustrative instances will be of much help to the reader to understand how the collections will be useful to the reserach scholar.

### (a) KAIFIYAT OF NAGALA DINNE SEEMA

***(Microfilm roll No. 6 Ms. No. 95 and L.R.No. 15-4-8)***

This Kaifiyat belongs to Anantapur District of Andhra Pradesh. Pages 1 and 2 of the kaifiyat (PI. II (a) and II (b)) contain recipe for cultivators. Minutest details are recorded with regard to the bull power to be employed for ploughing the land; reclaiming the land and making it level (even) to facilitate cultivation and other details like sowing seasons, implements used expenditure connected to it and measures that were prevalent are also recorded.

The account also furnishes details about the variety of paddy crops that are cultivated in wetlands i.e., white rice

etc. and also different varieties of garden grown on the drylands like plantains, citrus, mangoes, guava etc.

Thus in Mackenzie Kaifiyats we have on the subject of agriculture a detailed picture of methods of cultivation the type of the soil, the seasons for sowing, precautions to presserve and growing the crops which would be of immense value for researches on social and economic conditions of the places.

### (b) KAIFIYAT OF GANDIKOTA SEEMA
*(Microfilm roll No. 10 Ms. No. 180)*

This kaifiyat belongs to Cuddapah District of Andhra Pradesh. It furnishes and elaborate account of the history of Gandikota seema. Incidentally the kaifiyat furnishes more details about the period of Vijayanagara empire. In page 30 of the kaifiyat (Plate III) the date of accession of illustrious monarch Sri Krishnadevaraya of Tuluv dynasty is accurately recorded as A.D. 1509 and it also furnishes that during his reign, his minister Timmarasayya issued an inscription in Rao who collected very valuable information and prepared diaries containing minute details of their itinerary.

Mackenzie Manuscripts especially the kaifiyats cover various subjects of historical interest like historical background of the villages agro-economic conditions, the places where minerals are available, the background of digging the tanks, legends of pilgrim centres the details of agriculture, the account of Zamindars, industrial and marketing centres, the methods of taxation, village boundaries, socio-economic conditions of various periods, the firmans, Sanads and Pedigrees of various ruling families and the origin of castes and tribes.

The account in kaifiyats from the early period upto 12th century A.D. is very measure and sometimes not accurate. But the account about the Kakateeyas, Reddis, Rayus and Gajapathis are precise and accurate. They furnish clue for solving certain intricate problems connected with the interpretation of inscriptions. The descriptions about Mughals, Qutb Shahis, Asafjahis, French, English and Zamindari Administrations in this part of the country are very accurate and contain minute details. Special information can be gathered regarding the Poligars of Rayalaseema.

The original Machenzie collections and Local Records prepared by Mr.C.P. Brown are preserved in GovernmentOriental Manuscripts LIbrary, Madras. The Andhra Pradesh State Archives have brought microfilm copies of the above collections in 1968 for the benefit of Research Scholars. These microfilms are preserved in 60 rolls containing 18,000 meters.

The Collection covers the contents of 349 Volumes of local tracts and 62 Volumes of local Records etc. The Department has taken up several research projects based on this collection viz.,

1. Publication of the Guntur District Inscriptions.
2. Publication of the Guntur District Kaifiyats.
3. Social and Economic conditions of the Ceded Districts as gleaned from Mackenzie Manuscripts.

Sanskrit stating that people of the land were exempted from payment of taxes which were levied at the time of marriages celebrated by the eighteen communities.

The information in Gandikota kaifiyat would facilitate to verify the data available through other sources like inscriptions related to the period of Vijayanagara dynasty and it also aids us to establish that the territory of Cuddapah had been under the rule of Vijayanagara kings during the period referred to in the kaifiyats.

The foregoing explanatory notes on the two illustrations taken from the Mackenzie kaifiyats would amply prove that the collection has unique value from the research point of view and it is highly desirable that every scholar who undertakes research studies in South Indian history and in particular the history of Andhra Pradesh should make use of this abundant source material available in Archives.

As the study under microreader has become a strenuous and costly process for individual scholars working on various subjects the others alternative to provide material available in microfilms is by preparing photostat copies by the Department for easy and quick reference. This would also ensure further longevity to the originals.

## REFERENCES


1. Brown C.P. Telugu English Dictionary, Hyderabad (1966) Local Archives : the 'great book', 'record book or register'.
2. Wilson H.H. Glossary of the judicial and Revenue Terms, London (1855). Kaifiyat : Statement, Description Report, Account particulars.
3. Copies prepared by C.P. Brown out of the selections made by him from the then decaying Mackenzie Manuscripts.
4. Wilson H.H. Op. Cit

a. Gorru (Tel) = An instrument of husbandry used as a sort of drill plough

b. Pedamadaka (Tel.) = A plough of pairs of bulls.

MACKENZIE'S COLLECTIONS

5. Ibid

a. Sola (Tel) = The sixty fourth part of the measure of capacity called TUM

b. Manika = A measure of capacity in Telangana countries, in some of which eight, in other sixteen make one TUM

c. Munta = A grain measure containing three seers and a half.

6. See also Venkataramanayya, N. Dr. Cuddapah Inscriptions, Madras (1972) pp. 29-30.


సహ్యాభూమీధర సానుభాగంబుల
నాత్మజన్మంబున నందగించి
శ్రీశైలనాథు సుశ్రీపాదపర్యంత
సంచార పరిపూత చరిత మెరసి
వేదాద్రి నరసింహు వివిధార్చనా లబ్ధ
నైర్మల్యభావ సందర్భ మొనసి
అమరావతీశ్వరు నభిషేచన క్రియా
మహనీయ పుణ్యసంపదల మించి
కనకదుర్గా మహాదేవీ కనుల తుదల
జాలువారిన సద్దయా లీల గనుచు
అఖిల భారతధాత్రికి అన్నధాత్రి
దివ్యకృష్ణానదికి తూర్పుతీరమందు

శ్రీ మండలి వెంకట కృష్ణారావు

# 1977 జలప్రళయ జ్ఞాపకాలు

తెల్లవారింది, సూర్యుడు కనిపించని ఉదయం! హోరుగాలి, కారు మబ్బుల్లో... జడివాన వాతావరణంలో ఏదో భయంకరమైన మార్పు కనబడుతోంది. అది మనస్సులో ఏదో గుబులుకు కారణం అవుతుంది. 1977 నవంబరు 19వ తేదీ మనదేశ చరిత్రలో దుర్దినం. ప్రపంచ మహా విపత్తులలో ఒక విపత్తు. ఈ శతాబ్దమున ఘోరమైన ముప్పు సంభవించిన రోజు.

మనిషికి అతీంద్రియ జ్ఞానం ఉంది అంటారు. ఈ అతీంద్రియ జ్ఞానము అంటే ఏమిటో నాకైతే స్పష్టంగా తెలియదు. మామూలుగా మనము ఊహించిన దానికంటే ఎక్కువగా రాబోయే ఉదంతాన్ని పసిగడుతుంది. నా విషయములో కూడా అంతేనేమో! ఆ అతీంద్రియం ఏదో అప్పుడు పని చేసినట్లుంది. లేకపోతే గుంటూరు, బాపట్ల, భీమవరం, ఏలూరు, చూచి హైదరాబాదు వెళ్ళవలసిన ప్రోగ్రాములు ఉండి, ఏలూరు నుండి సేవాశ్రమంలో ఉన్న పిల్లలనుచూచి వెళదామని సరాసరి 18వ తేదీ అర్ధరాత్రి అవనిగడ్డ చేరినాను. వారిని చూచి ఉదయంకు హైదరాబాదులో 19వ తేదీ సాయంత్రం వున్న అతి ముఖ్యమైన అధికార కార్యక్రమాలలో పాల్గొందామని అనుకున్నాను. కాని ఉదయం నుండే గాలి, వాన ప్రారంభమయ్యాయి. తుఫాను, పల్లపు ప్రాంతాలు ముంపుగాగల సముద్రకెరటాలు రావచ్చునని ఆకాశవాణి తెలుగులో వార్తలు ప్రసారంచేసి హెచ్చరికచేసింది. ఏదో ముప్పువుందని హైదరాబాద్ ప్రయాణం రద్దుచేసుకొని ఫోనులో శ్రీమతి ప్రభావతికి హైదరాబాద్ రావడంలేదని చెప్పినాను. గాలి, వానగా ఉన్నందునఅనాధపిల్లల క్షేమంచూస్తున్నానిఅన్నాను. ఉదయం 10గంటలకు గాలివేగం పెరిగింది.వెంటనేమా సమీపములో వున్న ఒక క్రైస్తవమిషను నడుపుచున్న షాలెమ్ హరిజన బాలికల హాస్టలుకు వెళ్లాను. దాదాపు 80 మంది బాలికలు ఒక పూరిపాకలో వుంటున్నారు. ఆ పాక కూలిపోతుందేమోనని భయం వేసింది. వాళ్ళను అక్కడనుంచి ఖాళీచేయించి సేవాశ్రమంలోనికి తీసుకువచ్చాను. చుట్టు ప్రక్కల గుడిసెల వారిని కూడా అక్కడ నుంచి ఖాళీ చేయించి, గాంధీ క్షేత్రం లోనికి, జూనియర్ కాలేజీలోనికి వెళ్లి తలదాచుకోమని చెప్పాను. నా భయం నిజమైంది. కొన్ని నిముషాలు తరువాత ఆ పాకలు కూలిపోయాయి. సేవాశ్రమంలో హిందీ ప్రచారక శిక్షణ పొందుతున్న 40 మంది విద్యార్థినీ విద్యార్థులు అనాధశరణా లయానికి చెందిన 50 మంది బాల బాలికలు ఉన్నారు. ఉదయం 10 గంటలకే అందరికి భోజనం పెట్టించి, వారివారి గదులలో కదలకుండా ఉండమని చెప్పి హిందీ హాస్టల్ పిల్లల మధ్య ప్రిన్సిపాల్ శ్రీమతి సుభద్రమ్మను, జూనియర్ కాలేజి టైపిస్టు గార్లను వుంచి ఆశ్రమ పాఠశాలవద్ద పిల్లల దగ్గర శ్రీ లక్ష్మయ్యగారిని వుంచి,అనాధ శరణాలయం పిల్లలవద్ద శ్రీ చంద్రశేఖర్‌ని వుంచి నేను సేవాశ్రమంలో నిర్మలసదన్‌లోవున్నాను. సేవాశ్రమాన్ని 1977 అక్టోబరు 2వ తేదీన గాంధీజీ కోడలు శ్రీమతి నిర్మలాగాంధీ, మనుమడు శ్రీ కనూగాంధీ ప్రారంభోత్సవం చేశారు. వారిరువురూ వుండడంకోసం సేవాశ్రమం నిర్మలాసదన్అని కొత్తగా నిర్మించాము. అవి రెల్లుగడ్డి పాకలు.

మహాత్ముని దివ్యబోధనలు దివిసీమ నలుమూలలా అందచేసిన శ్రీమతి నిర్మలాగాంధీ, శ్రీ కనూగాంధీ, నాల్గురోజులుపాటు సేవాశ్రమంలో వుండి గాంధీక్షేత్రంలో జరిగిన నిర్మాణ కార్యకర్తల సమ్మేళనములో పాల్గొన్నారు. అంతటి ఉన్నత వ్యక్తులు విడిదిచేసిన ఆ పాకలో నిలబడి కిటికీ గుండా పిల్లలు ఉన్న వివిధ భవనాలను చూస్తూ వాతావరణాన్ని గమనిస్తున్నాను.



నావద్ద శ్రీ మిక్కిలినేని సుబ్బారావు, శ్రీ జి.యం.కొండయ్య, శ్రీ వెంకటేశ్వరరావు, శ్రీ గోపాలు, కొంతమంది విద్యార్థులూ వున్నారు. మధ్యాహ్నం 2 గంటలు అయింది. వేరుశెనగకాయలు, అరటిపండ్లు తెప్పించి అందరికి యిచ్చాను. గాలి గంటకు 150 కి.మీ. వేగంతో వీస్తుందంటే అతిశయోక్తి కాదు. సేవాశ్రమంలో నెలరోజుల క్రితం శ్రీ బండి శోభనాచలం, శ్రీ జాన్ డేవిడ్ గార్ల సహాయంతో బంగాళా పెంకులతో కట్టిన భవనాలపై పెంకులు పదిపదిహేనుఅడుగుల ఎత్తున బిల్లంగోడుల్లా ఎగిరిపడుతున్నాయి. యాస్‌బెస్టాస్ రేకులైతే తాటి ఆకుల్లా ఎగిరిపోతున్నాయి. ఇక తాటాకుల మాట వ్రాయనక్కరలేదనుకుంటాను. గాలిపటాలులాగా ఆకాశంలో తిరుగుతున్నాయి. మా ఇంటివద్ద ఉన్న కొబ్బరిచెట్లూ, వేపచెట్లూ విరిగిపోతూ ఉంటే చూడలేకపోయాను. 1962 లో మా యిల్లు సేవాసదన్ కట్టుకున్నప్పుడు ఈ చెట్లను నాటి నారికేళ వనంలా తయారుచేశాను. ఎవరూ పుల్లకూడా విరువకుండా పెంచిన వేపచెట్లు అల్లాడిపోయి నేలకొరుగుతున్నాయి. ప్రాణానికి ప్రాణంగాపెంచిన చెట్లు ప్రచండవాయుగమనానికిఅటుఇటూ వూగిపోయి నేల కూలిపోతుంటే నా హృదయం బాధతో విలవిలలాడిపోయింది.



అలాగే పేదపిల్లల కోసం ఇటీవలనే దగ్గరవుండి అజమాయిషీ చేస్తూ కట్టించిన భవనాలు కదలిపోతూంటే నా ఆశయాలు, ఆశలూ సమూలంగా నాశనం అయిపోతున్నంత బాధ కలిగింది. అవును, ఆ పునాదులపైన నిలిచే భవనాలే నా ఆదర్శాలకు, ఆశయాలకూ ప్రతీకలు, అవే నా ఊపిరి, నా జీవం, నా సర్వస్వం. కాని అవి నిలుస్తాయా? నిలువనిస్తుందా ఈ పెను తుఫాను? నా మనస్సులో కోటి సందేహాలు శతకోటి సముద్రాలైపొంగి పొరలుతున్నాయి.

## ప్రాణ రక్షణ

సాయంత్రం 4 గంటలు అయింది. గాలివేగం పెరిగిపోతోంది. మేము ఉన్న నిర్మలా సదన్‌పై కప్పు గాలికి ఎగిరిపోతోంది. కప్పుక్రింద శుభ్రంగా ఉండటానికి వేసిన తాటాకుచాపలు మాత్రం మిగిలాయి. గాలికిచాటుగా ఉండటం వలన కిటికీగుండా బయటకుచూసే అవకాశం కలిగింది. పెంకుటింటి కప్పులు లేచిపోవుటచేత ఆశ్రమ పాఠశాలలోని పిల్లలు భయపడిపోయి పది పన్రెండు మంది పిల్లలు బయటకు వచ్చారు. వారు గాలిలో కొట్టుకొనిపోతూ మేమున్న నిర్మలా సదన్ గోడను వచ్చి పట్టుకున్నారు. మాకు ఎదురుగా ఉన్న హాస్టలు భవనములోని ఆడపిల్లలు అదిచూచి కేకలు వేశారు. వెంటనే ఏమిటని అడిగాను. గాలిహోరు ఉధృతంగా ఉండుటవల్ల ఒకరిమాట ఒకరికి వినుపించటం లేదు. యింతలో ఒక కుర్రవాడు గాలికి కొట్టుకొని పోతూ కనిపించాడు. కిటికీగుండా అది చూచి వెంటనే బయటకు వచ్చి ఆ కుర్రవానిని పట్టుకోబోయాను నేను. మరొక బాలుడు వచ్చి నామీద పడ్డాడు. ఆ కుర్రవాడితోపాటు నేను పడిపోయాను. నా వెనుక సుబ్బారావుగారు, యితరులూ వచ్చారు. చివరకు ఆ పన్రెండు మంది పిల్లలను పట్టుకొని మేమున్న నిర్మలాసదన్‌లోకి చేర్చగలిగాము. అయితే మిగిలిన పిల్లలను గురించి ఆందోళన ప్రారంభమయింది. వెళ్ళాలా? ఉండాలా? ఏమైయుంటారు అని మనస్సులో పలుపలువిధాల ఆలోచనలు సాగాయి. వాళ్ళు ఉన్న ఆశ్రమ పాఠశాల భవనానికి వెళ్ళాలంటే గాలికి ఎదురు వెళ్ళాలి. అది మేమున్న భవనానికి వంద గజాల దూరములో ఉంది. అయినా పోదామని మొండి ధైర్యముతో బయటకు నడిచాము. ఆ గాలివేగానికి ముందుకు సాగలేకపోయాం. మానులను సహితం కుదిపివేస్తున్న ఆ గాలి ముందు మనుష్యులమైనమేం ఏపాటి? అది భీకరంగా ఘీపెట్టుతూ మమ్మల్ని వెనక్కి త్రోసేసింది. కాని సుబ్బారావు గారు మరొక విద్యార్థి పట్టువదలలేదు. ఎలాగైనావెళ్ళాలని నిశ్చయించుకొని నేలమీద ప్రాకుతూ అక్కడికి చేరారు. అక్కడ వున్న పిల్లలతో ఉండిపోయారు. నాకు కొంత స్థిమితం చిక్కినట్లయింది.

## బడబాగ్ని

సాయంత్రం 5 గంటలు అయింది. ఆకాశం అంతా ఎర్రగా రక్తం ఒలక పోసినట్లులా, ఎర్రటి కణకణలాడే నిప్పుకణాలు పరచినట్లుంది. అది చూస్తుంటే సముద్రంలో బడబాగ్ని బద్దలైందా వున్నట్టుంది. ఉప్పెన వచ్చినప్పుడు సముద్రం ఎర్రబడుతుందని మా చిన్నప్పుడు పెద్దవాళ్ళు చెప్పుతుండగా విన్నాను. మరికాసేపటికి ఆకాశమంతా నేలమతాబుల కాంతిలా నిండిపోయి, పట్టపగలల్లే అయిపోయింది. అటు తరువాత మేఘావృతమయినట్లుంది. ఇలా రకరకాల కాంతులు మారుస్తున్నా ఆకాశం పలురకాల భయాలకు కారణం అయింది. ఏమిటి విపరీతం అంతుపట్టలేదు. నాలో ఇన్ని భయాలు ఉన్నా ఇన్ని ఆలోచనలు ఉన్నా అవి మొహం మీద ప్రతిఫలించకుండా జాగ్రత్త పడ్డాను. సాధ్యమైనంత ఎక్కువ గాంభీర్యం కూడదీసుకున్నాను. లేకపోతే నా చుట్టూ ఉన్నవాళ్ళు నిరుత్సాహ పడవచ్చు.




స్వతహాగా నేను కొంచెం మొండి మనిషిని. దేనికీ ఒక పట్టాన జడవను. అది నాకీ సమయంలో అక్కరకి వచ్చింది. యింతలో హిందీ ప్రచారక విద్యాలయం ఆడపిల్లలు బిల్డింగు మీద పెంకులమోతకు భయపడి బయటకు వచ్చారు. వారి వెర్రి కేకలు విని మరల బయటకు వచ్చాను. వారిని ఎలాగైతేనేం మేమున్నచోటికి చేరదీశాం. ఒక అమ్మాయికి ఛాతిలో నొప్పివచ్చింది. వంటిమీద స్పృహలేదు. ఆ పాకలోనే వున్న ఒక బల్ల మీద పడుకోబెట్టి ప్రథమ చికిత్స చేశారు. ప్రొద్దుకూకింది. కారుచీకట్లు కళ్ళు పొడుచుకున్నాకానరాని గాఢాంధకారం. అలాగే ఆ కటిక చీకటిలో ఒకరినొకరం పట్టుకొని అన్ని హాస్టల్సులో ఉన్న వారిని పలుకరించి కదలవద్దని చెప్పి నిర్మలా సదన్‌కు తిరిగివచ్చాం. అక్కడ నుండి తిరిగి మా సేవాసదన్‌కు వెళ్లాం, విరిగిపోయిన చెట్టుకొమ్మలతో నిండిపోయిన దారివెంట మా యింటికి వెళ్ళడం అసాధ్యమైపోయింది. ఇంటి నిండా జనం నిండిపోయి వున్నారు. ఎక్కడా ఒక అంగుళం మేర కూడా ఖాళీ లేదు. వారందరినీ జాగ్రత్తగా ఉండమని చెప్పి తిరిగి ఎలాగో నిర్మలాసదన్‌కు చేరుకున్నాం. ఉదయం పదిగంటలకే బట్టలు తడిచిపోయాయి. ఆ తడిచిన బట్టల తోనే చలిలో చీకట్లో ప్రకృతిచేసే విలయ తాండవానికి నిస్సహాయుడనై నిలబడిపోయాను. రాత్రి రెండు గంటలయింది. అప్పటికి గాలివేగం కాస్తంత ఉపశమించింది. మళ్ళీ ఒకసారి అందరినీ పలుకరించటానికి వెళ్ళాను. అయినంపూడి ప్రకాశరావు బ్యాటరీ లైటు మాత్రం మాకు దారి చూపింది.ఆకులు, కొమ్మలూ, పెంకులతో దారి అంతా నిండిపోయి ఉంది. భయముతో పాములు జరజరపరుగులెడు తున్నాయి. ఆ దారిలో అడుగడుక్కి కసుక్కుమని దిగే ముళ్ళు ఆ సమయంలో వాటిని లెక్కపెట్టలేదు నేను, అందరిని పలుకరించి ధైర్యము చెప్పి తెల్లవారే వరకు బయటకు రావద్దని చెప్పాను.

**తుఫాను భీభత్సం**

తెల్లవారుతోంది. 20వ తేదీ. తూర్పురేఖలు కనపడ్డాయి. మా ఇంటికి వచ్చాను. కొబ్బరి చెట్టూ వేప చెట్టూ పడిపోయి వంట ఇంటి రేకులు ఎగిరిపోయి దారి అంతా చెత్తాచెదారంతోనిండిమరీ భీభత్సంగా వుంది. మా యింట్లో జూనియర్ కాలేజి ప్రిన్సిపల్‌గారు, శ్రీ ముగుళ్లపు కృష్ణారావుగారు వున్నారు. ఆయనకు కిన్నెరసాని రెసిడెన్సియల్ స్కూలులో ప్రిన్సిపాల్‌గా బదిలీ అయితే అక్కడకు వెళ్లారు. ఆ రోజు వారి అత్తగారు, భార్య, మా యింట్లోనే వుండి వెళ్ళడానికి అన్నీ సర్దుకుని ప్రిన్సిపాల్‌గారి అత్తగారు సత్యవతమ్మగారు ఊరగాయలు పట్టడంలో సిద్ధహస్తులు. ఆమె అనేక రకాలైన పచ్చళ్ళు తయారుచేసి ఉంచారు.మా యిల్లంతా పోవడంతో ఆమె పచ్చడి జాడీలు పగిలిపోయి ఎందుకూ పనికిరాకుండా పోయాయి. మన ఇల్లే ఇంత భీభత్సంగా వుంటే యిక గ్రామ పరిస్థితి ఎలావుందో అనుకుంటూ బయటకు వచ్చాను. కరంటు స్తంభాలు నేలకొరిగిపోయి మెలికలు తిరిగిపోయి ఉన్నాయి. టెలిగ్రాఫ్ స్తంభాలు ముక్కలు చెక్కలైపోయినాయి. రోడ్డుకు అడ్డంగా చెట్లు పడిపోయినాయి.ఇండ్ల కప్పులతోదారులు కప్పబడినాయి. గాంధీపురం గిరిజనులు ఎలా వుందీ చూచుటకు వెళ్ళాను.

ఒక యింటి మీద కూడ కప్పులేదు. వారిని పలుకరించి తిరిగి వస్తూ ఉండగా రోడ్డు ప్రక్క ఒక పాకలో ముసలమ్మ మూలుగుతూ వుంది. ఆయువు అంటే అదే కాబోలు. గోడ పడింది. దూలం పడింది. వాటికి రెండికి మధ్య ఆ ముసలమ్మ యిరుక్కు పోయింది. మూలుగుతూ చూస్తూ వుంది. ఆమెను నెమ్మదిగా బయటకు లాగాము. అచ్చట నుంచి గాంధీ క్షేత్రము నకు వచ్చాము. ఆంధ్రప్రదేశ్ నాట కోత్సవాల కోసము కట్టబడిన ఆరుబయలు రంగ స్థలముకొన్నివేలమంది ప్రజలను ఆకర్షించింది. అప్పట్లో మే 8వ తేదీన సినిమా నటులు శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావుగారు ప్రారంభోత్సవం చేశారు. దీని రేకులన్నీ ఎగిరి పోయాయి. ముక్కచెక్కలై చెల్లాచెదురైపోయాయి. పూరిపాకగా వేసిన మీటింగుహాలు నేలమట్టమయింది. అయితే గాంధీక్షేత్రం కట్టడాల మధ్య నిలబడివున్న మహాత్మాగాంధీ విగ్రహం మాత్రం చెక్కుచెదరలేదు, ఆ కాళరాత్రి ఆ భయానకమైన రాత్రిలో ప్రకృతి విలయతాండవానికి తానూ గుర్తై లక్షలాది బాధితులైన ప్రజల పరిస్థితి ఎలా అని పరితపిస్తూ ఆలోచిస్తూ వున్నట్లుగా వుంది ఆ విగ్రహం. ఆ శిల్పాన్ని ప్రముఖ శిల్పి శ్రీ పి. యన్. పట్నాయక్ బహూకరించారు. గాంధీజీకి అత్యంత సన్నిహితులు ప్రముఖ సర్వోదయ నాయకులు శ్రీ ప్రభాకర్ జీ ఆ విగ్రహాన్ని ఆవిష్కరించారు. వేలాది ప్రజలు బాధపడుతున్నారు. వెళ్ళు సేవచెయ్యి అని గాంధీజీ ఆదేశించినట్లు అనిపించింది. సర్వీస్ ఇన్ గాడ్ (సేవే దైవము) అదే నా కర్తవ్యము అని గాంధీజీ విగ్రహానికి నమస్కరించి బయలుదేరాను. గాంధీక్షేత్రంలో నున్న హిందీ విద్యాలయాన్ని గ్రంథాల యాన్ని ఓరియంటల్ పాఠశాల, మహిళా మండలి పాఠశాలనీ అన్నింటిని ఏ విధంగా దెబ్బతిన్నది చూస్తున్నాను. ఎవరోవచ్చి వంతెన దగ్గర ఒక మనిషి చచ్చిపడి వున్నాడని చెప్పారు. అప్పటికి ఉదయం



6.30 గంటలైంది. వెంటనే అచ్చటకు వెళ్ళాను అతను హరిజనుడు. గాలికి రేకు దెబ్బతగలడం వలన ఒక చెంప అంతా చీరుకు పోయింది. ఆ గాయంవలన అతను చని పోయాడు. మనస్సులో అయ్యో అనిపించింది. అచ్చట నుంచి గ్రామములో జరిగిన భీభత్సాన్ని చూస్తూ గుర్రపు చెరువు సమీపానికి చేరుకున్నాను. ఇంతలో ఎవరో వచ్చి గోడక్రింద మనిషి ఎవరో పడి చచ్చిపోయాడన్నారు. యాభైమందితో గుర్రపు చెరువుగట్టుకు వెళ్లాను. శవాన్ని బయటకు తీశారు. యువకుడు. పాపం ఆధారము లేనివాడు అతని భార్య పిల్లలు గగ్గోలుగావిల పిస్తున్నారు. నాలుగు మాటలు చెప్పిఓదార్చాం. ఆదుర్దాగా వెళ్ళామన్న మాటేగానీ తిరిగి రావాలంటే దారేలేదు. చెత్తచెదారం ముళ్ళకంపలతో నడవడానికి వీలులేనంత భీభత్సంగా వుంది. అలాగే అక్కడ వున్న వాళ్ళనందర్నీ పలకరించు కుంటూ శ్రీ అన్నపరెడ్డి సత్యనారాయణ గారితో హరిజనవాడ చేరుకున్నాము. ఇండ్లు వదలి ఏటిగట్టుపైన హాహాకారాలు చేస్తున్నారు. తాహసిల్దారుగారు ట్రాన్సుఫర్ అయినారు. ఇన్‌చార్జి తాహసీల్దారుగారు వచ్చారు. బాధితు లందరికి బియ్యం యివ్వమని చెప్పాను. వారు అలాగే యిచ్చారు. గ్రామాలన్నీ తిరుగుతూ బాధితుల్ని పరామర్శచేస్తూ యింటికి చేరాను. శ్రీ భోగాది మాణిక్యాలరావుగారు వచ్చారు. ఆశ్రమంలో పిల్లలు అందరికి భోజనము ఏర్పాటు చేయించి వెంటనే బయలుదేరాము. కోటగిరిలంక శీతాయలంక హరిజనవాడలు చూచుకుంటూ, రోడ్లమీద చెట్లను తొలగించుకొని పులిగడ్డ చేరాము. అక్కడ పరామర్శచేసి అడ్డంగా పడివున్న టెలిగ్రాఫ్ స్తంభాలు తీగెలను తొలగించుకొని మోపిదేవి వరకు వెళ్ళాము. గోడ క్రిందపడి చచ్చిపోయిన వారి కుటుంబాలను చూచి ఎటు వెళ్ళుటకు దారితోచక తిరిగి అవనిగడ్డ చేరాం.

**భయానకమైన వార్తలు**

పులిగడ్డ సెంటరులో అప్పుడే భావదేవరపల్లి నుండి వచ్చిన శ్రీ వెంకటేశ్వరరావు రోదిస్తూ నా వద్దకు చేరి భావదేవరపల్లి అంతా తాడిచెట్టు ఎత్తున ఉప్పెన వచ్చి ఊరంతా తుడిచి పెట్టుకుపోయిందని వందలాది మంది చనిపోయారని చెప్పారు. తను ఒక తాడి చెట్టుమీద ఉండి బ్రతికి బయటపడ్డానని పొలాలన్ని కొట్టుకుపోయాయని శవాలు కళేబరాలు చెట్లతో రోడ్లు నిండిపోయాయని, ప్రాణాలు అరిచేతుల్లో పెట్టుకువచ్చానని చెప్పాడు. నా కళ్ళల్లో నీళ్ళు సుడులు తిరిగాయి.



హృదయం ద్రవించుకుపోయింది కాసేపటికి మాజీ సమితి అధ్యక్షులు శ్రీ కోట కేశవ పెరుమాళ్ళు గారు కోడూరు నుండి 13 కిలోమీటర్లు ఎంతో బాధపడి నడిచివచ్చి దేశమంతా కొట్టుకుపోయిందని గద్గద స్వరముతో చెప్పారు. ఆయనను కూర్చోబెట్టి సేదదీర్చి సముదాయించి జరిగిందంతా వివరంగా చెప్పమని అడిగాను. వారు యిస్మాయిల్ బేగ్‌పేట, కోడూరు సముద్ర కెరటాలకు సర్వనాశనము అయిపోయి నాయనీ యిళ్లకప్పులు ఎక్కి ప్రాణాలు రక్షించుకున్నామని చెప్పారు. దివిసీమలో ప్రతి అణువు అభివృద్ధి చెందటానికి ఏళ్ళపాటు కృషిచేసిన నేను ఈ వినాశనాన్ని వింటూ స్థాణువులా అయిపోయాను. కోడూరు నుండి జయపురం వరకు దారి అంతా శవాలతోను చెట్ల మోదులతోను నానాభీభత్సంగా వుందని అయినా తెగించి వార్త అందించటానికి వచ్చానని చెప్పారు. నాగాయలంక నుండి డిప్యూటి తాహశీల్దారు శ్రీ నరసింహారావు రూరల్ బ్యాంకు ప్రెసిడెంటు శ్రీ వి. రాంప్రసాద్‌గార్లు వచ్చి భీభత్స పరిస్థితులు గురించి రిపోర్టు చేశారు. అప్పటికే మధ్యాహ్నం 12 గంటలు అయింది. అవనిగడ్డ సబ్ ఇన్‌స్పెక్టరు శ్రీ రంజిత్‌ను ఈ ప్రమాద పరిస్థితులను గురించి ముఖ్యమంత్రిగారికి, జిల్లా కలెక్టరుగారికి కబురు అందజేయవలసిందిగా కోరాను.

చల్లపల్లి వైర్‌లెస్ చెడిపోయిందని బందరు మాజేరు రోడ్డు అంతా శవాలతోను, కళేబరాలతోను, చెత్తచెదారముతోను నిండిపోయి వెళ్ళటానికే అవకాశము లేదని చెప్పారు. నడిచి అయినాసరే ఏదో విధంగా వెళ్ళి ఆ కబురు అందజేయమని ఆదేశించాను.

**ఉప్పెన ప్రాంతాల - పర్యటన**

మధ్యాహ్నం 2 గంటలయింది. భావదేవరపల్లి వెళ్ళి మందపాకల మీదుగా కోడూరు తిరిగి వద్దామని బయలుదేరాము. వెంట శ్రీ భోగాది మాణిక్యాలరావు, శ్రీ కోట కేశవ పెరుమాళ్ళు శ్రీ మండలి సుబ్బారావు, శ్రీ ఆర్థర్‌పాల్ శ్రీ రంజిత్‌ఫొటోగ్రాఫర్ శ్రీ ప్రసాద్ యింకా మిత్రులు వున్నారు. అవనిగడ్డ నాగాయలంక రోడ్డుకి అడ్డంగాపడి ఉన్న చెట్లను

తొలగించుకుంటూ వక్కపట్లవారిపాలెం చేరాం. శ్రీ మాణిక్యాలరావు గారు పర్రచివర ప్రాంతపు పరిస్థితులు తెలుసు కోవటానికి నాగాయ లంక వైపుకు వెళ్ళారు. వక్కపట్లవారిపాలెం దాటిన దగ్గర నుండి భావదేవర పల్లి వరకు నానా భీభత్సంగా ఉంది. ఇది అని వర్ణించినా ఊహకందని దృశ్యాలు అవి.అంతటి భయంకరదృశ్యాలు ఎప్పుడూ ఎక్కడా చూసి వుండం.

అసలు గ్రామాలు అనేవే ఉన్నాయా? వుంటే బ్రతికి వున్న వారంతా వున్నారా? ప్రశ్నలు, సందేహాలు మనసునిండా ముసురుకున్న ఆలోచనలు చాలా ఆందోళనకు గురిచేయసాగాయి. గుండె నిబ్బరం చేసుకొని, ముక్కుమూసుకుని కాళ్ళు ఈడ్చుకుంటూ శవాల మీదుగా ప్రయాణం సాగించాం. బ్రతికి బయటపడిన ప్రజలు ఎదురు చూస్తున్నారు. గుండెలు అవిసేలా ఏడుస్తూ కౌగలించుకొని ఏడ్చేవాళ్ళూ కాళ్ళమీదపడి రోదించేవాళ్ళూ. కన్నీటి గాథలు వింటూంటే మనసు కరిగిపోయింది. గుండె తరుక్కుపోయింది. ఓదారుస్తూ నాగాయలంక చేరవలసిందిగా చెప్పి భావదేవరపల్లివైపు ప్రయాణం సాగించాం.

## శ్మశానంగా మారిన భావదేవర పల్లి

శవాలు సంగతి సరే... ప్రాణాలతో తిరుగుతున్న ఈ జీవచ్ఛవాలు ఆస్తులు పోగొట్టుకొని, అయ్యో అనిపించిందా ప్రజల్ని చూస్తుంటే.

ఊళ్ళోకి అడుగుపెట్టాక మా ఆత్మీయులు మునసబు ఆంజనేయులు గారు కనపడ్డారు. నోటమాట లేకుండా నిర్వీర్యులుగా నిలబడిపోయాం. కొన్ని యిళ్ళు నేలమట్టమయ్యాయి. కొన్నికొట్టుకొని పోయాయి. దారులన్నీ కూలిన చెట్లతో కుళ్ళిన జీవాలతో నిండి పోయాయి. శ్రీ భావన్నారాయణ స్వామివారి దేవాలయం, రామాలయం, బడి, ఏడెనిమిది పెంకుటిళ్ళూ, డాబాలు మిగిలాయి. చిన్న వూరు దాటగానే మా తమ్ముడు జనార్దనరావు ఎదురొచ్చాడు. బావురుమని ఏడ్చాడు. వాడావూరికి సర్పంచ్. ఊరంతా పిచ్చెక్కినట్లు తిరుగుతున్నాడు. పిద్దవూరు వెళ్ళాను. గవుడపాలెంలో ఒక యిల్లు కూలిపోయింది. 40 మంది చనిపోయారు. ఉన్నత పాఠశాల భవనం కూలిపోయింది. 80 మంది మరణించారు. మా యింటికి వెళ్లాను. ఇల్లంతా నేలమట్ట



మయింది. పశువులన్నీ చనిపోయాయి.మా తమ్ముడి కుటుంబం ప్రక్కనే ఉన్న మా పెద్దన్నయ్య శ్రీ మండలి వెంకటప్పయ్యగారి ఇంటి అటకమీద ఎక్కి ప్రాణాలు దక్కించుకున్నారు.నేను వెళ్ళిన పదినిముషా లకు మా యిల్లు నేలమట్టమయింది. ఎత్తైన ప్రదేశములో నున్న మా అన్నయ్య గారి యింటికి అటకవరకు వరదలు వచ్చాయి. యింకా కొంచెము వరదవస్తే కప్పు కొట్టుకొని పోయేది.18 నుండి 20 అడుగులు దాకా నీరువచ్చింది.150 కిలోమీటర్ల వేగముతో గాలులు సముద్రపు కెరటాలు రావడంతో ఆ ధాటికి ఏ కట్టడము నిలుస్తుంది? దార్లు అన్నీచాలా ఘోరంగా ఉన్నాయి.అలాగే కొన్ని చోట్లకు మాత్రము వెళ్ళి కొద్దిమందిని మాత్రంపరామర్శించి బ్రతికివున్న వారందరినీ నాగాయలంక అవనిగడ్డ చేరమని చెప్పి నేను వెనుకకు తిరిగి వచ్చేసరికి చీకటి పడుతోంది.

బాధితులంతా నాగాయలంక చేరుతున్నారు. వారికి భోజనవసతి ఏర్పాట్లు చూడాలి.వెళ్ళటానికి దారులు సరిగా లేవు.అందరూ ఆందోళన పడుతున్నారు. ఏమీ ఫరవాలేదని మొండికేసి తిరిగి బయలు దేరాము. ఆ కటిక చీకటిలో కర్ర చేతితో పట్టుకుని గుండె నిబ్బరము చేసుకొని నడుస్తూ నాగాయలంక చేరుకున్నాము. రోడ్లు అన్నీ కిక్కిరిసిపోయి వున్నాయి. డిప్యూటి తహసిల్దారు శ్రీ నరసింహరావును పిలిచి వారికి బియ్యంయిచ్చే ఏర్పాట్లు చేశాను.వైశ్యులు భోజనం వండిపెడు తున్నారు. అచ్చట నుండి అవనిగడ్డ చేరాను.కోడూరు ప్రాంతము నుండి వచ్చిన వారంతా గాంధీక్షేత్రములో ఉండుటవల్ల ఆ ప్రదేశం కిటకిటలాడుతోంది.

## ముఖ్యమంత్రి రాక

21వ తేదీ ఉదయం ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావుగారు, రెవిన్యూమంత్రి శ్రీ నరసారెడ్డిగారు వస్తున్నట్లు రేడియో వార్తలు విన్నవారు వచ్చి చెప్పారు. ఇంతటి జలప్రళయం జరిగిందని బయట ప్రపంచానికి అప్పటికి ఎవరికీ తెలియదు. లైట్లు పెట్టుకొని ప్రజల సహకారముతో దారికి అడ్డంగా వున్న చెట్లను తొలగించుకుంటూ 8 గంటలకు గన్నవరం చేరాం. మేము వెళ్ళిన కొంతసేపటికి పత్రికా విలేఖరులు ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావుగారు, రెవిన్యూమంత్రి శ్రీ నరసారెడ్డిగారు వచ్చారు. శ్రీ నరసారెడ్డిగారు నేను సోదరులుగా ఉండేవారము. ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులుగా ఆయన ఉన్నప్పుడు నేను ప్రధానకార్యదర్శిగా వుండేవాణ్ని. అప్పటినుంచి అత్యంత సన్నిహితులుగా వుంటున్నాం. శ్రీ నరసారెడ్డిగారు దగ్గరకు వచ్చి ఏమిటి అలా ఉన్నావు అని అడిగారు. నాకు దుఃఖం ఆగలేదు. ముఖ్యమంత్రిని వారిని కౌగలించుకొని విలపించాను. ఎంతో ధైర్యంగా, మొండిగా, శవాలమీదనుంచి నడచివెళ్ళి భీభత్స దృశ్యాలను చూస్తూ ప్రజలను ఓదార్చిన నేను మన నాయకులనుచూసి ఆగలేకపోయాను. గ్రామాలన్నీ కొట్టుకొనిపోయాయని, 20 సంవత్సరాలుగా దివిసీమాభివృద్ధికి చేసిన

కృషి అంతా సర్వనాశనం అయిపోయిందని, కనీసం పదివేల మంది అయినా చనిపోయి ఉంటారని చెప్పాను. 19వ తేదీ ఉదయం నుంచి 21వ తేదీ ఉదయం వరకు 28 గంటలపాటు దివిసీమతో బయట ప్రపంచానికి కమ్యూనికేషన్సు లేక వార్తలు అందలేదు. ప్రథమంగా ఈ వార్తలు బయట ప్రపంచానికి తెలియజేశాను.



ముఖ్యమంత్రి నన్ను ఓదార్చి ఏది ఏమైనా మన ప్రజలను మనము రక్షించుకుందాం. హెలికాప్టరు ఎక్కు అన్నారు. ముఖ్యమంత్రిగారు, రెవెన్యూ మంత్రిగారు, మునిస్వామిగారు, నేను ఒక హెలికాప్టర్‌లోను, శ్రీ చనుమోలు వెంకట్రావుగారు, రెవెన్యూబోర్డువారు రెండవదానిలోను ఎక్కారు.

ముందుగా మచిలీపట్నం పెరేడుగ్రౌండులో దిగాము. బందరులో ఉప్పెనకు గురైనవార్ని జాతీయ కళాశాల, హిందూ కళాశాలలకు చేర్చారు. వారిని పరామర్శించి, దెబ్బతిన్న ప్రాంతాలను చూసేందుకు బయలుదేరాము గిలకలదిండి, చిన్నాపురం, కొనయాదర, వాడపాలెం లను చూచుకుంటూ దివితాలుకా ప్రవేశించాం. ఉల్లిపాలెం, హంసల దీవి, గుల్లలమోద, భావదేవరపల్లి చూచుకుంటూ అవనిగడ్డ ప్రాంతానికి వచ్చాము. చినుకులు పడుతున్నవి. దిగే చోట జనం విపరీతంగా చుట్టుముట్టి వున్నారు. వాతావరణం బాగుండలేదని హెలికాప్టరు దిగకుండనే గుంటూరు జిల్లాకు వెళ్ళాం. బాపట్ల, రేపల్లె చూసుకుంటూ, గుంటూరు వచ్చాం. గుంటూరుభారీవర్షాలవల్ల జలమయం అయింది. గాలివలన ఇళ్ళు భవనాలు కూలిపోయాయి.

మేము ఇందిరానగర్ పరిసరప్రాంతాలకు వెళ్ళిచూశాం. పడి పోయిన పాకల నుండి శవాలను బయటకు తీస్తున్నారు. నానా భీభత్సంగా వుంది. ముఖ్యమంత్రిగారు జిల్లా అధికారులకు సత్వర సహాయచర్యలకు ఆదేశాలు యిచ్చారు. అచ్చట నుండి మేము ఆ దృశ్యాలను చూచుకుంటూ విజయవాడ చేరాం. గుంటూరు జిల్లా అధికారులను, కృష్ణా జిల్లా అధికారులను సమావేశపరచి ఏది ఎలా



అయినా, ఎంత ఖర్చు అయినా సహాయ కార్యక్రమాలు ముమ్మరంగా జరగాలని శ్రీ జలగం వెంగళరావుగారు ఆదేశాలిచ్చారు.

ముఖ్యమంత్రిగారి వద్ద సెలవు తీసుకొని మేము 21వ తేదీ సాయంత్రం అవనిగడ్డ చేరాం. అవనిగడ్డ అంతా కిటకిటలాడిపోతోంది. గాంధీక్షేత్రం మీద ఇసుకవేస్తే రాలని ప్రజావాహిని హాహాకారాలు, ఆర్తనాదాలతో నిండివుంది.

సేవాశ్రమంలో భోజనములు ఏర్పాట్లు, ఉండుటకు గాంధీ క్షేత్రం, కాలేజీ భవనాలు ఏర్పాటు చేశాం. 15 రోజులపాటు 10, 15 వేలమందికి భోజనాలు పెట్టాము. ప్రభుత్వం యిచటనేకాక, కోడూరు, నాగాయలంక, మచిలీపట్నం సెంటరులలో 50 వేల మందికి శిబిరాలు ఏర్పాటు చేసి భోజనవసతి కల్పించింది. కమీషనర్ శ్రీ సుబ్రహ్మణ్యం, కలెక్టర్ శ్రీ జి.ఎన్.రావు, ఇతర సిబ్బంది ప్రత్యేక శ్రద్ధతో సహాయ కార్యక్రమాలు పర్యవేక్షించారు.

ఇతర జిల్లాల నుండి కలెక్టర్లు, హైదరాబాదు సెక్రటేరియట్ నుండి సిబ్బందిని కూడా తీసుకువచ్చి సహాయకార్యక్రమాల్లో నియమించారు. అమెరికా సెటిలైట్ నుండి టి.వి. ప్రసారము వలన ప్రపంచవార్తలు తెలిపే ఇతర దేశస్థులు కూడా రావడం ప్రారంభమైంది.

## రాష్ట్రపతి పర్యటన

ఈ వార్తవిని దిగ్భ్రాంతిచెందిన శ్రీ నీలం సంజీవరెడ్డిగారు హైదరాబాద్ వచ్చి 23 వ తేదీ గన్నవరం వచ్చారు. అవనిగడ్డలో హెలికాప్టర్ దిగుటకు వీలులేకపోవుటచే శ్రీ సంజీవరెడ్డి కారులో బయలుదేరి వెంటదారి చూచుకుంటూ వచ్చారు. వారి వెంట గవర్నరు శారదాముఖర్జీ, ముఖ్యమంత్రి జలగం వెంగళరావు, కేంద్రవ్యవసాయ మంత్రి బర్నాలా ఉన్నారు. బాధితుల్ని పరామర్శించి ధైర్యంగా

ఉండాలని చెప్పారు. విమానములో దెబ్బతిన్న ప్రాంతాలను చూచి మద్రాసు వెళ్ళి అచ్చట తుఫానుకు గురియైన ప్రాంతాలను పరిశీలించి ఢిల్లీ వెళ్ళారు. ఈ భీభత్సాన్ని గురించి ప్రధానికి వివరించారు. కేంద్ర సహాయం సత్వరంగా వచ్చేటట్టు చేశారు. 25వ తేదీ రక్షణమంత్రి శ్రీ జగ్ జీవనరాం ఉప్పెన ప్రాంతాలను చూశారు. వారివెంట పలువురు జనతాపార్లమెంటు సభ్యులు ఉన్నారు.

### శవసేన

ఉప్పెనవచ్చి నాల్గురోజులు అయినా శవాలను తీసివేసే సమస్య మిగిలిపోయింది. భీతావహం చెందిన ప్రజలు ధైర్యం చేయలేక పోయారు. సర్వోదయ నాయకులు శ్రీ ప్రభాకర్‌జీ సలహాతో శవసేన పేరుతో వాలంటీర్లు తయారు చేసి ఆ కార్యక్రమాన్ని ప్రారంభించాం. దానితో సర్వోదయ కార్యకర్తలు, ఆర్.ఎస్.ఎస్., ఆనందమార్గ్, విద్యార్థులు, కాంగ్రెస్ కార్యకర్తలు చేరారు. ముమ్మరంగా కార్యక్రమం సాగించారు. పోలీసులు, సింగరేణి కాలరీస్ సిబ్బంది, ఖైదీలు, స్వచ్ఛంద సేవాసంస్థలు పాల్గొని విజయవంతం చేశారు.

### మంత్రిపదవికి నా రాజీనామా

25వ తేదీ గ్రామాలన్నీ చూచి భావదేవరపల్లి చేరాను. బట్టలు పంచిపెట్టుతూంటే గ్రామస్తులంతా అతి దీనావస్థలో అచ్చట గుమి గూడారు. ఒక రాతిమీద కూర్చుని పరిస్థితులు అవలోకించాను. 20 సంవత్సరముల కృషి సర్వనాశనము అయ్యిందే అని బాధ కలిగింది. ప్రజల హీనస్థితిని చూడలేకపోయాను. పదవి బాధ్యతలకంటే ప్రజాసేవ ముఖ్యమనిభావించాను. మా గన్‌మేన్‌ను పిలిచి కాగితం అడిగి పదవీ బాధ్యతలనుంచి విడుదల చేసి సేవాకార్యక్రమంలో పాల్గొనేందుకు నన్ను విడుదల చేయమని కోరుతూ ముఖ్యమంత్రిగారికి రాజీనామా లేఖ వ్రాశాను. అది అవనిగడ్డ పంపి మెస్సేజి యివ్వమన్నాను. పోలీసు సూపరింటెండెంటు అది చూసి వెంటనే భావదేవరపల్లి వచ్చి యిటు వంటి కష్టసమయములో రాజీనామా యివ్వవద్దని కోరారు. పదవి ఉన్నా లేకపోయినా ప్రజాసేవ చేయగలనని పదవీ బాధ్యతలు లేకపోతే మరింత ఎక్కువగా సేవ చేయగలనని వారికి చెప్పి పంపాను. ముఖ్య మంత్రిగారికి మెస్సేజి అందాక 26వ తేదీన అవనిగడ్డ వస్తున్నట్లు తెలియజేశారు.

26 వ తేదీ ఉదయం ప్రభాకర్‌జీతో కలసి శవాలు తీసివేసే నిమిత్తం గ్రామాలకు వెళ్ళాను. ఈ లోపుగా ముఖ్యమంత్రిగారు భావ దేవరపల్లి, నాగాయలంక, కోడూరు ప్రాంతాలు చూచి అవనిగడ్డ మా యింటిదగ్గర వేచిచూస్తున్నట్లు యిస్మయిల్‌బేగ్ పేటకు కబురు వచ్చింది. మేము అవనిగడ్డ చేరేసరికి రాత్రి 8 గంటలు అయింది. 7 గంటలువరకు చూచి ముఖ్యమంత్రిగారు విజయవాడ వెళ్ళిపోయారు.



పత్రికా విలేఖరులు నన్ను చుట్టుముట్టారు. రాజీనామా సంగతి ప్రశ్నించగా, రాజీనామా వార్త నిజమేనని, ఇటు ప్రజాసేవ, అటు పదవీబాధ్యతలకు రెండింటికి న్యాయం చేకూర్చటం కష్టమని, అందువలన రాజకీయ కారణాలవలన కాదని చెప్పాను.

### బాధితుల సహాయ సమితి

నేను మంత్రి పదవికి రాజీనామా చేసి వెంటనే, అన్ని రాజకీయ పక్షాలవారిని ఆహ్వానించి, ఉప్పెన తుఫాను బాధితుల సహాయ సమితిని ఏర్పాటు చేశాను. ప్రభాకర్‌జీ గౌరవాధ్యక్షులుగ, శ్రీ ఘంటా కృష్ణమూర్తి కోశాధికారిగా, నేను అధ్యక్షులుగా, శ్రీ లవణం, హేమలతాలవణం కార్యదర్శులుగా, వివిధ రాజకీయపక్ష నాయకులు ఉపాధ్యక్షులుగ కమిటీ చేయబడింది. శ్రీ రాజలింగం, శ్రీ రాజన్, శ్రీ జయసింహాచారి మా కార్యక్రమాలకు ఎంతగానో తోడ్పడినారు. కార్యదర్శులుగా శ్రీ లవణం, హేమలతాలవణం గార్లు నిర్విరామంగా కృషి చేశారు. వచ్చిన సహాయాల్ని సత్వరంగ, సక్రమముగా అందజేయడం, సహాయ సంస్థలను సమన్వయ పరిచాం. దేశవిదేశాల నుంచి వచ్చిన పరిశీలకు లకు అవసరమగు సహకారం ఇవ్వడం, అధికారులతో మాట్లాడి, బాధితులసమితి చేసిన ముఖ్యకార్యక్రమము.

### ఇందిరాగాంధీ సానుభూతి

విపత్తులలో చిక్కుకున్న ప్రజలను పరామర్శించటానికి శ్రీమతి ఇందిరాగాంధీ 26 వ తేదీ రాత్రి మద్రాసు మీదుగా నాగార్జునసాగరు వచ్చి, అచ్చటనుండి గుంటూరు పట్టణం చేరి, ఉపద్రవానికి గురియైన ప్రదేశాలను పరిశీలించి,బందరు మీదుగా మధ్యాహ్నందివిసీమకు వచ్చారు.

భావదేవరపల్లి వరకు వెళ్ళి ఉప్పెన వల్ల జరిగిన విపత్తును తిలకిం చారు. ఆ రోజు వక్కపట్లవారి పాలెం నుండి భావదేవరపల్లి వరకు కాలువగట్టుల వెంటనున్న శవాల మంటలతో శ్మశానంగా మారిపో యింది.ఆ పొగలకు శ్రీమతి గాంధీ కళ్ళుతుడుచుకుంటూ ప్రయాణము

చేశారు. నాగాయలంక, అవనిగడ్డలోను వేలాది బాధితుల సభలో ధైర్యంగా ఉండాలని, విపత్తును రాజకీయంగా మార్చవద్దని చెప్పారు.

28వ తేదీ కేంద్ర ప్రభుత్వం వ్యవసాయశాఖ కార్యదర్శి శ్రీ ఎస్.ఎ. ముఖర్జీ ఆధ్వర్యాన 7 గురు సభ్యులుగల అధికార బృందం, జరిగిన భీభత్సాన్ని అంచనావేయటానికి వచ్చి పరిశీలించారు.

## ప్రధాని పర్యటన

30వ తేదీన మురార్జీ దేశాయి గన్నవరం వచ్చి హెలీకాప్టరు మీద దెబ్బతిన్న ప్రాంతాలన్నీ పరిశీలించి బాధితులనుపరా మర్శించారు. ఆ విపత్తును చూచి తీవ్రంగా చలించిపోయిన ప్రధాని కేంద్ర, రాష్ట్ర ఉన్నతాధికారుల సమావేశము ఏర్పాటుచేసి సత్వర సహాయచర్యలు జరగాలని ఆదేశించారు.

ప్రపంచ ప్రఖ్యాత సంఘ సేవకులు మదర్‌థెరిస్సా, బెలిగ్రాం మరియు అనేక విదేశీ ప్రముఖులు వచ్చి చూచారు. భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, జనతాపార్టీ అధ్యక్షులు శ్రీ చంద్రశేఖర్, సి.పి.ఐ. కార్యదర్శి శ్రీ చంద్ర రాజేశ్వరరావు, సి.పి.యం. నాయకులు శ్రీ నంబూద్రిపాద్, పశ్చిమ బెంగాల్ ముఖ్య మంత్రి శ్రీ జ్యోతిబసు, ఆర్.ఎస్.ఎస్. నాయకులు శ్రీ దేవరస్ మరియు వివిధ రాజకీయ పార్టీల నాయకులు వచ్చి చూసి వెళ్ళారు.

అంతర్జాతీయ సేవా సంఘాలు రెడ్‌క్రాస్, కేర్, ఎ.పి.కార్, రోటరీ, లైన్స్ క్లబ్బులు, రామకృష్ణా మిషన్, ఆర్.ఎస్.ఎస్. ఆనంద్ మార్గ్ విశ్వహిందూ పరిషత్, భారత్ సేవాశ్రమ సంఘం యింకా అనేక సంస్థలు వచ్చి సేవా కార్యక్రమాలలో పాల్గొన్నాయి.

ముఖ్యమంత్రి వెంగళరావు గారు నా రాజీనామా ఉపసంహరించు కోవలసిందిగా కోరారు. ఈ ఆపద సమయములో ప్రభుత్వమునకు క్లిష్టపరిస్థితులు ఏర్పడతాయని, సహాయ కార్యక్రమాలు సత్వరం జరగవని, రాజీనామా ఉపసంహరించుకోమని చెప్పారు. అవనిగడ్డ బహిరంగసభలో రాజీనామా ఉపసంహరించుకోవలసిందిగా తీర్మానం చేశారు. ముఖ్యమంత్రి అభీష్టప్రకారం ప్రజల అభీష్టప్రకారం పదవిలో కొనసాగుతూ వారికి సేవచేశాను.

నా జీవితంలో రెండు ముఖ్య సంఘటనలు జరిగాయి. 1975లో ప్రపంచములో నున్న తెలుగువారి ప్రతినిధులను, తెలుగు దేశ నాయకులను, ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ఆహ్వానించి తెలుగువాణిని వినిపించి, తెలుగు దేశసుస్థిర సమైక్యతకు, ప్రగతికి కృషిచేయడం.

ఈ శతాబ్దములో ఘోరవిపత్తుగ పరిగణింపబడిన 1977 నవంబరు ఉప్పెన తుఫాను భీభత్స సమయములో నా ప్రజలమధ్య ఉండి వారి బాధలలో భాగస్వామిని కావడం, వివిధ పార్టీల, వివిధ స్వచ్ఛంద సంస్థల సంఘ సేవకులతోకలసి బాధితులకు సహాయంచేసే అవకాశం కలగడం. నా జీవితంలో మరుపురాని ముఖ్య సంఘటనలు.

ప్రపంచవ్యాప్తి చెందిన ఈ రెండు కార్యక్రమాలలో ప్రముఖపాత్ర వహించే అవకాశాల కంటే నాకు ఇంకేమికావాలి? అదే నాకు తృప్తి అదే నాకు సంతృప్తి. ఆపదలో ఉన్నవారిని ఆదుకున్నవారి కందరకు హృదయపూర్వక అభినందనలు, నా నమోవాకములు. సేవేదైవము సేవ చేయడమే మన కర్తవ్యము.

**బ్రహ్మ సరస్వతులకు అర్ఘ్య ప్రదానం :**

చతుర్ముఖ జగద్రష్ట సత్యలోక స్థితవ్యయ<br>
సరస్వత్యా చ సహితో గృహాణార్ఘ్యం<br>
నమోస్తుతే<br>
ఓం సరస్వతీ సమేత బ్రహ్మణే నమః<br>
ఇదమర్ఘ్యం సమర్పయామి

శ్రీ సురవరం ప్రతాపరెడ్డి

# 1857 నుండి 1907 వరకు

భారతీయుల కత్తి 1757లో ప్లాసీ యుద్ధములో లొంగిపోయెను. 1857 విప్లవములో విరిగిపోయెను. మరల 1947లో మనకత్తి మన చేతికి వచ్చెను. 1857లో ఇంగ్లీషు రాజ్యము దేశమంతటను స్థిరపడిపోయెను. ఇది మన దేశ చరిత్రలో ముఖ్యమగు ఘట్టము. మన మానాటి నుండి ఆధునిక యంత్ర యుగములోనికి ప్రవేశించినాము. ఈ 90 ఏండ్ల చరిత్ర విద్యావంతుల కందరికినీ బాగా పరిచితమైనదే. అందుచేత ఈ భాగమును 1907 వరకు ముగించుట బాగని తలపనయినది. అనగా విప్లవము తరువాత 50 ఏండ్ల సాంఘిక చరిత్ర సంగ్రహముగా నీ ప్రకరణమున వ్రాయబడును.

1857కు పూర్వముండిన ముస్లిం మతవ్యాప్తి ఆనాటితో ఆగిపోయెను. ఇంగ్లీషు వారు క్రైస్తవులు మత వ్యాపక సంఘములు (మిషనులు) అనువయిన స్థలములందంతటను స్థాపితమయ్యెను. మిషనరీలు నానావిధములగు సేవలద్వారా జనులను తమ మతములోని కాకర్షించిరి. వారు విద్యాలయములు స్థాపించిరి. వైద్యాలయముల నెలకొల్పి ఉచితముగా మందులిచ్చిరి. తమ బైబిల్ మత గ్రంథమును భారతీయ భాషలన్నింటిలోనికి పరివర్తనము చేసి ముద్రించి ఉచితముగా పంచిపెట్టిరి. వారి మతములోనికి విశేషముగా అంటరాని తెగలవారు చేరిపోయిరి. తెనుగు దేశమందు 200 ఏండ్లనుండి క్రైస్తవ మత ప్రచారము సాగుతూ వచ్చినది. క్రైస్తవ మతములో చేరిన పై జాతులవారు తమ కులాలను మరచిపోజాలరయిరి. గుంటూరుజిల్లాలో వేలకొలది రెడ్డి కుటుంబాలు క్రైస్తవ మతం పుచ్చుకొనెను. కాని వారు అదే మత మవలంభించిన మాల మాదిగ మంగలి మున్నగు తక్కువ జాతులతో బాంధవ్యము నేటివరకు చేయుట లేదు. అందింకొక చిత్రమే మన హిందువులగు రెడ్లు తమ కన్యల ఆ రెడ్డి క్రైస్తవులకిచ్చి పెండ్లి చేయుదురు. కాని క్రైస్తవ రెడ్లు మాత్రము తమ పిల్లల హిందూ రెడ్లకీయరు.

మిషనరీలు, ఫాద్రీలు, తమ మతము గొప్పదనియు ప్రచారము చేసుకొనుటలో తృప్తినొందక హిందువులు కులాచార లోపములను మూర్ఖవిశ్వాసములను సంఘములోని కుళ్ళును బయటపెట్టి దుష్ప్రచారము చేసి జనులలో హిందూ మతముపై విశ్వాసమును భక్తిని ఆదరమును పోగొట్టుతూ వచ్చిరి. అందుచేత ఇంగ్లీషు విద్య నేర్చినవారిలో తమ మతముపై అభిమానము తగ్గిపోయి తమ కొంచెపుతనమునకు తాము లజ్జింప మొదలిడిరి. అట్టి సన్నివేశములో భారత రంగముపై ఒక మహావ్యక్తి ఆవిర్భవించెను. అతడే మహర్షి శ్రీ మద్దయానంద సరస్వతీ భగవత్పాదులు. వారికింగ్లీషేమియు రాకుండెను. సంస్కృతమందు పారమందినవారు. వేద శాస్త్రములను సంపూర్ణముగా స్వాధీనపరచుకొనిరి. అతడాధునిక కాలపు ద్రష్ట. అతడార్యసమాజమును స్థాపించి హిందువులలోని ఆచార లోపాలు మధ్య వచ్చినవే కాని వేదమూలకములు కావని నిరూపించి ఇస్లాం క్రైస్తవమతాలలో కల ఆధ్యాత్మికాధి భౌతిక లోపాలను సవిత్కరముగా నిరూపించి హిందువులకు ధైర్యము సంస్కారావకాశము, ఆత్మ గౌరవము కలిగించెను. తెనుగుదేశమందు నిన్న మొన్నటి వరకు ఆర్యసమాజ ప్రచారము సాగినదికాదు.

ఆర్యసమాజానికి ముందే రాజారామమోహనరాయల బ్రహ్మ సమాజశాఖలు కృష్ణా గోదావరి జిల్లాలలో కొన్ని స్థాపితమయ్యెను. కాని వానికి వ్యాప్తి లేక ఆగిపోయెను. అయినను ఆర్యబ్రాహ్మ సమాజముల భావములు జనులలో బాగా వ్యాపించిపోయెను. బ్రహ్మ సమాజంలో చేరినట్టి కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఒక అసాధారణ వ్యక్తి. మహానుభావుడు. 'వీరాఃపండిత కవయః' అన్న సూక్తికి లక్ష్యభూతుడు. అతడు కులముల తారతమ్యములమీద మూఢ విశ్వాసాలమీద, అవైదికమగు మూర్తిపూజలమీద దెబ్బ తీసెను. స్త్రీలపై జరుగు అత్యాచారముల ముఖ్యముగా వితంతువులకు పునర్వివాహము చేయక నిరోధిం[illegible]ను ప్రతిఘటించి వితంతూద్వాహములను చేయించి, విత[illegible]మమును నెలకొల్పెను. ఆయన ప్రచారము వలన తెనుగు దేశమందపూర్వ సంచలనము కలిగెను. పూర్వాచార పరులు ఆంక్షలుపెట్టి, అల్లరులు చేసి, దౌర్జన్యాలు చేసి, బీభత్సము

చేసినను అతడు మరింత విజృంభించి తన దీక్షను సాగించెనే కాని విరమించుకొన్నవాడు కాడు.

హిందువులలో ఇంచుమించు 1000 ఏండ్లనుండి అనగా ముస్లిములు దేశమందు ప్రవేశించిన కాలమునుండి అనేక దురాచారాలు ప్రబలిపోయెను. బాల్యవివాహాలు, వితంతూద్వాహ నిషేధము, సహగమనము, బహువిధ మూర్తుల పూజ, అనేక శక్తుల పూజలు, దేవర్ల కొలువులు, మంత్రతంత్ర విశ్వాసములు, సముద్ర యాన నిషేధము, కుల బహిష్కారదౌర్జన్యాలు, గ్రహచార విశ్వాసము, గ్రహశాంతులు శుభాశుభ శకునాల పాటింపులు, అంటరానితనము, దృష్టిలోపాలు తాంత్రిక వామాచారాలు, మున్నగు ననంత లోపాలు సంఘమందు స్థిరపడిపోయెను. ఈ లోపాలవల్ల మనలో ఐకమత్యము, నాగరికతాభివృద్ధి, నిర్మాణ కౌశలము నశించి, రాజకీయ పతనము సంభవించెనని విద్యావంతులు తలచిరి. అందుచేత పారతంత్ర్య విముక్తికి ముఖ్య సాధనము సంఘ లోపముల సంస్కారమని తలచిరి. దానికై సంఘ సంస్కార మహాసభలు విరివిగా కావించిరి.

ఇది యిట్లుండ క్రీ.శ. 1885 లో అఖిల భారత జాతీయ మహాసభ (నేషనల్ కాంగ్రెస్) స్థాపితమయ్యెను. 1857 తర్వాత అతిముఖ్యమగు ఘట్టమీ కాంగ్రెసు సంస్థాపన, భారత జాతీయత (Nationalism) ఆనాటి నుండి ప్రారంభమైనదన్నమాట. భారత దేశమును సృష్టికర్త తన పరిశీలన గృహము (లేబరేటరీ)గా బహుశా నిర్ణయించు కున్నాడేమో వివిధ జాతులు, కులాలు, మతాలు, భాషలు - ఇచ్చటనే సమకూడినవి. వేదకాలమునుండి భారతీయులలో అఖండ జాతీయత యెన్నడును కలిగి యుండలేదు. కావున కాంగ్రెసు అవతరణ యీ జాతీయతకు పునాది వేసెను. యూరోపులోని జర్మనీలో ఫ్రెడరిక్ (The Great) తోను, ఇటలీ గారిబాల్డీ, మాజ్జినీలతోను, ఫ్రాన్సులో 1789 నాటి విప్లవము తోను సంయుక్తామెరికాలో 1776 తోను జాతీయత ఏర్పడెను. మన కాంగ్రెసు మొదట సంఘ సంస్కారమునకు పూను కొనలేదు. దాని వార్షిక సభలతోపాటు వేరుగా సంఘ సంస్కార సభలు జరుగుచుండెను.

ఇంగ్లీషు పరిపాలనము ఆర్థికముగా దేశానికి గొప్ప నష్టము కలిగించెను. మన దేశములోని పరిశ్రమలు నాశనమయ్యెను. కొత్త పరిశ్రమలను ఇంగ్లీషువారణగ ద్రొక్కిరి. అందుచేత జనులు అత్యధికముగా భూమిపై వ్యవసాయముపై ఆధారపడిరి. దేశమందు క్షామములు అభివృద్ధియై జననష్టమపారమయ్యెను. విలియం డిగ్బీ అను ఆంగ్లేయుడు 1891 లో పార్లమెంటు సభ్యుల పేర ఒక విజ్ఞప్తి ప్రకటించెను. అందిట్లు వ్రాసెను. '1802 నుండి 1854 వరకు 13 క్షామాలు సంభవించి 50 లక్షలమంది చచ్చిరి. 1860 నుండి 1879 వరకు 16 క్షామాలు సంభవించి 1 కోటి 20 లక్షల మంది చచ్చిరి. 1868లో దాదాబాయి నౌరోజీ లెక్కించి పరిశోధించగా మద్రాసు రాజధానిలో మనిషికి సగటున సంవత్సరాదాయము 18 రూపాయలే అని తేల్చెను. ఉత్తరార్కాటు జిల్లా కలెక్టరు తన జిల్లాలో అపారమైన దారిద్ర్యము జనులలో నిండినదని వ్రాసెను. నెల్లూరు జిల్లాలో అపరాధులు జెయిళ్ళలో పడిన తర్వాత బాగా బలిసిరనియు జనులకు తిండికొరత విపరీతముగా నుండెననియు జిల్లా డాక్టరు అభిప్రాయ మిచ్చెను.

ధాన్యాల యొక్కయు తిండి పదార్థాల యొక్కయు ధరలు చాలా హెచ్చుగా నుండెను. కృష్ణా జిల్లావారగు పెద్దిభొట్ల వీరయ్య అను వకీలు గారు ఇంచుమించు 27 ఏండ్ల క్రిందట ఆంధ్రపత్రికలో ఇట్లు ప్రకటించెను.

'ఇప్పటికి 60 సంవత్సరములకు పూర్వము (1860లో) మచిలీ పట్టణములోనుండి ధరలు తెలియగల కాగితమొకటి నేను చూడ తటస్థించినది. ....... 1860లో బందరులో జరిగిన ఒక వివాహ మప్పుడుంచబడిన జాబితా సంగతులిందు తెలియజేయుచున్నాను.

| వస్తువు | ధర రూ.అ.పై. | పరిమాణము |
|---|---|---|
| బియ్యము | 1-0-0 | 32 సేరు |
| కందులు | 1-0-0 | 31 సేర్లు |
| పెసలు | 1-0-0 | 22 సేర్లు |
| మినుములు | 1-0-0 | 19 సేర్లు |
| మిరప | 1-6-0 | మణుగు |
| నెయ్యి | 4-2-0 | మణుగు |
| ఆముదం | 1-0-0 | 4 వీసెలు |
| నూనె | 1-0-0 | 4 వీసెలు |
| చింతపండు | 0-13-16 | మణుగు |
| బెల్లం | 0-11-8 | మణుగు |
| పసుపు | 1-0-0 | 5 వీసెలు |
| మెంతులు | 1-0-0 | 40 సేర్లు |
| జీలకర్ర | 1-0-0 | 6 సేర్లు |
| కొబ్బరికాయలు | 0-3-0 | 10 కాయలు |
| సొరకాయలు | 0-2-0 | 3 కాయలు |
| కట్టెలు | 0-3-0 | 150 మడకర్రలు |
| విస్తళ్ళు | 0-1-4 | 100 |
| తమలపాకులు | 0-1-9 | 1000 |
| దోసకాయలు | 0-2-0 | మణుగు |
| వంకాయలు | 0-2-0 | మణుగు |
| ఇంగువ | 0-0-10 | తులం |
| అటుకులు | 1-0-0 | 16 సేర్లు |
| చేటలు | 0-1-6 | 4 |
| తాటి ఆకు బుట్టలు | 0-0-3 | 6 |

పై యంశములు ఆనాటి ప్రజల యార్థిక స్థితి తెనుగు దేశమందెట్లుండెనో తెలుసుకొనుటకు సహాయపడును. 1876 లోను 1878 లోను బొంబాయి మద్రాసు రాష్ట్రాలలో అనగా దక్కనులో నంతటను మహాక్షామ మేర్పడెను. ఆ క్షామము దెబ్బ తెనుగుసీమపై విశేషముగా పడెను. నేటికిని 80 ఏండ్ల వృద్ధులా 'ధాత కరువు' ను గురించి ముచ్చటిస్తూ వుందురు. ఆ సంవత్సరమే "పగటి చుక్కలు రాలె"ను అని చెప్పుదురు. అనగా సంపూర్ణ గ్రహణము తెనుగు సీమలో అయ్యెనన్నమాట. అదే సంవత్సరము "ఎఱ్ఱగాలి" వీచెనందురు. ఆకాశమంతయు ఎఱ్ఱని ధూళితో నిండి దేశమంతటను నిండి పోయెనట. ధాత కరువులో జనులు లక్షల కొలదిగా తెనుగు సీమలో చనిపోయిరి. కర్నూలు జిల్లాలోని కోయిలకుంట్ల తాలూకాలోని ఉయ్యాలవాడ అను గ్రామమందు బుడ్డా వెంఘరెడ్డి అను అపర కర్ణుడప్పుడు వెలసెను. అతడు తన సర్వస్వమును కోల్పోయి అప్పులు చేసి చందాలెత్తి తన ధాన్యమునంతయు ఇచ్చివేసి వేనవేల క్షామబాధితులకు అన్నము పెట్టి రక్షించెను. నేటికిని కర్నూలు జిల్లావారాదాతను మరువలేదు.

**బుడ్డా వెంగళరెడ్డి**
**ఉండేదే ఉయ్యాలవాడా**

అని పాటలుకట్టి బిచ్చగాండ్లు పాడుతూ వుందురు. ఇట్టి దాతలింకెందరుండిరో ఆయా ప్రాంతాలవారు తెలిపితే బాగుండును. ధాత కరువులో దక్కనులో 50 లక్షల కన్నా హెచ్చుమంది చచ్చిరని ఇంగ్లీషు చరిత్రకారులే వ్రాసినారు.

ఈ సమీక్షా కాలములో జనుల ఆచార వ్యవహార విశ్వాసాలలో చాలా గొప్ప మార్పులు జరిగెను. ముసల్మానులు హింసామార్గములతో హిందువుల నాకర్షింప జాలినవారు కారు. హిందువుల ముసల్మానులను మరింత దూరముగా పరిహరించిన వారైరి. కాని ఇంగ్లీషు వారు తమ నూతన భావాలతో హిందువుల లోనే కాక ముసల్మానులలోను మార్పులను గావించిరి. కాని ముసల్మానులకన్న హెచ్చుగా హిందువులలో మార్పులు కలిగెను. జుట్లు ఎగిరిపోతూ వచ్చెను. క్రాపులు బహుళమయ్యెను. బొందెల అంగీలు పోయెను. ఇంగ్లీషు అంగీతో పాటు కోట్లు కూడా వచ్చెను. టోపీలు విరివియయ్యెను. మొదట మొదట సముద్ర ప్రయాణము చేసిన వారిని బహిష్కరించిరి. తర్వాత ప్రాయశ్చిత్తముతో స్వీకరించిరి. తర్వాత ఏ యాటంకమున్నూ లేకపోయెను. వివిధ కులాలవారు కలసి భుజించుటకు మొదలుపెట్టిరి. దీనికి హోటళ్ళు దోహదమిచ్చెను. రైళ్ళు కూడా కులం కట్టుబాట్లను సడలించెను. అంతశ్శాఖా వివాహాలు, వితంతూద్వాహాలు ప్రబలెను. బాల్యవివాహాలు క్రమక్రమముగా తగ్గెను. ఇంగ్లీషు విద్యావంతులలో కొందరు ఇంగ్లీషు వేషములను సూటు బూటు కాలర్, టై ధరించుట గౌరవ హేతువని భావించిరి.

ఇంగ్లీషు ప్రభుత్వము ప్రజల యొత్తిడియైనప్పుడే ప్రజాభీష్టము నెరవేర్చునట్టిది. సంఘసంస్కారుల కోరికలను అప్పుడప్పుడు మన్నిస్తూ బాల్య వివాహములకు సరిహద్దులు మార్చుచూ వచ్చెను. మొదట 10 ఏండ్లలోపుల బాలబాలికలకు వివాహము చేయరాదని శాసించిరి. 1890 ప్రాంతములో 12 ఏండ్ల లోపల బాల్యవివాహములు చేయరాదని శాసించిరి. 1850 ప్రాంతమందే పోస్టు (టప్పా) ఏర్పాటయ్యెను. 1853 లో తంతీలేర్పాటయ్యెను. క్రమక్రమముగా ఈ రెండు చాలా విరివిగా స్థాపింపబడెను. 1885 లో రిప్పన్ గవర్నరు జనరల్ మునిసిపాలిటీలను స్థానిక స్వపరిపాలనమును ప్రారంభించెను.

టప్పా రైల్వే తంతీ సౌకర్యాలు వృద్ధియగుకొలది పత్రికలు కూడా వృద్ధియయ్యెను. కాని తెనుగు దేశములో పత్రికల వ్యాప్తి చాలా తక్కువగా నుండెను. 19వ శతాబ్ది మధ్యకాలమందు బళ్ళారిలో 'శ్రీ యక్షిణి' అను వార పత్రిక ప్రారంభమయ్యెను. అదే తెనుగు వారి మొట్టమొదటి పత్రిక. ఆంధ్రపత్రిక వారపత్రికగా మహారాష్ట్రులుండు బొంబాయి నుండి వెలువడుట చాలా చిత్రము. కాని తర్వాత అది మద్రాసుకు మారెను. దిన పత్రికను కూడా కాశీనాథుని నాగేశ్వరరావు గారు ప్రారంభించిరి. అది నిత్యాభివృద్ధిగా ఆంధ్రుల సేవ నేటికిని చేయుచున్నది. 1920 లో కృష్ణా పత్రిక ప్రారంభమయ్యెను. అదియు అవిచ్ఛిన్నముగా సాగుచున్నది.

ఇంగ్లీషువారి ప్రభావము భాషపై చాలాపడెను. అదేమి చిత్రమో తెనుగులో యక్షగానాలు తప్పితే వేరు నాటకాలు లేకుండెను. 1600 తర్వాత తెనుగు కవిత కూడా నీరసమై అప్పకవీయ శాసనబద్ధమై, అష్టాదశ వర్ణనలను వెఱ్ఱిమొఱ్ఱి రోకటి పాటలతో కూడినదై, జుగుప్సాకరమైనదయ్యెను. అందు శబ్దాడంబరమే యుండెను. వచన గ్రంథాలు ఏకామ్రనాథుని ప్రతాపచరిత్ర, కైఫీయత్తులు స్థానాపతి విజయనగర కైఫీయత్తు, తంజాపురీ కవుల వచన భారతాదులు మున్నగునవి కొన్ని తప్ప మరేవియు లేకుండెను. ఇంగ్లీషు చదివిన విద్వాంసులగు కందుకూరు వీరేశలింగంగారు, కొమర్రాజు లక్ష్మణరావుగారు, గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు కట్టమంచి రామలింగారెడ్డిగారు, గిడుగు రామమూర్తిగారు ఆంధ్రవాఙ్మయ పంథను త్రిప్పివేసిరి. కట్టమంచి వారి కవిత్వ తత్త్వవిచారము సనాతనపు కోటలో గుండుపడినట్లయ్యెను. అది పెద్ద సంచలనము కలిగించెను. వారు 1900 లో ముసలమ్మ మరణము అను ఉత్తమ బలిదాన కథను కొత్త రీతుల వ్రాసిరి. నిజముగా భావకవితకు అతడే మార్గదర్శి యనవలెను. వీరేశలింగ ప్రతిభ సర్వతోముఖాభివృద్ధి యయ్యెను. అతడు నాటకాలను, ఉత్తమ వచన గ్రంథాలను, నవలలను, హాస్యములను కవుల చరిత్రను స్వీయచరిత్రను ఆంగ్ల గీర్వాణ భాషలందలి యుత్తమ విషయాల అనుకరణములను రచించి అపారమగు

సేవను చేసెను. కొమర్రాజు లక్ష్మణరావుగారి వ్యక్తిత్వము అసాధారణ మైనట్టిది. అతని పట్టుదల, నిర్వహణము, విధానము విషయ విజ్ఞానము, దానిని పిల్లలకును అర్థమగునట్లు రచించు నేర్పు, ఇతరు లందు కానవచ్చుట అరుదు. వారును గాడిచర్లవారును, హైదరాబాదు రావిచెట్టు రంగారావుగారును (అనగా ఉత్తర సర్కారు, రాయలసీమ, తెలంగాణా ప్రతినిధులు) కలిసి 1907లో విజ్ఞాన చంద్రికా గ్రంథ మాలను హైదరాబాదులో స్థాపించిరి. ఈ గ్రంథమాల మొట్టమొదటి ప్రచురణము గాడిచర్ల వారి అబ్రహాంలింకన్ చరిత్ర, దానికి కొమర్రాజు వారు పీఠిక వ్రాసిరి. అది చరిత్రాత్మకమైనది. మనలో లేనివి కావలసినవి బంగాలీలు మరాఠీలు ముందుకు చాలా దూరము సాగి పోయిన విధానము వారు చాలా చక్కగా నిరూపించిరి. వారిట్లింకను వ్రాసిరి.

"భాషాభివృద్ధికి గద్య గ్రంథములత్యంతావశ్యకంబులని మొట్ట మొదట కనిపెట్టినది చిన్నయసూరి; అతడు గద్యనన్నయ. రెండవవాడు కందుకూరి వీరేశలింగము, వారు గద్యతిక్కన, పూర్వమొకప్పుడుండిన పురుషార్థ ప్రధాయిని, ఆంధ్ర భాషా సంజీవని, మందార మంజరి, చింతామణి, శ్రీ వైజయంతి, మొదలైన మాసపత్రికలును, ప్రస్తుతమున్న సరస్వతి, మంజువాణి, మనోరమ, సువర్ణలేఖ, సావిత్రి, హిందూ సుందరి, జనానా పత్రిక మొదలగు మాసపత్రికలు, ఆంధ్ర ప్రకాశిక, శశిలేఖ, కృష్ణా పత్రిక, ఆర్యమతబోధిని, సత్యవాది, మొదలగు వార్తాపత్రికలును తెనుగునందొకవిధమైన యుపయోగకరమగు వాఙ్మయమును పుట్టించినవి. కాని తెనుగుబాస యొక నాగరిక భాష యనిపించుకొనుటకు ఇపుడు జరిగిన ప్రయత్నమొక సహస్రాంశమైనను కాదు" మన భాషలో చరిత్రలు, కథలు, శాస్త్ర (సైన్సు) గ్రంథాలు ఏవియు లేవని వారు వాపోయిరి. ఆ యుత్తమ పీఠిక అత్యంతముగా విలువైనట్టిది. వారెత్తి చూపిన లోపాలను తొలగించుటకై విజ్ఞాన చంద్రికా గ్రంథమాల ద్వారా చాలా కృషి చేసి సిద్ధ సంకల్పులైరి. మన దురదృష్టముచేత వారు 1922లోనే మరణించిరి. వారి యనంతరము గ్రంథమాల నానాటికి తీసికట్టుగా సన్నగిల్లి మాయమై పోయెను.

1900 నుండి తెనుగులో ఇంగ్లీషు సంస్కృత పద్ధతులపై నాటకాలు, నవలలు, వచన గ్రంథాలు, చరిత్రలు, విమర్శలు, ఖండ కావ్యాలు, విరివిగా రచింపబడుతూవచ్చెను.

బెంగాలును కర్జన్ వైస్రాయి రెండు భాగాలుగా విభజించెను. హిందూ ముస్లిములను భిన్నించుటకై అతడట్లు చేసెను. అందుపై బెంగాలులో జాతీయోద్యమము తీవ్రరూపము దాల్చెను. వందే మాతరం జాతీయ గీతమయ్యెను హింసాత్మక చర్యలతో బెంగాలీలు ప్రతిఘటించిరి. ఆ జాతీయోద్యమపు గాలి తూర్పుతీర మందలి ఉత్తర సర్కారులను తెనుగు జిల్లాలపై వీచెను. ఆ సందర్భములో "స్వదేశీ" విధానోద్యమము బయలుదేరెను. అదే సందర్భములో బందరులో జాతీయ కళాశాల స్థాపితమయ్యెను. అదొక ముఖ్యఘట్టము. మన పూర్వ సంస్కృతి యంతయు గర్వింపదగినది కాదనియు ఇంగ్లీషువారి దంతయు ఉత్తమమనియు భావించిన వారిలో కొంత పరివర్తనము కలిగెను. మన సంస్కృతిని కాపాడుకొనుచు కాలానుసరణమగు మార్పులు చేసుకొనుటయే సరియని యీ జాతీయ కళాశాల నిరూ పించెను. పూర్వకాలపు చిత్రలేఖన పద్ధతి మారెను. రంగులు మారెను. భావాలు మారెను. తెనుగుదేశమందు నూతన చిత్రలేఖన పద్ధతికీ కళాశాలయే దోహదమిచ్చినట్టిది.

ముసల్మాను ప్రభువులలో గోలకొండ సుల్తానులలో ఒక్క ఇబ్రహీం ఖుతుబ్షాయు, అతని యుద్యోగియగు అమీను ఖానున్నూ తెనుగు భాషను పోషించిరి. ఆసఫ్‌జా వంశమువారు తెనుగు నాదరించకపోగా దానికి విఘాతములే కల్పించిన వారయిరి. తెనుగు దేశాన్ని పాలించిన యీ ఖుతుబ్షా అసఫ్‌జా వంశాలవల్ల తెనుగుభాష కేమిన్ని సహాయము కలగలేదు. ఇంగ్లీషు పరిపాలనలో ఇంగ్లీషు ప్రభుత్వము దేశములోని తాటాకు గ్రంథాలను సేకరించి మద్రాసులో ప్రాచ్యలిఖిత పుస్తకా లయమును స్థాపించి, అందు వాటినుంచి అంతరించి పోనున్న బహు గ్రంథాలను రక్షించిరి. పలువురు ఇంగ్లీషువారు మన భాషను నేర్చు కొనిరి. అందు బ్రౌన్ ముఖ్యుడు. ఖుతుబ్షాలు, అసఫ్‌జాలు అందరినీ ఒక్క ప్రక్క పెట్టి బ్రౌను దొర నొక్కదిక్కుపెట్టి తూచిన బ్రౌను దిక్కే త్రాసు ముల్లు చూపును. అతడు తాటాకు గ్రంథాలు సేకరించి యుంచెను. వేమన పద్యాలను మెచ్చుకొని వాటిని ఇంగ్లీషులోని కనువదించెను. తెనుగు నిఘంటువులు రెండు రచించెను. అందొకటి వ్యావహారిక పదకోశము. నేటికిని ఇవి చాలా యుపయోగపడుచున్నవి. మెకంజీ అను నింకొకడు కైఫీయత్తులను వ్రాయించి తెప్పించి యుంచెను. కాల్డ్వెల్ అను మరొకడు ద్రావిడ భాషాశాస్త్రమును వ్రాసెను. మొత్తముపై ఇంగ్లీషు భాషా ప్రభావము తెనుగు భాషపై సంపూర్ణముగా పడెను. తెనుగులో బహుముఖ వికాసము కలిగెను. ఇంగ్లీషు వారు భాషతో పాటు ప్రాచీన శిల్పములను కాపాడిరి. తురకలు విధ్వంసము చేసిరి. ఇంగ్లీషువారుద్ధరించిరి. హంపీ శిథిలాలను, అమరావతీ స్తూపా లను, ఇతర ప్రాచీన దేవాలయాలను కోటలను మరమ్మత్తు చేసి దిబ్బలు త్రవ్వి, శిల్పశకలాలను బయటికి తీసి మిగిలినవాటిని విధ్వంసము కాకుండా రక్షించిరి. బ్రిటీషిండియాలోని యీ విధాన మును హైదరాబాదులో అవలంబించక తప్పినదికాదు. అందచేత తెనుగుసీమ హద్దు వరకు ఓరుగల్లు శిథిలాలు, రామప్పగుళ్ళు, పిల్లలమర్రి,

పానుగల్లు (నల్లగొండ) మున్నగు తావులలోని తెనుగు శిల్పాలను రక్షించినవారయిరి.

1857 విప్లవానంతరము తెనుగుసీమలో ఉత్తర సర్కారులలోనే యెక్కువగా పురోభివృద్ధి కలిగినది. వారికంటే రాయలసీమవారు వెనుకబడినవారు. ఆ రాయల సీమ కన్నను మరీ చాలా వెనుకబడిన వారు తెలంగాణావారు. వారి పాలిట బడిన ప్రభుత్వమే వారి పురోభివృద్ధికి ముఖ్యకారణము అనవలెను.

ఆంధ్రుల 900 సంవత్సరాల సాంఘిక చరిత్ర సంగ్రహముగానే తెలుపబడినది. వ్రాయదగిన విషయములింకను కలవు. అందుకు తగిన పండితులు కృషిచేసి మన సాంఘిక చరిత్రలు వ్రాసిన మనలో సాంఘిక చరిత్రలు లేని లోపము తొలగిపోవును.

సీ. పరిపూర్ణ పావనాంభస్తరంగోద్వేగ
గౌతమీ గంభీర గమనమునకు
ఆలంపురీ నందనారామ విభ్రాజి
మల్గోబఫలరాజమధురరుచికి
ఆంధ్రీకుమారీ ఈ సమాయుక్త పరిపూత
తుంగా వయస్సు మాధుర్యమునకు
ఖండశర్కరజాతి, ఖర్జూర, గోక్షీర,
ద్రాక్షాదియుత రామరసమునకును
అమృత నిష్యంది వల్లకీ హ్లాదమునకు
రాగిణీదివ్య సమ్మోహరాగమునకు
తేనెతేటల నవకంపు సోనలకును
సాటియగును మా తెనుగు భాషా తల్లి, (మదీయము)

(ఆంధ్రీనది = తుంగభద్ర కుపనది, రామరసము = మహరాష్ట్రుల మధుర రసము. జాజికాయ, జాపత్రి, ఏలకులు, బాదాము, ద్రాక్ష, పాలు, దోస, సొర, కరెపుచ్చ మున్నగువాటి విత్తులు, సొంఠి, చక్కెర, కుంకుమపువ్వు ఇంకా చాలా వస్తువులు నూరి కలిపిన దాన్ని రామరస మందురు. ఆలంపూరు బనగానపల్లె రెండును ముల్గోబ, దిల్‌పసందు అను శ్రేష్ఠమగు మామిడి పండ్లకు సుప్రసిద్ధస్థలాలు.)

### దాలిపర్తి పిచ్చిహరి

నాదస్వరమునందు మోదంబు గూర్చుచు
శ్రద్ధతోడను నాదసిద్ధుడయ్యె
రాగవిస్తారాల రమ్యతల్ చిలికించి
మిగుల దక్షిణమందు మెప్పులందె
నాదసాధనఁజేసి 'నాద చింతామణి'
విలువైన చక్కని బిరుదునొందె
'మైసూరు' రాజుచే మానస ముప్పొంగ
'అర్ధ సింహాసన' మందు కొనియె
'జానకమ్మ' కొసగి సంగీత సంపద
చలనచిత్రసీమ వెలయఁజేసె
ధన్యుడయ్యె జగతి 'దాలిపర్తిహరి'యె
కీర్తి కళలరాశి! కృష్ణవేణి!

-'స్మితశ్రీ' చింతపల్లి నాగేశ్వరరావు

డా॥ వి. అనూరాధ

# కృష్ణాతీరంలో మధ్యయుగ స్త్రీలు

శాతవాహన, ఇక్ష్వాకుల కాలానంతరం చిన్న చిన్న సామంత రాజ్యాలేర్పడ్డాయి. అవి రాజ్య విస్తీర్ణకాంక్షతో ఒకదానితో ఒకటి యుద్ధాలు సాగించాయి. ఆర్థిక, మత విధానాలలో వచ్చిన మార్పు వలన పూర్వం వలె సామాన్య ప్రజలు మత కట్టడాలకు విరివిగా దానాలు ఇచ్చినట్లు శాసనాలు లేవు. క్రీ.శ. 3వ శతాబ్దాంతానికి మత పరిస్థితులు, రాజకీయాల వలన గానీ, బౌద్ధ క్షేత్రాల నిర్మాణం పరిపుష్టత చేరడం వలన గాని ప్రజల దానశాసనాలు కనుమరుగైనాయి.

ఇక్ష్వాకుల తదనంతరం ధాన్యకటక ప్రాంతాన్ని పాలించిన పల్లవులకు, ఇతర చిన్న చిన్న సామంతులకు మధ్య నిరంతరం యుద్ధాలు జరుగుతుండేవి. పల్లవ స్కందవర్మ కొడుకు యువరాజు విజయబుద్ధ వర్మ ధాన్యకటకాన్ని పరిపాలించాడు. యువరాజు విజయబుద్ధ వర్మ భార్య చారుదేవి. కొంతమంది చరిత్రకారుల వాదన ప్రకారం యువ మహారాజు యుద్ధంలో మరణించగా, ఈయన భార్య చారుదేవి తమ కుమారుడు బుద్యాకరుడు చిన్నవాడవడం వలన కుమారుని తరుపున రాజ్యభారం వహించి సమర్థంగా రాజ్యాన్ని పాలించింది. కుమారుడు చిన్నవాడవటం, యుద్ధభీతి ఉండుట వలన క్రీ.శ. 4వ శతాబ్ది చివరి కాలంలో ఈమె దాలూర క్షేత్రంలో తటాకానికి, మంచినీటి బావికి ఉత్తరంగా ఉన్న కొంతభూమిని భగవాన్ నారాయణ దేవాలయానికి తన ఆయురారోగ్యం నిమిత్తం దానం చేసినది. ఈ దానాన్ని ఒక రాజ్ఞిగా ఆజ్ఞ ఇచ్చినది.

పల్లవరాణి చారుదేవి తరువాత ఈ జిల్లాలో ప్రఖ్యాతి గాంచిన మహిళ పరమభట్టారక మహాదేవి. ఈమె విష్ణుకుండిన గోవింద వర్మ మహారాజు భార్య. పృథ్వీశ్రీ మూలరాజు కుమార్తె. గణపాశపుర రాకుమార్తె. ఈ గణపాశపురం గుంటూరు జిల్లాలోని తాడికొండ, తాళ్ళూరు ప్రాంతం అయి ఉంటుందని చారిత్రక వాదన. గోవిందవర్మ ఈ జిల్లాలో పల్లవుల ఆధీనంలో ఉన్న ప్రాంతాన్ని జయించి తన రాజ్యాన్ని విస్తరింపచేశాడు. ఈ ప్రాంతంలోని చిన్న సామంతరాజైన పృథ్వీ శ్రీమూలుని కుమార్తెను వివాహమాడాడు. ఈయన రాజ్య విస్తరణ, నిరంతర యుద్ధాలలో నిమగ్నమైయుంటే, పరమ భట్టారిక మహాదేవి ధార్మికపనులు, ప్రజాసంక్షేమ కార్యక్రమాలు నిర్వహించి ప్రజలలో మన్నన పొందివుండాలి. అందువల్లనే గోవిందవర్మ ఈమెను తన పట్టమహిషిగా పేర్కొని, ఈమె పేరున ఒక బౌద్ధవిహారాన్ని వేల్పూరులో కట్టించాడు. విష్ణుకుండినశాసనాలలో ఈమెను పుట్టింటికి, భర్తకి అనంతమైన కీర్తిని తెచ్చిపెట్టిన స్త్రీగా ఘనంగా కీర్తించారు. విష్ణుకుండిన వంశంలో అయిదవతరం వాడైన విక్రమేంద్రవర్మ కూడా ఈమె కీర్తిని స్తుతించాడంటే ఈమె తన కార్యక్రమాల వలన ప్రజల మనస్సులో సజీవంగా వుండి తీరాలి.

వారసత్వంగాగాని, స్వయంగాగాని రాజుకి రాజ్యాధికారం పొందడం అనేది జరుగుతుంది. కానీ చేజర్లను రాజధానిగా పాలించిన ఆనంద గోత్రికుల రాజైన సత్యభామల్లుడు తన తల్లి అవనితలాంతవతి వలన తన రాజ్యమొచ్చినట్లు తెలిపాడు. అలాగే వెలనాటి గొంకరాజు తన కుమార్తె మైలమను హైహయ వంశానికి చెందిన అనుగురాజుకిచ్చి వివాహం చేసి పలనాటికి రాజును చేశాడు. ఈ అనుగురాజు బిడ్డల మధ్య జరిగిన వారసత్వపోరే పలనాటి యుద్ధం.

మధ్యయుగం నాటికి ఆర్థిక, సామాజిక వ్యవస్థలలో వచ్చిన మార్పులతోపాటు రాజకీయ, మత పరిస్థితులలో కూడా చాలా మార్పులొచ్చాయి. దేవాలయాలలో లభించిన దానశాసనాలలో చాలామంది గుంటూరుజిల్లా స్త్రీల పేర్లు తెలుస్తున్నాయి. వీరిలో ఎక్కువమంది మండలేశ్వరుల భార్యలుగానో, తల్లులుగానో తెలుస్తున్నారు. కానీ శాసనాలు స్త్రీలను గురించి కొంత సమాచారాన్ని అందిస్తున్నాయి. చేజర్ల దేవాలయ శాసనం ప్రకారం 1136 ఎ.డి.లో వెలనాటి చోడ వంశీకుడగు గొంకరాజు భార్య చూడాంబిక దయాగుణశీలిగాను, యాచకులకు కల్పవల్లిగానూ ప్రసిద్ధిచెందింది.

ప్రత్యేకంగా చెప్పుకోదగ్గ స్త్రీ వెలమన కేతన. ఈమె వెలనాటి కులోత్తుంగ చోళ గొంకరాజుల ఇష్టభృత్యురాలు. అనగా ఈమె కొలువులో ఉద్యోగిని. తన తల్లిదండ్రుల పుణ్యం కొరకు 1151 ఎ.డిలో దేవాలయానికి దానం చేసింది. సమకాలీన సాహిత్యమైన రుక్మాంగద చరిత్ర, కాశీఖండం, సతీసహగమనాన్ని తెలుపుతున్నాయి. అయితే సతీసహగమనం చేసి చరిత్రకెక్కిన మగువ పేరమ్మ. ఈమె నలగామ

రాజు కుమార్తె. తన భర్త అలరాజు చంపబడ్డాడని తెలిసి, తన భర్తతో సహగమనం చేస్తూ, తన భర్తను హత్యచేసిన వారిమీద పగతీర్చమని ప్రజలను కోరింది. ప్రతీకార వాంఛ, పగలతో రగులుతూ సతీసహగమనం ఆచరించడం వలన ప్రజలభావనలో ఒక ఉద్వేగాన్ని నింపింది. కారంపూడి యుద్ధంలో బాలచంద్రుడు, నరసింగరాజు తలనరికి పేరమ్మ పగతీర్చానని ప్రకటించాడు. ఈనాటికీ పలనాటి ప్రజలు ఈమెను పేరంటాలుగా కొలుస్తారు.

ఇంకొక ప్రఖ్యాతిగాంచిన స్త్రీ మాంచాల. ఈమె బాలచంద్రుని భార్య. పలనాటి పౌరుషానికి మారుపేరుగా కీర్తింపబడుతున్నది నేటికి. ఈమె ప్రాపంచిక సుఖాలకన్నా కర్తవ్యదీక్షకే ప్రాధాన్యతిచ్చి, భర్తలోని పౌరుషాన్ని రెచ్చగొట్టి అతని కర్తవ్యాన్ని బోధించి యుద్ధానికి పంపింది. అందువలన ఆంధ్రప్రజలు ఈమెను వీరవనితగా తెలుపుకున్నారు.

క్రీ.శ. 12వ శతాబ్దంలో పలనాటిని ఏలిన హైహయ వంశ రాజకీయాలను మలుపుత్రిప్పి, పలనాటి యుద్ధంలో జయం సాధించిన ఘనత పలనాటి నాయకురాలు రెడ్డి నాగమ్మకు చెందుతుంది. ఈనాటికి ఈమెను దేవతగా పలనాటి ప్రజలు కొలుస్తున్నారంటే ఈమె యొక్క గొప్పదనం తెలుస్తుంది. నాగాంబరెడ్డి కుటుంబంలో జన్మించింది. తండ్రి గొప్ప విలుకాడు. ఈమె చిన్నతనంలో తల్లిదండ్రులను కోల్పోతే మేనమామ పెంచి ఈమెకు విలువిద్యతో పాటు రాజనీతిని నేర్పాడు. సహజంగా తెలివితేటలు గల ఈమె విద్యలలో ప్రావీణ్యత సంపాదించింది. చిన్న వయస్సులోనే వివాహమయి భర్తను కోల్పోగా అత్తవారి వైపు నుండి ఈమెకు అపారమైన సంపద లభించింది. ఈమెకు గల తెలివితేటలు, నేర్పరితనం, ధార్మిక లక్షణాల వలన స్థానిక ప్రజల మన్నన పొందింది. ఈమెకు ప్రజలలో గల పలుకుబడిని, ఆమె మేథాశక్తిని గమనించి అనుగురాజు ఆమె సలహాలను తీసుకునేవాడు. కాలక్రమంగా పలనాటి రాజకీయాలలో చాలా మార్పులొచ్చాయి. ఒకానొక సమయంలో తన కుంటుంబ రక్షణకే ఆపద సంభవిస్తున్న సమయంలో అనుగురాజు స్థానిక ప్రజల నాయకురాలైన నాగమ్మను తన కొలువులో చేర్చుకొన్నాడు. ఈవిధంగా పలనాటి రాజకీయ వేదిక మీద కాలుపెట్టింది. ఈమెను కొలువులోకి తీసుకోవటం వలన అనుగురాజు మంత్రియైన దొడ్డనాయుడు అశక్తుడై, తనకు మారుగా తన కుమారుడైన బ్రహ్మనాయుడికి మంత్రి పదవిని ఇప్పించాడు. బ్రహ్మనాయుడు కూడా వైష్ణవ మతప్రచారం ద్వారా ప్రజలలో కొంత ప్రాబల్యాన్ని పెంపొందించుకున్నాడు. రాజాస్థానంలో నాయకురాలి అధికారం పెంపొందకుండా చేయడానికి బ్రహ్మనాయుడు కుతంత్రంతో హైహయ కుటుంబాన్ని విభజించి నాయకురాలి ప్రాబల్యాన్ని తగ్గించాలని చూశాడు. దాని ఫలితంగా పలనాడు – గురజాల, మాచర్ల రాజ్యాలుగా విభజింపబడింది. నలగామరాజు నాగమ్మను గురజాల రాజ్యానికి ప్రధానమంత్రిని చేశాడు. నాగమ్మ తన తెలివితేటలతో సమర్థవంతంగా రాజకీయాన్ని నడిపింది. కారంపూడి వద్ద నాగులేటికి ఆనకట్ట కట్టి, కారంపూడి పరిసర ప్రాంతాలవారికి నీటి కొదువ లేకుండా చేసింది. రాజ్యమంతటా చెరువులు త్రవ్వించి వ్యవసాయాభివృద్ధికి విశేష కృషి చేసి రాజ్యాదాయాన్ని పెంచింది. ప్రజల కష్టాలు తెలుసుకొని, వారికి ఊరట కలిగించి ప్రజల మన్నన పెంపొందించుకుంది. ఈవిధంగా ప్రజలలో అభిమానం పెరగటం వలన వారు ఆమెను నాయకురాలు నాగమ్మగా పిలుచుకునేవారు. ఈ విధంగా ఈమె గురజాలరాజ్యంతో ప్రజాభిమానాన్ని రోజురోజుకు పెంపొందించుకొంది. అయితే మాచర్ల రాజ్యంలో బ్రహ్మనాయుడు ప్రజాసంక్షేమ కార్యక్రమాలకన్నా వైష్ణవమత వ్యాప్తికి, అట్టడుగు వర్గాల సమాజంలో గౌరవస్థానం పెంపొందడానికి విప్లవాత్మకమైన విధానాలను అనుసరించాడు. దీనివలన ఇతడు ఈ వర్గ ప్రజలలో అభిమానం సంపాదించినా, పెద్ద కులాలతోను, ఇతర రాజ్యపాలకులలోను తన యెడల వ్యతిరేకతను పెంపొందించుకున్నాడు.

ఈ పరిస్థితులు అర్థంచేసుకున్న నాగమ్మ మాచర్ల రాజ్యాన్ని గురజాల రాజ్యంలో కలపాలనే తలంపుతో రెండు రాజ్యాలమధ్య కోడి పందాలు పెట్టి ప్రత్యర్థులను ఓడించి రెండు రాజ్యాలను కలపడానికి ప్రయత్నించింది. ఈ ప్రయత్నం చివరకు కారంపూడి యుద్ధానికి దారితీసింది. ఈమెయొక్క పరిపాలనా దక్షత, యంత్రాంగానికి, ఆంధ్రదేశంలోని దాదాపుగా అన్ని రాజవంశీయులు ఒక్క కాలచూరులు తప్ప నలగామునికి సహాయం చేశారు. నలగామునికి సహాయంగా వచ్చిన రాజులందరు ఒకరితో ఒకరు విరోధం కలిగి ఉన్నా నాగమ్మ చాతుర్యం వలన నలగామునికి సహకరించడానికి తమ సైన్యాన్ని పంపారు. దీనికంతటికీ ఈమె ప్రజ్ఞే కారణం. బ్రహ్మనాయుడు ఆంధ్ర రాజులలో ఒక రాజు సహాయం కూడా పొందలేకపోయాడు. మూడు రోజులు జరిగిన ఈ పలనాటి యుద్ధంలో నాగమ్మ స్వయంగా కత్తిపట్టి యుద్ధం చేసిందని తెలుస్తున్నది.

పలనాడులో మాలదాసరులు పలనాటి చరిత్రను కథలుగా తరతరాలుగా గానం చేస్తూ వచ్చారు. సుమారు రెండు శతాబ్దాల తరువాత ఈ కథను శ్రీనాథుడు, పలనాటి వీరభారతంగా గ్రంథస్థం చేశారు. ఇందులో బ్రహ్మనాయుడిని కీర్తిస్తూ, నాగమ్మని కుతంత్రురాలుగా చిత్రీకరించారు. బహుశ దీనికి కారణం మాలదాసర్ల ప్రభావం అయి వుండవచ్చు. బ్రహ్మనాయుడు వారికి సమాజంలో గౌరవస్థానం కల్పించడానికి చేసిన ప్రయత్నాల వలన వీరు బ్రహ్మనాయుడిని నాయకుడిగా చేసి, నాగమ్మను లోకకంటకిగా చిత్రించి గానాలుచేసి ప్రచారం చేశారు. కానీ ఈ చరిత్రను తులనాత్మకంగా పరిశీలించినట్లయితే నాగమ్మ యొక్క తెలివితేటలు, సమర్థత అర్థమవుతుంది. ఈమెలో గల చాతుర్యానికి, వివేకానికి ప్రజలు తమంతట తామే నాయకురాలు నాగమ్మగా వ్యవహరించారు. ఆంధ్ర చరిత్రలో నాగమ్మ తొలి మహిళా మంత్రిగా, నాయకురాలుగా, రాజనీతి దురంధరురాలుగా ప్రజల మన్ననలను పొందిన పరిపాలనాదక్షురాలిగా పలనాటి పౌరుషశాలిగా ప్రఖ్యాతి

గాంచి చిర స్మరణీయమైనది. పౌరుషానికి, వీరత్వానికీ, రాజనీతికి ప్రఖ్యాతి గాంచిన పలనాటి మహిళల తరువాత ప్రసిద్ధి చెందిన మహిళా పాలకురాలు, యనమదల రాజ్యాన్ని పాలించిన రాణి గణపాంబ. ఈమె కాకతీయ ప్రభువైన గణపతిదేవుని పెద్ద కుమార్తె. యనమదల రాజైన కోటబేతరాజు భార్య. భర్త మరణానంతరం రాజ్య భారాన్ని వహించి మహామండలేశ్వర బిరుదుతో తన తండ్రి రాజ్యంలో ఒక సామంతురాలుగా సమర్థవంతంగా పరిపాలించింది. మహా మండలేశ్వరకోట గణప మహాదేవమ్మగారిలా ప్రఖ్యాతిగాంచిన ఈమెకు పలనాటి నాగమ్మ స్ఫూర్తిగా వచ్చును. పలనాటి నాగమ్మ యొక్క పరిపాలనాదృష్టి, ప్రజాక్షేమం ఇంకా ప్రజల స్మృతిపథంలో ఉండటమే కారణం అనవచ్చును. తాడికొండను పాలిస్తున్న మరియొక కోట వంశంలోని మొదటి రాజు మన్మపోతరాజు. ఇతని మరణానంతరం ఇతని భార్య పండాంబిక పరిపాలించినట్లు శాసనాల వలనతెలుస్తున్నది.

పెదకోమటి వేమారెడ్డి భార్య సూరాంబిక కొండవీటి సమీపంలో సంతాన సాగరం అనే చెఱువును త్రవ్వించింది. ఇదంతా మెట్ట ప్రాంతం, వర్షాభావం, కరువుతో దయనీయస్థితిలో ఉండేది ప్రాంతం. అందువలన ఈమె మంచినీటి తటాకాన్ని నిర్మించింది. ఈ చెఱువు విశాలముగా విస్తరించి సప్తసముద్రాలకు దీటుగా నిర్మింపబడింది. ఈ నీటిని అనేక గోవులు, పక్షులు, తృషితులు త్రాగేవారు. ఈ తటాక జలాన్ని సేవించిన అశ్వమేథయాగ ఫలం లభిస్తుందని శ్రీనాథకవి ఈ శాసనాలలో స్తుతించాడు.

రెడ్డిరాజుల కాలంలో ప్రఖ్యాతి గాంచిన నర్తకి లకుమాదేవి. ఈమె కొండవీటి ప్రభువైన కుమరగిరి రెడ్డి (1386-1402) ఆస్థానంలో ఉండేది. మహాసౌందర్యరాశి, పండితురాలు. ఈమె ప్రభువుల కొలువులో పండిత గోష్ఠిలో పాల్గొనేది. ఆనాటి ప్రజలు జరుపుకొనే ఘనమైన ఉత్సవం -వసంతోత్సవం. ఇది కొండవీటిలో ప్రతి సంవత్సరం ఎంతో వేడుకగా జరిపేవారు. ఈ ఉత్సవాలలో ఈమె నాట్యం ఒక ప్రత్యేకతను పొందేది. ఈమె ఒక భావానికి అనేక వేల ప్రకటనలు చేయగలిగేది.

శ్రీ కృష్ణదేవరాయని కాలంలో కాకానిలోని రేటూరి చిట్టయ్య మంత్రి భార్య తిమ్మాంబ దేవునికి నైవేద్య నిమిత్తం ఒక చెఱువుని త్రవ్వించింది. అనగా చెఱువు వలన కొంతభూమి సాగుబడిలోకి వస్తుంది. దానిమీద వచ్చే ఆదాయం దేవుని నైవేద్యానికి ఉపయోగ పడుతుంది. దీనివలన చాలామంది ప్రజలకు జీవనోపాధి కలుగుతుంది. శ్రీకృష్ణదేవరాయల కాలంలోనే తెనాలి గ్రామంలో అమాత్యులు నాదెండ్ల తిమ్మయ్యగారి భార్య కృష్ణమాంబ దానశీలి, వివేకవంతురాలిగా కీర్తింపబడింది.

క్రీ.శ. 1530 నాటి యనమదల శాసనం ప్రకారం కోట నరసింగరాజు విజయనగర సంస్థానంలో పెద్ద ఉద్యోగ నిర్వహణలో ఉన్నారు. ఆయన ఎంత ఉన్నత ఉద్యోగి అయినా అతని భార్య గంగమాంబ వల్ల ఘనతకెక్కెనని తెలుస్తుంది. అంటే సింగరాజు ఉద్యోగ నిర్వహణా బాధ్యతలను నిర్వహిస్తుంటే, అతని భార్య గంగ మాంబ స్థానికంగా సమాజంలోని ఇతర ప్రజలతో బాంధవ్యాలను పెంపొందించుకుంటూ, దయాగుణం, ధార్మికగుణం ఉండటంవలన ఆమెపేరే ప్రజలలో వాసికెక్కింది. అందువలన ప్రజలు ఈయన ఎంత ఉన్నత ఉద్యోగి అయినా గంగమాంబ భర్తగానే గుర్తించారు.

"కోట శింగరాజు మాటవాసియే గాని
గంగమాంబ వల్ల ఘనతకెక్కె".

ప్రాచీన కాలంలో స్త్రీ భార్యగా, తల్లిగా, సోదరిగా, కూతురుగా, ఉమ్మడి కుటుంబంలో సభ్యురాలుగా కుటుంబక్షేమం, ముక్తి కోరి పుణ్యం కొరకు దానాలు చేసింది. కుటుంబ గృహ బాధ్యతలకు స్త్రీయే పర్యాయపదంగా ఉందనడానికి ఇది ఒక తార్కాణం. కుటుంబ, గృహ బాధ్యతలు నిర్వహిస్తూనే ఒక దాతగా మారి, తను అభిమానించిన మతానికి దానధర్మాలు చేసి తన దానగుణాన్ని చాటింది. మధ్య యుగంలో స్త్రీ కూడా కుటుంబశ్రేయస్సుకు, ముక్తికి ప్రాధాన్యత ఇచ్చినా సమాజ శ్రేయస్సును కూడా కాంక్షించి దానధర్మాలు చేయడమే కాకుండా, ప్రజాసంక్షేమం కార్యక్రమాలను చేపట్టింది. ఈ దశలో ఈమె కుటుంబ బాధ్యతలే కాకుండా అవసరమయినప్పుడు పరిపాలనా పగ్గాలను చేపట్టి సమర్థవంతంగా నిర్వహించి కీర్తింపబడింది.

ఉద్యోగ నిర్వహణ వలనగాని, ఆర్థిక సంపాదనలోగాని, రాజ్య పనుల్లోగాని, ఉత్పత్తి, వ్యవసాయపనులలోగాని మరి ఏ ఇతర పనులతో గాని పురుషుడు తలమునకలై వుంటే ప్రతి కుటుంబంలోని స్త్రీలు కుటుంబ బాంధవ్యాలు కాపాడుకుంటూ సమాజ కట్టుబాట్లలో ఒదిగి సమాజ శ్రేయస్సును కూడా కాంక్షిస్తూ సమాజాన్ని పరోక్షంగా అభివృద్ధి మార్గంలో పయనింపచేసింది మహిళ. అది గృహమైనా, రాజ్యమైనా, సమాజమైనా అభివృద్ధి పథంలో ఉండటానికి కారణం స్త్రీ యొక్క సమర్థవంతమైన పరోక్ష సహకారమే. స్త్రీ చరిత్ర మినహాయింపు కాదు.

కుటుంబ, గృహబాధ్యతలకే పరిమితమై వుండుటవలనచరిత్రలో ఆమె పాత్ర పరోక్షంగానే ఉండిపోయింది. గృహనిర్వహణ అయినా, పరిపాలనా నిర్వహణ అయినా,సమాజశ్రేయోభివృద్ధి కార్యకలాపాలలో నైనా, ఆమె సహకారం కొనసాగుతూనే వచ్చింది. పురుషుడు జీవన భృతికై పాటుపడుతుండగా, స్త్రీ గృహ కుటుంబనిర్వహణకై తన జీవితమును అంకితం చేసింది. వీలున్న ప్రతిచోటా, ఆమె ఇతర రంగాలయిన సాహిత్య, కళా, పరిపాలనలలో సహితం తన నేర్పుని ప్రదర్శించింది. ప్రతి కుటుంబాలలోని స్త్రీలు – కుటుంబ బాంధవ్యాలు కాపాడుకుంటూ, సమాజ కట్టుబాట్లలో ఒదిగి సమాజశ్రేయస్సుని కాంక్షిస్తూ, సమాజాన్ని అభివృద్ధి చేయడంలో తమ పాత్ర నిర్వహించారు.

శ్రీ వై.హెచ్. కె. మోహనరావు

# కృష్ణాతీరాన పల్నాడు

"నాజూకు కృష్ణమ్మ నడుము వడ్డాణమై
నడిచింది పల్నాడు కొంగు బంగారమై"

కృష్ణానది పశ్చిమోత్తర సరిహద్దులుగా పరిఢవిల్లింది పలనాడు. కృష్ణమ్మ నడకలతో ఈ నేల పవిత్రమైనది. పాడిపంటల పైడి తేరైంది పలనాడు,ఆ పదం వింటేనే చరిత్ర పులకించిపోతుంది. ప్రతి హృదయం కిలికించతమౌతుంది. పలనాడును తలచుకుంటేనే తెలుగు నేల రోమాంచితమౌతుంది. తెలుగుదనం పౌరుషంతో ఉప్పొంగు తుంది. ప్రతిఒక్కరిరుధిరం పరవళ్ళు తొక్కుతుంది.ఇందుకు పూర్వరంగం పలనాటి చరిత్రలో నిండుకున్న ప్రాశస్త్యం. పౌరుషాలకు పురిటిగడ్డ కావడం,పలనాటి చరిత్ర బహుశా తెలుగులో తొలి వీరగాథ. పలనాడు గురించి చెప్పుకోవాలంటే బౌద్ధమత వ్యాప్తి, హైహయరాజుల పాలన, నాయకురాలు నాగమ్మ, బ్రహ్మనాయుడు కాలాలను వివరించడమే అవుతుంది.బౌద్ధమతంలో మహాయానశాఖకు పలనాడు పుట్టిల్లు. ప్రాచీన మధ్యయుగాలలో పలనాడుకు విశిష్టత ఉంది. ప్రాచీన, మధ్యయుగ, ఆధునిక పలనాటి ప్రాభవాన్ని సంక్షిప్త పరచి అందించడమే ఈ వ్యాససంకల్పం.

## పలనాడు నామ నిర్దేశము

పలనాడు అనే పదాన్ని అనేక శాసనాలు, కావ్యాలు పలు విధాలుగా వ్యక్తం చేశాయి. ఆంధ్రప్రదేశ్‌లో 'నాడు' అనే పదం ప్రాచీన రాచరిక విభాగాల్లో ప్రసిద్ధమూ, బహువ్యాప్తి గాంచిన దేశవాచకం. 'నాడు' అనేది మండలాన అంతర్భాగం, సామ్రాజ్య కాలంలో రాజ్యంలో అంతర్భాగంగా చెప్పేవారు. క్రీ.శ.669లోని పూర్వ చాళుక్య ప్రభువైన రెండవ విష్ణువర్ధనుని కొనెకి శాసనంలోనూ, క్రీ.శ.1111 లోని మాచెర్ల ఆదిత్యేశ్వరాలయంలోని చాగి బేతరాజు శాసనంలోనూ, క్రీ.శ.1118 లోని భృగుబండ శాసనములోనూ, క్రీ.శ.1147లోని కులోత్తుంగ చోడ గొంకరాజు వేయించిన కొదమగూడ (కొదమగుండ్ల) శాసనములోనూ, ద్రోణాది కేశవదేవుల క్రీ.శ 1269 లోని దుర్గి శాసనంలోనూ, క్రీ.శ.1259లోని త్రిపురాంతక శాసనంలోనూ, క్రీ.శ. 1269 లోని కాకతి రుద్రమదేవి వేయించిన దుర్గి శాసనంలోనూ పల్లినాడు, పలినాడు అనే పదాలు కనిపిస్తాయి. మహాకవి శ్రీనాథుని చాటువుల్లోనూ, పింగళిసూరన ప్రభావతీ ప్రద్యుమ్నంలోనూ, వినుకొండ వల్లభరాయుని క్రీడాభిరామంలోనూ ఈ నేలను పలనాడు, పల్నాడు అని ఉచ్చరించడం చూస్తాము. ప్రస్తుతం వినవస్తున్న పల్నాడుకు పర్యాయాలుగా పలనాడు, పల్లనాడు, పల్లవబొగ్గ, పల్లవభాగ, పల్లినాడు, పల్లునాడు అనే పదాలు వ్యాప్తిలోకి వచ్చాయి. ఈ పదాలన్నింటినీ పరిగణలోకి తీసుకుని కొందరు పరిశోధకులు వారివారి భావాలకనుగుణంగా సిద్ధాంతీకరించారు.

'పల్లి' అనే శబ్దాన్ని బౌద్ధ, జైన నివాస స్థావరాలకు భావంగా చెపుతున్నప్పటికీ, బౌద్ధ నివాసమనే అర్థాన్నే ఎక్కువమంది పరిశోధకులు స్వీకరించారు. పల్నాడులో బౌద్ధం,జైనం విస్తృతంగా వ్యాప్తి చెందాయి. బౌద్ధం ఇక్కడ ఎంత బలపడిందంటే 2వ శతాబ్దంలో పల్లిదేశం నుండి 14,60,000మంది బౌద్ధ బిక్షువులు సింహళ దేశానికి ప్రచారం జరిగింది. బౌద్ధమత ప్రచార స్థావరంగా వున్నందున ఈ ప్రాంతాన్ని 'పల్లి' దేశంగా పిలిచారు.తరువాత కాలంలో ఉచ్ఛారణా పరిణామంలో పల్లి దేశం పల్లినాడుగా, పలనాడుగా రూపాంతరం చెందింది. ఇది ఇలా వుంటే 2వ శతాబ్ది నాటికి ఈ ప్రాంతానికి పల్లవబొగ్గ, పల్లిదేశ అనే రెండు పదప్రయోగాలు వినికిడిలో ఉన్నాయి. నీటిబొగ్గలుండే ప్రాంతాన్ని బొగ్గ లేదా బుగ్గ అంటారు. కృష్ణానదికి దక్షిణాపథాన వుండే పల్నాడు ప్రాంతమంతా పల్లంగా వుండి నీటి బుగ్గలు విస్తారంగా వున్నందున ఈ పిలుపులు అన్వయమయ్యాయి.

## నాగార్జునుడు - మహాయానము - విశ్వవిద్యాలయము

బౌద్ధమతంలో మహాయాన శాఖ స్థాపకుడు నాగార్జునుడు. మహాయానశాఖకు జన్మస్థలి పల్నాడు అనే విషయాన్ని చారిత్రక సాక్ష్యాలు నిర్దిష్టంగా తెలుపుతున్నాయి. క్రీ.శ. 2వ శతాబ్దానికి చెందిన ఆచార్య

నాగార్జునుడి జన్మస్థలం విదర్భ అని, కాదు పెందోట అని వాదా లునప్పటికీ, ఆయన వికాసమంతా పల్నాడు శిరోభాగానికి చెంది వున్నది. నాగార్జునుడు బాల్యంలోనే సన్యసించి హిందూశాస్త్ర శోధకుడిగా జీవన యానాన్ని ప్రారంభించాడు. తదుపరి బౌద్ధమతాన్ని స్వీకరించి మహాయాన శాఖకు ఆదిమూలమై, ఒకనూతన సైద్ధాంత వివేచనతో ఆశాఖామతవృద్ధికి జీవితాన్ని అర్పించాడు. కొంతకాలం నలందా విద్యా పీఠంలో అధ్యాపకుడిగా పనిచేసి ఆ తరువాత పల్నాడు పశ్చిమాన నెలవై వున్న శ్రీ పర్వతాన్ని కేంద్రంగా జేసుకుని జీవించాడు. ఆనాటి శ్రీపర్వతమే నేటినాగార్జునకొండ, నాగార్జునుడు యజ్ఞశ్రీ శాతకర్ణి సమ కాలికుడు. యజ్ఞశ్రీ శాతకర్ణి నాగార్జునుడి కోసం నాగార్జునకొండపై అతి పెద్ద పారవత విహారాన్ని నిర్మించాడని ప్రతీతి. క్రీ.శ. 5వ శతాబ్దిలో భారతదేశంలో పర్యటించిన చరిత్రకారుడు పాహియాన్ ఆ విహారాన్ని దర్శించి ముగ్ధుడైనట్లు వర్ణించాడు. మొత్తం నిర్మాణం 5 అంతస్తులుగా, క్రింది అంతస్తులో 500ల గదులు, రెండవ అంతస్తులో 400ల గదులు, మూడవ అంతస్తులో 300ల గదులు, నాల్గవ అంతస్తులో 200ల గదులు,అయిదవ అంతస్తులో 100 గదులతో అలరారినట్లు నమోదు చేశాడు. క్రింది అంతస్తు ఏనుగు ఆకారంలోనూ, రెండవ అంతస్తు సింహం రూపంలోనూ, మూడవ అంతస్తు అశ్వరూపంలోనూ, నాల్గవ అంతస్తు వృషభాకారంలోనూ, అయిదవ అంతస్తు కపోత రూపంలోనూ బహురమణీయంగా నిర్మాణం జరిగినట్లు పేర్కొన్నాడు. ఇక్కడే ఆచార్య నాగార్జునుడు బౌద్ధ అధ్యయనపీఠాన్ని స్థాపించాడు. ఈ మహా నిర్మాణమే విశ్వవిద్యాలయంగా విలసిల్లింది. ఇక్కడ తత్వ, వైద్య, రసాయన, గణితశాస్త్రాలను బోధించేవారు. నాగార్జునుడు బౌద్ధ తత్వ జువా, టిబెట్ దేశాల నుండి కూడా విద్యార్థులు ఇక్కడకు వచ్చి విద్యనభ్యసించేవారని పాహియాన్ తెలిపాడు. ఆనాటి నాగార్జునుడి విశ్వవిద్యాలయ అవశేషాలు నేడు నాగార్జునసాగర్ జలాశయం మధ్య లోని నాగార్జున కొండపైకి తరలించి ప్రదర్శనశాలలో భద్రపరిచారు. అట్లాగే అశోక చక్రవర్తి వివిధ ప్రాంతాల్లో నాటించిన 8400 బౌద్ధ ధాతువుల్లో ఒకటి నాగార్జునకొండలో వుంది. ఇక్కడి ధాతువును బుద్ధుని దంతంగా గుర్తించారు. ఈ ధాతువును భద్రపరచిన పేటికనూ, దానిని వుంచిన కుండనూ నాగార్జున కొండ ప్రదర్శనశాలలో పదిలపరిచారు. నాగార్జున కొండ, నాగార్జున సాగర్ ఆధునిక కాలంలో ఆచార్య నాగార్జునుని స్మృతి చిహ్నంగా ఏర్పడినవే.

## మధ్యయుగ పల్నాడు

12వ శతాబ్దికి చెందిన పల్నాటి చరిత్ర తెలుగు వాఙ్మయంలో తొలి వీరగాథ. తెలుగు నేలపై అనేక యుద్ధాలు సంభవించినా పల్నాటి యుద్ధం మళ్ళీ మళ్ళీ జ్ఞప్తికి వచ్చేకథనం. మహాభారత ఇతిహాసంతో అనేక పోలికలున్న సందర్భంగా దీనిని మరోభారతంగా పేర్కొన్నారు. దాయాదుల మధ్య రాజ్యస్పర్థతే ఈ యుద్ధానికి హేతువు. 12వ శతాబ్దినాటికి హైహయుల పాలనాకాలంలో ఏకపల్నాడు ద్విపక్షాలుగా, రెండు రాజ్యాలుగా విభజన జరిగి రాజులకంటే మంత్రులైన నాయకు రాలు నాగమ్మ, బ్రహ్మనాయుడు కనుసన్నల్లో పాలన నడిచింది. రాజు లను మించి మంత్రులకు విశేష ప్రాధాన్యమేర్పడింది. ఈ కాలంలో 100 కి.మీ పొడవునా పల్నాడుకు పశ్చిమోత్తర దిశల్లో కృష్ణానది పరవళ్ళు తొక్కింది. పల్నాటిలోని పల్లెలన్నింటికీ అది ఒక్కటేపెద్ద యేరు కావడం మూలంగా దానిని పల్లేరు అని కూడా వాడుకలో చెప్పుకున్నారు. అప్పకవి తెలిపిన వివరాల ప్రకారం నాటి పల్నాటిలో 194 గ్రామాలు న్నట్లు కావ్యప్రమాణం. పల్లెనాటను నూట తొంబది యునాల్గు / గ్రామముల నీడు గానక కాకునూరి / వెంగనార్యుడు వేద వేదాంగము లను / ప్రస్తుతికి నెక్కి మాఱట బ్రహ్మయనగ – అప్పకవి. అదే అప్పకవి పల్నాటిలో బెల్లంకొండ, నాగార్జునకొండ, తంగేడు అనేవి అంతః స్సీమలుగా వున్నట్లు చెప్పుకొచ్చాడు. తంగెడ సీమను నిర్జర / గంగా సమ నాగ నిమ్నగా పూర్వమునం / బింగళి పుర దక్షిణమున రంగుగ నెలకొన్న గోపరత్నంబునకున్ – అప్పకవి. ఈ అంతః స్సీమలను 15వ శతాబ్దిలో శ్రీకృష్ణదేవరాయలు జయించినట్లు చారిత్రక ప్రమాణాలున్నాయి. పల్నాటి యుద్ధం క్రీ.శ. 1176–1182 సం॥ల మధ్యకాలంలో జరిగినట్లు పరిశోధకుల నిర్ణయం. పల్నాటి వీరుల అనంతరం పల్నాటి సీమను కాకతీయులు, కొండవీటి రెడ్డి రాజులు, విజయనగర రాజులు, గోల్కొండ నవాబు, ఆర్కాటునవాబు, ఆ తరువాత ఈస్టిండియా కంపెనీ వారు పాలించారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తరువాత పల్నాడు తాలూకా ఏర్పడి అనంతరం గురజాల, మాచెర్ల తాలూకాలుగా విభజించబడి, ఇప్పుడు తొమ్మిది మండలాలుగా వుంది.

## మహాకవులు - వాఙ్మయము

15వ శతాబ్దిలో శ్రీనాథ మహాకవి పల్నాటి రణక్షేత్రమైన కారం పూడి (కార్యమపూడి) చెన్నకేశవాలయంలో పలనాటి వీరచరిత్ర ద్విపద కావ్యానికి శ్రీకారం చుట్టి ముగించినట్లు ప్రథల ఆధారాలున్నాయి. భట్టువారి పల్లెకుచెందిన భట్టుమూర్తి, పిన్నెల్లి గ్రామ నివాసి పింగళి సూరన శ్రీకృష్ణదేవరాయల ఆస్థాన దిగ్గజాలు. భట్టుమూర్తి భట్టువారి పల్లె గ్రామస్థులు, ఆయన ప్రఖ్యాత కావ్యం వసుచరిత్ర, పింగళిది పిన్నెల్లి గ్రామం. ఈయన గొప్పకావ్యం కళాపూర్ణోదయం. తంగెడ గ్రామానికి చెందిన అప్పకవీయం పేరిట ప్రసిద్ధులు. ఆధునిక కాలంలో గద్వాల సంస్థాన ఆస్థానకవిగా పేరుగాంచిన బోదిలవీడు గ్రామ కవి, పండితులుకాశీపతి అవధాని. వీరు అష్టావధాన, శతావధానాలలో 40 సువర్ణ పతాకాలు, 40 బిరుదులు పొందారు. 60 కావ్యాలను

రచించారు. రామాయణ, మహాభారత గాథలను ఒకే కావ్యంలో ఆవిష్కరించారు. ఒక్కో పద్యంలో 30 భావాలు ప్రస్ఫుటించే విధంగా లఘుకావ్యాన్ని రచించారు. తిరుపతి వేంకట కవులు ఈ ప్రాంతాన్ని పర్యటించినపుడు ప్రత్యేకించి బోదిలవీడు విచ్చేసి కాశీపతి అవధానిని పరామర్శించి అభినందించారు. అదేవిధంగా తక్కెళ్ళపాడు గ్రామానికి చెందిన పల్నాటిసోదర కవుల పేరిట ప్రఖ్యాతి వహించిన చినలింగాచార్యులు, ప్రభులింగాచార్యులు, వీరభద్రాచార్యులు అవధాన ప్రతిభలో లబ్ధప్రతిష్ఠులు. వీరు ముగ్గురూ విడివిడిగా పదుల సంఖ్యలో ప్రజాదరణ పొందినకావ్యాలు రచించారు. రెంటాల గ్రామ నివాసి రెంటాల గోపాలకృష్ణ పత్రికా సంపాదకుడుగా, రచయితగా ప్రసిద్ధులు.

## పల్నాడులో మతాలు - కులాలు

ప్రాచీన యుగంలో బౌద్ధ,జైన మతాలు పల్నాడులో ఉచ్ఛస్థితికి చేరుకున్నాయి. ఈ ప్రాంతం నుండి బౌద్ధ అధ్యయనంతో బౌద్ధ భిక్షువులుగా మారిన 14,60,000ల మంది సింహళ దేశానికి బౌద్ధమత ప్రచారానికి తరలి వెళ్ళారని ఇదివరలో మనం తెలుసుకున్నాం. బౌద్ధం ఏ స్థాయిలో, ఎంతబలంగా వేళ్ళూనుకుందో ఈ పరిణామాన్ని బట్టి అర్థం చేసుకుంటాము. అయితే తదనంతరం జన సామాన్యంలో జైనం, శైవం సమాన స్థాయిలకు చేరుకున్నాయి. వైష్ణవం మధ్యయుగం వరకూ చాలా స్వల్ప దశలో వుండి వుంది. జైనుల్లో స్వర్ణకారులు, వృత్తి కార్మికులు, గోసంగులు ఎక్కువ. ఇక శైవుల్లో వ్యవసాయ దారులు, కొన్ని సంచార జాతులు, బ్రహ్మణ వర్గంలో కొంతభాగం వుండేవారు. శైవుల విజృంభణను ఎదుర్కోలేని జైనం ఇతరత్రా మరే ఆదరణ లేని కారణంగా క్రమేపి క్షీణించింది. శైవుల ఆధిపత్యాన్ని తట్టుకోలేకనే జైన మతస్థుడైన కాకతి ప్రోలరాజు శైవమతాన్ని విధిగా స్వీకరించాడు. ఉప్పెనలా మారిన శైవమతోద్యమంలో సామాన్య జనులంతా భాగస్వాములయ్యారు. అట్లా జడలు విప్పిన శైవమతానికి సమాంతరంగా పల్నాడులో వైష్ణవమతం కూడా విజృంభించింది. రెండు మతాల మధ్య జైనం పూర్తిగా చతికిలబడి అంతరించింది. జైనులంతా వారి వారి అనుకూలతను బట్టి కొందరు శైవంలోకి మరికొందరు వైష్ణవ మతంలోనూ చేరిపోయారు. ఈ సంధికాలంలో వీర శైవులు జైనులపై దాడులు జరిపి హింసాకాండకు పాల్పడినారు.కానీ అదే మతంలోని వైదికులను మినహాయించారు. అట్లాగే వైష్ణవులు కూడా శైవులను వదిలి జైనులనే అణచివేశారు. ఈ కాలంలో శైవ, వైష్ణవ మతాలు రెండూ జైనాన్నే ప్రధాన శత్రువుగా భావించాయి. అయితే జైనంలో మాదిరిగా శైవ, వైష్ణవ మతాల్లో సైతం కులాలుండేవి. కానీ మూడు మతాలు కూడా కులబేధాలను నామమాత్రంగా కూడా పాటించేవి కావు. ఒక మతం నుండి మరో మతానికి, ఒక కులం నుండి మరో కులానికి మారే వెసులుబాటుండేది. దాదాపుగా కులాలన్నీ వారివారి వృత్తులను బట్టి నిర్ణయించినవే కాని, ఈ నాటివలే పుట్టుకను బట్టి ఏర్పరిచినవి కాకపోవడం వలన కులమార్పు సాధ్యమయ్యేది. ఆనాటి సమాజంలో అన్ని కులాల వారికి సమాన గౌరవం వుండేది. వీర శైవులకు నాయినార్లు, ఆరాధ్యులు, దేవరలూ గురువులైతే, వీర వైష్ణవులకు ఆళ్వార్లు గురువులు. ఈ విధానమే పల్నాడులో కూడా ఆచరించబడింది. ఊరేగింపులు, ఉత్సవాలు, దైవప్రార్థనలు మొదలైనవన్నీ సమస్త జాతులన్నీ కలిసి సమిష్టిగా జరుపుకుంటాయి. సాంఘిక, సాంస్కృతిక రంగాలలో కూడా అన్ని కులాలకు సమాన ప్రాతినిధ్యముండేది. వృత్తులను బట్టి కులాలు ఏర్పడినా, అందరి ప్రధాన వృత్తి పశుపోషణ, వ్యవసాయంగా కొనసాగింది. పేరుకు మాత్రమే కులాలు. యోగ్యత, అర్హత, ప్రతిభలననుసరించి ప్రాధాన్యత లభించేది. కొన్ని ప్రత్యేక సందర్భాల్లో మాత్రం బ్రాహ్మణులకు అధిక ప్రాధాన్యం ఉండేది. బ్రాహ్మణులకు రాజుల అండదండలుండేవి. వృత్తిని బట్టి నిర్ణయించుకున్న కులాలే కాకుండా ఆనాడు పల్నాడులో మరికొన్ని కొత్త కులాలు ఆవిర్భవించాయి. దక్షిణాదిన శైవమతవ్యాప్తి కోసం ప్రచారం చేస్తూ కులభేదాలను రూపుమాప పూనుకొన్న జంగములు తామే ఒక ప్రత్యేక కులంగా ఏర్పడినారు. అట్లాగే వైష్ణవమత విస్తృతి కోసం ప్రచారం చేస్తూ ద్రవిడ దేశం నుండివచ్చిన 'చిత్తాతావర్' (సాతాను) లు తామొక ప్రత్యేక కులంగా రూపొందారు. వైష్ణవంలో ఈ సాతానులే శ్రీ వైష్ణవులుగా వైష్ణవ పూజారులుగా, శైవంలో తంబళులు అనే శివ బ్రాహ్మణులు ఒక కులంగా మార్పు చెందారు.

## ఆచారాలు - సాంప్రదాయాలు

బౌద్ధ, జైన మతాలు పరిఢవిల్లిన ప్రాచీన యుగంలో పల్నాడులోని ఆచార సాంప్రదాయాలు ఏ విధంగా వున్నాయో స్పష్టత లేకపోయినప్పటికీ, మధ్యయుగ పల్నాటి గురించి శాసన, గ్రంథ సమాహారమైనాయి. పల్నాడులో గురజాలనేలిన నలగామరాజుకానీ, మాచెర్ల ప్రభువైన పెదమలిదేవరాజు కానీ పేరుకే రాజులు. పెత్తనమూ, పాలన మొత్తంగా వారి వారి మహా మంత్రులైన నాయకురాలు నాగమ్మ, బ్రహ్మనాయుడిదేనన్నది జగమెరిగిన వాస్తవం. రాజులతో పాటు మంత్రులు కూడా బ్రాహ్మణుల ఆనతినీ,వినతినీ ఆమోదిస్తూ పూజ్య భావంతో మెలగుతారు. మధ్యయుగాల్లో పల్నాడులో రాజుల్లో మాత్రమే బహుభార్యత్వం వుండేది. అన్ని కులాల్లో బాల్య వివాహాలు జరిగేవి. సహగమనం రాజవంశాల్లోనూ, బ్రాహ్మణవంశాల్లోనూ వుండేది. కానీ ఈ ఆచారం ఐచ్ఛికమే. రాజకీయ పోరాటాలు మిక్కుటం. వివాహ సమయంలో వరుడి కుటుంబం వధువుకు ఓలి (కన్యాశుల్కం) నిచ్చే సాంప్రదాయం నడిచింది. అదేవిధంగా వధువు పుట్టింటివారు పసుపు

కుంకుమలుగా కొంత సంపద నిచ్చి పంపే ఆచారం కలిగి వుంది. దీనినే అరణం అనేవారు. ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక రంగాల్లో పురోగతి స్వల్పమే. కళలు, సాహిత్యం, భాషాపోషణ విషయాల్లో పాలకులకు ఏమాత్రం శ్రద్ధ వుండేది కాదు. చెఱువులు, కుంటలు, త్రవ్వకాలు, చప్టాలు అడ్డుకట్టల నిర్మాణాలు, సాగునీటి, త్రాగునీటి కోసం కొంతమేర చేపట్టేవారు. దూప చెఱుదు, మహాదేవి తటాకం ఈ కోవలో ఏర్పాటైనవే. చిన్న చిన్న దేవాలయ నిర్మాణాలు జరిగి వాటి నిర్వహణకు యీనాములు, మాన్యాలు కల్పించేవారు. నాయకురాలి పక్షాన వీరగంధాలు, బ్రహ్మనాయుడి వైపున వీర విద్యావంతులు దళితులైనప్పటికీ దేవాలయ ప్రవేశముండేది. చెన్నకేశవస్వామి ఆలయాల్లో మాలదాసరులు, గోసంగులూ పూజారులుగా వుండేవారు. వీరగంధాలు శివాలయాల్లో స్వయంగా శివలింగాన్ని తాకి అర్చన చేసుకొనేవారు. ఇరువురూ మాల కులంలోని ఇరు శాఖలకు చెందిన వారు. ప్రజల్లో రాజభక్తి, విశ్వాసం మిక్కుటం. దానితో బాటు సైనిక తత్వం, వీరావేశం మెండు. క్షుద్రవిద్యలు, జాతరులు, జంతు బలులూ విరివిగా జరిగేవి. మంత్రాలు, అద్భుతాలు, మాయలు మొదలైన అంధవిశ్వాసాలు ప్రజల్లో గాఢంగా వుండేవి. అభూత కల్పనలను, మూఢవిశ్వాసాలను బలంగా నమ్మేవారు.

## జాతీయోద్యమము - పుల్లరి పోరాటము

భారత స్వాతంత్ర్య సంగ్రామంలో పల్నాడు కదం తొక్కింది. బాపూజీ అడుగుజాడల్లో అంకిత భావంతో నడిచింది. జాతీయోద్యమ స్ఫూర్తి నింపడానికి గాంధీజీని చేవతేలిన పోతుగడ్డ రెంటచింతల గ్రామం పల్నాడుకు ఆహ్వానించింది. ఈ సందర్భంగా ఆ గ్రామంలో జాతిపిత ఒక విద్యాలయానికి శంఖుస్థాపన చేశారు. మహాత్ముని ఉద్వేగ పూరిత ప్రసంగానికి పల్నాడు వేదిక అయ్యింది. గాంధీజీ ప్రసంగంతో పల్నాడు తన పోరాటాన్ని ద్విగుణీకృతం చేసుకుంది. ఈ క్రమంలోనే బాపూజీ సహాయ నిరాకరణోద్యమ పిలుపునందుకుని పల్నాడు తిరుగుబాటు ఉప్పెననే సృష్టించింది. ఆత్మత్యాగి కన్నెగంటి హనుమంతు నాయకత్వాన పల్నాడులో బ్రిటీష్ ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలను నిరసిస్తూ పుల్లరి పోరాటం పెద్ద ఎత్తున సాగింది. ఈ పూర్వరంగంలో పల్నాడు ప్రాంతంలో పోలీసు ఠాణాలు అగ్నికి ఆహుతయ్యాయి.బందెల దొడ్లగడీలు బద్దలయ్యాయి.బ్రిటీష్ పాలకులు సాంఘిక బహిష్కరణకు గురయ్యారు. రక్షక దళాలపై ప్రజలు తిరగబడి తరిమి కొట్టారు. బ్రిటీష్ ప్రత్యేక అధికారి రూథర్‌ఫర్డ్ నేతృత్వాన 22వ తేది ఫిబ్రవరి 1922న కన్నెగంటి హనుమంతు ప్రాణాలను బలి తీసుకుని పుల్లరి ఉద్యమాన్ని అణచివేసింది. బ్రిటీష్ ప్రభుత్వం అయితే పల్నాటి గగన వీధుల్లో కన్నెగంటి అమరత్వం స్వాతంత్ర్య కేతనమై రెపరెపలాడింది.

## పల్నాడులో దేవాలయాలు

బహుళ ప్రసిద్ధి చెందిన దేవాలయాలు పల్నాడులో విరాజిల్లాయి. పురాతమైన ఆలయాలు నేటికీ విలసిల్లుతున్నాయి. అత్యంత ప్రాశస్త్యం సంతరించుకున్న దేవాలయాలతో పల్నాడు పవిత్రమైంది. శ్రీ పర్వతం దిగువన విజయపురిలో క్రీ.శ. 3వ శతాబ్దిలో నిర్మితమైన అష్టభుజ స్వామి దేవాలయం అత్యంత ప్రాముఖ్యత సంతరించుకుంది. నాగార్జున కొండ పశ్చిమ పాదతలంన క్రీ.శ 257-281 మధ్యకాలంలో నిర్మించిన నోదగిరీశ్వరాలయం ప్రసిద్ధిగాంచినది. అక్కడే కృష్ణాతీర స్నానఘట్టము చెంత శ్రీపుష్పభద్ర, కార్తికేయ ఆలయాలు నిర్మాణమైనాయి. విజయపురిలో ఇక్ష్వాకుల కాలానికే 9 వైదిక మత దేవాలయాలు నిలిచాయి. ఒక పుణ్య తీర్థక్షేత్రంగా వర్ధిల్లుతున్న ఎత్తి పోతల కేంద్రంలో శ్రీ దత్తాత్రేయ, శ్రీరంగనాయకస్వామి దేవాలయాలున్నాయి. ఇది గొప్పపర్యాటక కేంద్రంగా భాసిల్లుతుంది. విభాగ పల్నాటి రాజధాని మాచెర్లలో 12వ శతాబ్దిన చెన్నకేశవస్వామి, ఇష్టకామేశ్వర, వీరభద్రాలయాలు, నిర్మాణమయ్యాయి. చెన్నకేశవస్వామి దేవాలయం క్రితంలో ఆదిత్యేశ్వరాలయంగా పూజలందుకుంది. దుర్గిమండలం తేరాల గ్రామంలో అత్యంత పురాతనమైన శ్రీ సిద్ధేశ్వరాలయం వుంది. ఈ ఆలయంలో స్వయంభూ మరియూ పరశురామప్రభువుచే ప్రతిష్ట జరిగిన లింగం అర్చనలందుకుంటున్నాయి. కారంపూడి మండలం ఒప్పిచెర్ల గ్రామానికి దక్షిణాన 4 కి.మీ దూరంలో కొండల్లో ధన మల్లయ్య స్వయంభూ శివక్షేత్రం గలదు. నీటి దొనలున్న కొండ గనుక ఈ కొండను దొనకొండ అనిపిలుస్తారు. కారంపూడి పల్నాటి యుద్ధానికి రణభూమి. ఇక్కడ పలనాటి వీరచరిత్ర కావ్యం రూపుదిద్దుకోవడానికి శ్రీనాథమహాకవి ఆశ్రయం చేసుకున్న చెన్నకేశవస్వామి, సూరేశ్వర ఆలయాలు, పల్నాటి వీరుల ఆరాధ్యదేవత అంకాళమ్మ దేవాలయంతో పాటు పల్నాటి యుద్ధంలో అశువులు బాసిన 66 మంది వీరనాయకుల స్మృత్యర్థం వీరుల గుడి వున్నాయి. గుత్తికొండ గ్రామ సమీపంలో సహజసిద్ధంగా ఏర్పడిన బిలం, లోపలి చీకటి మల్లయ్య ప్రసిద్ధికెక్కాయి. పెదకొదమగుండ్ల గ్రామంలోని శ్రీ ఉత్తరేశ్వరాలయం ఆధ్యాత్మిక శిఖరం, ఐక్య పల్నాడు రాజధాని గురజాల పట్టణంలో నాటి పల్నాటి చరిత్ర స్ఫురించే విధంగా ఇష్టకామేశ్వర, ముక్కంటేశ్వర, గంగ (పాతపాటేశ్వరి) వీరభద్ర దేవాలయాలు నేటికీ అలరారుతున్నాయి. దైద అమరలింగేశ్వరస్వామి, గోగులపాడు గ్రామంలో నీలకంఠేశ్వరుడు, సత్రశాల శ్రీ గంగాభ్రమరాంబికా సమేత మల్లిఖార్జున స్వామి దేవాలయాలు ప్రఖ్యాతి వహించాయి. 9వ శతాబ్దిలో చాళుక్య మొదటి భీముని కాలంలో నిర్మాణమైన జలపేశ్వరాలయం అత్యంత వైభవోపేతం. పీఠం నుండి విమాన గోపురం వరకూ

పూర్తి శిలానిర్మితము. ఈ ఆలయాన్ని కేంద్ర పురాతత్వ శాఖ పురాతన ఖండంగా గుర్తించి ఉన్నతీకరణకు స్వీకరించింది. ఆ ఆలయాన్నే బొబ్బనాగ అనే మరో నామము పిలుస్తారు. ఆలయం వెనుక నుండి నాగులేరు పరవళ్ళు తొక్కుతుంది. గురజాలకు సమీపంలోని జిట్ట గామాలపాడు పల్నాడు మహామంత్రిణి నాయకురాలు నాగమ్మ అర్చించుకున్న చెన్న మల్లిఖార్జున స్వామి దేవాలయం కలదు. ఈ దేవాలయం కుడ్యములపైగల శిల్పకళ అత్యంత రమణీయంగా దర్శనమిస్తుంది. ఈ దేవాలయం కూడా పురాతత్వ శాఖ వారి స్వాధీనమై అభివృద్ధిలో అడుగులు పడుతున్నాయి.

**ఉపయుక్తాలు :**


1. పల్నాటి వీరచరిత్ర - పింగళి లక్ష్మీకాంతం - 1961
2. ఆంధ్రుల సాంఘిక ఆర్థిక చరిత్ర - మధ్యయుగము - అల్లాడి వైదేహి - 1978
3. శ్రీనాథ భట్టకృతి పల్నాటి వీర చరిత్ర - పండితశ్రీ ఉమాకాన్త విద్యాశేఖరులు - క్రీ.శ. 5040
4. తెలుగు వీరగాథ కవిత్వము - డా॥ తంగిరాల వేంకట సుబ్బారావు - 1983
5. పల్నాటి చరిత్ర - గుర్రం చెన్నారెడ్డి - 1992
6. పల్నాటి చరిత్ర - పీఠిక - పండితశ్రీ ఉమాకాన్త విద్యాశేఖరులు - 1997
7. పలనాటి వీరగాథ - టి.వి.యల్. నరసింహరావు - 1998
8. పల్నాటి ప్రాభవం - సంకలనం - సంపాదకులు - కె. రాజమల్లాచారి - 2006


సప్తరుషులకు అర్ఘ్యప్రదానం :

మునయో వాలఖిల్యాద్యాః సప్త చైవ మహర్షయః
సింహస్థితే దేవగురౌ గృహ్ణంత్వర్ఘ్యం
మయోద్యతం
ఓం వాలఖిల్యాది సప్తరుషిభ్యోనమః
ఇదమర్ఘ్యం సమర్పయామి

**చిరునామా :** *వై. హెచ్.కె. మోహనరావు, ఇం. నెం. 11-61/3, జానపాడు రోడ్డు, పిడుగురాళ్ళ - 52213, గుంటూరుజిల్లా, ఏ.పి, సెల్ : 9440154114*

శ్రీ ఈమని శివనాగిరెడ్డి - స్థపతి

# కృష్ణా తీరాన్ని పాలించిన రాజవంశాలు

ఆదిమ మానవుని అడుగుజాడల నందించిన కృష్ణాతీరం తరతరాల తెలుగుజాతి వెలుగు చరిత్రకు పుట్టిల్లు. క్రీ.పూ. 4వ శతాబ్దికే ధంఞ నీడగా పేర్కొనబడిన ధాన్యకటకం (తరువాత ధరణి కోట, అమరావతి) ఒక స్వతంత్ర జనపదానికి రాజధానిగా ఉండేదని అక్కడ దొరికిన లిపిలేని నాణేలు, మట్టిపాత్రలు, ఇతర పురావస్తువులు రుజువు చేశాయి. క్రీ.పూ. 3వ శతాబ్దిలో జంబూద్వీపాన్నంతటినీ పాలించిన అశోకచక్రవర్తి కాలంలో కృష్ణాతీరం మౌర్యుల ఏలుబడిలో కొచ్చింది. అమరావతిలో దొరికిన శాసనశకలం, ముఖ స్థూపం చుట్టూ మౌర్యుల పాలించే శాసనాలు, ఉన్న రాతి స్థంభాలతో ఏర్పాటుచేసిన రాతికంచె, మెరిసే ఉత్తరాది మట్టిపాత్రలు, ఎర్రగుడి శిలాశాసనాలతో పాటు ఇందుకు సాక్ష్యాలుగా నిలుస్తున్నాయి. అశోకుని తర్వాత దాదావు రెండు శతాబ్దాలు ఈ ప్రాంతాన్ని ఎవరు పరిపాలించారో తెలియని నేపథ్యంలో, కృష్ణాతీరంలోని గుంటూరుజిల్లా భట్టిప్రోలు స్థూపంనుంచి బయల్పడిన బుద్ధధాతుపేటిక శాసనంలో రాజా కుబిరకుని ప్రస్తావన చారిత్రక ప్రాధాన్యతను సంతరించుకొంది. శాసన లిపిని బట్టి కుచిరోకుడు అశోకుని సమకాలికుడనీ, భట్టిప్రోలు రాజధానిగా, ఇతడు కృష్ణాతీరాన్ని స్వతంత్రంగా పాలించాడని చరిత్రకారులు పేర్కొంటు న్నారు. అటు తరువాత శాతవాహనులకంటే ముందు, ఈ ప్రాంతం నుంచి సదవంశీయులు పాలన సాగించారు. గుంటుపల్లి వేల్పూరు శాసనాలు, అమరావతి, వడ్లమానులలో దొరికిన నాణేలు ఈ వంశం గురించి తెలియజేస్తున్నాయి. వారిలో సిరిసద, మహాసద, శివసద, శివమకసద అనే రాజులు నాణేలు విడుదల చేశారు. సిరిసద ఈ వంశ వ్యవస్థాపకుడనీ, ఆయన కళింగ ఖారవేలునుకీ సమకాలీకుడనీ, అందుచేతనే ఖారవేలుని బిరుదులైన మహరాజు, మహామేఘ వాహన బిరుదుల్ని ధరించి, క్రీ.పూ. 1వ శతాబ్దాలుగా కృష్ణాతీరంలోని ధాన్య కటకం నుంచి పాలించి ఉండ వచ్చని కూడా చరిత్రకారులు పేర్కొంటు న్నారు. వీరు శ్రీకాకుళంనుంచి నెల్లూరు దాకా గల తీరాంధ్రాని క్రీ.శ. 1వ శతాబ్ది దాకా పాలించారనీ, గౌతమపుత్ర శాతకర్ణి, వాసిష్ఠీపుత్ర శాతకర్ణి ధాన్యకటకం నుంచి పాలించేవరకూ, వారి పాలన కొన సాగిందని శాసనాలు, నాణేలు తెలియజేస్తున్నాయి. దాదాపుగా ఇదే కాలంలో అంటే క్రీ.పూ. 2-1 శతాబ్దాల్లో ధరణికోట సమీపంలోని వడ్డమానునుంచి రాజా సోమకుడు కృష్ణాతీరంలోని కొద్దిపాటి దక్షిణ భూభాగాన్ని పాలించాడని వడ్డ మానులో ఉన్న అతని శాసనాన్ని బట్టి చెప్పవచ్చు.

ఇదే సమయంలో అంటే క్రీ.పూ. 2-1 శతాబ్దాల్లో కర్నూలుజిల్లా వీరాపురం తవ్వకాల్లో మతోరధి వంశరాజుల నాణేలు బయల్పడి నాయి. మహాహస్తిన్, శివమహా హస్తిన్, శివస్కంధహస్తిన్, ఖడమూరి హస్తిన్ అనే రాజులు శాతవాహనుల పూర్వం మహారాష్ట్రలోని చంద్ర తిల్ల కొల్హాపూరులనుంచి పాలించి తరువాత కాలంలో వారి పాలనను కృష్ణాతీరానికి విస్తరించారని నాణేలు తెలియజేస్తున్నాయి.

ముందుగా కోటలింగాల, తరువాత పైఠాను ప్రతిష్ఠానపురం నుంచి పాలించిన శాతవాహనులు కృష్ణాతీరాన్ని వారి ఆధీనంలోకి తెచ్చుకున్నట్లు వారి శాసనాలు, నాణేలు, కట్టడాలు రుజువు చేశాయి. క్రీ.శ. 60-90 మధ్య ముందు పైఠాను, తరువాత కొండాపూరుల నుంచి పాలించిన గౌతమీపుత్ర శాతకర్ణి తన రాజధానిని ధాన్యకట కానికి మార్చుకొని అప్రతీకారంగా మొత్తం దక్షిణభారతాన్ని, రాజ స్థానుకు గుజరాత్, ఉత్తరఖండ్‌ల వరకూ గల ఉత్తరభారతాన్ని ఏలాడు. ధాన్యకటకంలో అతని సమకాలికుడైన ఆచార్య నాగార్జునుని పర్య వేక్షణలో స్థూపాన్ని విస్తృతం గావించి, శిలాఫలకాలతో అలంకరింప జేసి, బౌద్ధునికీ, బౌద్ధవాస్తుశిల్పానికీ ఎంతో సేవచేశారు. ధ(వి)న కీటకస్వామిగా కీర్తించబడినాడు. ఇతని కుమారుడైన వాసిష్ఠీపుత్ర పులుమావి కూడా ధాన్యకటకం నుంచే పాలించినట్లు అమరావతి శాసనం, నాణేలు తెలియజేస్తున్నాయి. ధాన్యకటక మహాస్థూప పూర్వ (తూర్పు వైపు) ద్వారం ఎత్తించినట్లు, తాను ధాన్యకటక స్వామిననీ

అక్కడ దొరికిన శాసనంలో చెప్పబడింది. తరువాత శాతవాహన రాజులు గౌతమీపుత్ర యజ్ఞశ్రీశాతకర్ణి కూడా ధాన్య కటకం నుంచే పాలించిన ఆధారాలు దొరికాయి. శాతవాహనకాలంలో ధాన్యకటకం, రాజధానిగానే కాక గొప్ప వర్తక కేంద్రంగా, బౌద్ధ స్థావరంగా, విద్యా లయంగా, సుందరనగరంగా భాసిల్లి, కృష్ణాతీరానికి రోము లాంటిదే శాలతో వర్తకాన్ని కొనసాగించటానికి తోడ్పడింది.

శాతవాహనుల తరువాత కృష్ణాతీరంలోని శ్రీపర్వత-విజయపురి (ప్రస్తుత నాగార్జునకొండ) నుంచి ఇక్ష్వాకులు క్రీ.శ 225 నుంచి 300 వరకూ పాలించారు. వంశమూలపురుషుడైన మొదటి చాంతమూలుడు (క్రీ.శ. 225-233) తరువాత వీరపురుషదత్తుడు (క్రీ.శ. 233-257), రెండో చారితమూలుడు (క్రీ.శ. 257-281), రుద్రపురుష దత్తుడు (క్రీ.శ. 281 నుంచి 300) చివరగా యువరాజు, మహారాజ కుమారుడైన రెండో వీరపురుషదత్తుడు (క్రీ.శ. 300) పాలించారు. ఉత్తరాన గోదావరి, దక్షిణాన పెన్నానది వరకూ పాలించిన వీరి కాలంలో, శ్రీపర్వతం గొప్ప నగరంగా విరాజిల్లి, బౌద్ధ వైదిక మతాలకు ఆలవాలము పొంది ఇక్కడి విద్యాలయాలలోకి ఎక్కడెక్కడి నుంచో బౌద్ధభిక్షువులు, విద్యార్థులు వచ్చి నేర్చుకునేవారనీ, శాసనాలు రుజువు చేస్తున్నాయి.

ఇక్ష్వాకుల తరువాత కృష్ణాతీరం అనేక రాజవంశాల పాలనను చవిచూచింది. బృహత్పలాయుడనే రాజవంశానికి చెందిన జయవర్మ కృష్ణాజిల్లా మచిలీపట్నం దగ్గరున్న కుదూరు (కుడూరు, గూడూరు) నుంచి తన పాలనా సంవత్సరంలో విడుదల చేసిన కొండముది రాగిరేకు శాసనంవల్ల తెలుస్తుంది. కృష్ణాతీరంలో విజయవాడకు దక్షిణానున్న పాతూరు అనే గ్రామాన్ని బ్రాహ్మణులకు దానం చేసినట్లుగా ఆ శాసనంలో ఉంది. ఇతడు క్రీ.శ. 292 నుంచి 302 వరకూ పాలించాడనీ, అతని తరువాత ఈ ప్రాంతం సాలంకాయనుల ఏలు బడిలోకొచ్చిందని చరిత్రకారులు నిర్ధారించారు.

సాలంకాయనులు పశ్చిమగోదావరిజిల్లా వేలాగి (పెదవేగి) నుంచి కృష్ణా-గోదావరి తీరాలను క్రీ.శ. 4-5 శతాబ్దాల మధ్యకాలంలో పాలించినట్లు పెదవేగి రాగిరేకు శాసనాలు రుజువు చేస్తున్నాయి. విజయదేవవర్మ (క్రీ.శ. 300-315), మొదటి హస్తివర్మ (క్రీ.శ. 315-320) మొదటి విజయనందివర్మ (క్రీ.శ. 320-355), అచందవర్మ (క్రీ.శ. 355-358), సముద్రగుప్తుని సమకాలికుడైన రెండో హస్తివర్మ (క్రీ.శ. 358-375), రెండో నందివర్మ (క్రీ.శ. 375-420), చివరగా విజయస్కంధవర్మ (క్రీ.శ. 420-440)లు పాలించారు. విష్ణుకుండిన రెండో మాధవవర్మ వీరినుంచి అధికారాన్ని హస్తగతం చేసుకొన్నారు.

ఇక్ష్వాకుల తరువాత, పల్నాడు-తీరాంధ్ర మధ్య ప్రాంతంలో కొంతభాగాన్ని పాలించిన తొలి పల్లవులకు క్రీ.శ. 4వ శతాబ్దంలో ధాన్యకటకం రెండో రాజధానిగా ఉండేదని గుంటూరుజిల్లా మంచికల్లుశాసనం ద్వారా చరిత్రకారులు అంచనావేశారు. క్రీ.శ. 300 ప్రాంతంలో మంచికల్లు శాసనంలో ప్రస్తావించబడిన సింహవర్మ ధమ్మకడ నుంచి స్వతంత్రపాలన సాగించి ఉండవచ్చనీ, పి.వీ. పరబ్రహ్మశాస్త్రి పేర్కొన్నారు. వీరు కందరపురంనుంచి పాలించిన ఆనందగోత్రికులను కూడా ఓడించి కృష్ణాతీరప్రాంతంలో ఆధిపత్యాన్ని చలాయించారు.

ఇక్ష్వాకుల తరువాత కృష్ణాతీరంలో పుట్టుకొచ్చిన రాజవంశం అనాదగోత్రినులు, కందరుగు మూలపురుషుడుగా, గుంటూరు జిల్లాలోని కందరపురం (కంతేరు)ను రాజధానిగ చేసుకొని క్రీ.శ. 375 నుంచి 560 వరకూ పాలించారనీ అత్తివర్మ గోరంట్ల, దామోదరవర్మ మట్టిపాడు, కందరుని చేజర్ల శాసనాలవల్ల తెలుస్తుంది. కృష్ణా-గుంటూరు జిల్లాలవరకు మాత్రమే వీరి ఆధీనంలో ఉన్నట్లు దాన శాసనాల్లోని గ్రామాలవల్ల తెలుస్తుంది. బహుశ తొలి పల్లవులు, లేక విష్ణుకుండనుల వల్లనో అధికారాన్ని పోగొట్టుకొని ఉంటారు.

ఇక్ష్వాకుల తదనంతర కాలంలో కృష్ణాతీరం విష్ణుకుండినుల కిందికి వచ్చింది. క్రీ.శ. 380 ప్రాంతంలో పాలన ప్రారంభించిన మొదటి ఇంద్రవర్మనుంచి, క్రీ.శ. 555-569 వరకూ పాలించిన రెండో విక్రమేంద్రవర్మ వరకూ వీరు, నల్లగొండజిల్లా తుమ్మలగూడెం (ఇంద్రపాలనగరమని కీ.శే. బి.ఎన్.శాస్త్రిగారి అభిప్రాయం), రంగారెడ్డిజిల్లా కీసరగుట్ట, కృష్ణాజిల్లా తిరువూలరు, గుంటూరుజిల్లా వినుకొండలమధ్య గల ఏదో ఒక రాజధాని నుంచి పాలించారని చరిత్రకారుల ఊహ. విష్ణుకుండిన రాజైన మూడో మాధవవర్మ (క్రీ.శ. 570-612) గుంటూరుజిల్లా సత్తెనపల్లి సమీపంలోని అమరపురి (వేల్పూరు)ని రాజధానిగా జేసుకొని పాలించాడని, బి.ఎస్.ఎల్. హనుమంతరావుగారు నిర్ధారించారు. దీనివల్ల కృష్ణాతీరం విష్ణుకుండినుల ఆధీనంలో వున్నట్లు రూఢీగా తెలుస్తుంది. అమరావతిలో దొరికిన విష్ణుకుండినుల నాణేలు కూడా ఈ విషయాన్ని బలపరుస్తుంది. ఇలా, శాతవాహనుల ధాన్యకటకం రాజధానిగా సువిశాల భూభాగాన్ని పాలించగా, తరువాతి రాజ్యాలు కొద్దిపాటి భూభాగాలకే పరిమితమయి కృష్ణాతీరంనుంచి తమ ఉనికిని చాటుకొన్నాయి.

విష్ణుకుండి [illegible] త, కృష్ణాతీరంలో నున్న మహబూబ్‌నగర్ కర్నూలు ప్రాంతాలను బాదామీ లేక వాతాపి చాళుక్యులు పరిపా లించారు. రెండో పులకేశి తూర్పు దిగ్విజయ యాత్రకు పూర్వమే ఈ

ప్రాంతాలు చాళుక్యుల హస్తగతమైనాయి. అటు తరువాత మొదటి విక్రమాదిత్యుడు (క్రీ.శ. 655-681), వినయాదిత్యుడు (క్రీ.శ. 681-696), విజయాదిత్యుల (క్రీ.శ. 696-733) శాసనాలు మూడో జిల్లాలోని కూడలి సంగమేశ్వరం, పంచలింగాల, అలంపూరు, పల్లెపాడు, చిన్నమారూరు, కర్నూలు, మాయలూరు, గద్వాల, పణియాత్, దయ్యాలదిన్నె, ఉల్సాల లభించాయి. ఈ కాలంలో ఆలంపూరు, పంచలింగాల, చిన్నకూరురు, ఐజ, పాణ్యం, మహానందిలలో దేవాలయాలను నిర్మించారు.

బాదామీ చాళుక్యుల కాలంలోనే అంటే క్రీ.శ. 624లో పెదవేగిని రాజధానిగా చేసుకొని కుబ్జవిష్ణువర్ధనుడు వేంగీ (తూర్పు) చాళుక్యరాజ్యాన్ని ప్రారంభించి పాలించాడు. క్రీ.శ. 41 వరకూ తీరాంధ్రలో ఎక్కువభాగంతో పాటు కృష్ణా-గుంటూరు జిల్లాలు ఇతని ఆధీనంలోనే ఉన్నాయి. ఇతని భార్య అయ్యణదేవి విజయవాడలో నెడుంబబసది అనే జైనబసీదని నిర్మించి దాని నిర్వహణ కోసం ముసినికొండను దానంగా ఇచ్చినట్లు ముసినికొండ రాగిరేకు శాసనాలు తెలియజేస్తున్నాయి. ఇదే వంశానికి చెందిన మూడో విష్ణువర్ధనుడు (క్రీ.శ. 719-755) కూడా ముసినికొండను, నెడుంబివసదికి ఇచ్చిన దానాల్లో పునరుద్ధరించాడు.

రెండో అమ్మిరాజు (క్రీ.శ. 945-970) కృష్ణాతీరంలోని మెల్లెంపూడి శాసనం, మచిలీపట్నం శాసనాలు అతడు జైనసదులు, ఆచార్యులకు ఇచ్చిన దానాల గురించి తెలియజేస్తున్నాయి. అదే వంశానికి చెందిన మొదటి బెజవాడ యుద్ధమల్లుడు (క్రీ.శ. 930-934) చేబ్రోలును రాజధానిగ చేసుకొని పాలించాడు. కర్నూలుజిల్లా పెదకల్లుకు చెందిన తెలుగు చోళరాజైన ఖటాచోడభీముడు క్రీ.శ. 973లో వేంగిని జయించి కృష్ణాతీరం అతని వశమైంది. తంజావూరుకు చెందిన మొదటి రాజరాజచోళుడు, క్రీ.శ. 1002లో జటాచోడుని వధించటంతో కృష్ణాతీరం చోళుల వశమైంది. దీంతో చాళుక్య శక్తివర్మకు వేంచేసి సింహాసనం దక్కటంతో కృష్ణాతీరం చాళుక్య, చోళుల ఆధీనంలో కొచ్చింది. క్రీ.శ. 1006లో కళ్యాణచాళుక్య సైన్యాలు బయలు నంబి ఆధ్వర్యంలో ధరణికోట, యనమదల కోటలను, చేబ్రోలు పట్టణాన్ని కొంతకాలం ఆధీనంలో కొచ్చినా, తరువాత శక్తివర్మ మళ్ళీ అధికారంలో హస్తగతం చేసుకున్నాడు. రాజరాజనరేంద్రుని వరకూ పరిస్థితులు అలాగే కొనసాగినా, క్రీ.శ. 1047 నుంచి కృష్ణాతీరం మళ్ళీ కళ్యాణ చాళుక్యుల వశమైంది. క్రీ.శ. 1068 నుంచి 1075 వరకూ కృష్ణాతీరం చాళుక్య-చోళుల ఆధీనంలో ఉంది.

రాష్ట్రకూటులు కూడా కృష్ణాతీరంపై ఆధిపత్యాన్ని చలాయించిన ఆధారాలున్నాయి. రాష్ట్రకూటరాజైన మూడో గోవిందుడు (క్రీ.శ. 793-814) వేంగిపై దాడిచేసి క్రీ.శ. 800 ప్రాంతంలో కృష్ణాతీరాన్ని స్వాధీనపరచుకొన్నాడు.

ఈ విషయాన్ని గోవిందుని సామంతుడైన బాలవర్మ శాసనంలో నల్లగొండ జిల్లా వాడపల్లి శాసనం రుజువు చేస్తుంది. అటు తరువాత క్రీ.శ. 9వ శతాబ్దంలో రెండో కృష్ణుని (క్రీ.శ. 878-911) కాలంలో కృష్ణాతీరమైన కర్నూలు రాష్ట్రకూటుల ఆధీనమైనట్లు మంచాలశాసనం రుజువు చేస్తుంది. అంతేకాక, మూడో ఇంద్రుని (క్రీ.శ. 914-928) శాసనాలు కడపజిల్లా కమలాపురం, మాలెపాడు, దానవులపాడులో దొరకటం చేత, కృష్ణాతీరంతోపాటు రేనాడు అతని వశమైనట్లు తెలుస్తుంది. మూడో కృష్ణుని కాలం (క్రీ.శ. 939-967)లో కృష్ణాతీర మని భవనాసి సంగమం వద్ద, రూపాలసంగమేశ్వరాలయం, నిర్మించ బడింది. అంతేకాదు రాష్ట్రకూటులకాలంలో కృష్ణాతీరానున్న అలం పూరు, సంగం, మహానంది, పంచలింగాల సోమశిల వరకు ప్రాత కోట, పాపనాశి, వెల్లుర్తిలలో ఆలయాలు నిర్మించబడినాయి.

క్రీ.శ. 9-12 శతాబ్దాల మధ్య పాలించిన ముదిగొండ చాళుక్యులకు సంబంధించి కొరది, మంచికాండ కొండపల్లి శాసనాలు కృష్ణాతీరంలో కొంత కాలంపాటు సాగిన వారి ఆధిపత్యాన్ని సూచిస్తున్నాయి. క్రీ.శ. 11వ శతాబ్దినుంచి పాలించిన వెలనాటి చోళుల పాలన మొదటి గొంకని (క్రీ.శ. 1076-1109)తో ప్రారంభమై పృథ్వీశ్వరుడనే మూడో రాజేంద్ర చోళుదుని (క్రీ.శ. 1185-1210) వరకూ చందాలు రాజధానిగా కృష్ణాతీరాన్ని పాలించి, తీరాంధ్ర రాజకీయాల్లో ప్రముఖపాత్ర సాధించారు. అలాగే క్రీ.శ. 1100 నుంచి క్రీ.శ. 1282 వరకూ కృష్ణాతీరంలో నున్న గాదెండ్ల నుంచి మరో శాఖ సత్తెనపల్లినుంచి, ఇంకో తాడికొండ యనమదులను రాజధానిగా చేసుకొని మరో కొండ పడుపటి రాజవంశశాఖ పరిపాలించాయి. కోట మన్మకేతరాజుకొడుకు క్రీ.శ. 1234లో పత్తిపాడు నుంచి పాలించాడు. క్రీ.శ. 9-10 శతాబ్దాలు కృష్ణాతీరప్రాతమైన నల్లగొండ-గుంటూరు జిల్లాలోని పల్నాడు ప్రాంతాన్ని హైహయులు పాలించినట్లు నల్లగొండజిల్లా హుజూర్‌నగర్, మిర్యాలగూడ, నిడమానూరు, అనుముల, పెద్దపూర, మట్టపల్లి, మేళ్ళచరువు, నేరేడుచర్ల, వేములపల్లి, సిరిపురం, మాచర్ల, సత్రశాల శాసనాలు రుజువు చేస్తున్నాయి. ఇదే కాలంలో మహబూబ్‌నగర్‌జిల్లా కందూరునుంచి కందూరు చోళవంశానికి చెందిన క్రీ.శ. 1025-1050 నుంచి పాలంబన ఏరువ భీముని నుంచి క్రీ.శ. 1176-1248 వరకూ పాలించిన రెండో శాతకర్ణుని దాకా

దాదాపు 3 శతాబ్దాలపాటు కళ్యాణ చాళుక్యులకు, కాకతీయులకు సామంతులుగానూ, స్వతంత్రంగానూ కృష్ణాతీరం ఉత్తరప్రాంతాన్ని పాలించారు. కొలనుపాక, తొండ, పానగల్లు, మల్లాలి, వేములనరవ, వర్ధమానపురం, ఆలవాన పల్లి, మల్లేశ్వరం, బూదపూరు, నెక్కొండ, రాచారు, కృష్ణాపురం, రామలింగాలగూడెం, గట్టుతిమ్మన, పేరూరు, నేలకొండపల్లి, పరడ, ఎండచెట్ట, సిరికొండ, మామిళ్ళపల్లి, ఆగామోతుకూర్ శాసనాలు ఈ విషయాన్ని రుజువు చేస్తున్నాయి. ఇదే కాలంలో కృష్ణానదికి గల కర్నూలు - మహబూబ్‌నగర్ జిల్లాల్లోని ప్రాంతాన్ని చెరుకు వంశానికి చెందిన బొల్లయరెడ్డి పరిపాలించగా పానగల్లు పాలిస్తున్నారు.

శాతవాహనుల తరువాత మొత్తం తెలుగునేలను ఏకంచేసిన కాకతీయులు రాజ్యంలో కృష్ణాతీరం కూడా చేరి ఉంది. కాకతీయుల తరువాత ముందుగా అమీనాగల్లు, తరువాత రాచకొండ, దేవర కొండలనుంచి పాలించిన రేచర్ల పద్మనాయకులు (వెలగులు) కృష్ణా తీరానికి ఉత్తరంగా నున్న మహబూబ్‌నగర్‌కు, నల్లగొండ జిల్లాలుగల ప్రాంతాన్ని పాలించారు. అలాగే రెడ్డిరాజ్యాన్ని స్థాపించి అద్దంకినుంచి పాలించిన ప్రొలియ వేమా (క్రీ.శ. 1325-1353) తరువాత ఆయన హోదాతో అనీవాతారెడ్డి (క్రీ.శ. 1353-64) రాజధానిని కొండవీడుకు మార్చి నప్పట్నుంచి, చివరి రాజైన రాచవేమిరెడ్డి (క్రీ.శ. 1424) వరకూ కృష్ణాతీరం వీరి ఆధీనంలోనే ఉంది. ఇదేకాలంలో కొంతకాలం కృష్ణాతీర ఉత్తరభాగం, కళింగ గాంగుల కింద ఉండేదట. రెడ్డిరాజుల తరువాత ఈ ప్రాంతం ఓఢ్ర గజపతులు, పిత్రాపుత్రాను, విజయనగర ప్రభువులు క్రింద ఉంది. క్రీ.శ. 1570లో ఖుతుబ్‌షాహీల వశమై మూర్తిజా నగరంగా పిలువబడిన కొండవీడు కృష్ణాతీరానికి రాజధానిగా ఉండేది. అటు తరువాత ఆసఫ్‌జాహీల వశమైన కృష్ణాతీరం క్రీ.శ. 1752లో ఫ్రెంచి వారి ఆధీనంలోకీ, క్రీ.శ. 1788 నుంచి ఆంగ్లేయుల వశమైంది. కృష్ణాతీర చివరిప్రాంతం క్రీ.శ. 18-19 శతాబ్దాల్లో చింతపల్లి అమరావతి వాసిరెడ్డివారికి, రేపల్లె మానూరివారికి, నరసరావుపేట మాల్రాజువారికి, చిలకలూరి పాడు (పేట) మానూరి వారికి, దేవరకోట చల్లపల్లి, నూజివీడు జమీందారీల కింద ఉండేది.

నివేదయితం కామోహం పాపం పరిషదిస్వకమ్
స్నానం శరీర శుద్ధ్యర్థం కరిష్యయతి కీర్తయేత్
అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాం గతోపివా
యస్మరేత్ పుండరీకాక్షం సబాహ్యాభ్యంతరశ్శుచిః

చిరునామా : *ఈమని శివనాగిరెడ్డి, 9878598446*

శ్రీ కె.హెచ్.వి.శర్మ

# కాకతి గణపతి కొలవెన్ను తామ్రశాసనము

ఈ మధ్య మా ఆఫీసులోని తామ్ర శిలాశాసనములు కొన్ని అవ్యవస్థముగా పడియుండెను. వాటిని పరిశీలించుచుండ ఈ తామ్రశాసన ప్రతిబింబములు కన్పడినవి. వీని యుపలబ్ధి మున్నగు విషయములను గూర్చి విచారించగా నిట్లు తెలిసినది. దాదాపు 40 సంవత్సరములకు పూర్వము బెజవాడ తాలూకాలోని కోలవెన్ను అను గ్రామమున దేవాలయమువద్ద మంటిదిబ్బ నొకదానిని త్రవ్వుచుండగా వలయములో గూర్చబడిన ఐదు రాగిరేకులు దొరికినాయి. అవి యప్పటి కృష్ణాజిల్లా కలెక్టరు ద్వారా పంపబడి మద్రాసు ప్రభుత్వ వస్తు ప్రదర్శనశాలయందు భద్రపఱుచబడినవి. 1918వ సంవత్సరమున మద్రాసు ప్రభుత్వముచే ప్రకటింపబడిన వారి వస్తు ప్రదర్శనశాల తామ్రశాసనముల పట్టికలో నీ విషయము సంక్షిప్తముగా తెల్పబడినది.

ఈ రాగిరేకులు 9 అంగుళములు పొడవును, 4 1/2 అంగుళముల వెడల్పును గల్గి యెడమవైపు అర యంగుళము వ్యాసముగల రంధ్రము ద్వారా నొక వలయమునకు గూర్చబడి యున్నది. ఆ వలయపు రాజముద్రపై వరాహము, సూర్యచంద్రులు చెక్కబడగలవు.

ఈ శాసనమును సవ్యాఖ్యానముగ 'ఎపి గ్రాఫియా ఇండికాల'లో ప్రకటించ వలసిందిగా కోరుచూ శ్రీ ఆర్. శ్రీనివాస రాఘవయ్యంగారు తమ వ్యాసము నాంగ్లములో అప్పటి గవర్నమెంటు, ఎపి గ్రాఫిస్టుగారగు రావు బహద్దూరు కృష్ణశాస్త్రిగారు పంపిరి. కాకతీయ గణపతిదేవుని తండ్రి మహదేవరాజని స్పష్టముగా తెలియుచుండగా నీ శాసన మాతని జనకునిగా నొకానొక పోరంటి వెన్నభూపాలుని పేర్కొనుచుండుటచే నిది యథార్థ తామ్రశాసనమగునాయని సందేహించుచు సత్యాసత్యములు భావిపరిశోధనలలో దెలియగలవని వారు దీనిని ప్రకటించుటకంగీకరించిరి. కాని వారా పదవినుండి నివృత్తికాగా ఆ స్థానమునకు వచ్చిన శ్రీ హీరానందశాస్త్రిగారీ వ్యాసమును సునిశితముగ పరిశీలించవలసినదిగా శ్రీ వి.ఆర్. కృష్ణమాచార్యులగారికిచ్చిరి. వారిందు బేర్కొనబడిన అంశములు విరుద్ధములని తదనుగుణముగ "The grant on account of late Paleography, its wrong date and abrupt beginning which are all unlikely for a genuine Kakatiya record, is evidently a forgery" - అని తీర్మానించుటచే నా వ్యాసము మరల శ్రీ రాఘవయ్యం గారికి పంపివేయబడినది. తదుపరి వారుగాని తదితరులుగాని దీనిని ప్రకటించినట్లు నాకగుపడలేదు.

మా ఆఫీసులోని ప్రతిబింబములనుబట్టి, మూలము వ్రాసికొని పరిశీలింపగా నాకిది కృత్రిమశాసనముగా కన్పట్టలేదు. మరియు కాకతీయ చరిత్ర  కత్యన్తోపయోగ కరమైనట్లు గూడ తోచుటచే దీనిని ప్రకటింపబూనితిని.

మొదటి రేకు రెండవ ప్రక్కకు, రెండు, మూడు, నాలుగు రేకుల రెండు ప్రక్కలను, ఐదవరేకు మొదలి ప్రక్క పూర్తిగను రెండవప్రక్క 'కొలవెంటి శాసనాలు' అను అక్షరములు మాత్రము చెక్కబడగలవు. మొత్తము శాసనమంతయు 73 పంక్తులలో ఉన్నది.

లిపి తెలుగు, భాష సంస్కృతి గద్య పద్యమయము. మొత్తము 16 శ్లోకములు గలవు. ప్రారంభమున అనునది. ప్రతి గ్రహీతల గోత్రనామములు, వారి భాగములు గద్యలో నున్నవి. శాసనాల శుభమస్తు 'కొలవెన్ను శాసనాల' మాటలు మాత్రము తెలుగున గలవు.

మొదటి రెండు శ్లోకములలోను గణపతి సూక్ష్మాపాలుని జనకునిగా పోరంటివ్యాపించిన దనియు కలడనియు అతని స్వచ్ఛమైన కీర్తి దిగంత ములు నాతడు దానమున కర్ణుని, వెన్నభూపాలుని ప్రతాప విభవము లచే శ్రీరామచంద్రుని, ధైర్యమున మేరుపర్వత మును, కాంతియందు చంద్రుని, తేజస్సున సూర్యుని, ఐశ్వర్యమున ప్రమదాధి పుని, ధర్మమున ధర్మతనయుని, బలమున భీముని, రూపమున మన్మథుని బోలిన వాడనియు వర్ణించబడెను. మూడు నాలుగు శ్లోకముల కాకతి గణపతిదేవుని వర్ణన, కాకతీయ వంశాబ్ధియందు చంద్రుడు వలె ప్రభవించిన గణపతి దేవుడు ప్రకాశించుచుండగా సర్వసౌఖ్యములతో

కూడిన ఈ లోకము కృత యుగమువలెనున్నది. ముల్లోకముల సద్గుణములచే నలంకరించినట్టియు, శత్రుభూపాలురి దర్పమును ప్రశమింపచేయుటలో యముడును, పొందబడిన భూసురుల ఆశీస్సులు గల గణపతి క్షోణిపాలుని కీర్తి మేరు పర్వతప్రాంతమున కల్పద్రుమము లచే నొప్పు నూతనోద్యానములయందు నిశాంతముల స్వర్గ స్త్రీలచే గానము చేయబడుచుండినట్లు వర్ణించబడెను.

5, 6, 7 శ్లోకములలో శాసనోద్దేశమైన దానమును గూర్చి గలదు. సస్య సమృద్ధమున, తన జనకుని పేరిట గల కృష్ణాతీరమున ప్రసిద్ధమైన యగ్రహారమున గణపతి దేవుడు శ్రుతి, శాస్త్ర పథ ప్రవీణులైన విద్వాంసులకిచ్చి వేసెను. శాఖలన్నింటిలోను మొదటిదని మూడు లోకములును ఏ యాజ్ఞవల్క్యముని యొక్క శాఖ ప్రసిద్ధబడెనో అట్టి శాఖకు చెందినట్టియు, సంతతి వేదశాస్త్ర పదవీపారంగతులగు నట్టియువి ప్రవరులకు కొలవెన్ను దానమీయబడినది. 8వ శ్లోకమున దానకాలము గలదు. శిక వర్షములు నయన (2) అద్రి (7) రుద్ర (11) లచే లెక్కించడిన సౌమ్య సంవత్సర మాఘమాసము సూర్యగ్రహణ పుణ్యకాలమందు గణపతిదేవుడు నూటముప్పది మరుత్తుల భూమిగల కొలవెన్నును ధారవోసెను. 9వ శ్లోకమున దత్తాగ్రహారపు సీమా చిహ్నములు చెప్పబడినవి. తదుపరి ప్రతి గ్రహీతలు గోత్రనామములు, వారి వారి భాగములు గద్యలో గలవు.

10, 11 శ్లోకముల గణపతిదేవుని సత్కార్యములు ప్రశంసించ బడినవి. హేమాద్రికలోక్త విశేష దానములు, ఈశ్వర ప్రతిష్ఠలు, భూసురుల వివాహోపకయాది ధర్మకార్యములు ఆతడు చేసినట్లు పాలించుచుండగా ప్రజలు స్వధర్మ నిరతులై ధనధాన్య సమృద్ధి కల్గియుండిరని వర్ణించబడెను. 12వ శ్లోకమున సమస్తమైన భూపాలుర శిరస్సులందు ప్రకాశించుచున్న రత్నకాంతుల రాపిడిచే నెఱుపైన పాదపద్మములు గల గణపతిదేవుని కీర్తి లోకపర్వత గుహలందలి చీకటులను హరించి స్వర్గ, మర్త్య, నాగలోకముల తిరుగుచుండుగాక యని ఆశీర్వదించబడింది. 13, 14వ శ్లోకములు శాసనోద్దిష్ట దానమును గూర్చి చెప్పబడింది. గణపతిమహీపాలునిచే చేయబడిన ఈ ధర్మమును తక్కిన భూపాలుడు సంరక్షించుచుందురుగాక, శ్రీమత్స్వయంభూవాద సంతర్పణార్థము గణపతిదేవునిచే ఈయబడిన యగ్రహారము నెవ్వరు హరించెదరో వారు గోబ్రాహ్మణ వధ చేసినట్లు, 15, 16 శ్లోకములు సామాన్యముగ దాన శాసనముల చివరనుండు వ్యాసగీతములు, తదుపరి “శ్రీ స్వయంభూనాథ కొలవెంటి శాసనాలు” అని సమాప్తి చేయబడినది.

కాకతిరాజుల తామ్రశాసనములు చాలా తక్కువ. ఇంతవఱకు ఈ వంశమువారి తామ్రశాసనములు మూడు మాత్రమే లభ్యమైనవి. గణపతిదేవుని గరవపాడు శాసనము, అతని సేనాని సారంగధరదేవుని శరంగపుర శాసనము, అతని పుత్రిక రుద్రాంబ కోటగిరి శాసనము పై మూడు తామ్రశాసనముల కడియములకు గల రాచముద్రికల యందు వరాహము, సూర్య, చంద్రులు చెక్కబడియున్నవి. ఇవి కాకతీయుల వరాహలాంఛనమును దెల్పుచున్నవి. ప్రస్తుత శాసనపు కడియముపై గూడ వరాహ లాంఛనముండుటబట్టి ఇది కృత్రిమ శాసనము కాజాలదని కొంతవఱకూహింపవచ్చును.

దీనికాలము 8వ శ్లోకమున శికవర్షములు నయనాద్రిరుద్ర అనగా 1172 సౌమ్యసంవత్సర మాఘమాసము సూర్యగ్రహణమని గలదు. ఇందు పేర్కొనబడిన శికవర్షము 1172 వర్తమానాబ్దముగ గ్రహించవలయును. దీనికి సరియగు క్రీస్తుశకము 1250 ఫిబ్రవరి 8వ తేదీ గురువారము. స్వామి కణ్ణుపిళ్ళెగారి ఎఫిమెరిస్ ప్రకార మానాడు సూర్యగ్రహణము లేదు. కాని ఆ సంవత్సర వైశాఖ, కార్తిక మాసముల యందు వరుసగా రెండు సూర్యగ్రహణములు గలవు. అందొక దానియందీ గ్రామము ధారవోయబడి తదనంతరము మాఘ మాసమున శాసనము లిఖించబడియుండును. గణపతిదేవుని శిరంగపుర, గరంపాడు తామ్రశాసనములు వరుసగా క్రీస్తుశకము 1254, 1260 నాటివగుటచే నిదియే మొదటిదని చెప్పవచ్చును.

ఇంతవఱకు లభ్యమైన గణపతిదేవుని, అతని వంశమువారి శాసనములను, వాఙ్మయమునుబట్టి అతని తండ్రి మహాదేవరాజని స్పష్టముగ తెలియుచున్నది. కాగా ఈ తామ్రశాసనములో గణపతి దేవుని జనకుడుగా పోరంటి వెన్నభూపాలుడొకడు వర్ణించబడెను. ఈ కారణముచేతనే ఇయ్యది కృత్రిమ శాసనమనియు నిందు విరుద్ధ చరిత్రాంశములు గలవని విమర్శించి ప్రకటింప బడలేదు. ఇందు ముఖ్యముగ గమనించవలసినవి మూడు అంశములు కలవు. 1. ఇందు పేర్కొనబడిన పోరంటి వెన్న భూపాలుడెవ్వడు ? 2. గణపతి దేవునకు నాతనికి గల సంబంధమేమి? 3. అతని పేర నీయగ్రహారము నేల దానము చేయవలెను?

1. పోరంటి వెన్న మరాజుని గూర్చి గూడూరు శాసనము, ప్రతాప చరిత్ర, హనుమకొండ స్థానిక చరిత్ర, సోమదేవరాజీయములను బట్టి తెలియుచున్నది.

గూడురు శాసనము తెలుగుపద్యములలో గలదు. ఆ పద్యముల లోని పదముల కర్థము సరిగాలేదని పండితులు ఎవరికి తోచినట్లు వారు సవరించి సమన్వయము చేయుచున్నారు. శ్రీ కంభముపాటి అప్పన్నశాస్త్రిగారు ప్రథమమున దొలిపద్యము నిట్లు సవరించి ప్రకటించిరి.

**చ. “అనుపమ దుర్జయాన్వయ**
**సుధాబ్ధి ననేకులు రాజనందనుల్**
**సనిన బిఱంద నన్నఁడును సం**
**భవుఁడయ్యె నతి ప్రసిద్ధుఁడై**

వినుత విరోధి మండలిక
వెన్నఁడు వెన్నుఁడపోలె ; వానికిన్

వారి సవరణలను ప్రశంసించుచు తదుపరి పండితులు, చరిత్ర కారులు దానినే గైకొనిరి. డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులగారు దానిని పరిష్కరించు సందర్భమున పై పద్యపు రెండవ పాదములోని 'బిఱంద వెన్నడ'ను దానికి బదులు సరియగు మూలములోని పాకమును 'బొఱంటి వెన్నడ' ని తెల్పిరి. ఇప్పుడా పద్యమిట్లు చదువ నగును.

"అనుపమ దుర్జయాన్వయను
ధాబ్ధివనేకులు రాజనందనుల్
సనిన బొఱంటి వెన్నఁడును
సంభవుఁడయ్యె నతి ప్రసిద్ధుఁడై
వినుత విరోధి మండళిక
వెన్నఁడు వెన్నుఁడపోలె ;"

దుర్జయ వంశజుడుగా చెప్పబడినట్టియు, విరోధి మండలికి విష్ణుమూర్తిగా నతి ప్రసిద్ధుడైన పోరంటి వెన్నమరాజు మన తామ్ర శాసనములో పేర్కొనబడిన పోరంటి వెన్న భూపాలుడే యని నా నిశ్చయము.

ఏకామ్రనాథ విరచితమగు ప్రతాపచరిత్ర కాకతీయ సామ్రాజ్య చరిత్ర కుపకరించు ముఖ్య గ్రంథములలో నొక్కటి. చరిత్రాంశము లిందు కల్పనలతోను, అతిశయోక్తులతోడను గూడి యుండినను యదార్థమును చారిత్రకదృష్టితో విమర్శించి గొంతవఱకు గ్రహింప వచ్చును. మాధవవర్మ పౌత్రుడుగ పద్మసేనుని పుత్రుడుగ నిందొక పొరికి వెన్నమరాజు పేర్కొనబడి యుండెను. హనుమ కొండ స్థానిక చరిత్రలలో గూడ నీ విషయము గలదు. వీటినిబట్టి ఈతనికి గుండమ రాజు జన్మించి కొంతకాలము రాజ్యము చేసినట్లున్నది. వేంగి చాళుక్య రాజగు రెండవ అమ్మరాజు కాలమునాటి తామ్రశాసనమొకదానిలో 'కాకర్త్యగుండన' యొకడు పేర్కొనబడి యుండెను. దీని కాలము క్రీ.శ. 945. ఈ గుండన పై ప్రతాపచరిత్ర, స్థానిక చరిత్రలలో పేర్కొనబడిన గుండనయే కావచ్చును.

కూచిమంచి జగన్నాథకవి విరచితమైన సోమ దేవ రాజీయము నందొక పొరకి వెన్నమరాజు కాకతీయుల కూటస్థుడుగ పేర్కొనబడి యుండెను.

ప్రస్తుత తామ్రశాసనమునందు, గూడురు శాసనములలోను బేర్కొన బడిన పోరంటి వెన్నభూపాలుడు, సోమదేవరాజీయ, ప్రతాప స్థానిక చరిత్రలలో చెప్పబడిన పొరికి వెన్నమరాజు నొక్కరే కావచ్చునని నా యభిప్రాయము. పై రెండు శాసనములాతని శౌర్యప్రతాపములను బొగడుటచే నాతడు మిక్కిలి ప్రసిద్ధుడైయుండవలెను. ఈ తామ్ర శాసనమునుబట్టి అతని కాలనిర్ణయము సేయుటకు వలనుపడదుగాని పైన పేర్కొనబడిన అమ్మరాజు శాసనము గూడూరు శాసనములనుబట్టి అతడు సుమారు తొమ్మిదవ శతాబ్దప్రాంతమున నుండవలెనని యూహింపవచ్చును.

2. ఈ శాసనములో పోరంటి వెన్నమరాజు కాకతి గణపతిదేవుని జనకుడుగా చెప్పబడెను. పైన జూపబడిన ఆధారములనుబట్టి కాకతీయుల మూలపురుషులలో ప్రసిద్ధుడొక పోరంటి వెన్న భూపాలుడు గలడని రుజువయినది. శాసన వాఙ్మయాధారాలములను బట్టి కాకతి గణపతిదేవుని తండ్రి మహదేవరాజని మనకు స్పష్టముగ తెలియుచున్నదిగదా ! "జనక" శబ్దమిచ్చట మూలపురుషులలో నొక్కడను నర్థములో వాడబడినది. "తాతస్తు జవక్షః పితా" అని అమరము. ఈ మూడును సమానార్థకములు. ఇది కేవలము తండ్రియను నర్థముననే గాక పితామహ, ప్రపితామహ, పూర్వులు అను సందర్భమునగూడ సంస్కృత వాఙ్మయములో ప్రయోగములున్నవి.

చంపూ రామాయణములో భాగీరథ వర్ణనావసర నమున దన పూర్వులగు సగళ చక్రవర్తులను గూర్చి శ్రీరాముడు సీతతో తెల్పు సందర్భమున

మేధ్యాశ్వమార్గ పరిమార్గణ సంధివస్య
దివ్యౌషధింకపిలకోపమహాజ్వరస్య
తాతాను తర్పణపచేలిమభాగధేయాం
భాగీరథీం భగవతీం శరణం భజామః
(అయోధ్యకాండ. 51 శ్లో)

రఘువంశములో తమ కులగురువగు వశిష్ఠ మహర్షిని దిలీప మహారాజు సంబోధించినది

తస్మాన్ముచ్యె యథాతాతి సంవిధాతుం తథార్హసి,
ఇక్ష్వాకూణాం దురా పేల_ర్థే త్వదదీనాహిసిద్ధయః
ఇట్లే పితృశబ్దము గీతలో పితృ, పితామహః,
పితామప్రహులను నర్థమున గలదు.
పతన్తి పితరో హ్యేషాంలుప్తపిండోదః క్రియాః
(మొదటి అధ్యయము, 42వ శ్లో)

కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలమున గూడ నీ శబ్దమిట్లే ప్రయోగించబడినది.

మానం ప్రసూతి వికలేవ మయా ప్రసిక్తం
ధౌతాశ్రుశేష ముదకం పితరః పిబన్తి !
(షష్ఠాంకము)

ఈ శాసనకావ్యకర్త 'జనక' శబ్దమునుగూడ నిట్లే యిందు ప్రయో గించెను. ఈ విషయమీ శాసనములోని మూడవ శ్లోకమునుబట్టి వ్యక్తమగుచున్నది. మొదటి రెండు శ్లోకములను వెన్న భూపాలునిగూర్చి

వర్ణించి తోడనే మూడవ శ్లోకమున గణపతిదేవుని బేర్కొను సందర్భ మున **'తత్పు త్రః, తతోఽభూత్, తస్మాదజని'** మున్నగు సంబంధ మేమియు దెల్పక 'గణపతి భూపతి చంద్ర ప్రభవతి భువి కాకతీయ వంశాబ్ధౌ అని ప్రారంభించుటచే గణపతిదేవుడు పైన పేర్కొనిన పోరంటి వెన్నమరాజు కుమారుడు కాడని స్పష్టము. శాసనములలో సామాన్యముగ ముక్కంటి పల్లవి, త్రినయనకదంబ మొదలగు కల్పనా పురుషునో కరికాల చోళాది ప్రసిద్ధ చారిత్రక పురుషులనో పేర్కొని వారివంశమందు తా ముద్భవించినట్లు చెప్పుకొనుటయొక ఆచారము. గణపతిదేవుని గరవపాడు తామ్రశాసనములో కరికాలచోళుడు, దుర్జయుడు పేర్కొనబడి వారి వంశమున కాకతి ప్రోల రాజాదులు జన్మించినట్లు గలదు. మల్కాపురము, కొలనుపాక మున్నగు శాసనము లన్నింటిలోను కాకతీయులు తాము దుర్జయవంశజులమనియే తెల్పుకొనిరి. గూడురు శాసనమును బట్టి ఆ దుర్జయ వంశములో ననేకుల రాజుల తర్వాత పోరంటి వెన్నమరాజు జన్మించినట్లున్నది. మరియు ఆ వంశములో పుట్టిన కాకతి బేతిరాజు కొఱవిదేశమును పాలించుచున్నట్లునూ, ఆ శాసనమునుబట్టియే తెలియుచున్నది. ఈతడు మొదటి బేతరాజు కావచ్చును.

3. గణపతిదేవుడీ కొలవెన్ను గ్రామము 'గ్రామంజనకాభిదాన విలసంత్తం' అని, 'శ్రీమత్స్వయంభూశివ తర్పణాయ' యనుటను బట్టి తన మూల పురుషులలో నొక్కడగు వెన్నభూపాలుని పేర నుండుటచే వారి కులదైవమగు స్వయంభూనాథుని సంప్రీతి కొఱకు సంతతి వేదశాస్త్ర పదవీ పారంగతులగు విద్వాంసులకు ధారవోసెనట. కొలవెన్ను చెన్నకేశ్వరాలయములోని శాసనములనుబట్టి ఈ దాన కాలమునకు పూర్వమునుండియే ఆ గ్రామమా నామముతో వ్యవహ రించబడుచున్నట్లు స్పష్టము.

ఈ సందర్భమున కొలవెన్ను చెన్నకేశ్వరాలయమున సంస్కృత శ్లోకములోగల శిలాశాసనమొకటి పరిశీలించవలసియున్నది. మధ్య అక్షరములు కొన్ని చెరగిపోయి శాసనమును పూర్తిగా చదువ వీలు లేకుండెను. గణపతిదేవుని సేనానియు మంత్రి సత్త ముడునగు పోతన గణపతిదేవుని జనక నామధేయముతో వెలయుచున్న కొలవెన్ను గ్రామమును యాజ్ఞవల్క్యకుల సంభూతులైన 120 మంది విప్ర వరులకు దానమిచ్చినట్లు తెలియుచున్నది. పోతనామాత్యుని యాజ్ఞాను సారము సూర్యకవిచే నీ శ్లోకములు రచింపబడి శిలయందు చెక్కబడిన వని గూడ కలదు. దురదృష్టముచే దీని కాలము లేదు. మన తామ్ర శాసనములో చెప్పబడిన విషయమే కొలవెన్నులోని ఈ శిలా శాసనములో చెక్కబడియుండుట మిక్కిలి ఆశ్చర్యకరమైనది. ఈ శాసనములో శిలాశాసనముగ చెక్కబడినదనియు మన తామ్ర శాసనములో తుట్టతుదిన 'కొలవెంటి శాసనాలలోని యుండుటనుబట్టి శిలాశాసనోద్దిష్టదానమే మరల వివరముగ ప్రతిగ్రహీతల గోత్ర నామములు భాగములతో గూడ రాగిరేకులపై చెక్కబడినట్లు స్పష్టమగు చున్నది. ఇట్లే తామ్రశాసనముయొక్క యదార్థమును కొలవెన్నులోని శిలాశాసనమే వెల్లడిచేయుచున్నది. పై శిలాశాసన కావ్యకర్తయగు సూర్యకవియే మన తామ్రశాసన గ్రంథమును గూడ రచించి యుండ వచ్చును.

కొలవెన్ను చెన్న కేశ్వరాలయములోని శాసనములను[10] బట్టి పోతన గణపతి దేవుని గొప్ప సేనానిగను, మంత్రి సత్తముడుగను దెలియుచుండెను. ఈతడు మంచి వితరణశాలి, కవులను గూడ పోషించెను. గణపతి దేవుని దక్షిణదేశ దిగ్విజయము నందీతడు మిక్కిలి తోడ్పడి ఆతని మెప్పు వడసియుండును. ఈ పోతన మంత్రి ప్రోత్సాహముననే గణపతిదేవుడు కోలవెన్ను గ్రామమును దానముచేసి యుండవలెను.

ప్రతిగ్రహీతల గోత్రనామములు, భాగములు సంస్కృతగద్యలో గలవు. గణపతిదేవుని గరవపాడు తామ్రశాసనములో గూడ నీభాగమిట్లే తెల్పబడినది. మొత్తము 188 మంది బ్రాహ్మణులకు 180 మరుతుల భూమి దానమీయబడినది. ఇందు కాశ్యపగోత్రజులు 39 మంది, భారద్వాజులు 34, శాండిన్య గోత్రజులు 35, కౌశిక గోత్రజులు 12. మిగతావారి గోత్రము చెప్పబడలేదు. పైనుదాహరించిన శిలా శాసనమును బట్టి ఈ గ్రామము 120 మంది విప్రులకు మాత్రమే దానమీయబడినది. అట్లే ఇందు సరిగా 120 మంది గోత్రములు మాత్రమే చెప్పబడి మిగతా 18 మంది గోత్రములు విడిచిపెట్టబడినవి. దీనిని బట్టి ఈ 18 మంది బ్రాహ్మణులను తర్వాత చేర్చియుండవలెనని యూహింపవచ్చును.

| సం. | ప్రతి గ్రహీత పేరు | భాగము | గోత్రము |
|---|---|---|---|
| 1. | గోవిందభట్టు | 1 | కాశ్యప |
| 2. | నారాయణభట్టు | 1 | ” |
| 3. | మాధవభట్టు | 1 | ” |
| 4. | కేశవభట్టు | 1 | ” |
| 5. | త్రివిక్రమభట్టు | 1 | ” |
| 6. | యజ్ఞేశ్వరభట్టు | 1 | ” |
| 7. | మంచిభట్టు | 3/4 | ” |
| 8. | విశ్వేశ్వరభట్టు | 1 | ” |
| 9. | రాఘవభట్టు | 1 | ” |
| 10. | లక్ష్మణభట్టు | 1 | ” |
| 11. | భీమేశ్వరభట్టు | 1 | ” |

| సం. | ప్రతి గ్రహీత పేరు | భాగము | గోత్రము |
|---|---|---|---|
| 12. | ఔభళాచార్యుడు | 1 | కాశ్యప |
| 13. | ప్రోలనార్యుడు | 3/4 | ” |
| 14. | మారుభట్టు | 1/2 | ” |
| 15. | కూచిభట్టు | | 1 ” |
| 16. | కృష్ణభట్టు | | 1 ” |
| 17. | మల్లనార్యుడు | 3/4 | ” |
| 18. | అన్నంభట్టు | 1 | ” |
| 19. | కామయభట్టు | 1 | ” |
| 20. | శింగనార్యుడు | 1 | ” |
| 21. | త్రిపురాంభట్టు | 2 | ” |
| 22. | నారాయణభట్టు | 1 | ” |
| 23. | భాస్కరభట్టు | 1 | ” |
| 24. | ఆఇత్తభట్టు | 1 | ” |
| 25. | నరసింహభట్టు | 1 | ” |
| 26. | శ్రీధరభట్టు | 1 | ” |
| 27. | జగన్నాథ భట్టు | 1 | ” |
| 28. | పద్మనాభభట్టు | 1 | ” |
| 29. | పురుషోత్తమభట్టు | 1 | ” |
| 30. | వల్లభభట్టు | 1 | ” |
| 31. | తెలుంగనార్యుడు | 1 | ” |
| 32. | నూరుభట్టు | 1/2 | ” |
| 33. | పిన్నాయభట్టు | 3/4 | ” |
| 34. | అప్పలకాభట్టు | 1 | ” |
| 35. | తల్లుభట్టు | 1 | ” |
| 36. | కాంభట్టు | 1 | ” |
| 37. | వరదభట్టు | 1/2 | ” |
| 38. | వామభట్టు | 1/2 | ” |
| 39. | సింహాద్రిభట్టు | 1 | ” |
| 40. | కేశవార్యుడు | 2 | భారద్వాజ |
| 41. | మాధవార్యుడు | 1 | ” |
| 42. | కామవార్యుడు | 1 | ” |
| 43. | గంగనార్యుడు | 1 | ” |
| 44. | నాగనార్యుడు | 1 | ” |

| సం. | ప్రతి గ్రహీత పేరు | భాగము | గోత్రము |
|---|---|---|---|
| 45. | రామనార్యుడు | 1 | ” |
| 46. | లక్ష్మణార్యుడు | 2 | ” |
| 47. | పెద్దనార్యుడు | 1 | ” |
| 48. | యజ్ఞనార్యుడు | 1 | ” |
| 49. | సోమనార్యుడు | 1 | ” |
| 50. | దుఅనాహోప్ప | 1 | ” |
| 51. | ధర్మనార్యుడు | 1 | ” |
| 52. | సింగనార్యుడు | 1 | ” |
| 53. | వల్లభార్యుడు | 1 | ” |
| 54. | రంగనార్యుడు | 1 | ” |
| 55. | విస్సనార్యుడు | 1 | భారద్వాజ |
| 56. | పినాయ | 1 | ” |
| 57. | న(నాగ)నార్యుడు | 1 | ” |
| 58. | లింగనార్యుడు | 1 | ” |
| 59. | సింగనార్యుడు | 1 | ” |
| 60. | అప్పనార్యుడు | 1 | ” |
| 61. | గంగనార్యుడు | 1 | ” |
| 62. | రాఘవార్యుడు | 1 | ” |
| 63. | నారాయణార్యుడు | 1 | ” |
| 64. | అప్పన | 1/2 | ” |
| 65. | అల్లాడనార్యుడు | 1 | ” |
| 66. | రాగవార్యుడు | 1 | ” |
| 67. | విశ్వేశ్వరభట్టు | 1 | ” |
| 68. | నాగనార్యుడు | 1 | ” |
| 69. | వామనార్యుడు | 1 | ” |
| 70. | మారనార్యుడు | 1 | ” |
| 71. | సోమనాథ | 2 | ” |
| 72. | భాగీరథభట్టు | 1 | ” |
| 73. | గంగనార్యుడు | 1 | ” |
| 74. | గంగనార్యుడు | 1 | కౌండిన్య |
| 75. | మల్లనార్యుడు | 1 | ” |
| 76. | కేశినార్యుడు | 1 | ” |
| 77. | నారాయణార్యుడు | 1 | ” |

| సం. | ప్రతి గ్రహీత పేరు | భాగము | గోత్రము |
|---|---|---|---|
| 78. | పెద్దనార్యుడు | 1 | ” |
| 79. | వామనార్యుడు | -- | ” |
| 80. | శంకరార్యుడు | 1 | ” |
| 81. | మధుకరార్యుడు | 1 | ” |
| 82. | గోవిందార్యుడు | 1 | ” |
| 83. | విష్ణునార్యుడు | 1 | ” |
| 84. | త్రివిక్రమనార్యుడు | 1 | ” |
| 85. | వామనార్యుడు | 1 | ” |
| 86. | శ్రీధరనార్యుడు | 1 | ” |
| 87. | నరసింహార్యుడు | 1 | ” |
| 88. | పద్మనార్యుడు | 1 | ” |
| 89. | దామోదార్యుడు | 1 | ” |
| 90. | వాసుదేవార్యుడు | 1 | ” |
| 91. | రాఘవార్యుడు | 1 | ” |
| 92. | అక్కనార్యుడు | 1 | ” |
| 93. | లింగనార్యుడు | 1 | ” |
| 94. | బృహప్పత్తార్యుడు | 1 | ” |
| 95. | నారనార్యుడు | 1 | ” |
| 96. | సర్వనార్యుడు | 1 | ” |
| 97. | సోమనార్యుడు | 1 | ” |
| 98. | రంగనార్యుడు | 1 | ” |
| 99. | యెఱనార్యుడు | 1 | ” |
| 100. | మల్లనార్యుడు | 1 | ” |
| 101. | భాస్కరార్యుడు | 1 | ” |
| 102. | మాధవార్యుడు | 1 | ” |
| 103. | యజ్ఞనార్యుడు | 1 | ” |
| 104. | దుగ్గనార్యుడు | 1 | ” |
| 105. | కామనార్యుడు | 1 | ” |
| 106. | ప్రోలనార్యుడు | 1 | ” |
| 107. | కామనార్యుడు | 1 | ” |
| 108. | యల్ల నార్యుడు | 1 | ” |
| 109. | మాధవార్యుడు | 1 | కౌశిక |

| సం. | ప్రతి గ్రహీత పేరు | భాగము | గోత్రము |
|---|---|---|---|
| 110. | గోవిందార్యుడు | 1 | ” |
| 111. | శంకరార్యుడు | 1 | ” |
| 112. | సోమనార్యుడు | 1 | ” |
| 113. | మల్లనార్యుడు | 1 | ” |
| 114. | ప్రోలవార్యుడు | 1 | ” |
| 115. | వాసుదేవార్యుడు | 1 | ” |
| 116. | రాఘవార్యుడు | 1 | ” |
| 117. | కేశవార్యుడు | 1 | ” |
| 118. | పర్వనార్యుడు | 1 | ” |
| 119. | ప్రోలవార్యుడు | 1/2 | ” |
| 120. | ధర్మనార్యుడు | 1/2 | ” |
| 121. | సర్వనార్యుడు | 1/2 | ” |
| 122. | నారాయణార్యుడు | 1 | గోత్రము లేదు |
| 123. | మాధవార్యుడు | 1 | ” |
| 124. | రాఘవార్యుడు | 1 | ” |
| 125. | సోమనార్యుడు | 1 | ” |
| 126. | యల్లనార్యుడు | 1 | ” |
| 127. | వామనార్యుడు | 1 | ” |
| 128. | దేవనార్యుడు | 1 | ” |
| 129. | భావనార్యుడు | 1 | ” |
| 130. | గంగనార్యుడు | 1/2 | ” |
| 131. | నాగనార్యుడు | 1/2 | ” |
| 132. | యెల్లనార్యుడు | 1/2 | ” |
| 133. | ప్రోలవార్యుడు | 1/2 | ” |
| 134. | పర్వతార్యుడు | 1/2 | ” |
| 135. | అన్నమార్యుడు | 1/2 | ” |
| 136. | రాఘవార్యుడు | 1/2 | ” |
| 137. | కేశవార్యుడు | 1/2 | ” |
| 138. | మాధవార్యుడు | 1/2 | ” |
| 139. | యల్లనార్యుడు | 1/2 | ” |
| | | మొత్తము | 180 |







## కాకతి గణపతి కొలవెన్ను తామ్రశాసనము మూలము[1]

### మొదటి రేకు రెండవ ప్రక్క

1. శుభమస్తు । గణపక్ష్మాపతి జనకో భువి విలసతి పొరంటి వెన్న భూపా
2. లః । అవతంసయ తి కీ తిఁ ప్రవిమల కుసుమాని యస్య దిజ్నార్యః ॥
3. దానే సూర్యసుతం ప్రతాపవిభవే శ్రీరామ చెం (చం) ద్రం నృపం ధై
4. ర్యే మేరు మహీధరం హిమకరం కాంత్యాం రవిం తే
5. జసి।ఐశ్వర్యే ప్రమాధాధిపం యమ సుతం ధర్మేఁబలే వాయుజం రూ
6. పే పంచశరం విదుః పొరంటి వ్నె (వె)న్న క్ష్మాపతిం పండితాః ॥ గణ
7. పతిభూపతిచంద్రే ప్రభవతి భువి కాకతీయ వంశాబ్ధౌ ।

### రెండవ రేకు మొదటి ప్రక్క

8. కృతయుగమివ లోకోయం కృతకృత్యో భవతి సౌఖ్య సంపన్నః ॥జీ
9. య్యా (యా) దాచంద్రతారం త్రిభువన విలస త్సద్గుణాలంకృతాంగో వై
10. రిక్ష్మానాథ దపఁ పశమన శమనః ప్రాప్త భూదేవతాశీః । హేమాద్రి ప్రా
11. లతకల్పదృ(ద్రు)మ కలిత నవోద్యాన లీలా నిశాంత స్వణాఁ (నాఁ) రీ గీత కీత్తిఁజఁగతి
12. గణపతి క్షోణిపాలః కృపావాణ్ (న్) ॥ సమధిక సంపత్సా(త్పా) త్రం సమస్త
13. ధాన్యోద్భవోచితం లోకే । విపులతర మగ్రహారం కృష్ణాతీగ ప్రభూత వి
14. ఖ్యాతిం। గణపతిదేవ మహీశో గ్రామం జనకాభిధాన విలసంతం । కృ
15. త్వా శ్రుతిశాస్త్ర పథప్రవణేభ్యో దాద్వి శిష్ట విద్వద్భ్యః॥ శాఖానాం ప్రథమే (మా)







16. త్రివిష్టపతలే విఖ్యాతి మాగ౾ గతా యచ్ఛాఖాపి నిజాన్వవాయ

## రెండవ రేకు రెండవ ప్రక్క

17. జనక స్యా ద్యాజ్ఞవల్క్యోమునిః । తేభ్య స్సంతత వేదశాస్త్ర పదవీ పారంగతేభ్యో
18. భువి ప్రాదా ద్విప్రవరేభ్య ఏవ నృపతి(ః) శ్రీ కోలవెన్నుం ముదా ॥ శాకాబ్దే నయ నాద్రి
19. రుద్రగణితే సౌమ్యే శుభేవత్సరే మాఘే సప్త తురంగమ గ్రహణ సత్కాలే సుపుణ్యే
20. దివే । త్రింశద్యు కశతాయ భూమి మరుతాం(శ్రీ కొలవెన్నుం ప్రభులో ౾ కే విశ్రుత
21. మావిరూఢ గణక్షోణీపతి ద ౾ తవాన్ ॥ ప్రాచ్యాం చించా స్తదాగః శిఖిదిశిశ
22. మనస్య ప్పికాకూప ఆశాభాగే దైత్యస్య కుల్యా దశి చ జలపతేస్తోరణాశ్వద్ధ (త్థ) భూజాః । వా
23. యవ్యాం మ్రోంపకుల్యా జలవిమల తలా చోత్తరస్యాం చ కుల్యా చైశాన్యాం విష్ణు రాజో దిశి జ
24. న విదితాశాగ్రహారస్య సీమాః ॥ గోవింద భట్ట ఏకభాగీ నారాయణభట్ట ఏకభాగీ । మాధవ
25. భట్ట ఏకభాగీ । కేశవభట్ట ఏకభాగీ । త్రివిక్రమభట్ట ఏకభాగీ । యజ్ఞేశ్వరభట్ట ఏకభాగీ । మంచిభట్టః

## మూడవ రేకు మొదటి ప్రక్క

26. పాదోన భాగీ । విశ్వేశ్వరభట్టో భాగీ । రాఘవభట్టో భాగీ । లక్ష్మణ భట్టో భాగీ। భీమే
27. శ్వరభట్ట ఏకభాగీ । ఔభళార్యో భాగీ ! ప్రోలనాద్య (ర్యః) పాదోన భాగీ । మారుభట్టఅర్ధ ౾
28. భాగీ । కూచిభట్టో భాగీ । కృష్ణభట్టోభాగీ । మల్లనార్యః పాదోన భాగీ । అన్నంభట్ట



29. అర్ధ ≡ భాగీ । కా మాయభట్ట ఏకభాగీ । శింగనార్యో భాగీ । త్రిపురారిభట్టో ద్విభా

30. గీ। నారాయణభట్ట ఏకభాగీ । భాస్కర భట్ట ఏకభాగీ । ఆఇతభట్ట ఏకభాగీ । న

31. రసిహ్య (హ్మ) భట్ట ఏకభాగీ । శ్రీధర భట్టోభాగీ । జగన్నాధభట్ట ఏకభాగీ । పద్మనాభభట్ట ఏ

32. కభాగీ। పురుషోత్తమ భట్టో భాగీ। వల్లభభట్టో భాగీ । తెలుంగనార్యో భాగీ । సూ



33. రు భట్ట అర్ధ ≡ భాగీ । పిన్నాయభట్ట (ః) పాదోనభాగీ । అప్పల ≡ భట్టో భాగీ । తలుభట్ట భాగీ ।

34. కాంభట్టో భాగీ । వరదభట్టఅర్ధ ≡ భాగీ । వామభట్టఅర్ధ ≡భాగీ । సిహ్య(హ్మ)ద్రిభట్టభాగీ । గణా

## మూడవ రేకు రెండవ ప్రక్క

35. ఏతే కాశ్య (శ్య)పగోత్రాః ॥ కేశవార్యో ద్విభాగీ । మాధవార్యో భాగీ । కామనా

36. ర్యోభాగీ । గంగనార్యోభాగీ । నాగనార్యో భాగీ । రామనార్యో భాగీ । ల

37. క్ష్మణార్యో ద్విభాగీ । పెద్దనార్యో భాగీ। యజ్ఞ నార్యో భాగీ । సోమనార్యో భాగీ। దు



38. అన హోప, భాగీ । ధమ ≡ నార్యో భాగీ । శింగనార్యో భాగీ । వల్లభార్యో భాగీ ।

39. రింగనార్యో భాగీ । విస్సనార్యో భాగీ । పినాయ భాగీ । ననా[2]ర్యో భాగీ ।

40. లింగనార్యో భాగీ । సింగనార్యో భాగీ। అప్పనార్యో భాగీ । గంగనార్యో భాగీ।

41. రాఘవార్యో భాగీ । వారణార్యో భాగీ। అప్పనార్ధ ≡ భాగీ । అలాడనార్యో భాగీ।

42. రాగనార్యో భాగీ । విశ్వేశ్వరభట్టో భాగీ। నాగనార్యో భాగీ । వామనార్యో భాగీ।

43. మారనార్యో భాగీ । సోమనాథ ద్విభాగీ। భాగీరథ భట్ట భాగీ । గంగనార్యో భాగీ।

## నాల్గవ రేకు మొదటి ప్రక్క

44. ఏతే భారద్వాజ గోత్రాః ॥ గంగనార్యో భాగీ । మల్లనార్యో భాగీ।
45. కేశవార్యో భాగీ । నారణార్యో భాగీ । పెద్దనార్యో భాగీ । వామనార్యో[3]
46. శంక రార్యో భాగీ । మధుకరనా[4] ర్యో భాగీ । గోవిందనార్యో భాగీ । విష్ణునార్యో
47. భాగీ । త్రివిక్రమనార్యో భాగీ । వామనార్యో భాగీ । శ్రీధరనార్యో భాగీ ॥ నరసిహ్యా (హ్మా)
48. నార్యో భాగీ । పద్మనార్యో భాగీ । దాఘూదరార్యో భాగీ । వాసుదేవార్యో భాగీ ।
49. రాఘవార్యో భాగీ । అక్కనార్యో భాగీ । లింగనార్యో భాగీ । బృహస్పతినార్యో భాగీ । నార
50. నార్యో భాగీ । సవ్వ౬ నార్యో భాగీ । సోవ(మ) నార్యో భాగీ । రంగనార్యో భాగీ । యఅనార్యో భాగీ ।
51. మల్లనార్యో భాగీ । భాస్కరనార్యో భాగీ । మాధవార్యో భాగీ । యజ్ఞనార్యో భాగీ । దుగ్గనా
52. ర్యో భాగీ । కామనార్యో భాగీ । ప్రోలనార్యో భాగీ । కామనార్యో భాగీ। యల్లనార్యోభాగీ ।

## నాల్గవ రేకు రెండవ ప్రక్క

53. ఏతే కౌండిన్య గోత్రాః ॥ మాధవార్యో భాగీ । గోవిందనార్యో భాగీ । శంకరా
54. ర్యో భాగీ । సోమనార్యో భాగీ । మల్లనార్యో భాగీ । వాసుదేవ
55. నార్యో భాగీ । రాఘవార్యో భాగీ । కేశవార్యో భాగీ । సవ౬ నార్యో భాగీ । ప్రోలనార్యో
56. అథ( ) భాగీ । ధర్మనార్యో అథ౬ భాగీ । సవ౬ నార్యో అథ౬ భాగీ । ఏతే కౌశికగోత్రాః ॥
57. యణార్యో భాగీ । వామనార్యో భాగీ । దేవనార్యో భాగీ । భావనార్యో భాగీ । గంగనా
58. ల్ల నార్యో భాగీ । వామనార్యో భాగీ । దేవనార్యో భాగీ । భావనార్యో భాగీ । గంగనా
59. (ర్యో) అథ౬ భాగీ । నాగనార్యో అథ ౬ భాగీ । యల్లనార్యో అథ ౬ భాగీ । ప్రోలనార్యో అథ౬ భాగీ । పర్వతా
60. ర్యో అథ౬ భాగీ । అన్నమార్యో అథ౬ భాగీ । రాఘవార్యో అథ౬ భాగీ । కేశవార్యో అథ౬ భాగీ । మా
61. ధవార్యో అథ౬ భాగీ । యల్లనార్యో అథ౬ భాగీ । హేమాద్రి కల్పోక్త విశేష దానా వ్యథాకృ

## ఐదవ రేకు మొదటి ప్రక్క

62. తానీశ్వ (ర) మందిరాణి । ప్రీత్యా వివాహోపనయా చ భూమే బ()హి()ము() లానా() గణ
63. పాలకేన । గణపాలక భూమిపాల నర్యే ధరణీ పాలన తత్పరే జనా శ్చ । నిజధర్మర
64. తా విముక్తవైరాధనధాన్యై వి౬లసంతిపూణ౬ గేహాః ॥ శ్రీమత్కాకతివంశకతు() రఖి
65. లోవీ()నాథ మౌళిస్ఫు రద్రత్నప్రోచ్చలదంశు రంజిత పదాంభోజస్య భత్తు ౬
66. భు ౬ వః । లోకాలోక గిరీంద్రకందర తమస్సందోహ సంహారిణీ కీత్తి౬బ్రా౬ మ్య
67. తు నాక మత్య ౬ ఫణిభృల్లోకేషు సంవాసినీ ॥ గణపాలమహీపేన కృతంధర్మ మతంద్రి
68. తాః । పాలయంతు మహీపాలా ఆచంద్రాక ౬ మహీతలే ॥ శ్రీమత్స్వయంభూశివతప్ప ౬ ణా
69. య గణాధిపక్ష్మాపతినా ప్రదత్తం । యోవైన మాద్యం ప్రభు రగ్రహారం నిహంతి తేవ ద్విజ గోవధః కృతః ॥
70. ఏకైవ భగినీ లోకే సవే౬షా మసి భూభుజాం । న భోజ్యా న కరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా ॥ సామాన్యోయం
71. ధమ్మ ౬ సేతు నృ ౬ పాణాం కాలే కాలే పాలనీయో భవద్భిః । ఇత్థం నవా ౬ న్భావినః పాథి౬ వేంద్రాన్ భూయో
72. భూయో యాచతే రామచంద్రః ॥ శ్రీ స్వయంభూనాథ

## ఐదవ రేకు రెండవ ప్రక్క

73. కొలవెంటి శాసనాలు ।

9వ శ్లోకమున దత్తాగ్రహారపు సీమా చిహ్నములిట్లు చెప్పబడి యున్నవి. పూర్వ దిక్కున చింతచెట్లు, ఆగ్నేయదిక్కున చెఱువు, దక్షిణములకు పికాకూపము, నైర్ఋతమున కుల్య, పశ్చిమమున అశ్వత్థ వృక్షముల వరుస, వాయవ్యమున మ్రోంపకుల్య, ఉత్తరదిక్కున కూడ స్వచ్ఛమైన నీటితో గూడిన కుల్య, ఈశాన్యమునకు విష్ణురాజు.

కృష్ణాతీరమున ప్రసిద్ధమైన కొలవెన్ను గ్రామముయొక్కటియే శాసనములో బేర్కొనబడినది. అది ఈ శాసనపు రేకుల దొరకిన కొలవెన్ను గ్రామమేయని తెలియుచున్నది.

A Trophical List of the Inscriptions of Madras Presidency

By

Sri V. Rangacharya - Vol No II - No. 17178 Page No. 88

Bezawada Taluk.

## KOLAVENNU

98 A.e.p.Grant of Chalukya Bhima II (Now in Madras Musium) consists of an order advansed by him to the inhabitants of Kon(duruvati) - Vishaya and issued at the request of a Vassal king vajjaya giving the village of Kondapalli to Kommana the son of Ven(naya ) and Kra(mavid) See S.11, 1, No. 37pp 43.6

## Dynastic list of Inscriptions

A Trophical list of Inscriptions of Madras Presidency

By V. Rangacharya

Krishna Districts Page No. 1732

Kakatiya - 2, 31, 38, 58, 92-A 136, 146, 161 - 74, 180 200-3-209A, 223, 232, 248, 252, 278 and 286

**కోలవెన్ను :** ఇది కృష్ణాజిల్లా గ్రామం. ఇంకా ఇలాంటి గ్రామాలు కుర్తివెన్ను, చాలివెన్ను, తాడివెన్ను, వేలివెన్ను, పెప్పలి తీగను కోల అంటారు. పెన్న వెన్న అయి వెన్నుగా స్థిరపడింది. ఆవువెన్న అనే గ్రామములోది. విన్నలేక వెన్న శబ్దాలకు తెలుగులో అర్థాలు కనిపించవు. అయితే తమిళంలో వెణిలకు అంటే బంజరు ఇసుకనేల అని అర్థం. (Ref : ఒక ఊరికథ రచన ప్రొఫెసర్ యార్లగడ్డ గంగాధరరావు)

**పితృదేవతలకు అర్ఘ్యప్రదానం**

**అగ్నిష్వాత్వా బర్హిషదః**

**కవ్యవాహనచార్యమాః**

**అజ్యపాః పితరస్త్వర్ఘం గృహ్ణం తృపిచ సోమపాః**

**ఓం అగ్నిష్వాత్తాది పితృభ్యో నమః ఇదమర్ఘం**

**సమర్పయామి**

డాక్టర్ రెంటపల్లి రవీంద్రభాస్

# రాచరిక వైభవానికి నిలువెత్తు సాక్ష్యం

ఆంధ్రప్రదేశ్‌లోని కృష్ణాజిల్లాలో నవ్యాంధ్ర రాజధాని విజయవాడకు వాయువ్యదిశగా 20 కి.మీ. దూరంలో ఉన్న చారిత్రక కట్టడం కొండపల్లి దుర్గం. మురిపించే ప్రకృతి సోయగం, అరుదైన చారిత్రక సంపద, అద్భుతమైన కళాకృతులు, ఆకట్టుకొనే కళానైపుణ్యం, చిత్ర సౌందర్యం, ప్రశాంతమైన వాతావరణం ఈ దుర్గం సొంతం. సముద్ర మట్టానికి 1200 అడుగుల ఎత్తులో ఉంది ఈ దుర్గం. చరిత్రకాలము నుండి 18వ శతాబ్దం వరకు కొండపల్లి కోట వివిధ రాజుల పరిపాలనతో ఐన్నత్యం కలిగి ఉన్నది. కనీసం వెయ్యి సంవత్సరాల ఘనచరిత్ర కొండపల్లికి ఉంది.

క్రీ.శ. 1200వ సంవత్సరమున కాకతీయులు కొండపల్లిని ఆక్రమించేనాటికి, కొండపల్లి "మంచికొండ విషయ" అను పేరుతో ముదిగొండ చాళుక్యుల ఆధీనంలో ఉన్నట్లు తెలుస్తోంది. తర్వాత కొండపల్లి ముదిగొండ చాళక్యుల నుండి పడమటి చాళుక్యుల, కాకతీయుల ఆధీనంలోకి వచ్చింది. కాకతీయరాజులైన రుద్ర, మహదేవ, గణపతిదేవ, రుద్రమదేవి మరియు ప్రతాపరుద్రులు పరిపాలించారు. ప్రతాపరుద్రుని కాలములో కొండపల్లి కోట మంచి పరిపాలన కేంద్రముగా పేరు పొందింది. క్రీ.శ. 1360లో కొండవీడుకు చెందిన ప్రోలయ వేమారెడ్డి దీన్ని నిర్మించాడు. ప్రోలయ వేమారెడ్డి రాజ్యం కృష్ణానది, శ్రీశైలం, అహోబల క్షేత్రాలు, కందుకూరి సీమ, తూర్పుతీరాల మధ్య విస్తరించింది. ఒక్క ప్రోలయ వేమారెడ్డి కాలంలోనే 84 దుర్గాలు నిర్మించబడ్డాయంటే వీరు దుర్గాల నిర్మాణానికి ఎంతటి ప్రాముఖ్యత ఇచ్చారో అర్థం చేసుకోవచ్చు. వీటిలో లభ్యమయినవి ధరణికోట, దనుదుప్రోలు (చందోలు), వినుకొండ, బెల్లంకొండ, నాగార్జునకొండ, కొండవీడు, కందుకూరు, కొండపల్లి మొదలైనవి. ఈ దుర్గాలు నాటి నిర్మాణ కౌశల్యానికి నిదర్శనాలు. వేమారెడ్డి క్రీ.శ. 1360 నుండి 1377 వరకు పరిపాలించాడు. ఈయన సర్వమత సమ్మతుడు. అనేక దేవాలయాలు నిర్మించాడు. దానధర్మాలు చేసాడు.

కదన రంగంలోనే కాక, వాస్తు శిల్ప కళల పోషణలో కూడా కాకలు తీరినవారు రెడ్డిరాజులు. దేశ రక్షణలో దుర్గాల ప్రాముఖ్యత పెరగడంతో వారు అనేక దుర్గాలను నిర్మించారు. కోటను ఆక్రమించడమంటే ఆ కోట ఏలుబడి క్రింద ఉన్న మొత్తం గ్రామాలను, భూమిని స్వాధీనం చేసుకోవడమే. అంటే ఆ రాజ్యాన్ని ఆక్రమించడమే. వేమారెడ్డి సాహిత్య పోషకుడు. కవిత్రయంలో చివరివాడయిన ఎఱ్ఱాప్రగడను పోషించాడు. శంభుదాసుడిగా ప్రసిద్ధిచెందిన ఎఱ్ఱాప్రగడ హరివంశాన్ని అనువాదం చేసి వేమారెడ్డికి అంకితం చేశాడు. రామాయణం, హరివంశం ఎఱ్ఱాప్రగడ చెబుతుంటే వేమారెడ్డి ఎంతో ఆసక్తితో వినేవాడట.

రెడ్డిరాజుల పతనానంతరం కొండపల్లి దుర్గం ఒరిస్సా గజపతుల వశమైంది. క్రీ.శ. 1463-82 సంవత్సరాల మధ్య గజ పతులను ఓడించి బహమని రెండో మహమ్మద్‌షా ఈ దుర్గాన్ని బాగు చేయించాడు. తిరిగి ఈ దుర్గాన్ని గజపతులు హస్తగతం చేసుకున్నారు. శ్రీకృష్ణదేవరాయలు క్రీ.శ. 1516లో ఈ కోటను ముట్టడించాడు. ఈ ముట్టడి మూడు నెలలు కొనసాగింది. రాయలసేనాపతులు కొండపల్లి దుర్గాన్ని తమ తమ సైన్యాలతో చుట్టుముట్టారు. ఈ విధంగా నాలుగు విభాగాల రాయల సైన్యం నలుమూలలనుండి దుర్గాన్ని విధ్వంసం చేశాయి. గజపతి వీరుల మొండేలతో, సైనికుల మృత కళేబరాలతో, ఎముకల గుట్టలతో, పాడయిన మహలులతో వేలకొద్ది గజాశ్వ ఖండాలతో నిండి, ప్రేత భూమివలె కనపడుతున్న కొండపల్లి కోటను శ్రీకృష్ణదేవరాయలు క్రీ.శ. 1516వ సంవత్సరం జనవరి నెలలో స్వాధీనపర్చుకున్నాడు.

కొండపల్లి ముట్టడి జరిగేటప్పుడు విజయనగర సైన్యానికి త్రాగడానికి మంచినీరు దొరకనందున, వారికి నీటి వసతికి మంత్రి తిమ్మరుసు ఇబ్రహీంపట్టణం ప్రధాన రహదారి ప్రక్క ఒక బావి త్రవ్వించాడు. ఈ బావిని నేటికీ తిమ్మరుసు బావి అని పిలుస్తున్నారు. కొండపల్లిలో లభించిన శాసనం వల్లనే శ్రీకృష్ణదేవరాయలు క్రీ.శ. 1530లో మరణించినట్లు తెలుస్తున్నది.

తర్వాత ఈ కోట గోల్కొండ నవాబుల పాలన క్రిందకు వచ్చినది. వీరి కాలంలోనే ఈ కోటకు 'ఖిల్లా' అనే ఉర్దూ పేరు పెట్టడం జరిగింది. రాయల దాడుల్లో నాశనమైన కొన్ని భవనాలను కులీ కుతుబ్‌షా పునర్నిర్మించాడు. ముస్తాఫాఖాన్ తన ప్రభువైన ఇబ్రహీం పాదుషా పేరుతో కొండపల్లికి 5 కి.మీ. దూరంలో ఇబ్రహీంపట్నాన్ని కట్టించాడు. అది ఇప్పటికీ అదే పేరుతో ఉంది. ఇతడు కొండపల్లి దుర్గంపై గల ఒక దేవాలయాన్ని నాశనం చేసి 'హజరత్ సయ్యద్ గాలిబ్ షహీద్ బాబా దర్గా' అనే పేరుతో ఒక మసీదును కట్టించాడు. అది కూడా నేడుంది.

నాటి మొఘల్‌చక్రవర్తులు, గోల్కొండ నవాబులు ఈ దర్గా పోషణ కోసం వందలాది ఎకరాలు కేటాయించారు. అప్పటినుండి ఇప్పటి వరకు ఉరుసు మహోత్సవం చేస్తూ వస్తున్నారు. రాచరిక కాలంలో ఆ తర్వాత బ్రిటీషర్ల పాలనలో కూడా ఉరుసు ఉత్సవాలు అత్యంత వైభవంగా సాగేవి. ఆ తర్వాత స్వాతంత్ర్య భారతంలో కూడా ఇక్కడ ఉత్సవాలు కొనసాగించారు. ముస్లింల ఆస్తుల పరిరక్షణ కోసం ఏర్పడిన వక్ఫ్ సంస్థ ఈ దర్గాకు చెందిన ఆస్తులను ఒక్కొక్కటిగా విక్రయించి ఆ సొమ్మును హైదరాబాదులో పెట్టేశాయి. ఆ సొమ్ముపై వడ్డీ కూడా దర్గాకు ఇవ్వటంలేదు. కోట్ల ఆస్తులున్నా ప్రస్తుతం ఈ దర్గా దీనస్థితిలో ఉంది. దర్గాకు చెందిన సొమ్మంతా తెలంగాణా రాజధాని హైదరాబాదులో ఉంటే, దర్గా మాత్రం ఆంధ్రప్రదేశ్‌లోని కొండపల్లి కోటపై దీనస్థితిలో ఉంది. అందుకే ఇప్పుడు అక్కడ ఉరుసు ఉత్సవం కూడా చేయలేకపోతున్నామని స్థానిక ముస్లిం పెద్దలు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.

1766 మార్చి 10వ తేదీన జనరల్ కెయిలాడ్ అనే ఆంగ్ల సేనాని ముస్లింలను ఓడించి ఈ ఖిల్లాను స్వాధీనపరచుకున్నాడు. దీనితో కొండపల్లి ఆంగ్లేయుల పాలన క్రిందకు వచ్చింది.

కొండపల్లి ఖిల్లా ఉన్న ప్రదేశంలో అనేకరకాలైన అపురూపమైన వనమూలికలు, అమూల్యమైన రంగు రంగుల వజ్రాలు పూర్వం దొరికేవని చెబుతారు. ఈ మహాదుర్గం అనేక రాజుల చేతులు మారి భయంకరమైన ఎన్నో దాడులకు గురి అయి నేడు నామ మాత్రంగా మిగిలి ఉంది. గోల్కొండ ద్వారం, ఎర్రబురుజు, హనుమంతుని బురుజు మొదలైనవి ఇప్పటికి కొంతవరకు బాగానే ఉన్నాయి. గోల్కొండ ద్వారం గుండా వెళ్తుంటే నెమ్మదినెమ్మదిగా గతంలోకి నడిచి వెళుతున్నట్లే ఉంటుంది.

పురావస్తు శాఖవారు ఈ కోటలోని ప్రతి భవన శిథిలాల వద్ద ఆయా భవనాల చరిత్రను వ్రాయించి బోర్డులను పెడితే ఈ కోటను దర్శించినవారికి కొంతవరకైనా సంతృప్తి మిగులుతుంది. కోటకు సంబంధించిన చారిత్రక వివరాలు, జరిగిన యుద్ధాలు, నడిపించిన సేనానులు, వ్యూహం పన్నిన రాజులు మొదలైన వివరాలు తెలియకపోతే ఆ కోట, భవనాలు కేవలం మొండి రాతిగోడలుగా మిగిలిపోతాయి. లండన్‌లోని మన వజ్రాలు, అమెరికాలోని మన శిల్పాలు మళ్ళీ మనకు రావాలని కోరే మన నాయకులు ఒకసారి మనదేశంలో శిథిలావస్థలో ఉన్న పురాతన కట్టడాలను గురించి పట్టించుకుంటే బాగుంటుంది.

చిటికెనవేలంత సైజులోని బొమ్మలో అన్ని అంగాలు స్పష్టంగా కన్పించేటట్టు చేయడమే గాకుండా వాటికి తగిన రంగులు వేయడం, ప్రతి బొమ్మలో ఆంధ్ర గ్రామీణ సహజత్వం మూర్తీభవింపజేయడంలో కొండపల్లి కళాకారులు సిద్ధహస్తులు.

క్రీ.శ. 1687 మధ్యకాలంలో ఔరంగజేబు ఈ కోటను ముట్టడించి ఆక్రమించుకున్నాడు. ఆ తర్వాత గోల్కొండ నవాబులు, వీరి తర్వాత నాజర్‌జంగ్ ప్రభువు ఈ ప్రాంతాన్ని పరిపాలించారు. క్రీ.శ. 1766వ సంవత్సరంలో జనరల్ కాలిమెడ్ కోటను ఆక్రమించి, కెప్టెన్‌మాడ్గే ఆధ్వర్యంలో కోటకు కొన్ని మరమ్మత్తులు చేయించినట్లుగా ఆధారాలు ఉన్నాయి. చివరిగా క్రీ.శ. 1767 సంవత్సరంలో బ్రిటీష్‌వారు కొండపల్లికోటను తమ ఆధీనంలో కలుపుకొని, తమ సిపాయిలకు శిక్షణ పాఠశాలను ఏర్పాటుచేసి, ఆర్థికపరంగా దానిని సాగించుటకు వీలుపడక క్రీ.శ. 1859వ సంవత్సరములో ఈ శిక్షణా పాఠశాలను విరమించుకున్నారు. 1890 నాటికి బ్రిటీష్ వారికి కోటలు మొహంమొత్తాయి. ప్రత్యేకమైన యుద్ధాలు లేవు కాబట్టి కోటల అవసరం కూడా వాళ్ళకి లేకుండా పోవడంతో అనాటి కృష్ణా కలెక్టర్ కోటల మీద రిపేర్ల కోసం ఖర్చు పెట్టవద్దని ఆదేశించాడు. శిథిలావస్థలో వున్న వాటిని ధ్వంసం చేయవలసిందిగా కూడా ఆజ్ఞాపించాడు. ఒకప్పటి చరిత్ర ప్రసిద్ధ నగరాల్లో వైభవాన్ని నడిపించిన కోటలన్నీ కనుమరుగైపోవడానికి ఇది ముఖ్య కారణం. ఆ తరువాత ఏవిధమైన ఆలనా పాలనా లేక శిథిలావస్థకు చేరుకొన్నప్పటికి 1962 సంవత్సరం నుండి ఆంధ్రప్రదేశ్ పురావస్తు మరియు ప్రదర్శనశాలల శాఖ కొండపల్లి కోటను తమ ఆధీనంలోకి తెచ్చుకొని రక్షితకట్టడంగా ప్రకటించారు. గత వైభవ చిహ్నాలుగా మిగిలిపోయిన కట్టడాలను పునరుద్ధరించడానికి పూనుకున్నారు.

కొండపల్లికి అంతర్జాతీయ ఖ్యాతిని తెచ్చి పెట్టిన మరో అంశం కొండపల్లి కొయ్యబొమ్మలు. సమీప అడవిలో విరివిగా లభించే తేలిక పాటి తెల్లపొనికి చెట్ల కర్రతో ఈ బొమ్మల్ని చేస్తారు. రాజస్థాన్, మధ్యప్రదేశ్‌ల నుంచి వచ్చిన ఆర్య క్షత్రియులు ఈ బొమ్మల తయారీపైనే కొన్ని తరాలుగా జీవిస్తున్నారు. కొండపల్లిలో కలంకారీ

పరిశ్రమ కూడా ఒకప్పుడు ప్రసిద్ధి. మచిలీపట్నం, కొండపల్లి, పాలకొల్లు, శ్రీకాళహస్తి నగరాలు కలంకారీ వస్త్రాన్ని ఎగుమతి చేసేవారు. కలంకారికైనా, చెక్కబొమ్మలకైనా వాడుకునే రంగుల్ని వనమూలికలతో ఈ చిత్రకారులు స్వతంగా తయారుచేసుకోవడం ఇక్కడి ప్రత్యేకత.

ఇక్కడి పర్వతలోయల్లోని వనమూలికలు శ్రేష్ఠమైనవిగా పేరొందాయి. గత వెయ్యి సంవత్సరాల కాలంలో రస గంధకాలు కల్సిన సింధూర ఔషధాలు తయారుచేయడంలో కృష్ణాతీర వాసులు అప్పటికీ ఇప్పటిక్కూడా నేర్పరులే ! కాని ఆదరణ లేక వారి సంఖ్య నానాటికి తగ్గిపోతోంది. కొండపల్లి గ్రామంలో రసకూర్పరం, రస సింధూరం తయారుచేసే బట్టీలు కొన్ని తరాలుగా నడుస్తూనే వున్నాయి. కొండపల్లి రసకర్పూరం నాణ్యమైంది కూడా ! చైనా వరకూ ఎగుమతయ్యేదంటారు.

వంట ఔషధాలు తయారుచేయడానికి వైద్యుడికి పాకం తెలియాలి. లేకపోతే కుప్పెలో మందు ఎగిరిపోతుంది. ఇది అనుభవం మీద సాధించవలసిన వైద్యకళ, కృష్ణాజిల్లాలో ఇలాంటి అనుభవజ్ఞులు ఇప్పటికి చాలామంది వున్నారు. కానీ, ఆదరణ లేక వారి సంఖ్య నానాటికీ తగ్గిపోతోంది.

**కొండపల్లి కోట నిర్మాణం :**

కొండపల్లి దుర్గం దుర్భేధ్యమైన 3 ప్రాకారాలతో, 27 బురుజులతో నిర్మించబడింది. క్రింది రెండు మైళ్ళ దూరంలో కోట ప్రాకారం ఉంది. దీని చుట్టుకొలత షుమారు 12 మైళ్ళు. ఈ పర్వత ప్రాకారము కోటకు దిగువన చుట్టూ లోతైన కందకం ఉండేది. కందకం ఎప్పుడూ కొండలలో ఉండే యేటి ప్రవాహంచే నింపబడుతూ ఉండేది. ప్రతి ప్రాకారానికి బురుజులుండి, బురుజులపై సేనా నాయకులు కాపలా కాస్తూ ఉండేవారు. మధ్య మధ్య కొండ వరుసలే పెట్టని ప్రాకారాలై దుర్గానికి రక్షణగా ఉండేవి. ప్రాకారాలతో కూడిన ఏడు బురుజులు దాటి లోపలికి పోయిన తర్వాత మరొక దుర్భేద్యమైన ప్రాకారం వుండేది. ఇట్టి ప్రాకారాల మధ్యగల కట్టడాలు, సౌధాలు, ప్రాచీన సభ్యతా, శిల్ప సౌందర్యాలు కలిగి ఉండేవి. ఇందు ధనా గారము, సైనిక గృహాలు, రాజమహాలు, అంతఃపుర ఉద్యాన వనాలు, రాణిమహలు, రాజవీధులు కలవు. రాజవీధుల సమీపంలో దర్బారు భవనం ఉండేది.

దర్బారు భవనంపై ఉన్న శిలా విగ్రహాలు, శిలా లతలు, ప్రాచీన కళాకారుల ప్రావీణ్యతను చాటుతూ ఉండేవి. దర్బారు హాలులో రాజులు దర్బారు నిర్వహించి ప్రజలకు తీర్పునిస్తుండేవారు. దర్బారు హాలుకు పడమరవైపున రంగమండపము ఉంది. ఇందు నర్తకిలు నాట్యం చేస్తూ ప్రభువులకు వినోదాన్ని కలిగిస్తూ ఉండేవారు. ఈ భవనానికి క్రింది భాగాన గజశాలలు, అశ్వశాలలు ఉన్నాయి. దర్బారు హాలునుండి క్రిందికి వెళ్ళడానికి రహస్యమార్గంగా నిర్మింపబడిన మెట్లు ఉన్నాయి. వీటిని రహస్య మార్గము క్రింద ఉపయోగించేవారు. చతురంగ బలం రాకపోకలకు అనువుగా ఈ రాచబాట నిర్మించారు. రహస్య మార్గం రాళ్ళతో నిర్మించారు. శత్రువులు దుర్గంలో ప్రవేశించినప్పుడు, ప్రాణాపాయం తప్పదనుకున్నప్పుడు దుర్గ పాలకులు, ఇతరులు ఈ రహస్య మార్గం గుండా పారిపోయేవారు.

గజశాలకు తూర్పువైపున ఖాళీ ప్రదేశము చుట్టూ ప్రాకారము ఉంది. ఈ ప్రదేశములో విందు, వినోద కార్యక్రమాలు జరుగుతూ ఉండేవి. ఉత్తరభాగాన రాజభవనము, రాణిమహలు, ప్రేక్షకుల మందిరం ఉంది. రాణిమహలు ముందు భాగాన కోనేరు నిర్మాణం చేయబడి ఉంది. దీనిని అంతఃపురస్త్రీలు జలక్రీడలకు ఉపయోగించేవారు. ఈ కోనేరుకు దగ్గరలో ఉన్న అత్తా కోడళ్ళ చెరువులనుండి నీటి సరఫరా ఉండేది. దీనిలో నీరు నింపడానికి అలాగే వృథా నీటిని ఖాళీచేయటానికి వేర్వేరు మార్గాలు ఉన్నాయి. చెఱువుల నుండి దుర్గం అంతటికి నీటి సరఫరా జరుగుతున్నట్లు తెలుస్తోంది. ఏడు శతాబ్దాలలో ఏనాడు ఇక్కడ నీరు ఇంకి పోకపోవడం వీటి ప్రత్యేకత. రాణిమహల్ దగ్గర మార్కెట్‌యార్డు, ధాన్యాగారములు కలవు. బ్రిటిషువారు మిలటరీ ట్రైనింగ్‌సెంటరు ఇక్కడ నడిపిన కాలములో వీటిని ఉపయోగించినట్లు తెలుస్తోంది. ధాన్యాగారానికి ఉత్తరం వైపు ఆయుధాగారం, జై- ఉండేవి. గజశాలకు ముందు ఖాళీ ప్రదేశంలో పెద్ద చెఱువు వుండేది. ఈ చెఱువును రాజు కుటుంబీకులు బోటు షికారు కోసం ఉపయోగించినట్లుగా తెలుస్తోంది.

ఈ కొండపల్లి దుర్గానికి రక్షణగా తూర్పు భాగాన హనుమకొండ బురుజు, దక్షిణాన ఎఱ్ఱబురుజు, పడమట యెద్ల బురుజు మరియు ఉత్తరాన ఒంటె మాన్యము బురుజులు ఉండేవి. వీటిలో కొన్నిటిని మనం ఇప్పటికి కూడా చూడవచ్చు. ఒంటె మాన్యం (ఒంటె మూపు ఆకారం కలది) దిబ్బమీద భోగం దాని మేడ అని పిలువబడు రెండు గదుల కట్టడం ఉంది. ఇది షుమారు 1200 అడుగుల ఎత్తులో నిర్మాణము చేయబడి కోటకు ప్రధాన రక్షణ బిందువుగా ఉపయోగపడినట్లు తెలుస్తోంది. ఈ ఎత్తునుండి చూస్తే భవానీద్వీపం, కొండపల్లి గ్రామం, కృష్ణానది మొదలైన ప్రాంతాలన్నీ ఎంతో ఆహ్లాదకరంగా కనువిందు చేస్తూ ఉండేవి.

కాకతీయులు కొండపల్లిని ఆక్రమించేనాటికి "మంచికొండ విషయం" అని పిలిచేవారు ఈ ప్రాంతాన్ని ! మంచికొండ ఏది అనే

దానిమీద పరిశోధకుల్లో ఏకాభిప్రాయం లేదు. కొందరు దొండపల్లినీ, కొండదీడునీ, మరికొందరు కోటప్పకొండనీ ఈ 'మంచికొండ'గా ఊహించారు. ఏమైనా కాకతీయుల కాలంనుంచి ఇది కొండపల్లిగానే ప్రసిద్ధి చెందింది. కొండపల్లినాడు, కొండపల్లి రాజ్యం, కొండపల్లి దండపాట ఇలాంటి పేర్లతో ఆ తర్వాతి కాలంలో కొండపల్లి సీమగా పిలవబడింది.

కాకతీయుల తర్వాత రెడ్డిరాజుల ఏలుబడిలోకి కొండపల్లి వెళ్ళింది.

1516లో కృష్ణదేవరాయలు కనీసం 2 నెలలకు పైగా శ్రమించి కొండపల్లి కోటని స్వాధీనం చేసుకోగలిగాడు. రాయలు తర్వాత కొండపల్లి గోల్కొండ సుల్తానుల పరం అయ్యింది. 1550-80 మధ్య కాలంలో మాలిక్ ఇబ్రహీం కుతుబ్ షా కొండపల్లి కోటని పటిష్టపరిచాడు. ఆ మాలిక్ ఇబ్రహీం తెనుగు ప్రజలభిమానం చూరగొన్న పాలకుడు. ఇతన్ని "మల్కిభ రాముడు" అని కీర్తించేవాళ్ళు. కోటకు దగ్గరగా కోమటిపేట అనే ప్రాంతాన్ని అభివృద్ధిచేసి దాన్ని తన పేరుతో ఇబ్రహీంపట్నంగా వ్యవహరించాడు. 1900 నాటి బ్రిటీష్ రికార్డుల్లో ఇబ్రహీంపట్నాన్ని 'ఇభరాంపురం'గా పిలుస్తున్నట్లు వుంది.

హైదరాబాదు నగర నిర్మాత కులీకుతుబ్‌షా 1580-1612 మధ్యకాలంలో కొండపల్లి పట్టణానికి దగ్గరగా ఒక నుయ్యిని తవ్వించాడు. ఈ నుయ్యి ప్రస్తుతం విజయవాడ థర్మల్‌స్టేషన్ స్థలంలో వుంది. ఈ నూతి నీరు మక్కాలోని 'జంజం' జలంతో సమానం అనీ, ఎదురుగా కన్పించే రెండు కొండలూ మక్కాలోని సఫా, మర్వా పర్వతాలతో సమానం అనీ, కొండపల్లి మహ్మదీయుల పుణ్యక్షేత్రం కావాలని ఆయన ఆశిస్తూ ఈ నూతి గట్టున ఒక శాసనం వేయించాడు. ప్రస్తుతం ఈ శాసనం పురావస్తు శాఖ ఆధీనంలో ఉంది.

ఆంధ్రప్రదేశ్‌లో రెండవ అతిపెద్ద పారిశ్రామిక వాడగా ప్రసిద్ధికెక్కిన కొండపల్లి ప్రాంతంలో కొన్ని వందల పరిశ్రమలు అక్కడ నెలకొల్పబడి వున్నాయి. భారతీయ రైల్వేలో దేశంలోనే రెండవ అతిపెద్ద వ్యాగన్ వర్క్‌షాపు కొండపల్లికి కేవలం 3 కి.మీ. దూరంలో రాయనపాడులో ఉంది. అతి పెద్ద కంపెనీలయిన BPCL, GAIL, HPCL, IOC, Relience తమ పెట్రోలియం ఉత్పత్తులను పలు ప్రాంతాలకు నిరంతరం సరఫరా చేస్తుంటాయి. APHMEL ఫ్యాక్టరీ కూడా కొండపల్లిలో ఉంది. రాష్ట్రానికి విద్యుత్ వెలుగులు అందించడానికి తమ వంతు పాటుపడుతున్న NTTPS థర్మల్‌స్టేషన్, లాంకో విద్యుత్ కర్మాగారాలు కొండపల్లి కీర్తిని శాశ్వతం చేస్తున్నాయి.

చారిత్రకమైన కొండపల్లి కోట శిథిలమవుతోంది. గుప్తనిధుల మాఫియా కబంధ హస్తాలలో చిక్కుకుని అల్లాడిపోతోంది. గుప్తనిధుల వేటగాళ్ళ బారిన పడి అంతరిస్తున్నది. గత కాలపు రాచరికపు వైభవాన్ని నిలువెత్తు నిదర్శనం కొండపల్లి కోట. రాజులు, వాళ్ళ రాజ్యాలు నశించినా, వాళ్ళు కట్టించిన కట్టడాలు నేటికి అజరామరంగా ఉన్నాయి. ఎంతో చరిత్రలు కలిగిన కోటలు, కళాఖండాలను తిలకించేందుకు దేశవిదేశాలనించి పర్యాటకులు వస్తుంటారు. గుప్తనిధుల పేరుతో అడ్డు అదుపులేని త్రవ్వకాలతో దేశద్రోహులు చరిత్రకు చెదలు పట్టిస్తున్నారు. గుప్తనిధులు ఉన్నాయని పుకార్లు షికార్లు చేయడంతో గుప్తనిధుల వేటగాళ్ళు కోటలోకి జొరబడుతున్నారు. కొండపల్లి కోటలో ఇప్పటికే ఎంతో విలువైన చారిత్రక సంపదను గుప్తనిధుల త్రవ్వకం దారులు నాశనం చేసేసారు. విలువైన పురాతన విగ్రహాలను ధ్వంసం చేశారు. దాదాపు వెయ్యేళ్ళ చరిత్ర కలిగిన కోట జాడ రోజు రోజుకి కనుమరుగైపోతోంది. ఈ దుస్థితిని గ్రహించి ప్రభుత్వం తగిన చర్యలు చేపట్టి, కోటకు మరింత పటిష్టమైన రక్షణ వ్యవస్థను కల్పించి భావితరాలవారికి ఈ సంపదను అందించాలని ఆశిద్దాం.

## ఆధార గ్రంథాలు


1. అప్పారావు, వడ్డాది రెడ్డి సంచిక, రాజమహేంద్రవరము, 1947
2. ప్రతాపరెడ్డి, సురవరము ఆంధ్రుల సాంఘిక చరిత్ర (తృతీయ ముద్రణ), హైదరాబాద్, 1982
3. సుబ్బారెడ్డి, వి.వి. రెడ్డిరాజుల కాలంలో కొండవీటి వైభవం, ఆంధ్రభూమి (దినపత్రిక), సికింద్రాబాదు, 28-2-1982, అమరావతి మహోత్సవం, (సావనీరు), గుంటూరు, 2002

   గత వైభవాన్ని కడుపులో దాచుకున్న కొండపల్లి కోట
4. హనుమంతరావు, బి.ఎస్.ఎల్., ఆంధ్రుల చరిత్ర (ద్వితీయ ముద్రణ), హైదరాబాదు, 1996
5. కృష్ణాజిల్లా ఆయుర్వేద ప్రగతి, డా. జి.వి. పూర్ణచందు (కృష్ణాజిల్లా సర్వస్వం నుండి)
6. కృష్ణాజిల్లా సర్వస్వం, ప్రథమ ముద్రణ (చరిత్ర, సమాజం, సంస్కృతి) ఏప్రిల్, 2011.
7. అంతర్జాలం


*చిరునామా : డాక్టర్ రెంటపల్లి రవీంద్రభాన్, రీడర్, తెలుగుశాఖ, ఆంధ్రా లయోలా కళాశాల, విజయవాడ - 520 008*

*చరవాణి - 9848389900*

శ్రీ టేకుమళ్ళ అచ్యుతరావు

# వినుకొండ వల్లభరాయని క్రీడాభిరామము

మహమ్మదీయుల దండయాత్రలకు పూర్వము దక్షిణ హిందూ స్థానములో కాకతీయ రాజ్యమునకు ముఖ్యపట్టణమగు ఓరుగల్లును, భల్లాణరాజ్యమునకు రాజధానియగు ద్వారసముద్రమును గొప్ప ప్రతిష్ఠ ననుభవించుచుండెను. ఓరుగల్లు సంగీతసాహిత్యాది లలితకళలకును, ద్వారసముద్రము రాజనీతిశాస్త్రములకును పేరొందియున్నట్లు పద మూడవ శతాబ్దియంతమందుండిన కొఱవి గోపరాజు అను ఆంధ్రకవి వరుడు తన సింహాసనద్వాత్రింశిక కథలను ప్రబంధములో అభివర్ణించెను.

ఇట్టి యోరుగల్లుపురముయొక్క వైభవమును, రాజకీయసాంఘిక మతపరిస్థితులును పౌరులయొక్క వర్ణభేదములును, కులాచార విష యములను, దైనిక జీవితమును, వినోదములును, ఆటపాటలు యిత్యాది విషయములను వినుకొండ వల్లభరాయడను ఆంధ్రకవివరుని సహాయమున క్రీడాభిరామమందు మనకండ్లకు కట్టినట్టు చూడ గలుగుచున్నాము.

వినుకొండ వల్లభరాయడు కడపజిల్లా పులివెందల తాలూకాలోని మోపూరు గ్రామమునకు అధిపతిగానుండెను. ఈతని తండ్రియగు తిప్పన్న గుంటూరుజిల్లాలోని వినుకొండకు ప్రభువుగానుండి విజయ నగరరాజైన రెండవ హరిహరరాయలయొద్ద రత్నభాండాగారాధిపతిగా నుండెను. వీరి పూర్వులు విజయనగర రాజులయొద్ద గొప్ప యుద్యో గములు చేసినవారే. క్రీ.వె. 1404-22 వఱకు రాజ్యము చేసిన మొదటి దేవరాయలకును, అతని పౌత్రుడగు రెండవ దేవరాయలకును (1423-46) సమకాలికుడైన వినుకొండ వల్లభరాయడు దేవరాయ లచే కనకాభిషేక గౌరవముబొందిన శ్రీనాథునికిని గూడ సమకాలము వాడని నిర్ణయింపవచ్చును. వల్లభామాత్యుడు కామ కాయనస విశ్వామిత్ర గోత్రమువాడు,మోపూరుభైరవస్వామి భక్తుడు.

ఇతడు క్రీడాభిరామమను వీథినాటకమును నాంధ్రమున రచించెను. ఈ గ్రంథమందలి ప్రస్తావన పద్యములవలనఁ దత్కవి గొప్ప పండితు డనియుఁ జక్కని కవిత్వముఁజెప్పగలవాడనియు తెలియవచ్చుచున్నది. ఇంతియెగాక ఋగ్వేదము కరతామలకముగా పఠించి భైరవస్వామి కృపవలన సారస్వతసిద్ధియనగాఁ గ్రంథకర్తృత్వసంపత్తి బొందెను.

## క్రీడాభిరామము

క్రీడాభిరామమొక వీథినాటకము. వీథి యనగా దశరూపకము లలో నొకటియైన చిన నాటకస్వరూపము. దానియందు నొకరుగాని యిద్దరుగాని విలాసపురుషులగు నాయకులు శృంగార విహారపరులై యొకానొక పట్టణమందును, దత్పరిసరమందును దిరిగి యచ్చటచ్చట బొడసూపెడు ఆటలు, వినోదములు, యుత్సవములు యిత్యాది విశే షములను దిలకించి ముదమొందుచు శృంగారభోగపరాయణులై వేశ్య వాటికాపరిభ్రమణమున మదనావిష్టమానసులై యారేయి గడపి మరునాడు తమదారిన దాఁటబోదురు. ఇట్టి వీథి నాటకములన పదునాల్గు పదునేను శతాబ్దములలోని మనదేశమందలి గీర్వాణకవులు వ్రాసి ప్రదర్శించి రాజులను, ప్రజలను సంతోషబెట్టుచుండిరి.

రావిపాటి త్రిపురాంతకదేవుడను కవీశ్వరుడు ప్రేమాభిరామమను నాటకమును సంస్కృతమున రచించెను. దానిననుసరించి వల్లభ రాయఁడు తెలుగున క్రీడాభిరామమను రూపకమును రచియించెను. ఏతద్గ్రంథము వల్లభామాత్యుడు రచించినట్లు గ్రంథమందలి ప్రస్తావన బట్టియు దెలియవచ్చుచున్నది. అయిన మఱికొందఱు లాక్షిణికులు ఈ యభిప్రాయమునకు భిన్నముగాఁ దమ గ్రంథములయందు కవి సార్వభౌముఁడగు శ్రీనాథుడే యీనాటకమును రచించెనని సూచించి యున్నారు. ఇట్లాంధ్రలక్షణ గ్రంథములలోనున్న భిన్నాభిప్రాయముల మూలమునను మఱికొన్ని కారణములవల్లను యీ గ్రంథకర్తృత్వము విషయము వాదప్రతివాదముల కాస్పదమయ్యెను.

తొలుతల్లి యీ గ్రంథమును ముద్రించిన శ్రీమానవ రామకృష్ణకవి గారు ఉభయపక్షములఁజెప్పదగిన హేతువులను వారికి సహజమగు

నిస్సాక్షికమగు బుద్ధితోఁజెప్పిరి. బ్రహ్మశ్రీ వేటూరిప్రభాకరశాస్త్రిగారు 'శృంగార శ్రీనాథ' మందు అనేక నుపపత్తులను జూపుచు క్రీడాభిరామకర్త శ్రీనాథుడని తెలియజేసిరి. ఈయుభయుల యభిప్రాయములను ఖండించుచు కొన్ని నూతన విశేషములను గనపరచుచు బ్రహ్మశ్రీ వేమూరి విశ్వనాథశర్మగారు 1927 సం॥ ఏప్రిల్ భారతిలో క్రీడాభిరామకర్త వల్లభామాత్యుడేయని కంఠోక్తిగా నుడివిరి. ఈ పండితుల వాదప్రతివాదములనిచ్చట సంక్షేపముగా తెలియజేయుచున్నాను.

1. పూర్వకవిలాక్షణికులగు చిత్రకవిపెద్దన ముద్దరాజు రామన, గణపవరపు వెంకటకవి, పెదపాటి జగన్నాథకవి మొదలగువారు క్రీడాభిరామమునుండి తమ గ్రంథములలో నుదహరించిన పద్యములు వల్లభరాయుని వేయని చెప్పినట్లు శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసినారు. కాని అప్పకవి, లింగమగుంట తిమ్మకవి మున్నగువారీ పద్యములు శ్రీనాథునివని నుడివినారు.

2. క్రీడాభిరామములోనున్న ఒందురెండు పద్యములు శ్రీనాథుని గ్రంథములోనున్నవి. మఱియు క్రీడాభిరామములోనివైన కొన్ని వాక్యములు,వర్ణనలును శ్రీనాథుని వాక్యములను వర్ణనలను గాఢముగా ననుకరించుచున్నవనియు, కావున శ్రీనాథుడే యేతద్గ్రంథకర్తయని సిద్ధాంతీకరింపబడవచ్చుననియు, ఋజువు చేయుటకు శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు చాలావఱకు శ్రీనాథుని గ్రంథములనుండి సామ్య శబ్దసామగ్రిని సేకరించి విపులముగ విశదపరచినారు.

క్రీడాభిరామ ప్రస్తావనయందున్న కృతిపతిస్తుతియు, గ్రంథాంతముననున్న భరతవాక్యమును వల్లభరాయని గుణగణములగురించి స్తోత్రపాఠములగుటచే వల్లభరాయడే తన్నుతాబొగడు కొనునాయని సందేహింపదగియున్నదని శ్రీప్రభాకరశాస్త్రిగారి వాదము. ఈ పద్యములన్నియు సూత్రధారుడు పల్కినవిగాన ననౌచిత్యదోషములేదని శ్రీశర్మగారి వాదము. ఉభయపక్షములవాద ప్రతివాదముల సారాంశమిది యేయని నాయభిప్రాయము.

గ్రంథమును గుఱించి యొందు రెండు విషయములకు ప్రాముఖ్యమివ్వక పోవుటచే నీయభిప్రాయభేదమునకవకాశము గలిగెనని యూహించుచున్నాను. ఈ గ్రంథము రూపకముగాని కేవలము ప్రబంధము గాదు. ఇది హాస్యరసప్రధానమైన క్షుద్రకావ్యముగాని యున్నతాదర్శముగల యుత్తమమైన కావ్యముగాదు. దీనిని అట్లు పలక్షించిన యెడల శ్రీనాథుడుగాక శ్రీనాథుని భాషావేషము గొంత వఱకును ధరింపగల మరియొక కవి రచించియుండునని మనకుఁదోచును. శ్రీప్రభాకరశాస్త్రిగారి వాదములో ముఖ్యాంశమేదన శ్రీనాథుడును, వల్లభరాయుడును సమకాలికులగుటయు, శ్రీనాథుని వాక్యచయమెంతయేని యీ గ్రంథమునగాన్పించుటయు నీ రెండు కారణముల చేతనే తద్గ్రంథము శ్రీనాథుడే రచించియుండెనని తలంపు.

గ్రంథమందున్న సాక్ష్యము రెండువిధములుగా నున్నది. 1. గ్రంథకర్తను గుఱించియు, 2. గ్రంథశైలిని గుఱించియు.

## గ్రంథకర్త

కృత్యాదినున్న యవతారికపద్యములలో వల్లభామాత్యుడు తన్ను గుఱించియే అధికముగ జెప్పుకొనెను. వల్లభామాత్యుడే ఈ గ్రంథమును వ్రాసినయెడల నిట్లు తన్నుఁదా బొగడికొనియుండునాయని కొందఱిచే యాక్షేపింపబడినది. ఈ యాక్షేపణకు రెండు సమాధానములు 1.ఈ గ్రంథము వీథినాటకముగానుండునట్లు వ్రాయబడినది. కాన కృతికర్తస్తవము నాటకప్రస్తావనయందు సూత్రధారుడు చెప్పినట్లు గానూహింపవలసియున్నది. సూత్రధారునిద్వారా యెంతెంత విపులముగాను విపరీతముగాను నాటకకర్తలు తమ్మదాగొండాడుకొనియుండిరో మన సంస్కృత నాటకములఁ జదివినఁ దెల్లమగును.

వల్లభామాత్యుడే యీ గ్రంథమును రచించియుండనియెడల సూత్రధారుడతని కవితా స్వారస్యమును,భాషావైదుష్యమును గుఱించి కడుంగడు నుత్ప్రేక్షించి సంస్తవించుట యసందర్భముగా నుండును. ఈ గ్రంథమును వల్ల భామాత్యుడే ప్రత్యేకముగ రచియించెనని స్పష్టముగా సూత్రధారుడు ప్రేక్షకులకు జెప్పుచున్నాడు. కాన ప్రభాకరశాస్త్రిగారు దీని విషయమై వ్యతిరేకముగా చెప్పుట సమంజసముగా కన్పడదు.

ఈ వీథి నాటకమునకు భరతవాక్యమని చెప్పదగిన కృత్యంత పద్యములో మోపూరి భైరవస్వామి యీ "కవీంద్ర కాంక్షతత్రి దశ మహీరుసారమైన" వల్లభరాయనిబ్రోచుగాతయని చెప్పబడినది. ఈ పద్యమును వల్లభరాయడే వ్రాసిన యెడల తుమ్ముకొని తానేశతా యువనుకొన్నట్లుండునని శ్రీప్రభాకరశాస్త్రిగారాక్షేపించిరి. అయితే వల్లభరాయడాపద్యమును వ్రాయని యెడల శ్రీనాథుడు వ్రాసెనని చెప్పుటకు దగిన హేతువున్నదాయని విచారింపదగినది. ఏ నాటకమందైనను భరతవాక్యమందు కృతిభర్తను గుఱించి వ్రాయుట శాస్త్ర సమ్మతముగాని సంప్రదాయసిద్ధముగాని యైయుండలేదు. కనుక ఈ అశాస్త్రీయుమైన పనియు, సాంప్రదాయవిరుద్ధమైన పనియు శ్రీనాథుడు చేసెననుటకంటె వల్లభరాయడు చేసెననుటయే సబబు.

## గ్రంథశైలి

శైలీ సామ్యమునుబట్టి ఈ గ్రంథము శ్రీనాథునిదే అని కొందఱి వాదము. దీనికి నేజెప్పునదేమన ఏ గ్రంథముయొక్క శైలి ఆ గ్రంథ

స్వభావమును బట్టియు, ఆ గ్రంథకర్త ప్రతిభను బట్టియు నిర్ణయమగు నని సర్వవిదితమే. క్రీడాభిరామము క్రీడావిషయములుగల హాస్య గ్రంథము కావున హాస్యరస ప్రతిపాదన కొఱకు హాస్యవిషయములేగాక హాస్యరసజనకపరిభాష కూడ వాడుక చేయవలసియుండును. లేని యెడల హాస్యరసము జనింపదు.

ఈ గ్రంథమందలి శైలి సంస్కృతభూయిష్టము. ఇట్టి పద కాఠిన్యము కేళీవినోదముల గుఱించియు నీచసందర్భముల గుఱించియు వినియోగిం పబడినది. ఈ గ్రంథశైలియందలి యేతద్వైకప రీత్యమునకు రెండు హేతువులుండవచ్చును. 1. ప్రథమమున రావిపాటి త్రిపురాంతకుడు తన ప్రేమాభిరామమును సంస్కృతమునవ్రాసెనుగాన నా పద్యములను దెనిగించిన కవి సంస్కృతమానముల నట్లేదిగవిడచి యుండవచ్చును. 2.లేదా, ఎవరోయొకకవి కీర్తికాముడగు సామాన్యుడు తన భాషావైద గ్ధ్యమును బ్రకటించుటకు నౌచిత్యపరిజ్ఞానము లేకుండ పదబంధము క్లిష్టతమముగఁ జేసియుండవచ్చును. తనవాగ్వైభవమును గుఱించి మహాతిశయముగఁ జెప్పికొనిన వల్లభామాత్యుఁడే యీ యప్రస్తక్తమై నట్టియు శైలీదోషమునకుఁ కారణభూతుడయ్యెనుగాని యుచితజ్ఞుఁ డగు మహాకవి శ్రీనాథుఁడుగాడని యూహించుట యెక్కువ న్యాయముగాదా?

ఈ గ్రంథములో శ్రీనాథుని పద్యములు, వర్ణనలు గానంబడు చున్నవనుట వాస్తవము. అయిననాకారణమున శ్రీనాథుఁడే యీ గ్రంథమును వ్రాసెననుట మాత్రము సాహసము. శ్రీనాథునిశైలి ననేక మంది మహాకవులనుకరించిరి. అట్టియెడ వల్లభరాయడుగూడ శ్రీనాథుని శైలిననుసరించెనని చెప్పినచో నాశ్చర్యమేమియులేదు.

ఈవిధముగ నీగ్రంథము శ్రీనాథకృతమనిగాక వల్లభరాయని కృత మని యంగీకరించుటయే యెక్కువ న్యాయమని యూహించు చున్నాను. వల్లభరాయడీగ్రంథమునుఁ దెనిగించి తన స్నేహితుడగు శ్రీనాథునిచేఁ గొంత సాయముబొందియుండవచ్చున[3] కూడ మనమూ హించినను తప్పులేదు.

## కథాసారము

కాసలనాటి గోవింద మంచన్న శర్మయను శ్రోత్రియ బ్రాహ్మణు డును, అతని చిన్నతనపు చెలికాడగు టిట్టిభశెట్టియను వైశ్యుడును ఆంధ్రనగరమును బ్రసిద్ధివహించిన యోరుగంటి పురవీధులలో విలాసా ర్థము విహరించి,యచ్చటగోచరించెడు క్రీడావినోదములను, ఆట పాటలను సావకాశముగ దిలకించి, యానందించవలెనను నుద్దేశ ముతో నొకనాడు శుభముహూర్తముజూచుకొని ప్రభాతమున బయలుదేరిరి.

మున్ముందుగ నోరుగంటి పురపరిసరముననున్న వెళిపాళెము బ్రవేశించి యచ్చటనున్ననొక మేదరిసానిని, తర్వాత నొక చండా లాంగనను, యటుపైని నొకకర్నాటస్త్రీని వారు చూచిరి. అటుతర్వాత మరికొంత దూరము బోవ నొక 'కాపు' కులాంగనయు, కర్ణాట వేశ్యయును వారి దృష్టి నరికట్టిరి. వీరినిజూచి సంతసించుచుండగ సంపెంగనూనె నమ్ముచున్న తెలియువతి వారికన్నుల కగుపడెను. ఆమె సొబగును వీక్షించి మోహరివాడలోనికి బ్రవేశించుటకై చుట్టునున్న యగడ్తను దాటి, పైడి తలుపులు బిగించిన వంకరదారిగుండ రాజ మార్గముఁ జేరిరి. ఆ "రాజమార్గము వారణఘటాఘోటక, శకటికా భటకోటి సంకులంబు గాన నందు బోవవలదు, క్రంతత్రోవల కల కలంబులు లేక సుఖవినోదములు గలుగును" అని సందుచాయల బోవుట సుఖమని వారు నిశ్చయించి యాదారినిబట్టిరి. అటుబో ంబోవ వారియెదుట పల్నాటి వీరపురుషుల కథనమును పాడుచున్న వేటగాంండ్ర నుపలక్షించి కొనియాడి, ముందుకుసాగ నేకవీరాదేవి దేవళమును, మాహురమ్మ గుడియుఁ గాన్పించినవి. ఈ దేవతల సేవలనుజూచియు, జక్కుల వాండ్రును, మైలారభటులును జేయుచున్న జాతరలను వీక్షించియు, చమదేశ్వరీయాలయమును, బౌద్ధ విహారమును, ముద్దరాలుము సానమ్మ నివాసమును, కుమారస్వామిదే వళమును, పాండవుల గుడియు, కర్తారుని మశీదును మున్నగు వివిధ దేవాయతనములనుఁ దిలకించి, యెదుటనున్న స్వయంభూ కేశవ స్వాములకు గేల్మోడ్చి, మహాభైరవేశ్వరునకు నమస్కరించి, నిరీక్షించు చుండ నాంధ్రేశ్వరుని మొగసాలపైనున్న గడియారము పదునారు ఘడియలుగొట్టెను. ద్వరపడి బ్రాహ్మవీథికేగి లక్ష్మణయొజ్జలయింట నొక్కొక్కరూకనిచ్చి వారు మృష్టాన్నము భుజించి తిరిగి పురవీథులకు మొగముద్రిప్పిరి.

పూలయంగడికిబోయి పుష్పలావికలప్రౌఢవచో విలాసములనాక ర్ణించి వేశ్యవాటికం బ్రవేశించి, యచట నేదోయొక యుత్సవంపు కలకలము వీక్షించి, ప్రతాపరుద్ర మహారాజుగారి యుంపుడుకత్తెయగు మాచలదేవి వారాంగన చిత్రశాలాప్రవేశముజేయుచున్నయదిగాన పుణ్యాహవచన సమయమిదియని దెలిసికొనిరి. అచ్చట కొంతకాలము నిలిచి యారారాజు మన్నించు వన్నెలాడిని సందర్శించి కొంతతడవు సంభాషించి వెండియు బోవంబోవ మంచనశర్మయొక్క పూర్వంపు గారాబు వెలవెలందియగు గాంధారి యగుపడెను. ఆమెయొద్ద గొంత సేపువారు సేదదీర్చికొని తిరిగి బయలువెడలి నాగస్వరమును బాడు చున్న నాగులవానిని, యటుతర్వాత గొఱ్ఱెపందెములను, కోడి పందె ములను జూచి, యుత్సాహమును బొంది మంచనశర్మ ప్రియురాలగు కామమంజరిగృహము బ్రవేశించిరి. అచ్చట నారేయియంతయు సుఖ నిద్రను గడపి తరువాత తమ దారిని దాబోయిరి.

## గ్రంథవిమర్శనము

ఈ గ్రంథము క్రీడావిషయములతో నిండియున్న చిన్న నాటకము. ఆనాటి సాంఘిక జీవితమిందులో పూర్తిగా వర్ణింపబడినది. గోవింద మంచన శర్మయు, టిట్టిభశెట్టియు చూడదలచినది యుత్కృష్టజీవితము గాక ఆదర్శ విహీనమైన జఘన్యజీవితము. కావుననే బయలుదేరు నపుడు టిట్టిభశెట్టి తనయనుంగు చెలికానితో నోరుగంటిపురము నందలి మన్మథుని విజయచిహ్నములను బ్రస్ఫుటముగ వర్ణించెను. ఈవిధమైన నికృష్టజీవితమును తనివిదీరజూచుచు పోవుచున్నను మధ్యమధ్యను మరికొన్ని సాంఘిక స్వరూపములు వారి దృష్టికి పొడసూపినవి. మన యదృష్టవశమున వారి క్రీడాపరాయణత్వము ఇట్టి దృశ్యములపైనగూడ బ్రసరించినది. పల్నాటివీరుల వర్ణనము, మైలార భటుల వర్ణనము,ఏకావీరాదేవి సేవాప్రసంగముఇత్యాది విషయములు వర్ణింపబడినవి. ఎఱిగియో యెఱుగకయో వల్లభామాత్యుడు తన చిన్న నాటకమును కేవలము ఆస్యశృంగారరస పూరితముగ జేయక యచ్చటచ్చట నుదార భావస్ఫురితముగఁగూడ జేయగలిగెను.

శిష్టాచారసంపత్తిలో నగ్రస్థానమలంకరించినను కొందఱు బ్రాహ్మణులు నీతిబాహ్యమగు కాముకవ్యాపారమునందుగూడ నగ్రస్థానము నలంకరించియుండ మతమునకును, శీలమునకునుగల వైరుధ్యము నేటికాలమునందుండినట్లే యాకాలమునందుసహిత ముండెను. ఈ గ్రంథమందలి కవిత ధారాళమై రసపుష్టి కలిగియున్నది. శృంగార విషయముల నత్యుత్కటముగ స్పృశింపకపోయినయెడల నిది సర్వ జనాదరణీయమగు గ్రంథములలో జేర్చుకొనదగినదే. కాని శైలియెంత మనోహరముగనున్నను విషయములు నిరంకుశములై రసభావములు చాలావఱకు వ్రీడావిహీనములై యుండుటచే గొంత యేవగింపు గలిగించుచున్నది. తత్కారణమున నీ గ్రంథమునకున్నత స్థానమిచ్చుటకు వలనుపడదు. ఐనను మేలైన యాంధ్రచారిత్రకవిషయముల నెక్కుడుగనిచ్చుటచే నీగ్రంథమాంధ్రుల కనూనమగు సాయ మొనరించుచున్నది. కాన దీనిని నమూల్యాంధ్రగ్రంథములలో నొకటిగాఁ బరిగణింపదగును.

## అమ్ముల విశ్వనాథ భాగవతార్

హరికథావిధియందు అతుల ప్రతిభఁజూప
'రాజహంస' బిరుదు ప్రాప్తమయ్యె
మార్దంగి కునిగాను మన్ననలందుచు
హరికథల్ రచియించి యశము నొందె
'ఆనందవర్ధన' మను దివ్యరచనతో
ఘన నాటకపు సంస్థ కాన్కలొందె
'రాష్ట్రపతి'యె మెచ్చ రమ్యగాన మొనర్చి
స'త్కళా పూర్ణు'డై సాగిపోయె
'సర్వరాయ' స్కూలు సరిప్రిన్సుపాలౌచు
తెలుగు సభలయందు వెలుగులీనె
అమృత కళల సాధు 'వమ్ముల విశ్వనాథ్'
కీర్తి కళల రాణి! కృష్ణవేణి!

–'స్మితశ్రీ' చింతపల్లి నాగేశ్వరరావు

## Dr. LANKA SUNDARAM

# REVENUE SETTLEMENTS : 1781-1786

### (a) Under Masulipatam

With the return of the zamindars to their Zamindaries there emerged considerable difficulty in realising the terms of the Rumbold Settlement. Though most of them at first made a show of punctuality in paying their balances and current kists, the Masulipatam Council were compelled to observe that they had "indeed little expectation of succeeding with these zemindars unless they are previously convinced that they will be proceeded against to extremities in case of non-compliance" (1). With regard to the farms under Masulipatam, Divi failed under the rentership of Venkatarayalu and they reimbursed themselves of the rent out of the grant of M.P. 10,000 made to him annually in consideration of his relinquishing the muzumdari rights in the Rajahmundry Sarkar. The salt-farm receipts under Statham, one of their Council, were satisfactory (2).

The Whitehill government realised that the chief difficulty with the zamindari payments lay in the terms on which the sahukar agreed to stand security and in the manner in which they collected the revenue. Finding that the sahukar offered as security by Tirupati Razu of Mugalaturru was a man of straw, the government recorded their sentiments in the following manner (3) : "Not conceiving the security of the soucar teeps always to be depended upon, it will be necessary, while the zamindars are at Masulipatam to obtain from them every intelligence that can be procured relative to the nature of the securities given by them to the soucars, and the mode in which the soucars make their collections, and to give positive instructions, at the same time, to the zamindars the moment any sum shall be paid in, to advise the chief and Council accordingly that the revenues may not be diverted into improper channels."

When the zamindars arrived at Masulipatam, in obedience to the orders of that settlement, they confessed their inability to settle their accounts with the Company. Believing that this was due to a general inclination to evade payment, the Masulipatam Council had recourse to coercion and placed guards of sepoys upon them in order thus to force them into compliance. Tirupati Razu's balance was so heavy and its recovery so hopeless, that a sequestration of his zamindari seemed to be the only way out. But considering such a severe step to be inadvisable, they undertook an

(1) Masulipatam to madras , 23rd March 1780 Rev. Cons, 15th April, Vol. 29. pp. 1-10.

(2) Ibid.

(3) Resolution of the government in Rev. Cons. 28 April 1781, Vol. 25, pp. 33-37, and Madras to Masulipatam, 2 May, idem, pp. 67-71.

exhaustive inquiry into the question of zamindari indebtedness in order to discover the extent to which the rajas were hiding their real wealth.

On completion of this inquiry, they wrote to Madras ([1]): "The soucars must necessarily transact their business with the zamindars very nearly as money-lenders of any denomination do : they pro-portion the interest to the risque and require from the zamindars a larger or smaller premium according to their experience of his (the zamindar's) ability in every light in which that ability can be considered." Mutual agreements of secrecy between the sahukars and zamindars made it impossible for official action to unravel their transactions. " The zamindars often employ soucars solely with a view to this concealment [of] the state of their affairs, at times very sufficiently proving that some latent reason of this kind must exist as an inducement to employ the soucars. The state of the zamindars' treasury would enable them to pay in cash, but they chose to have recourse to a soucar who appears to advance the sum upon their credit that it may not be certainly known they could do without his assistance."

This vicious system at once called for a drastic remedy. In a reasoned minute ([1]), Samuel Johnson, a member of the Madras Council, showed that in case of imposition by or failure of a sahukar, the government had no remedy against him, since he generally happened, at this time, to be a gumasta or agent of a banking house at Hyderabad which was outside the jurisdiction of the Company. He pointed out that sahukar security was no security at all. The enormous interest and premium charged by the sahukars absorbed nearly fifteen per cent of the revenues and, with the balances due from zamindars and renters under Masulipatam, amounting to sixteen lakhs of Madras Pagodas, their profits were really enormous. On the whole, " the mode is not only insufficient in point of security, but detrimental to the Company and ruinous to the zamindar."

To mitigate the evils of this long-standing custom, he advocated the institution of monthly kists from the zamindars and renters, since, in case of default, the Company have the right and the power to reimburse themselves out of their patrimony. As a further step to safeguard the Company's dues he proposed the appointment of proper persons to look after the crops in the Sarkars before and after they were out, sell the grain to the zamindars at the prevailing market price and thus recover the money without any risk from possible dissipation of revenue by the latter. These reforms, he argued, would relieve the Masulipatam revenues alone of a burden of nearly a lakh of Madras Pagodas.

The Whitehill government were not prepared to take any action upon Johnson's minute, but delegated to the Masulipatam Council full powers for the realisation of the balances ([2]). The latter immediately sent thanadars into the country ([3]) government prepared to indulge the zamindars with sufficient time for the discharge of their debts ([1]). But both these measures ended in failure.

The immediate cause of the backwardness of the zamindars in the payment of their kists was found in their dislike of the twelve and a half per cent increase imposed by the Rumbold settlement

(1) Masulipatam to Madras, 13 June 1780. Rev. Cons. 23, June, Vol. 25, pp. 194-210.

(1) In idem. 7, July 1780; idem. pp. 301-07.
(2) Resolution of the goverpment in Rev. Cons, 7 July 1780, Vol. 25, pp, 397-08.
(3) Masulipatam to Madras. 31, July idem, 8, August, idem pp. 449-69. See also, a further minute of Johnson's idem. pp. 478-80

at Madras. Until " this cause of disgust " had been removed, the Masulipatam Council pointed out, there would not be any change in the temper of the zamindars. Further, with the imperfect machinery available for the realisation of the kists remaining unaltered, they found that " the present produce being already engaged for the payment of the teeps last given in, wherever this system of anticipation is in practice, there is no alternative " to the acceptance of further useless sahukar tips (2). The government were unable to rise to the occasion but resolved that " at a time when the zamindars show such reluctance to made good their heavy balances to the Company, it would be impolitic for us to resolve on a reduction of their tribute."(3)

Thus, when he was suspended by the supreme government at Calcutta, Whitehill handed a very short-sighted policy to Charles Smith, his successor as temporary governor. The latter found that the position of the zamindari balances was getting more and more serious. As stated by the Masulipatam Council it was as follows(4)

**State of sahukar tips.**

(10th December 1780).

| | |
|---|---|
| Total tips delivered by the zamindars M.Ps. | 3,80,496 |
| Cash received | 74,993 |
| | 3,05,503 |

(1) Rev. Cons. 12 August, idem. pp. 489-90 and Madras to Masulipatam, 14 August, idem. pp. 493-97.

(2) Masulipatnam to Madras, 25 September 1780. idem. 3 November, idem. pp. 595-627.

(3) Rev. Cons 5. December, Vol. 25, pp. 542-46; and Madras to Masulipatam, 9. December, idem. pp. 547-50.

(4) Masulipatam to Madras, 15 December 1780, idem. 15, March 1781, Vol. 26. pp. 76-100

Money received from sahukars on or before 10th December 1780.

| | |
|---|---|
| For balance due on old tips for 1779 | M.Ps.63,523 |
| Do on new tips for 1780 | M.Ps. 74,993 |
| Total | M.Ps. 1.38,516 |

In consequence of the government's orders, coercion was used to realise the balances, particularly in the case of Kota which was taken possession of (1). But even this severe measure was unproductive of immediate results. As to the work of the thanadars, the fact that the crops had already been mortgaged to the sahukars for the tips given in for the previous year's jama rendered progress impossible (2). The government observed that since they "apprehend any innovation in the method of collecting the revenues in the Circars might be at present attended with dangerous consequence," the continuance of the agency of the sahukars was best calculated to secure the Company's interests. But they directed James Daniell, Chief of Masulipatam, to make a full and particular investigation of the state of "territorial revenues " under his jurisdiction, and as a tentative measure empowered the Chief " to acquaint the zamindars that such grain as may be publickly demanded of them will be received in lieu of money for which their accounts shall have credit at the market price on [sic] the time of delivery (3). "At this stage, Lord Macartney took charge of the government of Fort St. George (2nd August 1781).

(1) Same to same, 27 December 1780, idem. 15 March 1781, idem. pp. 105-01; same to same, 4 January 1781, idem. pp. 102-05. See also representation of Ramachandra Razu of Kota, idem. pp. 105-11. See also Madras Letters Received, 9 January 1781. (Smith) paras, 2-3, Vol. X.

(2) Masulipatam to Madras, 14 January. Rev. Cons. 15. March. Vol. 26, pp. 112-130. See also, same to same, 20, March, idem. 31 March, idem. 31 March, idem, pp. 183-87.

(3) Resolution of the government and Madras to Masulipatam both of 31 March 1781, idem. pp. 188-97.

The zamindars of Peddapuram, Pithapuram, Korukonda, Ramachandrapuram and Kota delivered tips for a year's tribute including the 12 1/2 per cent increase. But out of the balance of M.Ps. 2,00,000 for which the raja of Mugalaturru stood indebted to the Company, only M.Ps. 1,01,400 were secured by approved bills. Gutala and Polavaram also partly paid in their dues but no adjustment of accounts between Nuzividu and the Company was made. After a review of all these individual transactions, the Masulipatam Council observed that the Rumbold settlement had been heavy and had reacted upon the prosperity of the cultivators who were coerced by the zamindars for the payment of a higher proportion of the crops. To alleviate this, they recommended the government " to indulge the (zamindars) with a free gift " of the enhancement of the jamabandi by Rumbold.(1)

Lord Macartney at once set himself to the task of clearing up the work created by the repudiation of the Rumbold settlement which had also, been left unsettled for a period of two years by the preceding Whitehill and Stratton governments. Within less than a month after his arrival at Madras, the government directed the three subordinate settlements in the Sarkars to furnish them with an account " of what Soucars' bills and teeps have been received, with the debts of them (sic), the periods at which they are payable and the names and parties by whom and upon whom they are drawn and...... that in future whatever sums of money or teeps are received on account of the annual tribute may be actually distinguished from what are delivered on account of the outstanding balances from the zemindars and renters" (2). This distinction

(1) Masulipatam to Madras, 20 August. Rev. Cons. 31 August, idem pp. 268-76; Daniell's minute in Masulipatam Consultations idem. pp. 277-82; representations of the rajas of Peddapuram (pp. 283-89), and Pithapuram (pp. 291-99) requesting for the remission of the increase of the tribute; and, the Masulipatam Consultations of, 22nd June 1776 (p. 290) and 10th August 1776, (p. 290).

(2) Idem, 31 August 1781, and Madras to Masulipatam, Vizagapatam and Ganjam, 6, September, idem. pp. 303-06.

As an instance of Macartney's vitality and earnestness to introduce order into the revenue affairs of the Sarkars, it may be pointed out that he first took between the old balances and current kists had been wanting till then all through the period of the Company's administration of the Sarkars, and its adoption certainly facilitated the inquiries and decisions of government.

This action produced a considerable amount of nervousness in both the zamindars and sahukars. Such an inquiry, however necessary and just it might have been, was unprecedented, and, consequently, we find the Masulipatam Council complaining that the normal revenue machinery was more or less " at a stand still since very few of the principal soucars would engage at all " to supply security to the zamin.(1) Con-currently with this, Lakshmi Narasu, renter of the Masulipatam farms, failed with very little prospect of discharging his heavy dues to the Company, while the important zamindar of Nuzividu was in similar circumstances since all sources of sahukar security were closed.(2)

Besides this, the sahukars were powerless to realise their monies on the basis of their old bills and there was no prospect of any better results even if the government were prepared to assist them with military force. The system of security-raising was so vicious that it had undermined all healthy activity in the country. There was a great need for an effective remedy, but the Macartney government were un willing to introduce any sudden changes in a system which had been sanctioned by time, until the Circuit Committee had reported.(3)

(1) Masulipatam to Madras, 27 September 1781. Rev. Cons. 12 October, Vol. 26, pp. 332-36.

(2) Same to same. 12 October. idem. 12 October, idem. pp. 366-70.

(3) Resolution of the government thereon, Vol. 26, pp. 392-96. See also Madras Letters Received, 26. January 1782. (Macartney) para. 4, Vol. V.

They recognised the possible good that might come out of the suggested remission of the 12 1/2 per cent his seat in revenue consultations 2 August 1781. On 9 August he presided over the deliberations of his Council upon the Masulipatam revenue latter advocating the remission of the increase of tribute. On 31 August he was responsible for this resolution which was given effect to on 6 September. Increase in the jamabandi, but rejected its immediate operation as premature. On the contrary they directed the Chief of Masulipatam to " convince (the zamindars and renters) of our intentions to afford them relief from their embarrassments as soon as we have collected sufficient information to judge of their grievances " by means of the investigations of the Circuit Committee which they intended shortly to revive. While holding forth this assurance, they introduced a further change in the settlement of revenue balances. Henceforward; all cash and tips received from the zamindars and renters were to he credited to their accounts dealing with current kists (presumably as from the date of the Rumbold settlement) and only when they had been completely adjusted, would such receipts be made use of for the discharge of the old balances.(1)

The immediate effect of the delay of the government in dealing with the zamindari situation was that most of the zamindars were alarmed at the small prospect of any remission in the jamabandi at a time when their finances were in a heavily encumbered state. Appa Rao of Nuzividu and the Kamadana brothers of the Char Mahal precipitately fled from the surveillance of the Council at Masulipatam, whither they had been ordered by the government for the settlement of their affairs to be detained till they had discharged their debts to the Company. Only Tirupati Razu of Mugalaturru secured tips for his balance of M.Ps. 1,01,400 only after a long period of negotiation with the sahukars.

Now that they had realised that the government preferred to wait till the investigations of the promised Circuit Committee were available, and to tide over the present financial embarrassment, the Masulipatam Council recommended a policy of repression. They wrote to Madras (2) " The idea of despotic power in which they are brought up from their infancy (for the accomplishment of which they would commit every enormity) renders is impossible to conciliate their minds to anything but interested views and, as they can only be instigated by fear, they can be governed by no other principle. Their present enormous debts to the Company, without one other cause, would make them wish for a change of government merely to expunge them while they suppose (by our present inactivity for want of authority) that we are afraid to oblige them by force to comply with the just demands of the Company. Their arrogance, inattention and, in short, almost total disobedience to every request for the public welfare, daily increase, nor can anything less than a public welfare, daily increase, nor can anything less than a public example bring them back to a proper sense of duty". They further urged that it was within the power of the Company to "drive them all united from the districts" and requested for an extension of their powers to effect such a policy. (1)

But Macartney's government though differently. While admitting that the reluctance of the zamindars to pay their dues had become dan-

(1) Madras to Masulipatam. (Rev.) 23, November 1781. Vol. 26, pp. 400-04.

(2) Masulipatam to Madras, 4 December, 1781. Rev. Cons, 14 December, Vol, 26, pp. 426-34.

(1) Masulipatam to madras, 4 December 17181. Rev. Cons. 14 December, Vol. 26, pp. 426-34

gerous, they recognised that these territorial magnates had been groaning with several grievances. They also found that the state of the finances of the Sarkars had seriously gone down and that the zamindars themselves had been extremely averse to proceed to Masulipatam every year to settle their accounts in an atmosphere of restraint and, worse still, of coercion.

Still, the government did not recognise that the time had come for drastic remedies. As a temporary expedient, they directed James Daniell, Chief of Masulipatam, to visit the different forts of the zamindars within his jurisdiction in order to obtain first-hand information from each locality, "with full powers to negotiate with them for whatever sums he may be able to collect from them in liquidation of their balances". He was to transmit all correspondence through the Masulipatam Council, "but he shall be totally independent of them and answerable to us alone for his actions". He was to be attended with such military force as he deemed requisite "to awe the zamindars into performance of such agreements". In view of the fact that the Circuit Committee was shortly to proceed on their investigations, the government hoped that Daniell "will employ his utmost endeavours to justify the extraordinary authority (with) which........ they had been induced to invest him". ([1])

At this stage, the expiry of the leases of the Masulipatam farms gave the government an opportunity to introduce a fresh regulation for the better management of the revenue affairs in the Sarkars. They directed the unification of all the farms under single renter, Venkata Krishna Rao, for a period of four years (September 1781 to September 1785). The renter was obliged to advance four thousand Madras Pagodas to the farms for the purchase of seed and thus start the cultivation under good auspices. At the recommendation of Masulipatam a fresh clause was inserted in his kau' binding him "to furnish whatever quantity of grain may be, at any time required from (him) either for the use of this settlement or the Presidency at the current price for the time being to be received in part of (his) rent"([2]).

(1) Resolution of the government in Rev. Cons. 14, December, 1781, Vol. 26, pp. 436-39 and Madras to Masulipatam, 17 december, idem, pp 442-46.

See also, Madras Letters Received, 26 January, 1782. (Macartney) paras. 8-9, Vol. X.

(2) Masulipatam to Madras, 3 December 1782. Rev. Cons. 17 January 1783, Vol. 28. pp. 1-7; resolution of the Government thereon; idem. pp. 18-19; and Madras to Masulipatam, 25, January, idem. pp. 30-31.

During the year 1782, Daniell seems to have toured the Sarkars and conducted a settlement at Rajahmundry. But no details of his activities are available in the records. We get an interesting glimpse of this settlement from a passage in the Madras Letters Received for 31st August 1782. Daniell urged upon the government that there was a great necessity for the abolition of the 12 1/2 per cent increase in the Jamabandi. While refusing to take any final decision on the matter till the Circuit Committee had reported on it,

Madras wrote home that they "directed that the payment of the teeps delivered in separately by the zamindars for the balance of the additional tribute shall not be at present insisted upon, but remain in deposit with us" ([1]). A cursory statement by the Masulipatam Council in February 1783 reveals the fact that the settlement was easily and economically effected. The actual receipts of this settlement are stated to be M.Ps. 6,81,350 inclusive of M.Ps. 1,16,580 recovered on behalf of the old balances ([2]). In the same month a fresh settle-

(1) Madras Letters Received, 31 August 1782. (Macartney) para. 19 Vol. 11

ర్భంలో నిద్రిస్తున్నది. అది మిమ్ము ఆహ్వానిస్తున్నది... మీలో కుతూహలం చిగిర్చి పూలుపూస్తుంది. కృష్ణ దాటి అవతలిఒడ్డు చేరుతారు. గ్రామం అనటానికి నామకః వున్న నలభై యాభై ఇళ్ళనుదాటి, మిట్టలూ పల్లాలూ, రాళ్ళూ రప్పలూ దాటుకుంటూ ఎంతో ఉత్సాహంతో ముందుకు నడిచి వెళ్తారు. ఈనాటికీ సగర్వంగా నిల్చివున్న ఆనాటి ప్రాకారం మీకు స్వాగతమిస్తుంది. ఆశ్చర్యంతోనూ, ఆనందంతోనూ, కీనీడలా వీటిని వెన్నాడుతూ మీ హృదయాన్ని కలచే విషాదంతోనూ ప్రాకారం దాటి లోనికి ప్రవేశిస్తారు.

రెండుమూడు మలుపులు తిరిగిన తర్వాత బోసికొట్టున్న ఆలయం ఓ ప్రక్కనుండి మిమ్ము ఆహ్వానిస్తుంది. ఆగి ఆ ఆలయాన్ని తేరిపార చూస్తారు. మీకు భయం వేస్తుంది. పాడుబడ్డ ఆ గుడిని చూచి. గుడి వుంది, గుళ్ళో దేవుడున్నాడు, కాని గుళ్ళో దీపం వెల్గించే నాథులు లేరు. కారణం తెలియదు, మన పుణ్యవశాత్తూ ఆ గుడి మాట్లాడగల్గితే తప్ప. తెలిసినంతవరకూ అది వీరభద్రస్వామి ఆలయం మాత్రమే.... పాడుబడ్డ గుడి మాత్రమే ఆలనా పాలనా లేక అలమటిల్లుతున్న దాన్ని చూచి మీ ఒళ్ళు జలదరిస్తుంది. అప్రయత్నంగా ముందుకు సాగి పోతారు.

కొద్దిదూరం వెళ్ళాక దారి మధ్యన సగం విరిగి జీర్ణస్థితిలో వున్న సింహద్వారం మిమ్మల్ని నిలుపుతుంది,మీకేదో చెప్పాలని ; కాని అది చెప్పలేదు...ఏమని చెప్తుంది ! రెడ్డిప్రభువులు తననీస్థితికి తెచ్చారని చెప్తుతుందా ? ఆంధ్రదేశాన్ని పాలించిన రెడ్డిప్రభువుల్లో సంఘీభావం లేదని, కదనానికి కాలుదువ్వుతూ నిరంతరం వారిలోవారు పోట్లాడుకునే వారని, వారి తృష్ణకు తనున్న భూభాగం సమరభూమి అవ్వక తప్పింది గాదని, ఫలితంగా ఓ ప్రముఖపట్టణం పతనమై, తను మాత్రం పేరుకు నిలిచివున్నానని ఎట్లా చెప్తుతుంది !భామినీ సుల్తానులు కేవలం విజయ నగర సామ్రాజ్యంతో కక్ష సాధించటానికి కాలాన్ని దుర్వినియోగం చేశారని, పతనావస్థలో వున్న తన ప్రాముఖ్యాన్ని గుర్తించలేక పోయారని ఎట్లా చెప్తుతుంది! భామినీసుల్తాన్ ఫిరోజ్....పతనస్థితిలో వున్న మహాపట్టణానికి వజీరాబాద్ అని మారుపేరు పెట్టాడని ఎట్లా తెలుప గలదు !...తెలుపలేదు.

ఏవేవో ఆలోచనలు మిమ్ము కొద్దిసేపు దాసుల్ని చేసుకుంటాయి. అట్లాగే దాన్ని చూస్తూ నిలబడిపోతారు మీరు. ఇంతలో కొద్దిదూరంలో ఖంగ్‌మని గంట మ్రోగుతుంది,మీ ఆలోచనలకు అంతరాయం కల్గిస్తూ, శబ్దం వచ్చిన దిక్కుకు చూస్తారు. ఆలయశిఖరం మీ దృష్టి పథంలో అడ్డు నిలుస్తుంది. నిత్యకళ్యాణం పచ్చతోరణం అన్నట్లు కళ కళలాడు తున్న నృసింహస్వామి ఆలయం మిమ్ము పిలుస్తున్నది. మీరు వెళతారు ...గుడిలో ప్రవేశిస్తారు.

గుడిముందు రెండు శిలాశాసనాలున్నాయి. ఒకటి కృష్ణానది దక్షిణ సరిహద్దుగా తెలంగాణాను పాలించిన రేచెర్ల పద్మవెలమ నాయకులది. వారి రాజధాని రాజుకొండ. రెండవశాసనం కృష్ణ ఇవతల ఒడ్డునున్న దేశాన్ని పాలించిన రెడ్డిప్రభువులది. రెడ్డి ప్రభువులు, రేచెర్ల వెలమలు నిరంతరం కలహాలతో కాలం గడిపారు. వారిద్దరిమధ్య పచ్చిగడ్డివేస్తే భగ్గుమనేది. వారిద్దరిమధ్య రేగిన కలహాగ్ని జ్వాలలు ఓడపల్లిని దహించాయి.

గుళ్ళోకి వెళ్లుతారు మీరు. గంభీరమైన నృసింహస్వామి విగ్రహం మిమ్ము ఆకర్షిస్తుంది. మీలో భక్తిశ్రద్ధలు పెల్లుబుకుతాయి. ఈ స్వామిని ప్రత్యక్షదైవమంటారు. నరసింహస్వామి ముక్కుకు సూటిగా, గర్భ గుడిలో, కొద్దిదూరంలో రెపరెపలాడుతున్న ఓ జ్యోతి వుంది. దానికి కొంచెం క్రింద నిశ్చలంగా దేదీప్యమానంగా వెల్గుతున్న మరో జ్యోతి వుంది. ఈ స్వామి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు విడుస్తాడని, నిదర్శనం ఆయన ముక్కుకు సూటిగా రెపరెపలాడుతున్న జ్యోతేనని అంటారు. ఇచ్చట జరిగే వివాహాలు ప్రేమైక దాంపత్యంతో చిరకాలం చల్లగా వర్ధిల్లుతా యని గూడా అంటారు. మీలో విశ్వాసం పునాది వేస్తుంది, మనమింకా నాస్తికులం కాలేదు కాబట్టి, ఆలయం నాలుగుమూలలా సమగ్రంగా చూసి బయటకువస్తారు. మీరొచ్చిన మార్గాన్నొక్కసారి చూచి ముందుకు సాగిపోతారు. కొద్దిదూరంలో మరో ఆలయం కన్పిస్తుంది. మరొక దేవాలయమా అనుకుంటూ ఎంతో ఓర్పుతో, ఆ కొద్దిదూరం నడిచి వెళ్తారు. అది అగస్త్యేశ్వర ఆలయం... అగస్త్యమహర్షి ఆ గుడిలోని శివలింగాన్ని ప్రతిష్ఠించాడట, అందుచేత దానికాపేరు వచ్చిందట. నిజంగానా! ఈ ప్రశ్న మీలో ఉద్భవించదు, మీకు మతంపై నమ్మకముంటే.

గుడిలోకి వెళ్లండి. తెల్లటి పాలరాతి శివలింగాకృతి మీ హృద యంలోనుండి దూసుకుపోతుంది. ముకుళితహస్తాలతో పరమేశ్వరుని ముందు కొద్దిసేపు ధ్యానంలో నిలబడుతారు ; కాని మీకో అనుమానం వేస్తుంది. ఈ శివలింగానికి తలకొట్టివేసినట్లుందేమా అని. పూజారిని అడుగుతారు.

ఒకానొకప్పుడు –ఎప్పుడో తెలియదు – వేటగాడొకడు పావురాన్ని తరుముకుంటూ వచ్చాడట. పావురం గుళ్ళోదూరి శివుని శరణు వేడిందట. భయమేమీ లేదంటూ పరమేశ్వరుడు దానికి అభయ మిచ్చాడట. ఇంతలోనే వేటగాడు గుళ్ళో ప్రవేశించి పావురాన్ని పట్టుకో బొయ్యాడట. పరమేశ్వరుడు అతన్ని వారించి, అది తన శరణు వేడింది, దానికి బదులు తన తలపైవున్న గంగను తీసుకోవలసిందిగా తెలిపాడట. వేటగాడు తన రెండుచేతుల్తోనూ ఈశ్వరుని తలపైనున్న గంగను పెకలించుకొని వెళ్ళాడట. ఈ కథ ఎంత నిజమో ఏమోకాని శివలింగం తలకొట్టివేసినట్లుంది. వేటగాడు గంగను పెకలించుకొని వెళ్ళా డనటానికి నిదర్శనంగా పదివేళ్ళ చారలూ కన్పిస్తాయి. ఆ చారల

నుండి నిరంతరం నీరు ఉబుకుతుంటుంది.

కొందరిది కట్టు కథ అని, కొన్నివందల అడుగున దిగువనున్న కృష్ణ మూసీనదుల సంగమం నుండి శివలింగానికి ఏదో యంత్రం వంటి అమరిక వుండివుంటుందని, అందుచేతనే ఆ వ్రేళ్ళ చారలనుండి నిరంతరం నీరు ఉబుకుతుంటుందని అంటారు. ఇదే నిజమైతే రెండో అంతస్థులోకే నీళ్లు రావటం అధ్వాన్నంగా వున్న ఈ పంపుల మహా యుగంలో విజ్ఞానవేత్తలు తలలొంచవలసిందేగా !

హారతి అద్దుకొని పూజారిచ్చిన ఫలపుష్పాలు తీసుకొని భక్తితో నిండిన హృదయంతో బయటకు వస్తారు మీరు. ఊరు మాత్రం లేదుగాని గుళ్ళు మాత్రం మిగిలాయా అని అనుకుంటారు. నిజంగా ఈ మూడు ఆలయాలచుట్టూ మూడు పురాలుండేవట ; వీరభద్రపురం, నృసింహపురం, అగస్త్యేశ్వరపురం. ఇవి రెడ్డిరాజుల కాలంలో ప్రసిద్ధికెక్కినవని అంటారు. ఆ కాలంలో వారు శైవ వైష్ణవమతాలను సమానంగా ఆదరించారనటానికి ఈ గుళ్ళే నిదర్శనం.

పది అడుగులు ముందుకు నడకసాగిస్తారు. దిగువన, కొన్ని వందల అడుగుల క్రింద కృష్ణమూసీనదుల సంగమం....రెండు నదులూ ఓడపల్లిని గూర్చి పాడుతున్నాయి. ఓడపల్లి చరిత్రను గానం చేస్తున్నాయి. కాని ఆ ఓడపల్లి ఏదీ ?...లేదు. మీ పెదవులపైనుండి దీర్ఘమైన నిట్టూర్పు దిగజారుతుంది. మీ కళ్లలో నీళ్లు తిరుగుతాయి. గిరుక్కున వెనుదిరిగి బయలుదేరుతారు. పెద్దపెద్ద అంగలువేస్తూ, మనస్సు మథన పడుతుండగా కృష్ణను దాటి ఇవతలి ఒడ్డు చేరుతారు. ఒక్కసారి వెను దిరిగి అవతలిఒడ్డువైపు దృష్టి సారించి చూస్తారు.

విషాదాంతమైన చరిత్రాత్మికనవల చదివినట్లు మీ మనస్సు బాధతో మూల్గుతుంది. కల్లు మూసుకుంటారు ఆవేదనతో. మీ మనో నేత్రం ముందు చలనచిత్రంవలె దృశ్యాలు ఒకదానివెనుక ఒకటి నడిచి పోతాయి.

కత్తుల ఘణఘణలు...అశ్వాల సకిలింపులు, గజాల ఘీంకారాలు, సైనికుల కోలాహలం...ఇవన్నీ మీ చెవుల్లో ప్రతిధ్వనిస్తాయి. శ్మశానంలాగున్న ఓడపల్లి మీ మనోవీథిలో నాట్యం చేస్తుంది. కళ్లు తెరుస్తారు....ఎదురుగా కృష్ణ అవతల ఒడ్డున చరిత్రాత్మక చిత్రం తాలూకు బోసికొట్టున్న పాత సెట్టింగులాగా ఓడపల్లి....మీకు తెలియకుండానే మీహృదయం పలవరిస్తుంది వ్యథతో. చిరుచెమట కమ్మిన ముఖాన్ని తుడుచుకొని వెనుతిరుగుతారు మీరు....

**(పందిరి మల్లికార్జునరావు శతజయంతి సంపుటము 3 సౌజన్యంతో)**

---

## వెలిదండ్ల హనుమంతరావు

స్వస్థత నిడగ భిషగ్వరుం డైనిల్చె
రూపుమాపె నతండు రుగ్మతలను
'ఉప్పుసత్యాగ్రహ' మున్నతం బుగఁజేసి
కఠిన శిక్షలనొందె కార్యశీలి
దేశదాస్యవిముక్తి స్థిరముగఁగోరుచు
ధీరత్వమునఁ బోరు పోరుడితడు
విజ్ఞాన దీప్తుల విరివిగా నందింప
అమరఁజేసె నిట గ్రంథాలయమ్ము
ఉన్నతాశయమున మిన్నగా తానుండె
పరుల సేవ కొరకె పాటుపడియె
హనుమ కృపనుఁగొన్న 'హనుమంతరాయుడు'
కీర్తి కళల రాణి! కృష్ణవేణి!

*స్మితశ్రీ చింతపల్లి నాగేశ్వరరావు*

శ్రీ చందూకార్తీక్

# ఏనుగుల వీరాస్వామయ్య చూచిన 1831 నాటి కృష్ణాతీరం

1830, మే 18వ తేదీన చెన్నపట్నం నుంచి బయలుదేరి, కాశీయాత్రను చేసిన ఏనుగుల వీరాస్వామయ్య తిరుగు ప్రయాణంలో తీరం వెంబడి చెన్నపట్నానికి 1831, సెప్టెంబరు 3వ తేదీన తిరిగి వచ్చారు. ఈ క్రమంలో, 1831 ఆగస్టు 2వ తేదీనుంచి, 19వ తేదీ మధ్యాహ్నం వరకూ కృష్ణా తీరంలోని బందరు, (పెద) కళ్ళేపల్లి, కొత్తపాలెం, చల్లపల్లి అను సందర్శించి ఈ ప్రాంత ఆచార వ్యవహారాలను అయన మాటల్లోనే చదువుదాం.

"1831, ఆగస్టు 2వ తేది ఉదయాత్పూర్వము2 గంటలకు మబ్బు చినుకులుగా వున్నా లేచి యిక్కడికి తుమ్మిడి రెండామడల దూరంలో ఉండే మచిలీబందరు అనే షహరు యీ దేశస్థులు పేట అని చెప్పే బస్తీని 9గంటలకు ప్రవేశించినాను. దారి నిన్నటివలెనేయిసకపర. బండ్లు సాధారణముగా నడవవచ్చును. రామన్న పేటలో నొక గొప్పతోట యింట్లోదిగానాను. యీ మచిలీబందరు బస్తీలో 22 పేటలు కలిగి వున్నవి. వొక్కొక్క పేటను పూర్వమందు లక్ష్మీకటాక్షము కలిగిన పురుషులు తామై కలగచేసినారు గనుక ఆ పేటలలో వచ్చుబడి బాడిగెలను పురుషులు తామై కలగచేసినారు. గనుక ఆ పేటలలో వచ్చుబడి బాడిగెలను పేటలు కలగచేసిన వారి వంశస్థులు నూరారు రూపాయల వంతున సుఖపాయముగా ముప్పల్లో ప్రతిమాసమున్నూ అనుభవింపు చున్నారు. ఈ బస్తీ లోగడ తురకలది, హయిదరాబాదుకింద వున్న అధికారస్థుడు యిక్కడికి తాను నవాబు అనిపించుకొని యీ రాజ్యాన్ని ఆక్రమించినాడు. ఆ స్వామి ద్రోహము వారి వంశస్థులను కుంపిణీ వారికింద పించన్ తీసుకొని యిప్పట్లో వుండేటట్లు చేసిరి.

పూర్వకాలము మొదలుగా యీ బస్తీ సర్వాధికారుల నివాసముగా వుంటూ రావడముచేత నున్ను, యిప్పట్లో నున్ను వుత్తరంఖండం ప్రోవిన్ శయాల్ కోరటులో జిల్లాకోరటు కటకటరు కచ్చేరి కమ్మిస్సెర్యాటు ఆఫీసు సహితముగా కొంత దండు వసించివుంటూ రావడంచేత నున్ను, కాంట్రేగులవారు మొదలయిన కొందరు జమీన్‌దారులు సాహుకారులు వర్తకులున్ను వుండుటచేత నున్ను బస్తీ చాలాగా శోభించివున్నది. దాజవీధులు బాగా విశాలముగా వున్నవి. యిండ్లు బయటచూచేటందుకు చిన్నవిగా అగుపడ్డా లోపలి ఆవరణాలు విశాలముగా కట్టివున్నారు. ముంగిళ్ళుమాత్రము కొంచపరచి కట్టివున్నారు. సమస్త పదార్థాలున్న సమస్తవనులు చేయగల మనుష్యు లున్ను దొరుకుదురు. శ్రీకాకొళము వదిలిన వెనక బాడిగెకు బండ్లు యీ బస్తీలో దొరకడము కష్టము. భూమి వుప్పుకలిసిన రేగడ నీళ్ళవసతి లేదు. దూరమునుంచి యీ బస్తీకి మంచి నీళ్ళు తెచ్చుకోవలసినది.



మనుష్యులు నిండా అరోగదృఢ గాత్రులుగా ఉండలేరు స్త్రీలు అలంకార పురస్సరముగా శోభాయమానలయి వున్నారు. స్వరూపలావణ్యము గలవారు కారు. చెవులకునిడుపుగొలుసులు వేశికొని పావటకు చేర్చి చెక్కుతారు. స్త్రీ పురుషులు చాయవేసిన వస్త్రప్రియులై యున్నారు. రాజమహేంద్ర వరం, మచిలాబందరు, గుంటూరు, జుములా యీ అయిదు జిల్లాలోను భూమి విస్తారము జమీన్‌దార్ల అధీనముగా పూర్వము నుంచి చేయబడి వున్నందున జమీన్‌దార్ల ప్రాబల్యద్వారా హిందవుల వల్ల అద్యాపి కొన్ని విశేషధర్మాలు 20-30 వేల బ్రాహ్మణులకు సంతర్పణలున్ను చేయబడుచున్నవి. అన్నిటిలోను బందరు, కాకినాడ, జిల్లాల జమీం దారులు చాలా ధర్మబుద్ధి గలవారు. రాజా కొచ్చర్లకోట వెంకటరాయ నింగారు. రెండావృత్తులు కుటుంబసహితముగా తులాభారము తూగి రెండావృత్తులు లక్ష బ్రాహ్మణభోజనము చేయించి అనేక యాగాలుచేయించినారు. వాశిరెడ్డి వెంకటాద్రినాయిడు అప్పారావు మొదలైన మరికొందరు అంతకు యొక్కువగా హిందూధర్మములను

జరిగించి నారు. యీ దేశస్థులు కచ్చేరీ సహితముగా విందుచేస్తే ఆ వత్సవాన్ని మేజువానీ లంటారు. కాకినాడ జిల్లా సాలుకు 5 లక్షల వరహాలు యెత్తుచున్నది. మచిలీ బందరు ఆరులక్షల వరహాలెత్తుచున్నది. యీ మచిలీబందరులో ఆగస్టు నెల 15 తేది వరకు వసించినాను.

16 తేది వుదయాత్పూర్వము నాలుగు గంటలకు బైలువెళ్ళి యిక్కడికి2 ఆమడల దూరములో నుండే కొత్తపాళె మనే కృష్ణా తీరపు వూరు 10 గంటలకు చేరినాను. దారిలో యీ దేశస్థులు పర్రలు అని చెప్పే పల్లెలు కొన్ని వున్నవి. రేగడభూమి. కొత్తపాళెమునకు రెండు కోసుల దూరములో చల్లపల్లియను యేర్లగడ్డ జమీనుదారుని నివాస గ్రామము ఒకటి వున్నది. అందులో సుందర తరముగా వొక మిద్దెను ఆ జమీనుదారుడు కట్టియున్నాడు. యీ కొత్తపాళెము చిన్నవూరు అయినప్పటికీ వెచ్చా గోపాలకృష్ణమ్మయనే కోమటి యిప్పట్లో బందరు ప్రొవిన్‌శయాల్ కోర్టులో ప్లీడరుగా వుండి అతడు వొక సత్రము కట్టించినందున మార్గస్థులకు బహువుపకృతిగా వున్నది.

గంజాంలో బందం చలమయ్య అనే అతను, విశాఖపట్టణములో చిన్నం చలమయ్య అనే అతను, యానాంలో మన్నెం కనకయ్య, రాజ మహేంద్రవరములో గుండు శోభనాద్రి వగైరాలు జమీన్‌దారులయి లక్షాంతరములువ్యాపారముల చేసి దొరతనపు డౌలుపాయా పరువున్ను కలిగివున్నా వీరిని దక్షిణ దేశములాగున శెట్టి అనడములేదు కాని గారు అనే ప్రతిష్టావాచక ప్రయోగమున్ను "తాజీం అనే ప్రత్యుద్థాన మున్ను వీరికి చేయకూడనని వొక నిష్కర్ష యితర జాతులందరు , తాగాయతునుంచి చేసుకొని అటు యీ దేశములో జరిగింపు చున్నారు. కోమటి జాతిలో వెచ్చా, వారి కుటుంబము లాగున గవర్నమెంటు ఉద్యోగాలు చేసిన కుటుంబాన్ని ఎక్కడా చూడలేదు. శూద్ర జాతిలోనున్న యెంత గొప్పవాడైనా నాయుడనే ప్రతిష్టావాచకాన్ని ఆ పురుషుని పేరుతో కూడా ఆధారణముగా వాడరు. గంజాం మొదలుగా భోగస్త్రీలు సభాస్థలములకు వస్తే తంబుర వీణలవుంచుకొని పాడేకాలము తప్ప తక్కిన దేశములలో కూర్చుండకూడదు. పశ్చాత్తాపములేక రెండు మూడు రూములు వారిని నిలపెట్టుతారు.

బందరు జిల్లా ప్రవేశించిన వెనక బందిపోట్లు, పితూరీలు అనే మాటలు వినడములేదు.ఆ విషయమై యీ దేశము సభిక్షముగా వున్నది. ఇటీవల గుంటూరులో భేది. వాంతి వున్న ద్రవాలు చాలా కలిగియు న్నట్లు తెలియడమయినది ఆ వుపద్రవము తగిలినయింట్లో మళ్ళీ మళ్ళీ తగులుతూ వున్నట్లు తెలిసినది.గనుక అందుకు హేతువు నాకు తోచడము యేమంటే అవశాత్తుగా వొక పురుషునికి ఆ వుపద్రవము తగిలి విపత్తుకు హేతువు కాగానే సన్నిహితులు భీతిచెంది భీతిద్వారా యీ వుపద్రవము పరంపరగా వారు తెచ్చుకునే టట్టు తోచుచున్నది. భీతి మరణాన్ని యివ్వగల వుపద్రవమని అనుభవసిద్ధముగాదా! "తేననినా తృణాగ్రమపినచలతి" అనే వాక్యము సత్యమయినా దేహదృష్టి చేతనున్ను ప్రపంచదృష్టి చేతనున్ను యిటువంటి వూహలు దేహదృష్టి విలయము పొందేకొరకు చేయవలసి యున్నవి.

కృష్ణాతీరమునందు 9వ తేది మధ్యాహ్నము వరకు నిలిచినాను. కృష్ణానదీ మహాత్మ్యము విచారించగా లోకులను తరింపచేసే కొరకున్ను యీ కలిలో లోకుల పాపాలు యెంతబళువో అంతపాటి పుణ్యము వొక స్వామముచేతనే కలిగేకొరకున్నశ్రీ మహావిష్ణువు యీ నదీస్వరూప ముగా అవతరామెత్తినట్లు తెలియవచ్చినది. ఈ కృష్ణామహాత్మ్యము స్కాందపురాణాంతర్భూతముగా వున్నది.యిక్కడికి2 కోసుల దూరములో కళ్ళేపల్లి అనే మహాస్థలము వొకటివున్నది.యీ నది సహ్యపర్వతములో వత్పత్తి అయినది.ఆ వత్పత్తి స్థలసాగర సంగమాలకు70 ఆమడ అని విన్నాను. యిక్కడ కృష్ణానది కోశడు వెడల్పు, అనేక గొప్ప లంకలు కలవు. అందులో అనేక అడివి యావులు స్వేచ్ఛగా విహరింపుచున్నవి. యీ లంకలో కాయకూరలు చాలాగా పైరై బందరు బస్తీలో ప్రయమవుచున్నవి. 1831, ఆటష్టు19తేది మధ్యాహ్నము మీదట 1 గంటకు బయలువెళ్ళి కృష్ణానది పడవలకుండా దాటి 5 కోసుల దూరములో ఉండే కనగాల యనే వూరు సాయంకాలం 6 గంలకు చేరినాను. (ముత్తేవి లక్ష్మణరావు గారికి కృతజ్ఞతలతో..

చిరునామా : జి.చందూకార్తీక్, గాలరీ ఎగ్జిక్యూటీవ్, ది కల్చరల్ సెంటర్ ఆఫ్ విజయవాడ అండ్ అమరావతి,
మధుమాలక్ష్మీ ఛాంబర్స్, మొగల్రాజపురం, విజయవాడ - 10. మొ:9533682339.

శ్రీ లంక వెంకటరమణ

# కుంఫిణీ కుంపటి

వేదాంతంకాదు. తాత్విక దృక్పథం అసలే కాదు. ఉన్నది ఉన్నట్టు చెప్పుకోవాలంటే మనిషి పంచభూతాల పంట. ఆలోచించగలిగే చైతన్యవంతమైన ఈ పదార్థం నిలబడడానికి పృథివి కావాలి. పుట్టడం అన్నది ఎక్కడో అక్కడజరుగుతుంది. పుట్టాడు కనుక మరణించాలి. వేటి సంయోగంతో రూపొందాడో వాటి వియోగంతో తిరిగి పంచ భూతాల్లో కలసిపోతాడు. అదే మరణం. అదెలా సంభవిస్తుందన్న ప్రశ్నకు వైజ్ఞానిక సంబంధమైన లేదా ఆదిభౌతిక సంబంధమైన చర్యకు ఇక్కడ తావులేదు. వాస్తవాన్ని చూడాలి.

నేలమీద నిలబడడానికి చోటు దరికిన మనిషి గాలి లేకపోతే మూడు నిమిషాలు కూడా బ్రతకలేడు. ప్రయత్నించి గాలి సంపాదించ వలసిన పనిలేదు. ప్రకృతే పుష్కలంగా సమకూర్చింది. ఇక నీరు, దీన్ని మనిషి ప్రయత్నించి సంపాదించుకోవాలి. ఎదు వల్లనంటే నీళ్లు గాలి అంత సమృద్ధిగా లభించేది కాదు. ఆహారం ప్రయత్నించి సంపాదించుకోవాలి. తిండి లేకుండా నాలుగైదు రోజులు ఉండవచ్చు, కాని తాగడానికి నీరు లేకపోతే పదహారు గంటల కంటె మించి బ్రతకలేడు. అందుకే మనిషి జలవనరులను వెతుక్కుంటాడు. 'ఎప్పుడు ఎడతెగకపారే ఏరులేని' చోట చొరకుము, అని సమితీ శతకకారుడు కూడా హెచ్చరించాడు.

నీళ్ళు సహజ సంపద. మానవుడి పురాకృత పుణ్యఫలం నదులు. నదీ తీరంలో పుట్టడం అదృష్టం, ఈ నదులవల్ల తినడానికి తిండి లభిస్తుంది. నివాసం కూడా చల్లగా ఉంటుంది. అందుకే మానవ నాగరికత నదీతీరాల్లో వృద్ధిచెందుతుంది.

సంచారం జీవనం సాగించిన మానవ సమూహాలు పశువుల మందులతో సహా ఎక్కడ పుష్కలంగా నీరు, పశుగ్రాసం లభిస్తాయో అక్కడతోనే జీవన యాత్ర (జీవనం అంటే ఒక అర్థం నీళ్ళు) ఆపు చేశాడు. ఈ అన్వేషణలో ఎవరితోనైనా విభేదాలు వస్తే యుద్ధానికైనా సిద్ధపడతాడు. పూర్ణానదీ జలాలు పంచుకొనే సమస్యపై శాక్య వంశానికి కొళీయ వంశానికి మధ్య యుద్ధం జరిగే పరిస్థితి ఏర్పడితే రాజీ చేయడానికి గౌతమ బుద్ధుడు ప్రయత్నించి విఫలు డయ్యాడు.

11,12 శతాబ్దాలలో పశువులు మేపుకోవడానికి, గుండ్లకమ్మ నీటి వియోగం విషయంలో మనమసిద్ధితో వచ్చిన విభేదాల ఫలితంగా కాటమరాజు యుద్ధానికి సిద్ధమయ్యాడు. ఆధునిక యుగంలో ఆల్మట్టి వివాదంలో కర్ణాటక, ఆంధ్రప్రదేశ్‌లు ఇరుక్కున్న సంగతి అందరికీ తెలిసినదే!

సామాజిక స్థాయిలో జల రాజకీయాలు అలా ఉంటే వ్యక్తిగత స్థాయిలో ఎలా ఉంటాయో రైతాంగానికి బాగా తెలిసినదే! పొలాలకు నీరు పెట్టుకొనే విషయంలో తగాదాలు ఒక్క దివిసీమలోనే కాదు మొత్తం భారతదేశమంతటా కనిపించే లక్షణం. అని వార్యం, అయినా రోజులు గడిచిపోతాయి.

ఇలాంటి విచిత్రమైన సంఘటన. చిలికి చిలికి గాలివానలాగా మారి తేలికగా తప్పిపోయిన వివాదం ఒకటి 1838లో రెండు గ్రామాల మధ్య జరిగింది. సామాజిక శాంతి,సామరస్యాల కోసం, రెండు వంశాల మధ్య ఏనాడో 160 సంవత్సరాలనాడు జరిగిన సంఘటనను ఇప్పుడు తవ్వి బయటకు తియ్యడం మంచిది కాదు కనుక సంఘమర్యాద కోసం వివరాలలోకి పోవడం లేదు. అయితే జరిగిన సంఘటన చరిత్రలో భాగం కనుక చెప్పుకోవచ్చు.

బ్రిటిష్‌వాళ్ళు, డచ్‌వాళ్ళు దివిసీమలో తిష్ఠవేసిన రోజులు. పోర్చుగీసువాళ్ళు కూడా వలసలు ఏర్పాటు చేసుకొన్నారు. ఎవరైతేనేం అంతా దుర్మార్గులే! మన దేసాన్ని పీడించే లక్ష్యంతో వ్యాపారం కోసం వచ్చి వలసలు ఏర్పాటు చేసుకొన్న రక్త పింజెరులు. ఏనాడో దివిసీమ బ్రిటిష్‌వాళ్ళ కిందకు వచ్చింది. వలందపాలెం, బందరు

స్థావరంగా డచ్‌వాళ్ళు వ్యాపార హస్తాలు విస్తరింపజేశారు. వాళ్ళ కబంధ హస్తాలు దివితాలూకా వరకు వచ్చాయి.

ఇక్కడ ఒక చిన్న రహస్యం ఉంది. హాలెండ్, ఇంగ్లాండ్ మధ్య రహస్య ఒడంబడిన ఉండేది. ఇంగ్లీషు వాళ్ళు భారతదేశంలోని కొన్ని ప్రాంతాలను డచ్‌వాళ్ళకు ఇవ్వాలి. అంటే కౌలులాగా. ఆ విధంగా డచ్‌వాళ్ళు దివిసీమలోకి వచ్చారు. వ్యాపారం కోసం వచ్చిన వాళ్ళు వ్యాపారంతో ఆగిపోక పాలనాధికారం కోసం ప్రాకులాడారు. ఆ విధంగా ఇంగ్లండ్ కృతకృత్యమైంది. ఇక డచ్‌వాళ్ళకు, బ్రిటిష్ వాళ్ళకు మధ్య వైరం మొదలైంది. ఇద్దరిదీ వ్యాపార మనస్తత్వమే కదా! సహజంగానే ఇద్దరి మధ్య వైరం మొదలైంది.

విభజించి పాలించే ప్రవృత్తి బ్రిటిష్ వాళ్లది. డచ్ వాళ్ళది ఎలుక మనస్తత్వం. ఇద్దరూ దోచివేయడానికి వచ్చినవాళ్ళే కనుక ఒక విధంగా రాజీపడ్డారు. ఆ రాజీ ప్రకారం దివిసీమలో ఏ సరుకునైనా కొనుగోలు చేసే బాధ్యత డచ్‌వాళ్ళది. వాళ్ల నుంచి బ్రిటన్ కొంటుంది. బందరు వరకు సరకు రవాణా బాధ్యత కూడా డచ్ వాళ్ళదే!

దివి ప్రాంతంలో అప్పటికి నీలిమందు బాగా తయారయ్యేది. ఓ విధంగా అది పరిశ్రమేనని చెప్పాలి. ఆ మొక్కలను విస్తారంగా పండించే రైతుల నుంచి వైశ్యులు కొనేవారు. వైశ్యులు నీలిమందు తొట్టెలు కౌలుకు తీసుకొని తయారు చేసేవారు. వైశ్యులతోబాటు, కొన్ని బ్రాహ్మణ కుటుంబాలు కూడా చేపట్టాయి. ఈ నీలిమందుకు డచ్‌వాళ్ళు కొని బందరు రేవుకు పంపించి ఓడలకు ఎక్కించేవాళ్ళు. అక్కడ బ్రిటిష్ వాళ్ళు సరకు కొనేవాళ్ళు.

దివి ప్రాంతంలోని వైశ్యుత్వ పెద్ద వ్యాపారం. వీరికి అవనిగడ్డ, బందలాయిచెర్వు, బెజవాడ దగ్గర కోమటి గుంటలలో నీలిమందు తొట్టెలు ఉండేవి. అలాగే బ్రాహ్మణులలో కొందరికి అవనిగడ్డలో గొట్టంమిల్లు ప్రాంతంలో, గుర్రపు చెర్వు ఎగువన మరికొన్ని ప్రాంతాల్లో తొట్టెలు ఉండేవి.

బ్రిటిష్ వాళ్ళకు కృష్ణా జిల్లాలో తయారైన నీలిమందు అంటే చాలా మక్కువ. శ్రేష్ఠమైనది. మాంచెస్టర్‌లోని బట్టల మిల్లులకు నీలిమందు అవసరమై ఇక్కడ నుంచి దిగుమతి చేసుకొనేవాళ్ళు.

అలాగే నేటి ప్రకాశం జిల్లా పర్చూరు సమీపంలో నివసిస్తున్న కోటవారు యార్లగడ్డవారితో కలిసి ఎగుమతి దిగుమతి వ్యాపారం చేశారు. ఎగుమతుల్లో నీలిమందు ఉండేది. యార్లగడ్డవారికి (యార్లగడ్డవారికి జమీందారుతో సంబంధాలు ఉండేవేమో తెలియదు) నీలితొట్టెలు ఉండేవి. వీరితో బ్రిటిష్ వాళ్ళు నేరుగా వ్యాపారం చేసేవారు. ఆ వ్యాపారపు ఒప్పందం ఎంత భయంకరంగా ఉండేదో ప్రకాశం జిల్లా భీమవరంలో కాపురం ఉంటున్న కోట వెంకటేశ్వరరావు గారి ఇంట్లోఉన్న ఆనాటి ఒప్పందం పత్రాలు నిరూపిస్తున్నాయి. సరకు కొనుగోలు చేయడం యార్లగడ్డ, కోటవారి బాధ్యత. ఆ సరుకును ఓడలకెక్కించే బాధ్యత కూడా వీళ్ళదే! అవసరమైన ఓడలను కూడా తమకు నమ్మకమైన కంపెనీల నుంచి మాత్రమే అద్దెకు తీసుకోవాలి.

ఇంత వ్యాపారం చేస్తే యార్లగడ్డ వారికి, కోట వారికి ఏమి మిగిలేదో తెలియదుగాని కోటవారు పూర్తిగా దివాలా తీశారు. గొప్ప వెలుగువెలిగిన ఆ కుటుంబాలలో కొన్ని నేడు దయనీయంగా ఉన్నాయి. యార్లగడ్డవారు కూడా పూర్తిగా నష్టపోయారు.

1838లో జరిగిన సంఘటనకు ఇదంతా చారిత్రక నేపథ్యం. అయితే ఆ సంఘటనతో ఇప్పుడు చెప్పుకొన్న బ్రాహ్మణ, వైశ్య కుటుంబాలకు యార్లగడ్డ, కోట వంశీకులకు ఏమీ సంబంధం లేదు. అయితే ఈ వంశాలే చాలా నష్టపోయాయి. బాగా బలపడి డచ్‌వాళ్ళకు, కంపెనీ వాళ్ళకు ద్వితీయ శక్తిగా రూపొందుతున్న దశలో ఈ కుటుంబాలను దెబ్బతియ్యడానికి బ్రిటిష్ వాళ్ళు కుట్ర చేశారు. ఆ కుట్ర ఏమంటే

కృష్ణ నుంచి నీటిని ఏతాలతో ఎత్తిపోసి తాము తవ్వుకొన్న కాలువల ద్వారా రైతుల పంటలు పండించుకొనేవారు. సహకార పద్ధతిలో చాలా గ్రామాలు కలిసి కృష్ణా జలాలను వాడుకొనేవారు. తాము కష్టపడి ఇలా నీళ్ళు తెచ్చుకొన్నా రైతులు మాత్రం పన్నుకట్టక తప్పేదికాదు. ఇది వేరే విషయం.

నీలిమందు తొట్టెలకు నీళ్ళు బాగా కావాలి. తొట్టెల్లో నీలి మొక్కల ఆకులు, సున్నం ఇంకా ఏవేవో కలిపి ఎండకు ఎండబెట్టేవారు. నీళ్ళు లేనిదే నీలిమందు తయారు కాదు కదా. అందుకోసం ఆ వ్యాపారం చేసిన యార్లగడ్డ, కోట వారు తమ నీలిమంటకు, పంటకు అవసరమైన నీటిని రైతుల నుంచి కొనేవారు. ఆ విధంగా ఈ వంశాలు మూడు పువ్వులు ఆరుకాయలుగా వృద్ధి చెందుతున్న సమయంలో నీళ్ళు పంచుకొనే సమస్యపై వివాదం ప్రారంభమైంది. ఎంత ఏటికి ఏతం వేసి నీరు తోడినా పారేందుకు కాలువలు ఉండాలి కదా. ఒక ఊరు నుంచి మరో ఊరు వరకు నీరు పారేది. అయితే కాలువ అనగానే కొంతనీరు బీరుపోక తప్పదు. నిజానికి ఇదొక సమస్యకాదు. సహకారం, సమరసం, సహాయం నిండుగా గుండెల్లో నింపుకొని తరతరాలుగా సేద్యం చేసుకొంటూ, రెండుగ్రామాల మధ్య ప్రజలు వియ్యాలు కూడా పెంచుకొంటున్న దశలో బ్రిటిష్ వాళ్ళ ప్రేరణతో

ఒక గ్రామంలో ఎవరో ఒక రైతు తనకు నీళ్ళు అందడంలేదని జిల్లా అధికారికి ఫిర్యాదు చేశాడట. ఆ ఫిర్యాదును పురస్కరించుకొని, నీళ్ళు నీలిమందుకు అపారంగా ఖర్చు అవుతున్నది కనుక తొట్టెలు నీళ్ళు వాడకపోతే పంటలకు సాగునీరు పుష్కలంగా లభిస్తుంది కనుక నీలితొట్టెలు ఉపయోగించరాదని నిషేధించారు.

పిడుగుపాటువలె వచ్చిన ఈ నిషేధంతో వ్యాపారం స్తంభించి పోయింది. ఈ వంశాలతో ఒప్పందం చేసుకొన్న డచ్‌వాళ్ళు 'బీచ్ ఆఫ్ అగ్రిమెంట్' (ఒప్పందం ఉల్లంఘన) కింద పరిహారం కోరారు. అటు వ్యాపారం ఆగిపోయింది. ఇటు డచ్‌వాళ్ళకు పరిహారం చెల్లించాలి. వ్యాపారం అన్నప్పుడు లావాదేవీలు ఉంటాయి. ఈ వంశాలు తమ వ్యాపారం కోసం కొంత అప్పులు చేశారు. తమకు అవసరమైన నీలిమొక్కలు, ఇతర రసాయనాలను నావలమీదుగా రవాణా చేసుకొనేవారు, ఆకస్మికంగా వ్యాపారం ఆగిపోడంతో మత్స్యకారులు వత్తిడి ప్రారంభించాడు. మరి మత్స్యకారులు నష్టపోరు కదా! ఈ తిరుగుబాటు ఒక దశలో పెద్ద సంఘర్షణ వరకుపోయింది. అదృష్టవశాన అలాంటిదేమీ జరగకుండానే దాటిపోయింది.

వాస్తవాలు ఇవికాగా లోకల్ రికార్డ్సులో మరో విధంగా ఉంది. సముద్రపు దొంగలుగా జీవనం సాగించేవారు తిరుగుబాటు చేశారని వ్రాసుకొన్నారు. ఆ రోజుల్లో ఒక దీవికి, మరో దీవికి మధ్య ప్రయాణ సాధనాలు పడవలు మాత్రమే! సాధారణ ప్రయాణీకులను అప్పుడప్పుడు నావలలో దొంగలువచ్చి బెదిరించి ఏ పాతికో పరకో దోచుకునే పద్ధతి దివి ప్రాంతంలో ఉండేది. ఇదేమంత సామాజిక సమస్య కాకపోయినప్పటికీ వాళ్ళకు 'సీపైరెట్స్' (సముద్రపు దొంగలు) గా ముద్రవేశారు.

బ్రిటిష్, డచ్‌వాళ్ళ కుతంత్రాల కారణంగా అనేక వందల కుటుంబాలు నష్టపోయాయి. కోటవారైతే ఐ.పి. పెట్టవలసి వచ్చింది. ఐ.పి. పిటిషన్‌కు అవసరమైన 42 రూపాయల స్టాంపుకు ఆరు రూపాయలు తక్కువైతే భార్యమెడలో పుస్తెలు కూడా అమ్మవలసి వచ్చింది.

హంసలదీవి వేణుగోపాలస్వామి ఆలయంలో విగ్రహం నీలమేఘ చ్ఛాయతో మెరిసిపోతుంది. ఇది ఆ విగ్రహం, ప్రత్యేకత, ఈ ప్రాంతంలో అలాంటి రాళ్ళు కనిపించవు. ఈ సుందరమైన ఆలయం బందరు ఉప్పెనకు ధ్వంసమైతే ఆరోజులో ఉల్లిపాలెం కరణంగారు కృష్ణరాయుడుగారు పునరుద్ధరించారు. కంతమనేని లక్ష్మయ్య నాయుడు అనే ఒక కవి స్వగ్రామం నాగయ్యతిప్ప. ఆయన 18వ శతాబ్దపు కవి. 'వేణుగోపాల పాదం' అనే సంగీత కావ్యాన్ని వ్రాసి హంసలదీవి వేణుగోపాలునికి అంకితమిచ్చారు. ఆయన మృదుమధురంగా గీతాలను ఆలపిస్తూ పొలం పనులు చేసుకొనేవారు. తనకు తోడు వేణుగోపాలుడేనని "శరణు శరణు వేణుగోపాల, నీవె నా గతి....." అని ఆనందభైరవిలో ఆలపించేవాడట.

## పార్వతీపరమేశ్వరులకు అర్ఘ్యప్రదానం

అష్టమూర్తే మహేశాన గంగాధర కృపానిధే
గౌర్యాసహ గృహాణార్ఘ్యం యథోక్త ఫలదోభవ
ఓం గౌరీసహిత ఈశానాయ నమః ఇదమర్ఘ్యం
సమర్పయామి

శ్రీ కడియాల వెంకటేశ్వరరావు

# కూచిపూడి సముతు జాగీర్‌దార్ కనకదండి సోమన్న

(కలెవరం కైఫియత్)

సర్ ఆర్థర్‌కాటన్ కృష్ణాబ్యారేజ్ నిర్మాణానికి 160 సంవత్సరాల ముందుగానే సీతానగరం వద్ద కరకట్టల నిర్మాణం గావించి దిగువ కృష్ణాతీరాన్ని, తెనాలి ప్రాంతాన్ని సస్యశ్యామలం గావించిన అపర భగీరథుడు.

కనకదండి సోమన్నగారిని గురించి మొదటిగా 1811లో సేకరించ బడిన కలెవరం కైఫియత్‌లో పేర్కొనబడింది. ఈయన కలెవరం గ్రామంలో నివసించేవారని, కుతుబ్‌షాహీ పాలనలో అబ్దుల్ హసన్ సుల్తాన్‌గా (తానీషా) పరిపాలిస్తున్న కాలంలో వీరివద్ద పెద్ద వజీరులైన అక్కన మాదన్నలకు పౌరహితులుగా ఉండేవారని, అందువల్ల దయచేసి వీరికి కలెవరం సర్వాగ్రహారంగా ఇచ్చి, కూచిపూడి సమితికి జాగీరు దారుగా నియమించబడ్డారని తెలుస్తుంది. మాదన్న మహామంత్రి 1674–75 ప్రాంతాల్లో రాజ్యంలో ప్రవేశపెట్టిన కొత్త సంస్కరణలో భాగంగా ఈయన అనేక ప్రజాహిత కార్యక్రమములు చేపట్టి, గ్రామాలలో వాపీకూప తటాకాలను నిర్మించాలని, వ్యవసాయదారులకు అనుకూలంగా ఎన్నో కాలువలు కూడా వీరిచే నిర్మించబడ్డాయని యిప్పటికీ ఈ ప్రాంతంలో వినికిడి ఉంది. ఆ కాలంలో విజయవాడకు దిగువున సీతానగరం గండి వద్ద తుంగభద్రా నది మహాప్రవాహం వచ్చి కూచిపూడి సంతు గ్రామాలను వరదపెట్టి ముంచెత్తేదని, నాటి గ్రామాలు, పంటపొలాలు పూర్తిగా మునిగి పోయేవని తెలుస్తుంది. దీనికి సోమన్న గారు చింతించి, ఈ తుంగ భద్రానదీ ఉపద్రవాన్ని కట్టడి చేసేందుకు ఆలోచించి నాటికి ఉన్న సాంకేతిక పరిజ్ఞానంతో తెనాలికి 40 కి.మీ. దూరంలో బెజవాడకు దిగువన ఉన్న సీతానగరం వద్ద కరకట్టలను పెద్ద బండరాళ్ళను ఉపయోగించి, వీటిలో సీసము, సత్తు కరిగించి పోసి ఈ కరకట్ట నిర్మించారని తెలుస్తుంది. సర్ ఆర్థర్ కాటన్ విజయవాడ ఆనకట్ట వరద ప్రవాహాలను కట్టడిచేసి, తెనాలి ప్రాంతాన్ని సస్యశ్యామలంగా చేసారు. అంతేకాక వీరు అక్కన – మాదన్నలకు పురోహితులుగానే కాకుండా హితులుగా కూడా వీరి రాచకార్యాలలో, పరిపాలనలో సహాయపడ్డారని కైఫియత్‌లో ఉదహరించిన కొన్ని అంశాలను బట్టి తెలుస్తుంది. కనకదండి సోమన్నగారికి కనకదండు లక్ష్మన్న అనే సోదరుడు ఉన్నట్లుగా మరో కైఫియత్ ద్వారా తెలుస్తుంది. వీరి కుటుంబం గురించి మిగిలిన వివరాలేవి తెలియవు. పూర్వం నుండి వీరు కలెవరంలోనే నివసించేవారని కైఫియత్ పేర్కొనటమే కాకుండా పూర్వం కలెవరం గ్రామంలో కనకదండువారు ఈ ప్రాంతాన్ని పరిపాలించారన్న ఒక వినికిడి కూడా ఉంది. వీరు కలెవరంలో నివసించిన గృహం ఉన్న ప్రాంతం గుర్తించబడింది.

కొండవీటి దండకవిలె ననుసరించి క్రీ.శ. 1579 తరువాత కొండవీటి సీమ 14 సముతులుగా విభజించబడినది సముతులు,

**అందలి గ్రామములు :**

| | | |
|---|---|---|
| 1. | పొలడుగు | 14 గ్రామాలు |
| 2. | ప్రత్తిపాడు | 14 గ్రామాలు |
| 3. | నూతక్కి | 14 గ్రామాలు |
| 4. | పొన్నూరు | 44 గ్రామాలు |
| 5. | మునిగోడు | 56 గ్రామాలు |
| 6. | రావిపూడి | 12 గ్రామాలు |
| 7. | గుంటూరు | 34 గ్రామాలు |
| 8. | పులివర్రు | 52 గ్రామాలు |
| 9. | సంతరావూరు | 10 గ్రామాలు |
| 10. | చేబ్రోలు | 36 గ్రామాలు |
| 11. | మంగళగిరి | 33 గ్రామాలు |
| 12. | నాదెండ్ల | 100 గ్రామాలు |
| 13. | కూచిపూడి | 54 గ్రామాలు |
| 14. | తాడికొండ | 22 గ్రామాలు |
| | **మొత్తం గ్రామాలు** | **495 గ్రామాలు** |

# కూచిపూడి సముతు జాగీర్‌దార్ కనకదండి సోమన్న

కనకదండి సోమన్న గారు కూచిపూడి సమితికి జాగీదారుగా షుమారు 1675-76 ప్రాంతంలో నియమించబడి ఉంటారని భావించబడుతుంది. కుతుబ్‌షాహీ పరిపాలకా కాలంలో తెనాలి కూచిపూడి సమితిలో ఒక గ్రామంగానే ఉంది.

తెనాలి గోవర్ధనస్వామి దేవాలయంలో ఉన్న 1489 ఎ.డి. నాటి ఒక శాసనంలో "తెనాలి నగరి" అని పేర్కొనబడినది. తిరిగి ఈ తెనాలి గ్రామ స్థాయికి ఎప్పుడు చేరిందో తెలియదు.

**"శ్రీ వక్షజ పటీర కుంక్కును రజశ్శృంగ్గారి తోర స్థలం**
**ప్రావిర్భావ మగాత్తెనాలి నగరీ గోవర్ధనాధీశ్వర్ణ ।**
**శాకెరుద్రపయోధి చంద్రగణితే సౌమాభిదే వత్సరె**
**వైశాఖే సిత పక్షగే వారిదినే దేవద్రుమూల స్థలే ॥**

**కలెవరం కైఫియ్యత్తు** : ది.17-11-1811న పులిగడ్డ మల్లయ్య అనే లేఖకునిచే సేకరించబడినది.



"కట్టెవరం", కూచిపూడిసమితి సర్కారు ముత్తుంజా నగరు. ఈ గ్రామానికి పూర్వం నుండి కట్టెవరం అను పేరు ఉందని,క్రీ.శ.1134ముందు గజపతి గణపతి దేవుదు బ్రాహ్మణు లకు ఇచ్చిన 44 గ్రామాదులు అగ్రహారములుగా ఇచ్చేటప్పుదు, యీ గ్రామం కూడా సదరు అగ్రహారములలో చేరింది. ఈ గ్రామానికి కరణీలు వారి సంప్రతి, లక్కరాజువారి సంప్రతి. ఈ గ్రామానికి అగ్రహారీకులుకనకదండ్డెవారు పూర్వం నుండి ఉండినారు. మొగలాయీ ప్రభుత్వంలో తానీషా పాదశహావారు రాజ్యం చేసేటపుడు వీరి దగ్గర పెద్ద వజీరులైన అక్కన్న - మాదన్నల వారికి కన్నదండి సోమన్నగారు పౌరోహితులై యుందురు. గనుక వారియందు దయచేసి కట్టెవరం సర్వాగ్ర హారములు ఇచ్చి, కూచిపూడి సముతు జాగీరు యిచ్చినారు. కనుక వారు అంద్దలములు మొదలైన బహరి బహుమానములు పొంది వచ్చి స్థలములో ప్రవేశించి సదరహిస ముతు అబాదాను చేయుచినంతలో కృష్ణానది నుంచి సీతానగరం గండీనతుంగభద్ర మహాప్రవాహంగా వచ్చికూచిపూడిసముతు గ్రామాలు వరదపెట్టి ముంచివేస్తూ వచ్చే వరకు కనకదండి సోమన్న గారు విచారించి, అనేక ద్రవ్యం వ్యయం చేసి విస్తారం కామటీలను వుంచ్చి సత్తు, సీసం వగైరాలు కాపించి, శిలలనందు బోయించి సీతానగరపు గండిలో నుంచి తుంగభద్ర ప్రవాహం రాకుండా కట్టించినారు. కనుక కూచిపూడి సంతు గ్రామాలకు వరద ఉపద్రవములు నిలిచి, విస్తారంగా



పంటలు పండి, ఈ ప్రాంతమంతా సస్యశ్యామలంగా మారినట్లు కైఫియ్యతు తెలియజేస్తుంది. సదరహినకకదండి సోమన్న గారు కట్టెవరంలోనే కాపురం ఉండినారు.కనుక ఈ గ్రామానికి ఈశాన్య భాగమందు శివాలయం కట్టించి, తను పేరిట సోమేశ్వరస్వామి అను పేరుపెట్టి లింగమూర్తిని ప్రతిష్ఠ చేసి స్వామివారికి ఎదుటన పెద్ద నందికేశ్వరుని నిలుపవలెనని, పని ఆరంభించి చేయుస్తుండగా, ఇంతలో హైదరా బాద్‌లో తుర్కలు అంతా ఏకస్తులై తానీషా వారి దగ్గర పితూరీచేసి అక్కన్న - మాదన్న గారిని తలలు గొట్టినప్పుదు ఇక్కడికిన్ని వారు వచ్చి ఈ కన్నదండి వారిని శిరచ్ఛేదములు చేసిపోయినారు. గనుక తత్సంతివారు అందటనే ఖిలమై పోయినట్లుగా కట్టెవరం కైఫియ్యత్ తెలియజేస్తుంది." కైఫియ్యత్‌లో పేర్కొన్న పెద్ద నందికేశ్వరుని నిర్మాణం ఆగిపోయి తరువాత కాలంలో ఒక చిన్న నందిని మాత్రమే ఆలయంలో ఉంచారు. ఇది ఇప్పటి దేవాలయంలో ఉంది. ఈ కైఫియ్యత్తును అనుసరించి, కన్నదండివారి కుటుంబం పూర్వం నుండి కలెవరం గ్రామంలోనే నివసించినట్లుగా తెలియవస్తుంది. కాబట్టి, కట్టెవరం గ్రామనామ ప్రశస్తి గురించి తెలుసుకొనవలసి ఉంది. కలెవరం కైఫియ్యత్ పూర్వం నుండి ఈ గ్రామాన్ని కట్టెవరంగా పిలుస్తున్నారని తెలుస్తుంది. కలెవరం కైఫియత్ యొక్క విషయసేకరణ1811 ఎ.డి.లో అప్పటికి ఈ తెనాలి ప్రాంతాల్లో కైఫియత్‌లు సేకరించిన పులిగడ్డ మల్లయ్య అనే లేఖకుని ద్వారా జరిగినట్లుగా తెలుస్తుంది. కలెవరం పేరు పురాతనమైనదే. గ్రామం ఆవిర్భవించినతరువాత ముందుగా ఈ గ్రామంలో నీలకంఠేశ్వరస్వామి వారి ఆలయం,చెన్నకేశవస్వామి వారి ఆలయంపూర్వం ఈ గ్రామంలో ఉండేవని, ప్రస్తుతం ఈ గ్రామంల్లో ఉన్న దేవాలయాలకు ఎదురుగా ఉన్న మార్గంలో కుడివైపున ఉండేవని, వీటికి ఎదురుగా కనకదండి సోమన్న గారి స్వగృహం ఉండేదని తెలుస్తుంది. ఈ పురాతన చెన్నకేశవ స్వామి వార్ల దేవాలయానికి చెందిన స్వామివారి విగ్రహంఒకటి ఇప్పటి ఆంజనేయస్వామివారి గుడిలో ఉంది.శివాలయం తాలూకు విరిగి తుప్పుపట్టిన ఒక ధ్వజస్థంభం తాలూకు శిధిలాలు షుమారు 80 సంవత్సరాల

క్రితం ఈ ప్రాచీన దేవాలయాలు ఉన్న ప్రాంతంలో కనిపించేవని గ్రామస్థులు తెలియజేస్తున్నారు. కనుక, ఈ గ్రామానికి నీలకంఠేశ్వరంలేక కంఠేశ్వరం అనే పేరు స్థిరపడిందని, కాలక్రమంలో ఈ కంఠేశ్వరం కఠెవరంగా పిలువబడుతుంది అని నేను ప్రగాఢంగా విశ్వసిస్తున్నాను. శివునికి నీలకంఠేశ్వరుడు, జలకంఠేశ్వరుడు, తల కంఠేశ్వరుడు, త్రిపురాంత కేశ్వరుడు అనే వివిధ నామాలు ఉన్నాయి. కఠెవరం సమీపంలోని గుడివాడ గ్రామంలో కూడా మరో నీలకంఠేశ్వర స్వామివారి ఆలయం ఉంది. బహుశా ఇవి కాకతీయులనాటి దేవాలయాలు కావచ్చు.

ఇందుకు ఉదాహరణగా ఆంధ్రదేశమంతటా శివుని పేరుతో అనేక గ్రామాలకు పేర్లు ఉండటం మనం గమనించవచ్చు. ముఖ్యంగా నిజామాబాద్ పట్టణం, (నిజామాబాద్ జిల్లా) మధ్యన నీలకంఠేశ్వర స్వామివారి దేవాలయం ఉంది. ఈ ఆలయానికి చుట్టూఉన్న ప్రాంతాన్ని ఇప్పటికి కంఠేశ్వర్‌గా పిలుస్తున్నారు. ఈ ప్రాంతంలో ఉన్న ఉర్దూ భాషా ప్రభావం వల్ల కంఠేశ్వర్ అయి ఉంటుంది. కృష్ణా, గుంటూరు జిల్లాల్లో కూడా శివాలయాల పేరుతో ఉన్న అనేక గ్రామాలు ఉన్నాయి. **ఉదాహరణగా :** విజ్జేశ్వరం, చౌడేశ్వరం, మల్లేశ్వరం, కాళేశ్వరం (వరంగల్ జిల్లా), అంతేకాక మన ప్రఖ్యాత త్రిపురాంత కేశ్వరస్వామి వారి దేవాలయం ఉన్న గ్రామాన్ని త్రిపురాంతకంగా పిలుస్తున్నాను.

కఠెవరానికి గ్రామదేవత మల్లమ్మ ఈ దేవాలయాన్ని కడియాల కోటయ్యగారి వారి ధర్మపత్ని సరమ్మగారు నలనామ సంవత్సరంలో ఈ దేవాలయాన్ని నిర్మించిది. 7-12-1916నశిఖరప్రతిష్ట చేసినట్లుగా దేవాలయం ముఖమండపంపై శాసనంలో ఉన్నది. కఠెవరంలో ఉన్న మల్లేశ్వరస్వామి వారి ఆలయం,రామాలయం, ఆంజనేయస్వామి వారి దేవాలయాలు గ్రామకరణాలైన లక్కరాజు వారి పూర్వీకులచే నిర్మించ బడినట్లుగా శాసనాధారాలు ఉన్నాయి. ప్రస్తుతం వారే ట్రస్టీలుగా ఉన్నారు.

### కృష్ణా తుంగభద్ర ప్రవాహాలు, తుంగభద్రానది అంతర్ వాహినిగా ప్రవహిస్తుందా?

కృష్ణానదిని మన ప్రాచీన గ్రంథాలలో కృష్ణవేణ్యాం,కృష్ణవేణి అని పేర్కొన్నారు. భారతదేశంలోని పుణ్యనదులలోనేకాక ముఖ్యమైన నదులలో ఇది ఒకటి. పూణే నగరానికి దక్షిణాన పడమటి కనుమలలో మహాబలే శ్వరం వద్ద పుట్టి దక్కన్‌పీఠభూమి గుండా ప్రవహించి, విజయవాడ వద్ద తూర్పు కనుమలు దాటి, దివిసీమవద్ద పాయలుగా చీలి బంగాళాఖా తంలో కలుస్తుంది. దారిలో చిన్న, పెద్ద అనేక ఉపనదులు వచ్చి కృష్ణను కలుస్తున్నవి. తుంగ, భద్ర అనేవి రెండు నదులు. తుంగా నది శృంగేరి వద్ద భద్రానదిని కలుస్తుంది. దీనినే తుంగభద్రానది అంటారు. ఇది చివరికి కృష్ణానదిలో మహబూబ్‌నగర్ జిల్లా, ఆలంపూర్ వద్దనున్న కూడలి వద్ద కలుస్తుంది. దీన్ని కూడలి సంగమేశ్వరంగా పిలుస్తున్నారు.

### కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్‌ను అనుసరించి విజయవాడ వద్ద ఉన్న కృష్ణ తుంగభద్రా ప్రవాహాలు :

1766లో కొండపల్లి సర్కార్, 1788లో గుంటూరు సర్కార్, ఈస్టిండియా కంపెనీ స్వాధీనంలోకి రాకముందే కృష్ణా జిల్లాలను వ్యవసాయానికి మరలించుకొనే ప్రయత్నాలు జరిగాయి. నది ముఖ ద్వారంలో భూతలమంతా సమంగా ఉండే దివిసీమలో కృష్ణా వరద జలాలను వృత్తాకారంలోని జలాశయాలలో నిల్వ చేసుకోవడం ద్వారా పంటపొలాలకు నీళ్ళు పారించుకునే ప్రయత్నాలు జరిగేవి. అయితే నదికి అవతలి వైపున బెజవాడకు దిగువ భాగంలో సహజ జలమార్గాలు ఉండేవి. బహుశా అవి కృష్ణానది ప్రాచీన భూతలాల మార్గాలో, ఆనవాళ్ళో లేదా వరదల మూలంగా ఏర్పడిన మురికినీటి మార్గాలో అయి ఉండవచ్చు అని తెలుస్తుంది. ఈ జల మార్గాలలో ఒకటైన తుంగభద్ర సీతానగరంకు సమీపంలో ప్రారంభమై నిజాంపట్నం వద్ద సముద్రంలో కలుస్తుంది. నాటి ఆంగ్లేయులు కూడా ఈ నదీ ప్రవాహాన్ని తుంగభద్ర కాలువగానే పిలుస్తూ వచ్చారు. అంతేకాక, దుగ్గిరాల గ్రామంలో ఉన్న కేశవస్వామి వారి దేవాలయంలో క్రీ.శ.1214 నాటి 44 పంక్తులు ఉన్న శాసనంలో కూడా ఈ నదీ ప్రవాహాన్ని దైవ స్వరూపంగా భావించి తుంగభద్రా దేవిగా కూడా పిలువబడింది.

**అనంత్తరమ తుంగ్గ భద్రాదేవి ప**

**శ్చిమత్త పొలిమెర కుంటు అనంత్త**

**(ర) మనైరీత్యాం తుగ్గ భద్రాదేవి ద**

**క్షిణ ముముఖమైన మదుక**

కనుక ఆనాటికి దక్షిణ పడమర డెల్టా అంతటా ముఖ్యంగా ఈ తుంగభద్రా నీటి ప్రవాహాలే గ్రామాలకు పట్టణాలకు ముఖ్య నీటి వనరులుగా ఉన్నాయి.

ఈ శాసనాన్ని బట్టి పురాతన కాలం నుండి తుంగభద్రానది ప్రవాహము దుగ్గిరాలకు తూర్పు వైపునకు ప్రవహిస్తుందని, ఈ ప్రాచీన తుంగభద్రానదీ ప్రవాహాలు వరదల సమయంలో పూర్వం నుండి కూచిపూడి సంతు గ్రామాల పైబడి విలయాన్ని సృష్టించినట్లు తెలుస్తుది. తరువాత విజయవాడ వద్ద 1855నాటికి ఆనకట్ట నిర్మించిన తరువాత ఈ పురాతన తుంగభద్రా ప్రవాహ మార్గాలను అనుసరించే ఇప్పటి కాలువలు త్రవ్వబడ్డాయని స్పష్టమౌతుంది. దుగ్గిరాల లాకువద్ద నుండి ఈ పెద్ద కాలువ నుండి చీలి, మూడు కాలువలు తెనాలి, కూచిపూడి మొదలైన గ్రామాలగుండా ప్రవహించి నిజాంపట్నం చేరుతున్నాయి. ఈ దుగ్గిరాల లాకుల నుండి పడమట వైపుగా కొమ్మమూరు కాలువగా పిలువబడే మరో పెద్ద కాలువ సంగం జాగర్లమూడి మీదుగా 109 కి॥మీ॥ వద్ద చిన్నగంజాం గ్రామానికి పడమట వైపుగా ప్రవహిస్తుంది.

ఈ పెద్ద కాలువను బకింగ్‌హామ్ కెనాల్ అని కూడా పిలుస్తున్నారు. ఇది మద్రాసు వరకు చేరుతుందని తెలుస్తుంది.

కృష్ణానది ప్రాచీన కాలం నుండి బెజవాడ నుండి నదికి రెండు వైపులా పాయలుగా ఏర్పడి కృష్ణా డెల్టా అంతట ప్రవహించిన ఆధారాలు కనిపిస్తున్నాయి. ఆనవాలుగా ఈ నది ప్రవహించిన మార్గాలలో ఇసుక రేవులు, గుండ్రని గుళకరాళ్ళు కనిపిస్తున్నాయి. ఇందుకు నిదర్శనంగా ఈ మధ్యకాలంలో వద్దపూడి వద్ద నిర్మించిన ఓవర్‌బ్రిడ్జినిర్మాణం కోసం తూర్పువైపున త్రవ్వబడిన పునాదులలో పెద్ద ఇసుకరేవు బయల్పడింది. బహుశా ఇది నదీ ప్రవాహానికి చెందిన పూర్వరేవు ప్రదేశం అయి ఉంటుంది. ఇది తూర్పున ఉన్న తుంగభద్రా మెయిన్ కెనాల్‌కు సమీపంలోనే ఉంది. అలానే డెల్టాకి సమీపంలో ఉన్న గ్రామాలలో నీటి బోర్లు వేసే సందర్భంగా భూమి లోపల షుమారు 20-30 అడుగుల లోతులో గరప ఇసుక, నున్నగా ఉన్న గుళకరాళ్ళు బయటపడు తుంటాయి. భూమిలోపల ఉన్న నీటి ప్రవాహ వేగానికి దొర్లుకుంటూ రావటం వల్ల ఇవి నున్నగా మారి ఉంటాయి. కనుక, ఇవి పురాతన కృష్ణాపాయలకు సంబంధించిన ప్రాచీన ప్రవాహ మార్గాలు అయి ఉండవచ్చు. ఇందువల్ల పూర్వం కృష్ణా ప్రవాహాలు ఈ డెల్టా ప్రాంతం అంతటా పాయలుగా చీలి పల్లపు ప్రాంతాలలో ప్రవహించి ఉంటాయని భావింపబడుతుంది. ఇలాంటి కొన్ని ప్రాచీన నదీప్రవాహాలు భూమిలో అంతర్ వాహినులుగా మారి ఉంటాయని భావిస్తున్నాయి.

### కైఫియత్‌ల నిర్మాణం - వీటి సేకరణల వెనుక కల్నల్ కాలిన్ మెకంజీ గారి కృషి :

కనకదండి వారి ఉదంతం మొదటిగా కలెవరం కైఫియత్‌లోనే చేర్చబడి ఉంది. పూర్వం 1811, 1812 సం॥ల కాలంలో కల్నల్ కాలిన్ మెకంజీ గారి ఆధ్వర్యంలో కృష్ణా - గుంటూరు జిల్లాలో ఉన్న గ్రామాలన్నింటినీ గురించిన చరిత్ర,ఇతర వివరాల గురించి కైఫియత్‌ల రూపంలో సేకరించబడ్డాయి. మెకంజీగారికి కావలి వెంకట బొర్రయ్య సోదరులు ఈ కైఫియత్‌ల నిర్మాణానికి ఎంతో సహకరించి నట్లుగా తెలుస్తుంది. వీరి క్రింద నియమించిన గుమస్తాలు ప్రతి గ్రామానికి వచ్చి ముఖ్యంగా కరణాల వద్ద నుండి గ్రామ పెద్దల నుండి కూడా గ్రామాల వివరాలు, దేవాలయచరిత్ర గురించి, పూర్వపు చరిత్రల వినికిడుల గురించి, అప్పటికే మన పూర్వీకులు చరిత్రను రికార్డు చేసిన తాళపత్ర గ్రంథాల రూపంలో ఉన్న కొన్ని యాదస్తులు (గండికోట యాదస్తు) దండ కవిలెం (కొండవీటి దండ కవిలెలు) కూడా వీరు సేకరించేవారు. ఇలా సేకరించబడిన కైఫియత్‌లో ఒకటైన కలెవరం కైఫియత్‌లో ముఖ్యంగా కనకదండి సోమన్నగారి గురించిన వివరాలు సేకరించ బడ్డాయి. ఇప్పటికి వీరి ఉదంతం గురించి ఇవే ముఖ్యమైన ఆధారాలు, అంతేకాక మన కృష్ణాడెల్టా ప్రాంతంలో అనేక గ్రామాల చరిత్రలు కూడా కైఫియత్‌ల రూపంలో సేకరించబడ్డాయి. కనుక, ఈ కైఫియత్‌ల నిర్మాణం గురించి మన చరిత్రకు మహోపకారం చేసిన కల్నల్ కాలిన్ మెంకజీ గారి గురించి తెలుసుకోవలసిఉంది. ఆంగ్లేయులు మన దేశాన్ని 300 సం॥లు పరిపాలించారు. ఇంగ్లాండ్ నుండి వచ్చిన అధికారులలో ఎక్కువమందిమన దేశాన్ని దోచుకున్నవారే. అందులో అతి కొద్దిమంది మాత్రం మన దేశాన్ని, భాషను, సంస్కృతిని గౌరవించి, మన ప్రజలను ప్రేమించారు. అందులో ముఖ్యంగా ఆంధ్రరాష్ట్రానికి మహోపకారం చేసిన సర్ ఆర్థర్ కాటన్, సి.పి. బ్రౌన్‌లాంటి వార్లతో పోల్చదగ్గవారు కల్నల్ కాలిన్ మెకంజీ. ఈయన 1810లో మద్రాస్ ప్రాంత సర్వేయర్‌గా నియమించబడ్డారు. 1816లో భారతదేశం మొదటి సర్వేయర్ జనరల్‌గా కూడా నియమించబడ్డారు. వీరికి స్వతహాగ ఉన్న చరిత్ర అధ్యయనం పట్ల ఉన్న ఆసక్తితో మొదటి నుండి ఆంధ్రప్రదేశంలో ఉన్న గ్రామాల పట్టణాల చరిత్రలను కైఫియత్‌ల రూపంలో సేకరించి, భద్రపరచినారు. 1795 నుండి 1816 వరకు దక్షిణ భారతదేశంలో ఉద్యోగం చేసినప్పుడు, మెకంజీ తాళపత్ర గ్రంథాలు, వ్రాత ప్రతులు 1560 వరకు సేకరించారు. ఇవి కాక అతని సేకరణలో ప్రధానమైనవి (1) స్థానిక చరిత్రలు 2,070(2) శాసన పాఠాలు 8,076 (3) దేశపటాలు 79 (4) బొమ్మలు పెయింటింగ్స్ 2,630 (5) నాణాలు 6,218,(6) శిల్ప చిత్రాలు 106,(7) పురాతన వస్తువులు 40 ఇవన్నీ మెకంజీ తన స్వతం డబ్బు రూ. 15,000/- ఖర్చు చేసి సేకరించారు. మెకంజీ సేకరణలను అతని మరణానంతరం కంపెనీ పరంగా వార్న్ హేస్టింగ్స్ 10,000/- డాలర్లకు కొన్నారు. ఈ సేకరణ లన్నీ మద్రాసు ప్రాచ్యలిఖిత భాండాగారంలో భద్రపరచ బడినాయి. ప్రపంచచరిత్రలో అన్ని చారిత్రక వస్తువులను సేకరించేవారు మరొకరు లేరు. అంతేకాక మెకంజీ కృషి వలనే అమరావతిలో బౌద్ధస్థూపం ఉన్న విషయం వెల్లడయింది. అప్పటికే ఈ బౌద్ధ స్థూపం ఇటుకల కోసం, సున్నం తయారుచేసేందుకు ఆనాటి పాలరాతిపై చెక్కబడిన శిలాఫలకాలు ధ్వంసం చేయబడ్డాయి. ఈ విషయాన్ని తెలుసుకొని 1792లో అమరావతిని మొదటిగా దర్శించిన మెకంజి ఆనాటి రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు వారిని కలుసుకొని ఈ అమరావతి స్థూపం యొక్క ప్రాముఖ్యతను తెలియజేసి, ఈ స్థూపాన్ని రక్షించ వలసినదిగా వెంకటాద్రి నాయుడు గారికి విన్నవించారు. అందుకు జమిందార్ దయతో అంగీకరించారని మెకంజి తెలియ జేశారు.

### కుతుబ్‌షాహీల పరిపాలనా కాలంలో కనకదండివారు అక్కన్న మాదన్నలకు సహాయకులుగా ఉండేవారా?

కనకదండి సోమన్నగారు కుతుబ్‌షాహీలా పరిపాలనలో అబ్దుల్ హసన్ తానీషా సుల్తాన్(1672-1687)గా ఉన్నప్పుడు,వారి ప్రధానులైన అక్కన్న, మాదన్న (1674-1686)లకు పౌరోహితులుగా ఉన్నందువల్ల వీరికి కలెవరం గ్రామం సర్వాగ్రహారంగా కూచిపూడి సమితి జాగీర్

దార్‌గా నియమించబడ్డారు. ది.08-10-1685న హైదరాబాద్ నగరం పై మొఘల్ సేనలు దండెత్తి 8 మాసాల ఘోర సంగ్రామం తరువాత హైదరాబాద్ నగరాన్ని ఆక్రమించుకోవటం,అంతకు ముందు గానే సుల్తాన్‌తోపాటు నాటి ముఖ్య రాజబంధువులు, అధికారు లతో కలిసి సుల్తాన్ గోల్కొండలో ప్రవేశించటం, అదే సమయంలో 16-3-1686న కోటలో అక్కన్న మాదన్నలు హత్య గావించబడటం, వెంటనే కొంతమంది ముస్లీం సర్దార్‌ల దండు గుఝ్జాలపై హైదరాబాద్ నుండి కవెవరంలో ఉన్న కనకదండి వారిపై దండెత్తి వారిని కుటుంబ సమేతంగా హత్య గావించబడటం లాంటి సంఘటనలు జరగటం వల్ల కవెవరం కనకదండివారి చరిత్ర కుతుబ్ షాహీలపాలనలో వారి ప్రధానులైన అక్కన - మాదన్నలతో ముడివడి ఉన్నట్లుగా మనకు తెలుస్తుంది. వీరు కుతుబ్‌షాహీల ప్రధానులకు పౌరోహితులుగానేకాక, హితులుగా కూడా ఉన్నట్లుగా వారికి రాజకీయపరంగా పరిపాలనా పరంగా కూడా కనకదండివారు సహాయపడినట్లుగా భావించబడుతుంది. అందువల్లనే వీరిపై ఆగ్రహంతో అక్కన్న మాదన్నలతో పాటు కనకదండీ వారిని కూడా శత్రువులుగా భావించి, కవెవరం వరకు వచ్చి వారిపై దాడిచేసి కనకదండి వారిని శిరచ్ఛేదనం చేసినట్లుగా, అంతటిలో కనకదండివారి వంశం ఖిలం అయినట్లుగా తెలుస్తుంది.

### ఆనాటి కుతుబ్‌షాహీలనాటి అబ్దుల్ హసన్ తానీషా పరిపాలన, నాటిప్రధానులైన అక్కన్న-మాదన్నల ప్రజాహిత సంస్కరణలు:

1674 ప్రథమపాదంలో మాదన్న ఒక పెద్ద రాజ్యానికి ప్రధాని అయినాడు. పైసా లేని ఖజానా,శాంతిలేని దేశం, యంత్రాంగం లేని పరిపాలన,రాని పన్నులు, భద్రతలేని ఊళ్ళు, కుంటుపడిన పరిశ్రమలు, రాజభక్తిలేని సైన్యం రాజ్యాన్ని అమ్మజూపే అధికారులు. రాజశాసనాన్ని మన్నించని యూరోపియన్ వర్తకులు,శివార్లపైపొంచివున్న మొఘలాయిల ముప్పు వారసత్వాన మాదన్నకు లభించాయి. ఈ మాదన్న ప్రధాని కాగానే ముందు పాడుబడిన గ్రామాలను పునర్ వ్యవస్థీకరించ బూనినాడు. వాపీకూప తటాకోద్యానవనాలు పురుద్ధరించాడు. గౌరవనీ యులైన స్థానికులను వంశ పారంపర్యులగు గ్రామాధికారులుగ నియమించాడు. దేవాలయాలకు, పండితులకు, సైనిధికారులకు తదితర మాననీయులు భూ ఖండాలు, గ్రామాలు, అగ్రహారాలు మాన్యాలు, జాగీర్లు ఇవ్వబడేవి. మాదన్నచే అనేక కొత్త జాగీర్లు, అగ్రహారాలు ఈయబడ్డాయి. అట్లు ఇయ్యబడిన ధర్మశాసనాల్లో అభివృద్ధి కార్యకలాపాలకు సంబంధించిన నిబంధనలు ఉండేది ఈ ప్రజాహిత సంస్కరణలు కాలంలోనే కనకదండి వారికి షుమారు 1674-75 సంవత్సరాలలో కవెవరం సర్వాగ్రహారంగానూ, కూచిపూడి సమతికి జాగీర్‌దార్‌గా నియమించబడ్డారు. దీని బట్టి కనకదండి సోమన్న గారికి కూచిపూడి సమితి జాగీరు ఇవ్వబడిన వెంటనే తుంగభద్రా వరద ముంపునుండి కూచిపూడి సమితి గ్రామాలను, రైతులను కాపాడేందుకు తెనాలికి షుమారు 40 కి.మీ దూరాన ఉన్న సీతానగరం దగ్గర తుంగభద్రా గండిని పూడ్చవలసిన అవసరం ఉందని భావించి,ఎంతో ద్రవ్యం వ్యయం చేసి గండిని పూడ్చేందుకు సిద్ధపడ్డారు. మాదన్న మహా ప్రధాని గారు ప్రజాహితం కోరి వారి హయాంలో చేపట్టిన కొత్త సంస్కరణలో భాగంగానే కనకదండి సోమన్నగారు ఆలోచించి, ఈ తుంగభద్రా ప్రవాహాన్ని సీతానగరం వద్ద పెద్ద కరకట్టలునిర్మించి, కట్టడిచేసేందుకు బహుధనం ఖర్చుచేసి, తుంగభద్రా వరద ప్రవాహాన్ని నివారించి, కూచిపూడి సంతు గ్రామాలకు వ్యవసాయదారులకు మహోపకారాన్ని చేసారు. వరద ఉధృతినిబట్టి ఈ సీతానగరం గండిలో పెద్ద బండరాళ్ళను వేసి, సీసం, సత్తు కరిగించి అప్పటికి ఉన్న అత్యుత్తమ సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించి కరకట్టలను నిర్మించినట్లుగా తెలుస్తుంది. భారతదేశంలో మరే ఇతర చోట్ల 17వ శతాబ్దంలో ఈ విధంగా సీసం, సత్తు లాంటి లోహాలను ఉపయోగించి కరకట్టలను గాని, ఆనకట్టలను కాని నిర్మించిన దాఖలాలు కనిపించవు.

సీతానగరం దగ్గర గండిగుండ తుంగభద్ర ప్రవాహం వరద పేర్కొనబడింది. వరద ప్రభావం అరికట్టుటవల్ల ఈ కూచిపూడి సమితి సస్యశ్యామలమైనదని. తుంగభద్ర ప్రవాహాన్ని అరికట్టుట వల్ల కనక దండి వారు ఖిలమైపోయినట్లు చుండూరు ఖఫియత్‌లో కూడా పేర్కొనబడింది. కనకదండు వారు ప్రభుత్వము చేసేటప్పుడు సీతానగరం దగ్గర కృష్ణాలో పయిలు నష్టంక్రింద వస్తూ వుండేవి గన్కు తుంగభద్ర ప్రవాహం రాకుండా కట్టించి బహు బందోబస్తు చేసి తుంగభద్ర గుప్తగామిని చేసినారు. ఇదే విషయాన్ని కృష్ణానది శాపవశాన తుంగభద్ర గుప్తగామి. అయినట్లు ఆ నాటికి జనశృతిలో ఉన్న పురాణ కథనాన్ని చుండూరు కైఫియత్ ఈ విధంగా తెలియ జేస్తుంది. "యీ లాగ్ను మహాప్రవాహగామియైన తుంగభద్ర మనుష్య ప్రయత్నం చాతను గుప్తగామి కావడాస్కు హెతువు యెమంట్టెం పూర్వం తుంగభద్ర వుత్పత్తి స్థానం నుంచి వచ్చి కృష్ణలో సంగమమై ఒక ప్రవాహంగానే కొంతదూరం వచ్చి సీతానగరం దగ్గరను కృష్ణాతోటే నేను నీతో కూడా సాగర సంగమమయితే నా పేరు ప్రకటన యంత మాత్రం లేకుండా పోతుంది గన్కు నేను యిక్కడి నుంచి ప్రత్యేకంగా

ప్రవహించి సాగర మందు సంగమమవుతాను అని చీలే యడల కృష్ణకు కోపం వచ్చి నీవు పూర్వం నాతోటి కూడా సముద్ర సంగమ మయ్యేటట్టుగా వచ్చి కరారు తప్పితివి గన్కు కొంతకాలాన్కు మనుష్యుల చాత బందించబడి గుప్తగామి అవుదువు గాక అని శపించినది అని ఆ హెతువువల్ల తుంగభద్ర గుప్తగామి అయినది అని చెప్పినారు. మహా ప్రవాహం కట్టుటవల్ల కనకదండివారు వృద్ధి లేకుండా పోయినారు. యీ దేవుళ్ళకు పూర్వం యీ గ్రామంలో వుండే క్షేత్రములు మొగలా యిలతోను హరించ బడినవని తెలియ జేస్తుంది. మన పురాణాల శాస్త్రాలు స్వేచ్ఛావాహిని అయిన నదీ ప్రవాహాన్ని అడ్డుకోరాదని తెలియ జేస్తున్నాయి. ఈ కారణంగా సర్‌ఆర్థర్ కాటన్ గోదావరి బ్యారేజ్ నిర్మాణ సమయంలో అనేక కష్టాలు పడవలసి వచ్చినది. గోదావరి ఆనకట్ట నిర్మాణానికి పునాదులు త్రవ్వేందుకు భయపడి కూలీలు ఎవ్వరూ రాలేదు. తరువాత ఎన్నో ప్రయాసలు పడి బ్యారేజి నిర్మాణపు పనులు లేటుగా ప్రారంభించబడినవి అని కాటన్ చరిత్ర తెలియజేస్తుంది.

కనకదండివారి గురించి, జనశృతంగా కఠెవరంలో ఇప్పటికి చెప్పుకుంటారు. పూర్వం 50 సంవత్సరాల క్రితం మాచాలమాల కంచర్ల ఎఱ్రసుబ్బయ్యపూర్వం ఈ ప్రాంతాన్ని కనకదండోరు పరిపాలించారని, హైదరాబాదు నుండి సాయిబులు ఇక్కడికి వచ్చి కనకదండి వారిని చంపివేసి, ఆడచెర పట్టారని, అప్పుడు ఆడవారందరూ నగలతో సహా బావిలోకి దూకి చనిపోయారని నాతో చెప్పేవారు. కనుక కైఫియత్ పేర్కొన్న కనకదండివారి ఉదంతం, జనశృతిలో ఉన్న కనకదండివారి గురించి ఉన్న స్మృతులను బట్టి ఇది యదార్థగాథగా భావించ బడుతుంది.

అక్కన్న, మాదన్నల మేనల్లుడు కంచర్ల గోపన్న భద్రాచలం తహశీల్దారుగా ఉన్నారు. వీరు తహశీల్దారు పనిచేయు చున్నప్పుడు భద్రాచలంలో రామాలయం నిర్మించి, 6 లక్షల ప్రభుత్వ ధనం ఖర్చు చేసినందుకు ఖైదు చేయండి, గోల్కొండ కోటలో బందీగా ఉన్నారు. అప్పటికీ అక్కన్న మాదన్నలు తానీషా మంత్రులుగానే ఉన్నారు. తరువాత తానీషా గోపన్నను విడిచిపెట్టటం జరిగింది. కనకదండి సోమన్నగారు కంచర్లగోపన్న గారు సమకాలీనులుగా తానీషా ప్రభుత్వంలో ఉన్నతో ద్యోగులుగా నియమించబడి అక్కన్న మాదన్నలకు ముఖ్యులుగా ఉన్నారు. ఇద్దరూ దేవాలయ నిర్మాణాలు సాగించారు. కంచర్లగోపన్న చరిత్రలో ఏమైనదీ తెలియదు కానీ, రామదాసుగా కీర్తించబడినాడు. ముస్లింల పరిపాలన కాలం నుండి భద్రాచలం రాములవారికి ఇప్పటికీ ప్రభుత్వం నుండి తలంబ్రాలు పంపించబడుతున్నాయి. కానీ కనకదండివారి చరిత్ర కనుమరుగై పోయింది. వీరు కృష్ణానదికి సీతానగరం దగ్గర గండికి అడ్డుకట్టవేసిన కూచిపూడి సమితి గ్రామాలేకాక సీతానగరం నుండి నిజాంపట్నం వరకు ఉన్న గ్రామాలను వరదప్రమాదం లేకుండా నివారించి ఈ ప్రాంతాన్ని సస్యశ్యామలం చేసినట్లు కఠెవరం కైఫియత్ తెలియజేస్తుంది.

17వ శతాబ్దంలోనే తెనాలి ప్రాంతానికి ఎంతో మేలు చేకూర్చిన కనకదండి సోమన్న గారిని అందరు మర్చిపోయారు. గోదావరీ జిల్లాలకు సర్ ఆర్థర్ కాటన్ కృష్ణాతీర ప్రాంతానికి కనకదండి సోమన్నగారు ఒక అపర భగీరథుడే. మన తెనాలి డెల్టా ప్రాంతానికి తన స్వంత సొమ్ముతో నిస్వార్థంగా ఈ ప్రాంత గ్రామాల రక్షణకు, రైతుల క్షేమం కోరి, సీతానగరం వద్ద కృష్ణా కరకట్టల నిర్మాణాలను గావించి, ఇప్పటికి 340 సంవత్సరాలకు పూర్వమే కృష్ణా తీరంలోని గ్రామాలకు, ప్రజలకు ఎనలేని మహోపకారం చేసిన కనకదండి వారిని ఈ కృష్ణా పుష్కరాల సందర్భంగా స్మరించుకోవలసి ఉంది. కుతుబ్‌షాహీల చరిత్రలో అక్కన్న, మాదన్నలతో పాటు కనకదండివారు సంస్మరణీయులే.

**రిఫరెన్సులు :**


1. కొండవీటి దండకవిల – కొండవీటి సీమ.
2. తెనాలి, గోవర్ధనస్వామి దేవాలయంలో ఉన్న శాసనం పాఠం.
3. కఠెవరం కైఫియత్, గుంటూరు జిల్లా కైఫియత్‌లో 5వ భాగం.
4. ది ఓల్డ్ కృష్ణాడిస్ట్రిక్ట్ మాన్యువల్ ఆఫ్ మద్రాస్ ప్రెసిడెన్సీ, జి. మెకంజీ.
5. మహా మంత్రి మాదన్న, కొమరగిరి వెంకటగోపాలరావు.
6. కల్నల్ కాలిన్ మెకంజీ, జానుమద్ది హనుమశాస్త్రి.
7. దుగ్గిరాల, కేశవస్వామి వారి దేవాలయంలో ఉన్న శాసనం.
8. కె. వెంకటేశ్వరరావు గారి వద్ద నుండి స్వీకరించిన సమాచారం.
9. కఠెవరం గ్రామంలోని జన శృతులు.
10. లక్కరాజు కృష్ణమూర్తి గారి నుండి స్వీకరించిన సమాచారము.


*చిరునామా : **కడియాల మురహరిరావు,** ఔత్సాహిక పురావస్తు పరిశోధకుడు, తెనాలి (మం), కఠెవరం.*

శ్రీ వేటూరి ఆనందమూర్తి

# కృష్ణా జిల్లా కైఫియతుల పరిశీలన

ఆకిరిపల్లి, బందరు, కేసర వివరాలు గల కృష్ణాజిల్లా కైఫియతు డా॥ హెచ్. రాజేంద్రప్రసాద్‌గారి ఆధ్వర్యంలో శ్రీజాన్ అక్కిదాస్‌గారి కృషిమూలంగా 1990లో వెలువడింది. ఆంధ్రప్రదేశ్ రాజ్య అభిలేఖా గారంవారు దీన్ని ఆనాడు 200 ప్రతులు మాత్రమేప్రచురించారు. దానిని కృష్ణా (జిల్లా) మహోత్సవాల సందర్భంగా పునర్ముద్రించి పరిశీలించ వలసిన ఆవశ్యకమున్నది. ఈ కైఫియత్తులోని కథలు గాథలూ; పాలెం, పల్లి, ఊరు, వాడ అంతాలుగాగల ఊళ్లపేర్లూ, వ్యక్తినామాలూ, ఇంటి పేర్లూ, పంటలూ పైర్లూ ఖనిజాలు; వృత్తులూ,ఆలయాలూ, ఉత్సవాలు, పరగణా వగైరా భౌగోళిక వివరాలూ. చరిత్ర, శాసనాలూ మొదలైన అంశాలూ అన్నీ కూడా పరిశీలనకు ఆసక్తికరములైనవే. ఇవి మన ప్రాంతీయ భౌగోళి కాంశాలను, చరిత్రను, పుట్టుపూర్వోత్తరాలనూ అన్వేషించాలను కొనేవారు తప్పక పరిశీలింపవలసినవి.

ఆకిరిపల్లి– శోభనాచలస్వామివారి స్థలప్రభావము బ్రహ్మాండ పురాణోక్తమనీ, కృతాది చతుర్యుగాలలో ఈ ప్రాంతానికే శుభగిరి, కల్యాణాద్రి, శోభనాచలం, శోభనగిరి, అనేవి నామాంతరాలనీ ఉన్నవి. పర్వతానికి పావు క్రోసు దూరాన గలది గనక 'ఆగిరిపల్లి' అనీ, స్వామి వారు వరాహరూపమెత్తి త్రవ్వించిన పుష్కరిణి గలది గనుక ఆకిరిపల్లి అనీ గ్రామనామానికి జానపద నిరుక్తి చెప్పబడినది. ఇక్కడున్న వెంకటా చల స్వామివారు నవీన ప్రతిష్ఠ అనీ, రాజావెంకటాద్రి అప్పారావు బహదరుగారు కోవెలకత్వం వహించారనీ కలదు. గోపాలస్వామి వారి ఆలయాన్ని భాగవతులసర్వన్నగారు కట్టించిరనీ నవీనప్రతిష్ఠ అనీ వార్త. అలాగే దిగువ తిరుమలలో లక్ష్మీనరసింహ స్వామివారి ప్రతిష్ఠ చేయించినవారు ఆవులమరల్లి వెంకటకృష్ణునిం గారు, పైడిమర్రి దమ్మన్నగారు స్వయంవ్యక్తమైన మల్లేశ్వరస్వామివారి ఆలయాన్ని పునర్నిర్మించినట్లు తెలియుచున్నది. గ్రామంలోని మరో శివాలయంలో కాశీనుండి లింగాన్ని తెప్పించి దారులైన దేవులపల్లి వెంకటనర్సుగారు ప్రతిష్ఠ చేయించగా పైడమర్రి దమ్మన్నగారే ఆలయాన్ని కట్టించారట. ఇవి అన్నీ నవీన ప్రతిష్ఠలనీ 17వ శతాబ్ది తర్వాతి కాలానికి చెందినవనీ కైఫియము అందిస్తున్న సమాచారం. కనుక దాళ్లపాక వారివిగా గుర్తింపదగిన శోభనగిరీశుని మీది పదాలొకటి రెండు అర్వచీనమైన శోభనగిరికి చెందినవికాక ప్రాచీనమైన మంగళగిరికి (శోభన గిరికి పర్యతనామం)చెందినవిగా భావించవలసియున్నది. ఇవికాక శోభనగిరి ముద్ర గల పదాలు కొన్ని విడిగావున్నవి.వాటికర్త ఎవరో 17వ శతాబ్ది వారో తరువాతివారో అయియుండవలెను.

శుభవ్రతుడనేరాజు తపస్సు ఫలించి శివకేశవులిద్దరూ విడిది చేసిన ప్రదేశమే శోభనాద్రి అని కైఫియతులో కలదు.

శ్రీమద్భాగవత కైంకర్యపరాయణులైన దేవులపల్లి వెంకటనర్సు (భాగవతులు) గారికి వెంకటాద్రి అప్పారాయనింగారు అగ్రహారం చేయించి యిచ్చిన బందులో వున్నది. వాటి వివరాలు సరిహద్దులు కలవు. వాటిలో వెంకటకృష్ణమ్మ చెరువు, చిన్నతోటపల్లె తోట, అల్లడుచుకుంటకట్ట, శింగనగూడెం, కర్మికట్ట, అమ్మవారిగూడెం, నులినీడుకట్ట, దేవగాంధారిచేనం, కణగివాగు, వగైరాపేర్లున్నవి. ఈ స్థలానికి రాశిదారులయిన దేవులపల్లి అచ్యుతభాగవతులు హోమం శాసనాలు వ్రాయించుకొన్నారు. తురకల ప్రభుత్వం కారణంగా వారు దేశాంతరం వెళ్లి అక్కడే కాలధర్మం చెందగా, తదుపరి భాగవతులుగారి అన్నమనుమలు, కుమాళ్లు వచ్చి కాపురమున్నారు. రాజారామచంద్ర అప్పారావుగారు ఏనుగులు కట్టవేయించడానికి త్రవ్వుతుండగా ఆ స్థలంలో రెండు రాగిశాసనాలు లభించినవనీ వాటిని చదువనీయకుండా నూజివీడువంటి పుచ్చుకొని పోయినాడనీ కలదు. ఆ రాగి శాసనాలెట్టివో విచారించి పరిశీలింపవలసి యున్నవి.

ఆకిరిపల్లి శ్రీ శోభనాచలస్వామివారి ప్రథమోత్సవాలు క్రీ.శ. 1795లో జరిగినట్లు ప్రమాణపత్రము కలదు.

అక్కడి వృత్తులు అనుభవిస్తూ వుండిన బ్రాహ్మణుల పేర్లు, ఇంటి పేర్లు వివరాలతో వున్నవి.వీరిలో కరిపెద్ది,కనకదండి, కంభమెట్టు,

కొంపెల్లి, కొలిచిన, కూనపులి, గరికపాటి, గుంటూరు, గొట్టిముక్కల, గుడిపూడి, దోర్బల, వేదుల, రాయప్రోలు, శనగవరపు, భావి, పయిడిమర్రి, దేవులపల్లి, పన్నాల, పిల్లుట్ల, మద్దిరోల, సూరి, సుసర్ల, దోమకొండ, చల్లా, బొమ్మకంటి, చాడ, సూరవరపు, మేడేపల్లి, మన్న, కొన్నూరు, తిరుగరి, సాతులూరి, నండూరి, వగైరా ఇంటి పేర్లున్నవి. వైఖానసులు, శివార్చకులు, కళావంతులు, చాకల, వెలంగల, వెట్ట, వీరముష్టి, కుమ్మరి కమ్మరి వగైరా శాఖల, వృత్తుల పేర్లున్నవి.

స్వామివారి విశేష ఉత్సవాలలో కార్తీకమాసం కల్యాణోత్సవాలు, కావత్సరాది ఉత్సవం, శ్రీరామనవమి, తిరునక్షత్రాలు, రాజ్యలక్ష్మయ్య వారి తిరునక్షత్రం. నరసింహ జయంతి,వైశాఖోత్సవం, పవిత్రో త్సవం, శ్రీకృష్ణజయంతి, నవరాత్రి మహోత్సవం విజయదశమి, ధను ర్మాసోత్సవం, డోలోత్సవం, నరకచతుర్దశి, వగైరాలు ప్రస్తావనలున్నవి.

వెంకటాచలస్వామివారి తిరుకల్యాణం జరిపే మంటపమును వెంకటాద్రి అప్పారావు బహదరుగారు కట్టించిరి. చక్రవారి ఉత్సవానికై పుస్కరాశిలో మంటపాన్ని మల్కికాని బుచ్చయ్యగారు కట్టించిరి.

రాజా వెంకట నరసింహ అప్పారావు జమీందారుగారి దివాను చంద్ర రాజుకామయ్యగారు శోభనాద్రికి దక్షిణాన గల తిప్పమీద పాళెగిరిపల్లెలో ఈ విధంగా ఆగిరిపల్లిలోని శివవిష్ణుదేవస్థలాలు, ఉత్సవాలు, మంటపాలు, నాలుగు దిక్కులాగల దారులు, అక్కడినేలలు, పండేధాన్యాలు, దొరికే ఖనిజాలు, ఉత్సవాలకు కుంఫిశీవారిచ్చే మామూలు చదివింపులు వగైరా విశేషాలన్నీవున్నవి. ఈ కైఫియతు ఆకిరిపల్లిలో జూన్ 20వ తేదీ 1816లో వ్రాయడమైనది. దేవులపల్లి సుబ్బయ కులకర్ణి, భాగవతుల గర్వప్ప సాక్షి సంతకాలున్నట్లున్నవి. ఇలాగే బందరు; కీసర కైఫీయతులును పరిశీలనార్హములు. అవి యిందు పునర్ముద్రితములవుతున్నవి గనుక వాటిని పాఠకులు చదివి తెలుసుకోగలరు. ఒకటి రెండు విశేషాలను మాత్రము ప్రస్తావించి ఈ పరిశీలన ముగిస్తాను.

బందరు సమీపంలోని చాలాప్రాంతాలు ఉప్పెనలు వంటి ఉప ద్రవాలు కారణంగా ఎలా మేటలు పడినవో, మిగిలిన వేవో, పోయిన వేవో వాటిని బట్టి తెలుసుకోవచ్చును. అంధకుని కథలోని చారిత్రక అవశేషాలను గుర్తింపవలసివున్నది. ఆనీసుపేట, మల్కిపట్నం, ముస్తాఖాన్‌పేట, ఖోజ్జల్లిపేట, ఫకరులాబాద్, ఇంగిరీజుపాలం, పరాసుపేట, వలందపాలెం, టర్భలీపేట, ఒకసుపేట, రాబర్ట్సన్‌పేట, లంకలు, దీవులు వగైరా పేర్ల పుట్టుపూర్వోత్తరాలు పరిశీలింపదగినవి. అట్లే బందరు సర్కారు కిందవుండిన పరగణా, కసుచా, నువ్వుంజె గ్రామాదుల వివరాలు నాటి చారిత్రక భౌగోళిక పరిస్థితులను కనుల గట్టించగలవు. ముఖ్యంగా తుమ్మిది, దేవరకోడి, పడన, దివి, ఇక గోదుమ పరగణాల పరిశీలనం ఆసక్తి కరము. బందరు మచిలీ పట్టణములోని కలంకారీ బట్టలు చేసే విధము, అంబరభా అనే తరహాబట్ట,మదరసీ తరహాబట్ట, ఖానాబంది తరహా బట్ట, మోహరాతు తరహాబట్ట, బుటేదారు తరహాబట్ట, కేసు తరహాబట్ట, లభకుజమీను, పలంగ్‌పోష, సూదని, మార్చెజమీను, కజాకుజమీను, చోడదరునూళ్లు జమీను, బరయిబాబు లూమీను, మోహరాత్‌బమీను, ఇంకా పాగాలూ, చీరెలు, నాటిధరవరలు అన్నీకూడా పరిశీలించి తెలుసుకోదగినవే. బందరు కలంకారీ పరిశ్రమ17, 18 శతాబ్దాల లోనే ప్రపంచ ప్రఖ్యాతి కెక్కిన వైనాన్ని బర్నార్డెన్‌దె సేంపియర్ అనే ప్రఖ్యాత ఫ్రెంచి నవలా కారుడు తన "పాల్‌అండ్ వర్జినీ"అనే నవలలో ప్రముఖంగా చిత్రిస్తాడు- ఈ కలంకారీ బట్టలు ఆ నాళ్లలో ఎగుమతి పై మారిషసు పురవీధు లలో అమ్మకాలు జరుగుతూ వుండినట్లు ఆయన ఉటంకించినాడు. ఇది ఆంధ్రుల చేనేతవృత్తి కెత్తిన పతాక. గొడుగుపేట వివరాల నందిస్తూ శాంతమల్లేశ్వరస్వామి ఆలయంలో వుండిన శిలాశాసనం జాడలేకుండా గైబు అయిన వైనాన్ని వివరిస్తూ "దాని నకలుకునకలు యిందులో వ్రాయడమైనది" అని పేర్కొన్న దాని జాడా మనకు తెలియరాకున్నది. అలాగే కళ్లేపల్లి దుర్గనాగేశ్వరస్వామివారి ఆలయంలో వుండవలసి రెండు శిలాశాసనాలు బందరుచేరి అక్కడి ఏకామ్రేశ్వర స్వామివారి ఆలయ గర్భగృహద్వారానికిరుప్రక్కల నిలుపబడినట్లు ఈ కైఫయత్తు అందిస్తున్న సమాచారము. వీటిని పరిశీలించి, వీలైతే సేకరించి, శాసన పాఠాన్ని పరిశీలించి, యధా స్థానానికి చేర్చే యత్నం స్థానికులు చేయదగుదురని సూచిస్తున్నాను.

ఈ లఘువ్యాసానికి ముగింపుగా శోభనగిరి ముద్రగలకోటి రెండు అనుగ్రత పదాలను తంజావూరు వ్రాత ప్రతులనుండి 1958 లో నేను సేకరించిన వాటినిక్కడ ప్రకటిస్తున్నాను.

(D.No:465/B.No.11658)

**శంకరాభరణం - అటతాళం**

**నీకక్కడ వేసినంత - నిద్దురగాచితినో**

**వావినీముఖమెల్ల - వాడియున్నది**

**ఆవలింత వేటికయ్యానీయలసట తీరురాక**

**వోవరిలోపల నిద్దుర - బోవయ్యచాలును ॥చ॥**

**అన్నిపనులు వెనకనైతే నవుగాని**

**అన్నుదీరజలకము లాడవయ్య చాలును ॥పల్లవి॥**

**వేడరక నీవెవ్వరి - వీథులకేగితివో**

ఆకలనీ దేహమెల్లా - అలసి యున్నది

వేకటలేమిటి కయ్యా నీవేనట తీరుదాక

వేసి (చి) పాన్పుపై పవ్వళించవయ్యా చాలును ॥చ॥

యిక్కువ దేవికి నీవెవ్వరెను గలసితివో

దక్కిశోభన గిరీశ - దగగొంటివి

అక్కడి సొలపు దీరనా - యధరమిచ్చేగాని

వొక్కటైరతుల గూడి - వుండవయ్యా చాలును ॥అన్ని పనులు॥

(ఈశ్వగారు పదాన్నే పూర్వం నా తాళ్లపాక కవుల పదకవితలు" (1976 - పుట307) గ్రంథంలో తాళ్లపాకకవుల రచనగా మంగళగిరి స్వామిపరంగా అన్వయించి ప్రకటించాను. ఇలాంటి శోభనగిరి పదాలు క్షేత్రయ్య రచనలుగా భావింపదగునన్న డా॥ రజనీకాంతరావుగారి సూచన పరిశీలనార్హము.

పంతువరాళి - ఆదితాళం

ఏనుమంచిదానగాగ - యీతప్పుమన్నించితిగాక

మానునా తక్కినయింతి - మదనగోపాలుడా ॥పల్లవి॥

వెచ్చివెచ్చిదిరుగోచు - వినయమే పచరించి

మచ్చికసేయనే - మనసౌనే

మెచ్చుపొగడేనాని - మేలములకు నే

వెచ్చనవుదునని - వెరాపొగాని ॥పల్లవి॥

ఆటల శోభనగిరి - యయ్యనింకొకపరి

మాటునగూడనే - మన సౌనే

గాటంపు (దమి) సెంజి? వెంకటరాయని బలు

కూటములకు నే - గొంకేగాని (ప.41)

కేదాగరగౌళ - అటతాళం

నెలత వుపరతి సీయునిబ్బరమున ॥(పల్లవి)

గట్టిగుబ్బలపాదు - కదలి కదలాడంగ

పెట్టుకున్న ముత్తేల - పేరులూగ

చిట్టకపుసేతల - చెలియనటించగా

మట్టుగా అపరంజి - మణిగినట్లుండె ॥నెలత॥

కొండికపాయపు నడుము - గునిసి గునిశాడగా

మెందుగా గళరవము - మెరయగాను

అండ వేడుకశోభ - నాద్రీశు మేనిపై

బందు జిగురున దగులు - పక్షివలె నుండి ॥నెలత॥

---

**రాయప్రోలు సుబ్బారావు**

'లలిత' కావ్యరచన రమణీయముగఁజేసి
'తృణకంకణమ్ము'తో తేజరిల్లె
'స్నేహలతా'దేవి చిత్తమ్ము నెఱిగించి
అర్షవైభవదీప్తి నమరఁజేసె
'మాధురీ దర్శన' మహిత 'రమ్యాలోక'
కావ్యాల రసదీప్తి ఘనతఁజాటె
తేటతెనుగునందు దేశభక్తినిఁజాటి
నవ్యకవనరీతి నడవఁజేసె
వివిధ గతుల యందు నవలీల కవితల
నందఁజేసి మనకు విందుఁగూర్చె
సరస భావములకు శరధి'రాయప్రోలు'
కీర్తి కళల రాణి! కృష్ణవేణి!

*స్మితశ్రీ చింతపల్లి నాగేశ్వరరావు*

శ్రీ లంక వెంకటరమణ

# కృష్ణా మండలంలో ఆంగ్లేయుల రవాణా వ్యవస్థ

"ఆకలి ఉన్నచోట అభ్యుదయం ఉండదు. శాంతి, భద్రత ఉండదు. అసలు సామాజిక వ్యవస్థ సుస్థిరత కోల్పోతుంది. నేడుమనం ఈ సత్యాన్ని గుర్తించి, దేశాన్ని సంపద్విలసితం గావించే పనులు చెయ్యాలి. ప్రజలకు ముందు తిండి అవసరం. వాళ్ళకు తిండి పెట్టలేక పోతే దేశంలో మన వర్తక వ్యాపారాలు వృద్ధి చెందవు. కేవలం మన వాళ్ల దేముళ్ళ బొమ్మలతో అచ్చొత్తించే నాణాలు వారి విశ్వాసాన్ని చూరగొనడానికి మాత్రమే ఉపయోగపడతాయి. వాళ్ళ ఆకలి దప్పులు తీరకపోతే నష్టపోయేది రాజ్యమే. అప్పుడే అక్కడ తీవ్రమైన కరవు కాటకాలు తాండవిస్తున్న కారణంగా ఉత్పత్తులు పడిపోయాయి. అక్కడ మన ఫ్యాక్టరీలు అన్నీ మూతపడే స్థితిలో ఉన్నాయి. ఇండియా మనకు వ్యాపార, వర్తకాల రీత్యా భారమై పోయింది. దానిపై మన ఆధిపత్యం మాత్రం చేజార్చుకొన కూడదు. బ్రిటిష్ పార్లమెంటుకు అప్పగించక తప్పదు. ఎప్పటికైనా తప్పదు. మనచేతులు ఇంకా బాగామురికి కాక మునుపే కడుక్కోవడం సులభం. ఈవాస్తవాన్ని పాలకవర్గం గ్రహించడం మంచిదని ప్రార్థిస్తున్నాను".

ఇది 1830లో లండన్‌లో జరిగిన ఈస్టిండియా కంపెనీ వార్షిక సమావేశంలో రహస్య కమిటీ సమర్పించిన నివేదిక సారాంశం. నిజానికి అప్పటి మెద్రాస్ ప్రెసిడెన్సీలో కంపెనీ వ్యాపారం దాదాపుగా స్తంభించిపోయింది. మచిలీపట్టణం, నరసాపురం, కోరంగి, భీముని పట్టణం రేవులు నామమాత్రంగా పనిచేస్తున్నాయి. ఒక విధంగా మూత పడ్డాయి. వాళ్ళ ఆఫీసులు మాత్రం పనిచేస్తున్నాయి.

ఈ రేవులు మూతపడేసరికి, యార్లగడ్డ, ఆకుల, దేసువారి కుటుంబాలు దాదాపుగా చితికిపోయాయి. వ్యాపార లావాదేవీలలో వారికి ఇవ్వవలసింది ఇవ్వక కంపెనీ చాలా ఇబ్బందులు పెట్టింది. సరకు సప్లయి చేసినవాళ్ళు ఊరుకోలేదు. ఈ స్థితిలో కృష్ణా మండలానికి చెందిన ఈ కుటుంబాలకు ఈస్టిండియా కంపెనీ పెద్ద మొత్తాలే చెల్లించవలసి ఉన్నప్పటికీ ముందుగా తమకు ఇవ్వవలసిన బాకీలు ఇచ్చితీరాలని ఇరకాటానపెట్టాయి. కొన్ని కుటుంబాలైతే ఐ.పి. పెట్టే శాయి. కృష్ణా మండలానికి చెందిన ఈ కుటుంబాలు బందరు, నరసాపురం, కోరంగి రేవులనుంచి వస్త్రాలు, తోళ్లు, పడవలు కట్టే మోకులు, సురేకారం, రొయ్యలు, రకరకాల రసాయనాలు, ప్రత్తి ఇంకా పలు ఉత్పత్తులు ఎగుమతి చేసేవి. మొత్తంమీద ఈస్టిండియా కంపెనీ ఈ కుటుంబాలను పీల్చి పిప్పిచేశాయి.

18వ శతాబ్దం కృష్ణా మండలానికి భయంకరమైన పీడకల లాంటిది. కరవు కాటకాలు, అంటురోగాలు వరదలతో ప్రకృతి విలయ తాండవంచేసింది. బ్రిటీష్ పాలనకే చివరి రోజులు దగ్గర పడ్డాయి. తమ ప్రభుత్వం నెరపడానికైనా ఈ మండలాన్ని అభివృద్ధి పర్చడం అవసరమని కంపెనీ గుర్తించింది. గోదావరి జలాలు వృథాగా సముద్రంలో కలసిపోతున్నాయి. అలాగే కృష్ణా జలాలు కూడా. ఈ మహా ప్రవాహానికి అడ్డుకట్టవెయ్యాలి. నీరు నిల్వచేసి క్రమపద్ధతిలో కాల్వల ద్వారా విడుదలచేస్తే ఈ రెండు జిల్లాలు సిరిసంపదలతో తులతూగుతాయి. ప్రభుత్వ ఆదాయం పెరుగుతుంది. దేశంలో రాజకీయ సుస్థిరత చేకూరుతుంది. ఈ సంకల్పం తోనే ఈ రెండు డెల్టాలను అభివృద్ధి పరచడానికిగాను ఆనకట్టలు నిర్మించదలచి బాధ్యతలను సర్ ఆర్థర్ కాటన్‌కు అప్పగించింది. కాటన్ ఆధ్వర్యంలో ధవళేశ్వరంలో ఆనకట్ట నిర్మాణం జరిగింది. గోదావరి డెల్టా అనతి కాలంలోనే సౌభాగ్యసీమ అయింది.

ధవళేశ్వరంలో ఆనకట్ట నిర్మాణం పూర్తి అయిన వెంటనే విజయ వాడలో కృష్ణానదిపై ఆనకట్ట నిర్మాణం ప్రారంభమైంది. అయితే నిర్ణయం ఆకస్మికంగా జరగలేదు. నిర్మాణం 1852లో ప్రారంభమైనా సర్వేలు, నివేదికల కథ వంద సంవత్సరాలపాటు జరిగినా, ఈ బృహత్తరమైన నిర్మాణానికి కేవలం మూడు సంవత్స రాలే పట్టింది. 1852లో ప్రారంభించి 1855లో పూర్తిచేశారు. అప్పటి నుంచి కృష్ణాడెల్టాపంట పండింది. భోగభాగ్యాలతో అనూహ్యంగా వృద్ధి చెందింది. ఆంధ్ర దేశానికి కృష్ణా మండలం ధాన్యాగారమైంది.

అవసరాలు తీరగా మిగులు పంటలతో వర్తక వ్యాపారాలు వృద్ధికావడం మొదలైంది. జలమార్గాలు అనివార్యమయ్యాయి. ఈ జలమార్గాల వినియోగానికి అపారమైన చరిత్ర ఉంది. పుట్టీల మీదుగా

సరకు దాటించి బళ్లకీ సరకులు రవాణా చేసేవారు. ఆ విధంగా ప్రాచీన కాలంలోనే కృష్ణామండలం నౌకా వాణిజ్యంలో ఘనకీర్తి సంపాదించుకొన్నది. ఘంటసాల, మచిలీపట్టణం, పోతార్లంక, మోటు పల్లి, వాడరేవుల నుంచి రోమ్, ఇటలీలాంటి దూర దేశాలతో వాణిజ్యం జరిగింది. ఇది అస్పష్టమైన చరిత్ర.

13వ శతాబ్దంలోను, అంతకు ముందు కూడా కృష్ణామండలం మీదుగా అయిదు వాణిజ్య మార్గాలు ఉండేవి. వీటిని జాతీయ రహదా రులనవచ్చు. కంచి నుంచి ఉత్తరాదిలోని అయోధ్యకు, మహారాష్ట్ర నుంచి మద్రాసుకు, నెల్లూరు నుంచి కలకత్తా, బెజవాడ మీదుగా నెల్లూరు నుంచి హైదరాబాద్ వరకు రహదారులు ఉండేవి. 13వ శతాబ్దంనాటి కేతన మంత్రి 'ఆంధ్రభాషాభూషణం' కావ్యంలో కంచి నుంచి నెల్లూరు, బెజవాడ, వరంగల్లు మీదుగా ఒక వాణిజ్య మార్గ మున్నట్టు వ్రాశాడు.

శ్రీనాథ మహాకవికూడా తన 'పల్నాటి యుద్ధం కావ్యంలో ఆనాటి వర్తక వాణిజ్యాలగురించి చెప్పాడు. ఏలూరు నుంచి మోటు పల్లికి మొత్తం వేంగిదేశంలో ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతా నికి సరకులను రవాణా చేసే వర్తక బృందాలు బెజవాడ మల్లేశ్వరుని దర్శించుకొని కానుకలు సమర్పించు కొని మోటుపల్లి రేవు చేరేవని వ్రాశాడు.

బెజవాడ కేంద్రంగా తెలిక కులస్థులు ఒక సంఘంగా ఏర్పడి 14వ శతాబ్దంలో చేసుకొన్న ఒప్పందాలు ఆనాటి సామాజిక కట్టు బాట్లకు ఎలా దర్పణంగా నిలచాయో తెలిపే శాసనాలు విజయ వాడలోఉన్నాయి. వారు తమవ్యాపారంలో కొంతవాటాను బెజవాడ మల్లేశ్వరస్వామికి కానుకలుగాసమర్పించారు.బెజవాడ, రాజమండ్రి మధ్య తెలిక కులస్థుల గ్రామాలు చాలా ఉండేవి. ముఖ్యంగా కృష్ణా జిల్లా తేలప్రోలు ప్రసిద్ధి చెందిన తెలిక కులస్థుల గ్రామం. తిలలతో, (లేదా) తైలంతో-అనగా నువ్వులు, నువ్వుల నూనెతో వ్యాపారం చేసేవారి కుటుంబాలు అధికంగా ఉన్న గ్రామం కనుక తేలప్రోలు అయింది. సిరిసంపదలతో తులతూగిన ఆ గ్రామస్థులలో కొందరు తమ సంపదలో కొంత భాగాన్ని సత్రాలు, విద్యాలయాలు మున్నగు వాటిని నిర్మించడానికి వెచ్చించేవారు. అలా ఆ గ్రామానికి చెందిన కొందరు వదాన్యులు కృష్ణాజిల్లా అవనిగడ్డలో ఒక సత్రం నిర్మించినట్టు తేలప్రోలులో శాసనం ఉన్నది.

క్రీస్తుకు పూర్వం 2వ శతాబ్ది నుంచి 14వ శతాబ్దం వరకు అనగా దాదాపు 1400 సంవత్సరాల పాటు ఎన్నో ఒడుదుడుకులు ఎదురైనా విదేశీ వాణిజ్యం కొనసాగింది. అటు తరువాత మన వాణిజ్య పతాక అవనతమైంది. అందుకు అనేక కారణాలున్నాయి.

కృష్ణానదిపై ఆనకట్ట నిర్మించిన తరువాత రవాణా మార్గా లకు కృష్ణానది అవరోధమన్న సమస్యతీరిపోయింది. అప్పటి వరకు కేవలం నదీమార్గాలే రవాణా మార్గాలుగా ఉండేవి. కృష్ణా కాలువలు అటు సేద్యానికి, ఇటు సరకుల రవాణాకు, ప్రయాణాలకు కూడా మార్గాలయ్యాయి.

కృష్ణా మండలం దశవిదశలను పరిపోషించుకొంటూ అభ్యు దయ పథంలో పురోగమిస్తున్న దశలోనే భారతీయ రైల్వేలు కూడా వృద్ధి చెందాయి. 1890లో బెజవాడ దగ్గర కృష్ణానదిపై రైలువంతెన నిర్మించడంతో జిల్లా ఆర్థిక, సామాజిక స్వరూప, స్వభావాలే మారిపోయాయి.

బెజవాడ వద్ద కృష్ణానదిపై రైలువంతెన నిర్మించక ముందు మద్రాసువైపు నుంచివచ్చే రైళ్లన్నీ కృష్ణాకెనాల్ స్టేషన్ దగ్గర ఆగిపో యేవి. అక్కడ రైలుమార్గం రెండుగా చీలింది. ఒకటి తెనాలివైపు కాగా మరొకటి గుంటూరువైపు పోయేది. నదికి ఇవతలవైపు అనగా బెజవాడవైపు నుంచి మద్రాసువైపుగాని, గుంటూరువైపుగాని సరుకులు రవాణా కావడానికి పడవల మీదుగా చేర్చేవారు. 1890కి పూర్వమే ఆనకట్ట ఉన్నది కనుక కాలినడకన ఆనకట్ట మీదుగా అవత లకు చేర్చేవారు. అయితే ఎడ్లబండ్లు అనుమతించే వారు కాదు కనుక సరుకులను పడవలమీద చేరవేసేవారు.

బెజవాడకు సరాసరి రైలుమార్గం లేకపోవడం వర్తక వ్యాపా రాల అభివృద్ధికి అవరోధం అవుతున్నదని ఆనాటి బెజవాడ, బందరు, గుడివాడ తదితర ప్రాంతాల పెద్దలు బ్రిటిష్ ప్రభుత్వంపై వత్తిడి తెచ్చారు. తూర్పు కోస్తాలోని మచిలీపట్టణం, నర్సాపురం, కోరంగి రేవులనుంచి సరకులు రవాణా కావడానికి కృష్ణాకెనాల్ నుంచి బెజవాడకు ఇనపదారి పొడిగించడం సముచితమని ప్రభు త్వంపై వత్తిడితెచ్చిన ఆనాటి బెజవాడ ప్రముఖులలో దేవళరాజు, రామయ్య నాయుడు, పోలిసెట్టి వెంకాలుశెట్టి, చుండి ధర్మన్న నాయుడు, అక్కిపెద్ది సర్వేశ్వరశర్మ మరికొందరు ప్రముఖులు ప్రభుత్వానికి వినతి పత్రాలు పంపించారు.

నిజానికి బ్రిటిష్ ప్రభుత్వంకూడా 'పోర్ట్ టు పోర్ట్' అన్న సూత్రాన్ని రూపొందించుకొని ప్రముఖ నౌకాశ్రయాలను రైలు మార్గాలతో అనుసంధించాలని విధానపూర్వకమైన నిర్ణయాలు తీసు కొన్నది. ఆ నిర్ణయం ప్రకారం బందరు రేవును మచిలీపట్టణంతో అను సంధించాలి. అయితే బందరు నుంచి ఎటువెళ్ళాలన్నా కృష్ణా నది అవరోధం. బందరు నుంచి మద్రాసుకు దగ్గరగా రైలు మార్గం వెయ్యాలంటే చల్లపల్లి పెనుమూడి తెనాలి మీదుగా రూట్ వెయ్యడం మంచిదన్న ప్రతిపాదనలు అప్పటి కృష్ణామండలంనుంచి ప్రభుత్వా నికి వెళ్ళినాయి. ఆ ప్రతిపాదనలు అయిదారేళ్ళ పాటు పరిశీలనలో ఉన్నదరిమిలా బుట్టదాఖలయ్యాయి. ప్రాంతీయ తత్వం కారణంగా పెనుమూడి మీదుగా ఇనప దారి వేసే ప్రతిపాదన కృష్ణార్పణమైంది. దీనికి తగినట్టు ఎలాగు కృష్ణానదిపై రైలు వంతెన వేయక తప్పదు కనుక బెజవాడ దగ్గరే నిర్మించడం మంచిదన్న ప్రతిపాదనకు బలం

చేకూరింది. బందరునుంచి బెజవాడ వరకు రైలుమార్గంవేస్తే చాలు నన్న ఆలోచనతో బ్రిటిష్ ప్రభుత్వం రైలు వంతెనకు అనుమతించింది.

కంపెనీకి వంతెన నిర్మించే కాంట్రాక్టును మంజూరు చేసింది. 1890లో ఆ కంపెనీ పని ప్రారంభించి 1893లో పూర్తి చేసింది. వెంటనే మొదటిసారిగా బెజవాడకు రైలువచ్చింది. రైలు వంతెన నిర్మాణం, స్టేషన్ నిర్మాణం ఒకేసారి జరిగాయి. ఈ వంతెనకు అయిన మొత్తం ఖర్చు 35 లక్షల రూపాయలు. మొత్తం వంతెన పొడవు రమారమి ముప్పాతిక మైలు. ఈ రైలు వంతెన ప్రత్యేకత ఏమంటే ఇనపదారితోపాటు అటు ఇటు కాలిబాట కూడా ఉండేది. కొంత కాలంపాటు ఈ వంతెన మీదుగా నడచే వారి దగ్గర అణా చార్జి వసూలు చేసేవారు.

నిర్మాణానికి అవసరమైన కొండరాళ్ళను కొన్నింటిని గుణదల కొండను కొట్టి సేకరించారు. మరికొంత సీతానగరం కొండను కొట్టి సేకరించారు. ఈ సందర్భంలోనే ఒక ముచ్చట.

బెజవాడలో టిక్కిల్ రోడ్డువుంది. నగరవాసులకు చిరపరిచిత మైన పేరు. ఈ పేరు వెనుక ఐతిహ్యం ఉన్నది. గుణదల కొండను క్వారీచేయడానికి వడ్డెరలను పిలిపించారు. ఓఢ్ర దేశంనుంచి, అనగా ఒరిస్సా నుంచి వచ్చినవారు కనుక ఒడ్డెరలన్నారు. వారిది విచిత్రమైన యాస. తెలుగును చిత్రంగా సాగతీసి మాట్లాడతారు.

ఒడ్డెరలను ఆనకట్ట నిర్మాణంకోసం తీసుకొనివచ్చారు. వారంతా బెజవాడలోనే స్థిరపడ్డారు. ఆనకట్టతో పాటే కాలవ తవ్వకం పనులు కూడా చేపట్టారు. బందరు కాలవపని కూడా 1953లో ప్రారంభమైంది. కాలవ రివిట్‌మెంట్‌కు అవసరమైన కొండ రాళ్లను గుణదల కొండ నరికి సేకరించారు. సేకరించిన బండరాళ్లను కాలువ వరకు రవాణా చెయ్యాలి. అందుకోసం బొగ్గు గనులలో వలె రైలు పట్టాలపైన తొట్టెలులాంటి ట్రాలీలులో రాళ్ళువేసి రవాణాచేసేవారు. ఆ తొట్టెలను ట్రక్కులు అనేవాళ్లు.

గుణదల కొండనుంచి నేటి టిక్కిల్ రోడ్డు సందు, బందరు రోడ్డు మీద నుంచి కాలవ వరకు పట్టాలువేశారు. ఆ పట్టాలమీద ఈ ట్రక్కులు నడిపేవారు. పామరజనుల నోళ్ళలో ట్రక్కులు మాట టక్కుల అయింది. చివరకు ఒడ్డెరల వలన టిక్కిలు అయింది. టిక్కిలు తిరిగిన రోడ్డు కనుక అది టిక్కిల్ రోడ్డు అయింది.

కాలువ తవ్విన 38 సంవత్సరాల తరువాత రైలు వంతెన నిర్మాణానికి కూడా టిక్కిల్ రోడ్డు మీదుగా కాలువలోని పడవలు రాళ్ళను రవాణా చేసేవి. వంతెన నిర్మాణం వేగంగా జరగడానికి ఇటు సీతా నగరంవైపు నుంచి అటు బెజవాడవైపు రోడ్డు మీదుగా బల్లమీద రాళ్ళు చేరవేశారు. కృష్ణ పై రైలు వంతెన నిర్మాణ సమ యంలో అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం కార్మికుల మధ్య ఒక విచిత్రమైన పోటీ పెట్టినట్టు ఇప్పటికీచెప్పుకొంటారు. వంతెననిర్మాణ మార్గంలో సరిగా మధ్య ఒక స్తంభం నిర్మించి దానిమీద వెండి రూపాయలతో నింపిన మూట పెట్టారు. రెండు వైపుల నుంచి నిర్మాణం మొదలైంది. అంటే పోటీ రెండుజట్ల మధ్య ఏర్పడింది. ఎవరు ముందుగా నిర్మాణం పూర్తిచేసి ఆమూట చేరుకొంటే ఆజట్టుకు మూట అందు తుంది. సీతానగరం వైపు నుంచిపని ప్రారంభించిన జట్టు సీతా నగరం ముఠా అనీ, బెజవాడవైపు నుంచి ప్రారంభించిన జట్టును బెజవాడ ముఠా అని అనేవాళ్ళు. పోటీలో సీతానగరం ముఠా గెల్చింది. కెప్టెన్ ఒనిల్‌డ్రాస్ అనే దొర సీతా నగరం ముఠాకు మాత్రమే కాదు బెజవాడ ముఠాకు కూడా నాణాల మూటను బహూకరించాడు.

రైలు వంతెన నిర్మాణం ముగిసిన పదిహేనేళ్ళకు బందరు బెజవాడ మీటర్ గేజి రైలు మార్గం వచ్చింది. 1908 ఫిబ్రవరి 14వ తేదీన మొదటి సారిగా బందరు నుంచి బెజవాడకు రైలు వచ్చింది. తరువాత మచిలీపట్టణం మార్మగోవా రైలు వచ్చింది. గోవాలో ఈ రైలు బడ్‌బందర్ స్టేషన్ వద్ద ఆగిపోయేది. రెండు రేవుల అనుసంధాన విధానం క్రింద ఈ రైలు వేశారు. 1952లో ఈరైలు రద్దుచేశారు. బందరు బెజవాడ రైలువేసేటప్పుడు ముందుగా కౌతరం స్టేషన్ దగ్గర కౌతరం గేటు అనే స్టేషన్ నెలకొల్పారు. దీని నిర్మాణానికి కట్టమంచి కొళందరెడ్డిగారు స్వయంగా విరాళం ఇచ్చారు. అందుకు కారణం అప్పుడు కౌతరంనుంచి ధాన్యం, బియ్యం, అపరాలు భారీగారవాణా అయ్యేవి. గుడివాడ ప్రాంతంలో రైసు మిల్లులు అధికంగా ఉండేవి. ముఖ్యంగా రెడ్డిగారు కౌతరంలో, నెలకొల్పిన "ఆంధ్రలక్ష్మీ ఇండస్ట్రీస్ లిమిటెడ్" సంస్థ భారీగా బియ్యం రవాణాచేసేది. ఆ మిల్లు అవసరం కోసం కౌతారంవద్ద స్టేషన్ కావాలి. దానినిదృష్టిలో పెట్టుకొనే అక్కడ స్టేషన్ ఏర్పాటుకు ఆయన చొరవ తీసుకొని పలుకుబడి ఉపయోగించి కొంత విరాళం కూడా ఇచ్చి కృతకృత్యులయ్యారు.

బెజవాడలో పూర్ణానందం పేట రైలుగేటు ఏర్పాటు కోరుతూ అప్పటి రైల్వేలకు 1500 రూపాయలు విరాళం ఇచ్చారు. ఇందుకు కారణం నేటి మామిడికాయల పాకలు ఉన్నచోట ఆయనే పరిశ్రమలు నెలకొన్నాయి.

1923లో గుడివాడ–భీమవరం రైలుమార్గం ఏర్పడింది. అందుకు అవసరమైన స్థల సేకరణ కోసం, పరిహారం మొత్తాన్ని నిర్ధారించి నిర్వాసితులకు అందచేసేందుకుగాను కృత్తివెంటి నాగేశ్వర రావుగారిని స్పెషల్ ఆఫీసర్‌గా నియమించారు.

వాస్తవానికి కృష్ణా మండలం సర్వతోముఖ ప్రగతి కృష్ణానదిపై రైలు వంతెన నిర్మాణంతో ప్రారంభమైంది. నేటి స్వతంత్ర భారతా వనిలో 56 సంవత్సరాల తరువాత కూడా ఎంత చెప్పుకోతగిన అభివృద్ధి జరిగినా పథకాలు అమలు జరపడంలో చిత్తశుద్ధి, నిజాయితీ కొరతగా కనిపిస్తున్నది. ఆనాటి నిర్మాణాలు ఎంతో పటిష్టంగా ఉండేవి. ఆనాటి నీతినిజాయితీలకు దర్పణంగా విజయవాడలో కృష్ణానదీ గర్భంలో మిగిలిన పాతవంతెన శిధిలాలనే చెప్పుకోవాలి. ★

శ్రీ గేరా జీవరత్నం

# కృష్ణాజిల్లాలోని క్రైస్తవ పురాతన కట్టడాలు

**ఉపోద్ఘాతము :**

కృష్ణాజిల్లాలో పురాతన కట్టడాలు విశేషముగా ఉన్నాయి. రోమను కథోలిక సంఘము, దక్షిణ ఇండియా సంఘముతో పాటు, బాపిస్టస్టు సంఘము, రక్షణ సైన్యం, శనివారపు సంఘములకు సంబంధించినవి వున్నవి. నవీన సంఘముల నూతన కట్టడముల జోలికి ఈ సందర్భములో పోవుట లేదు. కాని పురాతన సంఘము లకు, మిషనరీ నివాసములు, కొన్ని ప్రముఖ సంఘములను గురించి పొందు పరచుచున్నాము.

**ప్రజల పరిస్థితులు-మిషనరీలు కృష్ణాజిల్లాకు రాకడ : దక్షిణ ఇండియా సంఘము పురాతన కట్టడములు :**

ఈ జిల్లా నివాసులు మొదలులో పేదలు, అవిద్యులు. అన్ని విషయములలో వెనుకబడినవారు. డచ్ వారు, ఆంగ్లేయులు, ఈస్టిం డియా కంపెనీవారి ప్రవేశంతోపాటు వాస్కొడిగామా మొదలగువారును ఇండియాలోనికి, ఆంధ్ర ప్రదేశమునకు మరి ముఖ్యముగా కృష్ణాజిల్లాకు వేంచేసిరి. ఆనాటి ఓడరేవు కేంద్రమైన మచిలీపట్నం, బంగాళాఖాతపు సముద్రతీర ప్రాంతముకు వచ్చిరి. వారి ముఖ్య ప్రయాణం సముద్రయానం.

టర్లింగ్‌టన్ నోబుల్, జాన్‌ఫాక్స్, కానన్ ఫ్రెడరిక్ విలియమ్ నస్సావు అలెగ్జాండర్ మొదలగు మిషనరీలు షుమారు 150 సంవత్సరముల క్రితం వచ్చారు. వారి నివాసములకు, పరిపాలనకు, పరచర్యకు కట్టడములు నిర్మించిరి. పట్టణములలోను, గ్రామములోను సంఘములు, పాఠశాలలు, ఆసుపత్రులు స్థాపించిరి. సంఘ పరిచర్యతో పాటు స్థానికులకు, చుట్టుపట్ల ప్రజల సంక్షేమము నాలోచించిరి. విద్య, వైద్యంతోపాటు ప్రజలసంక్షేమ కార్యక్రమములు చేపట్టిరి. వారు నిర్మించిన కట్టడములు ఇప్పటికిని నిలిచి ఉన్నాయి. కొన్ని శిధిలము కాగా, కొన్ని శిధిలావస్థలో నున్నవి. అధికారులు కొన్ని బాగు చేయించిరి. మరీ శిధిలమై పడిపోయిన వాటిని తీసివేసిరి. వాటి స్థానములో నూతన కట్టడములు నిర్మించడమో, కొన్ని చోట్ల స్థలాలు అమ్మడమో జరిగాయి. మొత్తం మీద ఇప్పటికి నిలిచియున్న కొన్ని కట్టడములు మీ ముందుంచుచున్నాము.

**కృష్ణాజిల్లాకు ఏతెంచిన మిషనరీల సేవ, కట్టడములు : మచిలీ పట్నం : నోబుల్ కాలేజీ :**

రెవ. రాబర్ట్ టర్లింగ్‌టన్ నోబుల్ ఇంగ్లండు దేశంలో జన్మించిరి. భారతదేశానికి సి.యం.యస్. మిషనరీగావచ్చిరి. 1843 సం॥ నవంబరు 21వతారీఖున నోబుల్‌గారు, షార్కీగారు బందరులో “ది నేటివ్ ఇంగ్లీష్ స్కూల్” అనే పేరుమీద ఇప్పటి నోబుల్‌కాలేజి ప్రాంగణం లోనే పాఠశాల స్థాపించిరి. దీనిని సంపూర్ణంగా నోబుల్‌గారేనడిపిరి. వారు కేవలం అగ్ర కులస్తులకు మాత్రమే బోధిస్తూ, వారికి సువార్తను ప్రకటిస్తూ, క్రైస్తవులుగా మార్చాలని దృఢ సంకల్పం కలిగియుండిరి. ఫాక్స్ గారుమాత్రం కేవలం సువార్త వ్యాపకమే తన కర్తవ్యంగా పెట్టు కొనిరి. 1855లో నోబుల్ స్కూలు ఉన్నత పాఠశాలగా మార్పు చెందింది. ఇది అభివృద్ధిచెంది 1864వ సంత్సరమున నోబుల్ కళాశాలగా రూపు దిద్దుకుంది. ఆంధ్ర రాష్ట్రములో ప్రప్రథమముగా ప్రారంభింపబడిన కళాశాల యిదియే ! విద్యా బోధనయందు పాఠము లతో పాటు, బైబిలు, భగవద్గీతకూడా బోధించారు. ఎక్కువగా హైందవ యువకులు ఇందులో ప్రవేశించిరి. రోజుకు 6 గంటలు విద్యార్థులకు విద్యాబోధన జరిపి, సాయంత్రము నౌకర్లకు సువార్త ప్రకటించేవారు. ఆ దినాల్లో ఉన్నత విద్యాభ్యాసము మద్రాసులోగాని, లేక మచిలీపట్నంలోని నోబుల్ కాలేజీలో మాత్రమేఉండేది. అందువల్ల ఆంధ్రులు ఎక్కువగా ఈ కాలేజీలో చదువుకున్నారు.

మొదటగా నియోగి బ్రాహ్మణుడైన మంచాల రత్నంగారు, వెలమ కులస్తులైన అయినాల భూషణంగారు ప్రభువును స్వీకరించిరి. వీరిరువురు గురు పట్టాభిషేకం పొంది విశేష సేవచేసిరి. వీరు కృష్ణా గోదావరిలో ప్రథమ కాపరులు. ఒక నౌకరు మహమ్మదీ యుడు బాప్తిస్మం పొందెను.

### నోబుల్ భవన కళాఖండం :

ఈ కళాశాల కట్టడము పెద్ద భవనము, గానుగ సున్నముతో నిర్మించిరి. గోడలు మీటరు మందముండును. 200 మీటర్ల పొడవు, అదే వెడల్పు గల భవనంలో, చుట్టు అనేక విశాల గదులు కలిగి, మధ్య ఒక పెద్ద హాలు నిర్మించబడింది. రంగూను దూలములతో, చెక్కలతో ఎత్తైన కప్పు ఉంటుంది. గదులు రంగూను దూలములు, చెక్కలతో నిర్మించబడి ఉంది. ఈ భవనము నాలుగు మూలలలో ఒకే విధమైన కట్టడమయినను, మూడు మూలలలో ఎత్తైన అంతస్థు గదులున్నాయి. మూడు మూలలలో చెక్కలతో నిర్మించబడిన మెట్లున్నాయి. నాలుగు ప్రక్కల సమ మయిన పద్ధతిలో (సెమిట్రికల్ కన్‌స్ట్రక్షన్) నిర్మింప బడినను, ఒకప్రక్క (పడమటవైపున) క్రింద, పైన గదులుగాని, మెట్లుగాని కట్టబడలేదు. కారణం తెలియదు. భవంతి చుట్టూ విశాలమైన వరండా దిమ్మలచే కట్టబడింది. భవనం మధ్యనున్న హాలు తూర్పు పడమరలలో ఇంగ్లీషు వారి నిర్మాణ పద్ధతిలో ఎత్తైన స్థంభములతో వరండా గంభీరముగా కనబడును. భవనపు నేల అంతయు పెద్ద బండరాళ్ళు, నల్ల నాపరాళ్లతో నిర్మింపబడెను. దీనిలో చూడ ముచ్చట గొలిపే ఇంగ్లీషు వారి కట్టడ నైపుణ్యత కనబడును.

### 1864లో బందరుకు వచ్చిన ఉప్పెన :

1864 సం॥ సమస్త పరిశుద్ధుల దినము మధ్యాహ్నం నోబుల్ దొర గారు ఇంటర్ మీడియట్ వారికి పాఠాలు బోధిస్తుండగా, చిన్న వానగా ప్రారం భమై, పెను తుఫానై, ఉప్పెనగా పరిణమిల్లింది. ఉప్పెన కెరటం బందరును తుడిచేసింది. ముప్పైవేలమంది సజీవ సమాధి అయిరి. వారి సమాధి బందరు కోటలో ఉంది. నోబుల్‌గారు, విద్యార్థులు ఒకరి చేయి ఒకరు పట్టుకొని అందరూ బ్రతికారు. ప్రక్కన ఉన్న షార్కీ బోర్డింగ్‌నకు ఉప్పెన తాకిడి తగిలింది. 66 బాలికలలో 33 మంది ఉప్పెనలో కొట్టుకు పోయారు. మరుసటి రోజు వారి శవాలు రైలు పట్టాల పైన పొదలలో పడి ఉన్నాయి. షార్కీ గారు ఎక్కడ శవాలను అక్కడే ఖననం చేయించారు. దాదాపు 400 మంది సిపాయిలు ఉప్పెనలో కొట్టుకుపోయారు. అక్కడున్న యోహాను దేవాలయము పాడయిపోగా, ఆ దేవాలయపు రాళ్ళు పరి, ఆంధ్రియ దేవాలయ నిర్మాణమునకు తరలించిరి. బందరు చరిత్రలో ఇదొక విషాద సంఘటన. నోబుల్ ఆరోగ్యం క్షీణించి 1865 సం॥ అక్టోబర్ 17వతారీఖున చనిపోయిరి. 26సం॥లు మిషనరీ పరిచర్య బందరులో చేసిరి. వారు చనిపోయినప్పుడు వారిశవాన్ని ఒక పల్లకీలోనే ఒక ఆంగ్లేయుడు, బ్రాహ్మణుడు, మహమ్మదీయుడు, వెలమ కులస్తుడు, శూద్రుడు, నిమ్నజాతికి చెందినవాడు, మొత్తం 6గురుమోసిరి. ఆయన శరీరమును బందరు సెంట్ మేరీస్ చర్చి ప్రాంగణములో భూస్థాపన చేసిరి, నవంబరు 21వ తేదీ నోబుల్ ఫౌండర్స్‌డేగా జరుపుచున్నారు.

వీరు విద్యా విషయంలో చూపిన పట్టుదల, కార్యదీక్ష బహుగా ఫలించింది. తదుపరి కాలములో మిషనరీలు, అటు విద్యా వ్యాప్తి, ఇటు సువార్త వ్యాప్తికై శ్రద్ధ చూపారు. అగ్రకులస్తులు మధ్యేగాక, దూరంలో పల్లెల్లో, గూడాలలో నివసించే మాల మాదిగ కులస్తులకు, అనాగరికులు, పామరులు అజ్ఞానులైనవారికి విద్య, వైద్యంతోపాటు సువార్త అందించి, అనేకులను విద్యావంతులుగా తీర్చిదిద్దారు. అనేక చర్చీలు, పాఠశాలలు నిర్మించారు.

నోబుల్ దొరగారి జ్ఞాపకార్ధముగా, నోబుల్ కాలేజీ నందు, నోబుల్ హాలు స్థానికులు నిర్మించారు. వారి పేరు సజీవమై, నోబుల్ కాలేజీగా నేడు విరాజిల్లుచున్నది. మద్రాసు విశ్వవిద్యాలయ ప్రథమ భారతీ యుడైన వైస్ ఛాన్సలర్ శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడు గారు, మద్రాస్ ప్రభుత్వ ట్రాన్సిలేటర్ శ్రీ బేతపూడి ప్రకాశంగారు, జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత, శ్రీ విశ్వనాధ సత్యనారాయణగారు మొదలైన వారు ఈ పాఠశాలలో ఉపాధ్యాయులుగా పనిచేశారు. మద్రాస్ గవర్నరు చార్లెస్ ట్రివేలియన్ నోబుల్ కళాశాలను "దక్షిణ భారత కేంబ్రిడ్జి"గా వర్ణించిరి. బందరు జాతీయ కళాశాల స్థాపకులు శ్రీ కోపల్లె హనుమంతరావుగారు, కృష్ణాపత్రిక వ్యవస్థాప కులు శ్రీ ముట్నూరు రామకృష్ణారావుగారు, ఆంధ్రరాష్ట్ర కౌన్సిల్ అధ్యక్షులు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, సినీ రచయిత మల్లాది రామకృష్ణశాస్త్రిగారు, ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు, అసెంబ్లీ స్పీకర్, ఉపముఖ్యమంత్రి శ్రీ సుబ్బారెడ్డిగారు, శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు గారు మొదలైన ప్రఖ్యాతి గాంచిన అమోఘమైన నాయకులు ఈ నోబుల్ కాలేజి విద్యార్థులే.

### జాన్‌ఎడ్మంగ్ షార్కీగారు :

వీరు ఒక ఆంగ్లోఇండియన్ కుటుంబమునకు చెందినవారు. వీరు నోబుల్‌గారితో బందరు వచ్చి 1851 నుండి సువార్త గావించిరి. 1847 సం॥ జూన్ 10 తారీఖున ఇద్దరు ప్రొటెస్టాంట్‌లు, ఒక రోమన్ కథోలిక, ఇద్దరు హరిజనులు, ఒక మహ్మదీయ బాలికతో పాఠశాలను దొరసానిగారు ప్రారంభించిరి. బైబిలు చదివించడంతో పాటు సంగీతములు నేర్పిరి. షార్కీగారు ప్రత్తిపాడు సంఘమును ప్రారంభించిరి. వారి పేరున మచిలీ పట్నంలో షార్కీ గరల్స్ హైస్కూల్ విరాజిల్లుతున్నది.

### సెంట్ ఆండ్రూస్ మహాదేవాలయము :

క్రీ.శ.1606 సం॥నుండి విదేశీవ్యాపారులు డచ్, ఫ్రెంచ్, పోర్చుగీసు, ఇంగ్లీషువారు మచిలీపట్నంకు రావడం మొదలైంది. బందరు పట్టణంలో చర్చి ఏర్పడక ముందు సెంట్ మేరీస్ చర్చి (1809)నందు ప్రతిఆదివారం ఉదయం ఆరాధనలు క్రమములుగా జరిగేవి. పెరుగుచున్న జనమునకు అనువుగా మరొక దేవాలయ

నిర్మాణం అవసరమేర్పడింది. మొదటి ప్రపంచయుద్ధ దినములలో కొన్ని అవాంతరములు ఏర్పడినా, 1917 నాటికి ఆలయ నిర్మాణ ప్రముఖ భాగము పూర్తి చేయబడినది. 1928 సం॥ చర్చి నిర్మాణం పూర్తి గావింపబడింది.

1847వ సంవత్సరములో మొదటి ఆంగ్లికన్ పరి. పౌలు కెథీడ్రల్ కలకత్తాలో ఆవిర్భవించి అగ్ర ఆచార్య సేవా విధానంలో కొందరు బిషప్పులు వారి అధ్యక్ష మండలములలో కెథీడ్రల్స్ కలిగి యుండిరి. 1319వ సంవత్సరములో గోపాడ నతానియేలుగారు పరి. అంద్రెయ దేవాలయము మచిలీ పట్నంలో కట్టుటకు పూను కొని పూర్తిచేసిరి. మొదట మద్రాసునుండి, తరువాత డోర్నకల్ అధ్యక్ష మండలమునుండి కృష్ణా అధ్యక్ష మండలము వేరు చేయబడింది. ఈ దేవాలయము 2002లో కృష్ణా, గోదావరి మండలపు మహా దేవాలయముగా ప్రతిష్ఠించబడినది. ఈ దేవాలయము అప్పటి గానుగ సున్నముతో కట్టబడి బలంగా యిప్పటికీ నిలచి వుంది. లోపలిభాగము సిలువ ఆకారముతో నుండి, ఎత్తైన గోడలు గలదిగా 100 సం॥ పైబిలుకు చరిత్ర గలదియై యున్నది. లోపలి భాగము గంభీరముగా నుండి షుమారు రెండు వేలమంది ఒకేసారి ఆరాధించ సమర్థత కలిగియున్నది.

ఆనందపేటలోని రెవ. ముత్యాలు బిషప్పు మెమోరియల్ చర్చి శతవార్షిక పండుగ ఈ సం॥ (2008) మార్చి 30న జరుపు కున్నది.

## సెంట్ మేరీస్ చర్చి :

1800 సం॥ ప్రథమములో మచిలీపట్నం వ్యాపార కేంద్రంగా విరాజిల్లెను. బ్రిటిష్ సైన్యము బందరు కోటను వశపరచు కొనిరి. ఈస్ట్ ఇండియా కంపెనీవారు అచట స్థావరము ఏర్పరచుకొనిరి. వారిలో కెప్టెన్ రాబిన్‌సన్ అచట నివసించెను. ఆయనకు సౌందర్య మయిన కుమార్తె అరబెల్లా ఉండెను. ఆ కాలములో జాన్ పీటర్ అను మేజర్ జనరల్ ఉండిరి. ఆయన 1805లో బ్రిటిష్ సైన్య బలగమునకు అధికారిగా నియమింప బడిరి.

ఈ జనరల్ అరబెల్లాను ప్రేమించెను. ఇరువురు ప్రేమించు కొని, వివాహమాడ సిద్ధపడగా, ఆయన అప్పటికే వివాహమయి, ఆయన భార్య ఇంగ్లాండులో ఉన్నందున, ఇంగ్లీషువారు వారి వివాహమున కభ్యంతరము వ్యక్తపరచిరి. అరబెల్ల తండ్రినివిడిచి, మేజర్‌తో నివసింపవెళ్ళెను. వారు కలసి జీవించిరి. అకస్మాత్తుగా అరెబెల్లా కాయిలా పడి 1809, నవంబరు 6వ తేదీన మరణిం చెను. మేజర్ అరబెల్లా శరీరమునకు పెండ్లి కుమార్తె వస్త్రములు ధరింపజేసి, ఆమె శరీరమును సమాధి చేయుటకు బందరు సమాధి దొడ్డిలో అనుమతి కోరగా, వారు తిరస్కరించిరి.

కనుక మాచవరందగ్గర డచ్ ప్రభుత్వమునుండి 15 ఎకరాల భూమినికొని, సుగంధ ద్రవ్యములు శవమునకు పూసి, సమాధి చేసెను. తరువాత 1815లో ఆ సమాధి మీద ఒక చర్చి కట్టబడెను. సమాధి రాయిమీద ఏర్పరచిన ఒక చిలక వంటి గుబ్బను త్రిప్పిన, ఆ రాయి కొంచెం తొలగి, ఆమె శరీరం కనబడునట్లు ఏర్పర్చెను. సందర్శకు లలో ఒక స్త్రీ శవమును చూచి భయముతో చనిపోగా, ఈ సమాధిని తెరిసే పద్ధతిని నిలిపివేసిరి. పీటర్ తాను చెన్నైకి వెళ్ళు వరకు దీనిని తన స్వంత ఆరాధన స్థలంగా చేసికొనెను. తరువాత దీనిని బహిరంగ ఆరాధన స్థలంగా మార్చుటకు ఈస్ట్ ఇండియా కంపెనీ వారికి అనుమతి నిచ్చెను.

రైట్ రెవ. జార్జ్ ట్రావర్ స్పెన్సర్‌గారు దీనిని సెంట్ మేరీస్ అని నామకరణం చేసిరి. అప్పటి వరకు దీనిని అరెబెల్లా అని పిలిచిరి. మొదటి గురువర్గ అభిషేక ఆరాధన సెంట్ మేరీస్‌తో రెవ. హెచ్.డబ్ల్యు ఫాక్స్ గారి అభిషేకముతో మిషనరీ పరిచర్య ప్రారంభమైనది. చర్చి కట్టడము ఎత్తైనదిగా ఉండును. లోపల ఒకచిన్న బాల్కనీ చెక్కలతో నిర్మించిరి. చర్చిపీఠము అర్థచంద్రాకారముగా నుండును. పెద్ద వాకిళ్ళు, కిటికీలు కలిగి అప్పటి సంస్కృతిని చూపుచూ యింకా నిలిచి ఉన్నాయి. వెలుపల ఇరు ప్రక్కల ఎత్తైన దిమ్మలతో చిన్న వరండాలు చూడముచ్చట వేయును. ఈ చర్చి ప్రాంగణము సిమెటరీగా (సమాధుల దొడ్డి) వాడబడుచున్నది. టర్లింగ్‌టన్ నోబుల్, షార్కీ మొదలగు మిషనరీలు చనిపోయి, యిచ్చటనే సమాధి చేయబడిరి. వారి సమాధులు భద్ర పరచబడుచున్నవి. దీనికి సమీపంలోని వలందపాలెంలో డచ్చి వారి సమాధులదొడ్డి ఉంది. ఇది అప్పటి నుండి ఇప్పటి వరకు ఆంధ్ర ప్రదేశ్ పర్యావరణ శాఖ వారి పర్యావేక్షణలో ఉంది.

## బందరు కోట :

డచ్ వారు ఇండియాలో ప్రవేశం మొదట మచిలీపట్నం సముద్ర తీర ప్రాంతానికి వచ్చిరి. వారి నివాసములతో పాటు కారాగారము ఏర్పరచి, వారు నిర్మించిన ఆయుధాగారం, కోట బురుజుతో పాటు, వారి సమాధుల దొడ్డి (సెమెట్రి) యిప్పటికి నిలిచియున్న వాటితో ముఖ్యమైనవి. డచ్చి వారి నిర్మాణమయిన బెల్‌టవరు, ఇంకను చెక్కు చెదరక నిలచి యున్నది. ప్రక్కనే ఉండిన సెంట్ జాన్స్ చర్చి మాత్రం కనబడటం లేదు. దీనిని గేట్ వే ఆఫ్ ఈస్ట్ ఇండియా అనే వారట. చేపకన్ను దర్వాజా 1961 వరకు నిలిచి వున్నది. బందరు ఓడరేవు ఆ కాలంలో ప్రసిద్ధి చెందినది. ఇక్కడినుండి గోవాకు రజను ఎగుమతి, దిగుమతి జరిగేవి. గోవాకు మీటర్‌గేజ్ రైలు మార్గము ఉండేది. ఈ ప్రదేశమును భారతీయ పురాతత్త్వ సంరక్షణవారు చేపట్టుట ముదావాహం. తరువాత ఇంగ్లీషు వారునువచ్చిరి. వారిపేర ఇంగ్లీషు పాలెం, వలంద పాలెం అను పేటను ఇప్పటికిని పిలువబడుచున్నవి.

### చార్లెస్ టాన్నర్ :

వీరు 1857లో మిషనరీగా ఆంధ్ర ప్రాంతమునకు వచ్చిరి. వీరి జ్ఞాపకార్థము విజయవాడలో పాఠశాల స్థాపించబడి, అది టాన్నర్ మెమోరియల్ ఉన్నత పాఠశాలగా నడపబడుచున్నది.

### థామస్ యంగ్ డార్లింగ్ :

వీరు 1829లో మద్రాస్‌లో జన్మించిరి. సి.యమ్.యస్.ద్వారా బెజవాడ కాటకిస్టుగా నియమింపబడిరి. ప్రస్తుతము గాంధీ కొండగా పిలువబడుచున్న హోర్సన్ కొండ పై బంగ్లాలో ఉండేవారు. పాగోలు వెంకయ్య అను గజదొంగ విజయవాడ నుండి హైదరాబాదుకు వెళ్ళే రహదారిలో కాపుకాచి దోచుకొనేవాడు. 1811 సం॥నాటికి ఇతడు 50 సం॥లు వయస్సు గలవాడు. అనేకసార్లు చెరసాలకు పంపబడెను. తన యుక్తి వల్లను, సాహసము వల్లను చెరసాల తప్పించుకొని తిరిగేవాడు. తరువాత కలలో ఒక మనుష్యుడు దయతో దృష్టించి, తాను అతనికి స్నేహితుడనని చెప్పెను. ఆయన క్రీస్తని గ్రహించెను. క్రీస్తు సువార్త విని, డార్లింగ్ గారిని తన గ్రామమయిన రాఘవాపురం తీసికొని వెళ్ళాడు. అతడు మారి బాప్తిస్మం పొంది, మంచి సువార్తికు డయ్యాడు. మునేరు మిషనరీ బంగ్లా కట్టాడు. రాఘవాపురంలోని దేవాలయం కట్టబడి ఇప్పటికి 125 సం॥ అయింది.

### బిషప్పు అజరయ్య బాలికల ఉన్నత పాఠశాల :

బిషప్పు అజరయ్య ప్రోత్సాహముతో 1929లో బిషప్పు అజరయ్య పేరున బిషప్పు అజరయ్య పాఠశాల బాలికలకు ఏర్పరచబడింది. న్యూజిలాండు అక్‌లాండు డయసిస్ వారు అప్పుడు దీనికి వనరులు సమకూర్చుచుండగా యస్.పి.జి. మరియు సి.యమ్.యస్. మిషన్ బోర్డుల సహాయంతో పాఠశాల నడిపించబడు చుండెను. పార్లమెంటు సభ్యులు శ్రీమతి చెన్నుపాటి విద్య, మాంటిసోరి విద్యా సంస్థల సంస్థాపకులు శ్రీమతి కోటేశ్వరమ్మ గారు, ఆల్ ఇండియా రేడియో డైరెక్టర్ శ్రీమతి పి.వేదవతి ఈ పాఠశాల పూర్వ విద్యార్ధినులే. 2000 మంది విద్యార్థినులతో 50 మంది ఉపాధ్యాయ సిబ్బందితో పట్టణ నడిబొడ్డున విరాజిల్లుతున్నది. మొదటలో పాఠశాలచుట్టు ప్రక్కల దళిత, వెనుకబడిన విద్యార్థినుల కై ఏర్పరచినను, ఆంధ్ర రాష్ట్రమంతటి నుండి విద్యార్థినులు రావడం జరుగుచున్నది. మంచి విద్యాస్థాయి కలిగి, క్రమశిక్షణలోను, వ్యాయామ యితర కార్యక్రమములలోను వన్నెకెక్కి అభివృద్ధి పొందుచున్నది. దీని కట్టడమంత కొండరాళ్ళతో ఆనాడు నిర్మింపబడింది.

150 సం॥లు ఆ గౌరవనీయులు సంఘములో జీవిత సాక్ష్యము కలిగి, పరిచర్యచేసి వారితరువాత ఇండియా సేవకులకు, దర్శకులకు, వారి మార్గముల ననుసరించడానికి మార్గదర్శకులైరి. ఇప్పటి పశ్చిమ గోదావరి జిల్లా, అప్పుడు కృష్ణాజిల్లా లోనిదే, మరియు ఆంధ్ర రాష్ట్రము ఉమ్మడి మద్రాసు రాష్ట్రములోనిదే. ఈ ప్రాంతం దళిత ముద్ర పొందిన సమాజమే. పైన పేర్కొనిన నోబుల్ మొదలైన వారితో గుడ్‌మన్, డార్లింగ్, హారిసన్, ఫాక్స్, థామస్ యంగ్ మొదలగువారు. వైద్యులు, విద్యావేత్తలు, నర్సులు, బోధ కులు, సామాన్యులు వచ్చిరి.

### సి.యస్.ఐ. క్రైస్ట్ చర్చి, ఏలూరు :

క్రీ.శ. 1854 సం॥ ఆంగ్లేయ సిపాయి కెప్టెన్ టేలర్ గారి బలవంతముపై రెవ. జార్జ్, ఇంగ్లీషువారు సి.యమ్.యమ్. మిషనరీగా ఏలూరు స్థావరంగా సేవ చేసిరి. 1856 సం॥ కోటలో నున్న పాఠశాల 80 మంది విద్యార్థులతో నుండెను. ఆంగ్లేయ సంఘములో 6గురు సిపాయిల భార్యలు సభ్యులుగా నుండిరి. 1857సం॥ రెవ. అలెగ్జాండర్ గారు వారి సతీమణితో ఏలూరు పరిచర్యకు వచ్చిరి. అలెగ్జాండరు సతీమణి గారి పేర అలెగ్జాండర్ పాఠశాల స్థాపించబడెను. ఈ కోటలో నున్న పాఠశాలనే ఆరాధనాలయంగా ఉపయోగించేవారు. తరువాత నూజివీడు రాజాగారు స్థలమివ్వగా 1877లో ఆలయము నిర్మించబడెను.

### ఏలూరు పరిసర ప్రాంతములు :

1857 సం॥ సిపాయిల తిరుగుబాటు ఉద్యమంలో భారతీయులు ఆంగ్లేయుల దొరల పైన, మిషనరీల పైన దాడులు జరుపుతున్న తరుణంలో రెవ. ఆలెగ్జాండర్ దంపతులు ఏలూరు చేరిరి. పొలసాని పల్లిలో ఒక పాఠశాల తెరువ బడెను. 1867లో ఆలయంకట్టబడింది. నూజివీడు రాజుగారు ఆలయమునకు స్థలమివ్వగా, స్థానికుల విరాళములతో ఆలయం కట్టిరి. అది నేటి సి.యస్.ఐ. క్రైస్ట్ చర్చి. 1862లో ఆడపిల్లల కొరకు ఒక నివాస పాఠశాలను ప్రారంభించిరి. భవన నిర్మాణం చేసిరి.

### రెవ. కానన్ ఫ్రెడరిక్ విలియా నాసా అలెగ్జాండరు దొర గారు :

వీరు 1857లో సతీసమేతంగా ఏలూరుకు మిషనరీగా వచ్చారు. పశ్చిమ గోదావరిలో చర్చీలు, పాఠశాలలు అన్నియు అలెగ్జాండరు గారు స్థాపించినవే. అలెగ్జాండరుగారు ప్రథమములో ప్రముఖ ముగా ముస్లిమ్ బాలికల విద్య విషయంలో శ్రద్ధవహించిరి. వీరు ఏలూరులో స్థాపించిన బాలికల పాఠశాల ఈ సంవత్సరము 150 సంవత్సరముల పండుగ జరుపుకొన్నది.

దుమ్ముగూడెం అలెగ్జాండర్ కుమార్తె దేవిస్ 1861లో కోయ జాతి ప్రజలమధ్య పరిచర్య చేసిరి. ఆమె భర్త కెయిన్ కోయ భాష నేర్చుకొనిరి. లూకాసువార్త కోయభాషలోకి అనువదించిరి. భీమ డోలు డోళ్ళకు ప్రసిద్ధి చెందింది. అలెగ్జాండరుగారి భార్య చనిపోగా భౌతిక కాయం ఏలూరులో సమాధిచేసిరి.

ఏలూరు సమీపంలో దుగ్గిరాల గ్రామంలో ఒక సంఘం స్థాపించ బడింది. ఏలూరు రూరల్ ప్రాంత దేవాలయాల్లో ఇది అతి ప్రాచీన మైనదిగా తెలుస్తుంది.

### రోమను కథోలికుల ప్రముఖ ప్రాచీన కట్టడములు

### సెంట్ పీటర్స్ కెథిడ్రల్ :

19వ మధ్య శతాబ్దిలో విజయవాడ క్రైస్తవ సిపాయిలతో ఒక కుగ్రామముగా నుండేది. కొందరు ఫాదర్స్ మచిలీపట్నం, విశాఖ పట్నంలో నివసిస్తూ ఇక్కడ సహాయపడుచూ ఉండేవారు. క్రిష్ణా ఆనకట్ట (బ్రిడ్జ్) 1852-1855లో కట్టిన తరువాత విజయవాడ ప్రాముఖ్యత పెరిగింది. 1888లో విజయవాడ, హైదరాబాదు రైలుతో కలపడం వలనను, రైలుబ్రిడ్జి 1897, జులై 15న మద్రాసు నుండి కలకత్తాకు హైదరాబాదును కలుపుట వలననూ ఆంధ్రకు ఇది ప్రముఖ కేంద్ర మయింది. ఎక్కువమంది రైల్వే ఉద్యోగులు, పనివారు ఇక్కడ నివాసమేర్పరచుకొనిరి. వారిలో ఎక్కువమంది ఆంగ్లో ఇండియన్ కథోలిక కుటుంబాలు.

అప్పటికే 1847లో ప్రొట స్టాంటులు విజయవాడలో స్థిర పడిరి. కథోలిక మిషనరీలు 1880వరకు వారమునకు రెండు పర్యాయములు దర్శించేవారు, ఫాదర్ జి.పియట్టి బెజవాడలో మొదటి ప్రీస్ట్‌గా పని చేసిరి. పాత పురపాలక ఆఫీసువద్ద ఫాదర్ పి.కార్లినో చిన్న ఆరాధన మందిరం (ఛాపెల్)ప్రీస్ట్ నివాసం కట్టిరి. 1896లో విజయవాడ పారిష్ అయింది. 1899లో సెంట్ అనీ సిస్టర్స్ కాన్వెంట్ తెరువ బడింది. ఈ సెంట్‌పీటర్స్‌చర్చి, 1937లో కెథిడ్రల్‌గా అయింది. తరువాత అంచెలం చెలుగా మార్చి అభివృద్ధి చేసి 1998లో కట్టడం సంపూర్తి చేసి, తిరిగి ప్రతిష్ఠించిరి.

### గుణదల మాత గుడి మరియు పండుగ (1947-1952) :

చరిత్రలో గుణదల సంస్థ ప్రాముఖ్యమయినది. కొంత దానము, కొంత కొనబడిన 23 ఎకరాలలో 1923లో మరియమ్మ తల్లికి, పరి. యోసేపు పేర ఇది ఏర్పడినది. ప్రథమములో పెజ్జోనిగారు ఎరుకల నేరస్తుల నివాసానికి దీనిని ఏర్పరచిరి. అట్టి పని రక్షణ, సైన్యం వారు తాడేపల్లిలో ప్రారంభించిరి కనుక ఆ ఉద్దేశము మానెను. ముళ్ళ పొదలు, జంతువులు, పాములతో నిండిన ఆ ప్రదేశమును 50 మంది పని వారిని పెట్టి బాగు చేయించిరి.

ఒక ఆశ్రమము, పారిశ్రామిక పాఠశాల స్థాపించిరి. మాత ఆశీర్వాదము పొందదానికి, అర్లాటి వారు పర్వతము మీద మాత విగ్రహము 1924లో ఏర్పరచిరి. 27 సం॥ల తరువాత అర్లాటి వారు ఇటలీ నుండి తెచ్చిన ప్రస్తుతమున్న మేరీమాత విగ్రహము నెలకొల్పిరి. ఒక భోజనశాల, ప్రార్థనగది నేర్పరచిరి. మరో భవనము తరువాత నిర్మించిరి. తరువాత కొండ మీద సిలువ నిలిపిరి. ఇది విజయవాడకు గర్వకారణముగా ఉన్నది. ఒక గుడి, కొండ మధ్య భాగమున నిర్మించిరి. 1937 సం॥లో విజయవాడ తమిళ కథోలి కులు ఆరోగ్యమాత పండుగ జరపాలనే సూచన మేరకు అర్లాటి దీనికి సమ్మతించెను. ఆయన ఒక క్రొత్త విగ్రహము కొని ప్రతిష్ఠిం చిరి. క్రమేణ విజయవాడ తమిళ కథోలికులే కాక, విజయవాడ చుట్టుపట్ల గ్రామముల నుండి భక్తులు తరలి వచ్చుచుండిరి. ఆ ప్రదేశంలో విగ్రహమును మోయుచూ ప్రదక్షిణ చేయుచుండిరి. క్రమేణ భక్తులు పెరిగి, మందిరము నుండి సిలువ వరకు తరలి వెళ్ళుచుండిరి. తరువాత మందిరములో పీఠము నమర్చిరి. మొత్తం మీద మాత గుడి అనేక సార్లు మందుగుండుతో పగల కొట్టి కట్టించవలసి వచ్చినది.

ఈ పండుగ 11 ఫిబ్రవరికి మార్చుడం వలన (1947) భక్తుల సంఖ్య మరీ పెరుగుతూ వచ్చింది. తరువాత మందిరమున కెళ్ళు మలుపుల దారిలో మాత అద్భుత పటములు నెలకొల్పిరి. మందిరము పైన ఒక అందమైన రాతి కట్టడము ఏర్పరచిరి. ఇరువైపుల దారి మేరీమాత పాదాలు భక్తులు తాకునట్లును, వారు అర్పణలు చెల్లించు ఏర్పాట్లు గావించిరి. 1951లో మేరీమాత విగ్రహము ఇటలీ నుండి తెప్పించి, గొప్ప ఊరేగింపుతో విజయవాడకు మేళతాళాలతో తెచ్చి ప్రతిష్ఠించిరి. ప్రజా సమూహముల తాకిడిని తట్టుకొనుటకు, పాఠశాల ఆవరణములో ఉత్సవములో జరుపుకొనుటకును, ప్రజల సంచార మునకు విశాల ప్రదేశము నేర్పరచిరి.

### 'రక్షణసైన్యము' సంఘం - భవనాలు, పాఠశాలలు :

1895లో విజయవాడలో ప్రారంభించిన బోర్డింగులో, బాలబాలికలు కలిసి ఉండేవారు. దానిని బాలుర బోర్డింగ్‌గా మద్రాసు సమీపమున నున్న మాధవపురానికి తరలించిరి. 1907లో బాపట్ల బోర్డింగ్ పాఠశాలనేర్పరచిరి. తరువాత బందరుకు, బందరు నుండి నెల్లూరుకు తరలించిరి. తరువాత బాపట్ల బోర్డింగ్ పాఠశాల ఏర్పరచిరి. నూజి వీడులో కట్టబడిన అతి పురాతన భవనం కూల్చబడి, దీని స్థానంలో ఆధునిక వసతులతో ఒక ఆసుపత్రిని ఏర్పరచిరి.

ప్రారంభ దినాలలో చదువులు కొందరి యిళ్ళలోను, చెట్ల క్రింద బడులపేరుతో జరిగేవి. కొన్ని గ్రామాలలో పాకలు వేసేవరకు మిషనరీలు దగ్గరే ఉండి, వాటిని కట్టించేవారు. ఇప్పటికి స్లాబులు వేసినవి, పెంకుటిళ్ళు అక్కడక్కడ నిలచివున్నాయి. మొదటిలో తాటాకు లేక రెల్లు లేక జమ్ము కప్పుతోనే ఉండేవి. క్రమంగాయితర దేశాల సహాయంతో,విరాళాలతో పక్కా భవనాలు నిర్మించారు, ఇంకా నిర్మించు కొంటున్నారు.

విజయవాడలో మొదటగా బాహ్య సభలకు జండా చెట్టు దగ్గర యింటిలో జరిపేవారు. తరువాత స్టూవర్టుపురంలో బంగళా, బాపట్లలో కుష్టురోగుల ఆసుపత్రులు కట్టబడ్డాయి.

## కృష్ణాజిల్లాలో మరికొన్ని సంస్కృతి వైభవాలు

నువ్వులపంట పండించేవారు కనుక 'నూజివీడు' అని పేరు వచ్చింది. చప్పట్ల నుండి తప్పెట్లు వచ్చాయి. దేవరపల్లి వారు ఈ కళను ప్రదర్శిస్తారు. కృష్ణాజిల్లాలో ఎక్కువ నల్లరేగడి నేల ప్రాంతం. నల్లరేగడి నేల దానంతటదే ఎరువు తయారు చేసుకొనగలదు.

### క్రైస్తవ స్మారక చిహ్నాలు :

క్రైస్తవ భవనాల మీద స్మారక చిహ్నాలు వేసిరి. వాటిని ప్రారంభించిన వారి పేర్లు వాటి మీద చెక్కబడ్డాయి. ఏ తేదీన, దీనికి ధనసహాయం చేసిన వారి పేర్లు వ్రాయబడ్డాయి. అట్లు శిలాఫలకాలు ప్రతి కట్టడ మునకు ఉండుట వలన భావి తరాలకు వాటిచరిత్ర అవగాహనకు సహాయపడుతుంది. దీని వలన అప్పటి భాష, సంస్కృతి, విలువలు తెలుస్తాయి. సమాధుల మీద స్మారక చిహ్నరాళ్ళు నిలబెట్టిరి. లేక సమాధుల మీద రాళ్ళు పరచిరి. ఆ రాళ్ళమీద బైబిలు వాక్యంవ్రాసిరి. సిలువగుర్తు వేయడం, చనిపోయిన వాని పేరు, పుట్టుక, మరణం మొదలగు వివరాలు తెలుపునవి వ్రాయడం, లేక చెక్కడంచేసిరి. అవి రంగులతో చిత్రించిరి. ప్రక్క ప్రక్కన బంధువుల సమాధులకు స్థలంకొని, వాటిలో శవములను ఉంచిరి. వాటిని శ్రద్ధ తీసుకొనక పోవడం వలన కొన్ని పాడయ్యాయి.

మిషనరీల సమాధుల శ్రద్ధ తీసుకొనినవి నిలిచి వున్నవి. శ్రద్ధ తీసుకొనక పోవడంవల్ల కొన్ని శిధిలావస్థకు చేరాయి. కొన్ని సమాధులు గోపురములుగానూ నిర్మించిరి. ఎవరికి నచ్చిన విధంగా వారు వారి కుటుంబ సభ్యులకు వాటిని కట్టిరి. అనేక పద్ధతులలో కట్టబడినవి సమాధుల దొడ్డులలో కనబడును. శుభశుక్రవారం నాడు వాటిని బాగుచేస్తారు. సమాన్యంగా ఆ శుక్రవారం బంధువులు తమ వారి సమాధులు దర్శించడం ఆనవాయితీ. కొందరు ఈస్టరు రోజునను దర్శించి ఆ సమాధుల మీద పూలువేయడం, కాండిల్స్ వెలిగించి చనిపోయిన వారికి గౌరవ సూచనగా చేస్తారు. కొన్ని చోట్ల మట్టి తొట్లలో సమాధులు దొరికాయి.

## పుష్కర నిర్ణయం

దుర్ముఖి నామ సంవత్సరంలో 2016 ఆగస్టు 11న అంటే శ్రావణ శుద్ధ నవమి గురువారం రోజు రాత్రి 9.28లకు బృహస్పతి కన్యారాశిలో ప్రవేశిస్తున్నాడు. దీనితో కృష్ణా పుష్కరాలు ప్రారంభం. అయితే రాత్రివేళ కన్యారాశిలో ప్రవేశించడంతో దాన్ని త్యజించాలి. కాబట్టి మరునాడు 2016, ఆగస్టు 12న అంటే శ్రావణ శుద్ధ దశమి నుంచి కృష్ణా పుష్కరాలు ప్రారంభమవుతాయి. ఆగస్టు 23న అంటే శ్రావణ బహుళ షష్టి మంగళవారం రోజుతో ముగుస్తాయి. మొత్తం 12 రోజులపాటు కృష్ణానదికి పుష్కరాలు. పుష్కర సమయంలో పుష్కర సహితుడైన బృహస్పతి, ముక్కోటి దేవతలు, పితృదేవతలు కృష్ణా నదిలోనే ఉంటారని పురాణ వచనం. ఈ సమయంలో పుణ్యస్నానం కోటిజన్మ పుణ్యఫలం అని ప్రతీతి. ఈ పన్నెండు రోజుల కాలంలో కృష్ణాతీరంలోనూ, దాని కాల్వలలోనూ, పవిత్ర స్నానాలు, దైవదర్శనాలు, దానాలు, పితృదేవతలకు తర్పణాలు, పిండ ప్రదానాలు చేయడం సకల శుభకరం.

చిరునామా : *18-187, సుకర్లాబాద్, మచిలీపట్నం-521001, కృష్ణాజిల్లా. ఫోన్ : 08672-221178*

### శ్రీ మారేమండ రామారావు

# గద్వాల సంస్థానము

## I. చరిత్రము

అనేక వందల సంవత్సరములనుండియు విద్వత్పోషణమునకును, వితరణా విభవమునకును, విశేషవిఖ్యాతి గాంచిన గద్వాల సంస్థాన మాధునికాంధ్రసంస్థానములలో నగ్రగణ్యము నియ్యది ప్రకృతమున నైజాం రాజ్యాంతర్గతమై కృష్ణాతుంగభద్రానదుల మధ్యగల భాగమునందున్నది. దీనికుత్తరమున మహబూబునగర మండలమును, తూర్పున కృష్ణయు, దక్షిణమున దుంగభద్రయు, బశ్చిమమున రాయచూరు మండలమును యెల్లలు. ఈ సంస్థానపు వైశాల్యము 1200 చదరపు మైళ్ళు. జనసంఖ్య 110000. ఈ యాంధ్రరాజ్యము సుప్రసిద్ధ పాకనాటికులజులగు రెడ్డిరాజుల పరిపాలనమునందున్నది.

### ఉత్పత్తి

గద్వాల సంస్థానము కాకతీయ సామ్రాజ్యమునుండి యుద్భవించినది. క్రీ.శ. 1290 ప్రాంతమున గాకతిరుద్రాంబయు బ్రతాపరుద్రుడును కలిసి రాజ్యము చేయుచుండిన కాలమున రాయచూరు దోఆబ్‌ను, గర్నూలు మండలము నరణ్యావృతములై యుండగా, నీ ప్రాంతమునందలి కాకతీయసామంతులును, సేనాలు నీభూభాగమును గృషియోగ్యమొనర్చిరి. ఇట్టివారిలో గోనవంశీయులు ముఖ్యులు. వీరిలో ముప్వురు సోదరు లీకాలమున గాకతీయసామ్రాజ్యపు దక్షిణ దిశనధికారము చేయుచుందిరి. గన్నయరెడ్డి వర్ధమానపురమునను, విఠ్ఠలనాథుడు రాయచూరు బళ్ళారి మండలములను, కాటరెడ్డియు నాతని పుత్రుడగు ఇమ్మడి కాటారెడ్డియు రాయచూరు దోఆబ్‌పైనను అధికారులై యుండిరి. వీరందరును కాకతీయసామంతులే. అడవులను నిర్మూలించి భూమిని వాసయోగ్యముగ జేయుటలో ఇమ్మడికాటారెడ్డికి ఐజగ్రామనివాసియగు బుడ్డారెడ్డి లేక పొలవిరెడ్డియను నతడు మిక్కిలి సహాయమొనర్చెను. అందుచే నీ కాకతీయసేనాని ప్రతాపరుద్రునిచే క్రీ.శ. 1290లో పై బుడ్డారెడ్డికి మానవ, బెలుదోణిరాయచూరు. మోసలకల్లు, అలంపురము, ఆదోని, ఐజ అను ఏడుసీమలపై నాడగౌడరికము నిప్పించెను. ఇంతటినుండియు బుడ్డారెడ్డియు నాతని సంతతి వారును 'ఐజనాడ గౌడు'లని ప్రసిద్ధినందిరి.

### నాడ గౌడరికము

క్రీ.శ. 1323లో కాకతీయ సామ్రాజ్యమస్తమించినపిమ్మట నాంధ్ర దేశము నందెన్నియో చికాకులు గల్గినవి. అపుడెచ్చటి సామంతులచటనే స్వతంత్రులైరి. ఆ సందర్భమున నీయైజనాడగౌడులు స్వస్థలమును వీడి, కర్నూలు మండలములోని గోసునూరనంతాపురమునకు బోయి, యచటి పాలకులగా విడెము వంశీయులకు సామంతులైరి. ఈ కర్నూలు మండలమున నంద్యాల మున్నగు దక్షిణభాగము విజయ నగర రాజుల స్వాధీనమయ్యెను. క్రీ.శ. 1344లో హరిహరుడును, ప్రతాపరుద్రుని పుత్రుడగు కృష్ణనాయకుడును ఏకశిలానగరమును ముట్టడించి స్వాధీనము చేసికొనినప్పుడు పై ఐజవాడగౌడులు గూడ వారికి దోడ్పడిరి. దానికి ప్రతిఫలముగ గర్నూలు మండలమున బశ్చిమమున గొన్ని గ్రామములపై వీరికి నాడగౌడరికము హరిహరునిచే నొసంగబడెను. కాని క్రీ.శ. 1347 లో బహమనీ సుల్తానులు బయల్వెడలి రాయచూరు దో అబ్‌ను, కర్నూలు మండలమునందలి పడమటి భాగమును జయించుటచే ఐజనాడగౌడులు బహమనీ సుల్తానులకు సామంతులైరి. ఇప్పటినుండి సుమారు క్రీ.శ. 1500 వరకును సుల్తానులకును, విజయనగర రాజులకును దోఆబ్‌ను గూర్చి యనేక యుద్ధములు జరిగియుండినను, మహమ్మదీయులే ఆ భూమిపై దమయధికారమును సాగించుచుండిరి. క్రీ.శ. 1489లో బిజాపుర రాజ్యము బయల్వెడలి యాప్రాంతమును స్వాధీనము చేసికొనుటచే నీ ఐజవాడ గౌడు లారాజ్యమునకు సామంతులైరి. క్రీ.శ. 1500 నాటికి వీరు తిరిగి ఐజప్రాంతమునకేగి పూర్వపు నాడగౌడరికమును సంపాదించిరి. హరిహరుడు వీరికి గర్నూలులో నొసంగిన యధికారములు బిజాపురసుల్తాను లాగికొనెను. క్రీ.శ. 17వ శతాబ్ది ప్రారంభమున పెద్దారెడ్డియను నతడు ఐజకందనూలు (కర్నూలు) సీమలకు

నాడగౌడుగానుండెను. ఇతడు పూడూరు సీమకు నాడగౌడుగ నుండిన వీరారెడ్డియను నతని కూతురు బక్కాంబను బెండ్లాడి యా సీమకుగూడ నధిపతి యయ్యెను.

## పెదసోమభూపాలుడు

క్రీ.శ. 1663-1712 నడుమ పెదసోమభూపాలుడు తన తండ్రి పెద్దారెడ్డి యనంతరము నాడగౌడరికమునకు వచ్చెను. బుడ్డారెడ్డి యైజనాడగౌడరికమును సంపాదింప నీ శూరుడు ప్రకృతగద్వాల సంస్థానమును నిర్మించెను. ఆ కాలపు పాళెగాండ్లలో నీతడు ప్రబలుడు నగ్రగణ్యుడునై యుండెను. మాతృకమగు పూడూరుగ్రామమునందలి కోటను బాగుచేయించుచుండగా నితని కొకనిక్షేపము దొరకెను. గురప్పయ్యయను తన గురువు సాయముతో నీ రాజు దానిని బొందెను. పేరుకుమాత్రమీతడు బిజాపురసుల్తానుకు సామంతుడుగనుండినను, స్వాతంత్ర్యమును బ్రకటింప నుద్యుక్తుడైయుండెను. అదే సమయమున మొగలు చక్రవర్తియగు ఔరంగజేబు దక్కనులోని అహమద్‌నగర్, బిజాపూర్, గోల్కొండమున్నగు మహమ్మదీయరాజ్యములను సంపూర్ణముగ జయించుచుండెను. అందు ప్రబలమగు బిజాపురమును ధ్వంసమొనర్చుటలో నా రాజ్యసామంతుడగు సోమభూపాలునితో ఔరంగజేబు మైత్రి యొనర్చుకొనెను. దీనిని యూతగగొని సోమభూపాలుడు 1686-87 ప్రాంతముల దన స్వాతంత్ర్యమును బ్రకటించెను. ఇంతటితో దృప్తినందక నీ రాజు బన్గానిపల్లె, సిరివెళ్ళ, నంద్యాల, సిరిగుప్ప, సిద్ధాపురం, భండాత్మకూరు, అహోబిలము, ఆదవేని మున్నగు సీమలను జయించి తనయధికారమును విస్తరించెను. దీనితో నతనికి శత్రువులెక్కుడైరి. అంత నితడు శిథిలమగు పూడూరుదుర్గము క్షేమకరముగాదని యెంచి క్రీ.శ. 1698-1705 నడుమ పూడూరున కైదుమైళ్ళ దూరమున విశాలమగు బయలులో బలిష్ఠమగు నొకకోటను గట్టించి, దానికి 'గద్వాల' యని పేరిడి తననివాసము నచటికి మార్చుకొనెను. అప్పటికి బిజాపుర రాజ్యము ఔరంగజేబు చక్రవర్తిచే పూర్తిగ జయింపబడెను. ఆ సందర్భమున దనకొనర్చిన యుపకారమునకు బదులుగ నా చక్రవర్తి సోమభూపాలునికి "రాజ" బిరుదమును లాంఛనములనే గాక, నదివరలో నాతడు జయించిన బంగానిపల్లె, కర్నూలు సీమలలో ఆరుమహలులపై సర్వాధికారము నొసంగెను. ఇందుమూలమున రాయచూరు దోఅబ్‌లోని తూర్పుననుండుసగము భాగమేగాక కర్నూలుమండలమునందలి విశేషభాగము గూడ సోమభూపాలునికి స్వాధీనమయ్యెను. ఇట్లుండగా ఔరంగజేబు చక్రవర్తి మరణించెను. అతనివెనుక మొగలు సింహాసనమునకు వచ్చిన బహదూర్షా బలహీనుడుగనుండుటచే దక్కనులో మొగలుల సుబేదారుగ నుండిన నైజాముల్‌ముల్క్ విజృంభింపసాగెను. క్రీ.శ. 1709-1712 నడుమ రెండున్నరసంవత్సరముల కాలము కర్నూలుదుర్గము సోమభూపాలుని యాధీనమునందుండెను. నైజాముల్‌ముల్క్ దీనిని స్వాధీనము చేసికొనుటకై దిలేల్‌ఖానను సర్దారును బంపెను. ఈ ఖానుకును సోమభూపాలునికిని నిడుదూరు మిట్టలవద్ద యుద్ధము జరిగి క్రీ.శ. 1712 నందనసంవత్సర జ్యేష్ఠ శుద్ధమినాడు గద్వాల సోమభూపాలుడందు మరణించెను. ఈ వీరశిఖామణికి మతవిషయములలోగూడ మిక్కిలి శ్రద్ధయుండెడిది. మాతామహస్థలమగు పూడూరులో నుండగనే యతడచటి కేశవస్వామియాలయము నుద్ధరించెను. గద్వాలదుర్గమును నిర్మించిన పిమ్మట నీరాజచటను మరియొక కేశవాలయమును గట్టించెను. మున్నీతడు నిక్షేపమును బొందుటకై కేశవుడను బ్రహ్మచారిని బలియొసగిన దోషముపోవుటకై యాదేవళము నిర్మింపబడెనని కొన్ని యాధారములలో గలదు. ఏమైనను సోమభూపాలుడు తన సర్వస్వమును గేశవునికర్పించి యాతని పక్షమున దాను రాజ్యకార్యములను నిర్వహించుచుండెను. వీరధర్మమునను రాజకీయములయందును, భగవద్విషయములలోనేగాక యీ రాజుకు కవిత్వమునగూడ ప్రశంసనీయమగు ప్రావీణ్యతయుండెడిది. జయదేవకవి సంస్కృతమున రచించిన గీతగోవిందకావ్యము నీతడు తెనుగుచేసి, ప్రతిశ్లోకమునకు నొక పద్యమును, ప్రతియష్టపదికి నొక చూర్ణికను రచించెను. ఈ విధమున పెదసోమభూపాలుడు గద్వాలరాజ్యమును స్థాపించి దానిని తాత్కాలిక సంస్థానములలో నగ్రగణ్యముగ నొనర్చెను.

## లింగమ్మరాణి

ఈతని యనంతర మీతని పుత్రుడు తిరుమలరాయడు బాలుడగుటచే వెంకన్న, రమణయ్యయను నుద్యోగులు నటుపై నీతని భార్యలగు అమ్మక్క, లింగమ్మయను రాణులును రాజ్యకార్యములను నిర్వహించిరి. క్రీ.శ. 1725-1738 నడుమ గద్వాల నేలిన లింగమ్మ రాజ్ఞి కాలము మిగుల ముఖ్యమైనది. ఇప్పటికీమెయధికారము కర్నూలు మండలములోని మరికొంతభాగమునకును, బళ్ళారిలోని ఆదోనిసీమకును వ్యాపించినది. మొగలులింకను గద్వాలవారి సాహాయమును గోరుచునేయుండిరి. ఈ కాలమున గొప్ప కాటకమొకటి సంభవింపగా జనులెందరో లింగమ్మరాణి దానధర్మములను, దయామయత్వమును గూర్చి విని, గద్వాలకు వలసవచ్చిరి. ఈ దీనులనెల్లర నీ రాణి యాదరించి యనేక సౌకర్యముల నొనగూర్చెను. క్రీ.శ. 1723లో దక్కను సుబేదారగు నైజాముల్ ముల్క్ స్వతంత్రుడై హైదరాబాదులో "నైజాం" అను బిరుదముతో నొక ప్రత్యేక రాజ్యమును స్థాపించెను. తమ కింతవరకును మిత్రులుగనుండిన మొగలులు క్షీణించుటను, పరిసరములనేలు కర్నూలు నవాబులు మున్నగువారు శత్రువులుగ నుండుటను గుర్తించి, యీ రాజ్ఞి నైజాముతో మైత్రిని బాటించి, యాతని యధికారము నంగీకరించెను. ఈమెకు బిమ్మట నీమె పుత్రుడు తిరుమలరాయడు మూడేండ్లు పరిపాలించెను.

## రామరాయడు

పిమ్మట తిరుమలరాయని తమ్ముడగు రామరాయడు రాజ్యము నకు వచ్చెను. గద్వాల రాజ్యమీతని కాలమున (క్రీ.శ. 1746-1761) మిక్కిలి యభివృద్ధినందెను. 1745 ప్రాంతమున కర్ణాటక సింహా సనమును గూర్చి యొదవిన అర్కాటుముట్టడిలో బాల్గొనిన నైజాముకు రామరాయడు సాయముచేసెను. ఆ యుద్ధము నుండి మరలునపుడు నైజాము సేనానియు, గర్నూలు నబాబు నొకరినొకరు హత్యచేసికొనిరి. ఈయదనున క్రీ.శ. 1746లో గద్వాల రామరాయడు కర్నూలు దుర్గమును స్వాధీనము చేసికొని, యథాపూర్వముగ నాడగౌడు, నర్నాడ డగౌడు, సర్ సర్నాడుగౌడు రుసుములను వసూలుచేయుచుండెను. క్రీ.శ. 1752లో నైజాముచే పంపబడిన మహమ్మదలంకు రామ రాయడు కర్నూలును స్వాధీనము చేసెను. కాని యీక్రొత్త నబాబు తన దివాను ప్రేరణచే గద్వాలవారి నాడగౌడకి మున్నగు హక్కులను త్వరలోనే లాగికొనెను. దీనికి బ్రతీకారమొనర్ప నవకాశమునకై రామ రాయడు వేచియుండెను. ఇంతలో మరణించిన కర్నూలు నబాబు తమ్ముడు రణమస్తుఖానను నతడు గర్నూలుపై దండెత్తి, పూర్వపు టధికారముల నొసంగెదననియు, గర్నూలు దుర్గమును స్వాధీనము చేయుమనియు రామరాయనికి రాయబారమంపెను. ఈ రాజు నట్లొనర్చెను. ఇందుమూలమున గద్వాలరాజులకు కర్నూలుజిల్లాలోని బేతంచెర్ల, రంగాపురము, కొలుమలపల్లి, ముద్దవరం, బుగ్గానిపల్లె, ఎర్రగుంట్ల, ఎంబావిమున్నగు 19 నూతన గ్రామములపై నాడ గౌడ రికము లభించెను. ఈ రామరాయడు క్రీ.శ. 1761లో మరణించెను.

## చిన్నసోమ భూపాలుడు

పిమ్మట రామరాయని యన్న తిరుమల రాయని పుత్రుడగు చినసోమ భూపాలుడు రాజ్యమునకు వచ్చెను. ఈ రాజు మహా వీరుడను, రాజ్యతంత్రజ్ఞుడునైయుండెను. తన పినతండ్రి రాజ్య కాలముననే యీతడు తన సైన్యములతో నైజామునకు దోడ్పడి యాతని వలన 2000 రూప్యములను బహుమానముగ బొందెను. రాజ్యా భిషిక్తుడయిన పిమ్మటనితనికి నైజాంసలబత్‌జంగు కర్నూలులో 2 మహలుల పైనను, ఆదోనిలో రెండిటిపైనను, నంద్యాలసీమలో 15 పైనను, మొత్తము 19 మహలులపై నాడగౌడు, సర్నాడగౌడు, సర్సర్నాడ గౌడు అధికారములనొసంగెను. పిమ్మట సోమభూపాలుడు తన రాజ్యమును విశేషముగ విస్తరింపజేసెను. అమరచింత సంస్థానము లోని కొన్ని గ్రామముల నీతడు యుద్ధసమయములలో విశేష సహాయము చేయు పద్ధతిని గుత్తకు దీసికొని తన కతిసమీపము నందున్న రాజోలిసీమ నాక్రమించెను. క్రీ.శ. 1773లో నైజామునకును షోరాపుర రాజునకును జరిగిన యుద్ధములో నైజాము సేనానియగు అమీర్‌ఉల్‌ఉమ్రాకు మిక్కిలి తోడ్పడెను. ఇందుమూలమున నైజాముకు సోమభూపాలునియెడ గౌరవ విశ్వాసములు ప్రబలి యాతడు రాయ చూరు, బళ్ళారి, సుబేదార్లు మున్నగువారికి సోమభూపాలుని యాజ్ఞ లను వారు చెల్లింపవలెననియు, నతడు వారితో జేయు నొడంబడిక లకు దాను బద్ధుడుగనుండుననియు పర్వానాలను బంపించెను. ఇటు పైన గద్వాల సంస్థానమునకు గొన్ని యిబ్బందులు గలిగినవి. ఇప్పటికి మహారాష్ట్రులు దక్కనులో ప్రబలిరి. నైజాముగూడ వారితో సంధి చేసికొని తన రాజ్యమున చౌతును వసూలు చేయు నధికారము వారి కొసంగెను. ఇందుమూలమున నైజాం రాజ్యమున ద్వంద్వ ప్రభుత్వ మేర్పడినది. సోమభూపాలుని కీ మహారాష్ట్రులు ప్రక్కలోని బల్లెమువలె నుండిరి. ఇదే సమయమున కర్నూలు నవాబు గద్వాలవారి నాడగౌడగి మున్నగుహక్కులను రద్దుచేసి క్రీ.శ.1773-1775 నడుమ ఎంబాయి, రంగాపురము, సిరివెళ్ళ, ఎఱ్ఱగుంట్ల, బేతంచెర్ల, కోముల పల్లె, బుగ్గాని పల్లె మొదలగు గ్రామముల నాక్రమించెను. వ్యాధిగ్రస్తుడుగ నుండుటచే చినసోమభూపాలుడిందులకు ప్రతీకారము జేయ లేకుండెను. ఈ రాజు క్రీ.శ. 1794లో మరణించెను.

ఆంధ్రవాఙ్మయాభివృద్ధికి చినసోమభూపాలుని రాజ్యకాలము మిక్కిలి ముఖ్యమైనది. సమకాలికులీతని నభినవభోజుడని కొనియాడు చుండిరి. ఈ రాజు రచించిన రతిరహస్యమను శృంగారగ్రంథము ప్రశంసనీయము. ఈతని యాస్థానమునందెందరో కవులుండి చక్కని గ్రంథములను రచించిరి. వారిలో నెన్మండుగురు ముఖ్యులు. 1. కాణాదము పెద్దన సోమయాజి యనునతడాత్రేయసగోత్రుడు. వేద శాస్త్రపురాణములను కరతలామలకములజేసికొనిన యీ కవి ఆశు, చిత్ర, బంధ, గర్భములను చతుర్విధకవితలను జెప్పనేర్చినవాడు. భోజుని చంపూరామాయణమునకు వ్యాఖ్యానమును రచించెను. సురపుర సంస్థానముననుండి యాంధ్రమత్స్యపురాణమును, గద్వాల సంస్థానముననుండి భద్రాపరిణయమును, ఆధ్యాత్మరామాయణమును, యథాశ్లోకతాత్పర్యరామాయణమునందలి బాలకాండమును, రచిం చెను. 2. కిరీటి వెంకటాచార్యుడను శ్రీ వైష్ణవకవి "సర్వతంత్రస్వతంత్ర కవితార్కికకంఠీరవ, శ్లేషయమకచక్రవర్తి" యను బిరుదములు గల వాడు. అలంకారకౌస్తుభము, జంఝూమారుతము, శృంగారలహరి, భావశతకము మున్నగు సంస్కృత గ్రంథములును, అచలాత్మజా పరి ణయమను నాంధ్రద్వ్యర్థికావ్యము నీతని గీర్వాణాంధ్రభాషా పాండిత్య మును దెల్పుచున్నవి. 3. క్రొత్తపల్లి రామాచార్యులను మరి యొక శ్రీవైష్ణవకవి యథాశ్లోకతాత్పర్యరామాయణమునందలి యయోధ్యా కాండమును రచించెను. 4. గార్గేయపుర సుబ్బశాస్త్రియను కవి "ఉభయ కవితానిస్సహాయసాహితీధురణ" బిరుదాంకితుడు. ఇతడు రామాయణారణ్యకాండమును తెనుగు చేసెను. 5. "విద్వత్కవికుంజర" బిరుదాంకితుడగు కామసముద్రం అప్పళాచార్యుడు వివిధ బంధముల

కవిత్వమును జెప్పి సంస్కృతప్రాకృతములలో కావ్యములను రచించిన వాడు. యథాశ్లోక దాత్పర్యరామాయణమునందలి కిష్కింధకాండమును రచించెను. 6. తిరుమల కృష్ణమాచార్యుడను కవి "అష్టభాషాకవితా దురంధరుడు". రామాయణ సుందరకాండము నాంధ్రీకరించెను. 7. బోరవెల్లి శేషకవి రామాయణ యుద్ధకాండమును రచించెను. 8. సోమనాథశాస్త్రికవి. ఈవిధమున చినసోమభూపాలుని కాలమున నాంధ్రగీర్వాణ వాఙ్మయములభివృద్ధినందినవి.

## రెండవ రామరాయడు

పిమ్మట రెండవ రామరాయడు గద్వాలరాజ్యమునకు వచ్చెను. ఇతడు క్రీ.శ. 1794-1806 నడుమ రాజ్యమేలెను. ఈకాలమున గొన్ని ముఖ్యకార్యములు జరిగినవి. ఇతడు రాజ్యమునకు వచ్చుటకు గొంచెము ముందుగ మనూరుద్దౌలా యను నైజాంసేనాని, గద్వాల సంస్థానములోని గట్టుదుర్గముపై దాడివెడలెను. ఇందులకు గద్వాల వారు కొంతకాలము నుండి పేష్కసును చెల్లింపకుండుటయే కారణము. అప్పుడు రామరాయని దివాను హైదరాబాదుకు పోయి 11 లక్షల రూపాయలను పాతబాకీగానిచ్చి, యటుపై సంవత్సరమునకు 2 లక్షల నొసంగుట కంగీకరించి, గట్టుదుర్గమును తిరిగి సంపాదించెను. దీనికి ఫలితముగ క్రీ.శ.1800లో నైజాము రామరాయనికి "రాజా, భూపాల్, బహద్దర్" మున్నగు బిరుదములను, వస్త్రాభరణాదులను బంపించెను. మరి యారుసంవత్సరముల కీరాజు మరణించిన పిమ్మట వార సత్వమును గూర్చి కొన్ని వివాదములును, కల్లోలములును జరిగినవి. తుదకు రామరాయని యంత్యశాసనము ననుసరించి, యతని మేనమామపుత్రుడగు సీతారామరెడ్డి గద్వాలరాజ్యమునకు సీతారామ భూపాలుడనుపేరుతో వచ్చెను.

## రాజరామభూపాలుడు

క్రీ.శ. 1807-1840 నడుమగల సీతారామభూపాలుని రాజ్యకాలము ప్రశాంతముగ జరిగిపోయెను. గద్వాలపేష్కసును గూర్చి యితనికిని నైజాముకును గొంత చర్చ జరిగి తుదకది 115000 రూపాయలుగ నిర్ణయింపబడెను. పిమ్మట నీరాజు దత్తపుత్రుడగు మూడవసోమభూపాలుడు రాజ్యమునకు వచ్చెను. నైజాము నిందుల కంగీకరించెను. ఈ రాజసమర్థుడును విషయలాలసుడునై యుండెను. సైనికులతో నీతడు వివాదపడుటచే వారు 3-6-1840 దేదీని దర్బారులో బహిరంగముగ నీరాజును కాల్చివేసిరి. అంతనీతని తల్లి యగు రాణీవెంకటలక్ష్మమ్మ రాజ్యభారమును వహించి క్రీ.శ. 1845లో తన మేనల్లుని దత్తుచేసికొని రామభూపాలుడను పేరుతో గద్వాల సింహాసనమెక్కించెను. ఈ రాజు కాలమున కృష్ణా తుంగభద్రానదుల మధ్యనున్న భాగముపై పేష్కసును నైజాం బ్రిటిషువారికొసగుటచే గద్వాలవారికి బ్రిటిషువారితో సంబంధమేర్పడెను. సిపాయిలకలహమిదే సమయమున జరిగినది. రాజు యువకుడైనను, పరిస్థితులు ద్రేకజనకములుగానుండినను, రాజమాతయగు రాణీ వెంకటలక్ష్మమ్మ గారు స్థైర్యము వహించి తన పుత్రుని యీ విద్రోహమునందే జోక్యమును గల్పించుకొననీయకుండెను. ఈ కాలమున సంస్థానీకుల పోలీసు, సివిల్, రెవెన్యూ అధికారములను గూర్చి కొంత చర్చ జరిగినది గాని తుదకది సంస్థానీకుల కనుకూలముగనే పరిష్కరింపబడినది. రామభూపాలుని కాలమున సంస్థానమెక్కుడుగ నభివృద్ధినందినది. ఈయన దోమకొండసంస్థానాధీశ్వరులగు శ్రీరాజా సోమేశ్వరరావు బహద్దరు వారి పుత్రికయగు రామక్కమ్మగారిని మొదటి భార్యగను, మహబూబు నగరుజిల్లా తాటికొండ గ్రామములోని లక్ష్మీదేవమ్మగారిని ద్వితీయ భార్యగను స్వీకరించి, వారివలన సంతతి గల్గకుంటచే తన సోదర పుత్రులగు వెంకట రామారెడ్డిగారిని పెంచుకొనెను. ఇందు రాణీ లక్ష్మీదేవమ్మగారు నేటికిని జీవించియున్నారు.

## మహరాజా సీతారామభూపాల్

క్రీ.శ. 1901 సంవత్సరములో పై వెంకటరామారెడ్డిగారు నైజాము వారి యనుమతితో "మహారాజాసీతారామభూపాల్ బహద్దర్" అను పేరుతో గద్వాల సింహాసన మధిష్ఠించిరి. వీరి పరిపాలనమున గద్వాల సంస్థానమనేకవిధముల నభివృద్ధి జెందినది. విద్వత్కవులెందరో వీరి యాదరమునకు బాత్రులైరి. అందు తిరుపతి వేంకటకవులును, కొప్పరపు కవులు నగ్రగణ్యులు. క్రీ.శ. 1912లో జరిగిన ఢిల్లీదర్బారులో వీరికి గొప్ప సన్మానము జరిగెను. మహారాజావారు కర్నూలుజిల్లా ఉల్సలగ్రామములోని యొక గౌరవనీయమగు రెడ్డికుటుంబమునుండి శ్రీ ఆది లక్ష్మీదేవమ్మయను నామెను పరిణయమాడిరి. వీరిర్వురకును శ్రీలక్ష్మీదేవమ్మ, వరలక్ష్మీదేవమ్మ యను నిర్వురు పుత్రికలు జన్మించిరి. మహారాజాసీతారామభూపాల్ బహద్దరువారు 1924 సంవత్సరము మే నెల 12వ తేదీన దివంగతులైరి.

## మహారాణీ శ్రీ ఆదిలక్ష్మీదేవమ్మ బహద్దర్‌వారు

అంతటినుండియు మహారాణిశ్రీ ఆదిలక్ష్మీదేవమ్మ బహద్దరువారు గద్వాల రాజ్యభారమును వహించుచున్నారు. కాకతీయ సామ్రాజ్యాంతర్గతమగు రాజ్యము నేలుచుండుటవలననో లేకనాంధ్రుల పూర్వ పుణ్యవశముననో యీ మహారాజ్ఞి యన్నివిధములను నాంధ్ర రాజ్ఞీవతంసమగు కాకతిరుద్రాంబికను పోలియున్నారు. ఈమె సంస్థాన కార్యములయందెక్కుడు శ్రద్ధవహించి స్వయముగ నెల్లవిషయములను చూచుకొనుచున్నారు. వీరు తమ ప్రథమపుత్రికను దోమకొండ సంస్థాన యువరాజగు శ్రీరాజా సోమేశ్వరరావు బహద్దరు వారికిచ్చి వివాహము చేసిరి. వీరికి శ్రీ రాజాకృష్ణరామభూపాలరావ్ బహద్దర్ అను దౌహిత్రులు కలిగిరి. కాకతీయ రుద్రాంబిక వలె మహారాణీవారీదౌహిత్రుని

పుత్రవాత్సల్యముతో పెంచి విద్యనేర్పించుచు, ప్రతాపరుద్రదేవుని వలెనే వీరిని భావిగద్వాల పాలకునిజేయనై యున్నారు.

మహారాణీవారి శీల మాదర్శప్రాయము. సంస్థానాధీశ్వరియయ్యు నీమె సదా శ్రీచన్నకేశవపాదారవింద మధుకరాయమానమానసయై దినమున విశేషభాగము నా ముష్మకచింతతో గడపుదురు. వీరి దర్శన మెల్లరకును సులభము. కష్టసుఖముల జెప్పికొనగోరు ప్రజలును, ఆశ్రయము నభ్యర్థించు విద్వాంసులును, సహాయము నపేక్షించు పరోపకారపరాయణులును, మహారాణీవారి సమక్షమున కసంఖ్యాకు లుగ వచ్చుచు బోవుచుందురు. ఇంద సంతృప్తులుగ మరలువారుండ రనుటలో నతిశయోక్తి యెంత మాత్రమును లేదు. కార్తికమాసమున విద్వాంసులకును, మాఘమాసమున కవి గాయకులకును జేయబడు సన్మానము లీ మహారాజ్ఞి కాలమునందపూర్వతను గాంచినవి. వీని వైభవమును చూడవలెనుగాని వర్ణింపనలవిగాదు. ఈమె కాలమున గద్వాలకు "విద్వద్గద్వాల" యను నామము సార్థకమైనది.

ఇట్లు ప్రజారంజకముగ రాజ్యము నేలుచు, సకలవిద్యలకును గల్పతరువై, సదా శ్రీ చెన్నకేశవ పాదారవింద మధుక రాయమానసయై, యాంధ్రరాజ్ఞీతిలకమై, యాంధ్రగౌరవాధినేతయై యెప్పు శ్రీ మహారాణీ వారికిని, వారి ప్రియ దౌహిత్రులగు శ్రీ రాజా కృష్ణరామభూపాల్ బహద్దరు వారికిని, వారి కుటుంబమునకును సర్వేశ్వరుడాయురా రోగ్యైశ్వర్యముల నొసంగుగాక.

## II. సంస్థానీకుల అధికారములు

గద్వాల సంస్థానాధీశ్వరులకు స్వతంత్ర పరిపాలనాధికారము గలదు. వీరికిని నైజాం రాష్ట్రమునందలి యితరులకును గల సంబంధ ములను మాత్రము నైజాంవారు పరిష్కరింతురు. సంస్థానన్యాయ శాఖలోని యున్నతోద్యోగములు మాత్రము హైదరాబాదు హైకోర్టు వారామోదింతురు. ఇతరోద్యోగులందరిని సంస్థానీకులే నియమించు కొందురు. కొలదికాలమువరకును "గద్వాలరూపాయలు" వ్యాప్తిలో నుండినవి. ఇటీవలినుండి బ్రిటీషురూపాయలు వాడబడుచున్నవి. నేటికి నిదియే ప్రమాణనాణెము. సంస్థానములోని భూస్వాము లందరికిని సంస్థానమే Court of Wards అగును. 1895 వరకును సంస్థానమునకు ప్రత్యేక చట్టములుండినవి. అప్పటినుండియు నైజాం ప్రభుత్వమువారి చట్టములే యిచటను వర్తించుచున్నవి. రెవెన్యూ విషయమునకూడ వీరికి విశేషమగు నధికారమున్నది. 1906వ సంవత్సరమువరకును వీరికి అబ్కారీహక్కులు పూర్తిగనుండినవి. అప్పటినుండియు వానిని నైజాంవారు నిర్వహించుచు గద్వాలుకు 13000 రూపాయిలను పరిహారముగా నిచ్చుచున్నారు. కోర్టుస్టాంపు లను సంస్థానీకులు తామే వేయించుకొనుచున్నారు. సుంకములను (Customs) నైజాంవారే వసూలుచేసి వీరికి సుమారు 20000 రూపాయలనిచ్చెదరు. పన్నులు విధించి వసూలుచేయునధికారము పూర్తిగ సంస్థానము వారిదే. గద్వాలలో 300 మంది రాజపుత్రుల సైన్యమును, అరబ్బుల అంగరక్షకబలమును గలదు. ఈ నియోగమునకై యేటేటను 30000 రూపాయిలు ఖర్చగును. నేరస్తులను శిక్షించుటలో సంస్థానీకులకు పూర్ణాధికారమున్నది. ఉరిశిక్షలు మాత్రమిటీవల నైజాంవారిచే నామోదింపబడుచున్నవి. ఈ సంస్థానమున ప్రబలమగు పోలీసుశాఖ పూర్వమునుండియునున్నది. పై నిబంధనలును, ఏటేటను నైజాంవారికి నియమితమగు పేష్కనును చెల్లించుటయును దప్ప నితర విషయములలో గద్వాల రాజులకు పరిపూర్ణాధికారము గలదు.

ఈ రాజులయెడ జూపబడు విశేషగౌరవములను గూర్చి యిచ్చుట దెల్పుట సమంజసముగ నుండును. వీరికి రాజ్యాభిషేక కాలమున నైజాంవారు తమ సమ్మతిని దెల్పుచునొక ఖిల్లతును, తురాయి, చీగా, హారములు, దస్తుబంద్, భుజబంద్, మున్నగు నాభరణములను, దస్తార్ (ఉష్ణీషము) దుశ్శాలువ, ఉత్తరీయము, అంగీ మున్నగు వస్త్రము లను బంపుదురు. అదేవిధమున రాణులకును చీరలును, రవికెలును, ఆభరణములును బంపబడును.

## III. ప్రాచీన శిథిలములు

ఈ సంస్థానము పూర్వకాలమున బశ్చిమ చాళుక్యసామ్రాజ్యము నను, బిమ్మట గొంతవరకును తెలుగుచోడుల రాజ్యములందును, దర్వాత కాకతీయ సామ్రాజ్యమునను చేరియుండినది. అటుపై నిందు ఐజ, దరూరు, పూడూరు, గట్టు, వల్లూరుమున్నగు సీమలేర్పడి యనేక నాడగౌడులచే పాలింపబడినవి. ఈ రాజవంశముల శాసనములును, కట్టడములు నీ సంస్థానమునం దెన్నియోగలవు. వీనివలన నీ రాజ్యపు ప్రాముఖ్యత స్పష్టమగును. గాన వీని నిట సంగ్రహముగ వర్ణించుట యుక్తము.

### గద్వాల

ఈ సంస్థానమునకు గద్వాల ముఖ్యపట్టణము. ఇది కృష్ణానదికి మూడుమైళ్ళ దూరమున సికింద్రాబాదు-కర్నూలు రైలు మార్గము నందున్నది. ఇందు సువిశాలమగు దుర్గమొకటి గలదు. దీనిని గద్వాల రాజులలో నగ్రగణ్యుడగు రాజా పెదసోమభూపాలుడు (క్రీ.శ. 1663-1712) లేక శోభనాద్రి గట్టించెను. ఈ దుర్గనిర్మాణ కాలము క్రీ.శ. 1700-1706 అయినటుల వాఙ్మయము నుండియు స్థానిక చరి త్రములనుండియు దెలియుచున్నది. వలయాకారమగనున్న యీ దుర్గమున నిరువదియొక్క బురుజులు గలవు. కోటలోపలి యావ రణము రెండు భాగములుగనున్నది. అందు దక్షిణమున కేశవాల యము రామస్వామియాలయమును, రాజసౌధమునున్నవి. సౌధ

ప్రాంగణమున కేడంకణాల సోఫాయని పేరు. దాని నడుమ నలు చదరముగానున్న తిన్నె గలదు. ఇదియే గద్వాల దుర్గమునకు శంకుస్థాపన చేయవడిన స్థలమని తెలియుచున్నది. ఇచటి గోడలపై కొన్ని వర్ణచిత్రములున్నవి. వీనిలో గద్వాల దుర్గనిర్మాతయగు రాజా పెద సోమభూపాలుని నుండి యారుతరముల రాజుల చిత్రములు గలవు. చరిత్రమున కీచిత్రములు మిగుల ముఖ్యములైనవి. ఇచటగల యితర చారిత్రకవస్తువులలో సుమారు ముప్పది యడుగుల పొడవుగల తుపాకి యొకటియు, మహమ్మదీయుల చంద్రధ్వజమొకటియు ముఖ్యములు. వీనిని తమయధీనములోని దరూరుపై బిజాపురసైన్యములు దండెత్తి నపుడు గద్వాలరాజులు వశపరచుకొనిరట.

## పూడూరు

గద్వాల సంస్థానమునందలి గ్రామములలో నెల్ల పూడూరు మిక్కిలి ముఖ్యమైనది. ఈ యూరు 9వ శతాబ్దినుండియు నభివృద్ధిలో నుండెనని యిచటి యొక కన్నడశాసనమునుండి తెలియుచున్నది. ఈ గ్రామమున జూడవలసినవి మూడు దేవాలయములు. అందు మొదటిది కేశవ స్వామియాలయము. ఇది యాధునికము. ఆలయమునకు శిఖరము లేదు. దీనియావరణలోగల సింహద్వారము ప్రాచీనచాళుక్యశిల్పపద్ధతి ననుసరించి నిర్మింపబడినది. పొలమును దున్నునపుడిది భూగర్భము నుండి బయల్వెడలెనని తెలియుచున్నది. పిమ్మట పేర్కొనదగినది పూడూరుదుర్గము. గ్రామమునకు చుట్టును పలయాకారమగు నొక మట్టిగోడ గలదు. ఇది పూర్వదుర్గమునకు బహిరావరణమనునంశము ఈ యూరి మల్లిఖార్జున గుడివద్దగల శాసనములోని "పుద్రసంజ్ఞేపురే" "దుర్గేయశస్సోదరే" యను మాటలవలన స్పష్టమగుచున్నది. మల్లికార్జునగుడి మట్టిగోడకు ముప్పదిగజముల దూరమునన్నది. దీనికి సమీపమున నొక గోడను జేరి కొన్ని విగ్రహములున్నవి. ఇందు ఒక స్త్రీ విగ్రహమును, ఒక పురుష విగ్రహమును, తలపై నేడు పడగల సర్పముగల్గి ధ్యానముద్రలో నాసీనుడైయున్న జైనతీర్థంకరుని విగ్రహమును ముఖ్యములు. ఇవిగాక మరిమూడు తీర్థంకరవిగ్రహములు గూడ నిచట గలవు. మల్లిఖార్జునగుడి కొక ఫర్లాంగుదూరమున వీరభద్రాలయమున్నది. ఇందు నందిగల ముఖమంటపము నటుపై ప్రవేశ మంటపమును దాని వెనుక గర్భాలయమును గలవు. ఆలయముపై శిఖరము మెట్లు మెట్లుగా నిర్మింపబడి పోనుపోను సన్నమగును. దీనియగ్రము తలక్రిందులుగ బోర్లింపబడిన కలశమువలెనున్నది. ఇది జైనాలయ శిఖరమని యీ వర్ణనమునుండి తెలియుచున్నది. ఈ యాలయమున నొక శివలింగమును వీరభద్రుని విగ్రహమును గలవు. ప్రత్యక్షముగ జైనాలయముగ గన్పడు నిందు శైవ విగ్రహము లుండుటను బట్టి యిందేమియో విశేషముండవలెనని తోచుచున్నది. శైలవులకును జైనులకును 12వ శతాబ్దములో ప్రబలమగు శాత్రవ మేర్పడి తత్ఫలితముగ జైనులు క్షీణించుటయు వారి గ్రంథములు నశించుటయు, వారికట్టడములు మార్పునందుటయు శాసనవాఙ్మ యాదుల నుండి తెలియుచున్నవి. ఈ సుప్రసిద్ధ చారిత్రక విషయమును పైన పేర్కొనబడిన జైనాలయమున శైవవిగ్రహములుండుట యందలి వైరుధ్యముతో సమన్వయించినచో పూడూరుగూడ శైవజైన సంఘర్షణమున కొక ముఖ్యరంగస్థలమైయుండెనని యూహింప నగుచున్నది. ఈ యూహను బలపరచుట కీయూరనే యీ క్రింది ప్రమాణములు గాంచనగుచున్నవి. 1. ఇచటి మల్లిఖార్జునగుడివద్ద చెదరి యున్న విగ్రహములలో పార్శ్వనాథుని యొక్కయు మరియిర్వురు తీర్థంకరులయొక్కయు విగ్రహములున్నవి. 2. ఈ యాలయమున కనతిదూరమునందున్న నల్లరాతిపై మూడు వైపుల 12వ చాళుక్య విక్రమసంవత్సరమునాటి కన్నడ శాసనము మొదట కూర్చొనియున్న ధ్యాని జైనవిగ్రహమును, జినుని ప్రశంసయు, పల్లవజినాలయ ప్రశంసయు గలవు. మొదటి ప్రక్క చిగురుభాగమున వుండవుర దుర్గమును, ద్రవిళసంఘమునకు జెందిన కాంచనసేవపండితుడును పేర్కొనబడి యున్నారు. 3. వీరభద్రాలయమున కుత్తరముగ నున్న యొక సత్రము యొక్క గోడలో నొక రాతిపైన మొదటి వరుసలో శివలింగమును ధ్యానిజైనవిగ్రహమును, రెండవవరుసలో జైనుని క్రింద కత్తితో పోరాడు చున్న రౌతుగుఱ్ఱమును శివలింగము క్రిందనున్న పదాతియొకడు యీటెతో పొడుచుచున్నట్లును, మూడవవరుసలో రౌతుక్రింద తల క్రిందుగ పడుచున్న మనుష్యుడును, నాల్గవవరుసలో నొక మృత దేహమును చెక్కబడియున్నవి.

ఈ శిల్పములనుండి నేటి వీరభద్రాలయమే పూర్వపు పల్లవజినాలయమనియు, నందు మల్లికార్జునగుడివద్దగల పార్శ్వనాధుడు నాతని యక్షిణీయక్షులు నుండెడివారనియు, వీరశైవమతము విజృంభించి నపుడు పైన పేర్కొనబడిన సత్రపుగోడలోని శిల్పము సాంకేతికముగ దెల్పు శైవజైనమతసంఘర్షణ మిచ్చటగూడ జరిగి జైనులోడిపోయి రనియు, నటుపిమ్మట నిచట పల్లవజినాలయమున శివలింగమును వీరభద్రుని విగ్రహమును స్థాపింపబడినవనియు స్పష్టమగుచున్నది.

## వల్లూరు

ఈ గ్రామము హైదరాబాదు - కర్నూలు రైలుదారిపైనున్న చాగాపురమునకు రెండు మైళ్ళ దూరమునందున్నది. ఇచటి గోపాలస్వామి

యాలయము సుప్రసిద్ధము. ఈ యాలయావరణలో భూమిలో పాతుకొనియున్న రాతిమీద మిక్కిలి యరిగిపోయిన శాసనమొకటి గలదు. ఆంధ్రచోళుల కొక వల్లూరు రాజధానిగ నుండెడిదనియు, కాకతీయ గణపతిదేవుని సామంతుడగు గంగయసాహిణి వల్లూరు పురము రాజధానిగా పానుగల్లు మొదలు మార్జవాడివరకును గల దేశము నేలెననియు శాసనములనుండి తెలియుచున్నది. రుద్రాంబా ప్రతాపరుద్రుల సామంతుడగు త్రిపురాంతకుడు నిటనుండియే రాజ్య మేలెను. ఈయూరనొకదుర్గము యొక్క చిహ్నములు గాంచనగు చున్నవి. పై చరిత్ర ప్రసిద్ధమగు రాజధాని ప్రకృతగద్వాల సంస్థానము లోని యీవల్లూరేయని చెప్పవచ్చును.

**బోరవెల్లి**

ఈ గ్రామము వల్లూరు కెనిమిదిమైళ్ళ దూరమునందున్నది. ఇచ్చట బలిష్ఠమగు దుర్గమొకటి గలదు. ఒకప్పుడీ గ్రామమొక సీమకు ముఖ్యస్థానముగ నుండినటుల స్థానిక చరిత్రములనుండి తెలియు చున్నది. "అలంకార శిరోభూషణ" మను సంస్కృతగ్రంథమున నీయూర ముష్టిపల్లికులజులును, మినిమళ్ళగోత్రజులునగు పాకనాటి రెడ్లు పాలించుచుండిరని చెప్పబడియున్నది. ఈ వంశపాలకులలో కడపటిదగుగిరెమ్మయను రాణి దత్తపుత్రుడగు రాజారామరాయడు 18వ శతాబ్దమధ్యభాగమున గద్వాల కేలికయగుటచే నీబోరవెల్లి సీమయు దుర్గమును గద్వాలరాజ్యములో గలసిపోయినవి.

**రాజోళి**

గద్వాల సంస్థానమునందలి ముఖ్యగ్రామములలో నిదియొకటి. ఇది తుంగభద్రాతీరమునందున్నది. నది యిట రెండుపాయలై యొక లంక యేర్పడగా బ్రిటిషు ప్రభుత్వమువారొక యానకట్టను గట్టి యావలియొడ్డునకు జల సౌకర్యమును గల్గించిరి. ఈ గ్రామమున బలమగు దుర్గమొకటి గలదు. ఇందలి రాజసౌధములలోని భాగము లింకను గన్పించుచున్నవి. దుర్గము మధ్య వీరనారాయణస్వామి యాలయమున్నది. ఇది మనోహరమైనది. గ్రామమునకు రెండుమైళ్ళ దూరమున నదియొడ్డున రామేశ్వరాలయము గలదు. చిన్నదైన నీ యాలయము చక్కనిది. ఇందొక లింగమును కొన్ని భిన్నశిల్పములును గలవు. ఆలయముముంగిట నొక తెల్లరాతిపైన చాళుక్యభూలోకమల్లుని శాసనమొకటి యున్నది.

**ఐజ**

ఐజ మిగుల ముఖ్యమైనది. సంస్థాన మూలపురుషుడగు బుడ్డారెడ్డి యీ గ్రామనివాసి. ఈతడు శా.శ. 1212వ సంవత్సరమున కాకతీయ ప్రతాపరుద్రుని వలన ఐజ మున్నగు నేడు సీమలపై నాడ గౌడరికమును బొందెను. ఇందువలన నతని సంతతివారికి 'ఐజ నాడగౌడు' లను పేరేర్పడినది. ఇట పూర్వమొక దుర్గముండెడిదని తెల్పుటకు నేటికి నొక మట్టిబురుజును, గోడలలోని భాగములును నిలచియున్నవి. ఇందు మూడు ప్రాచీనాలయములు గలవు. అందలి యాంజనేయా లయము ప్రక్కనున్న దిగుడుబావిమెట్లలో బిగింపబడిన యొక రాతిపై నొక శాసనభాగమున్నది. దానిలో "స్వస్తి శ్రీ మన్మహామండలేశ్వర కాకతీయ ప్రతాపరుద్రదేవ మహారాజులు ఒరుగంటను సుఖసంకథా వినోదంబున రాజ్యముసేయుచుండగా" అని యున్నది. ఈ శాసన శకలముపై బుడ్డారెడ్డికి నాడగౌడరికము వచ్చిన విధమును దెల్పుచు, గద్వాల సంస్థానము కాకతీయ సామ్రాజ్యభవమని నిరూపించు. సంస్థానికుల వద్దగల సన్నదును బలపరచుచున్నది.

**ఉత్తనూరు**

ఇది ఐజకు రెండుమైళ్ళలోనున్న గ్రామము. ఈ గ్రామమునకు భాగణ్ణదాములను కర్ణాటక భక్తుడు శాశ్వతమగు గీర్తిని గల్గించెను. ద్వైతమతభక్తులు గొందరు తమ మత సిద్ధాంతములను పామరులకు సుబోధ్యముల నొనర్చుటకై కన్నడభాషలో కీర్తనలను రచించిరి. ఈ కీర్తనలను పాడుచు భక్తిపరవశులై యనేకాద్భుత కార్యముల నొనర్చిన యీ భక్తుల సంఘమునకు 'దాసకూట'మనిపేరు. భాగణ్ణదాసులను నత డీకూటమున ముఖ్యుడు. ఉత్తనూరు గ్రామమీతని జన్మస్థానము. క్రీ.శ. 1722-62 నడుమ జీవించిన యీ మహనీయుని గూర్చి గర్ణాటకమున పెక్కుగాథలు గలవు. నేటికిని ఉత్తనూగులో "భాగణ్ణ దాగురభావి"యని యొక బావి గలదు.

**కుచినెర్ల**

ఈ గ్రామము గద్వాల-రాయచూరు రోడ్డుపై రాయచూరుకు 11 మైళ్ళ దూరమునందున్నది. ఊరి కరమైలుదూరమున పొలముల మధ్య సోమప్పగుడియని యొక చిన్న గుడి గలదు. ఇందొక రాతిమీద నాయుధహస్తుడై గుఱ్ఱముపై స్వారీచేయుచున్న యోధునివిగ్రహ మున్నది. ఇదియొక "వీరకల్" అని తోచుచున్నది. ఈ గుడికెదురుగ నొక నల్లని రాతి స్తంభము భూమిలో పాతబడియున్నది. దీనికి మూడు వైపులను మూడు శాసనములు గలవు. అందొకటి చాళుక్యత్రిభువన మల్లుని సామంతుడగు నొక తెలుగుచోడుని ధర్మమును దెల్పును. మరియొకటిపై రాజుయొక్క మంత్రియుదదండనాథుడునగు పద్మనాభరస 14వ చాళుక్య విక్రమవర్షమునజేసిన దానములను పేర్కొనును.

**దరూరు**

ఈ గ్రామము గద్వాలకారుమైళ్ళలోనున్నది. పూర్వమిదియొక సీమకు ముఖ్యస్థానము. ఐజసీమతోపాటు దరూరు సీమకు గూడ గద్వాలసంస్థానీకుల పూర్వుడగు బుడ్డారెడ్డి నాడ గౌడరికమును సంపాదించెను. ఈయూరి చెరువుగట్టుననున్న యాంజనేయాలయములోని విగ్రహము క్రీ.శ. 15, 16 శతాబ్దములలో విజయనగర రాజులచే "కుల దైవతముగ" నారాధింపబడినవాడును, ద్వైతమతాచార్యులలో సుప్రసిద్ధుడునగు శ్రీ వ్యాసరాజస్వామిచే ప్రతిష్ఠింపబడెనని పరంపరాగతమగు స్థానికుల గాథలు తెల్పుచున్నవి.

**బీచిపల్లి**

ఈ గ్రామము గద్వాలకు దూర్పుగా పది మైళ్ళదూరమున గృష్ణాతీరమునందున్నది. ఇచటి యాలయము ముఖ్యమైనది. ఇందలి యాంజనేయవిగ్రహము దర్శనీయము. దీనినిగూడ శ్రీ వ్యాసరాజస్వామి ప్రతిష్ఠించెనట. ఉత్తర దక్షిణముగా బ్రవహించునదిలో నిచట బ్రాక్పశ్చిమముగా నొక ద్వీపమేర్పడినది. ఇందలి యొక గుట్టపై బలిష్ఠమగు కోట గలదు. దీనికి నైజాం కొండయని పేరు. దీనికినతి దూరమున సీతారామస్వామి జీర్ణాలయమున్నది. పై యాంజనేయాలయము వెలుపల నొక చింతచెట్టుక్రింద భూమిలో చాలాభాగము పూడియున్న శిలాస్తంభమొకటి గన్గొనబడినది. దీనికి మూడువైపుల నొక శాసనము గలదు. ఇందు చాళుక్య భూలోకమల్లుని రాజ్యకాలమున శా.శ. 887 వ సంవత్సరమున నా రాజు సామంతుడగు బిద్దంచోళ మహారాజు చేసిన ధర్మము వర్ణింపబడినది. "కాశ్యపగోత్ర, ఒరయూంర్పురవరాధీశ్వర" మున్నగు బిరుదములనుండి యీసామంతు డాంధ్రచోడవంశీయుడని నిర్ణయింపవచ్చును.

ఇంతవరకును వర్ణింపబడిన శిథిలములుగాక గద్వాల సంస్థానమునందెన్నియో ప్రాచీన దుర్గములును, దేవాలయములును గలవు. ఇందలి శాసనములనుండి యీ భూభాగము గొంతకాలము పశ్చిమ చాళుక్య సామ్రాజ్యమునను, పిమ్మట నాంధ్రచోళుల వశమునను, పిదప గాకతీయ చక్రవర్తుల పరిపాలనమునందు నుండి, యటుపై ననేకసీమలుగ విభజింపబడి కాలక్రమమున ప్రకృత గద్వాలరాజ్యముగ నయ్యెనని తెలియుచున్నది.

(కాకతీయ సంచిక నుండి)

## నందూరి రామకృష్ణమాచార్య

ఆంధ్రాంగ్ల భాషల నతులిత ప్రతిభతో
కవి విమర్శకుడౌచు గణుతిఁగాంచె
'కేంద్ర అకాడమీ' సాంద్రపురస్కార
మంది పండితనుతు లందుకొనియె
పీఠికా రచనలో విఖ్యాతుడై నిల్చి
'ప్రిన్సిపాలు'గ మంచి పేరునొందె
'ప్రగతిగీత' ను వ్రాసి పరమప్రవక్తయై
'అధికారభాష' కధ్యక్షుడయ్యె
సరస భావనిధిగ సద్గ్రంథ ములఁగూర్చ
శేముషలనుఁ బెంచె శిష్యవితతి
గెలుపులొందె మిగుల 'కృష్ణమాచార్యుండు'
కీర్తి కళలరాణి! కృష్ణవేణి!

*స్మితశ్రీ చింతపల్లి నాగేశ్వరరావు*

శ్రీ కె. క్రిష్ణయ్య

# గుంటూరు కరువు - కలెక్టర్ సి.పి. బ్రౌన్

ఆంధ్రులు మరచిపోలేని ఆంగ్ల పాలకుల్లో ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ ఒకరు. ఆయన తెలుగుభాషకు మహోపకారం చేసిన మహానుభావుడు. పాలనాపరంగా కొన్ని ఒడుదుడుకుల్ని ఎదుర్కొన్నాడు. కాని గుంటూరు జిల్లా కరువు కాలంలో ఆయన మూడు నెలలు మాత్రమే ఆక్టింగ్ కలెక్టర్‌గా పనిచేసి ఈ నాటికీ ప్రజల గుండెల్లో తిష్టవేసుకున్నారు. ఆ సమాచారం నెమరు వేసుకోవడమే ఈ వ్యాసం ఉద్దేశ్యం. సి.పి.బ్రౌన్‌కి మానవీయ గుణాలు తండ్రి డేవిడ్ బ్రౌన్ ద్వారా సంక్రమించాయి. డేవిడ్ బ్రౌన్ భారతదేశంలోకి పరిపాలన నిమిత్తం రాలేదు. క్రైస్తవమత ప్రచారకుడుగా వచ్చారు. తనకు ఇంగ్లాండు నుంచి నిధులు అందని దశలో కూడా స్థానిక – పేద ప్రజలకు సేవ చేశాడు. తండ్రి తరువాత బ్రౌన్‌కు గవర్నర్ మన్రో ప్రబోధం పనిచేసింది. కడపకు ఉద్యోగ నిమిత్తం వచ్చే ముందు మన్రో "మీరు స్థానిక భాష నేర్చుకొంటే తప్ప ఆ ప్రజలకు చక్కని పాలన అందివ్వలేరు" అని కాన్వొకేషన్ ప్రసంగం చేశారు. ఆ ప్రభావం సి.పి.బ్రౌన్ మీద పుష్కలంగా పడింది. ఈ ప్రబోధంలో రెండు అంశాలున్నాయి. ఒకటి స్థానికభాష నేర్చుకోవడం, రెండు ప్రజలకు నిజాయితీతో సేవచేయడం. అందుకే బ్రౌన్ తెలుగు భాషకు అపారమైన సేవ చేశాడు. జడ్జిగా పనిచేసినా ఏ పదవిలో ఉన్నా ముక్కుసూటిగా ప్రవర్తించాడు. గుంటూరు జిల్లా కలెక్టర్‌గా ఇప్పటి కలెక్టర్లకు ఆదర్శంగా నిలిచాడు.

గుంటూరుజిల్లాలో కృష్ణానది ప్రవహిస్తూ ఉంది. కరువును నిలవరించటానికి ఆ నది నీరు ఉంది గదా అని ప్రశ్నరావచ్చు. కృష్ణనీరు ఉపయోగించుకోవడానికి కృష్ణమీద ఎలాంటి ఆనకట్టలు ఆనాటికి లేవు మరి. కృష్ణలో నీరు-సముద్రం చేరడం తప్ప పొలాలవైపు రాదు.

"1832 డిసెంబర్ 21వ తేదీన గుంటూరుజిల్లా ఆక్టింగ్ కలెక్టర్‌గా ఛార్జి తీసుకున్నాడు. సి.పి.బ్రౌన్, 23 నుంచి పనిలోకి దిగాడు. చార్జి తీసుకున్న వారం రోజులలోపల్నే అక్కడి కటిక కాటకపరిస్థితుల్ని అర్థం చేసుకొన్నాడు. కరువు బాధల్ని గాధల్ని విన్నవించుకుంటూ సన్నజనం యిచ్చే గుట్టల గుట్టల అర్జీలు రోజూ అందుకొంటూ వచ్చాడు. ఆకలి చావుల వార్తలను అనునిత్యమూ వింటూ వచ్చాడు. బ్రౌన్ కలెక్టర్‌గా ప్రభుత్వానికి పంపిన రిపోర్టుల్లో ఈ కరువు గురించిన వ్రాతలే అధికంగా వున్నాయి".

సి.పి.బ్రౌన్ ఛార్జి తీసుకున్న అయిదోరోజు డిసెంబరు 26వ తేదీన మద్రాసులోని రెవెన్యూ బోర్డుకు ఒక నివేదిక పంపాడు. అందులో బ్రౌన్ జిల్లాలో దొంగతనాలు, దోపిడీలు జరుగుతున్నాయని జిల్లాలో కలరా వ్యాపించిందని,ప్రజలు పశువులు నష్టమైపోతున్నారని వ్రాశాడు.

ఈలోగా బ్రౌన్‌కు ప్రభుత్వం నుంచి ఒక లేఖ వచ్చింది. దాని సారాంశమిది. "మచిలీపట్నం నుంచి బళ్లారికి వెళ్లవలసిన సైనికదళం గుంటూరు ద్వారా ప్రయాణం చేస్తుందని, ఆ దళానికి అవసరమైన ఏర్పాట్లు చేయాలి' అని. అ ఆజ్ఞ పాటించడంలో ఇబ్బందులెదురౌతాయని మద్రాసు ప్రభుత్వానికి తెలియచేశారు. "తీవ్రమైన కరువు తప్పనిసరిగా వచ్చేటట్లు కనిపిస్తున్నది. సైనికదళం ఈ జిల్లా గుండా అత్యంత కష్టంతో తప్ప ప్రయాణం చేయడం సాధ్యం కాదు. వీరి స్థితిని కలరాఇంకా జటిలం చేస్తుంది. ఇప్పటికే జిల్లాలో కలరా చాలా తీవ్రంగా ఉంది". ఈ ఉత్తరంలో బ్రౌన్ (కరువు) అన్న పదం వాడాడు. తిరిగి 1933 జనవరి 7వ తేదీన ఒక నివేదిక పంపాడు. అందులో జిల్లా మొత్తం మీద తగినంత ఆహారపదార్థాలు నీళ్ళు ఉండే గ్రామం ఒక్కటీ లేదన్నాడు. కరువు వల్ల దోపిడీలు దొంగతనాలు ఎక్కువ అవుతున్నాయనీ మళ్ళీ జనవరి16వ తేదీన ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి మరో లేఖ రాశారు. పెరుగుతున్న నేరాలను అదుపు చేయడానికి మచిలీ పట్నం నుంచి ఆయుధ సామాగ్రి గుంటూరుకు తరలిస్తే జిల్లాలోని పోలీస్‌యంత్రాంగం మరింత బాగా పని చేస్తుందని ఆ జాబు సారాంశం. దీనితో ప్రభుత్వ కార్యదర్శికి చిర్రెత్తిపోయింది. బ్రౌన్ లేఖలోని 'కరువు' అన్నమాట నచ్చలేదు. జనవరి 18నాడు ఆయన బ్రౌన్‌కు జాబు రాశాడు. famine (కరువు) పదం వాడినందుకు బ్రౌన్‌ను కటువుగా విమర్శించాడు. గవర్నరుగారు దేశంలో ఏ భాగమూ కరువు బాధలను అనుభవిస్తున్నట్లు ఇప్పటిదాకా విని యుండలేదు. కనుక నీవు ఆ మాటను అజాగ్రత్తతో వాడి ఉంటావని భావిస్తున్నారు. తీవ్రమైన పదం వాడకుండా జాగ్రత్తగా ఉండాలి. ప్రభుత్వం వారిని తప్పుదారిని పట్టించడమవుతుంది. నీవు పంపిన సమాచారం బద్ధతపట్ల అపనమ్మ కాన్ని కలిగిస్తుంది అంటూ ధరల గురించి వివరాలు పంపమన్నారు. అడిగిన ఆయుధ సామాగ్రిలో సగానికి అంగీకరించాడు.

సి.పి.బ్రౌన్ ఆ మందలింపుకు ఈసడింపు జవాబే చెప్పాడు. పిల్లల్ని పోషించలేక అమ్ముకుంటున్నారని, ఆకలి చావులు ఎక్కువగా ఉన్నాయని ఒక్క దాచేపల్లి డివిజన్‌లో 60 చావులు రికార్డు అయ్యాయని అందుకని కరువు అన్న పదం వాడానని బదులిచ్చారు. 1831 జూన్ నాటి ధరలు 1832వ సం॥ డిసెంబర్‌కు ఎలా పెరిగిపోయాయో పట్టిక ప్రభుత్వానికి పంపాడు. రెండింతలుగా ధరలు పెరిగి ఉన్నాయి.

సి.పి.బ్రౌన్ జిల్లాలో విషమిస్తున్న కరువు పరిస్థితిని గమనించి కరువు పనులు చేపట్టాడు. గంజి కేంద్రాలు ఏర్పాటుచేయించాడు. కూలీలను పెట్టి రోడ్లు వేయించాడు. ఫిబ్రవరి 21వ తేదీ ప్రభుత్వానికి రాసిన లేఖలో ఈ సంగతి ఉటంకించాడు. ప్రభుత్వం అనుమతి తీసుకోకుండా సాహసోపేతంగా మానవతాదృష్టితో చేపట్టిన కరువు సహాయక చర్యలివి. మార్చి మొదటి వారానికి ధరలు మరింత మండి పోయాయి. రెండింతలు దాటి మూడింతలకు చేరుకున్నాయి. మార్చి 6, 15 తేదీలో మరి రెండు నివేదికలు ప్రభుత్వానికి పంపాడు సి.పి.బ్రౌన్.

ఇల్లు కాలి ఒకడేడుస్తుంటే సందట్లో సడేమియాగా మరికొందరి ప్రవర్తన గ్రామాధికారుల లోపాయికారీతనం, పంటలు,పశువుల నష్టం వగైరా లెక్కలు తయారుచేయడంలోజమీన్‌ల లంచగొండి వ్యవహారాలు సి.పి.బ్రౌన్‌కు తలనొప్పి కలిగించాయి. ఈ అమీన్‌ల వ్యవహారం గురించి సి.పి.బ్రౌన్ ప్రత్యేక నివేదిక ప్రభుత్వానికి పంపించాడు.

ఆయన 1833 మార్చి 25వ తేదీన సి.పి.బ్రౌన్‌ను గుంటూరుజిల్లా కలెక్టర్ పదవి నుంచి తప్పించారు.చిత్తూరు జిల్లా జడ్జిగా వెళ్ళిపోయాడు. పట్టుమని ఆయన పనిచేసింది మూడునెలలే. అయినా "గుంటూరు కరువు కలెక్టర్"గా సి.పి.బ్రౌన్ నిలిచిపోయాడు. ఈ కరువు గుంటూరు జిల్లా ప్రజల్ని మూడు సంవత్సరాలు బాధించింది. మరో పది సంవత్సరాలపాటు ప్రజలపై ఆ కరువు ప్రభావం ఉండిపోయింది.

సి.పి.బ్రౌన్ తరువాత గుంటూరుకు వచ్చిన కలెక్టర్లను ప్రభుత్వం ఎక్కువకాలం అక్కడ ఉంచిన దాఖలాలు లేవు. కరువు తాండవించిన మూడు సంవత్సరాల కాలంలో బ్రౌన్ తరువాత ఎనిమిదిమంది కలెక్టర్లను మార్చారు. ఏ ఒక్కరినీ కుదురుపాటుగా ఉండనివ్వలేదు. కరువు ప్రభావం 1842 దాకా సాగింది. 1832 నుంచి 1842 దాకా ఈ పది సంవత్సరాలలో ఇరవైసార్లు కలెక్టర్లు బదిలీ అయ్యారు. ప్రభుత్వం జిల్లాలోని కరువును ఎలా తగ్గించుకోవాలోనని ఆలోచించినట్లు కనపడదు. వారు పరాయిదేశస్థులు. మన గొడవ వారికి పట్టదు. అందులో చాలామంది దండుకోవడానికి వచ్చినవారే ! బ్రౌన్ పరాయి దేశస్థుడయినా ఉద్యోగ నిర్వహణ పట్ల చిత్తశుద్ధి కలిగినవాడుగా ప్రజలపట్ల కనికరం ఉన్న వాడుగా గుంటూరుజిల్లా కలెక్టర్‌గా మంచిపేరు తెచ్చుకొన్నాడు. ఈయనే మాకు కావాలని ప్రజలుప్రభుత్వానికి మహజర్లు సమర్పించారు కూడా ! అంతటి అభిమానం చూరగొన్నాడు సి.పి.బ్రౌన్.

famine అన్న పదం సి.పి. బ్రౌన్ ఉపయోగించడానికి ముందూ వెనకా ఏ జిల్లాలోను, ఏ కలెక్టరూ ఆ పదం వాడలేదు. తమ ఆధిపత్యంలోని దేశంలో 'కరువు' అంటే ఆంగ్లేయులకు అవమానం కాబోలు ! కలెక్టర్లు వ్రాసే తమ రిపోర్టుల్లో drought, scarcity, distress, adverse season వంటి పూత మెరుగుల పదాలే వాడారు.

గుంటూరు జిల్లా కరువు ఎలాంటిదో ఊహకందాలంటే ఈ లెక్క గమనించండి.

1831-32లో జిల్లా జనాభా 5,12,317

1832-33లో జిల్లా జనాభా 3,57,038

అంటే ఒక లక్షా యాభై అయిదు వేలా రెండువందలా డెబ్బై తొమ్మిది మంది కరువు రక్కసి కోరల్లో చిక్కినట్లే కదా ! మరుసటి సంవత్సరం మరో లక్షా ఇరవైవేలు తగ్గిపోయారు. ఈ కరువు తరువాత మరో పదేళ్ళకు కూడా జిల్లా జనాభా మూడున్నర లక్షలకు దాటలేదు. కరువు బారిన పడి మరణించినవారి శవాలను రోడ్డుకు రెండువైపులా పేర్చితే ఆ పొడవు 20 మైళ్ళు ఉంటుందని అంచనా వేశారు. శవాలను గుట్టలుగా పోగుచేసి పోలీసులు సామూహిక దహనం చేశారు. కాకులు గద్దలు బారువులు కుక్కలు శవాలను లాక్కుని తినేవట. ఎడింబరో నుంచి వెలువడే 'మై ఇండియర్ జర్నల్'లో ఈ శవదహనం వార్త ప్రకటించారు. ప్రభుత్వానికి ఆర్థిక పరిస్థితి కూడా అలాగే దిగజారింది.

1831-32లో 18 లక్షల 31వేల రెవెన్యూ ఉంటే

1832-33లో 8 లక్షల 76 వేలకు పడిపోయింది. మరో అయిదేళ్ళు సగటున అయిదు లక్షల ప్రకారం రెవెన్యూ పడిపోయింది.

కరువు తీవ్ర రూపంలో ఉన్నప్పుడు కృష్ణలో ముప్పాతిక నీరు ప్రవహిస్తూ ఉన్నా ప్రయోజనం శూన్యం ఈ కరువు ఆంగ్లేయుల్ని ఆలోచింప చేసింది. నదీజలాలను సేద్యానికి ఉపయోగించే మార్గం ఆలోచించారు. 1839 కెప్టెన్ బకిల్ కృష్ణానదిపై ఆనకట్ట ప్రణాళికను సిద్ధం చేశారు. లేక్ నివేదికను కాటన్ దొర సిఫార్సు చేశాడు. 1849లో అయిదు గురితో కూడిన కమిటీ తన రిపోర్టును లండన్‌కు పంపింది. లండన్ లోని కోర్టు ఆఫ్ డైరెక్టర్సు 1850లో ఆమోదించారు. ఆ తరువాతే కృష్ణ మీద ఆనకట్ట పని మొదలయింది.ఇది కరువు అనంతర చరిత్ర!

చిరునామా : *శ్రీ కె.క్రిష్ణయ్య, 8-3-678/46, ప్రగతినగర్, యూసఫ్‌గూడా, హైదరాబాద్ - 45, సెల్ : 9394033678.*

డా॥ రెటపల్లి రవీంద్రభాస్

# చరిత్రను గుభాళించే కృష్ణాతీరం

మహారాష్ట్రలోని మహాబలేశ్వరంలో చిన్నపాయగా మొదలయిన 'కృష్ణమ్మ' బిరబిరా పరుగులిడుతూ కర్ణాటక, తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలను సుభిక్షం చేస్తూ కృష్ణాజిల్లా హంసలదీవి దగ్గర సముద్రంలో కలుస్తోంది. కృష్ణ ఒడ్డున  ఆ మూల దాకా ఎన్ని రాష్ట్రాలు, జిల్లాలూ ఉన్నా విభక్త ఆంధ్రప్రదేశ్‌లోని కృష్ణాజిల్లా మాత్రం విలక్షణ మయినది.

ఈ జిల్లా చరిత్రను పరికిస్తే ప్రాచీన కాలం నుండి నేటిదాకా భౌగోళికం, చారిత్రకంగా పొందిన మార్పులు అనేకం. ఒకనాడు ఉచ్ఛ స్థితిని పొందిన నగరాలు నేడు కొన్ని అధమ స్థితిలో ఉన్నాయి. కొన్ని రూపురేఖలు మార్చుకున్నాయి. ఈ ప్రాంతాన్ని పాలించిన రాజుల ఏలుబడిని అనుసరించి ఈ ప్రాంతం పెనుమార్పులకు లోనయింది. శాతవాహనులు, పల్లవులు, చాళుక్యులు, చోళులు, కాకతీయులు, రెడ్డిరాజులు, గజపతులు, బ్రిటీషువారు, బహుమనీ సుల్తానులు ఇలా ఎందరి ఏలుబడినో ఈ ప్రాంతం చవిచూసింది.

ఆధునిక కాలంలో విద్యా, వ్యాపార,వాణిజ్య,రాజకీయ రంగాలకు పెట్టిందిపేరయిన నేటి కృష్ణాజిల్లా సరిహద్దులుగాఉన్న గోదావరి, నల్గొండ, గుంటూరు, ఖమ్మంతో పాటు బంగాళాఖాతాన్ని కూడా కలిగి ఉంది. విజయవాడ ముఖ్య పట్టణంగా రాబోయే రోజుల్లో రాజధాని ప్రాంతంగా విలసిల్లే ఈ జిల్లా పేరెన్నిక గన్న దేవాలయాలకు, చరిత్రలో దేశవిదేశాలతో వర్తక వ్యాపారాలు చేసిన రేవు పట్టణాలకు, కూచిపూడి నాట్యకళకు, కొండపల్లి బొమ్మలకు, కలంకారి అద్దకాలకు నిలయమై ఉంది.

## ఆధ్యాత్మిక కేంద్రాలు

వివిధ మతాలకు చెందిన ఆధ్యాత్మిక కేంద్రాలు కృష్ణాజిల్లాలో కనిపిస్తాయి. హిందు, బౌద్ధ, జైన, క్రైస్తవ, ముస్లిం మతాలకు చెందిన ఆరాధన కేంద్రాలు, ఆలయాలు, గుహాలయాలు ఈ కృష్ణాజిల్లాలో ఉన్నాయి. అందులో కొన్ని హిందూ మతానికి చెందినవి.

## విజయవాడలోని ప్రముఖ కనకదుర్గ ఆలయం :

ఇంద్రకీలాద్రిపై వెలసిన స్వయంభూ కనకదుర్గఆలయం ప్రముఖమైనది. పురాణ కాలంనాటి ఈ ఆలయంలో శంకరాచార్యుల వారు ప్రతిష్ఠించిన శ్రీచక్రం ఉంది. రాక్షసుల నుంచి తనను రక్షించమని ఇంద్రకీలుడనే మహర్షి దుర్గాదేవి గురించి తపస్సు చేయగా ఆ తల్లి కరుణించి ఈ కొండపై కొలువు తీరింది అని పురాణ కథనం. అర్జునుడు వేదవ్యాసుని సలహాను అనుసరించి ఇంద్రకీల పర్వతంపై ఒంటికాలితో శివుని గురించి పంచాగ్నుల మధ్య తపస్సు చేశాడని, అతడిని కరుణించి శివుడు వేటగాని రూపంలో మారువేషంలో ఎలుగుబంటిని తరుముతూ రాగా దానిపై అర్జునుడు బాణం వేస్తాడు. అదే సమయంలో శివుడు కూడా బాణం విసురుతాడు. ఎలుగుబంటి బాణాల దెబ్బకు మరణిస్తుంది. ఇద్దరూ దానిని చంపింది తామేనని తగువులాడుతారు. యుద్ధానికి దిగుతారు. యుద్ధంలో అర్జునుడు అలసి శివుని ప్రార్థించగా మారువేషంలోని శివుడు యధారూపం దాల్చి పాశుపతాస్త్రాన్ని అర్జునుడికి ప్రసాదిస్తాడు. దీనికి గుర్తుగా ఈ కొండపై విజయేశ్వర స్వామిని అర్జునుడు ప్రతిష్ఠించాడని ప్రతీతి. విజయవాడ అని దీనికి ఈ కొండపై పేరు అందువల్లనే వచ్చింది అని ఒక కథనం. ఈ కొండపై రాతితో చెక్కిన అనేక చిన్న చిన్న గుళ్ళ సముదాయం కాలక్రమంలో నశించాయి. ఇక్కడే దొరికిన ఒక శాసన కిరాతార్జునీయానికి సంబంధించిన కథనాన్ని చెక్కబడి కనిపిస్తుంది.

అందులో 9 శతాబ్ది నాటి తెలుగులిపి ఉంది. ఇది కిందనుంచి పైకి రాయబడి ఉంది. బెజవాడకు చెందిన త్రికోటబోయి దానిని నిర్మించినట్లు ఉంది.

## ప్రకాశంబ్యారేజి :

కృష్ణాజిల్లాలో ప్రముఖంగా చెప్పుకోదగిన ముఖ్య అంశం ప్రకాశం బ్యారేజి. ఆధునిక దేవాలయంగా పిలువబడే ఈ బ్యారేజిని విజయవాడ

వద్ద కృష్ణానదిపై నిర్మించారు. 4014 అడుగుల పొడవున్న ఈ బ్యారేజి నిర్మాణాన్ని సర్ ఆర్థర్ కాటన్ చేపట్టాడు. ఇది 1852లో ప్రారంభమై 1855లో పూర్తి అయింది. ఇప్పుడు ఉన్నది 1952లో నిర్మించినా, అంతకు ముందుది సుమారు 100 సం॥ల క్రితం కృష్ణా జలాలను వినియోగించుకోవడానికి ఉద్దేశించినది. అదే కాటన్ ఆనకట్ట 1832, 33లో వచ్చిన భయంకరమైన కరువు వేలాదిమందినిపొట్టన పెట్టుకుంది. ఇటువంటి సమయంలో కూడా కృష్ణానది ఎండిపోలేదు. ఆ నీటిని ఉపయోగించుకొనే ఉద్దేశ్యంతోనే ఈ ఆనకట్ట కట్టబడింది. బెజవాడ వద్ద ఎడమ గట్టున ఇంద్రకీలాద్రి, కుడి గట్టున సీతానగరం మధ్య ఈ ఆనకట్ట నిర్మాణం జరిగింది. సుమారు 100 ఏళ్ళు ప్రజలకు వరప్రసాదంగా ఇది నీటిని అందించింది. 1952లో వచ్చిన వరదలతో ఇది కొట్టుకొని పోవడంతో మరో ఆనకట్ట నిర్మించాల్సి వచ్చింది. కాటన్ నిర్మించిన ఆనకట్ట ఎత్తు 1132 మీటర్ల పొడవు, 4 మీటర్ల ఎత్తుతో ఉంది. పాత ఆనకట్ట నేటి బ్యారేజి నిర్మాణానికి కొద్ది మీటర్ల ఎగువున జరిగింది. ఈ బ్యారేజి నుండి లక్షలాది ఎకరాలకు సాగునీరు లభిస్తుంది. కృష్ణానదిపై చిట్టచివర ఆనకట్ట ప్రకాశం బ్యారేజీయే.

## శ్రీకాకుళం ఆంధ్రమహావిష్ణువు ఆలయం :

ఈ ఆలయం శాతవాహనుల కాలంలో నిర్మించబడినట్లుగా తెలుస్తోంది. ప్రస్తుతం ఇప్పుడు ఉన్న ఆలయం క్రీ.శ.1010 నాటిది. శ్రీకృష్ణదేవరాయులు కళింగ పట్టణాన్ని జయించిన అనంతరం ఈ దేవాలయ ప్రాశస్త్యాన్ని విని, ఇక్కడ ఒక రాత్రి విశ్రమించాడని, ఆయనకు ఆంధ్ర మహావిష్ణువు కలలో కనిపించి తనకు, ఆండాళకు శ్రీరంగంలో జరిగిన వివాహ మహోత్సవాన్ని వర్ణించమని ఆనతిచ్చినట్లు, అందుకే ఆముక్తమాల్యదను తెలుగులో రచించి, ఆంధ్రమహావిష్ణువుకు అంకితము ఇచ్చినట్లు అవతారికలో చెప్పుకున్నాడు. నాటి శాసనాలు 32 దాకా ఇక్కడి గోడల మీద కనిపిస్తాయి.

తర్వాతి కాలంలో కాసుల పురుషోత్తమ కవి ఈ దేవుడిని కీర్తిస్తూ వ్యాజ్యస్తుతి పద్ధతిలో ఆంధ్రనాయక శతకాన్ని రచించాడు. ఇక్కడ విష్ణువు, మూలమూర్తి దశావతారాలలోని ఏ అవతారానికి చెందక విభిన్నంగా కనిపిస్తాడు.

## మొవ్వ వేణుగోపాల స్వామి ఆలయం :

మౌగల్య మహర్షి చేత ఇసుకతో చేయబడిన మువ్వగోపాలుడి విగ్రహం పేరుమీద ఈ ఊరు నిర్మించబడింది. ఈ స్వామి కృపతో చదువు రాని వరదయ్య గొప్ప కవిగా మారాడని ప్రతీతి. ఈయనరాసిన క్షేత్రయ్య పదాలు మధుర భక్తితో నిండి ప్రసిద్ధి గాంచాయి. 17వ శతాబ్దికి చెందిన ఈయన గొప్ప వాగ్గేయ కారుడిగా గుర్తింపు పొందాడు.

## బౌద్ధస్థూపాలు, ఆరాధన కేంద్రాలు :

కృష్ణాలో నది ఇరువైపులా శాతవాహనుల కాలం నుంచి బౌద్ధం పుంజుకుంది. ఎన్నో ఆరామాలు, స్థూపాలు, చైత్యాలు ఇక్కడ నిర్మించ బడ్డాయి. అమరావతి, జగ్గయ్యపేట, బోడపాడు, చందోలు, గుడివాడ మొదలగు ఎన్నో ప్రదేశాలలో బౌద్ధం ఆనవాళ్ళు కనిపిస్తాయి. ఈ ప్రాంతాన్ని అశోకుడు పరిపాలించిన కాలం నాటి నుండి బౌద్ధమత ప్రభావం ఉన్నా శాతవాహనుల కాలంనాటికి ఇది ఊపందుకుంది.

గుడివాడలోని దీపాల దిబ్బ ప్రాంతంలో బౌద్ధం ఆనవాళ్ళు లభించాయి. బౌద్ధ స్థూపాలు, వాటికి సంబంధించిన గుండ్రని నిర్మాణాలను ఇక్కడ వెలికి తీశారు.

ఘంటశాలలో బౌద్ధ మతానికి చెందిన మహాచైత్యం ఇక్కడ కనుగొన్నారు. 1919-1920 మధ్య ప్రాంతంలో గొప్ప బౌద్ధ క్షేత్రంగా ఈ ప్రాంతం విలసిల్లినట్లు ఆధారాలున్నాయి. 112 అడుగుల చుట్టు కొలత, 23 అడుగుల ఎత్తైన మహాచైత్య నిర్మాణం ఇది. అనేక స్థూపాల, చైత్యాల నిర్మాణం ఈ ప్రాంతంలో కనిపిస్తుంది.

జగ్గయ్యపేట దగ్గర ధనాబాద్‌లో మహాయాన బౌద్ధానికి చెందిన నిర్మాణాలు అనేకం కనిపించాయి. 'ధనంబోదు'గా పిలిచే ఈ ప్రాంతంలో 2000 ఏళ్ళ కిందటి స్థూపాలు కనుగొనబడ్డాయి. పాతరాతి యుగపు మానవుల సంచారపు ఆనవాళ్ళు కూడా ఈ ప్రాంతంలో గుర్తించబడ్డాయి.

గుడివాడలోని 8వ శతాబ్ది నాటికి చెందిన పార్శ్వనాధుని ఆలయం ప్రముఖంగా కనిపిస్తుంది.

ముస్లిములు పవిత్రంగా కొలిచే మహమ్మద్ ప్రవక్త కేశాన్ని భద్రపరిచిన హజరత్ బాల్ మసీదు విజయవాడలో ఉంది. సంవత్సరానికి ఒకసారి ప్రజల దర్శనార్థం దానిని ఉంచుతారు.

## క్రైస్తవ ఆరాధనా మందిరాలు :

గుణదలలోని మేరిమాత మందిరం ప్రసిద్ధి గాంచినది. 1971లో నిర్మించబడిన ఈ మందిరం విజయవాడకు తూర్పు దిశగా కొండపై నిర్మించబడింది. ప్రతి సంవత్సరం ఇక్కడ జరిగే ఉత్సవాలకు తండోపతండాలుగా ప్రజలు తరలి వస్తారు.

1812 ప్రాంతంలో బ్రిటీష్ వారి కాలంలో నిర్మించబడిన కాథలిక్ చర్చ్ దక్షిణ భారతదేశ తాజ్‌మహల్‌గా అక్కడి వారిచే పిలవబడి ప్రసిద్ధికెక్కింది. జాన్ పీటర్ తన భార్య జ్ఞాపకార్థం తన భార్య 'అరబెల్లా' పేరిట ఈ చర్చ్‌ని 200ఏళ్ళ కిందట నిర్మించాడు.

## గుహాలయాలు :

చైనా యాత్రికుడు (638సం॥) భారతదేశ సందర్శనలో

విజయవాడ సమీపంలో గుహలను తొలచి ఆలయాలుగా నిర్మించారని పేర్కొన్నాడు. అటువంటి జైన దేవాలయం ఒకటి ఈ గుహలలో ఉందని పేర్కొన్నాడు.

5వ శతాబ్దికి చెందిన విష్ణుకుండిన వంశరాజులు విజయవాడలోని మొగల్రాజపురంలో గుహాలయాలు నిర్మించారు. నటరాజ స్వామి, వినాయకుడు, అర్ధనారీశ్వర విగ్రహాలు ఈ ఆలయాలలో ఉన్నాయి. 5 గుహాలయాల ఒక్కటే మంచి స్థితిలో కనిపిస్తుంది.

ఉండవల్లిలో కూడా గుహాలయం నిర్మించబడింది. అనంత పద్మనాభుని విగ్రహం ఈ గుహలోని ఆకర్షణ

17వ శతాబ్దం వారయిన అక్కన్న, మాదన్నలు నిర్మించిన గుహాలయాలు ఇంద్రకీలాద్రి పర్వతంపై నెలకొని ఉన్నాయి. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు మూర్తులు ఇందులో కనిపిస్తాయి. కృష్ణాజిల్లాలో ప్రాచీనకాలంలో ఓడరేవులుగాప్రసిద్ధికెక్కినరేవు పట్టణాలు కనిపిస్తాయి. వాటిలో ప్రముఖమయినవి ఘంటసాల, మచిలీపట్నం.

మచిలీపట్నం 14వ శతాబ్దిలో ప్రముఖ వ్యాపార కేంద్రం. 'మహా సాలిపట్నం'అనేది పురాతన నామం. ఇక్కడ సాలెవారు (మస్లిన్) సన్నని వస్త్రాలు నేయటంలో నేర్పరులు. ఈ వస్త్రాలను విదేశాలకు ఎగుమతి చేసేవారు. తీరనగరాలలోప్రఖ్యాతి గాంచిన ఈ నగరానికి 'బృందావనం' అనే పేరు కూడా ఉందని అదే తర్వాత 'బందరు' అయిందని ప్రతీతి. మహాసాలిపట్నం మచిలీపట్నంగా రూపుమారింది. తూర్పుతీర నౌకాయాన కేంద్రంగా, విదేశీయులకు ముఖద్వారంగా ఈ పట్టణం ఉండేది. సముద్రం ఒడ్డున నిర్మితమయిన పెద్దచేప విగ్రహం వల్ల దీనికి ఆ పేరు వచ్చిందని కొందరి భావన. 3వశతాబ్ది నుంచి ఈ నగరం ప్రముఖ రేవు పట్టణాలలో ఒకటి. హాలిమి, మసిలా అనే పేర్లతో దీని ప్రస్తావన కనిపిస్తుంది. 1611లో బ్రిటీషు వారు తమ స్థావరాన్ని ఇక్కడ ఏర్పాటు చేశారు. ఆ తర్వాత చేతులు మారి ఇది నిజాం పాలనలోకి వెళ్ళింది. మొట్టమొదటి కలెక్టరేట్ ఇక్కడ ఏర్పడింది. కాకతీయుల కాలంలో ఈ రేవు పట్టణం ప్రముఖమైనదిగా 'మార్కోపోలో' పేర్కొన్నాడు.

కలంకారీ అద్దకానికి ఈ నగరం ప్రఖ్యాతి గాంచింది. కృష్ణాజిల్లా లోని 'పెడన' కూడా కలంకారి అద్దకాలకు ప్రఖ్యాతి. కలంకారి అద్దకంలో వారు రసాయనాలను వాడరు. కూరగాయల నుండి తీసిన రసాలను రంగులుగా వాడుతారు. పర్యావరణ హితంగా ఈ అద్దకాలు జరగడం విశేషం.

ప్రఖ్యాతి గాంచిన కొండపల్లి కోట కృష్ణాజిల్లాలో కనిపిస్తుంది. ప్రోలయ వేముని కాలంలో 14వ శతాబ్దిలో ఈ కోట నిర్మాణం జరిగింది. వ్యాపార వాణిజ్య కేంద్రంగా విలసిల్లిన ఈ కోట తర్వాతి కాలంలో బ్రిటీషు వారి రక్షణ స్థావరంగా ఉపయోగపడింది. తర్వాతి కాలంలో ఇది మహమ్మదీయుల చేతిలోకి వెళ్ళింది. ఈ కోట 3 పెద్ద పెద్ద ద్వారాలతో కొలువై ఉంటుంది. దర్గా దర్వాజాగా పిలవబడే ద్వారం 12 అడుగుల వెడల్పు,15 అడుగుల ఎత్తుతో ఏనుగులు తిరిగే వీలుతో ఉంటుంది. ఇందులోని తానీషా మహల్ ఎన్నో గదులతో, పెద్ద సమావేశ మందిరంతో కూడి అంతస్తులుగా నిర్మించబడింది. కోటలోని వారి అవసరార్థం నీటి ట్యాంకులతో పాటు రిజర్వాయర్ కూడా ఉంది. బ్రిటీష్ వారి శ్మశానం, వారు నిర్మించిన బ్యారక్ నేటికి కనిపిస్తాయి.

ఇంతేకాక కొండపల్లి కొయ్యబొమ్మలకు కూడా ప్రసిద్ధి గాంచింది. ఇక్కడి బొమ్మలు తేలికపాటి చెక్కతో తయారుచేయబడతాయి. ఇక్కడి కనుమలలో మాత్రమే దొరికే 'పొనికి'కట్టెను ఉపయోగించిఈ బొమ్మలు తయారుచేస్తారు.గ్రామాలలోని జీవనశైలి, పురాణపాత్రలు, జంతువులు, పక్షులు వంటివి తయారీలో ఎక్కువగా కనిపిస్తాయి. ఈ బొమ్మల పైన లక్కను పూసి రంగులు వేస్తారు. దేశ విదేశాలలో వీటికి ఆదరణ ఉంది. కొండపల్లి అభయారణ్యం వివిధ రకాల జంతువులకు ఆటపట్టు. నక్కలు, తోడేళ్ళు, అడవి పందులు, చిరుతలు ఇక్కడ కనిపిస్తాయి.

మచిలీపట్నం తర్వాత ప్రఖ్యాతి గాంచినది ఘంటసాల ఓడరేవు. ప్రాకృత శాసనాల్లో కంటకొస్సిల, కొంట కొశైశిల అని పేర్కొన్న ఈ ప్రాంత తర్వాత ఘంటశాలగా మారింది. ఇది వర్తక స్థావరం. ఇక్కడ మహాచైత్యంపై వెలిగించే దీపాలు సుదూరపు నావికులకు మార్గదర్శంగా ఉండేవట. ముఖ్య వాణిజ్య రేవు పట్టణం కావటం వల్ల ఇక్కడ రోమన్ దేశపు వెండి, బంగారు నాణేలు, బంగారు ఆభరణాలు, మత్తుపానీయాలు నిలువఉంచే కూజాలు అనేకం తవ్వకాలలో లభించాయి. నౌకాయానంలో ఆరితేరిన నావికులు అనేకులు ఇక్కడ ఉండేవారని శాసనాల ఆధారంగా తెలుస్తోంది. ఇక్కడి వైశ్యులు ధాన్య కటక మహాస్థూపానికి దానాలు చేసినట్లు శాసనాల ఆధారంగా తెలుస్తోంది. కృష్ణానది పూడిక పెరిగి, నౌకాయానానికి అనువుగా లేకపోవటంతో, క్రమేపి సముద్రానికి దూరం పెరిగి ఈ రేవు తన ప్రాభవాన్ని కోల్పోయింది. గ్రీసు, రోమ్, జావా, మలయా, ఈజిప్టు, చీనా,బర్మా మధ్య ఆసియా దేశాలతో వర్తక వాణిజ్యం చేసిన ఈ ప్రాంతం నేడు దీనావస్థలో ఉంది.

కళలలో కూడా కృష్ణాజిల్లా ప్రత్యేక స్థానాన్ని ఆక్రమించింది. కూచిపూడి నృత్యానికి ప్రాణం పోసిన సిద్ధేంద్ర యోగి మూలాలు ఉన్న ప్రదేశం ఇది. నాట్యశాస్త్రం ఆధారంగా తీర్థ నారాయణ యతి రచించిన కృష్ణలీల తరంగిణి కూచిపూడి నాట్యానికి మూలం. దీని ఆధారంగా సిద్ధేంద్రయోగి ఈ నృత్యరీతులు సమకూర్చాడు. దీనిలో ఆడ పాత్రలను మొదటిలో మగవారే ధరించేవారు. తర్వాతి కాలంలో

స్త్రీలు చేయటం మొదలు పెట్టారు. వెంపటి చినసత్యం కూచిపూడి నృత్యానికి మరింత ప్రాచుర్యం కల్పించారు.

కృష్ణాజిల్లాలో ప్రముఖంగా చెప్పుకోదగిన మరొక విశేషమైన ప్రదేశం కొల్లేరు సరస్సు. కృష్ణా, గోదావరి జిల్లాల మధ్య వ్యాపినిచిన ఈ సరస్సు మంచినీటి సరస్సు. బుడమేరు, తమ్మిలేరు నుంచి ఇందులోకి నీరు చేరుతుంది. ఎన్నో విదేశీ, దేశీయ పక్షులకు ఈ సరస్సు కొలువయి ఉంది. సైబేరియాన్ పక్షులు, పెలికాన్ పక్షులకు ఇది నిలయం అయి ఉంది. వన్యప్రాణి రక్షణ కేంద్రంగా దీనిని ప్రభుత్వం ప్రకటించింది. దీని ప్రస్థావన రామాయణంలో కనిపిస్తున్నదని చిలుకూరి వీరభద్రరావు గారు పేర్కొన్నారు. ఈ సరస్సు లక్షకు పైగా ఎకరాలలో వ్యాపించి ఉంది. "దండకారణ్య మధ్యమున 100 యోజనాల వైశాల్యం గల మహా సరస్సు ఒకటి జల విహంగములతో అలరారుతోందని" అగస్త్యుడు శ్రీరాముడితో చెప్పినట్లు అరణ్యకాండలో కనిపిస్తుంది.

ఈవిధంగా అనేక రంగాలలో అత్యున్నత స్థితిలో ఉన్న కృష్ణాజిల్లా ప్రచురణాలయాలకు కూడా నెలవయి ఉంది. ఆంధ్రప్రదేశ్‌లోని 90% ప్రచురణా సంస్థలు ఇక్కడ నెలకొల్పబడ్డాయి. ప్రతి ఏటా గ్రంథాలయ ఉత్సవాలు, పుస్తక మహోత్సవాలకు పెట్టింది పేరు. దేశం నలుమూలల నుంచి పుస్తక విక్రేతలు ఇక్కడ తమ పుస్తక ప్రదర్శన నిర్వహిస్తారు.

విభిన్నరంగాలలో ప్రఖ్యాతిగాంచిన ప్రముఖులుపింగళి వెంకయ్య, రాజా వాసిరెడ్డి, త్రిపురనేని రామస్వామి, చలం, ఘంటసాల వెంకటేశ్వర రావు, యన్.టి.ఆర్., ఎ.ఎన్.ఆర్. వంటి ఎందరో మహామహులను అందించింది ఈ జిల్లా. అనంతమైన చరిత్రను తనలో దాచుకున్నది ఈ నేల.

కృష్ణాజిల్లా అనగానే గుర్తొచ్చేవి నూజివీడు రసాలు, కలంకారీ అద్దకాలు, కొండపల్లి బొమ్మలు, కూచిపూడి నృత్యాలు, క్షేత్రయ్య పదాలు, పచ్చని పొలాలు.

---

## చంద్రరాజేశ్వరరావు

'విప్లవ జ్యోతి' యై వీరపోరాటముల్
గావించి రాష్ట్రాన గణ్యుడయ్యె
'మార్క్సిస్టు' భావాలె మాన్యతఁజేకూర్పు
ప్రజల సేవయొనర్చి వాసిఁగాంచె
కేంద్రరాష్ట్రాలలో కీలక బాధ్యత
మేలుగఁజేపట్టి మెప్పులందె
'రష్యా' ప్రభుత్వపు ప్రఖ్యాత 'లెనిను'పు
రస్కారమునుఁగొని రహినిఁగూర్చె
సత్య సేవలొసగె సాహితీ ప్రియుడౌచు
'కమ్యునిష్టు' పార్టి ఘనతఁబెంచె
సాంద్ర భావ నిధియె 'చంద్రరాజేశుండు'
కీర్తి కళల రాణి! కృష్ణవేణి!

*స్మితశ్రీ చింతపల్లి నాగేశ్వరరావు*

---

చిరునామా : డాక్టర్ రెటపల్లి రవీంద్రభాస్, రీడర్, తెలుగుశాఖ, ఆంధ్రా లయోలా కళాశాల,
విజయవాడ – 520008. చరవాణి :9848389900

డా॥ బత్తుల సంజీవ రాయుడు

# చరిత్రగమనంలో కర్నూలుజిల్లా చరిత్ర

కర్నూలు జిల్లా స్వాతంత్ర్యానికి పూర్వం ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఒక భాగంగా రాయలసీమలో వుండేది. 1953లో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడినపుడు కోస్తా, రాయలసీమ ప్రాంతాలు కలిసిపోయాయి. ఆ సమయంలో బళ్ళారిలో భాగంగా వున్న ఆదోని, ఆలూరు తాలూకాలు కర్నూలు జిల్లాలో కలపబడ్డాయి. ఈ ప్రాంతాలు మొదటినుంచీ కర్నాటకతో సంబంధ బాంధవ్యాలను కలిగివుండటంతో ఇక్కడంతా ఎక్కువగా కన్నడ భాషా సంస్కృతులు కనిపిస్తాయి. ఇవేగాక ఆదోని నుంచి కోడుమూరు వరకు చాలామంది తెలుగుతోబాటు కన్నడ భాష కూడా మాట్లాడుతూ వుంటారు. 1956లో భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పాటుచేసేటపుడు హైదరాబాద్ సంస్థానంలోని తెలంగాణా ప్రాంతం,




ఆంధ్రరాష్ట్రం కలసి ఆంధ్రప్రదేశ్‌గా అవతరించాయి. కానీ ఇటీవలే 2014లో మరలా ఇవి వివిధ కారణాలచే విడిపోవడం జరిగింది.

ప్రస్తుతం మనం కర్నూలుజిల్లాగా పేర్కొంటున్న భూభాగం 1970వ సంవత్సరంలో ఏర్పడింది. ప్రకాశం జిల్లాను కొత్తగా ఏర్పరిచే క్రమంలో కంభం, గిద్దలూరు ప్రాంతాలను కర్నూలుజిల్లా నుండి విడదీసి ప్రకాశంజిల్లాలో కలపడం జరిగింది.

కర్నూలు జిల్లాకు ఉత్తరంలో తెలంగాణ రాష్ట్రంలోని మహబూబ్‌నగర్, దక్షిణంలో అనంతపురం, కడపజిల్లాలు, పశ్చిమంలో కర్నాటక రాష్ట్రం, తూర్పున ప్రకాశం జిల్లాలు సరిహద్దులుగా వున్నాయి. జిల్లా మొత్తం భూభాగం 17,658 చ॥కి.మీకాగా 2011 లెక్కల ప్రకారం 40,46,601. అందులో పురుషులు20,40,101 స్త్రీలు 20,06,500

ఇందులో జిల్లా కేంద్రమైన కర్నూలు కార్పొరేషన్‌గానూ, నంద్యాల, ఆదోని, ఎమ్మిగనూరులు మున్సిపాలిటీలుగానూ అభివృద్ధి చెందాయి.

కర్నూలు ప్రాంతం మొత్తం కర్నూలు, నంద్యాల అనే రెండు పార్లమెంటు నియోజకవర్గాలుగా విభజించబడింది.

ఇందులో గల అసెంబ్లీ నియోజకవర్గాలు మొత్తం 14. అవి

| | | |
|---|---|---|
| 1. కర్నూలు | 2. నంద్యాల | 3. ఆళ్ళగడ్డ |
| 4. డోన్ | 5. పత్తికొండ | 6. ఆలూరు |
| 7. బనగానపల్లె | 8. ఆదోని | 9. ఎమ్మిగనూరు |
| 10. కోడుమూరు | 11.నందికొట్కూరు | 12. శ్రీశైలం |
| 13. పాణ్యం | 14.మంత్రాలయం. | |

పరిపాలనా సౌలభ్యం కోసం కర్నూలు జిల్లాను 1985లో మొత్తం 54 మండలాలుగా విభజించడం జరిగింది. అవి.

| | | |
|---|---|---|
| 1. కర్నూలు | 2. కల్లూరు | 3. ఓర్వకల్ |
| 4. కోడుమూరు | 5. గూడురు | 6. సి. బెళగల్ |
| 7. డోన్ | 8. క్రిష్ణగిరి | 9. ప్యాపిలి |
| 10. నందికొట్కూరు | 11. మిడుతూరు | 12. పగిడ్యాల |
| 13. జూపాడుబంగ్లా | 14. వెలుగోడు | 15. ఆత్మకూరు |
| 16. పాములపాడు | 17. కొత్తపల్లి | 18. శ్రీశైలం |
| 19. నంద్యాల | 20. మహానంది | 21. బండిఆత్మకూరు |
| 22. పాణ్యం | 23. గడివేముల | 24. ఆళ్ళగడ్డ |
| 25. రుద్రవరం | 26. బేతంచెర్ల | 27. వెల్దుర్తి |
| 28. శిరువెళ్ళ | 29. చాగలమర్రి | 30. గోస్పాడు |

| | | |
|---|---|---|
| 31. కోవెలకుంట్ల | 32. దొర్నిపాడు | 33. ఉయ్యాలవాడ |
| 34. సంజామల | 35. కొలిమిగుండ్ల | 36. బనగానపల్లె |
| 37. అవుకు | 38. ఆదోని | 39. కౌతాళం |
| 40. కోసిగి | 41. పెద్దకడుబూరు | 42. ఎమ్మిగనూరు |
| 43. నందవరం | 44. మంత్రాలయం | 45. ఆలూరు |
| 46. చిప్పగిరి | 47. ఆస్పరి | 48. హొళగుంద |
| 49. హాలహర్వి | 50. పత్తికొండ | 51. దేవనకొండ |
| 52. తుగ్గలి | 53. మద్దికెర | 54. గోనెగండ్ల |

కర్నూలుజిల్లా ప్రాచీన చరిత్రను గురించి తెలుసుకోవాలంటే ముందు ఈ ప్రాంతం అప్పుడు ఎలా వుందో తెలుసుకోవాలి. పూర్వం చాలావరకు దట్టమైన అడవులతో, అక్కడక్కడ చిన్నచిన్న గ్రామాలతో, రాజ్యాలతో వుండేది.

కర్నూలు ప్రాంతాన్ని ప్రధానంగా రెండు భాగాలుగా విభజింప వచ్చు. నంద్యాల, కోవెలకుంట్ల, నందికొట్కూరు, శిరువెళ్ళ, ఆత్మకూరు మొదలగు ప్రాంతాలనంతా కలిపి శ్రీశైలప్రాంతం లేదా నందికనుమ అని పిలుస్తుంటారు.

మరోభాగంలో ఆదోని, కర్నూలు, పంచపాళాలు వుండేవి. పత్తికొండ, కోటకొండ, దేవనకొండ, కప్పట్రాళ్ళ, మద్దికెర ఈ ఐదు ప్రాంతాలను కలిపి పంచపాళాలుగా పూర్వం పిలిచేవారు.

కర్నూలు నగరం పూర్వం చాలా చిన్న గ్రామం. నీటి సౌలభ్యం బాగా వుండడం,ఆదోని అప్పట్లో బళ్ళారిలో కలసి వుండడం,రైలు మార్గం ఏర్పడడం, జిల్లా కేంద్రంగా మారడం, ఆంధ్రరాష్ట్ర తొలి రాజధానిగా అవతరించడం మొదలగు కారణాలతో 1858వ సంవత్సరం వరకు రామళ్ళకోట తాలూకాలో ఒక గ్రామంగా వున్న కర్నూలు చూస్తుండగానే 1858లో జిల్లా కేంద్రమై, 1864లో మున్సిపాలిటీగా మారి, 1994లో కార్పొరేషన్ వరకు ఎదిగి ప్రముఖ పట్టణంగా రూపుదిద్దుకొంది.



Name.— This district derives its name from its chief town, Kurnool, the residence of former Nabobs, and at present the head-quarters of the Collector. [The word Kurnool is a corruption of Kandenavolu, the Telugu name by which it is described in books and inscriptions, and by which it is still known among the people of the district. According to tradition] in the time of the Chalukyas (the 11th century), the Wadders who carted stone for the construction of the temple at Alampur about eight miles north-east of Kurnool, used the site on which the town now stands as a halting place before crossing the Tungabhadra river, and greased their cart wheels with oil supplied by an oilmonger who worked a mill here. This circumstance led to the formation of a small settlement on the spot, which gradually sprang up into a town. Hence the name of Kandenavolu, the town of kandena or grease

"మాన్యువల్ ఆఫ్ ది కర్నూలు డిస్ట్రిక్ట్" లో వున్న విషయం.

అసలు కర్నూలుకు ఆ పేరు ఎందుకొచ్చింది అని ఆలోచిస్తే 1870 ప్రాంతంలో నరహరి గోపాలకృష్ణమశెట్టి కర్నూలుజిల్లా ప్యాపిలికి డిప్యూటి కలెక్టర్‌గా పనిచేశారు. ఆ సమయంలో వారు జిల్లాలోని భౌగోళిక, చారిత్రక విషయాలు అనేకం సేకరించి "మాన్యువల్ ఆఫ్ ది కర్నూలు డిస్ట్రిక్ట్" అనే పుస్తకం రచించారు. దీనిని తరువాత "కర్నూలు జిల్లా భూగోళము" అనే పేరుతో అనువదించారు.

నరహరి గోపాలకృష్ణమశెట్టి ఆ పుస్తకంలో కర్నూలుకు ఆ పేరు ఎందుకు వచ్చిందో వివరిస్తూ పదకొండవ శతాబ్దంలో చాళుక్యులు అలంపూర్‌లో దేవాలయం నిర్మించారనీ, దానికి కావలసిన రాళ్ళను కర్నూలు పక్కనే వున్న జగన్నాథగట్టు దగ్గర నుంచి సేకరించి బండ్ల మీద వేసుకొని తుంగభద్రానదిని దాటించారని తెలియజేశారు. బండ్లు అంత బరువైన రాళ్ళతో నదిని దాటాలంటే చాలా కష్టం. ఇసుకలో సులభంగా పోలేవు. దానితో ఆ ప్రదేశంలో కొందరు కందెన అమ్మేవారు గానుగ ఏర్పాటు చేసుకొని బండ్లకు కావలసిన కందెన తయారు చేయ సాగారు. కందెన కోసం ఆగే స్థలం కాబట్టి ఆ ప్రదేశానికి బండి మెట్ట అనీ, దాని చుట్టూ ఏర్పడిన గ్రామానికి కందెనవోలు అని పేరు వచ్చిందని అంటారు.

ఓలు అంటే "ఆగు స్థలం" అని అర్థం. ఈ పేరే కాలక్రమేణా అనేక మార్పులు చెందుతూ చివరికి కర్నూలుగా మారిందని అతడు తెలియజేశాడు. చాలా కాలం నుంచీ జనశ్రుతిలో ఎంతో ప్రచారం పొందిన కథ ఇది. నరహరి గోపాల కృష్ణమశెట్టి స్థానికుల నుంచి సేకరించిన దానిని అలాగే ఆ పుస్తకంలో పొందు పరచడంతో ఈ విషయం చాలా ప్రచారంలోకి వచ్చింది.

కానీ కొందరు పరిశోధకులు ఈ వాదనను ఒప్పు కోలేదు. ప్రఖ్యాత పరిశోధ కుడు గడియారం రామ కృష్ణశర్మగారు జగన్నాథ గట్టుపై వున్న రాయి తెల్లని మిశ్రమం రాయి అయితే ఆలంపూరు దేవాలయం కట్టడానికి ఉపయోగించినది ఎర్ర ఇసుక రాయి. కాబట్టి ఆలంపూరు రాయి జగన్నాథగట్టు రాయి వేరేవేరే అయినప్పుడు కందెన కథను గూడా నమ్మలేం అని అంటారు. అంతేగాక వారుమరికొన్ని ఆధారాలను చూపుతూ అలంపూరు దేవాలయం నిర్మాణానికి ఉపయోగించిన రాయి, సాతానికోట గ్రామం ఎదురుగా నదికి అవతలి తీరంలో వున్న భూభాగంలోని రాయి ఒకటే అని తేల్చారు. కాబట్టి బండ్లకు రాళ్ళను వేసుకొని నదిని దాటవలసిన అవసరం గూడా లేదు. అంతేగాక అలంపూరు దేవాలయం పదకొండవ శతాబ్దానికంటే చాలా ముందు నుంచే వున్నట్లు అక్కడి శాసనాల ద్వారా తెలుస్తూ వుంది.

ఇక శాసనాలు, పూర్వకాలం కవులు రాసిన గ్రంథాలు పరిశీలిస్తే అయ్యలరాజురామభద్రుడు రచించిన రామాభ్యుదయం అనే గ్రంథంలో "కందనవోలు" అనే మాట మొదటిసారి కనబడుతూ వుంది. ఇది 16వ శతాబ్దంలో వెలువడింది. అప్పటినుంచి 19వ శతాబ్దం దాకా వచ్చిన అనేక రచనలలో గూడా కందనవోలు అనే వుంది గానీ కందెన వోలు అని ఎక్కడా లేదు.

అలాగే శాసనాలను పరిశీలిస్తే క్రీ.శ. 1107లో కల్యాణచాళుక్య చక్రవర్తి త్రిభువనమల్లు ఆరవ విక్రమాదిత్యుని కాలంలో (క్రీ.శ. 1076-1126) వేసిన శాసనంలో మొట్టమొదటగా "కందనవోలు" అనే పేరు కనబడుతుంది. దీనిని అలంపురం శాసనం అంటారు. ఈ శాసనంలో ఈ త్రిభువనమల్లు సామంతుడు. మహామండలేశ్వరుడు మల్లసురుడు, తుంగభద్రానదీ తీరంలోని కందనవోలులో వసూలయిన పన్నులనూ, జరిమానాలను బాల బ్రహ్మేశ్వరునకు దానం చేసినట్లుగా వుంది.ఆ తరువాత వచ్చిన శాసనాలలో కూడా కందెనవోలుఅని ఎక్కడా వాడలేదని చొక్కపు నారాయణస్వామి అనే పరిశోధకుడు తేల్చి చెప్పాడు.

మరి ఈ గ్రామానికి కందనవోలు అనే పేరు ఎలా వచ్చింది అని పరిశీలించగా ఇక్ష్వాకుల కాలంలో ఈ ప్రాంతాన్ని విశాఖస్కందనాగుడు అనే రాజు పరిపాలించినట్లు తెలుస్తూ వుంది. అతని పేరుమీద వెలసిన గ్రామమే "స్కందనప్రోలు". ఇదే కాలక్రమేణా కందనప్రోలు, కందనవోలు, కందనోలు, కందనూలు ఇలా జనవ్యవహారంలో మారుతూ వచ్చి బ్రిటీష్‌వారి కాలంలో కర్నూలుగా స్థిరపడింది.

కాబట్టి బండ్లకు కందెన వేయడంవల్లగాక, విశాఖ స్కందనాగుని కాలంలో ఏర్పడడం వల్ల ఈ గ్రామానికి ఆ పేరు వచ్చినట్లు చెప్పవచ్చు.

కందనవోలు కోటను శ్రీకృష్ణదేవరాయల సోదరుడైన అచ్యుత రాయలు 1529-49 మధ్య కాలంలో కట్టించినట్లు తెలుస్తూ వుంది. కొండారెడ్డి బురుజును, కోట అవశేషాలను పరిశీలిస్తే ఈ విషయాలు అర్థమవుతాయి. కర్నూలు కోట మొత్తం ఎర్రరాయితో మూడు చదరపు కిలోమీటర్ల వైశాల్యంలో నిర్మించబడింది. ఇది ఆరడుగుల ఎత్తుతో తుంగభద్ర, హంద్రీ నదుల వరదల నుంచి కాపాడుతూ వుండేది. అప్పట్లో ఈ కోటకు మొత్తం నాలుగు ద్వారాలుండేవి. ఒకటి కొండారెడ్డి బురుజు పక్కన గల సింహద్వారం. మరొకటి గడియారం ఆసుపత్రి స్థానంలో గల ద్వారం. నగరవిస్తరణలో భాగంగా ఈ రెండిటినీపగల గొట్టడంతో ప్రస్తుతం మనకు కనిపించవు. మరో రెండు ద్వారా లను మాత్రం మనము ఇప్పుడు గూడా చూడవచ్చు. ఒకటి కోట ఆంజనేయ స్వామి గుడి పక్కన తుంగభద్రలోకి వెళ్ళే ద్వారం. దీనినే గోపాల్ దర్వాజా అని పిలుస్తారు. మరొకటి పెద్దమార్కెట్ దాటి అలాగే కిందికి వెళ్తే మధ్యవీధి దగ్గర తుంగభద్రలోకి వెళుతూ కనిపించే మరో ద్వారం. మనము తుంగభద్రలోనికి వెళితే సాయిబాబాగుడి నుంచి బండిమెట్ట వరకు కర్నూలుకు చుట్టూ వలయాకారంలో అప్పుడు కట్టిన గోడ తాలూకు గుర్తులు కూడా చూడవచ్చు. ఈ నాలుగు ద్వారాలను కలుపు కొంటూ కోట నిర్మించబడింది.

కోట వెలుపల వున్న ప్రాంతానికి పేట అని పేరు. కోటను, పేటను గడియారం ఆసుపత్రి దగ్గర గల ద్వారం అనుసంధానం చేస్తుంది. ఇది కోటకు ఊరు వాకిలి. కోట చుట్టూ లోతయిన కందకం వుండేది. అక్కడక్కడ శత్రువులను గమనించడానికి వీలుగా, ఎత్తయిన బురుజులు వుండేవి.అందులో మనకు ప్రస్తుతంకనిపిస్తున్నవి కొండారెడ్డి బురుజు, ఎర్రబురుజులు మాత్రమే. విక్టరీ టాకీసు పక్కన వున్న ఎర్ర బురుజు దాదాపుగా పడిపోయి చుట్టూ కట్టబడుతున్న కట్టడాలతో కనుమరుగు అవుతూ వుంది.దీనిని కొందరు ఒకప్పుడు రామానాయుడి బురుజు అని పిలిచేవారట.

కొండారెడ్డి బురుజు కోట లోపల వుండేది. కోటకు వెలుపల రాణితోట వుండేది. ఈ తోట ప్రదేశంలో బట్టలబజార్, షరాఫ్‌బజార్, పోస్టాఫీస్ మొదలగునవి తర్వాత నిర్మించబడ్డాయి. ఈ తోట తర్వాత అంతా పొలాలే.

ప్రస్తుతం కర్నూలు పేరు చెప్పగానే అందరికళ్ళ ముందు చటుక్కున కనబడేది కొండారెడ్డి బురుజు మాత్రమే. ఇది నగరం నడిబొడ్డులో వుండి అందరినీ ఆకర్షిస్తూ వుంది. జాతీయపతాకాన్ని నిరంతరం ఎగురవేయడానికి ఎన్నికైన స్థూపాలలో ఇది ఐదవస్థానాన్ని పొందింది. 168 అడుగుల ఎత్తు గల దీని స్థూపంపై జాతీయజెండా నిరంతరం రెపరెపలాడుతుంది.



కొండారెడ్డి బురుజు స్థూపం

జగన్నాథగట్టు నుంచి తెచ్చిన రాయితో నిర్మించబడిన ఈ బురుజులో శత్రువులను గమనించేందుకు, దాడి చేసేందుకు వీలుగా చుట్టూ అనేక రంధ్రాలు వున్నాయి. నేరస్తులను బంధించడానికి వీలుగా రెండవ అంతస్తులో ఒక కారాగారం వుంది. అంతేగాక అవసరమైనప్పుడు తప్పించు కోవడానికి వీలుగా ఒక సొరంగమార్గం వుంది.ఇది అలంపూరు వరకూ వుందంటారు గానీ నమ్మశక్యంగా లేదు. కోట వెలుపల తుంగ భద్రానది వరకుగానీ ఎస్పీ కార్యాలయంవరకు గానీ వుండవచ్చు. శత్రువుల నుంచి తప్పించుకోవాల్సిన సందర్భాలలో సొరంగ మార్గం ద్వారా అక్కడి వరకు వెళ్ళి అలాగే తుంగభద్రానది దాటి వెళ్ళిపోవచ్చు. బురుజు పైకి ఎక్కి చుట్టూ గమనించేందుకు వీలుగా ఒక నిచ్చెన వుండేది. ఇప్పుడది ప్రమా దాలు జరగకుండా నివారించడానికి తీసివేశారు. ఈ బురుజును రాయి మీద రాయి పేర్చుతూ ఇసుక, సున్నం, బెల్లం కలిపిన మిశ్రమంతో వాటిని అతికిస్తూ మూడం తస్తులుగా నిర్మించారు.



అచ్యుతదేవరాయలు నిర్మించిన ఈ బురుజుకు కొండారెడ్డి బురుజు అనే పేరు ఎలా వచ్చింది అనే దానిపై కొన్ని వాదనలు ఉన్నాయి.

1602-1618 మధ్యకాలంలో అబ్దుల్ వహాబ్ కర్నూలును పరిపాలిస్తూ వుండేవాడు. ఆ సమయంలో నంది కొట్కూరు తాలూకా లోని ప్రాతకోట పాలెగాడయిన కొండారెడ్డి అతని అధికారాన్ని ధిక్క రించడంతో అబ్దుల్ వహాబ్ కొండారెడ్డిని ఓడించి ఈ బురుజులోని కారాగారంలో బంధిం చాడు. అతను అక్కడే మరణించడంతో అతని పేరు మీదుగా దీనికి కొండారెడ్డి బురుజు అనే పేరు వచ్చి వుంటుందని కొందరంటారు.

మరికొందరు ఆంగ్లేయుల పరి పాలనా కాలంలో అలంపూరు తాలూకా లోని కొండారెడ్డి అనే దేశభక్తుడు వారి అధికారాన్ని ఎది రించడంతో ఆంగ్లే యులు అతనిని పట్టుకొని ఈ బురుజు లోని కారా గారంలో నిర్బంధించారు.దానితో అతని పేరుమీద దీనికి కొండారెడ్డి బురుజు అనే పేరు వచ్చిందని చెబుతారు. అలాగే ఇంకొం దరు కల్లూరు ప్రాంతానికి చెందిన కొండారెడ్డి అనే అతని పేరుమీద దీనికి ఈ పేరు వచ్చిందంటారు.

1930 జనవరిలో భారతి పత్రికలో కర్నూలుజిల్లా గురించి ఫోటో లతో సహాఒక పెద్ద పరిశోధనాత్మక వ్యాసాన్ని గన్నవరపుసుబ్బ రామయ్య ప్రచురించారు. అందులో అనేక కట్టడాల ఫోటోలు, వాటి పేర్లు ఇవ్వబడ్డాయి. కర్నూలు పేరు చెప్పగానే ఆంధ్రరాష్ట్రంలో అందరి మనసుల్లో తళుక్కున కదలాడే కొండారెడ్డి బురుజు ఫోటో కింద మాత్రం ఎటువంటి పేరు ఇవ్వకుండా ఇది ఒక పాత బురుజు, ఇందులో నల్లమందు దాచి పోలీసులు కాపలా కాస్తున్నారు అని రాయడం జరిగింది. నల్లమందును అప్పట్లో తుపాకీలకు మందుగుండుగా ఉపయో గించేవారు. దీనిని బట్టి ఆలోచిస్తే అప్పటికి ఈ కట్టడానికి కొండారెడ్డిబురుజు అనే పేరు లేదేమోనని అనిపిస్తుంది. అదే నిజ మయితే 1930 తర్వాతనే దీనికి ఆ పేరు వచ్చినట్లు చెప్పవచ్చు. ఇది పరిశోధించాల్సిన విషయం.

కర్నూలు నగరం పూర్వం కోట, పేట అని రెండుభాగాలుగా వుండేది. రాజప్రముఖులు, వ్యాపారస్తులు, ధనవంతులు కోటలో వుంటే మిగిలిన జనాలంతా పేటలో వుండేవారు. సాయిబాబానగర్, కొండారెడ్డి బురుజు, ఎల్లమ్మగుడి, రాధాకృష్ణ థియేటర్‌ల మీదుగా గడియారం ఆసుపత్రి వరకు కోట వుండేది. గడియారం ఆసుపత్రి అవతలినుంచి శ్మశానం వరకూ వున్న ఒన్‌టౌన్ ప్రాంతమంతా పేట వుండేది. కోటను, పేటను గడియారం ఆసుపత్రి దగ్గరగల ద్వారం అనుసంధానిస్తుండేది.

కర్నూలు, జొహరాపురం, రోజా, కొత్తపేట, కల్లూరు మొదలగు నవన్నీ ఒకప్పుడు వేరు వేరు గ్రామాలు.1839లో ఆంగ్లేయుల పరి పాలన ప్రారంభమయ్యాక కోట స్వరూపం నెమ్మదిగా మారిపో సాగింది. కెప్టెన్ రస్సెల్ పరిపాలనాకాలంలో రస్సెల్ బజార్ నిర్మించ బడింది. దానిని ప్రస్తుతం రసూల్‌బజార్‌లేదా బొంగుల బజార్‌గా పిలుస్తువున్నారు.

1857లో హంద్రీ, తుంగభద్రలకు పెద్దవరదలు వచ్చి కోటలోనికి నీరు ప్రవేశించి చాలా నష్టం జరిగింది. దానితో వారు కోట చుట్టూ వున్న కందకాలను పూడ్పించి ఉత్తర, దక్షిణదిక్కులలో వున్న కోట గోడలను పగులగొట్టించి మిలటరీ ఆస్పత్రిని ఒక ద్వారం వున్న ప్రదే శంలో నిర్మించారు. దీనినే గడియారం ఆస్పత్రి అని పిలుస్తున్నారు. దీనితో పేట, కోట ఒకదానితో ఒకటి కలసిపోయాయి. అప్పట్లో కలెక్టర్ మిశ్చిన్ పేరుతో వ్యాపార సముదాయాన్ని కొత్తగా నిర్మించారు. దీనినే మిశ్చిన్‌బజార్ అంటారు. అలా నెమ్మదిగా కొత్తపేట, నరసింగ రావుపేట, ప్రకాష్‌నగర్ ఏర్పడుతూ రోజా గ్రామం కర్నూలులో కలసిపోయింది. మరోపక్క హంద్రీనదికి అవతలి పక్కనవున్న బుధవార పేట ప్రాంతం, కల్లూరు ప్రాంతం గూడా కలసిపోయాయి. ఆంధ్రరాష్ట్ర అవతరణ సందర్భంగా ఉద్యోగుల కోసం ఎ.క్యాంపు, బి.క్యాంపు, సి.క్యాంపులు వెలిశాయి. మరోపక్క రైల్వేస్టేషన్ అవతల వెంకటరమణ కాలనీ విస్తరించింది.కొత్తబస్టాండు నిర్మించడంతో నగరం ఆ వైపు మరింతగా అభివృద్ధి చెందుతూ కార్పొరేషన్‌గా అవతరించింది.

డాక్టర్ జయంతి చక్రవర్తి

# తరతరాల బెజవాడ

### చరిత్రలో బెజవాడ ప్రాముఖ్యత :

ప్రపంచంలోని ప్రసిద్ధ నాగరికతలన్నీ నదీ తీరాల్లోనే విలసిల్లాయి. భారతదేశంలో సింధునది సింధూనాగరికతకి మూలమైనదైతే, గంగ, యమున, సరస్వతీ నదులు ఆర్యనాగరికతకు మూలంగా నిలిచాయి. ఇక ఆంధ్రదేశానికి వస్తే ఇక్కడ ప్రవహించే నదుల్లో గోదావరి, కృష్ణా, పెన్నా ముఖ్యమైనవి. కాబట్టే సుప్రసిద్ధ రాజవంశాలన్నీ ఈ నదీ తీరప్రాంతాలపై తమ ఆధిపత్యాన్ని నిలుపుకొనే ప్రయత్నాలు చేశాయి. ఎందుకంటే ఈ నదుల్లో కృష్ణా గోదావరి నదుల మధ్యవున్న భూభాగం చారిత్రకంగా భౌగోళికంగా ఎంతో కీలకమైన ప్రాంతం. పైగా సస్యశ్యామలమైన ప్రాంతం కూడా. అందుకే అనేక రాజవంశాల వాళ్ళు ఈ ప్రాంతం కోసం ఎన్నో యుద్ధాలు చేశారు. చారిత్రకంగా ఆంధ్రదేశాన్ని ఉత్తరప్రాంతంగా, దక్షిణ భాగంగా విభజిస్తూ కృష్ణానది ప్రవహిస్తోంది. ఈ పవిత్ర కృష్ణానదీ ఉత్తర తీరంలో విలసిల్లిన నగరమే బెజవాడ. చుట్టూ ఎత్తైన పర్వతాలతో ఒక ప్రక్కన కృష్ణానదీ ప్రవాహంతో కూడివున్న సారవంతమైన ప్రాంతం ఇది.

ఆంధ్రదేశానికి సంబంధించిన అత్యంత ప్రాచీన శాసనాల్లో ఈ బెజవాడ ప్రాంతం గురించి ప్రత్యేకంగా పేర్కొన్నప్పటికీపురావస్తు శాఖవారి త్రవ్వకాల్లో లభించిన వివిధ రాజవంశాలకి చెందిన నాణాలు, శిల్పాలు, ఇతర కట్టడాలు,అలాగే కొన్ని సాహిత్యాధారాలు, చారిత్రకంగా బెజవాడ ప్రాంత ప్రాముఖ్యతని గురించి మనకి తెలియచేస్తాయి.

ఆంధ్రదేశ చరిత్ర మనకి శాతవాహన చక్రవర్తుల కాలంనుంచే ప్రారంభం అవుతుంది. క్రీ.పూ. 2వ శతాబ్దంనుంచి క్రీ.శ. 2వ శతాబ్దం దాకా దాదాపు ఆంధ్రదేశం అంతా శాతవాహనుల పరిపాలనలో ఉంది. ఈ శాతవాహనుల తొలిరాజధాని బెజవాడకి 70 కిలోమీటర్ల దూరంలో వున్న శ్రీకాకుళంకాగా, తరువాతకాలంలో ఇది కృష్ణానదికి దక్షిణపు ఒడ్డున వున్న ధాన్యకటకానికి (అమరావతి ప్రాంతం) మార్చబడింది. దీనినిబట్టి కృష్ణానదికి ఉత్తరపు ఒడ్డున వున్న బెజవాడ ప్రాంతం కూడా నాడు శాతవాహనుల పరిపాలనలో వుందని తెలుస్తోంది. ఎందుకంటే వారి తొలిరాజధాని శ్రీకాకుళం, మలిరాజధాని ధాన్యకటకం, బెజవాడ ప్రాంతానికి చాలా సమీపంలోనే ఉన్నాయి కాబట్టి. అంతేకాక ఈ బెజవాడకి సమీపంలో వున్న గుంటూరు, తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి జిల్లా ప్రాంతాల్లో శాతవాహన వంశానికి చెందిన వాసిష్ఠీ పుత్రపులోమావి వాసిష్ఠీపుత్ర చండస్వాతి, యజ్ఞశ్రీ శాతకర్ణి అనే ప్రసిద్ధ రాజులకి చెందిన నాణాలు త్రవ్వకాల్లో లభించాయి. అలాగే బెజవాడ పరిసరప్రాంతాలైన ఘంటసాల,రామిరెడ్డిపల్లి, జగ్గయ్యపేట ప్రాంతాల్లో శాతవాహనుల కాలానికి చెందిన బౌద్ధశిల్పాలు, చైత్యాలు, గుహలు విశేషంగా మనకి కనిపిస్తాయి.

ఈ శాతవాహనరాజుల్లో సుప్రసిద్ధుడైన గౌతమీపుత్ర శాతకర్ణికి 'కణ్ణబెణ్ణాపతి' అనే బిరుదు వుంది. కణ్ణబెణ్ణ అంటే కృష్ణానది అని అర్థం.ఇంకా చెప్పాలంటే క్రీ.శ. 80-89 కాలనికి చెందిన ఒక అజ్ఞాత నావికుడు రాసిన "పెరిప్లస్ ఆఫ్ ది ఎరిత్రియనసీ" అనే గ్రంథంలో ఆంధ్రదేశంలో తూర్పుతీరంలో వున్న కొడ్డూర (కోడూరు) యల్లోసిజన్, మౌసోలియా(మచిలీపట్నం) వంటి సుప్రసిద్ధ రేవులగురించి పేర్కొన్నాడు. ఇలాగే టాలమీ అనే వ్యక్తికూడా తను రాసిన గ్రంథంలో కంటకొశ్శిల (ఘంటసాల) కొడ్డూర (కోడూరు) అనే ప్రసిద్ధ రేవు పట్టణాల గురించి వివరించాడు. ఇవన్నీ బెజవాడ సమీపంలో వున్న ప్రాంతాలే. కాబట్టి ఈ వివరాలాధారంగా శాతవాహనుల కాలంలో బెజవాడ రాజకీయంగా ప్రముఖస్థానాన్ని పొందిందని మనం భావించవచ్చు.

శాతవాహనులు అంతరించిన తరువాత క్రీ.శ. 200-254 కాలంలో ఆంధ్రదేశాన్ని విజయపురి (నేటి నాగార్జునసాగర్ ప్రాంతం)ని రాజధానిగా చేసుకొని, ఇక్ష్వాకులు అనే రాజవంశంవారు పరిపాలించారు. ఈ వంశానికి చెందిన రాజుల శాసనాలు కొన్ని ఘంటసాల, రామిరెడ్డిపల్లి, జగ్గయ్యపేట ప్రాంతాల్లో లభించటం వల్ల బెజవాడ ప్రాంతంకూడా ఇక్ష్వాకుల పరిపాలనలో వుండేదని తెలుస్తోంది. ఇక ఇక్ష్వాకుల తరువాత తమిళనాడులోని కాంచీపురం రాజధానిగా చేసుకొన్న పల్లవ వంశపు రాజులు క్రీ.శ. 260 నుంచి 630 దాకా

తమిళదేశంతోపాటు ఆంధ్రదేశాన్ని కూడా పాలించారు. కొందరు చరిత్రకారులు, వీరి పరిపాలన కృష్ణానదికి, దక్షిణ ఒడ్డున వున్న గుంటూరు ప్రాంతం దాకానే సాగిందంటారు. అయితే బెజవాడ ప్రాంతంలోని ఇంద్రకీలాద్రి పాదాన వున్న అక్కన్నమాదన్న గుహలు, మొగల్రాజపురం కొండలవద్ద వున్న గుహలు, పల్లవ నిర్మాణశైలిలో కనిపిస్తాయి. దీనినిబట్టి బెజవాడ ప్రాంతం కూడా పల్లవుల ఏలుబడిలో వుందని, ఈ గుహాలయాల్ని ప్రథమంగా వారే నిర్మించి వుండవచ్చని మరికొందరు చరిత్రకారులు అభిప్రాయపడతారు.

## 1. బృహత్పలాయనులు, ఆనందగోత్రికులు

ఇదిలా వుండగా ఇదే సమయంలో ఇక్ష్వాకుల సామంతరాజులైన బృహత్పలాయనులు, ఆనందగోత్రికులు అనే రాజవంశంవారు స్వతంత్రాన్ని ప్రకటించారు. వీరిలో బృహత్పలాయనులు మొదటగా అధికారాన్ని చేజిక్కించుకున్నారు. వీరి చరిత్రని గురించి ఆ వంశానికి చెందిన రాజు జయవర్మ వేయించిన కొండముది తామ్రశాసనం తెలియజేస్తుంది. ఈ శాసనంలో అతని పరిపాలనలో వున్న కుదూరాహారంలోని పంటూర అనే గ్రామాన్ని ఎనిమిదిమంది బ్రాహ్మణులకి దానంగా ఇచ్చిన వివరం చెప్పబడింది. ఈ కుదూరాహారం అనే ప్రాంతం బెజవాడకి సమీపంలో వున్న ఘంటసాల లేక మచిలీపట్నానికి దగ్గర్లో వుండేదని చరిత్రకారుల అభిప్రాయం. దీనివల్ల బృహత్పలాయనులు కూడా ఈ బెజవాడ ప్రాంతాన్ని పాలించారని తెలుస్తోంది.

ఈ బృహత్పలాయనుల అనంతరం ఆనందగోత్రికులు పల్లవ రాజుల ఆధిపత్యాన్ని ఎదిరించి, నేటి గుంటూరు ప్రాంతానికి దగ్గర్లో వున్న కందరపురాన్ని రాజధానిగా చేసుకొని స్వతంత్ర రాజ్యస్థాపన చేసి, తమ శాసనాల్లో "త్రికూటమలయాధిపతులమని" సగర్వంగా చెప్పుకున్నారు.

## 2. శాలంకాయనులు

ఇలా ఈ బృహత్పలాయనులుఆనందగోత్రికుల తర్వాత, కృష్ణానది ఉత్తరప్రాంతంలోవున్న వేంగీదేశాన్నిరాజధానిగాచేసుకొని శాలంకాయన వంశంవారు ఆంధ్రదేశంలో (క్రీ.శ. 300 నుంచి 420 దాకా) తమ పరిపాలన కొనసాగించారు. వీరిలో క్రీ.శ. 300 నుంచి 335 దాకా పాలించిన విజయదేవవర్మ ఈ వంశానికి మూలపురుషుడు. ఇతడు అశ్వమేధయాగాన్ని కూడా చేసాడని కొన్ని శాసనాలు తెలియచేస్తాయి. అలాగే ఈ వంశానికి చెందిన వేంగీహస్తివర్మ అనే రాజు, ఉత్తర దేశంలో గుప్తవంశానికి చెందిన సుప్రసిద్ధ రాజు సముద్రగుప్తుడు వేయించిన 'అలహాబాద్ ప్రశస్తి' అనే శాసనంలో పేర్కొనబడ్డాడు.

శాలంకాయన నందివర్మ (క్రీ.శ. 395-410) స్కంధవర్మ (క్రీ.శ 410-20)లకి చెందిన రెండు తామ్రశాసనాలు కృష్ణాజిల్లాలోని గుడివాడతాలూకాలో వున్న కానుకొల్లు గ్రామంలోలభించాయి. దీనివల్ల గుడివాడప్రాంతం వీరి ఆధీనంలో వుందని తెలుస్తోంది. అలాగే విజయ నందివర్మ (క్రీ.శ. 395-410) వేయించిన కొల్లేరు తామ్రశాసనంలో, 157 మంది బ్రాహ్మణులకి 'వెదురునూకపల్లి' అనే గ్రామాన్ని దానంగా ఇచ్చిన వివరం వుంది. చరిత్రకారుల అభిప్రాయం ప్రకారం ఈ గ్రామం కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాలో వున్న ముదినేపల్లి. ఈ వివరాలాధారంగా కృష్ణానది ఉత్తరపు ఒడ్డున వున్న బెజవాడ ప్రాంతం కూడా శాలంకాయనుల ఏలుబడిలో వుండేదని మనం గ్రహించవచ్చు.

## 3. విష్ణుకుండినులు

ఈ శాలంకాయనుల తర్వాత విష్ణుకుండినులు అనే వంశానికి చెందినవారు ఆంధ్రదేశాన్ని క్రీ.శ. 420 నుంచి 611 దాకా పరిపాలించారు. వీరి రాజధాని నేటి గుంటూరుజిల్లాకు చెందిన వినుకొండ అని కొందరు చరిత్రకారులు అభిప్రాయపడగా మరికొంతమంది, వేంగీ (ఏలూరు ప్రాంతం) దేశానికి సమీపంలో వున్న విజయకొండులూరు (దెందులూరు) వీరి రాజధానిగా భావించారు. ఈ వంశానికి చెందిన వివిధ రాజుల శాసనాలు బెజవాడ పరిసరప్రాంతాల్లో లభించాయి.

విష్ణుకుండిన రెండవ మాధవవర్మ (క్రీ.శ. 458-488)కి చెందిన పొలమూరు తామ్రశాసనంలో బెజవాడ సమీపంలో వున్న గుడివాడ పేర్కొనబడగా; విక్రమేంద్రవర్మ (క్రీ.శ. 488-497)కి చెందిన చిక్కుళ్ళ తామ్రశాసనంలో కృష్ణాతీరంలో వున్న రావిరేవ, రేగొన అనే గ్రామాలు ప్రస్తావించబడ్డాయి. అలాగే మూడవ మాధవవర్మ (క్రీ.శ. 564-611) వేయించిన ఈపూరు తామ్ర శాసనంలో విష్ణుకుండినుల అధికారం శ్రీకాకుళం నుంచి బెజవాడ ప్రాంతందాకా వ్యాపించిందని తెలియచేయబడింది. బెజవాడ పాలించిన మాధవవర్మ ఈ మూడవ మాధవవర్మే అని చాలామంది చరిత్రకారులు అభిప్రాయపడతారు.

మాధవవర్మకి చెందిన ఒక వృత్తాంతం ముక్కంటికాడ్వెట్టి వంశీయుడైన పల్లకేతు భూపాలుడు వేయించిన శాసనంలో "ఆశ్రిత పక్షపాతం చూపకుండా మాధవవర్మ తప్పుచేసిన తన కన్నకొడుకుకి కూడా మరణశిక్షను విధించిన ధర్మదీక్షాతత్వాన్ని చూసి, ఇంద్రకీలాద్రి మీదున్న మల్లికార్జునుడు సంతోషించి, బెజవాడలో కనకవర్షాన్ని కురిపించాడని" చెప్పబడింది.ఇంకా ఈ శాసనం మాధవవర్మకి 'జనాశ్రయ','అవసిత వివిధ దివ్య"అనే బిరుదులు కూడా వున్నట్టు తెలియ చేస్తుంది. మరొక ముఖ్యవిషయం ఏమిటంటే బెజవాడలో వున్న అక్కన్న మాదన్నల గుహాలు, మొగల్రాజపురం కొండల్లో వున్న గుహాలయాలు వీరి కాలంలోనే నిర్మించబడ్డాయని చరిత్రకారులు భావిస్తారు.

ఈవిధంగా ఆంధ్రదేశ చరిత్రలో ప్రాచీనకాలంలో ప్రసిద్ధమైన, శాతవాహన ఇక్ష్వాకు, పల్లవ, బృహత్పలాయన, ఆనందగోత్రిక, శాలంకాయన, విష్ణుకుండిన వంశాలవారి పరిపాలనాకాలంలో బెజవాడ

ప్రాంతం రాజకీయంగా ఎంతో ప్రాముఖ్యాన్ని పొందిందని ఇలా మనకి వివిధ ఆధారాలు తెలియచేస్తున్నాయి.

## 4. తూర్పు చాళుక్యులు

ఈ విష్ణుకుండినుల తరువాత బాదామీ చాణక్యరాజైన రెండవ పులకేశి ఈ ప్రాంతాన్ని జయించి, తన తమ్ముడైన కుబ్జవిష్ణువర్ధనుణ్ణి తీరాంధ్ర ప్రాంతానికి తన ప్రతినిధిగా నిలిపాడు. ఇలా కుబ్జవిష్ణువర్ధనుడి నుంచి విజయాదిత్యుడి వరకు క్రీ.శ. 626 నుంచి 1076 దాకా 450 సంవత్సరాలపాటు తూర్పు చాళుక్యరాజులు వేంగీ రాజధానిగా ఆంధ్రదేశాన్ని పాలించారు. ఈ తూర్పు చాళుక్యుల శాసనాలాధారంగా బెజవాడ సాంఘికంగా, రాజకీయంగా, మతపరంగా ఎంతో ప్రాముఖ్యాన్ని పొందిందని తెలుస్తుంది. ఈ వంశానికి చెందిన గుణగ విజయాదిత్యుడి సేనాని పాండురంగడు వేయించిన అద్దంకి శాసనం, మొదటి చాళుక్య భీముడు వేయించిన (క్రీ.శ. 848-892) బెజవాడ శాసనం, క్రీ.శ. 900లో యుద్ధమల్లుడు ప్రకటించిన బెజవాడ శాసనం, రెండవ అమ్మరాజు (క్రీ.శ. 945-970) శాసనం బెజవాడకి నాడున్న ప్రఖ్యాతిని గురించి మనకి తెలియచేస్తాయి. అలాగే రాజరాజనరేంద్రుడికి ముందు కొంతకాలం బెజవాడ వేంగీరాజులకు రాజధానిగా వుండేదని, ఆయన తన హయాంలో గోదావరీ తీరంలో వున్న రాజమహేంద్రవరంలో, ఒక కోటను కట్టాడని, నాటినుంచి అదే చాళుక్యుల రాజధాని అయిందని కొన్ని ఆధారాలు తెలియజేస్తాయి. అయితే రాజమహేంద్రవరం కోటని మొదటి అమ్మరాజే కట్టించాడని, కొందరు చరిత్రకారులు అభిప్రాయపడతారు.

## 5. చోళులు

రాజరాజనరేంద్రుడి తరువాత అతని కుమారుడైన రాజేంద్రుడు, కులోత్తుంగ చోళుడు అనే పేరుతో, ఆంధ్రదేశంలో చోళుల పరిపాలనని ప్రారంభించాడు. కొంతకాలానికి ఇతని పినతండ్రైన విజయాదిత్యుడు మరణించటంతో, వేంగీరాజ్యం కూడా రాజేంద్రచోళుడి ఆధీనంలోకి వచ్చింది. ఆ తరువాత రాజేంద్రుడు తన కొడుకులకి, ఈ సమస్త వేంగీ రాజ్యాధికారాన్ని అప్పగించగా, వారు ఈ రాజ్యాన్ని పాలించటానికి ఇష్టపడక, దాన్ని తమకు విశ్వాసపాత్రులైన సైనిక నాయకులు వెలనాటి రాజులకి అప్పగించారు.

అలా అప్పగించబడిన వేంగీరాజ్యాన్ని (బెజవాడతో సహా) వెలనాటి గొంకరాజు అనే మాండలికుడు, చోళుల ప్రతినిధిగా పాలించసాగాడు. ఈ పరిస్థితి ఇలా వుండగా వేంగీదేశంలో స్వతంత్ర ప్రభువు లేక పోవటం చూసి పశ్చిమచాళుక్యరాజైన నాల్గవ చోళ విక్రమాదిత్యుడు, (క్రీ.శ. 1076-1126) తన సేనానాయకుడైన అనంతపాలుణ్ణి వేంగీని ఆక్రమించటానికి పంపించాడు. ఆవిధంగా పంపబడిన అనంతపాలుడు వేంగీని జయించి, బెజవాడని తన రాజధానిగా చేసుకొని ఆ ప్రాంతాన్నంతా పాలించసాగాడు. ఇతని కాలంలోనే సుప్రసిద్ధ శైవాచార్యుడైన శ్రీపతి పండితారాధ్యుడు అనంతపాలుడి సభలో అనేక మహిమలు చూపించాడని కొన్ని సాహిత్యాధారాలు తెలియచేస్తాయి. అదే సమయంలో అనంతపాలుడి మేనల్లుడైన గోవింద దండనాథుడనే వాడు బెజవాడ సమీపంలోని కొండపల్లి దుర్గానికి పాలకుడుగా వున్నాడు. ఇతను కూడా కొంతకాలం బెజవాడని పాలించాడు. ఈవిధంగా క్రీ.శ. 1118 దాకా బెజవాడ పశ్చిమచాళుక్యుల ఆధీనంలో వుండగా 1135న జరిగిన యుద్ధంలో వెలనాటి చోళులు, కాంచీపుర చోళులు కలిసి పశ్చిమ చాళుక్యుల్ని ఓడించారు. దాంతో బెజవాడ మరల వెలనాటి చోళుల పరిపాలనలోకి వచ్చింది.

## 6. కాకతీయులు

ఇదిలావుండగా అదేకాలంలో ఓరుగల్లు కేంద్రంగా కాకతీయ ప్రభువులు తమ పరిపాలన ప్రారంభించారు. ఆ వంశపాలకుల్లో సుప్రసిద్ధుడు గణపతిదేవచక్రవర్తి. ఈయన తన హయాంలో కృష్ణానదికి దక్షిణపు ఒడ్డున వున్న అమరావతీ ప్రాంత పాలకులైన కోటవంశం వారితో సంబంధబాంధవ్యాల్ని ఏర్పాటుచేసుకున్నాడు. అలాగే నతవాటి ప్రభువుల (కృష్ణా జిల్లాలోని మధిర ప్రాంతం)తో కూడా మైత్రిని పెంపొందించుకున్నాడు. ఈవిధంగా తన ప్రాబల్యాన్ని పెంచుకున్న గణపతిదేవుడు క్రీ.శ. 1201లో వెలనాడుపై దాడిని జరిపి దాన్ని స్వాధీనం చేసుకున్నాడు. ఈ కాలానికి చెందిన నతవాడి ప్రభువు వక్కడి మల్లరుద్రుడికి చెందిన ఒక శాసనం ఇంద్రకీలాద్రిపై నున్న శ్రీ కనకదుర్గాలయ ప్రాంగణంలో దొరకగా, కాకతి ప్రతాపరుద్రుడికి చెందిన మరోశాసనం బెజవాడలో లభించింది. ఆనాటినుంచి కాకతీయులు అస్తమించేవరకూ బెజవాడ ప్రాంతం వారి ఏలుబడిలోనే ఉంది. ఆ తరువాత ఆంధ్రదేశంలోని చాలా ప్రాంతాలతో పాటు బెజవాడ ప్రాంతం కూడా ముస్లిం పాలకుల చేతిలోకి వెళ్ళిపోయింది. ఎప్పుడైతే పెద్దదైన కాకతీయ సామ్రాజ్యం కుప్పకూలి పోయిందో, ఆ రాజ్యపు సామంత ప్రభువులంతా స్వతంత్ర్యాన్ని ప్రకటించారు.

## 7. రెడ్డి రాజులు

ఇలా స్వతంత్ర్యాన్ని ప్రకటించి సామంతరాజుల్లో రెడ్డి రాజ్యవంశానికి చెందిన రాజులు 1334 నుంచి ఒక శతాబ్దకాలం తీరాంధ్ర దేశాన్నంతా పాలించారు. వారి పాలనలో బెజవాడ కూడా వుంది. కానీ వీరి కాలానికిచెందిన ఒక్క శాసనం కూడా ఈప్రాంతంలో ఇప్పటి వరకూ లభించలేదు. క్రమంగా కొండవీటిరెడ్డి రాజ్యం, రాజమహేంద్రవరపు రెడ్డి రాజ్యం, విజయనగర ప్రభువుల చేత ఆక్రమించబడింది. అదే సమయంలో ఓఢ్రదేశాన్ని (ఒరిస్సా) పాలిస్తున్న కపిలేశ్వర గజపతి, విజయనగరం వారిని ఎదిరించి తీరాంధ్రదేశం అంతా తన స్వాధీనం

లోకి తెచ్చుకున్నాడు. అలా బెజవాడ గజపతుల పాలనలోకి వెళ్ళింది. దీనికి సాక్ష్యంగా కపిలేశ్వర గజపతికి చెందిన శాసనం కూడా ఒకటి బెజవాడలో దొరికింది.

క్రీ.శ. 1470లో కపిలేశ్వరుడు మరణించిన తర్వాత జరిగిన వారసత్వపు తగాదాలవల్ల వీరి ఆధీనంలో వున్న ప్రాంతాల్ని, బహ్మనీ సుల్తానైన మహ్మద్‌షా (క్రీ.శ. 1463-82) సునాయాసంగా ఆక్రమించి, కొండపల్లి, రాజమహేంద్రవరాల్ని ముఖ్యస్థావరాలుగా చేసుకొని తన సర్దార్లద్వారా ఈ ప్రాంతాల్ని పరిపాలించాడు. ఆ విధంగా బెజవాడ ప్రాంతం ముస్లిం పాలకుల ఏలుబడిలోకి వెళ్ళింది. కొంతకాలం తరువాత మహ్మద్‌షా మరణించగా, పురుషోత్తమ గజపతి తన సైన్యంతో తాము గతంలో కోల్పోయిన రాజమహేంద్రం, కొండపల్లి, కొండవీడు, వినుకొండ, దుర్గాల్ని తిరిగి స్వాధీనం చేసుకున్నాడు. ఆవిధంగా మరల బెజవాడ గజపతుల అధికారంలోకి వచ్చింది.

## 8. విజయనగర రాజులు

ఆ తరువాత క్రీ.శ. 1336లో విజయనగర సామ్రాజ్యస్థాపన జరిగింది. ఆ విజయనగర పాలకుల్లో ప్రసిద్ధుడైన శ్రీకృష్ణదేవరాయలు క్రీ.శ. 1513లో తన తూర్పు దిగ్విజయ యాత్రని ప్రారంభించాడు. తన దండయాత్రలో భాగంగా, కొండవీడు, వినుకొండ దుర్గాల్ని జయించి, కృష్ణానదిని దాటి బెజవాడ ప్రాంతానికి సమీపంలో వున్న కొండపల్లి కోటని, జయించి తన దిగ్విజయ యాత్రని ఓఢ్రదేశంలో వున్న కటకం దాకా సాగించాడు. అలా ఈ ప్రాంతం అంతా ఆయన స్వాధీనంలోకొచ్చింది. అయితే కళింగ దేశాధిపతి అయిన ప్రతాపరుద్ర గజపతితో జరిగిన సంధి కారణంగా, కృష్ణానదికి ఉత్తరపు ఒడ్డున వున్న బెజవాడనుంచి కటకం దాకా తిరిగి అతనికే అప్పగించారు.

ఈ చర్యతో బెజవాడ తిరిగి మళ్ళా గజపతుల స్వాధీనమైంది. శ్రీ కృష్ణదేవరాయల కాలానికి చెందిన సింగరాజు అనే మహామాండలీకరాజు వేయించిన శాసనం ఒకటి ఇంద్రకీలాద్రి మీద దొరికింది. ఆవిధంగా ప్రతాపరుద్ర గజపతి తనకు లభించిన కృష్ణానది ఉత్తరాన వున్న ప్రాంతాలన్నింటికీ సంరక్షకుడుగా, తన సామంతుడైన సీతాపతి అనే వాడిని నియమించాడు. అయితే క్రీ.శ. 1492లో తెలంగాణా ప్రాంతపాలకుడుగా మహమ్మద్‌షా చేత నియమించబడిన కులీకుతుబ్‌షా తన మీదకి యుద్ధానికి వచ్చిన సీతాపతిని ఓడించి అతని స్వాధీనంలో వున్న ప్రాంతాలనన్నింటినీ స్వాధీనం చేసుకున్నాడు. ఆనాటినుంచి క్రీ.శ. 1687 వరకు బెజవాడ దీని పరిసరప్రాంతాలు కుతుబ్‌షాహీల పాలనలో వుంది.

## 9. ఆంగ్లేయులు

ఆ తరువాత ఆంధ్రదేశంలో క్రమంగా విదేశీపరిపాలన ప్రారంభం అయింది. క్రైస్తవ మతానికి చెందిన ఫ్రెంచివారు, డచ్‌వారు, పోర్చుగీస్‌వారు, ఆంగ్లేయులు వ్యాపారం నెపంతో భారతదేశంలో ప్రవేశించారు. కృష్ణాజిల్లాలో బెజవాడకి దగ్గర్లోవున్న మచిలీపట్నం రేవు నాడు అంతర్జాతీయ వ్యాపారానికి ముఖద్వారంగా ప్రసిద్ధిగాంచింది. అక్కడ గోల్కొండ రాజ్యం అస్తవ్యస్తమై, ఔరంగజేబు చేత ఆక్రమించబడింది. అతని ప్రతినిధిగా అసఫ్‌జా నిజాముల్‌ముల్క్ క్రీ.శ. 1724లో దక్కన్ సుబేదారుగా గోల్కొండ రాజ్యంలో నియమించ బడ్డాడు. ఆ తరువాత జరిగిన వారసత్వపు తగాదాల్లో ఫ్రెంచ్‌వారి సాయంతో విజయం సాధించిన సలాబత్‌జంగ్ క్రీ.శ. 1752లో కృతజ్ఞతా సూచకంగా ఫ్రెంచ్‌సైన్యం పోషణక్రింద కొండవీడు, కొండపల్లి, రాజమహేంద్రం, శ్రీకాకుళం, సర్కార్లని వారికి బహుమానంగా ఇచ్చేశాడు.

కాలక్రమంలో బెజవాడ ఫ్రెంచ్‌వారి స్వాధీనంలోకి వచ్చింది. ఆ తరువాత బ్రిటిష్‌వారి ప్రాబల్యం ఆంధ్రదేశంలో ఇనుమడించింది. క్రీ.శ. 1766లో నిజాం ప్రభువులకి బ్రిటిష్‌వారికి జరిగిన ఒప్పందం ప్రకారం, ఉత్తర సర్కారు ప్రాంతాలన్నీ బ్రిటిష్‌వారి స్వాధీనంలోకి వచ్చాయి. ఆవిధంగా బెజవాడ ప్రాంతం, అంతా బ్రిటీష్ పాలకుల పరిపాలనలోకి వెళ్ళింది. చివరికి మనదేశానికి స్వతంత్రం వచ్చేదాకా బ్రిటిష్‌వారి పాలనలోనే వుంది.

ఇక చారిత్రకంగా చెప్పాలంటే మధ్యాంధ్రయుగంలో బెజవాడ ఎంతోప్రముఖస్థానాన్ని పొంది ప్రముఖ శైవ, శక్తి, క్షేత్రంగాఒక వెలుగు వెలిగింది. ఎందరో మాండలీకప్రభువులు,సామంతులు, దుర్గామల్లేశ్వర స్వామికి భక్తులై బెజవాడ మల్లేశ్వర పాదపద్మారాధక అనే బిరుదుల్ని కూడా స్వీకరించారు. అటువంటి మాండలీక వంశాల వారిలో వెలనాటి దుర్జయ, త్యాగి (చాగి) కొనకంద్రాడి, నతవాడి, గొంటూరి పల్లవ అనే పాలకులు సుప్రసిద్ధులు. వీరందరిచేత దుర్గాదేవికి, మల్లేశ్వర స్వామికి ఎన్నో దానాలు చేయబడ్డాయి. ఆ వివరాలన్నీ వారు ప్రకటించిన శాసనాలు మనకి స్పష్టంగా తెలియచేస్తాయి.

చిరునామా : డాక్టర్ జయంతి చక్రవర్తి, ఎఫ్-1, ఏకశిల అపార్ట్‌మెంట్, భగత్‌సింగ్ రోడ్, సత్యనారాయణపురం, విజయవాడ - 520 011. ఫోన్ : +91 9390526272.

శ్రీ ముత్తేవి రవీంద్రనాథ్

# తెనాలి ప్రాచీనత, విశిష్టత

1887 వ సంవత్సరంలోప్రచురితమైన కందుకూరి వీరేశలింగం పంతులు గారి 'ఆంధ్ర కవుల చరిత్రము' అనే గ్రంథంలో తెనాలి రామకృష్ణ కవిని గురించి రాస్తూ పంతులుగారు రామకృష్ణ కవి స్వస్థలం కృష్ణా మండలంలోని తెనాలి గ్రామమని పేర్కొన్నారు. నిజంగానే ఆ గ్రంథ రచనా కాలానికి తెనాలితో సహా నేటి గుంటూరు జిల్లా మొత్తం కృష్ణాజిల్లాలో ఒక అంతర్భాగంగా ఉండేది. 1904వ సంవత్సరంలో మాత్రమే కృష్ణా నదికి పశ్చిమంగా ఉన్న ప్రాంతం గుంటూరు జిల్లా పేరిట వేరే జిల్లాగా ఏర్పడింది. తెనాలిని గురించి ప్రాచీన సాహిత్యంలో ఎవరు, ఎక్కడ ప్రస్తావించినా దానిని కృష్ణాతీర గ్రామంగానే ప్రస్తావించారు. ప్రస్తుతం కృష్ణాతీరంనుంచి తెనాలి 15 కిలోమీటర్లదూరంలో ఉన్నప్పటికీ అనాదిగా తెనాలిని కృష్ణాతీర గ్రామంగానే పరిగణించడానికో కారణం ఉంది. కృష్ణానదికి ఎలాంటి ఆనకట్టలూ, కరకట్టలూ లేని ప్రాచీన కాలంలో నది వరద నీరు తరచు తెనాలిని ముంచెత్తేదట. ఆ కారణంగానే వరద ముంపును తట్టుకొనేటందుకు పాత తెనాలిలోని ఇళ్ళ పునాదులన్నీ నేలమట్టం నుంచి పది పదిహేను అడుగుల ఎత్తున నిర్మించబడి ఉండడం మనం నేటికీ గమనించవచ్చు.అతి ప్రాచీనకాలం నుంచీ కృష్ణాతీర గ్రామాలలో తెనాలిది ఓ విశిష్టమైన, విలక్షణ మైన స్థానం. ఒకప్పుడు పేరెన్నికగన్న బౌద్ధ–జైన క్షేత్రంగా, తరువాత ఓ సుప్రసిద్ధ అగ్రహారంగా, కొంతకాలం ఓ ప్రసిద్ధనగరంగా, మరి కొంత కాలం కూచిపూడి సముతులోనూ, ఆ తరువాత రేపల్లె తాలూకాలోనూ ఓ గ్రామంగా పలు రూపులెత్తిన తెనాలి ప్రాంతపు చారిత్రక వైభవం తెలుసుకోవడం ఆసక్తికరంగా ఉంటుంది. అనాదిగా పాడి పంటలతో విలసిల్లుతూ, చదువుల పుట్టినిల్లుగా, కళలకు కాణాచిగా, స్వాతంత్ర్య సమరానికి పురిటిగడ్డగా, కార్మిక కర్షకోద్యమాలకు ఉనికిపట్టుగా, రాజకీయ దురంధరులకు కార్యస్థలిగా వినుతికెక్కిన తెనాలి ప్రాంతం ప్రాచీనత, విశిష్టతలనుగురించి సంక్షిప్తంగా తెలపడం ఈ వ్యాసం లక్ష్యం.

విలక్షణమైన తెనాలి అనే పేరు తెనాలి ప్రాచీనతకు నిలువెత్తు సాక్ష్యం. పలు ఇతర పట్టణాలు, గ్రామాల పేర్లలా మనం తెనాలి అనే పదాన్ని తేలికగా విశ్లేషించి తెలుగులో అర్థం చెప్పలేము. 'తెన్', 'న్యాలి' అనే రెండు ప్రాగ్ద్రావిడ శబ్దాల కలయికతో ఏర్పడిన 'తెన్న్యాలి' శబ్దమే కాలక్రమాన 'తెన్నాలి'గా రూపాంతరం చెందిందని నా అభిప్రాయం. (ప్రాచీన సాహిత్యంలో 'తెన్నాలి' అనే గ్రామనామం కూడా వాడుకలో ఉంది) 'తెన్' అంటే 'దక్షిణము', 'న్యాలి' అంటే 'నీటి వనరు' అని అర్థాలు. తెన్ను టికిరి, తెన్నేరు (తెన్+నేరు), తెన్ కాశి, న్యాల్ కల్ (న్యాలి కల్లు), న్యాలి కొండ, న్యాల కొసిగి (న్యాలి కొసిగి), దోర న్యాలి (దోర్నాల), న్యాలికొండ పల్లి (నేలకొండ పల్లి), న్యాలి నూతల (నేల నూతల), న్యాలి, నాలి మొదలైన గ్రామనామాలన్నీ పరిశీలిస్తే అవన్నీ కూడా ఇలా తెనాలి లాగే ప్రాగ్ద్రావిడ శబ్దాలతో ఏర్పడినవేనని గ్రహించగలం. అలా తెనాలి పేరే దాని ప్రాచీనతకు ప్రబల సాక్ష్యం.

తెనాలి పట్టణానికి నైరుతి దిశలో ఉన్న మల్లెపాడు దిబ్బ మీద పురావస్తు శాఖ జరిపిన తవ్వకాలలో లభించిన అవశేషాల ఆధారంగా క్రీ.పూ. 5వ శతాబ్ది – క్రీ.పూ. 3వ శతాబ్ది మధ్యకాలంలో ఈ ప్రాంతంలో ఒక గొప్ప నాగరికత విలసిల్లినట్లు, ఆ నాగరికతా కేంద్రానికి ధాన్యకటకం, ధనదపురం (చందవోలు), ప్రతీపాలపురం (బట్టిప్రోలు) నాగరికతలతోనూ, రోమన్లతోనూ సన్నిహిత వ్యాపార సంబంధాలున్నట్లు పురావస్తు ఆధారాలతో చారిత్రకులు నిర్ధారించారు. క్రీ.శ. ఒకటో శతాబ్దిలో సద వంశానికి చెందిన శ్రీసద అనే రాజు తెనాలి ప్రాంతాన్ని పాలించినట్లు నిర్ధారణ అయింది. తెనాలి ప్రాంతం గౌతమీపుత్ర శాతకర్ణి కుమారుడు వాసిష్ఠీపుత్ర పులోమావి (క్రీ.శ102–130) పాలనలో ఉన్నట్లు తెలిపే ఆ కాలంనాటి నాణెములు, ఇతర పురావస్తు ఆధారాలు ఇక్కడ లభించాయి. తరువాత ఈ ప్రాంతాన్ని వరుసగా ఇక్ష్వాకు, పల్లవ, బృహత్పలాయన, ఆనంద గోత్రిక, శాలంకాయన,

విష్ణుకుండిన రాజులు పాలించారు. బృహత్పలాయన రాజైన జయవర్మ (క్రీ.శ.270-285) రాగిరేకుపై ప్రాకృత భాషలో వేయించిన శాసనం ఒకటి తెనాలి సమీపంలోని కొండముది గ్రామంలో లభించింది. ఆ శాసనం ప్రకారం తెనాలి ప్రాంతంతో సహా పాంటూరు (నేటి కాకుమాను మండలంలోని కొండపాటూరు) కూడా కూడూరు (దివిసీమ కోడూరు) హారములోని ఒక భాగమని తెలింది. ఆనాటి హారము అంటే జిల్లా వంటి ఒక పరిపాలనా విభాగం. తెనాలి గంగానమ్మ పేటలోని రామేశ్వర (రామలింగేశ్వర)స్వామి ఆలయం ఆవరణలో జరిపిన తవ్వకాలలో బయల్పడిన క్రీ.శ. 5వ శతాబ్ది నాటి జైన తీర్థంకరుని పాలరాతి విగ్రహాన్ని బట్టి, ఒకప్పుడు అక్కడ ఉండిన ప్రసిద్ధ జైనాలయాన్ని తొలగించి, దాని స్థానంలో శివాలయాన్ని నిర్మించడం జరిగిందనీ, ఆ ఆలయ నిర్మాణం జనాశ్రయుడనే బిరుదు పొందిన విష్ణుకుండిన రాజు మూడవ మాధవవర్మ పాలనాకాలం (క్రీ.శ. 546-611)లో జరిగి ఉంటుందనీ చరిత్రకారులు భావిస్తున్నారు. తెనాలి ప్రాంతాన్ని పాలించిన రెండవ అమ్మరాజు (ఈయన పాలనాకాలం క్రీ.శ. 945-970) 'అర్హనంది' అనే జైనాచార్యుడికి 'కలుచుంబఱ్ఱు' (తెనాలి సమీపంలోని నేటి పెదగాదెలవఱ్ఱు) అనే గ్రామాన్ని దానంగా ఇచ్చినట్లు శాసనాధారం ఉంది. ప్రస్తుత కొల్లిపర మండలం దావులూరు గ్రామంలోని గోకర్ణేశ్వర స్వామి ఆలయంలో కనుగొన్న శాలివాహన శకం 1065 (క్రీ.శ.1143) నాటి ఒక ప్రాచీన శాసన స్తంభం మీద తెనాలి పేరు మొదటగా ప్రస్తావించబడింది. ఈ శాసనాన్ని బట్టి వెలనాడులోని అంతర్భాగంగా ఉన్న ఈ ప్రాంతపు నాటి పాలకుడు రెండవ గొంకరాజు అనే నామాంతరం కల మొదటి రాజేంద్ర చోడుడు (పాలనా కాలం క్రీ.శ.1132-63). అయ్య వంశీకుడైన జాయప్ప కాకతి గణపతిదేవుని (క్రీ.శ.1198-1262) గజసాహిణిగా ఉంటూ చేబ్రోలు కేంద్రంగా ఈ ప్రాంతమంతటినీ పాలించాడు. ఈయన తన సోదరీమణులు నారమ్మ, పేరమ్మలను గణపతిదేవుడికిచ్చి వివాహం చేశాడు. సంస్కృతంలో ఈ జాయప్ప రాసిన 'నృత్త రత్నావళి' అనే నాట్యశాస్త్ర గ్రంథంలో వివరించిన నాట్య భంగిమలే అనంతరాంలో వరంగల్ సమీపంలోని పాలంపేటలో ఉన్న రామప్పగుడిలోని అపురూప శిల్పాలు చెక్కిన శిల్పులకు ప్రేరణ అయ్యాయట. కాకతీయ ప్రతాపరుద్రుని పాలనాకాలం (క్రీ.శ.1296-1323)లో ఆయన గురువైన ముదిగొండ శివయోగీశ్వరుడిని రప్పించి, తెనాలి రామలింగేశ్వర స్వామి దేవస్థానానికి ఆయన్ని స్థానాచార్యుడిగా నియమించి, ఆయనకూ, మరికొన్ని కుటుంబాలకూ నివాస గృహాలు నిర్మించి ఇచ్చినట్లు తెనాలి కైఫీయ్యత్ పేర్కొంటుంది. తెనాలిలోనూ, సమీప ఈమని గ్రామంలోనూ నేటికీ నివసిస్తున్న ముదిగొండ ఉద్భటారాధ్యుని వంశస్థులు, ఇంకా ములుగు, కాశీనాథుని వంటి గృహనామాలు కల ఇతర ఆరాధ్య శైవ కుటుంబాలు ఆ సందర్భంగా ఇక్కడ స్థిరపడినవారి వంశీకులేనంటారు. కాకతీయ సామ్రాజ్య పతనానంతరం కమ్మ నాయకులైన ముసునూరి ప్రోలయ నాయకుడు, కాపయ నాయకుడు నేటి ఖమ్మంజిల్లా రేకపల్లి కేంద్రంగా క్రీ.శ. 1323 నుంచి 1368 వరకు సాగించిన పాలనకు సంబంధించిన ఆధారాలు ఏవీ తెనాలి ప్రాంతంలో లభించలేదు. అయితే తెనాలి సమీపంలోని చిలువూరు, అంగలకుదురు, యడ్లపల్లి వంటి గ్రామాలలోని ముసునూరి కుటుంబాలవారు రేకపల్లి రాజ్యం పతనానంతరం వచ్చి అక్కడ స్థిరపడ్డారట. తెనాలి ప్రాంతమంతా క్రీ.శ. 1324 నుంచి క్రీ.శ.1424 వరకు కొండవీడు రాజధానిగా పాలించిన రెడ్డి రాజుల పాలన కింద ఉండేది. కొండవీటి రెడ్డిరాజుల పాలనాకాలంలో రావూరి రంగారెడ్డి అనే ఆయన కొంతకాలం తెనాలికి స్థానిక పాలకుడుగా వ్యవహరించాడట. యక్షగాన కళారూపాన్ని ప్రోత్సహించిన కొండవీటి పాలకుడు కుమారగిరి రెడ్డి పాలనాకాలం (క్రీ.శ. 1386 - 1402)లో శైవులైన జక్కుల కులస్థులు పెద్ద సంఖ్యలో వచ్చి తెనాలి ప్రాంతంలో రంగస్థల కళావైభవానికి ఓ రకంగా బీజావాపనం చేశారు. ఆ తరువాత కొంతకాలానికి వైష్ణవమత ప్రాబల్యంఅధికమైనప్పుడు కృష్ణానదికి ఆవలి తీరాన ఉన్న కూచిపూడిలో అప్పటి రాజులు, వైష్ణవాచార్యుల ప్రోత్సాహంతో కొందరు బ్రాహ్మణ కళాకారులు భాగవత కథల ఆధారంగా యక్షగాన కళారూపాలు ప్రదర్శించడం మొదలైంది. వీరిని కూచిపూడి భాగవతులు అంటారు. తెనాలి కైఫీయ్యత్ లో పేర్కొన్నదాని ప్రకారం విజయనగర పాలకుడు సాళువ నరసింహ రాయలు పాలనా కాలం (క్రీ.శ.1485-1491)లో జన్నాదుల (జొన్నాదుల)వల్లభుడు అనే పద్మశాలీయుడు ఇక్కడి గాంధీ చౌక్‌కి అతి సమీపంలో ఉన్న సుప్రసిద్ధ గోవర్ధనస్వామి ఆలయం శాలివాహన శకం 1411 (కీ.శ.1489)లో నిర్మించాడు. (తెనాలిలో నేటికీ పద్మశాలీయులు - ప్రత్యేకించి జొన్నాదుల వారు - పెద్ద సంఖ్యలో ఉన్నారు.) క్రీ.శ.1515లో విజయనగర పాలకుడైన శ్రీకృష్ణ దేవరాయులు కొండవీటి దుర్గాన్ని జయించి, తన మంత్రి సాళువ తిమ్మరుసును దుర్గాధ్యక్షునిగా నియమించాడు. సాళువ తిమ్మరుసు ఈ గోవర్ధన స్వామి ఆలయానికి తెనాలి నగరాన్ని దానంగా ఇచ్చాడని కూడా పేర్కొనబడింది. తెనాలిలోని ఈ గోవర్ధనస్వామి ఆలయాన్ని సాళువ తిమ్మయ్య సోదరి కృష్ణమాంబ, ఆమె భర్త నాదెండ్ల తిమ్మయ్య, వారి కుమారులు నాదెండ్ల అప్ప మంత్రి, గోప మంత్రి దర్శించుకుని చేసిన ధర్మకార్యాల వివరాలు కైఫీయ్యత్‌లో ఉన్నాయి. తిమ్మరుసు యొక్క ఈ ఇద్దరు మేనల్లుళ్ళే తరువాత కాలంలో కొండవీడు

దుర్గాధ్యక్షులుగా వ్యవహరించారు. శాలివాహన శకం 1437 (క్రీ.శ. 1515)లో కొండవీటి దుర్గాన్ని జయించిన తరువాత శ్రీకృష్ణ దేవ రాయలు తెనాలికి స్వయంగా వచ్చి, ఇక్కడి గోవర్ధనస్వామి ఆలయానికి తేలప్రోలు గ్రామానికి చెందిన 25 కుచ్చెళ్ల (160 ఎకరాల) ఖండ్రిక ఇచ్చారని కైఫీయ్యత్ పేర్కొంది. తేలప్రోలు తెనాలిపట్టణంలోని అయితా నగరానికి ఆనుకుని ఉన్న గ్రామం. రాయలు కొండవీడుదుర్గాన్ని క్రీ.శ. 1515 జూన్ 23వ తేదీన జయించాడని చారిత్రకుల నిర్ధారణ. కనుక ఆ తరువాత కొంతకాలానికి ఎప్పుడో ఆయన తెనాలి గోవర్ధన స్వామి ఆలయాన్ని సందర్శించి ఉంటారు. .

'వికటకవి'గా సుప్రసిద్ధుడైన తెనాలి రామలింగని స్వస్థలం తెనాలికి సమీప గ్రామమైన గార్లపాడు. తెనాలి నుంచి నందివెలుగు మీదగా గుంటూరు వెళ్ళే మార్గంలో విజయవాడ – చెన్నై జాతీయ రహదారిని ఆనుకుని ఉందీ గ్రామం. తల్లిదండ్రులు శైవులైన గార్లపాటి రామయ్య, లక్ష్మమాంబలు. మేనమామల ఇంట తెనాలిలో క్రీ.శ.1495 జన్మించిన ఈ కవి శైవునిగా 'ఉద్భటారాధ్య చరిత్రము' అనే కావ్యం రాసి ప్రసిద్ధుడై, ఆ తరువాత వైష్ణవం స్వీకరించి, 'రామకృష్ణ కవి' పేరిట తిమ్మరుసు సాయంతో హంపి విజయనగరంలో రాయలవారి 'భువన విజయం' లో క్రీ.శ. 1520 నుంచి 1530 వరకు అష్టదిగ్గజ కవులలో ఒకనిగా వెలుగొందాడు. హంపిలోఉండగా 'కందర్పకేతు విలాసము', 'హరి లీలా విలాసము' అనే కావ్యాలు రాసి, విఠ్ఠలభక్తుడైన రాయలవారి ప్రేరణతో 'పాండురంగ మహాత్మ్యము' రచన ఆరంభించి, రాయల మరణానంతరం చాలకాలానికి క్రీ.శ.1570లో ఆ దివ్య ప్రబంధ రచనను పూర్తిచేశాడు. ఇది తెలుగులోని పంచ కావ్యాలలో ఒకటిగా ప్రసిద్ధి పొందింది. ఇక చేతులు వణికే వృద్ధాప్యంలో ఆయన రాసిన మరో ప్రముఖ కావ్యం 'ఘటికాచల మహాత్మ్యము'. క్రీ.శ.1590లో తన 95వ ఏట మరణించి ఉంటాడనిభావిస్తున్న ఈ కవి తాను 'తెనాల్య గ్రహార నిర్ణేత' నని 'పాండురంగ మహాత్మ్యము' అవతారికలో చెప్పు కున్నాడు. 'ఉద్భటారాధ్య చరిత్రము' అవతారికలో 'కుమారభారతి తన బిరుదనీ, తెనాలిలోని 'రామేశ్వరస్వామి రమణీయ కరుణ కార ణంగా తాను సహజ సాహిత్య మాధురీ సంయుతాత్ముడ నయ్యాన'ని పేర్కొన్నాడు. ఈ కవి క్రీ.శ. 1510 లో తెనాలి రామేశ్వర దేవస్థానానికి బహూకరించిన ఉమ, రామలింగ స్వాముల ఉత్సవ విగ్రహాలు ఆ ఆలయంలో నేటికీ పదిలంగా ఉన్నాయి.వాటి పాదపీఠం మీద ఉన్న శ్లోకంలో తెనాలి ఒక నగరంగా పేర్కొనబడ్డది. తెనాలికి ఈ కవిలా పేరు ప్రతిష్ఠలు తెచ్చినవారు మరొకరు లేరు. ఈయన పేరిట ప్రచా రంలో ఉన్న హాస్య కథలు, సమస్యాపూరణ కథల కారణంగా ఆంధ్ర దేశంలో మాత్రమేకాక యావద్భారత దేశంలో–ప్రత్యేకించి దక్షిణభారత దేశంలో – ఈ కవి పేరు వినని వారుండరంటే అతిశయోక్తి కాదు.

తెనాలి రామకృష్ణకవికి సమకాలికుడైన సుప్రసిద్ధ కవిభట్టు మూర్తిది కూడా తెనాలి సమీపంలోని 'బట్టుపల్లె' అనే మరోపేరు కలిగిన 'దేవ రాయ భట్లపాలెం' కావడం విశేషం. ఈ గ్రామం తెనాలి రామకృష్ణ కవి స్వగ్రామానికి కూతవేటు దూరంలో ఉన్న వెంకట కృష్ణాపురానికి శివారు గ్రామం. భట్టుమూర్తి రచించిన ప్రఖ్యాతశ్లేష ప్రబంధం 'వసు చరిత్ర' పంచకావ్యాలలోకెల్లా అతి రమ్యమైనది. 'ప్రబంధాంకం' అనే ఇంటిపేరుగల భట్టుమూర్తి శ్రీ కృష్ణదేవరాయలు అల్లుడైన 'అళియ' రామరాయలు కొలువులో కొంతకాలం పోషణనందుకున్న కారణంగా అతడికి 'రామరాజ భూషణుడు' అనే మరో పేరు. వీరేశలింగం పంతులుగారు తమ 'ఆంధ్ర కవుల చరిత్రము' (పేజీ 604, అక్టోబర్, 2005 ముద్రణ, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్)లో తెనాలి రామకృష్ణ కవి గురించి రాస్తూ ఆయన స్వస్థలం తెనాలికి సమీపంలోని గార్లపాడు గ్రామమనీ, ఆయన బాల్యంలో బట్టుపల్లె గ్రామంలో ఉండే బట్రాజుల సాంగత్యంచేసిన, వారి చెలిమి చేత సంస్కృతాంధ్ర సాహిత్యమును, కవిత్వ కౌశల మునుసంపాదించాడనిపేర్కొన్నారు.బహుశా బట్టుపల్లెలో తమ విద్యా భ్యాస కాలం నుంచే రామకృష్ణ కవికీ, భట్టుమూర్తికీ ఒకరంటే ఒకరికి సరిపడదు. వారిరువురి గురించి ప్రచారంలో ఉన్న పలు చాటువులే వారి మధ్యగల బద్ధ వైరానికి ప్రబల నిదర్శనం.

ఇక ఆ సంగతి అలా ఉంచితే, తెలుగు పంచ కావ్య కర్తలలో ఇరువురు తెనాలి ప్రాంతం వారే కావడం తెనాలివారందరికీ గర్వకారణం.

నాలుగు జిల్లాలలో విస్తరించిన 999 గ్రామాలకు ప్రభువైన శ్రీ రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు మన్నెసుల్తాన్ బహద్దర్ (క్రీ.శ. 1761-1816) చేబ్రోలు, శృంగారపురం, చదలవాడ, ఆలపాడు మొదలైన పలు తెనాలి ప్రాంత గ్రామాలలో అనేక శైవ, వైష్ణవ ఆల యాలను నిర్మించి, జీర్ణోద్ధరణ చేసి ఖ్యాతి గాంచాడు. చేబ్రోలులో ఈయన నిర్మించిన 101 ఆలయాలు, అమరావతి అమరేశ్వరస్వామి ఆలయం, అక్కడికి సమీపంలోని వైకుంఠపురం ఆలయం, మంగళగిరి స్థల నరసింహస్వామి ఆలయానికి నిర్మించిన అతి ఎత్తైన గాలిగోపురం ఈయన అద్భుత నిర్మాణ కృషికి మచ్చుతునకలుగా నిలుస్తాయి. ఈయన పాలనా కాలంలో చేబ్రోలు, వడ్లపూడి, చేకూరు, బోడేపూడి, పాటిబండ్ల, పుతుంబాక, సూర్యదేవర, దేవభక్తుని, చిరుమామిళ్ళ, గోళ్ళమూడి, నారా, గుంటుపల్లి మొదలైన పలు కుటుంబాలవారు పెద్దసంఖ్యలో స్థిరపడ్డారు. క్రీ.శ. 1652లో గోల్కొండ నవాబు సేనాని మీర్ జుమ్లా చేసిన దాడిలో గండికోట రాజ్యం పతనమైన తరువాత

దక్షిణ దేశానికి వలసవెళ్ళిన గండికోట శాఖీయులైన పెమ్మసాని, అడుసుమిల్లి, ఘట్టమనేని, శాఖమూరు, కిలారు, నర్రావుల, పరుచూరి మొదలైన కుటుంబాలవారు వేంకటాద్రి నాయని పాలనా కాలంలోనే ఆంధ్రదేశానికి తిరిగి వచ్చి తెనాలి ప్రాంతంలోని పెదరావూరు, బుర్రిపాలెం, కొత్తపాలెం తదితర గ్రామాలలో స్థిరపడ్డారట. నాయని పాలనా కాలంలో ఇదొక ప్రముఖ సామాజిక పరిణామం.

నాయని పాలనా కాలంలోనే బ్రిటిష్ ప్రభుత్వం కర్నల్ మెకంజీ ద్వారా వివిధ గ్రామాల స్థానిక చరిత్రలను సేకరించి, కైఫీయత్‌ల పేరిట వాటిని క్రోడీకరించడం జరిగింది. నాటి చరిత్రకు అవి కొంత మేరకు సాక్ష్యాధారాలుగా నిలుస్తున్నాయి. క్రీ.శ. 1876-78 సంవత్స రాలలో వరుసగా రెండేళ్ళ అనావృష్టి కారణంగా మద్రాసు, బొంబాయి ప్రావిన్సులలోనూ, హైదరాబాదు, మైసూరు సంస్థానాలలోనూ అతి తీవ్రమైన కరవు సంభవించింది. దీనినే కొందరు 'డొక్కల కరువు' అంటారు. ఆకలిగొన్న వాళ్ళు కడుపునిండా తృప్తిగా భోజనం చేసినవారి డొక్కలు నిర్దాక్షిణ్యంగా కత్తులతో చీల్చి వారి పొట్టల్లోని ఆహారాన్ని తినేవారట. మొత్తంగా ఒక కోటీ మూడు లక్షలమంది ప్రజలు మృత్యువు వాత పడిన ఆ ఘోరమైన కరవులో సస్య సమృద్ధిగల తెనాలి ప్రాంతం కూడా విలవిలలాడి పోయిందట. రెండేళ్ళు వరసగా పంటలు లేని కారణంగా అందరి దగ్గరా ధాన్యం నిల్వలు పూర్తిగా నిండుకున్నాయట. అయితే అంత దుర్భిక్షం తాండవిస్తున్నా పశువులకు మాత్రం ఏదో ఒక మేత లభించేదట. అప్పటి జనం ఆకలిబాధకు తట్టుకోలేక మెత్తటి ఒండ్రు మట్టిని పెరుగులో కలుపుకుని తినేవారని వాళ్ళ అమ్మ చెప్పిందని నా చిన్నతనంలో మా అమ్మమ్మ చెప్పేది. శాశ్వత కరువు నివారణ చర్యలలో భాగంగా బ్రిటిష్ ప్రభుత్వం సర్ ఆర్థర్ కాటన్ నేతృత్వంలో, కెప్టెన్ ఓర్ ప్రత్యక్ష పర్యవేక్షణలో కృష్ణా నదిపై ఆనకట్ట నిర్మించడం, ఆ తరువాత క్రమంగా కృష్ణా వెస్టర్న్ మెయిన్ కెనాల్ మరియు చానల్స్ ఏర్పరచి, డెల్టా వ్యవస్థను పూర్తిగా వినియోగంలోకి తీసుకురావడం, 1954లో లోగడ గండి పడిన పాత ఆనకట్ట స్థానంలో ప్రకాశం బరాజ్‌ని నిర్మించి డెల్టా వ్యవస్థను మరింతగా ఆధునీకరించి, ఆయకట్టు మరింత పెంచడంతో ఈ ప్రాంతంలో కరవును విజయవంతంగా తిప్పి కొట్టడం సాధ్యపడింది.

ప్రస్తుతం కృష్ణా డెల్టాలో అత్యంత సారవంతమైన పంట భూము లతో అలరారే ప్రాంతం ఏదంటే మనం ముందుగా తెనాలినే చెప్పు కోవాలి. ఇక్కడ పండని పంట లేదు. అనాదిగా ఇక్కడి రైతులు ఆరు గాలం శ్రమిస్తూ, ఇలాతలంనుంచి హేమాన్ని పిండడంలో కడు నేర్పరు లయ్యారు. పాడిపంటల సమృద్ధితో ఈ ప్రాంతం నిత్యం పచ్చగా, భాగ్యవంతంగా ఉండడమే కాక, ఇక్కడి కర్షకులు ఎప్పటికప్పుడు ఆధునిక వ్యవసాయ పద్ధతులు అనుసరిస్తూ వ్యవసాయ విజ్ఞానంలో అందరికీ ఆదర్శం కాగలిగారు. ఈ ప్రాంతం వరి, చెరకు, మొక్కజొన్న, కంది, మినుము, పెసర, ఉలవ వంటి ఆహార పంటలకు, నువ్వు, పొద్దుతిరుగుడు, ఆముదం మొదలైన నూనె గింజల పంటలకే కాక, పొగాకు, పత్తి, పసుపు, మిర్చి, జనుము, గోగు మొదలైన వాణిజ్య పంటలకు, కంద, చేమ, చిలగడ దుంపలతో సహా అన్ని రకాల కూరగాయలు, ఆకుకూరలకూ, తమలపాకు తోటలకూ, కొబ్బరి, నిమ్మ, జామ, సపోటా, బొప్పాయి, అరటి, మామిడి, ఉసిరి వంటి పండ్ల తోటలకూ, గులాబీ, మల్లె, కాగడా మల్లె, కనకాంబరం, బంతి, కారపు బంతి, సెంట్ లిలీ, జెర్బెరా వంటి పూల తోటలకూ ప్రసిద్ధి పొందింది. కృష్ణానదిలోని పలు లంక గ్రామాల సారవంతమైన భూము లలో రైతులు మరిన్ని వైవిధ్యభరితమైన పంటలు పండిస్తున్నారు. పాడి పశువులు, మేలుజాతి భారవాహక జంతువుల పోషణలో, కోళ్ళు, చేపలు, ఈము పక్షుల పెంపకంలో ఈ ప్రాంతం అగ్రగామి. ఇలాంటి సస్య సమృద్ధిగల ప్రాంతం కనుకనే తెనాలి ప్రాంతం మొదటి నుంచీ ఆర్థికంగా, సాంస్కృతికంగా, రాజకీయంగా అగ్రగామిగా విలసిల్లింది. ఇక్కడ పుట్టి పెరిగిన ఎందఱో ప్రసిద్ధ వ్యక్తులు ఖండాంతర ఖ్యాతి నార్జించారు. ఎక్కడో పుట్టినా ఇక్కడికి వచ్చి స్థిరపడిన కొందరు ఇక్కడి సాంస్కృతిక వాతావరణం ప్రభావంతో మరింతగా కీర్తి ప్రతిష్ఠలు పొందగలిగారు.

**చిరునామా :** *ముత్తేవి రవీంద్రనాథ్, తెనాలి. సెల్ : 9849131029*

మహమ్మద్ సిలార్

# తూర్పుతీర చేనేత పరిశ్రమ ప్రాభవం - విదేశీ కంపెనీల నిర్వాకం

అతి ప్రాచీన కాలం నుండి భారతదేశం, ముఖ్యంగా తూర్పు తీరంలో చేనేత, అద్దకం పరిశ్రమ గొప్పగా వర్ధిల్లింది. కొన్ని వందల సంవత్సరాలు ప్రభవించిన ఈ పరిశ్రమ క్రీ.శ. 16వ శతాబ్దం నుండి అంటే పోర్చుగీసుల రాకతో ప్రారంభమైన పరిశ్రమ క్షీణదశ ఇంగ్లీష్ ఈస్ట్ ఇండియా కంపెనీ - ఇంగ్లండ్ వలస పాలకుల చేతిలో గాయపడి, మంచమెక్కి వైద్యం లేకుండానే తుదిశ్వాస విడిచింది.

షుమారు వేయి మైళ్ళ పొడవున తీరరేఖ గల ఆంధ్రదేశం, ప్రాచీనకాలం నుండి నౌకా వ్యాపారంలో ప్రముఖ పాత్ర పోషించింది. తూర్పు ఆఫ్రికా, ఆగ్నేయాసియాతో ఆంధ్రదేశం వ్యాపార వాణిజ్యాలు నడిపిందని క్రీ.పూ. పెరిప్లస్ అజ్ఞాత రచయిత (The Periplus Maris enythraei - Schoff, 1912) తెలిపాడు. క్లాడియస్ టాలమీ రచన జాగ్రఫి కంటకసేల (ఘంటసాల), కొద్దూర (గూడూరు), అల్లోసెగ్నే (అవనిగడ్డ) మార్కెట్ల నుండి పరిసరాల్లో తయారైన చేనేత బట్టలు గోల్డెన్ క్రిసే - మలయా పెనున్సిలాకు ఎగుమతికి, పైటిండ్ర (మచిలీపట్నం) నౌకలకు నిర్గమస్థలంగా ఉందని (Ancient India as described by ptolomy - translation by Mc. Crindle, India - 1884) తెలుపుతుంది. కృష్ణా గోదావరి నదుల ముఖద్వారంలో ఉన్న ప్రదేశాన్ని ప్రాచీనకాలంలో 'మయిశక' దేశంగా పిలిచారు. మయిసోల్స్ (కృష్ణా)నది ముఖద్వారంలో నివసించిన ప్రజలు మయిశకులు లేక మహిషకులు. వీరు ప్రాచీన తెలుగుభాషను మాట్లాడేవారు. వీరితోపాటు నివసించిన 'పుళిందులు' అనే తెలుగు మాట్లాడే మరొక జాతివారు సముద్రం మీద ఆధారపడి బ్రతుకుతూ, సముద్ర యానంలో ప్రసిద్ధులై ప్రాచీన తెలుగు మాట్లాడుతూ తాము మాట్లాడే భాషను 'పుళింద' లిపిలో వ్రాస్తుండేవారు. స్థానికులైన పుళిందులు బంగాళాఖాతం ఓడరేవు అయిన మైసోలియా నుండి తూర్పుదేశాలతో వ్యాపార వ్యవహారాలు చూస్తుండేవారు. పుళిందులు, ఆంగ్ల నిఘంటువులో 'Boats people' గా చెప్పబడ్డారు. (A history of seafaring maritime network of peninsular India by Dr. Himanshu Prabha reuy, 2006).

షుమారు వేయి మైళ్ళ పొడవున్న తూర్పు తీర ఆంధ్రదేశం ప్రాచీన కాలం నుండి నౌకా వాణిజ్యంలో ప్రముఖ పాత్ర పోషించింది. రోమన్ ప్రపంచంతో, మెసపటోమియా, తూర్పు ఆఫ్రికా, ఆగ్నేయ ఆసియాలతో ఆంధ్రదేశం నౌకా వాణిజ్యం నెరపిందనే ప్రబల సాక్ష్యం పెరిప్లస్ రచయిత తెలిపాడు. ఆంధ్రదేశం నుండి జైన, బౌద్ధ మత వ్యాప్తితోపాటు వ్యాపారం కూడా సుదూర దేశాలకు ప్రాకింది. 'ఈ ప్రాచీనాంధ్ర పట్టణాలు ప్రాంతీయ ఆర్థిక వ్యవస్థలో ప్రముఖపాత్ర పోషించాయి. చాలావరకు ఈ వ్యాపారం ప్రబలంగా విలాస వస్తువులకు సంబంధించి నట్లు తెలుస్తుంది. అయితే నూలు వస్త్రాలు లాంటి తక్కువ విలువ గలిగిన వస్తువుల వైపు క్రీ.శ. 2వ శతాబ్దం నుండి మచిలీపట్నం పెరిగింది. క్రీ.శ. 7వ శతాబ్దంలో రోమ్‌తో వ్యాపారం పతనమయ్యేంత వరకు ఈ పద్ధతి కొనసాగింది. (ఆంధ్రప్రదేశ్ సమగ్ర చరిత్ర - సంస్కృతి, వాల్యుం - V ఆంధ్రప్రదేశ్ చరిత్ర కాంగ్రెస్

'స్ట్రాబో' తాను తూర్పుతీరం మసాలియారేవును చూచానని, అక్కడ ప్రసిద్ధిగాంచిన 'మస్లినులు' అనే సన్ననూలుకట్టలు అతి చౌకగా దొరుకుతాయని వ్రాశాడు. 'మసులా' నగరంలో తయారైన బట్టలే 'మస్లిను'గా పేరుపొందాయి. ఇక్కడ బంగారు పోగులతో నేయబడిన సరిగంచు పట్టుబట్టలు తయారవుతున్నాయ'ని సుప్రసిద్ధ చరిత్రకారులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ తెలిపారు. మయిసోలియా (రాజ్యం), మయిసోల్స్ (నది) అనేవి గ్రీకుభాషా పదాలు. అలెగ్జాండర్ భారతదేశపు దండయాత్రలకు ముందుకాలంలోనే తూర్పుతీర పట్టణాలతో గ్రీసు దేశానికి వ్యాపార సంబంధాలున్నవి. తూర్పుతీరం మౌసల ప్రాంతంలో తయారయిన సన్ననూలు 'మస్లిన్స్' బట్టలు, ఈజిప్ట్ ఫారో రాజుల మృతదేహాల మమ్మీలకు 24 వరసలు చుట్టేవారని చరిత్ర చెబుతుంది.

మసులా నగరం మరి చుట్టుప్రక్కల రాజ్యంలో తయారయ్యే మస్లిన్ బట్టలు, మల్లు తానులు, సెల్లాలు, సాలెంపూర్ చీరలు,

పోలంపూర్‌లు బొంతలు, నమాజు చేయటానికి ఉపయోగించే తెల్ల మల్లు చాందినీలు, గుమ్మం తెరలకు వాడే దర్ పర్దాలు, రోజువారీ ధరించే కుర్తా కపడాలు, దస్తీ గుడ్డలు (చేతి రుమాళ్ళు) ; అద్దకం చాదర్లు, అరబ్బులు కూర్చునే బాలీసు కవర్లు, మొదలగు బట్టలు తూర్పుతీరపు ఓడరేవుల గుండా సింహళంను చుట్టి సముద్రం మీదుగా; తూర్పుతీరం నుండి భూమార్గాన షోలాపూర్‌ల మీదుగా బ్రోచ్ సూరత్‌కు చేరి, పశ్చిమతీరం మీదుగా పర్షియా తదితర అరబ్బు దేశాలకు ఎగుమతి అయ్యేవి.

ఆనాటి కృష్ణానదీ తీర మార్కెట్ కేంద్రమైన అల్లోసెగ్నె (అవనిగడ్డ) నుండి వ్యాపార నౌకలు సువర్ణభూమి - మలయా పెనున్సిలాకు బయలుదేరుతున్నాయని అమరావతి రాతిశాసన మొకటి చెప్తుంది. క్రీ.శ. 2వ శతాబ్దము వరకు తూర్పుతీర ఓడరేవులతో రోమ్‌కు విస్తృతమైన సముద్ర వ్యాపారం సాగిందనటానికి అక్కనపల్లి, ఏలేశ్వరం, నాగార్జునకొండ, బెజవాడ - విద్యాధరపురం, ఘంటశాల, గూటిపర్తి, వినుకొండ, శాలిహుండాం, మల్లయపాలెం, నుస్తులాపూర్, నంద్యాల, పెదబంకూర్ ; ఖమ్మం, నాగవరప్పాడు, పెనుగంచిప్రోలు తదితర పట్టణాలు మరియు గ్రామాలలో దొరికిన శాతవాహన సమకాలీన రోమన్ బంగారు నాణేలు ధృవీకరిస్తున్నాయి. శాతవాహన రాజులలో 26వ వాడైన గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి (క్రీ.శ. 174-203) వేయించిన రెండు తెరచాపలు - చుక్కాని కలిగిన నౌకల బొమ్మలు (చేప్రోలు) నాణేలు తూర్పుతీరంలో చాలాచోట్ల దొరికాయి. మరోరకం, మూడు తెరచాపలతో చుక్కాని కలిగిన నాణెములు శాతవాహనుల మలికాలంలో విదేశాలతో జరిగిన సముద్ర వ్యాపారంను తెలియ జేస్తున్నాయి. ఘంటశాల కోట దిబ్బలో బయల్పడిన క్రీ.శ. 2వ శతాబ్దపు శిలాశాసన మొకటి 'గహవతి నవరన పుతన మహానావికన శివకన...' అంటూ ప్రస్తావించింది. ఈ మహా నావికుడు శివకుడు, మచిలీపట్నం దగ్గరున్న గూడూరు వాస్తవ్యుడని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తన 'కృష్ణాజిల్లా చరిత్ర' ఆంగ్ల గ్రంథంలో అభిప్రాయపడ్డారు. తూర్పుతీరం వెంబడి సాగర, కొలంబియా అను భారీ సరుకురవాణా పడవల మీద గంగానది ముఖద్వారం వరకు ; గూడూరు, మాజేరు, ఘంటశాల నదీ తీర రేవుల ద్వారా సువర్ణభూమికి చేనేత తదితర సరుకులు ఎగుమతి జరుగుతుండేవి. కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారు ముఖ్య సంపాదకులుగా వెలువడిన ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము - 1వ సంపుటము గ్రంథములో 'అనాదిగా నూలు, కలంకారీకాంధ్రదేశము మిక్కిలి వన్నె కెక్కినది. బౌద్ధ శకము నాటికే బందరు కలంకారీ బట్టలు జగద్విదితములైనవి. అద్దకం బట్టల వ్యాపారానికి బందరు అరుదెంచిన పర్షియనులు తామెరిగిన కలంకారీ పనితనమును బందరు అద్దకమునకద్ది, మెరుగులు దిద్ది తమ దేశమునకు బందరు ఓడరేవునుండి ఎగుమతి చేసి రూపాయికి రూపాయి లాభము తీయుచుండిరి' అని వ్రాశారు. ఉత్తర కోరమండల్ రేవులలో కళ్లా మచిలీపట్నానికి విస్తారమైన పృష్ఠభూమి (Hinter land) 100 మైళ్ళ లోతట్టుకు వ్యాపించి ఉంది. కృష్ణా, గుంటూరు, గోదావరి జిల్లాలనుండి రకరకాల వాణిజ్య ఉత్పత్తులు మసులీపట్నాం రేవుకు ఎగుమతుల నిమిత్తం వస్తాయి. (సంజయ్ సుబ్రహ్మణ్యం, 1993). మొలుక్కాస్, జండా, సుగంధ ద్రవ్య ద్వీపాలలో మంచి గిరాకి ఉన్న వెల తక్కువ సాదారకాల వస్త్రాలు ఇక్కడ తయారవుతాయి (W.H. Morland, 1930). కృష్ణాజిల్లా గ్రామాలతోపాటు ఏలూరుపాడు, పరవరముండిపేట, పెయ్యేరు, కొర్రగుంటపాలెంలలో తయారయ్యే చక్కటి సాదా వస్త్రాలు, ఉభయగోదావరి జిల్లాల తయారీ ముతకరకం బట్టలు తూర్పుతీర రేవుల గుండా ఎగుమతి అవుతాయి. జగ్గయ్యపేటలో పట్టుబట్టలు, ఏలూరులో నేత తివాసీలు తయారవుతున్నాయి. సాలెగూడు దారం పోలిన పోగులతో నేసిన తూర్పుతీర గ్రామాల ఉత్పత్తి 'రవసెల్లా' బట్టను పచ్చటి గడ్డి మైదానంలో పరిస్తే పచ్చగడ్డి తప్ప, సెల్లా గుడ్డ పోగులు కనబడనంత పల్చని, సుతిమెత్తని దారం పోగులతో రవసెల్లాలు తూర్పుతీర సాలెవారు నేసేవారు. 'సాలె'వారు నివసించినదే దివితాలూకా 'సాలెంపాలెం' గ్రామం.

శాతవాహన రాజులకు 'మహపథ నిర్మాత'లని బిరుదు. ఆ కాలంలో తూర్పుతీరం మాసాలియా నుండి భూమార్గం, వినుకొండ నుండి మరొక భూమార్గం పశ్చిమతీరం బ్రోచ్, సూరత్‌లకు ఉండేవి. రెండు మార్గాలు హైదరాబాద్ వద్ద కలిసిపోయి బిదారు వర్తకులతో పశ్చిమతీర పట్టణాలకు సాగేవని ఫ్లీట్ పండితుడు వ్రాశాడు. ఉత్తర భారతదేశం మగధ నుండి మరొక మార్గం కళింగరాజ్యం (ఒడిషా)లోని 'తోసలి' మీదుగా, కృష్ణానదీ ముఖద్వారం 'మోసలి'ద్వారా రాయచూర్, అంతర్వేదిల మీదుగా వైజయంతికి సాగేది. (డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు, ఆంధ్రుల చరిత్ర, 1971).

శాతవాహనుల విదేశీ నౌకా వ్యాపారం రోము సామ్రాజ్యంతో ముమ్మరంగా సాగుతున్న రోజుల్లో అగస్టస్ చక్రవర్తి (క్రీ.పూ. 019) నుండి నీరో వరకు (068 నీరో మరణం) రోము సామ్రాజ్యపు సంపన్నులు భారత తూర్పు తీరపు చేనేత సన్న నూలు వస్త్రాల కోసం ఎగబడేవారు. క్రీ.శ. 70 సం॥ ప్రాంతపు ఇటలీ చరిత్రకారుడు ప్లినీ పండితుడు, రోము ప్రజలు భారతదేశపు చేనేత వస్త్రాలకోసం, సొమ్ము దుబారా చేయటం చూచి, 'రోము దేశపు బంగారమంతా భారతదేశానికి ఊడ్చుకుపోతుందని, భారతీయ విలాస వస్తువుల కోసం ఏటా 10 కోట్ల సెస్టరుల సొమ్ము రోమనులు చెల్లిస్తున్నార'ని ఆవేదన వెలిబుచ్చాడు. దీనికి విరుగుడుగా రోము దేశపు బంగారు నాణేలలో రాగి లోహం కల్తీ చేసి ముద్రించటం ప్రారంభించారు.

అశోకుని సమకాలీనుడైన ఈజిప్ట్ చక్రవర్తి 'ఫెలోడెల్ఫస్ టాలమీ' కాలంలో భారతదేశముతో వ్యాపారం భూమార్గాన సాగేది. అశోక చక్రవర్తికి ఈజిప్ట్ దర్బారుతో రాయబార సంబంధాలుండేవి. ఫెలోడెల్ఫస్ పారశీక సింధుశాఖ యందు బెరనికా, మయాస్, హుర్మజ్ రేవు పట్టణాలు నిర్మింపగా, ఈ రేవులకు భారతదేశం తూర్పుతీరం రేవుల నుండి చేనేత దతితర వస్తువులతో వ్యాపార వాణిజ్యం సాగింది. 'హుర్మజ్' రేవు నుండి ఏకకాలంలో 120 ఓడలు భారతదేశానికి బయలు దేరటం తాను చూచానని వ్రాశారు. (భావరాజు వెంకట కృష్ణారావు, ప్రాచీనాంధ్ర నౌకా జీవనం). మైసోలను (కృష్ణానది) ముఖద్వారము దాటిన తర్వాత తూర్పుతీరంలో పాలూర, నెయింగనా, కటిమర్దయ, కన్నగరములు ప్రసిద్ధిచెందిన రేవులని టోలమీ తన 'జాగ్రఫీ' గ్రంథంలో ఉదహరించాడు. కాకతీయ రుద్రమదేవి పరిపాలనా కాలం (13వ శతాబ్దం) తెలుగు దేశం సంచరించిన వెనిస్ యాత్రికుడు మార్కోపోలో, తెలుగుదేశంలో అతిసున్నితపు బట్టలు తయారవు తున్నాయని, ఈ దుస్తులు ధరించ టానికి ఇష్టపడని రాజులు, రాణులు ఉంటారా?" అని ప్రశ్నించాడు (కల్నల్ యూల్ రచన మార్కోపోలో యాత్రలు).'మాబారు (మలబారు)కు ఉత్తరముగా 'మోసల' నగరమున్నదని, అచ్చట సాలెపట్టును బోలిన బట్టలు తయారుచేయబడుచున్న'వని, వ్రాయబడింది. (ట్రావెల్స్ ఆఫ్ మార్కోపోలో). 'మోసల మండలమున వెండి, బంగారపు సరిగె బూటా పనిచేయబడిన నూలు బట్టలు నేయబడుచున్నవి. ఇచ్చటి వర్తకులు సుగంధ ద్రవ్యములను,ముత్యములను, జలతారు నేసిన పట్టు బట్టలను ఎగుమతి చేయుచుందురని మార్కోపోలో వ్రాశాడు. (భావ రాజు వేంకట కృష్ణారావు, ప్రాచీన నౌకా జీవనము). పాల్కురికి సోమన కవి, తూర్పుతీర గ్రామాలలో తయారయ్యే 40కు మించిన మేలురకం వస్త్రాలను ఉదహరించాడు. వెంజావళి, జయరంజి, మంచు పుంజంబులు, మణిపట్టు, భూతిలకము, మహజబీ, భావ తిలకము, పచ్చని పట్టు, రాయశేఖరము, రాయవల్లభము, వాయి మేఘము, గజవాళము, సరిపట్టు, గావులు, మస్లినులు, అద్దకాలు మొదలగు మేలురకం బట్టలు పాల్కురికి ఉదహరించాడు.

థామస్ బౌరే అను పేరుగల ఇంగ్లీషు కంపెనీ వర్తకుడు క్రీ.శ. 1669 నుండి 1679 వరకు భారతదేశం పర్యటించి తన వ్యాపార యాత్రా విశేషాలను **'ఏ జియోగ్రాఫికల్ ఎక్కౌంట్ ఆఫ్ ద కంట్రీస్ రౌండ్ ద బే ఆఫ్ బెంగాల్, 1669-79'** అనే గ్రంథంలో 'కోరమండల్ తీరములో మచిలీపట్నం ప్రముఖ కేంద్రమనటంలో ఎటువంటి సందేహం లేదు. ఇంగ్లీషు వారికి, డచ్ వారికి పట్టణం నడిబొడ్డున ప్రధాన ఫ్యాక్టరీలు కలవు. వీరు గోల్కొండ నవాబు నుండి పన్ను రాయితీలు పొంది చెల్లించాల్సిన సుంకం కంటే తక్కువ సొమ్ము చెల్లిస్తున్నారు..రెండు లక్షల జనాభా కల్గిన పెద్ద నగరం మచిలీపట్నంకు రెండు నుండి నాల్గు మైళ్ళ పరిధిలో నేతగాళ్ళు, పనివారు, కార్మికులు నివసించే పేటలు కలవు. ఇక్కడ అన్నిరకాలైన నాణ్యమైన కాలికో, సోలంపూర్, పోలంపూర్, శాటిన్ బట్టలు తయారవుతున్నాయి. ఈ సామాగ్రికి భారతదేశంలోని ఇతర ప్రాంతాలతో పాటు పర్షియా, అరేబియా, చైనా, ఇంగ్లండ్, హాలెండ్ మొ॥ దేశాలలో మంచి గిరాకీ కలదు' అని వ్రాశాడు'....ఇక్కడ నేసిన బట్టలు దేశంలో మిగతాచోట్లలాగే చవకగా దొరుకుతాయి. మచిలీపట్నం బట్టల పనితనం వేరుగా కన్పిస్తూ ఉంటుంది. కోస్తా మండలంలో తయారయ్యే కలంకారీ అద్దకాలకు దేశమంతా గిరాకీ ఉన్నది. బట్టలు చిరిగినా రంగులు మాయటం అంటూ ఉండదు...' అని విలియం మెథోల్డ్ వ్రాశాడు.

1657లో మచిలీపట్నం దర్శించిన క్రిష్టఫర్ హవుట్టన్ నగరంలోని వర్తక విశేషాలు వర్ణిస్తూ... 'ఈ నగరపు వర్తకులు ఇరవై ఓడల నిండా సరుకులు వేసుకొని ఎప్పుడూ అరకాను, టెన్నెసరి, పెగూ, క్వీడ, మలక్కాలకు, పశ్చిమమున మోకా (మక్కా) నగరము, మరియు పారశీక దేశములకు బోవుచూ వర్తకము చేయుచుందురనియు ; 1672వ సం॥లో ఈ ప్రాంతం దర్శించిన బోల్డోరస్ అనే క్రైస్తవ మత మతాధిపతి 'మసులీపటాం ఓడరేవు కొచ్చే వ్యాపారంలో వజ్రాలు, రూబీలు ప్రముఖపాత్ర వహిస్తాయని, ఈ రేవుకొచ్చే వెండి, రాగి మరియు సుగంధద్రవ్యాలు అత్యధికశాతం బటేవియా నుండి దిగుమతి అవుతున్నాయని, వాటికి బదులుగా ఇక్కడ చేనేత బట్టలు ఎగుమతి అవుతున్నాయని, క్రీ.శ. 1650 నాటికే ఈ రేవులో 900 టన్నుల బరువు మోయగల ఓడలు లంగరేస్తున్నాయ'ని వ్రాశాడు. 1667లో అబ్దుల్లా కుతుబ్‌షా రాజ్యంలో బసచేసిన 'తెనేనా' పేరుగల ఫ్రెంచ్ దేశపు వైద్యుడు 'మచిలీపటాం మంచి వాణిజ్య కేంద్రమని, సన్నని నూలుబట్టలు అక్కడనుంచి అధికసంఖ్యలో ఎగుమతి అవుతాయని, కోస్తా అద్భుతంగా ఉంటుందని, అన్ని దేశాలనుండి ఓడలు వస్తూ పోతూంటాయని, కొచ్చిన్, చైనా, సయాం, పెగూ మొదలైన అనేక తూర్పు దేశాలనుండి వచ్చిన జనం అక్కడ కనబడ్డారని, చాలా ఫలవంతమైన దేశం. వస్తువులు కారు చౌక' అని అన్నాడు. కోస్తాతీర గ్రామాలు, పట్టణాలు దర్శించిన విదేశీయులెందరో తూర్పుకోస్తాలో ముమ్మరంగా సాగుతున్న వస్త్ర పరిశ్రమ గూర్చి, వాటి నాణ్యత గురించి తూర్పు కోస్తా సన్న నూలు నేతబట్టల గురించి వివిధ సందర్భాలలో ప్రశంసిస్తూ కితాబిచ్చారు.

భారతదేశ సంపూర్ణ గ్రామ వ్యవస్థలో, ప్రథమంలో స్థానిక అవసరాలు తీర్చటానికి గ్రామగ్రామాన ప్రారంభమయిన బట్టల నేత, అద్దకం / కలంకారీ పరిశ్రమ, చివరకు నేత పనివారి కేంద్రీకరణ, పని విభజనవల్ల, పరిణామక్రమంలో వ్యాపార పరిశ్రమగా మారి, మిగులు సరుకు మార్కెట్‌కు చేరి మార్కెట్‌దార్లకు లాభాల పంట

పండించేదిగా తయారయింది. పట్టణం ఒక మార్కెట్టుగా మారి, పట్టణం చుట్టూఉన్న పేటలు, గ్రామాలు, శివార్లు మార్కెట్టుకు సరఫరా చేసే సరుకు తయారీ కేంద్రాలయ్యాయి. ఇంటికో మగ్గం గుంట పోయి, ఊరికో షెడ్డుగా చేనేత సరుకు అంగడి సరుకయింది. చేనేత మగ్గం యజమానులు రోజువారీభత్యపు కూలీలయ్యారు. వీవర్ (చేనేతదారు) స్థానంలో పెట్టుబడి పెట్టగలిగిన సంపన్నులు 'మాస్టర్ వీవర్స్' అయ్యారు. ఇంటింటి చేనేతమగ్గాలు పరిశ్రమగా మారి షెడ్లల్లోకి దూరాయి. షెడ్లలో పెత్తందారు 'మాస్టర్ వీవర్' పర్యవేక్ష ణలో, నేతన్న 24 గంటలు మగ్గం మీద పనిచేసే బానిసయ్యాడు. విశ్రాంతి లేదు, సరియైన తిండిలేదు, బట్టలు నేసే 'మగ్గరి'కి ఒంటిమీద బట్టలు కరువయ్యాయి. మగ్గం గుంటలు కాస్తా, మగ్గం నేసే వాని కనుగుంటలుగా మారి కడివెడు కన్నీరు కార్చాయి.

పరిశ్రమదార్ల చేతిలో నేత పనివారు, కార్మికులు నేత పనిముట్లుగా ఎంచబడ్డారు. గుత్త వ్యాపారస్తులు, చేనేత మగ్గరికి ముందస్తు బయానా సొమ్ము అంటగట్టి, తయారైన సరుకు యజమాని తనకిష్టమైన... చేనేత దారు కష్టంతో పనిలేకుండా, చేనేత గుడ్డలకు పెద్దరేటు కట్టి అమ్మేవాడు... రేయింబవళ్ళ కష్టం నేతన్నది, శ్రమ చేయకుండా లాభం పెద్ద యజమానిది. సముద్రతీర ప్రాంతంలో చేనేత బట్టలకు ఎర్రటి ఎర్రరంగు సమకూర్చే 'చేరివేళ్ళ' పంట పుష్కలంగా పండేది. కృష్ణా గోదావరి డెల్టా గ్రామాలలో నీలి ఆకు మొక్కలు పండేవి. బట్టకు నీలిరంగు (ఇండిగో-బ్లూ) ఇచ్చే నీలి ఆకును ఇటుకతో కట్టిన భారీ తొట్టెల్లో వండేవారు. రైతుల చేలో పండే పసుపు, బట్టకు పసుపు రంగువేసే మూలికగా తయారయింది. కృష్ణా-గోదావరి డెల్టా పరిధిలో నల్లరేగడి నేలల్లో ప్రతిపంట పుట్లల్లో పూటుగా పండేది. ఇంకా స్వాభావికంగా దొరికే కాయలు, పువ్వులు, చెట్ల బెరడ్లతో కలగలపు కలిపి వెజిటబుల్ రంగులతో గ్రామగ్రామాన చేనేత, అద్దకం, కలంకారీ పరిశ్రమ మూడు పువ్వులు, ఆరు బెరడ్లు, 12 రంగుల్లా వర్ధిల్లింది. విదేశీ కంపెనీలకు భారతదేశ వస్త్రపరిశ్రమ కనులకింపుగా, రంగుల ప్రపంచంలా, లాభాలపంటగా కనబడి, భారతీయ చేనేత వస్త్రాలు కొనుగోలు చేసి తమ దేశాలలో అధిక లాభాలకు అమ్మకోసాగాయి. తెల్లటి శరీరచ్ఛాయ గలిగిన అరబ్బులకు, శీతల వాతావరణంలో పెరిగిన ఇంగ్లీషు తదితర యూరోపియనులకు తూర్పు తీర స్వాభావిక రంగులతో (వెజిటబుల్ కలర్స్) నేసిన, అద్దిన బట్టలు శరీరానికి అందం ఇవ్వటమే కాక, రసాయనిక రంగుల బట్టల్లా వారి చర్మానికి చెరుపు చేసేవి కావు. అందుకనే దేశ విదేశాల వర్తకులు, ఏజెంట్లు ఆంధ్రదేశం తీర పట్టణాల్లో మకాం వేసి, వారికి కావల్సిన బట్టలకు ముందస్తు ఆర్డర్లిచ్చి, సొమ్ములో కొంతభాగం ముందస్తు జమచేసి, తక్కువరేటు మీద కొనుగోలు చేసి, విశాఖపట్నం, కాకినాడ, మచిలీపట్నం, నిజాంపట్నం, దుగరాజుపట్నం, కృష్ణపట్నం, చెన్నపట్నం తదితర తూర్పుతీర ఓడరేవులగుండా తమ దేశాలకు తరలించేవారు.

స్వాభావిక రంగుల్లో బట్టలు ముంచి, రంగురంగుల చీరెలు, ఓణీలు, పావడాలు, తీర్చిదిద్దేవారు. ఛేరి వేరు రంగు రక్తపు ఎరుపు, ఇండిగో రంగు నీలిరంగు అద్ది చేసిన చేనేత వస్త్రాలను 'చింటిజ్' లేక 'చిన్జ్' అనేవారు. సన్ననూలు మేలిమి బట్టను 'మస్లిన్'లనేవారు. సాలెగూడు సన్నపోగుల సుతిమెత్తని నూలుతో చేసిన బట్టలను 'రవసెల్లా'లని పిల్చేవారు. జగ్గయ్యపేటలాంటి పట్టణాల్లో పట్టుబట్టలు, ఏలూరు లాంటి పట్టణాల్లో నేత తివాసీలు, మచిలీపట్నం నిజాంపట్నం లాంటి చోట నేత తెరచాపలు అల్లేవారు. మందపాటి బట్టను 'బక్రం' అనేవారు (నేడు బక్రం గుడ్డను టైలర్లు చొక్కా కాలర్‌లకు వాడతారు) కోడూరు మండలం సాలెంపాలెం లాంటి గ్రామాలలో తయారైన చీరెలు సాలెంపూర్లు. చేనేత గ్రామం పోలవరంలో నేసిన మగ్గం చీరలు పోలంపూర్లు. మల్లవోలు చేనేత మగ్గర్లు ఉత్పత్తి చేసినవి తెల్ల మల్లు తానులు. ఆ రోజుల్లో రెండురకాల చేనేత బట్టలు తయారయ్యేవి. తెలుపు చేసినవి, గోధుమరంగు లేక నీరు కావి రంగువి. కాలికోలు, మస్లిన్‌లు అద్దకం రకాలు. ప్రస్తుతం ప్రింటులుగా పిలవబడే స్వదేశీ పరిజ్ఞానపు కాలికోలు, మస్లిన్‌లు ప్యాటరన్ సరుకులు. కాలికోలు, మస్లిన్‌లు తీరప్రాంతపు గ్రామాలలో పట్టణాలలో తయారుచేయబడి, జావా తదితర తూర్పు దీవులకు, తూర్పు ఆసియా దేశాలకు ఎగుమతి అయ్యేవి. రకరకాల పరిశ్రమలు, వ్యాపార వాణిజ్యాలకనుగుణంగా వివిధ దేశాల వ్యాపారులు, ఏజెంట్లు తమ దేశాల డబ్బును వారి కవసరమైన దేశం కరెన్సీ / నాణేలతో మారకం పెట్టుకోవటానికి ప్రముఖ ఓడరేవు పట్టణాల్లో, వ్యాపారకేంద్రాల్లో ద్రవ్య మారక కేంద్రాలు (Foreign Exchange Centres) నెలకొల్పబడి, అతి తక్కువ మారకం కమీషన్ రేటుతో పనిచేసేవి (ద హిస్టరీ ఆఫ్ సౌత్ ఇండియా - నీలకంఠ శాస్త్రి)

ఆంధ్రదేశంలో వర్ధిల్లిన ఆనాటి చేనేత పరిశ్రమ గురించి వ్రాస్తూ "దక్కన్‌లో ఔరంగాబాద్, ఆంధ్రదేశంలో చికాకోల్ (శ్రీకాకుళం), విశాఖపట్టణం, మచిలీపట్టణం; కర్నాటకలో బెంగుళూరు ; తమిళ నాడులో మధురై, కోయంబత్తూరులు నేత పరిశ్రమ కేంద్రాలుగా వాసికెక్కాయి" అన్నారు శ్రీ బిపిన్ చంద్ర, తన ఆధునిక భారతదేశం గ్రంథంలో. 'మచిలీపట్నం కన్నా నర్సాపురంలో చిక్కని బట్ట (కాలికో) ఇరవైశాతం చవక ధరకు దొరికేది. మచిలీపట్నం వద్ద కలంకారీ పని చాలా ఉన్నతస్థాయికి చేరింది. మచిలీపట్నం తీరంలో దొరికే ఛేరూట్‌తో (రంగులద్దిన) చేసిన ఎరుపు రంగు చాలా ఉత్తమంగా ఉండటంతో, గోల్కొండ వస్త్రాలకు మంచి గిరాకీ ఉండేది' అంటారు

శ్రీ కంభంపాటి సత్యనారాయణ తన ఆంధ్రుల సంస్కృతి - చరిత్ర గ్రంథంలో.

మొగలుల కాలంలో భారతదేశం మొత్తంమీద మధ్యయుగపు పట్టణ కేంద్రాలను స్థూలంగా నాలుగు విధాలుగా చరిత్రకారులు విభజించారు. 1.ఆగ్రా, ఢిల్లీ, హైదరాబాద్ లాంటిపరిపాలనా కేంద్రాలు, 2. మధుర, వారణాసి, తంజావూరు లాంటి యాత్రా కేంద్రాలు, 3. సూరత్, మచిలీపట్నం, సోనార్‌గావ్ లాంటి ప్రముఖ వర్తక కేంద్రాలు 4. బ్రోచ్, బయానా వంటి సరుకు ఉత్పత్తి కేంద్రాలు. మొగలుల కాలంలో పట్టణ సంస్కృతి బాగా వ్యాపించింది. ఈ పట్టణ కేంద్రాలకు చేనేతవస్త్రాల సంపదను చేకూర్చి పెట్టేవి. పత్తి ఉత్పత్తి, నూలు వస్త్రముల తయారీ, మార్కెటింగ్ కేంద్రాలు దేశం యావత్తు విస్తరించి, కొన్ని మహానగరాలుగా రూపొందాయి. బెంగాల్‌లో ఢాకా, ముషీరాబాద్; గుజరాత్ సూరత్, అహమ్మదాబాద్, బ్రోచ్ ; మహారాష్ట్రలో బర్హంపూర్ ; ఉత్తరప్రదేశ్‌లో లక్నో, ఆగ్రా ; పంజాబ్‌లో ముల్తాన్, తూర్పుతీరంలో మచిలీపట్నం, శ్రీకాకుళం, కొయంబత్తూర్, మధురై మొదలగునవి మహా చేనేత కేంద్రాలుగా విస్తరించాయి. "ముడి పదార్థాలు దండిగా ఉండటం నిపుణులైన పనివారు తగినంత మంది ఉండటం, పల్లెల్లోనూ కూడా కొద్దిపాటి సరుకులను ఉత్పత్తి చేయగల పరిశ్రమలు బాగా పెరిగాయి అంటారు. శ్రీ కంభంపాటి సత్యనారాయణ (ఆంధ్రుల సంస్కృతి - చరిత్ర). చేనేత ఒక స్వతంత్ర పరిశ్రమగా వృద్ధి పొందటం వలన కోరా గుడ్డను తెలుపు చేయటం, బట్టలమీద బొమ్మలు, లతలు, చెట్లు, పశు-పక్షాదులను గీయటం, ఆ బొమ్మలకు రంగులద్దటం మొదలగునవి వేటికి అవి ప్రత్యేక పరిశ్రమలుగా, నేత పరిశ్రమకు అనుబంధంగా వెలిసి విస్తరించాయి. తూర్పుతీరంలో తయారైన చింటెజ్ వస్త్రాలు ఓడల మీద బెంగాల్, ఒరిస్సా చేరగా బెంగాల్, ఒరిస్సాల నుండి బియ్యం సముద్రం మీదుగా మచిలీపట్నం రేవుకు చేరేది. మలబారు నుండి సుగంధ ద్రవ్యములతో లంగరు వేసిన ఓడలు సరుకు దిగుమతి చేసుకొని, తిరిగి అక్కడ చేనేతవస్త్రాల బేళ్ళు, బియ్యం బస్తాలు ఎగుమతి చేసుకొని భారత - పశ్చిమ తీర రేవులకు చేరేవి.

## భారతదేశ చేనేత వనరుల మీద కన్నేసిన యూరప్ వ్యాపారులు

భారతదేశం నుండి యూరప్‌కు వ్యాపార సంబంధాలు, ప్రాచీన గ్రీకుల కాలం నుండి ఉన్నాయి. భారతదేశం - యూరప్ - ఆగ్నేయాసియాల మధ్య అనేక మార్గాలగుండా వ్యాపారం సాగింది. పర్షియన్ సింధుశాఖ వెంబడి ఒక సముద్ర మార్గం, అక్కడి నుండి ఇరాక్ - టర్కీల మధ్య గుండా భూమార్గం, తదుపరి సముద్రమార్గాన వెనిస్, జనీవా నగరాలకు చేరుకోవటం జరిగేది. ఇవి రెండు కాక వ్యాపారస్తులు తప్పనిసరి పరిస్థితులలో ఎప్పుడో ఒకసారి అవసరం కొద్దీ వాడే భూమార్గం భారత్ వాయువ్య సరిహద్దు ఖైబర్ - బోలన్ కనుమల గుండా సాగి, మధ్యాసియా, రష్యాలను దాటి 'బాల్టిక్' సముద్రతీరానికి చేరేది. ఈ దేశాలకు సంబంధించినంతవరకు ఈ వ్యాపారాన్ని అరబ్బు వర్తకులు, నావికులు నిర్వహించేవారు. యూరప్ - మధ్యధరా తీర ప్రాంతానికి సంబంధించిన వ్యాపారాన్ని ఇటాలియన్లు కొత్తగా నిర్వహించేవారు. భారత్ నుంచి యూరప్ దేశాలకు వెళ్ళే సరుకులు అనేక రాజ్యాల గుండా ప్రయాణించి, అనేక చేతులు మారి, ఆయా దేశాలు విధించే రహదారుల సుంకాలు, టోల్ సుంకాలు, వాణిజ్య సుంకాలు, ఎక్సైజ్ సుంకాలు వర్తకులు విధిగా చెల్లించాల్సి వచ్చేది. అయినా వర్తకులు భారతదేశపు విలాసఉత్పత్తుల లాభాలు దృష్టిలో ఉంచుకొని అధికమొత్తం పన్నులు, చెల్లిస్తూ పోయేవారు. మధ్యయుగాల్లో తూర్పు పశ్చిమ దేశాల వ్యాపారం అరబ్బుల చేతుల్లో ఉండి, అరబ్బు వర్తకులు పెద్ద ఎత్తున లాభాలు గడిస్తూ ఉండేవారు. ఆ రోజుల్లో వర్తకం కొంత సముద్రమార్గం ద్వారానూ, మరికొంత భూమార్గం గుండాను జరుగుతుండేది. ఈ మార్గాలను నల్ల సముద్ర ముఖద్వారంలోని 'బైజాన్‌టెయిన్ (తూర్పు రోమ్) రాజధాని 'కాన్‌స్టాంట్ నోపిల్' నగరం గొప్ప వ్యాపార కూడలిగా ఉండేది.క్రీ.శ. 1452-53లో ఆటోమన్ తురుష్కులు (బట్టోమాన్ టర్కీ వారు) కాన్‌స్టాంట్ నోపిల్ నగరం మీద దాడిచేసి ఆక్రమించారు. తూర్పు పడమటి దేశాల మధ్య ఉన్న వ్యాపార మార్గాలు టర్కీల చేతుల్లోకి వెళ్లిపోయాయి. అంతకు ముందు కాలం నుండే ఐరోపా దేశపు వర్తకులు, తమ దేశాల వ్యాపార - వాణిజ్య పట్టు నుండి అరబ్బులను తొలగించి అరబ్బుల యావత్ వ్యాపారాన్ని స్వంతం చేసుకోవాలనే ప్రయత్నంలో ఉండేవారు.

యూరప్ ప్రజలు నీరు గడ్డకట్టే శీతాకాలంలో ఉప్పు - మిరియపు పొడి, సుగంధ ద్రవ్యాలలో ఊరవేసిన మాంసం వండుకొని తినేవారు. ఉప్పు, మిరియాల నిమిత్తం యూరోప్ వాసులు తప్పనిసరిగా భారత దేశం మీద ఆధారపడవలసిన పరిస్థితి. భారతదేశానికి రవాణామార్గం లేక, సరికొత్త దగ్గర మార్గం అన్వేషణ ముమ్మరం చేశారు. ఐరోపా - యూరపుల మధ్య సాగే వ్యాపారాన్ని గుత్తకు తీసుకొని, సరిక్రొత్తగా వ్యాపారంలోకి దిగిన స్పెయిన్, తమ నౌకా బలాధిక్యతతో, పోర్చుగల్ దేశ వర్తకులను పాత సంప్రదాయక వర్తక మార్గాల గుండా వర్తకం నిర్వహించకుండా నిరోధించింది.

ఆనాడు సుగంధద్రవ్యాల వ్యాపారంతోను, చేనేత వ్యాపారంతోనూ ప్రపంచాన్ని శాసిస్తున్న ఇండోనేషియా, భారతదేశాలతో వ్యాపారం యూరప్ దేశాలకు మహా విలువైనది. కనుక భారతదేశానికి, తూర్పు ఇండియా దీవులైన ఇండోనేషియాకు వ్యాపారం సాగించేందుకు లాభకరమైన, క్షేమకరమైనమరింత దగ్గరైన మార్గాన్వేషణకు తొలిదశలో స్పెయిన్, పోర్చుగల్ నావికులు ఆయా ప్రభుత్వ అండదండలతో విడివిడిగా ప్రారంభించారు.

## 'ఎష్టడో డా ఇండియా' పోర్చుగీసు కంపెనీ

పోర్చుగీసుల భారతదేశ నూతన మార్గాన్వేషణ ఈ అన్వేషణల ఫలితంగా క్రీ.శ. 1494లో స్పెయిన్ దేశస్థుడు కొలంబస్‌భారత దేశానికి నూతన మార్గం కనిపెట్టబోయి అమెరికాను కనిపెట్టి, అది ఇండియా గానే భ్రమించి, అక్కడివారు ఎఱ్ఱగా ఉండటం గమనించి వారిని **'రెడ్ ఇండియన్స్'** అని పేరుపెట్టాడు. ఈ దిశగా ప్రయత్నించి 1498లో పోర్చుగల్ నావికుడు వాస్కోడిగామా గుడ్‌హోప్ అగ్రం చుట్టి, హిందూ మహాసముద్రం ప్రవేశించి, గుజరాత్ వర్తకుల సహాయంతో భారత పశ్చిమతీరం 'కళ్ళికోట' (కాలికట్) ఓడరేవుకు చేరాడు. ఆవిధంగా భారతదేశంతో ఐరోపా ఖండంకు, గుడ్‌హోప్ అగ్రం గుండా నూతన మార్గావిష్కరణ జరిగింది. ప్రపంచ వ్యాపార చరిత్రనే మార్చగలిగిన సంఘటన అది. **'కొలంబస్ అమెరికాను కనిపెట్టడం, (వాస్కోడిగామా) భారతదేశానికి నూతన మార్గం కనిపెట్టాలనుకోవటం మానవజాతి చరిత్రలో నమోదైన రెండు అత్యంత ప్రధానమైన మహత్తర సంఘటనలని'** ప్రపంచ ఆర్థిక శాస్త్రవేత్త **'ఆడమ్‌స్మిత్'** అభివర్ణించాడు. అత్యంత లాభకరమైన తూర్పుదేశాల యావత్ వర్తకం పోర్చుగీసు వ్యాపారుల పిడికిళ్ళలో బిగుసుకు పోయింది. మధ్యధరాసముద్ర ప్రాంత రాజ్యాల ఆధిక్యత, ప్రాధాన్యత పోయి, అట్లాంటిక్ మహాసముద్ర ప్రాంత రాజ్యాల ఆధిక్యత, ప్రాముఖ్యత పెరిగిపోయింది.

పోర్చుగీసులు భారతదేశంలో అడుగెట్టక పూర్వం మనదేశంలో స్వేచ్ఛా వాణిజ్యం జరిగేది. ఏ ఒక్కదేశానికో, లేక ఉమ్మడి కూటములకో (సిండికేట్ కంట్రీస్) భారతదేశ మార్కెట్ల మీద గుత్తాధిపత్యం లేదు. భారతదేశంతో అప్పటికే వ్యాపారంలో ఉన్నఇతర దేశాలవారికి, స్వదేశీ వ్యాపారులకు అందరికీ ఒకేరకమైన ఆదరణ, గౌరవముండేది. 17వ శతాబ్దపు యూరప్ దేశాల నిపుణుల లెక్కలను అధ్యయనం చేసిన ఆర్థికశాస్త్రవేత్త శ్రీ బాలకృష్ణ **'ఇంగ్లండ్ - ఇండియాల మధ్య సముద్ర వ్యాపారం ప్రారంభం కాకముందు కాలంలో యూరప్ నుండి ఇండియాకు ప్రతి ఏటా 'మోచా' రేవు గుండా సాలీనా6 లక్షల పౌండ్లు, 'కాన్‌స్టాంట్ నోపిల్' ద్వారా 5 లక్షల పౌండ్ల ఆదాయం భారతదేశానికి సమకూరేదని ; పర్షియా, టర్కీ, రష్యా మొదలైన దేశాలకు 'ఓర్ముజ్' రేవు మీదుగా ఎంతో వ్యాపారం జరిగేదని, ఈ వ్యాపారం వలన మరో 6 లక్షల పౌండ్ల ఖరీదుగల వెండి, బంగారాలు సాలీనా భారతదేశానికి చేరుతుండేవని** వ్రాశారు.

కుతుబ్‌షాహి సుల్తాన్ కుతుబ్‌షా అనంతరం 'మహమ్మద్ షా' పాలనకొచ్చాడు. ఇతని కాలంలోనే 1611, డిసెంబరు నెలలో మచిలీ పట్నం, నిజాంపట్నం రేవు పట్నాలలో ఇంగ్లీషు, డచ్‌వారు వ్యాపారం చేస్తున్నట్లు రికార్డయింది. విజయనగర సామ్రాజ్యాధిపతి శ్రీకృష్ణదేవ రాయలుకు పోర్చుగీసు రాయబారి 'లూయజ్ ఫ్రేయర్'కు జరిగిన ఒప్పంద భాగంగా పోర్చుగీసులు క్రీ.శ. 1509లో గోవాను ఆక్రమించి కోట నిర్మించారు. తదనంతరం పశ్చిమ కోస్తాలోని కొచ్చిన్, దయ్యూ - డామన్, భట్కల్ వద్ద వ్యాపార గోదాములు కోటలు కట్టుకున్నారు. సైనికులసాయంతో పోర్చుగీసులు తమ వ్యాపార వాణిజ్యాలను కొనసాగించారు. **"పట్టుమని పాతికమందైనా లేని పోర్చుగల్ సైనికులు, నావికులు అమేయ శక్తిసంపన్నమైన భారత, ఆసియా రాజ్యాలకు వ్యతిరేకంగా సముద్రాధిపత్యం సాధించారంటే, దానికి కారణం వారి సాయుధ నౌకా బలాధిక్యతేనని చెప్పాలి"** అంటారు శ్రీ బిపిన్ చంద్ర తన భారతదేశ చరిత్ర గ్రంథంలో, 1540 ప్రాంతంలోనే పోర్చుగీసు ప్రైవేటు వ్యాపారులు మసులీపటాంలో ఉన్నట్లు నమోదైంది. (షిప్ బిల్డింగ్ సెంటర్ ఇన్ సౌత్ ఇండియా, 1570-1700, ఎనోట్ ఆన్ నర్సపూర్ పేట - సంజయ్ సుబ్రహ్మణ్యం.. మచిలీపట్నం పాత ఓడరేవు ప్రాంతం తవిసిపూడి-గోపువానిపాలెం సరిహద్దు పాత లైట్‌హవుస్ ప్రాంతంలో పోర్చుగీసుల నివాసం (ఫిరంగి దిబ్బ) దాన్నాను కొని వారి వర్తక గోదాముల సమూహం పునాదులు, వాటికి తూర్పుగా సమాధుల దొడ్డి ఈ వ్యాసకర్త 2013 సం॥లో కనిపెట్టడం జరిగింది. పోర్చుగీసులు మసులీపట్నంలో 1645లో ఒక చర్చి నిర్మించు కున్నారు. ఈస్ట్ ఇండియా కంపెనీ వైద్యుడు జాన్ ఫ్రేయర్ 1673 ప్రాంతంలో మచిలీపట్టణంలో ఉన్న సమయంలో ఈ పట్టణంలో 'స్థానికులైన హిందువులు, ముసల్మానులతోపాటు ఆర్మేనియనులు, పోర్చుగీసులు,డచ్‌వారు,ఫ్రెంచ్‌వారు మరియు ఇంగ్లీషువారు నివసిస్తు న్నార"ని వ్రాశాడు. భారతదేశపు ఒకనాటి స్వయం సంపూర్ణ వ్యవస్థ విచ్ఛిన్నమయింది. వ్యవసాయరంగంలోనూ, పరిశ్రమల రంగంలోనూ పెట్టుబడిదారీ ఉత్పత్తి శక్తులు విస్తరించాయి. గతంలోని వస్తు మార్పిడి పద్ధతి పోయి, సరుకులు డబ్బు ఇచ్చి కొనే పద్ధతి కొనసాగింది. పట్టణాల్లోను, పల్లెల్లోనూ - గ్రామ సివార్లలోనూ వృత్తిపనివారు సరుకులను అమ్మకం కోసమే ఉత్పత్తి చేయటం మొదలెట్టారు.

## పోర్చుగీసుల దుర్మార్గపు వ్యాపార విధానాలు :

పోర్చుగీసులు కనిపెట్టిన నూతన మార్గం వలన ఇండియాలో మార్కెట్లు బాగా పెరిగాయి. అదే క్రమంలో యూరపు, పశ్చిమాఫ్రికా, అమెరికాలకు ఆసియా దేశాలకు భారతదేశం నుండి ఎగుమతులు పెరిగాయి. ఈ ఎగుమతుల్లో భారతదేశ (స్థానిక) వ్యాపారులు, అరబ్బులు, పోర్చుగీసులు పాలు పంచుకొనేవారు. "సముద్రాంతర వర్తకం చేసే ఇండియా, అరబ్బు ఓడల్ని పట్టుకొని (సముద్రంలో) ముంచేసి తమ వర్తకానికి పోటీ లేకుండా పోర్చుగీసులు చేసుకున్నారు. దానివలన సముద్ర వ్యాపారంలో పోర్చుగీసు ఓడల, నౌకల ఆధిపత్యం

చెల్లింది. అరబ్బుల ఓడలు దోచుకుని, ముంచినందుకు గోల్కొండ రాజ్య ప్రధానమంత్రి ఉత్తర్వుల మేరకు మచిలీపట్నంలోని పోర్చుగీస్ కెప్టెన్ ఒకతన్ని గోల్కొండ అధికారులు అరెస్టు చేశారు.

గోల్కొండ సుల్తాన్ ఇబ్రహీం కుతుబ్‌షా (1550-1580) పరిపాలనలో, కోరమండల్ తూర్పుతీరం సముద్రవ్యాపారంలో అత్యున్నత దశకు చేరుకున్నది. గోల్కొండ సుల్తానుల విదేశీ వర్తకుల రక్షణపట్ల ఎల్లప్పుడూ అప్రమత్తులై యుండేవారు. గోల్కొండ తీరం (మచిలీపట్నం)కు 1623లో వచ్చిన పోర్చుగీస్ నౌకకు డచ్‌వారు నష్టం కలిగించగా, మచిలీపట్నం ఫౌజుదార్ డచ్చివారిని కఠినంగా శిక్షించారు (డా॥ బి.యస్.ఎల్. హనుమంతరావు, ఆంధ్రదేశ చరిత్ర). 1606లో శాన్‌థోమ్ వద్ద మూడు పోర్చుగీసు నౌకల్నిడచ్ నౌక ఒకటి తగులబెట్టింది. తూర్పు తీరంలో పోర్చుగీసులకు డచ్‌వారికి సాయుధ ఘర్షణలు బాగా సాగాయి. 1608లో మచిలీపట్నం ఫౌజ్‌దారుని, హవల్దారుని మంచి చేసుకొని డచ్‌వారు మచిలీపట్నం, నిజాంపట్నం రేవు పట్టణాలలో వ్యాపార గోదాములు కట్టుకున్నారు. 1610లో పులికాట్ వద్ద రెండు, మచిలీపట్నం వద్ద మరి రెండు పోర్చుగీసు ఓడలను డచ్‌వారు స్వాధీనం చేసుకున్నారు.

డచ్ కంపెనీ వారి పులికాట్ వ్యాపారకేంద్రాన్ని సాయుధంగా ధ్వంసం చేయటానికి 1629లో పోర్చుగీసులు ప్రయత్నించారు. డచ్‌వారు పోర్చుగీసువారి మీద పైచేయి సాధించి, బంగాళాఖాత సముద్రంలో సరుకులతో ప్రయాణించే తమ ఓడలతోపాటు, భారతదేశ వ్యాపారుల సరుకు ఓడలకు డచ్‌వారు బాధ్యత పడి సంరక్షించేవారు. క్రమంగా సన్నగిల్లటం ప్రారంభించిన పోర్చుగీసుల ప్రాభవం 1639 నాటికి పూర్తిగా అడుగంటింది. డచ్ కంపెనీ వారు, పోర్చుగీసుల నాగపట్నం రేవును స్వాధీనం చేసుకొనగా, 1661 నాటి కుతుబ్‌షాహి పాలకులు పోర్చుగీసుల నుండి శాన్‌థోమ్‌ను స్వాధీనం చేసుకొని అక్కడ వర్తక స్థావరం కట్టుకోవటానికి డచ్‌వారిని అనుమతించారు. షుమారు నూరేండ్ల ఎదురులేని శక్తిగా భారతదేశ తూర్పు, పశ్చిమ తీరంలో చలామణి అయిన పోర్చుగీసులు 1665 నాటికి తూర్పు కోస్తాలో గుర్తులేనివిధంగా తుడుచుకుపోయారు.

### డచ్ వ్యాపారస్తులు :

1602లో నెదర్లాండ్స్ ఈస్టిండియా కంపెనీ అవతరించింది. 1602లో డచ్ అడ్మిరల్ 'వాండర్ హాగన్' అను వ్యక్తిని కంపెనీ డైరెక్టర్లు కంపెనీ నిమిత్తం కోరమాండల్ తీరంలో, ప్రత్యేకించి మచిలీపట్నంలో వ్యాపార స్థావరం ఏర్పాటుకు ఆదేశించారు. 1605లోడచ్ దేశంనుండి, కంపెనీ తరుపున ఒక వ్యాపారుల బృందం గోల్కొండ దర్బారు దర్శించి, కులీ కుతుబ్‌షా సుల్తాన్ నుండి వ్యాపార ఫర్మానా సంపాదించి మచిలీపట్నంలో ఒక గోదాము; జింజి నాయకుని అనుమతితో 'దేవన పట్నం'; విజయనగరం అవశేషరాజు వెంకటపతి రాయలు అనుమతితో పులికాట్‌లలో వాణిజ్యకేంద్రాలు స్థాపించింది. 1614లో వెంకటపతి రాయలు మరణించేనాటికి తూర్పుకోస్తాలో పోర్చుగీసులు, డచ్ మరియు ఇంగ్లీషువారు వ్యాపారం పేరుతో స్థావరాలు ఏర్పరచుకొని భారతదేశ వర్తకులపై సాయుధ బలప్రయోగం చేయసాగారు. ఇండోనేషియాలో సుగంధ ద్రవ్యాల వ్యాపారంలో స్థిరపడిన డచ్‌వారు, అక్కడనుండి 1603లో ఆంగ్లేయులను తరిమేశారు. ఇదే సంవత్సరంలో వారు పోర్చుగీసుల గోవా కేంద్రాన్ని ముట్టడించారు. 1606లో డచ్‌వారు శాన్‌థోమ్ తీరంలో మూడు పోర్చుగీసు ఓడలను సముద్రంలో ముంచేశారు. తమ సాయుధ బలగాల కోసం డచ్‌వారు 'తుపాకీ మందు తయారీ' పరిశ్రమ నౌకదానిని పులికాట్‌లో ఏర్పాటుచేసుకున్నారు.

### కిడ్నాపులకు పాల్పడిన డచ్‌వారు :

మచిలీపట్నం హవల్దార్ అహమద్‌ఖాన్ 1610 ప్రాంతంలో డచ్ కంపెనీకు దిగుమతి అయిన సరుకులు, సొమ్ము చెల్లించకుండానే 'అప్పు' పేరు చెప్పి సరుకులు దించుకొని, మార్కెట్టులో సొమ్ము చేసుకొని ఎప్పటికీ బాకీ తీర్చేవాడు కాదు. డచ్ వ్యాపారులకు వ్యాపారం నిర్వహించుకోవటానికి సుల్తాన్ అనుమతి లభించనందున, స్థానిక అధికార్లతో డచ్‌వారు లౌక్యంగా వ్యవహరించేవారు. డచ్ కంపెనీ అధికారి 'ఫ్లోరిస్' ఎన్నిసార్లు అడిగినా హవల్దార్ సొమ్ము చెల్లించలేదు సరికదా డచ్ వారిని బెదిరించేవాడు. గోల్కొండ దర్బారుకు డచ్‌వారు పెట్టిన విజ్ఞప్తులకు స్పందన లేదు. ఇక లాభం లేదనుకొని డచ్‌వారు హవల్దార్ ఓడలు రేవులో పట్టుకొని సొమ్ములు వసూలు చేసుకోవాలను కున్నారు కాని సమయానికి సరుకు ఓడలు రేవులో దొరకలేదు. హవల్దార్‌కు ఈ దొంగ వ్యాపారంలో 'బసుబలరావు' అనే పార్టనర్ ఉన్నాడు. ఈ పార్టనర్ కుమారుడు 'వెంకటాద్రి' కష్టమ్స్‌షెడ్‌లో పనిచేసు కుంటూ ఉండగా డచ్‌వారు ఆ యువకుణ్ణి కిడ్నాప్ చేసి, మచిలీపట్నం రేవులో సిద్ధంగా ఉంచిన పడవలో వేసుకొని, సముద్రంలో లంగరేసి యున్న డచ్ ఓడలో నిర్బంధించారు. ఈ విషయం తెలుసుకొన్న హవల్దార్ డచ్ కంపెనీకు చెల్లించాల్సివున్న బాకీ మొత్తం అణా-దమ్మిడీలతో సహా చెల్లించి, వెంకటాద్రిని విడిపించుకున్నాడు. ఈ కిడ్నాప్ దెబ్బతో నగరంలోని స్థానిక వ్యాపారస్తులందరూ డచ్‌వారికి న్యాయబద్ధంగా చెల్లించాల్సిన సొమ్ము చెల్లించి జాగ్రత్త పడ్డారు. బలప్రదర్శన చేస్తే తప్ప, గోల్కొండ అధికారులు, స్థానిక వ్యాపారస్తులు దారికి రారని డచ్, ఇంగ్లీషు అధికారులు భావించారు.

1665-1967లలో జరిగిన మొదటి ఆంగ్లో - డచ్ యుద్ధ సమయంలో మచిలీపట్నం సముద్రజలాల్లో తిరుగాడే ఇంగ్లీష్ నౌకలను

స్వాధీనం చేసుకోవాలని డచ్ కంపెనీ భావించి ఇందు నిమిత్తం కంపెనీ సాయుధ నౌకల్ని రేవులో సిద్ధంగా ఉంచింది. ఇంగ్లీషువారి అభ్యర్థన మేరకు, 'మచిలీపట్నం సముద్రజలాల్లో లంగరేసియున్న ఇంగ్లీషు నౌకలకు, పడవలకు ఎట్టి నష్టం చేకూర్చరాదని అటువంటి చర్యలు నిరోధిస్తూ ఆనాటి మచిలీపట్నం హవల్దార్ ఉత్తర్వులు జారీచేయటమే కాక మచిలీపట్నంలోని డచ్ నివాస సముదాయములకు త్రాగునీరు, ఆహారం సరఫరా బంద్ చేయించాడు. ఏమీచేయలేని స్థితిలో డచ్‌వారు వారి సాయుధ చర్యలను విరమించారు. డచ్ వ్యాపారులు స్థానిక అధికార్లయిన షాబందర్, ఫౌజుదార్, హవల్దార్ తదితరులకు లంచాలిచ్చి, సుల్తానులు దౌరా (టూరు) కొచ్చినప్పుడు వారికి నజరానా లిచ్చి వర్తక స్థావరాల ఏర్పాటు, పన్ను రాయితీలు సంపాదించేవారు. నిజాంపట్నం ప్రాముఖ్యాన్ని డచ్ వర్తకుడు 'పీటర్ ఫ్లోరిస్' గుర్తించాడు. నిజాంపట్టణం 1679 వరకు 'పెదపల్లి'గా పేరుపడింది. ఒకప్పుడు ఈ పెద్దపల్లిలో పోర్చుగీసులు స్థావరం పెట్టుకొని ఉప్పు ఎగుమతి వ్యాపారం సాగించారు. ఘోరమైన ఉప్పెనకు ఈ స్థావరం మొత్తం కొట్టుకు పోయిందని, కృష్ణాజిల్లా మాన్యువల్ చెబుతుంది. పోర్చుగీసులకు ముందు పెద్దపల్లి పర్షియన్ ముసల్మాను వ్యాపారులస్థావరంగా ఉండి, అక్కడ నుండి పింగాణీ సామానుల వ్యాపారం సాగింది. (డా॥ బి.ఎస్.ఎల్.హనుమంతరావు-ఆంధ్రుల చరిత్ర)ఉలవపాడు మండలం, ప్రకాశం జిల్లా కరేడు సముద్ర రేవు వస్త్ర పరిశ్రమకు పెద్ద కేంద్రం. కరేడు వస్త్రాలు పులికాట్ రేవు ద్వారా తూర్పు ఇండియా దీవులకు డచ్‌వారు ఎగుమతి చేసేవారు. పులికాట్‌లో కూడా వస్త్ర పరిశ్రమ సాగేది.

1610-23 మధ్యకాలంలో డచ్‌వారు పులిచింతల బేసిన్ కొల్లూరు వజ్రపు గనులను సాలుకు మూడు లక్షల హోన్నులకు లీజుకు తీసుకొని అశేష లాభాలు గడించారు. కోహినూరు వజ్రం లభించింది ఈ కొల్లూరు గనుల్లోనే. 1613లో ఏకమొత్తంగా సాలుకు 3000 హోన్నుల సొమ్ము గోల్కొండ సుల్తానుకు చెల్లించి ఆ రాజ్యంలో స్వేచ్ఛగా రాజ్యం చేసుకొనే హక్కు పొందారు డచ్ వారు. మచిలీపట్నం, నిజాంపట్నం, మద్రాస్ తేనాం పేటలలో తమ సరుకుల మీద నాల్గు శాతం, పులికాట్‌లో రెండుశాతం వ్యాపార రాయితీలు సంపాదించి నందున, డచ్‌వారికి అమితమైన లాభాలు వచ్చేవి. స్థానిక వర్తకులకు అట్టి రాయితీలు లేనందున నష్టపోయేవారు. డచ్‌వారు తమకు కావలసిన నౌకలు, ఓడలు మచిలీపట్నంలోనూ, నర్సాపురంలోనూ కట్టించుకొనేవారు. స్థానిక వర్తకులు, నేతపనివారు వారి మగ్గాలమీద నేసిన బట్టకు ధరకట్టి కొనుగోలు చేసేవారు. కాని డచ్‌వారు స్థానిక వర్తకులను కొంత సొమ్ము కొనుగోలు బయానాగా ఇచ్చి పనిచేయించు కొనేవారు.అలా బయానా తీసుకొన్న మగ్గరి తాను నేసిన బట్ట, అద్దకం అద్దిన కలంకారీ బట్టలు కేవలం డచ్ కంపెనీకు మాత్రమే అమ్మాలి. ఆ విధంగా డచ్‌వారు మచిలీపట్నం పులికాట్‌లలో రోజు వారీగా ఒక్కొక్కచోట రెండు నుండి మూడువందల రంగులద్దే కార్మికులను నియమించుకున్నారు. ప్రథమంగా గ్రామాలలో చేనేత షెడ్యూల్ నిర్మించి చేనేత - అద్దకం పనివారిని ఒకచోట చేర్చి సాయుధ పహారా క్రింద సామూహికంగా నేత మరియు అద్దకం పనులు చేయించారు.

డచ్ కంపెనీ వ్యాపారస్తులు తమ కంపెనీకు సరుకు సరఫరా చేసేందుకు 12మంది దేశీయ వ్యాపారస్తులను ఒక జట్టుగా గ్రూపు చేసి వారి పేర్లతో వేరు వేరు 12 కంపెనీలు పెట్టించేవారు. ఈ పన్నెండు మంది తమసొంతసొమ్ము పెట్టుబడి చేసి డచ్‌వారి కోసంనేత నేయిస్తారు. వారి బట్టలు డచ్‌వారు కొనేవారు. విదేశీ వర్తకులు 24 గంటలూ కార్మికుల మీద పెత్తనం చేసేవారు. 'తక్కువ కూలీ' అని ఏ కార్మికుడో నిలదీస్తే అంతే!వారికి మళ్ళీ పని దొరకదు. భార్యాపిల్లల పస్తులు ఉండాల్సిందే.

డచ్‌వారు తమ కర్మాగారాల స్థాపనకు,నడపటానికి దేశీయ ధనిక వర్తకులనుండి, స్థానిక అవినీతి అధికారులనుండి పెట్టుబడి 'అప్పు'గా పొందేవారు. ఆనాటి మచిలీపట్నం హవల్దార్అయిన 'సిద్ధప్ప' డచ్ కంపెనీకు 20వేల హోన్నులు అప్పుగా ఇచ్చాడు. **"పెట్టుబడి దేశీయం, ముడిసరుకు దేశీయం, కార్మికులు దేశీయం. కాని పరిశ్రమల మీద ఆధిపత్యం మాత్రం విదేశీయులైన డచ్ వారిది"** అంటారు డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు తన ఆంధ్రుల చరిత్ర గ్రంథంలో. ఆనాటి వరకు స్వతంత్రంగా వస్తూత్పత్తి చేస్తుండిన నేతన్నలు డచ్ కంపెనీకు దినభత్యం కూలీలుగా ; వాణిజ్యం సాగిస్తున్న వర్తకులు కార్మికులకు - కంపెనీకు మధ్య దళారులుగా ; స్థానిక గోల్కొండ అధికారులు వడ్డీ వ్యాపారస్తులుగా మారిపోయారు. డచ్ కంపెనీవారు భారతదేశంలో అనుసరించిన ఆర్థిక విధానాలవలన వారి లాభాలు దినదినాభివృద్ధి చెందాయి. 1636లో డచ్ కంపెనీకి వచ్చిన లాభం 30వేల పౌండ్లు. 1684 నాటికి వారి లాభం12 లక్షల 70వేల పౌండ్లు. 1630 నాటినుండి డచ్‌వారికి కష్టాలు ప్రారంభమయ్యాయి. ఈ సంవత్సరం దక్షిణదేశంలో పెద్ద క్షామం సంభవించి సాలె నేతవారు, అద్దకం పనివారు అధికసంఖ్యలో మరణించారు, మిగిలినవారు తిండి వెతుక్కుంటూ వలసలు సాగించారు. కేవలం చేనేత వస్త్ర వ్యాపారం మీద ఆధారపడిన డచ్ వ్యాపారం కుదేలయింది. ఇదే అదనుగా గోల్కొండ దర్బారు ఉద్యోగులు చేనేత వ్యాపారం చేపట్టారు. 1690 నుండి పులికాట్‌కు బదులు నాగపట్నం డచ్‌వారి ప్రధాన వ్యాపార స్థావరమయింది.

## ఇంగ్లీషు ఈస్ట్ ఇండియా కంపెనీ నిర్వాకం :

క్రీ.శ. 15, 16 శతాబ్దాలలో ఇంగ్లండ్ దేశం ఫ్రాన్స్, స్పెయిన్ దేశాలకన్నా ఆర్థికంగా, రాజకీయంగా, సైన్యపరంగా బలహీనంగా ఉండేది. సుదూర ప్రయాణం చేయగల నౌకలు లేకపోవటం వలన

ఇతర యూరపు దేశాలతో పోటీ పడలేకపోయింది. బ్రిటన్ దేశస్థులు తమ ఆహారం నిల్వకు కావలసిన మిరియాలు తదితర సుగంధద్రవ్యాల కొరకు, ఉప్పు కొరకు తప్పనిసరిగా ఇటలీ మీద ఆధారపడవలసి వచ్చేది. తమ బలహీనతలను అధిగమించేందుకు బ్రిటన్ తన నౌకాదళ సామర్థ్యం పెంపుకోసం ప్రయత్నించి సఫలమైంది.

స్పెయిన్ దేశపు ప్రాభల్యాన్ని నిరోధించే ప్రయత్నంలో, ఇంగ్లండ్ స్వంతంగా ఒక వలస విధానాన్ని, వాణిజ్య వ్యూహాన్ని రూపొందించు కున్నది. ఇంగ్లండ్ దేశపు నావికుడు 'ఫ్రాన్సిస్ డ్రేక్' 1580కల్లా నౌకాయానంతో ప్రపంచాన్ని చుట్టివచ్చాడు. 1583లో మరొక ఇంగ్లీషు నావికుడు 'రాల్ఫ్ పిచ్' పర్షియా జలసంధి చేరగా, పోర్చుగీసువారు నిర్బంధించారు. తప్పించుకొన్ని రాల్ఫ్ ఇంగ్లాండ్ చేరి, 'భారతదేశ అపార వనరుల గురించి, సంపద గురించి, అక్కడ జరుగుతున్న దేశవిదేశ వ్యాపార వాణిజ్యాల గురించి' ఇంగ్లండ్ ప్రజలకు తెలియ జెప్పాడు. 1585లో ఇంగ్లీషువారి నౌకాదళం 'స్పానిష్ అర్మడా' (స్పెయిన్ నౌకాదళం)ను ధ్వంసం చేసి, ఇంగ్లండ్ నౌకాదళానికి గొప్ప గుర్తింపు తెచ్చింది. 1591-93 లలో 'జేమ్స్ లాన్ కాస్టర్' కన్యాకుమారి అగ్రం పెనాంగ్ చేరాడు. 1599లో 'జాన్ మిల్టన్ హాల్' అనే సాహసికుడు, లండన్ నుండి భూమార్గం ద్వారా భారతదేశం చేరి, ఏడు సంవత్సరాలు పాటు నివాసమున్నాడు. ఔత్సాహికులైన ఇంగ్లండ్ వ్యాపారులు ఒక సంఘంగా ఏర్పడి బ్రిటిష్‌రాణి అనుమతి పొంది 'ది గవర్నర్ అండ్ కంపెనీ ఆఫ్ మర్చంట్స్ ఆఫ్ లండన్ ట్రేడింగ్ టు ది ఈస్ట్' అనే ఇంగ్లీష్ ఈస్ట్ ఇండియా కంపెనీను క్రీ.శ. 1600, డిసెంబరు 31వ తేదీన ఏర్పరచారు. బ్రిటిష్ రాణి ఎలిజబెత్ కూడా ఈ కంపెనీలో వాటాదారుగా ఉన్నది. కంపెనీ పాలకవర్గాన్ని 'కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్' అన్నారు. లండన్ వీరి ముఖ్య కార్యస్థానం. ఈ కంపెనీ నౌక ప్రథమంగా ఇండోనేషియాలోని 'ఎకిన్' నౌకారేవు పట్టణానికి ప్రయాణించింది. హెన్రీమిడిల్‌టన్ నాయకత్వాన బయల్దేరిన రెండు నౌకాయాన బృందాలు, సుగంధ ద్రవ్యాల పుట్టిల్లు అయిన 'అంబియానా' మరియు 'బందా' ద్వీపాలతో సరాసరి సంబంధాలు నెలకొల్పాయి. ఈ బృందం విపరీతమయిన లాభాలతో 1609 ఇంగ్లండ్ చేరింది.

హెన్రీమిడిల్ టన్ ఒక సముద్రపు దొంగ (పిరేట్)లా వ్యవహరించే వాడు. సముద్ర మధ్యంలో భారతీయ ఓడల్ని అడ్డం గొట్టటమూ, ఇంగ్లీషు సరుకులను బలవంతంగాఅంటగట్టటం,భారతీయ సరుకుల్ని దోచుకోవటం సాగించేవాడు. 1602లో 600 టన్నులఎంతో విలువైన సరుకుతో ప్రయాణిస్తున్న పోర్చుగీసుల ఓడనొకదానిని బంగాళాఖా తంలో ఇంగ్లీషువారు పట్టుకున్నారు. 1604లో భారత దేశపు ఓడలను బ్రిటిష్ ఓడ అడ్డగించి దోచుకుంది. 1608లో భారత దేశంలో ఇంగ్లీషు ఫ్యాక్టరీలను నెలకొల్పాలనే కోర్కె ఆ కంపెనీకు కలిగింది. టర్కీభాష మాట్లాడే నేర్పు కలిగిన 'విలియం హాకిన్స్'ను 1609లో ఢిల్లీ మొగలాయి దర్బారుకు పంపారు. అప్పటికే దర్బారులో తిష్టవేసిన బ్రిటిష్ రాయబారి 'సర్‌థామస్ రో' అప్పటి గుజరాత్ గవర్నరును మంచి చేసుకొని సూరత్‌లో ఫ్యాక్టరీ స్థాపించటానికి ఉత్తర్వు ఇచ్చినట్లే ఇచ్చి తిరిగి ఉపసంహరించుకోవటం జరిగింది. ఎట్టకేలకు 1615 నుండి 1618 వరకు ఢిల్లీ దర్బారులో తిష్టవేసిన బ్రిటిష్ రాయబారి 'సర్‌థామస్ రో' అప్పటి గుజరాత్ గవర్నరును మంచి చేసుకొని సూరత్‌లో ఫ్యాక్టరీ (గోదాములు) స్థాపనకు అనుమతి పొందాడు.

## గోల్కొండ పరిధిలో వర్తక వ్యాపారం

కంపెనీ తరపున 'గ్లోబ్' నావలో, ఇంగ్లీషు సేవలో ఉన్న డచ్ 'పీటర్ విలియం ఫ్లోరిస్' తోడుగా 'కెప్టెన్ హిప్పన్' 1611లో బయలు దేరి తూర్పుతీర రేవులు దాటుకుంటూ 1611, జనవరి నెలలో మచిలీ పట్నంచేరి ఇక్కడ చేనేత వస్త్రాలు కొనుగోలు చేసి ఓడ నింపుకొని ప్రయాణించి1612 సయాం, బాంటమ్ దేశాలకుచేరాడు. అక్కడ తూర్పు తీరం సన్ననూలు బట్టలుఅమ్ముకొని, నిండాలాభాలతో 1613లోతిరిగి మచిలీపట్నం చేరాడు. స్థానికంగా వున్న గోల్కొండ దర్బారు ప్రతినిధితో మాట్లాడి, బందరులో ఒక వ్యాపార స్థావరాన్ని (ఫ్యాక్టరీ)ను స్థాపించ టానికి అనుమతి పొందారు. అంతకుముందు 1612లో సూరత్ వద్ద ఇంగ్లీషువారు పోర్చుగీసు సాయుధులతో తలపడి, నష్టపోయారు. పులికాట్ వర్తక స్థావరం విషయంలో డచ్ వారితో ఘర్షణపడి సాధించ లేకపోయారు. 1615లో బ్రిటిష్ రాయబారి 'సర్ థామస్ రో', ఢిల్లీలో జహంగీర్ చక్రవర్తిని కలిసి అనేక వ్యాపార రాయితీలుపొందారు.

తూర్పుదీవుల్లో సుగంధద్రవ్యాల వ్యాపారం విషయంలో డచ్ కంపెనీ బిగిసి ఉన్నందున, ఇంగ్లీషు కంపెనీ తమ దృష్టిని భారతదేశ చేనేత వ్యాపారం మీద నిలిపింది. 1620లో 'కెప్టెన్‌షిల్లింగ్' ఆధ్వర్యంలో జరిగిన ఇంగ్లీషు నౌకాదళ విన్యాసం మీద పోర్చుగీసులు దాడిచేసి బాగా నష్టపోయారు. 1622లో ఇంగ్లీషువారు పర్షియనులతో కలిసి, పోర్చుగీసు ఆధీనంలోని 'ఓర్ముజ్ జలసంధి'ని స్వాధీనం చేసుకున్నారు. ఢిల్లీ చక్రర్తి జహంగీర్ అనుమతి పొంది ఇంగ్లీష్ కంపెనీ పశ్చిమ తీరంలో చాలాచోట్ల ఫ్యాక్టరీలు నిర్మించుకున్నది. 1623లో 'అంబాయినా' వద్ద 13 మంది ఇంగ్లీషువారిని డచ్‌వారు చంపేశారు. తప్పనిసరి పరిస్థితులలో ఇంగ్లీషు కంపెనీ 'మొలక్కాస్' దీవులనుంచి, సయాం దేశాలనుండి (బాంటామ్ మినహా) తమ వర్తక వాణిజ్యాన్ని వెనక్కు తీసుకుంది. ఇంగ్లీషు డచ్ కంపెనీల ఘర్షణలవల్ల ఇంగ్లీషు కంపెనీకు 1623 ప్రాంతంలో 20 లక్షల పౌండ్ల నష్టం వచ్చినట్లు అంచనా. ఇంగ్లండ్ దేశంలో కంపెనీవారు తీర్చవలసిన ఋణం 2 లక్షల పౌండ్లకు చేరింది. ఇంగ్లీషు కంపెనీ డచ్ ఘర్షణలతో విసుగు చెంది. మచిలీ

పట్నం కేంద్రం విడిచి 1623లో పులికాట్‌లో స్థావరం ఏర్పాటుచేసు కొన్నది. 1624లో కంపెనీ నష్టాలు (24 లక్షల పౌండ్లు) భరించలేక పులికాట్ మకాం మార్చి 'ఆర్మగాన్' వద్ద సరికొత్త స్థావరం ఏర్పాటుచేసు కున్నది. మచిలీపట్నం మీద పట్టు సాధించిన గోల్కొండ దర్బారు ఆహ్వానం మేరకు 1628 తరువాత మచిలీపట్నంలో ఇంగ్లీషు ఫ్యాక్టరీ తిరిగి ఊపిరి పోసుకుంది. ఇంగ్లీషు కంపెనీ తూర్పుతీరం నిజాంపట్నం, మోటుపల్లి, వీరవాసరం, భీమునిపట్నం, విశాఖపట్నం, తూర్పు గోదావరి ఇంజరం ప్రాంతాల్లో కొత్తగా వర్తక కేంద్రాలు తెరిచి ఇక వెనక్కు తిరిగి చూడకుండా వ్యాపారరంగంలో ముందుకు దూసుకు పోయింది. తమ సరుకులను ఎట్టి పన్నులు చెల్లించకుండానే గోల్కొండ రాజ్యంలో వ్యాపారం చేసుకునేందుకు 1632, నవంబరులో గోల్కొండ కుతుబ్‌షాహీల నుండి ఇంగ్లీషు కంపెనీ ప్రతినిధి 'థామస్ జోయస్' అను ఆంగ్లేయుడు సుంకం రాయితీల ఫర్మానా సంపాదిం చాడు. కేవలం సాలీనా 500ల బంగారు పగోడాలు చెల్లించి ఇంగ్లీషు కంపెనీ గోల్కొండ రేవుల్లో మరెట్టి పన్నులు లేకుండా వ్యాపారం చేయవచ్చును. 1634లో ఇంగ్లీషువారు నవాబు వద్ద ఇటువంటి రాయితీలను తిరిగి సంపాదించారు. బంగారురేకు మీద చెక్కించి ఇచ్చిన ఫర్మానా కనుక, ఈ ఉత్తర్వును 'గోల్డెన్ ఫర్మానా' అంటారు.

1637లో ఈస్టిండియా కంపెనీ ప్రత్యర్థి కంపెనీ 'కోర్టీన్స్ అసోసియేషన్' పేరుతో సరికొత్త కంపెనీ ఆంధ్రదేశం వచ్చి ఇంగ్లీష్ కంపెనీతోపాటు తమకు కూడా వ్యాపార పన్ను రాయితీలు ఇమ్మని కోరగా, నవాబు తిరస్కరించిన మీదట, కోపగించిన కొత్త కంపెనీ గోల్కొండ నగరం మీద కాల్పులు జరిపారు. సుల్తాన్ కొత్త కంపెనీ ప్రతినిధులను అదుపులోకి తీసుకొని 50 రోజుల ఖైదు శిక్ష విధించాడు. మచిలీపట్నం కౌన్సిల్ సభ్యుడు ఫ్రాన్సిస్ డే, విజయనగర అవశేషరాజు చంద్రగిరి పాలకుడు 'దామెర్ల వెంకటాద్రి నాయుడు' నుండి మద్రాసులో వర్తకస్థావరం కట్టుకోవటానికి అనుమతి పొందాడు. సెయింట్ జార్జి కోట పేర మద్రాసులో గొప్ప వర్తక స్థావరం ఏర్పడింది. ఇంగ్లీష్ ఈస్టిండియా కంపెనీ వాణిజ్యం 1660 నాటికి పుంజుకుంది, కాని కంపెనీపేరుతో ఉద్యోగులు, అధికారులు ఆర్థికంగా బలిసిపోయి, కంపెనీ అదుపులోంచి తప్పిపోయారు చివరకు ఇంగ్లండ్ నుండి వచ్చిన సాయుధ నౌకాదళం కంపెనీ అధికార్ల చేతినుండి పాలనను కైవసం చేసుకోవలసి వచ్చింది. 1668లో కంపెనీ విశాఖపట్నంలో క్రొత్త వ్యాపారకేంద్రం తెరిచింది.

1670 ప్రాంతంలో మచిలీపట్నంలోని స్థానిక మహిళపై ఒక ఆంగ్లేయుడు అత్యాచారం జరిపాడు. అతన్ని పట్టుకోవటానికి స్థానికులు వెంటబడగా, ఆంగ్లేయ అధికారులు అతన్ని బందరుకోటలో దాచారు. అయినా అతన్ని పట్టుకొని ప్రజలు ముక్కలుగా నరికి చంపారు. స్థానికులు కోటకు ఆహారం, నీరు బంద్ చేశారు. ప్రతీకారంగా ఇంగ్లీషు వారు ఫిరంగులతో బందరు నగరం మీద కాల్పులు జరిపారు. ఆంగ్లేయుల బహిష్కరణ ఎత్తివేసేంత వరకు ఇంగ్లీషువారు నగరం మీద కాల్పులు జరుపుతూనే ఉన్నారు. ఇంగ్లీషు కంపెనీ అవలంబిస్తున్న పద్ధతులకు కోపగించిన ఔరంగజేబు చక్రవర్తి ఇంగ్లీషువారిని భారతదేశం నుండి తరిమేయమని ఉత్తర్వులు ఇచ్చిన మీదట మొగల్ సైన్యం బెజవాడ - కొండపల్లి వరకు పురోగమించా యని తెలిసి మచిలీపట్నంలోని ఇంగ్లీషు అధికారులతోసహా, విదేశీ వర్తకులు, అధికారులు, సిబ్బందితో నగరం విడిచి పారిపోయారు. మొగల్ సైనికాధికారులు మచిలీపట్నం ఫ్యాక్టరీతోసహా, మద్రాస్ జార్జికోట కేంద్రాన్ని, 18 గోదాములతో ; విశాఖపట్నం వ్యాపార కేంద్రాన్ని స్వాధీనం చేసుకున్నారు.

1708 నాటికి తూర్పుతీరంలో ఇంగ్లీషు కంపెనీకి మచిలీపట్నం, మాధవాయ పాలెం, భీమునిపట్నం, బిలియపట్నం, గంజాం, కొమ్మెర, తేనాంపట్నం, జింజి, బాలాసోర్, ఖిప్లి, మద్రాస్, ట్యూటికోరిన్, పోర్టోనోవా, పులికాట్, ఆర్మగాన్, వీరవాసరం, ఇంజరం మరియు విశాఖపట్నంలో వర్తకకేంద్రాలు ఉన్నట్లు కంపెనీ రికార్డులు చెబుతున్నాయి.

## ఫ్రెంచ్ వ్యాపారస్తులు :

మొగల్ సామ్రాజ్యం ఉన్నతదశలో ఉన్నకాలంలో ఫ్రెంచ్ యాత్రికులు, నావికులు, వర్తకులు భారతదేశం సందర్శించి, మొగలాయి చక్రవర్తుల వైభవాన్ని, గోల్కొండ సుల్తానుల ఐశ్వర్యాన్ని కనులారచూచి, తమ దేశంలో కథలు కథలుగా చెప్పుకొనేవారు. ఫ్రెంచ్ నగల, వజ్రాల వర్తకులు బెర్నియర్, ట్రవర్నియర్ రచనలు ఆనాటి భారతదేశ ఆర్థిక, సాంఘిక, రాజకీయ ఔన్నత్యాన్ని చాటిచెబుతాయి. ఫ్రాన్స్‌దేశం చొరవతో ఎట్టకేలకు ఫ్రెంచ్ వ్యాపారులు క్రీ.శ. 1670 ప్రాంతంలో 'గోల్కొండ తీరం'గా పేరుపడిన తూర్పుతీరం చేరారు. ఆనాటికి డచ్, ఇంగ్లీషు వర్తకులు గోల్కొండ తీరంలో తమ వ్యాపార కేంద్రాలు స్థాపించుకొని స్థిరపడినారు. ఫ్రెంచ్ వ్యాపారులు మచిలీపట్టణంలో వ్యాపార గోదాములు కట్టుకోవటానికి, గోల్కొండ రాజ్యంలో స్వేచ్ఛావర్తకం, వాణిజ్యం జరుపుకోవటానికి 1671లో కుతుబ్‌షాహి సుల్తానుల అనుమతి పొందారు. ప్రథమంలో డచ్, ఇంగ్లీషు కంపెనీలు ఫ్రెంచ్ కంపెనీను తమ ఉమ్మడి శత్రువుగా భావించి ఘర్షణలు పడ్డారు. ఫ్రెంచ్‌వారు జింజి పాలకుని వద్ద కొనుగోలు చేసిన పుదుచ్చేరి వ్యాపార కేంద్రాన్ని బలపర్చుకోవటమేకాక 1693లో పాండిచ్చేరిని పూర్తిగా తమ స్వాధీనంలోకి తెచ్చుకున్నారు 1748లో ఇంగ్లండ్ - ఫ్రాన్స్‌ల మధ్య యుద్ధం ముగిసిన దరిమిలా ఇరుపక్షాలకు కుదిరిన శాంతి ఒప్పందం ప్రకారం, ఫ్రెంచ్‌వారు మద్రాసును ఇంగ్లీషు కంపెనీ పరం చేశారు.

ఫ్రెంచ్ గవర్నరు డూప్లే కర్ణాటకలో చందాసాహెబ్‌తోనూ, హైదరాబాద్‌లో ముజఫర్‌జంగ్ తోనూ చేసుకొన్న ఒప్పందం ప్రకారం ఈ కూటమి 1749లో 'అంబారు' యుద్ధంలో కర్ణాటక నవాబును ఓడించి, చంపింది. చందాసాహెబ్ పాండిచ్చేరి దగ్గర 80 గ్రామాలు, ఫ్రెంచ్ తూర్పు ఇండియా కంపెనీకు దఖలు పర్చాడు. నాజర్‌జంగ్ యుద్ధంలో చనిపోగా, మచిలీపట్నం, దివిసీమ గ్రామాలు, పాండిచ్చేరి దగ్గర కొన్ని గ్రామాలు ఫ్రెంచ్‌వారికి దఖలయ్యాయి. డూప్లేకు వ్యక్తిగత లంచంగా 2 లక్షల నగదు, సాలీనా లక్షరూపాయల ఆదాయం వచ్చే జాగీరు దక్కాయి. మచిలీపట్నంతో సహా కొండపల్లి సర్కారు కూడా ఫ్రెంచ్‌వారి ఆధీనంలోకొచ్చాయి.

1750లో నాజర్‌జంగ్ నవాబు అధికార్లు మచిలీపట్నం ఫ్రెంచ్ ఫ్యాక్టరీను స్వాధీనం చేసుకోగా, మరుసటి సంవత్సరం ఫ్రెంచ్ సైన్యం బందరు ఓడరేవును నగరంతోసహా ఆక్రమించింది. ఫ్రెంచ్ డూప్లే ఆమోదంతో నాజర్‌జంగ్ పెద్ద తమ్ముడు సలాబత్‌జంగ్ (1751-1761) దక్కన్ సుబేదారుగా ప్రకటింపబడ్డాడు. సలాబత్ ఫ్రెంచ్‌వారికి 24 లక్షల నగదు ఫ్రెంచ్ సైన్యం పోషణ నిమిత్తం అందజేశాడు. ఫ్రెంచ్‌వారు సలాబత్‌ను మహారాష్ట్ర దండయాత్రల నుండి కాపాడారు. అందుకు అనుగ్రహించిన సలాబత్‌జంగ్ విశాఖపట్నం నుండి ఫ్రెంచ్‌వారిని తరిమేసి, శత్రువులు లేకుండా చేసుకోవాలనే దుర్బుద్ధితో, కలకత్తా నగరం విలియం కోటలోని క్లైవ్ తక్షణమే స్పందించి కల్నల్ ఫోర్డ్ నాయకత్వంలో సైన్యాన్ని తూర్పుతీరం ఆక్రమణకు పంపాడు. ఇంగ్లీషు సైన్యం రాజా ఆనందగజపతితో కలిసి 1959, ఏప్రియల్ నెల 7వ తేదీ అర్ధరాత్రి ఆంగ్లో-ఫ్రెంచ్ యుద్ధంలో మచిలీపట్నం - బందరుకోటలను, దివితాలూకాలను గెలిచాడు. ఆ అర్ధరాత్రి విజయంతో మచిలీపట్నం నుండి ఇంగ్లీషు కంపెనీ పైపైకిఎదిగి, యావత్ భారతదేశాన్ని ఆక్రమించి, భారతదేశాన్ని వలసదేశం చేసుకొని 1759 నుండి 1947 ఆగష్టు వరకు పరిపాలించింది. 1759, మే నెల 14వ తేదీన గోల్కొండ సుబేదారుఇంగ్లీషువారితో చేసుకొన్న ఒప్పందంప్రకారం మచిలీపట్నం, నిజాంపట్నంలను కొండపల్లి సర్కారు కొంతభాగాన్ని ధారాదత్తం చేయటం వలన భారతదేశంలోనింతర్ భాగమైనదక్కన్‌లో కొంతభాగం మొదటిసారిగా ఇంగ్లీషువారి పాదాక్రాంతమయింది. మన దేశానికి కేవలం వ్యాపారం చేసుకొని బ్రతుకుతెరువు నిమిత్తం వచ్చిన ఇంగ్లీష్ ఈస్ట్ ఇండియా కంపెనీ వ్యాపారులు తదనంతర కాలంలో భారతదేశ పాలకులై, ఈ దేశ ప్రజలను రెండవశ్రేణి పౌరులను చేసి, దేశ సంపదను దోచుకోవటమే కాక వారి మిల్లు బట్టలను ఇండియా మీద రుద్ది దేశీయ చేనేత పరిశ్రమను ధ్వంసం చేశారు.

1679 నాటి మద్రాస్ ఫోర్ట్ సెయింట్ జార్జ్‌కోట ఇంగ్లీష్ ఏజెంటు,వ్యాపారి 'స్ట్రెయాన్‌షామ్ మాస్టర్' 17 మందితో కలిసి చేనేత బట్టల కొనుగోలు నిమిత్తం మద్రాస్ నుండి 1679 మార్చి 19వ తేదీన బయలుదేరి ఆనాటి చేనేత మార్కెట్లయిన వేటపాలెం, నిజాంపట్నం, బాపట్ల మీదుగా 'మెట్‌చెల్ పటాం' చేరాడు. పెదపల్లి (నిజాంపట్నం) నుండి వచ్చిన స్థానిక చేనేత వ్యాపారులు, స్ట్రెయాన్‌షామ్‌ను కలిసి, మచిలీపట్నం వ్యాపారులకన్నా తక్కువరేటుకు బట్టలు అమ్మారు. వారు తమవెంట తెచ్చిన సాలెంపూర్స్, పెరికోలాస్, ఇజారీస్, అల్లెజాయెస్, సాదరున్‌చెస్ ; నుసరగంటెస్, కల్వపుప్పూస్, రొమల్లాస్ అను పేర్లుగల చేనేత బట్టలు 10 శాతం తక్కువ ధరకు అమ్మారు. ఈ బట్టలు కాక ఏజెంట్ డైరీను బట్టి ఆ రోజుల్లో వరంగల్ బీటలాయస్, దుంగరీస్, సైలె అను పేర్లుగల బట్టలు కూడా వాడకంలో ఉన్నాయి.

### భారతదేశపు ఉల్లిపొర మేలురకం బట్టలపై బ్రిటీష్ ప్రభుత్వం ఆంక్షలు

బ్రిటిష్‌వారి స్వదేశం ఇంగ్లండ్‌లో ఆ దేశపు 'ముతకరకం పూల అద్దకం బట్టలు' చలామణిలో ఉండేవి. బ్రిటిష్ నేతబట్టలకు బ్రిటన్‌లో డిమాండు లేదు. భారతదేశంలో తయారైన ఉల్లిపొరల్లాంటి సన్నపోగు మేలురకం బట్టలు యూరోపియన్ మార్కెట్లను వెల్లువలా ముంచెత్తు సరికొత్త ఫ్యాషన్‌లకు తెరలేపాయి. భారతీయ చేనేత ఉత్పత్తులు వారి దేశాల్లో ఎంత లోతుకు చొచ్చుకుపోయాయంటే "భారతీయ వస్త్రాలు మన ఇళ్ళల్లోకి, బీరువాల్లోకి, చివరకు పడకగదుల్లోకి కూడా చొర బడ్డాయి. మన గుమ్మాలకు, కిటికీలకు కట్టే తెరలకు, సోఫా మెత్తలకు, కుర్చీ కవర్లకు, చివరకు మన పక్కల్లో దుప్పట్లతో సహా, అన్నింటికి భారతదేశపు బట్టే" అని బ్రిటన్ రచయితలు తమ నవలలలో ఎత్తి చూపారు (రాబిన్‌సన్ క్రూసో నవల - డెఫో). బ్రిటిష్ వ్యాపారవేత్తలకు భారతదేశ వస్త్రాలంటే కండ్లు కుట్టాయి. భారతీయ చేనేత వస్త్రాలను బహిష్కరించమని,ఉపయోగించిన వారిపైన భారీ జరిమానాలు విధించమని, బట్టల దిగుమతిపై అధిక సుంకములు వసూలు చేయమని మాంచెస్టర్ బట్టలమిల్లు యజమానుల ప్రభుత్వం మీద ఒత్తిడి తెచ్చారు. **"1720లోనే భారతీయ అద్దకం, చేనేతబట్టలు వాడకం మీద బ్రిటన్ ప్రభుత్వం ఆంక్షలు విధించింది. అత్యధిక దిగుమతి సుంకం విధించింది. కొన్ని మేలురకం బట్టలు నిషేధించింది. ఫలితంగా 1760లో భారతదేశం నుండి దిగుమతి అయిన ఒక జేబురుమాలు కొన్నందున ఒక బ్రిటిష్ మహిళతో 200 పౌండ్ల జరిమానా బ్రిటన్ కట్టించింది. భారతదేశపు వస్త్రాలు బ్రిటన్‌లో 67 1/2 శాతం దిగుమతి సుంకం చెల్లించాల్సి వచ్చింది"**. (ఆధునిక భారతదేశ చరిత్ర - బిపిన్‌చంద్ర).

### చేనేత పనివారల స్థితిగతులు - తిరుగుబాట్లు

కొంతమంది చేనేత బట్టల స్థానిక వ్యాపారస్తులు ఆంధ్రదేశంలో తయారయ్యే చేనేతవస్త్రాల అమ్మకాలు, కొనుగోళ్ళకుఇంగ్లీషు కంపెనీతో ముందస్తు కాంట్రాక్టులు కుదుర్చుకొన్నారు. తమ గ్రామాల్లో మగ్గం

దార్లకు పెట్టుబడి పెడితే, సరుకు భద్రత విషయం తాము చూచు కుంటామని జమీందార్లు కంపెనీలకు కబురు పెడుతున్నారు. పట్టణాల్లో, పెద్దఎత్తున పరిశ్రమలు ఏర్పడిన గ్రామాల్లో కంపెనీ కమర్షియల్ రెసిడెంట్స్ ఏర్పడ్డారు. రెసిడెన్స్ మనుషులు, సాయుధ సిపాయిలు ఎప్పటికప్పుడు గ్రామాలకెళ్ళి పనివారి పరిస్థితులను గమనిస్తూ, అదలిస్తూ వస్తున్నారు. ఇప్పుడు చేనేత కార్మికులు వారి శ్రమకు తగ్గ ప్రతిఫలం ఇవ్వమని డిమాండ్ చేసే స్థితిలో లేరు. ఇంగ్లీష్ కంపెనీల కాంట్రాక్టుల్లో ఉన్న నేతపనివారు, డచ్ / ఫ్రెంచ్ కంపెనీల పనికెళ్ళే స్థితిలేదు. తుని తాలూకాలో చేనేత కార్మికులు తిరుగుబాటు చేసి గ్రామాలు వదలి, భయంతో పక్క జిల్లాలోని తమ కులస్థుల ఊళ్ళల్లో ఆశ్రయం పొందారు. పెద్దాపురం నేత మార్కెట్టులో చేనేత పనివారు మార్కెట్‌మీద దాడిచేసి, కంపెనీ సిపాయిలను కొట్టి సరుకు ధ్వంసం చేశారు. ఈ సమస్యలను తట్టుకోలేక, 1776లో ఇంగ్లీషు కంపెనీ వెనక్కు మరలి వ్యాపారులతో కాంట్రాక్టులు చేసుకోవటం పునఃప్రారంభించింది.

**"ఉత్పత్తి చేసేవారిలో అధికభాగం చాలా పేదవాళ్ళు కనుక బయానా (అడ్వాన్స్) సొమ్ము చేతికివ్వనిదే వారు పనిచేయలేని పరిస్థితి ఉండేది. కనుకనే వర్తకులు వారిమీద పెత్తనం చేస్తారు"** అని జాన్‌ఇర్విన్ అన్నాడు. ప్రథమంలో యూరోపియన్ వర్తకులు భారతదేశ వస్తువులను వారి స్వదేశాలకు ఎగుమతి చేసే ఉద్దేశంలో లేరు. భారతదేశ వస్త్రాలను మలయా, తూర్పు ఇండియా దీవులకు తీసుకెళ్ళి అమ్మి లాభాలు గడించారని భావించారు.

మచిలీపట్నంలో అద్దకం / కలంకారీలు, ఇంజరం చేనేత వస్త్రాలు బరంపురం పట్టు, శ్రీకాకుళం మేలిరకం సన్ననూలు బట్టలు, బందరు, ఏలూరు, కర్నూలు రంగురంగుల నేత తివాచీలు, ఐరోపా, ఆగ్నేయాసియాలో మంచి గిరాకీ పలికేవి. అందుకనే యూరోపియన్ వర్తకులు ఈ ప్రాంతాలకు వెళ్ళి ముందుగా అడ్వాన్సులు చెల్లించి తమ కంపెనీల కోసం బట్టలు నేయించుకొనేవారు. ఒక్క మచిలీ పట్నంలో డచ్‌వారు 5వేల మంది నేతపనివారికి బయానా పెట్టుబడులు ఇచ్చుకొని, దాంతో పాటు కొంత ముడిసరుకు కూడా సరఫరా చేసి, చౌకగా పని చేయించు కొనేవారు. ఇంగ్లీష్ కంపెనీవారు 'ఇంజరం'లో ఏడువందలమంది చేనేత కార్మికులతో పైవిధంగా సొమ్ములిచ్చి పని చేయించుకొనేవారు.

## వృత్తిపనివారి స్థితిగతులు :

"(చేనేత) వృత్తిపనివారి పరిస్థితి చాలా దుర్భరంగా ఉంది. వారి తిండి హీనం. జీతాలు చాలాతక్కువ. విధిలేక బానిసలుగా బతకటం తప్ప గోల్కొండ (దేశపు) వృత్తి పనివారి బతుకులు అంతకన్న వేరుకాదు" అంటాడు మెత్‌వోల్డ్. "వాళ్ళు మాంసం రుచి ఎరుగరు. పెసరపప్పు, బియ్యం కలిపి మజ్జిగతో రాత్రి గడుపుతారు. పగటిపూట వేయించిన పప్పు లేక బియ్యం నములుతారు. మా పొట్టలకిది చాలును" అంటారు అని వ్రాశాడు 'ఫ్రాన్సిస్కో పెలార్ట్' ఆనాటి పనివారి పరిస్థితులు తెలుపుతూ, నానాటికీ పెరిగిపోతున్న ఈస్ట్ ఇండియా కంపెనీ రాజకీయ ప్రాబల్యం, ఆర్థిక బలం చూచి బ్రిటిష్ ప్రభుత్వం ఒక దశలో భయపడింది. భారతదేశం నుండి వెల్లువలా ముంచెత్తు తున్న, ముఖ్యంగా తూర్పుతీర నాజూకైన బట్టల పోటీను తట్టుకొనే చేనేత వ్యాపార వ్యవస్థ బ్రిటన్ దేశంలో లేదు. ఒకదశలో తమదేశానికి భారతతూర్పు తీరప్రాంతం బట్టల దిగుమతిని నిలిపివేయాలన్న ప్రతిపాదన బ్రిటిష్ పార్లమెంటు ముందుకు వచ్చింది. ఈస్ట్ ఇండియా కంపెనీ కార్యక్రమాలను, ఆధిపత్యాన్ని నియంత్రించాలని 1783లో పార్లమెంటీరియన్‌లు ఎడ్మండ్ బర్క్, ఫాక్స్ దొరలు చేసిన ప్రయత్నం విఫలమైంది. **'భారతదేశంలో బ్రిటిష్ దేశ వలస పాలక విస్తరణకు ఈస్ట్ ఇండియా కంపెనీయే కారణం'** అన్న నిజాన్ని పార్లమెంటు కాదనలేకపోయి కంపెనీకు అనుకూలంగా వ్యవహరించింది.

"తీరప్రాంత గ్రామాలన్నీ మంచి నైపుణ్యంకల నేతపనివారి మగ్గాల ధ్వని ప్రతిధ్వనించేది. కంపెనీ ప్రతినిధులు సంవత్సరానికి సరిపడ చెల్లింపులను ముందుగానే బట్వాడా చేసేవారు. ఆ చెల్లింపులకు ఆశపడి నేతపనివారు నేతపనికి ఒప్పుకొనేవారు. (పని అందించలేక) చివరకు వారే (కార్మికులు) కంపెనీకు బకాయిపడేవారు. ఈ ప్రక్రియలో కంపెనీ లాభపడేది. తక్కువధరకే (కంపెనీకు) వస్త్రాలు లభించేవి. చేనేత కార్మికులు బకాయిల కారణంగా కంపెనీకు వెట్టిచాకిరి చేసేవారు" (డా॥ బి. సారంగపాణి, వలస పాలనలో మచిలీపట్టణం చేనేత పరిశ్రమ వ్యాసం, కృష్ణాజిల్లా సర్వస్వం).

గ్రామాలలో నెలకొనియున్న ప్రతిమగ్గం మీద, తయారైన చేనేత వస్త్రాలమీద, ప్రతి చాపింగ్ కేంద్రం మీద ఇంగ్లీష్ కంపెనీ అధికతరం పన్నులు వేసేది. వేసిన పన్నులు, నేతకార్మికుల కుండా, చెంబు జప్తు పెట్టి వసూలుచేసేది. బలవంతపు వసూళ్ళకు దడిచి, అసలు పన్నులు చెల్లించలేక కార్మికులు గ్రామాలు విడిచి లేకుంటే వేరే వృత్తులకు వెళ్ళేవారు. "నూలు ఖరీదు ఏడురెట్లు, బియ్యం ఖరీదు ఇరవైరెట్లు పెరిగింది". దాంతో నేతపనివారికి పూటగడవని పరిస్థితి. వేతనాలు పెంచమని సమ్మెలు చేసినా నేతన్నల తలరాత మారలేదు. ఈస్ట్ ఇండియా కంపెనీ రోజుకూలి పెంచలేదు. మగ్గం మీద నేసిన బట్టకు గిట్టుబాటు ధర పలికేదికాదు. కాస్తో కూస్తో ఎక్కువ కూలీ డబ్బులు యిచ్చే డచ్,ఫ్రెంచ్ కంపెనీలకు చేనేత కార్మికులు మారటానికి ఆంక్షలు, నిర్బంధాలు. కంపెనీ ఉద్యోగులు, సాయుధ సిపాయిలు వీరి పని పర్యవేక్షించటానికి మగ్గాలకు వెళ్ళినప్పుడు, కాంట్రాక్టు ప్రకారం బట్టలు సప్లయ్ చేయని కార్మికుని కుటుంబం, కంపెనీ పర్యవేక్షకుని తిండి ఖర్చు భరించాలి'. మాదపాలెం చేనేత కార్మికులు ఆందోళన చేపట్టి కంపెనీ ప్రతినిధికి మెమోరాండం సమర్పించారు. **'మా కష్టాలను**

మీరు పట్టించుకోలేదు. కరువు కాటకాలలో కంపెనీ మమ్ములను ఆదరించలేదు. ఫ్రెంచ్ మరియు డచ్ కంపెనీలు ఇంగ్లీషు కంపెనీకంటే నేత బట్టలకు ఎక్కువ మజూరి ఇస్తున్నారు. బట్టల తయారీకి ఇంగ్లీషు కంపెనీ కన్నా రెండునెలలు ఎక్కువ గడువు ఇస్తున్నారు. మా సమస్యలు మీరు విని, మద్రాస్ ప్రభుత్వానికి నివేదించలేదు. మా జీతాలు పెంచ లేదు, మా విన్నపాలు పట్టించుకోలేదు. మామీద నిఘా మనుషులను పెట్టి మమ్మల్ని అనుమానించి, అవమానపర్చారు' ఇవి మెమోరాండం లోని విషయాలు. ఈ వినతిపత్రం ఇంగ్లీషు కంపెనీ తమ కమర్షియల్ బోర్డుకు రిఫర్ చేయగా, దాన్ని పరిశీలించిన బోర్డు దిగువ విధంగా కంపెనీ ఏజెంటుకు పెడసరపు జవాబు పంపింది. "నిన్ను కంపెనీ తరుపున నియమించింది గుమస్తాగా మండపేట తదితర ప్రాంతాల నేతకార్మికుల మీద అజమాయిషీ చేయటానికి మాత్రమే. ఇంగ్లీషు కంపెనీకు తప్ప, నేతకార్మికులు మరే ఇతర కంపెనీ పనులు చేయ కూడదు. కార్మికులు ఇతర కంపెనీలకు పనిచేస్తున్నట్లు నీ దృష్టికి వస్తే, నేతకార్మికుడు పనిచేస్తున్న చేనేత మగ్గంమీద నేతలో ఉన్న గుడ్డ కత్తిరించు. మన కంపెనీకు అనుకూలంగా వున్న ఏపనైనా నువ్వు చేయవచ్చు. ఇంగ్లీషు కంపెనీకు తప్ప, కార్మికులు ఏ ఇతర కంపెనీ కోసం మగ్గం మీద ఎక్కకూడదు". కంపెనీ యాజమాన్యం తమ పరిధిలోవున్న జమీందారులను, ఎస్టేటుదారులను పేద చేనేత కార్మికుల మీదకు ఉసిగొల్పారు. జమీందారులు కార్మికులను నిర్బంధాలపాలు చేశారు.

మరొక ఆందోళన విషయంలో డా॥ సారంగపాణి వ్రాశారు. 'నిడదవోలులో ఒకరాత్రి300 మంది చేనేతపెద్దలు సమావేశమై ఈస్ట్ ఇండియాకంపెనీకు ఒక అంగుళం గుడ్డ కూడా నేయకూడదని తీర్మానిం చారు.నిడదవోలు నుండి మిగిలిన ప్రాంతాలకు సమ్మెనువ్యాప్తి చేయాలని గ్రామాంతరాలు వెళ్ళారు. ఈ సమ్మెకు కంపెనీ చాలా తీవ్రంగా పరిగ ణించింది.సామ, దాన, భేద, దండోపాయాలుప్రయోగించారు. సంప్రదిం పుల పేరుతో అనేక హామీలిచ్చి సమ్మెను మొత్తంమీద విరమింప జేశారు. సమ్మెనుండి కార్మికులు తొలగకపోతే నిత్యావసర వస్తువులు, నేత ముడిసరుకులు పనివారి కుటుంబాలకు అమ్మవద్దని స్థానిక వర్తకులను శాసించారు. ఏమీచేయలేని స్థితిలో కార్మికులు సమ్మెను విరమించారు' గోదావరి జిల్లా ఇంజరం గ్రామం చేనేత బట్టల ఉత్పత్తి కేంద్రంగా పేరుపడింది. ఇంగ్లీషు కంపెనీ పెట్టే బాధలకు తట్టుకోలేక ఇంజరం చేనేత కార్మికులు పెద్ద ఎత్తున సమ్మె కట్టారు. ఆ గ్రామంలో బట్టలు నేసే కార్మికులు 1200 మంది ఉండేవారు. ఇక్కట్లుకు తాళలేక, ఇంగ్లీష్ కంపెనీలో పనిచేయటం ఇష్టంలేక డచ్ కంపెనీ, ఫ్రెంచ్ కంపెనీల అధికార్లకు మేనా (పల్లకీ)లు మోసే బోయలుగా పనిలో కుదిరారు. ఇంగ్లీష్ కంపెనీ ప్రతినిధులు తమవద్ద పనిచేసే నేత కార్మికు లను, కంపెనీ ఫ్యాక్టరీభవనాల్లో నిర్బంధించి గంటలకొద్దీ పనిచేయిం చేవారు. గోదావరి జిల్లా 150 గ్రామాల కార్మికులంతా ఏకమయి జీతాలు పెంచేదాకా, బట్టలమీద సుంకాలు తగ్గించేదాకా కంపెనీ విధుల్లో చేరమని చెప్పి సమ్మెకు దిగారు. ఈ సమ్మెను కూడా కంపెనీ కఠినంగా అణచివేసింది. శ్రీకాకుళం, విజయనగరం, కైకలూరులలో ఇంగ్లీషువారికి తప్ప, ఇతర కంపెనీవారికి అక్కడ తయారైన బట్టలు అమ్మితే, అట్టి సరుకుమీద అధికమొత్తం పన్ను విధించమని స్థానిక జమీందారులను కంపెనీవారు ఆదేశించారు. ఇంగ్లీషువారి నిర్బంధా లకు భయపడిన చేనేత కార్మికులు ఒంటరిగా ఉంటే తమకు ప్రమాదమని గుంపులు గుంపులుగా కలిసి తిరిగారు. డచ్, ఫ్రెంచ్ కంపెనీలకన్నా నలభై శాతం తక్కువ మజూరీ / వేతనం ఇవ్వటం, తెల్ల కాగితాలమీద సంతకాలు తీసుకోవటం, ఎదురుతిరిగిన వారిని చెట్లకు కట్టి హింసిం చటం కంపెనీ అధికార్లు చేసేవారు.

ఆవిరియంత్రం కనిపెట్టటంతో ఇంగ్లండ్ దేశంలో పారిశ్రామిక విప్లవం వచ్చింది. చేనేత మగ్గాలు పోయి, బట్టల తయారీ నిమిత్తం ఆవిరియంత్రంతో నడిచే బట్టలమిల్లులు మాంచెస్టర్‌లో కోకొల్లలుగా స్థాపించారు. **'ఇంగ్లీషు కంపెనీ భారతదేశంలో మెండుగా పండే ముడిపత్తిని కారుచౌక (టోకు)గా కొనుగోలు చేసి, బ్రిటన్‌కు ఎగుమతి చేశారు. మన పత్తిని వారి మిల్లుల్లో ఏకి, వారి మిల్లుల మీద బట్టలు తీసి తిరిగి మనదేశానికే ఎగుమతి చేసి అత్యధిక ధరలకు మనకే అమ్మకం చేసేవారు'** మాంచెస్టర్ మిల్లులు తూర్పుతీరం చేనేత మగ్గాల ఉసురుతీసాయి. మన చేనేత ఉత్పత్తులు పడిపోయాయి. నేతన్నలు తిండికి మలమల మాడిపోయారు. మిల్లు బట్టలు రాకపూర్వం ఒక్క మచిలీపట్నం నుండే యూరపు దేశాలకు సాలుసరి ముప్పై లక్షల రూపాయల చేనేతబట్టల వ్యాపారం సాగేది. 1843లో అదికాస్తా సాలుకు మూడువేల రూపాయలకు పడిపోయింది. ఎందరో చేనేత పనివారు, ఇక్కడ బ్రతకలేక శ్రీలంక, మారిషస్ దేశాలకు తిండికోసం, పనికోసం వలసపోయారు. ఇంగ్లండ్‌లో భారతదేశం వస్త్రాలపై 20 శాతంపన్నులు వేయగా,భారతదేశంలో ఇంగ్లండ్ దేశం మిల్లు వస్త్రాల పై 10శాతం పన్ను మాత్రమే విధించారు. 1800 సం॥లో 30 శాతం మాంచెస్టర్ మిల్లు బట్టలపై భారతదేశంలో పన్ను విధించబడింది. ఇదే 1807 కల్లా 44 శాతంగా పెంచారు. **'భారతదేశం కనుక స్వతంత్రదేశం అయిఉంటే, ఇంగ్లండ్ ఉత్పత్తుల మీద భారీగా పన్నులు విధించి, తన పరిశ్రమలను ఖచ్చితంగా కాపాడుకొని ఉండేది. ఇంగ్లండ్ దయా దాక్షిణ్యాల మీద ఆధారపడిన దేశం ఇండియా. తన పరిశ్రమలను తాను కాపాడుకొనే పరిస్థితి లేదు'** అంటాడు జె.ఎస్.మిల్. సాలెవారు మగ్గం పన్ను చెల్లించాల్సి వచ్చింది. మద్రాస్ ప్రెసిడెన్సీలో బ్రిటిష్ ప్రభుత్వానికి సాలుసరి 10 లక్షల రూపాయల 'మగ్గంపన్ను' వసూలయ్యేది. ప్రజల్లో కూడా రానురాను మిల్లుబట్టల మీద ఆకర్షణ

కలిగింది. చేనేత బట్టకన్నా, మిల్లు బట్ట నాణ్యత ఎక్కువ. ఎక్కువకాలం మన్నుతుంది... ధరకూడా చేనేతబట్ట మీద తక్కువ. పేద, మధ్యతరగతి వారికి ధర అందుబాటులో ఉండేది. క్రమంగా ఆంధ్రదేశం మార్కెట్లు మాంచెస్టర్ మిల్లు బట్టలతో నిండిపోయాయి."1800 సం॥ ప్రాంతంలో మచిలీపట్నం రేవునుండి 10 లక్షల (ఖరీదుచేసే) రూపాయల ఖరీదు చేసే చేనేతవస్త్రాలు ఎగుమతి అయినాయి. 1834లో అదే రేవు నుండి కేవలం, 2750 రూపాయల వస్త్రం మాత్రమేఎగుమతి అయింది" అంటారు డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు. మచిలీపట్టణం, నరసాపురం రేవుల్లో ఇంగ్లీషు కంపెనీవారు తమ ఓడలు కట్టించు కొనేవారు. ఇందుకు కన్నులు కుట్టిన ఇంగ్లండ్ రాజు 2వ ఛార్లెస్, 'ఇంగ్లీషు వర్తకులు ఇండియా రేవుల్లో నౌకలు నిర్మించుకోవటం గాని, మరమ్మత్తులు చేయించుకోవటం చేయరాద'ని నిషేధం విధిస్తూ శాసనం చేశాడు.

ఇంగ్లీషు ఈస్ట్ ఇండియా కంపెనీ వ్యాపారం పేరుతో తూర్పు తీరంలో తిష్టవేసి, ఈ దేశంలోని చేతివృత్తులను ఛిన్నాభిన్నం చేసింది. అంతకుముందు కాలంలో చేతివృత్తుల వారు, ఎవరి వృత్తిపనులు వారు తరతరాలుగా నిర్వర్తిస్తూ, తమ చేతిపనిముట్లతో అద్భుతమైన నైపుణ్యం చూపి, తమ వ్రేళ్ళతో అత్యద్భుతమైన సన్ననూలు బట్టలు సృష్టించి దేశ విదేశాలలో పేరు ప్రఖ్యాతులు సంపాదించారు. పొట్ట నింపుకున్నారు. యూరోప్ కంపెనీల ప్రవేశంతో దేశంలోని చేతివృత్తి కార్మికులు ముఖ్యంగా నేతన్నల బ్రతుకులు ఛిద్రమయ్యాయి. ఒకప్పుడు ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన స్వదేశీ చేనేత పరిశ్రమ ఖాయిలాపడి బ్రిటిష్ హయాంలో కనుమరుగయింది. కంపెనీల ప్రాపకంలో కుదేలయిన తూర్పుతీర చేనేత పరిశ్రమ, తిరిగి పుంజుకొని స్వతంత్ర భారతావనిలో ఇప్పుడిప్పుడే కుదుటపడుతుంది.

**ఆధార గ్రంథాలు**


1. ఆంధ్రుల సంస్కృతి - చరిత్ర ...
   శ్రీ కంభంపాటి సత్యనారాయణ, హెచ్‌బిటి, 1987
2. ఆంధ్రుల చరిత్ర ...
   డా॥ బిఎస్ఎల్ హనుమంతరావు, విశాలాంధ్ర పబ్లికేషన్స్, 1994
3. ప్రాచీనాంధ్ర నౌకా జీవనము ...
   శ్రీ భావరాజు వెంకట కృష్ణారావు, ప్రాచీ పబ్లికేషన్స్, 1923
4. ఆధునిక భారత చరిత్ర ...
   బిపిన్ చంద్ర, హెచ్‌బిటి, హైదరాబాద్, 1983
5. భారత సామాజిక చరిత్ర ...
   డా॥ పి. రామలక్ష్మి, తెలుగు అకాడమి పబ్లికేషన్స్, 1990
6. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము ...
   కొమఱ్ఱాజు లక్ష్మణరావు, 1934
7. తరతరాల బందరు చరిత్ర ...
   మహమ్మద్ సిలార్, సాహితీ మిత్రులు ప్రచురణ, 2010
8. గైడ్ టు రికార్డ్ ఆఫ్ మచిలీపట్నం డిస్ట్రిక్ట్ ...
   గవర్నమెంట్ ప్రింటింగ్ ప్రెస్, మద్రాసు (1682-1835)
9. ఎ హిస్టరీ ఆఫ్ సౌత్ ఇండియా ...
   కె.ఎ. నీలకంఠశాస్త్రి, ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్, లండన్, 1966
10. కృష్ణాడిస్ట్రిక్స్ మాన్యువల్ ...
    గోర్డెన్ మెకంజీ, లారెన్స్ అసైలమ్ ప్రెస్, మద్రాసు
11. మచిలీపట్నం & కాంబే (1500-1800) ...
    సిన్నప్ప అరసరత్నం, ఎం.ఎం. పబ్లికేషన్స్, న్యూఢిల్లీ, 1994
12. హిస్టరీ ఆఫ్ కృష్ణా డిస్ట్రిక్ట్ ...
    ప్రొ॥ వేటూరి ప్రభాకరశాస్త్రి, కృష్ణాడిస్ట్రిక్ట్ రైటర్స్ అసో॥, 2008


**కృష్ణవేణీ నదీమతల్లికి అర్ఘ్య ప్రదానం**

*కమండలధరాం దేవీం జపమాలాధరాం శుభాం బ్రాహ్మీం*

*సువర్ణవర్ణాభాం కృష్ణాం ప్రణతోస్మ్యహం*

*ఓం కృష్ణవేణ్యై నమః ఇదమర్ఘ్యం సమర్పయామి*

**చిరునామా :** *మహమ్మద్ సిలార్, డెప్యూటీ కలెక్టర్, (రి), మచిలీపట్టణం - 521 001. సెల్ : 9985564946*

శ్రీ పందిరి మల్లికార్జునరావు

# నాగార్జున కొండ శిల్పాల తరలింపు

నాగార్జున కొండనుంచి బౌద్ధశిల్ప కళాఖండాలను పురాతత్త్వ శాఖవారు అర్ధరాత్రి ఎక్కడికో తరలించుకొని వెళ్ళినారని ఇటీవల కొన్ని పత్రికలలో వెలువడిన వార్తలూ, ఆందోళనా గూర్చి ఇండియా ప్రభుత్వ సమాచారశాఖవారి వివరణ వెలువడినది.

వచ్చే సంవత్సరం జనవరిలో రంగూనులో బౌద్ధ ప్రపంచ పరిషత్తు మహాసభ జరుగనున్నది. ఆ సందర్భంలో ఒక బౌద్ధ కళాప్రదర్శనానికి కూడా ఏర్పాట్లు చేశారు. ఏతత్సమావేశ కార్యకర్తల కోరిక మీద ఇండియా ప్రభుత్వం యీ ప్రదర్శనానికి మనదేశం నుంచి బౌద్ధ శిల్ప కళాఖండాలు పంపడానికి అంగీకరించారు. నాగార్జున కొండ నుంచి ఆరు శిల్పఖండాలు పంప నిశ్చయించారు.

ఈ శిల్పఖండాలేకాక రంగూనుకి మరికొన్ని కూడా పంపు తున్నారు. న్యూఢిల్లీలో నున్న నేషనల్ మ్యూజియం, మధ్య ఆసియా పురావస్తు ప్రదర్శనశాలలనుంచీ, సాంచీ, నలందా, సారనాథ్,మద్రాసు, పాట్నా, మధురనగర పురావస్తు ప్రదర్శనశాలలనుంచీ, కలకత్తా ఇండియన్ మ్యూజియం, హైదరాబాదు ప్రభుత్వ మ్యూజియముల నుంచీ కూడా కొన్ని కొన్ని బౌద్ధశిల్పఖండాలు పంపడానికి ప్రభుత్వం వారు నిశ్చయించారు.

ఈ కళాఖండాలు సేకరించి రంగూనుకు పంపే విషయంలో యే మాత్రం విరామానికిగాని అవకాశం లేనందువల్ల వాటిని ఆదరా బాదరాగా ఢిల్లీకి తీసుకువెళ్లడం జరిగిందనీ, ఏమాత్రం ఆలస్యం లేకుండా వీటిని రంగూనుకు తీసుకువెడుతున్నారనీ, ప్రదర్శనం ముగిసిన వెంటనే వీటిని రంగూనునుంచి రప్పించి మనదేశంలో ఆయా మ్యూజియములకు చేరుస్తారనీ కేంద్రప్రభుత్వ సమాచారశాఖ ప్రకటన వల్ల తెలుస్తున్నది.

1950వ సంవత్సరం జనవరిలో నాగార్జున కొండనుండి తీసుకు వెళ్లిన కొన్ని శిల్పఖండాలు అప్పటినుంచీ భారత రాజధాని అయిన ఢిల్లీలో నేషనల్ మ్యూజియంలో ఆంధ్ర సంస్కృతిశాలలో ప్రదర్శనార్థం ఉంచారనీ, వాటిని బహుజాగ్రత్తగా రక్షిస్తున్నారనీ కూడా ఈ ప్రకటన తెలియజేస్తున్నది.

నాగార్జున శిల్ప కళాఖండాల తరలింపు విషయంలో ఆంధ్ర ప్రజానీకంలో చాలా ఆందోళన వ్యాపించినది. పురాతత్త్వశాఖవారు ఈ శిల్ప ఖండాలను తరలించుకొనిపోయే సందర్భంలో ప్రజలు ఈ శిల్పాలు ఉన్న లారీలను అడ్డుకొన్నారు. వాటిని ఏ విధంగాను ఆంధ్ర దేశం పొలిమేరలు దాటిపోకుండా కాపాడుకోవాలని చాలా ప్రయత్నం చేశారు. అంటే – దీనినిబట్టి ఆంధ్రులకు ఈ శిల్ప ఖండాలపట్ల గల ఆసక్తి సుస్పష్టంగా ద్యోతకమవుతూ ఉన్నది. నాగార్జున కొండ శిల్ప ఖండాలు ఆంధ్రలో ఏర్పడగల మ్యూజియములోనే ఉండాలనీ, వాటిని అన్యప్రాంతాలకుకొనిపోవడం ఆంధ్రులకు ఎంతమాత్రం సమ్మతం కాదనీ నిరూపితమవుతున్నది. కాబట్టి, ఈ సందర్భంలో ప్రభుత్వం దానికి భిన్నంగా లేనట్లుగానే ప్రకటన తెలియజేస్తున్నది.

అయితే, భారత రాజధానిలోని నేషనల్ మ్యూజియంలోని శిల్పాల విషయం ఏమిటి? అవి అక్కడ ఆంధ్ర సంస్కృతిశాలలో భద్రంగా ఉన్నాయనీ,"ఇవికాక, నాగార్జున కొండలో యింకా ఎన్నో శిల్పఖండాలు వుండనే వున్నా"యనీ ప్రభుత్వ ప్రకటన తెలియజేస్తున్నది. అంటే నేషనల్ మ్యూజియమునకు కొనిపోబడిన శిల్పఖండాలను ఆంధ్రదేశానికి తిరిగి ఇచ్చివేయాలనే అభిప్రాయం ప్రభుత్వానికి లేనట్లు ఈ ప్రకటనవల్ల ఊహించడానికి అవకాశం ఏర్పడుతున్నది.

భారత రాజధానిలోని ఆంధ్ర సంస్కృతిశాలలో ఇవి భద్రపరుపబడి ఉండడంవల్ల వీటికి ఎక్కువ ప్రచారం, ప్రదర్శనానుకూలం ఏర్పడ గలవని ప్రభుత్వం భావించి ఉండవచ్చును. అది హర్షింపదగిన విష యమే. కాని, ఆంధ్రదేశానికి చేరవలసిన శిల్పఖండాలఅసలు శిల్పాలను గాక, ప్రతిరూపాలను తయారుచేయించి నేషనల్ మ్యూజియంలో

ప్రదర్శించవచ్చు. అసలు శిల్పకళాఖండాలు ఆంధ్రదేశంలో ఏర్పడగల కేంద్రప్రదర్శనశాలకు ఏనాటికయినా చేరవలసి ఉంటుంది.

ఆంధ్రదేశంనుంచి లభించినవీ, ఆంధ్రదేశానికి సంబంధించినవీ అనేక శిల్పఖండాలూ, తదితర వస్తువులూ మద్రాసు మ్యూజియంలో ఉన్నవి. ఆంధ్రరాష్ట్రం అవిభక్త మద్రాసు రాష్ట్రంలో ఉన్నప్పుడు, ఆంధ్రదేశంలో అనుకూలమైన మరియొక మ్యూజియంలేనందువల్ల మద్రాసు మ్యూజియమునకు చేర్చబడ్డాయి. కాని, ఇప్పుడు ఆంధ్రరాష్ట్రం ఏర్పడినది. ఆంధ్రదేశానికి ప్రత్యేకప్రదర్శనశాల ఏర్పడగలదు. కావున, ఆంధ్రకు చెందవలసినవన్నీ కూడా ఆంధ్రరాష్ట్రానికి తిరిగి ఇచ్చివేయ వలసి ఉంటుంది.

మేము పదేపదే సూచించినట్లు ఆంధ్రదేశానికి ఒక కేంద్ర ప్రదర్శనశాల సాధ్యమైనంత త్వరలో ఏర్పడాలి. ఆంధ్రచరిత్రకూ, ఆంధ్ర సంస్కృతికీ సంబంధించిన యావత్తు వస్తుసంపదా ఈ మ్యూజియములో భద్రపరచబడాలి. నేషనల్ మ్యూజియములోనూ, మద్రాసు మ్యూజియములోనూ ఉన్న ఆంధ్రదేశపు శిల్పాలు ఆదిగాగల సమస్తమూ ఏర్పడగల ఆంధ్రమ్యూజియమునకు తప్పక చేరవలసి ఉంటుంది.

### తెలుగు విజ్ఞాన సర్వస్వం :

భారతదేశపు భాషలలో ప్రధానమైన వాటిలో తెలుగు ఒకటి. తెలుగు వాఙ్మయము ఇతర భారతీయభాషలలోని వాఙ్మయానికి ఎంత మాత్రము తీసిపోదు. కాని, నేటివరకు విజ్ఞాన సర్వస్వం ప్రచురింప బడియుండలేదు.

కీర్తిశేషులైన కొమర్రాజు లక్ష్మణరావుగారు తెలుగు విజ్ఞాన సర్వస్వాన్ని ప్రకటించడానికి ప్రయత్నం చేశారు; కాని, అది కొనసాగలేదు. తరువాత శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు అందుకు మరల పూనుకొని, రెండు సంపుటాలను ప్రకటించారు.

తెలుగులో విజ్ఞాన సర్వస్వాన్ని రచించి, ప్రకటించడానికి తెలుగు భాషాసమితి మద్రాసులో ఏర్పడి, ఈ కార్యనిర్వహణకు పూనుకొన్నది. ఈ తెలుగు భాషాసమితి ఆధ్వర్యాన తెలుగులో పన్నెండు సంపుటాలలో విజ్ఞానసర్వస్వాన్ని ప్రకటించడానికి ఏర్పాట్లు చేయబడినాయి. అందులో మొదటి సంపుటం – చరిత్ర, రాజనీతి పూర్తి అయి, ఇప్పుడే ప్రకటితమయినది. ఇది సంతోషదాయకమైన విషయం.

సైన్సుకి సంబంధించిన సంపుటము అచ్చులోనున్నది. అదికూడ త్వరలో ఆంధ్రప్రజానీకానికి అందజేయబడగలదు. ఆంధ్ర సంస్కృతికి సంబంధించిన సంపుటమూ, భూగోళాది శాస్త్రాలకు సంబంధించిన సంపుటాలు రెండూ రచన పూర్తికాగానే ముద్రణకేర్పాట్లు జరుగగలవనీ, త్వరలోనే ఈ మూడు సంపుటాలూ ఆంధ్రప్రజకు సమర్పింపబడగలవనీ తెలుస్తున్నది.

తెలుగులో విజ్ఞాన సర్వస్వాన్ని ప్రకటించడానికి సంకల్పించి, పనిచేస్తున్న తెలుగు భాషాసమితి శ్లాఘాపాత్రమైనది. యావదాంధ్రుల సహకారం, ఆదరాభిమానాలు తెలుగు భాషాసమితికి లభించి, తెలుగులో ఒక విజ్ఞాన సర్వస్వం సాధ్యమైనంత త్వరలో ప్రకటితం కావడానికి అవకాశం ఏర్పడగలదని ఆశింపవచ్చును.

## సనకాది మునులకు అర్ఘ్య ప్రదానం

సనకాద్యాస్తథా సింధుః కపిలాద్యా మహాజనాః
తే గృహ్ణంతు మయాదత్తమర్ఘ్యం సింహగతే గురౌ
ఓం సనకాది మహాజనేభ్యో నమః ఇదమర్ఘ్యం సమర్పయామి

డా॥ ఈమని శివనాగిరెడ్డి స్థపతి

# నీటిముంపు దేవాలయాల తరలింపు

*(Transplantations of Temples)*

ఆదిమ మానవుడు ఆఫ్రికాలోనే ఆగలేదు. తిండికోసం మొండిగా తిరుగుతూ, తిరుగుతూ దేశాలే కాదు, ఖండాలు, ఖండాంతరాలకు చేరుకొన్నారు. రాతి పనిముట్లను రోజువారీ పనుల కోసం వాడుకొన్న దిగుమ పాత రాతియుగపు ఆదిమానవులు ఆఫ్రికాలోని ఇథియోపియా, కెన్యా, టాంజేనియా, ఉగాండాలలో తమ ఉనికిని చాటుకొని లక్షల సంవత్సరాల క్రితం ఆహారం కోసం యూరేషియాకు విస్తృతంగా వలసపోయారు. అటు తరువాత చిన్నసైజు రాతి పనిముట్లను తయారు చేసుకున్న మధ్యరాతి యుగపు మానవులు ఆఫ్రికాను వదలి ఇతర ప్రాంతాలకు భారీగా వలస వెళ్ళారు. ఇప్పటి మానవులకు ఆద్యులుగా పేర్కొన్న (హోమోసెపియన్లు) ఎగువరాతి యుగపు ప్రజలు ఆఫ్రికా నుంచి ఆస్ట్రేలియా,అమెరికాల వైపు వెళ్ళి అక్కడే స్థిరనివాస మేర్పరుచుకొన్నారు. ఇందులో భాగంగానే జావా (జావా మనిషి) చైనా (పీకింగ్ మనిషి) ఐరోపా (పయొనీర్ మాన్), జర్మనీ (హీడెల్ బర్గ్ మాన్) లకు కూడా చేరుకొని శరీరపు ఆకారం, రంగు, పుర్రె ఆకారం, వెంట్రుకలు, కళ్ళు, ఒక్కో ప్రాంతంలో ఒక్కో విధంగా ఉండి, భిన్న జీవన విధానాలకు అలవాటు పడినారు. తొలుత సహజసిద్ధమైన గుహల్లో ఉంటూ, తరువాత కొండ చరియల కిందకి మారి, ఆహారం కోసం జంతువులను వేటాడేవారని, గుహల గోడల మీద, కొండ చరియల కింద గీసిన వర్ణచిత్రాల వల్ల తెలిసింది. పాతరాతియుగం చివరి రోజుల్లో సరిపడా ఆహారాన్ని సేకరించుకున్న తరువాత, కొద్దిపాటి ఖాళీ సమయంలో అప్పటివరకూ తాను చూసిన జంతువులు, చేసిన పనులను చుట్టు పక్కల దొరికిన ఎర్రజాజు మట్టికి, కొవ్వులు, చెట్లపాలను కలిపి రంగు బొమ్మల్ని గీయటంతో మనిషి తన అనుభూతుల్ని బయటి ప్రపంచానికి ఆవిష్కరించటం ప్రారంభ మైంది. అది అంతటితో ఆగక, రాతి పనిముట్ల తయారీలో నైపుణ్యాన్ని సంపాదించిన ఎగువ రాతియుగం నాటి మానవులు దంతం, ఆల్చిప్ప లతో పూసలు చేసుకొని, మెళ్ళో ధరించేవారని, దక్షిణాఫ్రికాలోని కేప్ టౌన్‌కు దగ్గర్లోని బ్లోంబాస్ గుహలో దొరికిన గవ్వలకు చిల్లులు పెట్టి చేసిన హారం వల్ల తెలుస్తుంది. ఈ పూసలు క్రీ.పూ. 75000 సం॥ల నాటివని పురావస్తు శాస్త్రవేత్తలు తేల్చారు. తరువాత చెక్ రిపబ్లిక్‌లోని వెస్టోనీస్‌లలో క్రీ.పూ. 29,000 నాటి తొట్టతొలి మట్టిబొమ్మ బయట పడింది.

మధ్యరాతియుగం నాటికి మనిషి చనిపోయిన వారిని పాతిపెట్టే పనికి పూనుకొని, శవాలతో పాటే చనిపోయిన వారు వాడుకొన్న పూసలు, ఇతర పరికరాలు, పనిముట్లను, వాడిన ఆయుధాలు, అలం కార సామాగ్రిని పూడ్చి పెట్టేవారు. ఇటలీలోని ఎరీన్ కాండీడ్ లో జరిపిన తవ్వకాల్లో సముద్రపు గవ్వలతో చేసిన నక్లెస్, తలపై టోపీలతో గల 18 సం॥ల యువకుని అస్తిపంజరం బయటపడి పై విషయాన్ని రుజువు చేస్తున్నాయి.

కొత్త రాతియుగానికి కొద్దిగా ముందే ప్రారంభమైన చదును చేసిన నేలపై సాగు చేయటం వ్యవసాయానికి దారితీసి, ఆహార సంపాదన దశ నుండి, ఆహారం నిల్వ చేసుకునే దశకు చేరుకొని, గ్రామాలు రూపు దిద్దుకొని, మనిషి చనిపోయినపుడు, బిడ్డ పుట్టినపుడు, తొలి సారిగా ఇద్దరు దంపతులైనపుడు, విందులు, వినోదాలు, వేడుక లప్పుడు అందరూ ఒకచోట గుమిగూడేవారు. ఆయా సందర్భాలకు గుర్తులుగా రాళ్ళను నిలబెట్టడమో, కట్టడాలను చేపట్టడమో చేసేవారు. ఆనాటి ఆనవాళ్ళుగా మిగిలి, మొత్తం మానవాళి వారసత్వ సంపదగా గుర్తింపు పొందాయి.

## ప్రపంచ తొలి కట్టడాలు, నగరాలు

నిలువుగా పాతిన రాళ్ళపై మరో కప్పు రాయి నుంచటం, విడి విడిగా పెద్ద పెద్ద రాళ్ళను పాతిపెట్టడంలాంటి ప్రయత్నాలు స్థలాలపై యాజమాన్యాన్ని చాటటానికేనని పురావస్తు శాస్త్రవేత్తలు అభిప్రాయ పడుతున్నారు. ఐర్లాండ్‌లోని బర్రెన్ వద్ద గల పోల్నబ్రోన్ అనే డాల్మెన్

ఇందుకు ఉదాహరణ. ఇలా ప్రారంభమైన కట్టడాలు, సమాధులే స్మారక చిహ్నాల నిర్మాణానికి దారి చూపినట్లు ఐర్లాండ్, స్పెయిన్, బ్రిటన్, స్కాట్‌లాండ్‌లలో బయల్పడిన సమాధి గదులు నిరూపిస్తు న్నాయి. అటు తరువాత కంచు యుగానికి (క్రీ.పూ. 3500) చెందిన రాతిచుట్టు, స్కాట్‌లాండ్‌లోని మేక్రీమూర్‌లో గుండ్రంగా నిలబెట్టిన రాళ్ళు తరువాతికాలపు (ఇనుపయుగం) సమాధుల రూపకల్పనకు తోడ్పడినాయి. సాల్స్‌బరీలోని స్టోన్ హెంజ్, ఈస్టర్ ఐలాండ్‌లోని ఒంటిరాతి శిల్పాల వరుస, ఇలా సామూహికంగా నిర్మించిన కట్టడాలే. ఈ క్రమంలోనే ప్రాచీన నగరాలు, పట్టణాలు క్రీ.పూ 2650 నాటికే ఈజిప్టులోని తొలి ఖుపు పిరమిడ్, స్పింక్స్‌లు, క్రీ.పూ. 1750 నాటి క్రీటే ద్వీపంలో నాసోస్‌లో బయల్పడిన వర్ణచిత్రాలున్న మినోన్ రాజ ప్రాసాదం క్రీ.పూ. 1200 నాటి మధ్య అమెరికా (తరువాతి మయా సంస్కృతి) క్రీ.పూ. 800 నాటి ట్రాయ్ నగరం, క్రీ.పూ, 776 నాటి ఒలింపిక్ క్రీడలకు నాంది జరిగిన ఒలింపియా నగరం, ఇలా ఒక్కొ క్కటిగా నిర్మింపబడి ప్రపంచనాగరికత చిహ్నాలుగా ప్రపంచ ప్రజ లందరిచేత కొనియాడబడుతున్నాయి.

అభివృద్ధి పనులు చేపట్టినపుడు, యుద్ధాలు జరిగినప్పుడు, ప్రాజెక్టులు కట్టినప్పుడు, భూకంపాలు, వరదలు వచ్చినప్పుడు వారసత్వ కట్టడాలను భావితరాల కోసం భద్రపరిచేందుకు ఐక్యరాజ్యసమితిలోని యునెస్కో నడుం కట్టుకొని, సభ్యదేశాల సహకారంతో అలా ముప్పుకు గురైన కట్టడాలు, కళాఖండాల తరలింపుకు శ్రీకారం చుట్టింది. పరిరక్షణ చేపట్టడానికి వీలుగా సభ్యదేశాల్లోని వారసత్వ కట్టడాల జాబితా తయారుచేయటానికి పూనుకొన్న యునెస్కో ప్రపంచ వారసత్వ కేంద్రాన్ని స్థాపించి ప్రపంచవ్యాప్తంగా, ఇప్పటివరకూ 139 దేశాల్లో, 830కి పైగా చారిత్రక స్థలాలు, కట్టడాలను గుర్తించింది. 1837లో ఫ్రాన్స్‌లో ప్రారంభమైన తొలి కట్టడాల జాబితా తయారీ కార్యక్రమం యునెస్కోకు మార్గదర్శకమైంది.



రూపల సంగమేశ్వరాలయం

భారీ నీటిపారుదల, విద్యుదుత్పాదక ప్రాజెక్టులు నిర్మించినపుడు ఏర్పడే జలాశయాల కింద స్థలాలు, కట్టడాలు ముంపుకు గురౌతాయి. గ్రామాలు, పట్టణాలను ముంపుకు ఎగువభాగాన మళ్ళీ నిర్మించి, ప్రజలకు స్థానిక ప్రభుత్వాలు పునరావాసం కల్పించినా చారిత్రక, వారసత్వ కట్టడాలు, స్థలాలు ఒక్కోసారి నిరాదరణకు గురై నీటిమునక బారిన పడేవి.

## చారిత్రక కట్టడాల తరలింపు - తొలి ప్రయత్నం

1960 లో ఈజిప్టులోని ఆశ్వాన్ డాం నిర్మాణం సందర్భంగా క్రీ.పూ.1250 ప్రాంతంలో అప్పటి ఈజిప్టు ప్రభువు ఫారో రామ్‌సెసే -2 తన సార్వభౌమత్వాన్ని చాటుతూ దక్షిణ ఈజిప్టులో నైలు నది ఒడ్డున నిర్మించిన అబూసింబల్ అనే ఆలయాలు నాసర్ జలాశయంలో ముంపుకు గురైనాయి. మూడువేల సం॥ల నాటి అపురూప వారసత్వ కట్టడాలైన అబూసిబెల్ ఆలయాలను ఎలాగైనా పరిరక్షించాలనుకున్న యునెస్కో సభ్యదేశాల సహకారంతో నిపుణులైన ఇంజనీర్లు, పురాతత్వ వేత్తలు, పరిరక్షణలో తర్ఫీదుపొందిన సిబ్బందితో, 30 టన్నుల బరువు తూగేముక్కలుగా ఆ ఆలయాలను, శిల్పాలుగా విడగొట్టి, సురక్షితంగా తరలించి ఎగువ భాగాన మళ్ళీ నిర్మించి కాపాడారు.

## ఆంధ్రప్రదేశ్‌లో కట్టడాల తరలింపు కార్యక్రమం

ఇదే స్ఫూర్తితో1962లో నాగార్జునసాగర్ జలాశయం ముంపుకు గురైన ప్రాంతంలోని ఒకప్పటి ఇక్ష్వాకుల రాజధాని శ్రీపర్వత - విజయపురి, నదికి ఉత్తర గట్టునున్న ఏలేశ్వరంలో తవ్వకాలు జరిపి నాటి బౌద్ధ కట్టడాలను, నాగార్జునకొండ మీద,అనుపు వద్ద పునర్ని ర్మించగా, కాకతీయుల కాలంనాటి రంగనాథాలయాన్ని, ఏలేశ్వర స్వామి ఆలయాలను నాగార్జునసాగర్ వద్ద పునర్నిర్మించి అపురూప కళాసంపదను కాపాడారు.

దాదాపు ఇదే కాలంలో శ్రీశైలం వద్ద కృష్ణానదిపై ఆనకట్టను కట్టి సాగునీటికి, విద్యుదుత్పత్తికి తోడ్పడే శ్రీశైలం హైడ్రో ఎలక్ట్రిక్ ప్రాజెక్టు నిర్మాణానికి అప్పటి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ శంకుస్థాపన చేయగా, మరోసారి పునరావాస కార్యక్రమం అవసరమైంది. చారిత్రక స్థలాలు, కట్టడాలు, శిల్పాలు, శాసనాలను పరిరక్షించే పనిని కేంద్ర పురావస్తు సంస్థ రాష్ట్ర పురావస్తు శాఖ, దేవాదాయ శాఖ, బిర్లా పురావస్తు సాంస్కృతిక సంస్థ, ఆచార్య నాగార్జున యూనివర్సిటీలు నెత్తికెత్తు కొన్నాయి. ఇందులో భాగంగా, చారిత్రకస్థలాల వద్ద తవ్వకాలు

చేపట్టడానికి శిల్పాలు, శాసనాలను తరలించి కొత్తగా నిర్మించే మ్యూజియాల్లో ప్రదర్శించడానికి, దేవాలయాలను ఊడదీసి,ఎగువకు తరలించి, మళ్ళీ ఇదివరకటి మాదిరిగానే పునరావాస గ్రామాల్లో గానీ, వాటికి దగ్గరగా గానీ నిర్మించడానికి అవసరమైన నిధులను సాగునీటిశాఖ సమకూర్చింది.

పాండిచ్చేరిలో ఫ్రెంచి ప్రభుత్వ సహకారంతో నెలకొల్పిన ఇండాలజికల్ ఇన్‌స్టిట్యూట్, సొంత ఖర్చులతో నూట రెండు గ్రామాలను సర్వేచేసి ఫ్రెంచి భాషలో ఎంట్రై శ్రీశైలం ఎట్ ఆలంపూర్ అన్న శీర్షికతో రెండు గ్రంథాలను ప్రచురించింది. ఇదే సమయంలో ఉస్మానియా యూనివర్సిటీ చరిత్ర, పురావస్తు శాఖకు చెందిన ప్రొ।।ఎం. రాధాకృష్ణ శర్మ అన్ని గ్రామాలు తిరిగి ప్రతి ఊరులోనూ ఉన్న చారిత్రక దేవాలయాలు, శిల్పాలు,శాసనాల వివరాలను సేకరించి శ్రీశైలం సబ్‌మెర్జిబుల్ ఏరియా ఏ కేస్ ఫర్ సాల్వేజ్ ఆర్కియాలజీ అన్న పేరుతో 1980లో పుస్తకాన్ని ప్రచురించారు. కేంద్ర పురావస్తు సంస్థకు చెందిన డా।। ఇ.కె.శర్మ ముంపు గ్రామాల్లో విస్తృతంగా గాలింపు జరిపి, 1977 నాటికే గ్రామం వారీగా గల రాతియుగం నుంచి, మధ్యయుగాల దాకా గల వివిధ పురావస్తు, చారిత్రక శకలాలు, స్థలాలు, కట్టడాల వివరాలను పొందుపరచిన అముద్రిత నివేదికను రూపొందించారు. రాష్ట్ర పురావస్తు శాఖకు చెందిన డా।।పి.వి. పరబ్రహ్మశాస్త్రి, డా।।వి.వి. కృష్ణశాస్త్రి సర్వే జరిపి శాసనాలు, శిల్పాల వివరాలను సేకరించటంతో పాటు తవ్వకాలు, చేపట్టవలసిన శిల్పాలు, శాసనాలు తరలించాల్సిన ఊళ్ళ వివరాలతో కూడిన నివేదికను తయారుచేసి ప్రభుత్వానికి సమర్పించి, నిధులకేటాయింపు కూడా పొందగలిగారు.

పురాతన స్థలాలను, పాతరాతియుగం, కొత్తరాతియుగం, రాగి–రాతియుగం, ఇనుపయుగం, చారిత్రక తొలియుగం, చారిత్రక తొలి మధ్యయుగం, మధ్యయుగం, విజయనగరానంతర సంస్థాన యుగాలకు చెందిన స్థలాలుగా విభజించారు.

## పురాతన స్థలాల వద్ద తవ్వకాలు

మహబూబ్‌నగర్ జిల్లా యాపలదీవిపాడు (కృష్ణానది ఒడ్డున) వద్ద జియొలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా వారి సహకారంతో రాష్ట్రపురావస్తు శాఖ జరిపిన తవ్వకాల్లో ఎండ్‌ప్లీస్టోసీన్ కాలానికి (పాత రాతియుగపు తొలినాళ్ళు) చెందిన రాతిగొడ్డళ్ళతో పాటు దున్నపోతు (Bosna-madicus) అవశేషాలు దొరకటంతో, ఈ ప్రాంతం ఆనాటికే ఆదిమ మానవుని ఆవాసంగానే కాక జంతుజాలానికి కూడా నెలవుగా ఉండేదనీ, నీటివనరు, పచ్చికబయళ్ళు విరివిగా వుండటమే దీనికి కారణమని పరిశోధకులు తేల్చి చెప్పారు. రాష్ట్ర పురావస్తు శాఖ ఆధ్వర్యంలో మహబూబ్‌నగర్ జిల్లా చిన్నమారూరులో జరిపిన తవ్వకాల్లో కొత్త రాతియుగం (నునుపైన పదును తేలిన రాతి పనిముట్లు, పశుపాలన, వ్యవసాయం ప్రారంభమైన కాలం) రాగి – రాతియుగం, ఇనుప యుగాలనాటి అవశేషాలు బయల్పడినాయి.కొత్త రాతియుగం, ఇనుప యుగాల వారి అవశేషాలు బయల్పడినాయి. కొత్తరాతియుగపు పాలిష్ చేసిన పనిముట్లతో పాటు, అస్థిపంజరం, పాతసామాగ్రి, తరువాతి కాలపు మరో సమాధిలో కాళ్ళకు రాగి కడియాలు, చేతికిరాగి ఉంగరం దొరికిరాగి – రాతి యుగపు ఆధారాలు, క్రమేపీ ఈ స్థలం ఇనుప యుగపు ప్రజలకుకూడా వాసయోగ్యమైనట్లు అక్కడ ఇనుప యుగపు పెట్టె సమాధులు, అస్థిపంజరాలు,ఇనుప పనిముట్లు, నలుపు – ఎరుపు మట్టి పాత్రలు, పూసలు దొరికాయి. క్రీ.పూ. 4000 నుండి క్రీ.పూ. 500 సం।।ల వరకూ చిన్నమారూరు నివాస స్థలంగా కొనసాగింది.

ఇదే జిల్లాలో ఇనుపయుగపు సమాధులున్న ఆలంపూర్ దగ్గరున్న చాగటూరు,ఉప్పలపాడులలో రాష్ట్ర పురావస్తుశాఖ జరిపిన తవ్వకాల్లో గుర్రాలపై స్వారీ చేసేపుడు కాళ్ళు పెట్టుకునే ఇనుప స్టిరప్పులు, కళ్ళేలు, ఇనుపమేకులు, గడ్డపార, అస్థిపంజరాలు దొరికాయి. చాగటూరులో భూమి పైకి ఎత్తుగా రాళ్ళు పేర్చి, వాటిపై పెద్ద కప్పు బండ నుంచిన రెండు సమాధులున్నాయి. వాటిని రాజు, రాణీ సమాధులని పిలిచారు. క్యాతూరు సమీపంలోని శేరుపల్లి, బూడిదపాడుల్లో ఇనుపయుగపు పెట్టె సమాధులు, వాటిలో అస్థిపంజరాలు, నలుపు, ఎరుపు మట్టి పాత్రలు బయల్పడినాయి. శేరుపల్లికి దగ్గర్లో కృష్ణానది ఒడ్డున గల పిన్నాపురంలో ఇనుపయుగానికి చెందిన చుట్టిల్లు (రాళ్ళు పరచిన నేలతో) ఒక కొలిమి బయటపడినాయి. వనపర్తి దగ్గర కొరపాకలలో డా।।బి. సుబ్రహ్మణ్యం ఇనుపయుగపు సమాధులను తవ్వారు.

చారిత్రక తొలి యుగానికి చెందిన తవ్వకాలు పెద్దమరూరు, రంగాపురం,క్యాతూరు, వీరాపురం, చేబోలు వద్ద జరిగాయి. రాష్ట్ర పురావస్తు శాఖ చేపట్టిన తవ్వకాల్లో పెద్దమారూరు, క్యాతూర్‌లలో శాతవాహనకాలం (క్రీ.శ. 1–2 శతాబ్దాలు) నాటి ఇంటి పునాదులు, మట్టిపూసలు లభించగా చేబోలులోనూ రంగాపూర్ దగ్గర క్రీ.శ.1వ శతాబ్దికి చెందిన ఇటుకల (60×30×7 సె.మీ) తో నిర్మించిన శివాలయాలు పునాదులు బయల్పడినాయి.చిత్తూరు జిల్లా గుడి మల్లాంలోని క్రీ.పూ. 1వ శతాబ్ది శివాలయం తరువాత మళ్ళీ వెలుగు చూసిన శివాలయాలు ఇవే.చేబోలులో 'కన్యగంభ' అన్న బ్రాహ్మీ శాసనం కూడా దొరికింది.

బిర్లా పురావస్తు సంస్థ కర్నూలు జిల్లా వీరాపురం దగ్గర జరిపిన తవ్వకాల్లో పాత రాతియుగం నుండి మధ్యయుగాల పురాతన ఆధారాలు దొరికాయి. అన్నిటికీ మించి శాతవాహన, ఇక్ష్వాకు, మహారథి నాణేలు, ఇక్ష్వాకుల కాలపు 14 ఇటుక రాతి శివాలయాలు బయట పడినాయి. కోస్తా తీరాంధ్ర దేశంలో బౌద్ధం విశేషంగా ఆదరించబడు తున్నపుడు, కృష్ణా తీరంలో ఎగువభాగాన కర్నూలు – మహబూబ్

నగర్ జిల్లాలో శివాలయాలు నిర్మించబడటం గమనించదగ్గ విషయం. రాష్ట్ర పురావస్తుశాఖ గుమ్మడం వద్ద, కేంద్ర పురావస్తు సంస్థ కూడలి సంగమేశ్వరం వద్ద జరిపిన తవ్వకాల్లో క్రీ.శ. 4వ శతాబ్ది నాటి ఇటుకరాతితో నిర్మించిన శివాలయాల ఆనవాళ్ళు బయల్పడినాయి.

కేంద్ర పురావస్తు సంస్థ కర్నూలు జిల్లా సాతానికోట వద్ద జరిపిన తవ్వకాల్లో శాతవాహన కాలపు గ్రామం బయటపడింది. ఇటుకరాళ్ళతో నిర్మించిన పునాదులు, గోడలు, డ్రైనేజి వ్యవస్థతో పాటు, శాతవాహన నాణేలు, మట్టిపాత్రలు, పూసలు, ఇనుప పనిముట్లు దొరికాయి. చుట్టూ మట్టీ, ఇటుకలతో నిర్మించిన కోటగోడ కూడా బయల్పడింది. కొన్ని చోట్ల సహజసిద్ధంగా ఉన్న బండరాతిని చెక్కుకొని, దానిపై ఇటుకలతో కోటగోడను లేపారు. చుట్టూ కందకం, బయటినుంచి లోపలికి వచ్చేవారిని, లోపలినుంచి బయటికి వెళ్ళేవారిని నియంత్రించేందుకు అవసరమైనపుడు మాత్రమే వాడుకొనేట్లు హౌరాబ్రిడ్జి మాదిరిగా, ఇక్కడ ఒక సస్పెన్షన్ బ్రిడ్జి ఆ కాలంలోనే ఉందన్న ఆధారాలు పురావస్తు పరిశోధకులను విస్మయానికి గురిచేశాయి.

నాగార్జున యూనివర్సిటీ చరిత్ర, పురావస్తు విభాగం అధిపతిగా పని చేసిన డా॥రాయప్రోలు సుబ్రహ్మణ్యం ఆధ్వర్యంలో ఏర్పాటైన శ్రీశైలం ఎక్సవేషన్ ప్రాజెక్టు కింద కర్నూలు జిల్లా సిద్దేశ్వరం, ఎర్రమఠం, ముసలి మడుగులలో తవ్వకాలు జరిగాయి. సిద్దేశ్వరంలో శాతవాహన, చాళుక్యుల కాలంనాటి ఆలయపునాదులు బయటపడగా, ముసలిమడుగులో మధ్యయుగాల నాటి మట్టికోటగోడ, కొన్ని ఇళ్ళ పునాదులు బయటపడినాయి.

ఇదంతా ఒక ఎత్తైతే, ముంపుకు గురైన గ్రామాల్లోని దేవాలయాలను తరలించటం మరో ఎత్తు. కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లాలోని గ్రామాల్లో ఇటుకరాతి దేవాలయాల తరువాత బాదామీ చాళుక్యుల (క్రీ.శ. 7-8 శతాబ్దాలు) దేవాలయాలు, రాష్ట్రకూటుల (క్రీ.శ. 9వశతాబ్ది) దేవాలయాలు, కళ్యాణీ చాళుక్యుల (క్రీ.శ.11-12 శతాబ్దాలు) దేవాలయాలు, కందూరు చోళుల (క్రీ.శ.11-12 శతాబ్దాలు) దేవాలయాలు, కాకతీయుల (క్రీ.శ.13-14 శతాబ్దాలు) దేవాలయాలు, విజయనగర రాజుల (క్రీ.శ.15-16 శతాబ్దాలు) దేవాలయాలు, సంస్థానాల (క్రీ.శ.16-17 శతాబ్దాలు) దేవాలయాలుగా విభజించవచ్చు.

పై దేవాలయాలలో వాస్తుశిల్పి విశేషాలతో కళాత్మకంగా తీర్చిదిద్దిన వాటిని ఊడదీసి ఎగువన పునర్నిర్మించాలనీ, అంతగా అలంకారాలు లేని సాదాసీదా దేవాలయాలను అలానే ఉంచేయాలనీ, అయితే వీటి ఉనికే ప్రమాదమున్నందున, కనీసం ఆ దేవాలయాలు ఎలా ఉంటాయోనని చూడాలనుకొన్న వారి కోసం చిన్నసైజు నమూనా దేవాలయాలను తయారుచేసి మ్యూజియాల్లో భద్రపరచాలని తీర్మానించారు.

## బాదామీ చాళుక్య దేవాలయాలు

బాదామీ చాళుక్య దేవాలయాల విషయానికొస్తే ఆలంపూర్ లోని నవబ్రహ్మాలయాలు గుర్తుకొస్తాయి. రేఖానాగర ప్రాసాద రీతిలో నిర్మించిన 8 దేవాలయాలు తొలి చాళుక్య వాస్తు శైలికి నిదర్శనాలు. ముంపు నుంచి కాపాడటానికి ఈ ఆలయాల చుట్టూ పెద్ద గోడ కట్టి వాటిని పరిరక్షించారు. బాదామీ చాళుక్య రాజైన మొదటి విక్రమాదిత్యుడు (క్రీ.శ.660) చిన్నమరూరు వద్ద శివదీక్ష తీసికొని అక్కడొక దేవాలయాన్ని నిర్మించినట్లు శాసనముంది. కృష్ణా -తుంగభద్ర నదులు కలిసే కూడలి వద్ద వినయాదిత్యుని (క్రీ.శ.681-696) కాలంలో నిర్మించిన సంగమేశ్వరాలయముంది. ఈ ఆలయాన్ని కేంద్ర పురావస్తు సంస్థ తరలించి ఆలంపూర్‌లో పునర్నిర్మించింది. ఊడదీసిన తరువాత పునాదుల చుట్టూ జరిపిన తవ్వకాల్లో ఆలయం కింద దాదాపు 10 అడుగుల లోతు వరకు రాళ్ళతో పునాదులు వేసి భూమట్టంపైన ఆలయాన్ని నిర్మించారు.



అలంపురంలో పునర్నిర్మించిన కూడలి సంగమేశ్వరాలయం - నిర్మాణదశ, పూర్తయిన తరువాత

ఆలయాన్ని తరలించటానికి ఊడదీసే ముందు చుట్టూ పేరుకు పోయిన మట్టిని తొలగించి, ఉన్నది ఉన్నట్లుగా డ్రాయింగు గీసుకొని, ఆలయం గర్భాలయ, అర్ధమండప, మహామండప, ప్రవేశ లేక నంది మండపాల వరకూ ప్లానునూ గీసుకోవాలి. తరువాత ఆలయం తొలి వరుస అయిన ఆధార శిల (లేక ఉపానం) నుంచి పైనకలశం/స్థూపి వరకు ఈశాన్య మూలనుంచి ప్రదక్షిణగా ఒక్కో వరుసకు ఒక్కో సంకేత అక్షరమిచ్చి ఎన్ని రాళ్ళున్నాయో అన్నింటికీ ఆయా వరుసల ప్రకారం నంబర్లను వేస్తారు. అలాగే లోపలి నేలరాళ్ళు, స్తంభాలు, గోడలు, ద్వారాలు, కప్పురాళ్ళకు కూడా నంబర్లను వేసి వరుస క్రమంలో అన్ని వైపులా ఫొటోలు తీసి డాక్యుమెంట్ చేస్తారు. ఊడదీసే ముందు ఆలయం లోపలి మూలవిరాట్టు లేక శివలింగాలను కళాకర్షణ కార్యక్రమం జరిపి ముందుగా తొలగించి, అటు తరువాత పై నుంచి ఒక్కో వరుసా ఊడదీసి జాగ్రత్తగా కిందికి దించి, దగ్గర్లో వరుస క్రమంలో నంబర్లు కనబడే విధంగా భద్రపరుస్తారు. తరువాత ఆ దేవాలయ పునర్నిర్మాణానికి ఎంపిక చేసిన స్థలం దగ్గరకు వాటిని చేరుస్తారు. స్థలంలో పునాదుల పని పూర్తైన తరువాత ఆధార శిల నుంచి ఒక్కో వరుసా యథావిధిగా డ్రాయింగులు, ఫొటోల సాయంతో నిర్మించుకుంటూ పోతారు. పునర్నిర్మాణం పూర్తైన తరువాత ఆలయ రాళ్ళ మీద వేసిన నంబర్లను తుడిపించి, శుభ్రం చేసి, మళ్ళీ కళా న్యాసం ద్వారా పాత విగ్రహాలను గానీ, శివలింగాలను గానీ (భిన్నమైతే కొత్తవి) పునఃప్రతిష్ఠిస్తారు.

## రాష్ట్రకూటుల దేవాలయాలు

బాదామి చాళుక్యుల తరువాత ఈ ప్రాంతం మాల్ఖేడ్ నుంచి పాలించిన రాష్ట్రకూటుల వశమైంది. ఆలంపూర్‌లోని తారక బ్రహ్మే లయం ద్వారతోరణం మల్లేశ్వరంలోని 9వ నంబరు గుడి, కర్నూలు జిల్లా పాతకోట, రూపాల సంగమేశ్వరాలయాలను రాష్ట్రకూటులు భిన్నమైన శైలిలో నిర్మించారు. పల్లవ వాస్తును పుణికి పుచ్చుకున్న ఈ ఆలయాలు మహాబలిపురంలోని పల్లవుల రాతి రథాలను పోలి ఉంటాయి. రాష్ట్రకూటరాజైన మూడోకృష్ణుడు (క్రీ.శ. 939-967) కాలాముఖ శైవ పండితులను గౌరవించి రూపాల సంగమేశ్వరాల యాలను నిర్మించాడు. మహబూబ్‌నగర్ జిల్లా మల్లేశ్వరంలోని అగస్త్యేశ్వరాలయ సముదాయాన్ని జటప్రోలు జంక్షన్ దగ్గర, కర్నూలు జిల్లాలోని రూపాల సంగమేశ్వరాలయాన్ని కర్నూలు ఊరు బయట గల జగన్నాథ గట్టు మీద దేవాదాయ శాఖ పునర్నిర్మించగా, రూపాల సంగమేశ్వరాలయానికి ఎదురుగా నున్న భుజంగేశ్వరాలయాన్ని అదే జిల్లా జూపాడు బంగ్లా వద్ద రాష్ట్ర పురావస్తు శాఖ పునర్నిర్మించింది. పాతకోటలోని నాగేశ్వరాలయాన్ని దేవాదాయ శాఖ కొత్తగా నిర్మించిన పాతకోట గ్రామంలో నిర్మించగా, మరో శివాలయాన్ని కర్నూలు మ్యూజియంలో పురావస్తు శాఖ నిర్మించింది. అదే జిల్లా ఎర్రమఠం ఊరు బయటున్న మోక్షేశ్వరస్వామి దేవాలయాన్ని పురావస్తుశాఖ ఊడదీసి కర్నూలు మ్యూజియంలో పునర్నిర్మించింది. ఇక్కణ్ణించి తరలించిన కుబేర, నటరాజశిల్పాలు కర్నూలు మ్యూజియంలో భద్ర పరచబడినాయి.

## కళ్యాణ చాళుక్య దేవాలయాలు

కర్నూలు జిల్లా నివృత్తిసంగం (ఇక్కడి ఆలయాలను పరమాచార్య కంచికామకోటి పీఠాధిపతి నీళ్ళల్లో మునిగి ఉండటమే ఉత్తమమని సలహానివ్వటం చేత ఆలయ సముదాయం ఇప్పటికీ అలానే ఉంది.) ముసలిమడుగు, సిద్దేశ్వరం (ఈ ఆలయాన్ని ఊడదీసి రాష్ట్ర పురావస్తు శాఖ జూపాడు బంగ్లా వద్ద పునర్నిర్మించింది.) సిద్ధరాజలింగాపురం, ఎర్రమఠం, దేవాలయ మండపాలను పురావస్తు శాఖ కర్నూలు మ్యూజియం ప్రాంగణంలో పునర్నిర్మించింది. శివపురం, కొల్లంభారతి దేవాలయాలను అలాగే ఉంచగా మహబూబ్‌నగర్ జిల్లా ఆలంపూర్ దగ్గరి బుగ్గ రామలింగేశ్వరాలయాన్ని దేవాదాయ శాఖ, పాప నాశేశ్వర దేవాలయ సముదాయాన్ని కేంద్ర పురావస్తు సంస్థ ఆలంపూర్ ఊరు బయట పునర్నిర్మించారు. ఆలంపూరులోని జోగులాంబ వాగు దగ్గరి పిచ్చుక గూళ్ళను రాష్ట్ర పురావస్తు శాఖ ఊడదీసింది గానీ మళ్ళీ నిర్మించలేదు. మహబూబ్‌నగర్ జిల్లాలోని ఆరో విక్రమాదిత్యుని కాలం (క్రీ.శ. 1076-1126) నాటి మల్లేశ్వరం,రామతీర్థం,సోమశిల దేవాల యాలను ఊడదీసిన రాష్ట్ర పురావస్తు శాఖ ఎగువన పునర్నిర్మించింది.

## కాకతీయుల దేవాలయాలు

కళ్యాణీ చాళుక్య రాజైన రెండో జగదేశమల్లుని (క్రీ.శ. 1138-1149) తో కళ్యాణీ చాళుక్య పాలన అంతమై కాకతీయులు ఈ ప్రాంతాన్ని స్వాధీనం చేసుకున్నారు. మహబూబ్‌నగర్ జిల్లా సోమశిల, మల్లేశ్వర దేవాలయాలను రాష్ట్ర పురావస్తుశాఖ పునర్నిర్మించింది. కాకతీయుల సామంతులుగా నున్న చెఱుకు వంశం, మల్యాలవంశ ప్రభువులు సోమశిలలో దేవాలయాలు నిర్మించారు.

## విజయనగర, సంస్థానకాలపు దేవాలయాలు

జటప్రోలులోని మల్లిఖార్జునస్వామి దేవాలయం, మదన గోపాల స్వామి దేవాలయాలు, మంచాలకట్టలోని శివ, అమ్మవారు దేవాలయా లను దేవాదాయ శాఖ జటప్రోలు జంక్షన్, కొల్లాపూర్‌లో పునర్నిర్మిం చింది. మహబూబ్‌నగర్ జిల్లా పెబ్బేరు దగ్గర ఈర్లదిన్నె లోని విజయ నగర కాలంనాటి శివాలయాన్ని రాష్ట్ర పురావస్తు శాఖ మహబూబ్‌నగర్ సమీపంలోని పిల్లలమర్రి మ్యూజియం వద్ద పునర్నిర్మించింది.

## నమూనా దేవాలయాలు

దాదాపు 50 ఊళ్ళలో మునిగిపోయిన దేవాలయాలను చిన్నసైజు నమూనా దేవాలయాలుగా దేవాదాయ శాఖ తయారు చేయించి

రాష్ట్ర పురావస్తుశాఖ ప్రధానకార్యాలయంలోని శ్రీశైలం పెవిలియన్ మ్యూజియంలో ప్రదర్శించటమైంది.

**శాసనాలు, శిల్పాల తరలింపు**

బాదామీ చాళుక్యుల (క్రీ.శ.7వ శతాబ్ది) కాలం నుంచి విజయ నగర కాలానికి (క్రీ.శ. 17వశతాబ్ది) చెందిన రెండు వందల శాసనాల నకళ్ళు తీసి భద్రపరచటమే కాక, రాతి శాసనాన్ని ఆలంపూరు, కర్నూలు, హైదరాబాదు మ్యూజియంలకు తరలించటమైంది. అలాగే ఇదే కాలానికి చెందిన అపురూప శిల్పాలనుకూడా తరలించి భావి తరాల కోసం మ్యూజియాల్లో ప్రదర్శించటమైంది. ఇలా నీటి ముంపు దేవళాల తరలింపు కార్యక్రమం స్థానిక శిల్పుల దేశవాళి సాంకేతిక పరిజ్ఞానంతో విజయవంతంగా పూర్తి చేయటం చర్చనీయాంశమైంది.

## ప్రవహించవే కృష్ణ

ప|| ప్రవహించవే కృష్ణ ప్రవహించవే తల్లి
పరితపించే తృష్ణ నీడేర్చవే! ||ప్రవహించవే||

చ|| సహ్యాద్రి లోనున్న గోముఖంబు నుండి
మరాఠ, కర్నాట, మహబూబలంపూర్ అందుండి ఆంధ్రా
ఓ జీవనదిగా!..... జనజీవ హృదిగా!...
దాహార్తి తీర సస్యంబులీయ ||ప్రవహించవే||

చ|| పాలేరు మున్నేరు తుంగభద్ర మూసి దిండి తోడైయుండి

చ|| పాలేరు నల్గొండ మున్నేరు పరకాల
ఏలేశ్వరాన దిండిని కలుపుకొని
ఆనందగిరిలో మూసిని కలిసి
నవబ్రహ్మలున్న శివవిష్ణు క్షేత్రం
ఆలంపూరాన ఆంధ్రాను చేరి ||ప్రవహించవే||

చ|| శ్రీశైల క్షేత్రాన పాతాళగంగవై
బౌద్ధ నాగార్జున క్షేత్రమ్ము జేరి
గుంటూరు నల్గొండ ప్రకాశవంతమై
అమరేశ్వరుని కొలువ అమరావతికి చేరి ||ప్రవహించవే||

చ|| కామితమ్ములు తీర్చు కనకదుర్గమ్మను కొలిచి
పులిగడ్డన రెండు పాయలై పారి
గలగల జలజల బిరబిర జరజర
సంద్రాన కలియ హంసలాదీవిన ||ప్రవహించవే||

*- వలివేటి వెంకట శివరామకృష్ణమూర్తి*

**శ్రీ ఎ.ఎస్.ఆర్. కృష్ణ**

# నూజివీడు తొలి స్వాతంత్ర్య సమరం

కృష్ణా జిల్లాలోని నూజివీడు తాలూకా శౌర్య, పరాక్రమాలకు పూర్వకాలంనుంచి ప్రసిద్ధి పొందింది. 13వ శతాబ్దంలో తుగ్లక్ వంశీయులైన ఢిల్లీ సుల్తానులు కాకతీయ రాజు రెండో ప్రతాపరుద్రుణ్ణి ఓడించినపుడు, కాకతీయ ప్రతాపరుద్రుని కాలంలో సామంతులుగా ఉన్న పరిపాలకులు, మిగిలివున్న సేనా నాయకులు ముస్లింలను ప్రతిఘటించవలెనని నడుంకట్టారు.

అప్పుడు నూజివీడు తాలూకా ముసునూరు ప్రాంతాన్నిపరి పాలిస్తున్న పోలయ్యా నాయకుడు వీరికినాయకత్వం వహించారు. ముసునూరు నాయకులు కమ్మవారు- పోలయ్య నాయకుడు ప్రజలను సంఘటితపరచి, కీ.శ 1325-26 ప్రాంతంలో కోస్తా జిల్లాలను విముక్తి చేశాడు.

తెలంగాణా ప్రాంతం విముక్తి పోరాటంలో భద్రాచలం వద్ద రేకపల్లిలో 1325లో తిరుగుబాటు జెండా లేవనెత్తారు.

పోలయ్య నాయకుడు మరణించడంతో అతని పినతండ్రి కొడుకు కావయ్య నాయకుడు తెలంగాణా పోరాట విముక్తికి నాయకత్వం వహించి పది సంవత్సరాలు గెరిల్లా యుద్ధం చేసి, 1336-37 సంవ త్సరాలలో ఢిల్లీ సేనాని మాలిక్ మక్బూల్‌ను ఓడించి ఓరుగల్లును స్వాధీనపర్చుకొన్నాడు.

కావయ్య నాయకుడు ఓరుగల్లు రాజధాని తెలంగాణాను 1336 నుండి 1368 వరకు పరిపాలించాడు.

ఆంధ్రదేశాధీశ్వర, ఆంధ్ర సురత్రాణ బిరుదులు వహించి కాకతీయ సామ్రాజ్యానికి వారసునిగా గుర్తింపబడ్డాడు.

తెలుగు దేశాన్ని పునరద్ధరించడానికి జరిగిన ప్రయత్నాలు పోరాట జీవితంలో ప్రధాన ఘట్టాలు. అందుకు నాయకత్వం వహించిన ముఖ్యులైన పోలయ్యా నాయకుడు, కావయ్య నాయకుడు ముసునూరి నాయకులుగా చరిత్రలో చిరస్మరణీయులు.

### "రెబెల్" నారయప్పారావు

18వ శతాబ్దమున తెలుగుగడ్డపై గెరిల్లా పోరాటంలో బ్రిటిషు పాలకులను గడగడలాడించిన విప్లవ చరిత నూజివీడుదే!

దక్షిణ భారత ప్రథమ స్వాతంత్ర్య సమరయోధులు తెలుగు నాట "రెబల్" మేకా నారయప్పారావుగారు తమిళనాట వీరపాండ్య కట్టబొమ్మన్.

18వ శతాబ్దంలో నూజివీడు సంస్థానం ఏలిన మేకా నార యప్పారావుగారు 1783లో బందరులో ఉన్న ఆంగ్ల అధికారి డేనియల్‌కు సలాం కొట్టనందుకు, కప్పం బకాయిపడినందవల్ల నూజివీడు కోటను ముట్టడించుటకు కెప్టెన్ మాంట్ గోమరి నాయకత్వం క్రింద బ్రిటిష్ సైన్యాన్ని పంపాడు. ముందే ఈ విషయం పసిగట్టిన నారయప్పారావుపటిష్ఠ పరిచాడు.

నారయప్పారావు పిలుపు మేరకు కృష్ణా, గోదావరి, మధ్యప్రదేశమున గల సాహసవీరులైన కమ్మ, రెడ్డి, కాపు, కత్తిపట్టగల హరిజనులు, బంధువర్గం పద్మనాయకులు నూజివీడు చేరుకొన్నట్లు రిపోర్టుల బోగట్టాగా వుంది.

నేడు నూజివీడులో వాడుకలో వున్న దమదమాలతోట ప్రదేశంలోనే బ్రిటీష్ సైన్యాలు మోహరించి ఫిరంగులు పేల్చారని ఫిరంగుల మోతకు ధం-ధం అని ప్రేలుడు శబ్దం వస్తుంది. గనుక దాన్ని బట్టి దమదమాలతోటగా వాడుకలోకి వచ్చింది.

గెరిల్లా పోరాటంలో జైవీరహనుమాన్ నినాదంతో నారయప్పారావు ఎనిమిది మంది బ్రిటీష్ సేనాధిపతుల్ని గడగడలాండిచారు.

మూడు దశలుగా కోట నుంచి ప్రజాసైన్యం సుంకొల్లు, యనమదల చేరువరకు శతృవులపై బాణాల వర్షం కురిపిస్తూనే ఉన్నారు. ఉభయ పక్షాలు తుపాకులు పేల్చుకొంటూనే వున్నారు. నాలుగేళ్లు కోటను విడిచి ప్రజాపాలన చేస్తూ బ్రిటిష్ వారితో పోరాడుతున్న నారయప్పారావుగారితో రాజీ సంప్రదింపులు జరిపి చివరకు తిరిగి సంస్థానాన్ని అప్పగించారు. తెల్లవాళ్లు.

స్వశక్తి, సామర్థ్యములపై ఆధారపడిన పాండ్యరాజు వీరపాండ్యకట్ట బొమ్మన్ బ్రిటిష్‌వారి కుటిల శక్తి సామర్థ్యముల మందు తట్టుకొనజాలక తన కోటతో బాటు మరఘిరంగుల కాహుతియై ప్రజాహృదయాల్లో నిలిచారు.

అయితే నారయప్పారావు శౌర్య ధైర్య సాహసములతో గెరిల్లా పోరాట పద్ధతుల్లో పోరాడారు. ప్రజాహృదయాలను చూరగొన్న నాయకుడైన కారణాన ప్రజలు కుల, మత, వర్గ విచక్షణ లేకుండా పోరాటంలో పాల్గొని సంస్థాన పాలనను తిరిగి నిలబెట్టుకొన్నారు.

"రెబల్ వీరుడు"గా "విప్లవ నారయ్య" గా ప్రసిద్ధిగాంచారు.

భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో మహాత్మాగాంధీ నాయకత్వాన దేశమంతటా సహాయ నిరాకరణోద్యమం ముమ్మరంగా జరుగుతున్న రోజులవి. 1920-21 సంవత్సరాలు జాతీయోద్యమం చరిత్రలో ప్రత్యేక స్థానాన్ని అలంకరించుకొన్నాయి. ప్రచండమైన సహాయ నిరాకరణోద్యమం ప్రజ్వరిల్లింది. పంజాబు హత్యలు, ఖిలాఫత్ ఉద్యమం దీనికి ప్రధాన కారణాలు, బ్రిటిషు సామ్రాజ్యవాదుల రాక్షస చర్యల్ని అంత మొందించాలని గాంధీజీ ఎలుగెత్తిచాటాడు.

గాంధీజీ పిలుపునందుకొని మోతీలాల్‌నెహ్రూ, చిత్తరంజన్‌దాస్, రాజగోపాలా చారి, సరోజినీదేవి మొదలగువారు దేశమంతటా ప్రచారం చేశారు.

ఆంధ్రాలో గాంధీజీకి అండగా కొండా వెంకటప్పయ్య, కడప కోటిరెడ్డి, అయ్యదేవర కాళేశ్వరరావు, ప్రకాశంపంతులు, బులుసు సాంబమూర్తి ప్రభృతులు అఖండ ప్రచారం చేశారు.

ఆ ఉద్యమ ప్రభావానికి ఉత్తేజితులై నూజివీడు తాలూకా ప్రజలను 1920లో మొట్టమొదటిసారిగా మేల్కొలిపిన జాతీయయోధులు మరం బాల సుబ్రమణ్యగుప్తా, కోటగిరి వెంకటకృష్ణారావుగార్లు, అప్పటి నుండే నూజివీడు పట్టణంలో కాంగ్రెసు ఉద్యమం ప్రారంభమైంది.

## కాంగ్రెస్ ఉద్యమం- జస్టిస్ పార్టీ పాత్ర

"కాంగ్రెస్ జిందాబాద్" నినాదం వింటే చాలు గుండెదడగా వుండేది. జస్టిన్ పార్టీవారికి. జాతీయతత్వం పెరగటమే నేరంగా భావించేవారు. చైతన్యం వెల్లివిరిస్తే చెప్పుచేతుల్లో ప్రజలుండరని భయపడేవారు. ఖద్దరు టోపీ కనిపిస్తే చాలు తమ కిరీటాలకే పోటీగా చూచేవారు.

జమిందారీ పరిపాలనలో ఫ్యూడల్ అవశేషాలుజీర్ణించుకొన్న రోజులవి. ప్రతి దశలోనూ జాతీయోద్యమాన్ని నీళ్లు కార్చటానికి విశ్వ ప్రయత్నాలు చేశారు. జస్టిస్ పార్టీ మూలవిరాట్టుల కేంద్రం నూజివీడుఅవటం వలన పట్టణ ప్రజలమీద,వారి గ్రామాల రైతాంగం పైన వత్తిడిఎక్కువగా వుండేది. మీర్జాపురం రాజాగారు, తేలప్రోలు రాజా గారు జస్టిస్ పార్టీకి అగ్రనాయకులు.

మొత్తం జమీందార్ల కుటుంబాలలో ఉయ్యూరు రాజాగారు, గొల్లపల్లి రాజాగారు కాంగ్రెసుకు అండగా ఉండేవారు.

జస్టీస్ పార్టీ పట్టును ఊడగొట్టాలనే ధ్యేయంతోనే నూజివీడులో కాంగ్రెసు కార్యకర్తలు కేంద్రీకరించారు. ఆనాటి జిల్లా నాయకులు చెరుకువాడ లక్ష్మీనరసింహం పంతులు, పట్టాభి సీతారామయ్య, కాళేశ్వరరావు, దువ్వూరు సుబ్బమ్మ, మాగంటి అన్నపూర్ణ, యామినీ పూర్ణ తిలకం, మరం బాల సుబ్రమణ్య గుప్త, కోటగిరి వెంకటకృష్ణారావు, ప్రకాశం పంతులుగార్లు తాలూకాలో పర్యటించారు.

## ప్రచారకులుగా శ్రీ సూర్య ప్రకాశరావు

జిల్లా నాయకుల పర్యటనతో దేశంలో జరుగుచున్న స్వాతంత్ర్య పోరాట ప్రభావం నూజివీడు పట్టణంలో అన్ని వర్గాల యువకులమీద పడింది. ముఖ్యంగా వర్తకులు చేయూతనిచ్చారు.

తాలూకా వ్యాపితంగా పట్టణ కాంగ్రెసు పక్షంగానే భాగవతులు లక్ష్మీనారాయణగారు నిర్మాణాన్ని వ్యవస్థాబద్ధం చేశారు.

గోపవరం, ఆగిరిపల్లి,నూజీవీడు, గొల్లపల్లి ఫిర్కాలుగా విభజించి ప్రధాన ప్రచారకులుగా శ్రీ దశిఖ సూర్య ప్రకాశరావుగారు నాయకత్వం వహించారు. గ్రామాలలో పర్యటించి కాంగ్రెసు సంఘాలు ఏర్పాటు చేశారు. జస్టిస్ పార్టీ జమీందార్లకు సంబంధించిన గ్రామాలలో వారి అనుయాయులైన మొఖాసాదార్లు కాంగ్రెసు ప్రచారానికి అడ్డంకిగా తయారైనా అరికట్టలేకపోయారు. పరాయిప్రభుత్వ వ్యతిరేకత, ముఖ్యంగా జమిందార్ల మొఖాసాదార్ల ఎడల ప్రజల అసంతృప్తి కాంగ్రెసు ప్రచారకులకు చేయూతనిచ్చింది.

1898 ఏప్రిల్ 10న రాజమండ్రిలో జన్మించిన దశిక సూర్య ప్రకాశరావు 1921 లో సహాయ నిరాకరణోద్యమంలో ప్రవేశించినది మొదలు అనేకసార్లు జైలుశిక్ష అనుభవించారు. సుమారు 40 మాసాల పాటు జైలు జీవితం అనుభవించారు. కాంగ్రెస్ మీటింగుల గురించి చాటింపు వేయకుండా తేలప్రోలు జమిందారీ నౌకర్లు బాధలు పెట్టినప్పుడు, ఆయన స్వయంగా డప్పులు వాయించారు. 1921 నుండి 1944 వరకు పట్టణ కాంగ్రెస్ అధ్యక్షులుగా పని చేశారు.

## సహాయ నిరాకరణోద్యమం

1921 పట్టణంలో సహాయ నిరాకరణోద్యమం ముమ్మరంగా సాగింది. దళాలువారీగా పికెటింగ్‌లు, ఊరేగింపులు, పట్టణంలో పెద్ద సంచలనం కలిగించాయి. నల్లమందు, గంజాయి దుకాణాలవద్ద, కల్లు దుకాణాలవద్ద శాంతియుతంగా పికెటింగ్‌లు చేశారు.

కల్లు త్రాగవద్దని ప్రచారం చేస్తుంటే దశిక సూర్య ప్రకాశరావుగారి నోట్లో కల్లుపోశారు జస్టిస్ పార్టీ ఏజెంట్లు. అయినప్పటికినీ శాంతి యుతంగానే ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్లారు. దుకాణాలన్నీ బంద్ చేయించారు. ప్రభుత్వ ఆదాయానికి నష్టం కలిగించాలనేనెపంతో దశిక సూర్యప్రకాశరావు, బంద్ చేయించారు. దశిక సూర్యప్రకాశరావు, తటవర్తి రంగయ్య, వెజ్జ వెంకట నరసింహం,కొత్వాల్ అబ్బావలి, చలమాల కోటయ్య మొదలగు 12 మందిని అరెస్టు చేసి జైలుశిక్ష విధించారు.

కూనపులి సుబ్రమణ్యం, మురారి విజయసారధిగార్లు కాలేజి చదువు మానివేసి పశ్చిమ గోదావరి జిల్లా ఆకివీడు వద్ద సిద్ధాపురంలో కల్లు దుకాణాలవద్ద పికెటింగ్ చేస్తూ అరెస్టు అయ్యారు. కాంగ్రెసు ప్రచారం బాగుగా జరిగినకొలదీ ప్రభుత్వ నిర్భంధవిధానం ఎక్కువైంది. దేశవ్యాప్తంగా అనేకమంది ఉద్యోగులు రాజీనామాలిచ్చారు. ఆ సందర్భంలో 1921లో తాలూకాలో గోపవరం గ్రామ మునసబు పర్వతనేని వీరయ్య, గోపవరంకరణం బొమ్మకంటి సీతారామయ్య, వట్టి గుడిపాడు, పొలసానపల్లి కరణాలు తమపదవులకు రాజీనామా చేశారు.

నూజివీడు హైస్కూలు ఉపాధ్యాయులు లకావఝల సుందర రామయ్య, కావూరి వెంకట నారాయణగార్లు ఉద్యోగాలకు రాజీనామా చేసి జాతీయ పాఠశాల స్థాపించారు. మిర్యాల లక్ష్మీనరసింహ మొదలగు విద్యార్థులందరూ పాఠశాలలో చేరారు.

1923 లో ఆగిరిపల్లి గ్రామంలో రథసప్తమినాడు వేలాది ప్రజల సమక్షంలో రథంమీద గాంధీపటం కట్టినందుకు పారేపల్లి లక్ష్మీ నారాయణ, తాడిగడప పుల్లయ్య, ఆకుల బసవయ్య, యెందూరు సుబ్బారావు, కేతేపల్లి సుబ్బారావుగార్లను అరెస్టుచేసి,6 నెలలు శిక్ష విధించారు.

## 1926 ఎన్నికల్లో నూజివీడు మెజార్టీ

1925 కాన్పూర్ కాంగ్రెస్ తీర్మానం ప్రకారం శాసనసభలకు 1926లో కాంగ్రెస్ పక్షంగానే అభ్యర్థులను నిలబెట్టాలనే నిర్ణయం జరిగింది. కృష్ణాజిల్లాలో ఈ ఎన్నికల పోటీ అతి తీవ్రంగా జరిగింది. జస్టీస్ పార్టీ తరుపున మీర్జాపురం జమీందారుగారు, కాంగ్రెస్ పక్షంగా అయ్య దేవర కాళేశ్వరరావుగా (రాష్ట్ర స్వరాజ్యపార్టీ అధ్యక్షులు)

మీర్జాపురం రాజాగారి స్వస్థలమైన నూజివీడులో పోలింగ్ తీవ్రంగా జరిగింది. కాంగ్రెస్ కార్యకర్తలు గట్టి కృషి చేశారు. చివరకు నూజివీడు పట్టణంలో కాళేశ్వరరావు గారికి మెజార్టీ రావటంతో కాంగ్రెసు ఉద్యమం మరింత బలపడింది.

## మహాత్మాగాంధీ రాక - ఉయ్యూరు రాజాగారి స్వాగతం

ఆంధ్ర పర్యటన సందర్భంలో 1929 ఏప్రిల్ 11న మహాత్మాగాంధీ గారు నూజివీడు వచ్చారు. కొత్వాల్ అబ్బాసలి అధ్యక్షులుగా, మేకల రాములుగారు కార్యదర్శిగా ఆహ్వాన సంఘం ఏర్పాటైంది.

గాంధీగారి రాక గ్రామాలలో పెద్ద సంచలనం కలిగించింది. రైతాంగం ఎడ్ల బండ్లతో యాత్రగా నూజివీడు వచ్చారు.

బ్రిటీష్ పాలకులకు అనుకూలంగా ఉన్న జస్టిస్ పార్టీలో జమీందారీ వర్గీయులు కొనసాగుతూ, నాయకత్వం వహిస్తున్న రోజుల్లో నూజివీడు సంస్థానానికి చెందిన ఉయ్యూరు ఎస్టేట్ జమిందారులు మాత్రం జాతీయ ఉద్యమానికి అండగా నిలిచారు.

ఉయ్యూరు రాజా శ్రీ వెంకటాద్రి అప్పారావుగారు కాంగ్రెస్ వాలంటీర్ల దుస్తులతో ఎదురేగి స్వాగతం చెప్పారు. వాలంటీరు దుస్తులతో రాజాగారు రావటం ప్రత్యేకాకర్షణగా ప్రజలు భావించారు. రాజాగారు 1926లో కాకినాడలో జరిగిన ఆంధ్ర మహాసభలకు అధ్యక్షులుగా ఎన్నికకావడం, గాంధీగారికి స్వాగతం చెప్పటంతో జాతీయోద్యమాభిమానిగా మరింత పేరు తెచ్చుకున్నారు.

ఉద్యమంలో జైళ్ల పాలైన వారి కుటుంబాలకు ఆర్థికంగా చేయూతనిచ్చేవారు. ఎస్టేటు ఉద్యోగస్తుల కుటుంబాలవారు జైళ్ల పాలైతే వారి కుటుంబ పోషణభారాన్ని ఎస్టేటువారు కొంత భరించేవారు. ఈ సందర్భంగా ఆయన గాంధీజీకి సన్మానపత్రం సమర్పించారు. ఈ సన్మాన పత్రాన్ని హరిజన నిధికోసం గాంధీజీ వేలం వేశారు. బలుసూరి సీతారామయ్య ఈ సన్మానపత్రాన్ని 20 రూపాయలకు పాడుకున్నారు.

జనం తండోపతండాలుగా వచ్చినసభలో గాంధీగారుగంభీరో పన్యాసం చేశారు. ఆ ఉపన్యాస ప్రభావం జాతీయ తృష్ణను పెంపొం దించటమే గాక, బ్రిటిష్ పాలనను అంతమొందించాలనే ఆకాంక్షను రేకెత్తించింది. గాంధీగారి పర్యటన తాలూకాలో జాతీయోద్యమానికి జీవం పోసింది.

ఈ దశలో యువకుడైన శ్రీ ఎం.ఆర్ అప్పారావుగారు కూడా ఖద్దరు ధరించి ఉద్యమంలో పాల్గొన్నారు.

గాంధీజీకి అతిధ్యం ఇచ్చినందుకు ఉయ్యూరు జమిందారు వెంకటాద్రి అప్పారావు గారిని గవర్నర్ సంజాయిషీ కోరగా, తమ ప్రాంతానికి వచ్చిన అతిథిని గౌరవించడం తప్పుకాదని తాను భావిస్తున్నానని, ఆయన గవర్నర్‌కు సంజాయిషీ ఇచ్చారు.

## ఉప్పు సత్యాగ్రహం

రాష్ట్ర కాంగ్రెసు గుంటూరులో సమావేశమై శాసనోల్లంఘనం జరపటానికి తీర్మానించింది. ఆ తీర్మానం ప్రకారం కృష్ణాజిల్లాలో సత్యాగ్రహం చేయాలని జిల్లా నిర్ణయించి కోటగిరి వెంకట కృష్ణారావుగారిని సర్వసేనాధిపతిగా ఎన్నుకొన్నారు. ఏప్రిల్ 2వ తేదీ ఆంధ్ర రత్న భవనంలో సత్యాగ్రహ శిబిరాన్ని ప్రారంభించారు.

ఉప్పు సత్యాగ్రహాన్ని గురించి తాలూకా అంతటా విరివిగా ప్రచారం జరిగింది. కోటగిరి వెంకట కృష్ణారావుగారి నాయకత్వాన జిల్లా సత్యాగ్రహదళంలో నూజివీడు నుండి శిరికొండ వల్లభరాయుడు, సముద్రాల సత్యనారాయణ,క్రోసూరి నరశింహమూర్తి, మల్లె రాములు, తటవర్తి రంగయ్య, వలివేటి రామకోటయ్య, చలసాని రాజగోపాలరావు, ఆలపాటి లక్ష్మయ్య, ఆలపాటి సత్యనారాయణ మొదలగువారు పాల్గొని పాదయాత్రలో 14-4-30న చిన్నాపురం వెళ్లి ఉప్పును తీసుకొచ్చి తాలూకా అంతటా పంచిపెట్టారు.

చెరుకూరి వెంకటశేషయ్య, ఈడ్పుగంటి వెంకట్వేరరావు, మురారి విజయసారథి మొదలైనవారు ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని జైలుశిక్ష అనుభవించారు.

## దారుణమైన లాఠీ ఛార్జీ

ఉప్పు సత్యాగ్రహోద్యమం తీవ్రతను చూచి ప్రభుత్వం నిర్బంధ విధానానికి పూనుకొంది. జూన్ 6న నూజివీడులో శ్రీ సూర్య ప్రకాశ రావుగారి నాయకత్వాన బ్రహ్మండమైన ఊరేగింపు జరిగింది. గ్రామాల నుంచి వందలాదిమంది యువకులు ఊరేగింపులో పాల్గొన్నారు. ఊరేగింపుమీద పోలీసులు దారుణమైన లాఠీఛార్జీ చేశారు. బూరుగడ్డ నివాసి కందాళ రామచంద్రాచార్యులుగారిని కొట్టి కాలువలో పడేశారు. పోతురెడ్డి పల్లి యువకులు బాగా గాయపడ్డారు. అక్కినేని గోపాల కృష్ణయ్య గారికి ఆ లాఠీఛార్జీలో పన్ను ఊడిపోయింది. అక్కినేని పుల్లయ్య గారికి బాగా గాయాలు తగిలాయి.

తిరిగి ఊరేగింపు జరుపబోగా మళ్లీ లాఠీఛార్జీ చేశారు. సత్యా గ్రహులను అరెస్టు చేశారు. చివరకు అబ్బాసలిగారి అధ్యక్షతన సభ జరిపి పోలీసు చర్యల్ని ఖండించారు.

## కరపత్రాల పంపిణీ

బెజవాడ కేంద్రంగా ఉన్న కాంగ్రెసు శిబిరం నుండి కరపత్రాలు జోరుగా వచ్చేవి. సర్క్యులర్లు, కరపత్రాలు రహస్యంగా పంపిణీ జరుగు తుండేవి.

1. నిర్భాగ్య భారతము, 2, ఆంధ్ర పౌరుషమను జాతీయ పాటలు, 3. ఉప్పు సత్యాగ్రహం 4. నిర్మాణ కార్యక్రమం 5. త్రాగుడు మానుడు, 6. విదేశీ వస్త్ర బహిష్కరణము, 7. దరిద్రనారాయణము, 8. సత్యాగ్రహ బోధిని మొదలగు కరపత్రాలు విరివిగా పంచబడ్డాయి.

1931 మార్చి 5న గాంధీ- ఇర్విన్ ఒడంబడిక ప్రకారం సత్యా గ్రహులు విడుదల చేయబడ్డారు. ఏదో రూపంలో నిర్బంధవిధానంకొన సాగించటం, 144సెక్షన్ అమలుజరుపటం ప్రభుత్వం చేస్తూనే ఉంది.

తర్వాత రాష్ట్ర పరిస్థితులు ఆలోచించి అఖిల భారత కాంగ్రెసు కమిటీ 1932 జనవరి 1 నుండి మళ్లీ సత్యాగ్రహం ప్రారంభించాలని నిర్ణయించింది. బెజవాడలో జనవరి 6న నిషేధాజ్ఞనుల్లంఘించి సభ జరిపినందుకు చలసాని రాజగోపాలరావుగారిపై లాఠీఛార్జీ చేశారు. దేశవ్యాప్తంగా అనేక మందిని అరెస్టు చేశారు. ఈ సందర్భంలో నూజివీడులో దిగువ నారాయణరావు, భట్టర్ రామకృష్ణాచార్యులు, సూర్యప్రకాశరావుగార్ని అరెస్టు చేశారు.

## గ్రామాలలో రిజర్వు పోలీసుల విహారం

జిల్లాలోని అన్ని చోట్ల 144 సెక్షన్ క్రింద నిషేధపు ఉత్తర్వు లిచ్చారు. ప్రచారక దళాలు గ్రామాల వెంట పర్యటన ప్రారంభించాయి. ఒక గ్రామంలో అరెస్టు చేసిన వారిపై మరొక గ్రామంలో లాఠీచార్జీ చేసి ప్రజలను భయపెట్టేవారు, డెల్టా గ్రామాల నుంచి సత్యాగ్రహులను తీసుకొచ్చి పోతురెడ్డిపల్లిలో లాఠీఛార్జీ చేశారు. పట్టణంలో, పల్లెల్లో రిజర్వు పోలీసు దళాలు తిరిగాయి. జాతీయ జెండాలు లాగివేయటం, కాంగ్రెసు ఉద్యమంలో చేరకూడదని బెదిరించేవారు.

## లోథియన్ ముందు నల్లజెండా ప్రదర్శన

1932 ఫిబ్రవరి 26న లోథియన్ కమిటీ బెజవాడ వచ్చింది. నల్లజెండా చూపాలని నిర్ణయం జరిగింది. ఆ క్రితం రోజు నుంచే స్టేషన్ అంతా మిలటరీమయం. ఎవరినీ రానివ్వకుండా బందోబస్తు చేశారు. ఈ క్రితం రోజునే పోలీసులను తప్పించుకొని చలసాని రాజగోపాలరావు, కాట్రగడ్డ శ్రీనివాసరావు స్టేషన్‌లో చొరబడి బట్టల బేళ్లక్రింద దాగుకొన్నారు. నిద్రాహారాలు లేకుండా రోజల్లా గడిపారు.

"లోథియన్" వస్తున్న రైలు సరిగ్గా ఆ బట్టలు బేళ్ల ముందే ఆగింది. "లోథియన్ వెనక్కి పో" అంటూ సింహగర్జన చేస్తూ నల్లజెండాతో రాజగోపాలరావు లోథియన్ ముందుకు దూకాడు. ప్రాణాలకు తెగించి బిర్రుమీదబడ్డ యువకిశోరంపై పోలీసులు తుపాకులు గురిపెట్టారు. లోథియన్ సైగతో కాల్చకుండా అరెస్టు చేశారు.

ఆంధ్రలో ప్రజా ఉద్యమాల ప్రభావం బాగా అర్థమైంది. లోథి యన్‌కు. ఎప్పటికప్పుడు వార్తలు శిబిరానికి అందజేయటానికి వాలంటీ ర్లను పెట్టారు. వీరమాచినేని సాంబమూర్తి, అక్కినేని ఆంజనేయులు (పోతురెడ్డిపల్లి) మొదలగు యువకులు శిబిరంలో వాలంటీర్లుగా ఉన్నారు.

రాజగోపాలరావు సాహసోపేతమైన యీచర్య నూజివీడుతాలూకా జాతీయోద్యమానికి వన్నె తెచ్చింది.

బెజవాడలో ఆంధ్రరత్న భవనాన్ని ఆక్రమించుకొన్న పోలీసుల నుంచి స్వాధీనపర్చుకోటానికి రాష్ట్ర వ్యాప్తంగా వాలంటీర్ల సమీకరణ జరిగింది.

31-7-32 చలసాని రాజగోపాలరావు పోలీసులను ఎదిరించి భవనం ముఖద్వారం వద్ద పోరాడారు. కనీవినీ ఎరుగని లాఠీచార్జీ జరిగింది. రాజగోపాలరావును నిర్ధాక్షిణ్యంగా ఈడ్చారు. ఆయన వీరోచిత చర్య యువ లోకాన్ని ఉద్రేకపరచింది. ఆయనకు శిక్ష విధిస్తూ, ఆస్తి జప్తుకు ఉత్తర్వులిచ్చారు.

## జాతీయోద్యమంలో అంతర్భాగంగా రైతు ఉద్యమం

జమీందారి, మొఖాసాదార్ల వ్యతిరేక పోరాటాలు తాలూకా నలు మూలలా జరిగాయి. కాంగ్రెస్ కార్యకర్తలు రైతులకు అండగా నిల

బడ్డారు. జాతీయోద్యమంలో భాగంగా రైతు సంఘాల ద్వారా ఉద్యమం పెరిగింది. ప్రతి పోరాటంలోనూ రైతు ఉద్యమ నాయకులు ముందుండేవారు.

రైతు సంఘాన్ని సభ్యత్వ రూపంలో నిర్మాణం చేశారు. పర్వతనేని వెంకట సుబ్బయ్యగారి నాయకత్వాన రైతు ఉద్యమం పెంపొందింది. అక్కినేని అచ్యురామయ్య, అక్కినేని, గోపాలకృష్ణయ్య, పాలడుగు లక్ష్మయ్య, దాసరిక వెంకటసుబ్బయ్య, దాసర ధనకోటేశ్వరరావు, కలగర సత్యనారాయణగార్లతోపాటు అనేకమంది రైతు కార్యకర్తలు కదిలి పనిచేశారు.

భట్ల పెనుమర్రు వాస్తవ్యులు, కాంగ్రెస్ నాయకుడు, రైతు పెద్ద కామినేని వెంకటప్పయ్యగారికి ముక్కొల్లుపాడు, ముసునూరు గ్రామాల్లో ఉన్న బంధుత్వం కారణంగా రాకపోకలతో ఆయన ప్రేరణతో స్వాతంత్ర్యకాంక్ష, రైతు ఉద్యమ ఆసక్తి ఆ గ్రామాల రైతాంగంలో పెరిగింది.

ముఖ్యంగా ఆగిరిపల్లి ఫిర్కాలోజమీందారీ వ్యతిరేక పోరాటాలలో కాంగ్రెస్ నిర్మాణంలో పనిచేస్తున్న మాదాల సూర్యనారాయణగార్ల కుటుంబాలు అండగా నిలిచాయి. ఆర్థికరూపంలో, వసతుల రూపంలో యీ కుటుంబాలు కాంగ్రెస్‌కు కేంద్రాలుగా ఉండేవి. రైతు సంఘం ద్వారా ఎనలేని కృషి జరిగింది.

## మొఖాసా వ్యతిరేక పోరాటాలు- రైతు ఉద్యమం

1935 ఇండియాచట్టంప్రకారం ఎన్నికలు జరిగిన ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో(ఆంధ్రప్రదేశ్ కూడా అందులో చేరి ఉంది.) 1937లో రాజగోపాలాచారి ముఖ్యమంత్రిగా కాంగ్రెసు ప్రభుత్వంఏర్పడింది. నూజివీడు, తిరువూరు తాలూకాల్లో మొఖాసాదార్లచేత పీడింప బడుతున్న రైతులు, వ్యవసాయ కూలీలు మేల్కొని చైతన్య వంతు లయ్యారు. మొఖాసాదార్లపై తిరుగుబాట్లు చేశారు.

ముఖ్యంగా తిరువూరు తాలూకా విస్సన్నపేట ఫిర్కాలోని కొండ పర్వ, చాట్రాయి, నర్సాపురం, గంటిపాడు, చిత్తపూరు, పోలవరం, జనార్థనవరం వంటి గ్రామాల్లోని రైతులు, వ్యవసాయ కూలీలు జమీందార్లు–మొఖాసాదార్ల నిరంకుశత్వంలో పలు బాధలు అనుభవిస్తూ ఉండేవారు.ఈ బాధలు భరించలేక మొట్టమొదటిసారిగా 1937లో కొండ పర్వ గ్రామ రైతులు మొఖాసాదార్లపై తిరుగుబాటు చేసి నూజివీడులో కాంగ్రెస్ కార్యకర్తల సహాయాన్ని అర్థించారు.

అప్పుడు నూజివీడు నుంచి దశిక సూర్యప్రకాశరావు, దిగువ నారాయణరావు, మేకల రాములు, కూనపులి సుబ్రమణ్యం, కోసూరి నరసింహమూర్తి, ఎఱ్ఱోజు మాధవాచార్యులు, చలసాని రాజగోపాల రావు, మరికొందరు కొండపర్వ వెళ్లి సభలు జరిపారు, మొఖాసాదార్ల చర్యల్ని ఖండించారు. రైతులకు అండగా నిలిచారు.

ఈ ఉద్యమంలో పేట బాపయ్యగారు ప్రముఖ పాత్ర వహించారు. అప్పుడే వీరికి " సర్ధార్" బిరుదును రైతులు ఇచ్చారు.

1938-39 సంవత్సరంలో చలసాని రాజగోపాలరావు, కూనపులి సుబ్రమణ్యం, కోసూరి నరసింహమూర్తి, దిగువ నారాయణరావు, విసన్నపేట ఫిర్కా మొఖాసా గ్రామాలన్నిటిలో పాదయాత్ర చేసి రైతులను అలుసుకొని వారి కష్టానష్టాలపై వ్రాత విన్నపాలు సేకరించి, నాటి రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు డాక్టర్ పట్టాభిగార్కి సమర్పించారు. మంత్రులతో మాట్లాడి, రైతుల బాధల నివారణకు కృషి చేస్తానని పట్టాభి వాగ్దానం చేశారు.

## జాతీయోద్యంలో అంతర్భాగంగా కమ్యూనిస్టు ఉద్యమం

అఖిల భారత జాతీయ కాంగ్రెస్ సంస్థలో అతివాద భావాలతో మెలుగుతున్న చాలామంది యువకులు అప్పటికే భారతదేశంలో ప్రచారమవుతున్న మార్క్సిస్టు సిద్ధాంత భావాలవైపు ఆకర్షింపబడినారు దాని ఫలితంగానే జాతీయోద్యమంలో పనిచేస్తున్న ప్రముఖులుకొందరు 1934లో ఆంధ్రలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణానికి పూనుకొన్నారు. వెంటనే పార్టీని ప్రభుత్వం నిషేధించింది. అతివాద, సోషలిస్టు భావాలు గల యువకులు కాంగ్రెస్ సోషలిస్టు పార్టీని స్థాపించి పని చేయటం ప్రారంభించారు. కొద్దికాలానికే ఈ పార్టీలో చీకలు రావటంతో తిరిగి అత్యధిక సంఖ్యాకులైన యువకులు కమ్యూనిస్టు పార్టీని స్వతంత్ర్య ప్రతిపత్తిగల రాజకీయ పార్టీగా పురోగమింపచేశారు.ఆ ఉద్యమ పురోభివృద్ధికి నూజివీడు తాలూకాలో చలసాని రాజగోపాలరావుగారి నాయకత్వాన గంగపల్లి మాధవరావుగారు, అక్కినేని గోపాల కృష్ణయ్యగారు తదితరులు గ్రామాలలో కమ్యూనిస్టు శాఖలు ఏర్పరిచారు.

జిల్లాలో జస్టిస్ పార్టీ నాయకత్వానికి కేంద్రస్థానమైన నూజివీడు తాలూకా, ముఖ్యంగా పట్టణం అన్ని ఉద్యమాలలో ముందుండి జస్టిస్ పార్టీతోను, పరాయిప్రభుత్వంతోనూ ద్విముఖపోరాటాన్ని సాగించిజిల్లా జాతీయోద్యమ చరిత్రలో ప్రత్యేక స్థానాన్ని సంతరించుకొంది.

శ్రీ అన్నవరపు బ్రహ్మయ్య

# పశ్చిమకృష్ణా గ్రామ చరిత్రలు

కృష్ణానది మహాబలిపురంలో జన్మించి మహారాష్ట్ర, కర్నాటక, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలద్వారా ప్రయాణం చేసి కృష్ణాజిల్లా హంసలదీవిలో సాగరసంగమం చేస్తుంది. కృష్ణానది మన రాష్ట్రంలో ప్రవేశించిన తర్వాత ఒక ప్రత్యేకతను సంతరించుకొంది. లక్షలాది ఎకరాలను సస్యశ్యామలం చేసి కల్పతరువుగా పేరుగాంచిన కృష్ణమ్మ కృష్ణాజిల్లా ప్రవేశంతో పశ్చిమకృష్ణాలోని నందిగామ, జగ్గయ్యపేట ప్రాంతాన్ని వజ్రాలు పండించే వజ్రాలసీమగా మార్చింది. కృష్ణమ్మ జగ్గయ్యపేట సమీపంలోని ముక్త్యాల గ్రామం వద్ద కృష్ణాజిల్లాలో ప్రవేశిస్తుంది. అక్కడనుంచి నందిగామ, కంచికచర్ల, ఇబ్రహీంపట్నం ప్రాంతాల మీదుగా విజయవాడ చేరి అక్కడనుంచి దివిసీమవైపు పయనించి హంసలదీవి వద్ద సాగర సంగమం చేస్తుంది.

**"ఈ ప్రాంతంలో గద్దల రెట్టలో వజ్రాలు, రత్నాలు లభిస్తాయి... వజ్రాలకు మటఫలి సీమ (మోటుపల్లి) ప్రసిద్ధి...పెద్ద పెద్ద వజ్రాలు ఇక్కడ మినహా ప్రపంచంలో ఎక్కడా లభించవు..." విన్నీస్ (స్పెయిన్) పర్యాటకుడు మార్కోపోలో కృష్ణానదీ తీరప్రాంతమైన నందిగామ ప్రాంతం గురించి చేసిన వ్యాఖ్యలివి.**

ఈ అంశం వినడానికి, చదవటానికి అతిశయోక్తిగా అనిపించినా ఓరుగల్లును రుద్రమదేవి పాలించిన కాలంలో భారతదేశం పర్యటించిన మార్కోపోలో తన పర్యటనలో భాగంగా మోటుపల్లి (మటఫలి), పరిటాల, నందిగామల మీదుగా ప్రయాణం చేసి ఓరుగల్లు చేరుకొన్న సందర్భంగా ఈ వ్యాఖ్యలు చేశారు. 'ది ట్రావెల్' అనే తన గ్రంథంలో ఆనాటి నందిగామ ప్రాంత శోభను, విశేషాలను వివరించారు. ప్రపంచంలోనే అత్యంత విలువైన వజ్రంగా పేరుగాంచిన 'కోహినూర్' కృష్ణానదీ పరివాహక ప్రాంతంలో లభించినట్టుగా చారిత్రక ఆధారాలు స్పష్టం చేస్తున్నాయి. అయితే ఈ వజ్రం కృష్ణానది ఆవలి ఒడ్డున ఉన్న గుంటూరుజిల్లా అమరావతి ప్రాంతంలో లభించినట్టుగా కొంతమంది అభిప్రాయపడుతుండగా, మరికొంతమంది చరిత్రకారులు మాత్రం నందిగామ తాలూకాలోని కృష్ణా పరీవాహక ప్రాంతమైన పరిటాల తీరంలో లభించినట్టుగా చెబుతున్నారు. ఈ రెండు వాదనల్లో పరిటాల ప్రాంతంలో లభించినట్టు చెప్పడానికే ఆధారాలు ఎక్కువగా కనిపిస్తున్నాయి.

కృష్ణమ్మ జిల్లాలో ప్రవేశించిన ముక్త్యాల నుంచి విజయవాడ వరకు నదీతీరప్రాంతం (నదికిరువైపుల) వజ్రాలకు నెలవుగా వుంది. ఈ ప్రాంతంలో వర్షపాతం ఎక్కువ. వర్షాలు కురిసినప్పుడు వర్షపునీరు ఎండిన తర్వాత ప్రజలు వజ్రాలు ఏరుకొంటారు... ఈ ప్రాంతంలో లోయలు ఎక్కువ. జన సంచారానికి వీలు లేకుండా ఉండే ఈ లోయల్లో జాతిరత్నాలు అత్యధికంగా వుండేవి. ఈ లోయల్లో జంతు మాంసం తినే గద్దలు మాంసంతోపాటు అంటుకొని ఉండే రత్నాలను కూడా మింగేవి.అందుకే ఈ ప్రాంత ప్రజలు గద్దల గూళ్లను వెదికివాటి రెట్టల నుంచి రత్నాలు సేకరించేవారని ఈ ప్రాంతంలోని పూర్వీకులు చెబుతారు.

నేటికీ పరిటాల, చందర్లపాడు, రామన్నపేట ప్రాంతాలలో ఎంతో విలువైన వజ్రాలు బహిర్గతం అవుతుండటమే అందుకు నిదర్శనం. జగ్గయ్యపేట, నందిగామ, కంచికచర్ల ప్రాంతాల్లోని నదీతీరం వెంట స్థానిక ప్రజలు వజ్రాల వేట సాగిస్తుంటారు. తొలకరి సమయంలో నదీతీరప్రాంతమైన రామన్నపేట, చందర్లపాడు, పరిటాల ప్రాంతాల్లో ప్రజలు వజ్రాలను వెదకడం కోసం ప్రత్యేకంగా వస్తుంటారు. ఈ ప్రాంతంలో లభించిన వజ్రాలతో జగ్గయ్యపేట, నందిగామ, చందర్ల పాడు, కంచికచర్ల ప్రాంతాల్లో పలు సామాన్య కుటుంబాలకు చెందిన వారు కూడా భాగ్యవంతులుగా మారారు. ఎన్ఎండిసీ (జాతీయ ఖనిజ అభివృద్ధి సంస్థ) కూడా 1985వ సంవత్సరం నుంచి పది సంవత్సరాల పాటు చందర్లపాడును కేంద్రంగా చేసుకొని వజ్రాలను అన్వేషించి ఎంతో విలువైన వజ్రాలను సమీకరించింది.

## ప్రతి గ్రామానికీ ఎంతో కొంత ప్రాచీన చరిత్ర :

పశ్చిమ కృష్ణాలో ముఖ్యంగా కృష్ణానది, మున్నేరు, వైరా నదుల పరివాహక ప్రాంతమైన నందిగామ ప్రాంతానికి చారిత్రకంగా,

రాజకీయంగా, సాహిత్యపరంగా ఎంతో ప్రాధాన్యత ఉంది. నందిగామ ప్రాంతంలో అనేక చారిత్రక ప్రదేశాలు ఉన్నాయి. ప్రతి గ్రామానికీ ఎంతోకొంత ప్రాచీన చరిత్ర వుంది. ముఖ్యంగా కృష్ణానది వైపు సరిహద్దునున్న అమరావతి, అటు జగ్గయ్యపేటలో కనిపించే బౌద్ధస్థూపాలు వల్ల ఈ ప్రాంతంలో కొనసాగిన బౌద్ధమత ప్రచారం, అనంతరం తిరిగి విజృంభించిన జైనం, దానివెనుక శైవం ఈ ప్రాంతానికి కొంత ప్రాధాన్యాన్ని చేకూర్చిపెట్టాయి. కొండెడలమీద, గుట్టలమీద, సేద్యంలేని బంజరు భూముల్లో అనేక విగ్రహాలు, పెద్ద పెద్ద ఇటుకరాళ్ళు, కుండపెంకులు, గుర్రాల ఎముకల వంటి అనేక చారిత్రక ప్రధాన వస్తువులు లభిస్తున్నాయి. కొన్ని గ్రామాల్లో గింజల పాత్రల్లతోపాటు నాణాలు, దీపపు హారతులు వంటివి సైతం లభించాయి.

## నందిగామ పట్టణ చరిత్ర :

ఈ ప్రాంతంలో ప్రధానమైన నందిగామ పట్టణ చరిత్ర విషయానికి వస్తే భౌగోళికంగా ఈ పట్టణం భూమధ్యరేఖకు తూర్పున 80.17 డిగ్రీల రేఖాంశంలో, ఉత్తరాన 16.40 డిగ్రీల అక్షాంశంలో ఉంది. ఈ కారణంగా వేసవిలో ఇక్కడ అత్యధిక ఉష్ణోగ్రతలు నమోదవుతుంటాయి. ఈ విగ్రహం కారణంగా కూడా ఆధ్యాత్మికంగా రామాయణ కాలంలో ప్రస్తావించిన నందిగ్రామమే నేటి నందిగామ అనే వాదన ఎలా ఉన్నప్పటికీ చారిత్రకంగా నందిగామపట్టణం ప్రాంతంలో రాతియుగం కాలానికే మానవ సంచారం ఉన్నట్టు పురావస్తు శాస్త్రవేత్తలు ప్రకటించారు. 9వ శతాబ్దం నాటికే 18 పేటలు కలిగిన పెద్ద పట్టణమని రుద్రభూపతి రాజు కాలానికి చెందిన ఒక శాసనం ద్వారా తెలుస్తోంది. కాకతీయ రాజు కుమార్తెలైన 'మాలాంబిక', 'కుందాటిక'లను భూపతిరాజుకు ఇచ్చి నాతనాడి (నందిగామ)లో వివాహం జరిపినట్టు కూడా కాకతీయుల శాసనంలో ప్రస్తావించారు. చారిత్రకంగా మూడవ శతాబ్దం నుంచి నందిగామకు చెందిన ఆధారాలు లభిస్తున్నాయి. ప్రాచీన చరిత్రలో కృష్ణా, మున్నేరు, పాలేరు నదుల మధ్య ఉన్న ఈ ప్రాంతాన్ని 'నతవాటి' సీమగా వ్యవహరించేవారని నందిగామ ప్రాంతంలో లభించిన శాసనం ద్వారా తెలుస్తోంది. 3వ శతాబ్దంలో పాలన చేసిన మౌర్య వంశానికి చెందిన భూపతిరాజుకు చెందిన శాసనాలలో, 9వ శతాబ్దంలో పాలన చేసిన రెడ్డిరాజులకు చెందిన శిలాఫలకాలలో నందిగామ ప్రస్తావన కనిపిస్తోంది. ఈ శాసనాలను బట్టి నాటి నతవాటి సీమ క్రమంగా నందిగామగా వ్యవహారంలోకి వచ్చిఉండవచ్చునని భావిస్తున్నారు. పేరుకు తగినట్టుగా పట్టణంలో రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు పాలనా కాలంలో పునర్నిర్మించిన శివాలయంలో పెద్దనంది విగ్రహం వుండటం విశేషం.

నందిగామకు సమీపంలోని చందర్లపాడు గ్రామంలో లభించిన బంగారు నాణాలను బట్టి నతవాట (నందిగామ) సీమ నుంచి శాతవాహనుల కాలంలో కృష్ణానది ద్వారా విదేశాలతో వాణిజ్య సంబంధాలు కలిగి ఉన్నట్టు తెలుస్తోంది. శాతవాహనుల కాలం తర్వాత ఈ ప్రాంతం ఇక్ష్వాకుల పాలనలోకి వెళ్ళినట్టు జగ్గయ్యపేట, మలకాపురంలో లభించిన జైన శాసనాల ద్వారా తెలుస్తోంది. ఇక్ష్వాకుల తర్వాత కాకతీయుల పాలనలో, ఆ తర్వాత రెడ్డిరాజుల పాలనతో ఉంది. రెడ్డిరాజుల పాలనా కాలంలోనే పెనుగంచిప్రోలు వద్ద గోలుకొండ నవాబు అయిన కులీ కుతుబ్‌షా యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో రెడ్డిరాజులు ఓడిపోవడంతో నందిగామ ప్రాంతం నవాబుల ఏలుబడిలోకి వెళ్ళింది. ఆంగ్లేయుల ప్రవేశం అనంతరం నవాబులతో జరిగిన ఒడంబడిక మేరకు 1765వ సంవత్సరం నుంచి బ్రిటీష్ పాలన ప్రారంభమైంది. రాష్ట్రంలో ఇంచుమించు ప్రతి జిల్లాలో నందిగామ పేరు కలిగిన గ్రామాలు ఒకటో రెండో ఉన్నాయి. కృష్ణా జిల్లాలో కూడా మైలవరం పేరు ప్రస్తావన రావడంతోనే స్ఫురణకు వచ్చేది మాత్రం ఈ నందిగామ పట్టణమే. దుగ్గిరాల గోపాల కృష్ణయ్య, మాడపాటి హనుమంతరావు, అయ్యదేవర కాళేశ్వరరావు పంతులు, కొమర్రాజు లక్ష్మణరావు, తొలిమహిళా రచయిత్రి బండారు అచ్చమాంబ, కవి తట్టుభీమన్న వంటి స్వాతంత్ర్యసమరవీరులను, రాజకీయ ఉద్దండు, సాహితీమూర్తులు ఈ ప్రాంతానికి చెందినవారే.

## ప్రాచీన ఆలయాలు :

ప్రాచీన ఆలయాల విషయానికి వస్తే నందిగామ నియోజకవర్గంలోని కాండ్రపాడు గ్రామంలో దర్శనమిచ్చే అపూర్వ శివలింగం అత్యంత చిత్రమైనది. నాలుగున్నర అడుగుల ఎత్తు, మూడున్నర అడుగుల చుట్టుకొలత కలిగిన లింగాకృతి అగ్రభాగాన సమాన దూరంలో ఐదు శిరస్సులు చెక్కి వున్నాయి. 80 సంవత్సరాలకు పూర్వం పాటిమన్ను తవ్వుతుంటే బయటపడిన ఈ లింగం పరిసరాల్లోనే మరి నాలుగు శివలింగాలు ఒక చతురస్రాకారపు ఫలకం, మరికొన్ని విగ్రహాలు లభించాయి. ఈ ప్రధాన లింగానికి పానమట్టం లేదు. మిగిలిన నాలుగు లింగాలు ఈ ప్రాంతంలో దొరికే రాయితోనే చెక్కినట్టు, పానమట్టంతో కనిపిస్తుంటే ఈ ప్రధాన లింగం మాత్రం పూర్తి నల్ల రాయితో తయారుచేశారు. ఏటూరులోని జైన తీర్థంకరుని విగ్రహాన్ని నిర్మించిన రాయికి, ఈ రాతికి దగ్గర సంబంధం కనిపిస్తోంది. ముఖ్యంగా ఈవిధమైన శిల ఈ ప్రాంతంలో దొరికినదే. అదేవిధంగా ఈ ప్రదేశంలో రెండు పూర్ణకుంభాలు; ఒక శంఖం, మీనముల జంట చెక్కివున్నాయి. పూర్ణకలశం అమరావతి స్థూపంలోని పూర్ణ కలశాన్ని పోలి వుంది.

ఆలయంలోని లింగాన్ని చూడగానే జైనశిల్పం మనకు గుర్తుకు వచ్చింది. లింగానికి పురోభాగంలో కనిపించే లింగాకృతి సైతం ఈ భావాన్ని బలపరుస్తుంది. "పాడు" అనే పేరు జైన గ్రామాలకు చివర

వుంటాయన్న చరిత్రకారుల వాదనను అంగీకరిస్తే ఈ 'కాంద్రపాడు'లో ఏదో చరిత్ర దాగివుంది. ఇందుకు సాక్ష్యంగా సమీపంలోని లింగాల పాడు, అడవిరావులపాడు, తక్కెళ్ళపాడు, బొబ్బిళ్ళపాడు, చందర్లపాడు, తోటరావులపాడు, చింతలపాడు, విపరింతలపాడు మొదలైన గ్రామా లన్నీ ఈ ప్రాంత పరిసరాలలోనివే. ఇవి జైన మతప్రభావాన్ని గుర్తు చేస్తుంటే చారిత్రక నేపథ్యంలో 'చాగి' వంశపురాజులు ఈ ప్రాంతాన్ని పరిపాలించినట్లు గుడిమెట్లలో క్రీస్తుశకం 1155 నాటికి శాసనాలు తెలియచేస్తున్నాయి. కాకతీయ, రెడ్డిరాజుల పాలనలో ఈ ప్రాంతం ఉన్నట్లు శాసనాధారాలతో కృష్ణా గెజిట్ 235 పేజీలో ప్రస్తావించారు. తట్టుకవి భీమన పద్యం ఈ గుడిమెట్లను పాలించిన చాగి పోతురాజుని గురించి చెప్పిందేనని, ఆ పోతరాజు ఈ పంచముఖేశ్వరుని పూజించి వెడుతుండగానే తట్టుకవి భీమన శతకాన్ని చూసి దాన్ని అభిలషించి చివరికి ధన్యత పొందారనే కథనం వుంది.

## పెనుగంచిప్రోలు చరిత్ర

కొలిచినవారికి కొంగుబంగారంగా భాసిల్లుతున్న శ్రీ తిరుపతమ్మ తల్లి ఆలయంతో నేడు రాష్ట్రంలో ఆధ్యాత్మిక కేంద్రాలలో ఒకటిగా వున్న పెనుగంచిప్రోలుకు చారిత్రికంగా ఎంతో చరిత్ర వుంది. దేశ వ్యాప్తంగా గుర్తింపున్న నతవాడిసీమలో కొణకంచి, పెనుగంచిప్రోలు, అనుమంచిపల్లి, ముక్త్యాలయందు శివాలయములు గలవు. వీటిలో పెనుగంచిప్రోలు ఉత్తరదిశలో నున్నట్లు చెబుతారు. ప్రాచీన తెలుగు భాషయందు ఉత్తరదిశలో వున్న ప్రాంతాన్ని 'పెను' పేరుతో వ్యవ హరించేవారు. అందువల్లనే పెను (ఉత్తర) అని, శివాలయములున్న గ్రామములను 'కంచి' పేరుతో పిలిచేవారు. రాజుగారి కోశాగారం ఉండే గ్రామాలను ప్రోలు పేరుతో పిలుస్తారు. గుడిమెట్ల పాలకుడు సాగి పోతరాజు కోశాగారం పెనుగంచిప్రోలులో వుంది. ఈ నేపథ్యం లోనే పెను = ఉత్తర, కంచి = శివాలయం, ప్రోలు = కోశాగారం వుండటం వల్ల పై మూడు పదములు కలయికతో పెనుగంచిప్రోలు నామం ఏర్పడింది. ప్రాచీన ఆంధ్రలో భట్టిప్రోలు, అమరావతి, విజయపురి, ఘంటసాల నగరములతోపాటు పెనుగంచిప్రోలు కూడా ప్రముఖ స్థానం అలంకరించింది. క్రీ.పూ. 230, క్రీ.శ. 230 సంవత్సరాల మధ్య శాతవాహనులు ఈ ప్రాంతాన్ని పరిపాలించారు. తరువాత ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు పరిపాలన చేశారు. ప్రస్తుతం గుమ్మడిదుర్రు గ్రామాన్ని ప్రాచీనకాలంలో 'మదదకడపర' అను పేరుతో పిలిచేవారు. క్రీ.శ. 270 సంవత్సరంలో ఖముద (కమ్మ) కులంనకు చెందిన దోపం బసకస –అతని భార్య జాదిక, పిల్లలు దాపస, ఆకశ, చములస, ఉఖాస – బంధువులు ఫలికామోదియ, ధరేశు బుచ్చదియ, కాద్యలతో కలిసి సమీపంలోని ఉదయగిరి పేరుగల కొండమీద మహా విహారంను, చైతన్యంను నిర్మించారు. ఈ స్థూపం వద్ద శిలా ఫల కములు, వరదముద్ర భంగిమలో నుండి 0.96 మీ. ఎత్తుగల ఒక బుద్ధ విగ్రహం లభించాయి. మూడు తరాలకు చెందిన ఆచార్య మౌగ లాయన, ఆచార్య మాదేవశ్రమణ, రాహుల – బౌద్ధమతాచార్యుల పేర్లు శాసనముతో లభించాయి. ఈ స్థూపంలో స్వర్ణ కంఠహారం లభించింది. ఇది ప్రస్తుతం అమరావతి మ్యూజియంలో భద్రపర్చినట్టు రికార్డులు చెబుతున్నాయి.

ప్రాచీనకాలమున బౌద్ధులు ఉత్తరభారతదేశంలో సాంచీ నుండి పౌనార్, కోటిలింగాల, ఫణిగిరి, నేలకొండపల్లి, జగ్గయ్యపేట, మునగ చర్ల, పెనుగంచిప్రోలు మీదుగా ప్రయాణం చేసి గుమ్మడిదుర్రు బౌద్ధ స్థూపం సందర్శించేవారని చరిత్రకారులు నిర్ధారించారు. పెనుగంచి ప్రోలులోనూ ఒక బుద్ధ విగ్రహం లభించినది. బౌద్ధయాత్రికులు, వర్తకులు తెచ్చిన బంగారు నాణెములు, రోమన్ సామ్రాజ్య నాణెములు పెనుగంచిప్రోలులో లభించాయి. ఈ నాణెములు, విగ్రహములు పెనుగంచిప్రోలు ప్రాచీనతను తెలియచేస్తున్నాయి. రాజరాజ నరేంద్రుని కుమారుడు రాజేంద్రచోళుడు యీ నతనాటిసీమకు 'సాగిపోత రాజు'ను మండలాధీశునిగా నియమించారు, మొదటి పోతరాజు అను త్యాగి పోతధరాధీశుడు కాశీనుండి శివలింగాన్ని తెప్పించి, ముక్త్యాలలో శ్రీ భవాని ముక్తేశ్వర దేవాలయమును నిర్మించారు. ఈ వంశంలో చివరివాడు రామజగపతిరాజు, అతని భార్య సీతాంబికలను వధించి కొండపల్లి పాలకుడు గజపతిరాజు పెనుగంచిప్రోలును ఆక్రమించారు. ఆ తర్వాత క్రీ.శ. 1531 సంవత్సరంలో హైదరాబాద్ పాలకుడు కులీకుతుబ్‌షా కొండపల్లి పాలకులను, మక్కపేట రైలుగేటు సమీ పమున 'హసనాబాద్' వద్ద జరిగిన యుద్ధంలో ఓడించి పెనుగంచి ప్రోలును స్వాధీనం చేసుకొన్నారు. పెనుగంచిప్రోలు చరిత్రకు సంబం ధించిన అనేక శిలాశాసనాలు ఇక్కడ బయటపడ్డాయి. గ్రామస్తులు ఇళ్ల నిర్మాణ సమయంలో చేసే తవ్వకాలలో ప్రాచీన శిల్పాలు, నాణాలు అనేక లభించాయి.... నేటికి లభిస్తున్నాయి. ఇప్పటి వరకు లభించిన శిల్పాలు ప్రస్తుతం విజయవాడలోని విక్టోరియా మ్యూజియంనందు ప్రదర్శనకు వుంచారు. కులీకుతుబ్‌షా గజరాజుపై లభించిన విజయంతో విర్రవీగి, కురుకూరు గ్రామనామాన్ని నవాబుపేటగా మార్పు చేసి, చెరువును తవ్వించారు. ఆ చెరువు ద్వారా ప్రస్తుతం వందల ఎకరాల భూములను సస్యశ్యామలం చేస్తోంది. కులీకుతుబ్‌షా సమయంలోనే మక్కపేట, షేర్‌మహమ్మద్‌పేట గ్రామాలు నిర్మించారు.

## ఏటూరు-జైన విగ్రహం

నందిగామకు 16 కిలోమీటర్ల దూరంలో వున్న చారిత్రక ప్రదేశం ఏటూరు. ఇచ్చట జైన మత ప్రాబల్యం అధికంగా కనిపిస్తోందని 'కృష్ణా గెజిట్' వెల్లడిస్తోంది. ఇప్పటికి 50 సంవత్సరాల క్రిందట ఈ ప్రాంతంలో దొరికిందని గ్రామస్తులు చెపుతారు. ఈ విగ్రహం మతో



ఏటూరులోని జైన విగ్రహం

న్మాదుల చేత మొండెమునుండి శిరస్సు వేరుచేయబడింది. శిరస్సు సమ్మెట దెబ్బకు గురై ముఖపు ఎడమ పార్శ్వం శిథిలమైంది. విగ్రహానికి చెందిన మొండెం ఒక ప్రాంతంలో శిరస్సు మరో ప్రాంతంలో లభించాయి. ఉత్సాహవంతులైన గ్రామస్తులు ఆ రెంటిని అతికించి ఒక రూపాన్ని తయారుచేశారు. విగ్రహం స్థిరాసనంతో కూర్చొని వుంది. నిలువు 5' 10", పీఠం 4' 9", వక్షస్థలం 18", భుజాల మధ్య దూరం 3' 10" వున్న ఉన్నత విగ్రహమే యిది. అరచేతులు ఒళ్ళో వుంచుకొన్న యోగముద్రలో వున్న మూర్తి అరచేతులు, పాదాల పైన చక్రాంకితాలై వున్నాయి. శిరస్సు చుట్టూ లతలతో చెక్కి వుండటంతో పాటు, పల్లెవాటు వున్నట్లు విగ్రహంలో మనం స్పష్టంగా గమనించవచ్చు. ఎడమచేయి ఎక్కువభాగం సమ్మెట దెబ్బలకు ధ్వంసం అయ్యాయి. విశాల నేత్రాలు, తలపై ముంగురులు కలిగిన జుట్టు ముడి, వల్లెవాటు, ఆజాను బాహు శరీరంవుండి నల్ల రాయిపై అందంగా చెక్కబడిన ఈ మూర్తి బుద్ధ విగ్రహమనే అనేకులు వ్యాసాలు రాశారు. అయితే యిది జైన తీర్థంకరు లలో ప్రధానుడైన వర్ధమాన మహావీరుని విగ్రహమని కృష్ణా గెజిట్ 235వ పేజీలో పేర్కొనబడింది. ఏటూరు గ్రామం వీరభద్రుని పాలెం, ఏటూరుగా అనే రెండుగ్రామాలుగా వ్యవహరిస్తారు. ఈ ప్రదేశంలో ఎక్కడ తవ్వినా ధాన్యం పాతర్లు, పురాతన ఇటుకలు, కుండ పెంకులు, ఎముకలు, చిన్నచిన్న రాతి శిల్పాలు బయట పడుతుంటాయి. ఏటూరు ఇంటి పేరుతో దేశ పాండ్యాలు అనే బ్రాహ్మణ కుటుంబాలు ఈ ప్రాంతంలో చాలాకాలం నివసించాయి. రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు మున్నలూరు సంగమేశ్వరుని దర్శనానికి వెళ్ళి వీరిని పిలిపించుకునే వారని, వారితో కలిసి మళ్ళీ ఈ ప్రదేశం వరకూ వచ్చేవారని వృద్ధులు చెబుతారు. ఒక డొంకపేరు ఇప్పటికి 'స్నానాల డొంక' అనే పిలుస్తారు. సాహితీ వేత్తలుకు, కళాకారులు ఈ ప్రాంతంలో నివసించారు. సాహిత్యరం గంలో ప్రసిద్ధిచెందిన చదలవాడ సోదరీమణులు ఈ ప్రాంతంవారే. వీరి రచనలో ఏటూరు గురించి ఎంతో ప్రముఖంగా ప్రస్తావించారు.

**'లక్ష్మమ్మ' పేరంటాలు :**

నందిగామ సీమలో ప్రసిద్ధి పొందిన ప్రదేశం లింగాలపాడు. నందిగామ నుండి 10 కిలోమీటర్ల దూరంలో వున్న ఈ గ్రామంలో 'లక్ష్మమ్మ' పేరంటాలుగా ప్రసిద్ధి గాంచింది. 'లక్ష్మమ్మకథ' పేరుతో ఈ పేరంటాలు చరిత్రను చలనచిత్రంగా రూపొందింది. దిగుమర్తివారి ఆడపడుచు 'లక్ష్మీ' చిరుమామిళ్ళ వారి కోడలుగా అడుగుపెట్టింది. అత్తవారింటిలో ఆడపడుచు, అత్తగారు లక్ష్మిని అనేక ఆరళ్ళు పెట్టి చివరికి ఆమె తమమాట వినడంలేదనే కోపంతో ఇంట్లోని పాలేరుకు ఆమెకూ అక్రమ సంబంధం అంటకట్టారు. సహజంగానే జాలి హృదయురాలైన లక్ష్మి, పాలేరుకు అన్నం పెడుతూ ఒకటికి రెండుసార్లు కొసరి కొసరి వడ్డించడం, మురికిపట్టిన జీతగాడి తలపై నురుగుపోసి తల అంటడం వంటి దృశ్యాలను భర్తకు చూపి అతని మనసును విరిచివేశారు. అది సహించలేని ఆమె భర్త వెంకయ్యనాయుడు భార్యను అనుమానించి ఆవేశంలో పొడిచి చంపేశాడు. ఏ పాపం ఎరుగని లక్ష్మి "లక్ష్మమ్మ"గా మిగిలిపోయింది. అనంతర కాలంలో ఆమె పేరు మీద, ఆమె ప్రవర్తనమీద నమ్మకం కుదిరిన ప్రజానీకం ఆమెను దేవతగా భావిస్తూ వచ్చారు. ఆమెను పొడిచిన పాపానికి భర్త కళ్ళు పోయి పశ్చాత్తాపంతో మరణించాడని, ఆమె మహిమ మూలంగానే అత్త ఆడపడుచులు బావిలోపడి మరణించారని గ్రామస్తులు చెప్పు కుంటుంటారు. వీటన్నింటికి కారణం లక్ష్మమ్మ పతి భక్తేనని ప్రజలు పూర్తిగా విశ్వసిస్తున్నారు.

నందిగామకు 16 కిలోమీటర్ల దూరంలో కృష్ణానది ఎడమ గట్టుపై వున్న చారిత్రిక ప్రదేశం గుడిమెట్ల గ్రామం. ఈ గ్రామం ఎత్తయిన కొండగట్టుపైన కట్టిన శివాలయం గల ఈ ప్రదేశం మెట్టుమీద గుడి వుండటం వల్ల ఈ గ్రామానికి "గుడిమెట్ల" పేరు వచ్చివుంటుందని చరిత్రకారుల అభిప్రాయం. రెడ్డిరాజుల, కాకతీయుల పరిపాలనలో చెన్నకేశవస్వామి, వెంకటేశ్వరస్వామి, రామలింగేశ్వరస్వామి, విశ్వేశ్వర స్వామి దేవాలయాలు ఏర్పాటుచేసినట్లు చారిత్రాకాధారాలు వున్నాయి. రాణి పోతరాజు పరిపాలించిన క్రీస్తుశకము 1155 ప్రాంతంలోని శాసనాలు 'మసీదు దిబ్బ' అనే ప్రాంతంలో మనకు కనిపిస్తాయి. ఏడు కోటలు, ఏడే పేటలు ఈ ప్రాంతం ప్రజల్లో పాతమాట అయి పోయింది. రాణి పోతురాజు కాకతీయులకు సామంతుడిగా రాజ్య పాలన కోరాదన్న శాసనాధారాలు అతని శైవ మతాభిమానాన్ని గుర్తు చేస్తూ కాకతీయుల శైవమతావలంబనానికి ఆలంబగా నిలుస్తున్నాయి.

కృష్ణానది ఒడ్డున మరో గ్రామం ఉస్తేపల్లి. ఈ గ్రామంలో వున్న గట్లు వజ్రాల దిబ్బలుగా చెబుతారు. ఈ మట్టికొండలు రంగురాళ్ళు రత్నాలకు ప్రసిద్ధి. స్థానికులలో అనేకమందికి వజ్రాలు లభించడం, వారి జీవనంలో మార్పురావడం ఈ ప్రాంతవాసులకు తెలిసిన విష యమే. ఈ గ్రామంలో కృష్ణానది ఒడ్డున కనిపించే 'ద్వారక వెంక టేశ్వరుని దేవాలయం'. ఆ ఆలయానికి ఎదురుగా శివాలయం. వీటిపై

చరిత్రను ప్రతిబింబించే కళారూపాలు అబ్బురకొల్పుతాయి. కృష్ణవేణి లోతు అధికమై వెడల్పు తగ్గి నిర్మలమైన నీటిని అందించే ఈ కొలనుల్లో నిర్మించిన ఈ ఆలయాల వెనుక ద్వార బంధాలపైన చెక్కిన లతలు మాత్రం ఈనాటికీ నూతనంగానే కనిపిస్తుంటాయి. కొందరు స్వార్థ పరులు చేత తవ్వకాలు జరపబడి, విగ్రహాలను, శివలింగాలను తవ్వి వేసి విగ్రహాలను అపహరించారు. ఇలాంటి చక్కటి శిల్పాలను రక్షించాల్సిన అవసరం వుంది.

### 'ముక్త్యాల భవానీ ముక్తేశ్వరస్వామి ఆలయం'

జగ్గయ్యపేట మండలం కృష్ణా, నల్గొండజిల్లాల సరిహద్దులో వున్న ముక్త్యాల గ్రామంలో ఆధ్యాత్మిక ప్రాశస్త్యం గల గ్రామంగా శైవక్షేత్రంగా, పుణ్యక్షేత్రంగా దాదాపు వెయ్యి సంవత్సరాల చరిత్ర కలిగివుంది. భవానీ ముక్తేశ్వరస్వామి ఆలయం వున్న గ్రామం ఈ ముక్తేశ్వరం. అయితే వ్యవహారికంలో ముక్తేశ్వరాన్ని ముక్త్యాలగా వ్యవహరిస్తారు. గ్రామంలోని 'భవాని ముక్తేశ్వరస్వామి' ఆలయాన్ని 11వ శతాబ్దంలో రెడ్డిరాజులు నిర్మించినట్లు ఆలయంలోని శాసనాల ద్వారా వెల్లడవుతోంది. ఇక్కడ కృష్ణానది ఉత్తర దిశగా ప్రయాణం చేయడం వల్ల కృష్ణానదిని ఇక్కడ ఉత్తరవాహిని అనికూడా వ్యవహరిస్తారు. ఇది రాజరిక వైభవాన్ని సంతరించుకున్న ఆధ్యాత్మిక క్షేత్రంగా నేటికీ విరాజిల్లుతోంది. రాజరికపు వారసురాలిగా, నేటికీ ముక్త్యాల రాణిగా పేరుగాంచిన జగ్గయ్యపేట మాజీ శాసనసభ్యులు వాసిరెడ్డి రాజ్యలక్ష్మమ్మ నాటి పాలనకు, నేటి ప్రజాస్వామ్యానికి మధ్యవారధిగా వున్నారు.

### కోట చరిత్ర

ముక్త్యాల జమీందారు గ్రామం జగ్గయ్యపేటతోపాటు పరిసర గ్రామాల పరగణగా వాసిరెడ్డి తనయులు, పలు తరాల రాజులు పాలించినట్లు చారిత్రక ఆధారాలు తెలుపుతున్నాయి. వాసిరెడ్డి వంశీకులైన చింతలపాటి ఇంటిపేరుగల వారు చంద్రమౌళి ముక్త్యాలను రాజధానిగా చేసుకొని పాలించారు. అనంతరం నాలుగవతరం వాడైన 'రామలింగప్ప' అధికారంలోకి వచ్చిన అనంతరం దాయాదులు సింహాసనం, పాలనాధిపత్యానికి జరిపిన పోరాటంలో ఈ ముక్త్యాల కోటను ధ్వంసం చేశారు. 1863లో ఈ కోటను భవానీ ముక్తేశ్వర ప్రసాద్ పునఃప్రతిష్టించగా వారి మనుమడు చంద్రమహేశ్వరప్రసాద్ కోటలోని రాజప్రాసాదాన్ని పునరుద్ధరించి నూతన భవనాలను నిర్మించారు. జగ్గయ్యపేట ప్రాంతం పూర్వం బౌద్ధక్షేత్రంగా అభివృద్ధి చెందింది. బౌద్ధారామాలు ఏర్పాటుచేసే నాటికే ముక్త్యాల గ్రామం బౌద్ధకేంద్రంగా పరిఢవిల్లింది. 1925లో రాజు చంద్రమహేశ్వరప్రసాద్ రాజప్రాసాదంలో రసాయనశాలను ఏర్పాటుచేసి ముక్త్యాలను ఆయుర్వేద వైద్య సేవలకు ప్రధాన కేంద్రంగా దేశవ్యాప్త ప్రాచుర్యానికి కృషి చేసారు. 1939లో కుమారరాజుగా పిలువబడే వాసిరెడ్డి రామ గోపాలకృష్ణ మహేశ్వరప్రసాద్ రాజరిక బాధ్యతలు స్వీకరించి కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణచే విరచితమైన శ్రీమద్రామాయణ కల్పవృక్షాన్ని ప్రకటింపజేశారు. ముక్త్యాల ఆస్థానంలో రాజా ఆర్.జి.కె.ఎం. ప్రసాద్ ప్రోత్సాహంతో కవులను, రచయితలను, కళాకారులను పోషించారని ప్రతీతి.



**విజయవాడ విక్టోరియా మ్యూజియంలో వున్న పెనుగంచిప్రోలు శిలాశాసనం**

రాష్ట్ర విభజనతో నవ్యాంధ్ర ఆవిష్కరణ కావడమేకాకుండా నందిగామ, జగ్గయ్యపేట ప్రాంతాలు రాజధాని పరిధిలోనే వున్నాయి. ఈ నేపథ్యంలో ఈ ప్రాంతంలో వున్న విగ్రహాలపై, చారిత్రక ప్రాంతాలపై చరిత్రకారులు అధ్యయనం చేసి నూతన విషయాలను అందించగలదని ఆశించవచ్చు. నూతన రాజధాని అమరావతితోపాటు నందిగామ ప్రాంతం కూడా దేదీప్యమానం అవుతుందనడంలో ఎటువంటి సందేహం లేదు.

**చిరునామా :** *శ్రీ అన్నవరపు బ్రహ్మయ్య, ఇంటి నెం : 70-11-13/ఎ, భవానీపురం, విజయవాడ - 12,*
*సెల్ : 94403 20886,* ***email: brahmaiahannavarapu@gmail.com***

శ్రీమతి గుడిపూడి రాధికారాణి

# బందరులో బ్రౌన్ భాషాసేవలు

**జా**తి భాషా వికాసానికి, చారిత్రక, సాంస్కృతిక వైభవానికి సాహిత్యమే మూలం. నదీతీర గ్రామాల, పట్టణాల నాగరికత, సామాజిక, రాజకీయ, ఆర్థిక పరిణామ క్రమ తులనాత్మక అధ్యయనానికి చరిత్రయే ఆధారం. అట్టి సాహితీ సంపద, చారిత్రక ఆధారాలు గ్రామ చరిత్రలు తాళపత్రాలుగా శిథిలమౌతుంటే చూడలేక వాటిని కొత్తగా కనిపెట్టిన కాగితాలపై ఎత్తి రాయించి స్వంతఖర్చుతో భవిష్యత్ దర్శనం చేయించిన మహనీయుడు ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ సాహెబ్.

'ఆంధ్ర భాషోద్ధారకులలో కలకాలం స్మరింపదగ్గ మహనీయుడు, మహా విద్వాంసుడు సి.పి.బ్రౌన్ అన్నారు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. 'ఆంధ్రభాషామతల్లి సేవ, వాఙ్మయాభివృద్ధికే జన్మమెత్తిన పుణ్య పురుషుడు బ్రౌన్' అన్నారు కొమర్రాజు లక్ష్మణరావుగారు. తెలుగువారి చారిత్రక, సాంస్కృతిక వైభవాన్ని తవ్వితీసిన పాశ్చాత్యులలో వీరు అగ్రగణ్యులు. తన ధన, జీవితాలను తెలుగు భాషాభివృద్ధికై ఖర్చుచేసిన ఈ నిష్కామ భాషాభిమానికి తెలుగుజాతి రుణపడి ఉంది.

మసులీపటాంను ఆంధ్రదేశానికి రాజధానిగా అభివర్ణించిన ఈ యూరోపియన్ దొరకు బందరుతోగల సాహితీఅనుబంధాన్ని స్మరించుకోవడమే ఈ వ్యాస ముఖ్య ఉద్దేశ్యం. కృష్ణానది పేరుమీదుగా ఏర్పడిన కృష్ణాజిల్లా ముఖ్యపట్టణం మచిలీపట్నం. ఇదే నాటి మసులీపటాం, మచిలీబందరు. ఈ ఊరితో వీరు దాదాపు పుష్కరకాలం పాటు సంబంధం కలిగి ఉన్నారు.

బ్రౌన్ మచిలీపట్నంలో జ్యుడీషియల్ ఆఫీసరుగా వున్న కాలంలో తన తీర్పును తెలుగులో ఇచ్చారు. ఇది తెలుగు చరిత్రలోనే ప్రథమం. నేటికీ ప్రభుత్వ జి.వోలు తెలుగులో అరుదుగా వెలువడుతున్న తరుణంలో ఈ విషయం ప్రతిఒక్కరం తలుచుకుని అభినందించవలసి ఉంది.

ఒక తండ్రి తన సంతానంలో విజ్ఞాన తృష్ణను రగిలిస్తే భవిష్యత్ తరాలకు మార్గదర్శకత్వం లభిస్తుందనడానికి వీరి తండ్రి డేవిడ్‌బ్రౌన్ ఉదాహరణ.

తండ్రి పర్యవేక్షణలో చిన్నతనంలోనే హీబ్రూ, సిరియన్, అరబ్బీ, పారశీక, గ్రీకు, లాటిన్ భాషలను బ్రౌన్ క్షుణ్ణంగా నేర్చుకున్నాడు. కలకత్తాలో అరబ్బీ, పర్షియన్, హిందుస్తానీ మాట్లాడేవారి మధ్య పెరగడంతో ఆ భాషలూ వచ్చేశాయి. అనేక ఆంగ్లనవల, ప్రఖ్యాత గ్రంథాలూ పదహారేళ్ళ ప్రాయంలోనే పఠించాడు.

తెలుగు భాషకు వెలుగు సమకూర్చవలసిన సూర్యుడు కావలసిన తరుణంలో బ్రౌన్ మద్రాసు సర్వీసుకు, అతని సోదరులు బెంగాల్ సర్వీసుకు కేటాయింపబడటం తెలుగువారి అదృష్టం.

1816 జూన్ 30న మద్రాస్ సివిల్ సర్వీసులో రైటర్‌గా నియమింపబడ్డారు. పూర్తిచేయవలసిన విద్యకోసం చెన్నపట్నం సెయింట్ జార్జికోటలోని కాలేజీకి పంపారు. 1817 ఆగస్ట్ 4న చెన్నపట్నం చేరాడు. ఫోర్ట్ సెయింట్ జార్జి కోటలో రెండు దక్షిణభారత దేశ భాషలు నేర్చుకోవాలి. ఆయన తెలుగు, మరాఠీ భాషలు స్వీకరించాడు. వెలగపూడి కోదండరామపంతులు తెలుగు అక్షరాలు నేర్పాడు. మూడేళ్ళ శిక్షణ తర్వాత పరీక్ష ద్వితీయశ్రేణిలో నెగ్గాడు.

1820 ఆగస్టులో 22 సంవత్సరాల వయస్సులో బ్రౌన్ ఉద్యోగ జీవితం ఆరంభమైంది. కడపజిల్లా కలెక్టర్ హన్‌బరీకి రెండో అసిస్టెంట్‌గా నియామకం జరిగింది. హన్‌బరీని చూసి తెలుగులో మాట్లాడాలనే ప్రేరణ పొంది రెండేళ్ళలో బ్రౌన్ ఆయనను మించిపోయాడు. ఈ విషయం నేటి విద్యార్థులందరికీ ఆదర్శప్రాయం.

1822 అక్టోబర్ 26న బ్రౌన్ కడపనుండి కృష్ణాజిల్లా కోర్టు రిజిస్ట్రార్‌గా బదిలీ అయ్యాడు. సహాయక మేజిస్ట్రేట్ హోదాలో దస్తావేజుల రిజిస్ట్రేషన్ చేసేవాడు. 1823 జనవరిలో అప్పటి బందరు జడ్జీ చెర్రీ కుంభకోణం బదిలీ అయ్యారు. అందువలన రిజిస్ట్రార్‌గా వున్న బ్రౌన్ రెండు నెలలపాటు కృష్ణాజిల్లా జడ్జిగా పనిచేశాడు.

కడపలో స్థాపించినట్లే మచిలీపట్నంలో కూడా రెండు ధర్మబళ్ళు ప్రారంభం చేశాడు. విద్యార్థులకు భోజనవసతితో సహా ఆ పాఠశా

లలకయ్యే ఖర్చంతా ఆయనే భరించాడు. ఈ సమయంలోనే ఆయన సంస్కృత సాహిత్య పఠనం చేశాడు. చాలామంది పండితులవద్ద తెలుగు నేర్చుకున్నాడు. వారిలో ముఖ్యుడు పత్యం అద్వైత పరబ్రహ్మశాస్త్రి.

### సి.పి.బ్రౌన్‌కు సంస్కృతం నేర్పిన శ్రీ పత్యం అద్వైత పరబ్రహ్మశాస్త్రి

వీరు గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా కారుమూరు గ్రామస్థులు. వృత్తిరీత్యా బందరులో స్థిరపడ్డారు. బ్రౌన్ ఆయనను తన గురువుగా, మిత్రునిగా, భాషాసేవకు సహాయకునిగా స్వీకరించి గౌరవించారు. బందరు జిల్లా కోర్టులో పనిచేస్తుండేవారు. ఆ రోజుల్లో తెలుగు, సంస్కృతం తెలిసినవారు, తెలుగు, సంస్కృతభాషల్లో ఉన్న కోర్టుడాక్యుమెంట్లను, సాక్ష్యాలను ఆంగ్లభాషలో విడమరచి చెప్పే ఉద్యోగిని 'కోర్టు ఇంటర్ ప్రెటర్' అనేవారు. వీరు కోర్టు పండితులుగా ఉండేవారు. వారిలో ఒకరు శ్రీ పరబ్రహ్మశాస్త్రి.

బందరు సబ్‌కోర్టు పండితులుగా పనిచేసి పదోన్నతి పొంది, దక్షిణదేశ మొత్తానికి ఆనాడు వున్న సదరన్ ఫేజ్ దారి అదాలత్ సీనియర్ పండితులుగా వెళ్ళి, తిరిగి బందరులో చేరారు. బ్రౌన్ 1830లో తిరిగి రాజమండ్రి నుండి బందరు బదిలీపై వచ్చినపుడు బ్రౌన్ దొర సహాయకులుగా వ్యవహరించారు. ఈ కాలం లోనే బ్రౌన్ దొర పరబ్రహ్మంగారిని తన 'వసుచరిత్ర' తెలుగు గ్రంథం ముద్రణ పర్యవేక్షించుటకు మద్రాసుకు పంపారు.

కృష్ణానదిలోని అనేక పురాతన వ్రాతప్రతులను తాను చదివి, తిరిగి వ్రాసి, సంస్కరించి ప్రచురించడంలో పరబ్రహ్మశాస్త్రి తనకెంతో ఉపకరించాడని బ్రౌన్ తన జ్ఞాపకాలలో రాసుకున్నాడు. పరబ్రహ్మశాస్త్రి శశాంక విజయం పరిష్కరించాడు. శాస్త్రిగారి కుమారుడు రామలింగ శాస్త్రి వసుచరిత్ర ప్రచురించాడు. శాస్త్రిగారి మరో కుమారుడు వాసుదేవ శాస్త్రి తెలుగులో 'వ్యవహారదర్పణము' గ్రంథరచయిత, శాస్త్రిగారి తమ్ముడు కృష్ణశాస్త్రి కూడా బ్రౌన్ దొరకు సహాయకుడిగా ఉండేవారు. పత్యం పరబ్రహ్మశాస్త్రి 1840లో అనారోగ్యంతో బందరులో మరణించారు.

మచిలీపట్నంలో పనిచేస్తున్న సమయంలోనే బ్రౌన్ వెంకటశివ శాస్త్రినుండి వేమన గురించి విన్నారు. అబేదుబాయ్ వ్రాసిన 'Hindu manners and Customs' అనే గ్రంథం ద్వారా తెలుగుకవి వేమన గురించి తెలుసుకున్నారు. వేమన పద్యాల సేకరణను, ఆంగ్ల అనువాదాలను ప్రారంభించాడు. తాళపత్రాలు సేకరించి 18 సంవత్సరాలు కృషిచేశారు. మచిలీపట్నం, నెల్లూరు, విశాఖపట్నం, గుంటూరు, బెల్లరీ, కడపలనుండి తాళపత్రాలు సేకరించారు.

### తిప్పాభొట్ల వెంకటశివశాస్త్రి

బందరు జిల్లాకోర్టులో సాదర్ అమీన్‌గా చేసేవారు. శివశాస్త్రి సహాయంతో బ్రౌన్ వేమన పద్యాలను 'ద వర్సెస్ ఆఫ్ వేమన' పేరుతో ఆంగ్లానువాదం చేశారు. మొత్తం 1215 పద్యాలు. స్వంతఖర్చు. బ్రౌన్ దొర కష్టపడి వేమన చెప్పినట్లు భావించిన 693 పద్యరత్నములను క్రీ.శ. 1829లో ప్రచురించారు. 1200 పద్యములు మలిముద్రణలో ప్రచురించారు. వీటికి 'పూర్ణయాచారి' బందరు ముద్రణము నాలుగువేలకుపైచిలుకు పద్యాలతో వెలువరించిన రచనే మూలాధారమని తెలుగు సాహిత్య సమీక్ష గ్రంథము రెండవ సంపుటిలో డా॥ జి. నాగయ్య సెలవిచ్చారు. అనగా రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారి వేమన గ్రంథమునకు పూర్ణయాచారి 'బందరు' ముద్రణమే మూలాధారము.

తెలుగులో రచనలు చేయడానికి బ్రౌన్ దొరకు పత్యం అద్వైత పరబ్రహ్మయ్యశాస్త్రి, శివశాస్త్రి, రామలింగశాస్త్రి, సీతారామశాస్త్రిలు సహకరించారు. వీరి సాహచర్యం వల్ల బ్రౌన్ తెలుగులో మంచి పట్టు సాధించాడు. బ్రౌన్ దొర ఏరి కూర్చిన మొదటి నిఘంటువు బ్రౌణ్య నిఘంటువు. ఇది తెలుగు-ఇంగ్లీష్ డిక్షనరీ.

1822లో నిఘంటు రచన ప్రారంభించారు. బందరులో బ్రౌన్ దొర వద్ద రామయ్య అనే గుమస్తా పనిచేస్తూ డిక్షనరీ వ్రాత పనులు చూచేవారు. అందరూ ఆయన్ని డిక్షనరీ రామయ్యా అని పిలిచేవారు. రామయ్య ఒకసారి బ్రౌన్ దొరకు ఉత్తరం వ్రాస్తూ తమవద్ద పనిచేసే డిక్షనరీ రామయ్య అనేక సలాములు చేసి వ్రాయునది ఏమనగా అని వ్రాసుకున్నాడు.

'ఆంధ్రదీపిక' అనే నిఘంటువు వ్రాసిన శ్రీ మామిడి వెంకయ్య బ్రౌన్ దొరకు సమకాలికుడు. వీరు బందరువాసి, వైశ్యకులస్థులు. బ్రౌన్ దొరకు తెలుగుభాష విషయంలో చేదోడుగా ఉండేవారు. ఆయన గురించి ఒక సందర్భంలో బ్రౌన్ దొర స్వయంగా 'మసులీ పటాంలో నాకు మామిడి వెంకయ్య విద్యాలయంలో ప్రవేశం లభించింది' అని వ్రాసుకున్నారు. తనకు తెలుగు సాహిత్యం సరఫరా చేసిన వారిను దహరిస్తూ 'మసూలీ పటాంలో శ్రీ గుండుమళ్ళ జగన్నాథం వద్దా, రాజ జగన్నాథం వద్దా పుస్తకాలున్నాయి' అని వ్రాసుకున్నాడు. బందరు వాస్తవ్యరాలు కోటిలింగన్న భార్యవద్ద ఉన్న సంస్కృతభాషా పుస్తకాలు రు. 370 వెచ్చించి బ్రౌన్ కొనుగోలు చేశారు.

సి.పి.బ్రౌన్ మరో సహాయకులు జూలూరు అప్పయ్య పండితులు. వీరు గుంటూరుజిల్లా వేటపాలెం గ్రామస్థులు. సంస్కృతాంధ్ర భాషా పండితులు. బ్రౌన్ మసులీపటాంలో పనిచేసిన కాలంలో బ్రౌన్ గారికి సంస్కృతాంధ్ర భాషల సహాయకులుగా పనిచేశారు. 'అచ్చ తెలుగు కవిత్వం రాయడంలో అప్పయ్య పండితులంతటి వారు లేరు' అని బ్రౌన్ ఈయనను ప్రశంసించారు. వసుచరిత్ర, మనుచరిత్ర సంస్కృత గ్రంథాలను బ్రౌన్ దొర ఆదేశానుసారం తెలుగులో వ్యాఖ్యాన సహితంగా అప్పయ వ్రాశారు.

కవివర్ణ రసాయనము, విజయ విలాసములకు వ్యాఖ్యానాలు వ్రాశారు. కానీ అవి ముద్రణకు నోచుకోలేదంటారు. శుకసప్తతి, వేమన పద్యాలు, శశాంక విజయటీక, పద్మపురాణం, ఆముక్తమాల్యద తదితర గ్రంథములను అసలు తాళపత్రములతో పరిశీలించి పరిష్కరించారు. జూలూరు అప్పయ్య పండితులు కుమారుడు కూడా కవి. అతడు వసు చరిత్ర తెలుగులో వ్రాయగా తండ్రి దానికి వ్యాఖ్యానంజోడించాడు. అప్పయ్య పండితుల రచనలు యదువంశభూషణ శతకం, శ్రీనివాస తారావళి, రామపంచ సత్కంథములు 'వైజయంతి' పత్రికలో ప్రచురితమైనవి.

1822 అక్టోబర్ 26 నుండి 1825 నవంబర్ వరకు బ్రౌన్ దొర మసులీపటాంలో పనిచేసిన అనంతరం 1825 నవంబరులో రాజమండ్రి కలెక్టర్‌కు హెడ్ అసిస్టెంట్ మెజిస్ట్రేట్‌గా బదిలీ అయ్యారు. 1826 మార్చిలో తిరిగి కడపకు, 1829లో తమిళనాడు ప్రాంతంలోని తిరుచునాపల్లికి బదిలీ అయ్యారు. 1829 మే నాటికి 16,000 పదాల తన నిఘంటువు పూర్తి అయింది. 1929 డిసెంబరులో రాజ మండ్రికి బదిలీ జరిగింది.

1830లో మచిలీపట్నం అగ్జిలరీకోర్ట్ జడ్జిగా చేరాడు. ఈ సమ యంలోనే ఏడేళ్ళుగా తదేకదీక్షతో వ్రాస్తూ వచ్చిన తెలుగు – ఇంగ్లీషు నిఘంటువుకు సమగ్రరూపం ఇచ్చాడు. దీనినే తిరగరాసి (ఇంగ్లీషు –తెలుగు) నిఘంటువుగా తయారుచేయడం మొదలుపెట్టాడు. శామ్యూల్ జాన్సన్ ఇంగ్లీషు నిఘంటువును తెలుగులో తర్జుమా చేయడం ప్రారంభించాడు. ఇందువలననే తన నిఘంటువులో జాన్స న్‌ను కనీసం వెయ్యిసార్లకు పైగా ప్రస్తావించాడు.

బ్రౌన్ దొర మచిలీపట్నంలో ఒక ప్రింటింగ్ ప్రెస్ ప్రారంభించాడు. ఆ రోజుల్లో బందరులో తెలుగు అక్షరములద్దే ముద్రణాలయములు రెండు వుండేవి. ఒకటి నోబుల్ కళాశాలలోని డౌప్రెస్ కాగా రెండవది బ్రౌన్ స్వంతంగా స్థాపించిన తెలుగు ముద్రణాలయము. డౌప్రెస్ ఆంధ్రదేశంలోని ప్రథమ ఆంగ్లభాషా ముద్రణాలయము బ్రౌన్ స్థాపిం చిన తెలుగు ముద్రణాలయములో తన 400 అరఠావుల చేతివ్రాతలో ఉన్న 'నా కాశీయాత్ర' అచ్చు వేయించవలసిందిగా ఏనుగుల వీరా స్వామయ్య కోరారు. 300 ప్రతులు ప్రకటించవలసిందిగా లేఖ వ్రాశారు. బ్రౌన్ దొర తెలుగుభాషా సేవను గుర్తించి 'స్కాందం' అనే గ్రంథమును పంపుతానని కూడా లేఖలో తెలిపారు.

## ఏనుగుల వీరాస్వామయ్య కాశీయాత్ర

1862లో స్థాపింపబడిన చెన్నై హైకోర్టులో ఇంటర్‌ప్రిటర్‌గా వీరాస్వామయ్య 1819లో ప్రవేశించారు. ఇంగ్లీషును అరవం, తెలుగు మొదలగు భాషల్లో తర్జుమా చేసే ఉద్యోగులను ఇంటర్‌ప్రిటర్‌లంటారు.

వీరాస్వామయ్య 1830 మే 18నుండి 1831 సెప్టెంబర్3 వరకు కాశీయాత్ర చేశారు. వీరితో 100మంది యాత్రకు వచ్చారు. ఆ యాత్రలో 'కడప, హైదరాబాదు, నాగపూర్, జబల్‌పూరు, మిరిజా పూరు, అలహాబాదుల మీదుగా పోయినాను. తిరిగి వచ్చేటపుడు ఘాజీ పూరు, చప్రా, పట్నా, గయ, కలకత్తా, పూరీ, గంజాంమీదుగా అన్ని ఉత్తరజిల్లాలనుండీ వచ్చాను' అని బ్రౌన్‌కు రాసిన లేఖలో తెలిపారు.

ఆ యాత్రాకాలంలో 1830 ఆగస్ట్2న మచిలీబందరు చేరి 15వ తారీఖు వరకు మకాం చేసారు. కృష్ణాతీరమందు 19 మధ్యాహ్నం వరకు ఉన్నారు. మచిలీపట్నంలో బ్రౌన్‌ను కలిశారు. తన తమ్ముడి బదిలీ విషయంలో సహాయం అర్థించారు. బ్రౌన్ దొరకువ్రాసిన లేఖలో కూడా తమ్ముడి విషయం ప్రస్తావించారు. బ్రౌన్ దొర కాశీయాత్ర పుస్తకం ముద్రణ విషయం పరిశీలిస్తానని, పుస్తకం పంపమనీ బందరు నుండి తిరుగుజాబు పంపారు.

కానీ 1833 మార్చిలో గుంటూరుజిల్లా కలెక్టరుగా బదిలీపై వెళ్ళిన బ్రౌన్ పుస్తకాలు 1834 వరకు బందరులోనే ఉన్నాయి. ముద్రణాలయమును కూడా ఆయన అమ్మివేశారు.

## వీరాస్వామయ్య కాశీయాత్రలో వర్ణింపబడిన బందరు ప్రాంత విశేషాలు

ఆగస్టు 1 ఉదయం 5 గం॥ బయలుదేరి బొండాడకు 5 కోసుల దూరంలోని ఏలూరుపాడు 10గం॥ చేరాను. అక్కడి ఉప్పుకాలువే రాజ మహేంద్రవరం జిల్లాకు, బందరుజిల్లాకు సరిహద్దు. 12 గం॥ భోజనం చేసి రాత్రి 7 గం॥కు 6 కోసుల దూరంలో తుమ్మిడి చేరాను. వర్షాలు లేనందున మడువులు బొత్తిగా ఎండి వున్నవి. దారిలో కలిదిండి అనే ప్రసిద్ధ గ్రామం దాటి వచ్చాను.

1830 ఆగస్టు 2వ తేదీ వుదయాత్పూర్వము 2 గం॥లకు మబ్బు చినుకులుగా వున్నా లేచి రెండామడ దూరంలో ఉండే మచిలీబందరు అనే షహరు (బస్తీ) ఈ దేశస్థులు పేట అని చెప్పే బస్తీని 9 గం॥లకు ప్రవేశించాము. దారి ఇసుక పర్ర. బండ్లు సాధారణముగా నడవ వచ్చును. రామన్నపేటలో గొప్ప తోట ఇంట్లో దిగినాను. బస్తీలో 22 పేటలు ఉన్నవి. సర్వాధికారుల నివాసముగా ఉండుటచేత చాలా శోభించి వున్నది. రాజవీథులు చాలా విశాలము. భూమి ఉప్పు కలిసిన రేగడ. నీళ్ళ వసతి లేదు. బందరు బస్తీ యాచక బ్రాహ్మణ పూరితమై వుంది. బందరు, కాకినాడ జమీందార్లు చాలా ధర్మబుద్ధి కలవారు.

రాజా కొచ్చెర్లకోట రాయనింగారు రెండావృత్తులు కుటుంబ సహితముగా తులాభారము తూగి రెండావృత్తులు లక్షబ్రాహ్మణ భోజనం చేయించి అనేక యాగాలు చేయించారు. వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు అప్పారావు హిందూధర్మములు జరిగించారు. మేజు వాణీలతో బందరు సాలుకు 6 లక్షల వరహాలెత్తుచున్నది.

బందరువాసులు వీరాస్వామయ్యగారిని ఆగస్ట్ 15 వరకు బందరులో ఉంచారు. అప్పుడు బందరులో బ్రౌన్ జిల్లా జడ్జిగా వున్నారు. ఆంధ్రభాషోద్ధారకులగు సి.పి.బ్రౌన్‌ను ఏనుగుల వీరాస్వామయ్య దర్శించి నప్పటికీ పుస్తకంలో ఆసంగతి రాయలేదని బ్రౌన్ దొర స్వదస్తూరీతో వ్రాతప్రతి 456 పేజీలో రిమార్కు వ్రాసినారు. వీరాస్వామి చెన్నై చేరిన తరువాత బ్రౌన్ దొరకి వ్రాసిన ఉత్తరం వ్రాతప్రతి చివర అంటించబడి ఉంది.

వీరాస్వామి 16 ఉదయం 4 గం॥ మచిలీబందరులో బయల్దేరి కొత్తపాలెం అనే కృష్ణాతీరపు వూరు చేరారు. దారిలో పల్లెలు ఉన్నవి. వాటిని ఈ దేశస్థులు పర్రలు అంటారు. రేగడభూమి. 2 కోసుల దూరంలో చల్లపల్లి జమీందారు నివాసగృహం వుంది.

బందరుజిల్లాలో బందిపోట్లు, పితూరీలు అనే మాట వినడము లేదు. ఈ దేశము సుభిక్షముగా వున్నది.

## కృష్ణానదీ మహత్యము

లోకులను తరింపచేసే కొరకున్నూ, యీ కలిలో లోకులపాపాలు ఎంత బలువో అంతపాటి పుణ్యము ఒక స్నానముచేతనే కలిగే కొరకున్ను శ్రీ మహావిష్ణువు యీ నదీ స్వరూపముగా అవతారమెత్తినట్లు తెలియవచ్చుచున్నది. కృష్ణామాహాత్మ్యము స్కాంద పురాణాంతర్భూతముగా వున్నది.

ఇక్కడికి 2 కోసుల దూరంలో కళ్ళేపల్లి అనే మహాస్థలం ఒకటి వున్నది. యీ నది సహ్య పర్వతములలో ఉత్పత్తి అయినది. ఆ ఉత్పత్తి స్థలం సాగరసంగమానికి 70 ఆమడదూరం అని విన్నాను. నది కోసెడు వెడల్పు. అనేక గొప్ప లంకలు కలవు. అందులో కాయగూరలు చాలాగా పైరై బందరు బస్తీలో వ్రయమగుచున్నవి.

## బ్రౌనుగారికి వ్రాసిన లేఖ

నేను చెన్నపట్టణం చేరిన తరువాత కీ.శే. జంగరు పాపయ్యగారి భార్యను, కొమాళ్ళను కలుసుకొని వారిదగ్గరున్న స్కాంధ్ధం అనే గ్రంథం వివరాలడిగి తెలుసుకున్నాను. 6 సంహితాలు, 50 కాండలు, లక్ష శ్లోకాలు వున్న గ్రంథమది. సనత్కుమార సంహిత, సూత సంహిత, బ్రహ్మ సంహిత, వైష్ణవ సంహిత, శంకర సంహిత, సౌర సంహితలు.

5వదైన శంకర సంహితను నిర్దుష్టమైన చక్కని తెలుగు పద్యములలో అనువదింపచేశారు. దానిని తెచ్చినాను. తమరు పంపమంటే ఆరు సంహితలూ బంగీలో పంపుతాను. లేదా శంకరసంహిత తెలుగు తర్జుమా మాత్రమే పంపుతాను.

నా కాశీయాత్రలో హైందవ పుణ్యస్థలములన్నిటి చరిత్రలు, మహానదుల చరిత్రలు వ్రాశాను. నేను చూచిన ప్రదేశాలలోని ప్రజల ఆచారవ్యవహారాలు, భేదాలకు గల కారణాలు వర్ణించాను.

ఈ పుస్తకము చాలామంది కావాలంటున్నారు. మచిలీపట్నంలో మీ ముద్రాక్షరశాలలో అచ్చువేయించి మూడువందల ప్రతులు ప్రకటించడానికి అవకాశముంటుందా ? ఇవి శీఘ్రంగానే అమ్ముడైపోతాయని నా నమ్మకం. దీనివల్ల నేను లాభం పొందదలచడంలేదని మనవి. లాభం ఇచ్చివేయడానికి అభ్యంతరం లేదు. నష్టం వస్తే నేనే భరింపగలను. కానీ నష్టం రాదనే నా దృఢ విశ్వాసము.

నేను మచిలీపట్నంలో ఉన్నకాలంలో తమరు నా యెడల చూపిన దయకు నా కృతజ్ఞతాభివందనాలు స్వీకరింపగోరతాను.

ఇలాగ చనువు తీసుకున్నందుకు క్షమింపవేడుతూ గౌరవ పురస్సరంగా విరమించు తమ విధేయుడు, భృత్యుడు" అని ఇంగ్లీష్‌లో వీరాస్వామయ్య సంతకమున్నది.

దీనికి బ్రౌన్ దొర జవాబిస్తూ 'పుస్తకం పంపితే చూస్తాను. స్కాందము తెలిగించే పని ప్రస్తుతానికి నిలుపుతున్నాము. సూత సంహిత నాయొద్ద వున్నది' అని పేర్కొన్నారు.

ఈ లేఖ బందరులో బ్రౌన్ ముద్రణాలయము, భాషాసేవకులకు సాక్ష్యంగా నిలిచింది.

సాంస్కృతిక రాజధాని బందరుతో సాహితీ అనుబంధం కలిగిన బ్రౌన్ దొర 1884 డిసెంబర్ 12న అస్తమయం చెందారు.

'దేశభాషలందు తెలుగులెస్స' అన్న శ్రీకాకుళాంధ్ర మహావిష్ణువు తెలుగువారి తొలివేలుపు కాగా రెండో దేవుడు శ్రీ ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్.

In 1825 I found Telugu literature dead, in thirty Years, I raised it to life' అని ఆయన ఆత్మకథలో వ్రాసుకున్నది అక్షర సత్యం.

చిరునామా : *గుడిపూడి రాధికారాణి,* gudipudiradhika@gmail.com

శ్రీ లంక వెంకటరమణ

# రఫిక్ ఆలమ్ ప్రేమకథ

తీరప్రాంతంలో, ముఖ్యంగా నదీ ముఖద్వారంలో జన జీవనాన్ని అస్తవ్యస్తం చేయడంలో, ఆస్తినష్టం, ప్రాణ నష్టం కలిగించడంలో వరదలు తక్కువైనవేమీ కాదు. ముఖ్యంగా కృష్ణానది వరదల చరిత్ర ప్రసిద్ధమైనవే! వాన వరద అని నానుడి. వాన తరువాత వరద రావడం సహజం. ఉన్నట్టుండి భారీ వర్షం ఒక్క గంటసేపు వస్తే ఇంటిచుట్టూ నీళ్లు చేరడం మన అనుభవం లోని విషయమే! పల్లపు ప్రాంతాలు జలమయం కావడం చూస్తున్నదే! అదే వర్షం పుష్కలంగా ఎక్కువ సేపు విస్తారంగా పడితే కాలువలు, నదుల పరవళ్లు తొక్కడం చెరువులు గట్లు తెంచుకోవడం, నదులు పొంగడం చూస్తూనే ఉన్నాం.

మహాబలేశ్వరంలో పుట్టిన కృష్ణానది 1500 మైళ్లు ప్రవహించి హంసలదీవి వద్ద సముద్రంలో సంగమించే లోపల దారి పొడవునా అనగా పరీవాహక ప్రాంతంలో చేరే చిన్న చిన్న సెలయేళ్ళు, చిన్నచిన్న ఉపనదులు భారీ ఆకస్మిక వర్షాల వల్ల ఒక్కసారిగా పొంగిపోయి. ప్రధాన వాహినిలో ఆకస్మికంగా చేరితే వరదలు వస్తాయి. ఇక్కడ ఒక్క విషయం గమనించాలి. కృష్ణానది పరీవాహక ప్రాంతంలో ముఖ్యంగా జనసంకీర్ణమైన ప్రాంతాలపై నది విరుచుకుపడకుండా కరకట్టలు పోశారు. ఈ కరకట్టలు వెయ్యని రోజుల్లో నది తన ఇష్టం వచ్చినట్లు విస్తరించేది. అందుకే నదిని స్వైరిణి అన్నారు కవులు. అంటే ఇష్టం వచ్చినట్టు తిరిగే ఆడది అని అర్థం. నదిని అలా అనడం కవి సమయం అనుకోండి.

మరొక్క విషయం, కొండల్లో పుట్టి, దారి పొడవునా వాగులు, వంకలు కలుపు కొంటూ, ఉపనదులను చేర్చుకొంటూ ప్రవహించే నదిలో నీటితో పాటు మట్టికూడా చేరుతుంది. నీరు ప్రవహించి సముద్రంలో కలిసినా కొంత మట్టి నది శయ్యలోకి చేరుతుంది. కాలక్రమంలో నదీ గర్భం పూడిపోతుంది. ఇక నది మళ్ళీ జనావాసాలను ముంచెత్తుతుంది. మళ్లీ స్వైరిణి అవుతుంది. పూడిక తియ్యకపోతే తేలికపాటి వర్షాలకే వరదలు వస్తాయి. నాగార్జునసాగర్, శ్రీశైలం డామ్స్ కట్టిన తరువాత కృష్ణకు వరదలు తగ్గినాయి. అయితే నదుల్లో పూడిక తియ్యనందువల్ల ఎప్పటికైనా మనం భయంకరమైన వరదలు చూడక తప్పదు.

శ్రీనాధుడు బొడ్డుపల్లిలో నివాసం ఉంటూ కలానికి ఆదరణ కరవై హాలం పట్టాడు. పాపం ఆ దురదృష్ట జీవి పండించిన పంటను వరదలతో పోటెత్తిన కృష్ణవేణమ్మ కాస్తా కబళించింది.

కొండవీడు కోటను జయించి, మగళాద్రి నారసింహుని దర్శించి, కొండపల్లి దుర్గాన్ని హస్తగతం చేసుకొందామని శ్రీకృష్ణదేవరాయలు బెజవాడ వద్ద పదిరోజులు పడిగాపులు కాచాడు. అప్పుడు కృష్ణ మంచి పూటుగా ఉంది. ఎన్నెన్నో దుర్గాలను, జయించిన రాయలవారికి కృష్ణానదిని దాటడం దుస్తరమైంది. చేసేది లేక దివి ప్రాంతం శ్రీకాకుళంలో కొలువు చేసిన ఆంధ్రమహావిష్ణువును దర్శించుకొనడానికి ఆ వైష్ణవ భక్తుడు శ్రీకాకుళం చేరాడు. 'కతిపయ దివసంబులు ఉపవసించా'డు రాయలు. హరివాసరంలో అర్ధరాత్రి శ్రీ మహావిష్ణువు కలలో కనిపించి తనమీద కావ్యం వ్రాయవలసినదిగా రాయలవారిని ఆదేశించాడు. ఆ విధంగా ఆముక్తమాల్యద కావ్యరచనకు ప్రేరణ అయింది. కృష్ణానది వరద ఆవిధంగా దివి ప్రాంతంలో మహోదాత్తమైన ప్రబంధ రచనకు ప్రేరణ కలిగించింది.

వరదల వల్ల లాభాలేమీ లేవు. అన్నీ కష్టాలే! అన్నీ నష్టాలే! మానవ జాతి పురోగమనానికి పెద్ద అరిష్టమే! అయినా ఒక్కొక్కసారి రసవత్తరమైన సంఘటనలకు కారణమవుతాయి వరదలు. అలాంటి ఒక సంఘటనను చూద్దాం.

1784వ సంవత్సరం. అప్పటికి దివిసీమ ఈస్టిండియా కంపెనీ పెత్తందారిలో ఉండేది. కొంత డచ్చివాళ్ల ఆధిపత్యంలో ఉండేది. నైజాం కూడా కన్నువేశాడేమో! రఫీక్ ఆలం అనే ఒక సైనికాధికారి తరచు దివి ప్రాంతానికి వస్తూ ఉండేవాడు. బహుశా ఈస్టిండియా దన్నుతో దివిసీమలో డచ్‌వాళ్ళకు పోటీగా వ్యాపార పతకాన్ని ఎగరవెయ్యడానికి వచ్చినవాడై ఉండాలి. పిడప కాలపు ఈస్టిండియా, పిడప కాలపు డచ్చివాళ్ళు పిడపకాలపు నైజాంకు దన్నుగా నిలచారేమో!

రఫీక్ ఆలమ్ మంచి కవి. అందగాడు. అతడి రాజకీయ తంత్రానికి, శౌర్యసాహసాలకు అతడి అందం శాపమైంది. దివిసీమలో కాలూనడంతోనే మనోహరి అనే ఆలయనర్తకి అతడి మనసును దోచుకొన్నది. గుర్రం మీద ప్రతి రోజు బందరు నుంచి దివిసీమలోని చోడవరానికి వస్తూపోతూ ఉండేవాడు. బందరు అతడి స్థావరం. బందరు నుండి ఎప్పుడు బయలుదేరేవాడో గానీ రాత్రికి చోడవరం చేరి ఆమెతో గడిపి తెల్లవారురుఝామునే బయలుదేరి బందరు వెళ్ళిపోయేవాడు. మనోహరికి రఫీక్ ఆలం సర్వాన్ని దోచిపెట్టాడు. ఆఖరుకు హైదరాబాద్‌లోని అఫ్జల్‌గంజ్‌లో గల తన భవనాన్ని తన ప్రేమ కానుకగా ఇచ్చాడు. తనకు కానుక ఇచ్చినట్టు ఆమెకు తెలిసు కాని ఏనాడూ చూడలేదు భవనాన్ని. మనోహరి మురిపెంగా ఎద్దేవా చేసింది. అనుభవంలోకి రాని కానుక, పొందులోకి రాని ప్రేమ, అందని ద్రాక్షపట్టి దండగ అని తేల్చేసింది. పౌరుషంతో రఫీక్ ఆలమ్ ఆమెను గుర్రం మీద ఎక్కించుకొని చోడవరం నుంచి బందరు బయలుదేరాడు. 'పూల్‌ఘుడా' చేరేసరికి ఇక ప్రయాణం సాగలేదు. అప్పటికి కృష్ణ ఉధృతంగా ప్రవహిస్తున్నది. ఈ వరదలో నదిని దాటడం మంచిది కాదని మనోహరి చెప్పింది. బ్రతిమాలింది అయినా ఆ మూర్ఖుడు వినలేదు.

గుర్రాన్ని కృష్ణలోకి వదిలాడు. అది ఈదుకొంటూ నది అవతల గట్టుకు చేరింది. తిరుగు ప్రయాణం కోసం పూల్‌ఘుడా ( ఆ ముస్లిమ్ నోటిలో పులిగడ్డ కాస్తా అలా మారిందేమో!) వద్ద కృష్ణలో లంగరు వేసిన పడవ మీద ఆ ప్రేయసీప్రియులు బయలుదేరారు. ఇంతలో ఏమైందో పడవ అదుపు తప్పింది. సుడిగుండంలో చిక్కుకొన్నది. సరంగుతో మనోహరి కూడా కృష్ణానదిలో కొట్టుకొనిపోయారు. ఆలం హతాశుడై బందరు చేరాడు. ప్రేయసీ వియోగానల దగ్ధ హృదయంతో హైదరాబాద్ చేరుకొన్నాడు. ఐహికానందాల పట్ల విరక్తి కలిగింది. నవాబు కొలువుకు రాజీనామా చేశాడు.

శేష జీవితమంతా మనోహరి కోసం తపించిపోయాడు. తనకు ఇష్టమైన మనోహరి రాగంలో అనేకమైన పాటలు కూర్చాడు. ఘజల్స్ చెప్పాడు. మనోహరి మంచి నర్తకే కాదు, మంచి సంగీత విద్వాంసు రాలని కూడా చెప్పుకొన్నాడు. వియోగ గీతికలతో 'మంజిలే కార్వాయి' అనే కావ్యం వ్రాశాడు. అందులో ఒక చోట ఇలా వ్రాశాడు.

**రోజాలు కురియకుండానే గులాబీల గుబాళింపులు**
**అవేవో కనిపించకుండానే గులాబి ముళ్ళు**
**అందెలు కనిపించవు రవళి వినిపిస్తుంది**
**శృతిలయలులేని మనోహరి వినిపిస్తున్నది.**

నిజామాబాద్ నివాసి కైజరాలీ సిద్దికీ సేకరించిన ప్రాచీన ఉర్దూగ్రంథాలలోనిదే ఈ 'మంజిలే కార్వాయి' 1950లో అచ్చు అయింది. గోలకొండ పత్రిక తెలుగు సేత ప్రచురించింది. ఇలాంటి మధుర విషాద గాథలెన్ని కృష్ణానదిలో కలిసి పోయాయో! దివిసీమ సినిమా కవి వేటూరి సుందరరామమూర్తి గారు ఒక పాటలో ఇలా అంటారు. 'ఎందరు ఏడ్చిన ఏడుపులో కృష్ణా గోదావరులు' అని. 'ఎదను ఎద కంటె లోతుగా గదుముకొంటే' నే గాని రఫీక్ ఆలం గీతానికి అర్థం రాదు. ఆ గీతం చదివితేనే గానీ వేటూరివారి గీతానికి అర్థం తెలియదు.

కృష్ణ పొంగడం, వరద రావడం వల్ల ప్రజల్లో భయాందోళనలు ఎలాకలుగుతాయో నేటి అధునాతన యువతరానికి తెలియదు. ఏ క్షణాన అయినా కరకట్ట తెగిపోతే ఊళ్ళకు ఊళ్ళు కొట్టుకుపోతాయి. కష్టపడి పండించుకొన్న పంటలు వరద పాలవుతాయి. ధాన్యం పురులు, పాతరులు నీటిపాలవుతాయి. ఇళ్ళు వాకిళ్ళు, గొడ్డు గోద కృష్ణార్పణమవుతాయి. అసలు తాము బ్రతికి బయటపడతామో లేదో అన్న భయాందోళనలతో జనం తల్లడిల్లిపోతారు.

వరదలు మిక్కుటంగా వచ్చినప్పుడు కొంతలో కొంత సురక్షిత ప్రదేశమైన అవనిగడ్డ లాంటి ప్రదేశంలోనే ప్రజలు ఎంత భీతావహమైపోతారో 50 సంవత్సరాలు పైబడినవారందరికీ తెలుసు. చేతనైనంత చేతపట్టుకొని సురక్షిత ప్రాంతాలకు తరలిపోయే వారు. అవనిగడ్డలో అప్పట్లో ఎత్తైన సురక్షితమైన భవనం తాలూకాఫీసు. అక్కడకు చేరేవారు. తాలూకాఫీసు వెనుక పాటిదిబ్బ ఉండేది. ఆ దిబ్బ మీద ఇల్లే మాది. చుట్టు ప్రక్కల ఇళ్ళవాళ్లు ఆ దిబ్బ మీదకు చేరేవారు. రైతులైతే కళ్లల్లో నీళ్లు నింపుకొని తమ సావిళ్ళలో పశువులను కట్లు ఊడతీసి వదిలే వాళ్ళు. ఈ రచయితకు తెలిసినంత వరకు కరకట్ట తెగిన ప్రమాదం జరగలేదు. కాని నిరంతర భయాందోళనలతో ఊరు ఊరంతా తల్లడిల్లిపోవడం తెలుసు.

కరకట్టలు తెగిపోతే నిజంగా మహోత్పాతమే! ఎక్కడ గండి పడినా ఎగువ ప్రాంతాలకు ప్రమాదం తొలగిపోతుంది. అందువల్ల పైప్రాంతాల వాళ్ళు దిగువ ప్రాంతాలకు రహస్యంగా వచ్చి కరకట్టలకు గండ్లు కొడతారని దిగువ ప్రాంతాల వారికి భయం. అందువల్ల రాత్రిపూట, పగటివేళ గస్తీ తిరిగేవాళ్లు. భయానికి తోడు వదంతులు కూడా ఎక్కువే! వరదలు ఈ విధంగా సామాజికంగా అస్తవ్యస్త పరిస్థితులు సృష్టించేవి.

కృష్ణానదికి వరదవస్తే నిజంగానే బీభత్సంగా ఉంటుంది. అందులో కూడా గంభీరమైన సౌందర్యం ద్యోతకమవుతుంది. అందమైన పతివ్రత పూర్ణగర్భవతి అయినట్టు కనిపిస్తుంది. వరదవస్తే శ్రీకాకుళం వద్ద కృష్ణానది ఎంత మనోజ్ఞంగా ఉంటుందో 'కరుణకం' అన్న లఘు రచనలో ప్రభాకరశాస్త్రిగారు చిత్రీకరించారు.

శ్రీ గోళ్ల నారాయణరావు

# శ్రీశైల జలాశయ ముంపుప్రాంత సంక్షిప్త చరిత్ర

శ్రీశైలం ప్రాజెక్టు జలాశయంలో ముంపుకు గురైన కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లాల్లోని 114 గ్రామాల్లో జరిపిన సర్వేలో 200 శాసనాలు బయటపడగా, వాటిలో 180 శాసనాలకు సం॥లున్నాయి. వీటిలో కళ్యాణీ చాళుక్య (క్రీ.శ. 1031-1126), కాకతీయ చివరి రాజులు (క్రీ.శ. 1566-1600)నికి చెందిన శాసనాలే ఎక్కువగా ఉండటం విశేషం.

శాసనాలను పరిశీలిస్తే శైమమతం ఎక్కువగా ఉండి కాలాముఖ శాఖ తన ప్రాబల్యాన్ని చాటుకొందని తెలుస్తుంది. బాదామీ చాళుక్యుల కాలంలో అలంపూరు దేవాలయాలతో మొదలై, ఆముదాలవరస రాగిరేకు (క్రీ.శ. 660)లో మొదటి విక్రమాదిత్యుడు చిన్నమారూరులో శివదీక్ష తీసుకోవటం, మొదటి వినయాదిత్యుడు పంచలింగాలలో పంచ లింగేశ్వరాలయాన్ని నిర్మించటం వరకూ, శైవమత ప్రాపకాన్ని తెలియ జేస్తుంది. క్రీ.శ. 713వ సం॥ తరువాత ఈ ప్రాంతంలో చాళుక్యుల ప్రభావం సన్నగిల్లి, శాసనాలు లభ్యం కాలేదు. అయితే క్రీ.శ 1వ శతాబ్దిలో కృష్ణా - తుంగభద్ర సంగమ స్థానమైన శివ బ్రహ్మేశ్వరా లయాలు తరువాత బాదామీ చాళుక్యవాస్తుకు అద్దం పడుతున్నమాట నిజం.

బాదామీ చాళుక్యుల తరువాత, దక్షిణభారతదేశంలోని ఈ ప్రదేశంలో రాష్ట్రకూటులు తమ ఆధిపత్యాన్ని చాటుకొన్నారు. కృష్ణా తీరంలో మొదటి కృష్ణుడు (క్రీ.శ. 776-772) ఆలంపూరు దేవాలయ సముదాయంలోని ప్రాతోలి (తోరణం)ని నిర్మించటంతో ప్రారంభమై తరువాత భవనాశి-నివృత్తి-రూపుల సంగమేశ్వరం, సాసనూరు, బి.తాండ్ర పాడు, మల్లేశ్వరం, పాపనాశనం, పాతకూరు (క్రీ.శ. 10వ శతాబ్ది) దేవాలయాల నిర్మాణం వరకూ, చాటుకున్నట్లు అక్కడి శాసనాలు తెలియజేస్తున్నాయి. దొరికిన శాసనాలను బట్టి క్రీ.శ. 11వ శతాబ్దం నుంచి 12వ శతాబ్దం (క్రీ.శ. 1015-1126) దాకా కళ్యాణ (తరువాత) చాళుక్యుల పాలనలోకొచ్చిన ఈ ప్రాంతంలో ఎన్నో దేవాలయాలు నిర్మించబడినట్లు, కళ్యాణ చాళుక్య ప్రభువులు శ్రీశైల క్షేత్రానికి ఎంతో ప్రాధాన్యతనిచ్చినట్లు తెలుస్తుంది. కళ్యాణ చాళుక్య సామంతులైన కందూరు చోళుల ఆధీనంలోనున్న ఈ ప్రాంతంలో శైవమతంలో ఒక శాఖ అయిన కాలాముఖులు పైచేయిగా నిలిచి, ఆలంపూరు శ్రీశైలం లాంటి దేవాలయాలపై పెత్తనం సాగించారు. మొదటి జయసింహుని (క్రీ.శ. 1015-1048) కాలంలో ఆలంపూరు, మల్లేశ్వరం, రామతీర్థం, జటప్రాంతాల దేవాలయాలు నిర్మించబడి, అనేక ధానాలు పొంది, కాలాముఖ శివాచార్యుల నిర్వహణలో ఉన్నాయని అక్కడి శాసనాలు తెలియజేస్తున్నాయి.

మొదటి సోమేశ్వరుని (క్రీ.శ. 1042-1068) కాలంలో చోళ-చాళుక్య ఘర్షణలు పెచ్చరిల్లాయి. అంతేకాక, మొదటి సోమేశ్వరుడు కాలి నడకన శ్రీశైలాన్ని సందర్శించటం ఒక ప్రత్యేక సంఘటనగా పేర్కొనవచ్చు. మూడు సోమేశ్వరుని విక్రమాంకాభ్యుదయంలో మొదట సోమేశ్వరుడు తన శ్రీశైలయాత్రలో భాగంగా అలంపూరు, కూడవెల్లి, సంగమేశ్వరం, సోమశిల దేవాలయాలను కూడా సందర్శించినట్లు అక్కడి శాసనాల్లో ప్రస్తావించబడింది. అంతేకాక, మొదట సోమేశ్వరుడు, అతని రాజులు, కుమారులు, సామంతులైన తెలుగు చోళులు, విరివిగా ఆలయ నిర్మాణాన్ని చేపట్టి వాటి నిర్వహణకు అనేక దానాలినిచ్చినట్లు కూడా శాసనాలు పేర్కొంటున్నాయి. కొల్లం భారతి, శివపురం, మల్లేశ్వరం, సిద్ధేశ్వరం, పాపనాశనం, అలంపూరు మొదలైనచోట్ల గల దేవాలయాలు మొదట సోమేశ్వరుని కాలంలో నిర్మింపబడినవే. రెండో సోమేశ్వరుడు బెక్కెం గ్రామాన్ని సందర్శించి అక్కడ, పంచలింగాల ఎర్రమతం గ్రామాల్లో ఆలయాలను నిర్మించి, దానాలు చేశాడు. పంచలింగాలలో ఉన్న కాశ్మీరపండితుడనే కాలా ముఖాచార్యునికి క్రీ.శ. 7వ శతాబ్దిలో మొదట వినయాదిత్యుని

కాలంలో చేసిన దానాన్ని పునరుద్ధరించినట్లు శాసనంలో ఉంది. ఎర్రమఠం గ్రామాల్లో శిలాహార వంశస్తులు శైవమఠాన్ని నిర్మించినట్లుగా కూడా చెప్పబడింది.

యుద్ధాలు లేకుండా శాంతిమయంగానున్న ఆరో విక్రమాదిత్యుని (క్రీ.శ. 1076-1126) కాలంలో ఎన్నో ఆలయాలు నిర్మించబడి, కాలాముఖ శైవాచార్యులకు దానాలు ఇవ్వబడినాయి. ఈ కాలంలో పాత దేవాలయాల పునరుద్ధరణ, విస్తరణ, కొత్త దేవాలయాల నిర్మాణం జరిగినట్లు మల్లేశ్వరం, సిద్ధేశ్వరం, రామీర్థం, సంగమేశ్వరం, కొల్లంభారతిలోని శాసనాలు తెలియజేస్తున్నాయి.

కళ్యాణచాళుక్య రాజైన ఆరో విక్రమాదిత్యుని మరణంతో ఈ ప్రాంతంలో కళ్యాణీ చాళుక్యపాలనకు తెరపడింది. గణపతిదేవుని (క్రీ.శ. 1199-1261) కాలంలో ఎన్నో ఆలయాలు నిర్మించబడి, నిర్వహణ కోసం దానాలు పొందినట్లూ, శాసనాల్లో కన్నడ భాషకు బదులు, తెలుగుభాష రావటం, కాలాముఖ శైవాచార్యుల స్థానంలో పాశుపతులు అధిపత్యాన్ని కొనసాగించటం, వీరశైవులు, ఆరాధ్యులు అనే కొత్త శైవశాఖలు తమ కార్యకలాపాలను విస్తరించటం లాంటి అనేక విషయాలు శాసనాల్లో ప్రస్తావించబడినాయి. అంతేకాక ఈ ప్రాంతంలో కళ్యాణచాళుక్యుల స్థానంలో కలచూరులు చొరబడినట్లూ సామంతులుగానున్న కందూరు చోళులు, స్వతంత్రులైనట్లూ శాసనాలు తెలియజేస్తున్నాయి.

సుదీర్ఘకాలం పాలించి గణపతిదేవుని కాలంలో గోళకీ సంప్రదాయానికి చెందిన రాజగురువు విశ్వేశ్వర శివాచార్యుని ఆధ్వర్యంలో పశుపతీ శైవం విజృంభించిందనే చెప్పాలి. విభూతిగౌరుని ఆధ్వర్యంలో నున్న ఆరాధ్యశైవం కూడా సంగమేశ్వరం, ముసలిమడుగు లాంటి ప్రదేశాల్లో తమ కారకలాపాల్ని కొనసాగించినట్లు శాసనాలు తెలియజేస్తున్నాయి. తీరాంధ్రంలోని మందిరంలోని రుద్రమదేవి శాసనం (క్రీ.శ. 1261)లో ఈ ప్రాంతంలోని సోమశిల, సంగమేశ్వరం, సిద్ధేశ్వరం, గోళకీమఠాధిపతి విశ్వేశ్వర శివాచార్యుల కార్యకలాపాలు కొనసాగినట్లు చెప్పబడింది.

తరువాత ప్రతాపరుద్రుని పాలనలో కొత్త గ్రామాలు రూపుదిద్దుకొని, వ్యవసాయం విస్తరించి, ఆలయ వ్యవస్థ కొనసాగి, సామంతులైన చెఱుకు రెడ్లు ప్రముఖ పాత్ర పోషించినట్లు నందికొట్కూరు, మల్యాల శాసనాలు రుజువు చేస్తున్నాయి.

అటు తరువాత ఆరవీటి సోమరాజు ముసలిమడుగు, సాతాని కోట, కర్నూలు, రాయచూరు కోటల గురించి అక్కడున్న శాసనాలు తెలియజేస్తున్నాయి.

నిర్మించిన ఆలయాలు ఏకకూట, ద్వికూట, త్రికూట, ఇంకా సముదాయాలుగా, కొన్ని ఆలయాలకు ముందు మండపాలు ఉన్నాయి.

## గుంటూరులో నల్లమస్తాన్

*మస్తాన్ వలి వయసెంతో ఎవరికీ తెలియదు. ఒకసారి వర్షం పడుతున్నది. పిడుగుపడి వారి వెంట ఉండే మేక చనిపోయింది. ప్రక్కనే పోతున్న ఒక బాలుడు చనిపోయాడు. మస్తాన్ వలి మీద ఒక్క చినుకు కూడా పడలేదు. జనం ఆశ్చర్యపోతుంటే తన మేకను ఊఁ అని బ్రతికించాడు. బాలుని తల్లి వచ్చి ప్రార్థించగా బాలుని బ్రతికించాడు. దానితో ప్రజలలో భక్తిభావం ఏర్పడింది. ఖండయోగవిద్యలో మస్తాన్ వలి సిద్ధహస్తులు. మస్తాన్ వలి సర్వజ్ఞత్వాన్ని చాటే కథలు కోకొల్లలు. ఇప్పుడే వస్తానని చెప్పి మక్కా పోయి కాసేపట్లో వచ్చి అక్కడ జరుగుతున్న ఉత్సవాలను గురించి చెప్పాడు. విచారించగా అవన్నీ వాస్తవాలే తెలిసింది. స్వచ్ఛంద మరణంతో శరీరం చాలించిన తర్వాత కూడా ఎంతోమందికి దర్శనాలిస్తున్నారు. గుంటూరులోని మస్తాన్ దర్గా ఉత్సవాలు హిందువులు, ముస్లిములు ఘనంగా జరుపుకుంటారు.*

శ్రీ కె. విజయప్రసాద్ (వియోగి)

# కర్నూలు జిల్లాలోని కొన్ని ముఖ్య దేవాలయాలు/ ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలు

కర్నూలు జిల్లా ఎన్నో ప్రాచీనపుణ్యక్షేత్రాలకు నిలయమై ఉంది. అత్యంత ప్రసిద్ధి పొందిన క్షేత్రాలలో మొదటిది శ్రీశైలం, రెండవది మంత్రాలయ రాఘవేంద్ర స్వామి మఠం, మూడవది అహోబిల నారసింహ క్షేత్రం. ఇవిగాక మహానంది, సంగమేశ్వరం, యాగంటి ఉమా మహేశ్వరం, నందవరం చౌడేశ్వరీమాత, కొత్తూరు సుబ్బరాయుడు, కాలువబుగ్గ, రణమాడల (ఆంజనేయస్వామి, ఆదాని అవ్వ, మద్దిలేటి స్వామి (ఆర్.యస్.రంగాపురం) దక్షిణషిరిడిగా పిలువబడే కర్నూలు సాయిబాబా మందిరం, మణికంఠాలయము, పత్తికొండ సాయిబాబా తదితర దేవాలయ సముదాయము, పాణ్యం పాణికేశ్వరస్వామి, పత్తికొండ దగ్గరలోని నల్లగుట్టకూర్మక్షేత్రం, కర్నూలులోని జగన్నాథ గట్టు, కాళమ్మగుడి, ఎల్లమ్మదేవాలయం తదితర ఆలయాలు భక్తులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి.

స్థలాభావం వలన కొన్ని ముఖ్యమైన క్షేత్రాల గురించి మాత్రమే రేఖామాత్రముగా వివరించడము జరిగినది.

## శ్రీశైలం :

అత్యంత ప్రాచీనమైన క్షేత్రం. ఇచ్చట మల్లికార్జున స్వామి జ్యోతిర్లింగము, భ్రమరాంబదేవి వారి అష్టాదశ శక్తి పీఠము ఉండడం కూడా విశేషం. కృష్ణానది ఉత్తరవాహినిగా, పాతాళగంగగా, నల్లమల కొండలలో శ్రీశైల క్షేత్రంలో ప్రవహిస్తున్నది.

వేదాలలో, అగ్నిపురాణాలలో శ్రీశైలంప్రశస్తి వర్ణించబడినది. అంటే ఈ క్షేత్రం యుగయుగాలుగా ఇక్కడ వెలిసిఉంది. కలియుగాంతాన శ్రీశైలం ఆలయంలో మొసళ్ళు తిరుగాడతాయి అని బ్రహ్మంగారు తనకాల జ్ఞానంలో రాసిఉన్నారు.

ఆంధ్రలో తిరుమలక్షేత్రం తర్వాత భక్తులను విపరీతంగా ఆకర్షించే క్షేత్రం ఈ మల్లికార్జున క్షేత్రం. నిత్యం భక్తులతో రద్దీగా ఉంటుంది. శివరాత్రిలాంటి పర్వదినాలలో లక్షలమంది భక్తులు గంటలతరబడినిరీక్షించి స్వామివారి దర్శనం చేసుకుంటారు. భ్రమరాంబదేవిని కన్నడిగులు తమ ఆడపడుచుగా భావిస్తారు. కర్నాటక ప్రాంతం నుండి శివరాత్రి పండుగకు కొన్నివేల మంది కన్నడభక్తులు కాలినడకన కొన్ని వందల కిలోమీటర్లు నడుచుకుంటూ వచ్చి దర్శనం చేసుకొని మొక్కుబడులు చెల్లించుకుంటారు.

మల్లికార్జునస్వామి ఆలయశిఖర దర్శనం తరువాత సాక్షి గణపతి కొలువైవున్న కొండపైకి వెళ్ళి, అక్కడవున్న నందివిగ్రహం కొమ్ముల సందునుండి భక్తులు మల్లికార్జునస్వామివారి ఆలయం శిఖర దర్శనం చేసుకుంటే, అలా దర్శనం జరిగినవారికి, మోక్షం కలుగు తుంది. ఇది అందరికి కనపడదు. ఎంతో పుణ్యం చేసుకుంటేనే ఆ దర్శనం లభిస్తుంది. మన పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారికి ఈ దర్శనం లభించిందని చెబుతారు.

ఈక్షేత్రం గురించి ఎన్నో ప్రసిద్ధ కథలున్నాయి. వాటిలో ముఖ్యమైనది శివపార్వతిల ముద్దులబిడ్డ కుమారస్వామి అలుక గురించి ఒకటి. గణాధిపత్యం విషయంలో (కొందరు ముందుగా ఎవరు వివాహం చేసుకోవాలన్న విషయంలో అని చెబుతారు) ఆదిదంపతులు కొమరులైన విఘ్నేశ్వరుడికి, సుబ్రహ్మణ్యస్వామికి పోటీపడిందట. నేనంటే నేనని వాదులాడుకున్నారు. చివరికి వారితల్లిదండ్రులు వారి మధ్య ఒక పోటీపెట్టారు. ఎవరైతే ముందుగా భూలోకంలోని సమస్త తీర్థాలలో స్నానంచేసి వస్తారో వారికే గణాధిపత్యం (ముందుగా వివాహం) యిస్తామని(జరిపిస్తామని) చెప్పారు. దాని ప్రకారంగా కుమారస్వామి తన నెమలివాహనం ఎక్కిరివ్వున బయలుదేరిపోయాడు. కాని మరగుజ్జురూపం, ఎలుక వాహనం కల వినాయకుడు మటుకు దిగులుపడి అక్కడే ఉండిపోయి, నారాయణ మంత్రం జపిస్తూ మూడుసార్లు తల్లిదండ్రులకు ప్రదక్షిణం చేశాడు. ఆ ప్రదక్షిణ ఫలితంగా శివపార్వ

తులు సంతసించి వినాయకుడికే గణాధిపత్యం యిచ్చి సిద్ధి, బుద్ధి అనే కన్యలను యిచ్చి వివాహం కావించేరు. కుమారస్వామి రాగానే జరిగిన మోసం పట్ల ఆగ్రహం చెంది, కైలాసం విడిచి తల్లిదండ్రులకు దూరంగా క్రౌంచన పర్వతం మీదకు వచ్చి కూర్చున్నాడు. వారు బ్రతిమాలారు. చివరకి నారదుడి రాయబారం కూడ విఫలమయ్యాయి. ఆదిదంపతులు కొడుకుమీది ప్రేమతో అతనికిదగ్గరగా శ్రీశైలం స్థిర నివాసం ఏర్పరుచుకున్నారు. అప్పటినుండి ఈ క్షేత్రం భక్తుల పాలిట కల్పవృక్షమైనది.

## శ్రీగురురాఘవేంద్ర దేవస్థానము, మంత్రాలయము :

కర్నూలుకు దాదాపు 100 కి.మీ. దూరంలో ఎమ్మిగనూరుకు ముప్పయి కి.మీ వెలసిన క్షేత్రం మంత్రాలయము. ఇందు శ్రీ రాఘవేంద్ర స్వామి కొన్నివందల సంవత్సరాల కిందట బృందావనంలో సజీవ సమాధి అయినారు. శ్రీకృష్ణ దేవరాయుల ఆస్థానంలో వీరి ముత్తాతగారు కృష్ణభట్టు ఉండేవారు. వారికొడుకు కనకచర్లభట్టు. వీరి కుమారుడు తిమ్మన్న భట్టు. ఇతని ధర్మపత్ని గోపాంబ. వీరికి మొదట ఒక కొడుకు, కూతురు జన్మించారు. అయినా ఒక మగ సంతానంతో తృప్తిపడక రెండవ కొడుకు కావాలని తిమ్మన్నభట్టు దంపతులు తిరుమలకు వెళ్ళి శ్రీ వెంకటేశ్వరస్వామిని భక్తి శ్రద్ధలతో కొలిచారు. తిమ్మన్నభట్టుకు వేంకటేశ్వరస్వామి కలలో సాక్షాత్కరించి సకలసద్గుణ ప్రచారంలో మహాపేరుప్రఖ్యాతలు పొందుతాడని వరం ప్రసాదించాడు.

వరప్రభావంతో కొన్ని నెలలకు వారికి వేంకటనాథుడు జన్మించాడు. చురుకైన వాడుగా, స్ఫురద్రూపిగా పెరిగాడు. ఐదుసంవత్సరాల వయసులో విద్యాభ్యాసం చేశారు. కాని కొన్ని దినాలకే తిమ్మన్న భట్టు జబ్బుపడి మరణించాడు. అన్నగారు గురురాజులు వేంకటనాథుడికి ఎనిమిది సంవత్సరాలకు ఉపనయనం చేశారు. అంతేగాక వేంకటనాథుడిని తన బావగారైన శ్రీలక్ష్మీనరసింహాచార్యయింటికి విద్యాభ్యాసం కోసం పంపించాడు. అక్కడ వేంకటనాథుడు అనతికాలంలోనే నాలుగు వేదాలు, షట్‌శాస్త్రాలు, పద్దెనిమిది పురాణాలు కరతలామలకం చేసుకున్నాడు. యుక్త వయసులో సరస్వతి అనే సుగుణాల రాశిని వివాహం చేసుకున్నాడు.

ఆతరువాత అన్న అనుమతి పొంది ఆధ్యాత్మిక విద్యలు అభ్యసించడానికి కుంభకోణపీఠాధిపతి అయిన సుధీంద్ర తీర్థులవారిని ఆశ్రయించాడు. 'శ్రీసుధ' గ్రంథపాఠాలను ఆయన దగ్గర అభ్యసిస్తూనే వాటికి వ్యాఖ్యానం రాసి గురువుగారినుండి పరిమళాచార్య (శ్రీసుధవ్యాఖ్యాసం పేరు పరిమళం) అనే బిరుదు స్వీకరించాడు.

తదుపరి గురువుగారితో పాటు దేశపర్యటనగావిస్తూ పెక్కుపురస్కారాలు పొందాడు. వైయ్యాకరుణుడిని మహాభాష్యంలోఓడించి మహాభాష్యాచార్య అనే బిరుదును పొందాడు. వేంకటనాథుడు సన్యాసం స్వీకరించి రాఘవేంద్రుడు అన్న నామంతో చివరికి మంచాలగ్రామం దగ్గర మంత్రాలయంలో స్థిరపడ్డారు. తన జీవితంలో ఎన్నో ఘన కార్యాలు సాధించారు. ఎంతోమంది నిర్జీవులను జీవింపచేశారు. ఎంతో మంది భక్తుల కష్టాలను తొలగించారు. నిరుపేదగా వున్నప్పుడు ఒక జమిందారు గారింట్లో శుభకార్యానికి వెళితే తోటి బ్రాహ్మణులు ఇతనిని చిన్నచూపు చూసారు. తనకి ఏమి పెద్దకార్యాలు అప్పచెప్పకుండా అతి చిన్నదయిన గంధంనూరే పని అప్పగించారు. స్వామివారు గంధం నూరుతూ అగ్ని సూక్తం పఠించారు. తదుపరి ఆ గంధం రాసుకున్న వారందరికి దేహంలో మంటలు చెరేగినట్లు నానాబాధలు అనుభవించారు. చివరికియోచించి యిదంతా వీరి మహిమ అని గ్రహించి తమ తప్పులు కాయమని ప్రాధేయపడితే, కరుణించి, వరుణ దేవుడిని స్మరిస్తూ గంధం అరగదీసి వారికిస్తే, వారి మంటలు శాంతించి వారికి స్వస్థత చేకూరుతుంది.

మహ్మదీయరాజులకు కూడా ఇటువంటి ఎన్నో మహత్యాలు చూపించి వాసికెక్కారు. వీరిని ప్రహ్లాదుడి అవతారంగా భావిస్తారు.

తగిన సమయంలో తను సజీవ సమాధిలో ప్రవేశించారు. 700 సంవత్సరములు జీవించి ఉంటానని, సమాధినుండే భక్తుల ఈప్సితార్థాలను నెరవేరుస్తానని వాగ్దానం చేశారు.

శ్రీ రాఘవేంద్రస్వామి వారు కొన్ని వందల సంవత్సరాల తరువాత కూడ ఇంకా జీవించి ఉన్నారు అనడానికి ప్రబలసాక్ష్యం మన్రా కలెక్టరు గారు రాయించిన గెజిటును యిప్పటికి చూడవచ్చు. ఆంగ్ల సామ్రాజ్యాన్ని విస్తరిస్తూ వచ్చిన మన్రా కలెక్టరు మంత్రాలయమును ఆక్రమిద్దామని రాగా, వారికి శ్రీరాఘవేంద్రస్వామి దర్శనం యిచ్చి వారితో ఆంగ్లంలో సంభాషించారు. సంతోషించిన మన్రో మంత్రాలయాన్ని స్వతంత్ర ప్రతిపత్తికలిగిన గ్రామంగా, తన తదనంతరం కూడా ఎవరూ ఆ గ్రామాన్ని ఆక్రమించకూడదని ఆజ్ఞజారీచేశారు. ఇది వారు ప్రకటించిన గెజిట్‌లో ఉన్నది. ఇంకా ఉదాహరణ ఇటీవలి కాలంలో తుంగభద్రకు వచ్చిన వరదలు మంత్రాలయంను ముంచెత్తాయి చరిత్రలో ఎన్నడూ లేనివిధంగా ఒక స్వామివారికి శ్రీరాఘవేంద్ర స్వామి వారి ఉనికిపైన సందేహం వచ్చి ఇది ఎలా జరిగింది అని మధనపడగా స్వామివారు కలలో కనిపించి తానే తుంగభద్రనదికి తన మఠంలో నుంచి ప్రవహించమని అనుమతి ప్రసాదించానని, అలా యివ్వక పోయినట్లయితే, తుంగభద్రనది కొన్ని వందల గ్రామాలను ముంచి అపారజననష్టం కావించేదని సెలవిచ్చారు.

శ్రీ రాఘవేంద్రస్వామివారు మన ఆంధ్రలో కొలువైవున్నా నిజానికి వీరి భక్తకోటి కర్నాటకలో ఎక్కువమంది ఉన్నారు. వీరు ద్వైతమత మయిన మధ్వమతాన్ని బహుళవ్యాప్తి కావించారు.

ఇక్కడికి కొన్ని కిలోమీటర్ల దూరంలో పంచముఖ ఆంజనేయ స్వామిక్షేత్రం కూడా రమణీయంగా ఉన్నది. ఇచ్చట రాఘవేంద్రస్వామి వారు కొన్ని దినములు తపస్సు చేసినారట.

మంత్రాలయం వెలియడానికి ముందు ఇది మంచాలగ్రామం, దానికి గ్రామదేవత మంచాలమ్మ, స్వామివారు ఆ తల్లిని ప్రార్థించివారి అనుమతినీ ఇచ్చట తన ఆశ్రమం నెలకొల్పుకున్నారు. అందుకని భక్తులు స్వామివారిని దర్శించేముందు మంచాలమ్మవారిని సేవిస్తారు.

మంత్రాలయమును కర్నాటక భక్తులు మాధవవరం వంతెన ద్వారా తొందరగా చేరుకోగలరు. ఎమ్మిగనూరు నుండి రావడం చుట్టూతా అవుతుంది. హిందూదేశ ఆధ్యాత్మిక వైభవానికి, భారత దేశంలో యోగపుంగవులూ, చిరంజీవులు వున్నారని చెప్పడానికి కట్టె దుట నిలిచిన తార్కాణం శ్రీ గురురాఘవేంద్రస్వామివారి మంత్రా లయం! ఇక్కడ మడీ, ఆచారాలు చాలా ఎక్కువ!

## అహోబిల నవనారసింహక్షేత్రము - ఆళ్ళగడ్డ- కర్నూలుజిల్లా

కృష్ణానదికి దక్షిణంగా వ్యాపించిన నల్లమల పర్వతాలను శేష పర్వతం అనికూడ పిలుస్తారు. అంటే శ్రీమహావిష్ణువు పవళించిన ఆ ఆదిశేషుడు ఈ శేషపర్వత రూపం ధరించాడని ప్రతీతి. ఈ నల్లమల పర్వతం యొక్క తోకను 'శ్రీగిరి' అని పిలుస్తారు. ఇచ్చట భ్రమరాంబ మల్లికార్జున స్వామి వారలు కొలువై ఉన్నారు. అలాగే శేషపడగగా నల్లమల పర్వతం తలభాగాన్ని తిరుపతిలో 'గరుడగిరి'గా పిలుస్తారు. ఇచ్చట విష్ణువు కలియుగ అవతారం శ్రీ వేంకటేశ్వరస్వామి కొలువై ఉన్నారు. ఆదిశేషుడి మధ్యభాగమయిన నల్లగిరి కొండలు మధ్య భాగాన్ని 'వేదగిరి'గా పిలుస్తారు. ఇక్కడే నరసింహస్వామివారు వెలిశారు.

శ్రీశైలాన్ని హిరణ్యకశిపుని పూజామందిరంగా, అహోబిలాన్ని అతని సభామండపంగా పురాణాలు వర్ణించాయి. వైష్ణవపురాణ కథల ప్రకా రం హిరణ్యకశిపుడు అనే రాక్షసరాజు శివుడి పరమభక్తుడు. కాని శ్రీహరి ద్వేషి. అతని భార్య లీలావతి గర్భాన ప్రహ్లాదుడు జన్మించాడు. అతను కడుపులో ఉండగానే నారద మహర్షివారు లీలావతికి అంటే హిరణ్యకశిపుని పట్టపురాణికి నారాయణ మంత్రోపదేశం చేశారు. అందుమూలంగా ప్రహ్లాదుడికి పుట్టుకతోనే విష్ణుభక్తి అలవడింది. పోతన గారు తన భాగవతంలో ప్రహ్లాదుని కథను, నరసింహస్వామి ఆవిర్భా వాన్ని అద్భుతంగా వర్ణించారు.

విష్ణుభక్తుడైన ప్రహ్లాదుడిని కొడుకు అని కూడా కనికరించకుండా అనేకమార్లు మరణశిక్షలు విధిస్తాడు హిరణ్యకశిపుడు. కాని ఆ విష్ణువు దయవలన అతనికి ఎటువంటి ప్రమాదం సంభవించదు. చివరికి విసిగిపోయి ఆ శ్రీహరి ఎక్కడున్నాడో అతని చిరునామా తెలుప మంటాడు. హిరణ్యకశిపుడు కొడుకును ప్రహ్లాదుడు 'ఇందుగలడు అందులేడని సందేహము వలదు, ఎందెందు వెతకిన అందందేగలడు' అని సందేహ నివృత్తి చేస్తాడు. అయితే ఈ సభాస్తంభంలో వున్నాడా చూపించు అంటూ హిరణ్యకశిపుడు తన గదతో స్తంభాన్ని విచ్ఛిన్నం చేస్తాడు. ఆ విష్ణువు వుగ్రనరసింహరూపం దాల్చి ఆ రాక్షసుడిని తన వాడిగోళ్ళతో చీల్చి సంహరిస్తాడు. ఈ కథ జరిగిన ప్రదేశమే 'అహో బిలం'. అందువలన ఇది యుగయుగాలుగా ప్రసిద్ధిపొందిన వైష్ణవక్షేత్రం

ఎగువఅహోబిలంలో ఉగ్రనసింహస్వామి వారు దర్శనం ఇస్తారు. దిగువ అహోబిలంలో శాంత నరసింహస్వామి వారు భక్తులను కనికరిస్తారు మొత్తం మీద ఈ చుట్టుప్రక్కల నరసింహంలా వెలిశారు. వారు(1) ప్రహ్లాద వరద 2) చత్రాత 3) గరుడ 4) యోగ 5) ఉగ్ర 6) క్రోధ 7) మాలాల 8) జ్వాల9) లక్ష్మీనరసింహులు. భవనాశి నది ఇక్కడ ప్రవహిస్తున్నది. హిరణ్యకశిపుడిని చంపిన నరసింహస్వామి వారి క్రోధానికి దేవతలు సైతం భయపడిపోయారు. ఆయనను శాంత పరచడానికి ప్రహ్లాదుడు స్తోత్రం చేశాడు. ఆ పిదప అరణ్యాలలో తిరుగుతున్న ఆ నరసింహస్వామికి చెంచువనిత రూపంలో లక్ష్మీదేవి కనిపించి ఆయనను వివాహమాడుతుంది.

ఇక్కడ ఒక గుహలో స్వయంభూగా నరసింహస్వామి వెలసి ఉన్నారని ప్రతీతి. హిరణ్యకశిపుడు నరసింహస్వామి ఉగ్రరూపాన్ని కాచి అహోబిలం అహోబిలం అని ఆశ్చర్యపడ్డాడని అందువలన ఈ క్షేత్రానికి ఆ పేరు వచ్చిందని చెబుతారు. కళ్యాణి చాళుక్యుడైన విక్ర మాదిత్యుడను రాజు వేయించిన శాసనాలున్నాయికూడా. అలాగే కాకతీయ రాజు ప్రతాపరుద్రుడు చేయించిన బంగారు ఉత్సవ విగ్రహం ఉంది. ఈ క్షేత్రంలో అపారనిధినిక్షేపాలు దాచబడి ఉన్నాయని వినికిడి.

## మహానంది మహానందీశ్వరస్వామి ఆలయం

కర్నూలు జిల్లాలోని నంద్యాల పట్టణానికి 17 కి.మీ దూరంలో మహానంది అనే గొప్పశైవ క్షేత్రం వెలసింది. నల్లమలకొండలకు తూర్పు దిశగా మహానందిక్షేత్రం ఉంది. ఈ కొండలలో మొత్తం తొమ్మిది నందులు ఉన్నారు. తొమ్మిది నందులు దాదాపు పదిహేను కిలోమీటర్ల దూరంలో విస్తరించి ఉన్నాయి. కార్తీక మాసంలో ఈ నవనందులను ఒకేదినం దర్శించిన వారికి ముక్తి కలుగుతుందని ప్రతీతి.

ఈ క్షేత్రం గురించి రెండు పురాణ కథలు ప్రచారంలో ఉన్నాయి. కృతయుగంలో పర్వతరాజుకు శిలాదుడు, నంది అనేయిద్దరు కుమారులుండేవారు. పెద్దవాడు శివుడి గురించి ఘోరంగా తపస్సుచేశాడు. ఆహారం తీసుకోకుండా కేవలం రాళ్ళు తింటూ తపస్సుచేశాడు కాబట్టి అతనికి శిలాదుడు అన్న పేరు కలిగింది. అతని తపస్సుకు మెచ్చి శివుడు అతనిని పవిత్ర పర్వతాలుగా మార్చి ఆ పర్వతాలపైన నివసించసాగాడు. రెండవ కుమారుడు నంది కూడా ఘోరంగా శివుడి గురించి తపమాచరించగా శివుడు మెచ్చి అతనిని తన వాహనం చేసుకున్నాడు. అప్పటి నుండి నంది వృషభరూపం ధరించి శివుడి వాహనంగా ఉండిపోయాడు. నందితపస్సుచేసిన ప్రదేశమే నేటి మహానంది అని ఒక కథ.

పదకొండవ శతాబ్దంలో నందులు ఈ ప్రాంతాన్ని పాలించి యిక్కడ అనేక శైవఆలయాలను నిర్మించి వారి కులదైవమయిన నందిని పూజించారని వారిపేరు మీద మహానంది అన్నపేరు వచ్చిందని ఇంకో కథనం.

అనగనగా ఒక ఆవు ఉండేది. అది రోజూ ఒక చిన్న పుట్ట దగ్గర నుండి పాలును ధారపోసేది. పశువుల కాపరి ఇలా రోజుపాలు తగ్గిపోవడం చూసి ఆ ఆవును వెంబడించి రహస్యంగా ఆవుపాలను పసిపిల్లవాడికి యివ్వడం చూసి అచ్చరువొందాడు. ఈ విషయాన్ని రాజుగారికి తెలియ చేశాడు. రాజుగారు రహస్యంగా ఆ పశువుల కాపరి వెంటవెళ్ళిఆవు పసిపిల్లవాడికిపాలు యివ్వడం చూసి ఆశ్చర్యపోయాడు. ఆ ఆశ్చర్యంలో రాజు ఒకడుగు ముందుకు వేశాడు ఆతృతతో. ఆ ఆవు ఆ చప్పుడుకు బెదిరిపోయి తత్తరపడి పారిపోబోయి తన పాదాన్ని ఆ పుట్టపైన మోపింది. వెంటనే ఆ బాలుడు అదృశ్యమైపోయాడు. రాజు తన తప్పు తెలుసుకుని ఈశ్వరుణ్ణి శరణు వేడాడు. శివుడు కనికరించి అక్కడ లింగరూపంలో వెలిశాడు. కాని ఆ లింగం పైన ఆవుపాదం గిట్టలు ఇప్పటికీ కనిపిస్తూ ఉంటాయి.

నవనందులలో ప్రఖ్యాతమైనది మహానంది (నంద్యాలకు 17 కి.మీ దూరం) ప్రథమనంది నంద్యాలలోనే (మహానందికి 16 కి.మీ దూరంలో) నాగనంది నంధ్యాలలోని ఆంజనేయస్వామి గుడిలో, సోమనంది ఆత్మకూరు పట్టణంలో, సూర్యనంది మహానందికి 6కి.మీ దూరంలో, విష్ణునంది మహానందికి మూడు కి.మీ దూరంలో, వినాయకనంది మహానంది గుడిలో వాయువ్యదిశలో శివనంది మహానందికి 13కి.మీ దూరంలో నంద్యాలలో ఉండగా గరుడనంది మహానంది గుడిలోనే ఉంది.

మహానందిలో మూడు పుష్కరిణులు వున్నాయి. బ్రహ్మగుండం, విష్ణుగుండం గుడి బయట ఉంటే రుద్రగుండం మటుకు గుడిలోనే ఉంది. గర్భగుడిలోని స్వయంభూశివలింగం నుండి ఈ మూడు పుష్కరిణులు పుట్టినట్లు చెబుతారు. ఈ పుష్కరిణులో ఐదు అడుగుల ఎత్తులో నీళ్ళు స్వచ్ఛంగా ఉంటాయి. రూపాయి బిళ్ళ పుష్కరిణిలో వేసినా అది అడుగున వున్న స్పష్టంగా పైకి కనిపిస్తుంది. అంత తేటతెల్లంగా ఈ నీరు ఉండటమేగాక, దీనికి రోగాలుమాపు శక్తి ఉందంటారు. చలి కాలంలో వెచ్చగాను, ఎండాకాలంలో చల్లగాను ఉండటం ఈ గుండం నీరు ప్రత్యేకత, ప్రాతఃకాలంలో వెచ్చగా పొద్దుపొడిచే కొద్దీ సూర్యుడు నడినెత్తిమీద కొచ్చేకొద్దీ నీరు చల్లగా (అన్ని కాలాలలో) మారుతూ ఉంటుంది. అన్ని కాలాలలో నీరు నిరంతరం ప్రవహిస్తూ ఉంటుంది. ఈ ప్రవాహం చరిత్రలో ఎప్పుడు ఆగిపోలేదు (ఆరవ శతాబ్దం నుండి)

కార్తీకమాసంలోను, శివరాత్రికి యిక్కడికిభక్తులు అశేషసంఖ్యలో విశేషపూజలు సలుపుతారు. శైవక్షేత్రాలలో ప్రసిద్ధిపొందిన క్షేత్రం ఇది.

## యాగంటి ఉమామహేశ్వరస్వామి ఆలయం

యాగంటి కర్నూలు పట్టణానికి దాదాపు 100 కి.మీ దూరంలో, బనగానపల్లె పట్టణానికి 14. కి.మీ దూరంలో ఉన్నగొప్ప శైవ క్షేత్రం. విజయనగర సామ్రాజ్య రాజులలో ఒకరైన బుక్కరాయలవారు ఈ గుడిని 15వ శతాబ్దంలో వైష్ణవ సాంప్రదాయానికి అనుకూలంగా నిర్మించారు.

కాని పురాణ కథనం ప్రకారం అగస్త్య మహాముని ఈ కొండలలో వేంకటేశ్వరస్వామికి గుడి కట్టించాలని సంకల్పించారు. కాని విగ్రహంలోని కాలి గోరు ఛిన్నం కావడంమూలంగా వేంకటేశ్వర స్వామివారిని ప్రతిష్ఠించలేకపోయారు. అప్పుడు ఖిన్నుడై అగస్త్యుడు శివుడి గురించి ఘోరంగా తపస్సుచేశాడు శివుడు ప్రత్యక్షమై ఈ ప్రదేశం కైలాసాన్ని పోలి ఉందనికాబట్టి ఇక్కడ శైవక్షేత్రం అయితే బాగుంటుందని చెప్పాడు. ఆపైన అగస్త్యుడి ప్రార్ధన అనుసరించి శివుడు ఉమామహేశ్వరుడిగా ఏకశిలపైన వెలిశాడు.

ఆటవికుడైన చిట్టెప్ప అనే భక్తుడు శివుడి గురించి తపస్సుచేస్తున్నప్పుడు శివుడు అతనికి పులి రూపంలో దర్శనమిచ్చాడు. కాని చిట్టప్ప శివుడిని గుర్తించి 'నేను కనుగొన్నాను, శివుని నేను కనుగొంటి' అంటూ అరిచాడు. అది చివరికి యాగంటిగా పరిణమించింది అని చెబుతారు కొందరు. ఇక్కడ వున్న కోనేటిలోకి నీరు నంది నోటినుండి వెలువడుతుంది. ఆ నీరుకొండల అడుగునపుడుతుందని తెలుస్తున్నది.

ఈ క్షేత్రంలో మహాసిద్ధపురుషుడైన పోట్లూరి వీరబ్రహ్మేంద్రస్వామి వారు కొంతకాలం నివసించి కాలజ్ఞానం రచించారని తెలుస్తుంది. కానివీరు నివసించిన గుహచాలా పొట్టిగావుండి యాత్రికులు వంగి లోపలికి పోవలసి వుంటుంది.

యాగంటిలోని నంది వార్తలలోకి ఎక్కింది. ఈ నంది క్రమంగా పెరుగుతున్నదని భక్తులు చెబుతారు. ఒకప్పుడు ఈ నంది చుట్టూ భక్తులు ప్రదక్షిణలు చేసేవారు అటువంటిది నంది పెరిగి పెద్దయి తన మండపం మొత్తంవ్యాపించడంతో ఇప్పుడు ప్రదక్షిణలు చేయ డంలేదు. ఇప్పటికీ ఇది పెరుగుతూనే ఉంది. ఈ విషయాన్ని శాస్త్రజ్ఞులు కూడా నిర్ధారించారు. 20 సంవత్సరాలకు ఒక అంగుళం పెరుగు తుందని అంచనావేశారు. ఇది యిలా ఉండగా కలియుగాంతంలో ఈ బసవన్నకు ప్రాణం వచ్చి రంకెవేడుతుందని వీరబ్రహ్మంగారు తన కాలజ్ఞానంలో రాశారు.

నూటయిర్వై మెట్లు ఎక్కితే అగస్త్యుడి గుహ కనిపిస్తుంది. ఇక్కడ ఆయన శివుడి గురించి తపస్సు చేశారు. గుహలో పార్వతీదేవి విగ్రహం ఉంది. ఇదిగాక వెంకటేశ్వర స్వామి గుహకు మెట్లున్నాయి నిట్ట నిలువుగా. ఇక్కడ కాలిగోరు భిన్నమయిన వేంకటేశ్వర స్వామి ప్రతి మను చూడవచ్చు. ఇది తిరుమలకంటే ముందునుంచి ఉందని ప్రతీతి. ఇచ్చట కాకులకు ప్రవేశం నిషిద్ధం. అగస్త్యముని శాపం కార ణంగా ఇచ్చట కాకులు సంచరించవు.

## ఉరుకుంద ఈరణ్ణస్వామి దేవాలయం

కర్నూలు జిల్లాలోని కౌతాళం మండలంలో, మంత్రాలయముకు సుమారు 30 కి.మీ. దూరంలో, ఆదోని పట్టణానికి దగ్గరగా, ఉరు కుంద క్షేత్రం వెలిసింది. ఇది హరిహరక్షేత్రం. శైవ, వైష్ణవ మతాల సామరస్యానికి గొప్ప ప్రతీక ఈ క్షేత్రం. ఈ క్షేత్రం ఏటా లక్షలాదిమంది భక్తులను ఆకర్షిస్తున్నది. ముఖ్యంగా పర్వదినాలలో లక్షలమంది భక్తులు స్వామివారిని దర్శించి తమ మొక్కులు చెల్లించుకుంటారు.

రెండువేల సంవత్సరములు క్రిందటి మాట. ఈ ఉరుకుంద క్షేత్రంలో హిరణ్యుడు అని ఒక సాధువు ఉండేవాడు. స్థానికులుఅతనిని వీరన్న లేక ఈరన్న అని పిలిచేవారు. అతను రావిచెట్టు క్రింద పెక్కు సంవత్సరాలు తపస్సుచేశాడు. గ్రామస్తులు అతనికి పళ్ళు, పూలు సమర్పించి తమ బాధలు విన్నవించుకొనేవారు. దీర్ఘకాలిక వ్యాధులు, వారి బాధలు ఆయన చేత తొలగించబడేవి. అకస్మాత్తుగా ఒకరోజు వీరన్న రావిచెట్టు క్రిందనుండి మాయమైపోయాడు. దాదాపు అదే సమయంలో ఆ రావిచెట్టు క్రింద లక్ష్మీ నరసింహస్వామి వారి విగ్రహం కనిపించింది. వీరన్నే ఆయన రూపంలో అక్కడ వెలిసినాడని భావిం చిన గ్రామస్తులు లక్ష్మీనరసింహస్వామి వారలను కొలువనారంభించారు.

ఆ తరువాత క్షేత్ర పాలకుడిగా వీరన్న ప్రతిమను పెట్టదలచుకొని వెండితో వీరభద్రస్వామి రూపంలో ఒక ప్రతిమను తయారుచేసి అక్కడ స్థాపించారు. వీరశైవ సాంప్రదాయం ప్రకారం ఇచ్చటి విగ్రహాలను భక్తులు నిగ్రహంతో కొలుస్తూ ఉన్నారు తరతరాలుగా.

ఇంకో కథనం ప్రకారం వీరన్నఅదృశ్యమైన పిదప ఆ రావిచెట్టు క్రింద లక్ష్మీనరసింహస్వామి మరియు వీరభద్రస్వామి విగ్రహాలు వ్యక్తమయ్యాయట. ఎందుకంటే వీరన్న ఎప్పుడూ శైవ,వైష్ణవ మతసామ రస్యాన్ని భక్తులకు బోధించేవాడట.

రావిచెట్టుపైన కప్పులేదు కాబట్టి ఈ పవిత్రవృక్షాన్ని భక్తులు గర్భా లయం తలుపులు మూసినా ఎప్పుడూ సేవించుకోవచ్చు. శ్రావణ మాసంలో ఈ క్షేత్రంలో విశేష పూజలు జరుగుతాయి. మిగతా మాసా లలో సోమ, గురు వారాలు, అమావాస్య దినాలలో భక్తులు తండోప తండాలుగా వస్తారు.

శ్రావణమాసంలోని మూడవ సోమవారంలో పదిహేనులక్షల పైగా భక్తులు ఆలయాన్ని దర్శించుకుంటారు. విధిగా ఆరోజు కుంభ వృష్టి కురుస్తుంది. నేలంతా చిత్తడి అయిపోతుంది. అయినా భక్తులు ఆలయంచుట్టూ తడినేలమీదే తడికట్టెలతో పొయ్యిలు వెలిగించి చక్కెర పొంగలి వండి స్వామివారికి నైవేద్యం సమర్పిస్తారు. తడికట్టెలు మండ టం స్వామివారి మహత్యం అని నమ్ముతారు ప్రజలు. చివరి సోమవారం పల్లకీసేవతో విగ్రహాలను తుంగభద్ర నదిలో స్నానం చేయించి విభూ దిని భక్తితో సమర్పిస్తారు. ఆ విభూదిని తమతో పాటు తీసుకువెళ్ళి ఆర్తులకు, దీనులకురాస్తారు. దానితోవారి బాధలు తొలగిపోతాయి.

రాఘవేంద్రస్వామివారు ఈ గుడిని సందర్శించి పూజలు జరిపి నట్లు చరిత్ర చెబుతున్నది.

ఆదోని పట్టణానికి 25కి.మీ. దూరంలో, మంత్రాలయానికి 30 కి.మీ దూరంలో వెలిసిన ఈ క్షేత్రానికి భక్తులు ఆంధ్ర కర్నాటక, తెలంగాణ రాష్ట్రాల నుండే కాక విదేశాలనుండి కూడ వస్తుంటారు. ఇక్కడ భక్తుల కోరికలు నెరవేరుతాయని భక్తుల నమ్మకం.

## నందవరం చౌడేశ్వరీ దేవిఆలయం

ఇది కర్నూలు జిల్లాలోని పాణ్యంనుండి బనగానపల్లెపోవు దారిలో వెలిసిన మహాగొప్ప శక్తిక్షేత్రం సాక్షాత్తు కాశీవిశాలాక్షి దేవి కాశీనుండి

నందవరం చక్రవర్తి ఎదుట సాక్ష్యం చెప్పడానికి ఒక్కరోజులో భూతల సొరంగ మార్గం ద్వారా కాశీనుండి నందవరంకు వచ్చిందని ఇతిహాసం. చంద్రవంశ మహారాజులు హస్తినాపురం రాజధానిగా రాజ్యం మేలేవారు. వారి వంశస్తుడైన సొమేంద్రుడు దక్షిణ భారతదేశానికి వచ్చి నందవరంను,తన రాజధాని చేసికొని పుణ్యక్షేత్రాలయిన శ్రీశైలం, అహోబిలం, అలంపురం దేవాలయాలను కొలుస్తూ ఉండేవాడు. అతని కొడుకు అయిన ఉత్తుంగ భుజుడు కూడ తండ్రి మార్గాన్ని అనుసరిస్తూ చాతుర్వర్ణాలవారిని కంటికి రెప్పలా కాపాడుతూ ఉండేవాడు. అతనికి చతుర్మతి,చారుమతి అనే యిరువురు భార్యలు. పెద్దరాణి చతుర్మతి కడుపు పండి నందుడు జన్మించాడు. ఉత్తుంగ భుజుడు తన రాజ్యంలో 301దేవాలయాలను నిర్మించి వాటికోసం ఒక్కోబ్రాహ్మణ కుటుంబానికి బాధ్యతలు అప్పచెప్పాడు.

యుక్తవయసు రాగానే సకలవిద్యలలో పారంగతుడైన నందుడిని యువరాజుగా అభిషేకించాడు ఉత్తుంగభుజుడు. ఒకరోజు భిల్లునాయకుడు వచ్చి క్రూరమృగాలు గ్రామాలను అల్లకల్లోలం చేస్తున్నాయని, పంటలను పాడు చేస్తున్నాయని పరిస్థితిని చక్కదిద్దమని ప్రార్థించాడు. రాజుగారు సపరివారంగా శ్రీశైలం చేరుకొని మల్లికార్జునస్వామిని, భ్రమరంబదేవిని సేవించుకుని, తన పరివారంతో వేటకు వెళ్ళి ఎన్నో క్రూరమృగాలను సంహరించాడు. అలా కొంత కాలం గడిచింది శ్రీశైలంలో.

ఒకరోజు నందుడు ఒంటరిగా శ్రీశైలం అడవులలో సంచరిస్తూ ఉండగా ధ్యానంలో ఉన్న ఒక మునిని కాంచాడు. అతను కళ్లు తెరిచేదాకా నిరీక్షించి వారిని సేవించుకున్నాడు. ఆముని ప్రసన్నుడై అతన్ని ఆశీర్వదించి అతనికి దత్తాత్రేయస్వామి అనుగ్రహం కలుగుతుందని చెప్పి, దత్త మంత్రాన్ని ఉపదేశించాడు. మునుముందు అతను చక్రవర్తి అయినంద సామ్రాజ్యం స్థాపిస్తాడనిపేర్కొన్నారు. ఇదివిని ఉత్తాంగభుజంగుడు సంతోషపడి కొంతకాలానికి తన కుమారుడికి తగిన కన్యను అన్వేషించి, చివరికి పాంచాలరాజైన చంద్రహాసుడు అతని రాణిచంద్రమతికి జన్మించిన శశిరేఖతో వివాహం కావించాడు. తరువాత కొంతకాలానికి నందుడికి రాజ్యం అప్పగించి తనువాన ప్రస్థాశ్రమం స్వీకరించి తన రాణులతో అడవులకు వెళ్ళిపోయాడు.

నందరాజు దత్తాత్రేయస్వామి గుడి కట్టించి నిత్యం పూజలు చేస్తూ ఉండేవాడు. ఒకరోజు దత్తాత్రేయస్వామి వారు నందుడికి స్వప్నంలో దర్శనం యిచ్చివరం కోరుకోమన్నాడు. తనకు నిత్యం తెల్లవారు ఝామున గంగలో స్నానం చేసి కాశీలోని అన్నపూర్ణాదేవిని, విశ్వేశ్వరుడిని యితర దేవుళ్ళను దర్శించి, ఉదయం అయ్యేసరికి నందవరం చేరి తన నిత్యకృత్యాలు నిర్వహించాలని కోరిక ఉన్నదని నందుడు దత్తాత్రేయుడిని కోరుకున్నాడు. అతని కోరిక మన్నించి స్వామివారు అతనికి తన పాదుకలను బహుకరించాడు. అవి మనోవేగం కలవి. కాని ఈ విషయాన్ని రహస్యంగా ఉంచమని ఆదేశించాడు.

ఆ పాదుకులను ధరించి నందుడు రోజూ ప్రాతఃకాలంలో కాశీకి పోయి ఒక్కోరోజుఒక పుణ్యస్నానవాటికలో గంగలోస్నానం చేసి విశ్వేశ్వరుడిని, అన్నపూర్ణమ్మను దర్శించుకొని తెల్లవారేసరికి తన మందిరం చేరుకొనేవాడు.చాలా కాలం యిలా జరిగింది. కొన్నాళ్ళకు శశిరేఖ దీనిని గమనించి ఆయన ఎక్కడికిపోతున్నాడో తెలుసు కుందామని అతను పోయేముందు అతని కాళ్ళు పట్టుకుంది. రాజు కనికరించి ఆమెను కూడ తనతో కాశీకి తీసుకుపోయాడు.

దురదృష్టంకొద్దీ అక్కడ రాణిగారు రజస్వల అయ్యింది. దత్తాత్రేయ స్వామివారు యిచ్చిన పాదుకలు మైలబడిపోయి తమ శక్తిని కోల్పోయాయి. దాంతో నందరాజు కాశీలో చిక్కుపడిపోయాడు. రాజ్యం అల్లకల్లోలమైపోతుందని భావించి కాశీలోని పండితులని తనను తన రాజ్యం చేర్పించమని వేడుకొన్నాడు, జరిగినది వారికి వివరించగా, వారు ఎన్నో పూజలు చేసి, మంత్రాలు చదివి, పవిత్రజలంతో రాణిగారి దోషం పోగొట్టారు. తమ మంత్రశక్తితో వారిని వారి స్వస్థలం చేర్పించారు క్షణాలలో. ఈ క్రతువులో 500 మంది బ్రాహ్మణులు పాలు పంచుకున్నారు. వారిలో 13మంది బ్రాహ్మణులను రాజు బాగా గౌరవించాడు. తనకు చేయబోయే మేలుకుప్రతిగా కష్టకాలంలో వారిని ఆదుకుంటానని దేవి మీద ప్రమాణం చేసి చెప్పాడు. కాశీలో కొన్ని సంవత్సరాలు గడిచిపోయాయి. కాశీలో కరువు పరిస్థితులు ప్రబలాయి. బ్రాహ్మణులకు నందరాజు గుర్తుకువచ్చాడు. అతని సహాయం కోసం 500 మంది పోదామనుకుని ముందుగా పదమూడు మంది బ్రాహ్మణులను, అనగా ఒక్కగాత్రానికి ఒక్క పెద్దదిక్కును, నందవరం పంపించారు. ఆ పదమూడుమంది బ్రాహ్మణులు నందరాజు సభకు వచ్చి తమ సహాయం గుర్తుచేసి తమ కుటుంబాలను ఆదుకోమని కోరారు. నందరాజుకు తన రహస్యం తెలియటం యిష్టంలేదు. వారిని తను చూడలేదని, ఒకవేళ సాక్షి ఉంటే, సాక్ష్యం చెప్పమని చెప్పాడు. అదివిని కాశీపెద్దభట్టు తమ కులదేవత అయిన చాముండేశ్వరి దేవి తోనే సాక్ష్యం, చెప్పిస్తానని చెప్పాడు. ఆ సభలో

చాముండేశ్వరిదేవిని నందవరం పిల్చుకురావడానికి ఆ 13 మంది బ్రాహ్మణులలో నలుగురు బ్రాహ్మణులు బయలుదేరారు. కాశీకు వారు

1) శ్రీవత్సవ గోత్రికుడుఅయిన బ్రహ్మశ్రీ అవధానం పెద్దిభట్టు 2. వశిష్టస గోత్రీకుడు అయిన తర్కశాస్త్రం మాధవభట్టు 3. భరద్వాజస గోత్రంలో జన్మించిన పురాణం శ్రీధరభట్టు మరియు 4. హరితస గోత్రికుడైన వర్తకం కమలనాభ పండితుడు.

వారుపోయి కాశీలో తమ మంత్రబలంతో చాముండేశ్వరీదేవిని ప్రత్యక్షం గావించుకొని నందవరం వచ్చి రాజుకు సాక్ష్యం చెప్పమని ప్రార్ధించారు. ఆమె ప్రసన్నురాలై బ్రాహ్మణులందరిని ముందు నడిచి పొమ్మని, వారి వెనుకాల తను వస్తానని, కాని ఎటువంటి పరిస్థితుల్లోను వెనుదిరిగి చూడవద్దని హెచ్చరించింది. సొరంగ మార్గం ద్వారా 500 కుటుంబాల బ్రాహ్మణులు, వారి వెనుక దేవి ఒక్కరోజులో కాశీనుండి నందవరం చేరుకున్నారు. నందవరం పొలిమేరలు వచ్చిన తరువాత వెనుకనుండి శబ్దాలు వినిపించకపోయే సరికి అనుమానంతో వారు వెనక్కి తిరిగి చూశారు. వెనుకగా వస్తున్న చాముండేశ్వరీ దేవి శిలగా మారిపోయింది.

నందవరం రాజు, ప్రజలు, పురోహితులు అందరూ అమ్మవారికి స్వాగతం పలికారు. నంద చక్రవర్తి ఆ చాముండేశ్వరికి, అంటే కాశీ విశాలాక్షి దేవికి, దేవాలయం నిర్మించాడు. 500మంది బ్రాహ్మణ కుటుంబాలను ఆదుకున్నాడు. వారందరిని నందవరం నియోగి బ్రాహ్మణులు అంటారు. మూలవిగ్రహం భయంకరంగా ఉండి భక్తులకు గుండెపోటు తెప్పిస్తున్నది కావడంతో సరిగ్గా ఆవిగ్రహం పైన అటువంటి ప్రతిమని శాంతమూర్తిగా నెలకొల్పారు భక్తులు.

అప్పటినుండి నందవరం చౌడీశ్వరిమాత కాశీవిశాలాక్షి దేవి లాగానే భక్తుల కోరికలను తీరుస్తూ ఉన్నది. దసరాకు అంటే దేవి నవరాత్రులలో యిక్కడ గొప్ప ఉత్సవం చేస్తారు. ఈ దేవికి భక్తులు మన దేశంలోనేగాక విదేశాలలో కూడ చాలామంది ఉన్నారు. లోగట క్షత్రియులు, బ్రాహ్మణులు ఈ దేవిని విశేషంగా సేవిస్తారు.

## కొత్తూరు సుబ్బారాయుడు

పాణ్యం నుండి చౌడీశ్వరీ మాతనుదర్శించుకునే దారిలోనే ఒక చోట దారిచీలి కొంచెంలోపలికి పయనిస్తే ఈ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి క్షేత్రం కనిపిస్తుంది. 300 సం॥క్రిందట బీరం చిన్నరెడ్డి పొలం దున్నుతూ ఉంటే అతని నాగలికి నాగదేవత శిల తగిలిఆగిపోయింది. సర్పాకారంలో వున్న ఆ విగ్రహాన్ని తీసి నింబువృక్షంక్రింద ప్రతిష్ఠించాడు. ఆ తరువాత కలలో స్వామివారు దర్శనం యిచ్చి తనకు గుడి కట్టించమని అడిగారు. ఆ ప్రకారంగా వల్లీదేవసేన సమేత సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వారి గుడి ఇక్కడ కట్టబడింది.

ఈ కొత్తూరు సుబ్బరాయుడు కర్నూలుజిల్లా వాస్తవ్యులకు గొప్ప వరప్రదాయుడు. ఏటా యిచ్చట నాగపంచమ, నాగచతుర్ధి తదితర పర్వదినాలలో ఉత్సవాలుజరుగుతాయి.

## మద్దిలేటి నరసింహస్వామి, మద్దిలేరు, ఆర్‌యస్ రంగాపురం, కర్నూలుజిల్లా

కర్నూలు పట్టణానికి 85కి.మీ దూరంలో, యాగంటికి 13 కి.మీ దూరంలో వెలిసిన స్వయంభూ వైష్ణవ క్షేత్రం ఇది. కదిరి నరసింహస్వామి ఒకసారి పాచికలు ఆటలో లక్ష్మీదేవి చేతిలో ఓడి పోయాడు. ఆమె ఆయనను అల్లరిపెట్టింది. అలిగిన నరసింహస్వామి కదిరి వదిలి నల్లమల, ఎర్రమల కొండలలో తిరుగుతూ యాగంటి ఉమామహేశ్వరుడిని తనకు ఒక నివాసం చూపమన్నాడు. ఆయన తన దగ్గరలోని మద్దిలేరుప్రక్కన ఉండమన్నాడు. కన్నప్పదొర మద్దిలేరుకు 3.కి.మీ దూరంలోని మోక్షపట్టణం పాలిస్తూ ఉండేవాడు. ఒకరోజు అతను వేటకు వెళ్ళినప్పుడు రంగులుమారుస్తున్న ఊసరవెల్లిని చూశాడు. దానిని పట్టుకోమని సైనికులను ఆదేశించాడు. అది దొరక్కుండా ఒక పుట్టలోకి పోయి దాక్కుంది. పుట్టను తవ్వినా దొరకలేదు. ఆ రాత్రి కలలో స్వామివారు కనిపించి తనే ఆ రూపంలో వచ్చినట్లు చెప్పారు.

రాజు మరుసటిరోజు పుట్టదగ్గరకు తన పురోహితులతో పోయి ప్రార్థన చేశాడు. సంతోషించిన నరసింహస్వామి పదిఏళ్ళ బాలుడిగా పట్టుబడి ప్రత్యక్షమై అందరిని ఆశీర్వదించి అదృశ్యమైపోయాడు. మద్దిలేరు ప్రక్కన ప్రత్యక్షమైన నరసింహుడు కాబట్టి ఈయనను మద్దిలేటి నరసింహస్వామిగా అప్పటినుంచి భక్తులు కొలుస్తున్నారు.

## సంగమేశ్వరం

నందికొట్కూరు దగ్గర సప్తనదుల సంగమం ఉన్నది. ఇది పురాణాల కాలం నుండి బహుళవ్యాప్తిలో ఉన్నది. ఏడునదులు సంగమించడం వలన ఇది ఎంతో మహిమాన్వితమైన ప్రదేశం. ఇచ్చట ధర్మరాజు, భీముడు తపస్సు చేశారు. లింగాలు స్థాపించారు. విశ్వామిత్రుడు తపస్సుచేసిన ప్రదేశం. శ్రీశైలం డ్యాము నిర్మాణంలో ఈ క్షేత్రం నీళ్ళల్లో మునిగిపోయింది. సంవత్సరానికి కేవలం రెండునెలలు మాత్రమే దర్శన యోగ్యంగా ఉంది. ఇక్కడ గొప్ప ఆలయమైన సంగమేశ్వర దేవాలయాన్ని అలంపురంలో పునర్నిర్మించారు.

## కాలువబుగ్గ

హసీనాపురంలో, కర్నూలుకుపోవు దారిలో, కర్నూలునుండి

సుమారు 30-40 కి.మీ దూరంలో ఒక గొప్ప శైవక్షేత్రం. భక్తులను అలరిస్తుంది. దీనిని కాలువబుగ్గ రామేశ్వరదేవాలయం అని పిలుస్తారు.

### దక్షిణషిరిడీ

కర్నూలులో నక్షత్రపు ఆకారంలో తుంగభద్రతీరంలో కోటలో (నవాబు బంగళాప్రక్కన) సాయిబాబా గుడి ఉన్నది. ఇందలి విగ్రహం షిరిడీలో స్థాపించుట కొరకు తయారైనది. కాని అప్పటికి అక్కడ గుడి నిర్మాణం జరగకపోవడం వలన ఆ సాయి బాబా విగ్రహాన్ని ఇక్కడ స్థాపించారు. కాబట్టి ఒకరకంగా భారతదేశంలోని తొలి సాయి బాబా గుడిగా దీనిని పేర్కొనవచ్చు. బాబాను కొలచి అశేషభక్తులు విశేష ఫలితాలను పొందుతున్నారు. ఇటీవల కాలంలో పత్తికొండలో, ప్యాపిలిలో తదితరచోట్ల అద్భుతమైన రీతిలో సాయిబాబా గుళ్ళు వెలిసినవి. దత్తాత్రేయ స్వామివారి అవతారంగా సాయిబాబాను కొలుస్తారు భక్తులు. నందికొట్కూరులోని సూర్యనారాయణస్వామివారి గుడి ప్రాచీనకాలం నుండి భక్తులను అలరిస్తున్నది.

పెరవలిలోని రంగనాథస్వామి వారిగుడి కూడ ప్రాచీనమైనది, మహిమాన్వితమైనది, భక్తులను విశేషంగా ఆకర్షించుచున్నది.

కోయిల కుంట్లలోని పాండురంగస్వామి గుడి బహుప్రశస్తమైనది.

కౌలుట్లలోని చెన్నకేశవ స్వామిగుడి విశేషఆదరణ పొందుతున్నది. ఆదోనిలోని రణమండల ఆంజనేయస్వామిగుడి కొండపైన నిర్మించబడినది. కర్నూలులోని పేట ఆంజనేయస్వామి దేవాలయము మహిమాన్వితమైనది.

గస్పాదులోని పెద్దమ్మగుడి, నంద్యాలలోని జగజ్జనని దేవాలయము, కర్నూలు పాతనగరంలోని కాళమ్మగుడి, ఆత్మకూరు పట్టణం దగ్గరలోని కొలనుభారతి గుడి భక్తులను ఆకర్షిస్తాయి. ఇటీవల నిర్మించిన మణికంఠ ఆలయాలు కూడ కర్నూలులో గొప్పఖ్యాతి పొందాయి.

ఓంకార సిద్దేశ్వర క్షేత్రం కర్నూలు జిల్లాలోని బండి ఆత్మకూరుకు 12 కి.మీ.దూరంలో వెలసిన పవిత్ర శైవక్షేత్రం.ఇక్కడ ఎప్పుడూ ఓంకారం వినిపిస్తూ ఉంటుంది. ఇక్కడ తపస్సు ఒనరించిన సిద్ధుడి మహిమ అది అని వినికిడి. కృష్ణాపురం గ్రామానికి 23 కి.మీ దూరంలో వెలిసిన నామతీర్థ యోగనంద నృసింహ తీర్థమును రామతీర్థమని కూడా చెబుతారు. పరశురాముడు స్థాపించిన శివలింగం యిచ్చట ఉంది.

సంజామల మండలంలోని నొస్సం గ్రామ ప్రాంతంలోని ఎర్రమల కొండలలో కొలువైన శైవక్షేత్రం నయనాలప్పక్షేత్రం భక్తులను ఆకర్షిస్తుంది. నందవరం మండలానికి 15 కి.మీ దూరంలో గల గురజాల గ్రామంలో ప్రసిద్ధిపొందిన శైవక్షేత్రం రామలింగేశ్వరస్వామి క్షేత్రం, శ్రీరాముడు స్థాపించిన సైకతలింగము, ఆంజనేయస్వామి కాశీనుండి తెచ్చిన లింగము, పాండవులు స్థాపించిన లింగములు ఈ తీర్థంలో దర్శనమిస్తాయి.

ఇంకా కర్నూలులోని శ్రీగోకర్ణం రామబొట్ల దేవాలయము గోరంట్ల శ్రీ లక్ష్మీమాధవ స్వామి దేవాలయము,కోట వీరాంజనేయస్వామి దేవాలయము, పాణికేశ్వర స్వామి దేవస్థానం, పాణ్యం, శ్రీమహాయోగి లక్ష్మమ్మ ఆలయం, ఆదోని తదితర దేవాలయాలు ముఖ్యమైనవి.

## మహాసంకల్పం

**మీ సమస్త పాపాలు పరిహారం కావడానికి, మీ పితృదేవతలు సద్గతి పొందటానికి,**
**మీ మనోభీష్టం నెరవేరడానికి పుణ్యస్నానాలు ఆచరించాలి.**
**అందుకుగాను మహాసంకల్పం చెప్పకోవాలి. పుణ్యక్షేత్రాల్లో,**
**ప్రత్యేక సందర్భాల్లో ఏదేని కోరికతో చేసే స్నానాన్ని కామ్యస్నానం అంటారు.**
**పుష్కరస్నానం కూడా కామ్యస్నానమే అవుతుంది.**

*చిరునామా : శ్రీ కె. విజయప్రసాద్, 87/395, కమలానగర్, 'బి'క్యాంప్, కర్నూలు-518002.*

శ్రీమతి భమిడిపాటి బాలాత్రిపురసుందరి

# కృష్ణానదీతీర ప్రాంతంలో గ్రామదేవతలు

### 1. గ్రామదేవతల పుట్టుక :

గ్రామస్థుల దృష్టిలో మాతృదేవత అందరికంటే అధికురాలు కనుక తమకి అవసరమైనవిధంగా వేరు వేరు పేర్లతో గ్రామదేవతల్ని ప్రతిష్ఠించుకుని ఆరాధిస్తున్నారు. దేవతలు విగ్రహరూపంలోనే కాదు శూలము, రాయి, వృక్షము, జంతురూపాల్లో కూడా పూజలు అందుకుంటున్నారు. పురుష దేవతలు ఉన్నా కూడా స్త్రీ దేవతకే ఎక్కువ ప్రాముఖ్యత ఇస్తున్నారు.

గ్రామదేవతల రూపాలు కొన్ని విలక్షణంగా భయంకరంగా కూడా ఉంటాయి. రూపం ఎలా ఉన్నా విజృంభించిన రోగాల్ని అదుపులో పెడుతూ, పశువుల్ని కాపాడుతూ, గ్రహబాధలు, శత్రుబాధలు లేకుండా చేస్తూ, ఊరి పొలిమేరల్ని, పంటపొలాల్ని, చెరువుల్ని, నీటి వనరుల్ని కనిపెట్టుకుని ఉంటూ, నమ్ముకున్న గ్రామస్థుల్ని రక్షిస్తున్నారు.

### 2. గుడి నిర్మాణం :

గుడి నిర్మాణంలో గ్రామదేవతలకి, శిష్టదేవతలకి మధ్య తేడా కనిపిస్తుంది. గ్రామదేవతల గుళ్ళు ఊరి పొలిమేరల్లోను, పంట పొలాలమధ్య చెరువుగట్ల మీద, వేపచెట్ల కింద నాలుగు బండరాళ్ళని చేర్చి చతురస్రాకారంలోను, విశాలంగా, ఆకర్షణీయంగా, సూర్య కిరణాలు విగ్రహం మీద పడేట్టు, తూర్పువైపు ద్వారం ఉండేట్టు పుష్కరిణితో, గోపురాలమీద శిల్పకళ ఉట్టిపడేలా నిర్మించి, దేవతా మూర్తుల్ని శాస్త్రప్రకారం ప్రతిష్ఠించి గరగల్ని, వేపమండల్ని దేవతలముందు ఉంచుతారు.

### 3. పవిత్రభావం :

నిప్పులమీద నడవడం, నీళ్ళతోను, రక్తంతోను శుభ్రం చెయ్యడాన్ని పవిత్రీకరణ చెయ్యడం అంటారు. దేవతా విగ్రహాలు ప్రతిష్ఠించి పూజ చెయ్యడం మొదలయ్యాక ఆ ప్రదేశాన్ని పవిత్రంగా భావిస్తూ దేవాలయానికి ముందు ధ్వజస్తంభాలు, దేవతలకి ముందు పవిత్రతకి చిహ్నంగా శూలాలు ఉంచారు. అప్పటినుంచి పవిత్రమైన దేవత ఉండే స్థలానికి వెళ్ళేముందు, శారీరకంగాను, మానసికంగాను పవిత్రంగా ఉండాలన్న భావన మనిషిలో కలిగింది. ప్రతి సంవత్సరము ఆలయప్రతిష్ఠ జరిగిన నెలలో అదే తిథిరోజు పండితుల్ని పిలిచి పవిత్రోత్సవం చేయిస్తున్నారు.

### 4. పూజా విధానం :

తరతరాలుగా వస్తున్న గ్రామీణ దేవతల పూజా విధానం వల్లే ఇప్పటికీ గ్రామీణ సాంప్రదాయం నిలబడి ఉందని చెప్పవచ్చు. ప్రకృతి చేసే బీభత్సం, దుష్టశక్తుల భయం నుంచి తనచుట్టూ ఉన్నవాళ్ళని, తనని రక్షించమని కోరుకుంటూ ప్రాచీన మానవుడు గ్రామదేవతల్ని ప్రతిష్టించి ప్రార్థించేవాడు. కోరికల్ని చెప్పుకుని కానుకలు సమర్పించేవాడు. కాలక్రమేణా పూజా విధానము, ఆచారాలు పద్ధతుల మార్పుల వల్ల మనిషికి దేవతలకి మధ్య పూజారి ఉంటున్నాడు. దేవతా ప్రతిష్ఠ జరిగిన సమయంలో అర్చకులుగా నియమించబడిన వంశంవాళ్ళే ఇప్పటికీ గుడి వ్యవహారాలు చూసుకుంటున్నారు. మంచి ముహూర్తంలో బీజాక్షరాలు ఉన్న యంత్రాలతో దేవతా విగ్రహాల్ని ప్రతిష్ఠిస్తున్నారు.

దేవత అనుగ్రహం పొందడం కోసం తనని తాను హింసించుకోవడం పూజలో ఒక భాగం. గ్రామదేవత ముందు కాళ్ళు, చేతులు నరుక్కోవడం, దవడల్లో శూలాలు దించుకోవడం, నాలుకలో శూలాలు గుచ్చుకోవడం, కళ్ళని పీకి అర్పించడం వంటి ఆత్మహింసని గంగ జాతర అంటారు. ప్రస్తుతం సర్పాలు ఎత్తుకోవడం, శరీరమంతా నిమ్మకాయలు గుచ్చుకోవడం, తలమీద టెంకాయలు కొట్టుకోవడం వంటి ఆత్మహింసా ప్రక్రియలు జరుగుతున్నాయి. సిడి ఎత్తడం వంటి ప్రక్రియలు ఇప్పుడు చాలావరకు తగ్గిపోయాయి.

### 5. బలి :

భూతాలకి కృతజ్ఞతాపూర్వకంగా కానుకలు ఇవ్వడాన్ని బలి అంటారు. ధూపము, పుష్పము, మద్యము, జంతువు లేక మనిషి వంటివే ఈ కానుకలు. పూర్వం మనిషి గ్రామదేవతల సహాయం పొందడానికి ఇటువంటి కానుకల్ని ఇచ్చేవాడు. ఈ బలి ఊరిలో వాళ్ళందరి శ్రేయస్సు, కుటుంబ శ్రేయస్సు, ఒకే వృత్తికి చెందిన కుటుంబాల శ్రేయస్సు (మడేల్రాజు అనే పండుగని చాకలివాళ్ళు, బీరయ్య పండుగని కురువలు జరుపుకోవడం) అని మూడు విధాలుగా వుంటుంది.

బలి ఇవ్వడం వాళ్ల ఆచార వ్యవహారాలు, ఉద్దేశాల మీద ఆధారపడి ఉంటుంది. ఆటవికులు రక్తం కిందపడకుండా బలి ఇస్తారు. మిగిలినవాళ్ళు రక్తం చిందేలా బలి ఇస్తారు. మొదటి బలి పశువుని శుభ్రంగా స్నానం చేయించి అలంకరించి దేవత చుట్టూ తిప్పుతారు. కంఠాన్ని, మెడని నరకడం ; వెన్నుని విరవడం ; కొరత వెయ్యడం ; ఎత్తునుంచి కిందికి తోసెయ్యడం ; నలిగిపోయేలా, ఊపిరి ఆడకుండా చెయ్యడం వంటి పద్ధతులతో బలిస్తారు. బలి ఇచ్చిన పశువు నుంచి ఎక్కువ రక్తం కారడానికి మెడ భాగాన్ని కిందకి శరీరభాగాన్ని పైకి పట్టుకుంటారు. రక్తం ఎక్కువగా కారితేనే దేవత తృప్తి పొందినట్టు భావిస్తారు. దున్నని, మేకని, కోడిని బలి ఇవ్వగానే కసురుని తీసుకెళ్ళి పోలి చల్లుతారు. గ్రామ శ్రేయస్సు కోసమయితే పోలిని గ్రామం చుట్టూ, కుటుంబ శ్రేయస్సు కోసమైతే ఇంటిచుట్టూ, పొలం చుట్టూ చల్లి, ఏ ఉద్దేశ్యం లేనప్పుడు బలి ఇచ్చిన జంతువుల అవయవాల్ని చెట్టుకి కట్టి ఆ రక్తాన్ని విగ్రహాలకి పూస్తారు. బలి ఇచ్చిన జంతువుల రక్తాన్ని భూమిలో కలిసేట్టు చెయ్యడం, దేవతలకి పుయ్యడం, పూజారులు గావు పట్టి తాగడం చేస్తారు. రక్తం కలిసిన అన్నం తినడం వల్ల దేవతలు తమకు మంచి చేస్తారని భావిస్తారు.

### 6. పూనకాలు :

పూనకం వచ్చినవాళ్ళు వేపచెట్టు కొమ్మల్ని చేత్తో పట్టుకుని నములుతూ, జుట్టు విరబోసుకుని, ముందుకీ వెనక్కీ ఊగుతూ కొలువు చెప్తారు. వేపాకుని బోనాల గరగల్లోను, బోనాల కుండల్లోను, మెడలో దండలుగాను వాడుకుంటారు. జాతర సమయంలో ఇళ్ళకి వేపాకులతో తోరణాలు కట్టుకుంటారు. మశూచి, ఆంకాళమ్మ, పోచమ్మ వచ్చినప్పుడు వేపాకు మండల్ని విసనకర్రలుగాను, రోగి పక్కన పెట్టి, వేపాకుల్ని మరిగించిన నీళ్ళని త్రాగిస్తే గ్రామదేవత అనుగ్రహించి రోగాన్ని తగ్గిస్తుందని గ్రామస్థుల నమ్మకం.

### 7. వివిధ గ్రామదేవతలు :

**1. ప్రాణత్యాగం చేసినవాళ్ళు :** తిరుపతమ్మ, మద్దిరామమ్మ, శ్రీలక్ష్మమ్మ, వాసిరెడ్డి, అచ్చమ్మ, ఉయ్యూరు వీరమ్మ, పెద్దింట్లమ్మ ఇంకా అనేకమంది.

**2. పౌరాణిక వ్యక్తులు :** కుంతీదేవి, గొంతేలమ్మ లేక గొంతెమ్మ వగైరా దేవతలు

**3. ప్రకృతి శక్తులు :** గంగానమ్మ, నీరమ్మ, వనదేవత, కొండమారెమ్మ, లంకమ్మతల్లి మొదలైనవారు.

**4. వీరత్వానికి ప్రతీకలు :** కోటమహిషమ్మ, జలదుర్గ, దుర్గ వంటి దేవతలు.

**5. కులదేవతలు :** వైశ్యులకి కన్యకాపరమేశ్వరి, విశ్వ బ్రాహ్మణులకి బ్రహ్మంగారు, పద్మశాలీయులకి భావన ఋషి వంటి దేవతలు.

**6. ఇతర దేవతలు :** ఘంటసాలలో సరస్వతీదేవి, గంగానమ్మ, అంబాపురంలో జైనుల దేవత భైరవలింగస్వామి, అక్కచెల్లెళ్ళైన బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, ఇంద్రాణి, వారాహి, చాముండి మూలదేవతకి మూడు అంశలైన సప్తమాతృకలు కూడా ఉన్నారు.

ఇలా ఆరువిధాలుగా చెప్పబడే గ్రామదేవతలున్నారు. వాళ్ళే కాకుండా శక్తి స్వరూపిణులు : పంచభూతాలైన గాలి, నీరు, నిప్పు, భూమి, ఆకాశం ఆధారంగా మొదట అయిదుగురు గ్రామదేవతల్ని ఏర్పాటుచేశారు. పంటకి ఆధారమైన నేలలో ఎక్కడ ఏ పంట బాగా పండుతుందో అక్కడ కుంకుళ్లమ్మ, గోగులమ్మ, జొన్నాళ్ళమ్మ, నూకాల్లమ్మ వంటి దేవతల్ని పృథ్వీదేవతలని ; గంగమ్మ - గంగానమ్మ వంటి దేవతల్ని జలదేవతలని, సూరమ్మ, పున్నమ్మ వంటి తేజస్సు కలిగిన దేవతల్ని అగ్ని దేవతలని ; కురువలమ్మవంటి దేవతల్ని వాయు దేవతలని ; ఆకాశమంత ఎత్తులో ఉండే దేవతని కొండమ్మని పిలిచేవాళ్ళు.

### 8. గ్రామదేవతల విశేషాలు :

సాధారణంగా పది పదిహేను గ్రామాలకి కలిసి ఒక దేవత ఉంటుంది. శంకరుడితో కలిసి అర్ధనారీశ్వర రూపంతో మా ఊళ్ళన్నింటికీ అమ్మ అని చెప్పే మావూళ్ళమ్మ. శంకరుడి కంఠం మీద మచ్చ (అంకము) ఉండడంవల్ల అంకగళమ్మే అంకాళమ్మ. బ్రతకడానికి వర్షాన్ని, పంటనీ ఇచ్చే అమ్మ బతుకమ్మ ; మనిషికి జీవన అవధిని రక్షించే అమ్మని కట్టమేయమ్మ, కట్టమేసేయమ్మ, కట్టమైసమ్మ ; మంచిని చూసే అమ్మ కన్నమ్మ ; సత్యాన్ని చూసే అమ్మ సత్తెమ్మ ; స్వచ్ఛమైన అమ్మ అనే అర్థంలో అచ్చమ్మ ; పుల్ల (వికసించిన కళ్ళు కల) అమ్మ- పుల్లమ్మ ; నైవేద్యం సమర్పించుకునే అమ్మ అర్పణమ్మే అప్పలమ్మ ;

అమ్మవార్ల ఊరేగింపులో అన్నింటికంటె చిన్న విగ్రహం పెంటి (బాల)+అమ్మ-పెంటమ్మ ; భోజనాన్ని అందించగల అమ్మ బోనాలమ్మ ; శంకరుడు, పార్వతి-అయ్య, అమ్మ అయ్యమ్మ ; భండాసురుణ్ణి చంపేందుకు లలితాంబ గుర్రాల మీద స్త్రీ సైన్యాన్ని తీసుకుని వెళ్ళింది కనుక గుర్రాలమ్మ ; సోమప్రోలు ఊరి అంబ-సోమపోలమాంబ ; ఊరి హద్దు వరకు రక్షించేది ఎల్లమ్మ ; జీవన భృతిని కలిగించేది పోచమ్మ. పాములు ఎక్కువగా ఉన్నచోట తల్లి పుట్టమ్మ, నాగేశ్వరమ్మ, పాపమ్మ, సుబ్బమ్మ. ఈ దేవతలు మొత్తం నూటొక్కమంది ఉన్నారని వాళ్లందరికీ పోతురాజు తమ్ముడని అంటారు.

## 9. కృష్ణాజిల్లాలో గ్రామదేవతలు :

ముత్యాలమ్మ తల్లి : కృష్ణాజిల్లా అంబరుపేట నందిగామ మం. గంగినేని పాలెం, హవేలి, ముత్యాలంపాడు జి కొండూరు మం. గొల్లమందల, పోలిశెట్టిపాడు ఎ కొండూరు మం. చంద్రగూడెం మొరుసుమిల్లి మైలవరం మం. గంపలగూడెం రాఘువాపురం రెడ్డిగూడెం మం. తెల్లదేవరపల్లి విస్సన్నపేట మం. మందపాకల కోడూరు మం. మచిలీపట్టణం గ్రామం, మం. గుమ్మడిదుర్రు పెనుగంచిప్రోలు మం. తోటరావులపాడు చందర్లపాడు మం. పోచంపల్లి జగ్గయ్యపేట మం. ఊటుకూరు గంపలగూడెం మం. ముచ్చునపల్లి విస్సన్నపేట మం. మాధవరం ముదినేపల్లి మం. అక్కపాలెం తిరువూరు మం.

**లక్ష్మీ తిరుపతమ్మ తల్లి :** జగ్గయ్యపేట గ్రామం, మం. కొటికలపాడు ఇబ్రహీపట్నం మం. బొర్రగూడెం మైలవరం మం. విస్సన్నపేట గ్రామం, మం. కానూరు పెనమలూరు మం. తెన్నేరు, కంకిపాడు మం. కూచిపూడి మొవ్వ మం. గన్నవరం గ్రామం, మం. విశ్వనాథపల్లి కోడూరు మం. దింటిమెరక కొడూరు మం.

**ముక్తాలమ్మ తల్లి :** జగ్గయ్యపేట గ్రామం, మం. నాగసత్యమ్మ తల్లి : జగ్గయ్యపేట గ్రామం, మం. గంగానమ్మ తల్లి మాల్కాపురం జగ్గయ్యపేట మం. భీమవరప్పాడు కందులపాడు, జి. కొండూరు గ్రామం, మం. కొండపల్లి ఇబ్రహీపట్నం మం. బద్రరాజుపాలెం కళ్ళంవారి పాలెం తోట్లవల్లూరు మం. గోసాల, తాడిగడప, పెనమలూరు గ్రామం, మం. గొల్లపూడి, రాయనపాడు విజయవాడ గ్రామీణ మం. నాగాయలంక గ్రామం, మం. జగన్నాధపురం, కంకిపాడు గ్రామం, మం. దావాజీగూడెం గన్నవరం గ్రామం, మం. పట్టిగుడిపాడు ఆగిరిపల్లి మం. మొఖ్భాస నూజివీడు మం. ముసునూరు గ్రామం, మం. ఉంగుటూరు, వెన్నూతల, మధిరపాడు, నాగవరప్పాడు. పొణుకుమాడు ఉంగుటూరు మం. పెరికీడు బాపులపాడు మం. హనుమంతపురం, గోవువానిపాలెం పమిడిముక్కల గ్రామం, కాటూరు, బోళ్ళపాడు, వుయ్యూరు గ్రామం, మం. మంగళాపురం చల్లపల్లి మం. చిట్టూర్పు కొడాలి ఘంటసాల మం. తాడేపల్లి ఘంటసాల పెదముక్తేవి పెదసనగల్లు మొవ్వ మం. పెదప్రోలు మోపిదేవి మం. మచిలీపట్టణం గ్రామం, మం. పెద కరాగ్రహారం మచిలీపట్టణం మం. కంకటావ, లెల్లగరువు, ముక్కొల్లు గూడురు గ్రామం, మం. అడ్డాడ, పామర్రు గ్రామం, మం. రిమ్మనపూడి పామర్రు మం. అప్పికట్ల, పెదపారుపూడి గ్రామం మం. గురువిందగుంట, జువ్వనపూడి, మోపర్రు, వానపాముల, వెంట్రప్రగడ పెదపారుపూడి గ్రామం, మం. పెదఎరుకపాడు గుడివాడ మం. గుడ్లవల్లేరు గ్రామం, మం. కౌతారం గ్రామం, మం. పెంజెండ్రా గుడ్లవల్లేరు మం. కవిపురం, చెవేంద్ర పెడన మం. అర్తమూరు, బంటుమిల్లి గ్రామం, మం. ఆటపాక, గోనెపాడు కైకలూరు మం. సంగమూడి కృత్తివెన్ను మం.

**కొండాలమ్మ తల్లి :** రామచంద్రునిపేట జగ్గయ్యపేట మం. రెడ్డిపాలెం, వేమవరం గుడ్లవల్లేరు మం. వెంకటాపురం కలిదిండి మం.

**తిరుపతమ్మ తల్లి :** గోపినేనిపాలెం, పెనుగంచిప్రోలు వత్సవాయి మం. కానూరు పెనమలూరు మం. వీరవల్లి బాపులపాడు మం. అవనిగడ్డ గ్రామం, మం. గుడ్లవల్లేరు గ్రామం, మం. తెన్నేరు గ్రామం. కంకిపాడు మం.

**సత్తెమ్మ తల్లి :** అంబరుపేట నందిగామ మం. దొనబండ ఇబ్రహీంపట్నం మం.

**గంటలమ్మ తల్లి :** కేతవీరునుపాడు నందిగామ మం.

**అంకమ్మతల్లి :** వెలది గ్రామం, కొత్తపాలెం మం. మునుకుళ్ళ గ్రామం తిరువూరు మం. కొత్తపల్లి గ్రామం, గంపలగూడెం మం. వెదురుపావులూరు గన్నవరం మం. జయంతి గ్రామం, వీరులపాడు మం. మాధవరం గ్రామం ఏ.కొండూరు మం. కంచల నందిగామ మం. త్రిలోచనపురం, ఇబ్రహీంపట్నం గ్రామం, మం. కవులూరు జి కొండూరు మం. గరికపర్రు తోట్లవల్లూరు మం. బద్రిరాజు పాలెం తోట్లవల్లూరు మం. రెడ్డిగూడెం గ్రామం. మం. కొండపర్వ విస్సన్నపేట మం. నున్న, రామవరప్పాడు విజయవాడ గ్రామీణ మం. మోపిదేవి గ్రామం, మం. దేవరపల్లి తోట్లవల్లూరు మం. గోడవర్రు కంకిపాడు మం. గోపవరపుగూడెం గన్నవరం మం. బిళ్ళనపల్లి బాపులపాడు మం. వుయ్యూరు గ్రామం, మం. చోరగుడి, హనుమంతపురం పమిడిముక్కల మం. అయ్యంకి, పెడసనగల్లు, నాగాయతిప్ప, భట్లపెనుమర్రు, వెంకటాపురం, కె కొత్తపాలెం, గంజివాని పాలెం మోపిదేవి గ్రామం, మం. పులిగడ్డ అవనిగడ్డ గ్రామం, మం. కలపటం గూడూరు మం. రామనుజవార్తల పల్లి, గూడూరు గ్రామం, మం.

తమలంపాడు, ఎలమర్రు పెదపారుపూడి మం. గుడ్లవల్లేరు గ్రామం, మం. పురిటిపాడు, విన్నకోట, రెడ్డిపాలెం గుడ్లవల్లేరు మం. ఉప్పలకలువగుంట పెడన మం. పెనుగంచిప్రోలు వత్సవాయి మం.

**పుట్టమ్మ తల్లి :** జనార్ధనపురం పెదపారుపూడి మం ; కంచల నందిగామ మం.

**అలివేలమ్మ తల్లి :** చందర్లపాడు గ్రామం, మం. పామర్రు గ్రామం. మం. మోదుమూడి అవనిగడ్డ మం ;

**నూకాలమ్మ తల్లి :** చింతలపాడు చందర్లపాడు మం. కొండపల్లి ఇబ్రహీంపట్నం మం. చెవుటూరు, జి కొండూరు మం.

**నాగలక్ష్మీ తల్లి :** కంచికచర్ల గ్రామం, మం. మారెమ్మ తల్లి ; దొనబండ ఇబ్రహీపట్నం మం. పుట్రెల విస్సన్నపేట మం. వెంకటాపురం మోపిదేవి మం. మాట్లం కృత్తివెన్ను మం.

**కాశేమ్మ తల్లి :** దొనబండ ఇబ్రహీంపట్నం మం. నాభిశిల : భీమవరప్పాడు జి. కొండూరు మం. పోలిశెట్టిపాడు ఎ కొండూరు మం. మొరుసుమిల్లి మైలవరం మం. విస్సన్నపేట గ్రామం, మం.

**అచ్చమ్మ తల్లి :** కవులూరు జి కొండూరు మం. వినగడప గంపలగూడెం మం.

**చల్లపల్లమ్మ తల్లి :** వెల్లటూరు జి. కొండూరు మం.

**సత్యాలమ్మ తల్లి :** వెల్లటూరు జి కొండూరు మం.

**పాటిబండ్ల లక్ష్మీదేవమ్మ తల్లి :** వీరులపాడు వీరుల మం.

**మరీదు మహిసమ్మ తల్లి :** పెనమకూరు తోట్లవల్లూరు మం.

**నాంచారమ్మ తల్లి :** పెదకళ్ళేపల్లి మోపిదేవి మం. అరిసెపల్లి, కృష్ణాజిల్లా, మచిలీపట్నం మం ; మైసమ్మ ; దేవరపల్లి తోట్లవల్లూరు మం.పెదకళ్ళేపల్లి, పెదప్రోలు మోపిదేవి మం. దుగ్గిరాల

**రావమ్మ తల్లి :** కనసానపల్లి, తోటపల్లి, ఆగిరిపల్లి గ్రామం. మం.

**కొల్లేటి పెద్దింట్లమ్మ తల్లి :** కొల్లేటికోట కైకలూరు మం.

**బాలపేరంటాళ్ళమ్మ తల్లి :** ప్రసాదంపాడు విజయవాడ గ్రామీణ మం.

**పేరంటాళ్ళమ్మ తల్లి :** నున్న రామవరప్పాడు విజయవాడ గ్రామీణ మం. ఆరుగొలను హనుమాన్ జంక్షన్ బాపులపాడు మం. గూడూరు గ్రామం. మం ;

**వీరమ్మ తల్లి :** నున్న విజయవాడ గ్రామీణ మం. భూషణగుళ్ళ పెదపారుపూడి మం. మామిడికోళ్ళ గుడ్లవల్లేరు మం. ఉయ్యూరు, ఉయ్యూరు మం.

**పార్వతమ్మ తల్లి :** నున్న విజయవాడ గ్రామీణ మం.

**నాగమ్మ :** నున్న విజయవాడ గ్రామీణ మం.

**వెంకమ్మ :** రామవరప్పాడు విజయవాడ గ్రామీణ మం. గూడూరు గ్రామం, మం.

**ఆరేటమ్మ తల్లి :** నగులూరు రెడ్డిగూడెం మం.

**కంచలమ్మ తల్లి :** బురుగ గూడెం రెడ్డిగూడెం మం.

**పెద్దమ్మ తల్లి :** పెడన గ్రామం మం ; రాఘవాపురం రెడ్డిగూడెం మం. పెనుగంచి ప్రోలు వత్సవాయి మం.

**లక్ష్మీపేరంటాలు తల్లి :** లింగాలపాడు, నందిగామ మం. వినగడప గంపలగూడెం మం. అంకాలమ్మ తల్లి ; బొబ్బర్లంక మోపిదేవి మం. వేకనూరు, రామకోటిపురం, గాజులవారి పాలెం అవనిగడ్డ మం. భావదేవరపల్లి నాగయలంక మం. మందపాకల కోడూరు మం. సుల్తాన్ నగరం కొల్లపలెం మచిలీపట్టణం మం.

**అమ్మగారు తల్లి :** ఆడపావారి పాలెం మోపిదేవి మం. పెన్నేరమ్మ తల్లి : ఘంటసాల గ్రామం, మం.

**కోటముత్యాలమ్మ తల్లి :** దేవరకోట ఘంటసాల మం.

**ఢిల్లీభోగాలమ్మ తల్లి :** వక్కలగడ్డ చల్లపల్లి మం.

**రేణుకమ్మ తల్లి :** యార్లగడ్డ, చల్లపల్లి మం. అయ్యంకి, మంత్రి పాలెం మొవ్వ మం.

**తాటానమ్మ తల్లి :** మంగళపురం చల్లపల్లి మం.

**సత్యాలమ్మ తల్లి :** చల్లపల్లి గ్రామం. మం.

**చల్లపల్లమ్మ తల్లి :** చల్లపల్లి గ్రామం, మం.

**జమ్మి లంకమ్మ తల్లి :** చల్లపల్లి గ్రామం, మం.

**సంపటాలమ్మ తల్లి :** చల్లపల్లి గ్రామం, మం.

**లక్ష్మి నాంచారమ్మ తల్లి :** లక్ష్మీపురం చల్లపల్లి మం. వుయ్యూరు గ్రామం, మం.

**బుస్సమ్మ తల్లి :** ముదునూరు వుయ్యూరు మం.

**తిరువులమ్మ తల్లి :** వేలేరు, ఆరుగొలను బాపులపాడు మం.

**గురువులమ్మ తల్లి :** వేలేరు, ఆరుగొలను బాపులపాడు మం.

**రంగమ్మ పేరంటాళ్ళు తల్లి :** తేలప్రోలు, ఉంగుటూరు మం.

**పంగిడమ్మ తల్లి :** ఈదర ఆగిరిపల్లి మం.

**రణ అంకమ్మ తల్లి :** దావాజీగూడెం, గన్నవరం మం.

**మద్దిరావమ్మ తల్లి :** బహుబలేంద్రుని గూడెం గన్నవరం మం. వెంకటాపురం మోపిదేవి మం.

**పెనుగంచిప్రోలు వత్సవాయి మం. :** జింజేరు గ్రామం, పెడన మం.

**మహాలక్ష్మమ్మ తల్లి :** ఈడుపుగల్లు, కంకిపాడు మం.

**గొంతేనమ్మ తల్లి :** గొల్లగూడెం, కంకిపాడు గ్రామం, మం. గూడూరు గ్రామం, మం. వల్లూరుపాలెం తోట్లవల్లూరు మం.

**బాలకొండలమ్మ తల్లి** : తెన్నేరు, కంకిపాడు మం.

**అద్దంకి నాంచారమ్మ తల్లి** : దక్షిణ చిరువోలు లంక అవనిగడ్డ మం. మందపాకల కోడూరు మం. విశ్వనాథపల్లి, పిట్టల్లంక కోడూరు మం. పెద్దప్రోలు మోపిదేవి మం ;

**పోలాశమ్మ తల్లి** : పులిగడ్డ అవనిగడ్డ మం. మాచవరం కోడూరు మం.

**ప్రసన్న గుర్రాలమ్మ తల్లి** : వేకనూరు అవనిగడ్డ మం.

**అమ్మగారమ్మ తల్లి** : వేకనూరు అవనిగడ్డ మం. జరుగువానిపాలెం కోడూరు మం.

**అంగలమ్మ తల్లి** : గుడివాకవారి పాలెం అవనిగడ్డ మం.

**ఎల్లారమ్మ తల్లి** : నాగాయలకం గ్రామం, మం.

**లంకమ్మ తల్లి** : అవనిగడ్డ గ్రామం. మం.

**రేణుక మావూరమ్మ తల్లి** : అవనిగడ్డ గ్రామం, మం.

**రెడ్డెంకాలమ్మ తల్లి** : అవనిగడ్డ గ్రామం, మం.

**మల్లెలమ్మ తల్లి** : మెరకనపల్లి మోపిదేవి మం.

**నూకాలమ్మ తల్లి** : రావివారి పాలెం మోపిదేవి మం.

**మామిళ్ళమ్మ తల్లి** : కె కొత్తపాలెం మోపిదేవి మం.

**బోర్లమ్మ తల్లి** : వెంకటాపురం మోపిదేవి మం.

**మావుళ్ళమ్మ తల్లి** : వెంకటాపురం మోపిదేవి మం.

**ఉర్వేలమ్మ తల్లి** : భావదేవరపల్లి, బర్రంకుల నాగాయలంక మం.

**విరుగులమ్మ తల్లి** : నంగేగడ్డ నాగాయలంక మం.

**చోడిశెట్టి అమ్మ** : రేమాలవారిపాలెం, నాగాయలంక మం.

**అమలేశ్వరి తల్లి** : మందపాకల కోడూరు మం. దావోజీపాలెం పెడన మం.

**బీబీనాంచారమ్మ తల్లి** : విశ్వనాథపల్లి కోడూరు మం.

**దొంతులమ్మ తల్లి** : మచిలీపట్టణం గ్రామం, మం.

**దేవీనాంచారమ్మ తల్లి** : అరిసెవల్లి మచిలీపట్టణం మం.

**సీతమ్మ తల్లి** : గూడూరు గ్రామం, మం.

**పోలేరమ్మ తల్లి** : కొమరవోలు పామర్రు మం.

**రేణుకాపుట్టలాంబ తల్లి** : జనార్దనపురం నందివాడ మం.

**చోడేశ్వరి తల్లి** : పెదలింగాల నందివాడ మం.

**నాగమ్మ తల్లి** : గుడివాడ గ్రామం, మం.

**బాల రెడ్డెంకమ్మ తల్లి (దేవరమ్మ)** : గుడ్లవల్లేరు గ్రామం, మం.

**గంగమ్మ తల్లి** : విన్నకోటారెడ్డిపాలెం గుడ్లవల్లేరు మం.

**పైడమ్మ తల్లి** : పెడన గ్రామం మం. ముత్యాలంపాడు జి.కొండూరు మం. పైడూరుపాడు విజయవాడ రూరల్ మం.

**గోగులమ్మ తల్లి** : బల్లిపర్రు పెడన మం.

**వనవలమ్మ తల్లి** : కాకర్లమూడి పెడన మం.

**వీరసుంకులమ్మ తల్లి** : పుల్లపాడు పెడన మం.

**దేవీతల్లి** : లింగాల, పెరికెగూడెం మండవల్లి మం. కోరుకొల్లు కలిదిండి మం.

**బళ్ళమ్మ తల్లి** : కోరుకొల్లు, కలిదిండి మం.

**దానమ్మ తల్లి** : లక్ష్మీపురం కృత్తివెన్ను మం. మాల్చమ్మ : మాట్లం కృత్తివెన్ను మం. మొగదారమ్మ తల్లి : మాట్లం కృత్తివెన్ను మం.

**ఇరుములమ్మ తల్లి** : నంగేగడ్డ నాగాయలంక మం.

**చంద్రమ్మ-మల్లయ్య** : పెనుగంచిప్రోలు ;

**వత్సవాయి మం తుమ్మలమ్మ తల్లి** : బందరు దగ్గర చెన్నూరు గ్రామం పెడన మం ;

**పెద్దింటమ్మ తల్లి** : కొల్లేటికోట కైకలూరు మం ;

**పోతురాజు** : గ్రామదేవతలకి సోదరుడు, సహాయకుడు. నిలబడి ఉన్న పోతురాజు విగ్రహానికి ఒక చేతిలో కత్తి, రెండో చేతిలో నిమ్మకాయ, తొమ్మిది గాజులు ఉంటాయి. కాళ్ళ దగ్గర కోడిపుంజు బొమ్మ ఉంటుంది.

**మహాకాళమ్మ తల్లి** : ముక్కొల్లు గ్రామం. గూడురు మం ;

**మాలచ్చమ్మ తల్లి** : కొత్తపల్లి కుగ్రామం గంపలగూడెం మం ;

**ముప్పాలమ్మ తల్లి** : ముప్పాలగ్రామం నందిగామ మం ;

బుచ్చమ్మ-పల్లా కోటమ్మ తల్లి : ముదునూరు పెంటపాడు మం ;

**రంగమ్మతల్లి** : తేలప్రోలులో ఉంగుటూరు మం ;

**వీరబాబు గుడి** : విజయవాడ, విజయవాడ గ్రామీణ మం.

## 10. గుంటూరుజిల్లా గ్రామదేవతలు :

**నాంచారమ్మ తల్లి** : వెనిగండ్ల పెదకాకాని మం. వేజెండ్ల చేబ్రోలు మం. గూడవల్లి చెరుకుపల్లి మం. పెసర్లంక భట్టిప్రోలు మం. గంగడిపాలెం రేపల్లె మం. పూడివాడ నగరం మం. కొత్తపాలెం నిజాంపట్టణం మం.

**గంగానమ్మ తల్లి** : తెనాలి, ములూరు, కొల్లిపొర, ఉరవకల్లు, నవులూరు మంగళగిరి మం. పెదవడ్లపూడి మంగళగిరి, చిలువూరు, తుమ్మపూడి, పెరకలపూడి, పెనుమూడి, ఈమని, రేవేంద్రపాడు, మంచికలపూడి దుగ్గిరాల మం. వల్లభాపురం, దావులూరి పాలెం కొల్లిపర మం. తెనాలి, గుండవరం, చేబ్రోలు మం. లేమల్లెపాడు వట్టిచెరుకూరు మం. మోపర్రు అమృతలూరు మం. కనగాల చెరుకుపల్లి మం.

**నడివేలమ్మ తల్లి** : రాజవోలు చెరుకుపల్లి మం. కొత్తమల్లయ పాలెం ప్రతిపాడు మం.

**ఉళ్ళేరమ్మ తల్లి** : జరుగుమల్లి గ్రామం, మం.

**పల్లాలమ్మ తల్లి** : బుద్ధం కర్లపాలెం మం. పాంచాళవరం, అమృతలూరు మం.

**అద్దంకమ్మ తల్లి** : తెనాలి బాపట్ల మం. అప్పికట్ల వట్టిచెరుకూరు మం. తక్కెళ్ళపాడు పెదకాకాని మం. ముట్లూరు, చింతపల్లిపాడు, వింజనంపాడు వట్టిచెరుకూరు మం. ప్రత్తిపాడు గ్రామం, మం. శావల్యాపురం, కొత్తలూరు, వేల్పూరు శావల్యాపురం మం. పసుమర్రు చిలకలూరిపేట మం. వల్లూరు కాకుమాను మం. ములుకుదురు పొన్నూరు మం.

**మహంకాళీఅమ్మ తల్లి** : కంటమరాజు కోడూరు గుంటూరు ;

**మొగలిచేలమ్మ తల్లి** : పెదరావూరు తెనాలి మం.

**తాళ్ళమ్మ తల్లి** : ధూళిపూడి గ్రామం. ముట్లూరు వట్టిచెరుకూరు మం ; నగరం మం. అద్దంకివారిపాలెం నగరం మం.

**జడలమ్మ తల్లి** : గుంటూరు జిల్లా పొన్నేకల్లు గ్రామం ;

**నాగారమ్మ తల్లి** : తుర్లపాడు, చిలకలూరిపేట మం. పాత పాటేశ్వరి తల్లి : గురజాల గ్రామం, మం. నడికుడి దాచేపల్లి మం. కారంపూడి గ్రామం, మం. గుళ్ళపల్లి, చెరుకుపల్లి మం.

**అంకమ్మ తల్లి** : అంగలూరు ఈపూరు మం. మురికిపూడి పసుమర్రు చిలకలూరిపేట మం. గుళ్ళపల్లి చెరుకుపల్లి మం. ఇరికేపల్లి దాచేపల్లి మం. అబ్బూరు సత్తెనపల్లి మం. నుదురుపాడు ఫిరంగిపురం మం. తక్కెళ్ళపాడు పెదకాకాని మం. పెరవలి వేమూరు మం. నిమ్మగడ్డవారిపాలెం ప్రత్తిపాడు మం. కొప్పర్రు పెదనందిపాడు మం. రేటూరు కాకుమాను మం. మోపర్రు గోవాడ అమృతలూరు మం. సిరిపూడి నగరం మం. గుళ్ళపల్లి, రాజోలు, పగడంవారి పాలెం, వాకారివారి పాలెం చెరుకుపల్లి మం. తాడివాకవారి పాలెం నగరం మం. అడవులదీవి, నిజాంపట్నం గ్రామం, మం. పిట్టవానిపాలెం గ్రామం, మం.

**సత్తెమ్మ తల్లి** : కుంతిమడ్డి అడవుల్లో ఉంది ; పెద్దింటమ్మ తల్లి ; కర్లపాలెం గ్రామం, మం.

**గంగమ్మ తల్లి** : పిడుగురాళ్ళ, తెనాలి, రెంటచింతల మం. గామలపాడు దాచేపల్లి మం. అనంతవరం క్రోసూరు మం. దుర్గి, తుమ్మల చెరువు పిడుగురాళ్ళ మం. తాడిబోయినవారి పాలెం దుగ్గిరాల మం. కుచ్చళ్ళపాడు, వేమూరు, పెదగాదెలవర్రు చుండూరు మం. కొప్పర్రు పెదనందిపాడు మం. చింతాలమ్మ తల్లి : కొల్లూరు, ప్రత్తిపాడు, ప్రతిపాడు మం.

**నూకాలమ్మ తల్లి** : గుళ్ళపల్లి చెరుకుపల్లి మం. తక్కెళ్ళపాడు పెదకాకాని మం. బూతుమిల్లి వేమూరు మం. ఆరేపల్లి, గుళ్లపల్లి, చెరుకుపల్లి మం. పుట్టలమ్మ తల్లి : మునిపల్లె పొన్నూరు మం. అమృతలూరు గ్రామం, మం. సూరేపల్లి వెల్లటూరు భట్టిప్రోలు మం.

**నేలపాటి శ్రీలక్ష్మి తిరుపతమ్మ తల్లి** : నగరం గ్రామం, మం. పక్కలమ్మ అమ్మవారు నగరం గ్రామం, మం. పూడివాడ నగరం నగరం గ్రామం, మం. పూడివాడ నగరం

**ముత్యాలమ్మ తల్లి** : ఆమని, జమ్ములమడక, కొప్పునూరు, మాచెర్ల మం. మల్లవరం, తుమృకోట రెంటచింతల మం. నడికుడి దాచేపల్లి మం. అనుపాలెం రాజుపాలెం మం.

**పోలేరమ్మ తల్లి** : గన్నవరం, మంచికల్లు మాచెర్ల మం. మంగళగిరి, అబ్బూరు సత్తెనపల్లి మం. కారంపూడి గ్రామం, మం. ఓబులేసుని పల్లి దుర్గి మం. కర్లగుంట నకరికల్లు మం. తక్కెళ్ళపాడు, పెదకాకాని మం. వలివేరు చుండూరు మం. కొత్తరెడ్డి పాలెం చేబ్రోలు మం. వింజనంపాడు వట్టిచెరుకూరు మం. వేమవరం భట్టిప్రోలు మం. వట్టి చెరుకూరు గ్రామం, మం. కొత్తమల్లయ్యపాలెం ప్రత్తిపాడు మం. కొండపాటూరు, కాకుమాను మం. లింగాపురం మాచర్ల మం. చేబ్రోలు గ్రామం, మం. బోడి శాంభునివారి పాలెం ఈ పూరు మం. కొత్తలూరు, వేల్పూరు, కనమర్లపూడి శావల్యాపురం మం. అందుగులపాడు వినుకొండ మం. పెదనందిపాడు, ఉప్పల పాడు, అన్నవరం, గోగులమూడి, రావిపాడు, వరగాణి పెద్దనందిపాడు మం. కాకుమాను, కొండబలవారి పాలెం, బల్లూఖానుదు పాలెం, కొమ్మూరు, పెద్దివారి పాలెం, కొండపాటూరు, రేటూరు, గార్లపాడు, కాకుమాను మం. పొన్నూరు, కొండముది పొన్నూరు మం. చెరుకుపల్లి గ్రామం, మం. వేమవరం భట్టిప్రోలు మం. పెద్దపల్లి నగరం మం. జమ్ముల పాలెం, పూండ్ల బాపట్ల మం. కంకటపాలెం బాపట్ల మం.

**లక్ష్మీ తిరుపతమ్మ తల్లి** : నాగులవరం మాచెర్ల మం. శృంగార పురం, పెనుమూడి దుగ్గిరాల మం. కొల్లిపర, వేమవరం, మాచవరం మం. చింతపల్లిపాడు, ముట్లూరు వట్టిచెరుకూరు మం. కొప్పురావూరు పెదకాకాని, దోనేపూడి కొల్లూరు మం. గొట్టిపాడు ప్రత్తిపాడు మం. బెల్లంవారిపాలెం, నగరం గ్రామం, మం. జమ్ములపాలెం, మున్నావారిపాలెం బాపట్ల మం.

**చౌడేశ్వరీ తల్లి** : రెంటాల, రెంటచింతల మం. మెర్జంపాడు మాచవరం మం. నెమలిపురి రాజుపాలెం మం. ఓబులేసుని పల్లి దుర్గి మం. తక్కెళ్ళపాడు, పెదకాకాని మం. పొన్నూరు గ్రామం, మం. బంగారు మైసమ్మ తల్లి ; జెట్టిపాలెం రెంటచింతల మం. భట్టిప్రోలు గ్రామం, మం.

**అలేఖ శూన్య తల్లి** : చర్లగుడిపాడు గురజాల మం.

**వీరంకమ్మ తల్లి** : దాచేపల్లి, తక్కెళ్ళపాడు దాచేపల్లి మం.

**దుర్గిదేవమ్మ తల్లి** : భత్రుపాలెం దాచేపల్లి మం.

**అంకాలమ్మ తల్లి :** నడికుడి దాచేపల్లి మం. దుర్గి, ఆత్మకూరు, మంగళగిరి మం. కారంపూడి, మం. వినుకొండ గ్రామం, మం. ఆళ్ళవారి పాలెం, నడింపల్లి, పిట్టువారి పాలెం చెరుకుపల్లి మం.

**తిరుపతమ్మ తల్లి :** బయ్యవరం, క్రోసూరు మం. వల్లభాపురం కొల్లిపర మం. కుచ్చళ్ళపాడు, వేమూరు మం.

**అంకమ్మదేవర తల్లి :** మంగళగిరి గ్రామం, మం.

**ఆవుదేవర గుడి :** మిరియాల కారంపూడి మం.

**నాభిశిల/బొడ్డురాయి :** కండ్లగుంట, నకరికల్లు మం. పలు దేవర్లపాడు, ముప్పాళ్ళ మం. వీరనాయకుని పాలెం చేబ్రోలు

**వీరమ్మ తల్లి :** పెనుమూడి దుగ్గిరాల మం. నారకోడూరు చేబ్రోలు మం. ధూళిపూడి, పడమటి పాలెం నగరం మం.

**పేరంటాలమ్మ తల్లి :** పెనుమూడి దుగ్గిరాల మం. పెదకాకాని, వల్లభాపురం కొల్లిపర మం. తెనాలి, నారకోడూరు చేబ్రోలు ధూళిపూడి నగరం మం.

**రేణుకా గంగానమ్మ తల్లి :** చింతలపూడి దుగ్గిరాల మం.

**బాపమ్మ తల్లి :** దావులూరు కొల్లిపర మం. చింతలమ్మ తల్లి : కొల్లూరు గ్రామం, మం.

**దుగ్గెమ్మ తల్లి :** క్రాప, కొల్లూరు మం.

**కట్లమ్మ తల్లి :** వేమూరు గ్రామం, మం.

**సత్తెమ్మ తల్లి :** చావలి, వేమూరు మం.

**రావులమ్మ తల్లి :** జంపని, వూమూరు మం. చేబ్రోలు గ్రామం, మం. మోపర్రు అమృతలూరు మం.

**దేశమ్మ తల్లి :** పెనుగుదురుపాడు చుండూరు మం. మాంచాల చేబ్రోలు మం. గూడవల్లి చెరుకుపల్లి మం. గొరిగపూడి భటిప్రోలు మం. కూచనపూడి నిజాంపట్టణం మం.

**శీతలమ్మ తల్లి :** కొత్తరెడ్డి పాలెం చేబ్రోలు మం. అడిగొప్పుల దుర్గి మం. వరగాణి పెదనందిపాడు మం.

**ముప్పాదేవరమ్మ తల్లి :** వట్టిచరుకూరు, వట్టిచెరుకూరు మం.

**కట్టాలమ్మ తల్లి :** కాట్రపాడు, వట్టిచెరుకూరు మం.

**బొట్టుపేరంటాళ్లమ్మ తల్లి :** ముట్లూరు వట్టిచెరుకూరు మం.

**మహలక్ష్మమ్మ తల్లి :** వినుకొండ, వినుకొండ మం. వరగాణి పెదనందిపాడు మం.

**పాతపాటి పోలేరమ్మ తల్లి :** శివాపురం వినుకొండ మం.

**కావూరమ్మ తల్లి :** కావూరు తుమ్మలపాలెం చెరుకుపల్లి మం. కావూరు చెరుకుపల్లి మం.

**వీర్లంకమ్మ తల్లి :** పెదనందిపాడు, గోగులమూడి, పెదనందిపాడు మం. గోకర్ణమఠం నిజాంపట్నం మం. ఆసోదివారి పాలెం, పూండ్ల బాపట్ల మం.

**తోటమ్మ తల్లి :** పొన్నూరు గ్రామం, మం.

**నాగరూపమ్మ తల్లి :** బ్రాహ్మణ కోడూరు పొన్నూరు మం.

**బద్దెలమ్మ తల్లి :** మునిపల్లె పొన్నూరు మం.

**మెంటలమ్మ తల్లి :** చింతలపూడి పొన్నూరు మం.

**బండ్లమ్మ తల్లి :** అమృతలూరు, గోవాడ అమృతలూరు మం. పగడంవారిపాలెం చెరుకుపల్లి మం. చెందోలు, జి.ఎన్ పాలెం, పిట్టలవాని పాలెం గ్రామం, మం.

**బోళ్ళమ్మ తల్లి :** ఊల్పూరు, అమృతలూరు మం.

**నాగారమ్మ తల్లి :** గుళ్ళపల్లి చెరుకుపల్లి మం.

**శంకరమ్మ తల్లి :** బలుసుల పాలెం, గంజరబోయినవారి పాలెం చెరుకుపల్లి మం.

**గుడారంకమ్మ తల్లి :** ఉప్పాలవారి పాలెం చెరుకుపల్లి మం. పిట్టుకోటిరెడ్డిపాలెం చెరుకుపల్లి మం. లుక్కావారిపాలెం నగరం మం. నిజాంపట్టణం గ్రామం, మం.

**సముద్రాలంకమ్మ తల్లి :** పిట్టుసీతారామిరెడ్డిపాలెం చెరుకుపల్లి మం.

**కారుమూరమ్మ తల్లి :** పొన్నపల్లి చెరుకుపల్లి మం.

**సిరిపూడమ్మ తల్లి :** సిరిపూడి, సిరిపూడి మం.

**నెల్లెమ్మ తల్లి :** ఆరుంబక చెరుకుపల్లి మం.

**గుండిపార్వతమ్మ తల్లి :** భట్టిప్రోలు గ్రామం

**ఆడెమ్మ తల్లి :** అద్దేపల్లి భట్టిప్రోలు మం.

**రెడ్డెంకమ్మ తల్లి :** ఐలవరం భట్టిప్రోలు మం. బాలావారి పాలెం నిజాంపట్టణం మం.

**ఓలేటమ్మ తల్లి :** వెల్లటూరు భట్టిప్రోలు మం.

**ఎల్లారమ్మ తల్లి :** వెల్లటూరు భట్టిప్రోలు మం. కేసనవారి పాలెం నిజాంపట్టణం మం.

**బూరుగులమ్మ తల్లి :** రేపల్లె గ్రామం, మం.

**వేంపాళమ్మ తల్లి :** ఇసుకపల్లి రేపల్లె మం.

**కారుమూరమ్మ తల్లి :** కారుమూరు రేపల్లె మం.

**పినమాకమ్మ తల్లి :** నల్లూరు రేపల్లె మం.

**మహలక్ష్మి గుండెపాటమ్మ తల్లి :** పేటేరు రేపల్లె మం.

**బేతపూడెమ్మ తల్లి :** బేతపూడి, రేపల్లె మం.

**ఈదులమ్మ తల్లి :** ఈదుపల్లి నగరం మం.

**తాటిమ్మ తల్లి :** పూడివాడ నగరం మం.

**మద్దిరావమ్మ తల్లి :** ఏలేటిపాలెం, బోరమాదిగపల్లి నగరం మం.

**మొగదారమ్మ తల్లి :** నిజాంపట్టణం గ్రామం, మం.

**నాగార్పమ్మ తల్లి :** అడవులదీవి, నిజాంపట్టణం గ్రామం, మం.

**నన్నూరమ్మ తల్లి** : నిజాంపట్టణం గ్రామం, మం.

**పల్లపట్టమ్మ తల్లి** : పల్లపట్ల నిజాంపట్నం మం.

**ప్రజ్ఞమ్మ తల్లి** : ప్రజ్ఞం, నిజాంపట్నం మం.

**ముత్తుపల్లమ్మ తల్లి** : ముత్తుపల్లె నిజాంపట్నం మం.

**అల్లూరమ్మ తల్లి** : అల్లూరు పిట్టవానిపాలెం మం.

**మారెమ్మ తల్లి** : పిట్టవానిపాలెం గ్రామం, మం.

**ఉర్లమ్మ తల్లి** : గణపవరం కర్లపాలెం మం.

**కొండలమ్మ తల్లి** : కొండుబట్లపాలెం బాపట్లమం.

## 11. కర్నూలు జిల్లా గ్రామదేవతలు :

**గ్రామదేవత ఈనాం** : పెద్ద కడబూరు గ్రామం, మం.

**గ్రామదేవత** : బదినేహళ్, నందిచాగి కౌతాలం గ్రామం, మం. నిచ్చెనమెట్ల ఔక్ మం. హోసూరు ప్రత్తికొండ మం. జొహరాపురం అప్పరి మం. ఆరెకళ్ ఆదోని మం. ఆలూరు నందికొట్కూరు మం.

**పోతురాజు** : ముచిగేరి, తారాపురం, చిన్నతుంబాలం, చిన్న కడుబూరు, పెద్ద కడుబూరు మం. బుడూరు మంత్రాలయం మం. గోకులపాడు, బాపురం, వీర్లదిన్నె, దొంసాలదిన్నె, ఉర్వకొండ, దుబ్బలదిన్నె కామవరం, గోతులదొడ్డి, కుంటనహళ్, అగసాలదిన్నె కామవరం, గోతులదొడ్డి, కుంటనహళ్, అగసాలదిన్నె, కౌతాలం గ్రామం, మం. కారుమంచి ఆస్పరి మం. పలకుర్తి దేవనకొండ మం. సంతెకుడ్లూరు, ఇస్వి ఆదోని మం. కైరుప్పల ఆస్పరి మం. దేవరబెట్ట కోసిగ మం. మొలగవల్లి, ఆలూరు మం.

**మారెమ్మ తల్లి** : జీనపల్లె సిర్వెల్ మం. రోళ్ళపాడు గ్రామం, మం. మిడ్తూరు గ్రామం, మం. పొదలకుంట కౌతాలం మం. కల్లూరు గ్రామం, మం. చాపిరేవుల, రైతు నగరం నంద్యాల మం. భోజనం కర్నూలు మం. బండి ఆత్మకూరు గ్రామం, మం. మొలగవల్లి, ఆలూరు మం. కల్లపర్రి కొడుమూరు మం. ఉల్చల కర్నూలు మం.

**సుంకులమ్మ తల్లి** : బావాపురం ఆత్మకూరు మం. వేంపెంట పాములపాడు మం. ప్యాపిలి మిడ్తూరు మం. పలుకూరు బనగానపల్లె మం. బుగ్గనిపల్లి బేతంచెర్ల మం. పెసరవాయి, గడివేముల గ్రామం, మం. దొర్నిపాడు గ్రామం మం. హుస్సేనాపురం ప్యాపిలి మం. కాలేపరి, కొల్లగుండ, కల్లూరు గ్రామం, మం. అనుగొండ కోడుమూరు మం. సోమయాజులపల్లె ఓర్వకల్లు మం. పేరూరు రుద్రవరం మం. తుమ్మలూరు పాములపాడు మం. హొల్లగుంద ఆలూరు మం. జల్వాడి, కంబదహళ్ పెద్దకడుబూరు మం. ఎమ్మిగనూరు గ్రామం, మం. హోసూరు ప్రత్తికొండ మం. నరసాపురం వెల్దుర్తి మం. యర్రగుడి, బనగానెపల్లి మం.

**ఎల్లమ్మ తల్లి** : పసుపుల బనగానపల్లె మం. వెంకాయపల్లి కర్నూలు మం ; బన్నూరు, జూపాడు బంగ్లా మం. గంగవరం, సిరివెల్ల మం. కొమరోలు ఓర్వకల్లు మం. ఎనకండ్ల బనగానపల్లె మం. చెలిమిల్ల పాములపాడు మం. పందిర్లపల్లె, లక్కసాగరం కృష్ణసాగరం మం.

**పాపమ్మ తల్లి** : పెద్దపాడు, కల్లూరు మం;

**రేణుక ఎల్లమ్మ తల్లి** : ఉండవల్లి, కంచుపాడు, మనోపాడు, మెహబూబ్ నగర్

**జమ్ములమ్మ తల్లి** : కరివాన ఆత్మకూరు ;

**పోలేరమ్మ తల్లి** : కురుకుండ ఆత్మకూరు మం. దుద్యాల కొత్తపల్లె మం.

**గంగానమ్మ తల్లి** : చాపిరేవుల, నంద్యాల మం ;

**చౌడమ్మ తల్లి** : వెలుగోడు గ్రామం, మం. కోడుమూరు గ్రామం, మం. చింతలపల్లి ఓర్వకల్లు మం.

**పెద్దమ్మ తల్లి** : టంగుటూరు బనగానపల్లి మం. రేవనూరు, కోయిలకుంట్ల మం. ముదుమలగర్తికోడుమూరు మం. రామవరం ఓక్ మం. గోనెగండ్ల గ్రామం, మం. మాంచాలమ్మ ; మాంచాల మంత్రాలయం మం.

**నల్లమారెమ్మ తల్లి** : రామవరం ఔకు మం. బోయ గంగమ్మ తల్లి : చౌడపల్లి, చౌడపల్లి మం. చాపిరేవుల నంద్యాల మం. పాత కందుకూరు, ఆళ్ళగడ్డ మం.

**కురుకుంధమ్మ తల్లి** : కురుకుండ ఆత్మకూరు మం.

**చౌడేశ్వరి మాత** : నందికొట్కూరు గ్రామం, మం. నన్నూరు, ఓర్వకల్లు గ్రామం, మం. నందవరం గ్రామం, మం. నొస్సం సంజామల మం. రామభద్రునిపల్లి గ్రాసం జమల మం. కల్లూరు గ్రామం., మం. హుస్సేనాపురం ప్యాపలి మం. జలకనూరు మిడ్తూరు గ్రామం, మం. బనగానపల్లె మం. యమ్మిగనూరు మం.

**మద్దమాంబ తల్లి** : మద్దికేర గ్రామం, మం.

**మైసమ్మ తల్లి** : మెహబూబ్ నగర్ :

**వల్లెలమ్మ తల్లి** : కోడుమూరు గ్రామం, మం.

**ముల్లమ్మ తల్లి** : ఓక్ మండలంలో ఆదిపరాశక్తిగా పూజలందు కుంటోంది.

**బళ్ళమ్మ తల్లి** : కోరుకొల్లు కలిదిండి మండలం ;

**ముక్తాంబిక తల్లి** : గొందిపర్ల కర్నూలు

**కాళీమాత తల్లి** : గుడిమళ్ళ, ఆలంపురం, మెహబూబ్ నగర్

**అంకాలపరమేశ్వరి తల్లి** : వేల్పనూరు, వెలుగోడు మం.

**కొలను భారతి** : శివపురం, ఆత్మకూరు మం. కొత్తపల్లె కర్నూలు

**లలితాంబిక తల్లి :** పందిపాడు, కల్లూరు మం ;

**దుర్గమావగుడి తల్లి :** కె. తిమ్మాపురం, యమ్మిగనూరు మం.

**తిక్కనాగలచ్చిమి అవ్వ :** కనకవీడు నందవరం మం.

**గౌరమ్మ తల్లి :** నిత్రావతి హలహర్వి మం.

**సమాధి నాగయ్యతాత :** చానుగొండ్ల గూడూరు మం.

**లక్ష్మమ్మ తల్లి :** ఆదోని గ్రామం, మం. బదినహాళ్ కౌతలం మం.

**స్వామి వెంకప్ప తాత :** నాగనాథనహళ్ళి ఆదోని మం.

**గట్టు మల్లయ్య :** అరికెర ఆలూరు మం.

**మల్లప్పతాత :** మొలగవల్లి, ఆలూరు మం.

**రాములమ్మ తల్లి :** మొలగవల్లి, ఆలూరు మం.

**నౌనెపేటయ్య :** మొలగవల్లి, ఆలూరు మం.

**మూగతాత :** దేవనకొండ గ్రామం, మం.

**బంగారమ్మ తల్లి :** చాపిరేవుల నంద్యాల మం. జళిబెంచి ఆదోని మం.

**పుట్టలమ్మ తల్లి :** ఆర్ కృష్ణాపురం, ఆళ్ళగడ్డ మం. నెరవాడ తాన్యం మం.

**చాగలమ్మ తల్లి :** చాగలమర్రి గ్రామం, మం.

**నాంచారమ్మ తల్లి :** చాపిరేవుల నంద్యాల మం.

**బాటసుంకులమ్మ తల్లి :** కుందనగుర్తి చిప్పగిరి మం.

**కల సుబ్బమ్మ తల్లి :** తిమ్మనాయుని పేట కొలిమి గుండ్ల మం.

**పోతప్ప దేవత :** బదినేహాళ్ కౌతాలం మం.

**ఎల్లప్ప తల్లి :** గోనెగండ్ల గ్రామం, మం.

**పోకప్ప దేవత తల్లి :** జోహరపురం, అప్పరి మం.

**సోమరాజు దేవత తల్లి :** బిల్లేకల్లు ఆదోని మం.

**గంగమ్మ తల్లి :** టంగుటూరు, బనగానెపల్లి మం. తుడుముల దిన్నె, ఉయ్యాలవారి మం. మిక్కినేనిపల్లె సంజమల మం. సిర్వెల్ గ్రామం, మం. గుణం పల్లి రుద్రవరం మం.

**పంటలమ్మ తల్లి :** బీరవోలు బనగానెపల్లె మం.

**లింగమయ్య దేవత :** బిజినవేముల గడివేముల మం. మానెం కుంట కృష్ణగిరి మం. గూడూరు గ్రామం, మం. తుదిచెర్ల జూపాడు బంగ్లా మం. గుట్టపాడు ఓర్వకల్ల మం.

**నందలమ్మ తల్లి :** నరసాపురం ఆత్మకూరు మం.

**సోమరాజు తల్లి :** కలుదేవకుంట మంత్రాలయం మం. ప్యాపిలి గ్రామం, మం.

**చింకలమ్మ ఓబులేశ్వర :** తంగరదోన అప్పరి మం.

**దేవమ్మ తల్లి :** అగసాలదిన్నె కౌతాలం మం.

**గిద్దయ్యదేవత :** పార్లపల్లె యెమ్మిగూర మం.

**బీరప్ప :** గాజులదిన్నె, గోనెగండ్ల గ్రామం, మం. రతన తుగ్గలి మం. నెరనికి ఆలూరు మం.

**కర్రెమ్మ తల్లి :** ఊయలవాడ ఓర్వకల్లు మం. దుర్గమ్మ తల్లి, టంగుటూరి బనగానపల్లె మం. కలుగోట్ల యెమ్మిగనూరు మం.

గ్రామదేవతలకి నిత్యారాధనలు గాని, సంవత్సరానికి ఒకసారి గాని, రెండు సంవత్సరాలకి ఒకసారిగాని, ఆపదల సమయంలోగాని జాతరలు జరుగుతుంటాయి. మూడు జిల్లాల్లో ఉండే గ్రామదేవతల పేర్లు, ప్రదేశాలు ఇంచుమించుగా మొత్తం ఈ వ్యాసంలో ఇవ్వడం జరిగింది.

స్వర్గానికి మెట్టు వంటిది,
పవిత్ర తరంగిణి కలది.
అన్ని తీర్థాలకన్నా గొప్పదైన ప్రభావమున్నదీ
ఓ కృష్ణవేణీ నీకు నమస్కారములు.

*చిరునామా : భమిడిపాటి బాలాత్రిపురసుందరి, చరవాణి 9440174797, విజయవాడ - 10*

శ్రీ సుశర్మ

# కృష్ణానదీ తీరాన పంచనారసింహ క్షేత్రాలు

**పవిత్ర పుణ్యనదీ తీరాలలో పుష్కరాల సందర్భాన ధర్మరక్షణకు "నరసింహ" రూపం ధరించిన తీరును అవలోకిద్దాం...**

కృష్ణానదీ తీరాన గల పంచ నారసింహ క్షేత్రాల విశిష్టత ఆలయం, కోయిల్, మందిర,ప్రసాద చైత్య, హర్మ్యయను వేరువేరు పేర్లతో పిలువబడుతున్నా సంక్షిప్తముగా భగవంతుని కొలిచే కట్టడము దేవాలయమని చెప్పవచ్చు. 'ఆత్మ లయించే స్థానమే ఆలయం' అన్న అంతరార్థముతో కూడిన 'ఆలయ' శబ్దాన్ని ఋషి పరంపర 'అహం లయమయ్యే చోటని వ్యాఖ్యానించింది. క్షేత్రము' అను పదానికి భూమియని అర్థము. భగవానుని ఆరాధించుటకు మన పూర్వులు విశిష్టత కలిగిన భూములు / ప్రాంతాలలోని పవిత్ర భూములని చెప్పినవే పుణ్యక్షేత్రాలు.

హిందూ ధర్మము విస్తృత సాహిత్యాన్ని మనకు అందించింది. 'హిం'సను'దూ'షించడమే హిందూ ధర్ముల యొక్క అనేక లక్షణాలలో ఒకటిని ఋషి సమానులైన మన పూర్వీకులు బోధించారు. దూషించడమంటే వ్యతిరేకించడమని భావించాలి. నిరసించడమని కూడా అన్వయించుకోవచ్చు.

నీరు, మానవ జీవనానికి అత్యంత ప్రధాన వనరు. వర్ష రూపము లోనే కాకుండా మానవాళికి నెల్లప్పుడు అందుబాటులో నీటిని అందుబాటులో ఉంచేందుకే ప్రవాహ రూపములో 'నదుల'ను భగవంతుడు మనకందించాడు.

నదులు మట్టిలోని పరిమళత్వాన్నీ,కొండ కోనల గుండా ప్రవహించే క్రమంలో ఔషధులతో కూడిన వృక్షాల గుండా ప్రవేశించుట వలన ప్రవహించే నది నీరు మన రోగాల నివారణకు ఉపకరించే తీర్థముగా మారింది.

హింసలు రెండు రకాలు 'అధర్మహింస, ధర్మహింస, ధర్మాధర్మ విచక్షణా జ్ఞానాన్ని ప్రదర్శించకుండా లోకాన్ని చీకాకు పరిచే రాక్షసత్వపు హింసా పూరిత స్వభావము అధర్మ హింస. అధర్మ స్వభావముతో కూడిన హింసను ధర్మబోధ వలన మార్చలేము. దానిని పరిష్కారము సమూలముగా 'అధర్మహింస'ను సంహరింప చేయడమే ! దానిని నిర్వర్తించుటకు భగవంతుడు తన రూపాన్ని అవతారాలను ధరించుట ద్వారా పూనుకొన్నాడు. ధర్మహింసకు ఆకారము కల్పిస్తే ఆయననే నరసింహుడిగా చెప్పవచ్చు.

ధర్మాన్ని రక్షించడమే దైవంయొక్క ప్రథమ కర్తవ్యము. ధర్మమును ప్రచారములో ఉంచుటకు ఆర్తిలో ఉన్న ఆశ్రితులను రక్షించడము. అనగా అవతార ప్రయోజనంలో రక్షించడము అనేది ప్రథమ ప్రధాన కర్తవ్యం. క్రూర స్వభావము కల రాక్షసులను సంహరించడమును సూక్ష్మముగా ఆలోచిస్తే వారిని అనుగ్రహించినట్లుగా భావించాలి. మరణాన్ని కల్పించడము కూడా కారుణ్య స్వభావమే! సూక్ష్మంగా ఆలోచిస్తే శరీరములో ఏదైనా అంగము సరిగా ఎదుగక అసహజముగా సహజ ధర్మాలకు అనుగుణముగా ఉండకపోవుట అనే స్థితిని తద్వారి ఏర్పడే రోగపు బాధ తొలగించుటకు వైద్యుడు శస్త్ర చికిత్స చేసి శరీరములో నున్న వ్యర్థమును అర్థవంతముగా తొలగించేందుకు చేసే నేటి 'ఆపరేషన్' అనుదానిని సమాజములో సర్వజీవుల ప్రయోజనార్థం నిర్వహించడానికి ధరించే రూపాలే అవతారాలు.

మృత్యువును భారతీయ సనాతన ధర్మములో దేవతలలో పోల్చి, మరణమును కల్పించి జీవునికి విముక్తి కల్పించే భావనకు దేవతా స్వరూపాన్ని ఆపాదించాం. జనన, మరణ రూపమైన జీవన చక్రమే సంసారము. 84 లక్షల జీవకోటిలో మళ్ళీ పుట్టవలసిన అవసరము లేకుండా శరీరాన్ని విడిచి పెట్టి పరమాత్మలో జీవాత్మ కలవడమే మోక్షం. చివరిసారిగా శరీరాన్ని విడిచి పెట్టడము అనేది మానవులకు మాత్రమే సాధ్యపడే విషయము. మనుష్య స్వరూపము వివేకానికి నిదర్శనము. ఈ స్వరూపమేసంసార సాగరమును దాటటానికిఉపకరిస్తుంది. శరీరపు లోపల గల బుద్ధితో ఏర్పడిన శక్తి భావనల వలన కల్గిన జ్ఞానముతో మోక్షమార్గాన్ని పొందే సామర్థ్యము ప్రాణికోటిలో మానవులకే ఎక్కువగా సాధ్యపడుతుంది.

'లోక కళ్యాణ కాంక్షతో ఆయా యుగాలలో అవతరించి ఆయా పరిస్థితులలోని జీవులను తరింపచేయడమే అవతార లక్షణము'. అవతారాలు'అంశావతారాలు పూర్ణావతారాలుగా విభజించి ఆలోచిస్తే

అంశావతారాలలోవిశిష్టత కలిగిన భగవత్‌రూపమున్నసింహ రూపము. క్షిప్ర దేవతలు శ్రీఘ్ర ఫలితాలను ఇస్తారని పురాణాలు పేర్కొంటున్నాయి.

నర, మృగాకార రూపముతో ప్రత్యేక లక్ష్యముతో ఏర్పడిన ఈ శక్తి రూపాలకు సుదీర్ఘకాలము వేచి చూడవలసిన అవసరముండదు. వరాహ, నారసింహరూపాలు అటువంటివే.

రామ, కృష్ణావతారాలు అనే పూర్ణావతారాలలో దుష్ట శిక్షణకు చాలా కాలము వేచి యుండవలసి వచ్చింది.

అవతార ప్రయోజనము వెంటనే కల్పించిన రూపాలలో నరసింహ రూపముకు ఉన్న ప్రాచుర్యము మరేఇతర దశావతారాలకు లేదనుటలో సందేహము లేదు. కలియుగదైవముగా భక్తుల ఆపదలు తొలగించే దైవమైన వేంకటేశ్వరుడు తిరుపతిలోనున్న రూపముయొక్క నమూనాలో దేశములో వేంకటేశ్వర ఆలయాలన్నీ, ఈ కోవలోవే. రామ, కృష్ణ రూపాలన్నీ అలాంటివే!

ఒక రూపానికి నమూనా రూపముగా కాక ఏ రూపుకారూపానికి ప్రత్యేకతలతో కూడినవి నరసింహ రూపాలే. తనను ఆశ్రయించి తన పైనే భారము వేసిన ప్రహ్లాద సంరక్షకత్వ లక్ష్యముతో ధరించిన ఈ రూపము ప్రహ్లాదుని వోలె చిత్తమును భగవదర్పితము కావించే వారిని ఉద్ధరించుటకు కొండలలో, గుహలలో, నదీ తీరాలలో విభిన్నమైన రూపాలతో నరులను అనుగ్రహించుటము అనే ప్రధాన లక్ష్యముతో ఏర్పడిన అనేక నారసింహ రూపాలు మన భారతదేశములో ఉన్నాయి. సింహము అనునది మృగరాజు సింహము అనుదానికి నోరని, శ్రేష్ఠత కలిగినదని అన్వయింప చేసుకోవచ్చు. 'యద్భావం తద్భవతి' అను రీతిన నరులను కాపాడే శ్రేష్టత కలిగి వారి ఆర్తులను తీర్చుటకు ఏర్పడి వారికి తత్కారణముగా లోకములో చెడు / దుష్ట స్వభావము గల రాక్షసులకు శ్రీఘ్రముగా మోక్ష సామ్రాజ్యమును కల్పించే దివ్యావతారముగా నరసింహుని గూర్చి చెప్పవచ్చు.

భీకర సింహనాదాలతో హిరణ్యకశిపుని సంహరించిన 'సింహ' రూపము గల స్వామిని శాంతపర్చడములో బ్రహ్మాది దేవతలు, ఋషి పరంపరలు కూడా విఫలమయ్యారు. తుదకు లక్ష్మీదేవి తనకు కూడా లోక భీకర మూర్తిని శాంత పర్చుట యేలనో! బోధపడుట లేదనడ ముతో, దుష్ట సంహారము వలన కలిగిన ఆనంద ప్రయోజనమును పొందియు, భీకర నృసింహ గర్జనల తాకిడికి తల్లడిల్లలేని, లోకాల చీకాకు తొలగించుటకు బ్రహ్మ దీర్ఘముగా ఆలోచించాడు.

నరసింహ రూపావతరణకు తక్షణ కారణమైన కారణజన్ముడు ప్రహ్లాదుడే వాతావరణాన్నిఆహ్లాద పూర్వకముగాచేయగలడని భావించాడు. చతుర్ముఖుడు వెంటనే ఆ పనికి ప్రహ్లాదుని పురమాయిం చాడు.

భక్తియను శక్తితో నరసింహుని స్తుతించిన ప్రహ్లాదుని వినతుల మేరకు ప్రశాంతముగా నారసింహుడుతన ఉగ్రరూపాన్ని దాని తీవ్రతను భక్తాభీష్టము మేరకు ప్రసన్న రూపముగా గోచరించాడు.

యుగ యుగాలుగా ఋషి పరంపరతో అర్చనలు, అందుకుంటూ నారసింహుడు పవిత్ర కృష్ణవేణి తీరాన ఉన్న అరణ్య ప్రాంతములో స్వయంవ్యక్తంగా ఏర్పడి, పరిసర ప్రాంత ప్రజల భాగ్యవశాన కలియుగ ప్రారంభములో వివిధ మార్గాల ద్వారా తన ఉనికిని ప్రకటించుకున్నాడు.

అనేక నారసింహ క్షేత్రాలున్నా ఈ తీరాన కృష్ణమ్మ సేవలను అనునిత్యము అందుకుంటున్న పంచనారసింహ క్షేత్రాలకు ప్రత్యేకత ఏర్పడినది. ఇవి వాడపల్లి, మట్టపల్లి, వేదాద్రి, కేతవరం మరియు మంగళాద్రి.

## వాడపల్లి

ముచికుందాయని పురాణాలలో పేర్కొన్న మూసీ కృష్ణానది సంగమ క్షేత్రమైన వాడపల్లి తొలి పంచ నారసింహ క్షేత్రము. దక్షిణ దేశ ప్రాంతభాగ్యవశాన పవిత్ర గంగానదీ తీరమైనకాశీపట్టణము నుండి వచ్చిన అగస్త్య మహాముని ఈ ప్రదేశముల సంచరించాడని పురాణ కథనము. శివాలయానికి అగస్త్యేశ్వర స్వామి పేరు కలదు. హరి హర క్షేత్రమైన వాడపల్లి ప్రాచీన నగరము. శ్రీ వాడపల్లి నేడు కుగ్రామంగా కనిపిస్తున్నా వాడలు అనేక ఆధ్యాత్మిక సాంస్కృతిక, సాహిత్య చారిత్రక విశేషాలకు సాక్షిగా నిలిచిన అద్భుత 'భూత' ఘటనలను, సంఘట నలను ఆ ప్రాంత సందర్శనార్థమై వెళ్ళిన సందర్శకులకు వివరిస్తాయి.

'వింధ్యుని' గర్వమణచుటకు లోక బాంధవుడైన సూర్యగమన నిరోధకుడైన తన శిష్యుని సంస్కరించుటకు పరమ పావనమైన కాశీ క్షేత్రాన్ని జనహితము కొరకు వదలి దక్షిణ భారతావనిని తరింప చేసినవాడు అగస్త్యుడు.

ద్రవిడ దేశమున అగస్త్యుడు తిరగని ప్రాంతము లేదు అగస్త్య మహాముని ఈ వాడపల్లిలోనే శివప్రతిష్ట చేసిన పురాతన దేవాలయము నకు అగస్త్యేశ్వర దేవాలయమని పేరు.

విష్ణుకుండిన, శాతవాహనా కాలములోని శిల్పకళలకు నిదర్శనాలు శిథిలముకాగా మిగిలిన కొన్ని ఆనవాళ్ళు, ముచికుందా నది (మూసి) కృష్ణమ్మలోసంగమించిన ఈ వాడపల్లి క్షేత్రము హరిహరక్షేత్రము ప్రాచీన నగరము అనడానికి తగిన చారిత్రక అవశేషాలూ అక్కడ కనపడతాయి.

11వ శతాబ్దానికి చెందిన ఒక శాసనమును కూడా శిథిలావస్థలో మనము చూడవచ్చును.

నదీ తీరములో శివాలయముండగా కొంచెం దూరంలో, నదికి ఎత్తైన ప్రదేశములో, పురాతన లక్ష్మీనరసింహస్వామి ఆలయం ఉండేది. ప్రస్తుత ఆ దేవాలయములలో స్వామి, లక్ష్మీ సమేతుడై నోటి నుండి

రక్త సిక్త జిహ్వను బయటపెట్టి రౌద్రముగా దర్శనమిస్తాడు. అయితే అభయ హస్తముతో, మరో రెండు చేతులతో, శంఖ చక్రాలను ధరించిన ఈ లక్ష్మీ సమేత నృసింహుడు మీసాలతో పౌరుషాన్ని ప్రదర్శిస్తూ, జీవకోటిని ఉద్ధరిస్తున్నాడు. ఆలయ ప్రాకారం బయట గరుడ మండప మున్నది. ధ్వజము పురాతన సంస్కృతికి నిదర్శనమనవచ్చు. వీటి వెనుక చిన్న మండపములో ఆంజనేయ స్వామి ఒక చిన్న మండపములో దర్శనమిస్తున్నాడు.

ఆలయ ముఖ మండపము బయట ప్రదక్షిణా పథంలో (గుడి చుట్టూ తిరిగే మార్గములో) కనబడు విధముగా శాసనాలను, వరుసగా జోడించి పెట్టారు. తిరుపతి, శ్రీరంగ, సింహాచలములలో జరుగు విధముగా ఉత్సవాలను జరుపుటకు దేవాలయానికి భూమిని దానంగా ఇవ్వబడిందనే విషయమూ ఆ పురాతన శాసనాలలో కనిపిస్తుంది.

నారసింహ జయంతి ఇక్కడ ఘనముగా నిర్వహించబడుతుంది.

(మిర్యాలగూడకు సమీపములో 30 కి.మీ. లోపు, గుంటూరు జిల్లాకు వెళ్ళే రోడ్డు మార్గము గుండా ఈ క్షేత్రానికి వెళ్ళవచ్చు.)

## మట్టపల్లి

నల్లగొండ జిల్లా, హుజూర్‌నగర్‌కు 24 కి.మీ. దూరంలో కృష్ణానది ఒడ్డున కల గ్రామం మట్టపల్లి. ఈ గ్రామమునకు ఒక కి.మీ. దూరంలో అడవి నడుమ గుహాలయములో వెలిసాడు నారసింహుడు.

జనావాసానికి సుదూరంలో ఉన్న 'స్వామి'ని మొదటమునులే సేవించేవారు. కలియుగారంభంలో సామాన్య ప్రజానీకంకూడా పూజించి తరించాలని మునులు స్వామిని కోరుకున్నారు. స్వామి తదాస్థనుట మూలనా, మధ్యయుగాన (సుమారు వేయి సం॥లు) మాచిరెడ్డి యను భక్తుడి కలలో స్వామి సాక్షాత్కరించి తన ఉనికిని ప్రకటించుకున్నాడు. ఆ భక్త శిఖామణియే మునుల తర్వాత స్వామిదర్శన భాగ్యాన్ని పొందిన నరశ్రేష్ఠుడు, నరసింహుడు, నరసింహస్వామికి దేవాలయ నిర్మాణతను చేయుట ద్వారా మాచిరెడ్డి అజరామరమైన కీర్తిని పొందగలిగాడు.

ఆలయ ద్వారముపై గజలక్ష్మి శిలా విగ్రహముంది. ఆలయం లోపల స్వామి వెలసియున్నాడు. పైన మరొక శిల శేషుడి పడగలా నీడను కలిగించి యున్నది. క్రింద శిలలో రాజ్యలక్ష్మి విగ్రహము స్పష్టముగా కనబడుతుంది. ప్రహ్లాదుని రూపములో తిరునామాలు, రెండు కాళ్ళు లిఖించబడ్డాయి.

పశ్చిమాభిముఖముగా ఉండే గర్భ గృహములో ఈ ధ్రువబేరాల ముందు నేలపై ఉత్సవ విగ్రహాలున్నాయి.

చక్రత్తాళ్వారు, నమ్మాళ్వారుల విగ్రహాలు రాగితో చేయబడినవి.

గర్భ గృహానికి ఉత్తరాన వైకుంఠ ద్వారముంది. దీనిని వైకుంఠ ఏకాదశి నాడు మాత్రమే తీయడం జరుగుతుంది. ఇక్కడ పదకొండు ఆళ్వారుల విగ్రహాలు ఉన్నాయి. అయితే గర్భగృహ ప్రదక్షిణ చేసే అవకాశము లేదు.

అందువల్ల భక్తులు ఆలయం ముందున్న ధ్వజస్తంభం మరియు అంజనేయస్వామి విగ్రహ ప్రదక్షిణం చేస్తారు. గర్భగృహము ముందు 21 సిమెంటు స్తంభాల ముఖ మండపం ఉంది. 1973లో నిర్మాణమైన ముఖ మండపము ఆకర్షణీయంగా ఉంటుంది. ఆలయ ప్రాంగణములో ఆలయ పాకశాల ఉత్తరాన ఉన్నది.

సర్వశ్రీ భక్త కవిశేఖర నరహరి గోపాలాచార్యుల వారి మొదలు, కేశవ తీర్థస్వామి, శ్రీరామకవచం వేంకటేశ్వర్లు, బొబ్బిళ్ళపాటి వేంకట రామారావు, నందుల అచ్యుత రామశాస్త్రి, ఆసూరి మరింగంటి పురుషోత్తమాచార్యులవారు మరియు సోమయాజుల లక్ష్మీనరసింహ శాస్త్రి వరకు అనేకులు శతకాలతో, స్తోత్రాలతో నాయక స్థానమును కల్పించి నరసింహునిపై రచించిన అనేక ముద్రిత రచనలతోపాటు ఇంకా అముద్రిత రచనలు వెలుగులోకి రానివి అనేకం ఉన్నాయి.

కంచర్ల గోపన్న భద్రాద్రికి ఎంత సేవ చేశాడోఇంచుమించు అంతటి మహానుభావుడు నేటి ఈ ప్రాంత జనుల భాగ్యవశాన, సుదూర తమిళనాడు నుండి ఈ ప్రాంతానికి వచ్చిన అపర నారసింహావతారము, 'శ్రీమాన్ ముక్కూర్ లక్ష్మీనరసింహాచార్య' గారి వల్ల ఈ క్షేత్రము ఇంకా వెలుగులోకి వచ్చింది. బహుశా మాచిరెడ్డి ప్రభువు కలియుగాన నృసింహుని దయతో మరల తాను చేసిన పుణ్య ఫలముతో 'ముక్కూర్' లక్ష్మీనరసింహుని రూపంలో వచ్చారేమో! శ్రీ ముక్కూర్ లక్ష్మీనరసింహాచార్యులవారు, వారి అనుచర, సహచర శిష్య బృంద తోడ్పాటు వలన నరసింహ స్వామికి, క్షేత్రానికి కొత్త సొబగులు ఏర్పడ్డాయి.

చైత్ర మాసములో అధ్యయన ఉత్సవాల నిర్వహణ మరియు వార్షిక బ్రహ్మోత్సవాలు ఘనముగా జరిగే ఈ ఆలయములో దక్షిణావర్త శంఖంతో స్వామి అభిషేకం జరుగుతుంది.

## కేతవరం (కేతనకొండ)

సుమారు రెండువేల సంవత్సరములకు పైగా ప్రాచీనతను కలిగియుండి ఋషిపరంపరతో త్రేతాయుగము నుండి అర్చనలు గైకొనబడిన అతి పురాతన నరసింహ క్షేత్రము కేతవరం (కేతనకొండ)

అటవీ ప్రాంతములో కృష్ణానది ఒడ్డున వెలసిన ఈ నారసింహుని దేవేరి పేరు చెంచులక్ష్మి. 11వ శతాబ్దికి చెందిన కేతవర్మ లేక కేదార వర్మ పాలనలో ఈ మందిరము వెలుగులోకి వచ్చిందట. ఒక యాదవ వంశస్థునికి కలలోస్వామి తన ఉనికిని ప్రకటించుకొన్నాడట. తన దృష్టికి వచ్చిన స్వామి వృత్తాంతాన్ని విని పరమానందభరితుడైన కేతవర్మ – యదువంశీయుడు నిర్దేశించిన విధముగా దట్టమైన అడవిలో ప్రయాణించి, శోధించి, తుదకు హరితపర్ణపు తరులతాగుల్మములతో

పచ్చటి కొండలతో శోభాయమానముగా నున్న ఈ క్షేత్రముపై స్వామిని దర్శించినాడు.

మిక్కిలి వ్యయప్రయాసలకు నోర్చుకొని ప్రస్తుతమున్న భవ్య మందిరములోని చాలావరకు తానే నిర్మింపచేశాడట.

శాసనాలలో కత్తారం, కేదారముగా పిలువబడు ఈ ప్రాంతము దట్టమైన అడవి ప్రాంతము. జన బాహుళ్యము ప్రకృతి పరవశించేంతటి శోభాయమానముగా నదీమ తల్లితో ఆకర్షణీయముగా ఉంటుంది. ఆరువందల మెట్లను అధిరోహిస్తే మందిరమున్న గుట్ట ప్రాంతము, చేరుకోవచ్చు.ప్రస్తుతము ప్రయాణ సౌకర్యాలు కొంతమెరుగ్గా ఉన్నాయి.

## వజ్రాలయ మహత్యం

నరసింహుని దేవేరి అయిన చెంచులక్ష్మి గిరిజన తెగకు చెందిన చెంచుదొర కుమార్తె. కొండపైకి వచ్చిన చెంచుజాతివారు మార్గాన్ని నిరాటంకముగా చేసే క్రమములో గొడ్డలి / పలుగు వంటి వాటితో చదును చేస్తున్నప్పుడు, పలుగు తగిలిన ఒక రాయి నుండి ఉవ్వెత్తున నెత్తురు ఎగజిమ్మిందట, తుదకా గిరిజన తెగ పెద్దలు మన్నించమని ప్రార్థించుటయే కాక తమ సంతానమైన 'చెంచులక్ష్మి'ని స్వామికి అర్పించారని మరొక ఐతిహ్యం.

నాటి స్వామి మూల స్వయంవ్యక్తరూపము నేడు వజ్ర సమాన దార్ఢ్యముతో వజ్రపు వెలుగులతో సమానమైన ఆశీరానుగ్రహముతో విలసిల్లుతుంది. ఈ దేవాలయమును వజ్రాలయమని మరొక పేరు కలదు.ఆలయ ఆవాసములోని ఆంజనేయుడేక్షేత్రపాలకుడు. అభిషేకాలు, జయంతి ఉత్సవాలు ఇక్కడ జరుపబడుతాయి.

## వేదాద్రి

కృష్ణాజిల్లాలో జగ్గయ్యపేటకు 10 కి.మీ. దూపంలో కృష్ణానది తీరములో ఉన్న ప్రాచీన నృసింహక్షేత్రమే వేదాద్రి.

శ్రీ యోగానంద లక్ష్మీనారసింహ స్వామి ఇక్కడి క్షేత్రదైవము. త్రేతాయుగములో ఋష్యశృంగమహర్షి ఈ స్వామి విగ్రహమును ప్రతిష్ఠించాడని స్థల పురాణం చెప్తుంది.

వేదాలు పర్వత రూపమును ధరించి వేద వేద్యుడైన యోగనార సింహుని తమపై వసించమని కోరడం వలన స్వామి స్వయం వ్యక్తమై యుండుట చేత ఈ క్షేత్రానికి ఆ పేరు ఏర్పడి యుండవచ్చును.

ఈ క్షేత్రములో పంచనారసింహ రూపాలు ఉన్నాయి. పై రెండు చేతులతో శంఖ చక్రాలను ధరించి క్రింది రెండు చేతులతో యోగదండాన్ని ధరించిన రూపము, కొండమీద ఉన్న వల్మీకములో నిరంతరము జ్వలించే రూపములోని జ్వాలా నారసింహరూపము, కృష్ణానదీ గర్భములో పెద్ద రాతిగుండు రూపములో సాలగ్రామ నారసింహునిగా, గర్భగుడిలోని పీఠ క్రింద యోగ నారసింహ రూపముతో మరియు వేదాద్రికి క్రోసు దూరములో నున్న గరుడాచలం అనే గుట్టమీద గల ఉగ్రనారసింహ స్వామిని వీరనారసింహుడని అంటారు.

స్వామివారికి ప్రతి సంవత్సరము వైశాఖ శుద్ధ ఏకాదశి నుండి బహుళ విదియ వరకు కళ్యాణోత్సవాలు, శు॥ చతుర్దశిన నృసింహ జయంతి వేడుకలు ఘనంగా నిర్వహిస్తారు.

## మంగళగిరి

సర్వ మంగళకరుడైన హరి నరహరిగా అవతరించిన గిరి మంగళగిరి. తన అనుగ్రహాన్ని ప్రహ్లాదునికే పరిమితం చేయకుండా అపార దయామృత వీక్షణాలతో భక్తకోటిని ఉద్ధరించడానికి స్వయం వ్యక్త రూపములో సర్వమంగళ శుభాసంసలను కలియుగములో కల్గింపజేసిన శ్రీహరి దయా దృష్టి ఎంత మధురంగా ఉంటుందంటే, బెల్లము ఎంత తియ్యగా ఉంటుందో అంతగా యని చెప్పవచ్చు.

ఈ ఆలయం చేరుకోవడానికి సుమారు 500కు పైగా మెట్లు ఎక్కవలసి యుంటుంది. నైవేద్య పదార్థాలలో పానకముత్రాగడం మీద ఎక్కువ మక్కువ గల ఈ నరసింహునికి పానకాలనరసింహుడనీ, పానకాల రాయుడనీ పేర్లు గలవు. పెరియాళ్వార్లచే బెల్లపు పండుగా ప్రస్తుతించ బడిన ఈ స్వామిని ఉత్తర భారతీయులు 'పన్నారసింగ' అని పిలుస్తారు.

బెల్లపు నీరును స్వామి వారి గళములో భక్తిపూర్వకముగా నివేదించి నప్పుడున స్వామి స్వీకరిస్తున్నప్పుడు చప్పుడు రావడముతో పాటు, సంతుష్టి చెందిన చిహ్నముగా సగానికి సగము పానకము వెనుకకు నెట్టబడి రావడం మరో ప్రత్యేకత గల కథ. దానిని భక్తులు మహాప్రసా దంగా స్వీకరిస్తారు.

"బెల్లము చుట్టూ ఈగల్లా" అన్న సామెత 'మధురప్రసాదచిత్త అభయవరదుని చుట్టూ వేరే జన సమూహమును 'కల్ప వృక్షపు నీడలో ఆర్తహృదయ ఆశ్రితులు సేద తీరునట్లు'ఈ స్వామి చెంతకు ఉత్సవాలలో ఇసుక వేసినా రాలనంతటి స్థాయిలో భక్తకోటి తమను తరింపచేయ మని వస్తారు. బెల్లపు నీరు గుడి పరిసరాలలో యెల్లెడలా పారినా, బాహ్య ప్రపంచములో వచ్చే ఈగలు బహుశా ఈ ఆవరణలో ప్రవేశించుట మూలానా, తమ 'స్వేదజ' జన్మకు విముక్తిని కల్పించుకొని ముక్తిమార్గపు దిశగా సాగటము వలననేనేమో ఇక్కడ ఈగలు కనపబడవు.

మంగళగిరి అగ్ని పర్వతమనియు, అందులోని జ్వాలను ఉపశమింప చేయుటకు స్వామికి ప్రీతికరంగా పానకం నివేదించే ఆచారమేర్ప డిందని కొందరి అభిమతం. దేవాలయం ప్రక్కనే గుహబిలం, ఉత్తర దిశలో కొండ ఉన్నాయి. ఈ దేవాలయ క్షేత్ర పాలకుడు ఆంజనేయుడు.

రామావతార పరిసమాప్తి సమయాన తాను వైకుంఠానికి వెళ్తూ హనుమను మంగళాద్రిలో ఉండమని రాముడు ఆదేశించాడని, తత్కారణ

ముగా ఈ క్షేత్ర పాలకత్వాన్ని హనుమ శిరసావహించాడని ఇతిహ్యం కలదు. ఈ కొండను "తోత్యాద్రి" యనుటకు ఇదొక కారణము. ఈ కొండ గజాకారములో యుండుట మూలాన "హస్తి శృంగి పర్వతం" అనే మరొక పేరు కూడా జనవ్యవహారంలో కలదు.

ఇక్కడి పుష్కరిణికి లక్ష్మీ పుష్కరిణి అని పేరు. కొండ క్రింద గల రాజ్యలక్ష్మీ సమేత నరసింహ దేవాలయాన్ని ధర్మరాజు నిర్మించాడంటారు. దక్షిణ దిశలో గల గాలి గోపురం యాత్రికుల మదిలో చెరగని ముద్రను వేస్తుంది. ఆలయ ముఖద్వారా మీదుగల 11 అంతస్తుల గాలి గోపురం మన దేశంలోనే అత్యంత ఎత్తైనదని చెప్పడంలో అతిశయోక్తి లేదు. 1807లో రాజా వేంకటాద్రి నాయుడు చేత నిర్మించబడిన ఈ గోపురము అత్యద్భుత నిర్మాణ కౌశలం కలదు.

జగద్గురు ఆది శంకరాచార్య మొదలు పరమ సామాజిక సేవా తత్పరతా నిష్ఠా గరిష్ఠులైన రామానులవారు, చైతన్య మహా ప్రభు వంటి అనేక యోగ పురుషులు ఈ ప్రాంతాన్ని దర్శించారు.

శ్రీ కృష్ణ దేవరాయలు ఈ దేవాలయ విస్తరణ ఉత్సవ నిర్వహణకు విశేషంగా పాటుపడటమే కాకుండా, నేటి ఒరిస్సా ప్రాంతపు గజపతి వంశస్థులైన, సిద్ధారాజు రాజయ్య దేవర గారిని ప్రేరేపింప చేసి కొంత పొలాలను, స్వామివారికి కైంకర్యమగునట్లు కృషి సలిపాడు.

మంగళగిరికి సమీపములో వరాహ తీర్థం, వటతీర్థం, చక్రతీర్థమనెడి తీర్థాలున్నాయి. శ్రీ భ్రమరాంభ సమేత మల్లీశ్వర స్వామి, శ్రీ లక్ష్మీ సత్యనారాయణ స్వామి, వేంకటేశ్వర స్వామి దేవాలయాలు ఇక్కడ యాత్రికులకు అదనపు ఆకర్షణ.

ఫాల్గుణ మాసంలో స్వామి వారికి12రోజులపాటు బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. 108 దివ్య తిరపతులలో మంగళగిరి నారసింహునది అద్వితీయ స్థానము.

ఈ పంచనారసింహక్షేత్ర రాజాల పంచన చేరిన కృష్ణమ్మ చల్లని చూపులతో, నృసింహుని దయతో సర్వులకు శుభము కలుగుగాక.

శుభంభూయాత్ !!

త్వమేవ మాతాచ, పితాత్వమేవ<br>
త్వమేవ బంధుశ్చ సఖాత్వమేవ<br>
త్వమేవ విద్యాం ద్రవిణం త్వమేవ<br>
త్వమేవ సర్వం మమ దేవ దేవ

మాతా నృసింహశ్చ । పితానృసింహ<br>
భ్రాతా నృసింహశ్చ । సఖా నృసింహ<br>
విద్యానృసింహో । ద్రవిణం నృసింహ<br>
స్వామీ నృసింహ । సకలం నృసింహో ।

## కాళీ వరప్రసాద్ బాబా

గుంటూరు, విజయవాడల మధ్య నంబూరు వద్ద కాళీవరప్రసాద్ బాబా ఆశ్రమం ఉన్నది. ఆయన చదువుకొనని బ్రహ్మజ్ఞాని. నేను భగవంతుణ్ణి కాదు, అవతారపురుషుణ్ణి, అమ్మ చేతి కీలుబొమ్మను అమ్మ సందేశం మీ కందిస్తున్నాను అనేవారు. కాని బాబా వారికి ఆర్షేయ వాఙ్మయం కరతలామలకం. వారి సూక్తులు అమృత బిందువులు

చిరునామా : సుశర్మ, ఎం.ఏ. తెలుగు, ఎం.ఎ. సంస్కృతం, ఎంఫిల్, (పి.హెచ్.డి), శారదా సాహితీ సమాఖ్య, శారద సదన్, ఇంటి. నెం. 3-213-4/5/19, నయానగర్, కోదాడ - 508 206. నల్లగొండ జిల్లా, తెలంగాణా రాష్ట్రం సెల్: 92474 39662, 08683-253206, E-mail:susharma1@gmail.com

డా॥ ఎం. మీనాకుమారి

# కృష్ణా, గుంటూరు జిల్లాలలో భావనారాయణ దేవాలయాలు

'నారాయణా' 'నారాయణా' అని అనని నరుడే అవనియందు - అరుదు. జగన్నాథుడు నారాయణమూర్తి యుగయుగాలయందు అవనిపై అవతరించుచునే ఉన్నాడు. భగవత్స్వరూపుడయిన భావ నారాయణుడు గుంటూరు, కృష్ణాజిల్లాలలో వివిధ ప్రాంతాలలో వైవిధ్యంగా వెలుగొందచున్నాడు. భిన్న భిన్న గాథలను కల్గి మహి మాన్వితులయి వెలుగొందుచున్నట్లు వివిధ పరిశీలన వలన స్పష్టమగు చున్నది. శ్రీమన్నారాయణుని మరియొక దివ్యరూపం భావనారాయణ స్వామి. 'భవ' అంటే సంసార బంధనాలు. వాటిని ఛేదించేవాడు భావనారాయణ స్వామి.

ముమ్మొదటగా గుంటూరుజిల్లా యందు నెలకొనియున్న భావ దేవాలయాల విశిష్టతను విశదపరచెదను. ఈ జిల్లాలో ఐదు భావ నారాయణ దేవాలయాలు దర్శనమిస్తాయి. అవి 1. శ్రీ సాక్షి భావ నారాయణ స్వామి దేవాలయము - పొన్నూరు అదే స్వర్ణపురి. 2. శ్రీ క్షీర భావనారాయణ స్వామి దేవాలయం భావపురి - బాపట్ల. 3. శ్రీ భావనారాయణస్వామి దేవాలయము - బ్రిడ్జిసెంటరు-నర్సరావు పేట 4. శ్రీ భావనారాయణస్వామి దేవాలయం - నుమెళ్ళ గ్రామం ఈపూరు 5. మిరియాల భావనారాయణస్వామి - అమృతలూరు. ఈ ఐదు దేవాలయాలలో శ్రీ సాక్షిభావనారాయణ స్వామి దేవాలయం, శ్రీ క్షీర భావనారాయణస్వామి దేవాలయం, శ్రీ మిరియాల భావ నారాయణస్వామి దేవాలయాలకు ఒక విశిష్టమైన గాథలు వినబడు తున్నాయి. అన్ని భావనారాయణస్వామి దేవా లయాలలో స్వామివారి రూపురేఖలు ఒకేవిధంగా ఉన్నాయి. స్వామి వారు వెనుక వరుస కుడిచేతియందు చక్రము ఎడమచేతియందు 'శంఖువు' ముందు వరుస కుడి చేయి 'అభయ హస్తము' ఎడమచేయి తిరుమల శ్రీవారివలె కటిహస్తముతో శ్రీరాజ్యలక్ష్మీ సమేతుడై స్వామివారు దర్శనమిస్తారు.

ఇక మిరియాల భావనారాయణస్వామి దేవాలయమందు శ్రీ భూనీలా రాజ్యలక్ష్మీసమేతుడై ఇతర భావ నారాయణస్వామివార్ల మూర్తులకంటె భిన్నముగానుండును. అటులనే ఈపూరు మండలం ఇనుమెళ్ళ గ్రామంలో వెలసిన భావదేవుని ప్రతిమ కూడా ఉండును.

### 1. శ్రీ సాక్షి భావనారాయణ దేవాలయం - పొన్నూరు :

భావనారాయణస్వామి నెలకొనటానికి ఒక్కొక్క ప్రదేశానికి ఒక్కొక్క స్థలచరిత్ర కనబడుతుంది. వానిలో పొన్నూరు, సాక్షి భావనారాయణ దేవాలయం, ప్రసిద్ధికెక్కినది. ఈ పొన్నూరునకే స్వర్ణపురి అని పేరు. పొన్ను అంటే బంగారం. స్వర్ణం అనగా బంగారం. బంగారం వ్యాపారానికి ఈ వూరు ఒకప్పుడు ప్రసిద్ధిట. అందుకే దీనికి పొన్నూరు అను ప్రసిద్ధ నామం స్థిరపడింది. దీనినే గోష్ఠివనమని కూడా అందురు.

బ్రహ్మదేవుడు ఒక దివ్యసరస్సును నిర్మించి విశ్వ శ్రేయార్థమై శ్రీహరిని గూర్చి తపస్సు చేయగా శ్రీహరి ప్రత్యక్షమయ్యెను. బ్రహ్మను శ్రీహరి సృష్టిని ప్రారంభించమని చెప్పెను. వారిరువురి చర్చ జరిగిన ప్రదేశం గావున దీనికి గోష్ఠివనమని పేరుగాంచెను.

### స్థల మహత్యము :

బ్రహ్మ శ్రీహరిని ఇక్కడనే అర్చారూపుడుగా నెలకొనమని ప్రార్థించగా శ్రీహరి "మన్వంతరకాలమున కాశియందు అత్రి మహర్షిచే పూజింపబడి కాలక్రమేణ ఒక భక్తుని సాక్ష్యమునకై మరల ఇక్కడకు వస్తానని చెప్పి 'నీవు నిర్మించిన ఈ సరస్సు 'బ్రహ్మకు సరోవరము'గా ప్రసిద్ధిచెందగలదని చెప్పి శ్రీహరి అదృశ్యమైనాడు. ఈ సరోవరంలో స్నానంచేసి భగవంతుని దర్శించిన పునర్జన్మ ఉండదట.

ఇక కొంతకాలం పిదప అత్రిమహర్షి శ్రీహరిని అనేకవిధాలుగా స్తుతించి "ఓ దేవదేవా ! నిన్ను నేను మనస్సున భావించినందున 'భావనారాయణ' అనే పేరుతో కాశీయందు నెలకొనవలసినదని

అర్థించాడు. శ్రీహరి కాశీయందు 'భావనారాయణుడు'గా అర్చ్యా రూపుడుగా వెలుగొందెను. బ్రహ్మ మానసపుత్రుడైన అత్రిమహర్షి ఏడు మహాయుగాలు శ్రీమన్నారాయణుని కాశియందు అర్చించాడు.

ఇక ఆ భావనారాయణుడే "సాక్షి భావనారాయణుడుగా పొన్నూరులో విరాజిల్లుటకు ఒక కథ కలదు.

పొన్నూరుకు సమీపంలో నందూరు అనే గ్రామమున్నది. (వ్యాస రచయిత్రి జన్మస్థలం ములుకుదురు. ఈ రెండు ఊళ్ళ మధ్యన ఉన్నది) ఆ గ్రామంలో సోమిదమ్మ కేశవయ్య అనే బ్రాహ్మణ దంపతులున్నారు. కేశవయ్యకు "గూనిగోవిందయ్య" పేరుతో ఒక మేనల్లుడున్నాడు. కేశవయ్య దంపతులు సంతానార్థం తీర్థయాత్రలు చేస్తూ వారణాసి వెళ్ళి విశాలాక్షి విశ్వనాథులను దర్శించి అక్కడ నెలకొనియున్న భావ నారాయణుని సందర్శించి సంతానాన్ని కోరారు. అప్పుడు గూని గోవిందయ్య మామనుద్దేశించి "మామయ్య నీకు ఆడపిల్ల కల్గితే నాకిచ్చి వివాహం చేస్తావా ! అని అన్న అల్లునిమాటకు సరేనన్నాడు మామ. కొంత కాలానికి కేశవయ్యకు అక్కలక్ష్మి పుట్టింది. యుక్తవయస్సు రాలయింది. గూనిగోవిందు తనకిచ్చివివాహం చేయమని మామ నడిగాడు. మామ మాట తప్పాడని ఊరి పెద్దలకు చెప్పాడు. వారణాసిలో భావనారాయణ సన్నిధిలో తనకిచ్చిన మాట తప్పాడని చెప్పగా, కేశవయ్య ఛలోక్తిగా భావనారాయణ స్వామి వచ్చి సాక్ష్యం చెప్పిన తన కుమార్తెను గూనిగోవిందయ్యకిచ్చి వివాహం చేస్తా నన్నాడుట.

గూనిగోవిందయ్య వారణాసి వెళ్ళి తనకు జరిగిన అన్యాయాన్ని భావనారాయణునకు విన్నవించగా ఆ స్వామి ప్రత్యక్షమైనాడు. అప్పుడతడు తన మామ మాట తప్పాడని తమరు వచ్చి సాక్ష్యమిస్తే మామ పిల్లనిస్తాడని వేడుకొన్నాడు. అత్రిమహర్షి స్వామి వద్దకు వచ్చి, "నీవు ఈ భక్తునితో వెళితే నాగతి ఏమి స్వామి ?" అని విన్నవించగా, భావదేవుడు నీవూ నావెంట రావయ్యా అనిచెప్పి, పొన్న వృక్షము విశ్వనాథుడు తుంగభద్రతో కలిసి అత్రిని వెంటబెట్టుకుని నందూరు బయలుదేరుతూ గోష్ఠీవనానికి వస్తూ గోవిందయ్యా వెనుకకు తిరిగి చూడకుండా పద' అనెను. వెనుక వస్తున్నారో లేదో అని గోవిందయ్య తిరిగి చూడగా స్వామి గోష్ఠీవనంలో విగ్రహరూపాన్ని పొందాడు.

గోష్ఠీవనానికి భావనారాయణుడు వచ్చాడను విషయం తెలుసు కున్న కేశవయ్య దంపతులు భావదేవుని దర్శించి క్షమించమని వేడు కొనగా, భావనారాయణ" గూనిగోవిందుకు 'నీ కుమార్తెనిచ్చి వివాహం జరిపించమని, నీ వంశం వృద్ధి చెందుతుందని, బ్రహ్మ సరోవనంలో మునిగిన గూనిపోయి మన్మథరూపం వస్తుందని చెప్పి అదృశ్య మయ్యెను.

ఆనాటి పరిపాలకుడగు సూర్యవంశ సంజాతుడగు హరిశ్చంద్రుని తండ్రి సత్యవ్రత మహారాజు స్వామిని దర్శించి అక్కలక్ష్మి, గోవిందయ్యల వివాహం జరిపించెనని, నాటినుండి సాక్షి భావ నారాయణునిగా స్వర్ణపురి (పొన్నూరు) నందు అర్చ్యరూపముతో పూజింపబడుతున్నాడని గాథ.

గోష్ఠీవనమునకే సుదర్శనక్షేత్రమని నామాంతరం కలదు. పంచభూతాలు సృష్టికర్తయగు బ్రహ్మకు సహకరించక భూలోకమున గోష్ఠీవనమున శ్రీహరిని గూర్చి తపస్సు చేస్తుండగా బ్రహ్మ వచ్చి శ్రీహరికి తన బాధను వ్యక్తపరచాడు. పంచభూతాలకు ప్రత్యక్షమై పంచభూతముల శక్తులను పంచాయుధములుగా ధరించెనట. అందుకతను ఈ క్షేత్రం సుదర్శనక్షేత్రంగా ప్రసిద్ధిచెందింది.

ఈ దేవాలయంలో ఎవరు దీపారాధన చేయుదరో వారికి వైకుంఠప్రాప్తి కల్గుతుందిట. గోష్ఠీవనమున (పొన్నూరు) అన్నదానము చేసిన మోక్షప్రాప్తి కలుగును. సాక్షి భావనారాయణుని సన్నిధిలో ఏమి చేసినను సత్ఫలితములు కల్గునట.

సాక్షిభావనారాయణుడు మహిమోపేతుడు. రాజగు అందెల నారపరాజు వీపుకు రాచకురుపు లేచి ఎటువంటి ఔషధములను వాడినా తగ్గలేదట. ఆ రాజు తీర్థయాత్రలకు బయలుదేరి పొన్నూరు ప్రాంతానికి వచ్చాడట. అతనికి భావనారాయణుడను ఒక భక్తుని సాక్ష్యమునకై కాశీనుండి ఇక్కడికి వచ్చాను. కృత, త్రేతా, ద్వాపర యుగాలందు బ్రహ్మకి దేవతలచేతను అత్రి మొదలగు మహర్షులచే పూజింపబడినాను. కలియుగమందు ఇక్కడ పుట్టలో ఉన్నాను. నన్ను బయటకితీసి, ఆలయ నిర్మాణం చేయి, ఈ పుట్టమట్టి నీ వ్రణమునకు పూయుము" అని చెప్పి అదృశ్యము కాగా, భావదేవుని ఆదేశం ప్రకారం ఆ రాజు పుట్టనుండి స్వామిని తీసి గుడి కట్టించాడుట. స్వామి కోరిక మీద వైఖానసులనే అర్చకులుగా నియమించారు. సంతానం లేని అర్చకులకు స్వామి అనుగ్రహంచే కల్గురు పుత్రులు కలిగారట.

క్రమంగా క్రీ.శ. 1119 సం॥ కుళోత్తుంగ చోళ మహారాజు శ్రీ సాక్షి భావదేవుని దర్శించి అర్చన భోగాదుల నిర్వహణకు ఐదు గ్రామాలను స్వామివారికి సమర్పించారుట. 1804 సం॥న రాచూరు (రేపల్లె) జమిందారులనుండి సర్వహక్కులతో స్వామివారి ఆలయాన్ని అమరావతి జమిందారులు శ్రీరాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు గారు స్వీకరించారు. వారి వంశీయులెందరో దేవాలయాభి వృద్ధికి పాటుపడ్డారుట.

పొన్నూరు సమీపంలో నిడుబ్రోలు గ్రామమున 'చింతక్రింది' వంశీయులగు పద్మశాలీలు తమ యింట ధాన్యపు పాతరయందు వెలసిన 'రాజ్యలక్ష్మీ' అమ్మవారిని వెలికితీసి భావదేవుని చెంత ప్రతిష్ఠించి, భావదేవునకు రాజ్యలక్ష్మిలకు వివాహం జరిపించారు. నాటి నుండి నేటిదాకా వైశాఖశుద్ధ పౌర్ణమినందు తొమ్మిదిరోజులు తిరునాళ్ళ అత్యంత వైభవంగా జరుగుతుంది.

ఈ పొన్నూరులో సహస్ర లింగేశ్వరస్వామి దేవాలయం, ఏకశిల ఆంజనేయుని, గరుత్మంతుని ఆలయాలు సుప్రసిద్ధాలు. అంతేగాదు ఇది చిన్న కాశీగా పిలువబడుతుంది.

## 2. క్షీర భావనారాయణస్వామి - బాపట్ల :

భావపురిగా ప్రసిద్ధిచెందిన బాపట్లలో నెలకొన్న భావ నారాయణునకు క్షీరభావనారాయణుడని పేరు. దీనికొక కథ ఉంది.

క్రీ.శ. 6వ శతాబ్దంలో ఈ బాపట్ల బ్రహ్మారణ్యంగా ఉండేదిట. దీనికి సమీపంలో కొండపాటూరు గ్రామం ఉంది. ఇద్దరు బ్రాహ్మణ బావబావమరుదులు కట్టెలకై ఈ బ్రహ్మారణ్యానికి వచ్చారు. వారిలో ఒకరి పేరు 'నారాయణ'. వారిద్దరు కట్టెలు కొడుతూ భావనారాయణుడున్నట్టి క్షీర వృక్షాన్ని 'నారాయణుడు' కొట్టగా వృక్షం నుండి రక్తం కారింది. దాన్ని చూసి నారాయణుడు మూర్ఛ చెందాడు. రెండవవాడు 'బావా' నారాయణా అంటూ పిల్వగా 'ఓయీ ! అనే శబ్దం క్షీర వృక్షం నుండి ప్రతిధ్వనించింది. ఆశ్చర్యంతో రెండవవాడు దైవస్వరూపం చెట్టులో వున్నదని భావించి, క్షమించమని వేడుకొన్నాడు. ఇంతలో నారాయణుడు మూర్ఛనుండి తేరుకొనెను. ఇరువురు క్షీరవృక్షానికి మ్రొక్కి ప్రతి ఆదివారం క్షీరాన్ని నైవేద్యంగా పెట్టుచుండిరి.

ఇట్లుండగ క్రిమికంఠచోళ చక్రవర్తి రాజ్యవిస్తరణార్థం కావేరి తీరంనుండి సమస్త రాజపుంగవులను జయిస్తూ బ్రహారణ్యం సమీపమున ఆముదాలపల్లి వద్ద తన సైన్యంతో వచ్చాడు. ఆ రాజుగారి ఏనుగులు స్వామివారున్న క్షీర వృక్షాన్ని తమ తొండాలతో తిందామని ప్రయత్నించాయి. తొండాలతో సహా ఆ యేనుగులు క్షీర వృక్షానికి అంటుకుపోయాయి. మావంటివారు వానిని చూచి రాజుగారికి విన్నవించగా రాజుగారు ఆ క్షీరవృక్షాన్ని సమీపించి ఓ వృక్షమా ! నీ మహిమ తెలియక మా ఏనుగులు తప్పు చేశాయి, వాటిని కాపాడమని అర్థించగా భావనారాయణస్వామి ఇద్దరు బ్రాహ్మణులను ఆవహించి "నేను భావనారాయణుడను కృత, త్రేత, ద్వాపర యుగాలనుండి ఈ క్షీరవృక్షముననే ఉండి బ్రహ్మాది దేవతలచే మహర్షులచే పూజలందుకొన్నాను. మాకు ఏనుగుపాదములవంటి స్తంభములతో ఇక్కడ దేవాలయమును నిర్మించి నా పేరుతో ఒక పట్టణాన్ని కూడా నిర్మింపుము అని అనగానే రాజు శిరసావహించెదను. ఏనుగులు విడివడినవి.

చోళచక్రవర్తికి కలలో స్వామి కనిపించి 'రాజా ! వేంకటగిరి సంస్థానమందుగల 'చిమ్మిరిబండ' కొండనుండి రాళ్ళు తెప్పించుము. ఆ రాళ్ళపై 'బావా' అను అక్షరాలుండును. ఆ రాళ్ళతో ఆలయాన్ని నిర్మించుము' అని చెప్పి అదృశ్యమయ్యెను.

చోళ చక్రవర్తి ఆలయాన్ని నిర్మిస్తుండగా కొండ పాటూరు గ్రామంలో కాపుల యింట జొన్నపాతరయందు శ్రీ రాజ్యలక్ష్మీ అమ్మవారు వెలసిందిట. ఆ యింటివారిని స్వప్నంలో 'నేను భావనారాయణుని అర్థాంగిని. శ్రీ రాజ్యలక్ష్మిదేవిని ఈ గ్రామం నాకు పుట్టిల్లు. ఆముదాలపల్లి వద్దనున్న భావపురి నా మెట్టినిల్లు. నన్ను మావారి చెంతకుచేర్చి కల్యాణం చేయమని చెప్పింది' ఈ విషయం తెలిసిన గ్రామస్థులు చోళరాజుకు విన్నవించగా ఆ రాజు అమ్మవారిని, అయ్యవారి చెంతకు చేర్చి కల్యాణం చేశారు. 'ఆముదాలపల్లి'ని భావపట్టణంగా మార్చారని, తరువాత కాలక్రమేణ భావపురి బాపట్లగా నామాంతరం చెందినాయి. క్రీ.శ. 594వ సంవత్సరం ప్రమాదీచ పాల్గుణ శుక్ల పూర్ణిమ శుభఘడియల్లో స్వామివారిని ప్రతిష్ఠించారు. నాటినుండి స్వామివారికి శ్రీ గౌతమ వైఖానసులు చంద్రగిరి వెంకటాచార్యులు అనువారిని చోళచక్రవర్తి అర్చకులుగా నియమించారు.

శ్రీ భావనారాయణస్వామివారి ఆలయం బాపట్ల నట్టనడుమ దర్శనమిస్తుంది. ఇది మిక్కిలి సౌందర్యమైనది. విశాలమైనది. బాగా ఎత్తైన రాజగోపురంతో భాసిస్తుంది. ఈ ఆలయప్రాంగణంలో మొట్టమొదట కనిపించేవి జీవకీర్తి ధ్వజులు, బలిపీఠం కల్యాణ మండపం రథశాల పూలతోట, పవళింపుసేవామందిరం హోమస్థానం జ్వాలం నరసింహస్వామి, రాజ్యలక్ష్మి శాంత కేశవ స్వామి, రంగనాయక స్వామి, కోదండరామస్వామి, ప్రముఖ ఆళ్వారుల విగ్రహాలు, భక్తులకు దర్శనమిస్తాయి. ఇక్కడ స్వామివారి క్షేత్రపాలకుడు "శ్రీ సువర్చలా సమేత ఆంజనేయస్వామి" ఈ పట్టణమందే సత్యనారాయణ స్వామి, సోమేశ్వరస్వామి రామలింగేశ్వరస్వామి పాండురంగస్వామి మున్నగువారి దేవాలయాలు ఉన్నాయి.

ఇచ్చట కొలువుదీరిన స్వామి ఆకారం అద్భుతం సుందరమోహనాకారుడు. కమనీయ రూపలావణ్య శోభితుడు. రెండడుగుల పద్మాసనమున మూడడుగుల ఎత్తున్న స్వామి విగ్రహం భక్తులను ఆనంద పరవశుల్ని చేస్తుంది. చతుర్భుజుడైన స్వామి శంఖ, చక్రాలను ధరించి అభయకటి ముద్రలతో, రాజ్యలక్ష్మీ సమేతుడై భక్తులకు దర్శనమిస్తాడు.

ప్రతిసంవత్సరం వైశాఖమాసంలో స్వామివారికి కల్యాణోత్సవం మహావైభవంగా జరుగుతుంది. పూర్ణిమనాడు రథోత్సవం ఆ రథోత్సవానికి చుట్టుప్రక్కల పల్లెలవాళ్ళు తండోపతండాలుగా తరలివస్తారు.

### 3. శ్రీ మిరియాల భావనారాయణస్వామి :

ఇది గుంటూరుజిల్లా అమృతలూరు గ్రామంలో నెలకొన్న భావనారాయణ దేవాలయం. 'భావదేవునకు 'మిరియాల' అనే పేరు ముందుంటానికి ఒక చిన్నకథ ఉన్నట్లు తెలుస్తుంది.

ఒకనాడు పశ్చిమ దేశస్థులు కొందరు మిరియాల వ్యాపారం చేయటానికి ఇక్కడికి వచ్చారు. వాళ్ళ మిరియాల వ్యాపారం చూచిన భావదేవుడు వారలను పరీక్షింపదలచి వృద్ధ బ్రాహ్మణరూపంలో వచ్చి, నాకు శిరోభారంగా ఉంది, కొన్ని మిరియాలను పెట్టమని ఆ వ్యాపారస్తులని అడిగాడట. వాళ్ళు అతనిని గేలిచేస్తూ మావద్ద వున్నవి మిరియాలు కావు, బచ్చలి గింజలని చెప్పారుట. వెంటనే మిరియాలు స్వామి కోపంవలన బచ్చలి గింజలయినాయిట. తమ తప్పు తెలుసుకున్న వ్యాపారస్తులు పశ్చాత్తప్త హృదయులై 'స్వామి'ని క్షమించమని వేడుకొన్నారుట. ఆ రాత్రికి అక్కడ నిద్రించిన వర్తకులకు భావనారాయణస్వామివారు స్వప్నమునందు కనిపించి "పశ్చాత్తాపమునకు మించిన ప్రాయశ్చిత్తము లేదు ఇకనుండి ధర్మ మార్గంలో వ్యాపారం చేసుకొనండని. నేను నెలకొనియున్న ఆలయం శిథిలమైనది. ఆ ఆలయమును పునర్నిర్మించండి అని చెప్పి అదృశ్యమైనాడట.

బచ్చలిగింజలు మిరియాలుగా మారిపోగానే వ్యాపారులు భావనారాయణస్వామి మహిమగా భావించి ఆలయాన్ని నిర్మించిరి. అప్పటి నుండి అక్కడి భావనారాయణస్వామియే మిరియాల భావనారాయణుడుగా ప్రసిద్ధిగాంచెను.

ఇక్కడ ప్రతి యేడు ఫాల్గుణ శుద్ధ పౌర్ణమికి స్వామివారి కల్యాణం జరుగును. ఇక్కడి స్వామి శంఖచక్ర, కమలములను ధరించి అభయ హస్తముకలవాడై, వంచిన కటిహస్తము రూపముతో శ్రీ భూనీలా రాజ్యలక్ష్మీ సమేతుడై, ఇతర భావనారాయణస్వామి మూర్తులకంటే భిన్నంగా కన్పడును.

ఇంకా ఇక్కడ స్వయంభూ అమృతేశ్వరస్వామి ఆలయం దర్శనమిచ్చును. ఇక్కడగూడా అంజనేయస్వామియే ద్వారపాలకుడు. పాటి దిబ్బలమీదనున్న ఆంజనేయుడు ఆ వూరి కరణానికి కనిపించి తనకు ఆలయం నిర్మించమని కోరాడుట. అమృతేశ్వరుని వలన ఈ గ్రామం 'అమృతలూరు'గా పిలువబడుతుంది.

### 4. నరసరావుపేట శాబనారాయణ దేవాలయం :

ఇక ఈ గుంటూరుజిల్లాయందే నర్సరావుపేట బ్రిడ్జిసెంటరులో ఒక భావనారాయణస్వామి దేవాలయం, ఇనుమెళ్ళ గ్రామం, ఈపూరు మండలంలో ఒక భావదేవాలయం కనిపిస్తాయి.

బ్రిడ్జిసెంటరు నరసరావుపేట అట్లూరు గ్రామంలో అట్లూరు ఏర్పడకపూర్వమే దేవాలయమున్నట్లు చరిత్రకారుల అభిప్రాయం. ఇక్కడి స్వామి బాపట్ల భావనారాయణస్వామి వలె రూపుండును. 1970 దశకంలో ఈ ఆలయం పునర్నిర్మాణం జరిగిందట.

### 5. ఇనుమళ్ళ భావనారాయణ దేవాలయం :

ఇక గుంటూరుజిల్లా ఇనుమెళ్ళ గ్రామంలో శ్రీ భావనారాయణ స్వామి దేవాలయం వెలయుటకు ఒక చిన్న కథ ఉంది.

శిబి చక్రవర్తి శతదీక్షయాగం చేయ సంకల్పించి నిద్రించగా రాత్రి అతనికి ఒక దివ్య స్వప్నం వచ్చిందట. "శిబి చక్రవర్తి మేము భావనారాయణ సోమేశ్వరులము. మా నివాసము వారణాసి. ఓ భక్తుని సాక్ష్య నిమిత్తం పొన్నూరు (స్వర్ణపురి) వచ్చితిమి. సమస్తం దేవతలచే పూజింపబడితిమి. యుగమార్పుచే వల్మీకమునందు (కలియుగమున) ఉంటిమి. బయటికి తీయమని చెప్పారుట.

మరునాడే శిబి చక్రవర్తి వల్మీకమునందున్నట్టి భావనారాయణుని, సోమేశ్వరుని, వెలికితీసి, అర్చించి చరితార్థుడయ్యాడు. తదుపరి ఎవరు ఆలయనిర్మాణం చేశారో చరిత్రకు అందని విషయము. ఇక్కడ ఆంజనేయుడు ద్వారపాలకుడు. ఈ ఆలయాన్ని వంద సంవత్సరముల క్రితం యోగులు నిర్మించారని ప్రజలవాళి. శ్రీ భూనీలా రాజ్యలక్ష్మీ సమేతుడైన స్వామికి ప్రతియేడు వైశాఖ పౌర్ణమినాడు తిరునాళ్ళ జరుగుచుండును.

ఇంతవరకు కృష్ణాతీరప్రాంతమైన గుంటూరు జిల్లాలో వెలసిన భావనారాయణ దేవాలయములను దిన్మాత్రముగా తెలియచేసితిని.

### కృష్ణాజిల్లాలో భావనారాయణ దేవాలయాలు :

కృష్ణాజిల్లాలో భావదేవరపల్లి, నాగాయలంకన ఒక దేవాలయం, కోనేరు సెంటరు, మచిలీపట్నంలో మరొక భావనారాయణ దేవాలయం, సుబ్బాయిగూడెం గ్రామం, పెనుగంచిప్రోలు మండలంలో వేరొక భావనారాయణస్వామి ఆలయం మనకు దర్శనమిస్తాయి. మొత్తముమీద ఈ జిల్లాలో మూడు భావనారాయణస్వామి ఆలయాలు కనబడుచున్నాయి.

### 6. భావదేవరపల్లి - శ్రీ భావనారాయణాలయం :

దివిసీమ ప్రాంతం ప్రసిద్ధమైనది. ఈ ప్రాంతంలో అష్ట మహారణ్యాలలో చిట్టచివరి అరణ్యమైన కదళికారణ్యం ప్రసిద్ధమైనది. ఈ అరణ్యంలో శ్రీ భావనారాయణ స్వామి స్వయంభువులై ఉండిరి. దీనికి చరిత్రాధారాలు లభించటంలేదు. అయితే ఇక్కడి స్వామికి ఒక కథను చెప్తుంటారరుట.

స్వామి వల్మీకమున ఉండెడివాడట. గోపాలుకులు గోవులను తోలుకొనిరాగా అందొక గోవు వల్మీకముపై పాలధారలు విడుచు చుండెడిది. ఆ కపిల గోవు ఇంటివద్ద పాలనీయకుండుట చూచి అందుకు గల కారణాన్ని తెలుసుకోవాలని అనుకొని గోవును అనుసరించాడు - గోపాలకుడు. అయితే ఆ కపిలగోవు వల్మీకముపై పాలధారను విడుచుచుండగా చూచిన గోపాలుడు గోవును కఱ్ఱతో కొట్టెను. ఆ పుట్టనుండి గోవును దండించవద్దని నేను భావనారాయణు డనని, ఆకలితో ఉంటినన్న మాటలు వినబడెను. ఆ మాటలను విన్న గోపాలుడు అందు దైవముండెనని భావించి వల్మీకానికి పందిరి వేసి నైవేద్యాలు పెట్టుచుండెను.

ఈ ప్రాంతము గోల్కొండ నవాబుల పాలన వచ్చెను. ఇక్కడి ప్రజల శ్రేయస్సు కోరి ఒక అధికారిని నియమించెను. గోపాలకులు వల్మీకములను ఆరాధించుచుండిరి. ఒక దినమున అధికారి తన గుర్రమును పందిరి గుంజకు కట్టెను. గోపాలకులు పందిరి పడిపోవును కావున ప్రక్కన చెట్టుకు కట్టమనిరి. అధికారి సమ్మతించకుండా ఉండగా గుఱ్ఱము గిలగిల తన్నుకొని మూర్ఛిల్లెను. అప్పుడా అధికారి వల్మీకమును క్షమించమని కోరెను.

అధికారి ఆ రాత్రి పుట్టవద్దనే విశ్రమించెను. స్వామి అతనికి కల యందు కనిపించి "నేను భావనారాయణుడను. కృత, త్రేతా, ద్వాపర యుగాలయందు బ్రహ్మాది గణములచే అర్చింపబడితిని. కలి మాయ వలన ఈ వల్మీకమున నివసించితిని మమ్ము ఉద్ధరించి దేవళమును నిర్మింపుమని మా పేర ఒక పట్టణమును నిర్మింపుమని, నీ అశ్వము మూర్ఛనుండి తేరుకొనునని చెప్పి అంతర్ధానమయ్యెను. అంతట ఉదయాన్నే నిద్రలేచి స్వప్న వృత్తాంతాన్ని గ్రామప్రజలకు విశదపరచి, వాల్మీకమునుండి స్వామిని బయటికి తీసి కృష్ణాజలముచే స్నానము చేయించి, దేవళ నిర్మాణ నిమిత్తం ధనార్జన చేయ సంకల్పించెను.

ఒక వేద బ్రాహ్మణుని ఇంటిలో అద్దెకు నివసించే దొంగలు కొంత ధనమును ఇంటిలో పెట్టి ఆ గదిలో ఉల్లిపాయలున్నాయి మీరు తీసుకోండి. అని చెప్పి వెళ్ళిపోయిరి. వారు వెళ్ళిన పిదప ఆ బ్రాహ్మణుడు గదిలో చూడగా ధనము కనిపించింది. ఇక ఆ బ్రాహ్మణుడు ఆ ద్రవ్యమును దేవాలయ నిర్మాణమునకై అధికారికి సమర్పించెను. ఈ విధంగా అక్కడ భావనారాయణస్వామి దేవాలయం ఏర్పడినదని, ఆ ప్రదేశానికి దేవుని పేరుతో భావదేవరపల్లిగా విలసిల్లినదని కథలుగా చెపుతుంటారు. ప్రతియేట తిరునాళ్ళ వైశాఖమాసంలో జరుగును.

ఇక్కడ విగ్రహం సుందరమైనది. శ్రీ భూనీలా-రాజ్యలక్ష్మీ సమేతుడై దర్శనమిస్తాడు.

### 7. మచిలీపట్టణం భావనారాయణ దేవాలయం :

ఇక రెండవది కోనేరు సెంటర్ మచిలీపట్నం భావనారాయణ స్వామి ఆలయం. మచిలీపట్నంలో కంచికంటే మిక్కుటముగా ఆలయాలున్నవి. ఈ భావనారాయణ ఆలయం సుమారు 400 సం॥ క్రితం నిర్మింపబడినదని అక్కడి ప్రజల అభిప్రాయం. ఇక్కడ చిలకలపూడి పాండురంగస్వామి ఆలయం, శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం, వేణుగోపాలస్వామి ఆలయం, ఆంజనేయస్వామి ఆలయం. ఇత్యాది ఆలయాలు మనకు దర్శనమిస్తాయి. గ్రామదేవతలెందరో కొలువున్నారు కూడ. మచిలీపట్నం కృష్ణాజిల్లాకే ముఖ్యకేంద్రం.

ఇక్కడ భావనారాయణస్వామివారు శంఖు, చక్ర అభయహస్త గదాధరుడై శ్రీ భూనీలా రాజ్యలక్ష్మీ సమేతుడై వెలుగొందుతున్నాడు.

### 8. పెనుగంచిప్రోలు భావనారాయణ దేవాలయం :

ఇక ఈ జిల్లాలో మూడవది సుబ్బాయిగూడెం, పెనుగంచిప్రోలు మండలంలో వెలసిన భావనారాయణస్వామి దేవాలయం మూడవ దేవాలయం.

'మౌద్గల్యమహర్షి వలన సంప్రాప్తమైన ఒక ఏరు. ములుగు పర్వతాల జన్మించి పాకాల సరస్సున చేరి మున్నేరు నదిగా మారింది. మున్నేరు నది ఆకేరు అను ఉపనదితో కలిసి ప్రవహిస్తూ వైర అను ఉపనదిని కలుపుకొని చెవిటికల్లు వద్ద "కృష్ణవేణి నదిలో కలిసింది. అట్టి నదీ ప్రాంతంలో ఎన్నో పుణ్యక్షేత్రాలు విరాజిల్లినవి. వాటిలో సుబ్బులుగూడెం శ్రీ భావనారాయణస్వామివారి ఆలయం ఒకటి ప్రసిద్ధమైనది.

ఈ గ్రామంలో నరసింహాచార్యుల అనే పేరుగల భక్త శిఖామణి ఉండేవాడట. ఇతడు వేదాద్రి నరసింహస్వామి భక్తుడు. ఇతడు కాలినడక వేదాద్రి వెళ్ళి వస్తూ కొనకంచి గ్రామ శివాలయం వద్ద ఉన్న శ్రీ భావనారాయణస్వామివారిని చూస్తూ వెళ్ళేవారట. అట్టి సమయంలో భావదేవుని విగ్రహ సమాచారం తెలుసుకొని కొనకంచి గ్రామస్తులను సంప్రదించి భావనారాయణుని తన గ్రామమైన సుబ్బాయిగూడెం తెచ్చి శాస్త్రోక్తంగా ప్రతిష్ఠించి ఆలయాన్ని నిర్మించారుట. ఇక్కడి భావ నారాయణుడు శంఖు చక్ర అభయహస్తమునందు కమలము ధరించి గదాధరుడే శ్రీభూనీలా రాజ్యలక్ష్మి సమేతుడై వెలుగొందు చున్నాడు.

ఇవి కృష్ణాతీరంలోని శ్రీ భావనారాయణ ఆలయాలు.

*చిరునామా : డా॥ ఎం. మీనాకుమారి, విశ్రాంతోపన్యాసకురాలు (విశ్రాంత-అధ్యాపకురాలు), 21-4.8. పెనుమత్సవారి వీధి, ముత్యాలంపాడు, విజయవాడ - 11, సెల్ : 9885295657.*

శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్

# కృష్ణాజిల్లా యోగులు

## యోగులు అంటే ?

యోగాన్ని అభ్యసించేవారిని యోగులు అంటారు. సాధారణంగా సన్యాసులను యోగులని పిలవటం లోకాచారం అన్ని మతాలలోను యోగులున్నారు. మలేషియాలో మంత్రాలు లేని యోగసాధన చేస్తు న్నారు. క్రైస్తవంలో మేరీస్తోత్ర ధ్యానంతో యోగసాధన చేస్తున్నారు. ఎవరు యే రకంగా యోగ సాధన చేసినా మోక్షం కోసమే. యోగులలో స్త్రీలను యోగినులు అంటారు. నాద సిద్ధ సంప్రదాయం అంటే శైవ సంప్రదాయం పాటించేవారినీ యోగులు అన్నారు. వైష్ణవ సంప్రదా యంలోనూ యోగులున్నారు. వీరందరూ నిర్గుణోపాసకులు. తంత్ర సంప్రదాయకులనూ యోగులు అంటారు. భారతీయ సంప్రదాయంలో ఉత్కృష్ట యోగినీ యోగులుగా పార్వతీ పరమేశ్వరులను పేర్కొంటారు. "యత్ర యోగీశ్వరః కృష్ణో" అని గీత శ్రీకృష్ణుని యోగీశ్వరుడే అన్నది. ఉపనిషత్తులు భగవద్గీతలలో యోగ ప్రస్తావన ఉన్నా పతంజలి మహర్షి క్రీ.పూ. 500లోనే యోగశాస్త్రాన్ని క్రోడీకరించాడు. ఆయన చిత్తవృత్తి నిరోధాన్ని యోగం అన్నాడు. హఠ యోగ ప్రదీపిక, శివ సంహిత లలో యోగ రహస్యాలున్నాయి. శంకర భగవత్పాదులు యోగ శాస్త్ర రహస్యాలను "యోగ తారావళి"లో తెలియజేశారు." యుజ్యతే అనేనా ఇతి యోగాః" అని నిర్వచనం. అంటే ఇంద్రియ వశంతో మనసును భగవంతునియందు లయం చేయటమే యోగం అప్పుడే ఆత్మ తనలోని నిగూఢ శక్తిని సాధిస్తుంది. యోగం అంటే సాధన అనే అర్ధంతోపాటు అదృష్టం అనే అర్ధమూ ఉంది. భగవద్గీతలో చెప్పినవన్నీ వివిధ యోగాలే. ఉత్తమ ఆధ్యాత్మిక సంపన్నులనూ యోగులు గానే భావిస్తారు. ఋగ్వే దంలో రుద్రుడు శివ రూపం దాల్చినప్పుడు యోగీశ్వరుడుగా ఆరాధింప బడినట్లు తెలుస్తోంది. మైత్రీ ఉపనిషత్‌లోని కాత్యాయని శ్రౌత సూత్రం యోగి అంటే యోగం అభ్యసించేవాడని, ధ్యానంలో నడిపేవాడని అర్ధం చెప్పారు. క్రీ.శ.400లో యోగుల గురించి రాసిన "యోగ భాష్యం" ప్రసిద్ధి చెందింది. సాధారణంగా యోగులు బ్రహ్మచర్యం పాటిస్తారు. కొందరు సాంసారిక జీవితం గడుపుతున్నా యోగులుగా ప్రసిద్ధి చెందారు. అలాంటివారిలో శ్రీరామ కృష్ణపరమహంస శ్రీ లక్ష్మణ యతీంద్రులను, శ్రీ ఎక్కిరాల కృష్ణమా చార్యవంటి వారెందరినో ఉదహరించవచ్చు. యమ నియమాలను యోగులు తప్పక అభ్య సించాలి. యోగులకు ఇవికాక అహింస, సత్య, అస్తేయ దయ, దుతి, మితాహారం, శౌచం, తపస్సు, సంతోషం, ధ్యానం ముఖ్యలక్షణాలు.

ఒక్కొక్క యోగి ఒక్కొక్క విషయంలో నిష్ణాతులై ఉంటారు. వారికి కవిత్వంలో అఖండ పాండిత్యం ఉండవచ్చు. జ్యోతిషం, వేద వేదాంతా లలో, శాస్త్రాలలో అద్వితీయ ప్రతిభా విశేషాలను సాధించవచ్చు. చదవకుండా అనేక విద్యలు సాధించవచ్చు. గురువు అనుగ్రహంతో అణిమాది అష్ట సిద్ధులు పొందవచ్చు. వారి మనసు అత్యంత నిర్మలం కనుక భూత భవిష్యత్, వర్తమానాలు వారికి తెలుస్తాయి. వశ్య వాక్కు ఏర్పడుతుంది. ప్రేమ, సానుభూతికి నిలయాలుగా ఉంటారు. వారి దర్శనంతో కోరికలు తీరుతాయనే నమ్మకమేర్పడుతుంది. అతీంద్రియ భావనతో యోగులు ఎన్నో అద్భుతాలు చేసే సామర్థ్యం పొందుతారు. అది కేవలం ప్రదర్శనకోసం కాకుండా అస్తికత్వానికి నిరూపణగా భావించాలి. యోగులు మహాయోగులు అంటారు. ఇదే కూచిపూడి నృత్య నాటకాలలో అతి ప్రాచీనమైనదిగా పేర్కొంటారు. "చల్లో యమ్మ చల్ల" అనిపాడే గొల్లకలాపమూ సిద్దేంద్రుల వారి రచనే అంటారు.

కూచిపూడికి దగ్గరలో ఉన్న మొవ్వ శ్రీకాకుళం గ్రామాలలో ఆనాడు దేవ దాసీలు చాలామంది ఉండేవారు. వారు వచ్చి నేర్పమని అడిగితే వారి అతిశృంగార భావాలు తాను రాసిన ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని దెబ్బ తీస్తాయని భావించి నేర్పలేదు. ఊళ్ళో అందంగా ఉన్న బ్రాహ్మ కుర్రాళ్ళనే ఎంపిక చేసి నేర్పి దాన్ని కూచిపూడి ఆర్ట్‌గా మలచారు.

ఆయన దీక్ష తపన గ్రహించి కూచిపూడి బ్రాహ్మణులు తమ కుటుంబాలలో ఒక కుర్రవాడిని తప్పక ఈ నృత్య కళకు అంకితం చేస్తామని ప్రతిజ్ఞ చేశారట. అలా అంకితం చేసే బాలుడి మొలకు ఒక చిన్న గంట సంకేతికంగా కట్టేవారట. కూచిపూడిలో వేదాంతం, వెంపటి కుటుంబాలు దీనివ్యాప్తి విస్తృతంగా చేశాయి. వెంపటి పెద సత్యం చినసత్యం, వేదాంతం రాఘవయ్య, వేదాంతం సత్యనారాయణ, రాధేశ్యాం, పసుమర్తి కేశవప్రసాద్ మొదలైన వారలు కూచిపూడి నాట్యానికి చేసిన సేవ చిరస్మరణీయం. వేదాంతం సత్యనారాయణ సత్యభామ వేషం చరిత్ర సృష్టించింది.

## అమృత యోగిని - పెనుమత్స సీతమ్మ అవధూత

సాధారణ గృహిణి, పూర్వ జన్మ వాసన, సంకల్ప బలం, వరిష్ఠ గురుత్వం లభించి, మహా మహిమాన్విత యోగినిగా మారిన ఉదంతమే పెనుమత్స సీతమ్మ యోగిని వృత్తాంతం.

సీతమ్మ 26-8-1921న కృష్ణా జిల్లా పెనుమత్స అనే చిన్న పల్లెటూరులో చెరుకూరి బ్రహ్మయ్య, శ్రీ రామమ్మ అనే కమ్మ దంపతులకు జన్మించింది. పుట్టింటిపై మమకారం, ఇరుగు పొరుగుపై ఆదరాభిమానాలు చిన్నప్పటి నుంచే అలవడ్డాయి. ఎనిమిదవ ఏట ఉయ్యూరుకు అతి దగ్గరలో ఉన్న చిన్న కుగ్రామం గండిగుంటలోని నాదెళ్ళ కృష్ణయ్య పెద్ద కొడుకు పదిహేనేళ్ళ సీతారామయ్యతో వివాహం జరిగింది. ఈమె తల్లిదండ్రులు అయిదు రోజుల పెళ్లి రంగ రంగ వైభవంగా చేశారు. పదహారవ ఏట కాపురానికి వెళ్ళింది. భర్తకు కుడి చేతి మీద వ్రణం పుట్టి, ఎన్ని చికిత్సలకూ తగ్గకచనిపోయాడు. ఆమె కాపురం రెండేళ్ళ ముచ్చట అయి పోయింది.

ప్రక్క ఇంటి దండమూడి పూర్ణయ్యగారు రోజు వచ్చి ఓదార్చేవారు పాటించవలసిన లోకరీతి, ధర్మం, కర్తవ్యం బోధించేవారు. కొంతవరకు తేరుకొని తనకు సంపూర్ణ జ్ఞానం కావాలని ఆయన్నే దారి చూపించమని కోరింది. శ్రీరామకోటి రాయమని, శ్రీరాముని చిత్రాన్ని ఇచ్చాడు. ఆమె రామకోటి రాయటం ప్రారంభించి, కఠిన నియమాలను పాటిస్తూ తులసి పూజ చేస్తూ గడిపింది. 1942 సూర్యోపాసన ప్రారంభించింది. ఉదయం ఆరు గంటల నుండి, మధ్యాహ్నం పన్నెండు గంటల వరకు సూర్యునికి ఎదురుగా నిలబడి దీక్షగా కొనసాగించింది.

1946వ సంవత్సరంలో ఆమె జీవితం ఒక మలుపు తిరిగింది. ఏలూరు నుండి కమ్ముల అప్పన్న అనే యోగ వ్యాయామ విద్యా ప్రవీణుడు పనిమీద పెనుమత్సకు దగ్గరలోని నరసన్నపాలెం వచ్చాడు. సీతమ్మ విషయం ఆయనకు తెలిసింది. పెనుమత్సకు వచ్చి, ఆసనాలు, యోగం నేర్పి వాటి వల్ల మనస్సు కుదుట బడుతుందని చెప్పాడు. ఆమె సాధన ప్రారంభించింది. 1948లో అప్పన్నగారు తాను కట్టిన ఇంటి గృహ ప్రవేశ వార్షికోత్సవాలకు సీతమ్మ కుటుంబాన్ని రమ్మని ఆహ్వానించాడు. అప్పన్న శిష్యులు, బంధువులు, అనేక మంది పెద్దలు, ప్రభుత్వోద్యోగులు అందరు వచ్చారు. అప్పన్నగారి కోరిక మీద "భక్తీ యోగం" గురించి అద్భుత ప్రసంగంచేసి అందర్నీ ఆకర్షించింది. జిల్లా కలెక్టరు, భార్య కూడా హాజరైన ఆ సమావేశంలో సీతమ్మ "కుండలినీ యోగం ప్రదర్శించి, సహస్రారం నుండి అమృతం తీసింది. హాలు అంతా సువాసనలతో గుబాళించి పోయింది. అప్పుడే ఆమె కీర్తి అన్ని జిల్లాలకు వ్యాపించింది. అమృతపానం చేయటం ఎంతో యోగ సిద్ధి ఉన్న మహాత్ములకే సాధ్యం. ఎందరెందరో భక్తులు పెనుమత్స వచ్చి దర్శించి వెళ్ళేవారు. ఇంట్లోనే ఒక తడికల గదిలోనే ఉంది. దృఢమైన వైరాగ్యంతో ఒకే ఆసనంలో 4నెలలు "సవికల్ప సమాధి"లో ఉంది. అప్పుడప్పుడు భక్తులకు దర్శనమిస్తూ నిత్యం సమాధిలో ఉండేది. పిండోత్పత్తి గురించి రాసింది. 5-3-1958న లక్షమందికి దర్శనమిచ్చి 2-4-1959న మహాసమాధి పొంది బ్రహ్మైక్యమైంది.

## అవధూత దొంతులమ్మ

నర్మదా నదీతీరాన ఉండే బంజారా మహిళ ఎలా వచ్చిందో కృష్ణాజిల్లా మచిలీపట్నం చేరింది. అరవై ఏళ్ళ వయసుతో ఆమె నెత్తి మీద నీళ్ళ కుండల్ని దొంతరలుగా పెట్టుకొని మోస్తుండేది. అందుకని ఆమెను "దొంతులమ్మ" అన్నారు బందరు జనం. అదే ఆమెపేరు అయిపోయింది. ఒక యోగి ఆమెకు దర్శనం ఇచ్చి సంసార బంధాలను వదిలేయమని ఆదేశిస్తే, భర్త అనుమతితో ఇల్లు వదిలి వచ్చేసింది. దీక్ష నిచ్చి పంపాడు యోగి. ఆమె అవధూతగా మారి ఎంతో దూరం నడిచి శ్రీశైలం చేరింది. దిగంబరంగా తిరిగేది. బాహ్యాస్పృహ ఉండేది కాదు. నిరంతరం సమాధి స్థితిలో ఉండేది. జగన్నాథపురంలో ఉండేది. ఎన్నో మహిమలు చూపేది చెరుకూరి పద్మనాభరావు బహద్దర్ కూతురును చల్లపల్లి రాజా శివరామ ప్రసాద్ బహద్దర్ కిచ్చి వివాహం చేయించటంలో ఆమె పాత్ర ఉంది. కుర్తాలం పీఠాధిపతి ఆమెచే జ్ఞానభిక్ష పొందారు. 9-2-1932న సిద్ధి పొందింది.

## స్వామి హఠ యోగి బ్రహ్మానంద సరస్వతి

కృష్ణాజిల్లా విజయవాడ దగ్గర పటమటలో 27-9-1863న గోవిందరాజు రాఘవయ్య, తిరుమలాంబకు జన్మించారు. పానకాలు అని పేరు పెట్టారు. యనమలకుదురు వాస్తవ్యులు గోవిందరాజు సీతమ్మ, నరసింహారావు దంపతులు దత్తపుత్రునిగా స్వీకరించారు.

రామప్ప అని పిలిచేవారు. బందరులో చదివారు. గాయత్రి, శివ పంచాక్షరి, రామ షడక్షరి వగైరాలను దీక్షగా జపించారు. దేశయాత్రలు చేస్తూ శ్రీశైలం చేరి ఒక బాబాజీ సత్సంగం పొంది, లోకజ్ఞానం పొందారు. సాధు, సత్పురుషులను సేవిస్తూ కాలం గడిపాడు. గౌడ యతీశ్వరుడు ఒకాయన కనిపించి దత్తాత్రేయ ఉపాసన చేయమని బోధించాడు. మళ్ళీ క్షేత్ర సందర్శన చేస్తూ , ప్రముఖ దత్తోపాసకులైన "వాసుదేవానంద సరస్వతి" వారిని దర్శించి, ప్రబోధం పొందారు. తీర్థయాత్రలు కొనసాగిస్తూ మానసిక ప్రశాంత స్థితిని పొంది, సన్యాసాశ్రమం పై తీవ్ర కోరిక పెరిగింది. శ్రీ సచ్చిదానంద సరస్వతి యతీంద్రులు సన్యాస దీక్ష నిచ్చి, "బ్రహ్మానంద సరస్వతి" అనే యోగ నామం పెట్టారు. నేపాల్‌లో హఠ యోగం చేశారు. నైమిశారణ్యంలో పరమ విరాగి అయ్యారు.

ఆత్మోద్ధరణ తర్వాత లోకోద్ధరణ ప్రారంభించారు. శంకరాచార్య సహస్రనామావళి యోగాభ్యాస దర్పణం మొదలైన గ్రంధరచన చేశారు. రుతంబర ప్రజ్ఞతో అనేక సిద్ధులు పొందారు. వారు చూపిన మహిమలు పరమాశ్చర్యం కలిగిస్తాయి. 2-12-1838 బహుధాన్య మార్గశిర శుద్ధ దశమినాడు సిద్ధిపొందారు.

## మహా భక్త అల్లూరి వెంకటాద్రి గారు

కృష్ణాజిల్లా పరిటాలకు దగ్గరున్న అల్లూరులో వెంకయార్యుడు, వెంకమాంబ దంపతులకు అల్లూరి వెంకట్రాది స్వామి జన్మించారు. శ్రీవత్సస గోత్రానికి చెందిన ఆరువేల నియోగి బ్రాహ్మణులు. అల్లూరి నరసింహ స్వామికి చిన్నప్పటి నుంచే పుష్పమాల సమర్పించటం అలవాటైన బాల భక్తుడు తమకున్న ఒకే ఒక ఆవును మేతకోసం ఇతర పశుకాపరులతో కలిసి వెళ్ళేవాడు. ఆవు గడ్డి బీడులో మేస్తుంటే వెంకట్రాది పొదల నీడలో హాయిగా నిద్రపోయేవాడు. ఒక రోజు ఒక నల్లత్రాచు అతనికి పడగ విప్పి గొడుగుపట్టింది. దీన్ని చూసి మిగిలినవాళ్ళు భయపడి ఊళ్లోకి వెళ్లి అతని తల్లిదండ్రులకు చెప్పి పిలుచుకొచ్చారు. వారు వచ్చే సరికి పాములేదు. కాని అది పాకిన జాడ కనిపించింది. అసలేం జరిగిందని బాలుడిని అడిగితే తనకు ఒక కల వచ్చిందని అందులో ఇద్దరు మొగాళ్ళు ఒక అందమైన స్త్రీతో ఒక కోతితో అక్కడికి వచ్చారని అందులో పెద్దవాడు చెప్పినట్లు చిన్నవాడు తన నాలుకపై ఏదో రాశాడని ఇంతలో మెలకువ వచ్చిందని చెప్పాడు. బాల వెంకట్రాది నాలుకపై రాసింది బీజాక్షరాలు. కనుక అతనికి సహజ పాండిత్యం అబ్బింది.

యుక్తవయస్సులో ఉపనయనం చేశారు. రామభావన తప్ప కామ భావన లేదు. నారసింహ భజనలతో అపర ప్రహ్లాదుడు అనిపించాడు. వెంకట్రాదికి వివాహం చేయాలని తల్లిదండ్రులు తొందర పెడుతుంటే తనకాలోచన లేదన్నాడు. ఒకసారి తిరుమల గరుడోత్సవానికి వెడుతున్నానని చెప్పి వెళ్ళాడు. శ్రీ వేంకటేశ్వరుని కనులారా దర్శించి కంచికి చేరారు. భిక్షాటన చేస్తూ కంచి వరద స్వామిని నిత్యం దర్శిస్తూ అక్కడే ఉండిపోయాడు. నిత్యం ప్రభాత సమయంలో నగర సంకీర్తన చేస్తూ వచ్చే డబ్బును స్వామి కైంకర్యానికి ఖర్చు చేసేవాడు. చేతిలో చిల్లిగవ్వ లేకుండా ఆయన చేసిన దైవ సేవలు అద్వితీయం భజనలో సమాధి అవస్థను పొందేవాడు. స్వామికి దేవేరులకు పూల తోటలు ఏర్పరచి గుడి గోపురాలు నిర్మించాడు. దివ్య మహిమలు చూపించి భక్తిని పెంచాడు. శ్రీరంగం చేరి స్వామి సేవలో ధన్యతపొంది సన్యాసం స్వీకరించి "తిరు వేంగడ రామానుజ జియ్యర్ స్వామి" అయి 48 ఏళ్ళు నిండ కుండానే 1877 దాత నామ సంవత్సర మాఘ బహుళ సప్తమినాడు మహా నిర్యాణం పొందారు. ఆయన కీర్తనలు బాగా ప్రచారంలో ఉన్నాయి.

## యోగీశ్వరేశ్వర సందడి నాగదాసు

కురవ కుటుంబానికి చెందిన సందడి నాగదాసుగారు రామయ్య, పార్వతమ్మల కుమారుడు. కృష్ణాజిల్లా నందిగామ తాలూకా దబ్బాకుపల్లిలో 19వ శతాబ్దిలో జన్మించారు. చిన్నప్పటి నుండి విలక్షణంగా ఉండేవారు. సదా చిరునవ్వుతో చిద్విలాసంగా కనిపించేవారు. దైవారాధన, భజనలతో కాలం గడిపేవారు. చిన్నప్పుడే వేద శాస్త్రాలన్నీ నేర్చారు. ముత్తవరపు వెంకటాద్రి వద్ద యోగాభ్యాసం నేర్చారు. తనకు తెలిసిన మర్మాలన్నీ తోటి విద్యార్థులకు బోధించేవారు.

తల్లి మాట ప్రకారం శ్రీమతి అచ్చమాంబను వివాహమాడారు. పొసగని సంసారమే అయింది. ఈయన భజనలు భాగవత్కథా కాలక్షేపాలతో గడుపుతుంటే, సంసారం కాడి కున్న ఎద్దులు చెరో వైపు లాగుతున్నట్లు ఉంది విసిగి, వివేకాన్ని ఆయన కోల్పోలేదు. ఒక గురు పూజోత్సవం నాడు శిష్యుంతా కలసి మొదటి రోజు గురు పూజోత్సవం, రెండోరోజు భజనలతో రాత్రి రెండవ జామువరకు జరిపారు. శిష్యులకు వేదాంతం బోధించారు. పరవశంతో వారు విన్నారు. తెల్లవారుతుండగా భార్య అచ్చమాంబ వచ్చి నోటి కొచ్చినట్లు తిట్టింది. అరిచి కేకలేసింది. దాసుగారు దీన్నేమీ పట్టించుకోలేదు. ఆమె కోపం తారస్థాయికి చేరి పేడ నీళ్ళతో దాసుగారికి అభిషేకం చేసి కోపం తీర్చుకున్నది. ఆయన ఉలకనూ, పలకనూ లేదు. శుద్ధ బుద్ధావతారంగా అలానే ఉండిపోయారు. భార్య ముక్కుమీద వేలేసు కొని ఆశ్చర్యపోయింది. ఆయన వైఖరి చూసి ఆమెలో అకస్మాత్తుగా

పరివర్తన వచ్చి భర్త దాసుగారి పాదాలపై వాలి క్షమాభిక్ష వేడింది. జనం పోగయ్యారు సమాధి స్థితిలో ఉన్న దాసుగారు నెమ్మదిగా లోకంలోకి వచ్చారు. కన్నీరు కార్చే భార్యను చాలా అనుయంగా ఓదార్చారు.

"కనిపించేది అంతా నశించేదే, మన పుట్టుకకారణం మాయ ప్రశాంతత నిచ్చేదే శాశ్వతమైంది. ఇదే అన్నిటికీ సాక్షిగా నిలుస్తుంది. దానినే ఆత్మ అంటారు. అదే పరమాత్మ. దాని సాయంతోనే సంసార సముద్రాన్ని దాటాలి" అని భార్యకు తత్వబోధ చేశారు. భార్యను శిష్యురాలిగా స్వీకరించి జ్ఞానమార్గంలో నడిపారు. కొంతకాలానికి అచ్చమాంబ గారు కూడా సమాధిస్థితి సాధించగలిగారు. అనుకోకుండా వికారి నామ సంవత్సర చైత్ర శుద్ధ నవమి శ్రీరామనవమి నాడు సప్తాహం ప్రారంభించారు. చేతిలో పైసా లేని స్థితి. దైవం మీదే భారం వేశారు. ఇంట్లో ఉన్న నువ్వుల నూనెతో అఖండ దీపారాధన చేశారు. ఇంతలో ఒక రెండెడ్ల బండి ఇంటిముందు ఆగింది. అందు లోని ఆసామి ఖమ్మం మెట్టు నుంచి దాసుగారికి అందజేయమని బియ్యం బస్తాలు నూనె, నేతి డబ్బాలు, సరుకులు కూరలు దించి వెళ్లిపోయాడు. ఇది అంతా ఆత్మసంతర్పణలు వేదాంత ఉపన్యాసాలతో జరిగింది. మంగళ స్నానాలతో క్రతువు ముగించారు. మంగళ స్నానాలు తరువాత ఆ ఆగంతుకుని జాడ లేదు. దాసుగారిని అడిగితే చిరునవ్వే సమాధానం.

ఈ క్రతువు తర్వాత దాసుగారు ఒక సత్రాన్ని, ఒక దేవాలయాన్ని నిర్మించి ఆలయంలో శ్రీ లక్ష్మీనారాయణ స్వామి విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. ధ్వజ స్థంభ ప్రతిష్ట సమయానికి దాసుగారి మహత్తు అందరికీ తెలిసింది. ముహూర్త సమయానికి వేలాది ప్రజలు చేరారు. ధ్వజ స్తంభాన్ని లేపటానికి అంతమందీ ప్రయత్నించినా లేపలేకపోయారు. గమనించిన దాసుగారు పూజా మందిరంలోకి వెళ్లి ప్రార్ధన చేస్తూ సమాధి గతులయ్యారు. ఆ సమయంలో ఎక్కడినుంచో ఎవరో పిలిచి నట్లు మేదరమెట్టు వెంకయ్యగారు అనే ఆయన వచ్చి అందరి సహాయంతో ధ్వజస్తంభాన్ని నిలబెట్టించారు. ప్రతిష్ట గొప్పగా జరిగింది. దాసుగారికి ఇదేమీ తెలియదు. ఆయన సమాధిలోనే ఉన్నారు. ఇదంతా దైవలీల అన్నారు. నదిలో మునిగిన ఇద్దరు యువకులను కాపాడారు. వారి లీలలు ఎన్నెన్నో దాసుగారు పద్యాలలో శ్లోకాలలో పాటలలో భక్తిని బోధనా చింతనలను తెలియజెప్పేవారు. అవన్నీ సుమారు నలభై పుస్తకాలుగా ప్రచురితమైనాయి. ప్రత్యక్ష సచ్చిదానంద మూర్తిగారైన దాసుగారికి ఒకసారి దేహ సంబంధ బాధపడ్డారు. 20వ శతాబ్దం పరాభవ నామ సంవత్సర ఆశాఢ బహుళ అమావాస్య ఉదయం పద్మాసనంలో కూర్చుని ఆత్మను పరమాత్మలో కలిపేశారు.

## శ్రీ ఆంజనేయ పరమహంస

1892లో నవంబర్ 13న కృష్ణా జిల్లా గుడివాడలో భైరవబొట్ల జోగేశ్వరరావు సీతమ్మ అనే నిరుపేద బ్రాహ్మణదంపతులకు శ్రీ ఆంజనేయ పరమహంస జన్మించారు. అసలుపేరు ఆంజనేయ శర్మ. తల్లి ఉగ్గుపాలతో రామభక్తి రంగరించి పోసింది. అక్షరాభ్యాసం జరిగిన10వ ఏట ఉపనయనమూ చేశారు. తండ్రి చేసిన బ్రహ్మోపదేశంతో భక్త రామదాసు కీర్తనలు, నారాయణతీర్థుల తరంగాలు, త్యాగరాజు స్వామి కృతులు భక్తీదార కారేట్లు గానం చేసేవారు. యవ్వనంలో "సీతా రామ సంవాదం" అనే మహద్గ్రంధం చదివి పులకించిపోయారు. అంతర్ముఖులైనారు. 13వ ఏట తండ్రి మరణంతో శర్మగారికి కుటుంబ బాధ్యత మీద పడింది. శ్రీమతి లక్ష్మీకాంతమ్మను వివాహ చేసుకొని గృహస్త ధర్మం పాటిస్తూ చిన్న ఉద్యోగంలో చేరి కుటుంబ భారాన్ని మోశారు.

17వ ఏట భద్రాచలానికి చెందిన శ్రీ సచ్చిదానంద యోగేశ్వర అవధూత శర్మగారింటికి వచ్చి ఉపదేశం చేసి తత్వ రహస్యాలు ఎరుక పరచారు. గురుకరుణకు తన సాధన తోడై బ్రహ్మ విద్యారహస్యాలన్నీ రెండేళ్లలో గ్రహించి జీర్ణించుకొన్నారు. సంసారం లాగుతూ ఆత్మ నిష్టతో జీవించారు. తమ కష్టాలను శర్మగారితో చెప్పుకొనే వారితో "కష్టాలు దూది పింజల్లా ఎగిరిపోతాయి. రామ నామంతో మునిగి తేలేవారికి ఆంజనేయ స్వామి అనుగ్రహిస్తాడు. రామదాసు, కబీరు త్యాగయ్య మొదలైనవారు రామనామామృత పానమత్తులై ధన్యులయ్యారు" అని ధైర్యం చెప్పేవారు బ్రహ్మ భావన లేని చదువు దండగే అని చెప్పేవారు. మనసు సత్ పదార్ధం పై లగ్నం చేయకపోతే యెంత బ్రహ్మ జ్ఞానమున్న సాధకుడైనా సంపూర్ణ జ్ఞాని కాలేడు అని బోధించేవారు. ఇలా తత్వోపదేశం చేస్తూనే యోగ నిద్రలోకి జారుకొనేవారు శర్మగారు.

1928నుండి రెండేళ్ళు గుడివాడ, బెజవాడ, తెనాలి తాలూకా కొల్లూరులలో శర్మగారు ఉద్యోగం చేస్తూ ఎక్కడున్నా రామభజన తత్వ బోధ, యోగసాధనా మానలేదు. శిష్యగణమూ పెరిగి శ్రీ కంభం మెట్టు మధుసూదనరావు అనే ఆడిటర్ శిష్యుడయ్యాడు శర్మగారు బాపట్లలో స్థిరపడ్డారు. 1925నుండి శర్మగారు పరమహంస స్థాయికి ఎదిగారు. నలభైవయేట గుర్వాజ్ఞ మేరకు కృష్ణాజిల్లా పామర్రు దగ్గరున్న కొండి పర్రులో ఆశ్రమం నిర్మించుకొని ఉన్నారు. అక్కడున్న మామిడి తోటలో శ్రీ హనుమాన్ విగ్రహం ప్రతిష్టించి నిత్యపూజా నైవేద్యాలు చేసేవారు. శిష్యులకు గురుదర్శనం ఈ ఆశ్రమం లోనే జరిగేది. అప్పుడప్పుడు శిష్యుడు మధుసూదనరావుతో కలిసి బాపట్ల వెళ్లి నిత్యం నగర సంకీర్తన చేస్తూ ప్రతి ఇంటిముందు నిలబడి భజన చేస్తూ ఊరి వారందరికీ ఆరాధ్యులయ్యారు.

1940లో శిష్యులు బాపట్లలో శ్రీమారుతీ ప్రణవాశ్రమం నిర్మించి పరమహంసగారిని అక్కడ ఉండేట్లు చేశారు. రావు గారిని ఒక మంత్రం దీక్షలో ఉంచారు. స్వామికి రాచపుండు బయటపడింది. 11-10-1941 రాత్రి 9 గంటలకు మధుసూదనరావును పిలిచి చెవిలో నారాయణ ఉపనిషత్తును 7సార్లు చదవమన్నారు. దాన్ని వింటూశిష్య బృందం అంతా చూస్తుండగా శ్రీ ఆంజనేయ పరమహంస గారి హంస పరమహంసగా మారి పరమపదం చేరింది. తరువాతెప్పుడో మధుసూదనరావుగారు గురువుగారు తన చేతికిచ్చిన కాగితం గుర్తు కొచ్చి విప్పి చూశారు. అందులో "దీపం ఉండగానే ఇల్లు చక్కదిద్దు కోవాలి" అని రాసి ఉంది. ఇది అందరికి అన్ని వేళలా ఆదర్శమైన విషయమే.

## ఉపనిషత్ జీవన యోగి శ్రీ ముట్నూరు కృష్ణారావు

మహాపురుషుల కోవకు చెందిన శ్రీ ముట్నూరు కృష్ణారావుగారు ఆంగ్ల ఆంధ్రాలలో సెలయేటి ప్రవాహ సాదృశ్య ఉపన్యాసకులు. ఆత్మ తేజో విలసితులు వీరు ఏ మాత్రం సరేనన్నా మహాత్మాగాంధి వీరిని జాతీయస్థాయి నాయకులను చేసి ఉండేవాడు. తాను ఏది చేసినా కృష్ణా పత్రిక ద్వారానే చేయాలనే స్థిర సంకల్పం వారిది. ముట్నూరు వారి వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోవాలంటే వారి రచనలో ప్రతి వాక్యం ప్రతి పదం చదివి అర్థం చేసుకోవాలి. మేరునగధీరులు మహా సముద్ర వ్యక్తిత్వ శోభాలంకారులు ఆయన.

శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడు, శ్రీ బిపిన్ చంద్రపాల్ శ్రీ అరవిందులు వారిని బాగా ప్రభావితం చేశారు. ఈ ముగ్గురి జీవన విధానాలు, మార్గాలు భిన్నమైనవి. అయినా వాటికి దాసోహం లాలేదు. వారి ప్రేరణగా తమ మార్గమేదో తామే ఏర్పాటుచేసుకొన్నారు. అదీ వారి విశిష్ట వ్యక్తిత్వం. వారికి భావ దాస్యం ఇష్టంలేదు. విశిష్టమైన స్వతంత్ర పంథా కోరుకుంటారు. ముట్నూరు వారి జీవన విధానం ఉపనిషత్తులలో చెప్పిన జీవన విధానంగా ఉండటం విశేషం. బుద్ధితో అర్థం చేసుకొని హృదయంతో ఆచరించారు. వారు విజ్ఞాన, భక్తి జ్ఞానాల త్రివేణీ సంగమం. కవిత్వం చెప్పనికవి, వేదాంతం ప్రవచించని వేదాంతి, దర్శనం రచించని దార్శనికులాయన. వీటన్నిటి సమాహారంతో మహోన్నత వ్యక్తిగా నిలిచారు. గురుదేవులైనారు.

కుచ్చుజార విడిచిన తలపాగా మోకాళ్ళ వరకు జీరాడే ఖద్దరు లాల్చీ, కాళ్ళకు నాటు చెప్పులు,చేతిలో సింహతలాటపు పొన్ను కర్ర, మౌన ముద్రతో దివ్యపురుషులులాగా భాసించేవారు. కృష్ణారావు గారి ఉపాస్య దైవం "నిఖిలరసామృత మూర్తి" అని వారినోట వింటే సకలేంద్రియాలు సకల ఊహా ప్రపంచాలు ఒక్కసారిగా విచ్చుకొని మరో ప్రపంచంలో విహరిస్తాం ఆ నిఖిల రసామృతమూర్తి ఆయనే అని మనకు అనిపిస్తారు. ఈ విశ్వం యొక్క అణువణువులోను ఆ నిఖిల రాసామృత మూర్తిని తెలుసుకోవాలి. ముట్నూరు వారి బాహ్య వెలుగులూ, లోవెలుగులూ అందరికి ఆదర్శనీయం. అందుకే వారిని "అఖిల రసామృత యోగి" అంటారు.

కృష్ణారావుగారు కృష్ణాజిల్లా మచిలీపట్నంలో 1879లో జన్మించారు. తండ్రి నాగభూషణంగారు. తల్లిదండ్రులను చిన్నతనంలోనే కోల్పోతే పినతండ్రి, ముత్తవ తల్లి పెంచారు. బందరులో మెట్రిక్, ఎఫ్ యే చదివి పాసై రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి శిష్యులై పవిత్ర జీవనం ఆధ్యాత్మ చింతన అలవరచుకొన్నారు. గురు ప్రభావంతో ఇంగ్లీష్‌పై ఆధిపత్యం సాధించారు. బ్రహ్మసమాజ సమావేశాలలోఆశువుగా గంభీరోపన్యాసమిచ్చేవారు. 1898 నుండి నాలుగేళ్ళు మద్రాస్‌లో చదువుతున్నప్పుడు కూడా క్లాసు పాఠాలకంటే ప్రిన్సిపాల్ మిల్లర్ చెప్పే షేక్స్‌పియర్ నాటక ఉపన్యాసాలను ఆసక్తితో విని అభిరుచి పెంచుకొని ఏంయే లో కృతార్థులయ్యారు. 1903లో మచిలీపట్నం తిరిగి వచ్చి కృష్ణాజిల్లా సంఘం స్థాపించిన "కృష్ణాపత్రిక" కు సహాయ సంపాదకులుగా చేరి 1905 నుండి సంపాదకులుగా ఉన్నారు. ఆయన ఇష్ట దైవం "సాక్షిత్వం" దానికే కట్టుబడేవారు."కృష్ణారావు కళ్ళల్లో ఆధ్యాత్మిక తేజం ఉంది" అన్నాడు మహాత్ముడు. మౌన ముద్రాలంకారాలుగా కృష్ణ రాయదర్బార్‌ను నడిపారు. తెల్లని శిరస్త్రాణం ధరించటం చేత వారిని "గురు గ్రంధ సాహెబ్‌జీ" అని గౌరవంగా సంబోధించెదవు జరుక్ శాస్త్రి, కాటూరి. వేదాంత రహస్యాలను వెన్న ముద్దలు చేసి అందించిన అపురూప వ్యక్తి శక్తి ముట్నూరు కృష్ణారావుగారు.

## కరగ్రహార యోగి - ఫరీద్ మస్తాన్ ఔలియ

ఒక హిందువు ముస్లిం మత పీఠం అధిష్టించిన ఆశ్చర్యకర విషయమే. అప్పలస్వామి ఫరీద్ ఔలియాగా మారిన చరిత్ర. విజయనగరాన్ని పూసాటి విజయ రామరాజు పాలిస్తున్న కాలం అది. ఆయన సేనాధిపతి నడిపల్లి అప్పలస్వామి.ఆయన భార్యయే పైడితల్లి. అందాల సుగుణ రాశి. రాజు ఆమెపై మోజుపడ్డాడు. తనను చంపి సతీత్వాన్ని కాపాడమని భర్తను కోరింది పైడితల్లి. కత్తి తీసుకొని ఒకే దెబ్బతో ఆమె శిరస్సు ఖండించి, ఆమె కోర్కె తీర్చి, ఊరు వదిలేసి, బడిపాలెం చేరి పైడి తల్లి ఆదేశం మేరకు మళ్ళీ పెళ్లి చేసుకొన్నాడు. పైడితల్లి "ఇక నుంచి రాజువంశంలో సంతాన ఉండదని, నడిపల్లి వారి ఏడవ తరంలో ఒక సత్పురుషుడు పుట్టి విజయనగరంలో ప్రవేశించినప్పుడు

మాత్రమే విజయనగరానికి వారసుడు జన్మిస్తాడు" అని పైడితల్లి శాపం పెట్టింది. విజయరామరాజు పశ్చాత్తాపపడి ప్రాయశ్చిత్తం కోసం పైడి తల్లికి గుడి కట్టించి ప్రతి ఏటా ఉత్సవాలు నిర్వహించాడు. ఇప్పటికీ మహావైభవంగా పైడితల్లి ఉత్సవాలు జరుగుతున్నాయి.

దిబ్బదిపాలెంలో అప్పలస్వామి వంశంలో నడిపల్లి పాపయ్య, రాజమ్మ దంపతులకు 19-8-1902లో జన్మించిన మగపిల్లవాడే మన కథానాయకుడు అప్పలస్వామి. లోక కళ్యాణం కోసం విష్ణుమూర్తి ఆమె గర్భంలో జన్మిస్తున్నట్లు తల్లి రాజమ్మకు కలలో చెప్పాడు. అతని మేనమామ కొడుకు ఇతనిపై కుట్ర పన్ని మంత్రప్రయోగం చేయించాడు. అవి అప్పలస్వామిని ఏమీ చెయ్యలేకపోయాయి. చిన్నతనంలో కావడిలో కూర్చొని విజయనగరం కోటకు వెళ్లాడుపూర్వం పైడి ఇచ్చిన శాపం తీరిపోయింది. రాజవంశంలో మళ్ళీ సంతానం కలిగింది.

ఒకప్పుడు అప్పలస్వామిని కాల పిశాచం పట్టుకొంటే, బంధించి ఇంటికి తెచ్చాడు. తొమ్మిదేళ్ళకే నారద తుంబురులు దర్శన మిచ్చారు. దేవతలు బందరు సముద్రతీరానికి తీసుకొని వెళ్లి భవిష్యత్తులో అతడు ఉండాల్సిన ప్రదేశాన్ని చూపించారు. నెల్లిమర్ల జూట్ మిల్లులో పని చేశాడు. అప్పుడు ఫ్యాక్టరికట్టడానికి పునాదులు తవ్వుతుంటే వెంటనే పూడిపోయేవట. అప్పలస్వామి అక్కడ నిలబడితే నిలబడి నిర్మాణం సాగిందట. తోళ్ళ కర్మాగారంలో పనిచేసే వారితో మద్య పానం మాన్పించాడు. బుచ్చమ్మతో వివాహమైంది. కంటోన్మెంట్ రోడ్డులో టోల్‌గెట్ ఉద్యోగంలో పనిచేశాడు. అక్కడే దగ్గరలో "ఖాదర్షా ఔలియా" ఉన్నారు. భార్య చనిపోయింది ఉద్యోగం ఊడిపోయింది. విజయ నగరంలో పైడితల్లి సంబరాలకు వెళ్ళి నాటకం వేసి ఖాదర్ షా ఔలియాను సందర్శించాడు. ముప్పై ఏళ్ళ వయసులో ఉన్నాడు. ఆయనను దర్శిస్తే మళ్ళీ రమ్మని వాయిదా వేశారాయన. ఇలా రెండు మూడుసార్లు అయిది. అనుమతి లభించింది.

అయిదేళ్ళ తర్వాత బాబా అప్పలస్వామికి "ఫరీద్ మస్తాన్ ఔలియా" అనే పేరు పెట్టారు. మచిలీపట్నం దగ్గర కరగ్రహారం సరైన స్థలం అని భావించి అక్కడ ఉండి పోవాలనుకొన్నాడు. క్రమంగా శిష్య బృందం ఏర్పడింది. ఎందరో హిందువులు, ముస్లిములు ఆయన శిష్యులైనారు. ప్రత్యర్థులను శాంతపరచి సయోధ్య కూర్చేవారు. మర్యాదగా సంబోధించటం ఆయన సంస్కార విధానం. తమ గురువులను సందర్శించటానికి విజయ నగరం వెడితే వంద గజాల దూరంలో చెప్పులు వదిలేసి ఖాదర్‌వలీషాగారిని సమీపించి పాదాల దగ్గర అతి భక్తితో కూర్చొనేవారు. ఆయన అందరి శిష్యుల్లో ఈయనదే అగ్రస్థానం. అంత ప్రత్యేకత పొందారు మస్తాన్ ఔలియా. అన్ని మతాల వారు అన్ని కులాల వారు ఆయనకు భక్తులయ్యారు. తాడిత, పీడిత జనానికి ఔలియాగారు ఆత్మీయులైనారు.

ఫరీద్ మస్తాన్‌గారు చేపల వృత్తిలో ఉన్న వారికి సముద్ర మరణ గండాలను చాలాసార్లు తప్పించారు. వారిలో నైతిక ప్రవృత్తి కలిగించారు. వారి పాలిటి దేవుడైనారు. బాబా గారికి తెలిసినన్ని చేపల్లో రకాలు అక్కడి జాలర్లకు కూడా తెలియవని జాలర్లే ఒప్పుకొన్నారు. పాగోలు లక్ష్మీకాంతమ్మగారి కేన్సర్ వ్యాధిని పోగొట్టారు. ఆదూరి ఉమామహేశ్వరరావుకు ఉబ్బసం తగ్గించారు. 6-12-1968న ఫరీద్ మస్తాన్ ఔలియా గారు బందు భక్తజన సమక్షంలో సమాధి చెందారు. ప్రతి ఏడూ రంజాన్ పండగల్లో ఔలియా ఉరుసు ఉత్సవాలు జరుగుతాయి. అందరు హాజరౌతారు. ముఖ్యంగా చెన్నారెడ్డి విజయవాడ వైపు వస్తే కరగ్రహారం వెళ్ళకుండా ఉండేవారు కాదు. ఇక పి.వి.గారు బాబా సంస్థాన కార్యవర్గానికి అధ్యక్షులే. ఇప్పటికి ఆయన సమాధి నుండే భక్తుల అభీష్టాలను నేరవేరుస్తారని ప్రగాఢ విశ్వాసం.

## అవధూత చక్రవర్తి - కురుమద్దాలి పిచ్చమ్మ

మనిషి యే కులమోకాదు, మనసు యే కులమో చూడాలి. అప్పుడే మనం జ్ఞానవంతులమవుతాం. మాలకులంలో జన్మించి, జన్మ జన్మల సంస్కారాన్ని వెంట నిడుకొని, రామ భక్తి సామ్రాజ్యాన్ని యేలి మహాత్మా గాంధీని, రమణ మహర్షిని, మళయాళ స్వామివంటి వారినే సంభ్రమాశ్చర్యాలలో ముంచివేసిన కురుమద్దాలి పిచ్చమ్మ చరిత్ర సర్వపాప హరం ఆ అమ్మ ప్రత్యక్ష సచ్చిదానందమూర్తి, అవధూత చక్రవర్తి.

పిచ్చమ్మ మాల కులంలో బెజవాడ బందరురోడ్డులో పామర్రుకు దగ్గరగా ఉన్న కుగ్రామం కురుమద్దాలిలో వర్రే ముత్తయ్య, వీరయ్య దంపతులకు 1870లో జన్మించింది. మంచి ఆజానుబాహువు శరీరంతో ముచ్చటగా ఉండేది. పిల్లగా ఉన్నప్పుడే మంత్రం వేసినట్లు పడి పోయేది. ఆడుతూ, పాడుతూ పరవశించేది. ఏది చేసినా తాదాత్మ్యం చెంది చేయటం ఆమెకు అవాటైనది. ఆమెకేదో రోగం అనుకొన్నారు తల్లిదండ్రులు. రామాలయంలో రామచంద్రుని రూపం చూస్తూ పరవశించేది ఎన్నో వైద్యాలు చేయించినా తీరు మారలేదు "పిచ్చి పిచ్చమ్మ" అని పిలిచేవారు. తుమ్మలపల్లి గ్రామంలో నీలి శోభనాద్రికిచ్చి వివాహం చేశారు. కాపురానికి వెళ్ళినా ఏకాంత జీవితమే గోసేవ చేసేది నిర్జనప్రదేశం దొరికితే ధ్యానంలో మునిగి స్పృహతప్పి పోయేది. ఆమెకు రామ నామమే అండా, దండా.

పిచ్చమ్మ గర్భవతి అయింది. నాల్గవనెలలో భర్త చనిపోయాడు. ఆడపిల్లను కని భాగ్యమ్మ అని పేరు పెట్టింది. మళ్ళీ పెళ్లి చేసుకోమని

తల్లిదండ్రి కోరితే తిరస్కరించింది. కూలి చేసి బిడ్డను సాకింది. కష్టపడి పనిచేసి మూతామేస్త్రి అయింది. ఆమె పని అంటే అందరికి ఇష్టం. ఒళ్ళు దాచుకోకుండా చేసేది, చేయించేది. పిల్లను పోషిస్తూ మిగిలిన డబ్బును మంచి పనులకు ఖర్చు చేసేది. యుక్త వయసు రాగానే భాగ్యమ్మను ఒక అయ్యచేతిలో పెట్టి పెళ్లి చేసింది. అల్లుణ్ణి కన్న కొడుకుగా చూసుకొనే కాని అత్తవారు ఆమెను రాచి రంపాన పెట్టేవారు. తల్లికి వచ్చి చెప్పుకొని ఏడ్చేది. బతిమిలాడి పంపించేది. ఒకసారి అత్తారింటికి వెళ్లనని భీష్మిస్తే "యే నూతిలో పడి చచ్చినా బాగుందును కూతురు-అనుకొన్నది మనసులో అన్నుకోన్నట్లే భాగ్యమ్మ నూతిలో దూకి చనిపోయింది.

పిచ్చమ్మకు వైరాగ్య భావన పెరిగిపోయింది. మొలకు ఒక గోనె సంచి మాత్రం కట్టుకొని తిరిగేది స్మశానంలో నివాసం. రామనామం, హనుమ నామజపం జపిస్తూ తిండి తిప్పలు లేకుండా గడిపింది. అలాంటి సమయంలో ఎక్కడి నుంచో ఒక గోసాయి వచ్చి, ఓదార్చి ఏదో ఉపదేశించి వెళ్లాడు. ఆయన కోసం వెదికితే కంపించలేదు. వచ్చినవాడు సాక్షాత్తు శ్రీరాముడే అని నమ్మింది.ఆ దుఃఖంలోనే జ్ఞాన సిద్ధి కలిగింది. త్యాగరాజ కృతులు రామదాసు భజనలు వేమన పద్యాలు బ్రహ్మంగారి తత్వాలు పాడుకొంటూ ఉండేది. ఆకులు అల ములు స్మశానంలో ఒంద్రు మన్నే ఆహారం. పాములతో సహజీవనం అవి ఆమెను ఏమీ చేసేవి కావు. పిచ్చమ్మలో ఏదో శక్తి ఉందని అప్పుడు కుమద్దాలి జనం గ్రహించారు. కుటీరం నిర్మించి అమ్మకు ఆశ్రయం కల్పించారు. వారి బలవంతాన అందులో చేరింది. ఒకసారి కాళ్ళుపడి పోయిన ఒక వ్యక్తిని బండిలో ఆస్పత్రికి తీసుకువెళ్తుండగా బండిని ఆపించి ఆరోగిని కిందికి దింపి, వీపు మీద చెయ్యి వేసి రాసింది. "ఇంటికి పోరా" అంది వాడు హాయిగా నడుచుకొంటు ఇంటికి వెళ్లాడు. ఇలా క్రమక్రమంగా ఆమె మహత్తు జనాలకు తెలిసి గురి బాగా కుదిరింది పిచ్చి పిచ్చమ్మ రామావదూత పిచ్చమ్మగా పరిణామం చెందింది.

పిచ్చమ్మను చూడటానికి వచ్చే జనం పెరిగిపోతున్నారు. ఆమె క్రమంగా తత్వ రహస్యాలను, ఉపనిషద్ రహస్యాలను పామరభాషలో తెలియజెప్పేది. ఆమె "పని అవుతుంది" అంటే అయ్యేది 'కాదు' అంటే పని జరిగేది కాదు. రాముడు ఏది పలికిస్తే అది పలుకుతున్నాను అనేది. తనను 'వీడు" అను కోనేది. అమ్మ దేహం నుండి జ్ఞానాగ్ని, యోగాగ్ని సెగలు, పొగలు వచ్చేవి. అప్పుడు చన్నీళ్లు ధారగా పోసి వెంకమ్మ, వరలక్ష్మమ్మ తాపం చల్లార్చే వారు. ఆమెలో "బ్రహ్మ నంద భావన" క్రమంగా పెరిగింది. రాముడు, కృష్ణుడు మొదలైన దశావతా రాలు తనకు కన్పించినా మనశ్శాంతి ముఖ్యమని వారిని తిరస్కరించా నని చెప్పేది. 1925 పిన్నమనేని రామయ్య వగైరాలు ఆశ్రమం నిర్మించారు. ఆమె తపస్సుకు అనుకూలంగా "భూగర్భ భువనేశ్వరం" నిర్మించారు. రోజు విడిచిరోజు సమాధిలోకి, మూడు రోజులకో సారి మౌనంలోకి వెళ్ళేది. ఎప్పుడూ అర్ధనగ్నంగా ఉండేది.

"వీడు అనేది రాముడే" అని అద్వైత భావనలో అనేది డబ్బు బంగారంలాంటి వాటిని ముట్టు కొనేది కాదు. వాటిని "రోత" అనేది ఒకసారి మళయాళ స్వాములతో "ఒరెయ్ నీకు ఇంకో చొక్క ఉంది రోయ్" అన్నది. అంటే ఇంకో జన్మ ఎత్తాల్సి ఉంది అని అర్థం.

దక్షిణేశ్వరంలో "శ్రీరామకృష్ణ పరమహంస దేవిలో ఇమిడి పోయాడు. దేవి పరమహంసలో ఇమిడిపోయింది. పరమహంసకు చావు పుట్టుకలు లేవు" అని అద్భుత భాష్యం చెప్పింది. శ్రీ రమణా శ్రమానికి వెళ్లి సరాసరి రమణ మహర్షి కూర్చునే ఆసనంపై కూర్చుంటే రమణులు ఆమె ప్రక్కన ఆసీనులయారు. అమాంతంగా మహర్షిపై వాలిపోయింది. లేచి "ఎప్పుడూ అంత దూరం ఏమి చూస్తున్నావు? అని ఆయన్ను అడిగింది. ఆయన భావ గర్భితంగా "నువ్వు చూస్తున్నదే నేనూ చూస్తున్నాను" అన్నారు.

తిరుమలకు వెళ్లి అర్చకులు చూస్తుండగానే గర్భగుడిలోకి వెళ్లి 'ఏరా వెంకన్నా! ఇక్కడున్నావా?" అని పసిపిల్లాణ్ణి పలకరించినట్లుపలక రించింది. 1936 శ్రీమళయాళ స్వాములు కురుమద్దాలి ఆశ్రమానికి అమ్మను దర్శించటానికి వస్తే ఆయనకు ఎదురు వెళ్లి కౌగలించుకొన్నది. 1924లో గాంధి మహాత్ముడు బందరు వస్తే స్వామి సీతారం అమ్మను వెంట బెట్టుకొని గాంధీగారికి దర్శనం కల్గించారు. మహాత్ముణ్ణి ఆలింగనం చేసుకొని అరటిపండు బోసి నవ్వుల తాతనోటి కందించి "ఒరేయ్! లోకసేవ బాగా చేస్తున్నావు. ఇంకా బాగా చెయ్యి" అంది పెనుమత్స యోగిని, లలితానంద సరస్వతి ప్రణవానంద స్వామి వంటి వాళ్ళు వచ్చి అమ్మతో తత్వగోష్ఠి చేసేవారు గుడిపాటి వెంకటాచలం, ఆయన కూతురు పదమూడేళ్ళ సౌరీస్‌తో వచ్చి చాలాసార్లు అమ్మ దర్శనం చేసుకొన్నారు.

శ్రీలలితానంద సరస్వతి స్వామి ఆహ్వానిస్తే ఆయన నిర్వహించిన రుద్రయాగానికి వెళ్లి సన్మానం పొందింది. గాలి లాగా తేలికై కొండెక్కి నాగ సర్పరూపంలో సుబ్రహ్మణ్యేశ్వరుని సందర్శించి వచ్చింది.

1951 జనవరిలో భక్తులతో "ఈ మతం తగలబడిపోతోంది ఒరేయ్ వంటవాడు పైకి ఎక్కుతున్నాడు. ఇక వంట తయారు కాదు" అని సర్మగర్భంగా పలికింది. 15-1-1951 ఖర నామ సంవత్సరం పుష్య శుద్ధ అష్టమి నాడు రాత్రి ఒంటి గంటకు తనువు చాలిస్తున్నట్లు

తెలియజేశింది. శాస్త్రోక్తంగా ఆమె దేహాన్ని నిక్షేపం చేశారు. ఆమె ఆజ్ఞ ప్రకారం దేవీ రూపంలో ఉన్న నల్లరాతి విగ్రహాన్ని అమ్మ సమాధిపై ప్రతిష్టించారు. తరువాత ఇంకో తెల్లరాతి విగ్రహ ప్రతిష్ట చేశారు రోజూ ఈ విగ్రహాలకు అర్చన జరుగుతుంది. ఖమ్మం జిల్లా బూర్గం పహాడ్‌లో కూడా పిచ్చమ్మ అవధూత ఆశ్రమం ఉంది.

## ముముక్షు పీఠాధిపతులు 1008 శ్రీశ్రీ లక్షణ యతీంద్రులు

పెదముత్తేవి ముముక్షు పీఠాధిపతులు శ్రీశ్రీ లక్ష్మణ యతీంద్రులు, సహిత సంకీర్తనలతో రాష్ట్రం నలుమూలల భక్తి ప్రచారం చేసి ప్రజల్లో భక్తి భావం పెంపొందింపజేసిన మహనీయులు శ్రీ లక్ష్మణ యతీంద్రులు దులు. ప్రముఖ ఆధ్యాత్మిక కేంద్రమైన కృష్ణాజిల్లా పెదముత్తేవి శ్రీకృష్ణా శ్రమంలో ముత్తేవి లక్ష్మణదాసుగా ఆధ్యాత్మిక లోకానికి పరిచితులైన శ్రీ లక్ష్మణ యతీంద్రులు ముముక్షుజన మహాపీఠ వ్యవస్థాపకులు, శ్రీకృష్ణాశ్రమ స్థాపకులు శ్రీ సీతారామ యతీంద్రుల కుమారులు. 1972లో అక్టోబర్ 31న శ్రీ సీతారామ యతీంద్రులు విజయవాడలో అవతారం చాలించిన వెంటనే లక్ష్మణదాసు సన్యసించి శ్రీ లక్ష్మణ యతీంద్రులయ్యారు. నాటి నుండి 1985 వరకు 13 సంవత్సరాలు రాష్ట్రం నలుమూలలే కాకుండా పొరుగు రాష్ట్రాల్లో సైతం ధనుర్మాస మహావ్రతాలు నిర్వహించి ప్రజల్లో భక్తి భావాన్ని పెంపొందింపజేశారు. ఈ సందర్భంగానే శ్రీకృష్ణాశ్రమంలో శ్రీ సీతారామయతీంద్రులు ఆశ యమైన శ్రీ వైకుంఠనాథ స్వామి ఆలయాన్ని నిర్మించేందుకు ఉద్య మించి 1975 మే 18న శ్రీ వైకుంఠనాథస్వామి, శ్రీ రంగనాథ స్వామి, శ్రీ వెంకటేశ్వర స్వామివార్ల మూర్తులను ప్రతిష్ఠించారు. అదే సమ యంలో శ్రీ సీతారామ యతీంద్రుల దివ్యమూర్తిని ప్రతిష్ఠించారు. 1982లో యతీంద్ర బృందావనాన్ని, మహాపూర్ణమండపాన్ని నిర్మించి శ్రీ చతుర్భుజ వరదలక్ష్మి అమ్మవారిని ప్రతిష్టించారు. 1984లో శ్రీ అభయ వీరాంజనేస్వామి ఏకశిలా విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. కాంచీ పూర్ణ పుష్కరిణిని నిర్మించారు. అలాగే ఆధ్యాత్మిక, సాహిత్య రంగాల సేవతోపాటు కవి అయిన శ్రీ లక్ష్మణ యతీంద్రులు ధనుర్మాస మహో త్సవాల్లో అవధానాది సాహిత్య కార్యక్రమాలు నిర్వహించారు. శ్రీ లక్ష్మణ యంత్రీదులు శ్రీకృష్ణ జనన సందర్భాన్ని వివరిస్తూ 'క్వణత్ కింకిణి' అనే ఖండ కావ్యాన్ని, గోపి హృదయం అనే ఆంగ్ల అనువాదాన్ని, నీలివెన్నెల గేయాలను, తిరుప్పావైని తెలుగులో "రసధుని"గా, శ్రీ చైతన్యప్రభ అనే గ్రంథాలను రచించారు. భక్తుల ద్వారా భగవత్ ప్రచారాలను దేశం నలుమూలలప్రచారం చేసేందుకు యతీంద్ర సేవా సమితిని రూపుదిద్దారు. 1992లో శ్రీ లక్ష్మణ యతీంద్రులు అవతారం చాలించటంతో ఆయన కుమారులైన శ్రీ ముత్తేవి సీతారాం గురు దేవులు శ్రీకృష్ణా నామంతో పాటు యతీంద్ర సేవాసమితి, ముముక్షుజన మహాపీఠాలను ప్రపంచవ్యాప్తం చేస్తున్నారు. "ముముక్షు జన మహా పీఠం" అనే శ్రీ కృష్ణాశ్రమంలో శ్రీశ్రీ సీతారామ యతీశ్వ గురుదేవులు తర్వాత ఆశ్రమ పీఠాన్ని అధిరోహించిన వారు జగత్ ప్రసిద్ధులై 1008 శ్రీశ్రీ లక్ష్మణ యతీంద్రుల వారు శ్రీ అభయ ఆంజనేయస్వామి కనుల పండువుగా కనిపిస్తాడు శ్రీ లక్ష్మణయతీంద్రుల భారీ విగ్రహాన్ని కూడా స్థాపించారు. హనుమపై యతీన్ద్రుల వారు అనే ఆధ్యాత్మిక గ్రంధాలను రాసి ప్రచురించారు. "ముముక్షువు" అనే ఆధ్యాత్మిక మాస పత్రికను నిర్వహించారు. భజన చేయటంలో కీర్తనలు పాడటంలో లక్ష్మణ యతీంద్రులది ఒక ప్రత్యేక శైలి. భగవంతుడువారి శరీరంపై ఆవ హిస్తాడు. ఆయన చిందులు వేస్తూ చిడతలతో చేసే భజన తాదాత్మ్యాన్ని కలిగిస్తుంది. అఖండ నామ భజన ఆశ్రమంలో నిర్వహించేవారు. ఒకసారి శ్రీ ఆంజనేయ స్వామి సమక్షంలో 1991లో 108 రోజులు శ్రీలక్ష్మీనారాయణ మహాక్రతువు నిర్వహించి ప్రతిరోజు అన్నదానం అఖండంగా చేస్తూ పూర్ణాహుతి రోజున లక్షమందికి ఒకే పంక్తిలో భోజనాలు ఏర్పాటు చేసిన ఘనత వారిది. లక్ష్మణయతీంద్రులు పరమ పదించిన తర్వాత వారి కుమారులు శ్రీశ్రీ సీతారామ యతీంద్రులు పీఠాధిపత్యానికి వచ్చి నిర్వహిస్తున్నారు.

## భుక్త రహిత రాజ యోగి - వేటూరి ప్రభాకర శాస్త్రిగారు

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అంటే సాహిత్యమేరుపర్వతం. ఆయన రాయని పీఠిక లేదు. తరచని సాహిత్యమూ లేదు తిరగేయని శాసనం సేకరించిన తాళ పత్రంలేదు. దేశభక్తిలో అనుపమానమైన వారు. ఇవన్నీ మనకు అందరికి తెలిసిన విశేషాలే. కాని అందరికి తెలియని మహాపార్శ్వం వేటూరి వారిలోఉంది. వారు మాస్టర్ సి.వి.వి. గారి శిష్యులై ఎంతో యోగసాధన చేసి ఆధ్యాత్మిక తీరాలను చూసి, తన వంటి వారెందరినో శిష్యులను తయారుచేసి దీనులను ఉద్ధరించారు. అదే మనం తెలుసుకోబోతున్నాం.

కృష్ణాజిల్లాలో దివి తాలూకా చల్లపల్లికి సమీపంలో పెదకళ్ళేపల్లిలో ప్రభాకరశాస్త్రిగారు 7-2-1888న వేటూరి శేషమ్మ, సుందర శాస్త్రి దంపతులకు జన్మించారు. పదహారేళ్ళకే తెలుగు, సంస్కృతం పుక్కిట పట్టారు. కవిత్వమూ చక్కగా అలవడింది. శతావధాన, అష్టావధానా లెన్నో చేశారు. మద్రాసులో తెలుగు పండితులుగా పనిచేశారు. అప్పుడే వేపా రామేశంగారి వద్ద ఖోగళం, చరిత్ర అధ్యయనం చేశారు.

1910లో పిసుపాటి మహాలక్ష్మమ్మ గారితో వివాహమైంది. మద్రాస్ ప్రాచ్య లిఖిత భాండాగారంలో పండితునిగా చేరి ఇంగ్లీష్, కన్నడ, తమిళాలు నేర్చారు. చరిత్ర సంస్కృతి, వాఙ్మయం, శాసనాలు తాళ పత్రాలు, కైఫీయతులు, గ్రంథాలు సేకరించి, పరిశీలించి పరిష్కరించి ముద్రించారు. "ఎన్నో ఏండ్లకు ఎత్త దగినంత సాహిత్య వాఙ్మయాన్ని శాస్త్రిగారు సంతరించారు" అని ఆయన్ను గురించి అన్నారు.

1912-16 మధ్య కాలంలో శాస్త్రిగారు తీవ్ర బాధలకు గురైనారు. మానసిక స్వాస్థ్యమూ కోల్పోయారు. మద్రాసులో రైలు ఎక్కి ఎక్కడో ఆత్మహత్య చేసుకోవాలని భావించి రైలు ఎక్కటానికి స్టేషన్‌కు పోతున్నారు. అబ్బూరి జగన్నాధరావు అనే వారితో పరిచయమైంది. ఆయన తన బావగారైన ప్రెసిడెన్సీ కళాశాల ఫిలాసఫీ ప్రొఫెసర్ పోతరాజు నరసింహంగారిని పరిచయం చేశారు. ఈయన మాస్టర్ సి.వి.వి.గారి శిష్యులు. పోతరాజుగారు ఇచ్చిన పరిచయ ఉత్తరాన్ని తీసుకొని వేటూరివారు కుంభకోణంలో ఉన్న మాస్టర్ గారింటికి చేరి ఉత్తరం ఇచ్చారు. ఆయన చదివి విశ్రాంతి తీసుకోమని సలహా ఇచ్చారు. ఆ మాటతోనే శాస్త్రిగారిలో "ప్రజ్ఞ" ప్రవేశించింది. అప్పటికి ఆయన చేతి గూడు జారి చాలాకాలం నుంచి చాలా బాధపడుతున్నారు. ఇక్కడికి రాగానే తగ్గిపోయి గూడు మళ్ళీ యధాస్థానం చేరింది. ఒక చెయ్యి పైకి లేపగలిగేవారు కాదు ఇప్పుడు హాయిగా చెయ్యి పనిచేస్తోంది. అప్పటినుంచి శాస్త్రిగారు మాస్టర్‌గారి శిష్యులైపోయారు.

ఇతరుల బాధలనుచూసి శాస్త్రిగారు తట్టుకోలేకపోయేవారు. తన ఆత్మశక్తితో బాధలు తీర్చేవారు. "నిన్నటి వరకు నువ్వు ప్రజ్ఞా ప్రభాకరుడివి. ఈ రోజు నుండి నన్ను గురించి రాయగల యోగ్యత నీకు కల్గింది" అని గురువుగారు శాస్త్రిగారిని మెచ్చారు. 1918లో తంజావూర్ సరస్వతి గ్రంథాలయంలో పనిచేశారు. వారాంతపు శెలవల్లో మాస్టర్‌గారిని దర్శించి యోగ రహస్యాలు నేర్చేవారు శాస్త్రిగారు. "తమలో సమస్త విశ్వాన్ని, సమస్త విశ్వంలో తమను దర్శించగల యోగి పుంగవులు" అయ్యారు. భార్యనుకూడా మాస్టర్‌జీకి శిష్యురాలిని చేశారు. శాస్త్రిగారు "గౌతమబుద్ధుని అవతారం" అని నాడీ గ్రంథాలు తెలిపాయి. అందుకే ఆయనలో కరుణ, దయ, ప్రేమ, శాంత గంభీరత స్పష్టంగా కన్పిస్తాయి. ఆయన ముఖం చూస్తే చాలు మానసిక ప్రశాంతి లభిస్తుందని చాలామంది చెప్పేవారు. ఎందరికో దీర్ఘవ్యాధులను డిస్టెంట్ హీలింగ్‌తో పోగొట్టేవారు. దివార్ల వెంకటావధాని వంటివారి జబ్బులను భుక్త రహిత రాజయోగం ద్వారా తగ్గించేవారు. "నా చుట్టూ ఆనందాన్ని అమృతాన్ని పంచిపెట్టాలనే సంకల్పం ఉన్న వాణ్ణి నేను. అందర్ని ఆపదల నుంచి రక్షించటం, అందర్లో ఆనందాన్ని నెలకొల్పటం అనే రెండు భావాలే నాకు ఉచ్ఛ్వాసనిశ్వాసాలు. అవి రెండు ఆడటంలోనే నా ఊపిరి" అనే ప్రభాకరశాస్త్రిగారు 29-8-1950న సవిత్రులమండల నారాయణుని చేరుకొన్నారు.

## కుర్తాళం పీఠాధిపతి శ్రీశ్రీ విమలానంద భారతీస్వామి

కుర్తాళం పీఠాధిపతి శ్రీశ్రీ విమలానంద భారతీస్వామివారి పూర్వాశ్రమ నామధేయం శ్రీ కానుకొల్లు త్రివిక్రమరావు 20-6-1878లో ఆగస్ట్ 20న శ్రీకృష్ణాష్టమిరోజున కృష్ణాజిల్లా మచిలీపట్నంలో శ్రీ సూర్యనారాయణ శ్రీమతి ఆదిలక్ష్మి దంపతులకు భగవత్ కృపవలన జన్మించారు. నోబుల్ హైస్కూల్‌లో టీచర్‌గా పనిచేసి తిరువనంతపురంలో లా చదివి పాసయ్యారు. ఆధ్యాత్మిక భావ ధారలో పడి లా ప్రాక్టీస్ చేయలేదు. ప్రిన్సిపాల్ బలవంతం మీద నోబుల్ కాలేజిలో సంస్కృతం, తెలుగు చరిత్ర బోధించారు. శ్రీ పింగళి లక్ష్మీకాంతం కాటూరి వెంకటేశ్వరరావు విశ్వనాధ సత్యనారాయణగారి ప్రముఖులు లెందరో వారి శిష్యులు.

రావుగారు 1931లో సన్యాస దీక్ష స్వీకరించి శ్రీశ్రీ విమలానంద భారతీ స్వాములయ్యారు. 1944 డిసెంబర్‌లో కుర్తాళంలోని సిద్దేశ్వర పీఠాధిపతి అయ్యారు. ఎన్నో ధార్మిక ఉపన్యాసాలు చేస్తూ జ్ఞాన బోధ చేస్తూ దసరా ఉత్సవాలలో తిరువనంతపురం రాజాస్థానంలో అధ్యక్ష స్థానం వహించి వేదాంత చర్చ చేశారు. వారి అభిభాషణం అత్యంత శ్రద్ధతో అందరూ ఆలకించి పెద్ద పెట్టున హర్షధ్వానాలు చేసి అభినందించారు. అద్వైత్వ సిద్ధాంతాన్ని సంస్కృతంలో అనర్గళంగా వివరించిన తీరు అందరినీ అబ్బుర పరిచింది. ప్రస్తాన త్రయంపై స్వామి వారి అభి భాషణం అమృతధారలాగా ఉండి శ్రోతలను మైమరపించేది గహన మైన వేదాంత భాష్య విషయాలను అతి తేలిక పదాలతో అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు బోధించే నేర్పు వారిది సనాతన ధర్మ ప్రచా రంతో దేశమంతా పర్యటించారు. శ్రీవారి ఉపన్యాసాలను శ్రీ తంగి రాల వెంకట నరసింహారావుగారు 7 భాగాలుగా వచనం, కవ్వితంగా "శ్రీ విమలానంద విజ్ఞాన విలాస బంధం" పేరుతో ప్రచురింపబడింది. 25-1-1950న శ్రీ విమలానంద భారతీ స్వామివారు సిద్ధిపొందారు. వారి ఉత్తర పీఠాధిపతి శ్రీశ్రీ త్రివిక్రమ రామానంద భారతీ స్వామివారు విజయవాడ కృష్ణలంకలోని వారి సమాధిపై శివలింగాన్ని ప్రతిష్టించారు.

## విశిష్టాద్వైత యోగి - శ్రీ చిలకమర్రి వెంకట కృష్ణమాచార్యులు

కృష్ణాజిల్లా మచిలీపట్నంలో 1900లో చిలకమర్రి వెంకటా

చార్యులు, ఆండాళమ్మ దంపతులకు వెంకటకృష్ణమాచార్యులు జన్మించారు. తండ్రి ఇంజినీర్. పంట పొలాలకు కాలువలద్వారా నీరు అందించి ఎక్కువ పంట పండటానికి తోడ్పడ్డారు. విజయవాడకు బదిలీ అయి టైఫాయిడ్‌తో చనిపోయారు. రెండేళ్ళ వయసున్న కృష్ణమా చార్యులను తల్లీ నాయనమ్మలు గోవాడ తీసుకువెళ్ళారు. యాభై ఎకరాల ఆస్తికి వీరే ఏకైక వారసులు గోవాడ వీధి బడిలో చేరి అమరకోశం వగైరా చదివారు. గాంధీగారి పిలుపు అందుకొని చదువు మానేసి సహాయనిరాకరణ ఉద్యమంలో చేరారు. 16వ ఏట బాపట్లలో కొమాం దూరి రామానుజాచార్యుల వద్ద మూడేళ్లు సంస్కృతం నేర్చారు. విశిష్టాద్వైత సిద్ధాంతం ప్రకారం మంత్రాలు, అర్థాలు శ్రీ భాష్యం, ద్రావిడ నాలాయిరం, తిరువాయి మొడి మొదలైనవి అధ్యయనం చేసి స్వయంగా నేర్చారు. గోవాడ చేరి 16వ ఏట వివాహమాడారు. భార్య టైఫాయిడ్‌తో మరణిస్తే, తల్లీ మామ్మ బలవంతంపై 22వ ఏట ద్వితీయం చేసుకొన్నారు. కొత్తదంపతులు గాంధీ నిర్మాణ కార్య క్రమాలలో పాల్గొన్నారు. గోవాడ అస్పృశ్యతా ఉద్యమం నిర్వహించి ఇంటిపెరడులోని బావి నీళ్లను ఒక హరిజనుని చేత తోడించుకొని తాగారు. అదొక సాహస విప్లవ చర్యగా ఆనాడు భావించారు. 1929లో లాహోర్ కాంగ్రెస్ సభలకు వెళ్లి వచ్చి ఉన్నవలక్ష్మీ నారాయణ, కొండా వెంకటప్పయ్య, మద్ది సుదర్శనం మొదలైన పెద్దవారితో కలిసి పల్లెలు పట్టణాలలో పర్యటించి ప్రచారం చేశారు.

గోవాడలో బావినీరు కాచి ఉప్పు తయారుచేశారు. ప్రభుత్వం నిర్బంధించి 7-8-1930 నుండి ఏడాదిపాటు జైలులో ఉంచారు. శిక్షను రాజమండ్రి, రాయవేలూరు, కన్ననూరు జిల్లాలో అనుభవిం చారు. సత్యాగ్రహోద్యమంలో చాలా భూములను అమ్మేశారు. మిగిలిన భూమినీ అమ్మేసి వ్యాపారంలో దిగారు. ఎప్పటినుంచి వారిలో ఉన్న వైరాగ్యభావం ఒక్కసారిగా పెల్లుబికటంతో శిష్యగణమూ గణనీయంగా పెరిగింది. ఆధ్యాత్మిక ప్రచారం చేస్తూ కృష్ణమాచార్యస్వామి 1975లో జూలై 25న పరమాత్మలో ఐక్యం అయ్యారు.

## ఆరాధ్య యోగి శ్రీ ముదిగొండ కోటయ్య శాస్త్రి

జన్మ వివరాలు తెలియవు. శైవ ప్రవర్తకులలో ఒకరైన ఉద్భటా రాధ్య వంశంలో ముదిగొండ వీరభద్రయ్యగారి కుమారులే శ్రీ కోటయ్య శాస్త్రి సంస్కృతాంధ్రాలలో పాండిత్యం సంపాదించి శైవమత సంప్ర దాయ గ్రంథాలను అవలోకనం చేసి ఎన్నో గ్రంథాలు రచించారు. అందులో ముఖ్యమైనవి "కృష్ణా పుష్కర మహాత్మ్యం", "శైవ చింతామణి శతకం", "చాణక్య నీతి దర్పణం", "శైవ సర్వస్వం", "దీక్షా కౌముది", ఇవి ఆరాధ్య శైవ విజ్ఞానానికి ప్రామాణిక గ్రంథాలు పరంపరాను గతంగా వస్తున్న శైవ సంప్రదాయాన్ని పరిపోషిస్తూ అనుసరిస్తూ శిష్య బృందానికి బోధిస్తూ జీవితం గడిపారు. ఎందరికో దీక్షనిచ్చిన గురుదేవు లయ్యారు. జీవిత చరమాంకంలో ఇతర సంప్రదాయంలోని సన్యాసా నికి సమానమైన "శివానంద నిరాభారిత" ను అనుష్టించి 1984లో ఆత్మజ్యోతిలో కలసిపోయారు.

## మాతారవిందాశ్రమ యోగి- శ్రీ చలసాని నాగేశ్వరరావు

ఆరు అడుగుల ఆజానుబాహు విగ్రహం, ముఖంపై ఎన్నడూ చెరగని చిరునవ్వు తెల్లని కళ్ళల్లో అపూర్వ ఆధ్యాత్మిక తేజస్సు, మల్లె పూవులాంటి తెల్లని చొక్కా, పైన తెల్ల కండువాతో తమ మనసులోని నిర్మలత్వానికి ప్రతీకగా ఉండేవారు శ్రీ చలసాని నాగేశ్వరరావుగారు. కృష్ణాజిల్లా గుడివాడ దగ్గర శేరి కాల్వపూడి వారి స్వగ్రామం. అక్కడ స్వంత ఖర్చుతో శ్రీ కృష్ణాలయాన్ని నిర్మించి ప్రతి సంవత్సరం శ్రీకృష్ణ సత్యభామా కల్యాణం అత్యంత వైభవంగా జరిపేవారు.

"అయ్యవారు" అని అందరిచే భక్తీ గౌరవాలతో పిలువబడే రావు గారు అద్భుత ఆధ్యాత్మిక సంపన్నులు. మన వేదోపనిషత్తులను, పురా ణాలను పూర్తిగా చదివి అర్థం చేసుకొని, శ్రీ అరవిందుల శిష్యులై, ఆ భావ పరంపరను ఆంధ్ర దేశమంతటా వ్యాప్తి చేసిన మహనీయులు. వివాహమాడకుండా బ్రహ్మచర్యంతో జీవితాన్ని పునీతం చేసుకొన్నారు. సుమారు వందేళ్ల క్రితమే విద్యలో విప్లవాత్మక మార్పులు తెచ్చిన శ్రీ అరవిందుల భావాలకు అనుగుణంగా పామర్రు దగ్గరున్న పెంజెంద్ర గ్రామంలో మొదటగా శ్రీ అరవింద స్కూల్‌ను స్థానికుల తోడ్పాటుతో ఏర్పరచారు. అక్కడ మాతారవిందుల విభూతి మనకు దర్శనమిస్తుంది. ప్రతివారం అక్కడికి వచ్చి శ్రీ అరవింద బోధనలను శిష్యులకూ విద్యార్థులకూ వివరించేవారు. తరువాత శ్రీ యమ్. జనార్దనరావు శ్రీమతి వసంతా దేవి దంపతుల ఆర్థిక సహకారంతో పామర్రు- గుడివాడ రోడ్డులో అడ్డాడకు దగ్గరలో శ్రీ అరవిందా ఇంటిగ్రేటెడ్ స్కూల్‌ను 24-11-1992లో స్థాపించి విద్యా వ్యాప్తికి దోహదం చేశారు.

రావుగారు మాతారవిందుల గ్రంథాలన్నీ పూర్తిగా అధ్యయనం చేసి యే విషయంపైననైనా అనర్గళంగా మృదుమధురంగా మాట్లాడ గలరు. వారి పలుకులు అమృత గుళికల్లా ఉంటాయి. ముఖ్యంగా అరవిందుల "సావిత్రి" గ్రంథంపై సాధికారికంగా వారు ప్రసంగిస్తుంటే మరోలోకంలో విహరించిన అనుభూతి కలుగుతుంది. ఎన్నో గ్రంథా లను తెలుగులోకి అనువదించారు కూడా. నిష్కల్మష, నిర్మల మనసున్న

శ్రీ చలసాని నాగేశ్వరరావు గారు కృష్ణా జిల్లాలోనే కాక యావ దాంధ్రదేశం పర్యటించి అరవింద బోధలను ప్రచారం చేసిన అరవిందా శ్రమ యోగి సుమారు పది సంవత్సరాల క్రితం వారు పరమపదిం చారు. వారి సత్సంగంలో పాల్గొంటే ఆధ్యాత్మిక అనుభూతికి కొదవే ఉండదు. పూర్ణపురుషులు, త్యాగి, యోగి శ్రీ చలసాని నాగేశ్వరరావుగారు.

## పరివ్రాజక శ్రీ శంకరానంద స్వామి

విజయవాడ దగ్గరన్ను పెనమలూరులో "పరమాత్మానందా శ్రమం" పీఠాధిపతులు శ్రీ శంకరానందస్వామి. వీరు కడప జిల్లా భూమానందాశ్రమ పీఠాదిపతులు శ్రీరామ కృష్ణానందగిరి స్వామివారి శిష్యులు. ఏర్పేడు వ్యాసాశ్రమంలో ఋషీకేశ్‌లో కొంతకాలం తపస్సు చేసి 1993 నుండి ఈ ఆశ్రమంలో ఉంటున్నారు. దేశంలోని పరి వ్రాజకులనందరిని ఒకచోట చేర్చి "పరివ్రాజక సదస్సు"ను 25 ఏళ్లుగా నిర్వహించి రజతోత్సవం జరిపిన సనాతన సారధి వీరు. సహస్ర చండీయాగం, శత రుద్రాభిషేకం నిర్వహించారు. తమ ఆధ్యాత్మిక సంపత్తిని గ్రంథాల ద్వారా లోకానికి అందజేసిన మహాత్ములు. శివ గీత వేదాంత గోష్టి, ఉద్ధవ వ్రజ యాత్ర, గోపికా గీతం, దామోదర లీల, ప్రణయ గీత, వేణుగీత రచించారు. పంచోపనిషత్తులను తెలుగు లోకి అనువదించారు. ఇవికాక అమూల్యమైన సాధన పంచక, సప్తశతి మూలంతోపాటు అనేక స్తోత్రాలను రచించారు. పరాత్మానందాశ్రమాన్ని ఇప్పటికీ పరమ వైభవంగా నిర్వహిస్తూ సనాతన ధర్మ ప్రచారం చేస్తున్న యోగిపుంగవులు శ్రీశ్రీ శంకరానంద స్వామి.

## ద్విదండి వేదాంతం శ్రీ రామాచార్య స్వామి-గాయత్రి గురుకులం-ఉయ్యూరు

కృష్ణా జిల్లా ఉయ్యూరుకు దగ్గరున్న కాటూరు గ్రామంలో 1925లో బెజవాడ శ్రీ కనకదుర్గమ్మ దీవెనలతో శ్రీ వేదాంతం సూర్యనారాయణా చార్యులు శ్రీమతి తాయారమ్మ అనే సంపన్న వైఖానస దంపతులకు శ్రీ వేదాంతం శ్రీ రామాచార్యులు ప్రథమ సంతానంగా జన్మించారు. కుటుంబం ఉయ్యూరుకు వచ్చి స్థిరపడింది. తండ్రివద్దనే ఆగమ, సంస్కృత విద్యలో తనకు సాటిఎవరూ లేరని నిరూపించారు. వంశ పారంపర్యంగా వస్తున్న ఉయ్యూరు శ్రీ విష్ణ్వాలయ అర్చక వృత్తిలో రాణిస్తూనే, ఎన్నో క్రతువులు, ప్రతిష్టలు వివాహ ఉపనయాలు దేవతా కళ్యాణాలు, బ్రహోత్సవాలు నిర్వహించి అభిమాన పాత్రులయ్యారు.

1945లో ఉయ్యూరులో"హయగ్రీవ బైండింగ్ వర్క్స్"ను స్థాపించి విద్యార్థులకు గృహస్తులకు ఉపయోగపడ్డారు. కృష్ణ సరస్వతిని వివాహమాడి అయిదుగురు, పుత్రులకు అయిదుగురు పుత్రికలకు జన్మనిచ్చారు. 1947లో శ్రీ విఖనస మహర్షి జయంతిని నిర్వహించి 47 సంవత్సరాలు తండ్రిగారితో కలిసి మహా వైభవంగా నిర్వహించారు. 1953లో "శ్రీ వైఖానస దివ్యసిద్ధాంత వివర్ధనీ మహాసభ" నిర్వహించి రాష్ట్రపతి పురస్కార గ్రహీత శ్రీమాన్ రొంపిచర్ల పార్థసారధి భట్టా చార్యులు వంటిమహానుభావులను ఆహ్వానించి సత్కరించారు.

1969లో "కృష్ణ వేణిగ్రంథమాల"ను స్థాపించి "భారత సావిత్రి, వైఖానస శ్రౌత సూత్రము, కళ్యాణ విధానం, సంకల్ప శ్రాద్ధ విధి మొదలైన అరుదైన గ్రంథాలను ముద్రించి సభ్యులకు అందజేశారు. 1980లో "గాయత్రీ గురుకులం" అనే విద్యాసంస్థను స్థాపించి వైఖానస ఆగమాలతో పాటు వేదం సంగీతం నాట్యం విద్యార్థులకు నేర్పిస్తూ వార్షికోత్సవాలు నిర్వహిస్తూ అందరికి అభిమానపాత్రులయ్యారు. పిల్లలందరికీ విద్యాబుద్ధులు నేర్పి స్వంతకాళ్లపై నిలబడేట్లు చేసి, వివాహాదులు జరిపించి సంతృప్తిచెంది జీవితాన్ని సార్థకంచేసుకొన్నారు.

పరిపక్వ దశలో సన్యాసం స్వీకరించి ద్విదండి వేదాంతం శ్రీ రామాచార్య స్వామి నామధారులై భార్యతో గాయత్రీ గురుకులంలో వాన ప్రస్థాశ్రమంలో దివ్య జీవనం గడుపుతూ 2008లో దివ్య లోకాలకు చేరారు. ఇంతటి సఫల మనోరథ జీవి ఈ ప్రాంతంలో ఎవరూ లేరు.

## నూజివీడు భిక్షాల్ బాబా

యానాదుల కులంలో కృష్ణా జిల్లా ఇబ్రహీంపట్నం మండలంలోని జక్కంపూడి అనే కుగ్రామంలో భిక్షాల్ బాబా 1924లో జన్మించాడు. తండ్రి ఆంజనేయ భక్తుడైన వెంకటపతి.. ఆంజనేయ ధ్యాన్యంతో నిత్యం పరధ్యానంలో ఉండేవాడు. 25వ ఏట నూజివీడులో స్థిరపడి ముప్పై ఏళ్లు ఉండి అవదూతగా ఆత్మ రాముడుగా చింకి బట్టలతో మీసాలూ గడ్డాలతో మహానుభావుడుగా మారాడు. మట్టిపిడతతో వీధుల్లో తిరుగు తుంటే ఆది భిక్షువు అనిపించేవాడు. దగ్గరున్న సూరారంలో పాత శివాలయంలో శివరాత్రి ఉత్సవాలకు వెళ్లటానికి బస్సెక్కితే టికెట్ డబ్బులు లేక దింపేస్తే, దిగి బస్సుకంటే వేగంగా నడిచి చేరాడు. ఇలాంటి విశేషాలెన్నో చూపించాడు. ఎప్పుడూ చేతిలో ఉండే మట్టి పిడత కిందపడి పగిలిపోయిన కొద్ది రోజుల్లోనే భిక్షాల్ బాబా 2-3-1979న దేహం చాలించాడు.

## కృష్ణాజిల్లాలో మరికొన్ని ఆశ్రమాలు

కృష్ణా జిల్లాలో చాలా ఆశ్రమాలున్నాయి. వాటిని ఏర్పాటు చేసి

అందులో సనాతన భారతీయ ధర్మాలను బోధిస్తూ సంచారం చేసి జనాలకు జ్ఞాన బోధగావిస్తూ ఆర్ష ధర్మంపై గ్రంథాలు రచించి భక్తులకు అందిస్తూ, యజ్ఞ యాగాది క్రతువులను నిర్వహించి ప్రకృతిలో సమతుల్యతకు తోడ్పడిన యోగీశ్వరులు ఎందరో ఉన్నారు. కాని వారి జీవితచరిత్ర అలభ్యం వారిని స్మరించటం మన ధర్మం. అలాంటి వారిలో విజయవాడ ఊర్మిళా నగరలో ఉన్న రామానంద యోగా శ్రమం, అవధూత అమ్మ, కైకలూరు దగ్గర బొమ్మనంపాడులోని ఓంకారాశ్రమంకు చెందిన శ్రీ రామయోగి (1922-1967), ఇందు పల్లిలోని శ్రీమతి ప్రభావతి దేవి, జగ్గయ్య పేట దగ్గరున్న బలుసు పాడులో ఉన్న శ్రీ ఆంజనేయ ఉపాసకులైన శ్రీ రమణదాసుగారు, జగ్గయ్య పేట సీతారామపురంలోని బోధానంద స్వామి అనే రాఘవా పురుపు తిరుపతిదాసు, మచిలీపట్నంలో శ్రీ రంగావధానులుగారు (1868-1948), గాయత్రీ పీఠాధిపతి శ్రీ విద్యా శంకర భారతీ స్వామి, రంగావధూత, వీరంకిలాకు సమీపాన అగినిపర్రులోని భారతీ గీతాశ్రమంకు చెందిన మాతా శుద్ధానందగిరి స్వామిని, నందిగామ దగ్గర అంబాజీ పేటలో శ్రీ బోధానందగిరి స్వామి సమాధి ఆశ్రమం, ముప్పాళ్లలో శ్రీమతి సరస్వతి లక్ష్మమ్మ, కలిదిండికి దగ్గర కొండంగికి చెందిన శ్రీ సత్య బాల యోగి, పెనమలూరు మండలం పెదపులిపాకకు చెందిన శ్రీ వాసుదేవానంద గిరి స్వామి, ఘంటసాల దగ్గర తాడేపల్లి లోని మళయాళాశ్రమానికి చెందిన శ్రీ నారాయణానంద గిరి స్వామి, ఉయ్యూరు దగ్గరున్న గరికపర్రుకు చెందిన శ్రీ అచ్యుతానందగిరిస్వామి, శ్రీ స్కంద దేవానందగిరి స్వామి, గన్నవరానికి చెందిన శ్రీ విద్యానంద భారతీ స్వామి మొదలైన వారెందరో ఉన్నారు.

ఇవికాక శ్రీ మళయాళస్వామి ఆశ్రమాలు కూడా ఉన్నాయి. అందులో మచిలీపట్నం దగ్గర ఉల్లంగిపాలెం అన్నపూర్ణాశ్రమం, పెద పాడు వద్ద అసంగాశ్రమం, పత్తేలంక వద్ద బ్రహ్మరుష్యాశ్రమం, కొడాలి లోని పెద్దాశ్రమం, చిన్నాశ్రమం, ముదినేపల్లి దగ్గర వణుదూరులోని మళయాళ సద్గురు రాధాకృష్ణాశ్రమం ఉన్నాయి. ఈ ఆశ్రమాధిపతులు ఎంతో ధార్మిక ప్రచారం నిర్వహించి సమాజహితం కోసం కృషి చేసిన మహనీయులే. వారి స్మరణ మనకు స్ఫూర్తిదాయకం.

## అమ్ముల విశ్వనాథ భాగవతార్

హరికథావిధియందు అతుల ప్రతిభఁజూప
'రాజహంస' బిరుదు ప్రాప్తమయ్యె
మార్దంగి కునిగాను మన్ననలందుచు
హరికథల్ రచియించి యశము నొందె
'ఆనందవర్ధన' మను దివ్యరచనతో
ఘన నాటకపు సంస్థ కాన్కలొందె
'రాష్ట్రపతి'యె మెచ్చ రమ్యగాన మొనర్చి
స 'త్కళా పూర్ణు'డై సాగిపోయె
'సర్వరాయ'స్కూలు సరిప్రిన్సుపాలౌచు
తెలుగు సభలయందు వెలుగులీనె
అమృత కళల సాధు 'వమ్ముల విశ్వనాథ్'
కీర్తికళల రాణి! కృష్ణవేణి !

- స్మితశ్రీ చింతపల్లి నాగేశ్వరరావు

చిరునామా : గబ్బిట దుర్గా ప్రసాద్, సరసభారతి అధ్యక్షులు, 2-405 శివాలయం వీధి- ఉయ్యూరు, కృష్ణాజిల్లా-521165

శ్రీ గాజుల సత్యనారాయణ

# కృష్ణాతీరంలో ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలు

కృష్ణాజిల్లా, విజయవాడ పట్టణమునందు కృష్ణాతీరమున, ఇంద్రకీలాద్రి పర్వతంపై వేంచేసియున్న కనక దుర్గమ్మ గొప్ప మహిమలు గల తల్లి. ప్రతి సంవత్సరం ఆశ్వయుజమాసంలో శుద్ధ పాడ్యమి మొదలుకొని దశమి వరకూ శ్రీ దుర్గా దేవికి నవరాత్రి మహోత్సవాలు కనుల పండుగగా దేశమంతా ఘనంగా, అంగ రంగ వైభవంగా జరుపుకుంటారు. ఈ నవరాత్రులలో అమ్మ వారిని తొమ్మిది రోజులు తొమ్మిది రకాల అవతార మూర్తులుగా అలంకరించి ప్రతి అవతారానికి విశేష పూజలు, అర్చనలు జరుపుతారు. దశమినాడు శ్రీ రాజరాజేశ్వరీ దేవిగా కనక దుర్గాదేవిని అలంకరించి అర్చిస్తారు. ఈ తొమ్మిది రోజులు రోజుకొకరి చొప్పున రాక్ష సులను సంహరించి దశమి రోజున శ్రీ రాజరాజేశ్వరీ దేవిగా భక్తులకు ఈ అమ్మవారు దర్శనమిస్తారు.



## ఇంద్రకీలాద్రి చరిత్ర

కనకదుర్గామాత ఇంద్రకీలాద్రిపై వెలసి ఉండడానికి ఒక కథ ఉంది. పూర్వము దుర్గామాత ఆలయం ఉన్న కొండను ఇంద్రకీలాద్రి అంటారు. ఈ పర్వతాన్ని అధిష్టించినవాడు ఇంద్రకీలుడు అనే యక్షుడు. అతడు ప్రతిరోజు కృష్ణవేణీ నదిలో స్నానం చేస్తూ నదికి ఉత్తరభాగంలో తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. అతని తపస్సుకు మెచ్చి పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై వరం కోరుకోమన్నారు. పార్వతీ పరమేశ్వరులకు తాను ఆసనం అయ్యే భాగ్యం ప్రసాదించాల్సిందిగా ఇంద్రకీలుడు వరం కోరాడు. 'తథాస్తు' అన్నారు పార్వతీ పరమేశ్వరులు. అతని కోరిక తీర్చడానికి మహిషాసుర సంహారానంతరం కనకదుర్గామాత ఇంద్రకీల పర్వతంమీద ఆవిర్భవించింది. ఇక్కడ దుర్గాదేవి ఎనిమిది చేతుల్లో ఎనిమిది ఆయుధాలు కలిగి, సింహాన్ని అధిష్ఠించి, మహిషాసురున్ని శూలంతో పొడుస్తూ ఉన్నట్లు మనకు కనిపిస్తుంది. అరి, శంఖ, కేత, శూల, పాశ, అంకాశ, మౌర్వి, శానకాలనేవి దుర్గాదేవి ఎనిమిది చేతులలో ధరించే ఎనిమిది ఆయుధాల పేర్లు. ఈ దేవి మూర్తికి ఎడమ భాగంలో శ్రీచక్రం స్థాపించబడి ఉంది. ఆ శ్రీచక్రానికి ప్రక్కన గణపతి దేవతామూర్తి కొలువై ఉన్నారు. ఈ కనక దుర్గ అమ్మవారి ఆలయంలో జరిగే పూజలన్నీ శ్రీ చక్రానికి జరుగుతాయి. ఇదొక ప్రత్యేకత.

## శక్తిపీఠంగా విజయవాడ

దక్షుణి యజ్ఞశాలలో పార్వతీదేవి యోగాగ్నిలో దూకి శరీరత్యాగం చేయగా పరమశివుడు వివశుడై ఆ దేవి కళేబరాన్ని భుజం మీద ఎత్తుకొని సంచారం చేస్తుండగా మహావిష్ణువు తన ఆయుధంతో ఆ కళేబరాన్ని ఖండఖండాలు చేశాడని, ఆ ఖండాలు 51 అని అవి పలుస్థానాల్లో పడ్డాయని, అవన్నీ శక్తి పీఠాలని, వాటిలో 18 ముఖ్యమైనవి కాగా, మిగిలిన శక్తిపీఠాలలో విజయవాడ ఒకటని చెబుతారు. 10వ శతాబ్దంలో పశ్చిమ చాళుక్య రాజైన త్రిభువనమల్లు ఈప్రాంతంను పాలించాడని చరిత్ర తెలియజేస్తుంది. యుద్ధ మల్లుని బెజవాడ శాసనం చాలా ప్రాచీనమైంది. క్రీస్తు శకం 927 మొదలు 934 వరకు ఇతడు రాజ్యపాలన చేశాడు. ఆనాడు విజయవాడకు రాజేంద్ర చోళపురమనే పేరు కూడా ఉంది. మొగలి తామ్రశాసనం ప్రకారం శ్రీసింగభూపాలుడు, శ్రీకృష్ణదేవ రాయలు, విజయవాడ శ్రీ కనకదుర్గామల్లేశ్వరులకు అంగరంగ వైభోగ మంటపాలతో దేవాలయం అభివృద్ధి చేసి,నిత్యకైంకర్యానికి దానపట్టాలు ఇచ్చినట్లు తెలుస్తుంది.



కృష్ణానదీ తీరంలో విజయవాడలో ఇంద్రకీలాద్రి పర్వతంపై వేం చేసి ఉన్న శ్రీ కనకదుర్గాదేవి స్వయంభువు. ఈ ఆలయంలో శ్రీ చక్రం ఉంది. ఈ శ్రీచక్రానికి అగస్త్యులవారు తమ తపఃఫలాన్ని ధార పోశా రనీ, ఆదిశంకరులు విచ్చేసి శ్రీ చక్రంలోని రౌద్ర బీజాలు తొలగించిన పిదప దుర్గామాత శాంతమూర్తి అయి తనను దర్శించే భక్తుల అభీష్టాలు నెరవేరుస్తున్నదని చెబుతారు.

## మల్లేశ్వరుడు- మల్లికార్జునుడు :

పరమ పవిత్రమైన ఈ ఇంద్రకీలాద్రి మీద బ్రహ్మాది దేవతలందరి కోరిక మీద దుర్గాదేవి మహిషాసురమర్థినీ రూపంతో అవతరించింది. కనక ప్రభలతో వెలుగొందుతున్న ఆ దేవి కాల క్రమంలో కనకదుర్గగా కీర్తించబడింది. అలాంటి ఇంద్రకీలాద్రి మీద పరమేశ్వరుణ్ణి కూడా కొలువుండేలా చేయాలనే సత్సంకల్పంతో బ్రహ్మదేవుడు పరమనిష్ఠతో శతాశ్వమేథ యాగాన్ని చేయగా, అతని భక్తి శ్రద్ధలకు మెచ్చిన పరమే శ్వరుడు జ్యోతిర్లింగ స్వరూపంతో ఆ చతుర్ముఖునికి దర్శనమిచ్చాడు. ఇలా ఇంద్రకీలాద్రి మీద దివ్యజ్యోతిర్లింగ స్వరూపుడై నిలిచిన పరమే శ్వరుణ్ణి బ్రహ్మదేవుడు మల్లిక పుష్పాలతో భక్తిగా అర్చించాడు. అలా భక్తిగా తనని అర్చించిన బ్రహ్మ దేవుడి భక్తిశ్రద్ధలకు సంతోషించిన పరమేశ్వరుడు ఆయనకు బ్రహ్మలోకాన్ని ప్రసాదించాడు. ఆవిధంగా బ్రహ్మదేవుడిచేత ప్రథమంగా మల్లికార్జున (మల్లికా) పుష్పాలతో అర్చించబడిన కారణంగా ఆ స్వామికి మల్లికేశుడు అనే పేరు వచ్చింది. అనంతరం బ్రహ్మదేవడు ఈ కొండపైన శ్రీ దుర్గా మల్లేశ్వరస్వామి వార్ల కళ్యాణం జరిపించాడు. ఆ సాంప్రదాయం నేటికీ కొనసాగు తోంది. శ్రీ కనకదుర్గమ్మ తల్లి వెలిసిన ప్రాంతానికి ఉత్తరంగా ఈ మల్లేశ్వరస్వామి వెలిసిన నాటినుంచీ బ్రహ్మేంద్రాది దేవతలచేత సైతం పూజలందుకుంటున్నారు. కాలక్రమంలో కలిప్రభావం వల్ల ఈ జ్యోతిర్లింగం అంతర్నిహితమై (అదృశ్యంగా) ఉండటాన్ని గమనించిన శ్రీ శంకరాచార్యుల వారు కనక దుర్గాదేవికి ఉత్తర భాగంలో మల్లేశ్వర లింగాన్ని పునః ప్రతిష్టించారు. ఆనాటి నుంచీ మల్లేశ్వరస్వామి కూడా ఎంతో వైభవంతో భక్తులందరిచేత అర్చించబడుతున్నాడు. అయితే ఈ మల్లేశ్వరస్వామికి దక్షిణంగా శ్రీ కనకదుర్గా అమ్మవారు కొలువున్న కారణంగా శ్రీ కనకదుర్గ క్షేత్రంగా లోకంలో ఇది ప్రసిద్ధి చెందింది.

## మాచవరం దాసాంజనేయస్వామి - విజయవాడ

విజయవాడలోని ఏలూరు రోడ్డు మాచవరం ప్రాంతమునందు శ్రీ దాసాంజనేయ స్వామివారి ఆలయం కలదు. విజయవాడ పట్టణం లోనే కాక రాష్ట్రంలోని నలుమూలల నుండి భక్తులు అమితంగా కొలిచే దేవాలయాల్లో మాచవరంలోని శ్రీ దాసాంజనేయస్వామి ఆలయం ప్రముఖంగా పేర్కొనవచ్చు. ఈ ఆలయానికి ఒక ప్రత్యేక చరిత్ర ఉంది.



పూర్వం వ్యాసరాయలనే ఆంజనేయుని భక్తుడు పాదచారిగా పర్యటిస్తూ తాను బసచేసిన ఊళ్ళలో ఆంజనేయుని విగ్రహాలను ప్రతిష్టించేవాడని, ఆ పర్యటనలో భాగంగా విజయవాడ చేరుకొని ఆంజనేయస్వామి ప్రేరణపై ప్రస్తుతం ఉన్న శ్రీ ఆంజనేయస్వామి ఆలయ ప్రాంతానికి వచ్చి అక్కడ శంఖు-చక్రాదులతో తనకి లభించిన స్వామివారి విగ్రహాన్ని ప్రతిష్టించి శ్రీ దాసాంజనేయస్వామి ఆలయాన్ని నిర్మించారని తెలు స్తుంది. ఈ ఆలయంలో పూజలు నిర్వహిస్తే భక్తుల కోర్కెలు శీఘ్రంగా నెరవేరుతాయని విద్యా, ఉద్యోగ, వ్యాపారాల్లో అన్నింటా కూడా విజయం చేకూరుతుందని భక్తుల ప్రగాఢ నమ్మకం.

## త్రిశక్తిపీఠం - విజయవాడ

విజయవాడలోని పండిట్ నెహ్రూ బస్టాండ్ ప్రక్కన గల త్రిశక్తిపీఠం అనే దేవీ ఆలయం నగరంలోని ప్రసిద్ధ ఆలయాల్లో ఒకటి. మొదట 1947వ సంవత్సరంలో ఇక్కడ కాళీమాత విగ్రహం అతివైభ వంగా ప్రతిష్ఠాపన జరిగింది. ఆనాటినుండి భక్తులను విశేషంగా ఆకర్షిస్తున్న ఈ ఆలయం, 19 89వ సంవత్సరంలో త్రిశక్తి పీఠంగా రూపుదిద్దుకొని భక్తులను మరింతగా ఆకర్షిస్తున్నది. త్రిమా తలు ఇచ్ఛాక్రియాజ్ఞాన శక్తికి ప్రతీక లైన శ్రీమహాకాళి, శ్రీమహాలక్ష్మీ,



శ్రీమహాసరస్వతి అమ్మవార్ల దివ్య మంగళరూపాలు దేదీప్యమానమైన విగ్రహాలతో ఈ ఆలయం విలసిల్లుతోంది. ఈ ముగ్గురు మూర్తులలో శ్రీమహాకాళి స్వయంభూ శక్తిగా వెలసిన తల్లిని నెల్లూరు పరిసరా రణ్యముల నుండి 1941వ సంవత్సరంలో ఇక్కడకు తెచ్చి అక్కడ ఉన్న చిన్న ఆలయంలో ప్రతిష్ఠించారు. ఆ తరువాత 1989వ సంవ త్సరంలో భక్తుల కోరిక మేరకు అధునాతన ఆలయ సముదాయంగా ఆలయ ఆధ్యాత్మిక సలహాదారులచే పునఃప్రతిష్ఠ గావింపబడి వేలాది

భక్తుల మనోభీష్టం నెరవేర్చుచున్నది. దసరా పండుగరోజుల్లో ఈ త్రిశక్తి పీఠంలో ప్రత్యేక పూజలు నిర్వహించడం ప్రతీకగా వస్తుంది. నిత్యం భక్తులతో కళకళలాడే ఈ ఆలయంలో నిత్య పూజలతో పాటు, ప్రత్యేకపూజలు, దసరా పండుగ పర్వదినాలలో గొప్ప ఉత్సవాలు జరుగును.

### ఆంధ్ర మహావిష్ణువు - శ్రీకాకుళం

కృష్ణాజిల్లా, విజయవాడకు సుమారు 65 కి.మీ., దూరంలో ఘంటసాల మండలంలో, దివిసీమలో కృష్ణానదీ తీరాన, శ్రీకాకుళం అనే గ్రామంలో ఆంధ్ర మహా విష్ణువు ఆలయం కలదు. ఇది చాలా



ప్రాచీన ఆలయం. ఈ విష్ణువుని తొలుత బ్రహ్మ యే ప్రతిష్ఠించి పూజించాడు. ఇచ్చట ప్రతిష్ఠింపబడిన శ్రీమహా విష్ణువు శ్రీకాకు ళేశ్వరుడన్న పేరుతో ప్రఖ్యాతి గాంచాడు. ఇంకా ఈ స్వామి వారిని ఆంధ్ర విష్ణువు, ఆంధ్రనాయకుడు మొద లగుపేర్లతో పిలువబడి నాడని పురాణాల ద్వారా తెలియ జేయు చున్నది. శ్రీకాకు ళంలో స్వామివారు స్వయంభువుగా వెలసి భక్తుల పాపాలను హరిస్తున్నాడని భక్తుల నమ్మిక.

అయిదు అంతస్తుల ఎత్తయిన రాజగోపుర స్థంభం మీదగల శాసనం ద్వారా ఈ గోపురమును చోళరాజైన అనంత దండపాలుడు శాలివాహనశకం 1081లో నిర్మించాడని తెలియుచున్నది. తరువాత శ్రీకృష్ణదేవరాయలు క్రీ.శ.1519లో ఇచటకు వచ్చి ఇచటగల మండ పమునందు కూర్చుండి స్వామిని స్మరిస్తూ ఆముక్తమాల్యద గ్రంథాన్ని రచించాడని తెలియుచున్నది. స్వామివారి ఉత్తరభాగ ఉపాలయంలో భూసమేత చెన్నకేశవస్వామివారు కొలువై ఉన్నారు. ఈ ఆలయంలోని నిత్యాగ్నిహోత్రం ఒక ప్రత్యేకత. ఏనాడో వెలిగించిన హోమ గుండంలోని అగ్నిహోత్రం ఈనాటికీ సంరక్షించబడటం ఆలయంలో కనిపిస్తుంది.

వైకుంఠ ఏకాదశినాడు శ్రీరాజ్యలక్ష్మీ సమేత శ్రీకాకుళేశ్వర స్వామిని ఉత్తరద్వార దర్శనం చేసుకుంటే పుణ్యలోక ప్రాప్తి కలుగుతుందని చెబుతారు. ప్రతీఏటా వైశాఖమాసంలో బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. ఆ సమయంలో చుట్టుప్రక్కల జిల్లాల నుంచి పెద్ద ఎత్తున భక్తులు తరలి వస్తారు.

### శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి - మోపిదేవి

కృష్ణాజిల్లా దివిసీమకు చెందిన ఒక మండలము మోపిదేవి. మచిలీపట్నం నుండి 30 కిలోమీటర్ల దూరంలో ఉన్నది. ఇక్కడ ప్రసిద్ధ శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి ఆలయం ఉన్నది. దీనికి మోహిని



పురమని సర్పక్షేత్రమని పేరు. కాలక్రమేణా అది మోపిదేవిగా నామాంతరం చెందింది. ఇచ్చట సుబ్రహ్మ ణ్యేశ్వర స్వామి లింగరూ పంలో ఉండుట ఈ క్షేత్రం యొక్క విశిష్టత. స్వామివారి పానపట్టం వద్ద ఉన్న ఒక కన్నంలోనుండి సంవత్సరంలో ఒకసారి నాగుపాము బయటకు వచ్చి భక్తులకు దర్శనమిస్తుందని ఇది ఒక విశేషముగా చెబుతారు. గర్భగుడిలో పాము చుట్టలమీద లింగం ఉంటుంది. ఇదే పానమట్టం. స్వామికి వేరే పానమట్టం ఉండదు. ఇచట లింగరూపము వృత్తాకారంలో కాక పలకగా ఉండుట ఒక విశేషము. తూర్పు ముఖంగా ఉన్న ఈ ఆలయంలో గర్భగృహమునందు శ్రీ వల్లీదేవసేన సమేత శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుడు వారికి కుడివైపున పుట్టపూజ నాగేశ్వరుడు దర్శనమిస్తారు.

### శ్రీ దుర్గా నాగేశ్వరస్వామి - పెద్దకళ్ళేపల్లి

కృష్ణాజిల్లా, మచిలీపట్నం నుండి 35 కి.మీ. దూరంలో చల్లపల్లికి 10 కి.మీ. దూరంలో ఉన్న పెద్దకళ్ళేపల్లిలో ఈ ఆలయం ఉంది.



పవిత్ర కృష్ణవేణి తీరాన కొలువైన ఈ తీర్థక్షేత్రాన్ని నాగేశ్వర క్షేత్రమనీ, కర్ణాటక క్షేత్రమనీ కూడా అంటారు. ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలలో పెద్దకళ్ళే పల్లి ఒకటి. దీనికే కదళీపురమని కూడా మరో పేరు. ఈ తీర్థానికీ, కాశీ తీర్థానికి చాలా పోలికలు న్నాయి. అక్కడ గంగవలె ఇక్కడి కృష్ణకూడా ఉత్తరవాహిని, అక్కడ ఉన్నట్టే ఇక్కడ కూడా కాలభైరవు డున్నాడు. ఈ ఆలయానికి క్షేత్ర పాలకుడు మదన గోపాలస్వామి. ఈ క్షేత్రములోని లింగము కర్కోటకము అనే సర్పరూపమున స్ఫటిక లింగముగా దర్శనమిస్తుంది. ఇక్కడ స్వామివారు స్వయంభువు. ఈ ఆలయం క్రీ.శ. 1292వ సం॥లో సోమశివాచార్యులనే శివభక్తుడి చేత నిర్మించబడి నేటికీ నిత్యకల్యాణం పచ్చతోరణంలాగా విరా జిల్లుతోంది. ఇచట ప్రతిరోజు అర్చనలు, ప్రత్యేకపూజలు జరుగును. ఉగాది పర్వదినాన, శ్రావణ పౌర్ణమి రోజున లక్ష కుంకుమార్చన, శ్రీకృష్ణ జన్మాష్టమి, ఆశ్వీయుజ మాసంలో అమ్మవారి ఉత్సవాలు, కార్తీక మాసంలో అఖండ దీపారాధన, ఆరుద్రోత్సవాలు ఘనంగా

నిర్వహిస్తారు. మహాశివరాత్రి రోజున స్వామి వారి కల్యాణోత్సవం, రథోత్సవం ఘనంగా జరుగుతాయి.

## భవానీ ముక్తేశ్వరాలయం - ముక్త్యాల

కృష్ణాజిల్లా, జగ్గయ్యపేట మండలం, జగ్గయ్య పేటకు 13 కి.మీ. దూరంలో శ్రీ భవానీ ముక్తేశ్వరాలయం ఉంది. ఇది చాలా ప్రాచీనమైన శైవక్షేత్రము. ఈ క్షేత్రంలోని స్వామి గొప్ప మహిమాన్వితుడు. కృతయుగంలో బలిచక్రవర్తి తపస్సుకుమెచ్చి ప్రత్యక్షమైన శివుడు మరకత లింగ స్వరూపుడై ముక్తేశ్వరుడిగా కృష్ణానది గర్భాన వెలిశాడు. ముక్తేశ్వరలింగంగా పిలువబడిన ఈస్వామి ఆలయం విశ్వ కర్మచే నిర్మించబడినట్లుగా చెబుతారు. సంవత్సరంలో 6 నెలల పాటు నదిలో మునిగే ఉంటుంది. అందువలన మరలా బలిచక్రవర్తి ప్రార్థన మేరకు భూమిపై స్ఫటిక లింగరూపంలో పరమ శివుడు వెలిశాడు. ఈ భవానీ ముక్తేశ్వర స్వామికి మాఘ బహుళ చతుర్దశి మహాశివరాత్రి నాడు కళ్యాణోత్సవం వైభవంగా జరుగుతుంది. కార్తీక మాసంలో విశేష పూజలు ఘనంగా జరుగుతాయి.



## శ్రీ జ్వాలా నారసింహ క్షేత్రం - వేదాద్రి

కృష్ణాజిల్లాలో జగ్గయ్యపేట మండలంలో చిలకల్లుకు 10 కి.మీ. దూరంలో కృష్ణానదీ తీరాన వేదాద్రి అనే గ్రామములో పర్వత పాద భాగాన శ్రీ జ్వాలా నరసింహక్షేత్రం కలదు. ఇది చాలా ప్రాచీన ఆలయము. ఈ ప్రదేశంలో కృష్ణానది ఉత్తరవాహినిగా ప్రవహిస్తుంది. ఇచ్చట నరసింహస్వామి పంచ రూపాత్మకుడై జ్వాలా సాలగ్రామ వీర యోగానంద లక్ష్మీనరసింహ స్వామి వారిగా సేవలందుకొను చున్నాడు. ఈ ఆలయం 12వశతాబ్దంలో కానీ, 13వ శతాబ్దంలోగానీ నిర్మించినట్లు చరిత్ర తెలియ జేయుచున్నది. శ్రీ లక్ష్మీనరసింహస్వామివారికి ప్రతి సంవత్సరం వైశాఖశుద్ధ ఏకాదశి మొదలు పంచాహ్నికంగా తిరుకల్యాణం ఘనంగా నిర్వహించబడుతుంది.



## శ్రీ వేణుగోపాల స్వామి - నెమలి

కృష్ణాజిల్లాలోని గంపలగూడెం మండలంలో ఈ నెమలి అనే గ్రామం ఉంది. ఇక్కడి ఆలయంలోని స్వామి శ్రీ వేణుగోపాలస్వామి త్రిభంగి ఆకృతిలో వ్యత్యస్త పాదారవిందుడై (ఎడమ పాద ముపై నిలబడి, కుడి పాద మును ఎడమ పాదము పై నుండి మునివేళ్ళపై నిలిపి) సన్నని నడుము, విశాలమైన నేత్రాలతో, తిరునామంతో, మౌళిపై ఫించంతో, చిరు నవ్వులు చిందిస్తూ వయ్యా రంగా నిలిచి మురళి వా యించుచున్న భంగిమలో స్వయంభువుగా వెలసి, భక్తుల కోర్కెలు తీరుస్తూ నిత్యపూజలు అందుకొంటున్నాడు. విగ్రహం అంతా సాలగ్రామ శిల అవ్వటం వలన నీలము, నలుపు కలసిన విచిత్ర కాంతితో ప్రకాశిస్తుంటుంది. శ్రీకృష్ణుడు ద్వాపరంలో తన అవతారం చాలిస్తూ, తన నెమలి పింఛాన్ని ఇచట వదలినాడని, అదే చోట తను విగ్రహ రూపాన్ని ధరించి భూగర్భంలో ఉండగా,ఆ వేణు గోపాల స్వామిని ఎందరో మహనీయులు యోగదృష్టితో దర్శించి తరించారని ప్రతీతి. నెమలి గ్రామానికి చుట్టు ప్రక్కలనున్న అరవై గ్రామాలవారు, తమ ఇలవేల్పుగా స్వామిని అర్చిస్తూ, ఏ శుభకార్యం జరిగినా స్వామికే తొలి నివేదన సమర్పించుకుంటారు. నెమలికి ఉత్తరంగా కిలోమీటరు దూరంలో ఏరు ప్రవహిస్తోంది. ఈ జలంతో స్వామినభిషేకించి, తీర్థం ఇస్తారు. ఈ జలం అన్నివ్యాధులను నయం చేస్తుందని భక్తుల నమ్మకం.



## శ్రీవేణుగోపాలస్వామి ఆలయం - మొవ్వ

కృష్ణాజిల్లాలో దివిసీమయందుగల మొవ్వ గ్రామంలో శ్రీ వేణు గోపాలస్వామివారి ఆలయం కలదు. ఇది ప్రాచీన ఆలయము. స్థల పురాణం మాత్రం ఇది మౌద్గల్య మహాముని కాలంలో నిర్మాణమైనదని తెలియుచున్నది. స్థలపురాణమును అనుసరించి ఈ ప్రాం తమంతా ఒకప్పుడు అరణ్యంగా ఉండేది. ఆ అరణ్యంలో మౌద్గల్య మహాముని తపం చేసి కొనుచుండేవాడు! అతడచట తపం చేసి కొనుచు, ఆ ఇసుకతో ఒక వేణుగోపాలస్వామి విగ్రహాన్ని సృజించి ఆచట ప్రతిష్ఠించి ఆరా



ధించుచుండేవాడు. ఆ కాలంలో ఆలయానికి దగ్గరలో ఒక బ్రాహ్మణపల్లె ఉండేది. ఆ పల్లెలో వరదయ్య అనే బ్రాహ్మణ బాలకుడొకడుండేవాడు. ఇతడు అన్నమాచార్యుల తరువాత కాలంవాడు. త్యాగరాజు మొదలైన వాగ్గేయకారులకంటే సుమారు రెండు వందల సం॥ల ముందువాడు. వరదయ్య బ్రాహ్మణ కుటుంబంలో పుట్టినా యవ్వనకాలం వరకూ అల్లరిచిల్లరగా ఉండేవాడు. ఊరివారందరూ అతనిని తేలికగా చూచే వారు. ఒకరోజున మౌద్గల్య మహాఋషి వరదయ్యను చూసి, ఆయన వరదయ్యలో అంతర్లీనంగా గొప్ప తేజస్సు ఉందని గ్రహించి అతనికి ఒక మంత్రం ఉపదేశించాడు. ఆరోజునుంచి వరదయ్యలో గొప్పమార్పు వచ్చింది. కొద్ది కాలంలోనే గొప్ప వాగ్గేయకారుడయ్యాడు. మువ్వ గోపాలుడు మీద అనేక శృంగార పదకవితలువ్రాసి, స్వామికి అంకితం చేశాడు.

## శ్రీ రామలింగేశ్వరస్వామి - యనమలకుదురు



శ్రీరామలింగేశ్వర స్వామి వారి ఆలయం కృష్ణానది ఒడ్డునే యనమలకుదురు అనే గ్రామములో "మునిగిరి" అని పిలువ బడే 612 అడుగుల ఎత్తైన పర్వతం పై స్వయంభువుగా వెలసినది. త్రేతా యుగంలోని శ్రీరామ చంద్రమూర్తి సీతా సమేతుడుగా ఈ స్వామి వారిని దర్శించినట్లు స్థలపురాణం చెబుతుంది. విజయవాడ బెంజిసర్కిల్ నుండి మూడు కిలోమీటర్ల దూరంలో ఈ ఆలయం ఉన్నది. పడమట సెంటరు నుండి యనమలకుదురుకు రోడ్డు సౌకర్యం కలదు. ఇది విజయవాడలో పేరుగాంచిన శివాలయములలో ప్రముఖమైనది.

## శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయం - మంటాడ

కృష్ణాజిల్లా, మంటాడలో శ్రీ వేంకటేశ్వరస్వామి వారి ఆలయం ఉన్నది. ఈ ఆలయంలో కొలువైన శ్రీ వేంకటేశ్వర స్వామిని భక్తులు కళ్యాణ వేంకటేశ్వరస్వామిగా పిలుస్తారు. ఈ ఆలయం అతి మహిమాన్వితమైనదిగా భక్తులు చెబుతారు. ఒకే ప్రాంగణంలో గల రెండు దేవాలయాలలో ఒకే భగవంతుని విగ్రహం కలిగి ఉండటం ఈ ఆలయం యొక్క విశిష్టత. ఆలయంలోకి ప్రవేశించిన భక్తులకు ముందుగా ధ్వజస్తంభం దర్శనమిస్తుంది. గర్భాలయం ముందు



ద్వారపాలకులైన జయ విజయులమూర్తులు దర్శన మిస్తారు. గర్భాలయంలో అలమేలు మంగ, పద్మావతి సమేత శ్రీ వేంకటేశ్వరస్వామి సర్వాలంకార భూషితుడై భక్తులకు దర్శనమిస్తున్నాడు. ఈ ఆలయ ప్రాంగణంలో నాగేంద్రస్వామిపుట్ట ఉంది. సంతానం లేనివారు ఇక్కడికి వచ్చి ఈ నాగేంద్రస్వామికి పూజలు జరుపుతారు. నాగులచవితి, నాగుల పంచమికి భక్తుల రద్దీ ఎక్కువగా ఉంటుంది.

## శ్రీ అమరేశ్వరస్వామి ఆలయం - అమరావతి

గుంటూరుజిల్లాలో కృష్ణానదీ తీరాన గల అమరావతి గ్రామము నందు ఈ అమరేశ్వరుని ఆలయం కలదు. ఇది చాలా ప్రాచీనమైన ఆలయము. నాల్గువైపుల మహోన్నతమైన గోపురాలతో విరాజిల్లే ఆలయం శ్రీ అమరేశ్వర స్వామి వారి నిలయం. చారిత్రాత్మక ప్రసిద్ధ పౌరాణిక పుణ్యస్థలం ఈ అమరావతి. కృష్ణవేణీ నదీ తీరమున త్రినేత్రుడైన స్వామివారు మూడు గొప్ప ప్రాకారాములతో నిర్మించిన మహాక్షేత్రంలో కొలువుదీరి భక్తులు కోరిన కోర్కెలు తీర్చే అమరేశ్వరుడుగా కొలువై ఉన్నాడు. ఈ ఆలయానికి నాలుగువైపుల నాలుగు గాలిగోపురములు కలవు. తూర్పువైపు గాలిగోపురం నుండి ఇరవై గజముల దూరంలో కృష్ణా ప్రవాహము వద్దకు పోవుటకు దారి కలదు. దక్షిణవైపు గాలిగోపురం ద్వారానే ఎవ్వరైననూ ఆలయం లోపలకు ప్రవేశించవలయును. ఈ ప్రధాన గోపురం ఎదురుగా పెద్దవీధి (రాజమార్గం) ఉన్నది. కృష్ణా నదిలో స్నానమాచరించి శుభ్రమైన వస్త్రం ధరించి అమరేశ్వరమూర్తికి చేతులెత్తి నమస్కారంచేసి, దక్షిణదిక్కు గాలిగోపురం నుండి ప్రదక్షిణ రీతిలో బయలుదేరినచో వరుసగా మనకు ప్రణవేశ్వరుడు, శంకరాచార్యులు, కాశీ విశ్వేశ్వరుడు,



ఉమామహేశ్వరుడు, దత్తాత్రేయుడు, రుద్రపాదములు, జ్వాలాముఖీదేవి, అగస్త్యేశ్వరుడు, పార్థివేశ్వరుడు, సోమేశ్వరుడు, నాగేశ్వరుడు, మహిషాసురమర్ధిని దేవి, కోసలేశ్వరుడు, వీరభద్రుడు మొదలగు దేవతామూర్తుల సాక్షాత్కారం కల్గును.

అమరావతి ఆలయంలో శివ లింగం చాలా పొడవుగా ఉంటుంది. దీనికి ప్రాచుర్యంలో ఉన్న కథనం ప్రకారం ఈ శివలింగం పెరుగుతూ

ఉండేదట. అందువలన ఎప్పటికప్పుడు గుడిని పెంచవలసి వస్తుండేది. చివరకు విసుగు చెందిన అర్చకులలో వొకరు స్వామిపై ఒక మేకు కొట్టారు. అంతటితో శివలింగం పెరుగుదల ఆగిపోయినది. ఈ కథనానికి నిదర్శనంగా తెల్లని శివ లింగంపై ఎర్రని (నెత్తుటి) చారికలను కూడా చూపిస్తారు. అవి మేకు కొట్టినపుడు కారిన నెత్తుటి చారికలన్నమాట. ఈ లింగం 3 అడుగుల చుట్టుకొలత 60 అడుగుల ఎత్తు ఉంటుంది. ప్రస్తుతం పై అంతస్తులో శివలింగ భాగాన్ని మాత్రమే భక్తులు దర్శించుకోవటానికి అనుమతిస్తారు.

## శ్రీ పానకాల నరసింహస్వామి - మంగళగిరి

గుంటూరు జిల్లాలోని ముఖ్యమైన దేవాలయాలలో మంగళగిరి శ్రీ పానకాల నరసింహస్వామివారి దేవాలయం ఒకటి. ఇది విజయ వాడ శ్రీ కనకదుర్గ క్షేత్రమునకు 8 కి.మీ. దూరంలో,గుంటూరువిజయ వాడ జాతీయ రహదారిపై గుంటూరుకు 20 కి.మీ. దూరంలో ఉన్నది.



ఇక్కడ ఉన్న కొండపైన శ్రీ పానకాల నరసింహ స్వామి వేంచేసియున్నారు. భక్తుల కోర్కెలు తీర్చే భక్తా గ్రేసరుడుగా శ్రీ నరసింహ స్వరూపంలో సేవలందు కొనుచున్న ఈ నారాయణు నకు పానకమంటే ఎంతో ప్రీతి. సరాసరి తన నోటిలో పానకంలో సగపాలు ఈ స్వామి ప్రసాద చిహ్నంగా భక్తులకు అనుగ్రహిస్తూ ఉంటారు. స్వామి త్రాగుచున్నట్లు "గుట గుట" శబ్దం వినిపిస్తుంది. ఈ శబ్దం ఆగేసరికి పానకం వెలికి చిమ్ముతుంది. ఈ అద్భుతం రోజుకు ఎప్పుడో ఒకసారి మాత్రమే కాదు, పానకం సమర్పించిన ప్రతీ భక్తునికి జరుగుతూనే ఉంటుంది. ప్రతి నిత్యం బిందెల కొలది పానకం సమర్పించినా ఒక్క చీమ అయినా దరి దాపులలో ఎక్కడా కనిపించదు. ఈ విశేషం వల్లనే ఈ దైవం "పానకాల స్వామి"గా ప్రసిద్ధుడయ్యాడు. ఈ క్షేత్ర చరిత్ర బ్రహ్మవైవర్త పురాణంలో ఉన్నది. "మంగళగిరి" అంటే "శుభప్రదమైన కొండ" అని అర్థం. ఇది తూర్పు కనుమల పర్వతపంక్తుల వరుసలోదే. దూరా నికి ఈ కొండ పడుకొని ఉన్న ఏనుగు ఆకారంలో కనబడుతుంది. ఈ స్వామికి కృతయుగంలో తేనె, త్రేతాయుగంలో నెయ్యి, ద్వాపర యుగంలో పాలు, కలియుగంలో పానకం నైవేద్యంగా సమర్పిస్తున్నారు. ఇప్పటికీ శంఖంతో పానకం స్వామి నోటిలో పోస్తారు. అందులో సగము స్వీకరించి సగము భక్తులకు ప్రసాదముగా అనుగ్రహిస్తాడు. ఈకొండ ఏనుగు ఆకారంలో ఉంటుంది కనుక ఈ గుడి సరిగా ఆ ఏనుగు నోరువలె ఉంటుంది. ఈ పానకం నోటిలో పోయటమూ, గుటగుట అనే శబ్దము రావడం విశేషం. పానకాల నరసింహస్వామి ముఖం మాత్రం అదే కొండలోనే చెక్కబడి ఉండటం మరీ విచిత్రం. ఇంకొక కథనం ప్రకారం త్రేతాయుగంలో శ్రీరామచంద్ర మూర్తి ఈ కొండను సందర్శించాడట. అందువల్ల దీనికి 'తోతాద్రి' అని పేరు కూడా ఉన్నట్లు చెబుతారు.

## శ్రీ త్రికూటేశ్వరస్వామి -కోటప్పకొండ

గుంటూరుజిల్లా నరసరావుపేటకు 10 కి.మీ. దూరంలో త్రికూటాద్రి పర్వతం కలదు. దీనిని కోటప్పకొండ అనీ, 'త్రికూటాద్రి' అని కూడా అంటారు. ఈ త్రికూటా చలమును ఏ దిశలో చూసినను మూడు శిఖరములు స్పష్టముగా కని పించును. ఈ పర్వతముపైగల స్వామి వారిపేరు త్రికూటేశ్వరుడు. దీని చుట్టుకొలత సుమారు 9 కి.మీ. 'అడుగు తక్కువ-ఆమడ'అను వాడుక గలదు. బ్రహ్మశిఖరము, విష్ణుశిఖ రము, రుద్రశిఖరము అను మూడు పర్వత శిఖరములు ఉండుట వలన దీనిని త్రికూటాద్రి అని పిలువ



బడినది. కోటేశ్వరస్వామి ఆలయము విష్ణుశిఖరముపై నున్నది. ఈ కొండ దిగువభాగాన 'బొచ్చు కోటయ్య'గుడి కలదు. భక్తులు ఇక్కడనే తలనీలాలు సమర్పిస్తారు. శివరాత్రి పర్వదినాన భక్తులు తమతమ పిల్లలను అక్కడ ఉన్న ఎత్తైన ధ్వజస్తంభమునకు కట్టి వారివారి మ్రొక్కులు తీర్చుకొంటారు. 1584 అడుగుల ఎత్తులో ఉన్న కోటప్ప కొండ శైవ క్షేత్రంగా కీర్తి పొందింది. ఇక్కడ 687 అడుగుల ఎత్తున లింగ ఆకారంలో కోటేశ్వర నామంతో శివుని గుడి ఉంది. కొండపై నుండి దేవాలయానికి చేరుకోవటానికి 703 మెట్లు గల మార్గం కలదు.

## శ్రీ భ్రమరాంబ సమేత శ్రీ మల్లేశ్వరస్వామి - పెదకాకాని

ఈ ఆలయం గుంటూరునకు 8 కి.మీ. దూరంలో, విజయవాడ-గుంటూరు ఐదవ నంబరు రహదారిలో ప్రధాన రహదారికి అతి చేరువగా ఉన్నది. ఈ మహా పుణ్య క్షేత్రంలో శ్రీ గంగా భ్రమరాంబ సమేత శ్రీ మల్లేశ్వరస్వామి వార్లు కొలువుదీరి ఉన్నారు. ఈ ఆల యంను చిట్టెరసు మంత్రి కట్టించారని చెప్పుచుందురు. ఈ క్షేత్రములో



బారసాల, నామకరణము, అన్నప్రాసన, పుట్టు వెంట్రుకలు, చెవులు కుట్టుట వంటి బాల్య సంస్కార ప్రక్రియలకు ప్రసిద్ధి పొందినది. శివాలయమైనను వివాహ, ఉపనయనము మొదలైన శుభకార్యములను కూడా ఇచ్చట చేసుకొంటారు. కొత్త దంపతులు కొంగుముడి వేసుకొని స్వామివారిని దర్శించుకొని దేవాలయ ఆవరణలో ఉన్న శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని, శ్రీ వినాయకుని సేవించుకొంటారు. నాగదేవతలకు, నవ గ్రహాలకు కూడా పూజ చేస్తారు. ఆ సమయంలో కొత్త దంపతుల మనసులో ఉన్న మధురమైన కోరిక ఏమిటో ఆ మల్లేశ్వరునకు, ఇద్దరు బిడ్డల ముద్దుల తల్లి అయిన ఆ భ్రమరాంబాదేవికి తెలుసు. అందుకే ఆ నవదంపతులు అమ్మా నాన్నలై, తమ పాపలతో మల్లన్న దర్శనానికి వచ్చి ఈ స్వామి సమక్షం లోనే తమ బిడ్డలకు నామ సంస్కరణాది కార్యాలు చేస్తారు. ఇదీ ఈ క్షేత్ర మహిమగా భక్తులు నమ్ముతారు.

శ్రీకృష్ణ దేవరాయలు ఈ స్వామిని దర్శించుకొని, సేవించిన అనుగ్రహంతోనే సంతానవంతుడయ్యాడని, అందువల్లనే తన కుమారునకు "సదాశివరాయలు" అని పేరు పెట్టుకున్నాడని స్థలపురాణంలో రాయబడి ఉంది. ఈ క్షేత్రంలో సుబ్రహ్మణ్యేశ్వర స్వామి మహాత్యం కూడా ఎన్నదగి నదని అగస్త్య మహర్షి గుర్తించాడు. ఈ ఆలయంలో ప్రధాన ఆలయంతో పాటు గణపతి, భద్రకాళి, వీరభద్రుడు, నందీశ్వరుడు, ముఖ మండపంలోని పెద్ద నందీశ్వరుడు పూజలందుకుంటున్నారు.

ఇచ్చట ప్రతినిత్యం రోజువారీ పూజలతో పాటు ప్రత్యేక పూజలు కూడా జరుపుదురు. పండుగ పర్వ దినాలలో జరిపే ప్రత్యేకపూజలే కాక దేవీ నవరాత్రి ఉత్సవాలు, కార్తీక దీపోత్సవాలు, మహాశివరాత్రి నాడు జరిగే ఉత్సవాలు ఎంతో వైభవముగా జరుపుదురు.

## శ్రీ ఆంజనేయస్వామి - సీతానగరం

ప్రకాశం బ్యారేజి ప్రక్కన ఆవలివైపున గల గుంటూరుజిల్లాలోని సీతా నగరంలో కృష్ణానదీ తీరాన గల శ్రీ ఆంజనేయస్వామి వారి



ఆలయం అత్యంత పురాతనమైనది. ఇక్కడ ఆంజనేయస్వామి స్వయంభువు. ఇక్కడే కోదండస్వామి వారిని ప్రతిష్ఠించారు. ఈ ఆలయానికి ఎగువున శ్రీ సోమేశ్వరస్వామి రాజేశ్వరీ మాతలు ప్రతిష్ఠింపబడ్డారు. విజయవాడ అనగానే అందరికీ గుర్తుకువచ్చేది బెజవాడ కనకదుర్గమ్మ. కృష్ణానది ఓవైపు కనకదుర్గమ్మ, మరోవైపు శ్రీరామసమేతుడైన ఆంజనేయుడు భక్తులను తమ చల్లని చూపులతో కటాక్షిస్తుంటారు. గుంటూరు జిల్లా ముఖద్వారంగా పేర్కొనే సీతానగరాన్ని వేకువఝామునే సందర్శిస్తే కృష్ణాతీరాన శ్రీ త్రిదండి రామానుజ చినజీయర్ స్వామి శిష్య బృందం పఠించే వేదమంత్రాలఘోష, నది ఒడ్డునే ఉన్న శ్రీమద్ వీరాంజనేయ సమేత కోదండరాముని ఆలయంలో జేగంటల నాదాలు, సోమేశ్వర, రాజరాజేశ్వర, అయ్యప్ప దేవాలయాల నుంచి వినవచ్చే సుప్రభాతాలు, భక్తిగీతాలు భక్తుల హృదయాలకు దివ్యానుభూతిని కలిగిస్తాయి. సీతానగరం నిజానికి పూర్వం పండితుల అగ్రహారంగా ఉండేది. రావణాసురుడు సీతమ్మ తల్లిని అపహరించుకొనిపోతుండగా, ఓ నగ జారి ఇక్కడ పడిందనీ, సీతాన్వేషణలో లంకా నగరంనుండి తిరిగొస్తూ ఆంజనేయస్వామి ఇక్కడ విశ్రాంతికై ఆగినపుడు ఆ ఆభరణం కనిపించిందని అంటారు. అందుకే ఈ ప్రాంతానికి సీతానగరం అనే పేరు వచ్చిందని స్థలచరిత్ర చెబుతుంది.

## వైకుంఠపురం - తెనాలి

గుంటూరు జిల్లా తెనాలి పట్టణములో రైల్వే బ్రిడ్జి సమీపంలో నిర్మించబడ్డ శ్రీ వైకుంఠపురం వేంకటేశ్వర దేవాలయం ఆంధ్రదేశంలోని దివ్య క్షేత్రములలో ఒకటిగా ప్రసిద్ధి కెక్కింది. ఇది నూతనముగా నిర్మించిన ఆలయం. నిత్యకళ్యాణం పచ్చతోరణంతో విలసిల్లే కలియుగ దైవం, శ్రీ వేంకటేశ్వరుడు లక్ష్మీపద్మావతీ సమేతముగా ఈ దేవాలయంలో కొలువుతీరి ఉన్నాడు.



**స్థలపురాణం :** పూర్వం ఈ ఆలయం ఉన్న ప్రాంతం ఊరు పేరు లేని ఒక ప్రాంతం. ఆ ప్రాంతంలో ఒక పుట్ట ఉండేది. ఆ పుట్ట మామూలు పుట్టగానే చాలాకాలం ఉండిపోయినది. తరువాత ఒకనాడు తుళ్ళూరు బాల నరసింహ గౌడ్ అనే భక్తుడికి కలలో నాగేశ్వరుడు కన్పించి, తానొక పుట్టలో దాగి ఉన్నానని, ఆ పుట్ట ఫలానాచోట ఉన్నదని, నీవు నన్ను వెలికి తీసి ఆరాధించిన క్షేమం కలుగుతుందని చెప్పి, అంతర్థానమైనాడట! అతడు తనకు వచ్చిన కల సంగతి తన

మిత్రుడైన బెల్లంకొండ స్వామి వారికి తెలియజేసి, వారిని కూడా తీసికొని, ఆ పుట్ట వద్దకు వెళ్ళి, పరిశీలించగా, వారికాపుట్టలో దేవతా మూర్తులున్నట్లు గమనించి వెంటనే వారా మూర్తులను వెలికిదీసి నాగేశ్వరుడన్న పేరుతో అచట ప్రతిష్ఠించి ఆరాధించారు. ఇది 1966లో జరిగినది.

ఈవిషయం కొంతకాలానికి కంచికామకోటిపీఠాధిపతులవారికి తెలిసినది. వారచటకు వచ్చి, పుట్ట నాగేశ్వరులవారిని ఆరాధించు టయేగాక, అచట లక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరమూర్తిని ప్రతిష్ఠించి, ఆలయ నిర్మాణానికి పునాదులు వేసి, ఆప్రాంతాన్ని వైకుంఠ పురమని ప్రశంసించారు.

## దైద అమరలింగేశ్వరుడు - గుత్తికొండ బిలం

గుంటూరుజిల్లా, పిడుగు రాళ్ళకు 25 కి.మీ., దూరం లో ఉన్న గుత్తికొండలో ఈ బిలం ఉన్నది. చుట్టూ పర్వత శ్రేణి, మధ్యలో బిల సముదాయం. ఇది ప్రకృతి సిద్ధంగా ఏర్పడిన బిలం. ఈ బిలం ప్రధాన మార్గం నుంచి లోపలకు అడుగుపెట్టడంతోనే చీకటి మల్లయ్య పూజలందుకుంటూ కనిపిస్తాడు. కన్ను బొడిచినా కానరాని చీకటిలో విద్యుత్తుదీపాల వెలుగుల వెంబడి ముందుకెళ్తే నీటికొలను వస్తుంది. రూపాయినాణెం కిందపడినా కనిపించేంత స్వచ్ఛమైన నీటితో నిండి



ఉంటుంది ఈ కొలను. ఇక్కడికి వచ్చిన వారంతా పుణ్యస్నానాలు చేస్తారు. ప్రధాన బిలం నుంచి లోప లకు వెళ్తే 101 బిలాలు ఉన్నాయని చెపుతారు. ఇంకా ముందుకెళ్తే గరళం సేవించే శివుడి విగ్రహం ఉందని అంటారు. ద్వాపరయుగంలో కాలయవనుని బారి నుండి తప్పించుకునే క్రమంలో శ్రీకృష్ణుడు ఈ బిలంలోకి ప్రవేశించి తపమాచరిస్తున్న ముచికుంద మహర్షిపై తన ఉత్తరీయాన్ని కప్పి పక్కకు వెళ్లాడు. ఆయనే శ్రీకృష్ణుడని భావించిన రాక్షసుడు తపోభంగం కల్గించడంతో ఆగ్రహించిన ముని అతన్ని భస్మం చేసినట్లు పురాణగాథ.

గురజాలకు 13 కి.మీ., దూరంలో పవిత్ర కృష్ణానది తీరాన అమరలింగేశ్వరస్వామి ఆలయం ఉంది. సొరంగమార్గంలో స్వయం భువుగా వెలిసిన అమరలింగేశ్వరుడు భక్తుల పూజలందుకుంటూ భాసిల్లుతున్నాడు. శివరాత్రికి భారీ ఎత్తున భక్తజనం చేరుకుంటారు. సొరంగమార్గంలో స్వయంభువుగా వెలియడంతో భక్తులు గతంలో ప్రమిదల వెలుగులో సందర్శించుకునేవారు. ప్రస్తుతం దేవాదాయ శాఖ లైటింగ్ ఏర్పాటు చేసింది. సొరంగ మార్గంలో 400 మీటర్ల వరకు ప్రయాణం చేసి శివలింగాన్ని చూడవల్సి ఉంటుంది. పల్నాడు యుద్ధం తరువాత బ్రహ్మనాయుడు ఈ బిలంలోకి వెళ్ళినట్లు కథనం ఉంది. ఈ స్వామి దర్శనం గొప్ప అనుభూతినిస్తుంది.

## శ్రీ మల్లికార్జునుడు - శ్రీశైలం

కర్నూలు జిల్లా, కర్నూలుకు తూర్పుదిశలో సుమారు 70 కి.మీ. దూరంలో కృష్ణానదీ తీరంలో అరణ్యముల మధ్య గల శ్రీశైలము నందు, సముద్రమట్టానికి 458 మీ. ఎత్తున కొండపై వెలసిన అతి



పురాణప్రసిద్ధి చెందిన శైవ క్షేత్రము ఇది. ఇచట వెలసిన శివుడు మల్లికార్జునుడన్న నామంతో ప్రసిద్ధి గాంచాడు. పరమేశ్వరుడు తన ఆత్మశక్తిని లింగరావములో నింపి, మన దేశంలో పన్నెండుచోట్ల స్వయంభువుగా వెలిశాడని పురాణోక్తి. ఈ పన్నెండుచోట్ల ఉన్న శివ లింగరూపమూర్తులను 'ద్వాదశ జ్యోతిర్లింగాలు' అంటారు. శ్రీశైలంలో ఉన్న ఈ మల్లికార్జున స్వామి ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటి. జాతి, మత, కులభేదాలు లేకుండా ప్రతివారు చేతితో ఈ శివలింగాన్ని తాకి స్వయంగా అర్చించగల దివ్య క్షేత్ర మిదే. ఇక్కడ ఉన్న భ్రమ రాంబికాదేవి అష్టాదశ శక్తిపీఠాలలో ఒకటి. కేవలం శిఖరాన్ని దర్శిస్తే చాలు పునర్జన్మ లేకుండా చేయగల శివశక్తిగల ప్రదేశమే శ్రీశైలం. ఇక్కడే శ్రీ శంకరాచార్యులవారు శ్రీచక్రాన్ని ప్రతిష్ఠించి ప్రపంచప్రసిద్ధి గాంచిన సౌందర్యలహరిని, భ్రమరాంబ అష్టకాన్ని రచించారు. శివాజీ మహారాజుకు ముస్లింలపై విజయానికి కారణమైన అజేయమైన ఖడ్గం లభించింది ఇక్కడే. దేవాలయానికి 7 కి.మీ. దూరంలో ఉన్న చిన్న నందికొమ్ముల మధ్యలో నుండి శ్రీశైల శిఖరాన్ని చూస్తే పునర్జన్మ ఉండదని, శివసాయుజ్యాన్ని పొందుతారని పెద్దలు అంటారు. శ్రీశైల పర్వతాన్ని ఈ భూమికి మొత్తానికి నాభిగా చెబుతారు. అందుకే మనం ప్రపంచంలో ఎక్కడ ఉన్నా సంకల్పం చెప్పేటప్పుడు శ్రీశైలాస్య ఈశాన్య ప్రదేశే అని లేదా శ్రీశైలానికి ఏ దిక్కున ఉంటే ఆ దిక్కు గురించి సంకల్పంలో చెప్తాం. కృతయుగంలో ఈ క్షేత్రం హిరణ్యకశిపుడి పూజా మందిరంగా ఉండేది. త్రేతాయుగంలో శ్రీరాముడు, సీతాదేవి ఇక్కడ ప్రతిష్ఠించిన సహస్రలింగం ఇప్పటికీ పూజలందుకుంటుంది. ద్వాపర యుగంలో పాండవులు, ద్రౌపది ప్రతిష్ఠించిన శివలింగాలు పూజలందు

కుంటున్నాయి. కలియుగంలో మానవుల కోర్కెలు తీర్చేందుకు మహేశుడు కొలువై ఉన్న ఏకైక క్షేత్రం శ్రీశైలం. ఈవిధంగా నాలుగు యుగాలకు సంబంధించిన చరిత్రఉన్న క్షేత్రం ఈ శ్రీశైలం. ఇక్ష్వాకులు, పల్లవులు, విష్ణుకుండినులు, చాళుక్యులు, కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగర రాజులు, శివాజీలాంటి ఎందరో రాజులు తమవంతు సేవలు చేసిన మహా క్షేత్రం. పాండవులు, శ్రీరాముడు లాంటి పురాణ పురుషులు పూజలు చేసిన శ్రీ మల్లికార్జుని పవిత్రధామం. శ్రీశైల దేవస్థానమునకు రక్షణకొరకు కొందరు రాజులు చుట్టూ కోటలాంటి పటిష్ట కట్టడము నిర్మించారు. నాలుగు వైపులా నాలుగు పెద్ద ద్వారాలు, బ్రహ్మాండమైన నాలుగు గోపురాలు, అత్యద్భుతమైన కట్టడాలుగా దేవాలయాలు నిర్మించారు.

**భ్రమరాంబికా శక్తిపీఠం :** ఇక్కడ ఉన్న భ్రమరాంబికా దేవి అష్టాదశ శక్తిపీఠాల్లో ఒక పీఠంగా నిలిచింది. భ్రమరాంబికా దేవి చాలా అందగత్తె. పరమేశ్వరుని సౌమ్యతకు, మనోహర రూపానికి పరవశించి పోయి వివాహమాడాలనుకున్నది భ్రమరాంబికాదేవి. అక్కడే భ్రమిస్తున్న ఒక తేనెటీగను చూపి, అది విశ్రమించే వరకు దానిని అనుసరిస్తే వివాహమాడతానని పరమేశ్వరుడు తెలియజేశాడు. దాని వెనుకనే వేగంగా పరిగెత్తింది. ఆమె కొన్ని సంవత్సరాలపాటు అలా పరిగెత్తవలసి వచ్చింది. చివరకు ఆ భ్రమరం ఇక్కడ విశ్రాంతి తీసుకుంది. అప్పుడు పరమశివుడు ఒక వృద్ధునిగా దర్శనమిచ్చి "చాలా కాలం గడచినందున వృద్ధుణ్ణి అయినాను. వివాహానికి తగను. అని చెప్పగా, వ్యక్తి ఆత్మసౌందర్యాన్ని ఆరాధించే ఆమె అభ్యంతరం లేదని వివాహానికి అంగీకరించింది. భ్రమరాన్ని అనుసరించడం వల్ల ఆమెకు 'భ్రమరాంబిక' అని పేరు సార్థకమైనది. ఈరోజుకు కూడా భ్రమర ఝుంకారం భ్రమరాంబికా దేవి కొలువై ఉన్న గుడివెనుక మనము వినవచ్చును అని భక్తుల నమ్మకం.

ఈ దేవాలయము నందు గర్భాలయ వెనుక భాగమున గోడకు చెవి ఆన్చి వింటే ఝుమ్మనే భ్రమరనాధం వినిపిస్తుంది. ఆదిశంకరాచార్యుల వారు ఆలయమునకు శ్రీ చక్రప్రతిష్ఠ చేశారని ప్రతీతి. చైత్ర మాసంలో 'అంబ తిరునాళ్ళు'అని ఇక్కడ గొప్ప ఉత్సవం జరుగుతుంది.

సంక్రాంతికి పార్వతీదేవి కల్యాణోత్సవం, శివరాత్రినాడు శ్రీ భ్రమరాంబా కళ్యాణోత్సవం జరుగుతాయి. ఇక్కడ ఉత్సవములు మహా శివరాత్రికి, ఉగాదికి, చైత్రమాసంలో జరిగే చండీయాగము, కుంభోత్సవములు చాలా వైభవంగా జరుగుతాయి. శివరాత్రినాటి రాత్రి స్వామివారి ఆలయంపై ఉన్న శిఖర కలశం నుండి నాల్గువైపుల ఉండేటట్లుగా మూరెడు వెడల్పు గలిగి-360 మూరల నూతన వస్త్రాన్ని కడతారు. దీనినే పాగ చుట్టడం అని అంటారు. మంగళపాగా అని కూడా అంటారు. ఈ వస్త్రాన్ని రోజుకొక మూర చొ॥ 360 రోజులు నేస్తారని తెలియుచున్నది. మంగళపాగా రాత్రివేళ లింగోద్భవ సమయానికి ఖచ్చితంగా ముగుస్తుంది. పాగా చుట్టే మనిషి దిగంబరుడై ఎవరికీ కానరాకుండా పాగచుడతాడు. తరువాత ఈ మంగళపాగాను చిన్న చిన్న ముక్కలుగా కత్తిరించి ప్రసాదంగా ఇస్తారు. ఈ ఆలయానికి 3 రాజగోపురాలు ఉన్నాయి. ఉత్తర ద్వారాన్ని శివాజీ గోపురం, దక్షిణ ద్వారాన్ని హరిహర గోపురం, తూర్పు ద్వారాన్ని కృష్ణదేవరాయల గోపురం అని పిలుస్తారు. శ్రీకృష్ణదేవరాయలచే నిర్మితమైన రాజ గోపురం ద్వారా ఆలయంలో ప్రవేశించడం ఇక్కడి ఆచారం. శివునికి ఎదురుగా ప్రతిష్టింపబడిన పెద్దశిలానందిని 'శనగల బసవణ్ణ' అని పిలుస్తారు. ఎనిమిది దిక్కుల అష్టభైరవులు స్థాపించబడి ఉన్నారు. శ్రీశైలం చుట్టుప్రక్కల దాదాపు అయిదువందల వరకూ శివలింగాలు ఉంటాయని ప్రసిద్ధి.

**సాక్షిగణపతి ఆలయం :** శ్రీశైలం ప్రధానాలయానికి సుమారు 2కి.మీ. దూరంలో సాక్షిగణపతి ఆలయం కలదు. ఈ గణపతి ఆలయం ప్రత్యేకత ఏమిటంటే మనము శ్రీశైలంలో శివుడిని దర్శించినంత మాత్రాననే కైలాస ప్రవేశానికి అనుమతి లభిస్తుంది. అప్పుడు మనకు ఈ సాక్షి గణపతే సాక్ష్యము చెపుతాడు. మనము శ్రీశైలము వచ్చాము అని ఇతను సాక్ష్యము చెబుతాడు కనుక సాక్షి గణపతి అంటారు. ఇచ్చట స్వామివిగ్రహం ఏదో వ్రాస్తున్న భంగిమలో కూర్చొని ఉన్నట్లుగా మలచబడి ఉండుట విశేషం. శ్రీశైల క్షేత్రాన్ని దర్శించిన భక్తులను స్వామి తన చిట్టాలో వ్రాసుకొని కైలాసంలో శివునికి నివేదించి సాక్ష్యంగా ఉంటాడని ప్రతీతి.

## శ్రీ లక్ష్మీ నరసింహస్వామి ఆలయం - అహోబిలం

కర్నూలు జిల్లా, ఆళ్ళగడ్డ మండలం, ఆళ్ళగడ్డ పట్టణమునకు ఈశాన్యంగా, సుమారు 24 కి.మీ. దూరాన నల్లమల కొండలు, అడవుల మధ్యన ఉన్న ప్రాచీన వైష్ణవ దివ్యక్షేత్రంను అహోబిలంగా పిలుస్తారు. ఇది 108 దివ్య తిరుపతులలో ఒకటిగా కూడా ప్రసిద్ధి చెందినది. ఈ అహోబిల క్షేత్రానికే "సింగ వేలు తుంద్రం" అనే పేరుందేది. ప్రహ్లాదుని రక్షించడానికి, హిరణ్యకశిపుని చంపడానికి స్వామి ఈ రూపం ధరించారు. శ్రీ మహాలక్ష్మీ 'చెంచు లక్ష్మి'గా అవతరించిన ప్రదేశంగా ఈ క్షేత్రం ప్రసిద్ధి చెందింది. అంతేకాక నవ నారసింహరూపాలు ఇచ్చట ఒకేచోట నెలకొని ఉన్నాయి. అహోబిలం క్షేత్రం రెండు భాగాలుగా



అహోబిల నరసింహస్వామి

రెండు ప్రదేశాలలో ఉంది. గుర్తు తెలియడం కోసం ఒక భాగాన్ని ఎగువ అహోబిలం అని, రెండవ భాగాన్ని దిగువ అహోబిలం అని అంటారు. దిగువ అహోబిలం అనే చోటనే అహోబిలం అనే ఒక చిన్న గ్రామం ఉంది. ఈ గ్రామం నల్లమల కొండల పాద భాగాన ఉంది. దిగువ అహోబిలంనకు సుమారు 8 కి.మీ. దూరంలో, కొండల మధ్యగా ఎగువ అహోబిలం కలదు. ఎగువ అహోబిలంలోని ఉగ్ర నరసింహస్వామి ఆలయమూ, దిగువ అహోబిలంలోని లక్ష్మీ నర సింహస్వామి ఆలయమూ ఉదయం గం.6.30ని॥ల నుండి సాయం త్రం 8 గంటల వరకు తెరచి ఉంచుతారు. భవనాశిని నదీతీరమున గల కొండగుహయందు సాలగ్రామరూపంలో స్వామి స్వయంభూవుగా రాతిపీఠంపై ఉగ్ర నర సింహస్వామిగా తూర్పు ముఖంగా వెలిసి భక్తులకు దర్శనమిస్తాడు. స్వామిని అహోబిల నరసింహస్వామిగాను, అహోబలేశ్వరుడుగాను మరియు ఓబులేసుడుగాను పిలుస్తారు. ఈ స్వామి ఉన్న గుహకు ఒక చక్కటి ఆలయంను నిర్మించారు. శ్రీ లక్ష్మీనరసింహుల సన్నిధిలో చెంచులక్ష్మికి ఒక ఆలయం ఉన్నది.

## శ్రీ మహానందీశ్వరస్వామి వారి దేవస్థానం - మహానంది

కర్నూలుజిల్లా, నంద్యాలకు 14 కి.మీ, దూరంలో మహానంది మండలం, మహానంది వద్ద శ్రీ మహా నందీశ్వరస్వామి వారి దేవస్థానం ఉన్నది. ఇది పురాణ ప్రసిద్ధమైన పుణ్యక్షేత్రం. మహానంది అని పిలువ బడుతూ ఉన్న ఈ ఊరు అసలు పేరు తిమ్మాపురం. అయితే ఈ ఊరికి ఆనుకుని చుట్టుప్రక్కల పదిహేను కిలోమీటర్ల పరిధిలో (నవ నందులు) తొమ్మిది నందులు ఉన్నాయి. అన్నింటిలోకి ఈ ఊరిలో ఉన్న ఆలయం ప్రధానమైనది కావడంతో ఈ క్షేత్రానికి 'మహానంది అనే పేరు వచ్చింది.



ఇది ప్రముఖ శైవ క్షేత్రము. ఇక్కడగల స్వామి మహానందీశ్వ రుడు, అమ్మవారు కామే శ్వరీదేవి. ఇది చాలా ప్రాచీన ఆలయం. దీని నిర్మాణకాలం తెలి యదు. కాని ఈ ఆలయం 7వ శతాబ్ది నాటిదని, ఈ ఆలయం శిల్పశైలినిబట్టి ఇది బాదామి చాళుక్య చక్రవర్తి వినయాదిత్యుని పాలనాకాలం (680-696) నాటిదని ప్రముఖుల అభిప్రాయం. మరికొందరు ప్రాచీనకాలపు నందిరాజులు కట్టించారని, అందుచేతనే ఇది మహానంది ఆలయముగా ప్రసిద్ధిపొందినదని వారి అభిప్రాయం. ఈ క్షేత్రం నల్లమల పర్వత పంక్తికి ఆనుకొని ఉంది. ఇచ్చట గల శివలింగం ఎత్తుగా కాక కొంచెము తప్పటగా వుంటుంది. ఇచ్చట శుద్ధస్ఫటిక వర్ణంలో కనిపించే నీరు ప్రవహించే దృశ్యం మహానంది ప్రత్యేకత. ఈ క్షేత్రంలో ప్రధాన ఆలయానికి, ఆలయ ముఖద్వారం గోపురానికి మధ్యలో ఉన్న పుష్కరిణిలోనికి స్వచ్ఛమైన నీరు ఎప్పుడూ గోముఖ శిలనుండి ధారావాహకంగా వస్తుంటుంది.

ఈ నీరు బయటకు ప్రవహించే మార్గాల అమరిక వలన పుష్క రిణిలో నీరు ఎల్లప్పుడూ ఒకే స్థాయిలో (1.7 మీటర్లు) నిర్మలంగా, పరిశుభ్రంగా ఉంటుంది. ఈ నీరు ఎంత స్వచ్ఛంగా ఉంటుందంటే నీటిపై కదలిక లేకుంటే నీరున్నట్టే తెలియదు. ఐదున్నర అడుగుల లోతున్నా క్రిందనున్న రూపాయి బిళ్ల చాలా స్పష్టంగా కనబడుతుంది.

## శ్రీ రాఘవేంద్రస్వామి - మంత్రాలయం

కర్నూలు జిల్లా, కర్నూలుకు 80 కి.మీ., దూరంలో, ఆదోనికి 57 కి.మీ. దూరంలో మంత్రాలయం రైల్వేస్టేషన్‌కు 14 కి.మీ. దూరంలో పరమ పవిత్ర మైన తుంగభద్రానది ఒడ్డున వెలసిన మహిమాలయమే ఈ మంత్రాలయం. ఈ పా వన క్షేత్రంలో ద్వైత వేదాంత మునకు విశిష్ట సేవ చేసి ఉపనిషత్తులకు ఖండార్థాలు,



అనేక ఆధ్యాత్మిక గ్రంథాలకు వ్యాఖ్యానములు వ్రాసి, జ్ఞానభక్తిని ప్రబోధించిన సద్గురువు శ్రీ గురు రాఘవేంద్రస్వామివారు జీవసమాధిని పొందారు. ఆయన సమాధిని 'రాఘవేంద్ర బృందావనం' అని పిలు స్తారు. ఈ బృందావనం ఉన్న గ్రామమే మంత్రాలయం. రాఘవేం ద్రులు మహాభక్తుడు, పురాణ పురుషుడు, హిరణ్యకశిపుని కుమారుడు ప్రహ్లాదుని అవతారం. బృందావనం వెలిసిన చోటున పూర్వం భక్త ప్రహ్లాదుడు యజ్ఞం చేశాడని, అతడే కలియుగంలో రాఘవేంద్ర స్వామిగా జన్మించాడని, విజయనగర సామ్రాజ్యాధినేత శ్రీ కృష్ణదేవ రాయల మతగురువైన శ్రీ వ్యాసరాయల వారే రాఘవేంద్రస్వామియని భక్తులు నమ్ముతారు.

## జోగులాంబ దేవి ఆలయం - అలంపురం

మహబూబ్‌నగర్ జిల్లా, అలంపురం మండలం, మహ బూబ్‌నగర్ పట్టణానికి 90 కి.మీ. దూరంలో, హైదరాబాదుకు సుమారుగా 200 కి.మీ. దూరంలో తుంగభద్రానదీ తీరంలో వెలసిన జోగులాంబాదేవి సుప్రసిద్ధ క్షేత్రం అలంపూర్‌లో కలదు. ఇది శ్రీశైలానికి పశ్చిమ ద్వారంగా భావించబడుచున్నది (సిద్ధవటం, త్రిపురాంతకం, ఉమా మహేశ్వ రంలు దక్షిణ, తూర్పు, ఉత్తరద్వారాలుగా ఉన్నాయి). భారత దేశంలోని 18 శక్తిపీఠాలలో ఐదవ శక్తిపీఠమైన జోగుళాంబ ఆలయం



ఇక్కడ ఉన్నది. బాలబ్రహ్మేశ్వరుడు, జోగులాంబ ఇక్కడి ప్రధాన దేవతా మూర్తులు. ఈ క్షేత్రం శైవశక్తి పీఠంగా, దక్షిణకాశిగా పిలువబడు తుంది. అలంపురం, కాశీక్షేత్రంతో పోలుస్తారు. బ్రహ్మేశ్వరుడే-ఇచట విశ్వేశ్వరుడు. తుంగభద్రయే గంగ. తుంగభద్రానదీ తీరంలో కోటి లిం గాలు ప్రతిష్ఠింపబడినట్లు తెలియు చున్నది. క్రీస్తుపూర్వం ఇచట తుంగ భద్రా నదీ తీరంలో పొలం దున్ను కొంటూ జీవించేవారని, హలం (నాగలి) ఆ పురంలో ప్రధానమైన పనిముట్టని తలచి "హలంపురం" అని పిలిచే వారంటారు కొందరు. "ఎల్లమ్మ" అనే గ్రామదేవత కారణంగా ఎల్లమ్మ పురం, ఎలమ్‌పురం, అదే అలంపురంగా మారిం దని మరికొందరి అభిప్రాయం. హేమదేవత ఇచట వెలసిన కారణాన హేమలాపురమనీ, అదే అలంపురంగా మారిందంటారు. ఈ ఆల యంలో ఈశ్వరుని, జగదంబ జోగులాంబను ప్రతిష్ఠించినది బ్రహ్మ దేవుడే నంటారు. అందువలననే ఇచటిస్వామిని బాలబ్రహ్మేశ్వరు డంటారు. ఈ క్షేత్రాన్ని బ్రహ్మేశ్వర క్షేత్రమని, పరశురామక్షేత్రమని, దక్షిణకాశియని, శక్తిపీఠమని, ఎన్నో పేర్లతో పిలుస్తారు. ఇచట వెలసిన స్వయంభూవు దేవి జోగులాంబ. ఈ ఆలయంలోని అమ్మవారు ఉగ్ర స్వరూపిణి. మొదట అమ్మవారి విగ్రహం బాల బ్రహ్మేశ్వరాలయంలో ఉండేది. 2008లో ప్రత్యేకంగా ఆలయ నిర్మాణం చేసి అమ్మవారిని అక్కడ ప్రతిష్ఠించారు.

## గండి మైసమ్మ - మైసిగండి

మహబూబ్‌నగర్ జిల్లాలోని, ఆమన గల్లు మండలం, హైదరా బాద్ నుండి సుమారు 50 కి.మీ. దూరంలో కర్నూలు వెళ్ళే రహ దారిలో మైసిగండి అనే ప్రాంతంలో ఉన్న ఒక వేపచెట్టు క్రింద బురుజు గోడలో స్వయంభూవుగా మైసమ్మ తల్లి వెలిసినది. ఈమె కొన్ని వందల సంవత్సరాల క్రితం వెలసినట్లు తెలియుచున్నది ఈ మైసమ్మ తల్లి ఇచట గ్రామదేవతగా భక్తుల పూజలనందుకొంటుంది. మైసిగండి మైసమ్మ దేవత మహ బూబ్‌నగర్, రంగారెడ్డి జిల్లాలోని పరిసరాల ప్రజలకు ఆరాధ్య దేవత. కల్వకుర్తి, అచ్చం పేట, శ్రీశైలం వైపు వెళ్ళే ఆర్టీసీ బస్సులు ఈ ఆలయం ముందునుండి వెళుతూ ఇక్కడ ఆగుతాయి. భక్తుల పాలిట కొంగుబంగారమై కోరిన కోర్కెలు తీర్చే అమ్మగా ఈమెను కొలుస్తారు. సృష్టి స్థితి లయకారిణియై కాళికాదేవి స్వరూపంతో పూజలందుకొంటుంది ఈమె. మైసమ్మను అర్చించినవారు




సుఖసంతోషాలతో, సౌభాగ్యాలతో వర్ధిల్లుతారనే గొప్ప నమ్మకం ఈ ప్రాంత ప్రజలలో బలంగా ఉన్నది. మైసమ్మ విగ్రహం ప్రతిష్టించక ముందు ఇక్కడ చిన్న శిలావిగ్రహం ఉండేది. కొంతకాలం తరువాత ఒక భక్తుడు ఈ మైసమ్మ విగ్రహాన్ని ప్రతిష్టించినట్లు తెలుస్తుంది.

## బుగ్గ రామేశ్వరాలయం - జడ్చర్ల

మహబూబ్‌నగర్ జిల్లాలో జడ్చర్ల పట్టణం, జడ్చర్ల నుండి 10 కి.మీ., దూరంలో బుగ్గరామేశ్వరం అనే ఆలయం ఉన్నది. ఈ ఆలయం చాలా పురాతనమైన ఆలయంగా ప్రసిద్ధి చెందినది. ఈ ఆలయంలోని స్వామివారు బుగ్గ రామేశ్వరుడు. ఈ బుగ్గ రామేశ్వ రాలయం క్రీ.శ.750 ప్రాంతంలో నిర్మించబడినట్లు చరిత్ర ద్వారా తెలుస్తుంది. ఆలయ ప్రాంగణంలో 22 స్తంభాలతో నిర్మించబడిన స్తంభాల మండపం ఉన్నది.

## సీతారామచంద్రస్వామి దేవాలయం - శిర్సనగండ్ల

మహబూబ్‌నగర్‌జిల్లా, వంగూరు మండలం, నాగార్జున సాగర్ రోడ్డులో, మహబూబ్‌నగర్‌కు 76 కి.మీ., దూరంలో దేవరకొండకు 25 కి.మీ., దూరంలో చార గొండ నుండి 5 కి.మీ.,దూరంలో శిర్స న గండ్ల అనే గ్రామము ఉన్నది. ఇక్కడ కొండ పైన అతి పురాతనమైన శ్రీ సీతారామ చంద్ర స్వామి వారి దేవాల యం ఉన్నది. ఈ క్షేత్రం రెండవ భద్రాదిగా పేరు పొందినది. ఈ ఆలయం క్రీ.శ.14వ శతాబ్ధ కాలంనాటిదిగా తెలియుచున్నది. 60 ఎకరాలు విస్తరించి ఉన్న కొండపై ఉన్న ఈ ఆలయంలో కోదండ రాముడు సీతా, లక్ష్మణ సమేతంగా భక్తులకు దర్శనమిస్తారు.

ఇక్కడ ప్రతిఏటా చైత్రశుద్ధ పాడ్యమి నుంచి నవమి వరకు తొమ్మిదిరోజులు అత్యంత వైభవంగా ఉత్సవాలు (జాతర) బ్రహ్మోత్స వాలు జరుగుతాయి. శ్రీ సీతారాముల కళ్యాణోత్సవం కూడా ప్రతిఏటా ఎంతో గొప్పగా నిర్వహిస్తారు. ఈ ఉత్సవాల సందర్భంగా భక్తులు



పెద్దసంఖ్యలో పాల్గొని ముడుపులు చెల్లించుకుంటారు. ఇచ్చట గండ దీపం మోయుట ఒక ప్రత్యేకత. అనగా భక్తులు తమ పిల్లలకు అనారోగ్యంగా ఉన్నప్పుడు ఈ స్వామి వద్ద గండదీపం మోయిస్తానని మ్రొక్కుకుంటారు. గండదీపం అనగా గోధుమపిండితో పెద్ద ప్రమిద చేసి దానిలో ఆవు నేతితో దీపం వెలిగిస్తారు. తరువాత దానిని అనా రోగ్యం తీరిన వారి తలపై ఉంచి మూడు ప్రదక్షిణలు చేయిస్తారు.

## శ్రీలక్ష్మీ నరసింహస్వామి వారి దేవస్థానం - యాదగిరిగుట్ట

నల్గొండజిల్లా, యాదగిరిగుట్ట మండలం, భువన గిరి నుండి 9 కి.మీ., దూరంలో గల యాదగిరిగుట్ట మీద శ్రీ లక్ష్మీ నరసింహస్వామి వారి దేవస్థానం ఉంది. ఇది హైదరాబాదుకు సుమారు 60 కి.మీ. దూరంలో ఉంది. సృష్టికి పూర్వం శ్రీ మహావిష్ణువు నరసింహ రూపం లోనే బ్రహ్మకు దర్శనం ఇచ్చి, 'ఉగ్రంవీరం మహా విష్ణుం జ్వలంతం సర్వతో ముఖం నృసిం హం భీషణం భద్రం మృత్యోర్మృత్యుం నమా మ్యహం' అని మంత్రోప దేశం చేశారట. దీనివల్లే బ్రహ్మకు వేద దర్శనమై, ఆ తరువాత సృష్టి మొదలు పెట్టాడట. అంతటి ప్రాముఖ్యం



ఉన్న అవతారం నరసింహావతారం. అలాంటి నారసింహుడు వెలసిన పవిత్రక్షేత్రం యాదగిరి. మన రాష్ట్రంలోని ప్రముఖ దేవాలయాల్లో ఒకటిగా త్రేతాయుగంలోనే స్వామి వారు ఇచట వెలిశారని ప్రతీతి. ఇది స్వయంభువు నరసింహస్వామి ఆలయంగా భాసిల్లుతున్నది. శ్రీ వేదవ్యాస మహర్షి రచించిన నర సింహపురాణం లోనే కాక, స్కాంద, బ్రహ్మాండ పురాణాల్లో కూడా యాదగిరి క్షేత్ర మహాత్మ్యం ఉంది. క్రీ.శ.1148 సంవత్సరంలో త్రిభువన మల్లుడు ఆంధ్రదేశంలోని రాజులను ఓడించి భువ నగిరిలోని ఏకశిలా పర్వతంపై కోటను నిర్మించి యాదగిరి లక్ష్మీనరసింహ స్వామివారిని సేవించినట్లు కొలను పాకలోని జగద్దేవుని నారాయణ స్వామి ఆలయంలో గల శాసనం ద్వారా తెలుస్తుంది. క్రీ.శ.15వ శతాబ్ధంలో శ్రీ కృష్ణదేవ రాయలు దండయాత్రకు వెళ్తూ మార్గమధ్యలో గల ఈ క్షేత్రాన్ని దర్శించినట్లు చరిత్ర వలన తెలుస్తుంది. ఆంజనేయ స్వామి గుడి ఉన్న బండపై గండభేరుండ నరసింహమూర్తి ఉన్నాడు. గర్భగుడిలో జ్వాలానరసింహ స్వామివారు, మరికాస్త లోపల యోగ ముద్రలో యోగానంద నరసింహస్వామి,లక్ష్మీనరసింహస్వామిఉన్నారు.

ఈ క్షేత్రంలో ప్రదక్షిణల మొక్కు ప్రధానమైనది. దీనివల్ల మానసిక, శారీరక, ఆర్థిక బాధల నుంచి విముక్తి కలుగుతుందని భక్తుల నమ్మకం. మండలం (41 రోజులు), అర్ధమండలం, 11రోజుల ప్రదక్షిణల మొక్కులు మొక్కుకుంటారు భక్తులు. నిత్యం గర్భాలయానికి రెండు సార్లూ, ఆంజనేయస్వామికి16 సార్లూ ప్రదక్షిణలు చేస్తారు. ఈ మొక్కు తీర్చుకొనే దశలో స్వామి కలలోనే తమకు శస్త్రచికిత్సలు చేసి, శారీరక బాధల నుంచి విముక్తి చేస్తాడని నమ్ముతారు. సత్యన్నారాయణ స్వామి వ్రతాలకు అన్నవరం తర్వాత అంత ప్రసిద్ధి చెందిన క్షేత్రం యాదగిరి గుట్ట. రోజులో నాలుగుసార్లు ఈ వ్రతాలు జరుగుతాయి. ఏటా ఫాల్గుణ మాసంలో 11 రోజుల పాటు నారసింహుని బ్రహ్మోత్సవాలు జరుగు తాయి.ఆలయంలో నిత్యపూజలతోపాటు పండుగ, పర్వదినాలలో ప్రత్యేక పూజలు, ఉత్సవాలు జరుగును. ఫాల్గుణ శుద్ధ విదియ నుంచి ద్వాదశి వరకు బ్రహ్మోత్సవాలు ఘనంగా జరుగుతాయి. వైశాఖ శుద్ధ ద్వాదశి నుంచి చతుర్దశి వరకు నరసింహజయంతి ఉత్సవాలు జరుగుతాయి.

## శ్రీయోగానంద లక్ష్మీనరసింహస్వామి - మట్టపల్లి

నల్గొండ జిల్లా, హుజుర్‌నగర్ సమీపంలో కృష్ణానదీ తీరాన మట్టపల్లి అనే గ్రామము కలదు. ఈ గ్రామములో ఉన్న ఒక పర్వతంపైన ఉన్న గుహలో స్వయంభువుగా వెలసిన నరసింహస్వామి క్షేత్రం కలదు. ఈ స్వామి తో పాటు దక్షిణావృత శంఖం కూడా ఆవిర్భ వించింది. ఇది వేదాద్రి మొదలైన పంచనార సింహ క్షేత్రాలలో ఒకటిగా ప్రసిద్ధి చెందినది. ఈ మట్టపల్లి ఆలయానికి వెయ్యేళ్ళ చరిత్ర

ఉన్నది. ఈ స్వామి ప్రహ్లాద యోగానంద శ్రీలక్ష్మీనరసింహస్వామిగా భక్తులచే పిలువబడుతున్నారు.



ఈ మట్టపల్లి నరసింహస్వామి కొంతకాలం ఎవరికీ తెలియకుండా గుహలో దాగి ఉన్నాడట! అప్పుడు ఒక భరద్వాజ మహర్షి మాత్రమే, ఆ స్వామిని ఆరాధించుచుండేవాడట! పూర్వం భరద్వాజ మహర్షి ఇచ్చుటగల గుహలో స్వామివారి దర్శనం కోరి గొప్ప తపస్సు చేశాడు. ఆవిధంగా తన భక్తుడైన ప్రహ్లాదుని సంరక్షించడానికి భరద్వాజునికి ప్రత్యక్షమై దీవించాడు. అప్పుడు భాగవతోత్తములెందరో దర్శించి, సేవించి తరించారు.వారి కోరికమేరకు స్వామి అచట కొండ గుహలో వెలిశాడు. ఆనాటినుండి భరద్వాజమహర్షితో పాటు దేవతలు, మహర్షులు స్వామివారిని సేవించి తరించారు. ఈ మహర్షుల ఆరాధనలతో వేలకొలది సంవత్సరాలు గడచిపోయాయి. 15 అడుగుల ఎత్తు ఉన్న ఒక శిలా శాసనంపై దేవనాగర లిపితో చెక్కబడిన శాస నంలో ఈ ఆలయం 1100 సం॥కు ముందు నాటిదని మనకు తెలుస్తుంది. ఈ క్షేత్రంలో యమధర్మరాజు స్వయంగా వచ్చి ప్రదక్షిణలు చేశారట. అందుకే ఈ క్షేత్రానికి యమమోహిత క్షేత్రం అని పేరు కూడా కలదు. ఈ క్షేత్రమును దర్శించే భక్తులు కృష్ణానదిలో స్నాన మాచరించి 32 ప్రదక్షిణలు చేస్తారు. ఇది ఈ క్షేత్రము యొక్క ప్రాముఖ్యత.

## పచ్చల సోమేశ్వరాలయం - పానగల్లు

నల్గొండ జిల్లాలో చరిత్రాత్మకంగా ప్రసిద్ధి గాంచిన గ్రామము పానగల్లు. ఈ పానగల్లుకు సుమారు 3 కి.మీ., దూరంలో శ్రీ పచ్చల సోమేశ్వరాలయం కలదు. ఇచట వెలసిన సోమేశ్వరుడు పచ్చలు ధరించి పచ్చల సోమేశ్వరుడుగా ప్రసిద్ధి చెందాడు. ఈ క్షేత్రానికి పంచేశ్వరాలయం అనే పేరు కూడా కలదు. ఈ పానగల్లు 10, 12 శతాబ్దాలలో కల్యాణి చాళుక్యుల అధికారంలోనూ, తరువాత కొంత కాలం కుందూరు చోళుల అధీనంలోను, తరువాత కొంతకాలం కాకతీయ ప్రభువుల రాజధానిగా గూడా ప్రఖ్యాతిచెందింది. ఆయా రాజుల కాలంలో అచట అనేక ఆలయాలు నిర్మించారు. వానిలో పచ్చల సోమేశ్వరాలయం ఒకటి. ఇది చాలా ప్రాచీన మైన ఆలయం.



ఈ ఆలయము కందూరు చోళుల కాలంలో మహా వైభవ మును అనుభవించినట్లు తెలియుచున్నది. ఈ ఆల యములో పచ్చలసోమేశ్వర స్వామివారు, రాజరాజేశ్వరీ అమ్మవారు, నందీశ్వరుడు మొదలగు వారు భక్తులకు దర్శనమిస్తారు. ఇచటి నందీశ్వరుడు, నాగదేవతల శిల్పాలు ఎంతో అందంగా మలచబడ్డాయి.ఈ ఆలయంలో నిత్యపూజలతో పాటు, కార్తీకమాసం, మహాశివరాత్రి మొదలగు పర్వ దినాలలో విశేషపూజలతో పాటు ఉత్సవాలు కూడా ఘనంగా నిర్వహిస్తారు.

*చిరునామా : **శ్రీ గాజుల సత్యనారాయణ,** డోర్ నెం. 24-14-45, సాయి రెసిడెన్సీ, 2వ అంతస్తు, కుందేటి వారి వీధి, బావాజీ పేట, విజయవాడ - 520 003.*

శ్రీ రేగుళ్ళ మల్లికార్జునరావు
డా॥ ఈమని శివనాగిరెడ్డి - స్థపతి

# దివిసీమ దేవాలయాలు

## 1. శ్రీ పృథ్వీశ్వరస్వామి దేవాలయము  నడకుదురు

విజయవాడ- అవనిగడ్డ కరకట్ట మార్గంలో శ్రీకాకుళం దాటిన తరువాతగల నడకుదురు గ్రామానికి కుడివైపున కరకట్టకు, కృష్ణా నదికి మధ్యలో పృథ్వీశ్వరస్వామిదేవాలయముంది. ప్రకృతి ఒడిలో నదీతీరానగల ఈ ఆలయం ప్రసన్నత నొసగే తీర్థక్షేత్రంగా ప్రసిద్ధి చెందింది. స్వయంభువు అని పేర్కొనబడిన పల్నాటి సున్నపురాతి శివలింగం చుట్టూ నల్లశానపురాయి పానవట్టము అందంగా అలంక రించబడింది. క్షేత్ర మహాత్మ్యం ప్రకారం ప్రశస్తమైన ఈ ప్రదేశంలో విశ్వామిత్ర మహర్షి మట్టి (పృథ్వీ)తో చేసిన లింగాన్ని పూజించేవాడనీ, తరువాత ఆ మట్టి లింగమే రాయిగామారిందట. అందుకు తార్కాణంగా, వర్షాకాలంలో ఈ లింగం నుంచి మట్టి వాసనలు గుబాళిస్తుంటాయని కూడా స్థానికులు చెప్పు కొంటున్నారు.

మరోపురాణంలో ఇక్కడి లింగాన్ని నరకాసురుడు పూజించేవాడనీ, అతడు పృథ్వీపుత్రుడైనందున తన ఇష్టదైవమైన ఈశ్వరునికి పృథ్వీశ్వరుడని పిలుచుకున్నాడని చెప్పబడింది. నడకుదురులోనే, శ్రీరాముడు, లక్ష్మీనారాయణస్వామి విగ్రహాన్ని ప్రతిష్ఠించాడని కూడా చెప్పబడింది.

సత్యభామాసమేత శ్రీకృష్ణుడు, నరకాసురుని ఇక్కడే సంహ రించాడని, అందుచేత ఈ ప్రదేశం నరకోత్తారక క్షేత్రమై, తరువాత నరకుదురు, నడకుదురుగా మారిందని కృష్ణానది మహాత్మ్యంలో వర్ణించబడింది.

ఈ ఆలయ గర్భాలయం, అర్ధమంటపం, ముందు పదహారు స్థంభాల మహామండపం, ధ్వజస్థంభం, బలిపీఠం, ఎడమవైపున నాలుగు స్థంభాల కళ్యాణమండపం ఉన్నాయి. మహామండపంలో, అర్ధమండపానికి అటూ ఇటూ గల రెండు చిన్న కోష్టాలలో పార్వతి, భైరవులను ప్రతిష్ఠించారు.ఒక గోడకు చిన్న గణేశ విగ్రహముంది.

ఆలయంలోపల శివకేశవులకు భేదములేదన్నట్లుగా ఒక చక్కటి లక్ష్మీనారాయణ విగ్రహముంది. ఒకప్పుడు ఈ క్షేత్రంలో లక్ష్మీనారాయణస్వామికి ఆలయముండేదనీ, కాలక్రమంలో అది జీర్ణమైపోగా, ఆ విగ్రహాన్ని పృథ్వీశ్వరాలయంలో భద్రపరిచారని స్థానికులు కథనం.

మాస శివరాత్రి, మహాశివరాత్రి, విజయదశమి, కార్తీక పున్నమి,సంక్రాంతి ఇంకా స్వామివారి వార్షిక బ్రహ్మోత్సవాలు ఘనంగా జరుగుతాయి. ఆలయానికి ఎడమవైపున పాటలీ వృక్షముంది. బాగా చలిప్రదేశాల్లో మాత్రమే పెరిగే ఈ పాటలీవృక్షం, ఇక్కడ మాత్రమే ఉండటం ఒక ప్రత్యేకతగా చెప్పుకొంటారు. పృథ్వీశ్వర స్వామి దేవాలయాన్ని సందర్శించే భక్తులు విధిగా, కల్పవృక్షంగా భావించే పాటలీ వృక్షాన్ని కూడా సందర్శించి, ఆ చెట్టు పూలతో స్వామివారిని పూజించి తరిస్తారు. తొలుత, విశ్వామిత్ర ప్రతిష్ఠితమూ, తరువాత స్వయంభూ లింగంగా మార్పుచెందిన లింగాన్ని పృథ్వీశ్వరునిగా పూజించటం దివిసీమలో గల ప్రత్యేకతల్లో ఒకటిగా చెప్పుకోవచ్చు.

## 2. శ్రీ బాలపరమేశ్వరీ సమేత జలధీశ్వరస్వామి దేవాలయం, ఘంటసాల

విజయవాడ నుంచి అవనిగడ్డ వెళ్లే దారిలో, కొడాలికి ఎడమ వైపున 5కి.మీ దూరంలో గల ఘంటసాల గ్రామంలోని బాల పరమేశ్వరీ సమేత జలధీశ్వరాలయం, జిల్లాలోని ప్రముఖ శైవక్షేత్రాల్లో ఒకటి. విజయవాడకు 60, చల్లపల్లికి 5 కి.మీల దూరంలోనున్న ఈ ఆలయాన్ని ప్రతిరోజూ అధిక సంఖ్యలో భక్తులు సందర్శిస్తుంటారు. ఘంటసాల గ్రామానికి రెండువేల ఏళ్ల చరిత్ర ఉంది. ఇక్కడ గల క్రీ.శ. 1-3 శతాబ్దాల నాటి బౌద్ధ స్థూపం, చక్రాకారంలో నిర్మించబడింది. క్రీ.శ 2వ శతాబ్దానికి చెందిన గ్రీకు భూగోళ శాస్త్రవేత్త టాలెమీ ఈ గ్రామాన్ని కంటకస్సిల అనిపేర్కొనటం గమనార్హం.

సిద్ధార్థుని గుర్రమైన కంటకం పేరు మీద ఈ గ్రామానికి కంటకశైలమనీ, తరువాత కంటకశిల అనీ రానురాను ఘంటసాలగామారిందని చరిత్రకారుల అభిప్రాయం.క్రీ.శ 1870-1904ల మధ్య గ్రామంలోని ఘోటకం దిబ్బ దగ్గర బౌద్ధ స్థూపాన్ని, రమణీయంగాచెక్కిన బౌద్ధ శిల్పాలున్న ఫలకాలు, శిలకృత శాసనస్థంభాలు, బుద్ధ విగ్రహాలు లభించాయి. క్రీస్తు శకారంభంలో ఇదొక రేవు పట్టణంగా ఉండేదనీ, ఇక్కడ విదేశాలతో వర్తకం సాగించిన మహా నావికులున్నారనీ, క్రీ.శ. 3వ శతాబ్దంలో ఉపాసిక బోధిసిరి ఇక్కడొక శిలా మండపాన్ని కట్టించిందని శాసనాలు తెలియజేస్తున్నాయి. గ్రామంలో శాతకర్ణి, యజ్ఞశ్రీ శాతకర్ణి నాణాలు, పశ్చిమ క్షాత్రవుల నాణేలు, రోమన్ నాణేలు, సాలంకాయనుల నాణేలు లభించాయి.

దక్షిణ కైలాసంగా కూడా పిలువబడిన ఘంటసాల గ్రామంలోని జలధీశ్వరలింగాన్ని అగస్త్య మహాముని ప్రతిష్ఠించాడని, క్రీ.శ 8వ శతాబ్దిలో ఆదిశంకరాచార్యులు ఈ లింగాన్ని అర్చించారని స్థల పురాణంలో ఉంది. క్రీ.శ 12, 13 శతాబ్దాల శాసనాల్లో ఘంట సాలలోని శివాలయాన్ని జలధీశ్వరాలయంగా పిలిచారు. జలధి అనగా సముద్రం. సముద్రంపై వర్తక వాణిజ్యాలు నెరవేవారికి అభయమిచ్చే స్వామిగా శివుణ్ణి జలధీశ్వరస్వామి అని పిలిచారని స్థలపురాణంలో ఉంది. ఉంటారు. ఘంటసాలలో దేశ, విదేశాల వర్తకులు, చోళ,పాండ్యరాజ్యాల వర్తకులుండటాన ఈ గ్రామాన్ని ఆ రోజుల్లో చోళపాండ్య పురమని, దేవుణ్ణి విశ్వేశ్వరస్వామి అని పేర్కొన్నారు. ఆలయం గర్భాలయంలోని పానవట్టంపై పల్నాటి సున్నపురాతితో చెక్కిన శివలింగం, బాలపార్వతి అమ్మవారు ప్రతిష్ఠించబడి ఉండటం ఒక ప్రత్యేకత. జలధీశ్వరాలయం శిథిలం కాగా ఇటీవల ఆధునికంగా నిర్మించారు. విశాల ప్రాంగణంలో నాగరాజు, కుమారస్వామి, నవగ్రహాలు ప్రతిష్ఠితమై ఉన్నాయి. ఆలయానికి ఎదురుగా గోపురమూ, మూడు వైపులా ప్రవేశ ద్వారాలూ ఉన్నాయి. ఆలయ మహామండపానికి ఇరువైపులా పల్నాటి సున్నపురాతితో చెక్కిన భైరవుడు, నరసింహస్వామి విగ్రహాలున్నాయి. నరసింహస్వామి క్షేత్రపాలకునిగానూ, భైరవుడు ద్వారపాలకునిగానూ ఉండటం ఈ ఆలయం మరో ప్రత్యేకత. ఘంటసాలలో ఇంకా వేణుగోపాలస్వామి ఆలయం, ఆంజనేయస్వామి ఆలయం, విశ్వేశ్వరాలయం, అన్నపూర్ణాంబ ఆలయం, భావనారుషి ఆలయం, రామాలయం, పెన్నేరమ్మ, ముత్యాలమ్మలకు కూడా దేవాలయా లున్నాయి. ఘంటసాలలోని జలధీశ్వరాలయాన్ని దర్శించి, తరించండి.

### 3. శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాలయం, మోపిదేవి

విజయవాడ నుంచి అవనిగడ్డ వెళ్లే దారిలో, విజయవాడకు 65, అవనిగడ్డకు 5 కి.మీ దూరంలోగల మోపిదేవి గ్రామంలో సుబ్రహ్మణ్యే శ్వరాలయముంది. మోహినీపురమని కూడా పిలువబడిన మోపిదేవి గ్రామాన్ని వింధ్య పర్వత గర్వమణచిన అగస్త్య మహర్షి తనదక్షిణ దేశయాత్రలో భాగంగా సందర్శించాడనీ, అప్పుడు ఒక పుట్టలో నుంచి వెలుగులు విరజిమ్మిందనీ, దివ్యదృష్టితో చూచిన అగస్త్యునికి, ఆ పుట్టలో పాము రూపంలో నున్న సుబ్రహ్మణ్యస్వామి కనిపించాడని స్థలపురాణంలో ఉంది. ఒకప్పుడు కొన్ని దోషాల నివారణ కోసం, ఇంకా దివ్యశక్తుల కోసం,సుబ్రహ్మణ్యస్వామి తపమాచ రించటానికి అనువైన ప్రదేశాన్ని వెదుకుతుండగా, సుందరతర ప్రకృతిలో ఓలలాడుతూ కృష్ణా తీరంలో నున్న మోపిదేవి పరిసరాలు నచ్చాయని, ఇక్కడ తపమాచరించిన సుబ్రహ్మణ్యస్వామికి పర మేశ్వరుడు ప్రత్యక్షమై అనుగ్రహించాడని, ఇదంతా దివ్యదృష్టితో గ్రహించిన అగస్త్యముని, ఈ ప్రదేశంలో సుబ్రహ్మణ్యేశ్వరస్వామి పేర ఒక లింగాన్ని ప్రతిష్ఠించా డనీ కూడా చెప్పబడింది. అటు తరువాత శుభాంగుడు అనే రాజు భక్తి ప్రపత్తులతో సుబ్రహ్మణ్యేవ్వరునికి నిర్మించిన ఆలయం భక్తుల పాలిట పెన్నిధిగా నిలిచిందనీ చెప్పబడింది. ఆలయానికి అటూ, ఇటూ వల్లీ దేవసేనలకు ఆలయాలున్నాయి.

ఆలయానికి దక్షిణ దిశగానున్న పుట్టనుంచి గర్భాలయంలోని లింగం అడుగుభాగంలో నున్న పుట్టకు దారి ఉండేదని అర్చకులు చెబుతున్నారు. ఈ మార్గం ద్వారా ప్రయాణించిన భక్తులకు సర్పదోషం తొలగిపోతుందని నమ్మకం. పిల్లలు లేనివారు సుబ్రహ్మణ్యేశ్వరస్వామికి మొక్కుబడులు చెల్లిస్తే సంతానాన్ని పొందుతారనే నమ్మకంతో ప్రతిరోజూ వేలాది మంది భక్తులు ఈ ఆలయాన్ని సందర్శిస్తున్నారు. గతంలో ఒకసారి స్వామివారికి భక్తుడైన ఒక కుమ్మరి, మట్టితో కోడి, గుర్రం, నంది, గరుత్మంతుని బొమ్మలను తయారుచేసి సమర్పిం చాడనీ, ఇప్పటికీ ఆలయంలో ఉన్నవి ఆ బొమ్మలేనని అర్చకులంటు న్నారు. ఆలయంలో జరిగే మాఘమాస కళ్యాణోత్సవం, నాగులచవితి, సుబ్రహ్మణ్యషష్ఠి, కృత్తికానక్షత్ర విశేష పూజలు, ఉత్సవాల సందర్భంగా రాష్ట్రం నలుమూలల నుంచి వేలాదిమంది భక్తులు మోపిదేవివి తరలి వచ్చి, అర్చనలు చేసి తరిస్తారు.

### 4. శ్రీ దుర్గానాగేశ్వరస్వామి దేవాలయం, పెదకళ్లేపల్లి

దివిసీమలో అవనిగడ్డకు 15 కి.మీ, మోపిదేవికి 12 కి.మీ. దూరంలో ఉత్తరవాహినిగా ప్రవహిస్తున్న కృష్ణాతీరంలోగల పెదకళ్లేపల్లి చారిత్రక ప్రదేశము. క్రీ.శ 1-2 శతాబ్దాల్లో ఇదొక బౌద్ధక్షేత్రమని, నాగేశ్వరాలయంలోనున్న బౌద్ధస్థంభాలు తెలియజేస్తున్నాయి.

కడలుపురి, కదళీపురంగా పేరుగాంచిన పెదకళ్లేపల్లి, దక్షిణ కాశిగా కూడా ప్రసిద్ధి చెందింది. విశాలమైన ఈ తీర్థక్షేత్రం గురించి స్కాంధపురాణంలో వివరించబడింది. జనమేజయుడు ఇక్కడే సర్పయాగం చేశాడని, కర్కోటకం మొదలుగాగల మహానాగాలు, వశిష్ఠులాంటి మహర్షులు తపమాచరించిన ప్రదేశమనీ పురాణాలు పేర్కొంటున్నాయి. ఈ క్షేత్ర మహిమ శ్రీమత్కదళీపుర మహాత్మ్యంలో ఉంది. ఆలయంలో దుర్గ, నాగేశ్వర, పార్వతి, కాలభైరవ, భైరవ ఆలయాలు, ముందు ఒక సరోవరం ఉన్నాయి. ప్రధానాలయమైన నాగేశ్వరాలయం, గర్భాలయం, అర్థమండపం, మహా మండపం, ముఖమండపం, ధ్వజస్థంభం, రాజగోపురం ఉన్నాయి. ఆలయానికి ఎదురుగా ఈశాన్యంవైపున్న నాగ సరోవరంలో స్నానాలు ఆచరిస్తే నాగదోషాలు, పాపాలు తొలగిపోయి పునీతులౌతారని స్థానికుల నమ్మకం.

గర్భాలయంలో, నాగేశ్వరస్వామి, అర్థమండప ద్వారాలపై దిండి, ముండి, మహా మండపంలో కుడి, ఎడమ వైపుగల కోష్టాల్లో వీరభద్రుడు, భద్రకాళి విగ్రహాలున్నాయి. దుర్గ, భైరవులకు ప్రత్యేకా లయాలున్నాయి. ఆలయం ఈశాన్యదిశలో కళ్యాణ మండపం, దక్షిణాన ఒక బౌద్ధస్థంభం, దానిముందు కర్కోటకనాగశిల్పం ఉన్నాయి. దీనిని సత్యస్థంభమని కూడా అంటారు. ఆలయం ఎడమవైపున గోడకు క్రీ.శ 13వ శతాబ్ది చివరలో ఆలయాన్ని పునరుద్ధరించిన సోమ శివాచార్యుల శిల్పం ఉంది.

ఆలయంలోని గోపురానికి బిగించిన రెండు శాసనాలు, కళ్యాణ మండప స్థంభాలపై నాలుగు శాసనాలు, బౌద్ధ స్థంభంపైన ప్రాకృత శాసనం ఉన్నాయి. క్రీ.శ 11-18 శతాబ్దాల మధ్య కాలానికి చెందిన ఈ శాసనాల్లో ఆలయనిర్మాణం, అఖండ దీపానికి కావలసిన నేతిని సరఫరా చేయటానికి అవసరమైన ఆవులు, ఎనుములు, గొర్రెలను దానం చేసిన వివరాలున్నాయి. కాకతీయ ప్రతాపరుద్రుని క్రీ.శ 1292వ సం॥ శాసనంలో సోమ శివాచార్యుని ఆధ్వర్యంలో ఆలయం రాతిగోడల నిర్మాణం జరిగిందని చెప్పబడింది. చల్లపల్లి జమీందారు రాజా యార్లగడ్డ కోదండరామన్న దేశాయి, 1782లో ఆలయానికి జీర్ణోద్ధరణ చేశారు. తరువాత 1796లో ఆలయ గాలి గోపురాన్ని నాగేశ్వరనాయుడు నిర్మించారన్న శాసనం గోపురానికి బిగించబడి ఉంది. మహాశివరాత్రికి వేలాదిమంది భక్తులతో ఆలయ ప్రాంగణం కళకళ లాడుతుంది. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, సుసర్ల దక్షిణా మూర్తిగారు లాంటి సాహితీ, సంగీత విద్వాంసులు పుట్టిన పెదకళ్లేపల్లి కృష్ణాతీరంలో తనకంటూ ఒక ప్రత్యేకతను సంతరించు కుంది. గ్రామంలో ఇంకా వేణుగోపాలస్వామి, ఆంజనేయుని ఆలయా లున్నాయి. వేణుగోపాల స్వామి ఆలయం క్రీ.శ.10వ శతాబ్దికి చెందినది. ఆలయంలోని వైకుంఠనారాయణ, ద్వారపాల శిల్పాలు, వేంగీ చాళుక్య శిల్పకళకు అద్దం పడుతున్నాయి. పుష్కర పుణ్యకాలంలో పెదకళ్ళేపల్లిలోని నాగసరోవరంలోను, సమీపంలోగల కృష్ణా నదిలోని స్నానమాచరించి తరించండి.

## 5. శ్రీకాకుళేశ్వస్వామి దేవాలయం, శ్రీకాకుళం

దివిసీమలోని శ్రీకాకుళం గ్రామం శ్రీకాకుళేశ్వరస్వామి దేవా లయానికి ప్రసిద్ధి. విజయవాడకు 45 కి.మీ, ఘంటసాలకు 15 కి.మీ దూరంలో కృష్ణాతీరాన గల శ్రీకాకుళంలోని శ్రీకాకుళేశ్వరస్వామికి ఆంధ్ర మహావిష్ణువు, ఆంధ్రనాయకుడు, ఆంధ్ర వల్లభుడు, తెలుగు వల్లభుడని తెలుగురాయడని పేర్లున్నాయి. ఆంధ్ర కౌముది గ్రంథం ప్రకారం, శ్రీ మహావిష్ణువు, శ్రీకాకుళంలోని సుచంద్రుడనే రాజు కుమారునిగా జన్మించి, ఆంధ్ర మహావిష్ణువను పేరున రాజ్యం చేశాడని చెప్పబడింది. మరో కథ ప్రకారం, పూర్వం ఈ ప్రాంతంలో తపంచేస్తున్న మహర్షులకు కనిపించగా, విష్ణువును ఇక్కడే ఉండమని ప్రాధేయపడగా, శ్రీకాకుళంలో స్థిరపడ్డాడనీ అందువల్ల ఆయనకు శ్రీకాకుళాంధ్ర మహావిష్ణువని పేరు కలిగిందంటారు. శ్రీకాకుళంలోని ఆంధ్ర మహావిష్ణువుకు మీసాలుండటం ఒక ప్రత్యేకతగా చెబుతారు.

108 దివ్య తిరుపతుల్లో 57వ క్షేత్రంగా పేరుపడిన శ్రీకాకుళం లోని ఆంధ్ర నాయకుని ఆలయం, గర్భాలయ, అర్థమండప, మహామండపం, అటూ ఇటూ చెన్నకేశవ, రాజ్యలక్ష్మీ అమ్మవార్ల ఆలయాలున్నాయి. ఆగ్నేయ దిశగా శ్రీకృష్ణదేవరాయలు రచనకు శ్రీకారం చుట్టిన ఆముక్తమాల్యద మంటపం, ఈశాన్యంగా, ఆస్థాన మండపం, ముందు రాజగోపురం, చుట్టూ ప్రాకారం ఉన్నాయి. కుడివైపున ఏకరాత్ర ప్రసన్నమల్లికార్జున స్వామి దేవాలయముంది. గర్భాలయ, అర్థమండప, మహామండప, ముందు మరో మండపం, ఎదురుగా గోపురం, చుట్టూ ప్రాకారం ఉన్నాయి.

క్రీ.శ 12వ శతాబ్దపు తరువాతి శాసనాల్లో శ్రీకాకుళాన్ని కాకొలను, కాకొలని, కాకుళీ, శ్రీకాకులమని పేర్కొన్నాయి. చందోలు పాలకుడైన వెలనాటి కొండని క్రీ.శ 1132వ సం॥ మొదటి శాసనం కాగా క్రీ.శ 1519 నాటి శ్రీకృష్ణదేవరాయలిది చివరి శాసనం. శ్రీకృష్ణ దేవరాయలు శ్రీకాకుళంలో శ్రీ కాళేశ్వరస్వామిని దర్శించి విడిది చేసి నపుడు, స్వామి కలలో కనిపించి తనపై ఒక గ్రంథాన్ని రాయమనగా,

ఆముక్తమాల్యద గ్రంథాన్ని రాశానని ఆయనే చెప్పుకొన్నాడు. శాసనాల్లో, వెలనాటి చోళులు, కళ్యాణ చాళుక్యులు, ముదిగొండ చాళుక్యులు, కాకతీయులు, తూర్పుగాంగులు, విజయనగర చక్రవర్తులు, ఓఢ్ర గజపతులు శ్రీకాళేశ్వరునికి చేసిన దానాల వివరాలున్నాయి. క్రీ.శ 18వ శతాబ్దిలో శ్రీకాకుళ స్వామిపై 'చిత్రచిత్ర ప్రభావ, దాక్షిణ్యభావ! హతవిమతజీవ శ్రీకాకుళాంధ్రదేవ' అన్న మకుటంతో కాసుల పురుషోత్తమ కవి అంధ్రనాయక శతకాన్ని, అటు తరువాత మరికొంతమంది కవులు, దేవుణ్ణి స్తుతిస్తూ పుస్తకాలు రాశారు. ఆలయం శిథిలం కాగా, క్రీ.శ 18వ శతాబ్ది చివరిభాగంలో చల్లపల్లి జమీందారు యార్లగడ్డ కోదండరామన్న పునరుద్ధరించారు.

ఆంధ్ర మహావిష్ణు దేవాలయ కోష్ఠాలలో మహిషమర్దిని, గణేశ, జనార్ధన, కేశవ, వేణుగోపాల, వరాహ, బాలకృష్ణ మొదలైన శిల్పాలు నాటి శిల్పకళ వైశిష్ట్యాన్ని తెలియజేస్తున్నాయి. శ్రీకాకుళం దేవాలయంలో జరిగే తిరునాళ్లు తెలుగునేలంతా ప్రసిద్ధ గాంచాయి. సంవత్సరం పొడవునా జరిగే వివిధ ఉత్సవాలకు వేలమంది భక్తులు తరలి వస్తుంటారు. ఆ ఆలయానికి దక్షిణంగా ఏకరాత్ర ప్రసన్న మల్లిఖార్జున దేవాలయం తూర్పుముఖంగా నిర్మించబడి ఉంది. గర్భాలయం, అర్ధమండపం, మహామండపం, ముఖమండపాలు గల ఈ ఆలయం క్రీ.శ.11-14 శతాబ్దాల మధ్య నిర్మించబడినట్లు అక్కడి శాసనాలు, ఆలయ శిల్పం తెలియజేస్తున్నాయి. శివ, కేశవ, స్థానంగా పేరొందిన శ్రీకాకుళాన్ని దర్శించి తరించండి.

## 6. శ్రీ లక్ష్మీ నారాయణస్వామి దేవాలయం, అవనిగడ్డ

అవనిగడ్డలోని శ్రీ లక్ష్మీనారాయణస్వామి దేవాలయం చరిత్ర ప్రసిద్ధి గాంచింది. వెయ్యేళ్లనాటి ఈ ఆలయంలోని లక్ష్మీనారాయణ విగ్రహాన్ని త్రేతాయుగంలో శ్రీరాముడు ప్రతిష్ఠించాడనీ, వశిష్టుడు సీతాదేవికి ఇక్కడేధార్మిక విషయాలు బోధించాడనీ, అందుచేత ఈ ప్రదేశానికి అవనిజపురమని పేరొచ్చిందనీ,అవనీపురమే అవనిగడ్డ అయిందని స్థలపురాణం వివరిస్తుంది. అవనిగడ్డకు కొద్ది దూరంలో వ్యాఘ్రమహర్షి ఆశ్రమం ఉండేదనీ, ఆ ప్రదేశాన్ని వ్యాఘ్రేశ్వర పురమనిపిలిచే వారనీ, రానురాను అది పులిగడ్డగా పిలువబడిందని స్థానిక పెద్దలు చెబుతున్నారు. ఆలయంలో క్రీ.శ 1138-1154 సంll మధ్యకాలానికి చెందిన 5 శాసనాలలో చోడనారాయణుడుగా పిలువబడిన, లక్ష్మీనారాయణుని, అఖండదీపానికి కొల్లూరి ప్రభువులు ధనాన్ని, గోవులను దానం చేసిన వివరాలున్నాయి.

ఆలయం, గర్భాలయం, అర్ధమండపం, మూడు ప్రవేశ ద్వారాలతో మహామండపం, ఎదురుగా రెండువైపులా చక్కటి శిల్పాలతో నున్న మెట్లమార్గం, ఎడమవైపున ఒక ఆలయం, కుడివైపున మరో ఆలయం, ఈశాన్యంలో నాలుగు స్థంభాల గోష్ఠి మండపం, తూర్పు వైపున ఎత్తైన ఏడంతస్తుల రాజగోపురం, లోపల ప్రతిమా మండపం, చుట్టూ ప్రదక్షిణా పథముంది. నిలువుగా అధిష్ఠానం, పాదవర్గం (గోడ), ప్రస్తరం (కప్పు), దానిమీద రెండతస్తుల విమానం ఉన్నాయి. గర్భాలయంలో లక్ష్మీనారాయణ విగ్రహం, అర్ధమండపంతో ఉత్సవమూర్తులు రూపలావణ్యంతో చూపరులను ఆకట్టుకుంటున్నాయి. ద్వార శాఖలపై జయ, విజయ ద్వారపాలకులు, పైన గజలక్ష్మి విగ్రహాలు అందంగా తీర్చిదిద్దబడినాయి. మహామండప స్థంభాలపై రుక్మిణీ, సత్యభామ, విష్ణుమూర్తి, లక్ష్మీనారాయణులు, వేణుగోపాలుడు, నలరాజు, గణపతి, సతీసమేతుడై ఉన్న గణపతి, వాద్యగాళ్లు, నాట్యగత్తెలు, యుద్ధం చేస్తున్న యుద్ధవీరులు, ఇంకా మహామండపం ముందు వరుసలోనున్న స్థంభాలకు చెక్కిన సింహాల, వెలనాటి చోళుల శిల్పకళారీతికి అద్దం పడుతున్నాయి. ఈ ఆలయానికి కుడివైపునున్న, శివా (రాజశేఖరా)లయం కూడా చూడదగ్గదే.

ఈ ఆలయం దివిసీమకే కాక, ఆంధ్ర రాష్ట్రంలోనే ఒక ప్రత్యేక ఆలయంగా గుర్తింపు పొందింది. రథాకార దేవాలయంగా పేరుగాంచిన కోణార్క సూర్యాలయం క్రీ.శ 1254లో నిర్మించబడగా, అంతకంటే నూరేళ్ల ముందే అంటే క్రీ.శ 1154లోనే రథాకార దేవాలయంగా నిర్మించబడింది. మహామండపం ముందున్న మెట్లకు రెండువైపులా, ఆలయాన్ని రథంలా ముందుకు లాగుతున్నట్లు చక్రాలు, వాటి ముందు గుర్రాలు, గుర్రాలపైన రథకుల శిల్పాలు చక్కగా చెక్కబడినాయి. ఇక 7 అంతస్తుల రాజగోపురం, కప్పు వరకూ రాతిలోనూ, పైన ఇటుకలతోనూ, వెనుక వైపుగల ప్రతిమా మండపం రాతితోనూ నిర్మించబడింది. కోష్ఠాల (గూళ్ళ)తో ఆంజనేయ, లక్ష్మీనారాయణ, గరుడ, లక్ష్మీ నరసింహ, గణపతి, నాగరాజ విగ్రహాలు, ద్వారశాఖలకు జయ, విజయ విగ్రహాలు చూడముచ్చటగా ఉన్నాయి. 100 అడుగుల ఎత్తున్న ఈ గోపురం, దివిసీమలోనే ఎత్తైన గోపురంగా తీర్చిదిద్దబడింది. అంతేకాదు, దేవాదాయ, ధర్మాదాయశాఖ వారి మాస పత్రిక "ఆరాధన" మకుట చిత్రంగా స్వీకరించబడి ప్రత్యేక గుర్తింపుకు నోచుకుంది.

అవనిగడ్డలోని శ్రీ భూనీలా రాజ్యలక్ష్మీ సమేత లక్ష్మీనారాయణ స్వామి ఆలయంలో వైఖానస ఆగమ సంప్రదాయంలో నిత్యార్చనతో

పాటు, నృసింహజయంతి, కృష్ణాష్టమి, కార్తీక పున్నమి, పారువేట సేవ ముక్కోటి ఏకాదశి, వార్షిక బ్రహ్మోత్సవాలు, ఉగాదికి పంచాంగ శ్రవణం, కుంభ, ఆకాశ దీపోత్సవాలు, రాజ్యలక్ష్మీ దేవికి శుక్రవార పూజలు ఘనంగా జరుగుతున్నాయి. హంసలదీవి, నాగాయలంక, గణపేశ్వరాలయాలకు ముఖద్వారంగా ఉన్న అవనిగడ్డలోని లక్ష్మీనారాయణుని దర్శించి ఆశీస్సులు పొందండి.

## 7. సంగమేశ్వరస్వామి దేవాలయం, సంగమేశ్వరం

అవనిగడ్డ నుంచి కోడూరు మీదుగా చేరుకోవటానికి వీలున్న సంగమేశ్వరం గ్రామంలోని సంగమేశ్వరాలయానికి జిల్లాలోనే ప్రత్యేక ఆలయంగా గుర్తింపు ఉంది. కృష్ణానది, సముద్రం (సాగరం) లో కలిసే చోటుగాబట్టి గ్రామానికి సంగమని, సంగమేశ్వరుని పేరుమీదుగా సంగమేశ్వరమని పేరు కలిగింది. భౌగోళిక పరిస్థితుల్లో మార్పుల వల్ల, గ్రామం ప్రస్తుత సంగమప్రదేశానికి కొద్ది దూరంగా ఉంది. ఆలయానికి రెండువైపులా గంగాపార్వతి, నాగేంద్రస్వామి ఆలయాలున్నాయి.

గర్భాలయం, అర్ధమండపం, ఈశాన్యదిశలో, నవగ్రహమండపం ఉన్నాయి. గర్భాలయంలో సంగమేశ్వరుని పేరిట శివలింగం, ఆలయ కోష్టాలలోని కుమారస్వామి, దుర్గామాత శిల్పాలు దైవత్వం ఉట్టిపడేలా ఉన్నాయి. గర్భాలయంలోని చిన్న పానపట్టం మీద ఉన్న లింగం పరమపవిత్రంగా భావించబడి, పూజలందుంకుంటుంది. అర్ధ మండపంలో బాలాత్రిపురసుందరి, మహిషాసుర మర్దని విగ్రహాలు, కాలభైరవుని శిల్పం చూడ చక్కగా ఉన్నాయి. ప్రత్యేకంగా ప్రతిష్టించిన వినాయకుడు, విఘ్నరాజుగా చుట్టుగ్రామాల ప్రజలు గరికతో పూజిస్తుంటారు.

ఇక్కడి విశేషమేమిటంటే గర్భాలయంలోని శివలింగంపై మహా శివరాత్రినాడు సూర్యకిరణాలు ప్రసరిస్తాయి. ఆ విధంగా ఆలయంలోని ఉపాలయాల్లో తగు ఏర్పాటు చేశారు ఆనాటి శిల్పులు. కృష్ణా, సాగరం కలిసే పరమపవిత్రమైన ఈ సంగమేశ్వరంలో స్వామిని దర్శించటానికి భక్తులు రాష్ట్రం నలుమూలలనుండి వస్తుంటారు.

## 8. వేణుగోపాలస్వామి దేవాలయం, హంసలదీవి

దివిసీమలో కృష్ణానది సముద్రంలో కలిసే ప్రదేశానికి సమీపంలో గల హంసలదీవి గ్రామంలో వేణుగోపాలస్వామి దేవాలయం, సాగరసంగమానికి దగ్గరగా ఉన్న తీర్థక్షేత్రం. అవనిగడ్డ, మచిలీపట్నం నుంచి చేరుకోగల ఈ ఆలయం క్రీ.శ.11శతాబ్ధికి చెందినదని అక్కడున్న తమిళ శాసనాలు రుజువుచేస్తున్నాయి. ఒకప్పుడు రెండు వైపులా కృష్ణానదీపాయలు ముందు సముద్రంతో ఒకదీవిగా ఏర్పడింది. ఇక్కడ దేవతలు రాత్రివేళ హంసల రూపంలో సముద్రస్నానాలు చేసి వేణుగోపాలస్వామిని దర్శించుకొనేవారని ఐతిహ్యముంది. ఈ దివిపైన గల స్వామిని దేవతలు హంసల రూపంలో దర్శించుకున్నందువల్లనూ, పాపపంకిలమైన గంగానది కాకిరూపంలో వచ్చి సాగరసంగమంలో స్నానమాచరించి హంసరూపం ధరించిందనీ, అందుకే హంసలదీవి అని పేరొచ్చిందని అంటారు.

ఆలయంలో గర్భాలయం, అర్ధమండపం, ముఖమండపంతో మూడువైపులా ప్రవేశ ద్వారాలతో ఉంది. ముఖమండపంలో మూడు ఉపాలయాలు కూడా నిర్మించబడినాయి. గర్భాలయంలో వేణుగోపాలస్వామి, దక్షిణవైపు ఉపాలయంలో లక్ష్మీనరసింహస్వామి, ఉత్తరం వైపు ఉపాలయంలో విష్ణుమూర్తి విగ్రహం ఉన్నాయి. మరో ఉపాలయంలో దక్షిణాభి ముఖంగా రాజ్యలక్ష్మీ అమ్మవారున్నారు. ఆలయానికి ఈశాన్యంగా పవిత్ర పుష్కరిణి ఉంది.

వేంగీ చాళుక్య వాస్తు శిల్పం ఉట్టిపడుతున్న ఈ ఆలయ కోష్టాలలో దుర్గ, గణేశ, ఆంజనేయ, విగ్రహాలు, విడిగా రెండు ద్వారపాల విగ్రహాలున్నాయి. ప్రతిసంవత్సరం ఆలయంలో బ్రహ్మోత్సవాలు జరుగతాయి.

## 9. గణపేశ్వరాలయం, గణపేశ్వరం

అవనిగడ్డనుంచి తలగడదీవి మీదుగా 10 కి.మీ. ల దూరంలో గల గణపేశ్వరంలోని గణపేశ్వరాలయం చారిత్రక ప్రాశస్త్యాన్ని కలిగిఉంది. శాసనాల్లో గణపేశ్వరాన్ని పెదదీవి పురమని, కృష్ణవేణి సాగర సంగమమని కూడా పిలిచారు. గ్రామంలోని ఆలయాన్ని గణపతీశ్వరాలయమని ఒక కాకతీయశాసనం పేర్కొంది.

తలగడదీవికి చెందిన అయ్యవంశీయుడై పిన చోడదేవునికొడుకు జాయపసేనాని, శక్తియుక్తులను ప్రత్యక్షంగా చూచిన కాకతీయచక్రవర్తి గణపతిదేవుడు, అతని గజసైన్యాధ్యక్షునిగా నియమించాడు. సైనిక విన్యాసాలలోనేకాక నృత్యరీతుల్లో కూడా సిద్ధ హస్తుడైన జాయప నృత్యరత్నావళి గ్రంధాన్ని రాసిన నృత్తలక్షణకారుడు. గణపతిదేవుడు తన పట్ల చూపిన అభిమానానికి ముగ్దుడై కృతజ్ఞతాపూర్వకంగా ఆయన పేరుమీద గణపేశ్వరుణ్ణి ప్రతిష్టించి, కాకతీయ వాస్తురీతిలో గణపేశ్వర పేరిట చక్కటి ఆలయాన్ని, గర్భాలయం, అర్ధమండపం, పదహారు

స్థంభాల మహామండపం, విలుండు ధ్వజస్థంభంతో నిర్మించాడు. ఆలయానికి దక్షిణాన కనకదుర్గ దేవాలయం ఉంది. అమ్మ వారు పది చేతులతో, శక్తిస్వరూపిణిగా తీర్చిదిద్దబడింది. రెండు ఆలయాల ముందు ఇటీవలే జాయప సేనాని విగ్రహాన్ని ప్రతిష్టించారు. మహామండపానికి మూడువైపులా ద్వారాలున్నాయి. ద్వారాలు, స్థంభాలు, కప్పుభాగం, వెలుపల చూరు వగైరా కాకతీయశైలి ఉట్టిపడు తున్నాయి. మహామండపంలో ఎడమవైపున కాశీవిశ్వేశ్వర లింగం, గణేశ, భైరవ విగ్రహాలు క్రీ.శ. 16వ శతాబ్దికి చెందినవి.

ఆలయం వెలుపలగల ఒక పెద్ద శాసనస్తంభం పైన క్రీ.శ.1313, 1346, 1693, 1771 నాటి శాసనాలున్నాయి. క్రీ.శ. 1313నాటి శాసనంలో కాకతీయ చక్రవర్తి ప్రతాపరుద్రుని ప్రతీహారి (శ్రీవారికి అంగరక్షకుడు) బోలైనాయుడు, పెదవీధిపురంలోని గణపతీశ్వరదేవునికి 50 ఆవులు, 50 పెయ్యలను దానం చేసినట్లుగావుంది. 1346 నాటి శాసనంలో అనుమగంటి పురవరాధీశుడైన పాపయ్యనాకుని సేవకుడైన తుమ్మిడి ఉప్పరంప్రోలు లెంక, దివి గణపతీశ్వరునికి పెదతుమ్మిడిలో పాడియావు ఒకటి, మూడుపుట్ల పూదోటను దానం చేసినట్లు చెప్పబడింది. క్రీ.శ.1693 నాటి శాసనంలో వేంగీ సాగర సంగమ క్షేత్రమైన గణపేశ్వరంలో బందరు నగరానికి చెందిన ముదుంబై వంశస్థుడైన తిమ్మన్న గతంలో చోడరాజులు ప్రతిష్టించిన లింగాన్ని తిరిగి ప్రతిష్టించినట్లుగా ఉంది. క్రీ.శ.1771 నాటి శాసనంలో బోగాది వంశానికి చెందిన సుబ్బన్న గణపేశ్వరాలయంలోని లింగాన్ని పునఃప్రతిష్ట చేసిన వివరాలున్నాయి. చైత్రశుద్ధ ఏకాదశి, పున్నమి నాడు స్వామివారి కళ్యాణమహోత్సవం జరుగుతుంది. కార్తీకమాసంలో కార్తీక పున్నమినాడు. అఖండ దీపారాధనలు జరుగుతాయి.

# మాస్టర్ ఎక్కిరాల కృష్ణమాచార్యులు

బాపట్లలో జన్మించారు. మాస్టర్ సి.వి.వి. మార్గాను యాయులు.

ప్రాక్పశ్చిమ ఆధ్యాత్మిక సమన్వయం తెచ్చే మాస్టర్ ఇ.కె.గా ప్రసిద్ధులైనారు.

ది వరల్డ్ టీచర్ ట్రస్ట్ జగద్గురు పీఠాన్ని నెలకొల్పారు.

ఉచిత వైద్యం, సనాతన ధర్మప్రబోధం, యోగ, జ్యోతిర్విద్యల అధ్యయనం,

ప్రాచీన నవీన జ్ఞాన విజ్ఞానముల పరిశోధనా సమన్వయము,

సంఘసేవకులను సిద్ధం చేయటం, స్వతంత్ర జీవనోపాధి కల్పన,

గ్రంథముల ప్రచురణ వంటి ఆదర్శాలతో దేశవిదేశాలలో

శాఖోపశాఖలుగా తమ ట్రస్టును విస్తరించారు.

సుమారు 100కు పైగా గ్రంథాలు వ్రాశారు. 'బహుజన హితాయ బహుజన సుఖాయ"

అనే సందేశంతో ఆధునిక ప్రపంచాన్ని మేల్కొల్పారు.

శ్రీ కొంపెల్ల రామకృష్ణమూర్తి

# దుర్గమ్మ కురిపించిన కనకవర్షం

క్రీ.శ. 350 నాటి పల్లవరాజైన మాధవవర్మ విజయవాటికను (విజయవాడ) రాజధానిగా చేసికొని కృష్ణా, గోదావరీ నదుల మధ్య ప్రాంతాన్ని పరిపాలించాడు. ఆయన ధర్మ నిరతికి మురిసిపోయి, విజయవాటికలో దుర్గమ్మతల్లి కనకవర్షం కురిపించిందట! అప్పటి నుంచీ "కనకదుర్గమ్మ" అని ఆ తల్లిని పిలుస్తున్నారట!

మాధవవర్మ ధార్మిక ప్రవృత్తిగల రాజు. అతనికి ఒక్కడే కుమారుడు. ఒకరోజున..

విజయవాటికాపురవీథులన్నీ కోలాహలంగా ఉన్నాయి. రాజ భటులు ప్రజలను వీథి మధ్యలోనికి రానివ్వటంలేదు. ప్రక్కల నుంచి నడువ వలసినదే! అందరూ దేనికోసమో ఆత్రంగా ఎదురు చూస్తు న్నారు. తెలియని వారెవరైనా మార్గం మధ్యలోకి వచ్చే ప్రయత్నం చేస్తే, రాజభటులు వారిని కసురుకుంటున్నారు.

ఏమిటి ఈ హడావిడి? అంటే - యువరాజు పదివేల సువర్ణ టంకాలతో క్రొత్తగా మేలిజాతి గుఱ్ఱాలను కొన్నాడు. అవి ఇంకా అతనికి అలవాటు కాలేదు. ఆ రోజు ఆ గుఱ్ఱాలను తన రథానికి పూన్చి అతడు వాహ్యాళికి బయలుదేరుతున్నాడు. గుఱ్ఱాలు చాలా వేగంగా పరుగెత్తగలవి. ముందుగానే ఈ విషయాన్ని ప్రజలందరికీ చాటించారు. భటులందరూ అప్రమత్తంగా ఉన్నారు. రథం బయలు దేరింది. నెమ్మదిగా ప్రారంభమైన గుఱ్ఱాల నడక క్రమక్రమంగా పెరుగుతోంది! ఆ రథ వేగానికి ఒకరికొకరు కనిపించనంత దట్టంగా వీథుల్లో దుమ్ము రేగుతోంది. అంత ఖరీదైన గుఱ్ఱాలు ఎలా ఉంటాయో చూసేందుకు వీథిలోకి వచ్చే వాళ్ళ సంఖ్యపెరుగుతోంది. పిల్లలను గదమాయిస్తూ పెద్దలు, తమకు కనిపించకుండా అడ్డుగా ఉన్న పెద్దల్ని ఏమీ అనలేక బిక్కమొహం వేస్తున్న పిల్లలు!

యువరాజు రథం అనూహ్యవేగంతో రాజవీథుల్లో దూసుకు వెడు తోంది! వినోదార్థం అనుకొన్న రథ చోదనం విలయంగా పరిణమిస్తోం దనుకుంటున్నారు ప్రజలు. ఒకరి నొకరు తోసుకుంటూ ప్రమాదం రాదనుకొన్న చోట్లకు తప్పుకుంటున్నారు. మెరుపుతో సమానమైన వేగంతో గుఱ్ఱాలు పరుగెత్తుతున్నాయి.

చూస్తూ ఉండగానే దారుణం జరిగిపోయింది! ఆ రథ చక్రాల క్రింద ఒక వ్యక్తి పడి నెత్తుటి ముద్దలా కనిపిస్తున్నాడు! రథం దాటి పోయింది. హాహా కారాలు చెలరేగాయి. ఈ సంఘటనకు నిశ్చేష్టులైన ప్రజలు ఆ వ్యక్తి పడి ఉన్న చోటికి గుంపులు గుంపులుగా కదలు తున్నారు. దుమ్ముకొట్టుకు పోయిన ఆ శవాన్ని చూసి "ఎవరో ఈ నిర్భాగ్యుడు?" అనుకుంటున్నారు. సూర్యాస్తమయం అయ్యింది.

◆◆◆

ఆ మరునాడు మాధవవర్మ కొలువుతీరి ఉన్న సమయంలో - శోకమే మూర్తీభవించినట్టున్న ఒక పండు ముదుసలిది ప్రవేశించింది. నెత్తురు అట్టలు కట్టుకుపోయి ఉన్న తన కొడుకు శవాన్ని మోసుకువచ్చి, రాజు ఎదురుగా ఉంచింది.

"రాజా! వీడొక్కడేనయ్యా! మా కులాన్ని కడతేర్చే తెప్ప! నువ్వా ధర్మరాజువి! ఏమిటయ్యా ఇది? మా అందరికీ ఆధారమైన వీడు చని పోయాడు! ఇక మేమెలా బ్రతుకగలం? నా సంగతి వదిలెయ్యి- నేనె లాగూ వీడితోనే వెళ్ళిపోతాను. నా కోడలి గతి ఏమిటి?

ఇంతకు మించిన కష్టం ఏముంటుంది? ప్రజల్ని ఇలా రథంతో త్రొక్కిస్తారా? రాజులు ఐశ్వర్యముంటే అనుభవిస్తారు, ప్రజల్ని పరి పాలిస్తారు. ప్రజలు తప్పు చేస్తే మందలిస్తారు, విచారణ చేస్తారు. అంతేగానీ, ఇలా అకారణంగా చంపెయ్యటం న్యాయమేనా?

ఇక నీ ఇష్టం ప్రభూ! న్యాయమో, అన్యాయమో నీ చేతుల మీదుగా కానియ్యి. నేను వెడుతున్నాను" అంటూ కన్నీళ్ళు కారుస్తూ, ఆ అవ్వ పుత్రశోకాన్ని జయిస్తూ కుప్పకూలి ప్రాణాలు వదలింది!!

మాధవవర్మ ముఖం ప్రశాంతంగా ఉంది! సభలో ఉన్న వాళ్ళం దరూ నిశ్చేష్టులయ్యారు. ప్రభువు – ముఖ్య మంత్రులను, న్యాయాధి కారులను ధర్మ నిర్ణయం చెయ్యమన్నాడు. వాళ్ళు సునిశితంగా విచారణ చేశారు.

"అదుపులేని గుఱ్ఱాలను పూన్చిన రథాన్ని రాజకుమారుడు నగర వీథుల్లో నడపకూడదు. దారిలో పసి పాపలు, వికలాంగులు, గ్రుడ్డి వాళ్ళు ఉంటారు. ప్రాణం, ప్రాణాన్ని బలికోరుతుంది. ధర్మశాస్త్రానికి "వారు, వీరు" అనే వివక్ష ఉండదు. నీతికి జాలి ఉండదు" అంటూ తమ తీర్పును ప్రభువుకు విన్నవించారు.

తీర్పు వింటున్నంతసేపు మాధవవర్మ ముఖంలో ఏ కదలికా లేదు! మధ్యాహ్న సూర్యుడు ఆకాశంలో తీక్షణంగా ప్రకాశిస్తున్నాడు. ఎండవేడిమికి కృశించిపోయిన కృష్ణానది"ఇంద్రకీలాద్రి"ని తాకుతోంది.

ఆ రోజుకు రాజు కొలువు చాలించాడు. ధర్మాసనం మీద కూర్చు న్నంతసేపూ మాధవవర్మ గంభీరంగా ఉన్నాడు. ఆ ఆసనం నుంచి దిగిన వెంటనే దుఃఖంతో విచలించిపోయాడు! దీనిని గమనించిన న్యాయమూర్తులు–"ప్రభూ! న్యాయస్థానం చెప్పిన తీర్పును రాజు సవ రించవచ్చు" అన్నారు.

మాధవవర్మ వారితో "నా పుత్రుడు నాకు దూరమౌతున్నాడని దుఃఖిస్తున్నానేగానీ, న్యాయాన్ని అమలు చేసేందుకు దుఃఖించటంలేదు" అన్నాడు! ఆ ముదుసలిది కొడుకు చావును తట్టుకోలేక ప్రాణాలు విడిచింది. కానీ, ఒక్కగానొక్క కుమారుణ్ణి పోగొట్టుకుంటున్న రాజు, ప్రజలకోసం ప్రాణాలు నిలుపుకోక తప్పలేదు!

◆◆◆

ఆనాటి సాయంకాలం యువరాజు శరీరంనుంచి వెలువడిన రక్తప్రవాహంలో మలిసంజ కలిసిపోయింది. శివుని సంధ్యాతాండవ సమయంలో మ్రోగే మణినూపురాల ధ్వనియా! అన్నట్టుగా, దుర్గమ్మ విజయ వాటికలో రెండు ఘడియలపాటు కనక వర్షం కురిపించి "కనకదుర్గమ్మ" అయింది.

# పుష్కర స్నానం ... విధి విధానాలు

పన్నెండేళ్లకోమారు వచ్చే పుష్కరాల్లో అన్ని వీధుల్లో ప్రత్యేకమైనది పుణ్యస్నానం.

కృష్ణానది మనమున్న ప్రాంతానికి ఎంత దూరంగా ఉన్నా,

ఎన్నో వ్యయప్రయాసలకోర్చి ఆయా క్షేత్రాలకు వెళుతుంటాం.

తీరా అక్కడికి వెళ్లాక, పుష్కరస్నానం ఎలా చేయాలో తెలియకపోతే ఎలా?

పుష్కరాల్లో చేసే పుణ్యస్నానాలకు సైతం కచ్చితమైన శాస్త్రీయత ఉందని పురాణవచనం.

నది దగ్గరకు వెళ్లగానే సరదాగా నీట మునిగితే,

అది పుష్కరస్నాన ఫలాన్ని ఇవ్వదు. మహాసంకల్పం చేసుకుని,

సకల దేవతలను స్మరించి, పుష్కర స్నానాన్ని ఆచరిస్తే పుణ్యఫలం లభిస్తుంది

చిరునామా : *శ్రీ కొంపెల్ల రామకృష్ణమూర్తి 1-19-71/ఎ12/జి2, రుక్మిణీ రెసిడెన్సీ, అయోధ్యనగర్, ఇ.సి.ఐ.ఎల్. పోస్టు, కాప్రా, హైదరాబాదు – 500062, ఫోన్ : 9908075506*

డా॥ భీంపల్లి శ్రీకాంత్

# పాలమూరు జిల్లా కృష్ణాతీర పుణ్యక్షేత్రాలు

భారతదేశం పుణ్యభూమి, కర్మభూమి అని ప్రపంచదేశాలలో పేరొందింది. ఈ భారతావని ఎన్నో నదులు తమ జన్మస్థానం నుండి పవిత్ర ప్రాంతాలగుండా ప్రవహిస్తూ సముద్రంలోకలుస్తున్నాయి. నదీ తీరములందలి పవిత్ర ప్రదేశాలందు పుణ్యక్షేత్రాలు వెలసినవి. దక్షిణ భారతదేశపు నదులలో పెద్ద నదులలో ఒకటైన కృష్ణానదీ పరీ వాహక ప్రాంతాలందు అనేక పుణ్యక్షేత్రాలు వెలిశాయి. కృష్ణానదీ మహ బలేశ్వరంలో పుట్టి తెలంగాణ ముఖద్వారమైన పాలమూరు జిల్లాలోని తంగడి గ్రామం వద్ద ప్రవేశిస్తుంది. ఇది మాగనూర్ మండలంలో కలదు. ఈ తంగడి వద్దనే కృష్ణా, భీమా నదుల సంగమ ప్రాంతం సంగమేశ్వ రంగా పిలువబడుతున్నది. కృష్ణానదీ మహబూబ్ నగర్ జిల్లాలోని మాగనూరు, మక్తల్, ఆత్మకూరు, ధరూర్, గద్వాల, ఇటిక్యాల, అలంపురం, కొల్లాపూర్, అమ్రాబాద్, వీపనగండ్ల వంటి ప్రాంతాలలో ప్రవహిస్తూ శ్రీశైలం చేరుకుంటుంది. అక్కడి నుండి నాగార్జునసాగర్, వాడపల్లి, ముట్టపల్లి, రేపాల, అమరావతి, మంగళగిరి, ఉండవల్లి, విజయవాడ, శ్రీకాకుళం, నడకుదురు, హంసలదీవి ప్రాంతాలను స్పృశిస్తూ బంగాళా ఖాతంలో కలుస్తుంది. కృష్ణానదీ తీర ప్రాంతాలయందు అనేక దర్శనీయ స్థలాల పుణ్యక్షేత్రాలు వెలిశాయి. కృష్ణా పుష్కరాల సందర్భంగా ఈ క్షేత్రాలన్నింటికి అధిక సంఖ్యలో భక్తులు విచ్చేస్తారు.

## వల్లభాపురం - కుర్మగడ్డ - పస్పుల

పవిత్ర కృష్ణానదీ తీరాన వెలిసిన క్షేత్రం వల్లభాపురంలోని దత్తా త్రేయ స్వామి ఆలయం. ఈ వల్లభాపురానికే మరోపేరు పస్పుల. ఇది మక్తల్ మండలంలో కలదు. ప్రకృతి సౌందర్యంతో, ఆహ్లాదకర వాతావరణం మధ్య వెలిసిన శ్రీ దత్తాత్రేయస్వామి దేవాలయం ఎంతో ప్రసిద్ధి పొందింది. శ్రీపాద శ్రీవల్లభుడు తపస్సు చేసిన పుణ్యభూమిగా, తపోభూమిగా ఈ ప్రాంతం విశేష ప్రాచుర్యం పొందింది. శ్రీ దత్తా త్రేయ స్వామి దత్తావతార పరంపరలో మూడవ అవతారమే శ్రీపాద శ్రీవల్లభుడు క్రీ.శ 14వ శతాబ్దంలో తూర్పుగోదావరి జిల్లాలో పీఠా పురం అనే గ్రామంలో సుమతి, అప్పుల రాజుశర్మ అనే పుణ్య దంపతుల కు శ్రీ దత్తాత్రేయస్వామి జన్మించారు. శ్రీపాద శ్రీవల్లభుడు పుణ్యక్షేత్రా లను దర్శించుకుంటూ కుర్మగడ్డ అనే ప్రాంతంలో తపస్సు చేసుకుంటూ సమాధి అయ్యాడని చెబుతారు. ఈ కుర్మగడ్డ ప్రాంతంలోనే శ్రీదత్తాత్రేయ స్వామివారి మూలవిరాట్ విగ్రహం ఉంది. ఈ కుర్మగడ్డ కర్ణాటకలోని రాయచూర్ జిల్లా పరిధిలో వున్నా మన జిల్లాకు సమీపం లోనే ఉంటుంది. ఈ కుర్మగడ్డ ప్రాంతమే ప్రధాన దత్తక్షేత్రంగా భాసిల్లుతోంది.

## కృష్ణా

కృష్ణా గ్రామం మాగనూరు మండలంలో వుంది. ఇక్కడ దత్తాత్రేయ స్వామి ఆలయం. శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం, శ్రీకృష్ణ మందిరం, పాండురంగస్వామి ఆలయం, ఈశ్వరాలయం, నవగ్రహాలున్నాయి. కృష్ణానది పేరుమీద ఏర్పడ్డ ఏకైక గ్రామం కృష్ణా మాత్రమే. ఇది తెలంగాణ, కర్నాటక రాష్ట్రాల సరిహద్దున పవిత్ర కృష్ణానదీ తీరాన ఉంది. ఈ కృష్ణ గ్రామాన్ని ఒకప్పుడు 'అగ్రహారంగా' పిలిచేవారు. ఈ గ్రామం ఒకప్పుడు ధార్మిక, ఆధ్యాత్మిక, కార్యక్రమాలకు, వేద పండితులకు మాతృస్థానంగా వుండేది. ఇక్కడ 1989లో వివేకానంద స్వామి సేవా కేంద్రం ఏర్పాటు చేశారు. జిల్లాలో మొట్టమొదటి రైల్వేస్టేషన్ ఈ గ్రామంలోనే ఏర్పాటు చేయడం విశేషం. ఇది 1944-45లో నిర్మించారు. ఇక్కడ మరో దేవాలయమైన శ్రీ క్షీరలింగేశ్వర స్వామి దేవాలయం ప్రసిద్ధిపొందింది. శ్రీక్షీర లింగేశ్వర స్వామి అసలు పేరు లక్ష్మణస్వామి. ఆయన మహాతపస్వీ. పన్నెండేళ్ల ప్రాయం లోనే ఏకశిల ఘోర తపస్సు చేసిన మహాయోగి. క్షీర లింగేశ్వరస్వామి తన ఇరవయ్యవ ఏటనే కర్ణాటకలోని గుల్బర్గా జిల్లాలోని కప్పరగుట్ట అనే పుణ్యస్థలంలో ఏడాది పాటు కేవలం పాలు మాత్రమే స్వీకరిస్తూ ధ్యానం చేయడంతో వారికి క్షీరలింగేశ్వరస్వామి అనే పేరు వచ్చినట్లు కథనం.

## గుడెబల్లూరు

కృష్ణానదీ తీరంలో వెలసిన మరో పుణ్యక్షేత్రం మక్తల్ తాలూకాలో గల మాగనూర్ మండలంలోని గుడెబల్లూరు గ్రామంలో వెలిసిన శ్రీ స్వయంభూ లక్ష్మీవెంకటేశ్వరాలయం. ఈ దేవాలయానికి ఘనమైన ప్రాచీన చరిత్ర ఉంది. ఒకసారి మాండవ్యమహర్షి గుండెలారణ్యంలో తపస్సు చేస్తుండగా వెంకటేశ్వరస్వామి ప్రత్యక్షమై ఏమి కావాలో కోరుకోమనగా స్వామి అనుగ్రహానికి సంతోషించి స్వామి మీరు నాకు ఈ గుహలో దర్శనమిచ్చారు. ఇక్కడి వారి కోసం మీరీ గుహలోనే స్వయంభూవులై నిలువవలెనని కోరాడు. అప్పుడు స్వామి మహర్షి కోరికను మన్నించి ఆ గుహలోనే గుండులో లీనమైపోయాడు. అప్పటి నుంచి ఈ ప్రాంతం స్వయంభూ లక్ష్మీవెంకటేశ్వరాలయంగా ప్రసిద్ధి పొందింది. ఈ విషయం భవిష్యోత్తర పురాణంలోని కృష్ణామహాత్మ్యంలో పేర్కొనబడింది. ఇక్కడ ప్రతి సంవత్సరం చైత్ర పౌర్ణమి రోజున సంప్రదాయ బద్ధంగా స్వామివారి రథోత్సవం ఘనంగా జరుపుతారు. ఈ క్షేత్రానికి అనేక దూరప్రాంతాల నుంచి ఎంతో మంది భక్తులు వచ్చి స్వామివారిని దర్శించి తమ మొక్కులు తీర్చుకుంటారు.

## నది అగ్రహారం

గద్వాలకు 5 కిలో మీటర్ల దూరంలోగల నది అగ్రహారంలో దత్తాత్రేయ స్వామి ఆలయం, రామాలయం, శివాలయం ప్రసిద్ధి చెందిన పుణ్యక్షేత్రాలు, ప్రతి సంవత్సరం ఇక్కడికి ఏకాదశి, శివరాత్రి తదితర పర్వదినాలప్పుడు వేలాదిగా భక్తులు విచ్చేసి కృష్ణానదిలో పుణ్యస్నానాలు ఆచరించి,తమ మొక్కులు తీర్చుకోవడానికి వస్తుంటారు. కృష్ణాతీరంలో గల ఈ నది అగ్రహారానికి చినసోమ భూపాలుడు విహారానికి రాగా అక్కడ అతనికి ఒక ఎర్రని గుండుపై 'రామావధూత' అనే యోగి తీవ్రమైన తపస్సమాధిలో కూర్చుని ఉండి కనిపించాడు. అది చూసి రాజుగారక్కడ అతనికొక మఠాన్ని కట్టించాడు. ఆ తర్వాతనే ఇక్కడ అనేక ఆలయాలు వెలిశాయి.

## పెద్దచింతరేవుల

పెద్దచింతరేవుల గద్వాల తాలుకాలోని ధరూర్ మండల పరిధిలోని గ్రామం. ఇక్కడ కృష్ణాతీరంలో వెలిసిన ఆంజనేయస్వామి చింతలు తీర్చేస్వామిగా ప్రసిద్ధిపొందాడు. శ్రీ ఆంజనేయస్వామి దేవాలయం ప్రియదర్శిని జూరాల ప్రాజెక్టుకు అతి సమీపంలో కలదు. ఈ ఆంజనేయస్వామి దేవాలయం చాలా పురాతనమైంది. ఈ ఆలయం ఐదు వందల ఏళ్ల నాటిదని చారిత్రకుల అభిప్రాయం. చంద్రికాచార్యులనే వ్యాసరాయలు ఈ స్వామిని ప్రతిష్టించినట్లు ప్రతీతి. ఇక్కడ స్వామి ఊర్ధ్వ దృష్టి కలవాడు. ఊర్ధ్వదృష్టి కల ప్రతిమలలో ఉగ్రత్వం ఉంటుందని వాడుక. ఈ ఆంజనేయస్వామి పుట్టలో నుండి తీసి శేషదాసులనేవారు. ప్రతిష్టించారని చరిత్ర చెబుతోంది. తన శేష జీవితాన్ని శ్రీ ఆంజనేయస్వామి సన్నిధిలో గడిపి శేషదాసులు తనువు చాలించారు. శ్రీ శేషదాసుల వంశస్తులు నేటికి ప్రతి సంవత్సరం జనవరి నెలాఖరున జరిగే బ్రహ్మోత్సవాలలో పాల్గొని శ్రీస్వామి వారిని సేవించి తరిస్తున్నారు. శ్రీ ఆంజనేయస్వామి భక్తులు కోరిన కోర్కెలు తీర్చే స్వామిగా, నమ్మి కొలిచిన వారికి కొంగుబంగారంగా కొనియాడబడుతున్నాడు. ఇప్పటికీ ఇక్కడికి అధిక సంఖ్యలో భక్తులు ప్రతి అమావాస్య రోజున విచ్చేసి, స్వామివారి సన్నిధిలో నిద్రించి మరుసటి రోజువెళ్తుంటారు. గద్వాల చుట్టుప్రక్కల గ్రామాల వారు స్వామి వారిని తమ ఇంటి దైవంగా, ఇష్టదైవంగా కొలుస్తారు. ఇక్కడ ఒక రోజు నిద్రిస్తే శరీర ఆరోగ్య కుదుటపడి, రోగాలు రావని చరిత్ర.

## బీచుపల్లి

పాలమూరు జిల్లాలో పవిత్ర పుణ్యక్షేత్రంగా బీచుపల్లి ఆంజనేయ స్వామి దేవాలయం భాసిల్లుతున్నది. పవిత్ర కృష్ణానదీ తీరంలో వెలిసిన ప్రసిద్ధ దేవాలయం. పవిత్ర పుణ్యక్షేత్రంగా విలసిల్లుతున్న బీచుపల్లి దేవస్థానం రోజురోజుకు పర్యాటక కేంద్రంగా కూడా భాసిల్లుతున్నది. బీచుపల్లిలోని ఆంజనేయస్వామిని క్రీ.శ.16వ శతాబ్దంలో శ్రీ కృష్ణ దేవరాయల గురువైన వ్యాసరాయలు ప్రతిష్టించినట్లు చరిత్ర చెబుతోంది. బీచుపల్లి ప్రాంతంలో కణ్వమహర్షి తపస్సు చేసినట్లు చరిత్ర ద్వారా తెలుస్తోంది. ఈ ఆంజనేయస్వామి ఆలయంలో ప్రతి ఏటా మే నెలలో బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. బీచుపల్లి ఆంజనేయస్వామి దర్శించుకోవటానికి నిత్యం ఇక్కడికి అనేక వేలమంది భక్తులు వస్తుంటారు. బీచుపల్లి ఆంజనేయస్వామి దేవాలయాన్ని సుమారు రెండు వందల సంవత్సరాల క్రితం గద్వాల సంస్థానాధీశులు కట్టించారు. ఈ బీచుపల్లి వద్ద 1953లో రోడ్డు బ్రిడ్జిని నిర్మించారు. దీనికి సమీపంలోని కృష్ణానదీ మధ్య భాగంలో 30 ఎకరాల విస్తీర్ణంలో నిజాం కొండ వుంది. దీనిని నిజాం నవాబులు కట్టించారు. ఈ కోటలో ఆంజనేయస్వామి దేవాలయం, మసీదు, బావి వంటివి ఉన్నాయి. పుష్కరాలకు వచ్చే సందర్శకులు జిల్లాలో అధికసంఖ్యలో ఈ బీచుపల్లి ఆంజనేయస్వామి పుణ్యక్షేత్రంలో పుణ్యస్నానమాచరిస్తారు. బీచుపల్లి మరో విజయవాడగా కృష్ణా పుష్కరాల సందర్భంగా ప్రసిద్ధి చెందింది. ఇక్కడ పూజారుల బోయవారు.

## అలంపురం

దక్షిణ భారతదేశంలోనే అలంపురం ఎంతో ప్రసిద్ధి చెందింది. ఇక్కడ అష్టాదశ శక్తిపీఠాలలో ఒకటైన జోగులాంబదేవి, నవబ్రహ్మాలయాలు ఉన్నాయి. బ్రహ్మకు ఆలయాలు ఉత్తర భారతదేశంలో ఉన్నాయి. మరో వైపు దక్షిణ భారతదేశంలోని కేవలం అలంపురంలో

ఉన్నాయి. ఈ నవబ్రహ్మాలయాలు శివుని పేరుమీద ఉన్న శివా లయాలు. బాల, బ్రహ్మేశ్వర, అర్కబ్రహ్మేశ్వర, తారక బ్రహ్మేశ్వర, కుమార బ్రహ్మేశ్వర, గరుడ బ్రహ్మేశ్వర, విశ్వ బ్రహ్మేశ్వర వంటి శివాలయాలు ఉన్నాయి. ఈ క్షేత్రం అతి పురాతనమైన శైవ మహా క్షేత్రం. అలంపూర్ జోగులాంబ అని అష్టాదశ శక్తిపీఠ వర్ణనలో చెప్ప బడింది. ఇక్కడ బాల బ్రహ్మేశ్వర స్వామిని అభిషేకిస్తే ఉదకం ఆ లింగంలోనే ఇంకిపో తుంది. ఇది స్వామివారి విశేషం. ఈ స్వామివారికి ప్రతి ఏటా మహాశివ రాత్రి పర్వదినంనాటి నుండి ఐదు రోజులపాటు ఉత్సవాలు జరుపు తారు. ప్రాచీనమైన ఈ క్షేత్రంలో ఇంకా ఎన్నో మహిమగల దేవాల యాలున్నాయి. ఇక్కడ విష్ణు స్వరూపమైన కృష్ణానది, శివస్వరూప మైన భద్రానది, బ్రహ్మస్వరూపమైన తుంగానది సంగమ క్షేత్రం ఉన్నాయి. ఈ ప్రాంతం త్రిమూర్తకరమైన ఈ పావననదీ సంగమంలో స్నానంచేస్తే ముక్తి లభిస్తుందని పురాణాలలో చెప్పబడింది.

## సోమశిల

గలగలపారే కృష్ణవేణీ చెంతనే ఉన్న మరోపుణ్యక్షేత్రం సోమశిల లోని లలితాంబికా సోమేశ్వరాలయం. సోమశిలలో శ్రీ లలితాంబికా సోమేశ్వరాలయంతో పాటు శ్రీ వెంకటేశ్వరాలయం కూడా ఉంది. శ్రీశైలం ప్రాజెక్టులో ముంపుకు గురికాకుండా ఈ దేవాలయాలను పరిరక్షించారు. సోమశిలలోని శ్రీవేంకటేశ్వరాలయాన్ని కాకతీయుల కాలంలో నిర్మించారు. పునఃనిర్మించి ఇరవై ఏళ్ళు అవుతున్నా ఇంకా విగ్రహ ప్రతిష్టకు నోచుకోకపోవడం విచారకరం. సోమేశ్వర క్షేత్రంలో 32 స్థంభాలు గల మహామంటపం ఎనిమిది ఆలయాలను కలిపి వుంది. ఈ ఆలయాల్లో సోమేశ్వర స్వామితోపాటు అష్టలింగాలు గల ఆలయాలు, లలితాంబికా ఆలయం వుంది. ఇంత పెద్ద మహా మంటపం జిల్లాలో ఎక్కడా లేకపోవడం విశేషం. 11వ శతాబ్దంలో కాకతీయ రాజుల కాలంలో సోమేశ్వర క్షేత్రంలో ఆలయాలు పునరు ద్ధరణ జరుగగా, 7వ శతాబ్దంలో మహామంటప నిర్మాణం జరిగిందని చరిత్ర చెప్తోంది. ఇక్కడ 14 దేవాలయాల సముదాయం ఉంది. సోమశిలలోని దేవాలయాల నిర్మాణం కాకతీయ వాస్తుకళకు దర్పణం పడుతుంది. గర్భాలయం, అర్థమండపం, మహామండపం ఉన్నా ఈ ఆలయంచుట్టూ రాతి ప్రాకారంతో నిర్మించబడి కాకతీయశిల్పుల నైపు ణ్యాన్ని చాటుతున్నాయి. పూర్వం దీప, ధూప నైవేద్యాలతో అత్యంతవైభ వాన్ని కలిగి ఉన్న శ్రీ స్వామి ఆలయం నేడు పూజకు నోచుకోవడం లేదు.

## జటప్రోలు

జిల్లాలోని ప్రసిద్ధ పుణ్యక్షేత్రం జటప్రోలు, శైవ, వైదిక, వైష్ణవ మతాలకు చెందిన ఆలయాలు ఈ జటప్రోలు క్షేత్రంలో వెలిశాయి. ఆగస్తేశ్వరస్వామి, వీరభద్రస్వామి, చతురేశ్వరస్వామి, శంభు లింగే శ్వరస్వామి, రామలింగ్వేరస్వామి, విశ్వేశ్వరస్వామి, రాజేశ్వరస్వామి, భీమేశ్వరస్వామి, కాళేశ్వరస్వామి, అనంతపద్మనాభ స్వామి, గంగాధర స్వామి, భైరవస్వామి, మల్లేశ్వరస్వామి సాంబశివస్వామి, మదన గోపాల స్వామి, మల్లికార్జునస్వామి, వేణుగోపాలస్వామి, జటేశ్వరస్వామి, మాధ వేశ్వరస్వామి తదితర 20 ఆలయాలు ఇక్కడ ఉన్నాయి. పంచేశ్వరా లుగా పిలిచే సిద్ధేశ్వరం, సంగమేశ్వరం, కపిలేశ్వరం, సోమేశ్వరం, అగస్త్యేశ్వరం తీర్థాలలో ఒకటైన అగస్త్యేశ్వరాలయంతో పాటు అనంత పద్మనాభస్వామి, వరభద్ర, దుర్గ, భైరవ తదితర దేవతల ఆలయాలు కొలువై ఉన్నారు. జటప్రోలుకు జఠాయువు క్షేత్రం అని పురాణ ఇతిహ్యం. ఈ జటప్రోలు స్థలపురాణం ఆధారంగా జఠాయువు రెక్క తెగిపడిన ప్రదేశం. ఆ జటాయువు స్మారకంగా రాముడిక్కడ జటేశ్వర లింగాన్ని ప్రతిష్టించాడు.

## మంచాలకట్ట

కృష్ణాతీర క్షేత్రమైన మంచాలకట్టలో మాధవస్వామి ఆలయం ప్రసిద్ధి. దీనిని పూర్వం మంచాల-మంత్రాల కట్టగా వ్యవహరించేవారు. జటప్రోలులోని మదనగోపాలయం, మంచాలకట్టలోని మాధవస్వామి ఆలయాలను ఏకకాలంలో నిర్మించడం విశేషం. చరిత్రలో ఈ గ్రామా నికి ప్రత్యేక చరిత్ర వుంది. క్రీ.శ.1064 డిసెంబర్ 24 నాటి పులిజాల శాసనం మొదటి సోమేశ్వరుని వంపున గంగపెర్మాడి విక్రమాదిత్యుడు, నోలంబపెర్మడి జయసింహుడు మంచాలను నేలవీడుగా చేసుకొని చోళుల దాడిని తిప్పి కొట్టినట్లు చెబుతుంది. ఈ శాసనంలో ప్రశస్తమైన మంచాళ నేటి మంచాలకట్ట అని ఈ నిర్మాణాలను చాళుక్యుల నాటివని పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు.

## చెల్లెపాడు

కృష్ణా-తుంగభద్ర నదుల సంగమమైన పవిత్ర స్థలం చెల్లెపాడు, చారిత్రక ప్రాశస్త్యంగల ఈ చోటే సంగమేశ్వరం. ఏటికి అవతల రాయల సీమ, ఇవతల తెలంగాణాలోని పాలమూరు జిల్లా వీపనగండ్ల ఉండడం గమనార్హం. కృష్ణా, తుంగభద్ర కలిసే విశాలమైన దీవిలా స్థలం ఉంటుంది. దీనినే భీమేశ్వరం, సంగమేశ్వరం అంటుంటారు. శ్రీశైల క్షేత్రంలా ఇది అత్యంత ప్రాధాన్యత కలిగింది. పవిత్రమైన, నిర్మలమైన సంగమేశ్వరానికి బ్రహ్మ, విష్ణువు, లక్ష్మి, సరస్వతి, అష్ట దిక్పాలకులు, మహామునులు విహారయాత్రకు వస్తుండేవారట. ఒకరోజు పంచపాండవులైన ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు, ద్రౌపది సంయుక్తంగా సంగమేశ్వరం వచ్చి తపస్సు చేశారు. ధర్మరాజు శివలింగం ప్రతిష్ట గావించాలన్న తలంపుతో భీమునికి శివలింగన్వేషణకు పంపుతాడు. ముహూర్త సమయం ఆసన్న మవడంతో వేపచెట్టు నరికి, అచ్చటనే శివప్రతిష్ట చేశారు. భీముడు వచ్చే లోపల ధర్మరాజు శివలింగ ప్రతిష్ట గావించడంతో ఆగ్రహించిన భీముడు తాను తెచ్చిన లింగాలను విసిరాడని తెలుస్తోంది. దానినే

భీమలింగేశ్వరం అని, మల్లేశ్వరం, గడేశ్వరం, శైలేశ్వర క్షేత్రాల పేర్లతో పిలుస్తున్నారు. సప్తయాత్రికులు, దేవతలు, బింబకళ్యాణోత్సవ ప్రతిమలు, రాతిరథం మొదలగునవి సంగమేశ్వరం వద్ద ఉన్నాయి. ఇప్పటికీ వేపచెట్టులో శివలింగం క్షేత్రం ఆనవాలుండడం విశేషం. ప్రస్తుతం శ్రీశైలం నీటి ముంపుతో రాతిరథ ఆలయాన్ని అలంపూరుకు తరలించారు. కాగా, గలగల పారే కృష్ణా-తుంగభద్ర నదుల తొక్కులు, అలల సవ్వడులతో చూపరులను మంత్రముగ్ధులను చేస్తుంది. కృష్ణవేణి ప్రవహిస్తున్న వంకర టింకరుల, గుట్టలు, నిర్మలమైన ప్రకాశవంతమైన వాతావరణంలో చెల్లెపాడు పుష్కరాలతో పునీతమై శోభిల్లుతోంది.

## నందిమళ్ల

జూరాల ప్రాజెక్టు నందిమళ్ల విభాగంలో శ్రీకాళహస్తి మల్లికార్జున స్వామి కొలువు తీరాడు. శ్రీకాళహస్తి నుంచి శివుడి విగ్రహాన్ని శ్రీశ్రీశ్రీ భ్రమరాంబ మల్లికార్జునుడిగా నామకరణం చేస్తూ ఇక్కడి భక్తులు ప్రతిష్టించారు. దాదాపు 37 ఏళ్ల క్రితం జూరాల ప్రాజెక్టు మంజూరు కావడం, నందిమళ్ల విభాగం ఏర్పడటం జరిగింది. ఈ క్యాంపులోని ఉద్యోగులు, ఈ ప్రాంతవాసులు దేవాలయ ఆవశ్యకతను గుర్తించి శ్రీశ్రీశ్రీ మల్లికార్జునుడి దేవస్థానాన్ని 2-3-1992లో నిర్మించగా పుష్పగిరి పీఠాధిపతి జగద్గురు శంకరాచార్యులు విగ్రహ ప్రతిష్ఠాపనను చేశారు. ఇదొక ఆధ్యాత్మిక కేంద్రగా విలసిల్లుతుంది. ఆరాధ్య దైవంగా భక్తులచే కొనియాడబడుతుంది.

అలాగే ఈ దేవాలయం పరిసరాలను ఆనుకునే ఏర్పాటు చేయబడిన జింకలపార్క్ పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తోంది. నందిమళ్ల క్యాంపు కాలనీలో ఉన్న డ్రైవర్ బాబుమియా ఈ జింకలపార్కుకు స్ఫూర్తి ప్రదాత. ప్రస్తుతం ఇక్కడి పార్క్‌లో 14 జింకలున్నాయి. ఇవి జూరాల ప్రాజెక్టుకొచ్చే పర్యాటకులు, సందర్శకులకు కనువిందు చేస్తున్నాయి. దాదాపు పదిహేనేళ్ల క్రితం ఇక్కడి జింకలపార్క్‌ను ఏర్పాటు చేశారు. దీనికి దివంగత గవర్నర్ కృష్ణకాంత్ జింకల పార్క్‌గా కూడా నామకరణం చేశారు. ఈ పార్క్‌లో రోజురోజుకు జింకల సంఖ్య పెరిగిపోతున్నప్పటికీ ప్రతినెల అయ్యే దాదాపు రెండున్నరవేల వ్యయాన్ని అందించే దాతగానీ, ప్రభుత్వంగాని లేకపోవడంతో డ్రైవర్ బాబుమియాయే ఈ మొత్తాన్ని భరిస్తున్నాడు. సందర్శకులు, పర్యాట కులు ప్రశంసలనే ఆశీర్వాదాలుగా భావిస్తూ డ్రైవర్ బాబుమియా సంతృప్తి పడుతున్నారు. మొత్తం మీద పుష్కర స్నానం చేసిన భక్తులు ఇక్కడి మల్లికార్జునుడు ఆధ్యాత్మిక సంతృప్తిని కలగజేయనుండగా జింకలపార్క్ ఆహ్లాదానందాన్ని పర్యాటకులకు పంచనుంది.

## రంగాపురం

పెబ్బేరు మండలం రంగాపురం శివారులోని కృష్ణానది ఒడ్డున వెలసిన శ్రీ భక్తాంజనేయస్వామి ఆలయం పుష్కరాలకు సిద్ధమైంది. 44వ నంబర్ జాతీయ రహదారిపై బీచుపల్లి వంతెనకు ఇవతలి వైపున భక్తాంజనేయస్వామి ఆలయం వెలసింది. ఈ దేవాలయంలోని విగ్రహం వ్యాసరాయలు బీచుపల్లి ప్రాంతాన్ని సందర్శించిన సమయంలో ప్రతిష్ఠించినట్లు తెలుస్తోంది. ఇక్కడ కృష్ణానది ఉత్తరం నుంచి దక్షిణదిశలో ప్రవహిస్తోంది. కాశీలో గంగానది కూడా ఈ మాదిరే ప్రవహిస్తున్నందున ఇక్కడ పుష్కర స్నానం చేయడం ఎంతో పవిత్రం, విశిష్టమైనదని చెబుతున్నారు. ఇక్కడి శ్రీ భక్తాంజనేయస్వామి వారి ఆలయాన్ని ఏక కుటుంబం నిర్మించడం వల్ల కూడా ఈ ప్రాంతం ప్రత్యేకమైందిగా పండితుల ఉవాచ. 44వ నంబర్ జాతీయ రహదారిపై హైదరాబాద్ నుంచి వచ్చే భక్తులకు బీచుపల్లి కృష్ణానది వంతెనకు ఇవతలి వైపున భక్తాంజనేయస్వామి దేవాలయం ఉంది. పుష్కర యాత్రికులు తప్పక స్వామిని దర్శిస్తే దైవకృపకు పాత్రులు కాగలుగుతారు.

## పాతాళగంగ ప్రవాహం

కొండల మధ్య సన్నటి దారుల నుండి పరుగులు తీస్తున్న కృష్ణమ్మ శ్రీశైలం మల్లికార్జునస్వామికి పాదాభివందనం చేసి భక్తిపూరిత ఆవేశంతో శివతాండవమే చేసింది. సన్నని మార్గం ద్వారా వేగంగా పైనుంచి కిందికి పడుతూ చూపరులకు భయం కొల్పుతుంది. నిరంతరం ప్రవాహంలా సాగివచ్చే యాత్రికులతో శ్రీశైల మల్లికార్జున దేవాలయ కంచుగంటల నిర్విరామ గణగణ ధ్వనులతో కృష్ణమ్మ గలగల కలగలసి పోయింది. కొండల్లో, అడవుల్లో ప్రతిధ్వనించే భక్తజనుల హరహర శంభో మహాదేవ నామోచ్చరణలతో ఆర్భాటంగా వెల్లివిరిసే భక్తిపూరిత వాతావరణంలోకి అడుగుపెట్టి నిలువుగా పులకించిపోయింది. కొండల పాదాల వద్ద పాతాళ గంగగా కదలివెళ్ళి కృష్ణవేణమ్మ ఆధునిక దేవాలయం అని ప్రస్తుతించే శ్రీశైలం ఆనకట్ట నిర్మాణంతో కొండ అంచు వరకూ ఉబికి వచ్చింది. కనులకు విందు గొలిపే అక్కడి దృశ్యాన్ని ప్రత్యక్షంగా చూసి తీరాల్సిందే. శ్రీశైల శిఖర దర్శనమాత్రాన పునర్జన్మ ఉండదనేది భక్తుల విశ్వాసం. కైలాసాన్ని మరపించే భూలోక కైలాసం శ్రీశైలం. ఆలయ శిఖరాన్ని తనివితీరా అవలోకిస్తూ భక్తిభావంతో ఉప్పొంగి ప్రవహిస్తోంది కృష్ణమ్మ.

డా॥ పురాణపండ వైజయంతి

# పుణ్యక్షేత్ర దర్శనం - కృష్ణాతీరం

**1. కొండపై నిండుగా కొలువున్న మా తల్లి ! కనకదుర్గ ! నీకు దండాలు !!!**

విజయవాడ లేదా విజయవాటిక లేదా బెజవాడ.... ఏ పేరుతో పిలిచినా పలికేది మాత్రం బంగరుదుర్గ... ఆవిడే కనకదుర్గమ్మ. కృష్ణా జిల్లాలోని విజయవాడ నగరం ఇప్పుడిప్పుడే అభివృద్ధి చెందుతోంది. దక్షిణ భారతదేశంలోనే ప్రసిద్ధిగాంచిన పుణ్యక్షేత్రాలలో ఒకటిగా నిలిచింది. అఖిలాంధ్ర కోటి బ్రహ్మాండాలను కాపాడే తల్లి కనకదుర్గమ్మ. భక్తుల మొరలు ఆలకించి, వారిని కష్టాల బారినుంచి రక్షించడానికి ఇంద్రకీలాద్రిపై కొలువు తీరి ఉంది. అమ్మలగన్న అమ్మగా కొలువు తీరిన కనకదుర్గమ్మ...ఈ ఆలయంలో స్వయంభూగా వెలసిందని పురాణాలు చెబుతున్నాయి. అంతేకాక శ్రీశక్తిపీఠాల్లో ఈ ఆలయం ఒకటిగా భాసిల్లుతోంది.

**స్థలపురాణం :** పూర్వం కీలుడనే యక్షుడు దుర్గాదేవి గురించి తపస్సు ఆచరించడానికి కృష్ణానది తీరాన్ని అనువైన స్థలంగా ఎంచుకున్నాడు. అతడి తపస్సుకు సంతుష్టురాలైన అమ్మవారు ప్రత్యక్షమై, 'వరం కోరుకో' అంది. అందుకు అతడు, 'అమ్మా! నువ్వు నిరంతరం నా హృదయ స్థానంలో కొలువుండే వరం ప్రసాదించు' అని కోరుకున్నాడు. అది విన్న దుర్గమ్మ చిరునవ్వుతో 'కీలా! నువ్వు ఎంతో పరమ పవిత్రమైన కృష్ణానదీ తీరంలో పర్వతరూపుడవై ఉండు. నేను కృతయుగంలో అసురసంహారం చేసిన తర్వాత నీ కోరిక చెల్లిస్తాను....' అని అంతర్థానమైంది. కీలుడు పర్వతరూపుడై అమ్మవారి కోసం ఎదురు చూడసాగాడు. కృతయుగంలో లోకాలను కబళిస్తున్న మహిషుడిని వధించి, కీలుడికి ఇచ్చిన వరం ప్రకారం మహిషాసురమర్దిని రూపంలో కీలాద్రిపై వెలసింది. నాటి నుండి అనునిత్యం ఇంద్రాది దేవతలు ఇక్కడికి వచ్చి దేవిని పూజించారు. ఆ కారణంగా ఈ కొండను ఇంద్రకీలాద్రిగా పిలుస్తున్నారు. అమ్మవారు కనకవర్ణశోభితురాలై ఉండడం వల్ల ఆ తల్లిని 'కనకదుర్గ' గా కొలుస్తున్నారు.

ఆ తరువాత ఇంద్రకీలాద్రిపై పరమేశ్వరుడిని కూడా కొలు వుంచాలనే ఉద్దేశంతో బ్రహ్మదేవుడు శివుడి కోసం వంద అశ్వమేధ యాగాలు చేశాడు. అందుకు పరమానందభరితుడైన శివుడు జ్యోతిర్లింగ రూపంతో వెలిసాడు. ఆ స్వామిని బ్రహ్మదేవుడు మల్లి, కదంబ పుష్పాలతో పూజించేవాడు. ఆ కారణంగా ఆయనను మల్లికార్జునుడు పేరున కొలుస్తున్నారు.

ఆ తరువాత ద్వాపర యుగంలో అర్జునుడు పాశుపతాస్త్రం కోసం ఇంద్రకీలాద్రి మీద ఉగ్రతపస్సు చేయగా తనను పరీక్షించడానికి శివుడు కిరాతుడుగా వచ్చి అర్జునునితో ద్వంద్వయుద్ధం చేసి, అర్జునుని భక్తికి మెచ్చి పాశుపతాస్త్రాన్ని అనుగ్రహించాడు. స్వామి ఇక్కడ మల్ల యుద్ధం చేశాడు కనుక మల్లికార్జునుడిగా పిలువబడుతున్నాడు.

ఈ క్షేత్రాన్ని దర్శించిన జగద్గురువు ఆది శంకరాచార్యులు జ్యోతిర్లింగం అదృశ్యంగా ఉండటాన్ని గమనించి, అమ్మవారి ఆలయ ఉత్తర భాగాన మల్లికార్జునుడిని పునః ప్రతిష్టించాడు. మహారౌద్రంగా ఉన్న అమ్మవారిని ఆలయంలో శ్రీచక్రయంత్ర ప్రతిష్ట చేసి శాంతింపచేశాడు. అప్పటి నుంచి అమ్మ పరమశాంత స్వరూపిణిగా భక్తులకు కనువిందు చేస్తోంది. ఇక్కడ మరో విశేషమేమిటంటే స్వామివారికి దక్షిణంగా అమ్మవారు కొలువై వున్నారు. కనకదుర్గ అమ్మవారికి అతి ప్రీతిపాత్రమైనవి శరన్నవరాత్రులు. ఈ రోజుల్లో కనుక అమ్మవారిని పూజిస్తే సకల శుభములు కలుగుతాయి. ఈ దసరా తొమ్మిది రోజులు వివిధ రకాల అలంకారాలతో అమ్మవారు దర్శనమిస్తారు.

పురాణాల ప్రకారం అమ్మవారిని రాముడు, కృష్ణుడు, పరశురాముడు వంటి మహాపురుషులు సేవించారని తెలుస్తోంది. శ్రీకృష్ణదేవ రాయలు ఈ ఆలయాన్ని దర్శించి దీప, ధూప, నైవేద్యాలకు ఏర్పాట్లు చేశారని అమ్మవారి ఆలయానికి కొద్ది దూరంలో ఉన్న రాయలవారి శాసనం చెబుతోంది. అలాగే అక్కన్న, మాదన్నలు కూడా ఈ ఆలయాన్ని సందర్శించారనడానికి ఇక్కడ ఉన్న అక్కన్న,మాదన్నగుహలే ఆనవాలుగా చెప్పవచ్చు.

## 2. శ్రీశైలశిఖర దర్శనం సర్వపాపహరం.

కోరిన కోర్కెలు తీర్చుతూ భక్తుల పాలిట కొంగుబంగారమయ్యాడు శ్రీశైలవాసుడు. భ్రమరాంబ సమేతంగా మల్లికార్జునస్వామి కొలువు తీరిన శ్రీశైలం పరమపవిత్రక్షేత్రం. భారతదేశంలోని ద్వాదశజ్యోతిర్లింగాలలో ఒకటి. అష్టాదశ శక్తిపీఠాల్లో భ్రమరాంబికా అమ్మవారి పీఠం ఒకటి. అందువల్ల ఇది పరమపావన క్షేత్రంగా భాసిల్లుతోంది. ఇక్కడ స్వామివారు స్వయంభూగా వెలిశారు. ఈ క్షేత్రాన్ని దక్షిణకాశీ అని పిలుస్తారు. ఈ క్షేత్రాన్ని ఒకసారి దర్శించిన ముక్తి కలుగుతుందని భక్తుల ప్రగాఢ విశ్వాసం.

కృష్ణానదీ తీరంలో సముద్ర మట్టానికి 1500 అడుగుల ఎత్తులో నల్లమల అడవులు ఉన్నాయి. ఇవి చాలా దట్టంగా ఉంటాయి. కర్నూలు జిల్లాలో ఉన్న ఈ అటవీ ప్రాంతంలోనే ప్రాచీన పుణ్యక్షేత్రం అయిన శ్రీశైలం కనువిందు చేస్తుంది. పచ్చని వృక్షాలమధ్య నల్లటి రాతి కొండల మీద శివుడు కొలువుతీరి ఉన్నాడు. శ్రీశైలశిఖరం సముద్రమట్టానికి 2300 అడుగుల ఎత్తులో ఉంది. ఇక్కడి ఆటవికులు అమాయకతకు మారుపేరు. వారు ఇక్కడి శ్రీశైలం మల్లన్నను తమ అల్లునిగాను, భ్రమరాంబికా అమ్మవారిని తమ కూతురిగా భావిస్తారు. ఇక్కడ పూజలలో కూడా వీరు పాలు పంచుకుంటారు. శివరాత్రి సందర్భంగా నిర్వహించే రథోత్సవంలో వీరి చేతుల మీదుగానే రథం ముందుకు నడుస్తుంది. అల్లుడిని, కూతురిని ఊరేగించడమంటే వారికి చెప్పరానంత సంబరం. స్వామివారి ఆలయాన్ని శాతవాహనులు, పల్లవులు, ఇక్ష్వాకులు, కాకతీయులు, విజయనగరాధీశులు... ఇలా ఎందరో రాజులు అభివృద్ధి చేస్తూ వచ్చారు.

### పురాణాలలో....

త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడు వనవాస సమయంలో సీతా సమేతుడై దర్శించుకున్నాడని, ద్వాపరయుగంలో పాండవులు కూడా స్వామి వారిని దర్శించి స్వామివారి కృపకు పాత్రులయ్యారని పురాణాలు చెబుతున్నాయి. ఎందరో ఋషులు స్వామివారి ఆలయ ప్రాంగణంలో తపస్సు ఆచరించి, ముక్తి పొందినట్లు తెలుస్తోంది. జగద్గురువు శంకరాచార్యులు స్వామివారి ఆలయ ప్రాంగణంలోనే అమ్మవారి మీద భ్రమరాంబికాష్టం, శివానందలహరి రచించారని ప్రతీతి.

**స్థలపురాణం :** ఈ ప్రాంతంలో పూర్వం శిలాదుడనే మహర్షి శివుని గురించి తపస్సు చేయగా శివుడు ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమని అడుగగా, శిలాదుడు, 'నీ అంశతో నాకు పుత్రులను ప్రసాదించు' అన్నాడట. శివుడు వరం ప్రసాదించి అంతర్ధానమయ్యాడట. వర ప్రభావంతో, శిలాదునికి నందీశ్వరుడు, పర్వతుడనే ఇద్దరు కుమారులు జన్మించారు. వీరిలో పర్వతుడు శివునికై తపస్సు చేయగా, స్వామి ప్రత్యక్షం కావడంతో, ఆయనకు నమస్కరించి, 'నన్ను పర్వతంగా మార్చి, నా మీద కొలువుండే వరం ప్రసాదించు' అని కోరాడు. నాటి నుంచి బోళాశంకరుడు అక్కడే ఉండిపోయాడు. కైలాసంలో ఉన్న పార్వతీదేవి ప్రమథగణాలు కూడా స్వామి వారి బాటనే పట్టి అక్కడే కొలువై ఉన్నారు.

**మరో కథ :** చంద్రవంశరాజైన చంద్రగుప్తుని కుమార్తె అయిన చంద్రవతి శివుని పరమభక్తురాలు. ఆమె పరమశివుని ధ్యానంలో కాలంగడిపేది. పరమశివుడు సతీసమేతంగా దర్శనమిచ్చాడు. చంద్రావతి, 'స్వామీ! నేను మీ శిరస్సు మీద వుంచిన మల్లెపూలదండ ఎన్నటికీ వాడిపోకుండా వరం ప్రసాదించు' అని కోరుకుంది. శిరస్సుమీద ఉన్న గంగ, చంద్ర వంకల మధ్య మల్లెపూలదండను ధరించాడు శివుడు. ఆ కారణంగా స్వామి మల్లికార్జునుడయ్యాడని ప్రతీతి.

**ఆలయ చరిత్ర :** ఈ ఆలయం గురించి అనేక పురాణాల్లో ప్రస్తావన ఉంది. స్వామివారిని త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడు రావణాసురుడి సంహారం అనంతరం బ్రహ్మహత్యా పాపం అంటకుండా ఉండేందుకు దర్శించుకున్నాడని, ద్వాపర యుగంలో పాండవులు కూడా స్వామివారిని సేవించి స్వామి కృపకు పాత్రులయ్యారని పెద్దలు చెబుతారు.

క్రీ.శ. 6వ శతాబ్దం నాటి మైసూరులోని కదంబరాజుల తాల్గుండి శాసనంలో శ్రీశైలం ప్రస్తావన కనిపిస్తుంది. ప్రముఖ శైవ కవి పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్రలో 'కరమొప్ప దక్షిణ కైలాసము' అంటూ శ్రీశైలాన్ని కీర్తించాడు.

## 3. చిరుమువ్వల సవ్వడుల క్షేత్రం మొవ్వ....

కృష్ణాజిల్లా అంటేనే శ్రీకృష్ణుడు, ఆయన పేరు మీదుగా కృష్ణానది... సర్వం కృష్ణార్పణం. మొవ్వ గ్రామం ప్రత్యేకతను సంతరించుకుంది. ఇక్కడి మువ్వ వేణుగోపాల ఆలయంలో శ్రీకృష్ణుడితో పాటు, ఆయన భక్తుడైన క్షేత్రయ్య కూడా కనువిందు చేస్తాడు. భక్తుడు లేనిదే భగవంతుడు లేడు. భగవంతుడు లేనిదే భక్తుడు ప్రసిద్ధుడు కాడు. అందుకే ఈ వాగ్గేయకారులకు భగవంతునితో సమానంగా గౌరవం దక్కుతోంది. ఈ దేవాలయం పైభాగాన శ్రీకృష్ణుడు కనువిందు చేస్తాడు. కల్యాణమండపానికి ఎదురుగా క్షేత్రయ్య నిలువెత్తు విగ్రహం మనలను సంగీత పారవశ్యంలో ముంచెత్తుతుంది. క్షేత్రయ్య 17వ శతాబ్దానికి చెందిన వాడు. మువ్వవేణుగోపాలుని మీద పదాలురచించాడు. వాటినే క్షేత్రయ్య పదాలుగా పిలుస్తాం.

మొవ్వ గ్రామానికి చేసే ప్రయాణంలో మార్గానికి ఇరువైపులా దట్టంగా పచ్చగా కనువిందు చేస్తున్న వరి పొలాలు తలలు ఊపుతూ కనిపిస్తాయి. అవి చూస్తే పొలాలు కూడా క్షేత్రయ్య పదాలు పాడుకుంటూ, తలలు ఊపుతూ మైమరచిపోతున్నాయేమో అనిపిస్తుంది. వాటిని సంరక్షిస్తున్నట్టుగా కొబ్బరిచెట్లు,తాడిచెట్లు ఆకాశాన్ని అంటుతూ మనలను తల పైకెత్తుకుని తిరిగేలా చేస్తాయి.

విజయవాడ నుంచి రెండు గంటల ప్రయాణించిన తరువాత మొవ్వ గ్రామం చేరుకుంటాం. ఆ గ్రామంలో పాదం పెట్టగానే మనకు సప్తస్వరాలు వినపడుతున్న అనుభూతి కలుగుతుంది. క్షేత్రయ్య పదాలకు మొవ్వ గ్రామం పాదాలతో నర్తిస్తున్న మువ్వల సవ్వడి మన మనసులకు వినిపిస్తుంది. క్షేత్రయ్య రచించిన పదాలు... కూచిపూడి, భరతనాట్యం వారితోపాటు గాత్ర సంగీత కళాకారులకు కూడా ఆయువు పట్టు అయ్యింది. నాట్యం నేర్చుకునేవారు, సంగీతం పాడేవారు... క్షేత్రయ్య పదాలను నేర్చుకుంటే వారి శిక్షణకు బంగారానికి తావి అద్దినట్లు భావిస్తారు. శృంగార, భక్తి రసాలతో, ఎంతో భావ గర్భితంగా ఉండే క్షేత్రయ్య పదాలను పాడటం సంగీతకారులకు కత్తి మీద సాము వంటిదే.

సాంస్కృతిక పరంగా సుసంపన్నమైన ఆంధ్రప్రదేశ్‌లో మొవ్వ గ్రామం ఉండటంతో ఆ సంస్కృతి ఘల్లుమనడం ప్రారంభమైంది. ఈ గ్రామం తరువాత కూచిపూడి కనిపిస్తుంది. ఇక్కడకు రెండు గంటల దూరంలో కాజ అనే గ్రామం మంగళగిరికి దగ్గరగా ఉంది. ప్రసిద్ధ నారాయణతీర్థుల జన్మస్థానం అది. మొవ్వ గ్రామంలోని ప్రవేశించేసరికి క్షేత్రయ్య ఆరాధ్యదైవమైన వేణుగోపాలుడు అని పిలుస్తారు. ఇక్కడి దేవాలయం నిత్యం క్షేత్రయ్య పదాలతో మారుమోగుతూ ఉంటుంది. గర్భాలయానికి వెనుకగా చిన్న పరిమాణంలో క్షేత్రయ్య విగ్రహం శ్రీకృష్ణుని విగ్రహానికి అభిముఖంగా ఉంటుంది. దేవాలయ కుడ్యాల మీద క్షేత్రయ్య రచించిన నాలుగు పదాలు కనిపిస్తాయి. ఎంత చక్కని వాడే నా స్వామి... అవునమ్మా మీకేమి... రమ్మనవే సముఖాన రాయబారములేలే... అపురూప దర్శనంబాయె గదా నేడు...

దేవాలయానికి పక్కగా క్షేత్రయ్య కల్యాణమండపం, క్షేత్రయ్య పద పాఠశాల కనిపిస్తాయి. ఈ దేవాలయంలో వేణుగోపాలస్వామితో పాటు క్షేత్రయ్యను దర్శించుకుంటేనే భగవంతుడు ఆనందపరవశుడవుతాడు.

## 4. భక్తుల కొంగుబంగారం కోటప్పకొండ

ఆంధ్రప్రదేశ్‌లోని గుంటూరు జిల్లాలో ఉన్న కోటప్పకొండలోని శివుడిని త్రికూటేశ్వరస్వామిగా, దేవాలయాన్ని త్రికూటేశ్వరాలయంగా పిలుచుకోవడమంటే భక్తులకు పరమానందం. గుంటూరుజిల్లా నరసరావుపేటకు వాయవ్యంగా 13 కి.మీ. దూరంలో ఉన్న ఈ దేవాలయం అసలు పేరు కొండకావూరు. కాలం జరిగే మార్పుల్లాగే, ఈ దేవాలయం కూడా కాలక్రమేణా కోటప్పకొండగా ప్రసిద్ధి చెందింది. ఈ దేవాలయంలోని 687 అడుగుల ఎత్తు ఉన్న శివుడి విగ్రహం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. కోటప్పకొండను భక్తులు సంవత్సరం పొడవునా సందర్శిస్తూనే ఉంటారు. నిలువుగా ఉండే కొండమెట్లు ఎక్కుతూ దేవాలయం చేరుకోవాలి. భక్తులు 'చేదుకో కోటయ్యా' అంటూ మెట్లు ఎక్కుతూ అలసటను మరచిపోవడానికి ప్రయత్నిస్తారు. బస్సు మార్గం వున్నప్పటికీ, భక్తులు కాలినడకన కొండ చేరడానికి భక్తులు ఆసక్తి చూపుతారు. 1761లో ఈ ప్రాంతాన్ని పాలించిన గుండారాయలు అనే రాజు కోటప్పకొండ మీదకు 703 మెట్లతో మార్గాన్ని ఏర్పాటు చేయించారు. కొండ ఎక్కడానికి మూడు వేర్వేరు మార్గాలు ఉన్నప్పటికీ, చాలామంది శ్రీరాజమల్‌రాజా నరసింహరాయులు నిర్మించిన మార్గంలోనే ప్రయాణిస్తారు. దేవాలయం దగ్గర నిలబడితే, ఒక దివ్యానుభూతి కలుగుతుంది. ఈ గుడిని రుద్రశిఖరం, విష్ణుశిఖరం, బ్రహ్మశిఖరం అనే మూడు పెద్ద పెద్ద శిఖరాలు చుట్టుముట్టినట్లు కనిపిస్తాయి. వీటినే త్రికూటాచలం, త్రికూటాద్రి అంటారు. ఏ దిక్కు నుంచి చూసినా మూడు శిఖరాలూ కనిపించడం ఇక్కడి ప్రత్యేకత. కోటప్పకొండ ప్రాంతం మొత్తం శిఖరాలమయం. కోటప్పకొండ కంటే ఎత్తున వుండే రుద్ర శిఖరం మీద ఉన్న చిన్న దేవాలయంలో త్రికూటేశ్వరుడు లింగాకారంలో భక్తులకు దర్శనమిస్తాడు. 1587 అడుగుల ఎత్తు ఉన్న ఈ కొండ మీద, దేవాలయానికి అభిముఖంగా ఎనిమిది చిన్న చిన్న కొలనులతో పాటు ఇంకా చాలానే కొలనులు ఉన్నాయి.

ఈ క్షేత్రానికి ఒక విశిష్టత ఉంది. కొండ మీద ఎన్నోరకాల పక్షులు కనిపిస్తాయి గానీ, ఎంత వెతికినా ఒక్క కాకి కూడా కనిపించదు. ఒక ముని శాపం కారణంగా ఈ కొండ మీదకు కాకులు రావేవని స్థల పురాణం ప్రచారంలో ఉంది. యేటా కార్తీకమాసంలో వైభవంగా జరిగే కోటప్పకొండ తిరునాళ్ల సందర్భంగా ఏర్పాటయ్యే ఎత్తయిన ప్రభలు భక్తులకు కనువిందు చేస్తాయి. వారిలో భక్తిభావాన్ని పెంపొందిస్తాయి. ఈ దేవాలయంలో కార్తీక వన సమారాధనలు కూడా జరుగుతాయి.

**చరిత్ర :** లభించిన శాసనాల ఆధారంగా ఈ దేవాలయం 1172కు పూర్వమే ఉందని తెలుస్తోంది. ఈ ప్రాంతాన్ని ఎందరో రాజులు పరిపాలించారు. శ్రీకృష్ణదేవరాయల కాలంలో ఈ దేవాలయం దేదీప్యమానంగా వెలిగింది. దేవాలయ అభివృద్ధి కోసం శ్రీకృష్ణదేవరాయలు అనేక భూములను దానంగా ఇచ్చినట్లుగా తెలుస్తోంది. నరసరావుపేట, చిలకలూరిపేట, అమరావతి ప్రాంతాలకు చెందిన జమీందారులు కూడా ఈ దేవాలయ అభివృద్ధికోసం ఉదారంగా విరాళాలు సమర్పించారు. ఇక్కడ దక్షిణామూర్తికి ప్రత్యేకస్థానం. దక్షిణామూర్తి ఘోటక బ్రహ్మచారి కనుక, ఈ ఆలయ ప్రాంగణంలో వివాహాలు జరగవు. భక్తులు ఒక్కసారైనా దర్శించవలసిన పుణ్యక్షేత్రం కోటప్పకొండ.

### ఎలా చేరుకోవాలి

**రోడ్డుమార్గం :** నరసరావుపేట, విజయవాడ ప్రాంతాల నుంచి బస్సు సౌకర్యం ఉంది.

**రైలుమార్గం :** నరసరావుపేట, విజయవాడల నుంచి

**విమానం :** గన్నవరం, విజయవాడ....

## 5. మోపిదేవి స్వామి

**మోపిదేవిస్వామి :** ఆంధ్రప్రదేశ్ కృష్ణాజిల్లా విజయవాడకు 80 కి.మీ. దూరంలో దివిసీమ మోపిదేవీలో సుబ్రహ్మణ్యేశ్వరుడు లింగాకారంలో కొలువుదీరి ఉన్నాడు. సర్పదోష నివారణకు, రాహుకేతు దోష నివా రణకు, అనపత్య దోష నివారణకు ఇక్కడ పూజలు చేయించుకుంటారు. కన్ను, చెవి, చర్మ సంబంధిత వ్యాధులకు కూడా ఇక్కడ ప్రత్యేకంగా పూజలు చేయించుకుంటారు. ఉత్తమ జీవిత భాగస్వామిని ప్రసాదిస్తాడని విశ్వాసం. ఈ దేవాలయ ప్రాంగణంలో దంపతులు ఒకరోజు నిద్రచేస్తే, వారికి తప్పక సంతానం కలుగుతుందని విశ్వాసం.

**ఆలయ చరిత్ర :** సుబ్రహ్మణ్యేశ్వరుడు ఇక్కడ లింగ రూపంలో స్వయంభువుగా వెలిసినట్లు స్థలపురాణం చెబుతోంది. వీరవరపు పర్వతాలు అనే ఒక కుమ్మరివాడు కార్తికేయుని ఆరాధకుడు. ఒక రోజు అతడు నిద్రి స్తుండగా, సుబ్రహ్మణ్యేశ్వరుడు కలలో కనిపించి, మోపిదేవిలోని ఒక చీమల పుట్టలో ఒక లింగం ఉందని చెప్పాడు. మరుసటి రోజు ఆ కుమ్మరి తన కల గురించి గ్రామస్థులకు చెప్పాడు. వారంతా కలిసి ఆ పుట్ట ఉన్న ప్రాంతానికి వెళ్లి, పుట్టను తవ్వడం ప్రారంభించారు. ఆశ్చర్యంగా అక్కడ స్వయంభువుగా ఒక లింగం దర్శనమిచ్చింది. వారు ఆ లింగాన్ని మళ్లీ పుట్ట మీదనే ఉంచి, స్వయం భూలింగంగా పూజించడం ప్రారంభించారు. ఆ కుమ్మరి పర్వతాలు సుబ్రహ్మణ్యే శ్వరునికి ప్రీతికరమైన నందిని విగ్రహరూపంలో ప్రతిష్ఠించాడు. ఇంకా కోడి, గరుత్మంతుల మట్టి విగ్రహాలను కూడా రూపొందించాడు. వీటినన్నిటినీ తయారుచేసిన తర్వాత వాటిని బట్టిలో వేసి కాల్చడం వల్ల అవి గట్టిగా తయారయ్యాయి. శంకర, సనత్కుమార, సనత్సు జాతులు అనే దేవర్షులను ఆధ్యాత్మికవేత్తలుగా పెద్దలు చెబుతారు. వీరికి ఐహిక వాంఛల మీద మమకారం లేని కారణంగా దిగంబరంగా కనిపిస్తారు. ఒకనాడు వీరంతా కలిసి శివుడిని, శచీదేవిని, స్వాహాదేవిని, సరస్వతిని, లక్ష్మీదేవిని ప్రార్థించడం కోసం కైలాసానికి వచ్చారు. ఆ సమయంలో పార్వతీదేవి ఒడిలో కార్తికేయుడు కూర్చుని ఉన్నాడు.

కార్తికేయుడికి ఆ సమయంలో సందిగ్ధత ఏర్పడింది. ఒక ప్రక్కన వస్త్రాలు ధరించిన దేవతలు, మరో పక్క దిగంబరులుగా ఉన్న దేవ ర్షులు. దాంతో చంటిపిల్లాడిలా నవ్వాడు.

అతడి బాల్య చేష్టలకు పార్వతీదేవి కార్తికేయుడిని మందలించింది. తప్పు తెలుసుకున్న కార్తికేయుడు, తను చేసిన పాపాన్ని కడిగేసుకోవాలనే లక్ష్యంతో తపస్సు చేయాలనుకుని, అందుకు తల్లిని అనుజ్ఞ కోరాడు. సర్పాకారంలో సుబ్రహ్మణ్యేశ్వరుడు తపస్సు ఆచరించాడు. తను చేసిన పాపాలను ప్రక్షాళన చేసుకున్నాడు. ఎక్కడైతే సుబ్రహ్మణ్యేశ్వరుడు తపము ఆచరించాడో ఆ ప్రాంతాన్నే మోపిదేవిగా పిలుస్తున్నారు.

పురాణాల ప్రకారం... వింధ్యపర్వతం తను శక్తిశాలిని అనే మితిమీరిన గర్వంతో ఆకాశంవైపుగా ఎత్తు ఎదగడం ప్రారంభించింది. అలా అలా పెరిగిపెరిగి సూర్యమండలం చేరుకుంది. దాంతో ప్రపంచమంతా చీకటి వ్యాపించింది. ప్రపంచమంతా ఆ చీకటితో అనేక బాధలకు గురైంది. దాంతో దేవతలందరూ కలిసి అగస్త్యుడిని ప్రార్థించి, వింధ్య పర్వతం గర్వం అణచమన్నారు. ఆ సమయంలో అగస్త్యుడు వార ణాసిలో ఉన్నాడు. దేవతల కోరిక మేరకు అగస్త్యుడు ఉత్తర భారతదేశం నుంచి దక్షిన భారతదేశం వైపుగా ప్రయాణం ప్రారంభించాడు. దక్షిణ, ఉత్తర భారతదేశాలకు మధ్యగా ఉన్న వింధ్యపర్వతాల మీదుగా అగస్త్యుడు వస్తున్న వార్త తెలుసుకున్న వింధ్యపర్వతం ఆయనకు దారి ఇవ్వడం కోసం నెమ్మదిగా తన పరిమాణాన్ని తగ్గించుకుంది. అగస్త్యుడు వింధ్యపర్వతాన్ని దాటుతూ, తిరిగి తాను వెనక్కి వచ్చేవరకు ఎత్తు ఎదగకుండా అలాగే ఉండమని చెప్పాడు. వింధ్యుడు మాట ఇచ్చాడు. అగస్త్యుడు మళ్లీ దక్షిణ భారతదేశం నుంచి వెనక్కు రాలేదు. అగస్త్యుడి రాక కోసం ఎదురు చూస్తున్న వింధ్యపర్వతం నాటి నుంచి ఎత్తు ఎదగకుండా అలాగే నిరీక్షిస్తూ ఉంది. తన శిష్యులతో వచ్చిన అగస్త్యుడు, కార్తికేయుడు లింగాకారంలో తపస్సు ఆచరించిన ప్రాంతం గుండా ప్రయాణించాడు. ఆ ప్రాంతమంతా పులులు ఉన్నాయి కనుక, తూర్పు దిక్కుగా సుబ్రహ్మణ్యేశ్వరుడు కొలువు తీరి ఉన్న దేవాలయానికి వెళదామని చెప్పాడు. ఆ దేవాలయాన్ని ఎంతో భక్తిభావంతో దర్శించాడు అగస్త్యుడు.

**ఆలయ వేళలు....**

ఉదయం 4.00 నుంచి 12.30 వరకు
మధ్యాహ్నం 2.00 నుంచి 8.30 వరకు

**ఎలా చేరుకోవాలి**

బస్ సౌకర్యం : విజయవాడ నుంచి అవనిగడ్డ, కంకిపాడు, ఉయ్యూరు, పామర్రు, చల్లపల్లి మీదుగా. విజయవాడ 75 కి.మీ. దూరంలో ఉంది. మచిలీపట్నం నుంచి 30 కి.మీ. సమీప రైల్వేస్టేషన్... రేపల్లె. విజయవాడ నుంచి కూడా చేరుకోవచ్చు.

## 6. శ్రీలక్ష్మీనరసింహస్వామి వేదాద్రి.....

ప్రాచీన దివ్య క్షేత్రాలలో ఒకటి వేదాద్రి. కృష్ణాజిల్లా జగ్గయ్యపేట మండలంలో ఉన్న ఈ క్షేత్రం హైదరాబాదు విజయవాడ జాతీయ రహదారిలో చిల్లకల్లు నుండి పది కిలోమీటర్లు దక్షిణంగా కృష్ణాతీరాన ఉంది. ఈ ప్రదేశంలో కృష్ణానదిఉత్తరవాహినిగా ప్రవహిస్తోంది. ఇలా ప్రవహించడాన్ని పవిత్ర పుణ్యతీర్థంగా భక్తులు విశ్వసిస్తారు. ఇక్కడ నరసింహస్వామి పంచరూపాత్మకుడై జ్వాల సాలగ్రామ వీర యోగా నంద లక్ష్మీ నరసింహస్వామిగా సేవలందుకుంటున్నాడు. కనుక ఈ క్షేత్రం పంచనారసింహ క్షేత్రంగా ప్రసిద్ధి పొందింది. వాడపల్లి, మెట్ట

పల్లి, మంగళగిరి, కేతవరం... ఇవి పంచ నారసింహక్షేత్రాలు. పర్వత శిఖరం మీద స్వయంభువుగా జ్వాలానరసింహస్వామి, లక్ష్మీనరసింహ స్వామి, వేదాద్రికి ఐదు కిలోమీటర్ల దూరంలో ఉన్న గరుడాద్రిలో వీర నరసింహస్వామి కొలువుదీరి ఉన్నారు.

**దేవాలయ చరిత్ర :** అతి పురాతమైన యోగానంద నరసింహ స్వామి ఆలయ నిర్మాణం సంప్రదాయబద్ధంగా ఉంటుంది. దేవాలయ మంతా కనువిందు చేసే వివిధవర్ణాలతో, వివిధ భంగిమలలో రూపొందిన మూర్తులతో అందంగా ఉంటుంది. భక్తులకు స్వాగతం పలుకుతున్నట్లుగా, యోగ నరసింహస్వామి విగ్రహం కనువిందు చేస్తాడు. అందమైన రాజగోపురం మీద దేవతల మూర్తులను చెక్కారు. ఆలయ మండపంలో ధ్వజస్తంభం కింది భాగం కనిపిస్తుంది. గర్భ గృహంలో అర్ధ మండపం ఉంటుంది. ఇక్కడే మనం నరసింహుని సాలగ్రామ రూపం దర్శిస్తాం.

**ఆలయ కథ :** బ్రహ్మపురాణం ప్రకారం సోమకాసురుడు వేదాలను బ్రహ్మ నుంచి తస్కరించాడు. దాంతో బ్రహ్మదేవుడు తన తండ్రి అయిన విష్ణుమూర్తిని దర్శించి, వేదాలను ఉద్ధరించేందుకు సహకరించ మన్నాడు. శ్రీమన్నారాయణనుడు మత్స్యావతారంలో సోమ కాసురుడిని సంహరించి, వేదాలనుద్ధరించాడు. ఆయనచే రక్షింపబడిన వేదాలు పురుషరూపం ధరించి, శ్రీమన్నారాయణుడిని స్తుతించాడు. 'నిరంతరం నన్ను నీ శిరసు ధరించు' అని కోరుకున్నాయి. అందుకు శ్రీమన్నారాయ ణుడు, నృసింహావతారంలో హిరణ్యకశిపుని సంహ రించి, ప్రహ్లాదుని రక్షించిన అనంతరం పంచరూపాత్మకుడనై మీ శిరస్సుల మీద వసిస్తాను. అప్పటి వరకు కృష్ణవేణీ గర్భంలో సాలగ్రామ రూపంలో వసించండి అని పలికాడు. కృష్ణవేణి అనునిత్యం అభిషేకం చేయాలని కోరుకుంటోంది కనుక ఆమె కోరిక కూడా ఏకకాలంలో నెరవేరగలదని వరమిచ్చాడు. అనంతరం నృసింహ ఆవిర్భావం జరిగి, హిరణ్యకశిపుని సంహరించి, శ్రీమన్నారాయణుడు జ్వాలానారసింహు నిగా వేదాద్రిపై నెలకొన్నట్లు స్థలపురాణం చెబుతోంది.

వ్యాసమహర్షి ఆదేశానుసారం ప్రశాంతంగా తపస్సు చేసుకోవ డానికి అనువైన ప్రదేశాన్ని అన్వేషిస్తున్న కొందరు మహర్షులకు వేదగిరి ప్రాంతానికి రాగానే స్వరయుక్తంగా వేదనాదం కొండలో నుంచి వినప డిందని, ఆ వేదనాదానికి ఆకర్షితులైన మునులు వేదగిరిని అధిరో హించి, గుహలోనికి ప్రవేశించారని, అక్కడ స్వామిని దర్శించి ఆయన ఆశీస్సులతో అక్కడే చిరకాలం తపస్సు చేస్తూ ఉండిపోయారని కూడా ఒక కథ ప్రచారంలో ఉంది. మూలవిరాట్టు పడమటి ముఖంగా కృష్ణానది వైపు తిరిగి ఉంటుంది. స్వామికి ఎదురుగా నదిలో సాల గ్రామ రూపం వెలసి ఉంది.

**విశిష్టత :** ఇక్కడి యోగ నరసింహస్వామి యోగ పట్టసం మీద ఆసీనుడై, నాలుగు భుజాలతో శంఖచక్రధారియై భక్తులను అనుగ్రహి స్తున్నాడు. ఏరు మీద నుంచి వీచే చల్లటి గాలి, తియ్యటి రుచి కలిగిన కృష్ణాజలాలు, నిశ్శబ్ద వాతావరణం, అందమైన ప్రకృతి రామణీయకత ఇక్కడ ప్రత్యేకతలు. ఈ స్వామిని సేవిస్తే దీర్ఘవ్యాధులు నశించి పోతా యని భక్తుల విశ్వాసం... శ్రీమన్నారాయణుడు వేదాద్రి శిఖరం మీద జ్వాలానరసింహుడిగా కొలువుతీరి భక్తులకు అభయప్రదాతగా ఉన్నాడు.

**దేవాలయ వేళలు....** ఉదయం 6 నుంచి 9 గంటల వరకు

జగ్గయ్యపేటకు 5 కి.మీ. దూరంలో ఉంది. ఇక్కడకు అన్ని ప్రదేశాల నుంచి బస్ సౌకర్యం ఉంది.

**రైలు మార్గం :** మధిర రైల్వేస్టేషన్

**విమాన మార్గం:** విజయవాడ

## 7. శ్రీకాకుళాంధ్ర మహావిష్ణు

కృష్ణాజిల్లా ఘంటసాల మండలం, దివి తాలూకా శ్రీకాకుళం గ్రామంలో శ్రీకాకుళాంధ్రమహావిష్ణు కొలువుదీరి ఉన్నాడు. ఇక్కడ ప్రధాన దైవం శ్రీమహావిష్ణువు. దక్షిణ హస్తంలో శంఖం, వామ హస్తంలో చక్రం ధరించి శాంతికి నెలవుగా కనువిందు చేస్తాడు. శ్రీమహావిష్ణువు కంఠంలో సాలగ్రామ మాల ధరించి ఉంటాడు. ఇటు వంటి సాలగ్రామ మాల తిరుపతి, ర్యాలి దేవాలయాలలో మాత్రమే కనిపిస్తుంది.

**దేవాలయ చరిత్ర :** ఈ దేవాలయం 1081లో నిర్మితమైనట్లుగా రాజగోపురం మీద ఉన్న శిలా శాసనం ఆధారంగా తెలుస్తుంది. సాక్షాత్తు శ్రీమహావిష్ణువు భగవంతుడిగా కొలువుదీరి ఉండటం చాలా అరుదు. అందువల్ల ఈ దేవాలయం చాలా విశేషమైనది. ఇతర దేవాలయాలలో విష్ణుమూర్తి అవతారాలకు సంబంధించిన వెంకటేశ్వర స్వామి, నరసింహస్వామి, శ్రీకృష్ణుడు, శ్రీరాముడు వంటి మూర్తులు మాత్రమే భగవంతుడిగా అర్చనలు అందుకోవడం చూస్తాం. అనంత దండపాలుడు నిర్మించిన ఈ దేవాలయ రాజగోపురం అందంగా, ఠీవిగా కనిపిస్తుంది. రాజగోపుర స్తంభాలన్నీ దేవాలయ విశేషాలతో నిండి ఉంటాయి. దేవాలయ కుడ్యాల మీద ఉన్న 12, 13 శతాబ్దాలకు చెందిన 30కి పైగా శాసనాలు మనలను గత చరిత్రలోకి తీసుకు వెళ్తాయి. 1519లో శ్రీకృష్ణదేవరాయలు ఈ ఆలయాన్ని సందర్శిం చినట్లు, ఆ ప్రాంగణంలో అనేక రచనలు చేసినట్లు ఆయనే స్వయంగా రాసుకున్నాడు.

**దేవాలయ కథ :** ఆంధ్రవిష్ణు మహారాజు... శ్రీశైలం, భీమేశ్వరం, కాళేశ్వరం ప్రాంతాలకు కలుపుతూ పెద్ద కుడ్యాన్ని నిర్మించినట్లు కొన్ని ఆధారాలు లభ్యమవుతున్నాయి. ఈ చారిత్రక దేవాలయాలన్నీ ఆంధ్ర దేశంలోనే కొలువుదీరి ఉన్నాయి. ఈ కుడ్యాలలో పరమశివుడు స్వ యంగా నివసిస్తాడని విశ్వాసం. నిశుంభుడనే రాక్షసునితో శ్రీమహా విష్ణువు మూడు వందల సంవత్సరాలు యుద్ధం చేసి సంహరించాడని

ఒక విశ్వాసం. ఆంధ్ర మహావిష్ణువు మహారాజు ఈ దేవాలయాన్ని నిర్మించి తన పేరు పెట్టుకున్నాడు. 108 దివ్యదేశాలలో ఒకటి... 108 దివ్యదేశాలలో ఈ దేవాలయం 57వది. ఇక్కడి మహావిష్ణువు శ్రీకాకుళేశ్వరస్వామి, ఆంధ్రమహావిష్ణువు, ఆంధ్రనాయకుడు, ఆంధ్ర వల్లభుడు, తెలుగు వల్లభుడు, శ్రీకాకుళనాథుడుగా ప్రసిద్ధుడు.

**దేవాలయ వేళలు :** ఉదయం 6 నుంచి 12 సాయంత్రం 5 నుంచి రాత్రి 8 గంటల వరకు

**బస్ సౌకర్యం :** ప్రభుత్వ ఆర్టిసి బస్సులు

**రైలు మార్గం :** రేపల్లె, ఇక్కడ నుండి 28 కి.మీ.

**విమానం :** విజయవాడకు, ఇక్కడ నుంచి కేవలం 46 కి.మీ.

**వసతి సౌకర్యం :** దేవస్థానం అతిథి గృహాలు, సత్రాలు

**వేళలు :** ఉదయం 5.30 నుంచి 1.00 గంట వరకు, సాయంత్రం 3.30 నుంచి 7.00 వరకు

## 8. భళా! మంగళగిరీశా!

విజయవాడ కనకదుర్గ దేవాలయానికి ఎనిమిది కిలోమీటర్ల దూరంలో మంగళగిరి కొండ మీద పానకాల లక్ష్మీనరసింహస్వామి ఉంది. భారతదేశంలోని ఎనిమిది మహాక్షేత్రాలలో ఇది ఒకటి. ఇక్కడ పానకాల స్వామిగా భక్తుల పూజలు అందుకుంటాడు శ్రీమన్నారాయణుడు. భక్తులు తమ కోరికలను తీర్చమని ఆయనను కోరుతూ, భగవంతుడికి నిత్యం పానకపూజ చేస్తారు. నరసింహస్వామి ఎంతో సంతోషంతో ఆ పానకం సేవిస్తాడు. ఆశ్చర్యమేమిటంటే ఆయన పానకం సేవిస్తున్నప్పుడు గుటక వేస్తున్న శబ్దం వినిపిస్తుంది. సగం పోయగానే, బయటకు వచ్చేస్తుంది. నరసింహస్వామి నోటిలో పోసే ఆ పానకం అంతా ఎక్కడకు వెళ్తుందో అంతుపట్టని రహస్యం. మరొక విచిత్రమేమిటంటే, ఈ ప్రాంతంలో ఎంతో బెల్లం ఉపయోగిస్తున్నప్పటికీ, అక్కడ ఈగ కాని దోమ కాని కనిపించదు. ఆ ప్రాంతమంతా తడి లేకుండా నిరంతరం వేడిగా, పొడిగా ఎలా ఉంటుందో అంతుచిక్కని రహస్యం.

కొండ మీదకు వెళ్తే మెట్లకు కుడి వైపుగా, విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన శ్రీకృష్ణదేవరాయలు వేసిన శిలాశాసనం, కొద్దిగా ముందుకు వెళ్తే, చైతన్య మహాప్రభు పాదముద్రలు కనిపిస్తాయి. కొండ మధ్యభాగానికి వచ్చేసరికి, పానకాల లక్ష్మీనరసింహస్వామి ముఖ భాగం నోరుతెరుచుకుని కనిపిస్తుంది. 1955లో దేవాలయానికి అభిముఖంగా ధ్వజస్తంభాన్ని ప్రతిష్ఠించారు. దేవాలయానికి వెనుకగా, పడమర దిక్కుగా లక్ష్మీదేవి దేవాలయం ఉంది. అక్కడే ఒక సొరంగం ఉందని, ఆ సొరంగం కృష్ణాతీరం వరకు తవ్వబడి ఉందని చెబుతారు.

కొండ పాద ప్రాంతంలో, మరొక దేవాలయం ఉంది. అది ధర్మరాజు కాలానికి చెందినదిగా చెబుతారు. ఈ దేవాలయంలోని విగ్రహాన్ని ధర్మరాజు ప్రతిష్ఠించాడని స్థలపురాణం చెబుతోంది. ఇక్కడ భగవంతుడిని లక్ష్మీనరసింహస్వామిగా కొలుస్తారు.

సుమారు 200 సంవత్సరాల క్రితం రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు అమరావతిని రాజధానిగా చేసుకుని పరిపాలించేవాడు. ఆ సమయంలోనే అతి పెద్దదైన గాలి గోపురం మంగళగిరిలో నిర్మించాడు. దక్షిణ భారతదేశంలో ఇదే అతి ఎత్తయిన గాలిగోపురం. దీని ఎత్తు 153 అడుగులు,49 అడుగుల వెడల్పు,11 అంతస్థులతో ఠీవిగా కనిపిస్తుంది. వీటిద్వారాలు తూర్పు, పడమరదిక్కుల వైపుగా ఉన్నాయి. గోపుర నిర్మాణం పూర్తయేసరికి అది ఒకవైపుగా ఒరిగి ఉండటం గమనించారు. కాంచీపురానికి చెందిన ఇంజనీర్లు గోపురానికి ఎదురుగా ఒక చెరువు తవ్వమని సూచించారు. ఆ విధంగా చేయడంతో, గాలిగోపురం సమాంతరంగా నిలబడింది. ఇక్కడ నరసింహస్వామి, వామ భాగంలో లక్ష్మీదేవితో దర్శనమిస్తాడు. ఆయన కంఠంలో 108 సాలగ్రామాలతో తయారయిన దండ ఇక్కడ ప్రత్యేకం. దక్షణావృత్త శంఖం మరో ప్రత్యేకం. ఈ రథం మీద రామాయణ, భారత, భాగవత కథలకు సంబంధించిన బొమ్మలు చెక్కారు. ఈ శిఖరం మీద ఉన్న క్షీరవృక్షం ప్రత్యేకంగా మహిళలను ఆకర్షిస్తుంది. సంతానం కోసం స్త్రీలు నేటికీ ఇక్కడకు వచ్చి ఈ వృక్షాన్ని ఆరాధిస్తారు.

**వింత గాథ :** ఒక కంసాలి ఇక్కడ ఉత్సవమూర్తులను తయారు చేయడానికి పంచ లోహాలను కరిగించాడట. అయితే ఆ లోహాలు చిక్కపడకుండా అలాగే ఉండిపోవడంతో, పని నిర్విఘ్నంగా జరగాలని భగవంతుడిని కోరుకున్నాడట. సరిగ్గా ఆ సమయంలో 'నరబలి కావాలి' అని వినపడిందట. అదే సమయంలో మంచినీటి కోసం అక్కడకువచ్చిన కుమారుని చూడకుండా, సలసల కాగుతున్న లోహాలున్న పాత్రలో వేశాడట. వెంటనే ద్రవం చిక్కబడటం, ఉత్సవ మూర్తులు తయారవ్వడం వెంటవెంటనే జరిగిపోయాయట. అంతలోనే కొడుకు గుర్తుకు వచ్చి, 'నాయనా మంచినీళ్లు ఇస్తాను రా' అని పిలిచాడు. ఆశ్చర్యంగా ఆ కుమారుడు బయటకు వచ్చాడట. ఇటువంటి ఎన్నో అద్భుతాలు కలిగిన క్షేత్రం మంగళగిరి.

ఈ దేవాలయాన్ని ఒక్కసారి దర్శించినంత మాత్రానే మోక్షం లభిస్తుందని భక్తుల విశ్వాసం. రాముడు మనశ్శాంతి కోసం ఇక్కడకు వచ్చాడని, ఇక్కడే తన భౌతిక తనువును చాలించిన సమయంలో... హనుమంతుడు ఇక్కడ క్షేత్ర పాలకుడిగా స్థిరనివాసం ఏర్పరచుకున్నట్లు స్థలపురాణం ద్వారా తెలుస్తోంది. ఈ ప్రాంతాన్ని శ్రీశంకరాచార్యులు, రామానుజాచార్యులు, చైతన్యప్రభు, శ్రీకృష్ణదేవరాయల వంటి సార్వభౌముడు కూడా దర్శించినట్లు చరిత్ర చెబుతోంది.

## 9. వైకుంఠపురం

కృష్ణానదీ తీరంలో కృష్ణా గుంటూరు జిల్లాల సరిహద్దులో ఉన్నది అతి చిన్న గ్రామం వైకుంఠపురం. వైకుంఠపురంలోని క్రౌంచ పర్వతం మీద అలిమేలుమంగా సమేత వెంకటేశ్వరస్వామి స్వయంభువుగా

వెలిశాడని విశ్వాసం. 11వ శతాబ్దంలో కాకతీయులు అమరావతిని పరిపాలిస్తున్న సమయంలో, చిన్న రమణ, పెద్ద రమణ అనే సోదరులకు వెంకటేశ్వరస్వామి కలలో కనిపించి, అమరావతికి ఈశాన్యంగా ఉన్న కొండ మీద ఉన్న గుహలో తాను కొలువై ఉన్నానని చెప్పాడట. తెల్లవారగానే ఆ సోదరులు వెతుక్కుంటూ ఆ ప్రాంతానికి వెళ్లేసరికి అక్కడ వెంకటేశ్వరుడు సాలగ్రామ రూపంలో దర్శనమిచ్చాడట. 14వ శతాబ్దంలో కొండవీటి రాజులు గుహచుట్టూ ముఖమండపాన్ని నిర్మించారట. విగ్రహరూపాలను మార్చడానికి ప్రయత్నిస్తే, వారు రక్తం కక్కుకుని మరణించారట. అప్పుడు భగవంతుడు, ఆకాశవాణి రూపంలో, తాను నిరాకారంగా ఉంటానని, తనను అలాగే కొలవమని అయితే, నిత్యపూజలు చేస్తూ, ప్రతిరోజూ లింగానికి చందనం పూయమని చెప్పాడు.

1750 ప్రాంతంలో అమరావతిని పరిపాలించిన రాజావాసిరెడ్డి వెంకటాద్రినాయుడు, పూర్తిస్థాయిలో దేవాలయ నిర్మాణం చేసి, మహారాజ గోపురం నిర్మించిన నాటి నుంచి ఈ ప్రాంతాన్ని వైకుంఠపురం అని పిలవడం ఆరంభించారు. 1977లో వచ్చిన పెనుతుఫానుకి రాజగోపురం ఒరిగింది. పైకి వెళ్లడానికి ఉన్న రాతి మెట్లు కూడా శిథిలావస్థలో ఉన్నాయి.

"శ్రీ అలిమేలుమంగా సమేత శ్రీవేంకటేశ్వరస్వామి చరణ సన్నిధౌ, బంధవిరామ క్షేత్ర భైరవ క్షేత్ర పంచలింగ క్షేత్ర శ్రీఅష్టదిక్పాలక శ్రీఆంజనేయస్వామి చరణ సన్నిధౌ అఖండ కృష్ణవేణి ఉత్తరవాహిని స్నానమాహం కరిష్యే".

## 10. అమరావతి

కృష్ణాతీరంలో ఉన్న అతి చిన్న గ్రామం అమరావతి. ఇక్కడ శివుడు అమరేశ్వరుడిగా ప్రసిద్ధుడు. ఇది పంచారామంలో ఒకటి. అమరావతినే ధాన్యకటకం, ధరణికోట అని కూడా పిలుస్తారు. ఇక్కడ ప్రసిద్ధి చెందిన బౌద్ధ స్థూపం ఉంది. శాతవాహనులు అమరావతిని రాజధానిగా చేసుకుని పరిపాలించారు. ఇక్కడ పాలరాతితో తయారైన 15 అడుగుల శివలింగం కనువిందు చేస్తుంది. ద్రవిడ శిల్పకళా సంస్కృతిలో దేవాలయానికి నలుదిక్కులా గాలిగోపుర నిర్మాణం జరిగింది. హిందూ పురాణాల ప్రకారం, అమరావతి దేవాలయం లయకారకుడైన అమరేశ్వరుడికి అంకితం అయి ఉంది. ఈ దేవాలయానికి సంబంధించిన కథ స్కాందపురాణంలో ఉంది. ద్వాపరయుగాంతంలో అంటే 5053 సంవత్సరాల క్రితం నారాదమహర్షిని శౌనకాది మునులు, మోక్షమార్గాన్ని ఉపదేశించమని కోరారు. అందుకుగాను నారదుడు, 'శ్రీకృష్ణుడు సృష్టించిన కృష్ణానదీ పరీవాహక ప్రాంతంలో పవిత్ర స్నానం ఆచరిస్తే, మోక్షం లభిస్తుందని ఉపదేశించాడు. ఈ తీర ప్రాంతంలో ఎవరైనా కనీసం మూడు రోజులు భక్తిపూర్వకంగా స్నానం ఆచరించి, భగవంతుడిని దర్శించుకుంటే తప్పక ముక్తి లభిస్తుందని పెద్దలు చెబుతున్నారు. ఈ ప్రాంతంలో తనువు చాలించినవారిని పరమశివుడు తనలో ఐక్యం చేసుకుంటాడని క్షేత్రమహాత్యం చెబుతోంది.

**ధాన్యకటకం లేదా అమరావతి :** పరమశివుని వరం కారణంగా రాక్షసులు దేవతలపై యుద్ధం చేసి వారిని ఓడించారు. రాక్షసులను తాను సంహరిస్తానని పరమశివుడు దేవతలకు వరమిచ్చాడు. ఆ సమయంలో దేవతలు ఇక్కడే తల దాచుకున్నారు. అందుకే ఈ ప్రాంతానికి అమరావతి అని పేరు వచ్చినట్లు ఒక కథ ప్రచారంలో ఉంది. ఇక్కడ అమర లింగేశ్వరుడు బాలచాముండీ సమేతంగా పూజలు అందుకుంటున్నాడు. ఈ దేవాలయం కృష్ణానదీ సమీపంలో ఉంది. ఇక్కడి విమానస్థానం కూడా ద్రావిడ సంస్కృతిలోనే రూపుదిద్దుకుంది.

## 11. హంసలదీవిలో వేణుగానం

బిరబిరా పరుగులిడే కృష్ణమ్మ.... పరిష్వంగానికి పరితపించే సముద్రుడు...

దాపున వేణుగోపాలస్వామి గుడి... సాగరసంగమంలో భక్తి లీనం...

వెరసి హంసలదీవి ఒక దర్శనీయ స్థలి....

హంసలదీవి కృష్ణానది సాగరసంగమం ప్రాంతం. ఇక్కడ వేణుగోపాలస్వామి రుక్మిణీసత్యభామా సమేతుడై కొలువుతీరాడు. పూర్వం దేవతలు ఈ ఆలయాన్ని నిర్మిస్తుండగా, దేవాలయ నిర్మాణం పూర్తయి, గాలిగోపురం నిర్మిస్తుండగా తెల్లవారిపోవడంతో, అక్కడి నుంచి దేవతలు వెళ్లిపోయారనీ అందువల్ల అది అసంపూర్తిగా మిగిలి పోయిందనీ అక్కడి ప్రజలు చెబుతారు. కొన్ని సంవత్సరాల తరువాత ఐదంతస్తుల గాలిగోపురంగా నిర్మాణం పూర్తిచేశారు. ఆలయ ముఖమండపం స్తంభాల ఉన్న శాసనాలు మనకు చరిత్రను వివరిస్తాయి. ఈ ఆలయంలో శ్రీవేణుగోపాలస్వామి పిలిస్తే పలుకుతాడని భక్తులు విశ్వసిస్తారు.

**నిర్మాణం వెనుక కథ :** వేణుగోపాలస్వామి ఆలయానికి సంబంధించి ఒక కథ ప్రజా బాహుళ్యంలో ఉంది. పూర్వం ఈ ప్రాంతంలో ఒక పుట్ట ఉండేదట, స్వామి దానిలో ఉండేవారట. మేత పూర్తి చేసుకున్న గోవులు ఆ పుట్ట దగ్గరకు వచ్చి ఎంతో భక్తితో పుట్టలో ఉన్న స్వామికి తమ పొదుగుల నుంచి పుట్టలో పాలు ఇచ్చేవట. ఇంటికి తిరిగి వచ్చిన గోవులు పాలు ఇవ్వకపోవడంతో యజమానికి అనుమానం వచ్చి, ఒకనాడు మాటు వేసి, విషయం తెలుసుకున్నాడట. కోపం పట్టలేక, పుట్ట చుట్టూ పడి ఉన్న చెత్త పోగు చేసి, పుట్ట మీద వేసి నిప్పు పెట్టారట. పుట్టలోని స్వామికి వేడి తగిలిందట. ఇంతలో ఒకరికి పూనకం వచ్చి, పుట్టలో స్వామి ఉన్న విషయాన్ని చెప్పారట. విషయం గ్రహించిన ఆ యజమాని క్షమాభిక్ష కోరుకుని, స్వామివారి విగ్రహాన్ని ప్రతిష్ఠించి పూజలు నిర్వహించారట. కాలక్రమేణా ఆ

విగ్రహం శిథిలమైపోయిందట. అప్పుడు ఆ స్వామి, గ్రామస్తులకు కలలో కన్పించి, కాకరపర్రు గ్రామ మునసబు గారి పెరడులో కాకరపాదు కింద భూమిలో ఉన్నానని చెప్పాడట. దాంతో గ్రామస్తులు కాకరపర్రు గ్రామం వెళ్లి, స్వామివారి విగ్రహాన్ని బయటకు తీసి, ఆయనను ఊరేగింపుగా హంసలదీవికి తీసుకొచ్చి ప్రతిష్టించారట. ప్రపంచంలో ఎక్కడా కనిపించని విధంగా ఈ విగ్రహం నీలిమేఘ చ్ఛాయలో ఉండటాన్ని విశేషంగా చెప్పుకుంటారు. శిథిలమైన విగ్రహం కూడా నేటికీ అలంకరించబడిన మూలవిరాట్ పక్కనే దర్శనమిస్తోంది.

**నమ్మకం :** ఈ ఆలయంలో వివాహం చేసుకున్న దంపతులు సాగరసంగమ ప్రదేశంలో సరిగంగ స్నానాలు చేస్తే నూరేళ్లు సుఖంగా జీవిస్తారని, ఈ ఆలయంలో నిద్రచేస్తే సంతానం లేనివారికి సంతాన భాగ్యం కలుగుతుందని భక్తుల విశ్వాసం. ఆలయకుడ్యాల మీద అందంగా చెక్కబడిన రామాయణ ఘట్టాలు, శిల్పకళా వైభవానికి అద్దంపడతాయి. ఆలయానికి ఈశాన్యంలో ఉన్న అతి పురాతన కల్యాణ మండపం కనువిందు చేస్తుంది.

**ప్రత్యేకతలు :** ఈ ఆలయానికి ఎక్కడా లేని ఒక ప్రత్యేకత ఉంది. ఆరేడువందల సంవత్సరాల క్రితం నిర్మించిన ఆలయమే అయినా ఉప్పెనలకు సైతం చెక్కుచెదరకుండా నిలబడింది. 1864,1977సంవత్సరాలలో ఉప్పెనలు సంభవించినప్పుడు ఆ గ్రామస్థుల ప్రాణాలను కాపాడిన చరిత్ర ఈ ఆలయానిది. ఈ ప్రాంగణంలోనే జనార్దనస్వామి, రాజ్యలక్ష్మి, లక్ష్మీనరసింహస్వామి మూర్తులు, ఆలయ సమీపంలో బాలాత్రిపురసుందరి, అన్నపూర్ణ సమేత కాశీవిశ్వేశ్వరాలయాలు ఉన్నాయి. ఆలయ ప్రాంగణంలో అక్కడక్కడ చెల్లాచెదురుగా పడి ఉన్న కొన్ని శిథిల శిల్పాలు అలౌకిక ఆనందాన్ని పంచుతాయి.

కృష్ణాజిల్లా కోడూరు నుండి 15 కి.మీ. దూరంలో, మోపిదేవి నుంచి 28 కి.మీ. దూరంలో బంగాళాఖాతం అంచున ఈ పుణ్యక్షేత్రం ఉంది. మాఘపౌర్ణమికి స్వామివారి కల్యాణోత్సవం, కృష్ణాష్టమి, ధనుర్మాసం, ప్రత్యేక ఉత్సవాలు, కార్తీకమాసంలో సముద్రస్నానం ఆచరించిన భక్తులు ఈ స్వామిని తప్పక దర్శిస్తారు. హంసలదీవిలో కృష్ణానది సాగరసంగమ స్థానం కావడంతో ఈ ఆలయానికి మరింత విశిష్టత ఉంది.

**కృష్ణవేణి పుట్టుక నుంచి సాగర సంగమం వరకు :** కృష్ణమ్మ మహారాష్ట్రలోని మహాబలేశ్వర్ దగ్గర పడమటి కనుమలలో ప్రభవించి, తుళ్లుతూ, తూలుతూ, వయ్యారాలు పోతూ, దారిలోని పచ్చటి పొలాలను తడి చేస్తూ, పూలు పూయిస్తూ 1400కి.మీ. ప్రవహించి ప్రవహించి... అలసి సొలసి హంసలదీవి దగ్గర తన మధుర జలాలతో సాగరుడి క్షారజలాల ఒడికి చేరి ఒదిగి కూర్చుంటుంది. కృష్ణాజలాలు నల్లని వర్ణంలో ఉంటాయి కనుకే ఆ తల్లిని కృష్ణమ్మ అంటారు.

**ఆ పేరు ఎందుకు ? :** హంసల దీవి పేరు వినగానే... ఈ ప్రాంతంలో హంసలు పుష్కలంగా సంచరిస్తాయనే భావన కలుగుతుంది. కొన్ని వేల సంవత్సరాల క్రితం ఒక కాకి హంసగా మారటం వల్ల ఈ ప్రాంతానికి ఆ పేరు వచ్చినట్లుగా తెలుస్తోంది. అందరి పాపాలను కడుగుతున్న కారణంగా గంగానది మలినమైపోయింది. తన పాప పంకిలాన్ని పోగొట్టుకునే మార్గం చెప్పమని శ్రీమహావిష్ణువును ప్రార్థించగా, గంగాదేవిని కాకి రూపంలో సకల పుణ్యతీర్థాలలో స్నానమాచరించమనీ, ఏ క్షేత్రంలో ఆమె హంసగా మారుతుందో అది మహోన్నతమైన దివ్యక్షేత్రంగా అలరారుతుందని చెప్పాడు. సకల పుణ్యతీర్థాలలో స్నానం చేస్తూ వెళుతున్న కాకి కృష్ణవేణి సాగర సంగమ ప్రాంతంలో మునక వేయగానే అందమైన హంసగా మారింది. నాటి నుంచి ఈ ప్రాంతాన్ని హంసలదీవి అంటున్నారని స్థల పురాణం వివరిస్తోంది. అంతేకాదు.... ఈ ప్రాంతంలో ఎందరో మునులు తపస్సు చేసుకుంటూ సంచరించేవారని, అంతటి పరమహంసలు సంచరించిన ప్రదేశం కాబట్టి ఈ ప్రాంతాన్ని హంసలదీవి అన్నారని కూడా మరొక కథ ప్రచారంలో ఉంది.

**మధురానుభూతి :** పాలకాయతిప్ప దగ్గర కృష్ణానదీ బంగాళాఖాతం సాగరసంగమం దృశ్యం చూడాలంటే రోడ్డు మార్గంలో మూడు కిలోమీటర్లు ప్రయాణించాలి. ఒక పక్క నుంచి నల్లని వర్ణంలో కృష్ణమ్మ ప్రశాంతంగా ప్రవహిస్తుంటే, మరో పక్క తెల్లని వర్ణంలో సాగరుడు సైతం ప్రశాంతంగానే ఆమెను తన ఒడిలోకి ఆహ్వానిస్తుంటాడు. ఇక్కడికి రోడ్డు మార్గం ఉంది. చివరిలో బీచ్ వెంట కాలిబాటన రావాలి. అంతేకాదు, పాలకాయతిప్ప నుంచి కాలిబాటన వచ్చే ప్రాంతంలో సముద్రం పోటు మీద ఉన్నప్పుడు ఆ బాట కనుమరుగవుతుంది. పోటు తగ్గాక తిరిగి ప్రశాంతంగా కాలిబాట కనులవిందు చేస్తుంది. అందుకే సముద్రం పోటు సమయంలో ఇక్కడకు రావడం అంత క్షేమంకాదు. నీటిలో ఎక్కువ దూరం వెళ్లకూడదు. దగ్గరలో ఉన్న ఒక భవంతి పైనుంచి సుందరమైన సాగరసంగమం దృశ్యాన్ని కన్నులారా చూడవచ్చు.

**భౌగోళికంగా :** అవనిగడ్డ దగ్గర, పులిగడ్డ వద్ద కృష్ణానది రెండు పాయలుగా చీలి, తూర్పుదిశగా పాలకాయతిప్ప దగ్గర బంగాళాఖాతంలో కలుస్తుంది. పశ్చిమశాఖ లంకవానిదిబ్బ కృష్ణ, నాసగుంట కృష్ణ, వేణీసాగరం కృష్ణ....అని మూడు పాయలుగా చీలి, సముద్రంలో కలుస్తాయి.

*చిరునామా : డా॥ పురాణపండ వైజయంతి, ఆకాశవాణి కాలనీ, విజయవాడ - 520 010*

డా॥ వి. రవిశంకర్

# ప్రసిద్ధ శైవక్షేత్రం నందవరం

తెలుగునేలపై కర్నూలు జిల్లాకు ఒక ప్రత్యేక స్థానముంది. తెలుగుజాతికి, తెలుగు భాషకు ఈ పేరు రావడానికి ముఖ్య కారణమైన త్రిలింగాల్లో ప్రథమంగా చెప్పే శ్రీశైల మహాక్షేత్రం ఈ జిల్లాలోనే ఉంది. జ్యోతిర్లింగం, శక్తిపీఠం ఒకేచోట కొలువైన దివ్యక్షేత్రం ఉత్తరాదిన కాశీ అయితే, దక్షిణాదిన శ్రీశైలం మాత్రమే. అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత సిద్ధాంతాల త్రివేణీ సంగమంలా శ్రీశైల, అహోబిల, మంత్రాలయాలు ఈ నేలపై ఆధ్యాత్మిక పరిమళాలను వెదజల్లు తున్నాయి. వీటన్నిటితోపాటు శక్తి ఆరాధనకు సంబంధించిన ఆనవాళ్లు కూడా జిల్లాలో విస్తృతంగానే కనిపిస్తాయి.

సృష్టికి మూలంగా సనాతన ధర్మం శక్తిని ప్రతిపాదిస్తుంది. జ్ఞాన భాండాగారాలైన వేదాలు, ఉపనిషత్తులలో శక్తికి సంబంధించిన ప్రస్తావన విస్తృతంగా కనిపిస్తుంది. మహాశక్తుల సమాహారమూర్తిగా ఋగ్వేదం శక్తిని పేర్కొంది. ఇలాంటి శక్తి స్వరూపాన్ని ఎవరు ఎలా ఆరాధించినా స్త్రీరూపంలోనే ఆరాధిస్తారు. దాదాపు 5వేల సంవత్సరాల నాటి సింధునాగరికతలో మాతృదేవతారాధనకు సంబంధించిన ఆధారాలు విరివిగా కనిపిస్తాయి.

స్త్రీశక్తి మొదట్లో ఆర్యులచేత పృధ్వీదేవతగా, ఆ తర్వాత ఆదిపరాశక్తికిగా పూజలందుకుంది. పురాణ గాథలు, కాలగతిలో వచ్చిన మార్పుల వల్ల దేశకాలభేదాలను అనుసరించి వివిధ రకాల పేర్లతో పూజలందుకుంది. శక్తి సంబంధమైన ఈ ఆరాధనకు శాక్తేయమని పేరు. ఆ శక్తిని పూజించేవారు శాక్తేయులు. ఈ ఆరాధనలో మంత్రాలకంటే తంత్రాలకు అంటే క్రియలకు ప్రాధాన్యం ఎక్కువ. ఈ జగత్తు ఆవిర్భావానికి మూలకారణమైన పరతత్త్వాన్ని స్త్రీమూర్తిగా, జగజ్జననిగా శాక్తేయులు పూజిస్తారు. ఈవిధమైన ఆరాధనా విశేషం కేవలం హైందవానికే పరిమితం కాదు. వివిధ దేశాల్లో, విభిన్న మతాల్లో ఏదో ఒక రూపంలో శక్తి ఆరాధన కనిపిస్తుంది. శైవులు పార్వతిని, వైష్ణవులు లక్ష్మిని, కార్తికేయులు వల్లీదేవసేనలను పూజించినట్లే, బౌద్ధులు తారారూపాన్ని, క్రైస్తవులు మేరీమాతను, మహమ్మదీయులు బీబీఫాతిమాను ఆరాధించడం మాతృ దేవతారాధనకు ప్రతిబింబంగా చెప్పవచ్చు.

దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేయడానికి ఆదిపరాశక్తి వివిధ కాలాల్లో, రకరకాల పేర్లతో, అనేక ప్రాంతాల్లో అవతరించినట్లుగా పౌరాణిక ఆధారాలు కనిపిస్తాయి. కంచి కామాక్షి, మధుర మీనాక్షి, కాశీ విశాలాక్షి, బెజవాడ కనకదుర్గ, శ్రీశైల భ్రమరాంబ, అలంపురం జోగులాంబ మొదలైన స్వరూపాలే కాదు, దాదాపు ప్రతి ఊర్లోను ఏదో ఒక పేరుతో కనిపించే మైసమ్మ, పోలేరమ్మ, ఎల్లమ్మ, గంగమ్మ, పైడితల్లమ్మ, మావూళ్లమ్మ మొదలైన దేవతాస్వరూపాలన్నీ ఆ ఆదిపరాశక్తికి ప్రతిబింబాలే.

ఇదే కోవలో కర్నూలుజిల్లా బనగానపల్లె తాలూకా నందవరంలో కొలువైన శక్తి స్వరూపిణి చౌడేశ్వరీదేవి. కాశీ క్షేత్రానికి కర్నూలు జిల్లాతో ముడిపడిన అనుబంధాన్ని నిరూపించే జ్యోతిక్షేత్రం నందవరం. జిల్లాలో శాక్తేయానికి సంబంధించిన ఆనవాళ్లకు ప్రతిరూపం నందవరంలో వెలసిన చౌడేశ్వరీమాత.

## చౌడేశ్వరీదేవి ఆవిర్భావ కథ - ఆధారాలు

'చట్టుచౌడమ్మ కథ' అనే జానపద గేయ గాథలో నందవర చౌడేశ్వరీదేవి ఆవిర్భావగాథ కనిపిస్తుంది. తర్వాత వచ్చిన చౌడేశ్వరీ సాహిత్యానికి దీన్ని మూలంగా చెప్పవచ్చు. కాలగతిని అనుసరించి ఈ గాథలో రకరకాల మార్పులు, చేర్పులు చోటుచేసుకున్నాయి. కాల, విషయ, వస్తు వైవిధ్యాన్నిబట్టి పూర్వోత్తర భాగాలుగా దీన్ని చెప్పుకోవచ్చు. శిష్టరక్షణకు, దుష్టశిక్షణకు కృతయుగంలో ఆవిర్భవించిన దేవి శుంభనిశుంభులు, త్రిపురాసురుడు మొదలైన

రాక్షసుల్ని సంహరించి అవతారకార్యం ముగిసిన తర్వాత కాశీక్షేత్రంలో విగ్రహరూపం దాల్చేవరకు ఉండేది పూర్వగాథ. కాశీలోని దేవి నందవరానికి తరలివచ్చేవరకు ఉండే కథ ఉత్తరగాథ. ఈ కథను సంక్షిప్తంగా చెప్పుకుంటే..

యోగబలంతో నందరాజు ప్రతిరోజు ఉదయాన్నే కాశీకి వెళ్లి, విశ్వేశ్వరుణ్ని సేవించి మధ్యాహ్నానికల్లా రాజ్యానికి తిరిగి వస్తుంటాడు. ప్రతిరోజు తెల్లవారుజామున భర్త వెళ్తున్నది ఎక్కడికో తెలుసుకోవాలన్న మహారాణి ఒకరోజు ఆయనను నిలదీస్తుంది. దాంతో రాజు విషయాన్ని ఆమెకు వివరిస్తాడు. ఆమె తానూ వస్తానని పట్టుబట్టడంతో కాదనలేక మహారాణిని కూడా తనవెంట కాశీకి తీసుకుపోతాడు నందరాజు. అక్కడ ఆమెకు స్త్రీసహజమైన నెలసరి రావడంతో యోగబలం పనిచేయక వాళ్లు రాజ్యానికి తిరుగు ప్రయాణం చేయలేకపోతారు. సమయానికి రాజ్యానికి చేరుకోకపోతే కలిగే అనర్థాన్ని గురించి ఆందోళన చెందుతాడు నందరాజు. కాశీలోని కొందరు బ్రాహ్మణులు రాజుకు కలిగిన ఇబ్బందిని తెలుసుకుని మంత్ర ప్రభావంతో వారి ప్రయాణానికి ఎదురైన ఆటంకాన్ని తొలగిస్తారు. అందుకు కృతజ్ఞతగా రాజు వారికి నందవరాన్ని అగ్రహారంగా దానమిస్తానని వాగ్దానం చేస్తాడు.

తర్వాత కొంతకాలానికి కాశీలో కరువు రావడంతో ఆ బ్రాహ్మణులు కాశీని వదిలి అగ్రహారం స్వీకరించేందుకు నందవరానికి వస్తారు. కానీ రాజు తాను అగ్రహారం దానమిచ్చినట్లుగా సాక్ష్యం తెమ్మంటాడు. దాంతో వాళ్లలో కొందరు కాశీకి తిరిగి వెళ్లి చాముండిని ప్రార్థించి తమకు సాక్ష్యం చెప్పడానికి రమ్మని ప్రార్థిస్తారు. దాంతో ఆమె తాను వారిని అనుసరించి వెనకనే వస్తానని, ప్రయాణంలో ఎవరూ వెనక్కి తిరిగి చూడకూడదన్న షరతుతో వారివెంట జ్యోతిరూపంలో బయలు దేరుతుంది. నందవరానికి చేరుకునేసరికి అమ్మవారు వస్తోందో లేదోనన్న ఆత్రుతతో ఓ బ్రాహ్మడు వెనక్కు తిరిగిచూడడంతో ఆమె అక్కడే నిలిచిపోతుంది. ఆ తర్వాత ఆమె బ్రాహ్మణుల తరపున సాక్ష్యం చెప్పడంతో రాజు వారికి అగ్రహారమిస్తాడు. ఇలా కాశీనుండి వచ్చిన చాముండికి నందరాజు గుడి కట్టించి ఆమె ఆరాధనకు తగిన ఏర్పాట్లు చేశాడు.

ఇదే కథ కొద్దిపాటితేడాలతో జానపదసాహిత్యంలోనే కాకుండా చాముండికా విలాసం, దేవాంగపురాణం, శ్రీ చౌడేశ్వరీవిలాసం మొదలైన గ్రంథాల్లోకూడా కనిపిస్తుంది. చౌడేశ్వరీదేవి సాహిత్యాన్ని ఎక్కువగా నందవరీకులు, తొగటవీరులు, దేవాంగులు, ఏకాంగులే రచించారు. ఏకాంగుల ప్రస్తావన పూర్వోత్తర గాథలు రెండింటిలోనూ ఉంటే, నందవరీకుల ప్రసక్తి ఉత్తరభాగంలో మాత్రమే కనిపిస్తుంది. దీన్నిబట్టి చౌడేశ్వరి మొదట ఏకాంగ, దేవాంగుల కులదైవమై, తర్వాతికాలంలో నందవరీకుల కులదైవంగా మారి ఉంటుందని కొందరి భావన. నిశితంగా పరిశీలిస్తే చౌడేశ్వరి పేరులోనే ఆమె ఆరాధకుల ఇతివృత్తం కూడా దాగి ఉందని తెలుస్తుంది.

## ఈ పేరేంటి :

ఉపాధినిచ్చి, కడుపునింపిన వృత్తులను గౌరవించడం, ఆరాధించడం కృతజ్ఞతా సూచకం. జానపదులు, నాగరికులు, పండితులు, పామరులు దీనికి అతీతం కాదు. కొందరికి కులదేవతగా, ఇంకొందరికి ఉపాస్యదేవతగా, మరెందరికో ఆరాధ్య దేవతగా పూజలందుకొంటున్న శక్తిస్వరూపిణి చౌడేశ్వరి. ఇంతటి ప్రాచుర్యం, ప్రాశస్త్యం ఉన్న చౌడేశ్వరి పేరు అనాదికాలం నుండి జానపద, శాసన వాఙ్మయాల్లో వివిధ రూపాల్లో కనిపిస్తుంది. పౌరాణిక దృక్పథంతో చూస్తే 'చాముండ' లేదా 'చాముండి' అనే పేరు రూపాంతరం చెంది 'చౌడ' లేక 'చౌడి'గా మారి ఉంటుందని చెప్పవచ్చు. దీనికి ఈశ్వరి, అంబ, అంబిక, అమ్మ మొదలైన విశేషణాలు పరమైతే చాముండేశ్వరి, చౌడేశ్వరి, చౌడాంబిక, చౌడమ్మ అనే రూపాలు సిద్ధిస్తాయి. అంతేకాకుండా సంస్కృతంలో 'కాశ' శబ్దానికి 'ప్రకాశించేది' అని అర్థం. "కాశంతే ఇతి కాశీ" అంటే ప్రకాశించేది కాశి అని అర్థం. కాశీనుండి అమ్మవారు జ్యోతిరూపంలో నందవరానికి విచ్చేసినట్లు చౌడేశ్వరీ సాహిత్యంలో కనిపిస్తుంది. ఇలా జ్యోతిస్వరూపంలో ప్రకాశించే ఈశ్వరి చౌడేశ్వరి.

ఈమె తొగటులకు, దేవాంగులకు కులదేవత. నేతపని వీరికి ప్రధానవృత్తి, నేతవల్లే వస్త్రాలు తయారవుతాయి. 'చౌడ' శబ్దం వస్త్రాలకు సంబంధించిన ద్రావిడభాషా పదంనుండి వచ్చి ఉంటుంది. పత్తిచెట్టును సృష్టించి దాంతో వస్త్రనిర్మాణం చేసుకుని జీవించమని చౌడమ్మ చెప్పినట్లు తొగటుల కులచరిత్రలో కనిపించే ఆధారం. ఈ విషయాన్నే విశదం చేస్తుంది. 'చవలి' శబ్దానికి వస్త్రమనే అర్థాన్ని తెలుగుతోపాటు, తమిళ, మలయాళ, కన్నడ, తుళు మొదలైన ద్రావిడభాషల్లో గమనించవచ్చు.

వ్యాకరణశాస్త్ర ప్రకారం కూడా 'ల'కార 'డ'కారాలకు అభేదం కాబట్టి 'చవలి' శబ్దంలోని 'లి' 'డి'గా మారే అవకాశం ఉంది. కాబట్టి 'చవలి' 'చవడి'గా మారి ఉండవచ్చు. తాము జీవనోపాధి పొందుతున్న

'చవడి'ని దేవతగా భావించిన దేవాంగులు ఆమెకు రూపాన్ని కల్పించి ఆరాధించారు. అలా వాళ్లు ఆరాధించిన వృత్తిపరమైన దేవతే "చౌడేశ్వరి"గా స్థిరపడినట్లుగా భావించవచ్చు.

వృక్షాలను ఆరాధించడం ప్రకృతి ఆరాధనలో ఒక భాగం. తులసి, శమి (జమ్మి), అశ్వత్థ వృక్షాలకు చేసే పూజలే ఇందుకు నిదర్శనం. ఈ ప్రాచీన సంప్రదాయానికి చిహ్నంగా నందవరంలో అమ్మవారి శిలావిగ్రహం కాకుండా అత్తిచెట్టు కర్రతో చేసిన బచ్చన విగ్రహమే నేటికీ పూజలు అందుకుంటోంది.

కాశీనుండి నందరాజుకు బ్రాహ్మణులు తరపున సాక్ష్యం చెప్పేందుకు మహిమాన్విత శక్తి స్వరూపిణిగా ఒక బ్రాహ్మణస్త్రీ నందవరానికి వచ్చినట్లుగా మరో ఐతిహ్యం ప్రచారంలో ఉంది. తమకు సాక్ష్యంచెప్పి వృత్తులు, అగ్రహారాలను ప్రసాదించిన స్వకుల సంజాత అయిన ఆ స్త్రీశక్తిని నందవరీకులు కులదేవతగా పూజిస్తారు. నందవరీకులను తొగటులు, దేవాంగులు గురుత్వభావంతో చూస్తారు. అప్పట్లో విద్యాగంధం అంతగాలేని తొగటులు, దేవాంగులు మొదలైనవాళ్లు ఆమెను సహజరూపమైన "చైడమ్మ"గా పిలుచుకొంటే, విద్యావంతులైన నందవరీకులు "చాముండేశ్వరి"గా వ్యవహరించారు.

## చరిత్రలో స్థానం ఉందా...?

ప్రామాణికమైన ఆధారలు లభించకపోవడంవల్ల ఎంతటి సుప్రసిద్ధుల చరిత్రలైనా కాలప్రవాహంలో కొట్టుకుపోతాయి. లేదంటే రకరకాల మార్పులు, చేర్పులకు లోనై ప్రచారంలో కనిపిస్తాయి. ఆ తర్వాతి దశలో వాటిచుట్టూ కథలు గాథలు అల్లుకోవడంతో ఆ మార్పులతోటే శాశ్వతంగా నిలిచిపోతాయి. ఈ కోవకు చెందినదే నందన చక్రవర్తి కథ కూడా. చౌడేశ్వరీదేవి స్థలపురాణాన్ని తెలిపే అనేక కావ్యాల్లో నందన చక్రవర్తి కీలక వ్యక్తి. ఈ చక్రవర్తి కారణంగానే చౌడేశ్వరీదేవి కాశీనుండి నందవరానికి వచ్చినట్లు ప్రచారంలో ఉన్న కథను ఇంతకుముందే ప్రస్తావించుకున్నాం. ఈ నందరాజు చారిత్రకతను, ఆలయ ప్రాచీనతను నిర్ధారించడానికి శాసన, వాఙ్మయాధారలను గమనించాల్సి ఉంటుంది.

నందరాజు వేయించిన శాసనాలుగాని, నేరుగా అతని ప్రస్తావన ఉండే ఆధారాలుగానీ లభించకపోయినా ఆరవీటి రాజుల దాన శాసనాల్లో నందరాజు పేరు కనిపిస్తుంది. నందరాజును తమ పూర్వీకుడిగా అరవీటి రాజులు పేర్కొన్నారు. ఆలయ ప్రాచీనతను నిరూపించే శాసనాల విషయానికి వస్తే నందవరంలో మొత్తం 11 శాసనాలు కనిపిస్తాయి. క్రీ.శ. 1292 నాటి ఓ వీటన్నిటిలో ప్రాచీన శాసనం ఆలయంలోని బండపరుపుమీద కనిపిస్తుంది. ఇందులో దేవీభక్తులైన తొగటవారి ప్రస్తావన కనిపిస్తుంది. శాసనంలోని విషయం ప్రస్తుతాంశానికి సంబంధించినది కాకపోయినా శాసన కాలాన్ని బట్టి క్రీ.శ. 1292 నాటికి నందవరంలో చౌడేశ్వరీదేవి ఆలయం ఉందనే విషయం మాత్రం స్పష్టమవుతుంది. ఇదేవిధంగా నందవరం, అహోబిలం, మండగిరి శాసనాలతోపాటు, మోడి కైఫియత్తుల్లోకూడా నందవరం ప్రస్తావన కనిపిస్తుంది.

నన్నయ రచనగా కందుకూరి వీరేశలింగం పంతులుగారు నిర్ధారించిన చాముండికా విలాసంలో నందరాజును గురించిన ప్రస్తావన గమనించవచ్చు. "నందవరంబుననుండు చాముండికా మహత్త్వంబులు అద్భుతంబులు... సోమవంశ సంభవుడైన నందన చక్రవర్తి యను మహారాజ శ్రేష్ఠుండు నందవర పురంబున..." అని కనిపిస్తుంది. చాముండికావిలాస కర్త నన్నయభట్టేనని అంగీకరిస్తే నందరాజు నన్నయ పూర్వీకుడో, సమకాలికుడో అయిఉండాలి.

మోడీ కైఫియత్తుల్లో కూడా గయనుండి విప్రులు నందవరానికి వచ్చారని, అందువల్ల గయలో వెలిసిన జనార్ధనస్వామి కూడా నందవరానికి వచ్చాడని ఉంది. ఆ జనార్ధనస్వామి ఆలయాన్నే ప్రస్తుతం కేశవస్వామి ఆలయంగా పిలుస్తున్నారు. అయితే కరవు వచ్చినపుడు కాశీనుండి దక్షిణాదికి రావాలనే ఆలోచన ఎందుకు వచ్చిందని పరిశీలిస్తే, చాలాకాలం క్రితం వాళ్లంతా ఈ ప్రాంతాల నుండి ఉత్తరాదికి వలస వెళ్లినవారే అయిఉంటారన్న ఊహను మోడీకైఫియతు బలపరుస్తుంది. అందువల్ల ఆ బ్రాహ్మణులు నందవరానికి రావడం లోని ప్రధాన కారణం ఇది వారి జన్మభూమి కావచ్చు.

## భిన్నవర్గాల ఆరాధన -

కొన్ని ఆరాధనా విశేషాలు, దేవతామూర్తులు కొన్ని కులాలకు మాత్రమే సంబంధించినవిగా కనిపిస్తాయి. కానీ ఇలాంటి పరిమితి లేని శక్తిస్వరూపిణి చౌడేశ్వరి. అందుకే ఈ ఆలయాన్ని శక్తి నిలయంగా సంభావించడంతోపాటు, భిన్న సంస్కృతుల సమాహారంగా చెప్పడం సమంజసం. దేవీ ఆరాధకుల్లో ప్రధానంగా చెప్పుకోదగినవారు తొగటులు, దేవాంగులు, విశ్వబ్రాహ్మణులు, యాదవులు, నందవరీకులు. చౌడేశ్వరీమాత ఎందరికో కులదైవం మాత్రమే కాదు, ఉపాసనా దేవత కూడా. ఈమెను అర్చించేవాళ్లలో దాదాపు అన్నివర్గాల వారున్నారు.

ప్రతి కులానికి కులదేవతలున్నా ప్రఖ్యాతి చెందిన దేవతామూర్తులు కాలక్రమంలో ఆ కులంవారికే కాకుండా ఊరందరికీ ఆరాధనీయులుగా మారడం సహజం. ఆ మూర్తి మహత్త్వం ప్రచారమయ్యే కొద్దీ ఇతర ప్రాంతాలవారు కూడా భక్తులవుతారు. అదేవిధంగా నందవర చౌడేశ్వరీదేవి ఎందరికో ఆరాధ్యదేవతగా పూజలందుకుంటోంది.

రెండు అంతస్థులుగా నిర్మితమైన నందవరంలోని ఆలయంలో భూగర్భంలోని ఆలయంలో నందవరీకులు వైదికాచారలతో పూజలు చేస్తే, ఉపరితలాన ఉండే చౌడమ్మకు తొగటులు వామాచార పద్ధతిలో మద్యమాంసాలు నివేదించేవారని జనశృతి. అయితే కాలగమనంలో భూగర్భాలయం మూతపడింది. ప్రస్తుతం ఉపరితల ఆలయంలో మాత్రమే పూజలు జరుగుతున్నాయి. నందవరీకులు వైదిక పద్ధతిలోను, ఇతరులు వామాచార విధానంలో ఆమెను పూజిస్తున్నారు.

నందవరంలోని ఆలయం ఓంకార తత్త్వానికి చిహ్నంగా కనిపిస్తుంది. ఈ ఆలయం రోడ్డుకు 12 అడుగులకుపైగా ఎత్తులో నిర్మితమైంది. ఆలయం చుట్టూ బలమైన ప్రాకారాలు, 3 ద్వారాలు కనిపిస్తాయి. తూర్పువైపున ప్రధాన రాజగోపురం ద్వారం ఉంది. ఉత్తరంవైపున భూగర్భాలయానికి వెళ్లే ద్వారం, దక్షిణద్వారం ఉన్నాయి. అయితే ఉత్తరద్వారాన్ని మూసివేసి చాలాకాలమయింది. మహాద్వారం దాటగానే ఎడమవైపు బృందావనం, ఉత్తరంవైపు నాగులకట్ట కనిపిస్తాయి. కాశీనుండి అమ్మవారివెంట వచ్చినట్లు చెప్పే కలిమి చెట్టుకూడా ఇక్కడ ఉంది. గర్భాలయానికి ముందుండే అంతరాళంలో అమ్మవారి పాదాలున్నాయి. వీటికే అర్చన, అభిషేకం మొదలైనవి చేస్తుంటారు.

నందవరంలోని దేవాలయం శిల్పసంపద విషయంలోను, నిర్మాణశాస్త్రపరంగాను సంపూర్ణ ఆలయ లక్షణాలతో శోభిల్లుతోంది. ఈ ఆలయం వేసర శైలికి సంబంధించినది. ఉత్తర దక్షిణ భారతదేశాల శిల్పశైలీ సమ్మేళనమైన ఈ రూపానికి దక్కన్ లేదా చాళుక్యరీతి అని పేరు. ఉత్తర భారతదేశానికి చెందిన పద్ధతిలో గర్భాలయ శిఖరం, ద్రావిడ శైలిలో రాజగోపుర నిర్మాణాలు కనిపిస్తాయి. బహుశా అమ్మవారు కాశీనుండి ఇక్కడికి రావడమే ఇందుకు కారణమై ఉండవచ్చు.

ఈ క్షేత్రంలో కనిపించే మరో విశిష్టలక్షణం అస్పృశ్యత లేకపోవడం, మహిళల ప్రాతినిధ్యం ఎక్కువగా ఉండటం. ముఖ్యంగా ప్రతి సంవత్సరం జరిగే జ్యోతి ఉత్సవంలో రాయబార ఘట్టంలో ముత్తైదువుల ప్రాధాన్యత బాగా కనిపిస్తుంది. సమాజంలోని వివిధ వర్గాల ప్రజలు విభిన్న నేపథ్యాల వాళ్లంతా చౌడేశ్వరీదేవిని తమ ఇలవేల్పుగా పూజించడంతో పాటు వైవిధ్యభరితమైన శైలీవిన్యాసాలతో నిర్మాణమైన నందవరం చౌడేశ్వరీదేవి ఆలయం కర్నూలుజిల్లాలో శాక్తేయ సంస్కృతికి ప్రతిబింబంగా నిలుస్తోందనడంలో అతిశయోక్తి లేదు. "సర్వేజనా సుఖినోభవంతు"

# సనకాది మహామునులకు అర్ఘ్యప్రదానం

**సనకాద్యాస్తదా సింధుః కపిలాద్యా మహాజనాః**

**తేగృహ్ణంతు మయాదత్తమర్ఘ్యం సింహగతే గురౌ**

**ఓం సనకాది మహాజనేభ్యో నమః ఇదమర్ఘ్యం సమర్పయామి**

చిరునామా : డాక్టర్ వి. రవి శంకర్, అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలుగుశాఖ, రాయలసీమ విశ్వవిద్యాలయం, కర్నూలు - 518 007, ఆంధ్రప్రదేశ్. సంచారవాణి - 9440225207. E-mail: dr.v.ravisankar@gmail.com

శ్రీ లంక వెంకటరమణ

# పెద్దకళ్ళేపల్లి బౌద్ధ క్షేత్రమా!

పెదకళ్ళేపల్లి అనగానే చినకళ్ళేపల్లి గుర్తుకు వస్తుంది. నిజమే. దివి ప్రాంతంలో ఆ గ్రామం కూడా వుంది. పెదకళ్ళేపల్లి నుంచి వలస వెళ్ళినవాళ్ళు ఆ గ్రామాన్ని నిర్మించుకొని ఉండాలి. ఏమైనప్పటికీ పురాతనమైన పెదకళ్ళేపల్లికి ఈ పేరు ఎలా వచ్చిందోచూద్దాం.

సాంబపురాణం ఎప్పటిదో తెలియదు. అయితే ప్రథమ ఖండంలో మాత్రం "కృష్ణా భీమరధీ మధ్యే సర్వతీర్థ విరాజితమ్ పంచక్రోశ సమాకీర్ణం కదళీవన మండితమ్" అని ఉంది. అనగా కృష్ణా, భీమరధీ నదుల మధ్య అయిదు క్రోసులు విస్తీర్ణంగల కదళీవనం విరాజిల్లుతున్నది" అని భావం. ప్రాచీన భారతదేశంలో 18 రకాల అరణ్యాలు ఉండేవి. బదరిక, కేదార, నైమి, దారుక, ఉత్పల, పుష్కర, జాంగల, ఆనంద, సైంధవ, గుహ, మహా, దండక, బృంద, కామ్యక, చంప, వింధ్య వీక్ష, కదళి అనే అరణ్యాలు. ఇదిగో ఈ కదళికారణ్యంలో ఉన్నదే కదళీపురం అంటారు. క్షేత్ర మహత్యం గురించి సహ్యాద్రి ఖండంలో ఇలా ఉంది.

కృష్ణానది ఎక్కడ ఉత్తరవాహినిగా ప్రవహిస్తున్నదో, నాగేశ్వరస్వామి ఎక్కడ వెలసి ఉన్నాడో అదే నాగేశ్వర క్షేత్రం. దీనినే కర్కోటక క్షేత్రం అంటారు. ఇక్కడ శిలాలింగం కర్కోటకుడనే సర్పరూపంలో ఉంటుంది. మొదట వశిష్టమహర్షి పార్వతీదేవిని, దుర్గా దేవిని పూజించాడు. వశిష్ట, విశ్వామిత్రులిరువురు కలహించిన అనంతరం ఈశ్వరుని కోసం వశిష్ఠుడు తపస్సు చేశాడు. ఫలితం పొందాడు. విశ్వామిత్రుడు విష్ణుని కొలిచాడు. అందువల్ల విశ్వామిత్ర క్షేత్రం అయింది. నాగేశ్వరస్వామి ఆలయానికి ఉత్తరాన నాగకుండం ఉంది. దీనికి ఉత్తరాన బ్రహ్మ, రుద్ర కుండాలు ఉన్నాయి. నాగేశ్వరదేవుని దృష్టి చేత పవిత్రమైన కృష్ణానది ఉత్తరవాహినిలో స్నానం చేసినవారికి పునర్జన్మ ఉండదు.

ఈ గ్రామంలోనే విష్ణుతీర్థ యతీంద్రుడు అనే మహానుభావుడు దుర్గా, నాగేశ్వర, వేణుగోపాలస్వామి ఆలయాలకు మధ్య ఆంజనేయ స్వామి ఆలయాన్ని ప్రతిష్ఠించినట్టు చెబుతారు.

ఏమైనప్పటికీ కదళీపురం కదలిపురిగా చరిత్రలో నిలిచిపోయింది. పెదకళ్ళేపల్లి, జనంనోట కదళిపురం లేదా, కదలిపురం అయిందేమో! లేదా, కదలికి (అనగా సముద్రం) కడ (భాగాన అంటే చివర అనగా భూభాగానికి చివర ఉన్నందువల్ల) కదళిపురి కాస్త కడళిపురి అయిందేమో! తెలియదు. అయితే క్షేత్ర పురాణం ప్రకారం చూస్తే కర్కోటక క్షేత్రంగా కూడా స్థిరపడిపోయింది. దీనికి తగినట్టు అక్కడ కర్కోటక స్తంభం ఉంది దీన్ని సత్యస్తంభం అని కూడా అంటారు.

ఇప్పుడు ఆలయం ఉన్న భాగమే జనమేజయుడు సర్పయాగం చేసిన స్థలమని స్థానికులు అంటారు. అలా అనడానికి ఆధారాలు లేకపోలేదు. క్షేత్ర రూపుడు, క్షేత్ర స్థాపకుడు అయిన కర్కోటకుడు ఈ శిలారూపంలో ప్రతిష్ఠితుడయ్యాడు. కనుక కర్కోటక స్తంభం అన్నారు.

పుష్పగిరి మఠసాంత్తానికులైన సోమశివాచార్యులు నాగేశ్వరా లయాన్ని ఉద్ధరించారు. ఆలయం ఆవరణలోనే సోమశివాచార్యుల విగ్రహం ఉంది. దానికింద ఉన్న శాసనం ఇలా పేర్కొంటున్నది. "స్వస్తిశ్రీ శ్రీ మన్మహామండలేశ్వర కాకతీయ్య కుమార రుద్రదేవ మహా రాజులు ప్రిథివీ రాజ్యము సేయంగాను శ్రీమత్పుష్పగిరి మఠ సాంత్తానికులైన శ్రీమత్సోమశివాచార్యులు జనమేజయ సర్పయాగ స్థానమందు అనంత, వాసుక, తక్షక, కర్కోటక మహా నాగ కుమారుల చేత సుప్రతిష్ఠిత దివ్యలింగమైన కదలుపురి నాగేశ్వర శ్రీమన్మహాదేవరకు శకవర్షంబులు 1214 అగు నేటి నందన సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి గురువారంనాడు ఈ గుడి కట్టించినారు."

జాగ్రత్తగా గమనించినవారికి ఇక్కడ ఒక విచిత్రం కనిపిస్తుంది. ఈ శాసనం, సోమశివాచార్యుల విగ్రహం ఒకే కాలం నాటిది కాదేమో! విగ్రహం చూస్తే ప్రాచీనమైనది. విన్యాసం కూడా కాకతీయమే! కానీ, శిల్పం కింద శాసన భాష చూస్తే ఖచ్చితంగా కాకతీయుల కాలం నాటిది కాదు. అనంతర కాలం నాటిదనిపిస్తుంది. ఇలాంటి శాసనాలు ఆంధ్రదేశంలో చాలా కనిపిస్తాయి. చారిత్రిక ప్రయోజనాలు ఆశించిన వారు కొన్ని తమాషాలు చేస్తూ ఉంటారు. అలాంటి వాటిలో ఇది

ఒకటేమో! ఎందువల్లనంటే సోమశివాచార్యుల విగ్రహం క్రింద ఈ వాక్యాలు ఉన్నాయి. "వీరు శ్రీనాగేశ్వర శ్రీ మన్మహాదేవరకు ఈ గుడి కట్టించి, ఈ స్థానమేలిన సోమశివాచార్యులు" అని ఉంది. భాషగానీ, అక్షరాల విన్యాసం గానీ ఆధునికమైనవి కాకపోయినా అంత ప్రాచీనం కాదు.

అయినప్పటికీ సోమశివాచార్యుల ప్రమేయం పెదకళ్లేపల్లిలో లేదనడానికి వీలులేదు.

విజయవాడ సమీపంలోని ఉండవల్లి గుహల ప్రవేశానికి ముందు మూడు శైవాచార్యుల విగ్రహాలు ఉన్నాయి. అందులో ఒక విగ్రహం పెదకళ్లేపల్లిలోని సోమశివాచార్యుల విగ్రహాన్ని పోలివుంది. మరి ఉండవల్లి గోళకీ మఠం నెలకొన్న మల్కాపురం సమీపంలో ఉంది. ఉండవల్లికి సమీపాన గల పెనుమూక గ్రామంలో, ఎల్లారమ్మ గూడుగా చెప్పబడుచున్న చోట కుడి ప్రక్కన సుమారు పది అంగుళాల ఎత్తులో సపత్నీకమైన ఒక శైవాచార్య ప్రతిమ ఉంది.

కర్కోటక స్తంభం అనగానే ఈ కర్కోటకుడు ఎవరా అని ఆశ్చర్యం కలగడం సహజం. స్థలపురాణాన్ని బట్టిగానీ, శాసనాలను బట్టిగాని జనమేజయుడు సర్పయాగం చేసింది నాగేశ్వరస్వామి ఆలయం నెలకొన్న చోట అని అనిపిస్తుంది. కర్కోటకుడు అనేది ఒక సర్పజాతి. పరీక్షిన్మహారాజు సర్పజాతిని నాశనం చేయడానికి తలపెట్టిన యాగం ఇక్కడ జరిగినట్టు అనుశ్రుతం. పూర్వం పెదకళ్లేపల్లి గ్రామవాసులు ఎలాంటి సర్పభయం లేకుండా ఉండేవాళ్లని చెబుతారు. కర్కోటకుని మహిమగా చెబుతారు. ఏమైనా గానీ ఈ స్తంభాన్నే సత్యస్తంభం అని కూడా అంటారు.

'మాటకు ప్రాణము సత్యము' అన్నది ప్రధాన జీవన సూత్రంగా సమాజం భావించిన రోజుల్లో ఆ సత్య స్తంభానికి ప్రాముఖ్యం బాగా ఉండేది. గ్రామంలో ఏ వివాదం వచ్చినా సత్యస్తంభం దగ్గర పరిష్కరించుకొనేవాళ్ళు. ఆ స్తంభం దగ్గర ఎవ్వరూ అసత్యం చెప్పలేరని జనం నమ్మకం. స్తంభం చుట్టూ ప్రదక్షిణం చేసి నిలబడితే నోటి నుంచి అనృతం రాదని నమ్మేవాళ్ళు. ఒకవేళ ఎవరైనా అబద్ధం చెబితే వెంటనే అతడికి, అతడి కుటుంబానికి కీడు జరుగుతుందని విశ్వాసం.

ఒకప్పుడు ఇద్దరు వర్తకుల మధ్య ఏదో వివాదం వచ్చింది. పరిష్కారం కోసం గ్రామ పెద్దల సమక్షంలో ఉభయ పక్షాలు సత్యస్తంభం దగ్గర కలుసుకొన్నారు. వారిద్దరిలో ఒకడికి ఒక విపరీతమైన ఆలోచన వచ్చింది. 'ఈ స్తంభం కేవలం రాయి. అసత్యమే పలికితే ఏమవుతుంది?' అనుకొని ప్రదక్షిణం చేసి అబద్ధమే చెప్పాడట. వెంటనే ఆ స్తంభం పైభాగం సగం విరిగి అతడి తలపై పడింది. అతడు అక్కడికక్కడే తలపగిలి చనిపోయాడని అంటారు. ఈ కథను క్షేత్ర మహాత్యంగా చెబుతారు. ఏమైనప్పటికీ ఆ స్తంభం ఇప్పుడు సగం విరిగినట్లు కనిపిస్తుంది. క్షేత్రం మహాత్యం తరతరాలుగా విని ఉన్నారు. కనుక సమాజంలో ఆ మహాత్యం స్థిరపడిపోయింది. యాత్రికులు ముందుగా కర్కోటకుని సేవించిన తరువాతనే స్వామిని పూజిస్తారు.

విచిత్రమేమంటే ఆ స్తంభం మీద బౌద్ధమత చిహ్నాలైన ధర్మచక్రం, పద్మం, ఇంకా ఏవేవో ఉన్నాయి. దీనిబట్టి పెద్దకళ్ళేపల్లి కూడా ఒకప్పుడు బౌద్ధ క్షేత్రం కావచ్చుననడానికి వీలు ఉన్నది. అక్కడకు పాతిక కిలోమీటర్ల దూరాన ఘంటసాల, పన్నెండు కిలోమీటర్ల దూరాన చల్లపల్లి, ప్రక్కనే లక్ష్మీపురం ఉన్నాయి. అన్నట్టు శ్రీకాకుళం కూడా బౌద్ధక్షేత్రమే!

బుద్ధుడు జ్ఞానోదయమై కళ్ళు తెరచిన వెంటనే తొలిసారిగా అయిదుగురు యతులను దర్శించాడు. వారిలో ఇద్దరు ఆంధ్రులు. ఇది వేరే విషయం. తాను జ్ఞానోదయంలో దర్శించిన నాలుగు సత్యాలను ఆ యతి పంచకానికి బోధించాడు. ఆ నాలుగు సత్యాలే బౌద్ధమత సారం. వాటిని చతురార్య సత్యాలని అంటారు. ఈ లోకంలో దుఃఖానికి కారణమేమిటి? వాటిని ఎలా నిరోధించాలన్నదే ఆర్య సత్యాలసారం ఇది :

దుఃఖానికి సంబంధించిన ఆర్య సత్యమిది. జన్మ దుఃఖం, మరణం దుఃఖం ప్రియావియోగం దుఃఖం, అప్రియ ప్రాప్తం దుఃఖం. వీటినే పంచ స్కంధాలని అంటారు. బౌద్ధ పరిభాషలో చెప్పాలంటే రూపం, వేదన, సంజ్ఞ, సంస్కారం, విజ్ఞానం. ఈ అయిదింటిలో పడిపోయి మనిషి వేదనాకులితుడై జీవితాన్ని దుఃఖభాజనం చేసుకొంటాడు.

దుఃఖ హేతువులకు సంబంధించిన ఆర్య సత్యమిది : సుఖాపేక్ష, కామవాసనాభూయిష్టమైన తృష్ణ, ఆశ, భయం, క్రోధం, ఇవి దుఃఖ కారణాలు.

దుఃఖోపశమనానికి సంబంధించిన ఆర్యసత్యమిది : వాంఛల నుంచి విముక్తి సాధించి తృష్ణారాహిత్యాన్ని పొందడమే దుఖోపశమనం.

దుఃఖోపశమనానికి సంబంధించిన ఆర్యసత్యమిది : అష్టాంగ మార్గం (దృష్టి, సంకల్పం, వాక్కు, జీవనం, కృషి, స్మృతి వీటన్నింటి లోను సమ్యగ్ పద్ధతి పాటించడం! అంటే బాలెన్స్‌లో ఉండడం)

ఈ చతురార్య సత్యాలకు సంకేతాలు ఉన్నాయి. వాటిని సూచిస్తూ పూర్ణ వికసిత కమలాలు, ధర్మ చక్రం... ఇంకా అనేకం ఉంటాయి. ఈ సంకేతాలన్నీ బౌద్ధులు తమ స్తూపాల్లోను, స్తంభాల్లోను చూపిస్తారు. అలాంటి సత్యస్తంభమే పెద్దకళ్ళేపల్లిలో మనకు కానవచ్చే సత్య స్తంభం. అశోకుడు తాను స్వీకరించిన బౌద్ధ మతాన్ని వ్యాపింపచేయడం కోసం అనేక ప్రాంతాల్లో స్తంభాలు ప్రతిష్ఠించాడు. పెద్దకళ్లేపల్లిలో కానవచ్చే కర్కోటక స్తంభం లేదా సత్యస్తంభం అశోకుడు కాలం నాటిది కాకపోయినా బౌద్ధ మతావలంబకులు అత్యంత పవిత్రంగా భావించే స్తంభం అది.

మరో విశేషమేమంటే సత్యస్తంభం పైన కనిపించే సంకేతాలు ఘంటసాలలో లభ్యమైన ధర్మచక్రం తదితర సంకేతాలకు పోలినవి. దీనిని బట్టి పెద్దకళ్ళేపల్లి ఖచ్చితంగా బౌద్ధమతంతో ప్రభావితమైన గ్రామమనవచ్చు. మునుముందు ఏమైనా విశేషాలు బయటపడే అవకాశాలు ఉన్నాయి. కాలమే తీర్పరి కదా!

కాలంచేసే వింతలు విడ్డూరాలకు అంతులేదు. ఎందువల్లనంటే కాలంలో కలసిపోయేవే అన్నీను. మళ్ళీ అన్నీ కాలంలోంచే జనిస్తాయి. నాగేశ్వరస్వామి ఆలయాన్ని సోమశివాచార్యులు ఉద్ధరించారని శాసనం సంగతి చెప్పుకొన్నాం. అయితే అనంతర కాలంలో దేవరకోట సంస్థానాధిపతులు ఈ ఆలయానికి పారంపర్య ధర్మకర్తలు కనుక 1791లో కోదండరామన్న ప్రభువు మరణించిన తరువాత 1795లో రామన్న ప్రభువు మూడవ కుమారుడు రాజా నాగేశ్వర నాయుడు (పెదన పరగణా అధిపతి) నాగేశ్వరస్వామి ఆలయానికి గోపురం, ప్రాకారం కట్టించారు. ఇందుకు సంబంధించిన సంస్కృత శాసనం గోపురం లోతట్టున పడమటి దిక్కున ఉన్నది. దీనిని లోకల్ రికార్డ్స్ ఏడవ సంపుటంలో ప్రభుత్వం వ్రాసి ఉంచింది. ఆ శాసనం వివరం:

'యార్లగడ్డవారి వంశమనేటి పాల సముద్రమందు పూర్ణ చంద్రుడై ఉద్భవించిన రాజా నాగేశ్వరనాయుడు స్వభక్త్యతిశయంచేత, శ్రీ అగస్త్యేశ్వర స్వామి వారి సంపూర్ణ అనుగ్రహం సంపాదించుకొని, ఐశ్వర్యం సంపాదించుకొని భూలోకంలో దక్షిణ కాశి అనిపించుకొన్న కళ్ళేపల్లి దివ్య క్షేత్రమందు శ్రీ నాగేశ్వరస్వామి ఆలయానికి పూర్వభాగముందు స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు 1795 ఆగు నేటి వర్తమాన వ్యావహారిక చాంద్రమాన రాక్షస నామ సంవత్సరం మాఘశుద్ధ విదియ వరకు, పూర్వమందు బ్రహ్మదేవుడు సకల బ్రహ్మాండ స్థితి నిమిత్తం మేరువు నిర్మాణం చేసినట్టుగా ఆచంద్రార్క స్థాయిగా అత్యున్నత గోపుర నిర్మాణం చేయించినారు.

తరువాత మరో శ్లోకం ఉత్ప్రేక్షలతో కూడినది. పైన అడుగున పగ్గాలు, బసవన్నలు, యేనుగుల బొమ్మలు ఉన్నాయి.

సోమశివాచార్యులు నిర్మించిన ఆలయం శిధిలం కాగా 490 సంవత్సరాల తరువాత క్రీస్తు శకం 1782లో యార్లగడ్డ కోదండ రామన్న దేశాయి (దేశాయ్ అనేది బిరుదు) ఆలయాన్ని జీర్ణోద్ధరణ చేసినట్టు సంస్కృత శాసనం ఉంది. 1746 లో కోదండరామన్న ప్రభువు దేవరకోట సంస్థానాధిపత్యం వహించి ఫ్రెంచ్ వారి నుంచి చిట్టిగూడురు, ఆకులమన్నాడు, దివిసీమలోని ఆరు లంకలను పొందుతున్నట్టు ఫర్మానా తీసుకొన్నారు. శ్రీకాకుళంలోని కాకుళేశ్వర స్వామి ఆలయానికి, పెదముక్తేవి గ్రామంలో శ్రీ లక్ష్మీపతి ఆలయానికి దానాలు చేశారు.

సంస్థానానికి పడమటివైపున కృష్ణానది వల్ల సంస్థానం బాగా దెబ్బతినేది. వరదల వల్ల వాటిల్లుతున్న నష్టాలను నివారించడానికి నదికి తూర్పు వైపున కరకట్టపోయించాడు. ఆ ప్రాంత స్మరణీయుడు. కాలువలు, తటాకాలు నిర్మించాడు. గుంటూరు జిల్లా కూచిపూడి గ్రామంలో పెద్ద చెరువు తవ్వించాడు.

చల్లపల్లి ప్రభువులకు, కళ్ళేపల్లి క్షేత్రానికి ఎంతో ప్రాణ సంబంధం ఉన్నది. ఈ సందర్భంగా ఆసక్తిదాయకమైన ఒక ఉదంతం ముచ్చటించుకొనక తప్పదు. ఈ వంశానికి ఇలవేల్పు పెదకళ్ళేపల్లి దుర్గామాత. తమ కష్టాలు, సుఖాలు నివేదించుకొనేవారు ఆ వంశీకులు. సర్వార్థసిద్ధ ప్రద అయిన దుర్గ గురించి రసవత్తరమైన కథ ఉన్నది.

దేవరకోట సంస్థానాన్ని 1792 నుంచి 1819 వరకు రాజా అంకినీడు ప్రసాద్ పరిపాలించాడు. ఆయన ఒక హత్య చేసినట్టు ఆరోపణ వచ్చింది. (ఇది మర్యాద గల కుటుంబానికి సంబంధించిన నిజానిజాలు ఏమిటో తెలియని సంఘటన కనుక ఆ సంఘటన ప్రస్తావన వదలివేద్దాం)

మద్రాసు హైకోర్టులో కేసు విచారణకు వచ్చింది. తీర్పు దశకు వచ్చింది. అంకినీడు ప్రసాద్ నిర్దోషి. అయినా ఏమి చెయ్యలేని పరిస్థితి, చేయగలిగింది లేక అంకన్న ప్రభువు (తన పేరు అంకన్న గానే ఆయన చెప్పుకొన్నాడు) పెదకళ్ళేపల్లి దుర్గాదేవి ఆలయం ఎదుట ఒంటి కాలి మీద ఏడు రోజులు నిలబడి ఆర్తితో అమ్మవారిని శరణు వేడాడట! కోర్టులో తీర్పు చెప్పే సమయంలో తెలుగు తెలియని ఆ బ్రిటీష్ న్యాయమూర్తికి మగతలాగా వచ్చిందట. న్యాయమూర్తి తన తీర్పులో ఈ విషయం ప్రస్తావించి తీర్పు చెప్పాడట.

గ్రంథ విస్తరణ భీతి ఉన్నప్పటికీ చరిత్ర పరిశోధకుల కోసం, ఆసక్తి గలవారి కోసం అంకన్న ప్రభువు దుర్గాదేవిని స్తుతిస్తూ చేసిన స్తోత్రం ఇవ్వక తప్పడం లేదు.

**అంబాస్తవం**

1. అంబా నిగనిగ మెరిసే విలసిలధారీ, నివశివపుత్రీ, నివ శివగాత్రీ, అఖిలత రూపీ, అమృతప్రతాపీ, అంబా, జగ దంబా, తల్లీ, చేపట్టు శాంభవీ, మాపాలి తల్లివే, మందారవల్లీ, వెలశూలధరీ, వందనమే శృంగారీ, హరినీలవేణీ, అది నీ మోహంపురాణీ.
2. హా! పరమేశ్వరీ అని తలచితిని, తాపత్రయమ్మున దరి చేరితిని, నీ పాదమునే గొలిచితిని, ఓ పద్మాక్షీ, ఉత్తమసాక్షీ, పరమోద్ధారీ, కేళీ విహారీ, సుందరరాణీ
3. జరుగు ననాథ్యం జగమించెను, కలిగెను పట్టుదీక్ష, కలిగి కొమారాగ్రే సంచారీ, పరమోద్ధారీ, పాపసంహారీ, కేళీవిహారీ, సుందరరాణీ.

4. తాం నితలం, ఫలమూల జననీ, లామాలాంచానని జగదంబా, అంబవిలంబా, కనకదుర్గాంబా, అంబా జగదంబా, నిట్టాడిపత్రి కోసిన విధమూ, తట్టను, బండను పూజించామూ.
5. నల్లరాతిని సేవించాము, నల్లే రాతివి కదలవే దుర్గా, యెన్నన్నా యేమనవేమే, నా మొరాలించగదవే, నా వంటి దీనుల గాయగదవే, అంబా, జగదంబా, చేపట్టు శాంభవీ.
6. ఏలా నీ శౌర్యం, ఏలా నీ ధైర్యం, ఏలా నీ వయలు, సొమ్ములు శిలకు శ్రింగారించేందుకు, సింహ్వాసనమున వేడుకనే కూర్చున్నావటవే, యెన్నన్నా యేమనవేమే, ఐదు పది బంగారపు పువ్వులు, నీ పాదంబునే బూజింతు, నీ పాదంబునే సేవింతు, ఓ పద్మాక్షీ, ఉత్తమ సాక్షీ, పరమోద్ధారీ, పాపసంహ్వారీ, కేళీవిహారీ, సుందరరాణీ.
7. ఏ తలాటాన నిన్ను గొలిచితినో, నా తలాటాన తీసివేతు, గుళ్లో శిలను పెళ్ళగింతు, దులాలకు పోటీపెడుదు, పచ్చడి నూరే బండలకేతు, ఉతుకు రాళ్ళకు వేతును నిన్ను, యెన్నన్నా యేమన మేమే, నా మొరాలకించవు గదవే.
8. మనుష్యులను మ్రింగే మహిషాసురమర్ధనివి నమ్మగలేదు. దానిని నే గొలవగలేదు, అంబవనుచు కొలిస్తినే నిన్ను, నమ్మినవారిని కాయవె దుర్గా, దండం పెడితే గండంకాయి.
9. అందమైన చంద్రహార, ఆభరణాల పూజితురాలవే, సంపతిమించిన లక్ష్మీవె నీవు, నిన్ను దలచితె అన్నము లేదు. నిన్ను దలచితె వస్త్రము లేదు. నిన్ను గొలిచితె భాగ్యము లేదు, నిన్ను దలచితె బ్రహ్మహత్య వచ్చు, నిన్ను దలచితె గోహత్య వచ్చు, (లీల దృశ్యం) నిన్ను దలచితె అన్నం వచ్చు. నిన్ను దలచితె వస్త్రం వచ్చు, నిన్ను దలచితె భాగ్యం వచ్చు, నిన్ను దలచితె సంపదగలుగు, నిన్ను దలచితె బ్రహ్మ హత్య పోవును, నిన్ను దలచితె గోహత్య పోవును.
10. శూలంబట్టని శౌర్యంబేల, దీనులగాయని దిక్కెందుకే, యెన్నన్నా యేమనవేమే, అయిదు దినములు అయినను నేను, అన్నాహారము నిద్రాయెరుగను, కాళ్లు తీసుకువచ్చెను నాకు, ఔను, కాదనవేమే దుర్గా.
11. నేచేతి ఖడ్గాన నిన్నుపొడిచి, తరువాతనే పొడుచుకొందు, దూషణ భూషణ చేయుచుండగ, యెవడేయనుచును దుర్గా కన్నిప్పిచూచెనె కనకదుర్గాంబ, కలకలనవ్వుచు చిలకలకొలికి.
12. ఏలర నీకింత ఆపద; మెచ్చితిరా యిచ్చితి వరము, కొదవలేదు పదరా యనెను, దుర్గదేవి వస్తుందనుచు, తన నగలంతా శ్రింగారించెను, మిధునానగరెల్లను, పందిళ్ళేసి, మాణిక్య సింహ్వాసనమున, నవరత్నంబుల దీపము వెలగగ, రావే రావే దుర్గా నీవు, రావే రావే జననీ నీవు, రమ్మన్నారావు గదవే.
13. సింహ్వాసనమున దిగ్గునలేచెను, వన్నె వన్నె చీరలుగట్టెను, వయలు వయలు సొమ్ములు పెట్టెను, మదుపు రెవికె మగువరొ తొడిగెను, రాగిడి చంద్రవంక రంభా వుంచెను, సొరుకమ్ములు ఫణితిరొవుంచెను, కెంపులు చెక్కిన జంపులు వుంచెను, సుండికమ్మలు ఫణితిరొవుంచెను, కంబామమ్ములు కాంతరొ వుంచెను, పాపడమ్ములు ఫణితిరొ వుంచెను, అందెలు గజ్జెలు అతివరొ వుంచెను మట్టెలు పెళ్లాళ్లు మగువరొ వుంచెను, పచ్చలు చెక్కిన బేసరివుంచెను.
14. పొన్నంపు పొగడాల ఆశ్వమునెక్కి, పచ్చని బెత్తముచేబూని, ఘల్లు ఘల్లున నడవగదుర్గా, ఎక్కడికే ఓ దుర్గానీవు, అని చెలికత్తెలు అడగగనపుడు వినితాదుర్గ చెప్పెను నపుడు శివుని పువ్వులు మడువగ నపుడు, శివుని పాదము వొత్తగనపుడు, శివునితో కేళీపొందగపోదు
15. అక్కడికిరావే దుర్గానీవు, త్వరగారావేనీవు, కాలము చేరువయ్యే, వినితా దుర్గా చెప్పగనపుడు, భయములేదు పదరాయనెను, కొదవాలేదుపదరా, గజ్జెలుకట్టుకుని ముందర నడిచెను, వెళ్ళెను వారి మేడలయందు, వెళ్ళెను వారి మిద్దెలయందు నిలచెను వారి సభయందున
16. ఎందుకర నన్ను బిలచితివి, చూడడానికి పిలిపించితిమి, శనివారమ్ము ఆరు ఘడియలు ఊరికి శెలవు యిచ్చినారు, తొమ్మండుగురు దొరలలోను, భార్యను చంపిన దొరయే జనెను, భార్యను చంపిన దొర యితడనిరి, (ఆర్డరు), ఆడది చస్తే మళ్ళీ వచ్చును, యింత చక్కని ధరుణుని చంపితె, భాగ్యములేల, పదవులేల, అని శెలవిచ్చి, గుర్రమునెక్కెను, (అదృశ్యము), తల్లెందుకె, తోడెందుకె, నీ వంటి దైవము యుండగను, నమ్మగ కొలిపిస్తిని అమ్మరొ నిన్ను, కాస్తివె నన్ను కనకదుర్గాంబి, శివుడు పార్వతి దుర్గాదేవికి, నిత్య పవళింపులు చేసినవారు, యార్లగడ్డవారి వంశోద్ధకుడు, అంకన్న కట్టిన దుర్గాస్తవము, ఎవరు పాడిన ఎవరు విన్న భాగ్యము కల్గును, గల్గును పదవులు గల్గును.

(ఈ స్తోత్రం దుర్గా నాగేశ్వర స్వామి ఆలయం అర్చకులు ఘంటసాల వెంకటసుబ్బయ్య గారి వద్ద గల వ్రాత ప్రతిని చూసి, ఆ గ్రామ వాసులు గొట్టిపాటి వెంకటనరసయ్యగారు 'శ్రీమత్కదళీపు మహాత్యము' అనే తమ గ్రంథంలో ఉటంకించారు. అయితే, దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు 'చాటువులు' అనే పేరుతో వ్రాసిన గ్రంథంలో వారు సేకరించిన ఈ స్తోత్రం కూడా ఉంది. దానికీ పాఠబేధాలు ఉన్నాయి. అయితే దివి సీమవాసి కనుక గొట్టిపాటి వారి పాఠాన్నే తీసుకొన్నాను. ఈ స్తోత్రం 18వ శతాబ్దపు తెలుగు భాష, పైగా అంకన్న (అంకినీడు

ప్రసాద్‌గారు) కవి కాదు. ఆయన కేవలం భక్తుడు. కవితావైశారద్యం లేని సహజ భక్తి, తప్పు ఒప్పులు చూడడం తగదు. ఎంత పండితుడు కాకపోయినా అద్భుతమైన రీతిలో నిందాస్తుతి. ఇది తెలుగులో అపూర్వమైన ప్రయోగ వైచిత్రి)

స్థలపురాణ పండితులు రకరకాల కథలు చెప్పడం పరిపాటే! అలాగే ఈ ఉదంతం విషయంలో కూడ ఉంది. ఇక తీర్పు చెప్పడానికి ఏడు రోజులు ముందు నుంచి అమ్మవారి ఆలయంలో అంకన్నగారు ఒంటి కాలిమీద ఏడు రోజులు నిలబడి ధ్యానం చేశారనీ, ఈ తపస్సు ఫలించి కోర్టులో జడ్జిగారికి స్వప్నంలాగా వచ్చి అమ్మవారు ప్రత్యక్షమై సత్యం చెప్పిందని ఒక కథ. ఆయన దోషి కాదు, నిర్దోషి అని తేలిన తరువాత భక్తి పారవశ్యంతో ఈ స్తోత్రం చేశాడని మరో కథనం. ఏమైనా విజ్ఞులైన పాఠకులు ఈ స్తోత్రం చదివి ఏ అభిప్రాయం ఏర్పరచుకుంటారో తెలియదు. ఈ చారిత్రక వాస్తవం (ఉరిశిక్ష పడడం, నిర్దోషిగా తీర్పు రావడం) పై వ్యాఖ్యానం అక్కరలేదు. ఉరిశిక్ష పడిన అధికారులు ఖైదీని ఏడు రోజులపాటు ఎలా కళ్ళేపల్లి గుడికి పంపించారని ప్రశ్నించుతూ 1937 ఆగష్టు 24వ తేదీ 'ఆంధ్ర పత్రిక'లో ఒక వ్యాసం కూడా వ్రాశారు. ఆంధ్రదేశంలో ప్రశ్నించనిదేది? వివాదం కానిదేమున్నది కనుక!

## కర్కోటక సందేశం

పురాణాన్ని చరిత్రను వింగడించడం కష్టమని ఇంతకు ముందు చెప్పుకొన్నాం. పురాణంలో చెప్పిన సర్వస్వం స్వీకారయోగ్యం కాదన్న కాళిదాస సూక్తి అష్టాదశ పురాణాలకు సంబంధించినది కాకపోవచ్చు. అయినప్పటికీ పురాణం అంటే ఏమిటో చూద్దాం. 'పాతదే... కానీ కొత్తదిగా భాసించేది' అని శాస్త్రకారులు వ్యాఖ్యానిస్తారు.

'పురాణమిత్యేవ ననాదు సర్వం...' అన్న కాళిదాసు మాటను 'పుర నవ ఇతి పురాణం' అన్న వ్యాఖ్యానాన్ని (పాతదే కానీ కొత్తగా వుండేది) కలిపి చదువుకొంటే పురాణాల వల్ల మనం ఎంత ప్రగతినైనా సాధించవచ్చును కదా! అసలు ఈ దృక్పథమే లేకుండా పురాణాన్ని పురాణంగాను, చరిత్రను చరిత్రగాను పరిశీలించడంవల్ల పురాణంగా చెప్పబడుతున్న కథలలో అనేకానేక చారిత్రక విశేషాలు పైకి రాకుండా మరుగున పడిపోతాయి. నీరక్షీర న్యాయంగా చదవగలిగినప్పుడు వేటి కవిగా బోధపడతాయి. పాతదంతా పురాణమేనన్న అమాయకత్వంతో గానీ, తమకు సంబంధించిన గతం కనుక కొనసాగితే తమకు గణ్యత లభిస్తుందన్న అతి తెలివితోగానీ కొందరు గతాన్ని పురాణమయం చేసిన కారణంగా ఈ గందరగోళం ఏర్పడింది.

ఏ గ్రామ చరిత్ర చూచినా, ఏ కైఫియతు చదివినా చరిత్ర, పురాణం కలిసిపోయి కనిపిస్తాయి.

ఈ రెండు జిల్లాలలో ఏ గ్రామ కైఫియతు చూసినా రెండు ప్రధాన పాత్రలు వస్తాయి. ఒక పాత్ర విష్ణువర్ధన మహారాజు. రెండు అగస్త్య మహర్షి ఈ ఇద్దరు 'పురాణపురుషులకు' ఆ గ్రామ చరిత్రతో ఎంత వరకు ప్రమేయం ఉన్నదో తెలియదు గానీ కొన్ని సందర్భాల్లో చారిత్రక పురుషులుగా, కొన్ని సందర్భాల్లో పురాణ పురుషులుగా సాక్షాత్కరిస్తారు. సముద్రాలను పుక్కిటపట్టిన అగస్త్యుడు కైఫియ్యత్తులలోని అగస్త్యుడు ఒకరు అవునో కాదో గాని ఒకరే అన్నట్టు గ్రామ చరిత్రలు చెబుతున్నాయి.

విష్ణువర్ధన మహారాజు ఈ పేరుతో ఎంతో మంది మహారాజులు ఉన్నారు. 'ప్రిథివీ రాజ్యం చేయుచుండగా...' అని కైఫియతులు చెప్పిన విష్ణువర్ధన మహారాజు ఎవరో తెలియదు. ఆయన 'చతరుదధివేలా యుతంబగు ఈ ధరామండలాన్ని' పాలించినట్టుగా కనిపిస్తుంది. నిజానికి ధరా మండలాన్ని పాలించే సత్తా భగవంతుడికి మాత్రమే ఉన్నదిగానీ మానవ మాత్రులకు లేదు. ఉండడానికి వీలులేదు. ఏ విష్ణువర్ధన మహారాజు కూడాఅంత గొప్పవాడు కాదు 'ఆత్మాయత్తమైన' సమస్తాశాంతమాతంగ మర్యాదాలంకృతమైన భూవలయం' ఒక మనిషికి చెందడానికి వీలులేదు.

శాసన రచయితలు ప్రభు భక్తులు. ఏలినవారిని ప్రశంసించడానికే తాము పుట్టినట్టుగా శాసనాలు వ్రాశారు. శ్రీనాధుడే కావచ్చు, నన్న పార్యుడే కావచ్చు. ఎవరైనా ప్రభుసన్నుతంగానే వ్రాశారు. బందరు, అవనిగడ్డ మధ్య దూరం 40 కిలోమీటర్లు. చరిత్రలో ఒకానొక దశలో ఈ 40 కిలోమీటర్ల మధ్య మూడు రాజ్యాలుండేవి. అసలు బందరులోనే నాలుగు రాజ్యాలు ఉండేవి. అలాంటి చోటా రాజ్యాలను సైతం మహారాజ్యాలుగా తెగ పొగడడం కనిపిస్తుంది. ప్రభుభక్తి పరాయణులైన శాసన రచయితలు తమ కవితాశక్తితో తామాశ్ర యించిన ప్రభువులను ఆయన రాజ్యాన్ని పొగడ్తలతో ముంచెత్తి ఉత్ప్రేక్షించారు.

చారిత్రక దృష్టితో చూస్తే ఒక యాభై సంవత్సరాలు అటు ఇటుగా నేటి మోపిదేవి, పెదకళ్ళేపల్లి (ప్రస్తుతం చర్చలో వున్నవి కనుక... నిజానికైతే మొత్తం దివి ప్రాంతం అంతా) గ్రామాలు కాకతీయులకు సేనానిగా వున్న జాయప్ప ఏలుబడిలో వుండేవి. అంతకు ముందు యుద్ధమల్లుడి పాలనలో వుండేవనడం హేతబద్ధం, ప్రత్యక్షమైన ఆధారాలు కనిపించడం లేదు.

సర్వాన్ని పురాణోక్తం చెయ్యడం, సంస్కృతీకరించడం రాజు దైవాంశ సంభూతుడన్న దృక్పధంతో చేసే ప్రయత్నమే. అయినా వారి నిజాయతీని, చిత్తశుద్ధిని శంకించడం కాదు. అయితే వారి కథనా ల్లాంటివే మరికొన్ని ప్రాంతాల్లో కనిపించినప్పుడు ఏమను కోవాలి? ఆలోచించండి సీతమ్మ వారి పాదాలు ఎన్ని చోట్ల ఉన్నాయి? భీముడి

పాదాలు ఎన్ని చోట్ల కన్పిస్తాయి? సీతమ్మ వారి జడకుచ్చులు ఎన్ని ప్రాంతాల్లో ఉన్నాయి! అమె ఎన్నిచోట్ల బహిష్టు స్నానాలు చేసింది!

కాకతీయుల కాలంలోనే పుష్పగిరి మఠ సాంత్తానికులైన సోమ శివాచార్యులు క్రీస్తు శకం 1207లో పెదకళ్ళేపల్లిలో నెలకొల్పిన ఆదిశైవ పీఠం, వేయించిన శాసనం. ఉద్ధరించిన నాగేశ్వరస్వామి ఆలయంలో కూడా చరిత్ర, పురాణ మిశ్రమ వారసత్వం కనిపిస్తుంది.

ముందుగా పెద్దకళ్ళేపల్లిలోని దుర్గానాగేశ్వరస్వామి వారి ఆలయాన్నే చూద్దాం. అసలు ఆలయం చుట్టూ పురాణం ఆవరించి ఉంది. కానీ కొందరు చరిత్రకారుల అభిప్రాయం ప్రకారం ఆ స్థల పురాణం అంతా చరిత్రలో భాగమే. ఆ విషయం పరిశీలించడానికి ముందు నాగేశ్వరస్వామి ఆలయం గురించి కథితమైన చరిత్ర చూదాం.

ఈ ఆలయాన్ని సోమశివాచార్యులనే ఆదిశైవ మఠాధిపతి ఉద్ధరించారని శాసనం ఉంది. అక్కడే, పెద్దకళ్ళేపల్లి ఆలయంలోనే ఉంది.

సోమశివాచార్యుల వారి మఠం, ఆ మఠ విశేషాలు తెలుసుకొంటే దివిసీమ చరిత్రలో ఒక మహోజ్వల ఘట్టం తెలుస్తుంది. సోమ శివాచార్యులు (ఆయనను సోమశంభువు లేదా సోమశివుడు అని కూడా అంటారు) ఆది శైవ సంప్రదాయంలోని ఆచార్య పరంపరలోని దేశికోత్తములు.

ఆదిశైవం అనగానే దశవిధ శైవాలు ప్రస్తావనకు రాకతప్పదు. కాలక్రమంలో ఆదిశైవం, అద్వైతం (స్మార్త సంప్రదాయం) దగ్గరకు చేరడానికి కారణం, క్రమంగా ఆది శైవం బలం తగ్గిపోవడమే ఈ రెండు సంప్రదాయాల మధ్య చాలా స్వల్పమైన వ్యత్యాసాలు ఉన్నాయి. ఈ సంలీనాలు ఏ మత, కుల వర్గాల్లోనైనా కనిపిస్తాయి. అస్తిత్వం కోల్పోయే సమయంలో సమీప శాఖల్లో కలసిపోవడం అన్నది అనాదిగా జరుగుతున్నదే!

ఆదిశైవం మహోజ్వలంగా వృద్ధి చెందిన రోజుల్లో, అనగా క్రీస్తు శకం 10 నుంచి 12వ శతాబ్దం వరకు, ముఖ్యంగా నేటి కృష్ణా, గుంటూరు జిల్లాల్లో ఈ మతాలు ఏర్పడ్డాయి. ఈ శైవ ప్రభేదం, ప్రభావం ఆంధ్రదేశం పై అపారంగా పడింది. ద్రవిడ దేశంలో, అంటే నేటి కేరళ, తమిళనాడు తదితర ప్రాంతాల్లో దాక్షిణాత్యశైవం అతి ప్రాక్తనం ఆదిశైవంలోని గోళకీ సంప్రదాయం దాక్షిణాత్య శైవంలో మిళితమైపోయింది. ఈ సంలీనానికి దేవాలయ వ్యవస్థ, పదుగురాడు క్షేత్ర చరిత్ర, లేదా మహత్యం కూడా కారణం. అంతే కాదు రాచరిక వ్యవస్థ కూడా కారణమే! రాజుగారు ఏ పాట పాడితే తాబేదారులు కూడా అదే పాట పాడతారు కదా! రాజుగారు మతం మార్చితే కవి పండితులు కూడా మతం మార్చుకొని గ్రంథాలు వ్రాస్తారు. పామరులు అనుసరిస్తారు. ఈ విధంగా ఏ కొత్త సాంప్రదాయానికైనా పోషణ సహజంగానే లభిస్తుంది. రాజరాజు, రాజేంద్రచోళుడు, వారి గురువులైన ఈశాన శివుడు, సర్వశివుడు ఈ విధంగా పరిణామానికి కారణమయ్యారు.

ఆచార్య ఈశాన శివదేవుడు శ్రీ కృష్ణకర్ణామృతం వ్రాసిన లీలాశుకులకు అంతే వాసి. తన సంప్రదాయాన్ని 'ఈశాన శివదేవ పద్ధతి' గా ఈశాన శివదేవుడు నామకరణం చేశాడు. ప్రభేదాలన్నీ దక్షిణాదిలో మొదలయ్యాయి. ఎలాగంటే..

రాజరాజు మతసంబంధి కాదు. రాజ్య సంబంధి. ఆయన రాజ్య విస్తరణ కాంక్షతో తన సేనలను ఉత్తరాదికి నడిపించాడు. క్రమంగా ఆయన రాజ్యం నేటి ఆంధ్రదేశం దాటి మధ్యప్రదేశ్ కూడా విస్తరించింది. చరిత్ర చూడండి ప్రాచీన చరిత్రలోనే కాదు వర్తమాన చరిత్రలో కూడ ప్రాబల్యం. కోసం పరుగులు పెట్టి పెట్టి అలసిపోయి, ఇక ఏమి సాధించాలన్న ప్రశ్న ఎదుర్కొన్న మహామహులు కనిపిస్తారు. జీగిషను విడనాడి జిజ్ఞాసతో బౌద్ధం పుచ్చుకొన్న అశోకచక్రవర్తి మనకు వెంటనే స్ఫురిస్తాడు. జయించాలన్న ఈర్శ్యతో ప్రారంభమైన యాత్ర 'ఇదంతా ఏమిటి?' అన్న జిజ్ఞాసతో ఆగిపోతుంది. కొందరిలో ఆ జిజ్ఞాస కొనసాగుతుంది. ఆ జిజ్ఞాసతోనే ఏ ఆచార్యుడినో ఆశ్రయిస్తారు. అందుకే 'శాంతమిదం ఆశ్రమపదం' అన్నారు. ఇక వారి జీవనసరళే మారిపోతుంది. మహారాజులైతే తమ కవిపండిత సమూహంతో తాము విశ్వసించిన మహనీయుల ప్రశస్తిని చాటేటట్టు చేస్తారు. గ్రంథాలు వ్రాయిస్తారు. తమ గురుదేవులకు ఆశ్రమాలు కట్టిస్తారు. ఆలయాలు కట్టిస్తారు. అగ్రహారాలు, మడిమాన్యాలు ఇస్తారు. తాము నిర్మించిన ఆలయాల్లో స్తోత్రాలు, స్వస్తివాచకాలకు కవిపండితులను వినియోగిస్తారు.

ఆలయాల్లో తేవార పద్ధతి. దేవహారం అన్నమాట నుంచి పుట్టిందే తేవారం. భగవానుడికి సమర్పించుకొనే దివ్య కవితాహారమే తేవారం. ఇది శైవ, వైష్ణవ సంప్రదాయాల్లో ఉంది. ఈ తేవారాలను అనునిత్యం ఆలయాల్లో సంకీర్తనం చేసే సంప్రదాయం మొదటి పరాంతకుని కాలం నుంచి ఉంది. క్రీస్తు శకం 907 నుంచి 954 వరకు చోళదేశాన్ని పాలించిన చోళచక్రవర్తి పరాంతకుడు. ఈయన రాజ్యం నెల్లూరు వరకు ఉండేది. ఈయన్నే పరాంతక చోలుడు అంటారు. ఆయన తరువాత రాజరాజు (985 నుంచి 1042) తన రాజ్యాన్ని ఉత్తరాన వేంగి (నేటి ఏలూరు సమీపాన పెదవేగి) వరకు విస్తరింపజేశాడు. అతని కుమారుడు మొదటి రాజేంద్ర చోళుడు బెంగాల్ వరకు సామ్రాజ్యాన్ని విస్తరింపజేశాడు. సహజంగానే ఈ దండయాత్రల వల్ల ప్రజాజీవనం తీవ్రమైన మార్పులకు గురైంది.

రాజేంద్ర చోళుడు దక్షిణ రాఢ దేశం వరకు అంటే నేటి జబల్పూర్ వరకు జరిపిన దండయాత్రల్లో తాను చూసిన శైవమత పద్ధతులకు

బాగా ప్రభావితుడయ్యాడు. ఆయన వెంట వున్న కవిగాయక వైతాళికులంతా సహజంగానే ప్రభావితులయ్యారు.

రాఢ దేశంలో గోళాకారంలో ఒక పర్వతం ఉన్నది. అక్కడ శైవ పీఠం ఉంది. అదే గోళకీ శైవ పీఠం తిరిగి దక్షిణాదికి బయలుదేరే టపుడు తనవెంట కొందరు శైవాచార్యులను తీసుకొని వచ్చాడు. ఆ విధంగా గోళకీ శైవం పురుడు పోసుకొన్నది. అప్పటికే దక్షిణాదిలో ఉన్న దాక్షిణాత్య శైవంలో గోళకీ శైవం మిళితమైపోయింది. అదే ఆదిశైవంగా స్థిరపడిపోయింది. అంటే ఆదిశైవ ప్రభేదమే గోళకీ శైవం.

ఆదిశైవ మతాచార్యులలో ఒకరైన సోమశివాచార్యులు పుష్పగిరి మత సాంత్వానికులు. ఆదిశైవం పుష్పగిరిలో కాలూనడానికి ముందు గానే పుష్పగిరి అద్వైత పీఠంగా సుప్రసిద్ధమైనది. పుష్పగిరి, శృంగేరి, ఆమ్నాయ పీఠానికి ముఖ్యమైన శాఖగా ప్రసిద్ధమైనది. సాక్షాత్తు ఆదిశంకరులే ప్రతిష్ఠించారు. మరి ఆదిశైవులు ఎప్పుడు అక్కడ మఠం వేశారోగానీ అసలు పీఠం తమదేనని అంటారు. ఇదంతా దాదాపు ఏడెనిమిది వందల సంవత్సరాల నాటి కథ. అంటే అప్పటికి కాకతీయులు వచ్చేశారు.

ఇక ఆచార్యపరంపరను అవలోకిద్దాం.

రాఢ దేశంలోని గోళకీ పర్వతం నుంచి దక్షిణాదికి వచ్చినవాడు సద్భావ శంభువు, గోళకీ మత ప్రతిష్ఠాపకుడు. ఆయన దూర్వాస మహర్షి పరంపరలోనివాడు. ఆయన తరువాత వచ్చినవాడు సోమశంభువు లేదా సోమశివాచార్యుడు. ఈయనే పుష్పగిరి మత సాంత్వానికుడు. కేవలం పీఠాధిపతిగా మాత్రమేగాక పీఠం అధికార పరిధిలోని ప్రాంతాలకు పరిపాలకుడు కూడా ఆయన 'ప్రజానాం పుణ్యపరిపాక వశాత్' జన్మించిన కారణజన్ముడని శైవసాహిత్యం చెబుతున్నది. అపర శివావతారమని ఆదిశైవులు విశ్వాసం. ఆయన సకలాగమ సింధుసేతువట, తన నామాంకితంగా 'సోమశంభు పద్ధతి'ని ప్రవేశపెట్టిన స్వతంత్రుడు.

ఆదిశైవుల్లో ముఖ్యంగా పుష్పగిరి మతసాంత్వానికుల పరిధిలోని ఆదిశైవులంతా సోమశంభు పద్ధతినే పాటిస్తారు. నేటికీ కృష్ణాజిల్లాలో (మన ప్రస్తుత చర్చ అంతా దివి ప్రాంతం కనుక కృష్ణాజిల్లా అని అంటున్నాం. నిజానికి ఆంధ్రదేశం అంతా అంటే తప్పుకాదు) ఆదిశైవులంతా సోమశంభు పద్ధతినే పాటిస్తారు. నేడు పూజారులు అనబడేవారంతా ఆదిశైవ సాంప్రదాయానికి చెందినవారు.

ఇప్పుడు ఎవరి సాంప్రదాయం ఎలా వున్నా దివి ప్రాంతంలో బుద్ధువారు, ఘంటసాలవారు, మేడిచర్లవారు, ఆ మాటకు వస్తే బ్రాహ్మణ కుటుంబాలన్నీ ఆదిశైవ సంప్రదాయానికి చెందినవే. కొందరు కాలక్రమంలో స్మార్త సంప్రదాయంలోకి వచ్చినవారు కూడా వున్నారు.

గోళకీ మత సాంప్రదాయం బహు చిత్రమైనది. ఈ సాంప్ర దాయంలో ఆచార్యపరంపర తమ మఠాలకు అధిపతులేకాదు. పాలకులు కూడా. ఎవరికీ పన్నులు చెల్లించవలసిన పనిలేదు. పైగా మతం కింద గల స్థిర 'చరాస్థులతో మఠాన్ని నడుపుకోవచ్చు. ఆ మఠం కోసం ప్రభువు సమకూర్చిన స్థిర చరాస్థుల అయివేజు నుంచి ఖర్చు చేసుకోవచ్చు.

సంగీత, నృత్య తదితర కళారూపాలు, సాముగరడీలు, విలువిద్య, పోరాట కళలు, వేదపాఠశాల నిర్వహణ, ఆరోగ్యశాలలు, శరణా లయాలు, సామాజిక ప్రయోజనం గల వివిధ అంశాలపై గోష్ఠి కార్య క్రమాలు నిర్వహించడం పీఠం లక్ష్యం. కార్యక్రమాల్లో సర్వ వర్ణాల వారు పాల్గొనవచ్చు. కుల వర్ణ వివక్షను దోషంగా పరిగణిస్తారు. ఆచారం వ్యక్తికి పరిమితం. ఆహార విహార వ్యవహారాల్లో మాత్రం తమ పద్ధతులకు కట్టుబడక తప్పదు.

గోళకీ మత సాంప్రదాయాలకు ప్రత్యక్ష సాక్ష్యం పలికేది మల్కాపుర శాసనం. విజయవాడ సమీపంలో కృష్ణానదీ తీరాన ఉండవల్లి గుహలకు పదిహేను కిలోమీటర్ల దూరాన రోడ్డు ప్రక్కన గల శాసనమే మల్కాపురం శాసనం. సుమారు ఎనిమిదిన్నర అడుగుల ఎత్తుగల నల్లశాణం రాయి. ఏకశిల, ఈ శాసనం గణపతి దేవుడు వేయించాడు. కాకతీయుల చరిత్రకు దర్పణం పడుతుంది. గోళకీ మత ప్రాదుర్భావం, గురుపరంపర వృత్తాంతాన్ని ఈ శాసనం విశదీకరిస్తుంది.

గణపతిదేవ చక్రవర్తి బోధగురువు విశ్వేశ్వర శివాచార్యుడు. అసలు ఆదిశైవ ఆచార్య పరంపర లోనివారెవరైనా శివద్విజులు, 12వ శతాబ్దం శాసనాల్లో ఆ కాలంలోని ఆచార్యుల పేర్లు, దీక్షానామాలు కనిపిస్తాయి. శివపదాంతాలైన ఆచార్యుల నామధేయాలు, శంభు శబ్దాంతాలైన నామధేయాలు కనిపిస్తాయి. సత్యదేవుడు, వామదేవుడు, అఘోరశివుడు, విశ్వేశ్వర శివుడు, సోమశంభువు, శ్రీకంఠశంభువు మొదలైన నామాలు ఉదాహరణలు.

తమిళ, ఆంధ్ర దేశాల్లో ప్రభేదాలైన గోళకీ సాంప్రదాయం అలలు అలలుగా వ్యాపించినట్టు కనిపిస్తున్నది. తమిళ దేశంలో కన్నా ఒక శతాబ్దం తరువాత గోళకీ సాంప్రదాయం ఆంధ్రదేశంలోకి వచ్చింది 12వ శతాబ్దంలో గోళకీ ఆచార్యులు తన్మతానుయాయులు మళ్లీ వలసవచ్చారు. వారితోపాటు అనేకమంది వచ్చారు. ఇందుకు ఉదాహరణలు మల్కాపురం శాసనం. ద్రవిడ దేశం నుంచి వేద పండితులు, కాశ్మీరం నుంచి సంగీత విద్వాంసులు వచ్చినట్టు ఆ శాసనంలో దాఖలాలు కనిపిస్తాయి. గోళకీ శైవం వలస వస్తూ వేదపండితులను, వైద్యాచార్యులను, సంగీత విద్వన్మణులు, చివరకు పాకశాస్త్ర నిపుణులను కూడా తీసుకొనివచ్చింది. ఈ విధంగా సామాజిక చలనానికి గోళకీ సాంప్రదాయం ఎంతో దోహదం చేసింది. మహోదాత్తమైన రీతిలో కవులు, పండితులను సమాదరించింది.

తమిళనాడులో ఆనాటి చోళరాజ వంశాలు ప్రాపకంతో గోళకీ సాంప్రదాయం యాత్రలు ప్రారంభించింది. ఆంధ్రదేశం ఈ మతాల ప్రతిష్ఠాపనకు వీలైన ప్రదేశంగా కనిపించింది.

దక్షిణాది నుంచి చోళుల ప్రాపకంతో ఈ మతానుయాయులు ఆంధ్రదేశానికి పరివార సమేతంగా వచ్చారు. ఆగమకోవిదులను మరచిపోలేదు. అలా వారితో వచ్చిన వారిలో బుద్ధవారు, ఘంటసాల వారు ప్రముఖులు. ఆ వంశాలు నేటికీ నవనవోన్మేషంగా వర్ధిల్లు తున్నాయి. ఆ వంశాల వలెనే సంగీత విద్వద్వంశాలైన సుసర్లవార్లు, హరివారు, మంగళంపల్లివారు... ఇలా లబ్ధిప్రతిష్టులైన వంశాలు ఆనాటివే. దక్షిణాదిలో యజుర్వేదశాఖీయులు తక్కువ. సామవేదులు ఎక్కువ. యజుర్వేదమంగళం అనే గ్రామంలో వున్న వారంతా సంగీత రసికులు. పండితులు, బహుశా అక్కడి నుంచి వలస వచ్చిన పండిత కుటుంబాలే నేడు ఆంధ్రదేశంలో తామర తంపరగా వృద్ధిచెందాయి.

ఏమైనప్పటికీ గోళకీ సాంప్రాదాయంతో దివిసీమకు వచ్చిన వారంతా వెలుగు దివ్వెలయ్యారు. ఆయా కుటుంబాలలో ప్రముఖులైన వారి చరిత్రే దివి ప్రాంత సమగ్ర చరిత్ర. అయితే అనేకానేక భోగోళిక, ఆర్థిక, సామాజిక కారణాలవల్ల జీవనమే ప్రధాన లక్ష్యంగా పెట్టుకొన్న ఆ మహనీయుల పేర్లు చెప్పగలగడం అంటే ఏటికి ఎదు రీదడమే అవుతుంది. జీవన యాత్రలో ఎవరు ఎక్కడకు వలసపోతారో చెప్పలేం!

విప్పర్రులోని భీమేశ్వరాలయం, నందూరు సకలేశ్వరాలయం, పెదగంజాం సకలేశ్వరాలయం, వరగాణి మల్లేశ్వరాలయం, గుంటూరు మల్లేశ్వరాలయం, మల్కాపురం విశ్వేశ్వరాలయం, చిన కాకానిలో చెన్నమల్లేశ్వరాలయం, పాములపాడు మల్లికార్జునాలయం, నూతక్కి శక్తేశ్వరాలయం, పెనుమూలి గోకర్ణేశ్వరాలయం, అవనిగడ్డ రాజశేఖర స్వామి ఆలయం, వేకనూరు ముక్తీశ్వరాలయం, గణపేశ్వరం గణపేశ్వ రాలయం, రాయభద్రేశ్వరాలయం... ఇలా ఎన్నెన్నో శివాలయాలు నేడు సాంప్రదాయికంగా స్మార్తమైనా ఆదిశైవ ఆలయాలుగానే కని పిస్తాయి. ఇవన్నీ కృష్ణా జిల్లాల్లో కోకొల్లలుగా వున్న ఆదిశైవ ఆలయా లలో కొన్ని మాత్రమే. ఈ ఆలయాలన్నీ ఒక్కొక్క కాలంలో ఆయా కాలాల నాటి శైవమత శాఖల ప్రాబల్యంలో వుండేవి.

పెదకళ్ళేపల్లిలోని సోమశివాచార్య పీఠం ఆకర్షించిన కవిపండితు లేమి, అక్కడ వృద్ధిచెందిన వారి కుటుంబాలేమి ఆ గ్రామ వైభవానికి అద్దం పడతాయి. అలాగే ఆగమకోవిదులు కూడా. అక్కడ సోమశివా చార్యపీఠం నుంచి ఆగమ పండితులు ఇతర ఆలయాలకు వెళ్ళినవాళ్ళు చాలామంది కనిపిస్తారు. అయితే ఈ సందర్భంలో నాగేశ్వరస్వామి ఆలయానికి సంబంధించిన క్రీస్తుశకం 1140 వ సంవత్సరం నాటి ఒక శాసనాన్ని గమనించాలి. శాలివాహన శకం 1062 (క్రీస్తు శకం 1140) విక్రమ సంవత్సర మాఘ బహుళ చతుర్దశి మహాశివరాత్రి నాడు త్రిలోచన పల్లవ చక్రవర్తి వేయించిన శాసనం అంది. ఈ శాసనాన్ని మెకంజీ దొర బందరు గొడుగు పేట శాంత మల్లేశ్వరస్వామి ఆలయ అర్చకుల నుంచి సేకరించాడట. ఈ శాసనం దాఖలా ప్రకారం పెదకళ్ళేపల్లి నాగేశ్వరస్వామి ఆలయంలో బహుశా వామాచార పద్ధతిలో అర్చనలు జరుగుతూ ఉండేవి. అవైదిక అర్చనలను ఆ మహారాజు మాన్పించివేసి విష్ణ్వాలయాలలోవలె వైదిక పద్ధతుల్లో పూజాధికాలు ఏర్పాటు చేశాడు. వెలనాటి బ్రాహ్మణులు అర్చకులుగా ఉంటున్నారు.

దీనిని బట్టి గోళకీ సంప్రదాయ పద్ధతిలో పూజాదికాలు జరగడానికి పూర్వం వామాచార సంప్రదాయాలు వుండేవనుకోవచ్చు. ఇంకా విడమరచి చెప్పుకోవాలంటే శక్తిపూజలు కూడా మకార పంచకంతో జరిగేవనవచ్చు. మకార పంచకానికి ప్రత్యామ్నాయాలతో పుష్పగిరిలో భ్రమరాంబకు నేటికీ పూజాదికాలు జరుగుతూనే ఉన్నాయి. ఏతావాతా తేలేదేమంటే పెదకళ్ళేపల్లి దుర్గా సహిత నాగేశ్వరస్వామి ఆలయంలో పూజాదికాలు ఒకానొక దశలో అన్ని దేవాలయాలలోవలె అవైదిక పద్ధతుల్లో జరిగేవి. అనగా వామాచార రీతుల్లో సాగేవి. అలాంటి నేపథ్యంలో గోళకీ సంప్రదాయం వచ్చింది. గోళకీ సంప్రదాయం అవైదికం కాదు. అయితే పుష్పగిరిలోని భ్రమరాంబకు పూజలు మాత్రం నేటికి మకార పంచకాలకు ప్రత్యామ్నాయాలతోనే జరుగు తున్నాయి. కనుక, ఇక్కడ కూడా అలానే జరిగేవని స్థానికులు కూడా అంటారు.

(దివి దీపిక గ్రంథం' నుండి)

డా॥ యల్లాప్రగడ మల్లికార్జునరావు

# స్కందపురాణంలో కృష్ణవేణి

తెలుగింటి విరిబోణి మన కృష్ణవేణి. కృష్ణమ్మ పేరు వినగానేఈ నదీపరీవాహక ప్రాంతంలోని ఎవరికైనా ఆనందంపొంగి పొర్లుతుంది. బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటే హరోంహరహర అంటూ ఉత్సాహంతో ఉరుకులెత్తే మనుషులే గుర్తొస్తారు. పవిత్రతకు పుట్టిల్లుగా సకల ప్రజానీకానికి అమృతధారలను అందించే తల్లిలా కృష్ణవేణి తలపునకొస్తూనే ఉంటుంది. ఈ తల్లి దయవల్ల ఎన్నెన్నో జంటలు సంతానాన్ని పొందాయి. ఆ చల్లని చూపుల దేవేరి ఆశీస్సులతోనే అన్నపూర్ణమ్మతల్లి నట్టిళ్ళలాగా తెలుగింటి లోగిళ్ళు ధాన్యరాశులతో కళకళలాడుతుంటాయి. అందుకే ఆ తల్లిమీద ఉన్న కృతజ్ఞతాభావం తోనే వేలాదికుటుంబాలలో ఈనాటికీ కృష్ణవేణి అని ఆడపిల్లలకు పేరుపెట్టడం, కృష్ణయ్య, కృష్ణారావు అని తమ వంశాంకురాలకు నామకరణం చేయటం కనిపిస్తుంది. తెలుగు జనజీవనంతో ఇలా కృష్ణవేణమ్మ మమేకమై ఉంది. ఇంతటి గొప్ప నదీమతల్లి అసలు ఎప్పుడు పుట్టింది? ఎందుకు పుట్టింది? ఆ పుట్టుక, ఆ వివరాలు అన్నీ మనకెక్కడ కనిపిస్తాయి? అనంటే దానికి సమాధానం యుగాలు, మన్వంతరాల కిందకు వెళ్ళి వెతికితే కనిపిస్తుంది.

వేదాలలో అన్నీ ఉన్నమాట వాస్తవమే. ఆ అన్నిటి సారాన్ని మూటకట్టి అక్షరాక్షరాన అష్టాదశ పురాణాలలో పొందుపరచి ఉంచాడు వ్యాసభగవానుడు. అలాంటి పురాణాలలోనే వేదకాలంనాటి నదుల ఆవిర్భావ విశేషాలున్నాయి. అష్టాదశ పురాణాలలో సగానికి సగం వాటిలో నదుల ప్రస్తావన ఎంతో కొంత కనిపిస్తుంది. నదులు, ఆ తీరాలలో ఉండే పుణ్యతీర్థాలు ఏర్పడిన తీరు, వాటి పవిత్రత ఇలాంటివన్నీ పురాణాలలో స్పష్టంగా చూడవచ్చు. అయితే అన్ని పురాణాలలో కన్నా స్కంద పురాణంలో నదుల ఆవిర్భావ విశేషాలకు సంబంధించిన కథనాలు చాలా కనిపిస్తాయి.

**స్కందపురాణంలో కృష్ణవేణి :** విస్తృతమైన ఆ స్కంద పురాణంలోనే మన కృష్ణవేణమ్మ తరంగిణుల రవళులను కూడా మనం గమనించవచ్చు.

స్కందపురాణంలో శ్రీకృష్ణామహాత్మ్యం అని ఓ ప్రత్యేక ఖండం ఉంది. దానిలో మళ్ళీ ఓ ఇరవై అధ్యాయాలున్నాయి. అవన్నీ కృష్ణవేణీ పుట్టుక, ఆ నదీతీరంలోని తీర్థాల మహిమను వివరిస్తూ కనిపిస్తాయి.

**పుట్టుక వెనక ప్రధాన కారణం :** కృష్ణవేణి పుట్టుక వెనుక ఓ ప్రధాన కారణం ఉంది. అది ప్రస్తుతకాల సామాజిక ఉద్ధరణ నేపథ్యంలోనే ఉండటం మరీ విశేషం. ద్వాపరయుగం అంతరించి కలియుగం ఆరంభమైనప్పుడు కలి ప్రభావంతో సజ్జనులు బాధలు పడుతూ ఉండటం, దుర్మార్గం ప్రబలుతూ ఉండటం నాటి కొందరు మునులకు మనస్తాపాన్ని కలిగించింది. ఇప్పుడే ఇలా ఉంటే రానురాను ఈ కలిలో సజ్జనులు, భగవద్భక్తులు బలవంతంగా పాపకూపాలలో పడుతూ కష్టాలను అనుభవించాల్సివస్తోంది. మరి అలాంటి కష్టాలు వారికి అంటకుండా పుణ్యాన్ని పొందే మార్గమేదైనా ఉంటే బాగుండునని ఆ మునులందరికీ అనిపించింది. అందుకే వారంతా ఓ చోట చేరి తమ ముందున్న సమస్యకు సమాధానం దొరికితే బాగుండునని తీవ్రంగా ఆలోచించసాగారు. ఎంతకూ ఆ ఆలోచన తెగలేదు. సమాధానము దొరకలేదు.

అయితే ఇంతలో అక్కడికి త్రిలోకసంచారి నారదుడు వచ్చాడు. ఆయనకు అతిథి పూజాసత్కారాలన్నీ చేసి ఆ తర్వాత మునులు వారి సమస్యను వివరించారు. అప్పుడు నారదుడు ఆ సమస్యకు పరిష్కారం ఒకటుందని అదే కృష్ణవేణీ నదిలో స్నానమని చెప్పాడు. దానితోపాటు కృష్ణానది ఎలా పుట్టింది, ఎక్కడ పుట్టింది, అసలెందుకు పుట్టాల్సి వచ్చిందనే విషయాలను సాక్షాత్తూ శివుడు కుమారస్వామికి చెబుతున్నప్పుడు తాను కూడా విన్నానని, వాటిని విన్నది విన్నట్టు చెబుతానని అన్నాడు.

ముందుగా ఆయన "కృష్ణా విష్ణుతనుఃస్వయమ్"అనిఅన్నాడు. అది ఎలా అని మునులు అడిగారు. అప్పుడు నారదుడు అసలు విషయ మంతా క్రమంగా చెప్పాడు.

కల్ప ప్రారంభంలో శ్రీమహావిష్ణువు బ్రహ్మదేవుడిని సృష్టిని ప్రారంభించమని చెప్పాడు. బ్రహ్మ విష్ణువుకు నమస్కరించి సృష్టిని ప్రారంభించబోతూ తనకో సందేహం కలుగుతుందన్నాడు. అదేంటో చెప్పమన్నాడు శ్రీమహావిష్ణువు. తన సృష్టిలో యుగక్రమంలో కలియుగం కూడా ఉంటోందని అప్పుడు కలి ప్రభావంతో సజ్జనులు, భక్తులు బాధపడాల్సి వస్తోందని అది తనకు బాధగా ఉందన్నాడు. ఆ పరిస్థితిని చక్కదిద్దితే

సజ్జనులు బతికి బయటపడతారు కదా అని అన్నాడు. అప్పుడు శ్రీమహావిష్ణువు బ్రహ్మతో నీవు చెప్పింది నిజమే, అందుకే నేను పుణ్యనదీ నదాలను కూడా సృష్టిస్తున్నది అని అన్నాడు. ప్రస్తుత సృష్టిలో కూడా కలిప్రభావం నుంచి మంచివారంతా బయటపడటానికి కృష్ణానదిని తన శరీరం నుంచే సాక్షాత్తూ తన స్వరూపంతోనే సృష్టిస్తున్నట్లు చెప్పి అలాగే చేశాడు. మరుక్షణంలో అక్కడ సాక్షాత్తు శ్రీమహావిష్ణువు రూపంతో ఉన్న ఓ కన్య అవతరించింది. ఆమే కృష్ణ అని శ్రీమహావిష్ణువు బ్రహ్మకు చెప్పాడు.

"శ్యామలాం శంఖ చక్రాంకం చతుర్బాహ సుభూషితాం
పీతాంబరాం సుప్రసన్నాం సాక్షాత్ కల్పలతామివ"

నల్లని శరీరఛాయతో నాలుగు చేతుల్లోనూశంఖచక్రగదా పద్మాలతో పీతాంబర ధారిణిగా ప్రసన్నమైన చూపులతో కల్పవృక్షంలా కామిత దాయిని అయిన కృష్ణాఆనాడు శ్రీమహావిష్ణువు తనువునుంచి ఆవిర్భవించింది. ఆ తల్లినుంచి ప్రసరిస్తున్న కాంతులతో దిక్కులన్నీ ఆనందంగా వెలిగిపోసాగాయి. అంతటి మహామహిమాన్వితు రాలైన ఆ కృష్ణానదిని చూస్తూ బ్రహ్మదేవుడు ఎంతో ఆనందించాడు. అంతేకాదు ఆ కృష్ణమ్మను తన కుమార్తెగా స్వీకరించాలను కుంటున్నట్టు విష్ణువుకు చెప్పాడు బ్రహ్మ. శ్రీమహావిష్ణువు అనుగ్రహంతో ఆనాడు కృష్ణమ్మ బ్రహ్మకు కుమార్తె అయింది. ఆ తర్వాత బ్రహ్మదేవుడు సృష్టినంతా చేసాడు. ఆయన అనుకొన్నట్టుగానే కలియుగం ప్రవేశించటంతో కలి ప్రభావం వల్ల అన్నిచోట్లా పాపం పెరిగి పోయింది. ఆ పాప ప్రభావంతో మంచి వారు కూడా కష్టాలపాలయ్యే రోజులొచ్చాయి. అప్పుడు బ్రహ్మవిష్ణులు ధర్మోద్ధరణ, సజ్జన సంరక్షణ కోసం కృష్ణను భూలోకానికి తీసుకువెళ్ళాలని సంకల్పించుకున్నారు. ఆ బ్రహ్మ,విష్ణుల వెంట సకల దేవతాముని గణాలు కూడా బయలు దేరాయి. కృష్ణమ్మలాంటి పవిత్రమైన నదిని భూలోకంలో ఏదైనా పవిత్రమైన ప్రదేశంలోనే ఉంచాలి. కనుక అంతటి పవిత్రమైన ప్రదేశం ఏదీ? అని దేవతలంతా భూలోకంలో వెతుకుతూ ముందుకు నడుస్తున్నారు. అలా వెళుతున్న వారికి మార్గమధ్యంలో పర్వతరూపంలో ఉన్న ఒక ముని కనిపించాడు. అప్పుడా దేవతలు నిరంతరం విష్ణు నామస్మరణ చేస్తూ ఉన్న ఆ మునిని నీవెవరు, ఎందుకిక్కడ ఉన్నావు అని అడిగారు. అప్పుడాముని తన పేరు సహ్యుడు అని, తానొక పర్వతాన్ని అని చెప్పి తాను విష్ణుభక్తుడిని విష్ణు సేవలో జీవితాన్ని తరింపచేసుకోవాలని అనుకొంటున్నట్లు చెప్పాడు. అంతేకాక దేవతల పక్కనే ఉన్న విష్ణురూపిణి అయిన కృష్ణను చూసి ఆ నదీమతల్లిని తాను కుమార్తెగా స్వీకరిస్తానని, పర్వతమైన తనమీదనుంచే లోకోద్ధరణ కోసం ఆ నది ప్రవహించేలా అనుగ్రహించమని కోరుకున్నాడు. ఆ జలస్పర్శతో తాను నిరంతరం పునీతుడని అవుతూ ఉండేకన్నా భాగ్యం మరొకటి లేదని తన కోరికను మన్నించమని వేడుకొన్నాడు సహ్యపర్వతుడు. అప్పుడా దేవతలంతా ఎంతో ఆనందించారు. అంతేకాక వారి పక్కనే ఉన్న కృష్ణానది కూడా సహ్యపర్వతుడి కోరికను మన్నించి

"ఏవమస్తు గిరిశ్రేష్ఠా త్వత్తః సంప్రభవామ్యహం ।
సుతాచతే భవిష్యామి సహ్యా జౌత్య భివిశ్రుతా ॥"

ఓ సహ్యపర్వతుడా నువ్వు కోరుకున్నట్టు నీమీదనుంచే నేను ప్రవహిస్తాను. ఈనాటినుంచి నీ కుమార్తెనై "సహజ్య" అనే పేరుతో పిలుపులందుకొంటాను అని అన్నది. ఆ మాటలకు ఎంతో ఆనందించాడు సహ్యపర్వతుడు. వెంటనే ఆకాశం నుంచి పూలవాన కురిసింది. దేవ దుందుభులు మోగాయి. ఆ ఆనంద సమయంలో శ్రీమహావిష్ణువు భూలోక సజ్జన సంరక్షణార్థం మరో వరం ఇచ్చాడు. సహ్యపర్వతం మీద తాను ఒక శ్వేత అశ్వత్థవృక్షమై అవతరిస్తానని, తన పాదాల నుంచి కృష్ణ వెలువడి పుణ్యతీర్థమై విరాజిల్లుతుందని అన్నాడు. వెంటనే విష్ణు సంకల్పం రూపం దాల్చింది. అక్కడొక అశ్వత్థ వృక్షం అవతరించటం, దాని పాదునుంచి కృష్ణానది ప్రవహించటం ప్రారంభమైంది. ఆనాడు ఆ మహోత్సవాన్ని దర్శించటానికి దేవతలు, గంధర్వులు, సిద్ధులు, పితృదేవతలు తదితర దేవగణాలన్నీ అక్కడికి వచ్చాయి. కృష్ణమ్మకు మరింత శోభను చేకూర్చాయి. అశ్వత్థవృక్షం నుంచి కృష్ణప్రవాహం ప్రారంభంకాగానే ఆ వృక్షానికి మరికొద్ది దూరంలో రుద్రాంశతో ఒక ఆమలక (ఉసిరిక) వృక్షం ఆవిర్భవించింది. విష్ణువుకు తోడుగా రుద్రుడు కూడా కలి బాధల నుంచిసత్పురుషులను రక్షించాలని అలా అవతరించాడు. ఆ ఉసిరిచెట్టు పాదునుంచే వేణీనది ఆవిర్భవించింది. అలా కృష్ణ, వేణీ నదులు కొంతదూరం విడివిడిగా ప్రవహించి, ఆ తర్వాత కలిసి కృష్ణవేణీ నదిగా మారాయి. ఈ కృష్ణవేణీ నదులు ఉద్భవించిన ప్రాంతానికి మహాబలేశ్వరక్షేత్రమని పేరు. ఈ మహాబలేశ్వరం ఇప్పటికీ సహ్యపర్వత సానువుల్లో కనిపిస్తుంది. అక్కడి నుంచే బిరబిరా కృష్ణమ్మ పరుగులెత్తుతూ మనదగ్గరకొస్తోంది.

స్కందపురాణం శ్రీ కృష్ణామహాత్మ్యం అనే ఖండంలో ఉన్న కృష్ణవేణీ విశేషాలివి. కృష్ణానదీ మాహాత్మ్యం విరాజ వైభవం అనేపేరుతో పూర్వం ముద్రితమైంది. దీని హస్తలిఖిత ప్రతులు మహారాష్ట్ర సతారాలోని ప్రాచ్య లిఖిత భాండారంలో ఉన్నాయని పరిశోధకులు, పండితులు వివరిస్తున్నారు.

చిరునామా : *డాక్టర్ యల్లాప్రగడ మల్లికార్జునరావు, తెలుగు శాఖాధిపతి, హిందూ కళాశాల, గుంటూరు, సెల్‌ఫోన్ నెం : 9848543520*

శ్రీ నవులూరి మల్లికార్జునరావు
డా॥ ఈమని శివనాగిరెడ్డి - స్థపతి

# సోమశిల దేవాలయాల చరిత్ర

## సోమశిల క్షేత్ర మహిమ :

సోమశిల గ్రామం మహబూబ్‌నగర్ జిల్లా కొల్లాపూర్ మండల కేంద్రానికి 10 కి.మీ. దూరంలో కృష్ణానదీ తీరాన ఎడమవైపు ఉంది. హైదరాబాద్, వనపర్తి, మహబూబ్‌నగర్, కర్నూలు పట్టణాల నుంచి కొల్లాపూర్‌కు బస్సులో వచ్చి అక్కడనుంచి ఘాట్‌రోడ్డు ద్వారా సోమశిల చేరుకోవచ్చు.

శ్రీశైలం జలాశయంలో ముంపుకు గురైన 117 గ్రామాల్లో సోమశిల ఒకటి. జలాశయ ప్రాంతంలో వున్న పురాస్థల, కట్టడాల పరిరక్షణలో భాగంగా సోమశిల చుట్టుప్రక్కల జరిపిన సర్వేలో పాత, కొత్త రాతియుగాలు, బృహత్శిలాయుగంకు చెందిన అవశేషాలు, చారిత్రక తొలియుగంనాటి ఇష్టికాలయాలు, చారిత్రిక తొలి మధ్య యుగం, మధ్యయుగాలకు చెందిన రాతిదేవాలయాలు, శిల్పాలు, శాసనాలను గుర్తించడమైంది. ప్రాక్, తొలి చారిత్రక యుగ అవశేషా లను సేకరించి మధ్యయుగాల ఆలయాలను లోతట్టు నుంచి కాపాడి ఎగువన పునర్నిర్మించే బాధ్యతను పురావస్తుశాఖ చేపట్టింది. పురావస్తు ప్రాముఖ్యతతో పాటు ఈ సోమశిలకు ఎంతో మహత్త్వం ఉన్నట్లు స్థానికుల నమ్మకం.

## పుణ్యక్షేత్రమైన సోమశిల :

పండితారాధ్యుని శిష్యుడు దొనమయ్య వెలిగొండ నుంచి శ్రీశైలం వెళ్లగా మల్లికార్జునస్వామి అతనికి ముసలి జంగమ రూపంలో కనిపించి ఒక శిఖరంపై నుంచి సోమశిల, ఉమామహేశ్వరం, శ్రీగిరి క్షేత్రాలను చూపించినట్లు పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్యుని చరిత్రలో చెప్పడం వల్ల సోమశిల అప్పటికి ఒక గొప్ప పుణ్యక్షేత్రంగా విలసిల్లినట్లు చెప్పవచ్చు.

## పంచేశ్వరాలు :

చారిత్రక మధ్యయుగంలో భవనాశినది కృష్ణానదిలో కలిసేచోట సోమేశ్వరం, అగస్త్యేశ్వరం, సంగమేశ్వరం, సిద్ధేశ్వరం, కపిలేశ్వరం అనే పంచేశ్వరాలుండేవి. ఒక సిద్ధుడు కృష్ణలో స్నానంచేసి ప్రతిష్ట చేసిన లింగం ఉన్నచోటు సిద్ధేశ్వరంగానూ, అగస్త్యుడు ప్రతిష్టించిన చోటు అగస్త్యేశ్వరం (నేటి మల్లేశ్వరం)గానూ, కపిలమహర్షి ప్రతిష్ట చేసిన లింగం ఉన్న చోటు కపిలేశ్వరంగానూ, సంగమస్థానంలో ప్రతిష్టించిన లింగమున్న చోటు సంగమేశ్వరంగానూ, సోమేశ్వరుని చేత ప్రతిష్టించబడిన లింగమున్నచోటు సోమేశ్వరంగానూ అన్నీ కలిపి పంచేశ్వరాలుగా పిలువబడేవి. తీరాంధ్రదేశంలో ఇదే కాలంలో పంచారామాలనే శైవక్షేత్రాలు విలసిల్లాయి.

## సప్తనదీ సంగమం :

మహబూబ్‌నగర్‌జిల్లాలో కూడలి వద్ద కృష్ణానదితో తుంగభద్ర కలవటం చేత ఇది కూడలి సంగమేశ్వరంగా పిలువబడింది. కృష్ణానదికి సోమశిలకు ఎదురుగా ఉన్న సంగమేశ్వరం వద్ద భవనాశినది వచ్చి చేరటం చేత, దానిని సప్తనదీ సంగమస్థానమంటారు. కృష్ణానదిలో ఘటప్రభ, మలప్రభ,భీమరధి, తంగ, భద్ర,భవనాశీ అనే ఏడు నదులు కలయికను సప్తనదీ సంగమమనీ, ఇది పరమపవిత్రమైన తీర్థ క్షేత్రమని చెప్పబడింది. పాపాలనుంచి నివృత్తి లభించటంచేత దీనిని నివృత్తీ సంగమేశ్వరమని కూడా పిలుస్తారు. స్కాంధపురాణంలోని ఉమా మహేశ్వర సంవాదంలో ఈ నివృత్తీ సంగమక్షేత్ర మహత్యం గురించి చెప్పబడింది. ఈ నివృత్తీ సంగమేశ్వరానికి ఆ పేరెలా వచ్చిందో తెలిపే ఒక కథ ఇప్పటికీ ప్రచారంలో ఉంది.

## గాడిదల బాట :

పూర్వం కొల్లాపురం నుంచి సోమశిల వరకూ కాలిబాట ఉండేది. దీనికి సంబంధించిన ఒక కథ ప్రచారంలో ఉంది. వైష్ణవ గ్రంథాల్లో వున్న తిరుమంత్రం కథ ప్రకారం, పూర్వం మాధవదాసనే ఒక కోమటి ఉండేవాడు. తల్లీతండ్రీలేని అతడు తీర్థయాత్రలకు బయలుదేరి గంగా తీరం చేరుకొంటాడు. అక్కడ పరిచయమైన ఒక గురువును తనకు మంత్రోపదేశం చేయమని కోరగా, ముందుగా యమునానదికి వెళ్లి నీరు తెచ్చి తన దాహం తీర్చమని గురువు అంటాడు. మాధవదాసు యమునానది నుంచి నీటిని తెచ్చేలోపల గురువు మంత్రాన్ని గంగా

తీరంలోని ఇసుకపై రాసి మరణిస్తాడు. ఇంతలో ఒక దొమ్మరిసాని తన గాడిదల గుంపుతో అక్కడికి వచ్చి మంత్రాన్ని చూచి, తాటి ఆకులపై రాసుకొని వెళ్ళిపోతుంది. గాడిదల తొక్కులాటకు ఇసుక పైనున్న మంత్రాక్షరాలు చెరిగిపోతాయి. అక్కడున్న పశువుల కాపరుల ద్వారా జరిగిన విషయాన్ని తెలుసుకొన్న మాధవదాసు ఆమె వెళ్లిన మార్గం గుండా వెళతాడు. దొమ్మరిసాని తన గాడిదల గుంపుతో కొల్లాపురం, సోమశిలల మీదుగా చోళదేశం వెళ్ళగా అప్పటినుంచి కొల్లాపురం-సోమశిల కాలిబాటకు గాడిదలబాట అని పేరు కలిగింది.

## సోమశిల గ్రామ, ఆలయచరిత్ర

### పాత రాతియుగం :

ఆదిమానవుడు జంతుజాలాలలో ఒకడుగా నదుల వెంబడి, కొండ కోనల వెంబడి తిరుగుతూ జంతువులను వేటాడుతూ, మాంసాన్ని, దుంపలను తింటూ సంచారజీవనం గడిపాడు. వేటకు, ఇంకా కొన్ని నిత్యావసరాలకు అతడు రాతి పనిముట్లపై ఆధారపడ్డాడు. సోమశిలలో పాత రాతియుగానికి చెందిన గొడ్డళ్ళు అనేకం లభించాయి. కృష్ణానది సోమశిలగుండానే నల్లమల కనుమల్లో ప్రవేశిస్తుంది. ప్రాచీన మానవుని దైనందిన జీవితంలో అవసరమైన పనిముట్లకు వాడే నల్ల శాణపు రాళ్ళు ఇక్కడ పుష్కలంగా లభించడం విశేషం. కృష్ణానదికి ఎగువనున్న వీరాపురం, మల్లేశ్వరం, చిన్నమారూరు, చాగటూరు, బూడిదపాడు, పల్లెపాడు, శేరుపల్లి, క్యాతూరు, యాపల్దేవిపాడు మొదలగు పాత, కొత్త రాతియుగపు స్థలాల్లో లభించిన వివిధరకాలైన గొడ్డళ్ళు ఇతర పనిముట్లు బహుశ ఈ సోమశిలలో లభించే నల్లశాణపు రాతితోనే తయారై ఎగుమతి ఐనాయి.

### మధ్యరాతి యుగం :

మధ్యరాతియుగంలో ఆహారసంపాదనకు నాటి మానవుడు నదీ తీరాలను ఎంచుకొని ప్రకృతిరీత్యా ఏర్పడిన కొండ గుహలను, చరియ లను తమ తాత్కాలిక నివాసాలుగా ఏర్పరచుకొని జీవించేవాడు. ఇక్కడ లభించిన మధ్యరాతియుగపు అర్ధచంద్రాకార సూక్ష్మరాతి పని ముట్లను పరిశీలిస్తే ప్రక్కభాగంలో పట్టుకోవడానికి వీలుండి, క్రింది భాగంలో కత్తిలా కోయడానికి ఉపయోగపడేవని తెలుస్తుంది.

### కొత్త రాతియుగం :

పాత రాతియుగం నుంచి మధ్య రాతియుగం దాటి, కొత్త రాతి యుగం వరకు వచ్చిన మానవుడు, మునుపటి సంచార లక్షణాన్ని కొంత మానుకొని నీటి వనరులు, సారవంతమైన భూములు, పని ముట్లు తయారీకి కావలసిన ముడిరాయి లభ్యమయ్యేచోట్ల పాక్షిక స్థిర నివాసాలనేర్పరచుకొని వ్యవసాయం, పశుపాలనలతో జీవనం సాగించాడు. రాతి పనిముట్లు తయారీలో మెళకువలు తెలుసుకొని రాళ్ళను పాలీష్ చేయడం నేర్చుకున్నాడు. కొత్త రాతియుగపు గొడ్డళ్ళు, బడిసెలు, శానాలతోపాటు అరుదైన అర్థవృత్తాకారపు గొడ్డళ్ళు లభించ డం పురావస్తు శాస్త్రజ్ఞులకు ఎంతో ఆసక్తి కలిగించింది. ఇలాంటి గుండ్రని రాతిగొడ్డళ్ళు ఆంధ్ర దేశంలోనే కాక యావద్భారతదేశంలో కూడా మరెక్కడా లభించలేదు. పాతరాతి యుగంలో ఉన్న వృత్తాకార రాతి గొడ్డళ్ళు (డిస్కాయిడ్స్) చివరి భాగంలో పెచ్చులు తీయబడి ముడిగానే ఉన్న మొనలతో విసరబడేవి. వీటిని జంతువులపై విసరి నపుడు వాటి శరీరంపై చిన్న గాయం మాత్రమే ఏర్పడటంవల్ల అవి తప్పించుకుపోవడానికి అవకాశాలుండేవి. కొత్త రాతియుగంలో అదే వృత్తాకారపు గొడ్డళ్ళను ఒక భాగం మాత్రం అరగదీసి పదును పెట్టడం వల్ల జంతువులపైకి విసరినపుడు శరీరంలో ఏదో ఒక భాగం తప్పని సరిగా తీవ్ర గాయానికి గురై అవి మానవుని చేతికి చిక్కేవి.

ఇంతేకాక పాతరాతియుగపు త్రికోణాకార రాతిగొడ్డలికి కోణాకార మడమ ఉండి క్రిందిభాగం మాత్రం వాడుకోవడానికి వీలుగా తయారు చేసుకొనేవాళ్ళు. ఇందులో వాడుక భాగం తక్కువగా ఉండటం చేత, ఎక్కువ కోతభాగం కోసం అర్థవృత్తాకారపు రాతిగొడ్డళ్ళను తయారు చేసిన నవీన శిలాయుగపు మానవుడు ఒక వస్తువును నిలువుగా చీల్చడానికి, చెక్కడానికి, జంతువుల చర్మాలను తొలగించి ఎముకల కంటిపెట్టుకొని ఉన్న మాంసాన్ని వేరుచేయటానికి వీలుగా నునుపు చేసి పదును పెట్టి ఉండవచ్చు. ఈ అర్థవృత్తాకారపు రాతిగొడ్డళ్ళు పాతరాతి యుగంలో క్వార్ట్జైట్‌తోను, కొత్తరాతియుగంలో నల్లశాణపు రాతితోను ముక్కోణపు కత్తి పదునుగల్గి, ఒక్కోసారి సన్నని మొనదేలిన బ్లేడులాగాను తయారుచేయబడినాయి. ఇంకా ఈ యుగంలో వ్యవ సాయం, పశుపోషణలతోపాటు మొక్కల పెంపకం, ఇంతవరకూ మొరటుగా వాడిన రాతిగొడ్డళ్ళస్థానే నునుపుగా అరగదీసి కత్తిలాంటి పదును నేర్పరచటం, మధ్యరాతియుగంలో వాడిన సూక్ష్మరాతి బ్లేడ్లను సమీకరించి వాడుకోవడానికి వీలుగా కొయ్యలేక ఎముకలకు అమర్చి వ్యవసాయ పనిముట్లుగా వాడటం, కొండగుహలు, చరియలనుంచి మైదానాల్లో అడుగుపెట్టి చిన్న గుడిశెల్లో నివాసముండటం మొట్ట మొదటిసారిగా చేతితో మట్టిపాత్రలు, మట్టిబొమ్మలు తయారు చేసు కోవడం మొదలైన ఘట్టాలు ఈ దశలోనివే. ఈ కొత్తరాతియుగపు జాతులు ఆహారం కోసం అటూ ఇటూ సంచరిస్తూ క్రొత్తప్రదేశాల్లో కొన్నాళ్ళుండి, మళ్ళీ పాత ఆవాసాలకు రావటం పరిపాటి. వీటినే సీజనల్ క్యాంపులంటారు. సోమశిల సమీపంలోని అమరగిరి, బొల్లారం కొండచరియల్లో నాటి మానవజీవనం సాగినట్లు ఆ చరియ ఆవా సాలపై గల శిలాయుగపు చిత్రకళ స్పష్టం చేస్తోంది.

### బృహత్ శిలాయుగం :

కొత్తరాతియుగం తరువాత తామ్రశిలాయుగపు అవశేషాలు సోమశిలలో లభించకపోయినా, సమీపంలోని చిన్న మారూరులో

నాటి మృణ్మయ పాత్రావశేషాలు,రాగి గాజులు కనుగొనటం చేతఈ ప్రాంతం తామ్రశిలాయుగంలో పరిమితంగా ప్రభావితమైందని చెప్పవచ్చు. తరువాతి బృహత్శిలాయుగపు విశేషాలు సోమశిలలోనూ, చుట్టుప్రక్కలా ఎక్కువగానే లభించాయి. ఈ కాలపు మానవులు చని పోయిన తరువాతవారిని ఒక గుంటలో ఒక ప్రత్యేకపద్ధతిలో పూడ్చి, ఆ గుంట చుట్టూ పెద్ద బండరాళ్ళను గుండ్రంగా అమర్చటం వలన దీనిని బృహత్శిలాయుగంగా పిలిచారు. ఇనుమును తొలిసారిగా ఈ యుగం లోనే వాడుకలోకి తేవడంవల్ల దీనిని ఇనుపయుగంగా కూడా పిలుస్తారు. సోమశిల ఆలయాల పునర్నిర్మాణం కోసం తీసిన పునాది గుంటల నుంచి నలుపు, తెలుపు రంగుల మట్టి పాత్రలో మానవ అస్థిపంజర శకలాలను కనుగొనటంచేతనూ, కృష్ణానది ఒడ్డునే ఉన్న పాత సోమశిల గ్రామం నుంచి ఆనాటి ముడిఇనుప ఖనిజపు రాళ్ళు,కరిగించగా వచ్చిన లోహపుతెట్టు లభించటంచేత ఈ గ్రామములోనూ బృహత్శిలాయు గంలో జనావాసం ఉండేదని చెప్పవీలవుతుంది. ఎదురుగా నదికి అవతలి వైపున్న మారుగుత్తి, దుర్గం గ్రామాల్లోనూ, సోమశిల సమీప గ్రామాలైన పెద్దమారూరు, చిన్నమారూరు, అమరగిరి, బొల్లారంలలో గల వందల సంఖ్యలో ఉన్న ఆనాటి సమాధులు ఈ విషయాన్ని బలపరుస్తున్నాయి. ఈ కాలంలో మానవులు వ్యవ సాయాన్ని విస్తృతపరిచి, పశుపాలనతో పాటు ఇతర వృత్తులలో సమాజానికి అవసరమైన వస్తు సామాగ్రి నిల్వచేసుకొని, ఒకరిద్దరు ముఖ్యులు పరిసరాలను, జనాభాను తమ అదుపు ఆజ్ఞలలో ఉంచుకున్నారు. జనాలు కుదుళ్ళలో నివశించేవారు.

## చారిత్రక తొలియుగం (క్రీపూ. 300-క్రీ.శ. 400)

రాచరికపు వ్యవస్థ మొట్టమొదటిసారిగా రూపుదిద్దుకొన్న ఈ కాలంలో సమాజం వివిధ వృత్తి పనివారలు, కులాలతో వర్గీకరింపబడి సంఘటితమై ఉంది. వ్యవసాయాధార, పారిశ్రామికాధార రంగాలలో ఆర్థిక పరిపుష్టి సాధించి వర్తక, వాణిజ్యాలను జాతీయంగానే కాక, అంతర్జాతీయంగా చేపట్టి సాంకేతిక మార్పులను ప్రవేశపెట్టి, అన్ని సౌకర్యాలున్న పట్టణాల్లోనూ,నగరాల్లోనూ ప్రజలునివసించిన రోజులవి. ఈ కాలంలో నదీతీరాల వద్దనే కాక మైదానాల్లో కూడా నివాసాల నేర్పరుచుకొన్నారు. ఆరోగ్యానికి భూగర్భజలం మంచిదని తెలుసుకొని మొదటిసారిగా భూమిలోకి బావులను త్రవ్వుకొని నీటిని తోడుకొన్నారు. రోడ్లను వేసుకొని సుదూర ప్రాంతాలకు చక్కటి రవాణా సౌకర్యం ఏర్పాటుచేసుకొన్నారు. ఇటుకలు, నగిషీ మృణ్మయ పాత్రలు, అలంకార వస్తువుల తయారీ, లోహపు నాణేలను వస్తు వినిమయానికి తేవడం తొలిసారిగా ఈ కాలంలో జరిగినవే.

మౌర్యుల పాలనలోనున్న ఈ ప్రాంతం క్రమంగా శాతవాహనుల ఆధీనంలోకి వచ్చింది. సోమశిలకి దగ్గరగా నున్న సాతానికోట (శాత వాహన కోట)లో క్రీ.పూ. 1వ శతాబ్దానికి చెందిన పెద్ద పట్టణం, చుట్టు కోట గోడ, కోటలో జరిపిన త్రవ్వకాల్లో ఇటుక ఆవాసాలు, మృణ్మయ పాత్రలు, కప్పు పెంకులు, నాణేలు లభించటం సాతానికోట శాతవాహనుల పాలనాకేంద్రాల్లో ఒకటని చెప్ప వీలవుతుంది. సోమశిలలో కృష్ణానదీ తీరాన్న 50 x 25 x 8 cms కొలతలుగల ఇటుకలతో నిర్మించిన శాతవాహనుల కాలానికి చెందిన రెండు శివా లయాల పునాదులు బయల్పడ్డాయి. గర్భాలయ, అర్ధమండ పాలతో నున్న ఈ ఆలయాలు కృష్ణానదికి ఎగువనగల కూడలి, రంగాపురం, వీరాపురం, సిద్దేశ్వరంలలో కనుగొన్న శివాలయాలను పోలి ఉండటం గమనించదగ్గ విషయం.

పాత సోమశిల గ్రామములోని పాటి దిబ్బలనుంచి శాతవాహన కాలంనాటి ఎర్రనగిషీగల మట్టి పాత్రలు, ఎరుపు-నలుపు పాత్రలు, మట్టితో చేసి కాల్చిన టెర్రకోటా బొమ్మలు, మట్టిపూసలు ఇంకా అలంకృత మృణ్మయ పాత్రలు శకలాల రూపంలో లభించటంచేత సోమశిల శాతవాహనుల కాలానికి చెందిన తొలి గ్రామాల్లో ఒకటని గుర్తించ వీలయింది. తీరాంధ్రదేశంలో వర్తక వర్గాలు, సామాన్య ప్రజానీకంతోపాటు రాజుల పోషణతో బౌద్ధమతం పరిఢవిల్లితే, కృష్ణా తుంగభద్ర ప్రాంతంలో మాత్రం వైదికమతం విస్తరించటం కూడా ఈ కాలపు వైవిధ్యంగా గుర్తించవచ్చు.

సమీప వీరాపురంలో జరిపిన పురావస్తు త్రవ్వకాల్లో ఇక్ష్వాకుల కాలపు కోటగోడ వెలుగు చూడటమే కాక, ఇక్ష్వాకుల ఒక శాసనంలో పేర్కొన్న 'హలంపురం' స్వామిని అలంపుర స్వామిగా గుర్తించటం చేతనూ ఇక్ష్వాకుల పాలన మహబూబ్‌నగర్ జిల్లా వరకూ వ్యాపిం చిందని చెప్పవీలయింది. శాతవాహనుల పతనానంతరం సోమశిలతో పాటు ఈ ప్రాంతమంతా ఇక్ష్వాకుల ఏలుబడిలోకి వచ్చింది.

సోమశిలలో 1వ నెంబరు దేవాలయాన్ని ఊడదీసేటపుడు సోమ సూత్రం క్రింద విష్ణుకుండినుల కాలానికి చెందిన ఇటుకలను కను గొనటమైంది. అంతేగాక ఎగువనున్న గుమ్మడంలో విష్ణుకుండినుల కాలపు సర్వతో భద్రాలయం పీఠభాగం వరకూ త్రవ్వకాల్లో వెలుగు చూడటం మూలాన ఈ ప్రాంతం ఇక్ష్వాకుల తరువాత విష్ణుకుండినుల ఆధీనంలో ఉందని చెప్పవచ్చు. సోమశిలలో విష్ణుకుండినుల కాలానికి సంబంధించి ఇతర ఆధారాలేవీ లభించలేదు. విష్ణుకుండినుల తరు వాత ఈ ప్రాంతం బాదామి చాళుక్యుల వశమైంది.

## బాదామి చాళుక్యులు (క్రీ.శ. 7-8 శతాబ్దాలు)

బాదామి చాళుక్య రాజైన మొదటి విక్రమాదిత్యుని (క్రీ.శ. 655-680) ఆముదాలపాడు తామ్ర శాసనంలో తాను మణ్ణూరు (కొల్లాపురం తాలూకాలోని నేటి చిన్నమారూరు గ్రామం)లో విడిది చేసి శివమండల దీక్షబూనిన సందర్భంగా సుదర్శనాచార్యుడనే శైవ మతగురువుకు వంగూరు విషయంలోని ఈపఱుంగల్లు (పెంటవెల్లికి సమీపంలో గల నేటి వీపనగండ్ల) గ్రామాన్ని గురుదక్షిణగా సమర్పించటం చేత క్రీ.శ.7వ శతాబ్దానికి కొల్లాపురం-సోమశిల ప్రాంతం బాదామి చాళు

క్యుల ఆధీనంలో ఉన్నట్లు స్పష్టంగా తెలుస్తుంది. బాదామీ చాళుక్యుల ఆలయాలు సమీపంలోని మల్లేశ్వరం, చిన్నమారూరు, మారమునగాల, ఆలంపురం, కూడలి, పంచలింగాలలో ఉన్నాయి. క్రీ.శ. 713 సంవత్సరం తరువాత చాళుక్యుల పాలనకు సంబంధించిన వివరాలు దొరకలేదు. పశ్చిమ చాళుక్యరాజ్యము అంతరించగా రాష్ట్ర కూటులు ఈ ప్రాంతాన్ని తమ ఏలుబడికి తెచ్చుకున్నారు.

### రాష్ట్రకూటులు (క్రీ.శ. 8-9 శతాబ్దాలు)

రాష్ట్రకూట రాజైన మొదటి కృష్ణుడు (క్రీ.శ 756-772) తన రాజ్యాన్ని దక్షిణాన కృష్ణానది వరకూ విస్తరించాడు. తరువాత ధారావర్ష ధృవుని పాలనాకాలంలో అలంపురంలో ఒక తోరణ ద్వారం, బండ తాండ్రపాడు,పాపనాశనం, పాతకోట,మియాపూర్,మల్లేశ్వరం, సోమశిల, సమీపంలోని రూపాల సంగమేశ్వరం రాష్ట్రకూట శైలిలో ఆలయ నిర్మాణాలు సాగటం వల్ల రాష్ట్రకూటుల కాలంలో ఈ ప్రాంతం ఉత్తరాన శ్రీశైలం, దక్షిణాన పుష్పగిరి వరకు విస్తరించిందని చెప్ప వీలవుతుంది.

### కళ్యాణీ చాళుక్యులు (క్రీ.శ. 973-1200)

రాష్ట్రకూటుల తరువాత ఈ ప్రాంతంపై తమ ఆధిపత్యాన్ని చలాయించినవారు కర్నాటకలోని కళ్యాణీ నగరాన్ని రాజధానిగా చేసుకున్న కళ్యాణీ చాళుక్యులు. దాదాపు వంద సంవత్సరాలపాటు వారి పాలన ఈ ప్రాంతంలో అవిచ్ఛిన్నంగా సాగింది. స్థానికంగా, పాలనా పరంగా వారికి కందూరు చోళులు, చెఱకు రెడ్లు సహాయపడినారు. కాలాముఖ శైవమతం ఆలయాల పాలనా వ్యవహారాలను చూచుకొనేది. సోమశిలలోని 1వ నెంబరు దేవాలయం సోమశిల సూత్రం మీద మొదటి సోమేశ్వరుని (క్రీ.శ. 1042-1068) శాసనం ఉంది. బిల్హణుని విక్రమాంక దేవచరిత, మూడవ సోమేశ్వరుని (క్రీ.శ. 1126-1138) విక్రమాంకాభ్యుదయంలోనూ, మొదటి సోమేశ్వరుడు ఆలంపూర్ దగ్గరి కూడలి వద్ద జరిగినచాళుక్య, చోళ యుద్ధాలకు మనస్థాపం చెంది కూడలి, సంగమేశ్వరం, సోమశిల మీదుగా శ్రీశైలం తీర్థయాత్ర సాగించినట్లు పేర్కొనటం చేత సోమశిల గ్రామం కళ్యాణీ చాళుక్యుల కాలంలో ఒక గొప్ప శైవమత కేంద్రంగా ఉందని చెప్పవీలవుతుంది. ఆరవ విక్రమాదిత్యుని (క్రీ.శ. 1076-1126) పాలనలో కృష్ణాతీరం వెంట ఈ ప్రాంతంలో అనేక శివాలయాల నిర్మాణం కొనసాగింది. కళ్యాణీ చాళుక్యరాజైన మొదటి సోమేశ్వరుడు సోమశిల సందర్శించి అక్కడ ఆలయాలను నిర్మించటం చేత ఈ గ్రామం సోమేశ్వరం అని కూడా పిలవబడింది. కృష్ణానదికి ఉత్తరభాగాన్నంతా కందూరునాడుగా పిలువబడి తెలుగు చోళరాజులైన కందూరు చోళులు ఎత్తపి-90, (నేటి ఎత్తం), కుదుకుళి-13, (నేటి కుడికిళ్ళ),లను పాలనావిభాగాలుగా కలిగి సోమశిలను తమ అధీనంలో స్థానికంగా ఏలుతుండేవారు.

### కాకతీయులు (క్రీ.శ. 12-14 శతాబ్దాలు)

కాకతీయులు యావదాంధ్రదేశాన్ని తమ అధీనంలోకి తెచ్చుకోవటంతో ఈ ప్రాంతంపై కన్నడ రాజుల పాలనతోపాటుశైవ మతంలో అప్పటివరకు ఆదరింపబడిన కాలాముఖం కనుమరుగైంది. కాకతీయ గణపతిదేవుని పాలనతో స్థానికంగా చెఱుకు వంశంవారు స్వతంత్రులై పాలించటమే కాక, కాలాముఖం స్థానంలో పాశుపత శైవమతం వేళ్ళూనుకుంది. మొదటిసారిగా తెలుగు అధికారభాషై, శాసనాలు కూడ పూర్తిగా తెలుగుభాషలోనే వెలువడ్డాయి. గణపతిదేవుని రాచ గురువైన విశ్వేశ్వర శివాచార్యుని అభిమతం మేరకు మఠాలు (గోళకీ మఠం) నిర్మింపబడి ఆలయాల వద్ద విద్యా, వైద్య శాస్త్రాల బోధనతో పాటు ఉచిత భోజనవసతి కూడా కల్పించటమైనది. ఈ ప్రాంతంలో విభూతి గౌరయ ప్రచారం చేసిన ఆరాధ్యశైవం కూడా కొంతవరకు ప్రాపకమైంది. రుద్రమదేవి కాలపు గుంటూరు జిల్లా మల్కాపురం (క్రీ.శ. 1261) శాసనంలో సోమశిల తీర్థక్షేత్రంతోపాటు సంగమేశ్వరం, వెల్లాల ఆలయాలు విశ్వేశ్వర శివాచార్యుని అజమా యిషీలో ఉన్నట్లు పేర్కొనబడింది. కాకతీయుల చివరి ప్రభువు ప్రతాప రుద్రుని శాసనాలు రెండు (క్రీ.శ. 1295, 1297 నాటివి) సోమశిలలో లభించుట చేత, కాకతీయుల కాలంలో సోమశిల గొప్ప తీర్థక్షేత్రంగా విలసిల్లిందని చెప్పవీలయింది. ఈ కాలంలో కూడ చెఱకు వంశ ప్రభువులు స్థానికంగా ఈ ప్రాంతాన్ని తమ ఏలుబడిలోనే ఉంచు కొన్నట్లు మల్యాల, సోమశిల శాసనాలు చెబుతున్నాయి. దాదాపు ఆరువందల సంవత్సరాలు వైభవ, ప్రాభవాలను చవిచూసిన సోమశిల గ్రామం కాకతీయుల పతనానంతరం గత వైభవ చిహ్నంగానే మిగిలిపోయింది.

### విజయనగర, తదనంతర కాలం

కాకతీయుల పాలన తరువాత ఈ ప్రాంతం గురించి వివరాలు తెలిపే శాసనాలు లేవు. క్రీ.శ. 16వ శతాబ్దంలో విజయనగర పాలన పర్యవేక్షించిన అళియరామరాయలు తనకు సహకరించినందుకు రేచర్ల గోత్రీకులు సురభి వంశానికి చెందిన పద్మనాయకులకు జటప్రోలు సంస్థానాన్ని పారితోషికంగా ఇచ్చిన చారిత్రకాధారాలున్నాయి.

### జటప్రోలు సంస్థానం (క్రీ.శ. 16-20 శతాబ్దాలు)

పద్మనాయకుల మూలపురుషుడు భేతాళ నాయకుడు. సర్వజ్ఞ సింగ భూపాలుడు ఈ వంశంలోనివాడే. ఇతని తరువాత ఐదోతరానికి చెందిన కుమార మాదానాయకుడు. సురభి మాధవరాయలు కొల్లాపురం ప్రాంతాన్ని ఏలిన ముఖ్యులు. క్రీ.శ. 16వ శతాబ్దంలో కుమార మాదానాయకుడు, సురభి మాధవరాయలు కొల్లాపురం ప్రాంతాన్ని ఏలిన ముఖ్యులు. క్రీ.శ. 16వ శతాబ్దంలో కుమార మాదానాయకుడు జటప్రోలులో తన పేరుమీదుగా మదనగోపాల స్వామి ఆలయాన్నీ, చంద్రికా పరిణయమనే ప్రబంధాన్ని రచించిన మాధవరాయలు తన పేరుమీదుగా మంచాలకట్టలో మాధవస్వామి ఆలయాన్నీ, విజయనగర శైలిలో నిర్మించారు. విజయనగరపాలన అంతరించిన కొంత కాలానికి మాధవరాయని తరువాతిపాలకులు క్రీ.శ. 1650ప్రాంతంలో

గోల్కొండ ప్రభువు అబ్దుల్లా కుతుబ్‌షా నుండి సన్నదు ద్వారా జట ప్రోలుపై పాలనాధికారాన్ని పొందారు. సురభి లక్ష్మణరాయని కాలం వరకూ జటప్రోలు రాజధానిగా ఉండేది. ఇతని కాలంలోనే అంటే క్రీ.శ. 1840లోఇతడు తన రాజధానిని జటప్రోలు నుంచి 'కొలుముల పల్లె' అని పిలువబడిన కొల్లాపూర్‌కు మార్చాడు. అప్పటినుంచివీరు కొల్లాపురం సంస్థానాధీశులుగా పిలువబడ్డారు. నిజాంప్రభువులచే రాజా బహద్దూర్, నిజాం నవాజ్‌పంత్ బిరుదులను పొందిన రాజాలక్ష్మణరావు కుమారుడు రాజా లక్ష్మీ జగన్నాథరావు క్రీ.శ. 1851 నుంచి 1854 వరకూ కొల్లాపురాన్ని పాలించాడు. ఇతనికి సంతానం లేకపోతే దత్తత తీసుకున్న వెంకటగిరి సంస్థానాధిపతి నాల్గవ కుమా రుడైన కృష్ణయాచేంద్రుడు 1884 వరకూ కొల్లాపురం రాజాగా ఉన్నాడు. తరువాత వెంకటలక్ష్మా రావు భార్య వెంకటరత్నాంబ కొంతకాలం పాలనచేశారు. తరువాత రాజా సురభి వెంకట జగన్నాథరావు పాలన చేపట్టాడు. ఇతని భార్య రాణీ ఇందిరాదేవి. వీరి కాలంలోనే కొల్లాపురం సంస్థానం (1948లో) హైదరాబాదు రాష్ట్రంలో విలీనమైంది. జట ప్రోలు,కొల్లాపురం సంస్థానాల పాలనలో సోమశిల గ్రామం ఉండేది. క్రీ.శ. 19వ శతాబ్దంలో సోమశిల రాయలసీమ నుంచి తెలంగాణా ప్రాంతాన్ని కలిపే ఫెర్రీపాయింట్లలో ఒకటిగా ఉండేదని 1830 జూన్ 21వ తేదీన మద్రాస్ నుంచి కాశీ యాత్రలో భాగంగా సిద్దేశ్వరం నుంచి కృష్ణానదిని దాటిన ఏనుగుల వీరాస్వామి తన కాశీయాత్ర చరిత్రలో పేర్కొన్నాడు.

## ఆలయవాస్తు, శిల్ప సంపద

సోమశిలలో మొత్తం 13 దేవాలయాలున్నాయి. వాటిలో తొమ్మిది దేవాలయాలు, 32 స్థంభములు గల మహామంటపం చుట్టూ కలుపుతూ ఉండగా, మిగిలిన నాలుగు దేవాలయాలు విడిగా ఉన్నాయి. గర్భాలయ, అర్థ మండపాలతో కూడిన ఈ ఆలయాలన్నీ శివాలయాలే.

**1, 2, 3 దేవాలయాలు :** ఇవి గర్భాలయ, అర్థ మంటపములు గల్గి త్రికూటాలయంగా ఏర్పడిన తొలి చాళక్య నిర్మాణాలు. మంచకాధి ష్ఠానములపై పాదవర్గము, ప్రస్తరము, కప్పుపై 5 అంతస్థుల కదంబ నాగర విమానాలున్నాయి. ద్వార బంధములపై గల తక్కువ శిల్పకళ, గర్భాలయము పైకప్పు చదరముగానూ ఉండటంచేత ఇవి తొలి చాళుక్య నిర్మాణాలు (క్రీ.శ. 7వ శతాబ్దము)గా గుర్తింపబడ్డాయి.

**4వ దేవాలయం :** దక్షిణాభిముఖంగా ఉన్న ఈశ్వరాలయం అర్థమంటముపై చక్కటి మకర తోరణము అలంకరించబడియుంది. వాస్తు, శిల్ప, శైలిననుసరించి రాష్ట్రకూటుల కాలంలో ఈ ఆలయం నిర్మించబడింది. (క్రీ.శ. 8వ శతాబ్దం)

**5, 6, 7, 8 దేవాలయాలు :** ఇవి కళ్యాణీ చాళుక్యుల కాలం (క్రీ.శ 11వ శతాబ్దం)లో నిర్మింపబడిన ఆలయాలు. 5వ నంబరు దేవాలయ సోమసూత్రంపై మొదటి సోమేశ్వరుని శాసనముంది. కొంతభాగం చెక్కి అధిష్ఠానంలో బిగించటం వలన ఈ శాసన విషయం పూర్తిగా తెలియరాలేదు.

**9వ దేవాలయం :** ఇది కళ్యాణీచాళుక్యుల కాలంలో నిర్మింపబడి కాకతీయుల కాలంలో పునరుద్ధరింపబడిన ఆలయం. (క్రీ.శ. 13వ శతాబ్దం). కాకతీయ ప్రతాపరుద్రుని రెండు శాసనాలు ఈ ఆలయం ముందు ఉన్నాయి.

**10, 11, 12 దేవాలయాలు :** ఇవి కాకతీయుల తరువాత కాలంలో నిర్మింపబడినవి. మిగిలిన ఆలయాలపై విమానములు పడిపోగా, 11వ నంబరు దేవాలయం విమానంతో ఉంది.

**13వ దేవాలయం :** ఇది క్రీ.శ. 17వ శతాబ్దంలో నిర్మింపబడిన ఆలయం. పూర్వం ఇది 10, 5 దేవాలయాల మధ్య ఉండేది. పునర్ని ర్మాణ సమయంలో 1,2 ఆలయాల మధ్యన నిర్మించి అందులో లలితా దేవిని శ్రీ చక్రముతో సహా ప్రతిష్ఠించటమైంది.

**మండపం :** 8 ఆలయాలను కలుపుతూ నిర్మింపబడిన 32 స్థంభముల మండపం క్రీ.శ.7-13 శతాబ్దాల మధ్య వివిధదశల్లో నిర్మించబడింది. ఇందలి అశ్వపాదములపైనున్న స్థంభములు, బహు కోణములు గల పట్టములతోనూ, కలశం, ఘటం, ఫలకాపద్మం, పోదికలతో ఉన్నాయి. కళ్యాణీచాళుక్య, కాకతీయుల కాలంలో నిర్మిం చిన మంటప స్థంభములకు మాత్రమే ఫలకాపద్మములున్నాయి. దూల ములు, కప్పు సాదాగనే ఉన్నాయి.

**శిల్పము :** 2వ నంబరు దేవాలయ ద్వారముపై గల వాస్తు శిల్పము తొలి చాళుక్యుల కాలమునాటిది. గడప ముందరి శంఖ, పద్మనిధులు, ద్వారశాఖలపైనున్న కలశాలు, పతంగంపై గల శాలా గారము ఈ కాలము నాటివే. 4వ నంబరు దేవాలయపు ద్వారముపై గల ద్వారపాలకులు. ముందరి తోరణముపై గల మకరము, ఋషుల ప్రతిమలు రాష్ట్రకూట శైలిలో మలచబడినవే. కళ్యాణీచాళుక్య ద్వారపాల శిల్పాలను 5, 6, 7, 8 ఆలయాలలో చూడవచ్చు. 8వ దేవాలయం ముందున్న మండపం కప్పుపైన సోమేశ్వరుని చుట్టూ వాహనాలపై ఉన్న దిక్పాలశిల్పాలు,5,6 ఆలయాల ముందు గల మండపం కప్పు పైన వాహనాలపైనున్న దిక్పాలకులు, మధ్యనున్న చతుర తాండవ మాడుతున్న షడ్భుజనటరాజ శిల్పాలు క్రీ.శ. 8-9 శతాబ్దాలకు చెందిన చాళుక్య - రాష్ట్ర కూటశైలికి ప్రతిబింబాలు. 7వ ఆలయం ముందరి మండప స్థంభాలపైగల త్రిమూర్తుల ప్రతిమలు కాకతీయ శైలిలో చెక్కబడినవి. త్రిమూర్తులలోని శివుడు సుఖాసనంలో భూస్పర్శముద్రతో నుండగా, నిలబడిన బ్రహ్మ, విష్ణుమూర్తులు అంజలి ఘటిస్తున్నారు. 9వ ఆలయపు స్థంభాలపై విష్ణుశర్మ రచించిన పంచతంత్ర కథలు న్నాయి. మరో స్థంభం మీద మహాభారత యుద్ధంలో రథంపైనున్న కృష్ణార్జునులను శిల్పులు చక్కగా మలిచారు. ముందు గుర్రాలు, జెండాపై కపిరాజు కదనకుతూహలాన్ని స్పష్టం చేస్తున్నాయి.

**వెంకటేశ్వరాలయం :** ఊరి ముందర మొదటిగా కన్పించే వెంకటేశ్వరాలయం తొలి కాకతీయులకాలంలో నిర్మించబడింది. గర్భాలయ, అర్ధమండపాలచుట్టూ ప్రదక్షిణ పథంతో సాంధార పద్ధతిలో నిర్మింపబడిన ఈ ఆలయం మొగిలిచర్ల, ఎరుకవరంలలో గల తొలి కాకతీయాలయాల్ని పోలి ఉంది. విమానమునకు ముందు అర్ధమండపంపై సుకనాసి ఉన్న గుర్తులున్నాయి. ద్వారబంధం, కప్పుపై భాగంలోనూ, స్థంభములపైన గల శిల్పం కాకతీయ శైలికి దర్పణం పడుతుంది. ఆలయంలో ప్రస్తుతమున్న వెంకటేశ్వర, శ్రీదేవి, భూదేవి విగ్రహములు జటప్రోలు సంస్థానం వారు విజయనగర శైలిలో క్రీ.శ. 17వ శతాబ్దంలో చెక్కించినవి. సోమశిలలో ఇంకా చాళుక్య, రాష్ట్ర కూట, కళ్యాణీ చాళుక్య, కాకతీయ కాలాలకు చెందిన వినాయక, మహిషమర్ధని, భైరవ, సప్తమాతృక, నంది శిల్పాలు అనేకం ఉన్నాయి.

**శాసనాలు :** సోమశిల దేవాలయాన్ని ప్రస్తావించిన ఆరు శాస నాలు లభించాయి. అవి క్రీ.శ. 1055-1297 సం॥ మధ్యకాలంలో కళ్యాణీచాళుక్యులు, తరువాత కాకతీయులు రాజ్యం చేస్తున్న సంద ర్భంలో వారికి సామంతులుగా నున్న చెఱకు వంశపు ప్రభువులు, కందూరు చోళులు సోమనాధుని ధూపదీప నైవేద్యాలకూ, విద్యా దానానికీ, ఇంకా ఆలయ అధికారులకు కొన్ని వృత్తులను ఇచ్చిన దాన వివరాలను తెలుపుతున్నాయి.

1. సోమశిలలో 5వ నంబరు దేవాలయ సోమ సూత్రంపైనున్న శాసనం. ఇది కళ్యాణీచాళుక్య రాజైన త్రైలోక్యమల్ల మొదటి సోమే శ్వరుని పాలనాకాలం క్రీ.శ. 1055లో ఇచ్చిన దానశాసనం. అక్షర ములు చెరిగిపోవటం చేత ఇతర వివరాలు తెలియలేదు. శాసనంలో పల్నాటి ప్రాంతాన్ని పాలించిన హైహేయ వంశపువారిని ప్రస్తావిం చారు. పల్నాటి హైహేయులు కళ్యాణీచాళుక్యుల సామంతుల్లో ఒకరు.

2. మహబూబ్‌నగర్ జిల్లా జడ్చర్ల తాలూకాలోని గంగాపురం శాసనం. ఇది కళ్యాణీచాళుక్య రాజైన త్రిభువన మల్ల ఆరవ విక్రమా దిత్యుని పాలనాకాలంలో సామంతరాజులైన, కందూరు చోళ వంశానికి చెందిన భీమరస, సోమలదేవి క్రీ.శ. 1118 వ సం॥లో ఇచ్చిన దాన శాసనం. వారు సోమశిలలో తాము ప్రతిష్టించిన గంగేశ్వరుని ధూప దీపనైవేద్యాలకు, విద్యాదానానికీగాను చేసిన కొన్ని దానాలు ఈ శాసనంలో చెప్పారు. ఇందులో శైవమతాచార్యుడు వాగీశ్వర పండితుడు కూడా చెప్పబడినాడు. శాసనంలోని అక్షరాలు సరిగా కనిపించక పోవటం వల్ల దాన వివరాలు స్పష్టం కాలేదు. (తెలంగాణా శాసనాలు, మొదటి సంపుటం, 3వ శాసనం)

3. మహబూబ్‌నగర్ జిల్లా, అచ్చంపేట తాలూకాలోని లింగాల లోని కందూరు చోళుల శాసనం. క్రీ.శ. 12వ శతాబ్దంలో కందూరు ఉదయన చోళ మహారాజు తరువాత కందూరునాడు (కృష్ణానదికి ఉత్తరం వైపున్న కర్నూలు, మహబూబ్‌నగర్, నల్గొండ జిల్లాలలో కొంతభాగం)ను పాలించిన అతని కుమారులు భీమ, గోకర్ణదేవుల వద్ద మహా మాండలికునిగా పనిచేసిన 'తాండ' అనునతడు కందూరు మండలంలోనున్న సోమశిల దేవాలయానికి లింగాల గ్రామమును దానమిచ్చినట్లు తెలుపుతుంది. (బి.యన్. శాస్త్రి, కందూరు చోడుల చరిత్ర, శాసనాలు (లింగాల శాసనం. 64) హైదరాబాద్, 1986)

4. గుంటూరు జిల్లా మల్కాపురంలోని కాకతీయ గణపతిదేవుని క్రీ.శ. 1261వ సం॥పు శాసనం. ఇందులో రుద్రమదేవి జన్మదిన మహోత్సవాల గురించి ప్రస్తావన ఉంది. శాసన వివరాల ప్రకారం, కాకతీయ రాజగురువు, పాశుపత శైవమత ప్రచారాన్ని గోళకీ మఠ స్థాపన ద్వారా ప్రచారం చేసిన విశ్వేశ్వర శివాచార్యుడు సోమశిలలో ఒక లింగాన్ని ప్రతిష్టించి ఐతప్రోలు అనే గ్రామాన్ని దానం చేసినట్లు, వెల్లాల స్థలంలోనున్న నివృత్తీ సంగమేశ్వరంలో కూడ మరో లింగాన్ని ప్రతిష్టించి ఆత్మకూరు సమీపంలోని దుద్యాల గ్రామాన్ని దానం చేసిన వివరాలున్నాయి. (సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్,వాల్యూం x, నం. 395)

5. సోమశిల ఆలయమంటపంలోనున్న క్రీ.శ. 1295వ సం॥ కాకతీయ ప్రతాపరుద్రుని కాలంలో కాకతీయ సేనాధినాధుడైన చెఱకు బొల్లయ సోమశిలలోని సోమనాధునికి ఇచ్చిన దాన శాసనం. దీని ప్రకారం బొల్లయ, తన తండ్రికి, రాజు ప్రతాపరుద్రునికీ పుణ్యం కొరకు సోమనాధునికి కందూరు దేశంలోని ప్రోలయపురిని దానం చేసినట్లుంది. ఈ శాసనంలో ఇంకా శంకరశివాచార్యులు, తాడిమడ్ల పల్లి, ప్రోలయపల్లి ప్రస్తావించబడినాయి. (ARE : 1975-7E, No. 37).

6. సోమశిల ఆలయ మంటపంలో నున్న కాకతీయ ప్రతాప రుద్రుని కాలానికి చెందిన క్రీ.శ. 1297వ సం॥నికి చెందిన శాసనం. ఇందులో బాచన ప్రగ్గడ, రుద్రయ ప్రగ్గడలు, సోమశిల సోమ నాధదేవునికి ఆలయ అధికారులైన ఆయమల్లి, సోమయ, ఉదయన ప్రెగ్గడ్లను ప్రస్తావించారు. ఈ శాసనంలో రాచగురువైన ప్రసన్న శివా చార్యుని కొడుకు శంకర శివాచార్యుడు చింతపల్లిలో మకాం చేసిన ట్లుండటం చేత ఈ చింతపల్లి సోమశిలకు దగ్గరలోనున్న మొలచింత పల్లిగా గుర్తించవచ్చు. (ARE : 1975-76, No. 38).

7. సోమశిల మసీదులో గల సమాధిపై ఇబ్రహిం కుతుబ్‌షా అల్లుడు సయ్యద్ కమాలుద్దీన్‌ను ప్రస్తావించిన క్రీ.శ. 1609వ సం॥ శాసనం ఒకటి ఉంది. అందులో మహమ్మద్ ఖులీకుతుబ్‌షా కమాలు ద్దీన్‌ను కొంత సైన్యాన్నిచ్చి యుద్ధానికి కొల్లాపూర్ ప్రాంతానికి పంపగా అక్కడే మరణించినట్లు చెప్పబడింది.

**చిరునామా :** *నవులూరి మల్లికార్జునరావు, 8-6-530, శ్రీనివాసపురం కాలని, ఎన్‌జీవోస్ కాలనీ, వనస్థలిపురం, హైదరాబాద్ - 67, 9849905718*

శ్రీ ఎస్.కె. సైదా

# కృష్ణా పుష్కర వైభవం

**నమామి సుకృత శ్రేణీం కృష్ణవేణీం తరంగిణిమ్ ।**

**యద్వీక్షణం కోటి జన్మకృత దుష్కర్మ శిక్షణమ్ ॥**

పుణ్య పరంపరలు కల ఏ నదిని చూసినంత మాత్రానే కోటి జన్మలలో చేసిన పాపాలు నశిస్తాయో అటువంటి నదీమతల్లి కృష్ణవేణికి నమస్కరిస్తున్నాను.

**జల విశిష్టత:**

సమస్త జగమునకు అన్నింటికి మూలమైనది జలం. ఆ జలం యొక్క స్థానం అంతరిక్షం. దాని స్థితి లోకంలోని సమస్తజీవరాశికి మూలం. **"యదదః సంప్రయతీర హావనద తాహతే। తస్మాదానద్యో నామస్థ తావోనామాని సిన్ధవః ।"**

ఆకాశమందుండు జలము క్రిందికి వస్తున్నప్పుడు మేఘమునకు తాడితమై వర్షధారలుగా కురియుచున్నవి. ఆ కురిసే జలధారలే నదులు అని వేదం చెబుతుంది."నద శబ్దే" అను ధాతువు నుండి నదీ అనుపదము ఉత్పన్నమైనది. అనగా ధ్వనించునది లేక నదించునది అని అర్థం.

**"విశ్వస్యమాతర స్సర్వాః పాపహరాస్మృతాః"** ప్రపంచమునకు మాతృస్వరూపాలు మరియు సమస్త పాపాలను హరించునవి అని మార్కండేయ పురాణం నదులను కీర్తిస్తోంది. నదులన్నీ స్త్రీ రూపాలుగా పరిగణించబడుతున్నాయి. అందుకే అన్ని నదులు స్త్రీ దేవతలుగా ఖ్యాతిపొంది కీర్తించబడుతున్నాయి.

నదీమ తల్లులను దేవతలుగా ఆరాధించే సంస్కృతి మనది. పరమేశ్వరుడు పరోక్షంగా లేడనీ, మనచుట్టూ ఉన్న ప్రకృతిలోనే ఆయన తన కరుణామయ శక్తిని ప్రసరింపజేస్తున్నాడనీ పరిశీలించి ప్రత్యక్షం చేసుకున్న భవ్య సంస్కృతి మనది.

జీవనవాహినులైన నదులను ఆధారం చేసుకుని అద్భుతమైన నాగరికతలు విలసిల్లాయి. పచ్చదనాన్ని, చల్లదనాన్ని నదుల వల్ల అందుకున్న తీరప్రాంతాలు ఒక సాత్వికసంస్కృతిని వృద్ధి చేసుకున్నాయి. దాహార్తిని తీర్చి, నేలను పండించే నదులను జగన్మాత స్వరూపాలుగా సరియైన దర్శనం చేసిన సంప్రదాయానికి నమోవాకాలు.

నదీజలాల స్నానాలు దేహశుద్ధిని మంచి బుద్ధిని కలుగచేస్తాయి. జలము మనకు ఆహారాన్ని ఇస్తున్నాయి. అందుకే జలపూర్ణములైన నదులను 'భక్తి ముక్తి' దాయకాలు అని కీర్తిస్తారు. అలాంటి నదులు పుష్కరసమయమందు మరింత పవిత్రాలై పాపహరాలై, రోగనివారక మైన ఔషది విశేషాలతో పుష్కలంగా నిండి ఉంటాయి.

**పుష్కర మహత్యం :**

పుష్కరం అంటే జలం అని అర్థం. "పోషయతీతి పుష్కరం" పోషించేది అని అర్థం. పుష్కరమనగా పవిత్రీకృత జలమని వైదికార్థం. నదుల యొక్క పూర్ణత్వం పుష్కర సమయంలో వ్యక్తమవుతుందని, యౌవనకాలంలో మనిషి శక్తిమంతంగా ఎలా ఉంటాడో పుష్కర కాలంలో నది కూడా అలాగే చైతన్యవంతమై ఉంటుంది.

పుష్కరం అంటే పన్నెండు సంవత్సరాలు. ఒక్కొక్క నదికి పన్నెండు సంవత్సరాలకు ఒక్కసారి పుష్కరాలు వస్తాయి. పుష్కరాలు జరుపుకోవడం వెనుక ఉన్న గాథల్లో ప్రధానమైనది 'తుందిలుడి' కథ. పూర్వం తుందిలుడు అనే వ్యక్తి పరమేశ్వరుడి గురించి తపస్సు చేసి శాశ్వతంగా పరమేశ్వరుడిలో వుండేటట్టుగా వరం పొందాడు.

పరమేశ్వరుడు తన అష్టమూర్తులలో ఒక్కరైన జలరూపంలో తుందిలుడికి స్థానం ఇవ్వడంతో పాటూ మూడున్నర తీర్థాలకు సార్వభౌముడిని చేశాడు. అనంతరం బృహస్పతి బ్రహ్మదేవుడిని గురించి తపస్సు చేసి తన ఆధీనంలో పుష్కరుడిని వుంచివలసినదిగా కోరాడు. అయితే బ్రహ్మదేవుడుని విడిచి వెళ్ళడం ఇష్టం లేని పుష్కరుడు బ్రహ్మదేవుడిని కూడా తనతో రమ్మని వేడుకోగా అందుకు వీలుకాదని చెప్పిన బ్రహ్మదేవుడు ఒక ఏర్పాటుచేశాడు.

దేవతల గురువైన బృహస్పతి మేషది రాశులలో ప్రవేశించే సమయంలో పన్నెండు రోజులు, ఆ రాశినుంచి నిష్క్రమించే సమయంలో పన్నెండు

రోజులు, మిగిలిన అన్నిరోజులలో మధ్యాహ్న సమయంలో రెండు ముహూర్తాల కాలం పుష్కరుడు బృహస్పతిలో వుండాలని, ఆ సమయంలో తనతోపాటు సమస్త దేవతలుకూడా బృహస్పతితో ఉండేటట్లు బ్రహ్మదేవుడు ఏర్పాటుచేశాడు. అప్పటినుంచి నదులకు పుష్కరాలు ప్రారంభమయ్యాయి.

ఈ సమయంలో బ్రహ్మ, బృహస్పతి, పుష్కరుడు నదీదేవతలతో పాటు ముక్కోటి దేవతలు ఆ నదీజలంలో కొలువై వుంటారని ప్రతీతి

"మేషే గంగా వృషే రేవా మిధునే చ సరస్వతీ।
కర్కటే యమునా ప్రోక్తా సింహే గోదావరీ స్మృతా॥
కన్యాయాం కృష్ణవేణీ చ కావేరీ ఘటకే స్మృతా।
వృశ్చికే తామ్రపర్ణీ చ చాపే పుష్కర వాహినీ॥
మకరే తుంగభద్రా చ కుంభే సింధునదీ స్మృతా॥
మీనే ప్రణీతా చనదీ గురోస్సం క్రమణే స్మృతా॥
పుష్కరాఖో మునీనాం హి ప్రవేశోఽబుధైః స్మృతా॥

బృహస్పతి(గురువు) మేషరాశిలో ప్రవేశించినప్పుడు గంగకు, వృషభరాశిలో ప్రవేశించినప్పుడు నర్మదకు, మిధునరాశిలో ప్రవేశించి నప్పుడు సరస్వతినదికి, కర్కాటక రాశిలోప్రవేశించినప్పుడు యమునకు, సింహరాశిలో ప్రవేశించినప్పుడు గోదావరికి, కన్యారాశిలో ప్రవేశించి నప్పుడు కృష్ణవేణి నదికి, తులారాశిలో ప్రవేశించినప్పుడు కావేరినదికి, వృశ్చికరాశిలో ప్రవేశించినప్పుడు భీమరధికి (తామ్రపర్ణీ), ధనస్సు రాశిలో ప్రవేశించినప్పుడు పుష్కరవాహినికి (బ్రహ్మపుత్రా నదికి) మకర రాశిలో ప్రవేశించినప్పుడు ప్రణితానదికి పుష్కరాలు వస్తాయి.

## పురాణాల ప్రకారం కృష్ణానది పుట్టుక :

పూర్వం బ్రహ్మ సహ్యాద్రి శిఖరంపై యజ్ఞం చేయదలచి హరి హరాదులు సమస్తదేవతలను ఆహ్వానించగా యజ్ఞన సమయమునకు బ్రహ్మ సతీమణి సరస్వతీదేవి రాక ఆలస్యంకాగా సరస్వతీదేవి స్థానంలో గాయత్రీ దేవిని యజ్ఞదీక్షలో బ్రహ్మకు భాగస్వామ్యం వహింపమని హరిహరులు ప్రతిపాదింపగా, యజ్ఞదీక్షలో గాయత్రీతో బ్రహ్మదేవుని చూసిన సరస్వతీదేవి జరిగిన విషయం గ్రహించి కోపించి అందరినీ నదులై ప్రవహించుగాక అని శపించింది.

విష్ణుమూర్తి రావిచెట్టు క్రింద కృష్ణానదిగా, పరమేశ్వరుడు ఉసిరి చెట్టు క్రింద వేణనదిగా ప్రవహించి రెండు కలిసి కృష్ణవేణిగా ప్రసిద్ధి. మిగిలిన దేవతలు ఉపనదులుగా సమస్త దేవత స్వరూపంగా కృష్ణవేణి నదికి కీర్తి లభించింది.

మహారాష్ట్రలోని మహాబలేశ్వర్‌లో మహదేవ సమీపంలో సహ్యాద్రి పైన పురాతన దేవాలయం వద్ద కృష్ణానది పుట్టింది. క్వయినా, పెన్నా, సావిత్రి నదులు కూడా పుట్టాయి సముద్ర మట్టానికి 4,714 అడుగుల ఎత్తున ఉన్న దేవాలయంలో చెక్కబడిన గోమాత నోటిద్వారా ఉవ్వెత్తున ఎగసే స్వచ్ఛమైన నదీజలం పశ్చిమకనుమల ద్వారా ప్రవహిస్తూ మహారాష్ట్ర, కర్ణాటక, తెలంగాణా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలగుండా నదీతీరాన అనేక పుణ్య క్షేత్రాలతో శోభిల్లుతూ సమస్త ప్రాణికోటికి ప్రాణదాత అయి ఆంధ్ర ప్రదేశ్‌లోని కృష్ణాజిల్లాలో హంసలదీవి వద్ద సముద్ర సంగమం అవుతుంది.

## కృష్ణ పుష్కర మహోత్సవములు :

శ్రీ దుర్ముఖ నామ సంవత్సర శ్రావణ శుద్ధ నవమి శుక్రవారం ది.12-08-2016 నుండి

శ్రావణ బహుళ షష్ఠీ మంగళవారం ది.23-08-2016 వరకు కృష్ణానది పుష్కర మహోత్సవములు.

శ్రీ దుర్ముఖ నామ సంవత్సర శ్రావణ శుద్ధ అష్టమి గురువారం ది.11-08-2016 రాత్రి 10.56 ని॥లకు గురువు ఉత్తరా నక్షత్ర ద్వితీయ చరణమున కన్యారాశి యందు ప్రవేశించును. పర్యాంతము ది.23-08-2016 మంగళవారం వరకు పుష్కర మహోత్సవం జరుగును. అర్థరాత్రి సమయమునందు కన్యారాశి ప్రవేశము కావున ది.12-08-2016 బ్రహ్మీ సమయమునుండి పుష్కర విధుల ప్రారంభం చేయుట శుభప్రదం. ఆ రోజు నుండి కృష్ణమ్మకు పుష్కరశోభ.

పుష్కర సమయం కృష్ణవేణీ నదిలో స్నానం చేస్తే గంగ-గోదావరి మొదలైన నదుల్లో 12 సంవత్సరాలు ప్రతిరోజూ స్నానం చేసిన ఫలితం కలుగుతుందని బ్రహ్మాండపురాణం చెప్తోంది.

అశ్వమేధయాగఫలంకంటే ఎక్కువ ఫలితాన్ని, కృష్ణా పుష్కర స్నానం ఇస్తుందని, ఇంకా నర్మద తీరంలో తపస్సు, కురుక్షేత్రంలో దానం, కాశీలో మరణం ఈ మూడూ మోక్షాన్నిస్తాయని కృష్ణ పుష్కరస్నానం వల్ల పై మూడింటివల్ల కలిగే ఫలితం వస్తుందని పద్మపురాణం పేర్కొంది. పుష్కరవిధిని ఆచరించటానికి ముందురోజు ఒక పూటన ఉపవసించి, మరునాటి ఉదయం మండనం, స్నాన, దాన, తర్పణాదుల నాచరించుట ఉత్తమం. పుష్కర సమయాన 12 రోజులు చేయదగిన దానములు.

## దాన మహిమ :

ది. 12-08-2016 శుక్రవారం-మొదటి రోజున వెండి, భూమి, సువర్ణము, ధాన్యము దానమీయవలెను. హిరణ్యశ్రాద్ధము చేయవలయును.

ది. 13-08-2016 శనివారం - రెండవ రోజున గోవులు, లవణము, మణులు, వస్త్రములు దానమీయవలెను.

ది. 14-08-2016 ఆదివారం - మూడవ రోజున అశ్వము, గుడము, ఫలములు, శాకములు దానమీయవలెను.

ది. 15-08-2016 సోమవారం - నాలుగవ రోజున తైలము, ఆజ్యము, క్షీరము, తేనె, పానకము దానమీయవలెను.

ది. 16-08-2016 మంగళవారం - ఐదవ రోజున ధాన్య శాకములు, నాగలి, వృషభము, మహిషము దానమీయవలెను.

ది. 17-08-2016 బుధవారం - ఆరవ రోజున కస్తూరి, చందనము, ఔషధము దానమీయవలెను.

ది. 18-08-2016 గురువారం - ఏడవ రోజున గృహము, శయ్య, పీట, ఊయల దానమీయవలెను.

ది. 19-08-2016 శుక్రవారం-ఎనిమిదవ రోజున శ్రీ చందనము, కందమూలములు, పుష్పములు దానమీయవలెను.

ది. 20-08-2016 శనివారం - తొమ్మిదవ రోజున దాసీ దానము, కంబలము దానమీయవలెను.

ది. 21-08-2016 ఆదివారం-పదవ రోజున ముత్యాల హారము, వెండి, పుష్పములు దానమీయవలను.

ది. 22-08-2016 సోమవారం -పదకొండవ (ఏకాదశ) రోజున పుస్తకము, తాంబూలము, యజ్ఞోపవీతము దానమీయవలెను.

ది. 23-08-2016 మంగళవారం - పన్నెండవ (ద్వాదశ) రోజున మహాదానములు, అమశ్రాద్ధము చేయవలెను.

విశేష మేమనగా తీరవాసులు, అన్నశ్రాద్ధము, ఇతరులు హిరణ్య శ్రాద్ధము చేయవలయునని ప్రతీతి.

దానం దేవాః ప్రశస్తన్తి మనుష్యాశ్చ తథాద్విజాః ।
దానేన కామనాప్నోతి యానాంశ్చిన్మనసేచ్ఛత ॥

దానం చేయుట వలన దేవతలు, మనుష్యులు, ద్విజులు ప్రశంసిస్తారు. దానం చేయడం వలనే మానవులు తమ కోర్కెలు తీర్చుకొనగలుగుతారు అని విష్ణుధర్మోత్తరం చెబుతుంది. కృష్ణానదిలో స్నానం చేయడం ఇష్ట కామ్యార్థ సిద్ధిని మోక్షప్రాప్తిని కలిగిస్తుంది.

---

కాకరపర్తి భావనారాయణ

దాతయై పరితల వ్రాతలు మార్చంగ
కాలేజి నిర్మించి గణ్యుడయ్యె
ప్రజకు సేవనుజేయ బద్ధకంకణుడౌచు
పురమున ఛైర్మనై పూజలందె
'కాళేశ్వరుని' పేర కట్టించి మార్కెట్టు
విజయవాడకు పన్నెబెంచిమించె
'గాంధి' హైస్కూలును ఘనముగా స్థాపింప
బాలబాలికలకు మేలుఁగలిగె
అతని పేరు తోనె అమరెను కాలేజి
విద్యలన్న మోజు విమలమతికి
పరమ దాన సుగుణ 'భావనారాయణ'
కీర్తి కళలరాణి! కృష్ణవేణి!

– స్మితశ్రీ చింతపల్లి నాగేశ్వరరావు

చిరునామా : ఎస్.కె. సైదా, డోర్ నెం. 67-9-13, దర్శిపేట, పటమట, విజయవాడ-520 010, చరవాణి : 80088 41447.

డా॥ జి.వి. పూర్ణచందు

# ఆంధ్ర దీపిక తొలి తెలుగు నిఘంటువు

"నేను మామిడి వంశాంబునిధి విధుండ
సూరనాహ్వయు పౌత్రుండను జనహితుడ
వేంకనార్యుని పుత్రుండ వినుత యశుండ
వేంకటార్యసమాఖ్యచే వెలయువాడ"

"పండితరాయ', 'బాలామర', 'సాహిత్య చక్రవర్తి' బిరుదాలు పొందిన మామిడి వెంకటార్య పండితులు యావద్భారత దేశంలోనే తొలి ఆధునిక ఆకారాది నిఘంటువులకు ఆది పలికాడు. సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో పండితుడు. ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వంలో అనువాదకుడు. తండ్రి మామిడి వెంకన్న. తాత సూరన్న ఆయన స్వయంగా నూతనత్వం అమరేలాగా నవ్యాంధ్రత్వం నిండేలాగా 'ఆంధ్ర దీపిక' అనే నిఘంటువును కూర్చి ప్రచురించాడు. "ఆంధ్ర శబ్దజాల సంకేతరచనాచాతురీధురీణంబగు నీయాంధ్ర దీపికానామయగ్రంథంబు సేయ సమకట్టితి. సంకేతం బెట్టిదనిన సకల శబ్దంబులు నాద్యక్షర క్రమంబు చేత కూర్చబడుచున్నవి" అని ఆయనే స్వయంగా ఒక వివరణ ఇచ్చారు.

ఆద్యక్షరాలు వరుస క్రమంలో ఉండేలా కూర్చటం ఏ సాంకేతిక ఉపకరణాలూ లేని ఆ కాలంలో, నేటికి రెండువందల ఏళ్ళక్రితం, దేశంలోనే తొలిసారిగా మామిడి వెంకయ్యగారు వంటరిగా కష్టించి సాధించి సత్తా చాటుకున్నారు.

అచ్చు యంత్రాలు వ్యాప్తిలోకి రానున్నాయనీ, పుస్తక ప్రచురణ రంగం ఒక కొత్త విప్లవాన్ని సృష్టించనుందనీ, సాంకేతికాభివృద్ధి కనుచూపుమేరలో ఉందని గ్రహించి, అందుకు తగ్గట్టుగా తెలుగు నిఘంటువు నొకదాన్ని అత్యాధునిక పోకడలతో కూర్చాలనే ముందు చూపుతో కూడిన ఆలోచన 1806 (1816 అని కొందరంటారు) లోనే ఒక తెలుగువాడికి వచ్చిందంటే, అది అద్భుతమైన విషయమే !

"కోశవాన్ ఆచార్య" : అన్నారు. కోశాన్ని అంటే నిఘంటువుల్ని నమిలి మింగినవాడు. పుక్కిలిపట్టినవాడు. దాన్ని జీర్ణించుకున్నవాడు మాత్రమే ఆచార్యుడని ఒక వ్యవహారం ఉండేది. భాషమీద పట్టున్న వాడికి శాస్త్రాలు దాశ్యం చేస్తాయి. భాష అనే ఒక జ్యోతి లేకపోతే ఈ లోకం అంధకారమయమే అవుతుంది. ఈ విషయాన్ని అందరికన్నా ముందు గ్రహించగలిగింది నిఘంటుకర్తలే !

నితరాం=నిజంగా, ఘ్నయతి=చెప్పేది నిఘంటువు. నిజంగా చెప్పేది, సూటిగా చెప్పేది, విడమరచి చెప్పేది, అర్థజ్ఞానాన్ని కలిగించేది, గౌరవంగా చదివేది, గౌరవనీయ వేదాలు, ఉపనిషత్తులు తదితర సాహిత్యాదుల నుండి శబ్దాలు ఏర్చి కూర్చినదీ నిఘంటువు అని స్థూలంగా ఒక నిర్వచనం చెప్పుకోవచ్చు.

'ఘటి' అంటే, భాష ! దీన్నిబట్టి కూడా శబ్ద స్వరూప స్వభావాల్ని తెలియజెప్పేది నిఘంటువని భావార్థం ! వైదిక భాషకు సంబంధించిన నిఘంటువుల్ని నిరుక్తం అంటారు. పాణిని కారణంగా లౌకిక సంస్కృతం ప్రాచుర్యంలోకొచ్చింది. తరువాతికాలాలలో వెలువడిన శబ్ద కోశాలు, వ్యాకరణాలు, నిఘంటువులూ వీటన్నింటికీ పాణినీయం, నిరుక్తాదులు ఆధారాలై నిలిచాయి.

సమాజం ఎదిగే కొద్దీ, భాషల్లో శబ్ద సంపద పెరుగుతుంది. సమాజ అవసరాలు పెరిగే కొద్దీ కొత్త పదాల పుట్టుక అనివార్యం అవుతుంది. కొత్త పరికరాలు, పనిముట్లు, వివిధ సామాజికకార్యాలు వాడకంలోకి వచ్చేకొద్దీ భాషలో నుడులు కొత్తగా ఏర్పడతాయి. వాటిలో కొన్ని తద్భవాలు, కొన్ని తత్సమాలు కూడా ఉండవచ్చు. అందువలన పాత నిఘంటువుల్ని ఎప్పటికప్పుడు పెంపు చేసుకోవటం, కొత్తవి తయారు చేసుకోవటం, అంతకు మునుపు వదిలివేయబడ్డ పదాలను కలుపు కోవటం... ఈ కృషి నిరంతరంగా జరగవలసి ఉంటుంది. నిఘంటి నిర్మాతలకు ఇదంతా పెనుసవాలే !

ప్రచురణరంగం లేని ఆ కాలంలో తర్క వ్యాకరణ శబ్దాది విషయాలకు ప్రాచుర్యం కలగటానికి ఆ నాటి కవులు పద్యాల్లోనో లేక శ్లోకాల్లోనో వ్రాసినారు. అందువలన భట్టీయం వేసి జ్ఞాపకం పెట్టుకోవడానికి ధారణా సౌలభ్యం సమకూరింది.

17వ శతాబ్ది నాయకరాజుల కాలంనాటి గణపవరపు వేంకటకవి తనకాలానికి 24 రకాల సంస్కృత నిఘంటువులు వాడుకలో ఉన్నట్టు చెప్పాడు. నిజానికి 1225లోనే డిక్షనరీ అనే మాట వాడకంలోకి వచ్చింది. డిక్షనరీ అంటే 'గుర్తుంచుకోవలసినది'ని అర్థం. అమరకోశం లాగా ధారణ చేయటానికి వీలుగా ఆనాటి లాటిన్ నిఘంటువులు ఉండేవి. ఆంధ్రనిఘంటువులు పద్యాన్ని లేదా శ్లోకాన్ని ఆశ్రయించి పదకోశాలను నిర్మించారు.

చౌడప్ప నిఘంటువు (చౌడప్ప సీసాలు)లో ఈ చిన్ని ఉదాహరణ పరిశీలించండి.

"విరియనా పువ్వు/సీవిరియనా కల్లు/ వావిరియనా చెట్టు/ కావిరియు-పొగయు/ (విరి అంటే పువ్వు. సీవిరి అంటే కల్లు. వావిరి అంటే చెట్టు. కావిరి అంటే పొగ)

పరియనా డాలు/రూపరి యనా సొగసు/మేపరియనా తిండి/ తేపరస తెగువ..." (పరి అంటే డాలు, రూపరి అంటే సొగసు. మేపరి అంటే తిండి. తేపరి అంటే తెగువ)

ఇది తొలినాటి నిఘంటు స్వరూపం. జ్ఞాపకం పెట్టుకునేందుకు వీలుగా చేసిన ఒక ప్రయత్నం. ఇలాగే, అచ్చ తెలుగు కోశంలో నానార్థవర్గం అధ్యాయంలో ఒక సీసపద్యం ఇలా సాగుతుంది.

**గౌరన నేనుగు, కాహళి విలసిల్లు :** గౌరు అనే పదానికి ఏనుగు, కాహళి(బాకా) అని అర్థాలు

**డంబు నాగను గాంతి డంబము నగు :** డంబు అంటే కాంతి, డంబం (ఆడంబరం) అని అర్థాలు.

అచ్చుయంత్రాల వ్యాప్తి పెరిగాక పరిస్థితి మారింది. ఇవ్వాళ, 2×2=4 అని చెప్పటానికి కాలిక్యులేటర్ ఉపయోగిస్తూ, బుర్ర ఉపయోగించటం మానేసినట్టే, శబ్దాలను ధారణచేయటం కూడా మానేసి పుస్తకం తెరిచిచూడటం అలవాటయ్యింది. లేకపోతే ఇంటర్నెట్ తెరిచి హనుమంతుడు సీతను వెదికినట్టు వెదకటంలా వెదకులాటకు అలవాటు పడిపోతున్నాం. యస్య జ్ఞానగుణదయాసింధో అని, అమరకోశం చెప్పటం మొదలుపెడితే "గోడ దూకితే అదే సందో..." అని మనుషులు తప్పించుకుంటారనే వ్యంగ్యోక్తి ఇందుకే పుట్టింది !

ఆ రోజుల్లో ధారణా పటిమ అనేది సామాన్యుడి సొత్తు. ధారణ వలన మెదడు శక్తిమంతం అవుతుంది. ఈ రోజున అది అత్యంత స్వల్పసంఖ్యలో ఉన్న మేధావులకు పరిమితం అయ్యింది. మొన్న మొన్నటి దాకా వ్రేలికొనలమీద వందలకొద్దీ టెలిఫోను నెంబర్లు గుర్తు పెట్టుకునేవాళ్ళం. ఇప్పుడు మన ఇంటికే ఫోను చెయ్యాలంటే నెంబరు కొట్టకుండా కాంటాక్ట్సులోకి వెళ్తున్నాం. కాలక్రమంలో ధారణ చేయటాన్ని మనిషి మానుకుంటే మెదడు జ్ఞాపకం పెట్టుకునే శక్తిని క్రమేపీ కోల్పోయే ప్రమాదం ఉంది.

ఆంధ్రదీపిక అనేక కొత్త పదరూపాలను ఆవిష్కరించింది. వాటిని చదివి గుర్తుపెట్టుకోగలిగితేనే భాషపైన పట్టుదొరుకుతుంది. ఇతర నిఘంటువుల గురించి అలా ఉంచితే, ప్రతిరోజూ రెండు లేక మూడు పేజీలు ఆంధ్రదీపికని క్రమంతప్పకుండా చదివితే నలభైవేల తెలుగు పదాలపైన సాధికారికత దక్కుతుంది. పైగా మెదడు పదునెక్కుతుంది.

ఇతరులకన్నా భిన్నంగా చెప్పాలనే తపన ప్రతి రచయితకూ సహజంగా ఉంటుంది. ఎక్కువ సంస్కృత భూయిష్టంగా రాయాలని ఒకరు చూస్తే, ఒక్క సంస్కృత పదం కూడా లేకుండా రాయాలని మరొకరు ప్రయత్నించటం సహజం. పాల్కురికి సోమనాథుడి బసవ పురాణం దేశీయమైన భావాలకూ, పదాలకూ అద్దంపట్టిన తొలి ప్రజాసాహిత్యంగా చెప్పవలసిన రచన.

సోమనాథుడి తరువాత ఇలాంటి రచనలు ఒకఉద్యమంగా వచ్చి ఉండాల్సింది.కానీ, అచ్చమైన తెలుగు పదాలతో సాహిత్య సృష్టి చేస్తే రసభావాదులు పుష్టిగా ఉండవనే భయంతో కవులు ఆ ప్రయత్నాలను విరమించుకొని నలుగురు నడిచే సంస్కృతం బాటే పట్టారు. అందువలన తెలుగు నిఘంటువుల రాక బాగా ఆలస్యం అయ్యింది. కారణం ఏదైనా కానీండి. దేశీయమైన రచనలు ఎక్కువగా కాల గర్భంలో కలిసి పోయాయి. కానీ, నన్నెచోడుడి కుమారసంభవం లాంటివి కొన్ని రచనలు కాలగర్భంలోంచి బయటకొచ్చి కావ్యగౌరవా లను దక్కించుకున్నాయి. అన్నమయ్య ఎన్నేళ్ళ అజ్ఞాతవాసం తరువాత వేటూరివారి పుణ్యమా అని వెలుగు చూడగలిగాడూ...? అలాగే, ఇంకా మరికొన్ని కొత్త దేశీయ రచనలు ముందు కాలంలో వెలుగులో కొస్తాయని ఆశిద్దాం.

నిఘంటు నిర్మాణంలో ప్రముఖులైన కొందరు కవులు కావ్యాలలో వాడిన పదాలకు ప్రాధాన్యత దక్కింది. కానీ, దేశీయతని తమ రచనలలో ప్రతిబింబించిన కవుల రచనలలోని అచ్చమైన తెలుగు పదాలు, ఒకనాటి ప్రజల నాల్కలమీద నానిన పదాలు కను మరుగై పోసాగాయి. చీపురు రోకలిలాంటి వాడుక పదాలను నిఘంటుకర్తలు విస్మరించటాన్ని గిడుగువారు సూర్యరాయాంధ్ర నిఘంటు విమర్శనంలో తీవ్రంగా దుయ్యబట్టారు. ఇవన్నీ నిఘంటుకర్తల దృష్టి లోపాలే ! తెలుగు శబ్దాలన్నింటిని ఎలాంటి వివక్షా లేకుండా నిఘంటువుల్లోకి చేర్చాలనేది ఒక ఆశయంగా నిఘంటు నిర్మాణం జరగాలి.

బ్రౌన్ నిఘంటువు (1852) పూర్తయ్యేనాటికే గోడౌన్, కాంపౌండ్, బేరర్, మస్టర్ లాంటి విదేశీపదాలు జన వ్యవహారానికొచ్చేశాయి. జమీందార్, రైతు, లోటా, ఆయాలాంటి హిందీ పదాలు కూడా తెలుగు పదాలుగానే చెలామణికొచ్చాయి. అలాంటి చాలా వాటిని ఆంధ్ర దీపికలో చేర్చేందుకు ప్రయత్నించారు మామిడి వెంకయ్యాగారు.

ఆంధ్రదీపికలో లోట శబ్దానికి 'లోట=చిన్న పాత్రము' అని అర్థం ఇచ్చారు. బ్రౌన్ ఈ అర్థాన్ని మరింత విస్తృత పరిచి, lota = ఒక

కంచు పాత్రకు భారతీయ నామం అనీ, చెంబు అనీ రెండు అర్థాల్ని అందించాడు. ఆంధ్రదీపికను ఆధారంగా తీసుకుని బ్రౌన్ దొర తన తెలుగు ఇంగ్లీషు, ఇంగ్లీషూ తెలుగు, మిశ్రమ నిఘంటులు ఈ నిఘంటు త్రయాన్ని మెరుగుపర్చుకున్నాడనేది నిర్వివాద విషయం.

మహమ్మదీయ బాలలకు జరిపించే 'సుస్తీ'ని ఆంధ్రదీపికలో 'సున్నతి' అనే హిందీ శబ్దం అనీ, ఉపనయన సమయంలో శిశ్నము కొనతోలుని ఛేదించటం అనీ, మహమ్మదీయుల, యెహోదీల ఆచార విశేషం అని విపులీకరణ కనిపిస్తుంది. బ్రౌన్ Circumcission: సున్నతి" అని అర్థం ఇచ్చాడు. బ్రౌన్ తరువాత వందేళ్ళకు వచ్చిన సూర్యా రాయంధ్ర నిఘంటువులో సుంతీ గానీ సున్నతిగానీ కనిపించదు. ఎందుకు కనిపించదూ? పదాలను రద్దుచేసేందుకో, నిషేధిం చేందుకో, దాచి వేసేందుకో నిఘంటు కర్తలు ప్రయత్నించకూడదని ఆంధ్రదీపిక, బ్రౌన్ నిఘంటువులు హెచ్చరిస్తున్నాయి.

ఓ విద్యుచ్ఛక్తి ఇంకా వినియోగంలోకి రాని కాలంలో ఎలెక్ట్రిక్ శబ్దానికి బ్రౌన్ ఇచ్చిన అర్థాలు చూడండి. "ఆశ్చర్యకరమైన అద్భుతమైన, ఆకర్షణాపకర్షణ శక్తిగల, మహనీయమైన, అంతర్గతాన్ని సంబంధమైన, మెరుపు, పిడుగుతోకూడా పడే అగ్ని, చకుముకి రాతిలోని నిప్పులాగా తట్టితే పడేటిది..." ఇన్ని అర్థాలిచ్చాడు. ఇప్పుడు మనం విద్యుచ్ఛక్తి అంటున్న కరెంటు గురించి వాళ్ళకు ఆనాటికి ఏమాత్రం తెలియని రోజులవి. ఆంధ్రదీపికలో విద్యుత్తు శబ్దానికి మెరపు, సంధ్య మెరుగు లేనిది అనే అర్థాలు కనిపిస్తాయి. ఆంధ్రదీపిక రచన జరిగిన ముప్ప యేళ్ళ తరువాత బ్రౌన్ నిఘంటువు కూర్పు జరిగింది. కాబట్టి సాంకే తికంగా మరింత సమాచారాన్ని బ్రౌన్ ఇవ్వగలిగాడని అర్థం అవుతోంది. ఆంధ్రదీపిక 1806లో వెలువడగా బ్రౌన్ నిఘంటుత్రయం 1852, 1853, 1854 సంవత్సరాలలో వరుసగా వచ్చాయి.

Grammar and Vocabulary of the Gentoo Language గ్రంథానికి ముందు మాటలు వ్రాస్తూ, బ్రౌన్ దొరగారు మామిడి వెంకయ్యగారిని ఇలా ప్రస్తుతిస్తాడు. "The assistance of this man in the compilation of both grammar and vocabulary has been of the greatest advantage" అని బ్రౌన్ పైన మామిడివారి ప్రభావం ఘనంగానే ఉందని ఒప్పుకోవాలి.

ఆంధ్ర శబ్ద చింతామణి (1860) బ్రౌన్ నిఘంటువు వెలువడిన వెంటనే విడుదలైన నిఘంటు గ్రంథం తిరునగరి రామానుజయ్యా కూర్పు ఇది. 14090 సంఖ్య కలిగి బ్రిటిష్ మ్యూజియం లైబ్రరీలో దీని ప్రతి దొరుకుతోంది. ఆంధ్ర శబ్ద చింతామణి పేరుతో సరస్వతి తిరువేంగడాచార్యులు, వి. రాజకృష్ణమాచార్యులు 1865లో ఇంకో నిఘంటువు రూపొందించారు. ఇక్కడ పదిలంగా ఉన్న నిఘంటువుల్లో ఈ క్రింది అపురూపమైన గ్రంథాలున్నాయి.

ఆంధ్రనామ సంగ్రహం (లక్ష్మణుడు పి.ఇ.),
ఆంధ్రనామశేషము (సూరయ్య, ఎ.బి),
ఆంధ్ర నిఘంటు చతుష్కము (శ్రీనివాస జగన్నాథ స్వామి),
ఆంధ్రపదకరము (వీరప్ప రాజు ?)
ఆంధ్రపదపారిజాతము (జగన్నాథుడు)
ఆంధ్ర శబ్దతత్త్వము (శేషగిరిశాస్త్రి)
కవిశిరోభూషణం (అహోబల పండితీయం)

1898లో తెలుగు పండితుల తొలి కాంగ్రెస్ (సదస్సు) నివేదిక ఒకటి ఈ కేటలాగులో కనిపిస్తోంది. దీన్ని రామకృష్ణమాచార్యులు రూపొందించినట్టు కేటలాగులో ఉంది. ఇది చదివితే తెలుగు నిఘంటు నిర్మాణంలో తొలినాటి పరిణామాల గురించి అవగాహన కలుగు తుంది. బ్రిటిష్ మ్యూజియం లైబ్రరీలో ఆంధ్రదీపిక ఉంది కానీ అది రంగనాయకులు శ్రేష్టిగారి పేరుతో ఉంది. వెంకయ్యగారి 'ఆంధ్ర దీపిక'కూ దీనికీ తేడా ఉన్నదేమో పరిశీలించవలసి ఉంది. రంగ నాయకులు శ్రేష్టి మామిడి వెంకయ్యగారి తరువాతి కాలం వాడు. ఆయన స్వేచ్ఛగా వెంకయ్యగారి ఆంధ్రదీపికని తన పేరుతో వేసు కున్నాడా ? లేక వెంకయ్యగారే అంగీకరించి ఇచ్చేశారా ? లేక రెండూ వేర్వేరు నిఘంటువులా అనేది స్పష్టం కాలేదు.

ఎ.డి. క్యాంప్ బెల్ తన వ్యాకరణ గ్రంథంలో వెంకయ్యగారి గురించి ఇలా వ్రాశాడు. "Mamidi Vencaya, the author of the Andhra Dipica, an excellent dictionary of Telugu, has in his preface to this work, introduced a concise analysis of the language." అని క్యాంప్ బెల్ క్యాంప్బెల్ 1824లో బళ్ళారి కలెక్టరుగా పనిచేసిన కాలం అది । క్యాంప్ బెల్ (1821) జేసీ మోరీన్ (1835 - 1839) వీళ్ళంతా మామిడివారిని అనుసరించిన వారుగానే కనిపిస్తారు.

క్యాంప్ 'బెల్,బ్రౌన్, లక్ష్మీనారాయణీయం (అచ్చాంధ్రనిఘంటువు), శబ్దార్థ చంద్రిక, ఆంధ్ర వాచస్పత్యం, శబ్దార్థ దీపిక ఇవన్నీ ఆంధ్రదీపిక వెలుగులో రూపొందిన నిఘంటువులు. "అన్ని నిఘంటువులకు ఆంధ్ర దీపిక తల్లి యనవలెను" శుద్ధ చైతన్యస్వామి ఆంధ్రదీపిక 1965 మచిలీపట్టణం ప్రచురణకు వ్రాసిన ముందు మాటల్లో పేర్కొన్నారు.

బ్రౌన్ మచిలీపట్టణంలో కలెక్టరుగా పనిచేసిన కాలంలోనే ఆయ నకు పండితులతో చర్చలకు ఎక్కువ అవకాశం కలిగింది. నన్న యాదుల ప్రయోగాలకు సరైన భావార్థాలను పండితుల నుండి పొంద లేకపోవటం వలన బ్రౌన్ బాగా అసంతృప్తి చెందాడు ఒక్కో పండితుడికి నెలకి మూడు వేలకు మించి స్వంతంగా జీతాలిచ్చి పెట్టుకున్నాడు. కానీ, ఆయనకు మామిడి వెంకయ్యగారి ఆంధ్రదీపిక ఎక్కువ సహాయపడిందని ఆయనే చెప్పుకున్నాడు. "...the last work tombe

described is one that deserves honorable mention being the Telugu Dictionary compiled by mamidivenkayya, a learned Merchant (komati) of Masulipatnam, who died in 1834. The work is arranged alphabetically in European method and every word that is found in the ancient lyrics, is briefly explained in Telugu or Sanskrit. The work will always be of value to those who study the poets. The title is 'Andhradeepica'..."

1936 సూర్య రాయాంధ్ర నిఘంటువు వెలువడింది. జయంతి రామయ్య పంతులుగారు దీనికి ముందుమాటలు వ్రాస్తూ, "ఆంధ్ర భాషలోని పదములు తత్సములు, ఆచ్ఛికములు, అన్యదేశ్యములు, వైకృతములు, దేశ్యములు నని మూడు విధములుగా విభాగించ వచ్చును. అచ్ఛికములు వైకృతములు, దేశ్యములునని రెండు విధములు. గ్రామ్యము అను విభాగమొక్కటి కలదు గాని, గ్రామ్య శబ్దములు లక్షణ విరుద్ధములై బహువిధములుగా నుండుటచే వాని నీ గ్రంథమున జేర్పలేదు" అని చెప్పుకున్నారు. గ్రామ్యశబ్దాలు లక్ష్య విరుద్ధాలుగా ఉంటాయని దీని సంపాదకవర్గం ఎందుకు భావించిందో తెలియదు. అదే సిద్ధాంతమో అర్థం కాదు...

ఆఫీసు, కుర్చీ, కూర, టూకించు(సంగ్రహించు)గోలీ, గోళ్ళు లాంటి వాడుక పదాలు ఆంధ్రదీపికలో చోటు చేసుకున్నాయి. 'కమ్మకట్టు' అంటే "వ్రాత పూర్వకంగా సేవజేయటానికి ఒడంబడినవాడు" లాంటి అర్థాలు కనిపిస్తాయి. నేటికి 200 ఏళ్ళనాటి వాడుక పదాలను ఈ నిఘంటువులో మనం చాలా చూడవచ్చు. పెంపు చేసిన నిఘంటువులు కొత్తగా అనేకం పుట్టుకొస్తున్న మాట నిజం. కానీ వాటిలో సంస్కృతం పదాలను మరిన్ని తెచ్చి నింపడం కాకుండా నేటి ప్రజలు మాట్లాడు కుంటున్న పదాలకు, జాతీయాలకు, సామెతలకు ఎక్కువభాగం కల్పించాల్సిన అవసరం ఉంది.

ఆంధ్రదీపిక అకారాది క్రమంలో నిఘంటువుల కూర్పుకు భారత దేశంలోనే మొదటి అడుగు వేసిన నిఘంటువు. మామిడివెంకయ్య అందుకు కారకుడు మరొక ఏడాది కాలంలో ఆంధ్రదీపిక ద్విశతాబ్ది జరగబోతోంది.

ప్రజల నాలుకల మీద ఆడుతున్న పదాలను ఏర్చి కూర్చి అచ్చమైన ఆంధ్రదీపికను రూపొందించటానికి కృషి చేయగలగటమే మామిడి వెంకటార్యకు మనం ఇవ్వగలిగిన నివాళి.

---

ఇప్పుడీ కృష్ణయొడ్డున ఈ విజయవాటి
ఇటనొక్క తెన్గుకవి యెలుగెత్తితే
అటుపంప, ఋషికుల్య యిటు - ఈ నడిమి స్వర్గ
మందు నా ముక్కోటి యనుగు తెనుగులు
విందురా? అందరూను!
పలనాట, వెలనాట, అలపాకనాట,
రాయలనాటి గరువాల జిగులు బిగిసే నాట
మన కళింగాన, మాయని తెలంగాణాన
మన తెన్గు చుట్టాలు వినగల్గితే - ఈ రేయి
ఇటనొక్క తెన్గుకవి యెలుగెత్తితే!
ఏటి పొత్తిట శయించేటి పల్లెల,
కొంగ ఘూటీల నిద్రపోయేటి పల్లెల,
మావి తోట దుప్పటి నొత్తిగించు పల్లెల
పైరు చేల పానుపుల పల్లియల తెన్గువా
రెందరో - అందరూ వినగల్గితే -
ఇటనొక్క తెన్గుకవి యెలుగెత్తితే!

–దేవులపల్లి కృష్ణశాస్త్రి

ఆచార్య ఎమ్. రాజగోపాలరావు

# క్రీపూ. 4, 3 శతాబ్దాలనుంచి తెలుగు లిపి కొనసాగుతున్నది

తెలుగుజాతి – ఆంధ్రజాతి – ప్రాచీనతను ఐతరేయ బ్రాహ్మణం నిరూపిస్తున్నది. జనజీవనంతో అవినాభావంగా పెనవేసుకొని ఉండే భాష – తెలుగు భాష – కూడా అంతే ప్రాచీనమని అంగీకరించవలసి వస్తుంది. భాషకు శాశ్వతను సమకూర్చే లిపి, లిపి ప్రాణంగా అభివృద్ధి చెందే సాహిత్యం అటు తరువాతి పరిణామాలవుతాయి. వీటి పరిణామ కాలాన్ని అంచనా వేయటంలో అనేక ఇబ్బందులెదురవు తున్నాయి. ఈ నేపథ్యంలో తెలుగు లిపి చారిత్రకతను నిర్ధారించటానికి సహకరించే సమాచారాన్ని – ప్రాచీన శాసనాల ద్వారా లభించే సమాచారాన్ని – సమీక్షించుకోవటం ఎంతో ఉపకరిస్తుంది.

లభించే సమాచారాన్ని సక్రమంగా విశ్లేషించి తులనాత్మకంగా అర్థంజేసుకోవటానికి తెలుగు భాష, తెలుగు లిపి స్వరూప స్వభావాలను విశిష్టతను ఆకళించుకోవలసిన అవసరమేర్పడుతుంది.

తెలుగు భాష అజంత భాష – అంటే అచ్చులతో అంతమయే భాష. ప్రతి పదమూ ఏదో ఒక అచ్చుతో – అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ వగయిరాలతో అంతమవుతుంది – అమ్మ, అయ్య, అన్న, చెల్లి, ఇల్లు, ఊరు, ఏరు వగయిరాలు. ప్రాథమిక హలంతాతో -- క్, గ్, చ్, జ్ మొదలయినవాటితో తెలుగుపదాలు అంతంకావు. మనకు అందుబాటులోకి వచ్చిన అటువంటి హలంత పదాలను – పెన్, గన్, రైల్, రోడ్ వగయిరాలను పెన్ను, గన్ను, రైలు, రోడ్డు వగయిరా అజంతాలు గావిస్తుంటాం. ఆ విధంగా మనది అజంత భాష – ఇటలీ భాష గూడా అజంత భాషే. అందుకే ఆనాటి రాయబారి నికలోకోంటి తెలుగును "ఇటాలియన్‌ఆఫ్ ది ఈస్ట్" అన్నాడు.

భాష అవసరాలకు అనుగుణంగా లిపి అంటే అక్షరమాల – గూడా తయారవుతుంది. తెలుగు అక్షరమాలలో అ నుంచి అః వరకు 16 అచ్చులను క నుంచి ళ వరకు 34 హల్లులను – మొత్తం 50 అక్షరాలను చిన్నయసూరి వర్గీకరించాడు. అయితే అచ్చులు జతగాని హల్లులు – క్, గ్, చ్, జ్ వంటి ప్రాథమిక హల్లులు మన అక్షరమాలలో కనిపించవు. 'క' గుణింతం ఒక్కసారి గుర్తుచేసుకుంటే 'క'తో ప్రారంభించి, 'క' కు దీర్ఘమిస్తే కా, గుడిస్తే కి, కొమ్మిస్తే కు అంటూ కం, కః వరకు సాగుతాం. ఇక్కడ 'క' స్వరూపం విస్మరిస్తాం 'క్' అచ్చు 'అ'తో కలిసి 'క' అవుతుంది. 'క్' ప్రాథమిక హల్లు. అచ్చుచేరిన క హల్లు అవుతాయి అదే అన్ని హల్లులకూ వర్తిస్తుంది. హల్లుల మీది తలకట్టు 'అ'కారానికి (అత్తు అంటాడు చిన్నయసూరి) సంకేతం. అట్లాగే దీర్ఘం ఆకారానికి గుడి ఇకారానికి, కొమ్ము ఉకారానికి సంకేతాలు. ఈ సంకేతాలన్నీ హల్లుల తలమీద కాని, పక్కగాకాని కుడివైపుగా కలిసి ఉండటం తెలుగు లిపి ప్రత్యేకత. ప్రాచీన బ్రాహ్మీలిపిలోగాని అనేక ఇతర ఆధునిక లిపులలో గాని అవి ప్రాథమిక హల్లును అనుసరించి విడిగా ఉంటాయి.

భారతదేశంలో లభిస్తున్న అత్యంత ప్రాచీన లిపి బ్రాహ్మీ. ఇది అశోకుని శాసనాలలో కనిపిస్తుంది. అందుకే దానిని మౌర్యలిపి అని గూడా అంటారు. ఈ మౌర్య/బ్రాహ్మీ లిపి శాసనలిపిగా చాలాకాలం కొనసాగింది. అట్లాగే ప్రాకృతభాష కూడా కొనసాగింది. అశోకుని శాసనాలలోనే కాక ఇతరత్రా బౌద్ధ మహాచైత్య శాసనాలలో, స్తూప శాసనాలలో ప్రాకృత భాష, బ్రాహ్మీలిపి దర్శనమిస్తాయి. అయితే దేశంలో అనేక ప్రాంతాలలో కనిపించే శాసనాలలో కొట్టవచ్చినట్లు కనిపించే విభేదాలు పరిశోధకుల దృష్టి నాకర్షించాయి. ఆయా ప్రాంతాలలో అభివృద్ధి చెందిన ప్రాంతీయ భాషా లిపుల ప్రభావాలు ఒంటబట్టిన ప్రాంతీయ లిపికారులు శాసనాలు లిఖించేటప్పుడు (చెక్కేటప్పుడు) ఆ లిపులు లక్షణాలను బ్రాహ్మీలిపిలోకి చొప్పించి ఉంటారని పరిశోధకులు వివరిస్తున్నారు. ఇదే పరిస్థితి ఆంధ్రదేశంలో బౌద్ధమహాచైత్య శిథిలాలలో లభించిన శాసనాలకు గూడా వర్తిస్తుంది.

ఆంధ్రదేశంలో ఎన్నో చైత్యాలున్నాయి. వాటిలో కొన్ని మహా చైత్యాలని అక్కడ లభించిన శాసనాలు స్పష్టం జేస్తున్నాయి. వీటిలో అమరావతి స్తూప మంటున్న ధాన్యకటక మహాచైత్యం, భట్టిప్రోలు



మహాచైత్యాలను అత్యంత ప్రాచీనాలుగా గుర్తిస్తున్నారు. ధాన్యకటక మహాచైత్యం అనేక దశలలో అభివృద్ధి చెందటంలో అక్కడ లభించిన శాసనాల కాల నిర్ధారణలో కొన్ని ఇబ్బందులు ఎదురయ్యాయి. భట్టిప్రోలు మహాచైత్యం అటువంటి అభివృద్ధికి నోచుకొన్న దాఖలాలు కనిపించటంలేదు. ఆ విధంగా అక్కడ లభించిన శాసనాలు తొలిదశకు చెందిన శాసనాలు -క్రీ.పూ. 4, 3 శతాబ్దుల శాసనాలుగా అంగీకరించే అవకాశం లభించింది.

భట్టిప్రోలు శాసనాల భాష ప్రాకృతం. లిపి బ్రాహ్మీ. అయితే ఇతరత్రా కనిపించని కొన్ని మార్పులు ఇక్కడ బ్రాహ్మీలిపిలో చోటుజేసు కొన్న మార్పులు పరిశోధకులను ఆశ్చర్యపరిచాయి. ఆ మార్పులవల్ల ఇక్కడి శాసనాలలోని బ్రాహ్మీలిపి ఉత్తర భారత శాసనాలలోని బ్రాహ్మీ లిపికి భిన్నంగా గోచరించింది. అందుకే ఈ బ్రాహ్మీలిపిని 'దక్షిణబ్రాహ్మీ లిపి' అన్నాడు బూలర్.

దక్షిణ బ్రాహ్మీలిపిలో ఉన్న భట్టిప్రోలు శాసనాలను పరిశోధకులు నిశితంగా పరిశీలించారు. తెలుగు లిపి లక్షణాలు వీటిలో చోటు జేసుకోవటం గమనించారు. తెలుగు అక్షరాల తలకట్టు వంటి అడ్డగీతలు బ్రాహ్మీలిపిలో చోటుజేసుకున్నాయి. అక్షరం తలమీద నుంచి దీర్ఘంలా అడ్డగీతరావటం, తెలుగు ఎత్వ చిహ్నంలా అక్షరం తలపైన నిలువుగీత రావటం వంటివి తెలుగు లిపి ప్రభావంవల్ల చోటుజేసుకొన్న మార్పులుగా గుర్తించారు. ఆ విధంగా బ్రాహ్మీలిపిని ప్రభావితం జేయగలిగిన తెలుగు లిపి అప్పటికే అంటే క్రీ.పూ. 4, 3 శతాబ్దాలకే ఏదో ఒక రూపంలో ఉండి ఉండాలని తీర్మానించారు. దీని కెటువంటి విప్రతిపత్తి కలగకపోవటం గమనార్హం.

ఈ తెలుగు లిపి ప్రభావం భట్టిప్రోలు శాసనాలకే పరిమితం గాదు. ధాన్యకటక మహాచైత్య శిథిలాలలో లభించిన యజ్ఞశ్రీ శాతకర్ణి ప్రాకృత శాసనంలో గూడ కనిపించింది. దానిని గమనించిన ఆనాటి పండిత పరిశోధకులు ఆ బ్రాహ్మీలిపిని 'దిగువ కృష్ణాలిపి' అన్నారు. యజ్ఞశ్రీ క్రీ.శ. రెండవ శతాబ్దివాడని దాదాపు అందరూ అంగీక రిస్తున్నారు.

ఈ సందర్భంగా మరో అంశం గూడా ప్రస్తావించవలసి ఉంది. శాతవాహన చక్రవర్తులు వారి బొమ్మతో ఉన్న నాణేలను తయారు చేయించారు. బొమ్మచుట్టూ వారి పేరునే వేయించుకొన్నారు. బ్రాహ్మీ లిపిలో ఉన్న ఈ భాష ఆనాటి తెలుగుగా గుర్తిస్తున్నారు. అంతేకాదు. అది దేశీయ ఛందస్సులో ఉన్నదని కూడా వివరిస్తున్నారు. వీటిద్వారా శాతవాహనుల కాలంలో తెలుగు భాషే కాక దేశీయ ఛందస్సు కూడా అభివృద్ధి చెందిందని అర్థమవుతుంది. అటు తరువాత పల్లవుల కాలంలో తెలుగుభాషలోనే కాక తెలుగు లిపిలో గూడా శాసనాలు రావటంవల్ల తెలుగు లిపి క్రీ.పూ. 4, 3 శతాబ్దాల నుంచి కొనసాగు తున్నదని తెలుతుంది.

(నడుస్తున్న చరిత్ర మాసపత్రిక ఏప్రియల్-2005 సంచిక సౌజన్యంతో)

**చిరునామా :** **ఆచార్య ఎమ్. రాజగోపాలరావు,** పురావస్తుశాఖ, విశ్రాంత సంచాలకులు, ప్లాట్ నెం. 2 ప్రశాంతినగర్, సైదాబాదు, హైదరాబాదు - 500 059, సెల్ : 93462 65966;

డా॥ వెలుదండ నిత్యానందరావు

# కృష్ణాతీరంలో తొలి తెలుగు వ్యాకరణం

అగస్త్యుడు తమిళంలో తొలి వ్యాసకర్త. 'లక్ష్యం లేకుండా లక్షణం పుట్టదు అనేది అగస్త్యుని వ్యాకరణ సూత్రమట. ఇంతకూ అగస్త్యుని పుస్తకం దొరకలేదు. అయినా ఎక్కడో లభించిన ఈ సూత్రాన్ని పట్టుకొని తొలి వ్యాకరణ గ్రంథకర్తగా అగస్త్యునికి తమిళులు 1 పట్టాభిషేకం చేశారు. మరి తెలుగులో సైతం నన్నయ కంటే ముందు కావ్యాలు, వ్యాకరణాలు ఎందుకు దొరికే అవకాశముండదు ? తప్పనిసరిగా దొరికే అవకాశముంటుంది. కాకుంటే సి.పి.బ్రౌన్, వేటూరి ప్రభాకర శాస్త్రి, మానవల్లి రామకృష్ణ కవి, నిడదవోలు వేంకటరావు లాంటి మహనీయులకున్న చిత్తశుద్ధి, పనిదాహం మనకుండాలి.

మన వ్యాకరణ అలంకార శాస్త్ర గ్రంథాల్లో ఎందరి రచనలో ఉదాహరణల నిమిత్తము ప్రస్తావించబడ్డాయి. అవి నేడు కనబడడం లేదు. అంటే అవి లేనట్లా ? ఆనాటి వరకు అవి అందుబాటులో ఉన్నాయి. నేడు దొరకడం లేదు. నేడు దొరకడం లేదంటే భవిష్యత్తులో దొరకవచ్చునని ఆశాభావం. ఆచార్య అమరేశం రాజేశ్వరశర్మగారని హైదరాబాదులో గొప్ప వ్యాకరణ పండితులున్నారు. వారు 'ఆంధ్ర వ్యాకరణ వికాసం' అనే అంశంపై 1970లో డాక్టరేటు పొందారు. కాణ్వ వ్యాకరణం తెలుగులో తొట్టతొలి వ్యాకరణం. ఈ కాణ్వుడు తెలుగు భాషను గురించి సంస్కృతంలో రాశాడు. కాణ్వుడు శ్రీకాకుళాంధ్ర మహావిష్ణువు ఆస్థానంలోని వాడు అని అమరేశం రాజేశ్వరశర్మగారు ఒక ప్రతిపాదన చేశారు. వారి ఈ ప్రతిపాదనను పట్టించుకొన్న నాథుడు తిరస్కరించినవారు లేరు. మెచ్చుకొన్నవారు లేరు. నాకు తెలిసి ఒకే ఒక విద్వాంసుడు, ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖ రూపశిల్పి ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజన మహోదయులు పీఠికలో దీనిని ప్రత్యేకంగా ప్రస్తావించారు. లక్ష్మీ రంజనం గారు రాజేశ్వరశర్మ గారి వ్యాకరణ రంగ పరిశ్రమను పాండిత్యాన్ని ప్రశంసించిన పిదప ఇలా రాశారు.

"ఏవంవిధ పూర్వాభ్యాసముతో రచింపబడినది" ఆంధ్ర వ్యాకరణ వికాసము' అను ఉదాత్త సిద్ధాంత వ్యాసము. దీనియందు డాక్టరు రాజేశ్వరశర్మగారి బహుముఖమైన సంస్కృతాంధ్ర సాహిత్య వ్యాకరణ పరిజ్ఞానము అద్దమునందువలె ప్రతిబింబించినది. ముఖ్యముగా ఆంధ్రశబ్దచింతామణి కర్తృత్వమును గూర్చియు విషయములను గూర్చియు వీరు వ్రాసినది ప్రామాణికముగానున్నది. ప్రథమాంధ్ర వ్యాకరణ కర్త యెవరని వీరు బహుధా విచారణ సలిపి కణ్వుడను ప్రాచీన విద్వాంసుడనియు, అతడు ప్రథమాంధ్ర సామ్రాజ్య నిర్మాతయైన ఆంధ్ర విష్ణువుకు సమకాలికుడు కావచ్చుననియు చేసిన చర్చ ఎంతయో సహేతుకముగా నున్నది. పూర్వాంధ్ర వైయాకరుణులు పేర్కొన్న కణ్వుడు, బృహస్పతి మున్నగువారు కల్పితవ్యక్తులు కారనియు వారి వ్యాకరణములు సమగ్రములు కాకున్నను ఆంధ్రవ్యాకరణ సంహిత ప్రస్థానమునందు గుర్తింపదగిన మైలురాళ్ళే అనియు పరిశోధన నైపుణ్యముతో స్థాపించిన శ్రీ శర్మగారు అసాధారణ మేధావులనియే నేను భావించుచున్నాను. ఋషిమాన్యులైన ఈ ప్రాచీన వైయాకరుణులను అపసిద్ధాంతధ్వాంతము నుండి ఉద్ధరించిన రాజేశ్వర శర్మగారిని ఆ మహర్షులే దీర్ఘాయువులుగను, ఇతోధిక శబ్దశాస్త్ర నిష్ణాతులుగను ఆశీర్వదింతురనగా మా బోటివారి మాట చెప్పనేల? తథాస్తు !" అని అమరేశం వారి ఆంధ్రవ్యాకరణ వికాసం పీఠికలో 1973 ఆగస్టు 8న రాశారు.

## ఎవరీ కాణ్వుడు ? ఏమా కథ ? ఆలోచిద్దాం.

మండా లక్ష్మీనరసింహాచార్యులు 18వ శతాబ్ది ఉత్తరార్థంలో ఉన్న విద్వాంసుడు ఆంధ్రకౌముది అనే మరో పేరు గలిగిన 'త్రిలింగ శబ్దానుశాసనమ్' అనే వ్యాకరణం రాశాడు. ఇది సంస్కృతంలో రాయబడిన తెలుగు వ్యాకరణం. మద్రాసు ప్రాచ్య లిఖిత భాండాగారంలో చాలాకాలం అముద్రితంగా ఉండేది. దాన్ని ఆచార్య రవ్వా శ్రీహరిగారు పరిష్కరించి ప్రకటించారు. మండా లక్ష్మీనరసింహాచార్యులే 'ఆంధ్ర కౌముది' అని మరో వ్యాకరణం రాశాడు. నిజానికి ఈ రెంటిలోను అతి స్వల్పమైన తేడాలే ఉండడంతో రెండు పుస్తకాలను త్రిలింగ శబ్దానుశాసనంలో కలిపినారు.

**బార్హస్పత్యం రావణీయం కాణ్వామాథర్వణం విదన్**
**కరోమి సారస్వత త్రిలింగశబ్దానుశాసనమ్.**

(బార్హస్పత్యుని, రావణుని, కాణ్వుని, అధర్వుణుని స్మరించి సారస్వత త్రిలింగ శబ్దానుశాసనం రచిస్తున్నాను)

బృహస్పతి అనేవాడు ఒక ఆంధ్ర వ్యాకరణాన్ని సంస్కృతంలో రాసినట్లు తెలుస్తున్నది. దానిలో కొన్ని సూత్రాలు ఆంధ్రకౌముదిలో ఉదాహరింపబడ్డాయి. ఆ భాషా రూపాలు ప్రాచీన రూపాలు కావు – చాలా తర్వాతివి. ఒక రావణుడు ప్రాకృత వ్యాకర్తగా ప్రసిద్ధుడు. ఆ రావణుడు వేరు. ఈ రావణుడు ఆంధ్రవ్యాకరణ సంబంధమైన అంశాలు చెప్పకపోలేదు. కాని కాల నిర్ణయంలో బృహస్పతి, రావణులకు సంబంధించి ఎలాంటి ఆధారాలు లేవు.

ఈ కాణ్వుని మండా లక్ష్మీనరసింహాచార్యులు స్మరించడమే కాక అతని 'మతం'లో ఈ విధంగా ఉంటుందని 10 సూత్రాలు చెప్పడమే కాక కాలసూచనం కూడా చేశాడు.

అధర్వణ కృతంగా చెప్పబడే త్రిలింగశబ్దానుశాసనం అనే మరో వ్యాకరణ గ్రంథంలో సైతం (బార్హస్పత్యాని సూత్రాణి కాణ్వం వ్యాకరణం విదన్) అని చెప్పబడింది. అంటే అధర్వుణునికి కూడ కణ్వ వ్యాకరణం తెలుసు. కాణ్వ వ్యాకరణమంటూ ఒక పుస్తకం అందుబాటులో లేకపోతే పూర్వ వ్యాసకర్తల స్తుతిలో చెప్పే అవకాశముంటుందేమో కాని సూత్రాలను ఉదాహరించడం అనేది సాధ్యం కాదు. కనుక తప్పని సరిగా కాణ్వవ్యాకరణం ఉనికి యధార్థం. వావిలికొలను సుబ్బారావు 'ద్రావిడభాషకగస్త్యునివలె నాంధ్రభాషకు వాల్మీకి ఆది వ్యాకరణకర్తయని గ్రంథములు వచించియున్నవి. కణ్వాదులును ఆంధ్ర వ్యాకరణముల రచించిరి' అని పేర్కొన్నారు. వాల్మీకి ప్రాకృత వ్యాకర్తగా ఒకప్పుడు వెలిగాడు. తర్వాత ఆ వ్యాకరణానికి ప్రచారం తగ్గిపోయింది. వాల్మీకి అనడం పొరపాటు. కణ్వుని ప్రస్తావన మాత్రం వాస్తవం. మండపాక పార్వతీశ్వరశాస్త్రి కూడ కణ్వుని ప్రస్తావన చేశారు. ఈ కణ్వుడు బోధాయనుని కుమారుడు కోట వెంకటాచలం గారు ఆంధ్రుల పుట్టుపూర్వోత్తరాలు అనే గ్రంథంలో పేర్కొన్నారు.

## కాలనిర్ణయం :

'ఆంధ్రవిష్ణోరనుజ్ఞాతస్య మద్వ్యాకరణస్యద్రోహీ గురుద్రోహీ' అని కణ్వుడు చెప్పినట్లుగా త్రిలింగశబ్దానుశాసనంలో చెప్పబడింది. అంటే ఆంధ్ర విష్ణువు అనుగ్రహం చేత రాయబడుతున్న నా వ్యాకరణాన్ని తిట్టినవాడు గురుద్రోహితో సమానం అని స్పష్టపరుచుకొన్నాడు. అంటే ఆంధ్రవిష్ణువు ఆస్థానంలో ఉండడమో, ఆయన ఆదరణలో ఉండడమో సంభవించిందన్నమాట. కాల నిర్ణయానికి ఇది కీలకాంశం.

మరి ఆంధ్ర విష్ణువుకు నిజంగా ఆంధ్రభాషతో సంబంధం ఉందా? ఉందని నిరూపించే శ్లోకాలు ఇవి 'రావణీయె' (రావణీయం అనే వ్యాకరణ గ్రంథంలో ఉన్నట్లు మండా లక్ష్మీనరసింహాచార్లు ఉల్లేఖించారు.

**ఆంధ్రనాథో మహావిష్ణుర్నిశుంభ దనుజాపహా**
**పురాస్వాయంభువ మనుః కాలే కలియుగే హరేః**

(పూర్వకాలంలో స్వాయంభువమనువు కాలంలో శుంభ నిశుంభు లనే దనుజులను చంపిన మహావిష్ణువే కలియుగంలో హరిగా స్మరింపబడుతున్నాడు).

**కాకులే రాజవర్యస్య సుచంద్రస్య తనూభవః**
**అభవత్సర్వదైవైశ్చవేష్టితో లోకపూజితః**

'కాకుళ' రాజ పరంపరలోని సుచంద్రుని కొడుకు సర్వదేవతలు పరివేష్టించి యుండగా లోకపూజితుడయ్యాడు.

**శ్రీశైలభీమ కాళేశ మహేంద్రగిరి సంయుతమ్**
**ప్రాకారంతు మహత్ కృత్వా త్రీణి ద్వారాణి చాఽకరోత్**

(మహేంద్రగిరితో కూడిన శ్రీశైలము, భీమ (ద్రాక్షారామభీమేశ్వరం) కాళేశ్వరం వంటివి హద్దులుగా చేసుకొన్నాడు. మూడు ద్వారాలుగా చేసుకొన్నాడు.

**త్రిలోచనో మహేశస్త్రిశూలం చకరేదధత్**
**త్రిలింగ రూపేణోవాస త్రిద్వారేషుగణైరవృతః**
**ఆంధ్ర విష్ణుస్సురయుతో దనుజేన నిశంభునా**
**యుద్ధ్వా త్రయోదశయుగాన్ హత్వా తం రాక్షసోత్తమమ్**

త్రిలోచనుడైన మహేశ్వరుడు త్రిశూలధారియై మూడు లింగాల రూపమైన ఈ నేలలో తన భటుల చేత మూడు ద్వారాలలో రక్షిస్తూ నిలుచున్నాడు. ఆంధ్రవిష్ణువు దనుజుడైన నిశుంభుని పదమూడు యుగాల పాటు పోరాడి సంహరించాడు.

**అవసత్తత్ర ఋషిభిర్యుతో గోదావరీతటే**
**తత్కాల ప్రభృతి క్షేత్రం త్రిలింగమితి విశ్రుతమ్**

ఆ కాలంలో గోదావరి తీరంలో ఋషులు నివసించిన ఆ నేలకు త్రిలింగ మని పేరు వచ్చింది.

ఆంధ్రవిష్ణువు చరిత్ర బ్రహ్మాండపురాణంలోను, ఆర్య మంజుశ్రీ మూలకల్పమనే బౌద్ధ గ్రంథంలోను ఉందని చెపుతూ ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు తమ ఆంధ్రుల చరిత్ర సంస్కృతిలో ఆంధ్ర విష్ణువు ఉదంతాన్ని వివరించారు. ఆంధ్ర విష్ణువే నేడు విజయవాడ సమీపంలో

శ్రీకాకుళం గ్రామంలో కొలువై ఉన్నాడు. కృష్ణరాయల ఆముక్తమాల్యద రచనకు కాసుల పురుషోత్తమ కవి ఆంధ్ర నాయ శతక రచనకు ప్రేరణ ఈ శ్రీకాకుళాంధ్ర విష్ణువే.

ఆంధ్ర విష్ణువు శాతవాహనుల కన్న కొంచెం ముందువాడని అందరూ భావిస్తున్నారు. కనుక కాణ్వుడు, కణ్వ వంశీయుడు ఆంధ్ర విష్ణువు కాలంలో ఈ వ్యాకరణం రాశాడన్నది నిరూపితమవుతున్న విషయం.

ఈ కాణ్వ వ్యాకరణంలోని సూత్రాలు ఛందోబద్ధాలు కావు. పాణినీయ సూత్రాల ఫక్కీలో సాగుతాయి. ఆచార్య అమరేశం రాజేశ్వరశర్మగారు సూత్రాలను వాటి అర్థాలను నిర్ధారించి తమ గ్రంథంలో పేర్కొన్నారు.

**1. నేర్నకౌ అదంతస్య :** అదంతానికి పరంలో ఉన్న 'ని'కి కువర్ణకము పరమయినప్పుడు 'న' ఆదేశమవుతోంది అని దీని భావం. రామునకు, కృష్ణునకు మొ॥ ఉదాహరణలు

**2. కోర్నోరిత్వమిత :** ఇదంతానికి పరంలో ఉన్న 'కు' 'ను' అను వానికి ఇత్వం వస్తుంది. అని దీని భావం. హరికి గిరిని ఇత్యాదులు ఉదాహరణ.

**3. అందౌచ :** అందు వర్ణకం పరమయితే ఇటువంటిది వస్తుంది అని భావం. ముందేదో చెప్పి ఉంటాడు. ఇటువంటిది నువర్ణకం కావచ్చు. 'రామునందు' వగైరాలు.

**4. స్త్రియామ్ :** ఇది అధికారసూత్రం కాదు. ఈ సూత్రం తరువాతి కార్యాలు స్త్రీలింగానికి వస్తాయని భావం.

**5. అశ్చైకవచనే :** ఏకవచనంలో అ కూడా వస్తుంది. లచ్చ గౌర అనేటటువంటి దేశ్యశబ్దాలు దానికుదాహరణలు కావచ్చు.

**6. ఇదంతాదీనాం పుంవత్ :** ఇదంతాది స్త్రీలింగ శబ్దాలకు పుంలింగంలో వలెనే రూపాలుంటాయి. చివరిది మినహాయించినా తక్కిన ఆరు తెలుగు భాషా సంప్రదాయాలను చెప్పేవే.

**యోదేవతాంశజోవిప్రః స సంస్కృతకవిర్భవేత్**
**ఋష్యంశజాతో యో విప్రః స త్రిలింగక విర్భవేత్**

దైవాంశ సంభూతులైనవారు సంస్కృత కవులవుతారు. ఋష్యంశ కలిగినవారు త్రిలింగ (తెలుగు) కవులవుతారు – అనికూడా కాణ్వుడొక మాట అన్నాడు. ఇది సాంప్రదాయక భావన. సంస్కృతాన్ని దైవభాషగా చెప్పడం ఎప్పుడూ ఉండేదే. స్పష్టంగా త్రిలింగభాష అని పేర్కొనడం మనకు పనికి వచ్చే అంశం.

కాణ్వ వ్యాకరణాన్ని కేతన, విన్నకోట పెద్దనలాంటి వారు పేర్కొనలేదు. కాని మండా లక్ష్మీనరసింహాచార్యులు, అధర్వణనామధారి స్పష్టంగా కాణ్వ సూత్రాలను ఉల్లేఖించి కాలసూచనంతో సహా స్పష్టంగా చెప్పారు.

తెలుగు వారి ప్రప్రథమాంధ్రవ్యాకరణ గ్రంథం కాణ్వవ్యాకరణమనీ అది శ్రీకాకుళాంధ్ర విష్ణువు కాలంలో వచ్చిందనీ సగర్వంగా చాటుకొందాం.

## మాస్టర్ ఎక్కిరాల కృష్ణమాచార్యులు

బాపట్లలో జన్మించారు. మాస్టర్ సి.వి.వి. మార్గానుయాయులు. ప్రాక్పశ్చిమ ఆధ్యాత్మిక సమన్వయం తెచ్చే మాస్టర్ ఇ.కె.గా ప్రసిద్ధులైనారు. ది వరల్డ్ టీచర్ ట్రస్ట్ జగద్గురు పీఠాన్ని నెలకొల్పారు. ఉచిత వైద్యం, సనాతన ధర్మప్రబోధం, యోగ, జ్యోతిర్విద్యల అధ్యయనం, ప్రాచీన, జ్యోతిర్విద్యల అధ్యయనం, ప్రాచీన నవీన జ్ఞాన విజ్ఞానముల పరిశోధనా సమన్వయము, సంఘసేవకులను సిద్ధం చేయటం, స్వతంత్ర్య జీవనోపాధి కల్పన, గ్రథముల ప్రచురణ వంటి ఆదర్శాలతో దేశవిదేశాలలో శాఖోపశాఖలుగా తమ ట్రస్టును విస్తరించారు. సుమారు 100కు పైగా గ్రంథాలు వ్రాశారు. 'బహుజన హితాయ బహుజన సుఖాయ" అనే సందేశంతో ఆధునిక ప్రపంచాన్ని మేల్కొల్పారు.

**చిరునామా :** అసోసియేట్ ప్రొఫెసర్, తెలుగు శాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాద్ – 7. సెల్ : 9441666881

శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య

# కృష్ణా మండల భాష

భారత ఉపఖండంలో దక్షిణాన పశ్చిమ కోస్తా తీరభూమి తూర్పు కోస్తా తీరభూమి రెండూ అమిత అందంగా ఉంటాయి. అటు కేరళ మినికాయ్ ద్వీప భూమి, ఇటు తూర్పున ఆంధ్ర కోస్తా తీర భూమి రెండూ కన్నుల పండువ చేసే సస్యశ్యామల భూములే. అంతటా పచ్చపచ్చగా సస్యశ్యామలంగా ప్రశాంతంగా ప్రాకృతికమైన ఒడిదుడుకులు భూకంపాలు మొదలైనవి లేకుండా భారతదేశపు సర్వరంగాలలో ప్రముఖంగా విలసిల్లుతూ ముఖ్యంగా ఈ తూర్పు తీర కోస్తా భూమి దేశాని కంతటికీ అన్నపూర్ణగా అన్వర్థ నామంతో దేశపు ధాన్యాగారంగా పేరుపొందింది.

సమస్త భారతదేశం రేపటి దినాన ఏమి ఆలోచనలు చేస్తుందో ఆ ఆలోచనా ధారలను వంగభూమి నేటి దినాన ప్రకటిస్తుందని విజ్ఞులు అంటూ ఉంటారు. అంటే భారతదేశంలో వంగభూమి చురుకుదనం అటువంటి దన్నమాట. అదేవిధంగా రేపటి దినాన చూస్తేఆంధ్ర దేశము ఏమి ఆలోచిస్తుందో ఆ ఆలోచనాధారను కృష్ణా మండలం నేటి దినాన ప్రకటిస్తుందని మీరు అనవచ్చును. అంటే కృష్ణా తరంగిణీ పరివాహక భూమి ఖండవాసుల చురుకుదనం వేగం అటువంటి వన్నమాట. అనగా ఆంధ్ర దేశమనబడే ఈ భూమి ఖండం ఒకవైపున రాయలేలిన సీమ రాయలసీమ, మరోవైపు తెలుగుల సమర్థ భూమి తెలంగాణం, ఇంకోవైపున గజపతు లేలిన అందాల భూమి కళింగాంధ్రం ఉత్తరకోస్తాల సమస్త తెలుగువారి నడవడినీ ప్రవర్తననూ, జీవనశైలినీ శాసించే దిశా నిర్దేశం చేసేది కృష్ణా మండలం అని అర్థం.

దాదాపు తొమ్మిదివేల కిలోమీటర్ల భూమి విస్తీర్ణంతో దాదాపు వందమైళ్ళ అద్భుత సముద్రతీర రేఖతో దాదాపు అరకోటి స్త్రీ పురుష జనాభాతో సమర్థమైన సస్యశ్యామలమైన బంగారు భూములతో పాడి సంపదతో పరిశ్రమలతో విద్యా కేంద్రాలతో వ్యాపారసమృద్ధితో సమస్త దిక్కులకు రైల్వే రహదారి మార్గాల నాడీకేంద్రంగా విరాజిల్లుతూ విస్తరిస్తున్నది కృష్ణా మండలం.

శతాబ్దాల దీర్ఘ చరిత్ర కలిగినది ఈ నేల... పడమటి కనుమలలో ఎంతో దూరాన ప్రభవించి పవిత్ర కృష్ణా తరంగిణి మహాప్రవాహంగా ఉరుకులు పరుగులతో దూకుతూ వచ్చి ఇక్కడ సముద్రునిలో కలసి పోతుంది. పురాణాలలో ఇతిహాసాలలో పురాతన సాహితీ సంపదలో ఈ ప్రాంతాన్ని గురించిన ఎన్నోఐతిహ్యాలు...ఎన్నో ఉదంతాలు.. ఎన్నో రోమాంచక ఘట్టాలు...ఇలా ఎంతో మానవీయ చరిత్రగడిచింది ఇక్కడ.

ద్వాపర యుగం ముగిసి కలియుగం ఆరంభమైన వేళ అప్పటి మహాభారత సంగ్రామం... ఐదువేల ఏళ్ళనాటి ఉదంతం.... ఆనాడు పాశుపతాస్త్రం కోరి పాండవ మధ్యముడు ఈ తరంగిణీ తీరాన నేటి ఇంద్రకీలాద్రిపై స్థిర సంకల్పుడై తపించి దేవదేవుణ్ణి సంప్రీతుణ్ణి చేసి ఆ దివ్యాస్త్రం పొందాడని ఐతిహ్యం. చరిత్రలో బౌద్ధులు, జైనులు, శాక్తేయులు ఇంకా ఇతర విశ్వాసాలవారు ఇతర దేశాలవారు ఎందరెం దరో వచ్చి ఇక్కడ తమ విశ్వాసాలను పండించుకొని ఇక్కడి జనుల విశ్వాసాలను తమతో మోసుకొని వెళ్ళారు. చైనాకు చెందిన హ్యూయా న్‌సాంగ్, అద్వైత మహా మతాచార్యుడు ఆదిశంకరులు, తరువాత సాహితీ సమరాంగణ సార్వభౌముడైన కన్నడరాయడు రాయలు, ఆపైన ముస్లిములు పరాసువారు, బుడతకీచులు, ఆంగ్లేయులు ఇందరు ఈ నేలను సందర్శించి తరించారు. శాతవాహనులు, ఇక్ష్వాకులు, చోళులు, కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగర రాజులు, బహమనీ సుల్తానులు ఇలా ఎందరో కృష్ణామండలి ఆది దేవత దుర్గమ్మను సందర్శించు కోవడమేకాక భక్తి శ్రద్ధలతో మణులు మాన్యాలు కానుకలు సమర్పించు కున్నారని శాసనాలు చెబుతున్నాయి. అప్పటి కృష్ణానది ఉరుకులు పరుగులతో హోరెత్తుతూ అడ్డూ, అదుపూ లేకుండా నిలకడ లేని దాని వలె పోయి వృధాగా సముద్రంలో కలసిపోయేది. అప్పుడు ఈ ప్రాంతమంతా నీటి వసతి కొరవడి కపిల వర్ష ధార కావడంవల్ల జొన్న, పెసలు వంటి పంటలు తప్ప నేటి కాలంలో వలె సస్య సమృద్ధి ఉండేది కాదు. ఒకప్పుడు నీరులేక ఎండితే మరొకప్పుడు వరద కృష్ణ పంటను తుడిచిపెట్టేది. కాని దాదాపు నూటయాభై ఏళ్ళ క్రిందట ఈ ప్రాంతంలో విజృభించిన తీవ్ర దుర్భిక్షం అది సృష్టించిన విషాదం

అప్పటి తెల్లదొరలను అప్పటి శ్వేత జాతి అధికార గణాన్ని ఆలోచింప జేసింది. దాని ఫలితంగా అపర భగీరధుడని ఈ ప్రాంతవాసుల చేత ఆరాధింపబడుతున్న సర్ ఆర్థర్ కాటన్ దొర చొరవతో ఏర్పడిన ఆనకట్ట దాని ఫలితంగా ఉరుకులు పరుగుల కృష్ణవేణివేగం మందగించి తన జలధారతో ఈ నేల అంతా తడిపింది. ఇక్కడి భూమి అనతి కాలం లోనే అమిత సస్య ఫలితాలను అందించే బంగారు భూమిగా మారింది.

అదొక గొప్ప మలుపు ఈ ప్రాంతపు జన జీవితంలో ఒక అద్భుత మైన పెనుమార్పు. నూతన సంపద సమృద్ధుల వల్ల వచ్చిన అతిశయం. జనజీవన శైలిలో వారి జీవన పద్ధతులలో నడకలో ప్రవృత్తిలో ఆలోచనలలో ఒకటేమిటి సమస్త విషయాలలోనూ విచిత్రమైన మార్పు సంభవించింది. విచిత్రంగా వచ్చిపడిన నూత్న సంపద బలంచేత రాదగిన మార్పులన్నిటితోపాటు ఇతర పలుకు, భాష కూడా మారింది. ఆ మార్పు చాలా సహజంగా సంభవించింది. భూములు అమిత ఫలప్రదాలై మూల్యాలు పెరిగి కొత్త ఆర్థిక బలం పెరగడంతో ప్రజా జీవితంలో ప్రాధాన్యతలు మారాయి. వ్యవహార శైలిలో మాట తీరులో ఆలోచనా పద్ధతులలో ఒక కొత్తదనం ఒక విధమైన ఆధిక్యతా భావం. మిగిలిన ఆయా ప్రాంతాలకన్న సక్య ప్రదానమైన ప్రాంతం కావడం వల్ల ఇక్కడినుంచి పెట్టుబడులు ఇతర ప్రాంతాలకు ముఖ్యంగా ఎక్కడయితే లాభసాటి వ్యాపారాలకు పరిశ్రమలకు వీలు ఉంటుందో అక్కడికి తరలి వెళ్ళడం మొదలయింది. ఇక్కడి ఎకరం నేల ఇతర ప్రాంతాలలో యాభై ఎకరాలకు సమానమయింది. ఇక్కడి అంతంత మాత్రపు ధనికుడు మరో ప్రాంతంలో ఐశ్వర్యవంతుడైనాడు. సేద్యం దానిలోని సులువు బరువులు తెలిసినవాడు కావడం వల్ల ఇక్కడివాడు ఎటువంటి చోటనయినా రాజనాలు పండించగలడు. అందుచేత ఈ ప్రాంతం నుంచి ఇతర ప్రాంతాలకు కొత్తవలస వాసులు తరలివెళ్ళారు. వారి నడకలో ముఖ్యంగా మాటలో మాట తీరులో వున్న మార్పు సహించటమేకాక తప్పని సరికూడా అయింది. తాను ఇతరులకు అర్థం కావడం తనకు ఇతరులు అర్థం కావడం ముఖ్యం కాదా!

కాబట్టి ఇతర కొత్త అధికారాలతో పాటు కొత్త భాష అబ్బింది. ఎంతయినా అర్థమ్- ధనమ్- ప్రధానమైన అర్థవంతుడు అంటే ధనవంతుడు మిగిలిన వారి కంటే నాగరికంగా అతిశయంగా వుండాలని ప్రయత్నించడం అట్లా కనిపించాలని ప్రయత్నించడం సహజమే కదా! అటువంటి సందర్భంలో ఆ మనుషులకు భాష కూడా సహజంగానే మారుతుంది. నవధనవంతుల 'ఇనయోరిచ్' తరగతి వారి భాష వారి ఇతర లక్షణాలవలెనే మారుతుంది మరి. అది సహజం సరిగ్గా ఆ కాలంలోనే జాతి జీవితంలోనూ పెనుమార్పులు సంభవించాయి.

ప్రజలలో జాతీయ భావాలు బలపడటం స్వాతంత్ర్య కాంక్ష ప్రభలటం కొత్త చదువులు చదవవలసిరావడం మొదలయింది. విద్యా సంస్థలు స్థాపించబడ్డాయి. పాతకాలపు ఆలోచనలకు పాతకాలపు చదువులకు కాలం చెల్లింది. కొత్త విజ్ఞానం వెల్లివిరియడం మొదలయింది. కళాశాలలు కళకళలాడాయి. ఆంగ్లేయ బుద్ధి ప్రబలింది. విద్య అందరికీ అవసరం అనీ అది అందరికీ అందుబాటులోకి రావాలని ధ్యాస పెరిగింది. ముఖ్యంగా ఉన్నత విద్య తోటి మనుషుల ఆలోచనలతో విప్లవాత్మక మనదగిన పరిణామం సంభవించింది. ముద్రణ వ్యాపారం పెరిగింది. దూరంగా మద్రాసులో అయితేనేమి ముద్రణ పరిశ్రమ మొదలై గ్రంథ సముశ్చయం జనసామాన్యానికి చదువరులకు అందుబాటులోకి వచ్చింది. పుస్తక రచన పుంజుకుంది. పత్రికలు వెలిశాయి. వాటిలో 'వ్రాయసగాండ్రు' సంపాదకులు వార్తాకారులు విలేఖరులు ఇంకా ఇతర పనివాళ్ళు ఎందరో కావలసి వచ్చారు.

ఆ సమయంలో సహజంగానే బెజవాడ తెలుగు దేశానికి గుండెకాయ అనదగ్గ కేంద్రం రైల్వే కూడలి కావడంవల్ల ఇక్కడినుంచే ముఖ్యంగా తెనాలి గుంటూరు బెజవాడ బందరులలోని చదువుకున్న వారు విద్యావంతులు వ్రాయగలిగినవారు మద్రాసు చేరి పత్రికల కొలువులలో కుదురుకున్నారు. సినిమారంగం పెట్టుబడులకు లాభసాటి వ్యాపారరంగంగా మారింది. పత్రికారంగంలోనూ ప్రచార రంగం లోనూ సినిమా రంగంలోనూ అమిత మోతాదులో ఇక్కడినుంచే పెట్టుబడులు ప్రవహించాయి. ఆయా రంగాలలో అవసరమైన అంగబలం అర్థబలం రెండూ ఇక్కడినుంచే తరలివెళ్ళాయి.

అయితే ఇక్కడ ఒక చిన్న చిక్కు ఎదురయింది. గ్రంథ ప్రచురణ రంగంలోనూ పత్రికా ప్రచురణ రంగంలోనూ కుదురుకున్నవారికి ఒక సున్నితమైన సమస్య ఎదురయింది. పత్రికలు ఎక్కడో మద్రాసులో అచ్చయి ఆంధ్రదేశం నలుమూలలకు తెలుగువారి కందరికీ ఆలస్యంగా నయితేనేమి వార్తలు అందించాలి. రాయలసీమకు, తెలంగాణాకు, హైదరాబాదుకు, విశాఖ ప్రాంతానికి విజయనగరానికి, ఉత్తరాంధ్ర శ్రీకాకుళానికి అన్ని చోట్లకు వెళ్ళి వార్తలు అందజేయాలి. ఇప్పటి పరిస్థితి కాదు అప్పుడు. ఆయా ప్రాంతాలలోని చదువరులకు పాఠకులకు గ్రంథాలయాలకు పత్రికలు వెళ్ళి నాటి రాజకీయాలు వార్తలు విశేషాలు తెలియజేయాలి. ఆ పత్రికల వ్రాతలు ఆయా ప్రాంతాల తెలుగువారికి సులభంగా అర్థం కావడం అతి ముఖ్యం. వార్తలు వెంటనే బోధపడాలి. గ్రాంధిక భాష అప్పటికే మూలకు నెట్టివేయ బడింది. వ్యావహారిక భాష తప్పనిసరి అయింది. అయితే ఏది వ్యావహారిక భాష? ఎవరి భాష కాదంటే ఎవరూరుకుంటారు. ఒక ప్రాంతపు

భాష మరొకరికి సులభగ్రాహ్యం కాదు కదా! అన్ని ప్రాంతాల చూపరులకు అక్షరాస్యులకు బోధపడే ఒక భాష కావలసి వచ్చింది. రచయితలలోనూ కవులలోనూ వార్తా పత్రికలవారిలోనూ ఈ సున్నిత సమస్యలు ఎదురైె దాని పుణ్యమా అని ఒక గొప్ప ఆవిష్కరణకుకారణభూతం అయింది. ముఖ్యంగా పత్రికలవారు అందులోనూ కృష్ణా మండలం నుంచి వెళ్ళి పత్రికలలో స్థిరపడినవారు ఈ సమస్యను పరిష్కరించారు. ఫలితంగా ఒక చక్కని ప్రామాణికఅధికారిక భాష అన్ని ప్రాంతాలవారికి సులభంగా బోధపడే భాష విశిష్ట వ్యవహారిక భాష ఆవిష్కరించ బడింది. ఇది పత్రికా భాష. ఇది ఒక్కరోజు లోనో సంవత్సరంలోనో సాధించబడింది కాదు.కాని మొత్తానికి ఒక రమణీయ భాషతేట తెల్లమైన భాష. తక్కువ మాండలిక పద ప్రాబల్యం కలభాష రూపుదిద్దుకొన్నది. అది ముఖ్యంగా కోస్తా జిల్లాల అందులోనూ కృష్ణా మండలంలోని నిలకడయిన భాష. ఈ వ్యవహారిక భాషను పుష్కలంగా వాడి ఆనాటి పత్రికాధిపతులు రచయితలుయావదాంధ్ర దేశానికి వర్తింపజేశారనడం అతిశయోక్తి కాదు. ఆనాటి పత్రికలలో ఎవరో కొద్దిమంది తప్ప దాదాపు అందరూ కృష్ణా మండలం నుంచి తరలి వెళ్ళినవారే. పత్రికలలో ఉద్యోగాలు ముద్రణ రంగంలో ఉద్యోగాలు ముద్రాపరులుగా ప్రసిద్ధి చెందినవారు ప్రచురణ కర్తలుసంస్థలు అన్నీ నేటికీ ఈ జిల్లాలోనే నెలకొనివుండటం గమనార్హం. పత్రికల ప్రాబల్యం, ఇక్కడి వారి ప్రచురణ సంస్థల ప్రాబల్యం వీరి 'శిష్ట వ్యావహారిక భాష' దేశమంతటా తన ప్రభావం చూపించింది.

రాయలసీమకు చెందిన మధురాంతకం వ్రాసినా, గోదావరికి చెందిన శ్రీ పాద వ్రాసినా కళింగాంధ్రకు చెందిన కాళీపట్నం వ్రాసినా విశాఖకు చెందిన బలివాడ వ్రాసిన అందరూ తమ రచనలలో పాత్రలు సంభాషణ వశాత్తు తప్ప తమ కథనం అంతా ఈ శిష్ట వ్యవహారికంలోనే నడిపించారు. ఆనాటి ప్రసిద్ధ దిన పత్రికలు ఆంధ్ర పత్రిక, ఆంధ్రప్రభ రెండూ తమ కాలముల నిండా ఈ భాషనే సృష్టించి వాడుకున్నాయి. ఆనాటి వార పత్రికలలోనూ రచయితలందరూ ఆ శిష్ట వ్యవహారికంలోనే రచనలు చేసి యావదాంధ్రంలోనూ ఖ్యాతిని గడించారు. ఆనాడూ ఆ తరువాతనూకూడా అనేకానేక పత్రికలలో ఆ శిష్ట వ్యవహారికమ్ రాజ్యం చేసింది ఇప్పటికీ అదే భాష రాజ్యం చేస్తున్నది. తెలుగు భాషలలో సంస్తవనీయులు వంద్యులు అయిన ఆనాటి సంపాదకులు సాధించిన విజయం ఇది. సారస్వతానికి కృష్ణామండలం ఇచ్చిన గొప్ప కానుక ఈ భాష సార్వత్రిక ఆమోదం పొందిన ఆ భాషను నాటి చారిత్రక సాంఘిక అవసరాల నిమిత్తం రూపొందించిన ఘనత కృష్ణా మండల రచయితలకు సారస్వత ప్రియులకే చెందుతుందనిన అతిశయోక్తిలేదు. తెలుగు సాహితీ రంగంలో ధ్రువతారలుగా వెలుగొందే మహాకవులు రచయితలు పత్రికాధిపతులు, చరిత్రకారులు, పరిశోధకులు, ఎందరో ఈ సీమలో జన్మించి ఈ భాష సారస్వతిని ఉపాసించి తరించినవారే.

## వైకుంఠపురం - శ్రీ వేంకటేశ్వరస్వామి

అమరావతికి తూర్పుదిశన వైకుంఠపురం సాక్షాత్తు వైకుంఠంలాగే ఉంటుంది. కృష్ణానది ఇక్కడ ఉత్తరవాహిని. ఈ ప్రాంతంలో రెండు శ్రీ వేంకటేశ్వర ఆలయాలు ఉన్నాయి. కొండపైని ఆలయంలో స్వామి స్వయంభువు. కింద వున్న ఆలయాన్ని దిగువ తిరుపతి అంటారు. పైనున్న స్వామి పశ్చిమాభిముఖంగానూ దిగువనున్న విజయవాడ నుంచి 33 కి.మీ. దూరం.

**చిరునామా : *శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య, సీతారాంపురం, విజయవాడ, సెల్ : 9849550924***

డా॥ వి.వి. కృష్ణశాస్త్రి

# రెండువేల యేళ్ళ క్రితం తెలుగు మాటలు

సింధు నాగరికత నుండి మౌర్య అశోకుని కాలంవరకు అంటే రమారమి15 వందల సంవత్సరాల కాలంలోభారతదేశంలోని ఏ ప్రాంతం లోనూ ఏ లిపీ వాడుకలో ఉన్న ఆధారాలు లభించలేదు. గుంటూరు జిల్లాలోని భట్టిప్రోలు బౌద్ధస్తూపంలో లభించిన లిపి అశోకుని లిపికంటె ప్రాచీనమైనదని భావిస్తే మరొక వంద సంవత్సరాలు వెనుకకు జరగ వచ్చును. అంటే క్రీస్తుపూర్వం నాలుగవ శతాబ్దివరకు ఏదయినా లిపి లభిస్తేనే ఒక భాష ప్రాచుర్యంలో ఉన్నదని భావింపగలం. లిపి వాడుక లోనే లేనపుడు ఫలానాభాష వాడుకలో ఉన్నదని చెప్పడం సమంజసం కాదు. క్రీస్తుపూర్వం 4వ శతాబ్దం వరకు లిపి వాడకానికి నిషేధం ఉన్నదేమో ననిపిస్తుంది. ఈ నిషేధం ఎందుకున్నదన్న ప్రశ్నకు సమాధానం దొరకదు. మౌర్య అశోకుడే భారతీయులకు అక్షరజ్ఞానం కలుగచేశాడని చెప్పడం సమంజసం కాదేమో. అశోకుని శాసనాలు దేశమంతా వేయ బడ్డాయి. ఈ శాసనాలలో ప్రాంతీయంగా వాడిన అనేక అక్షరాలు చేర్చబడ్డాయి! అంటే అశోకునికి పూర్వం అనేక ప్రాంతాలలో లిపి ఉన్నట్లే కదా. క్రీస్తుపూర్వం 6వ శతాబ్దానికి చెందిన గౌతమబుద్ధుని కాలంలో 64 లిపులున్నట్లుగా లలితవిస్తర అనే గ్రంథంలో చెప్పబడ్డది. ఇవన్నీ ప్రాంతీయలిపులై ఉంటాయి. సింధు నాగరికత తరువాత ప్రవర్తిల్లిన కొత్తరాతియుగంలోగాని, లోహ యుగంలోగాని ఒక్క అక్షరం గూడా లిఖించిన ఆధారాలు లభించలేదు. ఆధారాలు లభించనంత మాత్రం చేత అక్షరాలు వాడుకలో లేవని చెప్పలేము. మేము త్రవ్విన చారిత్రకప్రదేశాలలో నివసించిన ప్రజలు నిరక్షరాశ్యులేమో.

ఇక అశోకుని కాలంనాటి శాసనాలలోగాని తరువాతి రాజుల కాలాల శాసనాలలో వాడిన ప్రాకృతభాషలో ఎక్కడా తెలుగు వాడిన ఆధారాలు మృగ్యం. శాతవాహనుల కాలంనాటిదని చెప్పబడుతున్న హాలసంకలిత ప్రాకృత గాథాసప్తశతిలో ధారాళంగా తెలుగు పదాలు న్నాయని కీర్తి శేషులు తిరుమల రామచంద్రగారు నిరూపించారు. హాలుడు క్రీస్తు శకం మొదటి శతాబ్దికి చెందినవాడు. అంటే అధమపక్షం క్రీస్తుశకారం భంనుండి తెలుగు వాడుకలో ఉన్నదనటానికి ఆధారాలున్నాయి.

క్రీస్తుపూర్వం ఒకటవ శతాబ్ది నుండి క్రీస్తు తరువాత నాలుగు అయిదు శతాబ్దాల వరకు భారతదేశానికి రోమన్‌సామ్రాజ్యానికి మధ్య విస్తృతంగా సముద్ర వ్యాపారం జరుగుతూ ఉండేది. భారతదేశం నుండి అనేక వస్తువులు రోమన్ సామ్రాజ్యానికి ఎగుమతి అయి వేలకొద్ది రోమన్ బంగారు వెండి నాణాలు భారతదేశానికి దిగుమతి అయ్యేవి. వీటిని దీనారాలని పిలిచేవారు. ఈ నాణాలు అన్ని రాష్ట్రాల కంటే ఆంధ్రలో ఎక్కువగా లభ్యమయినాయి. ఇవి నల్గొండ జిల్లాలో అక్కెనపల్లి, నాగార్జున కొండ, యేలేశ్వరం, గూటిపర్తి, విజయవాడలోని విద్యాధరపురం, గుంటూరు జిల్లాలోని వినుకొండ, మల్లయ్యపాలెం, పెదకొదమ గండ్ల, శ్రీకాకుళం జిల్లాలోని శాలిహుండం, ప్రకాశం జిల్లాలోని పాలేరు. విశాఖజిల్లాలోని కోటపాడు, గుమ్మాడ, బావికొండ, తోట్లకొండ, కర్నూలు జిల్లాలోని నంద్యాల, వీరాపురం, కరీంనగర్ జిల్లాలోని నుస్తులాపూర్, పెద్దబంకూరు, ఖమ్మంజిల్లాలో నాగవరపుపాడు మొదలయిన చోట్ల లభించాయి.

ఆ కాలంలో రోమన్ సామ్రాజ్యానికి భారతదేశానికి మధ్య జరిగిన సముద్ర వ్యాపారమే దీనికి కారణం. ఈ వ్యాపారం ఏయే ప్రాంతాల నుండి జరిగేది. ఎగుమతి అయ్యేవి తెలుసుకోవాల్సిన అవసరం ఉంది. ఈ ప్రశ్నలకు జవాబులు ఒకటవ శతాబ్దిలో ఒక అనామిక నావికా వ్యాపారవేత్త చేత విరచింపబడ్డ 'పెరిప్లస్ ఆఫ్‌ది ఎరిత్రియన్ సీ' అనే గ్రంథంలోను, రెండవ శతాబ్దిలో టోలమీ వ్రాసిన 'ప్రాచీన భూగోళం' అనే గ్రంథంలోనూ లభిస్తాయి.

క్రీస్తుశకం రెండవశతాబ్దిలో అంటే రమారమి 140 సంవత్సరంలో రోమన్ చక్రవర్తి ఆంటోనినస్ పయస్ రాజ్యకాలంలో ఈజిప్టు దేశంలోని అలెగ్జాండ్రియా వాసుడయిన క్లాడియస్ టోలమీ భారతదేశంలో విస్తృతంగా పర్యటించి ప్రాచీన భూగోళం అనే మహత్తర గ్రంథాన్ని వ్రాశాడు. పై రెండు గ్రంథాలలో శాసనాలద్వారా లభించిన ప్రాచీన భారతదేశంలోని అనేక ప్రాంతాల ప్రదేశాల పేర్లని ధృఢపరిచే రుజువులు లభిస్తాయి. ధృఢపరచడమేగాక వాటి ప్రాచీనతను గూడ తెలియబరుస్తాయి. ప్రస్తుతం మనకు కావాల్సింది ఆంధ్రప్రాంతంలోని ప్రాంతాల, ప్రదేశాల పేర్లు.

ఈ గ్రంథాలు ఆనాటి ఆర్థిక చరిత్రను ఎగుమతుల వివరాలను గూడా తెలియచేస్తాయి. గతంలో అనేకమంది దేశీయ విదేశీయ చరిత్ర కారులు ఈ గ్రంథాలలోని గ్రామాల ప్రాంతాల పేర్లను అధ్యయనం చేశారుగాని దేశీయంగా లభించిన శాసనాధారాలు లేకపోవడం చేత సరయిన వివరణలు ఇవ్వలేకపోయారు.

ఈ వ్యాసంలో పై రెండు గ్రంథాలలోని ఆంధ్రదేశానికి సంబంధిం చిన ప్రాంతాల ప్రదేశాల పేర్లు శాసనాల ద్వారాను పురాతత్వ పరిశోధ నల ద్వారాను లభించిన ఆధారాలతో అన్వయించి వివరణ ఇవ్వడం జరిగింది. గమనింపవలసిన విషయం ఏమంటే ఈ గ్రంథాలలో లభించిన పేర్లన్నీ తెలుగు పేర్లే. తెలుగు పేర్లని గ్రీకుభాషలో వ్రాయాల్సి వచ్చినపుడు ఆ భాష యాసతో వ్రాయబడ్డాయి.

టాలమీ వ్రాసిన ప్రాచీన భూగోళం అనే గ్రంథంలో తమిళనాడుకు సంబంధించిన కావేరినది నుండి ఉత్తరాన ఆంధ్రదేశంలోని గోదావరి వరకు గల భూప్రాంతం మూడు భాగాలుగా విభజింపబడ్డది. ఈ ప్రాంతాన్ని తెలుగు శాసనాలలో 'పడనాడు'గా చెప్పబడ్డది. దీన్ని టాలమీ పరాలియా లేక పడాలియ అని వ్రాశాడు. పడనాటికి ఉత్తరాన పెన్నానది నుండి కృష్ణానది మధ్య ప్రాంతం శాసనాలలో ఆరువేలనాడుగా చెప్పబడ్డది. దీన్ని టాలమీ 'అరవరనాయ్' అని వ్రాశాడు. కృష్ణానది నుండి ఉత్తరాన గోదావరి నది మధ్య ప్రాంతాన్ని శాసనాలలో 'మహిషాసక'గా చెప్పబడ్డది. దీన్ని టాలమీ మైసోలియా అని వ్రాశాడు.

పడనాడు లేక పరాలియా ఆంధ్రదేశంలోని అతి ప్రాచీన ప్రాంత నామం. పడు నాడుఅంటే పల్లపునాడులేక పల్లపుప్రదేశంగల ప్రాంతంగా వచ్చును. పూడు అంటే తమిళంలో కొత్త అని గూడ అర్థముంది. కాని ఇది పడనాడు. నెల్లూరు, చిత్తూరు జిల్లాలలో లభించిన అనేక శాసనాలలో పడనాడు ప్రాంతంలో ఉదయగిరి రాజ్యం ఉన్నట్లుగా చెప్పబడ్డది. కొన్ని తమిళశాసనాలలో విక్రమసింహపురం అంటే నెల్లూరు పడనాడు లో ఉన్నదని వ్రాయబడ్డది. ఈ పడనాడులో అనేక పట్టణాల పేర్లు ఇచ్చాడు. వీటిలో ప్రస్తుతం చిత్తూరుజిల్లాలో పీలేరుపాకాలలకు మధ్యగా ఉన్న కల్లూరు. దీన్ని కల్యూరు అని వ్రాశాడు. అతడుపేర్కొన్న తెన్నగరం, ఏకూరు, బేరి లేక పేరి, కర్మార, మొదలయిన ఇతర పట్టణాలను గుర్తించడం కష్టం. యేకూరు యేపూరు అయితే నెల్లూరు జిల్లా రావూరు తాలూకాలోఒక యేపూరుంది. కర్మార కారుమూరుకు భ్రష్టపదం అయితే గుంటూరు జిల్లాలో ఒక కారుమూరు ఉన్నది. ఈ వరసలో చెప్పిన మోగూరు కడపజిల్లా పులివెందుల తాలూకాలోని మోపూరు గావచ్చును.

ఉత్తర ఆర్కాట్ జిల్లాలోని ప్రస్తుతపు అంబూరును అబూరు అని వ్రాశాడు. ఉత్తర పడనాడులో అర్దురు అనే పట్టణాన్ని సురనాగ (సోర్న గోస్) అనే రాజు పాలిస్తున్నాడట. మనకు లభించిన శాసనాలలో ఆతురు నాడుకు ముఖ్యపట్టణం చిత్తూరుజిల్లాలోని చంద్రగిరికి సమీపం లోని ఆతూరు లేక ఆదూరు. క్రీస్తుశకం రెండవ శతాబ్దిలో టాలమీ చెప్పిన సురనాగుడుఆతూరును రాజధానిగా చేసికొని పడనాడును పాలిస్తున్నట్లు తెలుస్తుంది. ఈ పడనాడు పల్లవుల కాలంలో తొండమండలం లేక తుండీరమండలంగా వ్యవహరింపబడ్డది.

ఇక్కడ 'పెరిప్లస్ ఆఫ్‌ది ఎరిథ్రియన్‌సీ' అనే గ్రంథంలో పరాలియా లేక పడనాడును గురించి చెప్పిన సమాచారాన్ని పరిశీలిద్దాం. సముద్ర తీరంవెంట పరచుకొన్న పరాలియా ప్రాంతంలోకమర,పొదుక, సోపట్మ లేక పట్న అనే సముద్ర తీర వ్యాపారనగరా లున్నాయని ఈ నగరాలకు దమరిక (తమిళ) ప్రాంతంలో తయారయిన వస్తువులన్నీ దిగుమతిగా బడేవని, ఈజిప్టు దేశంనుండి పడవల ద్వారా వచ్చిన సామగ్రి గూడా ఇక్కడ దిగుమతి అయ్యేదని వ్రాయబడ్డది. దీన్నిబట్టి ఈజిప్టు దేశానికి భారతదేశానికి వ్యాపార సంబంధాలున్నట్లుగా తెలుస్తుంది. పైన చెప్పిన కమర అనే పట్టణాన్ని గుర్తించసాధ్యం కాలేదు. కాని పొదుక అనే పట్టణం తమిళనాడులోని పాండిచ్చేరి గావచ్చునని అనేకులుబ్రిటిష చరిత్ర కారులు వ్రాశారు. కాని యూల్, లేసన్ అనేవారు మాత్రం పొడుకా నగరం నెల్లూరు సమీపంలోని పులికాట్ గాని దానికి సమీపంలోని మరొక నగరంగాని కావచ్చునని ఊహించారు. ఈ మధ్య బిర్లాపురాతత్వ సంస్థ వారి ఆధ్వర్యంలో జరిపిన త్రవ్వకాలలో నెల్లూరు జిల్లాలోని నాయుడుపేటకు సమీపంలోని పూదూరు గ్రామ పరిసరాల్లో సువిశాల మయిన ప్రాక్చరిత్రకు సంబంధించిన పట్టణం వెలుగుకు వచ్చింది. నిస్సందేహంగా ఈ పట్టణమే పెరిప్లస్ ఉటంకించిన పోదుక లేక పుదుకూరు.

ఇక సోపట్న లేక సొపట్నం, స్వర్ణముఖి నది సముద్రంలో కలిపే ప్రాంతానికి సమీపంలోని కోటపట్నం లేక కొత్తపట్నమే పేరిప్లస్ చెప్పిన సోపట్న. దీన్ని గతంలో కాల్‌పట్టణమని పిలిచేవారని తేలింది. ఈ కాల్‌పట్టణం మహాకవి శ్రీనాథుని జన్మస్థలం గావచ్చు. ఈ మధ్య మేము జరిపిన పరిశోధనలో ఇక్కడ ప్రాక్చరిత్రకు చెందిన సువిశాల మయిన సముద్రతీర ప్రాచీన పట్టణమున్నట్లు గమనించాము.

ఇక టాలమీ ఉటంకించిన ఆరవర్‌నాయ్ లేక యేరువనాడు ఆరువేలనాడుకు భ్రష్టపదం. క్రీస్తుకు పూర్వం క్రీస్తుశకారంభంలోను ఆరువేలనాడుగా పిలువబడ్డ ఈ ప్రాంతం సంస్కృతీకరణం తరువాత షట్‌సహస్రదేశంగా మార్చబడ్డది. రానురాను ఈ పేరులోని ఆరు అనే పదం లుప్తమయి వెలనాడుగా మారింది. ప్రస్తుతం తమిళులకు బదులుగా చెప్పే అరవలనే పదం గూడా దీన్నించే వచ్చిందే.

పెన్నానదికి కృష్ణానదికి మధ్యగల భూభాగం అరవరనాయ్ అంటే ఆరువేలనాడులో పది పట్టణాలున్నట్లు టాలమీ వ్రాశాడు. ఇవి కరుగా, ఫ్రోరియన్, కరిగే, పోలూర్, పికొండక, ఐటూర్, ఇస్కపోలూర్, ఐకర్త, మలన్గ, కందిపట్న, కల్లిగ, బర్ధమాన, కోరంకల, పర్యాత్ర, పిథింద్ర మొదలయినవి. కరుగను కడపగా కొందరు గుర్తించారు. ఫ్రోరియన్

బహుశా పేరూరు గావచ్చు... కరిగ లేక కరుగాను గుర్తించలేము. పికోన్డకను అనంతపురంజిల్లాలోని పెనుగొండగా గుర్తించారు. ఐటూరు బహుశా యేటూరు గావచ్చు. అంటే యేటిఒడ్డున గ్రామం. నెల్లూరు జిల్లా రావూరు తాలూకాలో ఒక యేటూరున్నది. ఇది కండలేటికి సమీపగ్రామం. ఇక ఇస్కపోలూరు లేక ఇసుకపోలూరు అంటే ఇసుక లభించే గ్రామం. పోలూరు పాలూరు గావచ్చు. పాలూరు పేరుమీది గ్రామాలనేకం నెల్లూరు, కడప జిల్లాలలో ఉన్నాయి. పైన చెప్పిన ఐకర్త ఇనుగుర్తికి భ్రష్టపదంలా ఉంది. రావూరు తాలూకాలో కండలేరు నదికి ఉత్తర తటంమీద ఇనుకుర్తి అనే గ్రామం ఉంది.

మలంగ పట్టణాన్ని బసరనాగోస్ అనే రాజు పాలిస్తున్నట్లు టాలమీ వ్రాశాడు. మలం మల్లంగూరుకు సమీప పదం... గుంటూరుజిల్లా ఫిరంగిపురం మండలంలోని నేటి అమీనాబాదే నాటి మల్లంగూరు. ఇది గతంలో అరవరనాయ్ అంటే యేరువనాటికి రాజధాని.

కందిపట్న ఉనికి తెలియదు. కాని కంది పేరుమీద చాలా గ్రామాలున్నాయి. పట్న అంటే పట్టణం గాబట్టి ఈ పట్టణం సముద్రతీరంలో ఉండి తుపానుతాకిళ్ళకి సముద్రగర్భంలో కలిసిపోయుండాలి.

మరొకచోట టాలమీ అరవరనోయ్ ప్రాంతంలో పుదుకు లేక పుదుకూరు, మల్లంగ లేక మల్లంగూరు, కొట్టిన్ పట్టణాలు వ్యాపార కేంద్రాలని పేర్కొన్నాడు. పెన్నానదిని టిన అని పేర్కొన్నాడు. పెన్నానది ముఖద్వారం దగ్గర (సముద్రంలో కలిసేచోట) మరో వ్యాపారకేంద్రం ఉన్నట్లుగా చెప్పాడు... ఈ ముఖద్వారానికి దక్షిణదిశగా నున్న గంగాపట్టణమే టాలమీ చెప్పిన రెండవ శతాబ్దం నాటి వ్యాపారకేంద్రం గావచ్చును. పట్టణమంటే సముద్రతీర వ్యాపార కేంద్రం.

ఇక మైసోలియా లేక మహిషక భూభాగం ఇంతకుముందు చెప్పినట్లు కృష్ణా గోదావరి నదుల మధ్యప్రాంతంలోనిఐదు పట్టణాలను చెప్పాడు.ఇవి కల్లిగ, బర్దమాన, కొరంకల, ఫరేత్ర, పిథింద్ర మొదలయినవి. కల్లిగను గుర్తించలేము.బర్దమాన వర్ధమాన కావచ్చు...గుంటూరు జిల్లాలో ఒక వడ్డమాను ఉన్నది కాని మనకు కావల్సింది మహిషకలో కాబట్టి టాలమీ చెప్పిన బర్దమాన మెహబూబ్‌నగర్‌జిల్లాలో నాగర కర్నూలు మండలంలోని వడ్డమానుగా గుర్తించాలి.ఈ గ్రామ సమీపంలో ప్రాక్చరిత్రకు చెందిన విశాలమైన నగరావశేషాలు లభించాయి.

కోరంకలను నేటి వరంగల్లుగా గుర్తించవచ్చు....ఫరియాత్ర అనే నగరాన్ని గుర్తింపలేము. కాని రెండవ శతాబ్దంలో నాశిక గుహలలో గౌతమీపుత్ర శాతకర్ణి కుమారుడు వాశిష్ఠీపుత్ర పులోమావి వేయించిన శాసనంలో తన తండ్రి వింధ్య, చవత, పారిచాత (ఫరియాత), సహ్యక, కన్హగిరి, మచ్చ, శిరితన, మలయ, మహేంద్రశ్వేతగిరి, చకోరపర్వతాలకు అధిపతియని వ్రాయించాడు. విష్ణు, వామన మొదలయిన అనేక పురాణాలలో మహేంద్ర, మలయ, సహ్య, శుక్తిమన్, రుక్ష, వింధ్య, పారియాత్ర మొదలయినవి సప్తకుల పర్వతాలుగా చెప్పబడ్డాయి. టాలమి ఇచ్చిన పట్టికలోని ఫర్యాత అనేది పర్వతమా లేక పట్టణమా తెలియదు. యేమయినా టాలమీ ఫర్యాత నగరం మహిషికలోనిదని చెప్పడాన్ని బట్టి బహుశా ఇది గిరినగరం కావచ్చును.

పిథిన్ద్ర లేక పిథుండ మహిషక ప్రాంతానికి ముఖ్యపట్టణమని టాలమీ చెప్పాడు. పశ్చిమ గోదావరి జిల్లాలోని గుంటుపల్లి గుహలకు సమీపంలో పిథుండనగరం ఉండినట్లుగా ఈ మధ్య గుంటుపల్లి దగ్గర పాత గండి గూడెంలో లభించిన విష్ణుకుండిన శాసనం ద్వారా తేలింది. క్రీస్తుపూర్వం ఒకటవ శతాబ్దిలో కళింగరాజు ఖారవేలుడు పిథుండ నగరాన్ని నాశనం చేసి గార్దభాలతో దున్నించినట్లుగా చెప్పుకున్నాడు.

మహిషాసకలో ఆరూర పర్వత ప్రాంతంలో సాలంకాయనులు రాజ్యం చేస్తున్నారని అక్కడ మూడు పట్టణాల పేర్లు ఇచ్చాడు. అవి బెనగూరన్, కన్నగ, మగరిస్‌లు బి.వి. కృష్ణారావు గారు బెనగూరిన్ ఏలూరుకు సమీపంలోని వేంగి నగరమని, మగరిస్ మచిలీపట్టణానికి సమీపంలోని మాజేరు గావచ్చునని, కన్నగను గుర్తించలేమని వ్రాశాడు. బహుశానేటి మాజేరును రెండవ శతాబ్దిలో మాగేరు అనిపిలిచే వారేమో. మాజేరు గ్రామసమీపంలో ప్రాక్చరిత్రకు సంబంధించిన జీర్ణనగర శిథిలాలు కనుపించినాయి. టాలమీ వ్రాతను బట్టి సాలం కాయనులు క్రీస్తుశకం రెండవ శతాబ్దంలోనే ప్రఖ్యాతి గాంచినట్లు తెలుస్తుంది.

పైన చర్చించిన విధంగా క్రీస్తుశకం రెండవ శతాబ్దం నాటికే తెలుగు విస్తృతంగా వాడకంలో ఉన్నదని తెలుస్తున్నది. ఈ కాలంనాటి శాసనాలు అన్నీ ప్రాకృతంలోగాని సంస్కృతంలోగాని వ్రాయబడ్డా ప్రజలలో వాడుక భాష తెలుగేనని తెలుస్తున్నది. ఇక్ష్వాకుల తరువాత వచ్చిన విష్ణుకుండిన రాజుల శాసనాలు అన్నీ సంస్కృతంలో వ్రాయబడ్డా వాటిలో అనేక తెలుగుపదాలున్నాయి. కర్నూలు జిల్లాలో లభించిన పశ్చిమ చాళుక్యుల రాతిశాసనాలలో తెలుగు వాడబడ్డది. బహుశా పశ్చిమ చాళుక్యులే తెలుగును 7-8 శతాబ్దాల తరువాత పూర్తిగా ప్రాచుర్యంలోనికి తెచ్చి ఉంటారు.

(కృష్ణాజిల్లా రచయితల సంఘం 2007లో నిర్వహించిన 'తెలుగు భాష ప్రాచీనత' జాతీయ సదస్సులో అధ్యక్షోపన్యాసం)

డా॥ గల్లా చలపతి

# శాతవాహనులకు పూర్వం తెలుగు భాష

ఆంధ్రం, తెలుంగు తెనుగు అనే ఈ మూడు పేర్లు ఒక భాషకే పర్యాయపదాలుగా మనకు తెలుసు. ఆ భాషనే ఈ రోజు మనం మాట్లాడుతున్నాం. అదే నేటి తెలుగుభాష. పై మూడు పదాలు చారిత్రక కాలాల్లో ప్రచారమై కొంత కాలానికి కనపడకుండా పోయాయి. తెలుగు ప్రాచీనభాష అనే విషయం తెలుసుకోవాలంటే ఆ మూడు పదాలు ఎప్పటినుండి కనిపించాయో పరిశీలించాలి. వీటిలో ఆంధ్రం అతి ప్రాచీనమైన మాట. ఆంధ్రం ఒక ప్రాచీన భాషగా గుర్తింపబడితే దానిని నేటి తెలుగు భాషగానే భావించాలి. మన దేశాన్ని పాలించిన మొదటి రాజవంశీకులు ఆంధ్రులని, అప్పటినుండి ఆంధ్రదేశం, ఆంధ్రభాష అనే మాటలకు ప్రాచుర్యం కలిగిందని కొందరు భావిస్తారు. ఇది పూర్తిగా నిజం కాదు. శాతవాహన రాజ్యస్థాపనకు సుమారు రెండు వందల సంవత్సరాల ముందుకాలం నుండి 'ఆంధ్ర' అనే మాట ప్రాచుర్యముంది.

ఇంచుమించు బుద్ధుని కాలం నుండి భారతదేశమంతటా ప్రాకృతం ప్రధాన భాషగా ఉండేదని పండితులందరూ అంగీకరించిన విషయం. అశోకుడి కంటే ముందే బౌద్ధం ఆంధ్రదేశంలో వ్యాపించింది. భట్టిప్రోలు కరంత శాసనాలు ఈ విషయాన్ని నిరూపిస్తాయి. అంతకుముందే ప్రాకృతం మాట్లాడే ఔత్తరాహులు కృష్ణా గోదావరీ నదుల మధ్య ప్రాంతానికి వచ్చి స్థిరపడినారు. అప్పటికే అక్కడ ఉండిన నాగులు, తెలాంగులు మొదలైనవారితో కలసి వాళ్ళ భాషను మాట్లాడుతూ ఆ ప్రాంతానికి ఆంధ్ర అని పేరును ప్రచారం చేశారు. ఇక్కడ తెలాంగులు ప్రాచీన ద్రావిడ తెగలకు సంబంధించిన వాళ్లని, వాళ్లు ద్రావిడ భాషైన తెలుగును (అప్పటికి ఆంధ్రం) మాట్లాడేవారని, కొంతకాలం తరువాత ఇది ప్రాచీన ద్రావిడం – ద్రావితం నుండి విడిపోయిందని భాషాశాస్త్రజ్ఞులు గుర్తించారు.[1] ఇది శాతవాహనుల కంటే ముందే జరిగిన విషయం. అయితే ఈ విషయాలు త్వరగా బయటకు రాలేదు. దీనికి చారిత్రక కారణా లున్నాయి.

ఆంధ్ర ఉత్తర ఆర్య రాజ్యాలకు సన్నిహితంగా ఉండడం వల్ల ఆర్యమత సాంస్కృతిక ప్రభావం దీనిపైన బలీయమైన ప్రభావాన్ని చూపింది. ఆంధ్ర ప్రాంతపు సంస్కృతిలో మార్పులొచ్చాయి. ఆంధ్ర ఆర్య-అనార్య సంస్కృతులకు కూడలిగా ఉంటూ ఆ రెండింటి సమ్మేళనం ద్వారా హైందవ సంస్కృతిని రూపొందించడంలో ప్రముఖ పాత్రను పోషించింది. దీనికి తోడు తీరాంధ్ర సాగించిన విదేశ వర్తకం ద్వారా విదేశీ సంస్కృతి ప్రభావం కూడా ఉంది. ఈ కారణాల వల్ల అప్పటికే ఆంధ్రలో ఒక సామరస్య ధోరణి కనిపించింది. ఇప్పటికీ ఆంధ్రదేశం ఉత్తర సంస్కృతికి దక్షిణ సంస్కృతికి సేతువుగానే ఉంది. సంస్కృతి భాష ద్వారా వెల్లడవుతుంది. అందువల్ల అప్పటి భాషలో ప్రాకృత భాషాప్రభావం అధికంగా ఉంది. అయితే ఈ ప్రభావానికి దేశీయులు మాట్లాడే భాష తన స్పష్టతను కోల్పోలేదు.

అశోకుడి కంటే ముందే బౌద్ధం ఇక్కడ ప్రచారమైంది. ఈ ప్రచారానికి కారకులు బౌద్ధంలో రెండవ చీలికవారైన మహా సాంఘికులు. ఇది క్రీ.పూ. 4వ శతాబ్దం మాట. ఈ కాలం నాటి భట్టిప్రోలు బౌద్ధ శాసనాలలో ఒక వర్తక నిగమం. ఒక కుబేరక రాజు పేర్కొనబడడం వల్ల అప్పటి ఆంధ్రదేశంలో గణతంత్ర వ్యవస్థ కూడా ఉండినట్లు అర్థమవుతున్నది. మెగస్తనీస్ 'ఇండికా' కూడా దీనిని నిరూపిస్తున్నది. ఆ కాలంలో ఆంధ్రులు ప్రభుత్వాలనే స్థాపించినవారుగా కనపడినపుడు దేశంలో కొందరైనా విద్యావంతులుండే అవకాశ ముంది.[2] ప్రాచీన తెగలలో ఆంధ్రులు ఒక ప్రత్యేకతను కలిగి శాతవాహనుల కాలంనాటికి ఎంతో అభివృద్ధి దశలో ఉండినట్లు చరిత్ర కారులు గుర్తించారు. ఇంత అభివృద్ధిపథంలో ఉండిన దేశంలో వీళ్లకొక భాష తప్పకుండా ఉండి ఉంటుంది. ఆ భాషను తెలుగే (అప్పటికి ఆంధ్రం)నని కొందరు పండితులు భావిస్తే దానిని దేశ భాషగా కొందరు గుర్తించారు.[3]

మత్స్యపురాణం శాతవాహనులను ఆంధ్రులంటున్నది. కొందరికి ఈ విషయంలో అభిప్రాయ భేదాలుండవచ్చు. అయినా ఇది వాస్తవం. కొన్ని పురాణాలు శాతవాహనులను ఆంధ్రభృత్యులని పేర్కొన్నాయి. వాళ్లకంటే ముందే ఈ ప్రాంతంలో ఆంధ్రులున్నారని దీన్నిబట్టి తెలుస్తున్నది. ఈ ఆంధ్రులు ఆంధ్రదేశానికి మహాసాంఘికులు

రాకముందే ఇక్కడ ఉండినవాళ్లు, ఇది చిక్కుసమస్య కాదు. పండితులం దరూ ఒప్పుకొన్న విషయమే. శాతవాహనులు ప్రాకృతంలో శాసనాలు వేయించారు. సంస్కృతభాషను పోషించారు. ఈ రెండూ కాక వీళ్ల కాలంలో ఒక దేశభాష ఉంది. ఇది తెలుగేనని అనేక ఉపనిషత్తులలో నిరూపించవచ్చు.

"షడ్భిరాస పై స్త్వయా దేవః శిక్షితశ్చేత్తతో మయా,
సంస్కృత ప్రాకృత
తద్వద్దేశ భాషాచ సర్వధా భాషాత్రయమిదం
త్యక్తం యన్మనుష్యేషు సంభవేత్"

ఇది శర్మవర్మ శాతవాహనరాజును ఆరు నెలలలో సంస్కృతభాషా పారంగతునిగా చేస్తాననపుడు గుణాఢ్యుడు చేసిన శపథం. ఇది కథా సరిత్సాగరంలోని విషయం. సంస్కృత ప్రాకృతాలతో పాటు ఇందులో ఒక దేశ భాష పేర్కొనబడింది. ఈ దేశభాషలనే పదం అప్పటి నాట్యశాస్త్రం, వాత్స్యాయన కామసూత్రాలు ఇత్యాది గ్రంథాల్లో కూడా కనిపిస్తున్నది. కనుక తప్పకుండా ఇది ఒక భాషే. అది సంస్కృత ప్రాకృత భిన్నమై దేశంలోని జనులచే వ్యవహరింపబడిన భాష. గుణాఢ్యుని శపథం కాలం నాటికి శాతవాహన రాజ్యం మహారాష్ట్రలో కేంద్రీకృతమై వుండినదని, కాబట్టి ఈ దేశభాష మహారాష్ట్రి కావచ్చునని కొందరు అభిప్రాయపడినారు. కాని అప్పటికి మహారాష్ట్రి భాష ప్రచారంలో లేదని, తరువాత కొన్ని శతాబ్దాల వరకు ఆ భాష తయారుకాలేదని పండితుల అభిప్రాయం.[4]

శాతవాహనులు ఆంధ్రులైనపుడు వాళ్లు ఆంధ్రభాషలో శాసనాలు వేయించక ప్రాకృత భాషలో ఎందుకు వేయించారన్నది ఒక ప్రశ్న. దొరికిన ముప్పై పైగా శాతవాహనుల శాసనాలు ప్రాకృత భాషలో ఉన్నది నిజమే. ఇది అంతగా ఆక్షేపించదగిన ప్రశ్న కాదు. ఆ కాలం నాటికి భారతదేశమంతటా అధికారికంగా వ్యవహారంలో ఉండిన భాష ప్రాకృతం. పైగా ప్రాకృతం మౌర్యుల నుండి శాతవాహనులకు బౌద్ధంతో పాటు సంక్రమించిన భాష. ప్రాకృతం వాళ్ల మాతృభాష కాదు. దేశంలో ప్రచురంగా ఉండిన భాష ప్రాకృతం కాబట్టి శాసనాలు ప్రాకృతంలో వెలువడినాయి.[5] ఆంధ్ర ప్రాంతానికి దక్షిణంగా ఉన్న తమిళ ప్రాంతం వాళ్లకు ఉత్తర ప్రాంతంగా తెలుగు మాట్లాడే ప్రజలుండినట్లు గుర్తించింది. తమిళ వాఙ్మయంలో అతి ప్రాచీనమైన 'అగత్తియం' అనే లక్షణ గ్రంథంలో 'కొంగణం కన్నడం కొల్లం తెలుంగుం' అనే సూత్రప్రాయమైన విషయముంది. ఈ సూత్రంలోని తెలుంగుం అనే మాట శాతవాహనుల కాలంనాటి జన వ్యవహారం లోని భాషనే సూచిస్తుంది. గౌతమీపుత్ర శాతకర్ణి, వాసిష్ఠీ పుత్ర పులోమావి, శ్రీ యజ్ఞ శాతకర్ణి చలామణి చేయించిన నాణాలు (coins) పై ఆయా రాజుల పేర్లు రెండు భాషల్లో – అంటే ప్రాకృతం – దేశ భాషల్లో కనిపిస్తున్నాయి. ఈ నాణాలను ముద్రింపించి విడుదల చేస్తున్నపుడు ఈ రాజులు తాము తెలుగువాళ్లమన్న సంగతి, తమ నాణాలు తెలుగుదేశంలో ప్రచారం పొందుతున్నాయన్న విషయం గుర్తుంచుకొన్నారు.[6] అందువల్లనే కాబోలు బ్రాహ్మీలిపిలోనే నాణానికి ఒకవైపు ప్రాకృతంలో రెండవవైపు తెలుగులో తమ పేర్లను చెక్కించుకొన్నారు. ఒక ఉదాహరణ. యజ్ఞశ్రీ శాతకర్ణి నాణెంపై రెండువైపుల

**ప్రాకృతం :** రాఞోగోత విపుతస సిరియఞ సాతకణిస

**తెలుగు :** అరహణకు గోతమీ పుతకుహిరు యఞహా తకణికు

ఆ నాణెంపై గల అరహణకు ఇత్యాది తెలుగు మాటలు ఆనాడు ప్రజలు మాట్లాడుతూ ఉండిన దేశభాషా పదాలు. నాణాలపై కనిపించిన దేశభాషా పదాలను డి.సి. సర్కార్ లాంటి పండితులు తెలుగుభాషా పదాలుగానే గుర్తించడమే గాక ఈ భాషను శాతవాహనుల మాతృభాషగా కూడా పేర్కొన్నారు.[7] దీన్నిబట్టి శాతవాహనుల కాలంలో తెలుగుభాష వ్యాప్తిలో ఉందనడానికి సందేహం లేదు.

శాతవాహనుల కాలంలో తెలుగు వ్యవహార భాషగా ఉండినట్లు నిరూపించడానికి మరొక తిరుగులేని సాక్ష్యం హాల చక్రవర్తి సంకలనం చేసిన 'గాథాసప్తశతి' ఈ గ్రంథంలోని 700 గాథలు ప్రాకృతంలో ఉన్నప్పటికి అవి తెలుగు సంస్కృతిని ప్రతిబింబిస్తాయి. ఈ గాథలలోని అనేక సాంస్కృతికాంశాలు తరువాత వచ్చిన తెలుగు కావ్యాల్లో ప్రబంధాల్లో ప్రతిబింబించాయి. ప్రాచీన తెలుగు కవులెవరూ గాథాసప్త శతిని తమకు సంబంధంలేని మరొక భాషా గ్రంథంగా భావించలేదు. అప్పటికి తెలుగులో కవితా సంప్రదాయం మొదలు కాలేదు కాబట్టి ప్రజలకు అతి సన్నిహితమైన ప్రాకృత భాషలోనే పద్యాలు వెలువడినాయి. పైగా సంస్కృతానికి ఆనాడంత ఆదరం కనబడదు. "గాథాసప్త శతి కదలి తడవి చూడని అంశం లేదు. సప్తశతీ పర్యావలోకనం చేసిన తరువాత జగత్తు అంతా బాణోచ్ఛిష్టం కాదు. గాధోచ్ఛిష్టం అనిపిస్తుంది.[8]" సప్తశతిలోని విషయాలన్నీ నాగరకుల, గ్రామీణుల, ఆటవికుల సంప్రదాయాలు ; జీవన విధానాలు సమగ్రంగా చిత్రింపబడిన మనోహర దృశ్యాలు. సప్తశతిలో కనిపించే సంస్కృతి ఈనాటికీ తెలుగు పల్లెల్లో సజీవంగా కనిపిస్తున్నది.

గాథాసప్తశతి తెలుగువాళ్ల జీవితంతో పూర్తి సంబంధం ఉండడం వల్లనే ఆనాటి ప్రజా వ్యవహారం నుండి ఎన్నో తెలుగు మాటలు గాథలలో కనిపిస్తున్నాయి. అత్త, కరణి, కుసుంభ, చోజ్జం, కై (తెలుగు విభక్తి ప్రత్యయం), పాది, పోట్ట, ఫలహి, మోడి, తుప్ప మొదలైన పదాలు ప్రాకృత గాథలలో కనిపిస్తున్నాయి. తిరుమల రామచంద్ర, దివాకర్ల వేంకటావధాని వంటి తెలుగుభాషా సాహిత్య పండితులు ఈ పదాలన్నీ తెలుగు పదాలేనని సప్రమాణంగా నిరూపించారు. ద్రావిడభాషా శాస్త్రవేత్తల దృష్టి కూడా ఇదే. ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యం మొదటి సంపుటంలో గాథాసప్తశతిలో చేరి కనిపిస్తున్న

40 తెలుగు మాటలను చూపారు. ఆ మాటలను ఏయే ప్రాకృత కవులు ఏయే గాథలలో వాడినారో కూడా చూపించారు. ఈ తెలుగు మాటలను సంస్కృత పండితులు సంస్కృతంలోనివని నమ్మించే ప్రయత్నం చేసినా అది నిలిచే మాట కాదు. భాషా శాస్త్రవేత్తలు తెలుగును మధ్య ద్రావిడ భాషగా చెపుతారు. కాల్డ్‌వెల్ దృష్టిలో మరాఠీ, గుజరాతీ భాషలు కూడా ద్రావిడ భాషలే[9]. ఈ దృష్టితో పరిశీలించినా తెలుగుభాష దేశ మధ్య ప్రాంతానికి అంటే సరిగ్గా ఆంధ్రప్రాంతానికి సరిపోతుంది.

శాతవాహనుల కాలం నుండి వెలువడిన ప్రాకృత శాసనాలను పరిశీలించినా తెలుగు ప్రాచీనత బోధపడుతుంది. ఈ శాసనాలలో గ్రామాల పేర్లు, వ్యక్తుల పేర్లు అనేకం కనిపిస్తున్నాయి. ఇవన్నీ తెలుగు పదాలే. ఖదవలి (కొడవలి), వేపురకే (వేపూరు), కెవురురే, మందర, హిరలూరే, కుడూర ఇత్యాది గ్రామాల పేర్లు పులోమావి మ్యాకదొని శాసనం, అమరావతి శాసనం మొదలైన శాసనాల్లో దొరుకుతున్నాయి. శాతవాహనుల తరువాత ఆంధ్ర ప్రాంతాన్ని పాలించిన ఇక్ష్వాకుల, పల్లవ, శాలంకాయనాది రాజవంశాలు వేయించినప్రాకృత శాసనాలలో కూడా ఇలాంటి ఊర్ల పేర్లు ఎన్నో కనబడతాయి. ఇలాగే అగ్గిజ్జ, భావజ్జ, నందజ్జ, రెమ్మణక, సాగరమ్నక, విశాఖమ్నక మొదలైన వ్యక్తుల పేర్లు శాసనాలలో కనిపిస్తున్నాయి. అజ్జ తరువాత అయ్యగా మారింది. అక అన్నగా మారింది. ఈ "ఊళ్లపేర్లూ మనుష్యుల పేర్లూ తెలుగువే."[10] ఈ శాసనాలలో కనిపిస్తున్న ఊరు, పర, కొన్ఠ, చెరువు, కోడు, రేవుపాక, పల్లి, వాద, పుర, ముడి, తొతె, మంచి ఇత్యాదులన్నీ గ్రామాలపేర్ల ద్వితీయావయవాలు. వీటికి సంస్కృత మూలాలుండవు. ఇవన్నీ దేశ్య పదాలే. ఇప్పటికీ గ్రామ నామాలలో ఈ అనుబంధాలు కనిపిస్తున్నాయి. అందువల్ల ఇవన్నీ తెలుగు మాటలే.

క్రీ.శ. 6వ శతాబ్దం నుండి తెలుగులో శాసనాలొచ్చాయి. రేనాటి చోళరాజైనధనంజయుని కాలంలో వచ్చినఎర్రగుడిపాడు (కమలాపురం తాలూకా కడపజిల్లా)శాసనం మొదటి తెలుగు శాసనం. ఈ శాసనంలో కనిపిస్తున్న తెలుగువాక్య నిర్మాణం ఆ కాలం నాటి పరిణత తెలుగు భాషా స్థితినినిరూపిస్తుంది. దీని తరువాత విప్పర్లశాసనం వెలువడింది. ఆ తరువాత వరుసగా అనేక తెలుగు శాసనా లొచ్చాయి. ఇవన్నీ తెలుగు భాషా స్థితినే గాక తెలుగు సంస్కృతిని కూడాతెలుపుతున్నాయి. భాషా పరిణామాన్ని బట్టి చూస్తే సంపూర్ణ వాక్య నిర్మాణం గల శాసనాలు ఉన్నట్టుండి వెలువడడానికి వీలు గాదనిపిస్తుంది. ఈ శాసనాలు రావడానికి ముందు దేశీయులు ఆ భాషను వ్యవహారభాషగా వాడుతూ ఉండాలి. ఆ భాష ఒక పరిణత స్థితికి చేరుకొని ఉండాలి. అప్పటికే దేశంలో కొనసాగుతూ ఉండిన గుణాఢ్యుడు పేర్కొన్న దేశభాష తెలుగే కావడంవల్ల అప్పటినుండి 6వ శతాబ్దం నాటికి తెలుగు ఒక సంపూర్ణ భాషగా వికసించి సందేహాస్పదం కాని విధంగా తన ఉనికిని పటిష్టం చేసుకొన్నది. అందువల్ల శాతవాహనుల కాలం నుండి ఆంధ్రదేశంలో తెలుగు ఒకభాషగా వ్యవహారంలో ఉన్నదనినిస్సంశయంగా చెప్పవచ్చు. ఇతర ద్రావిడ భాషలైన తమిళ కన్నడాలలో కూడా ఇంచుమించు ఒక కాలంలోనే శాసనాలు వెలువడినాయి. తెలుగు శాసనాలు కూడా ఇదే కాలానికి చెందినవే.[11] ఈ విషయం తెలుగు కన్నడాల కంటే తెలుగు మనీ అర్వాచీనం కాదని నిరూపిస్తుంది.

ముందు పేర్కొన్న శాతవాహనుల నాణాలపై ఒక వైపున గల దేశి వ్రాతను (ఇది రాజు పేరును సూచించే అంశం) పరిశీలిస్తే అది ఛందోబద్ధంగా ఉన్నట్లు అర్థమవుతుంది. పండితులు ఈ వ్రాతలను రగడ పంక్తులుగా గుర్తించారు. వాడు వీడితో రగడ పెట్టుకున్నాడు అనడం ప్రాచీనకాలం నుండి ఉంది. ఇందులోని రగడ ఇద్దరూ ఎక్కువ సేపు కోరగా మాట్లాడుకోవడంలో అప్రయత్నంగా దొర్లిన లయాత్మ కతను చెప్పే మాట. ఇది తరువాత ఒక దేశి ఛందంగా మారింది. తెలుగులో ప్రాచీనకాలం నుండి పదసాహిత్యముందనడానికి ఇది ప్రారంభ దశ. ఒకరకంగా ఇది గాథాసప్తశతి కాలం. ఆ కాలంలో సందర్భానికి తగిన పాటలు కట్టి పాడుకోవడం తెలుగులో ఉంది. ప్రాకృత గాథలు కూడా అప్పటికప్పుడు ఆశువుగా వాళ్లూ వీళ్లూ పాడుకొన్నవే. వీటిలో కొన్ని అప్పటి కవులవి కూడా ఉన్నాయి. హాలుడు వీటిని సేకరించాడు. తెలుగు పదాలను ఎవరూ సేకరించలేదు. అంతమాత్రం చేత తెలుగులో పద సాహిత్యం లేదని చెప్పడానికి వీలు గాదు. ఉద్యోతనుడనే ప్రాకృత కవి తనకాలం నాటి దేశాలను, భాషలను పేర్కొంటూ ఆంధ్రదేశాన్ని, ఆంధ్రభాషను ప్రస్తావించాడు. మతంగుని బృహద్దేశిలో ఆంధ్ర అనే రాగం పేర్కొనబడింది. క్రీ.శ. 9వ శతాబ్దం నుండి తెలుగులో పద్య శాసనాలు వెలువడినాయి. అంతకుముందు ఛందో లక్ష్యాలు లేకుంటే ఇది ఎలా సాధ్యమవు తుంది.[12] తెలుగులో వివిధ రకాల ఛందో రచనలున్నందువల్లనే కవి జనాశ్రయమనే లక్షణ గ్రంథం వచ్చింది. ఇది క్రీ.శ. 10వ శతాబ్ది నాటిది. తమిళ కన్నడ భాషలలో దీనికంటే ముందు లక్షణ గ్రంథా లొచ్చాయి. తెలుగులో కొంత ఆలస్యంగా లక్షణ గ్రంథం వచ్చిందే గాని బోలెడు లక్ష్యాలున్నాయి కదా.

ప్రాచీనకాలం నుండి తెలుగులో ప్రచారం పొందిన పదాలను తెలుగువాళ్లు సేకరించుకొని ఉంటే ఎన్నో వైవిధ్యభరితమైన పాటలు దొరికి ఉండేవి. ఇవి ప్రచారంలో ఉండినట్లు బోలెడు ఆధారాలున్నాయి. నన్నయకాలం నుండి వెలువడిన పద్య సాహిత్యంలో ఇలాంటి పాటల ప్రస్తావన కనిపిస్తున్నది. నన్నెచోడుని కుమార సంభవంలో ఈశ్వరుని స్తుతించే అంకమాలికలు (3-38), కల్లు దించే వారి గౌత గీతాలు (6-45), శబర కామనుల దంచుపాటలు (6-47) స్త్రీలు పాడే ఊయల పాటలు (4-89) చోటు చేసుకొని కనిపిస్తున్నాయి. పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రలో తుమ్మెద పదాలు, గొబ్బి పదాలు,

వెన్నెల పదాలు, జోలపాటలు ప్రస్తావించబడినాయి. నన్నయభారతం ఆదిపర్వంలో నాగీ గీతాలు పేర్కొనబడినాయి. ఇలా ఎందరో కవులు తమ రచనలలో ప్రస్తావించిన అనేకరకాల పాటలు ప్రాచీనకాలం[1] నాటివి కావు. ఈ పాటలన్నీ ఎంతో ప్రాచీనకాలం నుండి ఆంధ్రదేశంలో ప్రచారం పొందుతూ పద్య కవుల రచనలలో చోటు సంపాదించుకున్నాయి.

ఇలా ఆంధ్రదేశంలో వెలువడిన శాసనాలు, నాణాలు, ప్రాకృత గ్రంథాలు, బౌద్ధ సాహిత్యం, ఛందో విషయాలు మొదలైన ఆధారాల నెన్నిటినో పరిశీలించి చూస్తే తెలుగు భాష ప్రాచీన స్థితి మనకర్థమవుతుంది. తెలుగుభాషకు అంత ప్రాచీన స్థితి ఉండడం వల్లనే సాహిత్య దశ ఏర్పడడం, ఛందో గ్రంథాలు రావడం, కావ్యాలు రావడం జరిగింది.

**సంఖ్యా సూచిక :**

1. ఈ అభిప్రాయం కోరాడ రామకృష్ణయ్య గారిది. SVOI పత్రిక 13వ సంపుటం 18వ పుటలో ఆయన రాసిన ఆంగ్ల పంక్తులు.

   Telangas perhaps a mixture of pre-Dravidian and Dravidian races speaking a Dravidian language Telugu which took after the name of their tribe and which must have got separated from other cognate languages of South India.
2. Hanumantha Rao, B.S.L. "Buddhism and Jainism in Andhradesa" Hyderabad, 1997. From Introduction
3. K. Gopalachary, "Early History of Andhra Desa", Madras, 1941, page. 1
4. వేంకటావధాని, దివాకర్ల 'ఆంధ్రవాఙ్మయారంభదశ' - హైదరాబాదు, 1960, పుట. 25.
5. Hanumantha Rao, B.S.L. "The Age of Satavahanas", Hyderabad, 2001, page. 7

   The Satahavanas used prakrit not because it was their mother-tongue but only because it was the official language through out the sub-continent since the time of Asoka.
6. ఆరుద్ర. 'సమగ్రాంధ్ర సాహిత్యం' మొదటి సంపుటం. ద్వితీయ ముద్రణ, విజయవాడ, 1990. పుట. 28
7. Sircar, D.c "Epigraphia Indica" Vol. 35.

   Apparently Telugu which was in older times closer to Tamil than it is now was the mother-tongue of the Satavahanas and they wanted to exhibit their Dravidian character by using an admixture of that language and sanskrit-prakrit in the reverse legend on their coins in the northern most part of their empire conquered from the sakas.
8. నరసింహశాస్త్రి గట్టి 'శాతవాహన సంచిక' హాలుడు - గాథాసప్తశతి' అనే వ్యాసంలో ప్రథమ ముద్రణ. 1950. పుట. 149
9. సుబ్రమణ్యం. పి.యస్. 'ద్రావిడ భాషలు' హైదరాబాదు. 1994. పుట. 3
10. సుబ్రమణ్యం. పి.యస్. 'ద్రావిడ భాషలు', హైదరాబాదు. 1994, పుట. 3

    'ఊళ్లపేర్లు, మనుష్యుల పేర్లు తెలుగులే' అని చాలామంది రాశారు. ఇది వాస్తవం. ఈ విషయాన్ని సాహిత్యకారులు చెప్పడంకంటే భాషా శాస్త్రవేత్తలు చెపితే ఇంకా గట్టి ఉంటుంది. అందుకని ప్రముఖ భాషా శాస్త్రవేత్త అయిన పి.యస్. సుబ్రమణ్యంగారి మాటలు గ్రహించడం జరిగింది.
11. ఆరుద్ర 'సమగ్రాంధ్ర సాహిత్యం' మొదటి సంపుటం. ద్వి. ము. పుట. 26.

    ఆరుద్ర మద్రాసులో ఉన్నవారు కావడం వల్ల తమిళ సాహిత్యాన్ని బాగా పరిశీలించారు. తమిళ సాహిత్య చరిత్రను కూడా చూశారు. ఆ అధికారంలో తమిళ, కన్నడ తెలుగు, భాషల్లో శాసనాలు, సాహిత్య ఎప్పటినుండి వచ్చాయో చారిత్రకంగా పరిశీలించి వివరించారు. సాహిత్యం విషయంలో కొంచెం తేడాలున్నా శాసనాలు మాత్రం ఈ మూడు భాషల్లో ఇంచు మించు సమకాలంలోనే వెలువడినట్లు ఆధారాలతో నిరూపించారు.
12. చలపతి, గల్లా. 'వ్యాస భండారం' ప్రాఙ్నన్నయ యుగంనాటి పదసాహిత్య స్థితి అనే వ్యాసంలో

    తిరుపతి. 1999, పుట. 3

    ఈ వ్యాసంలో తెలుగును ప్రాచీన భాషగా నిరూపించడానికి గల ఆధారాలన్నీ పరిశీలింపబడినాయి.

చిరునామా : డా॥ గల్లా చలపతి, ప్రొఫెసర్, తెలుగు శాఖ, శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం తిరుపతి - 517502.

డా॥ అద్దంకి శ్రీనివాస్

# శాతవాహనులనాటి "కా తంత్రం"

## ఆంధ్రుల భాషాబోధన నైపుణ్యాలు

ఆంధ్రులు, ఆంధ్రభృత్యులు,శాతకర్ణులు శాతవాహనులుగాప్రసిద్ధి చెందిన శాతవాహనులకూ కృష్ణాతీరానికీ అవినాభావ సంబంధం ఉంది. శాతవాహనులు కళలనూ, కట్టడాలనూ ప్రోత్సహించారు. వారు కట్టించిన కట్టడాలు, స్థూపాలు నేటికీ కృష్ణానదీ పరీవాహక ప్రాంతాలలో ఉన్నాయి. అమరావతిలోని బౌద్ధస్థూపం వాటిలో చాలాప్రసిద్ధిచెందింది.

ఈ స్థూపంలో ఉపయోగించిన చలువరాతి కట్టడాలు, గౌతమ బుద్ధుని శిల్పాలు వారి కళాతృష్ణకు, ఆనాటి పరిస్థితులకు అద్దం పడ తాయి. ఆంధ్ర శిల్పకళ వీరి ద్వారా ఆగ్నేయ ఆసియాలో కూడా వ్యాప్తి చెందింది.

ఇవన్నీ అలా ఉంచితే అత్యంత ప్రాచీన కాలంలోనే భాషా సాంకేతి కతకు ఆటపట్టుగా నిలిచే ఒక వ్యాకరణ గ్రంథం శాత వాహనుల కాలంలోనే ఆవిర్భవించింది. భాషాబోధనలోని సాంకేతికతను ఆంధ్రులు 2,000 ఏళ్ళక్రితమే పట్టుకున్నారు. ఆచరణలో పెట్టి ప్రయోగాత్మకంగా నిరూపించి చూపించారు.

ఇప్పుడిప్పుడే పాశ్చాత్యదేశాలు తెలుసుకున్న భాషాబోధనలోని టెక్నాలజీని మనం దిగుమతి చేసుకొని అద్భుతం సాధించా మను కుంటున్నాం. ఆకృతిగణాలు, భాషాశాస్త్రీయత, అన్యభాషా సారూప్యత మొదలైన అంశాలు విద్యాబోధనలో ఊతం ఇస్తాయి.

ఈ విషయంలో మన పూర్వులు చేసిన ప్రయోగాలు వీటికీ ఏ మాత్రం తక్కువకావు! ఒక భాషను ఎంతో సులభంగా నేర్చుకోవడానికీ, భాష రానివాడు కూడా స్వల్పకాలంలోనే మాట్లాడేలా, రాసేలా తీర్చిదిద్దే ఒక అద్భుత వ్యాకరణగ్రంథం శాతవాహనుల కాలంలో పుట్టింది. దాని పేరి 'కాతంత్రం'. మాతృభాష కాని అన్యభాషను అత్యంత సుల భంగా నేర్పడానికీ, నేర్చుకోవడానికి కావలసిన కిటుకుల్ని ఏర్చి కూర్చిన వ్యాకరణ గ్రంథం ఇది.

కుంతల శాతకర్ణి పట్టపురాణి సంస్కృత విదుషీమణి కాబట్టి, ఆమె సంస్కృతం తప్ప వేరే భాష మాట్లాడరు. పాపం మన రాజుగారికి సంస్కృతం కొద్దిగా వచ్చు. ఒకరోజు రాణిగారితో రాజుగారు జలక్రీడ లాడుతున్నారు. ఆ సమయంలో ఒక గమ్మత్తు జరిగింది. రాజుగారు రాణిని నీటితో కొట్టాడు. అపుడా రాణి సంస్కృతంలో **"మోదకై మామ్ తాడయ"** అంది. నీళ్ళతో అలా నన్ను కొట్టకు అనీ ఆవిడ ఉద్దేశం.

మోదకం అంటే సంస్కృతంలో 'కుడుము' అని అర్థం. ఆమె అన్న ఆ వాక్యాన్ని కూడబలుక్కునాడు రాజు. మోదకం అంటే కుడుము. మామ్ అంటే నన్ను, తాడయ అంటే కొట్టు. అర్థమైపోయింది రాజుగారికి. వెంటనే రాజుగారు 'ఎవరక్కడ?' అన్నారు. 'చిత్తం మహా ప్రభూ' అన్నారు సేవకులు. 'వెంటనే వేడి వేడి కుడుములు తెప్పించండి' అన్నాడు రాజు. వేడివేడిగా వచ్చాయి కుడుములు. ఆ కుములతో రాణిగారి ముఖార విందాన్ని అలంకరించారు రాజుగారు.

రాణి కోరిక తీరుస్తున్నానని రాజు గారి భావన. కానీ, రాణిగారు ఆగ్రహోదగ్రురాలై అక్కణ్ణుంచి చరచరా వెళ్ళిపోయింది. అర్థం కాని రాజు తన గురువూ ఆస్థాన పండితుడూ అయిన గుణాఢ్యుణ్ణి శరణు వేడాడు. జరిగింది చెప్పాడు. అప్పుడు గుణాఢ్యుడు (క్రీ.పూ.60-20) అసలు సంగతి చెప్పాడు. అతడు చెప్పిన మీదట తాను ఎంత పెద్ద పొరపాటు చేశాడో అర్థమయింది రాజుకు.

"మా ఉదకై:" కాస్తా గుణసంధి వల్ల "మోదకై:'గా మారింది. ఆ మాత్రం వ్యాకరణ పరిజ్ఞానం లేనివాడితో కాపురమేంటని రాణిగారికి కోపం వచ్చింది. భాష ఇలా సంసారంలో చిచ్చుపెడుతుందని ఊహించ లేకపోయాడు రాజు. ఇలా లాభంలేదని వెంటనే తాను సంస్కృతం నేర్చుకోవాలనుకున్నాడు రాజు. తన గురువు గుణాఢ్యుల వారిని తనకు సంస్కృతం నేర్పమన్నాడు.

ఒక భాష నేర్చుకోవాలంటే 12 సంగులు పడుతుందన్నాడు గుణాఢ్యుడు. అయితే, రాజు పట్టుదలతో ఉన్నాడు. అది గ్రహించిన మంత్రి శర్వశర్మ 'నేను ఆరు నెలల్లో నేర్పుతా'నన్నాడు.

అలా రాజుగారికి త్వరగా సంస్కృతం నేర్పటానికి శర్వశర్మ రాసిన వ్యాకరణ గ్రంథమే 'కాతంత్రవ్యాకరణం'. అన్యభాష నేర్చుకో గోరే వారికి ఈ కాతంత్రం ఎంతగానో ఉపయోగపడుతుంది. ఈ పుస్తకంలో శర్వశర్మగారు సూచించిన పద్ధతిలో శర్వశర్మ రాజును 6 నెలల్లో సంస్కృత పండితుణ్ణి చేశాడు. ఆ "కా తంత్ర" వ్యాకరణమే ఆంధ్రుల భాషాబోధనా నైపుణ్యాలకు (Language teaching skills) ఒక ప్రతీక గానూ, సాక్షిగానూ కనిపిస్తుంది.

తన ప్రతిజ్ఞానుసారం-ఓడిన గుణాఢ్యుడు "భాషాత్రయం (సంస్కృతం, (ప్రాకృత, దేశభాష)" విడచి, పైశాచీభాషలో "బృహ త్కథ"ను రచించాడని, చివరికి తన రచనను తానే అగ్నికి ఆహుతి చేసుకున్నాడనీ ప్రతీతి!

### కాతంత్ర అంటే....

అసలు కాతంత్రము అంటే తక్కువ తంత్రం కలది. అని అర్థం. ఇందులో 'కా' అనే శబ్దానికి తక్కువ అని అర్థం. అదే తరువాతి కాలంలో నీచ అనే అర్థంలోనికి మారింది.

కాపురుషుడు అంటే నీచుడు అని వ్యవహారం. కానీ కోష్ణం (కా+ఉష్ణం) అంటే తక్కువ వేడి కలది అని అర్థంలోనే ఉంది. కాక్ష, కాపథం పదాలు ఇలాంటివే. (Monier William's Sanskrit - English Dictionary, 2nd Ed.1899).

ఇక 'తంత్రం' అంటే – ఉభయార్థసాధకమైన ఉపాయము; స్వరాష్ట్ర చింత; వ్యాకరణశాస్త్రము; కుటుంబవ్యాపారము; ఉత్తమమైన ఔషధము; సిద్ధాంతము; ప్రధానము;మగ్గము;నూలిపడుగు (అని కొందఱు), పరివారము; ఒకానొక వేదశాఖ; హేతువు; ఇట్లు చేయందగినదనుట. అనే అర్థాలు ఉన్నాయి.

ఇవన్నీ అలా ఉంచితే సారాంశంగా తంత్ర అనే పదానికి విధానం అనే అర్థం సరిపోతుంది. ఇంగ్లీషులో చెప్పాలంటే Frame work అనే అర్థం పొసగుతుంది.

అంటే మామూలు వ్యాకరణాలమాదిరి సంజ్ఞా పరిభాషాది గందరగోళంలేకుండా ప్రక్రియారూపసాధనల చిక్కుముళ్ళు లేకుండా ఉండేది అని అర్థం. అత్యాధునికంగా Natural Language Processing (NLP)లో ఉపయోగించే paradigm విధానంద్వారానేర్పించే పద్ధతి. అదే 'కా తంత్ర వ్యాకరణం" అన్నమాట. అందుకే ఆరునెల్లలో రాజు సంస్కృత పండితుడయ్యాడు. రాణిగారి మెప్పును పొందాడు.

ఈ కథ నిజమో కాదోగానీ కాతంత్ర వ్యాకరణమూ అందులోని సులభతంత్రమూ మాత్రం ఆంధ్రులు లోకానికి అందించిన అద్భుతమైన కానుక. భాషాసాంకేతికతకు సాక్ష్యం. మన వారి ధిషణకు కొలమానం.

## కుర్తాళం మౌనస్వామి

బాపట్ల తాలూకా నూనెవారిపాలెంలో పుట్టారు. తల్లిదండ్రులు పెట్టిన పేరు పిచ్చయ్య. దత్తు తీసుకున్నవారు శివయ్యగా మార్చారు. భార్యాపిల్లలను వదిలి హిమాలయాలకు వెళ్ళి అచ్యుతానంద సరస్వతీ స్వామి వద్ద సన్యాసం పొంది శివచిదానంద సరస్వతులైనారు. బారాబంకీ గుహలో తపస్సు చేసే వెంకటాచలం పంతులు వద్ద సాధన చేసి యోగశక్తులు నేర్చుకున్నారు రమణమహర్షి, వాసుదేవానంద సరస్వతిలతో సంచరించి అనేక శాస్త్ర రహస్యాలు తెలుసుకున్నారు. దక్షిణాది చివర తమిళనాడులో కుర్తాళంలో సిద్ధేశ్వరీపీఠాన్ని స్థాపించారు. వారు నీటిపైన, గాలిలో తేలియాడేవారు. ఖండయోగసంపన్నులు. ఆయుర్వేద ప్రవీణులు. ప్రజోపయోగకరమైన ఎన్నో మహిమలు చూపించేవారు. వారు ప్రతిష్ఠించిన గణపతికి నాడి కొట్టుకోవటం చూచి మద్రాస్ గెజిట్లో ప్రకటించారు. కుర్తాళ పరంపరంలో పీఠాధిపతియైన శ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వామి ఆధునిక భారతీయ యోగులలో ప్రసిద్ధి వహించారు.

*చిరునామా : కడియాల మురహరిరావు, ఔత్సాహిక పురావస్తు పరిశోధకుడు, తెనాలి (మం), కఠెవరం.*

డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య

# ఆంధ్రబ్యాంకు లిమిటెడ్ పుట్టు పూర్వోత్తరాలు

ఆంధ్రదేశంలో ఒక కమర్షియల్ బ్యాంకు సంస్థను స్థాపించ వలెననే ఉద్దేశం మొట్టమొదట నాకు 1923 సం. సెప్టెంబరు మాసంలో కలిగింది. అప్పుడు ఢిల్లీలో జరుగనున్న అఖిల భారత కాంగ్రెసు ప్రత్యేక మహాసభకు వెళ్లాలని వేసుకున్న కార్యక్రమం ఏదో కారణంవల్ల ఆగిపోవడవల్ల నాకు పదిహేను రోజులు ఖాళీ చిక్కింది. తలవని తలంపుగా చిక్కిన ఆ పక్షపు దినాల వ్యవధిని అట్టి వ్యాపార సంస్థను స్థాపించే ప్రయత్నానికి వినియోగం చేయాలని కుతూహలం కలిగింది. ఆ ప్రకారమే బందరు పట్నంలోని కొందరు మిత్రులను ఒక సాయంకాలం సమావేశపరిచాను. ఆ మొదటి సమావేశంలో కూడిన వారిలో ఎవరుగాని తగినంత పెద్ద మొత్తములు విరాళము లుగా వేయుటకు సాహసింపకపోవుటవల్ల కొంత నిరుత్సాహం కలిగింది. మొత్తం మీద విరాళాలన్నీ కలిసి రూ. 10,000 మాత్రమే అవడం వల్ల ఇంకా ఆ విషయం లాభంలేదని నిస్పృహచెంది, అప్పటికి ఆ ప్రయత్నం విరమించుకున్నాను. కాని మూడు నాలుగు రోజుల తర్వాత మా యింటికి చేరువలో నివసించే శ్రీ నంబూరి వెంకట సుబ్బారావుగారు నా దగ్గరకు వచ్చి నా ప్రయత్నం ఎంతవరకు కొనసా గిందని కుశల ప్రశ్న వేశారు. బ్యాంకు పుట్టిన పిమ్మట వీరు 10 సంవత్సరాలు గౌరవ కార్యదర్శిగా పనిచేసినారు. నేను తలపెట్టి సంస్థ పట్నంలోని వ్యాపారస్థుల ప్రయోజనం నిమిత్తం ఉద్దేశింపబడినదనీ, అట్టిచోట స్థానిక వ్యాపారస్థులు ఏదో ఒక కారణంవలన సంస్థ స్థాపనకు ఉత్సాహం చూపకుండుట వలన ఆ ప్రయత్నం నేను విరమించుకొన దలచుచున్నాననీ అప్పుడు వారితో నేను అన్నాను. అంతట శ్రీ వెంకట సుబ్బారావుగారు వెంటనే తాము రూ. 3000 స్వయంగా చందావేసి, నాతో కలసి ఇతర మిత్రులను కలుసుకునేందుకు బయలుదేరారు. ఆ ఉదయం 10.30 గంటలు అయ్యేసరికి మరి ఇరువురు మిత్రులు వేసిన చందాతో కలిసి మొత్తం రూ. 10,500 తేలింది. ఈ లోపుగా ఒక చిన్న సంఘటన జరిగింది. పట్నంలోని వ్యాపారస్తులందరిలోకి జ్ఞానవంతులైన శ్రీ యు. గోపాలరత్నంగారు తాము రు. 3000 ఇష్టపూర్వకంగా చందా వేస్తూ, నన్ను కూడా ఈ సంస్థలో భాగస్వామిగా ఉండవలసిందని పట్టుపట్టారు. ఈ సంస్థ కేవలం వ్యాపారస్థుల సంస్థ గానే ఉండవలెననీ, నేను దాని నిర్వహణల్లో స్వయంగా చేయిపెట్టరాదనీ అంతవరకు నా ఉద్దేశం. అయినప్పటికీ శ్రీ గోపాలరత్నం గారిని తృప్తిపరిచే నిమిత్తం నేను పేరునకు రు. 1000 మాత్రం చందా వేశాను. అయితే వారి మనస్సులో ఉన్న లోతైన ఉద్దేశం అప్పుడు నాకు స్ఫురించ లేదు. ఈ సంఘటన యొక్క సార్థకత తరువాత మీకే గోచరించగలదు.

ఇక ఆ రోజు మొదలుకొని మా ప్రయత్నం చాలావేగంగా రూపం దాల్చడం మొదలుపెట్టింది. ఒక పక్షం రోజులలోగా మేము అనుకున్న చందా మొత్తం కంటె రూ. 18,000 ఎక్కువ కాగితం మీద పడింది. ఈ లోపున నేను సంస్థ నియమావళి, మెమోరాండం వ్రాసి సిద్ధ పరిచాను. మాట ఒసగిన చందాదారులనందరినీ సమకూర్చి అవి చదివి వినిపించడం అయింది. అవి అచ్చొత్తించడం నెమ్మదిగా తర్వాత జరగడంవలన ఈ లోపున వాటాదారులంతా ముందుగా నియమా వళిని బాగా పరిశీలించుకుని తెలుసుకొనడానికి బాగా అవకాశం ఏర్పడింది. ఆ సమావేశంలో కూడినవారి ఉత్సాహం అతిశయించి ఇంకా ఇంకా వాటాలు వేస్తామని చాలామంది ముందుకు రాసాగారు. ఆ ఉత్సాహాన్ని అరికట్టడమే అప్పుడు కష్టమైపోయింది. చివరికి వచ్చే సరికి ఈ ఉత్సాహపరులలో కొందరు వాగ్దానం ప్రకారం పూర్తి వాటా చందాలను రొఖ్ఖ పూర్వకంగా చెల్లించడం జరుగకపోవచ్చునని నాకు అనుమానం లేకపోలేదు. అందువల్ల అదనపు చందాలు వేసేవారిని కూడా అప్పటికి వెయ్యనిచ్చాను. వారిలో కొందరు నేను సందేహించిన ప్రకారం తాము చెప్పిన పూర్తి వాటా మొత్తాలు తుదిని చెల్లించలేక పోయారు. చివరకు 1923 సం. నవంబరు 20వ తేదీన బ్యాంకు రిజిస్టరు అయింది.

దానితో మా చిక్కులు కూడా ప్రారంభమయ్యాయి. బందరులోని ఇంపీరియల్ బ్యాంకు ఆఫ్ ఇండియా బ్రాంచి యొక్క ఏజంటైన ఒక తెల్లదొర రహస్యంగా ఊరిలోని వ్యాపారస్థులను మా సంస్థతో ఏ విధమైన సంబంధంగాని పెట్టుకోవద్దని వెనక్కి లాగుతున్నట్లు అప్పుడు మాకు మొదటిసారి తెలియవచ్చింది. సాధారణంగా ఇటువంటి సంస్థకు డైరెక్టర్లు కావాలని ఉత్సాహంగా రావలసిన వారంతా వెనుకకు

తగ్గడం మొదలుపెట్టారు. ఎవరుగాని మా సంస్థలో వాటాదారుగాగాని డైరెక్టరుగాగాని ఉండరాదని ఆ దొరగారి కోరిక. ఏదోవిధంగా ఈ చిక్కు దాటగానే మేనేజింగు డైరెక్టరు ఎన్నిక సందర్భాన్ని అసలు చిక్కు బయలుదేరింది. శ్రీ గోపాలరత్నంగారి మనస్సులో ఆదినుంచీ వున్న రహస్యమైన ఉద్దేశం అప్పుడు బయటపడింది. వారి ప్రోద్బలం వల్ల నేను మేనేజింగు డైరెక్టరు పదవిలో బలత్కారంగా బంధించడం జరిగి పోయింది. ఇక మిగిలినపని పోగైన డబ్బును వ్యాపారస్థుల సౌకర్యం నిమిత్తం ఉద్దేశింపబడినది అయినప్పటికి వ్యాపారస్థులు తక్షణం బ్యాంకునించి అప్పులు తీసుకోడానికి సిద్ధంగా లేరు. ఏదో ఒక విధంగా స్థానిక వర్తకులకు రూ. 30,000దాకా అప్పులు ఒసగగలిగాము. ఆ సమయానికి నేను కాకినాడలో జరుగనున్న కాంగ్రెస్ మహాసభకు పోదలచివున్నందున, ఆ సభాస్థలంలో మా బ్యాంకు ఒకటి ఏర్పరచాలని కూడా అనుకున్నాను. జరుగనున్న అక్కడి కొన్ని పరిస్థితులవలన అట్టి ఏర్పాటు అనవసరమయింది.

క్రమేపి ఈ సంస్థ బహుత్వరితంగా పెరిగి బలపడసాగింది. ఈ వరలో ఇంపీరియల్ బ్యాంకు ఆఫ్ ఇండియాతో మాత్రమే సంబంధం పెట్టుకున్న రాజభక్తులైన వ్యాపారస్థులు కూడా ఇప్పుడు ఆ బ్యాంకు బాకీలను తీర్చుకొనే నిమిత్తం మా బ్యాంకులో అప్పులు తీసుకొనడం ప్రారంభించి ప్రోత్సాహమొసగడం మొదలుపెట్టారు. 1926 సంవత్సరంలో ఇంపీరియల్ బ్యాంకువారు వసూలు చేసుకోలేని ఒక బాకీ మొత్తం రు. 1,25,000 వారికి వసూలు అయ్యేలాగున నేను సహకరించడం జరిగింది. అంతవరకు నేను కాంగ్రెస్‌వాదినని అనుమానంగా చూస్తున్నప్పటికీ, నావల్ల ఆ విషయంలో పొందిన సహాయానికి ప్రతిఫలంగా నాకు అవసరం కలిగినప్పుడు తాను ఏవిధమైన సహకారంగాని చూప గలనని ఆ బ్యాంకు మేనేజర్ వ్యక్తం చేశాడు. నేను ఆయనతో నాకు వ్యక్తిపరంగా సహాయం ఏమీ అవసరంలేదనీ, వీలైతే నేను తలపెట్టిన బ్యాంకునకు ఏవిధమైన సెక్యూరిటీ అవసరమైతే అది తీసికొని తమ బ్యాంకు నుంచి రూ. 50,000 ఓవరు డ్రాఫ్టు ఒసగ వలసినదనీ మాత్రం కోరాను. ఆ విషయం కాగితంమీద పెట్టి ఇచ్చిన యెడల దానిని తను హెడ్ ఆఫీసుకు పంపుతానని ఆయన చెప్పారు. నేనావిధంగా చేశాను. కాని హెడ్ ఆఫీసువారు నేను కోరినది వీలుకాదని తెలుపుతూ జవాబిచ్చారు. ఈ నిశ్చయానికి బాధ్యత హెడ్ ఆఫీసువారే తీసుకుని వున్నందున ఆ హెడ్ ఆఫీసు ఏజెంటును నేను మద్రాసుపోయి స్వయంగా కలుసుకోవడానికి లేఖలు తీసికొని అక్కడి ఏజెంటును కలుసుకునేందుకు వెళ్లాను. ఆ కార్యదర్శి 25 నిమిషాల వరకు నన్ను లోపలికి పిలవకుండా కూర్చోపెట్టి, ఈ లోపున బహుశా నేను వచ్చిన సందర్భాన్ని గురించి వారికి అవసరమైన వివరాలు అన్నీ గమనికలోకి తెచ్చుకొని, అప్పుడు నాకు రమ్మని కబురుచేశారు. నేను వచ్చిన పని చెప్పిన వెంటనే ఆయన ఖరాఖండీగా నన్ను "మీరు మా ఓవర్ డ్రాఫ్టు అప్లికేషన్ నిరాకరించడానికి ఆదేనా వారి బ్రాంచి ఏజెంటుయొక్క చర్యయే కారణమనిన్నీ కూడా విశదీకరించాను. మొదట్లో వారి బ్రాంచి ఏజెంటు ఏవిధంగా ఊరిలోని వ్యాపారస్థులను మా బ్యాంకిలో వాటాలు తీసుకొనడానికిగాని, తీసికొన్నవారిని డైరెక్టర్ల బోర్డులో చేరడానికిగాని, అట్లు చేరినవారిని మేనేజింగు డైరెక్టరు కావడానికి గాని ఆటంకపరుస్తూ వచ్చినదీ చెప్పి, అందువల్ల నేను మేనేజింగు డైరెక్టరుగా వుండడం తప్పనిసరి అయినందుకు వారి ఏజెంటు చర్యలే కారణమని నిరూ పించాను. బందరులో ఇంపీరియల్ బ్యాంకు బ్రాంచికి అప్పట్లో ఏజెంటైన గోర్డన్ దొర మాకు సహకరించేందుకు సంసిద్ధంగా ఉన్నాడనీ, మా బ్యాంకుకి చెందివున్న ప్రోనోటును, డైరెక్టర్ల స్వంత ఆస్తులను తాకట్టుగా ఒసగగలమనీ చెప్పి సెంట్రలు గవర్నమెంటు ధర్మమని కూడా నచ్చచెప్పాను. అంతేకాక వెంటనే నా మేనేజింగు డైరెక్టరు పదవికి రాజీనామా వ్రాసి యిచ్చి మిగతా 15 మంది డైరెక్టర్లు రాజ భక్తులే అని తెలుపుతూ వారిని గూర్చిన వివరాలు కూడా నివేదించుకున్నాను. రావుబహదూరు శెడింబి హనుమంతరావు గారు 22 సంవత్సరాలు పబ్లిక్ ప్రాసిక్యూటరుపని చేసినవారు. రావు సాహెబ్ టి. పేరయ్య నాయుడుగారు రిటైర్డు ఎగ్జిక్యూటివ్ ఇంజినీరు. మిగతా వారు లాయరుగాని, విదేశీ వ్యాపారం చేసే వ్యాపారస్థులుగాని, రిటైర్డు ఆఫీసర్లుగాని అయివున్నారు. యోగ్యత గల ఇందరిలోను పాపిని నేను ఒక్కడినే కనుక, ఇక మేము కోరే ఓవర్ డ్రాఫ్ట్సు అనుకూలించ వలసిందని కోరాను. "అబ్బే, అల్లా అనకండి" అన్నాడాయన. "అది మీరన్న మాటేనండి" అన్నాను నేను. దానితో కొంతసేపు ఆవులించి, అర్జీ పంపుకోండి అన్నారు. ఆ ప్రకారమే నేను బందరు స్థానిక ఏజెంటు ద్వారా ఈ రెండో అప్లికేషను పంపించాను. కాని ఇదికూడా చల్లగా నిరాకరిస్తూ జవాబు వచ్చింది. అప్పటినుంచి మేము స్వయం సహాయం మీదనే ఆధారపడవలసివచ్చింది. కాని మా బ్యాంకు మాత్రం నెమ్మదిగా ప్రవర్ధమానం అవుతూనే వచ్చింది. మాకు కావలసివచ్చిన ఆ ఓవర్‌డ్రాఫ్టు గవర్నమెంటు ప్రోనోట్లు హామీ మీద చివరికి ఇంపీరియల్ బ్యాంకు వారి వద్దనే సంపాదించాము. ఆ బ్యాంకు ప్రాథమిక నియమావళి ప్రకారం ఈ పద్ధతిని మాకు సహకరించక తప్పింది కాదు.

ఆనాడు ఆవిధంగా అల్పమైన రూపంతో ప్రారంభమైన ఈ సంస్థాంకురము ఈనాడు ఈవిధంగా అనేక శాఖాపుష్ప ఫలభరితమైన వృక్షంగా పెంపొందడం చాలా ముదావహమైన విషయం. ఇప్పుడు ఈ సంస్థ యొక్క వ్యాపారం ఏడు అంకెల పరిమాణానికి పెరిగింది. నమ్మకమైన న్యాయమైన వ్యాపార సూత్రాలను అనుసరించడం ద్వారా ప్రజాభిమానాన్ని ఆదరణనూ చూరగొని, సేవాదీక్షతో ముందుకు సాగిన యెడల, ఈ బ్యాంకు తప్పక సత్వరం భూవిలో ఇండియా మొత్తాన చెప్పదగ్గ అయిదారు బ్యాంకులలో ఒకటిగా పేరుపొంది నిలువగలదని నా దృఢ విశ్వాసము.

శ్రీమతి అల్లూరి గౌరీ లక్ష్మి

# ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక మౌలిక సదుపాయాల సంస్థ

"ప్రజల జీవన ప్రమాణాలను పెంచాలంటే పారిశ్రామిక ప్రగతి ఒక్కటే మార్గం - జవహర్‌లాల్ నెహ్రూ"

నవభారత నిర్మాత, తొలి భారత ప్రధాని పండిట్ నెహ్రూ గారి స్ఫూర్తితో భారత ప్రభుత్వము పారిశ్రామికరంగాన్ని బలోపేతం చేసే దిశగా పారిశ్రామికరంగంలో భారీ, చిన్న, మధ్య తరహా పారిశ్రామిక వేత్తలను భాగస్వాములను చేయసంకల్పించింది.

ఇదేవిధంగా నూతన పారిశ్రామిక విధానము అమలుజరిపే సంకల్పంతో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వము పారిశ్రమిక మౌలిక సదుపాయాల సంస్థను 1973లో స్థాపించడం జరిగింది. ఇది ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వ రంగ సంస్థ. ఈ సంస్థ 1974 నుంచి పనిచెయ్యడం ప్రారంభించింది. ఈ సంస్థ పరిశ్రమలకు అనువైన ప్రభుత్వ భూములని సేకరించి, ప్లాట్‌ల లే ఔట్లను వేసి అభివృద్ధి చేసి, నీరు, విద్యుత్, రోడ్లు మొదలగు మౌలిక సదుపాయాలు కల్పించి వాటిని పరిశ్రమలకు లీజ్‌పై కేటాయించడం, ఆ పరిశ్రమ స్థిరపడిన తర్వాత ఆ భూమిని వారికి అమ్మడం మొదలైన పనులను చేపట్టింది. ఇందుకుగాను ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో పదిహేనుజోన్లలో 320 పారిశ్రామిక పార్కులను ఏర్పాటుచేసింది.

సత్వర పారిశ్రామిక ప్రగతి కోసం కాల క్రమాన ఏపీ ఐఐసీ తన విధి విధానాలను మార్చుకుంటూ ముందుకు నడిచింది. గోల్ఫ్ కోర్సు మరియు హైదరాబాద్ ఇంటర్నేషనల్ కన్వెన్షన్ సెంటర్, హైటెక్ సిటీ వంటి ప్రతిష్టాత్మకమైన ప్రాజెక్టులకు ఈక్విటీ విధానంపై భూములిచ్చింది. పబ్లిక్ ప్రైవేట్ భాగస్వామ్య విధానంలో కూడా కొన్ని ప్రాజెక్టులకు భూములివ్వడం జరిగింది. వాటిలో ఐటీ పార్కులు, బయోటెక్ పార్కులు, అప్పారెల్ పార్కులు, ప్రత్యేక ఆర్థికమండళ్ళు, ఫ్యాబ్ సిటీ, హెల్త్ సిటీ మొదలైనవి ఉన్నాయి. ఇటీవల భారత ప్రభుత్వం తలపెట్టిన నేషనల్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ మ్యానుఫ్యాక్చరింగ్ జోన్స్‌కి (NIMZs) కూడా భూములు కేటాయించడం మొదలుపెట్టింది.

పారిశ్రామిక పెట్టుబడులకు ప్రత్యేక అనుకూలతలున్న రాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్‌కి దక్షిణ భారతదేశంలో ప్రత్యేకస్థానం ఉంది. 1000 కిలోమీటర్‌ల సముద్రతీర ప్రాంతం కలిగి రైల్, రోడ్డు సౌకర్యం కలిగి ఉన్న రాష్ట్రం ఇది.

ప్రాజెక్టులకు భూములిచ్చే క్రమంలో ప్రాజెక్టు రిపోర్ట్‌ల ప్రకారం అధిక పెట్టుబడి మరియు అధిక సంఖ్యలో యువతకు ఉపాధి కల్పించే వారికి ప్రాధాన్యత ఇవ్వడం జరుగుతుంది. అదేవిధంగా వాతావరణ కాలుష్యం కలిగించని పరిశ్రమలకి కూడా ప్రాధాన్యం ఇవ్వడం జరుగుతుంది. మరికొన్ని పరిశ్రమలు పరిమితంగా కలిగించే కాలుష్యాన్ని ట్రీట్‌మెంట్ ప్లాంట్‌ల ద్వారా శుద్ధిచేసే కార్యక్రమానికి ఏపీ ఐఐసీ శ్రీకారం చుట్టింది.

ఇదికాక, కేంద్ర రాష్ట్రప్రభుత్వాలు ఔత్సాహిక పారిశ్రామిక వేత్తలకిచ్చే రాయితీలను వారికి అన్వయింపచేస్తూ, షెడ్యూల్డ్ కులాల మరియు తెగల వారికి, మహిళా పారిశ్రామికవేత్తలకు కొంత శాతం రాయితీలిస్తూ వారిని ప్రోత్సహిస్తున్నది. జర్మనీవారి ఆర్థికసాయంతో పారిశ్రామిక పార్క్‌లలో పర్యావరణ ప్రక్షాళన కొరకు చెట్లను నాటే పనిని ప్రారంభించింది. జర్మనీవారి సాయంతోనే భూగోళంపై వస్తున్న వాతావరణ మార్పులకు అనుగుణమైన అనుకూలత (CLIMATE CHANGE ADAPTATION) కోసం తగిన పద్ధతులను కూడా అమలుపరుస్తోంది.

ఈ సంస్థకు రాష్ట్ర పంచాయితీరాజ్ మరియు మనిసిపాలిటీ యాక్ట్ కింద లోకల్ అథారిటీ స్థాయి ఇవ్వడం జరిగింది. దానితో ఈ సంస్థ టాక్స్ వసూలు చేసుకుని పారిశ్రామిక ప్రాంతాలకు అన్ని ప్రాథమిక సదుపాయాలూ కలిగించి పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడుతున్నది.

తెలుగు రాష్ట్రాల విభజన తర్వాత రెండు రాష్ట్రాలూ ఏపీ ఐఐసీ (ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక సదుపాయాల సంస్థ) ఆరు జోన్ల ద్వారా తమ తమ ప్రాంతాలలో పారిశ్రామికాభివృద్ధి ఇతోధిక కృషి చేస్తూ ముందుకు సాగిపోతున్నాయి.

చిరునామా : అల్లూరి గౌరీ లక్ష్మి, *Dy. General Manager (public Relations), APIIC,*
*D.No. 59A-20-30 A, 1-3 Floor, Shiva Complex, Gurunanak nagar Colony, Vijayawada - 520 008. 9948392357*

శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లు

# అరవై సంవత్సరాలు పోరాట పథంలో.... మావోయిస్టుల ప్రస్థానం?

ఈ అరవై సంవత్సరాలుగా ఈ దేశానికి స్వాతంత్ర్యం రాలేదని, నడుస్తున్న ప్రభుత్వాలు విదేశీ శక్తుల కనుసన్నలలో నడుస్తున్నాయని, నిజమైన స్వాతంత్ర్యం రావడానికి నక్సలిజమే లేదా మార్క్సిజం శక్తులు ఆయుధంతో పోరాడి సాధించవలసి వుంటుందని, అందుకు దేశంలో ఉన్న మార్క్సిజం ఒక్కటే పరిష్కారమని ఇటీవల విజయవాడలో జరిగిన నలభై సంవత్సరాల నక్సలిజం, తెలంగాణాలో ఆనాడు సాగించిన సాయుధ పోరాటం వివరిస్తూ అరవై సంవత్సరాలను గుర్తుచేసిన ఒకానొక సభలో సీనియర్ విప్లవ నాయకుడు కానూ సన్యాల్ అన్నాడు. విప్లవ ప్రతీఘాత శక్తులు ఐక్యంగా కదిలి ఉద్యమించవలసి వచ్చిందని అన్నారు. విప్లవ రచయితల సంఘం నాయకుడు వరవరరావు దగ్గర నుండి దేశ వ్యాప్తంగా పనిచేస్తున్న నలభై గ్రూపులదాకా ఇదేవిధంగా భావిస్తున్నారు. మనదేశంలోని కమ్యూనిస్టు పార్టీ విదేశీ గడ్డపై తాష్కెంట్ వద్ద ప్రారంభించబడింది. ఆనాటి నుండి దేశంలో కల కమ్యూనిస్టు పార్టీలో, అక్కడ నుండి చీలి వివిధ పార్టీలుగా పనిచేస్తున్న వామపక్షపార్టీలన్నీ పోరాటాలు చేస్తున్నాయి. కొన్ని పార్టీలు పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని అనుసరిస్తుంటే మరికొన్ని ఆయుధాలను సాధనంగా చేసుకొని పోరాటాలను ప్రారంభించిన చారుమజుందార్ సహచరుడైన కానూ సన్యాల్ ఆనాడు తమ సాయుధ పోరాటాన్ని గూర్చి స్పష్టంగా ఇలా నిర్వచించారు. "మా పోరాటం భూమికోసం కాదు. ఈ పోరాటం రాజ్యాధికారం కోసం. అదీ తుపాకి గొట్టంద్వారానే సాధ్యమవుతుంది' అని అనాడే స్పష్టం చేశాడు. నలభైసంవత్సరాల పోరాటం వలన కొన్ని వేలమంది హతులయ్యారు. దేశవ్యాప్తంగా కొన్నివేలమంది యువకులు తమ అమూల్యమైన జీవితాలను విప్లవంపేరిట బలిచేసుకున్నారు. అసలు కమ్యూనిస్టుల సాయుధ పోరాటం ఆంధ్రప్రదేశ్‌లోనే ప్రారంభమైంది. ఆ పోరాటం ప్రారంభంఅయి నేటికి అరవై సంవత్సరాలయింది.

మన రాష్ట్రంలో 1948-1951లో జరిగిన తెలంగాణా సాయుధ పోరాటం గూర్చి చెప్పకుండా నక్సల్బరీ ఉద్యమాన్ని ప్రస్తావించడానికి వీలులేదు. రాష్ట్రంలో కమ్యూనిస్టుపార్టీ 1940 ఆ ప్రాంతాలలో ఏర్పడింది. అంతకుముందు శ్రీ సుందరయ్య లాంటి వారు కాంగ్రెస్ పార్టీలో అంతర్భాగమైన సోషలిస్టు విభాగంలో ఉండేవారు. రాష్ట్ర వ్యాపితంగా ఏర్పడిన ఆ సంస్థలో సర్దార్ గౌతులచ్చన్న గారు అధ్యక్షులుగా, కార్యదర్శిగా మద్దూరి అన్నపూర్ణయ్య సహాయ కార్యదర్శిగా సుందరయ్యగారు ఉండేవారు. ఆ తర్వాత కాంగ్రెస్‌లో నుండి సోషలిస్టులు బయటకు వచ్చి కమ్యూనిస్ట్ ఆఫ్ ఇండియాగా మారారు. తెలంగాణాలో కమ్యూనిస్టు పార్టీ వారు ఆంధ్రమహాసభలో చేరారు. కాంగ్రెస్ వారితో కలిసి చేరినవారిలో రావినారాయణ రెడ్డి ప్రభృతులు ఉన్నారు. ఆ తర్వాత నిజాంపాలనకు వ్యతిరేకంగా కమ్యూనిస్టులుగా రైతాంగ పోరాటానికి ఉద్యమించారు. అయినప్పటికీ అన్ని వర్గాల వారు నిజాం పరిపాలనకు వ్యతిరేకంగా ఉద్యమించారు. 1947 ఆగస్టు 15న ఖండిత భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. కానీ సంస్థానాధీశులకు బ్రిటిష్ ప్రభుత్వం కుటిల నీతితో 550 సంస్థానాలను వారి స్వేచ్ఛకు వదిలివేశారు. ఆనాటి నిజాం రాజు తన మంత్రి కాశీంరజ్వీ సలహాతో తన రాజ్యాన్ని పాకిస్తాన్‌లో కలపడానికి ప్రయత్నాలు చేస్తున్నాడు. అప్పుడు నిజాం పాకిస్తాన్‌తో బేరసారాలు చేస్తుండగా కాశీంరజ్వీ అనుచర్లు రజాకార్లుగా ప్రజలపై అత్యాచారాలకు, హింసాకాండకు పాల్పడుతుండేవారు. వారిని వ్యతిరేకించడానికి స్వామీ రామానంద తీర్థ నాయకత్వంలో శాంతియుత పోరాటం చేస్తుంటే కమ్యూనిస్టులు తమ మూలపోరాటమైన సాయుధ పోరాటం ప్రారంభించారు. 1948 సెప్టెంబరు 13న భారత ప్రభుత్వం నిజాం ప్రభుత్వంపై సైనిక చర్యకు దిగినప్పుడు సెప్టెంబరు 17న ఆనాటి గృహ మంత్రి సర్దార్ పటేల్‌కు లొంగిపోవలసి వచ్చింది. కాంగ్రెస్ వారు అధికారం చేపడితే కమ్యూనిస్టుల రెండవ మహాసభ జరిగింది. ఆ సభలో ఆంధ్రా సెక్రటేరియట్ సమర్పించిన థీసిస్ పత్రంలో ఇలా వున్నది" మన విప్లవం అనేక విధాలుగా రష్యన్ విప్లవంతో విభేదిస్తుంది. చాలా వరకు అది చైనా విప్లవంతో పోలి ఉంటుంది. జనరల్

సమ్మె సాయుధ తిరుగుబాటు, ఆ తర్వాత గ్రామసీమల విముక్తికాక, వ్యవసాయక విప్లవం రూపంలో భీకర ప్రతిఘటన సుదీర్ఘమైన అంత ర్యుద్ధం తత్ఫలితంగా రాజకీయాధికారాన్ని ప్రజాతంత్ర సంఘటన ద్వారా వశపర్చుకొనడం, ఇది మన విప్లవ పోరాట పంధాగా వుండ గలదు.... దీన్నంతటనూ దృష్టిలో వుంచుకొని మనకు ప్రజాస్వామ్యంలో బాగా పలుకుబడి వున్న ఆంధ్ర, కేరళ, బెంగాల్‌లోని కొన్ని ప్రాంతాలలో మనలను నిర్దాక్షిణ్యంగా తుదముట్టించడానికి ప్రయత్నించిన నెహ్రూ ప్రభృతులు బూర్జువాల దాడికి వ్యతిరేకంగా మనంగెరిల్లా యుద్ధాన్ని (చైనామార్గం) సాగించాలన్న ఆలోచనకు సమయం ఆసన్నమైంది. అయితే ఆంధ్ర సెక్రేటేరియట్ థీసిస్‌ను రెండవ కమ్యూనిస్టు పార్టీ మహాసభ తిరస్కరించింది. మనపంథా రష్యన్‌పంథానే. అంటే రాజ కీయ జనరల్ సమ్మె, పట్టణాల్లో కార్మికుల సాయుధ తిరుగుబాటు ద్వారా అధికారాన్ని కైవసం చేసుకోవడం అని రెండవ కమ్యూనిస్టు మహాసభ స్పష్టం చేసింది.

అయినా తెలంగాణా సాయుధ ప్రతిఘటనా నినాదాన్ని మాత్రం పొలిట్‌బ్యూరో బలపరుస్తూ యుద్ధానంతర విప్లవ సంక్షోభంలోరానున్న పరిస్థితులలో కార్మిక వర్గ జనరల్ సమ్మెను, సాయుధ తిరుగుబాటును, తెలంగాణా సాయుధ పోరాటాన్ని కొనసాగించారు. ఆ విధంగా జరిపిన పోరాటంలో తీర్మానించినట్లుగా కార్మిక వర్గం ఎక్కడాపోరాటంలోనికి రాలేదు. దీర్ఘకాలం పోరాటాన్ని సాగించడంలో వారు ఏనాడూ సన్నద్ధం కాలేదు. అంతేకాదు ఆ పోరాటం నిజాంకు వ్యతిరేకంగా జరిపినంత వరకు లభించిన ప్రజల సమర్ధన ఆ తర్వాత నెహ్రూ ప్రభుత్వాన్ని వ్యతిరేకిస్తూ చేసిన పోరాటంకి ప్రజల సమర్ధన అంతగా లభించలేదు. స్వాతంత్ర్య సముపార్జనలో పనిచేసిన అనేక పార్టీలు పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని అనుసరిస్తే వీరు మాత్రం సాయుధ పోరాటాన్ని మార్గంగా ఎంచుకుని బూర్జువా నెహ్రూ పాలనను కూలదోసినప్పుడు తమ రాజ్యం ఏర్పడితేనే ఈదేశానికి స్వాతంత్ర్యం రాగలదని సిద్ధాంతీ కరించి భారత రాజకీయ రంగంలో ఏకాకులయినారు. పైగా కమ్యూ నిస్టు పార్టీని ఇక్కడి పరిస్థితులలో కంటే ఇతరదేశాల కమ్యూనిస్టు పార్టీలు నిర్దేశించినాయి. చైనా పంధాను పోలిన పంధా మనది అన్న ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ తన తెలంగాణా పోరాటంలో వేల వందల మంది కార్యకర్తలను పోగొట్టుకున్నారు. తాము ఆక్రమించిన భూము లను పేదలకు పంచిపెడితే వారు దానిని తగినంతగా సత్తాలేక వదలి పెట్టడం అంతకంతకూ జటిలం అవుతున్న పోరాటాన్ని కొనసాగించలేక ఆనాటి అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాలకు నాయకత్వం వహి స్తున్న రష్యను కమ్యూనిస్టు అధినేతలను అభ్యర్థించవలసి వచ్చింది. సోవియట్ యూనియన్ ఈ విషయాన్ని సోవియట్ కమిటీకి నివే దించారు. ఆనాటి రష్యను అధినేత స్టాలిన్ తదితర ప్రముఖులు తెలంగాణ పోరాటాన్ని అధ్యయనం చేశారు. మన రాష్ట్ర కమ్యూ నిస్టులతో చర్చించారు. నెహ్రూ ప్రభుత్వాన్ని బూర్జువా ప్రభుత్వంగా గుర్తించటం సాయుధపోరాటం ద్వారానే కమ్యూనిస్టులు రాజ్యాధి కారాన్ని హస్తగతం చేసుకొనగలమని విశ్వసించటం అవగాహనా రాహి త్యమని విశ్లేషించారు. కమ్యూనిస్టుల ఎత్తుగడలను ఆదేశ పరిస్థితులను మాత్రమే అంతర్జాతీయ నినాదాల పేరిట విప్లవాలు కొనసాగించటం ఆత్మహత్యా సదృశమని భావించారు. మన ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీల తరపున చంద్ర రాజేశ్వరరావు అజేయకుమార్ ఘోష్, శ్రీపాద అమృత డాంగేలతో కూడిన పార్టీ ప్రతినిధివర్గం మాస్కోలో చర్చలు జరిపింది. వీరితో చర్చలు జరిపి తెలంగాణా సాయుధ పోరాటానికి పరిష్కారం చూపడానికి కామ్రేడ్ స్టాలిన్ నాయకత్వాన మాలటోవ్, మామోవోష్ సుస్లోవ్‌లతో కూడిన కమీషనును సోవియట్ నేత పార్టీ నియమించింది. ఇరువర్గాల వారు సుదీర్ఘ చర్చలనంతరము అంతిమంగా తెలంగాణా రైతాంగపోరాటాన్ని ఉపసంహరించాలని రష్యాపార్టీ ఆదేశించింది. అప్పుడుకూడా మన దేశానికి రష్యాయే సలహా ఇచ్చింది. ఉపసంహరణ కోసం చంద్ర రాజేశ్వరావుగారు నానా తంటాలుపడ్డాడు. ఆ సమ యంలో నేటికి కమ్యూనిస్టులు గర్వంగా చెప్పుకొనే సాయుధ పోరాటం గురించి సోవియట్ కమ్యూనిస్టు పార్టీ ఇలా అభిప్రాయపడింది. "ఈ సాయుధ గెరిల్లా పోరాటం రైతుల భూముల రక్షణకై జరిగే ఒక పాక్షిక పోరాటంగా సాగించి ఉంటే సబబుగాను, సరైనదిగాను వుండేది. తెలంగాణా రైతాంగానికి సంబంధించిన భూ సమస్యను మధ్యవర్తుల ద్వారా చర్చల ద్వారా పరిష్కరించుకొనేందుకు ఒకవైపు సంసిద్ధతను వెల్లడించుతూనే మరోవైపున అన్యాయమైన పోరాటానికి అండగా ప్రజా తంత్ర అభిప్రాయాన్ని పెద్ద ఎత్తున సమీకరించి వుండవల్సింది. భూమి కోసము జరిగే పాక్షిక పోరాటం కాక కాంగ్రెసు పాలనకు వ్యతిరేకంగా ఒక విముక్తి యుద్ధంగా తెలంగాణా సాయుధ గెరిల్లా పోరాటం పొరపాటుగా నిర్వహించడమైనది."

సాయుధ గెరిల్లా ప్రతిఘటనను పరిరక్షించుకొని కొనసాగించు కొనలేకపోవటం దురదృష్టకరమని వారు అంగీకరించారు. సాయుధ విప్లవపోరాటాన్ని ఉపసంహరించుకొనే సమయం ఆసన్నమయింది.... సాయుధ గెరిల్లా పోరాటానికి అండగా రైతాంగం ప్రజావెల్లువ లేనప్పుడు తెలంగాణా సాయుధ గెరిల్లా పోరాటం అదే పనిగా పొడిగిం చటం వల్ల అది వ్యక్తిగత హింసావాదము క్రిందకు దిగజారే ప్రమా దము ఏర్పడవచ్చు. రష్యా పార్టీకి మనదేశం గురించి రాష్ట్రం గురించి క్షుణ్ణంగా తెలుసు. అయితే ఆనాటి సాయుధ పోరాటాన్ని కమ్యూనిస్టు పార్టీ కొనసాగించి ఉన్నట్లయితే నక్సల్‌బరీ పోరాటాన్ని కొనసాగించ వలసిన అవసరము వుండేది కాదని అతివాద దుందుడుగు ఒంటెద్దు పోకడలను అనుసరిస్తున్న విప్లవ పార్టీలు చెప్పగలిగి వుండేవికావు.

అయితే 1959లో విజయవాడలో జరిగిన ఐక్యకమ్యూనిస్టు పార్టీ మహాసభల్లో రష్యానుంచి వచ్చిన కామ్రేడ్ సుస్లోవ్ ఈ దేశ కమ్యూనిస్టు పార్టీకి మార్గదర్శనం చేశాడు. అంతవరకు బూర్జువా నెహ్రూ ప్రభుత్వంగా తమతో అభివర్ణించబడిన నెహ్రూ ప్రభుత్వానికి కితాబులు నీయవలసి వచ్చింది. సోషలిస్టు ప్రజాస్వామ్య ప్రతినిధిగా కమ్యూనిస్టు పార్టీ గుర్తించి అతనితో సహకరించటం వల్ల పార్లమెంటరీ పార్టీ ప్రజాస్వామ్య వ్యవస్థలో స్థానం సంపాదించవచ్చు. ఆ సూచనప్రకారమే కమ్యూనిస్టులలోని కొందరు కె.డి.మాలవ్యా, రఘునాథరెడ్డి లాంటివారు కాంగ్రెస్‌లో చేరి అధికారములో చేరగల్గారు. ఈ విధంగా కార్యకర్తల్లో పెద్ద ఆశచూపిన విప్లవం స్వరూప స్వభావాలే మారిపోయినాయి.

1962లో చైనా మనపై జరిగిన దురాక్రమణ కమ్యూనిస్టు పార్టీలో చీలికకు కారణమైంది. రష్యను పంథాను అనుసరించే కామ్రేడ్లు రష్యా పంథాను అనుసరించి, భారత్‌పై చైనా దాడి చేసిందంటే, చైనా పంథాను అనుసరించే కామ్రేడ్లు "ఒక సోషలిస్టు దేశం మరొక దేశంపై దాడి చేయడం అనే సూత్రాన్ని అనుసరించి సోషలిస్టు దేశం మనదేశంపై దాడి చేయలేదు. కానీ మన ప్రభుత్వమే చైనాపై దాడిచేసిందని స్పష్టం చేశారు. "దానితో ఐక్యకమ్యూనిస్టు పార్టీ చీలిపోయింది. అందుకు మన ఆంధ్ర నాయకుల వైఖరి కొంతవరకు కారణం. అప్పటి నుండి ఇప్పటి వరకు అలా చీలిన పార్టీలు ఇతర పార్టీలతో పొత్తుపెట్టుకొనగలరు కానీ ఉభయ కమ్యూనిస్టులకు సైద్ధాంతికంగా ఏకత్వం ఉన్నట్లు ఎత్తుగడలలో వైవిధ్యం కనపడుతుంది. తెలంగాణా సాయుధ పోరాటం అర్ధాంతరంగా ముగించడం వలన అసంతృప్తి చెందిన కార్యకర్తలు సమాధానపడలేదు. వారందరిలో ఈ దేశానికి విప్లవం ద్వారానే ప్రభుత్వం ఏర్పరచాలని ఉన్నది. అలాంటివారు చైనా పంథాను అనుసరించి చీలిన మార్క్సిస్టు పార్టీవైపుకు వచ్చారు. కానీ మార్క్సిస్టు పార్టీ కూడా పార్లమెంటరీ ప్రజాస్వామ్య పంథాను అనుసరించి రాజకీయాలను నడపడం, బెంగాల్‌లో అధికారంలోకి రావడం అంతగా వారికి నచ్చలేదు. అట్టివారిలో బెంగాల్ చారుమజుందార్, కానూ సన్యాల్ లాంటివారుండగా ఆంధ్రలో కూడా ఆదిభట్లకైలాసం, డి.వెంకటేశ్వరరావు, సత్యమూర్తిలాంటి వారున్నారు. బెంగాల్‌లో డార్జిలింగ్ ప్రాంతంలో విప్లవం ప్రారంభం కాగానే చైనా ఆ ఉద్యమాన్ని తన పెకింగ్ రేడియో, భారతదేశంపై వసంత మేఘం గర్జించింది. డార్జిలింగు ప్రాంతంలోని విప్లవ రైతాంగం తిరుగుబాటు బావుటా నెగురవేసింది. భారత కమ్యూనిస్టు పార్టీలోని ఒక విప్లవ గ్రూపు నాయకత్వంలో భారతదేశంలో ఒక ఎర్ర ప్రాంతంలో గ్రామానికి విప్లవ సాయుధ పోరాటం ప్రారంభమైనది. భారత ప్రజల విప్లవ పోరాటంలో ఇది బ్రహ్మాండమైన ప్రాధాన్యతను సంతరించుకున్న అభివృద్ధి. కొద్దిరోజుల క్రితం ఈ ప్రాంతానికి చెందిన రైతాంగ ప్రజలు భారత కమ్యూనిస్టు పార్టీని ఒక విప్లవ గ్రూపు నాయకత్వంలో రివిజనిస్టు సంకెళ్ళను దించుకున్నారు. తమను కట్టిపడవేసిన బంధనాలను తునాతునకలు చేశారు. తమనుఅణచి వేయడానికి వచ్చిన అభివృద్ధి నిరోధక సైన్యాన్ని, పోలీసుల్ని మాటువేసి చంపారు." ఇలా ప్రచారం చేసే సరికి ఆ తిరుగుబాటు ప్రపంచ దృష్టిని ఆకర్షించింది. కానీ నాడు తుపాకులతో, గొడ్డళ్ళతో, కొడ వళ్ళతో వచ్చిన ఆ ఎర్రదళం 52 రోజులలోనే తమ విప్లవాన్ని పూర్తి చేసింది. కానీ అప్పటికే చారుమజుందార్ శ్రీకాకుళం వచ్చాడు. గుంటూరుజిల్లా బెల్లంకొండ వచ్చాడు. అతని నిప్పురవ్వలు ఆంధ్ర ప్రాంతంలో శ్రీకాకుళం పోరాట రూపంలో ప్రత్యక్షమైంది. వేంపటాపు సత్యనారాయణ, ఆదిభట్ల కైలాసం, పంచాద్రి కృష్ణమూర్తులు గిరిజన ప్రాంతాలలో ఉద్యమాన్ని నడిపారు. గ్రామాలలో భూస్వామ్య వ్యాపారస్తులపైన దాడులు చేయడం ద్వారా వర్గ శత్రు నిర్మూలన చేయడంతో ప్రభుత్వం ఆ ఉద్యమాన్ని అణచి వేయగల్గింది. అయితే ఒక ఉద్యమ విజయాన్ని ఆ ఉద్యమ ఫలాఫలాలనుండి,వారి వివేచనను బట్టి నాయకత్వపు లక్షణాలను బట్టి, వారి చిత్తశుద్ధినిబట్టి అంచనావేయ వలసి వుంటుంది. అంతేకాకుండా ఏ ఉద్యమమైనా ఆ ఉద్యమ ప్రారంభం, అత్యంత ఉన్నతంగా ఉంటుంది. కనుకనే లక్ష్యశుద్ధి ఎంతగా ఉన్నప్పటికీ ఆవేశంతో, ఏదో చేయాలనే తాపత్రయంతో ఈ దేశంలో ముఖ్యంగా మన రాష్ట్రంలోనే మెడికల్, ఇంజనీరింగ్ విద్యార్థులు ఆవేశంతో ఈ అణగారిన ప్రజలలో చైతన్యం తేవాలని, అణగారిన వారి జీవితాన్ని మెరుగుపర్చాలని, అందుకోసం అత్యంత విలువైన తమ ప్రాణాలను లెక్కచేయరాదని తీర్మానించారు. అగ్నిగుండంలో శలభాలవలె మాడిమసై పోయారు. విప్లవ పోరాటం అంటే కామ్రేడ్ మావో ఇలా అంటారు." సృష్టించండి, తిరిగి విఫలంకండి, తిరిగి అల్లర్లు సృష్టించండి, తిరిగి విఫలంకండి, ఇలా వాళ్ళ (శత్రువులు) నాశనం అయ్యే వరకు చేయండి. ఇది ప్రజాప్రయోజనాల పట్ల ప్రపంచ వ్యాప్తంగా సామాజ్యవాదుల అభివృద్ధి అవరోధకుల తర్కం. వాళ్ళు ఎప్పుడూ దీనికి భిన్నంగా ప్రవర్తించరు. ఇది మార్క్సిస్టు సూత్రం" ఈ సూత్రాన్ని ఈ నలభై సంవత్సరాలుగా మావోయిస్టుల అనండి నక్సలైట్లు అనండి వారందరూ అల్లర్లను అంటే విధ్వంస కార్యకలాపాలకు పాల్పడడం, ప్రభుత్వ ఆస్తులను ధ్వంసం చేయడం సాగిస్తూనే వున్నారు. నేడు ఆర్థిక దిగ్బంధనం పేరిట విద్యుచ్ఛక్తి టవర్లను, ఇరిగేషన్ ప్రాజెక్టులను ధ్వంసం చేయడం ద్వారా అరాచకత్వానికి దారి తీస్తున్నారు. అందువలన తాము రాజ్యాన్ని సాధించడానికి అనువైన పరిస్థితులు ఏర్పడతాయని వారి విశ్వాసం. తమను రాజకీయంగా వ్యతిరేకించే వారిని వర్గ శత్రువులుగా ముద్రవేసి ఖతం చేయడం వలన రాజకీయ నాయకత్వాన్ని నిర్మూలించడం ద్వారా ఏర్పడే శూన్యతను తమ నాయకత్వం పూరించగలదని వారి నమ్మకం. అయితే మన రాజకీయ నాయకులలో అధిక సంఖ్యాకులు సైద్ధాంతిక నిబద్ధతలేని వారవడం

వలన తమ రాజకీయ ప్రయోజనాలకోసం ఎన్నికలలో వారి మద్దతును తీసికొని, గెలిచిన తర్వాత వారి ప్రయోజనాలను చూసే వారయినారు. అయితే అధికారంలో ఉన్నవారు మాత్రము తమ అధికారాన్ని కాపాడు కోవడం కోసం పలీసుశాఖవారి సమస్యను శాంతి భద్రతల విషయంగా పరిగణించి వదిలివేస్తున్నారు. దానితో ఈపోరాటం పోలీసులు, మావోయిస్టుల మధ్య జరుగుతున్నది. కానీ రాజకీయ సమస్యను రాజకీయంగానే పరిష్కరించవలసి వుంటుంది. దానికి తోడు కేంద్రం వివిధ రాష్ట్రాలకు శాంతి భద్రతలను పరిరక్షించడం కోసం ధారాళంగా గ్రాంట్లునిస్తుంది. పైగా నేడు దేశంలో మావోయిస్టులు ఈ దేశంలో స్వాతంత్ర్యం వచ్చిన పిమ్మట రాజకీయ అధికారాన్ని సంపాదించడం కోసం భారత ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధ విప్లవం ద్వారానే సాధించగలమని ప్రకటించారు. చారుమజుందార్ ఆనాడు 1975 నాటికి భారతదేశాన్ని విముక్తం చేయగలమని ప్రజా తంత్ర ప్రభుత్వం ఏర్పడగలదని ప్రకటించాడు. కానీ తమ పోరాటం విముక్తం చేసిన ప్రాంతాలు ఆతర్వాత ఏమయినాయి. ఎందరి నాయకులనో పోగొట్టు కున్నారు. ఇంకా ఏదో ఉద్యమాలంటూ విధ్వం సక కార్యకలాపాలకు పాల్పడుతున్నారు. ప్రభుత్వంతో చర్చలంటూ తమను తాము వెల్లడి చేస్తున్నారు. అసలు సిసలైన మార్క్సిస్టు నాయ కులకు చర్చలపై నమ్మకం ఉండదు.విప్లవం ద్వారానే తమ రాజ్యాధి కారాన్ని సాధించగలమనే విశ్వాసం ఉంటుంది.పైగా మార్క్సిస్టులలోనే చీలికలు ఎక్కువగా కనపడ తాయి. ప్రతి మార్క్సిస్టు మేధావి తాను మాత్రమే మార్క్సిజానికి సరైన నిర్వచనం చెప్పగలనని విశ్వాసం.ఆ విశ్వాసం ఉన్న నాయకులు తమ పార్టీపైఅధికారంచెలాయించాలనుకుంటాడు.అందువలననే నాయకుడు ఒకనాడు ఉద్యమాన్ని నిర్మాణం చేసిన వారు బయటకు వెళుతుంటారు. చారుమజుందార్‌కే ఆస్థితి తప్పలేదు. అదే విధంగా కొండపల్లి సీతారామయ్య,సత్యమూర్తి, నాగిరెడ్డిఅనేకమంది నాయకులు బయటకు పంపబడ్డారు. అందుకోసం సైద్ధాంతిక ముసుగులు సామాన్యంగా నడుస్తూ వుంటాయి. “విప్లవం విందుభోజనం కాదు. పీడిత వర్గాలు ప్రస్తుత పీడిత సమాజాన్ని కూలద్రోయడానికి సాగించే పోరాటం. అది కష్టాలతో కూడుకున్న పోరాటం.రక్తపాతంతోకూడుకున్న పోరాటం. ఇలాంటి విప్లవ పోరాటం సాగించాలంటే, విప్లవ సిద్ధాంతంపై ఆధార పడిన విప్లవ పార్టీ అవసరం. “కామ్రేడ్ చంద్రపుల్లారెడ్డి నాయకత్వంలో 1969 ఏప్రియల్ 22న ఏర్పడిన సిపిఐ (మాలె) యొక్క మానిఫెస్టోలో భాగమిది.ఇలా ఏ పార్టీ కొత్తగా ఏర్పడినా దరిదాపుగా ఇలాంటి భాషే ఉంటుంది. అయితే నేడు అఖిల భారత పార్టీకి కార్యదర్శిగా ముప్పాళ్ళ లక్ష్మణరావు మాత్రం చాలా కాలంగా కొనసాగలుగుతున్నాడు.

వారికి సిద్ధాంతంపై కంటే ఆయుధం మీద నమ్మకం ఎక్కువ. అందువలననే రాష్ట్రప్రభుత్వంతో జరిగిన చర్చలు విఫలం కావడం జరిగింది. అంతకంటే మన ఆంధ్రప్రదేశ్‌లో కె.ఎస్.వ్యాస్‌లాంటి వారితో ప్రారంభించబడిన గ్రేహౌండ్స్ బలముందు వారు పనికి రావడం లేదు. దొంగచాటుగా, క్లేమోర్ మైన్స్‌తో విధ్వంసం సృష్టించడం వలన పోలీ సులు ఖతం అవుతున్నారు. పైగా వారికి ఆయుధం పట్ల ఉన్న నమ్మకం ప్రజలపట్ల లేదు. వారుఏమనుకుంటారు అంటే తమ ఆయుధం చూచి, తమ పాటలను విని తాము ముందుకు నడవగానే ప్రజలు ముందుకు వస్తారు అని కాని నేడు యువకులలో ఆదర్శం కంటే కెరీర్‌పైన శ్రద్ధ పెరిగింది. ప్రపంచంలో వచ్చిన పరిణామాలు, మన ఆంధ్రప్రదేశ్‌లో కంప్యూటర్లపై పెరుగుతున్న మోజువలన విద్యార్థికులు చేరడంలేదు. ఆ పరిస్థితి వీరికే కాదు తక్కిన స్వచ్ఛంద సంస్థలకు, రాజకీయ పార్టీలకు కూడా ఏర్పడుతున్నది. పైగా వారనుసరించే విధానాలు, ఎత్తుగడలు ఏనాడు యువతరానికి ఆదర్శంగాలేవు. కనుకనే గ్రామీణ ప్రాంతాలలో నిరుద్యోగులైనవారు, సామాజిక అంతరాలవలన, వ్యక్తిగత కక్షల వలన ప్రభావితులైన వారు చేరుతున్నారు. అయితే వారు ఊహించే విప్లవం ఎలాంటి మార్పును తేగలదు. ఏ విధంగావుండగలదు అన్నవిషయాన్ని కె.జి.సత్యమూర్తి ఇలాఅంటారు.కొండపల్లి సీతారామయ్యతో కలిసి పీపుల్స్ వార్ గ్రూప్‌ను ప్రారంభించిన కె.జి.సత్యమూర్తి జంటనగరాల కుట్రకేసు సందర్భంగా హైదరాబాద్ ఆరవ మెజిస్ట్రేట్ న్యాయస్థానంలో మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీ నాయకునిగా(నేడు ఏ పార్టీనో ఆయనేచెప్పాలి) ప్రకటన పాతమిది ‘సాయుధ పోరాట ఎర్రజెండా చిరకాలం వర్ధిల్లుగాక! మేం విప్లవకారులం మా ఉద్దేశ్యాలను ఎన్నడూ దాచం. తుపాకిని ధృడంగా పట్టి- ప్రజల మీద ఆధారపడి మేం నిశ్చయంగా సుందరమైన నూతన భారతదేశాన్ని నిర్మిస్తాము అక్కడ భయాలు, బాధలుండవు. పేదరికంఉండదు.స్వార్ధం ఉండదు. భూస్వాములు,దళారీ బూర్జువాలు, అమెరికా, రష్యా,సామ్రాజ్యవాదుల దోపిడీకి రోగ పీడితమైన ఈ దేశ రాజకీయ వ్యవస్థకు మా విప్లవ కారులం. రాజకీయ అధికారం తుపాకి గొట్టం ద్వారా సిద్ధిస్తుందని విశ్వసిస్తాం. మాకు బుల్లెట్‌లోనే విశ్వాసం. బ్యాలట్‌లో కాదు. ప్రస్తుతం గెరిల్లా యుద్ధం మా పోరాటరూపం. మా ఉద్యమానికి ఇరుసు గెరిల్లాల పద్ధతుల్లో వర్గ శతృవును ఖతంచేసి, రైతు గెరిల్లా దళాల నుండి క్రమక్రమంగా ప్రజాసైన్యాన్ని నిర్మించు కుంటాము. ప్రజాసైన్యం లేకుండా విప్లవ స్థావరాలు లేకుండా వ్యవసాయ విప్లవం లేదని మాకుతెలుసు... విశాలమైన గ్రామీణ ప్రాంతాల్లో మేం విప్లవ రైతాంగ రాజకీయ అధికారాన్ని నిర్మిస్తాం. మా ఉద్యమంలో కుట్ర ఏమీలేదు. విప్లవ కారుడు నూతన ప్రపంచానికి వైతాళికుడు... మా అపజయాలు తాత్కాలి కమైనవి. కానీ ముద్ధం మాత్రం గెలిచి తీరుతాం. మావో ఆలోచన వెలుగులో ఉక్కులాంటి సుశిక్షితమైన విప్లవకారులతో పోరాట రంగం లో మా రకరకాల ఆయుధాలను ఇంకా పదును పెట్టుకుంటాము ఇవి 1973లో చెప్పినవి సుమా! 1990లో చెన్నారెడ్డి ఉదారవిధానం వలన బయటకివచ్చి నేటికీ ఆ ఉద్యమ వైఫల్యాల గురించి ప్రస్తావన చేస్తుంటారు.

నలభై సంవత్సరాల నక్సల్ ఉద్యమం ఎన్నో దశలను చూచింది. నక్సల్స్ సాయుధ పోరాటం తెలంగాణా సాయుధ పోరాటంతో ముడిపడివున్నది. నేటికీ వారి ప్రకంపనలు వినబడుతూనే వుంటాయి. అరవై సంవత్సరాల ఉద్యమం 1975లో చారుమజుందార్ కృత్యాలు కన్నా భారతదేశ విముక్తి కాకపోతే మానే ఈ అరవై సంవత్సరాలలో ఆంధ్రప్రదేశ్ విముక్తి ఎందుకు జరగలేదు. ఇందుకు కానూసన్యాల్ మాటలే చారిత్రక తీర్పు. ఆ తీర్పు ఇలా వుంది. "మార్క్సిజం - లెనినిజం-మావో ఆలోచనలను గుర్తించడంలో తగిన అనుభవం లేక పోవడం, భారతదేశంలో నెలకొన్న పరిస్థితులను సమగ్రంగా అర్థం చేసుకోలేకపోవటం వలన నక్సల్బరీ ఉద్యమాన్ని సరైనవిధంగా గుర్తించ బడటానికి చాలాకాలం పట్టింది. అందువల్ల భారీ నష్టాలనుపొంద టంతో ఎంతోవిలువైన మూల్యాన్ని చెల్లించవలసి వచ్చింది. భారత దేశం ఎంతో ప్రాచీనతను కలిగి ఉండటమే కాకుండా సువిశాలమైన దేశం. ఈ నేపథ్యాన్ని గుర్తించడంలో వైఫల్యాన్ని పొందాము. భారత ప్రజలు,వారి ప్రకృతులను బట్టి కొనసాగించిన పోరాటాలను అంచనా వేయలేకపోయాము. ఇతర దేశాల అనుభవాలను వాస్తవ పరిస్థితులను గుర్తించకుండా ఈ దేశప్రజల పోరాటంపై రుద్దటం జరిగింది. ఫలి తంగా భారత కమ్యూనిస్టు ఉద్యమం యెడాపెడా అస్థిరత్వానికి గురైనది. మావో పరిభాషలో చెప్పాలంటే చెప్పులసైజుల బట్టి పాదాన్ని నరకటం జరిగింది. భారత ప్రజలు తమ భవితవ్యాన్ని తామే నిర్మించు కున్నారనే చారిత్రక నేపథ్యాన్ని మనం గుర్తించలేకపోయాము. మన కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం పాలక వర్గాల పాలకులను వక్రంగా చిత్రీకరించి వారే చరిత్రలను నిర్మాణం చేశారని భారతజాతి పితృ తుల్యులని మనం కీర్తించటం వలన మనకి ఇక్కడ మనుగడలేకుండా పోయింది. ఎంతటి వాస్తవమైనది. 1973లో కమ్యూనల్ చెప్పిన చారిత్రక వాస్తవాలను 2007 నాటికి కూడా మనవిప్లవనాయకులమనే వారు గుర్తింపలేక పోతున్నారు. పత్రికా రచయిత పాపారావు ఒక పత్రికలో కమ్యూనిస్టులు ఉద్యమం, నక్సల్ చరిత్ర గూర్చి ఇలా విశ్లేషి స్తారు. "మనదేశంలోనికి కమ్యూనిస్టు కూడా తమ ఎనిమిది దశాబ్దాల పయనంలో ఉద్యమాలను ఎలా నడపాలో, పోరాటాలు ఎలా చేయ రాదో నేర్చుకుంటే మంచిది. అపరిపక్వ ఉద్యమ మనస్తత్వంతో ఫ్యూడల్ భావజాల ప్రభావం క్రింద నేటి వరకు సాగిన మనదేశ కమ్యూనిస్టు ఉద్యమ వైఫల్యం నిజానికి దాని స్వభావంలోనే వున్నది. ఓపక్క ఫ్యూడల్ సమాజం, దాని ప్రభావాన్ని పూర్తిగా అధిగమించని ఉద్యమం. ఓ పక్క పారిశ్రామిక వర్గ నాయకత్వంలోనే విప్లవోద్యమం అంతిమ విజయం సాధించగలదు అన్నసైద్ధాంతిక విశ్వాసం. ఈ వైరుధ్యం మన దేశంలో కమ్యూనిస్టు ఉద్యమ వైఫల్యం. నాటి చైనా వాస్తవ జీవితంలో పరిస్థితులకు అనుగుణంగా రూపొందించుకున్నది కనుక నేడు చైనా పరిస్థితులను మార్చుకుంటూ అగ్రరాజ్యం సరసన చేరగల్గుతున్నారు" అలా వారి ఆలోచనా విధానం, ఎత్తుగడలు, మారుతున్న పరిస్థితులను అంచనావేయడానికి అడవులలో ఉండి ఉద్యమాన్ని నడుపుతున్న వారికి అర్థంకావడంలేదు. అయినా వారిలో ఎందరు హతులవుతున్నా ఆ ఉద్యమం అతివాద దుందుడుకు విధానాలతో, వర్గపోరాట నిర్మూ లనతో శూన్యంలో మహా ప్రస్థానయాత్ర సాగిస్తున్నది!

### ప్రదక్షిణలు

కల్యాణజననీ నిత్యం నృణాం
సౌఖ్యప్రదాయినీం దుఃఖదారిద్ర్య
విధ్వంసీం కృష్ణ వేణీ నమోస్తుతే
ఓం శ్రీ కృష్ణ వేణ్యై నమః ఆత్మప్రదక్షిణ
నమస్కారాన్ సమర్పయామి

శ్రీ తెలకపల్లి రవి

# అరవయ్యేళ్ళ సంస్కరణోద్యమాలు

స్వాతంత్ర్యానంతర కాలంలో అంటే గత అరవై ఏళ్లలోనూ తెలుగునాట జరిగిన సంఘ సంస్కరణోద్యమాలు ఏమైనా వున్నాయా? అసలు సంస్కరణోద్యమాలు అంటే ఏమిటి?

సంస్కరణ అంటే మార్చుకోవడం. సమాజంలో చలామణిలో వున్న పొరబాట్లనూ, నష్టదాయకమైన అంశాలనూ సరిదిద్దేందుకు ప్రయత్నిం చడం.ఆ మార్పు స్వల్పమైనదే కావచ్చు.ఏదైనా ఒక్క అంశానికి మాత్రమే సంబంధించినదై వుండొచ్చు. కాని దానిపై పోరాడాలన్న స్పృహ అందరిలోనూ కలిగించి,అందుకు వ్యతిరేకంగా సామూహికంగా కృషి చేయాలి.ఆ పోరాటంసమరశీలమైందికావచ్చు.సాత్వికమైందీ కావచ్చు. స్థూలంగా చెప్పాలంటే విప్లవం అంటే సమూలమైన మార్పు, సంస్కరణ అంటే పాక్షికమైన మార్పు. అలాగే రాజకీయేతర అంశాలను సంస్కరణ లుగా పరిగణించడం రివాజుగా స్థిరపడింది. స్వాతంత్ర్య పోరాటానికి ముందే సాగిన కందుకూరి వీరేశలింగం వితంతు పునర్వివాహోద్యమం, వేశ్యావృత్తి నిరోధం, స్త్రీ విద్య వంటివి ఇందుకు ఉదాహరణలు. స్వాతంత్ర్య పోరాటంలో ఉపపాయలు గానూ అనేక సంస్కరణ ఉద్యమాలు నడిచాయి. అస్పృశ్యతా వ్యతిరేక ఉద్యమం, మద్యపాన వ్యతిరేక ప్రచారం అలాటివే. ఆ పోరాటంతో సంబంధం లేకుండా జ్యోతిబాపూలే, పెరియార్, కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి వంటివారు కూడా దళితుల కోసమూ, బ్రాహ్మణాధిక్యతను ఛేదించడం కోసమూ పోరాడారు.

మొత్తంపైన స్వాతంత్ర్య పోరాటమూ, కమ్యూనిస్టు ఉద్యమమూ, సంఘ సంస్కరణోద్యమమూ మూడు పాయలుగా మన ప్రజలను చైతన్య పరిచేందుకు కృషిచేశాయి. మరి స్వాతంత్ర్యానంతర కాలంలో పరిస్థితి ఏమిటి? రాజకీయాలను అలా వుంచితే బలమైన సంఘ సంస్కరణ ఉద్యమాలు ఏవైనా ఈ కాలంలో నడిచాయా అని పరిశీ లించడం ఆసక్తికరమైన విషయమే.

చారిత్రకంగా దేశ ప్రజలందరూ ఒక స్వతంత్ర పోరాటంలో నిమగ్నమై వున్నప్పటి పరిస్థితిని తర్వాతపరిస్థితినిపోల్చడానికి వుండదు. ఎందుకంటే స్వాతంత్ర్యం తర్వాత మనలను మనమే పాలించుకునే ప్రభుత్వం ఏర్పడింది.ప్రజా జీవితంలో వివిధరాజకీయ పక్షాల ప్రాధాన్యత తరతమ స్థాయిల్లో పెరిగింది. సమస్యలు, కష్టనష్టాల నివారణకు ప్రభుత్వం చర్యలు తీసుకోవాలనీ లేదా ఎన్నికలలో పోటీ చేసే రాజకీయ పార్టీలు చొరవ చూపాలనీ కోరుకోవడం పెరిగింది. రాజకీయేతర సంస్థలకూ, వ్యక్తులకూ పాత్ర పరిమితమై పోయింది. మారిన ఈ పరిస్థితులలో సంస్కరణోద్యమాలనే మాటకు అర్థం కొంత మార్చి చూడక తప్పదు. ఏ ఒక్క రాజకీయ పార్టీకో లేదా అభిప్రాయానికో మాత్రమే పరిమితం కాకుండా ఒక విధమైన విశాల ప్రజాభిప్రాయంగా ప్రతిధ్వనించిన అంశాలను మనం ఈ కోవలోకి తీసుకోవచ్చు.

స్వాతంత్ర్యానంతర తొలిదశలోనూ సంస్కరణోద్యమ స్ఫూర్తి కొనసాగింది. యాభయ్యవ దశకం వరకూ కూడా గ్రామాలలో యువజన సంఘాలు ఇందుకు నాయకత్వం వహించాయి. దురాచారాల నిర్మూలన, మూఢత్వంపై పోరాటం, కులాంతర వివాహాలు, వితంతు వివాహాలు, దండలమార్పిడి వంటి సంస్కరణ పద్ధతులను ముందుండి ప్రోత్సహిం చాయి. ఒక విధంగా గ్రామాలలో పెత్తందార్లకు, మూఢత్వం వ్యాపింప చేసే వాళ్ళకూ యువజన సంఘాలే సింహస్వప్నాలయ్యాయి. పల్లెటూరు, రోజులు మారాయి వంటి చిత్రాలలో ఈ వాతావరణం చూడగలము. మహిళా సంఘాలు కూడా ఈ దిశలో చెప్పుకోదగిన పాత్ర నిర్వహించాయి. ఇప్పటికీ సాంఘిక సమస్యలపై ఈ సంఘాలకే గణనీయమైన పాత్ర వుంటుంది.

ఆంధ్రప్రదేశ్‌నేగాక మొత్తం భారతదేశ మంతటినీ ప్రభావితం చేసిన తెలుగు మహిళల సారా వ్యతిరేక పోరాటం వాటిలో ముందుగా చెప్పుకోవాలి. అయితే దానికి అంకురార్పణ చేసింది అక్షరాస్యతా ఉద్యమం. ఈ రెంటిలోనూ ముందు నిలిచింది ప్రజాసైన్సు ఉద్యమం. స్వాతంత్ర్యానంతర కాలంలోవిజ్ఞానశాస్త్రం విస్తరిస్తున్నామరో వైపున సమాంతరంగా మూఢత్వం విచ్చుకుంటున్న తరుణంలో అందుకు విరుగుడుగా మొదలైంది ప్రజా సైన్సుపుద్యమం. కేరళలోని ఎర్నాకుళం

జిల్లాలో సంపూర్ణ అక్షరాస్యతా ఉద్యమం సాధించిన విజయం దేశాన్నే ఉత్తేజ పర్చడంతో ఆ కోవలోనే అన్ని రాష్ట్రాలలోనూ కృషి ప్రారంభమైంది. ప్రజాసైన్సు ఉద్యమం, ప్రజా కళాకారులు, అధ్యాపకులు విద్యాధికుల భాగస్వామ్యంతో ఇది మూల మూలలకూ పాకింది. అంతకుముందు కాలంలోని వయోజన విద్యాకార్యక్రమం ఇప్పుడు సరికొత్త రూపం తీసుకుంది. ఊరూరా కళాజాతాలు జరిగాయి. అక్షరాస్యతకు సంబంధించి ఒకో జిల్లాలో ఒకో పేరిట ఉద్యమం ప్రారంభమైంది. సర్కారీ కార్యక్రమ లక్షణాలున్నా నిజంగా విద్యావ్యాప్తికి దోహదపడాలనే సహృదయులెందరో ఈ కృషిలో పాలుపంచుకున్నారు. నవ అక్షరాస్యుల కోసం కొత్త పాఠ్య పుస్తకాలు రూపొందాయి. అలా రూపొందిన పుస్తకాలలో ఒక పాఠం సీతమ్మ కథ. అదే నెల్లూరు జిల్లాలో సారా వ్యతిరేక పోరాటానికి ప్రేరణ అయింది.

ఈ కథ చదివిన మహిళలు అందులో వలెనే ఊళ్లోని సారా దుకాణానికి వ్యతిరేకంగా పోరాటం మొదలుపెట్టారు. దూబగుంటలో రోశమ్మ అనే మహిళ అందుకు నాయకత్వం వహించింది. జనవిజ్ఞాన వేదిక చేతులు కలపడంతో అదో విస్తృత రూపం సంతరించుకుంది. ఎక్కడికక్కడ ప్రదర్శనలూ, ధర్నాలు ప్రారంభమయ్యాయి. మహిళా సంఘాలన్నీ సమైక్యమై నిలిచాయి. ఈనాడు పత్రిక ఇందుకు బలంగా మద్దతునిచ్చింది. నిస్వార్థ ప్రజాసేవకుడుగా పేరుగాంచిన వావిలాల గోపాలకృష్ణయ్య వంటివారు ముందునడిచారు. క్రమేణా ఇదిమహిళలకే గాక మొత్తం సమాజమంతటికీ సంబంధించినపోరాటంగా విస్తరించింది. సారా నిషేధించాలన్న నినాదం మార్మోగింది. క్రమ క్రమంగా అన్ని రాజకీయ పార్టీలూ అందుకు సుముఖత తెల్పాయి. చివరకు అప్పటి తెలుగుదేశం అధ్యక్షుడు ఎన్.టి.ఆర్.తను మళ్లీ అధికారంలోకి వస్తే సంపూర్ణ మద్య నిషేధం ఫైలుపై తొలిసంతకం చేస్తానని ప్రకటించారు. 1994 ఎన్నికల్లో ఆయన అపూర్వమైన విజయం సాధించడం వెనక దీని ప్రభావం చాలా వుంది. అలాగే సంతకం చేశారు కూడా. అయితే తర్వాత కాలంలో ప్రభుత్వాలు ఈ నిషేధాన్ని నీరుగార్చాయి. ఇప్పుడు మనరాష్ట్ర ప్రభుత్వ ఆదాయంలో బెల్టు షాపుల ద్వారా వచ్చే ఆదాయం ప్రధానమై కూచుంది! ఇలాటి స్థితిలో మరోసారా వ్యతిరేకోద్యమం రావాలనే ఆకాంక్ష తరచూ వ్యక్తమవు తుంటుంది. తర్వాతి పరిణామాలే మైనప్పటికీ సారా వ్యతిరేకోద్యమం స్వాతంత్ర్యానంతర సంస్కరణోద్య మాలలో అగ్రభాగాన నిలుస్తుంది. ఇదే విధంగా మహిళలను కించ పరచే అశ్లీల ధోరణులకు వ్యతిరేకం గానూ ఉద్యమం తీసుకువచ్చే ప్రయత్నాలు కొన్ని జరిగినా ఆ ప్రభావం పరిమితంగానే ఉంది. కొన్ని సినిమాలను మార్చడంవంటివి జరిగాయి. కొన్ని పత్రికలు సీరియల్సు ప్రచురణ మానుకోవలసి వచ్చింది. కాని మొత్తంపైన మహిళల గౌరవాన్ని దిగజార్చి వ్యాపార వస్తువుగా మార్చే ఈ మార్కెట్ వ్యవస్థ స్వరూపంలో మార్పు రావడం అంత సులభం కాదు.

మొదటి నుంచి కూడా సంఘ సంస్కరణోద్యమాలలో మహిళా సమస్యలపై పోరాటమే ప్రధాన పాత్ర వహిస్తుంటుంది. ఎనభయ్యవ దశకం తర్వాత దేశంలో మహిళలపై అత్యాచారాలు, వరకట్న హత్యలకు వ్యతిరేకంగా పోరాడటం అనేది నిత్యకృత్యమైపోయింది. ఇలాటి ఘటనలు ఇంతకుముందు కూడా వుండేవా ఇప్పుడు పెరిగాయా అన్నది చర్చనీయాంశమే. అయితే సమాజంలో వికృత వాణిజ్య ధోరణులు పెరగడంతో పాటు అన్నిటినీ వెను వెంటనే నివేదించే మీడియా విస్తరణ కూడా ఇందుకు కారణమైంది. మహిళా సంఘాలు ప్రధానంగా వామపక్ష మహిళా సంఘాలు ఇలాటి ఘటనలు ఎక్కడ జరిగినా వెనువెంటనే పోరాటంలోకి దిగుతుండడంతో ధన పిశాచులైన అత్తిళ్లవారు ఇప్పటికీ వున్నా వరకట్న మరణాలు ఒక సామాజిక సమస్యగా గుర్తింపజేయడంలో మహిళా ఉద్యమం విజయవంత మైంది. దీంతోపాటుగానే ప్రేమించామని మోసగించే పురుషులకు వ్యతిరేకంగా నిరాహార దీక్షలు పోలీసు స్టేషన్లలో ఫిర్యాదులు వంటివి పెరిగాయి. అయినా నేరాలు ఆగని మాట నిజమే కాని ఈ ప్రతిఘటన లేకపోతే మరెంత తీవ్రంగా వుండేవో వూహించు కోవలసిందే.

ఈ నేపథ్యంలోనే మహిళా ఉద్యమాలకు సమాంతరంగా సాహిత్య రంగంలో స్త్రీవాద వుద్యమం పెరిగింది. చాలా సంస్కరణోద్యమాలు మొదట రచనా రంగంలోనే వచ్చాయి గనుక వీటిని కూడా ఆ కోవలోనే చూడవలసి వుంటుంది. దాదాపు పదేళ్లపాటు స్త్రీవాదం సాహిత్యంలో దృష్టికోణాన్ని సమూలంగా మార్చేసింది. అంతకుముందు ప్రస్తావనకు రాని, వ్యక్తీకరించబడని పలుసమస్యలను, అంతకుమించి రంగం మీదకు తెచ్చింది. భాషలో కొన్ని ప్రయోగాలు ఉపసంహరణకు కారణ మైంది. ఇదే కాలంలో రాజకీయ సామాజిక రంగాలలోను వచ్చిన పరిణామాల ఫలితంగా చైర్మన్ కాస్తా చైర్‌పర్సన్ కావలసి వచ్చింది. స్థానిక సంస్థల ఎన్నికలలో మూడోవంతు మహిళలకు రిజర్వు చేయడం వల్ల వారిలో నూతనోత్సాహం పెల్లుబికింది. ఇప్పుడు చట్టసభలలోనూ మూడోవంతు స్థానాల కోసం బిల్లుపెట్టాలన్న డిమాండు నిరంతరాయంగా కొనసాగుతూనే వుంది. రాష్ట్రపతిగా ప్రతిభాపాటిల్ ఎన్నిక కావడమూ ఈ క్రమానికి కొనసాగింపే.

ఇంతకుముందే చెప్పుకున్నట్టు ఆర్థిక రాజకీయ పరిణామాలలో భాగంగానే మన పల్లెసీమల్లో వచ్చిన మరో పెద్ద మార్పు వుంది. డ్వాక్రా గ్రూపులు, లేదా స్వయం సహాయక బృందాల ద్వారా సూక్ష్మ పరపతి సదుపాయం విస్తరించడం వాటిలో ఒకటి. మహిళల ఆర్థిక స్థోమత పెరిగి కొంతవరకైనా తమ కాళ్ళపై తాము నిలబడటానికి

ఇది చాలా ఉపయోగపడింది. ఈ క్రమంలో సమావేశాలు, సమిష్టి చర్చలు వంటివి పెరిగాయి.ఈ పథకాలను ప్రోత్సహించడంలో ప్రపంచ బ్యాంకు ఉద్దేశాలు ఏమైనప్పటికీ దానివల్ల ఆచరణలో మహిళలలో నిజంగానే కదలిక వచ్చింది. గ్రామీణ జీవితంలో నిర్ణాయకమైన అంశాల్లో ఈ బృందాల పాత్ర పెరిగింది. ఎన్.టి.ఆర్. ప్రభుత్వం మహిళలకు సమాన ఆస్తి హక్కు కల్పించడం వంటి శాసనాలు కూడా కొంత మార్పునకు దోహదపడ్డాయి.

ఎనభయ్యవ దశకంలో దళిత ఉద్యమాన్ని కూడా ఈ కోవలోనే చెప్పుకోవలసి వుంటుంది. రాజకీయంగా కన్షీరాం, మాయావతి వంటి వారికే దీన్ని పరిమితంచేసి చూడటం పొరబాటు అవుతుంది. సమాజంలో వచ్చిన వివిధ మార్పుల ప్రభావం దీని వెనక వుంది. తొలిదశ నూతన ఆర్థిక విధానాలు ప్రారంభమైన తర్వాత దళితుల స్థితిగతులు దిగజారడం, అత్యాచారాలు, మతతత్త్వ రాజకీయాల పెరుగుదలకూడా ఇందుకు కారణమయ్యాయి. వి.పి.సింగ్ మండల్ కమిషన్ సిఫార్సుల అమలును ప్రకటించడం ఈ క్రమానికి పరాకాష్ఠ. సామాజిక న్యాయం అన్నది రాజకీయ అజెండాలో ఒక కీలకమైన అంశమైపోయింది. ప్రతి సందర్భంలోనూ సామాజిక పొందిక సక్రమంగా వున్నదీ లేనిదీ పరిశీలించడం తప్పనిసరై పోయింది. పూలే, అంబేద్కర్‌లతో మొదలైన దళిత చైతన్యం విస్మరించరాని వాస్తవంగా తయారైంది. సాహిత్యం లోనూ, భాషలోనూ దళిత నుడికారం, పద ప్రయోగాలు బలమైన స్థానం సంపాదించాయి. వూరూరా అంబేద్కర్ విగ్రహాల ఆవిష్కరణ జరిగింది. మన రాష్ట్రంలోనూ దీని ప్రభావం పడింది. ఈసడించబడిన కులాల పేర్లనే ఆత్మగౌరవ ప్రతీకలుగా చివరన జోడించుకోవడం మొదలైంది. కమ్యూనిస్టు పార్టీలు కూడా దళిత సమస్యలపై స్వాతంత్ర్య ఉద్యమం నాటి వలెనే దేవాలయ ప్రవేశం, సామాజిక వివక్షతలకు వ్యతిరేకంగా ఉద్యమం వంటివి పున:ప్రారంభించే స్థితి వచ్చింది.

ఇక భావాల పరంగా చూస్తే విస్తృతి తక్కువైనా నాస్తికోద్యమం, హేతువాదం వంటివి ఏదోఒక మేరకు ప్రభావం చూపించాయి. డెబ్బయిలలో శ్రీలంక డాక్టర్ అబ్రహాం కోవూర్ దీనికి ప్రేరణ నిచ్చారు. గోరా నాస్తికత్వ ప్రతీక అయ్యాడు. సాహిత్యంలో సివి ఈ భావాన్ని ప్రతిధ్వనించే అనేక కావ్యాలు రాశాడు. రామకృష్ణ, రావిపూడి వెంకటాద్రి, ఇన్నయ్య వంటివారు కూడా పలు పుస్తకాలు రాశారు. నాస్తికత్వం, చార్వాక, హేతువాద తదితర పత్రికలు నడిచాయి. ఒక దశలో ఈ ఉద్యమాల ప్రతినిధులు బాబాలను, అమ్మలను పరీక్షలకు నిలవమంటూ సవాలు చేయడం జరిగేది. ప్రజలతో సంబంధం లేని ప్రయత్నాలు అట్టే కాలం నిలవలేకపోయాయి. మూఢ విశ్వాసాలు గతంలో కంటే ఎక్కువ అయ్యాయనే అభిప్రాయం అందరిలో నెలకొన్నది. దానికి తోడుగా బాబాలు కూడా మహిమలు ప్రదర్శించడం మానేసి భారీ విరాళాలతో ధార్మిక కార్యక్రమాలు మొదలుపెట్టారు. సమాజానికి ఉపయోగపడే చర్యలు తీసుకుంటే మంచిదే కదా అన్న ప్రశ్నలు వినిపిస్తున్నాయి. మరోవైపున నాస్తిక కేంద్రం నాయకులు కూడా ఆ ప్రచారానికే పరిమితం కాకుండా స్వచ్ఛంద సంస్థలను స్థాపించి సామాజిక సంస్కరణ కార్యక్రమాలు చేపట్టారు. స్టువర్ట్‌పురంలో మాజీ నేరస్తులను సంస్కరించేందుకు వారు నిర్వహించిన కార్యక్రమాలు, తర్వాతి కాలంలో జోగినీ సమస్యను వెలుగులోకి తీసుకురావడం ఇందుకు ఉదాహరణలు.

సంస్కరణ కార్యక్రమాలలో స్వచ్ఛంద సంస్థలపాత్ర పెరగడం ఇక్కడ మరో ముఖ్యమైన మార్పు. అంతర్జాతీయంగానే ప్రపంచీకరణ యుగంలో రాజ్యం లేదా ప్రభుత్వం ప్రజా సదుపాయాల విషయంలో తన బాధ్యత నుంచి తప్పుకోవడంతో సామాజిక రంగంలో పెద్ద ఖాళీ ఏర్పడింది. దీన్ని భర్తీ చేసేందుకు స్వచ్ఛంద సంస్థలను ముందుకు తెచ్చారు. అయితే ఇవి గతంలో వలె పూర్తిగా దాతల సహకారంపై ఆధారపడి నడిచేవి కావు. వీటికి ప్రభుత్వమే గణనీయంగా నిధులు సమకూర్చడం మొదలు పెట్టింది. విదేశాల నుండి కూడా వీటికి నిధులు రావడంతో ఇది పెద్ద వ్యవస్థగా తయారైంది. ఈ నిధులను సద్వినియోగం చేసి ప్రజలకు మేలు చేసే సంస్థలతో పాటుగానే వాటిని దుర్వినియోగపర్చి విమర్శలు ఎదుర్కొనే సంస్థలూ వెలిశాయి. మొత్తంపైన ఇవి రాజకీయేతర ధోరవను ప్రోత్సహించడం ప్రధానమైన పనిగా పెట్టుకున్నాయి. అందుకు తగినట్టే ప్రపంచ బ్యాంకు వంటి సంస్థలు కూడా రాజకీయ రహితమైన అభివృద్ధి అన్న నినాదాన్ని ప్రోత్సహించాయి. అంటే స్వాతంత్ర్య పోరాటంలోనూ, ఆ తర్వాతి దశాబ్దాలలోనూ రాజకీయ ప్రాతిపదికన జరిగిన ఉద్యమాలూ, పోరాటాలను నిరుత్సాహపర్చే ధోరణి పెరిగింది. ఇదే కాలంలో వివిధ జీవనరంగాలలో కొత్త మార్పులు వచ్చాయి. మార్కెట్ శక్తుల పట్టు పెరిగి ప్రతిదీ సరుకుగా మారిపోయింది. ఈ నేపథ్యంలో సామాజిక సేవ కూడా కార్పొరేట్ రంగానికి బదలాయించే పద్ధతులు మొదలయ్యాయి. కార్పొరేట్ సామాజిక బాధ్యత వంటి మాటలు వ్యాప్తిలోకి వచ్చాయి. కార్పొరేట్, మీడియాశక్తులు కలసిన తర్వాత సామాజిక కార్యక్రమాలు కూడా ప్రచార సరళి సంతరించుకున్నాయి. రన్‌లు, షోలు నిర్వహించడం జరుగు తున్నది. వీటివల్ల నిజంగా జరిగిన మేలు మార్పు ఎంత అనేది ఎలా వున్నా వాటి గురించిన స్పృహ మాత్రం పెరిగింది. మద్యపాన నిరోధక చికిత్స కోసం కొన్ని సంఘాలు కృషి చేస్తూనే వున్నాయి. మానవ సంబంధాలు దెబ్బతిని పోతున్న నేపథ్యంలో మానసికంగా నిరాశకు గురైన వారికి సలహాలు, ఒంటరులకు తోడ్పాటు వంటి కొత్త సామాజిక సేవలు వినియోగంలోకి వచ్చాయి. ఫోన్‌లో మాట్లాడ్డంకూడా సంఘసేవ కింద పరిగణించవలసిన స్థితి ఏర్పడింది. ఈ పరిణామాలలో మరీ ముఖ్యమైంది వృద్ధాశ్రమాల స్థాపన. కుటుంబాలతో కలిసి వుండే అవకాశం లేక, ఆ

వాతావరణం లేక ఏకాకులవుతున్న వృద్ధులకు సపర్యలు చేసే సంస్థలు అనేకం వెలిశాయి. ఇదో కొత్త సేవా రంగమైంది.

హైదరాబాదులో చాలాకాలంగా పంపిణీ చేస్తున్న చేపమందు అశాస్త్రీయతపైనా జన విజ్ఞాన వేదిక ఉద్యమం నడిపింది. ఉచితంగా ఇస్తున్న మందుపై ఉద్యమం దేనికని కొందరు సవాళ్లు విసిరినప్పటికీ అది విజ్ఞానశాస్త్ర బద్ధమో కాదో తేలాలంటూ వారు పట్టుపట్టారు. కోర్టులు కూడా జోక్యం చేసుకోవడంతో చేపమందు పంపిణీకి నిబంధనలు విధించాయి. ఫలితంగా చేపమందుకోసం వచ్చేవారి సంఖ్య బాగా తగ్గిపోయింది. ప్రభుత్వ శాఖలు చేసిన ఏర్పాట్లు కూడా వృధా అయ్యే పరిస్థితి ఏర్పడింది. తిరుగులేని మందు అన్నది కాస్తా ప్రసాదంగా చెప్పుకోవలసి వచ్చింది. ప్రసాదంగా చెప్పేట్లయితే అప్పుడు ఎవరి విశ్వాసాన్ని బట్టి వారు నిర్ణయం తీసుకుంటారు. అయితే అలా ప్రకటించిన తర్వాత ఆ కార్యక్రమానికి ప్రభుత్వ వ్యయంతో ఏర్పాట్లు చేయడం సరికాదన్న విమర్శలు ఎదుర్కోవలసి వచ్చింది.

ఇలాగే శీతల పానీయాలలో క్రిమి సంహారాల శాతం ఎక్కువగా వుంటుందనే దానిపైనా సైన్సు ఉద్యమం సాగింది. ఒక దశలో ఇది వాటి వ్యాపారంపైనా ప్రభావం చూపింది. భారీ మొత్తాలు ఖర్చుపెట్టి అగ్రతారలతో అడ్వర్టయిజ్‌మెంట్లు చేయించి మరీ వాటిని సమర్థించు కోవలసి వచ్చింది. ఆ తారలు కూడా ఇందుకు ప్రత్యేకంగా సంజాయిషీ ఇచ్చుకుంటున్న తరహాలో మాట్లాడాల్సివచ్చింది.ఒక విధంగా సంస్కరణ, శాస్త్ర విజ్ఞానం కలగలసిన ఉద్యమాలు ఇవి. మరోవైపున పెద్ద శాస్త్రీయతతో సంబంధం లేకుండానే మీడియాద్వారా ప్రచారం పొందిన ఆయిల్‌పుల్లింగ్, వాటర్ థెరపీ వంటివి కూడా ఆయా దశల్లో విద్యాధికుల్లో చాలా ప్రభావం చూపించాయి.

పర్యావరణ పరిరక్షణ, ఎయిడ్స్ నిరోధ ప్రచారం కూడా పెద్ద నిరంతర ప్రచారోద్యమాలుగా రూపొందాయి.పర్యావరణంపట్ల మొదటి నుంచి ఈ స్పృహ వుండేదికాదు. పర్యావరణం నాశనానికి కారకులెవ న్న దానిపైనా భిన్నాభిప్రాయాలున్నాయి.ప్రపంచదేశాలను వలసలుగా సుకుని వనరులన్నీ కొల్లగొట్టిన సామ్రాజ్యవాద దేశాలే ఇందుకు ప్రధానంగా బాధ్యత వహించాలన్నది నిర్వివాదాంశం. ఇప్పుడు కూడా వాటికి సంబంధించిన బహుళజాతి సంస్థలూ, ఆయుధ కర్మాగారాలూ భారీ కాలుష్యానికి కారణమవుతూనే వున్నాయి. చమురు వినియోగం కారణంగా వాతావరణంలో పెట్రో కార్బన్లు విడుదల చేయడంలోనూ అవే అగ్రస్థానంలో వున్నాయి.కాని మరో వైపున అవే పర్యావరణ పరిరక్షణ గురించి వర్ధమానదేశాలకునీతులు చెబుతున్నాయి. అయినప్ప టికీ పర్యావరణ పరిరక్షణ అవసర మనడంలో ఎలాంటి సందేహం లేదు. ఆమేరకు మనదేశంతో సహా ఉద్యమాలు పెరుగుతున్నాయి కూడా. మేధాపాట్కర్ నాయకత్వంలోని నర్మదా బచావో ఆందోళన ఇందుకు ఒక ఉదాహరణ. అరుంధతీ రాయ్ వంటి రచయితలు ఈ విషయంలో గట్టిగా మద్దతు ప్రకటించారు.

సాంస్కృతిక విషయాలలోనూ ఇలాటి కదలికలు వచ్చాయి. ఏ జాతికైనా భాష సంస్కృతి ముఖ్యమైనవి. స్వాతంత్ర్యానంతరం భాషా విధానం ప్రజాస్వామిక భాషా విధానం రూపొందించుకోవడంలో విఫలమైన ఫలితంగా దేశీయ భాషలు దెబ్బతిన్నాయి. భిన్నత్వాన్ని గుర్తిస్తూ అన్ని భాషలకూ సమాన ప్రోత్సాహం ఇవ్వడంలో ప్రభుత్వాలు శ్రద్ధచూపని కారణంగా అనుసంధాన భాషగా దేన్నీ ఆమోదించే స్థితి లేకుండా పోయింది. విద్యా విస్తరణతో పాటే ఆంగ్లభాషా ప్రాబల్యమూ పెరిగింది. దీనివల్ల కలుగుతున్న ముప్పును తెలుసుకోవడానికి చాలా కాలమే పట్టింది. అయితే గత దశాబ్దకాలం, అంతకు కొంచెం ముందునుంచీ మాతృభాషా పరిరక్షణ అన్నది ఒక ఉద్యమ రూపం తీసుకున్నది. తెలుగు పుస్తకాలు, పద్యాలు, సామెతలు, పిల్లల పాటలు తెలుసుకోవాలన్న ఆసక్తి అధికమైంది. పెద్దబాల శిక్షల అమ్మకాలు పెరిగాయి. ఇదికూడా ఒకవిధమైన సంస్కరణోద్యమమే. సహజంగానే ఈ ఉద్యమంలోనూ భిన్న ప్రవంతులు ఉన్నాయి. స్వాతంత్ర్యం వచ్చిన కొత్తలో మంచి ప్రోత్సాహం పొందిన గ్రంథాలయ ఉద్యమం వంటివి తర్వాత కాలంలో కొడిగట్టిపోయాయి. ఇప్పుడు వాటిని పునరుజ్జీవింప చేసుకోవడానికి పెద్ద పోరాటం అవసరమవుతున్నది. ఇదేవిధంగా ఒకప్పుడు ప్రధాన పట్టణాలన్నిటా ఫిలిం సొసైటీ వుద్యమాలు వుండేవి. ఇప్పుడు టీవీ విస్తరణ వగైరాల వల్ల అవి వెనకపట్టు పట్టినా మళ్ళీ ఊపిరి పోసుకుంటున్నాయి.

మనకు రాజకీయ విషయాల్లో వున్న ఆసక్తి సామాజిక విషయాల్లో లేదని కందుకూరి వీరేశలింగం తన ఆత్మకథ చివర చేసిన విన్నపంలో ఎత్తిచూపారు. ఆ లోపం ఇప్పటికీ వెన్నాడుతూనే వుంది. సాంకేతికాభి వృద్ధితో మానవాళి విజ్ఞాన ద్వారాలు తెరుచుకుంటున్నా మౌఢ్యం కొత్త రూపాల్లో ప్రత్యక్షమవుతున్నది. రాజ్యం లౌకిక స్వభావం హరించుకు పోతుండగా కులమత తత్వాలను అధికారం కోసం వినియోగించు కోవడం పెరుగుతున్నది. ఇది అనేక దుష్పరిణామాలకు దారి తీస్తున్నది. సంఘ సంస్కరణ లక్ష్యాలనే తలకిందులు చేసే పరిణామంఇది. వ్యక్తిగత విశ్వాసాలుగా ఉండవలసినవి సమాజంపైనా పరిపాలనపైనా రుద్దడం జరుగుతున్నది. ఒక శాసనసభ వాస్తు దోష నివారణ క్రతువు అధికారి కంగా నిర్వహించడం ఇందుకో ఉదాహరణ మాత్రమే. అలాగే ధనమే సర్వస్వమై విచ్చలవిడిగా చెలరేగుతున్న వినియోగ సంస్కృతి మానవ విలువలను దిగజారుస్తున్నది. ఈ క్రమంలో గతంలో పోరాడి నిర్మూలిం చుకున్న అనేక అవలక్షణాలు కొత్త రూపంలో ముందు కొస్తున్నాయి. సరికొత్త వికృతాలూ పుట్టుకొస్తున్నాయి.గతంలో సంస్కరణ వివాహాలు చేసుకున్నవారు కూడా ఇప్పుడు ఛాందసాలకు గురవుతున్న సందర్భాలు

న్నాయి. అత్యాధునిక వాతావరణం మధ్యనే సంస్కృతిపేరిట మూఢత్వాన్ని ఆదరించే వాతావరణమూ కన్పిస్తోంది. వాణిజ్య సంస్కృతి కాలుష్యాన్ని వెదజల్లుతూ యువతలో ప్రశ్నించే తత్వం,ప్రతిఘటించే తత్వం పెంచే కన్నా ప్రలోభాలకు గురి చేయడమే ఎక్కువవుతున్నది.విద్య కార్పొరేటీకరణ కూడా విద్యార్థుల సంఘటిత శక్తిని, సామాజిక పాత్రనూ కుదించడానికి కారణమవుతున్నది. ఇవన్నీ సాంఘిక రంగంలో రావల్సిన ఉద్యమాలవాడిని కొంత మొద్దుబారుస్తున్నాయి.ఇకవ్యక్తిగత ప్రయోజనం తప్ప సేవా గుణానికి చోటునివ్వనివాణిజ్య సంస్కృతి కూడా ఎవరికివారే అన్నట్టు చేస్తున్నది. మార్పు కోసం పోరాడ్డం కంటే మనకెందుకులే అని విదిలించుకుపోవడానికి కారణమవుతున్నది. ఇంకా చెప్పాలంటే దానితో రాజీ పడి పని జపించుకుందామనే తత్వం పెరుగుతున్నది. వస్తు సంస్కృతి కల్పించిన పోటీ కారణంగా వాటిని సమకూర్చుకోవాలనే తాప త్రయంలో సామాజికాంశాలను పట్టించుకోవ డమే తక్కువైనప్పుడు వాటిని మార్చుకోవడానికి పోరాడాలనే స్పృహ ఇంకా తక్కువవుతున్నది. తాత్కాలికంగా ఇలాటి వెనకపట్టు కనిపిస్తున్నా జీవితానుభవమే సంస్కరణల అవసరాన్ని గుర్తింపచేస్తుంది. ప్రపంచీ కరణ మేడిపండు విచ్చు కుంటున్న కొద్దీ భ్రమలు తొలగి పోరాడాలనే దృష్టి ఎక్కువవు తున్నది. కొన్ని వర్ధమాన దేశాలలో తల్లుల ఉద్యమం వంటివి వచ్చినట్టే ఇక్కడ మరోసారి మహిళలు ఈ ప్రక్రియలో ముందుకు వచ్చే అవకాశం చాలావుంది. ఇప్పటికే అలాటి సూచనలు కనిపిస్తున్నాయికూడా.

సంస్కరణలూ సంస్కారానికి సంబంధం చాలా ఉంది. ఇంగ్లీషులో కల్చర్ అన్నమాట కల్టివేషన్ నుంచి పుట్టినట్టే సంస్కృతి సంస్కారాలనే మాటలుకూడా వ్యవసాయంతోనూ సమిష్టి జీవనంతోనూ ముడిపడి వచ్చాయి. ఆ సంస్కారాన్ని సమభావాన్ని నిరంతరం పెంచుకోవడానికి సంస్కరణోద్యమాలు నిరంతరంగా జరుగుతుండవలసిందే.మారు తున్న పరిస్థితులకు అనుగుణంగా వాటిని ఎలా పెంపొందించా లనేది ప్రజాస్వామిక వాదులందరూ ఆలోచించవలసిన అంశం. మీడియా విస్తరణ, రాజ్యం ఉపసంహరణ వంటి కారణాల వల్ల ఇటీవలి కాలంలో దైనందిన వ్యవహారాలలో పౌరసమాజం పాత్ర పెరుగు తున్నది. మారుతున్న జీవనసరళి, ముఖ్యంగా బస్తీలలో అపార్ట్‌మెంట్లు, బస్తీలు, కార్పొరేట్ మహాసంస్థల పెరుగుదల వగైరాలు ఇందుకు అవకాశం కల్పిస్తున్నాయి. సమాజ జీవితంలో చెడుగులకు వ్యతిరేకంగా ప్రచారోద్యమాలు చేపట్టడానికి గతం కంటే ఇప్పుడు మరింత అనుకూలమైన వాతావరణం వుంది. ప్రజావరణాన్ని తగ్గించే వాణిజ్య తాకిడి ఎక్కువగానే ఉంది.ఈ రెండు భిన్నదోరణుల మధ్యరానున్నకాలంలో సామాజిక మార్పుల కోసం పోరాటాలు సాగుతాయి. ఇప్పుడు వాటి ప్రభావం మరింత తీవ్రంగానూ త్వరితంగానూ వుంటుంది. అయితే అందుకు ఆలోచనా పరుల చొరవ చైతన్యం చాలా అవసరం.

'సహ్యాభూభృత్తుల స్వామి యొదలమోచి
లాలించి పెంచు గారాల కూన
శ్రీశైల శిఖరాగ్ర చిన్మూర్తి యైవెల్లు
శ్రీమమ్మహాదేవు చెలిమి కత్తె
అమరేశ్వరస్వామి యాస్థాన నర్తకి
సముదాయన్నృత్త శిక్షాప్రదాత్రి
ఇంద్రకీలాచలం బెక్కి లోకంబేలు
కనకదుర్గమ్మకు నసుగు జెల్లి
కాకుళ క్షేత్రమున నాంధ్రక్షైటభారి
యంఘ్రి యుగ్మము సేవించు నమలచరిత
కర్షకాంధ్ర ప్రజానీక కల్పవల్లి
నిక్కమ గుతల్లి కృష్ణవేణీమతల్లి'

– యార్లగడ్డ వెంకట సుబ్బారావు

డాక్టర్ వి. సింగారావు

# చెంచులు - సామాజిక జీవనం

ప్రపంచం మొత్తంలో ఆఫ్రికా తర్వాత భారతదేశంలోనే గిరిజనులు అధికసంఖ్యలో నివశిస్తున్నారు. గాంధీజీ జాతీయ స్థాయి నాయకుడైన తర్వాతనే, ఆదివాసి ప్రజల సమస్యలకు జాతీయస్థాయిలో గుర్తింపు లభించిందని నిహార్‌రంజన్‌రేగారి భావన. ఈ గిరిజనులనే కొంతకాలం ఆదిమజాతులుగా,మరికొంతకాలంఅణగారిన జాతులుగా వర్ణించారు. ఇప్పుడు ప్రభుత్వ పరిభాషలో గిరిజనుల్ని షెడ్యూల్డు తెగలుగా వ్యవహరిస్తున్నారు.

భారతదేశంలో ఆదిమ తెగల జాబితాను తయారు చేయ డానికి మొట్టమొదటి ప్రయత్నం-1931 జనాభా లెక్కల సేకరణ సమయంలో జరిగింది. 1936 నాటి భారత ప్రభుత్వ చట్టంలో వెనుకబడిన తెగలు (BACKWARD TRIBES) అనే పదం వాడటం జరిగింది. భారత రాజ్యాంగం అమలులోకి వచ్చిన 1950 జనవరి 26వ తేది తర్వాత, తెగలను, తెగలుగా జీవించే వర్గాలను షెడ్యూల్డు తెగలుగా గుర్తించ వలసిన అవసరం కలిగింది. గిరిజనులను నిర్ధారించే విషయంలో రాజ్యాంగంలోని 342 వ అధికరణం రాష్ట్రపతికి ప్రత్యేక అధికారాలు కల్పించింది. షెడ్యూల్డు కులాలు వెనుకబడటానికి సామాజిక వ్యవస్థ లోని అనాచారాలు, షెడ్యూల్డు తెగలు, వెనకబడటానికి వారు నివశించే భౌగోళిక పరిస్థితులను కారణాలుగా గుర్తించారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో షెడ్యూల్డ్ తెగల జనాభాను 34 విభాగాలుగా పరిగణించారు. వీరు -ఆంధ్, బగత్, భిల్, చెంచు, గదబ, గోండు, గవుడు, హిల్‌రెడ్డి, జాతపు, కమ్మర, కట్టునాయకర్, కోలాం, కొండదొర, కొండకాపు, కొండరెడ్డి, కొంధు, కోటియా, కోయ, కులియా, మాలీ, మన్నెదర, ముఖదొర, నాయక్ లేక నూకదొర, పర్ధాన్, పొరజ, రెడ్డిదొర,రోణ, సవర,సుగాలీ లేదా లంబాడా, తోటీ, వాల్మీకి, యానాది, ఎరుకల, ఇంకా వర్గీకరించబడనివారు.

ఇందులో చెంచుల సామాజిక జీవన విధానాన్ని తెలుసుకోవడం ప్రధానాంశం.

చాలాకాలంగా అడవుల లోపల, కొండప్రాంతాలలో నాగరిక సమాజానికి దూరంగా, ప్రకృతిలో దొరికే వాటిని సేకరిస్తూ వేటాడుతూ నివశించే గిరిజనులు - చెంచులు. తూర్పు కనుమల్లలోని నల్లమల అటవీప్రాంతం,ఉత్తరాన పీఠభూమి ప్రాంతంలో ఆకులలములు, కందమూలాలు, సేకరించడం చేపలు పట్టుకోవడం, వేటద్వారా దొరికే జంతువుల్ని ఆహారంగా తీసుకుంటూ చెంచులు గిరిజనులుగా జీవనం గడుపుతున్నారు. కాలక్రమంలో కొందరు అటవీప్రాంతానికి దగ్గరగా ఉన్న శివారు గ్రామాలకు వెళ్ళడం జరిగింది. మరికొంతకాలానికి మైదాన ప్రాంతాలకు వెళ్ళి జీవించడం ప్రారంభించారు. ఇలా దాదాపుగా మనరాష్ట్రంలోని అన్ని జిల్లాల్లో చెంచులు నివశిస్తున్నారు.

1886వ సంవత్సరంలో మద్రాస్ ప్రెసిడెన్సీలో ప్యాపిలిలో డిప్యూటి కలెక్టర్‌గా ఉన్న నరహరి గోపాల కృష్ణమ చెట్టి కర్నూలు జిల్లా మాన్యువల్‌లో నల్లమల గిరిజనులు - చెంచులు (NALLAMALA HILL TRIBES - THE CHENCHUS) అనే పేరుతో అధ్యయనం చేసిన విషయం ప్రకటించబడింది. 1909వ సంవత్సరంలో ఎడ్గార్ థ్రష్టన్, కె. రంగాచారి సంయుక్తంగా అధ్యయనం చేసి ప్రచురించిన CASTES AND TRIBES OF SOUTHERNINDIA -అనే గ్రంథంలో చెంచులను గూర్చి వ్రాయడం జరిగింది. సి.వి.ఎఫ్. హేమండార్ఫ్ "దిజంగిల్‌ఫోక్ ఆఫ్ ది దక్కన్" అనే గ్రంథంలో కృష్ణా నదికి ఉత్తరాన ఉన్న మహబూబ్‌నగర్‌జిల్లాలోని చెంచుల జీవనవిధానంపై అధ్యయనం చేశారు. భౌమిక్- "ది చెంచూస్" అనే గ్రంథంలో చెంచులను గూర్చి సాధారణ అధ్యయనం చేశారు. "యాన్ ఆంథ్రో పొలాజికల్ స్టడీఆఫ్ ఫెర్టిలిటీ బిహేవియర్ ఎమాంగ్‌ది చెంచూస్" అనే పేరుతో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో గంగాధర్ పరిశోధన పత్రాన్ని సమర్పించారు. నదీం హస్‌నైన్ వ్రాసిన "ట్రైబల్ ఇండియాటుడే" ఆంగ్లగ్రంథాన్ని అనువదించి 1995లో ప్రచురించిన "భారతీయ గిరిజనులు" గ్రంథంలోను చెంచులను గూర్చి చర్చించడం జరిగింది.

పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి పండితారాధ్యుల పీఠం - శ్రీశైలంలో చెంచుల జీవనవిధానంపై పరిశోధన పత్రాలు సమర్పించారు.

మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాతకేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు ప్రత్యేకించి గిరిజనుల అభివృద్ధిపై దృష్టి సారించాయి. ప్రణాళికల ప్రకారం గిరిజనాభివృద్ధికి నిధుల్ని సమకూర్చడం, వెచ్చించడం జరిగింది. ఐదు పంచవర్ష ప్రణాళికలు గడిచిన తర్వాత, గిరిజనాభివృద్ధిని గూర్చి సమీక్ష చేయడం జరిగింది. సమగ్ర గిరిజనాభివృద్ధికై ఇంటిగ్రేటెడ్ ట్రైబల్ డెవలప్‌మెంట్ అథారిటీ కార్యాలయాలు 1978లో శ్రీశైలంలోను, భద్రాచలంలోను ఏర్పాటుచేశారు.

## శ్రీశైలంలోని ఐ.టి.డి.ఏ పరిధిలోకి

1. కర్నూలు జిల్లాలో - 13 మండలాలలోని 40 గ్రామాలు
2. మహబూబ్‌నగర్ జిల్లాలో - 10 మండలాల్లోని 123 గ్రామాలు
3. రంగారెడ్డి జిల్లాలో - 7 మండలాల్లోని 31 గ్రామాలు
4. నల్గొండజిల్లాలో - 5 మండలాల్లోని 15 గ్రామాలు
5. గుంటూరు జిల్లాలో - 6 మండలాల్లో 48 గ్రామాలు
6. ప్రకాశం జిల్లా - 7 మండలాల్లోని 81 గ్రామాలు

ఈ గ్రామాలన్నింటిలో నివశిస్తున్న చెంచులను చేర్చారు. వీరి జీవితాల్లో వెలుగు నింపటానికి ఐ.టి.డి.ఏ వారు పలుపథకాలు ప్రారంభించారు. గోచిపెట్టుకుని లేదా మొలకు అడ్డగుడ్డ చుట్టుకొని, విల్లు ధరించి, వేటయే జీవనంగా బ్రతుకుతున్న చెంచులకు - పక్కాగృహ నిర్మాణం, విద్యనేర్పడం, వృథాగా ఉన్న భూముల్ని సాగుచేయడం, వారు సేకరించిన వస్తువులను విక్రయించడానికి గిరిజన స్టోర్స్ ఏర్పాటు చేయడం మొదలైన వాటిని ప్రారంభించారు.

మన రాష్ట్రంలో నివశిస్తున్న చెంచుల్ని 1)అడవి చెంచులు 2)దేవ చెంచులు 3)బొంత చెంచులు 4) కృష్ణ చెంచులుగా వింగడించవచ్చని డాక్టర్ జి.శేషగిరిరావు భావిస్తున్నారు. అడవి చెంచులు దేవ చెంచులు - నల్లమల అటవీప్రాంతంలోను, బొంత చెంచులు, కృష్ణచెంచులు - లోతట్టు పల్లపు ప్రాంతాల్లోను అనగా మైదాన ప్రాంతంలో ఉంటారని తెలుపుతున్నారు.

నేను మిత్రులతో కలిసి (డాక్టర్ సి.హెచ్. సత్యనారాయణ చెట్టి సుబ్రహ్మణ్యం) గుంటూరు జిల్లాలో, కర్నూలు జిల్లాలో, శ్రీశైలం చుట్టుపక్కల ప్రాంతాల్లో చెంచులు నివశిస్తున్న గ్రామాలను, గిరిజన కార్యాలయాలను సందర్శించి, వారితోమాటాడి, గమనించిన అంశాలను ఈవ్యాసంలో పొందుపరుస్తున్నారు.

చెంచులు నివశిస్తున్న ప్రాంతాలనుబట్టి 3 విధాలుగా వర్గీకరించాలి. అవి1) అటవీప్రాంతంలో నివశిస్తున్న చెంచులు 2) అటవీ ప్రాంతానికి దగ్గరలోని శివారు గ్రామాల్లో నివశిస్తున్న చెంచులు 3)మైదాన ప్రాంతాలలో నివశిస్తున్న చెంచులు. ఈ చెంచుల జీవన విధానంపై ఇరుగుపొరుగు ప్రజల ప్రభావం స్పష్టంగా కన్పిస్తుంది. ప్రభుత్వం తీసుకొనే అభివృద్ధికర చర్యల ప్రభావం ఉంది. ప్రభుత్వ సాయాన్ని వినియోగించుకోలేని పరిస్థితి కనబడుతుంది. ప్రభుత్వపు చర్యలు, తోటి ప్రజల ప్రభావం ఏమీలేని పద్ధతి తెలుస్తుంది. కొన్ని ఆశ్చర్యం గొలిపే విశేషాలున్నాయి. మరికొన్ని బాధ చెందే అంశాలు ఉన్నాయి.

మనరాష్ట్రంలో 2001 జనాభా లెక్కల ప్రకారం చెంచుల సంఖ్య - 49,232. ఇందులో పురుషులు-24,962 మంది. స్త్రీలు- 24,270 మంది. చెంచుల జనాభాలో చదువుకున్నవారు-12,670 మంది చదువుకున్న పురుషులు-8,132 మంది. చదువుకున్న స్త్రీలు-4,545 మంది. ప్రస్తుతం చెంచుల జనాభాలో చదువురాని వాళ్లు - 36,555 మంది.

చెంచులలో సాధారణంగా కనిపించే అంశాలు-నల్లగా ఉండటం, మధ్యస్తమైన ఎత్తుగా ఉండటం, ఆకలిబాధ ఓర్చుకోగలగడం, దంతపుష్టి కలిగి ఉండటం, కష్టపడిపనిచేయక పోవడం, వ్యవసాయం జోలికి పోకపోవడం, వేటాడటం, చేపలు పట్టుకోవడం, సోమరిగా ఉండటం - ఇవీ అటవీప్రాంతాలలో నివశించే చెంచుల్లోను,మైదానం ప్రాంతంలో నివశించే చెంచుల్లోను స్పష్టంగా కనబడుతున్నాయి. అక్కడక్కడా ఇంకా చెంచుల్లో మగవాళ్లు (60 ఏండ్ల వయసు దాటినవారు) తలగుడ్డలో నెమలి ఈకలతో, నల్లకోటు వేసుకొని, భుజాలమీదుగా మోకాళ్లవరకు వేలాడే కండువా, కుడిచేతిలో గంట, ఎడమభుజానికి జోలె తగిలించుకొని ఇంటింటికి తిరుగుతూ భిక్షాటన చేసేవాళ్లు ఉన్నారు.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చి 60 సంవత్సరాలు నిండుతున్న సందర్భంగా మారుతున్న సమాజంలో చెంచుల సామాజిక జీవనాన్ని తెలుసుకుందాం.

## కుటుంబం - పెండ్లి - చావు :

అటవీప్రాంతంలో 10 నుండి 15 గుడిసెల వరకు ఒక్కొక్క చెంచుగూడెం ఉంటుంది. ఒక్కోగుడిసెలో భార్య, భర్త, పెండ్లికాని పిల్లలు ఉంటారు. మీసం మొలచిన మగపిల్లాడికి పిల్లని వెతికి పెండ్లి చేస్తారు. వీళ్లల్లో ఎక్కువగా మేనరికపు వివాహాలే. అక్కడక్కడా ప్రేమ వివాహాలు జరుగుతున్నాయి. ప్రేమించుకుంటూ స్వేచ్ఛగా తిరిగే యువతీ యువకులను తల్లిదండ్రులు తప్పుగా పట్టించుకోరు. పెండ్లి కాకముందు ఆడపిల్లకు గర్భంవస్తే, గర్భవిచ్ఛిత్తికోసం ప్రయత్నించే పద్ధతి ఉంది. ఒకవేళ ఆడపిల్ల తన గర్భానికి కారకుడైన వాని పేరుచెబితే వానికి

పెళ్లైనా, వాడు దాన్ని భరించాల్సిందే. ఒకే ఇంటిపేరు ఉన్నవాళ్లమధ్య వివాహాన్ని అంగీకరించరు. ప్రేమవివాహాల్లో వేరేకులం వాళ్లుంటే, వాళ్లను చెంచుగూడేనికి రానివ్వరు.

సాధారణంగా చెంచుల ప్రేమ వివాహాలు మార్చి-ఏప్రిల్ నెలల్లో జరుగుతాయి. ఆసమయంలో యువతీయువకులు పట్టుబడితే, సారాతో విందుచేసుకొని, పోట్లాటలు, గొడవలు ఆరంభమైనాక పెండ్లిచేస్తారు. అక్కడక్కడ చెంచుల మగపిల్లలుఇల్లరికం కూడాఉంటున్నారు. పెళ్లిఖర్చు తక్కువగా ఉంటుంది. వరుడు వధువుకు, వధువు తల్లికి చీర, రవికలు కొన్నప్పుడు, కన్యాదాతకు తెలుపుతారు. బంధువుల్ని, గూడెం పెద్ద మనిషిని ఆహ్వానిస్తారు. పెళ్లిరోజున వరుడు అందరితో కలిసి, బియ్యం, సారాయి, ఇతర పదార్థాలతో కన్యాదాత ఇంటికి వెళతాడు. పెళ్ళికూతురిని పిరుదులకు, వక్షోజాలకు టేకు ఆకుల్తో కప్పి, వరుని ప్రక్కగా వేయబడిన చాపమీద కూర్చోబెట్టి, పెద్దమనుషులు – ఈ పెళ్ళిమీకిద్దరకు ఇష్టమేనా? అని అడుగుతారు. ఇద్దరు ఒప్పుకున్నాక కన్యచీర కొంగు,వరుని పంచెకొంగును ముడివేస్తారు. వరుడు తెచ్చిన బియ్యంతో వంటచేస్తారు.వండిన అన్నం చుట్టూ సారా తిప్పి,భోజనం చేసిన తర్వాత సారాతాగి, పొద్దుపోయేదాక చిన్నాపెద్దా తేడా లేకుండా తప్పెట కొడుతూ నాట్యం చేస్తారు. తెల్లారిన తర్వాతపెళ్లికూతుర్ని అత్తారింటికి పంపిస్తారు. ఆసందర్భంగా చెంచులు పాడేపాటను ఎడ్గార్ థ్రష్టన్ తన గ్రంథంలో పేర్కొన్నాడు.

"ఆరవం చెట్టు ఆకుల్తో తాళిచేశారు చెంచుదేవా
చెట్టు ఆకుల్తో బాసికం కట్టారు చెంచుదేవా
చింతకాయతో కంకణం చేశారు చెంచుదేవా
పారు చెట్టు ఆకుల్తో కట్టుగుడ్డకట్టారు చెంచుదేవా
పన్నుచెట్టు ఆకుల్తో కట్టుగుడ్డకట్టారు చెంచుదేవా
కొండపై తిరుగుతూ చెంచుదేవా
దట్టమైన అడవుల్లో సంచరిస్తూ చెంచుదేవా
చేయరాని పనులు చేస్తూ చెంచుదేవా
ఓబులేశు పెళ్లి జరిగింది చెంచుదేవా
నాలుగుమూలలా వేదికకట్టారు చెంచుదేవా
బాణాలు గుచ్చారు చెంచుదేవా
వెదురు బియ్యం అక్షింతలు వేశారు చెంచుదేవా
కొబ్బరి చిప్పలు బాణాలపై పెట్టారు చెంచుదేవా
పెళ్లి ఈ విధంగా జరిగింది చెంచుదేవా"

ఈ పాటద్వారా చెంచులు అంబుకు (విల్లుకు) ఎంతప్రాధాన్యం ఇచ్చారో తెలుస్తుంది. ఇందులో కట్నం ప్రసక్తిరానేరాదు. అటవీప్రాంతాలకు దగ్గరలోని శివారు గ్రామాల్లో ఉండే చెంచులు దాదాపుగా ఇరవైఏళ్లనుండి హిందూ సంప్రదాయపు వివాహాలు జరుపుతున్నారు. పురోహితుడిచేతపెళ్లిచేయిస్తున్నారు. మైదానపు ప్రాంతాలలోని చెంచులు కొందరు కన్యాదాతకు "ఓలి" యిచ్చే పద్ధతిని పాటిస్తున్నారు.

చెంచుల్లో ఉమ్మడి కుటుంబ వ్యవస్థ ఉండదు. మగపిల్లవాడికి పెళ్లి అయిందంటే వేరే గుడిసెలో కాపురం ఉంచుతారు. స్త్రీలు నెలసరి వచ్చినప్పుడు, నివశించే గుడిసెకు దూరంగా ఉంటూ, భార్యాభర్తలు సంసారానికి దూరంగా ఉండే పద్ధతి ఇప్పటికీ పాటిస్తున్నారు. చెంచు కుటుంబాల్లో గుడిసెకు మగాడే యజమాని. గూడేనికి మగాడేపెద్ద మనిషిగా ఉంటాడు.

## వేట :

చెంచులు వేటకు వెళ్ళేటప్పుడు దబ్బ గొడ్డలి, కత్తి వేటకుక్కను వెంట తీసికెళతారు. రాత్రిపూట టార్చిలైటు వాడతారు. వేటాడిన జంతువులు ఆహారంగా స్వీకరిస్తారు. శివారు గ్రామాల్లోని చెంచులు, మైదాన ప్రాంతాల్లోని చెంచులు ఇప్పటికీ వేటకు వెళ్తున్నారు. ఈ వేటనే వీళ్ల షికారు అనిపిలుస్తారు. ఇంకా వీళ్లు బాగా తాగుడుకు అలవాటుపడ్డారు. చిన్నవయసు పిల్లల దగ్గర నుంచి,ముసలి వాళ్లవరకు రోజంతా తాగుతూనే ఉంటారు. తిండి ఎన్నిరోజులు లేకపోయినా ఉండగలరుగాని, సారాయి త్రాగకపోతే ఉండలేరు. ఇది వీళ్ల నిత్య జీవితంలో గమనించదగిన అంశం.

కుక్కను ఇంటిలోని సభ్యులతో సమానంగా చూస్తారు. బయటకు అడవికి పోయి వేటాడేటప్పుడు కుక్కసహకరిస్తుంది. రాత్రివేళల్లో గూడేనికి కాపలాగ ఉంటుంది. జంతువుల చర్మాన్నిచాపలుగా వాడతారు.

ఇప్పుడు వీళ్లు జంతువుల్ని, చేపల్ని – నూనె, ఉప్పు, కారం, మసాలాలు వేసి, కట్టెల పొయ్యిమీద వండుకుని తింటున్నారు. అంటే చెంచుల్లో తినే ఆహారంలో ఎంతో మార్పువచ్చినట్టు కనబడుతుంది. కేవలం కాల్చుకుతినే పద్ధతి నుండి రుచిగా వండుకుతినే మార్పు స్పష్టంగా తెలుస్తుంది.

శ్రీశైలం ప్రాంతంలో ఉన్న పాలుట్ల గ్రామంలో ధంసాని వీరయ్య, గురవయ్యలు ఈ విషయం తెలిపారు. ఆ ఊరిలో నివశిస్తున్న కుడుములహనుమమ్మ ఈ మార్పును తన పాటద్వారా తెలిపింది.

"దాసినకోడి పీకను పిసికి పిసికి చంపింది
గుడిసెనక తీసికెళ్లి ఈకతోక తీసింది
పటకారు తీసుకొచ్చి పట్టిపట్టికాల్చింది
పెద్దకత్తి తీసుకొచ్చి పెద్దలాగా కోసింది
చినకత్తి తీసుకొచ్చి చిన్నలాగా కోసింది

ఉన్నూరు ఉల్లిగడ్డ వెయ్యనే వేసింది
ఏలూరి ఎల్లిపాయ వెయ్యనే వేసింది
దాచూరి ధనియాలు వెయ్యనే వేసింది
మాచర్ల మంచినూనె పొయ్యనే పోసింది
పొత్తూరు ముదురుకొబ్బరి వెయ్యనేవేసింది
దాతూరి దాతుకొబ్బరి వెయ్యనేవేసింది
కలుపుతుండగానే కమ్మగా తిన్నాది
ఉడుకుతుండగానే ఊరికే ఇంతతిన్నాది"

### పిల్లల పుట్టుక :

కాపురానికి వచ్చిన స్త్రీ గర్భవతి కాకపోతే,గొప్ప లోపంగా భావించే పద్ధతి అటవీప్రాంతంలోని చెంచుగూడేలలో ఉంది.పిల్లలకోసం కనబడ్డ దేవతలందరికి మొక్కుతారు. మంత్ర వేత్తలను ఆహ్వానిస్తారు. తంతు జరుపుతారు. ఆతర్వాత బిడ్డపుడితే దేవతపేరు పెడతారు. స్త్రీకాన్పు కష్టంగా ఉంటే, భర్త చేతిలోకి జొన్నలు తీసికొని కులదైవానికి మొక్కి,

"పిల్లవాడు ఊడిపడ్తే ఒకశేరు జొన్నలు.

తెచ్చి మీకు మొక్కుతా, మీకు దండం"అని ప్రార్థిస్తాడు. పిల్లవాడు పుట్టాక, దేవుడికి జొన్నన్నంతో నైవేద్యం పెట్టి, తింటారు. ఆడపిల్ల పుట్టినా,మగపిల్లవాడు పుట్టినా ఒకే రకంగా భావిస్తారు.గూడేల్లో నివాసం ఉండేవారుకుటుంబ నియంత్రణకు అంగీకరించడం లేదు.కాని శివారు గ్రామాల వాళ్లు, మైదాన ప్రాంతాల్లో నివశించే చెంచులు ఆరోగ్య సేవికలు, డాక్టర్ల మాటలు విని కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు చేయించుకుంటున్నారు.

### ఆరోగ్యం :

అడవుల్లో నివశించే చెంచులకి సరైన మంచినీరు ఆహారం దొరకడం లేదు. ఈకారణంగా ఎక్కువమంది సీజన్లవారీ రోగాలకు గురవుతున్నారు. వీళ్ళల్లో దురద, గజ్జి, తామర, చర్మవ్యాధులు సర్వ సాధారణం. టి.బి. కూడా చెంచుల్లో ఉంది. పరిశుభ్రమైన ఆరోగ్య సూత్రాలను పాటించడం, సబ్బు, నూనెలు వాడటం వీళ్ళల్లో తక్కువ. చెట్ల మందుల్లో చెంచులకి నమ్మకం ఎక్కువ. సర్కారువాళ్లు అందించే మందులు వాడకుండా వదిలివేస్తున్నారు.

ఒక్కసారి దొనల్లో, కుంటల్లో దొరికే నీటిమీద, తలగుడ్డవేసి, దానిమీద చిన్నరాయి వేస్తారు. అప్పుడు గుడ్డలో గుంట ఏర్పడుతుంది. ఆ గుంటలోకి వచ్చిన నీళ్లను త్రాగుతూ ఉంటారు. ఇప్పుడిప్పుడే శివారు గ్రామాలు, మైదానం ప్రాంతంలోని చెంచులు కొందరు షికారు (వేటకు)కు వెళ్లినా, పొలాలకు వెళ్లినా తమవెంట మంచినీళ్ల సీసాలను (WATER BOTTLES) తీసికెళ్తున్నారు.

### కర్మకాండ :

చెంచుగూడేలకు నిర్దిష్ట స్థలంలో స్మశానం అనేది ఉండదు. చనిపోయిన వాళ్లను పూడ్చడం లేదా కాల్చడం అటవీ ప్రాంతంలో కనబడుతుంది. దహనం చేశాక కొందరు 9 రోజులకి, కొందరు 11 రోజులకి కర్మకాండ నిర్వహిస్తారు. చనిపోయిన వాళ్లను దహనం చేయడమనేది చెంచులు కొత్తగా అలవాటు చేసుకున్న పద్ధతి. పెద్దపులి, చిరుతపులి చంపితే మాత్రం ఆశవాన్ని తగలబెడతారు. వీళ్లు తినే వస్తువులన్నింటిని పిండంతోపాటు పెడతారు. కర్మకాండ పెద్దకొడుకే చేస్తాడు.పిండాలకు అవసరమైన వంటలన్నీమగవాళ్లే తయారు చేస్తారు. కర్మకాండ నిర్వహించేటప్పుడు పెద్దకొడుకు తర్వాతి స్థానం గూడెం పెద్దమనిషికి పెద్దకర్మరోజున గుండు, గడ్డం గీయిస్తారు. శుభ, అశుభ కార్యం అనే తేడా లేకుండా సారాయి తాగుతారు. మనిషి మంచిపనిచేస్తే స్వర్గానికి పోతాడని, చెడ్డపని చేస్తే నరకానికి పోతాడని వీళ్లు నమ్ముతారు. మైదానాల్లో నివశించే చెంచులు శవాన్ని పూడ్చటమే చేస్తున్నారు.

### మతం :

చెంచులు పూర్తిగా ప్రకృతిమీద ఆధారపడి బ్రతుకుతారు. నమ్మిన సొంతదేవుళ్లను భక్తితో కొలుస్తారు. వీళ్లు కొలిచే దేవుళ్లు మైసమ్మ, అంకాలమ్మ, పోతురాజు, ప్రధానంగా శ్రీశైలం భ్రమరాంబ మల్లికార్జున స్వామి, అహోబిలం నరసింహస్వామి, మంగళగిరి లక్ష్మీ నరసింహ స్వాములను దేవుళ్లుగా పూజిస్తారు. ఈ పద్ధతి కారణంగా చెంచులు హిందూమతాన్ని పాటిస్తున్నట్లు కన్పిస్తుంది. మిషనరీ వాళ్ల ప్రభావంతో అక్కడక్కడా క్రైస్తవాన్ని స్వీకరిస్తున్నారు. శ్రీశైలం ప్రాంతంలోని చిన్నారుట్ల చెంచుగూడెంలో చర్చికట్టారు. తుమ్మలబయలుగ్రామం వాళ్లు చర్చికట్టడానికి అంగీకరించలేదని తెలిపారు.

### ఇంటి నిర్మాణం :

అటవీప్రాంతాల్లోని చెంచులు వెదులు కర్రలు వంటి చుట్టు గుడిసెలు నిర్మించుకుంటారు. సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థవారు గుడిసెలకు బదులు పక్కాఇళ్లు కట్టించి యిస్తున్నారు. శివారు గ్రామాలు, మైదానప్రాంతంలో ఉండే చెంచులు కొందరు గుడిసెలు, మరికొందరు పక్కా ఇళ్లల్లో నివాసం ఉంటున్నారు.

### వ్యవసాయం :

ఆహారసేకరణ జాతిగా ఉన్న చెంచులు క్రమంగాపోడు వ్యవసాయం చేసేవారు. ఇప్పుడిప్పుడే ఐ.టి.డి.ఏ వారు అడవిలో వృధాగా ఉన్న భూముల్ని చెంచులకు అప్పగించి, పనిముట్లు, ఎద్దుల్ని అందజేసి,

సాధారణ వ్యవసాయ పద్ధతికి అలవాటు చేస్తున్నారు. మైదాన ప్రాంతాల్లోని చెంచులు కొందరు ఇరుగు పొరుగువారి ప్రభావంతో జీవన సరళిలో మార్పులుతెచ్చుకొని, సాగుబడి వ్యవసాయాన్ని ఆచరిస్తున్నారు. గుంటూరు జిల్లా బెల్లంకొండ మండలం మన్నేసుల్తాన్‌పాలెంలో చెంచు పెద్ద మెరుగు ముత్తయ్య పక్కాయింటిలో నివాసం ఉంటూ, 3 ఎకరాల పొలాన్ని సాగు చేస్తున్నాడు. ఆ ఊరిలో దాదాపు 60 చెంచు కుటుంబాల వారు ఎకరమో రెండెకరాలో పొలం సొంతంగా కలిగి వ్యవసాయం చేస్తున్న విషయం లోకవిదితం. ఇంకా కొందరు పశువుల్ని, మేకల్ని పెంచడం ప్రారంభించారు.

**విద్య :**

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు, ఐ.టి.డి.ఎ సంస్థవారు ఆశించినంతగా అటవీప్రాంతాల్లోని చెంచుల్లో విద్యారంగంలో మార్పు తీసుకు రాలేక పోయారు. వారు ప్రారంభించిన గ్రామీణ వికాస విద్యాకేంద్రాలు, ఆశ్రమ పాఠశాలలు జయప్రదంకాలేక పోయాయి. మాబడి కార్యక్రమంలో ఎక్కువమంది చెంచు పిల్లల్ని ఆకర్షించలేకపోయింది. దీనికి కారణం నియమించిన టీచర్లు ఆచెంచుగూడేలలోని పాఠ శాలలకు రోజు వారీగా గూడేల దగ్గర నివాసం ఉండకపోవటం, గూడేల లోని చెంచుల్ని ఆకర్షించడానికి మాబడికార్యక్రమాన్ని పునరుద్ధరిం చాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

శివారుగ్రామాలు, మైదాన ప్రాంతాల్లో ఉండే చెంచులు మాత్రమే తమపిల్లల్ని చదువులకు పంపుతున్నారు. ఇదికూడా తక్కువశాతమే. చెంచుల్లో చదువుపట్ల ఈముందడుగు వేయటాన్ని హర్షించవచ్చు. గుంటూరు జిల్లా గిరిజనకార్యాలయం వారిచ్చిన సమాచారం మేరకు గుంటూరు జిల్లాలో ఐ.టి.డి.ఏ.గుర్తించిన మాచర్ల మండలంలో బెల్లం కొండవారి పాలెంలో, ఎత్తిపోతలలో, వెల్దుర్తి మండలంలో సిరిగిరి పాడులో ఏర్పాటైన చెంచుల ఆశ్రమ పాఠశాలల్లో 1000 మందికి పైగా విద్యార్థులు చదువుకోవడం విశేషమైన అంశం. 2006-2007వ సంవత్సరానికి సంబంధించి 54 మంది చెంచుపిల్లలు (మగపిల్లలు48-ఆడపిల్లలు6) ఉపకారవేతనాలు పొందారు. ఇందులో ఒక విద్యార్థి బి.ఫార్మశీకోర్సు, ఒక విద్యార్థి గుంటూరు మెడికల్ కాలేజీలో ఎం.బి.బి.ఎస్ కోర్సు చదువుతుండటం విశేషం.

**పెద్దమనిషి :**

చెంచుగూడేల్లో ప్రతిగూడేనికి ఒక పెద్ద మనిషి ఉంటాడు. ఇతర గూడేలతో సత్సంబంధాలు నెరుపుతాడు కులపంచాయతీ నిర్వహిస్తాడు. చెంచులు పోలీస్ స్టేషన్లకు, కోర్టులకు వెళ్లరు. పెద్దమనిషి మీద గూడెం వాళ్లందరికి నమ్మకం ఉంటుంది. ఇలాగే శివారు ప్రాంతాలు, మైదాన ప్రాంతాల్లోకి చెంచులు కూడా వ్యవహరిస్తారు.

చెంచుగూడేల్లో ఉండే చెంచులకు గిరిజన స్టోర్స్ ద్వారా రేషన్ కార్డులు, మైదాన ప్రాంతాల్లోని చెంచులకు రెవిన్యూవారి ద్వారా రేషన్ కార్డులు అందుతున్నాయి. కొన్ని గ్రామాల్లోని చెంచులు వృద్ధాప్యపెన్షన్ ప్రభుత్వం నుండి అందుకుంటున్నారు. కొన్నిచోట్ల గ్రామాల్లో చదువుకున్న చెంచులు ప్రెసిడెంట్‌గా, జడ్.పి.టి.సి మెంబర్లుగా ఎంపిక కావడం ఆనందం కలుగుతుంది. కొన్ని చోట్ల పట్టణాల్లో, పట్టణాలకు దగ్గర గ్రామాల్లో నివశిస్తున్న చెంచుల్లో నాగరిక లక్షణాలు కొరవడటం బాధకలిగిస్తుంది. అటవీప్రాంతాల్లోని గూడేల్లోని చెంచులకు విద్యు ద్దీపాలు ఏర్పాటుచేసి, ముందుగా వారి పరిసరాల్లోని చీకటిని పార ద్రోలాలి. ఆతర్వాత వారి మనసుల్లోని చీకటి పారద్రోలడానికి విద్యను నేర్పాలి. ముఖ్యంగా అధికారులు వారితో సంఘసేవా పరాయణులుగా మెలగాలి. ఇంటిగ్రేటెడ్ ట్రైబల్ డెవలప్‌మెంట్ అథారిటీని కొన్ని ప్రాంతాలలోని చెంచులకే పరిమితం చేయక, మొత్తం రాష్ట్రంలోని చెంచులకు వర్తించేటట్లు చేస్తే బహుళ ప్రయోజనం నెరవేరుతుంది. "ట్రైబల్ ఇండియాటుడే" గ్రంథకర్త నదీం హస్‌నైన్ భావించినట్లు అందమైన సమాజం వెనుక ఉన్న వికృతపు మచ్చలు తొలగిపోతాయి.

### శ్రీ పెనుగొండ లక్ష్మీనారాయణ

# గుంటూరు ముచ్చట

**కొమ్మన తండ్రి భాస్కరు దకుంఠిత తేజు, దఖండ సత్కవి త్వమ్మునుగూడ, తిక్కన పితామహుడేలగ, పట్టణాలకున్ సొమ్మయి గర్తపట్టణము శోభిలునాడును నేడు, యావదాం ధ్రమ్మొక యెత్తు, గుంటూరు పురమ్మొక యెత్తు కళా ప్రతిష్ఠలన్**

**- గుర్రం జాషువ**

గుంటూరు కథను కథలతోనే చెప్పించాలనే ప్రయత్నమే ఈ గుంటూరు కథల సంకలనం. గుంటూరంటే విస్తృతార్థంలో గుంటూరు జిల్లా. గుంటూరుకున్నట్లే గుంటూరు కథకు పెద్ద చరిత్ర ఉంది. ఆ చరిత్రకు చెప్పుకోదగినన్ని ప్రత్యేకతలున్నాయి. తెలుగు కథ ఆవిర్భావం గురించి వాదవివాదాలు చెలరేగాయి. ఇంకా కొనసాగుతూనే ఉన్నాయి. గుంటూరు కథకి సంబంధించి అటువంటి వివాదం లేదు.

గుంటూరు జిల్లా పల్నాటి సీమలోని గుత్తికొండకు చెందిన అక్కిరాజు ఉమాకాన్తమ్ ఈ సీమ తొలి కథారచయిత. "నేనిదివరకు నడుపుచుండిన త్రిలింగ పత్రికలో కొన్ని కథలు 'ఆర్యుడు' అనే పేరుతో 1913-14 సంవత్సరంలో వ్రాసియుంటిని" అని ఆయన అన్నారు. వారి తొలి కథ 'అన్నపూర్ణ' శిష్ట వ్యావహారికంలో సాగుతుంది. ఈ కథతోనే సంకలనం ప్రారంభమవుతుంది. ఈ ఏడాదికి గుంటూరు కథకు వందేళ్లు. రాయసం వెంకటశివుడు 1902 మేలో వెలువడిన తొలి తెలుగు కథాసంపుటి 'విచిత్ర మంజరి' తరువాత దశాబ్దికాలంలో వెలువడిన అతికొద్ది కథాసంపుటాలలో వావిళ్ల రామశాస్త్రులు అండ్ సన్స్ 1918లో ప్రచురించిన ఉమాకాన్తమ్ తెలుగు కథకు కొన్ని 'తొలి' వెలుగులను అందించారు. "ఇటి కథల వాఙ్మయము తెలుఁగునకు క్రొత్తది" అని పేర్కొంటూ కథా సాహిత్యాన్ని గురించి ప్రమాణికమైన చర్చ జరిపారు. ఫ్రెంచి, జర్మన్, రష్యన్, ఆంగ్ల భాషలకు చెందిన ప్రముఖ రచయితలు, విమర్శకులను ఉటంకించారు. వందేళ్ల క్రితమే ఆంగ్లంలో వెలువడే ప్రధాన పత్రికలలో అచ్చుయిన కొన్ని కథలను ఎన్నుకొని తెలుగులోకి అనువదించి తన 'త్రిలింగ చిన్న కథలు' సంపుటిలో ప్రచురించారు. ఇలా తొలి తెలుగు కథా విమర్శకుడు, అనువాదకుడు అక్కిరాజు ఉమాకాన్తమ్ విద్యాశేఖరులు.

1932లో గుంటూరు సాహిత్య మిత్రమండలి ప్రచురించిన 'కథావళి' సంకలనంలో కొమరవోలు నాగభూషణరావు, తుమ్మలపల్లి వెంకట సీతారామారావు, సుసర్ల రామమూర్తి, చెఱుకుపల్లి శివ రామయ్యల పది కథలున్నాయి. తెలుగులో తొలి కథాసంకలనాలలో ఇది ఒకటి. వీరెవరూ ప్రసిద్ధులు కాకపోయినా ఈ సంకలనం 1948లో ద్వితీయ ముద్రణ రావటం విశేషం. స్త్రీవాదంతో కూడిన, స్త్రీలే రాసిన కథలతో కూడిన తొలి కథా సంకలనం 'కథా మందారం' (1968) సంకలనం చేసింది బాపట్లకుచెందిన సుప్రసిద్ధ రచయిత్రి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ. గృహలక్ష్మి స్వర్ణకంకణ పురస్కారం (1934) పొందిన ప్రథమ కథా రచయిత్రి బాపట్లకు చెందిన కనుపర్తి వరలక్ష్మమ్మ. కథా సంకలనాల ప్రచురణ పరంపర నేటికీ గుంటూరు నుంచి కొనసాగుతూనే ఉంది. అరసం జిల్లా శాఖ సాహిత్యం ద్వారా సామాజికాభ్యుదయాన్ని కాంక్షిస్తూ పెనుగొండ లక్ష్మీనారాయణ సంకలనకర్తగా 1984, 85, 88, 91లలో మొత్తం 29 చిరస్మరణీయ కథలతో నాలుగు సంకలనాలను 'కథాస్రవంతి'గా ప్రచురించింది. అరసం చేసిన ఈ ప్రయత్నం కథా సంకలనాల ప్రచురణకు కొత్త ఊపునిచ్చింది. 'ఇతిహాసపు చీకటికోణం అట్టడుగున పడి కాన్పించని కథలన్నీ కావాలిప్పుడు' అంటూ డా॥ పాపినేని శివశంకర్, వల్లూరు శివప్రసాద్, పెనుగొండలు ఐదు దశాబ్దాల కాలంలో (1930-1980) ఎన్నదగిన, పత్రికా పుటల్లోనే కనుమరుగైపోయిన 30 మంచి కథలతో విలక్షణ కథా సంకలనం 'విస్మృత కథ' (1995) ప్రచురించారు. 1990ల నుండి వెలువడుతున్న 'కథాసాహితి' వార్షిక సంకలనాలకు డా॥ పాపినేని శివశంకర్ సహా సంపాదక బాధ్యతలు నిర్వహిస్తున్న సంగతి తెలిసిందే. గుంటూరు జిల్లాకు చెందిన డా॥ వేదగిరి రాంబాబు అనేక కథా సంకలనాలను, ప్రముఖ రచయితల కథా సంపుటాలను

వెలువరించారు. కథోద్ధారకుడిగా కీర్తి గడించారు. విహారి కథా విమర్శకుడిగా ప్రఖ్యాతి గడించారు. ఇప్పుడు మీరు చదువుతున్న ఈ సంకలనం వీటన్నింటికీ భిన్నమైంది. విలక్షణమైంది కూడా.

ఈ సంకలనంలో మూడు తరాల రచయితల డెబ్బై కథలున్నాయి. ఇందులో గుంటూరు వారు కాకపోయినా గుంటూరును తమలో నింపుకున్నవారున్నారు.

మల్లాది 'దుమువులు' ఈ సీమ తొలి కవిత్వ కాంతులు ప్రసరించే ఒక రాసిక్య రూపం. 'శారద' పుట్టుకవలన తమిళుడే కాని అతని జీవితమంతా తెనాలితో నిండిన తెలుగుతనమే. పోరంకి గుంటూరు జిల్లా మాచర్లలో జరిగిన ప్రకృతి బీభత్సాన్ని కథగా దృశ్యీకరించారు. కేతు గుంటూరు జిల్లాతో ముడిపడి ఉన్న తన సన్నిహిత కుటుంబానికి చెందిన ఒక ఘటనకు కథా రూపమిచ్చారు. వి. చంద్రశేఖరరావు, నల్లూరు రుక్మిణి, సాయి పాపినేని ప్రకాశం జిల్లావాళ్లు (ప్రకాశం జిల్లాలోని కొంతభాగం అవిభక్త గుంటూరు జిల్లాలోనిది). అయినా గుంటూరు ప్రాంతం వాళ్ల రచనల్లో తొంగిచూస్తుంది. గుంటూరు సీమ నేపథ్యంలో నడిచిన కథలకు ప్రాధాన్యతనిచ్చినా ఈ సంకలనంలోని కథలు గుంటూరు సీమ ఆత్మతోపాటు తెలుగుజాతి హృదయాన్ని ఆవిష్కరిస్తాయి. వైవిధ్యంతో కూడిన ఈ సంకలనంలో పురుషులు రాసిన స్త్రీవాద కథలూ, దళితేతరులు రాసిన దళిత జీవితాన్ని చిత్రించిన కథలూ ఉన్నాయి. ఈ కథలు రచయితల విస్తృతినే గాక విశాల దృష్టినీ వెల్లడిస్తాయి.

## 2

సాహిత్యంలో గుంటూరు ప్రస్తావనలను పరిశీలిస్తే గురజాడ కన్యాశుల్కాన్ని అరికట్టే మంచి పనికోసం గుంటూరు శాస్త్రుల్ని సృష్టించారు. తిరుపతి వేంకటకవులు, కొప్పరపు కవులతో వచ్చిన సాహిత్య వివాదాలను వర్ణిస్తూ 'గుంటూరు సీమ' రచన చేశారు. ప్రజలలో రాజకీయ చైతన్యం కలిగించే ఉద్దేశంతో దామరాజు పుండరీకాక్షుడు 'గుంటూరు గొప్ప' జంగం కథను 1921లో రాశారు. గుంటూరు మండలంలో బ్రిటిష్ ప్రభుత్వం చేసిన అన్యాయాలతోపాటు వాటిని ఎదుర్కొన్న నాయకుల త్యాగనిరతినీ, దేశభక్తినీ పుండరీకాక్షుడు ఈ రచనలో వివరించారు. 'కథా నిలయం' ఆవిర్భావానికి పెనుగొండ రాసిన '20వ శతాబ్ది తెలుగు కథా సంకలనాల చరిత్ర' వ్యాసం స్ఫూర్తినిచ్చిందని ప్రేమతో ప్రకటించారు కాళీపట్నం రామారావు. రావిశాస్త్రి 'గుంటూరు' శీర్షికతో రాసిన కథలోని అప్పల నరసింహంకు గుంటూరంటే అకారణ ద్వేషం. ఎంత గుంటూరని పేరు పెట్టినాగాని ఆ కథ ఈ సంకలనంలో చేరరానిది (అట్లాగే శ్రీశ్రీ రాసిన 'ఇంటిల్ జెంటిల్‌మెన్....' అనే కవిత సరదాగా రాసినట్లున్నా అది గుంటూరును చులకన చేసే అనుచిత హాస్యమే)

"నదిలేని ఊళ్లో ఎందుకు బతుకుతారో మనుష్యులూ, దేశ భక్తులూ, శారారణ్యులూ" అని గుంటూరు జనంపై, దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుపై, శారదానికేతనం వ్యవస్థాపకులు ఉన్నవ లక్ష్మీనారాయణపై చలం 'ఎరుకలమ్మి' కథలో ఒకింత అసహనాన్ని ప్రదర్శించారు. అయితే తాను పెరిగిన తెనాలిపై 'శమంతకమణితో ఇంటర్వ్యూ' కథలో పరోక్షంగానే అయినా ఎంతో మమతను ప్రదర్శించారు. గుంటూరులో నది లేకపోవటం నిజమే. కానీ నదిని మించి ద్రవించి ప్రవహించే మనుషులున్న మాట నిజం. ఇది నా జీవితానుభవం. తన రచనలను అంకితమిచ్చే అలవాటు లేని కాళీపట్నం రామారావు 1945లో తనను ఆదుకున్న 'గుంటూరు సజ్జనునకు' తన చిన్న నవల 'రాగమయి' భారతి - (1-11-1950)ని అంకితం చేశారని ఈ సందర్భంగా గుర్తుచేస్తున్నాను.

ఇప్పటికే రాష్ట్రంలోని అనేక ప్రాంతాలనుండి పలు ప్రాంతీయ కథా సంకలనాలు వచ్చాయి. గుంటూరుకు సంబంధించిన ఈవిధమైన తొలి కథా సంకలనం ఇదే. 'గుంటూరు కథలు' సంకలనానికి ప్రత్యేకత ఏమన్నా ఉందా అంటే పేరుకు గుంటూరు కథలేగాని ఈ కథలు తెలుగువారి సామాజిక జీవితాన్ని, అందులోని విపుల దృశ్యాలను కళాత్మకంగా ప్రదర్శించాయని చెప్పగలను. కనుక ఈ సంకలనం తెలుగు జాతిదే. ఇంకా ఈ సంకలనం ఈ సీమ ప్రత్యేకత, ప్రాంతీయ వాస్తవికత, జీవనశైలి, జీవద్భాష, కొన్నైనా చారిత్రికాంశాలు తెలుసుకోవటానికి దోహదపడుతుందని నా విశ్వాసం.

ఇంతమంది కథకులు ఒక్క జిల్లాలోనే ఉండటం సాధ్యమా అనేంత ఆశ్చర్యం కలిగించేలా దాదాపు నాలుగువందల మంది కథకులు ఇక్కడున్నారు. అందునా తెలుగు కథను విద్యుత్తేజంతో వికసింపజేసిన పలువురు ప్రసిద్ధులు ఈ సీమవారే కావటం ప్రపంచ సాహిత్య చరిత్రలోనే అరుదైన విషయం (గుంటూరు జిల్లా కథా రచయితల జాబితా అనుబంధంలో చూడవచ్చు)

## 3

"బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి" త్రిశరణాలతో బౌద్ధధర్మాన్ని నేల నాలుగు చెరగులా పరివ్యాప్తి గావించింది ఈ సీమలోని అమరావతి. బుద్ధ నాగార్జునుని బోధముద్రా జ్యోతులతో జ్ఞానకాంతులను వెదజల్లింది అమరావతి స్తూపం. తొలి ఆంధ్ర సామ్రాజ్య స్థాపకులు శాతవాహనులు. వారి రాజధాని ధరణికోట (ధాన్యకటకం). కొండవీటి రెడ్డిరాజ్య వైభవోజ్జ్వల

చరిత్ర (1340-1447) చిహ్నం గుంటూరు జిల్లా యడ్లపాడు మండలంలోని కొండవీడు. మానవ నిర్మిత మహాసాగరం నాగార్జున సాగరం ప్రారంభం (4-8-1967) కావటంతో జిల్లాలోని క్షామ సీమలు క్షేమసీమలుగా మారాయి. గుంటూరు జిల్లా మిరప, పొగాకు, పత్తి వాణిజ్య పంటలకు దేశంలోనే ప్రసిద్ధి చెందింది. చేనేత పరిశ్రమకు దేశవ్యాప్త గుర్తింపు పొందింది. "గుంటూరు మండలమున బుట్టు మానవుండు కొసరి కొసరి యింత గోంగూర తిననిచో ఏమి బ్రతుకు? వానిదేమి మెతుకు ?" అన్న తెనుగులెంక మాటలు గుంటూరు వారికే కాదు ఎక్కడ నివసిస్తున్నా తెలుగు వారందరికీ చెల్లుతాయి. గుంటూరు జిల్లా అభివృద్ధి చెందుతున్నట్లే కనపడుతున్నా కష్టజీవుల ఆత్మహత్యలు కొనసాగుతూనే ఉన్నాయి. రైతుల వెతలు, కార్మికుల కష్టాలకు కొదవలేదు. ఈ సంకలనంలోని కథలు కొన్ని రైతాంగ జీవితాన్ని సాక్షాత్కరింపచేస్తాయి.

## 4

'విష్ణు ధనువు', 'నవమి' చిలుక సమగ్ర వచన కవితా సంపుటాలతో (1938) తెలుగులో అతి నవ్య కవిత్వాన్ని తన తిరుగుబాటు ద్వారా ప్రారంభించిన శిష్ట్లా ఉమా మహేశ్వర రావు (1905-53) గుంటూరు జిల్లా మంచాల అగ్రహారం వాసి. తెలుగులో తొలిసారిగా కార్మికవర్గ ప్రచురణలు కరపత్రాలను (1933 డిసెంబర్) తెనాలి తాలూకా అనంతవరం నుంచి ధూళిపాళ్ల కోటయ్య నెలనెలా వెలువరించారు. ఆచార్య గోగినేని రంగనాయకులు గుంటూరు జిల్లా నిడుబ్రోలు నుంచి 1934 ఏప్రిల్‌లో 'రైతు భజనావళి' పేరిట వివిధ కవులు రాసిన శ్రామిక గీతాలను వర్గ దృక్పథంతో ముద్రించారు. తెలుగు సాహిత్యంలో మొట్టమొదట ప్రచురితమైన అభ్యుదయ కావ్యసంపుటి ఇదే. తరువాత కాలంలో గుంటూరు జిల్లాలో కమ్యూనిస్టు ఉద్యమంతో పాటు అభ్యుదయ సాహిత్యమూ అభివృద్ధి చెందింది.

'ఆంధ్రదేశంలోకెల్లా మొట్టమొదటి వర్గ విభేద ప్రాతిపదికమూ, వర్గ పోరాట ప్రబోధాత్మకమూ' అయిన 'కూలిపాట' రాసింది గుంటూరు వాసి పెండ్యాల లోకనాథం. 'ఎగరాలి ఎగరాలి మన ఎర్రజెండా' అంటూ తొలి ఎర్రజెండా గేయాన్ని రాసింది అరసం నిర్మాత తుమ్మల వెంకట్రామయ్య. ఈ గేయాలు జూన్ 1935 ప్రభ పక్ష పత్రికలలో ప్రచురితమైనాయి. దేశదేశాలలోని సమకాలిక సామాజిక సంఘటనలను తీసుకొని ప్రగతిశీల దృక్పథంతో ఏల్చూరి సుబ్రహ్మణ్యం, కుందుర్తి ఆంజనేయులు, బెల్లంకొండ రామదాసు త్రయం తెలుగులోనే ప్రథమ కవితా సంకలనం 'నయాగరా'ను 1944లో నరసరావు పేటనుండి ప్రచురించారు. గుంటూరు జిల్లాకు చెందిన కమ్యూనిస్టు నేత వేములపల్లి శ్రీకృష్ణ తెలుగు జాతీయతని ప్రబోధించే 'చేయెత్తి జైకొట్టు తెలుగోడా' గీతాన్ని గుంటూరుజిల్లా వినుకొండకు చెందిన రాష్ట్ర కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత పలుపుల వెంకటశివయ్య 'పలనాడు వెలలేని మాగాణిరా' శీర్షికతో గొప్ప ప్రజాగేయాన్ని 1945లో రాసి యావదాంధ్రలో కవులుగా గుర్తింపు పొందారు. ఆంధ్రుల జలస్వప్నాన్ని ఆవిష్కరిస్తూ వినుకొండ సీమకు చెందిన ధారా నరసింహం రాసిన నందికొండ నాగార్జునసాగరం ప్రచార గేయం (వస్తుందీ నందికొండ... నాగార్జున సాగరమొస్తుందీ - 1960) మధ్యాంధ్రలో మార్మోగిన సంగతి తెలిసిందే. 1970లో గుంటూరులో ఎం.కె.సుగమ్‌బాబు, దేవిప్రియ, ఒల్గా, కిరణ్‌బాబు, కమలాకాంత్‌లు 'పైగంబరకవులు' ఏర్పడి యుగ సంగీతం, యుగ చైతన్యం ఈ సీమకు చెందిన ఇంకా ఎందరెందరో గేయకవులు, వచన కవులు తెలుగు సాహిత్య క్షేత్రాన్ని సుసంపన్నం చేశారు.

జాతీయోద్యమ కాలంలో వ్యావహారిక భాషలో వెలువడిన తొలి రాజకీయ నవల 'మాలపల్లి (1922) కార్మికులను భూస్వాములకు వ్యతిరేకంగా రెచ్చగొట్టడం, కమ్యూనిస్టు సిద్ధాంతాలను ప్రచారం చేయడం అనే అభియోగాలపై రెండుసార్లు 1923, 1936లలో ప్రభుత్వ నిషేధానికి గురైన ఈ నవలాకర్త ఉన్నవ లక్ష్మీనారాయణ (1877-1958) జన్మస్థలం గుంటూరు జిల్లా వేములూరుపాడు గ్రామం. స్వాతంత్ర్య సమరయోధుడు, సంఘ సంస్కర్త అయిన ఉన్నవ గుంటూరు వీరేశలింగంగా ప్రశంసింపబడ్డారు. గుంటూరు ఝాన్సీ లక్ష్మిగా పేరొందిన స్వాతంత్ర్య సమరయోధురాలు, తన శ్రీమతి లక్ష్మీబాయమ్మ సహకారంతో గుంటూరు పట్టణంలో 1922లో శారదా నికేతన్ స్థాపించి స్త్రీ జాతి సంక్షేమానికి ఉన్నవ సేవలందించారు. తెలంగాణ విమోచన పోరాటాన్ని చిత్రించిన మొదటి నవల 'మృత్యుంజయులు' రాసింది తెనాలి సమీపంలోని చదలవాడ గ్రామానికి చెందిన అభ్యుదయ రచయిత బొల్లిముంత శివరామకృష్ణ. నవలా సాహిత్య ప్రక్రియలోనూ గుంటూరు సీమది ప్రత్యేక ప్రతిపత్తి.

## 5

శాతవాహనుల కాలంలో 17వ శాతవాహన రాజు హాలుడు కూర్చిన 'గాథా సప్తశతి'లో ఈ ప్రాంతపు గ్రామీణ జీవితం కూడా ప్రతిబింబించిందనిపిస్తుంది. 'కొమ్మన మంత్రికిన్ సుతుడ తిక్కాంకుండ, సన్మాన్యుడన్' అని తనను గురించి 'సార కవితాభిరాము గుంటూరు విభుని' అని తన తాత భాస్కరుని గురించి చెప్పుకున్న కవిత్రయంలో ద్వితీయుడు, తెలుగు కవిత్వంలో అద్వితీయుడైన తిక్కనది గుంటూరు. 13వ శతాబ్దికి చెందిన ఈ మహాకవి అచ్చ తెనుగు నుడికారాన్ని జాతికి రుచి చూపించారు. మధ్యయుగ సారస్వత కవినాథుడైన

శ్రీనాథుడు (1370-1450) 'జవన ఘోటక సామంత సరస వీర భట పటానేక హాటక ప్రకట గంధ సింధురారవ మోహనశ్రీల దనరు కూర్మి నమరావతికి జోడు కొండవీడు' అని కొండవీటి వైభవోజ్వల చరిత్రను గానం చేశారు. 'పల్నాటి వీరచరిత్ర' ద్విపద కావ్యాన్ని జాతికందించారు. సామాజిక జీవితం, తత్త్వాన్ని సరళంగా సహజసుందరంగా విడమర్చి చెప్పి అజరామర కీర్తిని పొందిన వేమన తన 'ఊరు కొండవీడు ఉనికి పశ్చిమ వీధి' అని చెప్పుకున్నాడు. ఇంకా 'కళాపూర్ణోదయ' రేఖలను ప్రసరించిన పింగళి సూరన ఈ ప్రాంతం వాడే. ఆంధ్ర పంచమహాకావ్యాలలో నాలుగవదైన 'పాండు రంగ మహత్త్యము' అందించిన తెనాలి రామకృష్ణుడు 'తెనాల్యగ్రహార నిర్ణేత' ఇంకా రాయల అష్టదిగ్గజాల్లో ఒకడైన మాదయగారి మల్లన కూడా ఈ సీమవాడే.

ఆశుకవితాధారణలో, అవధానాలతో లోక ప్రసిద్ధిగాంచిన కొప్పరపు సుబ్బరాయ, వెంకటరమణుల 'కొప్పరపు సోదర కవులు', కాశీ కృష్ణాచార్యులు, తల్లాజ్జల శివశంకర శాస్త్రి, నోరి నరసింహ శాస్త్రి, దీపాల పిచ్చయ్య శాస్త్రి, జమ్మలమడక మాధవరాయ శర్మ, మాధవపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రి, నాళం కృష్ణారావు, త్రిపురనేని రామస్వామి చౌదరి, కొసరాజు రాఘవయ్య చౌదరి, బలిజేపల్లి లక్ష్మీకాంతం, పల్లవ హనుమయ్య, జంధ్యాల పాపయ్య శాస్త్రి (కరుణశ్రీ) మరెందరో వందలమంది కవులు ఈ సీమనుండి కవితా వాహినిని ప్రవహింపజేసినవారే.

గుంటూరు కవిత్రయంగా పేరొందిన నవయుగ కవి చక్రవర్తి గుర్రం జాషువ, తెనుగులెంక తుమ్మల సీతారామమూర్తి, కవిబ్రహ్మ ఏటుకూరి వేంకట నరసయ్య గుంటూరు సీమ కవితా పతాకలు, ప్రపంచామోదం పొందిన మహాకవులు.

## 6

సాహిత్య రంగంలోనేగాక కళారంగంలోనూ గుంటూరు సీమది అందునా తెనాలిది ప్రత్యేక పాత్ర. తెనాలిని రాష్ట్ర 'సాంస్కృతిక రాజధాని'గా గుర్తించాలనేది ఇక్కడివారి చిరకాల వాంఛ. 'తెనాలి ఓ కళాసముద్రం' అన్న చలం మాట నిజం. 1880-81లోనే గుంటూరులో హిందూ నాటక సమాజం ఏర్పడి నాటక ప్రదర్శన లిచ్చింది. తెలుగు నాటకరంగం ఔన్నత్యం కాపాడటానికి, క్షీణదశకు చేరుకున్న నాటకాలను పునరుద్ధరించటానికి తెనాలిలో 1929లో ఆంధ్రనాటక కళాపరిషత్ ఏర్పడింది. ఒకనాడు ఒక్క తెనాలిలోనే 140 నాటక సమాజాలుండేవి. వందలమంది నటీనటులకు తెనాలి భూమిక, వేదిక. అప్పటికీ గుంటూరుజిల్లాలో ఉన్నన్ని, నాటక కళాపరిషత్తులు రాష్ట్రంలో మరెక్కడా లేవు. చలనచిత్ర రంగం ఆవి ర్భావం నుండి గుంటూరు సీమలో ముఖ్యంగా తెనాలి వారెందరో ప్రాధాన్యతను సంతరించుకున్నారు. హరికథా ప్రక్రియకు తెల్లాకుల వేంకటేశ్వర గుప్త భాగవతార్ (తెనాలి) ప్రాణం పోశారు. బుర్రకథ కళారూపాన్ని ప్రజాపక్షం చేసిన పద్మశ్రీ నాజర్, ప్రజానాట్య మండలి నిర్మాతలలో ముఖ్యులు మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి గుంటూరు జిల్లాకు చెందినవారే. ప్రజా సాంస్కృతికోద్యమంలో గుంటూరు సీమది ముందంజే.

## 7

సాహిత్య, సాంస్కృతిక, రాజకీయ చరిత్రలోనేగాక స్వాతంత్ర్యో ద్యమంలో దేశంలోనే అగ్రస్థానం వహించిన జిల్లా గుంటూరు. 1 అక్టోబర్ 1904న ఆవిర్భవించింది గుంటూరు జిల్లా. మే 26, 1913న గుంటూరుజిల్లా బాపట్లలో ప్రథమాంధ్ర మహాసభ జరిగింది. ఈ మహాసభ ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కొరకు తీర్మానం చేసి, ఆంధ్రోద్య మానికి బీజం వేసింది.

స్వాతంత్ర్యోద్యమంలో 1857 ప్రథమ స్వాతంత్ర్య సమరానికి ముందే గుంటూరు జిల్లా నాదెండ్ల ఫిర్కాలో రైతులు సాగించిన 'నాగలి సమ్మె' వలన పాలకులకు వణుకు పుట్టించింది. గుంటూరుజిల్లాలో స్వాతంత్ర్యోద్యమ కాలంలో జరిగిన సంఘటనలు, ఉవ్వెత్తున ఎగసిన ఉద్యమాలు చరిత్ర ప్రసిద్ధి చెందాయి. అందుకు ఉదాహరణలు కోటప్పకొండలో చేబ్రోలు రెడ్డిపాలెంకు చెందిన చిన్నపరెడ్డి ఉదంతం (9-2-1909), తెనాలి బాంబు కేసు (4-4-1909), కన్నెగంటి హనుమంతు నేతృత్వంలో సాగిన పల్నాటి పుల్లరి సత్యాగ్రహం (జులై 1921), పర్వతనేని వీరయ్య చౌదరి నాయకత్వంలో నడచిన పెదనంది పాడు పన్నుల నిరాకరణ ఉద్యమం (డిసెంబర్ 1922), ఇంకా అవిభక్త గుంటూరు జిల్లాలో ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య నడిపిన చీరాలపేరాల ఉద్యమం (ఏప్రిల్ 1921). తెనాలి రణరంగ చౌక్‌లోని ఏడు స్థూపాలు, గుంటూరు గాంధీపార్క్‌లో నెలకొల్పిన స్థూపం ఆనాటి స్వాతంత్ర్య సమరయోధుల త్యాగాలను స్మరణకు తెస్తాయి.

## 8

1934 మేడే నాడు ఆంధ్రలో ఆవిర్భవించిన కమ్యూనిస్టు పార్టీ, గుంటూరులో 1935 ఏప్రిల్ 17న జరిగిన సమావేశంలో ఏర్పడింది. తెనాలికి చెందిన పోలేపెద్ది నరసింహమూర్తి 1936 జనవరి 29న కాకినాడలో జరిగిన రాష్ట్ర పార్టీ ప్రథమ మహాసభలో ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ తొలి కార్యదర్శిగా ఎన్నికైనారు. అభ్యుదయ సాహిత్యోద్యమ వికాసానికి కమ్యూనిస్టు పార్టీ ఎంతగానో తోడ్పడింది. అభ్యుదయ

సాహిత్యోద్యమం ఈ సీమలో ప్రారంభమై తెలుగుజాతికి ప్రకాశ వంతమైన సాహిత్యపు వెలుగులను అందించింది. సరికొత్త ప్రాపంచిక దృక్పథంతో 1943 ఫిబ్రవరి 13, 14 తేదీలలో గుంటూరు జిల్లా తెనాలిలో తాపీ ధర్మారావు అధ్యక్షతన ప్రథమాంధ్ర అభ్యుదయ రచయితల సంఘం మహాసభ జరిగింది. 1946 మే నుంచి జూన్ 10వ తేదీవరకూ గుంటూరు జిల్లా పెదపూడి గ్రామంలో మల్లంపల్లి సోమశేఖర శర్మ ప్రాచార్యులుగా అరసం నిర్వహించిన ఆంధ్రసాహిత్య పాఠశాల తెలుగునాటనే గాక భారతదేశ సాహిత్య చరిత్రలోనే చిరస్మరణీయ మైనది. గుంటూరు జిల్లాలో అరసం రాష్ట్ర మహాసభలు, రాష్ట్రస్థాయి సదస్సులు, వార్షిక ఉత్సవాలు, సాహితీ సత్కార కార్యక్రమాలు, పుస్తక ప్రచురణలు ఎన్నో జరిగాయి. ఇవన్నీ అరసం చరిత్రలో అపూర్వ ఘట్టాలు.

అభ్యుదయ రచయితల సంఘంలో, అభ్యుదయ సాహిత్యోద్య మంలో గుంటూరు జిల్లాది నాడూ నేడూ నాయక పాత్ర. తుమ్మల వెంకట్రామయ్య, చదలవాడ పిచ్చయ్య, వట్టికొండ విశాలాక్షి, పులుపుల వెంకటశివయ్య, ప్రయాగ కోదండరామ శాస్త్రి, ధనకుధరం వెంకటా చార్య, కుందుర్తి ఆంజనేయులు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, బెల్లంకొండ రామదాసు, అనిసెట్టి సుబ్బారావు, కొడవటిగంటి కుటుంబ రావు, తిరునగరి రామాంజనేయులు, బొల్లిముంత శివరామకృష్ణ, గంగినేని వెంకటేశ్వరరావు, పరుచూరి రాజారామ్, కొండేపూడి శ్రీనివాసరావు, టి. వాణీరంగారావు ఇంకా పలువురు ఈ సీమకు చెందినవారు ఈ ఉద్యమ ప్రముఖులు. తెలుగునేల మొత్తం, తెలుగువారున్న ప్రతిచోటా విస్తరించి 'అరసం' అనే సంక్షిప్త నామంతో అభ్యుదయ రచయితల సంఘం కలిగించిన ప్రభావం అపరిమితం. అరసం సాహిత్యాన్ని ప్రజాపక్షం చేసింది. ప్రజా పోరాటాలకు స్ఫూర్తినిచ్చే సాహిత్యాన్ని సృష్టించింది. మొత్తంగా సమాజ ఉన్నతీకరణకు సాహిత్యం ఎంత దోహదపడుతుందో గ్రహించటానికి ఏడు పదుల అరసం ఉద్యమ ప్రస్థానమే సజీవ సాక్ష్యం.

## 9

తెలుగునాట సాహిత్య సంస్థలకు, సాహిత్యోద్యమాలకు, సాహిత్య పత్రికలకు కేంద్ర బిందువు గుంటూరు సీమ. భాష, సాహిత్య వివాదాలు, ఉద్యమాలూ రకరకాల సంస్థల స్థాపనకు దారితీస్తున్న తరుణంలో 1911లో కాకినాడలో సంప్రదాయ ప్రయోజన పరిరక్షణార్థం ఏర్పడిన ఆంధ్రసాహిత్య పరిషత్తుకు పోటీగా భావకవిత్వ వికాసానికి, ఆధునిక సాహిత్య వికాసానికి వేదికగా తల్లావజ్ఝల శివ శంకరశాస్త్రి నాయకత్వంలో యువ సాహితీవేత్తలు 1919లో తెనాలిలో 'సాహితీ సమితి'ని స్థాపించారు. 1920లో 'సాహితి' మాస పత్రికను నెలకొల్పి నవ్యసాహిత్య ప్రక్రియల విస్తరణకు సాహితీ సమితి సభ్యులు తోడ్పడ్డారు. తరువాత నవ్య సాహిత్యానికి, వ్యావహారిక భాషోద్యమానికి ప్రధాన వేదికగా తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి (కాజ గ్రామం, గుంటూరు జిల్లా) అధ్యక్షతన 'నవ్య సాహిత్య పరిషత్తు' ఏర్పడింది. ఈ సంస్థ గుంటూరు నుండి 'ప్రతిభ' సాహిత్య పత్రికను నడిపింది. నవ్య సాహిత్య పరిషత్తుకు పోటీగా వామపక్ష భావజాలంతో నరసరావుపేటలో నవ్య కళా పరిషత్తు (1941-43) కుందుర్తి ఆంజనేయులు అధ్యక్షుడుగా ఏర్పడింది.

నన్నయ్య చెప్పిన "వార్తయందు జగము వర్ధిల్లుచుండును" అన్న మాటను రుజువు పరిచిన పట్టణం తెనాలి. 1907 సంవత్సరంలో వడ్డెపాటి నిరంజన శాస్త్రి సంపాదకత్వం, నిర్వహణలో 'ప్రబోధిని' మాసపత్రికతో ప్రారంభమైన పత్రికా ప్రచురణ తెలుగు జాతికే మార్గదర్శకమైంది. నరసరావుపేటకు చెందిన సుప్రసిద్ధ స్వాతంత్ర్య సమరయోధులు కోలవెన్ను రామకోటేశ్వరరావు (1894-1970) నిర్వహణ, సంపాదకత్వంలో అత్యున్నత ప్రమాణాలతో జయంతి, త్రివేణి పత్రికలు వెలువడ్డాయి. తెనాలికి చెందిన చక్రపాణి (ఆలూరి వెంకట సుబ్బారావు) 'యువ' పత్రికకు, 'చందమామ' బాలల పత్రికకు సంచాలకులుగా వ్యవహరించారు. కథల కోసమే 'కళానిధి' పత్రికను కొడవటిగంటి కృష్ణశాస్త్రి తెనాలి నుండి వెలువరించారు. ఇంకా పలు సాహిత్య, సాంస్కృతిక పత్రికలకు పుట్టిల్లు గుంటూరు సీమ.

## 10

ఇప్పుడు గుంటూరు కథకు వందేళ్లు. అరసానికి ఏడు పదులు. ఈ చారిత్రక సదర్భంలో గౌరవ పురస్కారంగా అభ్యుదయ రచయితల సంఘం - గుంటూరు జిల్లా శాఖ పక్షాన గుంటూరు కథలు సంకలనాన్ని ప్రియమైన పాఠకలోకానికి సమర్పిస్తున్నా. స్వీకరించండి.

తెనుగులెంక తుమ్మల సీతారామమూర్తి పద్యాన్ని స్మరించుకుంటూ నా ప్రస్తావన ముగిస్తాను.

**తెలుఁగునాఁటికినెల్ల సుద్దీప్తి నొసఁగి**
**పేరుగన్న ధరిత్రి గుంటూరి సీమ**
**దేశహిత జీవనమ్మున కాశపడిన**
**మగల మగువల మనికి యీ మండలమ్ము**

కె.మీనాక్షి

# కృష్ణా తీరంలో కొండపల్లి బొమ్మల కొలువు

రెడ్డిరాజ్యస్థాపకుడైన ప్రోలయ వేమారెడ్డి కాలం (క్రీ॥శ॥1325) నుంచి శాసనాల్లో పేర్కొనబడుతున్న కొండపల్లి, విజయవాడ - హైదరాబాద్ జాతీయ రహదారికి 25కి.మి దూరంలో నున్న ఒకప్పటి గ్రామం. గ్రామానికి పశ్చిమవైపున గల కొండమీద రెడ్డిరాజులు, గజపతులు, విజయనగర రాజులు, కుతుబ్‌షాహీలు, అసఫ్‌జాహీదు, ఇంగ్లీషు, ఫ్రెంచ్ వారు, వారి వారి కాలాల్లో నిర్మించబడిన విశాలమైన కోట ఉంది దీనిని కొండపల్లి కోట అంటారు. కొండకు దిగువన తూర్పువైపున ఎత్తైన మట్టిగోడ వుంది. తరువాత మరొక ఎత్తైన రాతి కోటగోడ దాని చుట్టూ కందకం ఇప్పటికీ ఉన్నాయి. ఈ కోటగోడల లోపల ఉన్న గ్రామమే కొండపల్లి.రాను రాను, పెరిగి,కోటగోడలు దాటి, బయట విస్తరించి గ్రామం కాస్తా పట్టణంగా మారింది. కొండపల్లి కోటకే కాదు కొయ్యబొమ్మలకు కూడా ప్రసిద్ధి వీటికి కొండపల్లి బొమ్మలని పేరు. క్రీ.శ.17వ శతాబ్దిలో రాజస్తానునుంచిదాదాపు రెండు వందల కుటుంబాలు కొండపల్లికి వలస వచ్చారని వారే తరువాత తెలుగు భాష నేరుకొని స్థానికులతో కలిసిపోయి తెలుగు వారై, తమ వంశపరంపరగా వస్తున్న కొయ్యబొమ్మల తయారీని ఇక్కడ కొనసాగించా రని పరిశోధకులు భావిస్తున్నారు. రాజాదరణ చవిచూసిన ఈ కళాకారులు రాను రాను జనాదరణ లేక, ఇతర వృత్తుల్లోకి వెళ్ళి, ప్రస్తుతం రెండు వందల కుటుంబాలు కాస్తా 15 కుటుంబాలకు తగ్గారు. వంశ పరంపరగా కొయ్యబొమ్మల తయారీలోనున్న ఈ కుటుంబాలలోని మగవారు, ఆడవారు, పిల్లలు, బొమ్మలు తయారీలోనూ, వాటికి రంగులు వేయటంలోనూ పాల్గొని ఆ కళను కాపాడుకుంటున్నారు.

కొండపల్లి బొమ్మలను తయారు చేస్తున్నప్పుడు చూచినవారికి, ఈ కళపట్ల మక్కువ పెరుగుతుంది. పెద్దలు వివిధ రకాల బొమ్మలను తయారుచేసేప్పుడు, కుటుంబంలోని చిన్న పిల్లలకు శిక్షణనిస్తారు. తయారుచేయదలుచుకున్న బొమ్మలకు సంబంధించి, తమ పూర్వీకులు పుస్తకాల్లో గీచుకొని ఉంచిన బొమ్మల ఆధారంగా వాటిని తీర్చి దిద్దుతున్నారు. బొమ్మను వివిధ భాగాలుగా విభజించి, ఒక్కో భాగాన్ని ఒకరు గానీ లేక బొమ్మనంతా ఒకరు గాని చేస్తారు. పెద్దలు కొయ్యపై బొమ్మలు గీచి ఇవ్వగా, పిల్లలు వాటిని చెక్కి, పెద్దల పర్యవేక్షణలో కళాకారులుగా రూపొందుతున్నారు.

కొండపల్లి కొండమీద, అటుపక్కగల లోయలో తెల్లపొణికి అనే తేలికపాటి కర్ర దొరుకుతుంది. ఈ కర్రను, తెలుపు-పసుపు రంగుల మిశ్రమమైన గోపీ రంగులోనున్న చెట్లనుంచి సేకరిస్తారు. అలా తెచ్చిన కర్రను కావాలసిన సైజులో నరికి, "బావుదారు" అనే పనిముట్టుతో చెక్కి కావలసిన బొమ్మ విడిభాగాలను తయారుచేస్తారు. కర్రలోని తేమను తొలగించటానికి ఆ కర్రముక్కల్ని కుంపట్ల పై పెట్టి, నిప్పు సెగ తగిలిస్తారు. తద్వారా కర్రవంగకుండా ఉండడమే కాకుండా కర్రకు బిరుసుతనం కూడా వస్తుంది. విడిభాగాలు తయారైన తరువాత అనుభవజ్ఞులైన పర్యవేక్షకులు ఆ విడిభాగాలను కలిపి బొమ్మలుగా తీర్చి దిద్దుతారు. విడిభాగాలను కలిపేటప్పుడు బాగా ఉడికించిన చింతగింజల గుజ్జును, కొంత కొయ్యగుజ్జు, జిగురు కలిపిన బంకను వాడతారు. అప్పుడు విడిభాగాలన్నీ గట్టిగా అతుక్కుపోతాయి. అలా తయారైన కొయ్యబొమ్మకు ముందుగా ఒక పూత తెల్లరంగును పూస్తారు. బాగా ఆరిన తరువాత ఒక్కోభాగానికి ఒక్కోరంగు వేసి కావలసిన అలంకారాలనుతీర్చి దిద్దుతారు. కొండపల్లి కళాకారులు సహజ సిద్ధమైన రంగులను మాత్రమే వేస్తారు.వీటితోపాటు మైలతుత్తం, సింధూరం, సుద్ధరంగులను కూడా వేస్తారు. ఒక్కోసారి రంగులపై అవి చాలా కాలం ఉండటానికి వార్నీషు కూడా పూస్తారు. తద్వారా బొమ్మ నిగ నిగా మెరుస్తుంది. ఆకర్షణీయంగా తయారౌతుంది. ఇలా వార్నీషు పూయబడిన బొమ్మలు నీళ్ళలో పడినా ఏమాత్ర రంగులు కోల్పోక అలానే ఉంటాయి. ఇలా రంగులు వేయటం పూర్తయిన తరువాత నిపుణులైన కొయ్యశిల్పులు బొమ్మలపై రూపురేఖలను తీర్చిదిద్దుతారు. దీంతో కావలసిన బొమ్మ తయారై కొలువు తీరుతుంది.

దసరాకు, గోకులాష్టమికి, కొన్ని సందర్భాలలో సంక్రాంతికి కొందరుఇళ్ళలో బొమ్మల కొలువులను ఏర్పాటుచేస్తారు. ఈ బొమ్మలలో

విష్ణుమూర్తి దశావతారాలు (మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, రాముడు, పరుశురాముడు, బలరాముడు, బుద్ధుడు (కృష్ణుడు) కల్కి, ముఖ్యమైనవి. పురాణాల్లో వర్ణించినట్లు ఒక్కో అవతారాన్ని, వాహనము, ఆయుధాలతో అందంగా తయారు చేస్తారు. ఇంకా ఏనుగుపైన అంబారీ, ఒక్కోసారి అంబారీపై కూర్చోటానికి వీలుగా సవారీ, ముందు అంకుశము పట్టుకున్న మావటి బొమ్మ ప్రపంచ వ్యాప్తంగా ప్రఖ్యాతి గాంచింది. వివిధ పరిమాణాల్లో తయారయ్యే ఏనుగు బొమ్మలకు ఎంతో గిరాకీ ఉంది. ఇంకా రెండెడ్ల బండీ, వృత్తి పనివాళ్ళు, వాళ్ళలో తాటిచెట్టు పైకి ఎగబాకే గీతకార్మికుని బొమ్మ, దాని క్రింద మద్యనిషేధాన్ని అమలు చేస్తున్న పోలీసు, గుర్రము, లేగదూడతో నున్న ఆవు, పాలు పితుకుతున్న రైతు, ఇంకా ఆటవస్తువులు, కూరగాయలు లాంటి అనేక బొమ్మలను తయారుచేసి ఇళ్ళలోనూ, అంగళ్ళలోనూ అమ్ముతుంటారు. అన్నిటికన్నా ఒక్క అంగుళం సైజులో తయారు చేసిన మనిషి బొమ్మలకు దేశ విదేశాల్లో గిరాకీ ఉంది.

కేవలం కొన్ని కుటుంబాలకు మాత్రమే పరిమితమైన ఈ కళను ప్రోత్సహించటానికి హ్యాండ్లూమ్స్ అండ్ హ్యాండీక్రాఫ్ట్స్ డెవలప్‌మెంట్ కమిషనరేట్, లేపాక్షి లాంటి ప్రభుత్వ సంస్థలు ముందుకొచ్చాయి కర్రసరఫరాలోనూ,రంగులు తయారీలోనూ,పనిముట్లు తయారీలోనూ, శిక్షణనివ్వటంలోనూ, ప్రభుత్వం బ్యాంకులు తమ వంతు సహకారాన్ని అందిస్తూనే ఉన్నాయి. మిగతా వృత్తులు, ఉద్యోగాల్లో వచ్చే ఆదాయం ఎక్కువగా ఉండటం వలన, ఈ కుటుంబాల్లోని వ్యక్తులు తమ చేతి వృత్తిని విడిచిపెట్టి ఆయా వుద్యోగాల్లో చేరటాన కళాకారుల కొరత ఏర్పడుతుంది.

ఈ లోటును పూడ్చడానికి అందుబాటులో వున్న ప్రభుత్వ ప్రోత్సాహకాలు వీరికి నేరుగా అందేట్లు జిల్లా పరిశ్రమల శాఖ పూను కోవాలి. అంతేకాదు. ఇప్పటికే అందుబాటులో వున్న ఉత్పత్తి- మరియు ప్రదర్శన శాలకు తక్కువ రేటుకు కరంటు సరఫరా, కళాకారులకు రుణాలతోపాటు, విద్య, వైద్య, వసతి, సదుపాయాలను కల్పించాల్సిన అవసరం ఉంది. వివిధ విందులు, వినోదాలు వేడుకల సందర్భంగానూ, అధికారప్రతినిధుల సందర్శనలపుడో వారికి కొండపల్లి బొమ్మలను మాత్రమే బహూకరించేట్లుగా శ్రద్ధతీసుకోవాలి. ముందుగా ఈ పనికి ప్రభుత్వం పూనుకొంటే ప్రయివేటు సంస్థలు, వ్యక్తులు అనుసరిస్తారు.

కొండపల్లి బొమ్మల తయారీ, నాణ్యత, మెరుగైన ఉత్పత్తి, డిజైన్ల ప్రామాణీకరణతో పాటు సమకాలీన అవసరాలకు కళారూపాలను మలచుకోవటం, కోరిన విధంగా తయారు చేసి ఇవ్వటం, పని సులువుగా కావటానికి యంత్రాలు, పనిముట్లు, లేబ్లింగ్, ప్యాకింగ్, మార్కెటింగ్, పబ్లిసిటీ, సప్లయి చేయటం లాంటి అంశాలలో నిపుణులైన వారితో కళాకారులకు శిక్షణనిప్పించి, మెప్మా లాంటి పథకాలను అందిస్తే అరుదైన ఈ కొండపల్లి బొమ్మల పరిశ్రమ నిలదొక్కుకొని మనగలుగుతుంది. ఆదాయం కూడా పెరగటంతో ఉన్న కుటుంబాలు ఈ వృత్తినే అంటిపెట్టుకొని ఉండటానికి ఆస్కారమేర్పడుతుంది.

కొండపల్లి బొమ్మల కళాకారులను ప్రోత్సహించటానికి, ఎడ్లబండిలాంటి బొమ్మలను ప్రామాణీకరించటానికి, వీటికి ఒక బ్రాండ్ ఇమేజ్ కల్పించటానికి, ఆర్టిజన్ క్లస్టర్ ఏర్పాటుచేయటానికి ఒకప్పుడు కొండపల్లి-లాంకో పవర్ ప్రయివేట్ లిమిటెడ్ మేనేజింగ్ డైరెక్టర్‌గా పనిచేసిన మాలక్ష్మీ సంస్థల అధినేత యార్లగడ్డ హరిశ్చంద్ర ప్రసాద్ గారి కృషిని ఈ సందర్భంగా గుర్తుకు తెచ్చుకోవాలి. ఈ కళ గొప్పతనాన్ని ప్రపంచ వ్యాప్తంగా తెలియజేయటానికి విజయవాడ నగరాన్ని చూడటానికి వచ్చే ప్రముఖ వ్యక్తులకు వాటిని బహూకరించటం, ఇబ్రహీంపట్నం కూడలిలో ఎత్తైన కొండపల్లి బొమ్మలను ప్రదర్శించటం, జాతీయ స్థాయిలో ప్రామాణిక శిక్షణా సంస్థలను కొండపల్లికి రప్పించటం, కళాకారుల్లో ఆత్మ గౌరవాన్ని ఇనుమడింప చేయటం, వారికి గుర్తింపు నివ్వటంతో పాటు ఉచిత రీతిలో సత్కరించటం లాంటి వినూత్న కార్యక్రమాలకు హరిశ్చంద్ర ప్రసాద్ గారు శ్రీకారం చుట్టి, అంతరిస్తున్న అపురూప కొయ్య శిల్ప కళకు ఊపిరిలూది, కళాకారులకు భరోసానిచ్చారు. కొండపల్లి సూర్యనారాయణ సోదరులతో పాటు ఇతర శిల్పులకు ఉగాది, హంసలాంటి పురస్కారాలనిచ్చి గౌరవిస్తే ఈ కళనే నమ్ముకున్న కళాకారులు తమ నైపుణ్యం ద్వారా మన రాష్ట్రానికి పేరు ప్రఖ్యాతులు తెస్తారనటంలో అతిశయోక్తిలేదు.

చిరునామా : కె. మీనాక్షీ, ఛైర్‌పర్సన్, మీనాక్షీ ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స్ వెల్ఫేర్ సొసైటీ, 31-5-22, ప్రకాశరావు వీధి, మారుతీనగర్, విజయవాడ. సెల్ : 9966966926, 9393399989

శ్రీ యడవల్లి శ్రీనివాసరావు

# కృష్ణాజిల్లాలో టూరిజం ప్రగతి

కృష్ణానది పరీవాహక ప్రాంతంలో విదేశీ టూరిస్టులను ఆకర్షిం చేందుకు రాష్ట్రప్రభుత్వం ప్రత్యేకంగా మాస్టర్‌ప్లాన్‌ను రూపొందిం చింది. అదేస్థాయిలో 13 జిల్లాల్లోని 80 దేవస్థానాల అభివృద్ధికి కూడా మాస్టర్ ప్లాన్‌ను ఆయా ఆలయాలకు సంబంధించిన కార్యనిర్వహణాధి కారులు తయారుచేసినట్లు సమాచారం. ప్రముఖ ఆలయాలైన విజయవాడ కనకదుర్గ దేవస్థానం,సింహాచలం, ద్వారకా తిరుమల, శ్రీశైలం తదితర దేవస్థానాల్లో యాత్రికులను ఆకర్షించేందుకు మాస్టర్ ప్లాన్‌ను రూపొందిం చారు. ఇప్పటికే తిరుమల తిరుపతి దేవస్థానం మాస్టర్‌ప్లాన్‌ను అమలు చేస్తోంది. ఈ నేపథ్యంలో ప్రముఖ ఆలయాల్లో మాస్టర్‌ప్లాన్‌ను రూపొం దించి ఆలయాలను ఆధునీకరిం చడంతో పిలిగ్రిమ్ టూరిస్టులు పెరిగే అవకాశం ఉందని ప్రభుత్వ వర్గాలు అంచనావేస్తున్నాయి. ఆలయాలకు సంబంధించి తయారు చేసిన మాస్టర్‌ప్లాన్ల అమలుకు నిధులు ఎంత మేర అవసరమవు తాయనే విషయంలో స్పష్టత వచ్చేందుకు దేవాదాయ శాఖామంత్రి మాణిక్యాల రావు కృషిచేస్తున్నారు. కామన్ గుడ్ ఫండ్ (సిజిఎఫ్) సమావేశంలో నిర్ణయించారు. దేవాలయాలకు సంబంధించి వేలాది ఎకరాలు ఆక్రమణల చెరలో ఉన్నాయి. దీంతో అనేక ప్రాంతాల్లో కోట్లాది రూపాయల విలువైన భూములు కోర్టుల పరిధిలోకి వెళ్లాయి. పలు ఆలయాలకు వచ్చే ఆదాయంలో ఎక్కువభాగం కోర్టు వాయిదాలకు హాజరయ్యేవారికోసం కేటాయించాల్సి వస్తోందని ఆ శాఖలోని ఉద్యోగులు పేర్కొంటున్నారు. ఆలయాల భూములకు సంబంధించిన ఐదు ఏళ్లకంటే ఎక్కువకాలం పెండింగ్‌లో ఉన్న భూముల విషయంలో సత్వర పరిష్కారానికి ప్రభుత్వం ముగ్గురు సభ్యులతో కూడిన కమిటీని ఏర్పాటుచేయ బోతున్నారు. రాష్ట్రప్రభుత్వం ఒకవైపు కృష్ణానదికి రెండువైపులా పర్యాటకం అభివృద్ధి చేయాలని భావిస్తున్న నేపథ్యంలో ప్రముఖ ఆలయాలను కూడా అభివృద్ధి చేసి విదేశీ యాత్రికులను ఆకర్షించడం ద్వారా విదేశీ మారక ద్రవ్యాన్ని సంపాదించాలనే ఆలోచనలో సర్కారు అడుగులు వేస్తున్నట్లు సమాచారం.

### అలల హొయలు... కృష్ణానది పరవళ్లు

కృష్ణాజిల్లాలో అనేక చారిత్రక, పర్యాటకప్రాంతాలు ఉన్నాఅభివృద్ధికి నోచుకోవటంలేదు. దశాబ్దాలకాలంగా ఈ తంతు కొనసాగు తోంది. సముద్రపు అలల హొయలు..కృష్ణానది పరవళ్లు... పచ్చని తివాచీ పరచి నట్టుండే వరిచేలు...ఒంపు సొంపులతో పయనించే కాలువలు... తలలూ పుతూ స్వాగతం పలికే కొబ్బరిచెట్లు... ఇలాంటివి ఎన్నో కృష్ణాజిల్లాకు ఆనవాళ్లుగా ఉన్నాయి. జిల్లాలో ఎటువైపు చూసినా పచ్చని తోటలు.. కోనసీమను మైమరిపించేలా ప్రకృతి అందాలు పులకరిస్తాయి. సునుపుగా దూరంగా కనిపించే కొండలు...స్వచ్ఛమైన గాలి ఎటుచూసినా నీటి వనరులు మనస్సుకు ఎంతో ఆహ్లాదాన్ని పంచుతాయి. చుట్టూ పచ్చని పొలాలు...పచ్చికబయళ్లు, చెట్టూ, చేమలతో జారురైడ్స్, వాటర్ గేమ్స్, డైనోసార్స్ వంటి వినోదాన్ని పంచే ప్రాంతాలు జిల్లాలో అనేకం ఉన్నాయి. జిల్లాలోని విజయవాడ, నూజివీడు, గుడివాడ, మచిలీపట్నం రెవెన్యూ డివిజన్ల పరిధిలోని పలు ప్రాంతాల్లో ఎన్నో చారిత్రక, పర్యాటక ప్రాంతాలు ఉన్నాయి. అద్భుతమైన అందాలు, ఉద్యానవనాలు, ఆశ్చర్యం గొలిపే వింతలూ, విశేషాలు ఎన్నో ఉన్నాయి. కొన్ని ప్రకృతి అందాలతోపాటు మానవ కలబోతలు అక్కడక్కడా చోటుచేసుకున్నాయి. విరివిగా వ్యాప్తి చెందుతున్న పర్యావరణ రహిత పర్యాటకం, అపార అటవీ సంపద, వాగులూ, వంకలూ, కొండలూ, కోనలూ, నదులూ, లోయలతోపాటు తీర ప్రాంతం కోనసీమను తులతూగేలా అచ్చం కొబ్బరితోటలతో అలరారుతూ కలిదిండి మండలంలోని అనేక గ్రామాలు దర్శన మిస్తుంటాయి. నూజివీడు రెవెన్యూ పరిధిలోని 14 మండలాల్లో గిరిజనం నివసిస్తున్నారు. మామిడిచెట్లు పచ్చటికోటగా కనుచూపుమేర కన్పిస్తాయి. జగ్గయ్యపేట నియోజకవర్గంలోని పలు ప్రాంతాలు సున్నపు

నిక్షేపాలకు కేంద్రంగా ఉన్నాయి. కైకలూరు ప్రాంతంలో పర్యాటకులు ప్రకృతితో మమేకమై నడుస్తూ పక్షుల కిలకిలారావాలను, జంతువుల అరుపులను ఆలకిస్తూ కాలం గడుపు తున్నారు. నూజివీడు, ఆగిరిపల్లి, ఎ. కొండూరు, గంపల గూడెం, తిరువూరు, మైలవరం, రెడ్డిగూడెం తదితర ప్రాంతాల ప్రజలు చక్కని, చిక్కని అడవులతో ఉన్న కొండకోనల్లో ఆహ్లాదకరమైన వాతావరణా నికి నెలవుగా ఉన్నాయి. విహారయాత్రా స్థలంగా కొండపల్లి ఖిల్లా భాసిల్లుతోంది. కృష్ణా, గుంటూరుజిల్లాలను కలుపుతూ కృష్ణానదిపై నిర్మించిన ప్రకాశం బ్యారేజీ విజయవాడ నగరానికి ప్రధాన ఆకర్షణగా ఉంది. విక్టోరియా మ్యూజియం, భారత స్వాతంత్ర్య సంగ్రామ దృశ్య సదనం, రీజనల్ సైన్స్ సెంటర్, భవానీ ద్వీపం, గాంధీపర్వతం పర్యాటకులను ఎంతగానో ఆకట్టుకుంటున్నాయి. ఘంటసాల ప్రముఖ బౌద్ధ, శైవక్షేత్రంగా విరాజిల్లుతోంది. గతకాలపు వైభవానికి, రాజసానికి ప్రతీకగా చల్లపల్లి కోట నిలుస్తోంది. అవని గడ్డలో చోళరాజుల కాలంలో నిర్మించిన శ్రీ లక్ష్మీనారాయణస్వామి ఆలయం ఉంది. ఇక్కడి రాజగోపురాన్ని పురావస్తుశాఖ తన ఆధీనంలోకి తీసుకుని అభివృద్ధి చేస్తోంది. పులిగడ్డలోని అక్విడెక్టు దివిసీమకు 1930 నుంచి సాగునీటిని అందిస్తూ రవాణాకు వారధిగా నిలిచింది. పులిగడ్డ-పెనుమూడి మధ్య 3.65 కి.మీ. పొడవునా నిర్మించిన పొడవైన బ్రిడ్జి పొడవులో రాష్ట్రంలోని ద్వితీయస్థానంలో ఉంది. జగ్గయ్యపేట పట్టణానికి చేరువలో 2000 సంవత్సరాల క్రితం బుద్ధభగవానుడి పన్నును నిక్షిప్తంచేసి నిర్మించిన బౌద్ధస్థూపం చక్కని పర్యాటకస్థలంగా ఉన్నా అభివృద్ధి కొద్దిమేరకే జరిగింది.

## జిల్లాలో దర్శనీయ క్షేత్రాలు ఇవే...

జిల్లాలో దర్శనీయ క్షేత్రాలు ఎన్నో ఉన్నాయి. పలు చారిత్రక ఆలయాలు ఏ ప్రాంతానికి వెళ్లినా కన్పిస్తాయి. జిల్లాలో ప్రసిద్ధిగల ప్రాంతాల్లో కొండపల్లి ఖిల్లా సముద్రమట్టానికి 1200 అడుగుల ఎత్తులో ఉంది. ఇక్కడ పర్యాటకులను ఆకర్షించేందుకు అనేక అవకాశాలు ఉన్నా ప్రభుత్వం ఆ విధమైన చర్యలు తీసుకోవటంలేదు. ఎలాంటి రక్షణచర్యలు లేకపోవటంతో ఈ ఖిల్లాకు వెళ్లేందుకు పర్యాటకులు ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని వెళ్లాల్సివస్తోంది. ఇవికాక 400 ఏళ్ల చరిత్ర కలిగిన కొండపల్లి బొమ్మలు ఈ ప్రాంతంలో తయారవుతాయి. వీటికి ప్రపంచవ్యాప్తంగా గుర్తింపు లభించింది.

## రెండు జిల్లాలను కలిపేందుకు వంతెనలు దోహదం

కృష్ణా, గుంటూరు జిల్లాలను కలుపుతూ రాబోయేకాలంలో ఆరేడు వంతెనలు నిర్మించే అవకాశాలు ఉన్నాయి. కృష్ణానదిపై నిర్మించిన ప్రకాశం బ్యారేజీ ప్రధాన ఆకర్షణగా నిలుస్తుంది. ఇంద్రకీలాద్రి దిగువన 1957లో దీనిని నిర్మించారు. ఆంధ్రప్రదేశ్ రాజధాని అమరావతి అయిన నేపథ్యంలో కృష్ణానదిపై పలు హైలెవల్ వంతెనలు నిర్మించటా నికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. దుర్గగుడి వద్ద ఫ్లైఓవర్ నిర్మాణపనులు శరవేగంగా జరుగుతున్నాయి.

## బాపు రాష్ట్రస్థాయి మ్యూజియంగా విక్టోరియా

విక్టోరియా జూబ్లీ మ్యూజియాన్ని నాడు విక్టోరియా మహారాణి రాజ్యాధికారం చేపట్టిన తర్వాత దేశంలో గుర్తుండిపోయేవిధంగా ఏర్పాటు చేసిన మ్యూజియాల్లో విజయవాడలోనిది ఒకటి. ఈ మ్యూజియంలో అరుదైన వస్తువులున్నాయి. మూడోశతాబ్దం నాటినుంచి ఉన్న పురాతన వస్తువులు విజ్ఞానదాయకంగా ఉన్నాయి. ఇక్కడున్న భవనాలు, ఖాళీస్థలాలను వినియోగించుకుని విద్యార్థులకు విజ్ఞానాన్ని కలిగించే కోస్టల్‌మ్యూజియం ఏర్పాటుకు ప్రభుత్వంచర్యలు తీసుకుంది. రాజధాని నేపథ్యంలో దానిని బాపు మ్యూజియంగా పేరు మార్చారు.

## ప్రకృతివరం...భవానీ ఐలాండ్

కృష్ణానది మధ్యలో సుమారు 134 ఎకరాల విస్తీర్ణంలో భవానీ ద్వీపం సహజసిద్ధంగా ఏర్పడింది. పర్యాటకశాఖ 12 ఎకరాల మేర అభివృద్ధి చేసింది. సందర్శకులకు మానసిక ప్రశాంతతను అందిం చేందుకు వీలుగా పచ్చనిచెట్లు, పిల్లలు ఆడుకోవటానికి ఆట పరికరాలు న్నాయి. కృష్ణానది మధ్యలో ప్రశాంత వాతావరణంలో ఈ ద్వీపం ఉండటంతో ఇతర జిల్లాల నుంచి కూడా పర్యాటకులు తరలివస్తు న్నారు. ద్వీపంలో ప్రత్యేకంగా24 కాటేజీలు, నాలుగు ట్రీటాప్ కాటేజీలు, డిక కాన్ఫరెన్స్‌హాలు, రెండు రెస్టారెంట్లు ఉన్నాయి. దుర్గగుడికి దిగువ నున్న దుర్గాఘాట్, పున్నమిఘాట్, లోటస్ హోటల్ నుంచి బోటింగ్ పాయింట్లు ఉన్నాయి. తాజాగా బెరంపార్కులోని కాటేజీలను మంత్రుల అతిథిగృహాలకు కేటాయిస్తారనే ఊహాగానాలు కూడా వస్తున్నాయి.

## ప్రకృతి అందాల కొల్లేరు

ప్రపంచ ప్రసిద్ధి చెందిన మంచినీటి సరస్సు కొల్లేరు ఒకటి. ఏటేటా శీతాకాలం తొలివారంలో ఆస్ట్రేలియా, నైజీరియా,ఫిజి, దక్షిణ ప్రాంతం నుంచి పలురకాల పక్షులు కొల్లేరుకు వలసవచ్చి సంతానోత్పత్తి చేసుకుని మళ్లీ వాటి దేశాలకు వెళ్లిపోతాయి. కొల్లేరు సరస్సులో 183 రకాల పక్షిజాతులు ఉన్నాయి. గూడబాతు(పెలికాన్)వలస పక్షులు అగ్రస్థానంలో నిలుస్తున్నాయి. కొల్లేరు అందాలు, పక్షుల కిలకిలా రావాలు తిలకించేందుకు దేశ, విదేశాలకు చెందిన పర్యాటకులు ఇక్కడికి వస్తున్నా సరైన వసతి సదుపాయాలు అందు బాటులో లేవు.

సర్కారు కాలువపై కర్రల వంతెన, పడవ ప్రయాణంతో కొల్లేటి పెద్దింట్లమ్మను దర్శనం చేసుకోవటం మధురానుభూతిగా నిలుస్తుంది. అయితే టూరిజం శాఖ అభివృద్ధికి పెద్దగా దృష్టిసారించక పోవటంతో పర్యాటకుల సంఖ్య అంతంత మాత్రంగానే ఉంది.

### టూరిజం సర్క్యూట్‌కు ప్రాధాన్యత

విజయవాడలోని భవానీ ఐలాండ్, సముద్రతీర ప్రాంతంలోని మంగినపూడి, హంసలదీవి బీచ్, చినగొల్లపాలెం, చారిత్రక ప్రాంతాలైన శ్రీకాకుళం, ఘంటసాల, కూచిపూడిలను ఒక సర్క్యూట్‌గా అభివృద్ధి చేయాలనే ప్రతిపాదనలు ఉన్నాయి. రూరల్ టూరిజం ప్రాజెక్టు క్రింద పెడన పట్టణంలో కలంకారీ పరిశ్రమనుఅభివృద్ధిచేయడానికి ప్రయత్నాలు ముందుకు సాగటంలేదు. జిల్లాలో చారిత్రాత్మక ప్రాంతాలైన కూచిపూడి, శ్రీకాకుళం,ఘంటసాల, సముద్రతీర ప్రాంతమైనహంసలదీవి, మంగిన పూడి,చినగొల్లపాలెం,పెద్దింట్లమ్మ దేవాలయంప్రాంతాలను సర్క్యూట్‌గా అభివృద్ధిచేయడానికి ప్రణాళికలు రూపొం దించారు. పెడన పట్టణంలో కలంకారీ పరిశ్రమను అభివృద్ధి చేయడానికి పెద్దపెద్ద హాల్స్, రిటైల్ కౌంటర్స్, ఇన్ఫర్మేషన్ సెంటర్లను నెలకొల్పుతామన్న హామీ కూడా ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్న చందంగా ఉంది. మచిలీపట్నంలోని బీచ్‌లో బీచ్ ఫెస్టివల్ హామీ అమలులోకి వచ్చింది. అంతర్జాతీయ స్థాయిలో పేరుప్రఖ్యాతులున్న కూచిపూడి అభివృద్ధికి ఏర్పాట్లు జరుగు తున్నాయి. సుమారు రూ. 350 కోట్లు కేటాయించటంతో పెద్దఎత్తున అభివృద్ధి పనులు జరుగుతున్నాయి. దీవిగా ఉన్న కృత్తివెన్ను మండలం చిన్నగొల్లపాలెం అభివృద్ధికి ఆమడదూరంలో ఉంది. చినగొల్లపాలెం, మంగినపూడి, కొల్లేరు ప్రాంతాల్లో ఎన్నో అపార అవకాశాలు ఉన్నా పర్యాటకశాఖ అభివృద్ధికి తీసుకుంటున్న చర్యలు కేవలం ప్రకటనలకే పరిమిత మవుతున్నాయి.

---

### *గరికపాటి రాజారావు*

నాట్యవిద్యను నేర్చి నటశేఖరుండుగా
 పలుపాత్రలనుఁజేసి వాసిఁగాంచె
మహిత 'ప్రజానాట్య' మండలిన్ స్థాపించి
 దర్శక రత్నమై తనరినాడు
ఘన 'భయం' నాటకమ్మున పాత్రధరియింప
 ఖండాంతర ఖ్యాతిఁగాంచగలిగె
'రాజాప్రొడక్షన్సు' తేజంపు చిహ్నమై
 'పుట్టిల్లు' చిత్రంబు పుడమివెలిగె
నాణ్యమైన రీతి నాటకమ్ముల వ్రాసె
కథలు గేయములను బుధులు మెచ్చ
క్రమరూప జీవి ఘనుడు రాజారావు
కీర్తి కళలరాణి! కృష్ణవేణి!

*స్మితశ్రీ చింతపల్లి నాగేశ్వరరావు*

చిరునామా : *యడవల్లి శ్రీనివాసరావు, సెల్ 9490099214*

డా॥ జి.వి. పూర్ణచందు

# కృష్ణాతీరంలో ఘాటైన రుచులు

శివాలయంలో తెల్లవార్లూ శివభజన సాగుతోంది. తెల్లవారు ఝామున నైవేద్యానికి ఘుమఘుమల వంటకాలు సిద్ధంగా ఉన్నాయి. అన్నివిధాలా భ్రష్టుడైన గుణనిధి పారిపోయి వచ్చి ఈ భజనలో కూచున్నాడు. ఆకలి మీద ఉన్నాడు. సందు చూసుకుని ఆ ఘుమఘుమ పదార్థాలు దొంగతనం చేద్దామని గర్భాలయంలో దూరాడు. అక్కడ దీపం వత్తి కొండెక్కుతోంది. తన బట్ట చింపి వత్తిని చేసి వెలిగించాడు. ఆ వెలుగులో కనిపించిన వంటకాలను శ్రీనాథుడు వర్ణించాడు. ఈ వంటకాలు శ్రీనాథుడెరిగిన కృష్ణాతీరం వంటకాలే!

**మరీచి ధూళి పాళి పరిచితాలు :** మిరియాల పొడి చల్లి తయారు చేసిన వంటకాలు

**మాణిబంధాశ్మ లవణ పాణింధమములు :** సైంధవలవణం కలిసిన పిండిని చేతుల్తో నొక్కి చేసిన పిండివంట.

**బహుళ సిద్ధార్థ జంబాల సారంబులు :** ఆవపెట్టి వండిన వంటకాలు.

**పటు రామఠామోద భావితములు :** బాగా ఘాటైన ఇంగువ వాసన ఘుమాయించే వంటకాలు.

**తింత్రిణీక రసోపదేశ దూర్ధురములు :** చింతపండు రసం బాగా కలిపి చేసిన మెండైన వంటకాలు

**జంబీర నీరాభి చుంబితములు :** నిమ్మరసం పిండిన వంటకాలు.

**హైయంగవీన ధారాభిషిక్తంబులు :** తొలి ఈత ఆవుపాల నుండి తీసిన నెయ్యి లేదా క్రొన్నెయ్యి ధారగా పోసిన వంటకాలు.

**లలిత కస్తుంబరుల్లంఘితములు :** లలిత కస్తుంబరు అంటే, లేత కొత్తిమీరతో పరిమళించే వంటకాలు.

**శాకపాక రసావళీ సౌష్ఠవములు :** కండ కలిగిన కూరగాయలతో చేసిన రుచికరమైన కూరలు.

**భక్ష్యభోజ్య లేహ్యంబులు పానకములు :** భక్ష్యాలు కొరికి తినే పిండివంటలు : భోజ్యాలు = నమిలి మింగే అన్నం వగైరా, లేహ్యాలు: చప్పరిస్తూ తినే హల్వా, కేసరి లాంటివి. చోష్యాలు (చూష్యాలు) = పీలుస్తూ తినే పులుసు చారు లాంటివి. పానీయాలు = కీరు, సూపు, పాయసాలు, ఇలా ఐదురకాల ఆహారపదార్థాల్ని పంచభక్ష్యాలంటారు.

కృష్ణయొడ్డు జాతీయుల ఇష్టాన్నాన్ని సీసపద్యంలో ఇలా వివరించాడు శ్రీనాథుడు. వీటిని విశ్లేషిస్తే కృష్ణాతీరం ప్రజల ఆహార ఆచారాలు అర్థం అవుతాయి.

**గోగులమ్మతల్లి-గోంగూర :** గోను కూర, గోనుగూర, గోంగూర, గోcగూర గో(గుమొక్క ఇంగ్లీషులో కెనాఫ్ పేర్లతో వాసికెక్కిన గోంగూర పింగళి నాగేంద్రరావుగారి పుణ్యమా అని, ఆంధ్రమాతగానూ, శాకాంబరీ దేవి ప్రసాదంగానూ ప్రసిద్ధిపొందింది. మనం గోంగూర పచ్చడి / పులుసు చేసుకున్నట్టే యూరోపియన్లు kenaf pesto తయారు చేసుకుంటారు. గుంటూరువైపు గోంగూర పచ్చణ్ణి ఉప్పచ్చడి అంటారు. కర్నూల్లో పుంటికూరపచ్చడి అనీ తెలంగాణాలో తొక్కుపచ్చడి అని పిలుస్తారు. కర్నూల్లో 'పుంటికూరపప్పు' చేస్తారు కోస్తాజిల్లాల్లో గోంగూర పులుసు కూరని ఉత్తపప్పుతో నంజుకుంటారు.

నిజానికి, మొదటినుండీ గోంగూరని మన పూర్వులు పూలమొక్కగానే భావించారు. చింతాకునీ, పులిచెంచలినీ వర్ణించిన కృష్ణరాయలు గోంగూర పేరెత్తలేదు. బహుశా ఆయన కాలానికి గోంగూర ఆకుల పుల్లని కమ్మని రుచి గురించి పెద్దగా తెలిసి ఉండకపోవచ్చు. "కోమలార్థందు ధరు కొమ్మ గోగులమ్మ" అంటూ శ్రీనాథుడు భీమేశ్వర పురాణంలో గోగులమ్మ దేవతని స్తుతించాడు. గోగుపూలతో అందంగా గొబ్బెమ్మల్ని అలంకరించటం అటు తెలంగాణా, ఇటు కోస్తాజిల్లాల్లో కూడా ఉంది. గోగులు పూయటం గురించి ఎన్నో జానపదగేయాలున్నాయి. అభిమన్యుడి రథం జెండా మీద గోంగూర పువ్వు గుర్తు ఉంటుందట! తెలుగు నేలమీదకు మిరపకాయలు ప్రవేశించాక ప్రజలకు గోంగూర ఆకుల పుల్లరుచి తెలిసొచ్చింది. 16, 17 శతాబ్దాల్లో డచ్చివాళ్ళు, పోర్చుగీసులు ఆనాటి తెలుగు ప్రజలతో ఊరుగాయలు

పెట్టించి దేశదేశాలకు ఎగుమతులు చేశారు. తరువాత ఇతర ఊరు గాయలతోపాటు, గోంగూర ఊరుగాయ పచ్చడిని కూడా తెలుగు వాళ్ళు భారీగా తయారుచేశారు. అలా గోంగూర తెలుగువారి వంటింట్లోకి చేరింది. అందుకే సర్కారీ జిల్లాల్లోనూ, రాయలసీమలోనూ గోంగూర ప్రశస్తి ఎక్కువగా కనిపిస్తుంది.

ఎత్తుకెత్తు ఉల్లిముక్కలు, ధనియాలపొడి, కొద్దిగా మెంతిపొడి, తగినంత మిరియాల పొడి కలిపి నూరితే గోంగూర అజీర్తిని, వాతపు నొప్పులను కలిగించకుండా ఉంటుంది. దాని లాభాలు మెండుగా కనిపిస్తాయి.

## తెలుగింటి ఊరుగాయలు

కృష్ణ నీళ్లతో తడిసి పండిన మిరప కాయలకు ఘాటెక్కువ. కృష్ణా, గుంటూరు జిల్లాలను తలుచుకుంటే ఎవరికైనా మిరపకారం, దాని సాయంతో పెట్టే ఊరుగాయలూ గుర్తుకొచ్చి నాలిక తడిబారుతుంది. అకస్మాత్తుగా అమ్మవారు ప్రత్యక్షమై, ఒక పాత్రలో ఆవకాయనీ, ఇంకో పాత్రలో అమృతాన్ని చూపించి, నరుడా ఏది కావాలి?అనడిగితే ఆవకాయనే కోరేవాడు తెలుగువాడు!

"ఘటికాచల మహత్మ్యం" కావ్యంలో తెనాలి రామకృష్ణుడు, "రాజ శేఖరచరిత్ర"లో మాదయగారి మల్లన ఊరుగాయలను బాగా వర్ణించారు. ఈనాటి గుంటూరుజిల్లాతో సంబంధం ఉన్న ఈ ఇద్దరు పూర్వకవుల వర్ణనల్లో ఊరు పండ్లు, ఊరుగాయలు వేర్వేరుగా కనిపిస్తాయి. పులవబెట్టకుండా కేవలం ఊరబెట్టే ప్రక్రియలో చేసిన ఊరుగాయకు ఉసిరి తొక్కుపచ్చడి (నల్లపచ్చడి) మంచి ఉదాహరణ. ప్రాచీనమైన ఊరుగాయ అంటే ఇదే! అలాగే టమోటా, చింతపండు, దోసపండు ఇలాంటి వాటితో ఊరగాయలు పెట్టినప్పుడు వాటిని ఊరుపండ్లు అంటారు.

కోస్తా జిల్లాల్లో మామిడి ముక్కల్ని నూనెలో ముంచి ఆవకాయ పెట్టే అలవాటు కృష్ణా, గుంటూరు జిల్లాల్లో ఉంది. తెలంగాణా కృష్ణాతీర ప్రాంతాలలో బాగా మరగ కాచిన నూనెను పోసి ఆవకాయ పెడతారు. చింతకాయ, నిమ్మకాయ ఊరగాయల్ని కూడా అలానే పెడతారు.

## మాగాయ

మాగాయ పెట్టేప్పుడు, మామిడి ముక్కలకు ఉప్పు రాసి ఊరబెట్టి, నీటిని పిండేసి, ముక్కల్ని ఎండలో పెడతారు. కొద్దిగా తడీ పొడిగా ఎండాక వాటిలో నూనె, ఉప్పు, కారం తగుపాళ్ళలో కలిపితే దాన్ని మాగాయి అంటారు. మాగాయిని ఇలానే పెట్టుకునే అలవాటు కృష్ణా జిల్లాలో చాలామందికి ఉంది. ఇలా కాకుండా, కానీ, బాగా ఎండిన మామిడిముక్కల్ని తిరిగి ఆ ఊటలోనే కలిపి ఒక రోజంతా పులవనిచ్చి, పులిశాక ఉప్పు, కారం, నూనె కలిపి తాలింపు పెట్టే పద్ధతినే ఎక్కువ మంది పాటిస్తున్నారు. ఇలా చేస్తే, మాగాయలో ఎక్కువ ఉప్పు, ఎక్కువ కారం కలపవలసి వస్తుంది.

## మిరపకాయలు

కోస్తావారి గుంటూరు మిరపకాయలకు, తెలంగాణావారి భద్రాచలం మిరపకాయలకు, రాయలసీమవారి బళ్ళారి మిరపకాయలకు రుచిలో గానీ, కారపు గొట్టులో గానీ చాలా తేడా ఉంది. కారం ఎక్కువగా కావాలనుకునేవారు గుంటూరు కాయ లతో ఊరగాయలు పెట్టుకుంటారు. తక్కువ కారం కోరుకునేవారు బళ్ళారి కాయలకు వెడతారు. మధ్యస్థంగా ఉంటాయి భద్రాచలం మిరపకాయలు.

## బంగినపల్లి మామిడి పండు

కర్నూలు పేరు చెప్పగానే ఎవరికైనా గుర్తుకొచ్చేది బంగినపల్లి మామిడిపండు. కర్నూలు నుండి కృష్ణాజిల్లా నూజివీడు దాకా ఈ బంగినపల్లి మామిడి తోటలు విస్తరించి ఉన్నాయి. వీటిని "బేనిషా" మామిడిపళ్ళు అనికూడా అంటారు. ఓ రాజుగారు ప్రతి మామిడి పండునీ పరిశీలించి ఏదో ఒక వంకపెట్టి ఆ చెట్టుమీద ముద్ర వేయించేవాడట. బంగినపల్లి మామిడిచెట్టులో ఏ లోపం దొరక్క ముద్ర వేయకుండా వదిలేశాడట. బేనిషా అంటే వంకలేనిదని !

## బొబ్బట్లు

కోస్తాజిల్లాలో బొబ్బట్లు అనీ, కర్నూలుజిల్లాల్లో భక్ష్యాలనీ, తెలంగాణలో పోలె భక్ష్యాలనీ, కన్నడ సరిహద్దు ప్రాంతాల్లో ఒబ్బట్లు, పోళిగలు, ఓళిగలనీ పిలిచే ఈ బొబ్బట్లు అతిథి మర్యాదలకు ఉత్తమ వంటకం. తేలికగా చేయగలిగింది కూడా. కర్నూల్లో వీటి తయారీ కోసం, గోధుమపిండి కాకుండా ఫేనీ రవ్వని ఉపయోగిస్తారు.

## ఉగ్గాని బజ్జి

కర్నూలు అనంతపురం జిల్లాల్లో ఉగ్గాని బజ్జీలని దొరుకుతాయి. బొరుగులు (మరమరాలు) తాలింపుపెట్టి బజ్జీలు నంజుకొంటూ తింటారు.

## మజ్జిగ పులుసు

కోస్తాజిల్లాల్లో పండిత కుటుంబాల్లో మజ్జిగ పులుసుని తేమనం అనటం ఉంది. బియ్యం, శనగపప్పు, అల్లం మిర్చి నూరి గట్టిగా ఉండలు కట్టి ఈ మజ్జిగపులుసులో వేసి ఉడికిస్తారు. బహుశా తిమ్మనలంటే ఇవే కావచ్చు. తెలంగాణలో చిన్న చిన్న బజ్జీలని వేసి, మజ్జిగ పులుసుని కాస్తారు. వీటిని బొబ్బడాలు అంటారు. ఈ బొబ్బడాలు ఆ మజ్జిగపులుసులో ఎంత నానితే అంత రుచి !

## బేడలు

కందిపప్పుని కంది బేడలు అనటం రాయలసీమలోప్రసిద్ధి. బైదళం (ద్విదళ బీజాలు) కాబట్టి ఈ పేరు వచ్చి ఉండవచ్చు. కర్నూలు జిల్లాలో "శనగబేడల పాసెం" చాలా ఇష్టంగా తింటారు. కర్నూలు జిల్లాలో

ఉద్దలు బేడలు అంటే మినపప్పు అని అర్థం. కందిపప్పు, పుట్నాలపప్పు (గుల్లపప్పు),ఉలవలు,పెసలు, మినుములు,అల చందలు, నువ్వుపప్పు, వేరుశనగపప్పు, ఇలాంటి పప్పుధాన్యాలన్నీ బేడలే ! కర్నూల్లో వేరుశనగని బుడ్డలనీ, తెలంగాణాలో పల్లీలనీ, కోస్తాజిల్లాలో వేరుశనగ గుళ్ళు అనీ అంటారు.

## కందిపచ్చడి

కోస్తాజిల్లాల్లో కందిపచ్చడి ప్రీతిపాత్రం. దీన్ని పచ్చిపులుసుతో నంజుకు తినే సాంప్రదాయం ఉంది. ఆయుర్వేద గ్రంథాల్లో కంది పప్పుని పులుసుతో తినాలనే సూత్రం ఉంది.

## సున్నిపొడి

కోస్తాజిల్లాల వారికి కందిసున్ని అంటే ఎక్కువ ఇష్టం. పాతికేళ్ళ క్రితం వరకూ, రాత్రి భోజనాల్లో పప్పుకి బదులుగా కందిసున్ని వడ్డించే వాళ్ళు. చూర్ణం అనే మాట సున్నిగా మారింది. ఉత్తరాంధ్రలో 'గుండ' అనీ,తక్కిన ప్రాంతాల్లో సున్ని అని పిలుస్తారు.కందిపొడిని బాగా నెయ్యి వేసుకొనితింటారు."నిన్ను ముంచకపోతే నన్ను ముంచు తావట" అంటాడు. "ఇంటింటి పజ్యాలు" పుస్తకంలో ఆరుద్ర... కంది సున్నితో మినపసున్ని, ఉలవ సున్ని, పెసరసున్ని, శనగసున్ని, అల్చందల సున్ని ఇలా రకరకా లుగా సున్నిపొడి చేసుకునే అలవాటు కోస్తాజిల్లాల్లో ఎక్కువ.

## పులగం పచ్చడి

పెసర పులగాన్ని కోస్తా రాయలసీమల్లో ఎక్కువగా ఇష్టపడతారు. బాగా నెయ్యివేసి వండితే గానీ దాని రుచి తెలియదు. కటుపొంగలి అనే మాటని హోటళ్ళవాళ్ళు వ్యాప్తి చేశారు. సాంప్రదాయిక కుటుం బాల్లో పులగం అనే మాటే నేటికీ వ్యాప్తిలో ఉంది. కర్నూలు జిల్లాలో బుడ్డలు (వేరుశనగగుళ్ళు) పచ్చడితో దీన్ని నంజుకుని తింటారు. కాబట్టి పులగం పచ్చడి అనటం ఒక అలవాటు. బాలింతలకు స్నానం అయ్యాక ఈ పులగం పచ్చడి పెట్టడం అక్కడొక ఆచారం.

## అత్తరాసలు

గారెని మహబూబ్‌నగర్‌జిల్లాలో అత్తరాసెలు అంటారు. తక్కిన దేశం అంతా 'వడ' అనే అంటున్నా గుంటూరు, కృష్ణాజిల్లాల్లో "గారె" అని పిలుస్తున్నారింకా! చిల్లు పెట్టినవి గారెలనీ, చిల్లుపెట్టకుండా వండినవి వడలనీ, ముద్దగా వేస్తే పునుగులనీ పిలుస్తారు. ఆవపెట్టిన పెరుగులో నానబెట్టిన వాటిని ఆవడలంటారు. అది'ఆమవడ' నుంచి వచ్చిందని కొందరంటారు.

## అతిరసాలు

అరిసి అంటే వరి బియ్యం. బియ్యప్పిండి వంటకం కాబట్టి అరిసె అన్నారు. దీనికి అతిరసం అనే మారుపేరుంది. కర్నూలుజిల్లాల్లో అపరాసులు అని పిలుస్తారు. తెలంగాణలో అరిసె, అతిరసం రెండు పదాలూ వ్యాప్తిలో ఉన్నాయి. అరుగుదల బలంగా ఉన్నవారిని అరిసెలు ఏమీ చేయలేవు. జీర్ణశక్తి బలహీనంగా ఉన్నవారిని అరి అంటే శత్రువులా బాధిస్తాయని కూడా అర్థం చేసుకోవాలి.

## పొరి విళంగాయలు

పొరి, పురి, పొరటు పదాలకు గుల్లబారేలా వేయించటం అని అర్థం. 'ఆముక్తమాల్యద' కావ్యంలో పాండ్య రాజు దగ్గరకు శ్రీవిల్లి పుత్తూరు నుండి మధుర బయల్దేరిన విష్ణుచిత్తుడికి ప్రయాణంలో తినటం కోసం ఆయన భార్య కొన్ని ఆహారపదార్థాలు పొట్లాం కట్టి ఇచ్చింది. వాటిలో ఈ పొరివిళంగాయలు కూడా ఉన్నాయి. గుల్ల బారేలా వేయించిన పెసరపప్పుని అంటే పుట్నాల పెసరపప్పు, బొరు గులు (మరమరాలు) ఈ రెండింటినీ సమానంగా తీసుకుని బెల్లం పాకం పట్టి ఉండలు కడతారు. ఇవే పొరి విళంగాయలంటే! కర్నూల్లో వీటిని తాము వండుకుంటామని చాలామంది చెప్పారు.

## కోస్తాజిల్లాల్లో బొబ్బట్లు

కన్నడ పరిసరప్రాంతాల్లో ఒబ్బట్లు, తెలంగాణాలో పోలెలు, రాయలసీమలో భక్ష్యాలు, ఒకే వంటకానికి సంబంధించిన పేర్లే!

## సంక్రాంతి సకినాలు

నల్గొండ మహబూబ్‌నగర్ ఇతర తెలంగాణా జిల్లాల్లో 'సకిలాలు', కోస్తాజిల్లాల్లో 'చక్రాలు' కర్నూలు జిల్లాలో 'జంతికలు' ఇంచుమించు ఒకే తరహా వంటకం. బియ్యప్పిండి లేదా జొన్నపిండితో చేసిన వంట కాలివి.మూడు ప్రాంతాల్లోనూ సారెసత్తుల్లో ఇవిముఖ్యమైనవి. చీరపెట్టి, అపరాసులు, కరిజలు, చలిమిడి, జంతికలు వీటిని పుట్టింటివారు కొత్త పెళ్ళికూతురు ఒళ్ళో పెట్టి కాపురానికి పంపుతారు.

## జొన్నకూడు

వికసించిన తామరపూల వంటి కన్నులున్న అందగాడా! చిన్న నాట పూతన రొమ్ముపాలలో చేదు తాగేసాననీ, పెద్ద దావాగ్ని మింగేశా ననీ విర్రవీగుతున్నావేమో, లేత చింత చిగురు కలిపి వండిన బచ్చలాకు పులుసుకూరని ఈ జొన్నకూట్లో కలుపుకుని ఒక్క ముద్ద తిని చూడు...నీ పస ఏమిటో తెలుస్తుంది..." అంటూ కృష్ణుణ్ణి నిలేస్తాడు శ్రీనాథుడు.

700 యేళ్ళక్రితం ఆయన నెల్లూరు, కృష్ణా, గుంటూరు మండ లాల్లో ఎక్కువగా జీవించాడు. చివరి రోజుల్లో కృష్ణ ఒడ్డున బొడ్డుపల్లిలో గొడ్దేరి (దండగమారిన శ్రమ) మోసపోయాడు. వ్యవసాయం కారణంగా ప్రాణాలర్పించుకున్న తొలి తెలుగు రైతు ఆయన! పలనాడు వెళ్ళి

జొన్నకూడుని, కర్ణాటక వెళ్ళి రాగి సంకటినీ తినటానికి నానా తంటాలు పడి, తన అవస్థని ఇలా చాటుపద్యాల్లో చెప్పుకున్నాడు. తెలంగాణలో సజ్జరొట్టెల్ని, రాయలసీమలో రాగి రొట్టె, జొన్నరొట్టెల్ని ప్రధానంగా తీసుకుంటారు. పప్పు, పులుసు, రసం (చారు)లతో నంజుకుంటారు. జొన్నలకన్నా బియ్యమే కారుచౌకగా దొరుకుతున్నాయి. జొన్నలు, రాగులు, సజ్జల్ని ఖరీదైన మనుషులే కొనగలిగేలా ఉన్నాయి. వరికూడే పేదకూడు, జొన్నన్నం రాజభోజనం!

చల్లముద్ద = నిశ్చితార్థం సమయంలో రాగి ముద్దని అమ్మవారిగా భావించి పెళ్ళిళ్ళలో గౌరీపూజ చేసినట్టుగా పూజిస్తారు. ఒక ఆహార పదార్థం పట్ల అలాంటి భక్తిభావం ఉండబట్టే అన్నాన్ని పరబ్రహ్మ స్వరూపం అన్నారు పెద్దలు.

## తెలంగాణలో సేవికలు

సీమ, కోస్తాల్లో సేమ్యా అనీ, తెలంగాణలో సేవిక అనీ పిలుస్తారు. శ్రీనాథుడే 'సేవిక'ల గురించి అనేకసార్లు ప్రస్తావించాడు. సేమ్యా పాయసాన్ని "సేవెపాసెము"అన్నాడు. సేవికా మోదకాలు అనేవి మరొక రకం తీపి వంటకం. సన్నని దారాలుగా చేసిన సేమ్యాని చిన్నవిగా నలిపి, నేతితో వేయించి పంచదార పాకం పట్టి లడ్డూ ఉండలు కడితే వాటిని సేవికా మోదకాలంటారు. కర్నూలు జిల్లాలో సేమ్యాని సేవె పోచలు అంటారు. అక్కడ సొంగలు అంటే వడియాలు.

## కొర్రపాయసం

తెలంగాణలో కొర్రపాయసం, కృష్ణా, గుంటూరు జిల్లాల్లో పాల తారికలు కర్నూలు జిల్లాల్లో శనగబేళ్ళ పాయసం ప్రసిద్ధి. ఇంగ్లీషు వాళ్ళు ఉదయం పూట పారిడ్జిని అల్పాహారంగా తీసుకున్నట్టు ఈ మూడింటినీ మనమూ తీసుకోవచ్చు.బియ్యప్పిండి ముద్దనిచక్రాల గిద్దెలో ఉంచి మరుగుతున్న పాలలో చక్రాలుగా వత్తి, పాలతారికలు వండుతారు.

## తెలంగాణలో మక్కజొన్న పొత్తులు

కొలంబస్ అమెరికాని కనుగొన్నాకే మిరపకాయలు, పొగాకు, బంగాళాదుంపలు, మక్కజొన్న వీటిగురించి బైట ప్రపంచానికి తెలిసింది. బ్రిటిషర్లు వీటిని 16,17 శతాబ్దాలలో భారతదేశంలో పండింపచేశారు.అమెరికన్ ఆదివాసీ రెడ్డిండియన్లు వీటిని 'మైజ్'అని పిలుస్తారు. తెలంగాణలో "మక్కజొన్న పొత్తు"లనీ, తక్కిన ప్రాంతాల్లో "మొక్కజొన్న పొత్తు"లనీ పిలుస్తారు. 'మక్కజొన్నే సరయిన పిలుపు. మక్క అంటే, స్త్రీల పొత్తికడుపు. పొత్తిళ్ళలో పాపాయిలా అనేక రేకుల మధ్య దీని కండె భద్రంగా ఉంటుంది. జొన్నకండెలకు పొత్తు లుండవు. పొత్తులు (పొరలు, రేకులు) కలిగినది కాబట్టి, దాన్ని 'మక్కజొన్న పొత్తు' అన్నారు. మక్కజొన్న పేలాలలో ఫైబర్ ఎక్కువగానూ, కేలరీలు తక్కువగానూ ఉంటాయి. శనగపిండికి బదులుగా మక్కజొన్న పిండిని కూరలు ఇతర ఆహారపదార్థాల్లో విస్తారంగా ఉపయోగిస్తున్నారు. తీపి మక్కజొన్న గింజల్ని (స్వీట్‌కార్న్) సాతాళించటం, బూందీలాగా వేయించటం ఇప్పుడు కొత్త వంటకాలు. సమోసాలు కూడా వండుతున్నారు.

## జొన్నంబలి

"పని చేసి గంజి ఐనను అంబలైనను నెద చల్లగా ద్రాగి యెచటనైన/ పడియుండి వెన్నెల గుడిపాట పాడగా పేదల కాత్మ సంప్రీతి కలుగు' గంజిగానీ, అంబలిగానీ తాగి పనికి వెళ్ళే రైతు కూలీలు, ఇతర శ్రామిక జీవులు పనిచేసుకుంటూ వెన్నెలగుడి పాటలు పాడుకుంటూ ఉంటే ఆత్మ సంప్రీతి కలుగుతుందని వ్రాశాడు శ్రీనాథుడు. వెన్నెలగుడి అంటే జాబిల్లి. రావోయి చందమామ లాంటి పాటలు వెన్నెలగుడి పాటలు కావచ్చు. ఇది తాగితే ఎద చల్లగా ఉంటుందిట.

జొన్నపిండిని పలుచగా ఉడికిస్తే అంబలి అంటారు. దానిలో పెరుగు కలిపి, చిలికితే చిక్కని మజ్జిగ అవుతాయి. దాన్ని చల్లంబలి అంటారు. అంబకళం అనికూడా అంటారు. కర్నూలు జిల్లాలో ఇంకా జొన్నంబలి తాగేవారున్నారు. రాగంబలి కూడా ప్రసిద్ధమే! ఒకట్రొండు రోజులు నిలవుంచి పులియబెడితే దాన్ని 'పులిజావ' అంటారు ప్రొద్దునే పనులకు వెళ్ళే శ్రామికులు ఈ అంబలి తాగే వేళని అంబటేళ అనటం కర్నూలు, మహబూబ్‌నగర్ నల్గొండ జిల్లాల్లో బాగా వినిపిస్తుంది. కర్నూలు జిల్లాలో అంబలిని అమ్మరి అనికూడా అంటారు.

## పంచదార పుట్టిల్లు

కృష్ణాతీరంలో బౌద్ధ క్షేత్రాలు విస్తృతంగా ఉన్న కృష్ణా, గుంటూరు జిల్లాల్లో పంచదార అనే పదం బాగా వాడకంలో ఉంది. తక్కిన ప్రాంతాల్లో చక్కెర అనే పిలుస్తారు. పంచదార తయారీ గురించి క్రీ.శ. 5వ శతాబ్ది నాటికే భారతీయ శాస్త్రవేత్తలకు తెలుసు. శ్రీహర్షుడి కాలంలో భారతీయ బౌద్ధులు చైనా తదితర తూర్పు దేశాలకు పంచదారని పరిచయం చేశారని చరిత్ర చెప్తోంది. పంచన్ అంటే బౌద్ధ భిక్షువు. దార అంటే కానుకగా దారాదత్తం చేయటం. బౌద్ధ భిక్షువులు ఈ ప్రపంచానికి ఇచ్చిన కానుకగా కృష్ణయొడ్డు ప్రజలు పంచదారను ఆ పేరుతో గౌరవంగా పిలుస్తున్నారు. 'సుగుడం' - స్వచ్ఛమైన బెల్లం అనే అర్థంలో షుగర్ అంటున్నారు.

## పులిహోర

పులిహోరని కర్నూలు తదితర సీమ జిల్లాల్లో'చిత్రాన్నం' అంటారు. 'పులుసన్నం' అనే నామాంతరం కూడా ఉంది. దీన్ని కృష్ణా, గుంటూరు జిల్లాల్లో ఆవపిండి, మెంతిపిండి, బెల్లం కూడా చేర్చి తయారుచేస్తారు.

దాని రుచే వేరు. అవి కలపటం వలన పులిహోరలో తీపి, పులుపు, ఉప్పు, కారం, వగరు, చేదు రుచులు ఆరూ కలిసి ఉంటాయి. ఇలా వండిన పులిహోరషడ్రసోపేతమైన భోజనంతో సమానంగా ఉంటుంది. తేలికగా అరుగుతుంది. ఎలాంటి హానీ కలిగించకుండా ఉంటుంది.

**పాతోళీ :**

కడిగిన బియ్యం, కడిగిన అటుకులు, కొబ్బరి కోరు మూడింటినీ మెత్తగా రుబ్బి, పసుపు, అరటి ఆకుమీద అట్టులా పరుస్తారు. చెంచాడు బెల్లం పాకాన్ని మధ్యలో ఉంచి ఆకుల్ని మిఠాయి పొట్లాంలా చుట్టి అవిరిమీద ఉడికిస్తారు. ఉడికిన తరువాత ఆకుని వేరు చేస్తారు. ఇదే పాతోళీ అంటే ! సీమ ప్రాంతంలో దీని వాడకం ఎక్కువ. కన్నడిగులకు ఇది పవిత్ర వంటకం. కేరళవారు 'ఏలాఅడా' అంటారు. కోనసీమలో పనసపొట్టెంకలు పేరుతో ఇంకో వంటకం ఉంది. పనస ఆకుల దొన్నె చేసి అందులో ఇడ్లీ పిండిని ఉంచి ఉడికిస్తారు. ఉదయం అల్పాహారానికి అనువుగా ఉంటుంది. అట్టుని బెల్లంతోనూ, ఇడ్లీని పంచదారతోనూ తినే అలవాటు కోస్తా జిల్లాలవారికి ఎక్కువ.

**కరిజెలు**

తెలంగాణాలో కరిజెలు, సీమలో గరిజెలు, కోస్తాజిల్లాల్లో కజ్జికాయలు మూడూ ఒకే వంటకం. పూరీ అప్పడం వత్తి, దాని మధ్యలో తీపి కలిసిన నువ్వుపొడిగానీ, పుట్నాలపప్పుపొడి గానీ, బాదం, జీడిపప్పు, వేరుశనగపప్పు వీటి పొడిగాని, గసగసాలపొడిని గానీ ఒక చెంచాడు ఉంచి కజ్జికాయలు తయారుచేస్తారు. మధ్యలో పూర్ణంగా ఉంచే ఈ పొడి విషయంలో ప్రాంతీయ భేదాలు తప్ప కజ్జికాయలు తయారీలో తేడాలేదు. మహారాష్ట్రీయుల కరంజీల ప్రభావం కొంత తెలంగాణా కరిజెల విషయంలో ఉండొచ్చు.

**సర్వపిండి అప్పాలు**

సర్వపిండి అంటే వరిపిండి. మహబూబ్ నగర్, వరంగల్, నల్గొండ జిల్లాల్లో ఇది ప్రసిద్ధి. కర్నూలు, బళ్ళారి ప్రాంతాల్లో మండిగలు లేదా మండెగలు అంటారు. మండెగలతో, క్రొన్నేతితో భోజనం చేసినట్టు శ్రీనాథుడు పేర్కొన్నాడు. మంటకం అనే పేరుకూడా ఉంది. కోస్తాజిల్లాల్లో వీటినే తప్పేళా చెక్కలని పిలుస్తారు. తప్పేళా అంటే వంటగిన్నె. దాన్ని పొయ్యిమీద బోర్లించి అడుగున మంటబెట్టి, ముద్దగా తడిపిన పిండిని ఆ గిన్నెపైన ఉంచి వ్రేళ్ళతో గుండ్రంగా అట్టులా నొక్కుతారు. శ్రీనాథుడు "మాణిబంధాశ్మ లవణ పాణింధమములు - సైంధవ లవణం, బియ్యప్పిండి కలిపి, చేత్తో వత్తిన వంటకం" అన్నది ఈ తప్పేళా చెక్కల్నే! వీటిని కొరికి 'కోరల పౌర్ణమి' రోజున కుక్కలకు వేసే ఆచారం తెలుగువాళ్ళలో చాలామందికుంది.

తెలంగాణాలో, రకరకాల కూరలు, పచ్చిమిరపకాయలు, ఉల్లిపాయముక్కలు కలిపి "సర్వపిండి అప్పాలు" కాలుస్తారు. గౌరుగుపిండి అప్పాలని కూడా అంటారు. ఇది ఉదయం అల్పాహారంగా ఉపయోగపడుతుంది. కడుపులో దండిగా ఉంటుంది.

**బెల్లమండిగలు**

శ్రీనాథుడు బెల్లమండిగలనూ ప్రస్తావించాడు. ఇవి తీపి 'తప్పేళ చెక్క'లన్నమాట. జమిలి మండిగల్ని కూడా వండుకునేవాళ్ళు. జమిలి అంటే రెండు. బహుశా రెండు తప్పేలా చెక్కల్ని తీసుకుని ఆ రెండింటి మధ్య పచ్చి కూరగాయల తురుము పెట్టుకుని ఇప్పటి బర్గర్ల లాగా జమిలి మండిగలను తెలుగువారు తినే వారనుకోవచ్చు. శ్రీనాథుడు "గుజ్జుగా కాచిన గోక్షీర పూరంబు జమిలి మండిగలపై జల్లి" నట్టు వర్ణించాడు. దీన్ని బట్టి పాలను గుజ్జుగా కోవా అయ్యేవరకూ మరిగించి జమిలి మండిగల మధ్య ఈ కోవాక్రీము ఉంచి అంటిస్తే అవే జమిలి మండిగలు. కేకులమీద డిజైను వేసినట్టు ఈ జమిలి మండిగల మీద పాలగుజ్జుతో వేసిన డిజైను కొత్త పెళ్ళికూతురు కట్టిన తెల్లచీర అంచులా ఉన్నదంటాడు శ్రీనాథుడు. భోజనాన్ని ఇలా ఆస్వాదిస్తూ తినటం ఒక్క శ్రీనాథుడికి మాత్రమే తెలుసు.

**నూటిడి**

శ్రీనాథుడు 'నూటిడి' అనీ, అన్నమాచార్యులు 'నువ్వటిడి' అనీ వర్ణించిన ఈ వంటకం కోస్తా జిల్లాలో జీడీలుగా ప్రసిద్ధి. ఇవి చంద్రబింబంలా తెల్లగా ఉన్నాయట. 'నువ్వుపొడి'ని బెల్లంపాకంలో కలిపి జీడీలు చేసుకుని ఉండవచ్చు అనాడు. కోస్తాజిల్లాల్లో నువ్వుపప్పు అద్దిన జీడీలు దొరుకుతాయి.

**బత్తాసులూ - చిలకలూ**

కర్నూల్లో బత్తాసుల్ని తీపి ప్రసాదంగా దేవాలయాల దగ్గర విక్రయిస్తుంటారు. భక్త, భుక్త, భోక్త పదాలన్నీ భుజించటానికి సంబంధించినవి. బత్తాసు అనే మాట వీటిలోంచే వచ్చింది ! లోహంతో చేసిన ఒక ప్రమిదకు ఇనుప తీగని టాకా పెడతారు. పంచదార పాకంపట్టి ఈ ప్రమిదలో పోసి, రెండుచుక్కలు నిమ్మరసం కలిపి పుల్లతో తిప్పుతారు. అది గట్టిపడి ప్రమిదాకారంలో ఉంటుంది ఇవే బత్తాసులంటే ! ఇవి కర్నూలు అనంతపురం జిల్లాల్లో ప్రసిద్ధి. కోస్తా తెలంగాణాల్లో హంస, చిలక, కోడి, గొల్లభామ ఆకారంలో చెక్క అచ్చులు అమ్ముతారు. పంచదార పాకం ఈ అచ్చుల్లో పోసి చిలకలు తయారుచేస్తారు. కృష్ణా, గుంటూరు జిల్లాలు చిలకలకు ప్రసిద్ధి.

## ఆహార మాండలికాలు

పలనాడు నేతి మిఠాయి, బాపట్ల పులిబొంగరాలు, బాపట్ల గుత్తొం కాయలు, గుంటూరు మిరపకాయలు, గుంటూరు ధనాసి గోంగూర, బందరు లడ్డు, హల్వా, తెలంగాణా నాటుకోడి కూర, బిరియానీ పలావులు ఇలా ఒక్కో ప్రాంతంలో ఒక్కో ఆహార ద్రవ్యం కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. కర్నూలు పుల్లారెడ్డి స్వీట్లు, బందరు తాతారావు హల్వా, సుబ్బారావు స్వీట్లు ప్రసిద్ధి.

మహబూబ్‌నగర్‌లోని గద్వాల ఆలంపూరు కొల్లాపూరు సంస్థానాల మీద కర్నూలు ప్రభావం ఎక్కువ ! ఈ కృష్ణాతీర ప్రాంతాల్లో అప్ప చ్చుల్చి ఆచి లేదా అప్పిచ్చి అంటారు. ఉప్పిట్టి అంటే ఉప్మా. ఇంగలం = నిప్పు (ఇంగ్లం), ఇలాత్ కాయ అంటే వేరుశనక్కాయ. కూరగాయల్ని తర్కారీ అంటాడు. అరటిపండుని బాళేపండు అని పిలుస్తారు. ఇవన్నీ ఆహారమాండలిక వ్యత్యాసాలు.

ఆ నేలకున్న పండే స్వభావం ఆధారంగా ఆహార మాండలికాలు ఏర్పడతాయి. వరి, గోధుమ, పండని ప్రాంతాల్లో ప్రజలు అవే వంట కాల్ని ప్రత్యామ్నాయ ధాన్యాలతో వండుకుంటారు. వండిన ధాన్యాన్ని బట్టి వాటిలో చింతపండు వగైరా సంబారాలు అవసరం అవుతాయి. మెట్ట ప్రాంతాల్లోనూ, వర్షాభావ పరిస్థితులు ఎక్కువగా ఉండే ప్రాంతా ల్లోనూ ప్రజల ఆహారానికి, నదీతీర ప్రజల ఆహారానికీ ఖచ్చితంగా తేడా ఉంటుంది. అందుబాటులో ఉండే వనరుల్ని ఉపయోగించు కుంటూనే మనిషి మనుగడ సాగించవలసి ఉంటుంది.

హోటళ్ళ వాళ్ల వలన మన ఆహార సంస్కృతి నశిస్తోన్న మాట నిజమే అయినప్పటికీ, సాంప్రదాయక ఆహారాలను వండుకోవటానికి, వాటిని కాపాడుకోవటానికి మనం శ్రద్ధచూపించకపోవటం వలన ఆహార సంస్కృతి నాశనం కావటానికి మనం సహకరించినట్టు అవుతుంది. ఆహారసంస్కృతి, భాష, సమాజం, ఆచార వ్యవహారాలు ఒకే కుదురులోంచి పుట్టాయి. వాటిని పదిలపరచుకోవటం, వాటి మూలాలను అన్వేషించటం మన బాధ్యత.

### చంద్రరాజేశ్వరరావు

'విప్లవ జ్యోతి'యై వీరపోరాటముల్
    గావించి రాష్ట్రాన గణ్యుడయ్యె
'మార్క్సిష్టు' భావాలె మాన్యతఁజేకూర్చ
    ప్రజల సేవయొనర్చి వాసిఁగాంచె
కేంద్రరాష్ట్రాలలో కీలక బాధ్యత
    మేలుగఁజేపట్టి మెప్పులందె
'రష్యా' ప్రభుత్వపు ప్రఖ్యాత 'లెనిను'పు
    రస్కారమునుఁగొని రహినిఁగూర్చె

సత్య సేవలొసగె సాహితీ ప్రియుడౌచు
'కమ్యునిష్టు' పార్టి ఘనతఁబెంచె
సాంద్ర భావ నిధియె 'చంద్రరాజేశుండు'
కీర్తి కళలరాణి! కృష్ణవేణి!

*– స్మితశ్రీ చింతపల్లి నాగేశ్వరరావు*

శ్రీ సయ్యద్ నశీర్ అహమ్మద్

# భారత స్వాతంత్ర్యోద్యమంలో కృష్ణాతీరం ముస్లిం యోధులు

బ్రిటిష్ బానిస బంధనాల నుండి విముక్తిని కోరుకుంటూ, వజ్ర సంకల్పంతో, అద్వితీయ పోరాటపటిమతో భారతీయులు సాగించిన స్వాతంత్ర్యోద్యమం ప్రపంచ పోరాటాల చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగిన మహత్తర ఘట్టం. ఈ మహోద్యమంలో భిన్నత్వంలో ఏకత్వం- ఏకత్వంలో భిన్నత్వం, అంతర్గత మార్గదర్శక సూత్రంగా సాగుతున్న భారతీయ సాంఘిక జనసముదాయాలలో ఒకటైన ముస్లిం ప్రజానీకం సోదర జనసమూహాలతో కలిసి మెలసి ఈ పోరులో క్రియా శీలకంగా పాల్గొంది. అది శాంతిపథమైనా, విప్లవమార్గమైనా ఆత్మార్ప ణలకు ఏనాడు వెనుకడుగు వేయలేదు. మాతృభూమి పట్లగల అవ్యాజ ప్రేమాభిమానాల ఫలితంగా తమ ధన మాన ప్రాణాలను సైతం పణంగా పెట్టి సోదర సమానులతో కలిసి ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ఉద్యమించారు. అపూర్వ త్యాగాలు, అద్వితీయ సాహసాలతో బ్రిటిష్ వలస పాలకులను స్వదేశం నుండి పారద్రోలి **స్వదేశీయుల పాలన** సాధించుకోవడంలో మహత్తర పాత్ర నిర్వహించారు. ఈ పోరులో అశేష హిమాచలం ఎలాగైతే నడుంకట్టి కదనరంగానికి కదలి కలసి వచ్చిందో అదే విధంగా తెలుగు గడ్డ ముస్లిం జనసముదాయం కూడా పోటెత్తిన సముద్రంలా త్యాగాల బాటలో ముందుకు సాగింది. ఈ క్రమంలో కృష్ణాతీరంలో (కృష్ణా, గుంటూరు, కర్నూలు, మహబూబ్ నగర్ జిల్లాలు) పుట్టి పెరిగిన ముస్లింలు తరతరాలుగా తమతో కలసి మెలసి సహజీవనం సాగిస్తున్న సోదర సమానుల దారినే ఎంచుకుని భారత స్వాతంత్ర్యసంగ్రామానికి తమవంతు భాగస్వామ్యాన్ని అందించారు.

## తెలుగు గడ్డ మీద 1780లో 'తొలి' తిరుగుబాటు :

కృష్ణాతీరంలో బ్రిటిష్ పాలకులకు వ్యతిరేకంగాసాగిన పోరాటంలో ముస్లింల పాత్రను ప్రస్తావించుకున్నప్పుడు షేక్ అహమ్మద్ సాహసోపేత పాత్రతో ఆరంభించాల్సి వస్తుంది. షేక్ అహమ్మద్(-1780) గుంటూరు జిల్లా సత్తెనపల్లికి చెందిన వ్యక్తిగా ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆర్కియాలజీ విభాగం విశ్రాంత అధిపతి డాక్టర్ ఇ.వి. గంగాధరం సమాచారం ద్వారా తెలుస్తుంది. షేక్ అహమ్మద్ ఈస్ట్ ఇండియాకంపెనీ విశాఖపట్నం సైనిక స్థావరంలోని సైన్యంలో సుబేదార్‌గా బాధ్యతలు నిర్వహించారు. ఆంగ్లేయపాలకుల వివక్ష, పెత్తనానికి కినిసి తోటి సహచరులతో కలసి 1780లో వలసపాలకుల మీద తొలిసారిగా తిరుగుబాటు పతాకాన్ని ఎగురవేశారు. స్వదేశీసైనికుల కట్టలు తెంచుకున్న ఆగ్రహానికి తట్టుకోలేక కంపెనీ సైన్యాధికారులు కాళ్ళకు బుద్ధి చెప్పారు. స్వదేశీ సైనికుల తుపాకి గుండ్ల నుండి ప్రాణాలను రక్షించుకునేందుకు కలుగుల్లోకి దూరిన ఎలుకల్లా దాక్కొన్నారు. ఆ చర్యతో విశాఖపట్నంలోని బ్రిటిష్ సైనికస్థావరమంతా స్వదేశీ సైనికుల అధీనంలోకి వచ్చింది. విశాఖ సైనిక స్థావరం కోశాగారాన్ని, అయుధాగారాన్ని సుబేదార్ అహమ్మద్ స్వాధీనం చేసుకుని తిరుగుబాటు పతాకాన్ని రెపరెపలాడించారు. ఆ తరువాత పరిణామాల నేపథ్యంలో పర్లాకిమిడి జమీందారు నారాయణ గణపతి దేవ్ నమ్మకద్రోహం వలన తెలుగు గడ్డ మీద చిగురించిన సాహసో పేత తిరుగుబాటు విఫలమైంది. సుబేదార్ అహమ్మద్‌ను కంపెనీ సైన్యాలు ఫిరంగికి కట్టి పేల్చివేశాయి. ఆంధ్ర విశ్వవిద్యాలయం చరిత్ర శాఖాధి పతి డాక్టర్ కొల్లూరు సూర్యనారాయణ నవంబరు 28, 2006న విశాఖపట్నంలోని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వ్యాసకర్తతో మాట్లాడుతూ, **తొలి తిరుగుబాటు 1780 అక్టోబరు 3న విశాఖపట్నంలో జరిగింది...దురదృష్టవశాత్తు ప్రజలకు మంగళపాండే మాత్రమే తెలుసు,** అని వ్యాఖ్యానించడం ద్వారా ఆనాడు షేక్ అహమ్మద్ నిర్వహించిన మహత్తర పాత్ర ప్రాముఖ్యత వెల్లడవుతుంది. ఈ విషయాన్ని డాక్టర్ కొల్లూరు 'దక్కన్ క్రానికల్' దినపత్రికలో ప్రచురితమైన ఆర్టికల్‌లో మరింతగా వివరంగా రూఢీ చేశారు. ('The First revolt occured in Vizagapatnam on October 3,1780...Unfortuntely people know only about Mangal Pande' - 'Deccen Chronicle', Daily, Vijayawada, 01-10-2006, Page 1-2).

## 1840లో కర్నూలు నవాబు గులాం రసూల్ ఖాన్ పోరాటం:

ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాలతో తలపడ్డ మరో యోధులుగా

కర్నూలు నవాబు గులాం రసూల్ ఖాన్ (-1840) సుప్రసిద్ధులు. ఆంగ్లేయుల పెత్తనాన్ని సహించక పోరుబాట పట్టిననిజాం రాకుమారుడు ముబారిజుద్దౌలాతో (1800-1854) కలసి ఈస్ట్ ఇండియా కంపెనీ మీద పోరాటానికి నవాబు గులాం రసూల్ ఖాన్ సన్నద్ధమయ్యారు. స్వంత గడ్డ మీద పరాయి పాలకుల పెత్తనాన్ని ఏమాత్రం సహించని గులాం రసూల్ ఖాన్ తొలినాట నుండి ఆంగ్లేయులతో తగాద పడుతూ వచ్చారు. చివరకు పూర్తి స్థాయిలో యుద్ధం తప్పదని భావించిన ఆయన కర్నూలులోని తన కోటను పూర్తిగా ఆయుధాగారంగా మార్చు కున్నారు. ఆంగ్ల సైన్యాలతో సాగించాల్సిన యుద్ధానికి అవసరమగు సాధన సంపత్తిని సమకూర్చుకుంటున్న సమయంలో అధికారం కోసం అర్రులు చాస్తున్న స్వజనుల నమ్మక ద్రోహం వలన ఈ రహస్యం ఆంగ్లేయాధి కారులకు చేరుకుంది. ఆఘమేఘాల మీద ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాలు 1839 అక్టోబర్ 18న ఎ.బి.డైస్ నాయకత్వంలో కర్నూలు కోట చుట్టుముట్టాయి. గులాం రసూల్ ఖాన్ ఏమాత్రం జంకకుండా చివరిదాకా పోరాటం సాగించినా అశేష ఆంగ్ల సైన్యాల చేతితో పరాజం తప్పలేదు. కంపెనీ సైన్యం ఆయనను అరెస్టు చేసి తిరుచునాపల్లి ఖైదుకు తరలించింది. ఆ జైలులోనే ఆంగ్లేయుల కుట్ర ఫలితంగా పోరాట యోధులు కర్నూలు నవాబు గులాం రసూల్ 1840 జూలై 12న హత్యకు గురికావడంలో ఆయన పోరాటం అంతమయ్యింది.

ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు స్వదేశీయుల మీద, ప్రజల మీద సాగిస్తున్న దాష్టికాలను సహించలేక 1846లో ఆంగ్లేయుల మీద కర్నూలు జిల్లాకు చెందిన ప్రజానాయకుడు నరసింహారెడ్డి పోరాటం ప్రకటించారు. ఆ పోరాటానికి ఆ ప్రాంతానికి చెందిన మరో యోధుడు మహమ్మద్ ఖాన్ పూర్తి స్థాయిలో అండదండలు అందించారు. ఆనాడు నరసింహారెడ్డికి హైదరాబాదుకు చెందిన సలాం ఖాన్ అను నాయకుడు సహకరించినట్టు దాఖలాలు ఉన్నాయి. (Article titled 1846 Revolt of Rayalaseema : Some Reflections, by N.Raghavendra, Publihsed in Andhra Pradesh History Congress, Proceedings of the Tenth Session, Guntur, 1986, Page.197) ఈ నరసింహారెడ్డి సాహస చరిత్ర టెలీ సీరియల్‌గా కూడా ప్రసారం అయ్యింది. ఆ తిరుగుబాట్లు పటిష్టమైన పోరాట రూపాలుగా పరిణితి చెందక ముందే ఆధునిక ఆయుధాలు, శిక్షణ పొందిన సైనిక బలగాలు గల ఈస్ట్ ఇండియా కంపెనీ తిరుగు బాట్లను నలిపి వేయడంతో అవి చరిత్రలో తగినంత స్థానం పొందలేకపోయాయి.

## ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో భాగస్వామ్యం :

ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులను భయోత్పాతానికి గురిచేసిన ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో కూడా కృష్ణాతీరం ముస్లిం యోధులు తమదైన తీరులో భాగస్వామ్యం అందించారు. అనాడు కృష్ణా-గుంటూరు సీమలు ప్రజ్వరిల్లాయి. 1857 జూలై మాసంలో మచిలీ పట్నంలోని సిపాయీలు పెరేడ్ జరుపు మైదానంఎదురుగా ఆకుపచ్చని పతాకాన్ని రహస్యంగా ఎగుర వేశారు. **ఆంగ్లేయులను నరికి వేయండి** అంటూ హిందూస్థానీలో నినాదాలు రాసిన ప్లకార్డు కూడా ఆ జెండా కర్రకు కట్టి ఉంది. ఈ దృశ్యం ఆంగ్లేయాధికారులలో తీవ్ర కలవరానికి కారణమైంది. ఆ చర్యకు పాల్పడిన వారిని పట్టు కున్నట్టయితే 500 రూపాయాల బహుమానం ఇస్తామని కూడా ప్రకటించారు. ఆంగ్ల అధికారులు ఎంత ప్రయత్నించిన ఆ దృశ్యాన్ని రూపొందించిన సాహసుల ఆచూకిని ఏ మాత్రం కనిపెట్టలేకపోయారు. (The Freedom Struggle in Andhra Pradesh (Andhra), Volumes I (1800-1905 AD), Govt. of AP, Hyderabad, 1997, Page. 147). 1857 నవంబరు 7న కృష్ణాజిల్లా జగ్గయ్యపేటలోని ప్రభుత్వ కచేరిమీద దాడి జరిగింది.ఆయుధాలు చేపట్టిన నాలుగు వందలమంది రోహిల్లాలు ప్రభుత్వ కచేరి ఆవరణలోకి దూసుకొచ్చారు. ఆ సమయంలో ఈస్ట్ ఇండియా కంపెనీ సైనికుల ప్రతిఘటన అంతగా లేకపోవడంతో కోశా గారంలోని నగదును, ఆయుధాగారంలోని ఆయుధాలను తిరుగుబాటు యోధులు స్వంతం చేసుకున్నారు. ఈ సాహసకృత్యంలో హిందూ-ముస్లిం యోధులు పాల్గొన్నారు. ఈ ఆకస్మిక దాడికి ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాధికారులు హడలిపోయారు. 1857 ఆగస్టు 21న ప్రథమ స్వాతంత్ర్య సమరయోధుడు రహీం బేగ్ ను ఆంగ్లేయ అధికారులు అరెస్టు చేశారు. మొహరం పండుగ సందర్భంగా రహీం బేగ్ తిరుగు బాటుకు ప్రయత్నాలు ఆరంభించారు. ఆ రహస్యం కాస్తా బయట పడటంతో బేగ్‌ను ఆయన సహచరులు ఖాజీ మున్‌దార్‌దార్ అలీ, హుసైన్ బేగ్, షబిబ్ బేగ్, మీరా హుస్సేన్, సిలార్ ఖాన్,మీర్ లుబ్బా ఖాన్, మీర్ వజీర్ అలీ, గాలిబ్ బేగ్, ముస్తాబ్ సాహెబ్, ఖాద్ ముహమ్మద్ అలీ ఖాన్ అలియాస్ దాదా సాహెబ్ తదితరులను అరెస్టు చేశారు.

ఈ తిరుగుబాటును ప్రస్తావిస్తూ ఆగస్టు 22న రాజమండ్రిలోని ఆంగ్ల అధికారి మద్రాసులోని ప్రధానకార్యదర్శికి రాసిన లేఖలో **భారీ కుట్రను మొగ్గలోనే తుంచగలిగాం** అని చెప్పుకున్నాడు. **ఈ తిరుగుబాటు కేవలం రాజమండ్రి వరకు పరిమితం కాలేదని, మచిలీ పట్నం, గుంటూరు జిల్లాలను కూడా కలుపుకుని ప్రజలను రెచ్చగొట్టి ఒకేసారి తెల్లవారి మీద తిరగబడేందుకు పెద్ద వ్యూహం పన్నారని, ముసల్మాన్లు ఇందులో ప్రధాన పాత్ర వహించారని** ఆ అధికారి వివరించాడు. (The Freedom Struggle in Andhra Pradesh (Andhra), Volumes I(1800-1905 AD), Govt. of AP, Hyderabad, 1997, Page. 60, 156-157). ఈ వార్తతో గుండెలదిరిన ఆంగ్లేయాధి కారులు ముంచుకు వచ్చిన ముప్పు కొద్దిలో తప్పిపోయిందని సంతోషిస్తూ అప్రమత్తులై ఉండాల్సిందిగా ఇతర ప్రాంతాల అధికారులకు ఆఘ

మేఘాల మీద వర్తమానం పంపారు. అనుమానితుల పట్ల కర్కశంగా వ్యవహరిస్తూ అరెస్టులను ముమ్మరంచేశారు. ఈ అరెస్టులలో 14 సంవత్సరాల సయ్యద్ లాల్ అను బాలుగు ఏడుసంవత్సరాల కారాగార శిక్షకు గురయ్యారు. ఈ విధంగా గుంటూరు, కృష్ణా గోదావరి మండ లాలలో ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం ప్రభావం తీవ్రంగా కన్పించింది. (1857, యం.వి.ఆర్ శాస్త్రి, ఆంధ్రభూమి దినపత్రిక, 2007, జనవరి14)

## భారత జాతీయ కాంగ్రెస్ ఆవిర్భావం :

బ్రిటిషర్లకు వ్యతిరేకంగా ప్రజలను చైతన్యవంతులను చేసేందుకు పలు సాంఘిక, సాంస్కృతిక,సాహిత్య,విద్యా సంస్థలు,ప్రజా సంఘాలు, పత్రికలు రంగం మీదకు వచ్చాయి. ఆ సంస్థల, సంఘసంస్కర్తల, చైతన్య రథసారధుల కృషి వలన ఆధునిక విద్య మీదశ్రద్ధ, ఆంగ్లభాషను నేర్చుకోవడం పట్ల ఆసక్తి, ప్రసిద్ధులు రాసిన గ్రంథాలను అధ్యయనం చేయడం ద్వారా ప్రపంచ పోకడలను గ్రహించిన ప్రజలకు బ్రిటిషర్ల నిరంకుశ పెత్తనం ఇక ఏమాత్రం మింగుడు పడలేదు. ఆ కారణంగా తొలుత విద్యావంతులైన ప్రముఖులు ప్రధానంగా న్యాయవాదులు, అధ్యాపకులు, వివిధ వృత్తులలోని నిపుణులు తమ సమస్యల పరిష్కారా నికి కృషి సల్పేందుకు స్వయంగా ముందుకు కదిలారు. ఆ తరువాత తమలోనున్న సహజ స్వేచ్ఛా-స్వాతంత్ర్య కాంక్షతో విద్యావంతుల మార్గాన సామాన్య జన సమూహాలు కూడా పెద్ద ఎత్తున కదిలాయి. ఆ కదలిక ఫలితంగా 1885లో భారత జాతీయ కాంగ్రెస్ ఆవిర్భవిం చింది.జాతీయ కాంగ్రెస్ తొలి సమావేశానికి మద్రాసుప్రెసిడెన్సీ ప్రాంతం నుండి పలువురు ఆంధ్రులు హాజరయ్యారు. భారతీయుల ఆకాంక్షల సాధన కోసం ఉనికిలోని వచ్చినభారత జాతీయ కాంగ్రెస్ పట్ల తెలుగు బిడ్డలు సానుకూలంగాస్పందించారు.1887 సంవత్సరంలో మద్రాసు నగరంలో జస్టిస్ బద్రుద్దీన్ తయ్యాబ్జీ అధ్యక్షతన జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ సమావేశానికి తెలుగునాట నుండి హుస్సేన్ బేగ్, మీర్జా హుస్సేన్ బేగ్, సయ్యద్ సాహెబ్, ఖాదర్ ఖాన్, ఖాశిం మియ్యా సాహెబ్, ఆ తరువాత 1889లో బొంబాయి నగరంలో జరిగిన సమావేశానికి షేక్ బురానుద్దీన్ సాహెబ్, ఖలీల్ ఖాన్, నవాబ్ అలీ ఖాన్, అహమ్మద్ సాహెబ్ తదితరులు హాజరయ్యారు.

1906లో బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా ఆరంభమైన ఉద్యమం జాతీయ ఉద్యమంగా రూపుదిద్దుకుంది. ఈ సందర్భంగా ఉనికిలోకి వచ్చిన'వందేమాతరం'నినాదం ప్రజానీకాన్ని ఉత్తేజపర్చింది. 1907లో బిపిన్ చంద్ర పాల్ పర్యటనతోఆంధ్రదేశాన్ని పూర్తిగాచుట్టేసింది. జాతి, మత, ప్రాంతాల విభేదాలు మరచి వందేమాతరం గీతాన్ని ఆలాపిస్తూ ప్రజలు ముందుకురికారు. వందేమాతరం ఉద్యమంతో రగులుకున్న సహాయనిరాకరణ మరింత పరిణితి చెంది శాసనోల్లంఘనగా రూపు దిద్దుకుంది.ఆనాడు విద్యార్థులు ప్రభుత్వ కళాశాలలను బహిష్కరిం చారు. విదేశీ వస్తువులను తిరస్కరించారు. స్వదేశీ వస్తువుల వాడకాన్ని ప్రోత్సహించారు. స్వదేశీ ఉద్యమాన్ని ప్రోత్సహించేందుకు అవసరమగు నిధుల సేకరణకు తెలుగు గడ్డ మీదప్రయత్నాలుజరిగాయి. మద్రాసులో స్వదేశీ ఉద్యమ వ్యాప్తికోసం **దీపావళి జాతీయ నిధి** ఏర్పాటు చేశారు. ఆ నిధికి కృష్ణా తీరానికి చెందిన ప్రముఖులు సయ్యద్ మహమూద్, న్యాయపతి సుబ్బారావులు ధర్మకర్తలుగా వ్యవహరించారు. (నా జీవిత కథ-నవ్యాంధ్రము, అయ్యదేవర కాళేశ్వరరావు, ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ, 1959, పేజి.30).

## ఖిలాఫత్-సహాయ నిరాకరణోద్యమం :

అంతర్జాతీయ పరిణామాల నేపథ్యంలో మహాత్మాగాంధి, అలీ సోదరుల వ్యూహం మేరకు ఉనికిలోకి వచ్చి ఖిలాఫత్-సహాయ నిరాకరణోద్యమంలో హిందూ-ముస్లింలు ఏకోన్ముఖంగా పాల్గొన్నారు. ఖిలాఫత్- సహాయ నిరాకణ ఉద్యమం ఉధృతంగా సాగి యావత్తు ఆంధ్రదేశాన్ని చుట్టేసింది. ఈ సందర్భంగా ప్రజలు ప్రధానంగా విద్యార్థులు ప్రముఖ పాత్ర వహించారు. కర్నూలులోని మౌంట్ రోడ్‌లో గల ఆజం కళాశాల విద్యార్థులు యాకుబ్ హుస్సేన్, అబ్దుల్ మజీద్ షరార్, అమీర్ అలీ, బాబుహై మజహర్, సయ్యద్ మొహిద్దీన్ తదితర విద్యార్థులు 1920 అక్టోబరు 21న స్థానిక మసీదు వద్ద ప్రసంగిస్తూ 22 నాటి విద్యార్థుల సమావేశానికి హాజరు కావాల్సిందిగా పిలుపునిచ్చారు. ఆ రోజున జుమ్మా ప్రార్థనల తరువాత జరిగిన సమావేశంలో సయ్యద్ మొహిద్దీన్, అమార్ అలీ అబ్దుల్, మజహర్ అను విద్యార్థినాయకులు సహాయనిరాకరణ అంశం మీద ప్రసంగించారు. ఈ విద్యార్థి నాయకులు కళాశాలల బహిష్కరణకు ఇచ్చిన పిలుపుకు మంచి స్పందన కన్పించింది. (Role of Students in the Freedom Struggle in Rayalaseema : 1905-1947, by K.Maddaiah, Publihsed in Andhra Pradesh History Congress, Proceedings of the Twenty Second Session, Hyderabad, 1998 Page. 167).

భారతదేశ పర్యటనలో భాగంగా, ఖిలాఫత్ ఉద్యమ ప్రముఖులైన ఆలీ సోదరులతో కలిసి గాంధీజీ ఆంధ్రకు వచ్చారు. చరిత్ర సృష్టించిన ఈ పర్యటన కృష్ణా జిల్లా విజయవాడ నుండి ప్రారంభమైంది. ఈ సందర్భంగా మహాత్ముడు 1920 జనవరి 1న జరిగిన సభలో ప్రసంగిస్తూ బ్రిటిష్ ప్రభుత్వం అందజేసిన బిరుదులను త్యజించాలని, పదవులను వదులుకోవాలని కోరారు. ఆ పిలుపుకు కృష్ణా జిల్లా విజయవాడకు చెందిన జాగీర్దార్ మహమ్మద్ గులాం మొహిద్దీన్ సాహెబ్ (1882-1973)తక్షణమే స్పందించారు.ఆయన నిర్వహిస్తున్న గౌరవ మేజిస్ట్రేటు పదవికి రాజీనామా చేశారు. ఆ విధంగా గాంధీజీ పిలుపుకు స్పందించి ప్రభుత్వ పదవిని త్యజించిన తొలి ఆంధ్రుడిగా

గులాం మొహిద్దీన్ ఖ్యాతిగాంచారు. ఈ విషయాన్ని ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధులు అయ్యదేవర కాళేశ్వరరావు తన **నా జీవిత కథ (నవ్యాంధ్రము)**, 291 పేజీలో ప్రస్తావిస్తూ, **నా ముఖ్య మిత్రులైన మహమ్మద్ గులాం మొహిద్దీన్ సాహెబుగారు మొదటి తరగతి గౌరవ మేజిస్ట్రేటుగ నుండిరి. నాతోపాటుగా తాను కూడా గౌరవ ఉద్యోగము వదలు కొనెదమని ప్రకటించిరి, ఈ సంగతి గాంధీగారు ఆ సభలో గుమికూడిన వేలాది ప్రజల ముందు కరతాళధ్వనుల మధ్య ప్రకటించిరి. తమ 'యంగ్ ఇండియా' పత్రికలో కూడా వ్రాసిరి** అని పేర్కొన్నారు. ఈ విషయాన్ని ఆనాడు జరిగిన **సభలో మహాత్మా గాంధీ వేలాది కరతాళధ్వనుల మధ్య ప్రకటించారు** అని తాను సంపాదకత్వం వహించిన 'ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ' గ్రంథంలో శ్రీ కొడాలి ఆంజనేయులు కూడా పేర్కొన్నారు,

బ్రిటీషర్లకు ఏ విధంగానూ సహకరించవద్దని గాంధీజీ చేసిన విజ్ఞప్తి మేరకు ఆనాడు జరిగిన ఎన్నికలలో కూడా సహాయ నిరాకరణ ఛాయలు కన్పించాయి. ఎన్నికల బరి నుండి పలువురు అభ్యర్థులు పోటీ నుండి తప్పుకోగా, పలు ప్రాంతాలలో ప్రజలు ఓటింగ్‌ను బహిష్కరించారు. స్వాతంత్ర్యోద్యమానికి కేంద్రబిందువుగా మారిన గుంటూరులో 15% ఓటర్లు మాత్రమే ఎన్నికలలో పాల్గొనగా, రాజమండ్రిలోని మరొక చోట 120 ముస్లిం ఓటర్లకు కేవలం ఒక్క ఓటు మాత్రమే పోలైంది. ఆ ఒక్క ఓటూ కూడా ప్రభుత్వ ఉద్యోగిది కావడం విశేషం. (ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ, సంపాదకులు : కొడాలి ఆంజనేయులు). ఈ మేరకు భారత జాతీయ కాంగ్రెస్ పిలుపును తు.చతప్పక పాటించడంలో హిందూ సోదరులతోపాటుగా ముంస్లింలు కూడా క్రియాశీలక పాత్ర నిర్వహించారు.

1921లో విజయవాడలో అఖిల భారత జాతీయ కాంగ్రెస్ కార్యవర్గ సమావేశాలు జరిగాయి. పండగలా జరిగిన ఈ సమావేశాలలో మహాత్మాగాంధీ, ఇతర జాతీయ నాయకులతో పాటుగా అబ్బాస్ తయ్యాబ్జీ, హాకీం అజ్మల్‌ఖాన్, మౌలానా అబుల్ కలాం ఆజాద్, మహమ్మద్ అలీ, షౌకత్ అలీ, ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ లాంటి ముస్లిం ప్రముఖులు విచ్చేశారు. ఆంధ్ర నాయకులు క్రియాశీల పాత్ర వహించిన ఈ సమావేశాలలో పలు అంశాల మీద సుదీర్ఘ చర్చలు జరిగాయి. ఈ చర్చలలో ఆంధ్ర ప్రాంతానికి చెందిన షఫీ అహమ్మద్ ప్రముఖ పాత్ర వహించారు. ఈ సమావేశాల నిర్వహణకు విజయవాడకు చెందిన జాగీర్దార్ మహమ్మద్ గులాం మొహిద్దీన్ సాహెబ్ (1882-1973) తన ధనాన్ని మంచినీళ్ల ప్రాయంగా ఖర్చుచేశారు. ఆయన పట్టుదల త్యాగనిరతిని స్వయంగా గమనించిన మహాత్మాగాంధీ విజయవాడ నుండి ఎవరు ఆయన వద్దకు వెళ్ళినా మొదటిగా 'మొహిద్దీన్ సాబ్ ఎలా ఉన్నారు' అని అడిగేవారట.

జాతీయ నాయకుల పిలుపుమేరకు గుంటూరుకు చెందిన మౌల్వీ మహమ్మద్ రజాఖాన్ బెల్గామి ఖిలాఫత్ సహాయనిరాకరణ ఉద్యమంలో ప్రధాన పాత్ర వహించారు. బ్రిటిష్ ప్రభుత్వంలో డిప్యూటీ కలక్టరుగా పనిచేసిన ఆయన పదవీ విరమణ చేశాక ప్రజాసేవలో పాల్గొన్నారు. ఆయన సేవానిరతిని, ప్రతిభను గుర్తించిన ప్రజానీకం ముహమ్మద్ రజాఖాన్ సాహెబ్ బెల్గామిని గుంటూరుపురపాలకసంఘానికి ఛైర్మన్‌గా ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. ఆయన ఖిలాఫత్- సహాయ నిరాకరణ ఉద్యమంలో భాగంగా మండల ఖిలాఫత్ సంఘానికి ఆయన అధ్యక్షత వహించారు. ఆంధ్రప్రదేశ్‌లోని సహాయనిరాకరణ ఉద్యమ నాయకులలో ఆయనముఖ్యులుగా పేరొందారు. (గుంటూరు జిల్లా స్వరాజ్య ఉద్యమం మాదల వీరభద్రరావు, పేజి.163). ఈ సహాయనిరాకరణోద్యమంలో భాగంగా న్యాయవాదులు ప్రభుత్వ న్యాయస్థానాలలో ప్రాక్టీసు చేయ నిరాకరించారు. కర్నూలుకు చెందిన న్యాయవాది సయ్యద్ సాబ్ మొహిద్దీన్ ఖాద్రి బియబాని (1894-1969) వేలాది రూపాయల సంపాదనను ఆర్జించి పెడుతున్న న్యాయవాద వృత్తిని వదిలేసి జాతీయ ఉద్యమంలో పాల్గొన్నారు. మౌలానా అబుల్ కలాం ఆజాద్, డాక్టర్ జాకీర్ హుస్సేన్‌ల ప్రభావంతో జీవితాంతం జాతీయవాదిగా, స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం సాగిన పోరాటంలో సయ్యద్ సాబ్ మొహిద్దీన్ ఖాద్రి బియబాని ప్రముఖ పాత్ర వహించారు.

కృష్ణా జిల్లా విజయవాడకు చెందిన జనాబ్ అలీ బేగ్ ఆనాటి రాజకీయాలలో ప్రముఖ పాత్ర వహించారు. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ నాయకత్వంలోని భారత రాజ్యాంగ రచనా కమిటీలో సభ్యునిగా బాధ్యతలు నిర్వహించడమేకాక, పార్లమెంటు సభ్యునిగా ప్రజలకు సేవలందించారు. ఆయన జ్ఞాపకార్థం విజయవాడ నగరంలో ఒక వీధిని **అలీ బేగ్ స్ట్రీట్**గా నామకరణం చేశారు. అలీ బేగ్ గురించి అయ్యదేవర కాళేశ్వర రావు ప్రస్తావిస్తూ, **ఈయన మంచి సమర్థుడైన లాయరేకాక మద్రాసు శాసనసభలోను, భారత రాజ్యాంగ నిర్ణయ సభలోనూ, పార్లమెంటులోను కొంతకాలము సభ్యుడిగా నుండెను** అని పేర్కొన్నారు.(నా జీవిత కథ-నవ్యాంధ్రం, అయ్యదేవర కాళేశ్వరరావు, పేజి.291) ఆనాడు బ్రిటిష్ సర్కారులోఉన్నత ఉద్యోగాలు చేస్తూ కూడా జాతీయోద్యమానికి రహస్యంగా అండదండలు అందించిన ముస్లిం ఉద్యమకారులు చాలామంది ఉన్నారు. బ్రిటిష్ ప్రభుత్వంలో పోలీసు అధికారులుగా బాధ్యతలు నిర్వహిస్తూ పరోక్షంగా జాతీయోద్యమకారులకు సహకరించారు. ఈ విషయాన్ని అయ్యదేవర ప్రస్తావిస్తూ, **ముసల్మాను పోలీసు ఇనస్పెక్టర్ అక్కడికి వచ్చి, వచ్చిన పనికి సానుభూతి తెలిపెను...చందా ఇవ్వవలసిందిగా వర్తకులను ప్రోత్సహించెను**, అని రాశారు. (నా జీవిత కథ-నవ్యాంధ్రం : పేజి.308).

**'పుల్లరి', 'చీరాల-పేరాల', 'పెదనందిపాడు పన్నుల నిరాకరణ' ఉద్యమాలు:**

జాతీయోద్యమంలో భాగంగా గుంటూరు జిల్లాలో ఉనికిలోకి వచ్చిన 'పుల్లరి ఉద్యమం', 'చీరాల-పేరాల పోరాటం', 'పెదనందిపాడు పన్నుల నిరాకరణ' ఉద్యమాలలో ముస్లింలు కూడా పెద్దసంఖ్యలో పాల్గొన్నారు. ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ మాదల వీరభద్రరావు తన **గుంటూరు జిల్లా స్వరాజ్య ఉద్యమం 1920-30 ఉజ్వల ఘట్టాలు** గ్రంథంలో ఈ విశేషాంశాలకు ఒక ప్రత్యేక అధ్యాయాన్ని కేటాయించారు. ఆనాటి సంఘటనలకు స్వయంగా సాక్షి అయినటువంటి శ్రీ మాదలపుల్లరి ఉద్యమంలో ముస్లింలు నిర్వహించినపాత్రను వివరిస్తూ, **అప్పటికే ముగ్గురు ముస్లిం దేశభక్తులను నిర్బంధించి చెరసాలకు పంపడం జరిగింది...మాచర్లలో మహమ్మదీయులు అనేకులు గలరు. వారిలో ఏమాత్రమభిప్రాయ భేదములు లేకఉద్యమమును సంపూర్ణంగా నభిమానించు చుండిరి**, అన్నారు. గుంటూరు జిల్లా మాచెర్లకు పొరుగు గ్రామమైన కొత్తపల్లికి చెందిన **(1) నబీ సాహెబ్, (2) చింతపల్లి హుస్సేన్ సాహెబ్, (3) జానహమ్మద్** పుల్లరి చెల్లింపును వ్యతిరేకిస్తూ, ఉద్యమకారులకు అనుకూలంగా గూఢచర్యం నిర్వహించి మొట్టమొదటి సారిగా అరెస్టులకు కూడా గురయ్యి చరిత్ర సృష్టించారని పేర్కొన్నారు. (గుంటూరు జిల్లాలో స్వరాజ్య ఉద్యమం, పేజి. 63-64). పుల్లరి ఉద్యమంలో సామాన్య గ్రామస్థుల సాహసం, అధికారుల పట్లవారు వ్యక్తం చేసిన వ్యతిరేకత, మొట్టమొదటిగా సాగిన పుల్లరి వ్యతిరేక ఉద్యమకారుల అరెస్టుల ఉదంతాన్ని ఈ గ్రంథం వెల్లడించింది. ఈ మరింతగా విషయాన్ని రూఢిచేస్తూ 1921, ఆగస్టు22 నాటి The Hindu దినపత్రిక, '...three local Mohammdan workers have intensified feeling against forest administration.' (The Freedom Struggle in Andhra Pradesh,Vol.III, Prof. M. Venkatarangaiya, Govt. of AP Publications, Hyderabad, 1997, Page.185) అని పేర్కొంది. ఈ విధంగా పలు వివరాలను పేర్కొన్న శ్రీ మాదల వీరభద్రరావు **పల్నాటి పుల్లరి సత్యాగ్రహంలో మొదట అరెస్టు అయిన మాచర్ల ముస్లిం దేశభక్తులు** అంటూ ఇరువురి యోధుల చిత్రాలను తన గ్రంథంలో జతచేశారు.

గుంటూరు జిల్లా చీరాలకు చెందిన శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య నేతృత్వంలో సాగిన **చీరాల-పేరాల ఉద్యమం**లో దుగ్గిరాల సన్నిహిత సహచరుడిగా బాపట్లకు చెందిన మహమ్మద్ గౌస్ బేగ్ (1885-1976) ఎంతగానో కృషి చేశారు. ఆయన తన కుటుంబ ఆస్తిపాస్తులను ఉద్యమం కోసం పూర్తిగా వ్యయం చేశారు. ప్రజలలో ప్రధానంగా యువకులలో ఉత్సాహాన్ని రేకెత్తిస్తూ ప్రసంగాలు చేయడమే కాకుండా, బ్రిటీష్ పోలీసుల దాష్టిక చర్యలను ఏమాత్రం ఖాతరు చేయకుండా ఉద్యమాలలో చురుకుగా పాల్గొని పలుమార్లు ప్రభుత్వ ఆగ్రహానికి ఆయన గురయ్యారు. (గుంటూరు జిల్లాలో స్వరాజ్య ఉద్యమం: మాదల వీరభద్రరావు). ముహమ్మద్ గౌస్ మొత్తం మీద ఏడు సంవత్సరాలకు పైగా జైలు జీవితం గడిపారు. ఆయన సతీమణి ముహమ్మద్ గౌస్ ఖాతూన్ (-1990) కూడా భర్తకు అన్ని విధాల తోడుగా నిలిచారు. జాతీయ ఉద్యమకారులకు, నాయకులకు తన ఇంట రహస్యంగా ఆశ్రయం కల్పించి వారిని అన్నివిధాల ఆదుకుంటూ ప్రజోద్యమాలకు తోడ్పడ్డారు. **ఈ విధంగా ఉద్యమానికి సర్వసంపదను, బలాన్ని చేకూర్చిన యోధుడు జనాబు గౌస్ బేగ్** గా ఆయన ఖ్యాతి గాంచారు. (స్వాతంత్ర్యోద్యమం దేశనాయకులు, వి.యల్.సుందర రావు, 1989, పేజి.61)

ఆ సమయంలోనే గుంటూరు జిల్లా పెదనందిపాడు కేంద్రంగా పర్వతనేని వీరయ్య చౌదరి నాయకత్వంలో సాగిన పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమంలో కూడా ముహమ్మగ్ గౌస్ క్రియాశీలక పాత్రను నిర్వహించారు. పన్నుల నిరాకరణ ఉద్యమం లక్ష్యాలను, విధివిధానాలను ప్రజలకు తెలపడం, గ్రామాలకు వచ్చే ప్రభుత్వాధికారులకు ప్రజల నుండి ఎటువంటి సహకారం అందకుండా చూడటం వరకు ఆయన బాధ్యతలు నిర్వర్తించారు. ఈ ఉద్యమంలో భాగంగా పెదనందిపాడు గ్రామాధికారి షేక్ మొహిద్దీన్, మరొక గ్రామాధికారి షేక్ ఫకీర్ అహమ్మద్‌లు తమ పదవులకు రాజీనామా చేసి ఉద్యమంలో పాల్గొన్నారు. గుంటూరు నివాసి మౌల్వీ మహమ్మద్ రజా సాహెబ్ గౌరవ మేజిస్ట్రేటు పదవిని త్యజించారు.

జాతి స్వేచ్ఛ స్వాతంత్ర్యాలు కోరుకుంటూ సాగుతున్న జాతీయోద్యమంలో భాగంగా జరుతున్న వివిధ పోరాటాలలో తమదైన పాత్ర నిర్వహిస్తున్న కృష్ణాతీరం ప్రజలు ఆంగ్లేయ ప్రభుత్వ అధికారుల రాక్షసత్వాన్ని ఎదుర్కోవాల్సి వచ్చింది. కృష్ణాజిల్లా నూజివీడు నివాసి కొత్వాల్ అబ్బాస్ అలీ సాహెబ్ 9 మాసాలు రాజమండ్రి జైలులో గడిపారు. ఆయన ఆంధ్ర కాంగ్రెస్ కమిటీ నాయకులుగా, నూజివీడు కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులుగా 1926 నుండి 1940 వరకు పనిచేశారు. విజయవాడకు చెందిన నసీరుల్లా ఖాన్ నాలుగు మాసాలు, నూజివీడు నివాసి మొహిద్దీన్ బెగ్ నాలుగు మాసాలు, గుడివాడ నివాసి ఖాశిం బేగ్ రెండు మాసాలు రాజమండ్రి జైలులో గడిపారు. గుంటూరు జిల్లాకు చెందిన అబ్దుల్ హుదా సాహెబ్ ఒక సంవత్సరం జైలుశిక్ష అనుభవించారు. రేపల్లెకు చెందిన షేక్ దావూద్, షేక్ గులాబ్ హుస్సేన్, షేక్ ఉస్మాన్ నిర్బంధాలకు గురయ్యారు. సత్తెనపల్లి చెందిన రైతు షేక్ మీర్జా ఆలీ సాహెబ్ పన్ను వ్యతిరేక ఉద్యమ ప్రచారంలో పాల్గొని ఆరు మాసాలు జైలులో గడిపారు. కృష్ణా జిల్లా విజయవాడకు చెందిన మొహమ్మద్ నూరుల్లా ఖాన్, కృష్ణానగర్ నివాసి మహమ్మద్ మింటో, నూజివీడుకు చెందిన మొహినుద్దీన్ ఖిలాఫత్-సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొన్నందుకు జైలుశిక్షను అనుభవించారు.

## ఖద్దరు ఉద్యమం :

మాతృభూమి మీద నుండి పరాయి పాలకులను పాలద్రోలాలంటే విదేశీ వస్తువుల వ్యామోహం వదలాలని, స్వదేశీ కుటీర పరిశ్రమలను అభివృద్ధిపర్చుకోవాలని మహాత్ముడు ఇచ్చిన ఆదేశాల మేరకు స్వదేశీ ఉద్యమం భారత దేశమంతటా పెల్లుబికింది. ఈ ఉద్యమంలో భాగంగా ప్రజలు విదేశీ వస్తువులను ప్రధానంగా విదేశీ వస్త్రాలను త్యజించారు. ప్రజలు ఖద్దరు ధరించారు. ఖద్దరు ధారణను ప్రోత్సహించారు. నూలువడకడం ఒక ఉద్యమ రూపమయ్యింది.

ఈ కార్యక్రమాలలో భాగంగా గుంటూరు జిల్లా మహమ్మద్ ఇస్మాయిల్ (1892-1948)తెనాలిలో 1926లో తొలిసారిగా ఖద్దరు షాపు ప్రారంభించారు. ఖద్దరు ప్రచార కార్యక్రమాలలో నిరంతరం నిమగ్నమైన ఆయన చివరకు **ఖద్దరు ఇస్మాయిల్** గా స్థిరపడిపోయారు. గుంటూరు జిల్లా తెనాలి కేంద్రంగా కొంతవరకు ప్రభావం చూపిన అల్ ఇండియా ముస్లిం లీగ్ సిద్ధాంతాలను, రాజకీయాలను చివరివరకు నిరసించిన ఆయన కుటుంబం అనేక ఇబ్బందులను ఎదుర్కొంది. ఆయన సాగించిన ఖద్దరు ఉద్యమంలో ఆయన సతీమణి హాజరా బీబి (-1994) భర్తకు ఎంతగానో సహకరించారు. జాతీయ భావాల కారణంగా స్వజనం నుండి పలు ఆటంకాలు, సాంఘీక భహిష్కరణ లను కూడా ఆమె ఎదుర్కొన్నారు. ఖద్దరు ఇస్మాయిల్ తరహాలోనే నిరంతరంఖద్దరు ధరించడమే కాకుండా ఖద్దరువిక్రయశాల ఉద్యోగిగా ఖద్దరు ప్రచారాన్ని నిర్వహించడం ద్వారా బాపట్లకు చెందినషేక్ ఖాశిం బేగ్**ఖద్దరు జుబ్బా ఖాశిం బేగ్** గా(1905-18984)గుర్తింపు పొందారు.

జాతీయోద్యమాన్ని ఉధృతం చేయడానికి,కార్యక్రమాలను మరింత క్రియాశీలకంగా నిర్వహించడానికి యువకుల భాగస్వామ్యం అత్యవసర మని భారత జాతీయ కాంగ్రెస్ భావించింది. ఆ నిర్ణయం మేరకు 1928 మే మాసంలో గుంటూరులో **యువజన సమితి** ఏర్పడింది. ఆ సమితి ఏర్పాటుకు గుంటూరుకు చెందిన గాలిబ్‌సాహెబ్, రహిమాన్‌లు అవిరళ కృషి సల్పారు. షేక్ గాలిబ్ సాహెబ్(1904-1970) యువజన సంఘాలకు, విద్యార్థి సంఘాలకు సమర్థవంతమైన నాయకత్వం మాత్రమే కాకుండా మార్గదర్శకత్వం అందించారు. పలు సంవత్సరాలు ఆయా సంఘాల ప్రధాన కార్యదర్శిగా ఆయన వ్యవహరించారు. అంతే కాదు గుంటూరు బ్రాడీపేటలో ఆయన తన సోదరుని పేరిట నిర్వహిం చిన లాండ్రి షాపు ఆనాడు జాతీయ ఉద్యమకారులకు రహస్య కూడలి అయ్యింది. ఆ కారణంగా ఆ లాండ్రి మీద పలుమార్లు పోలీసుల దాడి జరిగింది. చివరకు ఆయన మీద విధించిన జరిమానా రాబట్టు కునేందుకు అందులోని సామగ్రి కూడా అధికారుల జప్తుకు గురయ్యింది. భారత జాతీయ కాంగ్రెస్ సభ్యునిగా పనిచేస్తూ అటు స్వాతంత్ర్యోద్య మంలో, ఇటు ప్రజా జీవనంలో తన ప్రత్యేకతను చాటుకున్న షేక్ గాలిబ్ భారత జాతీయ కాంగ్రెస్ నాయకునిగా అందించిన సేవలకు గుర్తింపుగా 1954లో ఆయనకు రాజ్యసభ సభ్యత్వం లభించింది. ఈ పదవిలో ఆయన 1958 వరకు ఉన్నారు. ఆ తరువాత తన సహచరుడు, మిత్రుడు బెజవాడ గోపాల రెడ్డికి రాజ్యసభలో సీటును కల్పించేందుకు షేక్ గాలిబ్ తన పదవీకాలం పూర్తికాకముందే రాజ్యసభ సభ్యత్వానికి రాజీనామా చేశారు. ఆ తరువాత 1958లో రాష్ట్ర విధాన పరిషత్ సభ్యులైన ఆయన ఆ పదవిలో 1969 వరకు ఉన్నారు.

పుల్లరి వ్యతిరేక, పెదనందిపాడు పన్ను వ్యతిరేక ఉద్యమాల తరహాలో ఆనాటి నైజాం సంస్థానంలో భాగంగా ఉన్న మహబూబ్‌నగర్ జిల్లాలో కూడా కొందరు పన్ను వ్యతరేక ఉద్యమంలో పాల్గొన్నారు. ఈ ఉద్యమంలో మక్తాల్ తాలూకా అప్పిరెడ్డిపల్లి నివాసి **షేక్ ఫక్రుద్దీన్** చురుగ్గా పాల్గొన్నారు. గ్రామంలో ప్రజల నుండి పన్ను వసూలును ఆయన వ్యతిరే కించారు. ఆ కారణంగా మహబూబ్‌నగర్, ఔరంగాబాద్, హైదరాబాద్ జైళ్ళల్లో 1948 మార్చి 10 నుండి అక్టోబరు 10 వరకు శిక్షను అనుభవిం చారు. ఆయన బాటలో మక్తాల్ తాలూకా అప్పిరెడ్డిపల్లి నివాసిషేక్ **కమాలుద్దీన్** కూడా పన్ను చెల్లించ నిరాకరించారు. ఆ కారణంగా మహబూబ్‌నగర్ జైలులో నిర్బందించబడ్డారు. ఆ తరువాత1948 ఏప్రిల్ మూడు నుండి ఏప్రిల్ పదకొండు వరకు హైదరాబాద్ జైలులో గడిపారు.

## శాసనోల్లంఘన ఉద్యమం

1930లో బ్రిటిష్ ప్రభుత్వ చట్టాల ఉల్లంఘన ద్వారా శాసనోల్లం ఘన ఉద్యమానికి శ్రీకారం చుట్టాలని గాంధీజి నిర్ణయించారు. అందులో భాగంగా మహాత్ముడు దండి చేరుకున్న ఏప్రిల్ ఆరున ఉప్పు తయారు చేసి ఆంగ్ల ప్రభుత్వ శాసనాన్ని ఉల్లంఘించారు. ఆయనను అనుసరిస్తు ఉప్పు సత్యాగ్రహ ఉద్యమం ఉధృతమైంది. గుంటూరు జిల్లా (ప్రస్తుత ప్రకాశం జిల్లా) అమ్మనబ్రోలుకు చెందిన షేక్ చెంగీ షా కనపర్తిలోని ఉప్పు కొటారాల మీద జరిగిన దాడిలో పాల్గొన్నారు. గుంటూరుకు చెందిన షేక్ గాలిబ్ సాహెబ్ ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని 1930లో సంవత్సరం పాటు జైలు శిక్షను అనుభవించారు. జైలు నుండి రాగానే మళ్ళీ ఉద్యమించి50 రూపాయల జరిమానా,జైలు శిక్షకు గురయ్యారు. రాయలసీమకు చెందిన ప్రముఖ నాయకుడు యం.షంషీర్ బేగ్ పలుమార్లు జైలుశిక్షలకు ఎరయ్యారు. ఉప్పుసత్యాగ్రహం సందర్భంగా కార్యకర్తలు శాంతియుతంగా ఉండాలని, సత్యాగ్రహ కార్యకర్తల మీద లాఠీచార్జీ జరుగుతున్నప్పుడు కూడా పోలీసుల మీద రాళ్ళు రువ్వడం తదితర హింసాత్మక చర్యలకుప్రజలు, ప్రధానంగా ఉద్యమ కార్యకర్తలు పాల్పరాదని ఆదేశిస్తూ భారత జాతీయ కాంగ్రెస్ ప్రచురించిన కరపత్రాలను ప్రకాశం జిల్లా బాపట్లకు చెందిన అబ్దుల్ రజాక్, షేక్ మూసా సాహెబ్‌లు గోడల మీద అంటిస్తుండగా పోలీసులు దాడిచేసి చితకబాది, వారిని నిర్బంధంలోకి తీసుకుని రాత్రంతా జైలులో

ఉంచారు. ఈ సందర్భంగా స్వదేశీ వస్తు ప్రచార కరపత్రాలను ప్రజలకు పంచుతున్న షేక్ నబీసాహెబ్‌ను ఆయన సహచరులను పోలీసులు పట్టుకుని బెత్తాలతో విరగబాదారు. ఆ భయంకరమైన ఆ దెబ్బలు భరించలేక నబీసాహెబ్ ఆయన సహచరులు స్పృహ కోల్పోయి క్రింద పడిపోయారు.

స్వచ్ఛంద సేవకులను అడ్డుకుంటున్న పోలీసు లాఠీలను లెక్కచేయ కుండా చీరాల యువకుల ఆహ్వానం మేరకు వెళ్ళి ఉప్పుగుడారాలలోకి దూకిన ముహమ్మద్ గౌస్ ధైర్య సాహసాలనుప్రదర్శించారు. (గుంటూరు జిల్లా స్వరాజ్య ఉద్యమం, మాదల వీరభద్రరావు, పేజి.141). ముహమ్మద్ గౌస్ దేవరంపాడు శిబిరానికి నాయకత్వం వహించి నందుకు మరో ఏడాది పాటు జైలు శిక్ష అనుభవించారు. 1931లో గాంధీజీ-ఇర్విన్‌ల మధ్యన కుదిరిన ఒప్పందం వలన శాసనోల్లంఘన ఉద్యమం ముగిసింది. ఆ ఒప్పందం వలన జైళ్లలో నున్న ఉద్యమకారు లను ఆంగ్లేయ ప్రభుత్వం విడుదల చేసింది. గుంటూరు జిల్లా తెనాలి నుండి విజయవాడకు నివాసం మార్చిన షేక్ మహబూబ్‌ఆదం జాతీయోద్య మంలో భాగంగా సాగుతున్న విద్యార్థి ఉద్యమాలలో చురుకైన పాత్ర నిర్వహిస్తూ, సత్యాగ్రహోద్యమం, ఉప్పుసత్యాగ్రంలో చురుకుగా పాల్గొని పోలీసు నిర్బంధాలను, కడలూరు జైలులో జైలుశిక్షను చవిచూశారు.

స్వరాజ్యం మాత్రమే తమ ఏకైక లక్ష్యంగా,శాసనోల్లంఘన కాలంలో భారతీయులు కష్టనష్టాలకోర్చి ఉద్యమించిన తీరును చూసిన బ్రిటిష్ ప్రభుత్వం జాతీయోద్యమాన్ని తీవ్రంగా అణచివేయాలని నిర్ణయించుకుంది. అందుకు తగిన కఠిన, క్రూరమైన చట్టాలను రూపొందించి, పోలీసులకు అధికారాలను కట్టిపెట్టు, పోలీసు చర్యలకు శ్రీకారం చుట్టింది. ఆ అధికారాల మేరకు భారత జాతీయ కాంగ్రెస్ కార్యాలయాల మీద దాడులు ఆరంభించారు. విజయవాడలోని భారత జాతీయ కాంగ్రెస్ కార్యాలయం మీద కూడా పోలీసులు దాడులు నిర్వహించారు. ఆ కార్యాలయాన్ని పూర్తిగా స్వాధీనం చేసుకుని దానికి తాళాలు వేశారు. ఆ తరువాత ఉద్యమకారులను నిరోధించేందుకు అరెస్టులు, నిర్బంధాలు ఆరంభించారు. ఈ చర్యను కృష్ణా జిల్లా విజయవాడకు యువకులు రెచ్చిపోయారు. భారత జాతీయ కాంగ్రెస్ కార్యాలయాన్ని స్వాధీనం చేసుకోవడం అవమానంగా భావించారు.

విజయవాడలోని భారత జాతీయకాంగ్రెస్‌కార్యాలయాన్ని విముక్తం చేయాలని నిర్ణయంచుకున్నారు. ఆ నిర్ణయం మేరకు ఉత్సాహవంతు లైన ఉద్యమకారులు సాగించిన ప్రయత్నాలకు సాహసవంతుడు, యువనాయకుడు సయ్యద్ హబీబుల్లా నాయకత్వం వహించారు. ఈ సమాచారాన్ని ముందుగా పసికట్టిన ప్రభుత్వం భారీ బందోబస్తు ఏర్పాటుచేసింది. ఆ బందోబస్తు ఏర్పాట్లను ఏమాత్రం ఖాతరు చేయకుండా 1932 జులై 31న కాంగ్రెస్ కార్యకర్తలు విజయవాడలోని కాంగ్రెస్ పార్టీ కార్యాలయ భవనాన్ని తిరిగి స్వాధీనం చేసుకునేందుకు సయ్యద్ హబీబుల్లా నేతృత్వంలో యువకులు ప్రయత్నించారు. సాయుధ పోలీసుబలగాలు కార్యాలయాన్ని చుట్టుముట్టిఉన్నందున యువకుల సాహసం ఫలితమివ్వలేదు. ఈ సాహసానికి ఒడిగట్టిన సయ్యద్ హబీబుల్లాతోపాటుగా మరో70 మంది యువకులు అరెస్టయ్యి చరిత్ర సృష్టించారు.(భారతదేశ స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర, కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం, విజయవాడ, 1984, పేజి.92).

ఈ విధమైన సాహస ఘట్టాలు జరుగుతుండగా దేశవ్యాప్తంగా శాసనోల్లంఘన ఉద్యమాన్ని మరింత వేగవంతం చేసేందుకు ఢిల్లీలో జాతీయ నాయకులు నిర్ణయించారు. ఆ కార్యక్రమాన్ని విజయవంతం చేయడానికి అగ్రనాయకుల ఆధ్వర్యంలో ఢిల్లీలో రహస్య రాజకీయ తరగతులు జరిగాయి. ఆ తరగతులకు ఆంధ్ర నుండి ప్రతినిధులు హాజరై తిరిగి వచ్చి రాష్ట్రంలో కూడా అధ్యయన తరగతుల నిర్వహణకు నడుం కట్టారు.ఈ మేరకు గుంటూరు జిల్లా తెనాలిలో జరగనున్న రహస్య సభలకు ప్రతినిధుల సమీకరణ కోసం తెనాలి ఉన్నత పాఠశాల విద్యార్థి షేక్ మహబూబ్ ఆదం (1914-1997), ఆయన గురువు మంత్రవాది వెంకటరత్నంలు సంయుక్తంగా రహస్య ప్రచార కార్యక్రమాన్ని నిర్వహించారు. కర్నూలు జిల్లా చెందిన యం.షంషీర్ బేగ్ శాసనోల్లంఘనలో ప్రముఖ పాత్ర వహించారు. ఉన్నత పాఠశాల విద్యార్థి అయినటువంటి ఆయన శాసనోల్లంఘన పిలుపును అందుకుని బ్రిటిష్ వ్యతిరేక పోరాట జీవితాన్ని ప్రారంభించి చివరి వరకు ఉద్యమబాటన సాగారు.

మహాత్మా గాంధీ శాసనోల్లంఘన ఉద్యమాన్ని విరమించుకోవడం పట్ల సాహసికులైన యువకులు కినుక వహించారు. అహింసా మార్గం వలన ఆంగ్ల ప్రభుత్వాన్ని లొంగదీయడం ఎప్పటికి సాధ్యం కాదను కున్నారు. విప్లవ కార్యక్రమాల ద్వారానే, సాయుధ పోరాటం ద్వారా మాత్రమే ప్రభుత్వం ప్రజల గోడు వింటుందని భావించిన సాహసులైన యువకులు విప్లవ మార్గాన్ని ఎంచుకున్నారు.ఆ కార్యక్రమాలలో తెనాలికి చెందిన మున్షీ మహమ్మద్ మస్తాన్, ఒంగోలుకు చెందిన రహమతుల్లా తదితరులు పాల్గొన్నారు. రహమతుల్లా మీద బాంబుల తయారి కేసు నమోదయ్యింది. ఆ యన శిక్షలు అనుభవించారు. ఆ తరువాతి కాలంలో ప్రముఖ రాజకీయవేత్తగా రహమతుల్లా రాణించారు. తెనాలికి చెందిన మున్షీ ముహమ్మద్ మస్తాన్ (1913-1999) పలు ఉద్యమ కార్యక్రమాలలో పాల్గొని ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధునిగా ఖ్యాతి గడించారు. మున్షీ మహమ్మద్ మస్తాన్ విప్లవ కరపత్రాలను పంచడమే కాక, మంతెనవారి పాలెంలో రహస్యంగా నిర్వహించిన రాజకీయ తరగతులకు హాజరై, పోలీసుల చేత చిక్కారు. ఆయనను 21 రోజుల పాటు పోలీసులు తమ కస్టడీలో ఉంచుకుని చితకబాది వదిలారు.

1939లో ద్వితీయ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. ఈ సందర్భంగా అరెస్టులు, నిర్బంధాలు, చిత్రహింసలు, జైలుశిక్షలు ముమ్మరంగా సాగాయి. ఈ క్రమంలో ప్రకాశం జిల్లా అమ్మనబ్రోలుకు చెందిన టాంగా డ్రైవర్ షేక్ చెంగీ షా మూడు మాసాల కఠిన జైలుశిక్ష అనుభవించారు. కృష్ణాజిల్లా నూజివీడుకు చెందిన కొత్వాల్ అబ్బాస్ అలీ కుమారుడు మహమ్మద్ హుస్సేన్ లాఠీఛార్జీలో తీవ్రంగా గాయపడ్డారు. కొనకంచి నివాసి షేక్ సర్దార్ సాహెబ్‌కు కోర్టు ముగిసేవరకు శిక్ష పడింది. అయినా ఆయన మళ్ళీ సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఈ విధంగా అనేక సంఘటనల్లో పలువురికి కఠినశిక్షలు పడ్డాయి. కర్నూలు జిల్లా పాణ్యంకు చెందిన షంషేర్ బేగ్‌కు ఆరు మాసాల జైలు, 500 జరిమానా లేక మూడు మాసాల జైలు శిక్ష విధించారు. జరిమానా కట్టడానికి ఆయన నిరాకరించారు. జరిమానా కడితే తాను చేసిన పనిని నేరంగా అంగీకరించటమేనని భావించిన ఆయన జరిమానా కట్టకుండా అదనంగా మూడు మాసాల జైలు జీవితం గడిపారు. నంద్యాల -పాణ్యం మధ్యన రైల్వేలైనుకు ఫిష్ ప్లేట్లు తొలగించినందుకు గాను షంషేర్ బేగ్, ముల్లా, మహబూబ్ సాహెబ్‌లు ఏడాది జైలు శిక్షను అనుభవించారు. షంషేర్ బేగ్ ఆ తరువాత కూడా ఉద్యమంలో నిర్విఘ్నంగా పాల్గొన్నారు. స్వతంత్ర భారతంలో రెండు సార్లు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులుగా ఎంపికయ్యారు.

ఈ కార్యక్రమాల సందర్భంగా కాంగ్రెస్ పార్టీ శాఖలు ఎన్నిక చేసిన వ్యక్తులుమాత్రమే వ్యక్తిగత సత్యాగ్రహంలోపాల్గొనాలన్న విధానాన్ని బాపట్ల ప్రాంతానికి చెందిన ముహమ్మద్ హనీఫ్ (1914-1990) లాంటి యువకులు వ్యతిరేకించారు. చిన్నవయస్సు నుండి ఆంగ్లేయ వ్యతిరేక భావనలను పుణికి పుచ్చుకున్న మహమ్మద్ హనీఫ్ బాపట్ల ప్రాంతంలో జన్మించినా తండ్రి ఉద్యోగం రీత్యా మద్రాసులో పెరిగారు. మద్రాసు కేంద్రంగా సాగిన జాతీయోద్యమంలో పాల్గొన్న ఆయన పలుమార్లు పోలీసుల దాష్టికాన్ని రుచిచూశారు. చిన్నవయస్సు కనుక అరెస్టులు, శిక్షలు తప్పించుకున్నారు. వ్యక్తిగత సత్యాగ్రహంలో ఎంత మంది కార్యకర్తలు, ప్రజలు పాల్గొనదలిచితే అంతమందిని బేషరతుగా అనుమతించాలని డిమాండ్ చేశారు. మాతృభూమి విముక్తి పోరాటంలో పాల్గొనాలనుకున్న వారి మీద ఆంక్షలు, నిషేధాలు, ఎంపిక విధానాలు ఏమిటని మహమ్మద్ హనీఫ్ జాతీయ నాయకులను సూటిగా ప్రశ్నించారు. అనాటి సత్యాగ్రహోద్యమంలో క్రియాశీలక పాత్ర నిర్వహించిన ఆయన చివరకు మద్రాసు నుండి బాపట్లకు తిరిగి వచ్చేసిన మహమ్మద్ హనీఫ్ స్థానికంగా జరిగిన ప్రభుత్వ వ్యతిరేక కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొన్నారు.

జాతీయోద్యమంలో భాగంగా ప్రజలు ద్వితీయ ప్రపంచ యుద్ధ వ్యతిరేక ప్రచారంలో కూడా పెద్ద ఎత్తున ఈ చర్యల పట్ల మండిపడిన ప్రభుత్వం అరెస్టులతో,జైలు శిక్షలతో ప్రజల గొంతులనునొక్కి వేయాలని విఫలయత్నం చేసింది. ఈ సందర్భంగా యుద్ధ వ్యతిరేక ప్రచారంలో పాల్గొంటున్న కొండా అప్పాపురం నివాసి టైలర్ షేక్ నబీ రసూల్ సాహెబ్ మూడు మాసాలు, గుంటూరుకు చెందిన సయ్యద్ జానీ సాహెబ్ నరసరావుపేట జైలులో నెల రోజులపాటు శిక్షను అనుభవించారు. గుంటూరుకు చెందిన షేక్ గాలిబ్ సాహెబ్, షేక్ అలీలు అరెస్టయ్యారు. నరసరావుపేటకు చెందిన షేక్ మహమ్మద్ మొహిద్దీన్ 1941 ఏప్రిల్‌లో నరసరావుపేట ప్రాంతంలో జరిగిన అహింసాయుత సత్యాగ్రహంలో పాల్గొని ఆరు మాసాలు కారాగారవాసంలో గడిపారు.

## క్విట్ ఇండియా ఉద్యమం :

జాతీయోద్యమ నాయకులతో రాయబారం జరపడానికి 1942 మార్చిలో సర్ స్టాఫర్డ్ క్రిప్స్ భారతదేశం వచ్చాడు. క్రిప్స్ ప్రతిపాదనలు ఆమోదయోగ్యంగా లేనందున 1942 జులైలో మహాత్ముడు బ్రిటిష్ ప్రభుత్వానికి చివరి హెచ్చరిక చేశాడు. ఆ తరువాత ప్రజలనుద్దేశించి గాంధీజీ మాట్లాడుతూ విజయమో-వీరస్వర్గమో ('Do or Die') తేల్చుకోవాలన్నారు. ఆంగ్లేయులను తమ మాతృభూమి విడిచి వెళ్ళాలని డిమాండ్ చేస్తూ బొంబాయికి చెందిన శ్రీ యూసుఫ్ మెహర్ అలీ 'క్విట్ ఇండియా' శీర్షికన చిరుపుస్తకం ప్రచురించారు. ఈ ప్రచురణతో ప్రచారంలోకి వచ్చిన 'క్విట్ ఇండియా' పదం కాస్తా ఆంగ్లేయులకు వ్యతిరేకంగా భారతీయుల బలమైన నినాదమయ్యింది. క్విట్ ఇండియా ఉద్యమం రూపుదిద్దుకుంది. శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్య దీనిని **బహిరంగ తిరుగుబాటు**గా అభివర్ణిస్తూ, అందుకు ప్రజలు సిద్ధం కావాలని పిలుపునిచ్చారు.

'క్విట్ ఇండియా' అంటూ ఉద్యమించిన ప్రజల మీద ఆంగ్ల ప్రభుత్వం విరుచుకపడింది. అక్రమ నిర్బంధాలకు, అరెస్టులను హద్దుల్లేని శిక్షలకు ప్రభుత్వం పాల్పడింది. ఈ సందర్భంగా కృష్ణాజిల్లా తిరువూరు తాలూకా గొరంపాలెం నివాసి సాలార్ సాహెబ్ పోలీసుల నిర్బంధంలో చిత్రహింసల పాలయ్యారు. కృష్ణాజిల్లాకు చెందిన స్వాతంత్ర్య సమర యోధుడు కొత్వాల్ అబ్బాస్ అలీ కుమారుడు కొత్వాల్ మహమ్మద్ హుస్సేన్ పోలీసుల నిర్బంధానికి గురయ్యారు. ఆయన నూజివీడు కాంగ్రెస్ పట్టణ సహాయ కార్యదర్శి బాధ్యతలను నిర్వహించారు. నూజివీడుకు చెందిన షేక్ నూరుల్లా సాహెబ్, కొనకంచి నివాసి షేక్ సర్దార్ సాహెబ్ వ్యక్తిసత్యాగ్రహం నుండి క్విట్ ఇండియా ఉద్యమం వరకు నిరంతరం కార్యక్రమాలలో పాల్గొన్నారు. నందిగామ తాలూకా కొనకంచి గ్రామాధి కారి షేక్ బికారీ సాహెబ్ ఉద్యమకారుల పట్ల ప్రభుత్వం అనుసరిస్తున్న కిరాతక వైఖరికి నిరసనగా ఉద్యోగానికి రాజీనామా చేశారు. ఆలూరు తాలూకా నెమకల్‌కు చెందిన టైలర్ యం. అక్బర్ ఆలీ ఎనిమిది మాసాల జైలు శిక్షకు గురయ్యారు. ఆయన ఖాది ఉద్యమ ప్రచారంలో,

హరిజనోద్ధరణ, మద్యపాన నిషేధం తదితర కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొన్నారు. కర్నూలు జిల్లా నంద్యాల తాలూకా తొగిరిచేడుకు చెందిన రైతుకూలీ ముల్లా మహబూబ్ సుభాని అలీపూర్‌జైలులో ఆరు మాసాల జైలుశిక్ష అనుభవించారు. ఆ తరువాత స్వతంత్ర భారతదేశంలో ఆయన గ్రామ పంచాయితీ సభ్యులుగా 1950-70 వరకు సేవలు అందచేశారు. అదోని తాలూకా పాండవగల్లు గ్రామ మున్సిఫ్‌గా పనిచేస్తున్న సుల్తాన్ మొహిద్దీన్ జాతీయోద్యమ కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొన్నారు. ఆయన్ను నిర్బంధంలోకి తీసుకున్న పోలీసులు చేసిన నేరారోపణల ఫలితంగా అలీపూర్, బళ్ళారి జైళ్లలో మూడు మాసాల పాటు జైలుశిక్షను అనుభవించారు. గుంటూరు జిల్లా సత్తెనపల్లికి చెందిన టైలర్ షేక్ హటల్ సాహెబ్‌ను అరెస్టు చేసి డిఫెన్స్ ఆఫ్ ఇండియా రూల్స్ క్రింద 18 మాసాల శిక్షను విధించారు. నిడుబ్రోలుకు చెందిన షేక్ మస్తాన్ క్విట్ ఇండియా ఉద్యమంలో ప్రముఖంగా పాల్గొన్నారు. ఆయనకు ప్రభుత్వం మూడు సంవత్సరాల ఆరు మాసాల జైలుశిక్ష విధించింది. బస్‌కండక్టర్ ముహమ్మద్ హనీఫ్ అలీపూర్, రాజమండ్రి జైళ్ళల్లో సంవత్సరం గడిపారు. తెనాలికి చెందిన మున్షీ సయ్యద్ మహమ్మద్ మస్తాన్ తెనాలి రైల్వే స్టేషన్ మీద జరిగిన దాడిలో పాల్గొని, అక్కడ జరిగిన పోలీసు కాల్పుల్లో చావు తప్పి బయటపడ్డారు. ఆ తరువాత కొంతకాలం రహస్య జీవితం గడిపారు. తెనాలికి చెందిన మరోయోధుడు సయ్యద్ అబ్దుల్ అజీం (1919-2001) ఉద్యమ కార్యకలాపాలలో పాల్గొనడమే కాక, మద్రాసులో కొంతకాలం అజ్ఞాతవాసం చేశారు. నరసరావుపేటకు చెందిన షేక్ మహమ్మద్ మొహిద్దీన్ (1922-1994) అరెస్టుల నుండి తప్పించుకుని ఆరుమాసాల పాటు నల్లమల అడవుల్లో అజ్ఞాతంలో గడిపారు. విజయవాడకు చెందిన షేక్ మహమ్మద్ యాసిన్ (1913-2000) క్విట్ ఇండియా ఉద్యమ ప్రచారకార్యక్రమాన్ని ముమ్మరంగా నిర్వహించారు.

1943లో అన్నాప్రగడ నాయకత్వంలో వినూత్నంగా జరిగిన 'రానున్న స్వాతంత్ర్యోత్సవ సంబరాలు' జరిగాయి. ఆంగ్ల ప్రభుత్వం ఆగ్రహానికి గురైన ఈ సంబరాల కార్యక్రమం సందర్భంగా జరిగిన ఊరేగింపులో పాల్గొన్న నేరానికి 1943 జనవరి 24 నుండి, ఫిబ్రవరి 7 వరకు ఆయన గుంటూరు సబ్‌జైలులో నిర్బంధానికి గురయ్యారు. ఆ తరువాత కార్యక్రమాలను మరింత ఉధృతం చేయగా ఆయన మీద అరెస్టుకు వారెంటు జారీ అయ్యింది. ఆ వారెంటు నుండి తప్పించుకోడానికి పార్టీ నేతల ఆదేశాల ప్రకారంగా తెనాలికి చెందిన మున్షీ మహమ్మద్ మస్తాన్ అజ్ఞాతానికి వెళ్ళారు. అజ్ఞాతంలో ఉంటూ కూడా మున్షీ తన పార్టీ ప్రచార కార్యక్రమాలను నిరాఘటంగా నిర్వహిస్తూ 1942 జూన్ మాసం నుండి 1943 డిసెంబరు వరకు పోలీసులకు చిక్కకుండా గడిపారు.

## చెన్నపట్నం చెర నుండి పల్లెల్లోకి ముస్లిం లీగ్ :

అఖిలభారత ముస్లింలీగ్ 1906ప్రాంతంలో ముస్లిం లీగ్ ఏర్పడినా రాజకీయంగా చైతన్యవంతమైన గుంటూరు జిల్లాలో 1944 వరకు పూర్తి స్థాయిలో జిల్లా శాఖ ఏర్పడలేదు. మద్రాసు నుండి చక్రం తిప్పు తున్న ముస్లిం లీగ్ నేతలు స్థానిక నాయకుల అభిష్టానికి వ్యతిరేకంగా వ్యవహరించడంతో నగరవాసులైన నాయకుల మీద పల్లెవాసులు తిరుగుబాటు చేశారు. ఆ క్రమంలో స్వతంత్రంగా వ్యవహరించడానికి నిర్ణయించుకున్నారు. ఈ తిరుగుబాటుకు గుంటూరు జిల్లా తెనాలి కేంద్రంగా మారింది. గుంటూరు తెనాలికి చెందిన మున్షి సయ్యద్ మహబూబ్ (-1985) ఆ పరిస్థితులను తారుమారు చేస్తూ రాష్ట్రశాఖకు నాయకత్వం వహించగా యం.ఎ. సలాం, షేక్ మగ్దూం, డాక్టర్ మహమ్మద్ బేగ్ తదితర ప్రముఖులు ముస్లిం లీగ్ రాష్ట్రశాఖను మద్రాసు నగర ప్రముఖుల పట్టు నుండి తప్పించి పల్లె ప్రాంతాలకు తరలించడంలో ప్రముఖ పాత్ర నిర్వహించారు.

ఆనాడు అఖిల భారత ముస్లింలీగ్ రాజకీయ దృక్పథంఎలా ఉన్నా ఆంధ్రలోని ముస్లింలలో అత్యధికుల రాజకీయ దృక్కోణం మాత్రం భిన్నంగా ఉంది. ముస్లింలు అటు అఖిల భారత జాతీయ కాంగ్రెస్‌లో ఉన్నా, ఇటు అఖిల భారత ముస్లింలీగ్‌లో ఉన్నా ఉమ్మడి ప్రయోజనాల విషయంలో ఏకాభిప్రాయం కలిగి ఉండటం విశేషం. ఆంధ్రలో ముస్లింలీగ్‌ను ప్రజాపరం చేయడానికి ఆవిర్భవించిన **గుంటూరు జిల్లా ముస్లింలీగ్ ఆర్గనైజింగ్ కమిటీ** అభిప్రాయాలు గాని, ఆ సభలను సంబోధించిన డాక్టర్ ఉమర్ అలీషా అభిప్రాయం గాని ఒకేరకంగా ఉన్నాయి. 1945 జనవరి 21న సాయంత్రం బాపట్లలో జరిగిన బహిరంగసభలో తూర్పుగోదావరి జిల్లా పిఠాపురానికి చెందిన ప్రముఖ కవివర్యులు మౌల్వీ ఉమర్ అలీషా(1885-1945) మాట్లాడుతూ, **మన దేశంలో కాంగ్రెసు, ముస్లిం లీగు రెండు పెద్ద రాజకీయ సంస్థలు. రెండు ఏకమైతేనేగాని పరదేశ పాలకవర్గాన్ని తరుమలేము. హిందూ-ముస్లిం తగాదాలు పోరాటాలు విదేశ పాలకులను ఇక్కడే శాశ్వితముగా అట్టి పెట్టగలవు. ఈ సత్యాన్ని ఉభయులు** గ్రహించాల,ని ఉద్బోధించారు. గుంటూరు, ప్రస్తుత ప్రకాశం జిల్లా నేతల కృషి వలన గుంటూరు జిల్లా పరిధిలోని 94 గ్రామాలలో 13వేల 366 మంది ముస్లిం లీగ్ సభ్యులయ్యారు. గుంటూరు, తెనాలి, రేపల్లె, బాపట్ల, ఒంగోలు,సత్తెనపల్లి, నరసరావుపేట,పల్నాడు, వినుకొండ ప్రాంతాలలో లీగ్ విస్తరించింది. (గుంటూరు జిల్లా ముస్లిం లీగ్ ప్రథమ వార్షిక నివేదిక 1945-46, రూపకల్పనః సయ్యద్ మహబూబ్ -తెనాలి, ముద్రణ ః సిటీ ప్రెస్-గుంటూరు).

1945 మే 5న గుంటూరు జిల్లా చందోలులోతొలిసారిగా రాష్ట్ర స్థాయి రాజకీయ పాఠశాల నిర్వహించారు. ఆంధ్ర ప్రాంతం నుండి

40 మంది విద్యార్థులుగా పాల్గొన్న ఈ పాఠశాల 10 రోజుల పాటు నిర్విఘ్నంగా సాగి చరిత్ర సృష్టించింది. ఈ పాఠశాలలో అజీజుల్లా దుర్రాని (ఇంగ్లాండు), అబ్దుల్ మన్నాన్ దుర్రాని (అలీఘర్), డాక్టర్ మహమ్మద్ బేగ్, యం.ఎ. సలాం, షేక్ మగ్దూం, యస్ మహబూబ్‌లు అధ్యాపకులుగా వ్యవహరించారు. రాష్ట్రంలోని ఒంగోలు, అమ్మనబ్రోలు,చిలకలూరిపేట, పొన్నూరు, భట్టిప్రోలు, కనగాల, కొలకలూరు, నందివెలుగు, తేలప్రోలు, వడ్లమూడి, చేబ్రోలు, గురజాల, దాచేపల్లి, పిడుగురాళ్ళ, సత్తెనపల్లి, ఫిరంగిపురం, బాపట్ల, తాడికొండ, చీరాల, పేరాల, ఈపూరు పాలెం, పర్చూరు, దగ్గుపాడు, ఇంకొల్లు తదితర ప్రాంతాలలో భారీ ప్రదర్శనలు, బహిరంగ సభలను లీగ్ నేతలు విజయవంతంగా నిర్వహించారు.

ఈ సభలు జరిగిన పలుచోట్ల ప్రజలను ఉత్తేజపర్చుతూ స్వతంత్ర భావనలను ప్రజలలో ఉద్దీపింపచేస్తూ, హిందూ-ముస్లింలమధ్య స్నేహ సంబంధాలను, సోదరభావాన్ని, ఐక్యతావశ్యకతను పునరుద్ఘాటిస్తూ **పుకార్** అను నాటక ప్రదర్శన, నాదస్వర కచేరీలు, ఇతర కళారూపాల ప్రదర్శనలుఏర్పాటు చేయడం విశేషం. ఈ కార్యక్రమాలన్నీ కార్యదక్షులు మాత్రమే కాకుండా ఉత్తమ ప్రజాకళాకారుడు మున్షీసయ్యద్ మహబూబ్ మార్గదర్శకంలో సాగి ప్రజలను అబ్బురపర్చాయి. 1940 నాటికి అఖిల భారత ముస్లింలీగ్ 'పాకిస్థాన్' తీర్మానం చేసినా స్థానిక ముస్లింలీగ్ నాయుకులు మాత్రం ఆ తీర్మానాన్ని పరిగణలోకి తీసుకోలేదు.

ఆ తరువాత ముస్లిం లీగ్‌లో పుట్టుకొచ్చిన విభజన-వేర్పాటువాద ధోరణుల తీవ్రత మూలంగా రాష్ట్రశాఖ నాయకులు ముస్లింలీగ్ కార్యక్రమాలకు క్రమంగా స్వస్తి పలికి భారత జాతీయ కాంగ్రెస్, కమ్యూనిస్టు పార్టీల కార్యక్రమాలకు తమనుతాము పరిమితం చేసుకున్నారు. ముస్లింలీగ్‌ను తొలుత నుండి వ్యతిరేకించిన షేక్ మహమ్మద్ యాశిన్ (విజయవాడ) విభజనకు వ్యతిరేకంగా గళం విప్పారు.అయన ఈ చర్య ముస్లింలీగ్ కార్యకర్తలఆగ్రహానికి గురయ్యింది. ముస్లింలీగ్ ఆధిపత్యం ఉన్న మసీదుల్లోకి ఆయనను రానివ్వకుండా అడ్డుపడేంత వరకు వెళ్ళింది. అయినా ఆయన ఏమాత్రం చెక్కుచెదర కుండా తన అభిప్రాయాల మీద స్థిరంగా నిలిచారు.

## భారత జాతీయ సైన్యంలో కృష్ణాతీరం బిడ్డలు :

మాతృదేశాన్ని బ్రిటిష్ దాస్య శృంఖాలాల నుండి విముక్తం చేయడానికి జర్మనీ, జపాన్ దేశాల సైనిక సహాయం కోరడం కోసం నేతాజీ సుభాష్ చంద్ర బోస్ దేశం విడిచి వెళ్ళారు. భారత దేశం విముక్తి ప్రధాన లక్ష్యంగా ఆయన నేతృత్వంలో భారత జాతీయ సైన్యం (ఆజాద్ హింద్ ఫౌజ్) ఏర్పడింది. ఆనాడు బ్రిటిష్ సైన్యంలో పనిచేస్తున్న భారతీయ సైనికులు, ఆంధ్రప్రదేశ్‌లోని ఇతర ప్రాంతాలకు చెందిన పలువురు భాగస్వాములయ్యారు. గుంటూరు జిల్లా చందోలు గ్రామంలో ఆనాటి వీర సైనికుల జాడలు నేటికీ కన్పిస్తాయి. ఆ గ్రామం నుండి భారత జాతీయ కాంగ్రెస్‌లో, ముస్లింలీగ్‌లో, భారత జాతీయ సైన్యంలో పెద్ద సంఖ్యలో పాల్గొనడం విశేషాంశం. అప్పటి గుంటూరు జిల్లా ప్రస్తుత ప్రకాశం జిల్లా దర్శి తాలూకా రామభద్రపురం గ్రామాధి కారి షేక్ బాదుషా 1937లో సైన్యంలో చేరారు. ఆరువాత ఆయన భారతజాతీయ సైన్యం సైనికుడిగా పోరాడిన కారణంగా మలయా, మాండలే జైళ్ళల్లో నిర్బంధానికి గురయ్యారు. గురజాలకు చెందిన సయ్యద్ లతీఫ్ (1919-1990) భారత జాతీయ సైన్యం ద్వారా మాతృభూమి విముక్తి పోరాటానికి చేయూత నిచ్చారు. చివరకు ఆయన నల్గొండ వెళ్ళి 'సయ్యద్ లతీఫ్ మాష్టారు' సుప్రసిద్ధులయ్యారు. తెనాలికి చెందిన సయ్యద్ అజీం లాంటి వారు భారత జాతీయ సైన్యం కోసం నిధులను సేకరించారు.

## భారత విభజన పట్ల వ్యతిరేకత

అంతర్జాతీయ పరిణామాల దృష్ట్యా, జాతీయంగా భారతీయులు నిర్వహిస్తున్న ఉద్యమాల తీవ్రత ఫలితంగా 1947లో భారతదేశం పాలనాధికారాన్ని భారతీయులకు అప్పగించాల్సిన పరిస్థితి ఆంగ్లేయు లకు ఏర్పడింది. భారతదేశాన్ని విడిచి వెళ్ళే ముందు ఈ గడ్డను ముక్కలు చేసి మరీ వెళ్లేందుకు నిర్ణయించుకున్న బ్రిటిష్ పాలకులు విభజన పథకాన్ని విజయవంతంగా అమలు చేశారు. 1940 నుండి పాకిస్థాన్ ఏర్పాటును కోరుతూ ఆల్ ఇండియా ముస్లింలీగ్ సాగించిన విభజన రాజకీయాలకు ఆంగ్లేయులు తోడ్పాటు అందించారు. ఈ విభజన ప్రయత్నాలకు కృష్ణాతీరం ముస్లింలవ్యతిరేకించారు. గుంటూరు జిల్లా తెనాలికి చెందిన మున్షీ మస్తాన్, సయ్యద్ మహబూబ్, సరావు పేటకు చెందిన షేక్ ముహమ్మద్ ఆలీ, షేక్ మొహిద్దీన్ సాహెబ్‌లు లీగ్ విభజన రాజకీయాలను నిరసించారు. మహమ్మద్ ఆలీ ఎంతో కాలం లీగ్ సభ్యునిగా ఉన్నా కూడా, లీగ్ విభజన రాజకీయాలను వ్యతిరేకిస్తూ లీగ్‌కు రాజీనామా చేశారు. నరసరావుపేటకు చెందిన సయ్యద్ జాన్ అహమ్మద్ విభజనను వ్యతిరేకిస్తూ పనిచేశారు. భారత విభజన వలనకలిగే నష్టాలను,కష్టాలను వివరిస్తూ సభలు సమావేశాలు నిర్వహించారు. కర్నూలు జిల్లాకు చెందిన సయ్యద్ షా మొహిద్దీన్ ఖాద్రి బియబాని(1894-1969) జాతీయ స్థాయిలో మౌలానా అబుల్ కలాం ఆజాద్, ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ లాంటి నాయకులు చివరి వరకు విభజనను నివారించడానికి ప్రయత్నించారు. ఆనాడు మౌలానా బాటన నడిచి భారత విభజనను పలువురు తెలుగుబిడ్డలు వ్యతిరేకిం చారు.ఆ దిశగా ప్రచార కార్యక్రమాలను కూడాముమ్మరంగా చేపట్టారు. భారత విభజనను ప్రజలు, నాయకులు ఎంతగా వ్యతిరేకించినా విభజన తప్పలేదు. చివరకు మన మాతృభూమి ఇండియా- పాకిస్తాన్ లుగా రెండు ముక్కలవడానికి మార్గం సుగమం అయ్యింది.

1947 జూలై 15న బ్రిటిష్ పార్లమెంట్ **భారత స్వాతంత్ర్య ప్రదాన బిల్లు** ను ఆమోదించింది. స్వాతంత్ర్య పోరాటంలోని ప్రతిఘట్టంలో తమదైన అద్భుత పాత్రను నిర్వహించిన తెలుగు ప్రజలు1947 ఆగస్టు 15న అత్యంత ఉత్సాహంతో భారత స్వాతంత్ర్యోత్సవాలను జరుపుకున్నారు. ఆ సమయంలో హైదరాబాదు సంస్థానాన్ని ఇండియన్ యూనియన్‌లో విలీనం చేసేదిలేదంటూ నిజాం నవాబు ఆగస్టు 14న **'ఆజాద్ హైదరాబాదు'** ను ప్రకటించాడు.ఆ ప్రకటనపట్ల అటు హైదరాబాదు సంస్థానంలో, ఇటు ఆంధ్రదేశంలోనూ వ్యతిరేకత వ్యక్తమయ్యింది.

**పరిటాల రిపబ్లిక్ పోరాటం :**

ఈ క్రమంలో ఇండియన్ యూనియన్‌లో హైదరాబాదు సంస్థానాన్ని విలీనం చేయాల్సిన అవసరాన్ని వివరిస్తూ నాయకులు ప్రచార కార్యక్రమాన్ని చేపడుతుండగా, కృష్ణా తీరంలోని ప్రస్తుత కృష్ణా జిల్లా పరిటాల గ్రామం కేంద్రంగా(ఆనాడు పరిటాల నిజాం సంస్థాన గ్రామం) ప్రజలు 'రిపబ్లిక్' ప్రకటించుకున్నారు. ఈ రిపబ్లిక్ ఉద్యమానికి శ్రీ మాదిరాజు దేవరాజు నాయకత్వం వహించాగా ఆయన సన్నిహిత సహచరుడిగా పరిటాల గ్రామస్తులు శ్రీ షేక్ మౌలా సాహెబ్ (1922-2013) అండదండలు అందించారు. పరిటాల రిపబ్లిక్ పతాకాన్ని ఎగురవేయడానికి సందేహిస్తుంగడా **దూర్‌హటో దునియా వాలో... హిందూస్థాన్ హమారా హై,** అంటూ ముదుకు దూసుకవచ్చిన షేక్ మౌలా సాహెబ్ పరిటాల పతాకాన్ని గ్రామం నడిబొడ్డున ఎగురవేసి సంచలనం సృష్టించారు. ఈ చర్య రిపబ్లిక్ ఉద్యమకారులను ఉత్తేజపర్చింది. ఈ చర్యకు మూడు సంవత్సరాల కఠిన శిక్ష ఉన్నప్పటికీ మౌలా సాహెబ్‌ఏమాత్రం భయపడకుండా పరిటాలపోరాటంలో చివరి వరకు నిలిచారు. ఆనాటి పోరాటంలో పాల్గొన్న పలువురిలో కృష్ణా జిల్లా గన్నవరం నివాసి నాసిర్ మహమ్మద్ ఐదు మాసాలు, ఖమ్మం తాలూకా మధిరకు చెందిన ఖాదర్‌బేగ్ రెండు మాసాలు జైలు శిక్షను అనుభవించారు. నిజాం సంస్థానం ఇండియన్ యూనియన్‌లో కలవాల్సిందేనంటూ నరసరావుపేటకు చెందిన షేక్ మహమ్మద్ మొహిద్దీన్ పలు ప్రాంతాలలలో పర్యటించి ఆలోచనాత్మక ప్రసంగాలో ప్రజలను ఆకట్టుకున్నారు. ఆనాడు విలీనం కోరుతూ సాగిన ప్రజాపోరులో కొంత మంది ముస్లిం మహిళలు పాల్గొన్నారు. ముస్లిం మహిళలకున్న మత, సామాజిక బంధనాల మూలంగా పెద్దసంఖ్యలో పోరుబాటన సాగలేక పోయినప్పటికీ, ఉద్యమకారులైన బిడ్డలను, భర్తలను ఎంతగానో ప్రోత్సహిస్తూ సహకరించారు.

**స్వాతంత్ర్యోదయం :**

చివరకు 1945 ఆగస్టు 15 భారతావని స్వేఛ్ఛా-స్వాతంత్ర్యాలను పొందగా 1948 సెప్టంబర్ 18న నైజాం సంస్థానం ఇండియన్ యూనియన్‌లో విలీనంకాగా, 1956 నవంబరు ఒకటిన తెలుగు ప్రజల చిరకాల వాంఛ నెరవేరి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అవతరించింది.

**త్యాగాల చరిత్ర అందరికి తెలియాలి :**

ప్రజలకు అన్ని సాంఘిక జనసముదాయాల త్యాగాలు తెలియాల్సి ఉంది. విభిన్న సాంఘిక జనసముదాయాలు కలిసిమెలిసి సహజీవం సాగిస్తున్న గడ్డ అయినటువంటి భరతభూమిలో ఆయా జనసముదాయాల మధ్యన సుహృద్భావ వాతావరణం ఏర్పడడానికి ఒకరి త్యాగ పూరిత చరిత్రలు మరొకరికి తెలియాల్సిన ఆవసరం ఎంతైనా ఉంది. మాతృభూమి సేవలో పునీతమైన ప్రజలందరి చరిత్ర అన్ని సాంఘిక జనసముదాయాలకు తెలిసినప్పుడు మాత్రమే ఆయా జనసముదాయాల మధ్యన పరస్పర గౌరవం ఏర్పడుతుంది. ఆ గౌరవం సదవగాహనకు కారణమౌతుంది. ఆ సదవగాహన నుండి సధ్భావన, సహిష్ణుత ఉత్పన్నమౌతాయి. ఆ సహిష్ణుత, సామరస్యం, శాంతి-స్నేహాలకు బలమైన పునాది అవుతాయి.

చరిత్ర మంచి చెడుల సమాహారం.చెడు సంఘటనలను గుర్తుచేస్తూ జనసమూహాల మధ్య వైషమ్యాలకు కారణమయ్యేకంటే, మంచి సంఘటనలను మళ్ళీ మళ్ళీ స్మరిచుకుంటూ భిన్నత్వంలో ఏకత్వంలో-ఏకత్వంలో భిన్నత్వం సంఘ జీవనానికి భూమికగా బహుళ సంస్కృతి-సభ్యతలతో సహజీవనం సాగిస్తున్న ప్రజల మధ్య స్నేహాన్ని, సోదర భావాన్ని, సామరస్యవాతావరణాన్ని మరింతగా పటిష్టం చేయయటం మంచిది.

ఈ వాతావరణంలో భారతీయ లౌకిక వ్యవస్థ పరిఢవిల్లుతుంది. సృష్టించదుతున్న, రగిలించబడుతున్న, పెంచి పోషించబడుతున్న మత విద్వేషాలు మట్టిలో కలసిపోయి మతసామరస్యం మరింతగా సుధృఢమౌవుతుంది. మతోన్మాద రాజకీయ శక్తుల కుట్రలు, కుయుక్తులకు అడ్డుకట్ట పడుతుంది. ఆ ప్రయత్నంలో భాగంగా సామాన్య ప్రజలకు చేరువకాని ముస్లింల త్యాగమయ చరిత్రను ప్రజలచెంతకు చేర్చేందుకు సాగుతున్న కృషిలో అతి చిన్న ప్రయత్నమిది.

డా|| కాటాబత్తుల ప్రభాకర్

# కృష్ణాతీరంలో గిరిజనులు సంస్కృతి సంప్రదాయాలు

దక్షిణ భారతదేశంలో రెండవ అతిపెద్ద నది కృష్ణానది. ఇది మహారాష్ట్రలోని పశ్చిమకనుమలలో 'మహాబలేశ్వరం' వద్ద పుట్టి మహా రాష్ట్ర, కర్నాటక రాష్ట్రాలగుండా ప్రవహించి, మహబూబ్‌నగర్ జిల్లాలోని 'మక్తల్' తాలూకా 'తంగడి'వద్ద నుండి మన తెలుగు ప్రాంతాల్లోకి ప్రవహిస్తున్నది. ముఖ్యంగా మహబూబ్‌నగర్, కర్నూలు, నల్గొండ, గుంటూరు, కృష్ణా జిల్లాల సరిహద్దున ప్రవహించి 'హంసలదీవి' వద్ద బంగాళాఖాతంలో కలుస్తుంది.

కృష్ణానది ప్రవహించే ఈ జిల్లాలు చారిత్రకంగా ఎంతో ప్రసిద్ధి గాంచినవి. 'శాతవాహనులు, ఇక్ష్వాకులు, పల్లవులు, విష్ణుకుండినులు, చాళుక్యులు, కాకతీయులు, బహమనీయులు, విజయనగరరాజులు, నిజాములు' మొదలైన అనేక ప్రసిద్ధి రాజవంశాల పాలనలో వర్థిల్లినది. పురాణ ప్రసిద్ధి కలిగిన 'శ్రీశైలం, అహోబిలం, ఇంద్రకీలం, అమరావతి, ఆలంపురం, యాదగిరిగుట్ట' వంటి ఎన్నో పుణ్యక్షేత్రాలలో విలసిల్లినవి. అంతేకాక ఎందరో మహనీయులకు జన్మస్థలాలు కూడా అయి,ప్రఖ్యాతి గాంచిన ఈ నదీతీరప్రాంతాల్లో 'అనాదిగా మనదేశంలో నివసిస్తూ తమవైన ప్రత్యేక సంస్కృతీ సాంప్రదాయాలు నిలుపుకుంటూ వస్తున్న గిరిజనతెగలు కొన్ని కలవు. అందులో ఎరుకల, యానాది, లంబాడి, చెంచు' తెగలు ప్రధానమైనవిగా చెప్పవచ్చు.

భారతదేశపు మూలవాసులైన ఈ ఆదివాసీతెగలసంస్కృతీ సాంప్ర దాయాలు సంక్షిప్తంగా పరామర్శించటం ఈ వ్యాస ముఖ్యోద్దేశ్యం.

నేడు ప్రపంచవ్యాప్తంగా గిరిజన సంస్కృతికి ఎంతో ప్రాముఖ్య ముంది. 'సంస్కృతి' అనేపదానికి బదులు మనం తరుచుగా వాడే ఆంగ్ల పదం 'కల్చర్'. ఈ కల్చర్ అనే లాటిన్‌పదం 'టుకల్చర్' అనే మూలపదం నుండి ఏర్పడింది. డి.డి. 'కోశాంబి విశ్లేషణలో 'సంస్కృతి అంటే ప్రజలందరి జీవిత విధానం. వారి జీవన రీతిలోని ముఖ్యాంశా లను తెలియజేయడం.'

ఐక్యరాజ్యసమితి వారి నిర్వచనం ప్రకారం 'ఒక సమాజానికి లేదా సమూహానికి చెందిన ప్రత్యేకమైన ఆధ్యాత్మిక, లౌకిక, వైజ్ఞానిక పర్యావరణ భావోద్వేగ అంశాలు ఆ సమాజ సంస్కృతి అవుతాయి. కళలు, భాష, జీవనవిధానం, విలువలు, సంప్రదాయాలు, విశ్వాసాలు ఇవన్నీ సంస్కృతిలో భాగాలే.'

## ఎరుకల

గిరిజన సంచార జాతులకు చెందిన ఎరుకల వాళ్ళు దేశంలో పలు రాష్ట్రాల్లో విస్తరించి ఉన్నారు. వీళ్ళు ఆంధ్ర, తెలంగాణా రాష్ట్రాల రెండింటిలో కలిసి సుమారు 10 లక్షలమంది ఉంటారని ఎరుకల సంఘాలవారి అంచనా. 2011 జనాభా లెక్కల ప్రకారం వీళ్ళు ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలోని గుంటూరు జిల్లాలో అత్యధికంగా 77,615 మంది, కృష్ణాజిల్లాలో 38,649 మంది చొప్పున ఉన్నారు. ప్రకాశం, నెల్లూరు, అనంతపురం, కర్నూలు జిల్లాలో ఆ తర్వాత స్థానంలో ఉండి మిగతా రాష్ట్రమంతటా విస్తరించి ఉన్నారు. అలాగే తెలంగాణా జిల్లాలో పలు ప్రాంతాల్లో కూడా వీళ్ళున్నారు. తమిళనాడులో 'కురువన్' (కొరవలు) లుగా, కర్నాటకలో 'కొరమ' (కొరచ)లుగా, కేరళలో 'సిద్ధనార్' లుగా, మహారాష్ట్రలో 'కైకాడీ'లుగా పిలువబడుతున్న ఎరుకలవాళ్ళు, 'ఎరుక' చెబుతారు కాబట్టి ఆంధ్ర, తెలంగాణాల్లో అదే పేరుతో వ్యవహరింప బడుతున్నారు. ఈ జాతి ఆవిర్భావము తమిళప్రాంతమని, తమిళ నాడుకు చెందిన కురువన్‌లు, వీళ్ళేనని, వీళ్ళలో కొన్ని కుటుంబాలు తెలుగు ప్రాంతాలకు వలస వచ్చారని 'ఎడ్గార్ థ్రస్టన్' వ్రాసిన Caste and Tribes of Southern India అనే ఆంగ్ల గ్రంథం వల్ల తెలుస్తుంది.

ఎరుకలకు సంబంధించిన సాహిత్యపరమైన ఆధారం వరాహభవి ష్యోత్తర పురాణాల్లోను, భారత,భాగవతాది గ్రంథాల్లోను ఉంది. అంటే ఈ జాతి క్రీస్తుకు పూర్వం నుంచే ఉన్నదనే విషయం స్పష్టం చెయ్య వచ్చు. వీళ్ళు మహాభారతంలో 'హిరణ్యధన్వుడ'నే నిషాధరాజు కుమా రుడైన 'ఏకలవ్యుని' తమ పురాణమహాపురుషునిగా చెప్పుకుంటారు. ఈ జాతివాళ్ళు కాకతీయుల పరిపాలనాకాలానికి ముందు చాలా కాలం పాటు ఓరుగల్లు రాజ్యాన్ని పరిపాలించినట్లు 'శ్రీసిద్ధేశ్వరచరిత్ర'

వంటి కావ్యాలవల్ల తెలుస్తుంది. 'టిప్పుసుల్తాన్' మైసూరు రాజ్యాన్ని పరిపాలించే కాలంలో ఎరుకల వాళ్ళతో 'కల్లబంతులనే' పేరుగల ఒక గూఢాచారుల సైన్యాన్ని ఏర్పరిచినట్లు 'ఎడ్గార్‌థ్రస్టన్' రచనల వల్ల స్పష్టమౌతుంది. ఇటీవల డా॥జి.వి. పూర్ణచంద్, బి.ఎ.ఎమ్.ఎస్. గారు వ్రాసిన 'తెలుగే ప్రాచీనం' అనే పుస్తకంలో అద్దంకిలో గుణగ విజయాధిత్యుని సేనాని 'పండరంగడు' వేయించిన శిలాశాసనాన్ని గురించి కొన్ని ఆసక్తికరమైన వివరణలు ఇచ్చారు. అందులో పండ రంగడు జయించిన 12 బోయకొట్టాలు ఎరుకల వాళ్ళ పరిపాలన లోనివేనని తేల్చాడు.

## ఇంటిపేరు - గోత్రాలు

ఎరుకల వాళ్ళలో 'అంగడి, ఆవుల, ఉయ్యాల, కట్టా, కర్రెద్దుల, గజ్జల, గరిక, మొగిలి, మోట, పాలపర్తి, వలిగి, దేవర, నలబోతుల, చదల, వల్లాగి, చౌటా' వంటి ఇంటి పేర్లుంటాయి. 'సాతుపాటి, కావాటి, మేనపాటి, మేంద్రగుత్తి' అనే నాలుగు గోత్రాలు ఉన్నాయి. 'సాతుపాటి', కావాటి ఈ రెండు గోత్రాలను వాళ్లు 'పోతు (మగ), పెంటి (ఆడ) గోత్రాలుగా భావిస్తారు.

## భాషా విశేషాలు

ఎరుకల తెగకున్న ప్రత్యేకతల్లో భాష ఒకటి. దీనినే 'కుర్రువాత' లేక 'కులవాత' అంటారు. ఈ భాషలో 'వాత' అంటే 'భాష' అని అర్థం. ఇది తమిళగ్రామ్యం. ఈ భాషలో తమిళ, తెలుగు, కన్నడ, భాషా పదాలు మిళితమై ఉంటాయి. ఈ భాషకు లిపిలేదు. కేవలం వాగ్రూపమైన భాష ఇది. ఎరుకల వాళ్ళు తమ సొంత కులస్తులతో మాట్లాడేటప్పుడు వాళ్ళ భాషలోనే మాట్లాడతారు. అలాగే ఏ ప్రాంతంలో ఉంటే ఆయా ప్రాంతీయ భాషలు కూడా నేర్చుకుని మాట్లాడతారు.

తెలుగు భాషకు ఎరుకలభాష ఈ క్రింది విధంగా ఉంటుంది.

| | తెలుగు భాష | | ఎరుకలభాష |
|---|---|---|---|
| 1. | అమ్మ | - | అమ్మ /తాయి |
| 2. | నాన్న | - | ఆవ / తేపం (త్యాపం) |
| 3. | అన్న | - | అన్న |
| 4. | తమ్ముడు | - | తంబి / తెంబి |
| 5. | అక్క | - | అప్ప /అక్క |
| 6. | చెల్లి | - | తంగిసి |
| 7. | కొడుకు | - | మూను / మోను |
| 8. | కూతురు | - | మొగులు /మగ |
| 9. | కోడలు | - | మెరిమగలు / మెరిమొగ |
| 10. | అల్లుడు | - | మెరిమూను / మెరిమోను |
| 11. | వదిన | - | నంగ |
| 12. | మరదలు | - | మెచ్చిన్సి |
| 13. | బావ | - | మామ |
| 14. | మామ | - | మామ |
| 15. | అత్త | - | అత్త |
| 16. | భార్య | - | మొండు / పంకేరు |
| 17. | భర్త | - | మొనాగం / మణాగొ |
| 18. | బావమరిది | - | మచ్చాడ |
| 19. | చిన్నమ్మ | - | సొడం |
| 20. | బాబాయి | - | చిన్నావ |
| 21. | పెద్దమ్మ | - | బెర్ధావ / బెరావ |
| 22. | తోడికోడలు | - | వారిగెత్తి |
| 23. | మనవడు | - | పేతం |
| 24. | మనవరాలు | - | పేతి |
| 25. | అమ్మాయి | - | పొన్ను / అమ్మి |
| 26. | అబ్బాయి | - | గుంటం /కిరు |
| 27. | చిన్నపిల్లలు | - | పసికుట్టిలు |
| 28. | డబ్బు | - | దుడ్డుగ |
| 29. | దొంగ | - | తెక్కొ |
| 30. | తల | - | మాడు |
| 31. | నోరు | - | వాయి |
| 32. | శరీరం | - | ఒడుం |
| 33. | చెయ్యి | - | కియ్యి |
| 34. | కోడి | - | కోయి |
| 35. | బాతుగుడ్డు | - | బాతుముట్ట |
| 36. | పంది | - | పర్రి / పంద్రి |
| 37. | కుక్క | - | నాయి |
| 38. | చేప | - | మీను |
| 39. | చెట్టు | - | చెడి / మరం |
| 40. | ఆకు | - | ఎల |
| 41. | ఇల్లు | - | ఊడు |
| 42. | మంచం | - | కట్లు |
| 43. | భూమి | - | తర్ర |
| 44. | దీపము | - | ఒలుకు |
| 45. | బియ్యము | - | ఎరిసి |
| 46. | అన్నం | - | సోరు |
| 47. | కూర / పులుసు | - | పులుసు |

| తెలుగు భాష | | ఎరుకలభాష |
|---|---|---|
| 48. పసుపు | – | మంజలి |
| 49. నెల | – | మాదం |
| 50. ఈరోజు | – | ఈమానం |
| 51. నిన్న | – | నేసు |
| 52. రేపు | – | తల్లారి |
| 53. రాత్రి | – | రావు |
| 54. పొలము | – | కొల్ల |
| 55. వర్షము | – | మగ |
| 56. వడ్లు | – | నెల్లు |
| 57. ఒకటి | – | ఒందు |
| 58. మూడు | – | మూను |
| 59. ఏడు | – | ఏగు |
| 60. ఎనిమిది | – | వొట్టు |
| 61. పది | – | పొత్తు (పత్తు) |
| 62. వచ్చి | – | వందు |
| 63. చేసి | – | సేందు |
| 64. ఉండు | – | ఇర్రు |
| 65. చెప్పు | – | సొన్ను |
| 66. అల్లు | – | చెచ్చు |
| 67. రండి | – | వాంగో |
| 68. వద్దు | – | మాన |
| 69. లేదు | – | ఇల్ల |
| 70. మంచి | – | నల్ల |
| 71. ఎక్కడ | – | ఏటి |
| 72. కూర్చో | – | ఉక్కో / కోందుంగో |
| 73. ఇటు రా | – | ఇనవా |
| 74. వెళ్ళిరా | – | పోయిటువా |

## గృహనిర్మాణం - ఇతర అలవాట్లు

ఎరుకలవాళ్ళు 'పందులు, గాడిదలు, మేకలు, కోళ్ళు, బాతుల' వంటి వాటిని పెంచుతుంటారు కాబట్టి, ముఖ్యంగా వాటికి ఆహారం, నీళ్ళు దొరికే కాలువకట్టలపైన, చెరువు కట్టలపైన, ఊరికి వెలుపల డొంకల్లోను, స్మశానపు దిబ్బలమీద గుడిసెలు నిర్మించుకొని ఉంటారు. వీళ్ళు నిర్మించే చుట్టు గుడిసెలకు ఒకవైపు మాత్రమే ఖాళీ ఉంటుంది. ఇవి కర్రలను గట్టిగా నేలలో పాతి తాటి ఆకులతో దడులు కట్టి వాటి మీద మట్టిపేడలను కలిపి అలికి గోడలవలె నిర్మించి ఉంటాయి. గుడిసె పై కప్పు తాటాకులతో కప్పి దానిమీద ఎండుగడ్డిగానీ, జమ్ము గానీ పరచి ఉంటుంది. ఈ గుడిసెలకు కిటికీలు ఉండవు. కాబట్టి లోపలికి గాలీ, వెలుతురు పెద్దగా సోకదు. తలుపులకు బదులుగా వెదురు తడికలను అడ్డం పెట్టుకుంటారు.

వీళ్ళ ఇళ్ళలో అన్నం కుండలు, కూరల చట్లు, తెడ్డు, తిరుగలి, ధాన్యపు సంచులు, వలలు, ఉచ్చులు, బోనులు, కత్తులు మొదలైనవి ఉంటాయి. పూర్వం వీళ్ళు తమ దగ్గర డబ్బు ఉంటే (వెండి, బంగారు నాణేలు) మట్టి కుండల్లో పెట్టి పైన ఒక మూత పెట్టి, ఇంట్లో ఒక మూల గొయ్యి తీసి అందులో పెట్టి పూడ్చి గుర్తుగా దాచుకొనేవాళ్ళు.

అలాగే రోజూస్నానం చేయరు,పళ్ళు తోముకోరు. తమ ఇష్టం వచ్చినపుడు ఈత, వెదురు, వేప,గానుగ వంటి పుల్లలతోను, పొయ్యిలో బూడిదతోను పళ్ళు తోముకుని, కాలువల్లో మునిగి స్నానాలు చేసే వాళ్ళు. వీళ్ళు ఇళ్ళదగ్గర ఏదో ఒక చెట్టును పెంచుకుంటారు. ఆ చెట్టు కొమ్మలకే పాతచీరలు వ్రేలాడగట్టి ఉయ్యాలలు వేసి అందులో పసిపిల్లలను పడుకోబెడుతుంటారు. లేదా నులక మంచాలను తిరగేసి మంచం మధ్యలో పిల్లలను పడుకోబెడతారు. స్త్రీ పురుషులు ఆ చెట్ల క్రిందే కూర్చుని 'బుట్టలు' అల్లుతుంటారు. వృత్తి పనిముట్లైన 'కొల్లి' (కొడవలి) ఊసి (దబ్బలం) మొదలైనవి ఆ ఇంటి చూరుల్లో దూర్చి దాచుకుంటారు. కుక్కలు, పందులు, కోళ్ళు ఎప్పుడూ ఇంటా బయటా తిరుగుతూ వీళ్ళుండే పరిసరాలు చాలా అపరిశుభ్రముగా ఉంటాయి. సెటిల్‌మెంటు కాలనీల్లో నివాసం ఉండే వాళ్ళకు మాత్రం పక్కా గృహాలు ఉండి, పరిశుభ్రమైన వాతావరణం ఉంటుంది.

## అలంకరణలు

పూర్వం ఎరుకల పురుషులు ముతక నూలుతో ప్రత్యేకంగా చేసిన నల్లని గుడ్డను మొలకు గోచీగా పెట్టుకునేవాళ్ళు. తలపాగా చుట్టుకొని, భుజాన పెద్ద గొంగడి వేసుకునేవాళ్ళు. బాగా పొడవుగా పెరిగిన తైలసంస్కారం లేని తలవెంట్రుకలు వెనక్కి దువ్వి 'వేలుముడి' ని వేసుకునేవాళ్ళు. కాళ్ళకు కడాలు, మొలకు వెండిబిళ్ళల మొలత్రాడు ధరించేవాళ్ళు. స్త్రీలకు మాత్రం కులాచారం ప్రకారం కుడిపైటగా చీర, జాకెట్టు ధరించి, కాలివేళ్ళకు మెట్టెలు, చేతికి గాజులు, మెడలో రంగురంగుల పూసలు, చెవులకు పెద్దకమ్మలు, ముక్కుకు ముక్కెర ఉండేది. వీళ్ళు నుదుట పెద్ద కుంకుమబొట్టు పెట్టుకొని తలను దువ్వి వింతగా ఉండే కొప్పు పెట్టేవాళ్ళు. అలాగే స్త్రీ పురుషులు ముఖం మీద, ఛాతీ మీద పచ్చలు పొడిపించుకునే ఆచారం వీళ్ళలో ఉంది. నేడు వీళ్ళు నవనాగరీకుల వలె అలంకరణ విధానాన్ని చాలా మార్చుకున్నారు.

## ఆహారం - కుటుంబం

ఎరుకల వాళ్ళు స్వతహాగా పూర్తి మాంసాహారులు. వరి, జొన్న, రాగి సంగటి పూర్వం ఎక్కువగా ఉపయోగించేవాళ్ళు. పందిరక్తంతో

వండే 'నల్ల'ను ఎక్కువ ఇష్టంగా తింటారు. అలాగే అన్ని రకాల పక్షుల మాంసాలు, చేపల వంటివి తింటారు. కానీ గేదె, ఎద్దుల మాంసాలు తినరు. సారాయి, కల్లు, స్త్రీ, పురుషులు త్రాగుతారు. అలాగే స్త్రీ పురుషులు 'తంబ' (తమలపాకు, పొగాకు, వక్క, సున్నం) నములు తారు. చుట్టలు, బీడీలు కాలుస్తారు. అసలు వీళ్ళ కులాచారాలన్నీ 'కల్లు, సారా, పొగాకు'లతోనే ముడిపడి ఉంటాయి.

వీళ్ళలో తండ్రి గానీ, వయోవృద్ధుడుగానీ, కుటుంబ యజమానిగా ఉంటారు. బహుభార్యత్వం అలవాటు ఉంది. ఆడపిల్లల పెళ్ళి సమ యంలో వరుని తరుపు వారి నుండి ఓలిని పుచ్చుకునే ఆచారం ఉంది. ఓలినే ఎరుకల భాషలో 'సుల్ల'లంటారు. వీళ్ళ కులంలో తమ ఆడపిల్లకు పుట్టబోయే మొదటి ఇద్దరు ఆడపిల్లలపై అధికారం ఉంటుంది. దానిప్రకారం ఆడపిల్ల పెళ్ళి సమయంలో వరుని నుండి మేనమామలు తగినంత 'ఓలి' కట్టించుకోవచ్చు. లేదా ముందుగానే తమ హక్కును ఇంకొకరికి అమ్ముకొనవచ్చు.

అలాగే తాతముత్తాతలు చేసిన అప్పులు 'మనవళ్ళయినా' తప్పు కుండా తీర్చాల్సిందే. లేకపోతే కులపంచాయితీ పెట్టి 'తప్పు' వేస్తారు.

## కులపంచాయితీలు

ఎరుకల కులస్తులు తమ కులస్తుల మధ్య వచ్చిన తగువులను కులపెద్దల ద్వారానే పరిష్కరించుకుంటారు. ఎరుకల భాషలో కుల పెద్దలను 'బెరిమొంచార' అంటారు. కులపెద్దలు 'వాడకట్టు తగువులు' (ఇద్దరు వ్యక్తుల మధ్య అభిప్రాయ భేదాల వల్ల వచ్చిన తగువు), ఋణతగువులు (అప్పు తీసికొని ఇవ్వనివి) దొంగతనం తగువులు (కోడి, పంది, డబ్బు వగైరా దొంగిలించినపుడు), భార్యాభర్తల తగువులు (నడవడి సరిలేనప్పుడు) మొదలైనవి పరిష్కరిస్తారు. ఈ పంచాయితీల్లో 'కులపెద్దల' మాట జవదాటటానికి వీల్లేదు. పెద్దలు ముద్దాయి, ఫిర్యా దిలతో 'రూక, కాణి, పూట' పేర్లతో డబ్బులు వసూలుచేసి కల్లు, సారాయి, త్రాగి వాయిదాలమీద వాయిదాలు వేసి తీర్పులు చెబుతారు.

## మూఢనమ్మకాలు

చేతబడులందు (సాదుపడి)దెయ్యం, భూతం, మారెమ్మలందు విపరీతమైన నమ్మకం ఉంది. అలాగే కులపంచాయితీలో తీర్పుకు అంగీకరించని వారి చేత 'బాగా కాల్చిన గడ్డ పలుగును పట్టించి, సలసల కాగే నూనెల్లో చేతులు పెట్టించి,చూచినదానికి నరుడు సాక్ష్యం, చూడనిదానికి దేవసాక్ష్యం అని చెప్పి 'చేతులు కాలకపోతే' తప్పు చెయ్యనట్లు, చేతులు కాలితే తప్పుచేసినట్లు కులపెద్దలు తీర్పు చెబుతారు.

## మతం - దేవతా పూజలు

పూర్వం కాలంనుండీ వీళ్ళు హిందూమతంలో అంతర్భాగంగానే కన్పిస్తారు. వీళ్ళ కులదేవత 'కొల్లాపురమ్మ' (కొల్హాపురి అమ్మ అంటే లక్ష్మీదేవి) అలాగే 'సుంకులమ్మ, అంకమ్మ, పోలేరమ్మ, మారెమ్మ, కనకదుర్గమ్మ'లను కొలుస్తారు. వేంకటేశ్వరస్వామిని, నరసింహస్వామిని, శ్రీశైలం మల్లికార్జునస్వామిని, శ్రీరాముణ్ణి మొదలైన దేవుళ్ళను పూజి స్తారు. 'సంక్రాంతి, శివరాత్రి, శ్రీరామనవమి, దసరా, ఉగాది' మొద లైన పండుగలను చేసుకుంటారు. ఐతే ఇటీవల 'సెటిల్‌మెంట్' కాలనీల్లో ఉన్నవాళ్ళు మరికొందరు ఏసుక్రీస్తును పూజిస్తున్నారు.

## పెళ్ళిళ్ళు, ఇతర ఆచారాలు

ఎరుకల వాళ్ళు పెళ్ళిళ్ళు గోత్రాలు చూసుకొని శకునాలు చూసుకొని కుదుర్చుకుంటారు. అన్నీ నచ్చితే కులపెద్దల సమక్షంలో అమ్మాయి తండ్రికి అబ్బాయి తండ్రి 'శకునపావు' ఇప్పిస్తాడు. 'శకున పావు' అంటే క్వార్టర్‌లో నాల్గవవంతు సారాయి. దీని తర్వాత ఇరువురి ఇంటా కోడిగానీ, మనిషిగానీ పందిగానీ చనిపోకుండాఉంటే (అశుభము జరుగకపోతే) వారంరోజులు గడచిన తర్వాత 'ముంతకల్లు, ప్రధా నము' జరుపుకుంటారు. ఒక మంచిరోజున వధువు ఇంటి దగ్గరకు వరుని తరుపువాళ్ళు వచ్చి, కులపెద్దల చేతులమీదుగా వధువుకు 'పసుపు, కుంకుమ, ఆకులు, వక్కలు, అరటిపండ్లు, గాజులు, చీర, జాకెట్టు, దువ్వెన, అద్దము, పౌడరు డబ్బా' వంటి అలంకరణ సామగ్రి ఇస్తారు. తర్వాత వరుని తండ్రి ఆడపిల్ల మేనమామకు 'ఓలి' అడిగినంత కట్టి, పుట్టింటివాళ్ళకు 'మాలు' కట్టి, వధువు చేతిలో 'రూక' పెడతాడు. 'రూక' అంటే తమలపాకుల్లో ఒక రూపాయి డబ్బులు ఉంచి వధువుకు ఇవ్వటం. దీంతో పెళ్ళి కాకుండానే ఆ పిల్ల ఇంటిపేరు వరుని ఇంటి పేరుగా మారిపోతుంది. పెళ్ళి కాకుండానే వధూవరులిద్దరూ భార్యాభర్త లుగా పరిగణించబడతారు. వరుని ఇంట జరిగే శుభాశుభాలు వధువు విధిగా పాటించాల్సి ఉంటుంది.

ఇలా ప్రధానం పూర్తి అయిన తర్వాత రోజున గానీ, ఒక నెల రోజుల తర్వాతగానీ మంచి ముహూర్తంలో పెళ్ళి జరుపుకోవచ్చు. కులపెద్దలు పెళ్ళి పందిరి మధ్యలో ఒక గొంగడి పరచి, 'కొల్లాపు రమ్మ'ను పెట్టి, పళ్ళాలు లేదా మేళాల సందడి మధ్యలో వరునిచేత వధువుకు 'పసుపుకొమ్మును' తాళివలె మెడలో కట్టిస్తారు. 'కొల్లాపురమ్మ' అంటే ఒక జానెడు నారపట్టకు గవ్వలుఅంటించి, పసుపు కుంకాలు అద్ది ఉంచిన ప్రతిమ. ఎరుకలసాని సోదె బుట్టలో ఉండేది. తర్వాత నల్లపూసలు, కాలిమెట్టెలు ధరింపచేస్తారు. దీంతో పెళ్ళి తంతు పూర్త వుతుంది. తర్వాత వరునిచేత పందిని పొడిపించి, పందిని కోసి బంధువులకు విందు భోజనాలు పెట్టి, కల్లు, సారాయిలుత్రాగి ఆనం దించటం ఈ కులపు ఆచారం.

స్త్రీలు గర్భవతులుగా ఉన్నప్పుడు గ్రహణ సమయాల్లో బయటికి రానివ్వరు. ప్రసవసమయంలో కషాయాలిచ్చి కాన్పులకు మంత్రసానిపై

ఆధారపడతారు. బాలింతకు పురిటిస్నానం పూర్తయ్యేవరకు ఇంట్లోను, ఇంటిముందు పాతచెప్పులు, చేపల వల వేసి ఉంచి, ఇంటిచూరుకు చేపముల్లును వ్రేలాడదీస్తారు. ఇలా చేస్తే 'దుష్టశక్తులు' ఇంట్లోకి రావని వాళ్ళ నమ్మకం. బాలింతకు 11వరోజు పురిటి స్నానం చేయించి, పసిబిడ్డకు అదేరోజున పేరుపెట్టి, అప్పుడే ఆముదపు దీపం వెలిగించి ఆ వెలుగులో సూదిని కాల్చి బిడ్డ బొడ్డు దగ్గర సూదికాకలువేస్తారు. పసిబిడ్డకు కొంచెం 'గాడిదపాలు' త్రాగిస్తారు. ఇలాచేస్తే ఆ పిల్లలు ఆరోగ్యవంతులుగా ఉంటారని ఎరుకలవాళ్ళ నమ్మకం. 21వరోజున పసిపిల్లలకు ఉయ్యాల వేసే ఆచారం వీళ్ళకుంది.

అలాగే సమర్త అయిన బాలికను ఇంటిలో ఒక మూలన ఎండుగడ్డి పరచి కూర్చోబెట్టి 11రోజులు మైల పాటిస్తారు. మేనమామలు ఆ బాలికకు బెల్లము, నువ్వులు, కొబ్బరి, కావడిలో పెట్టి తెచ్చి ఇచ్చే ఆచారం ఉంది. సమర్త అయిన బాలిక చేతికి ఒక పేము బెత్తము, ఒక కత్తిని ఇస్తారు.ముఖం నిండా పసుపు పూసి, కుంకుమ బొట్టును పెడతారు. ఉప్పు, కారం లేని పెసరపప్పుతో కలిపి వండిన అన్నాన్ని పెడతారు. బాలికకుస్నానం చేయించిన దగ్గరనుండీ ఆ పిల్లను ఎంతో గౌరవంగా చూసుకొంటారు.

## కర్మకాండలు

ఎరుకలవాళ్ళు చనిపోయినప్పుడు దాయాదివర్గమంతా కలసి మైలను పాటిస్తారు. చనిపోయినవారి పాడె వెంట కర్రసాము చేస్తూ స్మశానానికి తీసుకెళ్ళి పూడ్చటం వీళ్ళ ఆచారం. అలాగే 11వరోజు పెద్దదినం చేసి, అదేరోజు 'గుడిమెట్టు పూజ' పేరుతో 'శివాలయానికి' వెళ్ళి పూజలు చేస్తారు. ఆ తర్వాత సముద్రానికి వెళ్ళి ఈతపుల్లలతో 'పాడి' వలె కట్టి అందులో ఒకకోడిగుడ్డును ఉంచి, పూలతో అలంక రించి సముద్రంలో వదిలి, దాయాదులంతా కలసి సముద్రస్నానాలు చేస్తారు. దీంతో 'కీడు' తొలగినట్లుగా భావిస్తారు.

సంక్రాంతి, ఉగాదివంటి పండుగరోజుల్లో 'పెత్తర్లు' పేరుతో చని పోయిన వాళ్ళకు 'ఇష్టమైన పిండివంటలు' చేసిపెట్టి పూజలు చేస్తారు. అలాగే ఒక తరంవాళ్లంతా కలసి 'వీరుల కొలుపులు' కొలిచి జంతు వులను బలిచ్చే ఆచారం వీళ్ళకుంది.

## సంఘంలో స్థానం

ఎరుకలవాళ్ళు పందులు పెంచుతారు కాబట్టి అగ్రకులస్తులు వీళ్ళని హీనంగా చూస్తారు. వీళ్ళు తాకితే మైలపడినట్లు భావిస్తారు. అలాగే ఎరుకుల వాళ్ళు కూడా 'మాల, మాదిగ, ముస్లిం'ల ఇంట భోజనం చేయరు. ఒకవేళ ఎవరైనా భోజనం చేస్తే కులపెద్దల చేత తప్పు వేయించి కాల్చిన ఉంగరం చేత వాళ్ళకు నాలుక కాల్పిస్తారు.

## కళావిశేషాలు

పూర్వం విశేషంగా ప్రజాదరణ పొందిన జానపద కళారూపం 'కొరవంజి'. కొరవంజులనే నృత్యవిశేషాలు 'ఎరుకలు, కోయలు, చెంచులు, కురబలు' మొదలైన వాళ్ళు ప్రదర్శించేవిగా తెలుస్తుంది. వీళ్ళు పూర్వం శ్రీశైలం, ఇంద్రకీలనగరము (బెజవాడ) మంగళాద్రి, సింహాద్రి, తిరుమల క్షేత్రాల్లో వార్షిక ఉత్సవాలకు వచ్చే యాత్రికుల వినోదార్థం నృత్యప్రదర్శనలిచ్చి ధనం సంపాదించేవాళ్ళు. ఆటవికుల ఈ నృత్య ప్రదర్శనలే 'కొరవంజి, యక్షగాన' రచనలకు తర్వాత కాలంలో ప్రేరణయ్యాయని చెప్పవచ్చు.

అలాగే ఎరుకలవాళ్ళకే సొంతమైన మరో జానపద కళారూపం 'సోదె'. దీన్ని ఎరుకల భాషలో 'కొరమ్' అంటారు. ఎరుకల స్త్రీలు సోదె చెప్పటంలో కడు సమర్థులుగా పూర్వకాలం నుండీ చాలా ప్రసిద్ధి పొందారు. భూత, భవిష్యత్, వర్తమాన కాలాల్లో 'జరిగిన, జరగబోవు, జరుగుచున్న కథలన్నీ' సోదెలో జోష్యంగా చెబుతారు. వీళ్ళు సంచార జాతి కాబట్టి అన్ని ప్రాంతాలమీద, అన్ని విషయాలమీదా వీళ్ళకు అవగాహన ఎక్కువ. అందువల్లే వీళ్ళ సోదె మీద సామాన్య ప్రజలతో పాటు, పూర్వం రాజులు, రాణులకు కూడా ఎంతో నమ్మకం ఉండేది. సాక్షాత్తూ శ్రీ వేంకటేశ్వరస్వామి కూడా తన కళ్యాణానికి ముందు 'ఎరుకలసాని' వేషంలో వెళ్ళి పద్మావతీ దేవి తల్లి 'ధరణీదేవి'కి సోదె చెప్పి తన కార్యాన్ని నెరవేర్చుకున్నాడు. అలాగే 'ఎరుకలనాంచారి' సోదె విని మెచ్చుకొని గోల్కొండ నవాబు చాలా బహుమానాలు ఇచ్చి నట్లు ఎరుకల నాంచారి కథ వల్ల తెలుస్తుంది. నేటికీ పల్లెల్లో వీళ్ళు చెప్పే 'సోదె' కు ఎంతో ఆదరణ ఉంది. అందువల్ల సోదెలో వీళ్ళు చెప్పినట్లుగా దేవుళ్ళను పూజించటం వీళ్ళిచ్చే తాయత్తులు ధరించటం, మూలికా ఔషధాలు సేవించటం ఇప్పటికీ పల్లెల్లో కొనసాగుతుంది.

## ఎరుకలవారి వృత్తులు, దొంగతనాలు, సెటిల్‌మెంట్ల స్థాపన

ఎరుకలవాళ్ళు చేసే వృత్తులను బట్టి వాళ్ళలో నాలుగు ప్రధానమైన ఉపతెగలు ఉన్నట్లు గుర్తించవచ్చు. అవి 1. సువ్వ ఎరుకల 2. దబ్బ ఎరుకల 3. కుంచెపూరి ఎరుకల 4. బేరగాళ్ళు ఈ విభజన కేవలం వృత్తి సంబంధమైనదే. పూర్వకాలం ఈ తెగలమధ్య వివాహసంబం ధాలు లేవు. ఇటీవల కాలంలో మాత్రం వీళ్లంతా కలిసి ఉంటున్నారు. వీళ్ళది హస్తకళాకారుల సాంకేతిక నైపుణ్యంమీద ఆధారపడ్డ ఆర్థికవ్యవస్థ.

**1. సువ్వ ఎరుకల :** వీళ్ళనే 'ఈతపుల్ల ఎరుకల' లేక 'ఊర ఎరుకల' అంటారు. వీళ్ళుగ్రామజీవనానికి అలవాటు పడి ఊళ్ళో ప్రజలకు, రైతులకు పనిపాటల్లో సహాయపడుతూ ఉంటారు. ఈతసువ్వ లతో గడ్డిగంపలు, కోళ్ళగంపలు, జల్లిబుట్టలు, పేడపలికెలు వగైరా తయారుచేసి గ్రామాల్లో తిరిగి అమ్ముతారు. కాబట్టి వీళ్ళు మైదాన ప్రాంతాల్లో ఉంటారు.

**2. దబ్బ ఎరుకల :** వెదురుబొంగును రెండుగా చీల్చినపుడు వచ్చే కండభాగాన్ని 'దబ్బ' అంటారు. దీనితో బుట్టలు, తట్టలు, గాదెలు, గంపలు వంటి వస్తువులను తయారుచేసి అమ్మేవాళ్ళు దబ్బఎరుకలు. వీళ్ళు అటవీప్రాంతాలకు దగ్గరలో నివాసం ఉంటారు.

**3. కుంచెపురి ఎరుకల :** అడవుల్లోను, కొండల్లోను, మెట్ట భూముల్లోను దొరికే 'చీకురు, గడ్డి పూసిక' వేర్లను త్రవ్వుకొని వచ్చి వాటితో 'కుంచెలను' తయారుచేస్తారు. వీళ్ళను 'కుంచెకట్లు లేక కుంచెపురి' ఎరుకల వాళ్ళంటారు. కుంచెలు చేనేత పరిశ్రమలో పడుగు పోగులు సవరించటానికి ఉపయోగపడతాయి. వీళ్ళు ఆవు సహాయంతో వలలు పన్ని 'కణుజుపిట్టలు' ఇతర పక్షులను పట్టుకుంటారు. వేటాడిన వాటిని అమ్మి డబ్బు సంపాదిస్తారు. వీళ్ళు కూడా మైదాన ప్రాంతాల్లోనే నివసిస్తారు.

**4. బేరగాళ్ళు :** వీళ్ళలో ఉప్పెరుకుల, కరేపాకు ఎరుకల, ఎద్దల ఎరుకల, గాడిద ఎరుకల మొదలైన వాళ్ళున్నారు. వీళ్ళు పూర్వం 'ఉప్పు, కరివేపాకు, చింతపండు,బెల్లం, జీలకర్ర' వంటి నిత్యావసర సరుకులను చౌకగా ఉన్నచోట కొని, గిరాకీ ఉన్నచోట అమ్మేవాళ్ళు. ఈ వస్తువులను ఎద్దులు, గాడిదలు,ఆవులపై వేసుకొని(గోతాల్లో నింపి) ఊళ్ళ వెంట తిరుగుతూ వ్యాపారాలు చేసుకుంటూ బ్రతికేవాళ్ళు.

## దొంగతనాలు

అరువది నాలుగు కళలలో చోరకళ కూడా ఒకటి. దీనికి శాస్త్రము ఉన్నదని వినికిడి. ఇది అందరికీ సాధ్యమయ్యేపనికాదు. ఇందుకు ధైర్యసాహసాలు, హస్తలాఘవం ఉండాలి. అది తెలిసినవాళ్ళు ఎరుకల వాళ్ళు. వీళ్ళకి దొంగతనాలుచేయటం ఎప్పటినుండి అలవడిందో తెలియదు. కానీ ఇంగ్లాండులో పారిశ్రామిక విప్లవం వచ్చిన తర్వాత, వీళ్ళ వృత్తి వ్యాపారాలకు గిరాకీ తగ్గి, వీళ్ళ జీవనోపాధికి ఇబ్బంది కలిగి, గత్యంతరం లేకదొంగతనాలకు అలవాటుపడినట్లు తెలుస్తుంది. మనదేశాన్ని పరిపాలిస్తున్న అప్పటి బ్రిటీష్ ప్రభుత్వం వీళ్ళని నివారించలేక సి.టి.యాక్టు (క్రిమినల్ ట్రైబ్స్ యాక్టు) ను ప్రయోగించిన నాటినుండి (1908 సం॥నుండి) వీళ్ళు నేరజాతులుగా తెలుస్తున్నారు.

## సెటిల్‌మెంట్ల ఏర్పాట్లు

ఆంగ్ల ప్రభుత్వం సి.టి చట్టాన్ని ప్రయోగించి అకారణంగా కూడా 'ఎరుకల, యానాది, లంబాడి, దొమ్మర' వంటి జాతులన్నింటిని నిర్బంధించింది. వీళ్ళను అదుపులో పెట్టి, సంస్కరించి, వీళ్ళ జీవనస్థితిగతులు మార్చటానికి మళ్ళీ 1911లో ఒక చట్టము చేసింది. దీనిద్వారా కావలి, సీతానగరం, స్టువర్టుపురం, అల్లూరు, కప్పరాళ్ళతిప్ప (బిట్ర గుంట) మొదలైనచోట్ల 'సెటిల్‌మెంట్లు' స్థాపించబడ్డాయి. 'సెటిల్‌మెంటు' అనే పదానికి ఒక ఆవరణలో స్థిరనివాసం ఏర్పరుచుట అని అర్థము.

1912వ సంవత్సరంలో కావలి సెటిల్‌మెంటును స్థాపించి, దీని నిర్వహణ బాధ్యతను అమెరికన్ బాప్టిస్టు మిషన్ వాళ్ళకి అప్పగించారు. తర్వాత 1916లో 'అల్లూరు' లోను, 1917లో 'కప్పరాళ్ళతిప్ప' లోనూ సెటిల్‌మెంట్లు స్థాపించి ఇదే సంస్థకు అప్పగించారు.

1912వ సంవత్సరంలో ప్రస్తుతం గుంటూరు జిల్లా, తాడేపల్లి మండలంలోని 'సీతానగరం' వద్ద ఒక సెటిల్‌మెంటు ఏర్పాటు చేశారు. అది విజయవాడకు దక్షిణముగా కృష్ణానది బకింహామ్ కాలువల మధ్యలో ఉన్నది. ఈ సెటిల్‌మెంటులో నేరస్తుల సంఖ్య అధికమైనందున 1914-15 మధ్యకాలంలో ప్రస్తుతం గుంటూరుజిల్లా, బాపట్లమండలం పరిధిలో 'స్టువర్టుపురం' సెటిల్‌మెంటు ఏర్పాటుచేశారు. దీన్ని సాల్వేషన్ ఆర్మీ అనే స్వచ్ఛంద సంస్థకు అప్పగించారు.

ఇలా ఏర్పరచిన సెటిల్‌మెంట్లలో 'బౌడన్‌దొర, మెకంజీ, పియర్సన్, స్టువర్టు, సైఫన్' వంటి ఆంగ్ల ఉద్యోగులు విశేష సేవలు చేశారు. సెటిల్‌మెంటు వాసులకు విద్యాబుద్ధులునేర్పి, క్రైస్తవమత బోధనలు చేసి దొంగతనాలు మాన్పించటానికి కృషి చేశారు. వీళ్ళ జీవనోపాధికి ఐ.ఎల్.టి.డి కంపెనీ (భారత పొగాకు ఫ్యాక్టరీ) ఏర్పాటు చేయించి అందులో వీళ్ళను కూలీలుగా నియమింపజేశారు.

అయితే బ్రిటీషు ప్రభుత్వం నేరాలు చెయ్యనివారిని సైతం అక్రమంగా సెటిల్‌మెంట్లలో నిర్బంధించింది. ఆనాటి సెటిల్‌మెంటు వాసుల కష్టాలన్నీ కళ్ళకు కట్టినట్లుగా శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు వ్రాసిన 'మాలపల్లి' ద్వారా తెలుస్తాయి. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత క్రిమినల్ జాతుల చట్టం (1948-51 సం॥లమధ్యకాలంలో) రద్దు చేయబడింది. 1956 సెప్టెంబరు నెల 26వతేదీ నుండి ఎరుకల, యానాది, లంబాడీ తదితర జాతులను భారత ప్రభుత్వం షెడ్యూల్డ్ ట్రైబ్స్ గా గుర్తించింది. అయితే ఈ రిజర్వేషన్ ఆంధ్రప్రాంతంలోని వారికే వర్తింపచేశారు. తర్వాత వెన్నెలకంటి రాఘవయ్య, పాలపర్తి వీరయ్య, చదల జానకీరామారావు, దేవరకొండ హనుమంతురావు వంటి సంఘసేవకుల కృషి వల్ల 1976వ సంవత్సరం నుండి తెలంగాణా ప్రాంతపు 'ఎరుకల, యానాది, లంబాడీ' లకు కూడా రిజర్వేషన్ సౌకర్యం లభించింది.

## వృత్తిపరమైన ఇబ్బందులు

సెటిల్‌మెంటు కాలనీలో ఉన్న వాళ్ళలో అత్యధికులు విద్యావంతులు ఉన్నారు. వాళ్ళలో కొందరు ఐ.ఎ.ఎస్., ఐ.పి.యస్ వంటి పెద్దస్థానాల్లోకి ఎదిగిన వాళ్ళు కూడా ఉన్నారు. అయితే సెటిల్‌మెంటు కాలనీలకు బయట ఉండి, కులవృత్తులు చేసుకునేవాళ్ళలో ఎక్కువ మంది పూర్తిగా నిరక్షరాస్యులు ఉన్నారు. వాళ్ళకు తమ కులవృత్తులు తప్ప మరేమి తెలియవు. ఇదివరకు వీళ్ళకు అవసరమైన ఈతసువ్వలు,

పేము సువ్వలు రైతులపొలం గట్లపైన, ప్రభుత్వ పోరంబోకు భూము ల్లోను ఉన్న ఈత, పేము చెట్ల నుండి ఉచితంగా సేకరించుకోనేవాళ్ళు. ప్రస్తుతం ఈ చెట్లన్నీ నరికివేత కారణంగా ఇవి లభించనందువల్ల అటవీ ప్రాంతాల్లో ఉన్న చెట్లపై ఆధారపడవలసి వచ్చింది. అక్కడ వీటిని ఉచితంగా సేకరించుకొనే అవకాశం లేనందువల్ల, అటవీ అధికారులతో వీళ్ళకి ఇబ్బందులు ఎదురౌతున్నాయి.

అటవీ అధికారులకు కొంత డబ్బును ముట్టజెప్పి ముడిసరుకును వాహనాలమీద ఇంటికి చేర్చుకొనేసరికి ఖర్చులు విపరీతంగా అవు తున్నాయి. ఆ తర్వాత వీళ్ళు తయారుచేసుకున్న 'బుట్టలు, తట్టలు, గంపలు' వగైరా అమ్మకానికి తీసుకెళ్తే అవసరమైన 'ఈతమట్టలు, పేముసువ్వ, వెదురుబొంగులు' ఉచితంగా సేకరించుకొనే అవకాశం కల్పించాలి. అలాగే ప్రభుత్వ భూముల్లో పెంచే సామాజిక వనాల్లో ఈత చెట్లు వంటివి పెంచటానికి ప్రాధాన్యత ఇవ్వాలి.

వీళ్ళలో కుంచెపురి ఎరుకల వాళ్ళు 'సవరాలు' (క్షవరాలు) కట్టి అమ్ముతుంటారు. వీళ్ళకు అవసరమైన వెంట్రుకలు 'తిరుపతి, శ్రీశైలం, శ్రీకాళహస్తి' వంటి ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలనుండి ఇప్పించేందుకు ప్రభుత్వం కృషి చేస్తే వీళ్ళలో నిరుద్యోగం తగ్గుతుంది. ఎరుకలవాళ్ళలో అన్ని తెగలవాళ్ళూ పందులు, గాడిదలు, బాతులు వంటి జీవాలను పెంచు తారు. అవి ఇళ్ళ దగ్గరే పెంచుకొంటున్నందువల్ల వీళ్ళు పూర్తిగా అపరిశుభ్రమైన వాతావరణంలో ఉండవలసివస్తుంది. వీటిని ఊరు మీద వదిలితే రైతులనుండి ఊళ్ళో ప్రజలనుండి వీళ్ళకు అవమానాలు, దూషణలు నిత్యం ఎదురౌతుంటాయి. కాబట్టి వీటి పెంపకాలకు ప్రభుత్వం వీళ్ళకు ప్రత్యేకంగా స్థలాలు కేటాయించాలి. వీటి మాంసా లకు, గుడ్లకు దేశీయంగాను, విదేశాల్లోను ఉన్న అనుకూల అవకాశా లను ప్రభుత్వం పరిశీలించి ప్రోత్సహిస్తే వీటి పెంపకం దార్లకు మేలు జరుగుతుంది.

వీళ్ళలో ఎక్కువమంది నిరక్షరాస్యులైనందువల్ల ప్రభుత్వ పథకాల గురించి వీళ్ళకే మాత్రం తెలియదు. అందువల్ల బయట వ్యక్తుల దగ్గర నూటికి 10రూపాయల వడ్డీచొప్పున అప్పులుచేసి పందులు, బాతులతో వ్యాపారాలు చేస్తారు. వాటికేమైనా జబ్బులు చేసి చనిపోతే పూర్తిగా నష్టపోయి ఇళ్ళు వాకిళ్ళు అమ్మి అప్పులు తీరుస్తుంటారు. ఈ వృత్తిదారులు ఎక్కువగా సంచారజీవనం చేస్తున్నందువల్ల వీరిపిల్ల లకు విద్యాబుద్ధులు అలవడటం లేదు. వయోవృద్ధులు చూసేవారు లేక అనాథలౌతున్నారు.

### ఆరోగ్యసమస్యలు

ఈ కులస్తుల్లో జరిగే శుభాశుభాలన్నీ 'కులపెద్దల' ఆధ్వర్యంలో 'కల్లు–సారాయి'ల సేవనంతోనే జరుగుతాయి. వీళ్ళ ఆచారంలో భాగంగా అలవడిన సురాపాన సేవనం చివరకి దుర్వ్యసనంగా మారు తుంది. పైగా వీళ్ళ వృత్తిపనుల్లో కలిగే నైరాశ్యం వల్ల పొగాకు నమలటం, చుట్ట, బీడీలు కాల్చటం నేర్చుకుంటారు. దీంతో పొగాకు ఉత్పత్తులవల్ల, సారా సేవనం వల్ల కలిగే అన్ని అనర్థాలూ వీళ్ళకు కలుగుతాయి. అలాగే ఈతసువ్వ, పేము సువ్వ, వెదురు బొంగులను సేకరించేటప్పుడు, వాటిని చీల్చేటప్పుడు తరచుగా చేతులు తెగు తుంటాయి. వీటికి అందుబాటులో ఉన్న పసర్లుపిండి గాయాలను మాన్పుకుంటారు. అలాగే బుట్ట అల్లేటప్పుడు గంటలతరబడి ముదు చుకు కూర్చున్నందువల్ల మోకాళ్ళ నొప్పులు, స్త్రీలకు బహిస్టు సమస్యలు మొదలైనవి వస్తాయి.

అలాగే వీళ్ళు పెంచే పందులు, కోళ్ళు, బాతులు నిత్యం ఇంటా బయటా తిరిగి నందువల్ల వాటి విసర్జక పదార్థాలవల్ల తరచుగా విరోచనాలు, చర్మవ్యాధుల బారిన పడి బాధలు పడుతుంటారు. పైగా ఈ కులంలో 'కోడిపోయిందనో, భార్య ఇతరులతో అక్రమసంబంధం కలిగి ఉన్నదనో తరుచుగా కులపెద్దలను ఆశ్రయిస్తుంటారు. వీళ్ళు సత్యనిరూపణకు 'కాలుతున్న గడ్డపలుగు పట్టుకొని దూసి అవతల పడేయమనో, నూనెలో చెయ్యి పెట్టమనో' ఆజ్ఞలు జారీ చేస్తే, వాటివల్ల 'చేతులు, వళ్ళు కాలి గాయాలపాలై, పుళ్ళు మానక అవస్థలు పడు తుంటారు. ఇటీవల వీళ్ళలో నాగరికత బాగా పెరిగినప్పటికీ, ఇంకా పురాతన ఆచారాలు వదులుకోనట్లు తెలుస్తుంది.

### యానాదులు

మనం గ్రామాల్లోను, మారుమూల పల్లెల్లోను నిత్యం చూస్తూ ఉండే అనాగరికపు, అమాయకపు, నిర్భాగ్యపు మోటు మానవులే 'యానాదులు'. వీళ్ళు కూడా ఎరుకలవాళ్ళ వలె బహు ప్రాచీనకాలం నుంచి మనదేశంలో నివసిస్తున్న ఆదిమసంచార జాతులవాళ్ళు. వీళ్ళు నల్లని దేహచ్ఛాయతో, మొలవని మీసాలు, మేకగడ్డాలు, ఉంగరాలు తిరిగిన జుట్టు, ఉబ్బిన కనుబొమ్మలతో మొరటుగా ఉండటం వల్ల వీళ్ళ పుట్టుపూర్వోత్తరాలేమీ తెలియనందువల్ల పూర్వం నాగరీకులు వీళ్ళను హేళనగా 'అనాదు'లని పిలిచారు. ఆ పిలుపే నేడు వాడుకలో 'యానాదులై' ఉంటుందని పరిశోధకుల అభిప్రాయం. చాలా ప్రాచీనం అని అర్థానిచ్చే అనాదిశబ్దం నుంచి 'యానాది' శబ్దం వచ్చిందని, వీరి ప్రధానస్థావరం నెల్లూరి దగ్గరి శ్రీహరికోటని, వీళ్ల అనాగరికులని 'ఎడ్గార్ త్రస్టన్' తెలియజేశారు.

పద్మశ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారు రచించిన యానాది గ్రంథం లో 'కొండలపైన ఉన్న చెంచులు పర్వతశ్రేణిని దిగి పల్లపు ప్రాంతాలకు వచ్చి యానాదులైనారనీ, మొదట్లో చెంచులుగానే పిలవబడిన వీళ్ళను దక్షిణభారతదేశానికి వచ్చిన ద్రావిడులు అనాదులు అని పిలిచారనీ, క్రమేణా అదే పిలుపు 'యానాదులు' గా మారిందని తెలిపారు.

'శ్రీబారన్ హైమన్ డార్ఫ్' గారు హైదరాబాదు నైజాము ప్రభుత్వంలో ఆదివాసుల సముద్ధరణకు సలహాదారుగా పనిచేశారు. ఈయన సుప్రసిద్ధ పరిశోధకులు. ఈయన నల్లనిరంగును, నీగ్రోచిహ్నాలను కలిగిన 'మాలిడ్ జాతిలక్షణాలు తెలిపి, చెంచులు, యానాదులు, దొమ్మర్లు ఆస్ట్రేలియాలోని 'ఆరుంటాలు', సింహళములోని 'వెడ్డాలు' కూడా అవే లక్షణాలు కల్గి ఉన్నట్లు చెప్పారు. వీళ్ళంతా ఒకే 'మాలిడ్' జాతిగా (మలిడ్ అనగా కొండల్లో ఉండేవాళ్ళని అర్థము) నిర్ణయించారు. అలాగే వీళ్ళ ఆకారము 'మంగోలాయిడ్' వర్గ ఆకారమును పోలి ఉన్నదని కొందరు శాస్త్రజ్ఞులు చెబుతారు.

యానాదులు ఆంధ్రప్రదేశ్‌లో కృష్ణానది ప్రవహించే కృష్ణ,గుంటూరు జిల్లాలోను, పెన్నేరు ప్రవహించే నెల్లూరు జిల్లాలోను అధికసంఖ్యలో ఉన్నారు. అలాగే తూర్పు కనుమలకు అవతల కడప, కర్నూలు జిల్లాల్లోను చిత్తూరు, గోదావరి జిల్లాలోను విస్తరించి ఉన్నారు.

యానాదులు తలవెంట్రుకలను కత్తిరించరు. అవసరము అంతగా లేనందున క్షౌరము చేసుకోరు. చేతనుండే 'గెసిక' (గూచి) కఱ్ఱను చూచి, నడుముకు వ్రేలాడుతుండే చేపల సంచిని చూచి, అడుగుల్లో అడుగులు వేసుకుంటూ వెంబడించే ఇల్లాలిని చూచి, మొగవాని గోచిపాతను, గుంటకండ్లను మిణుగురు పురుగులవలె మెరుస్తున్న చూపులను, జింకలవలె గనిమలను, పిల్లకాలువలను దాటిపోవుటకు అతడు వేయు కుప్పె గంతులను చూచి, ఇతడు యానాది అని సులభముగా గుర్తించవచ్చు

## భాషావిశేషాలు

యానాదులకు ప్రత్యేకమైన భాష లేదు. అచ్చమైన తెలుగు భాషనే యాసగా మాట్లాడతారు. వీళ్ళ మాటల్లో అక్షరాలకు లేని వత్తులు తగిలించడం, అర్థానుస్వారాలను పూర్ణానుస్వారాలుగా పలికే అలవాటు ఉంది.

**ఉదా :** ఇబ్బంది (ఇబ్బంది), ధయ(దయ), భాణం (బాణం), సెంబు(చెంబు), భగమంతుడు (భగవంతుడు), కంట్లము (కంఠము), కుటుంభరం (కుటుంబము) (ఈశ్వరుడు) ఈశ్వరుడు, సాకలి (చాకలి), గొంతాలు (గోతాలు)

## యానాదుల్లో రకాలు - ఇంటిపేర్లు

యానాదుల్లో 'మంచియానాదులు, రెడ్డి యానాదులు, కప్పల యానాదులు, అడవియానాదులు, చల్లయానాదులు,' వంటి పేర్లతో పిలువబడతారు. వీళ్ళలో 'ఇండ్ల, తలుపుల,మానికల, తుపాకుల, కప్పల, మేకల, పాముల, తిరువీధుల, కోనేటి, కొమరగిరి, కత్తి, చేవూరి, మల్లారపు, ఈగా, నక్కా, గున్నం, పొట్లూరి, నంబూరి, ఎందేటి, యాకసిరి, చలంచర్ల, చౌటూరి వంటి ఇంటిపేర్లుంటాయి. వీళ్ళలో గోత్రాలుండవు. ఒక వర్గానికీ, మిగతావర్గాల వారికీ మధ్య ఐకమత్యం ఉండదు. **ఉదా :** రెడ్డి యానాదులుకు, చల్ల యానాదులుకు మధ్య వివాహ సంబంధాలుండవు. 'ఎవరికి వారే యమునాతీరే' అన్నట్లు ఉంటారు. ఇతర కులస్తుల యెడల బహుభయస్తులుగా ఉంటారు.

## మత విశ్వాసాలు - మూఢనమ్మకాలు

యానాదుల్లో పురాణ, చారిత్రక ప్రాధాన్యత గల వాళ్ళెవరో తెలియదు. వీళ్ళకు ప్రత్యేకమైన మతమనేది లేదు. కానీ హైందవ దేవుళ్ళను పూజిస్తారు. నరసింహస్వామి భార్య చెంచులక్ష్మి మాత్రం వీళ్ళ ఆడపిల్లగా చెప్పుకుంటారు. తిరుపతి వెంకన్నను తమ కుల దైవంగా భావిస్తారు. పోలేరమ్మ, అంకమ్మ, గంగమ్మ, తలపలమ్మ,దుర్గమ్మ, మహాలక్ష్మమ్మ వంటి దేవతలను పూజిస్తారు. వీళ్ళు ప్రత్యేకంగా గుళ్ళకు వెళ్ళకపోయినా వీళ్ళు నివాసముండే ఇళ్ళ దగ్గర ఉన్న ఒక వేప చుట్టు చుట్టూ అరుగుకట్టించి, ఆ చెట్టుకు పసుపు-కుంకుమ దిద్ది దాన్నే దేవతగా కొలుస్తుంటారు. వీళ్ళు తిరునాళ్ళన్నా, జాతరలన్నా, చాలా ఇష్టం. అలాగే వీళ్ళు చనిపోయిన వాళ్ల గాలి, దయ్యాలై పీడిస్తారని నమ్ముతారు. చీకట్లో కొరివిదయ్యాలుంటాయని వీరి విశ్వాసం. అందువల్ల తాయెత్తులు మొలలోను, చేతులకు, మెడలోను కట్టుకుంటారు. చేతబడులందు వీళ్ళకు నమ్మకం ఎక్కువ. అనారోగ్యం వీళ్ళువాడే వెరువెల్లంకులకు, మందులకు లొంగకపోతే రంగం కట్టిన యానాది దగ్గర 'సోది' లో తెలుసుకుంటారు. పగలల్లా ఉపవాసాలు ఉండి, పసుపు -కుంకుమలు ధరించి ఇంటిముందు రాత్రిపూటమంట వేసి, అర్థరాత్రి దాకా నోటికి వచ్చిన దేవుళ్ళను స్మరించి స్త్రీ తప్పెట కొడుతుండగా పురుషుడు పూనకం తెచ్చుకుని అడిగిన వారి ప్రశ్నలకు పరిష్కారాలు చెప్పటమే యానాదిరంగం.

## పెళ్ళిళ్ళు - ఇతర ఆచారాలు

యానాదుల్లో పెళ్ళిళ్ళు ఏహంగు ఆర్భాటాలు లేకుండా, కట్నకానుకలతో పనిలేకుండా నచ్చిన యువతితో యువకుని పెళ్ళి చేస్తారు. ప్రేమ వివాహాలే వీళ్ళలో ఎక్కువ. పురోహితునితో మంత్రాలతో పనిలేదు. ఆరుబయట గడ్డపలుగు పాతి లేక రోకలిని నిలిపి మిట్ట మధ్యాహ్నం సూర్యుడు, నడినెత్తికి వచ్చినపుడు నీడ అటుఇటూ పడకుండా ఉన్నపుడు వధువు మెడలో పసుపు తాడు (తాళి) కట్టిస్తారు. కాబట్టి శుభదినాల ప్రసక్తిలేదు. ఆ విషయాన్నే 'యానాది లగ్నానికి ఏనాడైనా ఒకటే' అనే సామెత తెలుపుతుంది. స్త్రీ పురుషులు నచ్చినంతకాలం చాలా అన్యోన్యంగా ఉండి కుటుంబపోషణలో భాగస్వాములుగా ఉంటారు. దంపతులే ఒకరినొకరు విడిచిపెట్టి ఉండరు. నచ్చనప్పుడు భార్య తన భర్తను వదిలి పరపురుషునితో సంబంధం

పెట్టుకొని అతడితో జీవించినా అది ఒక తప్పుగా ఈ కులంలో పరిగణించరు. విడాకులు, కులకట్టుబాట్లు వగైరా ఏమీ ఈ కులంలో ఉండవు. కలుసుకోవడం విడిపోవటమూ రెండూ సులభమే.

యానాదుల్లో స్త్రీ గర్భవతియైతే నవమాసాలు నిండగానే 10-12 రకాల వ్రేళ్ళను తెచ్చి 'కుండ కషాయాన్ని' తయారు చేసి త్రాగిస్తారు. ఈ కషాయానికి నేలవేము, చేదుపుల్ల, బాలింత సందుమి చెక్కలు, విషబుద్ధి, సోమి,నల్లబుడుగు, తెల్లబుడుగు, ఆకుజెముడు, ఎర్ర వాలుడు, పెద్దమాను, వారగోగు వంటివి ఉపయోగిస్తారు. ఈ కషాయం త్రాగిన స్త్రీలు అతి సునాయాసంగా కాన్పు అవుతారు. ప్రసవించిన స్త్రీ చేత 11వ రోజున 'బావిలో చేద వేయించేఆచారం' ఉంది. అలాగే శిశువులకు బొడ్డు చుట్టూ సూదికాకలువేయించే ఆచారం కూడా ఉంది.

అలాగే ఆడపిల్ల సమర్త అయితే ముఖానికి పసుపు పూసి, తాటాకుల మీద గడ్డి పరచి కూర్చోపెట్టి మైల పాటిస్తారు. 9వరోజు స్నానం చేయిస్తారు. పెద్దగా విందువినోదాలేమి ఉండవు. వీళ్ళలో స్త్రీ పురుషులకు మద్యం (కల్లు లేక సారాయి) త్రాగే అలవాటు ఉంటుంది. అలాగే బీడీలు, చుట్టలు కూడా కాలుస్తుంటారు. యానాదులకు వనమూలికల మీద పరిజ్ఞానం మెండు. అందువల్ల ఆయుర్వేద వైద్యులు వీళ్ళ ద్వారా ఆయా ఔషధగుణాలు కల్గిన మొక్కలను, వేర్లను సేకరిస్తుంటారు.

## గృహనిర్మాణం, వృత్తులు వగైరా

యానాదుల గుడిసెలన్నీ ఒకే తీరుగా ఉంటాయి. తరచుగా వీళ్ళు గ్రామాల్లో చెరువు గట్టుమీద, పొలములలోను, ఇతరుల ఇండ్ల ఆవరణములలోను 'వలయాకారమగు' చిన్న గుడిసెను వేసుకొని నివసిస్తుంటారు. ఐదు లేక ఆరు అడుగుల వెడల్పుగల స్థలం మీద వలయాకారంగా త్రవ్విన గుంటల్లోకి వెదురు బొంగులను పాతి (చొప్పించి) వీటి తలకొనలను దగ్గరకు చేర్చి ముడివేస్తారు. వర్షం నీళ్ళు గుడిసె లోపలికి జారకుండా ఒక కుండను తలక్రిందులుగా ఈ కొనలపై బోర్లిస్తారు. లోనికి వెళ్లటానికి ఒకవైపున ఖాళీ ఉంచి చుట్టూరా తాటి ఆకులతో చెట్ల మండలతో దళ్ళు కడతారు.

ఈ గుడిసె వాకిలికి కుడిప్రక్కన గుంటపొయ్యి, నీళ్ళకుండలు, చెంబులు, ఎడంప్రక్కన తట్టలు, ఎలుకుల్ని పట్టే బుట్టలు, వలలు యానాది రంగానికి (సోదెకు) ఉపయోగించే తప్పెట, ఈత ఆకుల చాపలు, ఎలుకకన్నాలు త్రవ్వటానికి ఉపయోగించే గెసిక (గూచి) కఱ్ఱ, మొలలో దోపుకునే చూరుకత్తి వగైరా ఉంటాయి. ఈ గుడిసె దగ్గర పెంచే చెట్ల మీద సొరకాయ లేక బీరకాయ పాదులు పెట్టి అల్లించి ఉంటాయి. కాలువ నీళ్ళే త్రాగుతారు. కాబట్టి ఈ గుడిసెల వద్ద 'బావులు, పంపులు' ఉండవు. వీళ్ళు మాంసాహారులు. కాబట్టి కొంగలు, చిలువలు, ఊరపిచ్చుకల్ని వేటాడి తింటారు. అలాగే చేపలు, నత్తగుల్లలు, ఎలుకల్ని పట్టి తింటారు. అన్నిరకాల కాయగూరలు, దుంపలు, ఆకుకూరలు తింటారు. ముఖ్యంగా ముదరమాగిన తాటి పండ్లు, తాటితేగలు, బురగుంజును, నేరేడి,ఈతపండ్లను ఇష్టంగా తింటుంటారు.

యానాదుల గృహనిర్మాణానికి వారం, వర్జం పట్టింపులేదు. అన్ని శుభకార్యాలకు అభిజిత్ లగ్నమే వారికి శరణ్యము. పట్టింపు గల కొంతమందికి బుధ, బేస్తవారాలు శుభదినాలు, మామ, కోడలు ఒకే ఇంటి కప్పు క్రింద నిద్రించకూడదనే ఆంక్ష ఆచారములో ఉన్నందువల్ల కొడుక్కు కోడల్ని కట్టబెట్టిన మరునాడే మరొక చిన్న గుడిసెను సమీపంలో కట్టుకుంటారు.

యానాదుల్లో స్త్రీ పురుషులు చిన్న చిన్న కుంటలు, దొరువులు, పంట కాలువల వంటి వాటిలో దిగి చేపలు, నత్తలు పడుతుంటారు. ముఖ్యంగా ఎండాకాలం ప్రారంభం కాగానే ఎండిపొయ్యే గుంటల్లోకి పంటకాలువల్లోకి, చెరువుల్లోకి గుంపులు గుంపులుగా ఊచలను నెత్తిన బెట్టుకొని పరుగులెత్తడం అనుదినం మనకు కనబడే దృశ్యాలే. చిన్న చిన్న చెలపలకు అడ్డుకట్టకట్టి కుండ పెంకులతోను, దోసిళ్ళతోను, నీటిని వెలుపలికి వెదజల్లి మిగిలిన బురదలో వట్టి చేతులతోనే చేపలను పట్టి నడుముకు వ్రేలాడుతున్న తాటాకు బుట్టలో వేసుకుంటారు. ఒక్కోసారి ఏకవస్త్రమైన ఇల్లాలిని వివస్త్రగా చేసి భార్యాభర్తలిద్దరూ చెరొక చెంగును నీటికడ్డముగా పట్టుకొని నీటిలో చేపలకొరకు దేవడం అరుదైన విషయం కాదు. అలాగే వలలు పన్ని కుందేళ్ళను అడవి పక్షులైన 'కొంగలను, పావురాళ్ళను, చిలవలను, నీటికోళ్ళను, ఊరపిచ్చుకలను, పట్టి బుట్టలో బంధించి అమ్ముతుంటారు. అలాగే పొలాల్లో పంటలకు కాపలాగా ఉంటూ పంటల సమయంలో ఎలుకల బెడదను తప్పించటానికి వలలు, ఉచ్చులు, ఎలిమి బుట్టలు పెట్టి వాటిని చంపి రైతుల దగ్గర ధాన్యాన్ని డబ్బును పుచ్చుకుంటుంటారు.

మంచి యానాదులు రెడ్ల వంటి రైతుల దగ్గర వంటపనికి, సేద్యము చేయటానికి, ధాన్యము దంచటానికి ఉంటారు. చల్లయానాదులు పెళ్ళిళ్ళు లేదా ఇతర విందు భోజనాల్లో 'ఎంగిలివిస్తర్లు' తీయటానికి, మంచినీళ్ళు జెరబోయటానికీ, అక్కడ అంట్లు తోమడానికీ, కళ్యాణ మండపాల్లో కసువు ఊడ్చటానికి కూలిపనులకు వెళ్తుంటారు. సంక్రాంతి వంటి పండుగ రోజుల్లో పిండి దంచటానికి కూడా వెళ్తారు. వీధుల్లో శుభ్రం చేసే వృత్తుల్లో కూడా వీళ్ళున్నారు.

## సంఘగౌరవము

పూర్వం ఎరుకల వాళ్ళతో పాటు యానాదులను కూడా అప్పటి బ్రిటీషు ప్రభుత్వం సి.టియాక్టు క్రింద చేర్చి ఇబ్బంది పెట్టింది. భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చాక ఆ ఇబ్బంది తొలగిపోయింది. ఎరుకల

వాళ్ళతోపాటు వీళ్ళను కూడా గిరిజనులుగా గుర్తించి, భారత ప్రభుత్వం రిజర్వేషన్ సౌకర్యాన్ని కల్పించింది. పూర్వం నుంచి కూడా యానాదులకు గ్రామాల్లో గౌరవ స్థానము గానీ, విరోధముగాని, నిరాదరణ గాని ఎక్కడా కన్పించదు. అందువల్ల పాపం తిడితే నవ్వుతారు, కొడితే దెబ్బలు తింటారు అన్న నానుడి వీళ్ళపై ఉంది.

యానాది అనే పేరు తిట్లలోను, కొట్లాటల్లోను అనుకొనే నైచ్య సూచకమైన దూషణ కాదు. కలుగక, కలుగక సంతానం కలిగితే ధనవంతులు కూడా అట్టి బిడ్డలను పులి ఆకులలో (పై కులస్తులు తినిపారవేసిన విస్తళ్ళలోని అన్నశేషాన్నిఆరగించే అలవాటు చల్ల లేక కప్పల యానాదులకు ఉంది) పొర్లించి, అట్టి బిడ్డలు ఆరోగ్యముగా కలకాలము జీవించాలనే ఉద్దేశ్యంతో యానాదుల చేతికిచ్చి, మళ్ళీ వారికి కొంత ధనాన్ని ముట్టజెప్పి బిడ్డను తీసుకుంటారు. వాళ్ళకి యానాదయ్య, యానాదిరావు, యానాదిరెడ్డి, యానాదమ్మ అనే పేర్లు పెట్టుకునే అలవాటు నేటికీ గ్రామాల్లో ఉంది. అల్పసంతోషులు, అరమరలేని అమాయకులు, కుడుము చేతికిస్తే పండుగని భావించే చాందసులు, చీకు చింతాలేని మానవులు యానాదులలేయ ప్రజాబాహుళ్యము యొక్క నిజమైన నిర్ణయము.

## అక్షరాస్యత - ఇతర సమస్యలు

యానాదుల్లో పూర్తిగా నిరక్షరాస్యత రాజ్యమేలుతుంది. నూటికి ఐదారుగురు చదువుకున్నా వాళ్ళ చదువు ఎలిమెంటరీ స్కూలు (ప్రాథమిక పాఠశాల) దాటదు. అంగన్‌వాడీలు, ప్రభుత్వపాఠశాలల్లో వీళ్ళ పిల్లల పేర్లుంటాయి. బడికి మాత్రం వెళ్ళరు. మధ్యాహ్నం భోజనం పెట్టే సమయానికి పళ్ళాలు పట్టుకెళ్ళి భోజనం పెట్టించుకొని వస్తుంటారు. అందువల్ల అక్షరజ్ఞానం అరకొరగా ఉంటుంది. పదిసంవత్సరాల వయస్సు వచ్చిన దగ్గరనుండీ పిల్లల్ని కూడా కూలీపనులకు తీసుకెళ్తుంటారు కాబట్టి, ఎవరైనా పిల్లల్ని చదివించమంటే వాళ్ళకు చదువబ్బలా! అని సమర్థించుకుంటారు.

గిరిజన కాలనీల్లో వీళ్ళకు స్థలాలిచ్చి ప్రభుత్వం ఇళ్ళు కట్టించినా వీళ్ళకి సుఖంలేదు. అందుకు కారణం ప్రభుత్వం కాంట్రాక్టర్ల ద్వారా నిర్మించి ఇచ్చే ఇళ్ళు ఒకటి,రెండు సంవత్సరాల్లోపు పూర్తిగా దెబ్బతిని, పైకప్పులు పెచ్చులూడి నెత్తిన పడుతున్నందువల్ల ఆ ఇళ్లలో వీళ్ళు ఉండడానికే భయపడుతుంటారు. అందువల్ల ఆ ఇళ్ళప్రక్కనే ఆరుబయట ఎప్పటిలాగే గుడిసెలు లేదా పాతగుడ్డలు ప్లాస్టిక్ కవర్లతో డేరాలు నిర్మించుకొని వాటిల్లోనే నివాసముంటారు.

వీళ్ళకు ఎక్కువమందికి రేషన్‌కార్డులు ఉండవు, ఉన్నా డీలర్లు సరుకులు సక్రమంగా వీళ్ళకివ్వరు. ప్రస్తుతం రేషన్‌కార్డులకు ఆధార్ లింకు పెట్టినందువల్ల ఆధార్ లేనివాళ్ళు మరింత ఇబ్బంది పడుతున్నారు. చౌకధరల దుకాణాల్లో క్రింద ఊడ్చేసిన బియ్యాన్ని పంట పొలాల్లో వదిలేసిన పరిగ గింజల్నితెచ్చుకొని కాలక్షేపం చేస్తుంటారు. అలాగే హోటళ్ళలో మిగిలిపోయిన, పాడయిపోయిన ఆహారపదార్థాలు వాళ్ళు బయట పారవేస్తే వీళ్ళు వాటిల్లో పనికి వచ్చిన పదార్థం కుక్కలవంటి జంతుజాలంతో పోటీపడి ఏరుకుని తింటుంటారు. స్త్రీలకు పాచిపని చేయించుకునే యజమానురాలు ఇచ్చే చినిగిపోయిన కోకలు, రైకలు, కట్టు వస్త్రాలు కాగ,పురుషులకు గోచి గుడ్డలు లేదా ఇతరులు తీసివేసి ఇచ్చిన చిరుగులు పట్టినప్యాంటు, షర్టులు, లాగులు, కట్టువస్త్రాలు. పసిపిల్లలకు ఉంటే వంటిమీద చొక్కా లేదా గౌనులు ఉంటాయి. లేకపోతే వంటిమీద ఏమీ లేక దిశమొలలతో అక్కడే మట్టిలో పడి దొర్లుతుంటారు. అలాగే చిన్నపిల్లలు ఇళ్ళదగ్గర ఎలుకలతోను, పిల్లి పిల్లలతోను, కుక్క పిల్లలతోను, ఆటలాడుకుంటూ, పసిపిల్లల కోసం చెట్లకు కట్టిన గుడ్డ ఉయ్యాలలో పడి ఊగుతూ ఆనందిస్తుంటారు.

ముఖ్యంగా కోస్తా తీరంలో ఉన్న ఈ గిరిజనులకు ప్రకృతి వైపరీత్యాలప్పుడు అనేక కష్టాలెదురౌతాయి. వీళ్ళు చెట్లమీద ఉన్న పక్షుల్లా విలవిల్లాడిపోతారు. నిత్యం చేపలవేటకో, కట్టెలు కొట్టటానికో, రిక్షా బండ్లు లాగటానికో ఇతర కూలి పనులకో వెళ్ళి ఏపూటకాపూట సంపాదించుకొని తెచ్చుకు తినే వీళ్ళకు వానలు, వరదలు, తుఫానులప్పుడు తిండికి కరువౌతుంది. బయట వీళ్ళకు అప్పు పుట్టదు. సమీపంలో పరిచయమున్న ఏ రైతులో దయతలచి ఇచ్చే పాతగుడ్డలు, సద్దికూడు, సోలెడు మానెడో బియ్యం లేదా నూకలు తప్ప. మామూలుగానే వీళ్ళ నివాసాల వద్ద మంచినీళ్ళు త్రాగటానికి కూడా దొరకవు. అందువల్ల దొరికిన బురదనీళ్ళు త్రాగి వ్యాధుల బారిన పడుతుంటారు.

2011 జనాభా లెక్కల ప్రకారం ఒక్క గుంటూరు జిల్లాలోనే వీళ్ళ జనాభా 63,032మంది అని తెలుస్తుంది. అన్ని ప్రాంతాల్లో కలిపి ఎంతమంది ఉన్నారనేది స్పష్టంగా తెలియదు.కాని వీళ్ళు ఎక్కువ మందే ఉంటారు.

## ఆరోగ్యం - ఇతర సమస్యలు

యానాదులు ఆడపిల్లలకు 15,16 సంవత్సరాల్లోపు పెళ్ళి చేయటం వల్ల సంవత్సరం తిరిగే సరికల్లా సగటు ఆడపిల్ల తల్లిగా మారటం, గర్భధారణకు వారి శరీరం సహకరించకపోవటం, కాన్పుకు కాన్పుకు ఎడం పాటించకపోవటం మొదలైన కారణాల వల్ల స్త్రీలలో రక్తహీనత ఎక్కువ. బాలికలకు, మహిళలకు గర్భకోశవ్యాధులు సర్వసాధారణం. రోజువారీ పళ్ళుతోమని కారణంగా స్త్రీ పురుషులకు, పిల్లలకు పళ్ళు పుచ్చి, గారలు పట్టి ఉంటాయి. చిగుళ్ళువాపు, గొంతువాపు వ్యాధులు, దగ్గు- జలుబులు నిత్యం ఉంటాయి.

అపరిశుభ్రవాతావరణంలో వీళ్ళ నివాసగృహాలు ఉన్నందువల్ల, వీళ్ళు రోజూ స్నానాలు చేయనందువల్ల, క్రిమికీటకాలు వీళ్ళ ఇళ్ళలో చేరినందువల్ల వీళ్ళు అనేక ఆరోగ్యసమస్యలు ఎదుర్కొంటుంటారు. అన్నం తిని చేతులు కడుక్కోని కారణంగా పిల్లల చేతులమీద, మూతుల మీద దోమలు, ఈగలు పుట్టలు పుట్టలుగా చేరిఉంటాయి. దీంతో పిల్లలు తరచుగా జ్వరాలు, నీళ్ళ విరోచనాలు, వాంతులువంటి జబ్బులతో బాధపడుతుంటారు. బాలింతలు, గర్భిణులకు పౌష్టికాహారం లేనందున బలహీనంగా ఉంటారు.

వీళ్ళు జీడిగింజలనుండి పప్పులను వేరు చేసే ప్రమాదభరితమైన పనులకు వెళ్తున్నందువల్ల పిల్లలకు, పెద్దలకు కాళ్ళు –చేతులు పుండ్లు పడి, కంటిశుక్లాలు వచ్చి ఇబ్బందిపడుతుంటారు. చిత్తుకాగితాలు ఏరటానికి, వీధులు శుభ్రం చేయటానికీ వెళ్తుంటారు. కాబట్టి పిల్లలకు పెద్దలకు గజ్జి, తామర వంటి నిండా సోబిమచ్చలు, పులిపిర్లు వంటి చర్మవ్యాధులు వస్తాయి. తైల సంస్కారం లేని తలల్లో పేలుపడి వీళ్ళను మరింత చికాకు పరుస్తుంటాయి.

పొగాకు, మద్యం, గుట్కాలకు పిల్లలు పెద్దలు అలవాటుపడినందు వల్ల ఊపిరితిత్తుల వ్యాధులు, గొంతుక్యాన్సర్‌లు, లివర్,కిడ్నీల జబ్బుల బారిన పడుతుంటారు. ఆదాయం తక్కువ దుర్వ్యసనాలు, జబ్బులు ఎక్కువ కారణంగా వీళ్ళు తెలిసిన వాళ్ళ దగ్గర నూటికి 10 రూ॥ మొదలుకొని 50 రూ॥ వరకు వడ్డీలకు తీసుకుంటుంటారు. నిత్యం ఈ వడ్డీవ్యాపారులు వీళ్ళను జలగల్లా పట్టి పీడించి, భయపెట్టి వడ్డీలు వసూలు చేసుకుంటారు. వీళ్ళ నివాస స్థలాలు,ఇళ్లుకూడా వాళ్ళే స్వాధీన పరచుకొంటుంటారు. అందువల్ల వీళ్ళు తరుచుగా ఒక చోటునుండి మరోచోటికి వలసలు వెళ్తుంటారు.

ఈ యానాదులు చనిపోతే ఆ శవాన్ని దగ్గర్లో ఉన్న స్మశానంలో పూడ్చుకోవటానికి కూడా అవకాశం లేదు. హిందువులు, ముస్లింలు, క్రైస్తవులు ఎవ్వరూ వీళ్ళను తమ స్మశాన భూముల్లో శవాల్ని పూడ్చుకోవడానికి కూడా అనుమతించరు. అందువల్ల చనిపోయినవారి శవాల్ని ఏరిక్షాల్లోనో పెట్టుకుని మైళ్ళకొద్దీ దూరంగా తీసుకుపోయి ఎడారి భూమిలో ఎవ్వరూ చూడకుండా పూడ్చి పెడుతుంటారు. అందువల్ల బ్రతికినా చచ్చినా ఎవ్వరికీ పట్టనంత నిరాదరణకు గురైన అనాదులు 'యానాదులు' అని చెప్పవచ్చు.

## లంబాడీలు (బంజారాలు)

లంబాడీలు ఆంధ్ర తెలంగాణా రాష్ట్రాల్లో నివసించే అతి పెద్ద గిరిజన సంచారజాతి. వీళ్ళ పూర్వీకులు రాజస్థాన్‌కు చెందిన రాజ వంశీకులని, వాళ్ళొకప్పుడు శత్రువులచే పరాభవింపబడి అడవుల పాలయ్యారని, తర్వాత వాళ్ళు గిరిజనులుగా పేరుపొంది దేశవ్యాప్తముగా విస్తరించారనీ చరిత్రకారులనేకమంది చెబుతుంటారు. మరి కొందరువారిని 'బుందేల్‌ఖండ్' నివాసులని చెబుతారు. వీళ్ళు మొగలు చక్రవర్తుల దండయాత్రల సమయంలో దక్షిణాదికి వలస వచ్చారని, సైన్యానికి కావలసిన ఆహారము, యుద్ధసామగ్రిని సరఫరా చేసేవాళ్ళని ఇంకొందరు చెబుతారు. ఇలా లంబాడీల మూలస్థానం గురించి చరిత్ర కారుల్లో విభిన్న అభిప్రాయాలున్నాయి.

ఏదేమైనా వీళ్ళు ఉత్తరభారతదేశం నుండి వలసవచ్చి, తెలుగు రాష్ట్రాలైన ఆంధ్ర తెలంగాణాల్లోని వివిధ ప్రాంతాల్లో స్థిరపడ్డారని స్పష్టమౌతుంది. ముఖ్యంగావీళ్ళు 'కృష్ణా, గుంటూరు, కడప, కర్నూలు, వరంగల్ నల్గొండ, మహబూబ్‌నగర్, అదిలాబాదు జిల్లాలో ఎక్కువగా ఉన్నారు. వీళ్ళు ఒక ప్రదేశం నుండి మరొక ప్రదేశానికి పొట్టకూటి కోసం చిన్న చిన్న గుంపులుగా వెళ్ళి పనిదొరికిన చోటనే గుడిసెలు వేసుకుంటారు. ఈ గుడిసెల సమూహాన్ని 'తాండా' లేక తండా అని అంటారు. ఈ తండాలకు కులపెద్దగా నాయకుడు ఉంటాడు.

లంబాడీలను 'లవణి, సుగాలి, బంజారా, లంబానీ, వంజారి, సుకాలి'వంటి పేర్లతో పిలుస్తారు. లంబాడీ అనేపదం 'లంబాన్' పదం నుండి ఉద్భవించింది. 'లంబాన్ 'అంటే పొడవు. వీళ్ళు పొడవైన ఎద్దులపై తమ వస్తువులను, సామగ్రిని వేసుకుని వెళ్ళేవారు కాబట్టి 'లంబాడీ' లయ్యారు. లంబాడీ అనేది సంస్కృత పదమైన 'లవణం' నుండి ఉద్భవించింది. అలాగే 'బంజారాలు' అంటే 'వ్యాపారస్థుడు' అని అర్థము. 'బంజారా' అనేపదానికి '(బ్రింజారా, లంబాడీ, లంమాణి, సుగాలీ ' అనేవి పర్యాయపదాలు. 'బంజారా అనే పదం 'బళద్' 'జారా' అనే పదాలు కాలక్రమంలో 'బంజారా' అయి ఉండవచ్చు.

కర్నాటకలో ఈ జాతి వాళ్ళని 'గోహర్– హర్‌కేరి' అని పిలుస్తారు. ఎవరైతే స్థిరనివాసమేర్పరుచుకోక తిరుగుతుంటారో వాళ్ళని వనచరులని సంస్కృతంలో పిలుస్తారు. అలాగే ఈ బంజారులు (సుగాలీలు) ఒకచోటనుండి ఇంకోచోటికి తమ సరుకులను మోసే ఎద్దులతో దేశ ద్రిమ్మరులవలె తిరుగుతుండడంవల్ల వీళ్ళని సంస్కృతపదప్రకారం వనచరులని పిలవడం, కాలక్రమాన 'వనచర' శబ్దం, 'వనచార, వంజార, బంజార' అనే పదంగా మారటం జరిగింది.

లంబాడీలు భారతదేశంలో సుమారు 17 రాష్ట్రాల్లో విస్తరించి ఉన్నారు. వీళ్ళకు భాష ఉంది. కాని లిపి లేదు. ఈ భాషను 'గోర్‌బోలి' అంటారు. ఈ 'గోర్‌బోలి' భాష ఇండో– ఆర్యన్ భాషా కుటుంబానికి చెందినదిగా భాషా శాస్త్రజ్ఞులు గుర్తించారు. బంజారాల సాహిత్యం మౌఖిక సాహిత్యంగానే విలసిల్లుతుంది. వీళ్ళు తమ సొంత మాండలి కాన్నే మాట్లాడుతూ మళ్ళీ స్థానిక భాషలు కూడా నేర్చుకుని మాట్లాడుతుంటారు. అలాగే తమను తాము 'గోర్' జాతి జనులని పిలుచుకుంటారు. గ్రామీణ జానపదుల సంస్కృతికంటే వీళ్ళ సంస్కృతి భిన్నంగా ఉంటుంది.

లంబాడీ తెగ 'భూక్యా( రాఠోడ్) వదిత్య(జాదవ్) చౌహాన్, పమార్; బానోత్ (అదే) అనే ఐదు ప్రధాన తెగలుగా విభజింపబడింది. వీళ్ళతో పాటు వీళ్ళకి సంబంధించిన చరిత్రను,గోత్రాలను చెప్పే 'భాట్, దాడీ, దప్పుడియా' వంటి ఉపతెగలున్నాయి. వీళ్ళలో 'ధనావత్, కెతావత్, రమావత్, రూపవత్, పాలిత్య, ముడావత్, అమ్గోతు, పాతలోత్, భూక్యా వంటి ఇంటిపేర్లుంటాయి.

## ఆహార్యం

లంబాడీలు బలమైన భుజాలతో మధ్యరకపు ఎత్తును కలిగి ఎరుపు, తెలుపు రంగుగల మంచి శరీరచ్ఛాయతో కనిపిస్తారు. పురుషులు మంచి కండరపుష్టి కలిగి ఎంతకష్టమైన పనులనైనా ఓర్పుతోను, నేర్పుగాను చేయగలుగుతారు. వీళ్ళు సాధారణంగా ఒకరంగులగుడ్డను తలపాగా చుట్టుకొని లాల్చీ,ధోవతి ధరిస్తారు. స్త్రీల వేషధారణ మాత్రం ఉత్తర భారత స్త్రీల వలె ఉండి ప్రత్యేకత కలిగి ఉంటుంది. ప్రత్యేకంగా తయారుచేసుకునే ముదురు ఎరుపు, నీలం, ఆకుపచ్చరంగులతో అద్దాలు పొదిగిన దుస్తులు, వెండి ఆభరణాలు దుస్తుల మీద అందంగా చిత్రించిన బొమ్మలు – అల్లికలు చూసి వీళ్ళని వెంటనే గుర్తించవచ్చు. రంగురంగులు కలిగి నడుము ప్రాంతంలో మడతలు కలిగి కుట్టుపని చేయబడిన లంగాను ధరిస్తారు. 'పడికి' అను గుడ్డను చెక్క దువ్వెనతో గాని, ఏదైనా కొమ్ము దువ్వెనతో గాని కలిపి తమ శిరస్సుపై నుంచి భుజాలపై పడేటట్లు వేసుకుంటారు. 'ఛొరనా' అనెడి రవికను ధరిస్తారు. ఇది వీపుపై పూసలుగ్రుచ్చిన త్రాళ్ళతో ముడివేయబడుతుంది. లంగా, జాకెట్టు, ఓణీ అన్ని చిన్న అద్దాలతో కుట్టబడి తళుకులొలుకుతుంటాయి. ముంజేతులదాకా ఏనుగు దంతాలతో చేసిన గాజులు వేసుకుంటారు. మెడలో 'హస్లీ' అనే వెండి లేక ఇత్తడి హారాలను ధరించి గంటలు గల అందెలను కాళ్ళకు వేసుకుంటారు. ఈ అందెలు పెళ్ళి అయిన స్త్రీ మాత్రమే ధరిస్తుంది. విధవరాలు కాగానే వీటిని తీసివేస్తారు.

అవివాహితులు తమ చేతులకుముంజేతి నుండి మోచేతి దాకా వెడల్పాటి దంతపు గాజులను, పాదాలకు కంచుగజ్జెలను ధరిస్తారు. కేశాలను నెత్తిపై ముడివేసుకుంటారు. వివాహిత స్త్రీలు తమ కేశాలు జారవిడిచి దానిని 'కవిరి' అను ఇత్తడి బొత్తాలతో నొక్కి ఉంచుతారు. బారులైన 'గుజీర' లనబడు వెండి,ఇత్తడి అలంకరణలు తలకుచ్చులకు కట్టబడి చెంపలపైన వ్రేలాడుచుండి ఆ స్త్రీ వివాహిత అని, ఆమె భర్త జీవించి ఉన్నాడని తెలియజేస్తాయి. ఇలా రకరకాలైన వీరి సాంప్రదాయ అలంకరణలు ఈ స్త్రీల శరీర సౌందర్యాన్ని ఇనుమడింపచేసేవిగా ఉంటాయి. నేడు ఈ స్త్రీల వస్త్రధారణలోను, అలంకరణలోను చాలా మార్పు వచ్చింది.

## పెళ్ళిళ్ళు - ఇతర ఆచార పద్ధతులు

వంశాభివృద్ధికి మూలమైన వైవాహిక వ్యవస్థకు లంబాడీలు అధిక ప్రాధాన్యమిస్తారు. వీళ్ళ పెళ్ళిళ్ళు హిందూ సాంప్రదాయ పద్ధతినే పోలి ఉంటాయి.అయితే పెళ్ళి నిర్ణయించేది, జరిపించేది గూడా వీళ్ళ పెద్దలే. నలుగురు పెద్ద మనుషులు కూర్చుని అబ్బాయి, అమ్మాయి ఇంటి మంచి చెడులకన్నా ఆ తండా నాయకుడెవరు? వాళ్ళ ఆచార వ్యవహారాలు ఎలాంటివి? వంటి విషయాలు ఆరాతీసి నచ్చితే పెళ్ళి ఒప్పందం చేసుకుంటారు. అందుకు కారణం ఆ తండా నాయకుడు మంచి నడవడి, సభ్యత కలిగి ఉంటే మిగతా తండా వాళ్ళంతా అదే త్రోవలో ఉంటారని భావించటమే.

వధూవరుల గోత్రాలు పరిశీలించి అవి కుదిరితేనే లంబాడీభాషలో 'సగాయి' అంటే తాంబూలాలు పుచ్చుకుంటారు. అంటే బెల్లం తినడం అని అనవచ్చు. వధూవరుల పక్షం వాళ్ళు పరస్పరం బెల్లంతిని పెళ్ళి సంబంధం కుదుర్చుకుంటారు. పెళ్ళికి ముందు వారంరోజుల్లో ఆది వారంనాడు మంచిముహూర్తంలో 'సాడి'కార్యాన్ని ప్రారంభిస్తారు. 'సాడి' అంటే చీర సాడి కార్యంలో పెళ్ళికొడుకుని అలంకరించి వధువు ఇంటికి తీసుకెళ్ళి, వధువుకు చీర ఇస్తారు. బెల్లం పానకానికి ప్రాముఖ్యాన్నిస్తారు.

ఏ కార్యమైనా తండాలోని వారంతా విందువినోదాల్ని సమానంగా చేసుకుంటారు.కనుక పెళ్ళప్పుడు ఆ జనానికి సరిపోయే బెల్లం, మిరియాలు, గసగసాలు, కొబ్బకుడుకులు, నీళ్ళ కుండల్లో నానబెడ తారు. పాటలుపాడి ఆనందిస్తూ ఉండగా పెళ్ళికొడుకు 'గోటా'ను వంగి మర్యాదగా అందరికీ అందిస్తాడు.'గోటా' అంటే బెల్లం పానకం. ఇటు వరుని ఇంట, అటు వధువు ఇంటా ఈ ముచ్చట జరిగాక, ఓ వైపు భాజాభజంత్రీలు మోతలతో వరుడింటికి తెచ్చిన పసుపు కొమ్ముల్ని ఒక సానరాతి మీద అరగదీసి పసుపుగంధం తీస్తారు. మనం హిందూ సాంప్రదాయంలో జీలకర్ర బెల్లానికి ఇచ్చినంత ప్రాధాన్యత వీళ్ళు పసుపు బొట్టుకివ్వడం ఆనవాయితీ.

'దొరాభాందేరో' అంటే మూడుముళ్ళబంధం. ఏడు అడుగులు అను బంధం అని వాళ్ళు భావిస్తారు. 'దొరాభాందేరో' అంటే దార మ్ముళ్ళు వేసే కార్యక్రమం. వీటిని బ్రహ్మముళ్ళని చెప్పుకోవచ్చు. వీళ్ళలో కన్యాశుల్కం ఇవ్వడం అనే ఆచారం ఉంది. ఆడపిల్లకు ఆమె తల్లిదండ్రులకు ఈ సమయం వరుడు తరుపున పశువులను, ధాన్యాన్ని, కన్యాశుల్కంగా అర్పించుకునే ఆచారం ఉంది. దీన్ని వారి భాషలో 'భరోపురాకరేకు' అంటారు. వీటితో పాటు పెళ్ళి కుమార్తె తల్లిదండ్రులకు వరుని తరుపు పెద్దలు నాలుగు కోడెదూడల్ని 45 రూపాయల్ని ఇచ్చుకుంటారు. వధువుకు ఆమె తల్లిదండ్రులు పుట్టింటి సాంప్రదాయం ప్రకారం పరికిణి, రవిక (కాంచళి భాషలో) ఒక తాంగిడిని (గోనెసంచి) ఇస్తారు.

పెళ్ళి మండపాన్ని 'వాయర్‌హండి' అని పిలుస్తారు. ఈ మండపంలో తొమ్మిదిమూరలున్న చతురస్రాకారపు స్థలాన్నికొలిచి నాలుగు మూలగుంజల మధ్యన రెండు రోకళ్ళను పాతుతారు. అలాగేఒక్కో మూలలో ఆరుకుండలను పెట్టి, వాటిప్రక్కనే జిల్లేడు, మోదుగ, మామిడి ఆకులను అమర్చుతారు. ఆ ఆకులు దుష్టశక్తుల్ని మంత్రతంత్రాలను నిర్వీర్యం చేస్తాయన్నది వీళ్ళనమ్మకం.

'లంబాడీల జీవనాధారం గోసంపదపై ఆధారపడి ఉంటుంది. కాబట్టి పెళ్ళప్పుడు వధూవరుల చేత ఆవుపేడకు (ఒకోల్డి) మొక్కించడం వీళ్ళ ఆచారం. ఈ సందర్భంలో ఆడవాళ్ళు పాటలు పాడతారు. తర్వాత పెళ్ళి కుమారుని శరీరధారుడ్యాన్ని, సహనాన్ని పరీక్షించేకార్యక్రమం మొదలుపెడతారు. ఇది చాలాచిత్రంగా ఉంటుంది. ఆడవాళ్ళు, బావమరుదులు కర్రలతో,జిల్లేడు మండలతో, రోకళ్ళతో మా కూతుర్ని బాదిస్తావా?బూతు మాటలు అంటావా?అంటూ పెళ్ళి కొడుకుని చెవిడొప్పలమీద కొడతారు. అప్పుడు ఆ పెళ్ళికొడుకు అమ్మో నొప్పి అనే మాట మాట్లాడకూడదు. ఆ తంతు అయిన తర్వాత రోకలి చుట్టూ ప్రదక్షిణ చేస్తారు.

ఇలాంటి కార్యక్రమాలు జరిపించిన తర్వాత ఒకే చెంబులో నీళ్ళను వధూవరులు సేవిస్తారు. అపుడు ఎవరి దృష్టీ ఆ భార్యాభర్తలపై పడకుండా దుప్పటి కడతారు. 'పసుపుతాడు' అంటే తాళికి ఏడుముళ్ళు వేసి వధువు మెడలో వేస్తారు. పెళ్ళి అయిన మర్నాడు 'చూడోలీపేర్' చేస్తారు. అంటే సౌభాగ్యవతిని అలంకరించడం. అపుడు లంబాడీ స్త్రీలందరూ వధువుకి టోపీలు, దండగాజులు, వాండీలు (అరవంకీలు) 'కసే' వంటి ఆభరణాలు ధరింపజేస్తారు.

ఆడపిల్లను అత్తవారింటికి పంపించడానికి వారంరోజుల ముందే ఏడ్చే విధానాన్ని కూడా తర్ఫీదునిస్తారు. అత్తవారింటికి వెళ్ళే సమయంలో ఆమె ఓ ఆవుపై నిలబడి ఆకాశంవైపు చేతులు చాపి ముఖమంతా కన్నీటిమయం కాగా, ఆ ప్రత్యేక సందర్భానికై నేర్చుకున్న ప్రాచీన పదాలను రోదిస్తూ ఉచ్చరిస్తూ ఉండడం ఒక ఆచారం. అత్తవారింట్లో ఎట్లా మసలుకోవాలో, పెళ్ళి కూతురుకి తోటివాళ్ళు, తల్లి పాటలు పాడుతూ తెలియజేస్తారు.

అలాగే పెళ్ళి లో 'గౌట్'(విందు) కార్యక్రమం ఉంటుంది. పెళ్ళి కుమారుడే తండా జనాన్ని దృష్టిలో పెట్టుకుని మేకలను బలి ఇస్తాడు. వాటి రక్తాన్ని పాత్రలోకి పట్టి 'సోలోయ్' వండుతారు. సోలోయ్ అంటే చింతపండు పులుసు, ఉప్పు, కారం రక్తం కలిపి తయారుచేసే కూర, అందరికి సరిపోయే కల్లు, సారాయితో సాయంకాలం అందరినీ పంక్తిగా కూర్చోబెట్టి, 'సోలోయ్'ని వడ్డించి విందు చేస్తారు. దీంతో పెళ్ళి తంతు ముగిసి ఆమె ఓ ఇంటి కోడలిగా మారుతుంది. కేవలం ఆమె భర్తకు సేవలుచేస్తే చాలదు. అత్తమామలకు ప్రతిరోజూ సాయంకాలం వేడి నీళ్ళతోస్నానం చేయించాలి. రాత్రి సమయం వారిద్దరికీ కాళ్ళు వత్తడం ఆచారంగా మెలగాలి.

ఇతర తెగల్లో వలె లంబాడీ తెగలో కూడా వధువుకు వరుడు ఇష్టం లేకపోయినా, వరుడికి వధువు ఇష్టం లేకపోయినా విడాకులు తీసుకునే ఆచారం ఉంది. పూర్వకాలం వీళ్ళలో బహుభార్యత్వం అధికంగా ఉండేది. ఇతర తెగల్లో వలె వీళ్ళలో కూడా భార్య చనిపోతే భర్త మరో పెళ్ళి చేసుకోవచ్చు. కాని భర్త చనిపోయిన స్త్రీ మాత్రం పెద్దలు నిర్ణయించిన వ్యక్తినే వివాహం చేసుకోవాలి.

లంబాడీల్లో గర్భిణీ స్త్రీలు సాధారణంగా బయటి వైద్యులనుసంప్రదించరు. కాన్పులు చేయడానికి బంజారా కులస్థురాలైన మంత్రసాని ఉంటుంది. ఆమె గర్భిణీ స్త్రీకి కావలసిన అన్ని రకాల సేవలు దగ్గరుండి చేస్తుంది. బంజారాల్లో శిశువు జన్మించిన తర్వాత జాతక కర్మలు చూపించే ఆచారం లేదు. పదకొండోరోజు శిశువుకు బొడ్డు చుట్టూ రెండువాతలు వేస్తారు. అలాగే ఉయ్యాల్లో పడుకోబెట్టే ఆచారం ఉంది. ఈ కులస్తుల్లో ఆడపిల్ల పుష్పవతి అయితే ఆ విషయం తల్లికి తప్ప ఎవ్వరికి తెలియనివ్వరు. రహస్యంగా ఉంచుతారు. ప్రత్యేకమైన శుభ కార్యాలు ఏమీ చేయరు.

## అపరకర్మలు

లంబాడీలు చనిపోయిన వాళ్ళని దహనం చేసి మూడవరోజున దహన భస్మము నెత్తిపోసి ఆరోజే అపరకర్మలు ముగిస్తారు. ఐదవరోజున తమ బంధుమిత్రాదులను పిలిచి మద్యమాంసాలతో వాళ్ళకి విందు చేస్తారు. అలాగే చనిపోయిన వాళ్ళ సంతృప్తి కోసం ప్రతిసంవత్సరం 'బోగ్' అనే పండుగ చేస్తారు. ఆ రోజుచనిపోయిన వాళ్ళకి ఇష్టమైన వంటలు చేస్తారు. తలెసకునం, దండసకునం, పేర్లతో మేకలను కోళ్ళను బలిచ్చి దెయ్యాలపీడ వదిలించుకుంటారు.

## దేవతారాధన పద్ధతులు

హోళీ,దీపావళి,సంక్రాంతి వంటి హిందువుల పండుగలు చేసుకుంటారు. సీత్లాభవాని, తుల్జాభవాని,దుర్గా పేరమ్మ, మైసమ్మ,పోశమ్మ, సమ్మక్క- సారలమ్మ, నరసింహస్వామి, సేవాలాల్ మహారాజ్, హాతీ రాంబాబాజీ, బాలాజీ వంటి దైవాలను పూజిస్తారు. ముఖ్యంగా తిరుపతి యాత్ర చాలాపుణ్యప్రదమైనదిగా భావిస్తారు. యాత్రకు వెళ్ళే రోజున యాత్రికుల ఇంటిముందు అగ్నిగుండాన్ని తవ్వి మద్దికట్టెలతో అగ్నిని ప్రజ్వరిల్లచేసి అందులో అగరువత్తులు, సాంబ్రాణి వేసి పూజలు చేస్తారు. తాండా వారంతా యాత్రికులను భక్తి గౌరవాలతో ఊరి పొలిమేరవరకు సాగనంపుతారు. యాత్రికులు యాత్ర ముగిసేవరకు స్వయంగా వంటచేసుకుని భుజిస్తారు. యాత్రికులు తిరిగి వచ్చేవరకు ఇంట్లో ఉన్నవాళ్ళు కూడా ఇతరుల చేతి వంట తినరు. యాత్ర నుండి

ఊరు చేరిన యాత్రికుల దగ్గర చెరువులోనో, బావిదగ్గరో స్నానం చేసి హనుమంతుని దేవాలయంలో పూజలు చేస్తారు. ఈలోగా తండాలో వాళ్ళు నీళ్ళ బిందెలతో వచ్చి యాత్రికుల కాళ్ళు కడిగి పాదాలకు నమస్కరించి తప్పెట్లతో భజనలుచేస్తూ అందరినీ వారి ఇంటి వద్దకు చేరుస్తారు. మరుసటిరోజు శుచిగా అగ్నిగుండంపై ప్రసాదాలు వండి నైవేద్యం, నెయ్యి, అగ్నిలో వేసి టెంకాయ కొట్టి మొక్కి ప్రసాదం తింటారు. ఈ యాత్ర చేసిన వారిని ఊరి వారంతా గౌరవిస్తారు.

అలాగే వీరి జీవనాధారం పశుసంపద కావున పశువుల ఆరోగ్యం కోసం, తండా సౌభాగ్యం కోసం, మశూచి, కలరా వంటి వ్యాధులు సోకకుండా కాపాడుతుందని ఎంతో భక్తితో 'సీత్లాభవానీ'ని పూజిస్తారు. 'తీజ్' వంటి మొలకల పండుగను జరుపుకుంటారు. తుల్జాభవానీని కొలిచి బలులు సమర్పిస్తారు.

## వివాద పరిష్కారాలు

వీళ్ళలో కులపెద్దలు తీర్మానాలు, చర్చల ద్వారా, వివాదాలుపరిష్కరించడం వీళ్ళ సంప్రదాయం. ఇందుకోసం ఒక అధినేత(నాయక్), ఒక సలహాదారు (కబరి), ఒక వార్తాహరుడు (దప్పన్) కలిసి చర్చించి నిర్ణయాలు తీసుకుంటారు.

## నృత్యవిశేషాలు - ఇతర ఆచారాలు

లంబాడీల్లో స్త్రీ పురుషులు వివాహ సందర్భంలోను, పండుగ దినాల్లోను సామూహికంగా నృత్యం చేస్తారు. వీళ్ళలో స్త్రీలు ప్రత్యేకంగా అలంకరించుకొని నలుగురు గాని, పదకొండుమంది గాని లేక పదహారుమందిగాని జట్లుజట్లుగా కూర్చొని వలయాకారంగా నృత్యాలు చేస్తారు. వీళ్ళు ధరించిన ఏనుగు దంతపుగాజులు, గజ్జెలు, ఘల్లు ఘల్లున మ్రోగుతుండగా, మగవాళ్ళు తప్పెట్లు వాయిస్తూ నృత్యం చేస్తుంటారు. ముఖ్యంగా 'కాముని పున్నమి' వంటి పండుగ దినాల్లో ఇలా నృత్యం చేస్తుంటారు. కులసంఘ కట్టుబాట్లయందు మద్యము సేవించుట, పండుగల సమయాల్లో వరుసఅయిన వాళ్ళను ఏడిపించుట, దూర ప్రయాణము చేసి కొన్ని సంవత్సరాల తర్వాత కలుసుకొన్న బంధువులను చూచి బిగ్గరగా ఏడ్చుకొనుట మొదలైనవి వీళ్ళ నాగరికతను చాటుతాయి.

## లంబాడీ భాష

లంబాడీ నిత్యవ్యవహారాల్లో మాట్లాడే పదబందాలు కొన్ని :-

| | లంబాడీ | - | తెలుగు |
|---|---|---|---|
| 1. | ఛావళ్ | - | బియ్యము |
| 2. | దళియ | - | అన్నము |
| 3. | దూద్ | - | పాలు |
| 4. | దహి | - | పెరుగు |
| 5. | ఘోళియ | - | మజ్జిగ |
| 6. | తేల్ | - | నూనె |
| 7. | బోటి | - | మాంసం |
| 8. | మాళీ | - | చేప |
| 9. | ఈండా | - | కోడిగుడ్డు |
| 10. | నుణ్ | - | ఉప్పు |
| 11. | హళద్ | - | పసుపు |
| 12. | కాంద | - | ఉల్లిగడ్డలు |
| 13. | గోళ్ | - | బెల్లం |
| 14. | సక్కర్ | - | పంచదార |
| 15. | వ్యాగణ్ | - | వంకాయ |
| 16. | భీండా | - | బెండకాయ |
| 17. | ధాడో | - | సూర్యుడు |
| 18. | చాంద్ | - | చంద్రుడు |
| 19. | జమ్మీ / జాగ్ | - | నేల |
| 20. | వాళ్ | - | గాలి |
| 21. | తావ్డో | - | ఎండ |
| 22. | సోనో | - | బంగారం |
| 23. | రూపో | - | వెండి |
| 24. | పీస | - | డబ్బులు |
| 25. | యాడి | - | తల్లి |
| 26. | బాపు | - | తండ్రి |
| 27. | బేటా | - | కొడుకు |
| 28. | బేటీ | - | కూతురు |
| 29. | ధణి | - | భర్త |
| 30. | గొణ్డి | - | భార్య |
| 31. | చార్వి | - | అమ్మాయి |
| 32. | చ్వార | - | అబ్బాయి |
| 33. | భూక్ | - | ఆకలి |
| 34. | దోక్ | - | రోగం |
| 35. | కత్ | - | ఎక్కడ |
| 36. | కన్నా | - | ఎప్పుడు |
| 37. | ఠేక్ఛ | - | బాగుంది |
| 38. | దేవళ్ | - | దేవాలయం |
| 39. | జో | - | వెళ్ళు |
| 40. | భూల్మత్ | - | మాట్లాడకు |

| | లంబాడీ | - | తెలుగు |
|---|---|---|---|
| 41. | వరస్ | - | సంవత్సరం |
| 42. | రాత్ | - | రాత్రి |
| 43. | పరబాతి | - | పగలు |
| 44. | మాతో | - | తల |
| 45. | జీబ్ | - | నాలుక |
| 46. | మూండో | - | నోరు |
| 47. | హతేళి | - | అరచెయ్యి |
| 48. | ధాళో | - | తెలుపు |
| 49. | కాళో | - | నలుపు |
| 50. | రాతాడో | - | ఎరుపు |

## వృత్తులు

లంబాడీలు వ్యవసాయం, పశువుల పోషణ, గొర్రెలపెంపకం, నిత్యావసర సరుకులతో వ్యాపారం మొదలైన పనులు చేస్తారు. వీళ్ళు పశువులను మేపడంలో సిద్ధహస్తులు. మహబూబ్‌నగర్ జిల్లాలోని అమ్రాబాద్ ప్రాంతంలో వీళ్ళు సాకే కోడెగిత్తలు 'అమ్రాబాద్‌కోడెలు' గా ప్రసిద్ధిపొందాయి. పూర్వం వీళ్ళు ప్రధానంగా ఎడ్లబండ్లపై సరుకులను ఒక చోట నుండి మరొకచోటికి తీసుకుపోయే వృత్తిలో జీవించే వాళ్ళు. లాభసాటియైన వ్యాపారం చేస్తూ ఒక ప్రాంతం నుండి మరొక ప్రాంతానికి వెళ్తూ దేశమంతా కనిపించేవాళ్ళు. అలాగే పండుగలకు వారి సాంప్రదాయ నృత్య ప్రదర్శనలు ఇచ్చి డబ్బు వసూలు చేసేవాళ్ళు. తెలంగాణా ప్రాంతంలో ఎర్రమట్టి నేలలో జీవిస్తూ జొన్నలు, మొక్కజొన్నలు, రాగులు, సజ్జలు, కొర్రబియ్యం, మిరపపంటలు పండించటం, అడవి నుండి కుంకుడుకాయలు, మోదుగాకులు, ఇంటి అలంకరణకు ఉపయోగించే ఎర్రమట్టిని, సీతాఫలం పండ్లు, జీడిపండ్లు లక్క మొదలైనవి సేకరించి నగరాల్లో అమ్మడం వంటివి చేసేవాళ్ళు.

ఇప్పుడా వృత్తులు వదిలి వేరే వృత్తుల్లో స్థిరపడ్డారు. త్రాళ్ళు పేనుట, గోతాలు నేయటం వంటి వాటితో కొందరు జీవిస్తున్నారు. మరికొందరు పురుషులు రిక్షాలు తొక్కడం, ఆటోలు నడపటం చేస్తుంటే స్త్రీలు ధనికుల ఇండ్లలో అంట్లు తోమడానికీ, హోటళ్ళలో పనులు చేయడానికి వెళ్తున్నారు. వీళ్ళలో నిరక్షరాస్యులు అధికంగా ఉన్నప్పటికీ గతంతో పోల్చుకుంటే చాలా మార్పు వచ్చింది. బాల్యవివాహాలు, మూఢనమ్మకాలు వీళ్ళ అభివృద్ధి నిరోధకాలుగా చెప్పవచ్చు. ఆంధ్రాతో పాటు తెలంగాణా ప్రాంతంలో కూడా 1977 వ సంవత్సరంనుండి ప్రభుత్వం వీళ్ళను గిరిజన తెగలలోకి చేర్చారు. అందువల్ల ఆర్థికంగా సామాజికంగా వీళ్ళు కొంత అభివృద్ధి చెందారు.

## చెంచులు

ఆంధ్రప్రదేశ్‌లోని గిరిజన తెగలలో చెంచు జాతి మిక్కిలి ప్రాచీనమైనదిగా మనచరిత్రను బట్టి తెలుస్తున్నది. ఆంధ్ర తెలంగాణా రాష్ట్రాల్లో వీళ్ళు ప్రధానంగా ప్రకాశం, గుంటూరు, కర్నూలు, నల్గొండ, మహబూబ్‌నగర్ జిల్లాలో విస్తరించి ఉన్నారు. ఈ ఆదివాసీలు ప్రాచీనమైన సంచార తెగలలో ఒకటిగా ప్రసిద్ధిగాంచిన వాళ్ళు. చారిత్రక ఆధారాలను బట్టి చూసినట్లైతే వీళ్ళు దట్టమైన నల్లమల అటవీ ప్రాంతంలో వేలాది సంవత్సరాలనుండి జీవనం సాగిస్తున్నారు. ఎక్కువగా ఈ సంచార జాతి కొండలు, గుట్టలు ఉన్నచోట నివాసాలు ఏర్పరుచుకొని, సహజ ఆటవిక వనరుల ద్వారా లభించే వాటిని అమ్మి సొమ్ము చేసుకుని జీవిస్తున్నారు.వీరి మాతృభాష తెలుగుగానే అనిపిస్తుంది. కొన్ని వ్యవహారదూరమైన మాండలికాలు అక్కడక్కడ వీళ్ళ ఉచ్చారణలో కనిపిస్తాయి

డాక్టర్ హైమన్ డార్ఫ్ చెంచులను గూర్చి వ్రాసిన గ్రంథములో 'చెంచులు, అరవదేశపు ఇరుళలు ఒకే జాతికి, ఒకే వైజ్ఞానిక సాంప్రదాయానికి చెందినవాళ్ళని' తెలిపాడు. ఇరుళ అనే పదానికి నల్లని అని అర్థం. అందుకే ఎడ్గార్ థ్రస్టన్ 1909లో ఇరుళ దేహఛాయలను గురించి వ్రాస్తూ ఇరుల శరీరంపై బొగ్గు గీత గీచినా గీత కనిపించనంత నల్లనిది అని ఛలోక్తిగా వర్ణించాడు. ఇరుళలు, విల్లియనులు (విల్లును వాడుకునేవాళ్ళని అర్థం) యానాదులు, చెంచులు, నల్లమల అడవులలో నివసించినవాళ్ళే. పద్మశ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారు చెంచులను గురించి వ్యాఖ్యానిస్తూ 'కొండలనుండి, అడవులనుండి కిందికి దిగిన చెంచులే యానాదులుగా మారినారని తెలియజేశారు. పాల్కురికి సోమనాథుని వంటి అనేకమంది ప్రాచీనకవుల రచనలలో వీరి ప్రస్తావన కనబడుతుంది. వీరి శరీర నిర్మాణాన్ని బట్టి ఆస్ట్రాలాయిడ్, నీగ్రిటోలాయిడ్‌ల సమ్మిశ్రిత జాతిగా ఆంత్రోపాలజిస్ట్‌లు పేర్కొన్నారు.

గుంటూరుజిల్లాలోని అమరావతి దేవాలయపు తామ్రశాసనాన్ని బట్టి శ్రీరాజావాసిరెడ్డి వెంకటాద్రినాయుడు గారి రాజ్యకాలంలో, 200 సంవత్సరాల క్రితం ఆంధ్రకోస్తా కీకారణ్యముగా ఉన్నదనీ, చెంచులు ఈ అడవులలో విచ్చలవిడిగా సంచరించుతూ దారిదోపిడీలు చేస్తూ, ప్రజలను హింసించుచున్నందువల్ల, అన్నదానమనే మిషతో వాళ్ళను రప్పించి దొడ్డిలోనికి ఒక్కొక్కరి వంతున పంపి శిరచ్ఛేదనము చేయించాడని, రంగనాయుడుదాసు అనే వ్యక్తి తల అతని తాయెత్తు మహిమచే ఎన్ని దెబ్బలకు తెగనందున ఆలస్యాన్ని సందేహించిన చెంచులు చావు పరుగులతో తూర్పు కనుమల వరకు వ్యాపించిన నాయుని రాజ్యము దాటి పర్వతశ్రేణిలో స్థిరనివాసము ఏర్పరుచుకొన్నారనీ తెలుస్తుంది.

చెంచుజాతిని సూక్ష్మంగా పరిశీలించినట్లైతే వీళ్ళలో నాలుగు రకాల విభజన కన్పిస్తుంది. వీళ్ళు

**1. అడవి చెంచులు :** వీళ్ళు ముఖ్యంగా అడవులలోనే జీవిస్తూ వేట, తేనెతీయడం, కట్టెలు కొట్టడం ఇతర అటవీ సామగ్రిని సేకరించడం చేస్తుంటారు.

**2. దేవచెంచులు :** వీళ్ళు దేవాలయాలలో సేవకులుగా ఉంటుంటారు. ముఖ్యంగా శ్రీశైలం, అహోబిలం, మహానంది, నల్లమల అడవులలోని ఇతర పుణ్యస్థలాల్లోని దేవాలయాలలో పనిచేస్తుంటారు.

**3. బొంత చెంచులు :** వీళ్ళు అడవిలోని వెదురును కాల్చి దానితో అనేక వస్తువులను తయారుచేస్తుంటారు.

**4. కృష్ణచెంచులు :** వీళ్ళు నల్లమల అడవులలోని వనమూలికలను సేకరించి మందులు, మాకులు అమ్ముకుని జీవిస్తుంటారు.

మొదటి రెండు వర్గాల వాళ్ళు సాంఘికజీవనము, గోత్రం, కులం, కట్టుబాట్లు ఆచారవ్యవహారాలు, సాంప్రదాయాలు ఒకేవిధంగా ఉంటాయి. మిగతావాళ్ళ ఆచారవ్యవహారాల్లో కొన్ని మార్పులు చోటు చేసుకున్నాయి. చెంచులు గుంపులు గుంపులుగా కలసి ఒకేచోట గుడిసెలు నిర్మించుకొంటారు. వీళ్ళ నివాస ప్రాంతాలను చెంచు గూడెములనీ, చెంచుపెంటలు (ఇండ్లు) అనీ అంటారు. శ్రీశైలం నుండి దొర్నాలగుండా ప్రకాశంజిల్లా గుంటూరులకు వెళ్ళే ప్రాచీన కాలినడక పొడవునా వీళ్ళకి సంబంధించిన ఆవాస నివాసాలు కనిపిస్తాయి. అలాగే మహబూబ్‌నగర్ జిల్లాలో అమ్రాబాద్ పీఠభూమి 'ఇర్లపెంట', నల్గొండ, భద్రాచలంలో నివసిస్తారు.

### మతము - దేవతాపూజలు

చెంచులు హిందూమతంలోని దేవుళ్ళను, దేవతలను పూజిస్తారు. వీళ్ళ ప్రధానమైన దేవుడు చెంచుమల్లన్న, శ్రీశైలం దేవాలయం గుడి ప్రాకారంలో ఒక చిన్నగుడి ఉంది. ఈ గుడిలో ఒక చిన్నరాయి మాత్రమే ఉంటుంది. ఈ రాయిని చెంచులు వృద్ధ మల్లికార్జునుడని పిలుస్తారు. వృద్ధ మల్లికార్జునుడికి చెవుడు రావడం వల్ల క్రమంగా భక్తుల సంఖ్యతగ్గిపోయి కొత్త మల్లికార్జునుడు అవతరించాడని చెబుతారు.

పూర్వం శ్రీశైలం వచ్చే యాత్రికులు చెంచుపెంటలలో బసచేస్తూ చెంచులు మోసే డోలీలలో కూర్చుని వెళ్ళేవారు. ఈ విధంగా చెంచులకు శ్రీశైలంతో దగ్గరి సంబంధం ఉంది. చెంచులు పూజించే దేవుళ్ళలో శ్రీశైలం మల్లికార్జునుడు, అహోబిలం, నరసింహస్వామిమాత్రమేకాక, భద్రాచలం వంటి చోట్ల శ్రీరాముడు, ఆంజనేయుడు, శ్రీ వెంకటేశ్వరుడు కూడా ఉన్నారు. దేవతల్లో శ్రీశైల భ్రమరాంబిక, చెంచులక్ష్మి, గారెల మైసమ్మ, ఎల్లమ్మ, అంకాలమ్మ, పోలేరమ్మ, ఈదమ్మ మొదలైన వాళ్ళున్నారు. ఇంకా వీళ్ళు లింగమయ్య, పోతురాజు, కాట్రేడు లను కూడా పూజిస్తారు. నరసింహస్వామి భార్యచెంచులక్ష్మి చెంచుల ఆడపడుచు. అందువల్ల చెంచుల పాటల్లో తరచుగా నరసింహస్వామి, చెంచులక్ష్మిలకు సంబంధించిన కథలు గానం చేయబడతాయి. మనిషి చనిపోగానే జీవుడు దేవునిలో లీనమైపోతాడని చెంచుల విశ్వాసం.

### ఆహారం - వృత్తులు

చెంచుల ప్రధానమైన ఆహారం అడవిలో దొరికే కాయలు, పండ్లు, ఫలములు, దుంపలు, తేనె, వెదురుబియ్యం, వేటాడిన జంతువుల, పక్షుల మాంసాలు మొదలైనవి. సారాత్రాగటం వీళ్ళకు సర్వసాధారణమైన అలవాటు. కరువు కాలంలో చింతపండును బూడిదలోపొర్లించి ముద్దలుగా చేసి ఆ ముద్దలను ఆరగించే అలవాటు కూడాఉంది.

కత్తి, బల్లెం, విల్లంబు, గొడ్డలి వీళ్ళ ప్రధాన ఆయుధాలు. వేట, అటవీ ఉత్పత్తుల సేకరణ వీళ్ళ ప్రధానమైన వృత్తులు. వేటాడటానికి వెళ్ళేటప్పుడు భార్యాభర్తలు ఒకకుక్కను కూడా వెంటబెట్టుకొని వెళ్తారు. అడవిలో పందులను, ఎలుగుబంట్లును, ఉడుములను, దుప్పులను, కుందేళ్ళను, నెమళ్ళను ఇతర అడవి పక్షులను వేటాడతారు. భర్త మాంసం కోసం వేటాడితే భార్య తనవంతు ఆహారసేకరణార్థం పండ్లు, దుంపలు, ఆకుకూరలు, వంటకు అవసరమైన వంటచెరకు సేకరిస్తుంది. అలాగే వీళ్ళు అడవుల్లో దొరికే వెలగకాయలు, రేగిపళ్ళు, సీతాఫలములు, చిల్లగింజలు, చింతపండు, తుమ్మబంక, కుంకుడుకాయలు, ఉసిరికాయలు, కందమూలాలు, తేనె, ముష్టిగింజలు, విప్పపువ్వు వంటివి సేకరించుకొని ఊర్లలోని సంతల్లోగాని, గిరిజన సహకార స్టోర్స్ లోగాని అమ్మి డబ్బు సంపాదిస్తారు.

### అలంకరణలు

సుప్రసిద్ధ చరిత్రకారుడు 'ఫెరిస్టా' పూర్వం వీళ్ళ ఆకారం, అలంకరణల గురించి తెలుపుతూ చూడడానికి నల్లగా ఉంటారు. శరీరమంతాపొడుగైన వెంట్రుకలు వ్రేలాడుతుంటాయి. తలలపై ఆకుల టోపీలు ధరిస్తారు. ప్రతివాని చేతిలో ఒక విల్లు పిడికెడు అంబులు ఉంటాయి. చెట్ల నీడల క్రింద కొండ గుహల్లోను నివసిస్తూ ఉంటారు. వారి ఒంటిపై బట్టలకు బదులు చెట్ల ఆకులే ఉంటాయి. అని వివరించాడు. అలాగే పూర్వం జంతు చర్మాలను ధరించేవాళ్ళు రాను రాను వీళ్లలో చాలా మార్పు వచ్చింది. స్త్రీలు చీర, రవికెలు ధరిస్తుండగా, పురుషులు గోచీలనుండి పంచెలు,చొక్కాలు ధరిస్తున్నారు. స్త్రీలు చెవులకు కమ్మలు, ముక్కుకు రెండువైపులా పుడకలు, మధ్యలో బులాకీలు, మెడలో గురివిగింజలపేరులు, పూసలదండలు, చేతులకు గాజులు, కాళ్ళకు కడియాలు ధరించే అలవాటు, నుదుటిమీద, చేతుల మీద పచ్చులు పొడిపించుకునే ఆచారం వీళ్ళకు ఉంది.

అలాగే పురుషులు ఊళ్ళలో బిచ్చం అడుక్కొనేందుకు వచ్చి నప్పుడు వీళ్ళ వేషధారణ చిత్రంగా ఉంటుంది. నడుంచుట్టూ చిన్న కొల్లాయి కట్టి, తలపై నెమలి ఈకలు కుచ్చులుగా ధరించి; తల మీద నుండి

చెంపలవెంటగా క్రిందికి వ్రేలాడునట్లు తెలుపు, ఎరుపురంగుల పూసల దండలను, వంటిమీద పాతకోటు లేదా చినుగుల వస్త్రాన్ని ధరించి; మెడ నిండా వివిధరంగు పూసలదండలు, పులిగోరు వేసుకొని, నుదుటి నిండా పెద్ద విష్ణునామాలు పెట్టుకొని, కాళ్ళకు చేతులకు కడియాలు ధరించి; కాళ్ళకు గజ్జెలు కట్టి; ఒక చేతిలో గుండ్రని ఇత్తడి గంట (పళ్ళెం) ఆచేతనే ఒక చిన్న కోల పట్టుకొని వాయిస్తూ ఆ ఇంటివాళ్ళను 'చెంచు దీవెన బ్రహ్మ దీవెన' అంటూ ఆశీర్వదిస్తూ భిక్ష అడుగుతుంటారు. వీళ్ళకు మరో చేతిలో చిన్న కత్తి, వేణువు ఉంటాయి. ఆ చేతిలోనే ఉడతతోకలు, ఉడుముతోళ్ళు, ముంజేయి మీద అడవిపిల్లి చర్మాలు; భిక్ష స్వీకరించటానికి భుజానికి ఒకజోలె ఉంటుంది. ఇప్పటికీ పల్లెల్లో దసరా, దీపావళి, సంక్రాంతి వంటి పండుగరోజుల్లో వీళ్ళు ఇలా ప్రత్యక్షమౌతుంటారు.

## ఇంటిపేరు - గోత్రాలు

వీళ్లలో 'జల్ల, తోకల, పిట్ట, పులిచెర్ల, నిమ్మల, దాసరి, భూమని, నలబోతుల' వంటి ఇంటిపేర్లు; 'ఆర్తి, గడ్డమోళ్ళ, మెఖల చిగుర్ల' అనే గోత్రనామాలు ఉంటాయి.

## వివాహం - ఇతర ఆచారాలు

చెంచులు మేనరికపు వివాహాలకు ప్రాధాన్యం ఇస్తారు. పెద్దల ద్వారా కుదిర్చిన వివాహాలతో పాటు, రాక్షస వివాహ పద్ధతులు కూడా వీళ్ళ సమాజంలో ఉన్నాయి. పెళ్ళికొడుకు తరుపు వాళ్ళు పెళ్ళికూతురు తరుపు వాళ్ళకి 'ఓలి' కట్టే ఆచారం ఉంది. మగసంతానం లేనివాళ్ళు తమ కూతురుకు పెళ్ళి చేయాల్సివచ్చినపుడు ఇల్లరికపు అల్లుడిని తెచ్చుకోవడానికి ఇష్టపడతారు. మంగళ, శుక్ర, ఆదివారాలు తప్పించి మిగిలిన సోమ, బుధ, గురు, శని వారాల్లో పగలు మాత్రమే పెళ్ళిళ్ళు చేస్తారు.

వీళ్ళలో చిన్న చిన్న కుటుంబాలే కనిపిస్తాయి. పెళ్ళి జరిగిన వెంటనే నూతన దంపతులు విడిగా కాపురం పెట్టుకుంటారు. యువకుడైనా సరే పెళ్ళికి ముందు నుంచే ఒక గుడిసెను భావి సంసారం సాగించేటందుకు నిర్మించుకునే ఆచారం వీళ్ళలో ఉంది. వీళ్ళు స్వేచ్ఛాప్రియత్వం కలవాళ్ళు. బిడ్డ పుట్టిన 10 రోజుల నుండి మూడు నెలలలోపు ఎప్పుడైనా పిల్లలకు పేర్లు పెడతారు. ప్రత్యేకంగా బారసాల చేసుకోరు.

## అక్షరాస్యత - అభివృద్ధి

దేశంలో వచ్చిన మార్పులకు అనుగుణంగా చెంచుల్లో చదువుపట్ల శ్రద్ధ పెరిగి విద్యావంతులుగా మారుతున్నారు. 2001 జనాభా లెక్కలను అనుసరించి మన రెండు తెలుగు రాష్ట్రాలలో కలిపి అక్షరాస్యుల శాతం 32.28 అది ప్రస్తుతం ఇంకా పెరిగే ఉంటుంది.

1975వ సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్‌గా తెలుగు వాళ్ళంతా కలిసి ఉన్నప్పుడే వీళ్ళను ప్రభుత్వం ఆదిమ గిరిజన తెగగా గుర్తించింది. వీళ్ళ కోసం శ్రీశైలంలో సమీకృత గిరిజనాభివృద్ధి సంస్థను ఏర్పాటు చేయడం గొప్ప విశేషం. ఇదే సంస్థ ఆయాప్రాంతాలకు చెందినచెంచుల కోసం విద్య, వైద్యం, ఆరోగ్యం, వ్యవసాయం, మంచినీటి సరఫరా, రహదార్ల నిర్మాణం, ఇళ్ళనిర్మాణం వంటి విషయాలలో చాలా అభివృద్ధి కార్యక్రమాలు నిర్వహిస్తూ ఆ జాతి సర్వతోముఖాభివృద్ధికి కృషి చేస్తుంది.

## సంఘగౌరవము

చెంచు భావము తెలుగునాడులో వ్యాపించి ఉన్నందువల్ల ముఖ్యంగా గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు జిల్లాలో విశేషముగా 'చెంచురామయ్య, చెంచుపాపయ్య, చెంచయ్య, చెంచమ్మ' వంటి పేర్లు కన్పిస్తాయి. అంతేకాక 'చెంచులక్ష్మి' వంటి వీధి నాటకాలకు కథలకు, చెంచు నృత్యాలకు, చెంచులక్ష్మి సినిమాలకు జనం ఎగబడే విషయం అందరికీ తెలిసినదే.

ఇలాంటి ప్రాచీనమైన సంస్కృతి, జీవన సరళి కలిగి ఉన్న 'ఎరుకల, యానాది, లంబాడి, చెంచు' సమాజాల వాళ్ళకి సాంప్రదాయ సిద్ధమైన స్వతంత్ర భావాలు ఉన్నాయని తెలుస్తుంది. కాబట్టి వాళ్ళ సంస్కృతి పరిరక్షిస్తూ వాళ్ళు అభివృద్ధి పథంలోకి పయనించేట్లు మన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, ఇతర స్వచ్ఛంద సంస్థలు కృషి చేస్తే బాగుంటుంది.

## ఆధారగ్రంథాలు


1. తెలుగుసామెతలు – జనజీవనం, రచన : డా॥ పాపిరెడ్డి నరసింహారెడ్డి ఎం.ఏ., పి.హెచ్.డి, యస్.వి.యూనివర్సిటీ, తిరుపతి, 1983 ప్రచురణ.
2. 'తెలుగు జానపద విజ్ఞానం– సమాజం– సంస్కృతి– సాహిత్యం', ప్రధాన సంపాదకులు : ఆచార్యనాయనికృష్ణకుమారి, పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు, 2000 సం॥ప్రచురణ.
3. 'గిరిజన సాహిత్యం', ఆచార్య ఎం.గోనానాయక్, నాల్గవ ప్రపంచ తెలుగు మహాసభల ప్రచురణ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, తెలుగు అకాడమి, 2012 ప్రథమ ముద్రణ.

4. 'గిరిజన స్రవంతి' సంపా: భూక్యా చిన వెంకటేశ్వర్లు, పూజా పబ్లికేషన్స్ చతుర్థ ముద్రణ 1995, గుంటూరు
5. స్వతంత్ర భారతంలో ఆదివాసీ తెగలు, సంకలనం : భూక్యా చినవెంకటేశ్వర్లు, పూజాపబ్లికేషన్స్, గుంటూరు, ప్రథమ ముద్రణ 2004
6. విజ్ఞానసర్వస్వము, 10వ సంపుటి, సాంఘిక శాస్త్రాలు, తెలుగు భాషా సమితి, హైదరాబాదు, మద్రాసు 1965 ముద్రణ
7. 'యానాది' గ్రంథకర్త : వెన్నెలకంటి రాఘవయ్య, ప్రకాశకులు: ఆంధ్రరాష్ట్ర ఆదిమజాతి సేవాసంఘం, విజయవాడ, 1974 ప్రచురణ
8. 'చరిత్ర గతిలో చైతన్యవాహిని వీరులపాడు' (గ్రామచరిత్ర –విశ్లేషణ), రచన : పాటిబండ్ల వెంకటపతిరాయలు, హైదరాబాదు
9. 'ఎరుకలవారి సామాజిక జానపద సంస్కృతి, సమగ్ర పరిశీలన, 2008లో ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం నుండి 'పి.హెచ్.డి' పట్టా పొందిన సిద్ధాంత గ్రంథం, పరిశోధకులు : డా॥ కాటాబత్తుల. ప్రభాకర్ ఎం.ఏ., పి.హెచ్.డి.,
10. 'తెలుగు పరిశోధనామంజరి', రెండవసంపుటం, సంపా: ఆచార్య వెలుదండ నిత్యానందరావు, సి.పి.బ్రౌన్ అకాడమి ప్రచురణ, హైదరాబాదు.
11. 'ఎరుకల' రచన, సంకలనం : పాలపర్తి వీరయ్య, ఆంధ్రరాష్ట్ర ఆదిమజాతి సేవాసంఘం, విజయవాడ
12. 'తెలుగు పున్నమి (చరిత్ర, సంస్కృతి, సాంకేతికత) ప్రపంచ తెలుగు రచయితల రెండవ మహాసభల సందర్భంగా 'కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురణ, ఆగస్టు 2011 ముద్రణ
13. తెలుగే ప్రాచీనం, డా॥జి.వి. పూర్ణచంద్ బి.ఏ.ఎమ్.ఎస్., గారు, ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం ప్రచురణ, హైదరాబాద్, ఫిబ్రవరి 2008 ముద్రణ.
14. ఆంధ్రప్రదేశ్ సమగ్ర చరిత్ర – సంస్కృతి (ప్రాక్‌పురాయుగం. క్రీ.పూ.500 వరకు) మొదటి సంపుటం, తెలుగునేత : ఆర్మీయర్, 2003 ఫిబ్రవరి
15. సమాజశాస్త్రం సామాజిక మానవశాస్త్రం, డా॥బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం ప్రచురణ, హైదరాబాద్
16. 'మార్గదర్శి' ఇయర్‌బుక్ 1996 ప్రచురణ, ఎడిటర్ : డా॥ అన్నవరపు కుమార్,
17. 'తెలుగు' అనుబంధపత్రిక, నవంబర్ 1997 ప్రచురణ, తెలుగు అకాడమి, హైదరాబాదు.

**దినపత్రికలు :**

1. ఆంధ్రప్రభ, ఆదివారం 29 మార్చి 2015
2. ఆంధ్రప్రభ, ఆదివారం 24 మే 2015

### తీర్థరాజ పుష్కరుడికి అర్ఘ్యప్రదానం

తీర్థరాజ మహాభాగ పుష్కరాఘ వినాశన
పుష్క రాఖ్యం గృహాణేశ సర్వతీర్థాభి పూజిత
ఓం పుష్కరాయ నమః ఇదమర్ఘ్యం సమర్పయామి

చిరునామా : *డా॥ కాటాబత్తుల ప్రభాకర్, ఈపురుపాలెం పోస్టు, చీరాల మండలం, ప్రకాశం జిల్లా, పిన్ : 523166, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం, చరవాణి : 9985927356*

శ్రీమతి పల్లవి ఆకురాతి

# కృష్ణమ్మ స్మృతులు - పర్యావరణం

'కృష్ణమ్మ' అంటూ నదిని "తల్లి"ని పిలిచినంత ఆప్యాయంగా ఆత్మీయంగా పిలవడంలోనే ప్రకృతి ప్రసాదాల పట్ల మనకున్న గౌరవాన్ని కృతజ్ఞతని ఏకకాలంలో వెల్లడించే మన సంప్రదాయ సంస్కారం వెల్లడవుతుంది. అందుకేనేమో ఎవరైనా నన్ను మీ 'Native Place' ఏమిటి? అని ప్రశ్నిస్తే ఠక్కున నేను కృష్ణమ్మ ఒడిలో పుట్టాననే చెప్తాను, అవును మరి బందరు కాలువ పక్కన అమెరికన్ హాస్పటల్‌లో నా కన్నతల్లి నాకు జన్మనిచ్చింది, మరి నేను కృష్ణ ఒడిలో పుట్టినట్టేగా. విజయవాడ అంతా కృష్ణ ఒడి సమానమే. ఒకానొకప్పుడు కృష్ణమ్మ బంగాళాఖాతం చేరడానికి పర్వతాలు అడ్డుగా ఉండడంతో దారి చూపమని అర్జునుణ్ణి కోరగా అర్జునుడు బాణం వేసి పర్వతాల్లో చేసిన 'బెజ్జం గుండా కృష్ణానది బంగాళాఖాతం చేరటం జరిగిందని చెప్పే ఐతిహ్యం ఈ స్థలాన్ని బెజ్జంవాడ అని అనంతరం అదే 'బెజవాడ' 'విజయవాడ' అయ్యిందని అంటుంది. అలా మా ఊరి ఉనికే కృష్ణమ్మ తల్లితో ముడిపడింది మరి.

పాఠశాలలో చదివేటప్పుడు 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' గీతంలో

**'బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను**
**బంగారు పంటలే పండుతాయి**
**మురిపాల ముత్యాలు దొరులుతాయి'**

ఆ వాక్యాల్ని ఎంతో గర్వంగా పాడేవాళ్ళం, మా కృష్ణమ్మ గురించి పాడుతున్నామనే గర్వంతో గుండె ఉప్పొంగే[illegible]. జాగ్రఫీ పాఠాలు చదివేటప్పుడు కృష్ణానది పుట్టింది మహారాష్ట్రలోని సతారా జిల్లా వై తాలూకాలోని 'మహాబలేశ్వరం' అని చదివినప్పుడు అయ్యో ! మన కృష్ణమ్మ మన ఆంధ్రప్రదేశ్‌లో పుట్టలేదా అని బాధపడ్డాం ! అర్థంలేని ఆ బాధ ఇప్పుడు తలుచుకుంటే పెదాల మీద ఓ చిరునవ్వు అలా దొర్లిపోతుంది. కృష్ణానదికి ఎడమవైపు భీమ, దిండి, పెద్దవాగు, హాలియ, మూసి, పాలేరు, మున్నేరు అనే ఉపనదులు కుడివైపు వెన్న, కోయినా, పంచగంగ, దూధ్‌గంగ, ఘటప్రభ, మాలప్రభ, తుంగభద్ర ఇత్యాది ఉపనదులు ఉన్నాయని చదివినప్పుడు మిగతా నదుల ఉపనదుల పేర్లు ఏమైపోయినా పరవాలేదు. మన కృష్ణమ్మ ఉపనదుల పేర్లు మాత్రం పట్టుపట్టి మరీ బట్టీయం వేసేవాళ్ళం! అదేమి అభిమానమో! లోనికి వచ్చే నీళ్ళు, నదీ బేసిన్ ప్రాంతం రీత్యా దేశంలో గంగా, గోదావరి, బ్రహ్మపుత్ర నదుల తరువాత కృష్ణానది నాల్గవ స్థానంలో ఉండొచ్చుగాక, మా మనసుల్లో మాత్రం కృష్ణవేణి అన్నివిధాలా అగ్రగామి !

దాదాపు 1290 కి.మీ. పొడవుతో పశ్చిమం నుండి తూర్పుకి ప్రవహిస్తూ అడుగడుగునా అన్నదాత అవుతున్న కృష్ణమ్మ శాతవాహనులు ఇక్ష్వాకుల కాలంనుంచి విజయనగర రాజుల వరకు ఈనాటి వరకు నిరంతరంగా తన బిడ్డలకి ఆసరాగా నిలుస్తూనే ఉంది.

చిన్నతనంలో అమ్మ ఏమి చెప్పినా ఎంతో అపురూపంగా వినేవాళ్ళం. అమ్మ చెప్పిన కబుర్లలో రామాయణాన్ని కృష్ణమ్మని కలిపి చెప్పిన కథ తెలుగువారందరికీ తెలిసిన కథ - అప్పటివరకూ అన్నే సర్వస్వంగా భావించి ఎంతో వినయవిధేయతలతో అన్నావదినల సేవకుడిగా అరణ్యవాసం చేస్తున్న లక్ష్మణుడు కృష్ణమ్మ తీరానికి చేరుకోగానే నేనేంటి మీకిల్లా ఊడిగం చేయడమేమిటి నా పరమార్థం నేను చూసుకుంటాను అని ఒక్కసారిగా 'లాజిక్కులు' మాట్లాడాడట ! అలా లక్ష్మణుడు 'లాజిక్కులు' మాట్లాడడానికి మూలకారణం - కృష్ణనీరు ! కృష్ణనీరు మహత్యం / మాహాత్మ్యం అది అని అమ్మ చాలా గొప్పగా చెప్పేది ! దీని వెనుక అసలు ఉద్దేశ్యం అటువంటి కృష్ణ నీళ్ళు తాగుతున్న మనమందరం చాలా తెలివైన వాళ్ళమన్నమాట - అనే ఆభిజాత్య ప్రదర్శన ! ఇప్పటికీ పేపర్లో (వార్తాపత్రికల్లో) కృష్ణా - గుంటూరు జిల్లాల వాళ్ళ సాధనలు ఏమైనా చదివితే మా అమ్మ నోటి వెంట వచ్చే మొదటి మాట 'మరి మన కృష్ణనీరు తాగిన తర్వాత ఆ ఫస్టు ర్యాంకు రాక ఛస్తుందా' ! అభిమానం నిండిన ఆ ఆభిజాత్యపు మాటలు విని ముసిముసి నవ్వుకోవడం మా వంతు.

బాల్యంలో పండగలకి అమ్మమ్మ ఇంటికి వెళ్ళడం అక్కడ చిన్నమ్మ-పెద్దమ్మల పిల్లలు,మామయ్యల పిల్లలతో ఆడుకోవడంఎవరికైనామధుర జ్ఞాపకం. మా అమ్మమ్మ నానమ్మ ఇరు కుటుంబాలు కొత్త-పాత మంగళగిరిలోనే ఉండేవి. మంగళగిరికి మేం ఎప్పుడూ ప్రకాశం బ్యారేజి మీదుగానే వెళ్ళేవాళ్ళం. పెద్ద పండగలకి అలా ఏడాది కోసారో ఆర్నెల్లకోసారో మంగళగిరి వెళ్ళేటప్పుడు ప్రకాశం బ్యారేజి మీద నుంచి కృష్ణమ్మఅందాలు కళ్ళార్పకుండా చూడడం ఎప్పటికీ మరపురాని అనుభూతి. ప్రతీసారి బ్యారేజి మీదనుంచి ప్రయాణం చేసేటప్పుడు పోయినసారికంటే ఈ సారి నీటిమట్టం తగ్గిందా పెరిగిందా అని మాలో మేమే లెక్కలువేయడం,బ్యారేజి పక్కగా నదీతీరంలో కొత్తకొత్తగా వచ్చిన దుకాణాలు, దేవాలయాలు ఇత్యాది గమనిస్తూ కృష్ణమ్మ అందాల్ని ఆస్వాదిస్తూ అయ్యో! బ్యారేజి అప్పుడే దాటేశామా అనిదిగులు పడుతూ మంగళగిరి చేరేవాళ్ళం. అక్కడ చిన్నమ్మ-పెద్దమ్మ పిల్లలకీ మామయ్యల పిల్లలకీ కృష్ణమ్మ అందాల గురించి బ్యారేజి మీద మేము చూసిన దృశ్యాల గురించి వున్నవిలేనివి చాలా గొప్పగా వర్ణించేవాళ్ళం! కృష్ణమ్మ గురించి మేం ఎన్ని గంటలు మాట్లాడినా పాపంవాళ్ళు ఎంతో ఓపిగ్గా వినేవాళ్ళు, ఆ తరువాత మాకు చూపించండంటూ వాళ్ళ అమ్మా నాన్నలని వేధించేవాళ్ళు. ఉడికించడంలో ఉన్న మజా అది!

బడిలో చదువుకునేరోజుల్లో విజయవాడ పాఠశాలల్లో ముఖ్యంగా అమ్మాయిలలో బెజవాడ కనకదుర్గమ్మనీ కృష్ణమ్మనీ కలిపి చెప్పే ఒక కథ బాగా నానుతుండేది. అదేమిటంటే - కృష్ణమ్మ పొంగి పొంగి కనకదుర్గమ్మ ముక్కుపుడక దాక పొంగి దుర్గమ్మ ముక్కుపుడకని తాకిన రోజు ప్రపంచమంతా జలప్రళయంలో మునిగి కలియుగం అంతమవు తుందని! ఈ కథా కమామీషు ఎలా ఉన్న కనకదుర్గమ్మ కృష్ణమ్మలు మాత్రంసొంత అక్కా చెల్లెళ్ళ వంటివారే! తరతరాలుగా కృష్ణమ్మ చుట్టిన ఇంద్రకీలాద్రిపై కొలువైన కనకదుర్గమ్మని దర్శించి తరిస్తున్న భక్తులకి ముఖ్యంగా కృష్ణానదిలో స్నానమాచరించి అనంతరందుర్గమ్మ దర్శనానికి వెళ్ళే భక్తులకి, తెలుగువారందరికీ కృష్ణమ్మ చుట్టూ లేని ఇంద్రకీలాద్రిని గాని కనకదుర్గమ్మ లేని ఇంద్రకీలాద్రిని గాని, కనకదుర్గమ్మ లేని బోసికొండని కృష్ణమ్మ మధ్యలోగాని ఊహించడం అశనిపాతం! కృష్ణమ్మ లాలనలు, దుర్గమ్మ దీవెనలు తెలుగువారికి వరాలు.

ఊహ తెలిశాక 'మహానది' సినిమాలోని శ్రీరంగ రంగనాథుని పాటలో వినిపించే

'నీల వేణిలో నీటి ముత్యాలు

**కృష్ణవేణిలో అలల గీతాలు**

**నీలవేణిలో నీటి ముత్యాలు నీరజాక్షునికి పూలుగా**

**కృష్ణవేణిలో అలల గీతాలు కృష్ణ గీతాలె పాడగా'**

ఈ వాక్యాలు శ్రావ్యంగా పాటలో అలా సాగిపోతుంటే వాటిని మళ్ళీ మళ్ళీ వినాలని పాటని ఎన్నోసార్లు రివైండ్ చేసేదాన్నో ! పాటనలా వింటూ కృష్ణమ్మ తల్లిని లేత నీలిరంగు చీర కట్టుకున్న, మోకాళ్ళ క్రిందకంటా పొడవున్న దట్టమైన వంకీ జుత్తుతో, పొడుగాటి నల్లని జడతో తెల్ల ముత్యాలాంటి మల్లెల్ని ఆ జడలో తురిమిన, ప్రసన్న చిరు దరహాసంతో ఉన్న కృష్ణమ్మ మానవీకరణ రూపాన్ని నా మనో నేత్రంలో చిత్రించుకునేదాన్ని!

కాలం - అల ఎవరికోసం ఆగవు అని ఆంగ్ల సామెత ! కదిలే కాలంతో బతుకు బండి సాగిపోతుంది. చదువులు చదివాక కృష్ణమ్మ చలవ దుర్గమ్మ దీవెన నాకు అఖిల భారత సేవలో ఉద్యోగం రావడం నేను తెలుగునేల వదిలి కర్మభూమి కర్నాటక రావడం జరిగిపోయాయి. కర్నాటకలో ఎవరికైనా నన్ను పరిచయం చేసుకోవలసినపుడు కృష్ణమ్మ గురించి విజయవాడ గురించి చెప్పగానే కొంతమంది వెంటనే కనకదుర్గమ్మ గురించి ప్రస్తావించడం నాకు ఆనందంగా ఉంటుంది. 2009లో తెలుగునేల వదిలిన నేను ఆర్నెల్లక్రితం 2015 సెప్టెంబరు నుండి 2015 డిసెంబర్ వరకు దీర్ఘకాలిక సెలవులో ఉన్నాను. ఆ సమయంలో ప్రకాశం బ్యారేజ్ మీదుగా విజయవాడలో పునఃప్రవేశం చేస్తున్నప్పుడు కృష్ణమ్మ దర్శనమవ్వగానే అప్రయత్నంగానే ఒక్కసారిగా ఆనందబాష్పాలతో చేతులు జోడించి నమస్కరించి కళ్ళు మూసుకుని కృష్ణమ్మని ధ్యానించి మనఃస్ఫూర్తిగా కృతజ్ఞతలు అర్పించుకున్నాను. ఆ అనుభూతి చాలాకాలం తరువాత పుట్టిల్లు చేరి అమ్మఒడిలో తలవాల్చిన అమ్మాయి మనసు సేదదీరిన అనుభూతి. కృష్ణమ్మతో నా హృదయాంతరాల్లో నాటుకుపోయిన అనుబంధపు లోతు అది.

ఈ సెలవుల్లో కృష్ణమ్మ తీరంలో ఎన్ని పర్యాటక ప్రదేశాలు చూడగలిగితే అన్ని చూడాలన్నది నా వ్యక్తిగత లక్ష్యాల్లో ఒకటిగా ఉంది. చివరికి నేను చూడగలిగింది కొన్నే అయినా చూసిన ప్రతి స్థలం పదిలంగా నా మదిలో మిగిలుంది. చిన్నప్పుడు కూచిపూడి కొంత కాలం నేర్చుకున్నందున స్వతః కూచిపూడి నాట్యంమీద మమకారం ఎక్కువ కావడంతోనూ కూచిపూడి గ్రామాన్ని దర్శించి అక్కడి కళాక్షేత్రాన్ని చూసి తరించాను. దురదృష్టవశాత్తు నేను అక్కడికి వెళ్ళిన సమయంలో రాష్ట్ర విభజన ఫలితంగా నాట్యశాస్త్ర తరగతులు నిలిచిపోయాయని తెలిసి చాలా బాధపడ్డాను. ఆ తరువాత నాట్యశాస్త్ర తరగతులు పునఃప్రారంభం అవ్వడం వార్తాపత్రికలలో చదివి ఊరట చెందాను. తెలుగు సాహిత్యంలో పదవి పత్రం (డిగ్రీ) పొందడంవల్ల అంతకుమించి తెలుగుభాష తియ్యందనానికి మదినర్పించి ఉండడం వల్లనూ కాసుల పురుషోత్తమ కవి సీసపద్యాల్లో శ్రీ మహావిష్ణువును సీయ పూజల నిర్లక్ష్యం గురించి హెచ్చరించి శతక రచన చేసి ఉద్ధరించిన శ్రీకాకుళాంధ్ర మహావిష్ణువాలయం దర్శించుకుని

ఆంధ్రభోజుని అలనాటి తెలుగు ఆదరణని ఆత్మీయంగా అంతరంగంలో నమస్కరించుచున్నాను. ఆ ఆలయాన్ని దర్శించిన ఆంధ్రభోజుడు 'ఆముక్తమాల్యద' ఆ స్థలంలోనే ప్రాసాదంటూ ప్రస్తుతం ఇక్కడ కనిపించే శ్రీకృష్ణదేవరాయల ప్రతిమని అభిమానపూర్వకంగా అవలోకించాను. బందరుగా పిలుచుకునే మచిలీపట్నంలో అద్దకం - కలంకారీ నైపుణ్యాన్ని చూసి గర్వించాను. చిలకలపూడి స్వయంభు పాండురంగ స్వామిని దర్శించి తరించాను. మోపిదేవిలో తపస్సులో లీనమైన సుబ్రహ్మణ్య స్వామిని దర్శించుకున్నాను. చివరికి కృష్ణమ్మ సంద్రంలో కలిసిపోయే పుణ్యస్థలం 'హంసలదీవి'నీ చూశాను. కృష్ణ నీళ్ళు సముద్రంలో కలిసిపోయే ఆ సంగమస్థానాన్ని చూస్తున్నప్పుడు సుమారు 1290 కి.మీ సుదూర ప్రయాణాన్ని ఎన్నో అడ్డంకుల్ని అధిగమిస్తూ ఎవర్నుంచీ ఏమీ ఆశించకుండా దారి పొడుగునా అందరికి ఆకలి, దప్పులు తీరుస్తూ అమ్మలా ఆదరిస్తూ అలసి సొలసి కృష్ణమ్మ తన అమ్మ ఒడిలోకి ఒదిగిపోతూ సేద తీరుతున్నట్లుగా, బతికినంతకాలం సర్వశక్తులూ ఒడ్డి లోకోద్ధరణ చేసిన జీవాత్మ పరమాత్మలో లీనమవు తున్న మోక్షఘట్టంగా భావించినది.

హంసలదీవి తీరంలో ఉన్న పీఠం మీది పాదాలు కృష్ణమ్మవని కొందరు సీతమ్మవని కొందరు నాకు పరిచయం చేశారు. ఆ పాదాలు ఏ అమ్మవైనా గాని పవిత్రస్థలంలో వున్నందున ప్రణమిల్లాను. అంతలో అనుకోకుండా సంధ్య సూర్యుడు పాదాల మధ్య చేరి కనిపించాడు, నా కెమెరా కన్నులోంచి కృష్ణమ్మ పాదాలకి శిరసాభివందనం చేస్తున్న పండు ముత్తయిదువ నుదిటి సింధూరంలాఉన్న ఆ దృశ్యాన్ని చటుక్కున్న క్లిక్ మనిపించాను. మరి కృష్ణమ్మ తీరపు పర్యాటకసౌందర్య గంధాల్ని పలుగురికి పంచాలిగా !

ఒంటరిగా పర్యాటక ప్రాంతాల్ని చుట్టేస్తున్న నన్ను చూసి కృష్ణమ్మ - దుర్గమ్మ మంతనాలు జరిపినట్లున్నారు. నాలుగు నెలల నా సెలవులు అయిపోయేలోగా నాకు పెళ్ళి కుదిర్చారు మరి కాబోయే శ్రీవారు కూడా మీ ఊళ్ళో నేను అంటూ వాట్సప్‌లో ఆయన కాలేజీ రోజుల్లో వారి స్వస్థలం శ్రీకాకుళం నుంచి విజయవాడ పర్యాటకానికి వచ్చినప్పుడు ప్రకాశం బ్యారేజి మీద దిగిన ఫోటో పంపించారు ! కృష్ణమ్మ ఆశీర్వాదం అడుగడుగునా వెంట ఉండటం అంటే ఇదేనేమో అనుకున్నా !

పెళ్ళైన తరువాత అమ్మ మొక్కు తీర్చడానికి అందరం విజయవాడ వచ్చాం. అప్పుడు మావారు అక్కడున్న ప్రతిరోజూ దుర్గమ్మ దర్శనానికి వెళ్ళి వచ్చేవారు. అయితే మొదటిరోజుఎంతో ఉత్సాహంగా కృష్ణానదిలో స్నానం చేసిన తర్వాత దుర్గమ్మ దర్శనానికి వెళ్ళిన ఆయన తరువాత రోజున మాత్రం కృష్ణమ్మ స్నాన - ఘాట్‌లోని కాలుష్యానికి భయపడి కృష్ణ-స్నానానికి వెళ్ళలేదు ! ఈ విషయాన్ని ఎంతో బాధగా నాతో పంచుకున్నారు. ఇక నా పరిస్థితి చెప్పనక్కరలేదు ! గుండె చెరువైపోయింది. నిజం నిప్పులాంటిది. వికిపీడియాలో 'Krishna River' అని కొడితే చూపించే వివరాల్లో కాలుష్యం గురించి రాస్తూ కృష్ణానదీ పరివాహక ప్రాంతాల్లో జనసంఖ్య బాగా పెరిగిపోవడం, అందువల్ల నదీ నీటి వినియోగం బాగా అధికమై పర్యావరణపరంగా సహజంగా సముద్రంలో కలవాల్సిన ప్రవాహం పరిమాణంలో కృష్ణానది సముద్రంలో గత కొన్ని ఏళ్ళుగా కలవలేకపోతుందని, ఇందువల్ల నదీ గర్భం నుంచి సముద్రంలోకి జరగాల్సిన ఉప్పు ఎగుమతి తగ్గిపోయింది. ఆ ఉప్పు నదీగర్భంలో నదీ తీరాలలో పేరుకుపోయి కృష్ణానది దిగువ బేసిన్ ప్రాంతాలలో ఉప్పు నేలలు ఏర్పడడానికి కారణం అవుతుందని విశ్లేషించారు. బసాల్ట్ రాతి నేలలపై ప్రవహించే కృష్ణానదిలో సహజంగానే ఆల్కలినిటి ఎక్కువగా ఉంటుంది. దీనికి తోడు బొగ్గు ఆధారిత విద్యుత్ ఉత్పత్తి కేంద్రాల వ్యర్థాలని కృష్ణానదిలో వదలడం వలన కృష్ణానది ఆల్కలినిటి మరింత అధికమై నదీ కాలుష్యం పెరిగిపోతుంది ! శుభమా అని పుష్కరాలు పండుగ చేసుకుంటుంటే ఆ కాలుష్యపు చిట్టా విప్పుతుందేంటి. మహాతల్లికి సమయం - సందర్భం బొత్తిగా పట్టదనుకుంటా అని బుగ్గలు నొక్కుకునేవాళ్ళు ఉండొచ్చుగాక ! కాని కృష్ణమ్మ మీద ఆదరం - ఆప్యాయత అణువణువునా నిండిన నాకు కృష్ణమ్మ ప్రస్తుత వాస్తవ చిత్రాన్ని ప్రతి ఒక్కరికి దర్పణదర్శనం చేసి తక్షణ కర్తవ్యాన్ని స్వయం వేద్యం చేయడం ఆ తల్లిపట్ల నాకున్న కనీస నైతిక బాధ్యత అనిపించింది.

మనసుంటే మార్గముంటుంది. ఆ మనో సంకల్పంతో చేయి చేయి కలిపితే కాలుష్యపు పొగ చూరని స్వచ్ఛ నిర్మల జల సౌందర్యాన్ని తరతరాలకి తరగని సంపదగా కృష్ణమ్మ చల్లని ఆశీస్సుల సుధాధారల్ని ముందు తరాలకి అందించగలుగుతాం. పుష్కలంగా ప్రవహించే శుద్ధ జలాలతో కృష్ణమ్మకి నిత్య పుష్కరశోభ సంతరించగలుగుతాం. కృష్ణమ్మ పాదాలకదే కృతజ్ఞతాభిషేకం ! కృష్ణమ్మ పాదాలకి కృతజ్ఞతాభిషేకం !

**చిరునామా :** *పల్లవి ఆకురాతి*, ఐ.ఏ.ఎస్., బెంగుళూరు

శ్రీ వంగర రంగభాస్కరరావు

# చేనేత రంగ ప్రగతి

దేశంలో వ్యవసాయం తర్వాత ఎక్కువమందికి పని కల్పిస్తున్నది చేనేత పరిశ్రమ. కుటీర పరిశ్రమలలో కెల్ల అతి ప్రాచీనమైనది చేనేత పరిశ్రమ. మనదేశంలో గల 45 లక్షల చేనేత మగ్గాలపై ప్రత్యక్షంగాను పరోక్షంగాను ఆధారపడి మూడున్నర కోట్లమంది బ్రతుకుతున్నారు. జాతిపిత మహాత్మాగాంధి, చరఖా తిప్పి స్వయంగా నూలువడికి, దానితోనే మగ్గంపై నేసిన కొల్లాయి కట్టి, కుటీర పరిశ్రమలు ముఖ్యంగా చేనేత పరిశ్రమ ప్రాధాన్యాన్ని చాటిచెప్పారు. దేశ ప్రజల అవసరాలకు సరిపడ చేనేత పరిశ్రమలో వస్త్ర ఉత్పత్తి జరగటంలేదని భావించిన స్వతంత్ర భారత ప్రభుత్వంవారు, భారీ పరిశ్రమలు స్థాపించేందుకు అనుమతి ఇచ్చారు. దాని ఫలితంగా దేశంలో భారీగా వస్త్ర మిల్లులు, మర మగ్గాలు ఏర్పాటుచేయబడి చేనేత పరిశ్రమకు అవి పోటీగా నిలిచాయి. స్వతంత్రం సిద్ధించిన తొలినాళ్లలో పాలకులు, భారీ పరిశ్రమల స్థాపన వల్ల గ్రామీణ హస్త కళాకారుల పొట్ట కొట్టకుండా చూస్తామని ఎన్నో వాగ్దానాలు చేశారు. రానురాను మిల్లులు మరమగ్గాల స్థాపనవల్ల చేనేత పరిశ్రమ వాటి పోటీని తట్టుకోలేని పరిస్థితి ఏర్పడింది. మిల్లులు మరమగ్గాలు దేశంలోని సంపన్న వర్గాలకు చెందిన పారిశ్రామికవేత్తల ఆధ్వర్యంలో పనిచేస్తున్నాయి. చేనేత పరిశ్రమ అనాదిగా పేదవర్గానికి చెందిన గ్రామీణుల చేతిలో వున్నది. తరతరాలుగా వస్తున్న పేద, ధనిక వర్గాల పోరులో చేనేత పరిశ్రమ నానాటికి కృంగదీస్తున్నది.

చేనేత పారిశ్రామికులు తమకు వంశపారంపర్యంగా సంక్రమించిన నైపుణ్యాన్ని ప్రదర్శించి వస్త్రాలు ఉత్పత్తి చేస్తున్నారు. కుటుంబం మొత్తం, ముసలి ముతక, పిల్లపాపలు, స్త్రీ పురుషులు అందరూ కలిసి పనిచేస్తేనే చేనేత మగ్గం ఆడేది, చేనేత పారిశ్రామికుడి కడుపు నిండేది. పారిశ్రామిక వర్గానికి చెందిన ప్రముఖులు వ్యాపారాభివృద్ధి కోసం, ధనార్జన కోసం మిల్లులు మరమగ్గాలుఏర్పాటుచేసి వస్త్ర రంగంలోఅతికొద్దిమందికి వృత్తి కల్పిస్తున్నారు. మారుతున్న అభి రుచులకు అనుగుణంగా చేనేత పారిశ్రామి కుడు తన సృజనాత్మక శక్తితో నూతనత్వం సాధిస్తూ చేనేత బట్టలు తయారు చేస్తున్నాడు. అయితే మిల్లులు మరమగ్గాల పోటీనుండి తట్టుకోవటం చేనేత పారిశ్రామికుని తాహతుకు మించిన కార్యంగా వున్నది.

ఈ పోటీని అధిగమించి చేనేత పరిశ్రమను, దానిపై ఆధారపడి బ్రతుకుతున్న అసంఘటిత చేనేత పారిశ్రామికులను ఆదుకునేందుకు భారత ప్రభుత్వంఅనేక కమిటీలు వేసింది. ఎన్నో శాసనాలుచేసింది. ఇవన్నీ ధనిక వర్గానికి చెందిన మిల్లు యజమానుల ప్రాబల్యం వల్ల అమలుకు నోచుకోవటం లేదు. దురదృష్టశాత్తు చేనేత పరిశ్రమకు కావలసిన ముఖ్యమైన ముడిపదార్థం నూలు కొరకు మిల్లులపై ఆధార పడవలసి వస్తున్నది. మిల్లులవారు తయారుచేసిన నూలుతో బట్టలు తయారుచేసి విడుదలచేస్తారు. వారి అవసరాలకు పోను మిగిలిన నూలు చేనేత పరిశ్రమకు సరఫరా చేస్తారు. మిల్లులో వాడే నూలు, చేనేత పరిశ్రమకు విడుదల చేసే నూలు ఒకటే అయినా, అదే నూలు చేనేత పారిశ్రామి కుడికిచేరటానికి అనేక చేతులు మారి వారి లాభాలుకలుపుకొని దాని ధర నూటికి 30 రూపాయలు అధికంగా వుంటుంది. అందువల్ల చేనేత బట్ట, మిల్లుబట్ట కన్న అధిక ధర వుంటుంది. అదే విధంగా మరమగ్గాలపై తయారైన బట్టకూడ చేనేత బట్టకన్న తక్కువ ధర వుంటుంది. కార్మికులకు వేతనాలు తక్కువ చెల్లించి, పన్నులు సక్రమంగా చెల్లించకపోయి నందు వల్ల మరమగ్గాల వస్త్రం తక్కువ ధరకు లభిస్తుంది. అందువల్ల మిల్లులు మరమగ్గాల పోటీకి చేనేత పరిశ్రమ తట్టుకొని నిలబడలేకపోతున్నది.

1950సం॥లో చేనేత పరిశ్రమ ఎదుర్కొంటున్నసమస్యలు ప్రభుత్వ దృష్టికి తీసుకువెళ్లేందుకు చేనేత పారిశ్రామికులు అవిభక్త మద్రాసు రాష్ట్రంలో మద్రాసు నగరంలో 75 రోజులపాటు సత్యాగ్రహం చేశారు. ప్రభుత్వ కార్యాలయాలలో ఘోరావ్‌లు నిర్వహించారు. రాస్తా రోకోలు చేశారు. వేలాదిమంది చేనేత పారిశ్రామికులను ప్రభుత్వం అరెస్టు చేసింది. జైళ్లకు పంపింది. నగర వీధులలో బిచ్చమెత్తుకుని జీవిస్తూ మొక్కవోని ధైర్యంతో చేనేత పారిశ్రామికులు సత్యాగ్రహం కొనసాగిం చారు. సత్యాగ్రహ తీవ్రత అప్పటి ప్రధానమంత్రి జవహర్ లాల్ నెహ్రూ

దృష్టిని ఆకర్షించింది. వెంటనే ఆయన పరిశ్రమల మంత్రి హరేకృష్ణ మెహతాబ్‌ను మద్రాసు పంపి చేనేత నాయకులతో సంప్రదింపులు జరిపించినారు. తత్ఫలితంగా చేనేతను ఒక పరిశ్రమగా గుర్తించటానికి, దానికి తగు రక్షణ కల్పించటానికి భారత ప్రభుత్వం అంగీకరించింది.

భారత ప్రభుత్వం ఆచార్య ఎన్.జి.రంగా నాయకత్వంలో, అఖిల భారత చేతివృత్తుల బోర్డు క్రింద చేనేత స్థాయీ సంఘాన్ని ఏర్పాటుచేసి చేనేత పరిశ్రమ రక్షణకు తగు సూచనలు ఇవ్వవలసిందిగా ఆ సంఘాన్ని కోరింది. ఈ కమిటీలో ప్రముఖ చేనేత నాయకులు ప్రగడ కోటయ్య గారిని ఆంధ్రదేశం తరపున సభ్యుడుగా నియమించారు. కమిటీ సభ్యులు దేశవ్యాప్తంగామిల్లులు, చేనేత పరిశ్రమప్రముఖుల అభిప్రాయా లను సేకరించి, అందుకు అనుగుణంగా చీరలు, ధోవతుల ఉత్పత్తిని చేనేత రంగానికి కేటాయించి, మిల్లుల పోటీనుంచి చేనేతను రక్షించాలని సూచనలు చేసింది. అప్పటి మద్రాసు శాసనసభ కూడా రంగు చీరలు, అంచు ధోవతులు ఉత్పత్తిని చేనేత రంగానికి ప్రత్యేకంగా కేటాయించా లని తీర్మానం చేసింది. భారత ప్రభుత్వం కొన్నిరకాల చీరలు ధోవతుల ఉత్పత్తిని, చేనేత రంగానికి కేటాయిస్తూ ఉత్తర్వులు జారీచేసింది. అయితే 1953-54 లో అప్పటి కేంద్ర పరిశ్రమల మంత్రి టి.టి.కృష్ణమా చారికి ఈ ఏర్పాటు రుచించలేదు. బడా పారిశ్రామికవేత్త అయిన కృష్ణమాచారి కనుంగో గారి అధ్యక్షతన మరో కమిటీని నియమించారు. ఆ కమిటీ సిఫార్సుల మేరకు నాలుగు అంతకు తక్కువగా వుండే మరమగ్గాల యూనిట్ కూడా చేనేతకు కేటాయించిన చీరలు, ధోవతులు తయారు చేసుకోవచ్చు. అని సవరణ ఉత్తర్వులు జారీ చేశారు. అప్పటినుండి మరమగ్గాలు చేనేతకు పోటీగా తయారై చేనేతకు కేటాయించిన వస్త్రాలను తయారుచేస్తున్నారు. ధనిక వర్గానికి చెందినవారు నాలుగేసి మరమగ్గాలు చొప్పున వందలాది మగ్గాలను వేర్వేరు షెడ్లలో ఏర్పాటు చేసి, వస్త్ర ఉత్పత్తిని చేస్తున్నారు. అలాంటి యూనిట్లకు పన్నురాయితీ, విద్యుత్‌శ్శక్తి రాయితీలు కల్పించారు. పేద ప్రజలు ఈ మరమగ్గాల మీద పనిచేస్తున్నారు. కార్మికులకు కల్పించే వసతులు, ప్రావిడెంటు ఫండు కనిష్ట వేతన చట్టం వారికి వర్తించకుండా నాలుగు మగ్గాలు ఒక యూనిట్‌గా ఏర్పాటుచేశారు. మరమగ్గం యజమానులు. అందు వల్ల కూలి తక్కువ యిస్తూ వారి కష్టాన్ని పారిశ్రామికవేత్తలు దోచుకుంటూ తక్కువ ధరకు వస్త్రాలు చేసి చేనేతకు పోటీగా నిలుస్తున్నారు. చేనేతకు కల్పించిన వసతులు మరమగ్గాలవారుఅనుభవిస్తూచేనేతను శాశ్వతంగా అణగద్రొక్కేందుకు ప్రయత్నం చేస్తున్నారు.

ఈ విషయాన్ని అప్పటి ప్లానింగ్ కమిషన్ ఉపాధ్యక్షుడు అశోక మెహతా ఆధ్వర్యంలో మరమగ్గాల విచారణ కమిటీ 1964లో ధృవీక రించింది. అయినా పేద చేనేత పారిశ్రామికునికి ఏ విధమైన సహాయం జరుగలేదు. చేనేతకు కేటాయించిన రకాల వస్త్రాలు మిల్లులు, మర మగ్గాలు తయారుచేయకుండా నియంత్రించగల యంత్రాంగం తమవద్ద లేదని ప్రభుత్వశాఖలు మిన్నకుంటున్నాయి. మిల్లులు మర మగ్గాలపై సరియైన అజమాయిషీ లేదు. చేనేత పరిశ్రమ అసంఘటిత పేద వర్గానికి చెందినది కనుక వారి మొర ఆలకించేవారు లేరు.

నూలు సరఫరా విషయంలో మిల్లు యజమానులు చేనేత పరిశ్రమకు ఏళ్ల తరబడి ఇబ్బందులు కలుగజేస్తున్నారు. మిల్లుల్లో ప్రత్తి వడికి నూలును రెండురకాలుగా తయారుచేస్తారు. కండెల రూపంలోను చిలపలరూపంలో తయారైన నూలుకు రంగులురసాయనాలు, అద్దకం చేసి చేనేత పరిశ్రమలో ఉపయోగిస్తారు. కండెల నూలు రంగు వేయటానికి అనుకూలంగా వుండదు. అందువల్ల చిలపల నూలు మాత్రమే ఉపయోగిస్తారు. అయితే మిల్లు యజమానులు చిలపల రూపంలో (Hanky am) తక్కువ తయారుచేసి, తమ అవసరాల నిమిత్తం కండెల రూపంలో (cone yarn) ఎక్కువ తయారుచేస్తూ చేనేత అవసరాలకు సరిపడా చిలపల నూలు సరఫరా చేయడం లేదు. ఈ విషయాన్ని అప్పటి కాంగ్రెస్ కార్యదర్శి హెచ్.యం. బహుగుణ, అఖిలభారత కాంగ్రెస్ కమిటీ దృష్టికి 1972లో తీసుకువచ్చారు. తర్వాత రెండేళ్లకు 1974లో చంద్రజిత్ యాదవ్ అధ్యక్షతన చేనేతకు నూలు సరఫరా చేసే విషయంలో వివిధ సమస్యలు పరిశీలించి సూచనలు యివ్వటం కోసం ఒక కమిటీని నియ మించారు. ఈ కమిటీ సూచనల మేరకు మిల్లులు తయారుచేసే నూలులో నూటికి 50 వంతులు చేనేత పరిశ్రమ ఉపయోగించే చిలపలనూలు తయారుచేయాలని భారతప్రభుత్వం ఉత్తర్వులు జారీచేసింది. అదికూడ సక్రమంగా అమలుకు నోచుకోలేదు. మిల్లు యజమానులు వారివారి రాష్ట్రాల హైకోర్టులలో కేసులు దాఖలు చేసి, కేంద్రప్రభుత్వపు ఉత్తర్వులు అమలుకాకుండా స్టే ఉత్తర్వులు పొందారు. ఆ విధంగా ప్రభుత్వ ఉత్తర్వులు చేనేత పరిశ్రమకు సహాయపడకుండా పోయాయి. ఉత్తర్వులు యివ్వటంతోనే ప్రభుత్వం బాధ్యత తీరిపోదు. అవి అమలు అయ్యేలా చూడటం కూడా ప్రభుత్వ విధి అని భావించిన పాలకులు కరువయ్యారు.

1974లో కేంద్రప్రభుత్వం బి.శివరామన్ ఆధ్వర్యంలో చేనేత పరిశ్రమ ఎదుర్కొంటున్న సమస్యలను అధ్యయనం చేయటానికి ఒక ఉన్నతస్థాయి సంఘాన్ని నియమించింది. ఈ కమిటీ తన నివేదికలో ఈక్రింది సూచనలు చేసింది. “మరమగ్గాలను చేనేత మగ్గాలుగా పరిగణించరాదు. ఒక్కొక్క మరమగ్గం స్థాపన వల్ల 25 మంది చేనేత పారిశ్రామికులు ఉపాధి కోల్పోతారు. చేనేత రంగానికి కల్పించిన రాయితీలుమరమగ్గాలకు ఇవ్వరాదు. మరమగ్గాలను కూడా మిల్లులోని మగ్గాలుగానే పరిగణించి, వాటిపై కూడా మిల్లు మగ్గాలలాగానే పన్ను

విధించాలి. మరమగ్గాల కార్మికులకు కూడ మిల్లు కార్మికులవలె వసతులు కలుగచేయాలి" దురదృష్టవశాత్తు ఈ సూచనలు కూడా అమలుకు నోచుకోలేదు.

తమిళనాడు ప్రభుత్వం 1975లో చేనేత స్థితిగతులు పరిశీలించ టానికి "సంతానం" కమిటీని నియమించింది. అదేవిధంగా 1976లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 'శాస్త్రి' కమిటీని నియమించింది. ఆయా కమిటీల సూచనల మేరకు భారత ప్రభుత్వం 1978లో పార్లమెంటులో "జౌళి, జౌళి వస్తువులపై అదనపు ఎక్సయిజ్ డ్యూటీ విధింపు చట్టం 1978" అనే పేరుతో ఒక చట్టం తీసుకురావాలని బిల్లు ప్రవేశపెట్టింది. దాని నిబంధనల క్రింద మిల్లులలో తయారయ్యే అన్నిరకాల నూలు బట్టలపైఅదనపు సుంకం విధించి,ఆ విధంగా వచ్చే ఆదాయం మొత్తాన్ని, చేనేత పరిశ్రమ చేనేత పారిశ్రామికుల రక్షణ కోసం ఉపయోగించాలని ఉద్దేశించింది. ఈ బిల్లుపై జరిగిన చర్చలో ప్రసంగిస్తూ ఆచార్యరంగా 'ఈ చట్టం ద్వారా ప్రభుత్వానికి వచ్చే ఆదాయాన్ని ప్రభుత్వం తన బడ్జెటులోటు పూడ్చుకోవటానికి ఉపయోగించుకోరాదని" కోరారు. అప్పటి కేంద్ర ఆర్థికమంత్రి హెచ్.యమ్.పటేల్ ఈ సూచనను అంగీ కరిస్తూ ఈక్రింది ప్రకటన చేశారు. "ఈ చట్టం క్రింద వసూలు అయ్యే మొత్తాన్ని ఒక నిధిగా ప్రత్యేక ఎకౌంటులో వుంచి, ఆ మొత్తాన్ని చేనేత పరిశ్రమ అభివృద్ధి కొరకు ఖర్చుచేస్తాం" అని పార్లమెంటులో స్పష్టమైన ప్రకటన చేశారు. ఆచరణలో మాత్రం ఈ హామీ హామీగానే మిగిలి పోయింది. 1993-94 సం॥లో ఈ చట్టంక్రింద రు. 555/- కోట్లు వసూలు కాగా, కేవలం రు. 95/- కోట్లు మాత్రమే చేనేత పరిశ్రమ అభివృద్ధికి ఖర్చుచేయటం జరిగింది. ప్రభుత్వ హామీ గాలికి ఎగిరిపోయింది.

చేనేత పరిశ్రమను ఉద్ధరించేందుకు ప్రభుత్వాలు అనేక కమిటీలు వేస్తున్నాయి. కాని ఆ కమిటీలు చేసే సిఫార్సులను చిత్తశుద్ధితో ఆమోదించి అమలు చేయకపోవటం వల్ల అవి కేవలం ఫార్సుగానే మిగిలిపోతున్నాయి. 1985 జూన్‌లో కేంద్రప్రభుత్వం వివిధ కమిటీల సిఫార్సుల మేరకు కేంద్ర జౌళి విధానం(Textile policy)ని ప్రకటించింది. దాని ప్రకారం 1. చేనేత రంగానికి సహాయపడేందుకు చేనేత పారిశ్రామి కులకు అందుబాటుధరలో చాలినంత నూలు సరఫరా చేయాలి. 2. మరమగ్గాలపై పన్ను విధించి ఆ విధంగా వచ్చిన సొమ్ముతో చేనేత పరిశ్రమను అభివృద్ధిపరచాలి. 3. చేనేతరంగానికి కొన్నిరకాల బట్టల ఉత్పత్తి ప్రత్యేకించాలి. (Reservation of certain varieties of cloth). ఈ మూడు స్వాగతించదగిన విషయాలే. కాని మరమగ్గాలు, నూలు మిల్లు యజమానుల బలమైన లాబీయింగ్ వల్ల నూలు సరఫరా విషయంలోను,మరమగ్గాలపై పన్ను విధించే విషయంలోను ప్రభుత్వం ఏ విధమైన చెప్పుకోదగిన చర్యలు తీసుకోలేదు. చేనేత రంగానికి చీరలు,ధోవతులు వగైరా 22 రకాల బట్టల ఉత్పత్తిని ప్రత్యేకిస్తూ 1985లో ఒక చట్టాన్ని భారత ప్రభుత్వం ప్రకటించింది. అయితే మిల్లు, మరమగ్గాల యజమానులు ఈ Reservation చట్టాన్ని సుప్రీంకోర్టులో సవాలు చేస్తూ రిట్‌పిటిషన్ దాఖలు చేశారు. సుప్రీంకోర్టువారు స్టే మంజూరుచేశారు. 1993 వరకు ఈ స్టే ఉత్తర్వులు కొనసాగాయి. వివిధ ప్రభుత్వాలు, బలహీనులైన చేనేత పారిశ్రామికులు సుప్రీం కోర్టులో ఈ విషయమై తమ వాదనను సమర్థంగా వినిపించలేదు. ఎట్టకేలకు1993లో నాటి ప్రధాని పి.వి. నరసింహారావుగారు తీసుకున్న ప్రత్యేక శ్రద్ధ కారణంగా ఈ రిట్‌పై విచారణ జరిగింది. స్టే తొలగించారు సుప్రీంకోర్టువారు. కొన్నిరకాల బట్టల ఉత్పత్తిని చేనేతరంగానికి కేటాయి ంచటానికి ప్రభుత్వానికి హక్కు వున్నదని, అలా చేయటం చట్ట సమ్మతమేనని సుప్రీంకోర్టువారు చారిత్రాత్మక తీర్పు ఇచ్చారు. దురదృ ష్టవశాత్తు కొన్ని రాష్ట్రప్రభుత్వాలు ఈ తీర్పును చిత్తశుద్ధితో అమలు చేయలేదు. మిల్లులు మరమగ్గాలవారు కట్‌పీసెస్ పేరుతో చీరలు తయారుచేసి మార్కెట్‌లోకి విడుదలచేశారు. తద్వారా వారు పన్ను ఎగవేతకు పాల్పడటమే కాకుండా చేనేత వస్త్రాలకు తీవ్ర పోటీగా నిలచారు. చేనేతవారు తయారుచేసే డిజైన్‌లు, రంగుచీరలను వివిధ మార్పులతో మిల్లువారు తయారుచేస్తున్నారు. పోచంపల్లి రకాలకు వెంకటగిరి అంచులు, గద్వాల రకాల చీరలకు పోచంపల్లి డిజైనులు, వెంకటగిరి రకం చీరలకు గద్వాలరకం రంగులు, డిజైన్‌లు వేసి కలగాపులగంగా చీరలు తయారుచేసి విడుదల చేస్తున్నారు. చేనేత చీరలమీద వున్న మమకారంతో మహిళాలోకం మిల్లు చీరలను చేనేత చీరలుగానే భావించి కొనుగోలు చేస్తున్నారు. మిల్లుల్లోను, మరమగ్గాల మీద ఈ రకాల చీరలు ఉత్పత్తి చేయకుండా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అడ్డుకోలేకపోతున్నాయి. వారిని అదుపుచేసే యంత్రాంగం తమవద్ద లేదని రాష్ట్రప్రభుత్వాలు కుంటిసాకులు చెపుతున్నాయి. ఈ రకమైన పోటీ తట్టుకోలేక చేనేత పారిశ్రామికులు నిరుద్యోగులు అవుతున్నారు.

సంవత్సరం పొడవునా చేతినిండా పని దొరకక చేనేత పారిశ్రామి కులు ఆకలి చావుల పాలవుతున్నారు. ఆత్మహత్యలకు పాల్పడు తున్నారు. గుంటూరు జిల్లాలోని భట్టిప్రోలు, రేపల్లె, మంగళగిరి, ప్రకాశం జిల్లాలోని చీరాల, పేరాల, ఈపూరుపాలెం, కృష్ణాజిల్లాలో పెడన, పోలవరం, చల్లపల్లి ప్రాంతాలలో చేనేత పారిశ్రామికులు ఎక్కువగా వున్నారు. వారికి చేతినిండా పనిలేక ఇటీవలికాలంలో ఈ ప్రాంతాలలో దాదాపు 600 మంది చేనేత పారిశ్రామికులు ఆకలి చావులకు గురయ్యారు. ప్రత్తి రైతులు, మిర్చిరైతులు ఆత్మహత్యల పాలయితే ప్రభుత్వం సహాయమందిస్తోంది. కాని చేనేత పారిశ్రామికులు ఆకలి చావులకు ఆత్మహత్యలకు గురయితే సహాయం చేయటానికి ప్రభుత్వం ముందుకు రావటంలేదు. అసంఘటిత కార్మిక వర్గంకు చెందిన చేనేత

పారిశ్రామికుల యెడల ప్రభుత్వం చూపుతున్న సవతి తల్లి ప్రేమకు ఇది ఒక ఉదాహరణ మాత్రమే.

వేర్వేరు చట్టాలలో గల లొసుగులను అడ్డుపెట్టుకుని మిల్లులు, మరమగ్గాల యజమానులు పన్నులు ఎగవేస్తూ చేనేతకు హాని కలుగజేస్తు న్నారు. పలురకాల ప్రాసెస్‌లు ఒక ప్రదేశంలో చేస్తే ఎక్సయిజ్ డ్యూటీ చెల్లించాల్సి వుంటుంది. వస్త్ర ఉత్పత్తిలో నేత ఒక విభాగం, రంగులు వేయటం ఒక విభాగం, బ్లీచింగ్ చేయటం ఒక విభాగం, గంజిపెట్టి నునుపు చేయటం మరో విభాగం, ఈ విభాగాలన్నింటిలోను ముస్తాబు చేస్తే తప్ప తయారైన వస్త్రం మార్కెటులో విడుదల కాదు. ఒకేయజమాని క్రింద పనిచేసే ఈ విభాగాలన్నీ ఒకచోట వుండి. నేసిన బట్ట ఆయా విభాగాలలో ప్రాసెస్ అయితే ఆ బట్టపై ఎక్సయిజ్ డ్యూటీ చెల్లించాలి. ఈ డ్యూటీ చెల్లించకుండా వుండేందుకుగానుమరమగ్గాల యజమానులు ఈ విభాగాలనుఒకే గ్రామంలో వేర్వేరు ఇళ్లలో నెలకొల్పి ఒక్కో విభాగం ఒక్కోచోట వున్నట్లు చూపించి, ఎక్కడ ఎక్సయిజ్ డ్యూటీ చెల్లించవలసిన అవసరం లేకుండా చూసుకుంటున్నారు. తద్వారా ప్రభుత్వానికి రావలసిన ఆదాయానికి గండి కొడుతున్నారు. దేశంలో ఈ రోడ్డు, ఇచ్చుల్‌కరంజి, భివాండి, బలోత్రా, సూరత్ వగైరా నగరాల లోను, మన రాష్ట్రంలోని కరీంనగర్, సిరిసిల్లలోను మరమగ్గాల యూనిట్‌లు ఈ ప్రాసెసింగ్ చేస్తున్నాయి. మరో అంశం వుంది. విద్యుశ్చక్తి వాడని ప్రాసెస్ యూనిట్‌లకు ఎక్సయిజ్ డ్యూటీ చెల్లించవలసిన అవసరం లేదు. ఆ కారణంగా మరమగ్గాల వారు తక్కువ కెపాసిటీ గల చిన్న చిన్న యూనిట్‌లు పెట్టి విద్యుత్ వాడకం లేకుండా పేద కార్మికులచేత ఈ పనులు చేయించి, తమ కర్మాగారాలకు విద్యుత్ లేదని చెప్పి ఆ విధంగా కూడా పన్ను ఎగవేస్తున్నారు.

చేనేత పరిశ్రమకు సరసమైన నూలు సరఫరా చేసేఉద్దేశంతోచేనేత పారిశ్రామికుల సహకారసంఘాలవారు సహకారరంగంలో స్పిన్నింగ్ స్థాపించుకున్నారు. దేశంలోనే ప్రప్రథమంగా అనంతపురం జిల్లా గుంతకల్లులోను, ప్రకాశంజిల్లా చీరాలలోను సహకార నూలు మిల్లులు స్థాపించటానికి అప్పటి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూతో ఈ మిల్లులకు శంకుస్థాపన చేయించి మిల్లుల నిర్మాణం చేశారు. వాటి నిర్మాణానికి ప్రగడ కోటయ్య, మాసాని సోమప్ప అవిరళ కృషిచేసి నూలు ఉత్పత్తి చేసి చేనేతకు సరఫరా చేశారు. తర్వాత నెల్లూరు, రాజమండ్రి, కరీం నగర్, అదిలాబాద్, సత్తెనపల్లి, వగైరా ప్రదేశాలలో మొత్తం 11 సహకార నూలు మిల్లులు స్థాపించారు. ఈ మిల్లుల మేనేజింగ్ డైరెక్టర్ లుగా ముందు ముందు ఐ.ఏ.ఎస్ ఆఫీసర్‌లను సహకారశాఖ లోని వున్నతోద్యోగులను నియమించారు. తర్వాత ఇతర డిపార్టుమెంట్‌ల నుండి పలుకుబడిగల ఉద్యోగులను డిప్యుటేషన్ మీద మేనేజింగ్ డైరెక్టర్‌లుగా నియమించారు. సహకార రంగంలోను, మిల్లు నిర్వహణ లోను వారికి సరియైన అవగాహన అనుభవం లేక సక్రమంగా మిల్లులను నడిపించలేని కారణంగా నూలు మిల్లులు క్రమంగా నష్టాల ఊబిలో కూరుకుపోయాయి. ఈ మిల్లుల నిర్మాణంలో చేనేత పారిశ్రామి కుల పెట్టుబడి అపారంగా వున్నా నిర్వహణలో వారికి భాగస్వామ్యం లేని కారణంగా ఈ మిల్లులు మూతపడిపోయాయి. ప్రభుత్వం వారి అనుయాయులు,పలుకుబడిగల వ్యక్తులు ఈ మిల్లుల నిర్వహణ చేపట్టి వాటి మూసివేతకు కారణమయ్యారు. ఈ మిల్లుల మూతవల్ల చేనేత పారిశ్రామికులకు చెప్పనలవికాని అన్యాయం జరిగింది. నూలు సరఫరా కొరకై చేనేత పారిశ్రామికులు ఎప్పటిలాగానే మిల్లులపై ఆధారపడ వలసివచ్చింది.

1988 సం॥లో దేశ జౌళి విధానంపై సమీక్ష చేసి, తగు సూచనలు ఇవ్వవలసిందిగా ఒక కమిటీని నియమించారు కేంద్రప్రభుత్వం వారు. ఈ కమిటీకి జౌళిశాఖలో రిటైరయిన అధికారి ఎస్.ఆర్.సత్యం అనే వ్యక్తిని అధ్యక్షుడుగా నియమించారు. కొందరు ప్రభుత్వ అధికారులను, టెక్స్‌టైల్ కమిషనర్‌ను, ఒక పత్రికా ఎడిటర్‌ను, నూలు మిల్లుల ప్రతినిధులు ఇద్దరిని ఈ కమిటీలో సభ్యులుగా నియమించారు. జౌళి పరిశ్రమలో ముఖ్య భాగమైన చేనేతరంగంనుండి ఎవరినీ ఈ కమిటీలో సభ్యులుగా నియమించలేదు. ఈ కమిటీ పలు రాష్ట్రాలలో పర్యటించి, వివిధ మిల్లులు, చేనేత కేంద్రాలను సందర్శించి ఒక నివేదిక తయారు చేసి ప్రభుత్వానికి సమర్పించారు. ఇది ప్రభుత్వం ఆమోదించినట్లు ప్రకటించారు. నిజంగా ఈ కమిటీ సూచనలు సలహాలు పూర్తిగా అమలుచేస్తే అది చేనేతకు శాశ్వతంగా సమాధి కట్టినట్లే అవుతుంది.

ఈ కమిటీ చేసిన సిఫార్సులలో ముఖ్యమైనవి 1. మిల్లులు తయారు చేసే నూలు చేనేత పరిశ్రమలో వాడే చిలపల రూపంలో తయారు చేయవలసిన అవసరం లేదు. కండెల రూపంలో తయారుచేస్తే చేనేత పారిశ్రామికులు, చేనేత సహకార సంఘాలవారు తమకు కావలసిన విధంగా చిలపల రూపంలో వారే తయారుచేసుకోవచ్చు. 2. చేనేతకు ప్రత్యేకంగా కేటాయించిన 22 రకాల వస్త్రాల ఉత్పత్తి ఉత్తర్వులను రద్దుచేయాలి. దాదాపు 50 సంవత్సరాల సుదీర్ఘ పోరాటం తర్వాత చేనేత పారిశ్రామికులు సాధించుకున్న విజయాలలో చేనేతకు 22 రకాల వస్త్రాల రిజర్వేషన్ ప్రముఖమైనది. అదేవిధంగా మిల్లులు తయారుచేసే నూలులో 50 శాతం చిలపల రూపంలో తయారు చేయటం కూడా ముఖ్యమైనది. ఈ రెండే చేనేతకు ప్రభుత్వం చేసిన ప్రోత్సాహక నిర్ణయాలు. కాని సత్యం కమిటీ ఈ రెండు వసతులు రద్దుచేయవల సిందిగా సిఫార్సు చేయటం అర్థరహితం, అవివేకం. చేనేత పారిశ్రామి కులు సాగించిన పోరాటం వల్ల భారత ప్రభుత్వం ఈ సిఫార్సుల అమలు నిలుపుదల చేసింది.

ఏ పరిశ్రమ అయినా మనుగడ సాగించాలంటే దానికి ఏడు ముఖ్యమైన అంగాలు అవసరం. వీటిని 7 ఎమ్.ఎస్. అనవచ్చు. 1. మెటీరియల్ 2. మేనేజ్‌మెంట్ 3. మిషనరీ 4. మెయిన్‌టినెన్స్ 5. మనీ 6. మెన్ 7. మార్కెటింగ్. ఇందులో మెటీరియల్ (నూలు), మనీ (పెట్టుబడి) మార్కెటింగ్ వస్త్రాల విడుదల చేనేత పరిశ్రమ మనుగడకు చాలా ముఖ్యమైనవి. ఇవే చేనేతకు కరువు. మిగిలిన అన్ని అంగాలు చేనేతకు పుష్కలంగా వున్నాయి. వారి మెషినరీ మగ్గం దానిని కుటుంబసభ్యులందరూ కలిసి మెయిన్‌టెయిన్ చేస్తారు. వారే మానేజ్ చేస్తారు. మాన్ పవర్ కుటుంబసభ్యులే.

చాలా ముఖ్యమైన అంశాలయిన నూలు (మెటీరియల్) కొరకు కటకట. అధవా దొరికినా అధికధర చెల్లించాలి. సబ్బు బిళ్లలపైన, పౌడర్ డబ్బాలపైన ముద్రించే విధంగా నూలు పెట్టెల మీద ఎమ్.ఆర్.పి. ముద్రించరు. అందువల్ల నూలు వ్యాపారులు వారి ఇష్టానుసారం అధిక ధరకు విక్రయిస్తున్నారు. అందువల్ల నూలు పెట్టెలమీద కూడ ఎమ్.ఆర్.పి. ముద్రించవలసిందిగా చేనేత పారిశ్రామికులు కోరు తున్నారు. పెట్టుబడి (మనీ) కొరకు చేనేత పారిశ్రామికుడు నిత్యం వెతుక్కోవల సిందే, కారణం అతడు నిరుపేద. సహకార బ్యాంకులు కూడా చేనేతపై సవతి తల్లి ప్రేమనే ప్రదర్శిస్తున్నాయి. రైతులకు ఇచ్చే అప్పులపై వసూలు చేసే వడ్డీ కన్నా రెండు శాతం అధికంగా వడ్డీని చేనేత పారిశ్రామిక సహకార సంఘాలనుండి వసూలుచేస్తున్నారు. ఇదేమని అడిగితే అవి రైతుల కోసం ఏర్పాటుచేయబడిన బ్యాంకులని సమాధానం చెపుతారు. అందువల్ల చేనేతవారికి సహాయపడేందుకు ప్రత్యేక చేనేత ఆర్థికసహాయ బ్యాంకును ఏర్పాటుచేయవలసిందిగా చేనేత పారిశ్రామికులు కోరుకుం టున్నారు. ఇక నేసిన బట్ట విడుదలకు మార్కెటింగ్ సౌకర్యాలు చాలా స్వల్పం. ప్రభుత్వం నిర్దేశించిన మార్గదర్శక సూత్రాలు పాటించి ప్రభుత్వ శాఖలకు కావలసిన వస్త్రాలు చేనేతరంగం నుండి కొనాలి. కాని వారు చేనేత బట్టలు కాకుండా మిల్లుబట్టలను వాడుచున్నారు. ప్రభుత్వం, ప్రభుత్వరంగ సంస్థలు వాడే వస్త్రం యావత్తు చేనేత రంగంనుండి కొనాలని ప్రభుత్వాలు పదేపదే ఆదేశించినా రైల్వేలు, విమానాలు, ప్రభుత్వ హోటల్స్‌వారు చేనేత వస్త్రాల వినియోగంతక్కువగా చేస్తున్నారు. మన రాష్ట్రంలోని తిరుపతి తిరుమల దేవస్థానం వారు ఇటీవల చేనేత వస్త్రాలు కొనేందుకు నిరాకరించినట్లు వార్తలొచ్చాయి. ప్రభుత్వంవారు చేనేత వస్త్రం అన్ని శాఖలలోను వాడేందుకు శ్రద్ధ వహించాలి.

ప్రతి సంవత్సరం కేంద్రం చేనేత సంఘం (ఆప్కో) వద్ద ప్రాథమిక చేనేత సహకార సంఘాల వద్ద హెచ్చుగా చేనేత వస్త్రాల స్టాకు నిలిచిపోతున్నది. అందువల్ల చేనేత పారిశ్రామికుడికి సంవత్సరం పొడవునా చేతినిండా పనిదొరకటంలేదు. ఆ కారణంగా ఆకలి చావులు, ఆత్మహత్యలు చేనేత పారిశ్రామికులలో చోటుచేసుకుంటున్నాయి.

కడుపునొప్పి రావటానికి అనేక కారణాలు ఉంటాయి. పేదవాడికి ఆకలి వేస్తే కడుపునొప్పి వస్తుంది. అతడికి కడుపునిండా తిండిపెడితే ఆ నొప్పితగ్గిపోతుంది. కాని మందులు వేస్తేను, ఆపరేషన్ చేస్తేను ఆ నొప్పి తగ్గదు. అదేవిధంగా చేనేత పారిశ్రామికుడికి చేతినిండా పని చూపిస్తే అతడు తనకు కావలసిన వేతనంసంపాదించుకొని సుఖజీవనం చేయగలడు. వివిధరకాల పథకాలు వేసి, ప్రణాళికలు తయారుచేసి ప్రభుత్వం నిధులు ఖర్చుచేస్తేగాని చేనేత పారిశ్రామికుడి ఆకలి తీరదు.

స్వతంత్ర భారతదేశంలో గత 60 సంవత్సరాలుగా చేనేత పారిశ్రామికులు ప్రగడ కోటయ్య, పెండెం వెంకట్రాములు, అక్కల కోటయ్య, కొండా లక్ష్మణ్ బాపూజీ, మాసాని సోమప్ప వంటి మహామహుల నాయకత్వంలో వివిధ పోరాటాలు సాగించి చేనేత పారిశ్రామికుడి స్థితిగతులు బాగుపరచటానికి కృషిచేశారు. ప్రభుత్వాలు వస్తున్నాయి, పోతున్నాయి. వివిధ పార్టీలు దేశాన్ని పాలించారు, పాలిస్తున్నారు. కాని చేనేత పరిశ్రమకు శాశ్వత రక్షణ కలుగజేసి చేనేత పారిశ్రామికుడి జీవనయాత్ర సాఫీగా సాగేందుకు తగిన ప్రణాళికలు తయారుచేయ టానికి ఎవరూ నడుం బిగించటం లేదు. ఆ రోజు ఎప్పుడు వస్తుందా అని 45 లక్షల చేనేత మగ్గాలపై ఆధారపడి బ్రతుకుతున్న మూడున్నర కోట్ల మంది ఆశతో ఎదురుచూస్తున్నారు.

**చిరునామా :** **శ్రీ వంగర రంగభాస్కరరావు,** జి.ఎఫ్ -1, రామ రెసిడెన్సీ, సిద్ధార్థ నగర్, విజయవాడ - 520 010.
ఫోన్ : 0866 - 2488977, సెల్ : 98854 46748.

శ్రీ పరకాల పట్టాభిరామారావు

# కృష్ణాతీరంలో సాంఘిక సంస్కరణోద్యమాలు

తెలుగునాట సాంఘిక సంస్కరణోద్యమ మూల పురుషుడు, నవయుగాంధ్ర వైతాళికుడు కందుకూరి వీరేశలింగంగారు తన అవసాన దశలో ఆంధ్ర మహాజనులకు 'కట్టకడపటి విజ్ఞప్తి' ఇలా చేశారు.

రాజ్యాంగ స్వాతంత్ర్య సమరోత్సాహం చేత సంఘ సంస్కరణ ప్రయత్నమును ఉపేక్షించకుండవలయునని మనవారిని వినయ పూర్వకముగా వేడుకొనుచున్నాను. ఓ విద్యార్థికులారా! మన సంఘ స్థితి బాగుపడిన కాని ప్రభుత్వము వారనుగ్రహించెడి రాజ్యాంగ స్వాతంత్ర్య ఫలములను మనము నిర్విచారముగా అనుభవింపజాలము. ఈ సత్యమును మీరు మనస్సునందుంచుకొని సంఘ సంస్కరణో ద్యమమునందు కూడా సమాన శ్రద్ధను వహించి పనిచేయుడు. స్వీయ చరిత్రము - రెండవ భాగము వీరేశలింగంగారు 1919లో మరణిం చారు. 6 దశాబ్దాలు గడిచాయి. ఆయన చేసిన హెచ్చరికను ఆంధ్ర మహాజనులు ఎంతవరకు పాటించారు అని వెనుదిరిగి చూసుకుంటే "స్వాతంత్ర్య సమరోత్సాహం"లో సంఘ సంస్కరణోద్యమాన్ని ఉపేక్షిం చారని చెప్పక తప్పదు. సంఘపరిస్థితి బాగుపడినదే కాని రాజ్యాంగ స్వాతంత్ర్య ఫలితాలను సరిగా అనుభవించలేదని ఆయన చేసిన హెచ్చరిక నూటికి నూరుపాళ్లు నిజమనీ, నేటికీ వర్తిస్తుందని అనుభవం చెబుతూంది.

### వీరేశలింగం యుగంలో....

తన కాలంనాటి సాంఘిక దురాచారాలన్నింటినీ కందుకూరి వీరేశ లింగం ఎదుర్కొని పోరాడారు.అతి బాల్యవివాహాలు, నిర్బంధ వైధవ్యం, స్త్రీల అవిద్య, వేశ్యావృత్తి, వివిధరకాలైన మూఢనమ్మకాలు మతమౌఢ్యం, అవినీతి, లంచగొండితనం, అంటరానితనం మొదలైన సాంఘిక రుగ్మతల న్నింటినీ ఎదుర్కొని పోరాడారు. ఫ్యూడల్ సాంఘిక, సాంస్కృతిక, సాహిత్య రంగాలలో గొప్ప విప్లవం తీసుకొని వచ్చారు. మహాకవి గురజాడ, గిడుగు రామమూర్తి, కొమర్రాజు లక్ష్మణరావు ప్రభృతులు ఈ వీరేశలింగం ప్రారంభించిన సాంఘిక, సాహిత్య సంస్కరణోద్యమాలను ముందుకు తీసుకుపోయారు. రఘుపతి వెంకట రత్నం నాయుడుగారు వేశ్యావృత్తికి వ్యతిరేకంగా సుదీర్ఘపోరాటం సాగించారు.

ఈ సాంఘిక, సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమాలు ఇలా కొనసాగు తూండగానే 1905 వందేమాతరం ఉద్యమంతో ఆంధ్ర దేశంలో జాతీయ స్వాతంత్ర్యోదమం ప్రారంభమైంది.

### జాతీయోద్యమ ప్రభావంలో సాంఘిక మార్పులు

గాంధీజీ నాయకత్వాన 1919-22 సహాయనిరాకరణోద్యమం 1930-32 ఉప్పుసత్యాగ్రహోద్యమం ఆంధ్రదేశంలో బ్రహ్మాండమైన రాజకీయచైతన్యాన్ని రగుల్కొలిపాయి. ఈ జాతీయోద్యమ సంరంభంలో ప్రత్యక్షంగా సాంఘిక సంస్కరణోద్యమాలు ప్రభవించక పోయినా, పరోక్ష ఫలితాలుగా అనేక సాంఘిక మార్పులు సంభవించాయి. వీరేశలిం గంగారు ఆంధ్ర స్త్రీలలో కల్గించిన సాంఘిక చైతన్యం ఫలితంగానే 1919-22 సహాయ నిరాకరణోద్యమంలోను 1930-32 ఉప్పు సత్యాగ్రహం లోను అనేకమంది స్త్రీలు మొదటి సారిగా యింటి గడప దాటి అనేక సాంఘిక కట్టుబాట్లను త్రెంచుకొని జైళ్లకు వెళ్ళారు. కల్లు అంగళ్లవద్ద పికెటింగ్‌లలో పాల్గొన్నారు. విదేశీ వస్త్ర బహిష్కరణలో పాల్గొన్నారు. వీరేశలింగంగారు ప్రారంభించిన వితంతు పునర్వివాహాలు జరిగాయి. కులాంతర వివాహాలు కూడా జరిగాయి. గాంధీజీ ఆంధ్రదేశ పర్యటనలో వితంతు పునర్వివాహాలను ప్రోత్సహించారు. 1929లో పశ్చిమ గోదావరి జిల్లా పెదపాడులో ఒక 18 సంవత్సరాల వితంతు యువతి యల మంచిలి సత్యవతి తనవంటి మీద వున్న 100 కాసుల నగలను గాంధీజీ చేతులలో పోసి ఒక చీటిని కూడా అందులో వుంచింది. ఆ చీటిలో నన్నుమీ ఆశ్రమానికి తీసుకొనిపొండి. నేను దేశసేవ చేస్తానుఅని ఉంది. గాంధీజీ ఆమె తల్లిదండ్రులను పిలిచి వెంటనే పునర్వివాహం చేయ వలసిందని చెప్పారు. ఆ తరువాత ఆంధ్రదేశంలో అనేకసభలలో యలమంచిలి సత్యవతి ఉదంతం చెప్పారు. కాని పురాతన కట్టు బాట్లను ఎదిరించలేని తల్లిదండ్రులు ఆమెకు పునర్వివాహం చేయలేదు. ఒక ఏడాది క్రితమే వృద్ధకన్యగా యలమంచిలి సత్యవతి మృతి చెందింది.

రాజకీయ సభలతో బాటు సాంఘిక సంస్కరణల సభలు జరిపే తొలి నాటి సంప్రదాయాన్ని జాతీయ కాంగ్రెస్ అలక్ష్యం చేసిందనే చెప్పాలి.

## వీరేశలింగం వారసత్వాన్ని స్వీకరించిన కమ్యూనిస్టు ఉద్యమం

1935-36లో ఆంధ్రదేశంలో కమ్యూనిస్టు ఉద్యమం ప్రారంభ మైంది. 1940 దశకం నుండి ఆంధ్రకమ్యూనిస్టు ఉద్యమం సాంఘిక సంస్కరణోద్యమాన్ని ఒక కర్తవ్యంగా ఎంచుకొని చైతన్యయుతమైన కృషి ప్రారంభించింది. వీరేశలింగంయుగం వారసత్వాన్ని స్వీకరిం చింది. వీరేశలింగం గురజాడ మున్నగువారి రచనలన్నింటినీ పునర్ము ద్రించింది. వీరేశలింగం, గురజాడ, గిడుగు కొమర్రాజు వర్ధంతులను వూరూరా జరిపింది. వారి సాంఘిక, సాహిత్య సంస్కరణోద్యమాలను పునరుజ్జీవింపజేసింది.

కమ్యూనిస్టు ఉద్యమాల ద్వారా, మహిళాసంఘాల ద్వారా యువ జన సంఘాలద్వారా మహీధర రామమోహనరావుగారి మాటలలో చెప్పాలంటే ఆంధ్రదేశంలో గ్రామసీమల స్వరూప, స్వభావాలను గుర్తుపట్ట లేనంతగా మార్చివేశాయి. స్త్రీలలో విద్యా, విజ్ఞానాలు, యువ తరంలో దేశభక్తి, సాంఘిక సేవా పరాయణతలను మేల్కొలిపాయి. యువతరాన్ని దురలవాట్లనుండి మరల్చాయి. వయోజనవిద్యను, ఆటలు, పాటలను సాంస్కృతిక కార్యక్రమాలను పెద్దఎత్తున పెంపొం దించాయి. అంటరాని తనాన్ని రూపుమాపాయి. తెలంగాణా సాయుధ పోరాట నేపథ్యంలో అక్కడ కూడా గ్రామాలలో ఎన్నో సాంఘిక మార్పులు తీసుకొచ్చారు. గోరా దంపతులు త్రిపురనేని రామస్వామి చౌదరి, ఉన్నవ లక్ష్మీనారాయణ దంపతులు సాంఘిక సంస్కరణోద్య మాలను నిర్వహించారు.

## నేటి పరిస్థితి

ఆంధ్రదేశంలో ఫ్యూడల్ జమిందారీ ఆర్థికవ్యవస్థను నిర్మూ లించడం తన ప్రధాన రాజకీయ కర్తవ్యంగా ఎంచిన కమ్యూనిస్టు ఉద్యమం ఫ్యూడల్ వ్యవస్థ ఉపరితల అభివృద్ధి నిరోధక, సాంఘిక, సాంస్కృతిక భావజాలాన్ని ఎదుర్కొని పోరాడాలి. అట్టి సామాజిక చైతన్యం దృష్టితోనే వీరేశలింగం యుగంనాటి ఆంధ్రజాతీయ పునరుజ్జీవనోద్యమ వారసత్వాన్ని కమ్యూనిస్టు ఉద్యమం స్వీకరించి తన చారిత్రక కర్తవ్యం నిర్వహించింది.

1947లో దేశానికి స్వాతంత్ర్యం వచ్చి అర్ధ శతాబ్దకాలంపైగా గడిచింది. కొంతవరకైనా స్త్రీలలో విద్య పెరిగింది. శాస్త్రీయ, సాంకేతిక విజ్ఞానం పెరిగింది కాని, నేడు తిరిగి విజృంభిస్తున్న సాంఘిక రుగ్మతలను, అశాస్త్రీయమైన నమ్మకాలను, మత మౌఢ్యాన్ని ముఖ్యంగా అవినీతి, లంచగొండితనం, అశ్లీలసాహిత్యం, సినిమాలు - స్త్రీలపై అత్యాచారాలు, వరకట్న వేధింపులు, ఆత్మహత్యలు, స్త్రీ, శిశు భ్రూణ హత్యలు, పసిపిల్లల విక్రయాలు, పడుపువృత్తి, కుల, మత జాడ్యాలు చూస్తుంటే సాంఘికంగా మనం ముందుకు పోతున్నామా? లేక వెనక్కు పోతున్నామా? అన్న సందేహం కల్గుతుంది. యువత మద్యం, మత్తు మందుల్లో జోగుతోంది. విద్యారంగం కూడా లాభసాటి వృత్తిగా మారింది. అవినీతి, లంచగొండి తనాలు సర్వాంతర్యామిగా తయారైంది. అసాంఘిక శక్తుల, మాఫియా గ్యాంగుల చేతుల్లో రాజకీయ రంగాలు, సినిమా రంగాలు (బొంబాయిలో వలె) ఉక్కిరిబిక్కిరి అవుతున్నాయి. తెల్లవారి లేస్తే కుంభకోణాలు, దగా, మోసాలు, అక్రమ సంపాదనలు నిత్యకృత్యమైపోతున్నాయి.

ఒకనాటి నిరాడంబర, పూలదండల వివాహాల బదులు నేడు అంతులేని ఆడంబరంతో అట్టహాసంగాపెళ్ళిళ్ళు చేస్తున్నారు.తమ ధనబలం, రాజకీయ ప్రాబల్యం నిరూపించుకునే ప్రదర్శనలుగా వివాహాలు తయారయ్యాయి. సినిమా సెట్టింగ్‌లను మించిపోయే విధంగా కళ్యాణమండపాలు, వివాహ నగరులు నిర్మిస్తున్నారు. తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత పెంపుడు కొడుకు వివాహానికి రు.10 కోట్లు ఖర్చుపెట్టారు. అటువంటి ఆడంబర వివాహాలు నేడు ఆంధ్రదేశంలో కూడా వ్యాప్తి చెందు తున్నాయి. ఒకవైపున గ్రామసీమలలో మంచినీళ్ళు లేక కనీస జీవితావసరాలు లేక ప్రజలులమటిస్తున్నారు. మరోవైపు ఆడంబర వివాహాలకు లక్షలు, కోట్లు ఖర్చు పెడుతున్నారు. సాంఘిక విలువలు పతనమవుతున్నాయి. రాజకీయ పార్టీలు సాంఘిక విలువలు పతనమవుతున్నాయి. రాజకీయ పార్టీలు సాంఘిక సంస్కరణలను ఉపేక్షించు తున్నాయి. కమ్యూనిస్టు ఉద్యమం చీలి ముక్కలవడంతో ఒకనాడు ఆంధ్రదేశంలో సాంఘిక సంస్కరణల రంగంలో అది చేసిన మహత్తర కృషి వెనుక పట్టుబట్టింది. అవినీతిపై, అసాంఘిక శక్తులపై, సాంఘిక దురాచారాలపై, క్షీణ సంస్కృతిపై కమ్యూనిస్టు ఉద్యమం ఒకనాడు జరిపిన ఆదర్శవంతమైన కృషిని నేడు తిరిగి జ్ఞప్తికి తెచ్చుకొని అట్టి సాంఘిక, సాహిత్య, సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమాలకు అంకితం కావాలి. అవినీతి, లంచగొండి తనాలపై వీరేశలింగంగారు అసహాయ శూరుని వలె పోరాడిన విషయం జ్ఞప్తికి తెచ్చుకోవాలి. విద్యార్థి, యువజన మహిళా ఉద్యమాలు, రాజకీయరంగంలో, విద్యా, విజ్ఞాన రంగాలలో పోరాటాలతో పాటు సాంఘిక సంస్కరణల రంగంలో కూడా సంఘటితమైన చైతన్యయుత మైన కృషిచేయాలి. అశ్లీల సాహిత్యం, సినిమాలపై అభ్యుదయ భావాలు గల రచయితలు, రచయితల సంఘాలు యుద్ధం ప్రకటించాలి. ఆంధ్ర దేశంలో ఫ్యూడలిజం, దాని క్షీణ సంస్కృతి స్థానంలో పెట్టుబడిదారీ క్షీణ సంస్కృతి వ్యాపించుతుంది. ఫ్యూడల్ ఆర్థికవ్యవస్థ పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థగా పరివర్తన చెందుతుంది. పాత సాంఘిక వ్యవస్థ స్థానంలో కొత్త సాంఘిక వ్యవస్థ రూపుదిద్దుకుంటుంది. మార్క్సిస్టు దృక్పథంతో దీనిని అర్థం చేసుకొని నూతనమైన సాంఘిక సంస్కరణో ద్యమాన్ని నిర్వహించిన మహనీయుడు వీరేశలింగంగారు చేసిన హెచ్చరికను దృష్టిలో పెట్టుకొని రాజకీయ పోరాటాలతో బాటు సాంఘిక సంస్కరణల రంగానికి కూడా సమాన ప్రాతినిధ్యం ఇవ్వాలి.

చిరునామా : *శ్రీ పరకాల పట్టాభిరామారావు, సంఘమిత్ర జర్నలిస్ట్ కాలనీ, సిద్ధార్థ అకాడమీ ఎదురుగా, విజయవాడ - 520 010, ఫోన్ : 0866-2474635*

డాక్టర్ పాలపర్తి శ్యామలానందప్రసాద్

# కృష్ణయొడ్డు జాతి

కృష్ణాతీర నివాసమే కాక కృష్ణానదీ నాగరికత లోతుపాతులను తరచి చూచి సాహిత్యములో నిక్షేపించిన కృష్ణవేణీ పరమభక్తుడు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ. ఆయన దృష్టికోణం విలక్షణము. పరిశీలన పరమసూక్ష్మము. పదప్రయోగము సార్థకము, పరమార్థభరితమై, మహావ్యాఖ్యాన వటవృక్షమునకు బీజమై యొప్పుచుండును. ఆంధ్రప్రశస్తి, ఆంధ్రపౌరుషము మొదలైన తొలినాటి రచనల నుంచి జీవితాంతము అన్ని పద్యగద్య కృతులలో కృష్ణానదీ ప్రభావమును ప్రత్యక్షముగానో పరోక్షముగానో ప్రతిపాదించిన భౌగోళిక, పర్యావరణ, మనస్తత్వ శాస్త్రవేత్త విశ్వనాథ. నిత్యలోక శాస్త్రానుశీలనా నిపుణుడు.

**స్నేహమని కాదుగాని నా స్నేహితులకు**
**చిన్ననాటి స్నేహితులకు స్నేహితుండు**
**రావు మండలి కులకృష్ణరావాకండు**
**ఒగిని మేమందరము కృష్ణయొడ్డు జాతి**

**ఆయన జూచిన నేనే**
**యాయన యనిపించె హృదయమందు నదేలో**
**ఆయన ప్రకృతియు నాయది**
**మాయది యొకజాతి ద్రవ్యమా యనిపించున్**

ఆనాటి ఆంధ్రప్రదేశ్ విద్యామంత్రి శ్రీ మండలి వేంకట కృష్ణారావును కల్పవృక్ష శ్రోతలతో చేర్చుచు విశ్వనాథవారు పైరెండు పద్యములను కల్పవృక్షావతారికలో చేర్చిరి. విజయవాడలో జరిగిన ఒక సభలో వానిని మండలివారికి విన్పించిరి. మరునాడు విశ్వనాథవారింటిలో చెల్లా సీతారామాంజనేయులు, మల్లాది లక్ష్మీనారాయణ, కవిసమ్రాట్ పైడిపాటి సుబ్బరామశాస్త్రి మరింకెవరో యుండిరి. చెల్లావారో, పైడిపాటివారో 'మాష్టారూ ! కృష్ణయొడ్డు జాతి' అని చులకనగా అన్నారా ? మెలకువగా అన్నారా ? ఈ ప్రయోగం మాకేదో కొత్తగా ఉంది. అంతుపట్టటంలేదు" అని వ్యంగ్యముగా, వక్రోక్తిగా అనిరి. విశ్వనాథవారికి కోపము వచ్చినది. చేతిలోని పేకముక్కలను విసిరికొట్టిరి. "కృష్ణఒడ్డున ఇలాంటివాళ్లు కూడా పుట్టిపెరుగుతారని ఇప్పుడే తెలిసింది. కృష్ణానది మహిమను, సంస్కృతిని, సంప్రదాయాన్ని, నాగరికతను సమస్తాన్నీ 'ఒగిని మేమందరము కృష్ణయొడ్డు జాతి' అనే పాదంలో రాశిపోశాను. 'ఒగిని' అనేమాట పరంపరను తెలియచేస్తుంది. కృష్ణానది నాలుగు యుగాల్లోనూ ఉంది. దేవతలు, ఋషులు, పితృదేవతల ఆశీర్వాదంతో వారి వారసులుగా మనం పుట్టాం. కృష్ణాతీరంలో పుట్టిన వారెవరూ ఒక్కసారిగా ఇక్కడ ఊడిపడరు. పరంపరా ప్రాప్తమైన అర్హతతోనే ఇక్కడ పుడతారు. మా పూర్వులు దివిసీమలో హంసలదీవి దారిలో కృష్ణ ఒడ్డున విశ్వనాథపల్లి గ్రామంలో శివలింగ ప్రతిష్టను చేశారు. ఆ ఊరు విశ్వనాథపల్లి అయ్యింది. మా ఇంటిపేరు విశ్వనాథ అయింది. తరువాత వాళ్లు నందమూరులో స్థిరపడ్డారు. తెలిసినా తెలియకపోయినా ఈ పరంపర కొనసాగుతూ ఉంటుంది. అందుకే మేమిద్దరము అనకుండా మేమందరము అన్నాను. కృష్ణనీరు, మట్టి, గాలి, ఆకాశం అన్నీ ప్రత్యేకతను కలిగివున్నాయి. ఇక్కడ ఉన్నవాళ్లు రూపంలో, వేషంలో, భాషలో, చదువుసంధ్యల్లో, పనిపాటల్లో, ఆత్మీయతల్లో, భావుకతలో, అనుబంధాల్లో, ఆవేశకావేశాల్లో, హావభావాల్లో ఒక ప్రత్యేకమైన నాగరికతను కలిగివుంటారు. కనుక కులమతాలతో నిమిత్తం లేకుండా 'కృష్ణయొడ్డు జాతి' ప్రపంచంలో ఎక్కడున్నా అది అదే. ఆ సంస్కృతి తంతువును ఎవరూ తెంచలేరు. అది రక్తనాళాల్లో ప్రవహిస్తూ ఉంటుంది. రెండో పద్యంలో దీనిని వివరించాను. మనుషులు, పేర్లు వేరుగా ఉన్నా కృష్ణాతీరవాసులందరూ ఒక జాతి ద్రవ్యమే. వారి ప్రకృతి ఒకటిగానే ఉంటుంది. ఇది నా రామాయణ కల్పవృక్షం అచ్చువేసుకోవడానికి డబ్బులిచ్చారని ముఖస్తుతిగా చెప్పినమాట కాదు. సహజమైన అనుభూతిని, అనుభవాన్ని ఒక కవిగా చెప్పాను. నా రచనల్లో అంతటా ఇదే కనిపి

స్తుంది. ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకోండి" అని ఆవేశముగా గర్జించిరి. పిల్లవాడను నేనులికిపడితిని. పెద్దలు చిరునవ్వుతో, "మీనుంచి ఇది తెలుసుకోవాలనే అలా అన్నాం మాష్టారూ !" అని ముక్కలు పంచిరి.

ఇమ్ముగ కాకుళమ్ము మొదలీవరకూ గల ఆంధ్రపూర్వ రా
జ్యమ్ముల పేరు చెప్పిన హృదంతరమేలో చలించిపోవు నా
ర్ద్రమ్మగు చిత్తవృత్తులు పురాభవ నిర్ణయమేని ఎన్ని జ
న్మమ్ములు గాగ ఈ తనువునం బ్రవహించునొ ఆంధ్రరక్తముల్

అని విశ్వనాథ చెప్పిన పద్యములో రక్తములోని సంస్కృతీ పారంపర్యము మనస్సు, వాక్కు, కాయములందు ఎట్లు వ్యక్తమగునో తెలుపును. ఈ పద్యము చదివినవారందరిలో అది మేల్కొనును. కృష్ణాతీరవాసుల లక్షణములు ఎట్లుండునో మండలివారిని గురించి చెప్పిన పద్యములలో ఆయనపై పెట్టి విశ్వనాథ ఇట్లు చెప్పెను. పేరు మాత్రము మండలివారిది. తీరు కృష్ణాతీర వాసులందరిది.

నా యెతిగినట్టి మండలి
యేయెడ దుర్మార్గములకు నెగబడి పోవం
దాయన గాంధిమతము చే
దోయిన గొని త్రావియందు దోగుచు నుండున్
ఎడదకు నిక్కుటెక్కులకు నీయడు కొంచెమునైన తావు తా
నుడిగి బడాయికోరు తన మూరును పేరు గడించి సంచరి
చెడి పురుషుండు నే పదవి చెందిన చిందులు లేక సంబరం
పడు తన బాసయన్న నభిమానము నిండిన గుండెకాయగా

తనసీమలోని పేదల
కును లోపము తీర్ప కూడుగుడ్డలయందున్
తన బ్రదుకున పరమార్థము
గను మనుగడ వెళ్లబుచ్చు కరుణామతియై:

సన్మార్గము, శాంతి, అహింస, నిక్కు టెక్కులు, బడాయి కోరు తనము లేకుండుట, పేరుప్రఖ్యాతులు గడించుట, ఎంతటి పదవి వచ్చినను గర్వపడకుండుట, మాతృభాషాభిమానము కలిగియుండుట, పేదలకు సహాయపడుట అనునవి జీవన పరమార్థముగా భావించుట 'కృష్ణయొడ్డు జాతి' లక్షణముగా విశ్వనాథ ఆవిష్కరించిరి. వారిని గురించి కూడ వారి కుమారులు పావని శాస్త్రి ఇట్లే వ్రాసిరి. "మా నాయనగారు దేహి అని ఒకణ్ణి యాచించలేదు. తలవంచలేదు. ఆశ్రయించలేదు. బ్రతికినంతకాలం సింహంలా బ్రతికాడు. ఏనాడూ అసత్యం చెప్పలేదు. జాత్యహంకారంతోగాని, కులమత వర్ణ వివక్షతోగాని, ఏనాటూ ఎవడి కడుపూ కొట్టలేదు. ఎవడినీ చెఱపలేదు. తనకి చేతనైనంతలో ఆకలిగొన్నవాడికి అన్నం పెట్టాడు. అర్హుడైనవాడికి ఆర్థికసహాయం చేశాడు. అర్హుడైనవాడికి విద్యాదానం చేశాడు. ఆ చేసేటప్పుడు వీడు నా వర్ణస్థుడా, నా మతస్థుడా అన్న దుష్టభావన ఏనాడూ చెయ్యలేదు" అని వివేచన గ్రంథంలో పేర్కొన్నారు.

కులమతములతో పనిలేకుండా కృష్ణయొడ్డు జాతి వ్యక్తిత్వ వికాసము ఇట్లుండును. కృష్ణానదీ పరీవాహక ప్రాంతము కళలకు కాణాచి. విద్యలకు ఆటపట్టు.

కృష్ణా తరంగ నిర్నిద్రగానము తోడ
శిల్పము తొలిపూజ సేయునాడు
అక్షరజ్ఞాన మెరుగదో ఆంధ్రజాతి
విమల కృష్ణానదీ సైకతముల యందు
కోకిలపు బాట పిచ్చుకగూళ్లు కట్టి
నేర్చుకొన్నది పూర్ణిమా నిశలయందు

ఈ పద్యమును వినినంతనే కృష్ణాతరంగముల గలగలలు వినును. ఇసుక తిన్నెలపై పున్నమి వెన్నెలలో విహరించినగతస్మృతులు ఎవరికైనా గుర్తుకు వచ్చును. కృష్ణయొడ్డుజాతి విజ్ఞానము అంత ప్రాచీనము.

నీ కోదండ వినిర్గతాశుగ మహాగ్ని జ్వాలలన్ దట్టమై
యేకోనల్ దహియింపగా బడెడు తండ్రీ ! యంబా శ్రీకృష్ణవే
ణీకల్యాణ పృషత్పరంపరల శాంతిన్ సస్యవంతంబులై
శ్రీకేదారములై తగున్ విజయలక్ష్మీ కేశబంధంబులై

(ఆంధ్రప్రశస్తి)

కృష్ణవేణి నీటి తుంపరల మహిమ చెప్పబడినది. వానితో బీడు భూములు సస్యవంతములైన శ్రీకేదారములగును. కృష్ణయొడ్డుజాతికి యాచించు లక్షణము ఉండదు.

నేను మనస్సన్న్యాసిని
నేనిది ఇమ్మంచునడుగ నెవ్వరి నెపుడున్
దానేది యేనియు బ్రాప్త
మ్మైనన్ వలదంచు చెప్ప... (కల్పవృక్ష బాలకాండం)

పైకి సంసారులైనను మనసులో సన్న్యాసులై ఎవరిని, ఏదియు ఇమ్మని అడగకుండ ప్రాప్తమైన దానిని స్వీకరించు లక్షణము కృష్ణాతీర వాసులలో నుండునని చెప్పిరి. వేదమును గంగగట్టు నుండి కృష్ణ యొడ్డుకు ఇచ్చటివారు తెచ్చి కృష్ణానదిని మరింత పవిత్రము చేసిరని విశ్వనాథవారి తొలినవల'అంతరాత్మ'లో ..."శ్యామలా జనకుని పూర్వులు త్రయీ పాఠములతో తమ కంఠములు శ్రుతి కలిపి కృష్ణవేణి శైవాలినికి భాగీరథీ నదీ పావిత్ర్యము తెచ్చినవారే..." కథాసన్నివేశమున వేదశాస్త్ర ముల వలన కృష్ణ ఘనత గంగతో సమానమైనట్లు వర్ణించిరి. విశ్వనాథ వారు మలిసంజెవేళలలో కృష్ణానది ఇసుక తిన్నెలపై రెల్లు దుబ్బుల

మధ్యనుంచి ప్రవహించుచోట గూర్చుండెడివారట. 'ఏకవీర' నవలలో కిన్నెరసాని పాటలలో ఈ యనుభవము పరిశీలన అద్భుతముగా కనిపించును.

**తేటదేరిన కృష్ణానదీ తరంగ**
**శీకర చయంబు గాలికి చిందు చిటిలి**
**ఇసుక తిప్పలపై మోసులెత్తియున్న**
**రెల్లుదుబ్బులపై పడి జల్లులాడె** (రస ప్రకృతి)

కృష్ణాతీరమున శిల్పము, సంగీతము, సాహిత్యము, నాట్యము, చిత్రలేఖనము తెలుగునేలలో అత్యద్భుతముగా వర్ధిల్లుటకు కారణములను, శాతవాహనాది రాజవంశములు, శ్రీకాకుళము వంటి రాజధానులు, వ్యక్తిత్వమును పౌరుషమును పెంచు ఆటపాటలను, పరిపాలనా చాతుర్యమును, దానధర్ములను కృషి పశుపాలనములను, ఐకమత్య భావనను, మానవతా పరిపూర్ణతను, భారతీయ సంస్కృతిని, సత్యాహింసలను పరిరక్షించు లక్షణములన్నియు కలిసి 'కృష్ణయొద్దు జాతి' ఏర్పడినదనియు, పరంపరగా అది కొనసాగుచుండునని, ఇంత లోతైన భాష్యమును చిన్న పద్యపాదములో పొదిగిన విశ్వనాథవారిని, వారి లేఖినిని మహాకవి శ్రీశ్రీ ఇట్లు కీర్తించెను.

**మాట్లాడే వెన్నెముక**
**నిన్నటి నన్నయభట్టు**
**నేటి కవిసమ్రాట్టు**
**గోదావరి పలుకరింత**
**కృష్ణానది పులకరింత**
**కొండవీటి పొగమబ్బు**
**తెలుగోళ్ల గోల్డునిబ్బు**
**అతగాడు తెలుగువాడి ఆస్తి**

ఇది 'కృష్ణయొద్దు జాతి' కథ. కృష్ణానదికి జయో ఉస్తు. విశ్వనాథకు విజయోஉస్తు.

*కలికాల కలుషముల కడుగదలచిన నలువ*
*తన జనకు కరుణకై తపియించె మున్నెపుడొ*
*నలువ చేసిన తపము నవనవోన్మేషమై*
*నారాయణుని గుండె నవనీతమై కరిగె*
*శశ్వ దానంద్రార్ద్రస్పందనాకృతి స్వామి*
*అశ్వత్థమై నిలిచె ఆ నలువ కట్టెదుట*
*తెల్లతెల్లని రావి మెల్లమెల్లగ కరిగి*
*చల్లచల్లని నీటియూటలై జాల్వారె*
*అచట సహ్యాద్రి ఉత్తర శిఖరవాటి*
*మొదట ఈ కృష్ణమ్మ బొడ్డుకోసిన చోటు*
*మూర్తిదాల్చిన యట్టి మూడు వేదమ్ములు*
*ఆర్తితో తపియించి అలమటించిన వేళ*
*ప్రత్యక్షమైనట్టి పార్వతీ విభుమూర్తి*

డా॥ దండెబోయిన పార్వతీదేవి

# కర్నూలు జిల్లా ప్రజల సాంఘిక జీవనం

'జలం ఈ విశ్వసృష్టిలో ప్రభవించిన ఒక మహాశక్తి' అని భారతీయ ఋషులు భావించారు. ఇది నిజమే. మానవకోటిని పావనమొనర్చటానికే నీరు పుట్టింది. ఎంతటి దయాంబురాశి కాకపోతే స్వర్గంలో పుట్టిన గంగ నేలకు ఉరికివస్తుంది. మన కోసమై మహాదేవుడి అనుమతి తీసుకుంది. హిమాలయాల పొందును కోరుకుంది. నింగిని నేలను ముంచెత్తే తన ప్రవాహఉధృతిని వినమ్రంతో నిగ్రహించుకుంది. అలల ప్రళయాన్ని ఆహ్లాదభరితంగా మనకోసం మలచుకొంది. కొండలు, గుట్టలు అడ్డంకులు దాటి నిర్మల మందాకిని నేలను తడిపింది. మనకు బ్రతుకునిచ్చింది. ఇహము, పరము తానే అయి కడతేర్చింది.

అనంతజల సముదాయమైనా, ఒక గుటికెడు జలమైనా దాన్ని 'గంగ'గా పిలవటమే నీటికి మనమిచ్చే గౌరవం. అది భక్తి కూడా. నీరెక్కడ వున్నా అది అమృతమే. ఆకాశగంగయే. అలా ఎక్కడో మహారాష్ట్ర సహ్యాద్రి శ్రేణిలో పుట్టి మూడు రాష్ట్రాలను పరమ పావనం చేస్తున్న జలముల జాబిలి కృష్ణవేణీ నదీమ తల్లి. 1200 కి॥మీ॥ దాదాపుగా ప్రవహించి మహబూబ్‌నగర్ జిల్లాలో మాగనూరు మండలం తంగిడిగి గ్రామం దగ్గర తెలంగాణా రాష్ట్రంలో ప్రవేశిస్తున్న ఈ నది ఆపై అంధ్ర రాష్ట్రంలోని కర్నూలుప్రాంతాన్ని పలకరించటం అక్కడి ప్రజలను తరింపచేయటం ఒక భాగ్యవిశేషం.

**"విష్ణుదేహోర్భూతి కృష్ణపరవిభూతి**

**శంభు దేహపు భూతి వేణ్యంబు సంభూతి"** – అని కీర్తిని పొందిన కృష్ణవేణీ కర్నూలు ప్రాంతంలో ఉత్తరవాహినిగా ప్రవహిస్తుంది. హిందువులకు ఉత్తరవాహినిగా ప్రవహించే తీర్థం అంటే పరమపవిత్రమని నమ్మకం.

**"గంగా సంగమమిచ్ఛగించునే... నీయంగంబంటి సుఖించెనేని గుణభద్రా! తుంగభద్రానదీ!"** అని తెనాలి రామకృష్ణ కవిచే ప్రశంసలందుకున్న తుంగభద్రానదీ తటంలో వెలసిన ప్రాంతం కర్నూలు జిల్లా. ఇక్కడ తుంగభద్ర, హంద్రీ, కుముద్వతి, కుందూ నదులు ప్రధానంగా ప్రవహిస్తూ ప్రజలపాలిట కల్పవల్లులై సాగుతున్నాయి.

అలా కర్నూలు జిల్లాకు ఉత్తరంగా ప్రవహిస్తున్న తుంగభద్రతో కృష్ణవేణీనది అలంపురానికి దిగువగా కలుస్తుంది. ఆపై సప్తనదీ సంగమంగా మారి సర్వదా పూజలనందుకుంటోంది.

**"బాహ్య రూపము జూడ కృష్ణవేణమ్మ**

**అంతరంగము జూడ తుంగభద్రమ్మ"** – అని అంతటి నరసింహ అనే కవి పాడినట్లు కర్నూలు నగరాన్ని ఒరుసుకుంటూ వెళ్ళిన కృష్ణా నదికి ఈనాడు పుష్కరవైభవం వచ్చింది. తెలుగు నేలల్లో పండుగ శోభను తెచ్చింది.

**శాతవాహన రాజ్య సంపదకు మురిసి**

**ఇక్ష్వాకు నృపవైభవము చల్లగా నరసి.....**

**కనుతుదల ఆ స్మృతులు కదలాడ నడయాడు...** (సముద్రాల ఆంజనేయులు) కృష్ణవేణీ నదీమతల్లి మా కర్నూలు ప్రాంతాన్ని చరిత్రతో నిలిపింది.

**కర్నూలు - స్వరూపం**

రాయలసీమ ముఖద్వారం కర్నూలు. ఆంధ్రరాష్ట్రానికి తొలి రాజధానిగా పేరుగొన్నది. విశాఖ స్కంధనాగుడు పాలించిన ఈ ప్రాంతం కందనవోలుగా మారి క్రమంగా కర్నూలు అయింది. మౌర్యులు, శాతవాహనులు మొదలుకొని గొప్ప చక్రవర్తులు ఎందరో ఈ ప్రాంతాన్ని పాలించారు. ఈనాడు కరువు, కష్టాలు కనిపించినా ఒకనాడిది ధనధాన్యవైభవంతో కళకళలాడిన కమనీయమైన గడ్డ. రత్నగర్భ.

2011 జనాభా లెక్కల మేరకు కర్నూలు జనాభా 40,46,601. జిల్లా 17,658 చ॥కి॥మీ॥లు ఉత్తరంగా మహబూబ్‌నగర్ జిల్లా, తుంగభద్రా నది, దక్షిణంగా కడప, అనంతపురం జిల్లాలు, పశ్చిమంగా కర్నాటక ప్రాంతం, తూర్పున ప్రకాశం జిల్లా దీనికి సరిహద్దులు. నైసర్గికంగా పర్వతాలతో, కొండలతో నదులతో చుట్టుముట్టి ఉంది ఈ ప్రాంతం, భిన్న ప్రాంతాలు, భిన్న సంస్కృతులు, భిన్న భాషలు, భిన్న భావాలు చుట్టూరా వున్న కారణంగా కర్నూలు ప్రాంతం ఎంతో

వైవిధ్యానికి లోనైంది. ప్రజల జీవన విధానంలో పలుమార్పులు చోటు చేసుకోవటం అనివార్యమైంది. అయినా తనదైన అస్థిత్వాన్ని నిలుపు కుంటూ, బ్రతుకుబాటను పునర్నిర్మాణం చేసుకుంటూ సజీవంగా సాగుతుందనేది వాస్తవం.

కర్నూలు ప్రాంత ప్రజల సాంఘిక జీవనాన్ని పరిశీలించి చూస్తే అనేక ఆసక్తికరమైన అంశాలు వెలికివస్తాయి. గొప్పదైన ఈ ప్రాంతం చరిత్ర, సంస్కృతి, సంప్రదాయాలు, కళలు, కవులు, అవధూతలు, భౌగోళిక ప్రత్యేకతలు, పంటలు, పండుగలు, ఆధ్యాత్మిక పరిమళాలు, ఆచార వ్యవహారాలు, భాష, భావోద్వేగాలు ప్రస్తావించదగ్గవిగా అగు పిస్తాయి. సమస్త వృత్తుల, సమస్త జాతుల సమైక్యజీవన సమ్మేళనంగా ఇక్కడి సమాజం స్పష్టపడుతుంది.

కనుకనే కర్నూలు జిల్లా ప్రజలుతరాల వైభవాన్ని, తమదైన జీవన సౌందర్యాన్ని తలుచుకుంటూ నేటికీ స్ఫూర్తిని పొందుతూనే ఉంటారు. పౌరుషానికి పుట్టిన బిడ్డలుగా బ్రతకటానికి ఇష్టపడతారు. అపర దాతలుగా ఆర్తులకు ఆదరవునిస్తారు. కోపమొస్తే ఎదుటివాడిని నిల దీయటంలోనూ, కరుణ కలిగితే కపటం లేకుండా కన్నీళ్ళతో అక్కున చేర్చుకోవటంలోనూ వీరికి వీరే సాటి. ఉమ్మడిగా, గుంపుగా సామ రస్యంగా ఉండటానికే ఇష్టపడతారు. వేర్పాటువాదాన్ని ఈ గడ్డ సహిం చదు. ఉదారగుణం, శ్రమను ఆస్వాదించే తత్త్వం, స్వాభిమాన ప్రకటన వీరి సొత్తు. మారుతున్న ఈ యుగంలో సాంకేతిక రంగు పులుము కుంటున్న మానవ యంత్రాలు నడుమ కూడా పూర్తిగా నలగిపోక తమదైన అస్థిత్వాన్ని నిలుపుకోవటానికి జాగ్రత్తపడే మధ్యతరాన్ని ఇక్కడ గమనించవచ్చు. తమ ప్రాంత చారిత్రక, సాంస్కృతిక, వారసత్వ రక్షణ పట్ల వారుపడే తపన, సంఘర్షణ చూస్తే వారి గర్వం, గౌరవం ఏపాటివో అర్థమవుతుంది. కర్నూలు ప్రాంతం యొక్క సమస్త సాంఘిక జీవనం పట్ల నలుగురిలో ఆసక్తిని పెంచుతుంది.

## చారిత్రక వైభవం

కర్నూలు జిల్లా వైభవాన్ని పట్టి చూపే ఎన్నో శిలాశాసనాలు, పురాతన ఆనవాళ్ళు ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. క్రీస్తు పూర్వం నాడే దక్షిణ భారతదేశానికి రాజధాని అయిన సువర్ణగిరి (సువర్ణగిరి > సొన్నగిరి) నేటి జొన్నగిరి కర్నూలు జిల్లా పత్తికొండ తాలూకాలో ఉంది. ఇక్కడే ఎర్రగుడి శాసనాలు ఆరు దొరికాయి. ఆదోని ప్రాంత శిలాశాసనాల్లో ఈ ప్రాంతం 'శాతవాహనరథ్థం'గా వ్రాయబడింది. శాతవాహనులు నిర్మించిన కర్నూలుకోట ఈనాటికి (శిథిలమైనా) కని పిస్తుంది. ఇక్కడి ఆదిమానవ సంచారం, వారి పనిముట్లు, ఆయుధాలు ప్రాచీన శిలాయుగం నాటివిగా పరిశోధనలో తేలింది. పాండవ గుళ్ళు, రాక్షసగుళ్ళు, పాతర్లు వంటి పురాతన సమాధులు ఇక్కడ బయల్ప డ్డాయి. తుంగభద్ర నదీలోయ నాగరికత హరప్పా మొహంజదారోల కంటె ప్రాచీనమని పరిశోధకుల అభిప్రాయం. కేతవరం కొండగుహ ల్లోని చిత్రాల్లో సింధూ నాగరికత ఆనవాళ్ళు కనిపిస్తాయి. ఇటీవల కాలంలో 2 కి॥మీ॥ పొడవాటి బెలూం గుహలు ఇక్కడ బయల్పడ్డాయి. ప్రపంచ వింతల్లో ఒకటిగా ఇవి భావించదగ్గవి. అతి ప్రాచీన తెలుగు పదం (3000–2500 సం॥) నాటిదిగా 'అంధిర్ లోహం' కర్నూలు జిల్లాలో ('అంధ్రలోకం')గా గుర్తింపదగినదని డా॥ వైద్యం వేంకటేశ్వరా చారి (పరిశోధకులు) చెబుతున్నారు. "ప్రాచీన మానవుల అవశేషాలకు సంబంధించిన కర్నూలు జిల్లా ఒక భాండాగారంవంటిది" అన్నఎం.వి. కృష్ణమూర్తి గారి పరిశోధనలు పై వానికి సాక్ష్యంగా నిలుస్తాయి.

## కర్నూలు జిల్లా - పౌరుషాల ఖిల్లా

కర్నూలు అనగానే అందరికీ ముందుగా గుర్తు వచ్చేది కొండారెడ్డి బురుజు. ఇది రాతితో కట్టబడ్డ గొప్ప చారిత్రక కట్టడం. క్రీ॥శ॥ 1529–49ల మధ్య అచ్యుతరాయలు దీనిః నిర్మించారు. వీరుల పౌరుషానికి నిలువెత్తు సింహాసనంలా, నిలిచి గర్జిస్తున్న సింహంలా గంభీరంగా కనిపిస్తుంది ఈ కోట. ఆంగ్లేయుల కాలంలో ఎదురు తిరిగిన కొండారెడ్డి వీరమరణ చిహ్నంగా కొండారెడ్డి బురుజు అని ఇది పిలువబడుతోంది. ఈ బురుజుపై 168 అడుగుల పెద్ద స్థూపం ఉంది. ఇది దేశంలోనే రెండవ అతిపెద్ద స్థూపం.ఈ స్థూపంపై భారత జాతీయజెండా నిరంతరం ఎగురుతూ, ఆయా వీరుల త్యాగ వైభవాన్ని దశదిశలా చాటుతున్నట్లుగా ఉంటుంది.నిజానికి ఆంగ్లేయుల కాలంలో బ్రిటీష్ వారి దాష్టీకానికి బలైన వీరులు ఎందరో ఈ కర్నూలు సీమ బిడ్డలే. ముతుకూరి గౌడప్ప, ఉయ్యాలవాడ నరసింహారెడ్డి, సర్దార్ నాగప్ప, గులాం రసూల్‌ఖాన్, అందరినీ మించి తొలిసారిగా జైలుకు వెళ్ళిన ఈ ప్రాంతవాసి గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఇంకను ఎందరో ధనమాన ప్రాణాలను దేశమాత స్వేచ్ఛకై అర్పించారు. సామాన్యజనం కూడా స్వదేశీ ఉద్యమంలో భాగంగా రాట్నం వడకటం, ఖద్దరు ధరించ టం వంటి స్వతంత్ర్య భావాలతో పోరాటబాట నడిచారు. 1921లో మహాత్మాగాంధీ కర్నూలు పట్టణానికి రావటం ఒక విశేషం, తుంగభద్ర తీరాన జరిగిన సభలో ఖిలాఫత్ ఉద్యమం, స్వదేశీ ఉద్యమం గురించి గాంధీజీ ప్రసంగించారు. వారి రాక కర్నూలు ప్రజల పోరాటస్ఫూర్తిని స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో పదిలపరిచింది.

పుట్టిన గడ్డను ప్రేమించటంలో, పరిరక్షించుకోవటంలో తరాల నాటి నుండి కర్నూలు సీమ వెనకడుగు వేయలేదు. బ్రతుకుబండి పట్టాలు తప్పినా పుట్టినచోటనే ప్రాణం విడువాలన్నది వారి పట్టుదల. కాలం కలిసి రాక పోయినా కన్న వూరునే పట్టుకొని కాలం గడిపే మనస్తత్వం ఈ ప్రాంతవాసుల్లో ఎక్కువగా కనిపిస్తుంది. స్వాతంత్ర్యం వచ్చాక హిందూ, ముస్లిం, క్రైస్తవమతాలు ప్రబలినా, బౌద్ధ, జైనఛాయలు ఇక్కడ కనిపించినా అందరూ సామరస్యంగానే బ్రతకటం గమనార్హం. ఏ ప్రాంతం వాడైనా, ఏ వృత్తివాడైనా కర్నూలు జిల్లాలో కాలుమోపితే

చాలు ప్రీతిగా కలుపుకుపోయే విశిష్టమైన సంస్కృతి గల నేల ఇది. ఇక్కడి చారిత్రక ఔద్ధత్యం, పరిణతి అంత గొప్పవి.

## ఆధ్యాత్మిక ఉద్యానవనం

ఆధ్యాత్మిక పరిమళాలను వెదజల్లిన ఒక ఉద్యానవనం కర్నూలు ప్రాంతం. సాధులు, వేదాంతులు, అవధూతలు ఎందరో ఇక్కడ తమ భక్తి, జ్ఞానవైరాగ్య సుమాలను పూయించారు. పోతులూరి వీరబ్రహ్మం, మంత్రాలయ రాఘవేంద్రుడు, యోగిని లక్ష్మమ్మవ్వ, రామిరెడ్డి తాత, కాశిరెడ్డినాయన, అల్లీ సాహెబ్ (తత్త్వగీతాలు) ప్రజలలో భక్తిమార్గాన్ని పెంచారు.

పేద, ధనిక భేదం లేకుండా ప్రజలు భగవదారాధన చేసుకోవటం పట్ల ఆసక్తి చూపుతారు. పుణ్యక్షేత్ర దర్శనం, గురుపరంపరను నమ్మి సేవించటం ఇందులో భాగమే. క్రైస్తవ మతం వారు చర్చీలకు వెళ్ళటం, ముస్లింలు సమీప ఈద్గాలకు వెళ్ళి ప్రార్థనలు చేయటం జరుగుతుంది, వీరు తమ మత సంస్థల ద్వారా ఆయా మతస్థులకు, మతావలంబికు లకు సాయం అందజేస్తుంటాయి. అయినప్పటికి సామాన్య ప్రజలలో నువ్వు, నేనన్న మత విభేదాలు ఎక్కడా కనిపించవు.

ఐతిహాసికంగా ప్రశస్తి పొందిన శ్రీశైలం, అహోబిలం, సంగమే శ్వరం, వీటితో పాటు మహానంది, మంత్రాలయం, యాగంటి, కాల్వ బుగ్గ ఇక్కడి ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలు. శ్రీశైలం శైవానికి, అహోబిలం వైష్ణవానికి, మంత్రాలయం ద్వైతానికి ప్రతిబింబాలై ఆధ్యాత్మికతకు ఈ ప్రాంతం ఒక త్రివేణీ సంగమమై భాసిల్లుతుంది. వీటితో పాటు ప్రతి ఊరిలోనూ నచ్చిన దేవాలయనిర్మాణాలు,పూజలు,పుణ్య కార్యాలు, ఉపవాసాలు, వ్రతాలు, నోములు ఆచారం ప్రకారం జరుగుతూనే ఉంటాయి.

పల్లెలలో గమనిస్తే స్థానికంగా వున్న గ్రామదేవతలను పూజిం చటం ఒక మంచి ఆచారంగా కనిపిస్తుంది. అంకాలమ్మ, చెట్లమ్మ, పుట్టాలమ్మ, పెద్దమ్మ, గౌరమ్మ, మారెమ్మ, రేణుకా ఎల్లమ్మ, సుంకు లమ్మ, పోలేరమ్మ, పోతురాజు, జంబులమ్మ, వీరు మ్రొక్కే గ్రామ దేవతలు. మద్దిలేటయ్య, ఓబులేసుడి తిరునాళ్ళు అని స్థానిక వేడుకలు కూడా ఇక్కడ జరుగుతాయి. ఆయా గ్రామ దేవతలకు మొక్కులు చెల్లించటంలో భాగంగా తప్పెట్లతో మేళాలతో ఊరు ఊరంతా కదులు తుంది. కొందరు మగవాళ్ళు చిందులు వేస్తారు. పూనకం వచ్చినట్లు కొందరు స్త్రీలు ఊగిపోతారు. 'బోణమని' పెసరపప్పు అన్నం, జొన్న న్నం (ఉప్పు ఉండదు) కుండను నెత్తికెత్తుకొని, వేపరెమ్మలు చేతపట్టుకొని ఊగిపోతూ తప్పెట్లకు అనుగుణంగా అడుగులు వేస్తూ స్త్రీలు ఆయా దేవతలకు ఎదురు నడుస్తారు. ఈ దేవతలకు జంతువులను, అంటే కోడిపుంజులు, మేకపోతులను, పొట్టేళ్ళను బలిఇవ్వటం జరుగుతుంది. ఇలాంటిదే శ్రీశైల భ్రమరాంబకు చైత్రమాసంలో కుంభోత్సవం జరుగు తుంది.అప్పుడు సాత్విక బలిని ఇవ్వటం గమనార్హం. ఈ వేడుకలలో యథాశక్తి దానధర్మాలు చేయటం కూడా చాలా సహజం. ఇది ఈ ప్రాంతవాసుల భక్తి, నమ్మకాలను చూపెడుతుంది. దీన్ని కాదనే సాహ సం ఎవ్వరూ చేయరు. (ఇటీవల కాలంలో ఈ వేడుకల్లో కనిపించే మద్యపానం సేవించటం అనే దురాచారం పరిహరించదగ్గది.)

## పచ్చని పంట పొలాలు

వానాకాలం వచ్చిందంటే రైతులు దుక్కిదున్ని ఆశగా విత్తనం వేస్తారు. నారు పోస్తారు. ఇక ఎకరాల కొద్దీ పొలం పచ్చదనంతో మిసమిసలాడుతూ పక్షుల దొంతెరలతో కళకళలాడుతూ ఉంటుంది. ఇక్కడి జనాభాలో దాదాపు 75% ప్రజల జీవనాధారం వ్యవసాయమే. కృష్ణ, కుందూ పరివాహక ప్రాంతమంతా దాదాపు 60% నల్లరేగడి నేలలు ఉన్నాయి. పడమటి భాగంగా హంద్రీ నదీ పరివాహక ప్రాంత ముంది. ఇక్కడంతా నల్లరేగడి నేలలున్నాయి. మిగిలిన 40% ఎర్ర నేలలు. ఇవి కొంత సారహీనంగా ఉంటాయి. ఎర్రమల, నల్లమల కొండల కారణంగా ఈ ప్రాంతంలో వేడి ఎక్కువ. వానాకాలంలో ఒకప్పుడు వాన అధికం. ప్రస్తుతం అంతటా వర్షానికి కరువే.

8.51 లక్షల చదరపు హెక్టార్ల భూమి నికరపు పంట భూమి అయితే 4లక్షల హెక్టార్లలో మాత్రమే రెండు పంటలు వేస్తారు. సగం భూమి వర్షాధారంగా పండవలసిందే. వరి, వేరుశెనగ, జొన్న, ప్రత్తి, ప్రొద్దుతిరుగుడు, కొర్ర, కంది, మినప, శనగ, ధనియాలు ఇక్కడి ప్రధాన పంటలు. ఇవి కాకుండా కూరగాయలు, ఆకుకూరలు, పూల తోటల సాగు కూడా కనిపిస్తుంది. వరిలో దేశంలోనే పేరుగాంచిన సోనామసూరి, ఢిల్లీ భోగాలు ఇక్కడ పండుతాయి. తెలుగుగంగ, శ్రీశైలం కుడికాల్వ ప్రాజెక్టు, సంజీవయ్య సాగర్, వరదరాజ ప్రాజెక్టుల ద్వారా ఇక్కడి ప్రజలు కొంత భూములను సాగు చేసుకొనగలుగు తున్నారు. ఇవిగాక ఇక్కడి విశేషమైన జలవనరులు (50) యాభైకి పైగా ఉన్న సహజ నీటిబుగ్గలు. ఇవి సంవత్సరం పొడవుగా పారుతూ ఉండటం మూలాన మహానంది, కాల్వబుగ్గ వంటిచోట్ల అరటి, వరి వంటి పంటలు రెండుకార్లు పండుతూ ఉంటాయి. అయితే ఏ విధమైన నీటివనరులు లేని ప్రాంతంలోని రైతుల జీవితం మాత్రం కష్టాల మయమే. ఈసురోమని వాళ్ళు బ్రతుకుదెరువు కోసం వర్షపు చుక్కల కోసం ఆకాశంకేసి, ఎండుతున్న మొక్కలకేసి ఆశగా చూస్తూ, కన్నీళ్ళతో సరిపెట్టుకొనే పరిస్థితి నిజంగా హృదయవిదారకమే.

అంతేగాక ఇక్కడి నీటిబుగ్గలు, పచ్చని కొండల ప్రాంతం కూడా, రోజురోజుకు మానవుడి స్వార్థం వల్ల ఉనికిని కోల్పోవటం జరుగు తోంది. కారణం చుట్టూవున్న సున్నపు గనులు, బైరైట్స్, నాపరాళ్ళ పాలిష్ యంత్రాంగమే. ఇవి జలకలుష్యాన్ని, పర్యావరణ కాలుష్యాన్ని తెచ్చిపెడుతున్నాయి.

పొలాన్ని నమ్ముకొని బ్రతకలేక, గొడ్డుగోదా అమ్ముకొని ఫ్యాక్టరీలలో కర్మాగారాలలో కూలీనాలీకి వెళ్ళేవాళ్ళు కొందరు. పట్నాలకు వెళ్ళి

దొరికిన పని చేసుకుంటూ పిల్లాజెల్లాతో అక్కడే మనుగడ సాగించేవారు కొందరు. మేస్త్రి కూలీలుగా, దర్జీపని, ఇళ్ళలో పనులు, ప్రభుత్వ కార్యాలయాల్లో, విద్యాలయాల్లో చిన్నాచితకా పనులు కూరగాయలు, పూలు అమ్మటం, మార్కెట్లలో, సంతల్లో వ్యాపారం చేయటం - ఇవి మహిళలు ఎక్కువగా చేసే పనులు. ఆటో కార్మికులుగానూ, ఇతరత్రా బరువు పనులు మగవాళ్ళు చేస్తారు. మధ్యతరగతి స్త్రీలు కుటుంబానికి ఆర్థిక వనరుగా ఉపయోగపడుతూనే, ఇంటిలో అన్ని సదుపాయాలు సమకూరుస్తూ ఉంటారు. స్త్రీ స్వేచ్ఛ తక్కువనే చెప్పాలి. కులవృత్తులపట్ల ఆదరణ తగ్గిన నేపథ్యంలో ప్రస్తుత తరంవాళ్ళు చదువులకు, ఇతర పనులకు మళ్ళుతున్నారు.

## రుచుల అభిరుచి

పగలంతా పొలాల్లో పనులు చేసి రాత్రికంతా ఉడుకు నీళ్ళతో స్నానం చేసి కాలే అన్నం లేదా సంకటి, పచ్చడి, కాచి చల్లార్చిన ఘుమ ఘుమలాడే నెయ్యి వేసుకొని, గడ్డపెరుగుతో కమ్మగా కడుపు నింపుకొనే చిన్న రైతు, రైతుకూలీ దగ్గరి నుండి, భక్ష్యభోజ్యాలతో విందారగించే ధనికవర్గం దాకా ఈ ప్రాంతవాసులు రుచులను ఆస్వాదించటంలో ముందుంటారు. జొన్నరొట్టె, పుంటికూడ (గోంగూర) పప్పు ఇష్టంగా తింటారు. గుత్తివంకాయకూర, రొట్టె కూడా ఇష్టమైన వంటే. పెసరపప్పు బియ్యం కలిపి వండే పులగం, పచ్చిపులుసు నేయిలను రోజు వారే కాకుండా కొన్ని వేడుకల సందర్భాలలో కూడా వాడతారు. ఓళిగలు (భక్ష్యాలు) కుడాలు (కర్జికాయల వంటివే) వీరికి సంప్రదాయ వంట. (ఇది కన్నడంలో హొళిగగా ఉంది) ఇక్కడి గడ్డ పెరుగు చవులూరిస్తుంది. పల్లెల్లో ఉల్లిగడ్డకారం, తెల్లపాయ కారం, ఇంకా రోటిపచ్చళ్ళు ఇష్టంగా వాడతారు. మంచి మసూరి బియ్యం అన్నం, కందిపప్పు, నాటుకోడి కూర, చేపలకూర, రాగిసంకటి, రాగి గంజి వంటివి మధ్యతరగతి వారు, రైతులు చాలా ప్రీతిగా తింటారు. కూరాకు అంటే మాంసం, ధర ఎక్కువ కాబట్టి వాళ్ళస్థాయిలను బట్టి తింటూ ఉంటారు. బంధువులువచ్చినా మిత్రులువచ్చినా ప్రత్యేక వంటలతో తృప్తిపరచటం వీరి అభిరుచిని,ఆతిథ్యసంస్కారాన్ని తెలుపుతుంది.

## చదువుల పర్వం

కొలను భారతి అనే సరస్వతీ సప్తర్షుల క్షేత్రం ఉన్న ఈ కర్నూలు సీమ చదువుసంధ్యలకు చక్కటి కూడలి. చదువుల్లోనూ, ఉన్నత ఉద్యోగాల్లోనూ, బాధ్యతా నిర్వహణల్లోనూ పేరొందిన వారు చాలా మంది కర్నూలు ప్రాంతంలో ఉన్నారు. పెద్దపెద్ద ఉన్నత చదువులకు విద్యాసంస్థలకు కూడా కర్నూలు ప్రాంతం నెలవుగా ఉంది. అయితే నాగరికంగా ఇంకా ఎదగని పల్లెలు, కొండగుట్టలున్న ప్రాంతాల కారణంగా కొంత విద్యాభివృద్ధి జరుగవలసి ఉంది. వీధిబళ్ళు, ప్రభుత్వ కళాశాలల సౌకర్యాలు ఇంకా మెరుగుపడవలసి ఉంది. ప్రభుత్వ వైద్యకళాశాల, వ్యవసాయ కళాశాల, దంతవైద్యశాల వంటి తదితర జాతీయస్థాయి కలిగిన విద్యాసంస్థలు ఇక్కడున్నాయి. గాడిచర్ల, దామోదర సంజీవయ్య, కోట్ల విజయ భాస్కరరెడ్డి, సముద్ర శాస్త్రవేత్త యం.పి.వై.మద్దులేటి రెడ్డి, కే.యి. కృష్ణమూర్తి, సంగీత సరస్వతి డా॥ శ్రీపాద పినాకపాణి, డా.డబ్ల్యు, సీతారాం వంటి మేధావులు, నాయకులు, సంగీతకారులు, వైద్యులు ఇక్కడ పేరు గాంచారు.

## పండుగల సందడి

ప్రజలందరినీ ఏకసూత్రంగా చేస్తూ, పచ్చని గడపల్లో కళకళలు నింపే పండుగ దినాలంటే ఇక్కడి జనాలకు గంపెడాశ. పండగొస్తోంది. అంటూ అదేదో పెద్ద నిధిని తెచ్చే చుట్టమన్నట్లు నెలా రెండు నెలల ముందు నుండే ఎదురుచూస్తూ ఉంటారు. వినాయక చవితి, దసరా, సంక్రాంతి, ఉగాది, శ్రీరామనవమి, బక్రీద్, రంజాన్, మొహ రం, క్రిస్మస్ వంటివి ఇక్కడ పెద్ద పండుగలు. వీటిని ఆయా మతాల వాళ్ళు ప్రత్యేకంగా జరుపుకుంటారు. స్త్రీలు నాగులచవితి, వరలక్ష్మీ వ్రతం, సత్యనారాయణస్వామి వ్రతం, నోములు, అట్లతద్ది, తులసి పూజ, గోదాపూజ, హనుమద్దండకం, విష్ణు, లలితా సహస్రనామా ర్చనలు, సుందరకాండ పారాయణాలు, చక్కని ఆచారాలతో చేయటం పరిపాటి. పండుగంటే ఇల్లు వాకిలి శుభ్రపరచుకోవటం పేడతో కళ్ళాపి చల్లటం, ముగ్గులు వేయటం, మామిడి తోరణాలు కట్టటం మొదలు కొని బంధువుల రాకలు, స్నేహితుల పలకరింపులు, భోజనాల బంతులు, పూజలు, దేవళాలకు వెళ్ళడం, ఆనందం, ఆప్యాయతలు గుమ్మరించుకోవటం మామూలే. పల్లెల కంటే పట్టణాలలో ఈ సందడి తక్కువే అని చెప్పాలి. పల్లెలు కూడా ఈ మధ్య చడీచప్పుడు లేకుండా పండుగలు జరుపుకోవటం చిత్రంగా తోస్తోంది.

పీర్ల పండుగలో హిందువులు పాల్గొనటం, తిరునాళ్ళలో ముస్లింలు పాల్గొనటం, పండగొస్తే కులమతాల ప్రసక్తి లేకుండా అందరూ ఆడపిల్లలు పుట్టింటికి రావటం ఇక్కడ చక్కని ఆనవాయితీ, ఆడపిల్లలకి పండుగులకు వేడుకలకి కొత్తబట్టలు పెట్టడం, ఒడిబియ్యం పోయడం అనేది ఇక్కడి సంప్రదాయం. పండుగలు సమైక్యతకు, సందడికి, క్రొత్త ఉత్సాహానికి, జీవితాశకు కారకాలని మనకు తెలిసిందే, కనుకనే నూటికి నూరుపాళ్ళు పండగల సందడిని చక్కని అనుభూతిగా మిగుల్చుకోవడానికి ఇక్కడివారు ప్రయత్నిస్తారు.

## జానపద కళల సోయగాలు

సంప్రదాయజ్ఞులు సంప్రదాయ కళలను అభ్యసించటం పరిపాటి. అయితే ప్రత్యేకించి ఇక్కడి జానపద కళారూపాలు చెప్పుకోదగ్గవి. ఆంధ్రదేశంలో ఎక్కడాలేని ఆసక్తికరమైన గొరవయ్యల నృత్యం అనే జానపదకళా రూపం ఈ కర్నూలు జిల్లాకు చెందింది కావటం విశేషం. ఇది ఒక ఉత్తమకళాఖండం. శివారాధన కోసం పుట్టిన కళ ఇది. ఎలుగు బంటి శరీరంతో చేసిన కిరీటం, ఒకచేత ఢమరుకం, మరొక

చేతిలో త్రిశూలం, మెడలో తెల్లని గవ్వలహారం, నడుముచుట్టూ జింక చర్మంతో అందంగా తయారుచేసిన సంచి – ఇదీ గొరవయ్యల వేష ధారణ. ఒక్కసారిగా గొరవయ్యల జట్టు అంతా ఢమరుకం మ్రోగిస్తూ శివుని గూర్చి పదంపాడుతూ అడుగువేస్తూ ఉంటే చూసేవాళ్ళు కళ్ళప్పగించి నిలిచిపోవాల్సిందే.

రాష్ట్రంలో పేరెన్నికగన్న బుర్రకథా కళాకారులు ఈ జిల్లా పర్ల గ్రామంలో ఉన్నారు. రంగస్థల పౌరాణిక నాటక నటకిశోరం వెంకట నర్సు నాయుడు కర్నూలు జిల్లా వెల్దుర్తివాసి. హరిశ్చంద్ర పాత్రకు ప్రాణం పోసిన అద్భుతనటుడు అల్లాబక్ష్ ఈ ప్రాంతంవాడే. అపూర్వ మైన ఈ జానపద కళలు నేడు వ్యాపారంగా మారటం శోచనీయం. అయినా ఇక్కడి జనం సంస్కృతికి అందగింపు తెచ్చే జానపదకళలను భద్రంగా నిలుపుకొనే ప్రయత్నాన్ని కొనసాగిస్తూనే ఉన్నారు.

ఇవేగాక బీరప్పడోలు, చిందునృత్యం, కోలాటం, తప్పెట విందు, పిచ్చికుంట్లు, బింగోళ్ళు, కోటకొండ భాగవతులు, పాతకమూరి భాగవ తులు, హరికథ, బుఱ్ఱకథ, జంగమదేవరలు, మేకన్నల సుద్దులు, బ్రహ్మంగారి తత్త్వాలు, రాంభజన పాటలు,గంగిరెద్దుల మేళం, బుడ బుక్కల వాళ్ళు, లంబాడీనృత్యం (బంజారా), రంగస్థలనాటకాలు, పగటివేషకాండ్రు, పిట్టలదొర మొదలగునవి జానపదాలలో కనువిందు చేసే చక్కని శ్రవ్య దృశ్య కళారూపాలు. వీటిలో కొన్ని నేడు అంతరించి పోవటం బాధాకరం.

## ఈ నేల పావనం

ఎందరో మహానుభావుల పాదస్పర్శతో పావనమైన నేల కర్నూలు ప్రాంతం. శివభక్తితో తరించిన ప్రసిద్ధ కవి, భక్తి సంపన్నుడు జంగమ మల్లికార్జునుడు శ్రీశైలవాసి. వారి పండితారాధ్య చరిత్ర ఆనాటి ఆంధ్రుల విజ్ఞాన సర్వస్వంగా చెప్పదగినది. బసవపురాణంతో శివభక్తి పరాయణ త్వాన్ని ప్రపంచానికి ప్రసరింపజేసిన పాల్కురికి సోమన భక్తి కేంద్రం శ్రీశైలమే. ఆదిశంకరులు అడుగిడిన పరవపావన భూమీ శ్రీశైలమే. ప్రసిద్ధ నారసింహగుహా దేవాళం అహోబిలం వచ్చి శ్రీ ఆదివన్ శఠ కోపజీయర్ నరసింహస్వామికి సేవచేశాడు. వారి శిష్యుడు అన్నమయ్య నారసింహుని విశేషంగా కీర్తించడం ఇక్కడే జరిగింది. ద్వైత సంప్ర దాయంలోని దాససాహిత్య వాఙ్మయంలో పేరొందిన విజయదాసుల వారు ఈ జిల్లా చిప్పగిరిలో దేహత్యాగం చేశారు. వీరి రచనల్లోగల సామాజిక తత్త్వచింతన గొప్పది. ఇవేగాక మంత్రాలయ మఠం వంటి మఠాలు విద్యాకేంద్రాలుగా, సామాజిక చైతన్య నిలయాలుగా నెలకొని ఉన్నాయి. కనుకనే ఆయా క్షేత్రాలను, ఆ ధూళిని, అక్కడి తీర్థాన్ని పరమపవిత్రంగా ఈ ప్రాంత ప్రజలు తలకెత్తుకుంటారు. అపూర్వమైన భక్తిభావంతో పదిలపరుచుకుంటారు. క్రైస్తవ మిషనరీలు, మదరసాలు ఆర్.యస్.యస్.వారు బాలబాలురకు విద్య, వికాసములందించటంలో ప్రత్యేక శ్రద్ధ కనబరచటం ఇక్కడ గమనార్హం.

## ఈ గాలి కవితామయం

కవితాసృష్టికి ఆలవాలమైన సారస్వత దేవాలయం కర్నూలు జిల్లా. ధర్మం, ఔదార్యం స్వాభిమానం గల కవుల కలాలతో ఇక్కడ కవిత్వం వికసించింది. కులవర్గ వ్యవస్థలకు దూరంగా మనల్ని నడిపించిన శివకవులు ఈ ప్రాంతం వారే. పింగళి సూరన, యధావాక్కుల అన్న మయ్య, వీరబ్రహ్మం, లింగావధూత, వేమన (కొన్నాళ్ళిక్కడ ఉన్నాడని చరిత్ర) మొదలైనవారుఈ గాలిని కవితా నిర్మాణంతో పవిత్రం చేశారు.

వీరేగాక తొలి నవలా రచయిత నరహరి గోపాలకృష్ణమశెట్టి కర్నూలు కలెక్టరుగా పనిచేసినవాడే.ఎర్రగుడి శ్రీనివాసాచార్యులు, శ్రీ కుమారస్వామి, గనిశేషశాస్త్రి, అన్నంపెట్టేవారుంటే దినమొక ప్రబంధం వ్రాసేవాడిననే వీరి శిష్యుడు తడకనపల్లి రామయోగి, గాడిచెర్ల హరి సర్వోత్తమరావు, అనుముల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, గాడేపల్లి వీర రాఘవ శాస్త్రి మొదలు యన్.వి.కృష్ణమూర్తి, సర్దేశాయి తిరుమలరావు, కలుగోట్ల విజయాత్రేయ, వనం శంకరశర్మ, షేక్ దావూద్, గండ్లూరి దత్తాత్రేయశర్మ, మాచిరాజు శివరామరాజు, మద్దూరి రామమూర్తి (అవధానత్రయం), నేటి వైద్యం వేంకటేశ్వరాచార్యులు, చక్కిలం విజయలక్ష్మి, రేవనూరి శమంతకమణి, చెరుకూరి కమలామణి, బి.కోమలాదేవి, యామినీ సరస్వతి, పండిట్ హీరాలాల్, సవ్వప్పగారి ఈరన్న, అజీజ్, డా॥ పత్తిఓబులయ్య, డా॥ తంగిరాల మీరా సుబ్ర హ్మణ్యం, డా॥ యన్.శాంతమ్మ, వియోగి వంటి ఎందరో సాహితీ మూర్తులు దాదాపు 200లకు పైగా కవులు/రచయితలు సామాజిక నేపథ్యంతో రచనలు చేస్తున్నారు.

## మాతృభాషమీది మమకారం

నానాటికి మాతృభాషలు మరుగున పడుతున్న నేపథ్యంలో భాషా సాహిత్యాల పరిరక్షణకై పరిశ్రమిస్తున్న పలు సంస్థలు ఇక్కడ పేరోద్ధగ్గవి. కార్యకర్తలిక్కడ స్వచ్ఛందంగా పనిచేస్తారు. రాష్ట్ర తెలుగుభాషా వికాస ఉద్యమసంస్థ (జె.యస్.ఆర్.కె. శర్మ గారి ఆధ్వర్యంలో) సాహితీ స్రవంతి (శ్రీ జంధ్యాల రఘుబాబు), తె.ర.సం. (శ్రీగన్నమరాజు సాయి బాబా), జాతీయ సాహిత్యపరిషత్తు (శ్రీ యం.డి.వై. రామస్వామిశర్మ), లలితకళాసమితి (శ్రీ డా॥ పత్తిఓబులయ్య), సూరన కళాసమితి (గెలివి సహదేవుడు / గొట్టిముక్కల సుబ్రహ్మణ్యం గారు) ఇలా ఎందరో స్థాని కంగా సంస్థాగతంగా సేవచేస్తున్నారు. వీరుగాక ప్రతి తాలూకాలోనూ భాషా సాహిత్య సంస్థలు సభలు సమావేశాలతో యధాశక్తి భాషాసేవలో త్రికరణశుద్ధిగా పాలుపంచుకుంటున్నాయి. వ్యవహారంలో అచ్చమైన తెలుగు భాషే కొనసాగుతుంది. ఇక్కడి తెలుగు దక్షిణ మాండలికానికి చెందినది. అయినా ఒకే జిల్లావాసుల్లోనే భాషలో యాసలో మార్పు కనిపిస్తుంది. కన్నడిగుల యాస, తెలంగాణావారి యాస, అటు కడప, అనంతపురంల యాస, పదజాలాలు పరస్పరం ప్రభావానికి లోన య్యాయి. కర్నూలు నగరంలో కూడా ఈ భాష–యాసలు అన్నీ మిళి

తమై ఉన్నాయి. ఇవన్నీ గాక విద్యావంతులు మాట్లాడే ప్రామాణిక భాషకు దగ్గరగా ఉండే తెలుగు భాష ఒకటి.

గోంగూర అనే పదాన్నే కర్నూలు జిల్లా పడమట ప్రాంతం వారు గోగాకు అంటారు. ఉత్తరాన వారు (తెలంగాణ ప్రభావం) పుంటికూర అంటారు. పుండుకూరు అని పట్టణంలో స్థానికులంటారు. వద్దు అనేదాన్ని 'వొల్ల' అని అంటారు. ఇది కన్నడ ప్రభావం. ఇన్నూరు, మున్నూరు (ఆళ్ళగడ్డ, నంద్యాల), ఐదుమంది (ఐదుగురికి బదులు), ఉద్దులు (జంట), చిలుకు (గొలుసు), గునాది (పునాది), చిలప (మాగాణిలో నీళ్ళు), పసి (లేత),తువ్వ (నేల), నాగేలి (నాగలి) ప్రధానంగా కనిపించే మాండలిక పదాలు. కర్నూలు జిల్లాలో హిందువులు, ముస్లింలు, గుజరాతీయులు, పంజాబీలు, మరాఠీ, కన్నడిగులు, క్రైస్తవ మతస్థులు అందరూ కలసిమెలసి ఉన్న కారణంగా వేషంలో, భాషలో మిళితాలున్నాయి. భాషలో, యాసలో తేడాలున్నా భావవైరుధ్యాలు లేకుండా వుండటమే ఈ ప్రాంత ప్రత్యేకత.

## అలంకరణ

ఇక్కడి స్త్రీలు హుందాగా అలంకరించుకోవటానికి ఇష్టపడతారు. విపరీతమైన ఫ్యాషన్‌ల జోలికి వెళ్ళరు. సామాన్యులైనా ధనవంతులైనా స్థాయిని బట్టి వారి వేషం, అలంకరణ ఉంటుందే కాని ఆడంబరాలు తక్కువే. సాధారణంగా ఇక్కడి మహిళల ఆభరణాలుగా నాను, కంటె, వడ్డాణం, మాటీలు, ముక్కుపుడక, చెంపసరాలు, చంద్రవంక, కడియాలు, కాళ్ళకు గొలుసులు, వంకీలు, చంద్రహారం, పాపిడిబిళ్ళ, ఒంటిగజ్జె వంటివి పెట్టుకుంటారు. వీటినే నేడు రకరకాల నవీన ఆకృతులతో మలిచి ధరిస్తున్నారు. బంగారునగలు తప్ప ఇత్తడి నగల జోలికి వీరు వెళ్ళరు.

ఇలా భిన్న మండలాలతో, భిన్న యాసలతో, సంస్కృతులలో విలసిల్లే కర్నూలు జిల్లాలో ప్రజల బతుకులు, బంధాలు, సమస్త జీవన విన్యాసపు మేళవింపులు చూడదగ్గవి. అతి సుందరమైనవి.

"ఏ జనని నితాంత సౌజన్య సంపద
నపరంజి ప్రభవించు నాంధ్రధరణి
ఏ యంబ క్షీరవాహినుల నాస్వాదించి
తేజమ్ము గాంతురు తెలుగు ప్రజలు
ఏయమ్మ ప్రేమాంక హేమభూమి వసిచె
రమణీయ వర్ణ వజ్రాల ఘనులు
ఏ తల్లి తరళ తనూ తరంగాల
ప్రాకాదు నవ్యాంధ్ర నౌకాదళంబు

**ఆ జలముల జాబిల్లి కృష్ణమ్మ తల్లి......** (సముద్రాల ఆంజనేయులు) అని కొనియాడబడుతున్న కృష్ణమ్మ తన తీరాన ఉన్న ఎన్ని మానవ సంచారాలకు జీవజలాలనిచ్చి ఇలా పలుకరిస్తూ పోతుందో. వారి సమ్మిళిత సౌజన్య జీవన సౌందర్యాన్ని చూసి ఎంతగా మురిసిపోతున్నదో. నాగరిక ప్రజలకు మాత్రమే కాక ఆటవికజాతులకు కూడా ఈ ప్రవాహాలు బ్రతుకునివ్వడం చూస్తే మనసు భక్తితో ప్రణమిల్లుతుంది. కర్నూలుప్రాంతంలోని నల్లమలఅడవుల్లో ఉండే చెంచులు ఒక విశిష్టమైన జీవనాన్ని నెలకొల్పుకున్నారు. ప్రత్యేకించి చెంచులు అడవులకు అటవీ మృగాలకు ఆధారమై జీవిస్తున్నవారెందరో. ఏపూట ఆకలికి ఆ పూట వెదుకులాట అనే సంస్కృతి కలిగిన ఈ చెంచుల నిస్వార్థ జీవనం ఆదిమ నాగరికతగా తోచినా అసలైన బ్రతుకుకర్థం వారిలోనే చూస్తున్నట్టు అనిపిస్తుంది. ప్రభుత్వ ప్రోత్సాహాల వల్ల వీరిలో కొందరు జనపదాలకు మళ్ళటం గమనార్హం.

ఇలాంటి పరమపావన నదీమతల్లుల అమృతస్పర్శచే కర్నూలు ప్రాంత ప్రజల సాంఘికజీవన ప్రవంతి సజావుగా సాగుతోంది. కష్టసుఖాలు అనే ఎత్తుపల్లాలు ఎన్ని ఉన్నా పారేప్రవాహంలా ఒడుపు చూసుకొని గడుసుగా ముందుకు దూకుతూనే ఉంది. ఉన్నంతలో బ్రతకటం ఉన్నతంగా బ్రతకటం అనే మార్గంకోసం తపన పడుతుంది. తరాలనాటి బ్రతుకువిధానాన్ని కాలానుగుణంగా మార్చుకుంటూ క్రొత్తది చేర్చుకుంటూ జీవచైతన్యాన్ని నిలుపుకోవటానికి శతధా ప్రయత్నిస్తూనే ఉంటుంది. ప్రవాహఉధృతిలా ప్రమాదాన్ని తెచ్చిపెట్టి, మలినపడినా తిరిగి సెలయేటి నురగలా స్వచ్ఛమైన మనసును నిర్మించుకొనే మంచి మలుపుకు సిద్ధంగా ఉంటుంది. కడలినిచేరే ప్రవాహంలా కడకు పరమార్థాన్ని వెతుక్కుంటూ ప్రశాంత జీవన సౌందర్యానికి పరుగులు తీస్తుంది. అందుకే భక్తి విశ్వాసాలతో ఈ పుష్కర సందర్భంగా కర్నూలు జిల్లా ప్రజానీకం యావత్తూ

**"కర్షకుల పాలిటి ఓ కల్పవల్లి
కడుపునింపెడు జీవజలములకు తల్లి
కదలి రావమ్మ కృష్ణమ్మ మా గడపలకు
కందనోలిడె మ్రొక్కు కడగి నీ పదములకు"** – అని ముక్తకంఠంతో గానం చేస్తోంది. నదులు నవజీవనోద్ధారకాలని మ్రొక్కి కొలుస్తోంది.

చిరునామా : *డా॥ దండెబోయిన పార్వతీదేవి, తెలుగు అధ్యాపకురాలు, సిల్వర్‌జూబ్లీ ప్రభుత్వ కళాశాల (స్వ), కర్నూలు.*
*ఆం.ప్ర. 94408 34017,* drparvathidevi123@gmail.com

డా॥ బీరం సుందరరావు

# మన ప్రాచీన పశుసంపద - ఒంగోలు జాతి ఎడ్లు

"ఒంగోలు వృషభమ్ము
మనదేశ గర్వమ్ము
నింగికీ నేలకూ
నిలువెత్తు అందమ్ము!
రంకెవేసిందంటే
కైలాసమే వంగురా
చాలుదున్నిందంటే
రతనాలు పండురా!
కాడిమోసిందంటే
కనకాభిషేకాలు
కాలుదువ్విందంటే
కదులురాలోకాలు!

అని జిల్లాకు చెందిన ప్రముఖ వైద్యులు డాక్టర్ మండువ నరసింహారావుగారు (ఒంగోలు) మన ఒంగోలు జాతి గిత్తల గొప్పతనాన్నిగొప్పగా వర్ణించారు.

ఒంగోలు జాతి పశువులు ప్రపంచానికే గర్వకారణం. ప్రపంచం లోనే అత్యుత్తమ జాతి పశువులుగా గుర్తింపు పొందాయి.అఖిల భారత స్థాయిలోను, అంతర్జాతీయ పశుప్రదర్శనల్లోను, అందాల పోటీల్లోనూ మన ఒంగోలు జాతి కోడెలు, ఆవులు ప్రథమ స్థానంలో నిలిచి తెలుగు వారికి అఖండఖ్యాతిని తెచ్చాయి.

మానవజీవన పరిణామ క్రమంలో పశుసంపదకూడముఖ్య భాగస్వామిగా నిలిచింది. మనదేశంలో సింధూనాగరికత కాలంనుండి రైతులు వ్యవసాయం చేసినట్లు పశువులు ముఖ్యపాత్ర వహించినట్లు ఆధారాలున్నాయి.సింధూలోయలోను, పరిసర ప్రాంతాల్లోనూ ఒంగోలు జాతి పశుసంపద విస్తరించినట్లు తెలుస్తుంది. సింధూనాగరికత కాలం నాటి ఎడ్లకు, మన ఒంగోలు జాతి ఎడ్లకు దగ్గర పోలికలున్నాయి.

భారత,రామాయణ కాలాల్లో కూడ పశుసంపదనే రాజులు ప్రధాన సంపదగా భావించేవారు. భారతకాలంలో విరాటమహారాజుకు లక్షల ఆవులుండేవి. ఉత్తర, దక్షిణ గోగ్రహణాలు అందుకు నిదర్శనం. మధ్య యుగంలోనూ, 13వ శతాబ్దంలోనూ గోసంపద అధికంగా వుండేది. కనిగిరి సీమను పాలించిన కాటమరాజుకు గోసంపద పుష్కలంగా వుండేది.అలాగే పల్నాటి బ్రహ్మన్న తన అనుచరులతోఆవుల మందలను శ్రీశైలం మేడపి అడవుల్లో మేపుకుంటూ జీవనం సాగించినట్లు చరిత్ర చెబుతున్నది. 1950 ప్రాంతాల వరకు కూడ మన గ్రామాల్లో రైతులకు పశుసంపద అధికంగావుండేది.

ఒంగోలు జాతి పశువులు అందంలోనూ,ఆకారంలోనూ, అవయవ సౌష్ఠవంలోనూ వాటికవేసాటి.బరువులు లాగడంలోనూ, అధికపాల దిగుబడిలోనూ, రోగనిరోధకశక్తిలోనూ మేలిమిజాతిగా గుర్తింపు పొందాయి. అసలు, సిసలైన ఒంగోలు జాతి ఎడ్లు, ఆవులు ప్రకాశం జిల్లాలోని గుండ్లకమ్మనది దక్షిణప్రాంతం, మూసి, పాలేరుల మధ్య ప్రాంతాల్లో విస్తరించి వున్నాయి. బ్రెజిల్, ఆస్ట్రేలియా, స్వీడన్, ఫిలిప్పీన్స్, ఇండోనేషియా, అర్జెంటైనా వంటి దేశాల్లో ఒంగోలు జాతిపశుసంపద పుష్కలంగావుంది. ఆయాదేశాల నుండి పశుపోషకులు మన, ఒంగోలు జాతి ఎడ్ల, ఆవుల అందచందాలను, బలిష్టతను, రాజసాన్ని చూసి, ముచ్చటపడి, లక్షల రూపాయలు వెచ్చించి, పశువులను,వాటి వీర్యాన్ని కొనుగోలు చేసితమదేశల్లో సంకరపరచడం ద్వార ఒంగోలుజాతి పశు సంపదను అభివృద్ధి చేసుకున్నారు. ప్రకాశం జిల్లాలోనికరవది, ఈతముక్కల, అమ్మశ్రబోలు, ఉలిచి, నేతివారిపాలెం, చీమకుర్తి చంద్రపాడు, తదితర గ్రామాలకు చెందిన ఆబోతులు మేలిమి జాతిగా నిర్ధారింపబడ్డాయి. 1950లో అద్దంకి వద్ద జరిగిన సింగరకొండ తిరునాళ్ళలో "కరవది ఆబోతు" ను చూచి రైతులు, పశునిపుణులు "అపరనంది" గా కొనియాడినట్లు పెద్దలు చెబుతారు. ఒంగోలు జాతికి వుండవలసిన 66 అవయవ పుష్టులు, సౌష్ఠవాలు ఈకరవది ఆబోతుకున్నాయని చెబుతారు.

### ఒంగోలు జాతి గిత్తలు లేదా ఆవుల ముఖ్యల లక్షణాలు :

ఒంగోలు జాతి ఆవులు లేదా గిత్తలకు (మేలురకం) ముఖ్యంగా 9 నలుపులు, 7 కురచలు, 7 తెలుపుబండారిని పశుపోషక రంగ నిపుణులు నిర్ధారించారు.

### 9 నలుపులు :

కొమ్ములు, కళ్ళు, చెవులు, ముట్టె, బొద్దు, మోకాలు, తోక, గిట్టలు, ఆసనం నల్లగావుండాలి.

### 7 కురచలు :

ముట్టె, కొమ్ములు, చెవులు, మెడ, కాలు,బొద్దు,తోక కురచగా వుండాలి.

### 7 తెలుపులు :

మూతి, కన్ను, ముట్టె, ముడ్డి, తోక, బొద్దు, గిట్టెలు.

9 నలుపులుండే గిత్తలను, ఆవులను నల్లపట్టె జాతిగా పిలుస్తారు. ఇది అసలైన ఒంగోలు జాతి. వీటిలోనే "బ్రాహ్మణ జాతి" పశువులకు 7 కురచలతో పాటు, 7 తెలుపులుంటాయి. వీటిని "ఎర్రపట్టె" జాతిగా పిలుస్తారు.

ఇవి సేద్యానికి పనికివస్తాయి. బరువులు లాగడానికి పందాలకు పనికిరావు. అయితే వీర్యాన్ని సంకర పరచడం కారణంగా(క్రాస్ బ్రీడింగ్) అసలైన ఒంగోలు జాతి క్రమంగా అంతరించి పోతుంది. ప్రస్తుతం కృష్ణా, గుంటూరు, కర్నూలు, ప్రకాశం, ఖమ్మం జిల్లాల్లోని మోతుబరి రైతులు మాత్రమే ఒంగోలుజాతి గిత్తలను, ఎడ్లపందాల కోసం, సమాజంలో హోదాకోసం అధిక వ్యయప్రయాసలతో మేపుతున్నారు. ప్రస్తుతం బ్రెజిల్, అర్జెంటైనా, ఫిలిప్పీన్స్ వంటి దేశాల్లోఒంగోలు జాతి పశువులు 6 లక్షలకు పైగా వుండగా, మన రాష్ట్రంలో 3లేదా4 లక్షలుంటాయని అంచనా. పశుపోషణ భారం కావడమే ప్రధాన కారణం.

ఒంగోలు జాతి గిత్తలకు రొమ్ము భాగం విశాలంగా వుంటుంది. ఎముకపుష్టి వుంటుంది. ముద్దచెండు వుంటుంది. వెన్ను నలుపు వెంట్రుకలతో నల్లగా వుంటుంది. గిట్టలు సమానంగా వుంటాయి. గుడ్డు (కన్ను) నల్లగా వుంటుంది. రెప్పలు నల్లగా వుంటాయి. మెడ బలంగావుంటుంది. గంగడోలు ఏడు ఒంపులతో వుంటుంది. చెండు వెనుక నడుమసన్నగా వుంటుంది. డొక్కలు పెద్దవిగా వుంటాయి. ముడ్డివద్ద తోకలోపలకు (లోతోక) వుంటుంది. ఎద్దుకు తగిన విధంగా "వట్ట"(బీర్జాలు) వుంటుంది. లెక్క సరిగాసుడులు వుంటాయి. కురచ కొమ్ములుంటాయి. ఈ లక్షణాలు కల్గిన ఒంగోలు జాతివిడ్లను, ఆవులను రైతులు, విదేశీయులు ఖర్చుకు వెనకాడకుండా కొనుగోలుచేస్తారు.

ప్రకాశంజిల్లాకు చెందిన ప్రఖ్యాతకవి డా॥ నాగభైరవకోటేశ్వరరావు గారు జనవ్యవహారంలో వున్న కథను స్వీకరించి "నదిచెప్పని కథ" కావ్యం రాశారు. అందంలోను, రాజసంలోనూ సాటిలేని ఒంగోలు జాతి కోడెలను చూచిన ఆవులు మోహంతో వాటివద్దకు చేరగనే, గిత్తతో సంగమం అనంతరం అదే పోలిక కోడెలు పట్టేవని కథను అల్లి, కావ్యంగా మలిచారు. శాస్త్రీయంగా కొంత అవాస్తవమైనప్పటికీ, ఇందులోని కవి సామాజిక దృష్టిని మనం కాదనలేము.

> **"ఎదకువచ్చినట్టియే ఆవునైనను**
> **తెచ్చి, నందిచుట్టుతిప్పి, నిలిపి**
> **గర్భదానమునకు కలుపుదురాబోతు**
> **ఇప్పటికిని రైతు లిచటివారు"**

ఒంగోలు జాతి గిత్తలాగేవున్న "నంది" (చెక్కినశిల్పం)చుట్టూ ఆవుల్ని తిప్పగానే, నందిని నిజమైన ఆబోతుగా భావించిన ఆవులు తమకంతో అనుభూతిని పొంది, అందమైన కోడెలను జన్మనిస్తాయని నాగభైరవగారి కథను "సొగసున ఒంగోలు ఎడ్లను మిగులంగల ఎద్దు భూమి మీదంగలవే!" - అని నాగభైరవ ఒంగోలు జాతి ఎడ్లకు అక్షరనీరాజనం అర్పించారు. ఒంగోలుకు చెందిన ప్రఖ్యాత వైద్యులు డా॥చుంచుచలమయ్య, చేకూరపాడుకు చెందిన వద్దెళ్ళ శేషయ్య, మద్దిరాలపాడుకు చెందిన పుచ్చకాయల రాజేంద్రప్రసాద్, కర్నూలు జిల్లాకు నంద్యాలకు చెందిన నాగిరెడ్డి, కృష్ణాజిల్లాకు చెందిన కుక్కల నాగేశ్వరరావు(మాజీ జెడ్. పి. చైర్మన్) తదితరులు ఒంగోలు జాతి పశుసంపద సంరక్షణలో అగ్రగాములుగా వున్నారు.

ప్రభుత్వం పశుపోషణ పట్ల శ్రద్ధ వహించడం లేదు. రైతుల వ్యవసాయ రంగాన్ని వదిలి,ఇతర రంగాలకు వలసపోతున్నారు.ఒంగోలు పశువులు వ్యాపార వస్తువులుగా మారాయి. ఫలితంగా ఒంగోలుజాతి పశుసంపద క్రమంగా అంతరించి పోతుంది. ఇప్పటికైనా ప్రభుత్వం, ప్రజలు కన్ను తెరచి, అరుదైన, అపురూపమైన ఒంగోలుజాతి పశువులను కాపాడుకోవాలి.

చిరునామా : డాక్టర్. బీరం సుందరరావు, ఇంకొల్లు - 523167, ప్రకాశం జిల్లా : 9848039080

శ్రీ రావెల సాంబశివరావు

# తెలుగులో పరిపాలన స్థిరపడేనా?

భావ ప్రయోజనాలలో పరిపాలన స్థానం పదిలం అనే విషయం నిర్వివాదాంశం. భారతదేశాన్ని యుగాల తరబడి రాజులు పాలించారు. వాళ్ళల్లో స్వదేశానికి సంబంధించిన వాళ్లున్నారు ; విదేశాలకు సంబంధించిన వాళ్లున్నారు. ఎవరి భాషల్లో వాళ్లు పరిపాలన సాగించుకున్నారు. రాజభాషలో పాలన సాగితే అది రాజుకు సుఖం. ప్రజల భాషలో పాలన సాగితే అది అందరికీ సుఖమేగాక ప్రజాస్వామ్యం కూడా అవుతుంది.

భిన్నత్వంలో ఏకత్వం అన్నది భారతీయ సంస్కృతికి మూల కందమై కూర్చున్నది. అది అటు భాషకు, ఇటు పాలనాభాషకూ పరివ్యాప్తమై కులికింది. చరిత్రకు అందని కాలాలను అలా వదిలేస్తే చరిత్రకు అందిన కాలాలలో రాజుల ఏలుబడిలో వారి వారి రాజ్యాలలో విభిన్న రాజ భాషలు వెలుగొందినా చక్రవర్తుల భాష ఆయా రాజ్యాలలోకి చొచ్చుకువచ్చి పైచేయిగా నిలిచేది. మొగలాయీల కాలంలో అరబ్బీభాష అలా వెలుగొందితే, ఆంగ్లేయులకాలంలో ఆంగ్లభాష అలా వేళ్లూనింది. ఆంగ్లభాషకు పరిపాలనా భాషగా మనపై రుద్దిన తెల్లదొరలు తొలగిపోయారుగాని వారి భాష మాత్రం ఇక్కడి నల్లదొరల పరమయ్యింది. అందుకే నవయుగకవి చక్రవర్తి జాషువ దొరలు దాటి పోవ దొంగలు మిగిలిరా !" అని చురకవేయటం.

ఇన్ని ఆటుపోట్లను తట్టుకుంటూ హిందీ తరువాత భారత ప్రజలలో అధికశాతం ప్రజలు మాట్లాడే భాషగా తెలుగు నిలదొక్కుకుంది. దాని ప్రాచీనతను ఋజువు చేసుకునేందుకు ఇంకా న్యాయస్థానాల పంచల్లో పడిగాపులు పడుతూనే ఉంది. భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు తరువాత తెలుగు రాష్ట్రంలో పరిపాలన తెలుగులోనే జరుగుతుందని సంబరపడినా నందమూరి తారక రామారావుగారు ముఖ్యమంత్రి అయ్యేవరకు ఆ విషయాన్ని అంతగా పట్టించుకున్న నాథుడు లేడు. అసలు అప్పటివరకు మన గుర్తింపు ఉత్తర భారతంలో 'మద్రాసీ' అనే అరవల మాదిరిగానే మనకూ ఆంగ్లంపైనే మోజు. అయితే వాళ్లది నేల విడిచిన సాముకాదు. వాళ్లు వాళ్ల రాష్ట్రంలో తమిళాన్ని అధికారభాషగా స్థిరపరచుకోవటంలో ముందంజలో ఉన్నారు. మనం వెనుకబడిపోయాం.

అవిభాజ్య ఆంధ్రప్రదేశ్ దక్షిణాది రాష్ట్రాలన్నింటిలో పెద్దది. ఇప్పుడు ఆ హోదా విడివడిన తెలుగు రాష్ట్రాలకు మిగలదు. ఏదో నలుగురిలో నారాయణా అంటూ బ్రతుకులు సాగుతున్నాయి. మనల్ని విభజించే కుట్రను అందరం కలసికట్టుగా తిప్పికొట్టలేకపోయాం. ఇప్పటివరకు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో ఉర్దూను నిర్మించటం కుదరదనే సాకులు చెప్పుకున్నాం. ఇప్పుడిక అటువంటిది కుదరదు. ఆంగ్లంపై మోజు సరే ఈ వెర్రి వ్యామోహమేమిటని ?

ఏ భాష అయినా నేర్చుకోవటం అంత కష్టం కాదని తరతరాలుగా దేశంలోని వివిధ ప్రాంతాలకు, విశ్వంలోని వివిధ దేశాలకు వలస వెళ్ళిన మనవాళ్ళు మనకు తెలియజేస్తూనే ఉన్నారు. అవసరం వాళ్లకు సకల భాషల్ని బోధించింది. కనుక అధికార భాష నేర్చుకునేందుకు పాండిత్యం అక్కర్లేదు. వ్యాకరణాలక్కర్లేదు. వ్యవసాయదారులుగా తుంగభద్ర డామ్ ఆయకట్టు ప్రాంతానికి చేరిన తెలుగువాళ్లకు కన్నడం అర్థంచేసుకునేందుకు, ఆ భాష మాట్లాడేందుకు ఆరు మాసాలకు మించి పట్టలేదు. వ్యవసాయదారులుగా పెద్దగా చదువుకోనివారు వారిది కాని భాషను అంత త్వరగా స్వంతం చేసుకుంటే తెలుగు వాళ్లుగా పుట్టి, పెరిగి, చదువుసంధ్యలు నేర్చి ఉద్యోగం చేసేవారికి తెలుగులో ఫైళ్లు నడపలేనంతగా జబ్బేం చేసిందో ! తెలుగులో తనకు తట్టిన ఆలోచనను తనకు అంతబాగా పట్టుబడని ఆంగ్లం ఫైళ్లల్లో వ్రాయగలం అనుకునేందుకు కారణం అలవాటేనని గ్రహించాల్సిఉంది. తెలుగులో ఫైళ్లు రాయటం ప్రారంభిస్తే ఆ సులువు తెలుస్తుంది. అదీ అలవాటుగా మారుతుంది. అనవసరపు భయాలు పటాపంచలవుతాయి. అసలు మనం ఆలోచించటం మానేశాం. దుస్తులు

స్వయంగా కుట్టించుకోవటం తగ్గిపోతున్నవి. వంటలు చేసుకోవటం తగ్గిపోతున్నది. ఇది రెడీమేడ్స్ యుగం ; ఫాస్ట్‌ఫుడ్స్ యుగం. పూర్వం పెద్ద పెద్ద ఉద్యోగాల్లో ఆంగ్లేయులుంటే ఇప్పుడు ఇంగ్లీషు కాన్వెంటుల్లో చదివివచ్చే వాళ్లుంటున్నారు. అందుకే జిల్లా పరిధిలో సైతం తెలుగు అధికారభాషగా మారకుండా అలా మొరాయించటం, ఇక మేథో వలసల విషయానికొస్తే ఇతర దేశాలకు మనమేధావులువలస వెళ్లటమే కాని ఇతర దేశాలనుండి మనదేశానికి వలస వచ్చేవాళ్ళసంఖ్య అరుదు. వలస వెళ్లేమేధావులు వాళ్లతంటాలేవో వాల్లు పడతారు.మన పరిపాలన మన భాషలో జరుపుకోలేనంతటి జబ్బు మనకెందుకు సోకిందో ? !

పరిపాలనా భాష ఇంగ్లీషును వాడుకోవడంవల్ల అధికారులకూ ప్రజలకూ మధ్య పూడ్చనలవిగాని అగాధం ఏర్పడుతుంది. అధికారులు ఇంగ్లీషు రానివాళ్లను చిన్నచూపు చూడటం నిత్యం మన దృష్టికి వచ్చే అంశమే. ఇది ప్రజాస్వామ్యానికి మాయనిమచ్చగా తయారుకాగలదని భాషావాదులు భయపడి మిన్నకుండలేదు. వాళ్లు హెచ్చరికలు చేస్తూనే వస్తున్నారు. న్యాయస్థానాలలో న్యాయవాదులు విధిగా తెలుగులోనే వాదించాల్సివస్తే ఎదుటివాళ్లున్నా ఏమేరకు పక్కదారి పట్టిస్తున్నారో సులభంగా అర్థంకాగలదు.

ప్రజల భాషలోనే పరిపాలన సాగాలనే కోర్కెను విశాలాంధ్రలో ప్రజారాజ్యం అనే పత్రం ఏనాడో ప్రతిపాదించింది. అయినా 1835లో మెకాలే ప్రతిపాదించిన ఆంగ్ల విద్యా ఉద్యోగి వర్గం తమ బానిసత్వా న్నుండి బయటపడిందెక్కడ? మూడుశాతం జనాభాకికూడా ఆంగ్లభాషా పరిజ్ఞానం అంతంత మాత్రంగా వున్న పరిస్థితుల్లో ఆంగ్లభాషలోనే పరిపాలన సాగించటం అప్రజాస్వామికమని మాతృభాషా వాదులు ఎంతగా గొంతెత్తి ప్రభుత్వం ముందు అరిచి గీపెట్టినా అదంతా చెవిటివాని ముందు శంఖం ఊదిన చందమయ్యిందని పించటంలేదా?

నవ్యాంధ్రప్రదేశ్ ప్రస్తుతం ప్రమాదానికి గురయినట్లుగానే తెలుగు భాష ఆంధ్రప్రదేశ్‌లో ఏనాడో ప్రమాదంలో పడిపోయింది. ఏదో కొన ఊపిరితో కొట్టుమిట్టాడుతూ వుంది. ఆ స్థితిలో వున్న పాలనాభాషకు జవసత్వాలు కల్పించవలసిన అవసరం ప్రభుత్వానికి లేదా?

"భాష ఆధారంగా తెలుగుభాష పునాది మీద సువిశాల ఆంధ్ర రాష్ట్రాన్నయితే ఏర్పరచుకుంటారుగాని తెలుగులో ఆ రాష్ట్రాన్ని పాలించు కోలేరు" అని అప్పుడెప్పుడో నిష్కర్షగా చెప్పిన డా॥ రామ్‌మనోహర్ లోహియాను పలువురు వితండవాదిగా భావించినా నిజం నిలకడమీద తెలుస్తుందనీ సామెతను ఋజువు చేసినట్లుగా లేదూ ?

పాలనాభాషగా తెలుగును అమలుచేయాలంటే సి. బి. బ్రౌన్‌కు తెలుగుపట్ల గల శ్రద్ధలో ఆవగింజంతయినా మనపాలకులకు వుండవద్దా?

గడచిపోయిందేదో గడచిపోయింది. అనేక కారణాలనుండి ఆంధ్ర ప్రదేశ్ నవనిర్మాణానికి అంకితమైన ప్రస్తుత ప్రభుత్వం పరిపాలనను తెలుగులో సాగించి తెలుగువాళ్లు తలెత్తుకు తిరిగే దిశగా దాని వేగాన్ని పెంచి,వాళ్లకుఆత్మస్థైర్యాన్ని పంచి ప్రజాస్వామ్య విలువల్నికాపాడే దిశగా ముందుకు అడుగులు వేస్తుందని ఆశిద్దాం. అవును ఇది రోజుల్లోనో, మాసాల్లోనో పూర్తయ్యే పనికాకపోవచ్చును. పోనీ మళ్లీ వచ్చే కృష్ణాపుష్క రాలకయినా మన రాష్ట్రంలో తెలుగులో పాలన స్థిరపడుతుందా ?

*ఈ యాషాఢ నవాంబుదార్భటులతో*
*నేకశ్రుతిం గల్పి త*
*ల్లీ! యీ రీతిగ నిత్య యౌవన సుధా*
*శ్రీరాగ మాలాపనల్*
*చేయం జాలితి వెన్నిమారు లిటులన్*
*జీర్ణించు నా బొంట్లకున్*
*ప్రాయంబింత చిగుర్ప నేర్పితివె*
*అంబా! కృష్ణవేణీనదీ!*

డా॥ భాను నాయక్

# నల్లమల చెంచుల సంస్కృతి - జీవన విధానం

ప్రపంచంలో ఆఫ్రికా ఖండం తర్వాతగిరిజనులకుకేంద్రం భారతదేశమే. దేశంలో గిరిజనులు 10 కోట్లు మంది ఉన్నారు. ఆంధ్రప్రదేశ్‌లో 70 లక్షల వరకు ఉన్నారు. ఈ గిరిజనులు 21 రాష్ట్రాలు, 4 కేంద్రపాలిత రాష్ట్రాలలో సరిహద్దు ప్రాంతాలు, కొండలు, గుట్టలు గల ప్రాంతాలలో జీవిస్తున్నారు. దేశంలో గిరిజనులు 457 తెగలు, ఉపతెగలుగా ఉండి 100 భాషలు మాట్లాడుతున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో 35 గిరిజన తెగలు ఉన్నారు. ఈ 35 గిరిజన తెగలలో ఒక తెగ చెంచులు.

మన రాష్ట్రంలో చెంచులు ప్రధానంగా ప్రకాశం, గుంటూరు, కర్నూలు, మహబూబ్‌నగర్, నల్గొండ జిల్లాలలో విస్తరించి ఉన్నారు. వీరు నల్లమల అటవీ ప్రాంతంలో వేలసంవత్సరాలుగానివసిస్తున్నారు. వీరు పూర్తిగా ఆదివాసులు. చెంచు తెగ ప్రాచీన సంచార తెగలలో ఒకటి. నల్లమల అటవీప్రాంతంలోనే కొండలు, గుట్టలు వీరి నివాసస్థలాలు. 2001 జనాభా లెక్కల ప్రకారం మన రాష్ట్రంలో 49,232 మంది చెంచులు నివసిస్తున్నారు. వీరి మొత్తం అక్షరాస్యత శాతం 32.28. అందులో పురుషుల అక్షరాస్యత శాతం 40.87, స్త్రీలది 23.48 వీరి మాతృభాష 'తెలుగు' మాట్లాడుతారు.

**చెంచువారిని నాలుగు రకాలుగా విభజించవచ్చు.**

1.అడవి చెంచులు, 2.దేవ చెంచులు, 3.బొంత చెంచులు, 4.కృష్ణ చెంచులు.

వీరిలో అడవి చెంచులు, దేవ చెంచులు, నల్లమల అడవులలో నివసిస్తారు. బొంత చెంచులు, కృష్ణ చెంచులు మైదాన ప్రాంతాలలో నివసిస్తున్నారు. అడవి చెంచులు, దేవ చెంచులు సాంఘీక జీవనం, గోత్రం, కుల కట్టుబాట్లు, ఆచార సంప్రదాయాలు మొదలగునవి పద్ధతులు ఒకే విధంగా ఉంటాయి. వీరు అడవులలోలభించే వివిధరకాల పండ్లు, దుంపలు, వెలగకాయలు, చిల్లగింజలు, కుంకుడు కాయలు, చింతపండు, బలక, ముష్టిగింజలు, ఉసిరికాయలు, సుగంధగడ్డ మొదలగు వాటిని సేకరించి, వాళ్ళ అవసరాలకు ఉపయోగించుకోగా మిగిలిన వాటిని 'గిరిజన సహకార స్టోర్స్' విక్రయించి, వారి వద్ద నుండి తమకు అవసరమైన నిత్యావసర వస్తువులను తీసుకుంటారు.

**చెంచుల ఇంటిపేర్లు :**

1) కుడుముల 2) దంసాని 3) జల్ల 4) మండ్లి 5) చెవుల 6) తోకల 7) ఉడతల 8) నిమ్మల 9) పిట్ట 10) చిగుర్ల 11) మేఖల 12) భూమని 13) దాసలి 14) పులిచెర్ల 15) ఆర్తి 16) పిట్టల 17) గడ్డమోళ్ళు.... మొదలగునవి గోత్ర నామాలు ఉన్నాయి.

**జీవన విధానం :**

చెంచులు జీవనోపాధికై అటవీ సంపదపై ఆధారపడి జీవిస్తుంటారు. బంక, తేనె, జిగురు, ఇప్పపూలు, సారాపప్పు, ముసిడిపిక్క బుట్టలు, తట్టలు, వెదురు – తడికలు మొ॥గువాటిని అమ్మి జీవిస్తుంటారు. అంతేకాక కూలీ పనులకు వెళ్ళి కూడా జీవిస్తుంటారు.

వీరి నివాస స్థలాలు కృష్ణానదికి ఇరువైపుల పరివాహక ప్రాంతంలో వున్నాయి. వీరు నివసించే నల్లమల అటవీ ప్రాంతాన్ని పులుల అభయారణ్యం గా ప్రభుత్వం ప్రకటించింది. వీరు నివసించే గ్రామాలు 10 లేక 30 ఇండ్లతో వుంటాయి. వీరి గ్రామాలను 'గూడెం' లేక 'పెంట' అని పిలుస్తారు. వీరు జీవనం చెట్ల క్రిందనే కనుక వీరికి 'చెంచులని' పేరు వచ్చిందని చరిత్రకారుల అభిప్రాయం. అంతేకాక 'మానవ పరిణామ శాస్త్రవేత్తలు చెంచుల రూపురేఖలకు, "వెడ్డోయిడ్" జాతి సారుప్యం వుందని చెబుతున్నారు. "వెడ్డోయిడ్" అనే పదం శ్రీలంక లోని ప్రాచీన తెగ అయిన "వెడ్డా" నుండి గ్రహించబడింది. ఈ "వెడ్డా"ల మాదిరిగానే చెంచులు కూడా రింగుల జుట్టు, వెడల్పు మొహం, చప్పడి ముక్కు, పొడవాటి దవడలు, పొట్టిగా నల్లగా వుంటారు. చెంచులు చాలా పరిమితమైన దుస్తులే తొడుక్కుంటారు. పురుషులు నడుముకు తోలు బెల్టును, పురికోస మొలతాడు కట్టుకుంటారు. మొలతాడుతోనే కట్టుకున్న "గోచీ" తో కనిపిస్తారు. అదే స్త్రీలు అయితే రవిక, చీర కట్టుకుంటారు. అంతేకాక విల్లంబులు, ఒక కత్తి గొడ్డలి,

గుంతలు తవ్వే కర్ర, కొన్ని కుండలు, బుట్టలు, మరికొన్ని వస్తువులే చెంచులు ఆస్తిపాస్తులు. వర్షాకాలం, చలికాలాలలో చెంచులు మట్టి గోడల గుడిసెల్లో గడుపుతారు. ఎండాకాలంలో వ్యక్తిగత కుటుంబాలుగా ఆరుబయట, తాత్కాలికంగా వేసుకున్న ఆకుగుడిసెల్లో తలదాచు కుంటారు. వీరి కుటుంబాలు అన్నీ చిన్నవిగా ఉంటాయి.

చెంచులలో వ్యక్తిగత స్వేచ్ఛ ఉంటుంది. భార్యా భర్త ఇద్దరిలో యిటు భర్తపుట్టింటి వారితోనైనా,అటు భార్య పుట్టింటి వారితోనైనా జీవించే వెసులుబాటు వుంటుంది.

చెంచులు వేట, ఆహార సేకరణపై ఆధారపడి జీవిస్తారు. వీరు ఆర్థికంగా బలహీనులు.వీరు ఆహారం కోసం అటవీ సంపదపై ఆధారపడి జీవిస్తారు.వీరి ముఖ్యఆహారం దుంపలు,నల్లగడ్డలు,తేనె,గంజి, పచ్చళ్ళు, ఆకులు, అడవిపండ్లు, మారేడు కాయలు, ఉసిరికాయలు మొదలగునవి పండ్లను ఆహారంగా తీసుకుంటారు. అంతేకాక చెంచులు ప్రధానంగా "మాంసాహారులు"వీరు "తేనె"సేకరించడంలో నేర్పులు.కొండ శిఖరాల్లో, కొండ చరియల్లో ఉండే తేనెను తీస్తారు. నేడు చెంచుల జీవన విధానం పూర్తిగా మారిపోయింది. ఇప్పుడిప్పుడే జన జీవనంలోకి కలిసి,తమ కట్టుబాట్లను ఆచార సంప్రదాయాలను వదిలేసి, నాగరికంగా జీవిస్తున్నారు.

చెంచుల ఆరాధ్యదైవం లక్ష్మీనరసింహస్వామి,శ్రీశైలం మల్లికార్జున స్వామి, చెంచుల ఆడపడుచు చెంచు లక్ష్మీతో లక్ష్మీనరసింహస్వామి వివాహం జరగడం ద్వారా వీరు ఘనంగా 'చెంచులక్ష్మీ' నరసింహ స్వామి ఉత్సాహాలు జరుపుకుంటారు. వీరి కుల దేవుళ్ళు-భమన్న, పోతయ్య, వీరయ్య, మల్లయ్య, చెంచులక్ష్మీ మొ॥గువారు.

చెంచులు ఉగాది, దసరా,శివరాత్రి, సంక్రాంతి దీపావళి మొ॥లగు పండుగలతో పాటు తమ దేవుళ్ళ పండుగలను భక్తి శ్రద్ధలతో జరుపు కుంటారు.వీరు దైవం పట్ల కృతజ్ఞత భావంతో కలిగి ఉంటారు. దైవ ప్రార్థన తర్వాత ఆహారాన్ని స్వీకరించడం వీరి అలవాటు. తేనెకోసం చెట్లు ఎక్కేముందుకానీ, కొండలపై ఎగబాకేటప్పుడుకానీ 'దేవతలను' ప్రార్థిస్తారు. తమకు ఆహారం, వేట, విజయవంతంగా లభిస్తే తాము సేకరించిన పదార్థాలలో కొంత భాగాన్ని దేవుడికి నైవేద్యంగా ప్రసాదం పెడతారు. వీరు 'తేనె' టీగలను 'దైవసమానంగా' భావిస్తారు.

## చెంచుల పాటలు :

నల్లమల అడవిబిడ్డలైన చెంచులు కృష్ణానది ఇరువైపుల (చాలా) ప్రాచీనకాలం నుండి శ్రీశైలమే నివాసంగా ఉండి ఆ కొండ ప్రాంతాలలో ఆటపాటలతో ప్రత్యేకమైన (మౌఖిక)గేయ సాహిత్యాన్ని కలిగి ఉన్నారు. వీరు దైవం పట్ల కృతజ్ఞత భావం పాడే పాట ఇలా ఉంటుంది.

## పాట :

"ఒక్కొక్క తాపో రెండొక్క తాపో తిమ్మెదో
రెండొక్క తాపో మూడొక్క తాపో తిమ్మెదో
మూడొక్క తాపో నాలుగొక్క తాపో తిమ్మెదో
నాలుగొక్క తాపో అయిదొక్క తాపో తిమ్మెదో
అయిదొక్క తాపో ఆరొక్క తాపో తిమ్మెదో
ఆరొక్క తాపో ఏడొక్క తాపో తిమ్మెదో
ఏడొక్క తాపో ఎనిమిదొక్క తాపో తిమ్మెదో
ఎనిమిదొక్క తాపో తొమ్మిదొక్క తాపో తిమ్మెదో
తొమ్మిదొక్క తాపో పదొక్క తాపో తిమ్మెదో
పదొక్క తాపో పదొక్క తాపో తిమ్మెదో"

*(గిరిగింజ గిరిమల్లెలు పు.13)*

## పాట విశిష్టత

పూర్వకాలం నందు ఈ నల్లమల్ల అటవీ ప్రాంతంలోని చెంచులు అందరూ శ్రీశైలంనకు అన్ని దిక్కుల్లో నివసిస్తూ ఉండేవారు. నేటికి కూడా నివసిస్తున్నారు. ఈ శ్రీశైల దేవస్థానమున దేవి ప్రధాన ఆలయమునకు చుట్టూ ఉన్న చిన్న చిన్న దేవాలయమునకు కాపాడుతూ, దేవతలకు పూజలు చేస్తూ ఈ నల్లమల్ల అటవీ ప్రాంతంలో దొరికే వివిధరకాల పండ్లు, మాంసం తింటూ జీవితంను గడుపుతుంటాను.

చెంచులు శ్రీశైలం యాత్రికులకు వారి చూపుతూదారిలో నడవలేని వారికి శ్రీశైలం దగ్గరగా ఉందని తెలుపుతూ మరియు పూర్తిగా నడవలేని వారిని 'చెంచులే' మోసుకుని పోయేవారు. చెంచులు వారిని మోసుకుని పోయేటప్పుడు వారికి (చెంచువాళ్ళకి) ఆ బరువు, అలసట మరచిపోయే విధంగా "ఈపాటను" పాడుకుంటారు. అంతేకాకుండా కొందరు చెంచులు ఇలా యాత్రికులను మోసుకొనేటప్పుడు వచ్చే డబ్బులతో జీవనము సాగించేవారిని ఈ పాటలోని ముఖ్య ఉద్దేశ్యం.

సమాజంలో మానవునికి వివాహపు దశ ఏ విధంగా ఉంటుందో, అదేవిధంగా చెంచుకులానికి చెందిన వారిలో కూడ వివాహం అనేది తప్పని సరిగ ఉంటుంది.చెంచు కుటుంబాలలో బాల్యవివాహాలు జరపడానికి కొన్ని కారణాలు ఉన్నాయి. తము పెండ్లి వయస్సు వచ్చేసరికి తాముజీవించి ఉంటామో లేక మరణిస్తామో లేకపోతే భవిష్యత్తులో తమ పిల్లల పెండ్లి కళ్ళారా చూస్తామో లేదోఅని తమ పెద్ద కోరిక మేరకే ఈ బాల్య వివాహం జరపడానికి సిద్ధపడతారు. ఈ వివాహాల సమయంలో సారాయి అనేది తప్పని సరిగ్గ ఉంటుంది. సారాయి లేకుండా పొరపాటున కూడా వీరి వివాహాలు జరగవు. చెంచులకు సారాయి ప్రీతిపాత్రమైనది.

## వివాహం :

చెంచు కుటుంబాలలో పురుషుడికి భార్య ఉన్నప్పటికీ ఎంతమంది స్త్రీలకైనా వివాహమాడవచ్చుననే ప్రాచీన ఆచారం యిప్పటికి ఉంది.

అయితే అతని ఇష్టాన్ని బట్టి, అతను పోషించే శక్తిని బట్టి ఉంటుంది. అదేవిధంగా చిన్న వయస్సులో భర్తలు చనిపోతే ఆ వితంతు స్త్రీలు కూడా ఇతర పురుషునితో వివాహం చేసుకోవచ్చు. ఎవ్వరిని చేసుకోవలెనన్నది ఆ వితంతు స్త్రీపై ఆధారపడి ఉండదు. ఎందుకంటే గూడెంలో పెద్దమనుషులు చూపించిన వ్యక్తిని మాత్రమే వితంతు స్త్రీ వివాహమాడవలసి ఉంటుంది. ఇది వితంతు వివాహానికి సంబంధించిన ఒక ప్రాచీన ఆచారంగా బోధపడుతుంది.

అదేవిధంగా అన్నగాని లేక తమ్ముడు మరణించాక అన్న భార్యను తమ్ముడు లేక తమ్ముని భార్యను అన్న వివాహమాడుట కూడా వీరి జాతిలో ఒక ప్రాచీన ఆచారంగా ఉన్నది?

చెంచులు అడవిలో ఎక్కడికి వెళ్ళిన ఒక 'కత్తి' భుజాన గొడ్డలి తప్పని సరిగ్గ ఉంటుంది. వీటితో పాటు ఒక కుక్క కూడాతప్పని సరిగ్గ ఉంటుంది. అంతేకాక దబ్బ, అంబులు, ఒక పట్టుడ కర్ర ఉంటుంది. అంతేకాక దబ్బ, అంబులు, ఒక పట్టుడ కర్ర ఉంటుంది. చెంచులకు తోడుగా ఎప్పుడు "భార్య" ఉంటుంది. ఎంత నట్టడవిలోనైనాసరే భర్త వెంట భార్య ఉండవలసిందే. భర్త తనకు ఎంత కొట్టిన, తిట్టిన, భరిస్తూ అతణ్ణి ఇష్టపడుతుంది. దీనికి ఉదాహరణగాచెంచుయువతి ప్రేమను మనం ఈ పాట ద్వారా తెలుసుకోవచ్చు

*(ఈ పాట పాడినవారు కుడుముల ఈదమ్మ, వయస్సు -65, ఊరు- పాలుట్ల)*

**పాట :**

'గురుగింజ గురుమల్లెలూ.....
గురుగింజ గురు మల్లెలూ.....
చింత చెట్టు క్రింద నా చిన్న లింగి
గురుగింజ గురుమల్లెలూ....
నా చిన్న లింగిని ఇంకెవరికి విస్తునో
గురుగింజ గురుమల్లెలూ...
మాలోని కిస్తను పోతావా బిడ్డ
గురుగింజ గురుమల్లెలూ....
మాలోని తోలు నేనొల్ల లేను తల్లీ
గురుగింజ గురుమల్లెలూ....
హనుమయ్య కిస్తను పోతావా బిడ్డ
గురుగింజ గురుమల్లెలూ...
హనుమయ్య చాకిరి నేను చెయ్యలేను తల్లీ
గురుగింజ గురుమల్లెలూ...
మాదిగొని కిస్తను పోతావా బిడ్డ
గురుగింజ గురుమల్లెలూ...
మాదిగోని కూలీపనులు నేను చెయ్యలేను తల్లీ
గురుగింజ గురుమల్లెలూ....
శివయ్య కిస్తను పోతావా బిడ్డ
గురుగింజ గురుమల్లెలూ...
శివయ్య చాకిరి నేను చెయ్యలేను తల్లీ
గురుగింజ గురుమల్లెలూ...
చాకలోని కిస్తను పోతావా బిడ్డ
గురుగింజ గురుమల్లెలూ...
చాకలోని చాకిరి నేను చెయ్యలేను తల్లీ
గురుగింజ గురుమల్లెలూ...
వెంకటయ్యకిస్తను పోతావా బిడ్డ
గురుగింజ గురుమల్లెలూ...
వెంకటయ్య చాకిరి నేను చేయలేను తల్లీ
గురుగింజ గురుమల్లెలూ...
కుమ్మరోని కిస్తను పోతావా బిడ్డ
గురుగింజ గురుమల్లెలూ...
కుమ్మరొని కుండలు నేను కొట్టలేను తల్లీ
గురుగింజ గురుమల్లెలూ...
గొల్లోని కిస్తను పోతావా బిడ్డ
గురుగింజ గురుమల్లెలూ...
గొల్లోన్ని గొర్రెలు నేను కాయలేను తల్లీ
గురుగింజ గురుమల్లెలూ...
ఉప్పరోని కిస్తను పోతావా బిడ్డ
గురుగింజ గురుమల్లెలూ...
ఉప్పరోని బావులు నేను తవ్వలేను తల్లీ
గురుగింజ గురుమల్లెలూ...
లంబాడోని కిస్తను పోతావా బిడ్డ
గురుగింజ గురుమల్లెలూ...
లంబాడోని ఆవులు నేను మేపలేను తల్లీ
గురుగింజ గురుమల్లెలూ...
చెంచోని కిస్తను పోతావా బిడ్డ
గురుగింజ గురుమల్లెలూ...
చెంచోనికైతే నేను పోతాను తల్లీ
గురుగింజ గురుమల్లెలూ...

చెంచోడు నీకేమి తెచ్చె బిడ్డ

గురుగింజ గురుమల్లెలూ...

చెంచోడైతే కుందేలు, ఉడుములు, ఉడతలు, తాంబోలు, ఇరగలు ... పెడతా తల్లీ.

గురుగింజ గురుమల్లెలూ...

చెంచోడైతే "కన్నెగుల్ల తేనే" తెచ్చి పెడతారు తల్లీ.

గురుగింజ గురుమల్లెలూ...

సారాయి తాగితే కొడతాడే బిడ్డ

గురుగింజ గురుమల్లెలూ...

సారాయి తాగైనా నన్ను సాకుతాడు తల్లీ

గురుగింజ గురుమల్లెలూ...

**పాట విశిష్టత :**

ఈ పాటలోని భావం ప్రధానంగా చెంచు యువతి తల్లి, తన కూతురు అనేక కులాల వారి పేర్ల ప్రస్తావించిన, తన తల్లి అనేక విధాలుగా ప్రయత్నించినా, ఆ చెంచు యువతి మనసులో వున్న మాట చెబుతుంది. తాను చెంచు యువకుణ్ణి పెండ్లి చేసుకుంటానని తన తల్లికి చెబుతుంది. తనకు అన్ని విధాల సుఖసంతోష, కష్టకాలంలో అయిన చెంచు యువకుడే కాపాడుతాడని తన తల్లి చెప్పి పెండ్లి చేసుకుంటుంది. ఈ విధంగా ఈ చెంచుల యువతి యువకులు ప్రేమ అంత మధురమైనదిగా మనం భావించవచ్చు.

**ఉపయుక్త గ్రంథాలు**


1. డా.వి.ఎన్.వి.కే.శాస్త్రి, ఆంధ్రప్రదేశ్ సంస్కృతి, పరివర్తన(2005), దామోదరం సంజీవయ్య సంక్షేమ భవనం,మాసబ్ ట్యాంక్ హైదరాబాద్.
2. గిరిగింజ గిరిమల్లెలు (2005), నల్లమలై పౌండేషన్, 1, ఒల్డ్‌బ్లాకు, స్రామాట్ కాంప్లెక్స్, హైదరాబాద్
3. నదీంహస్‌నైన్, భారతీయ గిరిజనులు (2007), ఓరియంట్ లాఙ్మన్, హిమాయత్ నగర్, హైదరాబాద్.
4. క్రిస్టాఫ్ పాన ఫ్యూరల్ హైమన్‌డర్ఫ్, మనుగడ కోసం పోరాట ఆంధ్రప్రదేశ్ ఆదివాసులు (2002) హైదరాబాద్ బుక్ ట్రస్ట్ హైదరాబాద్.
5. డా॥బి.రామాచార్యులు, తెలుగు కావ్యాల్లో గిరిజన సంస్కృతి, ఉస్మానియా యూనివర్శిటీ, హైదరాబాదు
6. Seethapati.p, Srisailam kaifiat, part-II, 1982, Andhra Pradesh.
7. Basic statistics on scheduled Tribes of Andhra Pradesh (2008), Tribal Cultural Research And Trining Institute, Tribal Department, Govt of Andhrapradesh, Hyderabad
8. చిన్న వెంకటేశ్వర్లు, భూక్యా, స్వతంత్ర్య భారతంలో ఆదివాస తెగలు (2004) పూజా పబ్లికేషన్, డోర్.నెం.7-10-68/1, వల్లూరివారి తోట, గుంటూరు.


*నిన్నా మొన్నటి దాక ఎండ బడి*

*యెంతే జాలిగా జాలుగా*

*నున్నా వోపిక లేక నాకు వలెనే,*

*ఒక్కమ్మడిన్ నేడు సం*

*పన్నాత్మీయ మహా ప్రవాహమున*

*సివ్వా లాడుచున్నావు నే న*

*ని న్నీనాడును పోలి పొంగ గల*

*నంటే, తల్లి, కృష్ణాపగా!*

శ్రీ కె. ఎస్. లక్ష్మణరావు

# నవ్యాంధ్రప్రదేశ్ విద్యారంగం - సూచనలు

పదమూడు జిల్లాలతో ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ మానవాభివృద్ధి సూచికలు చెప్పుకోతగిన విధంగా లేవు. మానవాభివృద్ధిలో ముఖ్యపాత్ర వహించే అక్షరాస్యత, ప్రాథమిక విద్య, డ్రాపౌట్స్ రేటు, ఉన్నత విద్యలో ఆంధ్రప్రదేశ్ ముందడుగు వేయాల్సి ఉంది. జాతీయ స్థాయి విద్యా సంస్థలను ఏర్పాటు చేసుకోవాలి. క్రమక్రమంగా పరిశోధనా కేంద్రాలు స్థాపించాలి. దీనికోసం రాజకీయ నాయకత్వం విశాల దృక్పథం, వికేంద్రీకరణ ప్రాతిపదికగా విద్యారంగాన్ని అభివృద్ధి పరచాలి.

## ఉన్నత విద్య - స్థితిగతులు

13 జిల్లాల ఆంధ్రప్రదేశ్‌లో 20 రాష్ట్రస్థాయి విశ్వవిద్యాలయాలు, వీటికి అనుబంధంగా 2,186 కళాశాలలు ఉన్నాయి. వీటిలో 1,174 డిగ్రీ కళాశాలలు, 436 పిజి కళాశాలలు, 366 ఇంజనీరింగ్ కళాశాలలు, 314 ఫార్మసీ కళాశాలలు, 432 ఎంబిఏ, ఎంసిఏ కళాశాలలు, 364 బిఇడి కళాశాలలు ఉన్నాయి. వీటిలో ఒక్కటి కూడా జాతీయ స్థాయి విద్యాసంస్థ లేదు. దాదాపు 90 శాతం ప్రయివేటు ఎయిడెడ్ కళాశాలలుగా కొనసాగుతున్నాయి. కళాశాలల్లో సగటు ప్రవేశాల సంఖ్య కూడా జాతీయస్థాయి కంటే తక్కువగా ఉంది. కేంద్ర ప్రభుత్వం ద్వారా స్థాపించబడి, నడపబడుతున్న జాతీయ స్థాయి పరిశోధనా కేంద్రాలు లేవు. హైదరాబాద్‌లో సిసిఎంబి, ఎన్ఐఎన్, డిఆర్‌డిఓ, ఐఐసిటి, ఇక్రిశాట్ వంటి ఎన్నో పరిశోధనా కేంద్రాలున్నాయి. రాష్ట్ర నాయకత్వం వినూత్నంగా, సృజనాత్మకంగా ఆలోచించి ఇటువంటి పరిశోధనా కేంద్రాల ఏర్పాటుకు చొరవ తీసుకోవాలి.

## జాతీయ స్థాయి విద్యా సంస్థల ఏర్పాటు - వికేంద్రీకరణ

పునర్ వ్యవస్థీకరణ చట్టంలో 11 జాతీయ స్థాయి విద్యాసంస్థల ఏర్పాటు గురించి పేర్కొన్నారు. ఐఐటి, ఎన్ఐటి, ఐఐఎం, సెంట్రల్ యూనివర్శటీ, ఆలిండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్, వ్యవసాయ విశ్వవిద్యాలయం, జాతీయ డిజాస్టర్ అధ్యయన కేంద్రం మొదలైన వాటిని ఏర్పాటు చేయాలి. ఈ సంస్థల ఏర్పాటులో పక్షపాత ధోరణికి తావివ్వకుండా, అన్ని జిల్లాలనూ సమగ్ర దృక్పథంలో ఆలోచించి ఏర్పాటు చేయాలి. జాతీయ స్థాయిలో విద్యారంగ నిపుణుల సలహాలను తీసుకుని వాటిని ఏర్పాటు చేయాలి. వీటి స్థాపనకు, అభివృద్ధికి త్వరితగతిన చర్యలు తీసుకోవాలి. అయితే కేంద్ర ప్రభుత్వం 2014-2016 నూతన బడ్జెట్‌లో ఎయిమ్స్‌కు రూ.100 కోట్లు, వ్యవసాయ విశ్వవిద్యాలయానికి రూ.100 కోట్లు కేటాయించి ఐఐటి, ఎన్ఐటి వంటి సంస్థలకు కేవలం కోటిరూపాయలు మాత్రమే కేటాయించింది. ఆంధ్రప్రదేశ్‌లో జాతీయ స్థాయి విద్యాసంస్థలకు ప్రత్యేక ప్యాకేజీ ప్రకటించి పూర్తిచేయాల్సిన బాధ్యత కేంద్ర ప్రభుత్వంపై ఉంది.

## రాష్ట్రస్థాయి విశ్వవిద్యాలయాలు - రూసా పథకం

రాష్ట్రంలో జిల్లాకో విశ్వవిద్యాలయం భావనను 2006లో ప్రవేశపెట్టారు. కడప, కృష్ణా, తూర్పుగోదావరి, శ్రీకాకుళం, నెల్లూరు, కర్నూలు జిల్లాల్లో విశ్వవిద్యాలయాలను ఏర్పాటు చేశారు. కానీ వీటికి ఇంతవరకూ మౌలిక వసతులుగానీ, సిబ్బందినిగానీ పూర్తిస్థాయిలో ఏర్పాటు చేయలేదు. వీటిని అభివృద్ధి పరచాలి. విజయనగర, ప్రకాశం జిల్లాల్లో విశ్వవిద్యాలయాలు లేవు. ఈ జిల్లాల్లో రూసా (రాష్ట్రీయ ఉచ్చతర్ శిక్షాభియాన్) పథకం కింద విశ్వవిద్యాలయాలు ఏర్పాటు చేయాలి. ఇవి అభివృద్ధి చెందాలంటే రాష్ట్ర బడ్జెట్‌లో ఉన్నత విద్యకు కేటాయింపులు గణనీయంగా పెంచాలి. ప్రస్తుతం ఉన్నతవిద్యకు రాష్ట్ర స్థూల ఉత్పత్తిలో 0.48 శాతం కేటాయిస్తుండగా దీనిని కనీసం 4 శాతానికి పెంచాల్సిన అవసరం ఉంది. ప్రయివేటు యూనివర్శిటీలను అనుమతించకుండా ప్రభుత్వమే ఉన్నత విద్యకు సంబంధించిన పూర్తి స్థాయి బాధ్యత వహించవలసి ఉంది.

## ఎయిడెడ్, ప్రభుత్వ డిగ్రీ, జూనియర్ కళాశాలలు

విద్యారంగంలో ప్రయివేటీకరణ కార్పొరేటీకరణ ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కువగా జరిగింది. దాదాపు రూ.8,500 కోట్ల మేరకు ఎపిలో విద్యావ్యాపారం జరుగుతున్నట్లు అంచనా. ప్రయివేటీకరణకు ముందు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో ఎయిడెడ్, ప్రభుత్వ డిగ్రీ, జూనియర్ కళాశాలలు విద్యావ్యాప్తిలో ఎంతో కృషి చేశాయి. ఉమ్మడి రాష్ట్రంలో 250 ఎయిడెడ్ డిగ్రీ కళాశాలలు, 178 ఎయిడెడ్ జూనియర్ కళాశాలలు, 270 ప్రభుత్వ డిగ్రీ కళాశాలలు, 820 ప్రభుత్వ జూనియర్ కళాశాలలు ఉన్నాయి. వీటిలో ఎయిడెడ్ సంస్థలు ఎక్కువగా ఆంధ్రప్రాంతంలో, ప్రభుత్వ కళాశాలలు ఎక్కువగా తెలంగాణా ప్రాంతంలో ఏర్పాటు చేశారు. ప్రభుత్వాలు అనుసరించిన విధానాల ఫలితంగా ప్రస్తుతం ఈ సంస్థలన్నీ క్షీణావస్థలో, దీనావస్థలో ఉన్నాయి. గత పదేళ్లుగా ప్రభుత్వ కళాశాలల్లో కాంట్రాక్టు అధ్యాపకులు మాత్రమే నియమితులవు తుండగా, ఎయిడెడ్ సంస్థలో అధ్యాపకుల భర్తీని జిఓ నెంబర్ 35 ద్వారా నిషేధించారు.13 జిల్లాల ఆంధ్రప్రదేశ్‌లో ఈ సంస్థలను పరి రక్షించుకోవడానికి పూనుకోవాలి. ముఖ్యంగా ఇంటర్ విద్యలో కార్పొ రేట్ సంస్థల పాత్రను నియంత్రించాలి.

## అక్షరాస్యత - ప్రస్తుత పరిస్థితి

ఆంధ్రప్రదేశ్ సమగ్రాభివృద్ధి జరగాలంటే అక్షరాస్యతను పెంచు కోవాలి. జాతీయ స్థాయిలో చూసినప్పుడు అక్షరాస్యతలో వెనుకబడిన రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్‌లో ఉంది. 2011 జనాభా లెక్కల ప్రకారం జాతీయ స్థాయి అక్షరాస్యత 74 శాతం ఉండగా, ఆంధ్రప్రదేశ్‌లో 67 శాతం మాత్రమే ఉంది. వివరాలు చూస్తే 13 జిల్లాలకుగాను 12 జిల్లాల్లో అక్షరాస్యత జాతీయ సగటు కంటే తక్కువగానూ, ఏడు జిల్లాలు రాష్ట్ర సగటు కంటే తక్కువగానూ ఉన్నాయి. అక్షరాస్యత పెంచి నప్పుడే అభివృద్ధి సాధ్యమనేది ప్రపంచ అనుభవం. అక్షరాస్యత పెంపుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రత్యేక యంత్రాంగాన్ని ఏర్పాటు చేయడంతో పాటు రాజకీయ చిత్తశుద్ధిని చూపాలి.

## జాతీయ విద్యాహక్కు చట్టం - డ్రాపౌట్స్ రేటు

2010 ఏప్రిల్ ఒకటి నుంచి జాతీయ విద్యాహక్కు చట్టం ఆంధ్ర ప్రదేశ్‌లో అమలులోకి వచ్చింది. దీని లక్ష్యం 6-14 సంవత్సరాల మధ్య వయస్సుగల పిల్లలందరూ బడిలో ఉండాలి. బడిబాట, బడి పిలుస్తోంది. సర్వశిక్షాభియాన్ వంటి అనేక కార్యక్రమాలు అమలు చేసి వేలాది కోట్లు ఖర్చుపెట్టినా ఇప్పటికీ లక్ష్యం నెరవేరలేదు. ఒకటో తరగతిలో బడిలో చేరిన పిల్లలు 10వ తరగతి వచ్చేసరికి దాదాపు 30 శాతం డ్రాపౌట్స్‌గా ఉంటున్నారు. పిల్లలు బడి మానకుండా ఉండేలా చేయడం ప్రభుత్వానికి ఒక సవాలుగా మారింది. డ్రాపౌట్స్ రేటు తగ్గింపుకు ప్రభుత్వంతోపాటు పౌరసమాజం, ఉపాధ్యాయులు, సామాజిక సేవా సంస్థలు కూడా కృషి జరపాలి. వివిధ ప్రభుత్వశాఖల మధ్య సమన్వయం ఉండాలి.

## పాఠశాల విద్య

మన రాష్ట్రంలో కేంద్ర ప్రభుత్వ పాఠశాలలు 112, రాష్ట్ర ప్రభుత్వం 7751, మండల-జిల్లా పరిషత్ 66,861, మున్సిపల్ 2,123, ప్రయివేటు ఎయిడెడ్ 3237 కలిపి మొత్తం 79972 పాఠశాలలు ఉన్నాయి. ప్రయివేట్ అన్ ఎయిడెడ్ 24,234తో కలిపి 1,04,318 పాఠశాలలున్నాయి. వీటిలో 26,69,870 మంది విద్యార్థులు చదువు తున్నారు. కేంద్ర ప్రభుత్వ పాఠశాలల్లో 57495 (0.45 శాతం), రాష్ట్ర ప్రభుత్వ పాఠశాలలో 10,01,217మంది, మండల-జిల్లా పరిషత్ పాఠశాలల్లో 59,08,014 మంది మున్సిపల్ పాఠశాలల్లో 2,98,413, ప్రయివేటు ఎయిడెడ్ పాఠశాలల్లో 49,773 మంది మొత్తం 56.8 శాతం మంది విద్యార్థులు చదువుతున్నారు. ప్రయివేటు అన్ ఎయిడెడ్ పాఠశాలల్లో 55,64,222 మంది (43.20 శాతం) చదువుతున్నారు. సర్వ శిక్షా అభియాన్ అమల్లోకి వచ్చిన తరువాత 12 ఏళ్లలో రూ.18,836 కోట్లు ఖర్చుపెట్టి 18శాతం నుంచి 44 శాతానికి ప్రయివేటు పాఠశాలల్లోని పిల్లలు వాటా పెంపుదల జరిగింది.

1999-2000 నాటికి 1,09,09576గా ఉన్న ప్రభుత్వ పాఠశాలల పిల్లలు 2012-13 నాటికి 73,14,912కి పడిపోయారు. 3051 ప్రాథమిక పాఠశాలల్లో ఒక్క టీచర్ కూడా లేని 10 లోపు పిల్లలు గల స్కూళ్లు ఉన్నాయి. ఇవన్నీ మూతపడటానికి సిద్ధంగా ఉన్నాయి. ప్రతి సంవత్సరం ఈ జాబితాలోకి మండలానికి మూడు నాలుగు స్కూళ్లు చేరుతున్నాయి. ఇలాంటి సమస్యలు గతంలో ఎదుర్కొన్న కేరళ, తమిళనాడు ప్రభుత్వాలు అర్థవంతంగా పరిష్కరించు కున్నాయి. విద్యాహక్కు చట్టం...మధ్యలో బడి మానివేసిన బడిలో చేరని విద్యార్థుల్ని 14వ సంవత్సరం నిండేదాకా బడిలో ఉంచి 8వ తరగతి స్థాయి విద్య అందించాలని చెబుతోంది. కేంద్ర గణాంకాల మేరకు రాష్ట్రంలో 6-15 మధ్య వయస్సు పిల్లలు 1,45,33,654 మంది ఉన్నారు. మన విద్యాశాఖ గణాంకాల ప్రకారం 1-10 తరగతుల్లో ఉన్న పిల్లల సంఖ్య 1,31,91,316 ఇదే వాస్తవమని

అనుకున్నా 6-15 సంవత్సరాల లోపు పిల్లలు దాదాపు 13.50 లక్షల మంది పాఠశాల బయట ఉన్నారు.

ఇలా నానాటికీ పాఠశాల విద్య కునారిల్లుతోంది. ప్రభుత్వ పాఠశాలలో విద్యార్థుల సంఖ్య తగ్గుతుంటే మరొక పక్క ప్రయివేటు పాఠశాలల సంఖ్యతోపాటు ఆ పాఠశాలల్లో చదివే విద్యార్థుల సంఖ్యా క్రమేపి పెరిగి ప్రభుత్వ పాఠశాల విద్యా రంగాన్ని మింగేస్తోంది. ఇదే లక్ష్యంగా పనిచేస్తున్న ప్రభుత్వం విద్యాసంస్థలను ప్రోత్సహిస్తూ వాటికి కావాల్సిన భూములు, సదుపాయాలు చాలా తక్కువ ధరలకే కేటాయిస్తోంది. క్రమంగా వ్యక్తులు, మధ్య తరగతి వర్గాలు నడుపుతున్న పాఠశాలలు పోటీకి నిలబడలేని పరిస్థితి. కార్పొరేట్ రంగం ఈ పాఠశాల విద్యను వేగంగా కబళిస్తోంది. ఈ పరిస్థితిని అదుపు చేయలేకపోతే భవిష్యత్ తరాలకు విద్య అందకుండా పోవడమే గాక గతంలో పాఠశాల విద్య ప్రభుత్వ రంగంలో ఉండేదని భవిష్యత్తులో చెప్పుకోవడానికి సరిపోతుంది. దీని వల్ల ఆర్థికంగా సాధారణ పిల్లల నుంచి మధ్య తరగతి వరకు విద్య అందని ద్రాక్షే అవుతుంది.

## పరిష్కారాలు

1. ఐదేళ్ళ వ్యవధిలో నాణ్యమైన కామన్ స్కూలు విధానాన్ని నిర్మించడం.
2. పటిష్టమైన అకడమిక్ వ్యవస్థలను, ఉపాధ్యాయ శిక్షణా సంస్థలను నెలకొల్పడం.
3. గ్రామీణ పిల్లలకు ఆహారం, యూనిఫారం, రవాణా సౌకర్యాలను, అభ్యాసనా సామాగ్రిని అందించడం.
4. ప్రాథమిక విద్య మాతృభాషలోనే నేర్పించడం, ఆంగ్లాన్ని భాషగా బోధించేందుకు ప్రత్యేక ఏర్పాట్లు చేయడం.

## ప్రయివేటు విద్యారంగం

రాష్ట్రంలో ప్రాథమిక విద్యంటే సెకండరీ విద్యలో, దీనికంటే ఉన్నత విద్యలో, వీటన్నింటికంటే సాంకేతిక విద్యలో ప్రయివేటు పెట్టుబడులు పెరిగాయి.ప్రాథమిక విద్యార్థుల్లో 67 శాతం2006లో ప్రభుత్వ స్కూళ్ళలో ఉండగా, 2007కి 55.2 శాతానికి తగ్గింది. మొత్తం పిల్లల్లో 89లక్షల మంది ప్రభుత్వ పాఠశాలల్లో 2007-08లో ఉండగా 48 లక్షల మంది ప్రయివేటు సూళ్ళలో ఉన్నారు. 10వ తరగతికి చేరేటప్పటికి ఈ నిష్పత్తి ప్రయివేటు సూళ్ళకనుకూలంగా మరింత పెరుగుతోంది. దీనికి కారణం ప్రభుత్వ స్కూళ్ళ నుంచి 63 శాతం డ్రాపౌట్లుగావడమే.

## సర్వశిక్షాభియాన్

పాఠశాల విద్యలో నిధులు, శిక్షణలు, సర్వేలు, అధ్యయనం తదితరాలన్నీ ప్రస్తుతం ఆర్‌విఎం. ఆర్‌ఎంఎస్ఏ చూస్తున్నాయి. 1 నుంచి 8 తరగతుల వరకు ఆర్‌విఎం. 9,10 తరగతులకు ఆర్‌ఎంఎస్ఏ పర్యవేక్షణ చేస్తున్నాయి. గణనీయంగా వీటికి కేంద్రంగా నిధులిస్తోంది. పాఠశాల భవనాలు బోధనాసామాగ్రి, అకడమిక్ సహాయం ఈ నిధులతో సమకూరుస్తోంది. కానీ ఇదొక సమాంతర వ్యవస్థగా మారింది. విద్యారంగంతో సంబంధం లేనివారు ఇందులో చేరారు. దీనికో ప్రత్యేక మంత్రి ఉండటం వల్ల విద్యాశాఖ నుంచి వేరైనట్లు స్వతంత్ర్యంగా వ్యవహరిస్తుంది. అందువల్ల

1. సర్వశిక్షా అభియాన్ విద్యాశాఖలో భాగంగా, దాని ఆధ్వర్యంలో నడపాలి.
2. రెగ్యులర్ టీచర్లను ఎస్ఎస్ఏ తన అవసరాల కోసం తీసుకున్నప్పుడు వారిపోస్టులు భర్తీ చేయాలి.
3. పాలనా వ్యవహారాల నిర్వహణకు విద్యావేత్తలతో, టీచర్లతో, పిల్లల హక్కుల బాధ్యులతో కమిటీలు ఉండాలి. నిధులపై పర్యవేక్షణ, ఆడిటింగ్ పకడ్బందీగా ఉండాలి.

*(ప్రజాశక్తి నవ్యాంధ్రప్రదేశ్ అభివృద్ధి ప్రత్యేక సంచిక సౌజన్యంతో)*

శ్రీ చెన్నాప్రగడ వీఎన్నెస్ శర్మ

# పుష్కరం నుంచి పుష్కరం దాకా...

మార్పు మంచిదే.. మనిషికైనా, రాష్ట్రానికైనా. మార్పుతోనే అభివృద్ధి ముడిపడివుంది. ఏదేనీ మార్పు జరిగితే అభివృద్ధి దానంతట అదే అవుతుంది. అభివృద్ధి బాగా జరిగిందంటే గుర్తుపట్టేందుకు కూడా వీల్లేనంతగా అక్కడి రూపురేఖలు మారిపోతాయి. ఉదాహరణకు శ్రీ తారణనామ సంవత్సరం (2004) లో వచ్చిన కృష్ణా పుష్కరాలనే తీసుకుందాం. అప్పట్నుంచి ఈ దుర్ముఖినామ సంవత్సరం (2016) పుష్కరాల వరకు గతించిన కాలాన్ని ఓసారి పరిశీలిస్తే సామాజిక పరంగా ఎన్నో మార్పులు.... ఎన్నెన్నో చేర్పులు.

గత పుష్కరాలు, ప్రస్తుత పుష్కరాలకు చాలా పెద్ద వ్యత్యాసమే ఉంది. అప్పట్లో అవిభక్త ఆంధ్రప్రదేశ్‌లో పుష్కరస్నానమాచరిస్తే... ఇప్పుడు విభజనకు గురైన నవ్యాంధ్రప్రదేశ్‌లోనే చేయక తప్పదు. కృష్ణమ్మ ప్రవహిస్తున్న కర్నూలు, కృష్ణా, గుంటూరు జిల్లాల్లోని పుష్కర ఘాట్లల్లో మునకలేయాల్సిన పరిస్థితి. గత పుష్కరాలను డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డి ఆధ్వర్యంలోని కాంగ్రెస్ ప్రభుత్వం 2004 ఆగస్టు 28వ తేదీ నుంచి సెప్టెంబరు 2వ తేదీ వరకు ఘనంగానే నిర్వహించింది. కర్నూలు జిల్లా శ్రీశైలంలో పుష్కరాలను ఆనాటి ముఖ్యమంత్రి డాక్టర్ వైఎస్ శాస్త్రోక్తంగా ప్రారంభించారు. అయితే అదేరోజు విజయవాడ ప్రకాశం బ్యారేజీ అప్రాన్ వద్ద జరిగిన ప్రమాదంలో ఐదుగురు భక్తులు మరణించడం..15 మంది గాయపడడం విషాదాన్ని మిగిల్చింది. గత ఏడాది గోదావరి పుష్కరాల సందర్భంగా రాజమహేంద్రవరంలో జరిగిన ఘోరకలి నేర్పిన పాఠంతో కృష్ణా పుష్కరాలను అత్యంత పకడ్బందీగా నిర్వహించాలని ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు అధికారులను ఆదేశించడం గమనార్హం. మరో గమ్మత్తయిన విషయమేమిటంటే ఇప్పటివరకు వచ్చిన ప్రతి పుష్కరానికీ కృష్ణానదిలో పుష్కలంగా నీళ్లుండేవి. కానీ ఈసారే పరిస్థితి మరీ ఘోరంగా ఉంది. రెండు నెలల క్రితం వరకు ప్రకాశంబ్యారేజీ వద్ద మూడడుగుల నుంచి ఆరడుగులలోపే నీటిమట్టం ఉంది. ఈసారి కృష్ణా పుష్కరాలను హైటెక్ స్థాయిలో నిర్వహించేందుకు తెలుగుదేశం ప్రభుత్వం కసరత్తు చేస్తోంది. కృష్ణాతీరం వెంబడి ఉన్న ప్రధానఘాట్లను విశాలంగా, సుందరంగా తీర్చిదిద్దే బాధ్యతను విదేశీ కంపెనీలకు అప్పగించింది. ఎక్కడికక్కడ మంచినీరు, వైద్యశాలలు, మరుగుదొడ్లు, దుస్తు మార్చుకునేందుకు గదులు, పిండ ప్రదానాల వంటి క్రతువులు నిర్వహించుకునే భక్తులకు సకల సౌకర్యాలు కల్పిస్తోంది. భక్తుల రద్దీకి తగినంతగా నీరు చాలకపోతే ఇబ్బందిపడకుండా సమీప ప్రాంతాల్లో బోర్లు వేసి జల్లు స్నానాలకు ఏర్పాట్లు చేసింది. ఇక ఆర్టీసీ, రైల్వే శాఖ గతంలో కంటే ఎక్కువ సర్వీసులు ఈసారి నడుపుతోంది.

### కర్నూలు జిల్లాకు రెండు పుష్కరాలు

రాష్ట్రంలోని ఏ జిల్లాకు లేని ఘనత కర్నూలుకు దక్కుతుందనే చెప్పాలి. సంగమేశ్వరం వద్ద కృష్ణమ్మ జిల్లాలోకి ప్రవేశించగా... తుంగభద్ర కూడా ఇదే జిల్లాలో ప్రవహిస్తుంది. 2008లో అప్పటి ముఖ్యమంత్రి డాక్టర్ వై.ఎస్. రాజశేఖరరెడ్డి తుంగభద్ర పుష్కరాలను ప్రారంభించి ఆ జిల్లా సంస్కృతి, సాహిత్యం, ఆర్థిక ప్రగతి తదితర విశేషాలతో కూడిన 'పుష్కర తరంగిణి' సంచికను ఆవిష్కరించారు.

చారిత్రాత్మకంగా, రాజకీయంగా, సాంస్కృతికంగా ప్రాముఖ్యతను సంతరించుకున్న కర్నూలు రాయలసీమ ముఖద్వారం. 2001 లెక్కల ప్రకారం కర్నూలు జిల్లా జనాభా 3,529,494 ఉండగా 2011 నాటికి అది 4,053,463 కు చేరింది.

2004 ఎన్నికల్లో 13 శాసనసభ నియోజక వర్గాలుండగా 2009 ఎన్నికల నాటికి ఆ సంఖ్య 14కి చేరింది. మూడు రెవెన్యూ డివిజన్లు (కర్నూలు, నంద్యాల, ఆదోని) 54 మండలాలు, నాలుగు పురపాలక సంఘాలు, ఒక నగరపాలక సంస్థతో కర్నూలు జిల్లా పాలనలో పరుగులు తీస్తోంది.

ఇక్కడ పుణ్యక్షేత్రాలు అధికంగా ఉండడంతో భక్తుల రాకపోకలు బాగా పెరిగాయని చెప్పవచ్చు. పన్నెండేళ్ల కిందట శ్రీశైలం, మంత్రాలయం వంటి పుణ్యక్షేత్రాలు దర్శించాలంటే రవాణా సౌకర్యాలు

పెద్దగా ఉండేవి కావు. జిల్లాలో నల్లమల అడవులు విస్తరించి ఉండడంతో క్రూర జంతువులు ఏ క్షణాన రోడ్లపైకి వస్తాయో తెలిసేది కాదు. ఈ మార్గంలో బిక్కుబిక్కుమంటూ ప్రయాణం చేసేవారు. అది కూడా పగటిపూట మాత్రమే. ఇప్పుడు పరిస్థితి మారిపోయింది. ఏ సమయంలోనే నిర్భయంగా వెళ్లేందుకు వీలుగా రోడ్డుమార్గాలు, బస్సు, రైలు సౌకర్యాలు ఏర్పాటు చేశారు.

హైదరాబాద్ నుంచి బెంగుళూరుకు జిల్లా మీదుగా వెళ్లే ఏడవ నంబర్ జాతీయ రహదారిని నాలుగు లేన్లుగా మార్చుచేశారు. ఎక్కడా అవాంఛనీయ సంఘటనలు జరగకుండా పోలీసుల నిఘా పెంచారు.

విద్యాపరంగా చూస్తే 2006లో డాక్టర్ వైఎస్ ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు రాయలసీమ యూనివర్సిటీ రూపుదిద్దుకోగా ఈ ఏడాది కర్నూలులో ఉర్దూ విశ్వవిద్యాలయం ఏర్పాటుకు ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు శంకుస్థాపన చేశారు.

జిల్లావాసులను తీవ్ర దిగ్భ్రాంతికి గురిచేసి విషాదాన్ని నింపిన రెండు సంఘటనలు 2009లో చోటుచేసుకున్నాయి. సెప్టెంబర్ రెండో తేదీన పావురాలగుట్ట వద్ద హెలికాప్టర్ కూలినప్రమాదంలో ప్రజాహృది దోచిన అప్పటి ముఖ్యమంత్రి డాక్టర్ వైఎస్ రాజశేఖర రెడ్డి దివంగతులై రాష్ట్రానికి, కాంగ్రెస్ పార్టీకి, అశేష అభిమానులకు తీరని శోకం మిగిల్చారు. అదే ఏడాది అక్టోబర్ ఒకటో తేదీన ఉత్తుంగ తరంగాలతో ఉగ్రరూపం దాల్చిన తుంగభద్ర కర్నూలును ముంచెత్తింది. చరిత్రలో మొదటిసారిగా ప్రసిద్ధ పుణ్యక్షేత్రమైన మంత్రాలయ శ్రీ రాఘవేంద్ర స్వామి ఆలయం జలమయమైంది. ఆ సందర్భంగా పీఠాధిపతిని ప్రత్యేక హెలికాప్టర్‌లో సురక్షిత ప్రాంతానికి తరలించారు.

సాంస్కృతికపరంగా చూస్తే 2010 ఆగస్టులో రాయల పట్టాభిషేక పంచ శతాబ్ది ఉత్సవాలను రాష్ట్ర ప్రభుత్వం కర్నూలు జిల్లాలో 10 రోజుల పాటు నిర్వహించింది. రాయలకాలంలోని చారిత్రక కట్టడాల న్నింటినీ ఆ సందర్భంగా ప్రత్యేకంగా అలంకరించారు.

కర్నూలు జిల్లా మల్యాల వద్ద 2013 లో హంద్రీనీవా ప్రాజెక్టును అప్పటి ముఖ్యమంత్రి నల్లారి కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రారంభించారు. అదే ఏడాది డిసెంబర్‌లో సమైక్యాంధ్ర ఉద్యమం మొదలైంది.

రాష్ట్ర విభజన అనంతరం కాంగ్రెస్ నుంచి పగ్గాలు అందుకున్న తెలుగుదేశం ప్రభుత్వం నవ్యాంధ్రప్రదేశ్‌లో 2014 ఆగస్టు 15న నిర్వహిం చిన మొట్టమొదటి రాష్ట్రస్థాయి స్వాతంత్ర్య వేడుకలకు కర్నూలు వేదికైంది.

గత పుష్కరాల కంటే ఈసారి ఏర్పాట్లను బాగా చేస్తున్నారనే చెప్పాలి. శ్రీశైలంలోని పాతాళగంగ, నందికొట్కూరు వద్ద ఉన్న సంగ మేశ్వరం పుష్కర ఘాట్లను సకల సౌకర్యాలతో అందంగా ముస్తాబు చేస్తున్నారు.

## కృష్ణమ్మ కలిపింది రెండింటినీ...

కృష్ణానదికి అటూ ఇటూ విస్తరించి జంట కవుల్లా ఉండే కృష్ణా, గుంటూరు జిల్లాలు రాష్ట్ర విభజన అనంతరం విశేష ప్రాముఖ్యతను సంతరించుకున్నాయి. నవ్యాంధ్రప్రదేశ్ నూతన రాజధానిగా ముఖ్య మంత్రి చంద్రబాబునాయుడు అమరావతిని ఎంపిక చేయడంతో విజయవాడ, గుంటూరు జంటనగరాలుగా మారిపోయాయి. ఇది గత పుష్కరకాలంలో జరిగిన పెనుమార్పని చెప్పాలి. ఇప్పటికే ఈ రెండు జిల్లాల్లోనూ ఒకే సామాజికవర్గం ఆధిపత్యం వహిస్తోంది. ఇప్పుడు రాజధాని కావడంతో ఇరు జిల్లాలవాసులు మరింత ధనవంతులయ్యారు. రియల్‌ఎస్టేట్ వ్యాపారం కొత్త పుంతలు తొక్కింది. అపార్టు మెంట్లు, విల్లాస్ సంస్కృతి మొదలైంది.

## అభివృద్ధికి చిరునామా కృష్ణాతీరం

కళల కాణాచి, భాషా సంస్కృతులకు నిలయమైన కృష్ణాజిల్లా జనాభా 2001 లెక్కల ప్రకారం 41,87,841 ఉండగా... 2011 నాటికి 45,29,009 కి చేరింది.

నియోజకవర్గాలపరంగా చూస్తే 2004లో 17 ఉండగా పునర్వి భజన ఫలితంగా 2009 ఎన్నికల్లో అవి 16కు చేరాయి. రాజకీయంగా తుడిచిపెట్టుకుపోయింది. తెలుగుదేశం పార్టీ అత్యధిక స్థానాలు గెలుచు కోగా కొత్తగా ఆవిర్భవించిన వైఎస్సార్ కాంగ్రెస్ పార్టీ ఐదు నియోజక వర్గాల్లో జెండా ఎగరేసింది. 2008లో సినీ నటుడు చిరంజీవి పెట్టిన ప్రజారాజ్యం పార్టీలోకి పలు పార్టీల నుంచినాయకులు వలస వెళ్ళిన ప్పటికీ ప్రయోజనం లేకుండాపోయింది. ఆ తర్వాత ఆ పార్టీని కాంగ్రెస్ లో విలీనం చేసిన సంగతి తెలిసిందే.

పరిపాలనాసౌలభ్యం కోసంవిజయవాడ,మచిలీపట్నం, గుడివాడ, నూజివీడు రెవెన్యూ డివిజన్లు ఉన్నాయి. ఎనిమిది పురపాలక సంఘాలు, ఒక నగరపాలక సంస్థ, 50 మండలాలతో పాలన జరుగుతోంది.

కొత్త రాష్ట్రం ఏర్పడ్డాక విజయవాడలో ముఖ్యమంత్రి విడిది కార్యాలయాన్ని ఏర్పాటుచేశారు. పలు శాఖల కార్యాలయాలన్నీ విజయవాడ, చుట్టుపక్కల గ్రామాలకు తరలివచ్చాయి. విజయవాడ పోలీస్ కమీషనరేట్ స్థాయిని పెంచారు. నిత్యం మంత్రుల బుగ్గకార్ల మోతతో నగరం మార్మోగిపోతోంది.

గత పన్నెండేళ్లలో ప్రజలు సామాజికపరంగా ఎంతో అభివృద్ధి సాధించారు. ఆర్థికంగా బలోపేతమయ్యారు. కొనుగోలుశక్తి పెరిగింది. 2004 లో నాలుగు ఇళ్లకొక ల్యాండ్‌లైన్ ఫోన్ ఉంటే2016లో ఒక్కో ఇంట్లో నాలుగు మొబైల్ కనెక్షన్లు ఉన్నాయి.

వాణిజ్యపరంగా చూసినా జిల్లా ముందుంది. నూజివీడు మామిడి ఎగుమతులు, కొండపల్లి బొమ్మలు, బందరు లడ్డూలు, పెడన కలంకారీ వస్త్రాల ఉత్పత్తిలో లాభాలపంట పండుతోంది.

ప్రధానంగా విజయవాడ నగరంలో వ్యాపారాలు బాగా వృద్ధి చెందాయి. చిన్న చిన్న సినిమా హాళ్లు పోయి పెద్ద పెద్ద మల్టీప్లెక్స్‌లు, 24 గంటల షాపింగ్‌లు, అర్ధరాత్రి ఫలహారశాలలు వచ్చాయి. నెలలో మొదటి ఆదివారం ఉదయంపూట బందరురోడ్డుఆటపాటలకు వేదికగా మారడం చెప్పుకోదగిన పరిణామం. నగరం నడిబొడ్డున ఉన్న స్వరాజ్య మైదానాన్ని సిటీ స్క్వేర్‌గా మార్చేందుకుచైనాదేశీయులతో ముఖ్యమంత్రి ఒప్పందం కుదుర్చుకున్నారు. ఈ క్రమంలో పీడబ్ల్యూడీ గ్రౌండ్ త్వరలో కనుమరుగవుతుంది.

ఆధ్యాత్మికపరంగా చూస్తే జనులందరికీ భక్తి బాగా పెరిగింది. బెజవాడ దుర్గమ్మ ఆలయంలో దసరా ఉత్సవాలకు స్టేట్ ఫెస్టివల్ హోదా లభించడం విశేషం. అయితే పుష్కరాల నేపథ్యంలో అభివృద్ధి పేరిట విజయవాడ నగరంలోని దాదాపు 30 చిన్నాచితకా ఆలయాల కూల్చివేతని కూడా విజయవాడ పౌరులు చవి చూశారు.

విద్యలవాడగా వినుతికెక్కిన విజయవాడ టెన్త్, ఇంటర్, ఇంజినీరింగ్, మెడిసిన్ ఫలితాల్లో వరుసగా ముందువరుసలో నిలుస్తోంది. 2005 లో నూజివీడులో ట్రిపుల్ ఐటీ, 2008లో మచిలీపట్నంలో కృష్ణా విశ్వవిద్యాలయం ప్రారంభమయ్యాయి.

వైద్యపరంగా చూసినా జిల్లా ఎంతో అభివృద్ధి సాధించింది. రెండేళ్లుగా అవయవదానాన్ని ఉద్యమంలా నిర్వహిస్తున్నారు. రక్తనిధి కేంద్రాలు, నేత్రదాన నిధిని చక్కగా నిర్వహిస్తున్నారు. ఎన్నో పేరెన్నికగల పెద్ద పెద్ద మల్టీ స్పెషాలిటీ ఆస్పత్రులు బెజవాడకు వచ్చాయి. నక్కలరోడ్డు, దోర్నకల్ రోడ్డు ఆస్పత్రులకు చిరునామాగా మారాయి. గతంలో ఏ చెన్నైకో, బెంగుళూరుకో వెళ్లి చేయించుకునే శస్త్రచికిత్సలు ఇప్పుడు సులభంగా ఇక్కడే జరిగిపోతున్నాయి.

సాహిత్యానికి పెద్దపీట వేసే జిల్లాల్లో కృష్ణా ఒకటి. కొత్తగా ఎందరో కవులు, రచయితలు వెలుగులోకొచ్చారు. మండలి బుద్ధప్రసాద్, డాక్టర్ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ వంటి సాహితీ పిపాసులు తెలుగుభాషకు ప్రాచీన హోదాకోసం పోరాటం సాగించినగడ్డ ఇది. 2005లో పునరుద్ధరించిన కృష్ణాజిల్లా రచయితల సంఘం సాహితీసేవలో ముందుంది. గుత్తికొండ సుబ్బారావు, డాక్టర్ జి.వి. పూర్ణచందు ఇతర ప్రముఖులు 2007, 2011, 2015 సంవత్సరాల్లో ప్రపంచ తెలుగు రచయితల మహాసభలనువిజయవాడలో నిర్వహించారు. ఇవికాకుండా 15 జాతీయ సదస్సులు, తెలుగు భాషకు ప్రాచీన హోదా కల్పించాలని కోరుతూ నాలుగు జిల్లాల్లో పాదయాత్రలు నిర్వహించారు. విజయవాడ పుస్తక మహోత్సవం కమిటీ నగరంలో పెద్ద గ్రంథాలయాన్ని నెలకొల్పింది. పుస్తక ప్రియులకు సుపరిచితమై నవోదయ పబ్లిషర్సు పుస్తక ప్రచురణ రంగం నుంచి విరమించడం బాధాకరం. సూర్య, సాక్షి వంటి నూతన పత్రికలు ఆవిష్కృత మయ్యాయి.

2008లో బందరు పోర్టుకు అప్పటి ముఖ్యమంత్రి డాక్టర్ వైఎస్ రాజశేఖర రెడ్డి శంకుస్థాపన రాయి వేయగా అది ఇంకా ఓ కొలిక్కి రాలేదు. విజయవాడలోని విక్టోరియా మ్యూజియాన్ని పూర్తి స్థాయిలో పునరుద్ధరించి బాపు ప్రదర్శనశాలగా నామకరణం చేశారు. ఇదే ప్రాంగణంలో జాతీయ జెండా రూపశిల్పి, జిల్లావాసి పింగళి వెంకయ్య కాంస్య విగ్రహాన్ని ప్రతిష్ఠించారు.

సాహితీ సభలు, సమావేశాలు, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించేందుకు నిర్మించిన తుమ్మల పల్లివారి క్షేత్రయ్య కళాక్షేత్రానికి మరమ్మత్తులు జరుపుతున్నారు. ప్రస్తుతానికిదుర్గాపురంలోని ఘంటసాల వెంకటేశ్వరరావు సంగీత కళాశాల కార్యక్రమాలకు వేదికైంది. ఒక వెలుగు వెలిగిన హనుమంతరాయ గ్రంథాలయం ప్రాభవాన్ని కోల్పోగా... కన్వెన్షన్ సెంటర్లు కోకొల్లలుగా వచ్చాయి. సివిల్ కోర్టు భవనాలను పునర్నిర్మిస్తున్నారు. రాష్ట్ర సాంస్కృతిక శాఖ సంగీత కళాశాల భవనంలోకి తరలి వచ్చింది.

రాకపోవడం.. మధ్యలో అతివృష్టి, అనావృష్టి పరిస్థితులు అన్నదాతను కోలుకోలేని దెబ్బతీశాయి. ఆత్మహత్యలకు పురికొల్పాయి.

టీడీపీ ప్రభుత్వం 2015లో నదుల అనుసంధానంపేరిట పట్టిసీమ నుంచి గోదావరి జలాలను ఫెర్రీవద్ద కృష్ణానదిలోకి తరలించడం కాస్తంత ఊరటనిచ్చే అంశం.

రవాణాపరంగాను అభివృద్ధి బాగానే జరిగింది. పండిట్ నెహ్రూ బస్‌స్టేషన్, రైల్వేస్టేషన్‌ను అధునాతనంగా తీర్చిదిద్దారు. బస్టాండ్‌లో ప్రయాణికుల సౌకర్యార్థం వైఫై, వైస్క్రీన్స్ పేరిట మినీ థియేటర్లు నిర్మించారు. గన్నవరం విమానాశ్రయాన్ని అంతర్జాతీయ స్థాయిలో అభివృద్ధి చేశారు. విమానాశ్రయం నుంచి రామవరప్పాడు రింగ్ వరకు జాతీయ రహదారిపై పచ్చదనాన్ని పరిచారు.

గత పుష్కరాలప్పుడు విజయవాడలో రోడ్లు ఇరుకిరుగ్గా ఉండేవి. అవిప్పుడు విశాలమైన రహదారులుగా రూపుదిద్దుకున్నాయి. ట్రాఫిక్ నియంత్రణలో భాగంగా బెజవాడ కనకదుర్గ గుడి వద్ద పై వంతెన నిర్మాణానికి శ్రీకారం చుట్టడం, కృష్ణలంక జాతీయ రహదారితో పాటు నగరంలోని ప్రధాన రహదారులన్నీ విస్తరించడం అభివృద్ధికి ముందడుగనే చెప్పాలి. రోడ్ల అభివృద్ధితో పాటు వాహనాల సంఖ్యపెరగడం కూడా కొంతమేర ట్రాఫిక్‌కు అవరోధంగామారింది. వారధి దగ్గర్నుంచి గుంటూరు జిల్లాకు నాలుగు లైన్ల రహదారిని అభివృద్ధి చేశారు. బీఆర్‌టీఎస్‌రోడ్డు విషయానికొస్తే దీన్ని నిర్మించిన విజయవాడ దేశంలోనే నాలుగో నగరం. బెంజిసర్కిల్ వద్ద పై వంతెన, మెట్రో రైలు రాక సశేషం. ఇక దుర్గాఘాట్‌తోపాటు పద్మావతి, మెట్లబజారు, పున్నమి, శివక్షేత్రం, ఘాట్లను పూర్తిగా ఆధునీకరిస్తున్నారు.

కూచిపూడి గ్రామానికి అంతర్జాతీయ గుర్తింపు లభించింది. స్మార్ట్ విలేజిగా తీర్చిదిద్దుతున్నారు. పలువురు ప్రముఖులు జిల్లాలోని గ్రామాలను దత్తత తీసుకుని అభివృద్ధికి బాటలు వేస్తున్నారు.

అవనిగడ్డ నియోజకవర్గం నుంచి తెలుగుదేశం పార్టీ తరపున శాసనసభ్యుడిగా ఎన్నికైన మండలి బుద్ధప్రసాద్‌ను ఉపసభాపతి పదవి వరించడం విశేషం. ఆయన 2012 నుంచి రెండేళ్లపాటు ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం అధ్యక్షుడిగా పనిచేశారు. కూచిపూడి నృత్యాన్ని సుప్రసిద్ధం చేసిన వెంపటి చినసత్యం 2012లో, తెలుగు చిత్రసీమ రారాజుల్లో ఒకరైన అక్కినేని నాగేశ్వరరావు 2014లో మనకు శాశ్వతంగా దూరమవడం విచారించదగ్గ విషయం.

## రాచనగరిని అందించిన గుంటూరు జిల్లా

ఎంతో చారిత్రక ప్రసిద్ధిగాంచిన అమరావతి పట్టణాన్ని నవ్యాంధ్ర ప్రదేశ్‌కునూతన రాజధానిగా ఎంపికచేయడంతో గుంటూరుజిల్లాఖ్యాతి దశదిశలా వ్యాపిస్తోంది. భవిష్యత్తులో అమరావతి మళ్లీ తెలుగు వారి రాజధాని అవుతుందని ప్రముఖ రచయిత డాక్టర్ జి.వి. పూర్ణచందు పదేళ్ల క్రితమే రాసిన మాటలు నేడు అక్షరాలా నిజమయ్యాయి.

గుంటూరు జిల్లా జనాభా 2001 లెక్కల ప్రకారం 44,65,144 మంది ఉండగా 2011కి ఆ సంఖ్య 48,89,230కి పెరిగింది. 2004లో శాసనసభ నియోజకవర్గాలు 19 ఉండగా 2009 ఎన్నికల నాటికి వాటిని 17కి కుదించారు.

గుంటూరు, తెనాలి, నరసరావుపేట, గురజాల రెవెన్యూ డివిజన్లు, 57 మండలాలు, తొమ్మిది మునిసిపాలిటీలు, ఒక నగరపాలక సంస్థ ద్వారా జిల్లాలో పాలన జరుగుతోంది.

కొత్త రాష్ట్రం ఏర్పడ్డాక కృష్ణా, గుంటూరు జిల్లాల్లో విస్తరించిన వీజీటీఎం ఉడా (విజయవాడ-గుంటూరు- తెనాలి-మంగళగిరి అర్బన్

అమరావతిని రాజధానిగా ప్రకటించిన తర్వాత జిల్లాలోని 29 గ్రామాల రైతుల నుంచి 32 వేల ఎకరాల భూమిని ప్రభుత్వం సేకరించింది. తుళ్లూరు మండలం వెలగపూడిలో తాత్కాలిక సచివాలయం, తాడేపల్లి కృష్ణా కరకట్టపై సీఎం వసతి గృహం ఏర్పాటుచేశారు. ప్రభుత్వ కార్యాలయాలు గుంటూరు, మంగళగిరిల్లో ఏర్పాటయ్యాయి.

గుంటూరులోని ఎన్టీఆర్ బస్టాండును, రైల్వేస్టేషన్‌ను అత్యంత అధునాతనంగా తీర్చిదిద్దారు.

విజయవాడ నుంచి చిలకలూరిపేట వరకు నాలుగు లైన్ల రహదారిని అభివృద్ధిని చేయడంతో ప్రయాణదూరం, భారం రెండూ తగ్గడం చెప్పుకోదగిన పెద్ద మార్పు.

నరసరావుపేట కోటప్పకొండ తిరునాళ్లకు రాష్ట్ర పండుగ హోదా కల్పించారు. గుంటూరు గార్డన్స్‌లోని శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం విశేష ప్రాచుర్యాన్ని పొందింది. ఇక్కడ పలు ఆధ్యాత్మిక, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

సమైక్యాంధ్ర ఉద్యమంలో గుంటూరు జిల్లావాసులు ముందుకొచ్చి పాల్గొన్నారు.

2006 జనవరిలో అమరావతిలో కాలచక్ర సదస్సు భారీఎత్తున నిర్వహించారు. అతి పెద్ద బుద్ధుడి విగ్రహాన్ని కృష్ణాతీరంలోనెల కొల్పారు. ఇప్పుడు అమరావతి కాకతాళీయంగా రాజధాని అయింది.

చదువులమ్మ ఒడిలో జిల్లా ఒదిగిపోయింది. అన్ని రకాల పరీక్షల్లో జిల్లా విద్యార్థులు పోటీ పడుతున్నారు. 2008లో ఏడాది గుంటూరు జిల్లాలో విజ్ఞాన్ విశ్వవిద్యాలయం అవతరించింది.

వైద్యరంగంలో గుంటూరు జిల్లా పోటీపడుతోంది. తాజాగా జీజీహెచ్‌లో వైద్యులు గుండెమార్పిడి శస్త్రచికిత్స విజయవంతంగా చేశారు. గతంలో కన్నా ఆస్పత్రి పదింతల అభివృద్ధి చెందింది. చినకాకాని ఎన్నారై ఆస్పత్రి కూడా విశేష సేవలందిస్తోంది.

డాక్టర్ కె.ఎల్.రావు సాగర్ పులిచింత ప్రాజెక్టు 2013లో జిల్లాలో ప్రారంభమైంది. ఇది పూర్తిస్థాయిలో ఉపయోగంలోకి వస్తే కృష్ణాకు కూడా జలాలు అందించవచ్చు.

గుంటూరు జిల్లాలో పొగాకు,మిర్చి, పత్తి పండించేరైతులు ఒకప్పుడు రాజాలుగా ఉండేవారు. ఇటీవలి కాలంలో నష్టాలు చవిచూసిన పలువురు రైతులు ఆత్మహత్యలు చేసుకున్న ఘటనలు కూడా ఉన్నాయి.

గుంటూరు జిల్లాలో సుగంధద్రవ్యాల పార్క్ ఏర్పాటుకు కసరత్తు సాగుతోంది. ఇంకా అనేక చిన్న, పెద్ద తరహా పరిశ్రమలు పురుడు పోసుకున్నాయి.

ఈ జిల్లా ప్రముఖులకు అత్యంత గౌరవప్రదమైన పదవులు దక్కాయి. కొణిజేటి రోశయ్యకుఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, తమిళనాడు గవర్నరు పదవులు దక్కాయి. నాదెండ్ల మనోహర్, కోడెల శివప్రసాద రావులకు శాసనసభాపతి హోదా లభించింది.

ప్రస్తుత పుష్కరాలకు అమరావతి క్షేత్రంతోపాటు సీతానగరం వద్ద ఘాట్లను సిద్ధం చేస్తున్నారు. నగరంలోని రోడ్లను విస్తరిస్తున్నారు. పురాతన కాలం నాటి మార్కెట్‌ను కూలగొట్టి ఆధునికంగా నిర్మిస్తున్నారు.

చివరగా... అభివృద్ధి అనేది ఒకచోట ఆగకూడదు. అప్రతిహతంగా జరిగిపోతూనే ఉండాలి. ఈ క్రమంలో ఎన్ని కష్టాలైనా, నష్టాలైనా సహృదయంతో భరించాలి. అప్పుడే ఊరయినా, జిల్లా అయినా, రాష్ట్రమైనా ముందుకు దూసుకెళుతుంది.

**చిరునామా :** *చెన్నా ప్రగడ వీఎన్నెస్ శర్మ, 29-19-18/1, సుబ్రహ్మణ్య టవర్స్, డోర్నకల్‌రోడ్డు, సూర్యారావుపేట, విజయవాడ-2. సెల్ : 94405 87567*

శ్రీ పప్పూరి రామాచార్యులు

# రాయలసీమ నాడు - నేడు

మనమిప్పుడు యుగసంధిలో నున్నాము. శ్రీకృష్ణ నిర్యాణముతో కలియుగ మారంభము. శ్రీ మహాత్మగాంధిగారి నిర్యాణంతో కృతయుగ మారంభమైనదని చెప్పవచ్చును. ఎద్దుబండి వేగమునకును విమాన వేగమునకును మధ్యన కాలచక్రము గిర్రున తెగతిరిగినది. ప్రాచీనకాల ప్రమాణములిప్పుడు సరిపడవు. కావున యుగ పరివర్తనమిప్పుడు త్వరత్వరగా జరుగుచున్నది.

గడియారములో సెకండులు, చూపు ముల్లువలె యూరోపు అమెరికాల ప్రగతి. ఇండియా అభివృద్ధివేగము నిమిషముల కనుబరచు ముల్లువలె. కాని రాయలసీమ గతి గంటల ముల్లువలెనున్నది. అనగా రాష్ట్రము నడచు వేగమునకు పండ్రెండంతలు తక్కువ వేగముతో మనము కదలుచున్నాము.

రాయలసీమ ప్రాచీన నామధేయము కుంతలదేశము. స్త్రీకి కురులే సిరి. ద్రావిడ దేశమున కొకప్పుడిది అలంకారసీమ. సిరి సంపదల కాటపట్టు, విద్యాలతల కాలవాలము. వీరపురుషుల కావాసభూమి రత్నాలగని. మహాకవుల కాశ్రయము. యాచకులకు అన్నవత్రము. దేశచరిత్రలో దీని కథ రామాయణములోని సుందరకాండకు పోల్చతగినది. అదియొక సువర్ణపుట. నేడో...? నేనేల చెప్పవలెను.

"శ్రీరామచంద్రుడు విశ్రమించిమిత్రసైన్యబలములు సంపాదించిన పంపాసరోవర తటము రాయలసీమలోనిది. అశోకుని విజయశాసన ములు గుత్తికి పదిమైళ్ళ దూరములో నున్నవి. ఆంధ్రదేశమున దొరకిన శిలా శాసనములలో నతి ప్రాచీనమైనది గుత్తి మండలముననే దొరికి నది. దీనినిబట్టి ఈ సీమ ఎన్ని యుగములనుండి పేరు ప్రతిష్ఠలు సంపాదించి యుండినదో గమనింపుము. పల్లవులు,చాళిక్యులు, హొయ సలులు, కాకతీయులు, రాయులు మహారాష్ట్రులు ఈ సీమను వరుసగా నేలిరి. వారు కట్టించిన కోటలు, చెఱువులు, నిర్మించిన దేవాలయ ములు, నగరులు, ఇచ్చిన ఇనాములు అగ్రహారములు, అంకిత మొందిన కావ్యప్రబంధములు నేటికిని తొంటివైభవమును చాటుచున్నవి.

కవులను శిల్పులను శ్రీకృష్ణదేవరాయుల ఆస్థానము ఆకర్షించినట్లు మరియేరాజసభయు ఆకర్షించలేదు. నవశిరీషకుసుమ పేశల సుధామ యొక్తులతో స్వారోచిష మనుసంభవ ప్రబంధము రచించిన అల్లసాని పెద్దన కడప మండలములోని కోకట గ్రామవాసి కావుననే ఆగ్రామము నతడు అగ్రహారముగా బడసెను. నాడును నేడును ఉత్తమోత్తమ కావ్యరచనకు కడప మండలమే పేరుమోసినది. ప్రొద్దుటూరి వాస్తవ్య లగు శ్రీ గడియారం శేషశాస్త్రులవారు రచించిన శివభారతము వంటి కావ్యము వెనుక నూరేండ్లుగాఆంధ్రదేశమునపుట్టలేదు,మరి నూరెండ్లకు పుట్టునను ఆశలేదన్నను అతిశయోక్తికాదు. ఆ గ్రంధమునకు తగిన ప్రచారము లభించుటలేదు. మన ఇంటనున్న మాణిక్యపు విలువను గ్రహించలేనంతటి స్థితిలో నుండుటకంటె దురవస్థనే దేమున్నది! రాజశేఖర కళావధాని సామాన్యకవియా! అతని రాణాప్రతాపసింహ నేటి తెనుగుకావ్యములలో తలమానికము వంటిది.

నంద్యాల కవి పింగళ సూరన రాయలసీమవాడైనందుకు మనము గర్వించతగియున్నది. మహాకవులకేగాదు...లకుగూడా ఈసీమ పుట్టినిల్లు. మల్లిఖాఫర్ తురుష్క సైన్యముచే పరాభూతమైన ఈ దక్కనులో, నాడు మరలిపోయిన ఏడేండ్లలోనే చక్కని సామ్రాజ్యము స్థాపించి దానికి జీవకళపోసి శౌర్యవీర్య/పరాక్రమములను నిండి ఢిల్లీ పాదుషహాలకును, బహమనీ సుల్తానుకును తేరిచూడరాని వైభవము నాపాదించిన శ్రీ హరిహర బుక్కరాయసోదరుల ప్రతాపమును సంస్థాపనా శక్తియు నేమని వర్ణింపగలము!

వారికి గురువై, నెయ్యుడై, మంత్రియై,వేదవ్యాఖ్యానకర్తయై విజయ నగర పట్టణమునకే గాదు సామ్రాజ్యమునకు గూడ శంకుస్థాపనా చార్యుడై శృంగేరి శారదాపీఠము నుండి కొల్లలుగా ధనము తెచ్చితన మంత్రశక్తిచేత కనకవర్షము కురిపించెనను ప్రఖ్యాతి బడసిన శ్రీ విద్యారణ్యస్వాముల కిది ఆదానభూమి. శ్రీ తిమ్మరసుమంత్రి మేధాశక్తిని మీయెదుట వర్ణించుట అనవసరము. కృష్ణదేవరాయుల ఖడ్గధారకంటె ముందుగా తిమ్మరసు ధీశక్తి ప్రసరించి ఆయన విజయ పరంపరలకు త్రోవచూపినది.

విజయనగర రాజులు పరాక్రమవంతులేగాదు, కవులు, రసికులు, దాతలు, దేశభాగ్యవిధాతలు గూడ. మన సీమ వారి అమృతహస్త ములచే సస్యశ్యామలమైనది. వారు కట్టించిన చెరువులే లేకున్న ఇది మనుష్యావాసమున కిరువుగాని ఎడారిగా నుండెడిది. ఒక్క చుక్కనీరు వృధాగా సముద్రముపాలుగాకుండ చెఱువులు ఆనకట్టలు కట్టించి జనులకు జీవనము కల్పించిన వారి యౌదార్యమును సేవాభిరుచిని ఎంతని వర్ణించగలము.!! కేవలము ఆకలిదప్పులగు పశువాంఛలనే వారు తీర్చను ప్రయత్నించలేదు. మానవుని బుద్ధివికాస మెంతవరకు ప్రవరింపగలదో దానిని నిరూపించగలశిల్పములనువారభివృద్ధి పరచిరి. హిందీ దేవాలయ శిల్పములందుకు నిదర్శనములు.రామరాజ భూషణుని సంగీతకళ, తాళ్ళపాకవారి కృతిరచన విఠల దేవాలయ శిల్పముల కంటే అపూర్వములు అమూల్యములు. ఇవి మన తొల్లింటి కథలు.

తళ్ళికోట యుద్ధమునాడు మన సీమలోశని ప్రవేశించినాడు. నాటినుండి నేటివరకు మన మంధకారమున తడవులాడుచున్నాము. విజయనగర సామ్రాజ్య నాశనముతో కుంతల సీమ చిక్కులపాలైనది. మహారాష్ట్రులు మహిసూరు సుల్తానులు, గోలకొండ నైజాముల మధ్య నిది దోపిడీసీమయై కడపట దత్తమండలమై కుంభిణీవారి ఏలుబడితో దగ్ధమండలముగా పరిణమించినది. కావుననే ఇది ఇంకను కలియుగ మధ్యమునందే ఇఱికికొని యున్నది.

నేడిది కఱువు కాటకముల విహారసీమ.అజ్ఞాన నిలయము. త్రాగునీరు దొరకని మరుభూమి. మన శిల్పము కఱువుబాటలు వేయుటలోనికి దిగినది. మన కుశలత కంకరరాళ్లు గొట్టుటగా పరిణమించినది. మన కవిత్వము ఫ్యామిక్ రిపోర్టులు వ్రాయుటతో సరిపడినది. మన పౌరుషము కూనీల కును మన దాతృత్వము వకీళ్ళకు ఫీజునిచ్చుటకును వినియోగపడుచున్నది.

క్రొత్తవి నిర్మించలేకపోగా, పాతశిల్పములను రక్షించుకొననైన లేకున్నాము.అప్పటి దేవాలయములు శిథిలములైనవి.చెఱువులు తెగినవి, కుంటలు పూడినవి, బావులు పాడుపడినవి. రసజ్ఞత అంతరించినది. కవిత్వము నిరాశ్రయమైనది. సంగీతము రైల్వే భిక్షకులచేత చిక్కినది. పల్లెలు బకాసుర నిలయములై ఏకచక్రపురమును జ్ఞాపకమునకు తెచ్చు చున్నవి, కావుననే చాలమంది చెడి పట్టణము చేరుచున్నారు. రాట్నము ప్రొయ్యిపాలై కవ్వము కాష్టమైనది. ఇప్పుడు మన సీమలో మిగిలిన పరిశ్రమ – అదియు ప్రోహిబిషన్ డిపార్టుమెంటువారి సాదరాభి మానములతో మిగిలి పెంపొందుచున్నది – వంటసారాయి పరిశ్రమ.

మన పౌరుష పరాక్రమములు కులకక్షలలో రేగి విజృంభించు చున్నవి. మన ధర్మగుణము స్వార్థకుక్షింభరత్వముగా మారినది. మన శాసనసభా సభ్యత్వము మన మిత్రుల దౌర్జన్యములను రక్షించుటకు. మన మంత్రిత్వము ప్రతిపక్షంమీద పగ దీర్చుకొనుటకు, క్షమింపుడు, అందరు నట్టివారు కాదని నేనెఱుగకపోలేదు.

విజ్ఞాన వికాసములు నాగరిక శిల్పములు మొదట రాయలసీమలో పుట్టి నలుదిశల క్రమక్రమముగా వ్యాపించినవి.

ఐరోపియనుల నవనాగరకతయో సముద్ర తీర్థములలో మొదట నెలకొని పశుబలము వెనుకగా మధ్యదేశమునకు ప్రాకివచ్చినది. కావున వెనుకటివారు ముందును ముందున్న వారు వెనుకకును నడువవలసిన పరిస్థితి ఏర్పడినది. మనము కట్టకడపటివారిమైతిమి. ఇదియే మన దుర్దశకు కారణము.

ఈ నూటయేబది యేండ్లుగా మన సీమకు జరిగిన అన్యాయమును ఏ చరిత్రకారుడును వర్ణింపలేదు. ఇచ్చట నదివర్ణించుటకు చోటుగానీ సమయముగానీ చాలదు. నాటికిని నేటికినిగల తారతమ్యము పైన నిరూపించినది చాలును. దీనికి కారకులు ఫలానా వారనుటకంటే కాలమే కారణమనుట బాగు.

కాలముసామ్రాజ్యములనాశముచేయును.క్రొత్తవానిని సృష్టించును. కోటీశ్వరుని కటిక దరిద్రునిచేయును.కూటి పేదనుకుబేరునిగా మార్చును. పండితుని పనికిరాని వానిగా చేయును. పనికిరానివానిని ప్రధానిగా చేయును.

ఎక్కడి ఇండియా, ఎక్కడి ఇంగ్లండు, దీని నది పాలించుట ఏమి? దేశభ్రష్టులై ద్వీపాంతరములకు వలసవెళ్ళిన యూరోపియనులు అమెరికా నాక్రమించి ప్రపంచమునాడించుటఏమి?జపాను తారాచువ్వ వలె అట్టే పైకెగిరి ఇట్టే క్రిందికి రాలినది. కావున అన్ని మహాత్మ్యముల కంటె కాలమహిమ గొప్పది.

రాయలసీమ ఉచ్చస్థానమునుండి పతనమై ఇప్పు డధమస్థానమున నున్నదనుట నిజము. కానీ అది మరల కాలక్రమముచే ఉచ్చస్థానము నకు రాక తప్పదు.ఆ రోజులు దగ్గరిలోనే యున్నవి.కాని మనము కాళ్ళు చాచుకొని ఊరక కాలముకొఱకు నిరీక్షించుచుండినచో మంచిదినములు రావు. సోమరులకు సులభముగా లభ్యమగునది... మృత్యువొక్కటే. కావున దైవయోగమునకు పురుషకారము తోడ్పడవలెను.

వర్షము వచ్చినను వానియంత కవియే మొలచునవి ముండ్లచెట్లే. కాని కృషికుడు భూమిని దున్ని విత్తనము చల్లినయెడల ధాన్యము పండును. అనుకూలకాలమున మనము వినియోగపరచుకోవలెను. లేకున్న వర్షజలము వరదలపాలై వృధాగా సముద్రము చేరునట్లు యోగకాలముగూడ వృథాగా మనలనుదాటిపోగలదు.

మన ముఖ్య కర్తవ్యమిప్పుడు కఱువును తప్పించుకొనుట. కడుపు నకు గంజిలేనప్పుడు కళాశాస్త్రముల మీదమనసెట్లు పోవును. పాడి పంటలకు జలమవసరము. దైవము మనకు దానిని చాల తక్కువపరుచెను. కురిసిన వర్షపునీటిని వృధపోనీకుండ మన పూర్వులు వంకలు వాగుల కక్కడనక్కడనే కట్టలుకట్టి నీరు నిలువచేసి ప్రతి గ్రామమునకును

జీవనాధారము కల్పించిరి. అందువలన ఒక్కచోట ఒక్కదిక్కున అనకుండ సీమ ఎల్లెడలను ప్రజలకు బ్రతుకుదెరువు లేర్పడినది. కాని బ్రిటిష ప్రభుత్వపు ఉపేక్షవలన నేమి, ప్రజల అశక్తివలననేమి అట్టి జలాశయములు చాల వరకు నష్టముభ్రష్టములైపోయినవి. జలప్రళయ కాలమున నక్కా ఎక్కడ నీ నివాసము అనగా, నాగసముద్రపు చెఱువు తూములో నన్న సామెతకుఉదాహరణముగా నున్నవి నేటి చెఱువులలో అసంఖ్యాకములు. ప్రభుత్వ దృష్టియేకాక, ప్రజలదృష్టి కూడా వీని మరమ్మత్తుల నాశింపకుండ పెద్దయేటి ప్రాజెక్టులమీదనే ప్రవర్తించుట వింతగా నున్నది. ప్రాజెక్టుల ఉపయోగము దాని దిగువనున్న నీ కొలది భూములకు మాత్రమే. వాని యజమానులు అప్రయత్నముగా ఐశ్వర్యవంతులగుదురు. కాని తక్కిన ప్రజానీకముతో అట్టి వారిసంఖ్య ఏపాటిది? లక్షమంది నిరుపేదలను నూరుమంది లక్షాధికారులను నున్నప్పుడే ప్రజలలో అసంతృప్తియు కమ్యూనిష్టు ప్రచారమున కవకాశమును ఏర్పడగలదు. కావున పెద్దప్రాజెక్టులమీదనే మన మాధారపడరాదు. అట్లని అవి కూడదనుట కాదు. తక్కిన మైనరు ఇర్రిగేషన్ పనులయెడకూడ మనము శ్రద్ధవహించి పనిచేయుట అగత్యమని నామనవి.

కూటికతర్వాతిది గుడ్డ, వెనుకటి శతాబ్దిలో మనకు మొదటిది లోపమైనా రెండవది యగు గుడ్డ కావలసినంతగా ఉత్పత్తియగు చుండెడిది. గ్రామజనుల కది రెండవముఖ్యవృత్తి. కుంభిణీవారు మనవృత్తిని మంట కలిపిరి. కాంగ్రెసు ఉద్యమాభివృద్ధి రోజులలో ఖద్దరుమీదనున్న శ్రద్ధాభక్తులు కాంగ్రెసు గవర్నమెంటు ఏర్పడినవెనుక నశించుట వింతలలోనెల్ల వింత. శ్రీప్రకాశంగారి ఖద్దరుప్రణాళికను తర్వాతి మంత్రులు నేలబెట్టి కాలరాచిరి. కావున ఇప్పుడు ఖద్దరునకూ కఱవేర్పడినది. వెనుకటి జిలుగునూలు వడకువారు నేడరుదైనారు. దొరికిన ఖద్దరుదోవతులిప్పుడు ఖరీదులో గొప్పయేగాదు మోతకును బరుగానున్నవి.

మంత్రులకు మిల్లుయంత్రములమీద అభిమాన మేర్పడినది. కాని అవిగూడ నిర్మాణముకాలేదు. మిల్లుస్థాపనకు లైసెన్సు పొందినవారు ఇతరుల కడ్డముగానున్నారు గాని తాము నిద్రించుచున్నారు, ఒకవేళ మిల్లు నిర్మాణమైనను ఏపదిమందికో దుర్భరమగు కూలిజీవన మేర్పడగలదు గాని బీదలందరకును చేతినిండపనికల్పింపజాలదు ఈ మిల్లులును ఆపెద్ద ప్రాజెక్టులవలె కొందరు కుబేరులను లక్షలమంది కుచేలులను సృష్టించి సంఘపు ఆర్థికదశలో విషమస్థితిని కల్పింపగలవు. అందువలనగూడ భావివిప్లవమునకు కాధారమును ఏర్పడగలదు. కాని ప్రజాసామాన్యమునకు కలుగులాభ మల్పమని విన్నవించు నా సాహసమును మన్నింప ప్రార్థన.

గ్రామ ఆర్థిక స్వాతంత్ర్యమును మన పూర్వులుసాధించినట్లు ఇతర ఖండములవారును సాధించియుండలేదు. కాలానుసారము పాత పద్ధతులు మారినవి నిజమే. కాని జపాన్ సాధించిన గ్రామపరిశ్రమాభ్యుదయమును మనము తలపెట్టనైన తలపెట్టక పోవుట విషాదకరముగానున్నది.

మన గవర్నమెంటునకు చిన్నపనులు పనికిరావు. పెద్దపనులన్న భయము. పెద్ద ప్రాజెక్టులకు అనండి చిన్నవాని విషయమై మనమును అందోళన చేయలేదు. పెద్ద ప్రాజెక్టులు ఎండమావుల వంటివని నేడు గ్రహింపగలుగుచున్నాము. మనము చిరకాలముగా నమ్ముకొన్న తుంగభద్రా ప్రాజెక్టు మనకు భద్రమైనదిగా పరిణమింపలేదు. కొండంతఆన కుండంతగా తేలినది. తుంగభద్రా హైలెవల్‌ఛానల్ మాటను మంత్రులు తలపెట్టారు. అదిలేని ఆ ప్రాజెక్టు తొండములేని ఏనుగు వలెనెనది. గండికోటమాట తలపెట్టరుగదా! అప్పర్ పెన్నేరు ప్రాజెక్టునకు అదిగో ఇదిగో శిలవేసెదనన్న మంత్రి పదవి చాలించుకొని వెళ్ళెను. అది ఇంకను ఇన్‌వెస్టిగేషనులో ఉన్నదన్నమాట. శాసనసభలో వినవచ్చినది ప్రాజెక్టుల మూలమున కలుగవలసిన ఫలము మనకు కలుగదను కొన్నను వాని నుండి ఉత్పత్తియగు ఎలక్ట్రిసిటివలననైన పరిశ్రమాభివృద్ధి కలుగగలదను ఆశ ఇంకను బాధించుచునేయున్నది. అందుకొఱకే ఈ ప్రాజెక్టులు కావలెననుచున్నాము. కాని ఈ ఎలెక్ట్రిసిటీ వ్యవహారము గూడ మెఱుపు తీగవంటిదె తళుక్కుమని మెరసి కనులను చీకటి క్రమ్మించిపోవునేమో ఎవ్వడెరుగుదురు? తాడిపర్తివద్ద తలపెట్టిన కర్నూల్ స్టేషన్ ప్రక్కన పెన్నలోనికి జారి నెల్లూరికి కొట్టుకుపోయినది గదా! మైసూరువారిచ్చెదమన్న ఎలెక్ట్రిసిటీని తీసికొనుటకు గవర్నమెంటు సిద్దముగా ఎందుకులేదు? మన వేరుసెనగనూనె పరిశ్రమగూడ మనకు దక్కకుండ బిర్లాగారు వచ్చి కర్నూలులో దిగ్విజయము చేసిరికదా! ఇంకను ఎవ్వరెవ్వరెక్కడ నవతరింపగలరో? ఇట్టి స్థితిలో మన ఆర్థికస్థితి ఎట్లు చక్కబడగలదు?

చేరువనున్న మైసూరు రాజ్యములో పరిశ్రమ లెట్లు పెంపొందుచున్నవో చూచినప్పుడు మన ప్రభుత్వము వారి యుపేక్షద్యోతకమగుచున్నది. అక్కడి పట్టుపరిశ్రమ రాయలసీమలో పలుచోట్ల వృద్ధిపొందుట కవకాశమున్నది. ఎలెక్ట్రిసిటీ లభ్యమైన యెడల పవరు మగ్గములతో పల్లెపల్లెలోగుడ్డనేసి ప్రపంచమునకే అందియ్యలేదా రాయలసీమ ఒక్కటే! వస్త్రములేనా రాగి, ఇత్తడి, కంచు పరిశ్రమల నిర్మాణము, బంగారు, వెండి, రాగి జరీఉత్పత్తి, సుద్దరాయిపొడితో వివిధమగు రంగులు పొడరులు సృష్టి, కలమందనారతోత్రాళ్ళు, గనులు త్రవ్వి వ్రాత పలకలు పరువు బండలు, శిలాఫలకములు సప్లయి, వెదురులతో తడకలు, బుట్టలు, మంచముల రచన ఇవి ఈ సీమలో సులభసాధ్యములు. అంతేకాదు తోళ్ళవస్తువులు చర్మముల కర, చేతిగాజులు లక్క బొమ్మలు కఱుగు కాగితములు, దళసరి అట్టలు, కత్తులు, చాకులు, కత్తెరలు, కంబళ్లు, మగ్గములు వానిలోవాడు కొమ్ములు, కొమ్ము వజ్రము, సబ్బులు మంచపు పట్టలు, ఫలరవములు, తేనెలు, పాలపొడులు, వాసననూనెలు, పరిమళ ద్రవ్యములు, పెన్సిళ్ళు కలములు సిరాలు, బెల్లము, చక్కెర, మొలాసస్,

కప్పుపెంకులు, సిమెంటుదోనెలు, ఎద్దుబండ్లు, బీడీ, చుట్ట, సిగరెట్లు, వశ్యము, నక్కపొడి, పండ్లపొడి, పిప్పరమెంట్లు, ఇట్టివస్తువులు గృహ పరిశ్రమలుగానే ఉత్పత్తిచేయు సాధ్యమున్నది. కాని వీనికి కావలసినది ఎలెక్ట్రిసిటి. రెండవది ఈ కార్యక్రమముకొనసాగింపజాలిన ప్రభుత్వ పరిశీలన. రాయలసీమకు ఇట్టి గృహపరిశ్రమల వలననే ఆర్థికముక్తి ఏర్పడగలదు. కాని కేవలము ఇర్రిగేషన్ ప్రాజెక్టులవలనగాదు. కావున మన దృక్పథము ప్రాజెక్టులనుండి మార్చి గృహపరిశ్రమల వైపు త్రిప్పుట అత్యవసరము. అట్లయినగాని ప్రజలందరకు సుఖసంపద లందుబాటు లోకి రావు.

ముఖ్యము మనము గమనించవలసిన దింకొక్కటి గలదు. మనకు స్వరాజ్యమొచ్చినది వాస్తవమే.కాని దానితోపాటు ఎనలేనిబాధ్యత కూడా అబ్బినది. నేటి ప్రభుత్వములు, శాసనసభ్యులును అధికార సంపాదనా దాని సంస్థాపనా కుచక్రములో తగుల్కొన్నారు. ఆ చక్రము తిరుగువేగము గూడ నానాటికి హెచ్చుచున్నది. వారు దానినుండి వెలువడ జాలరు. వారిని నమ్ముకొని మన సీమయు మన దేశమున ఉద్ధరింపబడగలదని విశ్వసించుట కుక్కతోక బట్టి గోదావరి నీదగలనని నమ్ముటవంటిదే యగునేమో. కావుననే ప్రజలే ఈ నిర్మాణ కార్యక్రమమునకు పూనుకొనవలెను.

పూర్వమువలె మనము సోమరులై యుండవీలులేదు.కాలము వృథ పర్చుట సొమ్మునిప్రయోజనముగ నమ్మనేయటవలె పాపముగా భావించ వలెను. పోయిన సొమ్ము తిరుగసంపాదించవీలున్నదికాని గడచిన కాలమును లాగకొన రాలేము. కావున ఒక్క నిమిషము వృథచేయకుండ మనము పనిచేయవలసి యున్నది. మనమేగాదు ఇంటింటను ఉన్నవారం దరును పూని పనిచేయదగును. ప్రతిగృహమును ఒక్క ఫ్యాక్టరీ కావలెను ప్రతివ్యక్తియు ఒక యంత్రమువలె పనిచేయదగును. మనదేశము జన సంఖ్యలోనేగాదు మేలివస్తువుల యునికిలో గూడ ప్రపంచమున నగ్రస్థానము వహించినది. కాని ఆరెంటిని మేళవించి ఉత్పత్తికార్యము జరుపదగును. కుమ్మరి యున్నాడు మట్టియుగలదు. కాని కుండలు నిర్మాణమగుటలేదు. కావుననే మన సీమలోని అమూల్యవస్తు సామగ్రిలో అప్రమేయమగు ప్రజల బుద్ధికుశలతను జంటించి రాయలసీమ ఐశ్వర్యాభి వృద్ధికిని అందుమూలమున ప్రజలసుఖ శాంతికిని ఈ మనసభ శంకు స్థాపన చేయగలదని విశ్వసించుచున్నాను.

(నెందలూరులో జరుగుచున్న కడపరాయలసీమఆర్థికాభివృద్ధి మహాసభలో శ్రీ పప్పూరి రామాచార్యుల ప్రారంభోపన్యాసము)

*శ్రీ సాధన పత్రిక 12-3-1949*

కలికాల కలుషముల కడుగదలచిన నలువ
తన జనకు కరుణకై తపియించె మున్నెపుడొ
నలువ చేసిన తపము నవనవోన్మేషమై
నారాయణుని గుండె నవనీతమై కరిగె
శశ్వ దానందార్ద్రస్పందనాకృతి స్వామి
అశ్వత్థమై నిలిచె ఆ నలువ కట్టెదుట
తెల్లతెల్లని రావి మెల్లమెల్లగ కరిగి
చల్లచల్లని నీటియూటలై జాల్వారి
అచట సహ్యాద్రి ఉత్తర శిఖరవాటి
మొదట ఈ కృష్ణమ్మ బొడ్డుకోసిన చోటు
మూర్తిదాల్చిన యట్టి మూడు వేదమ్ములు
ఆర్తితో తపియించి అలమటించిన వేళ
ప్రత్యక్షమైనట్టి పార్వతీ విభుమూర్తి

శ్రీమతి పుట్టి నాగలక్ష్మి

# స్టాంపుల కృష్ణాతీరం

"గలగలాగోదారి కదలి పోతుంటేను

బిరాబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను"

ఈ పాట పాడుకున్నా, విన్నా తెలుగువారి మనసు పులకరిస్తుంది. ఆనందం ఉవ్వెత్తున ఎగసి పడుతుంది.

"కదలి రావే ! కృష్ణవేణీ !

కదలిరా నిత్యకళ్యాణీ !

కదలి కదలిరా ! కడుపు చల్లని తల్లి" అంటూ కృష్ణమ్మకు స్వాగత నీరాజనాలు పలికారు కరుణశ్రీ.

ఈ కృష్ణాపరీవాహక ప్రదేశానికి వేవేల సంవత్సరాల చరిత్ర వుంది. నదీలోయలు నాగరికతా వికాసకేంద్రాలయితే నాగరికతలు మానవవికాసానికి దోహదం చేశాయి. తెలుగు సంస్కృతీ వికాసానికి పట్టుగొమ్మలయిన కృష్ణానదీ పరీవాహక ప్రాంతాల చరిత్రను పరిశీలిస్తే శాతవాహనులు, ఇక్ష్వాకులు, కాదంబ, విష్ణుకుండిన, శాలంకాయన, పల్లవ, చోళ, హొయసలాది రాజవంశాలు పరిపాలించాయి. వివిధ రాజవంశీయులతోపాటు విదేశీయులు ఈ ప్రాంతాన్ని పరిపాలించారు. ప్రాచీనయుగం నుండి ఆధునికయుగం వరకు కృష్ణాతీరానికి విశేష ప్రాముఖ్యత లభించింది.

చారిత్రక ఆధారలలో పురావస్తువులతోపాటు నాణెములకు, స్టాంపులకు ఎనలేని, ఎన్నలేని స్థానముంది. నాణెములు ప్రాచీన, మధ్యయుగాల చరిత్రకు ఆధారాలయితే స్టాంపులు ఆధునిక ఆధారాలు. వీటిని ముద్రించేముందు అనేక విషయాలను పరిశీలించి, పరిశోధించి ఆయా విషయాలకు చెందిన స్టాంపులను ముద్రించడం జరుగుతుంది. కృష్ణాతీరంలోని స్టాంపులను ఒకసారి చూద్దాము.

### డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య :

పుట్టింది పశ్చిమ గోదావరిజిల్లా అయినా మచిలీపట్నాన్ని కార్యక్షేత్రంగా ఎంచుకున్నారు డాక్టర్ పట్టాభి సీతారామయ్య. గాంధీజీకి నిజమయిన అనుచరుడు. "భారత జాతీయ కాంగ్రెస్" అధ్యక్షుడిగా పనిచేశారు. స్వతంత్రసమరయోధుడిగా కృషిచేస్తూనే / ఆంధ్రా సైంటిఫిక్ కంపెనీ, ఆంధ్రా లైఫ్ ఇన్స్యూరెన్స్, ఆంధ్రాబ్యాంకులను ఏర్పాటుచేసి తెలుగువారికి సేవలను అందించారు. "భారతజాతీయ కాంగ్రెస్" స్వర్ణోత్సవాల సందర్భముగా 'భారత జాతీయ కాంగ్రెస్ చరిత్ర'ను గ్రంథస్థం చేశారు. స్వతంత్ర్యం వచ్చిన తరువాత రాజకీయ పదవులను స్వీకరించని నిస్వార్థపరాయణుడు.

వీరి జ్ఞాపకార్థము ది. 17-12-1997 వ తేదీన రూ. 2-00ల విలువతో స్టాంపు విడుదలయింది. అంతేకాదు, 28-12-1985వ తేదీన విడుదలయిన కాంగ్రెస్ శతవార్షికోత్సవ స్టాంపుల బ్లాకులో కాంగ్రెస్ అధ్యక్షుల హోదాలో పట్టాభి స్టాంపు దర్శనమిస్తుంది.

### శ్రీ పింగళి వెంకయ్య :

కృష్ణాజిల్లా మొవ్వ మండలం భట్లపెనుమఱ్ఱు గ్రామంలో శ్రీ పింగళి వెంకయ్య జన్మించారు. వ్యవసాయ శాస్త్రవేత్తగా, ఖనిజ శాస్త్రవేత్తగా పేరు పొందారు. గాంధేయుడిలో స్వాతంత్ర్యోద్యమంలో పాలుపంచుకున్నారు.

1921 మార్చిలో గాంధీజీ బెజవాడ వచ్చినపుడు మూడు గంటలలో కాంగ్రెస్‌కు జాతీయ పతాకము తయారుచేయమని పింగళి వెంకయ్యను కోరారు. కాషాయము, తెలుపు, ఆకుపచ్చ రంగులతో ముచ్చటయిన మూడు రంగుల జండాను తయారుచేశారు. గాంధీజీ తెలుపురంగు మధ్యలో రాట్నాన్ని జోడించి కాంగ్రెస్ పతాకంగా ప్రచారంలోకి తీసుకువచ్చారు. స్వాతంత్ర్యం లభించిన తరువాత రాట్నం స్థానంలో 'అశోకధర్మచక్రాన్ని' చేర్చారు. అప్పటినుండి భారతజాతీయ పతాకముగా వెలుగొందుతోంది.

ఈవిధంగా జాతీయపతాక రూపశిల్పి అయిన శ్రీ పింగళి వెంకయ్య స్మారక స్టాంపును విలువతో విడుదల చేశారు.

**ఆంధ్రరాష్ట్ర ప్రథమ ముఖ్యమంత్రి - ఆంధ్రకేసరి :**

నాటి గుంటూరు నేటి ప్రకాశంజిల్లాలో జన్మించిన శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులు ప్రముఖ న్యాయవాదిగా పేరుపొందారు. గాంధీజీ పిలుపును అందుకుని స్వాతంత్ర్యోద్యమంలో పాలుపంచుకున్నారు.

గుండెకెదురుగా గుండె నిలిపి చంపమని గర్జించి 'ఆంధ్రకేసరి'గా మారారు. పత్రికలను నడిపి పాఠకులలో దేశభక్తి పెంపొందింప జేశారు.

విజయవాడలో కృష్ణాతీరంలో సర్ ఆర్థర్ కాటన్ నిర్మించిన ప్రాజెక్టుపైన బ్యారేజిని నిర్మించి - ప్రకాశంపంతులుగారి గౌరవార్థం 'ప్రకాశం బ్యారేజి' అని పిలుచుకుంటూ ఆయనని గౌరవించుకుంటు న్నాము. ఆంధ్రోద్యమంలో పాలుపంచుకున్నారు. 1953 అక్టోబర్ 1వ తేదీన ఏర్పడిన ఆంధ్రరాష్ట్రానికి తొలి ముఖ్యమంత్రిగా పనిచేశారు. వీరి శతజయంతి సందర్భంగా 16-10-1972న 20 పైసలు విలువతో విడుదలయిన తపాలాబిళ్ళ మీద ఆయన చిత్రంతో పాటు, 'టం॥ ప్రకాశం' అని తెలుగులో వారి సంతకాన్ని ముద్రించడం విశేషం.

**హైదరాబాద్ ఏకైక ముఖ్యమంత్రి : శ్రీ బూర్గుల రామకృష్ణారావు :**

మహబూబ్‌నగర్ జిల్లాలో బూర్గుల గ్రామానికి చెందిన బూర్గుల రామకృష్ణారావు రాజనీతిజ్ఞుడు, సంఘసంస్కరణాభిలాషి, బహుభాషా కోవిదుడు, అన్నింటికీ మించి హైదరాబాద్ రాష్ట్ర ఏకైక ముఖ్యమంత్రి. హైదరాబాదు రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడిగా పనిచేసి 1952లో ముఖ్య మంత్రిగా పదవిని స్వీకరించారు. హైదరాబాదులో భూసంస్కరణలను అమలుచేశారు. సమూలమైన మార్పులను తీసుకువచ్చారు. ఆంధ్ర రాష్ట్రాన్ని, హైదరాబాదు రాష్ట్రాన్ని కలిపి ఆంధ్రప్రదేశ్‌గా రూపొం దించడం కోసం ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేశారు.

రాష్ట్ర ఆవిర్భావానికి నేను చేస్తున్న ఈ సంతకం నా రాజకీయ మరణానికి వారంటు" అని ప్రకటించుకున్నారాయన. ఆయన శత జయంతి సందర్భముగా ది. 13-03-2000వ తేదీన రూ॥ 3-00 విలువతో స్టాంపు విడుదలయింది.

**శ్రీ దామోదరం సంజీవయ్య - తొలి దళిత ముఖ్యమంత్రి :**

కర్నూలు జిల్లా పెద్దపాడులో శ్రీ దామోదరం సంజీవయ్య జన్మిం చారు. చెన్నపట్టణంలో చదివి పట్టా తీసుకున్నారు. గాంధీజీ అను చరుడిగా స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. ఖద్దరు గురించి విస్తృతంగా ప్రచారము చేశారు. "భారత జాతీయ కాంగ్రెస్" అధ్యక్షుడిగా పనిచేశారు.

ఉమ్మడి మదరాసు రాష్ట్రములో శ్రీ రాజాజీ, బెజవాడ గోపాలరెడ్డిల మంత్రివర్గాలలో మంత్రిగా పనిచేశారు. మరొక గొప్ప విశేషం భారత దేశము తొలి ముగ్గురు ప్రధానమంత్రుల మంత్రివర్గాలలో క్యాబినెట్ మంత్రిగా పదవిబాధ్యతలను స్వీకరిచారు. ఆంధ్రప్రదేశ్‌కు ముఖ్య మంత్రిగా పనిచేశారు. తెలుగును పాలనాభాషగా అమలుపరిచే ప్రయత్నం చేశారు.

వీరి జ్ఞాపకార్థము ది. 14-2-2008వ తేదీన విలువతో విడుద లయిన స్టాంపులో సంజీవయ్యగారి చిత్రంతోపాటు తిరుమల ఆనంద నిలయం, చార్మినార్, అసెంబ్లీభవనము, కూచిపూడి నృత్యకళాకారిణి, నల్గొండ జిల్లాలోని 'నాగార్జునసాగర్' చిత్రాలను ముద్రించారు. ఈ స్టాంపు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లోని ముఖ్యాంశాలకు ప్రతీకగా నిలిచింది.

**శ్రీ నందమూరి తారకరామారావు :**

**తొలికాంగ్రెసేతర ముఖ్యమంత్రి :**

తెలుగువారి వెండితెరవేల్పు, పురాణేతిహాసాల్లోని నాయక, ప్రతి నాయక పాత్ర (ల) ధారి, విశ్వవిఖ్యాత నటసార్వభౌముడు శ్రీ నందమూరి తారక రామారావు. తెలుగువారి ఆత్మగౌరవ నినాదముతో 'తెలుగుదేశం పార్టీ'ని స్థాపించారు. 9 నెలలలోనే ముఖ్యమంత్రి పీఠాన్ని అధిష్టించారు. జాతీయస్థాయిలో కాంగ్రెసేతర రాజకీయపక్షాల వారిని ఏకత్రాటి మీదకు తీసుకువచ్చారు. విజయవాడలోనే జాతీయస్థాయి ప్రతిపక్షాల సమావేశమును ఏర్పాటుచేసి జాతీయస్థాయి నాయకుడిగా ఎదిగారు.

కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా నిమ్మకూరులో జన్మించి చలన చిత్రాలద్వారా ఈ నాటికీ ప్రేక్షకుల హృదయాలను అలరిస్తున్నారు. వీరి జ్ఞాపకార్థము 28-05-2000న విడుదలయిన రూ 3-00ల విలువ స్టాంపులో ఆయన చిత్రంతోపాటు చలనచిత్రాల నెగిటివ్స్ హారము మధ్యలో తెలుగు సినీమతల్లి చిత్రం కన్పిస్తుంది. ఈ చిత్రం భూమికి ప్రతీకగా (అ) అన్పిస్తుంది. దీనివెనుక ఎత్తయిన పర్వత శ్రేణులు నయనానందకరంగా, ఆహ్లాదకరంగా దర్శనమిస్తాయి.

**శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి :**

గుంటూరుజిల్లా చిరుమామిళ్ళ గ్రామంలో జన్మించిన కాసు బ్రహ్మానందరెడ్డి కోస్తాంధ్ర ప్రాంతం నుండి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అయిన తొలి వ్యక్తి. ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెస్‌పార్టీలో తనకి ఎదురులేదని అనిపించుకున్నవారు. రాష్ట్ర కాంగ్రెస్ ఎన్నికల కమిటీలో తన ఆధిపత్యాన్ని ఋజువు చేసుకున్నారు. 1969లో జరిగిన రాష్ట్రపతి ఎన్నికలలో తన గురువు శ్రీ నీలం సంజీవరెడ్డికి వ్యతిరేకంగా ఇందిరా

గాంధీకి మద్దతు యిచ్చి వి.వి. గిరి గెలుపుకు కారకుడయ్యారు. అలాగే 1978లో కాంగ్రెస్ చీలిపోయింది. ఆ సమయంలో కాంగ్రెస్ అధ్యక్షుడిగా పదవిలోనున్న కాసు బ్రహ్మానందరెడ్డి ఇందిరాగాంధిని పార్టీనుండి బహిష్కరించారు. తరువాత శ్రీమతి ఇందిరాగాంధి ఇందిరా కాంగ్రెస్ అధ్యక్షురాలయ్యారు.

అవశేష కాంగ్రెస్ 'రెడ్డి కాంగ్రెస్'గా రంగంలో నిలిచింది. చివరకు ఓడి మళ్ళీ ఇందిరా కాంగ్రెస్‌లో చేరారు. మహారాష్ట్ర గవర్నర్‌గా ఈయన రాజకీయ ప్రస్థానం ముగిసింది. పోచంపాడు, నాగార్జునసాగర్ ప్రాజెక్టుల నిర్మాణము త్వరితగతిన పూర్తిచేయించడంలో వీరి కృషి అనుపమానం.

వీరి జ్ఞాపకార్థము విలువతో స్టాంపును విడుదల చేశారు. కాంగ్రెస్ శతవార్షికోత్సవ స్టాంపులో కాంగ్రెస్ అధ్యక్ష హోదాలో వీరికి స్థానము లభించింది.

ప్రపంచస్టాంపుల చరిత్రలో తండ్రీకొడుకులకు గల ఘనత నెహ్రూ కుటుంబానికే దక్కింది. మళ్ళీ ఇటువంటి ఘనత కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా అంగలూరు గ్రామానికి చెందిన కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి, ఆయన కుమారుడు త్రిపురనేని గోపీచంద్‌కు దక్కుతుంది.

### కవిరాజు : శ్రీ త్రిపురనేని రామస్వామి :

కవి పండితుడు, సంఘసంస్కర్త, స్వాతంత్ర్యసమరయోధుడు. భారతం పాండవపక్షపాతంతో కూడి వుందని నొక్కి వక్కాణించారు. కౌరవులే నీతిపరులని భావించారు. హేతువాదాన్ని ప్రచారము చేశారు. రాజకీయ ప్రవేశము చేసి తెనాలి మున్సిపల్ ఛైర్మన్‌గా పనిచేశారు.

**"వీర గంధము తెచ్చినారము**

**వీరుడెవ్వడొ తెల్పుడీ !**

**పూసిపోదుము మెడనువైతుము**

**పూలదండలు భక్తితో"** అని తన దేశభక్తి గేయముతో తెలుగు ప్రజలను ఉర్రూతలూగించి – తెలుగువారి గుండెల్లో స్వేచ్ఛకోసం నగారా మ్రోగించిన 'నవయుగ వైతాళికుడు' కవిరాజు స్మారక తపాలాబిళ్ళను ది. 25–4–1987వ తేదీన "India's struggle for Freedom" - 5th Series లో భాగంగా విడుదల చేశారు.

### త్రిపురనేని గోపీచంద్ :

కవిరాజు కుమారుడు గోపీచంద్ సాహిత్యరంగంలోనేగాక చలన చిత్రరంగంలోని వివిధ శాఖలలో పనిచేశారు. "ఎందుకు ?" అని ప్రశ్నించే తత్వం వీరికి తండ్రి నుండే అలవడింది. ఈ ప్రశ్నే మనని జీవితంలో పైకి తెస్తుందని, అభివృద్ధిపథంలో నడిపిస్తుందని నమ్మినవాడు. ఆయన రచనలలో తాత్వికత ఎక్కువగా కనిపిస్తుంది. గోపీచంద్ వ్రాసిన "అసమర్థుని జీవయాత్ర" ; "పోస్టు చేయని ఉత్తరాలు" వంటి గ్రంథాలు అశేష పాఠకుల అభిమానాన్ని చూర గొన్నాయి. త్రిపురనేని గోపీచంద్ స్టాంపు విడుదలయింది.

### గోపరాజు సాంబశివరావు :

హేతువాద, నాస్తికోద్యమాలకు ఊపిరి పోశారు. నాస్తికోద్యమ వ్యాప్తి కోసం ప్రపంచ పర్యటన చేశారు. 'తొలి ప్రపంచ నాస్తిక సభ"లను విజయవాడలో ఏర్పాటుచేశారు. తన కుటుంబ సభ్యులందరిని నాస్తికోద్యమమువైపు మరలించి హేతువాదులుగా, నాస్తికవాదులుగా తయారుచేశారు. సంఘసంస్కర్త, భూదానోద్యమకర్త, కూడా అయిన శ్రీ గోరా స్మారక తపాలాబిళ్ళను ది. 16–9–2002వ తేదీన సంఘసంస్కర్తల సిరీస్‌లో విడుదలచేశారు. ఈ స్టాంపులో వీరి చిత్రంతోపాటు అభాగిని అయిన మహిళ, నాగలిపట్టిన రైతు, పూరిల్లు తదితరము దర్శనమిస్తాయి. గోరా సంఘసంస్కరణకు తగినట్లు ఈ స్టాంపును ముద్రించడం విశేషము.

### ఘంటసాల వెంకటేశ్వరరావు :

కృష్ణాజిల్లా గుడివాడ సమీపంలోని చౌటపల్లిలో జన్మించారు ఘంటసాల. విజయనగరం మహారాజా కళాశాలలో సంగీతాన్ని అభ్యసించారు. తొలిరోజుల్లో లలితసంగీతం ప్రైవేటు రికార్డులను యిచ్చారు. చలనచిత్రరంగంలో ప్రవేశించిన తరువాత గాయకునిగా, సంగీత దర్శకునిగా అనుపమానమైన ప్రజ్ఞను ప్రదర్శించారు.

ఆయన స్వరం నుండి వెలువడిన పుష్పవిలాపం కరుణశ్రీ ఆవేదనని కళ్ళకి కట్టినట్లు (అ) వినిపిస్తుంది. ఆయన ఆలపించిన భగవద్గీత సంగతి మనకందరకూ తెలిసిందే ! ఆయన సినీగాయకుడు కాకముందే స్వాతంత్ర్యోద్యమములో పాల్గొని జైలుశిక్షను అనుభ వించారు.

వీరి స్మారక తపాలాబిళ్ళ 11-02-2003వ తేదీన రూ॥ 5-00 విలువతో విడుదలయింది. ఘంటసాల కుటుంబసభ్యులు – స్టాంపు సత్కరించడం అపురూపం.

### క్రికెట్ వీరుడు కల్నల్ సి.కె. నాయుడు :

కృష్ణాజిల్లా మచిలీపట్నంలో జన్మించిన కల్నల్ సి.కె.నాయుడు క్రికెట్ వీరుడిగా పేరు గడించారు. బాల్యం నుండి క్రికెట్ ఆటను ప్రేమించారు. 1932లో ఇంగ్లాండ్‌లో పర్యటించిన తొలి క్రికెట్ జట్టుకు నాయకత్వం వహించాడు. ఆయన ప్రతిభకు ప్రతిగా విజ్డన్

క్రికెటర్ బిరుదును పొందాడు. 1953-54లో ఆంధ్రక్రికెట్ జట్టుకి నాయకత్వం వహించాడు. 1963లో భారత ప్రభుత్వం 'పద్మభూషణ్' పురస్కారముతో సత్కరించింది. వీరి జ్ఞాపకార్థము 13-03-1996 వ తేదీన రూ॥ 2-00 విలువతో బ్యాటింగ్ చేస్తున్న సి.కె.నాయుడు చిత్రంతో స్టాంపు విడుదలయింది.

**శ్రీ గూడురు వెంకటచలం :**

ప్రముఖ వ్యవసాయశాస్త్రవేత్త శ్రీ గూడూరు వెంకటచలం. కృష్ణా చలం గుడివాడకు చెందినవారు. వీరు ప్రముఖ వ్యవసాయ శాస్త్రవేత్త. హరితవిప్లవములో భాగముగా వరికి ప్రాధాన్యతను యిచ్చి పరిశోధించి నూతన వరి వంగడాలను సృష్టించారు. వెంకటచలం గారి స్పెషల్ కవర్‌ను "The Pioneer of Green Revolution" నినాదంతో "Food Safeth and Quality Year" సందర్భముగా 30-11-2009వ తేదీన విడుదల చేశారు.

**శ్రీశైల మల్లికార్జున దేవాలయము :**

కర్నూలు జిల్లాలోని నల్లమల కొండలలోని శ్రీశైలంలోని మల్లికార్జునస్వామి దేవాలయం అనాదిగా శైవక్షేత్రంగా భాసిల్లుతోంది. భారతదేశంలోని ద్వాదశజ్యోతిర్లింగాలలో ఇది ఒకటి. ఇక్కడ శ్రీరాముడు ప్రతిష్టించిన లింగాలు, పంచపాండవులు ప్రతిష్టించిన లింగాలు వుండడం విశేషం. పాల్కురికి సోమనాధుని పండితారాధ్య చరిత్రలోను, బసవేశ్వరుని బసవపురాణంలోను, స్కంధ పురాణం లోను ఈ ఆలయ ప్రస్తావన కన్పిస్తుంది. ఈ క్షేత్రాన్ని దర్శించిన తరువాతనే ఆదిశంకరాచార్యులు 'శివానందలహరి'ని వ్రాశారు.

**"శ్రీశైలం మల్లన్నా శిరసొంచేనా ?**

**చేనంతా గంగమ్మా వానా !"** అన్నారొకవి. "ఆధునిక దేవాలయం - శ్రీశైలం ప్రాజెక్టు" తెలుగువారికి నీటిని, దీపాల వెలుగును ఇస్తున్నాయి.

**కూచిపూడి నాట్యం :**

కృష్ణాజిల్లాలోని కూచిపూడిలోని కూచిపూడి నాట్యం విశ్వవ్యాపిత మైంది. ఈ నాట్యకళ సర్వజన సమానతను, సర్వజీవ సమానతను, సర్వమత సమానత్వాన్ని బోధించింది. 'సిద్ధేంద్రయోగి' ద్వారా ఈ కళ ప్రాచర్యంలోకి వచ్చింది.

ఈ నాట్యములో అనేక శాఖలున్నాయి. రూపకములు, కలా పములు, కేళికలు, నృత్య నాటకములు, యక్షగానములు, నృత్య నాటికలు, బృందనృత్యాలు వంటివి ప్రాచుర్యం పొందాయి. ఈ కూచిపూడి నాట్యము తెలుగునేలతోపాటు, రాష్ట్ర, దేశాల ఎల్లలు దాటి ప్రపంచమంతా వ్యాపించింది. కూచిపూడి నృత్యకళాకారుడి చిత్రంతో ది. 20-10-1975వ తేదీన "Indian Classical Series" లో (6 స్టాంపులు) భాగంగా రూ. 1-50 పైసల విలువతో స్టాంపు విడుద లయింది.

**శ్రీమతి భానుమతీ రమకృష్ణ :**

శ్రీమతి భానుమతీ రామకృష్ణ గుంటూరుజిల్లాలో జన్మించారు. చిన్నతనంలోనే చెన్నపట్టణము చేరి 1939లో సినిమారంగంలో ప్రవేశించారు. వరవిక్రయంతో సినీ నటిగా ప్రస్థానము మొదలయింది. అనతికాలంలోనే ఆమె బహుముఖ ప్రజ్ఞాశాలిగా పేరు పొందారు. నటి, గాయని, నిర్మాత, దర్శకురాలు, రచయిత్రి, స్టూడియో అధినేత్రిగా తెలుగుచిత్రసీమను ఏలారు. 'స్వర్గసీమ'లో ఐటమ్ డ్యాన్స్ చేసినా, మల్లీశ్వరిలో నవరసాల అభినయాన్ని చూపినా ఆమెకు ఆమెసాటి. త్రిభాషా చిత్రం చండీరాణి ఆమె ప్రతిభకు పరాకాష్ఠ. ఆమె హాస్య రసంతో సమ్మిళితం చేసి వ్రాసిన "అత్తగారి కథలు" సాహిత్య అకాడమీ పురస్కారాన్ని అందుకుంది. వీరి స్మారక తపాలాబిళ్ళ "Hundred Years of Indian Cinema" సందర్భముగా విడుదలయిన స్టాంపుల్లో ఉండడం తెలుగువారికి - కృష్ణాతీరవాసులకు గర్వకారణం.

**శ్రీమతి సావిత్రి :**

శ్రీమతి సావిత్ర గుంటూరుజిల్లా చిర్రావూరులో జన్మించింది. బాల్యంలో సినిమారంగంవైపు ఆకర్షితురాలయింది. 'సంసారం' సినిమాలో చిన్న పాత్రతో ప్రారంభమయిన సినీప్రస్థానం ఆమెను మకుటంలేని మహారాణిని చేసింది. దేవదాసు, మాయాబజార్, కన్యాశుల్కం, రక్తసంబంధం, సుమంగళి, డాక్టర్ చక్రవర్తి, ఆరాధన, మనుషులు - మమతలు, దీపావళి వంటి చిత్రాలలో వైవిధ్యమయిన పాత్రలు ధరించింది. గోరింటాకు, అమ్మమాట వంటి చిత్రాలలో తల్లిపాత్రలు, ఇంకా అనేక చిత్రాలలో గుణచిత్ర నటిగా తన ప్రతిభను నిరూపించింది. నిర్మాతగా, దర్శకురాలిగా అనేక చిత్రాలను తెలుగు చిత్రసీమకు బహూకరించింది. అందరూ మహిళా సాంకేతిక నిపుణులతో "చిన్నారిపాపలు" నిర్మించింది.

**S.V. రంగారావు :**

కృష్ణాజిల్లా నూజివీడులో జన్మించిన 'సామర్ల వెంకట రంగారావు' గురించి తెలియని తెలుగువారే కాదు - దక్షిణ భారత ప్రజలు కూడా ఉండరు అనడం అతిశయోక్తి కాదు. 'వరూధిని' చిత్రంతో సినిమాలో ప్రవేశించారు. పాతాళభైరవి, మాయాబజార్ వంటి చిత్రాలలో మాయావిగా, దీపావళి, యశోదాకృష్ణ వంటి అనేక చిత్రాలలో ప్రతి నాయకుడయిన రాక్షసుడిగా / ఆత్మబంధువు, గుండమ్మ కథ, పండంటి

కాపురం వంటి చిత్రాలలో గుణచిత్ర నటుడిగా తన నటనతో ఆయా పాత్రలకు జీవం పోశారు. 'నర్తనశాల' చిత్రంలో పోషించిన 'కీచకుని' పాత్రలోని నటనకు 'జకార్తా ఫిలిమ్ ఫెస్టివల్'లో పురస్కారం లభించింది. S.V.R. కు ప్రత్యామ్నాయం లేదు. ఈనాటికీ "వివాహ భోజనంబు - వింతయిన వంటకంబు" పాట (మాయాబజారు) ప్రేక్షకులకు కనువిందే !

వీరి స్మారక తపాలాబిళ్ళను భారతీయ సినిమాకు వందేళ్ళు సందర్భముగా 3-5-2013 వ తేదీన విడుదలయింది.

### ఆచార్య N.G. రంగా :

గుంటూరుజిల్లా బాపట్లలో జన్మించిన గోగినేని రంగనాయకులు నవంబర్ 7వ తేదీ 1900 సంవత్సరములో జన్మించాడు. రైతు నాయకుడుగా, జస్టిస్ పార్టీ నాయకుడిగా ప్రజలకు సేవలను అందించారు. స్వాతంత్ర్యోద్యమములో పాల్గొని జైలు జీవితమును అనుభవించారు. పార్లమెంటు సభ్యులుగా రాష్ట్రానికి సేవలను అందించారు.

The Father of The Indian Peasant Movement. భారతీయ వ్యవసాయానికి ఆత్మవంటి వాడని పేరుపొందిన రంగాగారి స్టాంపు 27-01-2001వ తేదీన విడుదలయింది.

### శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు :

కృష్ణాజిల్లా యలకుర్రులో జన్మించిన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు విశ్వదాత ; దేశోద్ధారక బిరుదులతో ప్రసిద్ధి పొందారు. 'ఆంధ్రపత్రిక'ను స్థాపించి 1908వ సంవత్సరంలో బొంబాయినుండి ; 1914 లో చెన్నపట్టణం నుండి నడిపారు. 'భారతి' మాసపత్రిక ద్వారా తెలుగు సాహిత్యానికి ఎనలేని సేవలను అందించారు.

వీరి జ్ఞాపకార్థము 01-05-1969వ తేదీన 20 పైసల విలువలతో స్టాంపును ముద్రించారు.

### శ్రీ కోటంరాజు రామారావుగారు :

నాటి గుంటూరుజిల్లా నేటి ప్రకాశంజిల్లా చీరాలలో పుట్టిన కోటంరాజు రామారావు 25పైగా భారతీయ పత్రికలకు పనిచేసిన కలం వీరుడు. కరాచీనుండి వెలువడిన 'ది న్యూ టైమ్సు', సింధ్ అబ్జర్వర్, ది లీడర్, ది టైమ్స్ ఆఫ్ ఇండియా, ది పయొనీర్ వంటివే గాక, ది ఫ్రీ ప్రెస్ జర్నల్, స్వరాజ్య, హిందుస్తాన్ టైమ్స్, నేషనల్ హెరాల్ట్ వంటి పత్రికలలో పనిచేసి హేమాహేమీలయిన నాయకుల మన్ననలను అందుకున్నారు.

లక్నో జైలులో 'ఎ' క్లాస్ ఖైదీగా వున్నారు. పంచవర్ష ప్రణాళిక ప్రచారక సలహాదారుగా వున్నారు. గాంధీజీ, నెహ్రూ, డా॥ రాజేంద్రప్రసాద్, సుభాష్ చంద్రబోస్ వంటి వైరుధ్య సిద్ధాంతకర్తల మన్ననలను పొందిన కోటంరాజు రామారావు స్మారక తపాలాబిళ్ళ ది. 9-11-1997 న విడుదలయింది.

### అమరావతి శిల్పము :

నవ్యాంధ్ర రాజధానిగా అమరావతిని ఎంపికచేయడం ముదావహం.

'అమరావతి శిల్పము' స్టాంపును 19-06-2003వ తేదీన భారత ప్రభుత్వ తపాలశాఖ విడుదల చేసింది. ఈ స్టాంపులో 'అమరావతీ కళ' పేరొందిన శిల్పచాతుర్యం మనకి దర్శనమిస్తుంది.

ఆంధ్రభోజుడు శ్రీ కృష్ణదేవరాయలు :

సాహితీ సమరాంగణ సార్వభౌముడు, ఆంధ్రభోజుడు, ప్రబంధ యుగకర్త అయిన శ్రీ కృష్ణదేవరాయలకు, కృష్ణాతీరానికి అవినాభావ సంబంధము వుంది. రాయలు కొండపల్లి, కొండవీడు కోటలను జయించిన తరువాత మూడునెలల పాటు బెజవాడలో మకాం పెట్టాడు. ఈ సమయంలో ఆంధ్రుల తొలి రాజధాని శ్రీకాకుళం వెళ్ళాడు. అక్కడ శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణువుని సేవించి, పూజించి నిద్రచేశారు. ఆ రాత్రి మహావిష్ణువు కలలో కన్పించి 'గోదాదేవి కథ'ను తెలుగుభాషలో వ్రాయమని కోరాడు. ఆ దేవుని ఆజ్ఞతోనే 'ఆముక్త మాల్యద' ప్రబంధరచనకు శ్రీకారం చుట్టాడు. ఆలయంలోని 16 స్తంభాలమండపమే ఆయన రచనకు వేదిక అయింది. దేవాలయానికి 5 గ్రామాలు నిత్యనైవేద్యాలకోసం దానం చేశాడు.

### ముక్తాయింపు :

ఈవిధంగా వివిధరంగాల ప్రముఖులతో విలసిల్లిన కృష్ణాతీరం ఆంధ్రప్రదేశ్‌కు చరిత్రలో ప్రాముఖ్యతను సంతరింపజేసుకుంది.

భారత ప్రభుత్వ తపాలాశాఖ పైన పేర్కొన్న ప్రముఖుల స్టాంపులను ముద్రించి తపాలాబిళ్ళల సేకరణ (ఫిలాటెలీని) సుసంపన్నం చేసింది.

చిరునామా : పుట్టి నాగలక్ష్మి, ఇం.నెం. 12/162, పాటిమీద గుడివాడ, కృష్ణాజిల్లా - ఆంధ్రప్రదేశ్ - 521301
9849454060

శ్రీమతి శిరిపురపు అన్నపూర్ణ

# స్త్రీ హృదయ ఆవిష్కరణలు - సాంప్రదాయక రంగవల్లులు

కృష్ణాజిల్లాలో సంధ్యా కాలంలో ముగ్గులు వేసే పద్ధతి అనాదిగా వస్తున్న ఆచారం. అలాగే శుభకార్య సమయంలో, సంక్రాంతి, మరియు ఇతర పండుగలు, వేడుకల్లో వాకిలిని ముగ్గుల్తో అలంకరించుతారు. ఈ ముగ్గుల్లో ముత్యాల ముగ్గులని, రతనాల ముగ్గులని 2 రకాలు. అలాగే చుక్కల ముగ్గులు, గళ్ళ ముగ్గులు, మెలికల ముగ్గులు, ఇంకా రకరకాల ఆకృతుల్లో ముగ్గులు వేస్తుంటారు. సంక్రాంతి నెల పట్టడం ఒక ఆచారం. ఈ నెల రోజులపాటు ఊరంతా ఆడపిల్లలుపోటీ పడుతూ వీధి వాకిళ్ళను రకరకాల రంగులతో ముగ్గులు తీర్చిదిద్దుతారు. అందులో గోమయముతో చేసిన గొబ్బిళ్ళు పెట్టి చుట్టూ తిరుగుతూ గొబ్బిపాటలు పాడతారు.

ఈ ముగ్గులు సంప్రదాయాన్నే కాక ఆధ్యాత్మికతకు, ఆరోగ్యానికి ప్రతీకగాచెప్పొచ్చు. ఈ ముగ్గుల్లో దేవిమాతకు ప్రతీకగా ఉండి శ్రీచక్రం లోని త్రికోణం, ఇంకా శరీరంలోని7 చక్రాలకు రూపంగాఉండే పద్మాలు, కుండలిని శక్తికి గుర్తుగా పాములా చుట్టుకుని ఉండే ముగ్గులు, ఇంకా సంక్రాంతి సమయములో సూర్యుని ఆరాధిస్తూ వేసే రథంముగ్గు, నక్షత్రాల ఆకారంలో ముగ్గులు ఇలా అనేక రకాలుగా ముగ్గులు వేస్తారు. ముగ్గుల ఎంపిక ముగ్గులు వేసే వారి అభిరుచిని బట్టి ఉంటుంది. అందుకే ముగ్గును బట్టి వ్యక్తిత్వాలను చదువుతారు.

రంగవల్లులు దిద్దటం వలన స్త్రీలలో ఏకాగ్రత పెరుగుతుంది. శాంతవర్తనులు అవుతారు. వంగుని ముగ్గు వేయటం వలన శరీరానికి మంచి వ్యాయామం కూడా! చక్కని అవయవ సౌష్టవం ఏర్పడుతుంది. ముగ్గులు వేయుటలో చూపించే నేర్పు, ఓర్పు వల్ల,వాళ్ళుఇతర విషయాలలో కూడా ఎంతో సహనంతో వ్యవహారాలు నిర్వహించగలుగుతారు.

తులసికోట ముందు వేసే ముగ్గులు, దేవతా మందిరంలోపల, దేవుని గూడు దగ్గర వేసే ముగ్గులు వేరే ఉంటాయి. శంఖు చక్రాలు, స్వస్తిక్ గుర్తు మొదలైన శుభ సంకేతాల నిచ్చే గుర్తులు వేస్తారు. నిజానికి, ఏడురోజులకు అన్ని రకాల ముగ్గులున్నాయి.

ఇదివరకు ముగ్గుని బట్టి

ఏరోజో తెలుసుకునేవారు. కాలం మారటముతో అలవాట్లు మారు తున్నాయి. దేమునిముందు వరిపిండితో ముగ్గువేయుట ఆచారముగ వస్తున్నది. ముగ్గులను రకరకాల రంగులతో అలంకరించుట, పువ్వులను, గొబ్బిళ్ళను వాటిలో అమర్చుట కన్యలకు ఒక వేడుక

అలాగే యజ్ఞయాగాది క్రతువుల్లో, కర్మకాండల్లో ముగ్గులు వేయుట ఆది నుండి ఉన్న విధానము. యజ్ఞము చేయు సమయములో ముగ్గువేసి దేవతలను అందులోనికి ఆహ్వానించడము జరుగుతూ ఉంటుంది. దీనికి గుర్తుగానే 'ముగ్గులోకి దింపటము' అనే సామెత వచ్చింది.

కృష్ణాష్టమి రోజు కృష్ణుని చిన్ని పాదాలు అందముగ వాకిలి నుండి మందిరము వరకు రమణీయముగా వేసి చిన్ని కృష్ణుడిని ఆహ్వానించ డానికి

యువతులూ, పిల్లలు, స్త్రీలు ఎంతో ఉత్సాహం చూపిస్తారు. సూర్య చంద్రులను, నక్షత్రాలను ముగ్గులుగా వేయడం ఓ ఆనవాయితీగా వస్తూ ఉంది. పాడ్యమినుండి చంద్రకళలకు గుర్తుగా చంద్రవంకను వేసి అందులో నక్షత్రమును వేస్తూ ఉంటారు. తీరప్రాంతాల్లో సంధ్య వేళల్లో చంద్ర వంకవేసె అలవాటు ఇప్పటికీ ఉంది. పూర్వకాలం నుండి సూర్యచంద్ర ఆరాధన జీవనంలో ఒక భాగముగా ఉంది. దీపాల ముగ్గు, పద్మాల ముగ్గు వేసి లక్ష్మీ దేవిని సాయంకాల సమయములో పిలుస్తారు. అయితే చెడుసమయాల్లో ముంగిట ముగ్గు వేయరు. అలా చేస్తే ఆ ఆత్మ తిరిగి వస్తుంది అని భయం ఉంది.

ముగ్గులను బియ్యపు పిండితో, పసుపు, కుంకుమతో అలంక రించుతారు. ఆధునిక కాలములో రంగులను వాడటము పరిపాటి అయినది. హాపీన్యూఇయర్ లాంటి ముగ్గులు వస్తున్నాయి. ముగ్గులను మనం శుభానికి గుర్తుగా వాడుతున్నాము. అశుభ సమయాల్లో ముగ్గులు వేయటము జరగదు. కన్యలకు ఇది ఉత్సాహాన్ని నింపే ఒక వేడుక. అనేక సందర్భాలలో అనేక రకాల ముగ్గులు వేస్తూ ఉంటారు. ఈ కాలంలో ముగ్గుల పోటీలు పరిపాటి అయినాయి. రంగవల్లుల్లోనే స్త్రీలు

తమ మనో భావాలను వ్యక్తపరుస్తూ ఉంటారు. అలాగే పువ్వులు, చెట్లు, పక్షులు,జంతువుల బొమ్మలు కూడా వేస్తూ ప్రకృతి మీద తమ ప్రేమ వ్యక్తపరుస్తూ ఉంటారు. ఆధునిక చిత్రణలు కూడా వస్తున్నాయి. ఓ చదువుకున్న అమ్మాయి తన ముగ్గులో లెక్కల చిత్రమైన చిత్రణ చేసింది. ఒక్కో దేమునికి, ఒక్కో దేవతకి,వేరేవేరే ముగ్గులువేసే ఆచారము ఉంది. ముగ్గులు శుభానికి గుర్తుగా, మంచిని తెచ్చేవిగా భావిస్తారు. తెలుగు దేశంలో ప్రతి పల్లెలో సూర్యోదయం కాక ముందే ముంగిట ముగ్గు వేయటము ఆచారముగా వస్తున్నది. ఉదయం కళ్లాపి చల్లి సున్నపు పొడితో విశాలమైన ముగ్గులు వేస్తారు. సాయం సమయాల్లో నీళ్ళు మాత్రము చల్లి చిన్న ముగ్గుకాని, వలయాకారం కానీ అడ్డంగా వేస్తారు. ఇంట్లోకి వచ్చిన లక్ష్మీదేవి వెళ్ళకూడదని అలా చేస్తారు. కొన్ని ప్రాంతాల్లో రాత్రికి వెలుగు నిచ్చే చంద్రుడిని వేస్తారు. ఇందు చంద్రకళల ఆధారంగా చంద్రరేఖ వేయడము జరుగుతుంది. నెలపొడుపునాడు చుక్కను, పెరుగుదలకు గుర్తుగాచంద్రవంకను గీస్తారు. అమావాస్యనాడు చంద్రుడు లేకుండా నక్షత్రము వేస్తారు. వాకిళ్ళలో సున్నపుపొడి వేసినా, ఇంట్లో,తులసికోట ముందు బియ్యపు పిండితో వేస్తారు. ఇది ఒకరకంగా జీవులకు ఆహారముగా వేయడందీని అంతరార్థము. సోమవారము శివప్రీతిగా శివపీఠము,మంగళవారము కాళికా స్తానము, బుధవారము స్వస్తిక్ గుర్తు వినాయకునికి, గురువారము నక్షత్రము, శుక్రవారము హ్రుత్కమలము, శనివారము తార, ఆదివారము రెండు త్రికోణములు ముగ్గుగా వేస్తారు. పవిత్ర ప్రదేశాలు అనగా కళ్ళము,తులసికోట ఇత్యాది చోట్ల కమలము లిఖించడము జరుగుతుంది. మన శరీరములోని నాడి మండలములలోని కమలములకుగుర్తుగా ద్విదళము, అష్టదళ, సహస్ర దళ పద్మాలను అలంకరిస్తారు. కుంకుమ, పసుపు,వరిపిండి, పచ్చఆకు పొడితో అలంకరణచేస్తారు. స్త్రీలుతమ చిత్రకళా నైపుణ్యాన్ని రంగవల్లుల ద్వారా వ్యక్తపరుస్తూ దేవతాప్రీతి కలిగిస్తారు. వైకుంఠ ఏకాదశికి శంఖుచక్రాలు విష్ణుపాదాలు వేయడము జరుగుతుంది. భగవంతుడిని బిడ్డగా భావించి ఉయ్యాల వేస్తారు. గృహ రక్షకురాలైన గోమాత పాదాలు చిత్రీకరిస్తారు. తులసికోట ముందు అంచుముగ్గు వేస్తారు. నాలుగు గీతాలు వలయము నాలుగు గీతలువేస్తారు. కార్తీక మాసములో కృత్తిక పద్మాన్ని, నాగ పంచమిరోజు పంచశిర నాగము, యోగానికి గుర్తుగా సుబ్రహ్మణ్య షష్టిరోజు బిడ్డలకొరకు, పాము పిల్లలు వేస్తారు. కార్తీక మాసములో శివకేశవ ఆలయములలో, తులసికోట దగ్గర రంగవల్లులు తీర్చిదిద్ది అందు దీపాలు పెట్టాలి అని నియమము. గణేశ చతుర్థికి గజపాదము గుర్తుగా వేస్తారు. నవరాత్రి దినములలో తొమ్మిది నిలువు, తొమ్మిది అడ్డము చుక్కలతో స్వస్తిక్ వేస్తారు. ఇది దుర్గాదేవి నవరూపాల కీ సంకేతము. రథసప్తమినాడు సూర్యునిరాకకై రథముగీస్తారు. దీనికి ఏకచక్రము వేస్తారు. సంక్రాంతికి వేసే రథానికి 2 లేక 3 చక్రాలు వేసి, 7 గుర్రాలను చిత్రీకరిస్తారు, ఇది మొదటిరోజు లోనికి వస్తున్నట్టు, చివరి రోజు రథము వెళ్తున్న గుర్తుగా బయటకి వేసి దానిని పక్కవారి రథముతో కలుపుతారు. వసంతుని ఆగమనానికి చిలుక ముగ్గు, పెళ్లి మండపములలో పెళ్లిగద్దె అని ధనుర్మాసములోనాగబంధం, గుమ్మడిపళ్ళు, కుంభము, హంసలు, సింహాలు శక్తిచిహ్నముగా, శుభాలకి సంకేతముగ వేయడము జరుగుతుంది. చాప, పాములు, తేళ్ళులాంటి ముగ్గులు పెళ్ళిళ్ళలో వేస్తూ ఉంటారు. బలి పాడ్యమి రోజు బలికోట,భూత ఆరాధనలో భూత కోలంఅని వేస్తుంటారు. పూర్వ కాలములో ఇంటిగోడలు, పేడతో అలికి రకరకముల చిత్రాలు వేసేవారు. అందులో అనేకరకాల చెట్లు, పూలు, తీగలు, పక్షులు, జంతువు లను చిత్రీకరించేవారు. ఇది ప్రకృతిలో వారి అనుబంధానికి గుర్తు.

ముత్యాలముగ్గులు చుక్కలు కనిపించేలా వేస్తే, రతనాల ముగ్గులు చుక్కలు కనిపించకుండా వేస్తారు. స్త్రీల కళాభిరుచికి ఇవి దర్పణముగా ఉంటాయి. చుక్కాలతో, మెలికలముగ్గులు, గళ్ళ ముగ్గులు, తీగలు, పూలు, బొమ్మలు, జంతువులు, పక్షులు ఇలా అనేకచిత్ర చిత్ర వర్ణాలు స్త్రీల అభిరుచికి దర్పణం ఈ రంగవల్లులు. ఈ ముగ్గులపోటి సంక్రాంతి సమయంలో ఎక్కువ. ధనుర్మాసం అంతా ఎంతో ఉత్సాహముగా పోటీ పడుతూ మహిళలు ముగ్గులుపెద్దవి చిన్నవి వేసి, రంగులతో, పువ్వులతో అలంకరిస్తారు. ఇందులో పోటీలు కూడా జరుగుతూ ఉన్నాయి. మొత్తానికి ఇది స్త్రీల యొక్క ఉత్సవము.

శ్రీ వకుళాభరణం రామకృష్ణ

# తెలుగునాట సామాజిక పరిణామాలు

ఒక జాతి చరిత్రలో 60 ఏళ్ళ కాలం చిన్నదేమీ కాదు. 20వ శతాబ్దిలో ప్రపంచవ్యాప్తంగా చోటుచేసుకున్న పెనుమార్పులు రాజకీయ, ఆర్థిక, సామాజిక మానవాళి భవిష్యత్తును సమూలంగా మార్చివేశాయి. 1945లో రెండవ ప్రపంచయుద్ధం ముగిసేనాటికి వలసవాదం బలహీనపడి, పరాధీనతలో మగ్గుతున్న దేశాలు స్వాతంత్ర్యం పొందాయి. ఐరోపా కేంద్రంగా ప్రపంచాన్ని ఏలుతున్న వలసాధిపత్యం అంతరించి అమెరికా సంయుక్త రాష్ట్రాలు ఒకవైపు, సోవియట్ రష్యా మరోవైపు రెండుగా ప్రపంచం చీలిపోయింది. రెండు అగ్రరాజ్యాల మధ్య ప్రాబల్య సమతౌల్యం (Balance of power) సమతూకంలో వుండి దాదాపు మూడు దశాబ్దాలు 1980 ల దాకా - స్వాతంత్ర్యం పొందిన తృతీయ ప్రపంచదేశాలు, ముఖ్యంగా భారతదేశం రెండు అగ్రరాజ్యాలకు సమదూరంలో ఉంటూ సంక్షేమరాజ్య నమూనాతో ముందుకు సాగింది. ప్రపంచశాంతిని ప్రోదిచేస్తూ, మరో ప్రపంచయుద్ధ ప్రళయాన్ని నివారిస్తూ, అంతర్గతంగా సోషలిస్టు తరహా అభివృద్ధి నమూనాతో ఆర్థిక ప్రగతిని సాధించే క్రమాన్ని అనుసరించింది. భారీ ప్రాజెక్టులు, పరిశ్రమలు, మౌలిక వసతులు పెంపుదల, ప్రణాళికాబద్ధంగా సాగించే ప్రయత్నం చేసింది. రాజకీయంగా ప్రజాస్వామ్య పరిపాలనకు బాటలు వేసింది. 200 సంవత్సరాల వలస పాలనలో మగ్గిపోయిన సమాజాన్ని సామాజిక, సాంస్కృతిక రంగాల్లో సంస్కరించే చర్యలు చేపట్టింది. ఇదొక బృహత్కార్యం. భారతదేశాన్ని ఉపఖండంగా అభివర్ణించారు. బహుళజాతులు, కులమతాలు, ప్రాంతాలు, భాషలు వీటి పర్యవసానంగా ఏర్పడ్డ సంస్కృతులు ఉన్న దేశం. సాంస్కృతిక ఐక్యత లేకున్నా అంతర్లీనంగా దేశాన్నంతటినీ, ప్రజలందరినీ కలిపే ఏకసూత్రమొకటి వుంటూవచ్చి, 'భిన్నత్వంలో ఏకత్వం' (Unity in Diversity) గా చరిత్రలో వాసికెక్కింది.

స్వాతంత్ర్య సంగ్రామకాలంలో జాతీయోద్యమం తన ముందుంచు కొన్న భవిష్యత్ దేశ పునర్నిర్మాణాన్ని 1947 తర్వాత చేపట్టాలని ప్రభుత్వం నిర్ణయించుకొంది. ఈ దిశలో రాజకీయ సుస్థిరత సాధించాక, ఆర్థికంగా బలపడ్డాక, భారీయెత్తున సామాజిక మార్పుకు కృషిచేయాలన్నదే రాజ్యాంగ నిర్మాతల లక్ష్యం. దేశం ఆధునికీకరణ (Modernization) చెందాలి. శాస్త్ర సాంకేతిక విజ్ఞానాన్ని పెంపొందించుకోవాలి. వ్యవసాయ పారిశ్రామిక రంగాల్లో స్వయంపోషకత్వం సాధించాలి. ఈ కార్యక్రమమంతా సంగ్రామ వారసత్వంగా మనం పరిగణించాలి.

1947లో స్వాతంత్ర్యం రాగా, ఒక దశాబ్ది తర్వాత 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. అంటే ఆంధ్రప్రదేశ్ ఏర్పడి 50 ఏళ్ళు, అంతకు ముందు 10 ఏళ్ళు కలిపి ఇప్పటికి 60 ఏళ్ళు గడిచాయి. ఈ ఆరు దశాబ్దాల్లో తెలుగునాట సామాజిక పరిణామాల గూర్చి చిన్న వ్యాసంలో వివరించడం కుదరదు. స్థూలంగా వచ్చిన మార్పుల గూర్చి సూచిస్తాను. వలస పాలనలో వచ్చిన మార్పులు వలస పాలకుల ప్రయోజనాలకు అద్దంపట్టాయి. 19వ శతాబ్దం ఉత్తరార్థం నుండి భారతీయ సమాజంలో ప్రబలమైన సామాజిక మార్పులు సంభవించాయి. ఆంగ్లేయులు ప్రవేశపెట్టిన ఆర్థిక, పాలనా సంబంధమైన సంస్కరణల ప్రభావంతో భారతీయ సమాజం సంస్థాగత మార్పులు లోనైంది. తత్ఫలితంగా మేధావులు, సంస్కర్తలు సమాజంలోని దురాచారాలను, మూఢనమ్మకాలను తొలగించే బృహత్తర కృషి ప్రారంభించారు. ఇందులో భాగంగా ఆంధ్రదేశంలో కందుకూరి, గురజాడ, గిడుగు, చిలకమర్తి, త్రిపురనేని, కొమర్రాజు, భాగ్యరెడ్డివర్మ, కుసుమ ధర్మన్న, మాడపాటి ప్రభృతులు ఆంధ్రదేశంలో ఆధునికతా ప్రక్రియద్వారా ప్రజల్లో సామాజిక, సాంస్కృతిక చైతన్యాన్ని కల్గించారు. స్త్రీ జనోద్ధరణ, విద్యావ్యాప్తి, శాస్త్రీయ దృష్టి, దళిత, వెనుకబడిన

కులాల ఉద్ధరణ మొదలగు అంశాలను అజెండాలో భాగంగా చేసుకొన్నారు. దీని ఫలితంగా ఆ తర్వాతికాలంలో జాతీయ విమోచన ఉద్యమంలో తెలుగు ప్రజలు గణనీయమైన పాత్రను నిర్వహించారు. మైదాన ప్రాంతాల్లో జరిగిన రాజకీయ పోరాటాలతోపాటు, ఏజెన్సీ ప్రాంతాల్లో ఆదివాసులు తమ హక్కులకోసం తిరుగుబాట్లు చేశారు. రాజకీయ ఉద్యమాలు, సామాజిక ఉద్యమాలు రెండూ పడుగు పేకల్లా కలిసి ముందుకుసాగాయి. ఈ క్రమంలో వచ్చిన సామాజిక మార్పులు అప్పటి పరిమితుల వల్ల అర్థాంతరంగా నిలిచిపోయాయి. ఈ అసంపూర్ణ సామాజిక పరిణామాన్ని పూర్తిచేసే బాధ్యత స్వతంత్ర భారతం తన భుజస్కంధాలపై వేసుకొంది.

ఆంధ్రదేశం, 1947 తర్వాత, భారతదేశంలో అంతర్భాగంగా అనేక మార్పులకు గురైంది. ఆర్థిక, సామాజికాభివృద్ధిని ఎంతగానో సాధించింది. పది శాతానికి మించని అక్షరాస్యత 60 శాతానికి పెరిగింది. కాని ఇందులో స్త్రీల అక్షరాస్యతా శాతం 40కి మించి లేదు. ఇక దళితుల, ఆదివాసీల శాతం మరీ తక్కువ. వీరిలో స్త్రీల శాతం గూర్చి చెప్పనక్కర్లేదు. దేశంలోనే నెలకొన్న బాలకార్మికతలో అధిక సంఖ్యాకులు ఆంధ్రదేశంలో ఉన్నారు. స్థూల దేశీయ ఉత్పత్తి 10% పెరుగుతున్నదని ఒకవైపు ఆర్థిక శాస్త్రవేత్తలు అంచనా వేస్తుండగా, దేశంలో ఇంకా 30 కోట్లమంది ప్రజలు దారిద్ర్యరేఖకు దిగువన వున్నారు. వృద్ధి చెందుతున్న సంపద ఎవరికి చెందుతుందనేదే ఇక్కడి ప్రశ్న. దేశం పేదదికాదు, కాని ఇది పేదవాళ్ళు ఉన్న దేశం. ఈ క్రమంలో గమనించినప్పుడు ఆంధ్రదేశంలో వస్తున్న మార్పులు ప్రజల ఆకాంక్షలకు అనుగుణంగా లేవు. స్వాతంత్ర్యానంతరం ప్రజలు తమ శ్రేయస్సుకు ఆశలన్నీ ప్రభుత్వం పైనే పెట్టుకున్నారు. ప్రతి సమస్య పరిష్కారానికి ప్రభుత్వం వైపే చూస్తున్నారు. ఈ మనస్తత్వం జాతీయవాదంలో భాగంగా వుండి స్వాతంత్ర్యోద్యమం ద్వారా కలిగింది. స్వచ్ఛంద సంస్థల పాత్ర ఇటీవల ఒక దశాబ్దం దాకా పరిమితంగానే వుండింది. ప్రస్తుతకాలంలో ఈ సంస్థలు విదేశీ ఆర్థిక సహాయాన్ని పొందుతూ గ్రామీణ ప్రాంతాల్లో అభివృద్ధి కార్యక్రమాలతో పాటు ప్రజలను చైతన్యపరిచేందుకు తోడ్పడుతున్నాయని కొందరు సామాజిక శాస్త్రవేత్తల అభిప్రాయం. ఇది పాక్షిక సత్యం మాత్రమే. సమాజాభివృద్ధికి ఇవ ఏమేరకు కృషిచేస్తున్నాయన్న అంశం నిశితంగా పరిశీలించాల్సిన అవసరం వుంది.

ప్రభుత్వం వెచ్చిస్తున్న వేలాది కోట్ల ధనం ప్రజల అవసరాలను తీర్చడంలేదు. దీనికి కారణాలు రెండు, ఒకటి, ధనం కేటాయింపులు సంతృప్తిగ లేకపోవడం. రెండు ఈ నిధులు సరిగా వినియోగం గాకపోవడం. సమాజంలో అవినీతి తామరతంపరలా పెరిగింది. ప్రభుత్వంలో అత్యున్నతస్థాయినుండి దిగువస్థాయిదాకా, తరతమ భేదం లేకుండా ఏవో కొద్ది మినహాయింపులతో అవినీతి జాడ్యం భయకరమైన అంటువ్యాధిలా పాకింది. అభివృద్ధి పేరిట చేస్తున్న ఖర్చులో రూపాయికి 15 పైసల మేరకు మాత్రమే ప్రజలకు చేరుతున్నది. మిగతా మొత్తం అవినీతిపరుల జేబుల్లోకి పోతున్నది. దీంతో ప్రజలు అసంతృప్తి చెంది, అసంతృప్తి ఆగ్రహంగా మారి ప్రభుత్వ వ్యతిరేకతగా మారుతోంది. ముఖ్యంగా ఈ నిరసన, ఈ ఆగ్రహం ఇంతకాలం ఆర్థిక, సామాజిక అణచివేతలకు గురైన సామాజిక వర్గాల నుంచి వస్తోంది. ఇది వర్గ స్వభావాన్ని పొందితే ప్రభుత్వం విపరీతమైన చిక్కులో పడే అవకాశం వుంది.

సమాజంలో కులం నేడు ప్రముఖంగా ముందుకొచ్చింది. సంఘీభావం పేరుతో కులసమీకరణలు అధికమయ్యాయి. 1947వ పూర్వం కులానికింత ప్రాముఖ్యం లేదు. పైగా అప్పుడు కులభావ నిరసన వుండి, కులరహిత సమాజాన్ని ఆశించారు. అప్పుడు కుల సంఘీభావం వున్నా, సమాజంలో ఒక ప్రాజ్ఞ వాతావరణం నెలకొని వుండేది. గ్రామ సీమల్లో వ్యవసాయరంగం అభివృద్ధి చెంది హరితవిప్లవంలాంటి ప్రక్రియలు వచ్చాక, వెనుకబడిన కులాలని చెప్పబడే సామాజికవర్గాలు బలపడ్డాయి. మధ్యతరగతి, దిగువ మధ్యతరగతి రైతులు ఆర్థికంగా కుదుటపడ్డారు. అంతవరకు వారికిలేని రాజ్య నిర్వహణలో, ప్రభుత్వ యంత్రాంగంలో భాగస్వామ్యం కోసం ఒకటయ్యారు. కులభావన ప్రాబల్యాన్ని తగ్గించటానికి బదులుగా, దేశంలోని పాలకవర్గాలు ఈ పరిస్థితిని తమ తక్షణ రాజకీయ అవసరాల కోసం వినియోగించుకొన్నారు. ఫలితంగా ప్రతి కులం ఒక వోటు బ్యాంకుగా మారింది. రాజకీయాలలో Pressure group గా మారింది. ప్రతి కులం తమకు ఒక సంఘం, దాని తరపున సభలు, ప్రత్యేకంగా పండుగలు, పబ్బాలు జరుపుకోవడం ఒక సామాజిక హోదాగా మారింది. కులభావన గట్టిపడి అన్ని రంగాలకు విస్తరించింది. ప్రధాన కులాలేగాక ఉపకులాల ప్రాముఖ్యం గణనీయంగా పెరిగింది. సమాజం ఖండ ఖండాలుగా ఏర్పడి ఘనీభవించింది. ఇది ఖచ్చితంగా తిరోగమనమే. ఇలా చెప్పడంలో మా ఉద్దేశం కులాలకున్న స్వతంత్ర ప్రతిపత్తిని నిరాకరించడం కాదు. కులాలకున్న ప్రత్యేకతలను తగ్గించడమూ కాదు. ఒకనాడు కులరహిత సమాజాన్ని ఆశించిన సామాజిక ఆదర్శం ఏమౌతుందన్నదే మా ఆవేదన. ఈ పరిస్థితి భవిష్యత్తులో సమాజాన్ని ఏ దిశగా నడిపిస్తుందో ఊహించలేకున్నాం.

సమాజంలో అన్ని ఉద్యమాల్లోనూ అగ్రగామిగా వుండి ప్రగతి పూర్వక పాత్ర వహిస్తున్న మధ్యతరగతి 1960 దశకం చివరనుండి బలహీనపడింది. మధ్యతరగతి వర్గం తన అభ్యుదయకర, విమర్శనాత్మక పాత్ర కోల్పోయి పాలకవర్గంతో చేతులు కలిపింది. ఇంతకుముందు చెప్పుకున్న కులసమీకరణల నేపథ్యంలో పాలక వర్గాలు బలమైన కులాలచేతిలో చిక్కుకొని నిర్వీర్యమైనాయి. ఈ పరిస్థితికి వ్యతిరేకంగా పేదవర్గాలు, నిర్లక్ష్యానికి గురైన బహుజనులను చేరదీసి, సమీకరించి తనను సమర్థించే విధంగా పాలకవర్గాలు తయారుచేసుకోలేకపోయాయి.

1990 దశకం ప్రారంభమయ్యేనాటికి ప్రభుత్వం అనుసరిస్తున్న ఆర్థికవిధానాల్లో ప్రబలమైన మార్పులు వచ్చాయి. ప్రభుత్వం ఉదారవాద, మార్కెట్ అనుకూల, ప్రపంచీకరణ ఆర్థిక విధానాలను ప్రవేశపెట్టింది. దీంతో స్వయంపోషక ఆర్థికవ్యవస్థ నుండి సరళీకరణ వైపు పరిస్థితి మారింది. విదేశీ రుణాలతో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పబ్బం గడుపుకోనారంభించాయి. ఆర్థిక వ్యత్యాసాలు పెరిగాయి. అభివృద్ధిచెందిన దేశాలకు పాలకవర్గాలు తలొగ్గాయి. వస్తు వినిమయతత్వం పెరిగింది. వ్యవసాయం తీవ్ర సంక్షోభానికి గురైంది. గ్రామీణ ప్రాంతాల్లోని చేతివృత్తులు ఆదరణ లేక క్షీణించడంతో పట్టణ వలసలు ఎక్కువయ్యాయి. ప్రభుత్వరంగంలో పెట్టుబడులు ఉపసంహరించడంతో కార్మికుల్లో నిరుద్యోగం పెరిగింది. విద్యారంగం దాదాపు ప్రైవేటు, కార్పొరేట్ సంస్థల హస్తగతమైంది. శిష్టస్వభావాన్ని పొంది సామాన్య జనులకు విద్య అందుబాటులో లేకుండాపోయింది. దీంతో సామాజిక చిత్ర స్వరూపం మారిపోయింది. వ్యాపార లాభాపేక్ష ధోరణి అధికమైంది. వ్యక్తుల మధ్య పోటీతత్వం పెరిగి, పక్కవాడిని తోసి ముందుకెళ్ళాలన్న హేయమైన మనస్తత్వం పెరిగింది.

ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ ద్వారా వస్తున్న అధిక ఆదాయాలు, వ్యవసాయంలో వచ్చిన మిగులు సంపద, అంతర్జాతీయ సంస్థల నుండి తీసుకున్న భారీ రుణాల వల్ల ద్రవ్య చలామణి పెరిగింది. దీంతో వస్తు వినిమయతత్వం మరింత పెరిగింది. ప్రపంచీకరణ వల్ల వచ్చిన ఈ దుష్పరిణామాలు కేవలం ఆర్థికరంగానికే పరిమితం కాలేదు. ఒకేరకమైన ఆర్థికవిధానంలాగే ఇవి ఒకేరకమైన సంస్కృతిని సృష్టించేందుకు ప్రయత్నిస్తాయి. దీంతో దేశీయ సంస్కృతి మూలాలు విచ్ఛిన్నమవుతాయి. విదేశీ సంస్కృతి ఆధిపత్యం పెరుగుతుంది. ఇవి ప్రపంచ వ్యాప్తంగా నేడు అమల్లో ఉన్న పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంవల్ల జరుగుతున్న విపరిణామాలు. ఉదాహరణకు తృతీయ ప్రపంచ దేశాల్లో మీడియాను తీసుకొందాం. ఇది పూర్తిగా విజాతీయాకరణకు (De-Nationalization) లోనైంది. కార్పొరేట్ పెట్టుబడిలో మీడియా ఒక భాగంగా ఉండి ప్రపంచీకరణను పెంచి పోషిస్తున్న ఆర్థిక శక్తుల చేతుల్లో ఇది చిక్కుకొంది. ఆధునిక ప్రజాజీవితంలో అతిముఖ్యమైన సమచారరంగంలో ప్రజలకు విజ్ఞానాన్ని, ఆరోగ్యకరమైన వినోదాన్ని అందించే మీడియా ప్రపంచీకరణ శక్తులకు వత్తాసుపలుకుతోంది. వారి ప్రయోజనాలకు పనికొచ్చే పనిముట్టుగా మారింది. విదేశీ సంస్కృతిలోభాగంగా టెలివిజన్లో లెక్కకు మించిన ఛానల్స్ అసభ్య దృశ్యాలతో ద్వేషం, కసి, హింస చూపే దృశ్యాలతో నిండిపోయింది. స్త్రీలను, చిన్నపిల్లలను వినిమయ సరుకులుగా వాడుకోవడం, ప్రజలను ప్రలోభపరిచే వ్యాపార ప్రకటనలు చేయడం వీటన్నింటివల్లా కలుగుతున్న దుష్ప్రభావం చింతనాపరులందరినీ ఆశ్చర్యానికి గురిచేస్తుంది. సమాజంలో పెద్దా, చిన్నా, గురువు, తల్లి, తండ్రి, స్త్రీలు, పిల్లలు, ముసలి ముతక తేడా లేకుండా వారి ఎడల మొరటుగా ప్రవర్తిస్తున్న తీరును చూచి ఆవేదన చెందుతున్నాం. మంచీ చెడూ, మట్టూ, మర్యాద, మప్పితం, స్నేహం, గౌరవం, హుందాతనం ఇవన్నీ మన సంస్కృతిని సంపన్నం చేసే అంశాలు. ఈ విలువలు లుప్తమైపోతున్నాయి. వీటి ప్రభావం నేటి యువతరంపై ఎంతగానో వుంది. క్రితం సమాజానికి ఉపకరించే సమస్యలపై యువత అనేక ఉద్యమాలు చేపట్టింది. త్యాగాలు చేసింది. ప్రాణత్యాగాలూ చేసింది. పోరాటపటిమ, సామాజిక చైతన్యం, రాజకీయ పరిజ్ఞానం, ఒక విషయంపట్ల పట్టుదల, నిబద్ధత, నిమగ్నత ఉండేవి. అవి క్రమేపి మరుగౌతున్నాయి. గతించిపోతున్న తరానికి ఇదొక పెద్ద మనస్తాపం.

పెట్టుబడిదారీ విధానం తొలిదశలో ఆధునిక యంత్ర, శాస్త్ర, విజ్ఞాన సహాయంతో 'ప్రజలకు కొంతవరకు' ఆర్థికపరమైన వెసులు బాటు కల్పించింది. ప్రజాస్వామ్య సూత్రాలను ఆచరించి, సామాజికనీతి పాటించి, ఆర్జించే లాభాల్లో కొంతభాగం సమాజాభివృద్ధికి ఉపయోగించాలన్ని పాజిటివ్ దృక్పథాన్ని కలిగి వుండేది. కాని ఇప్పుడు జరుగుతున్న ప్రపంచీకరణ ప్రక్రియ కొత్త తరహా పెట్టుబడిదారీ విధానాన్ని సృష్టించింది. సమాజంలో నూతన ఉన్నత వర్గాలను ముందుకు తెచ్చింది. ఈ వర్గాలు అధిక వస్తువు వినిమయ సంస్కృతికి దాసులయ్యారు. విలాసవంతమైన జీవితానికి, స్త్రీ, పురుష సంబంధాల్లో విచ్చలవిడితనానికి, ధగధగ మెరిసే ఉత్పత్తులపై మోజు, ఫాస్ట్‌ఫుడ్స్, ఫాస్ట్ మ్యూజిక్-ఒకటేమిటి అత్యంత వేగవంతమైన జీవనశైలికి, వీరు అలవాటుపడ్డారు. ఇది ఇలావుంటే, మహానగరాలైన హైద్రాబాద్, విశాఖపట్టణంలో మురికివాడలు పెరుగుతున్నాయి. మరోవైపు Gated

Colonies లో అన్ని హంగులతో ఖరీదైన నివాసాలూ వృద్ధి చెందుతున్నాయి. వస్తు వినిమయం పెరిగేకొద్దీ, సంపదలు వృద్ధిచెందేకొద్దీ, సామాజిక విలువలు క్షీణించి, మానసిక శాంతి నశించి, జీవితానికొక గమ్యం లేక శూన్యత ఏర్పడుతోంది. దీంతో మౌలిక మతవాద ఆలోచనలవైపు ప్రజలు లోబడుతున్నారు. నిశితంగా పరిశీలిస్తే ప్రపంచీకరణ, మతతత్వం ఒకే నాణానికి బొమ్మ, బొరుసు వంటివి. సంస్కృతి మూలాలు కోల్పోయి ప్రజలు ఓదార్పు కోసం, ఊరట కొరకు, మతాన్ని, 'ఆధ్యాత్మికత'ను ఆశ్రయిస్తున్నారు. ఇది సమాజంలోని అన్ని పొరలకు వర్తిస్తుంది. ఆచారవ్యవహారాల పేరిట మూఢనమ్మకాలు సాంఘిక దురాచారాలు ప్రబలుతున్నాయి. నిత్యం ఎంతోమంది 'God men', 'God women' ను చూస్తున్నాము. దైవభక్తి, నిజమైన ఆధ్యాత్మికత వేరు. వేలం వెర్రిగా, విచక్షణా రహితంగా గుళ్ళు, గోపురాల చుట్టూ తిరగడం, వాస్తులాంటి అశాస్త్రీయ అంశాలను గుడ్డిగా నమ్మడం జరుగుతున్నది. ఇవన్నీ సమాజంలోని క్రింది తరగతులకు వ్యాపించాయి. వారి జీవితాల్లో అలుముకొంటున్న నిస్సహాయతను, నైరాశ్యాన్ని వీటిద్వారా తొలగుతాయన్న భ్రమలకు వీళ్ళు గురయ్యారు. గణేష్ ఉత్సవాలు, శ్రీరామనవమి లాంటి పండుగలు జరుపుకోవడం కొత్తేమీ కాదు. కానీ భారీ ఎత్తున కార్పొరేట్ సంస్కృతిని ప్రతిబింబిస్తూ, అందులో భాగంగా వాటిలోని పవిత్రతను కోల్పోయి జరుగుతున్నాయి. వీటి నిర్వహణలో ఏమాత్రం భక్తిశ్రద్ధలు ఉండడంలేదు. విద్య పెరిగే కొద్దీ శాస్త్రీయ ఆలోచన, హేతువాద ధోరణి వృద్ధి చెందాల్సింది పోయి గుడ్డి నమ్మకాలకు విద్యావంతులు గురౌతున్నారు.

విద్య ఇవ్వాళ కొనుగోలు 'సరుకు'గా మారింది. ఆంధ్రదేశంలోని చిన్నా పెద్ద పట్టణాల్లో నెలకొన్న ప్రైవేట్, కార్పొరేట్ విద్యాసంస్థల్లో ప్రజలు చదువు 'కొంటున్నారు'. ఈ సంస్థల్లో రోజంతా చదువు పేరుతో పిల్లలను విపరీతమైన ఒత్తిడికి గురిచేస్తున్నారు. మానవత్వాన్ని, సామాజిక స్పృహను కల్పించే చదువులు మరుగునపడ్డాయి. సామాజిక దృష్టిని కలిగించి, ఆలోచనాపరులను తయారుచేసే సామాజిక శాస్త్రాలకు గిరాకీ పోయింది. ఇవ్వాళ ప్రైవేట్ విద్యారంగంలో వేలకోట్ల రూపాయల విద్యావ్యాపారం జరుగుతుందంటే నమ్మశక్యం కాకుండా వుంది. ఈ సంస్థలు విద్యావిధానాల రూపకల్పననే శాసిస్తున్నాయి. ఇందులో నుండి వస్తున్న లాభాలు రాజకీయాల్లో పైకి రావడానికి, అనుత్పాదక రంగాల్లో పెట్టుబడి పెట్టడానికి ఉపయోగపడుతున్నాయి. చదువు 'కొన్న' వాడికి కేవలం డబ్బు సంపాదనపైనే దృష్టి. ఎలాగైనా, ఎలాంటి అభ్యంతరకర పద్ధతుల ద్వారానైనా విలువలన్నిటికి స్వస్తి పలికి, ధనార్జనే ధ్యేయంగా మెజారిటి యువత ముందుకు వెడుతున్నది. ఉన్నత ఆశయాలు, సమాజశ్రేయస్సు, ఆచరణ, పఠనాశక్తి రోజు రోజుకు తగ్గిపోతున్నాయి. ఆదర్శాలు తగ్గి ఆడంబరాలు పెరిగాయి. ఇది సంపన్న వర్గాల్లో కావచ్చు మధ్య తరగతుల్లో కావచ్చు. పెళ్ళిళ్లు, పుట్టినరోజులు వంటివి సంపద ప్రదర్శనకు చిహ్నాలుగా మారాయి. నిరాడంబర, సాదా జీవితం గడపడం, ఉన్నతంగా ఆలోచించడంలోని సంస్కారం కనుమరుగౌతున్నది.

సమాజంలో సగభాగమైన స్త్రీల పరిస్థితి దయనీయంగా మారింది. విద్య పెరిగి ఉద్యోగావకాశాలు ఉన్నంతలో వృద్ధి చెందిన మాట నిజం. కావున మధ్య, కింది మధ్యతరగతి స్త్రీలకు సంసార బాధ్యతలతో పాటు ఉద్యోగం గుదిబండగా తయారైంది. ఇంటి చాకిరి, ఉద్యోగ బాధ్యతలు, స్త్రీకున్న స్వేచ్ఛను, తీరుబడిని తగ్గించి, యంత్రంగా మార్చివేశాయి. ఇటీవల అమలులోకి వచ్చిన చట్టం వున్నా, కుటుంబహింస పెరిగిందేకాని తగ్గలేదు. ప్రపంచీకరణ కొనితెచ్చిన అనర్థాలవల్ల పితృస్వామ్యం (Patriotic) పెరిగింది. భోగ్యవస్తువుగా, అమ్మకపు సరుకుగా స్త్రీని చూడడం మరింతగా ఎక్కువైంది. పేదరికంతోపాటు వస్తు వినిమయతత్వం, విలాస జీవితం, అధికసంఖ్యలో స్త్రీలను చీకటి కూపంలోకి నెడుతున్నాయి. కాగా ఆర్థిక సుస్థిరత కలిగిన స్త్రీలు విచ్చలవిడితనానికి గురౌతున్నారు. ముఖ్యంగా పట్టణాలలో ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ వల్ల ఉపాధి సౌకర్యాలు పెరిగి, కాల్‌సెంటర్లు లాంటివి వచ్చి, డబ్బు పుష్కలంగా ఉండడంతో, వీటిల్లో పనిచేసే చాలామంది జీవనశైలిలో ప్రబలమార్పు కన్పిస్తోంది. ఇటీవల విజయవాడలో ఒక హోటలు గదిలో హత్య చేయబడ్డ లక్ష్మీసుజాత నయా ఉదారవాద పెట్టుబడిదారీ వ్యవస్థ సృష్టించిన ఘాతుకంగా మనం అర్థంచేసుకోవాలి. 'వాలెంటైన్ డే'లు, సెల్‌ఫోన్లు సృష్టిస్తున్న అనేక దుష్ఫలితాలు ఈ కొత్త సంస్కృతికి పుట్టిన వికృత శిశువులు, సమస్యలు ఎదుర్కొనే మానసిక పరిణతులు లోపించి, సామాజిక మార్పులను అన్వయించుకొని అర్థం చెప్పుకొనలేక, పరిష్కారాలు మృగ్యమై ఆత్మహత్యలకు పాల్పడే యువతీ యువకుల సంఖ్య రోజురోజుకూ పెరుగుతున్నది. పేదరికాన్ని ఎదుర్కోవడానికి రాజకీయ ఉద్యమాల వైపు పోరాటాలవైపు, సంఘటిత కృషివైపు పోకుండా ఆత్మహత్యలే నిరసనలుగా మారుతున్న దుస్థితి నేడుంది.

పైన చెప్పుకున్న సామాజిక పరిణామాలు ఆంధ్రదేశంలో మనకు అడుగడుగునా గోచరమవుతాయి. సమాజం, ఆరు దశాబ్దాలు గడిచినా మధ్యయుగాల భావజాలం నుండి పూర్తిగా బయటపడలేదు. ఈ మార్పు రాకుండానే, మధ్యయుగ ఆర్థిక, సామాజిక అవశేషాలపై

ఆధునిక ప్రజాస్వామ్య పెట్టుబడిదారీ సమాజాన్ని నిర్మింపబూనటంతో సమాజంలో సమన్వయం లోపించి సంక్షోభం చోటుచేసుకొంది. ఈ సంక్షోభం నుండి బయటపడేందుకు కావల్సిన పరిష్కారాలు పాలకుల వద్ద లేవు. పాలకులు అవినీతిలో పీకలదాకా కూరుకుపోయారు. సభ్య సమాజాంలో విధిగా ఉండాల్సిన కనీసపు నీతి, నియమాలను కోల్పోయారు. ప్రజాస్వామ్యంలో ముఖ్యభాగమైన ఎన్నికలు జరిగే తీరు, ప్రజాస్వామ్యమంటేనే వెగటు పుట్టిస్తున్నది. స్వాతంత్ర్యానంతర కాలంలో దేశానికి అసామాన్య నాయకత్వముండేది. అది పోయి మనకు ఈనాడు మరుగుజ్జు నాయకత్వం లభించింది. వీరికెవరికి స్వాతంత్ర్యోద్యమ స్ఫూర్తి, ఆదర్శాలు లేవు. వీళ్లందరూ రాజకీయ వాదులే (Politicians) కానీ దూరదృష్టిగల రాజనీతిజ్ఞులు (statemen) కాదు. సమర్థవంతమైన నాయకత్వం వున్నంతకాలం ప్రజలకు తమ సమస్యలు పరిష్కారమవుతాయన్న నమ్మకముండేది. అది నేడు లోపించింది.

ఇదీ స్థూలంగా నేడున్న మన సామాజిక పరిస్థితి. ఈ పరిస్థితుల్లో సమాజంలో అశాంతి ప్రబలుతోంది. ఈ సంక్షోభం ఒక విధంగా చూస్తే చారిత్రక క్రమంలో సహజమైన భాగంగానే భావించాలి. సమాజం ఆధునికతా ప్రక్రియకు లోనౌతున్నప్పుడు ఈ బాధాకర అంశాలు వుంటాయి. అంటే నేటి మన సమాజం మార్పు (Transition) అంచులో నిలబడి ఉంది. ఈ స్థితి ఎన్నాల్లు కొనసాగుతుంది? దీనికి సమాధానం మనం ఖచ్చితంగా చెప్పలేం. కానీ మార్పు రాక తప్పదు. ఈలోగా బాధలు, అపజయాలతోపాటు, విజయాలు, ఆశా భంగాలు తప్పవు. ఈ సంక్షోభం నుండి బయటపడే మార్గాలకోసం మేధావులు, సంస్కరణాభిలాషులు, సామాజిక శాస్త్రవేత్తలు అనునిత్యం ఆలోచిస్తూనే వున్నారు. ఈ ప్రయత్నాలు ఫలించి సకల ప్రజానీకానికి సమన్యాయాన్ని అందించే సమాజం కోసం కృషిచేయాలి. ఈ కృషి గత ఆరు దశాబ్దాలుగా సాగుతున్నది.

## సున్ని పెంట పూర్ణానందస్వామి

తమిళనాడు మధురైలో పుట్టినస్వామి శ్రీశైల పర్వతగుహలలో తపస్సు చేశారు.
రాఖాడీబాబా శిష్యులు. భువనేశ్వరీ మంత్రోపాసకులు. హటకేశ్వరంలోనూ,
సున్నిపెంటలోనూ ఆశ్రమాలు స్థాపించారు. అసలు పేరు
కామేశ్వరన్ – తపస్సంపన్నులైన స్వామి వారి వల్ల ఎందరో
రకరకాల అధివ్యాధులు పోగొట్టుకున్నారు. చిన్నప్పుడే నిరాహారుడై
తామ్రపర్ణినది ఒడ్డున బాణతీర్థంలో ఒక గుహలో తపస్సు చేశారు.

చిరునామా : *శ్రీ వకుళాభరణం రామకృష్ణ, 102, దేవరత్న అపార్ట్‌మెంట్స్, మెహిదీపట్నం, హైదరాబాద్ - 28,*
*ఫోన్ : 040-23514766, సెల్ : 9866841409*

డా॥ చలసాని సుబ్బారావు

# థియోసఫీ : దివ్యజ్ఞానతత్వ మీమాంస

**అసతోమా సద్గమయ - తమసోమా జ్యోతిర్గమయ :**

ఇది భారతీయ ఆర్ష విజ్ఞానం. సమగ్ర మానవజాతి కొరకు మానవాభ్యుదయం కొరకు రూపొందించి పెట్టిన సారగర్భిత సిద్ధాంత సూత్రం. మహోన్నతమైన లక్ష్యాదర్శం. ఇదొక జవసత్వములు గల విశ్వజనీన జీవన సందేశం. జీవితంలో అడుగడుగునా మననం చేసికొనదగిన మహదాదర్శం. మానవజీవితంలోని మాలిన్యాలను తొలగించి అతని మనుగడకు మాన్యతనిచ్చేందుకు పూనుకొన్న ఉద్యమాలన్నీ యీ సూత్రగత సందేశం నుండి అవసరమైన మేరకే స్ఫూర్తిని పొందుతూంటాయి. ఇది సర్వదేశాలకు, సర్వజాతులకు వర్తించు విశ్వమానవాభ్యుదయ ధర్మమార్గం. దీనిలో భాగంగానే 19వ శతాబ్ది చివరిలో ఆనాటి విశ్వమానవాళి స్థితిగతులను దృష్టియందిడుకొని 1875 సం. నవంబరు 17న The World Theosophical Society ఆవిర్భవించింది. ఈ సొసైటీని రష్యా -అమెరికా-ఇంగ్లండు - ఫ్రాన్సు దేశాలకు చెందిన మేధావులు స్థాపించారు. రష్యన్ వనిత మేడం బ్లావట్స్కీ, అమెరికన్ మేధావి H.S. ఆల్కాటు ఈ సంస్థకు మూలకర్తలు డా. అనీబిసెంటు, లెడ్‌బిటర్, విలియం జడ్జి, జిడ్డు కృష్ణమూర్తి దీని అభివృద్ధికి విశేషించి తోడ్పడిన ప్రముఖులు. అయితే ఆనాడు థియోసాఫికల్ సొసైటీని స్థాపించింది అమెరికాయందలి న్యూయార్కు నగరంలో పాశ్చాత్య మేధావులైనా ఇది అన్నివిధాల బలపడింది మాత్రం భారతదేశంలోనే. కారణం దీని ఆశయాలు అన్నివిధాల సనాతన హిందూ ధర్మనిరతికి, బౌద్ధుల పరిణామవాద ప్రసక్తికి, వారి అహింసా మూలకమైన నైతిక ధర్మనిష్ఠకు (Legalization of morality) అతి చేరువగా నుండడమేనని బోధపడుతున్నది. ఈ కారణంగానే శతాబ్ద కాలంగా ఇది మద్రాసు నందలి అడయారు క్షేత్రం కేంద్రంగా ప్రపంచ మందలి 70 దేశాలలో కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. ఆనాటినుండి ఈనాటి వరకు ప్రతి సంవత్సరం డిశంబరులో ఈ సొసైటీకి చెందిన ప్రపంచ మేధావులు అడయారులో సమావేశమవుతుంటారు.

**హేతుబద్ధమైన శాస్త్రీయ దృక్పథం :**

Theosophical Society భారతీయ భాషల్లో 'దివ్యజ్ఞాన సమాజం' అని వ్యవహరింపబడుతున్నది. దీని కార్యక్షేత్రం (Jurisdiction) మానవ ప్రపంచం. దీని ఆశయం మానవజాతికి దివ్యజ్ఞాన స్ఫూర్తి (Theosphic Spirit) నందించడం. ఈ జ్ఞానాన్ని కొన్ని దేశాలలో పరతత్వ పరిజ్ఞానంగా ఆమోదిస్తున్నారు. ... ఏమైనా యీ పరతత్వ పరిజ్ఞానం లేక దివ్యజ్ఞాన సిద్ధాంత (Theosophy) ప్రసారం కొరకు ప్రపంచంలో 25-30 వార్తాపత్రికలు నిర్వహింపబడుతున్నాయి. ఈ సిద్ధాంత వ్యాప్తికి ఒక్క భారతదేశంలోనే, ఇంగ్లీషు కాక మరి 12 భాషల్లో ప్రాంతీయ పత్రికలు నడుస్తున్నాయి.

**దివ్యజ్ఞాన సమాజం :**

(T.S.) ఒక రాజకీయ పార్టీ కాదు, ఇది ఒక మతసంస్థ కాదు, ఒక సాహితీ సమాఖ్యకాదు. మానవుల మధ్య జాతి - కుల-మత - వర్గ వర్ణాల వంటి కృతక భేదాలను పాటించక సర్వులు సోదరతుల్యులను భావసంస్కారంతో తనకు తటస్థపడిన ప్రతి విషయాన్ని, ప్రతి సమస్యను కార్య - కారణ సంబంధ పరిజ్ఞానంతో (Causality) రాగ ద్వేషాలకతీతంగా యోచించగల సంస్కారవంతుల సమాఖ్య దివ్యజ్ఞాన సమాజం (Thesophical Society). దీనిది జీవితంలో కార్య కారణ సంబంధాలను నిశితంగా పరిశీలింపగలిగిన హేతుబద్ధమైన శాస్త్రీయ దృక్పథం (Rational outlook). మానవుడల వరచుకొన వలసిన సహజ సంస్కారం. ఈ సంస్కారమే మానవుని మనుగడకొక మహత్తర స్థితిని, ఒక ప్రత్యేకతను సమకూర్చి పెట్టినదని, ఈ సంస్కారం లోపించిన చోట మానవుడు సమగ్రత (perfection) వైపుకు పయనించజాలడనేది దీని అభిమతం. ఈ లోకంలో మానవతకుండ వలసిన మాన్యత (Regard) యిటువంటి మనుష్య సంస్కారం వల్లనే పరిరక్షిత మవుతుందని చెపుతుంది దివ్యజ్ఞాన సమాజం. దీనిని డా. అనీబిసెంటు, ఆచార్య జిడ్డు కృష్ణమూర్తి వంటి ప్రముఖులిలా చెప్పారు - Men on this earth should believe in cause and effect, but not in luck.

అభ్యుదయ మార్గంపై నున్న మానవుడు గమనించవలసిన ప్రధా నాంశమే ఇది అంటుంది దివ్యజ్ఞాన సమాజం. దీనికి అడుగడుగునా జీవితంలో అదృష్టం (Luck) పేరుతో మనిషి పరాధీనతను వరించడం రుచించదు. మానవుడు స్వతంత్ర దృక్పథంతో క్రియాశీలుడుగా తాను చేయు పనులకు లభించు ఫలితాలను (Results) అనుభవాలుగా గ్రహిస్తూ ముందుకు సాగడం నేర్వాలంటుంది. కనుకనే థియోసఫీ ఆశయాల రీత్యా మానవుడు ప్రతి విషయంలో సాటివారి ఆలోచనలను శాసించాలనిగాని, లేక తాను సాటివారి ఆలోచనలకు దాసుడవడం గాని కూడదు. జిడ్డు కృష్ణమూర్తి చెప్పిన ఈ మాటను గమనించండి - The ideal is the life of freedom which is that state when consciousness is free from egoistic tendencies, non-attatchment to and non-dependence on any thing out side.

## మనిషి మనిషిగా రూపొందించాలి :

ఆరంభం నుండీ థియోసాఫికల్ సొసైటీ భారతీయుల ఆర్ష విజ్ఞానం నుండి ఎనలేని స్ఫూర్తినందుకొంటూనే వుంది. కపిలుడు, వశిష్ఠుడు, గౌతముడు, వ్యాసుడు, పతంజలి వంటి మహనీయుల అనుభవాలనుండి ఇదెన్నోనిజాలను గ్రహించింది, అభ్యుదయ మార్గాన్ని ప్రశస్తం చేస్తూంది. మనిషి సహనంతో, సహోదరభావంతో, స్వతంత్ర ఆలోచనలతో, చిత్తశుద్ధి గల మానవీయ మనస్తత్వంతో ఔచిత్యాన్నెరిగి జీవించడం భావ్యమని ప్రబోధిస్తుంది.

ఆత్మ, పరమాత్మ, మోక్షం, మరుజన్మ వంటి ఆధ్యాత్మిక విషయాలతోపాటు Transcindental soul, philosophy, Theosophy, metaphysics, Epistomology, Occultism, Theology, mythology, Divinity, Secular spirit, in corporeal spirit, rationalistic and Athestic thought, Evolutionalism, Realism, idealism వంటి తత్త్వ చింతనకు వర్తించు అనేక విషయాలపై ప్రపంచ మంతటా గోష్ఠులు, శిక్షణా తరగతులు నిర్వహిస్తూ మానవులలో పరస్పర సదవగాహన పెరిగేందుకు, దీనితోపాటు వారి ఆలోచనా స్థాయి సంస్కరించగల యత్నాలు చేస్తూ వస్తూంది. 132 సంవత్సరాలుగా **ప్రపంచ దివ్యజ్ఞాన సమాజం (World Theosophical Society)** చేసిన, చేస్తూన్న కృషికి పరమావధి మానవునిలో మతసహనాన్ని, సత్యనిష్ఠను, కర్తవ్య నిరతిని, ధర్మనిష్ఠతో కూడిన సదాచరణను రాబట్ట డమే. మనిషిని ముందు మనిషిగా రూపొందించి, అటు పిమ్మట ఆ మనిషిని మనిషిగా నిలబెట్టడమే దీని ఆదర్శాల కంతరార్థం. కనుకనే మన స్వరూప స్వభావాలను గురించి ఒకప్పుడు డా. అనిబిసెంటు చెప్పిన యీ మాట ఎంతగానో సముచితమనిపిస్తుంది - "The Religion is nothing else more than raising the Burte into man, and the man into Divine Being" చేయవలసిన పనిలో నిబద్ధత - నిజాయితీ (Sincerity)లను, ఆలోచనల్లో అలసత్వానికి తావులేని నిష్పాక్షికమైన స్వతంత్ర ఆలోచనా దృక్పథాన్ని ప్రోత్సహించడం, మూఢ నమ్మకాలను నిరసించగల మానవ సంస్కారాలనమలుజేయడం ఆ కృషికి లక్ష్యాలు. జీవితంపట్ల సరైన దృక్పథం కలిగి, సరైన ఆలోచనలతో ముందుకుసాగగలిగిన మానవ సమాజం కొరకు అటువంటి కృషిని కొనసాగించాలని థియోసఫీ అభిమతం.

## నవ్య మానవావతరణకు నాంది మనోభావాల సంస్కరణ :

దివ్యజ్ఞాన సమాజంలో సభ్యులు, అభిమానులు అయినవారందరు దివ్యజ్ఞాన ప్రసార కార్యక్రమాలలో భాగమైన సమావేశాలను, సభలను మొక్కుబడిగా జరపడం కాకుండా వాటిద్వారా జీవితానికి వర్తించు నిజానిజాలను గమనించగల ఓర్పును,నేర్పును అలవడజేసుకొనేందుకు అంధానుకరణలను (Blind followings) విడనాడి, హేతు విజ్ఞానం (Rational mind) మరియు వైజ్ఞానిక దృష్టి (Scientific out look) అలవరచుకొని, పరిశీలనా పటిమగలిగి; ఆత్మవిశ్వాసంతో ధర్మ మార్గం పై ముందుకు నడవాలని థియోసఫీ ప్రబోధిస్తుంది. దీనినే థియోసఫీ నవ్యమానవావతరణ (Human regeneration) అంటుంది. అభ్యుద యాత్మకమైన ఈ నవ్య మానవజీవనం కొరకు దివ్యజ్ఞాన సమాజం మానవుని మనస్సును, మనోభావాలను సంస్కరించాలంటుంది. సమాజాన్ని సంస్కరింపదలచుకొన్న మానవులు ముందు తమ తమ భావాలలో, ఆలోచనల్లో, ఆదర్శాలలో అవసరమైన మార్పులను ఆహ్వానించగలిగివుండాలంటుంది **థియోసఫీ.** ప్రతి థియోఫిస్టు ప్రప్రథమంగా ఈ సత్యాన్నవగతం చేసికొనాలంటుంది. ఇది సాధ్యంకాని పక్షంలో మానవులాశిస్తున్న అభ్యుదయం అందని ఫలంగా మిగిలి పోతుందని **థియోసఫీ** నమ్మకం. – ఇదే దీని ప్రబోధం కూడాను. – You cannot change the society unless you can change yourself first.

## ఆచరణకందని ఆశయాలు వ్యర్థం :

**థియోసఫీ** రీత్యా మానవుని ఆశయాలు, ఆదర్శాలు, సిద్ధాంతాలు అతని ఆచరణ కంటరానివిగా నుండరాదు. అలా వున్నప్పుడవి నిష్ప్రయోజకాలే అవుతున్నాయి. నిజానికి ఎంత గొప్పవైనా జీవితంలో ఆచరణనందుకొనలేని మానవుని ఆశయాలుగాని, ఆలోచనలు గాని అజాగళస్తనాలేనంటుంది **థియోసఫీ.** ఆశయాల పరమార్థం ఆచరణే నంటుంది. There will be no any value of human thought without its practical form. ఈ రీత్యా మనిషి చెప్పు మాటకు, చేయు ఆలోచనకు, చేతకు వైరుధ్యం లేని బాంధవ్యం బలపడాలని ఆశిస్తుంది **థియోసఫీ.** దీన్ని ప్రతి మనిషి కనీస మనుష్య ధర్మంగా పాటించాలనేది **థియోసఫీ** ప్రబోధం. ఇందుచేతనే థియోసాఫికల్ సొసైటీ ఈ ఆశయాన్ని పాటింపదగిన నీతిగా ప్రబోధిస్తుంది. The most beautiful life is that in which the present is not mixed

up with the past. దీన్ని స్పష్టపరచాలంటే సభ్య మానవ ప్రపంచంలో మనిషి తాను ఏకరవుపెడుతున్న ఆశయాలను ఆచరించి చూపడంలో శ్రద్ధ వహించాలి గాని, లక్ష్యహీనుడై సివిక్ సెన్సును కోల్పోయి వ్యవహరింపరాదు. ఇది సాధ్యపడని పక్షంలో ప్రజాజీవితం ఆలోచనలరీత్యా అదుపు దప్పి, ఆచరణరీత్యా అవినీతినాశ్రయిస్తుంది, సదాశయాలను కోల్పోతుంది.

**ఈ జాతి స్వరాజ్యం గర్వకారణం కాలేకపోయింది :**

థియోసాఫికల్ సొసైటీ ఈ దేశ స్వరాజ్యం కొరకు ఆరంభం నుండి తన వంతు సేవలనందించింది. తిలక్ - గాంధీ వంటి మహనీయుల నుండి మన్ననలందుకొంది. ఈ దేశం స్వతంత్రం కాగలిగితే అది మనుష్య జాతి మహోన్నతికి దారితీయగలదని **థియోసాఫీ ఆదర్శంగా** నమ్మింది. డా. అనీబిసెంటు ప్రకటించిన ఈ నమ్మిక ఈ దేశీయుల నానాడు వెన్నుతట్టి జాగృత పరచింది - "India is the radiant splendour of Asia and the light and blessings of the World". ఇది నిజంగా భారతీయులకు వారి సనాతన ధర్మాశయాల కనుగుణంగా అనీబిసెంటు ద్వారా లభించిన ప్రశంసాపత్రం. అయితే బాధాకరమైన విషయమేమంటే స్వరాజ్యం తదుపరి ఈ దేశంలో **థియోసఫీ** ఆదర్శాలాశించిన దానికి భిన్నంగా ఇచ్చట బ్రతుకుబాట (life line) భ్రష్టు పట్టడం గమనార్హం. అక్రమ మార్గాలపై, చట్ట వ్యతిరేక చర్యలతో అపార ధనరాసులకధిపతులైన వారి సమాఖ్య, మరియు ఆ ధన బలంతో అధికార పదవులనాక్రమించి కూర్చున్నవారి సంఖ్య ఊహాతీతంగా పెరిగిపోవడం అనేది ఈ దారుణాలకు ప్రమాణమని **థియోసఫీ** నమ్ముతుంది. ఇచ్చటి సగటు ప్రజలు ఎన్ని చదువులు చదివినా వారు తమ జాతి శ్రేయస్సునేమాత్రం లక్షించక, వృత్తి ధర్మాన్ని విస్మరించి, పాపభీతిని, చట్టభీతిని విడనాడి, అమానవీయమైన అక్రమ మార్గాలపై జీవన యాత్రనాశించడం సమర్థనీయమైన విషయం కాదు. ఈ స్వతంత్ర భారతావనిలో నీతిని, ధర్మాన్ని సంరక్షించవలసిన విద్యావంతులైన అధికారులతోపాటు పాలకులుగా సంఘవ్యవస్థను కాపాడుతూ దేశాభ్యుదయానికి పునాదులు వేయవలసిన ప్రజా ప్రతినిధులు, రాజకీయ నాయకులు సైతం తమ తమ పదవులనడ్డుపెట్టుకొని ధనసంపదలకు దాసులై జాతి జీవితాన్ని అక్రమవర్తనులకు, అవినీతి పరులకు తాకట్టుపెట్టబూనడం శోచ నీయమైన నేరమేనంటుంది.

**థియోసాఫికల్ సొసైటి** పర్యవసానంగా జాతిని తీర్చిదిద్దవలసిన విద్యాలయాలు, న్యాయాలయాలు, వైద్యాలయాలు, సేవాసంస్థలు సైతం వాణిజ్యకేంద్రాలుగా మారిపోతున్న వైనం కాదనరాని సత్యమంటుంది **థియోసఫీ.** చివరిమాటగా చెప్పాలంటే స్వరాజ్యానికి ప్రజోత్సవం జరుపుకొంటున్న మనం ఈనాడు 6 దశాబ్దాల స్వపరిపాలనకు నిండు మనసుతో గర్వించలేకపోతున్నాం.

**థియోసఫీ ఒక సమగ్ర తాత్విక విజ్ఞానం :**

మానవుని సమస్త చర్యలకు అతని ఆలోచనా రీతులు, నమ్మకాలే ఆధారాలని **థియోసఫీ** నమ్మిక. ఈ కారణంగా ఇది తన ఆశయాలలో మానవుని ఆలోచనా పరిధులను, నమ్మకాలను సంస్కరించేందుకు అధిక ప్రాధాన్యమిస్తుంది. మానవజీవితం పట్ల సరైన దృక్పథం కలిగి, సరైన ఆలోచనలతో, సరైన నమ్మకాలతో ముందుకు సాగగలిగిన మానవ సమాజం-అదే నవ్యమానవ సమాజం కొరకు మన కృషి కొనసాగాలంటుంది థియోసఫీ. ఆ కృషి మనిషి ఆలోచనల్లో, ఆశయాలలో, ఆచరణలో అర్థదాయకమైన ఆధ్యాత్మిక జాగృతిని, పరోపకారబద్ధమైన సేవాధర్మాన్ని పెంపొందింపగలిగేదిగా రూపందు కొనాలని దీని అభిమతం. మానవుడిలా తన జీవితాన్ని **సత్యశోధన** (Quest for Truth) లక్ష్యంగా అహింసామార్గంపై చేయు జీవన యాత్రగా పరిగణించాలంటుంది థియోసఫీ. దివ్యజ్ఞాన సమాజానికి చేరువైన ప్రతి వ్యక్తి దాని సభ్యుడుగా (Right thinking, Right minding, Right doing, Social mindedness, Rational thinking, Good behaviour, Altruistic Nature, Philanthropic Sense, Act of living వంటి మానవాదర్శాలతో, నవతరపు జీవన సూత్రాలతో హేతుబద్ధమైన, విజ్ఞాన సమ్మతమైన జీవితాన్ని సాధించవలసి వుంటుంది. ఇదే అతని జీవనతత్త్వం, ఇదే **థియోసఫీ.** ఈ **థియోసఫీ** అనేది పరిపూర్ణ వ్యక్తిత్వంతో మానవుడే చరాచర జగత్తును పరిశీలించ వలసిన తీరును, ఈ గడ్డపై జీవించవలసిన రీతిని తెలియజెప్పగల సమగ్ర తాత్విక విజ్ఞానంగా ఆధునిక మానవ ప్రపంచంలో మాన్యత నందుకొంటూంది. అనీబిసెంటు మాటల్లో **థియోసఫీ** ఇది - Theosophy is Really away of looking at the World and is really a way of living in the World. వరల్డు థియోసాఫికల్ సొసైటీ ప్రస్తుత అధ్యక్షురాలు డా. రాధా బర్నియర్ దీన్నిలా విశదపర్చారు-

Theosophy tells us to be sincere in our efforts to lead intently intellectual life which radiates Harmony, Honesty, Humility along with peace and purity.

**చిరునామా :** *డా॥ చలసాని సుబ్బారావు, 18/226, భవానీ సదన్, అంబాగ్రహారం, మచిలీపట్నం - 01, ఫోన్ : 08672 - 223796*

డా॥ ఉప్పల నరసింహం

# వామపక్ష తీవ్రవాదం కాదు 'జ్ఞానపక్ష' తీవ్రవాదం కావాలి

ఆరు దశాబ్దాల క్రితం ఆంధ్రప్రదేశ్‌లో వామపక్ష రాజకీయాలు ఊపందుకున్నాయి. అంతకుముందు రాజకీయాలు మితవాదంతో, సంస్కరణవాదంతో కొనసాగాయి. సమాజంలో మానవీయకోణం లుప్తమవకుండా చూసేందుకు ప్రయత్నాలు జరిగాయి. గ్రంథాలయోద్యమం, భాషోద్యమం, వెట్టిచాకిరికి వ్యతిరేకంగా మానవీయవిలువలు కాపాడాలనే అత్యుత్తమ ఆకాంక్షలతో ఆంధ్ర మహాసభ పని చేసింది.

స్వాతంత్ర్య అభిలాష, తెలంగాణ ప్రాంతాలలో విముక్తి ఆకాంక్ష బలంగా వెల్లువెత్తుతున్న సమయంలో బెనారస్ విశ్వవిద్యాలయం విద్యార్థులు, ఆనాటి ఉత్తరభారత అభ్యుదయ కవులు - కళాకారులు అప్పటికి ఆధునిక భావజాలమైన కమ్యూనిజాన్ని (మార్క్సిజాన్ని)అక్కున చేర్చుకున్నారు. ఆంధ్రదేశం నుంచి ఆ విశ్వవిద్యాలయంలో చదువుతున్న విద్యార్థులపై కూడా ఆ ప్రభావం పడింది. ఆ కొత్త భావజాలం యువ రక్తాన్ని ఉరకలెత్తించింది. నల్లగొండజిల్లా భువనగిరిలో జరిగిన పదకొండవ ఆంధ్ర మహాసభ ఆంధ్రదేశ రాజకీయచరిత్రలో కీలక ఘట్టంగా గుర్తుండిపోతుంది. ఆ మహాసభలోనే ఆంధ్ర మహాసభ 'కమ్యూనిస్టు' భావజాలాన్ని విశ్వ సించే వ్యక్తుల చేతిలోకి వచ్చింది.

అప్పటి వరకు కాంగ్రెస్ భావజాలంతో, లేదా ఆర్యసమాజ్ ఆశయాలతో పనిచేసినవారు, రామానందతీర్థ లాంటివారి ప్రవచనాలను అభిమానించేవారు, మానవీయ కోణంతో ఆలోచించేవారు కొత్తగా ఉగ్రూతలూగించిన, అప్పటికే రష్యాలో ఆ భావజాలంతో లెనిన్ నాయకత్వంలో విప్లవం విజయవంతం కావడంతో, చెప్పలేనంత ఊపు మీదున్న విద్యార్థులు, యువకులు వామపక్ష రాజకీయాలవైపు, వామపక్ష తీవ్రవాదం వైపు ఆకర్షితులయ్యారు.

గత ఏడెనిమిది దశాబ్దాలుగా ఆంధ్రదేశంలో ఇది పునరావృతం అవుతూనే ఉంది. 1943-44 సంవత్సరంలో వామపక్షవాదులు చేపట్టిన ఈ ప్రక్రియ వామపక్ష తీవ్రవాదులు ఇప్పటికీ అవలంబిస్తున్నారు. అదే వ్యూహాన్ని అనుసరిస్తున్నారు. ఆ ప్రక్రియను 'రిప్లికేట్' చేయడం వల్ల 'టైమ్ లాస్' అవుతున్నదన్న విషయాన్ని కూడా గ్రహించకుండా అదే మార్గంలో పయనిస్తున్నారు.

విద్యాధికుడు, మేధావి, ప్రముఖవ్యక్తి రామచంద్ర గుహ ఇటీవల ఒక ప్రశ్నకు ఒక ప్రముఖ పత్రికలో సమాధానమిస్తూ, రానున్న అర్థ దశాబ్దంలోగాని, ఆరు దశాబ్దాలలో గాని వామపక్ష తీవ్రవాదం భారత దేశంలో విజయవంతమై అధికారం చేపట్టే అవకాశాలు లేవని కేవలం కొన్ని ప్రాంతాలలో వామపక్ష తీవ్రవాదుల ప్రభావం బలంగా ఉండ వచ్చునని చెప్పారు. రామచంద్ర గుహనే కాదు, రాజకీయాలు తెలిసిన వారు, ఆర్థిక స్థితి గతులను అధ్యయనం చేస్తున్నవారు, గ్లోబలైజేషన్ అనంతరం ఏర్పడిన, ఏర్పడుతున్న పరిస్థితులను లోతుగా అధ్యయనం చేసినవారు, విశ్లేషకులు, విద్యావేత్తలు కూడా ఇదే అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నారు.

రానున్న రెండు దశాబ్దాలలో భారతదేశం సూపర్ శక్తిగా ఎదిగే అవకాశాలున్నాయని సామాన్య మధ్యతరగతి పౌరుడు కూడా అంచనా వేస్తున్నాడు. అంతేగాని వామపక్ష తీవ్రవాదం భారతదేశమంతటా పరచుకుని కమ్యూనిజాన్ని విశ్వసించే నక్సలైట్లు/ మావోయిస్టులు అధికారం చేపడతారని ఎవరూ ఊహించడం లేదు.రామచంద్ర గుహ పేర్కొన్నట్టు ఆదివాసీ ప్రాంతాలలో వారి ప్రాబల్యం బలంగా ఉండే అవకాశముంది.

ఆధునిక సమాజంలో జ్ఞానం, మేథతో సంపదను సృష్టిస్తున్న నేపథ్యంలో, ఔట్‌సోర్సింగ్ ద్వారా అగ్రరాజ్యాల పని చైనా, భారతదేశాల భుజాలపై పడి ఈ రెండు దేశాల సంపద ఇబ్బడి ముబ్బడిగా పెరగనున్నదని అగ్రరాజ్యాల నిపుణులే లబలబలాడుతున్న సందర్భంలో ఆదివాసులతో వామపక్ష తీవ్రవాదులు జతకట్టి దేశ రాజకీయ చిత్రపటాన్ని, ప్రపంచ పోకడను మారుస్తారు అనుకోవడం అంత ఆచరణ సాధ్యంగాఅగుపించడం లేదని సామాన్యులే చెబుతున్నారు.

భారతదేశంలోకి ఎనిమిది దశాబ్దాల క్రితం కమ్యూనిజాన్ని రాడికల్ కమ్యూనిజాన్ని తీసుకొచ్చిన ఎం.ఎన్.రాయ్ సైతం ఆ భావజాలం భారతదేశానికి అంతగా ఉపకరించదని రాడికల్ హ్యూమనిజాన్ని ప్రబోధించిన విషయం అందరికి తెలిసిందే. వామపక్ష తీవ్రవాదాన్ని జీవన విధానంగా భారతీయులు అంగీకరించరనే ఇంగిత జ్ఞానంతో ఆయన ఆ అడుగువేశారు.

అపరభగీరథుడు డా॥ కె.ఎల్.రావు

# విజయవాడ - నా నియోజకవర్గం

పార్లమెంటు సభ్యునిగా ఎన్నుకోబడినందున నా నియోజకవర్గ ప్రజల కొన్ని సమస్యలను పరిష్కరించవలసిన బాధ్యత నా మీద వుంది. అనేక సమస్యలతో విజయవాడ అపుడూ,ఇపుడూ, ఎపుడూ సమస్యలతో అతలాకుతలమవుతోంది. రైల్వేల, జాతీయ రహదార్లకు కేంద్రస్థాన మవడంతో, ధనవంతమైన డెల్టాకు తలమానికం కావడంతో ఉపాధికై పలువురిని ఆకర్షిస్తుంది. పశ్చిమాన కొండలతో, దక్షిణాన శక్తివంత మైన కృష్ణానదితో, ఉత్తరాదిన బుడమేరు నదితో పరిసరాల వలలో చిక్కుకుని విజయవాడ వుక్కిరిబిక్కిరవుతోంది. పట్టణవ్యాప్తికి తగినంత తావులేదు. మొత్తం పట్టణ విస్తీర్ణం 30 స్క్వేర్ మీటర్లు లేదా 7500 ఎకరాలు. సముద్రమట్టానికి 24 మీటర్ల ఎత్తున వుంది. సగటు ఉష్ణోగ్రత 24 డిగ్రీల సెంటిగ్రేడ్ 30 డిగ్రీల సెంటీ గ్రేడుల మధ్య వుంటుంది. 1953 జూన్‌లో47 డిగ్రీల సెంటీగ్రేడ్ నమోదయింది. ఇదే అత్యధిక ఉష్ణోగ్రత. 1966 ఫిబ్రవరిలో 15 డిగ్రీల సెంటీగ్రేడ్ నమోదయింది. ఇది కనిష్ట ఉష్ణోగ్రత.

విజయవాడ జనాభా 3.5 లక్షలు. పట్టణాన్ని రోజూ సందర్శించే వారి సంఖ్య 40వేలు. మొత్తం 43 గణాంక ప్రాంతాలలో 11 మురికి వాడలు. పట్టణ జనాభాలో 6వ శాతం వీరివే. అరవై శాతం జనాభా సాలీనా ఆదాయం రు.1000 నుండి రు. 2000 దాకా వుంటుంది. పరిసర ప్రాంతాల్లోని పేద ప్రజలు పట్నం వచ్చి దొరికినప్రతి అంగుళం ఆక్రమించుకుంటారు. కాలవగట్లతో సహా. ఒక మాటలో చెప్పాలంటే గుడిసెల బస్తీ.

వలస వచ్చేవారి మీద అదుపు లేకుండా పోయి విజయవాడ విపరీతంగా పెరిగిపోయి నివాసానికి దుర్భరంగా తయారయింది. ప్రాకృతిక సౌందర్యం దెబ్బతిని పేద బస్తీ రూపుదాల్చింది. నిజానికి దేశంలోని అందాల పట్టణాలలో ఒకటి కావలసింది. సమగ్ర పథకం లేకుండా కొన్ని ప్రయత్నాలు చేసినా నాణ్యత ఏమాత్రం పెరగలేదు. నా అభ్యర్థనపై సాంఘిక, ఆర్థిక సర్వే జరిగింది. ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ సోషల్ సైన్స్ రీసెర్చి వారి ఆధ్వర్యంలో ఢిల్లీ యూనివర్సిటీ, ఢిల్లీ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ హ్యూమన్ జాగ్రఫీవారు 1979లో దీనిని నిర్వహించారు.

విజయవాడలో 68,000 గృహాలున్నాయ్. వీటిలో మూడింట రెండువంతులుకుచ్చా యిళ్లు, గుడిసెలూ,గుడిసెలకు వాడే మెటీరియల్ కూడా ఏమంత పటిష్టమైనది కాదు. చాల గుడిసెలకు గోడలే లేవు. గుడిసెల పైకప్పులను చూస్తేనే పట్టణ కట్టడాల అభివృద్ధి ఏ దశలో వుందో అర్థం చేసుకోవచ్చు.1950 నుండి 56 శాతం నుండి 60 శాతం వరకూ ఇళ్ల నిర్మాణం జరిగింది. డిమాండు పెరగడంతో గృహ సమస్య పట్టణ సమస్యగా మారింది. సగం ఇళ్లల్లో యజమానులే వుంటున్నారు.

వేసవిలో మురికివాడల్లో అగ్నిప్రమాదాలు జరిగి గుడిసెలు సర్వ నాశనమైపోతాయి. ఈ సమస్యను రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల దాకా తీసుకువెళ్లాను. కేంద్రప్రభుత్వం తన ఫైర్ ఎడ్వయిజర్‌ను పంపించింది. ప్రతి 200 మీటర్ల దూర పరిధిలో 50 గేలన్ల స్తోమతగల చేతిపంపులు ఏర్పాటుచేయాలని ఆయన సూచించారు. దీనివల్ల అగిద్నిమాద నిరోధ సౌకర్యాలు మెరుగవుతాయనీ, ఫైర్ ప్రివెన్షన్ డిపార్టుమెంటులో సంస్థాగత మార్పులు చేస్తూ సాంకేతిక నైపుణ్యంగల వ్యక్తిని అధికారిగా నియమించాలని ఆయన సూచించారు. ఈనాటికీ రాష్ట్రప్రభుత్వం ఈ సిఫారసులను అమలుచేయకపోవడం దురదృష్టకరం. విజయవాడలో ఇంటికప్పులకు వాడే తాటాకు చప్పున నిప్పంటుకొనకుండా ఫైర్ ప్రూఫింగ్ కెమికల్ ట్రీట్‌మెంట్ టెక్నిక్‌ను కనుగొనవలసిందిగా రూర్కీ లోని సెంట్రల్ బిల్డింగ్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్‌ను కోరాను. వారు నిప్పుని, నీటిని దూరంగా వుంచేవిధంగా జింక్ ఆక్సైడ్, మైకా, టాల్క్ పౌడర్, పల్వొరైజుడు ఎసెటేల్ వగైరాలతో ఓ సాంకేతిక ప్రక్రియ కనుగొన్నారు. కానీ దానికయ్యే ఖర్చు ఆ సాంకేతిక ప్రక్రియను నిరుత్సాహపరచింది. మన శాస్త్రజ్ఞులు ఈ సమస్యను మరింత శ్రద్ధగా అధ్యయనంచేసి చౌకగా లభ్యమయ్యే సాంకేతిక ప్రక్రియలతో ముందుకు రావాలి.

ఉష్ణోగ్రత మరీ ఎక్కువగా వుండడంతో బ్రిటిష్‌వారు ఈ పట్టణాన్ని 'బ్లేజ్‌వాడ' అనేవారు. తరువాతనే బెజవాడగా మారింది. తూర్పుదిక్కున

వున్న కొండ కృష్ణానది నుండి బుడమేరు వరకూ వ్యాపించి వుండడం అధిక వేడిమికీ, వేసవి వడగాడ్పులకూ ఒక కారణం. వేసవిలో ఈ కొండ వేడెక్కి సాయంకాలాల్లో వేడి విడుదల చేస్తుంది. ఫలితంగా పట్టణ వాతావరణం భరింపరానిదిగా వుంటుంది. ఈ ఉష్ణోగ్రత తగ్గించడానికి కొండచరియల్లో విరివిగా చెట్లు నాటాలని ప్రతిపాదించడం జరిగింది. ఈ ఏరియా సుమారు 150 ఎకరాలుంటుంది. వ్యవసాయ మంత్రిత్వ శాఖ వరకు ఈ సమస్యను తీసుకువెళ్లాను. ఎన్నోమార్లు రాయబారాలు జరిపి డాక్టర్ రాంసుభగ్ సింగ్ వద్దకు వ్యక్తిగతంగా వెళ్లి కలుసుకోగా కొండపైన చెట్లు నాటే పథకం క్రింద రు.30,000 మంజూరు చేశారు. 30 ఎకరాల ఏరియా దీని పరిధిలోనికి వచ్చింది. చెట్లు బాగా పెరగ డంతో ఈ కొండ మిగతావాటికంటే అందంగా తయారయింది. తక్కిన కొండవాలుల్లో కూడా చెట్లు నాటితే ప్రక్కనే వున్న కృష్ణాజలాలపై నుండి వీచే గాలులవల్ల పట్టణ వాతావరణం మరింత చల్లబడు తుందని నా నమ్మకం.

కృష్ణానది, బుడమేరు కాలువ కిరువైపులా పట్టణ పరిధిలోనే పలు లోతైన ప్రాంతాలున్నాయి. వేలాది మంది కాలనీలు కట్టుకొని అక్కడ నివసిస్తున్నారు. వారిని రక్షించడానికి వరదకట్టలు నిర్మించాలి. ఎప్పుడో ఒకసారి వచ్చే వరదలకు వరద కట్టలెందుకని స్థానిక అధికార్లు రాష్ట్ర నీటిపారుదల శాఖామంత్రుల అభిప్రాయం. వరదలు ఎప్పుడు వచ్చేదీ ముఖ్యం కాదనీ, వచ్చినప్పుడు సంభవించే జన, ఆస్తి నష్టం విపరీతంగా వుంటున్నదనీ, వరదకట్టలు లేకుండా నివాసవాడలు నిర్మించరాదనీ ఎత్తిచూపాను. ఎన్నో సంవత్సరాలు విజ్ఞప్తులు చేయగా, చుట్టూ తిరగ్గా పనులుమంజూరయి పూర్తయ్యాయి. బుడమేరు బారినుండి అజిత్‌సింగ్ నగర్‌నూ, ఆర్థిక ప్రయోజనాలుగల రహదారినీ రక్షించుకోవడానికి అవసరమైన కరకట్ట నిర్మాణంలో వ్యయం భరించేలా కేంద్రాల్ని ఒప్పించడానికి బ్రహ్మప్రయత్నం చేయవలసివచ్చింది.

కాలువలూ, కృష్ణానదీ, బ్యారేజ్‌తో సహా నగరం నడిబొడ్డునే వున్నా విజయవాడకు తగినంత మంచినీటి సదుపాయం లేకపోవడం వెక్కిరింపే. ఈ పథకానికయ్యే రు. 2 కోట్ల మంజూరుకు మొండిచెయ్యే ఎదురయ్యింది. ఎంతో ప్రయత్నం చేయగా పాక్షికంగా దీనిని అమలు చేశారు. విజయవాడ మునిసిపాలిటీ తిరిగి తీర్చే పద్ధతితో ఎల్.ఐ.సి. రుణం లభించింది. రెండేళ్ల క్రితం మొత్తం ఖర్చులో మూడింట రెండు వంతులు ఎల్.ఐ.సి. భరించేలా తక్కినది రాష్ట్రప్రభుత్వం, మునిసిపాలిటీ భరించేలా ఒప్పందం జరిగింది. అనవసర వ్యయం తగ్గించుకోవచ్చు. రాష్ట్రప్రభుత్వ అధికారులు సహకరించక, పథకాన్ని వ్యతిరేకించారు. ఎంత చెప్పినా వినలేదు. ఇంతకంటె తీవ్రత వున్న ప్రాంతాలు ఎన్నో వున్నాయనీ, తేలికగా వున్న తావుల్ని తరువాత చూడవచ్చనీ వారి వింతవాదం. ఈ మంచినీటి కుళ్ళాయిలున్నయి. రమారమి 5 శాతం మిగతావారి కుళాయిలనుండి 12శాతం వాడల్లో ఈ సౌకర్యం మృగ్యం, పబ్లిక్ కుళాయిలు లేనందువల్ల వారంతా నదుల్నుండి,కాలువల నుండి నీరు తెచ్చుకుంటారు. నీటికోసం మూడు ఫర్లాంగుల దూరం వెళ్లాలివారు.

కృష్ణాబ్యారేజీ, స్నానఘట్టాలకు ప్రక్కనే వున్న ఇంద్రకీలాద్రి పర్వతా నికి సగం దూరంలో వున్న కనకదుర్గ గుడికి రోడ్డువేయబోగా నాకు తీవ్ర ప్రతిఘటన ఎదురయ్యింది. మరోమారు వాడ మధ్యలో ఇరుకైన 'గోశాల' స్థలంలో కాలేజీ నిర్మించబోగా దుయ్యబడుతూ నామీద కరపత్రాలు వేశారు. ప్రత్యక్షంగా ఆ తావుకు వెళ్లి తనిఖీ చేయగా అక్కడ ఆవూ లేదు, దూడా లేదు. నూనె పీపాలకు గోడౌన్‌గా దానిని వాడుతున్నారు. ప్రతిఘటనకు ఎవరూ ఆందోళన చెందకూడదు. వ్యక్తిగతంగా ఎవరూ ఆందోళన చెందకూడదు. వ్యక్తిగతంగా ప్రత్యక్షంగా సమస్యను చూసి పరిష్కరించాలి.

విజయవాడ పట్టణ మధ్యగా రైల్వే ట్రాక్ వుంది. రెండుభాగాలను కలుపుతూ ఒకే అండర్ బ్రిడ్జి వుంది. మిగతా చోట్ల రైళ్ల రద్దీవల్ల లెవెల్ క్రాసింగులు ఎప్పుడూ మూసివేసి వుంటాయి.తగినన్ని ఓవర్‌హెడ్ క్రాసింగ్స్ లేక రాకపోకలకు ఆటంకంగా వుంది. ఉత్తర భాగాన పట్టణం పెరగడానికి ఆస్కారం లేదు. అందువల్ల రైల్వేలపై వత్తిడి తెచ్చి ఎంతో ప్రయత్నం మీద రైల్వే చేత మూడు బ్రిడ్జీలు కట్టించాం. అయినా అప్రోచ్ రోడ్ల నిర్మాణానికయ్యే ఖర్చు ఎవరు భరించాలా అన్న వివిధ ప్రభుత్వ శాఖల మధ్య తర్జనభర్జనతోనే సరిపోయింది. బ్రిడ్జీ కిరువైపులా కరకట్ట లను, రోడ్డును నిర్మించడానికయ్యే ఖర్చును భరించడానికి రాష్ట్రప్రభుత్వం ఇటీవలే సమ్మతించిందని తెలిసింది. మచిలీపట్నం వైపుగా వెళ్లే రైలుమార్గాన్ని కొంతదూరం మళ్లించడం ద్వారా రోడ్డుగా మార్చాలని మరో సూచన చేశానునా సూచనను అప్పుడు అంగీకరించలేదు గానీ, తరువాత తీవ్రంగా పరిశీలిస్తున్నారని తెలిసింది.

విజయవాడకు అండర్‌గ్రౌండ్ డ్రైనేజీ సిస్టం లేదు. మురుగునీరు ఆచ్ఛాదన లేని సైడు కాలవలగుండా పొంగుతూ వుంటుంది. పట్టణం లోని మరికొన్ని ప్రాంతాలలో అదీ లేదు. ఈనాటికీ అపరిశుభ్రత విలయతాండవం ఆడుతుంది. అందువల్ల 'టాయ్‌లెట్ టౌన్' (మరుగు దొడ్ల బస్తీ) అనడంలో ఆశ్చర్యమేముంది? అండర్‌గ్రౌండ్ సిస్టం పాక్షికంగా మంజూరయి అమలు జరిగింది. ఇంటి యజమానులు తమ ఆవరణలో మురుగునీటి కనెక్షన్ల మీద కొంత వ్యయం చేయవలసి వున్న కారణంగా దీనికి కొంత వ్యతిరేకత చూపారు.పట్టణాలలో అనేక చోట్ల సభలు జరిపి వారిని ఒప్పించడం జరిగింది.

మురికివాడల సమస్య చాలా తీవ్రమయినది. కష్టమైనది. అది అలాగే క్షేమంగా వుంది. మురికివాడ నివాసుల్ని నిర్వాసితుల్ని చెయ్యడం మన అభిమతం కారాదు. వారికి నీరు, విద్యుచ్ఛక్తి సరఫరా వున్న మంచి వసతి సౌకర్యం ప్రత్యామ్నాయంగా చూపాలి. మన దృక్పథంలో మార్పు

రానిదే ఇది సాధ్యం కాదు. విజయవాడ మొత్తం మురికివాడల్లో భాస్కర రావుపేట అతిదీనమైనది. వారికి అక్కడ మూడంతస్తుల బిల్డింగులు కట్టాలని ఎంతో ఉపలాటపడ్డారు. రాష్ట్రప్రభుత్వ అధికారు లకు భిన్నమైన అభిప్రాయం వుంది. అరవై, డెబ్బయి ఏళ్లనుండీ కాపురాలుంటున్న వారందరినీ తరిమివేసి అక్కడ బస్‌స్టాండ్ కట్టాలని వారి ఆలోచన.

విజయవాడలో మనోరంజన సౌకర్యాలు మృగ్యం. పార్కులు లేవు. ఉన్నవాటిని కూడా తొలగించారు. పట్టణానికి మంచి వనరులున్నాయి. ఉదాహరణకు కృష్ణాబ్యారేజీకి ఎగువనుంచి ద్వీపముంది. మనోరంజన కేంద్రంగా దానిని అభివృద్ధిపరచవచ్చు. అయితే దీనికి ఎంతో డబ్బు కావాలి, పేదవారికి వుపకరించదు. జంతు ప్రదర్శనశాలలేదు. మనోరంజనకైనా, విద్యావిషయకంగానైనా ఇదెంతో అవసరం. అనేక సంవత్స రాల క్రితం ఢిల్లీ జూలాజికల్ పార్క్ డైరెక్టర్ కె.ఎన్. శేఖలా ఎంతో ప్రయోజనకరమైన నివేదిక సమర్పించారు. ఇంతవరకూ స్థలనిర్ణయమే కాలేదు.

స్వాతంత్ర్యోద్యమ సమరం నాటినుండి విజయవాడ మహాత్మా గాంధీ అడుగుజాడల్లో నడుస్తోంది. కోటిమంది సభ్యత్వానికీ, కోటి రూపాయల స్వరాజ్యనిధికీ, దేశమంతాస్వాతంత్ర్య సమరానికి అంకితం చేసుకుని ఆ ఉద్యమాన్ని ముందుండి నడిపించాడు. ఇక్కడే ఆంధ్ర పౌరుడు పింగళి వెంకయ్య రూపొందించిన త్రివర్ణపతకాన్ని ఆమోదించారు. ఇక్కడే స్వదేశీ ఉద్యమ చిహ్నంగా తొలిసారిగా ఖద్దరు వాడారు.

గాంధీజీ శతజయంతి రాబోతూండగా కొంతమంది ఉత్తేజితులపై విజయవాడలో నిరాడంబరమైన గాంధీజీ స్మృతి చిహ్నం నెలకొల్పాలని అనుకున్నాం. డాక్టర్ అచ్చమాంబ మాకు పెద్ద. ఆమే, నేను, ఫణిభూషణరావూ, ముక్కామల నాగభూషణం విజయవాడ స్టేషన్ ప్రక్కనే వున్న కొండను కొని మెమోరియల్‌గా అభివృద్ధిచేయాలని తలపెట్టాం. కొండలో ముఖ్యభాగం ఓ ప్రయివేటు వ్యక్తిది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సహాయంతో మరోచోట ఆయనకు ప్రత్యామ్నాయంగా స్థలం యిప్పించాం.

గాంధీజీ జీవితంతో, కృషితో సంబంధాలుగల దేశంలోని ఆరుతావుల్లో స్మారకచిహ్నాలు నెలకొల్పాలని గాంధీ మెమోరియల్ ట్రస్టు సూచించింది. అన్నిటికంటె విజయవాడ స్మారకచిహ్నం ముందుగా తయారయింది. విజయవాడ మెమోరియల్‌కు 1964 నవంబరు 9న లాల్‌బహదూర్ శాస్త్రి శంకుస్థాపన చేశారు. దీనికి జకీర్‌హుసేన్ 1968 అక్టోబరు 6న ప్రారంభోత్సవం జరిపారు. గుంటూరుజిల్లాలోని రెంటచింతల వద్ద లభ్యమయ్యే ఎర్రపాలరాతితో దీనిని కట్టడం జరిగింది. శాంతి నికేతన్‌కు చెందిన విఖ్యాత శిల్పి నందలాల్ బోస్ రూపొందించిన నమూనా ప్రకారం దుర్గి గ్రామవాసులు చెక్కడాలను తయారించారు. విజయవాడ నివాసులకూ, సందర్శకులకూ గాంధీస్తంభం తీర్థయాత్రా స్థలంగా మారిపోయింది. సాయంత్రమయ్యేసరికి ధ్వని, కాంత్రి ప్రసారంతో గాంధీజీ సందేశం ప్రతిధ్వనిస్తూ ప్రకాశిస్తుంది. ఈవిధంగా వేడికొండను అందాల కేంద్రబిందువుగా మార్చగలిగాం. దీనిలో పిల్లల రైలూ, గాంధీ అధ్యయన కేంద్రం, పఠనాలయం, పాఠశాల, అబ్జర్వేటరీ, పఠనాలయంపై టెలిస్కోపూ, నక్షత్రశాల వున్నాయి. ఫోర్డ్ ఫౌండేషన్ చాలావరకు సహాయం చేసింది.

గాంధీ హిల్ సొసైటీ 1974 ఏప్రిల్లో డాల్స్ మ్యూజియం ఆరంభించింది. అదింకా కావలసిన మేరకు పెరగలేదు. దేశంలోనీ, ప్రపంచంలోని బొమ్మలన్నీ సేకరించాల్సి వుంటుంది. మురికివాడల్లో పిల్లలకు బొమ్మలు అరువు యిస్తూ, వంచితులయిన బాలబాలికలకు మనోరంజనం కల్పించాలని పథకం. గాంధీ హిల్ స్థలసేకరణలో, దాని అభివృద్ధిలో ఫణిభూషణరావు ఎనలేని కృషి చేశాడు. ఆయన మృతితో, సేవాని రతితో దాని అభివృద్ధికి నిరంతరం కృషిచేసే కార్యకర్తను విజయవాడ కోల్పోయింది.

విజయవాడకు గణనీయమైన జనాభా వుంది. భారతదేశంలోని 27 నగరాలలో 8వ స్థానం అలంకరిస్తుంది. జనాభా 2 లక్షలు. చెప్పుకోదగ్గ ఆస్పత్రి లేదు. ఆస్పత్రీ, మెడికల్ కాలేజీ, ఇంజినీరింగ్ కాలేజీ సత్వరమే స్థాపించాల్సిన అవసరం వుంది.

పలు సంవత్సరాలనుండి ఎన్నోమార్లు విజ్ఞప్తులు చేసినా పట్టణ సమన్వయాభివృద్ధికి రాష్ట్రప్రభుత్వం టౌన్ ఇంప్రూవ్‌మెంట్ కమిటీ ఏర్పాటుచేయకపోవడం ఎంతేనీ దురదృష్టకరం.

పైనుదహరించిన సమస్యలన్నీ విజయవాడకే పరిమితంకాదని నాకు తెలుసు. భారతదేశంలోని పలు పట్టణాలకీ సమస్యలున్నాయి. ప్రజాప్రతినిధులు ఇలాంటి లోపాలను ఎత్తిచూపి పరిష్కరించబూనాలి.

విజయవాడ పార్లమెంటరీ నియోజకవర్గంలో ఏడు అసెంబ్లీ నియోజవర్గాలున్నాయి. కృష్ణాజిల్లాలోని గ్రామీణ ప్రాంతాలకు చెందిన ఐదు నియోజకవర్గాలు దీనిలో వున్నాయి. మిగతా రెండూ విజయవాడ పట్టణానికి చెందినవే. (ఇటీవలే కొన్ని మార్పులు జరిగినాయి)

'గ్రామ సేవ చేస్తే స్వరాజ్‌ను స్థాపించినట్లే. తక్కినదంతా ఆదర్శ కలే'అన్నారు మహాత్మాగాంధీ. గ్రామసీమలకు నిజమైనసేవ చేయాలంటే త్రాగునీరు, నీటిపారుదల, పరిశుభ్రత, విద్యుత్ సౌకర్యాలు కల్పించాలి. మహాత్మాగాంధీ దృక్పథం నిజంగా గణనీయమైనది. దీనికంతటికీ తారకమంత్రం భారతదేశంనుండిదారిద్ర్యాన్ని పారద్రోలడమే. గ్రామీణ సమస్యలను పరిష్కరించడం ద్వారా 400 మిలియన్ ప్రజల సమస్యలనూ, అరలక్ష గ్రామాల సమస్యలనూ పరిష్కరించినట్లే. భారతదేశంలోని పెక్కు గ్రామాల సమస్యలన్నీ సాదృశ్యాలే.

గ్రామసీమలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయాలంటే, ముఖ్యంగా సేద్యానికిఅవసరమైన పంపులకు విద్యుత్తు సరఫరా చేయాలంటే ప్రత్యేక ప్రయత్నాలు అవసరం. విద్యుచ్ఛక్తి కావాలని గ్రామవాసులు తహతహ లాడుతున్నారు. నందిగామ తాలూకాలోని కొన్ని గ్రామాల విద్యుద్దీకరణ దీనికి తిరుగులేని ఉదాహరణ. ఈ గ్రామాలు రెండు కాలవల మధ్య వున్నాయి. వంతెనలు మాత్రం లేదు. దాదాపు 20 గ్రామాలున్నాయి. భూములన్నీ సారవంతమైనవే. వారికి నీరుంటే అమితంగా పంటల్ని పండిస్తారు. విద్యుచ్ఛక్తి రోడ్లూ లేని కారణంగా ఇవి బాగా వెనుకబడి వున్నాయ్. విద్యుచ్ఛక్తి సౌకర్యం వుంటే గ్రౌండ్ వాటర్ వినియోగించి మెట్టభూముల్లో పంటలు పండించవచ్చు.రెండో పంట కూడా పండించ వచ్చు. మీవంతు వాటా మీరు చెల్లించాలని గ్రామస్తులను ఒప్పించి, పథకం అమలుచేయడానికి శ్రమదానం చేయించి గ్రామీణ విద్యుదీ కరణ పథకం క్రింద కొంత మొత్తం మంజూరు చేయించాను. గ్రామస్థులకు స్టీలు, హోల్స్ తయారుచేయడానికి మోల్డ్స్ వంటి మౌలిక వస్తువుల్ని సరఫరా చేశాం. ప్రజలు వారంతట వారే స్తంభాలు తయారుచేశారు. తమ ఎడ్లబండ్లమీద వాటిని ఆయా తావులకు చేర్చారు. వాటిని వారే పాతారు. తీగెలు కూడా వారే వేశారు. అన్నివిధాలా సాయపడ్డారు. ఆరుమాసాల్లో గ్రామాలన్నీ విద్యుద్దీకరణ పూర్తిచేసుకుని నేడు సౌభాగ్య వంతాలైనాయి. నాయకులు ప్రజలను ఉత్తేజపరిస్తే ఇలాంటి పథకాల నెన్నింటినో అమలుపరచ వీలవుతుందని నా ప్రగాఢ విశ్వాసం.

విజయవాడ నియోజకవర్గంలోని గ్రామాలన్నిటా విద్యుదీకరణ పూర్తయినందుకు నాకు ఆనందంగా వుంది. ఆయా గ్రామాలతోపాటు హరిజనవాడల్లో ఇది పూర్తయ్యే విధంగా ప్రత్యేక శ్రద్ధ తీసుకోవడం జరిగింది.

నా నియోజకవర్గంలోని పలు గ్రామాలు నాగార్జునసాగర్ ప్రాజెక్టు ఎడమ కాలువ ఆనకట్ట క్రిందికి చేరాయి. ప్రధాన ఎడమ కాలువ తెలంగాణా సొంతం గుండా సాగుతూ ఆంధ్ర ప్రాంతాన్ని కూడా సాగులోనికి తీసుకొనివస్తుంది. ఆంధ్ర తెలంగాణా ఏర్పాటు ఉద్యమం ఎడమ కాలువ నిర్మాణాన్ని కొంత కుంటుపరిచింది. నాగార్జునసాగర్ ప్రాజెక్టు ఇరవయేళ్ల క్రితం మొదలయ్యింది. డామ్ నిర్మాణం పదేళ్లలో పూర్తయింది. నందిగామ బ్లాకుకు, చివరలో తదితర ప్రాంతాలకు ఉపయుక్తంగా ఉండే ఎడమ కాలువ ఇంకా ప్రారంభించాలి. కృష్ణా దాని ఉపనదుల నుండి ఎత్తయిన ప్రాంతాలకు నీరు పంపుచేసే పనిలో కూడా కొంత కేంద్రీకరించారు. బోటులమీద పంపులు పెట్టి ఈ పనిచేయడం జరిగింది. ఇలాంటి నీటిలో తేలియాడే పంపింగ్ సెట్లు అతి స్వల్ప వ్యవధిలో తయారుచేయవచ్చు. దీని తరువాత ఇలాంటి పథకమే ఉత్తరప్రదేశ్‌లో విజయవంతంగా అమలు జరిగింది.

నియోజకవర్గంలోని గ్రామాలన్నిటా విద్యుత్తు, ఇరిగేషన్ పంపింగ్ స్కీములు అమలు జరిగినంత విజయవంతంగా మంచినీటి పథకం అమలు జరగలేదు. కృష్ణానది నీటిని కొండపైకి పంపుచేసి ఇక్కడి నుండి రమారమి 15 గ్రామాలకు సరఫరా చేసే పథకం ఒకటి విజయ వంతమ య్యింది. దేశమంతటా మంచినీటిపథకం అమలు కాలేని కారణం బహుశ శాఖలే. ఒకే విషయంలో కేంద్ర, రాష్ట్రప్రభుత్వాల వివిధ మంత్రిత్వ శాఖలు తలదూరుస్తాయి. మానవ సంక్షేమానికి అత్యంత వృదాసంస్థ కావాలి. ఇది కేంద్ర ఆధ్వర్యంలో వుంటూనే రాష్ట్రాల సహకారం స్వీకరించాలి. మంచినీటి సరఫరాకు చెందిన సమస్త విషయాలూ దీని క్రిందికి రావాలి. గ్రామ పరిధిల్లో వున్న బావుల వంటి సమస్యను స్థానిక సంస్థల, రాష్ట్రప్రభుత్వా పరిధికి మాత్రమే వదలాలి.

మానవ శరీరం మిలియనులో ఒక భాగం ఫ్లోరైడ్‌నే భరిస్తుంది. కాని మన నీటిలో ప్రతి మిలియనులో 30 భాగాలున్నాయి. దేశంలోని పలు గ్రామాల్లో ఈ పరిస్థితి వుంది. నిరవధికంగా అలాంటి నీరు త్రాగుతూ ఉంటే ఎముకలు నందిగామ తాలూకాలో ఇలాంటి కొన్ని గ్రామాలున్నాయి. నేనే గ్రామాలకు వెళ్లి కృష్ణానది నుండి నీరు సరఫరా చేసే పథకం రూపొందించాను. పది కిలోమీటర్ల దూరానికి నీరు పంపించాలి. రాష్ట్రప్రభుత్వం ఎన్నో ఏళ్లక్రిందట దీనిని మంజూరు చేసినా అమలులో చెప్పుకోదగ్గ ప్రగతి లేదు.

నగర ప్రాంతాలలోని సమస్యలన్నీసువిధితమే.పల్లెసీమల సమస్యలే ప్రచురణకు నోచుకోవు. ఫలితంగా గ్రామాల, గ్రామవాసుల జీవన స్థితిగతులు గణనీయంగా మెరుగుపడలేదు. పట్టణ ప్రాంతాల సత్వర, సముచిత అభివృద్ధికి, సమస్యల ప్రజాప్రతినిధుల కోర్కెను స్థానిక అధికార్లు అవసరమయితే సంబంధిత మంత్రులతో సంప్రదించి మన్నించి సత్సాంప్రదాయానికి ఒరవడి దిద్దాలి.

శ్రీ లవణం

# ఆంధ్రప్రాంతానికి మహాత్మాగాంధీ తొలిరాక శతజయంతి

మహాత్మాగాంధి దక్షిణాఫ్రికాలో భారతీయుల ఆత్మగౌరవం కోసం జరిపిన పోరాటాన్ని అత్యధికభాగం విజయవంతం చేసిన తరువాత శాశ్వతంగా 1915 జనవరి 9వ తేదీన ముంబయి ఓడరేవులో దిగి భారతదేశం వచ్చారు. 1893లో గాంధీజీ దక్షిణాఫ్రికా వెళ్ళారు. అపుడు భారతీయ వ్యాపారవేత్త అయిన సేట్ అబ్దుల్లాకు న్యాయసలహాదారునిగా ఆయన వెళ్ళారు. దర్బాన్‌లో ఓడ దిగిన తరువాత జోహెన్స్‌బర్గ్ వెళ్ళడానికి రైలులో మొదటి తరగతి టిక్కెట్టు కొనుక్కుని ఎక్కారు. ఆయన ఎక్కినప్పుడు ఆ కంపార్ట్‌మెంటులో ఆయన తప్ప వేరే ఎవరూ లేరు. అందుచేత గాంధీజీకి దక్షిణాఫ్రికా గురించి దక్షిణాఫ్రికాలో భారతీయుల పరిస్థితుల గురించి ఏమాత్రమూ తెలియదు. ఇంగ్లండులో బారిస్టర్ చదువుకున్నప్పుడు అక్కడ తెల్లవారు భారతీయులను తమతో సమానంగానే చూశారు గానీ తమకంటే తక్కువవారిగా చూడలేదు. కానీ దక్షిణాఫ్రికాలో అలాకాదు. ఈ విషయం గాంధీకి తెలియదు. అది తెలుసుకోడానికి ఎంతోసేపు పట్టలేదు. రైలు కదిలింది. తర్వాత రైలు ఆగే స్టేషను మారిట్జ్‌బర్గ్ రాగానే కొంతమంది రైలు ఎక్కారు. తాను వున్న మొదటి తరగతి బోగీలోకి ఎక్కినవారందరూ కూడా తెల్లవారే. భారతీయులెవరూ లేరు. అదే సమస్య అయింది. గాంధీ పత్రిక చదువుకుంటూ ఏమీ పట్టించుకోలేదు. కానీ బోగీలోనికి ఎక్కిన తెల్లవారందరూ గాంధీ దగ్గరకు వచ్చి 'దిగు' అన్నారు. గాంధీకేమీ అర్థం కాలేదు. తాను రెండో తరగతి టిక్కెట్టు కొనుక్కుని మొదటి తరగతిలో ప్రయాణిస్తున్నా డని అనుకుంటున్నారేమోనని జేబులో ఉన్న తన మొదటి తరగతి టిక్కెట్టు తీసి అందరికి చూపించారు. తెల్లవారి కోపం ఇంకా రెట్టింపయింది. 'దిగూ' ముందు అన్నారు. 'నా దగ్గర మొదటి తరగతి టిక్కెట్టుంది నేనెందుకు దిగాలి ?' అని గాంధీ ప్రశ్న. కానీ తెల్లవారికిదేమీ పట్టలేదు. భారతీయుడైన గాంధీ తమ మాట వినటం లేదని కోపోద్రిక్తులై రైల్వే అధికారులను పిలిచి గాంధీ రెండు భుజాలూ పట్టుకొని బయటకు తోసేశారు. గాంధీ ప్లాట్‌ఫారమ్ మీద పడిపోయారు. ఆయన సామాను కూడా విసిరేశారు. రైలు వెళ్ళిపోయింది. అప్పుడు ప్రక్కన వున్నవారు చెప్పగా గాంధీకి అర్థమయింది.

దక్షిణాఫ్రికాలో భారతీయులను రెండురకాల భారతీయులుగా చూస్తారు. మొదటిరకం భారతీయులు - కూలీలుగా వెళ్ళినవారు. వారిని దాదాపు బానిసలుగా చూస్తారు. తెల్లవారి దరిదాపుకు వారు రావటానికి కూడా వీలులేదు. వారిని కూలీ భారతీయులంటారు. రెండవరకం భారతీయులు - బాబూ భారతీయులు. వీరు వ్యాపారస్తులుగాను, లాయర్లుగాను, ఉపాధ్యాయులుగాను వెళ్ళినవారు. వీరికి కొంత గౌరవం వుంది. కూలీ భారతీయులు రైలులో మొదటి తరగతిలో ఎక్కడానికి కూడా వీలులేదు. కానీ బాబూ భారతీయులు మొదటి తరగతిలో ప్రయాణం చేయవచ్చు. కానీ తెల్లవారు బోగీలో లేనప్పుడే. తెల్లవారు బోగీలోనికి రాగానే బాబూ భారతీయుల చేతుల్లో వున్న మొదటి తరగతి టిక్కెట్టుకు విలువలేదు. వారు వెంటనే దిగిపోయి రెండవ తరగతిలోకి వెళ్ళిపోవాలి. ఇలాంటి గొడవ ఎందుకని సాధారణంగా బాబూ భారతీయులు కూడా ఎప్పుడూ మొదటి తరగతిలో ప్రయాణం చేయటానికి పూనుకోరు. కానీ ఈ విషయం గాంధీకి తెలియనందున దక్షిణాఫ్రికాలో అతిపెద్ద ధన వంతుల్లో ఒకడైన సేట్ అబ్దుల్లాకు న్యాయసలహాదారుడిగా వచ్చాననే గొప్ప భావనతో గాంధీ మొదటి తరగతి టిక్కెట్టు కొనుక్కుని మొదటి తరగతిలో ప్రయాణం ప్రారంభించారు. అది ఒకవిధంగా మంచిదే అయింది. అంతవరకు గాంధీ చాలా పిరికివాడుగాను, భయస్తుడిగాను వుంటూ వచ్చారు. కానీ ఒకసారి భారతీయుడు కనుక తన మొదటి తరగతి టిక్కెట్టుకు తెల్లవారు ఎక్కగానే విలువ వుండదు అని తనను బయటకు త్రోసివేసినప్పుడు దానిని అవమానంగా భావించటంతో గాంధీలో ఎక్కడలేని ఆత్మగౌరవం తోసుకునివచ్చింది. మనిషిగా నాకు గౌరవం లేదా ? భారతీయుడిగా నాకు గౌరవం లేదా ? నా గౌరవం కోసం నేను పోరాడాలి. భారతీయుల గౌరవం కోసం నేను పోరాడాలి

అనే పట్టుదల గాంధీలో బలపడింది. తరువాత సేట్ అబ్దుల్లా వద్దకు వెళ్ళి ఈ విషయాలన్నీ చర్చించారు. భారతీయుల ఆత్మగౌరవం కోసం మనం పోరాడితీరాలి అనే గాంధీ భావనతో అబ్దుల్లా ఏకీభవించారు. అక్కడి భారతీయులందరితో ఈ విషయం చర్చించారు. ఎలా పోరాడాలి ? అనేది సమస్య.

హింసాయుత పోరాటానికి ఆస్కారం లేదు. భారతీయులు చాలాకొద్దిమంది. వారు హింసకు దిగితే దక్షిణాఫ్రికా ప్రభుత్వం వారిని ప్రతిఒక్కరినీ చంపగలదు. అందుచేత ఆత్మగౌరవాన్ని హింసతోను, ద్వేషంతోను ముడిపెట్టడం కాక ; అహింస ద్వారాను, ప్రేమతత్వం ద్వారాను సాధించాలని గాంధీ ఆలోచించారు. గాంధీతో సేట్ అబ్దుల్లా ఏకీభవించారు. అంతవరకు ఏ పోరాటం జరిగినా హింసద్వారానే జరిగింది. రామాయణం, భారతం కూడా యుద్ధాలతోనే నిండివున్నాయి. ఫ్రెంచి విప్లవం, అమెరికన్ విప్లవం, సోవియట్ విప్లవం హింస ద్వారానే విజయం సాధించాయి. బుద్ధుడు అహింస గురించి మాట్లాడినా ఆయన దానికి సామాజిక రూపం ఇవ్వలేదు. దాన్ని ఒక ఉదాత్తమైన భావంగా సమాజం ముందు పెట్టారు. బుద్ధుని తరువాత ఇప్పుడు గాంధీ వంతు వచ్చింది. గాంధీ ఆత్మగౌరవ పోరాటాన్ని హింస, ద్వేషం లేకుండా సత్యాగ్రహం ద్వారా అహింసాయుతంగా సాధించాలని, ఆత్మగౌరవాన్ని కించపరిచే ప్రతీ విషయాన్ని ధైర్యంగా అహింసాయుతంగా వ్యతిరేకించాలనీ నిశ్చయించారు. భారతీయులందరికీ వారి పరిచయాన్ని తెలియజేసే ఒక కార్డును దక్షిణాఫ్రికా ప్రభుత్వం ఇచ్చింది. ఎప్పుడు అడిగినా వారు ఆ కార్డు చూపించాలి. అలాంటి కార్డులు మరి వేరే ఎవరికీ వుండ నవసరం లేదు. ఇది భారతీయుల ఆత్మగౌరవానికి అవమానమని, వీటిని తాము తగులబెడతామని గాంధీజీ సత్యాగ్రహంగా ప్రారంభించారు. మొదటి కార్డు కస్తూరిబా నిప్పులో వేయగా, రెండవ కార్డు గాంధీ, మూడవ కార్డు సేట్ అబ్దుల్లా వేశారు. తరువాత వందలు, వేలు భారతీయులు దక్షిణాఫ్రికా ప్రభుత్వం ఇచ్చిన తమ పరిచయ కార్డులను తగులబెట్టటం ప్రారంభించారు. ఎక్కడా హింస లేదు, ఎవరిమీదా ద్వేషం లేదు. మా ఆత్మగౌరవం మాకు ముఖ్యం. అందుకే వీటిని తగులబెడుతున్నాం అనే భారతీయుల వాదం ఎంతోమంది తెల్లవారిని ఉద్యమానికి సన్నిహితులను చేసింది. గాంధీతోపాటు ఎంతో మంది సత్యాగ్రహులు అరెస్టయి జైళ్ళల్లో వున్నారు. ఈ ఉద్యమ వివరాలు భారతదేశంలో అందరికీ చాలా కుతూహలాన్ని కలిగించాయి. వీటికి తన పూర్తి సహాయసహకారాలు అందించిన మొదటి వ్యక్తి గోపాలకృష్ణగోఖలే. ఆయన భారతదేశంలో కాంగ్రెసు నాయకులు. 'సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ' స్థాపకులు. ఒక సంఘ సంస్కర్త. ఆయన దక్షిణాఫ్రికా వెళ్ళి గాంధీ సాగిస్తున్న ఉద్యమాన్ని దక్షిణాఫ్రికా ప్రభుత్వం గుర్తించాలని, వారి న్యాయ సమ్మతమైన కోర్కెలను అంగీకరించాలని ప్రభుత్వ వర్గాలతో చాలా చర్చలు జరిపారు. చివరకు ఆయన కృషి వల్ల దక్షిణాఫ్రికా ప్రభుత్వం దిగి వచ్చింది. గాంధీ గోఖలేను తన 'రాజకీయ గురువు' గా భావించారు. గోఖలే చేసిన అనేక సూచనలను ఆయన ఆమోదించారు.

ఈ నేపథ్యంలో 21 సంవత్సరాలు దక్షిణాఫ్రికాలో గడిపి, విజయం సాధించిన అనంతరం గాంధీ 1915 జనవరి 9 వ తేదీన భారతదేశం తిరిగివచ్చారు. అప్పటికే భారతదేశంలో జాతీయోద్యమం బాగా వేళ్ళూతన్నుకుంటోంది. సంఘసంస్కరణోద్యమం కూడా బలపడుతోంది. గోపాలకృష్ణ గోఖలే, బాలగంగాధర తిలక్, అనీబిసెంట్ ప్రముఖ నాయకులుగా ముందు నిలిచారు. గాంధీ ఇండియా వచ్చిన సరిగ్గా నెలరోజులకు 1915 ఫిబ్రవరి 19 వ తేదీన గోపాలకృష్ణ గోఖలే మరణించారు. గోఖలేను తన రాజకీయ గురువుగా భావిస్తూనే గాంధీ తిలక్, అనీబిసెంట్ ప్రభావాల మధ్య తన భవిష్యత్తును రూపొందించుకోవటం ప్రారంభించారు.

ఇంగ్లండులో ప్రముఖ నాస్తికుడు, బ్రిటిష్ పార్లమెంటులో భారతదేశానికి ప్రతినిధిగా పేరుపొందిన చార్లెస్ బ్రాడ్లాకు అసిస్టెంట్‌గా పనిచేసిన అనీబిసెంట్ బ్రాడ్లా మరణానంతరం, థియసాఫికల్ సొసైటీ (దివ్యజ్ఞాన సమాజం) స్థాపకురాలు హెలాన బ్లావట్స్కీ సలహా మేరకు భారతదేశం వచ్చి ఇక్కడ థియసాఫికల్ సొసైటీని స్థాపించటమే కాక, తాను ఇండియన్ హోంరూల్ లీగ్‌ను కూడా ప్రారంభించి, కాంగ్రెస్‌తో కలిసి భారతదేశానికి స్వపరిపాలన కొరకు కృషిచేయటం మొదలు పెట్టింది. భారతదేశంలో గాంధీకి అన్నివిధాలుగా అవకాశాలు కల్పించాలని అనీబిసెంటు చేసిన ప్రయత్నంలో 1915 మే 4, 5, 6 తేదీలలో ఆంధ్రప్రాంతం నెల్లూరులో జరగనున్న మద్రాసు ప్రొవిన్షియల్ థియసాఫికల్ మహాసభలకు గాంధీని ఆహ్వానించింది. అప్పటికింకా ఆయన భారతదేశం వచ్చి 4 నెలలు కూడా పూర్తికాలేదు. బొంబాయి, పూనా, గుజరాత్, ఢిల్లీ, ఉత్తరప్రదేశ్, కలకత్తా తప్ప ఇంకెక్కడికీ ఆయన వెళ్ళలేదు. కనుక అనీబిసెంటు ఆహ్వానం మీద 1915 ఏప్రిల్ 15వ తేదీన మద్రాసు వచ్చి కొంత తమిళనాడులో పర్యటించి మే 4న నెల్లూరు చేరుకున్నారు. గాంధీతోపాటు కస్తూరిబా కూడా వచ్చారు. ఆయన జీవితంలో దక్షిణ భారతదేశానికి రావటం అదే మొదటిసారి.

నెల్లూరు సభలలో ఆయన ఆంధ్రప్రాంతానికి చెందిన అనేకమంది నాయకులను కలుసుకున్నారు. వారిలో కాశీనాథుని నాగేశ్వరరావుగారు, ముట్నూరి కృష్ణారావు, కొండా వెంకటప్పయ్యగారు, జ్ఞాపతి సుబ్బారావుగారు, మొ. రామచంద్రరావుగారు, వి.యస్. శ్రీనివాసశాస్త్రిగారు, పట్టాభి రామిరెడ్డిగారు, వల్లూరి సూర్యనారాయణ గారు, నెమలి పట్టాభిరామారావుగారు, దేశపాండ్య సుబ్బారావుగారు,

జ్ఞాపతి హనుమంతరావుగారు, వింజమూరి భావనాచారిగారు, పి.యన్.శర్మగారు, వి.యన్.కృష్ణారావుగారు వంటి ఆంధ్రనాయకులు ఎందరో ఈ సభలో పాల్గొన్నారు. వారందరికీ కూడా గాంధీని చూడడం అదే మొదటిసారి. సభకు గాంధీని అనీబిసెంటు పరిచయం చేస్తూ దక్షిణాఫ్రికాలో గాంధీ సాధించిన విజయాలను చాలాగొప్పగా కీర్తించింది. అలాగే ఇతరులు కూడా గాంధీ నాయకత్వం ఇక జాతీయ ఉద్యమానికి లభించడం ఒక గొప్ప అవకాశంగా ప్రస్తావించారు. మహాసభలలో మూడురోజులూ అనేక విషయాలు చర్చించి, ప్రత్యేకంగా విద్య, వైద్యం, వ్యవసాయం, పరిశ్రమలు, మాతృభాషాభివృద్ధి మొదలైన విషయాల గురించి ఎన్నో సూచనలు చేశారు. గాంధీజీ చాలా చిన్న ఉపన్యాసం ఇస్తూ తనను చాలా ఘనంగా పొగిడారని, తాను దక్షిణాఫ్రికాలో సాధించిన విజయాల వెనుక అక్కడ భారతీయులు పట్టుదలతో చేసిన కృషి, గోఖలే గారి నాయకత్వం వున్నాయని, తాను చేసింది వీటిని సమన్వయం చేయటం మాత్రమేనని, అందుచేత తన గురించి గొప్పగా చెప్పవద్దని, తాను సామాన్యమైన కార్యకర్తనని చెప్పారు. అలాగే అనేక విషయాల అభివృద్ధి గురించి మనం సాధించాలని చెప్పుకోవటం చాలదు, వాటి గురించి మనం పట్టుదలగా పనిచేసి కొన్ని విజయాలు సాధించి ప్రజలకు చూపించాలి అని చెప్పారు. ఈ విధంగా ఒక ప్రక్క తన గురించి ఎక్కువ పొగడవద్దని వినయాన్ని ప్రదర్శిస్తూ, మరొకప్రక్క మనం కబుర్లు చెప్పటం కాదు, పనిచేసి చూపించాలి అని ఒక హెచ్చరిక కూడా చేశారు. ఇది ఆంధ్ర దేశంలో గాంధీజీ చేసిన మొదటి ఉపన్యాసం.

మర్నాడు విద్యార్థుల సభలో గాంధీ మాట్లాడుతూ చిత్తూరు జిల్లాలోని నారాయణవనం నుంచి నేతబట్టలు, మరికొన్ని గ్రామ పరిశ్రమలలో చేసిన వస్తువులు తెచ్చి ప్రదర్శించారని, గాంధీజీ వారిని మీరు తెచ్చిన వస్తువులు విలువ ఎంత వుంటుందని అడిగితే సుమారు వెయ్యి రూపాయలు వుంటుందని వారు చెప్పారని, ఇంతవరకూ మీరు ఎంత విలువచేసే వస్తువులు అమ్మారని అడగగా, వారు 50, 60 రూపాయల కంటే ఎక్కువ అమ్మలేదని చెప్పారని ప్రస్తావిస్తూ ముఖ్యంగా యువకులు మన ప్రజలు, మనదేశంలో మన ప్రాంతంలో తయారుచేసిన వస్తువులు కొనడం, వాడుకోవడం నేర్చుకుంటే వారికి పెద్ద ప్రోత్సాహం లభిస్తుందని, అలాంటి ప్రోత్సాహం ఇవ్వకుండా కేవలం పరిశ్రమలు అభివృద్ధి చెందాలని ఆశించటం సమంజసం కాదని చెప్పారు. వెళ్ళేలోగా ఒక్కొక్క వస్తువైనా కొనుక్కుని వెళ్ళమని విద్యార్థులకు పరోక్షంగా సలహా ఇచ్చారు. ఈ విధంగా గాంధీ దంపతులు ఆంధ్రదేశానికి రావడం యొక్క శతజయంతిని మనం ఇప్పుడు జరుపుకుంటున్నాం. ఆ రోజున గాంధీ వంద సంవత్సరాల క్రిందట ఏమిచెప్పారో అది ఇప్పటికీ మనకి కూడా వర్తిస్తుంది. ఆయన ఆంధ్రకు రావటం శతజయంతిని మనం జరుపుకునే ఈ సమయంలో మనం సింగపూరులాగానో, జపానులాగానో, చైనాలాగానో వుండాలని అనుకోవటం మాత్రమే కాక, వారు ఎంత కష్టపడి, ఎంత కృషిచేసి, ఎంత తమ దేశాన్ని అభివృద్ధిపథంలోకి నడిపారో అర్థంచేసుకుని మనం కూడా ఆ బాటన నడవాలని ప్రయత్నించటం చాలా అవసరం. ఈ విధంగా ఆంధ్రదేశానికి గాంధీ మొట్టమొదటిసారిగా వచ్చిన సందర్భం శతజయంతి మొత్తం ఆంధ్రదేశమంతా జరుపుకొని గాంధీ ఇచ్చిన సలహాలను మనం పాటించగలమని ఆశిద్దాం.

శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్

# కృష్ణా, గుంటూరు జిల్లాలలో గాంధీజీ పర్యటన

జాతిపిత మహాత్మా గాంధీజీ అయిదారు సార్లు ఆంధ్రదేశంలో పర్యటించారు. కృష్ణా, గుంటూరు జిల్లాలలో బాపూజీ పర్యటన విశేష ప్రాధాన్యం పొందింది. రౌలత్ బిల్లుకు వ్యతిరేకంగా దేశవ్యాప్త సత్యాగ్రహోద్యమానికి ప్రచారం చేస్తూ గాంధీ మొట్టమొదటిసారిగా 1919 మార్చి 31న విజయవాడకు రైలులో రాగా, ఇప్పటి రామమోహన లైబ్రరీ ఆవరణలో సన్మాన సభ జరిగింది.

ఆయన మద్రాస్‌లో సత్యాగ్రహ దీక్ష చేబట్టగా, దానికి మద్దతుగా ఆంధ్రదేశంలో అన్ని ప్రధానపట్టణాలలో భారీఊరేగింపులు సభలు జరిగాయి. గాంధీజీ ఆంధ్రులపట్ల ప్రీతిపాత్రంగా ఉండటానికి కారణం ఇదే!

రెండవసారి మద్రాస్ నుండి కలకత్తా వెడుతూ మహాత్ముడు, షౌకతాలి, రాజాజీలతో విజయవాడకు 1920 ఆగష్టు 23 ఉదయాన వచ్చారు. సాయంత్రం రహదారి బంగాళా ఆవరణలో జమ్మిచెట్టు కింద అయ్యదేవర కాళేశ్వరరావు గారి ఆధ్వర్యంలో గొప్ప బహిరంగ సభ జరిగింది. ముట్నూరు కృష్ణారావు, చెరుకువాడ నరసింహ, ఉన్నవ లక్ష్మీనారాయణ వంటి పెద్దలు పాల్గొన్నారు. దౌర్జన్య రాహిత్య అహింసాత్మక సత్యాగ్రహాన్ని తాను చేబట్టుతున్నానని గాంధీ తెలియజేస్తూ శాసనసభ, విద్యాలయాలు కోర్టులను బహిష్కరించమని కోరారు. అయ్యదేవర కాళేశ్వరరావుగారిని శాసన సభకు పోటీ చేసే ఆలోచన విరమించుకోమని సలహా ఇవ్వగా అక్కడికక్కడే అభ్యర్థిత్వానికి రాజీనామా చేశారు.

31వ తేదీ ఆంధ్రపత్రికకుగాంధీ ఇంటర్వ్యూఇస్తూ హిందూ ముస్లిం సఖ్యత అన్ని సమస్యలను పరిష్కరిస్తుందని ఆశాభావం వెలిబుచ్చారు.

1921 మార్చి 31న విజయవాడలో అఖిలభారత కాంగ్రెస్ సంఘ సమావేశం గవర్నర్‌పేట మ్యూజియం హాలులో జరిగింది. అప్పుడు విద్యుత్తు లేదు. పెట్రోమాక్స్‌దీపాలే ఆధారం. మైకులూ, బస్సులూ లేవు. గాంధీ కలకత్తా మెయిల్‌లో విజయవాడ చేరి, ఆ సదస్సులో పాల్గొన్నారు.

దేశంలోని ప్రముఖులందరూ హాజరవటం గాంధీ ఏకైక నాయకత్వాన్ని ఆమోదించటం, బెజవాడ సభ తీర్మానాలు - కోటి రూపాయల తిలక్ స్వరాజ్య నిధి వసూలు, కోటిమంది సభ్యుల చేరిక, 20 లక్షల రాట్నాల వినియోగం మొదలైనవి స్వాతంత్ర్య పోరాట చరిత్రలో అధిక ప్రాధాన్యం పొందటం ఈ సభ సాధించిన ఫలితాలు. మహాసముద్రం లాగ జనసముద్రం బెజవాడను ముట్టడించి చరిత్రలో నిలిచింది.

విజయవాడ మునిసిపాలిటి ఏప్రిల్ 1 ఉదయం స్వరాజ్య మైదానంలో విశ్వబ్రాహ్మణ సంఘం గాంధీని సన్మానించాయి. సాయంత్రం మైలవరం నాటకశాలలో జరిగిన స్త్రీలసభలో గాంధీజీ ప్రసంగించారు.

ఏప్రిల్ 4 సోమవారం కారులో మచిలీపట్నం చేరి మౌనవ్రతంలో ఉన్నందున మర్నాడు పురజనం ఊరేగింపు చేసి అభిమానాన్ని చాటుకొన్నారు. పురపాలక సంఘం, వైశ్య, వర్తక సంఘాలు సన్మానించాయి. మత్తుపదార్థాల విక్రయం చేయవద్దని హితవు చెప్పారు. సాయంత్రం జాతీయ కళాశాలలో జరిగిన భారీ సభలో తాను పూర్వం ఇచ్చిన వాగ్దానాన్ని నెరవేర్చు కోవటానికి ఆ కళాశాలకు వచ్చానని, జాతీయ భావం ఉన్న వారందరూ ఈ కాలేజీలో చేరి చదువు కోవాలని కోరారు, హర్తాళ్ పాటించమని, స్వార్థం వదిలి, మత సహనంతో అందరూ ప్రవర్తించాలని చెప్పారు.

మచిలీపట్నం నుంచి బెజవాడకు మోటార్ కారులో వెడుతూ ఉయ్యూరులో గ్రామస్తుల కోరికపై ఆగి, వారు స్వరాజ్య నిధికి సమర్పించిన వంద రూపాయలను స్వీకరించారు. ప్రతి ఇంట రాట్నం పెట్టి స్వదేశీఉద్యమాన్ని బలపర్చవలసిందిగా వారిని మహాత్ముడు కోరాడు. అలాగే, విజయవాడ నుండి బందరుకు వెడుతూ పామర్రులో ఆగి, నిధిని గ్రహించారు. ఏప్రిల్ 5న బందరు చేరి జాతీయ కళాశాలలో ప్లీడర్ల సమావేశంలో ప్రసంగించారు. వారి సందేహాలు తీర్చుఉద్యమ భాగస్వాములు కావలసినదిగా పిలుపు నిచ్చారు.

ఏప్రిల్ 6న కొత్తవరం వెళ్లి స్వరాజ్యం రావాలంటే స్వార్థ త్యాగం అవసరమని ప్రబోధించారు. అంగలూరు వెళ్లి అక్కడి మగ్గాలు రాట్నాలను చూసి ఆనందించి. గుడివాడ చేరి స్వరాజ్య నిధికి ఆంధ్రదేశం నుంచి ఏడున్నర లక్షల రూపాయల నిధిని, ఏడున్నర లక్షల కాంగ్రెస్ సభ్యులను, రెండు లక్షల రాట్నాలను సమకూర్చాలని కోరారు. హరిజన సేవ నిమిత్తం గూడూరు రామచంద్రుడుగారు స్థాపించిన "సేవాశ్రమం"ను అభినందించి స్వరాజ్యమే తన మోక్షం అని తెలియజేశారు.

6వ తేదీ గుంటూరులో లక్షమంది హాజరైన సభలో ప్రసంగించగా కొడాలి ఆంజనేయులుగారు తెలుగులో అనువదించారు. రెండువేల ఆరువందల రూపాయల నిధిని స్వీకరించి, సాయంత్రం కస్తూరిబాయ్ గారితో సహా బాపట్ల చేరి మేళతాళాల స్వాగతం అందుకొని పల్లెప్రజల అకుంఠిత దేశభక్తికి పులకించిపోయారు గాంధీజీ.

అక్కడినుంచి మునిపల్లె, పొన్నూరు మీదుగా రాత్రి పది గంటలకు చీరాల చేరి గ్రామం మధ్యలో ఏర్పాటు చేసిన సభలోదుగ్గిరాల గోపాలక్రిష్ణయ్యగారి రామదండు సభాకార్యక్రమాలను పర్యవేక్షించారు. అక్కడ గాంధీగారు ఉత్తేజకరంగా ప్రసంగించగా ప్రకాశం పంతులుగారు అనువదించారు.

1929లో గాంధీ మళ్ళీ ఆంధ్రదేశ పర్యటన చేశారు. తాను 6 గంటలకంటే ఎక్కువ శ్రమ పడలేదని, పెద్ద ప్రదర్శనలు ఊరేగింపులు వద్దని గొప్పవారిని సంతృప్తి పరచటానికి వారి వద్దకు తనను తీసుకు వెళ్ళవద్దని ముందే నిర్వాహకులకు సందేశం పంపారు. ఏప్రిల్ 7 రాత్రి సికిందరాబాద్'లో రైలెక్కి బెజవాడ చేరారు. బొమ్మకల్లులో అయ్యదేవర, జయంతిపురం, రాజావాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాద్ మొదలైన పెద్దలు స్వాగతం పలికి జయంతి పురానికి 8వ తేదీ ఉదయం తీసుకొని వెళ్ళారు.

దారిలో మునగాల రాజా నాయని వెంకట రంగారావు సమర్పించిన 1500 రూపాయలు స్వీకరించారు. జయంతిపురంలో రాజాగారి అతిథిగా ఉన్నారు. మౌనవ్రతం పూని కానుకలు గ్రహించి రాత్రి 7 గంటలకు జగ్గయ్యపేట చేరుకున్నారు.

గాంధీ దంపతులను ప్రజలు సంప్రదాయ పద్ధతిలో పేలాలు చల్లి మేళ తాళాలతో ఆహ్వానించగా పందిరి వేదికపై నుండి అస్పృశ్యతా నివారణ అత్యవసరమని, ఖద్దరుతోనే దేశ సరిహద్దుల నుంచి బ్రిటిష్ వారిని వెళ్ళగొట్టగలమని గాంధీజీ చెప్పారు. రెండు గంటలు కాలి నడకతో కొణకంచి చేరి అక్కడ సన్మానం కానుకలు తీసుకొని నంది గామకు చేరి, పెద్ద బహిరంగ సభలో స్వరాజ్యం అంటే మనశ్శాంతి, ప్రజాశాంతి అని, కల్లు తాగవద్దని, విదేశీ వస్తువులను బహిష్కరించాలని ప్రసంగించారు. స్త్రీలు స్వచ్ఛందంగా సమర్పించిన నగలను స్వీకరించి ఉదయం 9 గంటలకు బెజవాడ చేరారు.

విజయవాడ నుండి నూజివీడు వెళ్లి బహిరంగ సభలో మాట్లాడి, విరాళాలు కానుకలు గ్రహించి సన్మానాలు అందుకొని రాత్రి ఉయ్యూరు రాజావారి నందన వనంలో అతిథిగా ఉన్నారు. ఏప్రిల్ 10 గొల్లపల్లి, ఆరుగొలను, వీరవల్లి,పొట్టిపాడు ఆత్కూరు గ్రామాలను చూసి చందాలు గ్రహించి త్రాగుడు మానమని ప్రబోధించారు. ఉదయం తొమ్మిదిన్నరకు బెజవాడ చేరారు.

ఏప్రిల్ 10 సాయంత్రం వరకు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వర రావు గారికి అతిథిగా ఉండి సి.ఆర్.రెడ్డి సమర్పించిన వంద రూపాయలు తీసుకొని సాయంత్రం స్త్రీల సభలో మాట్లాడి మాగంటి అన్నపూర్ణాదేవి సౌశీల్యాన్నీ మెచ్చుకొని అందరూ ఆమెను ఆదర్శంగా తీసుకోవాలని కోరగా ఉంగరాలు నగలు ఒలిచి సమర్పించారు. స్వాతంత్ర పోరాట గాథల్లో కృష్ణాతీరానికి సంబంధించినంత వరకూ మాగంటి అన్నపూర్ణగారి వృత్తాంతం ఆ రోజున ఒక సంచలనం, చారిత్రాత్మకం.

సాయంత్రం ఆరున్నరకు గాంధీనగర్ మైదానంలో పది వేలమంది హాజరైన బహిరంగ సభలో జాతీయ వారం గడచి అప్పుడే నాలుగు రోజులయిందని, తాను పేదల ప్రతినిధినని ఇంత ఆర్భాటం చేయరాదని చెప్పి, శ్రీ కృష్ణదేవరాయల చిత్రపటం ఆవిష్కరించినందుకు, హై లెవెల్ రిజర్వాయర్ ప్రారంభోత్సవం చేస్తున్నందుకు గర్వపడుతున్నానని వినమ్రంగా తెలియజేశారు. సన్మాన పత్రాలను వేలం వేయగా వచ్చిన నూట పదహారు రూపాయలను నిధిగా స్వీకరించారు.

ఏప్రిల్ 11వ తేది సాయంత్రం బెజవాడ నుంచి ఉయ్యూరు వస్తూ దారిలో పోరంకి ఈడుపుగల్లు, పునాదిపాడు, నెప్పల్లి, ఆకునూరు గ్రామాలను దర్శిస్తూ కానుకలు గ్రహిస్తూ రాత్రి 8 గంటలకు ఉయ్యూరు చేరారు. రహదారి బంగళాలో ఆయన, హరిజనులతో బస చేవారు.

12 ఉదయం నూలు వడికి, దగ్గరలో ఉన్న కుమ్మమూరు గ్రామం సందర్శించి వారిచ్చిన నాలుగువందల రూపాయల నిధిని గ్రహించి పరిశుభ్రత పాటించమని హితవు చెప్పారు.

ఉయ్యూరుకు తిరిగి వచ్చి సి.బి.ఎం.స్కూల్ సభలో మహాత్ముడు విశ్వశాంతి ప్రదాత అంటూ అందించిన ఆహ్వాన సన్మానాలు అందుకొని, ప్రత్యుత్తర మిస్తూ మతసామరస్యాన్ని పాటించమని చెప్పి 667 రూపాయల నిధిని స్వీకరించారు. ఉయ్యూరు కార్యక్రమాన్ని గబ్బిట మృత్యుంజయ శాస్త్రి, వల్లభనేని వెంకటరావు, గాయత్రి అనంత రామయ్య, సూరి శోభనా చలపతిగార్లు విజయవంతంగా తీర్చిదిద్దారు.

12 ఉదయం ఉయ్యూరు నుంచి తాడంకి, కురుమద్దాలి పామర్రు వీరంకిలాకు పెనుమత్స, కపిలేశ్వర పురంచేరి బసచేసి విదేశీ వస్త్ర దహనాన్ని స్వయంగా చూసి స్వరాజ్య పతాకను ఆవిష్కరించి విరాళాలు తీసుకొని సహాయ నిరాకరణకు మద్దతు నివ్వమని కోరారు. సాయంత్రం కాశీనాథుని వారి స్వగ్రామం ఎలకర్రు చేరి వారు, పసు మర్రు,

పెరిసేపల్లి గ్రామస్తులు అందించిన వాటిని గ్రహించి అస్పృశ్యత నివారణ గురించి బోధించారు.

13 రాత్రికి గుడివాడ చేరి దారిలో సేరికలవపూడి, బొమ్మలూరి గ్రామాలను చూసి కానుకలు పుచ్చుకొన్నారు. నూజెళ్ళ, అంగలూరు కౌతవరం, వడ్లమన్నాడు, పెడన మీదుగా రాత్రి 11 గంటలకు బందరు చేరారు.

14 ఉదయం బందరులో బయల్దేరి చినముత్తేవి, కూచిపూడి, మొవ్వ, కొడాలి, ఘంటసాల చేరి పెద్దపందిరిలో 2,000 మందితో ఏర్పాటు చేసిన సభలో మాట్లాడి దేవరకోట మీదుగా చల్లపల్లి చేరి సాయంత్రం సభలో ప్రసంగించారు. పురిటిగడ్డ, నాగాయ తిప్ప మీదుగా సాయంసదె వేళ్ళలో కృష్ణానది దాటి అవనిగడ్డకు రాత్రి 10 గంటలకు చేరారు. గాంధీజీ ఆ సందెవెలుగులో నది దాటుతుంటే సాతంత్ర్య భానుడు ఎర్రగా ప్రకాశిస్తున్నట్లనిపించింది ప్రతి ఒక్కరికీ! ఇరుగట్ల మీదా వేచి చూస్తున్న నాలుగు వేలమంది ప్రజలనుద్దేశించి ప్రసంగించి రాత్రికి విశ్రాంతి తీసుకొన్నారు.

15 ఉదయం కృష్ణ దాటి మోటారుకారులో బందరు వెళ్ళారు. వేమూరి రామోజీరావు స్థాపించిన పంచమ బాలుర పాఠశాల అభినందించి జాతీయకళాశాలలో విదేశీ వస్త్ర దహనం చూసి 16 ఉదయం పామర్రు దగ్గరున్న గొల్వేపల్లి చూసి మనోహరమైన ఉపన్యాస మిచ్చారు. కైకలూరు రైల్వేస్టేషన్‌లో జరిగిన సభలో మాట్లాడి, భైరవపట్నం వడాలి వెంట్రప్రగడ మీదుగా గుడివాడ చేరారు. ఈ పర్యటనలో పట్టాభిగారు, జయప్రకాష్ నారాయణ, కస్తూరిబాయి, గొట్టిపాటి బ్రహ్మయ్య గాంధీ వెంట ఉన్నారు.

1929 డిసెంబర్ 23 మెయిల్‌లో మద్రాస్ నుంచి గాంధీ గుంటూరు చేరారు. ఉదయం స్వరాజ్య మైదానంలో బ్రహ్మాండమైన సభలో సవర్ణులు హరిజనులకు న్యాయం చేయాలని అర్థించారు. ఆచార్య రంగాతో కలిసి కారులో చేబ్రోలు మునిపల్లె, మంచాల, వెల్లటూరు, పొన్నూరు, నిడుబ్రోలు గ్రామాలు పర్యటించి ప్రసంగించారు. నిధి స్వీకరిస్తూ కాలినడకన తాళ్ళపాలెం వెళ్లి రామాశ్రమం సందర్శించారు. హరిజన సేవక సంఘం సేవలను పొందమని చెప్పి, హరిజనులు గౌరవ ప్రద జీవితం గడపాలని బోధించారు. ఇంటూరు మీదుగా కావూరు వెళ్లి గొల్లపూడి సీతారామ శాస్త్రి స్థాపించిన వినయాశ్రమాన్ని ప్రారంభించి తర్వాత గోదావరిజిల్లాకు వెళ్ళారు.

1936 మే 9 ఉదయం గాంధీ మళ్ళీ నిడుబ్రోలు వచ్చారు. అపూర్వ స్వాగతం లభించింది. జూన్ 13న మద్రాస్ నుండి గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో వార్ధా వెడుతూ సాయంత్రం 6 గంటలకు బెజవాడ స్టేషన్ చేరగా వేలాదిజనం స్వాగతం పలికారు. కపార్ట్‌మెంట్ గేట్‌లో నిలబడి తెలుగులో "డబ్బు ఇవ్వండి" అని అడిగారు గాంధీ.

తన సంతకాలను ఫోటోలకు డబ్బులు వసూలు చేసి నిధికి జమ చేశారు. 1937 జనవరి 24న మహాదేవ దేశాయ్, ప్యారీలాల్ మొదలైన వారితో కలిసి గాంధీజీ నిడుబ్రోలులో రైలు దిగి వినయాశ్రమానికి కారులో వెళ్లి, కుటీర పరిశ్రమ వస్తు ప్రదర్శన చూసి, తుఫాన్ బాధితులను పరామర్శించి, సన్మానం పొందారు. వేటపాలెం గొల్లపాలెం, తిమ్మసముద్రంలలో తుఫాన్ నష్టాన్ని ఆరాతీసి స్వచ్ఛంద సేవకులను వారికి త్వరలో సాయం అందించమని చెప్పారు. ఇంకొల్లులో స్వాగత సత్కారాలు పొంది నూతులపాడు, పరుచూరుల మీదుగా గుంటూరు వచ్చి బోర్డువారి సన్మానం పొంది చిలకలూరిపేట మీదుగా విజయవాడ, అక్కడ నుండి నేరుగా వార్ధా వెళ్ళారు.

1946 జనవరి 21న మహాత్ముడు ప్రత్యేక రైలులో ఉదయం 6 – 20 గంటలకు బెజవాడ చేరుకొన్నారు. లక్షమంది ప్రజలు ఆయనకు అపూర్వ స్వాగతం పలికారు.

డా.టి.వి.ఎస్.చలపతిరావు, అయ్యదేవర కాళేశ్వరరావు, మరుపిళ్ళ చిట్టి, పేటబాపయ్య మొదలైన హేమాహేమీలు గాంధీని కల్సి మాట్లాడారు. తెనాలి స్టేషన్‌లో స్నానం చేసి ఎడ్లపల్లి దగ్గర వేచి ఉన్న లక్షన్నర జనాన్ని బోసి నవ్వులతో పలకరించి బాపట్ల, చీరాల పట్టణాలలో ప్రజలకు దర్శనమిచ్చారు. హిందీ భాష నేర్చుకోమని దానివలన దేశ సమైక్యత సాధ్యమని చెప్పారు.

గాంధీజీ పర్యటనలో అన్ని సార్లూ ప్రజలు హృదయ పూర్వక స్వాగతం చెప్పటమే కాదు, ఆయన కోరికపై నిలువు దోపిడిగా స్త్రీలు తమ సకలాభరణాలను ఒలిచి ఇచ్చి తమ అపూర్వ దేశభక్తి నిరూపించారు. స్వరాజ్య నిధికి శాయశక్తులా విరాళాలు అందించారు. రాట్నాలు ఒడికి నూలు తీసి స్వయంగా వస్త్రాలు నేసుకొన్నారు. దేశమంతా సైన్యంలా ఆయన వెంట నడిచింది. ఆయన పిలుపుకు స్పందించి సహాయ నిరాకరణ, విదేశీ వస్త్ర బహిష్కరణ చేసింది. తాగుడు మానేసి అస్పృశ్యతను దూరం చేసుకొని, హిందూ ముస్లిం ఐక్యతతో కదం తొక్కి హిందీ భాష నేర్చి స్వాతంత్ర్యం సాధించింది. ఆంధ్రదేశంలో గాంధీ ప్రభావం అమోఘం, అద్వితీయం.

ఆధారం – శ్రీ కొడాలి ఆంజనేయులు గారు రాసిన "ఆంధ్ర ప్రదేశ్‌లో గాంధీజీ" గ్రంథం.

*చిరునామా : శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్, 13-7-16 – ఉయ్యూ 9989066375*

శ్రీ జి. వెంకటరామారావు

# కృష్ణాతీరంలో రాజకీయ పరిణామాలు

కోపల్లె హనుమంతరావు, పట్టాభిసీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు 'బందరుత్రయం'గా ప్రసిద్ధులు. స్వాతంత్ర్య పోరాటం తొలినాటి ఆంధ్రప్రదేశ్‌లో స్వరాజ్య సంరంభంలోగాని, జాతీయకళాశాల నిర్వహణలోగాని, కృష్ణాపత్రిక నిర్వహణగాని, ఆంధ్రరాష్ట్ర ఉద్యమంలోగాని వీరు ముగ్గురు సమిష్టి బాధ్యులే. ఒకే ఆలోచన, ఒకేబాట, ఒకే నడకగా వ్యవహరించి బందరు నాయకత్రయంగా ప్రతిష్టనార్జించారు.

డా॥ పట్టాబి కార్యదీక్ష, ముట్నూరి కృష్ణారావు భావుకత ఆంధ్ర జాతీయ కళాశాల స్థాపనకు విశేషంగా తోడ్పడినా, దాన్ని ప్రారంభించాలన్న సంకల్పం హనుమంతురావుదే. దానికి స్వరూప స్వభావాలను ప్రధానంగా నిర్ణయించింది కూడా ఆయనే. తక్కిన ఇద్దరిలో ఒకరు ప్రజా ఉద్యమాలకు, మరొకరు పత్రికా రంగానికి అంకితమైపోగా, జాతీయవిద్యా వ్యాప్తి ద్వారా మాతృదేశారాధనకు హనుమంతురావు కంకణధారులైనారు. తన కళాశాల తప్ప హనుమంతురావుకు మరొక ఆలోచన లేదు దాన్ని విడిచి ఆయనకు బతుకేలేదు. బందరులో జాతీయ కళాశాల 1910లో ఏర్పడింది.

ఇంతకంటే పురాతనమైన విద్యాసంస్థలు దేశంలో లేకపోలేదు. ఇంతకంటే విస్తృతమైనవి కూడా లేకపోలేదు. అయినా దీని సంస్థాపనకు ప్రేరేపించిన లక్ష్యాలు దానికొక ప్రత్యేకతనిచ్చాయి ఒక వైశిష్ట్యాన్ని కూర్చాయి. ఈ విషయంలో దానితో పోల్చదగినది పూర్వమొక సందర్భంలో శ్రీ ఆనంద కుమారస్వామి చెప్పినట్లు బోల్పూర్‌లోని విశ్వభారతి, హరిద్వార్‌లోని గురుకులాలు మాత్రమే. గాంధీజీ స్వాతంత్ర్యోద్యమంలో ప్రవేశించడానికి పదేళ్ళకు మునుపే హనుమంతురావు ఆ ఉద్యమానికి పూనుకున్నారు జాతీయకళాశాలలో హరిజనులకు ప్రవేశమిచ్చారు. వారికి ఉచిత విద్య కల్పించారు. ఆర్థిక సహాయం అందచేసారు. మద్యపాన నిషేధోద్యమంలో పాల్గొన్నారు బట్టలనేత, తివాసీలు, కంబళ్ళు, కలంకారీ అద్దకం మొదలైన చేతివృత్తులకు చేయూతనిచ్చారు. వీటివల్ల అనేకమంది విద్యార్థులకు తప బతుకు స్వయం సంపూర్ణం కావడానికి తోడ్పడింది. ఆయన గాంధీజీకి ముందే అస్పృశ్యత నివారణ, స్వదేశీ వస్తు ప్రాముఖ్యం, మద్యనిషేధానసారలను గుర్తించిన ద్రష్ట. కాని ప్రచారలేమిచే యుగ పురుషుడికాలేదు. తన నలభై రెండవ ఏట 1922 ఫిబ్రవరి 2న భౌతిక యాత్ర చాలించారు. హనుమంతరావు ఆంధ్రప్రదేశ్ పునరుజ్జీవనానికి అవతారమూర్తి.

ఇరవయ్యోశతాబ్ది ప్రథమార్ధపు ఆంధ్రచరిత్రలో గాడిచెర్ల హరిసర్వోత్తమరావుది విశిష్టస్థానం. వందేమాతరం, హోంరూల్ ఉద్యమం, సత్యాగ్రహం తదితర జాతి జాగృతోద్యమాల సందేశాన్ని పల్లెపల్లెకు తీసుకు వెళ్ళిన పత్రికా రచనలో ప్రథముడు. ప్రజలే పరమాత్మగా పనియే దైవముగా భావించే సేవా తపస్వి.

1908లో తమిళనాడులోని తిరునల్వేలి జిల్లా మెజిస్ట్రేటును పగలే ఎవరో రైల్వేస్టేషనులో కాల్చి చంపారు. చుట్టూ మూగిన అమాయక ప్రజలమీద ఒక తెల్ల పోలీసు అధికారి తుపాకి పెట్టాడు. ఇద్దరు నిర్దోషులు మరణించారు. ఈ దుశ్చర్యను ఖండిస్తూ హరిసర్వోత్తమరావు తన పత్రికలో 'అరెరె! ఫిరంగి క్రూర వ్యాఘ్రమా! ఇద్దరు భారతీయులను పొట్టన పెట్టుకుంటివిరా?' అనే సంపాదకీయం రాసి గర్జించారు. దానితో హరిసర్వోత్తమరావుకు మూడు సంవత్సరాల కఠిన కారాగార శిక్ష పడింది. ఆంధ్రదేశంలో మొదట రాజకీయ బాధితుడు ఆయనే. అదే రోజున పూనాలో లోకమాన్య బాలగంగాధర్ తిలక్‌ని బంధించి మాండలే జైలుకు తరలించారు. అది అలా కలిసి రావడంతో హరిసర్వోత్తమరావుకు 'ఆంధ్రతిలక్' అని పేరు వచ్చింది.

జైలునుంచి విడుదలై రాగానే 'ఆంధ్రపత్రిక' మొదటి సంపాదక బాధ్యతలను ఆయన స్వీకరించారు. 'ఎడిటరు' అనే పదానికి తెలుగులో సంపాదకుడు అని పెట్టింది ఆయనే. 1919లో ఆంధ్రమహాసభకు అధ్యక్షత వహించిన గాడిచెర్ల దాని చివరి సమావేశానికి కూడా ఆయనే అధ్యక్షుడు. హరిసర్వోత్తమరావు అడుగుపెట్టని సేవారంగం లేదు. గ్రామస్థాయి నుండి జాతీయస్థాయి వరకు వేలకొలది సభలలో వివిధ అంశాలపై ఉద్యమిస్తూ ప్రజలను ప్రభావితం చేశారు. ఆనాడు తెలుగు

నాట ఆయన పర్యటించని ప్రాంతం కాని, పాల్గొనని ఉద్యమం కాని లేవు. గ్రంథాలయోద్యమానికి ఆయన ప్రాణం పోశారు. ఆంధ్ర కురు వృద్ధులలో ఒకరై గాడిచెర్ల స్వాతంత్ర్యానంతరం రాజకీయాలలో ఇమడలేకపోయారు. స్వాతంత్ర్యానంతరం ఎందరో నాయకులకు ఎన్నో పదవులు లభించిన గాడిచర్ల ఏ పదవులు ఆశించక ప్రభుత్వ సహాయం పొందుతూ, ప్రజలకువ్యాసాలు రాసి, రేడియో ప్రసంగాలు చేసి వాటి ద్వారా వచ్చే పారితోషికాలతో జీవనయానం సాగించారు.

ఆంధ్రరాయకీయ రంగానికి విజయవాడ కీలకస్థానం. 1925, 1927 లలో రెండుసార్లు అయ్యదేవర కాళేశ్వరరావు బెజవాడ మునిసిపల్ చైర్మన్ పదవికి ఎన్నికయ్యారు. ఆనాడు మునిసిపాలిటీలకు కమీషనర్ పదవులులేవు. అన్నిపనులు చైర్మన్లే చూసుకోవాలి. త్రాగు నీరు, మురుగునీటి పారుదల, రోడ్లు, విద్యుద్దీపాలు మొదలైన సౌకర్యాలు బెజవాడ ప్రజలకు ఆయన హయాంలో కలిగినవి. మునిసిపల్ చైర్మన్‌గానే ఆయన జైలుకెళ్ళారు. స్వాతంత్ర్య పోరాటంలో అయ్యదేవర ఆరున్నర సంవత్సరాలు కారాగార శిక్షను అనుభవించారు. స్వాతంత్ర్య సమరంలో పిత్రార్జితంగా తమకు వచ్చిన భూమిలో వంద ఎకరాల వరకు ఖర్చుచేశారు. విజయవాడలోని రామమోహన గ్రంథాలయానికి తన సొంత డబ్బు సమకూర్చి పెట్టారు. ఆ సంగతి విన్న డా॥ పట్టాభి సంస్థలు నిర్మింప శక్తి అతనికి ఉంది. ఆయన తన డబ్బును ఖర్చు పెట్టుకోవడమేతప్ప సంపాదించి ఎరుగడు అని అన్నారు. విజయవాడ కాళేశ్వరరావుకున్న అభిమానం ఇంతింతకాదు ఆయన మాటల్లోనే, నేను విజయవాడను చేసాను, నన్ను విజయవాడ చేసింది విజయవాడ ఆంధ్రకు కేంద్రం కావడం మహాఅదృష్టం. అందుకే ఆంధ్ర అంటే విజయవాడ – విజయవాడ అంటే ఆంధ్రదేశం. కాని నేను మంచి పదవి తెచ్చుకోలేదని నా ప్రజలకు నామీద కోపం అనేవారు. విజయవాడ పట్టణాభివృద్ధికి ఆయనచేసిన సేవలకు గుర్తింపుగా,పట్టణంలోని పెద్ద మార్కెట్‌కు 'కాళేశ్వరరావు మార్కెట్' అని పేరు పెట్టారు.

తెలంగాణలో రజాకార్ల బాధలు పడలేని చాలమంది ప్రజలు పోలీసు చర్యకు ముందు విజయవాడలో తాత్కాలికంగా నివాసముంటున్న రోజుల్లో అయ్యదేవరవారికి ఆర్థిక సహాయమందించేవారు. కర్నూలులో బోర్డరు క్యాంపులు,నడుపుతున్న తెలంగాణా స్వాతంత్ర్య యోధుల యోగక్షేమాలు విచారించేవారు. మంత్రి కాలేని కాళేశ్వరరావు ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీకి మొదట స్పీకరు అయ్యారు. మన రాష్ట్రంలో ప్రజాస్వామ్య విధానం చక్కగా పనిచేయడానికి అయ్యదేవరవారు కృషి అపారం, విభిన్న పక్షాలకు చెందిన మూడువందలమంది శాసన సభ్యులు,అందులో పాలకవర్గమైన, ప్రతిపక్షమైనా, ఏపక్షమైన పక్షపాతం చూపించకుండా శాసనసభలో నిజమైన ప్రజావేదికగా కొనసాగించిన ఘనత ఆయనది. సభా నిబంధనలను ఏనాడు అతిక్రమించనీయలేదు.

1921 మార్చి 31, ఏప్రిల్1వ తేదీలు అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశం బెజవాడలో జరిగింది. ఆ సమావేశంలో పాల్గొన డానికి నాయకులంతా బెజవాడ వచ్చారు. మహాత్మా కూడా వచ్చారు. అదీ కాంగ్రెస్ మహాసభ కాదు. కమిటీ సమావేశం మాత్రమే. కాంగ్రెస్ మహాసభకి కూడా అంతమంది జనం రాలేదు. రాష్ట్రం నలుమూలల నుంచి పిల్లలు, పెద్దలు, రైళ్ళమీద, కార్లమీద, బండ్లమీద, కాలినడకన బెజవాడ చేరుకున్నారు. కొన్ని లక్షలమంది పుష్కరస్నానానికి కూడా అంతమంది రాలేదు. అప్పుడు బెజవాడ చిన్న నగరం. నగరం పొడుగునా పందిళ్ళు వేసి, తోరణాలు కట్టి, అలికి ముగ్గులు పెట్టి పండుగలా చేసుకున్నారు. మహాత్మునికి మంగళ హారతులిచ్చారు. నేల ఈనినట్లు తండోపతండాలుగా విరుచుకుపడ్డ జనసమూహాలు కరిగి నీరై ప్రవహించినట్లు తరంగాలుగా గాంధీదర్శనం కోసం వూరు మీద పడ్డారు. ఆ జనాన్ని పోలీసు కంట్రోల్ చేయలేకపోయింది. సభ జరగాలంటే మొదట ప్రజలని ఒక కంట్రోల్‌లో ఉంచాలి. అప్పుడు దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారిని పిలిపించారు. అప్పుడు ఆయన 500 మంది రామదండుతో చీరాల పేరాల నుంచి స్పెషల్ రైలులో దిగారు. అందరూ రక్తాంబరధారులు. దండధరులు. 'శ్రీమద్రామారమణ గోవిందో హరి' అని ఆయన, ఆయన స్వచ్ఛంద భటులు జనాన్ని సర్ది, బారులు తీర్చి, బాటలు కల్పించి, అపాయం లేకుండా జనాన్ని కాపాడి ఆమందిని ఒక తీరూ, తెన్నూకు తీసుకువచ్చారు. మహాత్ముని బహిరంగసభ ఏర్పాట్లు సరిగా జరిగినవి. ఆ బెజవాడ సభలోనే పింగళి వెంకయ్య రూపొందించిన త్రివర్ణ పతాకాన్ని గాంధీజీ ఆమోదించారు. బెజవాడ కార్యసంఘం సమావేశానికి వచ్చిన అతిథులకు సకల సౌకర్యాలు చాలా సంతృప్తి ప్రకారం జరిపి ఆంధ్రుల ఆతిథ్యాన్ని మిగతా రాష్ట్రాలవారు ప్రశంసించే తీరున వ్యవహరించిన బెజవాడ, కృష్ణాజిల్లా పేరులకు ప్రధాన నాయకత్వం వహించిన పూజ్యులు అయ్యదేవర కాళేశ్వరరావు, అద్దేపల్లి వెంకట గురునాథ రామశేషయ్య శ్రేష్టిగారలు చిరస్మరణీయులు.

## చీరాల - పేరాల ఉద్యమం

1916లో గుంటూరు జిల్లాలో ప్లేగు వచ్చింది. చీరాల పేరాల కూడా ఈ రుగ్మతతో బాధపడింది. అపరిశుభ్రత వల్ల ఈ జాడ్యం వచ్చింది. చీరాల–పేరాల ను ఒక మునిసిపాలిటిగా చేసి పన్నులు విధించి పరిశుభ్ర కార్యక్రమాలను చేపట్టాలనుకుంది ప్రభుత్వం. ప్రాచీన భారత సంప్రదాయానికి విరుద్ధంగా ఆంగ్లేయ పద్ధతిలో జరుగుతున్న నవనిర్మాణం తమకక్కర లేదన్నారు ప్రజలు. దానికి యువకుడైన దుగ్గిరాల గోపాలకృష్ణయ్య నాయకత్వం వహివచారు. చీరాల మునిసిపాలిటీకి వ్యతిరేకంగా 1920 సెప్టెంబరులో కౌన్సిలర్ల చేత గోపాల కృష్ణయ్య రాజీనామా చేయించారు. జైలు, జరిమానాలు, అగౌరవం,

అప్రతిష్ట అనే భయం పోగొట్టి దేశ సేవలో నూతనోత్తేజం రేకెత్తించిన మహానుభావుడు దుగ్గిరాల. రామదండును తయారుచేశారు. తరతరాల నుండి కాపురముంటున్న ఇండ్లు, వాకిళ్ళూ వదలిపెట్టి, ఇసుక దిబ్బలపై తాటియాకుల కుటీరాలను నిర్మించుకుని కాపురముండి ప్రభుత్వాన్ని ధిక్కరించే ధైర్యం ఆనాటి ప్రజలకు కలిగిందంటే దానికి కూడా గోపాలకృష్ణయ్య అలా వెళ్ళిపోయినవారు ఒకరుకాదు, ఇద్దరు కాదు. 20 వేల మంది ఒకమాసం కాదు, రెండు మాసాలు కావు. పదకొండునెలలు. చీరాల - పేరాల పోరాటం ఆయనకు ఆంధ్ర దేశానికి ఎనలేని కీర్తి తెచ్చింది.

1920లో కాంగ్రెస్‌లో గాంధీయుగం ప్రారంభమైంది. ఆ సంవత్సరం సెప్టెంబరులో కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ సమావేశంలో గాంధీజీ ప్రవేశపెట్టిన సహాయ నిరాకరణోద్యమ తీర్మానం నెగ్గింది. దీన్ని బలపరచిన వారిలో గోపాలకృష్ణయ్య ఒకరు. ఎడింబరులో ఎం.ఎ. అనర్సు పూర్తి చేసుకొని ఇండియాకి రాగానే మరి ఎందుకలా మార్పు వచ్చిందో ఖచ్చితంగా తెలియదు కానీ, శుద్ధ సాత్వికమైన సన్యాసిగా రూపం మారిపోయింది. పెరిగిన గడ్డ, రూపాయంత కుంకుమ బొట్టు, భుజాన జోలి, చేత చిరుతాలు మరొకప్పుడు కర్ర పట్టుకొని రామభజన చేస్తూ తిరిగేవారు. తన బలగానికి 'రామదండు' అని ముద్దుపేరు పెట్టుకున్నారు. రామదండుతో ఆయన ఎక్కడకు పడితే అక్కడికి వెళ్ళేవారు గోపాలకృష్ణయ్య ఆంధ్రరత్న. ఆయన అనర్గళ వాగ్ధాటికి తడసి తనయుని వారు ఆరోజుల్లో గుంటూరు సీమలో లేరు. మధ్య వయస్సులో 39వ ఏట బీదరికంతో, క్షయ వ్యాధితో గుంటూరులో మరణించారు. గోపాలకృష్ణయ్య ఆంధ్రుల ఉద్రేక స్వభావానికి ప్రతినిధి.

ఆంధ్ర, కృష్ణా పత్రికలు రెండు. ఆనాడు తెలుగు ప్రజలకు దేశభక్తి, జాతీయాభిమానాన్ని రగుకొలిపాయి. తెలుగు భాషను తీర్చిదిద్దాయి. తెలుగు ప్రజల భావ సమైక్యతకు, ఆంధ్రోద్యమానికి చేయూత ఇవ్వడంలో చరిత్రాత్మకమైన పాత్ర నిర్వహించాయి. దేశశ్రేయస్సు ప్రజల శ్రేయస్సు తప్ప ఇతర సంకుచిత స్వార్థ ప్రయోజనాలు, లాభాపేక్ష పత్రికలు లక్ష్యం కారాదని యీ పత్రికాధిపతులిద్దరు తమ ఆచరణ ద్వారా నిరూపించారు. అదే సందేశాన్ని 1929 సెప్టెంబరు 7,8 తేదీలలో బెజవాడ దుర్గాకళామందిరంలో తెలుగు ప్రజలు తమకు జరిపిన అఖండ సన్మానికి సందర్భంగా కూడా చెప్పారు. పత్రికా రచనకు అత్యున్నత ఆదర్శాలను అత్యుత్తమ ప్రణాళికలను నెలకొల్పిన ఆ మహాకవులు ఆంధ్రపత్రిక సంపాదకులు కాశీనాథుని నాగేశ్వరరావు, కృష్ణపత్రిక సంపాదకులు ముట్నూరి కృష్ణారావు.

1908లో కాశీనాథుని నాగేశ్వరరావు స్థాపించిన ఆంధ్రపత్రిక అసాధారణ జనాదరణ పొందింది. ఆంధ్రదేశంలో వాడవాడలో వెళ్ళింది. ఎక్కడెక్కడో ఉన్న ఆంధ్రులందరి అభిమానాన్ని సంపాదించుకుంది. ఆంధ్రుల అభిమాన పత్రిక అయింది. ఆంధ్రభాష వ్యాప్తి, ఆంధ్రరాష్ట్ర స్థాపన ధ్యేయంగా నాగేశ్వరారవు గారి జీవితం సాగింది. ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి మాటల్లో చెప్పాలంటే పంతులు గారు ఆంధ్రోద్యమానికి తండ్రికాదు ఆ ఉద్యమానికి వాని తల్లి వంటివారు. ఆంధ్రరాష్ట్రం ఆంధ్ర విశ్వవిద్యాలయం, ఆంధ్రభాషాభివృద్ధి, ఆంధ్ర సంస్కృతి - ఇవి ఆంధ్రోద్యమానికి ముఖ్యశాఖలు. ఈ ఉద్యమంలోని అన్ని దశలలో పంతులుగారిదే ప్రథమస్థానం. పంతులు గారిపై మహాత్మాగాంధీ ప్రభావం ఎంతగానో ఉండేది. 1937లో మహాత్ముడు ఆంధ్రదేశ పర్యటన కొచ్చినపుడు పంతులుగారే స్వగ్రామమైన ఎలకుర్రు కొచ్చి ఆయన ఆతిథ్యాన్ని స్వీకరించారు. ఆయన నిర్మించిన హరిజన పల్లెను చూసి ముచ్చట పడ్డారు. దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ బిరుదులు పొందిన నాగేశ్వరరావు పంతులు గారు ఇటువంటి మహానుభావుడు మనుషుల్లో సాధారణంగా దొరకరు. సహాయ నిరాకరణోద్యమం మొదలుకొని కాంగ్రెస్ పదవులచేపట్టే వరకు ఆంధ్రదేశంలో దేశోద్ధారకుని సలహా, సహాయం పొందని ఏ పని జరుగలేదు.

ఆంధ్రనాయకులు దేశభక్త కొండా వెంకటప్పయ్య గారిది విశిష్ట స్థానం. ఆయన గాంధీజీ ఉపసేనానులలో తొలి జట్టుకు చెందిన నాయకుడు. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి తొలికేక వేసింది కూడా ఆయనే. ఆంధ్ర ఖద్దరుకి యావద్భారత దేశంలో పేరు రావడానికి ఆయన కృషే ప్రధాన కారణం. కాంగ్రెస్ అధ్యక్షులుగా దేశబంధు చిత్తరంజన్‌దాస్ పార్టీ వివాదాల మధ్య తమ పదవికి రాజీనామా చేయగా మధ్యేమార్గంగా కొండా వెంకటప్పయ్యను అఖిల భారత కాంగ్రెస్ కమిటీ, అధ్యక్షులుగా ఎన్నుకొన్నారు. స్వల్పకాలమే అయినా అఖిల భారత కాంగ్రెస్ కమిటీ కార్యాలయాన్ని వెంకటప్పయ్యగారు బెజవాడ తరలించారు. ఇది ఆంధ్రరాజకీయ చరిత్రలో సువర్ణఘట్టం.

ఆచార్యరంగా ఆంధ్రరాష్ట్రంలో రైతు ఉద్యమ నిర్మాత. 1937లోనే ఆయన కాంగ్రెస్ శాసనసభ్యుడు, కాంగ్రెస్‌ను నిరంతరం దుయ్యబడుతూనేకాంగ్రెస్‌లోని స్థానం కోసం పోరాడేవాడు రంగా. ఈ రోజుల్లో కమ్యూనిస్టులం, సోషలిస్టులం అని చెప్పుకునే వారి చేసే పనులు ఆ రోజుల్లో రంగా చేసేవారు. ఆంధ్రదేశంలో అతివాద కాంగ్రెసేతరులు చాలామంది రంగా శిష్యులే. ఖాసా సుబ్బారావు అన్నట్టు ఆయనకు మొదటి స్థానం రాదు. రెండోస్థానం అంగీకరించరు. కనుక మొదటి స్థానం కోసం పోరాడుతున్న పట్టాభి, ప్రకాశం ల మధ్య విభేదాలు పెంచేవారు.

రంగాగారు ప్రకాశంగారి వలె రాష్ట్రనాయకత్వం ఆశించారు పట్టాభి గారి వలె అఖిల భారత నాయకత్వం అభిలషించారు. ఇతన్ని చూస్తే ఆయన అటు కేంద్ర మంత్రి పదవినో, రాష్ట్రంలో ముఖ్యమంత్రి

పదవినో అలంకరించవలసినవారు. కాని వాటిలో ఏ ఒకటి జరుగ లేదు. వాస్తవంలో ఆయనకు కాంగ్రెస్‌లో పట్టుచిక్కలేదు. బహిః ప్రచారం తప్ప అంతర్బలం లేదు. ఆచార్యరంగా ఏనాడూ ఆంధ్ర శాసనసభ్యుడు కాదు.

1934లో రంగాజీ నిడుబ్రోలులో రైతాంగ విద్యాలయం స్థాపించారు. దీనికి మహాత్మాగాంధీ ప్రారంభోత్సవం జరిపారు. భారత దేశంలో అదే మొదట రాజకీయ పాఠశాల. నేటి మితవాదులు, అతి వాదులు, మధ్యేవాద పార్టీల నాయకులలో ఎక్కువమంది ఈ పాఠ శాలలో శిక్షణ పొందినవారే. మహాత్మాగాంధీ రాకతో జాతీయోద్యమం ఎన్ని మలుపులు జరిగిందో ఆచార్యరంగా రాకతో కర్షకోద్యమం అన్ని మలుపులు తిరిగింది. రైతులోకానికి ఆయన సజీవుడు సారథి.

మొదట సార్వత్రిక ఎన్నికలకు ముందే కాంగ్రెస్ చీలింది. ఆచార్య రంగా కృషిక్ లోక్‌పార్టీ (కె.ఎల్.పి) పెట్టుకున్నారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో కాంగ్రెస్‌కు మెజారిటీ రాలేదు. కె.ఎల్.పి. మద్దతుతో రాజాజీ సారధ్యంలో కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడింది. నెహ్రూతో విభేదించి రాజాజీ స్వతంత్ర పార్టీ స్థాపించినపుడు రంగాజీ ఆ పార్టీ జాతీయ అధ్యక్షుడు పార్లమెంటులో ప్రతిపక్షనేత. 'కానని వాని నూతగొని కాననివాడు విశిష్ట వస్తువుల్ కానని భంగి' కృషిక్ లోక్ పార్టీ వారి రాజకీయాలు ఓ మోస్తరులో సాగాయి.

అది అదృష్టమనండి. దురదృష్టమనండి ఆంధ్రలోని నాయకులకు ఆరంభం నుంచి వ్యక్తిగతమైన భేషజాలు ఎక్కువగా వుంటూ వచ్చాయి. ఏ సమయంలోను ఎవరు రాజీ పడడమనేది ఎరుగరు. అపజయాలకు జంకరు. చిత్తశుద్ధికి లోపం రానివ్వరు. ఏదో ఒక విధంగా ప్రజలని తమ మార్గాన కొనిపోవడానికి ప్రయత్నిస్తారు. అవసరమైతే మాతృ సంస్థలను కూడా ధిక్కరిస్తారు. కాంగ్రెస్ చరిత్ర నుంచి తెలుగుదేశం పార్టీ రాజకీయాల వరకు జరుగుతున్న వ్యవహారమే నిదర్శనం.

కురుక్షేత్రం లాంటి జీవిత క్షేత్రంలో తను నమ్మిన ఆదర్శాల కోసం ఎడతెగని పోరాటం సాగించి, సుఖంలో, దుఃఖంలో జయాపజయాల్లో ఎన్నడూ ఎత్తిన తల దించకుండా, వేసిన అడుగులు తీయకుండా బతికినన్నాళ్ళు కర్మయోగిలా బతికిన మహాపురుషుడు. ఆంధ్రుల ఏకైక నాయకుడు ఆంధ్రకేసరి ప్రకాశం.

1928 సం॥లో సైమన్ కమీషన్ భారతదేశానికి వచ్చింది. కాంగ్రెస్ యీ సంఘాన్ని బహిష్కరించింది. ఈ కమీషన్ మద్రాసు వచ్చినపుడు తమిళనాయకులు తప్పుకున్నారు. బాధ్యతంతా ఆంధ్ర నాయకులు మోయవలసివచ్చింది. ఆంధ్రకాంగ్రెస్ సభ్యులంతా మద్రాసు చేరి ఊరేగింపులో పాల్గొన్నారు నల్లజెండాలతో, 'సైమన్ గోబ్యాక్' అనే నినాదాలతో అయ్యదేవర కాళేశ్వరరావు వంటి నాయకులతో సహా ఒక ఊరేగింపు సెంట్రల్ స్టేషను మీద నుంచి నేపియర్ పార్క్ దాకా వెళ్ళింది పచ్చయప్ప కళాశాల వద్ద తెల్ల సైనికులు వీరిని అడ్డుకున్నారు. ఈ ఊరేగింపును చూడడానికి వేలకి వేల ప్రజలు సెంట్రల్ మొదలు హైకోర్టు దాకా మహాసముద్రంలాగా వ్యాపించి క్రిక్కిరిసి పోయారు. ఆ గందరగోళంలో సైనికులు తుపాకులు పేల్చారు. మందిలో ఒకడు మరణించాడు ఇద్దరికి గాయాలు తగిలినవి. ఆ దురంతం జరిగిన తక్షణమే ఎటువైపునుంచో ఆంధ్రకేసరి ప్రకాశం ఝుంఝూమారుతాలాగా మరో పెద్ద ఊరేగింపులో వచ్చేశాడు. తుపాకి కాల్చిన చప్పుడు ఆయన విన్నాడు ప్రజల హాహాకారాలు విన్నాడు సైనికుల గద్దింపు విన్నాడు మంది భీతహం చూసాడు. రేగిన క్రాపు జుట్టుతో, చేతిలో నల్లజెండాతో, పసుపు పచ్చని గండభేరుండంచు ఖద్దరు ఉత్తరీయం గాలిలో నెగురుతూ భీకర మూర్తి ప్రకాశం గర్జించాడు. సైనికులు అడ్డు తగిలి ముందుకు పోరాదన్నారు. ఆ చనిపోయిన వ్యక్తిని, గాయాలు తగిలిన వ్యక్తులను నేను చూడాలి. పోనియ్యండి అన్నాడు. పోనియ్యం అన్నారు సైనికులు ఎట్లా పోనియ్యరో చూస్తా అని ముందుకురికినాడు ప్రకాశం. 'కాలుస్తాం, జాగ్రత్త' అన్నారు సైనికులు. 'కాల్చండి చూద్దాం' అని చొక్కా విప్పి ఛాతీ చూపించాడు ప్రకాశం. ఒక తెల్లసైనికుడు తుపాకి ఆంధ్రకేసరి గుండెకు సరిగా గురిపెట్టాడు మరో క్షణానికి ప్రకాశం ఉండేవాడు కాదు. ప్రకాశం పోతే ఆనాడు మద్రాసు నగరం ఉండేది కాదు. ఎక్కణ్ణించో చూసినాడు స్మాలర్ అనే పోలీసు అధికారి. వెంటనే పరుగెత్తుకుంటూ వచ్చి సైనికుడికి ప్రకాశం మధ్య నుంచున్నాడు. 'ఎవరనుకున్నావ్? కేంద్రశాసన సభలో కాంగ్రెస్ పార్టీ ఉపన్యాసకులు సుమా. కొంపముంచేద్దువు అని సైనికుణ్ణి వారించాడు. 'నన్నెవరు ఆపలేరీవేళ' అని ప్రళయ కాలాగ్నిలాగా ముందుకు సాగిపోయాడు ప్రకాశం ఆంధ్రకేసరి.

1946లో జరిగిన ఎన్నికల్లో కాంగ్రెస్‌కు అఖండ మెజారిటీ లభించింది. రాజాజీయో, పట్టాభియో ముఖ్యమంత్రి కావాలన్న అభిప్రాయంతో గాంధీజీ ఉండేవారు కాని అందుకు తమ తమిళులు అంగీకరించలేదు. అధిష్టానవర్గం అభిమతానికి విరుద్ధంగా ప్రకాశం రంగంలోకి దిగాలి, 13 ఓట్ల మెజారిటీతో, ముత్తురంగ మొదలియార్‌ని ఓడించి ప్రకాశం ముఖ్యమంత్రి అయ్యారు. ఆంధ్రకేసరి మంత్రివర్గం 12 నెలలు మాత్రమే పనిచేసింది. 1947 మార్చిలో ప్రకాశం మంత్రివర్గం పడిపోయింది. తమిళులతో పాటు పట్టాభివర్గం నుంచి మద్దతు లభించక పోవడంతో ప్రకాశం ఓటమికి కారణమైంది. అధిష్టానవర్గం ఇష్టాయిష్టాల ప్రకారం నడవని ప్రభుత్వాలను పడగొట్టడం మనదేశంలో ప్రకాశం మంత్రివర్గం తోనే ప్రారంభమైంది.

1953 అక్టోబరు 1వ తేదీన ప్రధాని నెహ్రూ ఆంధ్రరాష్ట్రానికి ప్రారంభోత్సవం చేసారు. ప్రకాశం ముఖ్యమంత్రి, పార్టీ నాయకుడు నీలం సంజీవరెడ్డి, పార్లమెంటరీ పార్టీ చరిత్రలో పార్టీ నాయకుడు

కాకుండా ముఖ్యమంత్రిగా ఉన్న వ్యక్తి ఒక ప్రకాశమే. తెన్నేటి ప్రజాపార్టీ వీడలేదు. కనుక మొదట ఆంధ్రప్రభుత్వం మిశ్రమ ప్రభుత్వమే. మంత్రివర్గంలో గౌతులచ్చన్నను తీసుకోవడంతో ఇప్పుడు ప్రభుత్వం మూడు పార్టీల మిశ్రమం అయింది. మంత్రివర్గ సభ్యులలో నలుగురు రాయలసీమవారే.

ఈ నూతన ప్రయోగం ఎంతవరకు ఫలించిందంటే మొదటి అడుగులోనే హంసపాదుగా అన్నట్లు మొదట్లోనే గవర్నరు పాలన కాకుండా తాత్కాలికంగా దాన్ని నివారించకలిగింది. తెగతెంపులు కోసం ఎదురుచూస్తుండగానే మద్యనిషేధం విషయమై ప్రభుత్వం శొంఠి రామమూర్తి సంఘం నియమించగా అది నిషేధం రద్దుచేయ వలసిందిగా సూచించించింది. ఆ సూచనను అమలు పరచనందుకు ప్రభుత్వంపై అవిశ్వాసతీర్మానం ప్రవేశపెట్టాడు లచ్చన్న. మంత్రివర్గం పై కన్వెర్గా ఉన్న కాంగ్రెస్ సభ్యులు నాయకంట శంకర రెడ్డి, అడుసుమిల్లి సుబ్రహ్మణ్యం వ్యతిరేకంగా ఓటుచేసారు. ఒకే ఒక ఓటుతో ప్రథమాంధ్ర మంత్రివర్గం పతనమైంది. ప్రతిపక్షం బలం వల్లగాని, నలుగురు స్వపక్షీయులు వెన్నుపోటు వల్ల ప్రకాశం మంత్రివర్గం పడి పోయింది. కాని రాజీనామా చేయవలసిందని తమిళులు పట్టు పట్టలేదు. తెలుగు వారికి మంత్రివర్గాలను పడగొట్టడంలో వున్ననేర్పు నిలబెట్టుకోవడంలో లేదు. 1954 నవంబరు 6వ తేదీన ప్రకాశం మంత్రివర్గం పతనమైంది మొత్తంమీద అందరూ కలసి ఆంధ్ర రాష్ట్రానికి గవర్నరు పాలన తెచ్చారు. పద్నాలుగున్నర మాసాలు రాష్ట్రం రాష్ట్రపతి పాలనలో ఉంది.

ప్రకాశం గారిలో కొన్ని లోపాలున్న ఆయన గొప్పతనానికి అవి అడ్డు రాలేకపోయాయి. వ్యక్తిగత త్యాగాలతో ఆయనతో పోల్చదగిన వారు శ్రీ చిత్తరంజన్‌దాస్ ఒక్కరే. ధైర్యంలో ఆయనను స్వామి శ్రద్ధా నందతో పోల్చవచ్చు. సంఘర్షణలలో, పోరాటాలలో తలవంచని ప్రకాశం సుభాష్‌చంద్రబోస్‌కు దీటైనవాడు. ఆయన సింహహృదయుడు. ఉత్తుంగ శృంగాలని చేరికోగల వ్యక్తిత్వం ఆయనది. అవిధంగా ప్రకాశం ఆంధ్రరాష్ట్ర మొదటి ముఖ్యమంత్రి కావటం అనివార్య విష యమే. దాదాపు నలభై సంవత్సరాల కాలం ఆంధ్రదేశంలో పోటీ లేనివాడు వెలుగొందాడు. కాంగ్రెస్ సంస్థను గజగజలాడించిన వీరుడిగా ఆంధ్ర ప్రజల మనసులలో శాశ్వత స్థానాన్ని పొందగలిగాడు ప్రకాశం.

కందుకూరి వీరేశలింగానికి సన్నిహితుడై, ఆయన తర్వాత అంత ఖ్యాతిని పొందిన వ్యక్తి రఘుపతి వెంకటరత్నం నాయుడు. నాయుడు గారుగా పదిమందికి పరిచయమైన, ఆయన ఆంధ్రదేశంలో సాంఘిక సమానత్వానికి, ఉదారభావాలకూ దారిచూపాడు. వెంకటరత్నం నాయుడు ఇంగ్లీషులో మహా పండితుడు. విక్టోరియా రాణి కాలానికి చెందిన గొప్ప వక్తల కోవకు చెందినవాడు. లలిత పదజాలంతో శ్రోతలను ముగ్ధులను చేసేవాడు. ఆకారంలోను, ఉపన్యాస పఠనం లోను, మానవతా దృక్పథంతో డాక్టర్ జాన్సన్‌ను గుర్తుకు తెచ్చేవాడు. విద్యావేత్తగా, సాంఘిక సంస్కర్తగా జీవితమంతా కృషి చేసి మద్రాసు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్ష పదవిని పొందగలిగాడు కొంతకాలం మద్రాసు రాష్ట్ర విధాన పరిషత్తు సభ్యుడుగా కూడా పనిచేశాడు. సాంఘిక సేవకు అంకితమైన జీవితం ఆయనది తన ఉపన్యాస చతురతలోనూ, తన వ్యక్తిగత ఉదాహరణలతోను, తనతరం ప్రజల నైతిక విలువలను పెంచిన వ్యక్తిగా ఆయన తన పేరును చరిత్రలో శాశ్వతం చేసు కున్నాడు. ఆరోజులలో ఆంధ్రదేశంలో నాయుడుగారి శిష్యులమని చెప్పుకోవడమే ఎంతవారికైనా గొప్పే. పిఠాపురం కళాశాలతో తనకున్న సాన్నిహిత్యాన్ని గూర్చి చెబుతూ నాయుడుగారు 'నాహృదయాన్ని అంగలం చీల్చిచూడండి, అక్కడ మీకు పిఠాపురం రాజ్ కళాశాల కన్పిస్తుంద'నేవారు.

రాజకీయాలలో గొట్టిపాటి బ్రహ్మయ్యగారికి అనుచరులు లేరు. ఉన్నవారంతా సహచరులే. సమానులు సైతం ఆయనను అగ్రజుడుగా గౌరవించేవారు. అదేమిటో గాని, ఏ పదవి ఖాళీ అయినా బ్రహ్మయ్య పేరు మొదట వినిపించేది కాని అది మరొకరి హస్తగతమవుతుంటే ఆయనలో ఎటువంటి ఆవేదన కనిపించేది కాదు. ఆయన మనసు తెలిసిన మిత్రులు 'మీది వశిష్ఠుల వారి స్థానం' అంటే బ్రహ్మయ్యగారు కూడ గర్వపడేవారు. ఒకసారి గుంటూరులో ఆంధ్రరత్న భవన్‌లో ప్రకాశం పంతులు బసచేస్తున్నరన్న సంగతి విని బ్రహ్మయ్య అటువెళ్ళి పంతులుగారి దర్శనం చేసుకున్నారు. 'ఏమి బ్రహ్మయ్యా! ఆ పాత మండువా భవంతిలోనే ఉంటున్నావా? ఏమైనా డాబా కట్టించవా! అని పంతులుగారు ఆప్యాయంగా అడిగితే అందుకు బ్రహ్మయ్య – 'బ్రహ్మయ్యలోను, మార్పు లేదు, బ్రహ్మయ్య యింటిలోను మార్పులేద'ని అనగానే పంతులుగారి కళ్ళు చెమ్మగిల్లాయి. మర్యాద చేసి మర్యాద పొందడంలో ఆయనకు ఆయనే సాటి దానికి కారణం బ్రహ్మయ్య అందరికి అన్నగారు కావడమే.

స్వాతంత్ర్య సంగ్రామం నుంచి ఆంధ్రోద్యమం వరకూ, సంఘ సంస్కరణోద్యమం నుంచి శాసన ధిక్కారం వరకు, వయోజన విద్యా వ్యాప్తి నుంచి గ్రంథాలయోద్యమం వరకు ఎనలేని కృషి చేసి, ఆంధ్రజాతికి అంకితమైపోయిన వావిలాల గోపాలకృష్ణయ్య కేవలం ఒక మనిషి మాత్రమే కాదు, కొన్ని ఆశయాల సముదాయం వ్యక్తి మాత్రమే కాదు ఒక సంస్థ. రెండు దశాబ్దాల పాటు అసెంబ్లీలో ప్రతిపక్ష నాయకుడుగా ఉన్న వావిలాల ఏ విషయం మాట్లాడిన శాసనసభ శ్రద్ధగా వినేది. పార్టీలోనూ లేకపోయినా, ధనమూ, కార్యకర్తలు లేకుండా, ఒక వ్యక్తిగా దేశసేవ చేయడం సాధ్యమేనని నిరూపించిన ప్రముఖ రాజకీయ వేత్త వావిలాల గోపాలకృష్ణయ్య.

సంయుక్త మద్రాసు రాష్ట్రంలో శ్రీ పూసపాటి కుమారస్వామి రాజా ముఖ్యమంత్రిగా ఉన్న రోజులు, అక్టోబరు 1949 విజయవాడ మునిసిపల్ హైస్కూల్ ఆవరణలో చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు తొలి ఆస్థానకవిగా పదవీ స్వీకారం చేసే కార్యక్రమం ఏర్పాటైంది. కట్టమంచి రామలింగారెడ్డి గారు సభకు అధ్యక్షులు. అచ్చమైన తెలుగు దుస్తులు ధరించి సభకు వచ్చారు ముఖ్యమంత్రి. చెళ్ళపిళ్ళవారి ఆరోగ్యం బొత్తిగా బాగాలేదు. కుర్చీలో కూర్చోబెట్టి, నలుగురు ఎత్తుకుని వచ్చి వారిని వేదికపై ఆసీనులనుచేశారు. వేటూరి ప్రభాకరశాస్త్రి, విశ్వనాథ సత్య నారాయణ, వేటూరి శివరామశాస్త్రి, పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వేంకటేశ్వరరావు వంటి దిగ్గజాలు చెళ్ళపిళ్ళ వారి శిష్యులు. వారంతా ఆనాటి సభలో ఉన్నారు. వేలాది జనంతో ఆవరణ క్రిక్కిరిసి పోయింది. తెలంగాణా నుంచి బూర్గుల రామకృష్ణారావు, కాళోజీ నారాయణ రావు, వావిలాల హనుమంతురావు, దేవులపల్లి రామానుజరావు, దాశరథి ఎందరెందరో వచ్చారు.

చాలా వైభవంగా జరిగింది సభ. విశ్వనాథవారు ఎందుకో కొంచెం అలిగారు ఆరోజున, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మైకులో విశ్వనాథ వారికి ఉద్దేశించి 'రా! నాయనా! మన గురువుగారి సన్మాన మహోత్సవం నీవు వేదిక మీదికి రాకుంటే జరుగదు' అన్నారు. వెంటనే విశ్వనాథ వారు వేదిక మీదకి వచ్చారు. మద్రాసు రాష్ట్రంలో కొంతా, హైదరాబాద్ రాష్ట్రంలో కొంత తెలుగు ప్రాంతం విడివిడిగా ఉన్న తెలుగు రచయితల హృదయాలు యేకంగా ఉన్నాయి.

ఆంధ్రులలో భావ విప్లవానికి దోహదం చేసి ఆధునిక హేతు వాదాన్ని ఆరంభించిన త్రిపురనేని రామస్వామి చౌదరి కులాధికారాలను కూల్చివేయటానికి ఉద్యమించిన విప్లవకవి అంగలూరు, బందురు, గుడివాడలలో విద్యాభ్యాసం చేసి లండన్‌లో బారిస్టరు పట్టాపొందారు. మునిసిపల్ చైర్మన్‌గా తెనాలి ప్రజలకు సేవ చేశారు. నాటి కవులకు, విమర్శకులకు, పండితులకు, న్యాయవాదులకు మరెందరో ప్రముఖు లకు ఆయన ఇల్లు ఒక సమాలోచన కేంద్రంగా ఉండేది. మతం పేరిట జరుగుతున్న అన్యాయాలను, 'దూర్త మానవ శతకం' లో విశదీకరించారు. 1929లో విజయవాడలో జరిగిన ఆంధ్రమహాసభ ఆయనకు 'కవిరాజు' బిరుదాన్ని యిచ్చి గౌరవించింది.

జాతీయోద్యమకాలంలో ఎం. చలపతి, ఖాసా సుబ్బారావు, కోటం రాజు రామారావు, కందూరి ఈశ్వరదత్తు వంటి తెలుగువారు భార తీయ పత్రికా రంగంలో, అందులోను ఆంగ్ల భాష పత్రికల్లో సమున్నత పాత్ర నిర్వహించేవారు. స్వాతంత్ర్యానంతరం వారి వారసత్వాన్ని 'ది ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా' ప్రప్రథమ భారతీయ సంపాదకుని హోదాలో పద్మశ్రీ ఎ.వి.రామన్ దిగ్విజయంగా కొనసాగించారు. ఆయన అసలు పేరు అవధానం సీతారామయ్య.

## కర్నూలు రాజధాని / శ్రీశైలం

ఆంధ్రరాష్ట్ర ప్రథమ గవర్నరు చందూలాల్ మాధవ్‌లాల్ త్రివేది ఆంధ్ర రాష్ట్రవ్యవహారాల ప్రత్యేకాధికారిగా ఉన్నప్పుడు మద్రాసు వచ్చిన కొద్ది రోజులలోనే ఆయన ప్రతిభ ప్రజల దాకా వచ్చింది. అందుకు కారణం విధ్యుక్త ధర్మ నిర్వహణ పట్ల ఆయనకున్న గౌరవభావమే.

ఒక ప్రభుత్వ ఇంజనీరును పిలిచి 'మీరు కర్నూలుకు వెంటనే వెళ్ళి అక్కడ ప్రధాన వీధులన్నిటిలోను రోడ్లకి తారు వేయించండి' అన్నారు త్రివేది. ఆ ఇంజనీరు ఉన్న వ్యవధి చాలా తక్కువని అందు లోను పనిజరిగే పగటిపూటలు చాలా కొద్దిగానే ఉన్నాయని విచారం వెలిబుచ్చారు. త్రివేదిగారు వెంటనే అందుకుని 'రాత్రులంతా ఏం చేస్తారు? పని కానివ్వండి' అన్నారు. పని నిర్విరామంగా సాగింది. రాష్ట్ర రాజధాని కాగలిగిన పట్టణంలోకి రోడ్లకి కావలసిన కళ కొంతలో కొంత వచ్చిందంటే అది త్రివేదిగారి చలువే. ఆంధ్ర రాష్ట్రానికి కర్నూలు రాజధానిగా ఖర్గారైంది.

తెలుగు దేశం పటం చూస్తే కేంద్రంగా శ్రీశైలం గోచరిస్తుంది. కోస్తా జిల్లాల స్మార్తులు సంకల్పంలో శ్రీశైల ఈశాన్యప్రదేశ్ చెప్పు కుంటారు. కోస్తా జిల్లాల తను వున్న స్థలం శ్రీశైల పరంగా నిర్ణ యించుకోవలసిన అవసరం ఆంధ్రచరిత్రలో ఏ మత, రాజకీయ విప్లవకాలంలో కలిగినదో చెప్పడానికి ఆధారాలు లేవు. శ్రీశైలం ఒక నాడు ఆంధ్ర సంస్కృతికీ, మత ప్రభావానికి సంక్షేమానికి నిలబడిన ఒక సహజ వర్గం. ఆ దృక్పథంతో చూస్తే కర్నూలు రాజధాని కావ డంలో వింతలేదు. యావదాంధ్ర దేశానికి ఒక విధంగా కేంద్రం కర్నూలే.

పది, పన్నెండు వందల సంవత్సరాల క్రితం కర్నూలు ఆముదానికి ప్రసిద్ధి. అక్కడ విరివిగా ఆముదాలు పండేవి. ఆముదం ఆడే గానుగలు ఉండేవి. తుంగభద్ర దాటే బళ్ళన్నీ, ఇక్కడ ఆగి, చక్రాల ఇరుసులకి కందెనె వేసుకునేవి. అనగా ఆధునిక పరిభాషలో ఆయిలింగ్. కర్నూలు ఆనాడు ఎద్దుబళ్ళకి ఆయిలింగ్ స్టేషను. తెలుగులో కందెనవోలు. అది కందనూలు అయింది. నవాబుల కాలంలోనే కందనూలు కర్నూలుగా మారి నిలిచిపోయింది.

కర్నూలుకి చరిత్ర ఉన్నది హంద్రీ తుంగభద్రా నదుల మధ్య ఉన్న ఈ నగరం క్రీ.శ. నాలుగో శతాబ్దిలో తెలుగు చోడులు పరి పాలించారు. తరువాత పశ్చిమ చాళుక్యుల వశమైంది. పన్నెండవ శతాబ్దంలో కాకతీయ సామ్రాజ్య విభాగమైంది. అడవులను నరికించి ఆ ప్రదేశంలో మొదల నగర నిర్మాణం చేసినవాడు కాకతీయ ప్రతాప రుద్రుడంటారు. కాకతీయులు తర్వాత కర్నూలు విజయనగర రాజుల పాలనలోకి తెచ్చినది. 1530-40 ప్రాంతంలో అచ్యుత దేవరాయలు కందనూలు కోట నిర్మాణం చేశాడు. ఆ కోట బాపతు మిగిలినది కొండారెడ్డి బురుజు మాత్రం. దాని 1799లో కర్నూలు నిజాం

రాజ్యమైంది. అవెంటనే సైనిక సహకార పద్ధతి ప్రయోగించి బ్రిటీష్‌వారి 1800 సం॥లో ఇతర మూడు జిల్లాలతో పాటు కర్నూలుని కూడా లాగేసుకున్నారు. కాని బ్రిటీష్‌వారి కర్నూలు నవాబునే ఏలుకోమని చెప్పి ఒక లక్షరూపాయలు భరణం యిచ్చే ఏర్పాటుచేసుకున్నారు.

1839లో కర్నూలు నవాబు బ్రిటీష్ ప్రభుత్వంపై తిరుగుబాటు చేశాడు. నిజాం సోదరుడు ముబారిజుద్దౌలతో చేతులు కలిపి కుట్ర పన్నాడు. అప్పుడు హైదరాబాద్‌లో బ్రిటీష్ రెసిడెంటుగా పనిచేస్తున్న జనరల్ ట్రెజర్ ఈ కుట్ర పసిగట్టి వెంటనే తగు చర్య తీసుకున్నాడు. కర్నూలు నవాబు ధైర్యంగా పోరాడి ఓడిపోయాడు.

కర్నూలు నవాబు మంచి పట్టుదల కలిగినవ్యక్తి. మంచి ఉపాయ శాలి. ఆనాడు ఓడిపోవలసివచ్చిందంటే అందుకు కారణం నిజాం నుంచి తగిన సహాయం లభించకపోవడమే.సిపాయిల తిరుగుబాటుకు ఇరువది సంవత్సరాలకు ముందే యీ సంఘటన జరిగింది. అందువల్ల ఇది చరిత్రకారులకు ఆసక్తిదాయకమైన విషయం.ఏమైతేనేం? ఈ నవాబు అవమానింపబడ్డాడు. ఈయన కుటుంబం జీవనాధారం లేక చెల్లాచెదరైపోయింది.

రాజధాని అయ్యేనాటికి కర్నూలు జనాభా 40,000. కలెక్టరు కార్యాలయాన్ని సెక్రటేరియట్ గా మార్చారు. కలెక్టరు కార్యాలయాన్ని నంద్యాలకు తరలించారు. అసెంబ్లీని జిల్లా కోర్టు కార్యాలయం నెల కొల్పారు. గవర్నరు త్రివేది 4000 టెంట్‌లను ఢిల్లీనుంచి తెప్పించారు. కలెక్టరు నివాసభవనం చీఫ్ సెక్రటరీ పుల్లారెడ్డి నివాస భవనమైంది. ఇంతచేసినా శాఖాధిపతులు, డైరక్టర్ల–కార్యాలయాలకు కర్నూలులో సౌకర్యాలు కలిగించలేకపోయారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడి హైదరాబాద్ రాజధాని నగరమయ్యే వరకు కార్యాలయాలు మద్రాసునగరం నుండే పనిచేశాయి. మంత్రివర్గ సమావేశాలు జరుగుతున్న రోజుల్లో శాఖాధి పతులు మద్రాసునుంచి ట్రెయినులో గుంటూరులో దిగేవారు. అక్కడి నుండి వారిని కార్లలలో కర్నూలుకు తీసుకుపోయేవారు. కె.సి.కెనాల్ తీరంలో ఉన్న ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్‌ను నివాస భవనాన్ని గవర్నరు రాజ్‌భవన్‌గా తీర్చిదిద్దారు. ప్రకాశం గారి ప్రోత్సాహంతో 45 రోజులు జరిగిన అసెంబ్లీ బడ్జెటు సమావేశాలు విశాఖపట్టణంలో జరిగాయి. యూనివర్శిటీ ఆవరణలోని తిక్కవరపు రామిరెడ్డి హాల్‌ని అసెంబ్లీగా మార్చుకున్నారు. వైజాగ్ సమావేశంలోనే వేంకటేశ్వరయూనివర్శిటీ బిల్లుకు ఆమోదముద్ర లభించింది. ప్రాథమిక విద్యను జాతీయం చేయడం జరిగింది.

## మహబూబ్‌నగర్ జిల్లా

మహబూబ్‌నగర్ జిల్లాని వెనుకబడిన జిల్లా అంటున్నారు. ఆర్థికంగా కావచ్చునేమో కాని చారిత్రకంగా ఎంతో ప్రగతిని సాధించిన జిల్లా. కృష్ణ, తుంగభద్ర, భీమా నదులు మరిన్ని ఉపనదులు ఈ జిల్లాలో ప్రవహిస్తున్నాయి. తెలంగాణాలో వెలువడిన మొదటి పత్రిక మహబూబ్‌నగర్‌లోనే.

సురవరం ప్రతాపరెడ్డి గోలకొండ పత్రికను స్థాపించి, రెండు శతాబ్దాల పాటు నిర్వహించి అప్పటి నిజాం పాలనలో తెలంగాణా ప్రజలను ఉన్నతపరచి చైతన్యవంతుల్ని చేశారు. సురవరం వారు జన్మించిన మహబూబ్‌నగర్ జిల్లా ఆలంపూర్ తాలూకా లోని ఇటకాల పాడు గ్రామం తుంగభద్ర తీరంలోని పుణ్యక్షేత్రం ఆలంపురం. అది హైదరాబాద్ సంస్థానంలోని రాయచూరు జిల్లాలో ఉండేది. ఇప్పుడు ఆలంపురం మహబూబ్‌నగర్ (పాలమూరు) జిల్లాలో చేరిపోయింది. ఆలంపురం దక్షిణకాశీగా ప్రసిద్ధి పొందింది. కాశీలో విశాలాక్షీ, విశ్వేశ్వర్లు, ఇక్కడ జోగులాంబా, బాలబ్రహ్మేశ్వరులు. ఆలంపూరు తాలూకా కర్నూలు పొలిమేరలలో ఉన్న తెలంగాణా రాష్ట్రప్రాంతం. అందువలన సురవరం వారి వ్యక్తిత్వంపై రాయలసీమ, తెలంగాణా సంస్కృతి మిళితమై గోచరించేది సురవరం రచించిన ఆంధ్రుల సాంఘికచరిత్ర, రామాయణ విశేషములు, హిందువుల పండుగలు. పరిశోధకుడుగా ఆయన స్థానాన్ని సుస్థిరం చేశాయి. తెలంగాణా మొదట కేంద్రసాహిత్య అకాడమి ఆయనకే లభించింది. ముప్పై పైగా రచనలు చేసిన ప్రతాపరెడ్డి 'గోలుకొండ కవుల సంచిక' ను ప్రచురించారు.

రాజ్ బహదూర్ వెంకట్రామారెడ్డి మహా సంస్థ వంటి వ్యక్తి నిజాం రాజుకు ఎంత విధేయుడుగా ఉన్న విశ్వాసపాత్రుడుగా మెలిగిన ప్రజా సంస్థలకు, రాజకీయ పార్టీలకు, యువజన సంస్థలకు, విద్యార్థులు సన్నిహితులుగా ఉండేవారు. సామరస్యం, సహనం ఆయన ఎక్కువగా ఆచరించే ఆదర్శాలు. కులమత ప్రాంతీయ భేదాలు లేకుండా అన్ని ప్రజల అభివృద్ధిని కాంక్షించిన వ్యక్తి. నిజాం నవాబుల పరిపాలనలో తొలి ముస్లిమేతర వ్యక్తి కొత్వాల్‌గా సేవలందించిన ఘనత ఆయనదే. పరిపాలన దక్షతకు ఆంగ్ల విద్యకాని, విదేశీయ శిక్షణగాని అవసరం లేదని రాజ్‌బహదూర్ చరిత్ర నిదర్శనం. నగర కొత్వాల్ (కమీషనర్) ఉద్యోగమంటే సామాన్యమైనది కాదు. దాని ప్రాముఖ్యాన్ని బట్టి ముఖ్యమంత్రి ఉద్యోగం తర్వాత కొత్వాల్ ఉద్యోగమే.

పూర్వం హైదరాబాద్ రాష్ట్రానికి ముఖ్యమంత్రులైన వారంతా నిజాం ప్రభువులు, లేదా కేంద్ర ప్రభుత్వం నియమించినవారే మొదటి సార్వత్రిక ఎన్నికల అనంతరం హైదరాబాద్ రాష్ట్రంలో మొదటిసారి నిజాం ప్రభుత్వం ఏర్పడింది. బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రి అయ్యారు. బూర్గుల పరిపాలనాదక్షుడు. రెవిన్యూ మంత్రిగా, విద్యా మంత్రిగా, ముఖ్యమంత్రిగా ఆయన రాష్ట్రానికి ఎంతో సేవ చేశారు. నూట యాభై సంవత్సరాలనుంచి ఇక్కడ ఉర్దూభాష అధికార భాష ఒక్క కలంపోటుతో దాన్ని మార్చేశారు. దేశంలో ఏ ముఖ్యమంత్రి ప్రవేశ పెట్టని భూసంస్కరణలు ఆయన రాష్ట్రంలో మొదటిసారి ప్రవేశ పెట్టారు.

అది పందొమ్మిదివందల యాభై మూడు జనవరి 11వ తేది. ఆంధ్ర సారస్వత పరిషత్తు సప్తమ సభలు. ఉపరాష్ట్రపతి డా. సర్వేపల్లి రాధాకృష్ణన్ గారు సభలు ప్రారంభించడానికి ఢిల్లీ నుంచి ఆలంపూరు వచ్చారు. ఉపరాష్ట్రపతి రాధాకృష్ణన్ గారి ఉపన్యాసం ప్రేక్షకులను ఉర్రూతలూగించింది. ప్రతిదినమొక మహాకవి పుట్టడు. ప్రతిమా సమునకొక మహానవల సృష్టికాదు. కాలముననుసరించి కవి పుట్టును. అవసరమును బట్టి కావ్యముద్భవించును. (రాధాకృష్ణన్‌గారి ప్రారంభోపన్యాసం నుండి)

ఇలా మాట్లాడుతుండగానే ఒక పండు ముసలి వేదికమీదకు వచ్చాడు. ఖరీదైనశాలువ కప్పుకున్నాడు. ముఖాన కుంకుమ తిలకం. భస్మరేఖలు పాలభాగంలో, బ్రహ్మవర్చస్సు,పచ్చని శరీరచ్ఛాయ. ఆయనే కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి. అష్టాదశ పురాణాలు ఒక చేతి మీద అనువదించారు. ఇది భగవద్గీతకు తెలుగు అనువాదం. మూలానికి విధేయంగా చేశాను. కవిత్రయం వారు భగవద్గీతను అనువదించలేదు. కరణాలు ఉన్నాయి. ఈ పవిత్ర గ్రంథాన్ని అనువదించి ఈ మహోత్సవంలో మహాభాగులైన తమకు అంకితం చేసుకుంటున్నాను.

'పార్థాయప్రతిబోధితం / భగవతానారాయణాస్వయం' అన్నారు కవిసార్వభౌములు. తెల్లని తలపాగాతో, ఆజానుబాహువు. విశ్వవిఖ్యాత మేధావి డా.సర్వేపల్లి రాధాకృష్ణన్ గారు లేచి నుంచున్నారు.

వ్యాసేనా గ్రంథితం పురాణమునిన్

**మధ్యే మహాభారతం** అని శ్లోకం అందుకున్నారు. ఆస్థాన కవి మొదలుపెట్టిన శ్లోకాన్ని రాధాకృష్ణన్ గారు గంభీర కంఠంతో చదివారు.

◆ ◆ ◆

ఎన్టీఆర్ సినీజీవిత నేపథ్యం అలా ఉంచి, రాజకీయంగా, పరిపాలనా రంగంలో తనది ఒక ప్రత్యేకస్థానం. ఒక పార్టీ పాలన సాగుతుండిన ఒక పెద్ద రాష్ట్రంలో మొదటిసారిగా రెండు పార్టీల వ్యవస్థ తెచ్చి స్థిరపరచిన వ్యక్తి ఆయన. సంక్షేమ పాలనకు దేశ విదేశాలలో కొత్త గుర్తింపు తెచ్చారు. అంతవరకు ఏకఛత్రాదిపత్యంగా సాగిన ఒక సామాజిక వర్గపాలనను భంగపరచి, బలహీన వర్గాలతో కలసి సోషల్ ఇంజనీరింగ్‌ను తీసుకువచ్చారు. జాతీయస్థాయిలో ఈ చివర జనసంఘ్ నుంచి ఆ చివరి కమ్యూనిస్టుల కూడ అందరినీ అనూహ్యమైన రీతిలో ఒకే వేదికపైకి తేగలిగారు. దేశంలో కాంగ్రేసేతర రాజకీయాలకుగానీ, ప్రాంతీయ రాజకీయ ధోరణికి ఒక పెద్ద ఊపు రావడంతో గ్రేట్ పాత్ర ఎన్టీఆర్‌ది...

పుష్కరాలనేది ఉత్సవం కాదు. జాతరా కాదు. పుష్కరాల సమయంలో యాత్రికుల మతకర్మలను ఆచరిస్తారు. యాత్రికులపై పన్నువిధింపు మత స్వేచ్ఛ అనే ప్రాథమిక హక్కుకు భంగకరం' (ఆంధ్ర ప్రదేశ్ హైకోర్టు ఆదేశం : ఆగస్టు 1979)

*చిరునామా : శ్రీ జి. వెంకటరామారావు 18-7-739/2 అవుట్‌సైడ్, గౌలీపూర్, హైదరాబాద్ - 500 053*

డా॥ వెన్నిసెట్టి రంగారావు

# గుంటూరు జిల్లా రాజకీయ మహిళలు

గుంటూరుజిల్లా 1904లో ఏర్పడింది. అప్పటి రోజుల్లో జిల్లాలో తాలూకా వ్యవస్థ ఉండేది. తరువాత మండల వ్యవస్థకు మారింది. ఇప్పుడు 57 మండలాలు కలిగిఉంది. ఈ జిల్లా చైతన్యంతో కూడిన ప్రజానీకానికి ప్రతీక. ఉద్యమాలకు నిలయం. బ్రిటీషువారి కాలం నుండి నేటివరకు ఏ ఉద్యమం అయినా ఈ జిల్లాలోనే పురుడు పోసుకునేది. ఇదిపెద్ద విద్యాకేంద్రం. కళలకు కాణాచి. పాడిపంటలకు నిలయం. వాణిజ్య పంటలకు ప్రసిద్ధి చెందిన ప్రాంతం. దానధర్మాలు చేసే బుద్ధిజీవులకు నెలవు. చెమటోడ్చిపనిచేసేవారికి తావు. విదేశీ వ్యాపారంతో రాష్ట్రానికి, కేంద్రానికి ఆదాయపు ఒనరుగా నిలిచింది ఈ జిల్లానే.

నాటిరాజుల కాలంలోను, మధ్యలో జమీందారుల కాలంలోను, నేడు ప్రజాస్వామ్యపాలనలోను రాజకీయాలతో రాటుతేలింది గుంటూరు జిల్లా ముఖ్యమంత్రులుగా కేంద్రమంత్రులుగా ఈజిల్లా నాయకులు ప్రధానపాత్ర వహిస్తున్నారు. ప్రతిపక్షనాయకులుగా రాణిస్తున్నారు.

అనురాగానికి, ఆత్మీయతకు, ఆప్యాయతకు,ఆదరణకు కేంద్ర స్థానం మహిళలు. సంస్కృతికి చిహ్నాలు మహిళలు. పౌరుషానికి ప్రతీకగా రాజకీయతంత్రాన్ని నడిపిన నాయకురాలు నాగమ్మ నివసించింది గుంటూరు జిల్లాలోనే. తిండి, వసతి కల్పించి, స్త్రీలకు విద్యాబుద్ధులు నేర్పుతున్న శారదానికేతన్ ప్రారంభమైందిఈ జిల్లాలోనే. రంగస్థలంపై స్త్రీ పాత్రలు స్త్రీలేధరించాలన్న ఆహ్వానాన్ని మన్నించి ముందుకు వచ్చింది ఈ జిల్లాలోనే.

స్వాతంత్ర్యోద్యమంలోను, ఆంధ్రోద్యమంలోను, హరిజనోద్యమంలోను, కమ్యూనిస్టు ఉద్యమంలోను, రాడికల్ ఉద్యమంలోను, భక్తిఉద్యమంలోను గుంటూరుజిల్లా మహిళల పాత్ర గణనీయమైనది. జాతీయోద్యమంలో మహాత్మాగాంధీజి పిలుపుకు 1922లో మొత్తం భారతదేశంలో మొదటగా స్పందించి ఘోషా (పరదా)ను వీడి, శాసనోల్లంఘన కార్యక్రమంలో పాల్గొని, జైలు శిక్షననుభవించిన మహిళలు (చేబ్రోలు) గుంటూరు జిల్లావాసులే. 1940లో సారాదుకాణాల దగ్గర విదేశీవస్త్రదుకాణాల దగ్గర పికెటింగ్‌లో పాల్గొని జైలు శిక్షను పొందిన మహిళలు (తెనాలి) ఈజిల్లా వాసులే.

భారతదేశానికి స్వాతంత్ర్యం రాకముందు, స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత రాజకీయరంగంలో గుంటూరు జిల్లా మహిళల పాత్ర గణనీయమైంది. ఎన్నికల్లో విజయం సాధించి, చట్టసభల్లో, స్థానిక సంస్థల్లో ప్రవేశించి, శాసనసభ్యులుగా, పార్లమెంటుసభ్యులుగా, మంత్రులుగా, మునిసిపల్ కౌన్సిల్ చైర్మన్లుగా, మేయర్లుగా, జిల్లా పరిషత్ చైర్మన్లుగా రాణించిన గుంటూరుజిల్లా రాజకీయ మహిళలను గూర్చి తెలుసుకుందాం.

### 1) సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి :

ఈమె పుట్టినిల్లు కృష్ణాజిల్లా వీరులపాడు గ్రామం. మెట్టినిల్లు గుంటూరుజిల్లా చేబ్రోలు గ్రామం. 1914 మే నెల 18వ తేదీన జన్మించారు. వీరితండ్రి వాసిరెడ్డి సీతారామయ్య, తల్లి సుబ్బమ్మ. సొంత ఊరిలో ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలో హనుమయ్య చౌదరి పంతులు గారి దగ్గర చదువుకున్నారు. బాల్యం నుండి దేశభక్తి భావాలుగలిగిన మహిళ. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని, 1932 జనవరి 26వతేదీన అరెస్టు అయ్యారు. రాయ వేలూరు, చెన్నై జైళ్ళల్లో సంవత్సరకాలం జైలుశిక్ష అనుభ వించారు. శిక్షాకాలంలో కొంత ఇంగ్లీషు నేర్చుకున్నారు. జైలునుండి విడుదలైన తర్వాత చేబ్రోలులో హిందీ నేర్చుకొని, రాష్ట్రభాషా విశారదలో కృతార్థులయ్యారు. కొన్నాళ్ళకు చెన్నైవెళ్లి దుర్గాబాయమ్మ గారి సలహాతో మెట్రిక్‌పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. తరువాతి కాలంలో రాజకీయ కార్యకలాపాల్లో పాల్గొనేవారు. మహిళల్ని చైతన్యవంతులుగా చేయడానికి ఈమె కృషిచేశారు.

1948వ సంవత్సరం జూన్‌నెలలో హైదరాబాద్ నగరంలో "తెలుగుదేశం" పేరుతో వారపత్రికను ప్రారంభించారు. స్టేట్ కాంగ్రెస్ పార్టీలో ప్రముఖస్థానం వహించారు. సంపూర్ణ మద్యనిషేధంకోసం ఉద్యమంలో పాల్గొన్నారు. ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘంతో సన్నిహిత సంబంధం కలిగి ఉండేవారు. ఈమె 07-08-2010వ తేదీన పరమపదించారు.

**2) ఉన్నవ లక్ష్మీబాయమ్మ :**

ఈమె గుంటూరు జిల్లా అమీనాబాద్ గ్రామంలో 1882లో జన్మించారు. తండ్రి నడింపల్లి సీతారామయ్య,తల్లి రామలక్ష్మమ్మ. ఈమెకు 10వ సంవత్సరంలోనే ఉన్నవలక్ష్మీ నారాయణతో వివాహం జరిగింది. భర్త ప్రోత్సాహంతో భారతరామాయణాది గ్రంథాలను చదువుకున్నారు. ఉన్నవ లక్ష్మీనారాయణ దంపతులు బాలవితంతువులు జీవితాలపై శ్రద్ధపెట్టి గుంటూరులో వితంతు శరణాలయాన్ని నిర్వహించారు. ఎందరో బాలవితంతువులకు అందులో ఆశ్రయం కల్పించి, వారికి వివాహాలు జరిపించడానికి ప్రయత్నించారు. 1921 నుండి మహాత్మాగాంధీ పిలుపుమేరకు జాతీయ ఉద్యమంలో పాల్గొన్నారు. త్రివర్ణ పతాకాన్ని చేతబూని, గ్రామ గ్రామంలో ప్రచారం చేశారు. కల్లుదుకాణాలు, విదేశీ వస్త్ర విక్రయశాలలముందు పికెటింగులలో పాల్గొన్నారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 1930 జూన్ 9వతేదీన దేవరంపాడులో అరెస్టు అయ్యారు. రాయవేలూరు జైలులో 6 నెలలు జైలుశిక్ష అనుభవించారు.

1922వ సంవత్సరంలో స్త్రీ విద్యావ్యాప్తికై భర్త ఉన్నవ లక్ష్మీ నారాయణతో కలిసి, గుంటూరు పట్టణంలో శారదానికేతనం ప్రారంభించారు. అందులో ఉచితంగా భోజనం, విద్య, వసతి, ఏర్పాటుచేసి ఎందరో విద్యార్థినులకు చదువుకొనే అవకాశం కల్పించారు. మాతృభాషలోనే విద్యలు నేర్పుతూ, సంస్కృతాంధ్ర భాషలకు ప్రాముఖ్యమిచ్చారు. ప్రభుత్వసాయం లేకుండానే ఈ సంస్థను నిర్వహించారు. ఈమె గొప్పవక్త. ఈమె చేసిన ఉపన్యాసాలు ఎందరో స్త్రీలను జాతీయోద్యమంలోకి ప్రవేశించేటట్లు చేసాయి. జాతినిర్మాణ కార్యక్రమాల్లో పాల్గొని, ఖద్దరు ప్రచారం, మహిళాజనోద్ధరణ, అస్పృశ్యతానిర్మూలనకై కృషిచేశారు. ఈమె 1956లో కాలధర్మం చెందారు.

**3. శ్రీమతి తుమ్మల దుర్గాంబ:**

ఈమె గుంటూరు జిల్లా తిరుమెళ్ల గ్రామంలో 1907లో జన్మించారు. తండ్రి పర్వతనేని కృష్ణయ్య, తల్లి భూషమ్మ. ఆ గ్రామంలోనే ఎడ్వర్డుబోర్డు ఉన్నతపాఠశాలలో చదువుకొన్నారు. 1919లో కావూరు గ్రామస్తులు తుమ్మల బసవయ్యగారితో వివాహం జరిగింది. దంపతులిద్దరు వ్యవసాయం పట్ల మక్కువ చూపేవారు. 1925నుండి గ్రామాభ్యుదయ కార్యక్రమాల్లో పాల్గోనేవారు. సమాజసేవ, హరిజనోద్ధరణ కార్యకలాపాల్లో ముంధంజలో ఉండేవారు. 1930లో ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని, రాయవెల్లూరు జైలులో శిక్ష అనుభవించారు. 1931లో విదేశీవస్త్ర బహిష్కరణ కార్యక్రమంలో పాల్గొని, పట్టుచీరల్ని దహనం చేసి, 15-06-1931న రెండవ పర్యాయం జైలుకు వెళ్లారు. 1931నుండి ఖాదీ వస్త్రాలు ధరించటం ప్రారంభించారు. 1933 వ సంవత్సరం డిసెంబర్ 23వ తేదీన కావూరు గ్రామంలో వినయాశ్రమానికి మహాత్మాగాంధీ చేత శంకుస్థాపన చేయించారు. వినయాశ్రమపురోభివృద్ధికి 200సవర్ల బంగారాన్ని విరాళంగా ఇచ్చారు. అప్పుడే కావూరులోని రామ లింగేశ్వరస్వామి దేవాలయంలోకి మహాత్మాగాంధీచే హరిజనులకు ప్రవేశం కల్పించారు. 1935లో "మీరాబెన్" చే కావూరులో స్వరాజ్య స్తూపం ప్రతిష్ఠాపన చేయించారు. 1940లో దీనపోషణశాఖను ఏర్పాటుచేసి, పేదలైన హరిజనబాలికలను దత్తత తీసుకొని, వారిని తీర్చిదిద్ది, వివాహాలు చేయించారు. 1948లో ఆంధ్రరాష్ట్ర సముపార్జనకై ప్రచారంలో పాల్గొన్నారు. 1957లో డిసెంబర్ నెల 25వ తేదీన శ్రీమతి దుర్గాబాయి గారిచే బాల్‌వాడీని ప్రారంభింపచేశారు. ఈమె 1984 నవంబరు 26న పరమ పదించారు.

**4) శ్రీమతి భారతీదేవి రంగా :**

ఈమె గుంటూరు జిల్లా మాచవరంలో 1908 ఆగష్టు 15న జన్మించారు. తండ్రి వెలగావెంకటసుబ్బయ్య, తల్లి పిచ్చమ్మ. ఆ ఊరిలో ఎలిమెంటరీ ఎడ్యుకేషన్ పూర్తిచేశారు. తరువాత గుంటూరులోని శారదానికేతనంలో విద్యాభ్యాసం గావించారు. 1923లో ఎన్.జి. రంగాగారితో వివాహమయింది. భర్తతో పాటు లండన్ వెళ్లారు. అక్కడ ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీకి అనుబంధమైన జాన్‌రస్కిన్ స్కూల్ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్‌లో చేరారు. రంగాజీతో కలసి యూరప్ దేశాలు పర్యటించారు. భారత దేశం తిరిగివచ్చి చెన్నైలో కొంతకాలం ఉన్నారు. భర్త ప్రొఫెసర్ పదవికి రాజీనామా చేసి, స్వగ్రామం నిడుబ్రోలులో 'గోభూమి' లో నివశించటం ప్రారంభించారు. అక్కడే భారతీదేవి 1930 నుండి జాతీయోద్యమంలో పాల్గొన్నారు. 1933లో కాకినాడ – ఆంధ్రరాష్ట్రరాజకీయ మహిళాసభలో, 1953లో ఘంటసాల –

ఆంధ్రమహిళా సభలోను పాల్గొని, స్త్రీలకు శాసనరూపేణా సమాన హక్కులు బాధ్యతలు కావాలని, తల్లిదండ్రులద్వారా ఆస్తిహక్కు రక్షణగా కావాలని ప్రసంగాలు చేశారు. 1936లో భారతీదేవి ఏకగ్రీవంగా జిల్లాబోర్డుసభ్యులుగా ఎన్నికయ్యారు. 1940లో మదనాపట్టణంలో జరిగిన పోలీసుకాల్పుల సంఘటనలో రైతులు చనిపోయిన, గాయాలపాలైన సందర్భంలో, వారందరి రక్షణకు, కోర్టులో డిఫెన్సుఖర్చులకు,విశాఖ, శ్రీకాకుళం జిల్లాల్లో పర్యటించి నిధులు వసూలుచేశారు. 1940లోనే గోదావరి వరద బాధితుల సహాయార్ధం వరదబాధనివారణ సంఘం ఏర్పాటుచేసి, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాల్లో పర్యటిస్తూ, ప్రజల కష్టాలను గూర్చి పత్రికలకు వ్రాసి, ప్రజల అవసరాలను తెలుపుతూ విరాళాలు వసూలు చేశారు. 1932లో తెనాలిలో కల్లు, సారాదుకాణాలు, విదేశీవస్త్ర విక్రయశాలల దగ్గర పికెటింగ్ కార్యక్రమాల్లో పాల్గొని అరెస్టు అయి, జైలు శిక్ష అనుభవించారు. 1952-53లో రాయలసీమ కరువు నివారణ సంఘం బాధ్యతలు నిర్వహించారు. 1958లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రశాసనమండలి సభ్యులుగా ఎన్నికయ్యారు. 1952, 1970 సంవత్సరాల్లో పార్లమెంటు ఎన్నికల్లో పోటీచేశారు కాని, విజయం దక్కలేదు. తమ శక్తికొలది శ్రమిస్తూ, రాజకీయ జీవితంలో నైతిక స్థాయిని పెంచతూ భారతీదేవి రాణించారు. 1972వ సంవత్సరం సెప్టెంబర్ 21 వ తేదీన భారతీదేవి స్వర్గస్తులయ్యారు.

### 5) శ్రీమతి కొల్లా కనకవల్లి తాయారమ్మ :

ఈమె గుంటూరుజిల్లా బ్రాహ్మణ కోడూరుగ్రామంలో 1906వ సంవత్సరం అక్టోబరు నెలలో జన్మించారు. తండ్రి మద్ది లక్ష్మీనరసింహం, తల్లి అన్నపూర్ణమ్మ. అదే గ్రామంలోని పాఠశాలలో ఫస్టుఫారమ్ వరకు చదివారు. స్కూలు టీచర్ల బోధనతో ఆమెలో బ్రిటీష్ ప్రభుత్వంపై వ్యతిరేకత ఏర్పడింది. 1916 లో తెనాలి వాస్తవ్యులు కొల్లాకాశీవిశ్వనాథం గారితో వివాహం జరిగింది. 1930లో భర్త ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని, రాయవేలూరు జైలులో 1 సంవత్సరం శిక్ష అనుభవించి రావడం గమనించారు. 1932లో విదేశీవస్తు బహిష్కరణ కార్యక్రమంలో భాగంగా షాపుల దగ్గర పికెటింగు చేస్తుండగ గర్భవతిగా ఉన్న కనకవల్లి తాయారమ్మ ప్రభుత్వం అరెస్టుచేసి, 6నెలల జైలు శిక్ష విధించింది. రాయవేలూరు జైలులోనే ఆమె పండంటి బిడ్డను ప్రసవించింది. గాంధీగారి పిలుపుమేరకు హరిజనోద్యమంలో భాగంగా తెనాలి మునిసిపల్ రోడ్డు మార్జిన్‌కు దగ్గరలో 1600 గజాల స్థలంకొని, అందులో 1933 డిసెంబరు 23న పాఠశాలకు గాంధీగారి చేత శంకుస్థాపన చేయించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో తెనాలిపట్టణంలో పాల్గొన్నారు. తెనాలి పట్టణంలో స్వదేశీవస్తు విక్రయశాల ప్రారంభించారు. తెనాలిలో శ్రద్ధానంద విద్యాలయం, శబరిహాస్టల్ ఏర్పాటుచేసి, వాటి నిర్వహణ బాధ్యతలు స్వీకరించారు. ఈమె 1970లో స్వాతంత్ర్యసమరయోధులు, భర్త కొల్లా కాశీవిశ్వనాథం గారి శిలావిగ్రహాన్ని ఏర్పాటు చేయించి, ఫిబ్రవరి 6వతేదీన అప్పటి రాష్ట్రపతి వి.వి.గారిచే ఆవిష్కరింపచేశారు. ఈమె 1977 మార్చినెల 6వతేదీన స్వర్గస్తులయ్యారు.

### 6. శ్రీమతి కొడాలి కమలమ్మ :

ఈమె గుంటూరు జిల్లా మోపర్రు గ్రామంలో 1916లో జన్మించారు. తండ్రి గోగినేని రామకోటయ్య, తల్లి వెంకాయమ్మ. ఈమెకు 7వ సంవత్సరంలో అక్షరాభ్యాస జరిగింది. నడింపల్లి ప్రాథమిక పాఠశాలలో 4వ తరగతివరకు చదువుకున్నారు. ఆ తరువాత గ్రామంలోని గ్రంథాలయానికి వెళ్లి,పుస్తకాలు తెచ్చుకొని చదువుకోవడం అలవాటు చేసుకున్నారు. గాంధీజి ఆత్మకథ, బుద్ధునిజీవిత చరిత్ర, గ్రంథాలు ఆమెను ప్రభావితురాలిగా చేశాయి. చదువు విషయంలో ఈమెకు తల్లి ప్రోత్సాహం ఉండేది. 14 సంవత్సరాల వయసులో సంగీతం కూడా నేర్చుకున్నారు. 16వ సంవత్సరం వయసులో మోపర్రు వాస్తవ్యులు కొడాలి కుటుంబరావు గారితోవివాహం జరిగింది. 1930వ సంవత్సరం నుండి ఖాదీ బట్టలు ధరించడం ప్రారంభించారు. మోపర్రు గ్రామం హరిజనవాడలోని మహిళలతో కలసి ఏకులు తయారుచేయడం, నూలువడకడం, వస్త్రాలు తయారు చేయడం దినచర్యగా పెట్టుకుంది. 1939లో తెనాలి సంస్కృత పాఠశాలలో రాష్ట్రభాషవిశారద పరీక్ష వ్రాసి, కృతార్థులయ్యారు. దక్షిణభారత హిందీ ప్రచార సభ రజతోత్సవ వేడుకల్లో గాంధీగారి చేతులమీదుగా "విశారద" పట్టాను చెన్నైలో స్వీకరించారు. 'ఈమె ఆర్యసమాజ సభలకు, బ్రహ్మ సమాజ సభలకు హాజరయ్యేవారు. హరిజనవాడలో గ్రంథాలయాన్ని ఏర్పాటుచేశారు. 1942వ సంవత్సరం సెప్టెంబరు 17వ తేదీన తెనాలిలో కోర్టుదగ్గర పికెటింగు చేసి, ప్రభుత్వానికి వ్యతిరేకంగా కరపత్రాలు పంచిన కారణంగా అరెస్టు అయి 12 నెలలు రాయవేలూరు జైలులో శిక్ష అనుభవించారు. 1943 జనవరి 26వ తేదీన జైలులోనే వేపచెట్టుపై ఈమె త్రివర్ణపతాకాన్ని ఎగరవేశారు. 1945లో చేబ్రోలులోని రాజకీయపాఠశాలకు హాజరై, అక్కడ గోరాగారి ఉపన్యాసానికి ఆకర్షితురాలైంది. క్రమంగా ఈమె హేతువాదిగా మారారు. చేతికి ఉన్న బంగారు గాజులు, మెడలోని మంగళసూత్రం తీసివేశారు.

1947 ఆగష్టు 15 స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలను ఆనందించారు. 1962లో భర్త చనిపోయిన సందర్భంగా స్త్రీలకు గాజు

పూసతీసే మూఢాచారాన్ని వ్యతిరేకించి నిలబడ్డారు. తెల్లచీరకు బదులు రంగు చీరలు కట్టుకోవడం ఆరంభించారు. 1977లో అమెరికా వెళ్లివచ్చారు. అక్కడ బంధువలతో ఆత్మీయతను పంచు కున్నారు. క్రమంగా నాసిక కేంద్రంతో అనుబంధం పెంచుకొన్నారు. నేత్రదానం శరీరదానం చేసే పత్రాలు పూరించారు. 2014వ సంవత్సరం జూలైనెల 11వ తేదీన ఈమె మరణించారు.

## 7. శ్రీమతి తమ్మాకోటమ్మ రెడ్డి :

ఈమె కృష్ణాజిల్లా పామర్రుగ్రామంలో 1925వ సంవత్సరం ఫిబ్రవరి 10వతేదీన జన్మించారు. తండ్రి బొమ్మారెడ్డి వెంకటరెడ్డి, తల్లి అంజమ్మ. అదే గ్రామంలో ప్రాథమిక విద్య, హైస్కూలువిద్య పూర్తిచేశారు. మచిలీపట్నంలో ఇంటర్మీడియట్ చదివారు.గుంటూరు ఏ.సి.కాలేజీలో బి.ఏ తిరిగి మచిలీపట్నంలో బి.ఎల్.పూర్తిచేశారు. తమ్మారామిరెడ్డిని వివాహమాడారు. గుంటూరులో న్యాయవాద వృత్తిని ఆరంభించారు.

1952వ సంవత్సరంలో ప్రత్తిపాడు నియోజకవర్గం నుండి కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేసి విజయం సాధించి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో శాసనసభలో అడుగుపెట్టారు. ఆశాసనసభలో ఎన్నికైన మహిళ ఈమె ఒక్కరే. ప్యానల్ స్పీకర్‌గాను పనిచేశారు. ఆ తరువాత రాజకీయాలనుండి విరమించుకున్నారు.

1958లో మున్సిఫ్‌మేజిస్ట్రేట్‌గా సెలక్టుఅయి 11 సంవత్సరాలు పనిచేశారు. 1970 నుండి 1974 వరకు సబ్‌జడ్జిగా ఉన్నారు. 1975 నుండి 1976 వరకు జిల్లాజడ్జిగా పనిచేశారు. 1977నుండి 1980 వరకు జిల్లా ల్యాండ్ రిఫామ్స్ అప్లియేట్ ట్రిబ్యునల్ జడ్జిగా పనిచేశారు. 01-07-1980లో ఒంగోలులో గ్రేడ్-1-జిల్లా జడ్జిగా పదవీ విరమణ చేశారు.

పదవీవిరమణ తరువాత ఈమె ఏ.పి.రెడ్‌క్రాస్ సంస్థకు వైస్-ప్యాటరన్‌గా ఉన్నారు. 1991నుండి శ్రీమతి తమ్మాకోటమ్మ రెడ్డి మహిళా పాలిటెక్నిక్ కళాశాల కమిటీ చైర్మన్‌గా వ్యవహరించారు.

## 1) శ్రీమతి దొడ్డపనేని ఇందిర :

ఈమె గుంటూరు జిల్లా యడ్లపల్లి గ్రామంలో 1937వ సంవత్సరం జనవరి 7వ తేదీన జన్మించారు. తండ్రి ఆలపాటి వెంట్రామయ్య తల్లి సామ్రాజ్యమ్మ. అదే గ్రామంలో ఎలిమెంటరీ విద్య, ఉన్నత విద్య తెనాలి మునిసిపల్ గరల్స్ హైస్కూలు, గ్రాడ్యుయేషన్ విద్య మద్రాస్‌లోని క్వీన్ మేరీస్ కాలేజిలోను పూర్తిచేశారు. 1955లో డాక్టర్ దొడ్డపనేని లక్ష్మీనారాయణ ప్రసాద్‌గారితో వివాహమయింది. తెనాలి నియోజకవర్గం నుండి వరుసగా 1967, 1972 & 1978 ఎన్నికల్లో విజయం సాధించి, ప్రజల హృదయాలను చూరగొన్నారు. 1983లో తెనాలి నియోజకవర్గం నుండి పోటీచేసి, విజయం సాధించలేకపోయారు. సమస్యల పట్ల వెంటనే స్పందించడం ఈమెకు అలవాటు. కుల,మత, వర్గ విభేదాలు లేకుండా ప్రజలతో మమేకమై ఉండేవారు. 1987 మార్చిలో గుంటూరు జిల్లా పరిషద్ ఎన్నికల్లో విజయం సాధించి, చైర్మన్‌గా ఎన్నికయ్యారు. రాష్ట్ర వ్యవసాయ విశ్వవిద్యాలయం, జవహర్ లాల్‌టెక్నికల్ యూనివర్సిటీలకు సెనెట్‌మెంబర్‌గా, రాష్ట్ర డ్రైనేజి బోర్డు సభ్యురాలుగా సేవలందించారు. ఈమె 1987 సెప్టెంబరు 16న పరమపదించారు.

## 2. శ్రీమతి భవనం జయప్రద :

ఈమె గుంటూరు జిల్లా బ్రాహ్మణ కోడూరు గ్రామంలో 1930వ సంవత్సరం ఏప్రిల్ 19వ తేదీన జన్మించారు. తండ్రి రామినేనివెంకట సుబ్బయ్య, తల్లి నాగేంద్రమ్మ. ఆ గ్రామంలోనే గోఖలే హయ్యర్ ఎలిమెంటరీ పాఠశాలలో ఐదోతరగతి వరకు చదివారు. గుంటూరు లోని శారదానికేతన్‌లో హైస్కూలు విద్యపూర్తిచేశారు. ఇంటర్మీడియట్, బి.ఏ.డిగ్రీకోర్సు గుంటూరు ఆంధ్రక్రైస్తవ కళాశాలలో పూర్తిచేశారు. ఆంధ్రా విశ్వవిద్యాలయంలో పోస్టుగ్రాడ్యుయేషన్ కోర్సు తరువాత "లా" డిగ్రీ చదివారు. గుంటూరు బార్ అసోసియేషన్‌లో మెంబర్‌గా రిజిష్టర్ చేసుకొన్నారు. 1955 ఆగష్టు నెలలో భవనం వెంకట్రామిరెడ్డిని పురోహితుని మంత్రాల సాక్షిగా స్నేహితుల సమక్షంలో వర్ణాంతర వివాహం చేసుకొన్నారు.

"లా" డిగ్రీ చేతబట్టిన కారణంగా గుంటూరు పట్టణంలో కోర్టుమెట్లు ఎక్కడం ఆరంభించారు. పెండ్లి అయిన కారణంగా హిందూ సంప్రదాయం ప్రకారంగా రామినేని జయప్రద పేరు భవనం జయప్రదగా మారింది. దేవాదాయశాఖకు పలు జాతీయ బ్యాంకులకు ఆమె సేవలందించారు. బార్ అసోసియేషన్లో గౌరవించదగిన వ్యక్తిగా ఆమె వ్యవహరించారు. రాజకీయాల్లో ప్రవేశించి, 1962లో వినుకొండ నియోజక వర్గం నుంచి కమ్యూనిస్టుయోధుడు పులుపుల వెంకటశివయ్యపై విజయం సాధించి, అసెంబ్లీలో అడుగుపెట్టారు. తిరిగి 1967లోను అదే నియోజకవర్గం నుండి విజయం సాధించారు. కొన్నాళ్లు టి.టి.డి. బోర్డు మెంబర్‌గా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈమెను నియమించింది. వినుకొండ ప్రాంతంలో పాఠశాలలు, కళాశాలలు ఏర్పడటానికి ఈమె దోహదం చేశారు. విద్యుత్ శాఖామంత్రిగా కేంద్రం నుండి 95 కోట్ల రూపాయల గ్రాంటు తెచ్చి గుంటూరు జిల్లాలో 270 గ్రామాలకు విద్యుత్ సౌకర్యం కల్పించారు. ఇబ్రహీం పట్నంలోని

థర్మల్ పవర్‌స్టేషన్, ఇచ్చంపల్లి పవర్‌ప్రాజెక్టులు ప్రారంభం కావడానికి ఈమె కారకులు. కోస్టల్ ఆంధ్రాడెవలప్‌మెంట్ ఛైర్మన్‌గా ఆంధ్రాయూనివర్సిటి, ఆచార్య నాగార్జున వర్సిటీల్లో మహిళా హాస్టళ్లు, లేబొరేటరీలు ఏర్పడటానికి తోడ్పడ్డారు.

## డాక్టర్ ఫాతిమున్నిసా బేగం:

ఈమె చిత్తూరు గ్రామఎలో 1932లో జన్మించారు. తండ్రి అబ్దుల్ సత్తార్, తల్లిహబీరాబి. మద్రాస్ మెడికల్ కాలేజినుండి ఎం.బి.బి.ఎస్. డిగ్రీ తీసుకున్నారు. అక్కడే డి.జి.ఒ డిగ్రీ కూడ పొందారు. గుంటూరు పట్టణంలో టొబాకో వ్యాపారస్తులు మహమ్మద్ మూసాను వివాహమాడారు. 1953 నుండి 1973 వరకు గుంటూరు జనరల్ హాస్పిటల్లో హానరరీ గైనకాలజిస్టుగా వ్యవహరించారు. 1972లో జరిగిన సార్వత్రిక ఎన్నికల్లో పెదకూరపాడు నియోజకవర్గం నుండి పోటీచేసి, విజయం సాధించి, అసెంబ్లీలో అడుగుపెట్టారు. శాసన సభలో ప్యానల్ స్పీకర్‌గా వ్యవహరించారు. విద్యాకమిషన్ మెంబర్‌గా కేరళరాష్ట్రాన్ని సందర్శించారు. తరువాత ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో విద్యా విధానంలో నూతన మార్పులు చోటుచేసుకోవడానికి కారకులయ్యారు. పలు శాసనసభ కమిటీల్లో సభ్యురాలుగా వ్యవహరించారు. 1978 సార్వత్రిక ఎన్నికల్లో ఈమె విజయం సాధించలేకపోయారు. గుంటూరు పట్టణంలో "ఆజాద్ మెటర్నటీ హోమ్" ఏర్పాటు చేసి వైద్యసేవ లందిస్తున్నారు.

## 4.శ్రీమతి విజయ రామానుజం :

ఈమె 1972లో గుంటూరు ఒకటవ నియోజకవర్గం నుండి సార్వత్రిక ఎన్నికల్లో విజయం సాధించి, అసెంబ్లీలో అడుగుపెట్టారు. ప్రధానంగా గుంటూరు ఒకటవ నియోజకవర్గంలో నల్లచెరువు ఏరియాను అభివృద్ధి చేయడానికి కృషిచేశారు. మహిళా సంఘాలను ఏర్పాటుచేసి ఎక్కువమంది మహిళలు రాజకీయాల్లోకి రావడానికి తోడ్పడ్డారు. ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో భిక్షాటనవృత్తి నిర్మూలనాంశంపై ప్రశ్నలు, అనుబంధ ప్రశ్నలు వేసి, దాని నిర్మూలనకై ప్రభుత్వానికి సూచనలు చేశారు.

## 5. శ్రీమతి నన్నపనేని రాజకుమారి :

ఈమె గుంటూరు జిల్లా నరిపూడి గ్రామంలో 1948వ సంవత్సరం అక్టోబర్ 9వ తేదీన జన్మించారు. తండ్రి చాపరాల వీరయ్య, తల్లి విజయలక్ష్మి. ఇంటిలోనే ప్రాథమిక విద్యఅభ్యసించారు. 1968వ సంవత్సరంలో తెనాలిలోని లెక్చరర్ నన్నపనేని ముకుంద రావుగారితో వివాహం జరిగింది. నన్నపనేని వెంకట్రావు, గారపాటి వెంకటకృష్ణయ్య గారల ప్రోత్సాహంతో రాజకీయ రంగంలోకి ప్రవేశించారు. 1972లో తెనాలిలోని నన్నపనేని స్ట్రీట్‌లో బహిరంగ ఉపన్యాసంతో రాజకీయ రంగ ప్రవేశం ప్రారంభమయింది. 1983వ సంవత్సరంలో సత్తెనపల్లి నియోజకవర్గం నుండి సార్వత్రిక ఎన్నికల్లో విజయం సాధించి, ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో అడుగుపెట్టారు. తిరుమల తిరుపతి దేవస్థానం బోర్డు సభ్యురాలుగా నియమింపబడ్డారు. ఆల్‌ఇండియా ఉమెన్ అండ్ చైల్డ్ వెల్ఫేర్ సలహామండలి సభ్యురాలుగా, ఆల్ ఇండియా చైల్డ్ లేబర్ అడ్వైజరీ బోర్డు సభ్యురాలుగా ఆల్ ఇండియా టెలికమ్యూనికేషన్స్ అడ్వయిజరీ బోర్డు సభ్యురాలుగా, ఆల్ ఇండియా వ్యాట్ అడ్వయిజరీ బోర్డు సభ్యురాలుగా, స్టేట్ కామన్-గుడ్‌ఫండ్ కమిటీ సభ్యురాలుగా వ్యవహరించారు.

1984వ సంవత్సరంలో సాంస్కృతిక పర్యాటక శాఖా మాత్యులుగా ఉన్నారు. 1989వ సం॥లో వినుకొండ నియోజకవర్గం నుండి శాసనసభ్యురాలుగా ఎన్నికయ్యారు. క్యాబినెట్ ర్యాంకు స్థాయి కలిగిన ప్రభుత్వ చీఫ్‌విప్‌గా వ్యవహరించారు. భారతదేశంలోనే తొలిమహిళా ప్రభుత్వ చీఫ్‌విప్‌గా స్థానం పొందారు. ఈమె కాంగ్రెస్ పార్టీ మహిళా సంఘం అధ్యక్షురాలుగాను రెండు పార్టీలలో తగినరీతిలో వ్యవహరించారు. వినుకొండ నియోజకవర్గంలో గుండ్లకమ్మబ్రిడ్జి నిర్మాణానికి రాజకుమారి పూర్తి సహకారం అందించారు.

తెలుగుదేశంపార్టీలోను, కాంగ్రెస్‌పార్టీలోను ముఠాలు లేనివ్యక్తిగా స్వతంత్రంగా రాణించారు. ఈమెకు అన్ని విషయాల్లో భర్త ముకుందరావు ప్రోత్సాహం లభించింది. నల్గొండజిల్లా వలిగొండ దగ్గర జరిగిన రైలు ప్రమాదం సందర్భంలోను,గుడిపూడి దగ్గర జరిగిన రైలుప్రమాదం సందర్భంలోను రైలు ప్రయాణీకురాలుగా ఉండి, అధికారులను మంత్రులను సంప్రదించి, సహాయకచర్యలు నిర్వహించడంలో ఈమె ప్రధానపాత్ర వహించారు. రాజకుమారిలో ధైర్యం, పట్టుదల, సమయస్ఫూర్తి, విచక్షణాశక్తి, అన్నింటికి మించి వాక్చాతుర్యం సహజగుణాలుగా కనబడతాయి. అటు తెలుగుదేశం పార్టీ తరపున పోటీచేసినప్పుడు, ఇటుకాంగ్రెస్ పార్టీతరుపున పోటీ చేసినప్పుడు ప్రజలు రాజకుమారికి బ్రహ్మరథం పట్టారు. రాజకీయరంగంలో రెండు పార్టీలలోనూ ఆటుపోట్లను తట్టుకొని నిలదొక్కుకున్న నిలువెత్తు శిఖరం రాజకుమారి. 2009లో శాసన మండలి సభ్యురాలుగా ఎన్నికయ్యారు. మహిళలుకు ఎక్కడ అన్యాయం జరిగినా, అక్కడ రెక్కలు కట్టుకొని వాలటం, సానుభూతితో ఓదార్చటం, అండగా నిలబడటం ఆమె నేర్చుకొన్నవిద్య, ఆచరిస్తున్న లక్షణం. ప్రజలనాడి తెలిసిన మహిళానాయకురాలు రాజకుమారిగారు.

ఎన్నో అవార్డులు పొందారు. అప్పుడప్పుడు సమకాలీన సమస్యలపై కవితలు వ్రాస్తారు. 2016వ సంవత్సరం ఫిబ్రవరినెల 10వతేదీన నవ్యాంధ్రప్రదేశ్ తొలి మహిళాకమీషన్ చైర్మన్‌గా ప్రమాణస్వీకారం చేశారు.

### 6. శ్రీమతి ఈవూరి సీతామ్మ :

ఈమె గుంటూరు జిల్లా మోర్లవారి పాలెంలో 1928వ సంవత్సరం డిసెంబర్ నెల 14వ తేదీన జన్మించారు. తండ్రి మోర్ల వెంకటాచలం, తల్లి కన్నమ్మ. అదే గ్రామంలో ఎలిమెంటరీ విద్య, రేపల్లెలో హైస్కూలు విద్య చదివారు. తెనాలిలో హిందీ ట్రైనింగ్ ప్రచారక్ పూర్తిచేశారు. ఈవూరి సుబ్బారావుతో వివాహం జరిగింది. 1985లో, 1989లో మరియు 1994లో కూచినపూడి నియోజకవర్గం నుండి ఎన్నికల్లో విజయం సాధించి అసెంబ్లీలో అడుగుపెట్టారు. 1995 సెప్టెంబరు నుండి స్త్రీ శిశుసంక్షేమశాఖా మంత్రిగా వ్యవహరించారు. అసెంబ్లీ ఉమెన్ వెల్ఫేర్ కమిటీ చైర్మెన్‌గా నియమింప బడ్డారు. 1986లో 1989లో & 1997లో తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తల మండలి సభ్యురాలుగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వీరిని నియమించింది. 1999 సార్వత్రిక ఎన్నికల్లో విజయం సాధించలేకపోయారు. కూచిపూడి నియోజకవర్గ ప్రజావసరాలను శక్తిమేరకు పరిష్కారానికి ప్రయత్నించారు.

### 7) శ్రీమతి జూలకంటి దుర్గాంబ :

ఈమె విజయవాడ పట్టణంలో 1942వ సంవత్సరం ఏప్రిల్ నెల 22వ తేదీన జన్మించారు. తండ్రి గాదె హనిమిరెడ్డి, తల్లి వెంకట నరసమ్మ. ప్రీయూనివర్సిటీకి కోర్సు హైదరాబాద్‌లోని గవర్నమెంట్ ఉమెన్స్ కాలేజీలో పూర్తిచేశారు. జూలకంటి నాగిరెడ్డిగారితో వివాహమయింది. 1999వ సంవత్సరం సార్వత్రిక ఎన్నికల్లో విజయం సాధించి, అసెంబ్లీలో తెలుగుదేశం పార్టీ అభ్యర్థిగా అడుగుపెట్టారు.

మాచర్ల పట్టణంలో 30 పడకల ప్రభుత్వవైద్యశాల ప్రారంభించారు. నాగార్జునసాగర్ డ్యాం దిగువన 22కోట్ల రూపాయల ఖర్చుతో వంతెన ఏర్పాటు చేయించారు. జెర్రివాగు లిఫ్ట్ ఇరిగేషన్ స్కీమ్ అమలు చేయించి 3,800 ఎకరాలకు నీటివసతి కల్పించారు. చంద్రవంక, నాగులేరు నదులపై రెండురోడ్డు బ్రిడ్జీలు ఏర్పాటుచేయించారు. కేంద్ర అటవీశాఖామంత్రి నుండి అటవీభూములకు మినహాయింపు తెప్పించడంలో కృషిచేశారు. అడిగొప్పులలో లెదర్‌పార్క్ ఏర్పాటుకు సహకరించారు. దుర్గిమండలంలో బుగ్గవాగునుండి రక్షిత మంచినీటిసరఫరా పథకాన్ని ప్రారంభించారు. నియోజకవర్గంలో ఉర్దూమీడియం స్కూళ్లకు శాంక్షన్ ఆర్డర్ తీసుకొచ్చారు. రైతుల సౌకర్యార్థం చెక్‌డ్యామ్‌లు ఏర్పాటుచేయించారు. పిహెచ్‌సి సెంటర్లు, ఎలక్ట్రికల్ సబ్‌స్టేషన్స్ అవసరమైనచోట్ల ఏర్పాటు చేయించారు. పదవీకాలం తర్వాత వయసు, ఆరోగ్యరీత్యా రాజకీయాల్లో చురుకుగా పాల్గొనడంలేదు.

### 8. శ్రీమతి కాండ్రుకమల :

ఈమె 1968వ సంవత్సరం జూలై నెల ఆరవతేదీన మంగళగిరిలో జన్మించారు. ఈమె తండ్రి మామిళ్ళ భాస్కరయ్య తల్లి సామ్రాజ్యం. ఈమె ఎం.ఏ. డిగ్రీ పొలిటిక్స్ మరియు పబ్లిక్ ఎడ్మినిస్ట్రేషన్ సబ్జెక్టుల్లో తీసుకున్నారు. ఇప్పుడు ఎం.ఏ. ఇంగ్లీషు సబ్జెక్టు చదువుతున్నారు. 2000వ సంవత్సరంలో మంగళగిరి మునిసిపల్ చైర్మన్‌గా ఎన్నికై, 2005 వరకు కొనసాగారు. 2009వ సంవత్సరం సార్వత్రిక ఎన్నికల్లో మంగళగిరి నియోజకవర్గం నుండి విజయం సాధించి ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో అడుగుపెట్టారు.

ప్రజల నుండి విరాళాలు వసూలుచేసి, దానికి గవర్నమెంటు నుండి మాచింగ్ గ్రాంటు కలిపి మంగళగిరికి కృష్ణావాటర్ స్కీమ్ తీసుకొచ్చారు. ప్రత్యేకంగా మంగళగిరికి అప్పటి కృష్ణాపుష్కరాలు సందర్భంగా ప్రభుత్వం నుండి గ్రాంట్ శాంక్షన్ చేయించారు. సి.సి.రోడ్లు వేయించారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈమెను ప్రభుత్వం నుండి గ్రాంటు తెచ్చి, మంగళగిరి మునిసిపల్ కార్యాలయభవనాన్ని నియమించారు. దానికి "కాండ్రకమల మునిసిపల్ కార్యాలయం" అని నామకరణం కూడా చేశారు. ప్రస్తుతం రాజకీయాల్లో కొనసాగుతున్నారు.

### 9. డాక్టర్ కందిమళ్లజయమ్మ :

ఈమె ప్రకాశం జిల్లాటంగుటూరు గ్రామంలో 1945వ సంవత్సరం జనవరినెల 25వ తేదీన జన్మించారు. తండ్రి పమిడి రామయ్య, తల్లిశేషమ్మ. ఈమె ఎం.బి.బి.ఎస్. చదివి, గైనకాలజీలో డిప్లొమాకూడా పొందారు. చిలకలూరిపేట నివాసులు కందిమళ్ల నారాయణ మూర్తిని వివాహమాడారు. చిలకలూరిపేటలో డాక్టర్‌గా ప్రాక్టీస్ ప్రారంభించారు. ఇండియన్ మెడికల్ అసోసియేషన్ చిలకలూరిపేటకు అధ్యక్షురాలుగా వ్యవహరించారు. చిలకలూరి పేట రోటరీక్లబ్ అధ్యక్షురాలుగా రెండు పర్యాయాలు ఎంపికయ్యారు. రోటరీక్లబ్ అధ్యక్షురాలుగా చిలకలూరిపేట ప్రాంతంలో 100కి పైగా బోర్‌వెల్స్ ఏర్పాటు చేయించారు.

1989లో జరిగిన సార్వత్రిక ఎన్నికల్లో చిలకలూరిపేట నియోజకవర్గం నుండివిజయం సాధించి తెలుగుదేశం పార్టీ అభ్యర్థిగా

ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో అడుగుపెట్టారు. చిలకలూరిపేట ప్రాంతంలోని యడవల్లిలో నందమూరి తారకరామఎత్తిపోతల పథకం ఏర్పాటుచేసి, వందలాది గ్రామాలకు నీటివసతి కల్పించారు. 15 కమ్యూనిటీ భవనాల నిర్మాణానికి దోహదం చేశారు. శాశ్వత గృహనిర్మాణ పథకం కింద 400 గృహాలను కట్టించారు. మెగా వైద్యశిబిరాలు ఏర్పాటు చేసి ఎందరికో వైద్య సలహాలు, చికిత్సలు అందించారు. గ్రామాలలోని నిరుపేద మహిళలకు టైలరింగ్‌లో ఉచితంగా శిక్షణగరపి, 100మందికి కుట్టుమిషన్లు పంపిణీ చేశారు. ఇంజనీరింగ్, మెడిసిన్ కోర్సులు చదివే నిరుపేద విద్యార్థులు దాదాపుగా 30మందికి హాస్టల్ వసతి కల్పించి, పరీక్ష ఫీజులు చెల్లించారు. ప్రస్తుతం వైద్యరంగానికే అంకితం అయ్యారు.

### 10. శ్రీమతి మేకతోటిసుచరిత:

ఈమె గుంటూరు జిల్లాలో 25-12-1972 న ఫిరంగిపురం గ్రామంలో జన్మించారు. తండ్రి నన్నం అంకారావు, తల్లిధనమ్మ. మధురైకామరాజు విశ్వవిద్యాలయం - దూరవిద్యా కేంద్రం నుండి బి.ఏ.డిగ్రీ 2003వ సంవత్సరంలో పొందారు. 2009వ సంవత్సరం జరిగిన సార్వత్రిక ఎన్నికల్లో ప్రత్తిపాడు నియోజకవర్గం నుండి విజయం సాధించి కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థిగా ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో అడుగు పెట్టారు. ప్రజాహిత కార్యక్రమాల్లో పాల్గొన్నారు. ఈమె ఎం.దయా సాగర్‌ను వివాహమాడారు. 2014 ఎన్నికల్లో (19) విజయం సాధించలేకపోయారు.

### 11. డాక్టర్ శనక్కాయల అరుణ :

ఈమె కర్ణాటక రాష్ట్రంలోని తుంగభద్రాడ్యాం ఏరియాలో 1950వ సంవత్సరం ఆగష్టు 14న జన్మించారు. తండ్రి తోట సుబ్బారావు, తల్లివీరరాఘవమ్మ. ప్రాథమికవిద్యతుంగభద్రా డ్యాం దగ్గర సెకండరీ విద్య నాగార్జునసాగర్ డ్యాం దగ్గర చదివారు. గుంటూరు మెడికల్ కాలేజినుండి ఎం.బి.బి.ఎస్. మరియు ఎం.డి. డిగ్రీలు పొందారు. డాక్టర్ ఎస్.జి.ఎస్. కృష్ణారావును వివాహమాడారు. 1979లో గుంటూరులో అహల్యా నర్సింగ్‌హోమ్ ప్రారంభించారు.

1999లో తటస్థులకోటాలో ఎంపికై, తెలుగుదేశం పార్టీ అభ్యర్థిగా గుంటూరు - 2వ నియోజకవర్గం నుండి పోటీచేసి, విజయం సాధించి, ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో అడుగుపెట్టారు. మొదటిపర్యాయమే వైద్య ఆరోగ్యశాఖామంత్రిగా ప్రమాణస్వీకారం చేశారు. రాష్ట్రంలోని ప్రభుత్వ వైద్యశాలల పనితీరు మెరుగుపరచేందుకు తగిన కృషి చేశారు. గుంటూరు జిల్లాలోని శాసనసభ్యులతో కలసి జిల్లా అభివృద్ధికి దోహదపడ్డారు. మెదడువాపు, హెపటైటిస్-బి-వంటి ప్రాణాంతక వ్యాధులకు పేద ప్రజలకు ఉచిత వ్యాక్సిన్లు అందించే ఏర్పాటుచేశారు. మొత్తం భారతదేశంలో కాశ్మీరు నుండి కన్యాకుమారి వరకు, బాంబేనుండి కలకత్తా వరకు పర్యాటన చేశారు. పదవీకాలం ముగిసిన తర్వాత రాజకీయాల్లో క్రియాశీలక కార్యకర్తగా ఉన్నారు. 2005వ సంవత్సరంలో అహల్యాట్రస్టు ఏర్పాటుచేసి దాని ఆధ్వర్యంలో గుంటూరు పట్టణంలోని మురికివాడల్లో గ్రామాలలో మెడికల్ క్యాంపులు నిర్వహించి రోగులకు ఉచితభోజనం, మందులు అందచేస్తున్నారు.

### 12. డాక్టర్ గోగినేని ఉమ :

ఈమె గుంటూరు జిల్లా తెనాలి వాస్తవ్యురాలు. 1958వ సంవత్సరం మార్చినెల 31వ తేదీన జన్మించారు. తండ్రి ప్లాస్టిక్ సర్జన్ డాక్టర్ డి.ఎల్.ఎన్.ప్రసాద్, తల్లి దొడ్డపనేని ఇందిర. హైదరాబాద్‌లోని స్టేన్లీ గరల్స్ హైస్కూల్లో స్కూలు విద్యపూర్తి చేశారు. అక్కడే వనితా మహావిద్యాలయంలో ఇంటర్మీడియట్ చదివారు. 1975 నుండి 1981 వరకు ఉస్మానియా మెడికల్‌కాలేజిలో ఎం.బి.బి.ఎస్, 1982 నుండి 1985వరకు గాంధీ మెడికల్ కాలేజిలో ఎం.డి.డి.జి.వో. పూర్తిచేశారు. ఆప్తమాలజిస్ట్ డాక్టర్ గోగినేని లక్ష్మీ ప్రసాద్ గారిని వివాహమాడారు. తెనాలిలో డాక్టర్‌గా 1992నుండి ప్రాక్టీస్ ప్రారంభించారు.

1999లో జరిగిన సార్వత్రిక ఎన్నికల్లో తెనాలి నియోజకవర్గం నుండి విజయం సాధించి, తెలుగుదేశం పార్టీ అభ్యర్థిగా ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో అడుగుపెట్టారు. తెనాలి ప్రాంతంలోని చినరావూరులోని పార్క్‌ను 'వుడా' నిధులతో అభివృద్ధిపరచారు. అమరావతి ప్లాట్స్‌లో ఇండోర్ స్టేడియంకు శంకుస్థాపనచేశారు. తెనాలిలో గవర్నమెంట్ హాస్పటల్‌ను ప్రారంభించారు. తెనాలి, తెనాలి పరిసరప్రాంతాలలో సి.సి.రోడ్లను ఏర్పాటుచేయించారు. సెంట్రల్ లైటింగ్ వేయించి, తెనాలి పట్టణ సుందరీకరణకు తోడ్పడ్డారు. ఉమెన్ అండ్ చైల్డ్‌వెల్ఫేర్ కమిటీ చైర్మన్‌గా వ్యవహరించారు. ఈమె శాసనసభ్యురాలుగా ఉన్నప్పుడే మొదటిసారిగా తెనాలి మునిసిపాలిటి ఎన్నికల్లో తెలుగు దేశం పార్టీ అభ్యర్థి చైర్మన్‌గా ఎన్నికయ్యారు. కొన్నాళ్ళు తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తల మండలిసభ్యురాలుగా కొనసాగారు. ఇంకా రాజకీయాల్లోనే ఉన్నారు.

### 13) శ్రీమతి పుతుంబాక భారతి :

ఈమె కృష్ణాజిల్లా శ్రీకాకుళం గ్రామంలో 1938వ సంవత్సరం

ఏప్రిల్ 17న జన్మించారు. తండ్రి తిరుమలశెట్టి శేషయ్య, తల్లి అలివేలమ్మ. ఆగ్రామంలోనే ఎలిమెంటరీ విద్యపూర్తచేశారు. 1954 డిసెంబర్ 31వ తేదీన పెసర్లంక గ్రామంలో పుతుంబాక వెంకటపతిని వర్ణాంతర వివాహం చేసుకున్నారు. పెండ్లి సందర్భంగా పెసర్లంక గ్రామంలో సహపంక్తి భోజనాలు జరిగాయి. పల్లెలోని దళితులు తినివదలి వేసిన ఆకుల్ని గ్రామస్తులు ఎత్తివేసి, కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టారు. ఈమె గుంటూరు జిల్లా కమ్యూనిస్టు (మార్క్సిస్టు) పార్టీ సెక్రటరీగా వ్యవహరించారు. 28సం॥ రాష్ట్రకమ్యూనిస్టు (మార్క్సిస్టు) పార్టీ ఉపాధ్యక్షురాలుగా ఉన్నారు. రైతుసంఘం స్టేట్‌కమిటీ సభ్యురాలుగా పనిచేశారు. నిత్యం ప్రజాసమస్యలపై పోరాడేవారు. డాక్టర్ అచ్చమాంబ, మోటూరి ఉదయం, మానికొండ సూర్యావతి వంటి సీనియర్ మహిళానాయకులు తర్వాత ఈమె గుంటూరు జిల్లా మహిళా సంఘాన్ని పునర్నిర్మించారు. 1994లో సత్తెనపల్లి నియోజక వర్గం నుండి అసెంబ్లీకి ఎన్నికయ్యారు. 1994నుండి 1999 వరకు అటు అసెంబ్లీలోను, ఇటు నియోజకవర్గం, రాష్ట్రంలోను మహిళా సమస్యలపై తీవ్రంగా పోరాడారు. రెంటచింతల గ్రామంలో ఒక హెడ్‌కానిస్టేబుల్ చేనేత కార్మికురాలుపై రేప్ చేయడానికి ప్రయత్నించగా ఆమె అవమానం భరించలేక కిరోసిన్ పోసుకొని, నిప్పంటించుకుంది. ఈ సంఘటనపై రెంటచింతలవెళ్ళి, గ్రామస్తులను కూడగట్టి, 800 మందితో ర్యాలీ జరిపి, అధికారులకు మహజర్లు సమర్పించి పుతుంబాక వెంకటపతిగారి సహకారంతో ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావును సంప్రదిస్తే, ఆయన అప్పటికప్పుడే అధికారులకు తగిన సూచనలిచ్చి తక్షణ సాయం కింద బాధితురాలుకు రూ.10వేల రూపాయలు రెంటచింతలలో10 సెంట్ల నివాసస్థలం, 5ఎకరాల భూమిగ్రాంటు చేశారు. సత్తెనపల్లిలో శిధిలావస్థలో ఉన్న ప్రభుత్వ వైద్యశాలస్థానే కొత్తబిల్డింగ్ నిర్మింపచేశారు. నందిగామ, వెలిగార్లపాడు గ్రామాలలో స్కూలు బిల్డింగులు కట్టించారు. పదవీకాలం ముగిసిన తర్వాతకూడా ఆమె రాష్ట్ర మహిళా సంఘం నేతృత్వంలో మహిళా సమస్యలపై పోరాటం చేస్తున్నారు.

### 14. శ్రీమతి కూచిపూడి విజయ :

ఈమె గుంటూరు జిల్లా ఈతేరులో 1962వ సంవత్సరం జనవరి నెల 16వ తేదీన జన్మించారు. తండ్రి జంగం కోటయ్య, తల్లి నాగరత్నం. ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం నుండి ఎం.ఎస్సీ డిగ్రీ పొందారు. ఎం.ఫిల్‌కూడ అక్కడే పూర్తిచేశారు. పి.హెచ్.డి డిగ్రీ పూర్తిచేయడానికి రిజిస్ట్రేషన్ చేయించుకున్నారు. అదే విశ్వవిద్యాలయంలో అసోసియేట్ ప్రొఫెసర్‌గా నియమితులయ్యారు. విద్యార్థి సంఘనాయకుడు కూచిపూడి సాంబశివరావును వివాహ మాడారు.గుంటూరు జిల్లా పరిషద్‌కు 2006లో జరిగిన ఎన్నికల్లో విజయం సాధించి, కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా గుంటూరుజిల్లా పరిషద్ చైర్మన్‌గా 2006 జూలై 23న ప్రమాణ స్వీకారం చేశారు. 2011 వరకు చైర్మన్‌గా కొనసాగారు.

గ్రామీణ ప్రాంతాలలో ప్రాథమిక విద్యకు ప్రాధాన్యం ఇచ్చారు. స్కూలు దశలో చదువుమానివేస్తున్న బాలికల సంఖ్యను గణనీయంగా తగ్గించడానికి శ్రద్ధ వహించారు. గుంటూరు జిల్లాలోని 354 జిల్లా పరిషద్ స్కూళ్లలోని 30వేలమంది విద్యార్థులకు "విజయదీపిక" పేరుతో స్టడీమెటీరియల్ అందించారు. ప్రతిస్కూలులో స్పెషల్ కోచింగ్ ఏర్పాటు చేయించారు. దీనికారణంగా క్రమంగా స్కూళ్లల్లో విద్యార్థుల రిజల్ట్స్ 72% నుండి 93% వరకు పెరిగింది. స్టడీ మెటీరియల్‌కు రూ.18,00,000/- గ్రాంటు ప్రత్యేకంగా ఏర్పాటు చేశారు. ప్రతి విద్యార్థికి న్యూట్రీషన్‌ఫుడ్ అందించడానికి Z.P.Funds నుండి రూ.2 1/2 వంతున కేటాయించడం జరిగింది. జిల్లాలోని 57 మంది Z.P.T.C మెంబర్లను ఐదు రాష్ట్రాలలో అవగాహనటూర్ ఏర్పాటుచేశారు. మహారాష్ట్రలో అన్నాహజారే గారి ఊరు సందర్శించి విషయాలు అవగాహన చేసుకొన్నారు. ఎస్సీ,ఎస్టీ కాలనీల్లో సి.సి.రోడ్లు వేయించడానికి ప్రాధాన్యం ఇచ్చారు. మాచర్ల ఏరియాలో మారుమూల ప్రాంతాల్లో నివశిస్తున్న తండావాసులకు మినీట్యాంకులు ఏర్పాటుచేయించి, పైపులద్వారా నీళ్ల సరఫరా చేయించారు. జిల్లాలోని ఇసుకరీచ్‌లపై పూర్తినిఘా ఉంచి, జిల్లా పరిషద్‌కు 2 1/2 కోట్ల రూపాయల నుండి 40 కోట్ల రూపాయల వరకు ఆదాయాన్ని రాబట్టగలిగారు. జిల్లా పరిషద్ ఆస్తులు దాదాపు 3వేల ఎకరాలు అన్యాక్రాంతం కాకుండా, వాటికి రికార్డులు తయారుచేయించి, తగిన జాగ్రత్తలు తీసుకున్నారు. 2008 అక్టోబర్‌లో న్యూఢిల్లీలో జరిగిన ఆలిండియా పంచాయితీ రాజ్ కాన్ఫరెన్స్‌లో బెస్ట్ జెడ్.పి. చైర్‌పర్సన్ అవార్డు అందుకొన్నారు.

### 15. శ్రీమతి షేక్ జానీమూన్ :

ఈమె గుంటూరుజిల్లా కొమ్మూరు గ్రామంలో 1989వ సంవత్సరం ఆగష్టునెల 5వ తేదీన జన్మించారు. తండ్రి షేక్‌సుబాని, తల్లిజిలేఖ. పెదనందిపాడు ఆర్ట్స్ & సైన్స్‌కాలేజీలో బి.ఎస్సీ కంప్యూటర్స్ డిగ్రీ పూర్తిచేశారు. షేక్ అబ్దులగఫార్‌ను వివాహమాడారు. గుంటూరుజిల్లా ప్రజాపరిషద్‌కు 2014లో జరిగిన ఎన్నికల్లో విజయం సాధించి, తెలుగుదేశం పార్టీ అభ్యర్థిగా జూలై 5వతేదీన జిల్లా పరిషద్ చైర్మన్‌గా ప్రమాణస్వీకారం చేశారు.

జిల్లాపరిషద్ స్కూళ్లల్లోని విద్యార్థులకు స్టడీ మెటీరియల్ అందజేస్తున్నారు. విద్యార్థులకు న్యూట్రీషన్‌ఫుడ్ కొరకు ఒక్కొక్కరికి

రూ.6/- నుండి రూ.7/- లకు పెంచి, సంవత్సరానికి 60 లక్షల రూపాయలు గ్రాంటు విడుదల చేస్తున్నారు. N.R.I. సెల్ ద్వారా 11/2 కోట్ల రూపాయలకు జిల్లా పరిషద్ నిధుల నుండి 1 1/2 కోట్ల రూపాయలు కలిపి, జిల్లా పరిషద్ స్కూళ్ళల్లో తరగతిగదుల నిర్మాణానికి, జిల్లాలో కమ్యూనిటీ హాల్స్‌నిర్మాణానికి, అంగన్‌వాడీ బిల్డింగ్స్ నిర్మంచడానికి ఖర్చు చేస్తున్నారు. జిల్లాలో 50 కోట్ల రూపాయలతో సి.సి.రోడ్లు, మెటల్‌రోడ్లు వేసి అభివృద్ధి చేస్తున్నారు.

### 16. డాక్టర్ కొల్లి శారద :

ఈమె చెన్నై పట్టణంలో 1939వ సంవత్సరం నవంబర్ 20వ తేదీన జన్మించారు. తండ్రి నార్ల వెంకటేశ్వరరావు తల్లి సులోచనాదేవి. ఎం.బి.బి.ఎస్ కోర్సు మద్రాస్‌లో చదివారు. ఎం.డి.కోర్సు ఆంధ్రా విశ్వవిద్యాలయంలో పూర్తి చేశారు. డాక్టర్ కొల్లి గంగాధరరావుగారిని వివాహమాడారు. 1964లో మెడికల్ ప్రాక్టీస్ ప్రారంభినిచారు. గుంటూరు మునిసిపల్ కార్పొరేషన్‌కు 1995లో జరిగిన ఎన్నికల్లో విజయంసాధించి, గుంటూరుటౌన్‌కు ప్రప్రథమ మేయర్‌గా తెలుగుదేశం పార్టీ అభ్యర్థిగా ప్రామాణ స్వీకారం చేశారు. గుంటూరు పట్టణాన్ని నగరంగా తీర్చిదిద్దడానికి ప్రణాళిక సిద్ధపరచారు. పట్టణంలో సిమెంట్ రోడ్లకు, డ్రైనేజి కాల్వలకు ప్రాధాన్యం ఇచ్చారు. ప్రజల నుండి 50% విరాళాలు సేకరించి, ప్రభుత్వమాచింగ్ గ్రాంటు కలిపి దాదాపు 100కోట్ల రూపాయలు సిమెంట్ రోడ్లకు, డ్రైనేజి కాల్వల నిర్మాణానికి ఖర్చుచేశారు. గుంటూరులోని గాంధీపార్క్ అభివృద్ధికి తోడ్పడ్డారు. స్త్రీ, శిశుసంక్షేమ కార్యక్రమాల్లో పాల్గొన్నారు. 1997 జూన్‌లో గుంటూరు టౌన్‌లో స్త్రీశక్తి సంస్థను ప్రారంభించారు. క్లీన్ & గ్రీన్ కార్యక్రమాలలో పాల్గొని నగరాన్ని సుందరంగా తీర్చిదిద్దడానికి ప్రయత్నించారు. మేయర్‌గా టర్కీ, శ్రీలంక, చైనా, అమెరికాదేశాలు పర్యటించివచ్చారు

### 17. శ్రీమతి తాడిపర్తి శారద :

ఈమె గుంటూరుజిల్లా తెనాలి పట్టణంలో 1945వ సంవత్సరం జూన్ నెల 25వతేదీన జన్మించారు. తండ్రి తాడిపర్తి వెంకటేశ్వరరావు, తల్లి సత్యవతీదేవి. తెనాలిలో పాఠశాల చదువుపూర్తిచేశారు. రంగస్థల మీద నటన ప్రారంభించారు. 15వ ఏట అంటే 1960వ సంవత్సరంలో "ఇద్దరు మిత్రులు"సినిమా ద్వారా సినీరంగ ప్రవేశం చేశారు. తరువాత మళయాళ సినిమా రంగంలో చక్కగా రాణించారు. ఇన్‌ప్రపుకల్ (ప్రేమపక్షులు) ఆత్మవు (చీకటిఆత్మ) చిత్రాలలో నటనావైదుష్యాన్ని ప్రదర్శించారు. మొదటగా "తులాభారం" సినిమాకు ఊర్వశి అవార్డు వచ్చింది. రెండవసారి "స్వయంవరం" సినిమాకు మూడవసారి "నిమజ్జనం" సినిమాకు ఊర్వశి అవార్డులు వచ్చాయి. తెలుగు సినీ రంగంలో "కాలంమారింది" "శారద" సినిమాలకు నంది అవార్డులు లభించాయి. "సర్దార్ పాపారాయుడు" సినిమాలోని నటనకు కళాసాగర్ వారి "ఉత్తమనటి" అవార్డు లభించింది.

సినీగ్లామర్‌తో తెలుగుదేశం పార్టీ అభ్యర్థిగా 1996లో జరిగిన సార్వత్రిక ఎన్నికల్లో తెనాలి పార్లమెంటరీ నియోజకవర్గం నుండి పోటీచేసి, విజయం సాధించి, పార్లమెంటులో అడుగుపెట్టారు. స్థానిక శాసనసభ్యులను సమన్వయం చేసుకుంటూ ప్రజాహిత కార్యక్రమాల్లో పాల్గొన్నారు. అర్థంతరంగా 11వ లోక్‌సభ రద్దుకావడంతో తిరిగి 12వ లోకసభకు తెనాలి పార్లమెంటరీ స్థానంనుండే పోటీ చేశారు. కాని విజయం లభించలేదు. తరువాతి కాలంలో తెలుగుదేశం పార్టీ కార్యకలాపాల్లో పాల్గొనేవారు.

### 18. శ్రీమతి దగ్గుబాటి పురంధరేశ్వరి :

ఈమె చెన్నై నగరంలో 1959వ సంవత్సరం ఏప్రిల్ నెల 22వ తేదీన జన్మించారు. తండ్రి నందమూరి తారకరామారావు, తల్లి బసవతారకం. చెన్నై నగరంలోని శాక్రిడ్‌హార్ట్ హైస్కూలులో స్కూలు విద్యను, ఎతిరాజ కళాశాలలో ప్రీయూనివర్సిటీకోర్సు పూర్తిచేశారు. అక్కడే బి.ఏ.డిగ్రీ పొందారు. బొంబాయిలో "జెమాలజీ" లో డిప్లొమాకోర్సు పూర్తిచేశారు. ప్రకాశం జిల్లా కారంచేడు వాస్తవ్యులు డాక్టర్ దగ్గుబాటి వెంకటేశ్వరరావును వివహమాడారు. తరువాత హైదరాబాదులో ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ జెమ్ అండ్ జ్యూయలరీని (రత్నాలు, ఆభరణాల విద్యాసంస్థను) స్థాపించారు.

2004వ సంవత్సరంలో జరిగిన సార్వత్రిక ఎన్నికల్లో బాపట్ల పార్లమెంటరీ నియోజకవర్గం నుండి పోటీచేసి విజయం సాధించి, పార్లమెంటులో అడుగుపెట్టారు. ప్రధానమంత్రి మన్మోహన్‌సింగ్ నేతృత్వంలో మానవవనరుల అభివృద్ధిశాఖలో సహాయమంత్రిగా వ్యవహరించారు. పార్లమెంటులో ఆమె చేసే ప్రసంగాలకు ప్రధాని మన్మోహన్‌సింగ్, లోక్‌సభస్పీకర్ సోమనాధ ఛటర్జీ, వ్యవసాయ శాస్త్రవేత్త ఎం.ఎస్.స్వామినాధన్ వంటి పెద్దలు ప్రశంసలు కురిపించే వారు. ఈమెను 2004-2005 వ సంవత్సరానికి ఉత్తమ పార్లమెంటేరియన్‌గా ఎంపికచేసి ఆసియన్‌ఏజ్ సంస్థవారు సత్క రించారు. ఈమె దేశవిదేశాలలో పర్యటించి పలు జాతీయ అంత ర్జాతీయ సమావేశాల్లో పాల్గొని ప్రసంగించేవారు. 2008వ సంవత్స రంలో అమెరికా ప్రథమ మహిళ లారాబూష్ ఆహ్వానం మేరకు "అక్షరాస్యత" అనే అంశంపై వైట్‌హౌస్‌లో ప్రసంగించారు. కర్నాటక

రాష్ట్ర మహిళావిశ్వవిద్యాలయం ఈమెకు గౌరవడాక్టరేట్ యిచ్చి సత్కరించింది. పార్లమెంటులోను బయట వేదికలపై ఈమె చేసిన ప్రసంగాలను "ఇన్‌క్వెస్ట్ ఆఫ్‌యుటోపియా" పేరుతో ఒక పుస్తకం వెలువడింది. పదవీకాలం తర్వాత రాజకీయ రంగంలో క్రియాశీలక కార్యకర్తగానే ఉన్నారు.

### 19. శ్రీమతి పనబాక లక్ష్మి :

ఈమె నెల్లూరు జిల్లా కావలి పట్టణంలో 1958వ సంవత్సరం అక్టోబరునెల 6వ తేదీన జన్మించారు. తండ్రి వెంకటేశ్వరరావు, తల్లి సీతారావమ్మ. ఆంధ్రావిశ్వవిద్యాలయంలో ఎం.ఏ.పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ కోర్సు చదివారు. 1985లో రైల్వే ఉద్యోగి పనబాక కృష్ణయ్యను పెండ్లి చేసుకున్నారు. మహిళా సంక్షేమ కార్యక్రమాలు స్వచ్ఛందంగా నిర్వహించడం ప్రారంభించారు. సాంస్కృతిక ప్రజాసేవ చేయాలనే ఆలోచనతో ప్రత్యక్ష రాజకీయాల్లో పాల్గొనే నిమిత్తం భారత జాతీయకాంగ్రెస్ పార్టీ సభ్యత్వం స్వీకరించారు.

1996లో జరిగిన సార్వత్రిక ఎన్నికల్లో నెల్లూరు పార్లమెంటరీ నియోజకవర్గం నుండి కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా పోటీచేసి పార్లమెంటులో అడుగుపెట్టారు. 1998లోను విజయం సాధించి, పార్లమెంటు సభ్యులుగా ఎన్నికయి, లోకసభలో రైల్వేశాఖాకమిటీ సభ్యురాలుగ పనిచేశారు. 2004లోను పార్లమెంటుకు ఎన్నికయ్యారు. ఆరోగ్య కుటుంబ సంక్షేమ సహాయమంత్రిగా పనిచేశారు. మంత్రిగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి విరివిగా ఆరోగ్య పథకాలు మంజూరుచేశారు. 2009 సాధారణ ఎన్నికల్లో బాపట్ల ఎస్.సి.నియోజకవర్గం నుండి గెలిచి, పార్లమెంటుకు వెళ్ళారు. కేంద్రప్రభుత్వంలో జౌళిశాఖా సహాయమంత్రిగా పనిచేశారు. కేంద్రమంత్రిగా పలుమార్లు రాష్ట్రంలో పర్యటించి ప్రజలతో కలిసిమెలిసి తిరిగేవారు. 2014లో తిరిగిపోటీ చేసినా, విజయం దక్కలేదు. ప్రస్తుతం రాజకీయాల్లో క్రియాశీలక కార్యకర్తగానే ఉన్నారు.

గుంటూరుజిల్లాలో మునిసిపల్ చైర్మెన్లుగా శ్రీమతి ఆలమూరి విజయలక్ష్మి డాక్టర్ తాడిబోయినమస్తానమ్మ, శ్రీమతి దొడ్డక సీతా మహాలక్ష్మి, శ్రీమతితవ్వా విజయలక్ష్మి, శ్రీమతి జరపల కోటీశ్వరీ బాయి, శ్రీమతి గోనుగుంట్ల జోగులాంబ గారలు చక్కగా రాణించారు.

ప్రస్తుతం గుంటూరు జిల్లాలో బాపట్ల మునిసిపల్ చైర్మన్‌గా శ్రీమతి తోటమల్లీశ్వరి, పొన్నూరు మునిసిపల్ చైర్మన్‌గా శ్రీమతి సజ్జాహేమ లత, చిలకలూరిపేట మునిసిపల్ చైర్మన్‌గా శ్రీమతి గంజి చెంచు కుమారి, పిడుగురాళ్ళ మునిసిపల్ చైర్మన్‌గా శ్రీమతి భవనాశి లలిత, మాచర్లమునిసిపల్ చైర్మన్‌గా శ్రీమతిగోపవరపు శ్రీదేవి పరిపాలనా బాధ్యతలు చక్కగా నిర్వహిస్తున్నారు.

*చిరునామా :* ***డాక్టర్ వెన్నిసెట్టి సింగారావు,*** ఇంటినెం. 371, పార్కురోడ్డు, 6వలైను, కృష్ణనగర్, గుంటూరు -522006
సెల్ నెం. 9393015584

ఆచార్య మన్నవ సత్యనారాయణ

# అమరావతి నేపథ్యంగా సాగిన అమరావతి కథలు

బండారు అచ్చమాంబ 'ధనత్రయోదశి'తో ప్రారంభమైన ఆధునిక తెలుగుకథ 'ఇంతింతై వటుడింతై' అన్నట్లు పెరిగి శాఖోప శాఖలుగా విస్తరించింది. అంతర్జాతీయస్థాయికి చేరుకుని పురస్కారాన్ని కూడా అందుకుంది. ఒక అంచనా ప్రకారం ఇప్పటివరకు తెలుగులో వచ్చిన కథలసంఖ్య మూడులక్షలు ఉంటుంది అంటే ఆశ్చర్యంగానూ, ఆనందంగానూ కూడా ఉంటుంది. ఇంత విస్తృతంగా విస్తరించిన తెలుగు కథా ప్రక్రియలో ఎన్నో మలుపులు వైవిధ్యంతో కూడిన ఇతివృత్తాలు, సజీవమైన పాత్రచిత్రణ, సహజసిద్ధమైన వర్ణన ఇలా నాటినుండి నేటివరకు తెలుగుకథ ముందుకు సాగుతూనే వుంది. స్థూలంగా పరిశీలిస్తే రచయితలలో కథలు రాసేవారే ఎక్కువ.

సుప్రసిద్ధ తెలుగు కథకులలో ఒక్కొక్కరిది ఒక్కొక్క మార్గం. ఒక్కొక్కరిది ఒక్కొక్క ప్రత్యేకశైలి. ఈవిధంగా కొనసాగుతున్న తెలుగు కథా సాహిత్యాన్ని పరిశీలిస్తే మనకు కొన్ని ప్రత్యేక అంశాలు గోచరిస్తాయి. వాటిలో ప్రధానమైనది ఒక ప్రాంతాన్ని నేపథ్యంగా స్వీకరించి కథారచనం చేయటం. కథాశిల్పంలో నేపథ్యం ఒక అంగం. కొందరు కథాకారులు నేపథ్యం లేకుండా కూడా కథారచన చేశారు. నేపథ్యంతో కూడిన కథలకు సహజత్వం చేకూరి పాఠకులకుమంచి అనుభూతిని అందిస్తాయి. గోదావరి కథలు, భట్టిప్రోలు కథలు, పసలపూడి కథలు, మిట్టూరోడి కథలు ఇందుకు ఉదాహరణలు.

ఈ ఒరవడిలోనే వెలువడినవి సత్యం శంకరమంచి అమరావతి కథలు. అమరావతి నేపథ్యంగా స్వీకరించి సత్యం శంకరమంచి వందకు పైగా కథలు రాశారు. అప్పట్లో ఈ కథలు ఆంధ్రజ్యోతి వారపత్రికలో ధారావాహికంగా ప్రచురింపబడ్డాయి. తరువాత పుస్తక రూపంలో పలు ముద్రణలు పొందాయి. జ్యోతిలో ధారావాహికంగా ప్రచురింపబడుతున్నరోజులలో ఈ కథలకు పాఠకుల నుండి మంచి ఆదరణ లభించింది. ఆమధ్య కొన్ని అమరావతి కథలు దూర దర్శన్‌లో నాటికలరూపంలో ప్రసారమై ప్రేక్షకులను ఎంతగానో అలరించాయి.

అమరావతి ప్రాంతం ఒకనాటి ఆంధ్రుల రాజధాని శతాబ్దాల క్రితమే ఈ ప్రాంతంలో సుస్థిర పరిపాలన నెలకొని తెలుగుకీర్తి ఖండాం తరాలకు వ్యాపించింది. చరిత్రపుటలలో అమరావతికి గల స్థానాన్ని గురించి ప్రత్యేకంగా ఇప్పుడు చెప్పవలసిన పనిలేదు. కాలగమనంలో అమరావతి గత వైభవాన్ని కోల్పోయి అనేక మార్పులకు లోనవుతూ వచ్చింది. ఇది చారిత్రక సత్యం. లోకసహజం కూడా.

అమరావతి ప్రాంతానికి నేపథ్యంగా స్వీకరించి వందకు పైగా కథలు రాసిన సత్యం శంకరమంచి ఎంతైనా అభినందనీయుడు. ఒక ప్రాంతాన్ని నేపథ్యంగా తీసుకుని ప్రతీ కథ పాఠకుని రంజింపజేసే విధంగా 100 కథలు రాయటం అంత సామాన్యమైన విషయం కాదు.

సత్యం శంకరమంచి జన్మస్థలం అమరావతి. అమరావతిలోనే పెరిగిన సత్యం అమరావతిలోని ప్రజల జీవనవిధానాన్ని ఎంతో సునిశితంగా పరిశీలించి మనస్సులో నిక్షేపించుకుని ఆయా కథలలో తాను గడించిన అనుభవాన్ని ప్రజల జీవన విధానాన్ని పొందుపరిచి అద్భుతమైన కథలను మనకు అందించారు. ఈ కథలు చదువు తున్నప్పుడు మనం కూడా నాటి అమరావతిలో ప్రజలమధ్య ఉంటున్న అనుభూతి కలుగుతుంది. నాటి అని ఎందుకు అనవలసివచ్చిందంటే శంకరమంచి నివసించిన నాటి పరిస్థితులు ఈనాడు అమరావతిలో లేవు. అన్ని గ్రామాల్లాగా, పట్టణాలలాగా అమరావతి కూడా మార్పులకు లోనైంది. ఇలా జరగడం సహజం.

అమరావతిలోని ప్రజలు ఏటిగాలి కృష్ణానది. కృష్ణానదిలో ప్రవేశించే నీరు నదిలోని పడవలు కూలీజనం చేపలను వేటాడేవారు. అమరలింగస్వామి దేవాలయం ధ్వజస్తంభం దాని గంటలూ, రథమూ

అమరావతి వీథులు అమరావతిలోని మట్టి మొదలైనవన్నీ శంకర మంచి కథలలో ప్రధాన పాత్ర వహిస్తాయి.

అమరావతి కథలకు ముందుమాట వ్రాస్తూ ముళ్ళపూడి వెంకట రమణ తమ అభిప్రాయాన్ని ఈవిధంగా వెలిబుచ్చారు. ఈ కథలు నిజానికి ఏ శతాబ్దానికైనా గొప్పవే. తెలుగులో మల్లాది రామకృష్ణశాస్త్రి, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ వంటి మహనీయుల రచనల సరసన పెద్దపీట వేసి గౌరవించతగినవి.

సత్యం శంకమంచి శైలి ఎంతో ఆకర్షణీయంగా ఉంటుంది. అసలు కథ ఒకరు చెబుతూ ఉండగా నలుగురు వినడం అనేది ఒకనాటి సంప్రదాయం. అచ్చుయంత్రాలు వచ్చి పత్రికలలోనూ ఇతర మాధ్యమాలలోనూ ప్రచురింపబడటం కథా సంకలనాలు వెలువడటం మొదలైన తరువాత కథలను చదివే అవకాశం ఏర్పడింది. కాని నిజానికి కథ చదువుతున్నప్పటికంటే వింటున్నప్పుడే మంచి అనుభూతి కలుగుతుంది. ఈ సందర్భంలో శంకరమంచి రచనావిధానంలో ప్రధానమైన శైలిని గురించి కొంత ప్రస్తావించటం అవసరం. మన ఎదుట కూర్చుని శంకరమంచి స్వయముగా కథ చెబుతున్నట్లుగా అమరావతి కథల రచన సాగింది. అంటే కథలలోని, పదాలలోనూ, వాక్యాలలోనూ మనకు సత్యం శంకరమంచి వినిపిస్తూ ఉంటారు.

ఆయన అలంకారిక శైలికి ఉదాహరణగా ఈ వాక్యాలను పరిశీలిద్దాం. "పగపట్టిన తాచుపాము ఎదురుగా వచ్చి నుంచుని కాలు కాటేద్దామా, వేలు కాటేద్దామా అని చూస్తున్నట్లుంది భూమయ్య చూపు" "అవధాన్లుగారు కృష్ణమ్మ గొంతెత్తి ఆశీర్వచనపనస చదువు తుంటే దేవతలు దిగివచ్చి దీవిస్తున్నట్టుండేది. ఆయన గంభీరమైన కంఠంనుంచి వేదం వెలువడుతుంటే సుస్వరంగా ఉన్న మంచి సన్నాయివాద్యం వింటున్నట్టు ఉండేది". పై ఉదాహరణలోని ఉపమా లంకారాలను గమనిస్తే శంకరమంచి శైలీ విన్యాసం అర్థమవుతుంది.

అమరావతి కథలు చదువుతున్నప్పుడు కొన్ని సందర్భాలలో సత్యం శంకరమంచిలోని చిత్రకారుడు మనకు కనిపిస్తాడు. ఆయన పాత్రలను అక్షరాల వర్ణాలతో మనముందు చిత్రించి కూర్చోబెడతాడు. ఉదాహరణకు శరభయ్య పాత్రను గమనించండి. "శరభయ్య అరవయ్యేళ్ళ వృద్ధుడు. బవిరిగడ్డం, ఆ గడ్డం వెనకాతల నవ్వుతున్న పెదవులు, ముడుతల ముఖంలో వెలుగుతున్న కళ్ళు, నుదుట మూడు పాయలుగా తెల్లని విభూతి, ఆ విభూతి చారల మధ్య సాయం సూర్యుడిలా పెద్దకుంకంబొట్టు, చేతులకి, ఛాతికి కర్మబంధాలు కట్టి పడేసినట్టు పెద్దపెద్ద విభూతి పోయాయి. చిరిగిపోయినా శుభ్రమైన పట్టుబట్టకట్టాడు శరభయ్య.

దేవాలయంలో అర్చకత్వం నిర్వహించేవారందరూ సంపన్నులు అనుకోవటం భ్రమ. వారిలో కూడా పేదరికాన్ని అనుభవించే వారెందరో. అర్చకుల పేదరికాన్ని ఇతివృత్తంగా స్వీకరించి శంకర మంచి 'తులసితాంబూలం' అనే కథను రాశాడు. పేదరికంలో కూడా భార్యాభర్తలూ ఒకరినొకరు అర్థంచేసుకుని అన్యోన్యంగా కలసి ఉండాలన్న సందేశం ఈ కథలో అన్యాపదేశంగా కనిపిస్తుంది. భోజనం లేక కేవలం భార్యాభర్తలిద్దరూ తులసితాంబూలంతో సరిపెట్టుకోవటం హృదయాన్ని కదిలిస్తుంది.

శంకరమంచి కథలలో 'ఎంగిలా" ? అన్నది విలక్షణమైన కథ. భార్యాభర్తలు దాంపత్యసుఖానికి అతీతంగా కేవలం ఎవరి ఇష్టదైవాన్ని వారు ధ్యానిస్తూ కాలం గడపటం ఈ కథలోని ప్రత్యేకత. ఈ కథలో రామశాస్త్రి భర్త, శ్రీదేవమ్మ భార్య. కర్మిష్ఠి అయిన రామశాస్త్రి తన ధ్యానం తనది అన్నట్టుగా జీవించేవాడు. శ్రీదేవమ్మ కామాక్షిదేవి ధ్యానంతో కాలం గడుపుతూ ఉండేది. వీరిద్దరూ లోకం దృష్టిలో మాత్రమే భార్యాభర్తలు. ఇలా కొంతకాలం గడిచిపోతుంది. ఒకనాడు కృష్ణలో స్నానానికి వెళ్ళిన రామశాస్త్రి చూచిన దృశ్యం అతనిలో పెనుమార్పుకు కారణమై జీవితాన్ని మలుపు తిప్పుతుంది. ఆ క్షణంలో రామశాస్త్రికి భార్యపట్ల ఎలా ప్రవర్తించాలో అర్థమవుతుంది. భార్యా భర్తలిద్దరూ తమ దాంపత్య ధర్మాన్ని గుర్తించడంతో కథ ముస్తుంది. ఈ కథను నడిపిన శంకరమంచి నేర్పు గమనార్హం.

శంకరమంచి కథలలో శృంగార రస ప్రధానమైవి కూడా ఉన్నాయి. అయితే ఎక్కడా శృతిమించిన శృంగారానికి అతిపేలవమైన శృంగారానికి అవకాశమివ్వకుండా ఎంతో జాగురూకతో కథానిర్వహణ చేశారు. శృంగార రస పవిత్రతను నిరూపించే ప్రయత్నం చేశారు. ఉదాహరణకు "వయసొచ్చింది" లాంటి కథలను మనం పరిశీలించ వచ్చు. ఈ కోవకు చెందినదే 'పున్నాగవాన' కూడా.

అమరావతిలో జన్మించిన సత్యం శంకరమంచికి కృష్ణానదితో విడదీయరాని అనుబంధం ఉంది. ఆయన రాసిన ప్రతి కథలోను కృష్ణానది ప్రస్తావన ఉండటం గమనార్హం. కృష్ణానదిలో జరిగే దైనందిన కార్యకలాపాలను ఈవిధంగా ఒక కథలో వర్ణించారు. "ఒక్కో తెప్పకొయ్యమీద ఇద్దరేసి పడుకొని ఈదుతున్నారు. కొందరు ఆవుతోకలు పట్టుకుని ఈదుతున్నారు. గేదెతోకలు పట్టారు. మందలో అటూ ఇటూ బెదిరిపోతున్న పశువులవైపు 'రయ్‌రయ్'మని ఈదు

కుంటూ వెళ్ళి తిరిగి మందలో కలుపుతున్నారు. అలా వందలాది పశువులు ప్రవాహంలో ఈదుకుపోతుంటే పశువుల తెప్ప కృష్ణలో కదలిపోతున్నట్లుంది".

కోటివిద్యలు కూటికొరకే అన్నది సామెత. కుటుంబపోషణకు ఒక వ్యక్తి సన్యాసిగా నటించటం తద్వారా భక్తులనుండి వచ్చేదాంతో కుటుంబపోషణ చూసుకోవటం 'ఎవరాపోయేది' అన్న కథ ఇతివృత్తం. కపట సన్యాసిగా నటిస్తూ భక్తులను వంచించి వారినుండి తన కుటుంబపోషణకు రావలసినవన్నీ రాబట్టుకుంటూ ఉంటాడు. ఒకనాడు తనపట్ల తన కుటుంబసభ్యుల నిర్లక్ష్యాన్ని గమనించి తానేమిటో తెలుసుకుని అసలైన వైరాగ్యంతో అన్ని బంధాలను తెంచుకుని నిజమైన సన్యాసాన్ని స్వీకరించి కాశీకి వెళ్ళిపోతాడు. ప్రస్తుత సమాజంలో కపట సన్యాసుల సంఖ్య ఎక్కువగా మనకు కనిపిస్తుంది. విద్యాధికులు సైతం వీరి ఉచ్చులో చిక్కుకుని మోసపోతున్నారు. భక్తి ముసుగులో కపటస్వామీజీలు చేయరాని అకృత్యాలు లేవు. శంకరమంచి రాసిన ఎవరాపోయేది అన్న కథ ఈనాటి పాఠకులలో చైతన్యాన్ని కలిగిస్తుంది అనటంలో సందేహం లేదు.

సత్యం శకంరమంచి రాసిన కథలలో కాల్పనికత కంటే వాస్తవికత, సహజత్వం ఎక్కువగా కనిపిస్తాయి. వీరి కథల్లోని సహజత్వమే వీరి కథలకు జీవలక్షణం. 'ముద్దులల్లుడు' అనే కథలో అమరావతి నుండి గుంటూరు వెళ్ళే బస్సు తీరుతెన్నులను అతిసహజంగా వివరించారు. ఆ రోజుల్లో బస్సులు ప్రైవేటు యాజమాన్యంతో నడిచేవి. అంటే యజమాని ఇష్టప్రకారం బస్సు ప్రయాణం సాగేది. ఈ విషయాన్ని పై కథలో అద్భుతంగా వర్ణించారు. బస్సు ప్రయాణీకుల బాధలను కూడా సహజంగా ప్రస్తావించారు.

గ్రామీణ వాతావరణం నేపథ్యంగా సాగిన కథ 'బలి'. సాధారణంగా గ్రామాలలో ఒకరినొకరు ద్వేషించుకోవటం అందరికంటే తామే అధికులమని భావించటం పరిపాలి. ఇందుకు అనుగుణంగా వర్గాలను సమీకరించుకోవటం సమయం వచ్చినప్పుడు ఘర్షణలకు దిగటం కూడా సర్వసాధారణం. 'బలి' అనే కథలో సూరయ్య, శేషయ్య ప్రత్యర్థులు. గ్రామదేవతకు తమ మేకని బలివ్వాలని ఒకరికొకరు పోటీ పడటంలో ఉద్రిక్తత నెలకొంటుంది. వయస్సు మళ్ళిన పెద్దల సర్దుబాటుతో అది సమసిపోయినా చివరకు పంటకుప్పలు తగలబెట్టుకోవటం వంటి అకృత్యాలు జరుగుతాయి. ఇది వాస్తవానికి కథే అయినా సాధారణంగా గ్రామాలలో కక్ష్యలు కార్పణ్యాలతో ఇటువంటి సంఘటనలు జరుగుతూ ఉండటం నేటికి మనం చూస్తూనే వున్నాం. ఈ వాస్తవాన్ని కథానుగుణంగా మలచి, ఎంతో సహజంగా శంకరమంచి పాఠకులకు అందించాడు.

గ్రామీణ కక్షలు విషయం అలా వుంచితే గ్రామీణ స్త్రీలలో సర్వసాధారణంగా ఉండే పరస్పర ద్వేష భావాన్ని వివరిస్తూ శంకరమంచి ఒక కథ రాశారు. ఒకరినొకరు ద్వేషించుకుంటున్న స్త్రీల సంభాషణ ఈవిధంగా సాగింది.

**"తంపులు పెట్టి తన్నుకుంటే చూద్దామనుకునేదానా ?**
**నేను తగాదాలు పెడ్తానా ?**
**నేను తంపులు పెడ్తానా ?**

నన్ను చూస్తే చాలు కళ్ళలో నిప్పులు పోసుకుంటావు నేను చంద్రహారం చేయించుకొన్నాననేగా నీ మంట.

ఓ యబ్బ ! నగలు ! వెలిగిపోతుంది ఐశ్వర్యం. మొన్న పెళ్ళిలో బంతిపాట నేను పాడానని కదూ నీ ఏడుపు ?

**ఆహా ఏమి పాట ? వినలేక చచ్చాం**
**చస్తే ఇక్కడకి దెయ్యమై వచ్చేవా ?**
**నన్ను చావమంటావా రాక్షసీ !**

అప్పడాల కర్రలు తీసుకుని ఒకళ్ళమీదికి ఒకళ్ళు లేచారు.

పై సంభాషణ ఎంత సహజసుందరంగా ఉందో ఎంత హాస్యరస స్ఫోరకంగా ఉందో ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. రచయితకు ఎంతో పరిశీలన జ్ఞానం వుంటే తప్ప ఈ విధమైన సంభాషణ రాయటం సాధ్యపడదు.

శంకరమంచి రాసిన వాస్తవికత ఉట్టిపడే మరో మంచికథ 'తంపులమారి సోమలింగం'. ఈ కథలో ప్రధాన పాత్ర సోమలింగం. సోమలింగం సూటిగా చూస్తే పచ్చనిచెట్టు మాడిపోతుంది. నడిచే నేలన పచ్చిక కూడా మొలవదు. అంతటి పుణ్యపురుషుడు కాబటే భర్త విశ్వరూపం చూడలేకనో యేమో ఇల్లాలు చిన్నప్పుడే పరలోకం చేరింది.....సోమలింగానికి పచ్చటి ఆకులన్నా పసుపు తాళ్ళన్నా గొప్ప చిరాకు మనుషుల మధ్య లేనిపోయినవి సృష్టించి తగవులు పెట్టి ప్రశాంత వాతావరణాన్ని భగ్నం చేసేవారికి ప్రతినిధి సోమలింగం. సోమలింగం లాంటి మనుషులు ఎంతోమంది మనకు నిత్యం తారసపడుతూనే వుంటారు. వారికి ఎప్పుడూ ఎవరికో ఒకరికి ఏదో ఒకటి చెప్పి అలజడి సృష్టించటం, తద్వారా ఆనందించటం వీరి దినచర్య. వీరి మరణానంతరం కూడా గ్రామాలలోని ప్రజలు ఏదో ఒక ఘర్షణతో కొట్టుకుపోవాలనేది వీరి కోరిక. ఈ విషయాన్ని వాస్తవానికి ఎంత

దగ్గరగా సోమలింగం పాత్ర ద్వారా శంకరమంచి మనకందించిన తీరు ప్రశంసనీయం. ఈ కథలను చదివి వీటివెనక దాగి ఉన్న ఆంతర్యాన్ని గమనించి మసలుకోవటం ఎంతైనా అవసరం.

పంచభూతాలలో వాయువు ఒకటి గాలిని ప్రధాన పాత్రగా చేసి 'స్తంభన' అనే కథను శంకరమంచి అద్భుతంగా రాశారు. అమరావతి కథలలో స్తంభన విలక్షణమైన కథ. దీనిని కథ అనటం కంటే గల్పిక అంటే సముచితం. వీచేగాలి ఒకటే అయినా అది వీచే తీరులు అనేకం. ఆ గాలి వీచే విధానాన్ని రచయిత ఈవిధంగా వర్ణించాడు.

"కృష్ణంతాగాలి

ఆకాశమంతా గాలి

అల్ల అమరలింగేశ్వర శిఖరం చుట్టూ గాలి. ధ్వజస్తంభం చుట్టూతా గాలి. గాలి ధ్వజస్తంభం చిరుగంటలు వూపుతోంది. ఆ గంటల మోతకి అనువుగా రెండు రామచిలకలు ముక్కులు పొడుచు కుంటున్నాయి. గాలిగోపురం శిఖరాల గాలి పోరాడుతుంది. పక్కనున్న వేపచెట్ల మీద గాలి గంతులేస్తుంది. సగంకట్టి ఆపేసిన రథశాలని దిగాలుగా పలకరిస్తోంది. చిన్న రథం మీద చెక్కిన చిలకల ముక్కులు ఎవరో విరగ్గొడితే వాటిని జాలిగా బుజ్జగిస్తోంది.

అల్లా అంచెలంచెలుగా వచ్చిన కృష్ణగాలిని వూరి గాలి కలుసు కుంది. ఇంతలో పైరగాలి పరుగెత్తుకొచ్చింది. పచ్చటిగాలి కంకుల గాలి, కండెలగాలి, కాయలగాలి, పువ్వులగాలి, పూతంగాలి నేలవాసన పూసుకుని వూరంతా పరచుకుంది. ఆకాశమంతా నిండిపోయింది. ఈవిధమైన వర్ణన రచయిత రచనా నైపుణ్యానికి గొప్ప ఉదాహరణ.

ఆరుగాలం కష్టపడి లోకానికి అన్నంపెట్టే రైతు బ్రతుకులు మాత్రం దుర్భరంగానే ఉంటాయి. ఇది జగమెరిగిన సత్యం. ఈ విషయాన్ని శంకరమంచి ఈవిధంగా ప్రస్తావించారు. ఓ అయ్య నాగలి భుజాని కెత్తుకుని ఎదురొస్తున్నాడు. నేలని నమ్ముకున్నా ఆ అయ్యా ! మనకి పెరుగన్నం, పాలబువ్వ అందించే ఆ అయ్య రెండుపూటలా సంకటే తింటాడు. ముద్దలో నేతిబొట్టు ఎరగడు.

శంకరమంచి రాసిన 'ఆగని ఉయ్యాల' కరుణ రసకథ ప్రధానంగా సాగింది. మాటలు రాని మూగపిల్లను కోరి పెళ్ళాడిన రంగడనే యువకుడు సంవత్సరం తిరగకుండానే అకాలమరణం చెందటం ఈ కథలోని ప్రధాన ఇతివృత్తం. ఈ కథ చదివిన పాఠకుడు కంట తడిపెట్టకుండా వుండలేడు.

తరాలు గడుస్తున్నకొద్దీ ఆలోచనావిధానాలు మారుతున్నాయి. సంప్రదాయం క్రమంగా క్షీణిస్తోంది. దీనిని పెద్దలు చూచి సహించలేక బాధపడుతూంటారు. ఈ విషయాన్నే 'దీపంజ్యోతి' అనే కథలో రచయిత ప్రస్తావించారు. కావమ్మ వృద్ధురాలు సంప్రదాయాన్ని తూచ తప్పకుండా పాటిస్తూ పుణ్యకార్యాలు చేస్తూ ఉంటుంది. ఆమె మనుమడు వర్ణాంతర వివాహం చేసుకున్నాడని తెలిసి కుంగిపోతుంది. అయితే కొత్త పెళ్ళికూతురు తనలాగా పూజాధికాలు నిర్వహించడానికి కార్తీకదీపారాధనలు చేసి కృష్ణలో వదలడానికి సంసిద్ధతను వ్యక్తం చేయటంతో కావమ్మ బాధను విడిచి సంతోషిస్తుంది. ఏమైనా సంప్ర దాయం నిలబడుతుంది గదా అని సంతోషిస్తుంది. అంటే వర్ణవ్యవస్థతో పనిలేకుండా సంప్రదాయాలను కాపాడగలిగితే అది సమాజానికి మేలు చేస్తుందని రచయిత అంతర్గతంగా ఈ కథలో సూచించాడు.

"ఆకలి రుచి ఎరుగదు నిద్ర సుఖమెరుగదు" అన్నది సామెత. బాగా ఆకలి వేసినప్పుడు సంప్రదాయం వర్ణవ్యవస్థ మొదలైన విషయా లేవి గుర్తుకురావు. ముందు ఆకలి బాధనుండి ఎలా ఉపశమనం పొందాలి అన్నది మాత్రమే ఆలోచన ఈ వాస్తవాన్ని 'వరద' అనే కథలో రచయిత సహజధోరణిలో నిరూపించాడు. అమరావతికి వరద వచ్చినప్పుడు అన్ని వర్ణాలవారు కలిసి ఒకేచోట భోజనం చేయటం ఈ కథలోని ప్రధానాంశం. ఉచ్చనీచాలన్న భావాన్ని విడిచి హాయిగా అన్ని వర్ణాలవారు కలసి భోజనం చేయటం ఈ కథలోని ప్రధానాంశం. ఎవరు వడ్డిస్తున్నారు తమ ప్రక్కన ఎవరు కూర్చున్నారు అన్నవేవీ పట్టించుకోకుండా సహపంక్తి భోజనం చేయటం వలన అందరిలోను సమభావం నెలకొంటుంది. చిత్రమేమంటే వరద తగ్గిన తరువాత ఆచారాలు అంటరానితనం మళ్ళీ మామూలే. ఇదొక చిత్రమైన ప్రవృత్తి. ఈ ప్రవృత్తిని సత్యం శంకరమంచి వరదలో ఆవిష్కరించారు.

కథలు రాయడంలో ఎంత నైపుణ్యాన్ని ప్రదర్శించాలో సత్యం శంకరమంచి ఆ కథలకు శీర్షికలు పెట్టే విషయంలో కూడా అంత ప్రత్యేకశ్రద్ధను ప్రదర్శించారు. సాధారణంగా పాఠకుని ముందుగా ఆకర్షించేది శీర్షిక. శీర్షికను బట్టి ఆ కథను చదవాలన్న ఉత్సుకత పాఠకునిలో కలుగుతుంది. ఈ సాహిత్య మర్మాన్ని గ్రహించిన సత్యం శంకరమంచి కథల శీర్షికలను కూడా ఆసక్తిజనకంగా ఏర్పరిచారు. ఉదాహరణకు ఎవరాపోయేది, వరద, స్తంభన, ఉయ్యాల ఊగుతూనే వుంది. దూరంగ సారంగధర మొదలైనవి.

తెలుగుకథ సారస్వతంలో అమరావతి కథలకు ఒక ప్రత్యేకస్థానం కథారచయిత సత్యం శంకరమంచికి కథకునిగా ప్రత్యేక గుర్తింపు ఉంటుంది. అమరావతిని కేంద్రబిందువుగా చేసుకుని శతాధిక కథా రచన చేయటం అంత సామాన్యమైన విషయం కాదు. అసామాన్యమైన దానిని తన కథన చాతుర్యంతో ప్రతి కథా హృద్యంగా ఉండేవిధంగా మనకందించిన సత్యం శంకరమంచి కృషి అభినందనీయం. వీరు ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో పనిచేస్తూ 'హరహరమహాదేవ' వంటి అద్భుతమైన నాటకాలను కూడా అందించి శ్రోతలను రంజింప చేశారు.

కృష్ణాతీరం కవులకు గాయకులకు కళాకారులకు ఎందరికో జన్మ నిచ్చింది. ఈ తీరంలో జన్మించిన కవిగాయకులెందరో అంత ర్జాతీయ కీర్తిని ఆర్జించటం తెలుగువారికి నిజంగా గర్వకారణం. అదేవిధంగా అమరావతి ప్రాంతం ఒకనాడు పరిపాలనాపరంగా ఎంతో చారిత్రక ప్రసిద్ధిని వహించింది. తిరిగి ఆంధ్రప్రదేశ్‌కు రాజధానిగా అవత రించింది. ఆంధ్రప్రదేశ్ రాజధానిగా గతకాలపు ప్రాభవ వైభవాలను మళ్ళీ సంతరించుకుని ప్రపంచ ప్రఖ్యాతి వహించాలని ఆకాంక్ష. ఈ ప్రాంతమంతా పాడిపంటలతో సుభిక్షమైన ఆరోగ్యకరమైన, ఆహ్లాద కరమైన వాతావరణంలో ప్రజాజీవితం సుఖసౌఖ్యాలతో కొనసాగాలని ఆశిద్దాం.

*చిరునామా : ఆచార్య మన్నవ సత్యనారాయణ, ఆచార్య నాగార్జునవిశ్వవిద్యాలయం, చరవాణి – 9701550300.*
*స్థిరవాణి : 08644 277960*

శ్రీ విహారి

# ఆంధ్ర కృష్ణాతీరం - తెలుగు కవిత్వం

**ప్రవేశిక :**

కృష్ణాతీర ఆంధ్రప్రాంతం అనగానే కృష్ణా, గుంటూరు జిల్లాలు స్ఫురిస్తాయి. కానీ, నవ్యాంధ్రప్రదేశ్‌లోని కర్నూలు జిల్లా కూడా కృష్ణా తుంగభద్రానదీ పరివాహక ప్రదేశంలో ఉన్నది. కనుక-కృష్ణా తీరాంధ్ర ప్రాంతం అంటే కృష్ణా, గుంటూరు, కర్నూలు జిల్లాలుగా గమనించాలి.

రాజకీయ, కళాసాహిత్య సాంస్కృతిక సామాజికశాస్త్ర వైజ్ఞానిక రంగాల్లో ఈ ప్రాంతం ఒక విలక్షణతనీ, ప్రత్యేకతనీ సంతరించుకుని ఉంది. ఇక్కడి నాగరికతకీ, సంస్కృతికీ ఒక ప్రత్యేక అస్తిత్వం ఉంది. 'స్వాగతంబోయి ఓ స్వాతంత్ర్యవీరుడా / ఇట నుండు మనుచు కోయిలలు పిలుచు' అన్న మల్లాదివారి (ఘంటసాల గళంలోని) ఆహ్వాన పత్రికకు నెలవు ఇది. అలాంటి అచ్చమైన స్వాభావిక మనో నైర్మల్యానికి ఉనికి పట్టు ఇది. ఈ గడ్డ పోతుగడ్డ. చారిత్రక ప్రాధాన్యతని సంతరించుకుని ఉన్న భూమి. 'గత చారిత్రక యశఃకలాపం' వద్దన్న మహాశయుడే 'సంప్రదాయం నిలిచే ఉంటుంది హమేషా' అన్నాడు కనుక-ఈ జాతికి జీవనాళికనీ, జానపద గీతికనీ కూర్చిన చారిత్రక కీర్తిని ధనాన్నీ తలచుకోకతప్పదు. ఆ నిధిత్వం శ్రీకాకుళంలో, అమరావతిలో, కర్నూలులో, కొండవీడులో నిబ్బరంగా నిలిచేవుంది. వీరత్వం, శౌర్యంతోపాటు, బుద్ధతత్వం, స్వాభిమానం, ఔదార్యం, సామరస్యం మిళితమైన మానవీయ విలువలు, వాటి పరిరక్షణాగుణం తేజఃస్ఫూర్తితో ప్రకాశిస్తున్నాయి ఇక్కడ. ఎన్నెన్నో ఉద్యమాల్ని అనుభవించిన నేల ఇది. 'అచట పుట్టిన చివురుకొమ్మైన చేవ' అన్నట్టు ఎందెరందరో త్యాగ మూర్తులు, మహనీయులు తమ వ్యక్తిత్వాల్ని జాతిపరంచేసి ప్రజలగుండెల్లో స్థిరమై ఉన్నారు. భోగరాజు పట్టాభిసీతారామయ్య నుండి ఆ తెలుగు మణిదీపాల పట్టిక చాలా పెద్దది. ఒక్కొక్క రంగంలో శతానేక దీపధారులు, ఆదర్శమూర్తులు, వైతాళికులు, అభ్యుదయ చోదకశక్తులు!

అయితే, ఈ ప్రాంతంలో పరిఢవిల్లిన కవిత్వోద్యమాల గురించీ, ఇక్కడ పుట్టి, సాహితీలోకానికి తమ అఖండ శేముషిని ప్రసరింపజేసిన కవుల గురించీ పరామర్శించటం-ఈ వ్యాసం ఉద్దేశం. కనుక (అనేక పరిమితుల దృష్ట్యా) ఆ విషయాల్ని స్థాలీపులాక న్యాయంగా పరామర్శిస్తాను. సమాజం, సాహిత్యం బింబ ప్రతిబింబ సదృశం. కాలంతో పాటు పరిణామశీలం కలిగినవి. కవిత్వం భాషాభివృద్ధికీ, సమాజాభ్యుదయానికీ చేగ(ర. సోమసుందర్ అన్నట్టు 'కవిత్వం కాలాతీత కాంతిరేఖ' అనుకున్నా, కవిత్వ పరిణామ వికాసాల పరామర్శకూ, పరిశీలనకూ ఒక ఆరంభ బిందువుని ఎన్నుకోవటం సముచితం. అందువలన ఈ వ్యాసంలో - తెలుగు కవిత్వంలో 1900 సంవత్సరం తర్వాత వచ్చిన పరిణామ వికాసాల్ని స్పర్శిస్తాను.

**నేపథ్యం :**

ముందుగా ఆ సమయ పరిచ్ఛేదంలో సమాజ నేపథ్యం, కవితాలోకం ఎలా వున్నాయో చూద్దాం. సంఘ సంస్కరణోద్యమం వివిధ రంగాల్లో సాగుతున్నది. వీరేశలింగం గారి భాషా సాహిత్య సాంస్కృతిక కృషి తాలోత్తాలంగా ఉంది. దాని ప్రభావంతో ఈ ప్రాంతం సంచలిస్తున్నది. కొత్త చదువులకీ, కొత్త భావజాల ప్రసరణకీ మేధావి వర్గం ఊపిరులూదుతున్న దశ అది. మరోవైపు-తమ అవధానాల ద్వారా సామాన్య అక్షరాస్యుల్ని సైతం ఆకట్టుకున్న కవితాశిఖరాలు-తిరుపతి వేంకట కవులు - తమ సాహిత్య జైత్రయాత్రలు చేస్తున్నారు. వారు పద్యరచనలో వ్యావహారిక భాషా ప్రయోగంతో, తెలుగు నుడికి పట్టం కట్టి విప్లవాత్మకమైన మార్పుల్ని సందేశిస్తున్న సమయం. ('గీరతం' రాశారు కదా !). ఎందరో సాహితీవేత్తలు, పండితులు ముమ్మరంగా వధానన కౌశలాన్ని చూపుతున్నారు. కొప్పరపు కవులు, కాశీకృష్ణాచార్యులు, వేలూరి శివరామశాస్త్రి, గాడేపల్లి వీరరాఘవశాస్త్రి, చందోలు శాస్త్రి ద్వయం, మారేపల్లి రామచంద్రశాస్త్రి (కవిగారు)-వంటివారు పద్య కవిత్వంతో సాహిత్యానికి ఉజ్జీవం కలిగిస్తున్నారు. ఎప్పుడో 1848లోనే ఎడ్మండ్ షార్కీ అనే మిషనరీ 'హితవాది' పత్రికను నడిపిన

ప్రదేశం మచిలీపట్నం. అక్కడే 'పురుషార్థ ప్రదాయిని' నడిచింది. బెజవాడ నుంచి 'జ్ఞానోదయం', గుంటూరు నుంచి దేశాభిమాని' వచ్చాయి.

1920లో బందరులో కొండా వెంకటప్పయ్యగారు, దాసు నారాయణరావుగారు కృష్ణాపత్రికని ప్రారంభించారు. ఆ తర్వాత పత్రిక ముట్నూరివారి సంపాదకత్వంలోకి వచ్చింది. బందరు నుంచే 'స్వధర్మ ప్రదాయిని' 'బుధవిధేయిని' వచ్చాయి. మల్లంపల్లి భైరవకవి 'రత్నాకరము' పత్రిక వెలువడింది. 1908 వచ్చేసరికీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు విజయవాడనుంచి 'స్వరాజ్య' పత్రికను ప్రారంభించారు. 1910 నుంచి బందరులో 'ఆంధ్రభారతి' (అయ్యంకి వెంకటరమణ సారథ్యంలో ఎం. కృష్ణారావుగారి ఆధ్వర్యంలో) మొదలైంది. దీనికి 'పోషకులు, రచయితలేగాని సంపాదకులు లేరు'. జానపాటి పట్టాభి రామశాస్త్రి గుంటూరు నుండి 'అభినవ సరస్వతి' మాసపత్రికని వెలువరించారు. బందరులో 'ఆంధ్ర భాషాభివర్ధిని' గ్రంథమాల మొదలైంది. ఇదీ నేపథ్యం.

## ఆరంభ, వికాసాలు

అటు రాయప్రోలువారి 'లలిత', ఇటు గురజాడ వారి ముత్యాల సరాలు (తోకచుక్క)తో నవ్య కవిత్వోదయమైంది. (వస్తువు) భావంలో, భాషలో, కవితారూపంలో, శైలిలో స్వేచ్ఛా ప్రియత్వం, నవ్యతాభిమానం, ఆధునికత రెక్కలు విప్పాయి. అడుగుజాడ గురజాడది ఐంది. 'సంఘ సంస్కరణోద్యమం, ఆంగ్ల విద్యావ్యాప్తి, పత్రికావ్యాప్తి, వ్యవహారిక భాషోద్యమం, స్వదేశీయోద్యమం' – ఈ ఐదూ నవ్య కవిత్వోదయానికి హేతువులుగా సోపపత్తికంగా నిర్ధారించారు. డా॥సి.నారాయణరెడ్డిగారు, 'స్థూల దృష్టితో చూచినచో ఈ నవ్య కవిత్వములో తాలోత్తాలమైన ఉద్యమములు రెండే రెండు. ఒకటి భావకవిత్వము, రెండు అభ్యుదయ కవిత్వము' అని కూడా వారే స్పష్టీకరించారు. ఒక దశలో భావకవిత్వ ప్రభావానికి లోనుగాని కవే లేడేమోనన్నంత ముమ్మరంగా సాగింది ఆ శాఖలో రచన. సుప్రసిద్ధ విమర్శకులు డా॥జి.వి. సుబ్రహ్మణ్యం 'భావ కవిత్వయుగ'మని పిలువబడే కాలాన్ని ఖండకావ్యయుగమని పేర్కొన్నారు. భావకవిత్వ పర్యాప్తి వివిధ వస్త్వాంశాల్లో సాగింది.

ఒక్కొక్క వస్తు చిత్రణలో – ఈ కృష్ణాతీరాంధ్రకు చెందిన కవుల రచనా సంపదని సంక్షిప్తంగా తెలుపుతాను.

దేశభక్తి ప్రబోధకంగా పద్యకవిత, గేయకవిత, పాటలు సాగేయి. ఇందులో జాతీయోద్యమ కవిత్వం ప్రముఖ స్థానం వహించింది. ఆ తర్వాత స్థానం ఆంధ్రరాష్ట్రాభిమానం. విశ్వనాథ, తుమ్మల సీతారామమూర్తి, జాషువా, బసవరాజు అప్పారావు, పింగళి–కాటూరి, పైడిసుబ్బరాయశాస్త్రి, కరుణశ్రీల కవిత్వాన్ని జగం మెచ్చింది. 'అంటరానివారెవరో కాదు, మా వెంటరానివారే' అన్న మాధవపెద్ది సుందరరామశర్మగారి పాట, అన్న బసవరాజువారి 'శ్రీ గాంధినామం మరువాం, మరువాం' అన్న దామరాజు పుండరీకాక్షుడు కీర్తన, 'కొల్లాయి గట్టితేనేమి' పాట ప్రజల నాల్కలమీద నర్తించాయి. వేములపల్లి శ్రీకృష్ణ 'చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా', పులుపుల శివయ్య 'పలనాడు వెలలేని మాగాణిరా' వంటి గేయాలు నిత్య పఠనీయాలైనాయి. త్రిపురనేని, రజని, ప్రయాగ, కొడాలి సుబ్బారావు అప్పటికి చాలామంది వంటివారి కవితలు బహుళవ్యాప్తిని పొందాయి. కొండూరి వీరరాఘవాచార్యులుగారి 'తోరణం' కృతి కూడా ప్రసిద్ధమైనది. దాసు శ్రీరాములుగారు 'తెలుగునాడు' వెలయించారు. వేలూరి శివరామశాస్త్రిగారి 'ఏకావళి', వే. ప్రభాకరశాస్త్రిగారి 'కడుపు తీపి' వంటి ఖండకావ్యాలు ప్రశంసనీయమైనాయి. పల్లీయుల జీవిత చిత్రణతో వచ్చిన ఏటుకూరి వెంకట నరసయ్య 'క్షేత్రలక్ష్మి' విశ్వనాథ 'ఋతుసంహారం', పింగళి కాటూరి 'పౌలస్త్యహృదయం' 'తొలకరి', రెంటాల 'సర్పయాగం' వంటి ఖండ కావ్యాలు ప్రాచుర్యం వహించాయి.

సాంఘిక దురాచారాలపట్ల నిరసన–(ప్రత్యేకించి వర్ణ వ్యవస్థ, అస్పృశ్యత)ని వ్యక్తంచేస్తూ జి.జోసెఫ్ ('కన్నీటి కబురు') వంటివారు శక్తివంతమైన కవిత్వాన్ని వెలయించారు. మంగిపూడి వెంకటశర్మగారు ఇదే వస్తువుతో 'నిరుద్ధభారతం' గ్రంథాన్ని రాశారు. కొడవటిగంటి వెంకటసుబ్బారావు 'భిక్షువు'నీ పేర్కొనాలి ఇక్కడ. త్రిపురనేని, నార్ల, తాపీ ధర్మారావు వంటి ఉద్దండుల రచనలు స్ఫూర్తిదాయకంగా నిలిచాయి. పువ్వాడ శేషగిరిరావు, అద్దేపల్లి లక్ష్మణస్వామి, గురజాడ రాఘవశర్మ, కొడాలి విదుషీమణి కనపర్తి వరలక్ష్మమ్మ. సాంఘిక అవాంఛనీయతల మీద కలమెత్తి ఈమె 'నవభారతేతిహాసం' వంటి వ్యంగ్య ప్రధానమైన ప్రబోధాత్మక కవిత్వాన్ని ప్రచురించారు. 'నాదు మాట' వంటి శతకాలు రాశారు. పరుచూరి భువనేశ్వరీదేవి హరిజన సమస్య కవితావస్తువుగా కవిత్వం రాశారు. చాగల్లులో 'ఆనంద నికేతనం' స్థాపించి, గాంధీమహాత్మునే అలరించిన తల్లాప్రగడ విశ్వ సుందరమ్మ, 'సౌదామిని' పేరుతో పాటలు రాసిన బసవరాజు రాజ్యలక్ష్మమ్మ కవయిత్రులుగా ప్రసిద్ధినొందినవారే. భావకవిత్వం ప్రణయతత్త్వం, అమలినశృంగారారాధన, మధుర భక్తితత్త్వం, విషాద స్మృతి చిత్రణవంటి అనేక ఇతర పాయల్లోనూ వడివడిగానే సాగింది.

## అభ్యుదయ కవిత్వం

ప్రపంచ వ్యాప్తంగా ఆర్థిక, సాంస్కృతిక సంక్షోభం మొదలైంది.

'ఆకలి దశాబ్దం' ప్రభావంతో వివిధ వ్యవస్థల్లో కల్లోలం, రాజకీయ అస్తవ్యస్తత, గందరగోళం మొదలయ్యాయి. భారతీయ సాహితీకారులు ఈ పరిణామాలకు వేదన చెందారు. 1936లో మున్షీప్రేమ్‌చంద్ అధ్యక్షతన – అఖిలభారత అభ్యుదయ రచయితల ప్రథమ మహాసభలు – లక్నోలో జరిగాయి. భారతదేశ కాలమాన పరిస్థితుల్ని, జనజీవన దుస్థితినీ ఆ మహాసభ చర్చించి, సాహితీలోకానికి దిశానిర్దేశం చేసింది. స్వతంత్రమైన ఆలోచనలతో భాషా సాహిత్యాల్ని ప్రజలకు దగ్గర చేయాలి. వారి అభివృద్ధికీ, సమాజాభ్యుదయానికీ దోహదం చేసే రచనలు చేయాలనే కర్తవ్యాన్నీ, ఆదర్శాన్నీ రచయితలంతా నిబద్ధతతో స్వీకరించాలి–ఇదీ లక్ష్యం. అబ్బూరి రామకృష్ణారావు ప్రేరణతో ఆంధ్ర ప్రాంతంలోనూ కదలిక మొదలైంది. 1943 ఫిబ్రవరిలోతాపీ ధర్మారావు అధ్యక్షతన తెనాలిలో ప్రథమాంధ్ర అభ్యుదయ రచయితల మహాసభలు జరిగాయి. అరసం ప్రణాళిక రూపు దిద్దుకున్నది. చదలవాడ పిచ్చయ్య, అశ్వనీకుమారదత్తు, మహీధరజగన్మోహనరావు, ప్రయాగ కోదండరామ శాస్త్రి, తాపీ, సెట్టి ఈశ్వరరావు, తుమ్మల వెంకట రామయ్య, వట్టికొండ విశాలాక్షి వంటివారు క్రియాశీల కార్యకర్తలైనారు.

అంతకంటే చాలా ముందుగానే శ్రీశ్రీ 'జయభేరి' మ్రోగించాడు. అభ్యుదయ కవిత్వం వేదికపైకి వచ్చేసింది. 'మహాప్రస్థానం' ప్రభావ శంఖమైంది. అభ్యుదయ రచనకు శక్తివంతమైన నిర్వచనాన్ని అందించారు కృష్ణశాస్త్రి. 'పీడింపబడేవాళ్లు, పీడించేవాళ్లు ఉన్న ఈ వర్ణ సమాజం ఉండాలని ఎవరూ కోరరు. రానున్న విధానంలో మానవుడే మకుటధారి. పురోగమిస్తున్న లోకాన్ని ప్రతిఘటించేవారు ఎప్పుడూ అభ్యుదయవాదులు కాజాలరు. ఈ ధనిక సమాజం పోవాలను కోవటమే అభ్యుదయం. ఇది మనసులో పెట్టుకొని వ్రాసేది అభ్యుదయ రచన" అని అరసం సభలో అధ్యక్షోపన్యాసం ఇచ్చారాయన.

అభ్యుదయ కవిత్వం వటవృక్షంలా పెరిగింది. అంతా కొత్తగాలి. ఎంతెంతో విస్తృతి. భావాభివ్యక్తిలో అనంతమైన వైచిత్రి. ఎందరో కవులు ఈ సాహిత్యశాఖని సుసంపన్నం చేశారు. ఈ ప్రాంతకవుల్లో – కుందుర్తి, ఏల్చూరి, బెల్లంకొండ (నయాగరా), అనిసెట్టి, రెంటాల గంగినేని వంటివారు పదునైన పలుకుని పంచారు. 'నీటి అడుగునీడ నుంచి/నిప్పు కణములొస్తున్నవి/ఎండిపోయిన చెట్టుకొమ్మ/లెర్రపూలు పూస్తున్నది' అంటూ చీకటి వెలుగుల్లో 'గుడిగంటలు'ని మ్రోగించారు రెంటాల. 'అంటరాదని యొకడు/అధికుడని మరియొకడు/గొంతుల్లు కోసుకుంటారా ?/తల్లికందరు బిడ్డలొకటేనురా' అని ఎలుగెత్తారు తెన్నేటి సూరి. 'ఈ శోకపు తెర వీడిపోయి/ఈ లోకపు వ్యథ తీరిపోయి/ నవలోకం ప్రభవించునులే' అని తల్లికీ, చెల్లికీ ఊరట నిచ్చారు తుమ్మల. ఇంకా... కరుణశ్రీ, సుంకర, అవసరాల సూర్యారావు, నార్ల, నార్ల చిరంజీవి వంటి వారెందరో కవితా శంఖాల్ని పూరించారు. జనం వేదనల్నీ, రోదనల్నీ అక్షరీకరించారు.

## వేరూనిన వచన కవిత

రూపంలో వచన కవిత నిలదొక్కుకుంది. దాని స్వరూప స్వభావాన్ని గురించీ, భవితవ్యం గురించీ – వివిధ కవులు తమతమ పథాలూ, దృక్పథాలూ చెప్పసాగారు. ఎన్నెన్నో చర్చలు, విశ్లేషణలూ, పరిశీలనలూ జరిగాయి. కుందుర్తి వచన కవితకు ఉద్యమస్ఫూర్తినిచ్చి, కథాకావ్యాల ఆవశ్యకతని ప్రచారం చేశారు. వచన కవితాయాత్రలో ఈ ప్రాంతం కవుల భాగస్వామ్యం సింహభాగంగానే ఉంది. కుందుర్తి, అనిసెట్టి, ఏల్చూరి, బైరాగి, రామదాసు, గంగినేని, శార్వరి, కేశవరావ్, రెంటాలవంటి ప్రముఖులు విరివిగా రాశారు. కల్పన, స్వేచ్ఛాపథం, యువసాహితివంటి కవితా సంకలనాలు వెలువడినాయి. సామాజిక భావన, సంఘదర్శనం, వర్గస్పృహ–అభ్యుదయ చైతన్యానికీ వస్తు వైవిధ్యానికీ పట్టుకొమ్మలైనాయి. అభివ్యక్తిలో ప్రయోగశీలత, నూతనా విష్కరణలు ప్రస్ఫుటంగా కనిపించసాగాయి. జరుక్ శాస్త్రి పేరడీలు రాసి 'సెహబాస్' అనిపించుకున్నారు.

రాను రాను సమాజంలో సంకీర్ణత, జనజీవనంలో సంక్లిష్టత పెరిగాయి. సమస్యల తట్ట నెత్తికెత్తుకొని తిరిగే పరిస్థితిలో మనిషి తనకు తాను బరువైపోయే దుస్థితి సంభవించింది. అభివృద్ధి... అరిగిపోయిన రికార్డయింది. స్వార్థం, స్వప్రయోజనం, నల్లబజారు, అవినీతి, నిరుద్యోగం, అశాంతి, ధరలు ఆకాశానికంటటం... అంతా నిరాశా నిస్పృహ...పాలనలో ఉదాసీనత...గ్రామీణ ఛిద్రజీవనపటం.... ఇవన్నీ కవులకు కవితావస్తువులైనాయి. కె.శివారెడ్డి గళం విప్పాడు. ఉత్తేజిత తరంగంలా లేచాడు. శివారెడ్డి, గుత్తికొండ సుబ్బారావు, ఆధ్వర్యంలో 'వేకువ' త్రైమాసిక వెలువడింది.

'ఫ్రీవర్స్ ఫ్రంట్' ఆవిర్భవించింది. యువకులు కుందుర్తి మార్గాన ముందుకు సాగారు. కేశవరావ్, కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు, సి.వి., దుర్గానంద్, అద్దేపల్లి వంటివారి కవిత్వం వెలువడింది. వస్తుశిల్ప విభిన్నతతో అనుభూతి కవిత్వం – ఒక ధోరణిగా వెలువడింది. వేగుంట మోహనప్రసాద్ తన ముద్రని చాటారు.

తెలుగు కవిత్వానికి 'షాక్‌ట్రీట్‌మెంట్'గా 1965లో దిగంబర కవిత్వం వచ్చింది. దిగంబరకవులు ఆరుగురిలో నగ్నముని, మహాస్వప్న

ఈ ప్రాంతం వారే. సమాజాన్ని 'తట్టిలేపటం కాక కొట్టిలేపే' ప్రయత్నంలో మూడు సంపుటాలు ప్రచురించి సంచలనం సృష్టించారు. 1970 వచ్చేసరికీ రాజకీయాలకు అతీతంగా సాహిత్యానికి ఉనికి లేదనే భావజాల తీవ్రత, 'విశ్వమానవతా వాదాన్ని మార్క్సిజం - లెనినిజం క్రాంతిమార్గంలో ఎలుగెత్తి చాటడం' ప్రధాన ఆశయంగా సాయుధపోరాటమే జాతివిమోచనకు సాధనమనే నిబద్ధతతో విప్లవ రచయితల సంఘం ఆవిర్భవించింది. చాలామంది కవులు ఆ మార్గాన కవితా ప్రస్థానం చేశారు. 'మార్చ్' 'ఇప్పుడు వీస్తున్నగాలి' 'ఠే' విప్లవ కవితా సంకలనాలు వచ్చాయి. గేయం, పాట కూడా వేదికలెక్కి స్ఫూర్తిదాయకంగా ప్రసారయోగ్యమైనాయి.

గుంటూరునుండి - సుగమ్‌బాబు, దేవీప్రియ, ఓల్గా, కిరణ్‌బాబు, కమలాకాంత్ - 'పైగంబర కవులు'గా మూడు కవితా సంపుటాలు వెలువరించారు. ఇవి చారిత్రకాంశం పరిధిలోనే నిలిచిపోయాయి. అరసం, విరసం సభ్యులు కాకున్నా లెక్కకు మించిన సంఖ్యలో కవులు ప్రగతిశీల కవిత్వాన్ని రాస్తూనే వున్నారు.

వేలాదిమందిని పొట్టనపెట్టుకున్న దివిసీమ ఉప్పెన దారుణానికి చలించి, ఆ సందర్భంలో ప్రభుత్వ యంత్రాంగం ఉదాసీనతకు సంచలించి-నగ్నముని 'కొయ్యగుర్రం' దీర్ఘకవితని రాశారు. దీనిమీద కల్లూరి భాస్కరం వంటి ప్రసిద్ధుల చర్చ సాగింది.

రాజకీయ ఆర్థిక సామాజిక సాంస్కృతిక పరిణామాలు కవుల సంవేదనకు నిరంతరం కారణమౌతూనే ఉన్నాయి. జనులందరికీ సమన్యాయం చేకూరాలనే ఆకాంక్షతో ఎందరెందరో కందగల వచన కవిత్వాన్ని అందించారు. ఈ ప్రాంతంలోనూ చాలా కవితాసంపుటాలూ, సంకలనాలూ వెలువడినై.

కె.శివారెడ్డి, అద్దేపల్లిరామమోహనరావు,విహారి,గుత్తికొండ సుబ్బారావు, ఎమ్వీయల్, రామసూరి, రావి రంగారావు, జి.వి. పూర్ణచంద్, పాపినేని శివశంకర్, భవానీదేవి, పెనుగొండ లక్ష్మీ నారాయణ మొదలైన అనేకులు వచనకవిత్వంలో కాంతిమంతమైన రచనలు చేశారు.

### లఘు రూపాలు :

వచన కవితలో ఒక రూపభేదంగా 'మినీకవిత' వచ్చింది. బ్రివిటీ, నేటివిటీ, క్రియేటివిటీ - ప్రాణంగా సామాజిక స్పృహతో, వెంటాడే వాక్యంగా నిలువగలిగిన మినీ కవితలు వేలసంఖ్యలో వచ్చాయి. ఉక్తివైచిత్రినీ, అభివ్యక్తిలో నూతనత్వాన్ని ఆవిష్కరించారు యువకవులు. 'ఎన్ని గజాలు/రాశాడన్నది కాదు/ఎన్ని నిజాలు/చెప్పాడన్నది ముఖ్యం' అన్న సూక్తి ఆదర్శమైంది. 'ఒక వ్యక్తి సంకెళ్ళతో తీసుకొచ్చింది కాదు / ఒక శక్తిగా స్వచ్ఛతో దూసుకొచ్చింది - మినీకవిత' అని నినదించారు రావిరంగారావు. తానే ఒక ఉద్యమరూపమిచ్చారు ఈ ప్రక్రియకు. ఊరూరా మినీ కవితా ప్రదర్శనలు నిర్వహించి దీనికి జి.వి.పూర్ణచంద్ బహుళవ్యాప్తిని కలిగించారు కొల్లూరి 'మినీ కవితా విప్లవం' పేర సంకలనాన్ని తెచ్చారు. 'గుడ్‌మార్నింగ్' కవితా సంపుటిని ప్రచురించారు రావి రంగారావు. 2006లో 'వెయ్యినూటపదహార్లు' పేరుతో ఉత్తమ మినీకవితల సంకలనాన్నీ ప్రచురించారు. ఇందులో ఈ ప్రాంతకవులైన - శివారెడ్డి, నగ్నముని, ఎమ్వీయల్, విహారి, రావి రంగారావు, పూర్ణచంద్, చిత్తలూరి, పాలెపు బాబు, ముత్యాలప్రసాద్, భవానీదేవి, తాడేపల్లి పతంజలి, జిసనారా, కొట్టిరామారావు, తరువాతి కాలంలో చలపాక ప్రకాశ్, గుమ్మా సాంబశివరావు, సత్రీ, సోమేపల్లి వెంకటసుబ్బయ్య, వీరపల్లె వీణావాణి, కోసూరి రవికుమార్, శ్రీనివాస గాంధి వంటి వారి కవితలు చోటుచేసుకున్నాయి.

కవిత్వంలో లఘు రూపాల గురించి మరికొన్ని విశేషాలు చెప్పుకోవాలి. జపనీయుల సంప్రదాయ కవితారూపం హైకూ. రెంటాల శ్రీవెంకటేశ్వరరావు వంటివారు దాన్ని తెలుగులో వెలయించారు. నాగభైరవ వంటి కొందరు రుబాయిల్నీ తెలుగులో రాశారు. అద్దేపల్లి, గజల్‌శ్రీనివాస్ గజల్‌కి ప్రాచుర్యం కల్పించారు. ఎన్.గోపి ప్రారంభించిన నానీ లఘు కవితారూపం బహుళప్రచారం పొందింది. 300 మందికి పైగా కవితా సంపుటాలూ, సంకలనాలు వచ్చాయి. చలపాక ప్రకాష్, భవానీదేవి, ద్వానాశాస్త్రి సంపుటాలు తెచ్చారు. నానీరూప విశేషాల్ని గురించి చలపాక ప్రకాష్ విశ్లేషణ గ్రంథాన్నీ రాశారు. సుగమ్‌బాబు ప్రారంభించిన 'రెక్కలు' కూడా విస్తృత ప్రచారాన్ని పొందింది. చాలా రెక్కల సంపుటాలు వచ్చాయి.

### వస్తు వైవిధ్యం, వివిధ వాదాలు ప్రతిఫలనం

కాలగమనంలో భిన్న పార్శ్వాలనుంచీ వస్తున్న నూతనావిష్కరణలు కవిత్వ వస్తురూపాలు రెంటిలోనూ ఎన్నెన్నో మార్పుల్ని తీసుకొచ్చాయి. కవులు స్థానీయతకూ, స్వీయానుభవానికీ ప్రాధాన్యతనివ్వటం ఎక్కువైంది. కొంతమేరకు కవిత్వం గత జీవితానుభవాల ఉటంకింపుగానూ, కీర్తనగా కూడా పరిణమించింది. ఉదారమానవతా ధోరణి నుండి క్రియాశీల మానవతా ధోరణిని కవిత్వంలో ప్రతిఫలింపజేయటం కనిపిస్తోంది. సాంస్కృతిక వైవిధ్యంలోని విలక్షణత, రాజకీయాధికార ప్రాధాన్యతా స్పృహ బహిర్గతమౌతున్నాయి. భిన్నవర్గాలకు చెందిన కవులూ, వివిధ ప్రాంతీయ, సాసంస్కృతిక నేపథ్యానికి చెందిన కవులు తమతమ హక్కుల కోసం గళమెత్తారు.

ప్రపంచీకరణ, సరళీకృత ఆర్థిక విధానాలు, విశ్వవ్యాప్తంగా జనుల జీవనవిధానం మీద తీవ్రమైన అలజడిని సృష్టించాయి. కవులు – మానవసంబంధాల విచ్ఛిత్తి పట్ల ప్రభుత్వ భూసేకరణ పట్ల వస్తు వ్యామోహం, కార్పొరేట్ కల్చర్, మార్కెట్ మాయాజాలాలపట్ల, రైతులు శ్రామికుల వెతలపట్ల, దళారీవ్యవస్థ పట్ల తమ నిరసనగళాన్ని తీవ్రంగా వినిపించారు. ప్రపంచీకరణని తిరస్కరిస్తూ నిబద్ధతతో కవిత్వోద్యమాన్ని నిర్వహించిన ప్రముఖుడు అద్దేపల్లి రామమోహనరావు. 'గాట్'పై సంతకం జరగగానే ప్రతిస్పందనగా – 'సంతకం చేసిన వేళ్ళు' కవిత రాశారు. మందరపు హైమవతి, చలపాక ప్రకాష్, ఆంజనేయకుమార్, చిత్తలూరి సత్యనారాయణ, అరసవిల్లి కృష్ణ మొదలైన కవులు గళాలు కలిపారు. కలాలు కదిపారు. పాపినేని (ఒక ఖడ్గం – ఒక పుష్పం) అద్దేపల్లి(పొగచూరిన ఆకాశం),కొండేపూడి నిర్మల(మల్టీనేషనల్ ముద్దు), ద్వానాశాస్త్రి (బుష్‌కాకి) వంటి ప్రత్యేకత కవితాసంపుటాలు వచ్చాయి.

స్వేచ్ఛ, సమానత్వం, స్వాతంత్ర్యం, పురుషాధిక్యత తిరస్కారం, హక్కులు, వ్యక్తిత్వ ప్రకటన, అస్తిత్వ నిర్ధారణ వంటి మౌలికసూత్రాల మీద ఆధార పడి మహిళా చైతన్యం కవిత్వం మొదలైంది. ఇదే తీవ్ర సంచలనాన్ని రేపుతూ స్త్రీవాద కవిత్వంగా ప్రాచుర్యం పొందింది. ఓల్గా, వాణీరంగా రావు, సత్యవతి, కొండేపూడి నిర్మల, ఘంటశాల నిర్మల, మందరపు హైమవతి, నాగలక్ష్మి, సి.భవానీదేవి ఈ ప్రాంతం వారు పదునైన పలుకు పలికారు. కౌటుంబిక శ్రమవిలువ, ఆర్థిక స్వావలంబన వంటి అంశాలు వస్తువులుగా కవిత్వం విస్తృతిని పొందింది.

ఆత్మగౌరవ ప్రకటనం ప్రధానధ్యేయంగా, కులవివక్షపై తిరుగులేని పోరుబాటగా వ్యాప్తి నొందింది దళితచైతన్యాన్ని అక్షరీకరించిన కవిత్వం. శిల్పవైవిధ్యంతో, నూతనపదప్రయోగంతో, ఉపమాన సంపదతో శక్తివంతమైన కవిత్వాన్ని రాశారు. ఈ ప్రాంత కవులు కొలకలూరి ఇనాక్, కత్తి పద్మారావు, డేవిడ్‌లివింగ్‌స్టన్, ఎన్.ఎలియా, నంబూరి పరిపూర్ణ, సి.వి. గద్దల జోసెఫ్, దాసి బసవయ్య, పినపాటి జెర్మియా, నూతక్కి అబ్రహాం, తాళ్లూరి లాబన్‌బాబువంటి ప్రముఖుల్ని పేర్కొనాలి. అత్తోటరత్నం, బిర్నీడి మోషే హరికథారచన, ప్రదర్శనల్లో ప్రసిద్ధులు.

ముస్లిం సాహిత్యంలో ప్రధాన వస్తువు వివక్ష, అభద్రతా భావం, ఈదేశ జనజీవన స్రవంతిలో భాగస్వామ్యం వహిస్తున్నా తమపై అధిక సంఖ్యాకులకు గల అనుమాన దృష్టిని నిరసిస్తున్నారు వీరు. ముస్లిం కవిత్వంలో గల రెండవపార్శ్వం – ఆ కవుల్లో కొందరు తమ మత సంప్రదాయాల్లోని ఛాందసభావాల్ని తిరస్కరించటం. ఈ పార్శ్వం లోని వస్తువిస్తృతిని కూడా కవితామయం చేసిన సాహితీపరుడు – కరీముల్లా.

## పత్రికలు, ప్రోత్సాహకాలు

సామాజిక చైతన్యంతో, మానవీయవిలువల పరిరక్షణ ధ్యేయాన్ని సందేశిస్తూ – యువకవులు విల్సన్‌రావు, సరిగొండ నరసింహరాజు, వియోగి, వివేకానంద, బండికల్లు జమదగ్ని ఆకాశరవి ప్రకాష్ జి. వెంకటకృష్ణ, కె.బి.లక్ష్మి ఎమ్.వి.రామిరెడ్డి మక్కెన శ్రీను, యర్రం పాప, పాతూరి కుసుమకుమారి వంటి ఎందరో కవులు కవిత్వాన్ని వెలయిస్తున్నారు. పాపినేని శివశంకర్, దర్భశయనం శ్రీనివాసాచార్య సంపాదకత్వంలో 'కవిత' సంవత్సరవారీ సంకలనాలు సమకాలీన కవితాధోరణులకూ, వివిధ భావజాలాల ప్రతిఫలనాలకూ ప్రతిబింబంగా వెలువడుతున్నాయి. ఇలాంటి ప్రయత్నాన్నే గతంలో ఎస్వీ కృష్ణగారూ నాలుగువందలకు పైగా కవితలతో వార్షిక సంకలనాల్ని ప్రచురించారు. 'అమ్మపదం'సంకలనం వచ్చింది. ఇటీవల 157 కవుల కవితలతో 'అక్షర' పేరున సుధామ సంపాదకత్వంలో ఒక సంకలనాన్ని డా॥ వేదగిరి రాంబాబు ప్రచురించారు. వీటన్నిటిలోనూ ఈ ప్రాంత కవుల రచనలు అధికసంఖ్యలోనే ఉన్నాయి.

కేవలం కవిత్వానికి అంకితమై విజయవంతంగా వెలువడుతున్న 'కవితా' మాసపత్రిక కూడా శ్లాఘనీయమైన వస్తుశిల్పకవితల సంపదను కలిగి వుంది. దీనికి శ్రీశ్రీ ప్రింటర్స్ విశ్వేశ్వరరావు ప్రధాన సారథి. విజయవాడ నుండి చలపాక ప్రకాష్ 'రమ్యభారతి' సాహిత్య త్రైమాసికను వెలువరిస్తున్నారు. కలిమిశ్రీ 'మల్లెతీగ' పత్రికను తెచ్చారు. నండూరి రాజగోపాల్ సంపాదకులుగా 'చినుకు' మాసపత్రిక వస్తోంది. సుప్రసిద్ధ మాసపత్రిక 'ప్రజాసాహితి' వెలువడుతోంది. ఇప్పుడు కొత్తగా 'రేపటికోసం' వస్తోంది. వీటన్నిటా ఈనాటి మంచి కవితలు ప్రచురితమౌతున్నాయి. బులుసు వెంకటకామేశ్వరరావు సంపాదకత్వంలో బందరునుండి 'ప్రమిద' త్రైమాసిక వస్తున్నది. అక్కడినుంచే భవిష్య సంపాదకులుగా 'భావతరంగిణి' వచ్చింది.

## ఈనాటి స్థితీ, గతీ : వెలుగు నీడలు

వర్తమానంలో పద్యకవిత్వంలో కావ్యాలూ ఖండకృతులూ వెలయిస్తున్నవారు ఈ ప్రాంతంలో చాలామంది ఉన్నారు. చిటిప్రోలు కృష్ణమూర్తి పురుషోత్తముడు కావ్యానికి సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. మద్దూరి రామమూర్తి 'ఆంధ్రభోజీయం', డా॥ కోడూరి వసునందన్ 'ధర్మదండం' మహాకావ్యాల్ని రాశారు. ఈ వ్యాసకర్త 6500 పద్యాలతో 'శ్రీ పదచిత్ర రామాయణం' మహాకావ్యాన్ని వెలయించాడు. పువ్వాడ తిక్కన సోమయాజి 'సువర్ణ సౌరభం', 'దుందుభి', 'అక్షర

ధామం' వంటి కవితా సంపుటాలు ప్రముఖుల ప్రశంసల్ని పొందాయి. పాలపర్తి శ్యామలానంద ప్రసాద్ అచ్చతెలుగు కవిత్వాన్ని అవిరళంగా చెబుతున్నారు. ఆచార్య గంగప్ప, రామడుగువారు, కె.సూర్య నారాయణ, సిహెచ్. బృందావనరావు, ఎరుకలపూడి గురునాథరావు వంటివారు పద్యవిద్యలో సిద్ధహస్తులే. కె.సుధాకరరావు రాసిన 'శ్రీ ఎఱ్ఱితాత మాహాత్మ్యము', విద్వాన్‌జి.బాలన్నగారి 'ఆంధ్రరాజన్యచరిత్ర', 'కోడూరు శ్రీ పాండురంగారావు 'సత్రాజితీయం', 'దత్తప్రసాద్ 'మధు శాల' పద్యకృతులు గుమ్మా సాంబశివరావు 'సెలఫోన్', 'శ్రీశ్రీ', 'అంబే ద్కర్', 'జాషువా' శతకాలు పద్యకవిత్వాభిమానుల్ని అలరించాయి. ఇప్పుడే అందిన మంచివార్త : కీ.శే. కవిపాదుషా పువ్వాడ శేషగిరి రావుగారి ఆంధ్రసాహిత్యకావ్యం ప్రచురింపబడింది.

"తెలుగు కథానిక అడుగుపెట్టని చోటు లేదు, పలకరించని వ్యక్తి లేడు" అని అప్పుడెప్పుడో మధురాంతకం రాజారాం అన్న మాటని ఈనాటి కవిత్వానికి అన్వయించుకోవచ్చు.

ఈనాటి కవులు ఈనాటి సామాజిక పరిస్థితులమీద వచన కవితలో స్పందిస్తూనే ఉన్నారు. 'మనిషి' కేంద్రకంగా, మనిషికోసం కవిత్వం వస్తున్నది. సమాజం పోకడల్నీ, సంఘంలోని ధోరణుల్నీ విశ్లేషిస్తున్నారు కవులు. మనిషి బహిరంతర ఆధివ్యాధుల్ని వర్ణిస్తున్నారు. మానవ సంబంధాల్లోని వైచిత్రినీ, వైరుధ్యాల్నీ ఆవిష్కరిస్తున్నారు. మారుతున్న లోక రీతుల్ని వింగడిస్తున్నారు. ఆధునిక జీవనంలోని అస్తవ్యస్తత, అలజడి, ఆందోళన, రాజకీయ కశ్మలం, అవకాశవాదం, ఆర్థిక అసమా నత, లోక వృత్తంలో 'డబ్బు' (తె)(చే)స్తున్న వికృత పరిణామాలు- వీటన్నిటి తీవ్రతనీ గాఢంగా, సాంద్రంగా వ్యక్తీకరిస్తున్నారు కవులు.

ఈనాటి కవితారచన వివిధ సామాజికవాదాల ప్రభావాన్ని స్పష్టంగా ప్రతిఫలిస్తోంది.

అభివ్యక్తిలో నూతన ప్రయోగాల్ని చేస్తున్నారు కాశీభట్ల వేణు గోపాల్, పాపినేని శివశంకర్‌వంటి ఎందరో కవులు. కవిత్వంలో వస్తు రూప శిల్పాల వంటి గుణాత్మకాంశాల గురించిన చర్చలూ విస్తృ తంగానే జరుగుతున్నాయి.

అరసం, విరసం, జిల్లా రచయితల సంఘాలూ, ఇతర సాహిత్య సంస్థలూ - చర్చా గోష్ఠులూ, కార్యశాలలూ, సదస్సులూ సమ్మేళనాలు వంటి నిర్మాణాత్మక కార్యక్రమాల్ని నిర్వహిస్తూ కవిత్వాభ్యుదయానికి ప్రోత్సాహాన్నిస్తున్నాయి. పోటీల్ని నిర్వహిస్తున్నాయి. కవితాసంకలనాల్ని పెద్ద సంఖ్యలో తెస్తున్నాయి. వర్తమాన సామాజికావశ్యకతల మీద విలక్షణ కవితా సంకలనాలూ వస్తున్నాయి. ఉదాహరణకు అవయ వదానంపై హైదరాబాద్ కిన్నెర పబ్లికేషన్స్ మద్దాళి రఘురామ్ సంపాద కత్వంలో 'నాన్నా ! నాకు మరణం లేదు' అనే సంకలనం తెచ్చారు. దీనిలో - చలపాక ప్రకాశ్, సిహెచ్.బృందావనరావు, డా॥ఎస్.ఏ. రవూఫ్, ఎస్.ఎమ్.సుబాని, డా॥కె.శివసుబ్బారావు వంటి ఈ ప్రాంత కవుల రచనలు ఉన్నై. కవులు స్వీయరచనల సంపుటాల్నీ, దీర్ఘకవితల్నీ సొంత ఖర్చుతో తెచ్చుకుంటున్నారు. పంచుకొంటున్నారు ! 'కాన్సెప్ట్' ప్రాధాన్యంగానూ సంకలనాలు వస్తున్నాయి. పన్నాల సుబ్రహ్మణ్య భట్టు తొలి తెలుగు హాస్య కవితా సంకలనం తెచ్చారు.

కవితా సంపుటాల/సంకలనాల సమీక్షలు పత్రికల సాహిత్య పేజీల్లో 'కాలమ్' ఒత్తిడికి లోనవుతున్నై. అయినవారికి మాత్రం అర్ధపేజీ కేటాయింపులు జరుగుతున్నై.

మొత్తంమీద ఈ ప్రాంతంలోని తెలుగు కవిత్వ సందర్భం వాడి గానూ, కవిత్వ సమాజపు వాతావరణం వేడిగానూ ఉంది. కవుల చిత్తశుద్ధీ, లక్ష్యశుద్ధీ మనిషిని ఉన్నతపథంవైపు నడిపించటానికి ప్రేరకా లుగా నిలిచే ఉన్నాయి. తెలుగు కవిత్వం చూపు-నాడూ, నేడూ, ఎప్పుడూ అభ్యుదయం వైపు !!

చిరునామా : *జి.యస్.మూర్తి (విహారి), హౌస్ నెం. 16-11-310/12/ఏ/1/1, గణపతి గుడి వీధి, సలీంనగర్ -2, మలక్ పేట, హైదరాబాద్ - 500 036, సెల్ : 9848025600*

డా॥ పి.బి.డి.వి. ప్రసాద్

# ఆంధ్ర సాహిత్యం - కృష్ణాతీర బౌద్ధ శిల్పకళా వైభవం

రాయిగ్రుద్దును నీ పురా శిల్ప సంపత్తి
అమరావతీ స్తూప సముదయంబు - తెలుగుతల్లి (కరుణశ్రీ)

ఆంధ్రావనిలో ప్రత్యేకించి కృష్ణాతీరంలో బౌద్ధమత శిల్పం వైభవోపేతంగా వెలుగొందింది. ఈ శిల్పకళా సోయగాలను రసహృదయులైన పెక్కురు ఆంధ్ర సాహిత్యకర్తలు తమ తమ సారస్వత గ్రంథాల్లో ప్రస్ఫుటంగా అభివర్ణించారు.

చారిత్రక ఆధారాలను బట్టి చూసినట్లైతే క్రీ.పూ. రెండు మూడు శతాబ్దాల నుండి బౌద్ధనిర్మాణాలు మొదలయ్యాయి. బౌద్ధమత వ్యాప్తికి ప్రత్యేకమైన వాస్తు శిల్పకళలు వినిమయంలోకి వచ్చాయి. బౌద్ధ జాతక కథలు క్షుల్లవగ్గ, మహావగ్గ, మహా సుదాసున సుత్త, వినయసుత్త మొ॥ బౌద్ధ గ్రంథాల్లో బౌద్ధనిర్మాణ విశేషాల ప్రస్తావముంది. బౌద్ధ వాస్తువులో స్తూపం, చైత్యం, విహారం, సంఘారామం ముఖ్యమైనవి. హీనయాన బౌద్ధంలో సంకేతాల ద్వారా బుద్ధుని జీవితాన్ని శిల్పీకరిస్తే మహాయాన బౌద్ధంలో ప్రత్యక్ష పద్ధతిలో బౌద్ధం శిల్పాయమానమైది.

ఉత్తర, మధ్య భారతదేశంలోని సారనాథ్, సాంచీ, బెడ్సా, కార్లీ, బార్హూత్, అజంత, ఎల్లోర మొదలయిన ప్రదేశాలలోనూ, దక్షిణాపథంలో శాలిహుండం, అమరావతీ, నాగార్జునకొండ, జగ్గయ్యపేట, ఘంటసాల, భట్టిప్రోలు, ఉండవల్లి మొ॥ చోట్ల బౌద్ధ నిర్మాణాలు మహాద్భుత వాస్తు శిల్పకళా విన్యాసాలై విలసిల్లాయి. ఆంధ్రదేశంలో ఏవో ఒకటి రెండు ప్రదేశాలు తప్పించి ఎక్కువగా కృష్ణానది తీరంలోనే ఈ క్షేత్రాలుండటం విశేషం.

శిల్పకళను ప్రస్తుతించిన ఆధునికాంధ్ర సాహిత్యంలో బౌద్ధశిల్ప క్షేత్రాల్లోని స్తూపచైత్యాలు, విహారాలు, ఆరామాలకు సంబంధించిన వాస్తు శిల్పం సవివరంగా వర్ణించబడింది. బుద్ధ జీవితగాథకూ, బౌద్ధ జాతక కథలకు సంబంధించిన ప్రతిమా శిల్ప, బౌద్ధ పరివ్రాజకులచే గుహారామాల్లో ప్రకృతిసిద్ధవర్ణాలతో తీర్చిన చిత్రలేఖనం కూడా పేర్కొనబడింది. బౌద్ధాన్ని ఆదరించిన రాజపాలకులు నిర్మించిన కట్టడాలు కూడా సమున్నతంగా ప్రస్తుతించబడ్డాయి.

కృష్ణాతీర బౌద్ధ శిల్పానికి కళాహృదయులర్పించిన సాహితీ నీరాజనాన్ని పరామర్శించటమే ఈ వ్యాసోద్దేశం.

అశోకుని క్రీ.పూ. (273-236) సమకాలీనులైన శాతవాహన ప్రభువుల కాలంలో అమరావతీ ధాన్యకటకాలు కలిసి రాజధాని నగరంగా విఖ్యాతి చెందటమే కాక శిల్పకళా క్షేత్రాలై విరాజిల్లాయి. ఇక్కడ ప్రాకృత(అర్ధమాగధి) భాషలో లభించిన శాసనాల వలన అమరావతీ నగర పురాతన ఖ్యాతి వెల్లడవుతూంది.

'అవి యశోకుని మత పరాయణత జాటి
చెప్పెడు శిలాక్షరములు ప్రసిద్ధ గన్న
ప్రాకృతము నందు మా యమరావతి కడ
దొరకి సాక్ష్యము లిచ్చు బౌద్ధుల మహత్తు'
– సౌగంధికము (శ్రీ పులివర్తి విజయభూషణ శర్మ)

ఆంధ్రజనుల హృదయాలు ఇంపొందేవిధంగా కృష్ణాతీరంలో చైత్యాన్ని నిర్మించవలసినదిగా అతిలోకాధీశ్వరుడైన అశోకుడు శాతవాహన ప్రభువుకు భిక్షు పరివ్రాజకులచే ఉపదేశ సందేశాన్ని పంపించాడు.

'ఈ కృష్ణా తటినీ తటంబునను భూమీశాన, చైత్యం బొకం
దే కాలంబును బౌద్ధధర్మలత పుష్పింపగా సృష్టించి, ప్రే
మాకారుండగు శాక్యసింహముని పాదాబ్జద్వయీ దివ్యపూ
జా కైంకర్య మొనర్చు మాంధ్రజనతా స్వాంతంబు లింపొందగన్
– అమరావతి (శ్రీ కొండూరు వీర రాఘవాచార్యులు)

దక్షిణాపథానికి ప్రధానమైన నగరంగా అమరావతీ వెలుగొందటమే కాక బౌద్ధమత వైభవానికి ప్రతిబింబ మనదగ్గ శిల్పకళా క్షేత్రమై వేనోళ్ళ కీర్తిగొన్నది.

'దక్షిణా పథమునకు ప్రధాన బౌద్ధ
పీఠమీ యమరావతి విస్తరించె

నవని నెల్లెడ బౌద్ధ విహారములను
నద్భుతములగు శిల్ప విద్యాలయముల'
-అమరావతి (శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు)

పవిత్ర కృష్ణాతటి తీరస్థలంబైన నాగార్జునకొండ శాతవాహనుల కాలంలోనూ, ఇక్ష్వాకులకాలంలోనూ బౌద్ధక్షేత్రంగా అభివృద్ధి చెందింది. ఈ క్షేత్రంలో దమ్మపద సూక్తులు పర్వతాగ్ర భాగాల్లో ముత్యాల పంక్తులను తలపించేటట్లు చెక్కారు.

'అదె నాగార్జునకొండ యయ్యదియే బౌద్ధారామ పీఠంబు, న
ల్లదె జీవత్తటినీ తరంగా విలసల్లాస్య క్రియా ధ్యాన స
మ్మదిస్వాంతము దాని శీర్షము పయిన్ ముత్యంబులై రాలె బు
ద్ధ దయాసూక్తులు మధ్యమాధ్వ విలసత్ వ్యాఖ్యా విశేషార్థముల్'
-సౌగంధికము (పులివర్తి విజయభూషణ శర్మ)

మహామహుడైన నాగార్జునాచార్యుడు శిల్పశాస్త్ర కోవిదుడు కూడా కావచ్చు, ఆ మహనీయుని స్పర్శ చేత ఈ ప్రాంతములోని ప్రతిశిల ముదమొసంగ రమణీయ శిల్పంగా మారింది. ఇక్ష్వాకు రాజకాంత ఛాంతి సిరి (శాంతి శ్రీ) మహా చైత్య నిర్మాణం చేయించింది.

'ఛాంతిసిరి' యను రాకాంత చైన్యమిచట
మించు భక్తి ప్రపత్తి నిర్మించె, క్షుల్ల
ఛాంతి సిరినక' యను మేలు సలిపె మివుల
గౌతమశ్రీ పదాబ్జ కైంకర్య నియతి
- సౌగంధికము (శ్రీ పులివర్తి విజయభూషణ శర్మ)

బౌద్ధ నిర్మాణాల్లో విశిష్టమైనది స్తూపం. బుద్ధ నిర్యాణం తర్వాత బుద్ధుడి శరీరావశేషాలను పెట్టి ఎనిమిది ప్రధాన స్తూపాలు నిర్మించారనీ, అశోకుడు బౌద్ధ మత విస్తరణకై, అందులో ఏడిటిని తెరిపించి వాటిలోని బుద్ధ భగవానుని అస్తికలను ఎనభై నాలుగు వేలకు పైగా సూక్ష్మఖండాలుగా చేయించి, దేశ విదేశాల్లోని అనేక ప్రదేశాల్లో స్తూప నిర్మాణాలు కావించినట్లు బౌద్ధ గ్రంథాల కథనం.

బుద్ధుని శరీరావశేషాల మీద నిర్మించిన వాటిని శారీరక స్తూపాలనీ, ఆ మహితాత్ముడు నడయాడిన ప్రదేశాల్లో కట్టిన వాటిని 'ఉద్దేశిక స్తూపాలనీ', శాక్యముని ఉపయోగించిన భిక్షాపాత్ర, పాదుకలు మొదలైన వాటిని ఉంచి నిర్మించిన స్తూపాలను 'పారభోగిక స్తూపాల'నీ వ్యవహరించినట్లు బౌద్ధగ్రంథాలు పేర్కొన్నాయి. బుద్ధ చితాంశాలపై కట్టిన వవటం చేత స్తూపాలనే చైత్యాలుగా కూడ పేర్కొంటున్నారు. గుడి అనే నైఘంటికార్థం విదితమే.

"ఇరవై లేక పాతిక గజాల చుట్టుకొలతలతో స్తూప నిర్మాణం జరుగుతుంది. రెండు నిలువుల ఎత్తున చుట్టూ గోడ పెట్టి, దాని అట్టడుగున ఒక బంగారు బరిణెలో బుద్ధ ధాతువు ఉంది. గుండ్రని గోడ లోపలి భాగమంతా మట్టితో నింపుతారు. మన్నుపైభాగంలో గుబ్బగా పోసి దానిపై ఒక చిన్న ఆలయం వలె నిర్మించి, అక్కడ బుద్ధ విగ్రహాన్ని ఉంచుతారు. వెలుపలి భాగంలో చక్కని సమ ప్రదేశం చేసి నాల్గువైపుల మెట్లు నిర్మిస్తారు"
- ధర్మచక్రము (శ్రీ విశ్వనాథ సత్యనారాయణ)

స్తూప నిర్మాణం ప్రత్యేక పద్ధతుల్లో ఉంటుంది. కూపాకారంలోనూ, స్వస్తికాకృతిలోనూ, చక్ర స్వరూపంలోనూ నిర్మితమౌతాయి. ఇది పైకి కనిపించే స్థూలాకృతి కాగా వివిధ అంతర నిర్మాణాలుంటాయి. అండమనీ, ఆయక స్తంభాలనీ, ప్రాకారరేఖ అనీ, హార్మికమనీ ఉంటాయి. మహా నిర్మాణ చాతుర్యంతో శిల్ప పుంగవులు వీటి నిర్మాణాలు కావించినట్లు సాహిత్య స్రష్టలు ఉటంకించారు.

"ఇది ధర్మ చక్రాకృతిగా నిర్మిస్తున్న మ.ా చైత్యం. ప్రాకార రేఖ చక్రనేమి ఆకారము ధరిస్తుంది. అట నుండి బయల్వెడలె ఈ ప్రదక్షిణా పథాలే చక్రారపంక్తి నూట ఆరు అడుగులవ్యాసంతో కట్టిన ఈ వేదియే చక్రనాభి. దానిలో తట్టె ధాతు గర్భం ఈ వేదికకు నాల్గుతట్టులా ఆయక స్తంభాలుంటాయి. ధాతు గర్భంమీద అర్ధ గోళాకారమైన అండమూ, దాని మీద హార్మిక, దానిపై దండఛత్రమూ నిర్మించబడింది".
- నాగార్జునకొండ (నాటిక) శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు

వర్తులాకృత స్తూపాలే కాక తద్భిన్న శైలిలో నిర్మించిన స్తూపాలు ఉన్నాయి. (శాలిహుండంలో గజపృష్ఠాకారంలో నిర్మించబడింది) ఈ స్తూప చైత్యాలలోని ప్రతి నిర్మాణమూ ఒక విశిష్టతను సంతరించుకొని, రమణీయ శిల్పాలంకృతమై ఉంటుంది.

'ఆర్యక స్తంభాల యందచందములలో
లతలు పూవులు సింహతతులు చూచి
అండ చిత్రములు దివ్యాకారములలోని
మూర్తుల యింపు సొంపులకు మెచ్చి
ప్రాకార రేఖపై లోకాద్భుతపు శిల్ప
చాతుర్యమునకాత్మ సంతసించి
ఉష్ణీష శిల్పాల నొప్పు సముజ్జ్వల
సౌందర్యమునకు నాశ్చర్యమొంది
ఆ యధిష్ఠాన చిత్రములందు నూర్ధ్వ
పటము లందలి దివ్య శిల్పములకు కుబ్బి..........'అమరావతి
(శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు)

తొలి దశలో సంకేతాల ద్వారా తీర్చిన హీనయాన బౌద్ధ శిల్పం అమరావతిలో కనిపిస్తుంది

'......బుద్ధమం
గళమూర్తి వర్తనలు
అతని జాతక కథలు

అతడు సంసరణ సం
గతి విముక్తిని పొంద
నను భవించిన బాధలు
అన్ని యాకృతులతో
అవతరించెను............"

–నాగార్జున సాగరం(గేయ రూపకం) డా. సి. నారాయణ రెడ్డి

బుద్ధప్రతిమ లేకుండానే బుద్ధుని జీవితంలోని ప్రధానమైన ఐదు ఘట్టాలు 1. సిద్ధార్థుని జననం 2. మహాభినిష్క్రమణ 3. బుద్ధత్వాప్తి 4. ధర్మ ప్రచారం 5. మహాపరి నిర్వాణం ప్రతీకల ద్వారా శిల్పీకరించారు.

'బుద్ధోదయమున కద్భుత చిహ్నములు గాగ
పద్మ చిత్రములు పాదుకొల్పి
అద్వయవాది మహాభినిష్క్రమణంబు
తలపించు వారువమ్ములను మలచి
మారజయంబు నుదార బుద్ధత్వాప్తి
స్మరియింప బోధి వృక్షముల చెక్కి
సౌగత ధర్మ ప్రచారంబు సూచించు
ధర్మ చక్రముల విస్తరము తీర్చి
ఆ మహాపరి నిర్వాణ మాత్మ నెలయ
స్తూప రూప శతమ్ముల దొలచి పెట్టి
శాక్యసింహుని జీవిత సారమెల్ల
వ్రాసినారీ శిలామయ గ్రంథమందు'

–అమరావతి (శ్రీ కొండూరి వీరరాఘవాచార్యులు)

పై ఐదు ఘట్టాలలో పుట్టుకను సూచించటానికి పద్మలతలు నిష్క్రమణకు గుర్రాలను, బుద్ధునిగా పరిణతికి బోధివృక్షాలను.. ధర్మ ప్రచారానికి గుర్తుగా ధర్మ చక్రాలనూ చెక్కారు. మహాపరి నిర్వాణ దశను సూచించే స్తూపరూపాలను తీర్చారు. స్తూపం అంటే సమాధి కనుకనే నిర్వాణాన్ని ఈ ప్రతీక ద్వారా వెల్లడించారు.

సంసార కంధి దాటి బుద్ధత్వ సిద్ధి పొందటమే బౌద్ధమత లక్ష్యం. ఈ లక్ష్యసూచకాలుగా చైత్యాలపై సింహ సమూహాలను గండరించారు.

'కామ కల్పిత సంసార కంధి దాటి
జీవితమ్మున బుద్ధిత్వ సిద్ధి గాంచు
గెలుపునకు సూచకంబుగా మలచినారు
చైత్యమున రమ్యతర సింహ సముదయంబు'

–అమరావతి (శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు)

ప్రథమ దశలో ప్రతీకమానమైన బౌద్ధశిల్పం బుద్ధ తత్త్వాన్నే శిల్పించినా, తర్వాత దశలో బుద్ధ భగవానుని పాదాలను ఆవిష్కరించటం ద్వారా ప్రతిమా శిల్పానికి తెరదీసారు. వాటినే అనుయాయుల ప్రజలు ఆరాధించారు. ఈ పాదాలను శుభ లక్షణ లక్షితాలుగా శిల్పివరేణ్యులు తీర్చిదిద్దారు.

'ఇవిగో బుద్ధుని దివ్య పాదములు గంటే శూల చక్రాది ల
క్ష్య విలాసోజ్జ్వలముల్ దురంత భవ దుఃఖ ధ్వంసకంబుల్ సదా
భువనా రాధ్యము లెట్లు శిల్పి పూర్వప్రక్రియా సృష్టి వై
భవ చాతుర్యము రూపమెత్తి నటులే భావించి కల్పించెనో'

–అమరావతి (శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు)

కృష్ణవేణీ పరీవాహక ప్రదేశమైన ఆంధ్రసీమలో మహాయాన బౌద్ధం విలసిల్లింది. మహాయానంలో ప్రతిమా శిల్పావిర్భావమే కాక, ఆ శిల్పం బహుళ వ్యాప్తిలోకి వచ్చింది. ఆ విషయాన్నే

'ఆంధ్ర భూమిలో మహాయాన శిల్పమ్ము
పంట పండి కీర్తి ఘంట మ్రోగె...'

–సౌగంధికము (శ్రీ పులివర్తి విజయభూషణ శర్మ)

తొలినాళ్లలోని (హీనయానం) సూచ్యప్రాయంగా ప్రతీకాత్మకంగా తెలియజేసిన శిల్పాలన్నీ మలినాళ్లలో(మహాయానం) ప్రత్యక్ష పద్ధతిలో రమణీయంగా చెక్కబడినాయి. తెల్లని రాళ్లలో గౌతముని జీవిత ఘట్టాలన్నింటికి శిల్ప వ్యాఖ్యానం చేశారు.

'మాయా మహాదేవి మహిత గర్భంబున
నభ్ర గజచ్ఛాయ లలము తీరు
లోక కళ్యాణ సుశ్రీ కారణంబౌ త
థాగతు జన్మవృత్తాంత సరణి.........
.........పాలరాలచే జెప్పింప జాలినోడ
వో మహాశిల్పి ధన్యుండవోయి నీవు'

–కళాక్షేత్రము (శ్రీ బోడెపూడి వేంకటరావు)

శాక్యసింహుని రూపాన్ని కరుణరసము పొంగి కాల్వగట్టే విధంబుగ, ఆ మహనీయుని జీవితచరిత్ర శీల సంస్కారాలకు చిగురు పెట్టే విధంబుగ స్థపతి వరేణ్యులు శిల్పాలలో ఆవిష్కరించారు.

నాగార్జున కొండ శ్రీగిరిగా ఆనాడు పిలవబడేది. ఇక్కడ బౌద్ధ శిల్పాన్ని తీర్చింది ఆ ప్రాంతంలోనో,సమీపంలోని పెందోటలోనో పుట్టి పెరిగిన తెలుగు శిల్పులే. ఆంధ్రుల వేషభాషల వ్యవహారసరళులు అక్కడ శిల్పంలో కానవస్తాయి. ఆంధ్ర శిల్పశైలిగానే ఈ శిల్పం కీర్తించబడటం విశేషం.

'రేఖలు తీరు భంగిమలు రీతులు నిత్యవినూత్న దివ్యశో
భాఖనులైన యంగముల భంగులు వస్త్ర విభూషణక్రియా

వైఖరు లంగ హారముల పద్ధతులుజ్జ్వల భావబంధురా
లేఖన సంగతుల్ తెలుగు లీలలె పో సరిపోల్వ నెల్లెడన్'

-కళాక్షేత్రము (శ్రీ బోడెపూడి వేంకటరావు)

జీవకళల కాంతులను చిమ్మె జాతక కథలకు సంబంధించిన శిలా ప్రతిమల్లో ఆర్యోక్తులు చెప్పె ఒక రామ, జడ ఒయ్యారంగా ఊపె ఒక లేమ, అద్దం చూసుకొనె ఒక భామ, శిరసెత్తిన ఒక వామ, ప్రియుని జేర పరవశించిన ఒక కొమ్మ, ఒక చిలుకల కొలికి, ఇంకొక అలివేణి, మరొక పూబోణి మనోజ్ఞంగా రూపు దిద్దుకొని అలరించిన తీరు 'సౌగంధిక' 'కళాక్షేత్ర' కావ్యాల్లో మనోహరంగా వర్ణించబడింది.

నాగార్జునకొండ బౌద్ధారామ పీఠం. బుద్ధ దయా సూక్తులకు శిల్ప పూజ జరిగింది. శాతవాహన రాజులు బౌద్ధ స్తూపాలు నిర్మింపజేశారు. విశ్వవిద్యాలయాలను స్థాపింపజేశారు.

'బౌద్ధ గాథలనేకముల్ ప్రస్తరముల
పై రచించిరి ఆ చంద్ర తారకముగ
నాటి నాగార్జునా చార్యు జ్ఞాన బోధ
లం బవిత్రులయిన కళాదవరులు'

-సౌగంధికము (శ్రీ పులివర్తి విజయభూషణ శర్మ)

శ్రీ పర్వత(నాగార్జున కొండ) ప్రాంతంలో ఇక్ష్వాకుల కాలంలో నాగార్జునాచార్యుని నేతృత్వంలో స్తూపాలే కాక సంఘారామ విహారాదులు నిర్మించబడ్డాయి. నేటికి శిథిలమైన ఒకనాడు మహోజ్జ్వలంగా ప్రకాశించిన శిల్పకళా విలాసాలవి.

'అచటి విహారముల్, శిథిలమై కళ తప్పిన చైత్యరాజి, స్తూ
ప చయము, శిల్ప ఖండములు ప్రాకృత భాంక నిదర్శనమ్ము లాం
ధ్ర చరితమందు కానబడు రాజిత శిల్పకళా విలాసముల్
ప్రచురత నందు నచ్చట ప్రభాత శుభారుణ పాద పంక్తులై'

-మహాబోధి (శ్రీ దాశరథి కృష్ణమాచార్యులు)

కృష్ణమ్మకి కుడిక్రేవ పలనాటి సీమలో విఖ్యాతమైన శ్రీ గిరీంద్ర శిలల్లో ఆంధ్రశిల్పులు ఆటలాడించిన ఉలుల మోతలకు ఉల్ల మోల లాడుతుంది. ఆంధ్రశిల్పి ఔన్నత్యాన్ని జగతికి తేటతెల్లం చేస్తుంది.

'అను కృష్ణా తట సంస్థితంబయిన నాగాద్రిన్విలోకించి యాం
ధ్రుని యౌన్నత్య మెరుంగ రమ్ము, శిలలందుందా కుశాగ్రీయ బు
ద్ధుని జొప్పించి పవిత్ర బుద్ధ కథ చిత్రించెన్ మహా శిల్పి వా
నిని యాదర్శముగా గ్రహించి తెలుగింటన్ జక్కగా దిద్దుమా !

-- మహాబోధి (శ్రీ దాశరథి కృష్ణమాచార్యులు)

శాతవాహనుల కాలంలో ధరణికోట అమరావతి రెండూ కలిసే ఉండేవి. ధాన్యకటకం అనే పేరుతో రాజధానిగా వన్నెకెక్కినది ఈ నగరనిర్మాణం. ఆధునిక పాశ్చాత్య వాస్తు పండితులకు అబ్బురమనిపించింది.

'బర్జెస్, విన్సెంట్ స్మిత్తులు
స్ఫూర్జిత మతి ధరణి కోట పుర నిభవం బ
త్యూర్జిత మమరావతిగ, స
మార్జిత కీర్తి వచించి రతి శోధనలన్'

-సౌగంధికము (శ్రీ పులివర్తి విజయభూషణ శర్మ)

''కాశ్యపశిల్పమ్', 'విశ్వకర్మ వాస్తుశాస్త్రమ్', 'అపరాజితపృచ్ఛా' మొదలయిన శిల్పశాస్త్ర గ్రంథాల్లో ఉటంకించబడిన వాస్తు ప్రమాణాలను రాజధానిని పరిపుష్టం చేసే ఆనాటి అక్కడి దుర్గ ప్రాసాద భవన హర్మ్యాదులు, వాపీకూప తటాకాదుల నిర్మాణాల్లోనూ దర్శించవచ్చు.

'మతి కబ్రమగు తృణీకృత దేవ గురుమతి
ప్రతిమాన దుర్గ నిర్మాణ శక్తి
ఆశ్చర్యమగు ధ్వంసమైనప్పటికి నిప్ప
టికి చిహ్నములున్న, శిల్పకళ సొగసు
అంతంత రాళ్ళెట్టులా పైకి నెత్తిరో
దేవతలో యేమో తెలియరాదు
చూచినం జాలు నచ్చోట సరోవరం
బుల లోతు నేటికి తెలియదు...........'

-ఆంధ్ర పౌరుషము (శ్రీ రాయప్రోలు సుబ్బారావు)

దుర్గమంటే కోట. శత్రు ప్రవేశ దుర్గమ మైనది కాబట్టి దుర్గం. వివిధ రకాలయిన దుర్గాలు (ధన్య, మహా(మహీ), జల,వృక్ష, మనుష్య, గిరి దుర్గాలు) ఉన్నాయి. మగధ నుండి కన్యాకుమారి వరకు విస్తరించిన శాతవాహన మహా సామ్రాజ్యానికి కృష్ణాతీరంలోని అమరావతి (ధాన్యకటకంతో కలిసి) రాజధాని నగరంగా ఉండేది. ఇక్కడ పరిపాలకులు శత్రు దుర్భేద్యంగా యంత్రాయుధ సమన్వితంగా మహా దుర్గాన్ని నిర్మించటమే కాక, శాస్త్రబద్ధంగా రాజప్రాసాదాలు, సౌధాలనూ, సూత్రం పట్టి వీథులనూ తీర్చిదిద్దుకున్నారు. ఈ నగరం శిల్ప సంపదకు ఆటపట్టుగా వాస్తు కళా సౌందర్యానికి కొంగుపసిడిగా అలరారింది.

'ఈ మహా దుర్గంబు నెటుల నిర్మించిరో
శాత్రవానీక దుస్సాధ్యముగను
ఈ నృప ప్రాసాద మెటు సృష్టి చేసిరో
శిల్ప దేవత దృఢాసీన గాగ

ఈ సౌధ విధముల నెట్లు కల్పించిరో
వాస్తు సంపద కాటపట్లు గాగ
ఈ వీధి విన్యాస మెట్టు లూహించిరో
పురలక్ష్మి క్రొత్త సొంపులు వహింప
ఈ మనోజ్ఞా పణంబుల నెట్లు తీర్చి
కట్టిరొ క్రొత్త చెలువము లుట్టి పడగ
ఈ పురోద్యాన వాటుల నెట్లు తీర్చ
గల్గి నారలో వింత సింగార మొలుక'

-అమరావతి (శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు)

నివాస గృహాలు వాస్తు శాస్త్ర మర్యాద ననుసరించే కళాత్మకంగా నిర్మించబడేవి. ఆ నివాస గృహాల్లో చతుశ్శాలలుండేవి.

'ధాన్యకటకంలోని కోట, నృపప్రాసాదము, రాజ సౌదాలు వాస్తు శిల్ప కళామయముగా తీర్చిదిద్దబడినాయి. రాజప్రాసాదములో అభ్యంతర మందిరాలు, స్నానగృహాలు, విద్యాగృహాలున్నాయి. ఇవి అందంగా నిర్మించ బడినాయి....ధర్మనంది ఇల్లు చతుశ్శాలాంతరమైన హర్మ్యము. ఈ హర్మ్యమునకు రెండు మేడలున్నవి. ఒక మేడ శుద్ధాంత జనము వసించునది. ఆ మేడ వెనుక స్త్రీ జనాశ్రయమైన మండప గృహము సూతికా గృహమును ఉన్నవి. మేడలందు పైకి పోవుటకు రెండు సోపాన పంక్తులు కలవు'. -హిమబిందు (శ్రీ అడవి బాపిరాజు)

'అమరావతీ నగరాన బౌద్ధులు విశ్వ
విద్యాలయము స్థాపించునాడు....'

-ఆంధ్ర పౌరుషము (శ్రీ రాయప్రోలు సుబ్బారావు)

దేశ విదేశ విద్యార్థులు చదువుకొన్న విశ్వ విద్యాలయం అమరావతీ నాగార్జునకొండ పరిసరాల్లో నిర్మింపబడింది. ఈ విశ్వవిద్యాలయం మహా బౌద్ధాచార్యుడైన నాగార్జునాచార్యుని మేథా సంపత్తికి నికషోపలం.

'అదె విశ్వ విద్యాలయ ప్రవేశ ద్వార
మతి లోక శిల్పాల కాటపట్టు.........'

-అమరావతి (శ్రీ కొండూరు వీర రాఘవాచార్యులు)

విశ్వవిద్యాలయంలో యోగ్యతాపత్రాలందించే శాస్త్రార్థాలను బోధించే, విదేశ విద్యార్థులకు వసతి సదుపాయాలు కల్పించే భవనాలు మహోత్కృష్ట శిల్పకళా నిలయాలు. (నాగార్జునకొండ వద్ద త్రవ్వకాల్లో కనుగొన్న విశ్వవిద్యాలయ అవశేషాల్లో పై నిర్మాణ విశేషాలన్నీ దృగ్గోచరమవుతాయి)

ఇంక అక్కడ బౌద్ధ వాతావరణం నేపథ్యంగా కలిగిన వివిధ ఉద్దేశాలను నెరవేర్చే కార్యాలయాలుండేవి.

'అట బౌద్ధ సన్న్యాసులాదరించు ననాథ
బాలురుండిన శరణాలయములు
అట హోమ కుండాల కాహుతి గాబోవు
పశువుల రక్షించు భవన సమితి..........'

అమరావతి(శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు)

త్రిరత్నాలను బోధించే దీక్షా గృహాలు, ఉపన్యాస వేదికలు, అష్టాంగ యోగాభ్యసన శాలలు మొదలయినవి పురవీథుల్లో నిర్మించబడ్డాయి. రాజధాని ధాన్యకటక నగర వైభవానికి కారణం మహాద్భుత వాస్తు శిల్ప సంచయమే. శాతవాహనుల రాజధానీ నగరంలో గోపురాలు, ద్వారతోరణాలు, కుడ్యాలు అద్భుత శిల్పకళా విలాసంతో నిర్మితమై పుర సౌందర్యాన్ని పెంపొదింప జేశాయి.

'గోపుర ద్వార తోరణ కుడ్యతతుల
శిల్ప విన్యాస రీతులచ్చెరువు గొల్పి
ధాన్యకటక పురీంద్ర సౌందర్య లక్ష్మి
విభ్రమ విలాసముల జెప్పు నే విధముల'

-అమరావతి (శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు)

నాగార్జునకొండకు సమీపంలో గల కృష్ణానదీ తీరంలోని విజయపురి ఇక్ష్వాకుల రాజధాని. ప్రతిపాల పురం (ఇప్పటి భట్టిప్రోలు) ఇక్ష్వాకులకు మరి యొక ప్రధాన నగరం. వీరి సమయంలోనే శ్రీ గిరి వద్ద చైత్య విహారాలు విరివిగా నిర్మించబడినాయి.

సాంకేతికమైన వాస్తు యంత్ర శిల్పం ఆనాడే ప్రదర్శించబడ్డాయి. కృష్ణానదికి అనుకొనియున్న ఈ నగరంలోనుండి కొండ పైకి యంత్రాల ద్వారా నీటిని చేరవేశారు.నీటిపారుదలా వ్యవస్థను గొప్ప యాంత్రిక శిల్ప ప్రణాళికతో అమలుచేసిన ప్రతిభావంతులు ఆనాటి శిల్ప వరేణ్యులు.

'విజయపురమునకు పడమటి భాగమున కృష్ణానది ప్రవహించు చుండెను. వాయువ్య దిక్కున నాగార్జున కొండ యుండెను... కృష్ణానదిలో నుండి నాగార్జున కొండమీదికి జలము యంత్రముల ద్వారా తోడబడి నిలువ చేయబడి యుండెను. ఈ ప్రదేశము నుండి ప్రతి విహారమునకును రాతి తూముల ద్వారా గొట్టముల ద్వారా జలము సమృద్ధిగా నందింపబడుచుండెను.

-ధర్మచక్రము (శ్రీ విశ్వనాథ సత్యనారాయణ)

విజయపురి నుండి అమరావతికి నదీ మార్గం ఉండేది. ఆ మార్గం ప్రతిపాలపురం (భట్టిప్రోలు) వరకు కూడ విస్తరించిఉండేది. కొంత కాలమది ఇక్ష్వాకు రాజధానిగా కూడా ఉంది. ఇక్కడ అతి సుందరంగా నిర్మించిన మహా చైత్యమున్నది.

'..........ఇక్ష్వాకుల రాజధాని యగు ప్రతిపాల పురమున ధర్మశాల యందు విడిది చేసిరి. అద్భుత నిర్మాణమై అలరారుతున్న అచ్చటి మహా చైత్యమునకు పూజలు సల్పిరి'

-హిమబిందు (శ్రీ అడవి బాపిరాజు)

అమరావతి శిల్పం స్వర్గమర్త్యంబుల సంగమ స్థలిగా కీర్తింపబడి ఆంధ్ర శిల్పకళా లక్ష్మికి అమరత్వాన్ని కలిగించింది.

**'ఆంధ్ర కళా లక్ష్మి కమరత్వ మొసగు**
**నమరావతీ శిల్ప మాదర్శకముగ**
**స్వర్గ మర్త్యంబుల సంగమ స్థలిగ**
**దైవ మానవ ధర్మ తాత్పర్య మొసగ**
**నెల్ల భావంబుల కేకాశ్రయముగ**
**సిద్ధ నాగార్జున శ్రీ పదాంకితము**
**క్షేత్రమ్ము సత్కళాక్షేత్రమ్మొనర్చు**
**భావనా హిత తుభ్యం విజయోస్తు'**

-కళాక్షేత్రము (శ్రీ బోడెపూడి వెంకటరావు)

ఇక్కడ శిలలు మహా శిల్పుల చేతిని బడి వన్నెలు సంతరించు కున్నాయి. రసరమ్య శిల్పకావ్యాలుగా అవతరించాయి.

'శిలలకు వన్నెనిచ్చు నమరావతి శిల్పుల నేర్పు పెంపు..........' ఖండకావ్యం (శ్రీ గుర్రం జాషువా)

జగద్విఖ్యాతి నార్జించిన ఈ శిల్పకళా సంపద ఆంధ్రులందరిని చరితార్థులను చేస్తుంది. కృష్ణాతట సంస్థితంబయిన అమరావతీ నాగార్జునకొండ భట్టిప్రోలు మొదలైన క్షేత్రాలు ఆంధ్రశిల్పకళా విరాజితాలు. ప్రతి తెలుగువాడు దర్శించి గర్వించవలసిన రమణీయ స్థలాలుగా కవి పుంగవులు చాటి చెప్పారు. ఈ క్షేత్రాలకు సమీపంలో గల 'పెందోట'లో శిల్పశాలలున్నట్లుగా, అది మహాశిల్పులకావాసంగా ఉన్నట్లు సాహిత్యవేత్తలు పేర్కొన్నారు.

**'.........ఆంధ్రశిల్పుల నాణెమైన చెక్కడముల**
**కాంతులు చిమ్ము విఖ్యాత సీమ**
**ప్రతి తెలుగు వాడు గర్వించ వలసినట్టి**
**దివ్యదేశము బుద్ధమూర్తికి ప్రియమ్ము**
**తమ్ముడా ! రమ్ము చూచి వత్తుము పవిత్ర**
**నాగ శైలాధిరాజ పుణ్యస్థలమ్ము...........'**

-మహాబోధి (శ్రీ దాశరథి కృష్ణమాచార్యులు)

దక్షిణాపథంలో ఆంధ్రావనిలో ఉత్తర ప్రాగ్వాహినియైన కృష్ణవేణీ పరీవాహకం సస్యశ్యామలమైన ప్రకృతి సంపదలతో అలరారింది. మహోన్నతమైన శ్రీగిరి పర్వత సానువులతో సహజాభేద్య దుర్గమమై శాతవాహన ఇక్ష్వాకు రాజవంశాలకు రాజధానియై వర్ధిల్లింది. తథాగతుని దివ్యబోధనలతో శాంత్యహింసా సత్యములతో పరిఢవిల్లింది. మహానిర్మాణకళాచయమై బౌద్ధశిల్పక్షేత్రమై విరాజిల్లింది. సమున్నత సాహిత్యగౌరవం పొందింది. సహృదయ హృదయాంతరంగాల్లో ప్రతిష్ఠితమైంది.

## ఈ వ్యాసానికి సహకరించిన సాహిత్య గ్రంథాలు


1. అమరావతి (కావ్యం) శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు
2. ఆంధ్ర పౌరుషము (ఖండిక) శ్రీ రాయప్రోలు సుబ్బారావు
3. కళాక్షేత్రము (కావ్యం) శ్రీ బోడెపూడి వేంకటరావు
4. ఖండకావ్యం శ్రీ గుర్రం జాషువా
5. తెలుగుతల్లి (ఖండిక) కరుణశ్రీ
6. ధర్మ చక్రము (నవల) శ్రీ విశ్వనాథ సత్యనారాయణ
7. నాగార్జున సాగరం (గేయ రూపకం) డా. సి. నారాయణరెడ్డి
8. నాగార్జున కొండ (నాటిక) శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు
9. మహాబోధి (కావ్యం) శ్రీ దాశరథి కృష్ణమాచార్యులు
10. సౌగంధికము (కావ్యం) శ్రీ పులివర్తి విజయభూషణ శర్మ
11. హిమబిందు (నవల) శ్రీ అడవి బాపిరాజు
12. అమరావతి (రేడియో రూపకం) శ్రీ మల్లంపల్లిసోమశేఖరశర్మ


## ఈ వ్యాసానికి సహకరించిన సాహిత్యేతర గ్రంథాలు


1. శిల్పదర్శనము శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు
2. ఆంధ్ర శిల్పము శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి
3. Beginnings of Buddhistic Art M. Fouchec
4. Indian Architecture (Buddhist and Hindu Periods) Percy Brown


చిరునామా : డా॥ పి.బి.డి.వి. ప్రసాద్, కోడూరు.... దివిసీమ... కృష్ణాజిల్లా, ఫోన్ : 8186814532

ఆచార్య గంగిసెట్టి లక్ష్మీనారాయణ

# 'క్లాసికల్' భాషోద్యమం : ముందూ, వెనుక

సరే! 19వ శతాబ్దిలో కాల్డ్‌వెల్ వేసిన విత్తనం పుణ్యమా అని, అది ఆ తర్వాతి రెండు మూడు దశాబ్దాలకే ఏపుగా పెరిగి, మరో శతాబ్దిన్నరకి స్వతంత్ర భారత ప్రభుత్వమే 'క్లాసికల్' ముద్ర వేసేంతదాకా వచ్చింది. ఉత్తరాద్రిలో సంస్కృతం, దక్షిణాది భాషలన్నిటికే మూలమైన 'మూల ద్రావిడ' భాష ఒకటుండి ఉంటుందని 'మాట వరసకు' ఓ చోట భాషా పరిశీలన సందర్భంలో అన్నప్పటికీ, తమిళానికే మరోపేరు ద్రావిడమనీ, మిగిలిన వాటికంటే తమిళమే ప్రాచీనమైందని, మిగిలినవి తమిళభాష భేదాలనీ ఆయన అనేకమార్లు ఉద్ఘోషించిన పుణ్యం ఊరకే పోతుందా? – ఆ మూల ద్రావిడానికి అసలు వారసులమైన ద్రావిడులం మేమేనంటూ, కనుక సంస్కృతంలా తమిళమూ ఈ దేశ భాషలకు తల్లి భాష. కనుక 'క్లాసికల్ భాష' అని ప్రకటించండని తమిళులు ఉద్యమించడంలో ఆశ్చర్యమేముంది?

మతావసరాల నిమిత్తం తమిళం పట్ల ప్రేమతోనే, అంతకు మునుపు ఎల్లిస్ ప్రభృతులు దక్షిణాది భాషలు సంస్కృత మాతృకకు సంబంధించినవి కావని చేసిన ప్రతిపాదనను, తెలివిగా వాడుకుంటూ, అవి తమిళం లాటివి, తమిళ భాష భేదాలు అంటూ తమిళ మాతృకమని తెలివిగా ధ్వనింపజేశాడు. బ్రాహ్మణ, బ్రాహ్మణేతర వర్గభేదం కూడా దాని వెనకాల చేరింది. దాంతో పాటు, వేదం చదువుకొన్నవారము, వేద ప్రామాణ్యం గలవారము అనే ఆధిక్య భావంతో, ఆంధ్రప్రాంత బ్రాహ్మణులు తమిళనాటి బ్రాహ్మణులను కూడా అంత మన్ననగా చూసేవారు కాదు (ఇది ఇటీవలిదాకా కొనసాగిన వాస్తవమే) ఈ వర్గభేదాలు, సామాజిక భావనలు వెనుక నుండి పనిచేసి, రంగస్థలం మీద 'తమిళం సంస్కృతంలా మరో మాతృకభాష – క్లాసికల్ భాష' అనేమాటను 19వ శతాబ్ది అఖరుకే నిలిపాయి. పారుదిమలై కలైజ్ఞర్ అనే తమిళ విద్వాంసుడు, 1887లో ఈ డిమాండును, మొదటిసారిగా, బాహాటంగా, గట్టిగా వినిపింప జేశాడు. కాల్డ్‌వెల్ తన గ్రంథ పరవర్ధిత పునర్ముద్రణలో, ఈ భాషలకు మూలమైన ప్రాచీన ద్రావిడ భాష ఒకటుందని చెబుతూనే, 'తమిళం ఈ భాషా కుటుంబమైన అత్యంత ప్రాచీన లక్షణాలు కలిగి ఉన్నట్టిది' అని తీర్మానించడం, ఈ డిమాండుకు క్రమేపీ కొత్త బలాన్ని సమకూర్చి పెట్టింది. ఆ తర్వాత అదే రకరకాలుగా విస్తరిస్తూ వచ్చింది. ఎందాకా అంటే, సుబ్రహ్మణ్య భారతి వంటి మహోదాత్తకవి, జాతీయోద్యమం ప్రచండంగా సాగుతున్న కాలంలో 'ద్విధారూపమైన జాతీయ భావా'న్ని కవిత్వీకరించాడు. అంటే ఒకవైపు, భారతదేశం పట్ల, మరోవైపు 'తమిళగం' (తమిళజగం, తమిళదేశం) పట్ల విధేయత, ప్రపత్తిని చాటే రెండు రూపాల జాతీయ భావన. ఆయనొక్కడే కాదు, ఆనాటి మన తెలుగు కవులు, కన్నడ కవులూ అందరూ అంతే. అది దేశభక్తి, ఇది భాషాశక్తి అని భావించబడింది. భాషా ప్రయుక్త రాష్ట్రాలేర్పడ్డాక, హిందీభాష పట్ల కేంద్రం అనుసరించిన దేశభాషాభక్తి విధానం మిగిలిన వాటికి అభద్రతా కారకంగా పరిణమించడంతో, భాషా ప్రతిపత్తి పునాదిగా ద్రవిడ పార్టీలు తమిళనాడులో బలం పుంజుకొని, అధికారంలోకి వస్తూ భాష – రాజకీయాలకు ఒక కొత్త తెరను లేపాయి. దరిమిలా ద్రవిడ పార్టీల అధీనంలోని తమిళనాడు ప్రభుత్వం,రాష్ట్ర ప్రభుత్వ పక్షాన్నే, ఈ డిమాండును కేంద్రప్రభుత్వం ఎదుటికి 20వ శతాబ్ది నాలుగో పాదం నుంచి తీసుకురావడం మొదలు పెట్టింది. 1980లో ఎం.జి. రామచంద్రన్ గారి నేతృత్వంలో మధురైలో జరిగిన ప్రపంచ తమిళ మహాసభలో తమిళాన్ని భారతీయ 'క్లాసికల్ భాషగా ప్రకటించాలనే తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడి కేంద్రానికి పంపబడింది. అప్పటినుంచి అదొక రాజకీయ అజెండాగా మారింది. ఏ ద్రవిడ పార్టీ వచ్చినా సరే. అజెండా మారలేదు. చివరకు 2004లో అధికారంలోకి వచ్చిన దుర్బల యు.పి.ఏ. ప్రభుత్వం తమిళానికి 'క్లాసికల్ హోదా' కానుకను, మిగిలిన భాషలకు ఓ హెచ్చరికను ప్రసాదించింది.

పక్కవాళ్లకి ఏదైనా జరిగితే కాని తెలుగు వాళ్లకి తిక్క కుదరదు. 'తిక్క' అనే శబ్దం 'తీక్ష్ణ' అనే సంస్కృత శబ్దం నుండి వచ్చిందని పండితులు వ్యుత్పత్తి చెప్పారు.

అంతదాకా భాష విషయంగా ఏమాత్రం పట్టింపూ, సంఘటిత శక్తీలేని తెలుగువారు, తమిళానికి ఈ కొత్త హోదా ప్రకటించగానే, అప్పుడు 'ఆత్మాభిమానం' గుర్తుకు వచ్చి, తమకూ ఆ హోదాకావాలని ఏక కంఠంతో ఉద్యమించారు. 80ల నడిమి భాగం నుంచి వ్యాప్తిలోకి వచ్చిన కార్పొరేట్ విద్యా విధానం, తెలుగును చిన్న బడుల స్థాయిలోనే సమూలంగా తుడిచి పెట్టేస్తోంటే పట్టించుకోని తెలుగు ప్రజ, క్లాసికల్ భాషోద్యమం పేరిట కాస్త ఉడుకు రక్తంతో ఆలోచించడం శుభ పరిమాణం. నిద్రాణ స్థితికి చేరుకున్న తెలుగు భాషా చేతన, త్వరలోనే అంతరించబోయే భాషలో తెలుగూ ఒకటి అని అంతర్జాతీయ నిపుణుల నివేదిక ఘోషించినా, మేల్కొనని భాషాభిమానం, ఈ క్లాసికల్ భాషోద్యమం పేరిటైనా మేల్కొనడం చాలా గొప్ప పరిణామం.

ఉద్యమం వస్తే ఊపిరి తిప్పుకోలేని స్థితి తెలుగుది. ఇంత మంచి పరిణామం తెచ్చిన ఉద్యమానికి ముందు, తెలుగు భాషా చేతన పరంగా తెలుగునాట మునుపొచ్చిన ఉద్యమాలను రేఖాప్రాయంగానైనా ఇక్కడ చూడడం సమంజసం. చరిత్ర పరమైన కథనం కనుక ఈ అవసరం ఏర్పడుతోంది.

### చారిత్రకంగా తెలుగు భాషోద్యమాలు :

భాషా స్పృహతో కలిగిన ఉద్యమాలు చారిత్రకంగా చూస్తే ఆరు –

### మొదటి దశ :

రేనాటి చోళుల నాటిది. వారి హయాంలో తెలుగు శాసనం ఎత్తించినంత మాత్రాన అదో ఉద్యమమవుతుందా? అనే ప్రశ్న రావచ్చు. తెలుగు శాసనాన్ని నెలకొల్పడమన్నది ఒక సంఘటన. చారిత్రాత్మక సంఘటన. ఏ నేపథ్యమూ లేకుండా ఒక చారిత్రక సంఘటన జరగదు. అ నేపథ్యానికి కారణమైన స్థితినే సరిగ్గా విమర్శించి చూస్తే అదో ఉద్యమ ఫలితమని అర్థమవుతుంది.

శాతవాహనులు అచ్చ తెలుగు కుటుంబీకులైనా, ఆంధ్ర భృత్యులుగా మొదలవడంతో కొంతకు కొంత మహాసామ్రాజ్యాధి నేతలకు జవాబుదారులై ఉన్నారు. వారి అంగీకారంతోనే సామంతుల పరిధిల్లో కూడా శాసనాలు రూపొందాలి. అందుకోసం వారి అవ గాహన కొరకు వారికి తెలిసిన భాషలో శాసనాలు విడుదల తప్పలేదు. అప్పటికే సంస్కృతంలో కాకుండా పాకృతంలో శాసనాలు విడుదల చేశారు. ప్రాకృతంతోపాటు తెలుగు భాషపట్ల కూడా వారు మక్కువ చూపారన్నది యదార్థం. దానికి గుర్తే నాణేల మీద ఒకవైపు ప్రాకృతం లోనూ మరోవైపు తెలుగులోనూ వివరాలుండడం. ఇది ఆంధ్రభృత్య స్థితి నుంచి క్రమేపి వారు స్వతంత్ర స్థితిలోకి రావడానికి సంకేతం. అయితే ఇక్కడ భాషాపరంగా గుర్తించాల్సింది ఆ ప్రాకృతంలో తెలుగును ఎంత చక్కగా, సహజంగా సమసింపచేశారు అనే విష యాన్ని. ప్రాకృతం, తెలుగు అభేదమనిపించేలా శబ్దరూపాలు చెప్పాయి. క్రియలు, ప్రత్యయాలు, వాక్యయ నిర్మాణాదుల్లో భేదం వల్లనే అవి విడిభాషలనిపించుకున్నాయి తప్ప పద నిర్మాణంలో అంత దగ్గరితనం ఏర్పడింది. ఈ సారూప్యం వల్లనే తెలుగునుంచి ప్రాకృ తంలో ఇంత సహజంగా తెలుగు సమసించిన తీరే తరువాతి యుగాల్లో తెలుగు భాష వికాసం మీద తన ప్రభావం చూపి ఉంటుంది.

### రెండవది : రేనాటి చోడుల ఆత్మ గౌరవ సూచిక

శాతవాహనులు అనంతరం తెలుగు నేలను వివధ ప్రాంతాల నుండి పాలించిన ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు, ఆనంద గోత్రీకులు, శాలంకాయనులు, పల్లవులు పూర్తిగా సంస్కృతంలోనే శాసనాలను ప్రకటించారు. వీరు శాతవాహనుల్లా మరొకరికి జవాబ్దారీగా ఉన్నవారు కాదు. పూర్తి స్వతంత్రులు. వారందరూ సంస్కృతాన్నే రాజభాషగా ఆదరించారు. అంటే వారెవరూ ఏ మాత్రం తెలుగు మూలాలు కలవారుకారని గుర్తించవచ్చు. ఉత్తర ప్రాంతాల నుండి, సంస్కృత ప్రాధాన్య వర్గం నుండి వచ్చిన వారో, అలావచ్చిన వారి మూలాలు కలవాం అయి ఉండాలి. ఒక విధంగా సాంస్కృతికమైన పరాయి పాలన. దీనివల్ల సహజంగానే దిగువనున్న తెలుగు చోడుల్లో వ్యతిరేకత మొదలైంది. వీరికి తమిళ ప్రాంత చోడుల (చోళుల)తో జాతి సంబంధమున్న కారణంగానే,వీరిని తెలుగు చోళులని వ్యవహరించడం పరిపాటి. భాషాపరమైన వీరి అభిమానానికి ఆ భాందవ్యం ఒక కారణం కాబోలు. రేనాటి (నేటి రాయలసీమ) చోళులు తొలిసారిగా తమ స్వతంత్రతకు సూచకంగా తెలుగులో శాసనం నెలకొల్పారు. నాటి తెలుగు ప్రజ మనోభావాలకు,స్వతంత్ర ప్రియతకు అదో సంకేతం. రేనాటి వారికి ఆది నుంచి పరభాషా ప్రియత తక్కువే. అప్పటి నుండి ఆ మనోభావాలను గుర్తించి, తదనంతరం ఏలికలు, వారు ఎటువైపు వారైనా తెలుగును సమాదరించక తప్పలేదు. రాజభాష సంస్కృతం తెలుగుతో సమసించక తప్పలేదు.

### మూడవది :

ఆ సమసించడం ఒక సమున్నత సాహిత్యకృతిగా రూపొందడం. తెలుగు వికాసాన్ని ప్రభావితం చేసిన రెండవ ఉద్యమం. తెలుగు

గమనాన్ని పూర్తిగా మార్చిన ఉద్యమాత్మక విధానం నన్నయ్య ప్రవేశ పెట్టిన మార్గపద్ధతి. సాహిత్యపరమైన 'క్లాసిసిజం' అంటే అదే. నీతి శాస్త్రంగా, ధర్మశాస్త్రంగా, పురావైభవ ప్రబోధకమైన పురాణ శాస్త్రంగా – అనుశాసకత, ఆదర్శనీయత, అనుకరణీయత, సముదాత్తత ప్రాణ లక్షణాలుగా నన్నయ మహాభారతం అవతరించి కొన్ని శతాబ్దాలపాటు, తెలుగు సాహిత్య గమనాన్ని శాసించింది. పద కవితలు, ద్విపదలు వంటి లఘు సాహితీ రూపాలు – పాపులర్ సంప్రదాయానికి సంబంధించినవి. వాటి ఆగమాన్ని కాని, వ్యాప్తిని కానీ ఎవరూ శాసించ లేరు. అయితే వాటి నుంచి పూర్తిగా దృష్టిని మరల్చి సాహిత్యమంటే ఆ దీర్ఘ మహాకావ్య ధార్మిక కథనాత్మక రూపమని సాహితీ చేతనను నియంత్రించేటంత స్థాయిలో నన్నయ భారత నిర్మాణాన్ని చేపట్టాడు. రెండు వందలసంవత్సరాల అంతరమున్నా తిక్కన, ఆపై వంద సంవత్సరాల అంతరం కలిగినా ఎర్రన ఆ నిర్మాణ వైశిష్ట్యాన్ని గుర్తించి దాన్నే అనుసరించారు.కవిత్రయ భారతం తెలుగు సాహిత్య చేతనకు తెలుగు భాషా చేతనకు స్థిరాకృతి. అయితే ఇది ఉద్యమం నుండి వచ్చిన కృతి కాదు. ఉద్యమాన్ని సృష్టించిన కృతి–నన్నయకు ప్రేరకులైన చాళుక్యులు. పశ్చిమం నుంచి తూర్పువేంగికి వచ్చి తంజపురంతో వియ్యం పొందారు. తంజావూరి సంబంధం తెలుగునాట విభిన్న సాంస్కృతిక పెత్తందారీ స్థితికి కారణమవుతున్నదనే అలజడి పెరుగుతున్న నేపథ్యంలో, కర్ణాటక దాయాదులతో ఘర్షణలు బాగా తీవ్రమైన సందర్భంలో, రాజరాజ నరేంద్రుడు ఒకటికి రెండు సార్లు వారి చేతిలో ఓడి ఆ సంఘర్షణ పతాకస్థాయి నందుకొన్న స్థితిలో ఆకృతి దాల్చిన సర్వధర్మ స్మృతి రూపం మహాభారతమనే అంశాన్ని మరచిపోరాదు. ఇది కేవలం ఒక భాషోద్యమానికి ప్రతీకేకాదు, ఒక ధార్మికోద్యమానికి, ఒక యావద్దక్షిణదేశ రాజకీయ– సాంస్కృతిక సంలీన ఉద్యమానికి ప్రతీక. తెలుగు–కన్నడ–తమిళ సంలీనంలో మిగిలిన రెండింటి రాజకీయ– సాంస్కృతిక పెత్తందారీ తనానికి అడ్డుకట్ట వేయాలనే భావంతో, బహుశ నన్నయ బుద్ధి పూర్వకంగానే ఆ సంస్కృత బాహుళ్యానికి దారులు పరిచాడు. వేంగినాటి పంపడు కన్నడంలో చూపిన దారిని మరింత పటిష్టపరిచాడు. అయితే సంస్కృత ఆధిక్యతకు ఆ తరువాతి చిన్న అడ్డుకట్టే జానుతెనుగు. బ్రాహ్మణ మతానికి సంస్కృత ప్రాధాన్యం సూచిక కాగా, జాను తెనుగు, దాన్ని వ్యతిరేకించవచ్చిన శైవ/ వీర శైవ మతోద్యమానికి ప్రతీక అయితే వీర శైవం తెలుగు నాట నిలదొక్కుకోలేదు. దాని అనుసరించినవారే దాని బ్రహ్మంబుతో కలిపేవారు. కనుక జాను తెలుగు ఉద్యమ స్థితి పొందలేదు. సంస్కృత కేంద్రమైన సంలీనత అలాగే అవిచ్ఛిన్నంగా కొనసాగింది.

ఆ సంలీనత – బహుభాషా సమ్యక్ రీతి – ఉద్ధృత రూపంలో నిలిచింది. శ్రీ కృష్ణదేవరాయల యుగంలో, అప్పటి ఉమ్మడి దాక్షిణాత్య భాషాచేతనకు, అందులో తలమానికంగా భాసించిన తెలుగు చేతనకు ఆయన యుగం ఒక ప్రతీక. అప్పటికి తెలుగు ఎంతో సమున్నత ఉద్యమ స్వరూపం తీసుకొని ఉంటేనో, తెలుగు రారాయుడైన ఆంధ్రమహావిష్ణువు తెలుగు రాయని కలలో అగుపించి తన లీలా విశేషాన్ని కావ్యంగా రచించమని ఆదేశించడం జరిగింది. కల – ఆ ఆదేశం అంతా ఒక కావ్యోచితమైన కల్పన కావచ్చు. కాని ఆ ఉమ్మడి దాక్షిణాత్య భాషా చేతన యథార్థం. అందులో తెలుగు, నాయకస్థానంలో భాసించడం యథార్థం. ఆ భాసమాన స్థితి ఒక ఉద్యమ స్వరూపంలో కనిపిస్తుందన్నది యథార్థం. ఇదంతా మూడవదశలోని ఉజ్వల ఘట్టం.

**నాలుగవది :**

గోల్కొండ నవాబుల కాలంలో అచ్చతెనుగు పేరిట బహిర్గతమైన ఒక 'అల్పపీడన' ఉద్యమం. ప్రత్యక్షంగా ప్రశ్నించే అధికారం లేక, పాలకులకే అంకితమిచ్చి మెప్పిస్తూ అప్పటి పండితులకే అర్థంకాని దేశీయ పదాల కూర్పుతో 'ఇదేమిటి, ఈ తెలుగెందు కిలాగుంది?" అని అంకిత స్వీకర్తలు ప్రశ్నించుకొనేలా, పరోక్షంగా నాటి భాషాస్థితిని చెప్పిన ప్రయత్నం కనుక, 'అల్పపీడన' ప్రయత్నమన్నాను. పాలకవర్గం వారి విజాతీయ భాషలతో తెలుగు కన్నడాలను యథేచ్ఛగా కలుపుతూ, పుట్టిన కొత్త భాష దఖనీ. అది ఉరుదూకు పూర్వరూపం. లక్నో పరిసరాలలో అక్బర్ సేనల్లోని వివిధ భారతీయ ప్రజల సమ్మేళనంలో పుట్టిన కొత్త భారతీయ భాష ఉరదూ. ఉరదూ అంటేనే సైనిక శిబిరం అని అర్థం. దాని పూర్వరూపమే దఖనీ. కాని ఉత్తరాది వారు దాన్ని ఉరుదూ పూర్వరూపంగా అంగీకరించరు. (చూ. ఆక్స్‌ఫర్డ్ ప్రచురణ A History of Urdu Literature మున్నడి) అన్నిటా ఉన్నట్లే ఈ సందర్భంలోనూ ఉన్న ఔత్తరాహ భాషాహంకారం ఇది. దాన్నలాగుంచితే, ఈ మిశ్రమ నవ్యభాష తయారిక క్రమంగా పాలనా రంగంపై, ప్రజల వ్యవహారంపై పడే పరిస్థితి మొదలై ఉంటుంది. ప్రత్యక్షంగా దాన్ని ప్రతిఘటించగలిగే స్థితిలేదు. అందువల్ల తెలుగు భాషా ప్రేమికులు, తమ భాషా రక్షణ నిమిత్తం సంస్కృత, తత్సమ శబ్దాలులేని శుద్ధ దేశీ శబ్దాలతోనే తమ భాషా వ్యవహారం నడుపుకోవాలని కృత నిశ్చయులై, అచ్చతెలుగు ఉద్యమాన్ని రూపొందించు కొన్నారు. ఒక అడుగు ముందుకు వేసి అందులో కావ్య నిర్మాణం చేసి పొన్నగంటి తెలగన, దాన్ని ఆనాటి పాలకునికే అంకితం చేశాడు. ఇంగితమున్న పాలకులు కావడం వల్లభరాముడని పించుకోవడం కంటె, ఉభయ భాషాభిరాముడనిపించు కోవాలను

కొన్నాడేమో, పాలనా రంగం మీద పరాయి భాష రుద్దుడు సద్దుమణిగింది. తెలుగు మంత్రులుండడం కూడా దానికొక కారణం కావచ్చు. పాలనా పరిభాష కొంత కొత్తగా తెలుగులోకి చేరింది కాని, పాలనా రంగంలో తెలుగు తన ఉనికిని కాపాడుకోగలిగింది. ఉభయ పాలనా భాష విధానం రూపొందింది. అందులో పారశీకం కేవలం కొన్ని ఫర్మానాల మూల రూపాలకే పరిమితమై, ప్రజావ్యవహారానికి తెలుగే లేగా కన్నడం లేదా మరో దేశీయ భాష, ఆ ప్రజలకు సంబంధించినదే వాడబడడం విశేషం. బ్రిటీషు వారి కాలంలో ఇదే విధానం అనుసరింపబడింది. ఆంగ్లేయ అధికారులు కూడా తెలుగు నేర్చుకోసాగారు. పాలనాధికారులుగా వారు దక్షిణ భారతానికి రాగానే మద్రాసు కోటలో మొదటి తొమ్మిది నెలల తెలుగు నేర్చుకోవడం అనివార్య శిక్షణా భాగమైంది.

ఈనాలుగూ పూర్వదశకు సంబంధించినవి. ఆధునికి దశలో 20-21వ శతాబ్దాల్లో రూపుదిద్దుకొన్నవి రెండు.

**ఆధునికమ్ : మొదటిది :**

భాషా ప్రాతిపదికన బీహార్ విభజన తరువాత 1920 నాటి నుంచినే ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుంచి తెలుగు ప్రాంతాన్ని ప్రత్యేక రాష్ట్రంగా రూపొందించాలన్నది.... రెండు దశాబ్దాల పాటు సాగిన ఈ ఉద్యమం చివరకు త్యాగమూర్తి కేవల గాంధేయవాది శ్రీ పొట్టి శ్రీరాములుగారి ఆత్మార్పణతో వ తాక స్థాయినందుకొని ఆంధ్రరాష్ట్రంగా, తదుపరి హైదరాబాదు ప్రాంతం కూడా కలువగా ఆంధ్రప్రదేశ్‌గా అవతరించింది.

**రెండవది :**

వర్తమాన చర్చకు కేంద్రమైన క్లాసికల్ భాషోద్యమం.

**వర్తమాన భాషోద్యమం - పూర్వరంగం :** భాషాందోళన

ఇక్కడ ముందుగా గుర్తు పెట్టుకోవలసిన అంశాలు రెండున్నాయి.

1. ఇది కేవలం తమిళానికి క్లాసికల్ భాషా ప్రతిపత్తిని కేంద్ర ప్రభుత్వం ప్రకటించాక, దానిని ప్రతిచర్యగా ఆత్మగౌరవ ప్రకటనార్థం తెలుగువారు చేబట్టిన ఉద్యమంకాదు. దానికి మునుపు దశాబ్ద కాలంగా తెలుగు భాష పరిరక్షణార్థం తెలుగువారు పొందిన ఆవేదన, ఆందోళన నేపథ్యంలో పనిచేసింది.
2. పైన వివరించిన నాలుగు పూర్వోద్యమాల స్వరూపాన్ని చూస్తే ఒక అంశం స్పష్టమవుతుంది.

పరిభాషతో వికర్ష సంభవించినప్పుడే తెలుగునాట భాషోద్యమం పుడుతూ వచ్చింది. ఇది కూడా అలానే రూపుదిద్దుకుంది. తెలుగు భాష ఎప్పుడూ ఇతర భాషలతో సమన్వయాత్మకమైన సన్నికర్షనే కోరుకుంటుంది. అది దాని నైసర్గిక గుణం. హాయిగా ఇతర భాషల్లోకి చొచ్చుకుపోతుంది. అంతే హాయిగా ఇతర భాషలను తనలో కలిపేసుకుంటుంది. ఒకనాడు ఓ ప్రముఖుడన్నాడు : ఇతర భాషల్లోకి తన రచనలు పంపడంలో పేదఅయినా ఇతర భాషల నుండి తెచ్చుకోవడంలో మాత్రం చాలా ఉదాహసంపన్నమైంది. భాషను సంపన్నం చేసుకోవడంలో సంకుచితత్వాన్ని ఎప్పుడో వదిలేసి ఎదిగింది తెలుగు. తెలుగు వారికి భాషా ప్రేమ ఉంటుంది. కాని, భాషా - అనన్యత లేదు. ఎప్పుడూ ఇతర భాషా పరిసరాల్లో సమన్వయాత్మక సన్నికర్షతోనే జీవించారు. అందువల్లే వారి భాష అలా ఎదిగింది. ఇతర భారతీయ భాషల్లో దేనికి లేని అజంత్యతను దానివల్ల లయాత్మకతను గేయ మాధురి (మ్యూజికాలిటీ)ని పెంచుకొంది.

అయితే ఈ సమరసత దాని బలహీనతగా భావించండి. పాలక వర్గం - లేదా - సాంస్కృతిక పెత్తందారీ వర్గం నుండి భాషా పరమైన ఉపేక్ష కలిగినప్పుడల్లా, తెలుగు జాతిలో భాషాపరమైన స్పృహ కచ్చితంగా మేల్కొంది. అది నిశ్శబ్దంగా ఒక ఉద్యమ స్వరూపం తీసుకొంది. ఒక చారిత్రక విచిత్రం ఉంది. మద్రాసు ఉమ్మడి రాష్ట్రంలో తెలుగువారే అన్ని విధాలా రాజకీయ అధికార స్థానంలో ఉండగా, అంత మంది ముఖ్యమంత్రులు తెలుగువారి నుంచి వచ్చినా, ఎందుకు విడిపోవాలని తెలుగువారే అంత పెద్ద ఉద్యమం చేశారో అర్థంకాదు. సామాన్యంగా బహు సంఖ్యాక పెత్తనం నుండి ఇతరులు కొంత తక్కువ సంఖ్యలోని వారు, ఆ ప్రాధాన్యానికి గురవుతున్నవారు, విడిపోవాలని కోరుకుంటారు. కాని చిత్రమేమిటంటే మద్రాసు ఉమ్మడి రాష్ట్రంలో బహు సంఖ్యాకులు రాజకీయ ప్రాబల్యం కలిగిన వారు - ప్రాధాన్య క్రమంలో ముందున్న వారు, 'చెన్నపట్టణం తెలుగు వారి ప్రధాన కేంద్రం' అని దాన్ని అభివృద్ధి పరచినవారు తెలుగువారే. వారే విడిపోవాలని కోరుకోవడం, ఆధునిక చరిత్రలో ఒక నిజమైన రిడిల్. అర్థంకాని ఉదంతం. అది వారికి నేరుగా పుట్టిన బుద్దేనా?అని అనుమానం. ఏదేమైనా బహుశ: దానికి భాషా వికర్ష కారణమేమోనని సందేహం. ఇది ఉపరితలానికి కనిపించే బలమైన కారణం కాకపోవచ్చు.కాని కచ్చితంగా అడుగున ఉండి, మనోధర్మాన్ని శాసించేబలమైన కారణం. రాజకీయాలు, మతం, సాహిత్యం వంటివి ఉపరితల రూపాలు. అంతర్గత ప్రాతిపదికలు ఆర్థికతలు, అంటే మానవుని భౌతికమైన మనుగడకోసం, ఉనికి కోసం చేసే ఉత్పత్తి కార్యక్రమాలు.వీటినే మార్బు 'బేస్ స్ట్రక్చర్స్' - 'సూపర్ స్ట్రక్చర్స్'

అంటాడు. నైమిత్తిక జీవన విధులకు సంబంధించినవన్నీ బేస్ స్ట్రక్చర్సే. భాష అందులోని ప్రధాన భావం. సాహిత్యం దానిపైనే రూపొందే సూపర్ స్ట్రక్చర్. భాష మానవుని ప్రాథమిక మనుగడకు, ఉత్పత్తిపరమైన సంబంధాలకు చెందిన మాధ్యమం. అది అతని సమాజిక - మనోధర్మాలను నడిపించే మాధ్యమం. కనుక బాహిర విశ్లేషణలకు లొంగని సున్నితమైన అంశాలు, మనోధార్మికమైన అంశాలు భాషను ఒక మిషగా తీసుకొని విస్తరిల్లే అవకాశం లేకపోలేదు.

అన్ని విధాల ప్రాధాన్యమూ, ప్రాబల్యమూ ఉన్న తెలుగువారు ఉమ్మడి మద్రాసు నుండి ఆంధ్రప్రాంతం విడిపోవాలని కోరుకున్నారు. చెన్న పట్టణం తెలుగువారి శ్రమతో, తెలుగువారి పెట్టుబడులతో పెరిగిన నగరం కనుక, చెన్నపట్టణంలేని ఆంధ్రరాష్ట్రాన్ని అంగీకరించనని ప్రకాశం పంతులుగారు భీష్మించడం వల్లనే, ఒక విధంగా పొట్టిశ్రీరాములు అసువులు బాసే పరిస్థితి వచ్చిందని చారిత్రకుల అంచనా. అలాంటి తీవ్ర పరిస్థితి. ఆందోళన ఎందుకు వచ్చింది? రాజకీయంగా వరుసగా తెలుగువారే ముఖ్యమంత్రులయి, రాజకీయ ప్రాబల్యం ఘనంగా ఉన్నా, దిగువ పాలనా నిర్వహణ బాధ్యతలు నిర్వర్తించే అధికారులు అధిక సంఖ్యాకులు తమిళులు. అందునా ఒక సామాజిక వర్గానికి చెందిన వారు ఎక్కువ. అది కుంఫిణీ యుగం నాటి నుంచి, బ్రిటీషు రాజుయుగం దాకా పెరుగుతూ వచ్చిన ప్రాబల్యం. పై స్థాయిలో - రాజకీయ స్థాయిలో - తెలుగువారి ప్రాబల్యమున్నా, దిగువ స్థాయిలో, అధికారుల స్థాయిలో తమిళుల ప్రాబల్యం ఉంది. సహజంగానే అది పాలనమీద, తెలుగు ప్రాంతం వారిమీద, సామాన్య వర్గాల మీద ప్రభావం చూపింది. పై పెచ్చు తెలుగు నాయకులలో కూడా ఉత్తరాది వారు, అంటే, నేటి తెలుగు ప్రాంతాలవారు, దక్షిణాదివారు అంటే నెల్లూరు నుంచి దిగువ వైపుగా దక్షిణ - పశ్చిమాల వైపు తెలుగువారు అత్యధిక సంఖ్యలో ఉన్న జిల్లాలు - ఆర్కాట్, ధర్మపురి జిల్లాలు - ఆ దిగువ కోయంబత్తూరు, తిరుచ్చి, మధురై ప్రాంతాల వరకు తాతముత్తాలనాడే స్థిరపడిపోయిన తెలుగువారు అనే భేదం ఏర్పడింది. అప్పట్లో కాట్పాడి, ధర్మపురి మున్సిపాలిటీలలో తెలుగువారి ప్రతినిధులే అధిక సంఖ్యాకులు. అయినా తాము ఆంధ్రరాష్ట్రంలో చేరబోమని వారు తీర్మానించారు. ఉత్తరాది ఆంధ్రులకు దక్షిణాది తెలుగువారికి మధ్య అప్పటికే భేదాలు ప్రస్ఫుటంగా ఉన్నాయి. ప్రకాశం పంతులుగారు మద్రాసు కోసం పట్టుబట్టడానికి మద్రాసులోని ఆయన ఆస్తులను కాపాడుకోవడం కోసమేనంటూ ఆంధ్ర కమ్యూనిష్టులు ఆరోపించారని, వారి వెనకాల తమిళ కమ్యూనిష్టులున్నారని ఒక పరిశీలన. ఆ మాట ఏమిటో కాని కట్టమంచి రామలింగారెడ్డి కాలానికి మునుపే ఉన్న జస్టిస్ పార్టీరాజకీయాలు, ప్రాదేశిక భావాలకు ఊపిరపోసాయన్నది మరో అంచనా. ఇలాంటి ఉపరి రాజకీయాలతో సంబంధం లేకుండానే అంతర్గత భాషా వికర్షలతో ఉభయులమధ్య ఒక దూరం ఏర్పడిందన్న మాట నిజం. దత్త మండలాల వారు భాషా విషయంలో ఆంధ్ర - దక్షిణాది వారిమధ్య తటస్థభావాన్ని వహిస్తారు. ఆతటస్థభావమే సంజీవరెడ్డిగారి రాజకీయ నిర్ణయంలో ప్రతిఫలించిందేమో. ఏదేమైనా భాష అంతర్గత సామాజిక- మనోధర్మాలకు రూపకరిస్తుంటుందన్నది నిజం. అది ఉపరితల రాజకీయాలను ప్రభావితం చేస్తుంటుందన్నిది యధార్థని. అప్పటి మద్రాసు విభజనలోనైనా, ఇప్పటి తెలంగాణా ఉద్యమంలోనైనా క్షుద్ర సినిమా వ్యాపారపు పోకడలు, కొన్ని విధాల సాహిత్య నిర్మాణాలు ఇవ్వాళ్టి విభజన తత్వానికి బలాన్ని పెంచాయి. రాజకీయాలకు అదనపు బలాన్ని కూర్చాయి. రాజకీయాలతో సంబంధంలేని సామాన్యప్రజలు, ఉద్యమం పట్ల స్పందించడానికి కారణం, భాషా పరంగా వారి వ్యక్తిత్వం గాయపడ్డమే. భాష మనుష్యుల్ని దగ్గర చేయడానికి ఉద్భవించిన సామాజిక సాధనం. అయితే దాన్ని సరిగ్గా వాడుకోవడం తెలియనప్పుడు మనస్సుల్లో దూరం సృష్టించే సున్నితమైన, పదునైన దక్షిణాది తెలుగు వారికి - ఉత్తరం వైపు ఆంధ్రులకు మధ్య మనస్సుల్లో దూరం ఏర్పడింది. తమిళనాడు తెలుగుల్ని ముందుకు నెట్టి వారి వెనుకగా తమిళులు నడిపిన కథవల్ల ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుండి విడిపోవాలని, అందులో అన్నివిధాలా ప్రబల్యమున్న తెలుగువారు కోరుకున్నారు. తెలుగుతనం కోసం కోరుకున్నారు. తీవ్రంగా ఉద్యమించి, ఆత్మార్పణలతో సాధించు కున్నారు.

భాషా ప్రయుక్తంగా భారతీయ రాష్ట్రాల ఏర్పాటుకు తెలుగువారే కారణం. ముక్కోటి తెలుగులు ఒక్కటై ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. ఇంతటి మహత్తర ఘటనకు కారణమైన తెలుగు చేతన ఏమయింది? బీహార్ వేర్పాటు తరువాత, రాజుకొన్న తెలుగు చేతన ఫలితమా అని, ఇతర రాజకీయ కారణాలు ఎన్ని ఉన్నా, తెలుగు అభివృద్ధికి, తెలుగు ద్వారా ఆధునిక విజ్ఞాన వ్యాప్తికి ఏర్పడ్డ ఆంధ్ర విశ్వవిద్యాలయం, తర్వాత యు.జి.సి. విధానం అమలుకాక మునుపే, ఇతర విశ్వ విద్యాలయాలన్నిటిలాగే ఆంగ్లేయ విశ్వవిద్యాలయ మయిపోయింది. ప్రాంత భాషా నామంతో దేశంలోనే ఏర్పడ్డ మొదటి విశ్వ విద్యాలయమది. అది తన స్థాపన లక్ష్యం కోల్పోయింది. అలాగే భాషా ప్రయుక్తంగా ఏర్పడ్డ మొదటి రాష్ట్రం ఆంధ్రరాష్ట్రం. అది తన స్థాపన లక్ష్యం పట్ల లక్ష్యశుద్ధిని కోల్పోయింది. అంతకంటే చిత్రంగా, భాష పేరిట సంఘటితమైన రాష్ట్రంలోనే, ప్రాంతం పేరిట పునర్విభజన జరగాలని, తెలంగాణా - ఆంధ్రా ప్రాంతాలు రెండు వైపులా రెండు

ప్రచండ ఉద్యమాలు చెలరేగాయి. ఈ రెండు ఉద్యమాల మధ్య అట్టుడిగిన స్థితి తెలుగు సంస్కృతి చరిత్రలో 20వ శతాబ్ది ఉత్తరార్ధంలో మరచిపోలేని ఒక గొప్ప ఘటన – 1975లో అప్పటి ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు – అప్పటి విద్యా, సాంస్కృతిక వ్యవహారాల మంత్రి శ్రీ మండలి కృష్ణారావుగారి నాయకత్వంలో విజయవంతంగా జరిగిన ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలు – రాష్ట్రసాధనకు పొట్టి శ్రీరాములుగారికి ఈ జాతి ఎలా ఋణపడి ఉందో, రెండు తీవ్ర వేర్పాటు ఉద్యమాల పిమ్మట ఏకతాసాధనకు ప్రేరకమైన ఈ మహాసభల నిర్వహణకు జలగం – మండలి ద్వయానికి కూడా ఈ జాతి అలాగే ఋణపడి ఉంది. ఈ మహాసభల తరువాత తెలుగువారిలో ఏకతాభావమూ, అలాగే ఋణపడి ఉంది. ఈ మహాసభల తరువాత తెలుగువారిలో ఏకతాభావమూ, ఆత్మ జాగృతి ఎంత బలంగా నెలకొన్నాయి అంటే, ఈ అభినవ తెలుగు జాగృతిని రాజకీయ శక్తిగా స్థిరపరచుకొని, ఆపై ఆరేడేళ్ళకే 'తెలుగుదేశం' అంటూ భాష పేరిట, రాజకీయ పార్టీ ఆవిర్భవించింది. ఆంధ్రప్రదేశ్ అవతరణ నాడు ఆశించిన తెలుగు దీప్తి, తెలుగుదేశంతోనైనా సిద్ధిస్తుందని ఆశపడ్డవారికి, రాష్ట్రేతర ప్రాంతాలలో "మద్రాస్" అనేమాట పోయి "తెలుగువారు" అనే గుర్తింపు రావడం, విదేశాలలో సైతం 'తెలుగు' కు గుర్తింపు రావడం గొప్ప సంతృప్తి. దాన్ని మినహాయిస్తే తెలుగునాట తెలుగు భాషా సంస్కృతులు ఆశించిన మేరకు దీప్తిమంతం కాలేదనడం అసత్యంకాదు. అయినా 'తెలుగు' అనే మాటకు 'తెలుగువారు' అనే మాటకు దేశ, విదేశాలలో సమకూరిన ఈ అభినవ గౌరవానికి, గుర్తింపుకు తెలుగుజాతి, తెలుగుదేశం నిర్మాత శ్రీ ఎన్.టి.రామారావుకు ఋణపడింది. అయితే ఆయన నాయకత్వంలో భాష ఒక రాజకీయ – సామాజిక శక్తిగా పెంపొందడంలో పొందిన ఉత్తేజం సాంస్కృతిక శక్తిగా బలపడడం కూడా జరిగి ఉంటే బాగుండేది.

ఇరుగుపొరుగునున్న తమిళ–కన్నడాల వలె తెలుగు భాషా ప్రగతి ఉంటుందని ఆశపడ్డవారికీ, ఆశోపహతే మిగిలింది. పైపెచ్చు అంతకు మునుపు తెలుగు భాషా బోధన, సాంస్కృతిక వ్యాప్తి కోసం విధానాలు, కార్యక్రమాలు, సంస్థలు అన్నీ ఒక్కసారిగా దెబ్బతిన్నాయి. ఈ వివరాలను కొంతవరకైనా రేఖా ప్రాయంగానైనా ఇక్కడ చూడ్డం అవసరం.

భాషా బోధన, సాంస్కృతిక వ్యాప్తి, పరిరక్షణల నిమిత్తం ప్రభుత్వ ప్రక్షాన పనిచేసే రంగాలు, విభాగాలు నాలుగు. 1. విద్యారంగం –ప్రాథమిక, సెకండరీ, కళాశాలల స్థాయిలో మాతృభాషా బోధన, వాటి ప్రణాళిక, లక్ష్యాలు మాతృభాషను నిలబెట్టడంలో మహత్తర పాత్రను నిర్వహిస్తాయి. 2. సాహిత్య, సంగీత,నృత్య, నాటక, లలిత కళా అకాడమీలు. అలాగే ప్రభుత్వం పక్షాన ఏర్పాటైన ఇతర సంస్థలు 3. గ్రంథాలయాలు. 4. తెలుగు అధికార భాష – అధికార భాషా సంఘం

## 4. తెలుగు అధికార భాష – అధికార భాషా సంఘం

మొదటిది విద్యార్థి దశకు సంబంధించిన పునాది భాగ సంబంధితమైతే, రెండవది భాషా సంస్కృతుల్లో అభినివేశం ఉన్నవారికి, వాటిపట్ల ప్రత్యేక ప్రేమాభిమానాలున్న వారికి సంబంధించినది, మూడవది సమస్త సామాన్య ప్రజలు జ్ఞానార్జనకు, సమాచార సేకరణకు సంబంధించినది, గ్రంథాలయాలు సామాజిక విద్యాలయాలు. ప్రజావిద్యానిలయాలు, నాలుగవది ప్రజలు నిత్య అవసరానికి, నిత్య నైమిత్తిక వ్యవహారానికి సంబంధించింది. బాలుర నుండి ప్రౌఢుల దాకా విద్యాప్రావీణ్యాల అభివృద్ధికి మొదటి మూడూ పనిచేస్తే, నాలుగవది ప్రజలందరి పాలనావసరాన్ని సమీక్షించేది.

భాషోద్యమ స్వరూప, ప్రభావాలను గుర్తించడానికి వీలుగా, వీటిని క్రమంగా చివరినుంచి ముందుకు పరిశీలిస్తూవద్దాం.

(ii) భాషా ప్రయుక్తంగా ఏర్పడ్డ మొదటి రాష్ట్రమైనా, తెలుగు భాషను అధికార భాషగా ప్రకటించడంలో చాలా రాష్ట్రాలకంటె తరువాతగా చురుకుదనం తెచ్చుకొంది ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం. ఇరుగుపొరుగులైన తమిళ–కన్నడాలతో పోల్చుకోవలసిన పనిలేదు. అదీ 66లో వావిలాల గోపాలకృష్ణయ్యగారు ఒక ప్రైవేటు బిల్లును అసెంబ్లీలో ప్రవేశపెడుతూ ఉంటే, దాన్ని ఆత్మ గౌరవార్థం పరిహరింపచేసి, ప్రభుత్వమే బిల్లును ప్రవేశపెట్టి, ఆ తరువాత వావిలాల గారి అధ్యక్షతలోనే అధికార భాషా సంఘాన్ని నెలకొల్పింది. వారి అధ్యక్షకాలంలో, ప్రభుత్వ పాలనా విభాగాలన్నిటికీ సంబంధించి పరిభాషను తెలుగులో తయారు చేసి, విభాగాలవారీ పద పట్టికలను విడుదల చేసింది. తెలుగుటైపు రైటర్ల తయారీకి ప్రభుత్వ ప్రెస్సులో ఒక విభాగాన్ని ఏర్పాటుచేసింది. పాలనాపర అవసరాలను గుర్తించి బహుళోపయోగకరమైన నిఘంటు నిర్మాణ బాధ్యతను తెలుగు అకాడమీకి అప్పగించింది. ప్రస్తుతం పరిశీలిస్తున్న కాలానికి అంటే ఎన్.టి.ఆర్. కాలానికి ఈ సంఘం మరో తెలుగు ఆచార్యుల నియామక విభాగంగా మారి పూర్తి నిస్తేజమై పోయింది.

(iii) ప్రజావిద్య సంబంధమైన గ్రంథాలయాలు కూడా పూర్తి నిస్తేజమైపోయాయి. పుస్తకాల పేర్లు, అట్టలు, మొదట్లో కొద్ది పేజీలు మార్చి, పుస్తకాలను ప్రచురించి గ్రంథాలయాల నిధులను ఒక ప్రాంతంలోని కొందరు ప్రచురణ కర్తలు పూర్తి దుర్వినియోగ పరచిన

వైనం ప్రభుత్వం దృష్టికి వచ్చి తీవ్ర చర్యలు తీసుకోవడం జరిగింది. అందులో భాగంగా కొనుగోలు ఆగడం, మార్కెట్ దెబ్బతిని కనీసంగా ఉన్న వెయ్యి ప్రతుల ముద్రణ, అయిదు వందల ప్రతులకు పడిపోవడం, దరిమిలా పుస్తకాల ధర పెరిగి సామాన్య పుస్తక ప్రియుల కొనుగోలు సరళికి మించిపోవడం ఆ చర్యల అనంతరం చోటు చేసుకున్న పరిణామాల్లో కొన్ని.

ఇంతకంటే మొదటికే మోసం వచ్చి మూతవేయబడ్డవి ప్రభుత్వం స్వతంత్ర ప్రతిపత్తినిస్తూ నెలకొల్పిన సాహిత్య, సంగీత, నాటకాది అకాడమీలు, భాషా సంస్కృతి సంస్థలు. దూరదృష్టిలేని అధికారుల, అనధికారుల సలహా వల్ల కొంత, ఆర్థిక పరిమితుల కారణంగా యు.జి.సి నిధులు లభించి వాటి కార్యక్రమాల భారం రాష్ట్రంపై పడడం తగ్గి ఆ నిధుల వల్ల ఆర్థిక పుష్టి సమకూరుతుందనే ఆశా భావంతో కొంతా, ఆ అకాడమీలను రద్దుచేసి, వాటిని తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనం చేశారు. ఆ కార్యక్రమాలను వేటినీ ఆప కుండా, మరింత ఎక్కువగా తెలుగు విశ్వవిద్యాలయం నిర్వహించి నప్పటికీ, విశ్వవిద్యాలయం పనితీరు వేరు, అకాడమీల పనితీరువేరు. ఫలితంగా విశ్వవిద్యాలయం చేసిన రెట్టింపు కృషి కూడా ప్రజల దృష్టికి ఎక్కకుండా పోయింది. ఈ కార్యక్రమాల పట్ల తెలుగు విశ్వ విద్యాలయం వీటికి కేంద్రమైన, ప్రత్యామ్నాయ సంస్థగా భావించ బడడం దరిమిలా విద్యాత్మక రంగంలో కావలసిన చురుకుదనం, విద్యాపర నాయకత్వం సన్నగిల్లింది. దరిమిలా ఉన్నతస్థాయి పరిశోధనా సంస్థగా దాని ప్రతిపత్తి దెబ్బతినడం కూడా జరిగింది. తెలుగు విశ్వవిద్యాలయం ఎన్.టి.ఆర్. గారి ఒక అసంపూర్ణ స్వప్న స్వరూపం. ఆయన విద్యార్థిగా ఉన్న దశలోనే, ఆంధ్రప్రాంత విద్యాభివృద్ధి కోసమూ, ఆంధ్ర భాషలో ఆధునిక విజ్ఞానం అందించాలనే ఆశయ సిద్ధి కోసమూ, దరిమిలా ఆధునికయుగ చేతనకు అనుగుణంగా ఆంధ్ర భాషా సంస్కృతుల పురోభివృద్ధి కోసమూ అవతరించిన ఆంధ్ర విశ్వవిద్యాలయం మరో ఆంగ్ల విశ్వవిద్యాలయం కావడంతో, ఒక అలజడి తెలుగు భాషాభిమానులలో వ్యాపించింది. ఆంధ్ర విశ్వ విద్యాలయం ఒక అసంపూర్ణ స్వప్నంగా, నాటి ఆంధ్ర భాషా, సంస్కృతి ప్రియులు భావించారు. ఆ అసంపూర్ణమైన కల సంపూర్ణంగా సాకార పరచడానికి ఆయన పూనికతో అవతరించిన తెలుగు విశ్వ విద్యా లయం, అవతరణ కాలంలో జరిగిన ఈ కలగూర గంపతనం వల్ల, తన స్థాపన గమ్యాలకేసి చురుగ్గా ముందుకు సాగలేకపోయింది.

## మాతృభాషా పరిరక్షణోద్యమం :

1. పై నాలుగింటిలో మొదటిది ఇదే. కాని క్లాసికల్ ఉద్యమానికి పూర్వరంగాన్ని కూర్చడమే కాదు, దానికి పూర్వరూపంగా కూడా పనిచేసిన అంశం వెనుక, దీన్ని చివరగా, విడిగా చూడ్డమవుతోంది.

పై పరిణామాలు చోటు చేసుకొంటున్న కాలంలోనే సంభవించిన మరో పెద్ద పరిణామం – ప్రభుత్వ ఆదరంతో కార్పొరేట్ విద్యారంగం బలపడ్డం.... పి.వి. నరసింహారావు గారి ప్రైవేటీకరణ ఏ ఏ రంగాన్ని ఎంత ప్రభావితం చేసిందో తెలియదుకాని, ఆయనే ఊహించని తీరులో తెలుగునాట కార్పొరేట్ విద్యారంగాన్ని అత్యంత ప్రభావవంతంగా చేసి నిలిపింది. అంతదాకా ఎమ్సెట్ కోచింగ్ కోసం జనం వెర్రిగా ప్రైవేట్ కోచింగ్ సంస్థలకు ఎగబడేవారు. ఈ దశలో అవి కాస్త, సమాంతర విద్యా సంస్థలుగా మారిపోయాయి. సంపూర్ణంగా విద్యాలక్ష్యాలను, రూపురేకలను మార్చివేశాయి. ఈ మార్పులో అతిదారుణంగా దెబ్బతిన్నది – మాతృభాష అధ్యయనం. తెలుగునాట, సాక్షాత్తు తెలుగుదేశం ప్రభుత్వ కాలంలో, తెలుగు భాషాధ్యయనం దెబ్బతిన్నట్లుగా మరెక్కడా, ఎప్పుడూ దెబ్బతినలేదు. కార్పొరేట్ విద్యావిధానం బాషాబోధనకు సంబంధించిన ప్రణాళిక విధానాన్నే మార్చివేసింది. అంతకు మునుపు జూనియర్ కళాశాలల్లో తెలుగు నిర్బంధ విషయం కాకపోవడం వల్ల, సంస్కృతం మేష్టార్ల తెలివైన ఆత్మరక్షణ వ్యూహంతో అతి సరళీకరణ పొందిన సంస్కృతం పాఠ్య ప్రణాళికతో ఎక్కువమంది విద్యార్థులు, సంస్కృతం తీసుకుంటే ఎక్కువ మార్కులు వస్తాయని, మాతృభాష తెలుగును ప్రక్కన బెట్టి, ఆ భాష తీసుకోవడానికి ఎగబడ్డారు. సంస్కృతం కాకుంటే ఫ్రెంచో,జర్మనో, ఏదో ఒకటి – చెప్పుకోవడానికి గొప్పగా ఉంటుందను కొన్నారు. పదో తరగతి దాకా ఏమాత్రం చదవని, ఏ పునాదులు లేని భాషను ఇంటర్ స్థాయిలో ఎలా తీసుకొంటారు? అందులోని ఔచిత్యం మాట అటుంచినా, శాస్త్రీయత మాటేమిటి? అని ఆలోచించే అధికారే మృగ్యమయ్యారు. పైపెచ్చు – సంస్కృతం అంటే తెలియని ఔన్నత్యభావన సగటు ప్రజలను పట్టుకు పీడిస్తుంది. తెలుగంటే "గ్రామీణ నిమ్నస్థాయి" భాష అనే భావం, నాగరిక ఉన్నత వర్గీయులకు, వాళ్లను అనుకరించే ఇతరులకూ సామన్యమైపోయింది. తెలుగుపట్ల న్యూనతాభావం క్రమేణా అటు విద్యార్థులతోబాటు, ఇటు తల్లిదండ్రులలో కూడా ఏర్పడడానికి ప్రధాన బాధ్యత మాత్రం కార్పొరేట్ విద్యారంగానిదే. భాషా ప్రయుక్త భావన మీద ఏర్పడ్డ మొదటి ప్రభుత్వం – ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం. అయితే భాష విషయంలో ఏ బాధ్యత లేకుండా క్రిందిస్థాయి పాఠశాలల్లో కూడా తెలుగు నిర్బంధ పాఠ్యాంశం కాకుండా చేసింది. ఆ సందర్భంలో ప్రజలందర్లోనూ, తెలుగు చదివే ఆ 'నిమ్నస్థాయి', 'గ్రామీణ ప్రజానీక'లోనే కాదు, తెలుగును అభిమానించే బాధ్యతాయుతమైన ప్రతి పౌరుడిలోనూ అది చాలా పెద్ద అలజడిని రేపింది. ప్రక్కనే ఉన్న కర్నాటకలో కూడా ప్రైవేటు ఆంగ్ల విద్యా సంస్థలు అలాగే ఒత్తిడి తేగా, పాఠశాల స్థాయిలో

కన్నడం చదవని వారికి, ప్రభుత్వ ఉద్యోగాలకు అర్హత ఉండదని కర్ణాటక ప్రభుత్వం ప్రకటించింది. తమిళనాడులోనైతే అసలు ఆ సమస్యకే అవకాశం ఏర్పడదు. కేరళలో కళాశాల విద్య కూడా కొన్ని వృత్తివిద్యలతోబాటు, మలయాళ భాషలోనే అత్యధిక శాతం విద్యార్థులు చదువుతున్నారు. భాషపరంగా ఐచ్ఛికాలను నియంత్రించ డంలో కచ్చితంగా ప్రభుత్వం బాధ్యతాయుతమైన పాత్రను నిర్వహించ వలసిన అవసరం ఉంది. అయితే ఈ విషయంలో తెలుగు ప్రభుత్వం తీరుమాత్రం లజ్జాకరంగా పరిణమించింది. సామాజిక వర్గాలతో సంబంధం లేకుండా తెలుగు ప్రజ బాగా ఆందోళన వ్యక్తం చేసింది. రాష్ట్రమంతటా విభిన్న వేదికలు ఏర్పడి దీన్నొక ప్రజాందోళనగా తీర్చిదిద్దడానికి శ్రమించాయి. ఉస్మానియా ప్రాంతంలోని జూనియర్ కళాశాలల తెలుగు ఉపన్యాసకులు 90ల నుంచే, ఆచార్య ఎస్.వి.రామారావు అధ్యక్షతలో సంఘటితమై, సభలు నిర్వహిస్తూ, సంస్కృత బోధన దుర్మార్గం పట్ల, మాతృభా,లిభ్యసనం పట్ల ప్రజల్లో స్పృహ పెంపొందించసాగింది. వివిధ యూనివర్సిటీ ప్రాంతాలలో అలాంటి కృషే జరిగింది.ఈ ఔత్సాహిక కృషి కంతా తలమానికం వంటిది వివేక వర్ధిని కళాశాలలో తెలుగు ఉపన్యాసకులుగా రిటైరైన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు, హైదరాబాదు కేంద్రీయ విశ్వ విద్యాలయం ఆంధ్రశాఖలోని డా.ఎన్.ఎస్.రాజుగారు కలిసి రూపొందించిన మాతృభాషా పరిరక్షణ సమితి. వీరిరువురూ 1996 నుండి ప్రభుత్వరంగంలోని పెద్దలనందర్నీ కలుస్తూ, ప్రభుత్వవైఖరి వల్ల కలిగే దుష్పరిణామాలను వివరిస్తూ, సమావేశాలనేర్పరచి మాతృ భాషా పరిరక్షణ వల్లబలమైన స్పృహ నిర్మించసాగారు. జనాన్ని ఆకర్షించే తీరులో ఉత్తేజకరమైన వాక్యాలను, నినాదాలను ముద్రించి పంచిపెట్టారు. భాషా జాగృతిని పెంచే కరపత్రాలను వెలువరిచారు. ఈ ఇద్దరే మూడు, నాలుగేళ్లపాటు ఉద్యమాన్ని చాలా చురుగ్గా నడిపారు. ఆ తరువాత ఇతరుల నాయకత్వం చేపట్టారు. ఆ పిమ్మట జరిగిన పరిణామాల్లో భాగంగా, విస్తృత ప్రాతిపదికపై "తెలుగు భాషోద్యమ సమాఖ్య" ఏర్పడింది. తండ్రిగారి నుంచి తెలుగుభాషా సంస్కృతుల సేవాభావాన్ని వారసత్వంగా పొందిన శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారు భాషోద్యమ నాయకత్వాన్ని స్వీకరించాక, ఉద్యమ తీవ్రత హెచ్చింది. ఉద్యమ స్థాయి పెరిగింది. వారు అసెంబ్లీలో ఈ అంశం లేవనెత్తి చర్చకు పెట్టించారు. దరిమిలా విధానానికి సంబంధించిన ఆ ఉత్తర్వుల అమలు, ఆచరణలో పాక్షికమే అయింది. వాస్తవంలో కార్పొరేట్ రంగం తన వైఖరిని ఏ మాత్రమూ మార్చు కోలేదు సరికదా, చిన్న పట్టణ ప్రాంతాల్లోని ఆంగ్ల పాఠశాలల యాజమాన్యాలు కొన్ని బడిలో పిల్లలు తెలుగులో మాట్లాడితే బెత్తాలతో కొట్టడం వంటి క్రూర చర్యలకు పాల్పడ్డాయి. దీనికి తోడు ఉద్యోగ రంగంలో వచ్చిన మార్పుల కారణంగా ముఖ్యంగా సమాచార, సాంకేతిక రంగంలో వచ్చిన విప్లవాత్మకమైన మార్పుల కారణంగా, ఆంగ్ల విద్యనభ్యసించినవారికే ఉద్యోగావకాశాలు మెరుగు పడ్డాయి. 2000 సంవత్సరానికి కాస్త ముందూ, వెనకగా వచ్చిన "వై2కె" స్పృహ, దేశ, విదేశాల్లో కొత్త ఉపాధి అవకాశాలను పెంచడంతోబాటు, ఆంగ్ల భాషాభ్యసన ప్రాధాన్యాన్ని కూడా ఇనుమడింపచేసింది. ఆ మేరకు తెలుగు పట్ల నిరాసక్తతను కూడా పెంచింది. దరిమిలా మాతృభాషా పరిరక్షణ ఉద్యమానికి ప్రజల వత్తాసుకూడా తగ్గసాగింది. వత్తాసు ప్రకటించేవారు కూడా ద్వంద్వనీతి పీడితులే. ఆ తర్వాత మరో నాలుగేళ్లకు ఒక రాష్ట్రమంత్రిగారే, "మీ పిల్లలు ఇంగ్లీషులో చదువుకొని పై ఉద్యోగాలకు వెళ్తే, మా పిల్లలు తెలుగు చదువుకొని దిగువస్థాయి ఊడిగాలు చేయాలా?" అని ప్రశ్నించే స్థితి వచ్చిందంటే, అది ఓ చారిత్రక పరిణామంలో భాగమేనని గుర్తించాలి. భాష ఆర్థిక - సామాజిక స్థాయికి సంకేతం కావడం, అదీ ఉత్పత్తి క్రమంలోకి మారిపోవడం, అందులో మాతృభాష నిరర్థకంగా గుర్తింపబడడం అత్యంత దురదృష్టకరమైన చారిత్రక విపర్యాసం. అందునా భారతదేశంలో మరేభాషా పొందని దుస్థితిని తెలుగు ఎదుర్కోవడం చాలా గొప్ప విషాదం. ప్రపంచంలో అభివృద్ధి పొంది ప్రథమ పంక్తికి చేరుకొన్న ఏ సభ్య దేశంలోనైనా, ముఖ్యంగా ఒక కొత్త ఆర్థిక విప్లవాన్నే సృష్టించిన జపాన్ దేశంలో కూడా, మాతృభాషకు ఇలాంటి దుస్థితి ఏర్పడలేదు. చైనాలో కనీసం ఆసియా స్థాయిలో, అగ్రస్థానాన్ని సాధించిన విశ్వవిద్యాలయాలలో ఇంగ్లీషులో మాట్లాడగలిగే నిపుణుల సంఖ్య, ఆచార్యుల సంఖ్య చాలా తక్కువంటే ఆశ్చర్యపోతారు. అయినా ఈవాస్తవాలేవీ తెలుగువారికి రుచించలేదు. ఒక విధంగా ఇది అప్పుడే వచ్చిన పరిణామం కాదు. 60ల మధ్యభాగంలో, కళాశాల స్థాయిలో బోధనా మాధ్యమంలో ప్రవేశపెట్టిన మార్పులకు ఇదొక తార్కిక ఫలం మాత్రమే. ఆ మార్పువల్ల ఆర్థిక శక్తిలేని గ్రామీణ విద్యార్థులు తెలుగు మాధ్యమ విద్యార్థులుగానూ, భారమైనా సరే ఖరీదైన ఆంగ్ల మాధ్యమంలో చదివించుకోగలిగే దిగువ మధ్యతరగతి నుంచి పట్టణ, నగర ప్రజలు ఆంగ్ల మాధ్యమ విద్యార్థులుగానూ విడిపోయారు. ఉన్నతాదాయ ఉద్యోగ అవకాశాలు వారికే ఎక్కువ అందుబాటులోకి రావడంతో, ఆంగ్ల మాధ్యమం పట్ల కలిగిన ఆసక్తిని ఆంగ్ల మాధ్యమ పాఠశాలలు, క్రమంగా ఆ తరువాత కార్పొరేట్ విద్యారంగమూ బాగాలాభదాయకంగా మార్చుకొన్నాయి. విద్యా లక్ష్యాలు, విలువలు మారిపోయిన దశలో అన్ని మానవీయ విలువలకు మాధ్యమమైన మాతృభాష బోధనే విస్మృతి పాలుకావడమే కాదు, ప్రభుత్వం దానిపట్ల ఉపేక్షవైఖరిని అవలంబించే స్థితి వచ్చింది.

భాషా - సంస్కృతి స్పృహ పరంగా తెలుగు జాతి జబ్బు పడ్డ స్థితి వచ్చింది. ఆ దశలో వచ్చింది తమిళానికి - క్లాసికల్ హోదా ప్రకటన! ఎందులో వెనకపడ్డా ఆత్మాభిమానంలో ఆంధ్రుడెప్పుడూ వెనక్కిపడడు. "తమిళుల కంటె మనమెందులో తక్కువ?" అనే ప్రశ్న అందరి గుండెల్లో భాషా సంస్కృతి పరమైన వేడిని రగిల్చింది. క్లాసికల్ హోదా ప్రకటనతో పాటే, వందకోట్ల కేంద్ర బడ్జెట్ కేటాయింపు ఉంటుందనే మాట ప్రజల్లోనూ, నాటి ప్రభుత్వ పెద్దల్లో, సంస్థల్లో చలనం కలిగించింది.

ఏదైతేనేం దాయాదిపోటుతోనైనా తెలుగుజాతి మరోసారి భాషాచైతన్యాన్ని పుంజుకుంది. తెలుగును ప్రేమించే ప్రతివారూ ఈ రూపంలో సంఘటితమై తమ భాషా గౌరవ స్థాపనకు ఉద్యమించారు.

"క్లాసికల్ భాష" పరిగణనకు కేంద్ర కమీటీల సిఫారసులు :

డి.ఎం.కె పార్టీ కేంద్రంలోని యు.పి.ఎ ప్రభుత్వంలో 2004లో చేరుతున్నప్పుడు పెట్టిన ముఖ్యమైన షరతు : తమిళాన్ని ఈ దేశ క్లాసికల్ భాషగా ప్రకటించడం. ఒప్పుకొన్న యు.పి.ఎ. ప్రభుత్వం ప్రజాస్వామికంగా దాన్ని ప్రకటించడానికి ఒక నిపుణుల కమిటీని ఢిల్లీలోని కేంద్ర సాహిత్య అకాడమీ, మైసూరులోని భారతీయ భాషా సంస్థల సంయుక్త ఆధ్వర్యంలో నియమించింది. అవి రెండే భాషల పరంగా ప్రభుత్వ అధికారిక సంస్థలు కనుక ! కమిటీలో 1.కేంద్ర సాహిత్య అకాడమీ అధ్యక్షులు 2.కార్యదర్శి 3.భారతీయ భాషా సంస్థ నిర్దేశకులు 4.కేంద్ర సాంస్కృతిక వ్యవహారాల శాఖ కార్యదర్శి 5.హోం శాఖ కార్యదర్శి, అధికారిక సభ్యులు 6.వారితోబాటు అంతర్జాతీయ ఖ్యాతినార్జించిన భాషాశాస్త్రవేత్త ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు బయటి నుంచి నామినేటెడ్ సభ్యులు. వాస్తవానికి ఆ కమిటీలో భాషావిషయంలో శాస్త్రీయ నిపుణులంటే వారూ, భాషా సంస్థ నిర్దేశకులుగా అధికారిక హోదాలో నియుక్తులైనా, వారి శిష్యతుల్యులు డా॥ఉదయ నారాయణ సింగ్ ఇద్దరే.

ఒక భాషను "క్లాసికల్" భాషగా గుర్తించాలంటే ఈ క్రింది నాలుగు ప్రమాణార్హతలుండాలని ప్రపంచంలో "క్లాసికల్ భాషా పరిగణన" కలిగిన భాషలను పరిశీలించాక ఆచార్య భద్రిరాజు గారు ప్రతిపాదించారు.

1. పరిశీలత భాష అత్యంత ప్రాచీన పాఠ్యాలను లిఖిత చరిత్రను (1500 - 2000 సంవత్సరాలది కావచ్చు) కలిగి ఉండాలి. (High antiquity of its earlier texts / recorded history, may be 1500-2000 years)
2. తరతరాలుగా ఆభాషీయులు విలువైన వారసత్వంగా పరిగణించే ప్రాచీన సాహిత్యం / రచనల సమాహారం కలిగి ఉండాలి. (A Body of ancient literature / texts which is considered as valuable heritage by generation of speakers)
3. ఆ సాహిత్య సంప్రదాయం ఆ భాషా సమాజానికి మౌలికమైనదై ఉండాలి. ఇతరుల నుంచి అరువు తెచ్చుకున్నది కాకూడదు. ("The literary tradition be original and not borrowed from onother speech community")
4. క్లాసికల్ భాషా సాహిత్యాలు ఆధునిక భాషా సాహిత్యాల కంటే భిన్నంగా ఉంటాయి కనుక, క్లాసికల్ భాషకూ, దాని అంతర్గత రూపాలకు లేదా భేదాలకు మధ్య (సంప్రదాయం) కొనసాగింపు లేకుండానూ ఉండవచ్చు. (The classical language and literature being distinct from modern, there may also be adiscontinuity between the classical language and its inner forms or its varietes....)

భద్రిరాజుగారు సూచించిన ఈ నాలుగు సూత్రాలు 2-9-2004 నాటిపై కమిటీ సమావేశంలో ఏకగ్రీవంగా ఆమోదించబడ్డాయి.

వారు చాల దూరదృష్టితో పై సూత్రాలను రూపొందించారు. ఇందులో "టెక్స్ట్" అనేమాట చాలా కీలకమైనది. గ్రంథం అని అర్థమూ తీసుకోవచ్చు. ఏ లిఖిత రచన అయినా అనే అర్థమూ తీసుకోవచ్చు. పఠించదగ్గ అంటే చదవదగ్గ పాఠం అంటే లిఖిత రూపమనే దాని స్వాభావిక అర్థం. ఒక నాణెం మీద నాలుగయిదుక్షరాల రాతకూడా టెక్స్టే! అది 1500-2000 సంవత్సరాల ప్రాచీనం కావచ్చు అన్నారు. "may be" కావచ్చు - అని మాత్రమే. అది నిర్బంధాంశం కాదు. పై సూత్రాలు కేవలం 'భాష' ప్రాచీనతను గుర్తించడానికే! సాహిత్యాన్ని గుర్తించడానికి కాదు. సాహిత్యమనే మాటను 2,3 సూత్రాల్లో వాడినా భాషా, సాహిత్యాలు అనే మాటకు సముచ్చయంగా, 4వ సూత్రంలో వాడి దాన్ని ఔపచారికం చేశారు. తమిళం తరువాత ఇది అంతే ప్రాచీనమైన తెలుగు, కన్నడాలకు అనువర్తించబడాలి. తమిళంతోపాటు తెలుగు, కన్నడాలుకూడా ప్రాచీన భాషార్హతను పొందగలగాలి అనే దూరదృష్టితోనే అంత పకడ్బందీగా, సంక్షిప్తంగా 1500-2000 సంవత్సరాలి చూడగానేతమిళులు మురిసిపోయేలా కొంత చమత్కారం పొదివి ఆ సూత్రాలను తయారు చేశారు.

నిపుణుల కమిటీ ఒకవైపు పై నాలుగింటినీ ఆమోదిస్తూనే పై సూత్రాలలో నాలుగవదాన్ని మినహాయించవచ్చని కూడా నిర్ణయించింది. పై మేరకు తమిళులకు క్లాసికల్ ప్రతిపత్తి ఇవ్వవచ్చని కమిటీ సిఫారసు చేసింది.

దరిమిలా 2004 సెప్టెంబరు 17, అకాడమీ నుండి సిఫారసు పంపిన 8 రోజులకే ఈ తీర్మానాన్ని ఆమోదిస్తూ తమిళాన్ని క్లాసికల్ భాషగా కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది. కమిటీని వేసింది, తమిళానికి ఇవ్వవచ్చా? అన్నది పరిశీలించడానికే కాబట్టి, కమిటీ సిఫారసులో సంస్కృతం ఉన్నా, దాన్ని పట్టించుకోకుండా తమిళాన్ని ప్రకటించేస్తే చాలనుకొని, దానికి మాత్రమే ప్రకటించింది. 2004 అక్టోబరు 12న గెజిట్‌నోటిఫికేషన్‌ను కూడా విడుదల చేసింది. చిత్ర మేమిటంటే అందులో ప్రాచీనతా కాల పరిమితిని 1500-2000 సంవత్సరాలకు బదులు 1000 ఏళ్ళకు కుదించింది. ఈ కుదింపుకు కారణం ఎవరు? తర్వాత దీనిపై వాడి చర్చజరిగి కేంద్రమంత్రిగా ఉన్న దయానిధి మారన్ తీవ్రంగా స్పందించడం తోటి, సంబంధిత శాఖలోని కార్యదరిశ ఒకరు కారణమంటూ, అతన్ని బదిలీ చేసి 1500కు మళ్లీ సవరించారు. మారన్‌గారు, తమిళనాడు ముఖ్యమంత్రి గారి అభిమతమంటూ 2000 సంవత్సరాలకు సవరించమని కోరారు. అలాగే ఉదారంగా సంస్కృతాన్నికూడా "క్లాసికల్" భాషగా గుర్తించాలన్న కరుణానిధి అభిమతాన్ని తెలియజేయగా కేంద్ర ప్రభుత్వం అప్పుడు సంస్కృతం పట్ల కూడా, కరుణానిధి పుణ్యమా అని ఉదారత చూపి దానిని క్లాసికల్ భాషగా ప్రకటించింది. అది కూడా ఏడాది తర్వాత, 2005లో! ఈ వ్యవహారాన్ని వీరివరకే పరిమితం చేసుకోలేదు. విదేశీ పండితులను కూడా రంగంలోకి దించారు. ఈ సందర్భంగా కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో దక్షిణ-దక్షిణేసియా అధ్యయన విభాగంలో తమిళ ఆచార్యులుగా ఉన్న జార్జ్.ఎల్.హార్ట్ 2005 ఏప్రిల్‌లో వెబ్ మీద ప్రకటించిన ఒక నోటు జాగ్రత్తగా గుర్తించదగింది.

"... to qualify as a classical tradition a language must fill several criteria : it should be ancient, it should have an independent tradition that arose mostly on its own not on offshoot of any other tradition, and it must have a large and extremely rich body of ancient leterature" తమిళానికి అనుకూలంగా తన వాదనను సమీకరిస్తూ "Tamil meets each of these requirements. it is extrement old (as old as latin and olden than arabic); it arose as an entirely independent tradition, with almost no influence from Sanskrit or other languages and its ancient leterature is indescribably vast and rich..." వెనకేటి వైష్ణవ ముద్రలను తలపింపచేస్తున్నది హార్ట్ కథనం. వారు. తమిళంతోపాటు తెలుగు కూడా నేర్చుకొన్నారు. కాని తమిళ ప్రేమ ఎక్కువయింది. వారి శ్రీమతి డా॥కౌసల్యగారు తమిళ భాషీయులు, తమిళ ప్రాంతం నుంచి వచ్చినవారు. కమిటీలో భద్రిరాజు గారున్న కారణంగా ఏ అంశం మీదయినా వారు వాదించి, ఒప్పించే తీరు అందరికీ పరిచితమే కావడం చేత తమిళంతోపాటు తెలుగు-కన్నడాలు ఆ గౌరవాన్ని పంచుకోవడం ఇష్టంలేక, ఇద్దరు తమిళ మహాభిమానులను మాత్రం అదనంగా చేర్చి కమిటీని పునర్నిర్మింపచేశారు.

1000 సంవత్సరాల కాలం నిడివిని, 1500 సంవత్సరాలకు మార్చడానికి మళ్ళీ ప్రజాస్వామిక తంతు ప్రకారం దాన్ని కమిటీ పరిశీలన పంపాలి. అయితే అది తెలుగు, కన్నడాలకు కూడా ఆ గౌరవాన్ని పంచడానికేనని తమిళ మంత్రిగారు ఆందోళన వ్యక్తం చేశారు. ఫలితంగా కమిటీ మళ్లీ పునర్నిర్మితమైంది. ఇందులో మరో అయిదుగురిని చేర్చి మొత్తం ఎనమండుగురు సభ్యులతో కమిటీ పునర్నిర్మింపబడింది. ఇందులో అకాడమీ అధ్యక్షుడు, భారతీయ భాషా సంస్థ నిర్దేశకుడు కాక, సుప్రసిద్ధ భాషా శాస్త్రవేత్త ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి, ఆచార్య అన్వితా అబ్బీ, ఆచార్య సుబ్బారావు, ఆచార్య పట్నాయక్ గార్లు, ఇద్దరు తమిళ ప్రతినిధులుగా- ఆచార్య కుళందై స్వామి అనే తమిళాభిమాని అయిన సాంకేతిక శాస్త్రవేత్త, కరుణానిధి ప్రసంగాలను హిందీలోకి అనువదించిన కణ్ణన్ అనే పాత్రికేయుడు సభ్యులుగా నియమించబడ్డారు. భారతదేశంలోని ఇతర భాషీయులకంటే తాము బహు ప్రాచీన సంతతికి చెందిన వారనే, సాంస్కృతిక, ఆధిపత్య భావన గడించడానికి తమిళులు చేసిన రాజకీయ వ్యవహారం ఈ క్లాసికల్ భాషా ప్రతిపత్తి ప్రకటన.

తమిళులు అలానుమానించడానికి కారణం, ఆచార్య భద్రిరాజు గారు విడిగా తాను కేంద్ర ప్రభుత్వానికి పంపిన నోట్. అందులో వారు "I recommend that, besides Sanskrit, pali, Prakrit and Tamil, the Government of India should recognise the above three languages (Telugu, Kannada and Malayanam) as classical languages. Otherwise they will be hurting the feelings of 3/4th of the speakers of the Dravidian languages..." అని నిర్మొహమాటంగా ప్రకటించారు. ఆయన సభ్యుడిగా ఉంటే పరిస్థితి ఏమిటన్నది వారు ఊహించగలిగిందే.

2005 నవంబరులో తమిళానికి లభించిన ఈ గౌరవాన్ని పురస్కరించుకొని మొదటగా మైసూరులో నెలకొల్పిన "ప్రాచీన తమిళ కేంద్రం" మదరాసు విశ్వవిద్యాలయ ప్రాంగణంలో ఒక విజయోత్సవ సభను జరిపింది. దానిలో పాల్గొనడానికి తెలుగు, కన్నడ, ద్రావిడ విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులను కూడా ఆహ్వానించారు. ఆ పాటికే తెలుగు, కన్నడ ప్రాంతాల్లో తమిళానికి ఈ హోదా నిచ్చి, తెలుగు కన్నడాలకు ఇవ్వక పోవడం పట్ల లియా భాషాభిమానులు ఉభయ రాష్ట్రాల్లోనూ తీవ్ర అసంతృప్తిని వ్యక్తం చేస్తున్నారు. కన్నడ నాడులో ఉద్యమానికి సమాయత్తులవుతున్నారు కూడా! బహుశః ఆ కారణంగా కావచ్చు లేదా కారణాంతరాల వల్ల కావచ్చు. ఆ ఇద్దరు ఉపాధ్యక్షులు పై సమావేశానికి హాజరు కాలేదు. ద్రావిడ ఉపాధ్యక్షుడి హోదాలో ఈ గ్రంథకర్త ఆ సభలో పాల్గొని మాట్లాడుతూ "పాటల పట్లా, పద కవితల పట్ల గౌరవంతో వాటిని సంకలన పరిచి సంగం సాహిత్యంగా భద్ర పరచుకొని, తమిళం ఈ గౌరవానికి సహజమైన ప్రథమార్హతను సాధించింది. మధ్యయుగాలలో భారతీయ సాహిత్యం పరజాతీయుల తాకిడికి స్థైర్యం, దిశానిర్దేశం కోల్పోతున్న స్థితిలో, భక్తి ఉద్యమాన్ని అందించి తన గౌరవాన్ని పెంచుకొంది. అయితే సంగం సాహిత్యం దాక్షిణాత్యులందరి ఉమ్మడి ఆస్తి. పోషణను వెదుక్కొంటూ ఇరుగు పొరుగు నుండి వచ్చిన భిక్షుక గాయకులు, పోషకులను నుతించి, వారి కీర్తిని తమిళ-తెలుగు-కన్నడ భాషా రూపాల మధ్య ఇప్పుడున్నంతటి అంతరాలుండక పోవడం వల్ల నాటి సరిహద్దుల్లోని తెలుగు, కన్నడిగులు పొరుగునున్న ఏలికలపై ఆ పాటలు కట్టారు. కనుక సంగం సాహిత్యం అందరి ఉమ్మడి సొత్తు. దానివల్ల లభించిన ఈ గౌరవమూ అందరికీ చెందుతుంది. అధికారికంగా అంతే ప్రాచీనత కలిగిన తెలుగు, కన్నడ, మలయాళాలను కూడాకేంద్ర ప్రభుత్వం విజ్ఞత కొద్దీ ప్రాచీన భాషలుగా ప్రకటించాలని, తద్వారా ద్రావిడ కుటుంబం మొత్తం ప్రాచీనతమమన్న చరిత్రవేత్తల అభిప్రాయాన్ని, ద్రావిడ కుటుంబ పాశస్త్యాన్ని నిలపాలనీ, ఈ అభ్యర్థనలోని ఔచిత్యాన్ని గుర్తించి తమిళ సోదరులు తగు రీతిగా సహకరించాలని కోరుతున్నాను"అని సభాముఖంగా కోరాడు. ఆచార్య కుళందై స్వామి వంటి వారు ఒకరిద్దరు అటూ ఇటుగా అన్నా, నాటి సభలోని అత్యధిక సంఖ్యాకులు ఈ అభిప్రాయంతో ఏకీభవించారు.

ఆ సభ నుండి తిరిగివస్తూ అప్పటికే భాషోద్యమానికి నడుం బిగించి, తెలుగునాట మాతృభాషా చైతన్యం నింపడానికి అంకితమైన పత్రికగా పేరొందిన "నడుస్తున్న చరిత్ర" సంపాదకులు, శ్రీ సామల రమేష్‌బాబు గారిని, ఆచార్య కస్తూరి విశ్వనాథం గారి ద్వారా ఫోన్‌పై సంప్రదించి, వ్యూహాత్మకంగా జిల్లాల వారీగా ఆయా జిల్లా రచయితల సంఘాలతోనో, లేదా మరే ప్రముఖ స్థానిక సంస్థలతోనో కలిసి సమావేశాలు నిర్వహించి ఉద్యమ స్ఫూర్తి నింపవలసిన ఆవశ్యకాన్ని చర్చించడం జరిగింది. నాలుగు భాషా రాష్ట్రాలకు చెందిన విశ్వవిద్యాలయంగా ద్రావిడ విశ్వవిద్యాలయం అందులో ప్రత్యక్షంగా పాల్గొనడం అసమంజసమవుతుంది. ఆ దశలో వారి పత్రిక ప్రధాన సలహాదారు తెలుగు విశ్వవిద్యాలయ పాలక మండలి సభ్యులు ఆ పాటికే తెలుగు ఉద్యమంలో చురుగ్గా పనిచేస్తున్న శ్రీ ధర్మారావు గారి పూనికతో నాటి ఉపాధ్యక్షులు డా॥ఎ.మంజులతగారి నేతృత్వంలో తెలుగు విశ్వవిద్యాలయం ప్రశంసనీయ స్థాయిలో కార్యక్రమాన్ని చేపట్టింది. దాదాపు ప్రతి జిల్లాలో సభలు నిర్వహించి – స్వచ్ఛందంగా నిర్వహించే వారికి ధన సహాయం అందించి రాష్ట్రానికి చెందిన పార్లమెంటు సభ్యులందరికీ మంజులతగారు ఉత్తరాలు రాసి, కేంద్ర ప్రభుత్వంపై ఒత్తిడి తేవాలని అభ్యర్థించారు. ఇదంతా ప్రభుత్వ సంస్థ సారథ్యంలో జరిగిన కృషి.

శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారి నాయకత్వం – ఉద్యమించిన ఉద్యమం : ఏదైనా ఒక ఉద్యమ స్థాయినందుకొనేది అది నేరుగా ప్రజా సంస్థలు లేదా వేదికల నుంచి వచ్చినప్పుడే. అలా ఈ ఆందోళనను ఉద్యమంగా మార్చింది కృష్ణాజిల్లా రచయితల సంఘం గౌరవ అధ్యక్షులు, అప్పటికి శాసన సభ్యులు, ఆ తర్వాత అమాత్యులు అయిన శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారి నాయకత్వమే. తెలుగుభాషా భక్తి వారికి తండ్రిగారి నుండి వారసత్వంగా సంక్రమించిన ఆస్తి. ఒక రకంగా అదృష్టమూ, మరొక రకంగా దురదృష్టమూ ఏమిటంటే నాటికి (నేటికి కూడా) రాజకీయ నాయకుల్లో, ముఖ్యంగా శాసన సభ్యుల్లో మాతృభాషా, సంస్కృతుల పట్ల అంతటి మమకారం, కార్యదీక్ష ఉన్న వారు తెలుగునాట మరొకరు లేకపోవడమే. అంతకుమునుపే వారు ప్రతి పక్షంలో ఉన్నప్పుడే, మాతృభాషా పరిరక్షణ కార్యక్రమంతో మమేకమై ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చి జి.వో. 86 విడుదలకు కారకులయ్యారు. భాషా, సంస్కృతి విషయంలో వారి దీక్షాదక్షతలు పార్టీ పరిధుల కతీతమైనవని అందరికీ, నాటికీ – నేటికీ తెలిసిందే! వారి కార్యదీక్షకు సరైన నిర్వాహక రూపం – కృష్ణా జిల్లా రచయితల సంఘం అధ్యక్షులు శ్రీ గుత్తి కొండ సుబ్బారావు, కార్యదర్శి డా.జి.వి. పూర్ణచంద్ గార్లు, సమర్థవంతమైన వారి నిర్వహణలో కృష్ణా జిల్లా బాషా ప్రేమికులందరూ కలిసి దీన్నొక సమున్నత ఉద్యమంగా తీర్చిదిద్దారు. ప్రభుత్వపర సంస్థలన్నిటిలోకి చెప్పుకోదగ్గ ప్రత్యేకమైన కృషి అప్పటి అధికార భాషా సంఘం అధ్యక్షులు శ్రీ ఎ.బి.కె.ప్రసాద్ గారిది – నిజానికది వారి వైయక్తిక కృషి. ఎక్కడ ఏ పత్రిక సంపాదకులుగా ఉన్నా మొదటి నుంచి వారిది మరెవరితోనూ పోలికలేని తెలుగు అక్షరోద్యమమే.

భాషా సంఘం అధ్యక్షులుగా కూడా వారు దాన్నే కొనసాగించారు. ఈ అందరి కృషి వల్లా 2006, 2007 లో ఉద్యమం బాగా విస్తరించింది. భాష గురించి సామాన్యంగా పట్టించుకోని జన సామాన్యంలో కూడా, మాతృభాష పట్ల ఓ కొత్త స్పృహను, అభిమానాన్ని పెంపొందించింది. తమది ప్రాచీన భాష, తమది ప్రాచీన సమున్నత జాతి అనే జాగృతిని కొత్త తరంలో నింపింది. అంతకు మునుపటి దశాబ్దంలో మొదలైన మాతృభాషాందోళన ఇలా కొత్తరూపు తీసుకుంది.

ఈ దశలో బుద్ధప్రసాద్‌గారు, నాటి ముఖ్యమంత్రి డా॥వై.ఎస్. రాజశేఖర రెడ్డి గారి జోక్యం కోసమై, ఆయన నుంచి కేంద్రంపై ఒత్తిడి తీసుకురావడంపై గట్టిగా పట్టుబట్టగా, ప్రాచీనాతాధారాల సేకరణకు ముఖ్యమంత్రిగారు ఒక అధికారిక కమిటీని అప్పటి సంస్కృతి శాఖా మాత్యులు శ్రీ ఎమ్. సత్యనారాయణరావుగారి అధ్యక్షతన, శ్రీ బుద్ధప్రసాద్ గారితోపాటు అధికార భాషా సంఘం అధ్యక్షులు శ్రీ ఎబికె.ప్రసాద్, తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు శ్రీ ఎ. మంజులత, హిందీ అకాడమీ అధ్యక్షులు డా.యార్లగడ్డ లక్ష్మీ ప్రసాద్ తెలుగు అకాడమి నిర్దేశకులు ఆచార్య కె.ప్రతాపరెడ్డిలతో ఒక టాస్క్‌ఫోర్స్‌ను ప్రకటించారు. అప్పటిదాకా వివిధ గ్రంథాలలోనూ, పరిశోధన వ్యాసాలలోనూ చెదురు మదురుగా ఉన్న తెలుగు ప్రాచీనతా సాక్ష్యాలన్నిటినీ కూర్చి, ఆధారాల దస్తరాన్ని టాస్క్‌ఫోర్సు అద్భుతంగా తయారు చేసింది (ఇదే సమయంలో కన్నడిగులు ఇలానే ప్రభుత్వాదేశంపై తయారు చేసిన నివేదిక చక్కటి కన్నడ భాషా చారిత్రక పరిశోధన సంకలన గ్రంథంగా మన్ననలందుకొంది) నివేదిక కేంద్ర ప్రభుత్వానికి సమర్పితమైంది.

ఇంత ఆందోళన జరిగి, ఇంత గ్రంథం తయారైనా, తెలుగుకు క్లాసికల్ హోదా అభ్యర్థన మాత్రం కేంద్ర ప్రభుత్వం ముందు యథాతథంగా ఉంది. భాషా స్థాయి ప్రకటనకై మొదట రూపొందించిన మార్గదర్శక సూత్రాల ఇతర భాషలకూ వెసులుబాటు కల్పిస్తున్నామని తమిళనాడు వ్యక్తబరచిన అసంతృప్తి కారణంగా పునర్నిర్మించబడ్డ కమిటీని ఒక్కమారు కూడా సమావేశ పరచలేదు. వాస్తవానికి సమావేశ అవసరం లేకుండానే ఆమెదించడానికి తగ్గ సూత్రాలు ప్రభుత్వం ఎదుట ఉండనే ఉన్నాయి! అయినా నిరాసక్తత!

ఇదిలా ఉండగా, 'తమిళానికి క్లాసికల్ ప్రతిపత్తి పరిశీలించిన కమిటీలో తమిళులు లేరు, మరి తెలుగు, కన్నడాలకు ఆ భాషల వాళ్లు ఎలాగుంటారు? తమ భాషలకు తాము ఎలా ప్రకటించుకొంటారు, స్వభాషా పక్షపాతాలు న్యాయమైన పరిశీలనలకు ఎలా అవకాశమిస్తాయి?" అంటూ గాంధీ అనే ఓ న్యాయవాది చెన్నై హైకోర్టులో ఓ ప్రజావ్యాజ్యం చేశాడు. దాని మీద శ్రీ ఎ.బి.కె. ప్రసాద్ గారు మళ్ళీ కోర్టుకు వెళ్లారు. అది వేరే విషయం. వ్యాజ్యం కోర్టులో ఉంది అనే మిషతో, న్యాయస్థానం సాకుతో క్లాసికల్ ప్రతిపత్తి అమోదం మరింత పక్కన పడ్డది.

## ద్రావిడ విశ్వవిద్యాలయం పాత్ర :
## శ్రీ వీరప్ప మొయిలీ గారి చొరవ

ఉద్యమ వేగం కొంత తగ్గుతున్న దశలో రెండు రాష్ట్రాల్లోనూ ఒక నిస్తబ్ధవ్యగ్రత ఆవరిస్తున్న తరుణంలో ద్రావిడ విశ్వవిద్యాలయం చురుగ్గా అన్ని రాష్ట్రాలలోనూ తగిన కార్యక్రమాల నిర్వహణను ప్రారంభించింది. ఆంధ్రప్రదేశ్‌లో కృష్ణాజిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో "తెలుగు భాష – ప్రాచీన విశిష్టత" పై ఓ సదస్సు నిర్వహించింది. అంతవరూ 'క్లాసికల్' అనే పదానికి సమానంగా 'ప్రాచీనత' అనే మాట ప్రచారంలో ఉంది. ఆ సదస్సుసుంచినే కేవలం ప్రాచీనత కాదు, శ్రేష్టత లేదా విశిష్టత ప్రధానమైన అంశం అంటూ, ప్రాచీన విశిష్ట భాష అనే మాటకు ప్రాచుర్యం పెరిగింది. ద్రావిడ భాషల ప్రాచీనతను తెలుగు మూలాలను చర్చించే 'సింధు, కృష్ణలోయల నాగరికతలు' అంశంపై జాతీయ సదస్సును నిర్వహించడంలో సంయుక్త పాత్ర వహించింది కృష్ణా జిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలోనే ఆ తర్వాత 2008 ఆఖరులో నిర్వహించిన విజయోత్సవ సభలో కూడా తన వంతు భాగస్వామ్యాన్ని వహించింది. 2007 సెప్టెంబరులో కుప్పంలోనూ, 2008లో హైదరాబాద్‌లోనూ మోహంజదరో ముద్రలలో ఉన్న తెలుగు ద్రావిడ మూలాలమీద డా॥ఐరావతం మహాదేవన్ గారితో సోదాహరణ ప్రసంగాలను ఏర్పాటుచేసింది. మొహంజొదారో లిపి విశ్లేషణ మీద దశాబ్దాల పరిశోధన చేసిన వారు ఐరావతంగారు. అందులోని తెలుగుమాట తెలుగు ప్రత్యయం గురించి సశాస్త్రీయంగా నిరూపించి సింధూ నాగరికత నాటిది తెలుగు భాషని పరోక్షంగా చెప్పారు. (దీని తెలుగు పాఠం కృష్ణా జిల్లా రచయితల సంఘం ప్రచురణలో ఉంది) 2007 అక్టోబరులో సంగం సాహిత్యం మీద కొత్తగా ఏర్పాటైన ప్రాచీన తమిళ కేంద్రం సంయుక్త సహకారంతో అంతర్జాతీయ సదస్సును నిర్వహించింది. అందులో పాల్గొన్న మలేషియా, శ్రీలంక, కేరళ, కన్నడ తెలుగు విద్వాంసులు సంగవాఙ్మయ ఉమ్మడి తనాన్ని వివిధ కోణాలల్లో ఎలుగెత్తి చెప్పారు. ద్రావిడ భాషలన్నీ అత్యంత ప్రాచీన భాషలని చెప్పడానికి – సంగ వాఙ్మయమే ప్రబల సాక్షి అని ఉద్ఘాటించారు. ఆ వెంటనే ఆ అంతర్జాతీయ సదస్సుకు కొనసాగింపుగా "క్లాసికల్ లాంగ్వేజ్ డిబేట్" మీద సదస్సును నిర్వహించడం జరిగింది.

క్లాసికల్ హోదా పరిశీలన కోసం కేంద్ర ప్రభుత్వం ఏర్పరచిన కమిటీలో అధికారిక సభ్యులై ఉన్నందువల్ల బయట ఏ సభలోనూ పాల్గొనని డా॥ఉదరనారాయణ సింగ్ అతిథిగా వచ్చి ఆ సభలో తన అభిప్రాయాన్ని, మద్దతును నిర్ద్వంద్వంగా, శాస్త్రీయంగా ప్రకటించారు. ఆ విషయం కేంద్ర ప్రభుత్వం దృష్టికి ఎలా తీసుకువెళ్ళాలి అనే అంశం గురించి అందుకు అనుసరించవలసిన వైజ్ఞానిక వ్యూహం గురించి, సమర్పించవలసిన సమాచారం గురించి సదస్సులో పాల్గొన్న ఎంతోమంది ఉన్నతస్థాయి విద్వాంసులు, నిపుణులు విలువైన సూచనలు అందించారు. అప్పటికి కొద్దిముందే ఆగష్టులో తెలుగు విశ్వవిద్యాలయం మద్రాసులో నిర్వహించిన అఖిల భారత తెలుగు మహాసభల్లో జ్యోతి వెలిగిస్తూ నాటి రాష్ట్ర ముఖ్యమంత్రి డా॥రాజశేఖర్ రెడ్డి గారు తెలుగును ప్రాచీన భాషా హోదా సాధించి తీరుతామని ప్రకటించడం ఉద్యమం మళ్లీ కొత్త ఊపు అందుకోవడానికి ప్రేరకమైంది. ఆ నేపథ్యంలోనే, దాదాపు ఉత్తేజాన్ని కొనసాగించే ఉద్దేశ్యంతోనే పై కార్యక్రమాలను కుప్పంలో ద్రావిడ విశ్వవిద్యాలయం నిర్వహించింది. ద్రావిడ విశ్వవిద్యాలయ కార్యక్రమాలన్నీ తులనాత్మక అంశాలపై నాలుగు భాషల వారిని సమన్వయించుకుంటూ జరగడం విశేషం. అందులో తెలుగు ప్రాచీనతను స్థాపింపచేయడం లక్ష్యం. చివరగా 2008 జూలై 19, 20వ తేదీలలో కన్నడ విశ్వవిద్యాలయం వారి సంయుక్త సహకారంతో ఢిల్లీ కన్నడ సంఘం వారి ఆధ్వర్యంలో తెలుగు విశ్వవిద్యాలయం ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘాన్ని కలుపుకొని తెలుగు-కన్నడాల ప్రాచీనతపై ఒక పెద్ద సదస్సును నిర్వహించింది. 19 నాటి సభలో తెలుగు నుండి, నాడు పశు సంవర్ధక శాఖ మంత్రిగా ఉన్నా, అందరి మనసుల్లోనూ తెలుగు మంత్రిగా ప్రతిష్ఠితులైన బుద్ధప్రసాద్‌గారు, శాసన మండలి అధ్యక్షులు శ్రీ చక్రపాణి గారు, అధికార భాషా సంఘం అధ్యక్షులు శ్రీ ఎ.బి.కె.ప్రసాద్‌గారు, సుప్రసిద్ధ భాషావేత్త ఆచార్య భద్రిరాజుగారు, తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు డా.ఎ.మంజులతగారు, కన్నడం నుండి అప్పటి ఉన్నత విద్యాశాఖామంత్రి అరవింద లింబావళి, కన్నడ అభివృద్ధి సంస్థ అధ్యక్షుడు చంద్రు, "కన్నడ భీష్మ" ఆచార్య డి.జవరేగౌడగారు, అనువాద అకాడమీ అధ్యక్షులు ప్రధాన గురుదత్తగారు పాల్గొన్నారు. ద్రావిడ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా ప్రస్తుత గ్రంథకర్త కన్నడ విశ్వ విద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య మొరిగెప్ప గారు దాని నిర్వాహకులుగా వ్యవహరించారు. ఢిల్లీ కన్నడ సంఘ అధ్యక్షులు ఆచార్య బిళిమలె సమన్వయ కర్తగా వ్యవహరించారు. ఢిల్లీ కన్నడ సంఘ అధ్యక్షులు ఆచార్య బిళిమలె సమన్వయ కర్తగా వ్యవహరించారు. ఇందులో ముఖ్యమైన అంశం శ్రీ వీరప్ప మొయిలీగారు ఆ సదస్సులో కీలకోపన్యాసం చేశారు. మొయిలీ గారు కేవలం రాజకీయ వేత్తకాదు. కన్నడంలో మంచి రచయిత, కవి. తన న్యాయశాస్త్ర పారంగతతో, సృజనాత్మకతతో ప్రధాని మన్మోహన్ సింగ్ గారి విశ్వాసాన్ని చూరగొన్నారు. కన్నడ విశ్వవిద్యా లయంతోపాటు ద్రావిడ విశ్వవిద్యాలయమన్నా, ఈ గ్రంథకర్త అన్నా వారికి అభిమానముంది. ఆ వ్యక్తిగత అభిమానంతోనే ఆ సభకు వచ్చారు. అంతేకాదు, అదే రాత్రి 10.30గంటలకు ప్రధాన మంత్రితో సమావేశమై, ముందు తయారు చేసి ఉంచిన సభా తీర్మానాన్ని ప్రధాన మంత్రిగారికి సమర్పించి, ఉభయ రాష్ట్ర ప్రజల మనోభావాలను జాతి మర్యాదా సంబంధమైన ఆందోళనను, నాటి ప్రముఖుల అభిప్రాయాల సారాంశాన్ని ప్రధాని దృష్టికి తెచ్చారు.

వ్యూహాత్మకంగా ఆ ఏర్పాట్లు చేసుకొని సభను నిర్వహించడం జరిగింది. ఆ తర్వాత కొద్దికాలానికే డా॥రాజశేఖర రెడ్డిగారు కూడా తెలుగువారి మనోభావాలను ప్రధాని దృష్టికి తెచ్చి ప్రాచీన హోదా ప్రకటనను గూర్చి అడగడం, దరిమిలా 2008 అక్టోబరు 31న మద్రాసు హైకోర్టులో పెండింగ్‌లో ఉన్న ప్రజావ్యాజ్యం నిర్ణయాలకు లోబడి (ఈ సూచన కూడా మొయిలీ గారు ఇచ్చిందే) తెలుగు – కన్నడలకు క్లాసికల్ గుర్తింపునివ్వటానికి కేంద్రం వ్యక్తబరచిన సముఖతను, నాటి సాంస్కృతిక మంత్రి శ్రీమతి అంబికా సోని ప్రకటించింది. ఎన్నికల ఫలితాల ప్రకటనకు కొద్ది ముందు, 2009 మే నెలలో, కోర్టు నిర్ణయానికి లోబడి క్లాసికల్ ప్రతిపత్తికి కేంద్ర క్యాబినెట్ ఆమోదాన్ని ప్రకటించింది.

### అప్పటికి - కాదు - ఇప్పటికీ అదే గొప్పగా తయారైంది !!

ఈ మాత్రమైనా రావడానికి తెలుగునేల నాలుగు చెరుగులా ఎందరో ప్రముఖులు, కవులు, పండితులు, రచయితలు, ప్రతి తెలుగు భాషాభిమాని కారణం. అందరూ ఈ ఉద్యమానికి తమ గొంతును కలిపి బలపరిచారు. కీ.శే.ధర్మారావుగారు అంకిత భావంతో పనిచేస్తూ తెలుగు భాషీయులకే అనల్ప అలంకారమైన జ్ఞానపీఠి, ఆధునిక తెలుగు కవితా గురుపీఠం ఆచార్య సి.నారాయణరెడ్డిని ఉద్యమంలో ముందు వరుసలో నిలిపారు. వారివల్ల ఉద్యమానికి కొత్త దీప్తి చేకూరింది. 2007లో జాతీయ అవార్డును తిరస్కరిస్తూ తెలుగు పాటల కీర్తి వేటూరి సుందర రామమూర్తిగారు చేసిన ప్రకటన కూడా ఈ ఉద్యమానికి ఓ నైతిక బలాన్ని ఇచ్చింది. తమిళానికి లభిస్తున్న ఈ ప్రతిపత్తి గురించి అప్పట్లో ఢిల్లీలో భాషాల్పసంఖ్యాకుల కమీషన్‌కు గౌరవ నిర్దేశకులుగా ఉంటూ మొదటగా పత్రికా వ్యాసరూపంలో తెలుగనాట హెచ్చరించిన ఆచార్య కస్తూరి విశ్వనాథం నుంచి, అనేకులు తెలుగు – ప్రాచీనత

– విశిష్టతలపై అసంఖ్యాకంగా వ్యాసాలు రాస్తూనే ఉన్నారు. పుస్తకాలు వెలువరించారు. కొత్త అంశాలు వెలుగులోకి రాకపోయినా, కొత్త ఆలోచనలు పునరాలోచనలు, కొత్త వ్యాఖ్యలు, వివరణలు తెలుగు భాషా, సాహిత్య సంస్కృతులు గురించి అనేకం వచ్చాయి.

**ఎందరో మహానుభావులు !**

**అందరికీ తెలుగు వెలుగుల వందనాలు !!**

నామమాత్రం ఆమోదం వెలువడ్డ రెండేళ్లకు 2011 చివర మైసూరు భారతీయ భాషా సంస్థలో యథార్థానికి దాంట్లోనే భాగం అన్నట్లు, "ప్రాచీన తెలుగు భాషా సర్వోన్నత కేంద్రా"న్ని ఏర్పాటు చేస్తున్నట్లు, దానికి గాను 2011-12 ఆర్థిక సంవత్సర మిగులు భాగంగా 23.2 లక్షలరూపాయలు కేటాయిస్తున్నట్లుగానూ ఓ ప్రకటన వెలువడింది. ఇంత ఉద్యమించి మైసూరు సంస్థలో ఓ రెండు గదులకు పరిమితమయ్యే చిన్న కేంద్రాన్నా తెలుగువారు సాధించింది?

'కరుణానిధి గారు స్వయంగా తన ఇల్లు ఇచ్చి కేంద్రాన్ని ప్రారంభింప చేశారు. తెలుగువారు అలాపూనుకోగలరా?' అని ఎదురు ప్రశ్న. దీనికి సమాధానం చెప్పవలసింది. అప్పుడు తెలుగునాట, కేంద్రంలోనూ అధికారంలో ఉన్న 'అమాత్య' బృందం. 'కొండంత రాగం' తీసింది.... చివరికీ వేలెడంత పాటకా? ఈ ప్రశ్న. ఆందోళన సహజంగానే ఉత్పన్నమయ్యాయి. ఆ కేంద్రాన్ని, "ప్రాచీన తమిళ కేంద్ర సంస్థ" రీతిలో హైదరాబాదులో కాని, విజయవాడలోకాని, తిరుపతిలోకానీ ఏర్పాటు చేయడం తెలుగువారికి తగ్గ గౌరవ మిచ్చినట్లవుతుందని మరోమారు పెద్దలందరూ ప్రభుత్వానికి నివేదించాల్సిన స్థితి వచ్చింది. అప్పటి ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి గారు కేంద్రానిక లేఖ కూడా వ్రాశారు. ఫలితం సున్న. మిగులు తగులు డబ్బులతో, తెలిసిన వారు సదస్సులు పెట్టుకోవడనాకి సహకరించడం వరకు మాత్రమే, ఆ నామ మాత్రము మైసూరు కేంద్రం పనిచేస్తున్నది. తమిళంలోలాగా ప్రత్యేక ప్రతిపత్తిగల పూర్తిస్థాయి సంస్థ ఏర్పాటుకాలేదు. 2012-13 ఆర్థిక సంవత్సరంలో కూడా తెలుగుకు కేంద్ర నిధులు, తెలుగు కార్యక్రమాల అమలు హుళక్కే అయింది. లోగడ హిందీ ఉద్యమం చెలరేగాక హిందీయేతర భాష అభివృద్ధి మాటేమిటి? అనే ప్రశ్నవచ్చేసరికి అప్పటి భారత ప్రధాని ఇందిరాగాంధీ, భాషకొక కోటిరూపాయల చొప్పున ఇచ్చారు. దానిఫలితంగానే తెలుగునాట తెలుగు అకాడమీ వెలసింది. తెలుగులో ఆధునిక విద్యావిషయాల బోధనకు, దేశంలో అగ్రగామిలా నిలచేలా పాఠ్యపుస్తకాలు, ఇతర జనప్రియ పుస్తకాలు లోకానికందించింది. ఇప్పుడు ఏటా వందకోట్లు క్లాసికల్ భాషాభివృద్ధి నిమిత్తం ఇస్తారన్న మాటేగాని తెలుగుకు ఎప్పుడు దక్కేట్లు? అందుకు తగ్గ సంస్థ ఎప్పుడు రూపు దిద్దుకొనేట్లు? అన్నవి శేష ప్రశ్నలుగానే మిగిలిపోతున్నాయి. ఉద్యమం తర్వాత – సముచిత 'సంస్థ' ఆవిర్భావానికై మిగిలిన స్వప్నం.

ప్రాచీన విశిష్ట భాష హోదా – చెందెలుగు మెట్టు – అయితే వచ్చింది. ఒక వర్తమాన సందర్భంలో – ఆధునిక భాషా సందర్భంలో – "క్రొందెలుగు గట్టు – లో" ఏం చేయాలి? ఇవ్వాళ కాకపోతే రేపు వందకోట్లు – కాకపోతే అందులో సగం లేదా పాతిక అయినా వస్తాయి! అప్పుడేం చేయాలి? ఇందాకే అన్నట్లు, ఇది కేవలం గౌరవమూ, నిధులకు సంబంధించిన ఉద్యమం కాదు. ఆ పేరిట మేల్కొని, భాషాభివృద్ధి కార్యక్రమాలకు నడుం బిగించవలసిన ఉద్యమం – ముఖ్యంగా ప్రపంచీకరణ సునామీలో ఒక ప్రాచీన ఉత్కృష్ట భాషా సంస్కృతి తన ఉనికిని నిలుపుకొని, మరింత మన్ననగా ముందుకు సాగవలసిన కృషికి సంబంధించిన ఉద్యమం, లేకుంటే, ఉన్నత గుణాత్మక (క్వాలిటేటివ్) విద్య, ఆంగ్లంలోకూడా అందనంత వరకు తెలుగుకు ప్రమాదం లేదుకాని, ఆ తర్వాత అది నిజంగానే "ప్రాచీన భాష" గా చరిత్ర పుటల్లోకి చేరిపోతుంది. క్వాలిటేటివ్ విద్యపేరిట కార్పొరేట్ విద్యావిధానం చేస్తున్న దుర్మార్గపు మాతృభాషా విద్రోహం. దానిచేతనే ప్రభావితమవుతున్న ప్రభుత్వ విద్యా విధానమూ తెలుగు చదువును పూర్తిగా నీరుగార్చే స్థితికి తీసుకువస్తాయన్నది బహిరంగ సత్యం.

కనుక "క్లాసికల్" భాషోద్యమ ఫలితాలు ఏ దిశగా సాగాలి? అనేది ముఖ్యమైన ప్రశ్న. క్లాసికల్ భాషా వివాదం తలెత్తిన మొదట్లో యు.జి.సి. వారు హైదరాబాదులో కేంద్రీయ విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో మంజూరు చేసిన ఆచార్యుడి వ్రాత బల్లవరకు మాత్రమే పరిమితం కావడమా? లేక ఆ బల్లచుట్టూ, ఆయన గౌరవాదరాలకు పాత్రమయ్యే ఉన్నత శ్రేణి విద్వాంసుల సమావేశాలకు పరిమితం కావడమా? లేదా కేంద్ర ప్రభుత్వం నిధులు పరాయి రాష్ట్రంలోని ఒక కేంద్ర సంస్థలో లేక మరే విశ్వవిద్యాలయ తెలుగు శాఖకో జమకావడమా? లేక రాష్ట్ర ప్రభుత్వ ఆధ్వర్యంలోని కార్యక్రమాలకు చెందుతున్నట్లా? ఇంతవరకు ఈ ప్రశ్న గురించి ఏ స్పష్టతా లేకపోవడం, ఎవరూ ఏ ఆందోళన వ్యక్తం చేయకపోవడంలోనే తెలుగువారి భాషోద్యమ స్వభావం స్పష్టమవుతోంది.

పోనీ తెలుగు విషయముటుంచితే, ఇలాగే కాగితం మీద గౌరవం వరకు పరిమితమైన కన్నడం విషయంలో ఏం జరుగుతోంది? ఆ తర్వాత ప్రకటించిన మలయాళం విషయంలో ఏం జరుగుతోంది? కన్నడవాడు రాజకీయాలలో భాషా సంస్కృతులు ఎప్పుడూ గొప్ప పాత్రను పోషించాయి. ప్రాధాన్యం అనుభవించాయి. కేంద్రం నిధుల కోసం ఎదురు చూడకుండా, దాని ప్రకటనతో కూడా నిమిత్తం పెట్టుకోకుండా, అంతకు మునుపటి నుంచే అనేక విధాల కన్నడ

అభివృద్ధికోసం కర్ణాటక ప్రభుత్వం కృషి చేస్తున్నది. హిందీ పాట అటుంచితే, మొత్తం భారతదేశంలోనే భాష నిమిత్తం ఏ రాష్ట్రమూ, కన్నడం కోసం కర్ణాటక చేస్తున్నంత కృషిని చేయడం లేదన్నది వాస్తవం. కర్ణాటక ఖర్చుపెడుతున్నంతలో పాతిక వంతు విధాన పరమైన ప్రణాళిక కోసం ఖర్చుచేయడం లేదన్నది వాస్తవం. సుమారు పది, పన్నెండు అకాడమీలను కన్నడ బుక్ ట్రస్ట్ వంటి సంస్థలను నిర్వహించడంతోపాటు వాటికై ప్రత్యేకంగా కన్నడ భవనాన్ని నిర్మించడంతోపాటు విడిగా భారతీయ భాషలన్నిటితో సంయోజన నిమిత్తం "కువెంపు" పేరిట "కువెంపు భాషా భారతి" అని ఒక చిన్న విశ్వవిద్యాలయ స్థాయిలో ఏటా మూడుకోట్ల బడ్జెట్టుతో ప్రత్యేక సంస్థను ఈ ఉద్యమ స్ఫూర్తితోనే కేంద్ర ప్రభుత్వ ప్రకటనకు ముందేకర్ణాటక నెలకొల్పింది. వీటితోపాటు కన్నడ విశ్వవిద్యాలయమూ, అలాగే ప్రభుత్వ నిధులందుకొంటున్న కన్నడ సాహిత్య పరిషత్తు వంటి సంస్థలు అనేక పరిశోధనా ప్రాజెక్టులు, క్షేత్ర కార్యక్రమాలు పోటాపోటీగా నిర్వహించడంతోపాటు వందలాది ప్రచురణలను ప్రతి ఏడాది మార్కెట్లోకి తెస్తున్నాయి. సామాన్యవ్యక్తి, సాహిత్య సంస్కృతులంటే మోజుపడి, కొనుక్కొని దాచుకొనే విధంగా వెలికి తెస్తున్నాయి. ఒకప్పుడు హోటలులో చిల్లర ఇవ్వడానికి బదులు అదే మొత్తానికి జేబులో ఇమిడిపోయే ఎక్కాల పుస్తకాల సైజులో ఎంపిక చేసిన ప్రాచీన కవుల రచనలతోకూడిన చిన్న - విలువైన పుస్తకాలను ఇచ్చేవారు. హోటలుకు వెళ్ళినవారు కూడ చిల్లర తీసుకోవడానికి బదులు ఆ చిరుపుస్తకాలనే తీసుకువెళ్ళి ఇంట్లో పిల్లకిచ్చేవారు, మనం చాక్లెట్లు తెచ్చి ఇస్తున్నట్లు "జెమ్స్ డిక్షనరీ" నమూనాలోని "కన్నడ రత్నకోశ" అనే నిఘంటువు అతి చిన్న ప్రింటుతో 420 పుటలున్న సగం డెమ్మీ సైజు పుస్తకం కేవలం 5 రూపాయలకే లభిస్తుందంటే ఎవరైనా నమ్మగలరా? చిరు పుస్తకాలను, కన్నడవిశ్వవిద్యాలయమూ, కన్నడ సంస్థలేకాక ఇతర సాధారణ శాస్త్ర, సాంకేతిక విద్యనందించే విశ్వవిద్యాలయాలు కూడా వందలాది విడుదల చేశాయంటే నమ్మగలమా? ట్యాంక్ బండ్పై విగ్రహాల మీద తెలుగు విశ్వవిద్యాలయం వెలువరించిన పుస్తకాల కంటె పెద్దవి, ఖరీదులో అందులో పాతిక వంతు కూడా కానివి! బహుశ: ఈ గొప్పతనమంతా మైసూరు విశ్వవిద్యాలయ పూర్వ ఉపకులపతి, కన్నడ రాష్ట్రకవి కువెంపు గారికే చెందుతుందేమో!ఆయన ప్రకారం ప్రతి విశ్వవిద్యాలయంలో "పాలనా విభాగం" తరగతులకు పరిమితమయ్యే బోధనా విభాగం, తరగతుల బయట యావత్తు ప్రజలను ప్రభావితం చేసే "ప్రచురణల విభాగం" - ఆడళితాంగ, అధ్యయనాంగ, ప్రసారాంగ - లనే మూడు విభాగాలుంటాయి. విశ్వవిద్యాలయం తన విశిష్ట ప్రచురణల ద్వారా సమాజం మొత్తానికి చదువు నేర్పించాలి. సంస్కృతిని నేర్పించాలి. ఆ సంప్రదాయాన్ని రాష్ట్ర ప్రభుత్వం ఇతోధికంగా ఆదరించి ప్రోత్సహించింది. క్లాసికల్ భాషాస్థాయి ప్రకటనకు ముందే ఉద్యమం ఊపందుకొంటున్నప్పుడు రాష్ట్రంలోనూ, బయటా ఉన్న ప్రతి కన్నడ శాఖకు సరాసరి కోటి రూపాయల ప్రత్యేక నిధిగా మంజూరు చేసింది. అదీ నిర్దిష్ట ప్రణాళికల ప్రకారం మాత్రమే.

ఇక తమిళనాడులో కవి, పండితుడూ (కురళ్‌కు ఆయన బృహద్వ్యాఖ్య గొప్పది) అయిన డా.కరుణానిధి గారు విశాలమన తన స్వంత భవంతినిచ్చి, అందులో సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ క్లాసికల్ తమిళ్‌ను ప్రారంభింపచేశారు. అక్కడ ప్రాధాన్యమంత చెందమిళ యుగానికి సంబంధించిన రచనలమీద పరిశోధనా ప్రాజెక్టుల నిర్వహణ, వాటిని ఇతర భాషలలోకి అనువదింపచేయించడం మీదనే. తమిళంలోనూ, కన్నడంలోనూ భాషా సాహిత్యాల వికాసాన్ని మూడు ముఖ్య దశలుగా చూస్తారు. ప్రాచీన, మధ్యకాలీన, ఆధునికాలని. వీటిని తమిళంలో చెందమిళం, ఇద్దెక్కాల తమిళం, పుదుకాల తమిళం అంటే,కన్నడంలో హళ, నడు, హొసగన్నడాలనడం రివాజు. తెలుగులో గ్రాంథిక, వ్యావహారిక, భాషాశైలులుగా మాత్రమే వర్గీకృతం. ప్రాయికంగా చిన్నయుగందాకా దాదాపు 19వ శతాబ్ది చివరదాకా గ్రాంథిక శైలిలోవచ్చినదంతా మనం ప్రాచీనాంధ్రంగానే సంభావించాలి. (20వ శతాబ్ది ప్రారంభం నుంచి భాషలో తేడారావడం మొదలైనప్పటికి, ఆ తర్వాత కూడా పూర్వపు భాషే చాలా మంది చాలా కాలం వాడినప్పటికీ కాల్పనిక యుగ అవతరణందాకా ఒకే బావజాలం, ఒకే సంస్కృతి స్వరూపం అభివ్యక్తమై ఉండడం కారణంగా, "క్లాసికల్" పరిగణనలో "క్లాసికల్" భావధారకే ప్రాధాన్యం ఉండడం వల్ల ఆ లక్షణాలు అవిచ్ఛిన్నంగా వ్యాప్తమై ఉన్న 19వ శతాబ్ది ఆఖరు వరకు ప్రాచీనాంధ్ర భాగంగా పరిగణించడం సమంజసం) ప్రాచీనాంధ్రానికి - ఆధునికాంధ్రానికి క్రియారూప, ప్రత్యయాలలోనూ సంధి పాటింపువంటివాటిల్లోనూ ప్రధానమైన తేడా కేవలం కావ్యప్రయోగాల, రచనాభాష పదబంధనిర్మాణాన్ని రెండు శైలులూ విడివిగా రూపొందించుకొన్నాయి. సంస్కృత భూయిష్ఠత గొడవ, కేవలం పాండిత్య ప్రకర్షప్రదర్శనాలకే. ఇతర భాషల్లాగే తెలుగులోనూ, చిన్నయ సూరిగారొక్కరు లేకుంటే ప్రాచీన - ఆధునిక భాషలు రెండు విడిపోయి రెంటికీ రెండు విడి వ్యాకరణాలు అవసరమయ్యేవి. అనితరసాధ్యమైన శైలిలో ఆయన "బాల వ్యాకరణాన్ని" రచించి, రెంటినీ ఒకటిగా బిగించి పెట్టడంతోపాటు, వందేళ్ళపాటు తెలుగు భాషను శాసించాడు. సంప్రదాయాన్ని విడిపోనివ్వకుండా కొనసాగింపచేశారు. ఒక విధంగా ఇది తమిళ -

తెలుగు ముద్రేమో. ద్విభాషా శైలుల మధ్య ఏకసూత్రత పాటించడం వారి పద్ధతి. కాని చెందమిళానికి, తదనంతర తమిళానికి, అలాగే హళ గన్నడానికి, అనంతర కన్నడాలకు తేడా ఎక్కువ. వాటికి విడి విడి వ్యాకరణాలే ఉన్నాయి. పాత తమిళ, కన్నడాలు ఇప్పటి వాటితో కాదు కదా, మధ్యకాలం వాటితోనే సరిపోగలవు. అందువల్ల వాటికోసం ప్రత్యేక పరిశ్రమ తప్పనిసరి.

చెందమిళ అధ్యయన వ్యాప్తికి ప్రత్యేక కేంద్రీయ సంస్థను ఏర్పాటు చేయడం ఎంతో సమంజసంగా ఉంది. ఆ భాషారీతిపై పరిశోధన ప్రణాళికలు చేబట్టడమూ చాలా బాగుంది. అందుకోసం విడిగా కొత్త వారిని ఉద్యోగాల్లోకి తీసుకోకుండా అనుభవజ్ఞులైన పెద్దలకే ఆ కార్యక్రమాలను అప్పగిండమూ మరింత బాగుంది. అయితే అధిక సంఖ్యాకులు తామిదివరకు చేసి ఉన్న ప్రాజెక్టులకు అనుబంధమైన వాటినే చేపట్టడంలో పునరుక్తి రావడం అటుంచి ఆ సంస్థకాస్తా విశ్రాంత వృద్ధ పండితుల పునరావాస కేంద్రమవుతోందన్న విమర్శ తొంగి చూడసాగింది. అంతకంటె ఆధునిక సందర్భంలో ప్రాచీన భాష ఎలా స్ఫూర్తిమంతమవుతుందో పరిశీలించే ప్రణాళికలకు ప్రాధాన్యం లభించి ఉంటే బాగుండేది. పై పెచ్చు సంస్థలోని విభాగాలు / శాఖలను చూస్తే మరోవిధంగా తమిళ విశ్వవిద్యాలయం పునరవతరించిందేమో నన్న అనుమానమూ తలెత్తుతుంది.

వీటినుంచి తెలుగువారు నేర్చుకోవలసింది చాలా ఉంది. ఆయా విమర్శలకు అవకాశం లేని తీరులో భవిష్యత్ ప్రణాళికను రూపొం దించుకోవలసిన అవసరముంది.

మళయాళ విషయంలో క్లాసికల్ ప్రతిపత్తి వచ్చాక, మళయాళ విశ్వవిద్యాలయం ప్రారంభమైంది. అంతదాకా వారికి ప్రత్యేక భాషా విశ్వవిద్యాలయం లేదు.

అమెరికన్ క్లాసికల్ లీగ్ ఏర్పడ్డాక, క్లాసికల్ లర్నింగ్‌కు అయిదు ముఖ్యలక్ష్యాల (గోల్స్)ను ఏర్పరచింది. అవి:కమ్యూనికేషన్, కల్చర్, కనెక్షన్స్, కంపారిజన్స్,కమ్యూనిటీస్ అనేవి. మళ్ళీ ఒక్కొక్కదాని కింద రెండు లక్ష్య విభాగాలను ఇచ్చారు. ఉదాహరణకు కంపారిజన్స్ తీసుకుందాం. అందులో గ్రీకు – లాటిన్ సంస్కృతి ముఖ్యాంశాలను గ్రహించడం ఒక భాగమైతే తమ స్వంత సంస్కృతి ముఖ్యాంశాలను గ్రహించి వాటినిపోల్చుకొని సమన్వయించుకోవడం రెండో భాగం. అలాగే మిగిలిన అంశాలు కూడా, గత – వర్తమాన సమన్వయాలకు ప్రాధాన్యమిచ్చేవే. అలా మనం భవిష్యత్ ప్రణాళికలోని ప్రతి అంశానికి స్పష్టమైన లక్ష్యాలను నిరూపించుకోవాలి. మనకైతే "క్లాసికల్ లర్నింగ్" ఒక భాగమే. పరిశోధన, ప్రచురణ, సాంకేతిక పరివర్తన వంటి అనేక అంశాలను విడిగా నిరూపించుకోవలసిన అవసరముంది.

ఈ సందర్భంగా రాబోయే కేంద్ర సంస్థ రూపురేఖల నమూనాని ప్రక్క పుటలలో పొందుపరుస్తున్నాను. ఇది నమూనా మాత్రమే.

1. విజ్ఞాన శాస్త్ర విషయాలలో ముఖ్యంగా పరిభాష అనువాద విషయంలో ప్రాచీన భాషపై పట్టు ఉన్న పూర్వుల వైఖరి,ఆ పట్టులేని ఆధునికుల వైఖరి. మొదటి వర్గానికి ప్రతినిధిగా కొమర్రాజు లక్ష్మణరావు గారిని చూద్దాం. విజ్ఞాన శాస్త్రాలను, విజ్ఞాన సర్వస్వాలను మొదటగా తెలుగు వారికి అందించిన ఘనత వారిదే. తొలి పాఠ్యపుస్తకాన్ని నిర్మించిన ఘనత కందుకూరి వారిదైనా, తెలుగులో ఆధునిక అధ్యయన వ్యాప్తికి కావలసిన అధ్యయన పరికరాల (టూల్స్)ను తొలిసారిగా తయారు చేసిన ఘనత కొమర్రాజు గారికే దక్కుతుంది. పరిభాష అనువాదంలో వారెంత సరళమైన వైఖరి అవలంబించారో ఉదాహరణకొక్కమాట చూడండి. "నైట్రోజన్"కు చాలా సరళంగా "నత్రజని" అన్నారు. కార్బన్‌డై యాక్సైడ్‌కు బొగ్గు పులుసు వాయువన్నారు. ఇప్పటి వారైతే, మూలశబ్దార్థాన్ని సంపూర్ణంగా నిష్పన్నంచేయడం కోసం ఎంత కృత్రిమంగా, ఎంత బీభత్సంగా అనువాదం చేస్తారో ఎవరమైనా ఊహించుకోవచ్చు. శబ్దాన్ని శబ్దంగానే తెలుగు నైజానికి అనుగుణంగా వివరించి చెప్పడం కాదు. ఇక ఆధునిక వైఖరికి తెలుగు అకాడమీ వారి అనువాదాలు చూస్తేచాలు. వాటి గురించి కావలసినంత చర్చ జరిగింది. అసెంబ్లీ చర్చలక్కూడా ఎక్కింది. కనుక ఇప్పుడవి వివరించవలసిన అవసరం లేదు. అనుశ్రుతంగా వచ్చే తెలుగు భాషా సంప్రదాయాన్ని తెలిసి, పరిభాషను అతి త్వరగా పునర్నిర్మించుకోవలసిన అవసరం తెలుగువారికుంది (యాష్ ట్రేను నుసి డబ్బా అని ఒక గ్రామీణుడన్నాడట. ఎ.బి.కె గారు చెప్పారు. ఎంత సరళమైన తెలుగుసేతో చూడండి)

## 2. ఇక రెండవ ముచ్చట :

వార్తల విశ్వసనీయత విషయంలో విమర్శలు ఎలా ఉన్నా, భాష విషయంలో "ఈనాడు" విప్లవాత్మకమైన మార్పు తెచ్చిన మాట అందరికీ తెలిసిందే. ఒక్క మాటలో చెప్పాలంటే భాష విషయంలో తెలుగు వాడికి ఒక కొత్త సెన్సిబిలిటిని నేర్పించింది. ఆ పత్రిక అత్యధిక ప్రాచుర్యానికి దాని భాషే కారణమన్నది నగ్నసత్యం. ఎమెర్జెన్సీ తర్వాత ప్రజల భాష మీద పట్టు ఉన్న యువ రచయితలను తీసుకోవడమేకాదు, ప్రాచీన భాష మీద అమితమైన పట్టున్నవారితో వారికి శిక్షణ ఇప్పించి, పత్రికా భాషలోనే విప్లవాన్ని తీసుకువచ్చారు ఈనాడు అధినేత. తన పాత్రికేయుల తర్ఫీదుకు తానే ఒకజర్నలిజం స్కూల్ స్థాపించి, అందులో విలక్షణ పాండిత్యానికి పేరు మోసిన రాంభట్ల కృష్ణమూర్తి, బూదరాజు రాధాకృష్ణ వంటి ఉద్దండుల సేవలను వినియోగించుకొన్నారు.

అంతేకాదు, కొండవీటి వెంకటకవికి కావలసిన సౌకర్యాలు సమకూర్చి పత్రికను చూకుకోబోయే తన కుమారునికి ప్రాచీనాంధ్రకావ్యాలు, శాస్త్రాలను పాఠం చెప్పించారు. అందుకే ఎన్ని పత్రికలు వచ్చినా, భాష విషయంలో ఈనాడు తెలుగు వారికి రిఫరెన్సులా మారింది. ఆధునిక భాషా సందర్భానికి ప్రాచీన భాషా పరిజ్ఞానం ఎంత అక్కరకు వస్తుందో చెప్పడానికి ఇంతకంటే పెద్ద ముచ్చట ఏముంది?

## సాంప్రదాయక కళావారసత్వాల డాక్యుమెంటేషన్, పరిరక్షణ కేంద్రం

ఇది సంక్షిప్తంగా ఇచ్చిన ఒక నమూనా పట్టిక మాత్రమే. ఇంకా ఇలాంటివే, చేర్చవలసినవీ ఉన్నాయి. మరికొన్నిటిని కృ.జి.ర.సం రెనిదేళ్ళ క్రితం విడుదలచేసిన తెలుగు భాషా మండలి మాదిరిపత్రంలో పొందుపరిచాము. ఇందులో సంక్షేపించిన విభాగాన్ని, కళా వివేచన పేరిట రెండుగా విడదీయవచ్చు. ఇందులోని అంశాలకు విడిగా లక్ష్యనిరూపణలు అవసరం. కార్యప్రణాళికలు ఆవశ్యకం. వాటి స్వభావాలు వివరణలు కూడా అవసరమే. ప్రతిదానికీ విజన్, మిషన్ నివేదికల తయారీ అత్యవసరం అప్పుడు భవిష్యత్ కార్యక్రమాలు దెబ్బతినవు. మచ్చుకు రెండు మూడు అంశాలను మాత్రం విభాగాల నుంచి మొదలుపెట్టి, బ్యాంకింగ్, కామర్స్, ట్రేడ్ వంటి స్వచ్ఛంద రంగాలను కలుపుకొని, శాస్త్ర, సాంకేతిక విద్యారంగాలు ఏవైనా కావచ్చు. ఆయారంగాలకు సంబంధించి మన సంప్రదాయంలో రూఢికెక్కిన పద సంపద అపారంగా ఉంది. ఆధునిక సందర్భాలకు అనుగుణంగా వాటిని స్మరించుకొనే నాధుడేలేడు. ఆ పరిజ్ఞానమున్నవారు మృగ్యమవుతున్నారు. అలాంటి తరుణంలో వాటి పునరధ్యయన, అధ్యాపనాల అవసరం ఉంది. అలాగే పూర్వకవుల పద ప్రయోగ సూచికలు, ఆయా పరిశోధకులు, తమ పరిశోధ నాంశమైన ఆయా కవులు / కావ్యాల వ్యాకరణ రచన కోసం తమకు రెఫరెన్సుగా తయారు చేసుకొన్న పద పట్టికలు మాత్రమే. అవి కేవలం వారికి అవసరమైన రఫ్ డేటా మాత్రమే. దాన్ని అలాగే అందించి నందువల్ల మరే తదనంతర పరిశోధనలకు ఉపకారం కలగలేదు. దానికి బదులు, వాటిని పరిష్కరించి, చక్కటి పదకోశం / నిఘంటువు తయారుచేసి ఉంటే ఎంతో ఉపయోగకరంగా ఉండేది. ఒక్క తిక్కన నిఘంటువు సరిగ్గా తయారైతే చాలు. తెలుగు భాషలోని సగం గుప్తనిధి బయటకు వస్తుంది. అలాగే దక్షిణాది సాహిత్య కృతుల భాషను అనుశీలించి పదకోశాలను నిర్మిస్తేచాలు. తెలుగు మధురిమ తరతరాలకు నిలుస్తుంది. ఈ సందర్భంగా మల్లాది రామకృష్ణ శాస్త్రిగారి మాటలను, వారి పరమ శిష్యులు వి.ఎ.కె.రంగారావుగారు, ఆరుద్ర గారు జనార్ధనాష్టకం (అందమైన బాపూ బొమ్మలతో వి.ఎ.కె.తెలుగు వారి కందించిన గొప్ప కానుక) ముందు మాటల్లో చెప్పిన దాన్ని గుర్తుకు తెచ్చుకోవాలి. మరోచిన్న ఉదాహరణ. "సీరియస్‌గా వినండి, సీరియస్‌గా చదవండి" వంటి సందర్భాల్లో "సీరియస్" మాటకు తెలుగు రూపం ఏమిటి? "కోనంగి" నవలలో అడివి బాపిరాజు గారు చెప్పారు. ముచిగుంభంగా/మంచి గుంభితం అని. ఈ మాట ఇప్పటికీ దక్షిణాది వ్యవహారంలోనూ, రాయలసీమ దిగువ ప్రాంతాల్లోనూ ఉందని కూడా చెప్పారు.

దృశ్య, శ్రవ్య మాధ్యమాలలో మనుచరిత్రలో కనీసం వరూధినీ ప్రవరాఖ్యం, పారిజాతాపహరణంలో తొలి ఆ శ్వాసం, మహా భారతంలో నన్నయ నుంచి శకుంతలోపాఖ్యానం వంటివి, తిక్కన నుంచి రాయబార ఘట్టాల వంటివి సమర్థులతో శ్రావ్యంగా పాడించో, లేదో హృద్యంగా అభినయింపచేసో వెలికి తెస్తే, ఇవ్వాళ్టి యువతరానికి, కనీసం ఒక అయిదు శాతం మైనారిటీకైనా, ఎంతచక్కటి కానుక అవుతుంది? పూర్వపు అంతర్జాతీయ తెలుగు సంస్థ కాలం నుంచి, తెలుగు విశ్వ విద్యాలయం మొదటి రోజుల దాకా దాన్ని మళ్ళీ మళ్ళీ అధికారులకు నివేదించికూడా ఈ గ్రంథ రచయిత ఆమోదం సంపాదించలేకపోయాడు.

భాషాగత పురాతత్వాన్వేషణ – తెలుగువారి మూలాల కోసం నేల పొరల్లో త్రవ్వి ప్రయోజనం లేదు. శబ్దం పొరల్లోకి త్రవ్వి చూడాలి. మారుమూల పడ్డట్లుగా ఉన్న ఎన్ని అచ్చ తెలుగు పదాలు, తెలుగువారి చరిత్రను ఎంత చరిత్ర పూర్వయుగాలకు తీసుకు వెళ్తుంది. తెలుగు శబ్దమేచాలు, దానిమీద ఇటీవలి దాకా చాలా చర్చే జరిగింది. పురాచరిత్రను స్పృశిస్తూ సాగింది. ప్రస్తుత పరిమితిలో దాన్ని ఇక్కడ మళ్ళీ ఉదహరించవలసిన అవసరం లేదు. దీనికి సంబంధించి ఈ గ్రంథం 2వ అధ్యాయంలోని విషయమేకాక, ఈ గ్రంథకర్త ప్రసంగ వ్యాసమే మరొకటి కృ.బి.ర.సం.వారి సదస్సు వ్యాస సంకలనంలో వచ్చింది. కనుక పునరుక్తి అనవసరం, ఖండాంతర రూపాల తులనాత్మక వివేచనకు ఉత్తమమైన ఉదాహరణ, డా.జి.వి. పూర్ణచంద్‌గారి నైలునుంచి కృష్ణదాకా (ద్రావిడ విశ్వవిద్యాలయ ప్రచురణ) అది ప్రారంభస్థాయిలోని పరిచయాత్మక కృషే – లోతుకు దిగి సాగితే అద్భుత ఫలితాలు వెలువడే అవకాశముంది. "ఆఫ్రో – ద్రవిడియన్ లింగ్విస్టిక్స్" మీద పరిశోధనలు జరగాలని అర్థశతాబ్దం పై నుండి అందరూ అన్నవారేకాని,అందులో అడుగు మోపిన వారెవరూ లేరు. సాహసోపేతంగా పూర్ణచంద్‌గారు తమకు తోచిన మేరకు పరిశీలనలు చేశారు. లోతుకు వెళ్తే, ద్రావిడులనే ఏమిటి, వైదికార్యుల బ్రహ్మ కల్పన (కాన్సెప్టె)కు కూడా ఆఫ్రికన్ మూలాలే కారణమన్నది స్పష్టమవుతుంది. అది వేరే చర్చ.

ఇక్కడ ఇంకో ముఖ్య విషయం కూడా చర్చలోకి వచ్చే అవకాశముంది. ఈ లక్ష్యాలనీ, తెలుగు విశ్వవిద్యాలయంవంటి పూర్వ సంస్థల స్థాపన లక్ష్యాలలో భాగం కాలేదా? అని. కచ్చితంగా కొన్ని కాలేదు. కొన్ని అయివుండవచ్చు. లక్ష్యాలు కాగితంపై లిఖిత రూపంలో భద్రపరచి ప్రయోజనమేమిటి? ఆ దిశగా ఏ కృషి ప్రారంభమైంది. ఏ కృషి సాగింది? అనేది ముఖ్యమైన ప్రశ్న – దాని వైఫల్యాన్ని అందరం నిర్మమకారంగా అంగీకరించక తప్పదు. అందుకు ప్రధాన కారణం పరస్పరం పొంతనలేని రెండు విభిన్న స్వభావాల సమాహారరూపంగా దాన్ని స్థాపించడమే. క్షేత్ర ప్రచార కార్యక్రమాలకు ప్రాధాన్యమిచ్చిన పూర్వపు అకాడమీల విలీనంపై నార్ల వెంకటేశ్వరరావు కమిటీ నివేదిక, తెలుగు భాషా సంస్కృతి పరిశోధనలకు సంబంధించిన ఆవుల సాంబశివరావు కమిటీ నివేదికలు రెంటినీ కలగలిపి, నాటి ప్రభుత్వం అధికారుల అవగాహనా లోపం వల్ల కొంత, నిధుల అభావం, ఒత్తిడి వల్ల కొంత, వీటికనదంగా కలసిన ప్రాంతీయ రాజకీయ నినాదాల వల్ల కొంత, అటూ ఇటూగాని రీతిలో, మూడు ప్రాంతాల్లో మూడు ముక్కలుగా తెలుగు విశ్వవిద్యాలయాన్ని స్థాపించింది. సహజంగానే ఏర్పడ్డ ఇలాంటి పరిమితుల మధ్య, వాటి ననుసరించి వచ్చే నిధుల పరిమితుల మధ్య తె.వి.వి. ఎటువైపూ గణనీయ ప్రగతి సాధించలేకపోయింది. దానిక్కారణం నిర్వహణలోపం కాదు, నిర్మాణలోపం. నిర్మాణ కాలంలోనే చోటుచేసుకొన్న అవగాహనా లోపం. ఆధునిక విద్యావసరాలకు అనుగుణంగా తెలుగును తీర్చి దిద్దాలనే పవిత్ర సంకల్పంతో అవతరించిన ఆ సంస్థ అలాంటి జన్య బలహీనత పాలయింది.

క్లాసికల్ భాషా ప్రతిపత్తిలో భాగంగా ఓ కేంద్రీయ సర్వోన్నత భాషా సంస్థ, ఎలాంటి రాజకీయ ఒత్తిడులతో ప్రమేయం లేకుండా జరిగే అవకాశం ఉంది కనుక, మునుపు జరిగిన నిర్మాణలోపం జరిగే అవకాశం లేదు కనుక, కొత్త రాష్ట్రానికి మరో కొత్త తెలుగు విశ్వ విద్యాలయం అవసరం లేకుండా, మరోమాటలో తెలుగు విశ్వ విద్యాలయం డూప్లికేషన్ లేకుండా, ఒక ప్రత్యేక పటిష్ట సంస్థగా 'సంప్రదాయ –ఆధునికతల సమన్వయ సంస్థ' గా అవతరిస్తే ఎంత గొప్పగా ఉంటుంది?! క్లాసికల్ అనే మాటకు అసలైన అర్థం ఆ సమన్వయంలో, సంప్రదాయపు కొనసాగింపులో ఉంది.

టి.ఎస్.ఎలియట్ "ట్రెడిషన్ అండ్ మాడర్నిటీ" అనే తన సుదీర్ఘ వ్యాసంల ఒక గొప్ప మాటన్నాడు."Pastness of the present and the presentnessof past!" అలా అవిచ్ఛిన్నత కలిగి శ్రేష్ఠతాదర్శమే క్లాసికల్. తమిళుల అవసరంకొద్దీ నిర్వచించిన dis-continuity of the tradition ఉన్నది కాదు. ఆ మాటకొస్తే వారి చెందమిళం క్లాసికలవుతుందా!.... అది మరో విషయం. భారతీయ చరిత్ర పరిశోధక మండలి పూర్వాధ్యక్షులు ఆచార్య శెట్టర్ కన్నడంలో రాసిన 'తమిళగం' లో అనుబంధంగా చేర్చి అంశాలను చూస్తే ఆ విషయం సుస్పష్టమవుతుంది. (ఈ గ్రంథానువాదం, ప్రస్తుతం గ్రంథకర్త చేసింది, అముద్రితంగా ఉంది)

వీటన్నిటికంటే ముఖ్యమైన మరో విషయం – "ప్రమాద హెచ్చరిక గంట" లాంటి విషయం – ఉంది. ఇవ్వాళ తెలుగు లెక్చరర్ ఉద్యోగాల కోసం అభ్యర్థులనెవరననైనా ఒక్క తెలుగు పద్యం చెప్పండి అంటే సరిగ్గా చెప్పగలిగే వాళ్లు బహుతక్కువ. తప్పులేకుండా చెప్పగలిగేవారు మరీ తక్కువ. అర్థం తెలిసి చెప్పగలిగే వాళ్లు మరీ మరీ తక్కువ. ఇది అందరికీ తెలిసిన యథార్థం. అమెరికాలోని కొలంబియా విశ్వవిద్యాలయంలో సంస్కృతం & భారతీయ అధ్యయనం విభాగం అధిపతి షెల్డన్ పొల్లాక్ ఒక మాటంటారు . "నన్నయ పూర్తిగా కరువయ్యారు. ఇప్పుడున్న (అమెరికాలో) ప్రొఫెసర్ రిటైరైతే, ఆయనతో బాటే తెలుగు క్లాసికల్ స్టడీస్ కూడా రిటైరవుతాయేమోనన్నట్లుంది పరిస్థితి. ఇది ఒక్క తెలుగులోనే కాదు, అన్ని భారతీయ భాషల్లోనూ అంతే. తొమ్మిదేళ్ల క్రితం 'అపభ్రంశ' లో ఆచార్యుడు, హెచ్.సి.భయానీ గతించారు. ఆయనతోటే, భారతదేశంలోనే, అపభ్రంశ అధ్యయనం గతించినట్లయింది. క్లాసికల్ స్టడీస్ అధ్యయనం ఏ కారణం వల్లనైనా కావచ్చు, ఎన్ని కారణాల వల్లనైనా కావచ్చు పూర్తిగా తగ్గిపోతోంది. సంస్కృతంలో ఒక సామెత ఉంది. ఉన్న ఉల్లు కూలగొట్టడం సులభం, మళ్లీ కట్టడమే కష్టం" ( ది రియల్ క్లాసికల్ లాంగ్వేజ్ డిబేట్, ది హిందూ లో వచ్చిన సంక్షిప్తవ్యాసం)

ఈ క్లాసికల్ ఉద్యమ ఫలితంగానైనా, ఏ రాజకీయ గొడవల్లేకుండా, శ్రేష్ఠ తెలుగు భాషకు ఓ పటిష్టమైన భవంతి, సరైన విజన్‌తోను మిషన్‌తోనూ త్వరలో నిర్మితమవుతుందని ఆశిద్దాం – దానికి ఉభయ రాష్ట్రాలు ముఖ్యంగా నవ్యాంధ్రప్రదేశ్ నడుంబిగిస్తుందని ఆకాంక్షిద్దాం!

---

చిరునామా :. ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ, పూర్వ ఉపకులపతి, ద్రావిడ విశ్వవిద్యాలయం

డా॥ పాపినేని శివశంకర్

# దక్షిణ తీరాంధ్ర కథ

నీవు చల్లని తల్లివి, నీదు కరుణ
బ్రదుకుచున్నది ప్రజ పాడిపంటలొదవ (తుమ్మల)

అనే కవుల గానం వింటూ ఒయ్యారపు నడకల్తో సస్యశ్యామల సీమలవెంట ప్రయాణించే నీలివన్నె కృష్ణవేణి ఒక వం. మరొక వంక వేల కెరటాల చేతుల్తో మనిషిలోని సాహసాన్ని ఆహ్వానించే అగాధ సముద్రం.కొండలు, కోనలు, పుట్టలు, గుట్టలు ఒకవైపు తమ ఆకుపచ్చ సింగారాన్ని ఆహ్లాదంగా చూసుకునే మాగాణి క్షేత్రాలు. ఇంకోవైపు ఒక్క వానచినుకు కోసం వేయికళ్లతో మబ్బుల్లో చూపులు నిలిపిన మెట్టపొలాలు.

'రాలకు వన్నెదెచ్చు నమరావతి శిల్పము నేర్పు పెంపు (జాషువ). లోకానికి కరుణాతత్వదర్శనం చేయించిన నాగార్జునకొండ. పురాణ ప్రసిద్ధి పొందిన ఇంద్రకీలాద్రి. బెజవాడ కనకదుర్గ. 'కృష్ణాతరంగిణీ నిర్ఝరగానము తోడ శిల్పమ్ము తొలిపూజసేయునాడు(విశ్వనాథ), 'కృష్ణా తరంగపంక్తిం ద్రొక్కి త్రుళ్లింత నాంధ్ర నౌకలు నాట్యమాడునాడు' (రాయప్రోలు) గాథా సప్తశతులకు, బృహత్కథలకు నేపథ్యం సవరించిందీనేల.

'సార కవితాభిరామ గుంటూరు సీమ'.ప్రజలకు చాపకూటి సిద్ధాంతం నేర్పిన వెలలేని మాగాణి పలనాడు. ప్రపంచ ప్రఖ్యాతి పొందిన ఒంగోలు గిత్తల గిట్టలు తొక్కిన నేల, విద్యల నెఱజాణ నెల్లూరి సీమ - అన్నీ కలిపి దక్షిణతీరాంధ్ర దేశం అవుతుంది.

ఎందరో దేశభక్తులు, త్యాగధనులు, కవివరులు, శ్రమజీవులు పుట్టినగడ్డ ఇది. కోడిపోరు మొదలు జాతీయోద్యమందాకా ఎన్నో ఉత్తుంగ ఆవేశాలు, పోరాటాలు వెల్లువెత్తిన గడ్డ, కళలకి, కరువులకి కాణాచి అయిన నేల.కవిబ్రహ్మలు, ప్రబంధ పరమేశ్వరులు, కవిసార్వ భౌములు, వికటకవులు వెలసిన నేల. ఇక్కడ కారం ఘాటు, పొగాకు చేదు, గోంగూర పులుపు, పాల కంకుల తీపి-అన్నీ ఉన్నాయి. సాహిత్యం ఉంది సౌహిత్యం ఉంది. కలలు, కలతలు, కావేషాలు, కదనాలు కదలాడే నేలమీద కథలకు కొఱతేముంటుంది?

బకింగ్‌హాం కాలవ రాకముందు దక్షిణతీరాంధ్రం ఎట్లా ఉండేది? వచ్చిన తర్వాత ఎట్లా ఉంది? నాగార్జునసాగర్ కాలవలు రాకముందు ఎట్లా ఉండేది?

'వచ్చిందీ నందికొండ నాగార్జునసాగర మొచ్చిందీ
ఆంధ్రుల పాలిట కామధేనువై వచ్చిందీ' (ధారా నరసింహం)

అని కవులు పాడుకొన్న తర్వాత ఎట్లా ఉంది? ఇటువంటి పరిశీలన చాలా ఆసక్తికరంగానూ, కొత్త కొత్త విశేషాలతో కనువిప్పుగాను ఉంటుంది. జీవనదులు పారుతున్నా ఒకప్పుడు ఈ నేల కరువు కాటకాలతో అల్లాడిపోయింది. 1832-33ప్రాంతంలో గుంటూరుజిల్లా కలెక్టర్ హోదాలో పనిచేసిన సి.పి. బ్రౌన్ గుంటూరు నుంచి ఒంగోలు దాకా శవాలగుట్టలుతేల్చిన 'నందన' నామ సంవత్సరం కరువు గురించి మద్రాసు గవర్నరుకు నివేదిక పంపాడు. Famine అనే మాట అందులో వాడాడు. తిరుగు టపాలో అతనిని మందలిస్తూ ఒక లేఖ వచ్చింది. ఘతర వహించిన ఆంగ్లే పరిపాలనలో కరువుకాటకాలే మిటని! సరే, సి.పి. బ్రౌన్ ఆశ్రయం కోరి వచ్చిన నెల్లూరు బ్రాహ్మణుడు తాతాచారి. కతలపుట్ట. అవి విన్న బ్రౌన్ వాటిని 'తాతాచారి కథలు' పేరుతో ప్రచురించాడు. ఎంతో స్థానీయత (Nativity), నెల్లూరు నుడికారం ఉన్న కథలవి.

**'పేరు గాంచిన వీర గుంటూరు క్షితికి
నతులొనర్పని యాంధ్ర మానసము గలదె ?' (జాషువ)**

జాతీయోద్యమ కాలంనుంచే దక్షిణతీరాంధ్రంలో తెలుగు కథ వికసించింది. ఆ క్రమంలో తెలుగుజాతికీ వికాసం కలిగించింది. 1918లోనే గుంటూరు ప్రాంతానికి చెందిన అక్కిరాజు ఉమాకాన్తం 'త్రిలింగ చిన్నకథలు' అనే సంపుటి ప్రచురించాడు. తెలుగులో తొలి కథాసంకలనం'కథావళి' 1932లో గుంటూరు సాహిత్య మిత్రమండలి సంపాదకత్వంలో వచ్చింది. 1938లో తెనాలి నుంచి యువ ప్రచురణ 'యువ కథావళి'లో కొడవటిగంటి కుటుంబరావు, కొడవటిగంటి

కృష్ణమూర్తి, సౌరీస్ లాంటి ప్రసిద్ధుల కథలున్నాయి. భావకవిత్వానికి గొప్ప అండగా నిలిచిన సాహితీసమితి అధిపతి తల్లావజ్ఝల శంకరశాస్త్రి కవిత్వమే గాక 'బుద్ధుని జాతక కథలు,మురారి కథలు' కూడా రాశారు.

చరిత్రలోగాని, సామాజిక చరిత్రలో గాని 'ఇతిహాసపు చీకటికోణం అట్టడుగున పడి కాన్పించని కథలెన్నో' ఉంటాయి. గౌరవించబడేవాళ్లే ఎప్పుడూ గౌరవించబడుతుంటారు. పైకి కనపడని సెనగ పంటలాగా నిశ్శబ్దకృషి చేసి నిశ్శబ్దంగానే నిష్క్రమించేవాళ్ళు మరికొందరుంటారు. శిఖరాలను మాత్రమే చూస్తాం మనం. కాబట్టి ఒక అందే నారాయణ స్వామి, మరొక మా గోఖలే మన కంటికానకపోతే తప్పెవరిది.

తెలుగు రచయితలు తమ తల్లివేళ్లు మరిచిపోతున్న ఈ దశలో మా గోఖలేని గుర్తుచేసుకోవటం మంచిది. గుంటూరమ్మట బ్రాహ్మణ కోడూరులో పుట్టిన మాధవపెద్ది గోపాలకృష్ణ గోఖలే మీద జాతీయోద్యమం, అభ్యుదయ సాహిత్యోద్యమం ప్రభావాలు ప్రసరించాయి. ఆ నేపథ్యంలో స్వరాజ్యానికి ముందు, వెనక గుంటూరు గ్రామసీమల్లో జరిగిన పరిణామాలన్నీ కథాచిత్రాలుగా గీశాడు. ఆ చిత్రాలకు జీవరేఖ గుంటూరు భాషే. 'అరె నాయనా ! ఎట్టాంటి కోడె గిత్తలు ! ఇంకా నెమరేత్తా పడుకున్నారేందే? లెగవండి లెగవండి, ఏలయిపోతుందది – దూర పయనం జేశారు గాపల్ను, కూసేపు జనపకట్టల్ని తినండి. గెనగెన గంటలు, గెజ్జెలు, మువ్వలు కుచ్చులు, గులాం కొట్టుకుంటా – దుమ్ములేపుతా పోవాలి. యాడికి పోయినా – తల్లుండమొయ సూరాయి గిత్తలు'అంటూ 'కిష్టమ్మగారి పెదజీతగాడు' కథలో వర్ణిస్తున్నాడంటే ఆ భాషకి, యాసకి ప్రాణం జివజివలాడాల్సిందే. బల్లకట్టు పాపయ్య,మూగజీవాలు,పాలెంలో దీపాలమాస,బండిరాముడి పెళ్ళాం, రాయి మడుసులు, నుప్పు కడుపులు– ఇట్లా అతని కథలెన్నైనా వరసగా చెప్పొచ్చు. స్వభావవాదం (Naturalism), వాస్తవికవాదం (Realism) కలగలసిన ఆ కథల్లో రెక్కాడినా డొక్కాడని అనామకజనం కన్పిస్తారు. ఆ మూగజీవాల ఆత్మోన్నత్యం, జీవనకాంక్ష కనిపిస్తాయి. ఒకరకంగా అవి అచ్చమైన దళిత కథలు.

మంగళగిరి చేనేత కుటుంబంలో పుట్టిన అందే నారాయణస్వామి 'తెలుగు సాహితీవనంలోతొలి చేనేతవృత్తి కథారచయిత చేనేత పనివాళ్ల బతుకువెతల్ని1949, 50 దశాబ్దాలకుచెందిన తన కథల్లో ఆవిష్కరించారు. తక్కువ ధరలకి నూలు దొరక్క నేసిన బట్టలు కొనే నాథుడు లేక, ప్రభుత్వంపట్టించుకోక, పస్తులుండే కటుంబాల్ని'శిల్ప', 'సన్మానం' కథల్లో చూపించాడు. 'నువ్వు కాదూ?' అనే కథ ఒక ముసలి ఎద్దు స్వీయ కథనం,జీవకారుణ్య సిద్ధాంత మథనం. 'స్నేహితులు', 'కారుణ్యం', 'ఉపాసనాబలం' 'వ్యత్యాసాలు' అనే నాలుగు కథా సంపుటుల్లోను గుంటూరు నుడికారం గుబాళిస్తుంది. నారాయణస్వామి 'ఆంధ్ర కథా రచనలో నీయన మాపాసా వంటివాడు' అని విశ్వనాథ సత్యనారాయణ మెప్పు పొందాడు.

ముఖ్యంగా ఆనాడే కథారచనలో పురుషులతో సమానంగా స్త్రీలు పోటీపడటం మెచ్చదగింది. గాంధీ మార్గానుయాయికనుపర్తి వరలక్ష్మమ్మ జాతీయోద్యమంలో స్త్రీలు నిర్వహించిన పాత్రని తన కథల్లో వాస్తవికంగా చిత్రించింది. 'కుటీర లక్ష్మి','ఐదు మాసముల ఇరువది రోజులు', 'కన్యాశ్రమము' వంటి కథలు సజీవ సమకాలీన చరిత్రలే. గుంటూరు ప్రాంతంలో వట్టికొండ విశాలాక్షి తొలి తరం అభ్యుదయ కవయిత్రుల్లో ప్రసిద్ధురాలు. గేయకవిత్వం, నవలా సాహిత్యంతోపాటు అభ్యుదయ కథలు (మీసాల మీనయ్య, భయం) గూడా రచించింది. గుంటూరులో స్థిరపడిన స్థానాపతి రుక్మిణమ్మ అటు పద్యంలో,ఇటు వచనంలో ఆరితేరిన రచయిత్రి. 1950 దశాబ్దంలో 'నీలాటి రేవు, దయ్యాలు, యుక్తిమాల' అనే మూడు కథాసంపుటులు వెలువరించింది. "మొగుడి శరీరం లాంటిది కాదేమిటి ఆడదాని శరీరం? ఉన్న స్వేచ్ఛ వూడగొట్టు కోమని చెప్పిన వారెవ్వరు?" అని ఆనాడే ప్రశ్నించగలిగిన పాత్రల్ని సృష్టించింది. 'కాలాన్ని బట్టి (స్త్రీలకి) ఆర్థిక స్వాతంత్ర్యం కోరుతున్నారు. అందుకు మనం మాంచి చదువు సంధ్యలు కలవాళ్లం కావాలి' అనే స్త్రీ పాత్రలామెవి.

ప్రముఖ అభ్యుదయ రచయిత అనిసెట్టి సుబ్బారావు (నరసరావు పేట) 'మనిషి ఖరీదు' కథలో సత్తిగాడు షావుకారు కోసం గోదావరి వరదలో కొట్టుకుపోయే కొయ్య దుంగల్ని తేవటానికై వెళ్లి ఆ ఉరవడిలో తనే కొట్టుకుపోతాడు. ఇంకా పునర్జన్మ, ఉన్నవారు–లేనివారు, సహగమనం, జనానాలో భర్త మొదలైన అతని కథల్లో వర్గదృక్పథం స్పష్టమవుతుంది. అతని సోదరుడు అనిసెట్టి అప్పారావు రాసిన 'ఎవరు? ఏమిటి? ఎందుకు?' ఈ సందర్భంలో గుర్తుకు తెచ్చుకోదగిన మంచి కథ. అమరేంద్ర వంటి అప్రసిద్ధ కథకులు కూడా మంచికథలు రాశారు.

ఆంధ్రదేశానికి ఒకప్పుడు సాంస్కృతిక రాజధానిగా, కళల కాణాచిగా వన్నెగాంచింది తెనాలి. హేతువాదం, జాతీయోద్యమం, నవ్య మానవతావాదం – 'ఇట్లా ఎన్నో ఉద్యమాల కుదురయ్యింది. అభ్యుదయ సాహిత్యోద్యమ నేపథ్యంలో తెనాలి నుంచి శారద (నటరాజన్) రాసిన కథలు విమర్శనాత్మక వాస్తవిక దృక్పథంతో సమాజాన్ని విశ్లేషించాయి. 'స్వాతంత్ర్య స్వరూపం' చక్కని వ్యంగ్య శిల్పం.అదే తెనాలి నుంచి రావూరి భరద్వాజ 'గోడల్లేని జైలు, ఈడొచ్చిన కథ, లక్కబొమ్మలు' మొదలైన కథల్లో మంచి ప్రయోగాలు చేశారు. ఆలూరి భుజంగరావు (కొండవాగు, ధనస్వామ్యం), కొడవటి గంటి కృష్ణమూర్తి (మాలో మేము, బీరకాయ పీచు), ధనికొండ హనుమంతరావు సారం గల కథలు రాశారు.

తెలుగు సాహిత్యసముద్రంలో పెనుతుపాను చలం. అది అప్పటి దాక గడ్డకట్టి, స్థిరపడిపోయిన కుటుంబ వ్యవస్థని, దాంపత్య సంబంధాల్ని – మొత్తంగా సామాజిక నీతిని –అల్లకల్లోలం చేసింది. స్వేచ్ఛలేని స్త్రీ పురుష సంబంధం హీనమని చెప్పింది. చలం సాహిత్యం ఒక అశాంతి. ఒక అన్వేషణ. 'స్త్రీకి శరీరం వుంది. దానికి వ్యాయామాన్నివ్వాలి.

ఆమెకు మెదడు వుంది. దానికి జ్ఞానం యివ్వాలి. ఆమెకు హృదయం వుంది.దానికి అనుభవం యివాలి'అన్నాడు చలం. అందుకోసం కథలు, నవలలు రచించాడు. 'ఓ పువ్వు పూసింది' అనే కవితాత్మక కథలో మగవాడి వంచనాకళకి స్త్రీ ఎట్లా బలి అయ్యేదీ సంకేత ప్రాయంగా తెలిపాడు. 'మైదానం' వంటి నవలల్ని పక్కనబెట్టినా 'హంపీకన్యలు', 'అనసూయ', 'జెలసీ' మొదలైన కథల్లోను చలం ప్రదర్శించింది స్వేచ్ఛా ప్రణయాన్ని. శ్రీ కె.వి. రమణారెడ్డి మాటల్లో చలం 'పరుషమనిపించే ధిక్కారాన్నీ,దుశ్శీలమనిపించే యథేచ్ఛావర్తనాన్నీ, విషయాసక్తి అనిపించే సుఖానుభవ వాదాన్నీ పనిగట్టుకు ప్రచారం చేసేందుకు పూనుకొన్నాడు.'

అసలు తెలుగులోనే అపహాస్యం గాని హాస్య కథలుతక్కువ. సంగం జాగర్లమూడిలో పుట్టిన మునిమాణిక్యం సుకుమారమైన హాస్యానికి పెట్టిన పేరు. 'కాంతం కథలు' తెలియని చదువరులుండరు. దాంపత్య సౌందర్యానికి సజీవ చిహ్నం కాంతం పాత్ర. 'వెండి కంచం, దాంపత్యోపనిషత్తు, పిల్లలు గల్ల ఇల్లు' మొదలైన కథలు పాఠకులకు గిలిగింతలు పెడతాయి. మునిమాణిక్యం కథలు ఒకరకంగా చలం స్త్రీవాదానికి అందమైన సమాధానం.

తెనాలి ప్రాంతానికే చెందిన మరో రచయిత కొడవటిగంటి కుటుంబ రావు. సమాజ విమర్శకి సాహిత్యాన్ని సాధనంగా చేసుకున్నాడు. మధ్య తరగతి మిథ్యా జీవితాన్ని – మరీ ముఖ్యంగా బ్రాహ్మణ భావజాలాన్ని – సూక్ష్మాతి సూక్ష్మంగా విచ్ఛేదన చేసి పరిశీలించాడు. 'నిలవనీరు' వంటి కథల్లో జడాత్మక కుటుంబ వ్యవస్థనుంచి చైతన్యవంతమైన స్త్రీ పురుష సంబంధాలు ఏర్పడాల్సిన అవసరం తెలియజేశాడు. 'కురూపి'లో స్త్రీ హృదయగత సౌందర్యం ఆవిష్కరించాడు. 'నీకేం కావాలి' కథలో స్వేచ్ఛలేని కుటుంబ సంబంధాల్ని అవహేళన చేశాడు. అతనివి సాధారణ మనిపించే అసాధారణ కథలు. వందల సంఖ్యలో రాసినా ఎంతో వైవిధ్యం ఉన్న కథలు.

'తెలుగు కథ పుట్టిన సంవత్సరంలో పుట్టి (1910) కథావస్తువు లోనూ, శిల్పంలోనూ కొత్తదారుల్ని వేసిన కథారచయిత గోపీచంద్' అని విమర్శకులు (వల్లంపాటి వెంకటసుబ్బయ్య) ప్రశంసించారు. ప్రముఖ హేతువాది త్రిపురనేని రామస్వామి కొడుకైన గోపీచంద్ కథల్లో హేతువాదంతో కూడిన సామాజిక విమర్శ ఉంది. రాజకీయ సిద్ధాంతాలున్నాయి. అస్తిత్వవాద ప్రభావాలున్నాయి.హిందూ పాతివ్రత్యం, పతివ్రత అంతరంగం లాంటి తొలికథల్లో మతపరమైన విలువల్ని అపహాస్యం చేశాడు గోపీచంద్. 'మమకారం' కథ రైతుకి, జీతగాడికి, మట్టికి గల పేగుముడిని పట్టి చూపిస్తుంది. 'ధర్మవడ్డీ, కూపస్థ మాండూక్యం, స్వయంకృతం, తండ్రులు కొడుకులు' మొదలైన కథలు మధ్యతరగతి కుటుంబ వైరుధ్యాల్ని వెలికితీశాయి. 'వెంకటచలం పాత్ర' లాంటి కథల్లో గోపీచంద్ అపహాస్యం కోసం 'ఫాంటసీ' అనబడే ఊహాకథన శిల్పం పాటించాడు. మనస్తత్త విశ్లేషణ చేశాడు.

అత్యంత మౌలిక సాహితీస్వరం ఆలూరి బైరాగిది. మంచికవిగా గాని, కథారచయితగా గాని అతడిని పట్టించుకొన్న వాళ్లు తక్కువ. 'ఒక గంట జీవితం', 'దరబాను' కథలు చదివితే లోతైన అస్తిత్వ ప్రాతిపదికలు వాటిల్లో దొరుకుతాయి. పొట్టకూటి కోసం కుటుంబం వదిలి నేపాల్ నుంచి ఇక్కడకు వచ్చి, దరబానుగా (గేట్ కీపర్) స్థిరపడ్డ అంతరంగంలోని నిశ్శబ్ద విషాదాన్ని కన్నీటి రంగుల్తో చిత్రిస్తాడు బైరాగి.

గ్రామీణ నేపథ్యంలోని వస్తువుల్ని స్వీకరించి, వాటిని మనోవిశ్లేషణ కోణం నుంచి (Psychoanalysis) పరిశీలించిన కథా రచయిత జి.వి. కృష్ణారావు తెనాలి ప్రాంతంవాడు. 'చేసుకున్న కర్మ' అనే కథ రైతు, జీతగాళ్లు, పశువులు – ఈ మూడింటి మధ్యగల అనుబంధం, తర్కానికందని జీవన శైథిల్యం ఆర్ద్రంగా వర్ణించింది. చైత్రరథం, ఉదబిందువులు అనే కథా సంపుటుల్ని ప్రచురించిన జి.వి. కృష్ణరావు సమకాలిక సామాజిక పరిణామాలవెనక హేతురాహిత్యాన్ని, అవివేకాన్ని చూపించి వదిలేస్తాడు, ఒక తాత్విక నిర్లిప్తమూర్తిలా. ప్రఖ్యాత చిత్రకారుడు సంజీవదేవ్ కుంచె నుంచి ప్రకృతి చిత్రాలే గాక 'ప్రొఫెసర్ భార్య' లాంటి కథాచిత్రాలు కూడా జాలువారటం అపురూపం.

కమ్యూనిస్టు ఉద్యమాల నేపథ్యం నుంచి, తెలంగాణ పోరాటం స్ఫూర్తితో ఈ ప్రాంతంలో వచ్చిన కథలు విలువైనవి. తుమ్మల వెంకట్రామయ్య (మీరు గెలుస్తారు), బొల్లిముంత శివరామకృష్ణ, వాసిరెడ్డి నారాయణరావు (శ్రీవారి శ్రమదానం),గంగిశెట్టి వెంకటేశ్వరరవు కథలు పరిశీలించదగినవి.

'సంకెళ్లనుంచి విముక్తి, బానిసతనం నుంచి స్వేచ్ఛ–అదే ఆత్మ వికాసం', ఈ మాటలు వాసిరెడ్డి సీతాదేవివి. రైతు కుటుంబంలో పుట్టి, అతి కష్టంమీద విద్యాధికురాలైన సీతాదేవిని సమాజంలో స్త్రీ పట్ల ఉన్న వివక్ష ఆలోచింపజేసింది. 1950 దశాబ్దం నుంచి సాగిన ఆమె రచనలు 9 సంపుటాలయ్యాయి. రత్తమ కష్టాలు, సాంబయ్య పెళ్లి మొదలైన కథలెన్నో రాసినా నవలా రచయిత్రిగానే ప్రసిద్ధురాలైంది. మిసెస్ కైలాసం లాంటి పాత్రల్ని తన కథల్లో అజరామరం చేసింది.

అప్పుడు దాకా ఉన్న కథ వస్తువును విస్తృతి చేసినవాడు కరుణ కుమార. నెల్లూరు ప్రాంతంలో ప్రభుత్వాధికారిగా దేశం తిరగటం వల్ల తన కథలకు కావాల్సినంత ముడిసరుకు దొరికింది. పల్లెలు, మాలవాడలు, అగ్రహారాలు, గమళ్లపాలేలు మొదలు ఎన్నో ప్రదేశాలు, పేదరైతులు, కూలీలు, గ్రామోద్యోగులు, పై అధికారులు, ప్లీడర్లు, పోలీసులు, లాగుడు బళ్లవాళ్ళు, ఎద్దుల బేరగాళ్లు మొదలు ఎన్నో వైవిధ్య భరిత పాత్రలు ఆవరించిన కథాలోకం ఆయనది. మానవతా వాదం పండిన కేదారం ఆయనది. కూలినాలి వాళ్లని కాలికింద

చెప్పులా చూస్తే ఎప్పుడో ఒకప్పుడు ఆ చెప్పే కాలిని కరుస్తుందని చెప్పే కథ 'కొత్త చెప్పులు'. ఇంకా కయ్య–కాలవ, బిళ్లల మొలతాడు, పోలయ్య, అంటుజాడ్యం, పశువుల కొరకం వంటి మేలైన కథలల్లాడు కరుణకుమార. పాత్రోచితంగా తను పెరిగిన నెల్లూరు భాషను చక్కగా ఉపయోగించాడు. 'దీనజనులపట్ల వెల్లి విరిసిన కారుణ్యదృష్టిని బట్టి, రచనా వ్యాసంగం కోసం ఆయన స్వీకరించిన కలం పేరు కాలక్రమాన సార్థకంగా పరిణమించింది' అన్నారు మధురాంతకం రాజారాం.

అదట్లా ఉంటే తెలుగులో తొలి గిరిజన కథ 'చెంచి' (1932) రాసిన ఘనత నెల్లూరు ప్రాంతంవాడైన గూడూరు రాజేంద్రరావుదే. అతని రచనలు 'చరమలేఖ' పేరున 1992లో వెలుగు చూశాయి. ఇక యానాదుల్లాంటి గిరిజన వర్గాల అభ్యున్నతికోసం జీవితాంతం కృషిచేసి, 'క్రిమినల్ ట్రైబ్స్ యాక్ట్' రద్దు చేయించిన వెన్నెలకంటి రాఘవయ్య స్వాతంత్ర్యసమరయోధుడు. నెల్లూరు భాషలో 'రెడ్డోరి, నాయుడోరి' తగాదాల మధ్య నలిగి నశించిన 'దిరసన్న' (1946) లాంటి సన్నజీవాల గురించి మంచికథలు కొన్ని రాశాడు.

1960, 70 దశాబ్దాల్లో దక్షిణాంధ్రతీరంలో కథాదీపం ఎందుకు రవ్వంత మసకబారిందో తెలీదు. కోస్తా ప్రాంతంలో క్రమక్రమంగా వ్యాపార నాగరికత అభివృద్ధి చెందిందని,అది అభివృద్ధిచెందే తరుణంలో అటువంటి ప్రాంతాలనుంచి విలువైన సాహిత్యం రాదని విమర్శకు లంటారు. ఈ విమర్శ పైపైన చూస్తే వాస్తవమే అన్పిస్తుంది. అయితే దక్షిణపు కోస్తాలో నీటిపారుదల, వాణిజ్యపు పంటలు, నాగరికజీవనం ఎంత వాస్తవమో, ఆ జాడలే లేని కాటక సీమలు, రైతు–కూలీల వలసలు, అవిద్యా అజ్ఞానాలు అంతే వాస్తవం. మరి అన్ని రకాల రచనలూ ఈ సీమలనుంచి వచ్చాయి. కాబట్టి ఒక ప్రాంతం భౌతిక అభివృద్ధికి, అక్కడి సాహిత్య అభివృద్ధికి అన్నిసార్లు సూటిసంబంధం ఉంటుందని చెప్పలేం.

ఈ దశలో కొంతమంది రచయితలు సారవంతమైన కథల పంటలు పండించారు. హితశ్రీ (ఎం.వి. ప్రసాదరావు) రాసిన 'మచ్చల శంఖం', 'పదిమందిలో పదకొండోవాడు' కథలు అంత తేలిగ్గా మర్చిపోగలిగినవి కావు. ఇంకా 'కాకి గూడు, పొడుగు నీడలు, అయ్యగారు – అమ్మగారు' లాంటి చాలా కథలు 'హితశ్రీ కథా మంజూషిక'లో దొరుకుతాయి. మునిపల్లె రాజు'వారాలబ్బాయి', 'సవతి తమ్ముడు' వంటి చాలా కథలు మానవసంబంధాలను పటిష్టం చేసేవి. 'నూట పదహార్లు' అనే గొప్ప కథాసంకలనానికి సహ సంపాదకుడైన తాళ్లూరి నాగేశ్వరరావు 'మానవత్వం, మావూరి కథలు, ప్రేమికుని అంతరంగిక ప్రపంచం' వంటి మానవతా స్పర్శ గల కథలు లెక్కకందనన్ని రాశారు. ఇక మధ్య తరగతి సంవేదనల్ని ఆర్ద్రంగా అభ్యుదయ దృక్కోణం నుంచి దర్శించిన ప్రసిద్ధ కథకుడు పెద్దిభొట్ల సుబ్బరామయ్య ప్రకాశం జిల్లావాడే. ఎక్కడో రాయలసీమ నుంచి వచ్చి ఒక్కసారిగా కృష్ణానది నీళ్లు చూసినవాడి అనుభూతి ఎలా వుంటుందో 'నీళ్లు' కథలో అద్భుతంగా వర్ణించాడు పెద్దిభొట్ల. కళ్లజోడు, నిప్పు, ముసురు, మూగపిల్ల మొదలైన కథలు చెప్పుకోదగ్గవి. ప్రత్యేకించి చింపిరి కోటిగాడు లాంటి అలగా కుర్రాళ్ల దయనీయజీవనాల్ని చిత్రించిన 'చింపిరి, లేచిన వేళ, కోదండం గారి కల' అనే కథలు పెద్దిభొట్ల చిత్రణానైపుణ్యాన్ని, కరుణాత్మని పట్టి చూపిస్తాయి. నాయని కృష్ణకుమారి రాసిన కవిగారి భార్య, గుడ్డితనం, ఆయా కథలు చక్కని సామాజిక అవగాహనతోసాగేవి.

సత్యం శంకరమంచి 'అమరావతి కథలు' తెలుగు సాహిత్య పీఠంలో కలకాలం నిలబడి, గౌరవం, ఆదరణ పొందే ఒక మహోజ్వల సృష్టి. ఎన్నటికీ ఆరని అఖండజ్యోతి' (ముళ్లపూడి వెంకటరమణ). కృష్ణానదీ తీరంలో, అమరేశ్వర సాన్నిధ్యంలో అమరావతిని అంటిపెట్టుకొని వున్న స్థానిక సాధారణ జనజీవనాన్ని వస్తువుగా తీసుకొన్నాడు సత్యం. రంగులు పులమకుండా అచ్చమైన వెలుగునీడల్తో ఆశ్చర్యకరమైన 101 కతల బొమ్మలు గీశాడు. అయితే ఎంతో స్థానికత గలిగిన ఆ కథల్లో స్థానిక భాష, యాస లేకపోవటం విచిత్రమే. 'కార్తీక దీపాలు' అతని పూర్వ కథాసంపుటి. బాపట్లకి చెందిన ఇల్లిందల సరస్వతీదేవి 'తులసీ దళాలు', 'స్వర్ణకమలాలు' కథాసంపుటులు నడిమితరగతి జీవితాల్లోని ఒడిదుకుల్ని అభ్యుదయదృక్పథంతో వ్యాఖ్యానించాయి. అట్లాగే పోలాప్రగడ సత్యనారాయణ, పోలాప్రగడ రాజ్యలక్ష్మి కథలు. ఇంక మా గోఖలే తరవాత మళ్లీ అంత జవరంగా గుంటూరు జీవద్భాషలో కొలకలూరి ఇనాక్ గ్రామసీమల్లో కునారిల్లుతున్న దళితులు, వెనకబడిన కులాల బాధల మూల్గుల్ని విన్పించాడు. ఇనాక్ కథల్లో కన్న ఆర్తి ఎక్కువ. అందువల్ల అవి పీడితులనే గాక పీడకుల్ని కూడా ఆలోచింపజేస్తాయి. ఆయన ప్రసిద్ధ కథాసంపుటులు ఊరబావి, కాకి, అస్పృశ్య గంగ.

1970 దశాబ్దంలోనే నగ్నముని 'విలోమకథలు' వచ్చాయి. 'సిమెంట్ సంతతి' మొదలైన కథల్లో గొప్ప రాజకీయ వ్యంగ్యం పలుకుతుంది. రైతు జీవితానికి సంబంధించిన కొన్ని కథలు తాళ్లూరి నాగేశ్వరరావు కలంనుంచి మొలకెత్తాయి. తాడిగిరి పోతరాజు గాజు కిటికీ, ఎర్రబుట్ట కథాసంపుటులు విలక్షణమైనవి. అలాగే అభ్యుదయ దృక్కోణంతో పరుచూరి రాజారాం రాజేసిన 'చల్లని మంట', 'ఇది నా పువ్వు' కథాసంపుటులు అటు మానవత్వాన్ని, ఇటు ప్రగతిశీలతని పుణికిపుచ్చుకొన్నాయి.

1980, 90 దశాబ్దాల్లో దక్షిణ తీరాంధ్ర కథ గొప్ప పరిణామం చెందింది. సామాజిక బాధ్యత గల, సిద్ధాంత ప్రవేశం ఉన్న శిల్పరహస్యం తెలిసిన కథా రచయితలు కొందరు ఎలమీద కొచ్చారు. వైయక్తిక, సామాజిక

రచనారీతుల మధ్య విభజనరేఖ చెరిపేశారు. తమనుంచి సమాజం లోకి, సమాజం నుంచి తమలోకి అన్యోన్య ప్రయాణాలు చేశారు.

కృష్ణానదీ తీరభూముల్లో కొన్ని మాత్రమే సాగునీటి సౌకర్యంతో సస్యశ్యామలమయ్యాయి. ఇంకెన్నో మెట్టపొలాలకు వర్షాలే ఆధారాల య్యాయి. నల్లరేగడి నేలలు పొగాకుపంటకు అనువుగా ఉండటంవల్ల వ్యాపారులు, పాలకులు కూడబలుక్కొని ఏటి ఒడ్డుకు కూతవేటు దూరంలో ఉన్న ఈ ప్రాంతాలకు తాగునీరు, సాగునీటి వసతి రాకుండా చేశారు. 1970 దశాబ్దం నాటికి పొగాకు సేద్యంతో రైతులు నాశనమై, దళారులు, వ్యాపారులు కోట్లకి పడగలెత్తారు. ఆ తర్వాత పొగాకు స్థానాన్ని పత్తి ఆక్రమించింది. పత్తిసాగు కూడా జూదంగా మారిపోయి, తగిన ధరలు లేక 1980, 90 దశాబ్దాల్లో రైతులు అల్లాడిపోయారు. ఆత్మహత్యలు చేసుకున్నారు. సహించలేని రైతులు టంగుటూరులో తిరగబడ్డప్పుడు వారిమీద కాల్పులు జరిఆయి. ఈ పరిణామాల నేపథ్యంలో కథకులు కదలబారారు. ఆధునిక రైతు కథగా, నూరేళ్ల ఉత్తమ నూరు కథల్లో ఒకటిగా ప్రసిద్ధి చెందిన 'మట్టాగుండె'తోపాటు 'చింతలతోపు','సగం తెరిచిన తలుపు','చివరి పిచ్చిక' కథలు (పాపినేని) గ్రామీణ వ్యవసాయరంగంలో, ప్రకృతిలో, మానవ ప్రకృతిలో వచ్చిన పెనుమార్పుల్ని చిత్రించాయి.అట్లాగే వల్లూరు శివప్రసాద్ 'నాగేటిచాలు' కథ పత్తిరైతుల ఆత్మహత్యల మీద వాస్తవ కథనం.

'అంటరాని వసంతం' నవలా కారుడుగా ప్రసిద్ధుడైన జి. కళ్యాణ రావు మనస్సునంటే మంచి కథలు కూడా రాశాడు. ముఖ్యంగా ఒకవైపు దళిత, మరోవైపు వ్యవసాయనేపథ్యంలో వచ్చిన 'పద్మ' మరుపురానిది. గుళ్లకమ్మ నదీతీరాన వ్యవసాయ కుటుంబాల్లో,వ్యవసాయ సంబంధాల్లో వచ్చిన మార్పుల్ని కాట్రగడ్డ దయానంద్ కథలు విశ్లేషించాయి. ఉమ్మడి కుటుంబాల విచ్ఛిన్నత, కరువు కాటకాలు, పొలాలు చేపల చెరువులుగా, రొయ్యల చెరువులుగా ఆరిపోవటం – ఇట్లాంటి మార్పుల్ని వాస్తవికంగా వర్ణిస్తూ 'పండుటాకు', 'గుండ్లకమ్మతీరాన' మొదలైన విలువైన కథలు రాశాడు దయానంద్. ఇదే ప్రాంతీయ నేపథ్యంలో వెలువడిన మంచికంటి వెంకటేశ్వరరెడ్డి 'మిత్తవ' కథ మిత్తి నెత్తిపై వేలాడే ప్రకాశంజిల్లా క్షామపీడిత వ్యవసాయ కుటుంబాల దైన్యాన్ని తెలుపు, నలుపుల్లో చూపించింది. ఇంకా సలీం, ధేనువకొండ శ్రీరామమూర్తి స్థానికత, అస్తిత్వం పునాదిపై కథలు రాస్తున్నారు. ఇక నెల్లూరు 'ప్రళయకావేరి' ప్రాంత నేపథ్యంలో సం. వెం. రమేష్ రాసిన కథలు కనుమరుగైపోతున్న స్థానిక సంస్కృతిని సజీవంగా మన కళ్లముందు నిలిపాయి. నెల్లూరు పట్టణం నూరేళ్లచరిత్రని 'శివయ్య కథ' (ధనిశెట్టి లెనిన్) అక్షరబద్ధం చేసింది.

రాష్ట్రానికే విద్యాకేంద్రాలుగా గుంటూరు వర్ధిల్లింది. జాతీయోద్యమ కాలంలో స్థాపించిన పాఠశాలలున్నాయి. ఎందరో మేధావుల్ని రూపొందిం చిన, దేశంలోనే వాసిగన్న గొప్ప గొప్ప కళాశాలలున్నాయి. అయితే 1980 దశాబ్దం నుండి ఇక్కడ ప్రైవేట్ రెసిడెన్షియల్ కళాశాలలు కేవలం ధనార్జన కోసం పుట్టుకొచ్చాయి. ప్రభుత్వ కళాశాలలో ఫలితాలు అంతంతమాత్రంగా ఉండటంతో అంతో ఇంతో ఆర్థికస్థితి ఉన్నవాళ్లు తమ పిల్లల్ని ఈ కళాశాలల్లో చేర్పించసాగారు. 1990 దశాబ్దంలో విద్యారంగం కార్పొరేట్ రంగంగా మారింది. రెసిడెన్షియల్ కళాశాలల మధ్య రాంకుల పోటీ పెరిగింది. విద్యార్థులపై భయంకరమైన ఒత్తిడి తట్టుకోలేని విద్యార్థులు ఆత్మహత్యలు చేసుకున్నారు. ఈ సంగతులమీద రావలసినన్ని కథలు ఈ ప్రాంతంనుంచి రాలేదు. డా. శాంతికుమార్ ఈ రంగంమీద, ఇతర సామాజికరంగాల మీద కొన్ని మంచి కథలు రాశారు. 'ఇప్పుడూ ఇక్కడా' (శివశంకర్) కథ భవిష్యత్ లక్ష్యనిర్దేశంతో నలిగిపోతున్న విద్యార్థుల నిసర్గ అనుభూతులకు సంబంధించింది. అతనిదే 'అసతోమా....'కథ క్షీణిస్తున్న విద్యావిలువల్ని విశ్లేషించింది. అదేవిధంగా వైద్యరంగంలో జరుగుతున్న అక్రమాలను వెల్లడిస్తూ, అదృశ్య సామాజికహింస మూలాలను తవ్విన 'హింసరచన' కథ ప్రసిద్ధమైంది. ఇంకా ఈ సందర్భంలో ఎమ్వీ రామిరెడ్డి (మేధా విధ్వంసం), నల్లూరి రుక్మిణి కథలు పరిశీలించదగినవి. ఇక జరుగు బాటు లేక సామాన్యులు తమ శరీరభాగాల్ని అమ్ముకొంటున్న దయనీయ పరిస్థితుల్ని వల్లూరు శివప్రసాద్ గిట్టుబాటు కథలో చిత్రించాడు. వైద్యం మొదలు అన్ని రంగాల్లో వ్యాపిస్తున్న విలువల రాహిత్యాన్ని 'వైరస్' కథలో చైతన్యస్రవంతిలో వర్ణించాడు ఎమ్వీ రామిరెడ్డి.

ఇంకా 'చూడలేక చార్మినార్' కథాసంపుటితో గోపరాజు నాగేశ్వర రావు, 'అంతరంగం'తో ప్రతాప రవిశంకర్, 'సుమిత్ర గారిల్లు', 'నాన్నలూ జాగ్రత్త' సంపుటులతో పెనుమాక నాగేశ్వరరావు, 'రోడ్డుమీద గులాబి' కథాసంపుటితో పి. చంద్రశేఖర ఆజాద్ గుంటూరు ప్రాంతంలో కథల సందడి చేశారు. రాష్ట్రపతి బహుమతి పొందిన 'తిలదానం' కథ (రెంటాల నాగేశ్వరరావు) ప్రత్యేకం.

ప్రపంచీకరణ నేపథ్యంలో ఇవాళ గ్రామాల్లో చేతివృత్తుల విధ్వంసం, కార్పొరేట్ వ్యవసాయ పద్ధతులు మొదలైన మార్పులు వేగంగా జరుగు తున్నాయి. కావలి ప్రాంతంలో వీటి ప్రకంపనల్ని చక్కగా పసికట్టిన కథకుడు మహమ్మద్ ఖదీర్‌బాబు. 'న్యూబాంబే టైలర్స్' కథ దర్జీవృత్తి విధ్వంసంపై అల్లింది. 'ఖాదర్ లేడు' రోడ్ల విస్తరణతో విచ్ఛిన్నమైన వ్యక్తి జీవితం. ఇక ముస్లిం కుటుంబ సంస్కృతి, సమస్యల నేపథ్యంలో వచ్చిన 'బా' కథాసంపుటి (రహంతుల్లా) అత్యంత సహజచిత్రం.

స్త్రీలు మాత్రమే స్త్రీ సమస్యల్ని లోతుగా దర్శించగలరనే వాదానికి అపవాదం ఆర్.యం.ఉమామహేశ్వరరావు కథలు. బిడ్డలు గల్ల తల్లి, నోరు గల్ల ఆడది, వొంటేపమాను కథలు చదివితే సామాజిక తృణీకరణకి గురైన స్త్రీల మానసిక ఔన్నత్యాన్ని ఒక రచయిత ఎంత ఆర్ద్రంగా అర్థం చేసుకున్నాడో అవగతమవుతుంది.

1980, 90 దశాబ్దాల్లో స్త్రీవాద, దళితవాద, మైనారిటీవాదాలు తెలుగుసాహిత్యంలో ప్రవేశించాయి. ప్రపంచవ్యాప్తంగా సోషలిస్టు రాజ్యాలు కుప్పగూలుతూ కొత్త కొత్త సామాజిక ఆలోచనలకి అస్కార మిచ్చాయి. సమాజంలో వర్గాలేకాక తరతరాలుగా గొంతు నొక్కబడిన జాతులు, వర్ణాల అస్తిత్వసంక్షోభం కూడా ఎన్నెన్నో ప్రశ్నలు రేపింది. ఈ దశలో అటు విప్లవోద్యమ ఆదర్శాలను, ఇటు స్త్రీ, దళిత ఆక్రోశాలను వివేచిస్తూ ఆలోచనలు పోయిన రచయితలున్నారు. ఉదాహరణకి డాక్టర్ వి. చంద్రశేఖరరావు మనావతా దృక్కోణం నుంచి 'జీవని' వంటి కథలు రాసిన ఈ రచయిత తర్వాత దశలో పోస్ట్ మోడర్నిజం, మాంటేజ్ వంటి పద్ధతుల్లో సంక్లిష్ట కథాశిల్పం అవలంబించాడు. లెనిన్ ప్లేస్, మాయ లాంతరు, కేక, కొన్ని పక్షులు ఎగరగలవు మొదలైన కథల్లో తమ సొంత ఉనికికోసం ఆరాటపడే ఉపేక్షిత వ్యక్తుల, సమూహాల గొంతులతో శ్రుతి కలిపాడు. 'మోహనా! ఓ మోహనా!' కథలో మోహనరావు అనే ఒక విచ్ఛిన్న పాత్రద్వారా (Split Character) దళితోద్యమంలోని ఆటుపోట్లను చిత్రీకరించాడు. దళిత చైతన్యక్రమంలో ఎదురయ్యే సరికొత్త ప్రశ్నల్ని దగ్గుపాటి పద్మాకర్ 'పరిధులు – ప్రమేయాలు' అనే కథ రాశాడు. మొలకలపల్లి కోటేశ్వరరావు 'మూడుతరాల బానిస' కథ దక్షిణం కోస్తా మెట్ట పల్లెటూళ్లల్లో రైతులకింద బతికే జీతగాళ్ల జీవిత విషాదాన్ని అత్యంత సహజంగా చిత్రించింది.

పాత్రపోషణలో మనస్తత్వ విశ్లేషణ ప్రధానమైంది. కాని ఆధునిక రచయితలు ఈ మధ్య ఉద్యమావేశాల వల్లగాని, ఇంకెందువల్లనైనా గాని – ఈ అంశానికి తగినంత ప్రాధాన్యం ఇవ్వటం లేదు. అంతే గాకుండా వైవిధ్యభరితమైన కథావస్తువుల్ని ఎన్నుకోవటం కూడా అవసరం. ఉద్యమాలు స్పృశించలేని, రచయితలు స్పృశించాల్సిన జీవిత విభాగాలు అనేకం మిగిలి ఉన్నాయి. ఈ చూపుతో పరిశీలిస్తే అనిశెట్టి శ్రీధర్ రాసిన 'మగాడి పశ్చాత్తాపం' అనే కథ పురుష మనోవిశ్లేషణతో అద్భుతంగా సాగింది. దేశపర్యటన అనే సరికొత్త ఇతివృత్తం గ్రహించి శ్రీధర్ 'కొలంబస్' అనే ఆసక్తికరమైన కథ రాశాడు. యాంత్రిక జీవన విధానంతో కలుషితమైన నిలవనీటి బ్రతుకుల కొక కదలిక ఈ కథ. ఇప్పుడిప్పుడు బౌద్ధతత్వాన్ని వర్తమానంతో అద్భుతంగా ముడిపెడుతూ (జాతక కథ, బోధిసత్వ పద్మపాణి కథ) బి. అజయ్ ప్రసాద్ కొత్త కథాశిల్పంతో లోతైన చూపుతో రాస్తున్నాడు. తెలుగు కథా పరిణామంలో స్త్రీల దృక్కోణం నుంచి తమ ప్రత్యేకముద్ర వేసిన పి. సత్యవతి, ఓల్గా గుంటూరు ప్రాంతానికి చెందినవాళ్లే. 'ఇల్లలకగానే', 'మంత్రనగరి' అనే సత్యవతి కథా సంపుటాలు మారుతున్న కాలమాన పరిస్థితుల్లో, కటుంబకథల్లో తారసపడతారు.

తెలుగు కథా పరిరక్షణ కార్యం కూడా ఇవాళ దక్షిణాంధ్రలో చురుకుగా సాగుతుంది. పెనుగొండ లక్ష్మీనా·ాయణ సంపాదకత్వంలో వెలువడిన 'కథాస్రవంతి' 4 కథ్యా సంకలనాలు వెన·కటితరం రచయిత లకు గొప్ప నివాళి. శివశంకర్ సహ సంపాదకు·డుగా 'క·ూసాహితి' సంస్థ – 90 మొదలు క్రమం తప్పకుండా ప్రతి సంవత్సరం ఉత్మకథా సంకలనాలు ప్రచురిస్తున్నది. 1995లో గుంటూరు రచయితలైన శివశంకర్, పెనుగొండ లక్ష్మీనారాయణ, వల్లూరు శివప్రసాద్ మరిచిపోయిన, కాలగర్భంలో కనుమరుగైపోయిన 40 ఉత్తమ కథల్లో 'విస్మృతకథ' అనే సంకలనం వెలువరించారు. తిరిగి గుంటూరు అరసం సంస్థ 'కథాస్రవంతి' దాదాపు పాతికమంది ప్రసిద్ధ తెలుగు కథకుల కథాసంకలనాలు తెస్తున్నది.

ఈ పరిశీలనంతా ఒక క్లుప్తమైన పరిచయమే. సమగ్రం కానే కాదు. ఇదొక తొలి ప్రయత్నం. ఇందులో పేర్కొనలేకపోయిన మంచి రచయితలెంతోమంది ఉన్నారు. కొందరి ప్రాంతం సరిగ్గా తెలియక పోవటం కూడా ఒక సమస్య. ఈ పునాది మీద తర్వాత తర్వాత ఇంకా వివరంగా పరిశోధన చెయ్యగలిగితే మరిన్ని విశేషాలు తెలుస్తాయి. ఇక కృష్ణాజిల్లాలో కూడా దక్షిణ తీరాంధ్రలో కలిపితే బాగుంటుందని ఒకరిద్దరు సాహితీమిత్రులన్నారు. అయితే పరిపాలనా సౌలభ్యం కోసం గాని, పరిశీలనా సౌలభ్యం కోసం గాని నదిని సరిహద్దుగా తీసుకోవటం ఒక పద్ధతి. అదే పద్ధతి ఈ వ్యాసంలో పాటించాను. కాక మరెవరైనా కృష్ణా గోదావరి జిల్లాలతో కలిపి ఇటువంటి పరిశీలన చేసినా మంచిదే.

ఏది ఏమైనా తెలుగు కథా పరిణామానికి దక్షిణ తీరాంధ్ర కథకులు చేసిన దోహదం దొడ్డది.

డా॥బీరం సుందరరావు

# డా॥ నాగభైరవ గుండె పలికిన కావ్యం "గుండ్లకమ్మ చెప్పినకథ"

డాక్టర్ నాగభైరవ కోటేశ్వరరావుగారు కాలం వెంటనడచిన కవి. కవిత్వంలో అదును, పదునూ తెలిసి, రచనలు చేసినకవి. సమకాలీన సిద్ధాంతాల, రాద్ధాంతాలకు అశ్లీలంగా రాస్తున్నదేదో తెలిసి, నిబద్ధతతో రాసినకవి. నిజం చెప్పాలంటే నాగభైరవ మాష్టారు నిరంతరకవి.

పద్యం పుట్టిన అద్దంకిసీమలోని రావినూతలలో 1931 అగష్టు 15న వేంకటసుబ్బారావు, రాఘవమ్మ దంపతలకు జన్మించిన నాగభైరవజీవితం మూడు పాయలుగా సాగింది. సుమారు మూడున్నర దశాబ్దాలు ఉపాధ్యాయుడిగా, కళాశాల తెలుగు అధ్యాపకులుగా వేలాదిమంది శిష్యులకు ఆరాధ్య గురువయ్యారు. 5 దశాబ్దాలు ఉత్తమకవిత్వాన్ని సృజించి, సమాజాభ్యుదయాన్ని కాంచించిన కవిగా, రచయితగా, సాహితీవేత్తగా ప్రకాశం జిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో అరుదైన 'కనకాభిషేకం' సత్కారం పొందారు.

1962లో రంగాజమ్మ కావ్యరచనతో కవితాప్రస్థానం ప్రారంభించిన నాగభైరవ 1969లో వచ్చిన పెనుతుఫాను ఇతి వృత్తంగా "కన్నీటి గాథ" గేయకావ్యం రాశారు. 1970 ప్రాంతాల్లో అభ్యుదయ రచయితల సంఘం ప్రభావంతో తన పదాన్ని, పథాన్ని మార్చుకుని ఆధునిక కవిత్వంవైపు అడుగులు వేశారు. 1971లో శ్రీ ఈమని దయానంద, శ్రీయం.వి.యస్.శర్మ, శ్రీ మల్లవరపు జాన్, శ్రీబి.సి.నారాయణరావు వంటి మిత్రుల సహాయంతో ప్రకాశం జిల్లా రచయితల సంఘాన్ని స్థాపించారు. ఆనాటి జిల్లా కవులందర్నీ ఒకవేదికపై తెచ్చారు. ఒంగోలులో ప్ర.ర.సం ప్రథమ మహాసభలను వైభవంగా నిర్వహించి, జిల్లా కవుల్లో కొత్త చైతన్యాన్ని నింపారు. "మానవతా సంగాతం, తూర్పు కొత్త చైతన్యాన్ని నింపారు". మానవతా సంగీతం, తూర్పువాకిళ్ళు, సంతకం, నాఉదయం, వెలుతురస్నానం, పతాకశీర్షిక, దగ్గగీతం వంటి కవితా సంపుటాలను ప్రచురించారు. బాలల కోసం "కన్నెగంటి హనుమంతు" జాతీయ గేయకావ్యాన్ని రాశారు. 1980 తర్వాత తెలుగు సాహిత్యంలో వచ్చిన మార్పులన్నింటినీ ఆహ్వానించారు. సమకాలీన సాహిత్యోద్యమాలతో తనకున్న అనుబంధాన్ని అనుభవాన్ని "కవన విజయం" సాహితీ రూపకంగా సృష్టించి, 450 పైగా ప్రదర్శనలతో సంచలనం సృష్టించారు. కొత్తతరం శీర్షికను నిర్వహించి, మార్గదర్శిగా నిలిచారు. ఆంధ్రదేశంలోని ప్రతిష్ఠాకరమైన అవార్డులు పుర స్కాలను పొందారు. ఎన్నో పదవుల్లో అరుదైన గౌరవం పొందారు. జన్మనిచ్చిన జిల్లా కోసం "జిల్లాగీతం" రాసి తల్లిరుణం తీర్చుకున్నారు. "నాకవిత్వంలో ఎత్తులే తప్పులోతులు లేవు. ధర్మాలేతప్ప మర్మాలు లేవు. నిజాలే తప్ప ఇజాలు లేవు. సామాజిక చైతన్యం లక్ష్యంగా నైతిక విలువల పునరుద్ధరణే ధ్యేయంగా నేను రచనలు చేశాను. నేను మంచి టీచర్ను అయితే లోకం నన్ను కవిగా గుర్తించింది. గౌరవించింది. అది నా అదృష్టం. అని తనను తాను ఆవిష్కరించుకున్నారు. గురువుగారు.

వచనకవిత్వం ఉధృతంగా వస్తున్న కాలంలో కొంత మంది పద్యం పాతబడిందన్నారు. మరికొందరు పతన మైందన్నారు. ఇంకొందరు వర్తమానానికి పనికిరాదన్నారు. పద్యం ఉనికినే ప్రశ్నిస్తున్న ఈతరం కవులకు పద్యం విలువను చెప్పడానికి నాగభైరవిగారు గుండ్లకమ్మచెప్పిన కథను రాశారు.

"పద్దెముపాతవడ్డదని పల్వురు చెప్పినచెప్పవచ్చు, లే
ముద్దులు మూటగట్టుననే మోహిని ప్రేమకు పాతమేమి? ఏ
హద్దులులేని మాతృహృదయంబున పొంగెడి ప్రేమతత్త్వపున్
సద్దుకుపాతమేమి?యివిచావనిసత్యములీవసుంధరన్" –

అంటూ తెలుగుపద్యం ప్రాభవాన్ని ప్రవక్తలా ప్రవచించారు. ప్రయోక్తలా "గుండ్లకమ్మ చెప్పిన కథ" కావ్యంసృజించాడు. అనంతరం "నదిచెప్పనికథ" ను రాసి ఆధునిక తెలుగు కవుల్లో నదీ కావ్యాలకు నడకనేర్పిన కవిగా ఖ్యాతి గడించారు.

"వట్టిదో, గట్టిదో లేక కట్టు కథయో
గాసటోబీసటో కాక కల్పనమ్మో
ఎద్దియైనను గాని విశుద్ధప్రేమ
గాథకాలాన నిలువంగగలదు నిజము" – అంటూ తమకావ్య రచనకు వస్తునేపథ్యాన్ని వివరించారు. అద్దంకిసీమలో జరిగినట్లు ప్రచారంలోవున్న కథను వస్తువుగా స్వీకరించారు. అయితే అది కట్టుకథా, లేక పుట్టుకథా? అనే విషయాన్ని పాఠకులకు వదిలేసి, అనల్పమైన కథాకథన శైలిలో అద్భుతమైన కవితాశిల్పంతో గొప్పకావ్యం రాసి "గట్టికథ" ను చేశారు.

అద్దంకివాస్తవ్యులు, సహజకవి, సహృదములు. శ్రీకాకాని పాపయ్యగారు చెప్పిన విశేషాలనువిని, గుండ్లకమ్మ తీరాన్ని సందర్శించి, స్థానికంగా వున్న గాథలనుసేకరించి, సరికొత్త ఊహతో కల్పనను జోడించి నాగభైరవగారు "గుండ్లకమ్మ చెప్పిన కథ" కావ్యంరాశారు. విశుద్ధమైన ప్రేమగాథకాలాన్ని జయించి నిలుస్తుందన్న నిజాన్ని లోకానికి చాటారు. పద్యానికి దేశమంతా పరిమళాన్ని అద్ది, అచ్చమైన తేటతెలుగు తేటగీతుల్లో తెలుగుతనాన్ని, తియ్యదనాన్ని అద్భుతంగా ఆవిష్కరించారు. "చక్కదనాల చుక్క, విరజాజుల నవ్వుల పూలమొక్క, నల్దిక్కులలోన అందముల తేజము బంపెడు వేగుచుక్క ఆ ప్రకను చెంచుభూమిని నభంబున వెల్గెడి చంద్రుకన్న సొంపెక్కిన మోముకాంతిగల ప్రేయసీ తాజగదేక సుందరీ" – అంటూ అంకి అందాన్ని అందంగా వర్ణించారు నాగభైరవ.

"అతడెరుకలచినవాడు అతనచెంచు
జాతివేరైన వారలరీతి మొకటె
ఒక్కటే ఒక్కటే అదిచిక్కనైన
అమరమధురానుభవమ భయమ్మనయము" – అద్దడు అంకి ఇద్దరు ప్రేమికులు. గుండ్లకమ్మకిరువైపులవున్న చెంచు, ఎరుక జాతులకు చెందిన వారి ప్రణయగాథే కావ్యానికి మూలబిందువు.

నాగభైరవ వస్తుదృష్టి గొప్పది. కథబలంగా వున్నపుడు భావనపుష్టి వుంటుంది. వస్తుదృష్టి, భావపుష్టికలిస్తేనే రససృష్టి. రసపోషణ కవిప్రతిభకు అద్దం పడుతుంది.

"నదికి అటునిటుగూడెముకో, నడుమనేరు
వారి వీరినివిడదీసి పారుచుండు
నదికి అటునిటుగూడెముల్, నడుమజాతి
భేదమేపారివారల వేరుచేయు" – గుండ్లకమ్మకు ఇరువైపుల వుండే రెండుతెగలను నది విడదీసి పారుతుంది. చెంచుఎరుకల మధ్య సహజంగానే జాతి వైరంవుంది. కులపట్టింపులు వున్నాయి. వర్తమాన సమాజంలో ఇప్పటికీ కులవైషమ్యాలున్నాయి. తాను చూస్తున్న సమాజాన్ని భూతకాలానికి సమన్వయించి నాగభైరవ కథను అల్లు కున్నారు. సహజంగా ప్రేమకథలు సుఖాంతమవుతాయి. గుండ్లకమ్మ చెప్పిన కథకూడా సుఖాంతమైతే ఇంతగొప్ప కావ్యంగా గుర్తింపు ఉండేదికాదు. అద్దడు, అంకికి చరిత్రలో స్థానం వుండేదికాదు. కాని నాగభైరవ నవ్యతకోసం కావ్యాన్ని విషాదాంతం చేశారు. అద్దడు, అంకి ఇద్దరూ తమ ప్రేమను జాతి, కుల భేదాలకు త్యాగం చేసి మంటల్లో మరణిస్తారు.

"మనది చెంచులజాతి, ఆత్మాభిమాన
గరిమచే వెలుగొందెడి ఘనతమనది" –

..............................

"జాతియేకాదు, మనకున్న నీతిఘనము
నీతియేకాదు మనకున్న రీతిఘనము
ఒకరిజోలికి పోము, వోరొకరువచ్చి
వేలుపెట్టిన సహించివిడువలేము" – బహుశా ప్రపంచంలో ఏ దేశంలో లేనన్ని కులాలు, జాతులు మనదేశంలో వున్నాయి. అయినా సహజీవనంలో గొప్ప విషయం. కనుకనే మనది లౌకిక రాజ్యం. చట్టాలు ఎన్ని వచ్చినా కులవాదం పోలేదు. కులతత్త్వం తగ్గలేదు. వర్తమాన సమాజపు వాస్తవ చిత్రాన్ని నాగభైరవగారు బొమ్మ కట్టిచూపారు. ప్రేమికులు కలసి జీవించకపోయినా,

కలసి చనిపోయే అవకాశాన్ని ఈ కావ్యంలో నాగభైరవ కల్పించారు. "విశుద్ధమైన ప్రేమకథ" కాలాన్ని గెలుస్తుందని చాటిచెప్పారు.

**"కులము వలపునకడ్డుగా నిలువబోదు**
**జాతి-అనురాగమిరక్టజాలదెపుడు**
**"అంకి అధరమ్ము చుంబించి అద్దడనెను**
**సుంకు పట్టిన వెడొాన్నకంకినీవు.**
**చెలిమి వనముల విహరించుజింకనీవు**
**వంకలేనట్టి నానెలవంకనీవు"** – గురువుగారి పద్యంలో పూలదండకమ్మదనం వుంది. కలకండల తియ్యదనం వుంది. సాధారణ పదాలతో అసాధారణభావాన్ని చెప్పగలనేర్పు, కూర్పు నాగభైరవగారికే సొంతం. వచన, గేయ, కవిత్వంలో సిద్ధహస్తుడైన నాగభైరవ ప్రతిపద్యంలోనూ అంత్యప్రాసలు, అంత:ప్రాసచా ప్రయోగించి పద్యానికో పరిపూర్ణతను సాధించారు. ఈ పద్యం చదివిముగ్ధుడైన అప్పటి మన ఆస్థానకవి డాక్టర్ దాశరథి "సోదరా! నాగభైరవా! నీ "గుండ్లకమ్మ" లో ఎన్నిసార్లు మునకలేశానో! ఎన్ని అనుభూతులు పొందానో! నెమలిఫించం లాంటి మీ పద్యాన్ని చదివి ఎంతగా ఆర్ధమయ్యానో! "సుంకు పట్టిన లోజొన్న కంకినీవు" – ఓహ్! ఎంత అద్భుత పదచిత్రణ. తెలుగు సాహిత్యంలో మీ అంకి, జొన్నలెంకి చిరంజీవులు" అని మెచ్చుకున్నారు.

"వర్ణాశోశిపుణ:కవి:"– అన్నారు పెద్దలు. నాగభైరవ వర్ణనలు రెండు రకాలుగా వుంటాయి. ఒకటి కథాగళమైనది. రెండోది వస్తుగతమైనది. సన్నివేశానికి అనుగుణంగా ప్రకృతిని వర్ణించడం ఒక పద్ధతి.

**"మచ్చలుండుట చందమామకును మచ్చ**
**రేయి ముకుళింతమచ్చ నీరేజమునకు**
**పగలు నవ్వులు లేమి కల్వకునుమచ్చ**
**లేమియే మచ్చ యువతికి లేని మచ్చ"** – అంకిని లేమ ఎందుకన్నాడో ఈ పద్యంలో గమనించవచ్చు. అందమైన ఆమె నడుము నాజూకుగా ఉందా? లేదా? అన్నట్లు వుంది. ఈ పద్యం చివరి పాదంలో ఆ అందాన్ని కవి సున్నితంగా ఆవిష్కరించారు. మచ్చలున్న వస్తువులను చెప్పి, ఆ మచ్చల కారణంగానే వాటిని మనం వేలెత్తి చూపుతున్నామనే భావాన్ని చెప్పి, ఏమచ్చలేకపోవడమే అంకికి లేనిమచ్చ" అని చమత్కరించడం, పద్యంలో సొగసు. పద్యంలోని నాలుగు పాదాల్లో పాదం తర్వాత పాదంలో ఔత్సుక్య కల్పన వుంది. ఇది వేమన ఆటవెలదుల్లోని గొప్ప కవితాశిల్పం. ఈ శిల్పాన్ని అనల్పంగా పోషించారు నాగభైరవ.

**తె"గిండ్లుగజనిమ్మపండ్లు పొలిండ్లు చెండ్లు**
**కురులు తుమ్మెదగరులు, ముంగురులు, సరులు"** – ఇది ఫక్కుప్రాచీన ప్రబంధ వర్ణన. అయిన భాష సరళం. భావం నవీనం. రెండూ కలిసి అంత్య ప్రాస అందాలతో పద్యానికో కొత్త సొగసు వచ్చింది. ఈ సొగసు అంకిది మాత్రమే కాదు. నాగభైరవ పద్యానిది కూడ. నండూరి వారు ఎంకిని సృష్టిస్తే నాగ భైరవగారు అంకిని సృష్టించారు. ముగ్ధత్వంలో ఎంకిని అంకి చెల్లెలు. స్నిగ్ధత్వంలో అంకికి ఎంకి అక్క.

నాగభైరవ వర్ణనల్లో మరో ప్రత్యేకత వుంది. అచేతన వస్తువులకు చేతనత్వం కల్పించడం. మాట్లాడని వాటిని మాట్లాడించడం.

అసలు కావ్యం పేరులోనే నాగభైరవ గడుసుదనం కన్పిస్తుంది. అదీచలద్వర్ణనే! "గుండ్లకమ్మ చెప్పిన కథ" అన్నాడు కవి. గుండ్లకమ్మకు నోరులేదు. కనుక కథచెప్పలేదు. కవి గుండ్లకమ్మ చెప్పినట్టుగా భావించి, ఆకథను మనకు చెప్పాడు.

**"ఆ ప్రవాహమ్ముగళమెత్తి ఆలపింప**
**ఆనేసము వినె, విన్నవోసైకతములు**
**నినెను చంద్రుడు, విన్నదాపిల్లగాలి**
**అడవి విన్నది, విన్నది పుడమిగూడ"** – గుండ్లకమ్మ గుండె గాథను ప్రకృతితో కవికూడ విన్నాడు. అలాదినే సహృదయ నాగభైరవకువుంది. అంతకుమించిన గొప్ప సంస్కారం వుంది. "నది చెప్పని కథ" ను కూడా నాగభైరవ రాశారు. ఒకటి చెప్పిన కథ. మరొకటి చెప్పని కథ. రెంటినీకవే చెప్పి, మనల్ని అనుభూతి సముద్రంలో ఓలలాడించాడు. నదులకు నడకనేర్పిన కవిగా నాగభైరవ పాఠకుల గుండెల్లో నిలిచిపోయారు. కనుకనే డాక్టర్ సంజీవదేవ్ – "డాక్టర్ భైరవ వంటివారు మాత్రమే ఈ కావ్యాన్ని వ్రాయగలరు. ఇతరులు వ్రాయలేరుగనుక. ఇతరులు

వ్రాయలేనివాటిని నాగభైరవ వ్రాస్తారనికాదు. నాగభైరవ వ్రాసినట్లుగా ఇతరులకు వ్రాయడం సాధ్యంకాదు.

ఈకావ్యం చదివి డాక్టర్ థాశరధి "ఇలాటి మానవతా విలువలను ప్రబోధించే కావ్యాల అవసరం ఎంతోవుంద"న్నారు. యాసిడ్ దాడులతో, గొంతులు కోయడంతో వస్తావా? చస్తావా? అనే ఉన్మాదపు నినాదాలతో దారి తప్పిన ప్రేమికులకు ఈ కావ్యం చక్కని అక్షర సందేశం

**"తరలెనెన్నో యుగమ్ములద్దడునులేదు**
**అరిగెనెన్నో శతాబ్దాల అంకిలేదు**
**వారి ప్రేమయా కాలగర్భాన కలిసె**
**దాని గుర్తుగనేటి "అద్దంకి" నిలచె" -**

"That is the best piece of art in which the distinection between matter and manner is minimissed"
అన్న వాల్టర్ పీటర్ మాటలు "గుండ్లకమ్మ చెప్పిన కథకు అక్షరాలా వర్తిస్తాయి. కవిత్వం 'కాలాతీత కాంతిరేఖ' అనే సత్యాన్ని నిరూపిస్తాయి.

కవిగానేకాదు, వ్యక్తిగానూ నాగభైరవ సమకాలికుల్లో సమున్నతంగా నిలిచారు. కొంతమంది కొంతకాలం రాసి, రాసిందాంతో తృప్తి పడతారు. మరికొంతమంది వచ్చిన కీర్తిని మూట గట్టుకొని మురిసిపోతారు. ఇంకొంతమంది గతంలో బతుకతూ వర్తమానంలో చచ్చిపోతారు. గురుదేవులు డాక్టర్ నాగభైరవ కోటేశ్వరరావుగారు ఈ మూటికీ అతీతమైన నిత్యసాహిత్య చైతన్యమూర్తి.

**"మమకార బంధురమైన నాగుండె**
**మానస సరోవరాన్ని వెతుక్కుంటూ**
**హంసలా ఎప్పుడో ఎగిరిపోతుంది**
**అప్పుడీ కట్టెకు కట్టెలతోకాదు - పొగ**
**చుట్టలతో చితి పేర్చండి"** - అంటూ తన

"చుట్టరికాన్నిచాటుకుంటూ, వారసులకు వీలునామా రాశారు. కదిలేది కవిత్వమైతే ఆకదలికను కవిత్వంద్వార నాగభైరవ తెచ్చారు. మారేది అక్షరమైతే ఆమార్పును తూర్పు సాక్షిగా ఆహ్వానించారు. పాడేది కవిత్వమైతే ఆ "పాట"ను జిల్లా ప్రజలకు కానుకగా ఇచ్చారు. అన్నీ ఇచ్చిన నాగభైరవ తనకేమీ మిగుల్చు కోకుండానే నిరాడంబరంగా వెళ్ళిపోయారు. కృష్ణశాస్త్రి గారం టారు. "నాకోసం చెమ్మగిల్లన మనంబులేదని". గురువు గారి కోసం చెమ్మగిల్లేనయనాలెన్నో వున్నాయి. ఇప్పటికీ నేను/ మానవత్వాన్ని ముఖచిత్రంగా మలచుకునేవున్నాను/ రేపటినా తరాల కోసం" అన్న మన జిల్లా పెద్దన్న నాగభైరవ" కదనం "చిరునామాగా" విజయం "వీలునామాగా బతికేవుంటారు.

*చిరునామా : డా॥బీరం సుందరరావు, ఇంకొల్లు -523167, 9848039080*

డా॥ వెలువోలు నాగరాజ్యలక్ష్మి

# గుంటూరుజిల్లాలో పద్య కవయిత్రులు

"ఆంధ్రత్వమాంధ్రభాషాచ నాన్యస్య తపసఃఫలమ్" అని అలనాడు అప్పయదీక్షితులు ప్రశంసించినట్లుగా తెలుగునేల, తెలుగు భాష పుట్టినిల్లు, తల్లిభాష కావటం బహుజన్మతపః ఫలం. భారతావనిలో అక్షరక్రమంలోనే కాక అందచందాలలోనూ, కళా సాహిత్య రంగాలలోనూ ఆధ్యాత్మికతలోనూ అగ్రగామి అయిన రాష్ట్రం ఆంధ్రప్రదేశ్. వేదంలా ఘోషించే గోదావరితోనూ, ఆంధ్రుల అందాల ఆడపడుచు కృష్ణవేణితోనూ పెన్నెటివేణి పెన్నతోను సతతమూ సస్యశ్యామలంగా విలసిల్లుతున్న పవిత్రభూమి ఆంధ్రావని.

ఆంధ్రావనికి నడిబొడ్డున ఉన్న గుంటూరు సీమ చారిత్రక ప్రశస్తి పొందినది. కవులకు, కవయిత్రులకు పుట్టినిల్లు. కళలకు కాణాచి. వీరులకు వీరమాగాణి. మతసహనానికి మణిమకుటం. కవితాకన్య ఈ సీమలో మధురశృంగార రసైక ముగ్ధమోహన అయి స్వేచ్ఛగా దోగాడింది. పండిత కవులేకాక కవయిత్రులు సహితం అపారమైన పాండితీగరిమతో పద్య, గేయ, వచన కవితారంగాలతో తమ ముద్రను ప్రకటించుకున్నారు. నవల, కథ, నాటక రచనలో నైపుణ్యాన్ని నిరూపించుకున్నారు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని దేశభక్తిని చాటుకున్నారు. సంగీత, నృత్య, అభినయాది కళలలో రాణించారు.

తెలుగుభాషకు ప్రత్యేకమైన గౌరవాన్ని, సంగీతాత్మకమైన లయను అందించి పరిపుష్టం కావించింది పద్యం. పద్యకవిత్వ పరిమళాలను దశదిశల పరివ్యాప్తం చేసిన గుంటూరుజిల్లా కవయిత్రులు కవితాశిల్ప సౌందర్య సాధనలో కవులకు తీసిపోని ప్రతిభామూర్తులుగా చరిత్రలో నిలిచిపోయారు. గుంటూరుజిల్లా ఖ్యాతిని ఇనుమడింపచేసిన పద్య కవయిత్రులను రేఖామాత్రంగా, కాలక్రమానుగుణంగా పరి చయం చేసే ప్రయత్నమే ఈ పరిశోధన వ్యాసం.

### 1. దార్ల సుందరమ్మ :

ఈమె 1829లో గురజాల మండలం చర్లగుడిపాడులో జన్మించింది. గంజి శ్రీరాములు, నాగమాంబల కుమార్తె "భావలింగశతకం" వీరి రచన. తాత్త్విక సంబంధమైన శతకం ఇది. సామాజిక కల్మషాలను శక్తిమంతమైన తెలుగులో, ఉత్తేజకరమైన భావపరంపరతో రచింపబడిన గొప్ప శతకం. వేమనవలె ఈమె కూడా ఆటవెలదులతో రచన సాగించింది. "పాపభయ విభంగ భావలింగ" అన్నది దీనిలోని మకుటం.

"భూమిగోరువారు బూడిదైపోయిరి
ధనముగోరువారు దగ్ధమైరి
నిన్నుగోరువారు నిత్యులైయుండిరి
పాపభయవిభంగ భావలింగ"

ఇటువంటి అనేక తాత్త్వికాంశాలు ఈ శతకంలో కానవస్తాయి.

### 2. కొటికలపూడి సీతమ్మ :

తెనాలి మండలం జెముదుపాడు గ్రామంలో 1874లో ఈమె జన్మించింది. తండ్రి అబ్బూరి సుబ్బారావు. భర్త కొటికలపూడి రామారావు. ఈమె స్వయంగా 'సావిత్రి' అనే పత్రికను నిర్వహించింది. "ఒక మహమ్మదీయ వనిత, సాధురక్షక శతకం, అహల్యాబాయి కావ్యం, భగవద్గీతానువాదం ఈమె పద్యరచనలు. వీరేశలింగం అనుయాయినులలో ప్రముఖురాలిగా పేరు వడసింది. సంఘసంస్కరణ భావాలు ఈమె కవిత్వంలో ప్రస్ఫుటంగా కన్పిస్తాయి. 1913లో బాపట్లలో జరిగిన ప్రథమాంధ్ర మహిళాసభకు అధ్యక్షత వహించిన మహిళామణి ఈమె. 1936లో దివంగతురాలయింది.

### 3. వెన్నెలకంటి హనుమాయమ్మ :

1875లో బాపట్లలో ఈమె జన్మించింది. సంస్కృతాంధ్ర సాహిత్యాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసిన విదుషీమణి. సంస్కృతంలో "శ్రీ బ్రహ్మానంద సరస్వతీస్వామి పాదపూజనము, శంకర పూజావిధి, శంకర సహస్ర నామావళి"ని రచించింది. తెలుగులో 'శ్రీరామలక్ష్మణ సంవాదము' అనే కావ్యరచన చేసింది.

**4. తాడేపల్లి యజ్ఞమహాలక్ష్మి :**

రేపల్లెలో 11-2-1886న యజ్ఞనారాయణశాస్త్రి, బాపమ్మ దంపతులకు ఈమె జన్మించింది. "జీవన్ముక్తి ప్రకాశిక" పద్యకావ్యాన్ని రచించింది. 1963లో దేహత్యాగం చేసింది.

**5. నిరాఘాటం యామినీ పూర్ణతిలకమ్మ :**

క్రోసూరు మండలం పీసపాడు గ్రామంలో మొక్కపాటి జానకిరామయ్య, రామమ్మ దంపతులకు 1887లో జన్మించింది. రేపల్లె మండలంలోని పేటేరు గ్రామస్థుడు నిరాఘాటం వేంకట సుబ్బయ్యను వివాహమాడింది. భర్తతో కలసి మద్రాసు వెళ్ళి అక్కడ "హిందూయువతి, విశ్వజనని" పత్రికలను నిర్వహించింది. 'శ్రీ వేంకటేశ్వర శతకం' ఈమె రచన 6-3-1957న స్వర్గస్థురాలయింది.

**6. గుడిపూడి ఇందుమతీదేవి :**

పాతగుంటూరులో నరహర్యక్షశాస్త్రి, అనంతలక్ష్మి దంపతులకు 1889లో జన్మించింది. గుడిపూడి రామారావు గారిని వివాహమాడి విజయవాడలో స్థిరపడ్డారు. 'గృహలక్ష్మి' పత్రిక అందించిన స్వర్ణ కంకణాన్ని స్వీకరించింది. 'కవితావిశారద, మధుర కవయిత్రి బిరుదాలను ధరించింది. 'నీతితారావళి, తరుణీశతకం, మంగళాద్రి నృసింహశతకం, రాజేశ్వరీశతకం, అంబరీష విజయం' ఈమె రచించిన పద్యకృతులు. సీతారాములపై భక్తి గేయాలను కూడా రచించింది.

**7. కనుపర్తి వరలక్ష్మమ్మ :**

6-10-1896లో పాలవర్తి శేషయ్య, హనుమాయమ్మ దంపతులకు బాపట్లలో జన్మించింది. రచయిత్రిగా, వక్తగా, సంఘసేవకురాలిగా, విదుషీ మణిగా రాణించింది. స్త్రీ జనాభ్యున్నతికి విశేష కృషి చేసింది. పద్యం, కథ, నవల, నాటిక మొదలైన సాహిత్య ప్రక్రియలు అన్నిటిలోనూ రచనలు చేసింది. 1934లో గృహలక్ష్మి స్వర్ణకంకణాన్ని పొందిన ప్రథమ మహిళ. 'ద్రౌపదీ మానసంరక్షణము, సత్యాద్రౌపదీ సంవాదము' అను ద్విపద కావ్యరచన చేసింది.

'ఆంధ్రమాతకు వందనం' అంటూ తెలుగుతల్లి కన్నబిడ్డలను స్మరిస్తూ చెప్పిన పద్యం ఆమె రచనాశైలికి ఉదాహరణం.

"కవయిత్రి మొల్లమ్మ కమ్మనికైతల
మహిమగాంచినది మా మాతృభూమి
విమల వేదాంతార్థ విజ్ఞాత వెంగమ్మ
బోధలందినది నా పుణ్యభూమి
రాజ్యపాలనదక్ష రాజ్ఞి రుద్రమదేవి
రాజ్యమేలినది నా రమ్యభూమి
సాధ్వీమల్లమదేవి సహగమనము చేత
పూతమైనది నాదు పుణ్యభూమి
మతియు నాగమ్మ లక్ష్మమ్మ మాచమాది
నారీమణుల గనినది నా సారభూమి
అట్టి నాయాంధ్ర భూమికి ననుదినంబు
హస్తములు మోడ్చి మ్రొక్కెద నధిక భక్తి"

**8. దేశిరాజు లక్ష్మీ నరసమ్మ :**

1896 ప్రాంతంలో గుంటూరులో జన్మించింది. విద్వత్కవయిత్రి. శ్రీరామశతకం, శ్రీ కుచేలోపాఖ్యానం, యుధిష్ఠిర చక్రవర్తి ఈమె పద్య రచనలు.

**9. కాంచనపల్లి కనకాంబ :**

దుర్గి గ్రామంలో 3-9-1912 న రంగారావు, రంగమ్మ దంపతులకు జన్మించింది. కళాశాల ఉపన్యాసకురాలిగా వృత్తిని చేపట్టిన ఈమె 12వ ఏటనే 'రంగశతకం' రచించటం విశేషం. కాశీయాత్రా చరిత్ర, ఆనందసారం, పాండవో దంతం, అంబాస్తవం, పద్యముక్తావళి, సీతారామాంజనేయచిరసంవాదం, రామాయణ కథా సంగ్రహం, గౌతమబుద్ధ చరిత్ర ఇత్యాది పలు కావ్యాలను రచించి కవితావిశారద, కవితిలక బిరుదులను అందుకుంది.

**10. దేశిరాజు భారతీదేవి :**

1915లో బాపట్లలో శ్రీ చంద్రమౌళి చిదంబరరావు, అన్నపూర్ణ దంపతులకు జన్మించింది. మహిళా సంఘం కార్యదర్శిగా సేవలనందించింది. "కాంతాశతకము, గోవింద శతకము" ఈమె రచనలు

**11. బీర్నీడి ప్రసన్న :**

15-8-1917న మోషే, సంతోషమ్మ దంపతులకు జన్మించింది. వినుకొండ వీరి జన్మస్థలం. "గంగినేని శతకము, పృథ్వీభాగవతము, మధుమాసము, తుకారాం' అన్న పద్యరచనలు చేసింది. మద్రాసు విశ్వవిద్యాలయం నుండి విద్వాన్ పట్టా అందుకున్న ఈమె 'విద్వత్కవిసింహ' బిరుదాంకితురాలు.

**12. ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ :**

18-12-1917న మధురకవి నాళం కృష్ణారావు, సుశీల

దంపతులకు జన్మించింది. బాపట్లలో నివసించింది. "నా తెలుగు మాంచాల, సరస్వతీ సామ్రాజ్యవైభవం, దేవీస్తవ తారావళి, మహిళా విక్రమసూక్తము, కన్యకమ్మనివాళి" వంటి కావ్యాలను రచించింది. ఆంధ్ర కవయిత్రులు, వాగ్గేయకారుల చరిత్ర వంటి గ్రంథాలను రచించింది. అపర వాగ్దేవి, కళాప్రపూర్ణ, పండితభారతి బిరుదులతో పాటు కనకాభి షేక సత్కారం స్వీకరించింది. 'భువనవిజయ' సాహిత్యరూపకాన్ని స్మరింప చేసే రీతిలో ఈమె రచించిన 'సరస్వతీసామ్రాజ్యవైభవం" కవయిత్రుల ప్రత్యేక సాహిత్య రూపకంగా ప్రసిద్ధి కెక్కింది. ఆమె స్వయంగా దీన్ని పలుచోట్ల ప్రదర్శించింది. 1-12-1996న దివంగతు రాలయింది.

### 13. దొప్పలపూడి అనసూయాదేవి :

స్త్రీల అనుభూతులను కవిత్వీకరించిన స్త్రీలలో ఈమె ఒకరు. 1919లో జన్మించింది. రేటూరు గ్రామస్థులు దొప్పలపూడి రత్నంగారి అర్ధాంగి 'తెలుగులెంక' తుమ్మల సీతారామమూర్తిగారి ప్రోత్సాహంతో కవిత్వరచన అలవడింది. 'మాతృహృదయము' ఈమె రచించిన పద్య ఖండికల సంకలనం. దీనిలో అంకురార్పణము, కాన్పు, అంతర్వాణి, పరిచయము, పాలు, దీపజ్యోతి, స్పర్శ, ఊయల, రంగులు, ఉగ్గు, రోదనము, లాలిజోల, జబ్బు, పాకీపని, నవ్వు అనే శీర్షికలతో రసవంతమైన పద్యాలు రచింపబడ్డాయి. ఇంటిలోని దీపాన్ని చూసే పసిబాలుని భావాలను కవయిత్రి ఇలా వర్ణించారు.

**"పుణ్యపాపములాకృతి పొందియున్న**
**కరణిదోచును వెల్గు చీకటులు హృదికి**
**పాపమెఱుగని యీపసిపాపలేత**
**మదికి చీకటి యెట్లు సమ్మదముగూర్చు**

తేటతేట తెలుగు పలుకులతో ఇంత అద్భుతంగా మాతృ హృద యాన్ని ఆవిష్కరించారు కనుకనే ఆమె కవితలు కేంద్రసాహిత్య అకాడమీ వారి తెలుగు కావ్యమాలలో చోటుచేసుకున్నాయి.

### 14. వట్టికొండ విశాలాక్షి :

గుంటూరుజిల్లా చేబ్రోలు గ్రామంలో 1920 జూన్‌లో జన్మించిన విశాలాక్షి, నంబూరు గ్రామస్థులైన పాటిబండ్ల దంపతుల కుమార్తె. చేబ్రోలులో మాతామహుల ఇంట ఉంటూ జ్ఞానసముపార్జనతో హిందీ సంస్కృతాంధ్ర భాషలు అభ్యసించింది. 16వ ఏటనుండి కవిత్వరచన చేశారు. భర్త వట్టికొండ రంగయ్యగారితో కలిసి అభ్యుదయ రచయితల సంఘంలో సభ్యులుగా సేవలనందించింది.

పరిణతిచెందిన పద్యశిల్పంతో సుకుమారమైన శైలిలో ఈమె రచన సాగింది కోయిల, వెలుగునీడలు, అనునయము, ఆవేదన స్వప్న సందర్శనము" అనే పద్యరచనలు ఆమె కవితా వైశిష్ట్యాన్ని తెలియ చేస్తుంది.

### 15. నాయని కృష్ణకుమారి :

14-3-1930న గుంటూరులో ఈమె జన్మించారు. సుప్రసిద్ధకవి నాయని సుబ్బారావుగారి పుత్రిక. అనేక సాహితీపురస్కారాలను అందుకున్న ఈమె జానపదసాహిత్య ప్రక్రియలో విశేషకృషి సల్పిన విదుషీమణి. ఉస్మానియా విశ్వ విద్యాలయ ఆంధ్రశాఖాధిపతిగా, పద్మా వతీ విశ్వవిద్యాలయ ప్రధమాధ్యక్షురాలిగా పదవులను నిర్వహించారు. "అగ్నిపుత్రి, మానసలీల, ఏంచెప్పను నేస్తం" వంటి కావ్యాలు, తెలుగు భాషా చరిత్ర, జానపదగేయాలు, సాంఘికచరిత్ర వంటి పరిశోధక గ్రంథరచన చేశారు.

### 16. పిండిప్రోలు వసంతకుమారీదేవి :

1940లో జన్మించిన ఈమె గుంటూరు 'శారదానికేతన' విద్యా లయంలో అధ్యాపకవృత్తిని అవలంబించారు. ఈమె ఖండ కావ్యాలు 'వసంతసాహితి' పేర 2011లో ప్రకటించబడ్డాయి.

### 17. నడకుర్తి స్వరూపారాణి :

అమృతలూరు మండలం గోవాద గ్రామంలో 1943లో వేంకట రత్నం - మరియమ్మ దంపతులకు జన్మించారు. "గంగావ తరణం - శివతాండవం, చంద్రగ్రహణం, ప్రబోధం" అనే పద్య కావ్యాలను ప్రకటించారు. రాష్ట్రప్రభుత్వ సన్మానాన్ని, 'కవయిత్రీతిలక' బిరుదాన్ని అందుకున్నారు.

### 18. వెలువోలు నాగరాజ్యలక్ష్మి :

అమృతలూరు గ్రామంలో వెలువోలు వరలక్ష్మి, రంగారావు దంపతులకు 22-7-1959న జన్మించారు. తెలుగు, సంస్కృత భాషలలో ఎం.ఏ తెలుగులో పిహెచ్‌డి పొందిన వీరు ప్రభుత్వ డిగ్రీ కళాశాలల్లో ఆచార్యులుగా, ప్రాచార్యులుగా చిరకాలం సేవలంది స్తున్నారు. భారతీయసంస్కృతి, ప్రకృతి మొదలైన అంశాలపై సీతారామ కళ్యాణం, సంక్రాంతి శోభ, సర్వధారివి నీవిక సాగిరమ్మ జగన్మాతకు నీరాజనం ఉగాది సౌరభం, ఆదిత్య దర్శనం" మొదలైన పద్య కవితా ఖండికలను రచించారు. 'అక్షరవృక్షం' వచనకవితా సంపుటి. 'చిగురు పొదలు' సాహిత్య వ్యాసం సంకలనం, 'భగవద్గీత వ్యక్తిత్వ వికాసం, ముకుందమాల (మరందవ్యాఖ్య) వీరి ఇతర రచనలు.

**19. కాకుమాను భూలక్ష్మి :**

ప్రత్తిపాడు మండలం గింజుపల్లివారి పాలెంలో 15-6-1966న కాకుమాను అప్పారావు, భారతి దంపతులకు జన్మించారు. సంస్కృతంలో లింగమూడి సోమేశకవి రచించిన 'రాఘవ యాద వీయం' అనే శ్లేషకావ్యాన్ని ఆంధ్రానువాదం చేశారు. సంస్కృతాంధ్రభాషలలో పరమపట్టభద్రురాలైన ఈమె పాండితీ ప్రకర్షకు ఆ కావ్యం నిదర్శనం.

**20. సంకా సత్యవతమ్మ :**

మంగళగిరి నృసింహస్వామిని గురించి 'నారసింహ' మకుటంతో 103 తేటగీతులను అల్లిన సత్యవతమ్మ ఏకా ఆంజనేయులు, ఆదిలక్ష్మి దంపతుల పుత్రిక.

సమస్త కళలకు ప్రసిద్ధిగాంచిన గుంటూరుజిల్లాలో కవయిత్రులు చైతన్యస్ఫూర్తితో కలంచేపట్టి అనేక రచనలు చేశారు. చేబ్రోలు సరస్వతీదేవిగారి 'సరస్వతీ రామాయణము', శారదా శతకము, ప్రబంధ ధోరణిలో సాగిన పద్యకావ్యాలు. ఇంకా అంజనాదేవి, చీమ కుర్తి సత్యవతీదేవి, మొదలైనవారు పద్యకవిత్వ రచన చేసిన కవయిత్రులు.

కవయిత్రుల పద్య రచనలో ప్రధానంగా భారతీయ సంస్కృతి, సంప్రదాయాలు, వారు పూజించే దైవసంబంధమైన శతకాలు ప్రముఖస్థానాన్ని వహించాయి. సంస్కృతీ, వారసత్వ పరిరక్షణకు మూలకారకులైన మహిళలు కవిత్వరచనలో సహితం తమ ధర్మాన్ని పాటించారని చెప్పవచ్చు.

ఆధునికయుగంలో సాహిత్య ప్రక్రియలు విస్తరిల్లిన అనంతరం మహిళలు సాహిత్య రంగంలో మరింత ముందంజవేస్తూ గుంటూరు జిల్లా ఖ్యాతిని ఇనుమడింపచేస్తున్నారు. తెలుగింటి విరిబోణి అయిన కృష్ణవేణీమతల్లి ముగ్ధమనోహరమైన తన సంచారాలతో స్త్రీమూర్తులకు ఎనలేని ప్రేరణను, ప్రోత్సాహాన్ని సదా కలిగించునుగాక.

# మోపిదేవి - శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి

మోపిదేవిలో మూలమూర్తి స్వయంభూలింగం. కుమారస్వామి లింగమూర్తిగా దర్శనమిచ్చే ఏకైక క్షేత్రం మోపిదేవి. వీరారపు పర్వతాలు అనే కుమ్మరి భక్తునికి కలలో కనిపించి, తన ఉనికిని తెలియచేశాడు స్వామి. సుబ్రహ్మణ్యేశ్వరస్వామి చల్లపల్లి జమిందారీ కుటుంబానికి ఇలవేల్పు. ఇప్పటికీ వీరి ఆధ్వర్యంలోనే ఆలయ నిర్వహణ కొనసాగుతుంది. పూర్వం ఈ క్షేత్రానికి మోహినీపురమని పేరు. సంతానప్రదాయకుడిగా సకల కామ్యాలు తీర్చే ఇలువేల్పుగా స్వామి భక్తుల నీరాజనాలందుకుంటున్నాడు. మోపిదేవి క్షేత్రానికి సమీప ప్రాంతాలలోనే మొవ్వ వేణుగోపాలస్వామి ఆలయం, తోట్లవల్లూరు వేణుగోపాలస్వామి ఆలయం, పెదకళ్ళేపల్లి దుర్గా నాగమల్లేశ్వర స్వామి, యనమలకుదురు - రామలింగేశ్వరస్వామి. కొల్లేటికోట పెద్దింట్లమ్మ క్షేత్రాలున్నాయి. విజయవాడ నుంచి మోపిదేవికి 65 కి.మీ. దూరం.

*చిరునామా : 'సారస్వత కళానిధి' - డాక్టర్ వెలువోలు నాగరాజ్యలక్ష్మి, ఎం.ఏ.పిహెచ్‌డి. తెలుగు, ఎం.ఏ. సంస్కృతం ప్రాచార్యులు, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, చేబ్రోలు, చరవాణి : 9394113848*

శ్రీ జి.శుభాకరరావు

# కర్నూలుజిల్లాలో ఆశావాది అవధాన వసంతం

సాహిత్యానికి సంబంధించిన కొన్ని ప్రక్రియలు చతుష్షష్టి కళలుగా, కొన్ని చతుష్షష్టివిద్యలుగా మన పూర్వులు వర్గీకరించారు. అందులో ముఖ్యమైనవి. 1.భాషాజ్ఞానము, 2.పదములు కూర్చు లక్షణములు, 3.వచనకావ్యాలు పఠించుట, 4.పద్యాలను ఒప్ప గించుట, 5.పద్యములను విమర్శించుట, 6.పద్యపాదాలను పూరించుట, 7.అడిగిన పద్యాన్ని అల్లుట, 8.పద్యమూలాన్ని ప్రశ్నించి నప్పుడు పద్యముద్వారానే ప్రత్యుత్తరమిచ్చుట. ఇక విద్యలలో ముఖ్యమై నవి 1.కవిత్వం, 2.వాక్చమత్కారం. పైవన్నీ కూడా అష్టావ ధానాలలో భాగాలే యిక్కడ ప్రాధాన్యతని సంతరించుకున్నట్లయింది.

ఎనమండుగురు పృచ్ఛకుల మధ్య వందలాది విజ్ఞులు రసజ్ఞులు అయిన ఆహూతుల సమక్షంలో యేమాత్రం తడబడక కాలయాపన చెయ్యక ఆద్యంతం ఆసక్తికరంగా, జాగరూకతతో అర్థవంతంగా, సమర్థంగా అవధానాన్ని నిర్వహించడం అవధాని యెంతటి ప్రాజ్ఞుడైనా అతనికి కత్తిమీద సామువంటిది.

అవధానమంటే మాటలు కాదు. అవధానమంటే నిఘంటువు ప్రకారం ఉపధారణము, ధారణి, నిబ్బరము, ప్రణధి, రంధి, సంవిత్తు, సమాధి అని పేర్కొనబడ్డాయి. అవధానమంటే నిశ్చల ఏకాగ్రత, అనల్ప ధారణాశక్తి, ధిషణ, భాషాపటిమ, పురాణ వేదవేదాంత వాఙ్మయ ప్రబంధ సారస్వత సకలశాస్త్రాల గ్రంథాలపరిజ్ఞానం, సమయ స్ఫూర్తి, వివేచన ఆలోచనావగాహనలు,అనర్గళంగా శ్రావ్యంగానిర్దోషంగా పద్యాన్ని పఠించగల ప్రాజ్ఞతల వంటి విశేష గుణగణాలసమాహారంగా చెప్పవచ్చు.

మహాకవి కాళిదాసు చెప్పినట్లు భావము శబ్దము దంపతిత్వము అనగా అర్థనారీశ్వరత్వం పొందుననే డా॥ఆశావాది పలుకులు అక్షర సత్యాలు, అతి చక్కని సామ్యాలు! ప్రపంచభాషలలో అష్టావ ధానమనే ప్రక్రియ మన తెలుగుభాషకే రత్నాభరణమై కీర్తి పొందుతోంది. అంతేకాదు. మృదుత్వమాధురులను పూని రసానికి తగినట్లుగా స్ఫోరణ మయమై రాణిస్తూ కవీశ్వరుల పాలిటి ఐశ్వర్యంగా మించిపోతున్నది. అవధాన ప్రక్రియను అత్యంత సమీపంగా, అత్యంత సహజంగా, యెంతో సత్యరూపంగా వెలార్చు నవ్యభాష్యమిది! సముచితమైన భాషితమిది!

సాహిత్యాష్టావధానమేగాక గణితావధానము, నేత్రావధానము, హాస్యావధానము, సంగీతావధానము, నాట్యావధానములాంటి వి మరికొన్ని ప్రాచుర్యంలో ఉన్నాయి. అవధానాలు పృచ్ఛకుల సంఖ్యను బట్టి అష్ట శత సహస్ర ద్విసహస్రఅవధానాలుకూడాకొందరు మేధావులైన అవధానులు చేపట్టి కొనసాగిస్తున్నారు.

ఇక ప్రస్తుతాంశం లబ్ధప్రతిష్టులైన సాహితీ పిపాసువులకు జిజ్ఞాసు వులకు భాషాభిమానులకు పండితప్రకాండులకు ఈనాడు కొత్తగా పరిచయము చేయనవసరము లేని సర్వవ్యాపియైన సకల జిహ్వాగ్రాలం దున నాట్యమాడే పేరొకటుంది. ఆ పేరే – అవధానాచార్య కళాతపస్వి వంటి ఎన్నో బిరుదాలను పొంది శతాధికసన్మానాలు స్వీకరించి, విశ్వ విద్యాలయపు గౌరవ డాక్టరేటును కైవసం చేసుకొని మంత్రులు, గవర్నరు, రాష్ట్రపతి వరకు యెందరెందరో ప్రముఖుల అమృతహస్తాల మీదుగా అవార్డులను, రివార్డులను పొంది, రాష్ట్ర రాష్ట్రేతర సారస్వత మూర్తులు అమితంగా అభిమానించే పేరు; చిన్నా పెద్దా అందరిచేత ఆదరణను పొందే పేరు; డాక్టరు నండూరి రామకృష్ణమాచార్య, ఆచార్య సి.వి.సుబ్బన్న లాంటి మహామహులకు శిష్యునిగా వినమ్రపూర్వకంగా చెప్పుకునే పేరు; ఎందరో శిష్య ప్రశిష్యులను తయారుచేసి సాహిత్యసేవ చేస్తున్నపేరు; తను శ్రమించి తపించి సాధించుకున్న జ్ఞానదీపపు కాంతి కిరణాలను అజ్ఞానతిమిరాల నీడల్లో జీవిస్తున్న నిరుపేద బడుగు బలహీన వెనుకబడిన విద్యార్థుల జీవితాలలో వెలిగింపజేసి తరిస్తున్న ఆర్తులపాలిటి బాంధవుడుగా సమాజసేవ చేస్తున్న పేరు; అవధానాలను విజయ వంతంగా నిర్వహించి నిర్వర్తించి ఆబాలగోపాలం సభాసదు

లను రంజింప చేసి విశేషమన్ననలను పొందిన బహుముఖ ప్రజ్ఞాశాలి వినయశీలి పేరు; ఎన్నో గ్రంథాల ముందుమాటల్లో సమీక్షలరూపంలో పరిష్కరణ రూపంలో అందమైన అచ్చులో కనిపించే పేరు; అనేక వివాహ వేదికలపై సాహిత్య సదస్సులలో ఆశీస్సులరూపంలో ఆవిష్కరణసభల్లో ఆవిష్కర్త రూపంలో కనిపించే పేరు; ఆకాశవాణి ప్రసంగాల రూపంలో శ్రోతల శ్రవణాలతో మారుమోగే పేరు; సౌమ్యభాషణుడిగా సహృదయశీలిగా సౌజన్యమూర్తిగా పిన్నలకు స్ఫూర్తిదాతగా నిగర్వి గా నిరాడంబరుడుగా కవిసమ్మేళనాలలోగళమెత్తిన కవికోకిలగా ఆర్జించు కొన్నపేరు;ఆధ్యాత్మిక వాదిగా అందరి మనసులను దోచుకొన్న ప్రేమాస్పదుడుగా ఖ్యాతిగన్న పేరు; ఆ పేరు చిన్నదే! కాని సంపాదించుకున్న కీర్తి గొప్పది.అందరూ బాగుండాలని సాహిత్యానికి యింకా మంచిరోజులు రావాలనీ సరస్వతీ పుత్రులు వర్ధిల్లాలనీ కోరుకునే నిజమైన ఆశావాదులు ! డాక్టర్ ఆశావాది శేముషీ విభవాన్ని గురించి నేను చెప్పబూనడం ప్రచండసూర్యుణ్ణి దివిటీతో చూపినట్లే!

డా॥ ఆశావాది యొక్క ఆప్తమిత్రులు ఆత్మీయబంధువులు అభిమానులు శిష్యపరంపర అధిక సంఖ్యలోగల కర్నూలుజిల్లాలో ఆయనకు అనుబంధం విశిష్టమైనదీ, విడదీయలేనిదీ! 2-6-72 మొదలుకొని 31-12-93 వరకు కర్నూలుజిల్లాలోని చిన్నాపెద్దా పట్టణాలలో అవధానిగా ఆశావాది పాల్గొన్న 28 అవధానాలు ఆయన జీవితంలో మధురమైనవీ! మరువరానివీ!

అలా ఆయా అవధానసభలకు సంబంధించి పృచ్ఛకులు సంబంధి ంచిన ప్రశ్న శరాలకు తగినరూపంలో డా॥ఆశావాది యెలా సమాధాన మిచ్చారనే విధానం పాఠకులు తెలుసుకోవాలనే సదుద్దేశంతో వాటిని సమీకరించి ఒక గ్రంథరూపంలో 'అవధాన వసంతం' పేరుతో వరంగల్ డా॥ టి.శ్రీరంగస్వామిగారి నేతృత్వంలో శ్రీలేఖ సాహితివారు ప్రచురించి అవధానాభిమానులైన పాఠకులకు మహోపకారం చేశారు. ఆ గ్రంథం లోని కర్నూలు ప్రాశస్త్యానికి సంబంధించిన అంశాలను పరిశీలిద్దాం.

1.ఉద్దండ కవిమహాశయులు అక్షరమే ఆయుధంగా సొంత పత్రిక 'హితవాది'నే ప్రధాన ప్రచార సాధనంగా చేసుకొని భారత స్వాతంత్ర్య సమరాంగణంలోకి ముందు కురికిన సాహితీయోధులు కీ.శే. వనం శంకరశర్మ అధ్యక్షస్థానీయులు కాగా, లలితకళాసమితి (పత్తికొండ) సేవలు గురించి అవధాని సమాధానం.

**భారతి కంఘ్రిపూజ ప్రతిభారతి చేయుచు పత్తికొండ, వి**
**స్ఫారమనీషులన్ బిలిచి సత్సభలెన్నియొ నిర్వహించు నీ**
**శ్రీరసమౌ కళాసమితి ప్రేక్షకలోకము దన్నుచున్ సుధా**
**శారదనీరదప్రతిమ శాశ్వతకీర్తి వహించు గావుతన్!**

నిరంతర సాహితీసేవలో పునీతమవుతున్న లలితకళా సమితిని అభినందిస్తూ, శాశ్వత కీర్తిని గడించాలని ఆశావాది పలికిన శుభ కామనలు సందర్భోచితంగా భాసిస్తున్నాయి.

2. పెద్దకడుబూరు జిల్లపరిషత్ ఉన్నతపాఠశాల అవధానంలో నిషేధాక్షరిలో మంత్రాలయ రాఘవేంద్రస్వాముల గురించి

**శ్రేయఃఉర్థిజనసుకల్పా! శ్రీయుత! శౌచవశవర్తి! చిన్నన్‌నన్ నీ**
**వాయతకరుణన్ బ్రోవుమ ధీయశ! శ్రీ రాఘవేంద్ర తెల్పున్ నిరతిన్ !**

ఆశ్రితజనులకు కల్పవృక్షమై, పవిత్రత కాలవాలమైన శ్రీస్వామి చిన్నవాడైన తనను కాపాడుకొరకు స్తుతిస్తానన్నాడు. ధీయశ! సంబోధన ద్వారా తనను కూడా ధీశాలిగా చేయుమన్న ఆశాభావం ప్రకటించారు.

3. కర్నూలు ప్రభుత్వ జూనియర్ కళాశాల అవధానంలో ప్రొ. యన్. వి.కృష్ణమూర్తి, ప్రొ. ఎస్.గంగప్ప, షేక్ దావూద్‌కవి వంటి దిగ్గంతుల సమక్షంలో కర్నూలు పట్టణ ప్రాశస్త్యాన్ని ఆశువుగా తెలిపారు.

***తుంగభద్రానదీ తోయపానము జేసి***
***ఏ పురసత్కీర్తి యేపు మీరె***
***షిర్డిసాయీశు నాశీఃప్రభావము జేసి***
***ఏ పురసత్కీర్తి యేపుమీరె***
***సత్యనారాయణస్వామి సన్నిధి జేసి***
***ఏ పురసత్కీర్తి యేపుమీరె***
***హైందవ ముస్లిం సమైక్యభావనజేసి***
***ఏ పురసత్కీర్తి యేపుమీరె***
***ఐహికాముష్మికస్వాంత మతిశయిల్ల***
***సాహితీసదస్సులు దీర్చు సారమెరిగి***
***దైవచింతనమూను సత్పథమెరింగి***
***ప్రథిత కర్నూలుపురమిద్ది వరలుచుండ !!***

ఇక్కడ 'ఏ పురసత్కీర్తి యేపుమీరె' అనే పునరుక్తి అసహజంగా తోచడం లేదంటే దానికి కారణం ఈ పద్యానికి అవధాని అద్దిన సౌందర్యపరిమళమే!

4. కర్నూలులో ఉస్మానియా డిగ్రీ కళాశాలదాతగా పేరొందిన జనాబ్ అబ్దుల్ హక్ గారిని గురించి ఆశువులో పద్యం చెప్పమన్నప్పుడు

**సద్యోజాతసుమంబునాగ నెడదన్ సంస్కారగంధమ్ములన్**
**విద్యోతిల్లగ జేసి నిండు కరుణన్ విద్యార్థిసంఘమ్ములన్**
**విద్యాదానము చేత దన్పె, తనదౌ విత్తంబు వెచ్చించి అ**
**య్యాద్యశ్రీకర సత్పథమ్మునకు శ్రీ హక్ తానె అర్హుండనన్ !**

ఎన్నో విద్యాలయాలను స్థాపించి విద్యారంగానికి ఎనలేని మహోపకారాన్ని చేసి సత్కీర్తిని సొంతం చేసుకున్న అబ్దుల్ హక్‌లాంటి మేధోధీశాగురించి యెంత చెప్పినా తక్కువేనని డా॥ ఆశావాది వర్ణన. ఆ విద్యావేత్త కొండంతకీర్తిని అద్దంలో లాగా కొంచెంగా చూపినా, ఎదలో సద్యోజాతసుమమై సంస్కారగంధాలను విద్యోతిల్లగజేసిన ఆ కరుణామూర్తి మూర్తిమత్వానికి వన్నెలుతెచ్చే పద్యమిది.

5. ఆదోని మహాయోగిని లక్ష్మమ్మ కళ్యాణమండపంలో జరిగిన అవధానంలో శతావధాని శ్రీ అనుమల వేంకటశేషకవి నిషేధాక్షరిలో ఆ మహాయోగిని గూర్చి అడుగగా

**బుధ్నాంశా ! స్వాంతాచ్ఛా ! దధ్నాయాసఘ్న ! పూజ్య ! ధాతృజ్ఞా ! కుం**
**డోధ్నీ ! నీ శిశువున్ నేన్ బ్రధ్నసమా ! లక్ష్మమాంబ ! పాలింపుమమా !**

లక్ష్మమ్మ శివాంశసంభూతురాలు. స్వచ్ఛమైన స్వాంతము గలది. యమ బాధలనుండి తప్పించేది. పూజనీయ. బ్రహ్మజ్ఞాని. నిండైన పొదుగు కలది – అనగా కరుణాక్షీరముచే భక్తులను లాలించేది. సూర్యునితో సమానమైన తేజస్సు కలది. అంటూ ఆమె మహిమాదికం చెప్పినారు. పృచ్ఛకుని బారినుండి తప్పుకోవటానికి స్వయానా దుష్కరప్రాస ఎన్నుకొని, పద్యాన్ని నారికేళపాకంలో నడపటం అవధాని ఆశావాది ప్రజ్ఞకు అద్దంపట్టుతూ ఉంది.

**6. నవ్యసాహితీ సమితి కర్నూలులో కొండారెడ్డి బురుజు – గూర్చి ఆశువులో.**

**రాచరికంపువ్యవస్థను కాచెన్ కాపై యొకండు ఘనమది నాగన్**
**ఈ చిహ్న మిందు నిలిచెన్ చూచెదు వారిట్టి త్రోవ చూచుట మేలా?**

అని చెప్పినారు. ఇందు రాచరికపు వ్యవస్థకు కాపుకాచే పద్ధతి స్వీకరించటం మంచిదా? అనే ప్రశ్న సంధించారు.

7. ఆదోని డిగ్రీకళాశాలలో శ్రీ రాణీ సత్యనారాయణ, విద్వత్కవి శ్రీ పాతూరి సీతారామాంజనేయశర్మ గారి సమక్షంలో ఏపుగా పెరిగిన చెట్లతో విరబూసిన కళాశాల ప్రాంగణాన్ని వర్ణించుమనగా

**కొమ్మల నంటియున్న కొనగుత్తుల సోయగముల్ విభాసిలన్**
**కమ్మని పూవుతావు లెద కాంక్ష దలిర్పగ నాతిదూరమై**
**ఝుమ్మను తేంట్లపాటలు రుహోద్యములన్ వెలయింప, ప్రాంగణం**
**బిమ్మహి బొల్చె నెంతయును ఇంపును పెంపును మంపు నింపుచున్!**

ఇచ్చట 'కొమ్మల నంటియున్న కొనగత్తులు' అనే చోట శ్లేష సహృదయరంజకం. ప్రకృతి పారవశ్యాలను ప్రాంగణంలో నింపుకొని చూపులనాకర్షించే వైనం, ఆకర్షణీయమైన పద్యంలో చెప్పినారు. శ్రీ ఆంజనేయస్వామిని గూర్చి ఆశువులో చెప్పుమనగా–

**స్వామిసేవలో నెవ్వాడు స్వాంతముంచు**
**నాతడే చిరంజీవియై యలరు ననగ**
**నుండె రణమండలాంజనేయుండు ప్రేక్ష**
**ణీయరూపంబుతో భక్తిగేయు డగుచు.**

స్వామిసేవలో మనసు నిలుపువాడే చిరంజీవి యగునని చిత్తశుద్ధితోడి సేవకు ప్రశంసనీయ పద్యాన్ని కానుకచేసినారు.

8. నవ్య సాహిత్య సదస్సు, ఆదోని అవధానంలో మహాయోగిని తిక్కలక్ష్మమ్మ గురించి ఆశువుగా పద్యం చెప్పమంటే–

**హరిజనయై కూడ సిరిజనసన్మాన**
**మందజాలినయట్టి అంచితాత్మ**
**ఉన్మాదిని యనంగ నుత్తమశ్లోకుల**
**పూజలందినయట్టి పుణ్యశీల**
**మనుజమానినియయ్యు ననిమేషభావంబు**
**సవదరించినయట్టి సత్త్వదేహ**
**మౌనముద్రాంగియై మహనీయయోగమ్ము**
**చౌకళించినయట్టి సౌమ్యశీల**
**సతుల పాపటబొట్టు భూషణము గాగ**
**శివశరణశిరోమణి యన్న చెల్వుబూని**
**తిక్కలక్ష్మమ్మ ఆదోనిదీప్తి బెంచె**
**అర్థితతి కెల్ల నాయమ అండయనగ !**

ఆదోని లక్ష్మమ్మ తల్లిని గురించి అంచితాత్మగా పుణ్యశీలగా సత్త్వదేహగా సౌమ్యశీలగా శివశరణ శిరోమణిగా అర్థితతికి అండదండగా ఆమె బహురూప మహిమలను గూర్చి ఒకే పద్యంలో యింత ఉదాత్తంగా భావయుక్తంగా కళాత్మకంగా సముచిత గౌరవాన్నిచ్చి సమున్నత స్థానమిచ్చి ఎవరు అవిష్కరించగలరు?! ఏ భావుకుడు ఏ సృజనశీలి ఏ అక్షరశిల్పి ఏ కళాకారుడు ఏ కవీంద్రుడు ఆయమ సంపూర్ణాకృతిని యింత సందర్భశుద్ధిగా ఔచిత్యభంగం కలగకుండా వర్ణించగలడు? ఏ చిత్రకారుడు రూపొందించగలడు యింత నిండుగా? ఒక్క ఆశావాది తప్ప! లక్ష్మమ్మ తల్లి వ్యక్తిత్వాన్నీ దైవత్వాన్నీ ప్రస్తుతిస్తూ చెప్పిన కవిత కవిత్వపరంగా చూసినా ఆధ్యాత్మిక దృష్టితో వీక్షించినా వర్ణ నాత్మకమైన పద్యరాజంగా చిత్రవర్ణాత్మకమైన రూపచిత్రంగా పరిశీలించినా ఈ పద్యానికి ఈ పద్యమే సాటి! ఈ పద్యమే మేటి!

9. పత్తికొండ జైభారత్ కళానికేతన్ సంస్థను గురించి ఆశుపద్యం కోరగా

**పత్తికొండను విరిదండ పగిది హత్తె ఖ్యాతి**
**జైభారత కళానికేతనంబు**
**అమలసాహితీదీప్తి విశ్వాసమూచి కవులనిందర**
**పూజించుకతన నాత!**

అన్నారు. ఈ సంస్థ సుందరసుమహారంగా పత్తికొండను హత్తుకుంది ప్రస్తుతించడం ఔచితీమంతంగా ఉంది. అదే వేదికలో ఆశావాదిగారికి 'కళాతపస్వి' బిరుద ప్రదానం చేయగా దానిపై స్వీయ స్పందన వినుపించండనగా –

**నాకు కిరీటమున్ దొడిగి నన్నసమాన 'కళాతపస్వి'గా**
**మీ కరుణావలోకనపు మేరల నిల్పితి రబ్బురంబుగా**
**నా కవనంబు నందు నిక నవ్యవిలాసము లీనునట్లుగా**
**ధీకమనీయరీతులను దిద్దెద నాశిషముల్ పొనర్పుడీ !**

అని వినయంగా ప్రకటిస్తూనే ఈ నాటినుండి నవనవోన్మేషంగా నా కవితాకన్యకను తీర్చిదిద్దుతాను, నన్ను ఆశీర్వదించండి అంటూ విన్నవించుకున్నాడు.

10. ఆదోని మహాయోగిని లక్ష్మమ్మ కల్యాణమండపంలో పత్తికొండ కమలా కళానికేతన్ సంస్థ ప్రారంభోత్సవ సభలో చెన్నుశ్రీ దమ్ము తానయ్య, అష్టావధాని కప్పా వేంకట రామరాజు సమక్షంలో సంస్థ కార్యదర్శి శ్రీ సవ్వప్పగారి ఈరన్నను గూర్చి ఆశువుగా పద్యం చెప్పమంటే –

**కమలా కళానికేతన మమరన్ మచ్ఛిష్యు డీరనార్యుడు నిల్పెన్**
**సుమతుల తోడ్పాటున స్నిగ్ధమసృణశోభ**
**విలసిల్ల కవి జనహితుడై !**

అంటూ శిష్యవాత్సల్యాన్ని ప్రకటించినాడు. అదే అవధానంలో ప్రస్తావికంగా

**ఆదోనిపురం బాశావాదికి సాహిత్యపీఠమయ్యెను భళిరా**
**లేదేనిట పల్మారుల్నా దీప్తిన్ కీర్తికాంత నర్తిలనేలా?**

అంటూ తృప్తిగా కృతజ్ఞత ప్రకటించారు.

11. పరిమళ భవనం, మంత్రాలయం ఆదోని కళాశాల జాతీయ సేవాశిబిరం ఆధ్వర్యంలో సర్వశ్రీ గణపతిభట్, పసుమర్తి వేంకటేశ్వర శర్మ, సంతె కడ్లూరు ప్రణేశ భారతి, కమలనాథ్ పంకజ్ (ప్రిన్సిపాల్), అప్పా శేషగిరి శాస్త్రిగార్లు పృచ్ఛకులుగా యతిశ్రీ రాఘవేంద్రులవారిని నిషేధాక్షరిలో వర్ణించమనగా –

**తుంగక్ష్మావాహా ! కళా సంగా ! తత్త్వాబ్ధిజేత ! సత్యాత్మా ! ధీ**
**రంగజ్జ్యోతి పరిమళ సాంగత్య ! రాఘవేంద్ర !**
**సత్కృప గనుమా !**

అంటూ కీర్తించినారు. పావనతుంగ భద్రాతీరవాసులు, సంగీత కళా సాంగత్యం కలవారు తత్త్వవేత్తలు సత్యాత్మకులు ధీరంగజ్జ్యోతియై పరిమళాలతో అలరారు స్వాములవారు శ్రీ రాఘవేంద్రయతీంద్రులు తనపై సత్కృప చూపాల్సిందిగా వేడుకుంటున్నారు శ్రీ ఆశావాది భక్తపరమాణువుగా!

12. సూరన సాహిత్య సంఘము, నంద్యాల అవధానంలో డా॥గెలివి సహదేవుడు శతావధాని గండ్లూరి దత్తాత్రేయశర్మ యామినీ సరస్వతి జి.సుబ్రహ్మణ్య శాస్త్రి కోడూరు శేషఫణిశర్మ ఎ.శ్రీదేవిగార్లు పృచ్ఛకులుకాగా నంద్యాల ప్రశస్తిని గూర్చి

**శ్రీమహానంది భవ్యనాశీస్సుమాల విశ్వకవి**
**యొచు సూరన వెలిగిపోయె**
**రాష్ట్రపతి నుతపదవితో రక్తి నెరపె ప్రీతి**
**నీలము సంజీవరెడ్డి యిచట!**

నంద్యాల సమీపంలోని శ్రీమహానందీశ్వరస్వామి వల్లనూ, కానాల ప్రాంతపు మహాకవి పింగళి సూరనవల్లనూ, నంద్యాలనుంచి పార్లమెంటు ఎన్నికలో నిలిచి గెలిచి దేశ రాష్ట్రపతి వంటి అత్యున్నత స్థానానికెదిగిన డా॥ నీలం సంజీవరెడ్డి వల్లనూ నంద్యాలకు కీర్తిప్రతిష్ఠలు విశేషంగా చేకూరాయి. ఈ మూడు అంశాలే నంద్యాల ప్రాశస్త్యానికి ప్రధాన కారణాలుగా అవధాని వాక్రుచ్చినాడు.

13. గణేశ ఉత్సవ కమిటీ; ఎన్.ఆర్.పేట కర్నూలు కమిటీ నిర్వహించిన అవధానం విజయం నిజంగా సార్థకనామధేయ. ఎందుకంటే కవన సమరక్షేత్రంలో అతిరథ మహారథులనదగిన అవధాన కవీశ్వరులు పాల్గొన్న అపురూపసదస్సది. శతావధాని బ్రహ్మశ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ అధ్యక్షత వహించగా శతావధాని సి.వి. సుబ్బన్న సభా సమీక్షకులు కాగా డా॥ మేడసాని మోహన్ గండ్లూరి దత్తాత్రేయశర్మ, ఆశావాది ప్రకాశరావు, మాడుగుల నాగఫణిశర్మ లాంటి ఉద్దండులు ఒకే వేదికపై ఏకకాలంలో సభలో పాల్గొనడం అత్యంత ప్రాధాన్యతని సంతరించుకుంది. పురాణపఠనం అప్రస్తుత ప్రసంగం న్యస్తాక్షరి తప్ప మిగతా అంశాలన్నిటిలో ప్రశ్నలన్నీ ఒకే విధమైనవి. ఆయాక్రమంలో ఆయా అవధానులు భిన్నరూప సమాధానాలివ్వటం విశేషం. సభా నిర్వాహకులు డా॥ శివభూషణం గారిని గురించి ఆశావాదిగారు

**నవరాగోదయసిద్ధిన్ కవితాజ్యోత్స్నా విభూతికారణమై**
**శ్రీశివభూషణేందుకిరణము ప్రవిమలసత్కీర్తి**
**నంది పావనమయ్యెన్ !**

అంటూ చెప్పిన పద్యంలో 'కవితాజ్యోత్స్నావిభూతి', 'నవరాగోదయసిద్ధి', 'ప్రవిమల సత్కీర్తి', 'శివభూషణేందు కిరణము' అనే పద ప్రయోగాలు విలక్షణమైనవి. భావార్థాన్ని సారవంతం చేయగలిగినవి అలంకారమైనవీ కావడం విశేషం.

14. శ్రీ వాసవీ కళాశాల చాగలమర్రి సభలో మీకు సంతోష కారణమైన అంశాన్ని పద్యంలో తెల్పండనగా

**సాహితీ ప్రియంభావుకస్వాంతములకు**
**సారసౌరభవాగ్దీప్తి ధారలిడగ**
**ముగ్వురవధానులీ సభ మురుపునొప్పి**
**రిట్టి తజ్ఞుల చెంగట తృప్తిగల్గు !**

అంటూ మాచిరాజు మద్దూరి సుధాకరశర్మ అనే ముగ్గురు అవధానులు ఈ సభలో పాల్గొనడం యెంతో ఆనందదాయకంగా వుందని సాటి అవధానుల ప్రగతికి సంతోషాన్ని వ్యక్తపరచడం సహజ సుందరంగా రాణించింది. అంతేకాక

**వైద్యవృత్తిలో జ్ఞానంబు పాదుకొల్పి శుభకళా**
**కుముద్వతి మేలు జూచువాడు**
**రామిరెడ్డి గుణాఢ్యసారస్వతాత్ముడుండు**
**టెంతయు నానందమొందజేసె.**

అంటూ వృత్తి వేరైనా ప్రవృత్తి సాహిత్యమైన వారిని అభినందించే సౌహృదం చాటినారు.

'ఆశావాది అవధానం వసంతం' అనే గ్రంథానికి ప్రకాశకులు శ్రీలేఖసాహితి వారుకాగా ఈ గ్రంథం డా॥ నండూరి రామకృష్ణమాచార్యులవారి ఆశీతిజన్మదిన మహోత్సవ సందర్భంగా వెలువడింది. చివరగా డా॥ ఆశావాది కర్నూలు జిల్లాలో నిరంతరాయంగా సాహిత్య సభలు నిర్వహిస్తున్న పత్తికొండ 'కమలా కళానికేతన్'కు చేయూత నిస్తున్న 'సహృదయ మండలి'కి అంకితం యిచ్చారు. ఇందులో ఎంతో ఔచిత్యం ఉంది. ఎందుకంటే పత్తికొండ కమలానికేతన్ సంస్థకూ, ఆ సంస్థ కార్యదర్శి శ్రీ సవ్వప్పగారి ఈరన్నకు, అవధానాచార్యులు డా॥ ఆశావాది ప్రకాశరావుగారికి మధ్యగల అనుబంధం గురువుపట్ల శిష్యునికి గల ఆరాధనాభావానికీ, శిష్యునిపట్ల గురువుచూపే పితృ వాత్సల్యానికీ, ప్రేమతత్పరతకూ ప్రతీక. వారిమధ్యగల ఈ బంధం పేగుబంధంకంటె గొప్పదై దినదినాభివృద్ధి చెందుతూ ఎన్నో గ్రంథాలు ప్రచురణకు, మరెన్నో సాహిత్య సౌరభాలను పంచిపెట్టి పత్తికొండను సాహిత్య సంపత్తికొండగా ప్రజలు ముక్తకంఠంతో పిలిచేలా కృషిచేసి అనావృష్టి బాధితప్రాంతమైన ఆ పట్టణంలో నవకవితావర్షధారలతో సాహితీక్షేత్రాలను సస్యశ్యామలం చేసి సుభిక్షంగా, సురక్షగా రూపొందిన వారి అనుపమాన కార్య శూరతకూ, అవిశ్రాంత పటుతర దీక్షాదక్షతలకు వేదికగా మారిన 'కమలాకళానికేతన్'కు ఈ పుస్తకం అంకితం ఇవ్వడం – హర్షణీయం ! అభినందనీయం ! అభిలాషణీయం !

# వైకుంఠపురం - శ్రీ వేంకటేశ్వరస్వామి

అమరావతికి తూర్పుదిక్కున వైకుంఠపురం సాక్షాత్తు వైకుంఠంలాగే ఉంటుంది.
కృష్ణానది ఇక్కడ ఉత్తరవాహిని. ఈ ప్రాంతంలో రెండు శ్రీ వేంకటేశ్వర ఆలయాలు ఉన్నాయి.
కొండపైని ఆలయంలో స్వామి స్వయంభువు. కింద వున్న
ఆలయాన్ని దిగువ తిరుపతి అంటారు. పైనున్న స్వామి పశ్చిమాభిముఖంగానూ
దిగువనున్న స్వామి ఉత్తరాభిముఖంగానూ భక్తులకు దర్శనమిస్తారు.
విజయవాడ నుంచి 33 కి.మీ. దూరం.

శ్రీమతి మందరపు హైమవతి

# కృష్ణాతీరంలో స్త్రీవాద సాహిత్యం - ఎగరేసిన పతాకాలు

నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, శ్రీనాథుడు, పోతన, పెద్దన, తిమ్మన ఈ పొడుగైన జాబితాలో పొరపాటున కూడా ఎక్కడా ఏ కవయిత్రి పేరు కనిపించదు. 15వ శతాబ్దం మొదలుకొని తాళ్ళపాక తిమ్మక్క, మొల్ల, రంగాజమ్మ, ముద్దుపళని, తరిగొండ వెంగమాంబ మొ॥ కవయిత్రులు ఎన్నోకావ్యాలు రచించినా వారిపేర్లు ఎవరూ ప్రస్తావించరు. 20వ శతాబ్దంలో తల్లాప్రగడ విశ్వసుందరమ్మ, చావలి బంగారమ్మ – సౌదామిని – బసవరాజు రాజ్యలక్ష్మమ్మ మేటి కవయిత్రులుగా ప్రసిద్ధి పొందినా తెలుగు సాహిత్యంలో కవయిత్రుల చిరునామాలేదని బుకాయిస్తారు.

పురుషకవులు తాము రాసిన కావ్యాల్లో స్త్రీలను అందాల ప్రతిమలుగా అభివర్ణించారు. కేవలం పడకటింటికే పరిమితం చేసారు. భక్త కవి పోతన దగ్గరనుంచి శృంగార కవి శ్రీనాథుని వరకు అతివల అంగాంగ వర్ణన చేసి స్త్రీలకు శరీరం తప్ప మనసు లేదని ఢంకా బజాయించి చెప్పారు. వారికి సొంత అభిరుచులు, అభిప్రాయాలు, వ్యక్తిత్వం లేదని, అక్కర్లేదని నిర్ణయించారు.

వైదిక యుగంలో మంత్రద్రష్టలుగా, స్రష్టలుగా, ఋక్కుల్ని రచించి వైభవ దశలోనున్న మహిళలను మధ్యయుగాల్లో పాతాళానికి అణచిపెట్టారు. ఆమెచుట్టూ సంప్రదాయాల చెరసాలలు నిర్మించారు. ఆచారాల ఊచలలో నిర్బంధించారు. నిషేధాల పంజరాలలో బంధించారు. అక్షరాల సూర్యోదయాలు ఆమె జీవితంలో వుండ కూడదని ముక్త కంఠంతో నొక్కి వక్కాణించారు. అంతఃపురాల్లో అందమైన ఆటబొమ్మగా వుండమన్నారు. బయటనుంచి ఒక చిన్న వెలుతురు చార కూడా చొరనీయకుండా చుట్టూతా చీకటి తెరలు కప్పారు. గాలి ఆడకుండా చేసి మృతప్రాయులుగా చేసారు. ఊపిరివిరుల రేకలను తుంచేసారు.

ఆధునిక కవులు స్త్రీల శరీరాలను వర్ణించకపోయినా, కలల ప్రేయసులుగా, ఊహా ఊర్వశులుగా వర్ణించారు. ఒకరిద్దరు కవులు మినహాయించి. తిలక్ కూడా "వర్ణనీయ వస్తువే తిరగబడి వర్ణిస్తుంటే అని స్త్రీని ఒక వస్తువుగా చిత్రించాడు. చలం మాత్రం స్త్రీకి కూడా శరీరం వుంది. దానికి వ్యాయామం ఇవ్వాలి. ఆమెకు మెదడు వుంది. దానికి జ్ఞానం ఇవ్వాలి. ఆమెకు హృదయం వుంది. దానికి అనుభవం ఇవ్వాలి అన్నాడు. కందుకూరి వంటివారు స్త్రీ విద్యకోసం ఉద్యమించారు.

సంఘసంస్కర్తలు, సహృదయుల ప్రోత్సాహంవలన స్త్రీలు చదువుకొన్నారు. రాజకీయాల్లో, కళల్లో రాణించారు. ఈ నేపథ్యంలో 80ల్లో తెలుగులో స్త్రీవాద కవిత్వం ఒక ప్రభంజనంగా దూసుకు వచ్చింది. తెలుగు కవిత్వాన్ని ఒక కుదుపు కుదిపింది. పితృస్వామ్య భావజాలాన్ని ధిక్కరించింది. పురుషాహంకారంపై ఆయుధాలెక్కు పెట్టింది. సంప్రదాయాలను ప్రశ్నించింది. సనాతనాచారాలపై ధ్వజమెత్తింది. మగకవులు వర్ణించినట్లుగా తమకు దేహాలు మాత్రమేగాక అంతరంగాలున్నాయని, ఆవేదనలున్నాయని చెప్పింది. తాము మాత్రమే అనుభవించి, తాము మాత్రమే చెప్పగల అనుభూతులకు నిస్సంకోచంగా, నిర్భీతిగా అక్షరరూపమిచ్చారు.

**వాణీ రంగారావు :**

స్త్రీవాద సాహిత్యం అని పేరు పెట్టకముందే స్త్రీవాద ధోరణితో రాసిన కవయిత్రి వాణీ రంగారావు ఈమె కవితలు నీలిమేఘాలు, గురిచూసిపాడేపాట సంపుటాల్లో ప్రచురించబడ్డాయి. 'తరతరాల శత్రువు' కవితలో పురుషుడు స్త్రీకెలా శత్రువౌతున్నాడో చెప్తారు. తన రక్తాన్నీ, తన మాంసాన్నీ పంచి, నవమాసాలు మోసి కనిపెంచుతుంది కన్నతల్లి. ఐనా పెరిగి పెద్దయ్యాక కన్నకొడుకే కన్నతల్లిని నిరాదరిస్తాడు. గుండెను ఓ గాయాల పెట్టెగా మారుస్తాడు. ఆ సందర్భంలో ఆ కొడుకే పితృస్వామ్య దురహంకారం సృష్టించిన ఒక బలవంతుడైన శత్రువు. ఆ భావాన్నే ఈ కవితలో సూటిగా గుండెల్లో గుచ్చుకొనేట్లు చెప్తారు.

లోపలంతా కలియదిరిగి । అల్లరి చేసిన నువ్వు । ఇవాళ నాకారో ప్రాణం అవుతావని । అస్త్రారు పదంగా కాపాడుకుంటూ ఇంతవాణ్ణి చేస్తున్నప్పుడు తెలీదు । నువ్వు నాలోంచి వచ్చి శత్రువర్గపు మొలకవని నన్నే గడ్డిబొమ్మగా నిలబెట్టిన । దోపిడీదారుడికి వారసుడవని । నా స్తన్యం పీలుస్తూ నువ్వు రక్కిన । గాయాలమచ్చల్ని । ఆనందంగా తడుముకొంటున్నాను । నాకొక్కటి తెలీదు । వర్గ శత్రుత్వం చచ్చిపోదని" అని తీవ్రంగా పురుషాధిక్యభావాలను ఖండిస్తారు.

ఆడపిల్లలకు పెళ్ళయిన వెంటనే పుట్టిల్లు పరాయిదౌతుంది. కొడుకులకు మాత్రమే తల్లిదండ్రుల ఇంట్లో సమస్తహక్కులు వుంటాయి. పెళ్ళి విఫలమై పుట్టింటికొచ్చిన ఆడపిల్లను ఎంతో నీచంగా హీనంగా చూస్తారు. కానీ ఆడపిల్లకు మాత్రం పెళ్ళికాకముందు, పెళ్ళయ్యాక పుట్టిల్లంటే ఎంతో అభిమానం వుంటుంది. దీన్నే కవయిత్రి 'తివాచీ' కవితలో తొలిగా నువ్వు పుట్టిన ఇంటిని పిచ్చిగా ప్రేమిస్తావు. ఎంత పిచ్చిగా అంటే ఆ ఇంటి గోడలలో దాక్కున్న ప్రతి ఇటుకా నాదే నన్నంతగా ఆ యింటి చూరుకు వేలాడే పిచ్చుక తల్లి తన గూటిని ప్రేమించినంతగా । " అని అంటారు. ఇంతగా ప్రేమించినా వాస్తవంలో మాత్రం పరిస్థితులు భిన్నం. "నువ్వు పుట్టినప్పుడే నీ తండ్రికి వేదన మొదలవుతుంది. నువ్వు పుట్టినప్పుడే నీ తల్లి గుండెకు మొదటిచిల్లు పడుతుంది" అంటారు. నిజం అంతేగదా! ఆడపిల్ల పుట్టిన వెంటనే తండ్రి అయ్యో! ఆడపిల్ల పుట్టిందే అని బాధపడతాడు. ఎలాటి భర్త వస్తాడో? జీవితం స్వర్గమౌతుందో, నరకమౌతుందోనని తల్లి క్షోభిస్తుంది. స్త్రీకి పెళ్ళై పిల్లలు పుట్టేంతవరకే ఆనందం. పిల్లాడు పెద్దయ్యాక భ్రమలు తొలగిపోతాయి. చిన్నప్పుడు తల్లితోనే జీవితమనుకొన్నవాడు క్రమంగా ఆమెకు దూరంగా జరిగిపోతాడు. అప్పుడా తల్లి బ్రతికున్నా చచ్చిపోయినట్లు దీన్నే కవయిత్రి "ఆర్ద్రతలూ, ఆప్యాయతలూ అవసరాలై నువ్వు చచ్చిపోతావు పిచ్చితల్లీ! ఊపిరి పీలుస్తూనే ఉన్నావుగానీ చచ్చిపోయావు, చచ్చిపోతున్నావు" అని ప్రేమ రాహిత్యంలో స్త్రీ బ్రతుకు ఎంత దుర్భరమో వర్ణిస్తారు. జీవన వాస్తవాలను ధైర్యంగా చెప్పడం ఈమె లక్షణం. చిలకలూరిపేటలో జన్మించిన ఈమె దీపం, వెలుగు నగరం కవితా సంకలనాలు ప్రచురించారు. "జీవనవాహిని" మహిళలే కళ్ళు తెరిస్తే నవలలు రాసారు. "వెలుగు బాటలో సోవియట్ మహిళ" పుస్తకాన్ని అనువాదం చేసారు.

## రేవతీదేవి :

స్త్రీ అంటే శరీరమే అని నిర్వచించిన సందర్భంలో శరీరమంటే కేవలం కొన్ని అవయవాల సమూహం కాదని, విభిన్నమైన అనుభూతులతో స్పందించే మనసుతో కూడినది అని స్త్రీవాదులు చెప్పారు. తన అంతరంగపు లోలోపలి స్పందనలను హృదయాలను తాకేటట్లు రచించిన కవయిత్రి రేవతీదేవి. "అనురాగదగ్ధ సమాధి" కవితలో ప్రణయానుభూతిని "ఈ హృదయం/ రసజ్వలిత దాహంతో వెచ్చగా విచ్చుకొన్న నెత్తురు పువ్వు । వేడినెత్తుటి తీగలై సాగిన యీ చేతుల బిగింపుతో । ఆ మెత్తని నున్నటి గట్టి శరీరం చిదకనిదే । ఈ సెగ చల్లారదు" అని గాఢమైన ప్రణయాన్ని ప్రవాహశైలితో వర్ణిస్తూ "ఆది శంకర సౌందర్యలహరిలో పునీతమై తను । రాధామాధవ నైతికా ద్వైత సమాగమంలో పవిత్రమై నేను । తనువంతటా మనసైన । మనసంతటా తనువైన । నేనైన తనలో పరిపూర్ణమై మేము..." అని ఇద్దరి శరీరాలు, మనసులు వేరు కాదని, అంటూ "ఈ కామ మోక్ష మోక్షకామ అశాంతులు అగ్నిగోళ । మహారణ్యాల కాంక్షా సౌందర్య తాండవకీలల్లో । దగ్ధమై ప్రభవించి । ప్రభవించి దగ్ధమై । రమిస్తే శమిస్తే దమిస్తే శాంతి శాంతి అంటూ మన చెయ్యి పట్టుకొని తన ప్రణయలోకంలోకి, ఆ రస జగత్తులోకి తీసుకువెళ్తుంది.

పితృస్వామ్య సమాజంలో స్త్రీకి ఒక నీతి పురుషునికొక నీతి. బహు భార్యాత్వం ఈ కాలంలోను మగవాడు రెండు పెళ్ళిళ్ళు చేసుకొంటాడు. సంఘం ఏమీ అనదు. పైగా అతణ్ణి రసికుడు అని మెచ్చుకొంటుంది. కానీ స్త్రీ మాత్రం ఒకరినే పెళ్ళి చేసుకోవాలి. అతణ్ణే ప్రేమించాలి. పెళ్ళి చేసికొన్నాక పరాయివాణ్ణి ప్రేమిస్తే అది నిషిద్ధ ప్రేమ. లోకులుకాకులై ఆమెను పొడిచి పొడిచి చంపుకుతింటారు. "నిష్క్రమణ" కవితలో దాన్నే వ్యక్తీకరిస్తుంది కవయిత్రి". నువ్వంటే నాకెంతో ఇష్టం । ఎవరంటేనూ లేని ఇష్టం । ఎన్నో రకాల అన్ని ఇష్టాలకి అతీతమైన ఇష్టం । నువ్వంటే నాకలాంటి ఇష్టం వుంటే। ఈ లోకానికేదో అవతుందట । అందుకని । నీ నుంచి పారిపోవాలని । నువ్వున్నావని ఊళ్ళోంచి వెళ్ళిపోయాను । నువ్వున్నావని హృదయం లోంచి ।" అని లోకంలోనుంచే వెళ్ళిపోవడాన్ని వ్యక్తీకరిస్తుంది. తాను మరణించి ఈ ద్వంద్వ నీతుల సమాజాన్ని ధిక్కరిస్తుంది. ఈ తమ్ముళ్ళ నెత్తురు, నీలం నిప్పు పువ్వు, శతతంత్రులరసవీణ, నెత్తురు పువ్వు మొ॥ కొత్త రూపకాలతో, గాఢానుభూతితో ఈమె కవితలు పాఠకులపై ప్రగాఢ ముద్రవేస్తాయి. 30 ఏళ్ళ చిరుప్రాయంలో మరణించాక ఆమె కవితలను 'శిలాలోలిత' పేరుతో ప్రకటించారు.

## ఓల్గా :

వివిధ సాహితీ ప్రక్రియలలో ఎన్నో రచనలు చేసి స్త్రీవాద ఉద్యమానికి స్ఫూర్తి నిచ్చిన రచయిత్రి. ఈమె రచించిన స్వేచ్ఛ నవలను

నేషనల్ బుక్ ట్రస్ట్‌వారు భారతీయ భాషలన్నిటిలో అనువదించారు. ఇటీవల ఈమె రచించిన "విముక్తి కోసం" కథా సంపుటకి సాహిత్య అకాడమీ బహుమతి లభించింది. "నీలి మేఘాలు" కవితా సంకలనాన్ని ప్రచురించి ఎందరో కవయిత్రులను ప్రోత్సహించారు.

కుటుంబంలో స్త్రీ పురుషులు ఇద్దరూ సమానమే. భార్యా భర్తలు సమానమే అంటారు కానీ పురుషాధిక్య సమాజంలో భర్తదెప్పుడూ పైచేయి. భార్య భర్తకు నీడలా వుండాల్సిందే. కాలమెంతమారినా ఇక్కడ మాత్రం ఇంతే భార్యాభర్తలు ఒకరంటే ఒకరికి ఇష్టంలేకపోయినా సమాజంకోసం ఒకే ఇంట్లో, ఒకే గదిలో కలసి వుంటారు. 'దాంపత్యం' అనే కవితలో దీన్నే చెప్తారు. "ఆదర్శ దంపతులారా! మీరు। చేరువకాక తప్పదనే । సామాజిక పెనుపాముల బుసలకు । ఉలిక్కిపడి పెనవేసుకుంటాం । అంటూ బలవంతపు దాంపత్యాన్ని వ్యాఖ్యానిస్తూ" ఏ అసంకల్పిత చర్యలో రేగి । ఏ నరాలో కదలబారి । ఇక తప్పనిసరై । ఇద్దరం కలిసే విడివిడిగా స్వయం తృప్తి సాధిస్తాం । అంటారు. "ఒకరి కొకరు వస్తువులమైనప్పుడు । ఒకరికొకరు ఆస్తులమైనప్పుడు । ఒకరికొకరు అక్కర్లేని మనం । మరెవరికీ చెందకుండా । లక్ష వత్తుల సామాజిక రక్షణా యజ్ఞం నిరంతరం సాగుతూనే వుంటుంది." అని దాంపత్యంలోని డొల్లతనాన్ని నిజాయితీగా, నిర్ద్వంద్వంగా విమర్శిస్తారు. ఈ పితృస్వామ్య సమాజాన్ని కళ్ళకు కట్టినట్లుగా వివరిస్తారు.

స్త్రీ ఒకప్పుడు పతివ్రతగా, ప్రబంధకన్యగా, అందాలబొమ్మగా ఎన్నో ఆగచాట్లు పడింది. ఆధునిక స్త్రీ ఎలా వుండాలో ప్రతి స్త్రీ ఒక నిర్మల కావాలి" లో "రేపు । నేను పతివ్రతామ తల్లిని కాను । ప్రబంధ కన్యను కాను । పంచదార చిలకను కాను । ఫ్యాషన్ పెరేడ్ బొమ్మను కాను । పసిపాపల చంపే పాపిని కాను । పంచాద్రి నిర్మల వారసురాలిని!" అని అంటారు. తరతరాలుగా దోపిడీ చేయబడుతున్న స్త్రీలు ఇక సహించకూడదని, ధైర్యంగా సంఘాన్ని ఎదిరించే పంచాద్రి నిర్మల వారసులుగా మారాలని ఆకాంక్షిస్తారు.

## కొండేపూడి నిర్మల :

కొండేపూడి నిర్మల అనగానే "లేబర్ రూమ్" కవిత గుర్తుకు వస్తుంది. పితృస్వామ్య సమాజం అనగానే స్త్రీలపై కొన్ని భావజాలాలు ప్రభావం చూపిస్తాయి. ఈ భావజాలాల్లో మాతృత్వం ప్రధానమైనది. 'ఆడజన్మే మధురమని', 'మాతృదేవత' అని అతిశయోక్తులు చెప్పారు. పిల్లల్ని కంటేనే స్త్రీ జన్మకి సార్థకత అని, పిల్లలు లేనివారిని గొడ్రాలు అని ఈసడించారు. సంతానం కోసం యజ్ఞాలు చేసారు. సంతానం అంటే మగపిల్లలు అనే అర్థం. పుత్రకామేష్టులు చేసారు. 21వ శతాబ్దంలో కూడా ఈ పుత్ర వ్యామోహం పోలేదు లింగ నిర్ధారణ పరీక్షలు వచ్చి కడుపులో వున్నది ఆడపిల్లైతే కడుపులోనే అంతమొందిస్తున్నారు. ఇద్దరి స్త్రీల మధ్య సంభాషణ 'పిల్లలెందరు?' తోనే ప్రారంభమౌతుంది. పిల్లకు పాలిస్తున్న తల్లి శిల్పాలకు, చిత్రాలకు విపరీతమైన ఆకర్షణ సమాజంలో. కానీ వాస్తవంలో బిడ్డను కనడమెంత నరకమో తన లేబర్‌రూమ్ కవితలో చెప్తారు నిర్మల. "ప్రపంచంలోని నరకమో । నరకంలోని ప్రపంచమో । త్రీడీలో చూస్తున్నట్టే వుంటుంది । కాళ్లనలా ఎడంచేసి దీనంగా హీనంగా నీచాతి నీచంగా । ఒక హింసాతల పరాకాష్ఠకోసం ఎదురు చూడ్డమంటే । రైలు పట్టామీద నాణెం విస్తరించిన బాధ" అని ప్రసవంలోని ఘోషాదాన్ని విప్పి చెప్తారు. ప్రసవమంటేనే స్త్రీకి పునర్జన్మలాంటిది. పిల్లల్ని కనలేక ఎంతోమంది తల్లులు మరణించిన సందర్భాలు మనకు గుర్తుకు వస్తాయి ఈ కవిత చదువుతుంటే.

నిర్మల స్త్రీలు ఎదుర్కొనే విభిన్న సమస్యల గురించి స్పందించి ఎన్నో కవితలు రాసారు. ఏ దేశంలోనైనా వేశ్యల సమస్యలొకటే. బయట పెద్ద మనుషులందరూ చీకటి పడగానే వాళ్ళ దగ్గరకు వెళ్ళి కోరికలు తీర్చుకొంటారు కానీ సంఘంలో వేశ్యలకు గౌరవం వుండదు. వారి పిల్లలను బళ్ళో చేర్చాలంటే ఎన్నో సమస్యలు. నాన్న పేరడుగుతారు. ఏమని చెప్తారు? వాళ్ళ ఆవేదనను అక్షరీకరిస్తూ మర్యాదస్తులంతా వాళ్ళ నాన్నకే పుడతార్ట! మేం అమ్మ కడుపున పుడతాం । బడికెళ్ళి దోసెడు గుణకారాలు వల్లించాలంటే । నాన్నల్ని కొనాలి కిలో ఎంత" అని మెహందీ స్త్రీల పిల్లలు సంఘంలో మిగతా పిల్లల్లాగే చదువుకోవాలనుకొని గాయపడిన హృదయాలతో అడిగిన ప్రశ్నలివి. కవిత్వమే మమేకమై జీవిస్తున్న నిర్మలగారు సందిగ్ధ సంధ్య, నడిచేగాయాలు, బాధాశప్తనది, మల్టీనేషనల్ ముద్దు, నివురు మొ॥ కవితా సంపుటులతోపాటు 'శత్రుస్పర్శ' కథా సంపుటిని రచించారు. విజయవాడ వీరి జన్మస్థలం.

## ఘంటసాల నిర్మల :

స్త్రీవాద కవితలుగా ప్రసిద్ధి చెందిన వీరి కవితలు జుగల్‌బందీ, ఏ కాల్‌గర్ల్స్ మోనోలాగ్. స్త్రీకి శృంగార వాంఛలు వుండకూడదనీ ఉన్నా బయటకు చెప్పడమే నేరమైన చోట. స్త్రీ పురుష సమాగమాన్ని అత్యద్భుతంగా, అత్యంత సహజంగా వర్ణించారు. "వాంఛాస్నానానికి ఉద్యమించి । ఆత్మలు రెండు । నిలువెత్తు నిస్సిగ్గుకి నిర్వచన భంగిమలవుతాయి" అంటారు. మరో కవిత "ఎ కాల్ గర్ల్స్ మోనోలాగ్"

అమానవీయమైన వేశ్యల భయంకర జీవితాన్ని" వేలవేల వీర్యాల వర్షాల్ని । కళ్ళు మూసుకునయినా భరిస్తున్నదాన్ని । రంగులు చిట్లిన రతి రోతకు జ్వరిస్తున్న దాన్ని అని ఈ సమాజంలో అలాటి స్త్రీల శరీరాలను, జీవితాలనూ ఎలా దోచుకుంటున్నారో వెల్లడిస్తారు. ప్రస్తుత వ్యవస్థపై తీవ్రమైన ఆగ్రహం ఈ కవితలో కనిపిస్తుంది. విజయవాడలో జన్మించిన వీరి కవితా సంపుటి నిర్వచనం. స్త్రీ వాద సాహిత్యంలో సంచలనం కలిగించిన కవితలివి. వీర్య వర్షం, రతిరోత పదాలపై స్త్రీలు ఇలాటి పదాలు రాయడమేమిటని సంప్రదాయవాదులు ధ్వజ మెత్తారు.

**పాటిబండ్ల రజని :**

పాటిబండ్ల రజని అనగానే అబార్షన్ స్టేట్‌మెంట్ కవిత గుర్తుకు వస్తుంది. కొన్ని సమస్యలవలన బిడ్డను కనలేక అబార్షన్ చేయించుకొన్న కన్న తల్లి వేదనను చిత్రిక పట్టిన కవిత ఇది. "పాలింకి పోవడాని కున్నట్లు । మనసిరికిపోవడానికి । మాత్రలుంటే ఎంత బావుండు" ఈ పంక్తులు ఎవరి మనసులోనైనా సూదుల్లా గుచ్చుకొంటాయి.

భారతీయ సమాజంలో భార్యాభర్తలు చాలామంది ఉత్తర దక్షిణ ధృవాల్లో వుంటారు. ఒకే యింట్లో వుంటూ, యుద్ధరంగంలో శత్రువుల్లా కలహించుకొంటూ వుంటారు. ఈ క్షణమో, మరుక్షణమో విడాకులిచ్చు కొనేలా ద్వేషించుకొంటారు. అంతలోనే మళ్ళీ రాజీపడతారు. దీన్నే "ఛీ మొహం చూడనన్నంతటి ద్వేషాన్నీ, థూనువ్వెంత పొమ్మన్నంత దోషాన్ని మొదలంటా తవ్విపోసి । ఎప్పటికప్పుడు కొత్త ప్రమాణాలు అట్టహాసంగా । నాటుకునే ఈ రాజీవనమహోత్సవాలు । మానవోన్న తులమై చేసే మార్జాల దాంపత్యాలు" అని దాంపత్యాలలోని బోలు తనాన్ని ఆవిష్కరిస్తారు. తిరువూరులో జన్మించినవీరు 'ఎర్రజాబిళ్ళ ఎరీనా' కవితా సంపుటినీ, మామగారి కథలు జేబు కథా సంపుటిని ప్రచురించారు.

**మందరపు హైమవతి :**

మందరపు హైమవతి పేరు చెప్పగానే గుర్తుకువచ్చే కవిత సర్ప పరిష్వంగం. పితృస్వామ్యయుగంలో భర్త ఎలాంటివాడైనా భార్య జీవితాంతం అతడితోనే కాపురం చెయ్యాలని భర్తే ప్రత్యక్షదైవమని ఎన్నో భావాలు నరనరాల్లో పతివ్రతా ధర్మాలు నూరి పోసారు. కానీ మానవ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలుగా పరిణమించి వివాహం వ్యాపారమయ్యాక, భార్యాభర్తలు ఆనందించే సమయంలో గూడ భర్త భార్యను జీతమడుగుతాడు. భార్య భర్తను తన శరీరంనుంచే కాకుండా, జీవితంలోనుంచి విదిలించి వేయాలనుకొంటుంది. కానీ వాస్తవంలో అలా ఆ భర్త పరిష్వంగంలో బతకక తప్పనిస్థితిని వర్ణిస్తుంది. మధురానుభూతుల్ని కలిగించవలసిన పరిష్వంగం ఎలా జుగుప్సా కరంగా పరిణమించిందో ఈ కవితలో వివరిస్తుంది.

ద్విపాత్రాభినయం కవితలో 21వ శతాబ్దంలో స్త్రీలు గూడ ఉద్యోగం చెయ్యవలసిన పరిస్థితులు వచ్చాక మహిళకు ఇంటి పనులతోపాటు బయటిపనులు రెండూ చెయ్యక తప్పని స్థితిలో ఆమె ఎదుర్కొనే సమస్యలు గురించి, వేధించే వేదనల గురించి రాసిన కవిత ద్విపాత్రాభినయం. బయట ఆఫీసులో పరిస్థితులు, సాయంత్రం నలిగిపోయిన న్యూస్‌పేపరులా ఇంటికి రావడం, మళ్ళీ ఇంట్లో పనులు చెయ్యడం, ఈ పనులతో విసుగెత్తిపోయి "అసూర్యం పశ్యల యుగం నుంచి । ఆధునిక కాలం వరకు పయనించినా । అంతః పురంనుంచి విశాల ప్రపంచంలోనికి ప్రవేశించినా నేటి చదువుకొన్న స్త్రీకి తప్పడం లేదు । ద్విపాత్రాభినయం" అంటుంది. విజయవాడలో జన్మించిన ఈమె 'సూర్యుడు తప్పిపోయాడు', 'నిషిద్ధాక్షరి' కవితా సంపుటాలు 'వానచినుకులు' వ్యాససంపుటిని ప్రచురించింది. కన్నడంలో, హిందీలో నిషిద్ధాక్షరి అనువదింపబడింది.

**అంజన :**

గుంటూరులో జన్మించిన అంజన రచించిన అమ్మ – బొమ్మ కవిత శక్తివంతమైన కవిత. ప్రాణంలేని బొమ్మ, ప్రాణమున్నా వ్యక్తిత్వం లేని అమ్మ ఇద్దరూ ఒకటే అని ప్రతీకాత్మకంగా చెప్పిన కవిత ఇది. "బాల్యంలో । బొమ్మకు అమ్మనయ్యానని సంతోషించాను । ఇప్పుడు అమ్మను నేనే । బొమ్మను నేనే" అని చెప్పిన కవితలో చెప్పని ఎన్నో అర్థాలు. చిన్నప్పుడు అమ్మనే సర్వస్వంగా భావించిన కొడుకులు పెద్దయ్యాక అమ్మను లెక్క చెయ్యకపోవడం, ఆమెను ఓ మరబొమ్మలా చూడడాన్ని వివరిస్తుంది ఈ కవిత. అమ్మల దీనస్థితిని చెప్పిన ఈ కవిత మన మనసులపై ప్రగాఢ ముద్రవేస్తుంది.

**బి. పద్మావతి :**

గుంటూరులో జన్మించిన ఈమె రెండు కవితలే రాసినా స్త్రీ వాద ఉద్యమానికి ఊతమిచ్చేవే. "గాయపడ్డ పనిముట్టు" లో స్త్రీని ఒక వస్తువుగా చూచే సంస్కృతిని నిరసిస్తుంది. స్త్రీల బ్రతుకే ఒక గాయం. ఇప్పుడు కొత్తగా గాయపడేదేముంది? దాదార్ ఎక్స్‌ప్రెస్‌లో అత్యాచార బాధితులైన అమ్మాయిని ఉద్దేశించి రాసిన కవిత ఇది. "వెక్కిరింతగా నిలిచిన వీర్యపుచుక్కల్ని । ఒక ధిక్కారపు చీత్కరింపుతో । బహిష్టు

స్రావంలా తుడి చెయ్యలేక । కన్నీళ్ళని వర్షించి వెళ్ళిన ఓ పాపా!" అని దోషం నీది కానప్పుడు, ఆ సంఘటన గురించి బాధ చూపవద్దని అంటుంది. 'గుక్కపట్టిన బాల్యం' ఒక కన్నీటి గాథ. తాగుబోతు తండ్రులు తల్లిని హింసిస్తుంటే ఏంచెయ్యాలో తెలీక, నాన్నచేత తన్నులు తినే తల్లిని ఓదార్చలేక నలిగిన బాల్యానికి భాష్యమిది. తండ్రి అమ్మను కొడతాడు. కొడుకూ తల్లిని కొట్టే ఈ సంఘంలో "అమ్మకావాలి । నవ్వే నక్షత్రంలా అమ్మకావాలి । లాలించే జీవనది అమ్మకావాలి । అమ్మ ఆకాశపు గుండెలమీద ఉయ్యాల లూగాలి । అమ్మకావాలి । నాన్నచేత తన్నులు తినని అమ్మకావాలి ।" అంటుంది. చిన్నారి పిల్లల విషాద బాల్యానికి ప్రతీక ఈ కవిత.

**సుధ :**

సుధ కూడా గుంటూరులోనే జన్మించారు. ఇల్లు ప్రశాంతంగా వుండాలంటే మగవాడి మాట స్త్రీ వినాలి. అలా విన్నంతసేపు జీవితం ప్రశాంతం. ఎప్పుడైతే తన ఆశల ఆశయాల జాబితా విప్పుతుందో అప్పుడే గొడవలు మొదలవుతాయి. దాన్నే "లొంగుబాటు సంగీతాన్ని కాను... కవితలో "లొంగుబాటు సంగీతాన్ని వినిపించి నన్నాళ్ళు । నేను నీ సహచరిని । తిరుగుబాటు సంగీతాన్నయిన నాడు। నీ కంట్లో నలుసుని । అంటుంది. తాను చెప్పినట్లు స్త్రీ వినాలి. ఎదురు తిరిగితే సహించలేడు పురుషుడు.

'నువ్వే' కవితలో నీ సమస్యల గురించి నువ్వే పోరాడాలి. నీ తరపున మరొకరు పోరాడగూడదు అని అంటూ "ఎవరి యుద్ధం వాళ్ళే చెయ్యాలి। నీ యుద్ధం నువ్వే గెలవాలి । నీ రక్తంతో నీ మూలుగతో । నీ కత్తి, డాలూ నువ్వే చేసుకోవాలి" అంటుంది. ఈమె తెనాలిలో జన్మించారు.

**ఏలూరి పార్వతి :**

మచిలీపట్నంలో పుట్టిన ఈమె "సిగ్గు సిగ్గు" కవితతో ప్రసిద్ధులు. 'ఆడదానిగా పుట్టడం కన్నా అడవిలో మాన్నై పుడితే మంచిది' అని సామెత ఉంది. అది ఇప్పటికీ మారలేదు. గొంగళిపురుగు, గాడిద, కుక్క వీటికన్నా స్త్రీ జన్మ హీనమని కవయిత్రి భావం. "ఛ ఏం బతుకిది । ఇంతకంటే జంతువు జన్మ నయమని । గోడమీది గొంగళి పురుగునడిగా । కొన్నాళ్ళు నాలో జీవించమని । అంతటి స్తబ్ధ జీవితం నేగడపలేనంది । ఇలా కుక్క కూడా "మరీ అంత విశ్వాసంతో పడి ఉండలేనంది।" అని పితృస్వామ్య సమాజంలో స్త్రీ బ్రతుకు పశువులకన్నా హీనమని వాస్తవాన్ని చిత్రీకరిస్తుంది.

**మొక్కపాటి సుమతి :**

తరతరాలుగా యుగయుగాలుగా స్త్రీలని మోసం చేస్తున్న పురుషులను పెళ్ళినాడు పురోహితుడు చూపే అరుంధతీ నక్షత్రంలా । ఆకాశంలో సగాన్ని చూపి । మోసం చేస్తున్నాడువాడు।।" అని లైంగిక వివక్షమీద కత్తి ఝళిపిస్తుంది. ఆకాశంలో సగం అంటాడుగానీ వాస్తవంలో మాత్రం ఒక వ్యక్తిగా జీవించడానికే అవకాశంలేదని అంటారు.

**జలసూత్రం పద్మావతి :**

"ఒక హృదయం రాలింది" లో గాయం చేసావ్ । నేత్రంగా మార్చుకున్నాను । బాధ్యతను తోశావ్ । ఆభరణంగా అలంకరించుకొన్నాను । ఒక హృదయం రాలటం మాత్రం । ఏ నేత్రము దర్శించలేదని ।" గాయపడిన స్త్రీ హృదయంలోని వేదనను చిత్రిస్తుంది. గుంటూరులో జన్మించారీమె.

**వర్రె రాణి :**

మచిలీపట్నంలో పుట్టిన ఈమె శక్తివంతమైన స్త్రీ వాదకవితలు రాసారు. కార్చే వేదనగ్నినుంచి పుటంపెట్టినవి ఈమె కవితలు. అంతులేని యాతనలో ముంచి తీసిన అక్షరాలు. సంసారంలో ఉన్న అసమానతలను ధిక్కరిస్తూ "నిజానికి నేనిప్పుడు ఉనికి గురించిగాని । సంసారాల సన్‌గ్లాస్‌ల వెనక లొట్ట కన్నుల సమానత్వం గురించి కానీ స్వప్నించడంలేదు । జననాంగమే ఒక శాపమై అనర్థమైపోయిన వ్యవస్థలో అయోనిగా పుట్టనందుకు అంగలార్చడం లేదు । అడవిలో మానుగా పుట్టడం కన్నా ఆడదానిగా పుట్టడానికి । ప్రత్యేకించి ఆడదానిగానే పుట్టడానికి ప్రిఫర్ చేస్తున్నదాన్ని । నేను సాయంత్రోదయాన్ని । నేను – ఇప్పుడొక కొత్త తల్లిని । ఒక సరికొత్త శిశువును ప్రసవించడానికి నెలలు నిండిన చూలాల్ని" అని 'చూలాలు' కవితలో వ్యాఖ్యానిస్తుంది. వివాహమైన కొద్దికాలానికే బలవన్మరణం పొందారు.

**శివలెంక రాజేశ్వరీ దేవి :**

గాఢమైన అనుభూతులున్న కవయిత్రి. 'ద్వైతం'లో స్త్రీలో ఉన్న విభిన్న కోణాలను ఆవిష్కరిస్తారు. "ఎండమావినీ నేనే, తొలకరి మబ్బునీ నేనే । కలకత్తా కాళికనీ నేనే, సలాం బాంచేనీ నేనే । మదర్‌థెరీసానీ నేనే "బీస్ట్ అండ్ బ్యూటీనీ నేనే । పుట్టిన కేకనీ నేనే, ఆఖరి కౌగిలినీ నేనే అని స్త్రీలోని ఆగ్రహాన్నీ, అనుగ్రహాన్నీ, ఆవేశాన్నీ అనురాగాన్నీ రకరకాల అనుభూతులను రంగురంగుల ఇంద్ర

ధనుస్సులా ఆవిష్కరిస్తారు. జగ్గయ్యపేటలో జన్మించిన ఈమె ఇటీవలే మరణించారు.

### ఎస్.జయ :

కర్నూలులో పుట్టిన వీరి 'సగం ప్రపంచం, కట్టు కొయ్య కవితలు' ప్రసిద్ధి పొందినవి. ఈ రెండు కవితలు పితృస్వామ్య సమాజంలో వివాహంలో వున్న అసమ స్థితిని గురించి వర్ణించినవి. "సగం ప్రపంచం" లో అర్థనారీశ్వరుడన్నా। ఆకాశంలో సగం అన్నా। ఒక్కలాగే వినిపిస్తుంది। అంటూ మా యింట్లో మూడు గదులు । డ్రాయింగ్ రూం, పడగ్గది, కిచెన్। సగం ఇల్లు నాదే। డ్రాయింగ్ రూం మావారికి । కిచెన్ నాకు ।" అని వంటపని ఇంటిపని స్త్రీలకు, ఉద్యోగాలు, సంపాదించడం మగవాళ్ళపని అని విభజించారు. పాపాయిని కనడం నా వంతు। వంశనామం ఇవ్వడం అతని వంతు ।" అని పితృస్వామ్య దురహంకారాన్ని ఎండగడతారు.

వివాహంలో భార్యాభర్తలకు సమాన ప్రాధాన్యం ఉంది అంటారు గానీ పురుషాధిక్య ప్రపంచంలో భర్తకు వున్న ప్రాధాన్యం భార్యకు లేదు. బాధ్యతలు బరువులు స్త్రీలకు మాత్రమే. భర్తలేమో బాధ్యతా రాహిత్యంలో స్వేచ్ఛగా తిరుగుతుంటారు. "కట్టుకొయ్య" కవితలో ఇదంతా కళ్లకు కట్టినట్లు వర్ణిస్తారు. "తీరం గడపమీద బాధ్యతల కట్టుకొయ్యకు । నన్ను బందీ చేసి తాళం చెవులు । జేబులో వేసుకొని చక్కాపోతావు" అని అంటూ పురుషుని బాధ్యతారాహిత్యానికి బాధ పడుతూ "సంసార సాగరమైనా । జంటగా పయనిస్తున్నామనే । భ్రమాన్విత దుఃఖంలో తల మునకలౌతుంటాను।" అని సంసారంలో భార్యాభర్తలిద్దరూ సమానమే భావన ఎంతభ్రమతో కూడిందో వివరి స్తారు ఈ కవితలో.

### చల్లపల్లి స్వరూపారాణి :

గుంటూరులో జన్మించిన ఈమెది స్పష్టమైన దళిత ధిక్కారస్వరం. "మంకెన పూవు" కవితతో ప్రసిద్ధులు. మహిళల మీద అత్యాచారాలు మామూలే. దీనిలోనూ దళిత స్త్రీలమీద అత్యాచారఘటనలు మరింత ఎక్కువ. ఎన్ని శాసనాలు చేసినా దళితులపై ముఖ్యంగా వారిస్త్రీలపై ఈ దాడులెక్కువగా జరుగుతుంటాయి. ఈ అత్యాచారాలను నిరసిస్తూ "ఆహ్వానం" కవితలో దశాబ్దాలు దమనకాండలుగా । సంవత్సరాలు సంక్షోభాలుగా। నెలలు నరమేధాలుగా । దినాలు అత్యాచారాలుగా అనువదించి అంటూ ఆవేదన చెందుతారు. ఆవేదనతో ఊరుకోక శతాబ్దపు జాములోయల్లో నిలబడి । నెత్తుటి మరకలంటని సరికొత్త శకాన్ని। ఎలుగెత్తి పిలుస్తున్నాను" అని ఈ వ్యవస్థను ధిక్కరిస్తున్నారు. 'మంకెనపూవు' ఈవిడ ప్రసిద్ధ కవితాసంపుటి.

### పి. సత్యవతి :

స్త్రీవాద సాహిత్యంలో ప్రముఖ రచయిత్రి 15 దశాబ్దాలుగా కథలు రాస్తున్నారు. సత్యవతి అనగానే 'ఇల్లలకగానే' "సూపర్‌మామ్ సిండ్రోమ్" గుర్తుకు వస్తాయి. ఈగ ఇల్లలుకుతూ తన పేరు మరచి పోవడం మనందరికీ తెలిసిన కథే. అలాగే స్త్రీలు పెళ్ళవగానే తమలోని కళలను, శక్తులను, సృజనాత్మకతను కోల్పోయి పిల్లల పెంపకంలో, ఇంటికి, భర్తకు సేవచేయడంలో మునిగిపోతారు. అలాగే పెళ్ళికాక ముందు అన్నిట్లోనూ ప్రావీణ్యమున్న శారద వివాహమైనాక వాటన్నిటినీ మరచి పోతుంది. చివరకు తనలోని అణగారిపోయిన ప్రతిభను పైకి తీసుకు రావాలనుకొంటుంది. మరోకథ 'సూపర్‌మామ్ సిండ్రోమ్'. గొప్ప తల్లి ననిపించుకోవాలని ఉత్తమ మాతలని పేరు తెచ్చుకోవాలని ఆధునిక స్త్రీలు కొందరు తమకు అనారోగ్యంగా వున్నా విశ్రాంతి తీసుకోకుండా మందులు మింగుతూ ఇంట్లోవాళ్ళు కష్టపడకుండా చూసుకొంటారు. అలాంటి గృహిణే అనూరాధ. ఆమె మరణించినపుడు శరీరమంతా రంగురంగుల మందుబిళ్ళలే. పితృస్వామ్య వ్యవస్థ ఆడ వాళ్లనెలా అణచి వుంచిందో, వాళ్ళు జరిపిన హింసలకు ప్రతిరూపాలు ఆమె కథలు. ఏ కథలలోను ఆమె కథానాయికలు అణగిమణగి పడి వుండరు. అణచివేతలను ధిక్కరించి స్వీయవ్యక్తిత్వంతో ధీరులుగా నిలబడతారు. మిగిలిన స్త్రీలోకానికే స్ఫూర్తినిస్తారు.

### లత :

స్త్రీల జీవితాలలోని వేదనకు అక్షరాకృతి నిచ్చినవారు లత విజయ వాడకు చెందిన లత పూర్తిపేరు తెన్నేటి హేమలత. వీరు కథ, నవల, నాటిక, మ్యూజింగ్స్ ఇలా వివిధ ప్రక్రియలలో సమర్థవంతంగా రచనలు చేసి తెలుగు సాహిత్యంలో తనకొక విశిష్టస్థానమేర్పరచు కొన్నారు. లత అనగానే 'మోహనవంశి' నవల గుర్తుకు వస్తుంది. ప్రాచీన తెలుగు కావ్యాల దగ్గరనుంచీ ఆధునిక ఆంగ్ల సాహిత్యం వరకు అధ్యయనం చేసిన విదుషీమణి. దేనినైనా వ్యాఖ్యానించగల ప్రతిభాశాలి. స్వర్ణసీత మొ॥ నవలలు, ఎన్నో కథలు, రామాయణ విషవృక్ష ఖండన మొ॥ విమర్శాగ్రంథాలు రచించారు. విజయవాడలో జన్మించిన వీరు విజయవాడ ఆకాశవాణిలో చాలాకాలం అనౌన్సరుగా ఉద్యోగం చేసారు.

1956 నుంచి ఆంధ్రప్రభ సచిత్రవారపత్రికలో 197 వారాల పాటు 'ఊహాగానం' పేరుతో రాసిన మ్యూజింగ్స్ ఆమెకు ఎనలేని పేరు తెచ్చిపెట్టింది. మ్యూజింగ్స్‌లో వర్తమాన పరిస్థితులపై, ముఖ్యంగా

స్త్రీల దుర్భర పరిస్థితులపై చేసిన వ్యాఖ్యానాలు ఆమె నిజాయితీని ప్రతిఫలిస్తాయి. జీవితంలోను, సాహిత్యంలోను నిర్భీతిత ఈవిడ నైజం.

**డి. సుజాతాదేవి :**

గేయం, కథ, నవల, బాల సాహిత్యం మొ॥ వివిధ ప్రక్రియలలో రచనలు చేసిన రచయిత్రి సుజాతా దేవి. ఈమె రాసిన 'ఆటలో అరటి పండు' కు 2013 లో కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు ఇచ్చింది. వరకట్నాలకు బలైన ఒక ఆడపిల్ల గురించి రాసిన గేయ కావ్యం 'వరాలు' కరుణ రసాత్మకం. పెళ్ళయిన వెంటనే కట్నం వేధింపులతో అత్తవారింట్లో ప్రాణాలు కోల్పోయిన వరాలు మరణవార్త విని తల్లి "ఆటపాటల మరిగి ఆలస్యముగ వచ్చి అమ్మ బంగారమని అలమి వైచిన స్పర్శ । పసుపు బట్టల తోడ పాదాలకడ ఒంగి । పొగిలిపోతూ ఎదను ఒదిగిపోయిన స్పర్శ । ఏమి మరవాలి? నేనేటుల మరవాలి !" అని కూతురు మరణవార్త విని తల్లడిల్లిన తల్లి పడుతున్న బాధను చూచి పాఠకులు కన్నీరు కారుస్తారు. గెలుపు, వెలుగు రేఖలు కథా సంపుటాలు, కిన్నెర, మల్లిపాటలు రచించారు. పిల్లలకు సంబంధించిన అనేక పుస్తకాలు రచించారు. జానపద బాణిలో వీరి పాటలు కేసెట్ల రూపంలో వెలువడ్డాయి. ఆకాశవాణి విజయవాడలో అనేక పాటలు ప్రసారమైనాయి. ఎన్.బి.టి. వారికి అడవిలో కొలను అనువాద నవల, సుజలాం సుఫలాం పర్యావరణ నవల, చిట్టడవిలో చిన్న ప్రాణులు రాసారు. తెలుగులో వచన కవితా ప్రక్రియలో ప్రసిద్ధి చెందిన ఎందరో కవయిత్రులున్నారు. కానీ పాటల పల్లకీలో తెలుగు తల్లిని ఊరేగించిన కవులు తక్కువ. ఆ బాల గోపాలాన్నీ ఆనందింప చేసే పాటల రచనలో చేయి తిరిగిన రచయిత్రి. విజయవాడలో చాలాకాలం నివసించారు.

**రెంటాల కల్పన :**

విజయవాడలో జన్మించిన కల్పన "నేను కనిపించే పదం" కవితా సంపుటి రచించారు. ఒకప్పుడు ఆఫ్ఘనిస్తాన్‌లో స్త్రీల చదువులపై, ఉద్యోగాలపై ఆంక్షలు విధించారు. బురఖా లేకుండా బయటకు రాకూడదని నిషేధించారు. ఈ వార్తలు విని 'బొమ్మలాట' కవితలో సైతాను హస్తాలతో । తుడిచేస్తున్న చరిత్రహంతకులపై । రాళ్ళు విసురుదాం రండి । స్త్రీలని బొమ్మల్ని చేసి ఆడుకొంటున్న తాలిబన్ ముష్కరులపై ఇక జిహాద్ ప్రకటిద్దాం రండి !" అని తాలిబన్లపై యుద్ధాన్ని ప్రకటిస్తారు కల్పన.

**సి. సుజాత :**

తెనాలిలో జన్మించిన వీరు సప్తభుజంగాలు, జాతిశిల మొ॥ నవలలు, రెప్పచాటు ఉప్పెన, మొ॥ కథా సంపుటలు రచించారు. ప్రాచీన కాలం నుంచి ఆధునిక కాలం వరకు విభిన్న రంగాలలో పని చేస్తున్న స్త్రీల జీవన చిత్రాలు ఈమె కథలు. 'రెప్పచాటు ఉప్పెన'లో వరలక్ష్మి పాత్ర చిరకాలం మనను వెంటాడుతుంది. ఒక మధ్యతరగతి మహిళ హృదయ సాగరంలోని కన్నీటి బడబాగ్నిని పదునైన అక్షరాలతో ఆవిష్కరిస్తారు. అర్థంలేని ఆచారాలు పనికిమాలిన కర్కశ సంప్రదాయాలు సున్నితమైన, సుకుమారమైన మగువల మనుసులను ఎలా నలిపివేస్తున్నాయో చిత్రిస్తారు. స్త్రీల జీవితంలోని బహుముఖ కోణాలకు వ్యాఖ్యానాలు ఈమె కథలు.

నిత్య జీవితంలో తారసపడే చిన్న సమస్యల నుంచి పెద్ద సమస్యల వరకు విభిన్న వస్తువులు తీసుకొని స్త్రీవాద దృక్పథంతో రచనలు చేస్తున్నవారు ఇంద్రగంటి జానకీబాల. ఎన్నో కథలు నవలలు రచించారు. 'కనిపించే గతం' వీరి ప్రసిద్ధ నవల. 6 కథా సంపుటాలు, 8 నవలలు, మనశ్శల్యాలు కవితా సంపుటి ప్రచురించారు.

ఇలా ఎంతోమంది కవయిత్రులు, రచయిత్రులు పితృస్వామ్య వ్యవస్థను ధిక్కరిస్తూ, తరతరాలుగా తమపై సాగిస్తున్న దోపిడీని ఎదుర్కొంటూ రచనలనే సాధనాలుగా చేసికొన్నారు. సంప్రదాయాలను ఎదిరించే అక్షరాలతో, ఆత్మవిశ్వాసమే ఆయుధంగా తెలుగు సాహిత్యపథంలో ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తూ కవిత్వరంగంలో స్త్రీలే లేరని ఎగతాళి చేసిన పురుషులకు మేమింతమందిమివున్నాం అని చెప్పి కలసికట్టుగా కవిత్వ పతాకాన్ని ఎగురవేస్తున్నారు కృష్ణాతీర తెలుగు రచయిత్రులు.

చిరునామా : శ్రీ మందరపు హైమవతి, ఉరుతావారివీధి, ఇంటి నెం. 26-15-6ఎ, గాంధీనగర్, విజయవాడ-520003 సెల్: 9441062732

డా॥ ఎ. మీనాకుమారి

# కరుణ శ్రీ- జాషువాల సామాజిక దృక్పథాలు

కవి సమకాలీన సమాజానికి ప్రతినిధి అన్నది నిత్య సత్యము. తన కాలంలో నున్న ఆచారవ్యవహారాలు, సాంఘిక దేశపరిస్థితులు - అన్యాయాలు - అక్రమాలు మొదలగు వాటిని తన రచనలలో ఆయా సందర్భాలలో పొందుపర్చకుండా యుండలేడు.

నాడు అభ్యుదయ కవిత్వం ప్రజాకవిత్వం బహుళ ప్రచారాన్ని పొందాయి. సామాజిక స్పృహ ఉన్న కవిత్వమే అభ్యుదయ కవిత్వం- అభ్యుదయ భావాలు జాతీయ భావాలు. విశ్వమానతా దృక్పథమున్న రచయితే సామాజిక దృక్పథం కలిగియుంటాడు.

కవి కోకిల, నవయుగ చక్రవర్తి మధుర శ్రీనాధ ఇత్యాది బిరు దాంకితుడగు జాషువా, కరుణ కవి 'కరుణశ్రీ' కలం పేరుతో ఖ్యాతి గాంచిన జంధ్యాల పాపయ్య శాస్త్రి గార్ల కవిత్వంలో గల సామాజిక స్పృహను తులనాత్మక పరిశీలన చేస్తున్నాను.

జాషువాకవి అట్టడుగు సమాజంలో పుట్టాడు. కడుపేదరికాన్ని అనుభవించాడు. దయనీయమైన సమాజ పరిస్థితులలో పెరిగాడు. కుల వివక్షకు గురియైనాడు. అష్టకష్టాలు పడ్డాడు.

> "నా కవితా వధూటి వదనంబునెగాదిగజూచి రూపురే
> ఖా కమనీయ వైఖలుగాంచి భళిభళీయన్న వాడే మీ
> దేకుమన్న ప్రశ్నవెలయించి చివాలున లేచి పోవుచో
> బాకున గ్రుమ్మినట్లగున్ పార్థివచంద్ర వచింప సిగ్గగున్"

-అని తన బాధను వ్యక్తం చేశారు.

కుటిల కుల తత్వం, మూఢ మతోన్మాదం, కఠోర దారిద్ర్య జీవితం, అనుభవించిన జాషువా వాటిపై ధ్వజ మెత్తారు. తాను మనిషిగా జీవించటానికి, కవిగా నిలబడటానికి ఎన్నికష్టాలు పడ్డారో తనకుమార్తె శ్రీమతి హేమలతా లవణానికి ఒకసారి చెప్పారుట, "జీవితం నాకు ఎన్నో పాఠాలు నేర్పింది. నా గురువులు ఇద్దరు. పేదరికం, కులమత భేదం. ఒకటి నాకు సహనాన్ని నేర్పితే రెండవది నాకు ఎదిరించే శక్తిని పెంచిందే గాని బానిసగా మాత్రం మార్చలేదు. దారిద్ర్యాన్ని కులభేదాన్ని కూడా చీల్చి నేను మనిషిగా నిరూపించుకోదలిచాను. వాటిపై కత్తి కట్టాను. అయితే నా కత్తి కవిత, నా కత్తికి సంఘంపై ద్వేషం లేదు. దాని విధానంపై ద్వేషం" (మా నాన్నగారు పుట10)) - అంటారు. అందుకే సంఘాన్ని మార్చటానికే సాహిత్యాన్ని సాధనంగా మలచుకొన్నారు. ఆనాడు సమాజాన్ని పీడిస్తున్న అంటరాని తనమనే మత్తగజాన్ని ధ్వంసం చేయతలంపుతో కవిసింహమై విజృంభించాడు- జాషువా.

అతని జీవితాన్ని కవిత్వాన్ని విడగొట్టి చూడలేము. అనుభూతి ఆవేదనల వ్యక్తీకరణమే జాషువా కవిత్వం. జాషువా బాధాతప్త హృదయుడు. అతని కవితల్లో అస్పృశ్యతా నిరసన మూఢాచారగర్హణ, దరిద్రుల పట్ల సానుభూతి, జాతీయ దృష్టి, స్త్రీ జనాభ్యుదయ కాంక్ష ప్రధానంగా కనబడుతాయి.

**ఇక కరుణశ్రీ**

> కరుణ శాంతి నిచ్చు కరుణ కాంతి నొసగు
> కరుణ లేనినాడు ధరణి లేదు
> కరుణ శుభమునిచ్చు, పరమసౌఖ్యాలనిచ్చు
> కరుణ లేని నరుడు గడ్డిబొమ్మ.

కరుణయే జనులకు అన్ని కలుగ చేస్తుంది. 'భగవంతుడు కరుణామయుడు. 'ఏకోరసః కరుణ ఏవ' అని ప్రతిపాదించాడు. -భవభూతి - రసాత్మకమైన ఒక్కవాక్యమే ఒక మహాకావ్యం. కరుణా కుమారి ఖండికలో" ఆర్ద్రత - అహింస, అనసూయ, ఆమె ఇంటి ఆడబిడ్డలు, నిత్య కల్యాణి ఆమె" అని కరుణను నిర్వచించారు. కరుణశ్రీ తన రచనలను సామాజిక స్పృహతో రచించినట్లు కనబడుతుంది.

> "ప్రేయసి ప్రేమలోన కనిపించెడి తీయని స్వర్గమొక్కటే
> ధ్యేయముకాదు హీనులతి దీనులు మ్లానతనుల్ దరిద్రనా
> రాయణు లేడ్చుచుండిరి తదశ్రువులన్ తుడువంగ పొమ్ము నీ
> ప్రేయసితోడు నీకట లభించును కోట్ల కొలంది స్వర్గముల్

– అప్పటివరకు ప్రేమగీతాల నాలపించు కవులకు సంఘము వైపునకు దృష్టి మరల్చుమని కరుణశ్రీ పిలుపు నిచ్చాడు. “సంఘంలో హీనులు, దీనులు, మ్లా నతనులు, దరిద్రనారాయణులు ఆర్తనాదాలు చేస్తున్నారు. వారి ఉద్ధరణ అవసరమని కవి కవులను మేల్కొల్పారు. జర్జరిత ప్రపంచమున ప్రేమ సుధాస్రవంతులతో మానవ సంఘసేవ చేయమని ప్రబోధించారు.

జాషువా కవి కూడా “ప్రేమకు దాసులై ప్రణయ నీరధి నీతలు గొట్టు భావుక స్వాములను యీసడించుటకు కాదు, ఇంకా ఏమన్నాడో చూడండి.

**“కవి సమయంబు దప్పినుండి కారపు సొంపును బాడుసేసి నీ**
**వెవతుక కోసమో కమిటి యేడ్చుచు జక్కని తెల్గుకైతకా**
**యువులు గురించి యేమిటికయోమయ ముంబొనరింతు వీవు నీ**
**కవనము పాడుగాను వెడగా। యిక నేయియురమ్ము దారికిన్**
**(ఖం.కా)**

– అని కవినిందచేస్తూ, ప్రియురాళ్ళకోసం పరితపించే కవులను, వారి కవితలనాక్షేపించాడు. అభ్యుదయ భావాలు గల జాషువా తనదైన రీతిలో కవులకు పిలుపు నిచ్చారు.

ఇరువురు కవులు సమకాలీకులు సాహిత్య వేదికకు స్థానమైన గుంటూరు నివాసులు, ఇరువురు కరుణ కవులే. జాషువా కవితలో కరుణ వీరం కనబడుతుంది. కరుణశ్రీ కవితలో ‘కరుణా'ర్ద్రత’ కనబడు తుంది. ఇక వీరి కవిత్వ తులనాత్మక పరిశీలన.,

కరుణశ్రీ ‘ఉదయశ్రీ’ ప్రథమ భాగమున ‘విశ్వప్రేమ’ ఖండికలో ‘విశ్వప్రేమతత్త్వం కనబడుతుంది.

**ఏ ప్రేమమహిమచే నీ ధారుణీ చక్ర**
**మిరుసు లేకుండనే దిరుగుచుండు**
**ఏ ప్రేమ మహిమచే నెల్ల నక్షత్రాలు**
**నేలరాక మింట నిలిచియుండు**
**ఏ ప్రేమ మహిమచే పృథివిపై బడకుండ**
**కడలి రాయడు కాళ్ళు ముడుచుకొనును**
**ఏ ప్రేమ మహిమచే నీరేడు భువనాల**
**గాలి దేవుడు సురటీలు విసరు**
**ఆ మహాప్రేమ – శాశ్వతమైన ప్రేమ**
**అద్భుతమఖండ మవ్యక్తమైన ప్రేమ**
**నిండియున్నది బ్రహ్మాండ భాండమెల్ల**
**ప్రేయసీ సృష్టి యంతయు ప్రేమ మయము.**

– భూమి తనంతట తానే తిరుగటం, నక్షత్రాలు కదలక నింగిన నుండటం, ఏడు భువనాలలో వాయుదేవుడు సంచరించటం –చూస్తే అద్భుతంగాను అవ్యక్తంగాను బ్రహ్మాండ భాండమంతా ప్రేమ నిండి యుంటుంది. ప్రేమ లేక పోతే సృష్టిలేదు. –అని కరుణశ్రీ విశ్వప్రేమను వ్యక్త పర్చారు.

జాషువా ‘విశ్వనరుడను’ నేను అంటారు. కులమతాలు గీచుకొన్న గీతలందుండి, పంజరంలో బంధింపపడను నిఖిల లోకమెట్లు నిర్ణయించిన నాకు తరుగులేదు విశ్వనరుడని’ అంటు.

**తల్లిదండ్రిలేని బిడ్డజూచి కన్నీరు**
**దానంబు జేయు నేత్రములునావి**
**జంతుకోటికి గల్గు స్వామి భక్తిని మెచ్చి**
**తృప్తినందెదు నవ్యదృష్టి నాది**
**సకల కార్మిక సమాజముల జీవిత కథా**
**నకములాలించు కర్ణములునావి**
**కఠిన చిత్తుల దురాగతములు ఖండించి**
**కనికర మొలకించు కలమునాది**

**దొడ్డ పదవులెక్కి గడ్డి మేసెడి వారి**
**నెత్తి పొడుచు చిత్త వృత్తి నాది**
**నిఖిల కోలమెట్లు నిర్ణయించిన నాకు**
**తరుగు లేదు విశ్వనరుడనేను (నేను ఖండిక)**

– సంఘమందలి కష్టాలన్నీ తనవిగా భావించి భాధాతప్తుడయి నాడు. అనాధలను చూచి కన్నీరు కార్చేకళ్ళు తనది నవ్యదృష్టియని, కార్మికుల దీనగాథలను వినే కర్ణములు తనవని కఠినాత్ముల దురాగ తాలను ఖండించి జాలి జూపించే కలము తనదని, అడ్డదారిన అందల మెక్కి గడ్డితినే వారిని ఎత్తి పొడిచే మనస్తత్వం తనదని తాను విశ్వనరు డనని చాటి చెప్పాడు జాషువా కవి తన వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించాడు.

జాషువా కవి కులతత్త్వం మీద, మతతత్వం మీద పేదరికం మీద సాగించిన సాహిత్య విప్లవం విశిష్టమైనది సాంఘిక సంస్కరణ పూరితమైనది. రైతులనుద్దేశించి

**ఎకర మొక్కటికి మానిక గింజలరాలక**
**హరిహరీయని యంగలార్చువారు**
**పన్నుగట్టుట కిండ్లు వాకిళ్ళు తెగనమ్మి**
**మైమీది బట్టతో మసలువారు**

తడుపుచున్నారు క్షేత్రములు కర్షకకోటి మానకుమేని చెమ్మటలు గురిసి” అని పేదరైతు కష్టాల కడగండ్లు– చక్కగా వర్ణించారు.

ముఖ్యంగా జాషువా కావ్యాలలో అరుంధతీ సుతుల ఆవేదన కనబడుతుంది. దేవాలయ గర్భగుడిలో గబ్బిలము నిరంతరం వేలాడు తుంది. మానవుని కన్నా పక్షే దేవాలయ ప్రవేశాన్ని పొందింది. నరుడు సాటి మానవుణ్ణి అస్పృశ్యునిగా చూస్తున్నాడు– అని కవి ‘గబ్బిలం’

కావ్యంలో- హరిజనుడు గబ్బిలాన్ని ఆశ్రయించి దేవునకు తన సందే శాన్ని పంపుతాడు.

'ఆలయమున నీవు ప్రేలాడువేళ
శివుని చెవి నీకు కొంత చేరువగనుండు
యాని ఖగరాజ్ఞి! పూజారి లేనివేళ
విన్న వింపుము నాదు జీవిత చరిత్ర।

"పూజారి లేని వేళ తన జీవితచరిత్రను" దేవునికి తెలియ చేయ మని విన్నవిస్తాడు గబ్బిలంలోనే

వాని తెక్కల కష్టంబు లేనినాడు
సస్యరమ పండిపులకింప సంశయించు
వాడు చెమ్మటలోడ్చి ప్రపంచమునకు
భోజనము పెట్టువానికి భుక్తిలేదు.

-అరుంధతీ సుతుడు నిరుపేద కష్టపడాలి. అతని కష్టం లేనినాడు పంట కూడా పండటానికి సందేహిస్తుంది. అతడే ప్రపంచానికి భోజనం పెడతాడు. కాని వానికి తిండిలేదు.

కరుణశ్రీకూడా "పాకీపిల్ల' ఖండికలో" తన సుఖాన్ని విడిచి తోడి సోదరుల సౌఖ్యానికి జీవితాన్ని ధారపోసి పాకీపని చేస్తుంది. ఈ లోకం స్వార్థంతో ఆమెను ఈసడించు కొంటోంది అని

చీపురు నొక్క చేత ఒక చేతను చింపిరి గంపబూని యీ
పాపపు గుప్పలూడ్చెదవు బాలిక! చీదర లేదె సుంత, నీ
యోపిక చూచి మెచ్చి తలయుంచు జగత్పతకన్నుగొల్పులన్
తేపకు తేపకున్ బయలుదేరు నవే నులి వెచ్చ బాష్పముల్

– పాకీపిల్ల వృత్తిని తెలియచేస్తుందీ పద్యం. చీపురు పట్టి, పాపపు కుప్పలూడ్చే పాకీ పిల్లను చూస్తే సృష్టికర్త కూడా కంటి నీరు కార్చారుట. ఆమె వృత్తి పవిత్రమైన దినచర్యయని, పాపిష్టిలోకము పాకీదానిగా ఆడి పోసుకొంటుందని నీ రుణం తీర్చుకోలేదీ లోకము. 'జగదంబా' అని కవి సానుభూతితో సంబోధిస్తాడు.

ఒక్కరోజావు వీధుల నూడ్వకున్న
తెలిపోవును మా పట్టణాల సొగసు
బయట పడునమ్మ బాబుల బ్రతుకులెల్ల
ఒక్క క్షణమ్మీవు గంప క్రిందకును దింప

పాకీపిల్ల ఆవశ్యకతను తెలియజేసి ఆమెను ఆ వృత్తి నుండి బయటికి వచ్చేయి. బ్రతకటానికి మార్గాలున్నాయి. అని ఆమెకు ధైర్యం చెబుతాడు. పాకీపిల్లను చిన్నచూపు చూస్తున్నదని మాతృస్థానాన్నిఆమెకు ఆపాదించాడు. ఇది అభ్యుదయ భావాలు కల కరుణశ్రీ కరుణార్ద్రంగా ఈ ఖండికను రచించి సాహిత్యలోకాన సుస్థిరమైన స్థానాన్ని అలంక రించారు. ఇది సంఘ సంస్కరణ సామాజిక స్పృహగల ఖండిక.

పుష్పవిలాప ఖండిక మందు పుష్పాలు విలపిస్తాయని వానికి మానవత్వాన్ని ఆపాదించారు పుష్పాలు - వెలయాండ్రకు ప్రతీకగా గ్రహించినట్లు స్పుటమగుతుంది.

కవి పూలమొక్క వద్దకు వెళ్ళి కొమ్మవంచి పూలు తుంచుదామని గోరు ఆనించగానే "ఆ పుష్పాలు మా ప్రాణము తీతువా" అని విలపిం చాయిట. కవి హృదయం కరుణార్ద్రమయింది.

"మహిషాసురు లెందరో నాల్గు ప్రక్కలన్ ప్రక్కలమీద చల్లుకొని ముసిని మేనులు పాదుకాళ్ళతో ద్రొక్కుచు దొర్లిదొర్లి మరురోజుద యాన్నే అవతల పారవేస్తారని పుష్పాలు విలపిస్తాయి. అది వెలయాండ్ర ఆవేదన అదే 'మ్లానతనుల్' విలపించటం.

మా వెలలేని ముగ్ధసుకుమార సుగంధ మరంద మాధురీ
జీవితమెల్ల మీకయి త్యజించి కృశించి నశించిపోయె మా
యౌవన మెల్ల కొల్లగొని ఆపయి చీపురుతోడా చిమ్మి మ
మ్మావల పారవోతురుగదా। నరజాతికి నీతియున్నాదా

– అని పుష్పాల ప్రశ్న. ఇది వెలయాండ్ర జీవిత సత్యం 'నరజాతికి నీతి యున్నదా' అని పుష్పాల ప్రశ్న. ఇటువంటిదే బీదపూజ; ఇది కరుణార్ద్ర మయిన రచన.

ధనవంతులు పిల్లలు బంగారు బుట్టలో మంచిపూలు తీసుకొని వెళ్ళితే ఒక పేదవాడు 'ధూళితో నిండియున్న గడ్డిపువ్వులనే యేరుకొని, ఎవరికి పనికిరాని దరిద్ర పుష్పాలను భగవంతుని కర్పిస్తాడు.

"ఈ యనాథ సుములనే ఈ విశీర్ణ
జీర్ణకుసుమాలనే ఈ కృశించు మ్లాన
హీన దీన ప్రసూనాలనే-త్వదంఘ్రి
సేవకై దోయిలించి తెచ్చితిని"

"నా కన్నీటితో దోసలిలోని పూలమాలిన్యాన్ని తొలగించి తెచ్చాను" అని అంటాడు బీదవాడు. హృదయాన్ని ద్రవింపజేయునట్లుగా కరు ణార్ద్రంగా ఆవిష్కరించాడు.

కరుణ శ్రీ రచించిన "అరుణ కిరణాలు" గేయ కావ్యంలో "కిర ణాలు నిద్రించే వారిని మేల్కొల్పుతాయి, మేల్కొన్నవారిన ముందుకు నడిపిస్తాయే- "విశ్వవిప్లవ విస్ఫురణాలు" అరుణ కిరణాలు.

నిద్దుర లేవోయ్ ఖండికలో సంఘ దురాచారాలు తెలియచేస్తూ కర్షకుణ్ణి నిద్దురలేపుతాడు కరుణశ్రీ సంఘంలో మద్యపానం, వడ్డీ, ధనికత్వము, జాతివైరాలు, కులభేదాన్ని పారద్రోలటానికి నిద్రలేవమని కర్షకుణ్ణి ప్రబోధించాడు.

"మూఢాచారపు ముళ్ళ తీగలను
మత విద్వేషము కలుపు మొక్కలను
నీ కొడవలితో కోసెయ్యాలోయ్"

– అగ్రవర్ణాల ఆత్మలు లోపలి అంటుకుపోయిన అస్పృశ్యతని తొలగించాలి. "తప్పులేని తమ్ముడు" ఖండికలో నాడు సంఘంలోని అస్పృశ్యతను తనదైన బాణిలో

ధ్వజ స్తంభముకాడ
దణ్ణాలు పెడుతుంటె
మడిగట్టి కూర్చున్న
గుడిలోని జేజాయి
మైలబడు నన్నారుటే ! నాయన్ని
మాలవాడన్నారుటే.
" కడగొట్టు తమ్ముడని
గారాబు తమ్ముడని"– కనికరం లేకుండా

చిన్నవాడని ప్రేమ లేకుండా అస్పృశ్యుని గుడికి రానీయకుండా వెలివేశారని; తరిమివేశారని కరుణార్ద్రంగా తెలియజేశారు. ఇకసంఘం లోని సాంఘిక అసమానతలను ఏకరువు పెట్టారు–బీద సాదాఖండికలో

రెక్కలన్నీ విరుచుకొని
రక్తమంతా ధారపోస్తే
రాకాశి లోకమ్ము మమ్ము
కూక లేస్తుందోయ్ – తంద్రీ.

ధనిక వర్గము శ్రామికుల కష్టాన్ని దోచేసి, కూడు గుడ్డ గుడిసె లేకుండా చేస్తుందని కవి నాటి సామాజిక దుస్థితిని విశ్లేషించారు.

"పస్తున్నామ్ మిక్కడ
మేస్తున్నారా మీరక్కడ"

– కరుణశ్రీ ఖండ కావ్యాలలో ఇటువంటి ఖండిక లెన్నో దర్శన మిస్తాయి. ఇక 'జాషువా'అస్పృశ్యత మీద తిరుగుబాటు చేసిన ప్రజాకవి. గబ్బిలంలో

"పామునకు బాలు చీమకు పంచదార
మేపు కొనుచున్న కర్మభూమిం జనించు
ప్రాక్తనంబైన ధర్మ దేవతకూడ
నులికిపడు జబ్బుగలదు వీడున్నచోట"

–"ధర్మదేవత కూడ ఉలికిపడుతుందిట"– అస్పృశ్యుని చూస్తే అంటు జాడ్య తీవ్రతను విమర్శించారు. జాషువా రచించిన "బాష్ప సందే శం" ఖండక హరిజనోద్ధరణమే పరమావధిగా భావించారు.

"కారణ్యంబున నంతరాని తనమునే, ఖండింపవానిరా
ధార వ్యక్తుల ఘోషణంబు కనరాదానీకు ! నాంగ్లేయులన్
మా రాజ్యంబిడుడంచు వేడుకొనుచున్నా విట్టి నీకిత్తురా!
ప్రారంభంబున నిన్ను దిద్దు కొనుమయ్యా కోర్కెసిద్ధం చెడిన్"
(ఖండకావ్యం 1 భాగం 5ప)

హరిజన సమస్యని పరిష్కరించని కొని పిదప స్వాతంత్రోద్యమానికి సన్నద్ధులు కావలసినదని కవి సందేశం. ఈ పద్యంలో 'గాంధేయప్రభావం స్పష్టంగా గోచరిస్తుంది. ముందు నీ సమాజాన్ని నీవు ఉద్ధరించుకో, హరిజనోద్యమము దేశ స్వాతంత్రోద్యమముతో ముడిబడినదని గంభీరంగా చెప్పినట్లయినది.

మరొక పద్యములో

అనుగుందమ్ములు దిక్కుమాలి పురబాహ్యక్షోణి గారాడ వెలి
చ్చిన సౌభాగ్య సువర్ణ మందిర సముసీనుండవై హాయిగా
గనుమయందగవా!" – (ఖం.కా.మొ.భా. 3వ ప)

– హరిజనోద్ధరణతో బాటుగా సామ్యవాద ప్రభావం కూడా జాషువా రచనలో కన్పడును. ఆనాటి సంఘంలో స్త్రీకి పురుషులిచ్చిన స్థానాన్ని జాషువా కరుణశ్రీలు తమదైన కవితా పద్ధతులలో తెలియజేశారు. జాషువా తన కవిత్వాలో సంఘంలో స్త్రీకి జరుగుతున్న అన్యాయాన్ని బట్టబయలు చేశారు.

"పురుషులు వంటి యింటి కొరముట్టుగ నిన్ను గణాంచు చుండ కిక్కురు మనకుండ సంసరణ మేపమునంబడి మందభాగ్య" అని స్త్రీ దయనీయ స్థితిని వర్ణించాడు. భారత స్త్రీ వ్యక్తిత్వాన్ని ఈ విధంగా వ్యక్తీకరించారు.

"వలపులరాణిగా చిలుక పల్కుల చక్కెర పిండి బొమ్మగా అలకుల వేణిగా" పొగిడి స్త్రీ "శరీరమున్ హృదయమున్ ఛేదించి వేధించి కాళ్లతో నలిపి "ఇంతన్నంబున్ బడవేయు" సంఘంబిడ్డాయిది. అందు వలన జాగ్రత్త అని వెర్రి బాగులమ్మగా పరమ మూఢగా, విద్యావిహీన భావ దాసురాలుగాను" భారత స్త్రీ వ్యక్తిత్వాన్ని సూచించారు.

ఉక్కు పదాల సాంఘిక పుటుగ్రపిశాచ మొనర్చు గర్జకున్
గుక్కిన పేనులై ప్రతిభగోల్పడి పూరుషజాతి చేయుయు
చ్చెక్కుల స్తోత్ర పాఠములచే పరితృప్తివహించు"

– స్త్రీ సహనానికి సానుభూతి తెలియచేస్తున్నాడు. జాషువా.

అబలయన్న బిరుదమంటించి కాంతల
స్వీయ శక్తులదిమి ! చిదిమివారు
నబలయన్న బిరుదు ! సాధించి హక్కులు
గడన చేసుకొమ్ము ! కష్ట చరిత. (ఖం.కావ.5)

– స్త్రీ అబలగాదు. సబలే అని తన హక్కుల్ని సాధించుకోమని స్త్రీ జాతిని వుద్బోధించారు. "దేశం చిమ్ముతున్న కన్నీటి చెమ్మలే నాయి కావ్యాలు అని చెప్పుకొన్నారు.

సంఘంలో జరిగే దృశ్యాలను చూచిన కరుణశ్రీ తన వేదనను భగవంతునకు నివేదిస్తాడు. జాషువా సంఘంలో తన వంటి అరుంధతీ సుతులకు స్థానము లభించటం లేదని ఆవేదనతో రచనలు చేశారు.

అంటరాని కవిని ఈ లోకం పురుగులాగ, పులుసలాగా చూస్తుం దని, జాషువా బాధపడ్డాడు. పురుగులలో గూడా రచనా శక్తి ఉన్నదని 'సాలెపురుగు' మీద పద్యాలు చెప్పారు.

"నీలో నూలు తయారుజేయు మరగానీ ప్రత్తి రాట్నంబుగా
నీలే; దీశ్వర శక్తి నీ కడుపులోనే లీనమై యుండనో
యేలీలన్ రచయింతు నీజిలుగు నూలీపట్టు పుట్టంబులో
సాలీడా ! నిను మోసగాదవని విశ్వంబేల ఘోషించెడిన్"
"ఢక్కా మట్లు పసందు నేత పని వాండ్రా నీయుపాధ్యాయు? లి
ప్డొక్కండున్ గనరాదు దాగుకొని నారో నీదు గర్భంబునవి
దిక్కెనీయుసమాన కౌశలము వ్యర్థ భూతమై పోయేడిన్

అని 'సాలీడు' – ప్రవృత్తిని తన దైవ శైలిలో వ్యక్త పరిచారు.

'అసమాన కౌశలము వ్యర్థమై పోయినదని ఆవేదన వ్యక్తం చేశారు.

ఇక పులుగునుద్దేశించి 'గిజిగాడు' – తనగూడును నిర్మించుకోనే విధానాన్ని విశద పరచాడు.

"తెలిక గడ్డి పోచలను దెచ్చి రచించెదవు నీవు తూగుటు
య్యెల గృహంబు మానవుల కేరికి సాధ్యము గాదు దానిలో
జులరు లందులో జిలుగు శయ్యలు నంతిపురంబు లొప్పగా
మేలు భళీ పులుంగు టికి మీడవు రా గిజిగాడ నీడజు"

ప్రకృతిలోని కీటకానికి, ఖేచరానికి గల శక్తులు తనలో కూడా ఉన్నావని తెలుసుకొన్నాడు జాషువా.

ఇక కరణశ్రీ సంఘంలో జరిగే అన్యాయాలను అరికట్టామని తన ఆవేదనను భగవంతునికి విన్నవించుకొన్నాడు.

హింసా రాక్షసి మానవత్వమును ధ్వంసంబు చేసెనయం
ద్వేష పిశాచం ప్రేమ తత్వమును నాశనం చేసెనయు
జటా జూటమును విదిలించి
నిలలేక్షణమును కదిలించి
కసి బూనిన రక్కసి మూకల పో
కార్చు ప్రగతి చేకూర్చు ధరిత్రికి" అని సంఘంలో మానవత్వం సమసిపోయి దానవత్వం తాండవిస్తుందని కరుణశ్రీ భగవంతుణ్ణి ఆహ్వానించాడు.

'నిద్దుర లేవోయ్' ఖండికలో సాంఘిక దురాచారాలను పికరువు పెట్టారు. నిద్రిస్తున్నా కర్షకుణ్ణి తట్టిలేపి సాంఘిక దురాచారాలని మట్టుపెట్టమని పిలుపునిచ్చాడు.

"కొంపలు గోడలు గుల్లలు చేస్తూ
తలవిర బోసుక తైతక్కలాడే
మద్యపాన మను మహా రాక్షసిని
నీ పలుగులతో పొడిచెయ్యాలోయ్ "

–మద్యపానాన్ని సమూలంగా పెరికి వేయాలని కవి ప్రబోధిం చారు. ఇక అధిక వడ్డీ రేట్లను, కార్మిక దైన్య పరిస్థితులు, జాతివైరాలను తొలగించి శాంతిబీజాలు వెదజల్లుమని కర్షకుని పురమాయించాడు. కవి

"కుప్పలు బద్దాకుల భేదాన్ని
కళ్ళాన్నేసి నురిపిడి చేసి
భరత భూమిపై పాటలు పాడుచు
నీ చేటలతో తూర్పెత్తాలోయ్.
అగ్ర జాతుల ఆత్మల లోపల
అంటుకుపోయిన అస్పృశ్యతని
అతుకుపోయిన అంధత్వాన్ని "

పొలికట్టలతో తుడి చేయమని కరుణశ్రీ సంఘానికి పిలుపు నిచ్చాడు.

ఆనాడు దేశమంతటా జాతీయోద్యమం ప్రబలింది. భారత జాతీ యోద్యమ, ఆంధ్రోద్యమాల ప్రభావం కవుల కావ్యాలలో ప్రతిబిం బించింది. ఉద్యమ నాయకుడైన గాంధీజీని కరుణశ్రీ జాషువా తమ కావ్యాలలో, ఖండికలలో స్తుతించారు.

కరుణశ్రీ 'మా గాంధీ తాత' ఖండికలో

అడుగు వెట్టిన చాలు అవనీంద్ర రత్న రం
జిత కిరీటములు హారతు లోసంగు
బయలుదేరిన చాలు జయ జయ ధ్వనులతో
గ్రామాలు గ్రామాలు కదలివచ్చు
కొంగుబట్టిన చాలు కోటాను కోట్ల హ
స్తములు బంగారు వర్షములు గురియు
పెదవి యొకింత విప్పిన చాలు లక్షల
కొలది తలక వచ్చి కొలువు తీర్చు
నవ్వినం జాలు పతిత మానవ సమాజ
మానవమ్ములు దేదీప్య మానములగు
పట్టు పట్టిన జాలు సమ్రాట్టులైన
తలలు వంతురు మా గాంధీ తాత ముందు.

గాంధీగారి స్వరూప స్వభావాలను వర్ణించారు. " నవ్వింనం జాలు పతిత మానవ సమాజ మాననమ్ములు " పతిన పావనుడని గాంధీని అభివర్ణించారు.

జాషువా బాపుజీ కావ్యంలో

"విముత భూపతుల దోపిడి గుండుజాతిలో
దీపంబు పెట్టిన దినకరుండు
మానవత్వమును భూమండల బుననెల్ల
చాటిన యాచార్య చక్రవర్తి

సత్యాగ్రహంబను శస్త్ర బాలన విద్య
భువికి దెచ్చిన మహా పురుషమౌళి
నిమ్న జాతుల కంటి నీరంబు దుడచియం
శ్వాసించు నిరుపేద బాంధవుండు
పండ్లు నూరుచున్న బహుమతంబులలోన
సహన విద్యా నేర్పు నాథకుండు
భార్యా బిడ్డలున్న ప్రత్యక్ష దైవంబు
కామిత ప్రదాత ముగాంధీ తాత"

– అని బాపూజీని 'కామిత ప్రదాతగా ప్రస్తుతించారు. బానిస జాతికి దీపం పెట్టిన దినకడని, మానవతను భూ మండలంలో చాటిన ఆచార్య చక్రవర్తియని, సత్యా గ్రహమును శాస్త్ర చాలన విద్యను భూమికి తెచ్చిన పురుషోత్తముడని, నిమ్నజాతుల వారి కన్నీరు తుడిచి ఊరడించే నిరుపేద బాంధవుడని సర్వమత సహనం నేర్పిన సాధకుడని, గాంధీని అభివర్ణించాడు. జాషువా.

ఇరువురి దృష్టిలో గాంధీ 'నిమ్మజాతి' సముద్ధరణకై యేతెంచిన మహాత్ముడు.

ఇరువురు 'భరతమాతను' తమదైన శైలిలో ప్రస్తుతించారు.

కరుణశ్రీ 'మాతృశ్రీ అనే శీర్షికలో భరతమాతను ఒక సీస పద్యంలో ప్రస్తుతించారు.

అభ్రకషంబౌ హిములయంబే తల్లి
మౌళి చుట్టిన మల్లెపూల చెందు
గోదావరి కృష్ణలే దేవి కటిసీమ
వ్రేలాడు ఆణిముత్యాల సరులు
ఆంధ్ర సముద్రమే యమ్మపాదలపై
జీరాడు పట్టుకుచ్చెల చెరంగు
నలుబడి కోట్ల వీరులు భారతీయులే
కళ్యాణి చల్లని కడుపుపంట
ఆమె బ్రహ్మానిజాత కళ్యాణ గీత
ధర్మ సముపేత వేదమంత్ర ప్రపూత
విశ్వ విఖ్యాత సుశ్రీల వెలయుగాత
పరమ కరుణా సమేత మా భరత మాత

– ఉదయశ్రీ ప్రథమ భాగంన కన్పట్లును.భారతీయులంతా కళ్యాణి కడుపు పంటయని,భరతమాత ధర్మాసముపేతయని, వేదమంత ప్రపూతయని లలిత లలిత పదజాలాలలో రమణీయమైన శైలితో అభి వర్ణించారు.

'స్వతంత్రభారతీ' అనే ఖండికలో స్వరాజ్యం వచ్చిన తరువాతి భరతమాత రూపాన్ని వర్ణించారు. భరతమాత స్వదేశీఖద్దరు చీర కట్టిందని కవి జాతీయ భావన.

చచ్చిన జాతిగాదు మరిచావదు వేయియుగాలకైన వెన్నిచ్చిన జాతిగాదు పరుగెత్తు విరోధిని బిల్చి కౌగిటన్ గ్రుచ్చిన జాతిరాఇది– అని 'స్వచ్ఛంద జాతీ' అనే ఖండికలో భారతీయ జుత్యౌన్నత్యాన్ని తెలియచేశారు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో మాతృదేశస్తవము చేయని అధునిక కవిలేడు. మాతృదేశాన్ని ఆరాధించి సర్వదేవతా స్వరూపిణిగా భావించి దేశభక్తితో కవితలల్లిన కవి వర్యులెందరో ఉన్నారు కవులు వివిధ సందర్భాలలో మాతృదేశస్తవం చేశారు.

జాషువా కూడా "మాతృపూజ" అనే శీర్షికలో దేశమాతను ఈ విధంగా కీర్తించారు.

సగరమాంధాత్రాది షట్చక్రవర్తుల
యంకసీమల నిల్చినట్టి సాధ్వి
కమల నాభుని వేణుగాన సుధాంబుధి
మునిగి తేలిన పరిపూత దేహ
కాళిదాసాది సత్కవి కుమారుల గాంచి
కీర్తినందిన పెద్దగేసురాలు
బుద్ధాది మునిజనంబుల తపంబున మోద
బాష్పముల్విడిచిన భక్తురాలు
సింధు గంగానదీ జలక్షీరమెపుడు
గుడిసిన బిడ్డల బోషించు కొనుచునున్న
పచ్చిబాలెంతరాలు మా భరతమాత
మంతలకు మాత సకల సంపత్సమేత

–సాధ్విగా, పెద్ద గేస్తురాలిగా, భక్తురాలిగా, పరిపూత దేవతగా, పచ్చి బాలెంత రాలుగా, భరతమాతను అభివర్ణించారు.

వీరే మరొక పద్యంలో భరతమాత ఔన్నత్యాన్ని తెలియచేస్తూ, పాప మడగించు తీర్థ కోటులలో మునిగితేలిన పునీత –సకల శాస్త్రాలు చదివిన విద్యాధికురాలు– అని భరతమాతను అభివర్ణించారు. 'ఉర్వి పుట్టకముంకదే నీవుంటివేమొ' అని ఆమెకు పెద్ద తనాన్ని ఆపాదిం చుటచే" అతి ప్రాచీన చరిత్ర గల్గిన దేశమని ధ్వనింపచేశారు.

'నా దేశంబది రత్నగర్భ'.... నీ భక్తుండ అని తన దేశభక్తిని ప్రక టించుకొన్నాడు. 'సమ శీతోష్ణసుఖాభిరామము నహింసా ధర్మ సిద్ధాంత వంతము నానావిధ రత్న రంజిత సముద్ర ప్రాంతం బస్మదీయ మహా భారత ఖండము'– అని మాతృదేశ స్వభావాన్ని సహజ సిద్ధంగా వర్ణించారు. గాంధీజీని "గోచిపాత గట్టుకొని జాతిమానంబు నిలిపినట్టి ఖదరు నేతగాడ"ని విశ్వసామరస్య విజ్ఞాత సంధాత' అని ప్రస్తుతించాడు.

### ఆంధ్రదేశాభిమాన కవితలు

కరుణశ్రీ జాషువా కావ్యాలయందు ఆంధ్రదేశాభిమానము కన్పట్టును. తెలుగుదేశము, తెలుగుభాష తెలుగుచరిత్ర తెలుగుప్రజ,

తెలుగు సంస్కృతి అని వంతనే నా యొదలు పులకించును'- అని అన్నారు తుమ్మల సీతారామచౌదరిగారు. నిజంగా ఆంధ్రుడై పుట్టిన ప్రతియొక్క రామ చౌదరిగారు. నిజంగా ఆంధ్రుడై పుట్టిన ప్రతియొక్కడు గర్వపడాలి. జాషువాకవి 'తెలుగుతల్లి' ఔన్నత్యాన్ని వర్ణించిన తీరు.

ఆంధ్రాళి మొదంబు నాశించి పోయిన
తిక్కనార్యుని వాణి తృప్తినంద
గజ్జెలందెలు కౌలు గదలించి మన్నెబొ
బ్బిలికోట తొలికోడి పలికి కులక
నదు వీధులందు రత్నములమ్మ కొన్నట్టి
తెలుగుల సంపత్తి తలపుకెక్క
ఖండాంతరముల బంగారు పూజలు గొన్న
కలికి పోగర మేను పులకరింప
ముందుకొండల శివలింగములు రహింప
నాలపింపక రాష్ట్రసింహాసనమున
అధివశింపుము జయము నీయందు గలదు
దివ్యదాశయసుమవల్లి! తెలుగుతల్లి.

ఆంధ్రవళి మోద మొనరంగ తెలుగు రంచెదనని తిక్కన వక్కాణించారు. రాయల కాలంలో అంగడిలో రత్నాలు రాశులు పోసిన విషయము, దేశదేశాలలో తెలుగు ఖ్యాతి విస్తరించిన విషయము. "త్రిలింగ దేశము - తెలుగు దేశం ; అని కవి తెలుగు తల్లిని సింహాసనాన్ని అధివసింపమని ఆహ్వానించాడు.

తెలుగురాష్ట్రం సిద్ధించిన పిదప వ్రాసిన ఖండికయే- 'తెలుగుతల్లి' ఇక 'తెలుగు వెలుగు' ఖండ కావ్యంలో

తెనుగంగేసరులున్ మహర్షులు గాంధీశాంతి సేనాపతుల్
గల రాంధ్ర ప్రముఖుల్ త్వదీయులు భుజస్కంధంబునందిత్రునీ
అలఘుం శ్రేయములోన మోచినవి రాష్ట్రార్థంబు యత్నించి నీ
బలముం గాంచి యమాకలించు కొనరా ప్రఖ్యాత వీరాంధ్రుడా

- ఆంధ్ర నాయకులను ప్రస్తుతిస్తూ ఆంధ్ర వీరునకు కర్తవ్య బోధ చేశారు. ఈ విధంగా జాషువా కావ్యాలలో ఆంధ్రాభిమానం కనబడుతుంది. జాషువా 'ఆంధ్రుడ'ను కవితయందు జాతీయాభిమానంతో గూడిన ఆంధ్రాభిమానాన్ని వ్యక్తపరచిన విధానం.

బహు దేశములను బేర్వడసి మీసముదీటు
భరతఖండంబు నా పాఠశాల
స్తనయుగం బున గాన సాహిత్యములుగల్గు
భాషావధూటి నా పంతులమ్మ
సాందీపని సమక్షమందు విద్యగడించు
వనమాలి నా సహ పాఠకుండు
భక్తి వైరాగ్యముల కాలవాలమైన
భాగవతంబు నా బాలశిక్ష
గంటంబు ధరించి మోహనాక్షరమలెనయ
ప్రతిఫలించెడు నామహోన్నత విభూతి
వ్రాసికొందును దశదిశా ఫలక పంక్తి
గణన కెక్కిన యాంధ్ర పుత్రుడను నేను

-అని తన వ్యక్తిత్వాన్ని సగర్వంగా చాటి చెప్పారు. ఇక కరుణశ్రీ 'వాణి వాయించు మాణిక్యవీణలోని యర్థమెరిగిన ఆంధ్ర విద్యార్థి నేను' అని అంటారు.

సర్వభూమీ పూజ్య గీర్వాణ భాషాయోష
తల్లి గారాబంపు తల్లినాకు
అత్యంత సుకుమారి ఆంధ్ర భాషా యోష
అల్లారు ముద్దుల చెల్లి నాకు
నవనవోన్మేష సుందర మూర్తి సాహితీ
లక్ష్మయ్ అర్ధాంగ లక్ష్మినాకు
కమనీయ మృదుపదక్రమ కవితాబాల
కల్కిపల్కుల పసికందు నాకు
పాణినీయులు దేశిక ప్రభువులునాకు
సరస వాఙ్మయ పురము కాపురము నాకు
వాణి వాయించు మాణిక్యవీణలోని
యర్థమెరిగిన "ఆంధ్ర విద్యార్థి నేను"

- ఇది కరుణశ్రీ వ్యక్తిత్వం.

ఇక కరుణశ్రీ 'ఉదయశ్రీ' కావ్యంలో పెక్కు ఖండికలలో ఆంధ్రాభిమానం తొణికిసలాడుతుంది.

'తెలుగుతల్లి' ఖండికలో పూర్వపురాజుల ఆంధ్ర పౌరుషాన్ని ఈనాటి తెలుగు తల్లికి కవి విన్నవించాడు.

కనిపింపదే నేడు? కాకతీయ ప్రాజ్య
సామ్రాజ్య జాతీయ పతాక
వినిపింపదే నేడు, విద్యా నగర రాజ
సభలోని విజయ దుందుభుల మ్రోత
చెలగదే నేడు, బొబ్బిలి కోట బురుజుపై
తాండ్రపాపయ తళతళల బాకు
నిప్పచ్చరంబయ్యెనే నేడు వీరప
ల్నాటి యోధుల సింహ నాదలక్ష్మి

చెక్కు చెదరని యొకనాడు యొక్కపోని
ఆంధ్రపౌరుష మిప్పుడధ్వాన మయ్యె
మరల నొక మాటు వెనుకకు తిరిగి చూచి
దిద్దుకోవమ్మ బిడ్డల తెలుగుతల్లి"

-గత ఆంధ్రక్షేత్రయ వైభవాన్ని పౌరుషాన్ని ఆంధ్రులకు కలుగు చేసి తెలుగు బిడ్డలను జాగృతిచేయమని కరుణశ్రీ ప్రబోధించారు. ఆంధ్రులు పౌరుషం లేకుండా నిర్లిప్తంగా ఉన్నారని కవిభావన. రాజ రాజ నరేంద్రుడు, కృష్ణరాయలు, ఓరుగంటి ప్రభువులు, కొండవీటి రెడ్డిరాజులు, మొదలగువారు 'కడిపెడు కొడుకులుండి, యిల్లు వాకిలి కరువైన తల్లి' అని కవి ఆవేదన పొందారు. ఎన్నో ఖండికలలో ఆంధ్ర జాతి కళాప్రశస్తిని విశదపరిచారు.

ఆంధ్రరాష్ట్రావరణలో ప్రజలలో సంతృప్తి కలుగలేదు. వైషమ్యాలు పెరిగాయి. స్వార్థం కలిగింది. సుహృద్భావం వీడి కలహించుటకు ప్రారంభించారు. దీనినే కరుణశ్రీ

"వైషమ్యాలకు స్వస్తి చెప్పి పెడత్రోవల్ పూడ్చి అన్యోన్యవి
ద్వేషమ్ముల్ హతమార్చి స్వార్థములకున్ వీడ్కోలు గావించి ఈ
భాషా రాష్ట్ర శుభోదయమ్మున సుహృద్భావమ్ముతోడన్ విశే
షాశీస్సుల్ గొని దీక్షగైకొనుడశేషాంధ్రుల్ విశాలాంధ్రకై"

- అని విశాలాంధ్రలకు కవి కర్తవ్యబోధ చేశారు. ఆరుకోట్ల ఆంధ్రులు కలిసి మెలిసి ఉండాలని కరుణశ్రీ కాంక్ష జాషువా కూడా ఆంధ్ర ప్రజలకు కర్తవ్యబోధ చేశారు. ఈ విధంగా ఇరువురి కవితలలో దేశాభిమాన, రాష్ట్రాభిమానవం కన్పట్టును.

ఇరువురు తెలంగాణోద్యమ కవితలు, చైనా దురాక్రమణ కవితలు, పాకిస్తాన్ యుద్ధరీతి, బంగ్లాపోరాట కవితలు, మున్నగు కవితా ఖండికలు, నాయకస్తుతి కావ్యాలు నాటి సమాజ పరిస్థితులు, ప్రతిబింబించే రీతులో రచించారు.

ఇరువురు పుంభావసరస్వతులు, ఇరువురి కవిత్వములోని సామాజిక స్పృహ, జాతీయతా భావములను నానేర్చిన విధముగా క్లుప్తీకరించి వ్యక్తీకరించితిని.

చిరునామా : డా॥ ఎ. మీనాకుమారి 21-4-8, పెనుమత్సవారి వీధి ముత్యాలంపాడు, విజయవాడ - 11,
సెల్ : 9885295657

శ్రీ ధర్మవరపు వెంకట నారాయణ

# కృష్ణాతీరంలో కళా తరంగాలు

ముగ్గురు కలిస్తే ముచ్చటగా ఆంధ్రమహాభారతం అనే మహా యజ్ఞం పూర్తి అయింది.

అదే మహాభాగవతం గురించి ఆలోచించండి. తెలుగులో పద్య రూపంలో వ్రాయడానికి ఓరుగల్లు ఒడ్డున ఆ కృష్ణమ్మ నీళ్ళు తాగి, కృష్ణలో తానాలాడి, కృష్ణానది ఒడ్డున కూర్చొని బమ్మెర పోతనగారు ఆంధ్ర మహాభాగవతాన్ని ఆరంభించాక, ఒంటిచేత్తో ఆ కృష్ణలీలా మృతాన్ని మనముందు ఆవిష్కరించారు,శ్రీమద్భాగవతం పూర్తిచేశారు. అదీ కృష్ణానదీ తీరానికి కృష్ణమ్మ నీళ్ళకున్న శక్తి. ఆనాటి బమ్మెర పోతనగారికి అంతటి ఖ్యాతిని సాధ్యం చేసిన తల్లి కృష్ణమ్మ. కవి హృదయానికి, సంకల్ప శక్తిని రచనా శక్తిని కల్గించే తల్లి కృష్ణమ్మ. కృష్ణాతీరంలోని కళాతరంగాలలో సినీ పరిశ్రమకు ఆ కృష్ణమ్మ ఒడిలో, కృష్ణానది తీరంలో కృష్ణాజిల్లాకు విడదీయరాని సంబంధం వుంది.

1921వ సం॥లో కీ.శే. పోతిన శ్రీనివాసరావుగారు మారుతీ సినిమా అనే పేరుతో మొట్టమొదటి పర్మినెంట్‌థియేటర్‌ను విజయవాడలో నిర్మించారు. అలాగే కీ॥శే॥ గ్రంథి కామరాజుగారు మొట్టమొదట పూర్ణ పిక్చర్స్‌పేరుతో విజయవాడలో పంపిణీ సంస్థనునెలకొల్పారు. అంతేకాక తెలుగు చలనచిత్ర పరిశ్రమకు ఆద్యుడు, పితామహుడు అయినటువంటి కీ॥శే॥ రఘుపతి వెంకయ్యనాయుడు గారు కృష్ణాజిల్లా వాసి.

తెలుగునాట చలనచిత్రాలు అడుగు పెట్టడానికి అవి ఎదిగి తెలుగు చలనచిత్రాలుగా రూపుదిద్దుకొనడానికి బాటలు వేసింది. కృష్ణాజిల్లా మచిలీపట్నం వాసి రఘుపతి వెంకయ్యనాయుడు. అందుకే వారు తెలుగు చలనచిత్ర పితామహుడయ్యారు. దక్షిణాదిన తొలి టూరింగ్ టాకీస్ పెట్టిన వెంకయ్య ఆంధ్రా, బెంగుళూరు, శ్రీలంక, బర్మా, రంగూన్‌లలో పర్యటించి డేరాలు వేసి మూకీ సినిమాలు ప్రదర్శించారు. దక్షిణ భారతదేశంలో తొలి చలనచిత్ర ప్రదర్శకుడిగా ప్రారంభమై, తొలి థియేటర్ యజమానిగా, తొలి నిర్మాణ సంస్థ అధిపతిగా తొలి స్టూడియో అధిపతిగా, తొలి నిర్మాతగా రఘుపతి వెంకయ్యనాయుడు వినుతికెక్కారు. తాను ఎదుగుతూ సినీరంగ విస్తృతిని తెలుగులోకి తెచ్చి తెలుగునాట ముఖ్యంగా కృష్ణాజిల్లావారికి ఎందరికో స్ఫూర్తి నిచ్చారు. వారి మరణానంతరం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఒక అవార్డు నెలకొల్పి సినీరంగానికి విశిష్ట సేవ చేసిన వారిలో ఏటా ఒకరికి ఈ అవార్డును అందజేసి గౌరవిస్తుంది.

ఇంకా చలనచిత్ర పరిశ్రమ దిగ్గజాలయిన నటీనటులు, దర్శకులు, నిర్మాతలు, సాంకేతికనిపుణులు, పంపిణీదారులు, కవులు, రచయితలు ఎంతోమందికి స్ఫూర్తినిచ్చిన తల్లి కృష్ణమ్మ విశేషించి కృష్ణాజిల్లా.

తెలుగు చలనచిత్రరంగానికి వివిధ రంగాల్లో చిరస్మరణీయమైన సేవలందించిన ఎంతోమంది కృష్ణాజిల్లాతో ప్రత్యక్ష, పరోక్ష సాంగత్యాన్ని కల్గివున్నారు. ముఖ్యంగా నటుల విషయానికి వస్తే, విశ్వవిఖ్యాత నట సార్వభౌమ శ్రీ నందమూరి తారకరామారావుగారు, నటసామ్రాట్ డా॥ అక్కినేని నాగేశ్వరరావుగారు. వీళ్ళిద్దరూ కళామతల్లికి రెండు కళ్ళులాంటివారు. సూర్యచంద్రులవంటివారు. వీరు కృష్ణాజిల్లా వాళ్ళే. కృష్ణమ్మ నీళ్ళు త్రాగినవాళ్ళే. సినీరంగంలో కృష్ణమ్మ గొప్పతనాన్ని గురించి ఢంకా భజాయించి చెప్పడానికి ఈ ఇద్దరు చాలరా ! నటనకు భాష్యం చెప్పిన నందమూరి, నటరాజు ముద్దుబిడ్డ అక్కినేని. తెలుగు సినీ కళామతల్లి గర్వించే ఆ ఇద్దరి ప్రాభవం, వైభవం, విశిష్టత గురించి తెలుగుజాతికి, విడిగా, వివరంగా ఎవరు చెప్పాలన్నా కృష్ణాజిల్లా గురించి, కృష్ణానది గురించి చెప్పి తీరాల్సిందే.

నందమూరివారు దాదాపు 300 చిత్రాలకు పైగా నటించి, తెలుగు వారి ఆత్మగౌరవం దెబ్బతింటుందని భావించి 1982లో తెలుగుదేశం పార్టీ స్థాపించి, కేవలం తొమ్మిది నెల కాలంలో వంద సం॥ల చరిత్రగల కాంగ్రెసును ఓడించి ప్రపంచ రికార్డును నెలకొల్పారు. ఒక నటుడుగానే కాక జాతీయ నాయకుడిగా కూడా గుర్తింపు పొంది భారతీయులలో రత్నం వంటివారు అయ్యారు. ప్రపంచపటంలో కృష్ణాజిల్లాకు ప్రత్యేక గుర్తింపు తెచ్చారు.

ఇక అక్కినేనివారి విషయానికి వస్తే సినిమా పుట్టింది 80 సం॥లు అయితే అందులో 70 సం॥ జీవించారు. "కృషి వుంటే మనుషులు

ఋషులవుతారు" మహాపురుషులవుతారు" అన్న మహాకవి అక్షర కుసుమాలకు మానవాకృతి అక్కినేని నాగేశ్వరరావుగారు. మహానటుడి గా, స్టూడియో అధినేతగా, నిర్మాతగా, వ్యాపారవేత్తగా ఇలా అడుగు పెట్టిన ప్రతి రంగంలోను అద్వితీయ ప్రతిభను కనబరచిన అనితరసాధ్య మైన విజయాలను సాధించి ఎందరికో స్ఫూర్తి ప్రధాతగా నిలిచారు. ఆయన అందుకోని పురస్కారాలులేవు. అధిరోహించని శిఖరాలు లేవు. ఒక వ్యక్తి వ్యవస్థగా ఎలా మారొచ్చో తెలియజెప్పిన మహనీయుడు. తరాలు ఎన్ని మారినా ఎన్నటికి ఎవరూ అక్కినేనిని మరచిపోరు. మరచిపోలేదు.

'వేగూ' అంటూ అక్బర్ చక్రవర్తి పాత్రలో కుమారుడు షేక్ సలింని 'అనార్కలి'లో వివాహమాడవద్దని సింగగర్జనతో డైలాగులు పేల్చినా జై పాతాళభైరవి అంటూ శ్రోతల గుండెలు ఝల్లుమనేలా, అమ్మను స్తుతించినా, సాహసం సేయరా ఢింభకా' అంటూ శైలిలో శిష్యుణ్ణి ఆజ్ఞాపించినా హావభావ నటన కౌశలంతో ప్రేక్షకుల్నిఆకట్టుకొనే ఆకృతి, ముఖకవళికలు అందుకు తగ్గట్టుగా శరీర కదలికలు, అవన్నీ ఆయన సొంతం.దాదాపు 300 చిత్రాల్లో నటనలో హావభావాల్లో తనను ఎవరూ అధిగమించలేనట్లు తనదైన ముద్రను శాశ్వతంగా వెండితెరపై జిలుగులు దిద్దిన సాటిలేని మేటి నటుడు విశ్వనట చక్రవర్తి యస్.వి. రంగారావు. వీరూ కృష్ణాజిల్లావాళ్ళే.

ఈయన మనదేశం, పల్లెటూరిపిల్ల, పాతాళభైరవి, షావుకారు, పెళ్ళిచేసిచూడు, బంగారు పాప, నర్తనశాల, పాండవ వనవాసం, మాయాబజార్, గుండమ్మ కథ, అనార్కలి, దేవదాసు, మిస్సమ్మ చిత్రాల్లో పలు తరగతులకు చెందిన పాత్రలు పోషించి ఖ్యాతిగాంచారు.

తెలుగు చిత్రాలతోపాటు తమిళ, కన్నడ, మలయాళ, హిందీ చిత్రాల్లో విభిన్న పాత్రలు పోషించి చెరగని ముద్ర వేశారనటంలో అతిశయోక్తి ఏమాత్రం లేదు. జకర్తాలో ఆసియా ఫిల్ము ఫెస్టివల్‌లో 'నర్తనశాల' ప్రదర్శనకు ఎంపిక కావటం తెలుగు సినీ రంగానికి కలికితురాయి. అందులో కీచకపాత్ర పోషించిన యస్వీకి ప్రత్యేక బహుమతి రావటం తెలుగుజాతికి గర్వకారణం. వీరు కృష్ణాజిల్లా వారు కావటం విశేషం. తెలుగు కలర్ చిత్రాల చరిత్రలో 'కథానాయకుడుగా తనదైన శైలిలో గుర్తింపు పొందిన ఉప్పు శోభనాచలపతిరావు అదే మన శోభన్‌బాబు, కృష్ణాజిల్లా చిననందిపాడులో జన్మించి భక్తశబరితో తెరంగేట్రం చేసి వీరాభిమన్యులో సోలో హీరోగా కేరీర్‌ను మొదలుపెట్టారు. తెలుగు చలనచిత్ర చరిత్రలో తనకంటూ ఒక పేజీని సొంతం చేసుకున్న మహానటుడు 'శోభన్‌బాబు'గారు.

దాదాపు 300 చిత్రాలలో విలన్‌గా, మరో 450 చిత్రాల్లో క్యారెక్టర్ ఆర్టిస్టుగా, తనదైన శైలిని తెలుగు చలనచిత్రాలలో తనకంటూ ఒక ప్రత్యేక గుర్తింపు తెచ్చుకొని, నవరస నటనా సార్వభౌముడిగా పిలబడిన కైకాల సత్యనారాయణ కృష్ణాజిల్లావాడు కావటం విశేషం.

కృష్ణాజిల్లా కంకిపాడులో జన్మించి నాటక, టీవీ రంగాల్లో పేరు తెచ్చుకుని 'ప్రతిఘటన'లో ప్రతినాయకుడిగా సినిమా రంగంలో ఓ ప్రభంజనం సృష్టించారు. అనేక చిత్రాలలో నటించి కేంద్రప్రభుత్వం నుంచి 'పద్మశ్రీ'తో సత్కరింపబడ్డారు.బి.జె.పి పార్టీనుండి ఒక పర్యాయం విజయవాడ శాసనసభ్యునిగా పనిచేశారు. వీరి సోదరుడు శ్రీ కోట శంకరరావు కూడా రంగస్థల, టి.వి., సినీ రంగాలలో విభిన్న పాత్రలలో నటిస్తూ ప్రేక్షకుల ప్రశంసలు పొందుతున్నారు.

ముఖ్యంగా మనం చెప్పుకోవలసింది నటకిరీట, శ్రీ గద్దే రాజేంద్ర ప్రసాద్ గురించి. వీరు కృష్ణాజిల్లా నిమ్మకూర్‌లో జన్మించారు. వీరు ఎక్కువగా హాస్యరస పాత్రలను పోషించారు. దాదాపు 30 సం॥లు సుదీర్ఘ సినీ జీవితంలో 200పైగా సినిమాలలో నటించి,తెలుగు చలన చిత్ర చరిత్రలో తనకంటూ ఒక పేజిని సొంతం చేసుకున్న, కింగ్ ఆఫ్ కామెడీ నటకిరిటి శ్రీ రాజేంద్రప్రసాద్.

వీరేకాకుండా....తెలుగు చలనచిత్రరంగంలో నటులుగా మకుటం లేని మహారాజులుగా తమకంటూ ఒక ప్రత్యేక శైలి, స్థాయి నెలకొల్పి కృష్ణాజిల్లా ఖ్యాతిని ఇనుమడింపజేసిన వారిలో.....ముఖ్యులు చంద్రమోహన్, సుత్తివేలు, సుత్తి వీరభద్రరావ్, నూతన్‌ప్రసాద్, గుండు హనుమంతరావు, విన్నకోట రామన్నపంతులు, పిళ్ళా ప్రసాద్

దర్శకులలో మనం ముఖ్యంగా స్మరించుకోవలసినది డాక్టర్ గరికపాటి రాజారావుగారు, వీరు కృష్ణాజిల్లా 'పోరంకి'లో జన్మించారు. ప్రజల్లో చైతన్యం కోసం నాటక, కళారూపాల్ని విస్తృతంగా ప్రచారం చేశారు. దాదాపు10 సం॥లు బెజవాడలో వుండి, డాక్టరుగా, యాక్టరుగా నాటక సంఘాల, ప్రజానాట్యమండలి శాఖల ఆర్గనైజర్‌గా, రాష్ట్రప్రజానాట్య మండలికి 'డైరెక్టర్'గా కార్యకలాపాలు నిర్వహించారు గరికపాటివారు. అందరూ కొత్త నటీనటులతో టెక్నీషియన్స్‌తో 'పుట్టిల్లు' తీశారు. ఈ చిత్రం ద్వారా వెండితెరకు పరిచయమైన వారిలో జమున, అల్లు రామలిం గయ్య, సంగీత దర్శకుడు టి. చలపతిరావు, ప్రసిద్ధ బుర్రకథ కుదు నాజరు ముఖ్యులు.

తెలుగు సినిమా ప్రారంభమై7 సం॥ల తర్వాత అంతవరకు ఎంతో ప్రజాదరణ, ప్రాచుర్యం పొందిన పౌరాణికాలను మాత్రమే చిత్రాలుగా తీస్తూవచ్చారు. కానీ సినిమా రంగంలో కొత్తనీరు ప్రవేశించి, కొత్త దృక్పథాలు ప్రారంభమయ్యాయి. సుడిగాలిలాగా సాంఘిక చిత్రాలు వెల్లువెత్తాయి. ఒక విప్లవంలా జరిగిన ఈ మార్పుకు బీజం వేసింది గూడవల్లి రామబ్రహ్మం. వీరు కృష్ణాజిల్లా నందమూరులో జన్మించారు. పుక్కింటి పురాణాలకు మాత్రమే పరిమితమవుతూ వచ్చిన తెలుగు చిత్రరంగాన్ని రామబ్రహ్మం దర్శకత్వంలో 'మాలపిల్ల' ఓ కుదుపు కుదిపింది. అభ్యుదయ సాంఘిక చిత్రాలకు అంకురార్పణ చేసింది.

తెలుగు చిత్ర సీమలో ఆణిముత్యాలలాంటి చిత్రాలు 'తాసిల్దారు గారి అమ్మాయి(1971), స్త్రీజన్మ(1967), సెక్రటరీ(1976), ప్రేమనగర్ (1971) లాంటి యాభైకి పైగా చిత్రాలకు దర్శకత్వం వహించిన ప్రముఖ దర్శకులు కోవెలమూడి సూర్య ప్రకాశరావుగారు. కృష్ణాజిల్లా కొలవెన్ను గ్రామంలో జన్మించారు. చిత్రసీమకు విశిష్టమైన కీర్తిని తెచ్చారు.

తెలుగు తెర మరో ఆణిముత్యం కమలాకర కామేశ్వరరావు. వీరు కృష్ణాజిల్లా బందరులో జన్మించారు. వీరు చరిత్రలో నిలిచిపోయే అనేక సాంఘిక, జానపద, పౌరాణిక చిత్రాలకు దర్శకత్వం వహించటం, స్క్రీన్‌ప్లే అందించటం జరిగింది. 'ధన సంపాదనే'లక్ష్యం కాదు. ప్రజలకు నచ్చే చిత్రాలు తియ్యాలి. అంటూ నలుగురికీ ఆదర్శంగా నిలిచారు.

తెలుగు సినీరంగంలో వినూత్నమైన శైలిలో అలుపు లేకుండా సినీ దిగ్గజాలం అందరితో చిత్రాలు చేసి విజయవంతం చేసిన దర్శకేంద్రుడు శ్రీ కె. రాఘవేంద్రరావు, కృష్ణాజిల్లా విజయవాడలో జన్మించారు. పౌరాణిక చిత్రాలు అంతరించిపోతున్న అరోహణలో 'అన్నమయ్య' చిత్రానికి దర్శకత్వం వహించి విజయవంతం చేశారు.

నవ్వటం ఒక యోగం, నవ్వించటం ఒక భోగం, నవ్వకపోవటం ఒక రోగమంటూ కుటుంబ సమేతంగా చూడదగ్గ అనేక హాస్యచిత్రాలకు దర్శకత్వం వహించి అనేకమంది నటులను చిత్రసీమకు పరిచయం చేసిన ఘనుడు, విజయవాడవాడు, మన జంధ్యాల. ఇలా చెప్పుకుంటూ పోతే అనేకంమది, చలనచిత్రరంగంలో దాదాపు 60 శాతంపైన కృష్ణానదీ తీరంలో కృష్ణమ్మ ఒడిలో పెరిగినవారే. కృష్ణాజిల్లాలో పుట్టినవారే.

హీరోయిన్స్ విషయానికి వస్తే మహానటి సావిత్రిగారు. ఈమె గురించి వివరించాలంటే ఒక మహాగ్రంథమే వ్రాయాలి. ఆమె గురించి ఎంత చెప్పినా చాలా తక్కువే. కేవలం నటీనటులు, దర్శకులే కాకుండా చిత్రసీమకు ఎనలేని ఖ్యాతి తెచ్చిన ఇతరులలో ముఖ్యులు వి.యస్.ఆర్ స్వామి, ఘంటసాల వెంకటేశ్వరరావు, మంగళంపల్లి బాలమురళీకృష్ణ, వేటూరి సుందర రామమూర్తి, కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, అంజలీ ఆదినారాయణ, ఎందరో.... ఎందరో....ఎందరో...లెక్కింప అలవికానంతమంది తెలుగు చలనచిత్ర పరిశ్రమకు ప్రపంచపటంలో 'కృష్ణాజిల్లా'కు ఒక ప్రత్యేక గుర్తింపు తెచ్చారు. "కృష్ణా పుష్కరాలు" సందర్భంగా ఆ మహనీయులను స్మరించుకుంటూ....మీ ముందుంచే అదృష్టం నాకు కలిగినందుకు సదా....ధన్యుడను.

# విశ్వనాథవారి కృష్ణానది వర్ణన

వర్షాకాలంలో ఒడ్డులందు ఆడుకుంటున్న నీటి తరంగాలతో ఆ నది ఉయ్యాలలూగుతున్నది. అగస్త్యోదయ శుభసమయారంభంలో తెల్లని కాంతులను విరజిమ్ముతున్న జలం ఆమెకు మృదుశయ్యగా అమరి నిద్రాసుఖాన్ని కలిగిస్తున్నది. వసంతకాలం ప్రాతఃసమయంలో చిరు ఎండల కాంతిరేఖలతో చిత్ర చిత్ర వర్ణాల మేళవింపు గల జలాలపై విశ్రాంతి పొందుతున్నది. గ్రీష్మ ఋతువులో వేడిమి వాడిమికి సలసల మరిగే జలప్రవాహం లోపలి భాగంలోని, అంత తీవ్రం కాని నీటిలో ప్రాణులు సేదతీర్చుకుంటున్నాయి. అన్ని కాలాలలో జలం అంతులేని పవిత్రతతో అలరారుతూ ఉంటుంది.

*చిరునామా : శ్రీ ధర్మవరపు వెంకట నారాయణ, ఇ.నెం. 15-C, ధ్యానజగతి, కలవచర్ల (Post) రాజానగరం మండలం. తూర్పుగోదావరి జిల్లా - 533294, సెల్ : 9515539219.*

డా॥ దామెర వేంకట సూర్యారావు

# కృష్ణాలోయలో సాహిత్య వైభవం

కృష్ణానది - సస్యసంపత్స్రష్ట... సంగీత సాహిత్యాది సకల కళా వికాస ద్రష్ట... సలిలో త్కృష్ట.... సర్వజీవనాకృష్ణ. కృష్ణాలోయలో అపూర్వమైన సాహిత్య సంపద విలసిల్లింది. ప్రాచీనకాలంలో ఈ ప్రాంతాన్ని పాలించిన రాజవంశీకులు కవి పండితులను ఆదరించారు. ఆధునికయుగంలో కూడ ఈ ప్రాంతంవారు వివిధ సాహిత్యప్రక్రియ లలో లబ్ధ ప్రతిష్ఠులయ్యారు.

కృష్ణతత్త్వాన్ని ప్రబోధిస్తూ జయదేవుని గీతగోవింద కావ్యాన్ని వ్యాఖ్యానిస్తూ "కృష్ణలీలా తరంగిణి"ని రచించిన నారాయణ తీర్థులు కృష్ణాతీరంలోని దివిసీమకు చెందిన కాజగ్రామ నివాసి. ఇచటి సమీపం లోని మొవ్వ గ్రామంలో నివసించిన మొవ్వగోపాలపదములు రచించిన వాడు క్షేత్రయ్య. భామాకలాపాన్ని బోధించి జీవ బ్రహ్మైక్య వేదాంత సారాన్ని అందజేసిన కూచిపూడి నాట్య పితామహుడు "సిద్ధేంద్రయోగి" కూచిపూడి గ్రామవాసి. కూచిపూడి నాట్యం అంతర్జాతీయ ఖ్యాతి నార్జించింది.

## సాహిత్యంలో కృష్ణానది

పురాణాలలో కృష్ణానది ప్రశస్తి ఉంది. మార్కండేయపురాణం గోదావరీ, భీమరథీ, కృష్ణవేణి మొదలైన నదులను 'సరిదుత్తమాః' అంటూ పేర్కొన్నది. వాయుపురాణం దక్షిణాపథ పుణ్యనదుల్లో కృష్ణా నదిని పేర్కొన్నది. కూర్మపురాణం దక్షిణానదీ వర్ణనా సందర్భంలో పాపహ రాలైన నదుల పట్టికలో కృష్ణానదిని చేర్చింది. మత్స్యపురాణం శ్రాద్ధ ప్రకరణంలో శ్రాద్ధయోగ్య తీర్థాలను పేర్కొంటూ కృష్ణానదిని కూడా చేర్చింది. వామన పురాణంలో కూడా "జగతోమాతరః సర్వాః సాగర యోషితః"అంటూ సహ్యపర్వతంలో ఆవిర్భవించిన మహానదుల్లో కృష్ణా నదిని చెప్పింది. వ్యాసభారతం వన పర్వంలో యుధిష్ఠిరుడు తీర్థ ప్రభావాలను చెప్పే సందర్భంలో పేర్కొన్న నదుల్లో కృష్ణవేణి ఉంది.

"తుంగవేణా కృష్ణవేణా కపిల శోణఏవచ
ఏతానద్యస్తు ధిష్ణ్యానాం మాతరోయాః ప్రకీర్తితాః"

భీష్మపర్వంలో కృష్ణానదిని మందవాహినిగా పేర్కొనడం జరిగింది. పాల్కురికి సోమన శ్రీశైలంలో వున్న పాతాళ గంగను విస్తృతంగా వర్ణించాడు. ఈ కవి సంగమేశ్వర క్షేత్రాన్ని వర్ణిస్తూ "జగత్ఖ్యాపిత లీలసరినొప్పు కూడలి సంగమేశ్వరము దనరారు తుంగభద్రయు కృష్ణవేణియును గూడ ..... అని పేర్కొన్నాడు. ఎఱ్ఱాప్రగడ నృసింహ పురాణములో కృష్ణవేణి తీర్థాన్ని వర్ణించాడు. కవిసార్వభౌముడు కాశీ ఖండంలో పుణ్యక్షేత్రాలను వర్ణిస్తూ శ్రీశైలంలోని పాతాళగంగను చిత్రించాడు. ఇతడు పలనాటి చరిత్రలో కృష్ణ, నాగులేరు, నిప్పుల యేరు నదులను పేర్కొన్నాడు. వినుకొండ క్రీడాభిరామ కావ్యంలో శ్రీకాకుళపు తిరునాళ్ళను వర్ణిస్తూ కృష్ణానది ప్రశస్తి చేసారు. జక్కన, అనంతామాత్యుడు, వెన్నెలకంటి సూరన, కొరవి గోపరాజు, మడికి సింగన, అల్లసాని పెద్దన మొదలైన కవులు ఆయా సందర్భాలలో కృష్ణానదిని పేర్కొన్నారు. కృష్ణదేవరాయలు కృష్ణాతీరంలోని శ్రీకాకుళ తీరంలో ఆముక్తమాల్యద ప్రబంధ రచనకు అంకురార్పణ చేశాడు. తెనాలి రామకృష్ణుడు ఘటికాచల మహత్యంలో పుణ్యనదులను పేర్కొనే సందర్భంలో కృష్ణనదిని చేర్చాడు. భట్టపెనుమర్తి కోదండరామ కవి 593 గద్య పద్యాలతో తెలుగువారి తొట్టతొలి ఇలవేలుపు అయిన శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణువు చరిత్రను వర్ణించాడు. ఆ కావ్యం వల్లభా భ్యుదయం. అనంతర కాలంలో అనేకమంది ప్రాచీనకవుల కావ్యాలలో కృష్ణానది ప్రశంస, ప్రసక్తి చోటుచేసుకున్నాయి.

## కృష్ణాలోయలో రాజవంశీయుల సాహిత్య సేవ

ఆంధ్రదేశాన్ని పాలించిన తొలి ప్రసిద్ధ రాజ వంశం శాతవా హనులు. శాతవాహన చక్రవర్తి హాలుడు ప్రాకృతంలో 'గాథసప్తశతి'

అనే సంకలన గ్రంథం వెలయించాడు. శాతవాహన కాలంలోని గుణా ఢ్యుడు బృహత్కథను పైశాచీప్రాకృతంలో రచించాడు. శాతవాహనుల కాలంనాటి బౌద్ధమతాచార్యులు నాగార్జునుడు సంస్కృతంలో అనేక బౌద్ధ తాత్విక, గ్రంథాలు రచించాడు. విష్ణుకుండినులు, శాలంకా యనులు కూడ కవి పండితులను ఆదరించినట్లు తెలుస్తోంది. వెల నాటి చోళుల ఆదరణలో సాహిత్యం, కళలు, వృద్ధిగాంచాయి. తెలుగు కావ్యరచనతోపాటు, శతకసాహిత్యం రూపుదిద్దుకుంది. దేవాలయాల్లో వేదశాస్త్రాలను బోధించేవారు. రాజులలో పండితులున్నారు. కొలువు లలో సాహిత్య ప్రసంగాలు జరిగేవి. వీరికున్న "శిష్టేష్టవనజవన మార్తాండ" అను ప్రశస్తిని బట్టి పండితులపట్ల వీరికున్న విశేషాభిమానం స్పష్టమవుతోంది. రెండవ చోళరాజు సర్వశాస్త్రపండితుడు. తన కొలువు లోని పండితులచే స్తుతింపబడినవాడు. ఒక తామ్రశాసనం యితనిని 'కవి పుండరీక నికరప్రద్యోతన" అని ప్రస్తావించింది. ఇతని కొలువు ఒక బ్రహ్మసభ లాంటిది. అందులో మల్లికార్జునపండితా రాధ్యులు, బౌద్ధపదాచార్యులు ప్రసిద్ధులు. మల్లికార్జున పండితారాధ్యుల రచనలలో 'శివతత్త్వసారము' పేర్కొనదగ్గది. ఇతడు శ్రీ ముఖ దర్పనగద్యము, గణ సహస్రనామము, ఇష్టలింగస్తోత్రము, హరలీల, రుద్రమహిమ, అమరేశ్వరాష్టకము మున్నగు రచనలు చేశారని సోమనాథుని పండితారాధ్యచరిత్ర ద్వారా తెలుస్తోంది. మొదటి చోళుని మంత్రులు, సేనానాయకులు, అధికార్లు కూడ కవులను పోషించారు. భీమనాథుడు వేదశాస్త్ర పండితుడేకాక కవిపోషకుడు కూడా. రెండవ గొంకని మంత్రి గోవిందుడు కావ్యరచయిత. కంతుడనే కోశాధికారి సాహిత్యాభిమాని, మంత్రి సూర్యుడు, పడాలుచోళుని భార్య కర్థాంబ, మొదటి చోళుని రాణి గుండమ్మ, కవులను ఆదరించారు. మంచనకవి. "విద్ధసాల భంజిక" అను సంస్కృత నాటకాన్ననుసరించి "కేయూరబాహుచరిత్ర" మనుకావ్యమును రచించెను. సజ్జన ప్రోలనాయకుడు కవిపండితులకు కల్పవృక్షం వంటివాడు. "జయ" అనే సేనానాయకుడు కవులకు దానాలిచ్చినట్లు చేబ్రోలు శాసనం ద్వారా తెలుస్తోంది. నందూరి భీమయ గుండయ పండితుడు. సాహిత్య ప్రసంగాలపట్ల మక్కువ కలవాడు.

వర్థమానపురగోన రాజులలో గోనబుద్ధుడు, ఇతని కుమారులు కాచడు,విఠల అనువారు రంగనాథ రామాయణాన్ని రచించారు. ఇది విపద రామాయణం శబ్ద విద్యావిశారదుడ'ను సార్థకనామం గల ఈశ్వరభట్టోపధ్యాయ పండితుడు యిక్కడివాడే.

పల్నాటి హైహయుల కాలంలో గురజాల, మాచర్ల కొలువులు కవి పండితులు, సంగీత నాట్యాచార్యులతో నిండివుండేవి. నలగామ ప్రభువు కొలువు గురించి శ్రీనాథుడు చక్కగా వర్ణించాడు. "పల్నాటి వీరభాగవతము" వీరిని గూర్చిన ముఖ్య గ్రంథం. మెకంజీ వ్రాతప్రతు లలో దీన్ని గురించిన విషయాలున్నాయి. శ్రీనాథుని తర్వాత మల్లయ, కొండయ అనువారలు యిక్కడి కవులు.

కొండవీటి రెడ్డిరాజులు సాహిత్యపోషకులు. పెదకోమటి వేమారెడ్డి శృంగార దీపిక సంగీత చింతామణి, అమరువ్యాఖ్య, సప్తశతీసార వ్యాఖ్య మొదలైన గ్రంథాలు రచించాడు. ఇతడి ఆస్థాన కవి వామన భట్టు వేమభూపాల చరిత్ర రచించాడు. శ్రీనాథుడు 'శృంగార నైషధము' కావ్యాన్ని మామిడి సింగనమంత్రికి అంకితం ఇచ్చాడు.

14-15 శతాబ్దులలో రాచకొండ, దేవరకొండలను పాలించిన పద్మనాయకులు సాహిత్యపోషకులు. సర్వజ్ఞ సింగభూపాలుడు రసార్ణవ సుధాకరం అనే అలంకారశాస్త్రాన్ని 'సంగీత రత్నాకర'మనే వ్యాఖ్యను సంస్కృతంలో రచించాడు. బమ్మెర పోతన "భోగిని దండకం" సింగ భూపాలుని సోదరుడి ప్రియురాలికి సంబంధించినదిగా చెబుతారు.

## సంస్థానాలు - సాహిత్య పోషణ

కృష్ణానదీ ప్రాంతానికి చెందిన వివిధ సంస్థానాలు కవి పండి తులను ఆదరించాయి. మహబూబ్‌నగర్, కృష్ణా, గుంటూరు జిల్లాలోని జమీందార్లు గొప్ప సాహిత్య పోషణ గావించారు.

### అమరచింత - ఆత్మకూరు

మహబూబ్‌నగర్ జిల్లాలోని ఈ సంస్థానంలో ఏటేటా ఫాల్గున మాసంలో కవి పండిత గోష్ఠులు జరిగాయి. సురపురం కేశవయ్య ఈ సంస్థానం కవులలో ముఖ్యుడు. ఆయన నిరోష్ఠ్య రామాయణం అనే ప్రౌఢకావ్యాన్ని రచించి ఆత్మకూరు సంస్థానాధీశుడు సోమభూపాలు డికి అంకితమిచ్చాడు. తర్కతీర్థ, బాలసరస్వతి మొదలైన బిరుదులుగల తిరుమల బుక్కపట్నం శ్రీనివాసాచార్యులు కూడా ఈ ఆస్థానంవారే. తిరుపతి వేంకట కవులు 'శ్రీనివాస విలాసం' అనే కావ్యాన్ని ఈ ఆస్థాన ప్రభువు సీతారామ భూపాలుడికి అంకితమిచ్చారు.

### గద్వాల

గద్వాల సంస్థానం మహబూబ్‌నగర్ జిల్లాలోనిది. ఈ సంస్థాన ప్రభువు పెద సోమభూపాలుడు ఉత్తమ సాహితీ పోషకుడు. ఇతడి ఆస్థానంలో హరిభట్టు, కాణాదం, పెదసోమయాజి మొదలైన విద్వతన కవులుండేవారు. గద్వాల ప్రభువు తమ ఆస్థాన కవులచే వాల్మీకి రామాయణాన్ని అనువదింపచేశారు.

### జటప్రోలు

మహబూబ్‌నగర్‌జిల్లాలోని ఈ సంస్థానానికి చెందిన మాధవ రాయుడు చంద్రికాపరిణయం అనే శ్లేష చమత్కార ప్రబంధాన్ని రచించాడు. ఈ సంస్థానంలో వాజపేయుల రామసుబ్బరాయుడు అక్షింతల సుబ్బాశాస్త్రి, వెల్లాల సదాశివశాస్త్రి మొదలైన కవులు వుండేవారు.

### వనపర్తి

ఈ సంస్థాన పాలకుడు రాజా బహిరి గోపాలరాయుడు ప్రాకృతం బహు భాషలలో పాండిత్యం కలిగి 'అష్టభాషా కవి' అని ప్రసిద్ధికెక్కాడు. ఈయన 'శృంగార మంజరి' భాణం అనే రూపకాన్ని సంస్కృతాన్ని రచించాడు. రామచంద్రోదయం అనే కావ్యానికి సంస్కృతంలో వ్యాఖ్యానం రచించాడు. ప్రతియేటా ఈ సంస్థానంలో కార్తీక పౌర్ణమినాడు శ్రీ రామకృష్ణ స్వామివారి బ్రహ్మోత్సవాల సందర్భంగా వేద శాస్త్ర పండితుల గోష్ఠులు జరిగేవి. ప్రసిద్ధ పరిశోధకులు మానవల్లి రామకృష్ణ కవి ఈ సంస్థానంలో గ్రంథ ప్రచురణ కార్య నిర్వాహకులుగా చాలా కాలం పనిచేశారు. తిరుపతి వేంకట కవులు తమ "నానా రాజ సందర్శనము"లో ఈ సంస్థాన పాలకులు రాజారామేశ్వ రాయలను "గళ బిరుదులు కైసేసె నమల పూర్గద్వాల విజయనగర పురములు...." అనే పద్యంలో వర్ణించాడు. ప్రసిద్ధ పండితులు సన్నిధానము సూర్య నారాయణ శాస్త్రి, చెలమచర్ల రంగాచార్యులు మొదలైన పండితులకు ఈ సంస్థానంతో సంబంధముంది.

### అమరావతి

రాజావెంకటాద్రి నాయుడి వైభవాన్ని ఆనాటి కవులు పెక్కుమంది తమ కావ్యాల్లో వర్ణించారు. వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు భూలోక దేవేంద్రుడని ఆంధ్రాభ్యుదయము, ద్రౌపదీ పరిణయము మొదలైన కావ్యాలను పేర్కొనబడినది. ఈ ఆస్థానంలో ప్రసిద్ధుడు ములుగు పాపయారాధ్యులు దేవీభాగవతము ఆంధ్రీకరించారు. వీరు సంస్కృతాంధ్రలో శతాధిక గ్రంథకర్తలు. వాసిరెడ్డివారి కోవకు చెందిన రాజా హరిహర ప్రసాద బహద్దురు పొన్నూరులో వేద పాఠశాల స్థాపించారు. వెంకట సుబ్బదాసు "వాసిరెడ్డి వంశ చరిత్రము" అనే కావ్యాన్ని రచించారు.

### చల్లపల్లి

ఈ సంస్థానంలో ఆదరణపొందిన కవుల్లో కాసుల పురుషోత్తమ కవిని పేర్కొంటారు. ఇతడు ఆంధ్రనాయక శతక కర్త. ముక్తేవి పెరుమాళ్ళయ్య కవి హనుమంతక శతకం రచించాడు.

### నూజివీడు

సాహితీపోషణంలో తెలుగు గడ్డమీది సంస్థానాధీశ్వరులలో ఈ పాలకులు అగ్రశ్రేణికి చెందినవారు. ఈ ఆస్థానంలో కుమార ధూర్జటి ప్రముఖులు. ఇతడు ఇందుమతీ పరిణయం రచించాడు. ఇంకా ఈ సంస్థానంలో దిట్ట కవి రామచంద్రకవి, అణివిల్ల వెంకటశాస్త్రి మొదలైన కవులు ఉండేవారు.

### ముక్త్యాల

ఈ సంస్థాన ప్రభువు వాసిరెడ్డి చిన వెంకటాద్రి పోషణంలో తాతం భట్టు గురుమూర్తి శాస్త్రి 'కృష్ణానదీ మాహాత్మ్యము రచించాడు. ఈ సంస్థాన పాలకులు మహిష్మతీ అనే ముద్రాక్షరశాలను నెలకొల్పి ప్రాచీన తాళపత్ర గ్రంథాలను ముద్రించారు.

### నరసరావుపేట

ఈ సంస్థాన ప్రభువు రామన్నగారికి 'సాహిత్య భోజుడు' అని బిరుదు ఉండేది. ఈ సంస్థాన కవి దిట్టకవి నారాయణ కవి 'రంగరాయ చరిత్ర' రచించాడు.

### రాచూరు - రేపల్లె

గుంటూరుజిల్లాలోని ఈ సంస్థానంలో రాజా కృష్ణానేని తిరుపతి మాణిక్యరావు ప్రభువు ఆస్థానకవి. అకలంకము కృష్ణకవి. శకుంతలా పరిణయం మొదలైన కావ్యాలు రచించాడు.

కృష్ణాది పరీవాహక ప్రాంతానికి చెందిన మరికొందరు చిన్న జమిందారులు కూడా వారి వారి స్థాయిలో సాహిత్యపోషణ గావించారు. గోపాల పేట, చిక్కవరం, పరిటాల, గురజ, వల్లూరు, బోరవిల్లి మొదలైన చిన్న సంస్థానాలు ఈ కోవలోకి వస్తాయి.

ఆధునిక యుగంలో ఎందరో ప్రసిద్ధకవులు రచయితలు విమర్శకులు పాత్రికేయులు ఈ ప్రాంతానికి చెందినవారు వున్నారు.

చిరునామా : *డా॥ దామెర వేంకట సూర్యారావు, 50-85-6, మధురానగర్, విశాఖపట్టణం - 16, ఫోన్ నెం. 9885188431.*

డా॥ జంధ్యాల పరదేశి బాబు

# కృష్ణామండలంలోని సంస్థానాలు - సాహిత్యపోషణం

ఆంధ్రదేశంలో ఒకప్పుడు ఆత్మకూరు, అమరావతి, గద్వాల, చల్లపల్లి, దోమకొండ, కపిలేశ్వరపురం, వనపర్తి, వెంకటగిరి, నరసరావుపేట, నూజివీడు, పిఠాపురం, పెద్దాపురం, విజయనగరం, భద్రాచలం, సాలూరు, ముక్త్యాల మొదలైన సంస్థానాలుండేవి ఆయా సంస్థానాధిపతులు లలితకళాపోషకులై, ప్రజాసేవకులై విరాజిల్లారు.

ఆంధ్రదేశమందలి కృష్ణామండలానికొక ప్రాముఖ్యత కలదు. పవిత్రమైన కృష్ణానదీ తరంగాలచే పునీతమైన ప్రదేశమిది. ఎందరో కవి పండితులకు, గాయకులకు, కళాకారులకు పుట్టినిల్లుగా భాసిల్లుచున్న ప్రాంతమిది. వేదాద్రిపై నొలకొన్న లక్ష్మీనరసింహస్వామి, ఇంద్రకీలాద్రిపై వేంచేసియున్న కనకదుర్గమ్మ, శ్రీకాకుళక్షేత్రమందలి ఆంధ్ర మహావిష్ణువు ప్రజల్ని చల్లగా కాపాడుతున్న ప్రదేశమిది. సిద్ధేంద్రయోగిచే వర్ధిల్లిన కూచిపూడి నాట్యం తెలుగువారి కీర్తిపతాకాల్ని ఖండ ఖండాంతరాల వరకు రెపరెపలాడునట్లు చేసింది. ఇంతటి ప్రాముఖ్యం కల్గిన మండలంలోని సంస్థానాల్ని, ఆయా సంస్థానాధిపతుల సాహిత్య పోషణను తెలిసికొందాం.

కృష్ణామండలంలోని ప్రధాన సంస్థానాలు మూడు అవి.

1. చల్లపల్లి సంస్థానం
2. నూజివీడు సంస్థానం
3. ముక్త్యాల సంస్థానం

## 1. చల్లపల్లి సంస్థానం :

కృష్ణాజిల్లా దివి తాలూకలోని ప్రాచీన సంస్థానమిది. దీని వైశాల్యం 190 చ.మై. 66 కసుబా గ్రామాలు - 32 శివారు గ్రామాలు - 20 అగ్రహారాలు చల్లపల్లి జమీందారుల ఆధీనంలో ఉండేవి. సంస్థాన పాలకులు కమ్మవారు. పూర్వపాలకులలో గుర్విసీడు, తిరుమల నీడు, గంగినీడు, కంచినీడు, నాగన్న మొదలగువారు ప్రసిద్ధులు.

సంస్థానాధిపతియైన యార్లగడ్డ కోదండరామన్న దేశాయి (1746-1791)గారి ఆశ్రయంలో గల ప్రధానకవి ముక్తేవి పెరుమాళ్ళయ్య. 'శత్రుహంత శ్రీహనుమంతా' అనే మకుటంలో ఈ కవి రచించిన కందపద్యశతకం 'హనుమంతశతకం'.

"వడిగల దేవుడవనుచును
నుడికారపు శతకమందు నుతిసేసెదనే
కడువడి గుబ్బపు దళముల
జెడతోలుము శత్రుహంత శ్రీహనుమంతా".

ఇత్యాదిగా గలపద్యాలు హృద్యముగానున్నవి. 'రామాయణ కథను' భద్రగిరి సౌధసంచార భవవిదూర' అనే మకుటంతో పెరుమాళ్ళయ్య ఒక కావ్యాన్ని, ఆ కవీశ్వరుని కుమారుడైన సుందర రామదాసు 'రామాయణ సారసంగ్రహం' అనే కావ్యాన్ని రచించారు.

శ్రీమంతు రాజా ఇమ్మడి అంకినీడు బహద్దూరు (1798-1819) గారి ఆస్థానంలో కాసుల పురుషోత్తమ కవి ఉండేవాడు. చల్లపల్లి జమీందారీలోని శ్రీకాకుళాంధ్ర విష్ణునిమీద చెప్పిన శతకము 'ఆంధ్ర నాయకశతకం'.

"అలు నిర్వాహకురాలు భూదేవియై
యఖిల భారకుడను నాఖ్యదెచ్చె
నిష్ట సంపన్నురాలిందిర భార్యయై
కామితార్థదుడన్న ఘనతదెచ్చె
కమలగర్భుడు సృష్టికర్త తనూజుడై
బహుకుటుంబకుడన్న బలిమిదెచ్చె
కలుష విధ్వంసిని గంగకుమారియై
పతిత పావనుడన్న ప్రతిభ తెచ్చె
ఆంధ్రుబిడ్డలు దెచ్చు ప్రఖ్యాతిగాని
మొదటినుండియు నీవు దామోదరుడవె

**చిత్రచిత్రప్రభావ దాక్షిణ్యభావ**
**హతవిమతజీవ శ్రీకాకుళాంధ్రదేవ !"**

తియ్యని తెనుగు నుడికారాలకు, చక్కని వ్యాజస్తుతులకు ఆకారమీ శతకం. మానసబోధ, హంసలదీవి గోపాలశతకాలు, భక్తకల్పద్రుమ శతకం - పురుషోత్తమకవి విరచితాలు. 1846-1875 మధ్య కాలంలో చల్లపల్లి సంస్థానాన్ని పాలించిన మూడవ అంకినీడు బహద్దూరు గారు మంచి భాషాభిమానులు. వేమూరి సుబ్బావధాని, యడవల్లి అప్పావధానులు, మదూకదరి కృష్ణావధానులు, కోటమర్తి రామావధానులు, ప్రభల ఆదినారాయణావధానులు, చల్లపల్లి జమీందారులచే సత్కరింపబడిన వేదపండితులు. రాజాగారు చల్లపల్లిలో ఒక సంస్కృత పాఠశాలను స్థాపించి, పోషించారు. 1876-1921 నాటి చల్లపల్లి ప్రభువైన మల్లికార్జున ప్రసాదనాయుడు బహద్దూరుగారి ఆస్థానంలో వేమూరి నరసింహశాస్త్రి శతావధాని వేలూరి శివరామశాస్త్రి అనే పండితులుండేవారు. ఈ ప్రభువుల పుత్రులైన అంకినీడు ప్రసాద బహద్దరుగారు తమ వివాహ సమయంలో కవి పండిత సభ నేర్పాటుచేసి, పెక్కుమంది విద్వాంసుల్ని సత్కరించారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తునకు భూరి విరాళమొసంగారు, మచిలీపట్నంలోని ఆంధ్రభారతి, మొదలైన సాహిత్య పత్రికలకు ప్రధాన పోషకులైనారు. కాకినాడలోని "ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల" వంటి అనేక గ్రంథప్రచురణ సంస్థలకు ఉదారంగా విరాళాలిచ్చారు. తర్కశాస్త్రప్రవీణులైన అద్దేపల్లి సోమనాథ శాస్త్రివంటి పండితుల్ని ఆదరించారు.

**"ఇతడు దేవరకోట రాజ్యేందిరామ**
**నః ప్రియుడు శివరామభూనాయకుండు**
**పేర్మిమై జాళువా గండపెండేరంబు**
**తొడిగి నవతిక్కనకు సొంపులిడినవాడు"**

అంకినీడు ప్రసాదుగారి కుమారులైన శివరామప్రసాదుగారు అభినవ తిక్కన తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారి 'రాష్ట్రగాన' కావ్యాన్ని అంకితంగా పొందారు. జమ్మూల మడక మాధవరామ శర్మగారి 'ఆంధ్రప్రతాపరుద్రీయం'ను, గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారి "భట్టుమూర్తి రామరాజభూషణుడు" అనే కావ్యాల్ని కూడా అమితంగా పొందిన ధన్యజీవి శివరామప్రసాదుగారు. ఏలూరులోని మాగంటి అన్నపూర్ణాదేవి విద్యాలయానికి, గుంటూరునందలి శారదానికేతనానికి, ఆంధ్రవిశ్వవిద్యాలయానికి భూరి విరాళాలిచ్చిన వదాన్యులు -కళా పోషకుడు శివరామప్రసాదు బహద్దరుగారు, తిరుపతివేంకట కవులు, కొప్పరపు సోదరకవులు, శ్రీపాద, వేటూరి, కాశీకృష్ణాచార్యులు, కరుణశ్రీ, విశ్వనాథ మొదలైన మహాకవులెందరో శివరామప్రసాదు బహద్దరుగారి సత్కారాలు పొందారు.

## 2. నూజివీడు సంస్థానం :

కృష్ణామండలంలోని ప్రాచీనమైన సంస్థానాలలో యిది ఒకటి. ఇందు 321 గ్రామాలు - వైశాల్యం 569 చ.మై. సాహితీపోషణంలో నూజివీడు సంస్థానాధిపతులు అగ్రశ్రేణిగా చెందినవారు. నూజివీడు సంస్థానం నుండి తర్వాత ఏర్పడిన ఉయ్యూరు, వెంట్రప్రగడ, మేడూరు, నిడదవోలు, ముసునూరు, గన్నవరం, మీర్జాపురం, తేలప్రోలు, శనివారపుపేట మొదలైన ఎస్టేటుల పాలకులు కూడా కవిపండితుల పోషకులై విరాజిల్లారు.

కుమార ధూర్జటి 'ఇందుమతీ పరిణయం' అనే ఆరాశ్వాసాల శృంగార ప్రబంధాన్ని రచించి, నూజివీడు ప్రభువైన నరసింహ అప్పారావుగారికి అంకితమిచ్చారు. ఆణివిళ్ళ వేంకటశాస్త్రి రచించిన "అప్పారాయ యశశ్చంద్రోదయం" అనే అలంకారశాస్త్రగ్రంథం నరసింహ అప్పారాయ ప్రభువులకే అంకితం - ఇది నారసింహప్పరాయ యశోవర్ణనాత్మకం. కవికి వట్లూరుపల్లి అగ్రహారాన్ని ప్రభువులు కానుకగా సమర్పించారు. వేంకట శాస్త్రి రచించిన అలంకార సుధాసింధు, మహేశ్వర మహత్యం, రుక్మిణీ పరిణయం వంటి కృతులు నరసింహ అప్పారావుగారి కుమారులైన 'నారాయప్పారావు'గారికి అంకితంగా సమర్పింపబడ్డాయి. నూజివీడు జమీందారు నారయ్యప్పారావుగారి ఆస్థానకవి దిట్టకవి. నారయ్య భూపాలునిమీద కొన్ని చాటువుల్ని రచించాడు.

'పల్లవీ పల్లవోల్లాస' ప్రబంధకర్త మాడభూషి నరసింహాచార్యులు నూజివీడు సంస్థానాధిపతుల ఆస్థానకవి.

**"పున్నమినాటి చందురుని బోలెడి నీదు మొగంబునందు లే**
**వెన్నెలవంటి నవ్వు కడు వేడుక మీఱగ గానరాదయో,**
**కన్నియ నీదు చెక్కిట వికాసము వీడెను వెంటవెంటనే**
**కన్నుల నీరు నిండి నుసుకాటుక జాఱె నిదేమె కోమలీ !"**

ఇత్యాది రసవంతములైన పద్యాలెన్నో ఈ కావ్యంలో ఉన్నాయి. నరసింహాచార్యుల పుత్రులైన వేంకటాచార్యులు శోభనాద్రి అప్పారావు, నారయ్యప్పారావుగార్ల ఆస్థానకవి. ఈ కవి అష్టభాషాప్రవీణులు. పిఠాపురం, విజయనగరం మొదలైన సంస్థానాల్ని సందర్శించి, అద్వితీయమైన అవధాననైపుణ్యాన్ని ప్రదర్శించి, ఆయా సంస్థానాధిపతులచే సత్కరింపబడిన విద్వత్కవి వేంకటాచార్యులుగారు. 1872లో వేంకటా

చార్యులుగారు చేసిన 'నూజివీడు శతావధానం' అవధాన సాహిత్య చరిత్రలో సుప్రసిద్ధమైంది. రంగయ్యప్పారావుగారు ఆచార్యులు వారిని బంగారు కంకణంతో సన్మానింపగా, పిఠాపురం మహారాజావారు 'అభినవ పండితరాయలు' అనే బిరుదుచే ఘనంగా సత్కరించారు. భరతాభ్యుదయం, పుష్పబాణవిలాసం, రామావధూటి తారావళి - వేంకటాచార్యులగారి కృతులు.

రాజా రంగయ్యప్పారావు బహద్దరుగారు కవి పండితపోషకులే కాదు. సంస్కృతాంధ్ర పారశీకములందు మంచి పాండిత్యం గలవారు. వీరి ఆస్థాన విద్వాంసులైన గోపాలకృష్ణమాచార్యులు "శోభనాద్రీశ వైభవ"మనే సంస్కృత చంపూప్రబంధాన్ని రచించారు - రంగయ్యప్పా రావుగారు పారశీక భాషలోని "షహనామా" అనే గ్రంథాన్ని తెలుగు లోనికి అనువదించారు.

రాజా రంగయ్యప్పారాయ బహద్దరుగారి దత్తపుత్రులైన వెంకటాద్రి అప్పారావు బహద్దరు కావ్యకళాప్రపూర్ణులు. కళాపోషణం, కావ్య రచనం రెండూ వారి జీవిత పరమార్థాలు. రామదాసు, జ్యోతిర్లీల, గోవర్ధనోద్ధారణం -ఇత్యాది నాటకాలు, ఆంధ్రగీతాగోవిందం, ఆంధ్రా ష్టపదులు, శోభనాచల మాహాత్మ్యంవంటి కమనీయ కావ్యాలు రచించారు.

**'కవివై, భూపతివై, సదా సుమతివై, కల్యాణివై, నిత్యమా**
**ర్జవమొప్పారగ నూజివీట సుఖివై రాజ్యంబు పాలించు ని**
**న్నవలోకించు సదృష్టమిప్పటికి సంప్రాప్తించె నుయ్యూరురా**
**జవరా ! తిర్పతి శాస్త్రికిన్ సుకవితా సాఫల్యమింపారగన్"**

అని తిరుపతి వేంకటకవులచే మెప్పుపొందిన సంస్థానాధిపతి వెంకటాద్రి అప్పారావు బహద్దరుగారు. ఉయ్యూరు వెంకటాద్రి అప్పా రావుగారి తనయులైన రంగయ్యప్పారావు బహద్దరు ఉన్నత విద్యా పట్టభద్రులు - అనేక కావ్యాల్ని అంకితంగా పొందిన సుకృతులు. దరిసేటి వేంకట రామాచార్యుల 'అనార్కలి', యత్నోజు మాధవా చార్యుల 'మఘవలయం' అనే కావ్యాలకు కృతిపతి రంగయ్యప్పారావు బహద్దరు. ఒకప్పుడు ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక వ్యవహారశాఖా మాత్యులుగా, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ ప్రోత్సాహకులుగా, ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా, ఆంధ్రనాటక కళాపరిషత్ అధ్యక్షులుగా బహుముఖమైన సేవలుగావించిన శ్రీ మేకా రంగయ్య ప్పారావుగారు బహుథా ప్రశంసాపాత్రులు.

**"అహహ వేంకట నారసింహాప్పరాయ**
**భూతలేంద్రునకెంతటి భూతదయయొ**
**యిమ్మహోదారు సత్కథలెల్లి దిశల**
**గాన మొనరించెదరు పుణ్యకరములనుచు"**

## 3. ముక్త్యాల సంస్థానం :

కృష్ణామండలంలోని ప్రాచీన సంస్థానాలలో ముక్త్యాల సంస్థానం ఒకటి. కృష్ణానదీతీరంలో వెలసిన ముక్త్యాల పట్టణం - ఈ సంస్థాన పాలకుల ముఖ్యనివాసం. ఇది జగ్గయ్యపేటకు 6 మైళ్ళ దూరం - ఈ సంస్థానంలో 23 గ్రామాలుండేవి. ఈ సంస్థాన పాలకులు "వాసి రెడ్డి" అనే ఇంటిపేరుగల కమ్మవారు. వల్లు గోత్రజులు.

ముక్త్యాల వారి కుదురునందు సాహిత్యపోషకుడగు మొదటి జమీందారు శ్రీ రాజా వాసిరెడ్డి చిన వేంకటాద్రి. (1787-1828). ఈ జమీందారు ఆదరణంలో తాతంభట్టు గురుమూర్తిశాస్త్రి "కృష్ణానదీ మాహాత్మ్యం" అనే కావ్యాన్ని రచించి, ముక్తేశ్వరపురంలో వెలసిన భవానీ ముక్తేశ్వరస్వామికి అంకితమిచ్చారు. చిన వేంకటాద్రి ప్రభువుల జ్యేష్ఠ పుత్రుడగు భవానీ ముక్తేశ్వరప్రసాదనాయడు బహద్దరు గొప్ప సాహిత్య కళాపోషకులు కొప్పరాజు సుబ్బరాయకృతమైన 'కాంచీ మహత్యానికి' కృతిపతులు అమరవాది రామయకవి కృతమైన 'ద్రౌపదీ పరిణయ' కావ్యరచనకు కారకులు. "సంగీత గీతాది సత్కళాభూషణా వళికి మంజూష యీ ప్రభు మనీష"

"అపార పారితోషిక ప్రతోషిత స్వదేశిక వైదేశిక పండిత జన మండలుడు" - భవానీ ముక్తీశ్వర ప్రసాదనాయడు బహద్దరుగారు.

ముక్త్యాల సంస్థాన ప్రభువుల ఆదరానికి పాత్రుడైన మరొక కవి ఆతుకూరి పాపకవి. దక్షయాగం మొదలు తారకాసుర దమనం వరకు గల కథను"లలితాంబోపాఖ్యానం"అనే 8అశ్వాసాలకావ్యంగా రచించి, ధాన్యవాటి అమరేశ్వరస్వామికి అంకితంగా సమర్పించారు ఆతుకూరి పాపకవి. ముక్త్యాల సంస్థానంలోని శ్రీ లక్ష్మీనరసింహ క్షేత్రమైన వేదాద్రికి సమీపమందుగల 'కాద్రేనిపల్లి' అగ్రహారంలో వాసిరెడ్డివారు పాపకవి మాన్యములిచ్చారు. ముక్త్యాల రాజా చంద్రమౌళీశ్వర ప్రసాదుబహద్దరువారి మాహిష్మతీ ముద్రణాలయంలో పాపకవి కావ్యం ముద్రింపబడింది. భవానీ ముక్తీశ్వరప్రసాద బహద్దరుగారి పౌత్రులైన చంద్రమౌళీశ్వర ప్రసాదుగారు పెక్కు గ్రంథాలకు కృతిపతులు. కవి సార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిచే రచింపబడిన వేదాద్రి మాహాత్మ్యం, శ్రీకృష్ణభారతం, విజయవిలాసకృత విమర్శలు - శ్రీ చంద్రమౌళీశ్వర ప్రసాద బహద్దరుగారికి అంకితమివ్వబడ్డాయి. కృష్ణ మూర్తిశాస్త్రిగారిని ముక్త్యాల ప్రభువు తన ఆస్థానకవీంద్రమాత్రునిగా

చిత్తబందు తలంపన్, మిత్రునిగా, గురూత్తమునిగా, చుట్టంబుగా నెంచుచు గౌరవించెడివారట !!

ముక్త్యాల జమీందారుల సన్నిధిలో 1922లో శతావధాని పిశుపాటి చిదంబరశాస్త్రిగారు ఆశుకవితాప్రదర్శనం గావించారు. కపోతకిరాతకథను శతపద్యపరిమితిగా నిర్మించి, సన్మానం పొందారు.

"చనుటకు శక్తి చాలక వెసన్ గరపత్రము లంపినంతనే
ధనమిడు తేడులున్ గల దుదారులు కొందరు నాకు, వారిలో
ఘనుడల వాసిరెడ్డి కులకాంతుడు శ్రీ శశిమౌళి యొక్కడై
నను నటు వ్రాసిపుచ్చుటకు నామది సిగ్గిలు త..."

అని చెళ్ళపిళ్ళవారు ముక్త్యాల ప్రభువుల వదాన్యతను ప్రస్తుతించారు. కవిసమ్రాట్ విశ్వనాథవారి రామాయణ కల్పవృక్షానికి చంద్ర మౌళీశ్వర ప్రసాదు బహద్దరుగారు శ్రోత.

'సత్యకవి వక్త - ముక్త్యాల స్వామి శ్రోత'

అమరవాది రామయకవి కృతమైన 'ద్రౌపదీపరిణయం', తాతంభట్టు గురుమూర్తి రచించిన 'కృష్ణామహత్యం', చర్ల వేంకటశాస్త్రి రచించిన 'వేంకటాద్రిగుణ రత్నావళి' అనే అలంకార శాస్త్రగ్రంథం, వేటూరి ప్రభాకరశాస్త్రి కృతమైన 'నీతినిధి', మల్లంపల్లి బుచ్చికవి కృతమైన 'హాలాస్యమహత్యం', 'శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రి, రచించిన 'విజయవిలాసకృతి విమరశనం', విశ్వనాథవారి రామాయణ కల్ప వృక్షం' – మొదలైన ప్రాచీన అర్వాచీన సంస్కృతాంధ్రగ్రంథాల్ని ముద్రింపించిన ఘనత చంద్రమౌళీశ్వర ప్రసాదబహద్దరుగారిది.

వీరి సోదరులు సదాశివప్రసాదు, దుర్గాసదాశివప్రసాదు, గౌరీ పర్వత మహదేవ రాకుమారులు కూడా సరససాహిత్యాభిరుచి గలవారు. జయంతిపురం రాజాగారైన దుర్గాసదాశివ ప్రసాదు బౌద్ధులకు పరమప్రమాణాలైన త్రిపిటకాల సారాన్ని దమ్మ పదమును తెలుగు చేసారు. 'సరస్వతీ' సాహిత్య పత్రికా సంపాదకులుగా వ్యవహరించారు చంద్రమౌళీశ్వరప్రసాదుగారు కూడా సాహిత్యపోషకులు – వేటూరి ప్రభాకరశాస్త్రిగారి 'నీతినిధి'కి కృతిపతి. ఈ విధంగా కృష్ణా మండలంలో ఒకప్పటి సంస్థానాధిపతులు సాహిత్యపోషకులై, ప్రజాసేవకులై, బహుముఖప్రజ్ఞాదురంధరులై విరాజిల్లారు.

# జిల్లెళ్ళమూడి అమ్మ

జన్మజ్ఞాని. ఏడాదిన్నర వయసులోనే ఆసనాలు, ముద్రలు వేసేది. భృకుటీభేదనం, శీర్షభేదనం జరిగినా జీవించింది. మౌనస్వామి, వాసుదాసస్వామి, కళ్యాణానందభారతి వంటి వారితో బాల్యంలోనే వేదాంత చర్చలు చేసింది. సర్వసమ్మతమైనదే నా మతం అంటూ కులమత వర్గ వర్ణ విచక్షణ లేకుండా ఆకలే అర్హతగా సర్వులకూ ఆహారం అందించే అన్నపూర్ణాలయాన్నీ సర్వులకూ స్వతంత్రమైన అందరింటినీ జిల్లెళ్ళమూడి (గుంటూరుజిల్లా)లో నెలకొల్పింది. అంతా ఆత్మగా తోచటమే ఆత్మ సాక్షాత్కారమన్నది. ఏది చెప్పినా తన అనుభవంలోంచి చెప్పింది. చిన్న చిన్న పదాలలో గొప్ప వేదాంతాన్ని బోధించేది. సృష్టిని తన సంతానంగా భావించింది. వైకల్యం లేకపోవటమే కైవల్యం. తృప్తే ముక్తి అని చెప్పింది. తెలుగులో నేను నేనైననేను, అన్ని పనులు నేనైన నేను" అనే మహావాక్యాన్ని ప్రసాదించింది.

చిరునామా : డా॥ జంధ్యాల పరదేశి బాబు, 20-6-67/2, మెయిన్‌రోడ్డు, రామలింగేశ్వరపేట, విజయవాడ – 520 003.

ప్రొ॥ వెలమల సిమ్మన్న

# కృష్ణాతీరంలో ప్రముఖ సాహితీ విమర్శకులు

కృష్ణాతీరంలో కృష్ణా, గుంటూరు, కర్నూలు, నల్గొండ, మహబూబ్‌నగర్ జిల్లాలు వున్నాయి. ఈ తీరంలో వున్న ప్రముఖ సాహితీ విమర్శకుల గూర్చి సంగ్రహంగా మనం తెలుసుకుంటాం. ఈ ఐదు జిల్లాల్లో సంగ్రహంగా మనం తెలుసుకుంటాం. ఈ ఐదు జిల్లాల్లో పుట్టినవారే కాక, ఇతర జిల్లాల్లో పుట్టినవారే కాక, ఇతర జిల్లాల్లో పుట్టి ఈ జిల్లాల్లో స్థిర నివాసం ఏర్పరచుకొన్న వారిని కూడా పరిగణనలోకి తీసుకోవడం జరిగింది.

కృష్ణాతీరంలో వేటూరి ప్రభాకరశాస్త్రి ఆచార్య పింగళి లక్ష్మీకాంతం, విశ్వనాథ సత్యనారాయణ నార్ల, ముట్నూరి కృష్ణారావు, కోలవెన్ను కామకోటేశ్వరరావు, టి.ఎల్. కాంతారావు, కవితా ప్రసాద్, ద్వానా శాస్త్రి, జి.వి. పూర్ణచందు, గుమ్మాసాంబశివరావు, అక్కిరాజు ఉమాకాంతం, కొడవటి కుటుంబరావు, గవిని వేంకటకృష్ణారావు, యస్. గంగప్ప, ఇరాక్ కడియాల రామమోహనరావు, చందు సుబ్బారావు, కత్తి పద్మారావు, పాపినేని శివశంకర్, పెనుగొండ లక్ష్మీనారాయణ, కొండపల్లి సుదర్శర్‌రాజు, రావిరంగారావు, సర్దేశాయి తిరుమలరావు, వైద్యం వేంకటాచారయులు, బి.ఎన్.శాస్త్రి, రవ్వా శ్రీహరి, సుంకిరెడ్డి నారాయణరెడ్డి, కాసుల ప్రతాపరెడ్డి, దేవులపల్లి ప్రభాకరరావు, శ్రీరంగాచార్యులు, యస్. రఘు, ముకుదాల రామారెడ్డి, ఇరివంటి కృష్ణమూర్తి, కసిరెడ్డి వెంకటరెడ్డి, ఎస్వీ రామారావు యశోదారెడ్డి, గిరిజా మనోహరబాబు, రుక్ముద్దీర్, హరగోపాల్, మసనజెన్నప్ప, కపిలవాయి లింగమూర్తి, వెలుదండ నిత్యానందరావు, మొదలైన సాహితీ విమర్శకులు ఎందరో వున్నారు. వాళ్ళందరికీ నమస్కారాలు. వీరు తెలుగు సాహితీ విమర్శను ఎంతగానో సుసంపన్నం చేశారు.

**వేటూరి ప్రభాకరశాస్త్రి :**

శాస్త్రిగారు కృష్ణాజిల్లా దివిసీమలోని పెద్దకళ్ళేపల్లిలో 1888 ఫిబ్రవరి 7వ తేదీన జన్మించారు. కవిగా, విమర్శకుడుగా, పరిశోధకుడుగా, అనువాదకుడుగా, గ్రంథ పరిష్కర్తగా పీఠికా రచయితగా, వ్యాఖ్యానకర్తగా, వ్యాసకర్తగా, ఇలా ఎన్నో విషయాల్లో వేటూరి ప్రభాకర శాస్త్రిగారు సర్వతోముఖ ప్రజ్ఞ కలవారు.

విమర్శ, పరిశోధన రెండూ వేర్వేరు క్షేత్రాలు, మంచి చెడ్డల్ని వివేచన చేస్తే అది విమర్శ అవుతుంది. సరికొత్త విషయాల్ని త్రవ్వి తీసేది కాదా సరికొత్త విషయాల్ని తెలియజేసేది పరిశోధన అవుతుంది. విమర్శలో పరిశోధన, పరిశోధనలో విమర్శ అప్పుడప్పుడు చోటు చేసుకుంటాయి. శాస్త్రిగారు రెండింటిలోనూ సిద్ధహస్తులు. వీరు ఉత్తమ విమర్శకులు, గొప్ప పరిశోధకులు. అంచేతనే రాజమన్నారుగారు వేటూరిగారి గూర్చి చెప్పుడూ "పరిశోధనలో ఆయన విశేషమైన ప్రజ్ఞ గలవాడు. సాహిత్య విమర్శకుల్లో ఆధునిక పద్ధతుల వంచించిన విమర్శకాగ్రేసరుడు" అని అన్నాడు.

వేటూరు వారు విమర్శనా రంగంలో ఎంతోమందికి మార్గదర్శకులు. వీరి విమర్శ పద్ధతుల్ని ఎందరో అనుసరించారు. అనువదించారు. ముఖ్యంగా వీరు రాసిన పీఠికల్లోనూ, వ్యాసాల్లోనూ, వ్యాఖ్యానాల్లోనూ, శబ్ద విచారంలోనూ మనకు కొట్టి వచ్చేటట్లు విమర్శ కన్పిస్తుంది. మరుగునబడిన ఎన్నో అంశాల్ని శాస్త్రిగారు వెలికితీసి తెలుగు పాఠకులకు ఉపయోగపడే విధంగా చేశారు. ఏ విషయం గూర్చి రాసినా దాని అంతం చూడడం శాస్త్రిగారి ప్రత్యేకత. అదే ఆయనను తెలుగు విమర్శనారంగంలో ముందువరుసలో కూర్చో పెట్టింది.

మనుచరిత్ర, బసవపురాణం, ఉత్తరహరివంశం, హర విలాసం, భారతీ శతకం మొదలైన గ్రంథంలకు పీఠికలు రాసి ప్రముఖుల ప్రశంసలు అందుకొన్నాయి. కుమారసంభవం, ఉత్తర హరివంశం మొదలైన గ్రంథాలకు విపులమైన వ్యాఖ్యానం రాశారు.

శబ్ద విచారంలో శాస్త్రిగారు ఘనాపాటి. ఏదేని శబ్దం యొక్క అర్ధ విభాగం చేయడంలో తన ప్రతిభను చూపించారు. నిఘంటువులకు ఎక్కని అనేక పదాల్ని తీసి వివేచన చేశారు. శబ్ద అర్ధ నిరూపణలో వారికి వారే సాటి. చక్కమాటలో చెప్పాలంటే ఇలాంటి విమర్శకుడు, పరిశోధకుడు, పండితుడు తెలుగు నాట పుట్టడం మన అదృష్టం. వీరి ప్రతిభ వల్ల ఎన్నో కొత్త విషయాలు బయటపడ్డాయి. వీరు తెలుగు విమర్శనారంగానికి చెప్పలేనంత మేలు చేశారు. విమర్శలో, పరిశోధనలో ఇతరులకు మార్గదర్శకులైనారనడంలో అతిశయోక్తి కాదు.

## ఆచార్య పింగళి లక్ష్మీకాంతం

లక్ష్మీకాంతంగారు 1894 జనవరి 10వ తేదీన అర్తమూరు, కృష్ణాజిల్లాలో జన్మించారు. వీరు విమర్శకుడుగా, కవిగా, రచయితగా, వ్యాసకర్తగా, వక్తగా, నాటక ప్రయోక్తగా, నటుడిగా, గ్రంథ పరిష్కర్తగా ఇలా ఎన్నో రంగాల్లో లక్ష్మీకాంతంగారు ప్రసిద్ధులు.

వీరు సుందరనందం, తొలకరి, ఆత్మలహరి, గౌతమ నిఘంటువు, కుమార వ్యాకరణం మొదలైన గ్రంథాలు రాశారు. లక్ష్మీకాంతంగారికి ఖ్యాతికి తెచ్చినవి ప్రముఖ విమర్శకుడుగా తేల్చి చెప్పడానికి వీలైనవి ప్రధానమైన మూడు గ్రంథాలు వున్నాయి. గౌతమ వ్యాసాలు, సాహిత్య శిల్ప సమీక్ష, ఆంధ్ర సాహిత్య చరిత్ర ఈ మూడు గ్రంథాల ఆధారంగా పింగళి వారి విమర్శ దృక్పథాన్ని మనం తెలుసుకోవచ్చు.

గౌతమ వ్యాసాల్ని నిశితంగా అధ్యయనం చేస్తే విమర్శకుడుగా పింగళివారిని మనం దర్శించవచ్చు. ఈ వ్యాసాలు సాంప్రదాయక విమర్శ, పరిచయానుశీలన విమర్శ, సహృదయ విమర్శ, పరిష్కరణ విమర్శ, దేశి ప్రక్రియ విమర్శ, అభినందన విమర్శ, తులనాత్మక విమర్శ, సృజనాత్మక విమర్శకు సంబంధించినవిగా వున్నాయి. పింగళి వారి విమర్శనా పటిమను నిరూపించే గ్రంథాల్లో ముఖ్యమైన వ్యాస సంపుటి "గౌతమ వ్యాసాలు".

తెలుగు సాహిత్య విమర్శలో విమర్శకునిగా పింగళివారు నిలబడడానికి ముఖ్యమైన గ్రంథం "సాహిత్య శిల్ప సమీక్ష" పాశ్చాత్య విమర్శ లక్షణాన్ని భారతీయాలంకాలిక విమర్శ లక్షణాలతో తులనాత్మకంగా అధ్యయనం చేసి సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు.

పింగళివారు చనిపోయిన తర్వాత 1974లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ఆంధ్రసాహిత్య చరిత్ర గ్రంథాన్ని ప్రచురించింది. ఒక ప్రణాళిక ప్రకారంగా రాసిన గ్రంథం ఇది. ఈ గ్రంథంలో కవుల జీవిత చరిత్రే కాక, ఆయా కవుల కవితా రీతుల్ని కవితా తత్వాన్ని, ఆత్మీయతని పింగళివారు విశదీకరించారు. వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యాన్ని పదియుగాలుగా వర్గీకరించి, సాహిత్య చరిత్రకు మార్గదర్శకులు అయ్యారు. రేడియో ప్రసంగాల్లోనూ, ఇతర వ్యాసాల్లోనూ వీరి ప్రతిభా ప్రజ్ఞా పాటవాల్ని, విమర్శ ధోరణిని మనం దర్శించవచ్చు.

## విశ్వనాథ సత్యనారాయణ :

విశ్వనాథవారు 1895 సెప్టెంబరు 10వ తేదీన కృష్ణాజిల్లా నందమూరులో జన్మించారు. సత్యనారాయణగారి ప్రతిభా వైవిధ్యం అనన్యసాధ్యం. తెలుగు సాహిత్య రంగంలో ఎన్నెన్నో ప్రక్రియల్ని చేపట్టి అత్యంత సమర్థంగా అంచులు ముట్టిన విరాణ్మూర్తి. కవిగా, విమర్శకుడుగా, నవలాకారుడుగా, కథకుడుగా, నాటకకర్తగా, గేయకర్తగా, వ్యాసకర్తగా, మహావక్తగా, అనువాదకుడుగా, ఇలా తెలుగు సాహిత్యంలో తనకంటూ ప్రత్యేకమైన, విశిష్టమైన, విలక్షణమైన, స్థానాన్ని సంపాదించుకున్నారు.

తెలుగుసాహిత్యంలో తొలి జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత, ఆంధ్రప్రదేశ్ తొలి ఆస్థానకవి, పద్మభూషణం కళాప్రపూర్ణం విశ్వనాథవారు స్వతంత్ర్యమైన వివేచనా ప్రతిభామూర్తి, విమర్శకుడుగా వీరు ఎనలేని కృషి చేశారు. ఆయన విమర్శ విధానం విలక్షణమైనది. విశ్వనాథవారు అటు కవిత్వంలోనూ ఇటు విమర్శలోనూ సవ్యసాచి.

సత్యనారాయణగారు నన్నయగారి ప్రసన్న కథాకవితార్థయుక్తి, అల్లసాని వాని అల్లిక జిగిబిగి, ఒకడు నాచన సోమన్న, శాకుంతలము యొక్క అభిజ్ఞానత, సాహిత్యసురభి, కావ్యపరీమళం, కావ్యానందం, విశ్వనాథ సాహిత్యోపన్యాసములు, నీతికథ, కల్పవృక్ష రహస్యములు, నా రాముడు, What is Ramayanatoma మొదలైన విమర్శన గ్రంథాల్ని రాశారు. ఇవికాక పీఠికలు, వ్యాసాలు, ఉపన్యాసాలు లెక్కలేనన్ని రాశారు.

విశ్వనాథవారి విమర్శ అనేక కోణాల్లో సాగింది. ప్రాచీనాంధ్ర సంస్కృత కవుల కావ్య దృక్పథం వివరించడంలోను, కావ్య శిల్పాన్ని గూర్చి విశదీకరించడంలోను రామాయణ, భారతాల విశిష్ట నిరూపంలోను శాంత, కరుణ రసాల గొప్పతనం నిర్ధారించడంలోను లోతైన పరిశీలన చేశారు విశ్వనాథవారు. వ్యాఖ్యానాత్మక విమర్శలోను, తులనాత్మక విమర్శలోనూ, రస వ్యాఖ్యానంలోను వర్ణనాత్మక లక్షణగ్రంథ నిర్మాణ కౌశలంలోను ఆయన ఆరితేరిన విమర్శకులు. ఏదైనా ఒక విషయాన్ని లోతుగా, నిశితంగా పరిశీలించి విశ్లేషించటంలో ఆయనకు ఆయనే సాటి.

విమర్శ ప్రధానంగా నాలుగు భేదాలున్నాయి. అవి ఇవి. 1. వివరణాత్మక విమర్శ. 2. అభినందాత్మక విమర్శ. 3. తులనాత్మక

విమర్శ. 4. నిర్ణయాత్మక విమర్శ. ఈ నాలుగు భేదాల్లోను విశ్వనాథ వారి విమర్శ చాలా చక్కగా సాగింది. వివరణాత్మక విమర్శలోకి కావ్యానందం చేరుతుంది. అభినందాత్మక విమర్శలోకి సాహిత్య సురభి, కావ్య పరిమళం వస్తాయి. తులనాత్మక విమర్శలోకి కాళిదాస భవభూతులు అనే వ్యాసం వస్తుంది. నిర్ణయాత్మక విమర్శలోకి శాంత, కరుణ రసాలు గూర్చి చేసిన చర్చ ఇందులోకి వస్తుంది. ఇలా విశ్వనాథ వారు ప్రాచీన విమర్శ భేదాలతో తమ ప్రతిభా ప్రజ్ఞాపాటవాలతో అనేక గ్రంథాల్ని వివేచన చేసి ప్రముఖుల ప్రశంసలను అందుకున్నారు. నాలుగు దశాబ్దాలుగా శాస్త్రిగారు చేస్తున్న సాహితీకృషి మెచ్చుకోదగ్గది. ద్వా.నా. శాస్త్రిగారికి సాహిత్య విమర్శలో స్పష్టమైన అవగాహన ఉంది. అందుచేతే దాశరథీ కృష్ణమాచార్యులుగారు విమర్శ ప్రక్రియను పరి పుష్టం చేయడంలో అపారమైన కృషి చేస్తున్న శాస్త్రిగారిని అభినంది స్తున్నాను అని అన్నారు. శాస్త్రిగారు వివేచనాత్మక విశ్లేషకులు. శాస్త్రిగారు విమర్శకుడుగా సమీక్షకుడుగా, సాహితీవేత్తగా, బహుగ్రంథకర్తగా, తెలుగు సాహిత్యంలో ఎనలేని పేరు ప్రఖ్యాతులు గడించారు. మారేపల్లి కవితా సమీక్ష నూరు అరుదైన పుస్తకాలు, సమీక్షా చక్షువు, తెలుగు సాహిత్య చరిత్ర, ప్రాచీన కవిత్వంలో వ్యక్తిత్వ వికాసం మొదలైన ఎన్నో గ్రంథాలు రాశారు. వీరు కృష్ణాజిల్లాకు సంబంధించినవారు.

**అక్కిరాజు ఉమాకాంతం :**

గుంటూరు జిల్లా పల్నాడు తాలూకాలో గొత్తికొండ అనే గ్రామంలో లక్ష్మమ్మ, లక్ష్మీనారాయణలకు పుట్టారు. ఉమాకాంతంగారు సంస్కృత, తెలుగు ఆంగ్లభాషలు బాగా చదువుకున్నారు. వ్యాకరణం, తర్క శాస్త్రంలో దిట్ట. వీరు సాంప్రదాయాభిమాని. తెలుగు సాహిత్య విమర్శలలో ఉమాకాంతంగారు ఎనలేని పేరు ప్రఖ్యాతులు గడించారు. 1921 తెలుగు దేశ వాఙ్మయ పత్రికను స్థాపించారు. సంస్కృత వ్యాకరణ ప్రదీపం, పార్ణనీయాంధ్ర వివరణం, రసమీమాంశ, నైషధ తత్వ జిజ్ఞాస వంటి వ్యాసాలు ఈ పత్రికలో ముద్రించారు. విమర్శ విషయంలో వేదం వేంకటరాయశాస్త్రి, కట్టమంచి రామలింగారెడ్డి మొదలైన వారితో వాద వివాదాలు చేశారు. ఆముక్తమాల్యద, మనుచరిత్ర ప్రబంధాల వివేచనంలో వారితో వాదాలకు దిగారు.

నైషధ తత్వ జిజ్ఞాసలో సంస్కృత నైషధ కావ్యంపై విమర్శ వ్రాస్తూ శ్రీహర్షుని పాండిత్యాన్ని మేధాశక్తిని ప్రశంసిస్తూనే నైషధం ఉత్తమ కావ్యం కాదని నొక్కి వక్కాణించారు. మహాభారతాది రచనలపై అనేక విమర్శ వ్యాసాలు చేశారు.

ఉమాకాంతంగారికి నేటి కాలపు కవిత్వం (1929) పల్నాటి వీరచరిత్ర పీఠికలు (1911-38) విమర్శకునిగా మంచి పేరు తెచ్చి పెట్టాయి. నేటి కాలపు కవిత్వంలో భావ కవిత్వం పేరుతో ప్రచారమైన కవిత్వాన్ని తీవ్ర పదజాలంతో విమర్శించారు. వాఙ్మయ దర్శనం పేరుతో ప్రాచీన ఖండాన్ని తొమ్మిది భాగాలుగా సూత్ర పద్ధతిలో రాశారు. వీరు వాఙ్మయ దర్శనంలో భారతీయ సంస్కారాదుల గురించి ఎక్కువగా ప్రస్తావించారు. భావకవిత్వంపై ఉమాకాంతంగారి అభిప్రాయం విమర్శకులోనయ్యాయి. ఉత్తమ కవులలో ఉండవలసిన మనో ప్రవృత్తిని చర్చించారు. భావకావ్యం వశ కావ్యం క్షుద్ర కావ్యంలాంటి లక్షణాల్ని చెప్పి వాటిని వివరించారు. శృంగార రసం ధర్మబద్ధం కావాలన్నారు. జానపదులపై దయా సానుభూతుల కోసం జానపదపాత్రలు సృష్టించే అవసరం లేదన్నారు. పీఠికల్లో ప్రశంసల్ని నిరసించారు. ఉత్తమ కవిత్వాన్ని ఆదరిస్తారని ఇష్టం వచ్చినట్లు రాయకూడదన్నారు. నేటి కాలపు కవిత్వాన్ని విచారణ చేసి అది ప్రాయికంగా దృష్టి సంకోచం చేత హీనంగా ఉందని చిల్లర శృంగార మని క్షుద్రాలని నిర్ణయించారు. ఈ గ్రామంలో చాలావరకు దోషాలనే చెప్పారు. ఎంకిపాటలను మెచ్చుకున్నారు. ముత్యాలసరాన్ని నేటి కాలపు కవిత్వంలో ఎక్కడా ప్రస్తావించలేదు.

నేటి కాలపు కవిత్వంలో సిద్ధాంతం పూర్వపక్షం ఆక్షేపణ, సమాధానం అనే విభజనలుండడం వల్ల ప్రామాణికత, హేతుబద్ధత వచ్చింది. ఆధునిక శాస్త్ర ప్రతిపాదనలో కూడా ఒక ప్రతిపాదన చేసి నపుడు ఆ ప్రతిపాదనకు ప్రతికూలమైన అంశాలను కూడా ప్రస్తావించి వాటిని తన ప్రతిపాదన ఎలా పరిష్కరిస్తుందో చెప్పాలి. అపుడే అది సిద్ధాంతం అవుతుంది. అదే ఉమాకాంతంగారు అనుసరించారు.

పల్నాటి వీరచరిత్ర మొదటి ముద్రణ (1911)కు రాసిన పీఠికలో విలువైన చారిత్రక అంశాల్ని పొందుపరిచారు. ఇతిహాసాలను గూర్చి పల్నాడు గూర్చి శ్రీనాథుడు 82 పేజీలు విపుల చారిత్రక భూమిక ఉంది. దాన్ని సారాంశాన్ని ఆంగ్లంలో 5 పేజీలు రాశారు. 72 పేజీల భూమికలో (1938) తెలుగు సాహిత్యంపై అభిప్రాయాల్ని వివరించారు. రెండు పీఠికల్లో తర్కపద్ధతినే పాటించారు.

భావకవిత్వం గూర్చి ఉమాకాంతంగారు చేసిన నిర్ణయాలు కాలగర్భంలో కలసిపోయాయి. ఆయన విమర్శ కాలక్రమంలో నిలువలేదు. ఆధునిక సాహిత్యంలో భావకవిత్వానికి ఎనలేని ప్రాముఖ్యం కలిగింది. ఏది ఏమైనా ఒక గ్రంథం తీసుకొని దాన్ని వివేచన చేసే పద్ధతిని మనం గౌరవించాలి. నేటి కాలపు కవిత్వంలో పరిశోధన దండిగా ఉంది. ఉమాకాంతంగారు తర్క శాస్త్రంలో పండితుడు కాబట్టి విమర్శ కూడా అదే పద్ధతిలో జరిగింది. ఆయన పరిశోధన, విమర్శ రెండూ విలువైనవే.

**కొడవటిగంటి కుటుంబరావు :**

కుటుంబరావుగారు 1909లో తెనాలిలో పుట్టారు. వీరు సైన్సు, సంస్కృతి, చరిత్ర, సినిమా, సాహిత్యం, సాంఘికం, రాజకీయ, ఆర్థిక, విద్య, వైద్య, కులం, మతం, దైవం, వేదాలు, పురాణం, ఇతిహాసం, తత్వశాస్త్రం మొదలైన అంశాలపై ఎన్నో వ్యాసాలు వ్రాశారు. వీరి వ్యాసాల్ని విరసం, ఎనిమిది సంపుటాలలో ప్రచురించింది. కుటుంబరావుగారు సాహిత్యంలోని అన్ని ప్రక్రియలపైన వ్యాసాలు వ్రాశారు. అన్ని వ్యాసాలు విలువైనవే. ప్రతి వ్యాసంలో ఏదో ఒక ప్రత్యేకత చోటు చేసుకుంది. వీరు అనేక గ్రంథాలకు సమీక్ష వ్రాశారు. అందులో కూడా విమర్శ చోటు చేసుకుంది. సాహిత్యానికి, సమాజానికి అవినాభావ సంబంధం ఉందని నొక్కి వక్కాణించారు వీరు.

కొడవటిగంటి కుటుంబరావుగారి సాహిత్య ప్రపంచం చాలా విస్తృతమైనది. సాహిత్యం పేరు మీద చలామణిలోకి వచ్చే దగుల్బాజి వ్యవహారాలను బయటపెట్టగలిగింది కూడా విమర్శేనంటారు కుటుంబరావుగారు. సాహిత్యంలో ఉత్తమమైనదాన్ని విమర్శ సజీవంగా ఉంచుతని కూడా రావుగారి నమ్మకం. విమర్శ కూడా తప్పనిసరిగా రచయితకన్నా రెండాకులు ఎక్కువ చదివినవాడై ఉండాలని రావుగారి అభిప్రాయం. రావుగారి సాహిత్య విమర్శ దృక్పథం ప్రధానంగా సాహిత్యానికి, జీవితానికి, సమాజానికి ఉండవలసిన సంబంధాలు గుర్చిన భావనపై రూపొందించి తెలుగు సాహిత్యాన్ని అసిలోను, వాసిలోను అభివృద్ధి చేయడానికి తన జీవితకాలం వెచ్చించినవారు కుటుంబరావుగారు.

**డా॥ గవిని వెంకటకృష్ణారావు :**

కృష్ణారావుగారు గుంటూరు జిల్లా తెనాలి తాలూకా కూచిపూడి గ్రామంలో నవంబరు 15, 1914లో జన్మించారు. వీరు నాటకకర్తగా, నవలారచయితగా, కథారచయితగా, విమర్శకుడుగా, పరిశోధకుడుగా, వ్యాసకర్తగా అలంకార శాస్త్రాల్లోని లోతుపాతులు తెలిసిన మేధావిగా ప్రాక్పశ్చిమ దేశాల తత్వశాస్త్రాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసిన ప్రతిభావంతుడుగా, హేతువాదిగా, మానవతావాదిగా తెలుగుదేశంలో పేరు ప్రఖ్యాతులు గడించారు.

వీరు మద్రాసు విశ్వవిద్యాలంలో పి.హెచ్.డి. చేశారు. కళా పూర్ణోదయంపై 'Studies in Kalapoornodayam' అనే ప్రామాణిక పరిశోధనా గ్రంథాన్ని ఆంగ్లంలో రాసి 1915లో డాక్టరేట్ పట్టాను పొందారు. తెలుగు సాహిత్యంలో నవలా నాటకం, కథ, కవిత అనువాదం మొదలైన ప్రక్రియల్ని తనదైన శైలిలో వ్రాసిన మహామహా పండితుల ప్రశంసల్ని అందుకున్నారు. కాశిలో ఎమ్.ఏ విద్యార్థిగా, కావూ జగత్ అనే ప్రామాణికమైన విమర్శ గ్రంథం వ్రాశారు. భరతుడు నుంచి పండితరాయల వరకు ప్లేటో నుంచి మార్క్స్ వరకు ఉన్న మహనీయుల సూక్తుల్ని ఉదహరిస్తూ "కావ్యవస్తువు" సామాజిక వ్యవస్థను బట్టి ఎలా మార్పు చెందుతుందో నిరూపించిన ఉత్తమ విమర్శ గ్రంథమిది. దేశకాల పరిస్థితులను అనుసరించి కావ్యాలలో వస్తురూపంలో ఎలా మార్పు చెందుతుందో ఇందులో మార్క్సిస్టు దృక్పథంలో విపులీకరించారు. కీలుబొమ్మలు, పాపికొండలు, రాగరేఖాలు, వరూధిని, ప్రతిమ, మొదలైన గ్రంథాలు కృష్ణారావుగారికి పేరు తెచ్చాయి.

వీరు భిక్షాపాత్ర దమ్మిల్లం, దానధార, యాదవ ప్రళయం మొదలైన భావ విప్లవానికి సంబంధించిన నాటికల్ని వ్రాశారు. వీరి నాటకాలపై హేతువాదం, మానవతావాదం, మార్క్సిస్టుల వాదాలు దృక్పథాలు చాలా స్పష్టంగా కనిపిస్తాయి. పౌరాణిక ఇతివృత్తాన్ని తీసుకొని అందులోని అహేతుక అంశాల్ని ఖండిస్తూ నూతన వ్యాఖ్యానాలతో కొన్ని రచనల్ని చేశారు. సమాజంలో ఉన్న అనేక ఆచార, సాంప్రదాయాలపై మత మౌఢ్యంపైన ధ్వజమెత్తిన కృష్ణారావు రచనలు ముఖ్యంగా పౌరాణిక రూపకాలు భావ విప్లవాన్ని రేకెత్తించేవిగా ఉన్నాయి.

**ఆచార్య ఎస్. గంగప్ప :**

ఆచార్య గంగప్ప 8-11-1936లో నల్లగొంద్రయని పల్లి పెను గొండ తాలూకా అనంతపురంలో జన్మించారు. గత నలభై సంవత్సరాల నుంచి గుంటూరులో స్థిరపడ్డారు. వీరు బహుగ్రంథకర్తగా, అగ్రశ్రేణి అధ్యాపకుడుగా, అపూర్వ పరిశోధకుడుగా, ప్రముఖ విమర్శకుడుగా, ఆదర్శ పర్యవేక్షకుడుగా, విశిష్ట వ్యాసకర్తగా, ఉత్తమ నాటక కర్తగా, సుప్రసిద్ధ నవలాకారుడుగా, నాటికా రచయితగా గేయ రచయితగా, కవిగా, కథకుడుగా, మహా పండితుడుగా, మంచి వక్తగా, సంపాదకుడుగా, పరిష్కర్తగా, పాఠ్య ప్రణాళికా నిర్దేశకుడుగా, రేడియో ఉపన్యాసకునిగా, సమీక్షకుడిగా, స్నేహశీలిగా, సౌజన్యమూర్తి, అజాతశత్రువుగా, అన్నింటికంటె మహామనీషిగా పేరు ప్రఖ్యాతులు గడించిన నిరంతర నిర్విరామ కృషీవలుడు.

గంగప్పగారు తెలుగులోనే కాక, ఆంగ్లంలోను అనేక వ్యాసాల్ని, గ్రంథాల్ని రాశారు. అటు తెలుగులోను, ఇటు ఆంగ్లంలోను ఈయన సవ్యసాచి. రాయడం ఒక ఎత్తు. ప్రచురించడం మరొ ఎత్తు. రాసిన రచనల్ని వెలుగులోకి తేవడం అంత సామాన్యమైన విషయం కాదు. దీనికి మనిషిలో పట్టుదల ఉండాలి. వీరి వాణి బాణి రెండూ గొప్పవే. ఆయన సాహితీకృషి అనన్యసామాన్యం. ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసాలు ఆయనలో నిండుగా వున్నాయి.

ఆచార్య గంగప్పగారు అన్ని ప్రక్రియల్లోను విమర్శ గ్రంథాలు రాశారు. 1. కోలాచలం శ్రీనివాసరావు, 2. క్షేత్రయ్య పదసాహిత్యం, 3. తెలుగుదేశపు జానపద గీతాలు, 4. కోలాచలం శ్రీనివాసరావు – నాటక సాహిత్య సమాలోచనలు, 5. క్షేత్రయ్య, 6. ప్రసంగ సాహితీ 7. సారంగపాణి పదసాహిత్యం 8. సాహిత్యోపన్యాసములు 9. సాహిత్య సుధ, 10. తెలుగులో పద కవిత, 11. వాగ్గేయకారులు 12. జానపద గేయ రామాయణం, 13. జాతికి ప్రతిబింబం – జానపద సాహిత్యం, 14. జానపద గేయాలు, 15. తెలుగు నాటకం, 16. భాషా వ్యాసాలు, 17. వేయి పడగలు – విశ్లేషణాత్మక విమర్శ, 17. వేమన భావన, 19. సిద్ధేంద్రయోగి, 20. పురంధరదాసు, 21. నాగార్జునుడు, 22. సాహిత్య సమాలోచన, 23. ఎఱ్ఱన రసపోషణ, 24. ప్రముఖ వాగ్గేయకారులు తులనాత్మక అధ్యయనం, 25. సాహిత్యానుశీలన, 26. తిక్కన భారతం, 27. పద సాహిత్య పరిమళం, 28. తెలుగులో పద కవిత, 29. జాతీయ ప్రసంగ సాహితి, 30. అన్నమయ్యాచార్య సంకీర్తన సుధ, 31. నవయుగ చక్రవర్తి జాషువా, 32. తెలుగు నాటకం సామాజిక చైతన్యం, 33. దివిసీమ సాంస్కృతిక వైభవం, 34. అన్నమాచార్య సంకీర్తన సాహిత్యం – రాయలసీమ సాంస్కృతిక వైభవం, 35. రాయలసీమ మాండలీకం, 36. తెలుగు భాషకు ప్రాచీన భాషా గౌరవం, 37. అన్నమాచార్య సంకీర్తనా సాహిత్య వైశిష్ట్యం, 38. సాహిత్యామృతం, 39. సారంగపాణి ఎలా ఎన్నో విమర్శన గ్రంథాలు వ్రాశారు.

ఆచార్య గంగప్పగారి సాహిత్య వ్యాసాల్లో పరిచయం విశ్లేషణ, విషయాన్ని ప్రామాణికంగా స్పష్టం చేయడం అనే లక్షణాలు. పద్యమైనా, పదమైనా, నాటకమైనా, వచనా సాహిత్యమైనా, ఆచార్య గంగప్పగారి వ్యాసంలో విశిష్ట సౌందర్యాన్ని సంతరించుకుంటుంది. పద సాహిత్యంలో గంగప్పగారి కృషి అనన్యసామాన్యం. జానపద గేయాల సేకరణలోను, విశ్లేషణాత్మక వివరణలోను గంగప్పగారి కృషి ప్రశంసనీయం. తెలుగు నాటక సాహిత్యాన్ని గూర్చి విశేషంగా అధ్యయనం చేసినవారిలో గంగప్పగారు ముందు వరుసలో నిలుస్తారనటం సముచితం. ఒక్కమాటలో చెప్పాలంటే ఆచార్య గంగప్పగారు విమర్శకులుగా విరాట్స్వరూపులు.

డా॥ కడియాల రామమోహనరావుగారు గుంటూరు జిల్లావారే. వీరు ప్రాచీన ఆధునిక సాహిత్యంపై మంచి వ్యాసాలు వ్రాశారు. వీరి విమర్శ సూటిగా ఉంటుంది. రావుగారి ఆధునిక కవితా వికాసం గూర్చి ఉత్తమ గ్రంథం వ్రాశారు. ఈ గ్రంథం ప్రముఖులు ప్రశంసల్ని కూడా అందుకుంది.

### ఆచార్య కొలకలూరి ఇనాక్ :

ఇనాక్‌గారు గుంటూరు జిల్లా వేజెండ్ల గ్రామంలో 1-7-39 తేదీన జన్మించారు. నాటకకర్తగా, కవిగా, గేయకర్తగా, పరిశోధకుడుగా, రేడియో నాటకాల రచయితగా, ఏకాంకికా రచయితగా, వ్యాసకర్తగా, ఉపన్యాసకుడిగా, పత్రికా రచయితగా, అనువాదకుడిగా, పీఠికా రచయితగా, సమీక్షకుడిగా, విద్యావేత్తగా, అధ్యాపకుడిగా, పరిపాలనా దక్షుడిగా, దళిత జనోద్ధారకుడిగా ఇలా ఎన్నో రంగాలలో ప్రఖ్యాతి గన్న ప్రతిభామూర్తులు ఆచార్య కొలకలూరి ఇనాక్. ఇనాక్‌గారు సృజనలోను కాక, విమర్శలో కూడా సిద్ధహస్తులు. తెలుగు విమర్శనా రంగంలో ఇనాక్‌గారికి ప్రముఖమైన స్థానం ఉంది. తెలుగు వ్యాస పరిణామం, సాహిత్య వ్యాసాలు, సాహిత్య దర్శిని, సమీక్షణం, ఆధునిక సాహిత్య విమర్శ సూత్రం, శూద్ర కవి, శుభమూరి వసు చరిత్ర వైశిష్ట్యం మొదలైన సాహితీ విమర్శ గ్రంథాల్ని వెలువరించారు.

వీరు అనేక గ్రంథాలకు పీఠికలు వ్రాశారు. లెక్కలేనన్ని విమర్శ వ్యాసాలు వ్రాశారు. ఇక ఉపన్యాసాలా సరే సరి. వీటన్నిటిలోను ఉత్తమ విమర్శ చోటు చేసుకుంటుంది.

తెలుగు విమర్శనారంగంలో నూతన విమర్శనా పద్ధతుల్ని ప్రవేశపెట్టి కొత్త ఒరవడిని చేకూర్చిన విమర్శ మార్గదర్శకులు ఇనాక్‌గారు. వీరు అటు సాహిత్యంలోను, ఇటు విమర్శలోను మార్పును కోరుకున్నారు. అదే వారి విమర్శ సిద్ధాంతం.

### చందు సుబ్బారావు :

ఆచార్య చందు సుబ్బారావుగారు గుంటూరు జిల్లా తెనాలి దగ్గర ఉన్న బాదలవాడ గ్రామంలో 18-5-1946లో పుట్టారు. రావుగారు మంచి రచయితలే కాక, ఉత్తమ విమర్శకుడు కూడా. వీరు ఎన్నో విమర్శ వ్యాసాల్ని రాశారు. ఆధునిక కవిత్వం గూర్చి దాని తీరు తెన్నులనుగూర్చి, ప్రాచీన సాహిత్యంగూర్చి, దాని సౌందర్యం గూర్చి లెక్కలేనన్ని వ్యాసాలు వ్రాశారు. వీరు రాసిన విమర్శ గ్రంథాల్లో చెప్పుకోదగ్గవి కవికి విమర్శ కూడా శత్రువు కాదు. శిల్పదృష్టి, ఛాందస చర్చ మొదలైనవి. నిస్వార్థ, నిష్పాక్షికంగా విమర్శించడం వీరికి వెన్నతో పెట్టిన విద్య.

వీరు ప్రాచీన, ఆధునిక సాహిత్యంపై పట్టు ఉంది. విమర్శ విషయంలో సుబ్బారావుగారి ఎవరినీ విడిచి పెట్టలేదు. చివరకు మార్క్సిస్టు సిద్ధాంతాలపైన తీవ్రంగా విమర్శ చేశారు. ఆయన కలానికి తన, మన భేదం లేదు. విమర్శ విషయంలో రావుగారు కఠినంగా ఉంటారు. తను ఉపన్యాసం ఇచ్చినా, వ్యాసం రాసినా అదే పంథాలో ఉంటారు. విషయ చర్చనీయాంశంలో రాజీపడే ప్రసక్తి లేదు. అదే ఆయన ప్రత్యేకత, విశిష్టత కూడా.

### డా॥ కత్తి పద్మారావు :

పద్మారావుగారు 27-7-1953 గుంటూరు జిల్లా బాపట్ల

తాలూకా ఈతేరులో జన్మించారు. కవిగా, విమర్శకుడుగా, వ్యాసకర్తగా, రచయితగా, విద్యావేత్తగా, ఉద్యమకారుడుగా, వక్తగా, హేతువాదిగా, మానవతావాదిగా, తత్వవేత్తగా, సామాజితక వేత్తగా, పత్రికా సంపాదకుడుగా, ప్రముఖ నాయకుడుగా, గొప్ప దార్శనికుడుగా, రాజకీయవేత్తగా, ఇలా ఎన్నో అంశాల్లో డా॥ కత్తి పద్మారావుగారు లబ్ధప్రతిష్టులు.

వీరు విమర్శకు సంబంధించి దళిత సాహిత్యవాదం - జాషువా, జాషువా సామాజిక తత్వం - గబ్బిలం - ఫిరదౌసి - విశ్లేషణ, భారతీయ సంస్కృతిలో స్త్రీ, సాంఘిక విప్లవ రచయితలు, పితృస్వామ్య వ్యవస్థలో స్త్రీ మొదలైన గ్రంథాలు వ్రాశారు.

పద్మారావుగారి విమర్శ చాలా వాడిగా, వేడిగా ఉంటుంది. తాను అనుదానిని నిర్మొహమాటంగా చెప్పగల దిట్ట. ఇతరులు ఏమను కుంటారో అని ఆయన ఆలోచించరు. తన సిద్ధాంతానికి అనుగుణంగా విమర్శ ఉంటుంది. పొగడ్తలతో ఆయనకు విమర్శ ఉండదు. మంచి చెడ్డలు రెండు వీరి విమర్శలో చోటు చేసుకుంటాయి. ఇది కత్తి పద్మారావుగారి ధోరణి అనే విధంగా వారు ప్రతి విషయాన్ని శాస్త్రీయంగా విశ్లేషిస్తారు. ఆయనకు సంస్కృత పాండిత్యం పుష్కలంగా ఉండడం వల్ల నిజాన్ని మరీ బల్లగుద్ది చెప్తారు. అది కొంతమందికి ఇబ్బందికరంగా ఉంటుంది. అయినా ఆయన లెక్క చేయరు. కుండ బద్దలు కొట్టినట్లు వారి విమర్శనాధోరణి ఉంటుంది.

సంపాదకుడుగా కత్తివారికి ఎనలేని కీర్తి ప్రతిష్టలున్నాయి. వీరు హేతువాదం, దళిత రాజ్యం, దళితులు వస్తున్నారు జాగ్రత్త మొదలైన పత్రికలకు సంపాదకత్వం వహించారు. ఈ పత్రికలో అనేక వ్యాసాలు వ్రాశారు. అంతేకాక దిన, వార, పక్ష, మాస పత్రికల్లో లెక్కలేనన్ని వ్యాసాలు వ్రాశారు. వీరి వ్యాసాన్ని ముఖ్యంగా హేతువాద వ్యాసాలు, దళిత వ్యాసాలు, విమర్శ వ్యాసాలు, జీవిత చరిత్ర వ్యాసాలు, సంపాదకీయ వ్యాసాలు, ఇతర వ్యాసాలు అనే విధంగా వర్గీకరించ వచ్చు. రావుగారి సాహిత్యాన్ని విమర్శనాత్మకంగా, తులనాత్మకంగా, హేతువాద దృక్పథంలో శాస్త్రీయ ధోరణితో నిశితంగా పరిశీలిస్తే ఆయన ప్రతిభ, ప్రజ్ఞా పాటవాలు మనకు తెలుస్తాయి. వీరి సాహితీ కృతి భావి తరాలకు మార్గదర్శకం అవుతుందనటంలో ఎలాంటి సందేహం లేదు.

## సర్దేశాయి తిరుమలరావు :

తిరుమలరావుగారు కర్నూలు జిల్లా ఆలూరు తాలూకా జోహరా పురంలో జన్మించారు. తెలుగు సాహిత్య విమర్శలో ఒక ప్రత్యేక స్థానం సంపాదించుకున్నారు రావుగారు. వైజ్ఞానిక శాస్త్రాల్ని అభ్యసించి శాస్త్ర సాంకేతిక రంగాల్లో కృషి చేస్తూ సాహిత్య రంగంలో కూడా రాణించారు వీరు. సాహిత్యతత్వం - శివభారత దర్శనం, కన్యాశుల్క నాటక కళ అనే మంచి గ్రంథాల్ని రాశారు. వివిధ అంశాలపై అనేక వ్యాసాల్ని వ్రాశారు. వీరి విమర్శ గ్రంథాలు వ్యాసాలు తెలుగు సాహిత్య విమర్శను సుసంపన్నం చేశాయి. వీరు తులనాత్మక అధ్యయనంలో ఆరితేరినవారు.

## ఆచార్య ఎస్.వి. రామారావు :

రామారావుగారు మహబూబ్‌నగర్ జిల్లాలో పెద్దేరు సమీపంలోని శ్రీ రంగాపురం గ్రామంలో 1941లో జన్మించారు. వీరి విమర్శ ప్రస్థానం చెప్పుకోదగ్గది. రావుగారి పరిశోధన విమర్శ ప్రక్రియపై జరగటం ఆయనకు విమర్శపైనున్న మక్కువ తెలుస్తుంది. తెలుగు సాహిత్య విమర్శ అవతరణం, వికాసం అనేది వీరి పరిశోధన గ్రంథం. విమర్శక రంగంలో కృషి చేసిన అనేకమంది రచయితల వివరాల్ని గ్రంథస్థం చేశారు. ఈ విమర్శ గ్రంథం ప్రముఖుల ప్రశంసలు అందుకుంది. వేయి సంవత్సరాల తెలుగు సాహితిని విహంగ దృష్టితో వీక్షించటమే కాకుండా నిశిత దృష్టితో వివేచన చేశారు. అందుకే ఆచార్య సింగిరెడ్డి నారాయణరెడ్డిగారు "ఒక సద్విమర్శకునికి కావలసిన సమీక్షణ, సంయమన శక్తులు ఈ రచయితకున్నవి. ఒక ఉత్తమ సిద్ధాంత గ్రంథానికి ఉండవలసిన విషయ సమృద్ధి, వివరణ శుద్ధి ఈ గ్రంథానికి ఉన్నవి" అని అన్నారు. ఈ పరిశోధనా గ్రంథాన్ని సంగ్రహంగా ఆంగ్లంలోకి కూడా అనువదించారు. వీరు వ్యాసాలు సమీక్షలు కూడా విలువైనవే. వీరు వ్రాసిన వ్యాసాలు అన్వీక్షణం, సమవీక్షణం, అభివీక్షణం, కావ్యామృతం పేర్లతో ముద్రితమయ్యాయి. తెలుగు సాహిత్య విమర్శలో రామారావుగారు ఎనలేని పేరు ప్రఖ్యాతులు గడించారు.

ఆచార్య వెలుదండ నిత్యానందరావుగారు నిరంతరం కృషి చేస్తున్న సాహిత్య పిపాసి. పరిశోధనా రంగం మీదనే పరిశోధన చేసిన నిత్యపరిశోధకుడు రామారావుగారు. వీరు మహబూబ్‌నగర్ జిల్లాకు చెందినవారు. ఆయన వ్యాసం రాసినా, గ్రంథం రాసినా, ఏది రాసినా వైవిధ్యంగా ఉంటుంది. అదే వారి ప్రత్యేకత. వివిధ విశ్వవిద్యా లయాలలో పరిశోధన, హాస, విలాసం, నిత్య వైవిధ్యం, చంద్రరేఖా విలాసం, తెలుగు సాహిత్యంలో పేరడీ మొదలైన ఎన్నో గ్రంథాలు రాశారు. పరిశోధనలో, విమర్శలో మంచి పేరు తెచ్చుకున్న ఆచార్యులు వీరు.

చిరునామా : *ప్రొఫెసర్ వెలమల సిమ్మన్న, తెలుగు విభాగం, స్కూల్ ఆఫ్ డిస్టెన్స్ ఎడ్యుకేషన్, ఆంధ్ర విశ్వకళాపరిషత్, విశాఖపట్నం - 530 003, ఫోన్ : 0891- 2538528, సెల్ : 9440641617,*

శ్రీ పి. ఉమామహేశ్వర పాత్రుడు

# కృష్ణదరి - సాంస్కృతిక ఝురి

కృష్ణాజిల్లాలో పుట్టి ఆ జిల్లాకే ఎంతో ఖ్యాతినార్జించిన ప్రముఖులు శతాధికంగా ఉన్నారు. వారిలో కొద్దిమందిరైనా ఒక్కసారి స్మరించుకుందాం.

**అక్కినేని నాగేశ్వరరావు :**

1923లో రామాపురం (వెంకట రాఘవపురం)లో అక్కినేని నాగేశ్వరరావు గారు జన్మించారు. చిన్నతనంలోనే నాటకరంగంవైపు ఆకర్షితుడై అనేక స్త్రీ పాత్రలను ధరించారు. నటనపై గల అభిమానాన్ని గమనించిన పి.పుల్లయ్యగారు తన 'దర్శకత్వంలో'1941లో "ధర్మపత్ని" చిత్రంలో బాలనటుడిగా వెండితెరకు పరిచయం చేశారు. ఆ తరువాత "1944"లో ఘంటసాల బలరామయ్య తెరకెక్కించిన "సీతారామ జననం" చిత్రంద్వారా కథానాయకుడిగా నటించారు. ఎన్నో వైవిధ్యమైన పాత్రలను పోషించి, పలు సాంఘిక, పౌరాణిక, జానపద చిత్రాలలో నటించి అశేష ప్రేక్షకాదరణను చూరగొన్నారు. తెలుగు, తమిళ, హిందీ భాషల్లో కలిపి 256 చిత్రాల్లో నటించారు. ప్రజలచే "నట సామ్రాట్" అనిపించుకున్నారు. నవరాత్రి సినిమాలో "9" పాత్రలను పోషించి నవరస నాయకుడనిపించుకున్నారు. పద్మశ్రీ (1968), పద్మభూషణ్ (1988), రఘుపతి వెంకయ్య (1989), దాదాసాహెబ్ ఫాల్కే (1990)తో పాటు 2011లో పద్మవిభూషణ్ అందుకున్న ఏకైక నటుడు తెలుగు సినీ ప్రపంచానికి ఒక లెజెండ్‌గా నిలిచిపోయారు.

**అమ్ముల విశ్వనాథ భాగవతార్ :**

1915లో దివిసీమలోని నంగిగడ్డలో జన్మించిన వీరు చిన్నతనము నుండి మృదంగ వాద్యాన్ని అభ్యసించి హరికథలకు, నాట్యాలకు సహకారం అందించెడివారు. కాకతాళీయకంగా వీరు చూచిన "రుక్మాంగద" కథకు ఆకర్షితులై తనే స్వయంగా ఈ కథను హరికథగా మార్చారు. ఒకనాడు భావదేవర పల్లిలో హరికథకు ప్రక్క వాయిద్యముకై వెళ్ళిన వీరు ఆ హరికథకులు రానందున వీరే హరికథను చెప్పి మెప్పించారు.ఆదిభట్ల నారాయణ దాసుగారి ఏకలవ్య శిష్యులైన వీరు ఒకనాడు గురువుగారి సమక్షంలో "సీతా కళ్యాణం" హరికథ చెప్పి వారి ఆశీస్సులను అందుకున్నారు. ప్రాథమిక విద్యను కూడా పూర్తిచేయని వీరు పద్య, గద్య రచనలలో సిద్ధహస్తులు. "అన్నవరక్షేత్రం" "ధృవ చరిత్ర"వంటి అనేక పౌరాణిక, సాంఘిక హరికథలను వ్రాసారు. డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారి ఎదుట హరికథా గానం చేసి ప్రశంసలు పొందిన వీరు దేశ విదేశాలలో హరికథలను చెప్పి "కళా ప్రపూర్ణ" అవార్డును, "హరి కథా కళాకోవిద", "హరికథా రాజహంస" వంటి ఎన్నో బిరుదులను పొందారు.

**ఈలపాట (కల్యాణం) వెంకట సుబ్బయ్య :**

1901లోగుంటూరు జిల్లాలో సుద్దపల్లిలోఈలపాటి రఘురామయ్యగా ప్రసిద్ధిచెందిన వీరు జన్మించారు. వీరు సుప్రసిద్ధ రంగస్థల, సినిమా నటుడు మరియు గాయకులు. 1933లో పృథ్వీపుత్ర సినిమాతో సినిమా రంగంలో అడుగుపెట్టిన వీరు గొల్లభామ, సతీసక్కుబాయి, శ్రీకృష్ణతులా భారం, చింతామణి, దక్షయజ్ఞం మొదలైన సినిమాలతో ప్రజాభిమానాన్ని చూడగలిగారు. తమ శ్రావ్యమైన స్వరపేటికతోఅత్యద్భుతమైన పద్యాలు, పాటలు పాడి తమకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని నిలుపుకున్నారు.

**సి.యస్.ఆర్. :**

1907లో కృష్ణాజిల్లా చిలకలపూడి (బందరు)లో జన్మించిన వీరు సీతారామాంజనేయులు (సి.యస్.ఆర్.) సహజ నటునిక ఉండవలసిన ఆంగికం, వాచకం, అభినయాలతో ప్రేక్షకులను మంత్రముగ్ధులను చేసిన వీరు పువ్వు పుట్టగానే పరిమళిస్తుందన్న తీరుతో11 ఏళ్ళ చిరు ప్రాయంలోనే రంగస్థల నటునిగా రాణించారు. హీరోగా, విలన్‌గా, హస్యనటునిగా విభిన్న పాత్రలకు జీవం పోశారు. రంగస్థలంపై కృష్ణునిగా, శివునిగా, రామునిగా నటించడమే కాకుండా తమ గాత్ర మాధుర్యంతో ముఖ్యంగా పద్యాలు పాడడంలో ఆయనకు ఆయనే సాటి అనిపించుకున్నారు. 1932లో "పాదుకా పట్టాభిషేకం" తొలి సినిమా కాగ, ఈస్టిండియా ఫిల్మ్ కంపెనీ 1933లో నిర్మించిన "రామదాసు"లో ఆయనే హీరో 1946లో ఎల్.వి.ప్రసాద్‌గారు

దర్శకత్వంలోవచ్చిన "గృహప్రవేశం" చిత్రంలోకామెడీ విలన్‌గా నటించారు అనేదానికంటే జీవించారనడమే సబబు. జగదేకవీరుని కథలో "హేరాజన్" అంటూ ఆయన చేసిన పాత్రపోషణ, అప్పుచేసి పప్పుకూడులో అప్పుకు కొత్త అర్థం చెప్పిన తీరు, మాయాబజార్ "ముక్కోపానికి విరుగుడు ముఖస్తుతి"అనే డైలాగులు అశేష ప్రజానీకాన్ని ఉర్రూతలూగించింది. జీవితం, దేవదాసు, ఇల్లరికం, పాతాళభైరవి, సుమతి, కన్యాశుల్కం, జయంమనదే, కన్యాదానం వంటి అజరామర చిత్రాలలో నటించి శకుని పాత్రకు సజీవరూపాన్ని అందించిన సి.ఎస్. ఆర్.గారు తెలుగు చిత్ర సీమకు మకుటంలేని మహారాజుగా నిలిచిపోయారు.

**నందమూరి తారకరామారావు :**

1922లో నిమ్మకూరులో జన్మించిన వీరు విజయవాడ, గుంటూరు లలో విద్యాభ్యాసం చేశారు. విశ్వనాథ సత్యనారాయణగారి శిష్యులుగా వీరికి తెలుగు భాషపై మమకారం పెరిగింది. విద్యార్థిగా యున్న రోజులలోనే ముక్కామల, జగ్గయ్య, శివరాం మొ॥న వారితో నాటకాలు వేస్తూ "నేషనల్ ఆర్ట్స్ థియేటర్" అను నాటక సంస్థను స్థాపించారు. 1949లో వీరి నటనను చూసిఎల్.వి. ప్రసాద్‌గారిమనదేశం చిత్రంలోకి తీసుకున్నారు. విజయా సంస్థలో నెల జీతమునకు పర్మినెంట్ ఆర్టిస్ట్‌గా "షావుకారు" "పాతాళభైరవి" "మిస్సమ్మ" "మాయాబజార్" మొదలగు అనేక చిత్రాలలో నటించి అగ్రశ్రేణి కథానాయకులయ్యారు. "మల్లీశ్వరి" చిత్రం వీరిని తారాపథంలో నిలిపింది. అలా అనేక వందల చిత్రాలను చేశారు. రాయలసీమ కరువుకు, దివిసీమ ఉప్పెనకు సహాయకార్య క్రమాలలో పాల్గొని మానవీయతను చాటుకున్నారు. 198జ2లో నటనను నిలిపివేసి ప్రజా సేవకు తన జీవితాన్ని అంకితం చేస్తున్నట్లు ప్రకటించి తెలుగుదేశం పార్టీని స్థాపించి 1983 జనవరి 5న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అయ్యారు. వీరి హయాంలో జరిగిన సంక్షేమ, జాతి వికాస, బడుగు జనోద్ధరణ కార్యక్రమములు అశేషం. వీరిని భారత ప్రభుత్వం "పద్మశ్రీ"తో పురస్కరించగా, తెలుగు ప్రజలు శ్రీకృష్ణదేవరాయలు ప్రతిరూపంగా నీరాజనాలందించారు. తెలుగు భాషకు, తెలుగు జాతి గుర్తింపుకు, ఔన్నత్యానికి వీరు చేసిన కృషి అజరామరం.

**ఎస్.వి. రంగారావు :**

1918లో నూజివీడులో జన్మించిన సామర్లకోటవెంకట రంగారావు తన నిండైన విగ్రహంతో అనేక ప్రతినాయక పాత్రలకు జీవం పోశారు. బి.ఎస్.సి. చదివిన వీరు తొలుత అగ్నిమాపక దళంలో ఉద్యోగం చేశారు. రంగస్థలనటులుగా చేస్తూ 1946లో"వరూధిని" చిత్రం ద్వారా చిత్రరంగప్రవేశం చేసి "మనదేశం" "పల్లెటూరిపిల్ల" "పాతాళభైరవి" వంటి అనేక చిత్రాలలో వైవిధ్యమైన పాత్రలు పోషించి ప్రేక్షకుల హృదయాలలో సుస్థిర స్థానం సంపాదించుకున్నారు. కేవలం కన్నుల తోనే నవరసాలను పోషించగల ధీమంతులు. వీరు నటించిన నర్తనశాల జకార్తాలో జరిగిన ఆసియా ఫిల్మ్ ఫెస్టివల్‌లో బహుమతి సాధించింది. తెలుగు, తమిళ, హిందీ, కన్నడ, మళయాళ భాషలలో 300కు పైగా చిత్రాలలో నటించారు.

**సావిత్రి :**

1937లో విజయవాడలో జన్మించి, చదువుకుంటున్న రోజులలోనే నృత్యాన్ని అభ్యసించి అప్పుడప్పుడు ప్రదర్శనిలిస్తూ అందరి ప్రశంసలను పొందేవారు. చలనచిత్రరంగంపై గల ఆసక్తితో చెన్నైవెళ్ళారు. 1950లో "సంసారం" అనే చిత్రంతో చిత్రరంగప్రవేశం చేశారు. అందులో పోషించినది చిన్న పాత్రే అయినా అద్భుతమైన అభినయం ప్రదర్శించారు. ఎంతటి క్లిష్ట భావాలనైనా అలవోకగా కళ్ళతోనే పలికించడం, చక్కని ఉచ్ఛారణ ఈవిడ సొంతం. అనతికాలంలోనే తారాపథంలో అగ్రనటి స్థాయికి చేరారు. తెలుగు, తమిళ, హిందీ భాషలలో అనేక చిత్రాలలో నటించారు. సావిత్రి అనగానే "దేవదాసు" "మిస్సమ్మ" "తోడికోడళ్ళు" "మాయాబజార్" "డా॥ చక్రవర్తి" ఇలా ఎన్నో ఆణిముత్యాల వంటి చిత్రాలు మన మనోవీథిలో విహరిస్తాయి."చిన్నారిపాపలు" "మాతృదేవత" వంటి కొన్ని చిత్రాలకు దర్శకత్వం కూడా వహించారు.

**కపిలవాయి రామనాధ శాస్త్రి :**

1894లో మైలవరంలో జన్మించిన వీరిది శ్రావ్యమైన కంఠం చిన్నతనంలోనే నాటకాలలో ప్రవేశించిపద్యాలను,పాటలను పాడటంలో తనకంటూ ఒక ప్రత్యేక బాణీని సృష్టించుకున్నారు. రాముడు, రామదాసు, అర్జునుడు, సారంగధరుడు, భవానీ శంకరుడు మొదలైనవి వీరు ధరించిన పాత్రలలో చిరస్మరణీయం. "హిజ్ మాస్టర్స్ వాయిస్" కంపెనీవరు ఇతని పాటలను రికార్డులుగా అమ్మి అత్యంత ధనార్జన చేశారు. ప్రపంచ ప్రముఖుల పాటలను రికార్డు చేసే లండన్ లైబ్రరీ వారు వీరి పాటలను రికార్డు చేసి భద్రపరిచారు.

**కమలాకర కామేశ్వరరావు :**

1911లో బందరులో జన్మించిన వీరు అక్కడి నోబుల్ కళాశాలలో బి.ఏ. చేసి కృష్ణాపత్రికలో చేరి సమీక్షలు వ్రాసేవారు. వారి సమీక్షలకు మెచ్చి ప్రముఖ దర్శకులు హెచ్.ఎం.రెడ్డి ఆహ్వానంపై చిత్రరంగప్రవేశం చేసి గృహలక్ష్మి, స్వర్గసీమ, భక్త పోతన, యోగి వేమన వంటి గొప్ప చిత్రాలకు అసోసియేట్‌గా చేసి 1954లో "చంద్రహారం" చిత్రం ద్వారా దర్శకులయ్యారు. వీరు దర్శకత్వం వహించిన "నర్తనశాల"కు రాష్ట్రపతి ప్రశంస లభించింది. "మహామంత్రి తిమ్మరుసు"కు రాష్ట్రపతి రజత పతకం లభించాయి. "పాండవ వనవాసం" "శకుంతల" "శ్రీకృష్ణ తులాభారం" వంటి అనేక చిత్రాలకు దర్శకత్వం వహించి పౌరాణిక దర్శకులుగా పేరుగాంచారు.

### కాశీనాథుని నాగేశ్వరరావు :

1862లో కృష్ణాజిల్లా ఎలకుర్రులో జన్మించిన వీరు కాలేజి విద్య ముగించుకుని ముంబైలోని విలియం అండ్ కో అనే యూరోపియన్ సంస్థలో ఉద్యోగిగా చేరారు. వారి ఉత్పాదనలో "అమృతాంజనం" అప్పటికే పేరు గాంచింది.వారు ఈ దేశం విడచి వెళ్ళేటప్పుడు ఆ సంస్థను వీరికి అప్పగించి వెళ్ళిపోయాక ఆ సంస్థ పేరును అమృతాంజనం డిపోగా వీరు మార్చారు. మహారాష్ట్రుల దేశసేవకు వీరు ముగ్ధులై 1908 ముంబైలో "ఆంధ్రపత్రిక"ను వారపత్రికగా స్థాపించి ఆంధ్ర దేశీయోద్ధరణకు నడుము బిగించారు. ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం కావాలని పోరు మొదలిడిన ప్రధములు వీరు. 1914 తన నివాసాన్ని, ఆంధ్రపత్రికని చెన్నైకి మార్చటమే కాక ఆంధ్రపత్రికను దినపత్రికగా మార్చారు. స్వాతంత్ర్యోద్యమంలో "ఆంధ్రపత్రిక" సేవ అసమానమైనది. 1920లో గాంధీజీ సహాయనిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సభ్యులుగా, హిందుస్తాన్ బ్యాంక్ డైరక్టర్స్‌లో ఒకరుగా ఉన్నారు. వీరు "దేశోద్ధారక" "విశ్వదా" బిరుదులను పొందారు. 1924 "భారతి" మాసపత్రికను స్థాపించి, శాసన, చరిత్ర పరిశోధకులకు కళలకు బాసటగా నిలిపారు. విలేఖరులకు ప్రతిఫలము ఇచ్చే సంప్రదాయం వీరు ప్రవేశపెట్టినదే. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర, భగవద్గీతకు తెలుగు అనువాదం రచించారు.

### కృష్ణవేణి :

1924లో కృష్ణాజిల్లా పంగిడిగూడెంలో మేకా కృష్ణవేణిగారు జన్మించారు. తెలుగు సినిమా విలక్షణ నటిగా, గాయనిగా, నిర్మాతగా నిలిచిన అలనాటి మేటి నటీమణి, సినిమా రంగప్రవేశం చేయడానికి పూర్వం ఎన్నో రంగస్థల నాటకాలలో ఎన్నో పాత్రలు పోషించారు. 1936లో "సతీ అనసూయ" "ధృవ" చిత్రములతో బాలనటిగా సినీ రంగప్రవేశం చేసింది. తెలుగులోనే కాకుండా తమిళ, కన్నడ భాషా చిత్రాలలో కథానాయికగా నటించారు. ఈమె తన చిత్రాలలో తెలుగు సాంప్రదాయ విలువలకు అద్దంపట్టారు. జానపద గీతాలకు పెద్దపీట వేశారు. 1949లో తెలుగు సినిమా చరిత్రలో మైలురాయి అయిన "మనదేశం" చిత్రాన్ని నిర్మించి, తెలుగు తెరకు ఎన్.టి.రామారావు, ఎస్వీ రంగారావును, ఘంటసాల వెంకటేశ్వరరావును పరిచయం చేశారు. 1957లో దాంపత్యం సినిమాతో ప్రముఖ సంగీత దర్శకుడు రమేష్ నాయుడును పరిచయం చేశారు. మళ్ళీ పెళ్ళి, దక్షయజ్ఞం, భీష్మ, గొల్లభామ చిత్రాలలో నటించారు. జయా పిక్చర్స్ (శోభనాచల స్టూడియోస్) ఎం.ఆర్.ఏ. ప్రొడక్షన్స్ బేనర్స్‌పై "మనదేశం" లక్ష్మమ్మ, దాంపత్యం, గొల్లభామ, భక్తప్రహ్లాద వంటి ప్రతిష్ఠాత్మక చిత్రాలను రూపొందించారు. తెలుగు సినీ పరిశ్రమకు ఈమె చేసిన కృషికి 2004లో రఘుపతి వెంకయ్య అవార్డు అందుకున్నారు.

### కె. ప్రత్యగాత్మ :

1924లో ముదునూరులో జన్మించిన వీరు తెలుగు సినిమాను క్రొత్త మలుపు త్రిప్పిన దర్శకులు. వీరు కమ్యూనిస్టు పార్టీతో సన్నిహితంగా ఉంటూ ఎన్నో ఉద్యమాలలో పాల్గొన్నారు. వీరు చెన్నైలో జ్వాల పత్రిక స్థాపించారు. తాతినేని ప్రకాశరావుగారి పిలుపుతో నిరుపేదలు చిత్రానికి కథ వ్రాశారు."ఇల్లరికం" "జయంమనదే" చిత్రాలకు సహాయకులుగా చేశారు. పర్వతనేని గంగాధరరావుగారి ప్రోత్సాహంలో "మా ఇంటి మహాలక్ష్మి"కి కథ, మాటలు, స్క్రీన్ ప్లే కూర్చారు."భార్యాభర్తలు" చిత్రానికి దర్శకత్వంవహించారు. దర్శకులుగా కీర్తిగాంచారు. "భార్యాభర్తలు" "కులగోత్రాలు" "మనుషులు మమతలు" "చిలకా గోరింక" ఇలా అనేక చిత్రాలకు కేంద్ర, రాష్ట్ర బహుమతులు వచ్చాయి. జయలలితను, కృష్ణంరాజును తెలుగు తెరకు పరిచయం చేశారు. హిందీలో 7 చిత్రాలకు దర్శకత్వం వహించారు. "పునర్జన్మ" "కమలమ్మ కమతం" "అత్తగారిల్లు" ఇలా 21 చిత్రాలను నిర్మించారు.

### కె.ఎస్. ప్రకాశరావు :

1914లో కోలవెన్ను గ్రామంలో జన్మించి 1938లో చిత్రరంగంలో ప్రవేశం చేశారు. "పత్ని" "అపవాదు" చిత్రాలలో కథానాయకుడుగా, "ద్రోహి" చిత్ర నిర్మాతగా చేశారు. ఆంధ్రప్రదేశ్ మంత్రిగా, శాసనసభా స్పీకర్‌గా, మహారాష్ట్ర గవర్నర్‌గా పనిచేసిన కోన ప్రభాకరరావును, రాళ్ళబండి కుటుంబరావును ద్రోహి చిత్రం ద్వారా విలన్ల గాను, పెండ్యాలను సంగీత దర్శకులుగా,"మొదటి రాత్రి" "దీక్ష" చిత్రాల ద్వారా ఆత్రేయను పాటల రచయితగా తెలుగు, తమిళంలో నిర్మించిన కన్నతల్లి చిత్రం ద్వారా పి. సుశీలను గాయనిగాను చిత్రసీమకు పరిచయం చేశారు. స్క్రీన్‌ప్లే, రచనలో వీరు దిట్ట. కె.బి. తిలక్, ఆదుర్తి సుబ్బారావు వీరి శిష్యులు. వీరు తీసిన "ప్రేమ్ నగర్" తెలుగు తమిళంలో ఘనవిజయం సాధించింది. వీరు తెలుగు, తమిళం, కన్నడ, హిందీ భాషలో 20కి పైగా చిత్రాలను నిర్మించి, 50 చిత్రాలకు పైగా దర్శకత్వం వహించారు. వీరు రాష్ట్రపతిచే సత్కారమును, రఘుపతి వెంకయ్య అవార్డును పొందారు. వీరి కుమారులు కె. కృష్ణమోహన్, నిర్మాత, కె. రాఘవేంద్రరావు, దర్శకులు, కె. ప్రకాశ్, ఛాయాచిత్ర దర్శకులుగా, వీరి సోదరుల కుమారులు కె. బాపయ్య దర్శకులుగా పేరుగాంచారు.

### కొమ్మూరి వేణుగోపాలరావు :

1935లో విజయవాడలో జన్మించిన వీరు వైద్యశాస్త్రంలో పట్టా పుచ్చుకున్నారు. చిన్నతనం నుండే రచనా వ్యాసంగం మొదలుపెట్టారు. శరత్, టాల్‌స్టాయ్ వీరి అభిమాన రచయితలు. వీరు వ్రాసిన "పెంకుటిల్లు" చెన్నై తెలుగుభాషా సమితి వారిచే ఉత్తమ నవలగా ఎంపిక అయింది. "హౌస్ సర్జన్" "ఒకే పాటకు రెండు రాగాలు"

"భారతి" "నివేదిత"ఇలా శతాధిక నవలలు వ్రాశారు. వీటిలో "భారతి" చలనచిత్రంగా రూపొందించబడినది. నవలలే కాక "ఇల్లుకొన్నాడు" "మర మనిషి" వంటి అనేక కథలను కూడా వీరు వ్రాసారు. వీరి రచనలు అనేకం ఆంధ్రజ్యోతి, ఆంధ్రప్రభ వారపత్రికలలో సీరియల్స్‌గా వచ్చాయి. ఇటు నవలా రచయితగా అటు వైద్యునిగా సాహిత్య, సామాజిక సేవ చేసిన ఘనులు.

## కొర్రపాటి గంగాధరరావు :

1922లో మచిలీపట్నంలో జన్మించిన గంగాధరరావు వృత్తిరీత్యా వైద్యులైనా నటులు, దర్శకులు, నిర్వాహకులు కూడా. నాటకరంగంపై ఆసక్తి కలిగినవీరు "తెలుగు కోపం" "బంగారు సంకెళ్ళు" "గుడ్డిలోకం" "యధారాజ తథాప్రజా" "నిజరూపాలు" వంటి అనేక నాటకాలను రచించారు. వీరు వ్రాసిన అనేక నాటకాలు ఆంధ్ర నాటక కళాపరిషత్ వారిచే ఉత్తమ రచనలుగా ఎన్నుకోబడ్డాయి.నాటక కళపై అనేక వ్యాసాలు వ్రాసి నాటక కళాభివృద్ధికి పాటుపడ్డారు. వీరు వ్రాసిన "పెద్దరోవ" నాటకానికి కేంద్రప్రభుత్వ అవార్డు లభించటమే కాక వీరు వ్రాసిన 25 నాటికలను "నాటికా పంచవింశతి" అనుపేర ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురించింది. "లంబాడోళ్ళ రాందాసు" "బోధిశ్రీ" అనే నవలలను కూడా వీరు రచించారు.

## కోగంటి గోపాల కృష్ణయ్య :

కృష్ణాజిల్లా శ్రీకాకుళంలో 1923లో జన్మించిన వీరికి చిన్నతనం నుండే సాహిత్యంపై మక్కువ ఎక్కువ. వీరు బ్రిటీష్ బానిసత్వంలో మ్రగ్గుతున్న భారత ప్రజానీకాన్ని ఉత్తేజపరచటానికై అనేక గేయాలను, నాటికలను వ్రాసి ప్రజల మధ్యకు తీసుకువెళ్ళారు. ప్రజానాట్యమండలి ఉద్యమానికి ప్రారంభకుల్లో ప్రముఖులుగా పనిచేశారు. బ్రిటీష్‌వారు ఇతనిని అరెస్టు చేసి జైలుకు పంపగా అక్కడ కూడా నాటకాలు వేసి జైలర్లను మెప్పించారు. కూచిపూడి వీధి నాటక శైలిని వేదాంతం వెంకటేశ్వర్లుగారి వద్ద అభ్యసించారు. వీధినాటికలు, బుర్ర కథలు, డప్పుల పాటలు, పిట్టల దొర వంటి అనేక ప్రాచీన జానపద కళారూపాలను ఉద్ధరించారు. ప్రసిద్ధ దర్శకులు ఎల్.వి. ప్రసాద్, తాతినేని ప్రకాశరావుగార్ల వద్ద అసోసియేట్‌గా పనిచేసి అనంతరం విజయవాడలో వ్యాపారంరంగంలో ప్రవేశించి సాంస్కృతిక సేవలందించారు.

## కొంగర జగ్గయ్య :

1926లో మొరంపూడి గ్రామంలో జన్మించిన వీరు పాఠశాల స్థాయి నుండే సాహిత్య రంగములో చేయి కదిపారు. 13వ ఏటనే "జీర్ణహంపి" అను పద్య ఖండికను వ్రాసారు. అస్పృశ్యత నివారణ, మద్యపాన నిషేధం, గ్రంథాలయ ఉద్యమాలలో పాల్గొన్నారు. ప్రజా నాట్యమండలి ద్వారా అనేక నాటకాలను వేశారు. అడవి బాపిరాజుగారి వద్ద చిత్రలేఖనంలో శిక్షణ పొందారు. 1948-51 మధ్య ఢిల్లీ ఆకాశవాణి కేంద్రంలో పనిచేశారు. 1951లో ప్రియురాలు చిత్రం ద్వారా చిత్రరంగములో ప్రవేశించి హీరోగా,విలన్‌గా,క్యారెక్టర్ ఆర్టిస్టుగా, హాస్యనటునిగా సుమారు 500 చిత్రాలను చేశారు. 1961లో "పదండి ముందుకు" చిత్రం ద్వారా నిర్మాతగా మారి ఆ చిత్రానికి మాటలతో పాటు ఒక పాటను కూడా వ్రాసి మహమ్మద్ రఫీతో తొలిసారిగా తెలుగు పాట పాడించారు. 1967లో ఒంగోలు లోక్‌సభ నుండి పార్లమెంట్ సభ్యునిగా ఎన్నికైన తొలి తెలుగు సినీనటులు, అనేక నాటకాలను, పద్యకావ్యాలను రచించారు. "మనస్విని" అనే ట్రస్టును ఏర్పరచి అనేకమంది కవులను కళాకారులను గౌరవించారు. భారత ప్రభుత్వము వీరిని "పద్మభూషణ్"తో సత్క రించింది.

## కొసరాజు రాఘవయ్య చౌదరి :

1905లో పొన్నూరులో జన్మించిన వీరు కొండముది నరసింహం పంతులుగారివద్ద ఆంధ్ర, సంస్కృతాలలో పాండిత్యం గడించారు. పినతండ్రి వరుస అయిన త్రిపురనేని రామస్వామి చౌదరి గారి వద్ద కవిత్వంలో ఓనమాలు నేర్చారు. 1927-28లో గుంటూరుజిల్లా బోర్డు ఎన్నికల ప్రచారానికై ప్రచార గీతాలతోపాటు బుర్రకథలను వ్రాసిన ప్రథములు వీరే. వీరు "కొండవీటి వైభవం" కావ్యం "శంబుకర్ణి" శతకం "గండికోట యుద్ధం" అను మంజరి ద్విపద కావ్యం ఇలా ఎన్నో రచనలు చేశారు. 1938లో "రైతుబిడ్డ" చిత్రానికి పాటలు వ్రాసి పాడడమే కాక రైతు నాయకుని పాత్రను కూడా వేశారు. 1953లో "పెద్ద మనుషులు" చిత్రానికి సినీ గేయరచయితగా స్థిరపడి "నందామయా గరుడ నందామయా" "శివ శివమూర్తివి గణనాథ" "ఏరువాక సాగేరో" "టౌను ప్రక్కకెళ్ళద్దురో డింగరి" "మామ మామ మామ" "ఇల్లరికంలో ఉన్న మజా" వంటి రసవత్తరమైన పాటలను 3వేలకు పైగా వ్రాసారు. "రైతు జన విధేయ రాఘవయ్య" అను ముకుటంతో రాఘవయ్య శతం పూర్తి ఆటవెలదులతో వ్రాసారు. వీరు నందమూరి తారక రామారావుగారిచేతులమీదుగా "కనకాభిషేకం" ఆంధ్ర విశ్వకళాపరిషత్ వారిచే "కళాప్రపూర్ణ" రాష్ట్రప్రభుత్వం వారిచే "రఘుపతి వెంకయ్య" పురస్కారం, కవిరత్న, జానపద కవి సార్వభౌముడు వంటి అనేక బిరుదు సత్కారాలను పొంది నేటికి జనహృదయాలలో నిలచియున్నారు.

## గూడవల్లి రామబ్రహ్మం :

1898లో నందమూరులో జన్మించిన రామబ్రహ్మం విద్యార్థి దశలోనే సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నారు. చెన్నైలోని "సమదర్శి" పక్ష పత్రికకు "ప్రజామిత్ర" వార పత్రికకు సంపాదకత్వం వహించారు. ప్రసిద్ధ దర్శకులు శ్రీ సి.వి. దాసులు పరిచయంతో చిత్రసీమలో ప్రవేశించి

"ద్రౌపది వస్త్రాపహరణం"నిర్మాణంలోను, హెచ్.ఎం.రెడ్డిగారి "బాలయోగి"ని లోను సహకరించారు. చెన్నైలో "సారథి ఫిలింస్" అను స్వంత సంస్థను స్థాపించి "మాలపిల్ల" "రైతుబిడ్డ" చిత్రాలను నిర్మించి సంచలనం సృష్టించారు. కొన్ని ఇతర సినిమాలను డైరెక్టు చేసినా "మాలపిల్ల" "రైతుబిడ్డ" లలో అభ్యుదయ భావాలను, "పత్ని" "పల్నాటియుద్ధం"లలో చారిత్రక భావాలను "ఇల్లాలు" "అపవాదు"లలో సంస్కరణ భావాలను చాటి వీరు సర్వత్రా ప్రశంసలనందుకున్నారు.

**ఘంటసాల వెంకటేశ్వరరావు :**

1922లో గుడివాడ తాలూకా చౌటపల్లిలో జన్మించిన వీరు తండ్రి సూరయ్యగారి వద్ద ప్రాథమికంగా సంగీతము నేర్చుకున్నారు. తన 11వ ఏటనే తండ్రి మరణించడంతో సంగీతానికి అంకితమవ్వాలనే తండ్రిగారి కోరిక నెరవేర్చుటకై విజయనగరం మహారాజావారి కళాశాలలో చేరి పట్రాయని సీతారామశాస్త్రిగారి వద్ద డిప్లొమా పూర్తిచేశారు. ఆనాడే వీరి గాత్ర మాధుర్యానికి మురిసి ఆదిభట్ల నారాయణదాసుగారు ఒక తంబూరాను బహుకరించారు. మద్రాసు ఆకాశవాణిలో గాయకులుగా పనిచేస్తూ కొన్ని నాటకాలలో కూడా వేశారు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని జైలుకు కూడా వెళ్ళారు. 1944 సముద్రాల రాఘవాచార్యుల గారి ద్వారా సినీ రంగప్రవేశం చేశారు. 110 చిత్రాలకు సంగీత దర్శకత్వం వహించారు. 14వేల పాటలను పాడారు. వీరి గొంతులో భక్తిభావం తొణికిసలాడుతుంది. 1970లో వీరికి భారత ప్రభుత్వం "పద్మశ్రీ" బిరుదునిచ్చి గౌరవించింది.

**జె. ఋష్యేంద్రమణి :**

1917లో విజయవడలో జన్మించిన ఋష్యేంద్రమణి పెంపుడు తల్లి వెంకట రత్నమ్మ వద్ద ఏడవ ఏటనే వంశపారంపర్య నృత్యాభ్యాసాన్ని ప్రారంభించి కొద్దికాలానికి నాటకరంగంవైపు అడుగులు వేసి ప్రహ్లాద, చింతామణి, సావిత్రి వంటి పాత్రలకు వన్నె తెచ్చి 1935లో శ్రీ కృష్ణ తులాభారం సినిమాతో తెలుగులోను 1939లో "కణ్ణకి" చిత్రం ద్వారా తమిళ చిత్రరంగప్రవేశం చేసి"మల్లీశ్వరి" "విప్రనారాయణ" "మాయాబజార" "పాండురంగ మహత్యం" వంటి అనేక చిత్రాలలో తన అద్భుతనటనతో తెలుగువారి హృదయాలలోస్థానం సంపాదించుకున్నారు.

**తెన్నేటి హేమలత :**

1931లో నిమ్మకూరులో జన్మించిన ఈమె తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు భాషలలో పాండిత్యం గలవారు. వీరి మొదటి నవల "గాలి పడగలు,నీటి బుడగలు"ఇది వ్యభిచార కూపంలో చిక్కుకున్న స్త్రీ గాథ. ఈ నవల చదివిన దుర్గాభాయి దేశ్‌ముఖ్ కూడాకన్నీరు కార్చారట. వీరు తన 18వ ఏట వ్రాసిన శిలాహృదయం, ఆకాశవాణిలో ప్రసారమైనది. ఈమె ప్రతిభకు ఆకాశవాణివారు స్క్రిప్ట్ రైటర్‌గా, ఎనౌన్సర్‌గా చేర్చుకున్నారు. చలం తరువాత అంతటి "సంచలన" రచయితగా పేరుగాంచారు. వందకు పైగా నవలలు, వంద కథలు, 5 సాహితీ సంపుటాలు వ్రాసారు. రామాయణ విష వృక్షాన్ని ఖండిస్తూ "విషవృక్ష ఖండన" అను రెండు సంపుటాలను వ్రాసారు. వీరి ప్రతి రచనా ప్రస్తావించదగినదే. 1964 నుండి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి సభ్యురాలుగా 3సార్లు కొనసాగారు. స్త్రీ సమస్యలపై ఉత్తమ సేవలకు గాను "గృహలక్ష్మి" స్వర్ణకంకణ పొందారు. 1977లో ఆంధ్ర విశ్వకళాపరిషత్ వారిచే "కళా ప్రపూర్ణ" గౌరవ డాక్టరేట్ పొందారు. 1981లో రాష్ట్రప్రభుత్వం ఉత్తమ రచయిత్రి అవార్డు అందుకున్నారు.

**త్రిపురనేని గోపిచంద్ :**

కృష్ణాజిల్లా అంగలూరులో 1910లో జన్మించిన గోపీచంద్ తండ్రి రామస్వామివారి విషయ జిజ్ఞాసను పుణికి పుచ్చుకున్నారు. బి.ఎ., బి.ఎల్ చదివి వీరు మార్క్సిజంవైపు ఆకర్షితులై కొంతకాలం తరువాత దానిలోని లోటుపాట్లు గ్రహించి"నవ్య మానవతా"వాదాన్ని ప్రారంభించి ప్రచారం చేశారు. సమకాలిక, వాస్తవిక ఆంధ్ర జీవితచిత్రం ధ్యేయంగా శతాధిక గ్రంథాలను రచించారు. భౌతికవాదియైన వీరు అరవింద మహర్షిని దర్శించి భౌతికవాద – ఆధ్యాత్మిక వాదాలను సమన్వయించి "పోస్టు చేయని ఉత్తరాలు" అనే గ్రంథాన్ని వ్రాసారు. వీరు వ్రాసిన "పండిత పరమేశ్వర శాస్త్రి"నవలకు కేంద్రసాహిత్య అకాడమి బహుమతి లభించింది. "మెరుపుమరకలు" "చీకటి గదులు" అనే నవలలు కూడా ప్రసిద్ధాలే. "గుడ్డి సంఘం" "తత్త్వమసి" మొంచాల మొ॥న అనేక నాటకాలు వ్రాసారు. "రైతుబిడ్డ" గృహప్రవేశం చిత్రాలకు సంభాషణలు వ్రాశారు. "లక్ష్మమ్మ" "పేరంటాలు" "ప్రియురాలు" చిత్రాలకు దర్శకత్వం వహించారు. 1953లో ఆంధ్రప్రదేశ్ సమాచార శాఖ డైరెక్టర్‌గా పనిచేశారు.

**త్రిపురనేని రామస్వామి చౌదరి :**

1887లో అంగలూరులో జన్మించిన వీరు సంస్కృతాంధ్ర భాషలు అభ్యసించి చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారి వద్ద అవధాన ప్రక్రియను అభ్యసించారు. బెంగాల్ విభజన సమయంలో బిపిన్ చంద్రపాల్ ప్రసంగాలకు ఉత్తేజితులై "రాణా ప్రతాప్" అనే నాటకాన్ని వ్రాసారు. ఇంగ్లండులో బారిష్టరు పాసై విజయవాడలో న్యాయవాద వృత్తిని కొంతకాలం చేశారు. స్వతంత్ర భావాలు కలిగిన వీరు "రామాయణం" పై "శంభుక వధను" "భారతం"పై "కురుక్షేత్ర సంగ్రామము", "సూత పురాణము" వంటివి వ్రాసి వాదోపవాదాలకు తెరనెత్తారు. "కారెంపూడి కథనము" "ధూర్త మానవ శతకం""వివాహ విధి"వంటి అనేక రచనలు చేశారు. ఉప్పు సత్యాగ్రహం సమయములో "వీర గంధము తెచ్చినాము" వంటి ఎన్నో గేయాలను రచించారు. శుద్ధ ఖద్దరును మాత్రమే

ధరించెడివారు. ఆంధ్ర మహాసభలలో వీరికి "కవిరాజు" బిరుదునిచ్చారు. "ఆంధ్ర విశ్వ కళాపరిషత్" సెనెట్ సభ్యులుగా కొంతకాలం సేవ చేశారు.

**దాలిపర్తి పిచ్చహరి :**

1910లో మచిలీపట్నం దగ్గరలోని లక్ష్మీపురంగ్రామంలో జన్మించిన వీరు తండ్రి అయిన నాదస్వర విద్వాన్ రామయ్యగారి వద్ద నాదస్వరం లో ప్రాథమిక విద్యను, సుసర్ల దక్షిణామూర్తిగారి వద్ద సంగీత విద్యను అభ్యసించి, మద్రాసు నటేశం గారి వద్ద, నాదముని బలరాంలవద్ద నాదస్వర విద్యలో మెళుకువలు నేర్చుకుని తనదైన ఒక బాణీని సృష్టించుకున్నారు. తానం వాయించడంలో వీరికి వీరే సాటి. వీరి సోదరుడు సూర్యనారాయణ అదే ప్రతిభతో వీరికి నాదస్వర సహకారమందించెడివారు. వీరికి 1942లో మైసూరు రాజుగారిచే కనకాభిషేకం "నాద చింతామణి" బిరుదు, 1944లో గాయక విశారద, 1947లో నాదస్వర చక్రవర్తి, 1948లో నెహ్రూగారిచే సత్కారం, 1949లో సువర్ణ గండపెండేరము, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి వారిచే "గాన కళాప్రపూర్ణ" పొందటమే కాక దేశంలో అనేక ఆకాశవాణి కార్యక్రమాలలో పాల్గొని, ఆడిషన్ కమిటీ సభ్యులుగా పనిచేశారు.

**దాసరి రామతిలకం :**

1905లో విజయవాడలో జన్మించిన రామతిలకం తొలుతగా నాటక రంగములో ఉజ్వలంగా వెలిగారు.కమ్మని కంఠంఈమె సొంతం. 1933లో "చింతామణి" చిత్రంద్వారా చిత్రసీమలో అడుగిడి, "సావిత్రి" "మోహిని రుక్మాంగద" "శ్రీకృష్ణ లీలలు" వంటి అనేక చిత్రాలలో నటించారు. శ్రీకృష్ణలీలలో ఈమె పాడిన "కలయో వైష్ణవ మాయయో" అనే పద్యానికి ఆనాటి ప్రేక్షకులు తన్మయులయ్యేవారు. నేపథ్య సంగీతం ప్రాధాన్యత వహించాక వీరు మరుగున పడ్డారు.

**నాదెళ్ళ పురుషోత్తమ కవి :**

1863లో దివి తాలూక సీతారామపురంలో జన్మించిన వీరు బహుముఖ ప్రజ్ఞావంతులు. సంస్కృత, పార్సీ, మరాఠి, హిందుస్తాని భాషలునేర్చుకున్నారు. పూజావిధానాలు, గణితం, హిందూస్థానీ సంగీతం, హరికథలు చెప్పటంలో ప్రావీణ్యులు. వీరు 12 ఆంధ్ర ప్రబంధాలను, 10 ఆంధ్ర రూపకాలను, 5 శతకాలను, 10 స్తోత్రాలను, 13 అభివర్ణన లను, 3 కీర్తనల సంకలనాలను, 3 నిఘంటువులను, 6 శాస్త్రగ్రంథ్యాలను, 9 వచన గ్రంథాలను, 32 హిందీ నాటకాలను, 9 స్కూలు పుస్తకాలను రచించారు. "అద్భుతోత్తర రామాయణం" "కృష్ణానదీ మహత్యం" "గురుభక్తి ప్రభావం" మొ॥న ప్రబంధ కావ్యాలు, చతుర్విధ కంద పద్య రామాయణం, "జాతక దర్పణము" "సులభ వైద్యబోధిని" "లక్షణ సారసంగ్రహము" రచించారు. నాటకాలలో పాత్రోచిత భాషను ప్రయోగించిన ప్రథమాంధ్ర కవి. "సరస చతుర్విధ కవితా దురంధరుడు" అను సార్థక బిరుదాంకితుడు.

**నిర్మలమ్మ :**

1927 బందరులో జన్మించిన నిర్మలమ్మ అమ్మకు, అమ్మమ్మకు అసలు అర్థాన్ని చాటిచెప్పే విధంగా పాత్రకు ప్రాణం పోసిన నటి నిర్మలమ్మగారి అసలు పేరు రాజమణిగారు. వందల చిత్రాలలో క్యారెక్టర్ నటిగా నటించిన ఈ సహజనటి చిన్ననాటినుండే నాటకాలంటే ఇష్టమే ఒక కారణం. 1943లో 16 ఏళ్ళ వయస్సులో "గరుడ గర్వభంగం" అనే సినిమాలో చెలికత్తె పాత్రలో తొలిసారి నటించారు. ఆనాటి ఎన్.టి.ఆర్, ఏ.ఎన్.ఆర్, యస్వీ.ఆర్‌లనుంచి నేటి చిరంజీవి, బాలకృష్ణ వరకు ఎందరో హీరోలకు బామ్మగా, అమ్మగా నటించారు. సుమారు"వెయ్యి"సినిమాలలో నటించారు.శంకరాభరణం, యమగోల, మావిచిగురు, మాయలోడు, శుభలేఖ, భార్యాభర్తలు వంటి చిత్రాలలో నటించి మెప్పించారు. మయూరి, సీతారామరాజు చిత్రాలకు నంది అవార్డులను అందుకున్నారు. షూటింగ్ విరామ సమయాలలో ఆమె మమ్మల్నందరిని తల్లిగా ఆదరించేదని అందుకే మేము "నిర్మలమ్మా" అని పిలిచేవారమని అక్కినేని నాగేశ్వరరావు గారు అన్నారు. కాకినాడలో ప్రదర్శించిన "కరువు రోజులు" నాటకం చూచి అలనాటి బాలీవుడ్ నటుడు పృథ్వీరాజ్ కపూర్ నీవు నటివమ్మ అన్నారట. "ఏకవీర" నాటకంలో గిరిక పాత్రను చూచి కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు, పిచ్చిమొద్దు, నీలో ఇంత నటన ఉందని అనుకోలేదు అంటే అమాయకంగా నవ్విన అజరామరమూర్తి నిర్మలమ్మగారు.

**పారుపల్లి రామకృష్ణయ్య పంతులు :**

1883లో కృష్ణాతీరంలో శ్రీకాకుళంలో జన్మించిన వీరు సుసర్ల దక్షిణామూర్తిగారి వద్ద సంగీతాన్ని అభ్యసించారు. విజయవాడలో నివాసముంటూ తమిళ దేశంలో అనేక కచ్చేరిలనిస్తూ అక్కడి పండితుల ప్రశంసలను పొందుతూ ఎన్నో సువర్ణ పతకాలు, కంకణాలు పొందారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్ పరీక్షలాధికారిగా, ఆకాశవాణిలో ఎన్నో కచ్చేరీలు చేసి 1931లో ఆంధ్ర సారస్వత పరిషత్తు వారిచే "గాయక సార్వభౌమ" బిరుదును పొంది మంగళంపల్లి బాలమురళీకృష్ణ వంటి అనేకమంది విద్యార్థులకు విద్యను నేర్పారు.

**పింగళి నాగేంద్రరావు :**

పింగళి నాగేంద్రరావుగారు శ్రీకాకుళం జిల్లా బొబ్బిలికి దగ్గరలో ఉన్న రాజాం అనే గ్రామంలో జన్మించారు. కేవలం సినీ రచయితగా మాత్రమే కాకుండా, పాత్రికేయులుగా, నాటక రచయితగా కూడా వీరు ప్రసిద్ధులు. కృష్ణాపత్రిక, శారద పత్రికలకు ఉపసంపాదకుడుగా

పనిచేశారు. విద్యుంరాణి, నారాజు, నా కుటుంబం, జేబున్నీసా వంటి నాటకాలు రచించారు. పురుషోత్తమ శర్మ అనే కవి, మాధవపెద్ది వెంకట్రామయ్య వంటి నాటక రచయితలు, కృష్ణాజిల్లా జాతీయ కాంగ్రెస్ కమిటీలో పనిచేసిన రోజులలో దేశభక్తి పద్యాలు రచించి, "జన్మభూమి" అనే పుస్తకాన్ని ప్రచురించారు. భలే పెళ్ళి అనే సినిమాతో పాటలు, మాటల రచయితగా సినిమా రంగానికి పరిచయమయ్యారు. వింధ్యారాణి చిత్రానికి కథా రచయితగా, గుణసుందరి కథ, పాతాళ భైరవి, చంద్రహారం రచయితగా,మహామంత్రి తిమ్మరుసు, జగదేకవీరుని కథ, మిస్సమ్మ, మాయాబజార్‌లకు గీత రచయితగా, రాజకోట రహస్యం, అగ్గిమీద గుగ్గిలం, అప్పుచేసి పప్పుకూడు, భలే పెళ్ళి వంటి ఎన్నో అద్వితీయమైన సినిమాలను అందించిన తెలుగు సినీ వినీలాకాశంలో మరపురాని మహామనిషిగా నిలిచిపోయారు.

## పి. ఆదినారాయణరావు :

1918లో విజయవాడలో జన్మించిన ఆదినారాయణరావు తండ్రి గారైన పట్రాయని సీతారామశాస్త్రిగారి వద్దనే సంగీతము, హార్మోనియం నేర్చుకున్నారు. 1947లో "గొల్లభామ" చిత్రానికి గీత రచయితగా జీవనాన్ని ప్రారంభించి "పల్లెటూరి పిల్ల" చిత్రానికి సంగీత దర్శకత్వం వహించి, 1953లో భార్యయైన అంజలీదేవి పేర "అంజలి పిక్చర్స్" స్థాపించి "పరదేశి" "పూంగోదై", "అనార్కలి", "సువర్ణ సుందరి" (తెలుగు, హిందీ, తమిళ) "సతీ సక్కుబాయి", "పూలోం కే సూజ్" వంటి అనేక చిత్రాలను నిర్మించి, లక్ష్మీకాంత్ – ప్యారేలాల్ వంటి వారిని సంగీత దర్శకులను చేసి "రాజశేఖరా నీపై" వంటి అనేక మధుర గీతాలకు స్వరకల్పన చేశారు.

## బందా కనకలింగేశ్వరరావు :

1907 కైకలూరి దగ్గర ఆటపాకలో జన్మించిన బందా తన న్యాయవాదవృత్తిని విడిచి నాటక రంగములో ప్రవేశించి శ్రీకృష్ణుడు, సారంగధరుడు, చంద్రగుప్తుడు, అల్లూరి సీతారామరాజు మొ॥న అనేక ముఖ్యపాత్రలు ప్రశంసనీయంగా పోషించి 1964లో ఉత్తమ నటునిగా రాష్ట్రపతి అవార్డును తీసుకున్నారు. వీరు నాటకాలలోనే కాక కొన్ని చలనచిత్రాలలో నటించారు. కూచిపూడి నాట్యకళకు వీరుచేసిన సేవ మరవలేనిది. కేంద్ర, రాష్ట్ర సంగీత నాటక అకాడమి సహకారంతో "కూచిపూడి"లో సిద్ధేంద్ర కళాక్షేత్రాన్ని స్థాపించారు. కూచిపూడి కళ గురించి ఎన్నో వ్యాసాలు వ్రాసారు. సంగీత నాటక అకాడమీ కార్యవర్గ సభ్యులుగా, విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో నాటక ప్రయోక్తగా వీరు కళకు సేవలందించిన మహనీయులు.

## మల్లిక్ :

1921లో బందరులో జన్మించారు. "మల్లిక్"గా కళా ప్రపంచ మంతా ఎరిగిన వీరి పూర్తిపేరు కందుల మల్లిఖార్జునరావు. క్రోవి సత్యనారాయణగారి వద్ద సంగీతాన్ని అభ్యసించిన వీరు లలిత, జానపద సంగీతాలలో తనకొక ప్రత్యేక గుర్తింపును తెచ్చుకున్నారు. 1942లో చెన్నై ఆకాశవాణి కేంద్రములో లలిత సంగీత గాయకులుగా చేరిన వీరు విజయవాడ ఆకాశవాణిలో సీనియర్ గ్రౌండ్ మ్యూజిక్ కంపోజర్‌గా పనిచేశారు. చెన్నై, విజయవాడ, హైదరాబాద్ కేంద్రాలలో 38 సంవత్సరములు పనిచేసి విశేష సేవ చేశారు. వీరు కొంతకాలం చిత్రరంగములోను, డా॥ వెంపటి చినసత్యంగారితో కలిసి నృత్యనాటిక లకు సంగీత దర్శకత్వం వహించారు. "జల్లరి బావో""అదివో అల్లదివో" "తందనా భళా తందనానా"అనే పాటలకు రాగాలను కూర్చింది వీరే. "బంగారు పాప" "భాగ్యరేఖ""జయభేరి" ఇలా అనేక చిత్రాలకు పాటలు పాడారు. "చంద్రలేఖ" అనే తమిళ చిత్రానికి నేపథ్యం పాడిన తొలి తమిళ నేపథ్య గాయకులు వీరు. 1952 నుండి 1993 వరకు తిరుమల తిరుపతి దేవస్థానం ఆస్థాన విద్వాంసులుగా సేవలందించారు.

## మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి :

1916లో గుంటూరుజిల్లా లింగాయపాలెంలో జన్మించిన వీరు ప్రముఖ రంగస్థల, సినిమా నటులు మరియు రచయిత. రంగం స్థలంపై పౌరాణిక, జానపద, సాంఘిక నాటకాలలో ఎన్నో స్త్రీ, పురుష పాత్రలు ధరించారు. జాతీయ స్వాతంత్ర్య పోరాటంలో "5" సార్లు జైలుశిక్షను అనుభవించారు. అంతేకాకుండా నిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా "ప్రజానాట్య మండలి" లో పనిచేశారు. తెలుగు సినిమాలలో 400పైగా పౌరాణిక, జానపద, సాంఘిక చిత్రాలలో భిన్న, విభిన్న పాత్రలు పోషించారు. పులి బెబ్బులి, రామదాసు, పాండవ వనవాసం, నర్తనశాల, రాముడు భీముడు, దక్షయజ్ఞం సినిమాలు కేవలం మచ్చుతునకలు మాత్రమే. నటునిగానే కాకుండా రచయితగా నటరత్నాలు (1980) ఆంధ్ర నాటక రంగ చరిత్ర, తెలుగువారి జానపద కళారూపాలు, ప్రజాపోరాటం రంగస్థలం, ఆంధ్రుల నృత్య కళా వికాసం, తెలుగువారి చలనచిత్రకళ వంటి రచనలతో ప్రసిద్ధిచెందారు.

## ముదిగొండ లింగమూర్తి :

1908లో తెనాలిలో జన్మించిన వీరు నాటక రంగంపై ఆసక్తితో ప్రాథమిక విద్యతోనే చదువుకు స్వస్తి చెప్పి నాటకరంగంలో ప్రవేశించి అనేక పాత్రలు వేశారు. కన్యాశుల్కంలో రామన్న పంతులు వీరికి అత్యంత పేరును తెచ్చింది. 1937లో "తుకారాం" చిత్రంతో చిత్రరం గంలో కాలుమోపి "దేవత" "పంతులమ్మ" "పోతన" "పెద్ద మనుషులు" వంటి అనేక చిత్రాలలో వైవిధ్యమైన పాత్రలను పోషించిన ప్రజ్ఞాశీలి. "పెద్ద మనుషులు"లోని రామదాసు, మహామంత్రి తిమ్మరుసు చిత్రం లోని "హంవీర"పాత్రలకు ప్రభుత్వ ప్రశంస,పారితోషికాలను అందు కున్నారు. పండిత ప్రకాండులచే, నాటకాభిమానులచే వీరు "నటయోగి" అనిపించుకున్నారు.

**రఘుపతి వెంకయ్య :**

1869లో బందరులో జన్మించిన వీరు తొలుత ఫొటోగ్రాఫర్‌గా చెన్నై వెళ్ళారు. 1909లో ఐదవ జార్జి సమక్షములో ఒక చలనచిత్ర ప్రదర్శన జరిగింది. అందులో చలనచిత్రంతోపాటు శబ్దం కూడా జతపరచ బడింది. ఒక గ్రామఫోన్ రికార్డును చలనచిత్రంతో పాటు ఒకేసారి ప్రారంభించబడుట వలన ఇది సాధ్యమైంది. ఆ యంత్రమే "క్రోనో - మెగాఫోన్". ఆ యంత్రాన్ని వీరు 30వేల రూపాయలకు కొని చిన్న నిడివి గల కొన్ని ఆంగ్ల చిత్రాలను కొని ప్రథమంగా అప్పటి చెన్నై టౌన్‌హాల్‌లో ప్రదర్శించటమే కాక బర్మా, శ్రీలంక ఆంధ్ర ప్రాంతాలలో ప్రదర్శించేవారు. తరువాత 1912లో ప్రథమంగా గెయిట్ థియేటర్ నిర్మించి మూకీచిత్రాల ప్రదర్శననుప్రారంభించారు. తరువాత వీరి కుమారులైన ప్రకాష్‌ను ఆధునిక కెమెరా పనితనం కోసం అమెరికా, ఇంగ్లండులకు వెళ్ళారు. "టెన్ కమెండ్‌మెంట్స్" ఛాయాగ్రహకుడు "సిసిల్.బి. డెమెల్లీ" దగ్గర పనిచేసారు. తను తిరిగి వచ్చిన తరువాత "స్టార్ ఆఫ్ ఈస్ట్ ఫిలిమ్స్" అను పేరుతో ఒక స్టూడియోను నిర్మించి అందులో "గజేంద్రమోక్షం" 'భీష్మ ప్రతిజ్ఞ" వంటి మూకీ చిత్రాలను నిర్మించి దక్షిణ భారత దేశ చలనచిత్ర పరిశ్రమకే పితామహులయ్యారు.

**వంగర వెంకట సుబ్బయ్య :**

1897లో ఒంగోలు దగ్గర ఒక కుగ్రామంలో జన్మించి తెనాలిలో స్థిరనివాసమేర్పరచుకున్న వీరు సంస్కృత పండితులుగా పనిచేస్తూనే స్థానం వారి "శ్రీకృష్ణ తులాభారం"తో వసంతకుని పాత్రతో నాటక రంగంలో ప్రవేశించి తొలిపాత్రతోనే ప్రేక్షక హృదయాలను దోచుకున్నారు. వీరు "విప్రనారాయణ""సక్కుబాయి" వంటి అనేక నాటకాలలో హాస్య పాత్రలను సమర్థవంతముగా పోషించేవారు. 1937లో విప్రనారాయణలో శిష్యుని పాత్రతో చిత్రరంగ ప్రవేశం చేశారు. "పెద్ద మనుషులు" "కన్యాశుల్కం" "తెనాలి రామకృష్ణ" ఇలా వందకు పైగా చిత్రాలలో నటించారు. 1975లో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలలో వీరు సముచిత రీతిన సత్కరింపబడ్డారు.

**విశ్వనాథ సత్యనారాయణ :**

1912లో నందమూరులో జన్మించిన వీరు సంస్కృతాంధ్ర ఆంగ్ల భాషా పండితులు. వీరి కవిత్వ బహుముఖ ప్రజ్ఞావంతం. జాతీయాభిమానం, ధర్మం, శాంతం, కరుణం, భక్తి ఇలా అనేక కోణాలలో వీరి కవిత్వం గోచరిస్తుంటుంది. వీరు భావ కవిత్వంలో కూడా ప్రముఖ స్థానం వహించారు. అలాగే పద్యరచనలోను వీరు స్రష్టలే. కొన్ని వందల కొలది ఖండకావ్యాలను, 20వేలకు పైగా పద్యాలను రచించారు. వీరు వ్రాసిన "శ్రీమద్రామాయణ కల్ప వృక్షానికి" వీరికి జ్ఞానపీఠ్ అవార్డు లభించింది. వేయి పడగలు వంటి సాంఘిక, చారిత్రక పౌరాణిక నవలలు దాదాపు 60కు పై చిలుకే. వీరు వ్రాసిన కొన్ని నవలలు ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రికలలో ధారావాహికంగా ప్రచురింపబడ్డాయి. "నర్తనశాల" "వేనరాజు" "త్రిశూలము" వంటి అనేక నాటకములను కూడా రచించారు. సంస్కృతములో "అమృతశర్మిష్టమ్" "గుప్తపాశుపతమ్" అనే నాటకాలు, "అశని నిదానమ్" అను నాటిక, "దేవిత్రిశతి" అను స్తోత్రకావ్యము, ఇంగ్లీషులో "వాట్ ఈజ్ రామాయణ టు మి" "భవన్స్ జర్నల్" అను వ్యాసాలు వ్రాసారు. వీరు తెలుగు సాహిత్యాకాశంలో "ధృవతార"

**వి. మధుసూధనరావు :**

1923లో కృష్ణాజిల్లాలో జన్మించిన వీరమాచనేని మధుసూధన రావు గారు ఎ.ఎస్.ప్రకాశరావుగారి వద్ద చిత్రీకరణ పాఠాలు నేర్చుకుని 1958లో మొదటిసారిగా "సతీ తులసి" అనే పౌరాణిక చిత్రానికి దర్శకత్వం వహించారు. ఈనాటి మేటి దర్శకులైన కె. రాఘవేంద్రరావు, కోదండరామిరెడ్డి,సి. సి. రెడ్డి, వంశీ, శివనాగేశ్వరరావు మొదలైనవారు ఈయన దగ్గర శిష్యరికం చేసినవారే. ఎన్.టి. రామారావు, అక్కినేని నాగేశ్వరరావు, కృష్ణ, కృష్ణంరాజు, శోభన్‌బాబులతో ఎన్నో విజయవంతమైన చిత్రాలకు దర్శకత్వం వహించారు. నాగార్జున, జగపతిబాబు, రమేష్‌బాబులను సినీరంగానికి పరిచయము చేసిన విలక్షణ దర్శకుడు. ఆరాధన (1962), రక్తసంబంధం (1965), అంతస్తులు (1965), గుడిగంటలు (1965), అదృష్టవంతులు (19668), భక్తతుకారాం (1973), ఎదురీత (1977), మల్లెపూవు వంటి ఎన్నో తెలుగు చిత్రాలతో పాటు కన్నడంలో స్నేహసేదు (1978) అన్‌దు హెన్ను ఆరు కన్ను (1980) హిందీలో దేవి (1970) సమాజ్ కో బదల్‌దాలా (1970) లవకుశ చిత్రాలు నిర్మించారు.

**వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రి :**

1875లో కూచిపూడి అగ్రహారంలో జన్మించిన వీరు వెంపటి వెంకట నారాయణగారి వద్ద నృత్య శిక్షణ పొందారు. వీరు తరంగములను, అష్టపదులను, పదాలను, శ్లోకాలను పాడి, అభినయించి లక్ష్య లక్షణ సమన్వయం చేసెడివారు. భామాకలాపంలోని "మదనా" దరువులోని పల్లవిని తీసుకుని రాగ, తాళాలను మారుస్తూ, స్వరపోకడ, శబ్ద కల్పనలను ప్రదర్శిస్తూ ప్రేక్షకులను మైమరపించెడివారు. కలాపంలోని జడ భారతాన్ని ప్రదర్శించి పండితులను మెప్పించడం లోను వీరికి వీరే సాటి. పిఠాపురం, నూజివీడు, ఉయ్యూరు, చల్లపల్లి, భట్టిప్రోలు జమిందారుల పోషణలో ఉన్న వీరివద్దకు దేవ గణికలే కాక అనేకమంది బరత నాట్య కళాకారులు కూడా వచ్చి కూచిపూడి నృత్య మెలుకువలు నేర్చుకొనెడివారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రప్రభుత్వం వీరికి సింహ కంకణముతో సత్కరించినా, అనేక బిరుదులు, సత్కారములు పొందినా వీరి పాండిత్యానికి తగిన గుర్తింపు రాలేదనే చెప్పవచ్చు.

## వేటూరి సుందరరామమూర్తి :

1936లో కృష్ణాజిల్లా, పెదకళ్ళేపల్లిలో జన్మించిన వీరు కె. విశ్వనాథ్ దర్శకత్వంలో వచ్చిన ఓ సీత కథ ద్వారా సినీరంగప్రవేశం చేశారు. తొలుత ఆంధ్రప్రభ పత్రికలో ఉపసంపాదకునిగా పనిచేసిన ఆయన 1956 నుండి 16 ఏళ్ళు పాత్రికేయ వృత్తిలో ఉన్నారు. సినీ గీత రచయితగా మరువలేని మరపురాని సినీ గీతాలన్నెంటినో రచించిన ఆయన మరువలేని గాతాలెన్నో రాశారు. "కృషి ఉంటే మనుషులు" "కోకిలమ్మ పెళ్ళికి కోనంతా పందిరి" "ఝుమ్మంది నాదం" "కొమ్మ కొమ్మకు సన్నాయి" "ఆకాశ దేశాన" "కిన్నెరసాని వచ్చిందమ్మా" "అబ్బనీ తియ్యనీ దెబ్బ" అంటూ, ఎన్నో జానపద సాంఘిక చిత్రాలకు గీత రచన చేశారు. "రాలిపోయే పువ్వా నీకు రాగాలెందుకే" అనే పాటకి 1994లో జాతీయ పురస్కారం లభించినా తెలుగు భాషకు ప్రాచీన హోదా ఇవ్వనందుకు ఆ పురస్కారాన్ని తిరిగి ఇచ్చివేసిన మాతృభాషాభిమాని. రచయితగా సిరికా కొలను చిన్నది, రచనలో తెలుగు సంస్కృతిని, ప్రజాజీవన సరళిని ప్రతిబింబించే కథ, కొమ్మకొమ్మకో సన్నాయి రచనలు ఎందరో సినీ మహనీయులు ప్రస్తుత వ్యాసాలను అద్వితీయంగా రచించిన ఆయనకు 8 నంది పురస్కారాలతోపాటు 14 అవార్డులు ఒక జాతీయ పురస్కారం పొంది సినీ వినీలాకాశంలో శ్రీశ్రీ తరువాత తెలుగు పాటకు ప్రాణం పోసిన మహనీయుడు వేటూరి.

## వేదాంతం రాఘవయ్య :

1919లో కూచిపూడి అగ్రహారంలో జన్మించిన వీరు వంశపారం పర్య నృత్యంలో చింతా వెంకట రామయ్యగారి వద్ద శిక్షణ పొంది 1939లో "రైతుబిడ్డ" చిత్రంలో "దశావతార" నృత్యం చేసి "గరుడ గర్వభంగం" "సీతారామజననం" "లక్ష్మమ్మ కథ" "బాలరాజు" వంటి అనేక చిత్రాలకు నృత్య దర్శకత్వం వహించారు. చిత్ర దర్శకత్వాన్ని సునిశితంగా పరిశీలించి అవగాహన చేసుకుని తొలుతగా 1951లో "స్త్రీ సాహసం" చిత్రానికి దర్శకత్వం వహించారు. దాని విజయంతో "దేవదాసు""అనార్కలి" "భలేరాముడు" "చిరంజీవులు" "ఆడబ్రతుకు" వంటి అనేక చిత్రాలకు దర్శకత్వం వహించి నిర్మాతల ఇంట ధనరాశులు కురిపించారు. 1964లో వీరికి "కళాప్రపూర్ణ అవార్డు" లభించింది.

## సుసర్ల దక్షిణామూర్తి :

కృష్ణాతీరంలోని పెదకళ్ళేపల్లిలో 1860లోజన్మించిన వీరు వేదము సంస్కృతములను అభ్యసించి తరువాత తంజావూరు వెళ్ళి త్యాగరాజ స్వామి శిష్యులైన మానం జావడి వెంకట సుబ్బయ్యగారి వద్ద సంగీతాన్ని అభ్యసించారు. పట్నం సుబ్రహ్మణ్య అయ్యరు, వైద్యనాథ అయ్యరు, ఫ్లూట్ శరభశాస్త్రి వీరి సహాధ్యాయులే. అటు పిమ్మట వీరు వీణ కుప్పయ్యార్, ముత్యాలపేట త్యాగయ్యగార్ల వద్ద కూడా సంగీత శిక్షణ పొంది పెదకళ్ళేపల్లిలో త్యాగరాజస్వామి సంప్రదాయాన్ని వ్యాప్తిచేశారు.

## గోవిందరాజులు సుబ్బారావు :

1895లో జన్మించిన వీరు ఎల్.డి.ఎం. పట్టా పొంది తెనాలిలో వైద్యశాలను స్థాపించి పేరు ప్రఖ్యాతులను సంపాదిస్తూ హోమియో వైద్యంపై ఆసక్తి కలిగి దానిని క్షుణ్ణంగా అభ్యసించడమే కాక దానిలో కొన్ని పరిశోధనలు జరిపారు. అంతేకాక వీరు "అణువిజ్ఞాన"శాస్త్రం కూడా చదివి "ఐన్‌స్టీన్"తో ఉత్తర ప్రత్యుత్తరాలను జరిపేవారు. పాఠశాల విద్యార్థిగి "మర్చంట్ ఆఫ్ వెనిస్" అను ఆంగ్ల నాటకంలో మొట్టమొదట పాత్ర వేశారు. అలా మొదలైన నాటకాభిలాష వారిని సాత్యకి, భీముడు, హైదర్‌జంగ్, చుస్సీ, గిరీశం వంటి అనేక పాత్రలకు జీవం పోయించింది. 1936లో "మాలపిల్ల"లో చిత్రరంగప్రవేశం చేసి షావుకారు, బాలనాగమ్మ, గుణసుందరి కథ, కన్యాశుల్కం మొదలగు అనేక చిత్రాలలో నటించారు. "ఇనార్గనిక్ ఎవల్యూషన్" అను వైజ్ఞానిక గ్రంథాన్ని కూడా వీరు రచించారు.

## పువ్వుల లక్ష్మీకాంతం :

1911లో ఏలూరులో జన్మించి వీరు చిన్నతనం నుండీతన మేనత్త గారి వద్ద కర్ణాటక సంగీతం, యూసఫ్ గారి వద్ద హిందుస్థానీ సంగీతం, చాటపర్రు బాల త్రిపురసుందరి గారి వద్ద నృత్యాన్ని అభ్యసించారు. అనేక నృత్య ప్రదర్శనలు ఇస్తూనే నాటకరంగంపై ఆకర్షితులై కొచ్చెర్లకోట రంగారావుగారి ప్రోత్సాహంతో నాటకాలలో అనేక పాత్రలు వేశారు. గూడవల్లి రామబ్రహ్మంగారి "మాలపిల్ల" చిత్రం ద్వారా చిత్రరంగ ప్రవేశం చేసి "దశావతారములు" "సతీ తులసి" చిత్రాలు చేసి మరల ఏలూరు వచ్చి 1938లో "లక్ష్మి కళాసమితి" అను నాటక సంస్థను ఏర్పాటుచేశారు. సినీ నటులు నాగభూషణంగారు తొలుత నాటకరంగ ప్రవేశం ఇక్కడే చేశారు. పృథ్విరాజ్‌కపూర్‌చే "పృథ్విరాజ్ కపూర్ కీ మా" అని అనిపించుకున్నారు. 1941-48 వరకు ఏలూరు మునిసిపల్ కౌన్సిలర్‌గా చేశారు.నటులు శ్రీ రమణారెడ్డి గారిప్రోత్సాహంతో మరల 1958లో "అత్త ఒక ఇంటి కోడలే" చిత్రం ద్వారా చిత్రరంగ పునః ప్రవేశం చేసి "మూగమనసులు" "సవతి కొడుకు" "జ్వాలాద్వీప రహస్యం" "ఊరుకిచ్చిన మాట" "ఇల్లు ఇల్లాలు" ఇలా 200 చిత్రాలలో 1985 వరకు నటించారు. ఎన్నో గుప్తదానాలు చేశారు. సినీ రచయిత బి.ఎల్.ఎన్. ఆచారి వ్రాసిన గ్రంథాలను అచ్చులొత్తించారు. "మేవాడ పతక" "రాణా ప్రతాప్" వంటి హిందీ నాటకాలను కూడా చేశారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్ పోటీలకు న్యాయనిర్ణేతగా వ్యవహరించారు. తెలుగు విశ్వవిద్యాలయం వారి ధర్మనిధి పురస్కారంచే గౌరవింపబడ్డారు.

ఇంకా ఎందరో మహానుభావులు అందరికీ మన వందనాలు.

డా॥ అద్దేపల్లి రామమోహనరావు

# కృష్ణాజిల్లాలోని ఆధునిక వచన కవిత్వం

కృష్ణాజిల్లాలో, జాతీయోద్యమ కాలంలో 'కృష్ణాపత్రిక' సంపాదకులు ముట్నూరు కృష్ణారావుగారి వెలుగులో, ఎంతో మంది గొప్ప పద్యకవులు ప్రసిద్ధులైనవారు. సుమారు 1960 సం॥ల నుండి వచన కవిత్వానికి వికాసదశ ప్రారంభమైందను కుంటే, అంతకుముందు తెలంగాణా పోరాట ప్రభావం చేతనూ, సామ్యవాద భావాల నేపధ్యంలోనూ, కృష్ణాజిల్లాలో వచన కవిత్వం రాసినవారిలో బలమైన గొంతు గల కలవి రెంటాల గోపాలకృష్ణ, ఆ రోజుల్లో లయబద్ధ కవిత్వానికి ఎక్కువ ప్రాబల్యం ఉండేది. మధ్యలో వచన కవిత్వం కూడా కొందరు కవులు రాశారు. అందులో ఉత్తమ కవితలు రాసినవారు రెంటాల గోపాలకృష్ణ, సంఘర్షణ, సర్పయాగం మొదలైన పుస్తకాల్ని ఆయన పోరాట నేపధ్యంలో రాశారు. వర్గ సంఘర్షణ ఆయన కవిత్వానికి అంత స్ఫూర్తం ఆవేశం ఆయన జీవధాతువు. ఆయన రాసిన ఒక గొప్ప వచన కవిత "నగరంలో రాత్రి" నగర సంస్కృతి భానతీచమూలాన్ని కబళింపచేస్తూ విస్తరించిన ఆ రోజుల్లో, చాలామంది కవులు నగరీకరణలోని వికృత లక్షణాల్ని నిరసిస్తూ కవిత్వం రాశారు. ఆ నిరసన "నగరంలో రాత్రి" కవితలో బలంగా ధ్వనిస్తుంది. కవి, విజయవాడలో స్థిరపడినారు కాబట్టి ఆయన దర్శనంలోని సూక్ష్మత, ఆవేశం ప్రతి అక్షరంలోనూ కనిపిస్తుంది. ముఖ్యంగా వ్యభిచారమయమైన పరిస్థితిని వర్ణిస్తున్నాడు.

"నెత్తిపై నింగి'
మృత్యువు ముచ్చట ముడిలా వ్రేలాడు కొంది
పద్దెనిమిది గంటలు మండిన నగర కాష్ఠంపై
కన్నీటి చుక్కలు రాలుస్తోంది.
నగరం నడిబొడ్డు దొరగారిది ప్రాణం
దివాణంలో సాగుతున్నది బూతుపురాణం.....
నగరంలో రాత్రి కళ్లుమూసి నడిచింది
నగరంలో రాత్రి వేయిపాపాల వడగండ్ల వానలో తడిసింది
నగరంలో రాత్రి నగ్నంగా కూచుంది
నగరంలో రాత్రి స్నిగ్ధంగా పూచింది
నగరంలో రాత్రి వయసంతా కొలిచి తెచ్చింది
నగరంలో రాత్రి వలపంతా ఒలిచి యిచ్చింది

భావంలోని విసురు కోసం పురానవృత్తి శిల్పాన్ని రెంటాల బాగా వినియోగించుకున్నాడు.

ఆధునికయుగంలో, అన్ని ప్రాంతాల్లోవలె కృష్ణాజిల్లాలోనూ, ఆత్మాశ్రయ కవిత్వం, సమాజాశ్రితకవిత్వం రెండు ఉపాయలుగా వచ్చింది. ఆత్మాశ్రయకవిత్వం అంటే తన బాధల్నీ, తన గాథల్నీ చెప్పుకునే కవిత్వం అని మాత్రమే కాదు. సంఘర్షణ పంథా నుండి పక్కకువెళ్ళి, అనుభూతి, తాత్వికత, మొదలైన అంశాలు ప్రధానంగా రాసే కవిత్వం. ఇలాంటి కవిత్వాన్ని కృష్ణాజిల్లాలో మొదటి వరసలో రాసిన వాళ్ళలో అరిపిరాల విశ్వం ముఖ్యుడు. "కాలం గీస్తున్న గీతలు"లో ఆయన జీవితాన్ని యిలా నిర్వచిస్తాడు.

అనుభవాల నేలపై
ఇంక విజ్ఞాపకాల చుక్కలు
చెట్టపట్టాలు పట్టి
వేసుకున్న బొమ్మజీవితం
కల్పించుకుంటే దీనికున్నంత అర్థం
విప్పి చెప్పడానికి లేదు'

జ్ఞాపకాలే జీవితంలో ప్రధానంగా మిగిలిపోయేవి. ఒక అనుభవం జరిగినప్పుడు ఆ అనుభవంలో కరిగిపోవు జ్ఞాపకాలు. ఒక జీవిత చిత్రాన్ని గీయాలంటే జ్ఞాపకాలు మాత్రమే భాగస్వాములౌతాయి. ఇలా జీవన తత్వాన్ని గురించిన ఆలోచనలు విశ్వంలో ఎక్కువ.

తాత్విక ఆత్మాశ్రయభావాలకే ప్రాధాన్యమిచ్చి బాధర్ అనే పేరుతో త్రిపురనేని మహారథి కవిత్వం రాశాడు. వైయుక్తికతా పరిశీలన ముఖ్యంగా కనిపిస్తుంది.

ఊహల పొలిమేరలు అనే కవితలో వ్యక్తిలో గూఢమైన శక్తిని గురించి యిలా చెప్తాడు.

**'కమ్మని కారుమబ్బులతో కరుణార్ద్ర హృద్వీ**
**గమనించు చిచ్ఛక్తికి నమోస్తు**
**వెన్నెల తీగ సొంపులలో మరుతాక్త శోభలు**
**ఘటించు పరమశక్తికి నమోస్తు**
**హృత్వాళ సీమ జనియించి లోకమంతా**
**పెకలించి కవియ జుట్టిన రుక్తికి నమోస్తు....**
**మహా మానవుడా ! అజేయుడా !**

మనిషిలోనూ, సమస్త ప్రకృతిలోనూ ఒకే శక్తి ప్రకాశిస్తోందని పై పాదాల్లో స్ఫురిస్తుంది.

నార్ల చిరంజీవి మార్క్సిస్టు భావాలతో ప్రేరణ పొందిన కవి. ప్రగతిశీలత ఆయన కవితల్లో బలంగా కనిపిస్తుంది. 'కాలరథం'లో ఇలా అంటాడు.

**మంచు వంటిది గతం**
**మళ్ళీ కనిపించదు**
**వెళ్ళిపోయిందెపుడో...**
**నీలో కుసుమించిన**
**పూలను చిదిమేస్తూ**
**గతం వెళ్ళిపోయింది**
**స్మృతి గర్భంలోనికి**
**కత్తివంటికాలాన్ని**
**గతం ప్రసవించింది**

గతాన్ని పట్టుకునే వేలాడే వారికి చేసే వర్తమాన కాల ఉద్భోధపై కవిత్వంలో కనిపిస్తుంది. 'కత్తివంటి కాలాన్ని గతం ప్రసవించింది.' అన్నప్పుడు గత కాలంకంటె అందులోంచి వచ్చిన వర్తమానం ఎక్కువ వాడిగలది అని చెప్తున్నాడు కవి. అందుకే వర్తమానాన్ని 'కత్తివంటి కాలాన్ని' అంటాడు.

అజంతా చాలాకాలం విజయవాడలో స్థిరపడిన కవి. అజంతా కవ్వితంలో ప్రయోగశీలి. కొన్ని సామాజిక కవితలు రాసినా, తన ముద్రను స్వీయవేదనాత్మక ప్రతిఫలనంలో గుర్తించాడు. పాశ్చాత్య కవిత్వ ప్రభావం, జీవిత వైఫల్య భావనలో గాఢంగా పొందినవాడు. మృత్యు సంబంధమైన భావచిత్ర రచనకు ఆద్యుడు ఈయనే. సామాజిక వస్తువుతో ఈయన రాసిన 'చెట్టుకూలుతున్న దృశ్యం కవిత భావచిత్రాల్ని నిక్షేపించిన రచన. వెంకట్రావు అనే నిరుద్యోగిని యిలా బొమ్మకడతాడు.

"తలక్రిందులైన స్వప్నం మీద శల్యాకారంగా కూర్చున్న కుర్రవాడు
ఆపాదమస్తకం సూదులతో ముస్తాబై ఉన్నవాడు
అతని ముఖం నిండా స్ఫోటకం మచ్చలు
కళ్ళలో శిలావిగ్రహాల వీక్షణలు
అతని చుట్టూ పరాజయ భారంతో క్రుంగుతున్న వృక్షాలు
అదే దృశ్యాన్ని ఇంకా ఉవ్వెత్తు ఉన్న భూతద్దాలతో చూడవచ్చు"

ఇలాంటి భావ చిత్రరచన అప్పట్లో ఒక కొత్త అభివ్యక్తి

తర్వాతి తరానికి వచ్చేటప్పటికి, సుమారు 60 సం॥ల తర్వాత వచన కవితకి సమకాలీన కవితారూపాల్లో ప్రధాన స్రవంతి గౌరవం వచ్చింది. అప్పుడప్పుడే 'వచనగేయం' అన్నపదం 'వచన కవిత'గా మారుతోంది. ఈ సమయంలో కృష్ణాజిల్లా ముగ్గురు కవుల్ని చెప్పుకోవలసి ఉంది. 60 సం॥లలో సామాజిక వైరుధ్య స్పృహ ఉండడంతో పాటు, అజంతాతో ప్రారంభమైన, ఆంగ్లకవితా ప్రభావం కూడా ఒక స్థాయిలో ఉంది. సామాజిక వైరుధ్యాల్లోంచి ఆంగ్ల ప్రభావంలోంచి కూడా కృష్ణాజిల్లాలో ఇతర ప్రాంతాలకు వలెనే కవులు చైతన్యవంతులయ్యారు.

వేగుంట మోహన్ ప్రసాద్ పూర్తిగా తన స్ఫూర్తిని ఆంగ్లకవుల నుండి తీసుకున్నాడు. సమకాలీన ఆంగ్ల కవిత్వంలో తన కవిత్వాన్ని మమేకం చేసుకునేటంతటి ధోరణి వేగుంటలో ఉన్నట్లు మరొకరిలో కనిపించదు. సమకాలీన ఆంగ్ల కవులపై ఆయన ఎన్నో వ్యాసాలు రాసాడు. సమకాలీన ఆంగ్లకవుల ప్రభావం వల్లనే ఆయన శైలి క్లిష్టతనూ, అస్పష్టతనూ, కొన్ని చోట్ల అర్థమే అవగాహన కాని ధోరణిని ప్రదర్శిస్తుంది. సామాజికతా దృష్టి ఆయనలో ప్రభావం కాదు అనుభూతి వైచిత్రి, తాత్విక ఆలోచనలూ, ఆత్మాశ్రయభావనలూ ఎక్కువగా పరుచుకుని ఉంటే ఈయన అభివ్యక్తిలో కొత్తదనం అందరూ గ్రహించారు. మధ్యమధ్యలో సామాజికత కను దగిలినా, అభివ్యక్తి వైచిత్రి, ఆత్మవేదన మాత్రమే వేగుంట కవిత్వంలో ప్రధానసూత్రంగా ఉంటే 'సుప్తచిత్రాలు'లో ఇలా అంటాడు.

**కలలు తేలి పోతాయేగదా యిక నా కాంతి ఈదుకుంటూ**
**పంకా గాలిలోంచి కిటికీ వెలుపల నీడలో నిద్రిస్తుంది**
**రాత్రి నిలవదు: నిద్ర ఆగదు: పొగపీల్చరాదు**

వేకువలోనే సూర్యకిరణాలు వొచ్చి చీకటి పాటి దున్ను దిబ్బల్ని పెళ్ళగించి వేసినా బావుల్లో నీరూరుతూనే ఉంటుంది.

సంబంధం లేనట్లుగా కనిపించే పదాల్నీ పదబంధాల్నీ భావాల్నీ పక్క పక్కనే రాయడం ఈయన నిర్మాణ పద్ధతి 'చితి చింత' రాహస్తంత్రి మొదలైనవి వెలువరించారు.

సామాజిక వైరుధ్యాల్లోంచి కలిగిన ఆవేశం ఇద్దరిలో స్ఫుటంగా కనిపించింది. ఒకరు సి.విజయలక్ష్మి. విజయలక్ష్మికి ముందు నుండి మార్క్సిస్టు భావనిమగ్నత ఉంది. ఎంతో కసితో ఆయన సమకాలీన

సామాజిక దౌష్ట్యాలన్నిటిని తన కవిత్వంలో ప్రతిబింబింప జేశాడు. శక్తివంతమైన తెలుగుపదాల తీవ్రశైలి ఆయనకు ముఖ్యం భావచిత్రాది శిల్పాల ద్వారా చెప్పడం ఆయన మార్గంగా కనిపించదు. ప్రజల దగ్గరకు వెళ్ళే శైలి తెలుగు సాహిత్యంలో గురజాడనించి ప్రవహిస్తూ వస్తోంది. ఆ ధోరణి సి.వి.లో ఉంది.సంఘంలో అన్నివిధాలైనపద్యాల్నీ అక్షర ఖడ్గంతో నరికెయ్యడం ఆయన కవిత్వంలో కనిపించే ముఖ్యమైన లక్షణం. అప్పట్లో ఆయన 'కారుచీకట్లో కాంతిరేఖ' బాగా సంచలనం కలిగించింది. నికరమైన వాస్తవికత, సూక్ష్మాంశాలతో కలిసి తీవ్రమైన తెలుగుశైలిలో ప్రవహించడం ఆయన శైలి ప్రత్యేకత. వేశ్యాగృహాన్ని గూర్చి చెప్పిన 'శోకంలో అశోకనిలయంలోని కొన్ని పంక్తులు

**"పాసింజరొచ్చాడు ఏయ్ రండి"**
**అమ్మలేని వాళ్ళూ అయ్యలేని వాళ్ళూ**
**దిక్కులేనివాళ్ళూ కుక్క బతుకు వాళ్ళూ**
**కట్నం డబ్బులు పిగలక పెళ్ళిగాక**
**ఉద్రేకం పట్టలేక ఊళ్ళో కెక్కిన వాళ్ళూ**
**విధవలయ్యి వెధవలతో వూరికెత్తిన వాళ్ళూ**
**ఎంగిలిస్తరాకు బతుకులీడ్చుతోన్న వాళ్ళూ**
**ఎదిగిన దానికి పెళ్ళని తలపెట్టిన దౌర్భాగ్యుల చెల్లెళ్ళూ**
**అత్తమామల పోరుకు అయ్యగార్ల పొగరుకూ**
**తాళలేక నుయ్యి గొయ్యి చేతగాక**
**కడుపు కొరకు పడువువృత్తి చేబట్టిన కోడళ్ళూ**
**కోట్ల కోట్ల హేతువులచే కులం లేని బొగరువాళ్ళూ**
**అప్పుడు పెట్టిన కేకకు నిక్కబొడుచుకు విన్నారు**

పి.విజయలక్ష్మికి అభ్యుదయ కవితాస్ఫూర్తి ఆ రోజుల్లో స్పష్టంగా ఉంది. మూడో కవి అద్దేపల్లి రామమోహనరావు. అద్దేపల్లిదీ తీవ్రమైన సామాజిక వైరుధ్యాల పట్ల క్రోధంలోంచి ఆవేశంలోంచి పుట్టిన కవిత్వమే. ఐతే అప్పటికి ఈ వైరుధ్యాలకీ మార్క్సిస్టు భావాల పరిష్కారసిద్ధాంతాలకీ సంబంధించిన ప్రేరణలేదు. అయితే కవితా శిల్పం తాలూకు ప్రేరణ బాగా ఉన్నవాడు. అంతకుముందు గొప్ప నిర్మాణ దక్షులైన కవులందర్నీ ప్రత్యేక సిద్ధాంత నిబద్ధతకు సంబంధం లేకుండా అధ్యయనం చేశాడు. పద్యరచనలో ప్రౌఢిమ కూడా సాధించాడు. అయితే సామాజిక వైరుధ్య వేదన ప్రధానమయ్యేటప్పటికి వచన కవితను వాహికగా చేసుకున్నాడు. సామాజికమైన కసి ఎంత ఉన్నా, అది నిర్మాణపరమైన ఏకాగ్రతలోంచి మాత్రమే ప్రవహించడం అతని కవిత్వంలో కనిపిస్తుంది. ఆ రోజుల్లో వచ్చిన అంతర్జ్వాల ప్రగతిశీల కవులందర్నీ ఆకర్షించడానికి కారణం ఇదే. ఆవేశంలో నిగ్రహం, అభివ్యక్తిలో జాగ్రత సామాజికతలోని విస్తృతీ, ఆనాటికి ఒక కొత్త సంచలనం కలిగించింది. అద్దేపల్లి నడకకు అంతర్జ్వాల నుండి ఒక ఉదాహరణ 'చీకటి నీడలు' నుండి 'ప్రతివాడి చుట్టూ సంఘమొక చెరసాల కట్టింది ప్రతివాడి కంట్లో సంఘమొక కన్నీటి తెర నిలిపింది. ఈ చీకటి సముద్రపుటంచు చివర తూర్పు దిక్కు కనిపించదు.

ఈ మోడైన చెట్ల వరుసల గూళ్లలో రామచిలుకలు పలకరించవు చంద్రునిలో నీడ పెరిగి చంద్రుణ్ణి కబళించబోతోంది. చేతిలోని వీణ తీగలు వేళ్లను కత్తిరించి రక్తరాగాలు రగిలించ బోతున్నవి.

సంఘపు పాడింటిమూల సాలెగూళ్ళు కప్పుకుని భయంగొంతు దాకా తాగి ముడుచు పడుకున్న ప్రతి మనిషీ! నీవు లేచి పిడికిలి బిగిస్తే ఆకాశపు మెడ నరాలు విరిగిపోతై నీవు నిజంగా గొంతు విప్పితే సప్తసముద్రాల ఘోష ఆగిపోతుంది.నీవు నిండుగా కళ్ళు తెరిస్తే దిక్పతుల గుండె పగిలిపోతుంది. ఈనాడు వెర్రితలలు వేసిన కుసంస్కృతి విషవృక్షపువేళ్ళు 'అంతర్జ్వాల నుండే అద్దేపల్లి ప్రతిఘటించడం ప్రారంభించాడు. నగ్నముని మచిలీ పట్టణానికి సంబంధించిన కవే అయినా ఆయన కవితా సంచలనమంతా హైదరాబాదు నుండే జరిగింది. పై ముగ్గురితోనూ అటూ ఇటూగా ఆయన కవిత్వరచన ప్రారంభించినా 'ఉదయించని ఉదయాలు' ఒక ప్రత్యేక స్థానాన్ని పొందినా, దిగంబర కవితా సంచలనంతోనే ఒక ప్రాధాన్యాన్ని పొందాడు. ఆంగ్ల కవుల స్ఫూర్తి ఉంది గాని అది సామాజికత అంచుల్లోనే ప్రవహించింది. వర్గదృక్పథంతో అట్టడుగు ప్రజల బాధల్ని వర్ణించినవారిలో బి.శివ ఒకరు 70లలో ఈ అంశం గురించి ఉన్న ఆవేశధోరణి 'శివ'లో కనిపిస్తుంది. గేటుముందు కాపలా వాళ్ల గురించి ఒక కవిత రాశాడు శివ. తరతరాల కాపలావారివంశాలు కొనసాగడం గూర్చి యిలా అంటాడు 'జీవగఱ్ఱ' కవితలో

**'చేతిలో కఱ్ఱ**
**అతని నిస్సహాయతకు పెదవి విరుస్తోంది**
**తరతరాలుగా వస్తున్న ఆచారమేనని**
**వెక్కిరిస్తోంది అవును మరి దానికంతా తెలుసు**
**ఆ కఱ్ఱను వాళ్ళ నాన్న చచ్చిపోతూ**
**అతని చేతికందించిన జీవగఱ్ఱ**
**వాళ్ళ నాన్నకు వాళ్ళ నాన్న దగ్గరనుండి వచ్చింది'**

ఈ కఱ్ఱ ఎదురు తిరిగి, దుర్మార్గుల్ని శిక్షించి, ఆర్థికసమానత్వం సాధించాలని ముగింపులో కోరతాడు. విప్లవ భావాలతో నిమగ్నమై కవిత్వం రాసి, మరో దశలో వైయక్తికత వైపున నడిచిన వారిలో త్రిపురనేని శ్రీనివాస్ ఒకడు. భావుకతతో కలిపి తన భావాల్ని వెలువరించడంలో ఒక ప్రత్యేకమైన శైలిని సాధించుకున్నాడు.

'ఎవరి జన్మస్థలంలో వారు నిలబడి
భూమి అంతస్సారంలోకి వేళ్ళూనాలి
ఠీవిగా అంతెత్తుకు ఎదిగి
మబ్బులను తలకు పూసే చినుకు పూలను కోసుకోవాలి
భూమ్యాకాశాల మధ్య ఎవరి పాటవాళ్ళు రాసుకోవాలి'

ప్రయోగాల పట్ల బాగా ఆశక్తి ఉంది సామాజికత భావుకత వినూతన శైలిలో శిల్పానికి ఒది పోవడం నగ్నమునితో కనిపిస్తుంది 'జైల్లో సముద్రం' పంక్తులు ఇలా ఉన్నై.

'సూర్యుని కడ్డంగా నుంచున్న
ఆమబ్బు తునక పేరేమిటి?
అర్ధంకాని అనంతశూన్యం అంచు మీదికి
ఆకారం లేని కుర్చీనొకటి లాక్కొని
అర్థవంతమైన బ్రతుకు వెన్నెల చుక్కల్ని కప్పుల్లో నింపి
ఒక్కొక్క క్షణం పెదవుల కానించి
విషాదాన్ని ఆరాధిస్తూ ఉంటానా
హోయలు హోయలుగా పొగలు పొగలుగా
కెరట కెరట కెరటాలుగా కలం
నా కాళ్ళని ముంచెత్తుతూ ఉంటుందా
ఎందుకో ఒక్కసారి ఏకాంతంలోకి
నిర్జనారణ్యాలు నడిచి వస్తాయి
నిబిడాంధకార గహ్వరాలు తెరచుకొంటాయి.

1970ల నుండి ఈనాటి దాకా చూస్తే, వస్తుపరమైన కవిత్వం, విప్లవ దళితవాద, స్త్రీ వాద, మైనారిటీ, ప్రపంచీకరణ వ్యతిరేక మొదలైన కవిత్వంగా వచ్చింది. రూపపరమైన కవిత్వం మినీ కవిత హైమా, నానీ మొదలైన కవిత్వంగా వచ్చింది.

విప్లవ ధోరణి వచ్చేటప్పటికి, దానిపట్ల అభిమానంతో రాసిన నగ్నముని, అద్దేపల్లి కృష్ణాజిల్లాలో లేకపోయినా, సి.విజయలక్ష్మి కృష్ణాజిల్లాలోనే ఉన్నా మిగిలిన వారిలో ఎవరూ ఒక బలమైన విప్లవ కవిగా రూపొందినట్లు కనిపించదు. 1975 నుండి 85 దాకా అతి తీవ్రంగా ప్రచురితమైన మినీ కవిత అన్ని ప్రాంతాల్లోలా, కృష్ణా ప్రాంతాన్ని కూడా అమితంగా ప్రభావితం చేసింది.

చిరునామా : ౦

డా॥ ఘంటా విజయకుమార్

# కృష్ణమ్మ పత్రికల ఒడి, సామాజిక ఉద్యమాల గుడి

నలుపు ఉద్యమాలకు పిలుపు..ఎరుపు పోరాటల కొలువు... నీలవేణి కృష్ణమ్మ ఒడి పత్రికలకు గుడిగా, సామాజిక ఉద్యమాల జడిగా విరాజిల్లింది. ఇప్పటికి ఆ దిశలోనే వర్ధిల్లుతుంది. జాతీయోద్య మానికి వెన్నుదన్నుగా నిలిచిన పత్రికల పుట్టినిల్లుగా కృష్ణాతీరంలో అనేకానేక పత్రికలు సామాజిక ఉద్యమాలకు మార్గదర్శనం చేసాయి. అణచివేతను నిగ్గదీసాయి. పెత్తందారీతనంపై తెగబడ్డాయి.. ఓ సశేష వార్తకథనంలా కృష్ణాతీరంలో సామాజిక ఉద్యమాల గాథలను అక్షరాల్లో బంధించి జనజాగృతమే లక్ష్యంగా ఈ తీరంలో పత్రికలు బాధ్యతగా వెన్నుచూపని ధైర్యంతో ముందుకు సాగుతున్నాయి. ఆధునిక భారత సంగ్రామంలో అహింసా ఉద్యమాల ఘట్టాలను తమ పుటల్లో బంధించి సామాన్యులను సైతం నెత్తురు పొంగే మహాశక్తులుగా మార్చిన ఘనత బిరబిరల కృష్ణమ్మ నడియాడుతున్న ఈ నేలకే దక్కుతుంది. ఇక్కడ పత్రికలు బానిస సంకెళ్ళను తుంచుకునేందుకు ఉద్యమించమన్నాయి. అలౌకికంశాలనుంచి బయటపడి లౌకిక దృక్కోణంలో ఆలోచించమని మార్గదర్శనం చేసాయి.దేశభక్తిని పెంచాయి. దైవభక్తిని ప్రేరేపించాయి. దైవం ఎవ్వరని, దేవుడో భ్రమంటూ హేతుబద్ధంగా వాదించాయి. ఇక్కడనుంచి మొత్తంవిశ్వాన్ని పలకరించిన పత్రికలు..జాతీయ పతాకను రూపొందించిన పింగళి వెంకయ్య, దేశవ్యాప్తంగా మహాత్ముని కన్నా ముందుకు దళిత జనోద్ధరణకే జీవితాన్ని అంకితమిచ్చి, హరిజనులకు విద్యను, ఉపాధి, గూడు అందించేందుకు సొంత ఆస్తులను అందించిన అయ్యదేవర కాళేశ్వరరావు, సామాజిక హితమే లక్ష్యంగా పరిశ్రమిం చిన దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు, అక్షరాలను జాగృత ఇంధనాలు స్వీకరించి ముట్నూరి కృష్ణారావు, నార్ల వెంకటేశ్వరరావు, కోలవెన్ను రామకోటేశ్వరరావు, కృపానిధి, తుర్లపాటి కుటుంబరావు, నండూరి రామ్మోహనరావు, ప్రజాశక్తి పత్రికా సంపాదకులు బొమ్మారెడ్డి, మోటూరు హనుమంతరావు, విశాలాంధ్ర దినపత్రికాసంపాదకులు సి.రాఘవాచారి, ఈదుపుగంటి వెంకటేశ్వరరావు, చంద్రం వంటి ఉద్ధండులు జిల్లాను జాగృతి వేదికగా తీర్చిదిద్దారు. కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ప్రజాశక్తి, విశాలాంధ్ర, ఆంధ్రభూమి, దినపత్రికలు, ఈనాడు, ఉదయం, వార్త దినపత్రికలు సామాజిక ఉద్యమాలపై విశేషప్రభావాన్ని చూపించాయి. 70వ దశకం చివరల్లో వచ్చిన సాయంత్రం పత్రిక జనతా, విజయభాను, విజయం, స్వర్ణాంధ్ర, అక్షర స్పందన, సన్‌ఫ్లవర్‌న్యూస్, ప్లెడ్జ్ వంటి పత్రికలు అక్షర చైతన్య దీపాలయ్యాయి. ఎబికె ప్రసాద్, వాసుదేవదీక్షిత్, కె. శ్రీరామచంద్రమూర్తి, తెలకపల్లి రవి, టంకశాల అశోక్ వంటివారు ప్రజాప్రభావితసంపాదకీయాలు రచించారు. కూచిమంచి సుబ్రహ్మణ్యం సంపాదక బాధ్యతలనుంచి విశ్రాంతి తీసుకున్న తరువాత అనేకమంది పాత్రికేయులను రూపొందించారు. ఇలా అనేక వార, పక్ష, మాస, ద్వైమాస, త్రైమాస పత్రికలు ఈ ప్రాంతం నుంచి వెలువడ్డాయి. మనో విశ్లేషణాంశాలుప్రధానంగా సి.నరసింహారావు రేపు పత్రిక వెలువడింది. తెలుగుపత్రికా ప్రపంచంలో ఈ పత్రిక ఓ సంచలనం, మనోవిశ్లేషణ ప్రధానంగా ఈ పత్రిక నడిచింది. 18 ఏళ్ళ వయస్సులోనే పత్రికా రచన ఆరంభించిన అప్పటి వైద్యవిద్యార్థి గంగరాజు వెంకటపూర్ణ చంద్రరావు ప్రచురించిన "వారధి" నూతనాలోచనలకు ప్రేరణగా నిలిచింది. "సిగ్గు" ఎలా వస్తుంది. ఆ భావనలోని ఉద్వేగం, ఉత్సాహాన్ని గురించి వివరిస్తూ ఈ పత్రికకు అనుబంధంగా వచ్చిన పుస్తకం నేటికి ప్రేమకవులకు, రచయితలకు కరదీపికగా నిలిచివుంది. అనేక సామాజిక, మనోవిశ్లేషణను గురించి ఈ పత్రిక సవివరంగా తెలిపింది. అంతకు ముందు జీవి తన మిత్రులతో కలిసి ప్రచురించిన సౌజన్య మంచి సాహిత్యానికి బీజాలు వేసింది. రాజకీయనాయకుల వెన్నులో వణుకు పుట్టించిన పింగళి దశరధరామ్ (శర్మ) ఎన్‌కౌంటర్ రాజకీయ పత్రికగా పెను సంచలనం వాడుకగా ఆవేశంతో మాట్లాడే భాషలో

ఈ పత్రిక ప్రచురితమయ్యేది. సత్యశోధనకు మార్గదర్శిగా నిలిచింది. అనేక కథనాలు నిజానికి దగ్గరగా ఉండటంతో ఈ పత్రిక వస్తుందంటే రాజకీయనాయకులు జంకేవారు. సి. నాగరాజు ప్రచురించిన కమెండో, సి. నరసింహారావుల స్ఫూర్తితో ఈ పత్రికను ప్రచురించారు. జాతీయ పతాక నిర్మాత పింగళి వెంకయ్య మనవడిగా, సైనికోద్యోగి చలపతిరావు కుమారునిగా దశరథ్‌రామ్ అత్యంత సాహసోపేతగా ప్రచురించిన ఈ పత్రిక తరువాత, తరువాత దినపత్రికల్లో సైతం వాడుక భాష వినియోగానికి కారణంగా మారింది. తోటపాంచజన్య పాలిటిక్స్ ప్రధానంగా నడిపిన పత్రిక, మహానగరం దినపత్రిక వినూత్నరీతిలో సాగాయి. తాడి సీతారాంలాంటి యువజర్న లిస్టులుపత్రికలను నడిపినంత కాలం వినూత్నంగా నడిపారు. తుర్లపాటి రాజేష్ "రక్షణ" దినపత్రిక, సూర్యదినపత్రిక ఆలోచింప చేసాయి. చలనచిత్రరంగంపై విశేష ప్రభావాన్ని చూపిన జ్యోతిచిత్ర, సితార, ఆంధ్రపత్రిక సినిమా పత్రిక ఇవ్వన్ని సామాజిక ప్రభావితంచేసాయి. పురాణం సుబ్రహ్మణ్య శర్మ, వీరాజీ తదితరులు వారపత్రికలను వినూత్నంగా నడిపారు. అప్పట్లో ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఆంధ్రపత్రిక, ప్రగతిలు ప్రచురించిన సీరియల్స్ పాఠకులను ఉర్రూతలూగించాయి. వీటికి ధీటుగా సీరియల్స్ లోని కొత్తవిధానానికి తెరదీస్తూ ఆంధ్రభూమి జిల్లానుంచి ప్రచురితం కాకున్నా, ఈ ప్రాంతంలో రచయిత(త్రు)ల్లో పోటీతత్వానికి నాందిగా మారింది. ఆంగ్ల నవలలకు అనువాదాలు, అనుసరణలుగా దేవులపల్లి కృష్ణశాస్త్రి, గుంటూరు శేషేంద్రశర్మ కవిత్వాన్ని, కొన్ని సందర్భాలలో శ్రీశ్రీ సాహిత్యాన్ని జోడించి పలువురు అనువాదకులు అందించిన రచనలు సీరియల్స్ అయి అన్ని వర్గాలను ఆకట్టుకున్నాయి. వింతా లోచనాల ధోరణులను సమాజంలో ప్రత్యేకించి యువతలో కలిగించాయి. క్షుద్రసాహిత్యం వెలుగులోకి వచ్చింది. దిగంబరకవులకు వేదికగా నిలిచిన విజయవాడ సీరియల్స్ హోరులో మునిగిపోయింది. ఓ యువతి తన అభిమాన రచయిత మోజులో పడి అన్నీ పోగొట్టుకుని ఆత్మహత్యకు పాల్పడింది. పత్రికలే కాదు.. అనువాద రచయితలకు నేరు రచయితలుగా ముద్రవేయించుకుని రాసిన సీరియల్స్‌ను పుస్తకాలు ముద్రించటం ద్వారా విజయవాడ పబ్లిషింగ్ రంగం కొత్తపుంతలు తొక్కింది. ఇవన్నీసామాజికంగా మంచిచెడులప్రభావాన్ని చూపించాయి. ప్రత్యేకించి ఆంగ్ల సాహిత్యానుసరణ రచయితలు సిగ్గుమాలిన తనంతో రాసిన నవలలు, వివిధ శీర్షికలపేరు నూతన పద్ధతుల్లో రాసిన రచనలు ఇలాంటి సాహిత్యం వద్దనే విధంగా ప్రజాసంఘాలను, ప్రత్యేకించి మహిళాసంఘాలను ఉద్యమింప చేసాయి. ఈనాటి యువతరాన్ని ప్రసార మాధ్యమాలు చెడగొడితేయండమూరి వీరేంద్రనాథ్, సామాజిక ఉద్యమనేపథ్యం కలిగిన రచయిత పేరు మార్చుకుని స్వాతివారపత్రిక గుర్తింపు, ప్రచారం కోసం రమణీమణి అనే పేరుతో రాసిన "ఈ తరం.." సీరియల్స్‌లో వింత వికృతత్వంతో రాసారు. వీరు తమ ఇతివృత్తంలో ఇన్‌సెట్‌సెక్స్ లాంటి అంశాలను తమ రచనల్లో చొప్పించి తలబొప్పి కట్టించు కున్నారు. వీరేంద్రనాథ్ దాదాపు తోబుట్టువులయిన అన్నచెల్లెలు వివాహం ఒక అంశంగా ఆంధ్రప్రభలో ఓ సీరియల్‌లో ప్రస్తావంశంగా చేస్తే, హరనాథ్ కామోద్వేగంలో ఓ యువతి తన తమ్మునితో శృంగారానికి తలపడేఅంశాన్ని చొప్పించారు. వీరి విపరీతధోరణికి వ్యతిరేకంగా సాగిన ఉద్యమాలు దాదాపుగా ఈ సాహిత్యానికి అడ్డకట్ట వేసాయి. ఈదర గోపీచంద్‌లాంటి వారు చందుసోంబాబు, మల్లాది వెంకటకృష్ణమూర్తి, చిట్టారెడ్డి సూర్యకుమారి వంటి రచయిత్రులు ఇంగ్లీషు నవలలను మక్కిమక్కి అనువాదించి చెత్తను రాస్తే ప్రతిఘటన ఉద్యమాలు చేసారు. ఇటువంటి రచనలను ప్రచురించిన పత్రికలు సామాజికంగా ఆలోచన కలిగించే ఉద్యమాలకు పరోక్షంగా దారితీసాయి. దురదృష్టవశాత్తు ఆ తరువాత రెండు దశాబ్దాలనంతరం ప్రపంచమొక పల్లె అనే నినాదంతో వచ్చిన మార్పులుప్రసార మాధ్యమాల ద్వారా ఈ దుర్మార్గమయిన విధానాలను యువత మెదళ్ళకు ఎక్కించాయి. ఈ పరిణామాలకు వ్యతిరేక చైతన్య, అభ్యుదయ, సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తులు ఉద్యమించాల్సి వున్నాయి. నాస్తికోద్యమ నేత గోపరాజు రామచంద్ర రావు (గోరా) సంపాదకత్వం లోను అనంతరకాలంలో డాక్టర్ విజయం, నియంతల సంపాదకత్వ ంలో వచ్చిన ఎథిజమ్, నాస్తికమార్గం పత్రికలు జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో విశేష గుర్తింపును పొందాయి. చార్వక, హేతువాదం వంటి పత్రికలు, శశికాంత్‌శాతకర్ణి సంపాదకత్వంలో వచ్చిన బాలజ్యోతి, జొన్నలగడ్డ సత్యనారాయణ సంపాదకత్వంలో వచ్చిన వనితాజ్యోతి, మహిళ, మాంటిసోరీ కోటేశ్వరమ్మ ఇల్లుఇల్లాలు తదితర పత్రికలు బాల, మహిళాభ్యుదయానికి కృషిచేసాయి. వివిధ కార్మిక, ఉపాధ్యాయ, కార్మిక సంఘాలు ప్రచురించిన పత్రికలు నూతన ఆలోచనావిధానాన్ని కలిగించి, అనేక సమస్యల పరిష్కారానికి దిక్సూచిల మాదిరిగా నిలిచాయి. ప్రజాసాహితీమానపత్రిక మూడు దశాబ్దాలకు పైగా ఉత్తమోత్తమ సాహిత్యపత్రికలా గుర్తింపు పొందింది. సాహిత్య పత్రికలకు అమ్మలాంటి భారతీ లబ్ధప్రతిష్ట సాహితీమూర్తులకు వేదికయ్యింది. విశ్వనాథసత్యనారాయణ, శ్రీశ్రీ వంటి కవుల రచనలు భారతీలో ప్రచురిత మయ్యాయి. మిని కవితాతోద్యమానికి వేదికగా నిలిచిన కొల్లూరి ఎక్స్‌రే సాహిత్యపత్రిక అమలాపురం నుంచి విజయవాడకు తరలివచ్చి ఆధునిక కవులను ప్రోత్సహిస్తుంది.

సాంస్కృతిక సమాఖ్య వాకాటి శిరీష్‌కుమార్ సంపాదకత్వంలో నడిచిన యువకలాలు, ఘంటా విజయకుమార్ సంపాదకత్వంలో ప్రచురితమయినవిసల వంటి సాహిత్యపత్రికలు కొంతకాలమే నడిచినా ఎందరో కవులకు వేదికలయ్యాయి. చలపాక ప్రకాశ్ "రమ్యభారతీ" భవిష్య "భావతరంగిణి" లెక్కకు మించిన సాహిత్యపత్రికలు యువగళాలను విన్పిస్తున్నాయి. శ్రీవాణి ఆధ్యాత్మిక మాసపత్రిక బాటలో అనేక పత్రికలు ప్రచురణలో వున్నాయి.

## ప్రజలపై నేరుగా ప్రభావితం చేసిన పత్రికలు

బ్రిటీష్ ఈస్టిండియా కంపెనీ ప్రతినిధులు 17వ శతాబ్దంలో మచిలీపట్టణంలో ఓడరేవు దగ్గర ఓ కర్మాగారాన్ని స్థాపించారు. తద్వారా పట్టణంలో అడుగుపెట్టిన వీరు ఇక్కడ వేసిన తొలి అడుగులు మొత్తం ఆంధ్రప్రదేశ్ గుండెలపై సమ్మెటపోటుల మాదిరిగా మారాయి. సామ్రాజ్యవాదులకు వ్యాపార దుర్గంగా మారిన బందరులో రాష్ట్రీయులపై అణచివేత చర్యలు అదే దిశలో సాగాయి. ఈ క్రమంలో యువకులు, బ్రిటిష్ ఉద్యమకారుల ఆలోచనను ఉద్భవించింది. "కృష్ణాపత్రిక" తెలుగునేలపై నుంచి వెలువడిన ఈ ఆధునిక ఆలోచనా విధానంతో కూడిన పత్రిక తొలుత మచిలీపట్టణం నుంచే ప్రచురితమయ్యింది. 1902 ఫిబ్రవరిలో కొండా వెంకటప్పయ్య పంతులు, దాసు నారాయణరావు సంపాదకత్వంలో కృష్ణాపత్రిక వెలువడింది. అనంతరకాలం సంపాదక బాధ్యతలు ముట్నూరి కృష్ణారావు చేపట్టారు. విలువలు కలిగిన వ్యక్తుల సంపాదకత్వంలో ప్రచురితమయిన ఈ పత్రిక జాతీయోద్యమంలో భాగస్వాములు కావటానికి ప్రజలను సంసిద్ధులను చేసింది. నండూరి రాజగోపాల్ నేతృత్వంలోని చినుకు మాసపత్రిక ఆధునీక, సంప్రదాయ కవిత్వాన్ని సమ ప్రాధాన్యతనిస్తుంది.

1907లో సూరత్‌లో జరిగిన భారతజాతీయ కాంగ్రెస్ సమావేశంలో అమృతాంజన్ కంపెనీ వ్యవస్థాపకులు కాశీనాథుని నాగేశ్వరరావు పాల్గొన్నారు. ఈ సమావేశంలో తెలుగు వారిని బ్రిటిష్ పాలకులకు వ్యతిరేకంగా ఉద్యమింపచేయాలంటే ఓ పదునయిన పత్రికను స్థాపించాలనుకున్నారు. ఆ ఫలితంగానే బొంబాయి నుంచి 1908 ఆంధ్రపత్రిక ప్రచురితమయ్యింది. ఈ పత్రిక చెన్నయి కేంద్రంగా ప్రచురితమయిన తరువాత విజయవాడ కేంద్రంగా ప్రచురితమయ్యింది. జాతీయోద్యమంలో ఆంధ్రపత్రిక ఓ సంచలనం. కారణాంతరాల వలన ఆగిపోయిన ఈ పత్రికను తోట పాంచజన్య తిరిగి ప్రచురణలోకి తీసుకుని వచ్చే ప్రయత్నంలో పడ్డారు. గత ఏడాది ఫిబ్రవరిలో ఈ పత్రిక డమ్మీలు అందుబాటులోకి వచ్చాయి. జిల్లాలో కాకపోయినప్పటికీ జగ్ధాత్రి, రామతీర్థవంటివారు విశాఖలో ఆంధ్రపత్రిక శతవార్షికోత్సవాలు నిర్వహించారు. ఇండియన్ ఎక్స్‌ప్రెస్ సంస్థ నుంచి 1938లో మద్రాసునుంచి ప్రచురితమయిన ఆంధ్రప్రభ పత్రిక సంచలనాలకు మారుపేరుగా నిలిచింది. 1959 నుంచి విజయవాడ కేంద్రంగా ప్రచురితమయిన ఈ పత్రికకు తొలి సంపాదకుడు ఖాసా సుబ్బారావు. న్యాపతి నారాయణమూర్తి, నార్ల వెంకటేశ్వరరావు, విడి. ప్రసాదరావు, నీలంరాజు వెంకటశేషయ్య, పండితారాధ్యుల నాగేశ్వరరావు, కూచిమంచి సత్యసుబ్రహ్మణ్యం, పండితారాధ్యుల నాగేశ్వరరావు, ఎబికె ప్రసాద్, పొత్తూరి వెంకటేశ్వరరావు, వాసుదేవదీక్షితులు, పి. విజయబాబు, సతీష్ చందర్ తదితరులు వరుసగా సంపాదక బాధ్యతలను నిర్వహించారు. నిర్వహిస్తున్నారు. ఆంధ్రప్రభ నిజాలను వెలుగులోకి తీసుకునిరావటంతో గురుతర బాధ్యత వహించటమే కాకుండా సామాజికరణా మంచి ప్రభావాన్ని చూపింది. ఈ పత్రిక చలనచిత్రనటుడు ఎన్టీరామారావు ముఖ్యమంత్రి కావటంలో తెరవెనుక పాత్రను నిర్వహించింది. సుదీర్ఘకాలంలో తెలుగులో అత్యధిక చందాదారులు కలిగిన దినపత్రికగా గుర్తింపులోకి వచ్చింది. అనంతరకాలంలో వచ్చిన ఆంధ్రజ్యోతికి నార్ల వెంకటేశ్వరరావు సంపాదకునిగా వ్యవహరించారు. విలువలు కలిగిన నార్ల అభిప్రాయాలకనుగుణంగా పత్రిక చాలాకాలం నడిచింది. అనంతరకాలంలో నండూరి రామ్మోహనరావు పత్రిక గుర్తింపును మరింత పెంచే దిశలో నిర్వహించారు. దివంగత ఎంపీ కెఎల్ఎన్ ప్రసాద్ నడిపిన ఈ పత్రిక ఆయన కుమారుల కాలంలో కొంతకాలం లాకౌట్ అయ్యింది. తరువాత పత్రిక టైటిల్‌ను కొనుగోలు చేసిన వేమూరి రాధాకృష్ణ ఈ పత్రికను కొనసాగిస్తున్నారు. పత్రికలో రచనా విధానం మారవచ్చుగాని, గత విలువలకు ప్రాధాన్యతనిస్తూనే ఈ పత్రిక కొనసాగుతుంది. పత్రికా రచనలో పెనుమార్పులకు శ్రీకారం చుట్టిన "ఈనాడు" వ్యవస్థాపకుడు జిల్లాకు చెందిన సి. రామోజీరావు. ఈనాడు విశాఖలో ఆరంభమయినా అత్యవసర పరిస్థితుల్లో జరిగిన ఘోరకృత్యాలను కళ్ళకు కట్టినట్లుగా చూపించిన ఈనాడు నిర్భయ కథనాలతో పాఠక అభిమానపాత్రమయ్యింది. మద్యపాన నిషేధం పర్యావరణ పరిరక్షణ వంటి సామాజిక ఉద్యమాలకు అండగా పత్రిక నిలుస్తుంది. కె. రామచంద్రమూర్తి, కొల్లు అంకబాబు వంటివారు స్థానిక సంపాదకులుగా వ్యవహరించిన దాసరి నారాయణరావు స్థాపించిన "ఉదయం"నిజాలకు వేదికయ్యింది. మాటలు కాకిపిల్లల ఆకలికేకలను విన్పించిన పత్రిక ఇది. "వార్తయందు జగము వర్ధిల్లుచున్నది– యదియులేని నాడయఖిల జనులు, నంధకారమగ్నులగుదురుగావున–

వార్త నిర్వహింపవలయు బతికి" అనే ఇతిహాసిక శ్లోకాన్ని ఆధారంగా ఇదే నినాదంతో ప్రచురితమయిన "వార్త" దినపత్రిక సంచలనాలకు కారణమయ్యింది. అమరావతిలోని వాస్తవ పరిస్థితులను అక్కడి శివలింగం ఎలా ఉద్భవించింది. మార్బుల్ లింగానికి ఎలా ప్రాధాన్యత వచ్చిందివంటి సంచల నాంశాలను రాజావాసిరెడ్డి వెంకటాద్రినాయుడు మునిమనవరాలి మనవుడు శాఖమూరు అనంత పద్మనాభ ప్రసాద్ ద్వారా తెలుసుకుని సంచలనాత్మక కథనాలను రాసిన జాతీయ, అంతర్జాతీయస్థాయిలో గ్రామీణప్రాంతంనుంచి ఉత్తమ జర్నలిస్టు పురస్కారాన్ని23ఏళ్ళ వయస్సులో అందుకున్న ఘంటా విజయకుమార్ లాంటివారు "వార్త" దినపత్రిక ద్వారా అనేక సామాజిక, చారిత్ర కంశాలను గుర్తింపులోకి తీసుకుని వచ్చారు. ప్రధానంగా సామాజిక సమస్యలను వెలుగులోకి తీసుకునిరావటంలోను, గుడిమెట్ల వంటి శిథిల చారిత్రక నగరాల ప్రాధాన్యతను వివరించటంలో విజయవాడ "వార్త" సాహసోపేతమయిన పాత్ర నిర్వహించింది. కంచల జయరాజు లాంటివారు ఈ పత్రిక ద్వారా కృష్ణాతీరంలోని వాస్తవిక జీవన స్థితిగతు లను వెలుగులోకి తీసుకునివచ్చారు. కమ్యూనిస్టు ఉద్యమాల పురిటిగడ్డ, తెలంగాణా సాయుధపోరాట ఆశ్రిత దుర్గం, స్వాతంత్ర పోరాటంతో తొలి రిపబ్లిక్‌గా నిలిచిన పరిటాల ఉద్యమంలా వేదికగా వున్న కమ్యూనిస్టుల కంచుకోటలో తొలుత వారపత్రికగా, అనంతరం దినపత్రిక "ప్రజాశక్తి", తెలుగురాష్ట్రాలన్ని ఒక్కటిగా ఉండాలనే లక్ష్యంతో ఏర్పడ్డ విశాలాంధ్ర దినపత్రిక సామాజిక స్పృహను కలిగించినా, కలిగిస్తున్న ప్రజా పత్రికలుగా గుర్తింపులో వున్నాయి. ఇవి కాక జాతీయోద్యమకాలంలో అనేక పత్రికలు ప్రచురితమయి ప్రజా ఉద్యమాలకు పరోక్ష వేదికల య్యాయి. ఆర్థిక అసమానత, అంటరానితనం, అస్పృశ్యుల ఆలయ ప్రవేశం, వర్ణ, మతాంతర వివాహాల దిశగా పాఠకులను నడిపిం చాయి. పాత్రికేయ రంగంలో విశిష్టతకు చిహ్నం.

**చిరునామా :** *డాక్టర్ ఘంటా విజయకుమార్, సీనియర్ జర్నలిస్టు, అధ్యక్షులు, అఖిలభారత తెలుగుపత్రికా రచయితల సమాఖ్య, నందిగామ – 521 185, విజయవాడ, కృష్ణాజిల్లా, సెల్ : 9948460199.*

శ్రీ నారిశెట్టి వేంకట కృష్ణారావు

# కృష్ణానదీ పరీవాహక ప్రాంతం - రచయిత్రులు

భారతదేశం గొప్ప వేదభూమి. అతి పవిత్రభూమి. మీదుమిక్కిలి విలువ తెలిసిన, పని బలం కలిగిన కర్మభూమి. కష్టపడటం భారతీయుడి వ్యక్తిత్వం. తెలుగువాడి తత్వం. ఇంత గొప్ప భారతదేశంలో ఆంధ్రప్రదేశ్ ఒక ప్రత్యేకత కల్గిన రాష్ట్రం. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంగా వున్నప్పుడు ఆంధ్రప్రదేశ్ ఒక అతిపెద్ద మరియు ఆర్థిక పరిపుష్టి కలిగిన రాష్ట్రం. ప్రాచీన కాలంనుండి ఆంధ్రప్రదేశ్ వ్యవసాయం మీదే ఆధారపడి అభివృద్ధి సాధిస్తూ వుంది. ఆంధ్రరాష్ట్రంలో అతిపెద్ద నదులైన గోదావరి, కృష్ణానదులు రాష్ట్రమంతా ప్రవహించి ఇక్కడ పంటల అభివృద్ధికి, ప్రజల అభ్యున్నతికి అనాది నుండి సహాయపడుతూనే వున్నాయి. ఈ నదులయొక్క నీటి బిందువుల త్యాగమే లేకపోతే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమే లేదు. ఈ రెండు నదుల నదీ ప్రవాహాలు ఎక్కడైతే వ్యాపించి వున్నాయో ఆ ప్రాంతాలు అనేక విధాలుగా అభివృద్ధి చెందాయి. ముందుగా ఎక్కడ వ్యవసాయం అభివృద్ధి చెందుతుందో అక్కడ సంస్కృతి అభివృద్ధి చెందటం సహజమే కదా !

సంస్కృతి అభివృద్ధి చెందడమంటే నాగరికత విలసిల్లడమే గదా! నాగరికత విలసిల్లుతుందంటే అక్కడ ఆర్థిక పరిపుష్టత ఉన్నట్లే గదా! ఆర్థిక పరిపుష్టత వున్నదంటే అక్కడి ప్రజలు అభివృద్ధి పథంలో పయనిస్తున్నట్లే గదా! ప్రజలు అభివృద్ధిపథంలో వున్నారంటే వారి ఆలోచనలు భిన్న రీతులలో కొనసాగుతున్నట్లే గదా! ప్రజల ఆలోచనలు భిన్నరీతులుగా సాగాలంటే వారిలో వివేకం వుండాలి కదా ! వారిలో వివేకం కలగాలంటే వారిలో విజ్ఞానం వుండాలి గదా! విజ్ఞానం కలగాలంటే విద్య తప్పనిసరి గదా! విద్యావకాశాలు వుండాలంటే అక్కడ అన్ని సౌకర్యాలు వుండి వుండాలి కదా! అన్ని సౌకర్యాలు వుండాలంటే అక్కడ అభివృద్ధి, నాగరికతలు వృద్ధి చెందివుండాలి గదా! మరలా మొదటికే వస్తున్నాం.

దీనిని బట్టి ఒక ప్రాంత అభివృద్ధి, నాగరికతల వికాసం ఆ ప్రాంత ప్రజల విద్యావ్యవస్థల మీద ఆధారపడి వుంటుందనేది స్పష్టం. విద్యా వ్యవస్థలంటే కేవలం చదువుకొనడానికి ఒక బడినో, కళాశాలనో స్థాపించి విద్యార్థులకు విద్యలు బోధించడమే కాదు. వివిధరకాల జ్ఞానాలను అనేక రచనల ద్వారా తెలియజెప్పి ప్రజలను చైతన్య వంతులను చేయడం. చైతన్య మవడం అనేది పలురకాలుగా వుంటుంది. చైతన్యం చేయడమంటే మానవశరీరంలోని నవరసాలనూ ప్రేరేపించడం, సానుకూలంగా దశ, దిశానిర్దేశం చేయడం.

కృష్ణానదీ పరీవాహక ప్రాంతంలోని ప్రజలను అన్నిరకాలుగా చైతన్యపరచి దశ, దిశా నిర్దేశం చేసిన, చేస్తున్న కవులు కళాకారులు, నాటకకర్తలు, రచయితలు, ఇతర రంగాలలోని అనేకమంది ప్రముఖులు వున్నారు. కృష్ణానది పరివాహక ప్రాంతంలో సాహిత్య సృజన చేస్తూ ప్రజలను చైతన్యవంతుల్ని చేసిన, చేస్తున్న మహిళామూర్తులను సంక్షిప్తంగా పరిచయం చేయడమే ప్రస్తుతాంశ ప్రధానోద్దేశ్యం.

ఏదైనా అభివృద్ధి చెందిన, చెందుతున్న అంశాలలో కేవలం పురుషుడి భాగస్వామ్యం ఒక్కటే వుండదు. స్త్రీల చేయూత కూడా తక్కువేమి కాదు. ఒక్కొక్కసారి ప్రత్యక్షంగా వారి పాత్ర బైటకు కనిపించదు. అందుచేతనే వారి భాగస్వామ్యం లేదని చెప్పడానికి వీలులేదు. మహిళామూర్తులు పురుషులతో పాటు సమంగా చేయగలరు. కొన్ని అంశాలలో పురుషులకంటే ఎక్కువగానూ, గొప్పగానూ చేయగలరు. సామర్థ్యం, ఆత్మవిశ్వాసం పుష్టిగా కలిగినవారూ వున్నారు అనేక రంగాలలో. ఇప్పుడు సాహితీరంగాన్ని మాత్రమే ఇక్కడ ప్రస్తావిస్తున్నారు.

కృష్ణానది తెలంగాణ ప్రాంతంలోని రెండు జిల్లాలలో, ఆంధ్ర ప్రదేశ్‌లోని మూడు జిల్లాలలో ప్రవహిస్తుంది. తెలంగాణలోని మహబూబ్‌నగర్‌జిల్లా వద్ద ప్రవేశించి క్రమంగా కర్నూలు, నల్గొండ, గుంటూరు, కృష్ణాజిల్లాల మీదుగా ప్రవహించి చివరగా కృష్ణాజిల్లా చివరి భాగమైన హంసలదీవి వద్ద సముద్రంలో కలుస్తుంది. ఈ నది అధికభాగం కృష్ణాజిల్లాలోనే ప్రవహిస్తూ వుండటం వలన దీనికి 'కృష్ణానది' అనే పేరు వచ్చిందని కొందరు చెబుతూ వుండటం కనిపిస్తుంది.

కృష్ణా పరీవాహక ప్రాంతంలోని రచయిత్రులను గూర్చిన అంశం గనుక ఈ ఐదు జిల్లాలలో సాహిత్య తపస్సు చేసిన, చేస్తున్న మహిళా మూర్తులను పరిచయం చెయ్యాలి. ఇది సంక్షిప్త పరిచయం మాత్రమే. శక్తిమేర ఆయా జిల్లాల్లోని రచయిత్రుల వివరాలు సేకరించబడ్డాయి. ఇదే సమగ్రం కాదు. దృష్టికి రాని, రాలేకపోయినవి ఎన్నో వుండే అవకాశముంది. జిల్లాలవారీగా రచయిత్రుల సంక్షిప్త వివరాలు క్రింద ఇవ్వబడ్డాయి.

## కృష్ణాజిల్లా - రచయిత్రులు :

కృష్ణాజిల్లాలో దాదాపు 35 మంది రచయిత్రులు కనిపిస్తున్నారు. గోవిందరాజుల సీతాదేవి 1932లో కృష్ణాజిల్లా, కాజ గ్రామంలో జన్మించారు. సుందరస్వప్నం, ముత్యాలపల్లకీ, అనురాగధార వీరి రచనలు. అనురాగధార టి.వీ సీరియల్‌కు నంది అవార్డును పొందారు. మద్రాస్ తెలుగు అకాడమి ఉగాది పురస్కారం, సుశీలా నారాయణరెడ్డి సాహిత్య పురస్కారాలను అందుకొన్నారు.

గురజాడ విజయశ్రీ 1949లో కృష్ణాజిల్లా, నూజివీడులో జన్మించారు. కొత్తవరవడి, తొలకరి, మనసు అనే మూడు కవితా సంపుటాలు వెలువరించారు. కథల పోటీలలో ఉత్తమ రచయిత్రి అవార్డులు పొందారు.

పంకజకుమారి 1956 లో గుడివాడలో జన్మించారు. వీరు మొగలిరేకులు, అక్షరభారతి, ఉగాది కవితా స్రవంతి కవితా సంపుటాలను రచించారు. జి.వి.యల్. ఆరాధనా పురస్కారాన్ని అందు కొన్నారు. మేకా జయశ్రీ విజయవాడలో 1954 లో పుట్టారు. ఇది కథ కాదు, బంధం - అనుబంధం, అమ్మ, శృంగారమే భూషణం మొదలయిన రచనలు చేశారు. నూజివీడులో జన్మించిన వారణాసి నాగలక్ష్మి ఆసరా, అమృతాన్ని సాధించు, చిన్నహోదా చిన్న ప్రాణం వంటి రచనలు చేసి పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, సాహితీ పురస్కారాన్ని పొందారు.

1943లో విజయవాడలో జన్మించిన కోకా విమలకుమారి పున్నమి నవ్వింది, కథలసంపుటిని, తెలుగుతల్లి నృత్యరూపకాన్ని, కనపర్తి వరలక్ష్మమ్మ జీవితం-సాహిత్యం పుస్తకాలను రచించారు. మచిలీపట్నంలో పుట్టిన శ్రీపతి బాలసరస్వతి వీనస్, అగుపించని అదృష్టం కథలను, మానవశ్రేయస్సు అనే కవితను రాశారు. విశ్వసాహితీవారి ఉత్తమ బహుమతిని పొందారు. 1953లో గూడవల్లిలో జన్మించిన వలక్కాము కామేశ్వరి రాజకీయరంగంలో మహిళాశక్తి అనే కథల సంపుటిని వెలువరించి 2007లో 'women of the Year' అవార్డును స్వీకరించారు.

మంచి నవలాకారిణిగా పేరుగాంచిన యద్దనపూడి సులోచనారాణి 1939 కాజలో జన్మించారు. వీరు రాసిన నవలల్లో కొన్ని సినిమాలుగా రూపుదిద్దుకున్నాయి. సెక్రటరీ, విజేత, జీవనతరంగాలు మొదలగునవి వీరి నవలలు. వీరు ఆంధ్రరాష్ట్ర నంది పురస్కారాన్ని పొందారు. విజయవాడ వాసి అయిన మొదలి పద్మ 'మౌనంలోని స్వరం' కవితా సంపుటితో పాటు కొన్ని కథలు, వ్యాసాలు రాశారు. 1942లో మచిలీపట్నంలో జన్మించిన మంగళగిరి ప్రమీలాదేవి తెలుగులో పద్యగేయ నాటికలు, క్షేత్రయ్య, మన ప్రకాశం రచనలు చేసి ఉత్తమ గ్రంథరచయిత్రి పురస్కారం స్వీకరించారు. 1944లో విజయవాడలో పుట్టిన దంటు విద్యేశ్వరి ఆంధ్రమహాభారత ధర్మతత్వం, మహాభారతం - మానవధర్మం, తెలుగునవల - మనోవిశ్లేషణ వంటి రచనలు చేసి నవ్యసాహితి వారి లత సంస్మరణ సత్కారాన్ని పొందారు.

విజయవాడలో 1965 లో జన్మించిన పొట్లూరి పద్మావతీ శర్మ లలితాసహస్రనామ భాష్యం, సుందరకాండ, శ్రీవారి బంగారుమేడ రచనలు చేసి సావిత్రి కళాపీఠం వారి సన్మానాన్ని అందుకొన్నారు. విజయవాడ వాస్తవ్యులైన ప్రఖ్యలక్ష్మీ కనకదుర్గ నిత్యజీవితంలో ఉపనిషత్తులు, శ్రీదేవి భాగవతాలను రాశారు. విజయవాడ స్వస్థలమైన మందవరపు హైమావతి నిషిద్ధాక్షరి, సూర్యుడు తప్పిపోయాడు కవితా సంపుటులు వెలువరించారు. కృష్ణశాస్త్రి, ఉమ్మడిశెట్టి, సి.నా.రె. అవార్డులను, శ్రీశ్రీ పురస్కారాన్ని పొందారు.

కృష్ణాజిల్లాలోని నందిగామ స్వస్థలమైన బండారు అచ్చమాంబ 1874-1905 మధ్యకాలం వారు. సంస్కృతాంధ్ర, మరాఠీ భాషల్లో మంచి పాండిత్యం గలవారు. గొప్ప సంఘసేవకురాలు. అబలా సచ్చరిత్ర రత్నమాల (1901), గ్రంథాన్ని బీద కుటుంబము (1904) కథను రచించారు. సోమరాజు ఇందుమతిదేవి కృష్ణాజిల్లా కలువ పాములు గ్రామంలో జన్మించారు. వీరు కావ్యాళి, శకుంతలా పరిణయము, గౌరి అనే ఖండకావ్యాలు రచించారు. విజయవాడ నివాసి అయిన జ్ఞానమాంబ కాళీవరప్రసాదిని, విజ్ఞానామృతం, చందమ్మకథ, దేవుడు, సత్యవతి, మొదలయిన రచనలు చేశారు. నూజివీడు ప్రాంతవాసియైన రాగి చిన్నమాంబ "ఉపనిషత్కాలక్షేప సారములు" రామాయణ సంగ్రహము గ్రంథాలను రచించారు.

కృష్ణాజిల్లా, వీరులపాడులో పుట్టిన వట్టికొండ విశాలాక్షి భృంగమా, జలదమా, స్వాగతము, భారతనారి, అభ్యుదయగీతాలు రచించారు. 1925లో కందలంపాడులో జన్మించిన భూషి అన్నపూర్ణమ్మ 'కథకుల సంసారం' అనే కథనూ, 'శాంతమ్మ శపథం' అనే గేయాన్ని రాశారు. 1931లో గన్నవరం తాలూకా బండారుగూడెంలో పుట్టిన నంబూరి పరిపూర్ణ 'మాకురావు సూర్యోదయాలు' 'పొలిమేర' అనే నవలలను, 'ఉంటాయి మాకు ఉషస్సులు' అనే కథాసంపుటిని రచించారు. 1948లో విజయవాడలో జన్మించిన కె. దుర్గాదేవి 'సీతాపతికథ పడిందోయ్', 'రక్తమల్లిక్' కథలను రాశారు. 1952లో విజయవాడలో

జన్మించిన బి.జె. స్వరూపారాణి 'చదువుకుందాం' నాటికను, మానవత్వం, సహజీవనం కథలను రాశారు. జాషువా సాహిత్య సమితి వారి 'బెస్ట్ టీచర్' అవార్డు పొందారు.

1954లో కృష్ణాజిల్లా కాకులపాడు గ్రామంలో పుట్టిన ఝాన్సీ కె.వి. కుమారి నిశీధి కథను, 'నిశ్శబ్ద సంగీతం' కవితా సంకలనాన్ని రాశారు. శంకరంపాడు గ్రామంలో 1969లో జన్మించిన బిట్లమేరి లీలాకుమారి 'గుడిసె ఏసోబు' దళిత సాహిత్యం His thoughts first మహాత్మా జ్యోతిభా పూలే పలుకులు వంటి రచనలు చేశారు. 1922లో విజయవాడలో పుట్టిన ఆచంట శారదాదేవి 'ఏమి అదృష్టం' సెలవుల్లో, ఒక్కనాటి అతిథి, పారిపోయిన చిలుక మొదలయినవి రాశారు. నూజివీడు వాస్తవ్యులైన జొన్నలగడ్డ శారదాదేవి మంచి రచయిత్రిగా పేరు సంపాదించారు. ఇదే ప్రాంత వాసియైన చేబ్రోలు సరస్వతీ దేవి 'సరస్వతీ రామాయణం' సరస్వతీ శతకం, ఆత్మోపదేశం రచనలు చేసి అభినవ మొల్ల, కవి కలహంసి బిరుదులు పొందడంతో పాటు 'గృహలక్ష్మి స్వర్ణకంకణం' అవార్డును కూడా పొందారు.

కృష్ణాజిల్లా 'కొండినాయపల్లి'లో 1973 లో జన్మించిన జాలాది విజయకుమారి 'నగ్నాక్షరం నా ఆయుధం', జీవితం, నేను మొ॥ రచనలు చేశారు. 1881లో గుడివాడ తాలూకా పుట్టిన వేమూరి శారదాంబ, పద్యాలు అల్లడంలో విశేషం. ఈ రచయిత్రి మాధవశతకం, నాగ్నజిత స్వయంవరం కావ్యాలను రాశారు.

నూజివీడులో జన్మించిన మాలతీ చందూర్ 'కాలమిస్ట్'గా తెలుగు పాఠకులందరికీ పరిచయమే. 'రవ్వల దుద్దులు' వీరి మొదటి కథ. 'చంపకం - చెదపురుగులు' మొదటి నవల. ఆలోచించు, సద్యోగం, భూమిపుత్ర, 'హృదయనేత్ర' నవలలు రాశారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కేంద్రసాహిత్య అకాడమీ అవార్డులు అందుకొన్నారు. తిరువూరులో జన్మించిన పాటిబండ్ల రజని 'ఎర్రజాబిళ్ళ ఎరీనా' కవితా సంపుటిని ప్రకటించారు. 'అపరిచిత కథ'ను రాశారు. తెలుగు విశ్వవిద్యాలయం సాహితీ పురస్కారం పొందారు.

కృష్ణాజిల్లా నిమ్మకూరులో జన్మించిన తెన్నేటి హేమలత గొప్ప రచయిత్రి. 600లు రేడియో నాటకాలు, 100కు పైగా కథలు, 4 నాటకాలు, 5 సంపుటాలుగా సాహిత్యావ్యాసాలు రచించారు. వీరి నవలల్లో ప్రసిద్ధమైనది 'మోహనవంశీ' నవల.

### గుంటూరుజిల్లా - రచయిత్రులు :

గుంటూరు జిల్లాలో 50 మంది రచయిత్రులు ఉన్నట్లుగా తెలుస్తుంది.

1889లో గుంటూరు నగరం, పాత గుంటూరులో గుడిపూడి ఇందుమతీదేవి జన్మించారు. వీరు 15 రచనలు చేశారు. అంబరీష విజయం, ఆంజనేయస్తుతి, గాంధీ కీర్తనలు, గోవిలాపము, నీతి తారావళి, మంగళ నృసింహశరణం, మొ॥ రచించారు. తన 10వ యేటనే గేయరచన ప్రారంభించిన వీరు తిక్కవరం సంస్థానాధిపతి మంత్రి పెగడ భుజంగరావు ఆస్థానంలో సన్మానాలందుకొన్న విదుషీమణి. గృహలక్ష్మి స్వర్ణకంకణ గ్రహీతలు కవితా విశారద, మధురకవయిత్రి ఈమె బిరుదులు.

గుంటూరుజిల్లా చేబ్రోలులో జన్మించిన వాసిరెడ్డి సీతాదేవి గొప్ప నవలా రచయిత్రి. వైతరణి, మట్టిమనిషి, సమత, రాబందులూ - రామచిలకలు, మరీచిక మొదలయిన నవలలు రాశారు. 'మట్టిమనిషి' నవల అన్ని భారతీయ భాషలలోకి అనువదించబడింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ నుండి 5 సార్లు ఉత్తమ రచయిత్రి అవార్డు అందుకొన్నారు. గృహలక్ష్మి స్వర్ణకంకణాన్ని, గోపీచంద్ అవార్డును, తెలుగు విశ్వవిద్యాలయం విశిష్ట పురస్కారాన్నీ పొందారు.

గుంటూరుజిల్లా పెదకూరపాడులో జన్మించిన మదమంచి అనంతమ్మ మాంచాల, నాయకురాలు, సీతమ్మ పెండ్లి అనే వచన కావ్యాలను, వర్షర్తువు అనే ఖండకావ్యాన్ని, కొన్ని పల్లె పదాలను రచించారు. గుంటూరుజిల్లా ప్రాంతమైన దుర్గిలో 1893లో పుట్టిన గొప్ప విదుషీమణి కాంచనపల్లి కనకాంబ. వీరు రంగశతకము, అమృతవల్లి, కాశీయాత్ర చరితము, హంస విజయము, పద్యముక్తావళి మొదలయిన 15 రచనలు చేసి 'కవితిలక్ గ్రంథమాల'ను కూడా స్థాపించారు. 12వ ఏటనే రంగశతకాన్ని రాశారు. గృహలక్ష్మి స్వర్ణ కంకణ గ్రహీతలు. 1902 లో మార్కాపురంలో పుట్టిన తురగా కామాక్షమ్మ శ్రీలక్ష్మీ చెన్నకేశవ స్వామివారి మహత్యం కావ్యాన్ని రచించారు.

బాపట్ల జన్మస్థలమైన ఊటుకూరు లక్ష్మీకాంతం గారు 1917 లో జన్మించారు. మంచి విదుషీమణి. ఆంధ్ర కవయిత్రులు, అఖిలభారత కవయిత్రులు, తెలుగు వాగ్గేయ కవులు, ఆంధ్రుల సంగీత వాఙ్మయసేవ, మహిళా విక్రయసూక్తము వంటి మంచి రచనలు చేశారు. ఆ రోజులలో కనకాభిషేకం కూడా పొందారు. బాపట్లలోనే 1896లో జన్మించిన కనుపర్తి వరలక్ష్మమ్మ శారదలేఖలు, మహిళా ప్రబోధము, ఓటు పురాణము రాశారు.

1920 లో సంగం జాగర్లమూడిలో జన్మించిన కొత్త లక్ష్మీ రఘురామ్ 'ఆంధ్రమహిళ' పత్రికకు సంపాదకురాలుగా వ్యవహరించారు. కనువిప్పు, చిల్లిగవ్వ కథల సంపుటిని వెలువ రించాయి. "ఆంధ్రనారి" వ్యాసాన్ని రాశారు. గుంటూరు నివాసియైన దేచిరాజు లక్ష్మీ నరసమ్మ భారత కథాసారము, శ్రీ కుచేలోపాఖ్యానము, శ్రీరామ శతకాలను రాశారు. 1890లో దాచేపల్లిలో జన్మించిన జ్ఞానరత్నమ్మ పిలిప్.బి. అరుణోదయ ప్రార్థన, మంగళగీతం గేయాలను రచించారు.

గుంటూరు నగరం, రామిరెడ్డితోటలో 1937లో పుట్టిన థెరెసా దేవదానం 'లార్డు మాత' అనే పాటల సంకలనం, ఏసుక్రీస్తు పుట్టుక, గాంధీ, అంబేద్కర్ పుట్టుక బుర్రకథలను రాశారు. తెనాలి తాలూకా గోవాడ గ్రామంలో 1943లో జన్మించిన స్వరూపారాణికి 'కవయిత్రి తిలక' అనే బిరుదు వుంది. భక్తంజలి, క్రీస్తు వాదనా చాతుర్యం, క్రీస్తు ఛలోక్తులు అనే దండకాలను, 'చంద్రగ్రహణం' అనే పద్యకావ్యాన్ని ప్రబోధము అనే కవితాసంకలనాన్ని రచించారు. 1950లో నందరాజుపాలెంలో పుట్టిన జెల్ది సీతమ్మ కవితా సుందరి అనే కవితను, స్త్రీలు-కళలు అనే వ్యాసం రాశారు. మోదుకూరు స్వస్థలమైన ఎడ్లూరి విజయకుమారి (1951) 'చిన్నచేపను పెద్దచేప మింగింది' కవితాను, 'తెలుగు ప్రజలపై, సాహిత్యంపై క్రైస్తవమత ప్రభావం' అనే వ్యాసాలను ప్రకటించారు. తెనాలి వాస్తవ్యులైన కొటికలపూడి సీతమ్మ (1874-1936) 'ఉపన్యాస సుమమాలిక' ఉన్నత స్త్రీవిద్య వంటి రచనలు చేశారు. చెర్లగుడిపాడులో జన్మించిన దార్ల సుందరమ్మ 'భావలింగ శతకా'న్ని రాశారు.

క్రీ.శ. 7వ శతాబ్దికి చెందిన ప్రముఖ విదుషీమణి 'నాచి'. ఈమె గుంటూరు మండలంలోని ఐలేశ్వరంలో జన్మించారు. కాశీయాత్ర మార్గమధ్యంలో పండితులను జయించి తన విజయగాథనే సంస్కృతంలో ఒక నాటకంగా రాసిందని ప్రచారంలో వుంది. ఆ నాటకం పేరు 'నాచీ విజయ నాటకమ్'. క్రీ.శ. 13వ శతాబ్దం కాలానికి చెందిన ప్రోలమ గుంటూరుమండల వాసి. ఆశువుగా అనేక పద్యాలు చెప్పేవారని ప్రచారంలో వుంది.

1956 లో గుంటూరు జంగంగూడెంలో జన్మించిన తాటికోల పద్మావతి 'కవితా కుసుమాలు' కవితా సంపుటిని వెలువరించారు. శ్రీశ్రీ పురస్కారాన్ని, మహిళా శిరోమణి అవార్డును అందుకున్నారు. గుంటూరు సొంతస్థలమైన పులివర్తి నాగసూర్యకుమారి (1942) చక్ర భ్రమణము, సహజ విజ్ఞానము, మోహినీ భస్మాసుర, చిన్నపిల్లల నృత్య రూపకాలను రచించారు. 'ఓల్గా' అనే కలం పేరుతో ప్రసిద్ధులైన పోపూరి లలిత కుమారి 1950లో గుంటూరు పట్టణంలో జన్మించారు. రాజకీయకథలు, ప్రయోగం అనే కథల సంపుటాలను, స్వేచ్ఛ, సహజ, మానవి మొదలయిన నవలలు రాశారు. తెనాలి స్వస్థలమైన ఉంగుటూరి శ్రీలక్ష్మి (1938) మాయల పందిరి (ఆంధ్రప్రభ కాలమ్), 'ఎంతవారలైనా' అనే కథానికల సంపుటి రచించారు. మాదల గ్రామంలో జన్మించిన జనవళి వరలక్ష్మి యుగయుగాల్లో భారతీయ మహిళ, పున్నమిరాత్రి కురిసిన వెన్నెల రచనలు చేశారు. ఆంధ్రా విశ్వవిద్యాలయం నుండి కళాప్రపూర్ణ బిరుదును పొందారు.

గుంటూరులో 1958 లో జన్మించిన గోటేటి లలిత మూటే అంద్దం, నేర్పు, మార్గదర్శి వంటి గ్రంథాలు రచించారు. తెనాలిలో 1955లో పుట్టిన కోపూరి పుష్పాదేవి మరో కోణం, పరిమళం అనే కథా సంపుటాలను, 'పూలరేకులు' అనే నానీల సంపుటిని రాశారు. 1943లో గుంటూరులో పుట్టిన జక్కా విజయకుమారి భక్తవిజయం, వెన్నెలమెట్లు, పెళ్ళి చూపులు వంటి రచనలు చేశారు. పొత్తూరు వాసియైన పొత్తూరి విజయలక్ష్మి (1953) నిశ్శబ్ద జలపాతాలు అనే కథాసంపుటిని, ఇల్లు అద్దెకివ్వబడును, మతిలేని డాక్టర్ - గతిలేని పేషెంట్ అనే హాస్య నాటికలను రచించారు. తెనాలి వాస్తవ్యులైన చయనం మహాలక్ష్మి కొన్ని కథలు, కవితలు రాశారు. అవి వివిధ పత్రికలలో ప్రచురించబడ్డాయి. 1936లో గుంటూరులో పుట్టిన రావిపాటి ఇందిరామోహన్‌దాస్ 'జీవనగంగ' నవలను, నింగినేలను తాకింది, అనే కథల సంపుటిని, ఉద్బోధ అనే కవితల సంపుటిని రాశారు. గుంటూరు వాసియైన ఏ.వి.కె. సుజాత (1960) 'అమృత హృదయం' కవితా సంపుటిని, వ్యాససుమాలు అనే వ్యాససంపుటిని, బాలల కవితలను రాశారు. తెనాలి స్వస్థలమైన షేక్.బషీరున్నీసా బేగం (1965) 'మనసుమాట' రచించారు. రాష్ట్రస్థాయి ఉత్తమ కవితాపురస్కారాన్ని అందుకున్నారు.

1966లో గుంటూరులో జన్మించిన మద్దూరి శ్యామల 'కోకిలమ్మ పదాలు, సుహృల్లేఖ అనే గజల్ కవితా సంపుటాలను, నాగుండె గుమ్మానికి పచ్చనాకునై అనే వచన కవితా సంపుటిని రచించారు. నందిరాజు, పద్మలతా జయరామ్ 1965లో తెనాలిలో జన్మించారు. మూడుముప్పైలు, మూలధనం, చైతన్యస్రవంతి రచనలు చేశారు. జాగృతి కథా పురస్కారాన్ని అందుకొన్నారు. ఇక్కడే 1962లో పుట్టిన గుటాల శాంతకుమారి 'సన్నిధానం' నాటకాన్ని, 'గారట-గారట-గారట' అనే నాటికను, 'నిర్ణయం' కథను రాశారు. గుంటూరు నివాసియైన వంగిపురపు శారదాదేవి పిల్లలకథలు, రేడియో కథలు రాశారు. గుంటూరు వాసియైన డా॥ జి. వైదేహి (1955) అక్షర సుమహారం, తాజ్‌మహల్, విశ్వంభర మొదలయిన రచనలు చేశారు. కరుణశ్రీ విశిష్ట పురస్కారాన్ని పొందారు. ఈ ప్రాంతంవారైన పిల్లలమఱ్ఱి కళ్యాణశారద (1952) గుండెచప్పుడు (కవిత్వం), శివశక్తి దేవాలయ విశేషాలు అనే స్థలపురాణాన్ని రాశారు.

1951లో బాపట్లలో జన్మించిన లక్కాకుల సుకన్య "పసిమనసులు" రచన చేశారు. 1947లో తెనాలిలో జన్మించిన డా॥ కె.వి. కృష్ణకుమారి వందేకృష్ణం, కర్మయోగి, భద్రాకళ్యాణం రచనలు చేసి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారి చేత విశిష్ట రచయిత్రి పురస్కారాన్ని అందుకొన్నారు. గుంటూరువాసియైన కోవల్లె మణి (1954) 'గృహం - ఋణం' కథను, 'అందరికీ ఆధార్' అనే నాటికను రాశారు. గుంటూరు వాస్తవ్యులైన అధరాపురపు తేజోజ్యోతి (1936) పూర్వాసంధ్యాప్రవర్తతే, మృత్యోర్మా అమృతంగమయ, మూడు చక్రాలు, విద్యార్థి మొదలయిన నవలలు రచించారు. ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయ ప్రతిభా పురస్కారం పొందారు.

1943లో నిడమర్రులో జన్మించిన నిడమర్తి నిర్మలాదేవి వ్యాస ప్రభాస, వ్యాస విపంచి అనే వ్యాస సంపుటాలను ప్రకటించారు.

గుంటూరువాసియైన పొన్నూరి సునీత (1971) దైవరాజ్యం, ఓంకారం – ఓం ఆకారం అనే రచనలు చేశారు. బాపట్లలో జన్మించిన చిల్లర భవానీదేవి (1954) కెరటం నా కిరీటం, అక్షరం నా కిరీటం అనే కవితా సంపుటాలను, 'అమ్మా–నన్ను క్షమించొద్దు' అనే కథల సంపుటిని రాశారు. ఉత్తమ కావ్య వర్ణనకు గాను శ్రీపొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం అవార్డ్‌ను ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డును అందుకొన్నారు.

## నల్గొండజిల్లా - రచయిత్రులు :

నల్గొండ జిల్లాలో ప్రస్తుతానికి నలుగురు రచయిత్రులు కనిపిస్తున్నారు. ఇంకా ఎక్కువమంది వుండే అవకాశం ఉంది.

నల్గొండ స్వస్థలమైన ముదిగంటి సుజాతారెడ్డి 1942లో జన్మించారు. 'విసుర్రాయి' అనే కథలసంపుటిని, 'మలుపు తిరిగిన రథచక్రాలు' నవలను రచించారు. సామాజిక చారిత్రక నేపథ్యంలో తెలుగు సాహిత్య చరిత్ర అనే మంచి గ్రంథాన్ని వెలువరించారు. చాసో సాహిత్యపురస్కారాన్ని, సుశీలా నారాయణరెడ్డి పురస్కారాన్ని, తెలుగు విశ్వవిద్యాలయ ఉత్తమ రచయిత్రి, ఉత్తమ గ్రంథ పురస్కారాలను అందుకొన్నారు. నల్గొండలోనే 1945లో జన్మించిన రావి ప్రేమలత జానపదసాహిత్యం పురాణగాథలు, తెలుగుస్త్రీల చిత్రలిపి, వ్యాసతిలక్ వంటి రచనలు చేశారు. తెలుగు విశ్వ విద్యాలయం నుండి ఉత్తమ రచయిత్రి, ఉత్తమ విమర్శకురాలు అవార్డులు పొందారు. 1984లో మిర్యాలగూడాలో జన్మించిన డా॥ ఎమ్. శిరీష వెన్నెలపూదోట, దిలాస్టమీట్ ఎట్ సాగరిక, ఎ గిఫ్ట్ కార్ట్‌లైఫ్ మొ॥న రచనలు చేశారు.

## కర్నూలుజిల్లా - రచయిత్రులు :

కర్నూలుజిల్లా నుండి సాహిత్యరంగంలో కృషిచేస్తున్న రచయిత్రులు 12 మంది వున్నారు.

శశికళ, షహనాజ్ బేగం, ఎస్.పి.వి. జయరాజ్, చెక్కల విజయ లక్ష్మి, పి. శ్రీదేవి, గీతాంజలి, వి. ప్రతిమ, వినోదిని, షమీ మున్నీసా బేగం, చిలుకూరి దీవెన, ముక్తాపురం స్నేహలత, నిర్మల మొ॥న వారు సాహిత్య సృజన చేస్తూ సామాజిక చైతన్యనానికి కృషిచేస్తున్నారు. వీరు కథలు, కవితలు, నవలా రంగాలలో రాణిస్తున్నారు.

## మహబూబ్‌నగర్ జిల్లా - రచయిత్రులు :

మహబూబ్‌నగర్ జిల్లాలో సాహితీ క్షేత్రాన్ని సేద్యం చేస్తున్నవారు దాదాపు 10మంది రచయిత్రులు కనిపిస్తున్నారు.

1942లో మహబూబ్‌నగర్‌జిల్లాలో జన్మించారు పోల్కంపల్లి శాంతాదేవి. ఈమె మంచి నవలా రచయిత్రి. బాటసారి, నైనా, నౌకాగమనం అనే నవలలు రాశారు. మాదిరెడ్డి సులోచనా స్మారక్ అవార్డు, డా॥ సుశీలా నారాయణరెడ్డి సాహితీ అవార్డులు అందుకొన్నారు. 1952లో ఇదే జిల్లాలో జన్మించిన వావిలికొలను రాజ్యలక్ష్మి కూడా గొప్ప నవలా రచయిత్రే. వీరు ఆశల దీపాలు, ప్రేమపుష్పం, హృదయ సుగంధం నవలలు రచించారు.

పాలమూరులో 1953లో పుట్టిన పాణ్యం, మీనాకుమారి ప్రేమ పావురాలు అనే వచన కావ్యాన్ని, 'మీనా' అనే గేయమాలికను, బాలకవితా ఝరీ అనే కవితా సంపుటిని రచించారు. ఉత్తమ ఉపాధ్యాయినిగా రాష్ట్రప్రభుత్వ పురస్కారాన్ని అందుకొన్నారు.

మహబూబ్‌నగర్ జిల్లాలోనే 1959లో జన్మించిన లక్కరాజు నిర్మల ఆత్మనివేదన, అక్షరమాల అనే పిల్లల పాటలను, 'నిర్మలా నానీలు' ను రచించారు. బండారు, ఈశ్వరమ్మ బెస్ట్ ఆర్గనైజేషన్ అవార్డును, మల్లాది సుబ్బమ్మ ఉత్తమ సాహిత్య పురస్కారాన్ని అందుకొన్నారు. 1966లో శ్రీరంగాపురంలో జన్మించిన చుక్కాయపల్లి శ్రీదేవి శ్రీరంగాపురం వైభవం, గీతా శతకం, గీతామార్గం మొ॥న రచనలు చేశారు.

ఈ జిల్లాలోని లింగాల మండలం, రాయవరం గూడెంలో 1969లో జన్మించిన రచయిత్రి లక్ష్మి. ఈ రచయిత్రి కొత్తవాగు – కొండవెలుగు అనే రచనను చేశారు.

ఈవిధంగా కృష్ణానదీ పరీవాహక ప్రాంతంలోని ఐదు జిల్లాల నుండి తెలుగు సాహితీ వనంలో వికసించిన, వికసిస్తున్న మహిళా రచయితలను స్థూలంగా పరిశీలిస్తేనే 100కు పైగా రచయిత్రులు వుండటం ఆనందించదగిన అంశం. అభినందించదగ్గది కూడా. నదీ పరీవాహకప్రాంతాలు నాగరికతకు నిలయాలు. సంస్కృతికి ఆనవాలు, అభివృద్ధికి సహజ వేదికలు అనడానికి పైన పేర్కొనబడిన మహిళా రచయితల ప్రాతినిధ్యం ఒక చక్కని ఉదాహరణ.

వందమంది రచయిత్రులంటే అంత తక్కువేమీ కాదు. మహిళా మూర్తుల చైతన్యానికి, సమాజ వికాసానికి వారు అందిస్తున్న తోడ్పాటూ తక్కువేమి కాదు. ఇది కృష్ణానదీ పరీవాహక ప్రాంతంలోని రచయిత్రుల సంక్షిప్త వివరణలేగాని, సమగ్ర సమాచారము కాదు, సమస్త విశ్లేషణా కాదు. ఇది కేవలం రచయిత్రుల సేకరణ మాత్రమే. ఈ నదీపరీవాహక ప్రాంతంలో ఉద్భవించిన రచయిత్రులు ఈ నదీమతల్లికి వరపుత్రికలే. వారి వారసత్వాన్ని ముందుతరం వారుకూడా అధికసంఖ్యలో అందిపుచ్చుకుని అధిక రచనలు చేసి కృష్ణానదీ పరీవాహక ప్రాంతంలో రచయిత్రుల ప్రాతినిథ్యాన్ని మరింతగా పెంచాలని, పెంచుతారని కాంక్షిద్దాం.

డా॥ గుమ్మా సాంబశివరావు

# కృష్ణాతీరంలో అవధానులు

"అవధానంబొక పారిజాతతరువై అందమ్ములన్‌జిందు,ప
ద్యవితానోజ్వలశాఖలున్ కవన విద్యాహృద్యహాస్యోక్తులే
చివురాకుల్ సరసంపురాగ మెమధుశ్రీ, వాక్సభన్ నవ్వులే
పువులైవిప్పు, వధానికౌవిజయమొప్పున్ బంధురోద్గంధమై"

అవధానం ఒక పారిజాత వృక్షం. పద్యాల సమూహం శాఖలు హృద్యమైన కవిత్వంతో కూడిన హాస్యోక్తులు చివురాకులు. రసనిష్ఠమైన రాగం తేనె. వాక్సభలో నవ్వులే పువ్వులై విరిస్తే అవధానవిజయం అవధానికి బంధురమైన గంధమై ఒప్పుతుంది.

అవధానం ఆంధ్రులసొత్తు అని విజ్ఞుల భావం. ఇతర భాషల్లో లేని సొగసులు తెలుగు భాషకే సొంతం, కావటం వల్ల అవధాన ప్రక్రియ తెలుగులో బహుముఖీనంగా విస్తరించింది. తెలుగులో అవధానవిద్య 13వ శతాబ్దం నుంచి ఉన్నట్లు తెలుస్తుంది. కానీ 19వ శతాబ్దంలో విద్వాన్ మాడ భూషి వేంకటాచార్యులవారు అవధానాలు చేసిన తర్వాత మాత్రమే అవధాన ప్రక్రియాస్వరూప స్వభావాలు అందరికీ అవగాహన లోనికి వచ్చాయి. అష్టావధాన, శతావధాన, ద్విగుణిత, త్రిగుణిత, చతుర్గుణిత, షోడశగుణిత అష్టావధానాలు, ద్విశతావధానాలు, పంచశతావధానాలు, సహస్రావధానాలు, పంచసహస్రావధానాలు – ఇలా ఎన్నో వైవిధ్యభరితమైన అవధానాలు తెలుగులో ప్రచారంలోనికి వచ్చాయి. తెలుగు అవధానచరిత్రను పరికిస్తే అది బృహద్గ్రంథమే అవుతుంది. తెలుగునాట కృష్ణాతీరంలో ఉన్న అవధానుల్ని గూర్చి వివరించే ప్రయత్నమే ప్రస్తుత వ్యాసం.

## అవధానయుగకర్త

### వేంకటాచార్యులు, మాడభూష :

వీరు 1835–1895 ప్రాతానికి చెందినవారు. కృష్ణాజిల్లా నూజివీడులో వీరి స్థిరనివాసం అలమేలమ్మ, నరసింహాచార్యులు వీరి తల్లిదండ్రులు. నూజివీడు సంస్థాన విద్వత్కవిగా పేరు ప్రసిద్ధులు. ఏకసంథా గ్రాహి. అష్టావధానశతావధాన ప్రవీణులు. ఆధునికకాలంలో శతావధాన, అష్టావధానాలకు లక్షణాల్ని నిర్దేశించి అవధానాలు చేసిన వీరిని తిరుపతి వేంకటకవులు అవధానయుగకర్తగా ప్రశంసించారు. వీరి నూజివీడు శతావధానం సాహిత్య చరిత్రలో సుప్రసిద్ధమైంది. విజయనగర సంస్థానాధిపతి ఆనందగజపతిరాజుగారు ఈ శతావధానానికి స్వయంగా వచ్చారు. పిఠాపురం రాజారావు వేంకట మహీపతిగంగాధర రామారావు బహద్దూరు వీరికి అభినవ పండితరాయలు బిరుదు ప్రధానం చేశారు. వీరు భరతాభ్యుదయం, ఆనందగజపతీంద్ర వతకము, పుష్పబాణ విలాసము, ప్రభానాటకము, రామావధూటి తారావళి, హంససందేశము వామన నాటకము, బృహద్వైద్యరత్నాకరము, మదన మోహన చరిత్ర మొదలైన రచనలు చేశారు.

### కవితా ప్రసాద్ రాళ్లబండి :

వీరు 21-5-1961న శ్రీమతి రత్నవర్ధనమ్మ, రామకోటేశ్వరరావు దంపతులకు జన్మించారు. వీరి సొంత ఊరు భద్రాచలమైనా కృష్ణాజిల్లాలో ఎక్కువకాలం ఉన్నారు. ఉపాధ్యాయునిగా, సాంఘిక సంక్షేమ శాఖ అధికారిగా కృష్ణాజిల్లాలో బాధ్యతలు నిర్వర్తించి ఆ తర్వాత హైదరాబాదులో ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖ సంచాలకులుగా పనిచేస్తూ ఆకస్మికంగా మరణించారు. వీరు అవధాన విద్య–ఆరంభ వికాసాలు' అనే పరిశోధనా గ్రంథాన్ని రచించి డాక్టరేట్ పట్టా పొందారు. వీరు పద్యమండపం, ఒంటరి పూలబుట్ట, వేంకటేశశతకం లాంటి రచనలు చేశారు. తెలుగు విశ్వవిద్యాలయం వారి పురస్కారాన్ని పొందిన వీరికి అవధాన విద్యా వాచస్పతి అనే బిరుదు పొందారు. వీరు అష్టావధాన, శతావధాన, ద్విశతావధానాలు చేయటమే కాకుండా అనేక ప్రయోగాలు కూడా చేశారు. అలంకార అష్టావధానం, విశ్వనాథ సాహిత్య అష్టావధానం, అష్టదశావధానం, సాహిత్య ప్రక్రియావధానం మొదలైన రీతిలో అవధానాలు చేసి తనదైన ముద్రను ప్రకటించాడు.

### కాశీపత్యవధాని, పోకూరి (1892-1974) :

వీరు పల్నాటి సీమలోని మాచెర్ల సమీపంలోని బొదిలివీడులో

భద్రయాచార్యులు, రామలక్ష్మమ్మ దంపతులకు 1892లో జన్మించారు. వీరికి అనేక నిఘంటువులు కంఠస్థం అయ్యాయి. వీరి సంస్కృతాంధ్ర పాండిత్యం అపారం.వీరు ఆంధ్రదేశంలోని పలుప్రాంతాలు పర్యటించి అష్టావధాన శతావధానాలు గావించి అనేక సత్కారాలు అందుకొన్నారు. గద్వాల సంస్థానాధీశుని ద్వారా బంగారు పతకంతోపాటు కవిసింహ, మహాకవిశేఖర మొదలైన బిరుదులు పొంది వారి ఆస్థానకవిగా ప్రకాశించారు.ఢిల్లీలో తమ కవితా వైదుష్యాన్ని ప్రదర్శించిఅప్పటి రాష్ట్రపతి నుంచి సత్కారం అందుకొన్నారు. వీరి పాండిత్య ప్రకర్షను ప్రదర్శిస్తూ పలు గ్రంథాలు రచించారు.వీరు 'సారంగధరీయం' అనే త్ర్యర్థి కావ్యం సారంగధరునికథ,తారాచంద్రులకథ, శివచరిత్రం అనే కథలుపైత్ర్యర్థి కావ్యంలో ప్రతిబింబించాయి.ఇంకా వీరు 'నిరోష్ఠ్య నిర్గద్య, శుద్ధాంధ్ర హరిశ్చంద్రకథ" అనే కావ్యాన్ని రచించారు. వీరు సిద్ధయోగి చరిత్ర, బ్రహ్మగారి చరిత్ర, సత్రశాల మల్లేశ్వర శతకం, శ్రీశైలమల్లేశ్వర శతకం మొదలైన గ్రంథాలు రచించారు. వీరు కావ్యాంత గద్యల్లో "పరమేశ్వర వరప్రసాలబ్ధి చతుర్విధ కవితా విచిత్రుని'గా పేర్కొన్నారు.వీరికి కవిశిఖా మణి, అవధాన ప్రవీణ, చిత్రకవితా ప్రవీణ అనే బిరుదులు కూడా ఉన్నాయి. ఈ అవధాన శేఖరుడు తన 82వ సంవత్సరంలో 27-12-1974న కీర్తిశేషులయ్యారు.

## కుక్కుటేశ్వరరావు, గాడేపల్లి (1934-2000) :

వీరు గాడేపల్లి సుబ్బారాయమ్మ, మల్లికార్జునుడు దంపతులకు గుంటూరుజిల్లా పెదనందిపాడు గ్రామంలో 1937 సెప్టెంబరు 22వ తేదీన జన్మించారు. ఆంధ్ర విశ్వ కళాపరిషత్‌లో ఎం.ఏ తెలుగు పూర్తిచేసి ఆంధ్రదేశంలోని పలు ప్రాంతాల్లో తెలుగు అధ్యాపకులుగా పనిచేశారు.

1974-95 ప్రాంతంలో తణుకులోని ప్రభుత్వ డిగ్రీ కళాశాల ప్రిన్సిపాల్‌గా పదవీ విరమణ చేశారు. ఆంధ్ర, ఆంధ్రేతర ప్రాంతాల్లో పలు అవధానాలు చేశారు. వీరి కలంనుంచి జీర్ణశిల అనే ఖండకావ్య సంపుటి, విజయముద్ర అనే వీరరస ప్రధానమైన పద్యకావ్యం, రాలీ రాలని పువ్వు అనే సాంఘిక నవల, రాణాసంగుడు అనే చారిత్రక నవల, బ్రహ్మర్షి అనే పద్య కావ్యం, అవధాన సమాధానాలు, చమత్కార చాటువులు, ఏసు కృష్ణీయము అనే ద్వ్యర్థికావ్యం,ఆపదుద్ధారిణి శతకం, మొదలైన రచనలు వెలువడ్డాయి. వీరు చిత్తూరుజిల్లా కవుల, కళాకారుల జీవితచరిత్రము సంకలనం చేశారు. వీరు 2000 సంవత్సరం ఏప్రియల్ 11వ తేదీన అమలాపురంలో పరమపదించారు.

## కృష్ణాచార్యులు, కాశీ (1872-1967) :

వీరు శ్రీమతి పిచ్చమాంబ, లక్ష్మణాచార్యులు దంపతులకు కృష్ణాజిల్లా మచిలీపట్నంలో 1972లో జన్మించారు. తర్వాత వీరు గుంటూరుకు దత్తత వెళ్లారు. ఆనాటి ప్రముఖ పండితుల వద్ద వ్యాకరణం, తర్కం, వేదాంతం అభ్యసించారు. వీణ, వేణువు, వాయులీనం, మృదంగం మొదలైన వాద్యాలవాదనలో నైపుణ్యాన్ని సాధించారు.ఇంకా కుమ్మరం, వడ్రంగం, నేత మొదలైనవాటిలో ప్రావీణ్యాన్ని పొందారు. గుంటూరు, గుడివాడలలో వీరు సంస్కృతాంధ్ర అధ్యాపకులుగా పనిచేశారు. పది సంవత్సరాల వయసునుంచే కవిత్వ రచనం ప్రారంభించినవీరు 19వ సంవత్సరంలో గుంటూరులో చేసిన అవధానంతో అవధాన జైత్రయాత్ర ప్రారంభించారు. వీరు 1-12-1911న బందరులో చేసిన శతావధానంతో దేశవ్యాప్త కీర్తిని పిందారు. వీరు వినుకొండ, గద్వాల, వనపర్తి, ఆత్మకూరు,వేంకటగిరి,నూజివీడు, పిఠాపురం,విజయనగరం మొదలైన సంస్థానాల్లో అవధానాలు, ఆశుకవితలు ప్రదర్శించి సన్మానాలందుకొన్నారు.వీరు మాతృభాషాసమాజం అనే సంస్థనుస్థాపించి 'మాతృభాష' అనే పత్రికను ప్రచురించారు. క్రియాధర్మం, వాల్మీకిచరితం మొదలైన గ్రంథాలు రచించారు.అవధానయాత్ర,అష్టకాలు,దండకాలు, శతకాలు, స్తోత్రాలు రచించారు. అవధాని శిరోమణి, మహోమహోపాధ్యాయ, పౌరాణిక రత్న, కళాప్రపూర్ణ బిరుదులు డిలిట్‌లు అందుకొన్నారు. వీరు 1960లో రాష్ట్రపతి సత్కారం పొందారు. 1962లో ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవిగా నియమితులయ్యారు. సంస్కృతభాషా ప్రచారానికి సర్వస్వం ధారపోసిన ఈ సాహితీమూర్తి 1967లో అంతిమశ్వాస విడిచారు.

## కొప్పరపు సోదరకవులు (1883-1992) (త1887-1942) :

వీరు గుంటూరు మండలంలోని కొప్పరం గ్రామంలో వెంకటరాయలు, సుబ్బమాంబదంపతులకు జన్మించారు. వీరిలో పెద్దవాడైన వెంకట సుబ్బరాయకవి 1885 నవంబరు 12న, రెండవవారైన కొప్పరపు వెంకట రమణకవి 1887 డిసెంబరు 30న జన్మించారు. ఈ సోదరులిద్దరూ కొప్పరపు సోదరకవులుగా పేరుపొంది 16 సంవత్సరాలు నిండకముందే ఆశుకవితా విద్యను ప్రదర్శించారు. వీరు బాలసరస్వతి, ఆశుకవి సింహ, ఆశుకవి శిఖామణులుగా బిరుదులందుకొన్నారు. గంటకునాలుగు వందల పద్యాలుచెప్పటం వీరి ప్రత్యేకత. వీరిలో సుబ్బరాయకవి 29-3- 1932వ తేదీన వెంకటరమణకవి 21-3-1942న పరమ పదించారు. ఈ కవిసోదరుల తమ్ముడైన బుచ్చిరామకవి 9-12-1892 జన్మించి వీరుకూడా ఆశుకవితా ప్రదర్శనలు, అవధానాలు చేసి ఖ్యాతి పొందారు. ఈయన 29-5-1956న పరమపదించారు. వేంకట సుబ్బరాయకవి కుమారుడు సీతారామప్రసాదరాయకవి అవధానాశుకవితల్లో ప్రసిద్ధిపొందారు. కొప్పరపు సోదరకవుల దౌహిత్రుడు 'మాశర్మ' వీరి కవిత్వాల్ని సంపుటాలుగా వెలయించి విమర్శక వ్యాసాలు రచింపచేసి గ్రంథాలు ప్రచురించారు.

## గురునాథశర్మ మన్నికంటి :

వీరు నర్సరావుపేట తాలూకాలోని ఏల్చూరులో 10-4-1897న శ్రీమతి సుబ్బమాంబ, వేంకటలక్ష్మయ్య దంపతులకు జన్మించారు.

వీరు విద్యత్కవి. అచ్చతెలుగులోను, సంస్కృతంలోనూ రచనలు చేశారు. సుమారు 50 గ్రంథాలకు పైగా రచించారు. బంధ, చిత్రకవిత్వాలలో వీరికి ఆసక్తి పోతరాజు విశ్వనాథకవితో కలసి 'గురువిశ్వనాథ కవులు' పేరుతో జంటకవిత్వం రాశారు. శర్మగారు అవధానాలు కూడా చేసి ఎన్నో సత్కారాలు పొందారు.కవితామహేశ్వర, వేదాంత పారీణ అనే బిరుదులుగురునాథశర్మగారికి ఉన్నాయి.వీరు వ్యాసవిలాసము, చంద్రికా వివాహము, వామాక్షి, నమ్మకము, పతివ్రత, సత్యాగ్రహము, మృగేంద్ర వాహన, ఆంధ్రసనుత్సజాతీయము, తూము లక్ష్మీనరసింహ దాసు చరిత్ర, తల్లిబిడ్డ శ్రీ మద్గురు భాగవతము మొదలైన రచనలు చేశారు.

## జానకిరామశాస్త్రి ముప్పాళ్ల :

వీరు 1892లో సత్తెనపల్లి తాలూకా (గుంటూరుజిల్లా) ముప్పాళ్ళ గ్రామంలో శ్రీమతి హనుమాంబ కుశలవరామామాత్యుడు దంపతులకు జన్మించారు. వీరు మనోరమ, కన్యకాపరమేశ్వరీ నాటకము, హనుమచ్ఛతీకం,వేదాద్రి నృసింహశతకం,రామేశ్వరీయం, లక్ష్మీసహస్రం మొదలైన గ్రంథాలు రచించారు. విద్వత్కవిగా ప్రసిద్ధులైన వీరు అష్టావధాన శతావధానాల్లోను, ఆశుకవిత్వంలోను నిపుణులు. వీరు భక్తి వేదాంత ప్రతిపాదికంగా రచనలు చేసి ప్రసిద్ధిపొందారు.

## త్ర్యంబకరావు, శ్రీపతి :

వీరు 1959వ సంవత్సరం జన్మించారు.విజయవాడలో స్థిరనివాసం ఏర్పరచుకొన్నారు. వీరు రసాశ్రయము, శ్రీ కళాసిద్ధి, శ్రావణము అట్లతద్దె (గేయకావ్యం) తలపు (గేయకావ్యం) మొదలైన గ్రంథాలు రచించారు. వీరికి ఆశుకవి కేసరి, అవధానదురంధర అనే బిరుదులున్నాయి. శతావధాన ప్రతిభా సంపన్నులైన వీరు 25కు పైగా గ్రంథాలు రచించారు. వీరు రచించిన శ్రీ కళాసిద్ధి అనే ఐదాశ్వాసాల విలక్షణ కావ్యానికి మూలం దేవీభాగవతం. సంప్రదాయానుగుణంగా రచనలు చేసినా వీరు వీరగ్రాంథికవాదులు కారు. వీరి కవిత్వంలో నన్నయ శ్రీనాథుల పోలికలున్నాయి. వీరి రచనల్లో చాలా పాఠ్యగ్రంథాలుగా ఉండటం విశేషం.

## దుర్గాప్రసాద వేంకట రమణ మల్లికార్జునరావు, కొప్పరపు :

వీరు కొప్పరపు కవుల సాహిత్య వారసత్వాన్ని పుణికిపుచ్చుకొన్నవారు.వీరి నివాసం గుంటూరుజిల్లా నరసరావుపేటతాలూకా కొప్పరము గ్రామం. వీరి తండ్రి వేంకటరమణకవి. వీరు శతావధానిగా ఆశుకవిగా ప్రసిద్ధులు. వీరు తమ పెదతండ్రి కుమారుడైన సీతారామ ప్రసాదరావుతో కలసి ఆశుకవితా ప్రదర్శనలు నిర్వహించి, అవధానాలు కూడా చేశారు. వీరు రచించిన కృషీవలుడు కావ్యంలో భారతదేశపు కృషీవలుల దుస్థితి, వారి ఔదార్యం, శౌర్యం మొదలైన అంశాలు ప్రసక్తమయ్యాయి. వీరి మరణానంతరం వీరి కృషీవలుడు కావ్యాన్ని వీరి భార్య కామేశ్వరీదేవి ముద్రించారు. ఈ కవిగారు 1917-1957 మధ్యకాలంలో జీవించారు.

## నరసింహకవి కొండముది :

వీరు 1859వ సంవత్సరంలో గుంటూరుజిల్లాలో బాపట్ల తాలూకా అప్పికట్ల గ్రామంలో శ్రీమతి శాయమాంబ శ్రీ అక్కయామాత్యుడు దంపతులకు జన్మించారు. వీరు పాంచాలీ స్వయంవరనాటకము, వత్సల నీలిశతకము, ఆత్మారామచరిత్రము, కలిచర్య ప్రహసనము, జగదీశ్వర శతకము దుర్జన భంజనీ శతకము, పాంచాలీ పరిణయము, భోజచరిత్రము, వేంకటేశ్వర శతకము, శ్రీ ఎడ్వర్డ్ చక్రవర్తి మొదలైన రచనలు చేశారు. అనేక అష్టావధానాలు చేశారు. పలు సభల్లో ఆశుకవితా ప్రదర్శనలు గావించారు. పురాణగాథలను హరికథలుగా రాసి ప్రచారం చేశారు. 1890-94 సంవత్సరాల మధ్య అముద్రిత గ్రంథ చింతామణి మయూఖాలలో బరిఖ, పరిఘాది శబ్దాల వివాద సందర్భంగా పలు వ్యాసాలు రచించారు.

## పల్నాటి సోదరకవులు :

కన్నెగంటి వీరభద్రాచార్యులు (1913) కన్నెగంటి ప్రభులింగాచారి వీరు పల్నాటి సోదరకవులుగా ప్రసిద్ధులు. గుంటూరుజిల్లా తక్కెళ్లపాడు (పల్నాడుప్రాంతం) దాచేపల్లిలో స్థిరనివాసంగా ఉన్న వీరు జంటగా కవిత్వం చెప్పి అష్టావధానాలు చేశారు.వీరభద్రాచార్యులు సవర్ణాంజలి, పేదరాలు, త్రివర్ణపతాకం, పార్వతి, పల్నాటి వీరచరిత్ర నాటకం రచించారు. వీరి రచనలపై కాల్పనికోద్యమ ప్రభావం ఉంది. వీరి సోదరులైన ప్రభులింగాచారిగారు జయప్రదనాటకం, తారాచంద్రము యక్షగానం, పాంచాలీ స్వయంవరం యక్షగానం, గయోపాఖ్యానం యక్షగానం రచించారు. వీరి రచనలు నీతిధర్మ ప్రబోధకంగా ఉన్నాయి.

## పింగళి కాటూరి కవులు :

పింగళి లక్ష్మీకాంతం కృష్ణాజిల్లా దివి తాలూకాకు చెందినవారు వీరి తల్లిదండ్రులు కుటుంబమ్మ, వెంకటరత్నం దంపతులు. పింగళి వారు 1894 జనవరి 10వ తేదీన జన్మించి 10-1-1972న మరణించారు.వీరు తిరుపతి వేంకటకవుల శిష్యులు.విద్వత్కవి. ఆంధ్ర వేంకటేశ్వర విశ్వవిద్యాలయాల్లో తెలుగు ఆచార్యులుగా పనిచేశారు.

కాటూరు వేంకటేశ్వరరావు గారు కృష్ణాజిల్లా కాటూరు గ్రామవాస్తవ్యులు. వీరు 15-10-1895న జన్మించి 1962లో మరణించారు. బందరు జాతీయ కళాశాల అధ్యక్షులుగా పనిచేశారు. పింగళి లక్ష్మీకాంతంగారితో కలసి జంటకవిత్వం రాయడమే కాకుండా అష్టావధాన, శతావధానాలు చేశారు. వీరు కేంద్రసాహిత్య అకాడమీ పక్షాన

'కావ్యమాల' సంకలనం చేవారు. పింగళి కాటూరి కవులు సౌందర నందము, తొలకరి కావ్యాల్ని రచంచారు. వీరు విడిగా కూడా రచనలు చేశారు. పింగళివారు ఆత్మలహరి, ఆంధ్ర సాహిత్య చరిత్ర, సాహిత్య శిల్ప సమీక్ష, తేజోలహరి, గంగాలహరి, అన్యాపదేశలహరి పేరుతో జగన్నాథ పండితరాయలు శ్లోకాల్ని పద్యరూపంలో అనువదించారు. కాటూరివారు 'పౌలస్త్యహృదయము' గుడిగంట నేను, మావాళ్లు, మా ఊరు అనే రచనలు చేశారు. వీరు వివిధ సందర్భాల్లో రచించిన 83 ఖండికల సంపుటి 'పన్నీటి జల్లు' పింగళి కాటూరి కవులు అవధానాలు చేసినా వీరు కవులుగానే బాగా ప్రసిద్ధులయ్యారు.

## పూర్ణచంద్రరావు కావూరి (1926-2007) :

కృష్ణాజిల్లా చింతలపూడి గ్రామంలో జన్మించిన వీరు మద్రాసు లయోల కళాశాలలో విద్యనభ్యసించారు. ఆంధ్ర లయోల కళాశాలలో తెలుగు అధ్యాపకునిగా, శాఖాధ్యక్షునిగా మూడున్నర దశాబ్దాలకు పైగా ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తించారు. అనేక అష్టావధానాలు చేసి 'అవధాన సరస్వతి' అనే బిరుదునుపొందారు. రాష్ట్ర రాష్ట్రేతర ప్రాంతాల్లో అవధానాలు చేసిన కావూరి వారి కలంనుంచి 'అంబ' అనే కావ్యం వెలువడింది. అలాగే భీష్ముడు కావ్యం కూడా రచించారు. వయసుపై బడిన తర్వాత కూడా అవధానాలు చేసి ప్రతిభామూర్తి వీరు.

## పూర్ణప్రజ్ఞాచార్యులు పల్లె (1897-1977) :

వీరు నెల్లూరుజిల్లా కోవూరు తాలూకాలోని సంగం గ్రామంలో 15-6-1897న జన్మించారు. వేదుల సూర్యనారాయణశాస్త్రి, నోరి సుబ్రహ్మణ్యశాస్త్రులవద్ద, వేమూరి రామబ్రహ్మం, దెందులూరి పానకాల శాస్త్రులవద్ద వివిధ విద్యలు అభ్యసించి గురువుల్ని మించిన శిష్యులుగా ప్రసిద్ధిపొంది గుంటూరులో స్థిరనివాసం ఏర్పరచుకొన్నారు. గుంటూరు టౌన్ హైస్కూలు, హిందూ కళాశాల, కె.వి.కె. సంస్కృత కళాశాలల్లో అధ్యాపకునిగా పనిచేశారు. వీరు అజాతశత్రువుగా ప్రసిద్ధులు. వీరు స్వయంగాను, కాశీకృష్ణాచార్యులతో జంటగాను అష్టావధాన, శతావధానాలు చేశారు. ఆశుకవితాప్రదర్శనలు గావించారు. కవిశేఖర, మహోపాధ్యాయ, విద్యాలంకార, సాహిత్యరత్న మొదలైన బిరుదుల్ని వీరు అందుకొన్నారు. వీరు శతాధిక గ్రంథాలు రచించినా 40 మాత్రమే ముద్రణకు నోచుకొన్నాయి. శ్రీరామకల్యాణము అనే పద్యకావ్యం వీరి తొలి రచన. 'కైకేయీ సౌశీల్యము' అనే పద్యకావ్యాన్ని కూడా వీరు రచించారు. వీరి అనువాద రచనల్లో కాదంబరి ఉత్తమమైంది. ఇంకా వీరు ద్విపద మేఘదూతం రాశారు. భాస నాటకాలకు అనువాదాలు చేశారు. వీరు రాఘవేంద్ర,జయతీర్థ, వాదిరాజు,వ్యాసరాయ, పూర్ణబోధ విజయకావ్యాలలో ద్వైతమత సిద్ధాంతాలకు కావ్యత్వం కల్పించారు. వీరి శాస్త్రగ్రంథాల్లో 'శతలక్షణి' ఉన్నత గ్రంథం. తిరుపతి వేంకటకవులకు వాద సందర్భంలో అనేకవిధాలుగా ఇది పనికివచ్చింది. ఈ మహాకవి పండితుడు 2-2-1977న పరమపదించారు.

## ప్రభాకరశాస్త్రి వేటూరు :

వీరు ఫిబ్రరి 7, 1888వ సంవత్సరం కృష్ణాజిల్లా పెదకళ్లేపల్లిలో సుందరశాస్త్రి, శేషమ్మలకు మూడవ సంతానంగా జన్మించారు. 16 ఏళ్ల వయసులో చెళ్లపిళ్లవారి శిష్యులుగా చేరారు. ఆ సమయంలో కొండా వెంకటప్పయ్య, న్యాయవాది వల్లూరి సూర్యనారాయణగార్లు ఆశ్రయమిచ్చారు. ఆ సమయంలోనే ఆయన అత్యంత పిన్నవయసులో శతావధానం చేసి ప్రసిద్ధికెక్కారు. వీరు ప్రసిద్ధ కవి, భాషా పరిశోధకులు, చారిత్రకవేత్త విమర్శకులు. తెలుగు సంస్కృతభాషల్లో పలు రచనలు చేశారు. శృంగార శ్రీనాథము రాశారు. క్రీడాభిరామము, బసవపురాణము రంగనాథరామాయణాలను పరిష్కరించారు. తంజావూరాంధ్ర రాజుల చరిత్ర, ప్రాచీనాంధ్ర శాసనాలు, శాతవాహనులు, ఇక్ష్వాకులు రెడ్డి రాజులపై చేసిన పరిశోధనలు తర్వాతి వారికి మార్గదర్శకాల య్యాయి. అన్నమయ్య రచనలు వెలుగులోనికి తెచ్చి ఈతరం వారికి పరిచయం చేశారు. ప్రతిమ, నాగానందనం, మత్తవిలాసం మొదలైన సంస్కృత నాటకాల్ని తెలుగులోనికి అనువదించారు.

## ప్రసాదరాయ కులపతి :

వీరు పోతరాజు వంశంలో శ్రీమతి స్వరాజ్యలక్ష్మి పురుషోత్తమ కవి దంపతులకు 23-1-1937న జన్మించారు. ప్రసాదరాయకుల పతిగా సాహిత్యలోకంలో ప్రసిద్ధులు. గుంటూరు హిందూ కళాశాలలో అనేక సంవత్సరాలు తెలుగు అధ్యాపకులుగా, ఆ తర్వాత ప్రధానా చార్యులుగా సేవలందించారు.

తెలుగునాట అవధాన సంచలనాన్ని కలిగించిన కొప్పరపు సోదర కవులు వీరి మాతామహులు. భువనవిజయం, ఇంద్రసభ, కైలాససభ, శ్రీనాథవిజయంలాంటి సభల నిర్వహణలో వీరిది అందెవేసిన చేయి. అనేక అష్టావధానాలు చేశారు. ఆశుకవితా ప్రదర్శనలు గావించారు. వేగంగా ఆశుకవితను చెప్పటంలో వీరికి వీరే సాటి. వీరు ఇంద్రసాహస్రి అంబికా సాహస్రి, శివసాహస్రి, రసవాహిని, రసగంగ, రాధాలహరి, గంధర్వగీతి, ఆనందమోహిని, కవిబ్రహ్మ, కావ్యకంఠ, కవిరాజు, మొదలైన రచనలు చేశారు. వీరికి ఆశుకవికేసరి, సరస్వతీకంఠాభరణ మొదలైన బిరుదులున్నాయి.

ప్రస్తుతం వీరు కుర్తాళం పీఠాధిపతులై సిద్ధేశ్వరానందభారతి పేరుతో ఆధ్యాత్మిక సేవలు అందిస్తున్నారు.

## యోగానంద కవి, చిల్లరిగె :

వీరు పశ్చిమగోదావరి జిల్లా సీసలిగ్రామంలోజన్మించినా కృష్ణాజిల్లా గుడ్లవల్లేరులో స్థిరపడ్డారు. శ్రీమతి శేషగిరమ్మ నరసింహారావు

దంపతులు వీరి తల్లిదండ్రులు. వీరు వృత్తిరీత్యా ఉపాధ్యాయులుగా ఉంటూసాహిత్య రంగం7 విశేష కృషి చేశారు. గంటకు వంద పద్యాలు ఆశువుగా చెప్పటం వీరి ప్రత్యేకత. అనేక అష్టావధానాలు, ఆశుకవితా ప్రదర్శనలు నిర్వహించి సాహిత్యాభిమానుల, పోషకుల మన్ననలందు కున్నారు.వీరికి చిత్రలేఖనంలోనూ పాండిత్యం ఉంది.వీరు బాలశతకం, బాలనీతి ద్విపద శతకం, యోగానందం రామాయణం, జ్ఞానవతి, కనకవల్లి, దేవయాని వివాహము, భాగవతకథావళి, పామర్తియష్టావ ధానము,సుబోధినీశతకము మొదలైన గ్రంథాలు రచించారు.వీరి రచనల్లో సామెతలు, లోకోక్తులు వీరి కవితలకు అదనపు ఆకర్షణగా నిలుస్తాయి.

## రాఘవ నారాయణశాస్త్రి, తాడేపల్లి (1895)

వీరు గుంటూరుజిల్లా, గోరంట్ల గ్రామంలో1895లో హనుమాయమ్మ, వెంకటప్పయ్య దంపతులకు జన్మించారు. వీరి తల్లిదండ్రులు చందోలు గ్రామంలో స్థిరపడ్డారు.వీరికి 12వ ఏట బాలా త్రిపురసుందరి మంత్రం ఉపదేశమైంది. దీన్ని నాలుగు సంవత్సరాలపాటు జపించారు. వీరికి 16వ ఏట సన్యసించాలనే కోరిక కలిగినా తల్లిదండ్రులంగీకరించలేదు. తండ్రిగారి దగ్గర సంస్కృతం, ముదిగొండ నాగలింగశాస్త్రిగారి వద్ద వ్యాకరణం, దెందులూరి పానకాలశాస్త్రిగారి వద్ద తర్కం, పరిమి నరసింహా వధానుల వద్ద వేదాధ్యయనం గావించారు. సాహిత్య రంగంలో అష్టావధాన, శతావధాన నేత్రావధానాలు గావించి తిరుపతి వేంకటకవుల ఆశీస్సులు అందుకున్నారు. తన తండ్రిగారిలాగే తాను విద్యార్థులకు దాదాపు 40 సంవత్సరాలపాటు ఉచిత భోజన వసతి ఏర్పాటుచేశారు. వీరికి కంచికామకోటి పీఠాధిపతుల ఆశీస్సులు కూడా లభించాయి.

## రాఘవాచార్యులు, బుక్కపట్నం :

వీరు 1880వ సంవత్సరం జన్మించారు. కృష్ణాజిల్లా నూజివీడుకు చెందిన వీరి తండ్రి శ్రీనివాసతాతాచార్యులు వీరు వ్యాకరణ విద్యా ప్రవీణులు. నూజివీడు, గోపాలపేట సంస్థానాల్లో సంస్కృతం, తెలుగు, ఇంగ్లీషు భాషల్లో అవధానాలు చేసి సత్కారాలు పొందారు. బలేచింతా మణి, సంగీత ఇంద్రసభ అనే నాటకాన్ని రచించారు. ఆంధ్రదేశ చరిత్రము, కువలయాశ్వవిజయము అనే రచనలు కూడా చేశారు.

## రాజమన్నారు కవి కారెంపూడి (1846-1917) :

వీరు ప్రకాశంజిల్లా పేరాల గ్రామంలో జన్మించారు. తర్వాత మహబూబ్‌నగర్‌జిల్లా ఆత్మకూరు సంస్థానంలో స్థిరపడ్డారు. చిన్నవయసు లోనే వీరు మాడభూషి వెంకటాచార్యులవద్ద అవధాన పద్ధతులన్నీ నేర్చుకున్నారు. తెలుగునాట వివిధ ప్రాంతాల్లో 78 అవధానాలు చేసి పలు సత్కారాలు అందుకున్నారు. వీరు "వీపూరు పాళెపు వివిధావధా నము, భగవన్నామ భాగవతము,కారెమ చేటి మాధవస్వామి శతకము, రాజవంశరత్నావళి,శృంగార జావళీలు,మహేశశతకము, మకకుండల విజయము, శ్రీకృష్ణలీలలు, సమస్యాశతకము, హరిశ్చంద్ర చరిత్రము హేలాపురీ కన్యకాపరమేశ్వరీ దండకము మొదలైన రచనలు చేశారు. ఆత్మకూరు సంస్థాన ప్రభువుల్లో రాజాముక్కరక సీతారామభూపాలుడు వీరిని బాగా ఆదరించారు.

## రామకృష్ణ సీతారామసోదరకవులు :

గౌరవజ్జల రామకృష్ణశాస్త్రి, (1902-1970) సీతారామశాస్త్రి (1904-1972) సోదరకవులు. వీరు మార్కాపురం ప్రాంతంలోని గజ్జలకొండ వాస్తవ్యులు. సీతమ్మ, సుబ్బరామయ్య వీరి తల్లిదండ్రులు. వీరు శతావధానులు.జంటగా కవిత్వం చెప్పారు. విద్వత్కవులు, సంఘ సంస్కర్తలు,గద్వాల, ఆత్మకూరు సంస్థానాలగౌరవాలను అందుకున్నారు. 1940కి ముందే అష్టావధానాలు, శతావధానాలు చేసి ఆంధ్రదేశ మంతటా సాహిత్య వీర విహారం చేశారు. 30 గ్రంథాలు రచించారు. సీతారామశాస్త్రి గజ్జలకొండలో ప్రాథమిక పాఠశాల, భారతఖాదీకేంద్రం గ్రంథాలయం నెలకొల్పారు. వీరి రామనిర్యాణ నాటకం బహు ప్రసిద్ధి పొందింది. వీరు గొప్ప నటులు. వీరి 'కాఫీపురాణం' హాస్యభరితం. వీరు పలు గ్రంథాలు పరిశీలించి 'రామకృష్ణీయము' అనే ధర్మశాస్త్ర గ్రంథాన్ని రాశారు. వీరు అవధానాల్లో చెప్పిన పద్యాల్ని సుమహారాలు పేరుతో ఖండకావ్యంగా ప్రచురించారు. వీరికి ఆంధ్ర విద్యావాచస్పతి విద్యాభూషణ మొదలైన బిరుదులున్నాయి.

## రామయ్య బందా :

వీరు గుంటూరుజిల్లా ఓడరేవు (చీరాల దగ్గర) గ్రామంలో 1-7-1903న జన్మించారు. వీరికి కవిభూషణ బిరుదు ఉంది. వీరు పండితకవులు. శతావధాని కాకినాడలో ప్రభుత్వోద్యోగిగా పనిచేశారు. వీరు రచించిన త్రివర్గం తమిళంలోని తిరుక్కురళ్‌కు అనువాదం. వీరి విజయవవీరకథానిక చారిత్రక నవల.వీరు కోదండ రామాయణం, రాజరాజేశ్వరీ శతకం, వేదాంత డిండిమము, సాయిబాబా చరిత్రము, ముద్రారాక్షసము తులసీదాసు హృదయము, వైనాడు చరిత్రము మొదలైన గ్రంథాల్ని రచించారు.

## రామస్వామిచౌదరి, త్రిపురనేని (1887-1943) :

వీరు కృష్ణాజిల్లా అంగలూరులో పండితకుటుంబానికి చెందిన చలమయ్య రామయ్య దంపతులకు 1887వ సంవత్సరం జనవరి నెల 1వ తేదీన జన్మించారు. తిరుపతి కవుల్లో ఒకరైన చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారి ప్రియశిష్యులై అవధానాలు చేసి ప్రసిద్ధిపొందారు. వీరి దేశభక్తికి ప్రతీకగా రాణాప్రతాప్ నాటకం రాశారు. ఇంగ్లండులో న్యాయవిద్యను అభ్యసించారు. తెనాలిలో స్థిరనివాసం ఏర్పరచుకొని

సాంఘిక, సాహిత్యసేవలు గావించారు. హేతువాద ఉద్యమాన్ని తెలుగు నాట బాగా ప్రచారం చేసిన వీరు 'కురుక్షేత్ర సంగ్రామము' అనే నాటకాన్ని రచించి తెలుగు నాట సంచలనం రేకెత్తించారు. పురాణాల్ని ఇతిహాస దృష్టితో పరిశీలించి "పిట్టకథలకు నివియెల్ల పుట్టినిండ్లు" అన్నారు. వీరు రాసిన శంబుకవధ, ఖూనీ అనే నాటకాలు సరికొత్త ఆలోచనలకు తెరతీశాయి. వీరి సూతపురాణం మరో ప్రసిద్ధకావ్యం. ఇంకా వీరు నూతన భగవద్గీత, కారెంపూడి కథనము, ధూర్తమానవ శతకము సూతాశ్రమ గీతాలు, కుప్పుస్వామి శతకము అనే రచనలు చేశారు. బ్రాహ్మణే తరులు, స్వసంఘ పౌరోహిత్యం చేసుకోగలిగేటట్లు 'వివాహవిధిని' రచించారు. వీరు తెనాలి పురపాలకసంఘ అధ్యక్షులుగా కూడా బాధ్యతలు నిర్వర్తించారు. విజయవాడలో వీరికి'కవిరాజు' బిరుద ప్రధానం జరిగింది. సంప్రదాయవాదుల్ని ఎదుర్కోవటానికి సంప్రదాయ ధోరణిలోనే పోరాటం సాగించిన ఈ కవిరాజు 16-1-1943న పరమపదించారు.

## రామబ్రహ్మం చేతవోలు :

వీరు 10-6-1948న శ్రీమతి రాధారుక్మిణి, సత్యనారాయణ మూర్తి దంపతులకు జన్మించారు. వీరి స్వగ్రామం పశ్చిమ గోదావరిజిల్లా నల్లజర్ల. అయినా వీరు ఎక్కువకాలం గుంటూరులోని కె.వి.కె. సంస్కృతకళాశాలలో అధ్యాపకునిగా, ఆచార్య నాగార్జున విశ్వవిద్యాల యంలో ప్రాచ్య భాషావిభాగంలో ఆచార్యులుగా పనిచేసి ఆ తర్వాత తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు కేంద్రీయవిశ్వవిద్యాలయాల్లో ఆచార్యునిగా బాధ్యతలు నిర్వర్తించి పదవీవిరమణ చేశారు.

వీరు కొత్త గోదావరి, ఆధునిక వేమనశతకం, శృంగారశ్రీకంఠం మొదలైన రచనలు చేశారు. వీరు రచించిన 'దేవీభాగవతానికి' కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. వీరు రాజీవ్ పురస్కారం కూడా అందుకొన్నారు. ఇంకా ఉత్తమ అధ్యాపక పురస్కారం అందుకొన్న వీరికి అవధాన సుధాకర అనే బిరుదు ఉంది.

బేతవోలు వీరు అనేక అష్టావధానాలు చేశారు. సమతా స్ఫూర్తితో వీరు అప్రస్తుత ప్రసంగాలకు ఇచ్చే సమాధానాలు నవ్వుల పువ్వులు పూయిస్తాయి. అవధానాల సంచాలకులుగా వీరు ఎంతో ప్రసిద్ధులు. తెలుగునాట జరిగిన శతావధాన, సహస్రావధాన, పంచసహస్రావధాన సభలకు సంచాలకత్వం వహించిన శారదా స్వరూపులు వీరు.

## లక్ష్మీనారాయణశాస్త్రి, చల్లా (1903-1968) :

వీరు గుంటూరుజిల్లా తెనాలి తాలూకా దంతలూరు గ్రామంలో శ్రీమతి లక్ష్మీనరసాంబ, సీతయ్య దంపతులకు 1903 జనవరి 7వ తేదీన జన్మించారు. వీరి విద్యాభ్యాసం కృష్ణాజిల్లాలోని లక్ష్మీపురంలో సాగింది. గుడివాడలో జంధ్యాల శివన్న శాస్త్రి గారి దగ్గర వీరు హిందీని ప్రత్యేకంగా అభ్యసించారు. తర్వాత చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి దగ్గర వ్యాకరణం, కవితా రహస్యాలు అవగతం చేసుకున్నారు. వీరు మచిలీపట్నం, చెంగల్పట్టుజిల్లా పొన్నేరి, సత్యవీడు ప్రాంతాల్లో తెలుగు పండితులుగా పనిచేశారు. కొంతకాలం గన్నవరం సంస్థానంలో పండితులుగా ఉన్నారు. వీరికి సంగీతంలోను ప్రావీణ్యం ఉంది. వీరు పలుచోట్ల అష్టావధానాలు చేసి కవితా విశారద మొదలైన గౌరవాలు పొందారు. వీరు మైథిలి, రణతిక్కన, మణిమేఖల, శతకాలంలో ఆణిముత్యాలు, పొగడపువ్వులు, దివ్యజ్యోతి, విశ్వజ్యోతి మొదలైన రచనలు చేశారు. వీరు రచించిన 'విరివాన' కావ్యానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం బహుమతి లభించింది. వీరు హిందీలో 'మోతియాంకాహార్' అనే పద్యకృతిని రచించారు. వీరు 1968వ సంవత్సరం డిసెంబరు 25న చెన్నైలో పరమపదించారు.

## లక్ష్మీకాంతం, బలిజేపల్లి (1881-1953) :

వీరు గుంటూరుజిల్లా బాపట్ల తాలూకా ఇటికంపాడులో 1881వ సంవత్సరం డిసెంబరు నెల 23వ తేదీన జన్మించారు. ఆదిలక్ష్మమ్మ, నరసింహశాస్త్రి దంపతులు వీరి తల్లిదండ్రులు. చిన్నతనంలోనే సంస్కృతాంధ్రాల్ని అభ్యసించి భారత భాగవత రామాయణాదిగ్రంథాల్ని అవగాహన చేసుకున్నారు. వీరికి సంగీతసాహిత్యాలలో అభిరుచి ఎక్కువ. బాలప్రాయంలోనే కవిత్వ విద్య వీరికి అలవడింది. వీరు కొంతకాలం సబ్‌రిజిస్ట్రార్ ఆఫీసులో హెడ్ గుమాస్తాగా ఆ తర్వాత హిందూ కళాశాల(గుంటూరు)లో ప్రధానోపాధ్యాయులుగా పనిచేశారు. తర్వాత అవధానాల్లో విశేషప్రజ్ఞ సంపాదించి ఉద్యోగాన్ని వదలి తెలుగుప్రాంతంలో ఉన్న వివిధ సంస్థానాల్నిదర్శించ అవధానాలు చేశారు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని రెండేళ్లు కారాగారవాసం అనుభ వించారు. వీరు రచించి 'సత్యహరిశ్చంద్రీయ' నాటకం తెలుగునాట ఇప్పటికీ ప్రదర్శించబడుతుంది. వీరి మంచి నటులుకూడా. రంగూన్‌లో ఆంధ్రుల ఆహ్వానం మేరకు 'హరిశ్చంద్రీయ' నాటకాన్ని ప్రదర్శించారు. చలనచిత్రాల కథలు,సంభాషణలు, పాటలు రాశారు. 1942లో చలన చిత్రసంఘం వారు వీరికి 'పుంభావసరస్వతి' బిరుదునిచ్చారు. ఇంకా వీరు శివానందల హరిశతకం, స్వరాజ్య సమస్య, బ్రహ్మరథం, మణి మంజూష, బుద్ధిమతీ విలాసం, ఉత్తరరాఘవం మొదలైన రచనలు చేశారు. వీరు 30-6-1953న అంతిమశ్వాస విడిచారు.

## వీరబ్రహ్మకవి శ్రీరామ్ :

వీరు కృష్ణాజిల్లా మచిలీపట్నంలోజన్మించారు. వీరి తండ్రి గంగయ్య వీరు విద్వత్కవి. సహస్రావధాని. ప్రధానంగా నాటకకర్త. సమకాలిక సమస్యల్ని ఇతివృత్తాలుగా తీసుకొని రచనలు చేశారు. రష్యా జపాన్‌ల యుద్ధం ఇతివృత్తంగా వీరు రచించిన జపానీయం పలు ప్రశంసలు పొందింది. వీరు రచించిన రచించిన చారిత్రకవాచకం 'తుఖారామ్'

ఆంధ్రసంస్థానాదీవుల చరిత్రను నానారాజ్యన్యచరిత్రము పేరుతో ఒక గ్రంథాన్ని రచించారు. డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ జీవితచరిత్రను ప్రపంచాపారుడు అనే పేరుతో గ్రంథాన్ని రచించారు. కుటుంబ నియంత్రణ ప్రచారం కోసం 'సంసారశోభ' అనే రచన చేశారు. ఇంకా వీరు చైనీయము, వాసంతి, భక్తామృతము, రత్నమాలా విలాసము, ప్రియదర్శిక, వినోదిని అనే రచనలు చేశారు. సహస్రావధాని, కవిరత్న, ఆంధ్రభాషావాచస్పతి అనేవి వీరి బిరుదులు. సహస్రావధానం చేసినా వీరు నాటకకర్తగానే ప్రసిద్ధులు.

## వీరరాఘవశాస్త్రి, గాడేపల్లి (1891-1945) :

వీరు కర్నూలు జిల్లా మార్కాపురం తాలూకా ఎర్రగొండ పాలెంలో 1891 ఏప్రియల్ 30న శివరాజు దీక్షితులు, సుబ్బమ్మ దంపతులకు జన్మించారు. బాల్యంలో తండ్రిగారి వద్ద సంస్కృతాంధ్రభాషలు, వేదాలు అధ్యయనం చేశారు. వీరు ఎన్నో అవధానాలు చేసి శతావధానిగా ప్రసిద్ధులయ్యారు. చమత్కార సంభాషణ, సమయస్ఫూర్తి, ఏకసంథా గ్రాహశక్తి వీరికి సహజంగా అబ్బిన ప్రత్యేక ప్రతిభలు. వీరు చమత్కార కవిత్వం, త్రిపురాంతకస్థల మహత్యం, శ్రీ సత్యవరలక్ష్మి ధ్రువచరిత్ర, అహోబల మహత్యం, మార్కండేయచరిత్ర హరికథ, రామభూపతి శతకం, విఘ్నేశ్వర శతకం, సోమేశ్వర శతకం, ఆర్యవిద్యా ప్రబోధిని అనే గ్రంథాలు రచించిప్రచురించారు. ఇంకా వీరి రచనల్లో సాంబలక్షణ (శృంగార కావ్యం) హైమవతీకావ్యం, భూ గంగాస్తుతి, కుమార సుబ్రహ్మణ్య చరిత్ర, ఐరావత వ్రత కథ, మెదక్ సంస్థానాధిపులచరిత్ర అనేవి అముద్రితాలుగా ఉన్నాయి. బహుముఖప్రజ్ఞాశాలియైన వీరు 1945వ సంవత్సరం మార్చినెల 5వ తేదీన పరమపదించారు.

## వేంకటరత్నకవి కొప్పరపు :

వీరు గుంటూరుజిల్లా నరసరావుపేట తాలూకా కొప్పరము గ్రామంలో తిరుమలాంబ, నరసింహశర్మ దంపతులకు 1892లో జన్మించారు. వీరు వారస్తవంగా వచ్చిన ఆశుకవితా ప్రతిభను ప్రదర్శిస్తూ అష్టావధానాలు చేయటంలోను ప్రసిద్ధులయ్యారు. వినుకొండ తాలూకా ముప్పాళ్లలోని బోర్డు హైస్కూలులో ఉపాధ్యాయులుగా పనిచేశారు. వీరి పద్యరచన దీర్ఘసమాసాలతో ప్రౌఢంగా ఉంటుంది. ఈ కవి శాంభవీశతకము, రామదండకము మొదలైన రచనలు చేశారు.

## వేంకటరత్నశాస్త్రి, చించినాడ :

వీరు 1891లో కృష్ణాజిల్లా బందరులోని చింతగుంటపాలెంలో శ్రీమతి రామమ్మ శ్రీ లింగయ్య దంపతులకు జన్మించారు. వీరి అవధాన నైపుణ్యం అపారమైంది. ధారణాశక్తి అసాధారణమైంది. పలు సంస్థానాల్లో తన కవితాశక్తిని, పాండిత్య పటిమను ప్రదర్శించి సన్మానాలు అందుకొన్నారు. వీరి రచనలు భక్తి తత్త్వాన్ని ప్రతిబింబిస్తాయి. ఆంధ్రీకృత సప్తశతి, నాగేశ్వర శతకము, దుర్గాశతకము, శ్రీరాఘవాశ్వమేథి నాచికము, సుశ్యామ మొదలైన రచనలు చేశారు. వీరు తమ జన్మస్థలాన్ని "బృందావన పురాంతర్గత వింత్రిణీగర్తపురం" అని చెప్పుకోవటం విశేషం.

## వెంకటస్వామి గుప్త, దోమా (1899-1962) :

వీరు కర్నూలులో శ్రీమతి కోటమ్మ, గోవిందశెట్టి దంపతులకు 1899లో జన్మించారు. వీరు శతాధికగ్రంథకర్తలు. వీరి పితామహులు వెంకన్న గద్వాల సంస్థానంలో రాజసన్మానం పొందారు. తిరుపతి వేంకటకవులు వీరి విద్యాగురువులు. వీరు అనేక అవధానాలు చేశారు. ప్రతి అవధాన ప్రారంభంలో గురుస్తుతి చేసేవారు. 11 సంవత్సరాల ప్రాయంలో కవిత చెప్పటం మొదలుపెట్టారు. చెళ్లపిళ్లవారివద్ద అవధాన విద్యారహస్యాల్ని ప్రత్యేకంగా అభ్యసించారు. వీరు కంచి, కోవెలకుంట్ల, మద్రాసు, పెరంబూరు, విజయవాడమొదలైన ప్రాంతాల్లో తెలుగుపండితునిగా, ఆంధ్రోపన్యాసకునిగా పనిచేశారు. వీరు కర్నూలు, కావలి, గుంటూరు, చిత్తూరు, తెనాలి, ధర్మవరం, పెనుగొండ, బళ్లారి, మద్రాసు మొదలైన ప్రదేశాల్లో ఆశుకవితా ప్రదర్శనలు అవధానాలు గావించారు. అనంతపురం, కర్నూలు, వేటపాలెం మొదలైన ప్రాంతాల్లో శతావధానాలు కడప, కర్నూలు, అనంతపురం, ద్రోణాచలం, నెల్లూరు, బెంగుళూరు, సత్తెనపల్లి, సికింద్రాబాదు మొదలైన ప్రాంతాల్లో మూడు వందలకు పైగా అష్టావధానాలు చేశారు. వీరు 2-2-1938న మహాత్మాగాంధీ కలసి అవధాన విద్యను గూర్చి చెప్పగా వారు ఇలాంటి ప్రతిభాశారదోపాసన వల్లనే సాధ్యమవుతుందన్నారట. వీరు తారాశశాంకము, శ్రీకన్యకాపురాణము, శ్రీ మహాత్మాగాంధీ శతకము, గుంటూరు చీరాల, జాంద్రపేట మొదలైన ప్రాంతాల్లో జరిగిన అవధాన సంపుటాలు అసంఖ్యాకంగా ప్రచురించాయి. వీరికి బాలకవిశిఖామణి, ఆంధ్రవిద్యావాచస్పతి, సాహిత్యసరస్వతి, ఆశుకవితల్లజ, కవిభూషణ మొదలైన బిరుదులున్నాయి. వీరు 13-2-1962న గుంటూరులో పరమపదించారు.

## వేంకటేశ్వరరావు, మంచికంటి :

వీరు 19వ శతాబ్ది ఉత్తరార్థంలో జన్మించారు. వీరు గుంటూరు జిల్లా సంతగుడిపాడు వాస్తవ్యులు. పండితకవిగా, అష్టావధానిగా ప్రసిద్ధులైన వీరు సమకాలిక సమస్యల్ని ఇతివృత్తాలుగా గ్రహించి తను ప్రబోధించే రీతిలోసాగాయి. వీరు వివాహవిచ్ఛేదము, పృథ్వీరాజు, పురూరవ, రుద్రమదేవి, ప్రేమలీల, నేతాజీ భారతము, వేంకటేశ్వర మహాత్మ్యము, రుక్మిణీ సందేశము, శ్రీకృష్ణమనశ్శాంతము అనే రచనలు చేశారు. వీరికి జాతీయ మహాకవి అనే బిరుదు ఉంది. వీరు ద్వ్యర్థి ఖండ కావ్యాలు కూడా రచించినట్లు తెలుస్తున్నది.

## వేంకటకృష్ణ కవి కార్యంపూడి :

వీరు 1872లో గుంటూరుజిల్లాలోని పేరాలలో జన్మించారు. పున్నమాంబ, వేంకటసుబ్బారాయుడు వీరి తల్లిదండ్రులు. వీరు శతావధాని. గద్వాలసంస్థానంలో ముకుంద విలాస కావ్య పరీక్షలో ఉత్తీర్ణులై పండిత ప్రశంసలు పొందారు. వీరు దిలీపచరిత్రము, సర్వ మంగళ శతకము అనే రచనలు చేశారు. వయోజన విద్య సంఘ సంస్కరణ వీరికి ఇష్టం. పేరాలలో మార్కండేయ గ్రంథాలయ స్థాపనలో వీరి పాత్ర చిరస్మరణీయమైంది. కార్యమపూడి రాజమన్నారు కవి వీరికి చిన్నాన్న. ఆయన వారసత్వంతో విశిష్ట పద్యరచనా ప్రతిభులై శతావధానిగా కీర్తినందుకొన్నారు.

## వేంకటప్పారావు పంతులు, నందగిరి :

వీరు కృష్ణాజిల్లా అంగలూరులో 19-8-1968న జన్మించారు. శేషమాంబ నరసింహులు వీరి తల్లిదండ్రులు, వీరు అష్టావధాని. కురుపాం సంస్థానాధీశుల దర్బారులో జరిగే సాహిత్య చర్చల్లో పాల్గొని విశేషంగా సన్మానాలు అందుకొన్నారు. వీరు 25 గ్రంథాలు రచించినట్లు తెలుస్తున్నది. వీరు శ్రీమద్రామాయణాద్భుతోత్తర కాండము, ఆంధ్ర మేఘసందేశము, నిర్గద్యచతురముఖీ విలాసము, మైరావణ చరిత్ర గంగిరెడ్డు, శుద్ధాంధ్ర భీమసేన విజయము, బాలతొడమ, సీతారామ, గోపికా ప్రియ, చండమార్తాండ,దీనసంరక్షణ,రామలింగేశ్వర, శ్రుతశైల, హనుమత్‌శతకాలు, విప్రపురి ఆదికేశవసీసశతకము, బ్రహ్మపుత్రాభ్యుదయము మొదలైన రచనలు చేశారు.

## వేంకటశాస్త్రి ఉప్పల :

వీరు 10-12-1902న కర్నూలుజిల్లా మార్కాపురం తాలూకా ముడివేముల గ్రామంలో శ్రీమతి ఈశ్వరమ్మ, సింహాద్రి నృసింహ కవి దంపతులకు జన్మించారు. వీరు శతావధాని. గద్వాల మహారాణి ఆది లక్ష్మమ్మగారి నుంచి విశేష సత్కారాలు అందుకొన్నారు. భారతం లోని కథల్ని ఆధారంగా చేసుకొని ఎక్కువగా రచనలు చేశారు. 'కుమార విలాసం' వీరి ప్రసిద్ధ రచన. 'ఖండభారతం' అనే రచనచేసి మహారాణి ఆదిలక్ష్మమ్మగారి నుంచి విశేష సత్కారాలు అందుకొన్నారు. భారతం లోని కథల్ని ఆధారంగా చేసుకొని ఎక్కువగా రచనలు చేశారు. 'కుమార విలాసం' వీరి ప్రసిద్ధ రచన. 'ఖండభారతం' అనే రచన చేసి మహారాణి ఆదిలక్ష్మమ్మగారికి అంకితం చేశారు. శ్రీకృష్ణరాయబార వృత్తాంతాన్ని 'విశ్వజ్యోతి' అనే పేరుతో గ్రంథాన్ని రచించారు. ఇంకా వీరు రచించిన 'ఉత్తర' ఖండకావ్యం ఆలోచింపదగిన రీతిలో ఉత్తర తన భర్త చావుకు కారకులైనవారిని గూర్చి వ్యక్తంచేసిన అభిప్రాయాలున్నాయి. వీరు శ్రీరామవిలాసము, శ్రీశైల మహత్యము, బాలబ్రహ్మేశ్వరస్తోత్రము, శ్రీకృష్ణగీ, జయదేవచరితము, చెంచులక్ష్మి నాటకం, వసంతసేన మొదలైన రచనలు చేశారు. వీరికి అభినవ ఉభయకవిమిత్ర, కవి భూషణ, కవికోకిల, మొదలైన బిరుదులున్నాయి. వీరు 30-6-1978న పరమపదించారు.

## శరభాచార్యులు, పులివర్తి (1912-1980) :

వీరు తెనాలి తాలూకా కొల్లూరులో 1912లో శ్రీమతి శేషమ్మ, నాగభూషణం దంపతులకు జన్మించారు.ప్రభుత్వవిద్యాశాఖలో ఉద్యోగిగా ప్రవేశించి విద్యాశాఖాధికారిగా పదవీవిరమణ చేశారు. బాల్యంనుంచే వీరికి తత్త్వానందుల శిష్యత్వం భాగ్యం అలవడింది. చిన్ననాటనే కవిత్వం చెప్పటం మొదలుపెట్టారు. వీరు తెలుగులో కల్హారమాల, రత్నగర్భ, కర్మభూమి మొదలైన కావ్యాలు రచించారు. సంస్కృతంలో నివేదనమ్, మరుత్సందేశః యశోధరా అనే కావ్యాల్ని, కలాదర్శః అనే నాటకాన్ని రచించారు. విద్యాశాఖ అధికారిగా ఉన్నా, వీరు అవధాన విద్యలో మెలకువలు గ్రహించి శతాధికంగా అవధానాలు చేశారు. గణిత ప్రక్రియకు ప్రాముఖ్యం గొన్న ఒక కొత్తరకమైన అవధానాన్ని కూడా కనిపెట్టి కవితా గణితావధాన శేఖర అనే బిరుదు పొందారు. వీరి అవధాన విశేషాలు, పద్యాలు సంకలితాలై 'అవధాన వాణి' అనే సంపుటంగా ప్రకటితమయ్యాయి. అతి నిరాడంబరంగా ఆధ్యాత్మిక చింతనతో కాలం గడిపిన వీరు 1980వ సంవత్సరం సెప్టెంబరు 8వ తేదీన అంతిమశ్వాస విడిచారు.

## శ్యామలానంద ప్రసాద్ పాలపర్తి డా॥ శ్యామనందప్రసాద్ పాలపర్తి:

గుంటూరుజిల్లా పొన్నూరులో వీరు 1957వ సంవత్సరం అక్టోబరు 3న జన్మించారు. రాష్ట్రరాష్ట్రేతర ప్రాంతాల్లో విదేశాల్లో అష్టావధాన ద్విగణిత, చతుర్గణిత అష్టావధానాలు చేశారు. ఏకదినం సంస్కృతాంధ్ర శతావధానం చేశారు. ఆశుకవితా ప్రదర్శనలు గావిస్తూ సహృదయులు మన్ననలు అందుకొన్నారు."కాశీసారం రాసి కాశీకవిగావీరు ప్రసిద్ధులు. అష్టావధాన కళాసరస్వతి, శతావధాన శేఖర మొదలైన బిరుదులందు కొన్నారు.తెలుగు విశ్వవిద్యాలయం వారి పురస్కారం,ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉగాది పురస్కారం అందుకొన్నారు. ధర్మవ్యాధుని కథ ఆధారంగా వీరు రచించిన 'దర్మభిక్ష' ఖండకావ్యం సహృదయుల మెప్పులు పొందింది. వీరు పద్మవంశి, జైనధర్మశతకం, వెంకయ్యస్వామి జీవితచరిత్ర రచించారు. కాశీవిశ్వేశ్వ రునిపై సుప్రభాతం సంస్కృతంలో రాశారు.

పంచారామ శివసుప్రభాతం కూడా రచించారు. అచ్చతెనుగులో అవధానం చేయటం వీరి ప్రత్యేకత. తెలుగునాట అచ్చతెనుగులో అవధానం చేస్తున్న ఏకైక అవధాని శ్యామలానంద ప్రసాద్‌గారు.

**నివాసరంగేశ్వరశర్మ, పెళ్లూరు :**

వీరు గుంటూరు జిల్లా బాపట్లలో జన్మించి నరసరావుపేటలో స్థిరపడ్డారు. వీరు 1894లో జన్మించినట్లు తెలుస్తున్నది. వీరి తండ్రి శేషయామాత్యుడు. ఆశుకవిత్వంలో దిట్ట అయిన శర్మగారు మద్రాసు మొదలైన నగరాల్లో అష్టావధానాలు, శతావధానాలు చేశారు. తెలుగు, సంస్కృతం,ఇంగ్లీషు భాషల్లో ప్రవీణులైన వీరుప్రభుత్వఉద్యోగం చేస్తూనే సాహితీసేవ గావించఅలిరు. వీరు నరసరావుపేట తాలూకా చేజర్లలోని కపోతేశ్వరాలయాన్ని దర్శించి 114 పద్యాల రచనగావించి 'శీకపో తేశ్వరీయము' అని పేరుపెట్టారు. వీరు రచించిన సంగీతకు ముదవల్లి కరుణరస పూరితంగా ఉంది. వంగవోలు రాజులైన మంద పాటివారి చరిత్రను తెలిపే రామచంద్రీయము రౌద్రరసపూరితంగా ఉంది. ఇంకా వీరు ధర్మవిజయము, భావనా భద్రావతీయము అనే నాటకాల్ని కూడా రచించారు. వీరి నాటకాల్లో పార్శీ నాటకాల ఛాయలున్నాయి. పాటలకు హిందూస్తానీ మట్లు వాడారు.పద్యరచనలో పంచచామరం, ధ్రువకోకిల లాంటి వృత్తాలు రచించారు. వీరికి కవిరత్న అనే బిరుదు ఉన్నది.

**శ్రీరామ నరసింహమూర్తి కవులు :**

గంధం శ్రీరామమూర్తి, ఇర్రింకి నరసింహమూర్తి కలసి శ్రీరామ నరసింహమూర్తి కవులుగా ప్రసిద్ధులు. వీరు శతావధానులు, బహుగ్రంథ కర్తలు గద్వాల ప్రభువైన కృష్ణరామభూపాలుని సంస్థానాస్థాన కవులు (1946) శ్రీరామనరసింహగ్రంథరత్నమాల నిర్వాహకులు. వీరు రచించిన శ్రీమదాంధ్ర మహాభాగవతం ఐదు సంపుటాలుగా ప్రచురిత మైంది. అనేక సంస్కృత గ్రంథాల్ని అనువదించిన వీరు సమకాలిక వృత్తాంతాల్ని కూడా గ్రంథస్థం చేశారు. వీరి చాటువులు, శతావధాన పద్యాలు చాలా ప్రసిద్ధిపొందాయి.వీరి రచనాశైలి ప్రౌఢంగా ఉంటుంది. వీరు మణిరత్నమాల, తేటగీత భగవద్గీత, మహాభారత యుద్ధము, తీర్థయాత్రా ప్రదర్శన, పుష్పబాణవిలాసము, యదార్థరామాయణము, బాపూజీ సూక్తిరత్నావళి, మహాత్మాగాంధీ, ఆశ్రిత పారిజాతశతకము మొదలైన రచనలు చేశారు.

**శివరామశాస్త్రి, వేలూరి (1892-1967) :**

వీరు కృష్ణాజిల్లాలోని చిరివాడ అగ్రహారంలోనివిద్వత్ కుటుంబంలో 9-4-1892న జన్మించారు. విశాలాక్షి, వేంకటేశ్వరావ ధానులు వీరి తల్లిదండ్రులు. తిరుపతి వేంకటకవులు వీరి కవితాగురువులు. స్వయం కృషితో వీరు ఆంగ్లంలోను పాండిత్యాన్ని సాధించారు. 18 సంవత్సరాల వయసులో గుంటూరులో సంపూర్ణ శతావధానం గావించిన విశేష ప్రతిభాసంపన్నులు వీరు. వీరు గాంధీ, రవీంద్రనాథఠాగూర్, అరవింద యోగుల ప్రభావాన్ని పొందారు. వీరి సాహిత్యం కొత్త పాదత మేలుకల యికలకు దిక్సూచిగా ప్రసిద్ధిపొందింది. పురాణాలు, ప్రబంధాలు, లఘుకావ్యాలు, ఖండకృతులు వీరు వెలియించారు. వీరు రచించిన కథలు కథాషట్కము, కథాసప్తకము అనే సంపుటాలుగా వెలువడ్డాయి. వీరి రచనల్లో జాతీయోద్యమాన్ని ప్రతిబింబించిన నవల 'ఓబయ్య' వీరు బాపనపిల్ల, అరక్షణీయ, మార్గప్రదర్శనం అనే నవలల్ని బెంగాలీ నుంచి అనువాదం చేశారు. గుజరాతీ మాతృకనుంచి మహాత్ముని ఆత్మకథను ఆంధ్రీకరించారు. భూగోళ, ఖగోళ, సాంఖ్య, యోగ, తర్క, వేదాంతాది శాస్త్రాల్లో వీరికి అభినివేశం ఉంది. వీరు శతాధికంగా 'భారతి' పత్రికలో వ్యాసాలు రచించారు. ఫ్రెంచి, స్పానిష్ భాషలనుంచి కూడా వీరు అనువాదాలు చేశారు. ఈ సాహితీమూర్తి 1967వ సంవత్సరం మార్చినెల 17వ తేదీన అంతిమశ్వాస విడిచారు.

**శేషాద్రి రమణ కవులు :**

దూపాటి శేషాచార్యులు (1890-1940)

దూపాటి వెంకటరమణాచార్యులు (1893-1963)

వీరు సోదరులు. జంటకవులు. వీరు గుంటూరుజిల్లా వాడరేవులో శ్రీమతి లక్ష్మమ్మ రంగాచార్యులు దంపతులకు మూడవ, నాల్గవ సంతానంగా జన్మించారు. వీరిద్దరూ శేషాద్రి రమణకవులుగా ప్రసిద్ధులై అవధానాలు చేసి కావ్యనాటకాలు రచించి ప్రాచీన తాళపత్రగ్రంథాలు శాసనాలు,నాణేలు సేకరించి సాహిత్య, సాంస్కృతిక సేవ గావించారు. తిరుపతివేంకటకవుల,కొప్పరపు సోదరకవుల కవితాస్పర్ధల ప్రభావంతో శేషాద్రి రమణకవులు అవధానాలు చేశారు. ఈ సోదరకవులు అవధానాల్లో చెప్పిన పద్యాలు, ఆశుకవితలు, కనుమరుగైనా, ఇరువురు కలిసి రచించిన పద్యాలు వందకు మించకపోయినా వెంకటరమణాచార్యులు ఒక్కరే రచించిన అర్థశత గ్రంథాలను ఇద్దరి పేరుతో ప్రకటించటం మెచ్చుకోదగిన విషయం. వీరు పలు గ్రంథాలు పరిష్కరించారు. అర్జున పరాభవం, పాపరాయనిర్యాణం వీరి ప్రసిద్ధ నాటకాలు. ఇంకా వీరి పద్యకృతుల్లో బోధామృతం, సూర్యశతకం, నీతి గీతములు, ఋతుసంహారం పేర్కొనదగినవి. కొండపల్లి ముట్టడి, వసుంధర అనే

చారిత్రక నవలల్ని కూడా వీరు రచించారు. తెలుగునాట పద్యరచన, పరిశోధనగావించిన సోదరకవులుగా ప్రసిద్ధిపొందటం వీరి ప్రత్యేకత.

## శ్రీరాములు, దాసు (1846-1908) :

వీరు కృష్ణాజిల్లా కూరాడ గ్రామంలో శ్రీమతి కామమ్మ కన్నయ్య దంపతులకు 8-4-1846న జన్మించారు. పదేళ్లకే సంస్కృతాంధ్రాల్ని అభ్యసించి జ్యోతిశ్శాస్త్రాన్ని కూడా కొంత నేర్చుకున్నారు. తన 12వ ఏటనూజివీడు సంస్థానంలో అష్టావధానం చేసి జమీందారుగారి సత్కారాన్ని అందుకున్నారు. ఇరవైఏళ్లకే తర్క వ్యాకరణ, సంగీత, సాహిత్య వేదాంతాల్లో పాండిత్యాన్ని సాధించారు. దోకిపర్రులో ఒక విద్యాలయాన్ని స్థాపించారు. న్యాయశాస్త్రం చదివి న్యాయవాదవృత్తిని చేపట్టారు. కవుల్ని పండుతుల్ని తరచుగా సన్మానించేవారు. వీరు దేవీ భాగవతం, శాకుంతల (అచ్చతెలుగులో) ఉత్తర రామచరితము, ముద్రారాక్షసము మొదలైన అనువాదాలు చేశారు. వీరు రచించిన 'తెలుగునాడు' పరమరమణీయకావ్యం. ఆ కాలంనాటి అనేక సామాజి కాంశాలు ఈ కావ్యంలో ప్రతిబింబించాయి. అసాధారణ మేధావియైన ఈ కవిగారు 1908వ సంవత్సరం, మే నెల 16వ తేదీన పరమపదించారు.

## సుబ్రహ్మణ్యశాస్త్రి, అవ్వారి (1895-1935) :

వీరు 1895 వ సంవత్సరంలో శ్రీమతి మహాలక్ష్మమ్మ రామయ్య దంపతులకు జన్మించారు. వీరి నివాసంగుంటూరుజిల్లాలోని కొమ్మూరు గ్రామం. వీరికి తర్క వ్యాకరణ, అలంకార, వేదాంతాల్లో అపారమైన పాండిత్యం ఉంది. వీరు సంస్కృతాంధ్ర భాషా ప్రవీణులు. కవితా రచనలోఅందెవేసిన చేయి కాబట్టి వీరుఅష్టావధానాలు, శతావధానాలు, ఆశుకవితాప్రదర్శనలు గావించారు. కొంతకాలం వీరు తమ మేనల్లుడైన రాయప్రోలు సుబ్బారావుగారితో కలసి జంటగా అవధానాలు, ఆశుకవితా ప్రదర్శనలు గావించారు. దైవబలము, కావ్యనాటకాది పరిశీలనము, మేఘుడు, సీతజీవితము, ఆంధ్రభాషా విలాసము, దుష్యంత చరితము, శ్రీరామ మహాసామ్రాజ్య పట్టాభిషేకము, గౌతమీ పుష్కరమహిమ, తెలుగు కావ్యాలోకము, ఆంధ్ర ధ్వన్యాలోకము మొదలైన గ్రంథాలు రచించారు. వీరు సంస్కృత నాటకాలు కూడా రచించారు. ఎన్నో శతావధానాలు స్వయంగా గావించిన ఈ మహాపండితుడు 1935లో కన్నుమూశారు.

## సుబ్రహ్మణ్యశాస్త్రి, జంధ్యాల :

వీరు 20వ శతాబ్ది పూర్వార్థానికి చెందినవారు. కృష్ణాజిల్లా కలువపాముల వీరి జన్మస్థలం. గద్వాలలో స్థిరపడ్డారు. గద్వాల సంస్థానకవి. అవధాన విద్యలో నిష్ణాతుడు. సహస్రావధానాలు చేసేవారు. వీరి కొల్హాపుర సహస్రావధానాలు ప్రసిద్ధమైనవి. వీరి రచనలు వేదాంత పరంగా ఉంటాయి.వీరు ఆంధ్రుల చరిత్ర, ఆంధ్రసామ్రాజ్యము, రత్నలక్ష్మీ శత పత్రము, ఈశావాస్యోపనిషత్తు, కేనోపనిషత్తు, కఠోపనిషత్తు, వేదాంత పంచదశి, మొదలైన రచనలు చేశారు. వీరికి సహస్రావధాన చతురానన, పంచసహస్రావధాని అనే బిరుదులున్నాయి. సావిత్రి కామేశయ్య వీరి తల్లిదండ్రులు.

## సుబ్బారావు కొప్పవరపు (1896-1955) :

వీరు గుంటూరు మండలంలోని కొప్పరపు అగ్రహారీకుల కవి పండితవంశంలో 29-4-1896న జన్మించారు. బాల్యంనుంచి వీరికి చదువు, నాటకాలపై ఆసక్తి ఉండేది.వంశానుగతంగావచ్చిన పద్యవిద్యా ప్రతిభతో వీరు 14వ ఏట వినుకొండలో అష్టావధానం చేయటం విశేషం. కొంతకాలం గుంటూరు ప్రభుత్వ పాఠశాలల్లో ఉపాధ్యాయునిగా విద్యార్థుల్ని తీర్చిదిద్దారు. వీరు నాలుగు ద్రావిడ భాషలతో పాటు సంస్కృతం, పార్శీ, హిందీ, ఉర్దూ, బెంగాలీ, మరాఠీ భాషలు నేర్చుకున్నారు. ఉపాధ్యాయవృత్తికి రాజీనామా చేసి బెంగుళూరులోని "హిజ్‌మాస్టర్స్ వాయిస్"లో సంగీతదర్శకునిగా చేరారు. 'నమోహిందు మాతా' వంటి గేయాల్ని రికార్డు చేశారు. ఇంకా చండిక, కృష్ణలీలలు, చదువుకొన్న భార్య మొదలైన చిత్రాలకు నాటకరంగ అభివృద్ధికోసం విదేశాలనఉరించి వీరు తెప్పించిన పరికరాలు వీరి మరణానంతరం ఆంధ్రవిశ్వకళాపరిషత్ నాటకవిభాగానికి అందజేయబడ్డాయి. వీరికి బళ్లారి రాఘవ, కొంగరజగ్గయ్య, కె.వి. గోపాలస్వామి, గరికపాటి రాజారావు, పి.విరాజమన్నారు మొదలైనవారు ఆత్మీయమిత్రులు. ఈ విశిష్ట ప్రతిభాసంపన్నుడు 5-5-1955న పరమపదించారు.

## సుబ్బారావు, రాయప్రోలు (1892-1984)

వీరు గుంటూరుజిల్లా బాపట్ల తాలూకాలో17-3-1892న జన్మించారు. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వానికి కొంతకాలం పనిచేశారు. 1914లో శాంతినికేతనం చేరి రవీంద్రుని శిష్యునిగా చదువుసాగించారు. విద్యావతి, విదుషీమణి అయిన పినతల్లి అనసూయమ్మగారిచేత ప్రభావితులై స్త్రీని మాతృమూర్తిగా దేవతామూర్తిగా భావించారు. మొదట కొంతకాలం మేనమామ శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారితో కలసి ఆశుకవిత్వం చెప్పి అవధానాలు కూడా చేశారు. ఆశు కవితలు అవధానాలవల్ల ఉత్తమ శ్రేణి కవిత్వం వెలువడే అవకాశం లేదని ఆశుకవితాసన్యాసం స్వీకరించి కావ్యరచనలు గావించి భావకవితా పితామహులుగా ప్రసిద్ధి పొందారు.

ఉమర్‌ఖయ్యాం రుబాయిల్ని మధుకలశం పేరుతో అనువదించారు. ఇంకా గోల్డ్‌స్మిత్ రచించిన హెర్మిట్ కావ్యాన్ని 'లలిత' పేరుతో టెన్నిసన్ 'డోరా'ను అనుమతి పేరుతో అనువదించారు. వీరు స్వతంత్రంగా తృణకంకణం, కష్టకమల, స్నేహలత, స్వప్నకుమారము రచించారు. వీరి రచనల్లో 'ఆంధ్రావళి' జడకుచ్చులు, వనమాల, మిశ్రమంజరి ప్రసిద్ధమయ్యాయి. మిశ్రమంజరికి కేంద్రసామిత్య అకాడమీ అవార్డు లభించింది. వీరు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఆచార్యులుగా పనిచేశారు. దేశభక్తి కవిత్వాన్ని విరివిగా రచించిన ఈ కవి 30-6-1984వ కీర్తిశేషులయ్యారు.

**హనుమంతరావు భట్టిప్రోలు (1924-1993) బి.యస్.యల్. హనుమంతరావు:**

వీరు గుంటూరుజిల్లా దోనేపూడి గ్రామంలో 4-1-1924న జన్మించారు. వీరి బాల్యం విద్యాభ్యాసం మూల్పూరు, తురిమెళ్ల తెనాలి, ప్రాంతాల్లో జరిగింది. గుంటూరులో కళాశాల విద్యను అభ్యసించిన వీరు కర్నాటక విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేట్ పొందారు. 1946లో ఉన్నత పాఠశాల ఉపాధ్యాయునిగా జీవితాన్ని ప్రారంభించి తెనాలి, కూచిపూడి ప్రాంతాల్లో పనిచేశారు. ఆ తర్వాత హిందూకళాశాలలో చరిత్ర శాఖలో అధ్యాపకులుగాశాఖాధ్యక్షునిగాబాధ్యతలు నిర్వర్తించారు. కళాశాలలో పదవీ విరమణ చేసిన తర్వాత 1983-1987 సంవత్సరాల బిలో ఆచార్య నాగార్జున విద్వవిద్యాలయం మహాయాన బౌద్ధ పీఠానికి ఆచార్యులుగా నియమితులయ్యారు. వీరు ఆంధ్రలో సామాజిక చలనం, విజయవాణి (ఆకాశవాణి ప్రసంగాల సంపుటి) ప్రణయాంజలి అనే గ్రంథాలు రచించారు. వీరు మెట్రిక్, ఇంటర్, డిగ్రీ తరగతులకు పాఠ్య పుస్తకాలు రచించారు. వీరు రచించిన ఆంధ్రుల చరిత్ర ఇప్పటికి 14 ముద్రణలకు పైగా నోచుకుంది. వీరు పలు ఆంగ్ల గ్రంథాలు కూడా రచించారు. పండిత కుటుంబంలో పుట్టిన వీరు తమ యౌవనంలో కొన్ని అష్టావధానాలు చేశానని, ఆ తర్వాత ఆ ప్రక్రియ నచ్చక వదిలి పెట్టానని విద్యార్థులమైన మాకు గుంటూరు హిందూ కళాశాలలో చెప్పారు. ఈ ప్రజ్ఞాశాలి 8-6-1993న హైదరాబాదులో మరణించారు.

కృష్ణాతీరంలోని అవధానుల్ని గూర్చి సాధ్యమైన సమాచారాన్ని సేకరించగలిగాను. ఇంకా ఈ తీరంలో ఉన్న అష్టావధాన, శతావధానుల సంఆచారం అంతగా లభించలేదు. కృష్ణాతీరంలోని అవధానుల్లో కొండ పల్లి పెరుమాళ్లుగారు ముక్త్యాల వాస్తవ్యులైన శతావధానాల్ని చక్కగా నిర్వహించినట్లు తెలుస్తోంది. ఇంకా చల్లా సుబ్బరాయశాస్త్రి (1870-1912), శిష్టాలక్ష్మీకాంతశాస్త్రి (1902-1974) పైడిపాటి సుబ్బరామ శాస్త్రి (1918-2006) నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు (1924-2006)దీవి నరసింహారావు,పేరాల భరతశర్మ(1933-2007) కొత్తపల్లి ఘనశ్యామలరావు (1937) రాళ్లబండి నాగభూషణ శాస్త్రి (1948), కొండపి మురళీకృష్ణ(1963)గరిమెళ్ల అచ్యుత సోమయాజిశర్మ (1948) మొదలైనవారున్నారు. వీరితో పాటు ఇంకా పూసపాటి నాగేశ్వరరావు, పరిమి రామనరసింహం, నారాయణం బాలసుబ్రహ్మణ్యశర్మ, కప్ప గంతుల లక్ష్మణశాస్త్రి, శనగపాటి మధుసూదన భానుప్రసాద్, దేవరపల్లి ప్రభుదాసు మొదలైనవారు కూడా ఉన్నట్లు తెలుస్తున్నది.

తెలుగువారి సొత్తుఅయిన అవధాన విజ్ఞాన సర్వస్వాన్ని ఇటీవలనే డా॥ రాపాక ఏకాంబరాచార్యులవారు రాసి ముద్రించినట్లు తెలిసింది. ఆ గ్రంథంలో ఇంకా కృష్ణాతీరంలోని అవధానులు రండి దండవచ్చు. ఏది ఏమైనా తెలుగువారి సృజనాత్మక, ధారణాత్మక శక్తులను సమయ స్ఫూర్తికి నిదర్శనమైన అవధానం మాత్రం అజరామరమైంది. అవధానాన్ని గూర్చి డా॥ దివాకర్ల వేంకటావధానిగారు చెప్పిన పద్యంతో ఈ వ్యాసాల్ని ముగిస్తున్నాను.

**"అసమానంబగు పాండితీగరిమ, సత్యస్ఫూర్తి, హాస్యోక్తివి**
**న్యసనం బాశుకవిత్వసంపద, పురాణోక్తి ప్రబోధక్రియా**
**భ్యసనం బద్భుత ధారణామహిమ అత్యావశ్యకంబుల్ సుధీ**
**రసికుల్ మెచ్చవధాన కార్యము సభారమ్యంబుగాజేయగన్**

---

చిరునామా : డా॥ గుమ్మాసాంబశివరావు, తెలుగు శాఖాగ్రణి, ఆంధ్రలాయోల కళాశాల, విజయవాడ. సెల్ : 98492 65025

డా॥ వెన్నా వల్లభరావు

# కృష్ణాతీరంలో హిందీ ప్రచారం - హిందీ విద్యాలయాలు ప్రముఖులు

హిందీ ప్రచారం జాతీయోద్యమంలో అంతర్భాగంగా సాగి, భిన్న భాషలు మాట్లాడే విశాల భారతావని ప్రజల్ని సమైక్య పరచటానికి ఎంతగానో దోహదం చేసింది. మనకి స్వాతంత్ర్యం సిద్ధించటానికి చాలాకాలం క్రితమే దేశవ్యాప్తంగా హిందీ సామాన్యభాషగా, అను సంధాన భాషగా ప్రచారంలో ఉంది. జాతీయోద్యమం ప్రారంభం అయిన తర్వాత సువిశాలమైన భారతదేశాన్ని ఏకసూత్రంతో కలిపే 'జాతీయ భాష' కావాలనే ఆకాంక్ష బలపడింది. 'ఆసేతు హిమాచలం వ్యాపించి ఉన్న భారతజాతి భావాలను, అభిలాషలను వ్యక్తీకరించగల మాధ్యమం కాగలిగే హిందీయే జాతీయభాష కాదగినది' అన్న భావన రాజారామ మోహనరాయ్, మహర్షి దయానంద సరస్వతి, వి. కృష్ణస్వామి అయ్యర్ మొదలైన దార్శనికులకు కలిగింది. దక్షిణాఫ్రికా నుంచి స్వదేశానికి తిరిగివచ్చి స్వాతంత్ర్య సముపార్జనకు నడుం కట్టిన గాంధీజీ దేశమంతా పర్యటించి చూసి 'నైసర్గికంగా ఈ దేశంలో ఏదైనా భాష సామాన్య భాషగా ఉండి ఉంటే అది హిందీయే, అదే జాతీయభాష కాదగినది' అని 1915లో ప్రకటించారు. పై నలుగురిలో ఏ ఒక్కరి మాతృభాష హిందీ కాకపోవటం విశేషం.

భారతజాతి సమస్తాన్ని సమైక్యపరిచి జాతీయోద్యమంలో అన్ని ప్రాంతాల ప్రజల్ని భాగస్వాముల్ని చెయ్యాలంటే హిందీప్రచారం ఉద్యమ రూపంలో చేపట్టాలని గాంధీజీ నిర్ణయించుకున్నారు. గాంధీజీ అధ్యక్షతన 1918లో ఇండోర్‌లో జరిగిన 'హిందీ సాహిత్య సమ్మేలన్'లో ఆయన హిందీని జాతీయభాషగా దేశమంతా ప్రచారం చెయ్యాల్సిన అవసరం ఎంతైనా ఉందని తెలిపారు. తొలుత దక్షిణభారతదేశంలో హిందీ ప్రచారం ప్రారంభిస్తే జాతీయోద్యమంలో దక్షిణాది ప్రజల భాగస్వామ్యం గణనీయంగా పెరుగుతుందని భావించారు. వెంటనే ఆయన దక్షిణాది చేతలతో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపి, హిందీ ప్రచారానికి ప్రయత్నాలు మొదలెట్టారు. అందుకోసం గాంధీజీ 18 ఏళ్ళ తమ కుమారుడు దేవదాస్ గాంధీని మద్రాసు పంపారు. ఈ రకంగా దేవదాస్ గాంధీ దక్షిణ భారతదేశంలో తొలి హిందీ ప్రచారకుడుగా నిలిచారు. 1918 మేనెల మొదటివారంలో హోంరూల్ లీగ్ కార్యాలయంలో శ్రీ సి.పి.రామ స్వామి అయ్యర్ అధ్యక్షతన శ్రీమతి అనిబిసెంట్ తొలి హిందీ తరగతిని ప్రారంభించారు. అప్పటినుంచి ప్రణాళికాబద్ధంగా దక్షిణ భారత దేశంలో హిందీ ప్రచారం ఉద్యమరూపంలో మొదలైంది.

హిందీ ప్రచారోద్యమాన్ని ఆంధ్రప్రాంతం 'మొదటినుంచి స్వాగ తించి ప్రోత్సహించింది. దక్షిణాదిలోని ఇతర ప్రాంతాలకంటే ఆంధ్ర ప్రాంతంలో జాతీయభాషా ప్రచారానికి ఆదరణ పెరగటంతో ఉత్సాహ వంతులైన ఆంధ్రయువకుల్ని ఉత్తరభారతదేశానికి పంపి, అక్కడ వారికి హిందీ నేర్పించి, అటుపిమ్మట వారికి హిందీప్రచార కార్యభారం అప్పగించటం జరిగింది. ఈ క్రమంలో 1918లో శ్రీ శివరామశర్మ, శ్రీ మల్లాది సీతారామాంజనేయులు మొదలైనవారిని ప్రయాగలో హిందీ నేర్పించి, 1919లో వారిని తెలుగునాట హిందీప్రచార కార్య కర్తలుగా నియమించారు. శ్రీ మల్లాది సీతారామాంజనేయులు వినలేని అంకితభావంతో మచిలీపట్టణంలో హిందీప్రచార బాధ్యతల్ని నిర్వర్తించగా, శ్రీ శివరామశర్మ రాజమండ్రిలో తమ కృషి ప్రారంభిం చారు. వీళ్ళలాగానే ప్రయాగలో హిందీ నేర్చుకుని వచ్చిన రెండవ, మూడవ దళంలోని సభ్యులు హిందీ ప్రచారాన్ని విస్తృతపరచటానికి ఎంతో కృషి చేశారు. వారిలో సర్వ శ్రీ జంధ్యాల శివన్నశాస్త్రి, పీసపాటి వెంకట సుబ్బారావు, నరసింహాచార్యులు మాలపాటి రామకృష్ణశాస్త్రి, మేడిచర్ల వెంకటేశ్వరరావు మొదలైనవారు హిందీ ప్రచారం అనేక కేంద్రాలలో ప్రారంభించి, హిందీభాషను గ్రామగ్రామాలకు విస్తరింపజేశారు.

ఆంధ్రప్రాంతంలో ప్రణాళికాబద్ధంగా హిందీప్రచారం ప్రారంభం కావటానికి చాలాకాలం క్రితం నుంచి ఇక్కడ హిందీకి అనుకూలమైన వాతావరణం నెలకొని ఉంది. అందువల్లనే తెలుగువారు హిందీపట్ల విశేషంగా ఆకర్షితులయ్యారు. దక్షిణభారతదేశంలో మహమ్మదీయ పరిపాలన ప్రారంభమైన పిమ్మట అరబీ-పారశీ మిశ్రితమైన హిందీ

దక్షిణాదిలో ప్రవేశించి, ఇక్కడి భాషల విశిష్టతలను, మాధుర్యాన్ని సంతరించుకుని 'దఖనీ' అని పేరుగాంచింది. క్రమక్రమంగా అదే ఉర్దూగా, మరికొంత కాలం గడిచాక హిందుస్తానీగా వ్యవహరించ బడింది. దీనితోపాటు తెలుగునాట అనేక ప్రాంతాల్లో ఉర్దూ మాధ్యమం లోనే విధిగా విద్యాబోధన జరుగుతూ ఉండేది. ఈ రకంగా జాతీయోద్యమం ప్రారంభం కావటానికి మునుపే హిందీ ఇక్కడికి ప్రవేశించి, చోటు చేసుకుంది.

1882-83సంవత్సరాలలో ఒక పారశీక నాటక కంపెనీ ధార్వాడ నుంచి ఆంధ్రప్రాంతానికి వచ్చింది. ఆ కంపెనీ ఇక్కడ ప్రముఖ పట్టణాల్లో హిందీ నాటకాల్ని ప్రదర్శించి, కళాప్రియులు, నాటక ప్రియులైన తెలుగు ప్రజల మన్ననలు అందుకుంది. ఈ ప్రభావంతో శ్రీ ఈమని లక్ష్మణ స్వామిలాంటి ప్రముఖులు మచిలీపట్టణం మొదలైన పట్టణాల్లో 'రామదాసు', 'పేష్వా నారాయణరావు వధ' వంటి హిందీ నాటకాలు ప్రదర్శించి కృష్ణాతీరప్రాంత ప్రజల్లో హిందీభాష పట్ల ఆసక్తిని, అభిమతాన్ని కలిగించారు. ఫలితంగా ఆంధ్రప్రాంతంలో, ముఖ్యంగా కృష్ణాతీరంలో జాతీయోద్యమం ప్రారంభం కావటానికి దాదాపు 5 దశాబ్దాల ముందు నుంచి హిందీపట్ల అభిమానం, ప్రేమ చోటుచేసు కున్నాయి. ఈ హిందీ భాషాభిమానం, ప్రేమే కృష్ణాతీరంలోని యువతీ యువకులకు, నేతలకు హిందీ ప్రచారోద్యమంలో పాల్గొనేందుకు కావలసిన స్ఫూర్తిని, ఉత్సాహాన్ని కలిగించాయి.

## కృష్ణాతీరంలో హిందీ ప్రచారం :

కృష్ణాతీర ప్రాంతం హిందీ భాషాభిమానం కనపరచటంలోనే కాక, హిందీ ప్రచారంలో కూడా అగ్రగామిగా ఉంటూ వచ్చింది. దక్షిణ భారతదేశంలో హిందీ ప్రచారం ఉద్యమరూపంలో ఆరంభం కాకమునుపే మచిలీపట్టణంలో శ్రీ నాదెళ్ళ పురుషోత్తమకవి (1863-1938) 1881 ప్రాంతంలో 32 నాటకాల్ని హిందీలో రచించి, ప్రదర్శిం పజేశారు. ఆంధ్రప్రాంతంలో, హిందీ ప్రచార రంగంలో భీష్మాచార్యు నిగా భావింపబడే శ్రీ జంధ్యాల శివన్న శాస్త్రి కృష్ణాతీరవాసే (గుడివాడ తాలూకా,కొర్నిపాడుఅగ్రహార నివాసి) కావటం విశేషం. ఆధునిక హిందీ జనకుడుగా భావింపబడే శ్రీ మహావీర్ ప్రసాద్ ద్వివేది 'ఖడీబోలీ' హిందీని ప్రామాణికహిందీగా,సాహిత్యభాషగా రూపొందించి, ప్రచారం చెయ్యటానికి మహత్తరమైన కృషి చేశారు. 'ఖడీబోలీ' స్వరూప నిర్ణయంలో శ్రీ ద్వివేదిగారికి తెలుగుభాష, కృష్ణాతీరవాసి అయిన జంధ్యాల శివన్న శాస్త్రిగారి సహాయసహకారాలు అందాయి అంటే తెలుగువారందరికీ అది గర్వకారణం.

కృష్ణానది ఉత్తరతీరంలో మచిలీపట్టణం, విజయవాడ, గుడివాడ, పామర్రు, గన్నవరం,నూజివీడు,జగ్గయ్యపేట, తిరువూరు, నందిగామ, అవనిగడ్డ మొదలైన ఊళ్ళు హిందీ ప్రచారానికి ముఖ్యమైన కేంద్రాలుగా ఉండేవి. అలానే దక్షిణతీరంలో తెనాలి, గుంటూరు, రేపల్లె, సత్తెనపల్లి, నరసరావుపేట, పొన్నూరు మొదలైన ఊళ్ళలో హిందీ ప్రచారానికి ఎనలేని కృషి జరిగింది. పై ప్రాంతాలలో ఎంతోమంది జాతీయ స్ఫూర్తితో హిందీ నేర్చుకుని, హిందీ ప్రచారకులుగా తమ జిల్లాలలోనేకాక, పరిసర జిల్లాలలోని గ్రామ గ్రామాన హిందీభాషను పరివ్యాప్తం చేశారు. వీరి కృషివల్ల కృష్ణాతీరంలోని వందలాది గ్రామాల్లోని పిల్లలు-పెద్దలు, స్త్రీలు-పురుషులు హిందీ నేర్చుకున్నారు. హిందీతోనే విద్యాభ్యాసం మొదలుపెట్టి తర్వాత మాతృభాష తెలుగు నేర్చుకున్నవారూ ఉన్నారు. జాతీయభావాలు పునికి పుచ్చుకున్న కృష్ణాతీర ప్రాంత నాయకులం దరూ హిందీ ప్రచారోద్యమంలో భాగస్వాములయ్యారు. ఈ ప్రాంతంలో ఊరూరా హిందీ ప్రేమ మండళ్ళు, హిందీ నాటక సమాజాలు ఏర్పడి హిందీ ప్రచారానికి ఎంతగానో తోడ్పడ్డాయి. కృష్ణాతీర ప్రాంతంలోని హిందీ ప్రచారకులు సమస్త ఆంధ్రప్రాంతంలోను, రాష్ట్రం వెలుపల కూడా హిందీ ప్రచార రంగంలో ముందు నిలిచారు.

1918 నుండి 1927 వరకు సుమారు 9 సం॥ల పాటు దక్షిణాదిలో హిందీ ప్రచారం ప్రయాగ 'హిందీ సాహిత్య సమ్మేలన్' పక్షాన జరుగుతూ వచ్చింది. శ్రీహరిహరశర్మ మద్రాసు శాఖకి మంత్రి. ఆంధ్రప్రాంతానికి తొలుత రామ్ భరోసే శ్రీవాస్తవ్, అటుపిమ్మట శ్రీ మోటూరు సత్యనారాయణ సంచాలకులుగా హిందీ ప్రచార కార్యాన్ని నిర్వహిస్తూవచ్చారు. 1927లో 'దక్షిణభారత హిందీ ప్రచార సభ' స్థాపించబడింది. అప్పటినుంచి హిందీ ప్రచారం ఆ సభ ద్వారా జరుగుతూ వచ్చింది. 1932లో దక్షిణ భారతంలోని 4 ప్రాంతాలకు ప్రాంతీయ కార్యాలయాలు తెరవ బడ్డాయి. 1936లో నాలుగు ప్రాంతాల్లో ప్రాంతీయ సభలు స్థాపించ బడ్డాయి. అదే సంవత్సరం జూన్ నెలలో ఏర్పడిన 'ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచార సంఘ్'ని కృష్ణాతీరవాసి శ్రీ కొండా వెంకటప్పయ్య అధ్యక్షుల య్యారు. ఈయన జీవితపర్యంతం 'సంఘ్'కి అధ్యక్షులుగా కొనసాగారు. వీరి అవిరళ కృషి ఫలితంగా కృష్ణాతీరప్రాంతమే కాకుండా ఆంధ్ర ప్రాంతమంతా హిందీ ప్రచారం వేగవంతమయ్యింది. 'ఆంధ్రప్రాంత హిందీ ప్రచారసంఘ్' ఈ క్రింది కార్యక్రమాల ద్వారా హిందీ ప్రచారో ద్యమాన్ని కృష్ణాతీరంలో కొనసాగించింది.

1. హిందీ మహాసభలు 2. హిందీ ప్రచార సమ్మేళనాలు 3. హిందీ నాటక ప్రదర్శనలు 4. హిందీ ప్రేమమండళ్ళు 5. హిందీ ప్రచార వారోత్సవాలు.

## హిందీ మహాసభలు :

1921 నుంచి హిందీ మహాసభలు రాష్ట్రవ్యాప్తంగా పెద్దఎత్తున

నిర్వహించబడ్డాయి. ఇతర ప్రాంతాలకంటే కృష్ణాతీరప్రాంతం హిందీ ప్రచార కార్యకర్తలను సమావేశపరచటంలోను, వారి అభిప్రాయాలు – అనుభవాల ఆదాన-ప్రధాన సదస్సులునిర్వహించటంలోను, మరుసటి సంవత్సరానికి కార్యాచరణ ప్రణాళికల్ని సమర్థంగా రూపొందించి, అమలు చెయ్యటంలోను సర్వదా ముందు ఉంటూ వచ్చింది. 1923, 1933,1946 సంవత్సరాలలో మూడు పర్యాయాలు బెజవాడలో హిందీ ప్రచారమహాసభలు నిర్వహించబడ్డాయి. 1931,1924,1931, 1953 సంవత్సరాలలో 4 సార్లు గుంటూరులోను, 1939లో తెనాలిలోను జరిగిన ప్రచార మహాసభలు వక్తృత్వపు పోటీలు, నాటక ప్రదర్శనలు, పత్రికా ప్రదర్శనల ద్వారా హిందీ ప్రచారకుల్లో ఉత్సాహాన్ని నింపాయి.

## హిందీ ప్రచార సమ్మేళనాలు :

హిందీ ప్రచారకుల్ని, కార్యకర్తల్ని కనీసం సంవత్సరానికి ఒకసారి సమావేశపరిచి, వారికి తగిన సూచనలు – సలహాలు ఇచ్చి, హిందీ శిక్షణలో నూతన పద్ధతుల్ని నేర్పి, భవిష్యత్ కార్యక్రమాల్ని నిర్దేశించి నిమిత్తం 'ఆంధ్ర రాష్ట్ర ప్రచారక కుండళ్ళు' 1922లో స్థాపించబడ్డాయి. 1922లో బెజవాడలో శ్రీ హృషీకేశ్‌శర్మ అధ్యక్షతన జరిగిన సభతో ప్రారంభమైన ఈ సమ్మేళనాలు 1924, 1953ల్లో గుంటూరులోను, 1935, 1946, 1951ల్లో మరల బెజవాడలోను, 1939, 1956ల్లో తెనాలిలోను నిర్వహించబడ్డాయి.

## హిందీనాటక ప్రదర్శనలు :

తెలుగునాట సామాన్య ప్రజల్లో హిందీపట్ల ఆసక్తి, అభిమానం పెంపొందించి హిందీ నేర్చుకోవాలనే అభిలాష కలిగించటానికి హిందీ నాటక ప్రదర్శనలుఎంతగానో దోహదం చేశాయి. కృష్ణాతీర ప్రాంతంలో ఈ నాటకాల ప్రభావం చాలా తీవ్రంగా కనిపించింది. 1933లో మచిలీ పట్టణంలో 'బృందావన హిందీ నాట్యమండలి' స్థాపించబడి అనేక ప్రాంతాల్లో హిందీ నాటకాల్ని ప్రదర్శించింది. ఉన్నవ రాజ గోపాల కృష్ణయ్య, దాడి గోవిందరాజులు నాయుడు, తోట వెంకటేశ్వరరావు, గబ్బిట బాలసుందరశాస్త్రి, కందికొండ సత్యనారాయణ,బాలి సుబ్బారావు మొదలైనవారు ఈ నాట్యమండలిలో ప్రముఖ నటులుగా ఉండి ఎంతో అద్భుతమైన హిందీ నాటకాల్ని ప్రదర్శించారు. 'ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచార సంఘ్' తరపున విజయవాడలో కూడా 'ఆంధ్ర హిందీ నాటక మండలి' స్థాపించబడి, అనేక పట్టణాల్లో హిందీ నాటకాల్ని ప్రదర్శించి, ప్రేక్షకుల మన్ననల్ని పొందుతూ వచ్చింది. ఈ నాటకాలపట్ల తెలుగు ప్రజల ఆదరణ హిందీ ప్రచారకుల్లో ఉత్సాహాన్ని పెంచింది. ఈ నాటక మండలి దక్షిణభారత హిందీ ప్రచార సభ నిర్వహించిన అంతః ప్రాంతీయ హిందీ నాటక పోటీల్లో పాల్గొని, వరుసగా 1938,1939, 1640 మూడు సంవత్సరాలపాటు ప్రథమస్థానంలో నిలిచి షీల్డ్‌ను గెలుచుకుంది.

కృష్ణాతీరప్రాంతంలో 1933లో బృందావన హిందీ నాట్యమండలి 'ఉస్‌పార్', 'చంద్రగుప్త్' మొదలగు నాటకాలు అనేక ప్రదర్శనలిచ్చింది. 'చంద్రగుప్త్'నాటకంలో చాణక్య పాత్ర పోషించిన శ్రీఉన్నవ రాజగోపాల కృష్ణయ్య తన నటనా కౌశలంతో నవలాచక్రవర్తి ప్రేమచంద్, కాకా కాలేల్‌కర్ గార్ల ప్రశంసల అందుకున్నారు. చోడవరపు రామశేషయ్య రచించిన 'మంత్రి రామయ్య' నాటకం జగ్గయ్యపేటలో ప్రదర్శింపబడి మంచి మెప్పు పొందింది. 'ఈనాడు' అనే తెలుగు నాటకాన్ని 'ఆజ్' అని మిందీ నాటకంగా విజయవాడలో ప్రదర్శించగా, అది పలువురి ప్రశంసలు పొందింది. 1942లో 'కృష్ణాజిల్లా హిందీ నాటకమండలి' అది పలువురి ప్రశంసలు పొందింది. 1942లో 'కృష్ణాజిల్లా హిందీ నాటక మండలి' స్థాపించబడి, 'మేనాడ్‌పతన్' నాటకాన్ని అద్భుతంగా ప్రదర్శిం చింది. ఇందులో ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య, గుత్తా నరసింహం, పెరుమాళ్ళు, యలమంచిలి లక్ష్మయ్య, లక్ష్మీనారాయణ శర్మ, అట్లూరి రామారావు, మైనేపల్లి సీతారామయ్య తమ నటనా చాతుర్యంతో ప్రేక్షకుల్ని మంత్రముగ్ధుల్ని గావించారు. ఈ నాటకమండలి 'మహాత్మా ఈసా' 'రాజమకుట్' అనే నాటకాల్ని కూడా పలుచోట్ల ప్రదర్శించి హిందీ ప్రచారానికి సాయపడింది.

## హిందీ ప్రేమ మండళ్ళు :

కృష్ణాతీరప్రాంతంలో హిందీ ప్రచారార్థం చిన్న-పెద్ద పట్టణాలు ఎన్నింటిలోనో హిందీ ప్రేమమండళ్ళు పనిచేస్తూ ఉండేవి. ఆయా పట్టణాల్లో హిందీ భాషాభిమానులందరూ కలిసి ఈ మండళ్ళు స్థాపించటం జరిగింది. ఇవి 'ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారసంఘ్'కి అనుబంధంగా ఉండేవి. సంఘ్ సూచనలకనుగుణంగా ఈ మండళ్ళు తమ తమ పరిధిలో హిందీ ప్రచార కార్యక్రమం నిర్వహిస్తూ ఉండేవి. విజయవాడ హిందీ ప్రేమమండలికి శ్రీ కాకరపర్తి భావనారాయణ శ్రేష్ఠి అధ్యక్షులు, శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి సచివులు. గుడివాడ హిందీ ప్రేమమండలికి శ్రీ కాజ వెంకట్రామయ్య అధ్యక్షులు ; జగ్గయ్యపేట మండలికి శ్రీ వై.వై. శర్మ అధ్యక్షులు. ఇలా ఊరూరా ఏర్పడ్డ హిందీ ప్రేమ మండళ్ళలో స్థానిక జాతీయోద్యమ నాయకులు, ప్రముఖులు సభ్యులుగా ఉండి హిందీ ప్రచార కార్యక్రమాల్ని ప్రోత్సహించి ముందుకు నడిపిస్తూ ఉండేవారు. ఈ ప్రేమ మండళ్ళ కృషివల్ల కృష్ణాతీర ప్రాంతంలో హిందీ ప్రచారం సఫలీకృతంగా ముందంజ వేసింది.

## హిందీ ప్రచార వారోత్సవాలు :

కృష్ణాతీరంలోని అన్ని హిందీ ప్రచార కేంద్రాలలోను ప్రతి సంవత్సరం విధిగా గాంధీ జయంతి రోజునుంచి వారంరోజులపాటు, హిందీ సప్తాహం జరపబడుతూ ఉండేది. హిందీ ప్రచారకుల్ని

ఉత్సాహపరిచి, వారికి స్ఫూర్తినివ్వటానికి పలు శిబిరాలు ఏర్పాటు చెయ్యటం కూడా ఈ సప్తాహం సందర్భంగా జరుగుతుండేది.

కృష్ణాతీరప్రాంతంలో కొన్ని ఊళ్ళు హిందీ ప్రచారరంగంలో ముందునుంచి అగ్రస్థానంలో నిలిచాయి.

## మచిలీపట్టణం :

మచిలీపట్టణంలో 1919లోనే జాతీయభాషగా హిందీని ప్రచారం చెయ్యటానికి ప్రణాళికాబద్ధంగా కృషి మొదలైంది. ఇక్కడ శ్రీయుతులు హృషీకేశ్‌శర్మ, శ్రీరామగోపాలశర్మ, ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య, బైసాని శ్రీరాములు గుప్త, రాచకొండ నరసింహమూర్తి, ఎస్.ఎస్.వి. సోమయాజులు, పొట్లూరి ధనసూర్యావతి, మల్లాది శివరామ్, కామర్షి వీరభద్రరావు, కాలేపల్లి యోగేశ్వరరావు, కంచర్ల సాంబశివరావు, మోటపర్తి గోపాలకృష్ణమూర్తి, ముళ్ళపూడి వెంకట కృష్ణానందరావు, డి. రత్నాకరశర్మ, ఎ. అరుణాచలం, మలపాక గురుమూర్తి సోమ యాజులు, బోది నారాయణ దాసు,చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి, యల్లాప్రగడ శివరామారావు, ఉప్పలూరి శ్రీరామ కృష్ణయ్య, కస్తూరి సుబ్బారావు, కొప్పినేని సుబ్బారావు, చిత్రాజు కీటంరాజు, త్రిపురనేని దుర్గాప్రసూ నాంబ, చిట్టూరి అన్నపూర్ణాదేవి, కోట సుందరరామశర్మ, తారావత్తుల సుందరరావు, మల్లాది వెంకట సీతారామాంజనేయులు ప్రభృతులు హిందీ ప్రచారకులుగా హిందీని సమర్థవంతంగా ప్రచారం చేశారు.

భోగరాజు పట్టాభి సీతారామయ్య,చెరుకువాడ వెంకట నరసింహం, కోలవెన్నా రామకోటేశ్వరరావు, సప్పరపు రాజారావు, వారణాసి సుబ్రహ్మణ్యం, ముట్నూరి కృష్ణారావు మొదలగువారు ప్రముఖ హిందీ ప్రేమికులుగా ఉంటూ హిందీ ప్రచారానికి తోడ్పడ్డారు.

మచిలీపట్టణం హిందీ ప్రచారంలో ప్రసిద్ధిగాంచిన కేంద్రం. ఆంధ్ర జాతీయ కళాశాల హిందీ అధ్యయనానికి స్థానం కల్పించటంలో ముందుంది. ఇక్కడ హిందీ గ్రంథాలయం, పఠనాలయం, హిందీ పరీక్షల కేంద్రం కూడా ఉండేవి. ఇక్కడ స్థాపించబడిన బృందావన హిందీ నాట్యమండలి నాటకాలద్వారా ప్రజల్లో హిందీని వ్యాప్తిచెయ్య టానికి, హిందీపట్ల ప్రజల్ని ఆకర్షితుల్ని చెయ్యటానికి కృషి సల్పింది.

## బెజవాడ / విజయవాడ :

విజయవాడ ఆంధ్రప్రాంతానికి కేంద్రస్థానం. 1920లో ఇక్కడ హిందీ ప్రచారం ప్రారంభమై,కృష్ణాతీర ప్రాంతంలోనే ఇది ప్రముఖపాత్ర పోషించింది. 1921లో గాంధీజీ స్వరాజ్య ప్రాప్తికోసం రచనాత్మక కార్యక్రమ ప్రణాళిక ఇక్కడే తయారుచేశారు. ఆ సమయంలో అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశం కూడా ఇక్కడే జరిగింది. అందువల్ల ఈ కేంద్రంలో రచనాత్మక కార్యక్రమాలకు, ముఖ్యంగా హిందీ ప్రచారానికి ఎక్కువ స్ఫూర్తి లభించింది. దక్షిణభారత హిందీ ప్రచారసభ తరపున ఆంధ్రప్రాంతంలో హిందీ ప్రచారం నిమిత్తం 1923లోనే ఇక్కడ శాఖా కార్యలయం నెలకొల్పబడింది. ఆ కార్యాలయానికి తొలుత రామ్‌భరోసే శ్రీవాస్తవ్, తదుపరి మోటూరి సత్యనారాయణ, పిమ్మట పీసపాటి వెంకట సుబ్బారావు సంచాలకులుగా ఉన్నారు.

1930లో హిందీ ప్రచార కార్యాన్ని వేగవంతం చేసే దృష్టితో విజయవాడలో 'కృష్ణాజిల్లా హిందీ ప్రచారమండలి' స్థాపించబడింది. శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు దానికి అధ్యక్షులు. కాట్రగడ్డ మధుసూధన రావు కార్యదర్శి ఎర్నేని లక్ష్మీనారాయణ చౌదరి, అద్దేపల్లి రామశేషయ్య మొదలయినవారి కృషి ఫలితంగా జిల్లావ్యాప్తంగా హిందీప్రచారం చాలాబాగా జరిగింది. 1932లో మొట్టమొదటిసారిగా 'హిందీ విశారద విద్యాలయం' ఇక్కడ శ్రీ బాలచంద్ర ఆప్టే ప్రధానాధ్యా పకులుగా ప్రారంభమైంది. 'ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచారసంఘ్' పక్షాన ఇక్కడ సుమారు 3వేల పుస్తకాలు కలిగిన బృహత్ గ్రంథాలయం కూడా తెరవబడింది. 1933 నుండి విశారద విద్యాలయంతోపాటు 'ప్రచారక్ విద్యాలయం' కూడా నడపబడుతూ ఇప్పటివరకు ఎన్నో వేలమందిని హిందీ పండితులుగా శిక్షణ ఇవ్వటం జరిగింది.

1936లో ఇక్కడ స్థాపించబడిన 'ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారసంఘ్' ఆధ్వర్యంలోఆంధ్రప్రాంతమంతటా హిందీప్రచార నిర్వహణ జరుగుతూ వచ్చింది.'ప్రచారసంఘ్'తోపాటు విద్యాలయాల కోసంసొంత భవనాలు కూడా సమకూరాయి. సంఘ్‌కు ప్రత్యేకమైన ప్రచురణాలయం కూడా ఏర్పడంది.ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారసంఘ్‌కు సర్వశ్రీ ఎర్నేని లక్ష్మీనారాయణ చౌదరి, కుందేరు సత్యనారాయణ కొంకిమళ్ళ నాగభూషణరావు, వెంట్రప్రగడ వెంకటకృష్ణారావు, కాకరపర్తి భావనారాయణ మూర్తి, రాయని రాములు, గుమ్మడి మధుసూధనారావు, వానపల్లి బ్రహ్మయ్య, తాడంకి వెంకట దాసు, అంబటిపూడి కృష్ణమూర్తి మొదలయినవారు జీవితసభ్యులుగా ఉండేవారు.

సర్వశ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, మరుపిళ్ళ చిట్టి, డా॥ టి.వి.యస్. చలపతిరావు, దుగ్గిరాల బలరామకృష్ణయ్య, ఎం.వి. నారాయణమూర్తి, దేవరకొండ సుబ్రహ్మణ్యం, బట్లంకి బుల్లబ్బాయి, మొదలయినవారు 1943లో విజయవాడలో ఏర్పడిన హిందీ ప్రేమమండలి'లోని ప్రముఖులు.

1933లో శ్రీమతి దుర్గాబాయ్యగారి అధ్యక్షతన విజయవాడలో 8వ ఆంధ్రరాష్ట్ర హిందీ మహాసభ జరిగింది. 1946లో 17వ హిందీ మహాసభ శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారి అధ్యక్షతన ఇక్కడే జరిగింది.

13వ హిందీ ప్రచారక్ సమ్మేలన్ కూడా శ్రీ అల్లూరి సత్యనారాయణ రాజుగారి అధ్యక్షతన విజయవాడలో జరిగింది. 1951లో 16వ హిందీ ప్రచారక్ సమ్మేలన్ శ్రీ యలమంచిలి వెంకటేశ్వరరావుగారి అధ్యక్షతన ఇక్కడే జరిగింది. శ్రీ జె.వి. కృపలానీగారు ఈ సమ్మేళనాన్ని ప్రారంభించారు.

శ్రీయుతులు స్థానం గోపాలకృష్ణయ్య, కోట సత్యనారాయణ, బాలచంద్రఆప్టే, రామానందశర్మ, అవధనందన్, పీసపాటి కామేశ్వర రావు, ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య, వేమూరి ఆంజనేయశర్మ, వేమూరి రాధాకృష్ణమూర్తి, దోనేపూడి రాజారావు, పింగళి లజపతిరాయ్, యలమంచిలి రంగారావు తదితర వందలాదిమందిసమర్థులైన హిందీ ప్రచారకులు విజయవాడ కేంద్రంలో దిగ్విజయంగా హిందీప్రచారం గావించారు.

ప్రస్తుతం ఇక్కడ మోటూరి సత్యనారాయణ ప్రచారక్ విద్యాలయం, దక్షిణభారత హిందీ ప్రచారసభ,హిందీ బి.యిడి.విద్యాలయం మొదలయిన విద్యాలయాల సముదాయంలో ఆయా కోర్సులతోపాటు స్నాతకోత్తర హిందీ బోధన కూడా జరుగుతూ హిందీ ప్రచారాన్ని నిరంతరం కొనసాగి స్తున్నాయి.

## కృష్ణా ఉత్తరతీర గ్రామాల్లో....

కృష్ణానది ఉత్తరతీర గ్రామాల్లో 1919 నుంచి ప్రారంభమైన హిందీ ప్రచారం, క్రమక్రమంగా మారుమూల ప్రదేశాలకు సహితం విస్తరించింది. 1920లో అంగలూరులోప్రారంభమైంది. అక్కడ దుగ్గిరాల బలరామకృష్ణయ్య, మధురా ప్రసాద్, పొట్లూరి ధనసూర్యావతి, అరికె పూడి నాగభూషణం, అరికెపూడి రాఘవేంద్రరావు మొదలయినవారు హిందీ ప్రచారం గావించారు. అదే సంవత్సరం కోలవెన్నులో ప్రారంభ మైన హిందీ ప్రచారానికి కంచర్ల రమణమ్మ, బుర్రా రామశేషయ్య కృషిచేశారు.

1921లో గుడివాడలో హిందీప్రచారం ఆరంభమైంది. జంధ్యాల శివన్నశాస్త్రి, అట్లూరి రాజయ్య, గుత్తా లక్ష్మీనరసింహం, రాళ్ళబండి దుర్గానాగేశ్వరరావు,పొట్లూరి నాగభూషణం, చల్లగుళ్ళ కామేశ్వరరావు, యలమంచిలిసుబ్బారావు,దండమూడి వెంకట కృష్ణారావు, బండ్లమూడి ఆంజనేయులు, పొట్లూరి శివన్నారాయణ, కొచ్చర్లకోట వెంకట సుబ్బారావు ఎంతో ఉత్సాహంతో జాతీయభాషను ప్రచారం చేశారు. కాజ వెంకట్రామయ్య అధ్యక్షులుగా 1910లో ఇక్కడ 'హిందీ ప్రేమ మండలి' ఏర్పడింది. ఈ మండల హిందీ నాటకప్రదర్శనలు ఏర్పాటు చెయ్యటం, పరీక్షా కేంద్రాలను నిర్వహించటం కూడా చేపట్టింది. అదే సంవత్సరం నూజివీడులో కూడా హిందీ ప్రచారం ప్రారంభమైంది. అక్కడ దశిక సూర్యప్రకాశరావు, మరిగంటి సత్యనారాయణాచార్య అంకితభావంతో హిందీ ప్రచారం గావించారు.

1922లో గుడ్లవల్లేరులో ప్రచారం ప్రారంభమైంది. కొల్లి రామదాసు, పిడికిటి విశ్వనాథం, జంధ్యాల రామమూర్తి, దుగ్గిరాల సీతారామయ్య మొదలయినవారు హిందీని ప్రచారం చశారు. అదే సంవత్సరం పామర్రులో ఆరంభమైన హిందీ ప్రచారోద్యమానికి పోతకమూరి వీరబ్రహ్మాచారి, వెలగపూడి బసవయ్య, బండి వెంకటసుబ్బయ్య, కూచిభొట్ల హనుమంత రావు, శలాక దుర్గాప్రసాదరావు, మిక్కిలినేని సుబ్బారావు ప్రభృతులు సారథ్యం వహించారు. ఆ సంవత్సరమే బుద్ధవరంలో హిందీ ప్రచారం మొదలైంది. అక్కడ ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య హిందీ ప్రచారం గావించారు.

1923లో చినకళ్ళేపల్లిలో (యలమంచిలి వెంకటప్పయ్య), నంది వాడలో(దాసరి బ్రహ్మయ్య, అట్లూరి వెంకటరంగయ్య) పెద్దపల్లిలో (కంచర్ల వెంకట కృష్ణయ్య) హిందీ ప్రచారం ప్రారంభమైంది. 1924లో ఘంటసాలలో(మొక్కపాటి సుందరరామయ్య, ఐనంపూడి గురునాథ రావు), మంతెనలో (అల్లంరాజు సుబ్బారావు) ప్రచారం మొదలైంది. 1925లో తిప్పనగుంటలో (ఉన్నవ రాజగోపాల కృష్ణయ్య, వంకాయల పాటి శేషావతారం,పోతినేని దేవేంద్రరావు),పెదపారుపూడిలో (అట్లూరి వెంకటరంగయ్య, అట్లూరి రామారావు, కొల్లి వెంకటేశ్వరరావు, దుగ్గిరాల సీతారామయ్య), మంటాడలో (బుర్రా రామశేషయ్య) హిందీ ప్రచారం ఆరంభమైంది. 1926లో కానుమోలులో(ఉన్నవ రాజ గోపాల కృష్ణయ్య, నండూరి తిరువెంకటాచార్యులు, యలమంచిలి రంగారావు, దుట్టా వెంకటేశ్వరరావు, కొల్లిపర రామచంద్రయ్య) ప్రచారం మొదలు కాగా 1928లో కొండూరులో (చెరుకూరి జితేంద్రదాసు), 1930లో చిట్టిగూడూరు (వీరమాచనేని రామారావు, చిట్టిరాజు కోటమరాజు), జమీగొల్వేపల్లిలో (కాట్రగడ్డ వెంకటసుబ్బయ్య) హిందీ ప్రచారం ప్రారంభమైంది.

1930 నుంచి 1955 వరకు కృష్ణా ఉత్తరతీర ప్రాంతంలో ఇదే క్రమ కొనసాగి వందలాది గ్రామాల్లో జాతీయభాషా ప్రచారం ఉధృ తంగా సాగింది. ఆయా గ్రామాల్లో వందల కొలది హిందీ ప్రచారకులు స్వచ్ఛందంగా, నిస్వార్థంగా పన్నిల్ని-పెద్దల్ని, స్త్రీ-పురుషుల్ని హిందీ భాషాభిమానులుగా చేసి, జాతీయభాష నేర్పటంద్వారా వారిలో జాతీయభావాలని నింపటంలో మహత్తరమైన భూమికను నిర్వహించారు.

## గుంటూరు :

కృష్ణా దక్షిణతీరంలో హిందీ ప్రచార రంగంలో గుంటూరు అగ్ర స్థానంలో నిలిచింది. రాజకీయచైతన్యానికి నెలవైన గుంటూరు పట్టణంలో 1920లోనే హిందీ ప్రచారం ప్రారంభమైంది. శ్రీ కొండా వెంకటప్పయ్య, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణపంతులులాంటి స్వాతంత్ర్య సమరయోధులు హిందీ ప్రచారానికి తమ సహాయసహ కారాన్ని

అందించిముందుకు నడిపించారు. సర్వశ్రీ రామానందశర్మ, కీటంరాజు సీతాపతిశర్మ, ధర్మరాజు శర్మ, ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య, వారణాసి రామమూర్తి 'రేణు' మొదలయినవారు హిందీ ప్రచారానికి ఇతోధికంగా కృషిచేసారు. పిమ్మట బూదరాజు సుబ్బారావు, చావలి కోటేశ్వరరావు, ప్రయాగసత్యనారాయణమూర్తి,శాంతాబాయి,పీసపాటి సూర్యనారాయణ మొదలయిన పండితులు హిందీ ప్రచారానికి తమ శాయశక్తులా కృషిచేశారు.

హిందీ ప్రచారకుల్ని ప్రోత్సహించి, వారిలో నూతనోత్సాహాన్ని నింపే నిమిత్తం హిందీ మహాసభలు నిర్వహించబడుతూ ఉండేవి. గుంటూరులో 1921, 1924, 1931, 1953వ సంవత్సరాలలో నాలుగు పర్యాయాలు హిందీ మహాసభలు ఘనంగా జరిగాయి. 1924, 1953ల్లో హిందీ ప్రచార సమ్మేళనాలు కూడా ఇక్కడే జరిగాయి.

గుంటూరులోని హిందీ మహావిద్యాలయం 1955 నుండి చాలా ఉచ్చదశలో ఉంది. ఆ విద్యాలయంలో జిల్లాలోని పలు ప్రాంతాల నుంచి విద్యార్థులు విశారద, ప్రవీణ విద్యనభ్యసించటానికి వచ్చేవారు. ఈ మహావిద్యాలయం హిందీ ప్రచారంలో అగ్రగామిగా ఉండటానికి ఎనలేని కృషిచేసినవారు గుడివాడ పుల్లారావుగారు. 1987లో హిందీ ప్రభ – ఆంధ్రశాఖ స్వర్ణోత్సవం ఇక్కడ ఎంతో వైభవంగా జరిగింది. 1984లో ప్రచారకమండలి పక్షాన అమృతోత్సవం ఘనంగా జరప బడింది. ఈ ఉత్సవానికి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, కొత్త సచ్చిదానంద మూర్తి లాంటి గొప్ప వ్యక్తులు అతిథులుగా హాజరయ్యారు. ఈ సందర్భంగా 150 మంది పండితుల్ని సత్కరించటం జరిగింది.

గుంటూరుజిల్లాలో హిందీభాషా ప్రచారానికి, సాహిత్య వికాసానికి కృషిచేసినవారు ఇంకా ఎందరోఉన్నారు.వంకాయలపాటి శేషావతారం, మండా హనుమచ్ఛాస్త్రి, అనసూయాదేవి, వాసిరెడ్డి అనసూయ, చెన్నావఝుల నరసింహమూర్తి, యడ్లపల్లి సీతారామయ్య, శ్రీధర్‌శర్మ, కుసుమహరనాథశర్మ, దొడ్డి రామలింగేశ్వరరావు మొదలయినవారు వాళ్ళలో ప్రముఖులు. కర్ణ రాజశేషగిరిరావు, ఇలపావులూరి పాండు రంగారావు క్రమంగా హిందీలో ఉన్నత విద్యకు, అనువాదాలకు విశేష మైన కృషిచేశారు. దక్షిణభారత హిందీ ప్రచారసభ పక్షాలన కుసుమ హరనాథశర్మగారు గుంటూరులో 'విద్యార్థిమేళా' నిర్వహణ ద్వారాను, ఇతర కార్యక్రమాల ద్వారా హిందీ ప్రచారానికి చేసిన కృషి ఎన్నదగినది. అలాగే శ్రీ అంజయ్య, మొక్కపాటి వెంకటరత్నం, శ్రీ రాధాకృష్ణమూర్తి ప్రభృతులు హిందీకి గొప్ప సేవ చేశారు.

**తెనాలి :**

కృష్ణా దక్షిణతీరంలో హిందీ ప్రచారానికి ప్రధానకేంద్రం తెనాలి. గాంధీజీ ప్రభావంతో తొలుత శ్రీ యలమంచిలి వెకటప్పయ్య హిందీ ప్రచారం ప్రారంభించారు. 1929లో తిలక్ జాతీయ విద్యాలయంలో హిందీబోధన ఆరంభమైంది. 1938లో శ్రీ చిట్టూరి లక్ష్మీ నారాయణ సహకారంతో ఇక్కడ హిందీ ప్రేమమండలి స్థాపించబడింది. ప్రేమ మండలి విద్యాలయం కూడా ప్రారంభమైంది. 1942 నుంచి శ్రీ బోయ పాటి నాగేశ్వరరావు తెనాలిలో హిందీప్రచారం చెయ్యసాగారు. ఆయన ఉత్తరభారతదేశంలో హిందీలో ఉన్నతవిద్యఅభ్యసించి వచ్చారు. 1944లో ఆయన ప్రేమమండలి విద్యాలయానికి ప్రధానోపాధ్యాయు లుగా నియమితులయ్యారు. శ్రీ నాగేశ్వరరావు, ఆయన శ్రీమతి సుభద్రా దేవిల అవిరళ కృషివల్ల హిందీ మహావిద్యాలయం పేరుప్రతిష్టలు రాష్ట్రమంతా వ్యాపించాయి. రాష్ట్రంలోని అన్నిజిల్లాల నుంచి విద్యార్థులు హిందీ అభ్యసించటానికి అక్కడికి వస్తూ ఉండేవారు. ఆ మహావిద్యాల యంలో హిందీ విద్యార్జన చేసిన పండితులు ఇప్పటికే హిందీ ప్రచారంగావిస్తూ పలు ప్రాంతాల్లో ఉన్నారు. ఈ మహావిద్యాలయానికి జాతీయ విద్యాలయం (గాంధీ శిబిరం) యొక్క ఎకరం పుణ్యభూమి ప్రాప్తించింది. మహావిద్యాలయానికి సొంత భవనాలు సమకూరాయి. సంస్కృత సంప్రదాయాలకు ఆలవాలమైన తెనాలి పట్టణం హిందీ ప్రచారం కారణంగా కీర్తివంతమైంది. హిందీ ప్రచారరంగంలో శ్రీ బోయపాటి దంపతులు చేసిన కృషి అమోఘం. శ్రీ నాగేశ్వరరావుగారు స్వర్గస్తులైన పిమ్మట కొంతకాలం శ్రీ పరుచూరి ప్రభాకరరావు ఈ మహావిద్యాలయ నిర్వహణ బాధ్యతలు చేపట్టి ఆదర్శవంతంగా హిందీ ప్రచారం కొనసాగించారు. ఈ మహావిద్యాలయం పక్షాన ప్రతి సంవత్సరం గాంధీజయంతి రోజున హిందీ భాషా ప్రచారానికి విశేషమైన కృషిచేసిన వ్యక్తికొకరికి, హిందీ సాహిత్యానికి సేవచేస్తున్న తెలుగువానిని ఎంపికచేసి, వారిని శ్రీ బోయపాటి నాగేశ్వరరావు, శ్రీమతి సుభద్రాదేవి స్మారక గురుపీఠ పురస్కారం ప్రధానం చేయటం చాలా శ్లాఘించదగిన విషయం. ప్రస్తుతం శ్రీ బోయపాటి నాగేశ్వరరావుగారి కోడలు శ్రీమతి అరుణగారు ఈ మహావిద్యాలయం నిర్వహణ బాధ్యతల్ని సమర్థంగా నిర్వహిస్తున్నారు.

హిందీ ప్రచారానికి తెనాలిలో ఎనలేని కృషిచేసిన మరొక సంస్థ 'బాపూజీ హిందీ విద్యాలయం' దాని వ్యవస్థాపకులైన శ్రీ కంకణాల ప్రభాకరరావు ఎంతో అంకితభావంతో హిందీ ప్రచారానికి కృషిచేసారు. 1980 నుంచి ఈ విద్యాలయం నడుస్తుంది. దీని తరపున సంవత్సరా నికి సుమారు500 మంది విద్యార్థినీ–విద్యార్థులు దక్షిణ భారత హిందీ ప్రచారసభ నిర్వహించి హిందీ పరీక్షలకు హాజరు అయ్యేవారు. పాత తరానికి చెందిన హిందీ ప్రచారకుల్లో ఈదర లక్ష్మీనారాయణ, దోనేపూడి రాజారావు, కె. సుబ్బారావు, శ్రీమతి కమల చెప్పుకోదగిన

వారు. హిందీ ప్రచార కార్యక్రమానికి నాయకుల తోడ్పాటు ఎంతైనా ఉండేది. చేతవోలు సీతారామయ్య, ఆలపాటి వెంకటరామయ్య, కన్నెకంటి సూర్యనారాయణ మొదలైన నాయకుల సహకారం తెనాలిలో హిందీ ప్రచారం వెనుక ఎంతో ఉంది.

పై రెండు పట్టణాలతోపాటు రేపల్లె, సత్తెనపల్లి, నరసరావుపేట, పొన్నూరు, ప్రతిపాడు మొదలైన ఊళ్ళలో కూడా హిందీ ప్రచారం చాలాగొప్పగా జరిగింది. రేపల్లెలో శ్రీ కొండబవోలు హనుమంతరావు, ఆయన శ్రీమతి 'హిందీసదన్'నే నివాసంగా చేసుకుని హిందీ ప్రచారం గావించారు. వారి ఆప్యాయత, అనురాగాల కారణంగా ఎంతోమంది హిందీపట్ల ఆకర్షితులయ్యారు. శ్రీ హనుమంతరావు మంచి రచయిత, అనువాదకులు కూడా. వీరు హిందీ సాహిత్యరంగంలో నిత్య కృషీవాదులుగా మెలిగారు. ఆకాశవాణిద్వారా వీరు నిర్వహించిన హిందీ పాఠాలు, వీరుచేసిన జాతీయ నాటకాల అనువాదాలు ఎన్నో ప్రసారమయ్యాయి.

సత్తెనపల్లిలో శ్రీ వాసిరెడ్డి సుబ్బారావు పేరు మోసిన హిందీ ప్రచారకులు. ఆయన తయారు చేసిన వందలాదిమంది శిష్యులు వివిధ గ్రామాలు పట్టణాల్లో హిందీ ప్రచారంలో నిమగ్నమై ఉన్నారు. శ్రీ సుబ్బారావు మంచి నటుడు కూడా కావటంవల్ల హిందీ నాటక ప్రదర్శన ద్వారా కూడా ఆయన హిందీ ప్రచారం గావించారు. సుబ్బారావుగారి సతీమణి సరస్వతి, కుమారులు సత్యనారాయణ ప్రసాద్, రాధాకృష్ణ మరియ కుమార్తెలు–అందరూ హిందీ ప్రచారానికి ఎంతో కృషిచేసారు. నరసరావుపేటలో శ్రీ ఎం. సుబ్బరామయ్య, రావిపాటి సుబ్బారావు, టి.వి. కృష్ణకుమారి, శ్రీ మంగనాథాచార్యులు మొదలైనవారు హిందీ ప్రచారానికి ఎంతో పాటుపడ్డారు.

పొన్నూరు ప్రాంతలో శ్రీ బి. అంజయ్య, వారి శ్రీమతి హిందీ ప్రచారానికి విశేషమైన కృషిసల్పారు. హిందీ మహాసభలు, హిందీ సమ్మేళనాల్లో అంజయ్యగారి సహకారం ఎప్పుడూ ఉంటూ ఉండేది. ఆయన ఎన్నో వేలమందికి హిందీ బోధించి, ఆ ప్రాంతంలో హిందీ ప్రచార ప్రసారాలకు మహత్తరమైన కృషిచేశారు.

ప్రత్తిపాడులో శ్రీమతి రాజ్యలక్ష్మి హిందీ ప్రచారానికి చేసిన కృషి అభినందనీయం. ఇదే గ్రామంలో మరొక హిందీ ప్రచారకుడైన శ్రీ ఆలూరి బైరాగి హిందీ సాహిత్య రంగంలోధ్రువతారగా వెలుగొందారు. 1946నుంచి 1949 వరకు ఆయన ప్రత్తిపాడు ఉన్నత పాఠశాలలో హిందీ పండితునిగా పనిచేసి ఎంతోమంది విద్యార్థుల్ని హిందీపట్ల ఆకర్షితుల్ని గావించటంలో సఫలీకృతులయ్యారు. బైరాగిగారి శిష్యుల్లో ఒకరైన శ్రీ పి.ఆదేశ్వరరావు విశ్వవిద్యాలయస్థాయిలోహిందీ బోధించటం ద్వారా వందల–వేలమంది హిందీ అధ్యాపకులకు స్ఫూర్తిగా నిలిచారు. ఆంధ్రప్రాంతంలో వీరి శిష్యులు అనేకమంది పాఠశాలలు, కళాశాలలు, విశ్వవిద్యాలయాల్లో ఎంతో సమర్థంగా హిందీ బోధిస్తూ జాతీయభాషా ప్రచారానికి విశేషమైన కృషిచేస్తున్నారు.

### ఆశ్రమాల్లో హిందీ ప్రచారం :

కృష్ణాతీరప్రాంతంలో హిందీ ప్రచారార్థం ఆశ్రమాలు, విద్యావనాలు నెలకొల్పబడ్డాయి. స్కూళ్లకు వెళ్ళి విద్యాభ్యాసం చెయ్యలేనివారికి, వయసు మళ్ళిన నిరక్షరాస్యులకి, ముఖ్యంగా స్త్రీలకు హిందీ అభ్యసించే అవకాశం ఈ ఆశ్రమాలు కల్పించాయి. అక్కడ కేవలం హిందీనే కాకుండా మాతృభాషాబోధన, గణితం లాంటి విషయాలు కూడా బోధించటం జరుగుతూ ఉండేది. ఇవి జాతీయభావాల్ని పెంపొందించే కేంద్రాలుగా ఉండేవి.

### గాంధీ ఆశ్రమం :

కృష్ణాజిల్లాలోని అంగలూరు,కొమరవోలు గ్రామాలు1920 నుంచే హిందీ ప్రచారరంగంలో అగ్రగామిగా ఉంటూ వచ్చాయి. గాంధీజీ స్ఫూర్తితో శ్రీ ఎర్నేని సుబ్రహ్మణ్యం కొమరవోలులో గాంధీ ఆశ్రమాన్ని నెలకొల్పి హిందీ ప్రచారానికి ఎనలేని కృషిచేసారు. ఖాదీ, హిందీ–రెడింటి ప్రచారం ఈ ఆశ్రమ ప్రధాన ఆశయాలు. ఈ ఆశ్రమం చేసిన కృషివల్ల చుట్టుప్రక్కల గ్రామాల ప్రజల్లో హిందీపట్ల విశేషమైన ఆసక్తి ఏర్పడింది. శ్రీ మధురాప్రసాద్, శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్య, అవధనందన్, ఆరిగపూడి రాఘవేంద్రరావు, పొట్లూరి నాగభూషణం మొదలయిన త్యాగధనులు హిందీ ప్రచారానికి ఇక్కడ ఎంతో సేవ చేశారు. ఫలితంగా హిందీ పరీక్షలకు హాజరయ్యే విద్యార్థుల సంఖ్య గణనీయంగా పెరిగింది. 1923 మార్చి 11వ తేదీన తొలిసారిగా ఇక్కడ ప్రాథమిక, మధ్యమ, రాష్ట్ర భాష, ప్రవేశిక పరీక్షలు నిర్వహించ బడ్డాయి. ఇంటి గడపదాటని సంపన్న కుటుంబాల్లోని స్త్రీలు కూడా హిందీ అభ్యసించటానికి ఉత్సాహపడటం ఈ ఆశ్రమం గొప్పతనం. ఎర్నేని సుబ్రహ్మణ్యం, ఎర్నేని సూర్యనారాయణ గార్ల అంకితభావం; అడవి వెంకటేశ్వరరావు, పి. రామమూర్తిరెడ్డి, రామిరెడ్డి, శేషారెడ్డి మొదలయిన ప్రచారకుల సేవాభావంతో గాంధీ ఆశ్రమం అభివృద్ధి పదాన ముందుకు సాగింది. తరువాత ఇక్కడికి హిందీ బోధించటానికి శ్రీ యలమంచిలి వెంకటేశ్వరరావు, శ్రీమతి సరస్వతి రావటం, వారికి సాయంగా ఉండటానికి శ్రీ చలసాని కృష్ణారావు, వసుమతి దంపతులు విచ్చేయటంతో హిందీ ప్రచారం బాగా ఊపందుకుంది.

ఇక్కడ హిందీ అభ్యసించిన అట్లూరి రామారావు,పొట్లూరి శివన్నారాయణ, పి. సుబ్బారావు, అట్లూరి రాజయ్య, కొల్లిపర రామ చంద్రయ్య, కొడాలి ఉమామహేశ్వరరావు,అడుసుమిల్లి కృష్ణమూర్తి,

గుత్తా సుబ్బారావు మొదలైనవారు కృష్ణాతీరప్రాంత గ్రామాలకు వెళ్ళి హిందీ ప్రచారంతోపాటు దేశభక్తిని, జాతీయభావాల్ని రేకెత్తించే కృషి చేసారు. ఎర్నేని సుబ్రహ్మణ్యంగారి భార్య శ్రీమతి లీలమ్మ, వెంకటేశ్వర రావు గారి భార్య శ్రీమతి సరస్వతీదేవి, సూర్యనారాయణగారి భార్య స్వయంగా విద్యార్థులకు వంటచేసి భోజనాలు వడ్డిస్తుండేవారు. తెలుగు నాట ప్రసిద్ధ దేశభక్తుడు, హరిజనోద్ధారకుడు, ఖాదీ ప్రచారకుడు, ఆంధ్రరాష్ట్ర అవతరణకు దీక్షపూనిన శ్రీ పొట్టిశ్రీరాములు గాంధీ ఆశ్రమాన్ని దర్శించి, హిందీ ప్రచారానికి ఆశ్రమం చేస్తున్న అవిరళ కృషిని ప్రశంసించారు.

## విద్యావనం :

కృష్ణాతీరప్రాంతంలో హిందీకి పెరుగుతున్న ఆదరణ కారణంగా, అనేక ప్రాంతాలనుంచి విద్యార్థులు హిందీ అభ్యసించటానికి ఈ ప్రాంతానికి రావటానికి ఉత్సాహం కనపరచసాగారు. దానితో ఎక్కడైనా అనువైన ప్రదేశంలో వసతి సౌకర్యంతోహిందీఆశ్రమాన్ని నెలకొల్పాల్సిన ఆవశ్యకత ఏర్పడింది. గాంధీ ఆశ్రమంలో సేవచేస్తున్న శ్రీ యలమంచిలి వెంకటేశ్వరరావు, శ్రీ చలసాని సుబ్బారావు కృష్ణాజిల్లా పామర్రు సమీపంలో పుల్లేటి కాలువ ఒడ్డున మామిడి, కొబ్బరిచెట్లు విరివిగా ఉన్న సువిశాలమైన,సుందరమైన క్షేత్రాన్ని ఎంపికచేసి దానికి 'విద్యావనం' అని నామకరణం చేశారు. కొద్దికాలంలోనే ఈ సంస్థ ఖ్యాతి రాష్ట్రమంతా వ్యాపించింది. రాష్ట్రంలోని పలు ప్రదేశాలనుంచి ఉత్సాహవంతులైన విద్యార్థినీ-విద్యార్థులు హిందీ నేర్చుకోవటంకోసం విద్యావనానికి పెద్దసంఖ్యలో రావటం ప్రారంభించారు. ప్రారంభంలో వారే స్వయంగా వంటచేసుకుని, అక్కడ ఉంటూ కిరోసిన్ దీపాల వెలుగులో రాత్రిళ్లు సహితం విద్యనభ్యసిస్తూ ఉండేవారు. క్రమక్రమంగా విద్యావనంలో హాస్టల్ వసతి కల్పించబడింది. ఒక్కో విద్యార్థికి నెలకు 19 రూపాయలు మాత్రమే వ్యయమయ్యేది. విద్యార్థుల సంఖ్య బాగా పెరగటంతో అదనపు హాస్టళ్లు కూడా ఏర్పాటుచేయ్యవలసి వచ్చింది. 500 మంది కంటే ఎక్కువమందికి భోజన సదుపాయం కల్పించవలసివచ్చింది.

పిన్నలు - పెద్దలు, స్త్రీలు - పురుషులు, పేదలు - ధనికులు, భార్యా భర్తలు, తండ్రి-కుమారులు, అన్న-చెల్లెళ్లు, విధవలు-విడాకులు తీసుకున్న స్త్రీలు ఇలా ఎందరో విద్యావనంలో విద్యార్థులుగా ఉండేవారు. విద్యావనం పుణ్యమా అని ఆంధ్రప్రదేశ్‌లో హిందీ ప్రచారం ఎంతో గొప్పగా జరగసాగింది. ఇక్కడ కేవలం హిందీనే కాకుండా తెలుగుసాహిత్యం, పరీక్షలు, మెట్రిక్ మొదలయిన పరీక్షలకు కూడా శిక్షణ ఇవ్వబడుతూ ఉండేది. ఇక్కడ తెలుగు నేర్చుకున్నవారు తెలుగుపండితులుగానే కాకుండా తెలుగు కవులు-రచయితలుగా మిక్కిలి ప్రసిద్ధులయ్యారు. ఇక్కడి విద్యార్థులకు చదువుతోపాటులోకజ్ఞానానికి సంబంధించిన విషయాలు, జాతీయోద్యమ స్థితిగతులు మొదలయిన విషయాల్ని తెలియజెయ్యటానికి ప్రసిద్ధ వ్యక్తుల ఉపన్యాసాలు కూడా ఏర్పాటు చెయ్యటం జరిగేది. గాంధీవాది అయిన యలమంచిలి వెంకటేశ్వరరావు, ఆయన శ్రీమతి సరస్వతి గార్ల అంకితభావం, సేవానిరతి కారణంగా 'విద్యావనం' దినదినాభివృద్ధి చెంది ప్రచారంలో రాష్ట్రంలోనే కీర్తిప్రతిష్టల్ని కైవసం చేసుకుంది. ముఖ్యంగా కృష్ణాతీరప్రాంతంలో స్త్రీవిద్యకి విద్యావనం చేసిన కృషి అనన్యసామాన్యం. హిందీ ప్రచారోద్యమ చరిత్రలో 'విద్యావనం' నిర్వహించిన పాత్ర అజరామరంగా నిలిచి ఉంటుంది.

## 'వినయాశ్రమం' :

గుంటూరుజిల్లా చెరుకుపల్లి మండలంలోని కాపూవు గ్రామ సమీపంలో 50 ఎకరాల సువిశాల క్షేత్రంలో గాంధీజీ కరకమలాలతో పునాదివెయ్యబడి నెలకొల్పబడిన హిందీవిద్యాలయం 'వినయాశ్రమం'. ఇది నలువైపులా ఫలవృక్షాల తోటలతో అందమైన-ప్రశాంతమైన ప్రదేశంలో స్థాపించబడి 1924 నుండి 1960 వరకు హిందీ ప్రచారానికి ఎనలేని కృషిచేసింది. వినయాశ్రమంలో హిందీబోధనతోపాటు గాంధీజీ ఆశయాల్ని, జాతీయభావాల్ని కూడా విద్యార్థుల్లో పాదుకొల్పే కృషి జరుగుతుండేది. శీర్ల బ్రహ్మయ్యగారు, ఎం. పాపన్న గుప్తగారు, వేమూరి ఆంజనేయశర్మ, వేమూరి రాధాకృష్ణమూర్తి, వేమూరి సుబ్బారావు మొదలయినవారు వినయాశ్రమంలో హిందీ ప్రచారానికి విశేషమైన కృషిచేసిన వారిలో ముఖ్యులు. వీరిలో ఎం. పాపన్నగుప్త గారు, వేమూరి సుబ్బారావుగారు దక్షిణభారత హిందీ ప్రచారసభ, ఆంధ్రసభకి అధ్యక్షులుగా కూడా పనిచేశారు. వేమూరి రాధాకృష్ణమూర్తి ఆంధ్రసభకి కోశాధికారిగా చేశారు. ట్రైనింగ్ కాలేజి ప్రిన్సిపాల్‌గా హిందీప్రచారకులకు తగిన శిక్షణ ఇచ్చే బృహత్ కార్యక్రమాన్ని వేమూరి ఆంజనేయశర్మ సమర్థంగా నిర్వహించారు. దశిక సూర్యప్రకాశరావు ప్రధానాచార్యులుగా వినయాశ్రమంహిందీప్రచారకార్యక్రమాన్ని అత్యంత దక్షతతో నిర్వహించింది. శ్రీ దశిక, శ్రీ వేమూరిఆచరణలోను, ఆదర్శాల్లోను గాంధీజీకి ప్రతిరూపాలుగా ఉండేవారు. ఇరువురూ హిందీలో గొప్ప పండితులు. వినయాశ్రమంలో విద్యనభ్యసించే విద్యార్థులకు పరిసర గ్రామాల్లో ఎంతో గౌరవం, ఆదరణ లభిస్తుండేవి. ఈ వినయాశ్రమం కృష్ణాతీరప్రాంతంలో నెలకొని వేలాదిమందిని హిందీ బోధించటంతో పాటు జాతీయభావాల అంకురార్పణకు, గాంధీజీ సిద్ధాంతాల ప్రచారానికి విశేషమైన కృషిచేసింది.

ఈరకంగా ఈ మూడు ఆశ్రమ విద్యాలయాలు - గాంధీ ఆశ్రమం, విద్యావనం, వినయాశ్రమం - ఆంధ్రప్రాంతంలోనే కాక రాష్ట్రేతర విద్యార్థుల్ని సహితం ఆకర్షించి దశాబ్దాలపాటు హిందీ ప్రచారం

గావించి హిందీ ప్రచారోద్యమాన్ని విజయవంతంగా నిర్వహించే కృషిలో విశిష్టమైన భూమిక నిర్వహించాయి.

### హిందీప్రచారం - కృష్ణాతీరప్రాంత ప్రముఖులు :

హిందీ భాషా సాహిత్యాల వికాసానికి తెలుగువారు చేసిన సేవ అనన్య సామాన్యమైనది. గోదావరీ తీరం నుండి యమునా తీరానికి వెళ్ళి, పుష్టిమార్గీయ భక్తిని ఉత్తర భారతదేశమంతటా ప్రచారం చేసి, ప్రముఖ కృష్ణ భక్త కవి సూరదాసు మొదలుగా గల 8మంది అష్టఛాప్ కవులచేత కృష్ణభక్తి సాహిత్యాన్ని సృజింపచేసిన మహాప్రభు వల్లభాచార్యుడు తెలుగువారే. 'బిహారీ సతసయి' రచనకు ప్రేరణనిచ్చిన 'గాథాసప్త సతి'స్రష్ట హాలశాతవాహనుడు తెలుగువారే. రీతి (సంప్రదాయ) కాలంలోని సాహిత్యానికి మూలస్తంభమైన పద్మాకర భట్టు తెలుగు వాడు. వీరి సంప్రదాయాన్ని, వారసత్వాన్ని కృష్ణాతీరప్రాతం హిందీ సాహిత్యకారులు, భాషాప్రచారకులు చక్కగా కొనసాగించారు.

### నాదెళ్ళ పురుషోత్తమ కవి :

దివి తాలూకా సీతారామపురంఅగ్రహారంలో 1863లో జన్మించిన నాదెళ్ళ పురుషోత్తమ కవి సంస్కృతాంధ్ర భాషలతోపాటు హిందీలో కూడా గొప్ప రచయిత. మచిలీపట్టణం హిందూ హైస్కూలు బ్రాంచిలో ప్రధానోపాధ్యాయులుగా1887 నుండి1908 వరకు వీరు పనిచేశారు. వీరు రచించిన మొత్తం 112 రచనల్లో 32 హిందీ నాటకాలు. ఈ 32 నాటకాల్లో 'భద్రాచల రామదాసు చరిత్ర', 'పేష్వా నారాయణరావు వధ' తప్ప మిగిలిన నాటకాలు తెలుగు లిపిలో వ్రాయబడి ఉండటం చేత హిందీ సాహితీ ప్రపంచానికి దూరమై చాలాకాలం వరకు గుర్తింపు పొందలేదు. ఉత్తర భారతదేశంలో అప్పుడప్పుడే నాటక సాహిత్యం ఊపిరిపోసుకుంటున్న తరుణంలో తెలుగునాట, కృష్ణాజిల్లాలో 32 నాటకాలు తెలుగు లిపిలో రాయబడి హిందీభాషలో ప్రదర్శించబడటం – "హిందీ ప్రచారంలోనే కాక సాహిత్య వికాసంలో కూడా మనం ముందున్నాం" అని తెలియజేస్తుంది. హిందీలో రచనలు చేసిన తొలి తెలుగువాడు నాదెళ్ళ పురుషోత్తమ కవి.

### జంధ్యాల శివన్న శాస్త్రి :

గుడివాడ తాలూకా కొర్నిపాడు అగ్రహారంలో 1896లో జన్మించిన జంధ్యాల శివన్న శాస్త్రిగారు ఆంధ్ర ప్రాంతంలో హిందీ ప్రచార రంగంలో భీష్ముడుగా భావించబడ్డారు. శాస్త్రిగారు రచించిన హిందీ వ్యాసాలు 'సరస్వతి' అనే ప్రతిష్ఠాత్మకమైన హిందీ పత్రికలో క్రమం తప్పకుండా అచ్చువుతూవుండేవి. హిందీ మహారథి అని కీర్తినొందిన ఆచార్య మహావీర ప్రసాద్ ద్వివేది గారికి ఈయన సమకాలికులు. 'ఖడీబోలీ' హిందీ స్వరూప నిర్ణయంలో ద్వివేది గారికి కృష్ణాజిల్లా తెలుగువాసి శ్రీ శాస్త్రిగారి సహకారం లభించటం తెలుగువారందరికి గర్వకారణం. శ్రీ శాస్త్రిగారు 'హిందీ-తెలుగు', 'తెలుగు-హిందీ' కోశలను, 'హిందీ-తెలుగు వ్యాకరణ్', 'బ్రజభాషా వ్యాకరణ్' వ్రాశారు. వరవిక్రయం, కన్యాశుల్క్‌ను హిందీలోకి; శృంగార సప్తశతి, డి.ఎల్.రాయ్ రచించిన బెంగాలీ నాటకాలను తెలుగులోనికి అనువదించారు. తర్క, వ్యాకరణ, సాహిత్య శాస్త్ర పండితులైన శ్రీ శాస్త్రిగారు తెలుగు-సంస్కృత భాషల్లో గొప్ప కవి.

### పద్మభూషణ్ మోటూరి సత్యనారాయణ :

గుడివాడ తాలూకా దొండపాడు గ్రామంలో 1902లో రైతు కుటుంబంలో జన్మించిన సత్యనారాయణగారు దక్షిణ భారతదేశంలో హిందీని పాదుకొల్పిన మహాపండితుడు, మేధావి, బహుభాషావేత్త, దార్శనికుడు. మహాత్మాగాంధీ పిలుపు నందుకొని మచిలీపట్టణం ఆంధ్ర జాతీయ కళాశాలలో సుమారు రెండున్నర సంవత్సరాలు జాతీయ విద్యనభ్యసించిన ఆయన 1921లో హిందీ ప్రచారోద్యమం లోనికి అడుగుపెట్టారు. 1921 నుండి 1923 వరకు నెల్లూరు జిల్లా 'సంగఠక్'గా హిందీ ప్రచారానికి కృషిచేశారు. 1924 నుండి 1927 వరకు ఆంధ్ర ప్రాంతీయ ప్రచార సభకి సచివులుగా, 1927 నుండి దక్షిణ భారత హిందీ ప్రచారసభకు పరీక్షా మంత్రిగా, సంయుక్త మంత్రిగా, హిందీ ప్రచార కార్యాన్ని సమర్థవంతంగా నిర్వహించి 1938లో సభకి ప్రధాన సచివులుగా నియమితులయ్యారు. 1938 నుండి 1961 వరకు ఆ పదవిలో ఉంటూ ప్రణాళికాబద్ధంగా హిందీని గ్రామగ్రామాలకు విస్తరించేటట్లు చేశారు. వారి దూరదృష్టి, అవగాహన వల్లనే 'దక్షిణ భారత హిందీ ప్రచార సభ' హిందీ సాహిత్య సమ్మేళనం, ప్రయాగ వారి బంధనం నుండి విడివడి 1927లో స్వతంత్ర స్వావలం బనమైన సంస్థగా రూపొందింది. 1936లో దక్షిణ భారత హిందీ ప్రచార సభకు నాలుగు రాష్ట్రాలలో 4 ప్రాంతీయ శాఖలు ఏర్పడటం కూడా శ్రీ మోటూరి దూరదృష్టికి నిదర్శనం. వీరు ప్రధాన సచివులుగా ఉన్న సుదీర్ఘకాలం సభ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగినది. గాంధీజీకి ఆయనంటే ఎంతో నమ్మకం. రాజేంద్రప్రసాద్, జవహర్‌లాల్ నెహ్రూ, రాజగోపాలచారి, డాక్టర్ పట్టాభి వంటి మహోన్నత నాయకుల సాన్నిహిత్యం వారికి దక్కిన వరాలు.

తెలుగునాట, దక్షిణ భారతదేశంలో హిందీ ప్రచారం ఉద్యమ రూపంలో సాగుతున్నా, ఉత్తర భారతదేశంలోని అహిందీ ప్రాంతాలలో హిందీ ప్రచారం ప్రారంభమైనా కాలేదు. 1936లో ఆయా ప్రాంతాల్లో హిందీ ప్రచారార్థం శ్రీ రాజేంద్రప్రసాద్ అధ్యక్షులుగా 'జాతీయ భాషా ప్రచార సమితి' ఏర్పాటు చేయబడింది. దీనికి తొలి ప్రధాన సచివులు

మోటూరి సత్యనారాయణ. వీరి కృషి వల్ల గుజరాత్, సింధు, మధ్య ప్రదేశ్‌లోని మహారాష్ట్ర జిల్లాలు, ఉత్కళ, అస్సాం మొదలైన అహిందీ ప్రాంతాల్లో అత్యంత సమర్థవంతంగా హిందీ ప్రచారం కొనసాగింది. దక్షిణ భారతదేశంలోనే కాక ఉత్తర భారతదేశపు అహిందీ ప్రాంతాల్లో హిందీ ప్రచారం గావించిన ఘనత తెలుగువాడైన కృష్ణాజిల్లా వాసి శ్రీ మోటూరికి దక్కుతుంది.

భారత రాజ్యాంగ చట్టంలో 1949 సెప్టెంబరు 14న ఆమోదం పొందిన 17వ భాగం 'రాజభాష అధ్యాయ' నిర్మాణంలోనూ, దానిని రాజ్యాంగ సభలో నెగ్గించటంలోనూ శ్రీ మోటూరి పాత్ర కీలకమైనది. దాని డ్రాఫ్టింగ్‌లోనూ వారి హస్తం వుంది. 1954 నుండి 1966 వరకు శ్రీ మోటూరి వరసగా రెండు పర్యాయాలు రాజ్యసభ సభ్యులుగా నామినేట్ చేయబడ్డారు. 1956లో రాజభాషా కమీషన్‌కు సభ్యులుగా వున్నారు. భారత ప్రభుత్వం నుండి 'పద్మశ్రీ', 'పద్మభూషణ్' బిరుదులు పొందారు.'తెలుగు భాషా సమితి' వ్యవస్థాపక కార్యదర్శిగాశ్రీ మోటూరి 'తెలుగు విజ్ఞాన సర్వస్వం' 16 భాగాలుగా ప్రచురించారు. 'విజ్ఞాన సంహిత' పేరుతో హిందీ విజ్ఞాన సర్వస్వాలను ప్రచురింపజేశారు. 'దినకర్'గారి మాటల్లో శ్రీ మోటూరి 'హిందీ భాషా ప్రచారానికి ప్రాణం'.

### ఆరికపూడి రమేష్ చౌదరి :

కృష్ణాజిల్లా ఉయ్యూరులో 1922లో సామాన్య రైతు కుటుంబంలో జన్మించిన రమేష్ చౌదరి ఉత్తర భారతీయుల మెప్పు పొందిన హిందీ నవలా రచయిత.హిందీలో 25 నవలలు రచించి చేయితిరిగిన హిందీ రచయితగా కీర్తినార్జించారు శ్రీ రమేష్ చౌదరిగారు. నవలలే కాక వీరు కథలు, నాటికలు,వ్యాసాలు, జీవిత చరిత్రలు, విమర్శలు కూడా వ్రాశారు.'సారా సంసార్ మేరా', 'నిర్లజ్జ','ధన్యభిక్షు', 'ఉధార్ కే పంఖ్', 'అప్నే పరాయే' 'ఝూర్ ఫానూస్', 'నదీ కా శోర్' మొదలైనవి వీరి ప్రసిద్ధ హిందీ నవలలు. 'అప్నే పరాయే' నవల రష్యన్ భాషలోనికి అనువదించబడింది. వీరి 7 నవలలకు ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం బహుమతులిచ్చి గౌరవించింది. అడవి బాపిరాజు రచించిన 'నారాయణరావు' నవలను ఈయన హిందీలోనికి అనువదించారు. 'దక్షిణ్‌భారత్', 'చందమామ' (హిందీ) పత్రికలకు సంపాదకులుగా కూడా ఈయన పనిచేశారు.

### దుగ్గిరాల బలరామకృష్ణయ్య :

కృష్ణాజిల్లా అంగలూరు గ్రామంలో 1904లో జన్మించిన బలరామ కృష్ణయ్య, విజయవాడ, రాజమండ్రి, నెల్లూరు, కడలూరు, సేలమ్, తంజావూరు మొదలైనచోట్ల హిందీ ప్రచారం గావించటమే గాక 'బుద్ధ చరిత్ర్', 'ధర్మపథ్', 'మానవ జీవన్', 'విద్యావిధాన్', 'ఆత్మవిజయ్' మొదలైన గ్రంథాలను హిందీలోను, 'గాంధీజీ అనాసక్తి యోగం', 'గాంధీజీ సర్వోదయం','దండియాత్రా సందేశం', 'గాంధీగీత', 'తెలుగు సీమ' మొదలైన గ్రంథాలు తెలుగులోను రచించి కీర్తి గడించారు. 1930 నుండి 1942 వరకు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని 5సార్లు జైలుకు వెళ్ళారు. జైళ్ళలో ఉంటూ కూడా హిందీ ప్రచారం గావించారు. వీరు లోక్‌సభ సభ్యులుగా కూడా ఉన్నారు.

### చోడవరపు రామశేషయ్య :

కృష్ణాజిల్లా సాతులూరు గ్రామంలో 1906లో జన్మించిన రామశేషయ్య పెడన బోర్డ్‌హైస్కూలులో హిందీ పండితునిగా భాషా ప్రచారం గావిస్తూ 'బొబ్బిలి', 'గృహిణి', 'మంత్రి రామయ్య', 'రాణి మల్లమ్మ' మొదలైన చారిత్రక నాటకాలు రచించారు. హిందీ సాహిత్యానికి ఈయన చేసిన సేవ అపారమైనది.

### దండమూడి వెంకట కృష్ణారావు :

కృష్ణాజిల్లా పెనుమత్స గ్రామంలో జన్మించిన వెంకట కృష్ణారావు గారు 1930-34 సంవత్సరాల మధ్య గుడివాడలోనూ, 1937 నుంచి 1940 వరకు ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘ్ తరపున గుత్తి, అనంతపురం, వాల్తేరు, నంధ్యాలలోను హిందీ ప్రచారం గావించారు. ఎస్.ఆర్.ఆర్. అండ్ సి.వి.ఆర్ కళాశాల, విజయవాడలో కూడా హిందీ లెక్చరర్‌గా పనిచేశారు. వీరు హిందీలో 'చిత్రాంగి', 'స్తవనీయ శాసక్ కృష్ణరాయ్', 'శకకర్త శాలివాహన్' మొదలైన రచనలు గావించారు. తెలుగు తీన్ భక్త కవి', 'ఫుల్‌ఝడీ', 'కాలేజ్ హిందీ- అంగ్రేజ్ వ్యాకరణ్' రచించి శ్రీ వెంకట కృష్ణారావు గారు హిందీకి ఎనలేని సేవ చేశారు.

### రెంటాల వెంకట రాఘవయ్య :

గుడివాడ తాలూకా మోపర్రు గ్రామంలో 1921లో జన్మించిన వెంకట రాఘవయ్య హిందీలో అపారమైన పరిజ్ఞానాన్ని సంపాదించి అనేక పత్రికలలో వ్యాసాలు రాశారు. ఢిల్లీలోని రాష్ట్రపతి భవన్‌లో స్టెనోగ్రాఫర్‌గా పనిచేశారు. అంతేకాక దక్షిణ భారత హిందీ ప్రచార సభలోను, శ్రీ రామేశ్వరదాస్ బిర్లా, శ్రీ కమలనయన్ బజాజ్ గార్ల వద్ద స్టెనోగ్రాఫర్‌గా పనిచేశారు. మధ్యప్రదేశ్ విధానసభలో కూడా పనిచేసి కృష్ణాజిల్లా ఖ్యాతిని, దక్షతను దేశవ్యాప్తం చేశారు.

### పింగళి లాజపతి :

విజయవాడలో1907లో జన్మించిన లాజపతిమునిసిపల్ రెవెన్యూ ఆఫీసర్‌గాపనిచేస్తూ హిందీ సాహిత్యానికి ఎంతోసేవచేశారు. 'రామదాసు'

అను ఖండకావ్యాన్ని హిందీలో రచించారు. 'సుమతీ శతకాన్ని' హిందీలోకి అనువదించారు.'మీరాబాయి' పేరుతో పద్యకావ్యం కూడా రచించారు.

**కోట సుందర రామశర్మ :**

మచిలీపట్టణంలో 1936లో జన్మించిన శర్మగారు సాహిత్యరత్న, ఎం.ఏ., ఎం.ఓ.ఎల్ (తెలుగు), ఎం.ఏ. సంస్కృతం, పాలి విశారద, ప్రాకృత విశారద, ఫ్రెంచ్, జర్మనీ, ఫారసీ, రష్యన్ భాషల్లో డిప్లమోలు చేశారు. భారత ప్రభుత్వ విద్యా మంత్రిత్వశాఖలో అసిస్టెంట్ ఎడ్యుకేషనల్ ఆఫీసర్‌గా ఢిల్లీలో పనిచేశారు. శర్మగారు 'హిందీ-తెలుగు రీడర్', 'ప్రద్యుమ్నాభ్యుదయం', 'శ్రీహర్ష రాజ్య' మొదలైన గ్రంథాలు రచించారు. 'బిహారీ సతసీ'ని తెలుగులోకి అనువదించారు. హిందీ పత్రికలలో వీరి అనేక వ్యాసాలు, కవితలు ప్రచురించబడ్డాయి.

**దండమూడి మహీధర్ :**

కోడూరులో 1929లో జన్మించిన మహీధర్ గారు హిందీ-తెలుగు-ఉభయ భాషానువాద ప్రవీణుడు. వీరు హిందీలో 25 కథలు వ్రాశారు.'యూకలిప్టస్ కీ డాలిమేఁ ఆధాచాంద్' అనే వీరి కథా సంపుటి మంచి పేరు సంపాదించింది. తెలుగు సాహిత్యం, తెలుగు కవులు-రచయితలు,తెలుగు సంస్కృతి గురించి హిందీలో రాసిన వీరి వ్యాసాలు హిందీ పత్రికలలో అచ్చయ్యాయి. కొడవటిగంటి కుటుంబరావు గారి 'వాయుభక్షకుడు' కథని వీరు హిందీలోకి అనువదించారు. మొత్తం 47 తెలుగు కథల్ని, 8 నాటికల్ని, 12 నవలల్ని, లెక్కలేనని తెలుగు కవితల్ని హిందీలోకి అనువదించి హిందీ సాహిత్య లోకానికి తెలుగు సాహిత్య సౌరభాన్ని అందించారు. 'హిందీ-చందమామ'కు సహ సంపాదకులుగాను, ఆకాశవాణిలో 'స్క్రిప్ట్ రైటర్ అండ్ ట్రాన్సలేటర్' గాను పనిచేస్తూ హిందీ-తెలుగుల మధ్య వంతెనగా నిలిచారు.

**కనకమేడల వెంకటేశ్వరరావుగారు** యలకర్రులో 1931లో జన్మించారు.వీరు'తెలుగులో కావ్యాలు,నాటకాలు, నవలలు, వ్యాసాలు రచించిన గొప్ప రచయిత. 'మహావీర్ బాలచంద్ర' అనే రచన గావించారు.

**యలమంచిలి వెంకటప్పయ్య గారు** కనుమూరు గ్రామంలో 1902లో జన్మించారు. వీరు హిందీ-తెలుగు సరళ వ్యాకరణ్' 1, 2, 3 భాగాలు, 'హిందీ-తెలుగు ముహావరా కోశ్', 'బాలసాహిత్యం' మొదలగునవి రచించారు. ఐతానగరం, తెనాలిలో ఆదర్శ బాలికా పాఠశాలని స్థాపించి వీరు హిందీ ప్రచారం చేశారు.

**యలమంచిలి వెంకటేశ్వరరావుగారు**1914లో జన్మించారు. వీరు తెనాలి,గాంధీ ఆశ్రమం, కొమరవోలులో ప్రచారం గావించటమే కాక 'హిందీసాహిత్య కా ఇతిహాస్', 'ధర్మయుద్ధ్' మొదలైనగ్రంథాలు హిందీలో రచించారు. అనేక హిందీ కథల్ని తెలుగులోనికి అనువదించారు.

**దిగవల్లి శేషగిరిరావు గారు**1916లో మచిలీపట్టణంలో జన్మించారు. వీరు 'హిందుస్తానీ వ్యాకరణ సంగ్రహ్', 'హిందూస్తానీ స్వయం శిక్షక్', 'హిందుస్తానీ-తెలుగు శిక్షక్', 'జ్ఞానేశ్వరీ భగవద్గీతా', 'యోగసాధన' 'ముక్తిమార్గ్ జపయోగ్', 'ప్రాణాయామ్', 'బ్రహ్మచర్య', 'యోగాసన్', 'విజయా' మొదలైన గ్రంథాలు హిందీలో రచించారు. 'ప్రేమ్‌చంద్ కథలు', 'సతసయీ', 'వసుంధరా', 'జాగరణ్', 'జ్యోతిష్మతీ', 'మెహర్ బాబా' మొదలైనవి కూడా వీరి చెప్పుకోదగ్గ రచనలు.

**దీవి శ్రీనివాస అయ్యంగార్ గారు** ఆత్కూరులో 1915లో జన్మించారు. వీరు 'ప్రేమపాలన్', 'పునర్మిలన్' అనే గ్రంథాలను 'దీనసేవ' అనే అనువాద గ్రంథాన్ని రచించారు.

**బైసాని శ్రీరాములు గుప్తగారు** 1913లో గుడివాడలో జన్మించారు. వీరు 'డాక్టర్ పట్టాభిసీతారామయ్య జీ కీ జీవనీ' 'చక్రవర్తి రాజగోపాలా చారి కీ జీవనీ' (ఛాత్రహిత పుస్తకాలయ్, ప్రయాగ) అనే గ్రంథాల్ని 'హిందీ-తెలుగు స్వబోధిని' రచించారు. హిందీ నుంచి తెలుగులోనికి, తెలుగు నుంచి హిందీలోనికి అనేక కథలు అనువదించి ప్రచురించారు. విద్యార్థుల కోసం 'సికందర్','పంచవటి','పథిక్', 'నిర్మలా', 'సేవాసదన్' మొదలైనవాటికి సరళ సామాగ్రిని రాసి అందించారు. విజయవాడలో 'లోకమాన్య హిందీ మందిర్' అనే పేరుతో హిందీ పుస్తక విక్రయశాల నిర్వహించారు. ప్రస్తుతం వీరి కుమారుడు బైసాని రామ్‌ప్రసాద్ గుప్త గారు ఆ పుస్తకశాలని నిర్వహిస్తూ హిందీ అధ్యయనానికి, పరిశోధనకు ఎనలేని సేవ చేస్తున్నారు.

**దేవరకొండ సనత్కుమారశర్మగారు** 1924లో గురజ గ్రామంలో జన్మించారు. వీరు హిందీలో 'మాతా' అనే ఖండకావ్యాన్ని, 'రాజశ్రీ' అనే నాటకాన్ని రచించారు.

**అయాచిత హనుమచ్ఛాస్త్రిగారు** 1919లో లంకపల్లి గ్రామంలో జన్మించారు. వీరు హిందీలో 'తెలుగు ఔర్ ఉస్‌కా సాహిత్య' అనే గ్రంథాన్ని, తెలుగులో 'హిందీ సాహిత్యము' అనే గ్రంథాన్ని రచించారు.

**మిక్కిలినేని సుబ్బారావుగారు** 1915లో గరికపర్రులో గ్రామంలో జన్మించారు. వీరు హిందీలో 'శంకర్ బాలకథా', 'హిందీతెలుగు శబ్ద సంగ్రహ్'మొదలయినగ్రంథాలు రచించారు.'మజదూర్'హిందీ పత్రికకు సహాయసంపాదకులుగా కూడా పనిచేశారు.వీరు మంచినటుడు కూడా.

**అట్లూరి రామారావుగారు** గుడివాడ తాలూకా పెదపారుపూడిలో 1925లో జన్మించారు. వీరు తెలుగులో గొప్ప కథా రచయిత. హిందీ-తెలుగు నాటకాల్లో నటించిన గొప్ప నటుడు, స్త్రీ పాత్రలు పోషించటంలో దిట్ట. సినిమా నటుడు కూడా. రేడియో నాటకాలను, కథలను హిందీ నుంచి తెలుగులోనికి అనువదించారు.

**కాజ వెంకటేశ్వరరావు గారు** 1923లో వానపాముల గ్రామంలో జన్మించారు. తేలప్రోలు,ముదునూరు,వేలేరు,నెప్పల్లె, కుందేరు, విజయ వాడలో హిందీ ప్రచారం గావించారు. 'అంతస్థల్' అనే కవితా సంకలనాన్ని హిందీలోను, 'హృదయదానం', 'ఇవరంటావేమోయి' మొదలైన తెలుగు రచనల్ని గావించారు. పత్రికలలో అనేక వ్యాసాలు హిందీ-తెలుగు భాషల్లో వ్రాశారు. ఇప్పటివరకు అవిశ్రాంతంగా వీరు దక్షిణ భారత హిందీ ప్రచార సభ ప్రచార కార్యక్రమాల్లో నిరంతరం పాల్గొంటూనే ఉన్నారు. వీరికి "బాబూ గంగాశరణ్ సింహ్" పురస్కారం ఇవ్వటం కృష్ణాజిల్లా హిందీ ప్రచారకులు-సేవకులకు దక్కిన గౌరవంగా భావించవచ్చు.

**పొట్లూరి నాగభూషణంగారు** (మొఖాసా కలవపూడి) హిందీ ప్రచారంతో పాటు 'గాంధీ గారంటే', 'గవర్నర్ జనరల్ రాజాజీ' అనే గ్రంథాల్ని తెలుగులో వెలువరించారు. **ఎస్.ఎల్. పెరుమాళ్ళు** (ఉంగుటూరు) హిందీ ప్రచారంతోపాటు నాటక, సినిమా నటుడుగా మంచి ఖ్యాతి గడించారు. **అట్లూరి వెంకటరంగయ్య** (పెదపారుపూడి) సహాయ నిరాకరణోద్యమం లో పాల్గొని జైలుకు వెళ్ళటంతోపాటు, జైలులో హిందీ ప్రచారం గావించారు. **పునుకొల్లు వెంకటేశ్వరరావు** (పెదపారు పూడి) 1930లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. మోటూరి వెంకటేశ్వరరావు (దొండ పాడు) హిందీ-తెలుగు పత్రికలలో అనేక వ్యాసాలు రచించటంతో పాటు, రేడియో నాటకాల్ని, కథల్ని తెలుగునుండి హిందీలోనికి, హిందీ నుండి తెలుగులోనికి అనువ దించారు. శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యా లయం హిందీ శాఖలో పనిచేసిన ఆచార్య నరసింహాచారిగారు (ఉయ్యూరు) 'సౌందర్య శాస్త్రం' అనే సిద్ధాంత గ్రంథాన్ని, ఇంకెన్నో పరిశోధనా వ్యాసాల్ని రచించారు. **పడికిటి సీతారామయ్య** (కొయ్యరగూరపాడు) వ్రాసిన వ్యాసాలు, కథలు అనేకం హిందీ-తెలుగు పత్రికల్లో ప్రచురించ బడ్డాయి. రాయప్రోలు సీతారామాంజనేయ శాస్త్రి (విజయవాడ) 1942లో వ్యక్తి సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొని జైలుకు వెళ్ళారు. **దశిక సూర్య ప్రకాశరావు** (నూజివీడు) హిందీ ప్రచారంచేస్తూనే తెలుగులో 'లోకోత్తరులు', 'కథా పారిజాతం', 'గాంధీ విద్యార్థి జీవితం', 'వినోబా సన్నిధిలో' మొదలైన గ్రంథాలు రచించారు. **దోనేపూడి రాజారావు** (కొయ్యగూరపాడు) 'శోక్షక్' అనే హిందీ మాసపత్రికకు సంపాదకులుగా పనిచేశారు. వీరు 'కావ్యసుధ', కొన్ని 'పాఠ్యపుస్తకాలు' రచించారు. **డా॥ పుల్లారావు** హిందీలో 'స్వర్ణపథ్' అనే కావ్యసంపుటి రచించారు. లకమరాజు వెంకట రామరాజు (విజయవాడ) 'బంధన్, 'వీరవనితా' అనే హిందీ రచనల్ని తెలుగీకరించారు. ప్రముఖ హిందీ ప్రచారకులు **కాటూరి వెంకటేశ్వరరావు** (కాటూరు) తెలుగులో ప్రఖ్యాత కవి శ్రీమతి కొసరాజు శకుంతలాదేవి (విజయవాడ) హిందీ ప్రచారంతోపాటు హిందీ నాటకాల్లో నటించి మంచిపేరు గడించారు. **డా॥ చలసాని సుబ్బారావు** హిందీలో "రానీ రుద్రమ్మ" నాటకం రచించారు.

ఈ రకంగా వందలాదిమంది కృష్ణాతీర ప్రాంతానికి చెందిన హిందీ ప్రచారకులు భాషా ప్రచారంతోపాటు హిందీ సాహిత్య సేవ చెయ్యటం లోను, తమ ప్రాంతంలోను - వెలుపల హిందీ ద్వారా జాతీయ భావాల్ని పురికొల్పడంలోను ప్రముఖ పాత్ర పోషించారు.

దక్షిణ భారతదేశంలో హిందీ ప్రచారంలో అగ్రగామిగా నిలచి, హిందీ భాషా సాహిత్యాల వికాసంలో కృష్ణాతీరాన్ని ఆదర్శవంతంగా నిలిపిన పై మహనీయుల వారసత్వాన్ని, వారి సంప్రదాయాల్ని నేటికీ కొనసాగిస్తున్నవారు ఎంతోమంది రచయితుల, కవుల, అనువాదకులు ఉన్నారు.

**పద్మభూషణ్ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ :** ప్రస్తుత తరంలో హిందీ భాషా సాహిత్యాలకు ఎనలేని సేవ చేస్తూ మనరాష్ట్రంలోను, దేశంలోను, దేశాంతరాలలో కూడా కృష్ణాజిల్లా బావుటాను ఎగరేస్తున్నవారు పద్మశ్రీ ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్‌గారు. నందిగామ-కె.వి.ఆర్ కళాశాల లోను, విజయవాడ-ఆంధ్ర లయోలా కళాశాలలోను హిందీ అధ్యాపకు లుగా పనిచేసి వందలాదిమంది విద్యార్థులకు హిందీ భాషా సాహిత్యాల పట్ల అభిరుచి కలిగించారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు హిందీ విభాగంలో ఆచార్యులుగా స్నాతకోత్తర విద్యను బోధించటంతోపాటు, హిందీలో పరిశోధనలకు నిర్దేశకత్వం వహిస్తున్నారు. దాదాపు 40 సంవత్సరాలు గా హిందీకి ఎనలేని సేవ చేసిన లక్ష్మీప్రసాద్‌గారు హిందీ, తెలుగు భాషలు రెండింటిలోను పి.హెచ్.డి.లు చేసిన ఏకైక పరిశోధకులు. సృజనాత్మక సాహిత్యాన్ని, అనువాద సాహిత్యాన్ని హిందీ - తెలుగు పాఠకులకు అందిస్తూ ఉన్నారు. వీరి కలంనుండి ఇప్పటికి 60 పైగా మహత్తరమైన గ్రంథాలు, వందలాది వ్యాసాలు వెలువడ్డాయి.

అసాధారణమైన సృజనాత్మక ప్రతిభ కలిగి హిందీ, తెలుగు భాషల్లో వైవిధ్యభరితమైన రచనలు చేయటమే కాక, వాటికి గుర్తింపుగా పలు పురస్కారాలు కూడా లక్ష్మీప్రసాద్‌గారు అందుకున్నారు. 1981లో 'తెలుగు కే ఆధునిక్ కవి భైరాగి' అనే రచనకు కేంద్రవిద్యామంత్రిత్వ శాఖ నుండి జాతీయ పురస్కారం, 'తమస్' తెలుగు అనువాదానికి 1990లో తెలుగు విశ్వవిద్యాలయ పురస్కారం, 1992లో దీనికే కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం, ఇంకా 1995 తానా పురస్కారం; తమ తెలుగు పరిశోధనా గ్రంథానికి గాను ఆంధ్ర విశ్వవిద్యాలయపు 'ఉత్తమ థీసిస్' బంగారు పతకం, 2009లో జాతీయ హిందీ అకాడమీ పురస్కారం, ఉత్తరప్రదేశ్‌లోని కాన్పూర్ ఛత్రపతి సాహుజీ మహారాజ్ విశ్వ విద్యాలయం, హిందీ ప్రచార సమితి వారి'కీర్తిభారతి' పురస్కారం, డా॥ రాజీవ్ రంజన్ పాండే అవార్డుతో తామ్రపత్రం మొదలైన

సత్కారాలు అందుకున్నారు. 'ద్రౌపది' నవలా రచనకు 2009 కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారాన్ని రెండవసారి కైవసం చేసుకున్నారు.

1996-2002 కాలంలో లక్ష్మీప్రసాద్‌గారు రాజ్యసభ సభ్యులుగా ఉన్నారు. అదే సమయంలో గౌ॥ ఎల్.కె. అద్వానీగారు అధ్యక్షులుగా గల 'పార్లమెంటరీ కమిటీ ఆఫ్ అఫీషియల్ లాంగ్వేజ్'కి ఆయన ఉపాధ్యక్షులుగాఉన్నారు. కేంద్రీయ హిందీ సమితి, కేంద్ర పెట్రోలియం మంత్రిత్వ శాఖలో పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీ సభ్యులుగా, రక్షణ మంత్రిత్వ శాఖ, స్టీల్ అండ్ మైన్స్ మంత్రిత్వ శాఖల సలహా సమితిలో సభ్యులుగా వున్నారు. వీరి బహుముఖీయమైన సాహిత్య సృజనకు, వీరు జాతీయ భాష, అధికార భాషా ప్రచార ప్రసారాలకు చేస్తున్న కృషికి గుర్తింపుగా 'పద్మశ్రీ', 'పద్మభూషణ్'లు అందుకున్నారు.

ఆచార్య లక్ష్మీప్రసాద్ 'ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడమి'కి 6 సం॥లు అధ్యక్ష బాధ్యతలు నిర్వహించారు. తెలుగుభాష-సంస్కృతులను హిందీ భాష ద్వారా పరివ్యాప్తం చేయడానికి, రాష్ట్రంలో హిందీ భాషా - సాహిత్యాలవికాసానికి ఆయన ఎంతో కృషి చేశారు. ఇలాంటి మహత్తర మైన కృషి, హిందీ భాషా సాహిత్యాలకు సేవ చేస్తున్న ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్‌గారు కృష్ణాతీరప్రాంతవాసి కావడం హిందీ భాషాభిమానులు, రచయితలు - అందరూ గర్వించదగ్గ విషయం. మాస్కోలోని 'భారతమిత్ర సమాజం' లక్ష్మీప్రసాద్ గారి హిందీ భాషా సాహిత్యాల సేవతో పాటు సమకాలీన ప్రపంచంలో మానవ విలువలకు సంబంధించిన అంతర్జాతీయ అవగాహనను, వారికి గల విశ్వదర్శనాన్ని పరిగణనలోకి తీసుకొని 2007 సంవత్సరానికి గాను 'పుష్కిన్ పురస్కారం' ఇచ్చి సత్కరించింది.

హిందీ భాషా సాహిత్యాల ప్రచారాలతోపాటు,సాహిత్య వికాసంలో కూడా తీర ప్రాంత ఖ్యాతిని నిలుపుతున్నవారు ఇంకెందరో ఉన్నారు. జిల్లాలోని పాఠశాలలు, కళాశాలలన్నింటిలో హిందీ బోధన జరుగుతుండటంతో అనేకమంది హిందీ భాషా పండితులు, అధ్యాపకులు హిందీ భాషా ప్రచారంతోపాటు సాహిత్య సృజనలోను, అనువాదాలలోను తమ పూర్వపు వారసత్వాన్ని కొనసాగిస్తూనే ఉన్నారు. మచిలీపట్టణంలో **డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు** హిందీ తెలుగులో ఎన్నో సమీక్షాత్మకమైన వ్యాసాలు, 'గద్య సంకలనం' అనే పాఠ్యపుస్తకం రూపొందించారు. **వేమూరి వెంకట సుబ్బారావు** హిందూ కళాశాల, మచిలీపట్టణంలో అధ్యాపకులుగా వుంటూ భాషా - సాహిత్యాలకు ఎనలేని సేవ చేశారు. డా॥ మురళీ కృష్ణమ్మ, శ్రీమతి శారద, శ్రీమతి పద్మావతి, డా॥ కె. శామ్యూల్, డా॥ మౌలాలి హిందీ అధ్యాపకులుగా హిందీకి ఎంతో సేవ చేశారు.

విజయవాడ కె.బి.ఎన్. కళాశాల అధ్యాపకులు **డా॥ చెన్న కేశవులు** హిందీ -తెలుగు రెండింటిలోను గొప్ప రచయిత, 'మానిషాద', 'నైనం చిద్రంతి శస్త్రాణి' మొదలైన రేడియో జాతీయ నాటకాల్ని హిందీ - తెలుగు భాషల్లో రచించారు. 'ప్రేమజోగిని' అన్న సంగీత రూపకాన్ని, 'డా. పట్టాభి' జీవితగాథని, 12కు పైగా నాటికలను, 6 బాల కథలను హిందీలో రచించారు. 12 తెలుగు రేడియో నాటకాల్ని హిందీలోకి, 15 నాటకాలను హిందీ నుంచి తెలుగులోకి అనువదించారు. సిద్ధార్థ కళాశాలలో అధ్యాపకులు, హిందీ శాఖాధ్యక్షులుగా పనిచేసిన **శ్రీ యడ్లపల్లి సీతారామయ్య** 'వీరపాండ్య కట్టబొమ్మన్' అనే చారిత్రక నాటకం హిందీలో రచించారు. **డా॥ బాదరవాడ నరేంద్రవర్మ** (గుడివాడ) ఆరుద్ర రచించిన 'సినీవారలి' కావ్యాన్ని హిందీలోకి అనువదించారు. **డా॥ వెన్నా వల్లభరావు** 'భగవతీచరణ్‌వర్మ నవలల్లో వ్యక్తి-సమాజం' అనే పరిశోధనా గ్రంథాన్ని రచించారు. పోలవరపు కోటేశ్వరరావుగారి 'చినబాబు'నవలను, డా॥ జి.వి. పూర్ణచంద్ రచించిన 'తెలుగే ప్రాచీనం' అనే పరిశోధనా గ్రంథాన్ని, గోపీచంద్ కథల సంపుటి 'తండ్రులు-కొడుకులు'ను హిందీలోకి అనువదించారు. 18 హిందీ రేడియో నాటకాలు, రూపకాలను తెలుగులోనికి, 16 రేడియో నాటకాలను తెలుగు నుంచి హిందీలోనికి అనువదించారు. 'జాతీయ పతాక రూపశిల్పి పింగళి వెంకయ్య' అనే గ్రంథాన్ని హిందీలోను, తెలుగులోను రచించారు. సమకాలీన హిందీ కవితల్ని 112 తెలుగులోనికి, 100 కవితల్ని తెలుగు నుండి హిందీలోనికి అనువదిం చారు. వీరు అనువదించిన 'నల్లనివాడు' రేడియో నాటకం హిందీ అనువాదా నికి జాతీయ నాటకంగా అవార్డు లభించింది. ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడమీ నుండి ఉత్తమ అనువాద పురస్కారం కూడా ఈయన అందుకున్నారు.

### ఆలూరి బైరాగి :

తెనాలి ఐతా నగరంలో 1925లో జన్మించిన ఆలూరి బైరాగి హిందీ,తెలుగు,ఇంగ్లీషు భాషల్లో గొప్ప కవి. 11 సంవత్సరాల వయసులో తండ్రి ప్రోత్సాహంతో బీహార్ వెళ్ళి బైరాగి 5 సంవత్సరాలు హిందీ క్షుణ్ణంగా అభ్యసించారు. 13 ఏళ్ళ ప్రాయంలోనే ఆయన హిందీలో కవిత్వం రాయటం ప్రారంభించారు. దక్షిణ భారత హిందీ ప్రచారసభ వారి రాష్ట్రభాష, విశారద పరీక్షలు ఉత్తీర్ణులైన బైరాగి గుంటూరు జిల్లా ప్రత్తిపాడు గ్రామంలోని పాఠశాలలో హిందీ ఉపాధ్యాయునిగా

4 సం॥లు పనిచేసి ఎంతోమంది విద్యార్థుల్ని హిందీ పట్ల ఆకర్షితుల్ని చేశారు. ఆయన వాత్సల్యాన్ని, స్ఫూర్తిని అందిపుచ్చు కున్న వారి శిష్యుడు శ్రీ పి. ఆదేశ్వరరావు సాహిత్య మర్మజ్ఞునిగా, సహజ కవిగా, సాహిత్య రసికునిగా, ఉత్తమ ఆచార్యునిగా రూపొందారు. ఆలూరి బైరాగి తెలుగులో 'చీకటినీడలు', 'నూతిలో గొంతుకలు', 'ఆగమగీతి' కవితా సంకలనాలు రచించారు. 'పాపపోయింది' (నవల), 'దివ్యభావనము' (కథాసంపుటి) బైరాగిగారి ప్రసిద్ధ గద్య రచనలు. 'పలాయన్' ఆయన రచించిన ప్రసిద్ధ హిందీ కావ్య సంకలనం. 'ఫూటా దర్పణ్', బైరాగి మరణానంతరం ప్రచురితమైన హిందీ కవితల సంకలనం. హిందీ, తెలుగు భాషలో లఛందోబద్ధంగా, వచన కవితా రూపంలో బైరాగి రచించిన ప్రేమ కవితలు, గీతాలు భావ రస స్ఫోరకాలు. బైరాగి కవిత్వంలో భావకవిత్వ, ప్రగతివాద, ప్రయోగవాద లక్షణాలు దర్శనమిస్తాయి. ఆయన కవ్తివంలో యుస్పృహ, కల్పన, విప్లవచైతన్యం, ప్రకృతిప్రేమ, సౌందర్యదృష్టి తారసపడతాయి. తన హిందీ కవితా రచనద్వారా తెలుగువారైన హిందీ కావ్య పటిమను ప్రదర్శించి, హిందీ ప్రాంతీయ సరసన స్థానాన్ని ఏర్పరుచుకున్న కవిశ్రేష్ఠుడు అలూరి బైరాగి.

**వారణాసి రామమూర్తి 'రేఖ' :**

1940 నుండి 1955 వరకు గుంటూరు హిందూ కళాశాలలో హిందీ అధ్యాపకునిగా పనిచేసి శ్రీ వారణాసి రామమూర్తి 'రేఖ' 1917లో ఒంగోలు తాలూకా వల్లూరు గ్రామంలో జన్మించారు. 'కాశీవిద్యాపీఠ్' లో హిందీ కోలిద్, మద్రాసు విశ్వవిద్యాలయంలో, 'విద్వాన్' చేశారు. 1952లో కాశీ విశ్వవిద్యాలయంలో ప్రైవేటుగా ఎం.ఏ. హిందీ చేశారు. శ్రీ రేఖ హిందీలో గొప్ప రచయిత, అనువాదకులు. 'ఆంధ్రదేశ్‌కే కబీర్ శ్రీ వేమనా', 'ఆంధ్ర బాగవత్ పరిమల్', 'చమగీదడ్' రేఖ అనువాద పటిమకి తార్కాణంగా నిలిచిన రచనలు. 'విరహగీత్' శ్రీ రేఖ మౌలిక కవితల సంకలనం. ఈయన తన సాహిత్య సృజనకు గాను ఉత్తరప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం పురస్కారం, రోహిల్‌ఖండ్ విశ్వవిద్యాలయం నుంచి 1977లో 'డి.లిట్' అందుకున్నారు.

**ఆచార్య పి. ఆదేశ్వరరావు :**

కృష్ణాతీర ప్రాంత హిందీ ప్రచారకుల్లో పి. ఆదేశ్వరరావుగారు చాలా ప్రముఖులు. హిందీలో ఉన్నత విద్య, పరిశోధనకి వేరుచేసిన కృషి అపారం. ఈయన గుంటూరులో 1936లో జన్మించారు. ప్రసిద్ధ కవి అలూరి బైరాగిగారి వద్ద ప్రత్తిపాడు పాఠశాలలో విద్యాభ్యాసం చేసి హిందీ పట్ల ప్రేమ పెంచుకున్నారు. కాశీ హిందూ విశ్వవిద్యాలయం నుంచి 1961లో ఎం.ఏ (హిందీ) పట్టాను, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాల యాలనుంచి 1968లో పి.హెచ్.డి. డిగ్రీను పొందారు. 5 సం॥లపాటు దక్షిణభారత హిందీ ప్రచారసభ, మద్రాసులో స్నాతకోత్తర విభాగంలో అధ్యాపకునిగా, అటుపిమ్మట ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో హిందీ ఆచార్యునిగా వందల – వేలమంది విద్యార్థులకు ఎంతో ప్రేమతో స్నాతకోత్తర హిందీ విద్య నభ్యసింపజేశారు. పరిశోధనకు ప్రోత్సహించి, ఉన్నత ప్రమాణాలు కలిగిన పరిశోధనలకు పర్యవేక్షకులుగా వ్యవహరించారు.

ఆచార్య ఆదేశ్వరరావు అత్యంత భావుకుడు, కల్పనాశీలుడు అయిన హిందీ కవి. ప్రతిభాశాలి అయిన విమర్శకుడు. దక్షత కలిగిన అనువాదకుడు. ఈయన హిందీ, తెలుగు, ఇంగ్లీషు భాషల్లో 30కి పైగా రచనలు చేశారు. 'అంతరాల్', 'ధార్ కే ఆర్ పార్', 'వాతాయన్ యే ప్రేమ సౌధ్ కే' వీరి హిందీ కవితా సంకలనాలు. వీరి కవితల్లో అపురూపమైన ప్రేమ రసధార పాఠకుల్ని తన్మయుల్ని చేస్తుంది. ఆచార్య ఆదేశ్వరరావు అత్యంత ప్రౌఢ విమర్శకుడు. కవిపంత్ జీర్ ఉన్‌కీ ఛాయావాదీ కవితాయేఁ', 'తులనాత్మక శోధ్ జీర్ సమీక్షా', 'స్వచ్ఛందతావాదీ కావ్యకా తులనాత్మక్ అధ్యయన్' మొదలయిన విమర్శగ్రంథాలు వీరి లోతైన విమర్శనా పటిమకి తార్కాణాలు. తులనాత్మక భాషా శాస్త్ర రంగంలో వీరు దిట్ట. గద్య, పద్య రచనల అనువాదాల్లో అందెవేసిన చెయ్యి వీరిది. హిందీ, తెలుగు, ఆంగ్ల భాషల్లో నిష్ణాతులైన ఆచార్య ఆదేశ్వరరావు ఈ మూడు భాషల్లోనూ అనువాదాలు చేశారు. జ్ఞానపీఠ పురస్కారం పొందిన హిందీ కవి దినకర్ 'ఊర్వశి' కావ్యాన్ని వీరు ఆంగ్లంలోకి కావ్యానువాదం చేశారు. హిందీ నుంచి ఇంగ్లీషులోకి వీరు చేసిన అనువాదాల్లో 'కురుక్షేత్ర', 'కాంటెంపరరీ హిందీ పొయిట్రీ', 'లాంగింగ్ ఫర్ లవ్', 'పప్పెట్స్ ఆఫ్ టైమ్', 'ఫాషన్ అండ్ కంపేషన్' 'వాయిసెస్ ఫ్రమ్‌ద ఎంప్టీవెల్', 'ద బ్రోకెన్ మిర్ర్', 'ద షాడోస్ ఆఫ్ డార్‌కకనెస్', 'వాయిసెస్ ఫ్రమ్ ద ఎంప్టీవెల్', 'ద బ్రోకెన్ మిర్రర్', 'ద షాడోస్ ఆఫ్ డార్క్‌నెస్', 'అన్‌రిటెన్ పొయిట్రీ' మొదలైనవి హిందీ కృత్యానికి విశ్వవ్యాప్తిని కలిగించాయి.

తెలుగు రచనలకు జాతీయఖ్యాతి సంతరింపజేస్తూ ఆచార్య ఆదేశ్వరరావు తెలుగు నుంచి హిందీలోకి చేసిన అనువాదుల్లో 'తెలుగు కీనయీ కవితా', 'లోకాలోక్', 'మృత్యుకే బాద్', 'చంపకా', 'ఆత్మ వంచనా', 'హత్యా', 'పండిత్ పరమేశ్వరశాస్త్రీకే వసీయత్', 'మోహభంగ్' మొదలయినవి ప్రముఖమైనవి. హిందీ నుంచి తెలుగులోకి అనువ

దించిన నవల 'అమృతం-విషం'కు 1994లో కేంద్రసాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. జాతీయ-అంతర్జాతీయస్థాన పురస్కారాల నెన్నింటినో అందుకున్న ఆచార్య ఆదేశ్వరరావు కృష్ణాతీరప్రాంతానికి తన సృజనాత్మక, విమర్శనాత్మక, అనువాద రచనద్వారా ఎనలేని కీర్తి తెచ్చిన హిందీ ప్రముఖుడు.

**ఆచార్య ఎస్.వి.మాధవరావు :**

గుంటూరు జిల్లా సంక్రాంతిపాడు గ్రామంలో 1937లో జన్మించిన ఎస్.వి. మాధవరావుగారు స్నాతకోత్తర హిందీ బోధనకి, పరిశోధనకి విశేషంగా కృషిచేసిన ఆచార్యులు. వీరు నాగపూర్ విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఏ (హిందీ), పి.హెచ్.డి. డిగ్రీలు పొంది, ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో మూడున్నర దశాబ్దాలపాటు హిందీ ఆచార్యులుగా వేలమంది విద్యార్థులకు, డజన్లమంది హిందీ పరిశోధకులకు హిందీ రంగంలో ముందుకు సాగటానికి మార్గదర్శకులుగానిలిచారు. గంభీరమైన ఆలోచన, సూక్ష్మమైన విమర్శనా దృష్టిగల ఆచార్య మాధవరావు, 'ఆచార్య చతురసేన్ శాస్త్రి కీ ఉపన్యాస్ కలా కా శాస్త్రీయ అధ్యయన్', 'కావ్యశాస్త్ర కే నయే ఆయామ్', 'జయశంకర్ ప్రసాద్ కా సాహిత్య దర్శన్', 'రాష్ట్రభాషా కా దక్షిణ్ భారతీయ్ ఉపన్యాసీ సాహిత్య్', 'ఆధునిక్ ఆంధ్ర సాహిత్య్' మొదలయిన హిందీ గ్రంథాలు రచించి హిందీ పరివ్యాప్తికి ఎనలేని కృషిచేశారు.

**ఇలపావులూరి పాండురంగారావు :**

1930లో ఇలపావులూరులో జన్మించి గుంటూరులో అధ్యాపక వృత్తి నెరపిన శ్రీ ఇలపావులూరి హిందీలో పి.హెచ్.డి. పట్టా పొందిన తొలి తెలుగువాడు. ఈయన బహుముఖ ప్రజ్ఞాశాలి. హిందీ, తెలుగు భాషల్లో గొప్ప విమర్శకుడు, పరిశోధకుడు, కవి, అనువాదకుడు. నాగపూర్ విశ్వవిద్యాలయంలో హిందీలో జలపావులూరి 1956లో చేసిన పరిశోధన 'ఆంధ్ర-హిందీ నాటకాలు : తులనాత్మక అధ్యయనం' దేశంలోనే తులనాత్మక అధ్యయనంపైజరిగినమొట్టమొదటి పరిశోధనగా చెప్పుకోబడుతుంది. బోధనారంగం, ప్రభుత్వపాలనా రంగం, పాఠ్య పుస్తకాలు-జాతీయ భాష పాఠ్యప్రణాళిక రూపకల్పనకు సంబంధించిన వ్యవహారాల్లో ఈయన ఎన్నో ఉన్నత పదవులు నిర్వహించి హిందీ ప్రచార-ప్రసారాలకు ఇతోధికంగా కృషిచేసారు.

జలపావులూరి పద్యకవి, కావ్యానువాదకుడు. 'శ్రీకామాక్షీవిలాస్' వారి మౌలిక హిందీకావ్యం ప్రసిద్ధ హిందీ కవి జయశంకర్ ప్రసాద్ ఉత్కృష్ట కావ్యాలైన 'కామాయనీ', 'ఆంసూ'లను తెలుగులోకి కావ్యానువాదం గావించారు. సుమిత్రానందన్‌పంత్ రచన 'చిదంబరా'ను తెలుగులోకి తెచ్చారు. త్యాగరాజు,పోతనల కవిత్వప్రతిభను అనువాదాల రూపంలో హిందీవారికి చేరవేశారు. రంగనాయకమ్మ రచన 'పేకమేడలు', బలివాడ కాంతారావు రచన 'ఇదే నరకం, ఇదే స్వర్గం'ను హిందీలోకి సమర్థంగా అనువదించారు. తెలుగు, హిందీ, ఇంగ్లీషు భాషల్లో వారు 40 గ్రంథాలు రచించారు. 'భారతీయ జ్ఞానపీఠ్' సంస్థకు సంచాలకులుగా, ఇదే సంస్థకు ఎంపిక కమిటీకి ఎక్స్-అఫీషియో సభ్యునిగా సేవలందించిన గొప్ప వ్యక్తి ఇలపావులూరి.

వీరేకాక ఇంకా ఎంతోమంది హిందీ పండితులు, ప్రచారకులు, రచయితలు, కవులు, అనువాదకులు హిందీ ప్రచారానికి ఎనలేని కృషిచేశారు. వారి కృషి ఫలితంగా 1918లో తెలుగునాట ప్రారంభమైన హిందీ ప్రచారమనే విత్తనం, ఈ 98 సం॥లలో మహావృక్షంగా శాఖోపశాఖలుగా విస్తరించింది. జాతీయ భాషను ప్రేమతో ఆదరించటంలో దక్షిణాదిలోని ఇతర ప్రాంతాల కంటే కృష్ణాతీర ప్రాంతం అగ్రస్థానంలో ఉంటూ వచ్చింది. ఈ ప్రాంత హిందీ రచయితలు, అనువాదకులు తెలుగుకు జాతీయస్థాయిలోను, హిందీకి అంతర్జాతీయ స్థాయిలోను గౌరవం కల్పించటానికి కృషి చేశారు, చేస్తున్నారు.

శ్రీ పెనుగొండ లక్ష్మీనారాయణ

# కృష్ణాతీర సాహితీశోభ

వసంతాలను వెంటతెచ్చి శిశిరాలకు, శిథిలాలకు వీడ్కోలు పలికింది. క్షామసీమల్ని క్షేమసీమలుగా మార్చింది. ఊసర క్షేత్రాలను వెలలేని మాగాణిని చేసింది. తన స్వచ్ఛ జలధారలతో తెలుగునేలపై ఆకుపచ్చని సంతకం చేసింది. తన జల దృశ్యాలతో జన హృదయాలను పారవశ్యమొనరించింది. తన నడకతో జాతికి నడత నేర్పింది. ఇంత నాగరికతను ప్రసాదించింది.

'బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి' త్రిశరణాలతో బౌద్ధ ధర్మాన్ని నేల నాలుగు చెరగులా పరివ్యాప్తి గావించింది. బుద్ధ నాగార్జునుని బోధముద్రా జ్యోతులతో జ్ఞానకాంతులను ప్రసరించింది. బౌద్ధం పతనానంతరం ఆ ఆరామాలపై శిరసెత్తిని హిందూ దేవాలయాలు హరోం హర నాదాలతో ప్రతి ధ్వనిస్తుంటే పరవశించింది. శాతవాహన చక్రవర్తుల శౌర్యదీప్తులను వెదజల్లింది. అపురూప శోభలు సంతరించుకున్న అమరావతీ శిల్ప సంపద ప్రపంచ శిల్ప కళారంగంలో అమరావతి కళా సంప్ర దాయంగా స్థిరఖ్యాతి నొందటాన్ని కళ్ళారా గాంచింది. నవరత్న శిల్ప మయమయిన నాగార్జున కొండను పర్యాటక ప్రపంచంగా మార్చింది.

ఆధునిక దేవాలయాలుగా అభివర్ణితమైన అనేక జలనిధుతో తను ప్రజకు పెన్నిధయింది. వెలుగయింది. తన సజల హస్తాలతో నోళ్ళను, బీళ్ళను తనివితీరా స్పర్శించి తన నీటితో కన్నీటిని తుడిచిన ఆ ప్రాణహిత ఒక్కోసారి వరదవెల్లువైంది. జనజీవనాన్ని కన్నీట ముంచెత్తింది. ఆ చింతలు తీర్చే పులిచింతల పథకం యింకా వాగ్దాన దశలోనే వుండటం ఓ విషాదం. తెలుగువారి ఈ జీవనవాహిని రాజకీయ సుడిగుండాలలో రాష్ట్రాల మధ్య వివాదాలలో చిక్కుకుని చిక్కిపోయింది. నేడు తన బేలతనాన్ని ప్రదర్శిస్తోంది.

### ఆ నదీమతల్లి మన కృష్ణవేణమ్మ

సుదీర్ఘ తీర్థయాత్ర, ఘనత వహించిన తీరచరితగల కృష్ణానది ఎందరో సాహితీవేత్తలకు స్ఫూర్తిదాయకమైంది. వారి లేఖినులనుండి మత, తాత్వికబోధగా, గాథగా, కథగా, కావ్యంగా, కవితగా, నవలగా, చరిత్రగా జాలువారింది. నెమలికి నడకలు నేర్పిన సంగీత నృత్య వేదికైంది. సిద్ధేంద్రయోగి కూచిపూడి భామాకలాప నృత్యముద్రలు, నారాయణతీర్థ యతీంద్రులు ఆలపించిన తరంగాలు, క్షేత్రయ్య పద కవితలు ఈ తీరాన్ని ఎంతగానో తరింపజేశాయి. తర తరాలకు వన్నెతగ్గని సాహిత్య సాంస్కృతిక సంపదను అందజేసింది కృష్ణానదీ పరీవాహక ప్రాంతం.

### తొలి వేకువలో 'కృష్ణా' సాహిత్య దర్శనం

గౌతమబుద్ధుని తాత్వికతను విశ్లేషించి వ్యాఖ్యానించి సాధారణ జనపదులలో సైతం బౌద్ధ ధర్మాన్ని విస్తృతంగా ప్రచారం గావించిన ప్రబుఖుడు ఆచార్య నాగార్జునుడు, "నాగార్జునుడు తొలిసారిగా తన ప్రతిభా విశేషంతో సాపేక్షతా వాదాన్ని క్రీ.శ. 1వ శతాబ్దిలోనే సాకల్యంగా ప్రతిపాదించిన 20వ శతాబ్ది ఐన్‌స్టీన్‌ను ముందుగానే ఊహించగలిగాడు. ప్రపంచం ఒక భావమని ప్రతిపాదించిన హెగెల్ సిద్ధాంతాన్ని సవిశేషముగా కాకపోయినా స్థూలంగానైనా ఊహించి యీతడు ఖండించాడు." (డాక్టర్ జి.వి. కృష్ణారావు)

ఆచార్య నాగార్జునుడు మాధ్యమికవాదం లేదా శూన్యవాదం బోధకుడు. మాధ్యమిక బౌద్ధమత శాఖ వ్యవస్థాపకుడు. నాగార్జున కొండ ప్రాంతంలో గల వేదలి గ్రామ వాసి అని, ధాన్యకటకం (ధరణి కోట)తో ఆయన జీవితం, కృషి ప్రచారం ముప్పేటగా ముడిపడి వున్నాయని చరిత్ర సాక్ష్యం చెప్తోంది. ఆచార్య నాగార్జునుని మాధ్యమిక దర్శనాన్ని ఆంధ్రులకు ముక్కామల రాజగోపాలరావు అనువాదం – వ్యాఖ్యానంతో 'శూన్యతాసప్తతి' పేరిట అందించారు.

తన సన్నిహితుడైన ఆనాటి శాతవాహన పాలకుడు గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణిని ఉద్దేశించి నాగార్జునుడు రాసిన 'సుహృల్లేఖ'కు అమరావతి వాస్తవ్యులు డాక్టర్ వావిలాల సుబ్బారావు వచనానువాదం చేయగా గజ్జెల మల్లారెడ్డి పద్య గేయానువాదం గావించారు.

"జడములకు జీవులకు భూమియే ఆధారమైనట్లు అన్ని సుగుణాలకు నైతిక జీవనమే ఆధారం" అని సుహృల్లేఖలో నాగార్జునుడు బోధించినట్లు వావిలాల సుబ్బారావు పేర్కొన్నారు.

ఆచార్య నాగార్జునుడు సంస్కృతంలో మరికొన్ని రచనలు కూడా చేశారు. అమరావతిలో చైత్యాలు, స్థూపాలు నిర్మించిన ఈయన రసాయన శాస్త్రవేత్త కూడాను. వీరిపేరుమీద వెలసినదే ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం.

శాతవాహనరాజులలో 14వ వాడైన హాల శాతవాహన చక్రవర్తి సంకలనం చేసిన 'గాథాసప్తశతి' గ్రంథం నాటికీ నేటికీ ఎంతో ప్రసిద్ధమైనది.

"నాకు వేదమంత ప్రామాణికమైనది హాల శాతవాహన చక్రవర్తి పోహళించిన గాథాసప్తశతి. ఇది కేవలం కవితా సంకలనమే కాదు. సాంఘిక చరిత్ర, భాషా పరిణామ చరిత్ర... ఇంతెందుకు ? తెలుగు వారి విజ్ఞాన సర్వస్వమని నా విశ్వాసం" అని తెలుగు భాషా సాహిత్య సంస్కృతులకు స్వీయప్రజ్ఞతో ఉజ్వలితం చేసిన వర్చస్వి తిరుమల రామచంద్ర అభిప్రాయపడ్డారు.

ఎందరో ప్రముఖ సాహితీవేత్తలు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి, తిరుమల రామచంద్ర, వేలూరి శివరామశాస్త్రి, కొలకలూరి ఇనాక్‌వంటివారు గాథాసప్తశతిని తెనుగు చేశారు. వీరిలో కొందరు పద్యాన్ని మరి కొందరు వచనాన్ని ఆశ్రయించారు.

కృష్ణాతీరవాసైన పోలవరపు కోటేశ్వరరావు 'నాటి గాథలు-నేటి కథలు' శీర్షికన ఆనాటి కొన్ని గాథాసప్తశతిలోని గాథలనునేటి గ్రామీణ జీవన విశ్వాసాలతో పోల్చి గ్రామ జీవన శృంగార సౌరభాన్వితంగా ఆధునీకరించి చెప్పారు.

## కథా కృష్ణ

గౌతమ బుద్ధుని జన్మల గురించి చెప్పిన జాతక కథలను విపుల 'ప్రస్తావన'తో శ్రీ శివశంకరస్వామి (పూర్వాశ్రమంలో తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి - గుంటూరు జిల్లా మంగళగిరి సమీపంలోని కాజ గ్రామస్థులు, సభాపతిగా పేరొందిన బహుభాషావేత్త) బౌద్ధం విలసిల్లిన ఈ నేలనుండి 'బుద్ధుని జాతక కథలు' సంగ్రహాన్ని నేరుగా పాలి భాషనుండి ఆంధ్రీకరణచేసి మనకు అందించారు. బౌద్ధం విలసిల్లిన ఈ నేలనుండి బుద్ధుని జాతక కథలు తెలుగులో రావటం ఓ విశేషం.

"గౌతమ సిద్ధార్థుడు బుద్ధుడగుటకు అనేక జన్మలెత్తవలసి వచ్చెను. 547 జన్మలకు ఆయన బుద్ధుడయ్యెను. సంబుద్ధి కలుగుటకు పూర్వ మాయనకు తథాగతుడనియు, బోధిసత్త్వుడనియు సంజ్ఞలు. బోధి శబ్దానికి బుద్ధత్వమనియు, సత్త్వశబ్దానికి సంబుద్ధికై ప్రయత్నించు వాడనియు తాత్పర్యం" అని శ్రీ శివశంకరస్వామి బుద్ధుని జన్మజన్మల గురించి, బుద్ధునికి కలిగిన పేర్ల గురించి ఈ పుస్తకంలో 'ప్రస్తావన' చేశారు. బుద్ధత్వం, బుద్ధుని బోధలు, జాతిపై బుద్ధుని జాతక ప్రభావం, ఆయననాటి ఆచార వ్యవహారాలు, దేశకాల పరిస్థితులను ఈ జాతక కథలు మనకు తెలిజేస్తాయి.

## అమరావతి కథలు

"అమ్మ చెప్పిన కథలు అయ్యకే చెబుదునా ; ఆలకించమని హరిహరులను వేడుకొందునా !" అంటూ అమరావతికే చెందిన సత్యం శంకరమంచి మనకు ఆత్మీయంగా అందించినవే 'అమరావతి కథలు'.

"తెలుగు నది గురించి తెలుగులో రాసిన కథలే అయినా అన్ని దేశాలకూ, అన్ని జాతులకూ అందంగా అమరిపోతాయి. తారీకుల ప్రకారం, ఈ దశాబ్దానికి ఉత్తమశ్రేణి ఆధునిక కథావాహినిగా చెప్పదగిన ఈ కథలు నిజానికి ఏ శతాబ్దానికైనా గొప్పవే".

"అమరావతి కథలు తెలుగు సాహిత్య పీఠంలో కలకాలం నిలబడి గౌరవం, ఆదరణ పొందే ఒక మహోజ్వల సృష్టి. ఎన్నటికీ ఆరని అఖండజ్యోతి. పాఠకులకూ, కళాకారులకూ ఎన్నిసార్లు ఆస్వాదించినా తనివితీరని అమృతం కలశం. అక్షయమైన అక్షరపాత్ర. శిల్ప సౌందర్యానికి పరమావధి. ప్రపంచ సాహితీ వీధిలో తెలుగువారు సగర్వంగా ఎగరేయగల పతాకం" (ముళ్లపూడి వెంకటరమణ 'అమరావతి కథలు - అపురూప శిల్పాలు" శీర్షికన రాసిన ముందు మాటలో)

విఖ్యాత దర్శకుడు శ్యామ్‌బెనగల్ అమరావతి కథలు కొన్నింటిని రసరమ్యంగా బుల్లితెరకెక్కించి కృష్ణా సాహిత్యాన్ని ప్రపంచానికి ఎంతో గొప్పగా పరిచయం గావించారు. అమరావతి కథలకు 'బాపు' రూపానువాదాలు సరేసరి. వాటిని గురించి ఎంత చెప్పుకున్నా తనివి తీరదు మరి.

కృష్ణాతీర భూములలోని దివిసీమ ప్రజాజీవితాలను ముఖ్యంగా రైతు జీవన హేలను వివిధ కోణాలలో ప్రతిబింబిస్తూ పోలవరపు కోటేశ్వరరావు కాకుళయ్య కథలు, కృష్ణాతరంగాలు, లచ్చుమయ్య కథలు, మా ఊరి మనుషులు కథా సంపుటాలు వెలువరించారు.

సుప్రసిద్ధ కథకులు మా గోఖలే 'బుద్ధం శరణం గచ్ఛామి', 'బల్లకట్టు పాపయ్య' వీరివే మరికొన్ని కథలు ; గంధం యాజ్ఞవల్క్య శర్మ' 'సెలయింది....' కథ ; పి. సత్యవతి 'పెళ్ళి ప్రయాణం' కథ ; పాపినేని శివశంకర్ కథలు 'మట్టి గుండె', 'చింతలతోపు', ముళ్ళపూడి సుబ్బారావు 'రెండు నదుల మధ్య' కథలు కృష్ణాతీర సమాజాన్ని బహుముఖంగా చిత్రించాయి.

## 'కృష్ణాతీరం'

వచన రచనకు మేస్త్రి మల్లాది రామకృష్ణశాస్త్రి రాసిన 'కృష్ణాతీరం' నవలలో 'కృష్ణాతీరపు వ్యావహారిక భాషలోని వైవిధ్యాన్నీ, విలక్షణతనీ, కవితాత్మకత జోడించి ప్రదర్శించారు.

'మల్లాది రామకృష్ణశాస్త్రిగారి రచనల్ని చదవడం కృష్ణలో స్నానం చేసినంత పవిత్ర కార్యం అనిపిస్తుంది. చదివాక మనస్సు స్వచ్ఛమవు తుంది' అంటారు ప్రముఖ కథా రచయిత్రి అబ్బూరి ఛాయాదేవి.

## పద్యగేయ ప్రవాహం

కృష్ణానదీ తీరాన పద్యం గేయం రమణీయ భావుకతతో పరవళ్లెత్తాయి. ఎందరో కవులు ఆ నది గురించి, ఆ తీర వికాసాన్ని వివరిస్తూనే, ఆ నది తమకందించిన స్ఫూర్తిని పద్య గేయాల ద్వారా ప్రవహింపజేశారు.

"ఆంధ్ర రాజ్య స్థాపనాచార్యుడై, తెల్గువేలుపై నాఁడాంధ్రవిష్ణు విభుడు రణ కళానిధి సుశర్మను జంపి మగధోర్వి, శాసించె శ్రీముఖ చక్రవర్తి ఔత్తరాహులనెల్ల నదలించె హేలుండు, శాలివాహనశక స్థాప కుండు నిజ జయస్తంభముల్ నిఖిల దిక్కులఁ బాఁతె, గౌతమీపుత్రుండు శాతకర్ణి క్షాత్రవుల గెల్చి మాళవజాతికెల్ల, నాధుఁడయ్యెను వాసిష్ఠీ నందనుండు ప్రాంతపడినట్టి యాంధ్రభూపతుల కతలు, చదువుఁడొక సారి కండలు కదలియాడ–"

'తెనుఁగులెంక' తుమ్మల సీతారామమూర్తి 'రాష్ట్రగానము'లో ఈ పద్యాల ద్వారా అమరావతీ పాలకుల చరిత్రక్రమాన్ని, వారి వీరచరితల సిరులను పరిచయం గావిస్తూ ఈ తరం వెనుకతరముల వారినుండి స్ఫూర్తిపొందాలని సందేశమిచ్చారు.

"ఏ యిక్ష్వాకుల నాటి వృత్తములో యీ కృష్ణానదీవాః కళా
చ్ఛాయా స్వప్న పరంపరా శిథిలముల్ సాక్షాత్కరించున్ మహా
మాయా మేదుర మేఘ వాటికల శంపామాలికా జ్యోతులై
మా యాంధ్రావని బౌద్ధశిల్పముల సమ్యక్ పూర్వ సంభావనల్"

ఆనాటి శిల్పకళా చాతురిని అత్యుత్తమ భావుకతతో మనముందు ఈ పద్యరచన ద్వారా ఆవిష్కరించారు నండూరి రామకృష్ణమాచార్య.

"ఈ తరంగమాలాకుల కృష్ణవేణి
సైకత నిషణ్ణుడఁను నీ ప్రశాంతమధుర
మోహన విముగ్ధరూపమ్ము ముంచుకొన్న
నా మది యనంతభావసంకలిత మిపుడు"

అంటూ ఆ కృష్ణాస్రవంతి దర్శనంతో తనలో భావపరంపర వీచ టాన్ని ఉద్విగ్నపూరితంగా 'కృష్ణయొద్దున' పద్యాలలో సంకలనం చేశారు నాయని సుబ్బారావు.

కృష్ణాతరంగ నిర్నిద్ర గానముతోడ
శిల్పమ్ము తొలి పూజ సేయునాడు !"
"అక్షరజ్ఞాన మెఱుగదో యాంధ్రజాతి
విమల కృష్ణానదీ సైకతముల యందు
కోకిలపు బాట పిచ్చుక గూండ్లు కట్టి
నేర్చుకొన్నది పూర్ణిమా నిశల యందు"

కృష్ణానదీ స్పర్శలో ఆంధ్రజాతి పొందిన జ్ఞాన సంపదను విశ్వనాథ సత్యనారాయణ 'ఆంధ్ర పౌరుషము' ఖండికలో విశదీకరించారు.

"అల కృష్ణా జలధార పంపకము సేయం బండు బంగారు తీ
గల మాగాణులు పట్టు చీరలయి శృంగారింపగాఁ, బూర్వ రా
జుల దోశ్శౌర్యము లుగ్గడించెడు రణక్షోణీస్థలున్ రత్నభూ
షలుగా ! గొల్చెడు వీరభూమినిఁ బ్రతిష్ఠాజ్యోతి వెల్గించెదన్"

అంటూ వాస్తవికతా దృక్పథాన్ని సమ్మేళనపరచి బంగారుభూమి సూక్తాన్ని ఆలపించటమేగాక ఈ సీమను వీరభూమిగా కొనియాడారు తన 'గుంటూరు సీమ' పద్యాలలో గుఱ్ఱం జాషువా.

## నారాయణరెడ్డి 'నాగార్జున సాగరం'

డాక్టర్ సింగిరెడ్డి నారాయణరెడ్డి 'నాగార్జున సాగరం' గేయకావ్యం ఒక రాసిక్యగీతం. మత విశ్వాసాలను ప్రశ్నించిన ఒక మౌలిక రచన వీరి రచనలలో సుప్రసిద్ధమైనదీ కావ్యం.

బౌద్ధారామ శిల్పి పద్మదేవుడు, బౌద్ధ విశ్వవిద్యాలయ విద్యార్థిని శాంతిశ్రీల ప్రణయాన్ని యితివృత్తంగా స్వీకరించిన ఈ కాల్పనిక

కావ్యంలో వారి పవిత్రప్రేమకు అడ్డుగా నిలిచిన మతాన్ని మానవత్వం లేనిదిగా పరిగణించారు రచయిత.

కావ్య ప్రథమతరంగంలో కృష్ణానదిని వర్ణించిన తీరులో ఉన్నతమైన భావుకత సాక్షాత్కరిస్తుంది.

"అదిగొ కృష్ణమ్మ న
వ్యాప్పరోంగన భంగి
నడయాడె నాంధ్ర భూ
నందనోద్యానమున,
అల్లదుగా కృష్ణవే
ణమ్మ విద్రావ రూ
పము దాల్చినట్టి బౌ

ద్ధము వోలె కదలాడె" నంటూ కృష్ణ ఎన్ని రీతుల ఎన్ని వంపుల తిరుగుతూ, ఎన్ని సొంపులు పోతూ ప్రవహిస్తోందో ఆ తీరున ఈ కావ్యరచన గావించారు సి. నారాయణరెడ్డి.

## అన్నపురెడ్డి 'నది కదిలొస్తే...'

అన్నపురెడ్డి విజభాస్కరరెడ్డి వెలువరించిన ఉత్తమశ్రేణి గేయ కావ్యమిది.

"నాగార్జున సాగరం ఈ కావ్యవృత్తం
ఈ వృత్తం చుట్టూ తిరుగుతున్నది కృష్ణవేణి.

ఈ కృష్ణవేణి చుట్టూ తిరుగుతున్నది కవివాణి. "అని ఆత్మీయంగా" డాక్టర్ సి. నారాయణరెడ్డి రాసిన కవితాత్మక వాక్యాల ద్వారా ఈ కావ్య యితివృత్తాన్ని, కవి హృదయాన్ని గ్రహించగలం.

ఎంతో ఉద్వేగభరితంగా సాగిన ఈ కావ్యంలో నాగార్జున సాగరం నెలకొనక ముందు ఆ తర్వాత పరిస్థితులను పేర్కొనటంలో కవి విజయభాస్కరరెడ్డి విజయం సాధించారు. నాగార్జున సాగర్ జాతి జనులకు ముఖ్యంగా తన ప్రాంత ప్రజలకు కలిగించిన మేలును, దానివలన అక్కడి జీవితాలలో వచ్చిన మార్పులను, కలిగిన వికాసాన్ని ఎంతో బాగా చిత్రీకరించారు. రైతులపాలిటి ఆధునిక దేవాలయంగా ఆ సాగరాన్ని నిరూపించారు.

తెలుగుజాతి ప్రాంగణాన
వెలిగిన మణిదీపమ్మది.
దాహతప్త జనత కొరకు
తరలివచ్చు మేఘమ్మది
ఆకలితో అలమటించు
అన్నార్తుల కమృతమ్మది
పొలము దున్ను రైతుకొరకు
పొంగిపొరలు సాగరమది
పచ్చని ఊహల సాగిన
పైరగాలి పరిమళమది.
కోటి కోటి శ్రమజీవుల
కష్టానికి ఫలితమ్మది.

శ్రమ శక్తి నుండి ఆవిర్భవించిన ఆ సాగరాన్ని 'నవజీవన మధు పూర్ణ కలశమ్ముగ భావించి' – 'ఎవరిదోయి చెలికాడా ! ఆ పునీత సాగరమ్ము, ఇంకెవరిది – నీది నాది, ఇట పుట్టిన ప్రతి మనిషిది, కలలుకనే ప్రతి మనసుది, కనిపెంచిన కృష్ణమ్మది" అని కవి ప్రకటించి కృష్ణానదిపై నిర్మించిన ఆ సాగరానికి నీరానాలర్పించారు. పోలవరపు కోటేశ్వరరావు వెలువరించిన సంగీత నృత్యరూపకమైన 'కృష్ణవేణి గేయాలు' పుస్తకంకూడా ఈ సందర్భంగా పేర్కొనదగినది.

## పలనాడు వెలలేని మాగాణిరా

కృష్ణా పరీవాహక ప్రాంతమైన 'పలనాడు'ను విభిన్న కోణాలలో ప్రతిబింబించిన ప్రఖ్యాత తెలుగు జాతీయగేయం పలుపుల వెంకట శివయ్య రచించిన 'పలనాడు వెలలేని మాగాణిరా'. స్వాతంత్ర్యానికి పూర్వమే 1945 డిసెంబర్‌లో కమ్యూనిస్టునేత, అభ్యుదయ కవి శివయ్య రాసిన ఈ గేయంలో పలనాడును వెలలేని మాగాణిగా వూహించటం ఆయన దార్శనికతకు నిదర్శనం. నాగార్జున సాగరం రావడంతో ఆయన స్వప్నం రుజువైంది. శివయ్య ఆ సాగర ఉద్యమనేత కూడా. ఈ గేయంలో పలనాటి భౌగోళిక, చారిత్రక, సాహిత్య విశేషాలతోపాటు పలనాటి యుద్ధం, స్వాతంత్ర్యోద్యమంలో పలనాడు పాత్ర మనకు దర్శనమిస్తాయి. అంతేగాక ఆ ప్రాంత ప్రాభవ వికాసాలు ఈ గేయంలో మనకు కనిపిస్తాయి. 'వెనుక తరములవారి వీరచరితల సిరులు, నార్పోసి త్యాగమ్ము నీర్వెట్టి పెంచరా, విరిసి సుఖములు పండురా' అనే గొప్ప సందేశంతో ముగిసే ఈ గేయం ఎన్టీ రామారావు నటించిన 'పలనాటి యుద్ధం' చలనచిత్రానికి శీర్షికా గీతం. ప్రజా గాయకుడు బొడ్డు గోపాలం ఆలపించారు. ప్రజావేదికలమీద వినపడే నిత్యనూతన గేయమిది.

## ముగింపు

'బిరబిరా కృష్ణమ్మ పరుగు లిడుతుంటేను బంగారు పంటలే పండుతాయి, అని శంకరంబాడి సుందరాచారి ఆలపించారు. మా తెలుగుతల్లికి మల్లెపూదండ గేయంలో. 'కల్లోల గౌతమీ వెల్లువల కృష్ణమ్మ, తుంగభద్రావల్లి పొంగి పారిన చాలు' అని సంతృప్తిని వ్యక్తపరిచిన తెలుగోడు వేములపల్లి శ్రీకృష్ణ, 'వెన్నెలవలె విహరించే కృష్ణవేణి' అని ఆరుద్ర అంటే 'కృష్ణవేణి తెలుగింటి అలివేణి' అని సినారె కీర్తించారు.

'కృష్ణా తరంగ పంక్తిన్ ద్రొక్కి త్రుళ్ళింత నాంధ్ర నౌకలు నాట్య మాడునాడు... చూచి, సంతోషమున తలలూచి, గర్వమాచి, ఆంధ్ర పుత్రీపుత్రులందగలరు శాంతి, నందాక లేదు విశ్రాంతి మనకు కంకణ విసర్జనల కిది కాలమగున్నె !' అని రాయప్రోలు సుబ్బారావు 'కృష్ణ' సాక్షిగా చేసిన ప్రబోధము' ఎన్నటికీ శిరోధార్యమే.

'వస్తుందీ నందికొండ నాగార్జున సాగరం ఆంధ్రుల పాలిన కామ ధేనువై వస్తుందీ' పల్లవితో ధారా నరసింహం రాసిన గేయ మెప్పుడూ తెలుగువారి స్మృతిపథంలో నిలిచే వుంటుంది.

మరెందరో రచయితలు సృష్టించిన 'కృష్ణా' సాహిత్యం ఆ నదికి సమాంతరంగా వొడ్డొరుసుకుని ప్రవహిస్తూనే వుంటుంది.

**పీత్వామ్ పీత్వామ్ పునః పునః పీత్వామ్**

*చిరునామా : పెనుగొండ లక్ష్మీనారాయణ, కార్యదర్శి – అరసం జాతీయ సమితి, 403 హరిచందన అపార్ట్‌మెంట్స్, 2వ వీధి ముత్యాలరెడ్డి నగర్, గుంటూరు – 522 007, 9440248778.*

శ్రీ యలమర్తి రమణయ్య

# కందనవోలు సాహితీనందనం

**ఉ॥ క్షామము దాపురించి పలుమారులు చచ్చెను జంతు సంతతుల్
వేమరు చచ్చినారు ప్రజ వేనకువేలు చరిత్ర చాటునన్
క్షామములెన్ని వచ్చిన రసజ్ఞత మాత్రము చావలేదు జ్ఞా
నామృతవృష్టికిన్ కొఱతనందని రాయలసీమలోపలన్**

అని డా॥ నండూరి రామకృష్ణమాచార్యులవారు రాయలసీమ విశిష్టతను ప్రస్తుతించినట్లుగా కృష్ణా స్రవంతితోపాటుగా రాయలసీమ ముఖద్వారం, కృష్ణానదీ పరీవాహక ప్రాంతములైన కర్నూలు జిల్లాలో "సాహితీ స్రవంతి" వేల యేండ్లుగా ప్రవహిస్తూనే ఉంది. కందనవోలు సమీపాన ఉన్న "కన్నమడకల" గ్రామంలో ఆంధ్రదేశంలోనే అత్యంత ప్రాచీనం క్రీ.పూ. 3000–2500 నాటి తెలుగుశాసనం గుర్తించ బడింది. ఆ శాసనం మొదటి పంక్తిలో "అంధిర" అని రెండవ పంక్తిలో "లోహము" అని వ్రాయబడింది.

జిల్లాలోని సాహిత్యం గురించి ప్రస్తావించడానికి ముందు విశ్వశ్రేయస్సు కోసమే సాహితీసృష్టి జరుగుతున్నదని, పద్యగద్యాలుగా మరియు గేయాలుగా సాహిత్యం ప్రజలను జ్ఞానవంతులుగా, చైతన్యపరులుగా చేస్తున్న విషయం విస్మరింపరానిది. జిల్లాలోని సాహిత్యాన్ని "ప్రథమ సాహస్రికయుగం" దాకా అంటే 1వ శతాబ్దము నుండి 10వ శతాబ్దం దాకా చూచినట్లైతే సిద్ధనాగార్జుని రచనలు చెప్పుకోదగినవి. నాగార్జునాచార్యులు ఇతర ప్రాంతముల నుంచి వారైనా బౌద్ధమతాన్ని స్వీకరించి శ్రీశైలంలోనే స్థిరపడి ఇక్కడే దేహత్యాగం చేసిన మహనీయులు. వారు 24 గ్రంథాలు రచించినట్లు తెలిసినా ప్రస్తుతం లభ్యమౌతున్నవి లోహశాస్త్రః, రసరత్నాకరః కచ్ఛపుట తంత్ర ఆరోగ్యమంజరీ, యోగసారః రసేంద్ర మంగళ, రతిశాస్త్రః, రసకచ్ఛపుటః, సిద్ధ నాగార్జునీయః అనుగ్రంథాలు మాత్రమే తదుపరి ఆదిశంకరాచార్యుల వారి విషయానికి వస్తే వారుకూడ కొంతకాలం శ్రీశైలంలో ఉన్నారు. "సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలింగం శివ లింగంతం" అని వారు మల్లికార్జునస్వామిని స్తుతించారు. ఆది శంకరులు "శివానందలహరి"ని ఇక్కడే రచించారని పెద్దలు చెబుతారు. ఈ విధంగా కర్నూలు జిల్లాలో అతి ప్రాచీనకాలంలోనే సాహిత్యానికి అంకురార్పణ జరిగిందని తెలియుచున్నది.

ద్వితీయ సాహస్రిక యుగంలో ఎందరో ఉద్దండ కవిపండితులు ఉత్తమగ్రంథాలు వెలయించి సాహితీసేవ చేశారు. సరస్వతీదేవి కంఠాభరణమై వెలిగారు. క్రీ.శ. 1033 శిలాశాసనంలో ప్రస్తుతిగాంచిన ఉత్తమ రాశి పండితుడు ఋగ్వేదాన్ని ఆపోశన బట్టిన పెద్దిభొట్ల విద్యాధరభట్లు వంటి పదముగ్గురు కవిపండితులు 11వ శతాబ్దంలో కాశీనుండి వచ్చి నందవరాన్ని అగ్రహారంగా స్వీకరించిన నందవరీకులు కాగా వారిలో శ్రీధరభట్లు తాళ్లపాక అన్నమాచార్యులు వారి పూర్వ పరంపరలోనివారు. జాను తెనుగులో కుమారసంభవ కావ్యాన్ని రచించిన నన్నెచోడుడు అతని గురువు జంగమ మల్లికార్జునుడు. పాల్కురికి సోమనాథునిచే ప్రస్తుతింపబడిన అతని కవితా గురువు కరస్థలి విశ్వనాథమయ్య జంటకవులు. నంది మల్లయ ఘంటసింగయ్య చాటు పద్యాలు వెలయించిన ఎడవల్లి పర్వతన్న అష్టదిగ్గజాల నొకడైన పింగళిసూరన, అహోబిలం 7వ పీఠాధిపతియైన శఠకోపయతి. కాలజ్ఞాన తత్వాలు విరచించిన వీరబ్రహ్మంగారు. 47 గ్రంథాలు వ్రాసి జ్ఞాన పరిమళాన్ని వెదజల్లిన యతీంద్రులు రాఘవేంద్రులవారు, సేలంలో పుట్టి కందనోలు మెట్టరామాయణం (బాలకాండ) యక్షగానం వ్రాసిన శ్రీమతి హోసూరు సాకమ్మ, తరిగొండ వెంగమాంబ తండ్రి కానాల కృష్ణకవి, గయోపాఖ్యాన ప్రౌఢకావ్యకర్త తిమ్మన మంత్రి రామయ్య, పారిజాతాపహరణం నాటకకర్త తంబళ్ళ బాలవీరయ్య, యక్షగానప్రయోక్త ఆశువుగా పద్యాలు గేయాలు సమయస్ఫూర్తితో గానంచేసిన యడవల్లి సిచ్చన్న, పారిజాతాపహరణ యక్షగానకర్తలు ప్రయోక్తలు కోటకొండ కప్పట్రాళ్ళ భాగవతులు, తడకనపల్లె కవి రామయోగి వంటి కవులు మొదటితరంవారు కూడా తరువాతి కాలంలో శ్రీరంగరాజచరిత్ర (సోనాబాయి పరిణయం) రచించిన నాటి

కర్నూలు డిప్యూటి కలెక్టర్ నరహరి గోపాలకృష్ణమచెట్టి, గ్రంథాలయోద్యమం, వయోజన విద్య ఉద్యమం రెండు కన్నులుగా నడిపిన ఆంధ్రతిలక్ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, మహాత్మాగాంధీ శతకర్త, కవినాటక కర్త ఐంద్రావతీ పత్రికా వ్యవస్థాపకులు వనం శంకరశర్మ, సాహితీస్ఫూర్తి షేక్ దావూద్‌కవి, సాహితీ సదస్సు వ్యవస్థాపకులు, మేడూరి దీక్షితుల వేంకటసుబ్బయ్య, ఆచార్య ఎన్.వి.కృష్ణమూర్తి, బహు గ్రంథకర్త కలుగోట్ల విజయాత్రేయ, బందుమయ్య, భైరాపురం రామయ్య, ఉప్పలూరి విశ్వేశ్వరయ్య సముద్రపు మహావిష్ణు, దేశంకోసం కావ్యకర్త సుబ్బారాయుడు, ఆర్.రంగస్వామిగౌడ్, వైద్యం వేంకటేశ్వరాచార్యులు, హీరాలాల్, యం.కె.రాము, కె.రోశయ్య (పరాశర), జె. ఎస్.ఆర్.కె.శర్మ, గన్నమరాజు సాయిబాబా, సయ్యద్ మహమ్మద్ ఆజం, గొట్టిముక్కల సుబ్రహ్మణ్యశాస్త్రి, సవ్వప్పగారి ఈరన్న, కెబియస్ కుమార్ డా॥ వి. పోతన, పత్తి ఓబులయ్య, కె.ఎన్.ఎస్. రాజు, శిష్టు కృష్ణమూర్తి రాధశ్రీ, జంధ్యాల రఘువిజయసారధి, జయరాం, వసుంధరాదేవి, మీరాబాయి, వింజమూరి ప్రభాకర్‌శర్మ, ఎస్.ఎస్.పటేల్, డా॥ ఎన్ శాంతమ్మ డా॥ శ్రీదేవి డా॥ దండిబోయిన పార్వతీదేవి, ఎం. పార్వతి ప్రభృతులెందరో కవితాసేద్యం చేస్తున్నారు. ఇటీవలే అరసం జయరాం ఆధ్వర్యంలో 72 మంది కవుల / కవయిత్రుల కవితలతో కర్నూలు కవిత"ను ప్రచురించింది. కవి నవలారచయితగా తానా అవార్డు గెలుచుకున్న కాశిభట్ల వేణుగోపాల్, హెచ్.ఐ.వి. అంశంపై 70 కవయిత్రులతో వచ్చిన "చిగురంత ఆశ" జిల్లా రచయిత్రులకు చోటు దక్కడం విశేషం.

ఇక అవధానం విషయానికి వస్తే నాటి గడేపల్లి వీరరాఘవశాస్త్రి, దోమా వెంకటస్వామి గుప్తగార్లతో పాటు అవధాన కళలో రాణిస్తున్నవారు శతావధాని గండ్లూరి దత్తాత్రేయశర్మ, వెల్లాల నరహరిశర్మ, మాచిరాజు శివరామరాజు, మద్దూరి రామ్మూర్తి, అవధాని సుధాకరశర్మ పరవస్తు ధనంజయులు మొదలగువారు.

జిల్లాలో ఎన్నో ఉద్యమాలు వచ్చాయి. ఉద్యమాలను ముందుకు తీసుకుపోవడానికి కవుల కలాల నుంచి ఎన్నో గేయాలు నాటికలు జాలువారాయి. భారత స్వాతంత్ర్య సంగ్రామంగా వాసిగాంచిన సిపాయిల తిరుగుబాటుకు (1857) పూర్వమే కర్నూలుజిల్లాలో పాళెగాడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా పోరాడినాడు. ఆ పోరాట వీరుని జానపదులు" సైరా నరసింహారెడ్డి" అంటూ గానం చేశారు.

జిల్లాలో జనవిజ్ఞానవేదిక ఆధ్వర్యంలో ప్రజల్లో శాస్త్రీయ అవగాహన కలిగించడానికి ఎన్నో ఉద్యమాలు వాటికనుబంధంగా కళాజాతులు నడిచాయి. ఆయా అంశాలపట్ల ప్రజలకు అవగాహన కలిగించడానికి ఎన్నో పాటల్ని గేయకర్తలందించారు.

**ఆరోగ్యవ్యవసాయ జాతా :**

ఈ జాతాద్వారా రైతులకు వ్యవసాయం పట్ల అవగాహన కలిగించటానికేగాక రైతుల సమస్యలపట్ల సంఘంలో సానుభూతిని పెంచడానికి ఎన్నో గీతాలు వచ్చాయి. అందులో ఒకటి

**విత్తనాలు ఎఱువులు కొనడానికి డబ్బులేదు**
**అప్పుజేసి కొన్నా అవి పుచ్చులూ కత్తలు**
**ఎట్టాగో పండించిన గిట్టుబాటు ధరలేదు**
**కొనబోతే కొఱవి అయె అమ్మబోతే అడవిఆయె**
**యాడేసిన గొంగలి ఆడనేఉన్నట్టు**
**రైతన్నా నీ బతుకు ఎదుగు బొదుగు లేదాయె ॥**

**అక్షరజ్యోతి**

అక్షరజ్యోతి కార్యక్రమంద్వారా జిల్లాలో వయోజనులను అక్షరాస్యులుగా చేయడానికి అటు ప్రభుత్వం ఇటు జనవిజ్ఞానవేదిక ప్రయత్నించాయి. అదొక ఉద్యమంగా నడిపాయి. ఆ సందర్భంగా కవులు, కవయిత్రులు కలాలకు పదును పెట్టారు. జిల్లాకు చెందిన కవులూ, కవయిత్రులు వ్రాసిన గేయాల్లో ఒకటి రెండు ఉదహరించడం సందర్భోచితంగా భావిస్తాను.

**పలకాబలపం పట్టుకొని బావయ్యో**
**రాత్రిబడికి నువ్వుబోతే బావయ్యో**
**నీవు చదివే తీరు చూసి బావయ్యో**
**ఈ కన్నెమనసు ఎన్న ఆయె బావయ్యో**

అని నన్నపనేని రమాదేవి కలంనుంచి జాలువారితే

**సంద్రంలో ముత్తెమల్లె సదువులోనె గ్యానముంది**
**సీకట్లో దీపమల్లె సిక్కులిప్పుయిద్దెయిది**
**ఆ కటికి రాదంటూ అలుసు సెయ్యమాకు నువ్వు**
**అసలిసుంటి అవకాసెం వొదులుకుంటెమల్లిరాదు**

అంటూ విద్యయొక్క ప్రయోజనాన్ని ఆవిష్కరించారు ఎలమర్తి

**అఆలు దిద్దాలనే ఆందోళన పడబోకు**
**సులభపద్ధతిలోనే చదువు నేర్పుతారంట**
**అదిగదిగో కదిలిందిర అక్షరసేన**
**రారమ్మని సైగచేసి పిలుపందుకోవోయ్**

అంటూ వయోజనవిద్యాబోధన కష్టంగా ఉండదు. ఇష్టంగా ఉండటానికి సులభమైన బోధనాపద్ధతులున్నాయనే విషయాన్ని తన పాటద్వారా తెలిపాడు జి.బి. మద్దిలేటి

**"గుడిలో లేదు దేవుడు బడిలోనే ఉన్నాడు దేవుడు"** అంటూ విద్య నేర్పే గురువుల్ని దేవుళ్లుగా నాగరాజు సంభావిస్తే

**"జనగణమని బడిగంట పిలుస్తుంది"** అంటూ వాసు ఎలుగెత్తి పిలిచాడు. అక్షరాస్యతా ఉద్యమం గొప్ప సామాజిక ప్రయోజనం కలిగింది కనుక

**"మేధావిలోకమా మేలుకో మేలుకో**
**కళ్ళు తెరచి ఒక్కసారి నీవారిని చూసుకో"**

అంటూ మేధావుల కర్తవ్యాన్ని గుర్తుచేసింది.

విజయభారతి తన పాటతో పల్లెసీమల్లో పద్యానికున్న ఆదరణను దృష్టిలో పెట్టుకొన్న ఆచార్య ఎన్.వి.కృష్ణమూర్తి

**"బావా ఎప్పుడు వచ్చితివు"** అన్న తిరుపతికవుల పద్యంతో మొదలుపెట్టి **"బావా అల్లుని పాఠశాలకిపుడే పంపించు... నా కుమార్తె కిపుడు ద్వాహంబుగావించెదన్"**

అంటూ సందేశమిచ్చాడు. శార్దూలపద్యంతో ఇలా ఎందరో కవులు కవయిత్రులు అక్షరాస్యతా ప్రయోజనాన్ని పాటలతో పద్యాలతో పల్లెసుద్దులతో చాటిచెబితే భవానీప్రసాద్ గేయనాటికతో అక్షర ప్రయోజనాన్ని హత్తుకొనేలా చెప్పాడు.

### మా ఊరికి సారా వద్దు - సారా వ్యతిరేకోద్యమం :

సారావల్ల ఒళ్ళు గుల్ల ఇల్లు గుల్ల సంసారాలే సర్వనాశనమౌతున్న సత్యాన్ని చాటడానికి సారా నిషేధించడానికి సాగిన ఉద్యమం కవులు తమ ఆయుధాలను సానపట్టేలా చేసింది. సారా తాగుడువల్ల కలిగే దుష్ఫలితాలను ప్రభుత్వాల బాధ్యతారాహిత్యాన్ని స్పష్టంచేస్తూ "మా ఊరికి సారావద్దు" కార్యక్రమం లక్ష్యాలను ప్రజలవద్దకు తీసుకుపోయింది.

"నాపేరేంటి ? నాపేరేంటి ?" అంటూ ఓ మనిషి అక్కడున్న గుంపును అడుగుతాడు ఇది బ్రహ్మారెడ్డి సృష్టించిన నాటకంలో ఓ పాత్ర సారా తాగుడువల్ల నాడీవ్యవస్థ దెబ్బతిన్న మతిమఱుపు మనిషి పగ-ప్రతీకారవాంఛలే ఊపిరిగా బ్రతుకుతున్న జిల్లావాసులకు ముఠాకక్షలు ఎంతటి ముప్పు కలిగిస్తాయో తెలియజేసే పాటలు ఎన్నో వచ్చాయి.

**ముఠాలుగా రగులుతున్న సీమ**
**రాయల సీమా - ఇది చావుల సీమా**
**చేతివృత్తులే వదిలి - మాగాణులు బీళ్ళుచేసి**
**నమ్ముకున్నవారినంత నట్టేట ముంచేసి**
**ఎత్తుకు పై ఎత్తులతో హత్య ప్రతిహత్యలతో**
**తరతరాలుగా సాగే నరమారణ హోమంతో**

అంటూ ముఠాకక్షలవల్ల జీవనోపాధిని నిర్లక్ష్యం చేయడం ఆస్తినష్టం ప్రాణనష్టం కావడం వంటి అనర్థాలు జరుగుతాయని సడ్లపల్లె చిదంబరరెడ్డి తన గేయంద్వారా హెచ్చరించాడు.

విలువైనది జీవితం వొలికించాము అమృతం
కక్షల చితిమంటల్లో కాలరాదు భవితవ్యం

కాలనీకు మానవత్వం అంటూ జీవితం విలువైనదని వచనత్వం మంటల్లో కలువకూడదని హితవు చెబుతూ

**చేరకండి ముఠాకక్షనాయకుల అండ**
**చేదు నిజం చెబుతానది పాముపడగనీడ**

అంటూ హెచ్చరిస్తాడొకకవి. ఇలా ఎన్నో గేయాలు కవుల కలాల నుంచి జాలువారాయి. ముఠాకక్షలపై నాటకాలు కూడా వచ్చాయి. సున్నితమైన హాస్యంతో డా॥బ్రహ్మారెడ్డి నాటకం వ్రాస్తే, ముఠాకక్షలెంత భయంకరంగా ఉంటాయో విజయభాస్కర్ "పులిస్వారి" నాటకం తెలియజేస్తుంది. జిల్లా ఎస్‌పి ఆధ్వర్యంలో పోలీసు కళాబృందం ఊరూరా ప్రదర్శించిన 'కనువిప్పు" నాటకం కూడా కక్షలతీవ్రత తెలియజేస్తుంది.

### పొదుపు ఉద్యమం :

జిల్లాలో నిర్వహించిన పొదుపు కళాయాత్ర పొదుపు ఉద్యమాన్ని బలోపేతం చేసింది. జిల్లాలోని ఓర్వకల్లు మండలంలో విజయభారతి స్థాపించిన "పొద్దు" పొదుపులక్ష్మి సంస్థ అంతర్జాతీయ ఖ్యాతిని గడించింది. పొదుపు గురించి విజయభారతి వ్రాసిన ఎన్నో పాటలు ప్రజల్ని ఆకట్టుకున్నాయి. ముఖ్యంగా "ఓలాలో ఓలాలో" అనే పాట ప్రజల నాల్కలపై నాట్యం ఆడింది. అలాగే "ఘల్‌ఘల్‌ఘల్‌ఘల్ గజ్జెలమోతా" "పొదుపు విలువ తెలుసుకో" అనే పాటలు వాసు వ్రాసిన "నా బంగరు తల్లివే" నాగరాజు వ్రాసిన "యాడ దాపెట్టేది డబ్బు" భవానీప్రసాద్ వ్రాసిన గేయనాటక ప్రజల్లో "పొదుపు" పట్ల అవగాహాన్ని పెంచాయి.

సమతా కళాజాత (స్త్రీ సాధికారతకోసం)

స్త్రీ సాధికారత పట్ల అవగాహన కలిగించడానికి సమతాకళాజాత జరిగింది. ఆ సందర్భంగా ఎన్నో అద్భుత గీతాలు వచ్చాయి. అందులో

**"తరతరాలు దాసిగా పేరుకు సహవాసిగా**
**క్రుగ్గుతున్న మన మహిళా భగ్గుమంది ఈవేళ"**

అనే గీతం మహిళా సమాఖ్య గీతంగా మహిళలు పాడు కుంటున్నారు.

**బాలకార్మికనిర్మూలనోద్యమం :**

బాలకార్మికుల దురవస్థ తొలగించాలని ఆడేపాడే బాలలతో కూలివని చేయించాలనే ఆలోచన ఎంత దుర్మార్గమైనదో తెలిపే గేయాలు ఎన్నో వచ్చాయి జిల్లాలో కూడా ఎన్నో గేయాలు వచ్చాయి. దానిలో కొన్ని వాసు వ్రాసిన

"అమ్మా నేను ఆగమై అక్షరాలు రెండునేర్వర"

"నాచిట్టి చెల్లెళ్ళర తేరే

రేపన్న వెలుగు రేఖలు మీరే !

**ఎలమర్తి వ్రాసిన**

మానవత్వమన్నదే మట్టిపాలు అయ్యిందా

కారుణ్యం కఠినశిలల కాళ్ళక్రింద నలిగిందా

పూలరెక్కలాంటిరెక్కలు ఆడితేనె దొక్కాడునా

జాలిలేనిలోకానికి బాలశ్రమకావలెనా ?

**మాతృభాషావికాసోద్యమం :**

"దేశభాషలందు తెలుగులెస్స" అన్నాడు పదిభాషలు తెలిసిన ప్రభువు శ్రీకృష్ణదేవరాయలు. కాని ఈ రోజు మాతృభాష అన్నిరంగాల్లో Less అవుతున్నది. సమీప భవిష్యత్తులో చావ బోతున్న భాషల్లో తెలుగుభాష ఒకటి అంటూ ఐక్యరాజ్యసమితి వెల్లడించింది. ఈ నేపథ్యంలో మాతృభాషావికాసానికి ఒక ఉద్యమం అవసరమని తెలుగుభాషా వికాసోద్యమం పేరుతో సంఘాన్ని ఉద్యమానికి నడుంగట్టిన తెలుగు భాషావికాసోద్యమ రాష్ట్ర ప్రధానకార్యదర్శి శ్రీ జె.ఎస్.ఆర్.కె. శర్మగారు కర్నూలుజిల్లా వారేకావడం జిల్లాకే గర్వ కారణం శర్మగారి అభిప్రాయాన్ని మన్నించి అప్పటికే భాషాసేవ చేస్తున్న ఆ సంఘాలు కలసివచ్చి డా॥ సామల రమేష్‌బాబు కీ.శే.ధర్మారావుగారి ఆధ్వర్యంలో తెలుగుభాషా వికాస ఉద్యమంతో కలిసి సమాఖ్యగా ఏర్ప డడం ఒకచారిత్రాత్మక ఘటన భాషావికాసోద్యమ గీతంగా ఎలమర్తి రమణయ్య రచించిన గీతాన్ని ఎంపిక చేసుకోవడమేగాక హైదరా బాదులో జరిగిన రాష్ట్రస్థాయి సదస్సులు గౌరవ నీయులు నాటి తెలుగు విశ్వవిద్యాలయం ఉపకులపతి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం మరో ఉపకులపతి ఆచార్య పేర్వారం జగన్నాథంగార్ల ప్రతిపాదనతో, ఆమోదించి ప్రతి తెలుగుసభలో ఉద్యమగీతాన్ని ఆలపించాలంటూ తీర్మానం చేయడం హర్షణీయం ఆ పాట

పల్లవి : కమ్మనైన తెలుగుభాష కలనైనామానొద్దు
అమ్మపాల కమ్మదనం మాతృభాషమరవద్దు

అ.ప. తెలుగుదనం మనకు ధనం
తెలుగుభాష చరిత ఘనం
మనసులు కలవోసి మనకు
మమతలొసగు సాధనం

ఆంగ్లభాష వ్యామోహం - ఆంధ్రానికి ఒకశాపం
కాకూడదు కాకూడదు తెలుగుతల్లికది శోకం
మాతృభాష ప్రేమించు పరభాషలగౌరవించు
తెలుగుబువ్వ తిన్నందుకు తెలుగోడిగజీవించు

జిల్లాలో మాతృభాషాగీతలంతగా రాలేదు కాని తెలుగుభాష ఘనత చాటే పద్యాలు ఏకంగా శతకాలే వచ్చాయి. అందులో వైద్యంలేక ఈశ్వరాచార్యుల శతకము చెప్పదగినది. ముఖ్యంగా అవధాని మద్దూరి రామ్మూర్తి రచించిన తెలుగుతల్లి దండకం అద్భుతరచన

**జైతెలుగుతల్లీ ! మహేంద్రన్ సువర్ణాల పూయించు ఓకల్పవల్లి నినున్‌హృద్యపద్యాల కావ్యాలనానాపురాణాల సంగీతసాహిత్య శాస్త్రాల నాట్యాలశిల్పాగేయాల నీతేజమున్ రూపమున్ భావమున్ భంగిమన్ సంపదన్ సత్కళసర్వమున్ గొల్చిపూజించి చింతించి**

**సమైక్యాంధ్ర ఉద్యమం**

రాష్ట్రవిభజనకు వ్యతిరేకంగా ఆంధ్రప్రదేశ్‌లో సాగిన సమైక్యాంధ్ర ఉద్యమం ప్రతి హృదయాన్ని కదిలించింది. ఎన్నో పాటలు వచ్చాయి. క్యాసెట్లు వచ్చాయి. క్యాసెట్‌లో ఇతర జిల్లా రచయితలతోపాటు జిల్లాకు చెందిన గంగాధర్ వ్రాసిన "తెలంగాణాంధ్రులంటూ ఏర్పాటు విధానం" భూపాల్ వ్రాసిన "వెయ్యర దరువెయ్యరొ సమై క్యాంధ్ర కోసం శ్రీకాంత్ వ్రాసిన "అదరకుండబెదరకుండ అలుపెరుగక మోదిరుగక" ఎలమర్తి వ్రాసిన "ఇది సమైక్యాంధ్రగీతం"

క్యాసెట్ కాకుండా విడిగా వచ్చిన పాటలు అనేకం. వాటిలో చాలా పాటలు ప్రజల్లోనికి పోని మంచిపాటలున్నాయి. అలాంటి వాటిలో

ఎవరు చిచ్చుబెట్టారో పచ్చనిరాష్ట్రంలోన
ఎవరి స్వార్థపదవికాంక్ష ఆజ్యం ఈ మంటలోన
గడిలో ఎట్టిగబతికిన బడుగులబతుకుల్లోన
ఇపుడిపుడే వెలుగురేఖ విచ్చుకున్నతరుణాన
ఉమ్మడిరాష్ట్రంలోన కమ్మగబతుకుతున్నా

"కవితా వనితా తోడునీడలేక నిలుచునా అన్నాడొకకవి. అది నిజమే కవులు కవయిత్రులు తమ కావ్యం గానం చేయడానికి ప్రేరణ కలిగించడానికి వేదిక అవసరం. అలా వేదికలందించడానికి జిల్లాలో ఎన్నో సాహితీసంస్థలు వెలిశాయి. సాహితీ సేవచేశాయి. అలాంటి కొన్ని సంస్థలను సంస్మరించడం సముచితంగా భావిస్తూ నాటకంలో నున్న కొన్ని సాహితీసంస్థల నీ దిగువనుదహరించడమైనది.

సాహితీసదస్సు, కర్నూలుజిల్లా వెలుగు రచయితల సంఘం పింగళి సూరన సారస్వతసంఘం, నవచైతన్యసాహితి, శ్రీనవకవితా సామ్రాజ్యం, అరుణభారతి, అభ్యుదయ రచయితల సంఘం, సాహితీస్రవంతి, కళాస్రవంతి, తెలుగుభాషావికాస ఉద్యమం, తెలుగు కళాసమితి (ప్రభుత్వసంస్థ), జనవిజ్ఞానవేదిక, కర్నూలుజిల్లా సహకార రచయితల సంఘం.

జిల్లా కలెక్టర్ అధ్యక్షుడిగా ఉన్న తెలుగు కళాసమితి ఇటీవలే జిల్లా చరిత్రకు సంబంధించిన రచనలందించిన దాదాపు 40 మంది రచయితల్ని సన్మానించింది. 1970 లో ఆవిర్భవించిన సాహితీసదస్సు సాహితీమూర్తులెందరినో ఆహ్వానించి సాహిత్యోపన్యాసము లిప్పించింది" ఇచ్చిన ఉపన్యాసాలను ప్రచురించింది కూడా అలాగే దానితో పాటే ఆవిర్భవించిన కర్నూలుజిల్లా రచయితలసంఘం ఎన్నో సాహితీకార్యక్రమాలు నిర్వహించింది. నంద్యాలలోని సారస్వతసంఘం కూడా ఎన్నో సాహితీకార్యక్రమాలు నిర్వహించింది, నిర్వహిస్తూఉన్నది. పత్తికొండలో సవ్వప్పగారి ఈరన్న స్థాపించిన కమలా కళానికేతన్ సాహితీసంస్థ సాహితీసేవలో ముందంజలోనే ఉన్నది. సంస్థ వ్యవస్థాపకులు శ్రీ ఈరన్నగారు తనొక్కడే 40 పుస్తకాలు రచించడం విశేషం.

ఈ విధంగా సాహితీ సౌరభాలతో గుభాళిస్తున్న కందనవోలు సాహితీనందనం ఎన్నో కావ్యపుష్పాలను పూయుచు రసజ్ఞులైన సాహితీప్రియులను అలరిస్తున్నది. సామాజికచైతన్యమందిస్తున్నది.

చిరునామా : *మధురకవి యలమర్తి రమణయ్య, కరవాణి 9490131005.*

డా॥ రావి రంగారావు

# కృష్ణాతీరంలో జనరంజక కవిత్వం

కవిత్వం అంటే ఎలా ఉండాలి అనే అంశం గురించి రకరకాల పండితులు రకరకాలుగా చెప్పారు. ఎవరెన్ని రకాలుగా చెప్పినా ప్రస్తుతం కవులు రెండు ప్రధాన ధోరణులలో కవిత్వం రాస్తున్నారు. కేవలం కవులు, కవిత్వ విమర్శకులు బాగుంది అనాలనే ధోరణిలో రాసే కవిత్వం ఒకరకం. ప్రజలకోసం అనే ధోరణిలో రాసే కవిత్వం రెండవరకం. ఇందులో ప్రజల కోసం అనే రాసే రెండవరకానికి చెందిన కవుల్లో అందరూ "జనరంజకంగా ఉండే కవిత్వం" రాస్తున్నారని చెప్పటానికి వీలులేదు..తెలుగుభాష మీద, తెలుగు కవిత్వం మీద తెలుగు ప్రజలకు అభిమానం, గౌరవం కలగటానికి, సామాజిక వైయక్తిక వికాసాలు పెంపొందించటానికి సామాన్య జనానికి అర్థం అయ్యే కవిత్వం రావటం అవసరం. ఇలా జనానికి అర్థం అయ్యే కవిత్వం "జన రంజక కవిత్వం". ముందు అందరికీ కవిత్వం అర్థం అవుతూ వుంటే ఆ తరువాత వారిలో ఆలోచించగలిగినవారికి కవిత్వంలో లోతులు, గంభీర భావాలు, సొగసులు, విశేషాలు తెలుస్తాయి. స్పష్టంగా సూటిగా సరళంగా ఉంటూనే మనోహర భావ స్ఫోరకంగా, విశేష రచనా చమత్కృతి కూడా నిండి ఉండేది "జన రంజక కవిత్వం". "వావిలాల గోపాల కృష్ణయ్య లాంటిది జనరంజక కవిత్వం". ముందు చూడగానే ఇందులో గొప్పతనం ఏముంది అనిపిస్తుంది కాని క్రమంగా ఆలోచించగలిగినవారికి అందులో గొప్పతనం తెలుస్తుంది. జనరంజక కవిత్వం రాయాలంటే అది అందరికీ సాధ్యం అయ్యే పనికాదు. ఎంతో వాక్య నిర్మాణ నైపుణ్యం, కవిత్వ నిర్వహణ సామర్థ్యం, మంచి అనుభవంతోపాటు సామాన్య ప్రజల్ని చిత్తశుద్ధితో ప్రేమించే గుణం కూడా కలిగివున్నవాడే జనరంజక కవిత్వం రాయగలడు.

వాల్మీకి, వ్యాసుడు, తిక్కన, వేమన, గురజాడ, శ్రీశ్రీ, తిలక్, నారాయణరెడ్డి, దాశరథి, జాషువా, కరుణశ్రీ మొదలైనవారంతా జనరంజక కవులే.

వాల్మీకి రామాయణం రాయటానికి ఆయన భావించిన ఆనాటి సమాజం, ఆనాటి ప్రజల విషయం, లోకహితం ముఖ్యం. కొన్ని విలువస్థాపన అనే విషయం వాల్మీకికి ప్రధానం. ఇక ఆ ప్రధాన కేంద్రం ఆధారంగానే రామాయణం రాయటం జరిగింది. రామాయణం అందరికీ అర్థం అవుతుంది. ఆలోచించగలిగితే అదనంగా రామాయణంలో విశేష భావాలు, కవిత్వ సౌందర్యం కూడా జనం అందుకోగలుగుతారు. భారతం కూడా లోకాన్ని చూపించటం అనే విషయం ప్రధానం. ఆ ప్రధాన కేంద్రం ఆధారంగానే ఎన్ని అనుభూతులు వ్యక్తమైనా, అందుకే భారతం కూడా జనరంజకం అయింది. కాని ప్రబంధయుగం నాటి కవులు సమాజం, ప్రజల విషయం ప్రధానంగా భావించలేదు. వాళ్ళ కవిత్వ శక్తుల్ని వ్యక్తం చేసుకొనటానికే ప్రబంధాలు రాసారు. అంటే కేవలం అనుభూతికి ప్రాధాన్యం ఇచ్చారు. దీన్ని బట్టి రామాయణం, భారతం విషయ ప్రధాన కావ్యాలైతే ప్రబంధాలు అనుభూతి ప్రధాన కావ్యాలుగా భావించవచ్చు. అందుకే రామాయణం, భారతం జనంలోకి వెళ్ళాయి. ప్రబంధాలు జనరంజకం కాలేదు. ప్రబంధాలు పండితులలోకి వెళ్ళాయి. అనుభూతి ప్రధానంగా రాసే కవిత్వం కవులలోకి, కవిత్వ విమర్శకులలోకి మాత్రమే వెళ్ళగలుగుతుంది.

ఆధునిక సాహిత్యం కందుకూరి, గురజాడల నుండి సామాజిక దృష్టితో "జన రంజక కర్తవ్యం" గానే వచ్చింది. జన రంజకంగానే సాగింది. ఆ కొనసాగింపులోనే వచన కవిత్వం వచ్చింది. అభ్యుదయ కవిత్వం, విప్లవ కవిత్వం, దళిత కవిత్వం, స్త్రీవాద కవిత్వం ... ఇవన్నీ జన రంజక దృష్టితోనే వర్ధిల్లాయి.

ఆంగ్ల సాహిత్య ప్రభావంతో తెలుగులో భావ కవిత్వం, అభ్యుదయ కవిత్వం జన రంజక కవిత్వం అని సూత్రీకరించి చెప్ప టానికి కుదరదు. జన రంజకంగా వచ్చిన భావ కర్తవ్యం కూడా ఉంది, అలాగే జన రంజకంగా లేని అభ్యుదయ కవిత్వం కూడా వచ్చింది.

నండూరి సుబ్బారావు "ఎంకి పాటలు" జన రంజక కవిత్వమే. రాయప్రోలు సుబ్బారావు రాసిన "ఏ దేశ మేగినా ఎందు కాలిడినా..." గేయం జన రంజక కవిత్వమే. అలాగే అభ్యుదయ కవిత్వం అయిన ఆరుద్ర రచన "త్వమేవాహం" జనరంజక కవిత్వం కాదు. ఆరుద్ర ఇతర కవితలు జనరంజకం కావచ్చు. ఆరుద్ర రాసిన సినీ గేయాలు జనరంజక కవిత్వమే. సినిమాల కోసం చాలామంది కవులు రాసిన మంచి పాటలు జనరంజక కవిత్వమే. సినిమా పాటలు తక్కువగా చూడటానికి వీల్లేదు. అసలైన జనరంజక కవిత్వంగా ఎన్నో సినీగీతాలు వచ్చాయి, వస్తున్నాయి.

భావ కవిత్వం, అభ్యుదయ కవిత్వం ... ఈ రెండింటి మిశ్ర మంతో ప్రస్తుతం కవిత్వం అనేక శాఖలుగా విస్తరిల్లింది, విస్తరిల్లు తోంది. అందుకే దేవరకొండ బాలగంగాధర తిలక్ రాసిన కవిత్వాన్ని కొందరు భావ కవిత్వం అని, మరికొందరు అభ్యుదయ కవిత్వం అని, ఇంకా కొందరు భావాభ్యుదయ కవిత్వం అని వర్ణించారు. జనానికి అర్థం కావటం, ఆస్వాదించగలగటం అనేది జన రంజక కవిత్వానికి ప్రధానం. అంతే కాని అది భావ కవిత్వమా, అభ్యుదయ సామాజిక కవిత్వమా అనేది ముఖ్యం కాదు. ఇస్మాయిల్ కవిని అనుభూతి కవి అన్నారు. ఆయన రాసిన కొన్ని కవితలు జన రంజక కవిత్వమే. ఆయన కవిత్వంలో అనుభూతి ప్రధానం అన్నారు. కాని ఆయన కవిత్వంలో ఒక దృశ్యం ప్రధానం. అనుభూతి ద్వారా ఒక దృశ్యం కనిపిస్తుంది. అది చదివినవాడికి అది స్పష్టంగా అందితే అది జనరంజక కవిత్వమే. అది ఒక మూర్త ప్రకృతి అంశం కావచ్చు. ఒక అమూర్త భావన కావచ్చు. జనానికి అందుతున్నదల్లా జనరంజక కవిత్వమే. కొందరి దృష్టిలో అజంతా – కవులకు కవి. కాని జనరంజక కవి కాదు. చాలామంది దృష్టిలో జాషువా అభ్యుదయ కవి, జాషువాను కొందరు భావకవి అన్నా అది చెల్లదు. ఎందుకంటే జాషువా అనేక సామాజిక భావాలను చెప్పటం ప్రధానంగా ఉద్దేశించి కవిత్వం రాసారు. జాషువా కవిత్వం జనరంజక కవిత్వం. తుమ్మల, దువ్వూరి రామిరెడ్డి మొదలైన వారెందరో జనరంజక కవులే.

ఇక్కడ ముఖ్య విషయం ఏంటంటే – కవి ప్రధానంగా తన అనుభూతి వ్యక్తం చేయటానికి ఒక విషయం ప్రధానం కాకుండా గొప్ప కవిత్వం రాయాలని కవిత్వం రాసాడా, చెప్పదలచుకొన్న ఒక విషయం జనానికి అందటం కోసం కవిత్వం రాసాడా అనేది. దేని గురించి కవిత్వం రాసినా అసలు అనుభూతి లేకుండా కవిత్వం అనేది ఉండదు. అలాగే ఎంతో కొంత విషయం లేకుండా అనుభూతి ఉండదు. జనానికి అర్థం కావటం, ఆస్వాదించగలగటం అనేది ముఖ్యం. కాని ఒక దశాబ్దం నుండి వస్తున్న వచన కవిత్వం చూస్తుంటే అది జన రంజకంగా సాగిన దారిని తప్పి నడుస్తున్నట్లు అనిపిస్తున్నది. అరసం, విరసం మొదలైన కవులు కవి సమ్మేళనాలు పెట్టినప్పుడు జన సామాన్యం కూడా వచ్చి కవిత్వం ఆస్వాదించి వెళ్ళేవాళ్ళు. కవిత్వం జనంలోకి వచ్చింది. నాకు బాగా గుర్తు – నలభై ఏళ్లనాటి సంగతి. విజయవాడ ఆకాశవాణి వాళ్ళు pwd గ్రౌండ్స్‌లో ఆరుబయట ప్రముఖ కవులతో ఉగాది కవి సమ్మేళనం ఏర్పాటుచేస్తే ఆంధ్రప్రదేశ్‌లోని అనేక ప్రాంతాలనుండి జన సామాన్యం కూడా వచ్చి ఆ కవితల్ని విని ఆనందించి ఎంతో హుషారుగా ఇళ్ళకు వెళ్ళిపోయారు. ఆ కవి సమ్మేళనంలో దాశరథి ఒక కవిత చదవబోతూ ముందు వసంతం గురించి ఒక తేటగీతి పద్యం వినిపించారు. అందులో నాకు ఇప్పటికీ బాగా గుర్తున్న రెండు పాదాలు – "తరువులకు ఆకు కోకల కరువు తీరె, పడతులకు పైట చెరగులే భారమాయె". అప్పుడే సుగంబాబు నాకు దాశరథిని పరిచయం చేసారు. నిజాం నవాబుమీద నిప్పులు కురిపించిన దాశరథి చెయ్యి ఎంత మెత్తగా చల్లగా ఉందో ! కవి సమ్మేళనాలకు అప్పట్లో అంత జనాదరణ ఉండేది. మరొక జ్ఞాపకం – గుంటూరులో విరసం కవిసమ్మేళనం జరుగుతుంటే ఉద్యోగులు, విద్యార్థులు, యువకులు, మేధావులు...సమాజంలోని అన్నిరకాల ప్రజలు తండోపతండాలుగా వచ్చిన దృశ్యం నాకు ఇంకా బాగా గుర్తు. ఇందుకు సాక్ష్యం – నాతో ఉన్న ఆనాటి పైగంబర కవి సుగంబాబు, మరో అభ్యుదయ కవి నాగభైరవ కోటేశ్వరరావు కూడా ఆ కవి సమ్మేళనం వినటానికి వచ్చారు. కాని ఇటీవల కవి సమ్మేళనాలు చూస్తుంటే జనం రావటం లేదు. కవిత్వం జనరంజకంగా ఉండటం లేదు. ప్రజలు కవి సమ్మేళనాలంటే భయపడుతున్నారు. జనం పారిపోకుండా కవిత్వం దగ్గరకు జన రంజక కవిత్వం రావాలి, అపుడే జనం కవులతో పాటు కవిత్వంలోకి వెళ్ళగలుగుతారు. జనం కూడా కవిత్వమై ప్రవహించ గలుగుతారు.

అనుభూతి అంటే ఏమిటి అనేది మరో ప్రధానమైన ప్రశ్న. ఒక బాధ, ఒక సంతోషం, ఒక ఆశ్చర్యం, ఒక కోపం, ఒక అసహనం, ఒక కామం... ఇలా అన్నీ అనుభూతులే. కాని ఈ అనుభూతులు అనేవి ప్రధానంగా వ్యక్తికి సంబంధించినవా, సమాజానికి సంబం ధించినవా అనేది ఆలోచించాల్సిన సంగతి. ఇందులో సమాజానికి, ప్రజలకు సంబంధించిన అనుభూతి కవిత్వం జన రంజక కవిత్వం అయ్యే అవకాశం ఎక్కువ.

భావ కవిత్వం మీద తిరుగుబాటుగా సామాజిక చైతన్య విషయ ప్రధానంగా అభ్యుదయ కవిత్వం, విప్లవ కవిత్వం, దళిత కవిత్వం, స్త్రీవాద కవిత్వం వగైరా వచ్చాయి. సమాజాన్ని ఆలోచింపజేసి, చైతన్యవంతం చేసే గొప్ప కవిత్వం తెలుగులో వచ్చింది. ఇందులో

ఎక్కువ భాగం జనరంజక కవిత్వంగా వచ్చింది. కాని 21వ శతాబ్దం నుండి కవిత్వం మళ్ళీ అస్పష్టతతో భావ కవిత్వం ముసుగేసుకొని కొత్త ధోరణిగా వచన కవిత్వం రావటం ప్రారంభమైంది. మొన్నటి భావ కవిత్వం కష్టపడితే అర్థం అవుతుంది కాని కొందరు నేడు రాసే అత్యంత ఆధునిక భావ కవిత్వం ఎంత కష్టపడినా అర్థం కాదు. జనానికి దూరంగా వెళ్ళిపోతోంది. అది ఇటీవల బాగా ముదిరి పోతోందేమో అని భయపడే అంతగా పెరుగుతోంది. ఇలా రాయక పోతే కవిత్వంలో చిక్కదనం లేదంటారేమో అని రాసే కవులకు దిగులు, విషయ ప్రధాన కవిత్వం అంటే అది తక్కువస్థాయికి చెందినదని ప్రచారం చేసే స్థితికి వస్తోంది. అనుభూతి ప్రధాన కవిత్వం అంటే అది గొప్పస్థాయికి చెందిన కవిత్వంగా భావించటం ప్రారంభమైంది. విషయ ప్రధాన కవిత్వం అంటే అది తక్కువస్థాయి కవిత్వం అని పొరబడే స్థితి వచ్చింది. ఈ ధోరణి సమాజ ప్రేమికులకు చాలా ప్రమాదకర ధోరణిగా కనిపిస్తోంది. సమాజ వికాసం కోసం కవులు కవిత్వం రాయటం అనే ప్రధాన బాధ్యత తగ్గుతోంది. వచన కవిత్వం వచ్చిందే సమాజం కోసం. అలా అంటే "అసలు కవిత్వం సమాజం కోసం కాదు, అది గొప్ప వ్యక్తీకరణ వైచిత్రి" అంటున్నారు. "సమాజం కోసం కలవరించేవారు కథల్ని నవలల్ని నాటకాల్ని చదువుకోమని చెప్పండి" అంటున్నారు. ఒక ప్రక్రియను మొత్తం నియంతృత్వంతో ఆక్రమించటం ఇది.

ఒక గొప్ప దిగులు నన్ను బాగా పదేళ్ళ నుండి పీడిస్తోంది. సమాజం చెడిపోయినప్పుడు విప్లవ కవిత్వం వచ్చింది. ఇపుడు సమాజం ఎంతో కుళ్లిపోయి ఉంటే మహా విప్లవ కవిత్వం రావాలి. కాని అలాంటి కవిత్వం వచ్చే వాతావరణం నేడు సాహిత్య రంగంలో కనిపించటం లేదు. కవులు చీలిపోయారు. కవులు రకరకాల విషయాలు ప్రధానంగా దృష్టిలో పెట్టుకొని చీలిపోయినా అందరూ కలిసికట్టుగా సమాజాన్ని బాగుచేయాల్సిన ప్రధాన బాధ్యత కేంద్రంగా ఒక మహాకవి సమాఖ్య ఏర్పాటుకావాలి. కవులు జనరంజక కవిత్వం రాయాలి. కుళ్ళిన లోకం కూలిపోవాలి, కొత్త వెలుతురు లోకం ఆవిష్కరింపబడాలి. అందుకు జనం మారాలి, జనాన్ని మార్చాలంటే జన రంజక కవిత్వం రావాలి.

సాహిత్య వాతావరణంలో స్పష్టంగా సూటిగా ఆలోచనాత్మకంగా సమాజ కేంద్రంగా వచ్చే మంచి కవిత్వాన్ని ప్రోత్సహించాల్సిన అవసరం చాలా ఉంది. కవిత్వంలో విషయ ప్రధానం, అది కవిత్వంగా మార్చే శిల్పం కూడా ఉండాలి. అందులో అనుభూతి కూడా ఉంటుంది, కాని అది ప్రధాన విషయాన్ని బలంగా అందంగా చెప్పటానికే దోహదం చేయాలి. విషయం గ్రహించే మార్గంలో అనుభూతి సహకరించాలి కాని విషయాన్ని అధిగమించి పాఠకుడికి విషయగ్రహణంలో అడ్డం పడకూడదు. అదే "జన రంజక కవిత్వం". జన రంజక కవిత్వానికి ఎలాంటి ప్రక్రియా పక్షపాతం ఉండదు. వచన కవిత్వం, పద్య కవిత్వం, పాట కవిత్వం...లఘు కవితా రూపాలు... అన్ని రూపాలలో "జన రంజక కవిత్వం" ఉంటుంది. అలా రాసే కవుల్ని, వారి కవిత్వాన్ని ఈరోజు మనం బాగా ప్రచారం చేయటం అవసరం. చెడిపోయిన సమాజం బాగుచేయటం కోసం, పడిపోతున్న మనుషుల్ని నిలబెట్టటం కోసం, కనుమరుగవుతున్న విలువల్ని కాపాడటం కోసం, మనుషుల్ని భక్షించే చీకట్లను కాల్చేయటం కోసం, మానవత సామ్రాజ్యం వికసింపచేయటం కోసం నేడు "జన రంజక కవిత్వం" అవసరం. జన రంజక కవిత్వ అవసరాన్ని ఇపుడు కృష్ణాతీరంలోని కొన్ని సాహిత్య సంస్థలు, కొందరు సాహిత్య విమర్శకులు, కొందరు కవులు, మేధావులు కూడా గుర్తించారు, గుర్తిస్తున్నారు.

ఈ సందర్భంగా గత దశాబ్దంలో వచ్చిన మంచి జన రంజక కవిత్వ సంపుటాల్ని కొన్నిటిని పరిచయం చేయటం అవసరం.

## పౌరుష జ్యోతి

ఇది శ్రీ కొల్లా శ్రీకృష్ణారావు పద్య కవితల సంపుటి. తెలుగువారిలో పౌరుష జ్యోతి రగిల్చే కవిత్వం ఇది. తెలుగువారి గొప్పతనం, తెలుగు భాష, సంస్కృతి గురించి చక్కని పద్యాలు రాసారు. "శ్రీమద్భారత తత్వ/ప్రాముఖ్యము జగమెరుంగ ప్రవచించిన మా / స్వామి వివేకానందుని / నేమమ్మున నన్ను తింతు నిర్మల భక్తిన్" అని వివేకానందుని కొనియాడుతారు. ఎందరో దేశభక్తుల్ని, సంఘ సంస్కర్తలను కవితాత్మకంగా వర్ణించారు. "శౌర్య ధైర్య ప్రతాపాది శక్తులెసగ / సాహసించుచు సింహగర్జనలు సలుపు / వీర వనితలు నీ ముద్దుబిడ్డలమ్మ / దివ్య గుణ కల్పవల్లి, ఓ తెలుగుతల్లి" అని తెలుగు తల్లిని గురించి మధురమైన పద్యాలు రాసారు. "నీ / వాకున మ్రోసెరా తెలుగు భారతి కాంచన రత్న కింకిణుల్" అంటూ శ్రీనాథకవిని ప్రశంసించారు. భారత వీరగాథలకు ప్రాణము పోసే వస్తు గౌరవం వీరి పద్య కవిత్వం. రామబాణంతో పడిపోయిన వాలి రాముడితో ఇలా అంటాడు. "మీ నృప రీతికి నీతికి / నీ నిర్దాక్షిణ్య పాప నిష్ఠురగతికిన్ / నే నిప్పుడు బలియైతిని / భూ నాయక / చెట్టు చాటు పోటరి వయితే" అంటూ ఆవేదన చెందుతాడు. "సీత వృత్తాంత మిసుమంత చెప్పియున్న, రావణుని వాలమున చుట్టి జీవకునిగ / నిముసమున తెచ్చి నీ ముందు నిలుపువాడ" నని కూడా వాలి అంటాడు. నలగాముని చెంత చేరిన నాగమ్మ "బ్రహ్మనాదుల పుట మార్చపంతగించి అల్లకల్లోల మొనరించె పల్లెనాడు" అంటూ పల్నాటి వీరభారతాన్ని చక్కని తెలుగు నుడికారంతో కవిత్వీకరించారు.

"బొంగరా లాడెడు రంగమ్ము కా దది, రుధిరమ్ము ప్రవహించు రుద్రభూమి/ చెడుగుడు లాడెడు క్షేత్రమ్ము కా దది, ఎడద ఈటెలు నాటబడెడు చోటు" అంటూ యుద్ధభూమిని వర్ణిస్తారు. "వచ్చె స్వాతంత్ర్యమన్న సంబరమె కాని దిశలు నిండిన అవినీతి తిమిర మందు/ దేశభక్తులు తెరచాటు దివ్వెలైరి" అంటూ ఆవేదన చెందుతారు కవి. "పౌరుషమ్ముతోడ బ్రతికిన బ్రతుకొక్కపూట యైన పైడి మూట కాదె" అని పౌరుష జ్యోతిని వెలిగించిన కవి. "గుంటూరు సీమలో పుట్టు కతన, ఉడుకు జాతీయ భావమ్ము లుప్పతిల్లె"నని చెప్పు కొంటారు. "స్వతంత్రవాణి" పత్రికను చాలాకాలం నిర్వహించారు. ఏటుకూరి వెంకట నరసయ్య, జాషువా మొదలైన కవులకు చాలా ఇష్టమైన శిష్యులు. 88 సం.ల కొల్లావారు డజనుకు పైగా పద్య కావ్యాలు గ్రంథాలు వెలయించారు.

## కాకిముద్ద

నెల్లూరుకు చెందిన ఈతకోట సుబ్బారావు ఆధునిక సాహిత్య విశేషాలు తెలిసినవారు. ఒక కొత్తతరం నూతన మానవుణ్ణి ఆవిష్కరించే దిశలో సాగుతున్న కవి. "నేల నాకు దూరమైపోతోంది, నా ఆకాశం నానుంచి తొలగిపోతోంది, యుద్ధం లేకుండానే దురాక్రమణ" అంటూ నేటి నాజూకు అక్రమాల్ని చిత్రిస్తారు. రాతిని శిల్పంగా చేసినట్లు ముడిసరుకును మనోహరంగా మారుస్తారు. ప్రపంచాన్ని జీవితాన్ని ఒక సంయమనంతో ఒక ఆర్ద్రతా భావనతో రాసిన కవిగా శివారెడ్డి వీరిని అభివర్ణించారు. మామూలు మాటలకు కొత్త ప్రాణం పోస్తారు. సరళమైన భాష, ఒక కొత్త నిర్మాణ వ్యూహంతో సాగుతుంది కవిత్వం. "నాకో కొత్త దేవుడు కావాలి, మతాల్లేని దేవుడు, మానవత్వాన్ని హింసించని దేవుడు" అంటారు. మనిషిని మనిషితో అనుసంధానించి మనసుని మనసుతో అభిషేకించి ఒక సంగమ స్రవంతిని సృజించా లంటారు. మాటల రాళ్ళు విసురుతుంటే మనం చిరునవ్వుల పువ్వులు బహూకరించాలంటారు. మాటలు అమృతాన్ని కురిపిస్తున్నట్లున్నా గొంతులో దాగిన నిప్పుల్ని కనిపెట్టగలిగే దృష్టి ఉంది. "మనిషి ఎంత ఎత్తుకెదిగినా బతుకంతా ఆకాశం కిందే కదా !" అంటారు. "మనిషిని చదవాలి" అనే ఈ కవి కవిత్వాన్ని మనం చదవాలి. "నా అవసరా లిప్పుడు, నా దేశంకంటే, అమెరికాకే ఎక్కువ తెలుసు" అనే అవగాహన ఉంది. మంచి మనిషి విత్తనం కోసం వెతుకులాట వీరి కవిత్వ ప్రయాణం. "ఏనుగుల్ని మింగి ఆవాల బడ్జెట్ ప్రవేశపెడు తున్నవాళ్ళు, శంకుస్థాపనలకు ముందే అవినీతి ప్రాజెక్టులు కడుతున్న వాళ్ళకు" బాగా చురకలేస్తారు. "ఇప్పుడు ఉద్యమాలు పోరాటాలు అవసరంలేదు, మనిషికి ప్రేమించటం నేర్పండి, చిరునవ్వుల పావురాళ్ళను ఎగరేయడం నేర్పండి" అనే అవగాహన ఉన్న సుబ్బారావు నెల్లూరు నగరం ముద్దుబిడ్డ. "విశాలాక్షి" అనే మాసపత్రికకు సంపాదకుడిగా విశిష్ట సేవ లందిస్తున్నారు.

## చూపుడువేలుపై సూర్యోదయం

"కవిని కాకపోతే నే నీనాడు చిరునామా లేని చిత్తుకాగితాన్ని" అని భావించే కవిత్వ జీవి సరికొండ నరసింహ రాజు. ఆహారాన్ని వెతికే పక్షిలా భావాలకై వెదుకుతుండే కవి. సమాజంలో నిరంతరం మేల్కొని ఉండే కవి. సామాన్యుల కష్టాల్ని చూసి తీవ్రస్థాయిలో ఆవేదన చెందే కవిగా అద్దేపల్లి రామమోహనరావు ప్రశంసించారు. మానవ సంబంధాలు, కుటుంబ సంబంధాలకై తపిస్తారు. "కొలనులోకి రాళ్ళు విసిరి అలజడి సృష్టించిందెవరు !" అంటూ సాంస్కృతిక విధ్వంసకుల్ని విమర్శిస్తారు. "రిటైరైన ఉద్యోగి అంటే ఇప్పుడు ఎక్సుపైరీ అయిన మెడిసిన్" అంటారు. "తాను పాడెపైకెక్కి / మట్టిని పల్లకిలో ఊరేగించడం / ఈ నేలలోనే చూసాను" అంటూ రైతు స్థితిని చిత్రిస్తారు. "నేల హంస నెత్తుటి గాయానికి, ఆకుపచ్చదనం పసరుమందు రాసే" కవి. ఓ చెట్టును నరకటం అంటే కొన్ని శతాబ్దాల చరిత్రను నరకటమే అంటారు. అగ్ని పునీతమైన కాలాన్ని నిత్యం ఆశల పల్లకీలో ఊరేగించాలంటారు. "సత్యాగ్రహం – నే డొక ఘనీభవించిన శిల, దేశభక్తి చెత్తకుండీలో కుక్కలు చీలుస్తున్న అనాథ శవం" అంటూ గాంధీజీకిస్తున్న స్థానం గురించి ఆవేదన చెందుతారు. చెప్పు పేదవాడి ఆయుధం అంటారు. "అడవి దారి, కదిలే ఎర్రజెండా చెట్టు, భుజమ్మీద బుల్లెట్ల నాగళ్ళు, అగ్నిపూల వ్యవసాయం" అంటూ అడవిదారిలో నడుస్తున్న కొడవళ్ళను ప్రశంసిస్తారు. "అక్షరాలూ యాభైఆరు దారులై కలహించుకొంటుంటే నా బీజాక్షరం కన్నీళ్లు పెట్టుకుంటుంది" అనే తపన గల సరికొండ నాగార్జున కొండ, నాగార్జునసాగరుకు చెందినవారు. ఇరిగేషన్ డిపార్టుమెంటులో పనిచేస్తూ చక్కని అభివ్యక్తితో వైవిధ్యంతో కవిత్వం ప్రవహింపచేస్తున్న కవి.

## ఒక మెలకువ

ఎంతో స్పృహతో చైతన్యంతో చలనంతో కవిత్వాన్ని తన కవిత్వ ప్రపంచాన్ని నిర్మించుకుంటున్న కవి శ్రీనివాస గౌడ్ అని శివారెడ్డి అన్నారు. కవి పాఠకులకు సత్యానికి ఉతకర్రలా ఉండాలని ఈ కవి భావన. రకరకాలుగా అల్లుకుపోయిన, ముడులు పడిన జీవితాన్ని సరిచేసుకొనటానికి గౌడ్ కవిత్వం చదవాలి. సామాన్య మనుషుల

భాషను దోచి తన కవిత్వ భాషగా మలచుకున్న కవి. "ఎన్ని కడగండ్ల తర్వాత అది ఒక పండ్ల బండి అయిందో, అవి ఆ ఇంటిల్లిపాదికీ ఇంత అన్నంముద్దలై ఉండవచ్చు" అంటారు కవి శ్రమ గురించి. "మధ్యతరగతి జీవితాల తలల్ని ఈ రాజ్య తలారీ ఎప్పటికీ నరికేస్తూనే ఉంటాడు" అనే అవగాహన ఉన్న కవి. సమాజంలోని వివిధ శ్రమజీవుల గురించి ఎంతో శిల్పవైవిధ్యంతో కవిత్వం రాయటం విశేషం. బడిలో పిల్లల్ని చూసుకొనే ఆయాలు, స్త్రీలకు నిద్ర లేని రాత్రుల్ని అందిస్తున్న పురుషాధిక్యత, మద్యం వేశ్యకు అంగలార్చే బలహీనత, హోటల్లో పనిచేసే పిల్లలు, విస్తరిస్తున్న శిథిలాల మధ్య అస్తమిస్తున్న వాళ్ళు, పల్లేరు దారుల్లో పళ్ళ బిగువన పనిచేసే కలం యోధులు, ... శ్రీనివాస్ గౌడ్ కవిత్వంలో నేటి సమాజం మొత్తం కనిపిస్తుంది. "అవినీతి మురుగు కాల్వల్లో ముడుపుల ముత్యాల కోసం కొన్ని దొంగ కొంగలు" అని కొందరు అవినీతి విలేఖరుల్ని గుర్తించారు కూడా. "పరిమళాన్ని పంచి రాలిపోయే ప్రతి హృదయం వెంట నేనుంటా, పది మంది కోసం ప్రాణాలొడ్డేవాడి ప్రాణవాయువుల్లో నేనుంటా" అంటారు. "మెరుపుల వర్షం పులి గాండ్రింపులకి, గ్రీష్మం బెదిరిన జింకలా పారిపోతుంది' అని వర్ణిస్తారు. "రాష్ట్రాల నీటి మంకు పట్లన్నీ తెగి, ఆనకట్టల అహంకారాల ఎత్తులు తగ్గి, రాజకీయుల అవకాశవాద ఆలోచనలు ఆవిరై, అన్ని ప్రాంతాలకు నీళ్ళు సమానంగా చేరా'లని ఆశించే ఈ చీరాల కవి నిరంతరం కవిత్వం గురించే జీవిస్తుంటాడు.

## శిథిలాల మాటున శిల్పాలు

కవిత్వాన్ని ఘాటుగా, లలితంగా కూడా రాయగల నేర్పు మొహమ్మద్ ఖాన్ గారిది. "ప్రేమ నశిస్తే ఈ భూమి ఒక సమాధి" అంటారు. విజయవాడ రైల్వేస్టేషన్ గేటు దగ్గర పడి మోకాలు దెబ్బ తింటే కాలు కదపలేని దశలో అయిదు నెలలలో రాసిన 23 కవిత్వ సంపుటాలలో ఇది ఒకటని కవి చెప్పారు. పాశ్చాత్య సాహిత్యం బాగా చదివినవారు. "నా తెలుగు విత్తనానికి మరణం లేదు, ఎన్ని తెల్లని వడగండ్లు కురిసినా నా తెలుగు విత్తనం మొక్కవోదు" అనే ఆత్మవిశ్వాసం ఉన్న కవి. "నన్ను నేను తవ్వుకోనిదే ఒక ఊట బావి కాలేను, నన్ను కొల్లగొట్టుకోనిదే ఒక పదం కాలేను" అనగలిగిన భావుకత గొప్పది. "ఒకే ఒక్క అదుపు తప్పిన ఉలిదెబ్బ చాలదా, కోటానుకోట్ల జీవకళ కకావికల మయ్యేందుకు!" అంటూ గొప్పవాళ్ళు ఎంత జాగ్రత్తగా ఉండాలో సూచిస్తారు. "కాల ఫలాన్ని అడ్డంగా కోసి, చీకటి వెలుగుల రెండు బద్దల్ని పిండి, కాలరసాన్ని హస్తాల్లో పట్టి, గటగటా తాగినవాణ్ణి నేను" అంటారు. వీరి కవిత్వం నిండా సమాజానికి కళ్ళు తెరిపించే అనుభూతి కనిపిస్తుంది. "మనిషిని లోతు కంటా తోడనిదే తొందరపడి ఏ చొరవా తీసుకోరాదు" అంటారు. పుస్తకం మూసినాకే నన్ను నేను తెరుచుకుంటానంటారు. "మనిషంటే దీపం, మనిషంటే త్యాగం, మనిషంటే అక్షరం, మనిషంటే పుస్తకం, మనిషంటే నమ్మకం" అన్నారు. "నీటి బొట్టులో సముద్రం కనిపిస్తుంది, కన్నీటి బొట్టులో జీవితం విలపిస్తుంది" అంటూ ఆర్ద్రత ప్రదర్శిస్తారు. వీరి కవిత్వంలో వెంటాడే వాక్యాలు అనేకం. కృష్ణాజిల్లా కైకలూరులో పుట్టి విజయవాడలో ఉంటున్న కవి శానిటరీ విభాగంలో ఎన్నో సేవలందించి పరిశుభ్రమైన కవిత్వాన్ని కూడా మనకందిస్తున్నారు.

## ట్రంకుపెట్టె

జీవితాన్ని బాగా దగ్గరకు చూసే కవి మోకా రత్నరాజు. పల్లెను, తల్లిని, మరుగున పడిపోతున్న వస్తుసముదాయాన్ని కవిత్వంలో చిత్రించారు. మట్టి వాసనలోని మమకారాన్ని వాళ్ళమ్మ ఇచ్చిన "ట్రంకు పెట్టె" ద్వారా మనకందించారు కవి. మినీ కవితలతో మొదలైన కవి ప్రయాణం శ్రామికుల చేతికి పనికొచ్చే దుడ్డుకర్రలాంటి వచన కవిత్వం దాకా బాగా కొనసాగింది. ఒక శ్రమ, ఒక వేదన, ఒక తపన కవిని ఈ పుస్తకం రాయించాయి. "గుడ్డ బతుక్కేకాదు, మనిషికీ ఓ కొత్త రూపాన్నిచ్చి ఎంతోమందికి అన్నమై నిల్చిన ఉపాధి కల్పనా కేంద్రం కదా ఈ సూది" అంటూ దర్జీల గుండెల్లో ఆరాధ్యమై నిల్చిన సూది గురించి వర్ణిస్తారు. "దేవుళ్లకే కాదు, తాళ్ళకూ అవతారాలుంటాయి, పసుపుతాడై, పలుపుతాడై..." అంటారు. "దేవుడి పటం నిలవటానికి వేలెడు మేకు గోడ దేహాన్ని గాయపరుస్తున్నప్పుడు, మేకు గుండెల్లోని బాధ ఆ దేవుడు కూడా పసిగట్టి ఉండడేమో" అనగలిగిన ఆలోచన లున్నాయి. ఎంతటి శ్రీమంత భవంతులైనా రూపశిల్పి తాపీ తల్లి సాకిన బిడ్డలే కదా అని తాపీ పని గొప్పదనం తెలియజేస్తారు. నిలువెల్లా అక్షర బీజాలు చల్లుకున్న నల్లబల్లను ప్రశంసిస్తారు. "సాగునీటికి, తాగు నీటికి నానా రంగులు పులిమి రాజకీయ సేద్యం చేసుకుంటూ పదవుల పంటలతో తులతూగేవాళ్ళ చర్యల్ని ఖండిస్తారు. "ఆకలి చీకటి వాకిట్లో వెలుతురు మెతుకుల ముగ్గవ్వడానికి ఎన్ని పాచి వాకిళ్ళలో మొద్దు చీపురై అరిగిపోయిందో అమ్మ" అంటారు. "ఒక్క సెంటిగ్రేడ్ ఉష్ణోగ్రత పెరిగి లక్షల టన్నుల గోధుమ పంట నాశనమైనట్లు ఒక్క సెల్‌ఫోన్‌వల్ల ఆణిముత్యాల్లాంటి ఉత్తరాలు ఓల్డేజ్ హోముల్లో తల్లిదండ్రులైపోయాయి" అంటారు. విశాఖపట్నంలో పోస్ట్‌మేన్‌గా పనిచేస్తున్న రత్నరాజు సందేశం ఇది "నటించే నిద్రలోంచి ఇకనైనా కళ్ళు తెరుద్దాం, నిజంవైపు నడుద్దాం" అంటారు.

## చినుకు

"మంచి కవిత్వం చదివితే మనసు చలించాలి, జ్వలించాలి" అని భావించే కవి బిక్కి కృష్ణ వచన కవితల సంపుటి 'చినుకు'. "మంచి సమాజం కోసం స్వప్నించండి, మానవత్వమై పుష్పించండి" అంటారు. "కవిత్వం నా ఊపిరి పరిమళం" అంటారు. అమ్మ, నాన్న, రైతు, జర్నలిస్టు, బాల కార్మికులు, ప్రపంచీకరణ, డబ్బు, మానవ అను బంధాలు, చెట్లు, కరువు, పుస్తకాలు, ఫ్యాక్షనిజం, బాల్యం, దళితుల... మొదలైన విషయాలమీద మంచి కవిత్వం రాసారు. "ఒక సూర్య కిరణమై నిరంతరం ప్రవహిస్తూ ప్రేమ పత్రహరితాన్ని నాలో నింపు తోంది" అంటూ అమ్మను గురించి చెప్పారు. "నీ వొక దేహం కాదు. సౌందర్య దేశం, నీదొక మనసు కాదు, పూలతోట" అంటూ శేషేంద్రను కీర్తించారు. "ధర్మరాజులాంటి రైతులకు దక్కాల్సిన అయిదు ఊళ్ళు...కాసిని తాగు నీళ్ళు, కాసిని సాగు నీళ్ళు...ఇవ్వని రాజకీయ దుర్యోధనులు, ఏ మడుగులోను తల దాచుకోలేరు" అంటూ అనంత పురం రైతులను అన్యాయం చేస్తున్న నాయకుల్ని హెచ్చ రించారు. "పాత్రికేయుడు కరివేపాకు, పత్రికా లతికపై పరిమళాలు వెదజల్లే పూలరేకు...అక్షరాలకు సానబెట్టి పదాలకు పదునుబెట్టి భావాలకు బొమ్మ కట్టి వార్తలకు నగిషీలు చెక్కే స్వర్ణకారుడు" అంటూ పాత్రికేయుల అంకితభావాల్ని ప్రశంసించారు. "పక్షి చెట్టును ప్రేమించినట్లు, పువ్వు పందిరిని ప్రేమించినట్లు, మట్టి ఆకాశాన్ని ప్రేమించినట్లు, నది సముద్రాన్ని ప్రేమించినట్లు, పువ్వు పందిరిని ప్రేమించినట్లు, మట్టి ఆకాశాన్ని ప్రేమించినట్లు, నది సముద్రాన్ని ప్రేమించినట్లు....మిత్రుడా, నిన్ను ప్రేమిస్తున్నాను, శత్రువా, నిన్ను ప్రేమిస్తున్నాను" అంటూ శత్రువుల్ని కూడా సహజంగా ప్రేమించే కళ తెలియజేసారు. పడక పడక పడిన వానచుక్కను "పసివాడి నోట్లో పోలియో చుక్క"గా కొత్తగా అభివర్ణించారు. సద్దాంను ప్రపంచ చైతన్య పతాకగా భావించారు. "మానవత గుబాళించలేని దేశం ఒక కరాళ మృత్యువు, మనిషిని చూస్తే పూలచెట్టును చూసినట్లుండాలి. ఇపుడు ఎదురుపడిన ప్రతి మనిషి డబ్బు వాసనే చూస్తున్నాడు" అంటూ మనిషిని చూసి భయపడుతున్నారు. "విశ్వామిత్రుని దగ్గరకు మేనక రూపంలో వచ్చింది మాయ, నలుని దగ్గరకు జూదం రూపంలో వచ్చింది మాయ..." అంటూ నేటి యువత చెంతకు మాయ రూపంలో వచ్చిన క్రికెట్టును, టీవీని అసహ్యించు కొన్నారు. "అక్షరం అమ్మే, ఆయుధం కూడా...కలంపై జులుం చూపితే ఏ కులంవాడైనా కూలక తప్పదు" అంటూ ఒక దినపత్రిక కార్యాలయంపై జరిగిన దాడిని నిరసించారు. "అక్షరాలు కొందరికి వెన్నెల్లో ఆడుకునే అందమైన ఆడపిల్లలు, నాకు మాత్రం దళితులకు అందని ద్రాక్షా ఫలాలు" అన్నారు. "ఒక్కొక్క చెట్టు కూలుతుంటే ఒక్కొక్క శత్రువు నేలకొరిగినట్లే లెక్క, మాయల పకీరు ప్రాణం మర్రిచెట్టు చిలకలో ఉన్నట్లు రాయలసీమ రైతు ప్రాణం పచ్చని చెట్టు ఫలంలో ఉంటుంది" అంటూ పంటపై వేలుపడితే రాయలసీమ రైతు బతుకుపై పడినట్లే అని వ్యవసాయం ప్రాధాన్యం, అక్కడే పెచ్చురిల్లుతున్న కక్షలు, కార్పణ్యాలు చిత్రిస్తారు. పల్లె చెరువును "శివుని తలపై నెలవంక"లా ఉందని ఎంతో ఔచిత్యంగా పోలుస్తారు, "వాడు అందాల పోటీ పేరుతో ప్రపంచ సీతాకోకచిలకల్ని ఆకర్షించగలడు" అంటూ "వాటి తళుకు బెళుకు రెక్కల్ని కత్తిరించి తన మల్టీ నేషనల్ కంపెనీల వస్తువులపై అతికించి మన కళ్ళను మన వ్రేళ్ళతోనే పొడిచి" గ్లోబలైజేషన్ చేస్తున్న దగా వ్యాపార సంస్కృతిని ఎండగట్టారు. నాన్న రూపం అంటే ఒక మనోహర కావ్యంగా భావిస్తారు. కవులు పూలచెట్లలా సమాజాన్ని పరిమళభరితం చేసే కవితల మల్లెలు అందించాలనేది బిక్కి కృష్ణ ఆశయం, అందుకే కవిని అభినందించాలి.

## గరళం

"జీవితం చేసిన గాయాల మరకలకు మించిన బరువైన కవిత్వం ఏముంటుంది !" అని భావించే మౌనశ్రీ మల్లిక్ వచన కవితల సంపుటి ఇది. "పొగిలి పొగిలి రోదిస్తున్న పుడమిని ఒళ్లోకి తీసుకొని స్తన్యమిచ్చి ఓదార్చాలని ఉంది... అగ్నిగోళంగా రగులుతున్న అవనికి పాల బువ్వలో పత్ర హరితాన్ని కలిపి గోరుముద్దలు తినిపించాలని ఉంది..." అంటూ దెబ్బతింటున్న పర్యావరణం గురించి అభిమానంతో కూడిన ఆవేదన వ్యక్తం చేస్తారు. "అమ్మ చేట పట్టుకొని బియ్యంలో ఎన్ని రాళ్ళు ఏరినా తరిగేవి కావు, ఘనీభవించి చేటలో రాలుతున్న కన్నీటి బిందువులన్నీ రాళ్ళేనని అమ్మకు తెలియదు" అంటూ అమ్మ త్యాగగాథ కీర్తిస్తారు. "వాడు స్వచ్ఛంగా కనిపించే మలినం, నువ్వు పాడుతున్న పాట ఒక వేటగాడి కోసం అంటూ అమాయకులైన కవుల్ని కళాకారుల్ని తన కామ సుఖం కోసం వాడుకొనే అధికార పురుషుల్ని నిరసిస్తారు. ఎంతో సాహసం, విశిష్ట వ్యక్తిత్వం ఉంటేనే ఇలాంటి కవిత రాయగలడు కవి. "మూసిన మద్యం దుకాణాల చుట్టూ నూటొక్క ప్రదక్షిణలు చేస్తారు, అక్కడే ఒక చేతిలో కర్ర, మరొక చేతిలో భగవద్గీత పట్టుకొని కళ్ళజోడు తగిలించుకొన్న వృద్ధుడు కన్నీటిబిందువుల్ని జారుస్తాడు. ..." అంటూ గాంధీజీ జయంతిని కూడా గరళంగా మారుస్తున్న సంస్కారహీనుల్ని నిశితంగా విమర్శిస్తారు. "నా ఇండియన్ పార్లమెంట్ మీద ఎగిరే మూడు రంగుల జండా గుండెలు బాదు కొంటుంది, చౌరస్తాలో నిలబడిన జాతి నేతల శిల్పాలు అవినీతిపై మౌన పోరా టాలు చేస్తున్నాయి. అంటూ వేదనాభరిత హృదయం ఆవిష్కరిస్తారు. "వాడి జీవితంలోని అన్ని దశల్లో ఆడది కావాలి, ఆడపిల్ల పుడుతుంటే

మాత్రం ఆహ్వానించలేకపోతున్నాడు" అంటూ కడుపులోనే ఆడపిల్లల్ని చంపుతున్న దుర్నీతిని ఎండగట్టారు. "ఆయనో ధీశాలి, తనను బందీ చేసిన కులపు కుళ్ళు, ముళ్ళ కంచెల్ని నరికేందుకు కొడవలిగా పదునెక్కాడు, ఒక ఆకుపచ్చని సంతకం అణచి వేసిన రాక్షస పాదాల కింద అంకురమై మొలకెత్తి క్రాంతి శిఖరమై ఉదయించి నినదించాడు" అంటూ మహాకవి జాషువాని మన కళ్ళ ముందుంచుతారు. "ఆకాశంలో మెరిసే నక్షత్రాలన్నీ ఆయన కవితలే, సూర్యుడు ఆయన కవిత్వానికి ముఖచిత్రం, చంద్రుడు ఆయన కవిత్వానికి పీఠిక" అంటూ సినారెను అభివర్ణిస్తారు. "పగటి పూట గగనంలో సూర్యుణ్ణి చెరిపేసి నన్ను కంటికిరెప్పలా కాపాడిన మా అయ్య ఫోటోను అతికిస్తా, రాత్రి ఆకాశంలో చందమామను తీసేసి నిత్యం నాపై ప్రేమను కురిపించిన మా అవ్వ ఫోటోను అతికిస్తా ..." అంటూ నాన్న అమ్మ పట్ల అభిమానం ప్రదర్శిస్తారు. "ఇవ్వడానికి పంచడానికి కన్నీళ్లు తుడవడానికి ఉన్న మనిషి చేతులు ముంచడానికి, పచ్చనోట్లు లెక్కించడానికి అలవాటుపడుతున్నాయి" అంటూ మనిషిలో పెరుగుతున్న స్వార్థాన్ని విమర్శిస్తారు. ఇప్పుడు నా జీవితం రెండు భాగాలుగా విభజించ బడింది. అతడి కవిత్వం చదవకముందు, అతడి కవిత్వం చదివిన తరువాత... అతడి కలం ఓ మంత్ర దండం, మనిషిలోని విషాన్ని హరించే పవిత్ర జలం" అంటూ మంచి కవిత్వం చదివాక మనిషిలో కలిగే మంచి మార్పుల్ని పరిచయం చేస్తారు. "ఎదురుపడిన వారిలో మన గురువెవరో తెలుసుకోవడమే జ్ఞానోదయం. మన పక్కనే గురువుంటాడని తెలుసుకోవడమే ధ్యానో దయం" అంటూ జ్ఞానదృష్టి ప్రదర్శిస్తారు. "ఆరుగజాల చీర ధరించి మాతృదేవతలా కనిపించాల్సిన నువ్వు రెండు గుడ్డ పీలికలు కట్టుకొని వేశ్యలా దర్శనమిస్తున్నావు" అన్న కవి "నీ నుదుట దిద్దుకున్న సింధూరాన్ని సిరాగా మార్చి కొత్త పాటల్ని లిఖిస్తూ కోటి గొంతుల్ని పలికించు ... నువ్విప్పుడు పుష్పానివి కాదు - అస్త్రానివి" అని కూడా అంటూ స్త్రీ శక్తియుక్తుల్ని గానం చేస్తారు. "చెట్టు తన సుకుమార దేహాన్ని గ్రీష్మంలోకి దింపి మరిగిపోతుంది, విప్లవం అంటే త్యాగం, ఋతువు మారేది పోరాటం మరో రూపంలోకి మారేందుకే" అంటూ మట్టిని చెట్టును మనిషిని ఉగాది సంగీతంగా పలికిస్తారు. "అన్నార్తుల చితిమంటలలోని కాంతిని చూసి భారత్ వెలిగిపోతోంది అంటున్నారు. రైతన్నల కన్నీరు జీవ నదులవుతుంటే వారు కాగితం మీది పతాకాలతో ఆనకట్టలు కడుతున్నారు. అంటూ అభాగ్యుల అస్తిపంజరాలపై ఆకాశ హర్మ్యాలు నిర్మిస్తున్న స్థితిని విమర్శిస్తారు. మనల్ని బలిపీఠంపై నిలబెట్టిన వాడికి మనమే జై కొడుతున్నాం, మనల్ని కుక్కల్ని చేసి గొలుసులను వారి చేతిలో పెట్టుకుంటున్నారు. మనం మొరిగినపుడల్లా బొమికల్ని విసిరి మన నోరు నొక్కుతున్నారు..." అంటూ తాయిలాల ప్రభుత్వాల్ని దుయ్యబడుతున్నారు. "కొత్త నెత్తురు ప్రవహిస్తున్న యువకుల చేతులు లైసెన్స్ లేని తుపాకులు పట్టుకుంటాయి" అనే కవి హెచ్చరికను నాయకులు, మేధావులు గమనించితీరాలి. దానవుడు మానవుడు కావచ్చు కాని మానవుడు దానవుడు కారాదనే లక్ష్యంతో కవిత్వం రాస్తున్న మౌనశ్రీ అభినందనీయులు.

**రాతిజల**

"మనసు రెండు కన్నీటి బిందువుల్ని విదిలిస్తే అది కాగితంపై ఏరులా పారింది." అంటున్న అద్దంకి శ్రీనివాస్ వచన కవితల సంపుటి ఇది. "నా బాల్యం వికసించడానికి నులివెచ్చని తేజపుంజం మా బడి, నాటి గురువుగారి తిట్లే లేకపోతే ఇన్నెన్ని మెట్లెక్కడం సాధ్యమా ... నాటి గోడకుర్చీల క్రమశిక్షణలే నాకు ఇన్నిన్ని పదవులూ, అధికారాలు" అంటూ చదువుకొన్న బడిని ప్రస్తుతించారు. "మొద్దుబారిన మెదళ్ళకు సానపట్టుకొనే దిక్కడే, లక్ష్యాల లాంతర్లని చేత్తో అందిపుచ్చుకొనే దిక్కడే" అంటూ గ్రంథాలయ వైభవం కీర్తిస్తారు, "నీరసించిన కంటికి అమృతం పూసిన దొర, చీకటిని చిదిమి చిదిమి వెలుగు దీపాలు పెట్టిన క్రాంతదర్శి" అంటూ అంధుల లిపి రూపొందించిన బ్రెయిలీని ప్రశంసించారు. "అమ్మపాలలాంటి భాష, పాలలోన వెన్నలాంటి భావం, ఒక్క కార్పొరేట్ నెట్‌వర్క్ దెబ్బకి జోలపాటలు లాలిపాటలు జాలిగా నేలకొరుగుతున్నాయి" అంటూ మాతృభాషకు ఎదురవుతున్న ముప్పును వివరిస్తారు. "విశ్వ మానవుడికి జి-మెయిల్, యాహూ రెండూ రెండు కళ్ళు. గూగుల్ గాగుల్స్ లేకుంటే లోకం చీకటి" అంటూ సాలెగూటిలో చిక్కుకున్న జీవితాలను చిత్రిస్తారు. "భుజం మీంచి వేళ్ళాడే లెదర్ బ్యాగ్‌లోని చిల్లర ఘల్లుమంటూ ఇంటిదగ్గర పిల్లల్ని గుర్తుచేస్తుంది. పేరుకుపోయిన పురుషాహంకారాన్ని ప్రత్యక్షంగా పంచింగ్ చేసి చూపిస్తూ..." అంటూ కండక్టర్ వృత్తిలో మహిళను అభిమానిస్తారు. "పరువపు తపస్సిద్ధిలో పొందిన వరం పైట, అది నన్ను కౌగలించుకొన్నప్పుడు నేను కన్యను, నా పెద్దలకు నేను కుంపటి, కుర్రాళ్ళకు మాత్రం కంబళిని" అంటూ నవ యవ్వనంలోకి అడుగు పెట్టిన అమ్మాయిల గురించి వర్ణించారు. రకరకాల వృత్తిపనివాళ్ళ గురించి మంచి కవిత్వం రాసారు శ్రీనివాస్. "సూర్యుడు వస్తూనే అతని టీ గ్లాసు అందుకుంటాడు, చందమామ వెళ్ళేది అతని టీ చుక్క నోట్లో పడ్డాకే, మిత్రుల చేతుల్లో వన్ బై టూగా విరిగి చెలిమికి చిరకాల ముద్రగా మిగిలిపోతాడు" అంటూ టీ అమ్ముకొనే కుర్రాడి గురించి రాసారు. "లోకమంతా జోగుతూ నిద్రకు వేళ్ళాడుతుంటే నువ్వొక్కడివే కర్మయోగిలా ధ్యానముద్రలో, వెలుగు చీకటికి తేడా తెలియని చూపుల్ని మైలుకో ముక్కగా పారేసుకొని..." అంటూ రాత్రి

డ్యూటీ చేస్తున్న డ్రైవరు గురించి కలం పట్టారు. "బరువు బాధ్యతల ఎడ్లని బతుక్కిందకు చేర్చి ఆకలి చర్నాకోల ఝుళిపిస్తూనే ఉంటాడు. అంటూ ఎడ్లబండివాని గురించి వ్యక్తీకరిస్తారు. "చింపిరి జుట్టు దెయ్యంలా చీపురు చేతులతో నేల వీపును గోకుతూనే, అంట్ల గిన్నెలపై సబ్బులా నానిపోతూ, అవమానాల్ని కడుక్కుంటూ, మొట్టికాయల్ని కొప్పులో ముడుచుకుంటూ..." అంటూ పనిపిల్ల చాకిరీకి కవిత్వంతో కిరీటం తొడుగుతారు. "శరీరం పోత పోసిన వీరత్వానికి ప్రతీక, ప్రాణాలు మంచులా కరిగిపోతున్నా ధైర్యం పిడికిళ్ళు బిగిస్తూనే, ఊపిరి ఆగిపోతుందని తెలిసీ దేశభక్తి ఊపిరి పోసుకుంటూ" ఉన్న సైనికుల్ని మెచ్చుకుంటారు. "నడిచే సంప్రదాయంగా నెలగంట సూరీడు, గజ్జెల చప్పుళ్ళని వెలుతురు కొండపై వెలిగిస్తూ, వీధుల్లో చిడతలతో కళ్ళాపి చల్లుతూ" సంక్రాంతికి వచ్చే హరిదాసుల్ని మన కళ్ళ ముందుంచుతారు." వాడు తన కత్తితో పొట్టపోసుకుంటాడే గాని పొట్ట కోసుకోవాలనుకోడు, తల మాసిన వాళ్ళందరినీ శుభ్రపరుస్తూ, వాళ్ళు తలంటుకునేదాకా అంటరానివాడైపోతాడు" అంటూ కేశసౌందర్యం కాపాడటంలో మంగలి క్లేశ సౌందర్యం ప్రదర్శిస్తారు. "సుత్తి దెబ్బల ఆటుపోట్లు, అరకొర సంపాదనల కొలబద్దలు, సమస్యల పనిముట్లు కలిసి గుండెకి రంపం కోత విధించినా చెక్కల్ని చెక్కీ చెక్కీ పొట్టుగా రాలిపోతూ కూడా మెరిసే జీవితం" అంటూ వడ్రంగం వృత్తి ఘనత తెలియచేస్తారు. "కడుపు కుండ రోజు ఆకలితో కాలుతూనే ఉంటుంది, పిసికిన మట్టిముద్దల్ని అన్నంముద్దలుగా మలిచినా అవి కనీసం పంటికిందనైనా రావు" అంటూ కమ్మరి వృత్తిని కవితామయం చేస్తారు. "వేసవి దాన్ని వెన్నంటి వస్తుందో లేక వేసవిని తనే ఎర్రగా ఒంటికి పూసుకొని మోసుకొస్తుందో, ఎన్నో ఎండిన గొంతులకు రెఫ్రిజిరేటర్ అవుతుంది" అంటూ పుచ్చకాయ గురించి మంచి కవిత్వం రాసారు. "చేతిలో ఉంటే హస్త భూషణమై, జేబుకు తాను గుండెకాయై, కంఠంలో వేలాడే మోడరన్ కౌస్తుభమై, నడుంపై కితకితలు పెట్టే చరద్వాణియై...ఇప్పుడు తలనొప్పికి బదులు సెల్ నొప్పి మొదలయింది" అంటూ సెల్‌ఫోన్ వ్యామోహం ఎండగడతారు. "ఆరుపదుల వయస్సులో ఆరేళ్ళ స్కూలు పిల్లల క్రమశిక్షణ, ఆశ్రమం గదులు హాస్టలు గదులే, భోజనాలకి గంటలు కొట్టటం, బారులు తీరటం, ముమ్మాటికీ ఇది రెండో బాల్యమే" అంటూ వృద్ధాశ్రమాలలో స్థితిగతుల్ని చిత్రించారు. "అక్రమాల జలాశయాల్లోకి దిగిన మనిషిని ఏమీ చేయలేమని మోర లెత్తేసిన మొసళ్ళు, లోకంలోని జిత్తులమారిన తనానికి తమకు గుంటలే శరణ్యమనుకునే గుంట నక్కలు, చెంగు చెంగున విదేశాలకు గెంతే మనస్తత్వాన్ని చూసి ఖంగు తిన్న కుందేళ్ళు, చీకటి తప్పుల్ని చూడలేక రాత్రి కూడా చూడటం మానేసిన గుడ్లగూబలు ....." అంటూ జంతు ప్రదర్శనశాలలు మానవ ప్రదర్శనశాలలు అవుతున్నాయని మనుషుల్ని చూసి మృగాలే సిగ్గుపడుతున్నాయని వాపోతారు. "గ్లోబల్ ఆసుపత్రుల్ని మోయలేక మోసిన హృదయనాళాలు అంతస్తులకు పిల్లర్లయిన స్కానింగ్ ఫీజులు, లోపలి అర్ధ శవాలకోసం బయట కదలాడే పూర్ణశవాలు" అని కార్పొరేట్ వైద్య వ్యాపారాన్ని బహిర్గతం చేసారు. హృదయాన్ని నిర్వచించడం కన్నా హృదయాన్ని పంచి ఇవ్వడమే తేలిక మార్గం" అంటున్న అద్దంకి శ్రీనివాస్ కవిత్వం చదివి పనికిమాలిన పాత భావాల గొంగళి పురుగులు పనికొచ్చే సీతాకోకచిలకలవుతాయి. అందుకు కవికి అభినందనలు.

## ప్రపంచాక్షరి

"అనంతమైన చైతన్యాన్ని నింపుకొన్న ఆటంబాంబు అక్షరం. మస్తిష్క క్షేత్రంలో సరికొత్త ఆలోచనలు మొలకెత్తే బీజం అక్షరం" అని భావించే గరిమెళ్ళ నాగేశ్వరరావు వచన కవితల సంపుటి ఇది. "మనస్సు నిండా కవిత్వాన్ని నింపుకు దేహానికి చైతన్యాన్ని పూసుకునే అద్వితీయ అక్షర స్వరూపాన్ని, నేను కవిని" అంటారు కవి. "కాడి పట్టుకు మేడిని దున్నిన మహారాజు పాడెను పల్లకీ చేసుకు పల్లె దాటిపోతున్నపుడు బహుశా దిష్టిబొమ్మ కళ్ళలోనూ చెమ్మదనం చిప్పిల్లే ఉంటుంది ... మేఘానికి కూడా రాజకీయం నేర్పి కోట్లు క్రుమ్మరిస్తేనే కురుస్తుంది" అంటూ మట్టి దారిలో పోతున్న రైతు ఆవేదన వివరిస్తారు. "అమెరికన్ పడుచు విధవల కళ్ళ వెనుక సమాధుల్లోంచి ఓ మృతవీరుడి ప్రశ్న, నాది పరాక్రమమా పరమ అక్రమమా..." అంటూ ఇరాక్ మీద అమెరికా దాడిని విమర్శిస్తారు.

"డాలర్ల దాహంతో వలస వచ్చిన నవ నాగరిక బానిసత్వాన్ని కాలాన్ని కత్తిరించి కంప్యూటర్ తెరలమీద ప్రోగ్రాముగా అలంకరించే అత్యాధునిక శ్రామికుడిని" అంటూ నేటి సైబర్ కూలీ స్వగతం వినిపించారు. "ఉన్మాదాలను ఊరవతల నిమజ్జనం చేసేసి ఉద్రేకాలకి కఫన్ ఒక్కటి కప్పేసి సామరస్యం నిండిన గుండె లోతుల్లో దాగున్న పరమాత్ముణ్ణి వెలికితీద్దాం" అని సందేశం ఇస్తారు. "వంటిల్లు ఒళ్ళంతా విద్రోహాన్ని పులుముకొని గ్యాస్ సిలెండర్ల మందుపాతరలు దాచి పెట్టుంచుతుంది. అబద్ధపు ప్రమాదమై దాడి చేసేందుకు కిరోసిన్ తొంగి చూస్తుంది. అని చెప్తున్న కవి "మండే పైటకొంగు జెండా పైకెగరేసి నువ్వెనిమిదో అడుగు వెయ్యి" అంటూ పిరికి మగ గుండెలు పారిపోయేలా చేయాలని స్త్రీలకు హితవు పలికారు. "ఈ గెద్దమీంచి ఒక మట్టిబెడ్డని తీసి ఇస్తాను. మందిరానిదో మసీదుదో చెప్పగలవా" అంటూ మానవత్వం అవసరం అంటారు. "ఆకాశానికెవరో ఒళ్ళంతా చిమ్మచీకటి పులిమారు, తారల తళుకు బెళుకుల్ని ఎక్కడో తాకట్టు

పెట్టేసారు. బ్రతుకుతెరువు వెతుక్కుంటూ కాబోలు జాబిల్లి వలస వెళ్ళిపోయింది" అంటూ ఆకలి పర్యవసానాల్ని చిత్రిస్తారు. "విజ్ఞత మరిచిపోయిన విజ్ఞాన శాస్త్రం అమ్మ కడుపులోపలి రహస్యాలని ఆరా తీస్తోంది, ఆడతనం జాడ తగిలితే మరణశాసనాన్ని విధిస్తోంది" అంటూ అంతరించిపోతున్న ఆడపిల్లలను గుర్తుచేస్తారు. "మాట్లాడుతూ మాట్లాడుతూ, నీళ్ళు నమలకు, నీళ్ళు నమిలేవాడి దగ్గర నిజం నిలవదు" అంటూ హెచ్చరిస్తారు. "గుండెని పీకేసి రెండు చిప్స్ తగిలించుకో మనసు నిండా మైక్రోవేవ్స్ నింపేసుకో ... ఇక మీద పుట్టేది మనుషులు కాదు, యంత్రాలు" అంటూ దూరాలు దగ్గరైపోతూ మనసులు దూరమైపోతున్న ఆధునికతను చిత్రిస్తారు. "కాలం గాలానికి చిక్కుకుని జాలి చూపులకు జోలె పట్టి వైకల్యాన్ని చిల్లర చేసేందుకు మనసొప్పుకోలేక చీపురు పట్టి స్వేధాన్ని చిందిస్తూ శ్రమ సందేశం అందిస్తున్నాడు" అంటూ రైలు శుభ్రం చేసే పిల్లాడి ఆత్మాభిమానం గమనిస్తారు. "అడుగడుగునా ఓ బ్రాందీ షాపు ఆహ్వానం, రంగుల తెరమీద మన్మథ జైత్రయాత్ర, ఇంటర్‌నెట్ కేఫుల నిండా ఇంతుల అందాలూ ... అందాల పోటీల అపర దుశ్శాసనుడు నిలువునా వలువల్ని దోచేస్తున్నా పొంగిపోతూనే ఉంది ద్రౌపది, కృష్ణుడా, నీ కళ్ళు మూసేసుకో." అంటూ ఎంతో ఆవేదనతో విస్తరిస్తున్న కామ సామ్రాజ్యం విమర్శిస్తారు. "ప్రేమ చిరుతలు తిరుగుతున్నాయి, లేడీ పిల్లల్లారా, జాగ్రత్త" అంటూ అమ్మాయిల్ని హెచ్చరించారు. "ఆదాయ వ్యయాల తూనికలోంచి ఆనందం జారి మాయమైపోతోంది" అంటూ ముదిరిన డబ్బు జబ్బును గమనిస్తారు. "అడవులు నగరాలయ్యాయి కాని మనుషులు మృగాలయ్యారు" అని చింతిస్తారు. "గోవులకు రంగు వేసిన దేవుడినే జయించినట్లు పాలమీగడ పకాలున నవ్వుతుంది, వేషాలన్నీ తొలగించి చూస్తే నిఖార్సయిన మానవత్వం పలకరిస్తుంది" అంటూ భేదాలు తగవు అని భావిస్తారు. "పరాయి నాగరికత పద్మ వ్యూహంలో చిక్కుకున్న యువతరానికి తిరిగి రావటం నేర్పే కిరీటి కావాలి, లక్ష్మణ రేఖని దాటుతున్న సీతలాంటి సమాజానికి రేఖ దాటకముందే హెచ్చరించే రక్షించగల రాముడు కావాలి" అంటూ చైతన్య కాంతి నింపుతారు. "భద్రకాళికి వారసురాలు భరతజాతి, శత్రువులాంటి మిత్రమా, సహనాన్ని సమరానికి లాగొద్దు" అంటూ కయ్యానికి కాలు దువ్వే పొరుగుదేశాల్ని హెచ్చరిస్తారు. "ఎరుపెక్కిన ఎన్ని చేతులకి సంకెళ్ళు వేసి చెరసాలలకి తరలిస్తున్నా మనిషిని పీక్కుతినే బల్ల క్రింది చేతులు" అంటూ ఏసీబీ దాడులు జరుగుతున్నా పెచ్చరిల్లుతున్న అవినీతిని ప్రశ్నిస్తారు. "వజ్రాయుధం మాత్రం నీ చేతిలోనే ఉంది, జాగ్రత్తగా పదునుపెట్టి సంధించు ఆరాచకాన్ని అందల మెక్కకుండా బంధించు" అంటూ ప్రజాస్వామ్యం మీద నమ్మకం ఉన్న కవిగా ఓటు గొప్పతనం విశ్లేషిస్తారు. "శాలువాలు కప్పుకొని కవిత్వం మొద్దు నిద్రలోకి జారిపోగూడ" దనే గరిమెళ్ళ నాగేశ్వరరావు.

విస్ఫోటనం నుండి విధ్వంసం దాకా...

"ఏ మనిషి ప్రాణం అయినా ఎవరూ తిరిగి ప్రాణం ఇవ్వలేరు, మనిషికి ప్రాణం పోయలేని ఏ సంస్థ, ఏ ప్రభుత్వం మనిషి ప్రాణం తీయడానికి అర్హత లేదు" అని తలపోసే వై. శ్రీరాములు రచించిన దీర్ఘ వచన కవితా కావ్యం ఇది. "అర్ధరాత్రిలో చీకటి సంతకం ఒక గుండెను రెండుగా చీల్చుతూ పోయినా గగనంలో ఎగిరింది అధికార మార్పిడితో స్వాతంత్ర్యమనే పతాకం"... స్వతంత్ర్యం వచ్చి ఎన్నో ఏళ్ళు గడిచినా మనదేశంలో హింస, ఉగ్రవాదం పెరుగుతూనే ఉన్నాయి కాని తగ్గటంలేదు అనే ఆవేదన కవిది. "చిన్న పల్లె సైతం రెండుగా చీలిన విత్తనం, మమతల పంటను కోల్పోతున్న సందర్భం, తరం తరం నిరంతరం ఆజ్యం పోస్తున్న రాజకీయం" అని చింతిస్తు న్నారు కవి. "గాలికి సంకుచితత్వం లేదు. ఒక దేశపు జెండా రెపరెపలకే పరిమితం కాదు, నీటికి తారతమ్యం వుండదు. ఒక జాతి గొంతుక దాహాన్నే తీర్చదు. సూర్యుని వెలుగుకు స్వార్థం తెలియదు, ఒక ప్రాంతపు చీకటినే తొలగించదు" అంటూ ప్రకృతిని చూసి మనిషి సౌజన్యం నేర్చుకోవాలని ఆశిస్తున్నారు. "నరహంతకుని తుపాకీ మందుగుండు ముందు ఏ మతమూ పనిచేయదు... విధ్వంసం వాడి జెండా, వినాశనం వాడి ఎజెండా. అగ్రరాజ్యాల ఊపిరితోనే పురుడు పోసుకొంది ఉగ్రవాదం" అనే వాస్తవాన్ని తెలియచేస్తారు. "రెండు దేశాల చేతుల్లో ఆయుధాలు వాడివే, రెండు గుండెలపై ఆదేశాలు వాడివే, రెండు ఎజెండాలలో శాసనాలు వాడివే. ఎవరు ఓడినా గెలుపు వాడిదే" అంటూ గెలుపు ఓటముల మధ్య కృత్రిక మిత్రవాక్యం పలికే ఉమ్మడి శత్రువైన అగ్రరాజ్యాన్ని గుర్తించాలంటారు. "ముద్దకోసం యుద్ధం, ముద్దుకోసం యుద్ధం, ఇదే కదా చరిత్ర సారాంశం" అన్నారు. "ఒకరినొకరు కాల్చుకొని ఎవరు చచ్చినా పేదవాడు చనిపోయినట్టే, పేదరికం పెరిగిపోయినట్టే" అని పేదల పక్షం వహిస్తారు. "ప్రతిరోజు ఉదయం దేశం దేశమే శిరచ్ఛేదనమవుతుంది, మధ్యాహ్నం మరణమవుతుంది. సాయంత్రం శవమవుతుంది..." అంటూ నిరంతర హింసా స్వరూపం చిత్రిస్తారు. "శాశ్వతం అనుకొన్న బ్రతుకు దారం పుటుక్కున తెగి దినాల పూసలు ఆయువు దండలోంచి ఒక్కసారిగా చెల్లాచెదురై మట్టిలో కలిసిపోతాయి" అంటూ ప్రాణాలకు విలువ లేదని చింతిస్తారు. "నేడు ఆయుధం ప్రపంచాన్ని శాసిస్తోంది, ధనమే మనిషి ఇంధనం అయింది, ఇంధనం ధనం అయింది" అంటూ ఇంధనం కోసం జరుగుతున్న కుట్రల్ని గమనింపచేస్తారు. "ఇరాన్

ఇరాక్ ఒకే కొమ్మ పువ్వులు, పాక్ భారత్ ఒకే చెట్టుకాయలు, ఒకరికి ఇంధనంతో ఉచ్చు, మరొకరికి మతంతో చిచ్చు" అనే వాస్తవాన్ని తెలుపుతారు. "అమెరికా బ్రిటన్ తదితర అగ్రరాజ్యాలు విదేశీ ఉగ్రవాదులు, అంబానీలు టాటాలు బిర్లాలు సత్యంలు స్వదేశీ ఉగ్రవాదులు" అని స్పష్టీకరించారు.

ఇలా వాస్తవ స్థితిగతుల్ని వివరిస్తూనే చక్కని సందేశాత్మక భావాలూ ప్రకటించారు కవి. "ప్రపంచాన ప్రతిఒక్కరు నోరు విప్పాల్సిన కాలం ఇది" అంటారు. "ఆయుధం విసర్జించాలి, అది జాతిని నిర్వీర్యం చేసే మలిన పదార్థం, ప్రేమను సముపార్జించాలి, అది ఆత్మామృతంతో చేసిన యదార్థం... ఒక పువ్వు, ఒక నవ్వు, ఒక నెమలీక, ఒక సీతాకోకచిలుక, ఒక రొట్టె, ఒక ప్రేమ చాలదా... జీవితం నిశ్చింత" అని సంతృప్తిలో ఉన్న గొప్పతనం తెలుపుతారు. "ఒక చిన్న ప్రశ్న నియంతల్ని నిట్టనిలువునా చీలుస్తుంది.... రెండు చిన్ని పాదాలతో ప్రయాణం కొన్ని వేలమైళ్ళ దారిని జయిస్తుంది." అంటూ మనుషులు సొంత బుర్రలు పెంచుకోవాలంటారు. "ఒక విస్ఫోటనం జరిగినపుడు ఒక విధ్వంసం పెరుగుతున్నపుడు మతాల ప్రసక్తి రాకూడదు, దేశానికే గాయమవుతున్నపుడు దేహాలన్నీ ఏకం కాక తప్పదు" అంటూ సమైక్య శక్తి కీర్తిస్తారు. "ఎన్నో కులాల రెమ్మలతో మరెన్నో మతాల కొమ్మలతో మరెన్నో పూల మనుషులతో నిండిన భారతవృక్షం అశాంతి లోకానికి శాంతి ఫలాలను అనాదిగా ఇస్తున్న కల్పవృక్షం" అంటున్న దేశభక్తితో, మానవభక్తితో మంచి కావ్యాన్ని రచించిన శ్రీరాములు సహృదయ సాహితీప్రియులకు ఎంతో ప్రీతిపాత్రులు.

## మాట

"మాట ఓ మధుర స్వప్నానికి నాందీవాచకమవుతుంది, ఓ మహత్తర గమనానికి ప్రారంభ సూచిక అవుతుంది" అంటూ మాట మహత్తు గురించి ఓ దీర్ఘ వచనా కవితాకావ్యం రాసేసారు చిన్ని నారాయణరావు. "మాటలు ముత్యాలు వెదజల్లితేనే గదా బాల్యం వేగిరమై అలగా ఎగసేది, మాటలతోనే వివేకానందుడు విశ్వంలో మహోన్నతుడయినాడు" అంటూ కొనసాగుతారు. "పనిని ఫలితం వైపుకు నడిపించేది మాటల ఆయుధాలే. పనిని గమ్యం చేర్చి సాకారం చేసేవి మాటల పగ్గాలే" అంటారు. "మాటలతోనే మనీ ప్రవాహమై పొర్లుతుంది, మాటే కాల గమనంలో నక్షత్రమై వెలుగుతుంది" అని మాట ప్రయోజనం వెల్లడిస్తారు" ఆడి తప్పని మాటలో సత్యనిష్ఠా గరిష్ఠుడు హరిశ్చంద్రుడు, తండ్రికిచ్చిన మాట కోసం అడవులకేగిన శ్రీరామచంద్రుడు" అంటూ మాటమీద నిలబడిన మహాత్ములని స్మరిస్తారు. "సహస్ర బాహువులతో వాటేసుకుంటుంది మాట, బీజమై తేజమై హృదయాంతరాళాల్లోకి పాకుతుంది మాట. మాటలు మొలకలై మొక్కలై వృక్షాలై మనిషికి నీడలవుతాయి" అంటారు. "మాట మనిషిని మురిపిస్తుంది, మాటే మనిషిని జడిపిస్తుంది, మనిషి మూలాల్నే కొలిచే కొలబద్ద మాట" అంటూ మాట విలువ వివరిస్తారు. "విరాట్ పోతులూరి వీరబ్రహ్మం కాలజ్ఞానం, ఏసుక్రీస్తు మానవతా సందేశం, మాటల వనంలో విరిసిన సౌగంధమే కదా" అని తెలియజేస్తారు. "మాటపై విశ్వసనీయత చిగురు తొడిగితేనే నాయకత్వం పెట్టని కోటగా పరిమళించి గుబాళిస్తుంది" అంటూ మాటలు మరిచిపోవద్దని నాయకులకు సూచిస్తున్నారు. "మాట మనసును రంజింపచేసే సంజీవని, మాటే మనిషిని అనునిత్యం ప్రేరేపించే ఆయుధగని" అంటూ మాటకున్న రెండు కోణాలు చూపిస్తారు. "మాటా ఎంత అణుకువగా ఉంటుందో అంతగా తిరగబడుతుంది" అని అందుకే అంటారు. మాటల్లో మహాలక్ష్మి కొలువై ఉంటుంది. మాట ప్రకటనగా మారి వ్యాపారం వరదలా వెల్లువవుతుంది" అనికూడా తెలియజేస్తారు. "కడివెడు కష్టాల్ని కన్నీటి చారికల్ని ఒక్కసారిగా చెరిపేసేది, ఆశల చిగుళ్ళు పంటలై తొడిగేది... మాటతోనే కదా" అని మాట మనిషికి శక్తినిస్తుందంటారు. "మాటకు పట్టం కట్టని ప్రాంతాల్లోనే కదా రాష్ట్రాలు నీటి తగాదాలతో సరిహద్దు వివాదాలతో పేచీల సుడిగుండాల్లో మునిగితేలేది" అంటూ సమకాలీన రాజకీయ అంశాల్ని గుర్తుకుతెస్తారు. "మాటకు విలువ ఇవ్వటం అంటే కాలానికి పూల రహదారిని పరవడం, గతుకుల రహదారిని టోల్‌ఫ్రీ రాదారిగా స్వాగతించడం" అని మాట వలన గమ్యం తొందరగా చేరుకోవచ్చని సూచిస్తారు. "మాటలే మనస్సులో అంతరాల్ని తొలగిస్తాయి. మాటలే మనుషుల్లో అంతరంగాన్ని వెలిగిస్తాయి. మనిషిని శిఖరాయమానం చేసేది గురిపెట్టిన మాట ఒక్కటే, మాటంటే ఆలోచనల పూలతోట, మాటతోనే మనిషిది పెట్టని కోట" అంటూ మాట గురించి సూక్ష్మస్థాయిలో దీర్ఘ వచన కవిత రాసిన చిన్ని నారాయణరావుకు పెద్దలందరి శుభాభినందనలు.

## స్ఫూర్తి పాటలు

కమ్మరి కొలిమి, కుమ్మరి చక్రం, జాలరి పగ్గం, సాలెల మగ్గం...ఇలా శరీర కష్టం స్ఫురింపచేసే సమస్త వృత్తుల స్థితిగతుల్ని రాసిన ఉద్యమ నేత స్ఫూర్తి గారి పాట పుస్తకం ఇది. వివిధ వృత్తిదారుల పాటలే కాకుండా స్నేహం, పర్యావరణం, మాతృభాష, మత సామరస్యం, మహిళాభ్యుదయం, రైతులు మొదలైన అనేక అంశాలమీద జన రంజకంగా రాసిన పాటలివి. మచ్చుకు కొన్ని చూడండి.

ఆశయాల కోసమని బతికే వాళ్ళము
సమ సమాజ స్థాపనకై కదిలినోళ్లము
త్యాగాల దారుల్లో సుక్క లవుతము
నేల తల్లి గుండెల్లో మొక్క లవుతము...
గల్లు గల్లు గల్లు గల్లు గజ్జెల బండి
అరె పోరుకై సాగుతుంది పేదల బండి
భూమి పోరులో ఒరిగిన వీరులు
మొక్కై మొలిచిన రోరన్న
ధారపోసిన రక్తం తోటి
పంటై పండిన రోరన్న
జిలుగు వెలుగుల చీర నేసినా
జీవ గంజే కరువురా
పసిడి కాంతుల వన్నె లద్దినా
పూట గడవని బతుకురా
క్షవరాలు చేసేటి అన్నలారో అన్నలారో
మన బతుకు క్షవర మాయె అన్నలారో అన్నలారో
కుండలు చేసేటి వాళ్ళం
కూడైన దొరకని వాళ్ళం
ఎండకాలమందు కుండ లాంటి బతుకు
ప్లాస్టిక్ దెబ్బతో పగిలిపోయిందా...
టక టక టక టక ఎంత కుట్టినా
చిరిగినట్టి బట్ట లాగ బతుకు లాయెరో

వైకల్యం శాపమని దిగులు చెందకు
ఆత్మ విశ్వాసముతో కదులు ముందుకు
ఆకసాన నెలవంకను చూసినప్పుడు
వంకరగా ఉన్నానని ఏడ్వ దెప్పుడు...
సందామామ సందామామ పున్నామెప్పుడే
పున్నామోలె బతుకూ లోన వెలుగూ లెప్పుడే...
ప్రాణం పోసిన నీరే నాడు
ప్రాణం తీస్తుందీరోజు
పర్యావరణం పాడైపోతే
బతుకే నిలవదు ఏ నాడు...
ఊరిడిసి పోతున్న సెల్లెలా
వలసెల్లిపోతున్న తమ్ముడా
కన్నతల్లి లాంటి పల్లెటూరు వొదిలి
బతుకుదెరువుకై బాటసారవుతున్న...

ఇలా రాసిన పాటల నిండా చిక్కని కవిత్వం కూడా మనసుల్ని ఆలోచింపచేస్తుంది. పాటలు రాయటమే కాకుండా చక్కగా పాడి వినిపించే స్ఫూర్తికి తెలుగు ప్రజలు ఋణపడి వుంటారు.

ఇలా ఇంకా చాలా కవిత్వ సంపుటాలు వచ్చాయి, వస్తున్నాయి. స్థలాభావం వల్ల అన్నిటినీ వివరించటం సాధ్యం కావటంలేదు. తెలుగు కవులు జన రంజక కవిత్వం అవసరం గుర్తించి మంచి మంచి కవిత్వ సంపుటాలు వెలువరిస్తారని ఆశిద్దాం.

# సంగమేశ్వరం

నందికొట్కూరు పట్టణానికి సుమారు 20 కి.మీ. దూరంలో కృష్ణానది మధ్యలో సంగమేశ్వరం ఉంది. కృష్ణవేణి, తుంగభద్ర, భీమ, మలపాప, హరిణి అనే ఆరునదులు కలిసి ఇక్కడ భవనాశిని నదిలో కలుస్తూ వుండడం వల్ల ఈ క్షేత్రం సప్తనదీ సంగమం అయింది. సతీదేవి శరీర నివృత్తి జరిగిన స్థలం కనుక ఈ క్షేత్రానికి నివృత్తి సంగమేశ్వరం అనే పేరు ఏర్పడింది. ఇక్కడి శివలింగం వేపమొద్దులాగా వుంటుంది.

చిరునామా : డా. రావి రంగారావు, *101 శంఖచక్ర నివాస్, అన్నపూర్ణ నగర్ 5వ లైను తూర్పు, గోరంట్ల, గుంటూరు – 522 034.*

డా॥ ద్వా.నా.శాస్త్రి

# కృష్ణాతీరంలో తెలంగాణ ఆధునిక రచయితలు

సామాన్యంగా నదీపారివాహక ప్రాంతం భౌగోళికంగా, సాంస్కృతికంగా ముందువరుసలో ఉంటుంది. గోదావరి, కృష్ణాదుల తీరప్రాంతం వెలుగు సాహిత్యం, సంస్కృతి కళలపరంగా అభివృద్ధి చెందింది, రాష్ట్రవిభజన తర్వాత మహబూబ్‌నగర్, నల్గొండజిల్లాలు తెలంగాణలోకి వెళ్ళాలి. గోనబుద్ధారెడ్డి, పిల్లలమర్రి పినవీరభద్రుడు వంటి విశిష్ట ప్రాచీన కవుల ప్రాంతమిది. ఈ వ్యాసం ఈ ప్రాంతపు ఆధునిక రచయితలకే పరిమితం. ఈ ప్రాంతపు రచయితలు ఆధునిక సాహిత్యంలో గల అన్ని ప్రక్రియలను చేపట్టి తెలుగు సాహిత్యాన్ని పరిపుష్టం చేశారు.

తెలంగాణ ఆధునిక సాహిత్య చరిత్ర "తెలంగాణ వైతాళికుడు" సురవరం ప్రతాపరెడ్డితోనే ప్రారంభమవుతుంది. స్వాభిమానం, తెలంగాణపైగల అమ్మప్రేమ వీరి "కలాన్ని ఝళిపింపజేశాయి" "నిజాము రాష్ట్రములో ఆంధ్రకవులు పూజ్యము' అన్న ఒక్కోమాటకి "గోల్కొండ కవుల సంచిక"ను ప్రచురించి నోరుమూయించా. ఇది 1934వ సంవత్సరం నాటి వార్త ! ఆంధ్రుల సాంఘికచరిత్ర వీరి గొప్ప కృషికి ఆనవాలు. హిందువుల పండుగలు, రామాయణం రహస్యవలబిఉ మొదలైన పుస్తకాలు రాయటం ఒక ఎత్తు.గోలకొండ పత్రికను నిజాం పరిపాలనలో నడపటం ఒక ఎత్తు. తెలంగాణలో గ్రంథాలయా, విద్యాసంస్థల స్థాపనకు ఎనలేని కృషిచేశారు.

కపిలవాయి లింగమూర్తిని "శారదాతనయుడు" అనమని అసాధారణ ప్రతిభాశాలిగా వీరు చేపట్టని ప్రక్రియ లేదు. శతకాలు రాయటం సరే - చిత్ర పదిపదాల గారడీ కందపద్యాలలో "ఆర్యాశతకం రాయటం గమనార్హం. "ఇంద్రకల్లు", "శ్రీ మత్ర్పతాప గిరి ఖండము", "ఉమామహేశ్వరక్షేత్రము", "సోమశిల చరిత్ర" వంటి రచనల్లో పాలమూరు ప్రాంతంలోని చారిత్రక, సాంస్కృతిక వింతలు, విశేషాలను భద్రపరిచారు. గ్రంథ పరిష్కరణ, శుద్ధ ప్రతి తయారు చేయటం (తాళపత్రాలను) గల కొద్దిమంది పండితుల్లో లింగమూర్తి ఒకరు. "సాలగ్రామచరిత్ర" రచన తొమ్మిది పదులు దాటినా నేటికీ పఠనపాఠనాలలో, రచనావాక్య పరిశోధనలో ఉన్నారంటే కపిలవాయి ఎంతటి అక్షరార్చకులో తెలుసు.

తెలంగాణలో సురవరం తర్వాత శాసన, చారిత్రక సాహిత్యాల చైతన్యానికి అవిరళ కృషిచేసిన మహనీయులు బి. శాస్త్రి. దీనికోసం అకుంఠిత దీక్షతో "మూసీ" పత్రికను స్థాపించారు. తెలుగు సాహిత్యంలోని అన్ని ప్రక్రియలకు, అన్ని ప్రాంతాలకు మచ్చి నిబద్ధతతో నడుస్తున్న పత్రిక ఇది. వీరి గొప్ప కృషికి రెండు నిలువెత్తు నిదర్శనాలు - "బ్రాహ్మణంజ్యసర్వస్వం", "మహబూబ్‌నగర్ సర్వస్వం ! నల్లగొండ జిల్లా కవులపై, పండితులపై మొదటగా పుస్తకం రావి వీరి విద్వత్ పరిశ్రమకి వీరి అనేక రచనలు సాక్ష్యాలు.

నవ్వా శ్రీహరి సంస్కృతాంధ్రాలలో దిట్ట. వ్యాకరణశాస్త్ర పారంగతుడు. నిఘంటుకర్త అను వాదకులు. భాస్కరరామాయణంపై పరిశోధన చేశారు. "అలబ్ధత కావ్యపద్యముక్తావళి" అపూర్వరచన, గబ్బిలం, ఫిరదౌసి వంటివాటిని సంస్కృతీకరించారు. వాడుకభాషలో అపశ్రంభాలు. సంస్కృత సాహిత్యంలో మానవతావాదం, నల్గొండ జిల్లా మాండలికాలు, "శ్రీహరినిఘంటువు" మొదలైన వీరి రచనలు రవ్వా శ్రీహరి భాషాసాహిత్యాలతో చేసిన అపారమైన కృషికి నిదర్శనాలు.

పాకాల యశోదారెడ్డి విదుషీమణి తెలంగాణ తెలుగులోనే మాట్లాడుతూ అదే భాషలో "మావూరి ముచ్చట్లు" అనేకథాసంకలనం వెలువరించి ఒక దారి చూపింది" తెలుగులో హరివంశములు" అనే అంశంపై పరమప్రామాణికమైన సిద్ధాంత గ్రంథ వెలువరించారు. "వరాహపురాణం" - తెలుగు సంస్కృత తులనాత్మక పరిశీలన" ఆమె పాండిత్యానికి మచ్చుతునక. తాళ్ళపాక చిన్నన్న రాసిన అష్టమహిషీ కల్యాణంపై పరిశోధనాత్మక అంశంపై రచనచెయ్యటం దేశసాహిత్యంపై కూడా ఆమెకుగల మక్కువను వెల్లడిస్తుంది.

హైదరాబాదీ రాష్ట్రానికి తొలి ముఖ్యమంత్రిగా, ఒక కవిగా, ఒక దార్శనికుడిగా, భాషాసేవకుడిగా ప్రసిద్ధిపొందినవారు బూర్గుల రామకృష్ణారావు న్యాయవాది అయినా ఆరు భాషలు నేర్చిన రాజకీయ దురంధరులు. "సంస్కృత శ్లోకం - పారశీగజల్ - తెలుగు పద్యం వెరసి బూర్గుల "అన్నారు దాశరథి" సారస్వత వ్యాసముక్తావళి, "పారసీక వాఙ్మయచరిత్ర" "దిడ్రీమ్స్ ఆఫ్ పొయెట్స్" మొదలైన స్వీయరచనలతో పాటు జగన్నాథపండితరాయలవారి లహరీ పంచకాన్ని సౌందర్యలహరిని, కనకధారాస్తవాన్ని తెనిగించారు.

'ఒక్కడె వండొకష్టపడ ఒక్కడె వండొసుఖించు భోగియై

ఒక్కడెవండొ నష్టపడ ఒక్కడెవండొ గడించు లాభముల్

ఒక్కడెవండొ తిట్టుపడ ఒక్కడెవండొ ప్రశంసలొందు, ఇం

కెక్కడి న్యాయమయ్య జగదీశ్వర, ఓ ప్రభువిఠ్ఠలేశ్వరా"

అనే పద్యం చదవగానే కూరెళ్ళ విఠలాచార్య గుర్తుకువస్తారు. ఎంతటి పద్యకవో అంతటి గేయవచనకవులు కూడా. త్రిపదలు, అనే సరిక్రొత్త రూపంలో లోక రీతి వెల్లడించారు. "తెలుగు నవలల్లో స్వాతంత్ర్యోదమ చిత్రణ" అనేది వీరి పరిశోధనగ్రంథం. "పుష్ప విలాపం" లాగా గోవిలాపం రాయటం విశేషం.

ప్రస్తుతం తెలుగు విశ్వవిద్యాలయానికి ఉపకులపతిగా ఉన్న ఎల్లూరి శివారెడ్డి "ఆంధ్రమహాభారతంలో రసపోషణ" అంశంపై పరిశోధన చేశారు. ప్రాచీన సాహిత్యాన్ని మథించిన పండితులు. సురవరం ప్రతాపరెడ్డిపై మంచి పుస్తకం రాశాడు. పద్యాన్ని బాగా గౌరవించినా మంచి వచన కవిత్వాన్ని ఆదరించగలరు. ఉస్మానియా తెలుగుశాఖ ఆచార్యులుగా, ఆంధ్రసారస్వత పరిషత్ ముఖ్యకార్యదర్శిగా విధులు నిర్వహించారు. నిత్య అధ్యయనశీలి.

పరిశోధన, కథానవలారచన, విమర్శ, యాత్రారచన..... అన్నిటిలోను ప్రత్యేకత నిలబెట్టుకున్నవారు ముదిగంటి సుజాతారెడ్డి. ఈమె విశ్లేషణ, విమర్శనాశక్తులకి సామాజిక చారిత్రక నేపథ్యంలో తెలుగుసాహిత్య చరిత్ర పుస్తకం నిదర్శనం. ఇది ఇష్టపడి రాసింది తప్ప బహుమతి లేదా డిగ్రీల కోసం రాసింది కాదు. "వేమన - నాదసంప్రదాయం" కొత్తకోణాన్ని ఆవిష్కరించే మరొక విమర్శ గ్రంథమును చరిత్ర-వసుచరిత్రల తులనాత్మక పరిశీలనకు పి. హెచ్.డి లభించింది. తమ సహచరులు గోపాలరెడ్డితో కలిసి 820 పుటల "సంస్కృత సాహిత్య చరిత్ర" మంచి ఆకరగ్రంథం. "తెలంగాణ తొలితరం కథలు" "తొలినాటి కతలు" అనే సంకలనాలను సంపాదకు రాలిగా వెలువరించారు.

"ఒక సద్విమర్శకునికి కావలసిన సమీక్షణ, సంయమన శక్తులు ఈ రచయితకున్నవి. ఇంతవరకు పాయలు, పాయలుగా ఉన్న విమర్శనారీతుల్ని ఒకచోట గుదిగ్రుచ్చి చూపి ప్రామాణిక మతితో ఈ సిద్ధాంత గ్రంథాన్ని రచించారని సినారెచే కితాబు పొందిన అగ్రేసర విమర్శకులు ఎస్వీరామారావు 1974లో వెలువడిన ఈ పుస్తకం నేటికీ పఠనపాఠనాలలోను, ఒక "రిఫరెన్స్" గ్రంథంగాను ఉండటమే దీని ప్రాశస్త్యాన్ని చెపుతుంది. తెలంగాణ రాష్ట్రం వెలుడిన తర్వాత తెలంగాణ సాహిత్యంపై దృష్టిసారించి రచనలు చేస్తున్నారు. పాలమూరుజిల్లాలో సాహిత్యంపై ప్రత్యేకమైన పుస్తకం రాశారు. "తెలంగాణ సాహిత్యచరిత్ర"ను సంగ్రహంగా పరిచయం చేసిన రామారావు కవిత్వం కూడా రాశారు.

ప్రజాకవిత్వంలో ఈ ప్రాంతం ఒక సుస్థిరస్థానం సంపాదించు కుంది.

"ఓ పల్లెటూరి పిల్లగాడ !

పసులుకాసె మొనగాడ !

పాలబుగ్గల జీతగాడ !

అంటూ సుద్దాల హనుమంతు ప్రజలబాణీలో ప్రజలకి చేరువగా పాటలు రాసిన అచ్చెమైన ప్రజాకవి తెలంగాణ సాయుధపోరాటంలో తన కలాన్ని ఆయుధంగా వాడినవారు. గోరటి వెంకన్న అదే వారసత్వంతో ప్రజల దుస్థితిని తన పాటల ద్వారా కళ్ళకి కట్టిస్తున్నారు.

"పల్లె కన్నీరెడుతుందో కనిపించని కుట్రల

గోరెంక పిట్టల సవ్వడేమాయె..."

అనే పాటలక్షలాది మందిని స్పందింపజేసింది. ఏకునాదంమోత, రేలపూతలు, అలసెంద్ర వంక వంటి పాటలు సంపుటాలతో నిత్యోత్సాహంగా ఉంటారు. తండ్రికి తగినవారసుడిగా సుద్దాల అశోక్‌తేజ ప్రజాకవిత్వం రాస్తున్నారు. హనుమంతు పాటలన్నిటిని సేకరించి పల్లెటూరి పిల్లగాడగా సంపుటి తీసుకువచ్చారు. అశోక్‌తేజకు కవిత్వం తెలంగాణ మట్టి వాసనలనుంచి వచ్చింది. "నెమలికన్నోడు" "నేలమ్మానేలమ్మా" వంటి కవితా సంపుటాలని కేవలం సినీ కవిని కాదని ప్రకటించాడు. ఎల్లండ రఘుమన్న ఈకోవలో చెందరు కాని పల్లె పదాలు రాసి పాటలు పాడి జనంలోకి వెళ్ళిన ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖ ఆచార్యులుగా పనిచేశారు.

"ఆత్మ అక్షరమైనవేళ", "గదిలో నక్షత్రం", "మరో ఉదయాన్ని పిలుస్తా" వంటి కవితా సంపుటాలతో, శ్రీరంగరాజు కేశవరావు సాహిత్య పరిశీలన" "జనగామ సాహితీమూర్తులు". "వ్యాససంహిత" వంటి విమర్శ గ్రంథాలతో ఎందరినో తెలుగు అభిమానులుగా తీర్చిదిద్దిన సాహితీమూర్తి లింగంపల్లి రామచంద్ర సినారె వాక్కుకు వయసులేదు. కవితా సంపుటిని 144 పుటలలో విశ్లేషిస్తూ వీరు రాసిన విమర్శ గ్రంథం పేరు తీసుకొచ్చింది.

"ప్రజల మనిషి", "గంగు" పేర్లు చెప్పగానే వట్టికోట ఆళ్వారు స్వామి గుర్తుకు వస్తారు. "రైలులోపల" కథా సంపుటి తర్వాత గుర్తుకు వస్తుంది. తెలుగు విద్యార్థి పత్రికతో "రామప్ప రభస"గా వ్యంగ్యాస్త్రాలు వదిలారు. హోటల్ కార్మికుడిగా జీవితం ప్రారంభించి సమాజాన్ని దశలగా మార్చుకొన్న గొప్ప రచయిత ఆళ్వారుస్వామి. దేశోద్ధారక గ్రంథమాల స్థాపించారు. పరిసరాలు అనే కథా కొన్నాళ్ళు "తెనుగు తల్లి" పత్రికను నడిపారు.

తొలి సినిమాపేట రాసిన పండితుడు, రచయిత చందాల కేశవ వాసు, రామశతకం, తెలుగులో తత్వ కవులు వంటి రచనలు చేసిన కవిరత్న నీలాజంగయ్య, అరుణరేఖలు కవితా సంపుటి ప్రచురించిన కథా రచయిత, అభ్యుయదతాది కాంచనపల్లి చినవెంకట రామారావు, బహుభాషా కోవిదులు రచయిత నోముల మొదలైన వారంతా ఈ ప్రాంతాల నుంచి సాహిత్యాన్ని సృష్టించినవారే అత్యాధునికుల్లో దేవరాజు మహరాజు, సుంకిరెడ్డి నారాయణరెడ్డి (ముంగిలి రచయిత) కోట్ల వెంకటేశ్వరరెడ్డి, కాసుల ప్రతాపరెడ్డి ఏనుగు నరసింహారెడ్డి, ఎస్.రఘు వంటివారున్నారు. పాలకుర్తి మధుసూదన రావు విశిష్టమైన సిద్ధాంత గ్రంథం రచించారు. పైడిమర్రి వెంకట సుబ్బారావు, రావిభారతి, వేణు సంకోజు, అంబటిపూటి, నిత్యానంద రావు, జె.చెన్నయ్య. ఇలా ఎందరో ఉన్నారు. 150 కథలు, కొన్ని మంచిన నవలలు రాసిన పోల్కంపల్లి శాంతాదేవిని గుర్తుంచుకోవాలి. పున్న అంజయ్య, పోరెడ్డి రంగయ్య, ముకురాల రామారెడ్డి, తిరునగరి... ఎందరెందరో సాహిత్య రచనలు చేస్తున్నారు.

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, కేశవపంతుల నరసింహశాస్త్రి వంటి పండితుల కృషి వెలకట్టలేనిది. కప్పగంతుల వచన మహాభారతం, ఆంధ్ర వ్యాకరణ వరణములు, అనువాదాలు రచించి "ఆంధ్ర అనిపించుకున్నారు. అలంపూర్ క్షేత్రం శ్రీశైలం ప్రాజెక్టు వల్ల ముంపుకి గురికాకుండా పెద్ద ప్రయత్నం చేసి, గడియారం రామకృష్ణశర్మరాసిన "శతపత్రం" సాహిత్య అకాడమీ బహుమతిగా పొందింది. కేశవ పంతుల రఘువంశానికి వ్యాఖ్యానం రాసిన కవి, పండిత విమర్శకుల ఇంకా ఖండవల్లి లక్ష్మీనరసింహశాస్త్రి, తెలకపల్లి రామచంద్రశాస్త్రి వంటి పండితులుండేవారు.

ఆధునిక కవులలో ఎన్.గోపి అగ్రేసర కవి, విమర్శకులు పరిశోధకులు, విశిష్టమైన "జలగీతం" దీర్ఘ కావ్యం జాతీయస్థాయితో గుర్తింపు పొందింది. "కాలాన్ని నిద్రపోనివ్వను" కావ్యం సాహిత్య అకాడమి బహుమతి పొందింది. గోపి ప్రారంభించిన "నానీలు" సరికొత్త ఆధునిక కవితా రూపంగా స్థిరపడి వందలాది కవితా సంపుటాలు వెలువడ్డాయి. వేమనపై పరిశోధన చేసి, వేమనను "ఎకడమిక్"గా ప్రాచుర్యంలోకి తెచ్చారు గోపి. దిగంబర కవులుగా పేరొందిన జ్వాలాముఖి, నిఖిలేశ్వర్ ఈప్రాంతానికి చెందినవారే.

గొర్రెలు, ఎచ్చరికో, దున్న, చీమలు, రగులు తెలంగాణ వెతలు, బోజకథలు, ఉప్పునీరు... మొదలైన కథలు. జాతర, జగడం వంటి నవలలు రాసిన నిజాయితీ రచయిత బోయజంగయ్య. "జంగయ్య అసలు సిసలు వెలుగు రచయిత అన్నారు పురాణం సుబ్రహ్మణ్యశర్మ.

ఇలా తవ్వుకుంటూ వెళ్ళే ఎన్నో మాణిక్యాలు దొరుకుతాయి. మహబూ చోనగర్, నల్గొండ జిల్లాలలో ఆంధ్ర సారస్వతి కృషీవలురు ఎంతోమంది ఉన్నారని, ఈప్రాంతం ముందు వరుసలోనే ఉన్నదనీ తెలుస్తుంది. ఈవ్యాసం సంక్షిప్త పరిచయానికే పరిమితం!

శ్రీ జె.ఎస్.ఆర్.కె. శర్మ

# కర్నూలు జిల్లా కవులు, రచయితలు

కర్నూలు జిల్లాకు కేంద్రమైన 'కర్నూలు' కు కందెనవోలు, కందన వోలు, కందనోలు అనేపేర్లు ఉన్నవి. కొంత కన్నడప్రాంతం, కొంత ప్రస్తుత ప్రకాశం జిల్లాలోని త్రిపురాంతకం వరకు అది విస్తరించి ఉండిది. సర్కారులనుండి, కర్నాటక నుండి, తెలంగాణా నుండి కవులు ఈ జిల్లాకు వలస వచ్చారు. అందుకు శ్రీశైలం, శైవమత ప్రాబల్యం కారణం కావచ్చు. విజయనగరరాజుల సాహిత్య ప్రోత్సాహం కూడ ఎన్నదగినదే. అహోబిలక్షేత్ర ప్రభావం కూడ కావచ్చు. ఇది దండకారణ్యప్రాంతం కూడ.

తొలితెలుగు మాట 'నాగబు' అని పూజ్యులు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు గుర్తించిన దానినే ఆరుద్రగారు తమ సమగ్రాంధ్ర సాహిత్య సంపుటాలపై ముద్రించారు. కాని నిజానికి క్రీ.పూ. 3000-2500 నాటి తెలుగు శాసనం, కర్నూలుజిల్లా ఓర్వకల్లుమండలం, కన్నమడకల అనే గ్రామంలో సుబ్రహ్మణ్య మలమాండి అనే తెలుగు లిపుల పరిశోధ కులు గుర్తించారని ప్రసిద్ధ చారిత్రక, సాహిత్యపరిశోధకులు శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులవారు తమ కర్నూలుజిల్లా కవితరంగణిలో ఉటం కించారు. అంతేకాదు,ఆ శాసనంలో 'అంధిర, లోహము' అనేవే తొలి తెలుగుపదాలుగా గుర్తింపబడినవి. ఈ విధంగా తొలి తెలుగు పదా లకు స్థానంగా కర్నూలుజిల్లా నిలిచింది. ఆ పదాల కర్థం 'ఆంధ్ర లోకము' కావచ్చు. ఆదికవి వాల్మీకి బాల్యం దండకారణ్య ప్రాంతమైన కర్నూలు అనే వారున్నారు.

- కవులంటే తెలుగు కవులే కాదుకదా! సంస్కృత కవులు క్రీ.శ. 1వ శతాబ్దం నుండి వినిపిస్తారు. సిద్ధనాగార్జునిని మనం తొలి కర్నూలుకవి అనవచ్చు. "శ్రీశైల శిఖరస్థాయీ సిద్ధ నాగార్జునోమహాన్" అన్న నానుడి వలన 24 రచనలు చేసిన ఈ మహాకవి కర్నూలు వాడే!
- ఆదిశంకరుల వారు శ్రీశైలంలో వసించి భ్రమరాంబా మల్లి కార్జునులను సేవించుచు 'శివానందలహరి, సౌందర్య లహరి' లను రచించిరి.
- క్రీ.శ. 1050 ప్రాంతము వాడైన జంగమ మల్లికార్జునుడు పండితకవి. నన్నెచోడుడు తన కుమారసంభవమును గురువైన జంగమ మల్లికార్జును కంకితము చేసెను. ఈ త్రిమూర్తులకు వందనము ఘటింతును.

కర్నూలు జిల్లా రచయితలను గురించి ఇంతవరకు సమగ్రగ్రంథం రాలేదు. 1923లో కీ.శే.చింతలేని సుగూరప్పగారు 70 మంది కవి పండితుల గురించి మహనీయుల చరిత్రపేరుతో రచించారు.

1994లో శ్రీ.కె.ఎన్.ఎస్. రాజుగారు 68 మంది ఆధునికుల చరిత్రను 'కర్నూలు జిల్లా రచయితల చరిత్ర' పేరుతో ప్రచురించారు. 'అరుణభారతి' సంచికలోని బనగానిపల్లె ప్రాంత కవుల గురించిన వ్యాసం అమూల్యం. శ్రీయుతులు హెచ్. హీరాలాల్, శ్రీగొట్టిముక్కల సుబ్రహ్మణ్యశాస్త్రిగారల రచనలు అమూల్యాలు.

పరిశోధక రచయితగా నరహరి గోపాలకృష్ణమ శెట్టి (1833-1888) (ప్యాపలిలో కర్నూలుజిల్లా డిప్యూటి కలెక్టరుగ పనిచేశారు) ప్రథమవందనీయులు. కలెక్టర్ యస్. కాశీపాండ్యన్ గారు ద్వితీయులు. 1936లో కర్నూలు మండల చరిత్రము ప్రచురించిన కీ.శే. ధరణి రామచంద్రరావు గారి కృషి మరువలేము. శ్రీ చొక్కపు నారాయణ స్వామి గారి కృషియు పేర్కొనతగినది.

800 కవి పండితుల సంక్షిప్త పరిచయంగా 'కర్నూలు జిల్లా కవి తరంగణి' రచయిత శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు వారి కృషి అభినందనీయము. సమగ్రత కొరకు కొంతమంది ప్రముఖులైన పూర్వకవులను స్మరింతును.

## 1. నన్నెచోడుడు (1080-1130)

రాజకవి, కుమారసంభవం, కళావిలాసం అతని కృతులు ప్రబంధ కవితకే కాక పూర్వకవి స్తుతి, కుకవినింద, కర్తవిషయం, కృతిపతి వర్ణన షష్ఠ్యంతాలు, కృతి అంకితం వంటి ఆచారాలకాద్యుడు. అతని రాజధాని ఒరయూరు నేటి ప్రకాశం జిల్లాలోని కంభం - అర్ధవీడు దారిలో మొహిద్దీన్‌పురం దగ్గర వుండేది.

**2. యథావాక్కుల అన్నమయ్య**

గురువు పత్తికొండ తాలూకా దూదేకొండ సోమేశ్వరాధ్యులు. రచన 'సర్వేశ్వరశతకం' కాలము 13వ శతాబ్దము.

**3. కరస్థలి విశ్వనాథమయ్య**

13వ -త్రిపురాంతకంలో స్థిరపడ్డారు. పాల్కురికి సోమనాథుడు వీరి శిష్యుడు. త్రిపురాంతకంలోనే ఉండి పాల్కురికి బసవపురాణం రచించారు.

**4. రావిపాటి త్రిపురాంతకుడు**

14వ శ. ప్రస్తుతం ప్రకాశం జిల్లాలోని రావిపాడు, వినుకొండ, ఓరుగల్లు, రాజాస్థానాలలో ఉండెను. చాల గ్రంథాలు రచించినా త్రిపురాంతకోదాహరణం మాత్రమే లభిస్తున్నది.

**5. సంకుసాల నృసింహకవి**

16వ శ - కోవెలకుంట్ల ప్రాంతం- కవికర్ణ రసాయనము (మాంధాతృ చరిత్ర) ఆయనకృతి. దీనిని చదివితే యతి విటుడుగా; విటుడు యతిగా మారుతాడని కవిప్రతిజ్ఞ.

**6. ప్రోలుగంటి చెన్నశౌరి**

15 శ. పోలకల్లు. దండనాయకులు. నృసింహపురాణం - ద్విపద అహోబిలనరసింహస్వామికి అంకితం. బాలభారతవచనం, సౌరభ చరిత యక్షగానం వీరి కృతులు. తొలియక్షగానకర్త.

**7. నందిమల్లయ్య, ఘంటసింగయ్య (తొలిజంటకవులు)**

ప్రబోధచంద్రోదయం పెసరవాయి గంగామాత్యున కంకితం. వరాహపురాణం రాయలవారి తండ్రి తుళువ నరసరాయ కంకితం 15శ.

**8. అల్లసానిపెద్దన**

ఆంధ్రకవితా పితామహుడు ఈయన బిరుదు. నందవరేకి. శఠగోపయతిశిష్యుడు. దోరణాల స్వగ్రామం. కోగటం, పెద్దనపాడు, రాయలిచ్చిన కడపజిల్లాలోని అగ్రహారాలు. మనుచరిత్ర, హరికథా సారము ఆయనకృత్తులు. 16వశ.

**9. పింగళిసూరన**

ఆకువీడు పెదవెంకటాద్రి, నంద్యాల కృష్ణమరాజు వీరి పోషకులు. కాశాల వీరు స్థిరపడ్డగ్రామం. గిరిజా కళ్యాణం, గరుడ పురాణం, రాఘవ పాండవీయం (ద్వర్థికావ్యం) కళాపూర్ణోదయం (పద్యనవల) ప్రభావతీ ప్రద్యుమ్నం ఈయన కృతులు. 16వ శ.

**10. రాఘవేంద్రస్వామి**

1601-1671వీరు మధ్వ సిద్ధాంతప్రచారకులు. 47 గ్రంథాలు రచించారు. మంత్రాలయంలోని బృందావనంలో సమాధియై నేటకీ పూజలందుకొంటున్నారు.

**11. వీరబ్రహ్మంగారు**

17వ శతాబ్దం. యాగంటి గుహలలో కాలజ్ఞానం రాశారు. బ్రహ్మంగారి తత్త్వాలు ప్రఖ్యాతం

**12. హోసూరు సాకమ్మ**

అన్నదానం వారి ఇంటికోడలు. రామాయణం బాలకాండ యక్షగానం, రంగవిలాసం, ముక్తి కాంతాకళ్యాణం, గురుశిష్య సంవాదం - వీరి రచనలు

**13. గిరిరాజకవి**

ప్రస్తుతం ప్రకాశం జిల్లా కాకర్ల గ్రామవాసులు. (1767-1847) త్యాగరాజుల వారి పితామహులు. 8 కావ్యాలు రచించారు. దక్షిణదేశానికి వెళ్ళి తిరువాయూరులో స్థిరపడినారు. వీరి సోదరుడు వేంకటగిరి కూడ కవి.

**14. మజ్జరిమల్లారెడ్డి**

నగరి వంశానికి చెందిన పాళెగారు. ఉయ్యాలవాడ నరసింహా రెడ్డి గారిపూర్వులు. శకుంతలాపరిణయం అనే పద్యకావ్యం రచించారు.

**15. కోటకొండ కప్పట్రాళ్ళ భాగవతులు**

వీరు కూచిపూడి వారే. నైజాం నవాబును మెప్పించి కోటకొండను అగ్రహారంగా పొందారు. పారిజాతాపహరణంను ప్రదర్శనయోగ్యంగా రచించి ప్రదర్శించేవారు.

**1. నరహరి గోపాలకృష్ణమ్మ శెట్టి**

1833- 1838 వీరి పూర్వులది కర్నూలుజిల్లా గడివేముల మండలం బిలకలగూడూరు. మద్రాసుకు వలస వెళ్ళారు. కర్నూలు జిల్లా ప్యాపలిలో డిప్యూటి కలెక్టరుగా పనిచేశారు. కర్నూలు భూగోళం (కర్నూలుజిల్లా మాన్యువల్) మాన్యువల్ రచించిన తొలి భారతీయుడు. ఆంగ్లంలో రచించాడు. వీరు రచించిన రంగరాజు చరిత్ర తొలి నవల. గోపాలకృష్ణమూర్తి దండకం, గోపాల కృష్ణమూర్తి శతకం అనే రచనలు ఆయన కుమారుడు ఈయన గురించి రచించాడు. (కుమారుని పేరు రాజామణిశెట్టి) ఊరెదేరభద్రకవి తన 'కరిణీకోద్ధారిణి' గ్రంథాన్ని, గనిశేషకవి తన రంగరాజచరిత్ర పద్యకావ్యాన్ని గోపాల కృష్ణమ శెట్టి కంకితమిచ్చారు. పరవస్తు చిన్నయసూరి "మాన్యువల్ ఆఫ్ హిందూ లా" అనే గ్రంథరచనలో శెట్టిగారి సాయం తీసికొన్నారు. న.గో.శెట్టి కర్నూలు జిల్లా తొలి చిత్రకారుడు.

**2. గాడిచెర్ల హరిసర్వోత్తమరావు**

1883-1960 ఆంధ్రదేశంలో తొలి రాజకీయ ఖైది, ఆంధ్రతిలక్. కర్నూల్లో జన్మించారు. నంద్యాల ఆయన రాజకీయకేంద్రం. ఈయన

సాహిత్య సేవ ఆయన రాజకీయ సేవ కంటే విశాలమైనది. అదియు గుర్తింపు రాలేదు. 1906లో ఎం.ఎ. కొరకు సమర్పించిన పరిశోధనా పత్రం Aneglected Emperor రాయల అముక్తమాల్యదా కర్తృత్వాన్ని (వేదం వారికి విభిన్నంగా) నిర్ధారించింది. విజ్ఞానచంద్రికామండలి వ్యవస్థాపకులలో ఒకరు. శ్రీరామచరితము, ప్రచ్ఛన్నపాండవం, విస్మృత కవి చక్రవర్తి, గ్రంథాలయ ఉద్యమం, పత్రికల స్థాపన, వయోజన విద్యాపాఠ్యగ్రంథాలు రచించి క్రమంగా అంకితమిచ్చి తల్లి, తండ్రి, గురువు, ఋషి, దేశమాత, పత్నీఋణం తీర్చినారు. ఈయన గ్రంథాలు 25; విద్య, గాంధీయిజము, గ్రంథాలయాలు, పంచాయితీరాజ్, రాజకీయాలు, జీవితచరిత్రలు, శాస్త్రాలు , తీర్థక్షేత్రాలు, పత్రికలు, సమీక్షలు అనేకాలు. రాయలసీమ తొలి కథారచయిత (చివరిపైసా) ఈయన సాహిత్య కృషిపై పరిశోధనలు జరుగవలె. వారి పుస్తకాలు ప్రచురించాల్సిఉంది.

### 3. మేడవరం రామబ్రహ్మశాస్త్రి (1885-1967)

కర్నూలు పురపాలకోన్నత పాఠశాలలో తెలుగు పండితులు. బలిజేపల్లి లక్ష్మీకాంతంగారితో కలిసి జంట కవిత్వము చెప్పిరి. సుందరకాండ రచించిరి. యోగదృష్టి కలవారు. జగన్నాథ పండితుల భామినీ విలాసమును, సూక్తిసుధ పేరుతో వెలిగించిరి. శృంగార విలాసమును ఆంధ్రీకరించిరి.

### 4. దోమా వేంకటస్వామి గుప్త

(1899-1962) వీరు కర్నూలులో జన్మించారు. శతావధాని మొదలైన 13 బిరుదులున్నవి. విజయవాడలో గజారోహణ సత్కారం పొందారు. శతాధిక రచనలు చేశారు. 32 ముద్రితాలు, 57 అముద్రితాలు లభిస్తున్నవి. అలభ్యాలు ఎన్నో. పురాణాలు, మహాత్మ్యాలు, శతకాలు,కావ్యాలు, చరిత్రలు, నాటకాల విమర్శలు ఉన్నవి. శ్రీకృష్ణదేవ వరాయల చరిత్ర శ్రీ కన్యకాపురాణం, బ్రహ్మవైవర్త పురాణం ప్రసిద్ధాలు, కడపలో దోమా వెంకటస్వామి గుప్తా పీఠం ఉంది. ఆయన పేర ప్రతి వర్ష పురస్కారోత్సవం జరుగుతుంది.

### 5. మద్దులపల్లి సుబ్రహ్మణ్యస్వామి

(1900-1974) నంద్యాల మునిసిపల్ ఉన్నతపాఠశాలలో ఆంధ్రపండితులు. ఈ క్రింది చాటువు అందరినోళ్ళతో నానుతుంది.

**కవితాకన్య మనింటియాడపడుచా? కాకున్న ఇల్లాల ? ఏ**
**కవశం బందుననుండు వారవధువా? కాదట్టులం పూర్వ సం**
**భవమందుంగల పుణ్యలేశమున సంప్రాప్తించునే గాని మా**
**నవుడెన్నే విధులం తపించినను చెంతంజేర దొక్కింతయున్**

కవితావినోదము; దైవప్రార్థన - సుభాషితములు; భక్త పోతరాజీయము' త్యాగరాజు, పెండ్లిరాయభారము అను నాటకములు, ప్రియదర్శికానాటిక; అమృతసందేశము, సత్యనారాయణ మహాత్మ్యము, సుప్రభాతము గాదేపల్లి వారి కవితావిలాసము, దక్షిణామూర్తి స్తోత్రము, దానకర్ణ బుడ్డా వెంగళరెడ్డి చరిత్ర, బ్రహ్మస్వామి జీవితము, సూర్య వంశము, ఇంద్రగంటి శేషావధానుల చరిత్ర, ఆంధ్రవచన భారతము, చతుర్దశమను చరిత్ర, భోజకాళిదాసకథలు, చేతావని ఖండనము, మానవుడు - గోసేవ మొదలగు గ్రంథములు రచించిరి.

### 6. వనం శంకర శర్మ

1900-1977 హితవాది పత్రికా సంపాదకులు (శారద, ఇంద్రానీతి వ్యవస్థాపకులు) కవి, నాటకకర్త, హరికథా రచయిత, జ్యోతిష్కులు మరియు స్వతంత్ర పోరాటయోధులు. శ్రీ మహాత్మాగాంధీ శతకము, రామరాజు చరిత్ర, రాణా చరిత్ర, మృత్యుంజయ చరిత్ర, కేశవ దాసుచరిత్ర అను హరికథలు, సంసారయాత్ర, భక్తపుండరీక, దేశభక్తి, అప్పుల తిప్పలు, జగన్మాయ వంటి నాటకములు రచించిరి.

### 7. పాణ్యం నరసరామయ్య

కల్లూరు సుబ్బారావు, కళావెంకటరావు, దామోదరం సంజీవయ్య, పెండేకంటి సుబ్బయ్యగారల కోరికపై 'స్వాతంత్ర్యవీరుడు' ఉయ్యాల వాడ నరసింహారెడ్డి పై చారిత్రక పద్యకావ్యం రచించారు. ఆయన రచనపై గడియారం వేంకటశేషశాస్త్రి ప్రభావం ఉంది. వీరి మరొక కావ్యము 'వీర కంకణము' విశ్వనాథ నాయకుని చరిత్ర ఇది. వీరు తమ తమ్ముడగు (గుండయ్య) లక్ష్మీనరసయ్య గార్లతో కలసి 'ప్రభాత రేఖలు' అను కావ్యము రచించిరి. పాణ్యం సోదరకవులుగా ప్రసిద్దులు.

### 8. ఎం.డి. వెంకటసుబ్బయ్య :

(1911-) కర్నూలు ఉస్మానియా కళాశాలలో తెలుగు ప్రొఫెసర్‌గా పనిచేశారు. కళాశాల తెలుగు భాషా సమితిని కళకళలాడించారు. 'శీలవతి' అనే చిన్నకావ్యం రచించారు. తరువాత 1970లో ఉప్పులూరి విశ్వేశ్వరయ్య, ఎన్.వి. కృష్ణమూర్తి, ఎం.వి. సూర్యనారాయణల సహకారంతో 'సాహితీసదస్సు'ను స్థాపించి శతానేక సాహితీ ఉపన్యాసాలిప్పించారు. ఆ ఉపన్యాసాలు సాహిత్య ప్రబోధము, సాహిత్య జగత్తు, సాహిత్య సౌరభము, సాహిత్య వికాసము, సాహిత్య ప్రతిభ, రామాయణ ప్రశస్తి, భాగవత సుధాలహరి అను గ్రంథాలను ముద్రించారు.

### 9. షేక్ దావూద్

1916-1990.వీరి గురువు కైపసుబ్రహ్మణ్యశర్మగారు. దావూద్ గారు సాయిబాబా శతకం రచించి గురువుకు అంకితం చేశారు. నంద్యాల 1950నుండి 1972 వరకు తెలుగు లెక్చరర్‌గా పనిచేశారు. రసూల్ ప్రభు శతకం రచించారు. చిత్త పరివర్తనము, సూఫీ సూక్తులు, సంస్కార ప్రణయము, దాసీ పన్నా వంటి రచనలుముద్రింపబడినవి. 15 అముద్రితాలున్నవి. దావూద్ గారుంటే అవధానులలో నవ్వుల పువ్వులుపూసేవి.

### 10. బచ్చు సుబ్బరాయుడు గుప్త

(1902-1975) ఔకు గ్రామనివాసి. ఔకు సంస్కృత పాఠశాలలో విద్యాభ్యాసం. మైసూరు ఆస్థానకవి. 'సీతారావణసంవాదఝరి' కావ్యాన్ని 50 శ్లోకాలేరచించి వదలిరి. దానిని గుప్తగారు పూర్తి చేశారు. ఇది శ్లేషకావ్యం. పుల్లాపంతుల వేంకటరామశర్మగారు దీనికి తెలుగులో టీకా తాత్పర్యములు వ్రాసిరి. ఇది తెలుగు, ఇంగ్లీషు, హిందీ భాషలలో అనువాదమై అంతర్జాతీయఖ్యాతి ఆర్జించినది. అన్ని విశ్వవిద్యాలయ గ్రంథాలయములు చేరినది. వాసవి కన్యకాపరమేశ్వరీ సుప్రభాతము, స్తవమంజరి వీరి ఇతర కృతులు. కేంద్ర సాహిత్య అవార్డును, విదేశీ ఆహ్వానములను తిరస్కరించిరి.

### 11. అనుముల వేంకటశేషకవి

(1905) అవధాన విద్యలో ఆరితేరినవారు, ఎన్నో బాలవాచకములు రచించిరి. నవోఢ, అభినవతారాశశాంకం, చింతాదేవి, మహానందిమజా, వేళాకోళం, అంబాదేవి నాటకాలు, భారతోపన్యాసాలు, తులసీదాసు ఇతర రచనలు.

### 12. పుల్లాపంతుల వేంకటరామశర్మ

(1919-1975) వీరు అవధాని మహాపండితులు, దైవందిన్నె, గద్వాల సంస్థానభూషితులు, కర్నూలు మునిసిపల్ ఉన్నత పాఠశాలలో తెలుగు పండితులు. నిరాకృత శకుంతల, ఆనందగీతాకందము, ప్రణయానందం, భారతీ శ్రీనాథేయము, గజరాజకావ్యమ్, శ్రీ రాఘవేంద్ర ప్రభాత స్తవరత్నమాల, విచారార్జునీయము, వివేకభారతం, వేంకటేశ్వరతారావళి, శ్రీగురజాల రామలింగేశ్వర శతకం,శనిమహిమ, హనుమత్సుందరదండకం, ముత్యాలతోరణం, వైశాఖమహిమ, అలంకార శబ్దానుశాసనం, వ్యుత్పత్తి భాస్కరం,సీతారావణ సంవాద వ్యాఖ్య, శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జున ప్రభాత సౌభాగ్య స్తవం వీరి రచనలు.

### 13. దండిపల్లి వేంకటసుబ్బశాస్త్రి

ఉస్మానియా కళాశాలలో 27 సంవత్సరాలు అధ్యాపక వృత్తి, 1958లో శాసనమండలి సభ్యులు. వీర కంకణం జగన్నాథ పండితరాయల చరిత్ర, విద్యారణ్యుల ఏకాంకిక, భారత కమ్యూనిష్టుల వింత వైఖరి, ప్రకాశం గారి ప్రభుత్వం, మన రాజ్యాంగం మొదలగు గ్రంథాలు రచించారు.

### 14. ఆచార్యనన్నూరు వేంకట కృష్ణమూర్తి (ఎన్.వి.కృష్ణమూర్తి)

1924- సాహితీ సదస్సు వ్యవస్థాపక సభ్యులు. ఉస్మానియా కళాశాలాచార్యులు. నల్లులవేట, నాగరికత, భంభం పద్యాలు. బచ్చుసుబ్బరాయగుప్త "సీతారావణ సంవాదఝరి" కి ఆంగ్లానువాదం చేశారు. కథకులు, కళాశాల విద్యార్థులకు జంతుశాస్త్రగ్రంథాలు రచించారు.

### 15. మహా మహిమోపాధ్యాయ పండిత పద్మనాభాచార్యులు

1925లో ఆత్మకూరులో జన్మించారు. పరిభాషేందు శేఖర వ్యాఖ్య, శబ్దేందు శేఖర వ్యాఖ్య, న్యాయ కుసుమాంజలి వ్యాఖ్య, మన్యుసూక్త వ్యాఖ్య, మాధ్వ భాష్య వైశిష్ట్యము, తత్త్వవాదము, అద్వైత తత్త్వ చంద్రికా విమర్శనము, సుఖబోధిని బాలవ్యాకరణ వ్యాఖ్య మొదలగు గ్రంథములు రచించిరి. వేదపాఠశాలను స్థాపించిరి. శాస్త్ర చర్యలలో వీరు మేటి. దేశములోనే వీరి వంటి పండితులు ఇరువురో ముగ్గురో ఉండిరట.

### 16. సర్దేశాయి తిరుమలరావు

(1928) ఆలూరు తాలూకా జోహరాపురం స్వగ్రామం. 1954లో అనంతపురంలో తైల సాంకేతికత పరిశోధనాసంస్థలో చేరి డైరక్టర్ అయ్యారు. వీరి 'సాహిత్యదర్శనము - శివభారతము', కన్యాశుల్క నాటక కళ అను విమర్శనాత్మక పరిశోధన గ్రంథములు వ్రాసిరి. వీరి లేఖలు, వ్యాసాలు అసంఖ్యాకాలు.

### 17. చవాన్ సుదర్శనరావు

(1932) న్యాయవాది, ధన్యజీవులు, అజ్ఞాతప్రేమ, టిప్పుసుల్తాన్ అను నవలలు అనేక కథకులు రచించిరి. సామెతలు, దామియాన్‌లో బుద్ధ విగ్రహాలు, చిత్తారిగుండు వర్ణచిత్ర విలాసం వంటి వ్యాసాలు చాలా విలువైనవి.

### 18. దామోదరం సంజీవయ్య

వీరు అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షులుగా, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగ పనిచేసిరి. పెద్దపాడు వీరి స్వగ్రామం.సాహితీపరుడు. ఎన్నో కృతులంకితం పొందారు. కీర్తనలు రచించారు. భీష్మజననం అనే హరికథ రాశారు. ఆంగ్లంలో అర్థశాస్త్ర వ్యాసాలనేకం వ్రాశారు.

### 19. అందలం కృష్ణమూర్తి

(1935) మధుగీతి తొలికావ్యం (ఉమర్‌ఖయ్యాం రుబాయిలు) ప్రధానోపాధ్యాయులు, కవిసమ్మేళనము, అవధానములన్న ప్రేమ. మహాదాత, శ్రీకృష్ణతాండవము, సోమనాద్రి, వేంకటేశ్వరశతకము, శ్రీఅయ్యప్ప స్వామి శతకం వీరి రచనలు.

### 20. కలుగోట్ల విజయాత్రేయ

(1935) గని గ్రామవాసి. కవిగా ప్రసిద్ధులు. 43 నవలలు రచించిరి. యం.వి. ఎస్. ప్రచురణ సంస్థ ముద్రించారు. ఒకనూరు నవలలు రచించియుండవచ్చు. ఆంధ్రభోజుడు, మైరావణ, రాణి సంయుక్త, భువనవిజయం నాటకాలు రచించాడు.యాగంటి, మద్దిలేటి క్షేత్ర మహాత్మ్యాలు రచించారు. రాణిప్రమీల, మహర్షిరావణ, ఊర్వశి, హిమశిఖరాలు,పాంచాలి, కర్ణుడు, కచదేవయాని, వైరాటి పచ్చి

ముత్యం, పద్యకావ్యాలు పేర్కొనదగినవి. మణికంకణం, రసధుని ఊహా విహంగాలు, లాస్యగౌరి, తాండవకృష్ణ, సామ్రాట్ సుయోధన, దాశీకన్య, చిత్రాంగి మొదలైన పద్యకావ్యాలు ప్రసిద్ధాలు. అనేక బిరుదులు లభించాయి. వై.యస్. ఆర్.కె.శర్మగారు కవిగారి రజతోత్సవం ఓర్వకల్లులో 1983లో వీరిపై డా॥జె.శ్యామసుందరశాస్త్రి - కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో డా॥పి.ఎల్ శ్రీనివాస ఆచార్యత్వంలో పరిశోధన చేశారు.

## 21. యామినీ సరస్వతి

(1941) ఆళ్ళగడ్డ తాలూకా జిల్లెళ్ళ స్వగ్రామం. కథకులు, నవలాకారులు, విమర్శకులు, సినీ రచయితలు. నంద్యాలలోని పింగళి సూరన సారస్వత సంఘం వ్యవస్థాపకులు. పత్రికా రచయిత. తాండ్ర పాపారాయుడు, విశ్వామిత్ర, ఎలమావితోట అనే చలనచిత్రాలకు మాటల రచయిత. 'మంజుల' సాహిత్య పత్రికకు సంపాదకులు. దాంపత్య నౌక, కీర్తిరథం, మాధవి, మారని సమాజంలో మారే మనుషులు, ఇదీ జీవితం ఇలాగే బ్రతకాలి, మౌనవిపంచి, శ్రావణసంగీతం, వెన్నెల జలపాతం వంటి నవలలురాశారు.

## 22. ఆర్. రంగస్వామి గౌడు

(1941) వీరు ఇంజనీర్, వేదనాతరంగం,గుండెలోని నాదాలు మలేషియా మధురస్మృతులు, మనోరాగం, కవితాసంకలనాలు రచించారు. భక్తిగీతాలు, తత్వగీతాలు క్యాసెట్లుగా విడుదలయ్యాయి. అనేకఅవార్డులు పొందారు.

## 23. జీ రెడ్డి బాలచెన్నారెడ్డి

(1925) ఆళ్ళగడ్డ తాలూకా కోటపాడు అవధానులు, తెలుగు పండితులు. కలము-ఖడ్గము అను అపరాధ పరిశోధక నవల రచించిరి. రామలింగేశ్వర శతకము, నారాయణస్వామి సుప్రభాతము, శ్రీమద్రామాయణ తత్త్వదర్శనము గొప్ప వ్యాఖ్యా గ్రంథము. బృందావనము అను నవల, కంబంసోదరులు అను పద్యకావ్యము రచించిరి.

## 24. చెరుకూరి కమలామణి

(1926-1991) ఉన్నతపాఠశాలప్రధానోపాధ్యాయురాలు.నవలా రచయిత్రి, కథారచయిత్రి, పారిజాతం, జీవితం, నవలలు, వైకుంఠ వాకిలి,సమ్మె కథానికలు ఆమెకు పేరు తెచ్చాయి.గేయరచయిత్రి కూడ.

## 25. రేవనూరి శమంతం

(1928) పాణ్యం నివాసిని. తొణకిన స్వప్నం - తొలగిన స్వర్గం, రత్నకంబళం వీరి నవల, బహుసేన్ సాగర్ పేరుతో కథాసంపుటం వెలువరించారు.

## 26. ఇసుకపల్లి సంజీవశర్మ

(1927) వృత్తి వ్యవసాయం. ప్రవృత్తి సాహిత్య వ్యవసాయం అహోబిల మహాత్మ్యం, సుందరకాండ వంటి 25 ఆధ్యాత్మిక గ్రంథాలు కావ్యాలువ్రాశారు.

## 27. లోకా లక్ష్మీనృసింహశాస్త్రి

గార్గేయంపురం వాస్తవ్యులు. శ్రీమద్రామాయణ బాలకాండం 1949 లో రచించారు. శ్రీ చెన్నకేశవ శతకం, శ్రీరామచంద్రశతకం, సప్తనదీ సంగమేశ్వరశతకం మొ॥ రచించారు.

## 28. గుర్రం వెంకటరెడ్డి

(1922) వెలుగోడు స్వాతంత్ర్య సమరయోధులు, వీరు పోచన రామిరెడ్డిగారు కలసి విప్లవయోగి విశ్వకవి వేమనవేదశాస్త్రం రచించారు. తెలుగు దేశ సమైక్యత - రాయలసీమ భవితవ్యం, వేర్పాటు ఉద్యమం అను గ్రంథాలు తెలుగులో National Seminar of Fifty years of Independence ఆంగ్ల గ్రంథం వ్రాశారు.

## 29. తాటిమాను నారాయణరెడ్డి

(1927-2011) హిందీ పండితులు. శేషప్రభ అనే గొప్ప చారిత్రక కావ్యం బేతంచెర్ల శేషారెడ్డి గారి జీవితచరిత్ర. 22 గ్రంథాలు రచించారు.

## 30. కిలారు చిన్నసుబ్బరాయుడు

(1942-1993) తెలుగు పండితులు, నటులు, సంగీతజ్ఞులు, (వచనామృత) లూకెస్ భంగపాటు (Rape of Lucace) దేశంకోసం - కచునిగాథ (పద్యం) విశ్వవిస్ఫోటనం (గేయం)

## 31. ఆదవాని ఈశ్వర

నంద్యాలవాసి, వీరు దాదాపు 20 నవలలు వ్రాసి పేరు గాంచారు.

**చిరునామా** : *జె.యస్.ఆర్.కె.శర్మ, రాష్ట్ర కార్యదర్శి, తెలుగు భాషా వికాస ఉద్యమం, ఆం.ప్ర.*
*87-1027, బాలాజీ కాలనీ, సి.క్యాంప్, కర్నూలు -2, చరవాణి : 9440443443, స్థిరవాణి : 08518-271626*

శ్రీ ఇమ్మడిశెట్టి రామకుమార్

# మన ప్రచురణరంగ ప్రగతి

ప్రముఖ అమెరికన్ తత్త్వవేత్త 'థూరో' తన వాల్డెన్ అనే ప్రపంచ ప్రసిద్ధ గ్రంథంలో ప్రపంచానికి పుస్తకాలు గుప్త ధనం. తరతరాల ప్రజలకు, దేశాలకు అవిసరియైన వారసత్వ సంపదలు అంటాడు. ఒక దేశసంపద, మేధోశక్తులను పరిగణించటానికి, అనేక రకాలైన ఉత్పత్తులను ప్రమాణాలుగా తీసుకున్నా, ఆ దేశంలో ప్రతి సంవత్సరం ప్రచురింపబడే పుస్తకాలు, వాటి గుణాత్మకత గూడా దృష్టిలోనికి తీసుకొనబడుతుంది.

స్వతంత్ర భారతదేశంలో పుస్తకాల ప్రచురణ, వాని వినియోగం ఇంకా అత్యున్నత స్థాయికి చేరుకోలేదనేది నిర్వివాదమౌన విషయం. అయినా ఈ 60 సంవత్సరాల కాలంలో మన ప్రచురణ రంగం ఎలాంటి పోకడలు పోయిందో పరిశీలిద్దాం, అయితే మొత్తం భారత దేశం ఈ రంగంలో సాధించిన ప్రగతిని తెలుసుకొనటం కొంత కష్టతరమైన విషయం కాబట్టి తెలుగు పుస్తకాల ప్రచురణ ఎలా ఉన్నదో ఈ వ్యాసంలో పరిశీలిద్దాం.

భారతదేశంలో పుస్తక ప్రచురణ, బెంగాల్ రాష్ట్రంలోని శ్రీరాం పురంలో క్రైస్తవ మిషనరీలు బైబిల్‌కు సంబంధించిన పుస్తకాలను అచ్చు వేయటంతో పందొమ్మిదవ శతాబ్దం మొదటి భాగంలో ప్రారంభం అయింది. అంతకుముందు పద్దెనిమిదవ శతాబ్దంలోనే కొన్ని పుస్తకాలు అచ్చైనా అవి మన దేశంలో ముద్రించబడినవి కాదు. ఏది ఏమైనా 20వ శతాబ్దం ప్రారంభం వరకు పెద్ద మన ప్రచురణ రంగం అంత వేగాన్ని పుంజుకోలేదు. మెకాలే ప్రతిపాదించిన విద్యా విధానం అమలు లోనికి రావటం, బ్రిటిష్ ప్రభుత్వం వారి పరిపాలనకు సంబంధించిన వివిధ శాఖలలో పనిచేసే ఉద్యోగులు అవసరం కావటంతో విద్యావ్యాప్తి జరిగింది. దానితో ప్రచురణ విరివిగా జరగటం మొదలై అంతకంతకు 20వ శతాబ్దపు ఆరంభ కాలం నాటికి కొంత పుంజుకున్నది. దేశం స్వతంత్ర్యం అయ్యేనాటికి అంటే 1947 నాటికి పుస్తక ప్రచురణ మూడు రంగాలలో జరుగుతున్నది. మొదటిది వ్యక్తుల ద్వారా వారో లేక మిత్రులు, బంధువులో రచించిన పుస్తకాలు, రెండవది కొన్ని ప్రభుత్వ సంస్థలో లేక ప్రభుత్వేతర సంస్థలో ప్రచురించేవి. మూడవది కేవలం పాఠ్య పుస్తకాలనే ప్రచురించే సంస్థలు కొన్ని. అందులో మొదటి వర్గం వారు తమకు ఆసక్తి గల విషయాలకై రచించిన గ్రంథాలు సొంతగానే ప్రచురించుకొని అమ్ముకొనవలసి వచ్చేది. అందుకు ప్రధాన కారణం రంగంలో ఎక్కువమంది ప్రచురణ కర్తలు లేకపోవటం, వారు కూడా వెయ్యి పుస్తకాలను ముద్రించినా, దశాబ్దాల కాలంపాటు వెయ్యి పుస్తకాలను అమ్ముకోటమే గగనం కావటంతో రిస్కు తీసుకొనటానికి సాహసించేవారు కాదు. ఇందుకు ఒక ఉదాహరణ చూద్దాం. 1901వ సంవత్సరంలో ఎఱ్ఱాప్రెగ్గడ హరి వంశం వావిళ్ళ వారిచేత ప్రచురించబడింది. ఆనాడు వారు కేవలం వెయ్యి ప్రతులే ముద్రించారు. అంటే ఈ వెయ్యి ప్రతులు అమ్మటానికి అర్ధ శతాబ్ది కాలం పట్టింది. కవి కవిత్రయంలోని మహాకవి, గ్రంథం భారతానికి ఖిలపర్వం హరివంశం. ఇక అలాంటి గ్రంథానికి ఆ గతి పట్టిందంటే మిగిలిన సాధారణ గ్రంథాలను గురించి చెప్పేదేముంది.

1947వ సంవత్సర కాలానికి పుస్తక ప్రచురణ రంగంలో వావిళ్ళ రామస్వామి శాస్త్రి అండ్ సన్స్ వారు, వెంకట్రామా అండ్ కో వారు, రామా అండ్ కో, ఏలూరువారు ప్రచురణ రంగంలో ముందుండే వారు. వావిళ్లవారు కేవలం మద్రాసులోనే ఉండిపోతే, వెంకట్రామా అండ్‌కో వారు ఇప్పటి ఆంధ్రప్రాంతంలో 16 పట్టణాలలోను, సికింద్రాబాదులోను బ్రాంచీలతో పుస్తక వ్యాపారంలో ముందుండే వారు. రామా అండ్ కో వారు కేవలం ఏలూరుకు మాత్రం పరిమితంగా ఉండేవారు. వావిళ్ళవారు సాహిత్య గ్రంథాలను ముఖ్యంగా తెలుగు సంస్కృత సాహిత్య గ్రంథాలను సకృత్తుగా స్కూలు పుస్తకాలు, కొద్ది పాటి ఆధునిక సాహిత్య గ్రంథాలను ప్రచురించేవారు. వారు దానిని ఒక యజ్ఞంగా నిర్వహించారు. వెంకట్రామా అండ్ కో వారు పాఠ్య పుస్తకాలను ప్రచురించటమే కాకుండా ఇతర ప్రచురణకర్తల పుస్తకాలను తెప్పించి తమ ప్రతినిధులను గ్రామ గ్రామాలకు పంపించి పుస్తకాల

పంపిణీ చర్యలు తీసుకొనేవారు. రామా అండ్ కో వారు ఇలాగే తమ వ్యాపార నిర్వహణ చేసినా, వారి పరిధి కొంత తక్కువగా ఉండేది. ఏదైనా పుస్తకం కావలసివస్తే నాడు కేవలం తపాల ద్వారానే తెప్పించుకొనవలసి వచ్చేది. షుమారైన పట్టణాలలో కూడా ఆ రోజుల్లో పుస్తకాల అంగళ్ళు ఉండేవి కావు. ఒకటీ అరా ఉన్నా, అవి ఋతువును బట్టి వ్యాపారం చేసేవి. పూర్తి పుస్తకాల అంగళ్ళు కావు.

ఇందుకు ప్రధాన కారణం ఆనాడు ప్రజలకు ఉన్న విద్యాభ్యాస అవకాశాలు తక్కువగా ఉండేవి. ఎక్కువమంది ప్రజలు గ్రామాలలోనే ఉండి నిరక్షరాస్యులుగానే మిగిలిపోయేవారు. అందువలన వారికి పుస్తకాల అవసరం అంతగా ఉండేది కాదు. ఒకవేళ ఉన్నా కొనగలిగిన ఆర్థికస్థోమత ఆనాటివారికి చాలామందికి లేదు. ఉన్నవారికి పుస్తకాల అవసరం లేదు. వెంకట్రామా అండ్ కో వారు ఆనాడు వేసిన కొత్తాంధ్ర వాచకం ఖరీదు పావలా. దానిని కొని తమ పిల్లలకు ఇవ్వలేక తరగతి గదిలో సగంమంది, దానిని చిన్నతెల్ల కాగితాల పుస్తకం మీద వ్రాసిర తమ పిల్లలకు ఇచ్చేవారంటే ఆనాటి స్థితిని ఊహించుకోవచ్చు. అయితే పట్టణాలలో పరిస్థితి మరీ ఇంత అధ్వాన్నంగా ఉండేది కాదు. గిరాకీ ఉంటేనే కదా ప్రచురణ ఉండేది. అందుకే ఈ రంగం దిగవాసిగా ఉంటుండేది.

అయితే స్వతంత్ర్యం వచ్చిన తరువాత క్రమంగా అన్ని రంగాలలో వలె విద్యారంగంలో కూడా అభివృద్ధి జరగటం వలన పుస్తకాల అవసరం పెరిగింది. దాంతో అనేక పుస్తక ప్రచురణ సంస్థలు పుట్టుకొని రంగం మీదకు వచ్చాయి.

ప్రచురణ అనగానే ముఖ్యంగా స్ఫురించేవి రెండు రకాల పుస్త కాలు, పాఠ్యపుస్తకాలు, సాహిత్య, నవల, నాటకాదులైన ఇతర పుస్తకాలు, ఆంధ్రప్రదేశ్ ఏర్పడే నాటికి పాఠశాలల సంఖ్య బాగా పెరిగింది. జిల్లాకొక డిగ్రీ కళాశాల స్థాపించబడింది. అందువలన పాఠ్యపుస్తక ప్రచురణ విస్తృతంగా విస్తరించింది. ఇది కాక పంచవర్ష ప్రణాళికలలో భాగంగా ప్రతి జిల్లాను కొన్ని కొన్ని బ్లాకులుగా విడదీసి అభివృద్ధి కార్యక్రమాలను రంగంలోకి తీసుకొని వచ్చారు. అందులో భాగంగా ప్రతి బ్లాకులోను కొన్ని గ్రామాలలో గ్రంథాలయాల ఏర్పాటు జరిగింది. దీని వలన ప్రభుత్వమే పుస్తకాలను కొని, ఆయా గ్రంథాల యాలకు సరఫరా చేసేది. గ్రామాలలో ఉండే విద్యావంతులు చదవ టానికి వీలుగా ఉండే పుస్తకాలు కొనటం కేంద్రీకృతం అయినందు చేత రకరకాల నవలలు, నాటకాలు, కథలు, పాటలు, చరిత్రలు, వచన భారత భాగవత రామాయణాలు, వచనంలో కావ్యాలు, చేతి వృత్తులు మొదలైన విషయాలపై రచనల అవసరం హెచ్చింది. ఒక్కసారిగా తెలుగునాట పుస్తక ప్రచురణ రంగం ఇంతింతై వటుడింతై అన్నట్లు జరిగింది. అయితే అదే సమయంలో ప్రభుత్వం పాఠ్యపుస్తక ప్రచురణను జాతీయం చేసింది. మొత్తం పాఠశాల స్థాయి, ఇంటర్మీ డియట్ స్థాయివరకు, పుస్తకాలన్నింటినీ ప్రభుత్వమే పాఠ్య ప్రణాళికకు అనుగుణంగా పాఠ్యపుస్తకాలను వ్రాయించి, ప్రచురించి, పంపిణీలను చేపట్టింది. అయితే ఈ పుస్తకాల పంపిణీలో ప్రభుత్వ విధానం కొంత కఠిన నియమాలతో ఉంటుంది కాబట్టి, కొన్ని అవాంఛనీయ సంఘ టనలు కూడా చోటు చేసుకున్నాయి. ఏదేమైనా అప్పటివరకు పాఠ్య పుస్తక ప్రచురణ కర్తలు, కేవలం పాఠ్య పుస్తక పంపిణీదారులైనారు. పాఠ్యపుస్తక ప్రచురణలో స్తబ్దత చోటు చేసుకొని, క్రమంగా ఈ ప్రచురణ కర్తలు గైడ్లు, ప్రశ్నల నిధులు, (క్వశ్చన్ బ్యాంకులు) ప్రచురించు కొనవలసి వచ్చింది. ఇదొక నడమంత్రపు విధానమై అనేక వెర్రి పిలకలు వేయటానికి దారి తీసింది.

అయితే అనేక సాహిత్య సంస్థలు, సాహితీకారులైన వ్యక్తులు పాఠ్యేతర పుస్తకాలను స్వయంగా ప్రచురించటం ప్రారంభమైన కాలం ఇదే. అయితే వారు ఆశించినంత ఊహించినంతగా పుస్తకాలు అమ్మకాలు జరిగేవి కావు కాబట్టి, దాదాపు అందరూ నష్టాలనే చవి చూడవలసి వచ్చేది. ఇలా ఈ అరవై సంవత్సరాలలో ఎన్నో ఉత్తమమైన గ్రంథాలు వెలువడ్డాయి. గ్రంథాలలో ఎంతవాసి ఉన్నా ముద్రణకు సహాయం చేసేవారు లేనందువలన ముద్రించినా పంపిణీ విధానం మెరుగుగా లేనందువలన రచయితలు, గ్రంథకర్తలైన వారంతా చేతి చమురు భాగవతాలు ఆడవలసి వచ్చింది. అయినా ఇలాంటి సందర్భంలో ఆయా సాహితీ సంస్థలు, రచయితలు, కవుల కృషిని స్మరించకుండా ఉండలేము.

1812వ సంవత్సరం నుండి 1900 సంవత్సరం వరకు తెలుగులో కేవలం రెండువేల పుస్తకాలు మాత్రం ప్రచురించబడినట్లు కాశీనాథుని నాగేశ్వరరావుగారు సంకలించిన ఆంధ్రవాఙ్మయ సూచిక ద్వారా తెలుస్తున్నది.

1911లో పిఠాపురంలో స్థాపించబడిన ఆంధ్ర సాహిత్య పరిషత్తు స్వతంత్ర్యం వచ్చిన తరువాత కూడా తన పుస్తక ప్రచురణను కొన సాగించింది. అయితే వారు తలపెట్టిన సూర్యరాయాంధ్ర నిఘంటువు చివరి ఎనిమిదవ సంపుటం 1963లో గానీ పూర్తిగా ప్రచురించటం పూర్తి కాలేదు. 1905లో ప్రారంభం అయిన విజ్ఞాన చంద్రికా గ్రంథమాల వారు 1916లో ప్రారంభించిన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం లక్ష్మణరావుగారు 1921లో చనిపోయే నాటికి కేవలం రెండు సంపు టాలే వెలువడింది. 1921లో కాశీనాథుని నాగేశ్వరరావుగారు దానిని సంస్కరించి ప్రచురించటానికి చేసిన ప్రయత్నం అంతగా సఫలంగాక ఇంకొక్క సంపుటం అధికంగా వచ్చి అంతటితో ఆగి పోయింది. అది

నాటికి నేటికీ అలా అసంపూర్తిగా నిలిచి తెలుగువారికి సంపూర్ణ విజ్ఞాన సర్వస్వం లేదనే లోటుకు ఉదాహరణగా ఉన్నది. భారతదేశం స్వతంత్రం కావటానికి కొద్ది రోజుల ముందు 1945 ప్రాంతంలో రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ప్రభుత్వమే సైనికులకు ఉబుసు పోక కోసం పుస్తకాలను విరివిగా కొనేది. అందువలన ఆ కాలంలో జంపన, కొవ్వలి మొదలైన రచయితల నవలలు విస్తృతంగా ప్రచురిం చబడి వ్యాప్తిలోనికి వచ్చాయి. అప్పటి వరకు నవలలు చదవటమే తప్పుగా భావించే దశ దాటి నవలలను సాహిత్యంలో 'నవలా సాహిత్యం' అనే భాగంగా గుర్తించబడింది.

స్వతంత్ర్యం వచ్చిన తరువాత 1947లో ప్రాంతీయ భాషలలో వివిధ విజ్ఞాన విషయాలకు సంబంధించిన పుస్తకాలను ప్రజలకు అందుబాటులోనికి తేవాలని, అలాంటి విషయాలపై రచనలు చేసే రచయితలను ప్రోత్సహించాలనే సద్భావంతో ప్రభుత్వం తెలుగు భాషా సమితిని మద్రాసులో ఏర్పాటు చేసింది. 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పుడు ఆ సంస్థ హైదరాబాద్‌కు బదిలీచేయబడింది. అది 1970వ దశకం నాటికి దాదాపు పది సంపుటాల తెలుగు విజ్ఞాన సర్వస్వాన్ని ప్రచురించింది. ఆ సంపుటాలను పరిష్కరించి తిరిగి ప్రక టించే లోపల యన్.టి.రామారావుగారు తెలుగు భాషా సమితి, సాహిత్య అకాడమీ లలిత కళా అకాడమీ, వంటి క్వాసీ ప్రభుత్వ సంస్థల నన్నింటిని రద్దు చేసి తెలుగు విశ్వవిద్యాలయం అనే బ్రహ్మ పదార్థంలో విలీనం చేశారు. వారు కొన్నింటిని ముద్రించి, కొంత తిప్పలు పడుతున్నారు. అయితే వ్యక్తి నిష్ఠంగా ఆంధ్ర రచయితల సహకార సంఘం ఏర్పరచి దాని తరఫున సంగ్రహాంధ్ర విజ్ఞానకోశమనే ఏడు సంపుటాల విజ్ఞాన సర్వస్వాన్ని మూడు సంపుటాల ప్రాచీనాంధ్ర భూగోళమనే గ్రంథాలను ప్రచురించడం ముదావహమైన చర్య. దీనికి సూత్రధారి పాత్రధారి విఖ్యాత పండితులు శ్రీశ్రీ, ఖండవల్లి లక్ష్మీ రంజనంగారు. ఇలాంటి ప్రయత్నాలుగానే మాగంటి బాపినీడుగారి 'ఆంధ్రదర్శిని' అనే మూడు సంపుటాల విజ్ఞాన సర్వస్వం మొదలైనవి వచ్చాయి. 1956లో ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ ఉనికిలోకి వచ్చిన తరువాత ఆ సంస్థ ప్రచురించిన పుస్తకాలు ఆణిముత్యాలు. దాదాపు రెండు వందలకు పైగా వ్యక్తుల స్థాయిలో చేయలేని కృషి ఆ సంస్థ చేసింది. అయితే ప్రభుత్వ సంస్థ కాబట్టి దానికి కొన్ని నిర్నిరోధాలు, అడ్డంకులు తప్పనివి. మొదటిసారిగా తెలుగునాట రచయితలు తమ పుస్తకాలను ప్రచురించుకోవటానికి ఆర్థిక సహాయం చేయటం సాహిత్య అకాడమీయే మొదలుపెట్టింది. తరువాత తిరుమల తిరుపతి దేవ స్థానం వారు కూడా ఈ రకమైన సహాయం భక్తి ధార్మిక గ్రంత రచయితలకు పుస్తక ప్రచురణ కోసం సహాయం ప్రారంభించి నేటికీ కొనసాగిస్తున్నది. స్వతంత్ర్యం రాకముందు మొదలుపెట్టి వచ్చిన తరువాత కూడా పుస్తక ప్రచురణను కొనసాగించిన కొన్ని ప్రైవేటు సంస్థలలో విజయవాడ ఆదర్శ గ్రంథమండలి, ఆంధ్ర సారస్వత పరిషత్తు హైదరాబాద్, విజయవాడ దేశికవితా మండలి, త్రివేణి పబ్లిషర్స్ మొదలైనవి ఉన్నాయి. అలాగే రాజమండ్రి అద్దేపలి అండ్ కంపెనీ, కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు, నిడమర్రు ప్రగతి ప్రచురణాలయం, కపిలేశ్వరపురం, చాగంటి వెంకటశేషయ్యగారి ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల, గోరాగారి నాస్తిక కేంద్రం, విజయవాడ ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్, విశ్వనాథ సత్యనారాయణగారి వి.యస్.ఎన్. అండ్ కంపెనీ, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్‌లోని దాచే పల్లి కృష్ణయ్య అండ్ సన్సు, రామా అండ్ కంపెనీ, ఎమెస్కో అనే యం. శేషాచలం అండ్ కంపెనీల వంటివి పుస్తక ప్రచురణలో ఈనాటికీ తమ కృషిని కొనసాగిస్తున్నాయి.

1980 దశకం వరకు రాష్ట్రంలోని మూడు ప్రధాన విశ్వ విద్యా లయాలైన ఆంధ్ర, శ్రీ వేంకటేశ్వర, ఉస్మానియా విశ్వ విద్యాలయాలు ఉన్నత స్థాయికి చెందిన పుస్తకాలను ప్రచురించగా, 1990ల నుంచి నిధుల కొరత వలన ప్రచురణ కృషి కొంత సన్నగిల్లింది. తిరుమల తిరుపతి దేవస్థానం, శ్రీశైల దేవస్థానం వంటి ధార్మిక కేంద్రాలు, ఆధ్యాత్మిక, భక్తి శాఖలకు చెందిన ఉన్నత తరగతికి చెందిన పుస్తకాలను ప్రచురిస్తున్నాయి.

వీటి అన్నింటిని అలా ఉంచి ప్రత్యేకంగా గోరఖ్‌పూర్ గీతా ప్రచా రక్ సంఘ్ వారి కృషిని తప్పకుండా స్మరించవలసిన సందర్భం ఇది. వారు తెలుగుతో పాటు అనేక భారతీయ భాషలు, సంస్కృతం, ఇంగ్లీషులలో కూడా అతి తక్కువ ధరకు దాదాపు వందల కొలది పుస్తకాలను ప్రచురించి ధార్మిక సాహిత్యాన్ని సామాన్య ప్రజలకు అందు బాటులోనికి తేవటం ఎంతో ముదావహం.

ఇక ప్రపంచీకరణ మొదలైన 1992-93 నుంచి పుస్తక ప్రచురణ రంగం మూడు పూవులు ఆరు కాయలుగా వర్ధిల్లుతున్నది. ఒక రకంగా పాఠ్యపుస్తక శ్రేణికి చెందిన శాస్త్రసాంకేతిక పుస్తకాలతో పాటు ఆధ్యాత్మిక పుస్తకాల ప్రచురణ కూడాజోరు అందుకున్నది. మధ్య తరగతి పాఠకులు ఎక్కువ కావటం, విద్యపై మోజు అధికం కావటం, ప్రజలలో అధికులు సంపన్న వర్గాలలోకి ఎగబ్రాకటం, రాష్ట్రంలో అనేక ఇంజనీరింగు, వైద్య, ఇతర సాంకేతిక వృత్తి విద్యా కళాశాలలు, సంస్థలు పెరగటంతో ఆయా విషయాలకు అవసరమయ్యే పుస్తకాల ప్రచురణ ఎక్కువ అయింది. పైగా ముద్రణా రంగంలో వచ్చిన అభివృద్ధి, ఆధునిక సాంకేతిక విధానాలు ఇందుకు తోడ్పడుతున్నాయి. ఎన్ని వేల పేజీల పుస్తకమైనా, ఒకటి రెండు రోజులలోనే తయారై విద్యార్థుల, పాఠకుల

చేతిలోనికి రావటానికి అవకాశం కలుగుతున్నది. స్వయంచాలక సాంకేతికత (ఆటోమేషన్ టెక్నాలజీ) అభివృద్ధి చెందటం కూడా ఇందుకు ప్రధాన కారణం. ఇది పంపిణీ రంగాలలో అభివృద్ధి సాధించ టానికి వీలైంది. అంతేగాక నేడు లభ్యము అవుతున్న రవాణా సదు పాయాల వలన తక్కువ ఖర్చుతో ఎంత దూర ప్రదేశానికైనా పుస్తకాలను చేర్చటానికి వీలు కలుగుతున్నది. కనుకనే నేడు మారుమూల గ్రామా లలో కూడా పుస్తక విక్రయశాలలు వెలయుచున్నవి.

**అపశ్రుతి :**

అన్ని రంగాలలోను, అవినీతి, అపసవ్య ధోరణులు పెచ్చు పెరిగి నట్లుగా ప్రచురణ రంగంలోను అవాంఛనీయ వ్యవహారాలు చోటు చేసుకుంటున్నాయి. ఆధునిక కాలంలో విద్యావ్యాప్తి విశేషంగా జరుగు తున్నది. విద్యావకాశాలు బాగాపెరిగాయి. అలాగే ఉద్యోగావకాశాలు కూడా. అందువలన శాస్త్ర సాంకేతిక రంగాలకు చెందిన పుస్తకాల ప్రచురణ విరివిగా విస్తరణ చెందుతున్నది. అవిస్తృతావకాశాలను అందుకొని అడ్డుదారిలో డబ్బు సంపాదించ టానికి ఈ రంగాల్లోనూ మార్గాల అన్వేషణ సాగింది. అందువలన ఈ రంగాన్ని పట్టి పీడిస్తున్న విషరోగం పైరసీ. కనీసం ఐదారువేల పుస్తకాలు నమ్మకంగా అమ్ముడు అయ్యే అవకాశం ఉన్నదని అనిపిస్తే వెంటనే పైరసీ పుస్తకాలు రంగంలో ప్రవేశిస్తున్నాయి. పాఠ్యపుస్తకాలు, కంప్యూటరు సంబంధం విషయ పుస్తకాలు, ఇతర సాంకేతిక శాస్త్ర పుస్తకాలు ఈ భూతం పాలిట పడుతున్నాయి. అయితే ఇందులో గమనించవలసిన విషయం ఒకటి ఉన్నది. కేవలం పేదలో, ఒక మోస్తరు ఆర్థిక స్థోమత గలవారో ఇలాంటి పాడుపనులకు పాల్పడ్డారంటే అర్థం ఉన్నది. కానీ, వందల కోట్లు సంపాదించినవారు కూడా ఇలా అడ్డదార్లు తొక్కటం, ఏ విధంగా సమర్థనీయం అవుతుందో వారే ఆలోచించుకోవాలి.

రాష్ట్ర విభజనానంతరం రెండు తెలుగు రాష్ట్రప్రభుత్వాలు గ్రంథాల యాలను విస్మరించారు. గత రెండు సంవత్సరాల నుంచి ఒక్క పుస్తకమైనా గ్రంథాలయ పరిషత్‌వారు కొనుగోలు చేయలేదు. ఇది శోచనీయం. దీనికి నిధులు లేమి కూడా కొంత కారణం కావచ్చు. గ్రంథాలయాలలో చాలా చోట్ల నిధులు ఉన్నా, కొన్ని గ్రంథాలయాలకు కొన్ని జిల్లాలలో సిబ్బంది లేకపోవటం, చైర్మన్‌లు లేకపోవడం వలన కొనుగోళ్ళు జరుగుట లేదు. సర్వశిక్షా అభియాన్ వారు కూడా ఇటీవల కొన్ని పుస్తకాలను కొనుగోలు చేశారు. గత రెండు సంవత్సరాల నుంచి వారి నుంచి ఏ విధమైన ప్రోత్సాహము ప్రచురణకర్తలకు లేదు. రాజా రామమోహనరాయ్ ఫౌండేషన్ కలకత్తావారి పథకము (ఆర్.ఆర్. ఎల్.ఎఫ్) క్రింద ప్రతి సంవత్సరము కొనుగోలు చేసే పుస్తకాలను కూడా రెండు సంవత్సరాల నుంచి కొనుగోలు చేయుట లేదు. రాష్ట్ర ప్రభుత్వములు తమ వంతు పంపవలసిన మాచింగ్ గ్రాంటు పంపక పోవుట వలన పుస్తకాలు కొనుగోలు జరుగుట లేదు.

పాఠ్యపుస్తకాలు ప్రస్తుత ప్రభుత్వాలు ప్రయివేటు వారికి అప్ప గించినారు. ఒకటో తరగతి నుంచి పదో తరగతి వరకు మరియు ఇంటర్మీడియట్ పుస్తకాలను ప్రింటింగ్ మరియు పంపిణీ హక్కులను ప్రయివేటుపరం చేశారు. ఈ వ్యవస్థ కూడా పూర్తిగా పారదర్శకంగా లేకపోవుట వలన కొందరు ప్రయివేటు వ్యక్తులకు లాభం చేకూరేటట్లు ఉన్నది. దీనిని పూర్తిగా ప్రక్షాళన చేసి ప్రభుత్వం తరఫున ముద్రించి సామాన్య ప్రజలకు మరియు విద్యార్థులకు ఉపయుక్తంగా ఉండేలాగ చేయవలసి ఉన్నది. డిగ్రీ పుస్తకాల పరిస్థితి కూడా ఇందుకు భిన్నంగా లేదు. సెమిస్టర్ విధానం వలన గందరగోళ పరిస్థితి నెలకొని ఉన్నది. భాష పుస్తకాలను పాఠ్యగ్రంథాలుగా కొందరి పబ్లిషర్స్‌నే అనుమతిస్తూ కోట్లాదిరూపాయలు చేతులు మారుతున్నాయి. ఉదాహరణకు తిక్కన, నన్నయ పాఠాలకు కాపీరైట్స్ ఎవరికీ ఉండవు. వాటిని కొందరి పబ్లిషర్స్‌కు పబ్లిషింగ్ రైట్స్ ఇవ్వడం ఏమి సబబు? దానిని పూర్తిగా పారదర్శకంగా పాఠ్యపుస్తకాలను ఎన్నిక చేయవలెను.

పాఠశాల పుస్తకముల ప్రచురణలో గుంటూరు నుంచి షిర్డీ బుక్ డిపో, విజయవాడ రవి పబ్లిషర్స్, విక్రమ్ పబ్లిషర్స్, విక్రాంత్ పబ్లిషర్స్ వారు విశేషంగా పుస్తకాలను ప్రచురిస్తున్నారు. వి.జి.ఎస్ పబ్లిషర్స్, రాఘవేంద్ర పబ్లిషర్స్ విజయవాడ కేంద్రంగా వేలాది పుస్తకాలు ప్రచురిస్తూ అగ్రగాములుగా కొనసాగుచున్నారు.

ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు ఛారిటబుల్ ట్రస్టు, విజయవాడ మరియు బొమ్మిడాల ట్రస్టు, గుంటూరు వార్ల కృషి ప్రశంసనీయం. పై సంస్థలవారు అనేక ప్రాచీన గ్రంథాలను తెలుగులోకి సరళభాషలో అందించుచున్నారు.

విజయవాడ కేంద్రంగా విక్టరీ పబ్లిషర్స్, జె.పి. పబ్లిషర్స్, ఎమెస్కో, నవరత్న, నవసాహితీ, పల్లవి, విశాలాంధ్ర, ప్రజాశక్తి, వసుంధర, రోహిణి, భరణి, క్వాలిటి, దీప్తి పబ్లికేషన్స్‌వారు విశేషంగా పుస్తకాలను ప్రచురిస్తూ అనేకమైన ఆధ్యాత్మిక, సామాజిక, వైజ్ఞానిక, విద్యావిషయ పుస్తకాలను ప్రచురిస్తూ అగ్రగాములుగా కొనసాగుచున్నారు. రాజ మండ్రి కేంద్రంగా గొల్లపూడి వీరాస్వామి, మోహన్ పబ్లికేషన్స్‌వారు విశేషంగా పుస్తకాలను ప్రచురిస్తున్నారు.

విక్టరీ పబ్లిషర్స్‌వారు ప్రత్యేకంగా అక్కేశ్వరరావు ఛారిటబుల్ ట్రస్టు ప్రేరణతో అష్టాదశ పురాణాలను(18) పూర్తిగా వ్యావహారిక భాషలో ప్రచురించిన ఏకైక పబ్లిషర్స్. వారి కృషి అభినందనీయం. వేదాలు,

ఉపనిషత్తులు, ఆయుర్వేద గ్రంథాలు, జ్యోతిష గ్రంథాలు, బాల సాహిత్యం, నిఘంటువులు అనేక పుస్తకాలు వారిచే ప్రచురించబడినవి. నిఘంటువుల విషయంలో సి.పి. బ్రౌన్, విలియం బ్రౌన్, శంకర నారాయణ, బలిజేపల్లి శబ్దరత్నాకరం, సంస్కృతాంధ్ర నిఘంటువులు పూర్తిగా సంస్కరించి మరియు పరిష్కరించి ప్రచురించిరి.

ఎవరు ఎన్ని ప్రయత్నాలు చేసినా ప్రభుత్వం సహకారం లేనిదే పుస్తక పరిశ్రమ మనుగడ కష్టం. నవ్యాంధ్రప్రదేశ్‌లో నిధుల సమస్యలను అధిగమిస్తూ, ఈ ప్రచురణ రంగానికి ప్రచురణకర్తలకు అడుగడుగునా సహాయ సహకారాలందిస్తే తప్ప పుస్తకాలను ప్రచురించలేరు. ఆ వంతు సహాయాన్ని ప్రభుత్వం నుంచి ఆశిద్దాం.

### విజయవాడ బుక్ ఫెస్టివల్ సొసైటీ :

దేశంలోనే కలకత్తా బుక్ ఫెస్టివల్ తరువాత జరుగు అతి పెద్ద పుస్తక ప్రదర్శనను విజయవాడ బుక్ ఫెస్టివల్ సొసైటీవారు గత 27 సంవత్సరాల నుంచి నిర్విఘ్నంగా కొనసాగించటం తెలుగువారందరికీ గర్వకారణం. నేషనల్ బుక్ ట్రస్టువారు కూడా తమవంతు సహకారాన్ని అందించినారు. విజయవాడలో శ్రీ టి.వెంకటేశ్వరరావుగారు మేయర్‌గా ఉన్న సమయమున బుక్ ఫెస్టివల్ సొసైటీవారికి విజయవాడ మున్సిపల్ కార్పొరేషన్ మరియు బుక్ ఫెస్టివల్ సొసైటీ సంయుక్త నిర్వహణలో లైబ్రరీ పెట్టుటకు స్థలమును ఇవ్వడం జరిగినది. అది మొదలు వదాన్యులు శ్రీ చంద్రశేఖరరావువారు భూరి విరాళముతో బిల్డింగ్ కట్టటం ప్రారంభించినారు. తరువాత అనేకమంది దాతల సహాయంతో బిల్డింగ్ నిర్మించి అప్పటి గవర్నరు శ్రీ రంగరాజన్‌గారిచే ప్రారంభించబడినది. మాజీ ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావుగారు కూడా లైబ్రరీని సందర్శించి ప్రశంసించినారు. ఇన్ఫోసిస్ ఫౌండేషన్ చైర్మన్ శ్రీ సుధామూర్తిగారు కూడా దర్శించి పది లక్షల రూపాయలను పుస్తకాల కొనుగోలు నిమిత్తం మంజూరు చేసినారు. ఎందరో దాతల సహాయంతో నిర్విఘ్నంగా లైబ్రరీ నడుపబడుచున్నది. ఈ సొసైటీకి పూర్వాధ్యక్షులు శ్రీ ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు, నవోదయ శ్రీ రామమోహనరావు, శ్రీ రావికింది రామస్వామి, శ్రీ డి. అశోక్‌కుమార్, శ్రీ బి. బాబ్జీ మొదలైన అందరి సహకారం వలన అభివృద్ధి చెందినది. సొసైటీ సభ్యులు పూర్తి సహాయ సహకారాలతో ఈ సంస్థ అభివృద్ధి చెందినది. ప్రభుత్వం నుంచి ఏ విధమైన గ్రాంటులు లేకుండా పూర్తిగా వారు అభివృద్ధి చేసుకున్న ఫండు మీద వచ్చే వడ్డీతో లైబ్రరీని నడుపడం విశేషం.

### తెలుగు ప్రాచీన భాష :

ప్రాచీన భాష హోదా కోసం 2006లో ఏర్పాటైన నిపుణులతో కూడిన ప్రత్యేక కమిటీ ఏర్పరచిన నియమాలకనుగుణంగా ఆయా భాషలు తెలుగు, కన్నడం, మళయాళం, ఒడియాలకు కేంద్రప్రభుత్వం ప్రాచీన హోదా ఇచ్చినది. ఇంతకు ముందు కేవలం తమిళం, సంస్కృతమునకు మాత్రమే ప్రాచీన హోదా కలదు. తెలుగు భాషకు ప్రాచీన హోదాకు అర్హత లేదని కొందరు మద్రాసు హైకోర్టును ఆశ్రయించగా ఈనాటికి దాన్ని కొట్టివేస్తూ హైకోర్టు తీర్పు ఇచ్చినది.

### ప్రాచీన భాషకు హోదా లభించటం వలన కలిగే ప్రయోజనాలు :

ప్రాచీన హోదా పొందిన భాష అభివృద్ధి కోసం కేంద్రం ఐదేళ్ళ కోసారి వంద కోట్లను కేటాయిస్తుంది. అంటే సంవత్సరానికి ఇరవై కోట్లు. ఈ డబ్బుతో ఆ భాషకు సంబంధించి అంతర్జాతీయ జాతీయ సదస్సులను నిర్వహించుకొనవచ్చును. జాతీయ పురస్కారాల ప్రదానంతో పాటు అనేక ప్రాచీనగ్రంథాలను ప్రాచీన సాహిత్యమును ఇతర భాషలలోని ఉత్తమగ్రంథాలను తెలుగులోకి అనువదించి ముద్రించి ప్రచారం చేసుకొనవచ్చును. ప్రాచీన హోదా రాగానే ఆ భాషకు సంబంధించి ప్రత్యేక కేంద్రం ఏర్పాటు అవుతుంది. ఆ కేంద్రం కేంద్ర ప్రభుత్వం ఆధీనంలో ఉంటుంది.

ఇన్నాళ్ళకైనా మన తెలుగు భాషకు ప్రాచీన హోదా రావటం తెలుగువారందరికీ గర్వకారణం. దీనివలన తెలుగు పబ్లిషర్స్‌కు కూడా అనేక పురాతన గ్రంథాలను తెలుగులోకి వెలుగులోకి తెచ్చే అవకాశం లభిస్తుంది.

**చిరునామా :** ఇమ్మడిశెట్టి రామకుమార్, *డోర్. నెం. 29-2-34,* రామమందిరం వీధి, ఏలూర్ రోడ్, విజయవాడ- *520 002.*
*ఫోన్ : 0866 - 2444156*

శ్రీ షేక్ కరీముల్లా

# మతతత్వ ఉగ్రవాదంపై నిరసన గళం - ప్రగతిశీల ముస్లిం కవిత్వం

సహజీవన సౌందర్యానికి ప్రతిరూపం భారతదేశం. భిన్నజాతులు, మతాలు, భాషలు, సంస్కృతుల వారధిగా ప్రపంచ వినువీధులలో భారత పతాకం రెపరెపలాడుతోంది. తెలుగు సాహిత్యంలో తొలి ముస్లిం దీర్ఘకవితగా, ఇస్లాంవాద దీర్ఘకవితగా వచ్చిన "సాయిబు" (షేక్ కరీముల్లా)తో మొదలైన ఇస్లాంవాదం సామాజిక చైతన్యంతో కూడిన సాహిత్యం మాత్రమే కాక మతసామరస్యానికీ, మానవీయ విలువలకు పట్టం కట్టింది. ఇస్లాంవాదం హింసను, ఉగ్రవాదాన్ని నిరసిస్తుంది. "అన్యాయంగా ఏ వ్యక్తి ఏ వ్యక్తిని హత్య చేసినా అతను సమస్త మానవజాతిని హత్య చేసినట్లేనని "ప్రబోధించిన పవిత్ర ఖురాన్ మానవతావాదమే దీనికి స్ఫూర్తి. అన్నదమ్ముల్లా కలసిమెలసి జీవిస్తున్న భారత ప్రజల మధ్య ఉన్మాదగోడలు కట్టాలని చూస్తున్న చీకటి శక్తుల ముందు మేం హిందువులమైనా, ముస్లింలమైనా ఈ మట్టి పుత్రులమే అంటూ ఇస్లాంవాద కవిత్వం నినదించింది. ఉగ్రవాదం ఎన్ని బాంబులు పేల్చినా ఈ గడ్డపై బీటలు వారని మా ఆత్మీయ పునాదులున్నాయని చాటిచెప్పింది. నిజానికి ఉగ్రవాదానికి మతం లేదు. గాంధీని చంపిన గాడ్సే, గ్రాహంస్టెయిన్స్‌ను సజీవదహనం చేసిన దారాసింగ్‌ల చర్యలను మొత్తం హిందూ సమాజానికి ఆపాదించటం ఎంత అవివేకమో కసబ్ లాంటి దుర్మార్గులు ISI, ISIS ఉన్మాదసంస్థలు చేసే నేరాలకు మొత్తం ముస్లిం సమాజానికి ఆపాదించటం అంతే తప్పు. ఉగ్రవాదమనగానే టోపీలు, గడ్డాలు, వర్ణాలు అనే తప్పుడు ప్రచారాలు ముస్లింల జీవన చిత్రాన్ని హననం చేస్తున్నాయి. ఒక సామాజికవర్గాన్ని లక్ష్యంగా చేసుకుని వేధించటం వల్ల ఆ సమాజం వ్యవస్థ మీద నమ్మకం కోల్పోయే ప్రమాదముంది. విద్వేషాలను పెంచటమే లక్ష్యంగా సాగే ఉగ్రవాదం కోరుకునేదీ ఇదే. కనుక నిష్పాక్షికమైన విచారణ, హేతుబద్ధమైన పరిశీలన అవసరం. ఇస్లాంను త్రికరణశుద్ధిగా విశ్వసించిన ఏ ముస్లిం ఉగ్రవాది కాలేడు. ఈ సత్యాన్ని చాటిచెప్పేందుకే కవాతు (షేక్ కరీముల్లా సంపాదకత్వం) కవితా సంకలనం వచ్చింది. పిడికెడు మట్టి, పిడికెడు నిప్పు, దోసెడు కన్నీళ్ళు కలగలిసి ఉగ్రవాదంపై ముస్లిం కవుల నిరసన గళమిది.

> "ఉద్యమానికొక వెన్నెముక కదా ఉండాలి
> నెత్తుటి సమాధులపై కాదు
> మానవీయ పునాదులపై కదా ! నిలబడాలి
> ఎగిరిపడుతున్న
> ఈ కాళ్ళూ చేతులెవరివి ?
> తుదిశ్వాస విడుస్తున్న
> ఈ ఊపిరి తిత్తులెవరివి ?"

అంటూ వేంపల్లె అబ్దుల్ ఖాదర్ కవి తన ఆవేదనను వ్యక్తికరించటం జరిగింది. మతం మనిషికి గుప్పెడు గులాబీల్ని, షీర్‌ఖుర్మాని పంచాలే గాని బాంబుల్ని, భయోత్పాతాన్ని కాదు. ముస్లింలను హింసావాదులుగా చిత్రీకరిస్తూ, దేశద్రోహులుగా ముద్రవేస్తూ వైషమ్యాలను రెచ్చగొడుతున్న ఫాసిజంపై పోరాట రూపం ఉగ్రవాదం కానేకాదు.

ఉగ్రవాదం ఒక మానసిక వైకల్యం. అనేకానేక అవలక్షణాల హింసా రూపం. ఉన్మాదిలా మారిన మనిషికి విచక్షణ ఉండదు. ఉగ్రవాదాన్ని మతాల పేర్లతో విశ్లేషించకుండా ISI ఐనా, ISIS ఐనా, CIA ఐనా మొస్సాద్ ఐనా, పరివార్ ఐనా మరెవరైనా సరే హింసను ప్రేరేపించేవారెవరైనా భారతీయులమంతా సమైక్యంగా ఎదుర్కోవాలి.

నిజానికి యూరప్ సామ్రాజ్యవాదం ఆసియా దేశాలలోని చమురు సంపదను కొల్లగొట్టడానికీ, తమ ఆర్థిక, రాజకీయ, భౌగోళిక దురాక్రమణల కొరకు సృష్టించిన భూతమే ఉగ్రవాదం. ఇదే ఉగ్ర వాదాన్ని సృష్టించి తనే దానిపై యుద్ధం చేస్తున్నట్టు నటిస్తూ మనల్నందర్నీ "ఇస్లామోఫోబియా" "ముస్లిం ఫోబియా" లోకి నెట్టివేస్తుంది. మానవులంతా పరస్పరం సహోదరులేనని పవిత్ర ఖురాన్ ప్రవచించింది. ఇస్లాం అడుగుపెట్టిన ప్రతిచోట ప్రేమను, శాంతిని, సోదర

భావాన్ని పంచిపెట్టింది. నిమ్నోన్నత భావాలకు పాతర వేసింది. అందుకే కవి సయ్యద్ సాబిర్ హుసేన్ ఇలా అంటాడు

**"ఇస్లాంమార్గాన్ని మరిచి - ఉగ్రవాదం వైపుకు**
**అల్లా ఖాయిదా మరచి - ఆల్‌ఖైదా వైపుకు**
**నువ్వేసే ప్రతి అడుగు**
**ఖబర్‌స్తాన్ సృష్టిస్తుంది**
**మతోన్మాదుల కసాయితనాన్ని**
**నెత్తుటి హోలీతో కాదు**
**షీర్ ఖుర్మాతో గెలుద్దాం"**

ఇలా ప్రతి ముస్లిం కవి దారితప్పిన ఉగ్రవాదాన్ని నిరసిస్తూనే ఉన్నాడు. సాహిత్యం మానవసంబంధాలకు వేదిక కావాలి. ఉన్నతమైన జీవనప్రమాణాలను నెలకొల్పుతూ ఒక నూతన చైతన్యాన్ని ఆవిష్కరించాలి. ప్రజల అసలు సమస్యలైన ఆకలి, పీడన, అణిచివేతల నుండి విముక్తి చేసే సామాజిక చైతన్యధారై ప్రవహించాలి. ఇదే ముస్లిం కవుల మనోగతం.

ముస్లింలకు ఇది సంధియుగం. సంక్లిష్టయుగం. ఎంతో ఓరిమితో, ఆత్మవిశ్వాసంతో, సంయమనంతో పయనించాల్సిన అవసరమైన సందర్భం. ముస్లిం యువత తమపై జరిగే దాడులకు పరిష్కారంగా ద్వేషాన్ని ప్రేమతో జయించమన్న ప్రవక్త మహమ్మద్(సు) మార్గంగా ఆదర్శంగా తీసుకోవాలి. ఇస్లాంకున్న ప్రాపంచిక, లౌకిక దృక్పథాల్ని సరిగ్గా అర్థం చేసుకోవాలి. ఇతర వర్గాలలో మీడియా సృష్టిస్తున్న ముస్లిం ఫోబియా కారణంగా నానాటికీ పెరిగిపోతున్న అపోహల్ని దూరం చేసే క్రమంలో తమ నిజమైన జీవనవిధానాన్ని ఆవిష్కరించాలి. ఇస్లాం అంటేనే శాంతి అని అర్థం. ఇస్లాంను గురించి మాట్లాడటమంటే మతవాదాన్ని గురించి మాట్లాడటం కాదు. మనమేమీ ఇస్లాం మత రాజ్యమేమీ కోరుకోవటంలేదు. భిన్న విశ్వాసాలు కల సమాజంలో లౌకిక, ప్రజాస్వామిక సోషలిస్టు రాజ్యమే అందరికీ ఆదర్శం కావాలి. ఇలాంటి పరమోన్నత భావాలతో, ప్రగతిశీల దృక్పథంలో ముస్లిం సాహిత్యం ముందుకువెళ్తుంది.

ప్రపంచీకరణ, సామ్రాజ్యవాదాలు దోపిడీని విస్తృతం చేశాయి. ఈ బలీయమైన శక్తులకు తలవంచాక ఎదురొడ్డుతోంది ముస్లింలు మాత్రమే. ఆ కారణంగానే ముస్లిం సమాజంలోని అతివాద పోకడలున్న దారితప్పిన యువతరాన్ని చేరదీసి అమెరికా, ఇజ్రాయెల్‌లు ఆల్ ఖైదాను, ఐసిస్‌ను సృష్టించాయి. ఐసిస్ సృష్టిస్తున్న బీభత్సం కారణంగా ముస్లిలలో అనైక్యత నెలకొంది. మిగతా సమాజాల్లో అపోహలు ఎక్కువయ్యాయి. వీరి దాడుల్లో చనిపోయింది అత్యధికులు ముస్లింలే అనేది అందరూ గ్రహించాలి. సామ్రాజ్యవాద స్వరూప స్వభావాలు, కుట్రలు ఎంత లోతుగా ఉంటాయో మెజారిటీ హిందూ సమాజంలోని మేధావులు, కవులు, రచయితలు గ్రహించాలి. భారతదేశం అత్యంత గొప్ప సహజవనరులు, సాంస్కృతిక నేపథ్యం ఉన్న దేశం. ఇక్కడ ఐక్యత దెబ్బతీసి, వైరుధ్యాలను సృష్టించి తమ గుప్పిట్లో ఉంచుకోవాలని అమెరికా కలలు కంటోంది. అందుకే మరింతగా మనం సంఘటితమవ్వాలి. భారతదేశానికి హిందువులు, ముస్లింలు రెండు కన్నులవంటివారు. ఏ కంటికి గాయమైనా యావత్ దేహం బాధపడుతోంది అన్న సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్ మాటలు మనం మననం చేసుకోవాలి. దేశ స్వాతంత్ర్యం కోసం 8 లక్షల మంది ముస్లింలు తమ ప్రాణాలు త్యాగం చేశారు. దీన్ని విస్మరించి మొత్తం ముస్లిం సమాజాన్ని బోనులో నిలబెట్టాలని చూసే కుట్రల్ని అన్ని వాదాలకు చెందిన సాహిత్యకారులు తిప్పికొట్టాలి. పి.రసూల్‌ఖాన్ అనే కవి ఓచోట

**"ఉగ్రవాదులంతా కల్సి**
**ఉగ్రవాదాన్ని పోషిస్తున్నారు**
**ఉగ్రవాదాన్ని ఉగ్రవాదంతో**
**జయించాలనుకుంటున్నారు**
**సమన్యాయం, సమసమాజం**
**సమరక్షణ, సమస్వేచ్ఛలో**
**ఉగ్రవాదం ఉసురుతీయగలం"**

అంటాడు. సాహిత్యానికి బాధ్యత ఉండితీరాలి. కవిత్వమనేది సైద్ధాంతిక తాత్విక, దార్శనిక స్వభావం కలిగి ఉండాలి. కనుకే చారిత్రక ఘట్టాలను ఆవిష్కరించడంలో తప్పులు దొర్లవచ్చునేమో కాని రిక్టర్ స్కేల్ వంటి కవిత్వాన్ని ఆవిష్కరించడంలో తప్పులు దొర్లరాదు. ఈ సహేతుకమైన దృష్టి ఉంది కనుకే ప్రగతిశీల ముస్లిం సాహిత్య కారులు సత్యం ఆధారంగానే తమ కవిత్వాన్ని ముందుకు నడిపించారు. ఇస్లాంవాదం లేదా ప్రగతిశీల ముస్లిం సాహిత్యోద్యమంగా ఏ ఒక్క మతానికో, కులానికో వ్యతిరేకంగా రాలేదు. సంచలనాల కోసమో, సంకలనాల కోసమో రాలేదు. దేశాభివృద్ధికి తోడ్పడే ఉత్పత్తి కారకాలలో ప్రధానమైన శ్రమశక్తి వనరుగా ముస్లిం సమాజం ఉన్నప్పటికీ వారి మానాన వారిని బతకనివ్వని కుట్రల్ని, అభద్రతలను, అస్తిత్వ భయాలను మోసుకుంటూ తిరగాల్సి వస్తుంది. ప్రగతిశీలముస్లిం సాహిత్యం బలంగా వినిపించింది. పాకిస్తాన్ పాలకులు తాచెడ్డ కోతి వనమంతా చెరిచినట్టు ఉగ్రవాదాన్ని భారతదేశంలోకి బదలాయింపు చేసే ISI కుట్రల్ని ఖండించింది. నా 'కవాతు' కవితలో నేనిలా రాయటం జరిగింది.

"మొలకెత్తిన పసివాక్యం
పసిడి పద్యమై రూపుగడ్తున్న వేళ
కనుపాపల్లోని వెన్నెల్ని కత్తిరించి
పారిపోతున్న వాడి బుద్ధిలేనితనాన్ని
కాలర్‌పట్టి నిలదీయాలనుంది
చెదిరిన అక్షరాలను తిరిగి పేర్చగలవా ! అని
చెమర్చిన హృదయభాషకు
భాష్యం చెప్పగలవా ! అని"

మనం ఏ విశ్వాసాలకు, భావధారలకు చెందినవారమైనా మన మంతా భారతీయులం. శాంతి...సహజీవనం...సామాజిక స్పృహ లక్ష్యాలుగా చేసుకుని ముందుకు సాగాల్సిన బాధ్యత అందరిదీ. అసమ సమాజం, అసమన్యాయం, దోపిడీ, పీడన, అణిచివేత, ఉగ్రవాదం వంటి రుగ్మతలు లేని ఆదర్శభారతదేశాన్ని ప్రగతిశీల ముస్లిం సాహిత్యోద్యమం కోరుకుంటుంది. విభిన్న సంస్కృతులతో అలరారే దేశం కంచు ఊడల్ని గడ్డిపరకల్లా పెరికేయాలని కలలు కంటున్నవారికి మన ఐక్యతే సమాధానం. దీనికి ప్రతిరూ

పంగానే ఇస్లాంవాద స్ఫూర్తితో మొదలైన ప్రగతిశీల ముస్లిం కవిత్వం మనదేశ మట్టిశిబిరాల్ని ధ్వంసం చేయాలనుకుంటున్నవాళ్ళను, మనదేశ హిమశిఖరంపై కుంపట్లు రాజేయాలనుకుంటున్నవాళ్ళకు ఇండియా అంటే నాలుగు మందిరాలు, నాల్గు మసీదులు కావని శతాబ్దాల సామరస్య భావాల చరిత్ర అని గుర్తుచేస్తుంది.

*చిరునామా :* షేక్ కరీముల్లా, భూవిజ్ఞానశాస్త్ర విభాగం, ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్టణం – 530003, 9848486967

శ్రీ పువ్వాడ తిక్కన సోమయాజి

# మువ్వ గోపాల పదకర్తలు

**"సోమకళాలసత్త్రిపురసుందరి అందియ మువ్వ, మా పువా దామని రామకోకిల పదావళికిన్ శ్రుతిమీటు మువ్వ, గో పామృత పాయి క్షేత్రయ పదావళికిన్ లయకూర్చు మువ్వ, ము వ్వా! మహిమార్ఘుళంఝుళరవ ప్రతిరావ లుఠత్ కకుప్పురా!"**

**- 'కవిపాదుషా' పువ్వాడ శేషగిరిరావు.**

కృష్ణాజిల్లాలోని దివిసీమకు వచ్చిన అంతర్జాతీయ ఖ్యాతికి కారణం నాట్యంలో తనదైన ముద్రవేసికొన్న కూచిపూడి. కూచిపూడికి అల్లంత దూరంలో ఉన్న మొవ్వ, ఘంటసాల, శ్రీకాకుళం కూడా అంతటి ప్రఖ్యాతి గాంచినవే. దివిసీమలోని ఈ నాలుగు గ్రామాలను కలిపి 'దివ్యసీమ' గా కొందరు పేర్కొన్నారు. అటువంటి దివ్య దివిసీమలోని మొవ్వ గ్రామం మువ్వవేణుగోపాలస్వామి క్షేత్రంగా ప్రసిద్ధి చెందింది. 'మువ్వ' అనే తొలుతటి గ్రామనామం కాలక్రమేణ 'మొవ్వ'గా మారి నదని పెద్దలంటారు.

మొవ్వ గ్రామం ఇద్దరు పదకర్తలకు పుట్టువిచ్చింది. ఒకరు సుప్రసిద్ధుడైన క్షేత్రయ్య. మరొకరు పువ్వాడ శ్రీరామదాసుగారు. ఇరువురు మొవ్వ వేణుగోపాలస్వామినే కీర్తిస్తూ పదాలు, కీర్తనలువ్రాసారు. పువ్వాడ శ్రీరామదాసుగారి పేరు చరిత్ర కెక్కక పోవటానికి కారణం వారి కీర్తనలు కాలగర్భంలో కలిసిపోవటమే. ఇప్పుడిప్పుడే వెలుగు చూసిన కొద్ది కీర్తనలు వారి నీ వ్యాసంలో స్మరించుకునే అవకాశం కల్పిస్తున్నాయి.

'మువ్వ, అనే పేరు ఆ గ్రామానికి ఎలా వచ్చింది? వేణుగోపాల స్వామి సన్నిధిలో ఒక భక్తురాలైన నాట్యకత్తె అభినయిస్తుంటే, ఆమె అభినయానికి అనుగుణమైన పదాలు క్షేత్రయ్య వ్రాశాడని, ఆయన రచనకు ఆ నాట్యకత్తె యొక్క మువ్వలసవ్వడి ప్రేరకమైనదని, అందువల్ల ఆ గ్రామానికి 'మువ్వ' అనే పేరు వచ్చిందని కొందరంటారు. శివుడు తాండవం చేస్తుంటే ఆయన కాలిగజ్జెలలోని ఒక మువ్వ అక్కడ జారి పడిందని, అందుచేత దానికాపేరు వచ్చిందని కూడా మరికొంద రంటారు. మౌర్యుల కాలంలో మహాముని ఒకరు మొవ్వ వేణుగోపాల స్వామి ఆలయాన్ని నిర్మించారని కొందరు చరిత్రకారులనటం కూడా మనం గుర్తుచేసికొనవచ్చు. ఏది ఏమైనా అక్కడ జన్మించిన పదకర్తలు అక్కడ వెలిసిన వేణుగోపాలస్వామిని ఆలంబనం చేసికొని వారివారి సాహిత్యపు మువ్వలను రవళింపజేస్తూనే ఉన్నారు.

క్షేత్రయ్య అసలుపేరు వరదయ్య అనీ, అతడు కృష్ణాజిల్లా దివి తాలూకా కాపురస్తుడని ప్రతిపాదించినవారు విస్సా అప్పారావు గారు. క్షేత్రయ్య మొవ్వ గ్రామం వాడని తనకు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కూడా తెలిసియున్నారని విస్సా అప్పారావు గారు పేర్కొన్నారు. క్షేత్రయ్య పదాలలో 'వరద' ముద్రగల పదాలు అధికంగా ఉండటం వల్ల క్షేత్రయ్య అసలు పేరు వరదయ్య అని విశ్వసించటంలో తప్పులేదు. క్షేత్రయ్యకు క్షేత్రజ్ఞుడనే నామాంతరం కూడా ఉన్నది.

మొవ్వ గ్రామానికి సంబంధించిన సమాచారమనకొక గ్రంథంలో లభిస్తుంది. ఆ గ్రంథం "క్షేత్రయ్య" పేరుగల ఒక నవల. మూల గ్రంథం ఆంగ్లంలో ప్రొఫెసర్. మొవ్వ వేంకటరామశర్మ గారు రచించారు. ఆయన స్వగ్రామం మొవ్వ. ఆయన తిరుపతి శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయానికి ఉపకులపతిగా కూడా వ్యవహరించారు. ఈ గ్రంథాన్ని తెలుగులోనికి అనువదించిన వారు అయినంపూడి గురునాధ శర్మగారు. ఇరువురికీ బంధుత్వం కూడా ఉన్నది. 1979లో ప్రచురితమైన ఆ గ్రంథ అవతారికలోని ఈ క్రింది అంశాలు మనం గమనించవచ్చు.

**"ఔను క్షేత్రయ్య మా గ్రామం వాడే. వేం ఆయన వంశీకులం"..... ఇవి మొవ్వ వేంకట్రామశర్మ గారి మాటలు.**

**"క్షేత్రయ్య గారి పదాల్లో మువ్వ, మువ్వ అని ఉండగా ఈ గ్రామాన్ని మొవ్వ అని ఎందుకు పిలుస్తున్నారో..."**

**"మౌద్గల్య మహర్షి పేరుతో పూర్వం యీ గ్రామం ప్రచలితమైందని అంటారు. కాని కాలక్రమాన అది మువ్వగా మారి ఈ నాడు మొవ్వ అయింది. అది ఉచ్చారణలో క్రమంగా వచ్చిన కొద్దిపాటి మార్పేగాని మరేమీ కాదు."**

"....ఆలయార్చకుడు ఉత్సవ విగ్రహాల్లో ఒకటి తీసుకొనివచ్చి చూపించారు. ఆ విగ్రహం వెనుక పీటీని 'మువ్వ' అని చెక్కబడి వుండటం చూచి మేమంతా ఆశ్చర్య చకితులమయ్యాం....."

◆◆◆

## మొవ్వ తమిళదేశంలో ఉన్నదా?

ఇది ఇలా ఉండగా ఆరుద్ర గారు తమ సమగ్రాంధ్ర సాహిత్య చరిత్రలో మొవ్వ గ్రామం పేరున పోలినట్టి అనేక గ్రామాలు (మోపూరు, మువ్వాం పళ్లం, మూవనూరు, మూవనల్లూరు, మూవలూరు, ఇత్యాదులు) తమిళదేశంలో ఉన్నాయని, క్షేత్రయ్య దక్షిణదేశంలో అనేక రాజాస్థానాలు సందర్శించి ఆయారాజులపై పదాలు చెప్పటం జరిగిందనీ, అందుచేత క్షేత్రయ్య జన్మస్థానం తమిళదేశం కావచ్చునేమో అని సందేహం వెలిబుచ్చారు. తగిన ఆధారాలు రూఢిపరిస్తేగాని ఆ విషయం ఇదమిత్థంగా నిర్ణయించటం సాధ్యపడదు.

ఈ సందర్భంగా డా॥ పి.యస్.ఆర్. అప్పారావుగారు ఒక ఆంగ్ల వ్యాసంలో వ్రాసిన విషయాలు గమనిస్తే అందులో తమిళదేశపు శాస్త్ర పండితులు మన పదకర్తలకిచ్చిన గౌరవం ఎంతటిదో అవగాహన చేసికొనవచ్చు.

Just as Thyagaraja's Telugu gave perfection to the Carnatic music Kshetrayya's Padams, Narayana Thirtha's Tarangas and Sarangapani's Javlis as practised by devadasis and rajanarthakis shaped the contemporary Bharata Natyam of Tamil Nadu. None could afford to deny the historical fact that the Andhra played a major role in shaping the dance and music traditions in South India.

Dr. V. Raghavan, one of the greatest scholars in Sanskrit and Tamil observed as follows......"In the Tamil country where Telugu dance and music heritage was most carefully preserved, Tamil versions and Tamil padas on the model of Kshetragna's compositions arose".

Another great scholar 'Sangeetha Kalanidhi' Sri. Vasudeva Sastry further observed as follows in his introduction to taladasahaprana Dipika, a Telugu treatise on music "Any one who wanted to get any proficiency in any of the fine arts till about 100 years ago, had to learn Telugu".

ఈ విధంగా దక్షిణదేశంలోని సంగీత నాట్యకళారూపాలను తీర్చి దిద్దటంలో ఆంధ్రదేశపు సంగీత నాట్య మూలకందములని తమిళపండితులే విశదం చేసినట్లు తెలుస్తోంది. ఆంధ్రదేశంలో నృత్యా నికి బీజం వేసి తెలుగువారికి ప్రాముఖ్యం కల్పించినవారు సిద్ధేంద్ర క్షేత్రయ్యలు. క్షేత్రయ్య పదాలు అభినయానికి నాట్యానికి అవినాభావ సంబంధం. ప్రణయకళ క్షేత్రయ్యదైతే, ప్రణయకలహం సిద్ధేంద్రయోగి భామా కలాపంగా రూపుదిద్దుకుంది.

## దేశ సంచారం

క్షేత్రయ్య దక్షిణ భారతదేశంలోని అనేక క్షేత్రాలు సందర్శించి ఆయాదేవతలను కీర్తిస్తూ పదాలు వ్రాసాడు. అనేక రాజాస్థానాలలో ప్రవేశం పొందివారి మెప్పుకోసంవారి పేర్లతో పదాలువ్రాసాడు. విజయ రాఘవనాయకుడు, రఘునాధనాయకుడు, తిరుమలనాయకుడు, గోల్కొండ నవాబు అబ్దుల్ కుతుబ్ షాహిలు ఆయన పదాల్లో కీర్తింప బడినారు. రఘునాధనాయకుని పూర్వకాలపువాడైన తుపాకుల వెంకట కృష్ణప్పనాయకుని మీదకూడా క్షేత్రయ్య పదం పాడినట్లు తెలుస్తోంది.

"నేరమా కొమ్మా వాడెందుకే చేరరాడమ్మా ?
కినిసి తుపాకుల కృష్ణునితో నీ తనివి తీరలేదని పలికితినట!"
"మధుర తిరుమలేంద్రుడు మంచి బహుమానమొసగి
ఎదుట కూర్చుండుమని యెన్నిక యిమ్మనెనే"
"అలుకుతీరి తంజాపురి నెలకొన్న విజయరాఘవుని
వెలయ మనుజుల వెంబడి వేగమే పొడ గాంచి"
"బలవంతుడౌ గోలకొండ పాదుషా బహుమాన మిచ్చి
తులసి మూర్తితో వాదు దలచె నావేళ"

క్షేత్రయ్య రఘునాధనాయకునిపై ప్రత్యేకించి పదం చెప్పినట్లు లేదు కాని ఒక చాటుపద్యం చెప్పినట్లు ప్రచారంలో ఉన్నది.

"తము దామె వత్తు రర్థులు
క్రమమెరిగిన దాతకడకు, రమ్మన్నారా
కమలంబు లున్న చోటికి
భ్రమరంబులు నచ్యుతేంద్ర రఘునాథ నృపా!"

రఘునాధనాయకుడు, విజయరాఘవనాయకుడు స్వతహాగా సాహితీ ప్రియులు, గ్రంథకర్తలు, సంగీత, నాట్యాలలో ఆరితేరినవారు కావటం విశేషం. క్షేత్రయ్య దర్శించినది ఏ క్షేత్రమైనా, కీర్తించినది ఏ దేవతనైనా, పదం పాడింది ఏ రాజుపైనైనా, ప్రతి పదంలోను "మువ్వ గోపాలుణ్ణి" మాత్రమే ముద్రలుగా మూర్తీభవింప జేసికొనటం మాన లేదు. క్షేత్రయ్య పదాలలోని అసాధారణమైన ప్రత్యేకతలు రెండు. ఒకటి అవి సంగీత సాహిత్య అభినయాల త్రివేణీ సంగమాలు. ఇంకొకటి–శిష్టమైన వ్యావహారికంలో అచ్చతెనుగు భాషలో వ్రాయబడినాయి. అడుగడుగున తేనెలొలికే తేటతెనుగుపదాల పోహణింపు భాషలోని అందచందాలను గ్రుమ్మరిస్తూ ఉంటుంది.

"ఎంత చక్కని వాడె నాసామి వీ
డెంత చక్కని వాడే
ఇంతి మువ్వగోపాలుడు సంతతము నామది
సంతోషము చేసెనే॥"
"ఇంత తెలిసియుండి ఈ గుణమేలరా
పంతమా మువ్వ గోపాలా॥"

"మగువ తనకేళికా మందిరము వెడలెన్
వగకాద మాకంచి వరద తెల్లవారె ననుచు॥"

ఇత్యాది పదాలెన్నో తెలుగువారి నాల్కలపై నిరంతరం నర్తించేవే.

కూచిపూడి భామాకలాపంలోని సత్యభామ తెలుగువారు నృత్య పరంగా సృష్టించుకొన్న ఉపాధి దేవత. ఆ దేవతను రూపించినవాడు సిద్ధేంద్రయోగి. అదే స్ఫూర్తితో క్షేత్రయ్య తన రచనల్లో సత్యభామ అభినయ కౌశల్యాన్ని, వికాసాన్ని కూర్చి, త్రివిధ నాయికలను, అష్టవిధ నాయికావస్థలను నాట్యశాస్త్రానికి అందించారు.

పదకవిత అనే నూతన కళారూపాన్ని ఆరంభించిన అన్నమా చార్యుడు సంకీర్తనాచార్యుడుగా స్థిరపడితే ఆయన అడుగుజాడల్లో నడచి తనదైన మార్గాన్ని స్థిరపరచుకొని పదమంటే క్షేత్రయ్య పదమని పించుకొన్న ఘనతను సంపాదించుకున్నాడు క్షేత్రయ్య. అన్నమయ్య భక్తితత్వానికి శృంగార మధుపరాగాలు సుసంగతమై అలరిస్తాయి. సంస్కృతంలో జయదేవ, నారాయణతీర్థ లేజాతివారో, క్షేత్రయ్య తెలుగులో అలాటివాడని తిరుపతి వేంకటకవులు అన్నారు (కృష్ణాపత్రిక 18.1.1941). మువ్వగోపాలపదాలు గీతగోవింద మాధుర్యాన్ని చవి చూపిస్తాయని, క్షేత్రయ్య తెలుగువారి జయదేవుడని కీర్తించారు ద్వారం వేంకటస్వామినాయుడుగారు (భారతి - మార్చి 1938)

1966 సం॥లో మొవ్వలో క్షేత్రయ్య కళాసమితి ఏర్పడింది. నాట్యా చార్యులు వేదాంతం పార్వతీశం, పసుపర్తి రామలింగశర్మల ఆధ్వ ర్యంలో క్షేత్రయ్య పదాలపై నాట్యంలో శిక్షణఇచ్చారు. క్షేత్రయ్య నృత్య కళాశాల స్థాపించబడింది. శ్రీ మండవ జానకిరామయ్యగారు మొవ్వలో స్థాపించిన ఎడ్యుకేషనల్ ట్రస్టుకు క్షేత్రయ్య పేరు పెట్టారు. క్షేత్రయ్య జీవిత సాహిత్య చరిత్రలను గురించి అనేక పరిశోధనలు జరిగాయి, జరుగుతున్నాయి. ఆచార్య యస్. గంగప్ప,డా. మంగళగిరి ప్రమీలాదేవి ప్రభృతులు అనేక గ్రంథాలు వెలువరించారు.

## మరొక వాగ్గేయకారుడు పువ్వాడ శ్రీరామదాసుగారు

ఇంతటి ప్రఖ్యాతిగొన్న మొవ్వ గ్రామం మరొక పదకర్త వాగ్గేయ కారునకు కూడా పుట్టువిచ్చిన సంగతి సాహిత్యలోకానికి యిప్పుడిప్పుడే తెలియవచ్చింది. ఆయనే పువ్వాడ శ్రీరామదాసుగారు. పువ్వాడ శ్రీరామ దాసుగారు 1845ప్రాంతంలో మొవ్వలో జన్మించి అనేక కీర్తనలు రచించి గానం చేశారు. ఇవి మొవ్వ వేణుగోపాలస్వామి కీర్తనలుగాను, పువ్వాడ శ్రీరామదాసు కీర్తనలుగాను ప్రాచుర్యం పొందు తున్నాయి. పువ్వాడ శ్రీరామదాసుగారి కీర్తనలు కొన్ని వందలున్నాయి. ఆ తాళపత్ర గ్రంథాలన్నీ, మొవ్వ గ్రామంలో వారి వంశీకులైన 'గ్రామ సముద్ధారీ' పువ్వాడ సుందరరామయ్యగారి యిల్లు అగ్నికి ఆహుతి కాగా, అవి కూడా దహనమైనాయట. పువ్వాడ సుందరరామయ్యగారు - ఆ కీర్త నలు కొన్ని పాడుతుండగా ఆ గ్రామవాసులైన నల్ల గోపాలరాయుడు వంతపాడగా, ఎఱ్ఱ గోపాలరాయుడు, చిట్టెయ్యగారు తాళములు పట్టి తాండవించేవారని, తుర్లపాటి రామయ్యగారు మద్దెల వాయించేవారని, సుందరరామయ్యగారి కుమారుడు, (మా నాయన గారు) శ్రీ పువ్వాడ శేషగిరిరావుగారు ఒక ప్రసంగవ్యాసంలో తెలియ జేశారు. సుందరరామయ్యగారు తన జ్ఞాపకము కొలది తాళపత్రము లపై వ్రాసికొన్న కొన్ని కీర్తనలు కూడ, శేషగిరిరావుగారు చదువుకునే రోజుల్లో బందరు బుట్టయ్యపేటలోని దంటువారి ఇంట్లో పోయినవట. ఆ తర్వాత పువ్వాడ శేషగిరిరావుగారు తన మేనమామ గురుజాడ బాపిరాజుగారి ద్వారా సేకరించిన పాతికముప్పది కీర్తనల వ్రాత ప్రతి కూడా చెదలవాతపడి నశించటం జరిగింది.

ఇన్ని దురదృష్టకర సంఘటనలు పువ్వాడ శ్రీరామదాసు కీర్తనల అస్తిత్వానికి ప్రశ్నార్థకాలయినాయి. ఈ వ్యాసకర్తనైన నేను శ్రీరామ దాసుగారి వంశీకుడనైనందుకు గర్వపడాలో, ఆ కీర్తనల స్థితికి విచా రించాలో తెలియని పరిస్థితుల్లో, మా అమ్మ, మా చెల్లెళ్లు పాడు కొంటున్న తొమ్మిది-పది కీర్తనలు 1991లో మువ్వవేణుగోపాల స్వామి కీర్తనలు అనే పేరుతో ముద్రించి ప్రచురించాను. డా॥మంగళగిరి ప్రమీలాదేవి గారు పదసంగీత పరిషత్తు ద్వారా వాటిని ప్రచారంలోనికి తీసుకొని వచ్చారు. ఇటీవల 2003 సంక్రాంతిసుండి ఆకాశవాణి విజయవాడ కేంద్రం వారు భక్తిరంజని కార్యక్రమంలో ప్రసారం చేస్తు న్నారు. మొవ్వవేణుగోపాలస్వామి దేవస్థానంవారు స్పాన్సర్ చేయగా, శ్రీ వేమూరి సుందరరామయ్య శ్రీ మండవ జానకిరామయ్యగార్ల ప్రమేయంతో, ఆకాశవాణి సంగీత విద్వాంసులు శ్రీ మోదుమూడి సుధాకర్ బృందంవారు గానం చేయగా పువ్వాడ శ్రీరామదాసుగారి కీర్తనలు విజయవాడ ఆకాశవాణి వారిచే ప్రసారం చేయబడుచున్నాయి.

క్షేత్రయ్య పదాలు 'మధురభక్తి'కి దర్పణాలు కాగా, పువ్వాడ శ్రీరామ దాసు గారి కీర్తనలు 'శరణాగతికి' ప్రతీకలని - క్షేత్రయ్య వంశజుడైన డా॥మొవ్వ వేంకటరామశర్మ గారు పేర్కొన్నారు. పువ్వాడ శ్రీరామదాసు గారు రచించిన మొవ్వవేణుగోపాలస్వామి కీర్తనలు అత్యంత భక్తి సంభరితాలని 'పద్మశ్రీ' వేదాంతం సత్యనారాయణ శర్మగారు ప్రశంసిం చారు. (ఈ వ్యాసం చివరలో వీరిరువురి లేఖలు చూడవచ్చును).

కూచిపూడివారి దశావతారముల శబ్దంపై శ్రీ పరకాల పట్టాభి రామారావుగారి సంపాదకత్వంలో ఒక వ్యాససంపుటి వెలువడింది. అందులో శ్రీ నటరాజ రామకృష్ణ గారు వ్రాసిన వ్యాసంలో బుద్ధావ తారాన్ని గూర్చి చర్చిస్తూ, మువ్వ వేణుగోపాలస్వామి కీర్తనల్లోని దశావ తారాల్లోని "త్రిపురాంగనల దీక్ష త్రిప్పిన దేవరమ్మ అపుడే బుద్ధావ తారమాయెనే కొమ్మా" అనే చరణాన్ని ప్రస్తావించి పువ్వాడ శ్రీ రామదాసు గారి కీర్తనను ఉటంకించటం జరిగింది.

దివి ఐతిహాసిక పరిశోధనమండలి, అవనిగడ్డవారు డా॥ వేదాంతం రాజగోపాల చక్రవర్తిగారు రచించిన దివిసీమ ఆలయదర్శినిలో మొవ్వ వేణుగోపాలస్వామి దేవాలయ ప్రాభవాన్ని వివరిస్తూ పువ్వాడ శ్రీరామ దాసుగారి కీర్తనలు మూడింటిని ఉదాహరించారు.

1. ఎక్కడనున్నావు కృష్ణయ్య - నేనెంత వీడినరావు.....
2. మేల్ మేల్ మొవ్వ భీమలింగ - చాల దయయుంచు సంపూర్ణ లింగ....
3. నందీవాహనుడై వచ్చె నమ్మా - భీమేశుడు నందీ వాహనుడై వచ్చెనమ్మా....

శ్రీరామదాసుగారు మొవ్వ భీమేశ్వరస్వామిపై కూడా కీర్తనలు రచించారు. అంతేకాదు కృష్ణాజిల్లా ఉయ్యూరు సమీపాన గల గురజాడ గ్రామంలో నెలకొన్న రామలింగేశ్వర స్వామిపై కూడ కీర్తన చెప్పటం జరిగింది. దీనినిబట్టి ఈయన కూడా అనేక దేవాలయాలు సందర్శించి ఆయా దేవతలను కీర్తించినట్లు తెలుస్తోంది. అంతేకాక శివకేశవ అభేదం వారి కీర్తనల్లో ప్రతిబింబిస్తున్నది.

పువ్వాడ శ్రీరామదాసుగారి కీర్తనల్లో "మువ్వగోపాల" "మువ్వ నివాస" "శ్రీరామదాస" "పువ్వాడ శ్రీరామదాస" అనే ముద్రలు తప్పని సరిగా ఉపయోగించారు. సేకరించి ప్రచురించిన కీర్తనలన్నీ భజనకు, అభినయానికి కూడా అనువైనవిగా ఉన్నట్లు పెద్దలంటారు. వీటిలో జోలపాట, ఉత్సవ సంప్రదాయ కీర్తనలు కూడా ఉన్నాయి. లభించిన పది కీర్తనల్లో ఒకటి అసంపూర్ణంగా ఉన్నది. దానిలో ముద్రాంకిత చరణం కానరాకపోవటంతో అది వీరిదగునా కాదా అన్న సందేహం కూడా తలచూపే అవకాశం లేకపోలేదు. వేదాంతం సత్యనారాయణ శర్మగారు మాత్రం ఈ కీర్తన ఇతరులది కాదని శ్రీరామదాసుగారిదే నని అన్నారు. పూర్తిగా అన్ని చరణాలు లభిస్తేగాని ఇదమిత్థంగా నిర్ణ యించటానికి వీలుపడదు. మిగతా తొమ్మిది కీర్తనలు అన్నీ ముద్రలతో పూర్తిగా ఉన్నాయి. అసంపూర్ణంగా ఉన్న కీర్తనతో సహా 10 కీర్తనలు పల్లవులను మాత్రం ఈ క్రింద ఉదాహరిస్తాను. ఆపై ఒక్క కీర్తన మాత్రం పూర్తిగా ఉదాహరిస్తాను. అమూల్యమైన ఈ పది కీర్తనల ముద్రిత ప్రతులు కావలసినవారు ఈ వ్యాసకర్తనుండి పొందవచ్చును.

**పల్లవులు :**

1. ఎక్కడ నున్నావు కృష్ణయ్య నేనెంత వేడిన రావు
   ఎక్కడ నున్నావు ఎంత వేడిన రావు
   మక్కువ నన్నేలు మా మువ్వగోపాల ॥
2. ఎన్నడు చూడగ లేదు - ఈత డెవరమ్మా
   పన్నగ శయనుడు - మువ్వ గోపాలుడే కొమ్మా ॥
3. అదుగో గోపాలుడు వచ్చె నమ్మలారా
   వడివడిగా రాగదరే వనితలారా
4. రారా పోదాము కృష్ణా లేచి రారా పోదాము
   రారా పోదామంటె గారాము చేసేవు
   నీరజ నయన పన్నీరు గందము లిత్తు ॥
5. బాలెంత రాలనురా కృష్ణ - అల్ల
   పనికోర్వ జాలనురా
   వల్లగాదు పోపోరా కృష్ణ - మళ్లీ
   నెలవెళ్ళితే చూతము రా॥
6. మేల్ మేల్ మొవ్వ భీమలింగ
   చాల దయయుంచు సంపూర్ణ లింగ ॥
7. జయరామ లింగ - జయరామ లింగ
   జయరామలింగ - జయసుందరాంగ ॥
8. నందీవాహనుడై వచ్చెనమ్మా - భీమేశుడు
   నందీవాహనుడై వచ్చెనమ్మా
   ముందర సనక సనందనాది ముని
   బృందము నడువగ ఇందుశేఖరుడు॥
9. దశరథరామ పరాక! పుణ్య
   వశమున నిన్నునే పొడగంటి గాక! ॥

◆◆◆

10. రామ సదానంద - రామగోవింద
    కామిత మందార - ఘనదేవ బృంద ॥జో....జో...॥
    సురుచిర నవరత్న శోభిత హార
    పరిపంథివారిద పటల సమీర ॥జో...జో...॥
    జానకీ కుచయుగ చంద్రచకోర
    మానిత దేవాది దేవ విదూర ॥జో...జో...॥
    పన్నగ శయన సుపర్ణ తురంగ
    కన్నడ సేయకు కరుణాంతరంగ ॥జో...జో...॥
    కమనీయ మణిగణ కలితకేయూర
    విమల మౌక్తిక హార విజయావతార ॥జో...జో...॥
    రావణ కులకానన దాహ కీల
    భావజ జనక సద్భావ సుశీల ॥జో...జో...॥
    ధరణిలో శ్రీరామ దాస శరణ్య
    పరమాత్మ మువ్వగోపాలాగ్ర గణ్య ॥జో...జో...॥

మొవ్వ వేణుగోపాలస్వామి పాదారవింద మకరంద నిర్ఝరులలో తమ పదసాహిత్యపు పూదేనె సోనలను ప్రవహింపచేసిన పదకర్తృ ద్వయము - క్షేత్రయ్య, పువ్వాడ శ్రీరామదాసు ప్రాతఃస్మరణీయులు.

శ్రీమతి ఇంద్రగంటి జానకీబాల

# నదీతీరాల జానపద వాఙ్మయం

ఎక్కడో మహారాష్ట్రలో సహ్యగిరి మీద పుట్టి, అనేక గ్రామాలు పట్టణాలు దాటుకుంటూ హంసలదీవి దగ్గర సాగరసంగమం చేసిన జీవనది కృష్ణానది ప్రపంచ చరిత్రలోనే విలసిల్లిన అనేక నాగరికతలు నదీతీరాలలోనే పరిఢవిల్లాయి. ఈ నదీతీర నాగరికతకూడా అలాంటిదే.

కృష్ణాతీరం సంగీత సాహిత్య శిల్ప కళలకు ప్రసిద్ధిపొందింది. తెలుగు సాహిత్యంలో జానపదవాఙ్మయానికున్న ప్రత్యేకత ఒక ప్రకరణంగా చెప్పదగింది. జానపదసాహిత్యానికి ప్రత్యేకంగా కొన్ని విశేష లక్షణాలున్నాయి. వాటిలో మొట్టమొదటిదే మౌఖిక సంప్రదాయం. రెండవది ప్రాంతము, రచయిత ప్రత్యేకించి వివరించే అవకాశాలుండవు. సాధారణంగా ఈ వాఙ్మయం పల్లెటూర్లు కేంద్రంగా విలసిల్లినది. గృహజీవనం, వ్యవసాయం, చేతివృత్తులు, వీరగాథలు, పేరంటాళ్ళ కథలు, పురాణవాఙ్మయ సరళమైన వ్యవహారిక భాషలో జానపదసాహిత్యంగా ప్రచారంలోకి వచ్చాయి.

ఈ రచనలు తరుచుగా ద్విపద ఛందంలో మరికొద్ది తాళగతుల్లో, నడుస్తూ వుంటాయి. వీటిలో సంగీతపు పాండిత్యం కంటే, తాళగతులకే ప్రాముఖ్యం. తాళంకోసం హ్రస్వాక్షరాలు పొడుగుచేయడం, దీర్ఘాక్షరాలు పొట్టిచేయడం వుంటూ వుంటుంది. మరొక విశేషం ఈ పాటలు పుట్టిన సామాజికవర్గాన్ని బట్టి భాషలో భావంలో తేడాలుంటుంటాయి. ఉదాహరణకి "గంగాగౌరీసంవాదం" ఒకలాగ వుంటే ఒక వ్యవసాయగీతం ఒకలాగ వుంటుంది. పేరంటాలు కథ ఒకలాగవుంటే, మరొక వీరగాథ వేరేవిధమైన ఆవేశంతో వుంటుంది.

ఆంధ్రదేశంలో వున్న కొన్ని వందల జానపదగీతాలను సేకరించి, విభాగించి ప్రచురించినవారిలో శ్రీ నేదునూరి గంగాధరం, టేకుమళ్ళ అచ్యుతరావు డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి (కృష్ణశ్రీ) ప్రయాగ నరసింహశాస్త్రి, వింజమూరి సీతాదేవి, వింజమూరి అనసూయాదేవి, చింతాదీక్షితులు వంటివారు ఎందరో వున్నారు. సుమారు ముప్పై సంవత్సరాలుగా వివిధ ప్రాంతాలలో వున్న జానపద వాఙ్మయంపై పరిశోధనలు జరుగుతున్నాయి. విజయవాడ ఆకాశవాణి కేంద్రం ఆంధ్రప్రాంతంలో ముఖ్యంగా కృష్ణాతీరంలో విస్తృతంగా సంచరించి జానపద గాయకులచేత అమూల్యమైన గేయాలను పాడించి, సేకరించి, భద్రపరిచింది.

ప్రముఖ కవులైన నండూరి వెంకట సుబ్బారావుగారు ఎంకి పాటలను వ్రాసినా, కొనకళ్ళ వెంకటరత్నంగారు బంగారుమామ పాటలు వ్రాసినా, జానపదవాఙ్మయ ప్రభావంతోనే వ్రాశారు. సుమారుగా 50 ఏళ్ళకు పైగా జానపదవాఙ్మయానికి శిష్టసాహిత్యంతో సమానంగా, గౌరవాదరాలు పెరిగాయి. సినిమాలలో ప్రసిద్ధ గీత రచయితలు జానపద వాఙ్మయం నుంచి పల్లవులను, భావాలను తీసుకోవడం పరిపాటైంది. అంతటి విశాల సాహిత్యమైన ఈ విభాగం నుంచి కొన్ని పాటలను పరిశీలిద్దాం.

ముందుగా పౌరాణిక సాహిత్యం నుంచి చూస్తే, ఎంతో అందమైన, మృదువైన భావాలుగల పాటలు కనిపిస్తాయి.

"శ్రీకృష్ణలీలలు" అందరికీ తెలిసిన అంశమే అయినా, వారెంత అందంగా ఆ లీలలు, సులువుగా చెప్తారో చూడండి.

వినవమ్మ యశోదమ్మ నీ వరతనయుడు చేసేటి దుడుకు పనులు
పట్టి విచారింపబోతే భారత భాగోతమాయెను
ఎట్లనే- ఇక ఎట్లనే, యశోదమ్మ ఎట్లనే - ఇక ఎట్లనే -

పాట పాడటంలో మాటను మళ్ళీమళ్ళీ అనడంలోనూ, కృష్ణుని ఆగడాలు చెప్పాలనే ఆరాటం ఎంతో చక్కగా వ్యక్తమౌతుంది.

అలాగే - ఈనాడు లీవాడ లేవాడ లనగా-యెన్నయెనుబదిలక్ష గొల్ల వీధులను ముత్యాలు, పగడాలు, ముంగిళ్ళనుండు - రత్న మాణిక్యాలు రాసులై యుండు అంటూ కృష్ణుని ముద్దు మురిపాలు ప్రవాహంలా సాగుతాయి.

అలాగే -, "గంగా గౌరీ సంవాదము" చాలా ఆసక్తిదాయకంగా, ఎంతో ఉత్సాహం కలిగేలా ఉంటుంది.

**శివశరణు మాం పాహి శివశరణు సోమా**
**శివశరణు మనపాల శివునకు శరణు**
**గురుశరణు మాంపాహి గురుశరణు సోమా**
**గురుశరణ మనపాలి గురువులకు శరణు**

పాట వింటుంటే, వచ్చే పునశ్చరణ వల్ల, వినేవారికి నాట్యం చెయ్యాలనే ఉత్సాహం ఉరకలు వేస్తుంది.

రకరకాల దృశ్యాలను, సంఘటనలు పురాణాలతో ముడివడినట్లు భావించి, ఆసువుగా కవితలల్లి కంఠమెత్తి కమ్మగా, గంభీరంగా పాడేయడమే జానపదసాహిత్యానికి మూలం. దానికొక అక్షరం వ్రాయాల్సిన పనిగానీ, ఒక రాగాన్ని కూర్చవలసిన అవసరంగానీ లేదు. అవన్నీ ఒకరినుంచి మరొకరు అందిపుచ్చుకుని ఆలపించటమే జానపదగీతానికి లక్షణం.

సుభద్ర కల, శశిరేఖ పెండ్లి ; పండుపాట, కుమ్మరి గుండయ్య కథ – ఊర్మిళ నిద్ర, ఉషాస్వప్నము అంటూ ఎన్నో పురాణ కథల్ని ఆధారంచేసుకుని జానపదులు పాటలల్లారు.

అలాగే పనిపాటులు చేసుకునేటప్పుడు శ్రమ తెలియకుండా ఉత్సాహంగా వుండేదానికి వాళ్ళ దినచర్యలోని అంశాలే పాటలు పాడుకునేవారు –, వాటిలో కొన్ని మకుటాలు పెట్టుకుని కథలు కథలు పాడే పద్ధతి ఎంచుకుంటారు –

తుమ్మెదా, తుమ్మెదా – అనీ; కోయిలాలా కోయిలాలా అనీ ;

వెన్నియలో వెన్నీయలా – అనీ, ఉయ్యాలో ఉయ్యాలా' అనీ – రామాయమా – ఓ రామాయమ్మా' అని గానీ

ఒక పదాన్ని పెట్టుకుని పాటంతా సాగిస్తారు. అందులో బోలెడంత వెటకారం, హాస్యం, అల్లరి, ఆటపట్టించటం ఎన్నో వుంటాయి. ఇంకా అత్తా–కోడళ్ళ సంభాషణలు వెక్కిరింతలతో, ఎత్తి పొడుపులతో భలేగా వుంటాయి.

**'కోడల కోడల కొడుకు పెళ్ళామా ! ఓయమ్మా**
**కొడుకూళ్ళోలేడు మల్లెలెక్కడివే – ఆ!హూఁ**
**"సూదూలంటీ సన్నాబియ్యం సిమడ బెడితివె కోడలా–**
**నువు సియదాబెడితివె కోడలా !**
**వారుపుకొస్తే వంచవద్దని నీకెవ్వరు చెప్పారత్తమ్మో**
**నీకెవ్వరు చెప్పారత్తమ్మో !**

ఇంక గృహాల్లో జరిగే వేడుకలన్నింటికీ పాటలు కట్టి స్త్రీలు వేడుకగా, ఆనందంగా, పాటల పాలవెల్లిగా చేసేస్తారు. పదిమంది స్త్రీలున్నచోట ఒకరిద్దరైనా చక్కగా సాగీవారుంటారు – ప్రతీ పండగకీ పాటలు, పద్యాలు వుంటాయి. సందడిగా సంగీతంతో నిండిపోవడమే అసలు అర్థం – పెళ్ళి జరిగితే ప్రతి ఘట్టానికీ పాట – ముగింపు మంగళహారతి

**మంగళ హారతి మారాములకు**
**పొంగుచును సీతాంగనకును జయ మంగళహారితి మారాములకు**
**రాతిని నాతిగ ప్రీతితో జేసిన**
**వాతాత్మజ వరదాతకు సీతకు ॥మంగళ**
**నిత్యనిరామయ నిర్మలాంగునకు**
**సత్యస్వరూపునకు – సర్వాత్మునకు జయ ॥మంగళ**

వధూవరులను దైవస్వరూపులుగా భావించి మంగళహారతి పాడతారు. ఒక చరణంలో 'వరు'ని వర్ణించి, మరొక చరణంలో వధువుని స్తుతిస్తారు. అయితే అంతా సీత, రాముడు, శివుడు, పార్వతి, నారాయణుడు లక్ష్మీదేవి లాగే భావించి పాడుతారు.

ఇంకోవిధంగానూ దంపతులకు దీవిస్తారు. అదెలాగంటే

'కావవే మహానుభావా – కరుణతో ఈ దంపతులను
భూవలయమునందు సకల భోగభాగ్యముల తోడ ॥కావవే॥
మరోచోట –,
శ్రీకరంబుగాను నేడు శివుని కల్యాణము
శ్రీ కైలాసమందు చేయుచుంటిరి – అంటూ
శివుడి గూర్చి పాడతారు

వెంకటేశ్వరస్వామి అందరికీ ఇష్టదైవం. ఆయన దయవుంటే అదే గొప్ప అండదండలుగా భావిస్తారు.

**మంగళమ్ము శ్రీనివాస**
**మంగళ స్వరూప నీకు –**
**కాంతాలందరు గూడి**
**కర్పూరహారతివ్వ–**
**వడ్డికాసులవాడ నీకు**
**వందనమ్ము దేవదేవ మంగళమ్ము**
**ఏడుకొండలాధిపతివని**
**వేడినాము వెంకటేశ**
**అలివేలుమంగతోను**
**వేగరమ్ము కలుప హరణ**

అంటూ భక్తి హారతిలో కలిసి మంగళహారతులు పాడతారు.

ఇక్కడ గ్రహించవలసిందేమంటే అలవోకగా, ఆశువుగా పాడేసే ఈ పాటల్లో యతిప్రాసలు అద్భుతంగా అమరివుంటాయి. మామూలుగా మనం అనుకునే చదువులకీ, దీనికీ సంబంధం వుండదు. వాళ్ళ ఆలోచన, వాళ్ళ భాష అన్నీ అప్రయత్నంగా వాళ్ళ నోట పలుకుతాయి. దానికి తగిన వరుస (Tune) కూడా స్వభావ సిద్ధంగా వచ్చేస్తుంది. ఇదే రాగం ? ఇక్కడ స్వరమేమిటి ? అనే ప్రశ్నలే రావు – ఆ జానపద స్త్రీ పురుషులు పాడేసి, పక్కవాళ్ళకి మౌఖికంగా నేర్పేసిన మాటల్ని మనం విశ్లేషించుకుంటాంగానీ, వారికా ధ్యాసే వుండదు. ఒక పాట రాయడం దానికి బాణీ కూర్చటం లాంటివి జానపదస్త్రీ పాటల్లో వుండదు.

మధ్యతరగతి యిళ్ళల్లో పెళ్ళి రాబోతోందంటే ఆ బంధుజనానికే బోలెడంత సందడి.

పసుపు దంచటం దగ్గరనుంచి పాటతో ప్రారంభిస్తారు.

**ఓంకార చెలియరావె - ఓ మహాజ్యోతిరావె**
**సహకార చెలియరావె - సత్తురావె**
**కోటిశబ్దవాడు రావె**
**కోట్నములు దంచుదాము**
**పూల నిండు సువర్ణరావె - సుందరి రావె -**

అంటూ పసుపు దంచుతారు

ఇంక మగపెళ్ళివారిని ఆడపెళ్ళివారూ, ఆడపెళ్ళివారిని మగపెళ్ళి వారు, వెక్కిరించటం, వెటకారాలు, ఎద్దేవాచేయడం ఏడిపించేయడం - అన్నీ ఆ సందడిలో తోసుకుపోయేలా పాటలల్లి - పాటల బాణాలతో సరదాయుద్ధాలు చేస్తారు. అయితే ఇవన్నీ ఒక ముప్పై ఏళ్ళ క్రితం వరకు బాగా వున్నాయి. ఇప్పటి తెలుగు పెళ్ళి రూపురేఖలు మారిపోవడం వల్ల, ఇంకా ఇవన్నీ వున్నాయని చెప్పడం కష్టం. ఉన్నా వుండవచ్చు. ఆడపెళ్ళివారి విందు భోజనాన్ని ఆక్షేపిస్తూ ఈ పాట విందు చేసిరీ - వియ్యాల వారింట్లో - విందు చేసిరి

**అప్పడంబులోను ఉప్పుచాలకుండ**
**చప్పని జిలేబి చక్కెర లేకుండ ॥ విందుచేసిరి**
**మండిగల్ ఫేణీలు మారు మాకులేవు**
**వండి కందిపప్పు దండిగా వడ్డించి - విందుచేసిరి**
**వదిన వరుస వియ్యపురాళ్ళి నేరుగా ఢీ కొంటారు**
**రాజశ్రీ వదినగార్లకెంతటి - రాజసములమ్మా**
**ముసలి సొగసులకు మొదటి నెంబరట**
**మూడుమార్లు ముఖము కడుగవలెనట -**
**అంటూ ఎగతాళి చేస్తారు.**
**వడ్డనకొచ్చిన వియ్యపురాళ్ళి**
**ఈ బంతి కొడ్డించవే - ఓ వగలాడి**
**తక్కరి బిక్కరి వియ్యపురాల**
**ఎక్కడ దొరికితి వమ్మా - ఈ**
**తళుకుల చీరలు కట్టి**
**తగిన సొమ్ములే బెట్టి**
**కులుకుదుగాని వియ్యపురాల కూరలు తేవమ్మా -**

ఇలా ప్రతీదానికీ పాటలు పాడి ఉషారుగా కాలక్షేపం చేయడం మన తెలుగు పెళ్ళిళ్ళలో ఒక ముఖ్యమైన భాగం.

ఇంక కొత్త పెళ్ళికూతుర్ని ఊపిరి పీల్చుకోనివ్వరు.

**వదినరో నీవెంత బల్ జాణవమ్మా**
**అరుదుగా మాయింటి కోడలవమ్మా -**

అంటూ మొదలుపెట్టి నీ పుట్టింట నాజూకుగా తిరిగావుగానీ ఇక్కడదేం కుదరదని బెదరగొట్టి పారేస్తారు. ఇలాంటి ఘట్టఘట్టానికీ పాటలల్లి అజ్ఞాతంగా దాగివున్న తమ సృజనాత్మకతను, గానకౌశలాన్ని ప్రదర్శించిన మహిళారత్నాలు ఎందరో మన జానపదసాహిత్యంలో దాగి వున్నారు.

జానపదవాఙ్మయం అంటేనే మౌఖికంగా వచ్చేది - కవి, రచయిత, సంగీతకారుడు అంటూ వుండరు. అంతా ఒకరే -, అక్కడికక్కడే సమాజాన్ని ప్రతిఫలింపచేసే పాటని రచించుకుంటూ, రాగాన్ని కూర్చు కుంటూ పాడేయగల జానపదకళాకారుడు ధన్యజీవి. తనలోని కళారూపానికి వెలకట్టని కళాకారుడు.

జానపద కళారూపాలన్నీ పల్లెజీవనానికి అల్లుకునే వుంటాయి. అక్కడి వాతావరణం, అక్కడి యాస, అక్కడి భాషా, భావాలసముదాయం అక్కడి సమాజరీతులు, నీతులు జానపద సాహిత్యంలో దర్శనమిస్తాయి.

జానపదవాఙ్మయం ఒక మహాసముద్రం. ఒక బుడిగి చెంబుతో సముద్రంలోంచి నీళ్ళెంత తేగలం ? - అంతే -

కృష్ణానదీతీర వాసులందరికీ ఇందులో ప్రస్తావించిన జానపద గేయాలన్నీ సుపరిచితాలే అయివుంటాయి. వాటిని మళ్ళీ ఒకసారి నెమరేసుకుని ఆనందించగలరని భావించవచ్చు.

చిరునామా : శ్రీమతి ఇంద్రగంటి జానకీబాల *104,* సాహితీ రెసిడెన్సీ, జి.కె. కాలనీ, సైనిక్‌పురి పోస్ట్,
సికింద్రాబాద్ - *500 094.* సెల్ నెం. *9640052509*

డా॥ పొన్నపల్లి ఉష

# పల్నాటి వీరచరిత్ర - కథాకథనం

శ్రీనాథుడు కమనీయమైన కావ్యరచనా దురంధరుడు. 'మరుత్తరాట్‌చరిత్ర', 'శాలివాహన సప్తశతి', 'భీమఖండం', 'కాశీఖండం', 'శివరాత్రి మహాత్మ్యం' మున్నగు ప్రశస్తనీయమైన కావ్యాలను రచించి తెలుగు వైభవాన్ని జగద్విదితము గావించినాడు. రమణీయమైన కల్పనలతో ఔచితీవంతముగా అలరారు శ్రీనాథుడి కవితా ప్రాభవం అనన్యసామాన్యము - నిరుపమానము. ఆ కవివరేణ్యుని భావవీచికల నుండి జాలువారిన మరో ఆణిముత్యం 'పల్నాటి వీరచరిత్ర'.

'పల్నాటి వీరచరిత్ర' కర్తృత్వ విషయంలో అనేక వాదోపవాదాలు పండితలోకంలో ఉన్నాయి. పామర జనామోదకరమైన పల్నాటి వీరచరిత్రను "శాశ్వతంబైనట్టి సద్గ్రంథమను నమ్మకంతో శ్రీనాథుడు వ్రాయునా ?" అని కొందరాక్షేపించారు. చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు తమ శ్రీనాథ కవితా సమీక్షలో క్రీడాభిరచన నాటికే ఓరుగంటిలో పలనాటి వీరుల కాయమేర్పడి యుండునట్లును ఆ వీరచరిత్రము గచ్చుపలకలపై చిత్రింపబడియుండునట్లు తెలుపుటను బట్టి పల్నాటి వీరచరిత్ర ఇదివఱకే యాంధ్రదేశమున మిక్కిలి ప్రసిద్ధి వహించి యుండెననుట తెలియుచున్నది. శ్రీనాథునికీ రచనతో కృత్యాద్యంత పద్యరచనతో మాత్రమే సంబంధమున్నట్లు స్పష్టము. నైషధాది గ్రంథకర్తయగు శ్రీనాథుడే యా పలనాటి వీరచరిత్ర రచయిత కూడా అయినచో దానికి అతని కాలమందే అంతటి ప్రసిద్ధి వచ్చుట అసంభవము కదా? కావున పట్నాటి వీరచరిత్రమును రచించిన శ్రీనాథుడు నైషధాది గ్రంథకర్తయైన శ్రీనాథుడు గాక చెన్నకేశవ భక్తుడై యుండిన వేఱొకడే యగును అని పేర్కొన్నాడు.

పల్నాటి వీరచరిత్ర శ్రీనాథకృతమని నానుడి కలదు. కాని తెలుగులో సారస్వత విమర్శ వచ్చినప్పటినుంచి పల్నాటి వీరచరిత్ర శ్రీనాథ కృతమా! అనే సందేహం బయలుదేరింది. శ్రీనాథుడు చెన్నకేశవ పాదసేవారతుండనని కల్లు ప్రతిష్ట అవతారిక యందు చెప్పుకొన్నట్లు కలదు. శ్రీనాథుడు శివభక్తి పరాయణుడే కాని విష్ణుభక్తి పరాయణుడు కాడు. కనుక పల్నాటి వీరచరిత్రను శ్రీనాథుడు వ్రాసియుండడు అని పింగళి లక్ష్మీకాంతం గారి అభిప్రాయము.

కాని కొంతమంది విమర్శకులు పల్నాటి వీరచరిత్ర శ్రీనాథ కృతమనే భావించారు. ఉద్దండ పండితుడైన శ్రీనాథుడు యుగకర్త. తెలుగు జాతీయకవి. ఇతడాంధ్ర దేశమంతటను పర్యటించి రాజులను దర్శించి అనేక సత్కార్యాలను పొందాడు. కొండవీటి రెడ్డిరాజుల ఆస్థానంలో శ్రీనాథుడు విద్యాధికారిగా ఖ్యాతి వహించాడు. పల్నాటి చరిత్రకు రంగమైన స్థలం శ్రీనాథుని కాలంనాటి కొండవీటి రాజ్యం లోనిదే.

తనకభిమానపాత్రమైన ఈ పల్నాటి వీరుల వృత్తాంతాన్ని శ్రీనాథుడు అంతఃప్రేరణ వల్ల కావ్యవస్తువుగా స్వీకరించి ఉండవచ్చు. అంతకు ముందే ఈ కథను పిచ్చుకుంట్లు పాడగా ప్రజలు విని తన్మయులు కావడం శ్రీనాథుడు కన్నులారా చూచి ఉండవచ్చు. దానిని అట్లే ప్రజలు పాడుకుంటూ ఆనందించాలని శ్రీనాథుడు పల్నాటి వీరుల చరిత్రను రసవంతంగా తీర్చిదిద్ది ఉండవచ్చునని భావించడం సహజమే.

చారిత్రకాంశాల ననుసరించి శ్రీనాథుడు నారికురుపుచే బాధపడుతున్న సందర్భంలో పల్నాటి వీరచరిత్రను రచించినట్లు ఊహించవచ్చు. ఆ బాధను ఉపశమింపచేసుకొనుటకు చంద్రవంక నదిలో స్నానం చేసి చెన్నకేశవస్వామిని భక్తితో పూజించాడట. అంతట రోగము ఉపశమించెనట. ఆ తరువాత ఒకనాటి రాత్రి ఆ స్వామి కలలో ప్రత్యక్షమై పల్నాటి వీరచరిత్ర రచించుమని ప్రోత్సహించగా శ్రీనాథుడు పల్నాటి వీరచరిత్రను పూర్తిగాఆవించాడు. శ్రీనాథునికి సంపూర్ణారోగ్యం చేకూరిన పిదప యధాప్రకారం విషయలోలుడుగా మారగా స్వామి ఆగ్రహించి పల్నాటి వీరచరిత్రను పరిగ్రహింపక మాలమాదిగల పాలగునని శపించాడట. అంతట శ్రీనాథుడు స్వామి అనుగ్రహింపని గ్రంథం తనకెందుకని దానిని పారవేసినట్లు జనశ్రుతిలో కథ ఉంది. ఇపుడు వ్యాప్తిలో ఉన్న పల్నాటి వీరచరిత్ర పిచ్చుగుంటుల ఆధీనంలో ఉన్నమాట వాస్తవమేనని చెప్పవచ్చు. వలను భరద్వాజ వంశ వర్ధనుడ, కవి సార్వభౌముడ ఘనత గన్నట్టి, శ్రీనాథుడను వాడ అని తన్నుగూర్చి శ్రీనాథుడు బాలచంద్రుని యుద్ధావతారికలో కంఠోక్తిగా చెప్పుకున్నాడు. కవి సార్వభౌముడు, భరద్వాజ గోత్రుడు, అయిన మరొక శ్రీనాథుడు

అవతరించేదాకా శృంగార నైషధకర్తయైన శ్రీనాథుడే పల్నాటి వీరచరిత్ర కర్త అని భావింపవచ్చును.

**ఇతివృత్తం :**

ఉత్తర హిందూదేశంలో బాలమాచాపురి అనే ప్రదేశాన్ని హైహయ వంశీయుడైన అనుగురాజు పాలిస్తూ ఉండేవాడు. తన వంశానికాది పురుషుడైన కార్తవీర్యార్జునుడు జమదగ్నిని చంపి కామధేనువును అపహరించడంవల్ల కలిగిన పాపపరిహారార్థం తీర్థయాత్రలకై వెళ్ళాడు. గయనుజేరి ఆ దేశ పాలకుడైన భీమరాజు పుత్రిక భూరమాదేవిని పరిణయమాడి పిదప ఆంధ్రదేశంలోని మోటుపల్లి చేరి కొన్నాళ్ళుండ దానికి నిశ్చయించుకున్నాడు.

అనుగురాజు తనతోపాటు పట్టమహిషి విజ్జలదేవి ద్వితీయభార్య భూరమాదేవిని మంత్రి అయిన బ్రహ్మనాయుడిని సైన్యాధిపతి తెప్పలినేనిని, కొంత పశుగణాన్ని, కొంత సైన్యాన్ని వెంట తెచ్చుకున్నాడు.

పశుగణానికి గ్రాసం లేకపోవడం వల్ల అనుగురాజు తెప్పలినేనిని సమీప గ్రామంలోనికి పంపి గ్రాసం తెప్పించారు. తెప్పలినేనిని మార్గ మధ్యంలో ముత్యాల వంటి జొన్నకంకుల్ని ఒక పొలంలో చూచాడు. ఆ పొలాన్ని కొనాలనుకొని కాపునడుగగా అతడు అంగీకరించలేదు. అనుగురాజు అనుమతితో బలవంతంగా ఆ చేను గోయించి బండ్లపై కెక్కించాడు. అందుల కాదేశపు రాజగు పేరమరాజు కోపించి తెప్పలినేనిని అడ్డగించాడు. యుద్ధంలో పేరమరాజు నిహతుడయ్యాడు. రాజులలో అనుగురాజొక్కడే రాజుగాని తక్కిన రాజులు స్త్రీ సమానులని తెప్పలినేని ఒక శాసనం ప్రతిష్ఠించాడు. ఈ శాసనానికి కోపించి చందవోలు రాజు అనుగురాజుపై దండెత్తి వచ్చాడు. తెప్పలనేని తమ్ముడగు పేర్నీడు ఆ యుద్ధంలో చందవోలు రాజు పల్నాడు ప్రాంతం ఇచ్చాడు.

ప్రతీకారవాంఛతో పేరమరాజు కుమారుడు ఉత్తరుడు పరిసర రాజుల గూర్చుకొని అనుగురాజుపై యుద్ధాన్ని ప్రకటించాడు. తెప్పలినేని వధింపబడ్డాడు. కాని బ్రహ్మనాయుని ధాటికోడి కప్పం చెల్లించడానికి అంగీకరించి సంధి చేసుకొన్నాడు.

కొంతకాలానికి పిజ్జలదేవికి పెదమలి దేవుడు, పినమలిదేవుడు, బాలమలిదేవుడు అనే ముగ్గురు పుత్రులు జన్మించారు. భూరమాదేవికి కామరాజు, నరసింగరాజులని ఇద్దరు కుమారులు కలిగారు. మైలమాదేవికి నలగామరాజు పుట్టాడు. కాలక్రమంగా పిల్లలు పెరిగి యుక్తవయస్కులయ్యారు. నలగామ నరసింగరాజుల వివాహాలు వైభవంగా జరిగాయి.

ఒకనాడనుగు రాజు వేటకుబోయి మరలి వస్తుండగా జిట్టగామలపాడు నివాసి, ఆర్వెల్ల వారి కోడలు వీరజగ్గారెడ్డి కూతురు అయిన నాగమ్మ సకల సత్కార్యాలు చేసి చక్కని విందు ఇచ్చింది. సంతుష్టుడైన రాజు ఏదైనా కోరుకొమ్మన్నాడు. ఏడు గడియల కాలం పలనాటికి మంత్రిణిగా నుండునట్లు వ్రాయించుమని కోరింది. రాజట్లే చేశాడు. రాజు ప్రాపు పొందిన నాగమ్మ తరచు గురజాలకు వస్తూపోతూ ఉండేది. ఆమె రాకపోకలు బ్రహ్మనాయుడికి నచ్చక ఆమెపట్ల ఉదాసీనంగా ఉండేవాడు. అతని తృణీకారం నాగమ్మకు క్రోధకారణమైంది.

అనుగురాజు మరణించిన తరువాత గురజాలకు నలగామరాజు ప్రభువు, బ్రహ్మనాయుడు మంత్రి అయ్యారు. నాయకురాలొకనాడు నలగాముని చేరి అనుగురాజు ప్రసాదించిన పత్రాన్ని జూపి పాలనాధికారం కోరింది. నలగామరాజు అంగీకరించాడు.

నాగమ్మ బ్రహ్మనాయుని స్నేహితుల యిండ్లు దోయించి లెక్కకు మిక్కుటంగా ధన,కనక వస్తు సముదాయం రాశులుగా పోయించి ఇదంతా ప్రభుత్వధనమని బ్రహ్మనాయుడు అక్రమంగా దీనిని తన ఆప్తుల యిండ్లలోదాచుకొన్నాడని బ్రహ్మనాయుడు మలిదేవుని గురజాల ప్రభువును చేయటానికి రహస్య యత్నములు చేస్తున్నాడని గల్పించి నలగాముని నమ్మించి బ్రహ్మనాయునిపై ద్వేషం పెంచింది. మలిదేవాదులను కారాగారం పాలు చేయించింది. బ్రహ్మన్న కన్నమనీడను మానసపుత్రుని బంపి మలిదేవాదుల విడిపించి చంద్రవంకకు ఆవలి భాగాన్ని మలిదేవాదులకు పాలుగా ఇప్పించి మాచర్ల పట్టణం గట్టించి అచట చెన్నకేశవుని ప్రతిష్ఠించి మలిదేవరాజుకు మంత్రి అయ్యాడు.

కళ్యాణ పురాధీశ్వరుడైన వీరసోముని పుత్రిక సిరాదేవినిచ్చి మలిదేవునకు వివాహం చేయమని బ్రహ్మనాయుడడిగి కాదనిపించుకున్నాడు. వీరసోముని తమ్ముడగు నంది సోముని కూతురు నాగులాదేవి మేనమామ అయిన శివసింగుని ప్రేమించి రహస్యంగా పారిపోయి శివసింగుని కోట అయిన శివనంద్లలో అతని పరిణయమాడింది. వివాహానికంగీకరించని నందిసోముడు, వీరసోములు కలిసి శివనంద్ల కోటను ముట్టడించాడు. కాని కోట స్వాధీనం కాలేదు. సిరాదేవుని మలిదేవ రాజుకిచ్చు ఒప్పందంపై బ్రహ్మనాయుని సహాయం కోరింది. బ్రహ్మనాయుడు శివసంద్ల కోటను జయించాడు. నాగులాదేవి శివసింగులాత్మహత్య చేసుకొన్నారు. శివసంద్లనున్న 'భూతరాట్నంభాన్ని' దెచ్చి త్రిపురాంతకంలో ప్రతిష్టించాడు. సిరాదేవి మలిదేవరాజుల వివాహం కన్నుల పండువుగా జరిగింది. కొంత పశుగణాన్ని కొందరు జట్టీలను సిరాదేవి అరణంగా తెచ్చింది.

పొరుగున బలమైన రాజ్యముండడం క్షేమం కాదని తలచి నాయకురాలు బ్రహ్మనాయుని కోడిపందేలుకు ఆహ్వానించింది. బ్రహ్మనాయుడు పానుగల్లుపురం నుంచి చిట్టిమల్లుడనే కోడిపుంజును తెప్పించాడు. బ్రహ్మనాయుని విడిదికి నాగమ్మ విషాహారం పంపింది. బ్రహ్మనాయుడా విషాహారాన్ని జీర్ణించుకున్నాడు. బ్రహ్మనాయనాదులు కూర్చోడానికి గరిడీ ప్రక్కన ఒక పాతర త్రవ్వించి అందులో పెద్ద

నారసాలు పెట్టించి కీలులాగిన పదేట్లు ఒక తమగం ఏర్పాటుచేసింది. కట్టుబోతుల రావించి మంత్రతంత్ర సహాయంతోపోరులో జెట్టమల్లుని చంపించింది. ఆ తరువాత బ్రహ్మన్న మలిదేవాదులు అరణ్యవాసానికి బయలుదేరారు. చెన్నకేశవుని ఆభరణాన్ని వెల్లకంట్లపు కోడిపై నుంచి కొంత ఆలమందను దీసుకొని కృష్ణను చేరుకొన్నారు. అక్కడ ఒక పులికంట్లకు కోడిపై దూకి దానిని సంహరించింది. ఆలకాపరి అయిన లంకన్న దానినదిలింపలేకపోయాడు. బ్రహ్మనాయుడరుదెంచి పులిని సంహరింపయత్నించాడు. పులి గంధర్వుడయ్యెను ముని శాపం వల్ల అలా అయ్యానని తెల్పి తన లోకానికి వెళ్ళిపోయాడు గంధర్వుడు. బ్రహ్మన్న తన పరివారంతో కృష్ణను దాటాలని ఆలోచించాడు. మొసలి ఉన్నదనీ, అది పెక్కండ్రను చంపిందని విని తాను కృష్ణలో దూకి మొసలిని ఖండించాడు. అది ఒక గంధర్వాంగనగ మారి దుర్వాసుని శాపంతో భర్త వ్యాఘ్రమూ,తాను మొసలి రూపాలు చెందినట్లూ చెప్పి అంతర్థితమయింది. మరుదినం బ్రహ్మన్న తన అనుచరులతో కృష్ణను దాటి మండాదిని చేరి నివాసం ఏర్పరచుకొన్నారు.

నాగమ్మ అర్థవీటినున్న పలినేనిని పిలిపించి మలిదేవుని ఆలమంద లను తోలి తెమ్మని పంపించింది. పలినేని ఆలమందకు కావలి ఉన్న లంకన్నను జంపి గోవులను తెస్తూండగా కన్నమనీడు అడ్డుపడి పలినేనిని సంహరించి పశుగణాన్ని మరలించుకొని వెళ్ళాడు. బ్రహ్మనాయుడు ఆగ్రహించి నలగాముని పైకి ఒంటరిగా యుద్ధానికి పోయాడు. నలగాము డెదిరింపలేక గంగగుడికి పారిపోయి అచ్చట తలదాచు కొన్నాడు. బ్రహ్మనాయుడు వెంబడించి రాగా గంగ సాక్షాత్కరించి నలగాముని వదలుమన్నది. వదలిపెట్టి బ్రహ్మనాయుడు తిరిగి మండా దికి మరలిపోయాడు. మచ్చరం పెచ్చుపెరగడం మంచిది కాదని ఎరిగి బ్రహ్మన్న మండాదినుంచి మేడపికి వలసపోయాడు. గడువు సమయం పూర్తికాగా నలగాముని అల్లుడూ, ఇరువురకు కూర్చువాడూ అయిన అలరాజును సంధి గూర్చి రాయబారిగా పంపించారు. సంధి పొసగలేదు. నాగమ్మ అలరాజును విషప్రయోగంతో చంపించింది. అలరాజు భార్య పేరమ పతితో సహగమన మాచరించింది.

బ్రహ్మనాయుడు తన సేనలను తీసుకొని కార్యమపూడి యుద్ధక్షేత్రా నికి బయలు దేరాడు. తిపురాంతకంలో ఉన్న 'భూతరాట్కంబాన్ని' కార్యమపూడి యొద్ద ప్రతిష్టించారు. రణభట్టును మరొక పర్యాయం రాయబారమంపారు. భట్టు యుద్ధం వల్ల నష్టాలను పేర్కొని సంధి చేసుకొని మెలగడం సరసమని నొక్కి వక్కాణించాడు. ఈ సంధియత్నం విఫలమయింది. నలగామరాజు సామంతులందరికి యుద్ధానికి దోడు గమ్మని బాసపత్రాలంపించాడు. వారును తమ సైన్యాలతో నలగాముని చేరుకొన్నారు. ఇరుసైన్యాలు కార్యమపూడి కదనరంగంలో మోహరించాయి. మేడపిలో నొకనాడు బ్రహ్మనాయుని కుమారుడైన బాలచంద్రుడు తన సైదోడులను కూడుకొని బొంగరపులాట లాడుతుండగా బాలచంద్రుని బొంగరం అదుపుతప్పి కోమటి అన్నమ్మ అనే ప్రేక్షకురాలి పాదానికి తగిలింది. అన్నమ బాలచంద్రుని కార్యమపూడి యుద్ధరంగంలో ఉన్న తండ్రికి దోడుపడక పోతరించి కొట్టుకుంటున్నాడని పరిపరివిధాల దూషించింది. బాలుడు తల్లి ఐతమ్మను ఒప్పించి సగంగడీంద్రతో యుద్ధ భూమికి బయలుదేరి త్రోవలో భార్య మాంచాల ప్రోత్సాహం పొందదా నికి ఆమె సౌధానికి వెళ్ళాడు. మాంచాల సౌందర్య రసాస్వాద నానికి లాలసుడై కాలం మరిచిపోయాడు. తోడువచ్చిన అనపోతాదులు హెచ్చరించగా బాలుడు కర్తవ్యోన్ముఖుడు కాగా మాంచాల అనపోతు బ్రాహ్మణుడు కావడం వల్ల బ్రహ్మ హత్యాపాతకం సోకకుండా అతనిని వెనుకకు మరలింపుమని చెప్పి బాలచంద్రుని ప్రోత్సాహపరచి పంపింది.

బాలచంద్రుడు చెలికాండ్రు గలసి తన ముత్యాలహారం, ముద్దు టుంగరంమాంచాల సౌధంలో మరచిపోయానని బొంకి వానిని తెమ్మని అనపోతుని వెనుకకు బంపించాడు. కార్యమపూడి దగ్గర తిరిగి సంధి ప్రయత్నాలుసాగుతున్నాయి.అనపోతు మాంచాలసౌధానికేగి నిజమారసి తిరిగి వస్తుండగా ఆనతి లిఖించిన సత్రం జూచి మిక్కిలి దుఃఖించి ఆత్మహత్య గావించుకున్నాడు. ఇది బాలునికి తెలిసింది. బాలచంద్రుడు గ్రుడ్డై సభను ప్రవేశించి ఎవరెన్ని చెప్పినా తానును యుద్ధ భూమికి బోవ, మాననని పల్కినాడు. సంధి ప్రయత్నాలు మరొక్కసారి విఫలమయ్యాయి.

ఇరుపక్షాలవారు యుద్ధానికి తలపడ్డారు. ప్రతిన మేరకు బాలచంద్రుడు నరసింగరాజు తలను ఖండించి తుదకు రణభూమిలోనే హతుడయ్యాడు. కొమ్మరాజాదులు మరణించారు. ఇంతటి జనక్షయానికి తానే కారకుడని హరధారణాన మలిదేవుడు ప్రాణాలు వదిలాడు. బ్రహ్మనాయుడు రణ రంగంలో విజృంభించి అనేకులు యోధులను సంహరించాడు. బ్రహ్మనడొడు తాళజాలక నలగామరాజు కొదమగుండ్లకు పారి పోయాడు. నాగమ్మ ఎటు పారిపోయిందో తెలియదు. కొదమగుండ్ల లోని విప్రులు నలగాముని దయ చూడవలసిందిగా కోరారు. వారి కోరిక మన్నించి నలగామునకనేక నీతులు గరపి తిరిగి అతనిని గురజాలకు పట్టాభిషిక్తుని చేసి అటనుండి వెళ్ళిపోయాడు.

ఈవిధంగా శ్రీనాథ కృతంబైన 'పల్నాటి వీరచరిత్ర' వైవిధ్యభరిత మైన వర్ణనలతో, కథాకథనంతో అలరారుచున్నది. సందర్భోచిత పాత్ర చిత్రణ, చక్కటి భావవ్యక్తీకరణ శ్రీనాథుని ప్రతి పద్యము నందు ద్యోతకమగును. 'పల్నాటి వీరచరిత్ర' ఆసాంతము హృద్యముగను, మనోజ్ఞముగను శోభిల్లుచున్నది.

చిరునామా : *డా॥ పి. ఉష, తెలుగు శాఖాధ్యక్షులు, మారిస్ స్టెల్లా కాలేజి, విజయవాడ, సెల్ : 9703196520*

డా॥ కప్పగంతు రామకృష్ణ

# పత్రికల రాజధాని కృష్ణాతీరం

సమాజ గమనానికి కారకమైన అంశాలను ప్రస్తావించాల్సివస్తే నేటితరంలో పత్రికలను కూడా చెప్పాల్సివస్తుంది. సమాజ సభ్యుల్లో ఆలోచనా ధోరణి కొత్తపుంతలు తొక్కడానికి, సమకాలీన అంశాలపట్ల అవగాహన పెరగడానికి పత్రికలు చేస్తున్న కృషి అనిర్వచనీయం.

'చుట్టూ ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూచునే కంటే ఓ చిరుదీపం వెలిగించు' అని ఓ కవి చెప్పినట్లు అనేక సమస్యలతో సతమతమవుతూ, నడిచేందుకు ఇబ్బందిపడే సమాజ నావను సరైన దిశలో పయనింపజేసే దిక్సూచికలుగా పత్రికల్ని పేర్కొనవచ్చు. మానవుడు ఆశాజీవి. అనేక అంశాలపట్ల ఆసక్తి కలిగిన బుద్ధిజీవి.కానీ ఈ అంశాలు అతని దృష్టికి తెచ్చేదెవరు? ఇలాంటి ప్రశ్నలకు తేలికగా సమాధానాలు చెప్పే అక్షర దర్పణాలు పత్రికలు.

ఓ నిరుద్యోగి ఉపాధి కోసం వెతకులాడాలనుకున్నా, ఓ నిరుపేద తన కూతురిని అత్తవారింటికి పంపించేందుకు వేట సాగించాలనుకున్నా, ఓ రాజకీయ పక్షి విజయావకాశాల కోసం వెర్రిగంగలెత్తినా, ఓ విద్యార్థి తన అదృష్టాన్ని పరీక్షించుకోదలచినా ముందుగా పత్రికలనే ఆశ్రయిస్తారు. అనుక్షణం పత్రికలనే వెతుకుతుంటారు. పత్రికల్ని సమాజం నుంచి విడదీయలేం. అనాది నుంచి ఇది కొనసాగుతోంది. సంఘ సంస్కరణలతోను, సమాజోద్ధరణలతోను మొదలైన పత్రికా వ్యాసంగం ఎన్నో ప్రయాసలకోర్చి, ప్రసవ వేదనలు దాటి విశ్వమంతా వ్యాప్తి చెందింది. నల్లధనం ఆచూకీ, దగాకోర్ల చిరునామాలు, పైరవీకార్ల ప్రహసనాలు...ఒకటేమిటి సమాచారం చేరవేతలో వీటికి మించిన సాధనం మరొకటి లేదు.

అందుకనే పత్రికలు లేని సమాజాన్ని ఊహించుకోవడం కష్టమనే నానుడి వ్యాప్తిలో ఉంది. పొద్దునే నిద్రలేవగానే ఒక చేత్తో కాఫీ కప్పు, మరోచేత్తో దినపత్రిక పుచ్చుకునేవారు ఎందరో ఉన్నారు. సమాజ జీవితంతో ఇంతగా పత్రికలు తమ అనుబంధాన్ని పెనవేసుకున్నాయి. ఇంత జరగడానికి వెనుక పెద్ద చరిత్రే ఉంది. దాదాపు 150 సంవత్సరాలకు పైబడిన పత్రికారంగ చరిత్ర, అందులోను 100 సంవత్సరాలకు పైబడిన తెలుగు పత్రికారంగ చరిత్ర... తక్కువ వ్యవధేమీ కాదు. ప్రజల ఆశయాలు,ఆకాంక్షలకు దర్పణంగా నిలిచిన కారణంగా దిన పత్రికలే నేటి సమాజాన్ని అత్యంత వేగంగా, అత్యధికంగా ప్రభావితం చేసే స్థితికి చేరుకున్నాయి. ఇంకా చెప్పాలంటే... ఓ రకంగా ఆంధ్ర రాష్ట్ర రాజకీయాలకు తెలుగు దినపత్రికలు దిశానిర్దేశం చేస్తున్నాయి.

వాస్తవానికి పత్రిక అంటే దినపత్రిక, వార, పక్ష, మాస, వార్షిక లేదా మరే ఇతర పత్రిక అయినా కావచ్చు. కానీ, ఉషోదయంతోపాటు తాజా వార్తలతో పలకరించే దినపత్రిక అంటేనే పాఠకులకు ఎంతో మక్కువ. అందుకనే పత్రిక అంటే దినపత్రిక అనే అర్థం సమాజంలో బాగా పాతుకుపోయింది.

కృష్ణాతీరం విషయానికొస్తే తొలి తెలుగు దినపత్రిక 'దేశాభిమాని' కృష్ణాతీరంలోని విజయవాడలోనే పుట్టింది. పాతకాలం దినపత్రిక అనగానే చిన్నా పెద్దా అందరూ ఠక్కున చెప్పే కృష్ణాపత్రిక పుట్టినిల్లు కూడా కృష్ణాతీరమే. నాటినుంచి నేటిదాకా వందలసంఖ్యలో వివిధ రకాల పత్రికలు కృష్ణమ్మ ఒడ్డున పురుడు పోసుకుని, కృష్ణాతీరానికి పత్రికల రాజధానిగా పేరు తీసుకువచ్చాయి.

సారవంతమైన నదీప్రాంతం కావటం, పంటలు బాగా పండి, ప్రజలు ఆర్థికంగా ఉన్నతస్థాయిలో ఉండటం, నదీతీరంలో వేగంగా అభివృద్ధి చెందిన నాగరికత, వేగవంతమైన ముద్రణ, రవాణా సౌకర్యాలు ఉండటం, అన్నిటినీ మించి రాజకీయంగా, సామాజికంగా ఎక్కువ చైతన్యం ఉన్న ప్రాంతం కావటంతో కృష్ణాతీరం పత్రికలకు నిలయంగా మారింది.

తెలుగులో తొలిపత్రిక ఏదనే విషయంలో అనేక వాదోపవాదాలు నడుస్తున్నప్పటికీ తొలి తెలుగు దినపత్రిక మాత్రం దేశాభిమాని అనే విషయంలో ఎటువంటి సందేహం లేదు. ఇప్పటివరకు లభించిన ఆధారాలన్నీ ఈ విషయాన్ని రూఢి చేస్తున్నాయి.దేవగుప్తం శేషాచలపతి రావు దీనికి వ్యవస్థాపకుడు.

బెజవాడ నుంచి కృష్ణావృత్తాంతిని, కృష్ణా న్యూస్ పేర్లతో కొంత కాలం వెలువడిన ఈ పత్రిక అనంతరకాలంలో దినపత్రికగా మారినట్లు

తెలుస్తోంది. కృష్ణాపత్రిక 1906, మార్చి సంచికలో చెన్నాప్రగడ వేంకట కృష్ణరాయశర్మ తెలుగు పత్రికలు అనే వ్యాసంలో 'దేశాభిమాని యొక్క సారిగనే దినపత్రికగా మారినది' అని రాశారు. దీని ఆధారంగా 1906కు పూర్వమే దేశాభిమాని దినపత్రికగా వెలువడిందని తెలుస్తోంది. అలాగే 1910 నాటి ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో అప్పటికి దేశంలో వెలువడిన / నడుస్తున్న పత్రికల వివరాలు ఇచ్చారు. ఇందులో దేశాభిమానిని మాత్రమే దినపత్రికగా పేర్కొన్నారు.

తెలుగు జనాభా పత్రిక 1901 సెప్టెంబరు సంచికలో శ్రీపాద గోపాలకృష్ణమూర్తి శాస్త్రి నడుపుతున్న గౌతమి పత్రిక గురించి రాసిన వ్యాసంలో "ఆంధ్రలోకమున గౌతమియే మొదటి దినపత్రిక కాదు. అట్టి భాగ్యము కృష్ణకే లభించినది. కానీ అది కృష్ణవెల్లువల వలెనే మూడునాళ్ళ మురిపమేయై సింధు గతమైనది. ఇదివరకు బెజవాడలో నుండి, ఈ మధ్య కృష్ణ దాటి గుంటూరు జొచ్చిన దేశాభిమాని కొంత కాలం క్రిందట దినదినమును దలచూపుచు వచ్చెను. ఇప్పుడు ప్రచురమగుచున్న గౌతమి పత్రిక యొక్క మొదటిపుటలో..." అని ఉంది.

ఈ ఆధారాలన్నీ దేశాభిమానినే తొలి తెలుగు దినపత్రికగా ప్రకటిస్తున్నాయి.. ఈ పత్రిక ఖరీదు మూడు పైసలు. దాదాపు 30 సంవత్సరాలు ఈ పత్రిక నడిచింది. ఈ విధంగా తెలుగులో తొలిగా దినపత్రికను వెలువరించిన ఖ్యాతి కృష్ణాజిల్లాలోని విజయవాడకు దక్కుతోంది. విమర్శల్ని నిర్మొహమాటంగా ప్రచురించటంతోపాటు నాటి బ్రిటిష్ ప్రభుత్వ అధికారుల చర్యల్ని సైతం విమర్శిస్తూ వ్యాసాలు ప్రచురించటంతో దేశాభిమాని పేరుకు తగ్గట్టుగానే ప్రజల అభిమానాన్ని సొంతం చేసుకుంది.

బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీవారు 1611లో మచిలీపట్నం ఓడరేవు దగ్గర ఫ్యాక్టరీ స్థాపన చేయడంద్వారా ఆంధ్రదేశంలో కాలు మోపారు. ఈరకంగా విదేశీయుల పరిపాలన కాలంలోనే మచిలీపట్నం ప్రధాన వ్యాపారకేంద్రంగా రూపుదిద్దుకుంది. ఆ కాలంలో కృష్ణాజిల్లాను కృష్ణామండలంగా వ్యవహరించేవారు. ఇప్పటి కృష్ణాజిల్లా, గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాలు కలిసి కృష్ణామండలంగా ఉండేవి. ఈ ప్రాంతంలోని చైతన్యవంతులైన యువకులంతా కలసి 1902లో కృష్ణాజిల్లా సంఘాన్ని స్థాపించి, సంఘం పక్షాన ఓ పత్రికను కూడా నడపాలని నిర్ణయించారు. దీంతో కొండా వెంకటప్పయ్య, దాసు నారాయణరావు సంయుక్త సంపాదకులుగా 1902, ఫిబ్రవరి 1న 'కృష్ణాపత్రిక' విడుదలైంది.

ప్రారంభం నుంచి 1905 వరకు పక్షపత్రికగా నడిచిన కృష్ణాపత్రిక 1906-07 మధ్యకాలంలో వారపత్రికగా మారింది. దాసు నారాయణరావు మరణంతో ఆయన స్థానంలో ముట్నూరి కృష్ణారావు సహాయ సంపాదకుడిగా కృష్ణాపత్రికలో చేరారు. కొంతకాలానికి వెంకటప్పయ్య గుంటూరుకు తన మకాం మార్చటంతో, కృష్ణాపత్రిక పూర్తిబాధ్యతలు కృష్ణారావు చేపట్టారు. ముట్నూరి సంపాదకత్వంలో ఆంధ్రజాతి పునరుజ్జీవనానికి, అభ్యుదయ కళాకవిత్వ వికాసానికి కృష్ణాపత్రిక వేదికగా మారింది. సాంఘిక, రాజకీయ, ఆర్థిక, శిల్ప, సాహిత్య కళారంగాలపై ఎన్నో విలువైన వ్యాసాలు ఇందులో ప్రచురితమయ్యేవి. వీటికి తోడుగా కృష్ణారావు సంపాదకీయాలు పత్రికకు మరింత శోభ తెచ్చేవి. కేవలం ముట్నూరి సంపాదకీయాలకోసమే కృష్ణాపత్రిక చదివేవారనడం అతిశయోక్తి కాదు. పింగళి నాగేంద్రరావు, కాటూరి వేంకటేశ్వరరావు, విశ్వనాథ సత్యనారాయణ,కొడాలి ఆంజనేయులు, విశ్వనాథ వేంకటేశ్వర్లు, సర్వా వెంకట శేషయ్య, సబ్నివీసు రామారావు, సబ్నివీసు గురునాథరావు, శేషాద్రి రమణ కవులు, వేమూరి వేంకట రామనాథం, వేమూరి రామకృష్ణ, కొడాలి వేంకట సుబ్బారావు వంటి ప్రముఖుల రచనలు ఇందులో వచ్చేవి.

కృష్ణాపత్రిక తర్వాత కృష్ణాజిల్లాలోనే ఊపిరిపోసుకుని, నేటికీ ప్రజల ఆదరణ పొందుతున్న దినపత్రికలు ప్రజాశక్తి (1965), విశాలాంధ్ర (1952), ఆంధ్రజ్యోతి (1960).

వీటితోపాటు 50కి పైగా దినపత్రికలు కృష్ణాజిల్లా / విజయవాడలో ప్రారంభమైనట్లు రిజిస్ట్రార్ ఆఫ్ న్యూస్ పేపర్స్ వద్ద సమాచారం ఉంది. అయితే, వీటిలో నాలుగైదు పత్రికలు మినహాయిస్తే, మిగిలిన పత్రికల ఉనికి కూడా బహిరంగవిపణిలో కనిపించదు.

తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి 1919 ప్రాంతంలో ప్రారంభించిన 'సాహితి' తొలి ద్వైమాసిక పత్రిక. ఆ తర్వాతనే తెలుగులో ద్వైమాసిక పత్రిక ప్రచురణ ప్రారంభమైది. ఆనాటికి విఖ్యాతులైన వారితో శంకర శాస్త్రి తెనాలిలో 1919లో 'సాహితీ సమితి' నెలకొల్పారు. చింతా దీక్షితులు, నోరి నరసింహశాస్త్రి, మునిమాణిక్యం నరసింహారావు, మొక్కపాటి నరసింహశాస్త్రి, నండూరి సుబ్బారావు, నాయని సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, దేవులపల్లి కృష్ణశాస్త్రి తదితరులంతా 'సమితి'లో సభ్యులుగా ఉండేవారు. వీరందరి కవిత్వంతో నిండిన 'సాహితి' నిజంగానే సాహితీలోకంలో నిండుకుండగా భాసించింది. వ్యావహారిక వాదానికి ఇది ప్రాధాన్యం ఇవ్వడంతో పాఠకలోకంలో ఈ పత్రికకు ఆదరణ త్వరగా లభించింది. 'కవిసామ్రాట్' విశ్వనాథ సత్యనారాయణ సంపాదకత్వంలో 1927లో జయంతి ద్వైమాసిక పత్రికగా ప్రారంభమైది. మచిలీపట్నం, మద్రాసు రెండు ప్రాంతాల నుంచి ఇది వెలువడేది.

కె.రమ సంపాదకత్వంలో 1992 నుంచి మాతృక పేరుతో ద్వైమాసిక పత్రిక వెలువడుతోంది. దీనికి విజయవాడ ప్రచురణ కేంద్రం. ఈ పత్రిక శీర్షిక కింద 'ప్రగతిశీల మహిళా కరదీపిక మన మాతృక' అని రాసి ఉంటుంది. వీటితో పాటు వి. దక్షిణామూర్తి సంపాదక

త్వంలో జ్యోతిర్వేద (1968), టి. శామ్యూల్ సంపాదకుడిగా క్రీస్తులో విమోచనం (1992), సి.అబ్రహాంవెస్లీ (1996) సంపాదకుడిగా నిప్పు రవ్వలు (1996), దోరోతి జయరావు సంపాదకుడిగా పాలించు ద్రాక్షవల్లి (2002), ఎ. శేషాద్రి సంపాదకత్వంలో 2003లో శ్రీ దత్త వాణి (ఆంధ్రాంగ్ల భాషల్లో వెలువడింది). అదే ఏడాది చుక్కపల్లి కుశ లవ సంపాదకుడిగా ఆంధ్ర ఛాంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీ సమాచార్ (ద్విభాషా పత్రిక), పి.థామస్ వర్గీస్ సంపాదకత్వంలో ధ్వజం (ఇంగ్లిషు) పత్రికలు విజయవాడ కేంద్రంగా వెలువడ్డాయి.

కృష్ణాజిల్లా అరవిందపురం నుంచి 2000లో దివ్యదీపిక పేరుతో మరో ద్వైమాసిక పత్రిక వెలువడినట్లు ఆర్.ఎన్.ఐ. సమాచారం. కె. భాస్కరరావు దీనికి సంపాదకుడు. పి.అబ్రహాం శామ్యూల్ సంపాద కుడిగా బానర్ ఆఫ్ ట్రూత్ పేరుతో విజయవాడనుంచి ఆంగ్ల ద్వైమాసిక పత్రిక వెలువడినట్లు కూడా ఆర్.ఎన్.ఐలో నమోదైంది. ఇంతకుమించి ఈ పత్రికకు సంబంధించిన వివరాలు మృగ్యం.

త్రైమాసిక పత్రికల విషయంలోనూ ద్వైమాసిక పత్రికల తీరే కని పిస్తుంది. ఇవికూడా 1910వరకు వెలువడినట్లు ఆధారాలు లభించ డం లేదు. అయితే 1916లో రెండు త్రైమాసిక పత్రికలు వెలువడ్డా యని, అయితే అవి క్రైస్తవ మత ప్రచారం కోసమే పనిచేశాయని, ప్రారంభించిన కొంతకాలానికే మూతపడ్డాయనిడాక్టర్ జె.చెన్నయ్య తన తెలుగు దినపత్రికలు-భాషాసాహిత్య స్వరూపం (పుట 54)లో రాశారు. 1912లో వచ్చిన ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక ఆనాటి త్రైమాసిక పత్రికల్లో ఎంతో పేరుపొందింది. ఇది కృష్ణాజిల్లాకు చెందిన పత్రిక కానప్పటికీ త్రైమాసిక పత్రికల్లో చారిత్రాత్మక స్థానం పొందింది.

ఇక, కృష్ణాజిల్లాలో వెలువడిన త్రైమాసిక పత్రికలను పరిశీలిస్తే 1915లో అయ్యంకి వెంకటరమణయ్య విజయవాడనుంచి ప్రారంభిం చిన గ్రంథాలయ సర్వస్వం కనిపిస్తుంది.ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం ఆధ్వర్యంలో నడిచిన ఈ పత్రిక గ్రంథాలయోద్యమ వ్యాప్తికి ఎంతగానో పాటుపడింది.ప్రారంభించిన రెండేళ్ళకు ద్వైమాసిక పత్రికగా మారి, ఆరవ సంపుటం నుంచి మాసపత్రికగా వెలువడింది. విజయవాడ నుంచే 1946లో అభ్యుదయ పేరుతో త్రైమాసిక పత్రిక వెలువడింది. కొమర్రాజు వినాయకరావు దీనికి సంపాదకుడు. నాట్యకళకు సంబం ధించిన విషయాలతో 1956లో నాట్యకళ పేరుతో మరోపత్రిక వచ్చింది. విజయవాడనుంచి వెలువడిన ఈ పత్రికకు శ్రీనివాస చక్రవర్తి సంపాదకుడు.

ఇక్కడినుంచే 1999లో పి.ఎం.శామ్యూల్ సంపాదకుడిగా గాస్పెల్ ఇల్యూమినేటర్, కె.ఎస్.రావు సంపాదకుడిగా కలంకారీ అనే ఆంగ్ల త్రైమాసిక పత్రికలు వెలువడ్డాయి. కె.భాస్కరరావు సంపాదకత్వంలో గుడివాడ నుంచి 2001లో దివ్యదీపిక, కె.సి.హెచ్.పున్నయ్యచౌదరి సంపాదకుడిగా బ్యాడ్మింటన్ హౌస్ (2002) పత్రికలు వెలువడ్డాయి.

చలపాక ప్రకాష్ సంపాదకుడిగా 2003 నుంచి విజయవాడ కేంద్రంగా వెలువడుతున్న త్రైమాసిక పత్రిక రమ్యభారతి. తెలుగుభాషా సాహిత్యాలకు సంబంధించిన వ్యాసాలు ఇందులో ఎక్కువగా వస్తుం టాయి. తెలుగు సాహిత్యంలోని విభిన్న ప్రక్రియలను కూడా ఈ పత్రిక ఆదరిస్తోంది. ఇక్కడినుంచే కె.ఆర్.కె.ప్రభాకరమూర్తి సంపాదకుడిగా హోమియోపతిక్ మెడికల్ అబ్జర్వర్ (2009) ఆంగ్లభాషలో వెలువడుతోంది.

విజయవాడ కేంద్రంగా వి.సుదర్శనం సంపాదకుడిగా యువకృష్ణ పేరుతో మరో పత్రిక వెలువడింది. ఇది ఆంధ్రాంగ్ల భాషల్లో వెలువడి నట్లు ఆర్.ఎన్.ఐ. సమాచారం. అలాగే, కృష్ణాజిల్లా అంపాపురం నుంచి పాటిబండ్ల మాధవశర్మ సంపాదకత్వంలో ఉదయభారతి పేరుతో త్రైమాసిక పత్రిక వెలువడినట్లు తెలుస్తోంది. ఈ పత్రికలకు సంబంధిం చిన ఇతర వివరాలు లభ్యం కాలేదు.

చేబ్రోలు సరస్వతీదేవి ముద్రాపకురాలు మరియు సంపాదకు రాలిగా శ్రీ వైజయంతి, వార్షికపత్రిక పేరుతో రెండు వార్షికపత్రికలు వెలువడ్డాయి. కృష్ణాజిల్లా నూజివీడు కేంద్రంగా 1933లో ఇవి వచ్చాయి. నూజివీడు సంస్థానానికి సంబంధించిన వార్తలే వీటిలో ఎక్కువగా ఉండేవి. జి.ఎ.ప్రకాశరావు సంపాదకత్వంలో 1999లో విజయవాడనుంచి పీపుల్ టీచర్ పేరుతో ఆంధ్రాంగ్ల భాషల్లో వార్షిక పత్రిక వెలువడింది. సంక్రాంతి పేరుతో ఎం.కృష్ణారావు సంపాదకుడిగా మచిలీపట్నంనుంచి వార్షిక పత్రిక విడుదలైనట్లు అనధికారిక సమాచారం.

ఇతర ఆవర్తన వ్యవధుల్లో అంటే వార, పక్ష, మాస, ద్వైమాసిక, అర్ధవార్షిక, వార్షిక పత్రికల విషయానికొస్తే వందల సంఖ్యలో ఆయా పత్రికలు కృష్ణాజిల్లా / కృష్ణాతీరం నుంచి వెలువడ్డాయి. గుంటూరు నుంచి పొలదుగు పానకాలరావు రసికోల్లాసిని (1886) మాస పత్రికను తెలుగు, ఇంగ్లిషు భాషల్లో ప్రచురించారు. మచిలీపట్నం నుంచి 1892లో కోట సూర్యనారాయణ ఉపాధ్యాయోపగిని అనే విద్యా సంబంధ మాసపత్రిక, ఏలూరు నుంచి 1893లో దాసు కేశవరావు జ్ఞానోదయం పక్షపత్రిక, భీమవరం నుంచి సిహెచ్. రామ్మూర్తి ధర్మ వర్ధిని పత్రిక, ఏలూరు నుంచి సత్తిరాజు సీతారామయ్య దేశోపకారి పత్రికలు ప్రారంభించారు. 1894 ప్రాంతాల్లో గుడివాడ నుంచి నందగిరి వేంకట అప్పారావు బుద్ధిప్రదాయిని అనే మాసపత్రిక, మచిలీ పట్నం నుంచి మల్లంపల్లి భైరవమూర్తి రత్నాకరం మాసపత్రిక, అక్కడ నుంచే గోనుగుంట కోటయ్యశాస్త్రి సుజనవినోదిని, ఏలూరు నుంచి దామరాజు రామచంద్రరావు విబుధరంజని రాజకీయవారపత్రిక, ఏలూరి నుంచే సత్తిరాజు సీతారామయ్య తెలుగు 'లా' పేరుతో న్యాయ విషయాలతో మాసపత్రిక ప్రచురించారు.

విజయవాడనుంచి శ్రీ వేంకటేశ్వర పత్రిక పేరుతో శ్రీనివాసా చార్యులు హైందవ ఆధ్యాత్మిక విషయాలు ప్రకటిస్తూ ఓ వారపత్రికను నడిపారు. ఈ పత్రిక ప్రారంభమైన తేదీ గురించి ఆధారాలు లభించ

లేదు కానీ సుమారుగా 20వ శతాబ్దం ప్రారంభంలో ఇది ప్రారంభమై ఉండవచ్చని అంచనా. గాడిచర్ల హరిసర్వోత్తమరావు విజయవాడనుంచే నడిపిన వారపత్రిక స్వరాజ్య (1907)లో దేశభక్తికి సంబంధించిన విషయాలు ఎక్కువగా వచ్చేవి. ఇదే పేరుతోనే దుగ్గిరాల రాఘవ చంద్రయ్య విజయవాడనుంచే 1921లో మరో వారపత్రిక ప్రారంభించారు. రెండో స్వరాజ్యగా ఇది పేరుపొందింది. రాజా కోటగిరి వెంకట కృష్ణారావు సంపాదకత్వంలో విజయవాడ నుంచి వచ్చిన నవశక్తి (1921) వారపత్రిక రాజకీయ ప్రాధాన్యం కలిగిన వార్తలను ఎక్కువగా ప్రచురించేది.

కులప్రధాన వార్తలు ప్రకటిస్తూ కమ్మ పత్రిక (1923), కమ్మ కులపత్రిక (1923) - రెండూ వారపత్రికలుగానే వెలువడ్డాయి. కమ్మ కులానికి సంబంధించిన వార్తలు ఈ పత్రికల్లో వచ్చేవి. 1924లో ఇక్కుర్తి తిరుపతి నాయుడు కాపు పేరుతో కాపు కులస్తుల వార్తలకు ప్రాధాన్యత ఇస్తూ కృష్ణాజిల్లా మండవల్లి కేంద్రంగా వారపత్రిక ప్రారంభించారు.

ఇదే తీరులో 2009లో మాతి శ్రీకాంత్ కాపుప్రభ, యాదవవార్త పేరుతో బి. శ్రీరామ్‌యాదవ్ 2009లో కృష్ణాజిల్లానుంచి పత్రికలు నడిపారు.

•. హిందూమత సంబంధవార్తలతో సూర్యదేవర సంజీవరావువిజయవాడనుంచి ఐకమత్యం, ఎం.శేషాచలం బందరునుంచి సత్సంగ, నిమ్న జాతుల అభివృద్ధి లక్ష్యంగా వేమూరి రాంజీరావు దీనబంధు పత్రికలు నడిపారు. ఈ మూడు పత్రికలూ 1923లోనే ప్రారంభమయ్యాయి. క్రైస్తవ మత విషయాలతో మచిలీపట్నం నుంచి ఆంధ్రక్రైస్తవ పత్రిక (1925)వారపత్రికగా రెవరెండ్ డానియేల్ సంపాదకత్వంలో వచ్చింది. ఇదే ఏడాది విజయవాడ నుంచి ధన్వాడ రామచంద్రరావు విజయవాడ పేరుతో వారపత్రిక నడిపారు. శీలం జగన్నాథరావు నాయుడు నేతృత్వంలో 1928లో మచిలీపట్నం నుంచి వచ్చిన సత్య సాధని కూడా వారపత్రికగా పాఠకాదరణకు నోచుకుంది.

ఇరవయ్యో శతాబ్దం నాలుగో దశకంలో విజయవాడనుంచి వచ్చిన వారపత్రికలు భాగవతసేవ (భక్త సుబ్రహ్మణ్యం), వేదభూమి (జె.నరసింహశాస్త్రి) పూర్తిగా హిందూ మత సంబంధ విషయాలు ప్రచురించేవి. ఈ దశాబ్దంలోనే అన్నవరపు రామస్వామి అనే వైశ్య ప్రముఖుడు భారతీయవైశ్య పేరుతో వారపత్రికను విజయవాడనుంచి నడిపారు. పి.లక్ష్మీనారాయణ 1974లో విజయవాడ నుంచి లాటరీ సమాచార్ పేరుతో ఓ వారపత్రికను నడిపినట్లు రిజిస్ట్రార్ ఆఫ్ న్యూస్ పేపర్స్ వద్ద నమోదైంది. పేరును బట్టి ఇది లాటరీ వ్యాపారానికి సంబంధించిన వార్తలకు పరిమితమైన పత్రికగా భావించవచ్చు. అప్పట్లో ఆంధ్రరాష్ట్రంలో లాటరీ వ్యాపారం జోరుగా సాగడం కూడా ఈ పత్రిక వెలువడడానికి కారణమై ఉండవచ్చు. విజయవాడనుంచి 1976లో కె.జగదీష్‌ప్రసాద్ సంపాదకత్వంలో వచ్చిన జ్యోతిచిత్ర వార పత్రిక యువతరంలో సంచలనమే కలిగించింది. సినీవార్తలకు ప్రాధాన్యత ఇస్తూనే యువతరాన్ని ఆకట్టుకునే శీర్షికలు ఈ పత్రిక ప్రచురించేది.

యు.సత్యవాణి సంపాదకత్వంలో 1991లో వచ్చిన షేర్‌కాలం, ఎం.రామ్మోహన రావు సంపాదకత్వంలో 1993లో వచ్చిన మనీ బిజినెస్ వర్తకవ్యాపార వార్తలు ప్రధానంగా నడిచేవి. ఈ రెండూ విజయవాడ నుంచే వెలువడ్డాయి. 1999లో విజయవాడనుంచి లీగల్ మెయిల్ (కె.ఎస్.ఎన్.సుబ్రహ్మణ్యం) న్యాయవార్తలు ప్రధానంగా ప్రచురిస్తూ వారపత్రికలుగా వెలువడ్డాయి. తెలుగుతోపాటు ఆంగ్లంలోనూ ఎన్నో వారపత్రికలు విజయవాడనుంచి వెలువడ్డాయి. ఎస్.వి.స్వామి సంపాదకత్వంలో స్క్రీన్, 2000లో ఆర్.కె.ఝున్‌ఝున్‌వాలా సంపాదకుడిగా ద న్యూ సండే ఎక్స్‌ప్రెస్ వారపత్రికలు వెలువడ్డాయి. 2009 నుంచి ఎన్.రాజారావు నేతృత్వంలో ఆంధ్ర ఛాంబర్ ఆఫ్ కామర్స్, అదే ఏడాది నుంచి బెజవాడ పాల్ కమల్‌కుమార్ సంపాదకత్వంలో మై ఓన్ సిటీ గైడ్ డాట్ కాం ఆంధ్రాంగ్ల భాషల్లో వారపత్రికలుగా వెలువడుతున్నాయి. స్థానిక సమాచారం ప్రధానంగా చేసుకుని వెలువడిన వారపత్రికలు కూడా కృష్ణాజిల్లాలో ఉన్నాయి. వీటిలో 1979లో ఎం. జనార్దనరావు సంపాదకత్వంలో వచ్చిన మచిలీపట్నం సమాచార్‌ను ప్రముఖంగా చెప్పుకోవచ్చు. ఇదే పేరుతో 2011లో ఎం. నాగరాజు సంపాదకుడిగా మచిలీపట్నం నుంచి దినపత్రిక వెలువడుతున్నట్లు ఆర్.ఎన్.ఐ. సమాచారం.

ఈ పత్రికలతోపాటు కృష్ణాజిల్లాలో వెలువడిన పత్రికలు... మాతృభూమి (1949 అన్నె అంజయ్య);జనశక్తి (1966, ఎబికె ప్రసాద్); విజయం (1988, ముక్కాముల వేంకటేశ్వరరావు); ఫ్లాప్ టైమ్స్ (ఇంగ్లిషు, ఆర్ఎన్ మూర్తి), ది న్యూ ఇండియన్ ఎక్స్‌ప్రెస్ (1967, ఎన్‌వి స్వామి); బెజవాడ కమర్షియల్ డైలీ రిపోర్టు (ఇంగ్లిషు, 1967, ఎం.ఆదినారాయణమూర్తి); విజయవాడ డైలీ మార్కెట్ రిపోర్టు (ఇంగ్లిషు, 1967, సుఖదేవ్‌రాఠి); జనమిత్రం (1969, డి. కృష్ణమూర్తి); ఓం ఆంధ్రవాణి (1981, జివి. సత్యనారాయణ); కృష్ణా హెరాల్డ్ (1988, కెబి కిషోర్); దక్కన్ క్రానికల్ (1988, కె. ప్రభాకర్); అదృష్టం (1993, ఎన్ మణిమరన్); ఈ రోజు రేపు (1994, టి. వెంకటస్వామి); ఇవాళ రేపు (1994, టి.వెంకటస్వామి); సిటీ ఇమేజ్ (1998, తాడంకి రవి); స్వర్ణాంధ్ర (1998, కెజిబి తిలక్); టుడే ఫ్రీడం (ఇంగ్లిషు, 1998, బి దేవదాసు) ; పొద్దు (1999, బి.రామదాసు); పల్లెబాట (1999, కె.నాగేశ్వరరావు); సిక్స్ ఒ క్లాక్ (ఇంగ్లిషు, 1999, ఇవిఎన్ రాయుడు); భాగ్యనగర్ సాయంకాలం దినపత్రిక (1999, వివిఎన్ రాయుడు); వార్తాప్రభ (2002, వీర్ల శ్రీరామ యాదవ్); నేటి మనదేశం (2002, కెవిఎన్ రంగసాయి); స్కైలైన్ (ఇంగ్లిషు, 2002,కెఎన్ఆర్ సాయి); విజయాంధ్ర (2003, బి.గోపాల

రావు); నమస్తే (2003, ముత్యాల సిద్ధేశ్వరరావు); కృష్ణజ్యోతి (2004, మాంతి చిన్నారి); గంగ్రగొడ్డలి (2004, పి. హెచ్.వి.నారాయణశాస్త్రి); రక్షణ (2004, తుర్లపాటి రాజేష్); న్యూస్ బూమ్ (ఇంగ్లిషు, 2004, డిఎస్ ఎన్ మూర్తి); ఉదయ భారతం(2006, డిఎస్ఎన్ మూర్తి);వెన్నెల (2006, అంబడిపూడి సత్యనారాయణమూర్తి); ద ఫోర్త్ వాయిస్ (ఇంగ్లిషు, 2006, ఆర్.మురళీధరరావు); సేన (2006, అద్దంకి వేంకట శ్రీనివాసరావు); రత్నగర్భ (2006, పివిఎ ప్రసాద్); ఆంధ్ర వాయిస్ (2007, బి.గిరిబాబు); వార్తామండలి (2007, ఎ.ప్రతాప్ చంద్); లోకల్ న్యూస్ 5 పిఎం (2008, కె.విజయ్‌కుమార్); ప్యూస్ అబ్జర్వర్ (ఇంగ్లిషు, 2008, యువిఎస్ సూర్యకుమార్); ప్రజాభీష్టం (2008, ఎంవి సుబ్బారావు); విజయభాను (2008, బి.చంద్రశేఖర్), జనవాహినిలో నేడు (2008, పులిపాక సత్యమూర్తి); తెలుగువారం (2009, టి.ప్రియంవద); అంతిమతీర్పు (2009, బి.ప్రసాదకుమార్); ఆబ్లిగేషన్ (ఇంగ్లిషు, 2009, కె.సత్యనారాయణ); ప్రగతిబాట (2009, పి.శ్రీనివాసరావు); నేటి ప్రతిరోజు (2009, పులిపాక శ్రీలక్ష్మి); లక్ష్మి ప్రతిరోజు (2009, పి.శ్రీలక్ష్మి); రీజినల్ రియల్ న్యూస్ (2009, డి.వెంకట కృష్ణారావు); గ్రేటర్ వాయిస్ (2009, సిహెచ్ రమణారెడ్డి); కృష్ణాఎక్స్‌ప్రెస్ (2009, డి.ఏసుబాబు); ట్రస్ట్ న్యూస్ (2010, కొమ్మ రాజు రవి); ఆంధ్ర సాక్షి (2010), మార్కండేయ (2010); ఉత్తరాంధ్ర సాక్షి (2010), ఆంధ్రశక్తి (2010,ఎం. అబ్దుల్ రవూఫ్);స్పెషల్ న్యూస్ (2010, వి.నాగేశ్వరరావు); హాలిక(2010,పాటిబండ్ల శివశర్మ); నీలి మేఘం (2010, విన్నకోట శ్రీనివాస్); నిప్పు (2010, కొంగర బ్రహ్మయ్య); భారతశక్తి (2010, కె.పెంటారెడ్డి); నవ్యవిజ్ఞానం (2010, కొట్టిపాటి పద్మజ); కేసరి (2010, కె.సత్యనారాయణ); కృష్ణాతీరం (2011,మద్దినేని భాస్కరరావు); మచిలీపట్నం టైమ్స్ (2011, ఎం. నాగరాజు); అక్షర స్పందన (2011,కన్నెకంటి సజ్జనరావు)

మహిళలకు సంబంధించిన విషయాలు మాత్రమే ప్రచురిస్తూ మహిళా పత్రికలుగా పేరుపొందిన పత్రికలూ కృష్ణాజిల్లా నుంచి చాలా వెలువడ్డాయి. వీటిలో రంగమ్మరెడ్డి సంపాదకత్వంలో విజయవాడ నుంచి వచ్చిన నారీలోకం (1957), మచిలీపట్నం నుంచి ఎం.రత్నా రెడ్డి నేతృత్వంలో వెలువడిన గృహజ్యోతి (1961), ఆర్.మనోహరం సంపాదకుడిగా విజయవాడనుంచి వెలువడిన మహిళోదయ (1967), విజయవాడనుంచే కె.ఎల్.ఎన్.ప్రసాద్ సంపాదకత్వంలో వెలువడిన వనితాజ్యోతి (1976)లను ప్రముఖంగా చెప్పుకోవచ్చు. మాంటిస్సోరి విద్యాసంస్థల అధినేత డాక్టర్ వి.కోటీశ్వరమ్మ సంపాదకురాలిగా వచ్చిన పత్రిక ఇల్లు ఇల్లాలు. ఇరవై అయిదు సంవత్సరాలకు పైగా ఈ పత్రిక వెలువడుతోంది. మహిళా స్వావలంబన, మహిళా సాధికారత ప్రధాన లక్ష్యాలుగా ఈ పత్రిక వ్యాసాలు ప్రచురిస్తుంది.

భక్తిపత్రికలు కూడా కృష్ణాజిల్లానుంచి ఎక్కువ సంఖ్యలో ప్రచురిత మయ్యాయి. అవుతున్నాయి కూడా. విజయవాడ నుంచి 1907లో శ్రీనివాసాచార్యులు శ్రీ వేంకటేశ్వరపత్రిక పేరుతో ఒక భక్తి పత్రిక నడిపారు. ఆ తర్వాత వచ్చిన శ్రీవైష్ణవ (1920, తి.న.చక్రవర్తి శ్రీనివాస రంగాచార్యులు) పత్రిక కూడా ప్రముఖ భక్తి పత్రికగా పాఠకుల మన్ననలు అందుకుంది. మచిలీపట్నం నుంచి రెవరెండ్ థానియేల్ ఆంధ్ర క్రైస్తవ పత్రిక పేరుతో 1925లో క్రైస్తవ భక్తి పత్రిక కొంతకాలం నడిపారు.

ధ్యానమండలి నిర్వహణలో 2001నుంచి విజయవాడ కేంద్రంగా వెలువడుతున్న పత్రిక ధ్యానమాలిక, భిక్షమయ్య గురూజీ దీనికి వ్యవ స్థాపకుడు కాగా సత్యనారాయణ సంపాదకులు. యోగ, వైద్య విజ్ఞా నాంశాలకు ఇది ఎక్కువ ప్రాధాన్యత ఇస్తుంది. ధ్యానమండలి సభ్యులకు దీన్ని ఉచితంగా పంపిణీ చేస్తున్నారు. ఆమంచి బాలసుధాకరశాస్త్రి సంపాదకత్వంలో వెలువడుతున్న భక్తిసుధ పత్రికలు పాఠకాదరణ బాగా పొందాయి. పి.ఎస్.పి.కుమార్ సంపాదకత్వంలో 2006 నుంచి వెలువడుతున్న శ్రీకంఠవాణి కూడా ఆధ్యాత్మిక విషయాలను ప్రచురి స్తోంది. అయితే ఇందులో వివాహ సంబంధ విషయాలను ఎక్కువగా ప్రచురిస్తున్నారు.

వీటితోపాటు కృష్ణాజిల్లా నుంచే సాయిపథం (ఎస్.వి.ఎల్. నారా యణరావు), భాగవతసేవ (భక్త సుబ్రహ్మణ్యం), వేదభూమి (జి.నర సింహశాస్త్రి) పత్రికలు వెలువడినట్లు తెలుస్తోంది. అయితే ఈ పత్రికల పూర్తి వివరాలు లభించుటలేదు.

వ్యాపార ప్రకటనలు ఉంటే తప్ప పత్రికను నడపలేని నేటి పరిస్థి తుల్లో ఏడాదికి ఒకటి రెండు ప్రకటనలు మినహా వ్యాపారప్రకటనల ఊసే లేకుండా 1992 నుంచి నడుస్తున్న గణిత విద్యావిషయక పత్రిక గణిత చంద్రిక. అసోసియేషన్ ఫర్ ఇంప్రూవ్‌మెంట్ ఆఫ్ మ్యాథ్స్ ఎడ్యుకేషన్ ఆధ్వర్యంలో నడుస్తున్న ఈ పత్రికకు ప్రఖ్య సత్యనారా యణశర్మ వ్యవస్థాపకుడు, ప్రధాన సంపాదకుడు కూడా. గణిత విద్యా రంగంలో ప్రఖ్యాతి పొందిన పలువురు ఈ పత్రిక సంపాదకమండలి సభ్యులుగా ఉన్నారు. పూర్వప్రాథమిక స్థాయినుంచి స్నాతకోత్తరస్థాయి వరకు అవసరమైన గణితాంశాల్లోని ప్రాథమిక భావనలు, గణిత బోధనలో నూతన విధానాలు, గణితంలో బోధనోపకరణాల తయారీ, పోటీపరీక్షల్లో అడిగే గణితాంశాలకు సంబంధించిన వివరణలు తది తర అంశాలు ఇందులో ఉన్నాయి.

హాస్యరసం ప్రధానంగా వెలువడిన పత్రికల్లో అందిన సమాచారం మేరకు 1922, ఆగస్టు ఒకటోతేదీన మచిలీపట్నం నుంచి కోసూరి గురునాథమూర్తి సంపాదకత్వంలో వెలువడిన నవ్వులతోట ఎక్కువ ప్రాచుర్యం పొందిన పత్రికగా రికార్డుల్లో నమోదైంది. సునిశితమైన

హాస్యానికి వ్యంగ్యాన్ని జోడిస్తూ విజయవాడనుంచి 2003లో వెలువడిన హాస్యానందం ఆధునిక కాలంలో ఓ చక్కని ప్రయత్నంగా కొనసాగుతోంది. రాము పండా దీనికి సంపాదకుడు, ప్రచురణకర్త కూడా.

నిత్యనూతనంగా ఉండే కంప్యూటర్ విజ్ఞానాన్ని పాఠకులకు అందించాలనే సంకల్పంతో ప్రారంభించిన పత్రిక కంప్యూటర్ విజ్ఞానం. కె.రామారావు సంపాదకత్వంలో విజయవాడ నుంచి 1990 లో ఇది వెలువడింది. కంప్యూటర్ సమాచారాన్ని తెలుగులో అందించిన తొలి తెలుగు పత్రికగా ఇది పేరుపొందింది. కంప్యూటర్ కోర్సులు తదితర వివరాలతో వచ్చిన ఈ పత్రిక అచిరకాలంలో ఎక్కువసంఖ్యలో పాఠకులకు చేరువ అయింది.

తెలుగులో తొలిగా బాలల పత్రికను వెలువరించిన ఘనత కూడా కృష్ణాజిల్లాకే దక్కుతుంది. 1940లో మేడిచెర్ల ఆంజనేయమూర్తి విజయవాడనుంచి ప్రారంభించిన బాలలపత్రిక 'బాలకేసరి'. తర్వాతి కాలంలో కృష్ణాజిల్లా చాగల్లు నుంచి కె. హెచ్. ఒన్‌బరోస్, జి.జె.కిల్స్‌లే నేతృత్వంలో బాలపత్రిక పేరుతో ఓ మాసపత్రిక విడుదలైనట్లు ఆర్.ఎన్.ఐ.వద్ద నమోదైంది. పేరునుబట్టి ఇదికూడా బాలలకు సంబంధించిన పత్రికగా భావించవచ్చు.

ఇతర రంగాల పత్రికలను పరిశీలిస్తే వింతలు, విశేషాలకు ప్రాధాన్యాన్ని ఇస్తూ వట్లూరి నారాయణరావు వ్యవస్థాపక సంపాదకుడిగా విజయవాడనుంచి వచ్చిన వండర్ వరల్డ్ (1986) అప్పట్లో పెద్ద సంచలనమే సృష్టించింది. దేశవిదేశాల్లోని ఆశ్చర్యకరమైన వింతలతోబాటు, అక్కడి ప్రత్యేకతలు ఇందులో ప్రముఖంగా ప్రచురించేవారు. మొదట్లో ఈ అంశాలకే పరిమితమైనప్పటికీ క్రమంగా విద్యార్థులకు ఉపయోగించే సమాచారం, ఇంగ్లీషు భాషకు సంబంధించిన విషయాలు కూడా ఇందులో ప్రచురించేవారు.

'ఆయుర్వేదభూషణ' డాక్టర్ వేటూరి శంకరశాస్త్రి సంపాదకత్వంలో ముక్త్యాల నుంచి వెలువడిన పత్రిక ధన్వంతరి. ఆయుర్వేదానికి సంబంధించిన విషయాల ప్రచురణతోపాటుగా వివిధ శాస్త్రాల్లో పరిశోధనలు చేయడానికి సైతం ఈ పత్రిక కృషిచేసింది. ప్రాచీన వైద్యగ్రంథాలను ఈ పత్రికలో ధారావాహికంగా ప్రకటించారు.

విజయవాడనుంచి విడుదలై పాఠకాదరణ పొందిన పత్రికల్లో మరికొన్ని...ఆంధ్ర ఫిలిం ఛాంబర్‌జర్నల్ (ఎం.ఎస్.రాజు), శ్రీధన్వంతరి (వి.శంకరశాస్త్రి, 1967), ఆయుర్వేద (కె.విష్ణువర్ధనరావు, 1967), రజకజ్యోతి (ఎల్.తాతయ్య, 1972), ట్యాక్స్‌వార్తలు (జి. నాగేశ్వరరావు, 1973), టెలిఫోన్ ట్రాఫిక్ బులిటెన్ (ఆంగ్లం, ఎం.వెంకట్రావు, 1977), జనరల్ ఎడ్యుకేషన్ ఫర్ ఆల్ (ఆంగ్లం, ఎస్. సుందరాచారి, 1985), క్వశ్చన్‌బ్యాంక్ (ఎస్.ఎం.కొండయ్య, 1987), హెల్త్‌టుడే (ఎ.పి.ప్రసాదబాబు, 1994), భావతరంగిణి (జి.వి.రమణారావు, మచిలీపట్నం, 1998).

పత్రికా ప్రపంచంలో ఎంచుకున్న అతిచిన్న సమాజానికి మాత్రమే పరిమితమైన పత్రికలు 'లిఖిత పత్రికలు'. వాస్తవానికి వీటిని చదివే పాఠకుల సంఖ్య పరిమితమైనప్పటికీ వీటిని తయారుచేసే వ్యక్తులు / సంపాదకుల తృష్ణ ప్రశంసనీయం. ముద్రణ వ్యయాన్ని కూడా భరించలేని స్వతంత్ర వ్యక్తి లేదా వ్యక్తులు లిఖిత పత్రికవైపునకు మొగ్గుచూపిస్తారు. తమలో అంతర్లీనంగా దాగి ఉన్న కళాసాంస్కృతిక పిపాసను ఈ తీరులో పత్రికారూపంగా వీరు ప్రకటించడం జరుగుతోంది. జిల్లాలో ఇప్పటివరకు ఎన్ని లిఖితపత్రికలు వచ్చాయనే విషయంలో నిర్దుష్టమైన ఆధారాలు ఏవీ లభించలేదు. ఆర్.ఎన్.ఐ.వద్ద నమోదు చేయాల్సిన అవసరం లేకపోవడం, అతి తక్కువ ఆర్థిక వనరులు, తక్కువ పరిధి... ఇలా అనేక కారణాలు లిఖిత పత్రికల చరిత్రను దాచిపెట్టడానికి అవరోధంగా నిలిచాయి.

విజయవాడ నుంచి ప్రఖ్య సత్యనారాయణశర్మ సంపాదకుడిగా 1981లో కృష్ణవేణి,1988లో లీలావతి లిఖితపత్రికలు వెలువడ్డాయి. ఉన్నత పాఠశాల ఉపాధ్యాయుడిగా ఉన్న ఈ సంపాదకుడు తన విద్యార్థుల్లో దాగి ఉన్న ప్రతిభను వెలికితీయాలనే ఉద్దేశంతో ఈ పత్రికను ప్రారంభించారు. ఇందులో విద్యార్థులే కార్టూన్లు, కవితలు, వ్యాసాలు రాయడం జరిగింది. అక్కడి చిత్రలేఖనోపాధ్యాయులు ఇందుకు సహకరించి వ్యాసాలకు తగిన చిత్రాలు గీయడం ప్రత్యేకత. పత్రిక ప్రతి అణువులోను కొట్టొచ్చినట్లు కుదురుకున్న నిండుదనం పత్రిక నిర్వాహకులు దానిపట్ల చూపించిన ఆత్మీయతను ప్రకటిస్తోంది. లీలావతి కేవలం గణితశాస్త్ర సంబంధిత అంశాలతో మాత్రమే వెలువడేది. గణితంలోని అనేక సూక్ష్మప్రక్రియల వివరణలు, ప్రముఖుల జీవితచరిత్రలు, ప్రహేళికలు ఇందులో రాసేవారు. ఈ రెండు పత్రికలు మాసపత్రికలుగానే వెలువడ్డాయి. రెండేళ్లకాలంలోనే లీలావతి ముద్రిత పత్రికగా మారగా, వ్యవస్థాపరమైన కారణాలతో కృష్ణవేణి ప్రచురణ నిలిచిపోయింది.

డాక్టర్ కప్పగంతు రామకృష్ణ సంపాదకుడుగా వెలువడిన మరో లిఖిత పత్రిక గణితకౌముది (2007). ఉపాధ్యాయ శిక్షణ పొందుతున్న విద్యార్థులను గణితవిద్యా పరిశోధన దిశగా ప్రోత్సహించేందుకు ఈ పత్రిక సంకల్పించింది. ఆధునిక గణితవిద్యాబోధన పద్ధతులు, నూతన గణిత ఆవిష్కరణలు, గణితశాస్త్రవేత్తల జీవితచరిత్రల్లోని నూతన కోణాల ఆవిష్కరణ ప్రధానాంశాలుగా ఇందులో వ్యాసాలు రాసేవారు. అర్థవార్షిక పత్రికగా వచ్చిన గణితకౌముది మూడు సంచికలతోనే ఆగిపోయింది. ఇంకా మరికొన్ని లిఖిత పత్రికలు కృష్ణాజిల్లాలో వెలువడి ఉండవచ్చు. విస్తృతమైన పంపిణీ వ్యవస్థ, ప్రచారం అవసరం

లేకపోవడం తదితర కారణాలతో అనేక లిఖిత పత్రికలు జిల్లాలో వెలువడి ఉన్నప్పటికీ అవి ఆయా సంస్థల వరకే పరిమితమవడంతో, బాహ్య ప్రపంచానికి తెలిసే అవకాశం లేకపోయింది.

ఆర్థికంగా కొద్దిపాటి బలం ఉన్న ప్రతి పాఠశాల / కళాశాల తన కంటూ ఓ ప్రత్యేకతపత్రికను ప్రచురించడం అలవాటుగా వస్తోంది. కళాశాల ప్రత్యేకతలు, సాధించిన విజయాలు, ఉపాధ్యాయుల నైపుణ్యాలు, విద్యార్థులు రచనలు ప్రధానాంశాలుగా ఉంటాయి. కళాశాల/పాఠశాల విద్యార్థులు, ఉపాధ్యాయులు, సంస్థతో సంబంధం ఉన్న కొద్దిమంది వ్యక్తులకే ఈ పత్రికలు సాధారణంగా పరిమితమై ఉంటాయి. ఈ కారణంగా ఎన్ని పత్రికలు వెలువడ్డాయి? వాటి ప్రత్యేకతలు ఏమిటి? మొదలైన అంశాలకు నిర్దిష్టమైన సమాధానం లభించడంలేదు.

ఆర్.ఎన్.ఐ.వద్ద నమోదైన వివరాల ప్రకారం... ఎస్.ఆర్.ఆర్. అండ్ సి.వి.ఆర్. కళాశాల పత్రిక పేరుతో ఆర్.దయానిధి సంపాదకుడి అర్ధవార్షిక పత్రిక 1957లో విజయవాడ నుంచి విడుదలైనట్లు ఆర్.ఎన్.ఐ. వద్ద నమోదైంది. కళాశాల సాధించిన ప్రగతి, విద్యార్థుల వ్యాసాలు ఇందులో ప్రముఖంగా ఉండి ఉండవచ్చు. అన్నాథామస్ సంపాదకుడిగా బిషప్ అజరయ్య హైస్కూల్ పత్రిక (1967) వార్షిక పత్రికగా, పి.శరభరాజు సంపాదకుడిగా జైహింద్ హయ్యర్ సెకండరీ స్కూల్ మ్యాగజైన్ (1967) అర్ధవార్షిక పత్రికగా వచ్చాయి. రెండింటికీ విజయవాడే ప్రచురణ కేంద్రం.

ది ఆంధ్ర ప్రొవెన్నియల్ హోమియోపతిక్ ఎండీ కాలేజ్ మ్యాగజైన్ పేరుతో ఆంధ్రాంగ్ల భాషల్లో అర్ధవార్షికపత్రిక వచ్చింది. ఇ.రామ గోపాలరావు సంపాదకుడిగా 1967లో వచ్చిన ఈ పత్రిక ప్రచురణ కేంద్రం వివరాలు తెలియలేదు. యడవిల్లి సన్యాసిరావు సంపాదకత్వంలో గుడివాడనుంచి ఎ.ఎన్.ఆర్.కాలేజ్ మ్యాగజైన్ (1999) అర్ధవార్షిక పత్రికగా వచ్చింది.

ప్రత్యేక సంచికలు కూడా ఇదే తీరులో వెలువడుతున్నాయి. సాధారణంగా కళాశాలలు నిర్వహించిన జాతీయ సదస్సులు, ఇతర విద్యావిషయిక కార్యక్రమాల వివరాలతో ఇవి రూపొందుతాయి. ఇప్పటివరకు ఇలాంటి సంచికలు ఎన్ని వచ్చాయని కచ్చితంగా చెప్పడం సాధ్యం కాదు. ఒక్కోసారి కళాశాలలు తమ వార్షిక పత్రికలను ప్రత్యేక సంచికలుగా వెలువరించిన సందర్భాలు కూడా ఉన్నాయి. విజయవాడలోని ఎస్.ఆర్.ఎస్.వి.కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్ విద్యాభారతి పేరుతో 2007 నుంచి ప్రచురిస్తున్న వార్షిక పత్రికను 2012లో తాను నిర్వహించిన జాతీయ సదస్సు ప్రత్యేక సంచికగా వెలువరించడం ఇందుకు ఉదాహరణ.

కృష్ణాజిల్లా తర్వాత పత్రికారంగానికి సంబంధించిన గుంటూరు జిల్లాలో ఎక్కువ చైతన్యం కనిపిస్తుంది. పూర్వం కృష్ణామండలంలో భాగంగా ఉన్న సమయం నుంచి నేటివరకు ఇక్కడ కూడా అనేక పత్రికలు వెలువడుతూ పాఠకాదరణ పొందుతున్నాయి. కాళీపట్నం రామారావు (కారా మాస్టారు)గారు సేకరించిన వివరాల ప్రకారం గుంటూరు నుంచి వెలువడిన / వెలువడుతున్న పత్రికల వివరాలు... భక్తి ప్రబోధిని (మాస,1933,అవ్వారి హనుమయ్య); ప్రతిభ (త్రైమాసిక, 1936, గిడుగు వేంకట రామ్మూర్తి); సఖి (త్రైమాసిక, 1926, శివ శంకరశాస్త్రి); ప్రజాసంస్థ (మాస, 1933, గాదె సింహాచలం పంతులు); విశ్వకళ (మాస, 1933, కుందుర్తి నరసింహా చార్యులు); పదువురి బంటు (పక్ష, 1926, గిడుగు వేంకట నరసింహా రావు); పరపతి (పక్ష, 1925, గోవిందరాజు వేంకట కృష్ణారావు); పాఠశాలా పత్రిక (పక్ష,1925, గుండు రాఘవదీక్షితులు); ప్రకటన పత్రిక (మాస, 1910, వింజమూరి రాఘవాచార్యులు); స్వతంత్ర (వార, 1923, గోవిందరాజు వేంకట కృష్ణారావు); ఆంధ్ర గ్రంథా లయం (త్రైమాసిక, 1939, పి.రాజశేఖరం); వినియోగహక్కు (మాస, 1996); ప్రజావాణి (వార, వట్టికొండ రంగయ్య).

నల్గొండజిల్లా నుంచి చిటికి (త్రైమాసిక, 2004, తడ్క యాదగిరి); నీలగిరి (వార, 1922, హెచ్.నరసింహాచార్యులు); న్యాయం కావాలా (పక్ష, 2004, గంగాధర వేంకటేశ్వర్లు); మహబూబ్‌నగర్ జిల్లా నుంచి హితబోధిని (మాస, 1913, బి.శ్రీనివాసశర్మ); కర్నూలు నుంచి చర్చ (బులెటిన్, 2004, పాణి) పత్రికలు విడుదలైనట్లు రికార్డుల్లో ఉంది.

ఇలా విశ్లేషించుకుంటూపోతే కృష్ణాతీరం నుంచి వెలువడిన పత్రికల వివరాలతో ఇతిహాసాల స్థాయిలో గ్రంథాలు రాయొచ్చు. ఏదిఏమైనప్పటికీ ఆంధ్రరాష్ట్ర పత్రికారంగ చరిత్రలో కృష్ణాతీరానిదే అగ్రస్థానమని నిస్సందేహంగా చెప్పవచ్చు.

**చిరునామా :** *డా॥ కప్పగంతు రామకృష్ణ, ఆంధ్రోపన్యాసకులు, ఎస్.ఆర్.ఎస్.వి.కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, గాంధీనగర్, విజయవాడ-3.*
*సెల్ : 9032044115*

శ్రీ ఆముదాల మురళి

# సాహిత్యంలో కృష్ణాతీర వర్ణనలు

కృష్ణానది మహారాష్ట్రలోని మహాబలేశ్వరానికి ఉత్తరంగా పడమటి కనుమల్లోకి సహ్యాద్రిశ్రేణుల్లో పుట్టింది. ఇది సముద్రమట్టానికి 4717 అడుగుల ఎత్తులో $17^0$ - 59' ఉత్తర అక్షాంశ, $73^0$ - 28' తూర్పు రేఖాంశాల మీద ఉంది. సహ్యాద్రి శ్రేణుల్లోనే పుట్టిన మరోనది 'వేణి' మాహులీక్షేత్రం వద్ద కృష్ణానదితో కలువడంతో 'కృష్ణవేణి' అన్న వ్యవహారం ఏర్పడింది.

కృష్ణానది మహారాష్ట్రలో 306 కిలోమీటర్లు ప్రయాణించి ఐనాపూర్ వద్ద కర్ణాటకలో ప్రవేశించి 482 కిలోమీటర్లు ప్రవహించింది. రాయచూర్ జిల్లాలోని దేవనగర్ వద్ద కర్ణాటకకు వీడ్కోలు పలికి మహబూబ్‌నగర్‌జిల్లా తంగెడ వద్ద తెలంగాణ రాష్ట్రంలో ప్రవేశించింది. అక్కడినుండి ఆంధ్రప్రదేశ్‌లోని హంసలదీవి వద్ద సాగర సంగమం జరిగేవరకు 612 కిలోమీటర్లు ప్రవహించింది. మొత్తం 1400 కి.మీ. ప్రయాణంలో 17 ఉపనదులు కృష్ణలో కలుస్తాయి. ఈ సుదీర్ఘతీరం మీద సుమారు 60 పుణ్యక్షేత్రాలున్నాయి. అమరావతి వంటి ఎన్నో ప్రాచీన నగరాలు వెలిశాయి. కృష్ణానదిపై సుమారు 30 ఆనకట్ట లున్నాయి. వివిధ ఆనకట్టలు కారణంగా కూడా ఎన్నో క్షేత్రాలు కనుమరుగయ్యాయి.

సాహిత్యంలో వివిధ క్షేత్రాలు, చారిత్రక ప్రదేశాల వర్ణన ఆయా సందర్భాల్లో కవులు చేశారు. పురాణాల్లో కూడా కృష్ణాతీరక్షేత్రాల వర్ణన ఉన్నది. ఈ నదీతీరంలో గద్వాల, ఆత్మకూరు వంటి సంస్థానాలు వెలసి సాహిత్య సేవ చేశాయి. కృష్ణానది సోమశిల గుండా నల్లమల లోనికి ప్రవేశిస్తుంది. పదకవితా పితామహుడైన అన్నమయ్య **"సొంపుల నీ వదనము సోమశిలకనుమ, ఇంపులెల్ల చేకొనగ యిల్లు నీపతికి"** (10-115) అని అలిమేలు మంగమ్మను అభివర్ణించాడు. కూచిపూడి నాట్యానికి పుట్టినిల్లు కృష్ణాతీరం, సిద్ధేంద్రయోగి తపః ఫలంగా పురుడుపోసుకున్న భామాకలాపానికి కూచిపూడి జన్మస్థానం. పెద్దకళ్ళేపల్లి కృష్ణాతీరంలోని నాగక్షేత్రం. స్కాంద పురాణంలోను, శ్రీమత్కదళీపుర మహత్త్యంలోను దీని వర్ణన ఉన్నది. ఇక్కడ కృష్ణ ఉత్తర వాహిని. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిదీ ఈ ఊరే.

భావనారాయణస్వామి వెలసిన భావదేవరపల్లిని గూర్చి శ్రీ వేంకటార్య కవీంద్రులు

**"కదలి, కృష్ణయు నొక్కచో గలసియుండు**
**దివ్య దివిసీమయందు ప్రసిద్ధి గన్న**
**భావదేవరీపురమని బలుకబడగ**
**వెలసినాడవు సత్కృపాజలధి వీవు"** అని వర్ణించారు.

దివిసీమలో ఆంధ్రమహావిష్ణువు వెలసిన క్షేత్రము శ్రీకాకుళం. ఆ శ్రీకాకుళమును గూర్చి కాసుల పురుషోత్తమకవి తన 'శ్రీ ఆంధ్రనాయక శతకం'లో ఇలా వర్ణించారు.

**సీ॥ శ్రీకాకుళము భక్తలోక చింతామణి, శ్రీకాకుళము సుకృతాకరంబు**
**శ్రీకాకుళము ధరాలోక వైకుంఠంబు,**
**శ్రీకాకుళము మర్త్య సేవితంబు**
**శ్రీకాకుళము వేదసిద్ధాంత మహిమంబు,**
**శ్రీకాకుళము హతవ్యాకులంబు**
**శ్రీకాకుళము మహాక్షేత్రావతంసంబు,**
**శ్రీకాకుళము సర్వసిద్ధికరము**

**తే.గీ. తెలియ శ్రీకాకుళంబు నీ దివ్యదేశమాంధ్రనాయక !**
**నీవె శ్రీహరివి నిజము**
**చిత్ర చిత్రప్రభావ, దాక్షిణ్య భావ,**
**హతవిమతజీవ శ్రీకాకుళాంధ్ర దేవ (5)**

కృష్ణానది పులిగడ్డ వద్ద రెండు పాయలుగా చీలుతుంది. అందులో ఒక పాయ పెద్దకళ్ళేపల్లిని అంటి ప్రవహిస్తూ హంసలదీవి వద్ద సాగరసంగమం చేస్తుంది. హంసలదీవిలో వేణుగోపాలస్వామి ఆలయం ఉంది. కాసులపురుషోత్తమ కవి వ్రాసిన హంసలదీవి వేణు

గోపాల శతకంలో మూడుపాదాల మకుటం ఇలా ఉంది. "భావజ విలాస, హంసలదీవివాస, లలితకృష్ణాబ్ధి సంగమస్థల విహార, పరమ కరుణాస్వభావ గోపాలదేవ".

పింగళి వేంకట కృష్ణారావుగారు 'కవితాకృష్ణ' అన్న ఖండకావ్య సంపుటిలో కవితాకృష్ణ ఖండికలో కృష్ణానదిని, తత్తీరప్రాంతాలను గూర్చి రమ్యంగా వర్ణించారు. అందులో విజయవాడను గూర్చి వ్రాసిన పద్యం ఇలా ఉంది.

**సీ॥ శ్రీదేవి క్రీడించు చెలువంబు పెంపారు**
**విరులపందిరి నీడ విజయవాడ**
**ఇందిర గీర్వాణి కిచ్చిన కోట్లకు విలువైన దీమేడ విజయవాడ**
**మురిపాల కృష్ణమ్మ మూడుపాయలజడ విసరు**
**సోకులజాడ విజయవాడ**
**ముగ్గురమ్మలకును మూలమ్ముగా దుర్గ వెలసిన**
**దీవాడ విజయవాడ**
**తే.గీ. రాజకీయ చైతన్యము రాణకెక్క వివిధమతముల**
**సఖ్యమ్ము వినుతికెక్క**
**శాంతి సౌఖ్యాల జీవనసౌరభాలు వెల్లివిరిసెడి**
**నగరంబు విజయవాడ**

విశ్వనాథవారు ఆంధ్రపౌరుషములో "ఒకనాడు గలదు శిల్పకళా సరస్వతి అమరావతిని నృత్యమాడు దినము, ఒకనాడు గలదాంధ్ర సకల ప్రపంచమ్ము కృష్ణాస్రవంతి నూగిన దినమ్ము" అన్నారు. "కృష్ణా తరంగ నిర్ణిద్ర గానముతోడ శిల్పమ్ము తొలిపూజ సేయువాడు" అని కూడా అన్నారు. అదే పద్యంలో ఆంధ్రజాతి కృష్ణానది ఇసుక తిన్నెలపై పూర్ణిమరాత్రులలో కోయిల పాటను నేర్చుకొన్నదని విశ్వనాథ వారన్నారు.

"ఆంధ్రప్రశస్తి" కావ్యంలో విశ్వనాథవారు శ్రీకాకుళమును గూర్చి వర్ణిస్తూ "శ్రీకృష్ణవేణీ గరిష్ట పాథస్తరంగాహత ప్రాకారమైన" యదియు,

**"రాజరాజాంధ్ర విష్ణుని రాజధాని**
**కలుషముకెల్ల పిడుగు శ్రీకాకుళంబు**
**కన్నులకు గట్టినట్లుగ గానబడెడు**
**వేదకాలము నాటి ముత్తైదువట్లు"** అన్నారు.

కృష్ణానది సర్పంగా దాని తీరంలోని శ్రీకాకుళాన్ని పడగపైని రత్నంగా విశ్వనాథవారు ఉత్ప్రేక్షించారు.

**"త్రాసితలోక మాంధ్ర వసుధాపతి సైన్యము వీరకోటి బా**
**హా సముదీర్ణ ఖడ్గ గళితాంచిత కాంతులు నుర్వుగాగ వ**
**ర్షా సమయోగ్రశైల కుహరస్రుత నిర్ఝరమట్లు వచ్చి కృ**
**ష్ణా సరిదుల్ల సత్ఫణి ఫణామణి కాకుళమంత చేరగన్"**

ఈ కావ్యంలోని 'శాతవాహనుడు' ఖండికలో అమరావతి ప్రస్తావన ఉన్నది. ప్రారంభ పద్యంలో 'లలిత కృష్ణానది ముక్త పులిన సీమ' లో ఒక ఋషికన్య యక్షుని కలిసినట్లు వ్రాయబడింది. మాధవవర్మ ఖండికలో 'విజయవాటిక కోట వీధిలో నాడు సంరంభంబు పొందుచు రాజభటులు ప్రజనొత్తుచున్నారు ప్రక్కప్రక్కలకు' అంటూ విజయవాడను గూర్చి వర్ణించారు.

అనంతామాత్యుని భోజరాజీయంలో శ్రీకాకుళాంధ్ర విష్ణు సేవా తత్పరుడైన ముమ్మడి తిక్క విభుని గూర్చి వర్ణించు పద్యం ఇలా ఉన్నది.

**"విలసతంబగు కృష్ణవేణిమలాపహారిణి భీమరథినాధరిత్రియందు**
**నెమ్మి ప్రత్యక్ష పరమపదమ్మనంగ నొప్పు**
**శ్రీకాకుళంబున కొడయడైన**
**యాంధ్ర వల్లభ హరిసేన నలరుచుండు బెక్కు భంగుల**
**ముమ్మడి తిక్కవిభుడు"**

బసవపురాణంలో పాల్కురికి సోమనాథుడు అనేక పర్యాయాలు శ్రీశైల ప్రస్తావన చేశారు. వీరశంకరుని కథ, బాచయ్యగారి కథ, తెలుగు జొమ్మయ్య కథ మొదలగు వాటియందు "శ్రీశైలమున సమంచిత నిర్ఝర ప్రదేశంబుననను సమాధిస్థుడై యుండ" ఇత్యాది ద్విపదల్లో నామ మాత్ర వర్ణన చేశారు. మల్లరసు మండలేశ్వరుని కథలో శ్రీశైల వర్ణన విస్తారంగా ఉన్నది. "స్ఫాటిక పర్వత బహుశృంగములను, హాటక రత్నమయాంచిత్రాదులను" అంటూ ప్రారంభించి నూటికిపైగా ద్విప దలతో శ్రీశైలంలోని శిలలన్నీ శివలింగాలని, వనాలన్నీ బిల్వ వనాలని సుదీర్ఘ వర్ణన చేశాడు. (తృతీయాశ్వాసం)

మహాకవి, సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచర్యులు తన 'మేఘదూతము' కావ్యంలో కృష్ణాతీర ప్రాంతాలను గేయఫణితిలో పరిచయం చేశారు. అళియరామరాయలకు, బహమనీసుల్తానులకు యుద్ధం జరిగిన తళ్ళికోటను రణంపు బీడుగా, సుడుగాడు (స్మశానం)గా వర్ణించారు. శ్రీశైలాన్ని గూర్చి

**"శ్రీ మల్లికార్జున దేవ, మల్లికా నిభకటాక్షాంచలంబుల**
**జలదరించీ - భ్రమరాంబ**
**ఇంచు నవ్వుల పల్లవించీ - శ్రీశైల మెదుట కన్పడు**
**నీకు, మదవతీమృదిత**
**కిన్నరులతో - హరులతో - దరులతో - సొబగాని"**

అంటూ వర్ణించారు.

నాగార్జునుని పాదనళినంబులకు మ్రొక్కి స్థూపములు దర్శించు కోవాలని, అక్కడనుండి నీలి చీరను దాల్చిన కృష్ణమ్మ గట్టున వెలసిన విజయవాడలోని తెలుగు బిత్తరులను గూర్చి చెబుతూ

**"కమ్మగా కుంకుమము లమ్మకుండిన సతులు,**
**పుష్పలావికలు గఱవైనా గందూళి**
**పుప్పొడుల మంచుకరవైనా,**
**లకుమాయి కమ్ర నూపురకు హూకారంబు**
**లేకున్నా నేటికిని విజయవాటికి పెంపుగలదోయి"** అన్నారు.

ఇక్కడ ఒకనాడు కృష్ణమ్మ నీటిలో జలకేళి సలిపిన తెలుగు చానల కుచకుంకమలతో పచ్చి అత్తరు బావి పారినదని సరస్వతీపుత్రులు వర్ణించారు. విజయవాడ వీధులు లలితమైన వనితల పాదతల లాక్షతో విభూషితములయ్యాయి. ఆ వీధుల్లో రసకావ్యభామినీ సుఖ పరిష్వంగ సౌఖ్యాకాంక్షియైన కృష్ణరాయలు శ్రీకాకుళస్వామి పిలుపు మేరకు నడిచారట. కనకదుర్గను గూర్చి "సంధ్యలను సరసలాస్యములాడు చండికేశ్వరి"గా వర్ణించాడు.

కృష్ణానదీతీరంలో బౌద్ధమతం విరాజిల్లినచోటు నాగార్జునకొండ. మహాయాన బౌద్ధంలో మాధ్యమికవాదం ఇక్కడనుండే దేశవిదేశాలకు విస్తరించింది. శాతవాహనులు, ఇక్ష్వాకు రాజులు, పల్లవులు, చాళుక్యులు, కాకతీయులు, రెడ్డిరాజులు, గజపతులు, కృష్ణరాయలు దీనిని పరిపాలించారు. తళ్ళికోట యుద్ధం తర్వాత కుతుబ్‌షాహి సుల్తానులు దీన్ని పుష్పగిరి మఠానికి అగ్రహారంగా ఇచ్చారు.

నాగార్జునుని గూర్చి జాషువా తన ఆరవ ఖండకావ్యంలో ఇలా అన్నారు.

**"ఓ నాగార్జున సన్మునిప్రవర ! నీవుర్వీస్థలింబాసి యె**
**న్నోనూర్లబ్దములంతరించినవి, ఆంధ్రోర్విన్ భవత్సత్కళో**
**ద్యానంబిప్పుడు పూచికాచి సువిశాలాంధ్రంబు సృష్టించి మా**
**కానందంబు ఘటించె, పండినవి నీయానాటి దీక్షావనుల్"**

గుఱ్ఱం జాషువా తన ఖండకావ్యాలలో 'గుంటూరు సీమ' అన్న ఖండికలో గుంటూరును గూర్చి మనోహరంగా వర్ణించాడు. రాలకు వన్నెనిచ్చు అమరావతి శిల్పుల నేర్పు పెంపు సొంపులను గూర్చి ప్రస్తావించడమే గాక,

**"అలకృష్ణాజలధార పెంపకము సేయంబండు బంగారు తీ**
**గల మాగాణులు పట్టుచీరలయి శృంగారింపగాఁ బూర్వరా**
**జుల దోశ్శౌర్యము లుగ్గడించెడు రణక్షోణీస్థలుల్ రత్నభూ**
**షలుగా బొల్చెడు వీరభూమిని ప్రతిష్ఠాజ్యోతి వెల్గించెదన్"** – అన్నాను.

శ్రీనాథుడు ప్రస్తావించిన పల్నాటిసీమ జొన్నకూడు, బచ్చలి కూరలను గూర్చి, బాలచంద్రుని లేత పచ్చల పిడిబాకును గూర్చి, రెడ్డిరాజులను గూర్చి జాషువాకవి ఈ ఖండికలో గుర్తుచేశారు. నాలుగవ ఖండకావ్యంలో 'గుంటూరు' ఖండికలో జాషువా చేసిన గుంటూరి వర్ణన నిరుపమానం.

**సీ॥ ఏస కొంచెములేని హృదయంగమంబైన సిసలైన**
**తెలుగు రంజిల్లు చోటు**
**కట్టులో బొట్టులో కడమసీమల యందు**
**నగ్రతాంబూళంబు నందుచోటు**
**ఆజానుబాహువులై కోరమీసాల మగవారు దండిగా మసలుచోటు**
**కంటికింపైన చక్కని యందగత్తియలింటింట విద్యుత్తులీను చోటు**

**తే.గీ. అవల పల్నాడు కొండవీడివల నిలిచి,**
**జననమెత్తిన చిఱుత బాలునకు గూడ**
**గురువులై వీరగాథలు గరపుచోటు,**
**వీరభాషాభిరామ గుంటూరు సీమ**

మహబూబ్‌నగర్ జిల్లా మరికల్‌కు చెందిన శ్రీబాలస్వామిగారు 'కృష్ణవేణీ వైభవం' అనే కావ్యం వ్రాశారు. అందులో గుడబల్లూరు, కురుపురము, బీచుపల్లి, శ్రీశైలం, విజయవాడ, గద్వాల, అమరావతి, మంగళగిరి, బందరు, నాగార్జునసాగరం, జటప్రోలు, అలంపురం కూడలసంగమం, మునగాల, ధాన్యకటకం, కూచిపూడి మొదలగు ప్రాంతాలను వర్ణించారు. శ్రీశైలంవైపు వెళ్ళుతున్న కృష్ణానదిని కవి ఇలా వర్ణించాడు.

**"సోమేశ్వర తీర్థంబున, సోమేశుని భక్తి గొలిచి సోహమ్మనుచున్**
**మీ మేదిని కృష్ణానది, శ్రీమంతంబగుచు సాగె శ్రీశైలముకై"**

ధారా రామనాథశాస్త్రిగారు 'ముక్తసస్య' అనే గేయ సంపుటిలో కృష్ణాతీరంలోని ప్రాంతాలను, పుణ్యక్షేత్రాలను గూర్చి గేయఫణితిలో వ్రాశారు. అందులో

**"అమరేశ్వరారామ మాప్లావనము చేయు –**
**అమరవాహిని నీకు అంజలించెదనమ్మ**
**శ్రీశైలమల్లేశు చిత్తసీమల తొలచి పాతాళమున**
**కురుకు భవ్యగంగకు నతులు**
**నాగార్జునుని సీమ నాగేశు పదసీమ వ్యాఘ్రేశ్వరుని**
**వాడ కాకుళేశ్వరు వాటి**
**మున్నుగా నెన్నెన్నొ ముక్తిసీమల దాటి**
**హంసలదీవిని పరమహంసవై నిలిచితివి"**

అంటూ వివిధ క్షేత్రాలను పావనం చేసిన కృష్ణను ప్రస్తుతించారు.

దివాకర్ల వేంకటావధానిగారు తమ నాగార్జున సాగరము ఖండికలో తెలుగు పొలాలకు జలము, తెలుగువారల మతులకు తేజము, తెలుగుకీర్తికి వెలుగును కూర్చిన కృష్ణవేణికి నమస్కృతులు చేశారు. ఈ ఖండిక కృష్ణాపత్రిక (8-10-66)లో ప్రచురితమైంది. ఇందులో డ్యామును గూర్చి చెప్పిన పద్యం ఇలా ఉన్నది.

"కాదిది కృష్ణాపగకు నొక బంధమ్ము కటిసీమ రత్నమేఖలయె కాని
కాదిది వట్టిరాకట్ట దమ్మాంధ్రుల పాలి బంగారు పర్వతముగాని
కాదిది జీవవైకల్య నిర్మాణమ్ము ముగ్ధకార్మిక శక్తి మూర్తికాని
కాదిది వాస్తు వికల్పితాకారమ్ము మూర్తిదాల్చిన వారి బుద్ధికాని
ఈ మహిత మూర్తిశోభవాహిని మహస్సు
నయనముల కింపునింపు నౌన్నత్య గరిమ
అంచితోత్తర కళ్యాణమెంచి నంత ఘనత రానందమున
గల్గు గగురపాటు"

నదీతీరాలు నాగరికతలకు పట్టుగొమ్మలు, ఆధ్యాత్మికతకు పుట్టినిండ్లు, వేలకిలోమీటర్లు ప్రవహించే కృష్ణ ఇందుకు మినహాయింపు కాదు. ఎందరో కవులు కృష్ణను గూర్చి, తత్తీరప్రాంతాలను గూర్చి రసరమ్యంగా వర్ణించారు. అందులో కొన్నింటిని ఈ వ్యాసంలో ఉదహరించడం జరిగింది. ఇవి కేవలం రుచి చూపడానికి మాత్రమే. విషయం కూడా విస్తృతమైనదని మనవి.

"సహ్యాద్రి నందున జన్మించి ఘనమహారాష్ట్ర
దేశమ్ము కర్ణాటకమును
విడనాడి మిక్కిలి ప్రేమతో నాంధ్రదేశముజేరి
సర్వపూజ్యతను బడసి
తుంగభద్రాదుల సాంగత్యమును గాంచి శ్రీశైలమున
మహాశివుని గొల్చి
అతని గుసగుస లమ్మవారికి జెప్ప వడివడిగవిజయవాడ జేరి
భూమితల్లికి పచ్చని పుట్ట మిడుచు, ఆంధ్రవిష్ణు
పాదంబు లంటి పారి
సాగరంబున భక్తితో సంగమించు కృష్ణవేణీ !
నతులు స్వీకరించు మమ్మ". (స్వకీయం)

చిరునామా : శ్రీ ఆముదాల మురళి, తిరుపతి, 9440432683

శ్రీ కాంచనపల్లి చినవెంకట రామారావు

# సాహిత్య వ్యవసాయంలో నల్లగొండ జిల్లా కృషి

నల్లగొండ జిల్లా సాహిత్య చరిత్రను అంతంత మాత్రంగానైనా వ్రాయాలన్న నా యీ ప్రయత్నం వెనక ఎంతోమంది మిత్రుల ప్రోత్సాహ, ప్రోద్బలాలూ వున్నాయి. వాస్తవానికి యీ నాటికి కూడ ఆంధ్ర సాహితీ చరిత్ర నిర్మాణము సమగ్రంగాను శాస్త్రీయంగాను జరుగలేదు. అలాంటిది ఒక జిల్లాకు సంబంధించిన సాహిత్య చరిత్రను వ్రాయడానికి చేసే ప్రయత్నానికి చాలా పరిమితులున్నాయి. మన జిల్లాలో సమర్థులైనవారు ఎందరో వున్నారు. కాని వాళ్ళెవరు అట్టి ప్రయత్నానికి పూనుకొనలేదు. అందుకే నాకున్న పరిమితుల్లో స్థాలీపులాక న్యాయంగా కొంత చరిత్రను తడమడానికి ప్రయత్నిస్తు న్నాను. దీనిలోని లోటుపాట్లను సరిదిద్దగలిగితే స్వీకరించడానికి సర్వదా సంసిద్ధుని అని మనవి చేసుకుంటే "దాసుడి తప్పు దండంతో సరిపోతుంది."

నేడు మనకు లభ్యమౌతున్న లిఖిత సాహిత్యమే సాహిత్యమనుకునే భ్రమలు శాస్త్రీయ "సైంటిఫిక్" సమ్మతాలు కావు. అంతేకాక సామాజిక పరిశీలనకు సంబంధం లేకుండా విడాకులిచ్చేసి సాహిత్య పరిశీలనం చేయడం కూడా సరియైన అవగాహనకు దారులు దిద్దదు. తలా తోకలేని అయోమయాల కీకారణ్యములోకి తీసుకెళుతుంది. కనుక సాధ్యమైనంత వరకు సామాజిక భూమికను ఆధారంగా చేసుకొని ఈ నాలుగు మాటలు పాఠకుల ముందుంచుతున్నాను.

లిఖిత సాహిత్యానికి ఎంతోకాలం ముందు నుండే మౌఖిక సాహిత్యం ఉన్నదన్న విషయం ఈ నాడు వివాదాస్పదం కాదు.

ఇదే విషయాన్ని "మార్గ సాహిత్యం" "దేశ సాహు" అనే విభాగాలుగా ప్రాచీన అలంకారికులు అంగీకరించారు. కాని వరుస క్రమంలోను ప్రాధాన్యతనిచ్చే క్రమంలోను మార్గ సాహిత్యాన్ని మొదట దేశి సాహిత్యాన్ని పిదప పేర్కొన్నారు. కాని వాస్తవం ఏమిటంటే దేశి సాహిత్యం మొదట ఆవిర్భవిస్తే దాని అడుగుజాడల్లో రూపుదిద్దుకొని మార్గ సాహిత్యం పుట్టుకొచ్చింది. జానపదుల నోళ్ళల్లో నలిగి నానినవు కథలు సంస్కరించిన రూపంలో మార్గ సాహిత్యంలో ప్రతిఫలించాయి. అలాగే దేశి సాహిత్యంలోని జాతీయాలు, నుడికారాలు, పదబంధాలు, అలంకారాలు కూడ మార్గసాహిత్యంలో ప్రతిబింబించాయి. ఒక్కొక్కసారి అవి తమ సారళ్యాన్ని సహజత్వాన్ని కోల్పోయి కృత్రిమ సంస్కృతీకరణకు బలైన విషయం అందరికి తెలిసినదే. సంశయాత్ముల సందేహ నివృత్తికోసం పాల్కురికి సోమనాథుని బసవపురాణంలోని "ఆతత బసవ పురాతన భక్త గీతార్థ సమితియో మాతృకకాగా" అన్న ద్విపద పదాన్ని ఉదహరిస్తే సరిపోతుంది.

అయితే వచ్చిన చిక్కు ఎక్కడ అంటే జానపదుల ఆ దేశి సాహిత్యం రికార్డు చేయబడి లిఖిత రూపంలో లేదు. ఏ కొంతో వున్నాకూడా అది మనకు దక్కలేదు. కవిత్వానికి ఆదిమ రూపమైన పాటను మన ప్రాచీనులు కవిత్వంగాను సాహిత్యంగాను గుర్తించలేదు. మీదు మిక్కిలి పద కవితలను "దిడ్డి లంజలతో" నీచంగా పోల్చి పడనెట్టారు. కానీ తమిళ, కన్నడ సాహిత్యకారులు పదాలను, పాటలను కవిత్వంగా గుర్తించే విశాలతత్త్వాన్ని చూపించారు. కనుక పద సాహిత్యం తమిళానికి దక్కింది. కొంత కన్నడానికి దక్కింది. ఆదిమ యుగాల మరియు రాజుల ఆస్థాన సాహిత్యంతోపాటు జానపదుల కష్టసుకాలను తెలిపే తుమ్మెద పదాలు, ప్రఖ్యాత పదాలు, పర్వత పదాలు, నివాళి పదాలు, వెన్నెల పదాలు మొదలగునవి వడ్లు దంచుకునేటప్పుడు, పనులు చేసుకునేటప్పుడు ప్రజలు పాడుకున్నారు- కాని వాటిని సహించని, క్షమించని దర్బారీలు ధ్వంసం చేసి పారేశారు. లేకుంటే జైన బౌద్ధ దేవాలయాలను శైవ, వైష్ణవ దేవాలయాలుగా మార్చి పారేశారు. కనుక మనకు జైనుడైన మహావీరాచార్యుడు వ్రాసిన గణిత శాస్త్రం యొక్క తర్జుమా "సారసంగ్రహ గణితం" అనే పేరుతో పావులూరి మల్లన్న గ్రంథం దొరుకుతుంది. అలాగే జైనుడైన మల్లియరేచన వ్రాసిన మొదటి ఛందో గ్రంథం అసలు రూపంలో కాకున్నా మనకు దొరుకుతున్నది. అసలు మొత్తం ఆంధ్ర దేశాన్నే ఉర్రూత లూగించిన బౌద్ధ, జైన సాహిత్యం వైదిక మత పునరుద్ధరణ పేరుతో సర్వనాశనం చేయడం జరిగింది. వైదికులు, శైవ, వైష్ణవులు తెలుగుభాషను దేశి సాహిత్యాన్ని తమ ప్రచారానికి ఉపయోగించు కున్నట్లే, జైన బౌద్ధులు, చార్వాకులు వగైరా తప్పకుండా ఉపయోగించు కొని ఉంటారు. జైన, బౌద్ధులను గానుగ లాడించినట్టుగానే వాళ్ళ

సాహిత్యం కూడా అదే దురదృష్టానికిలోనై ఉండి ఉంటుంది.

ఇదంతా ఎందుకు చెప్పడం జరుగుతున్నదంటే నల్లగొండజిల్లా ప్రాంతాలనుకునే బౌద్ధ, సాంస్కృతీ శిల్ప సాహిత్యాలు మూడు పువ్వులు ఆరు కాయలుగా విలసిల్లిన నాగార్జున కొండ (విజయపురి) శ్రీ పర్వతాలు దక్షిణం దిశకూ, అలాగే తూర్పు దిశలో జగ్గయ్యపేట బౌద్ధ శిథిలాలు ఉన్నాయి. అసలు మన జిల్లాలోనే పాత, కొత్త రాతి యుగాల అవశేషాలతోపాటు ఆదిమ సమాజం మరియు, బౌద్ధ, సంస్కృతి కేంద్రమైన ఏలేశ్వరం మన జిల్లాలోనే వుంది. అయినా అది యిప్పుడు నాగార్జున సాగర్ నిర్మాణం తర్వాత మునిగిపోయింది. నాగార్జున శిల్పాలు, కట్టడాలు లాగ వేరే చోట పునరుద్ధరించటం జరగలేదు. ఇంతేకాక శాతవాహన పూర్వీకుల పట్టణాలు, విహారాలు మన జిల్లాలో ఉన్నాయి. ఫణిగిరి, గాజులబండ యిత్యాది ప్రదేశాల్లో ఆనాటి నాణాలు తయారు చేసే టంకశాలలతో సహా బయటపడ్డాయి. ఈ 80 దశకంలోనే వర్ధమానకోట గ్రామంలో త్రవ్వకాలు సాగుతున్నాయి. కొన్ని శాసనాలు, స్థూపాలు కూడ వెలుగులోకి వచ్చాయి. అంతేకాక మన జిల్లాలోను జిల్లానానుకొని వున్న ప్రదేశాల్లో "బుద్ధారం" అన్న పేరుతో వున్న గ్రామాలు ఎన్నో వున్నాయి. బుద్ధారం అంటే దాక్షారామం లాగే 'బుద్ధ ఆరామం' అన్నమాట. దాక్షారామం దాక్షారం అయినట్టే బుద్ధ ఆరామం బుద్ధారాం అయ్యింది. దేవరకొండ తాలూకాలో వున్న మెసంగి అనే గ్రామం ఒకనాటి మహాసంగం. మహా సాంగీకులు అనే శాఖ వున్నదన్న విషయం మరువకూడదు. ఇలాంటి చోట త్రవ్వకాలు జరిపితే ఎన్నో విశేషాలు బయటపడతాయి. ఆనాటి శిల్ప సంపదలతోపాటు సాహిత్య సంపదలు కూడా వుంటే, ఒకవేళ రాళ్ళమీద వుంటే బయటపడవచ్చు. భౌతిక దృష్టితో చూస్తే శిల్పాలు చిత్రాల నుండి కూడ సంస్కృతీ, సాహిత్య చరిత్రను రాబట్టుకోవచ్చు. ఎక్కడ బౌద్ధ క్షేత్రం వున్నా అది కేవలం దండాలు దస్తాలు పెట్టి గుండ్లు కొట్టిచ్చుకొనే క్షేత్రాలు కావు. అవి విద్యాబోధన, అధ్యయన కేంద్రాలు. ఆనాడు ప్రాకృతం రాజ భాష అయినా అది తెలుగు భాషను ప్రాభావితం చేసింది. తెలుగుభాషతో ప్రాభావితం అయ్యింది. అసలు తెలుగుదేశంలో వుండి బోధించేవాడు, ప్రజల్లో ప్రచారం చేసుకునేవాడు సంస్కృత పండితులులాగ తెలుగును ఉపేక్షించడు. తెలుగులో వ్రాయడం అవమానం అని కూడ అనుకోడు. అలాగే నేటికి సజీవంగా నిలచివున్న జైన క్షేత్రం కొలనుపాక ఆనాటి రూపంలో సంస్కృతీ సాహిత్యాల కేంద్రంగా లేదు. వైదిక మతాను యాయుల దాడిని తట్టుకోడానికి ఎన్నో అవతారాలెత్తి నేటి ఈ రూపంలో వుంది. లేకుంటే నల్లగొండకు పొరుగునే వున్న పానగల్లు ఛాయా సోమేశ్వరాలయం లాగా శివుని గుడి అయిపోయేది. పానగల్లు కూడ ఒకప్పుడు జైనక్షేత్రం. అలాగే నల్లగొండ స్థానికపు పడమటి భాగంలో పర్వతం దాపున వున్న శిలాస్తంభం జైనదేవాలయాల ముందు వుండే శిలాస్తంభం. దాని దగ్గర వున్న గుళ్ళు యిప్పుడు పాడుబడ్డ శివాలయాలు. దానికి సమీపంలోనే పాడుబడ్డ ఆర్యసమాజ ఆవరణలో శిఖరాలతో నా ఎరుక పట్టులో దేవాలయాలు వుండేవి. యిప్పుడు వాటి పత్తా లేకుండా చేశారు. ఒక విధంగా చూస్తే నల్లగొండ చుట్టు ప్రక్కలే జైన బౌద్ధ స్థూపాల విహారాలమయం. ఏనాటికైనా సంస్కారం, సంస్కృతీ వున్న ప్రభుత్వాలు వస్తే భౌతికంగా నిక్షిప్తమై వున్న చరిత్రను త్రవ్వి తీస్తే కావలసినంత సామాజిక చరిత్ర తద్వార సాహిత్య చరిత్ర లభ్యమవుతుంది. సుప్రసిద్ధ చరిత్రకారులు శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారి పరిశోధన ప్రకారం మన నల్లగొండ జిల్లా రాయగిరిలో "కైరన్"లు బయటపడ్డాయి (రాతి యుగాలనాటి సమాధులు). ఇవి వరుసగా హైదరాబాదు జిల్లా, నల్లగొండ జిల్లా, వరంగల్, ఖమ్మం మధిర రైలు మార్గాలు కైరన్‌ల మధ్య నుండే వెళతాయి. వీటినే మనవారు రాక్షస గుళ్ళు అంటున్నారు. పెట్టెలాంటి నిర్మాణం రాతి పలకలతో పేర్చి ఎరుపు నలుపు పాత్రలు, మృతులు వినియోగించిన ఆయుధాలు ఆభరణాల్ని పెట్టి రాతిపలకలతో మూసివేస్తారు. దీన్నే సిస్ట అని కూడ అంటారు. ఇలాంటి కైరన్‌లు సిస్టులు బృహత్ శిలాయుగం నాటివి. చనిపోయిన వాళ్ళకోసం టన్నుల కొద్దీ బరువుండే రాళ్లను యింత జాగ్రత్తగా నిర్మించారంటే ఆనాటి సమాజవ్యవస్థ కట్టుదిట్టంగా వుండి వుండాలి. ఇలాంటి నిర్మాణానికి కావలసిన తీరుబడి, తిండిపుష్టి వున్నదనుకోవచ్చు అంటారు. శ్రీ డి.డి. కోశాంబి, శ్రీ సంకారియా లాంటి సుప్రసిద్ధ చరిత్రకారులు ఆర్కియాలో జిస్టు ఇలాంటివి నాగార్జున కొండలోను, ఏలేశ్వరం ప్రాంతంలోనూ కనిపించాయి. ఇవి యినుము యుగపు సమీప కాలంలోనివి. అలాగే నార్కెట్‌పల్లి వద్ద వందల వేల సంఖ్యలో సమాధి రాళ్ళు పోగులను శ్రీ మెడోస్ టైలర్ నూరేళ్ళ క్రితం కనుగొన్నారు. ఈ పోగులో రాగి గంటలు బల్లెపు మొనలు కూడ దొరికాయి. దేవరకొండ వద్ద కూడ యిలాంటి సమాధులే కనిపించాయి. భువనగిరి తాలూకా రాయగిరి సమాధులవద్ద లభించిన ఎరుపు నలుపు పాత్రలపైన కొన్ని సంకేత చిహ్నాలు ఉన్నాయని, యిట్టి చిహ్నాలు మొహెంజాదారోలోను అక్కడ దొరికిన ముద్రికలలోను కనబడ్డాయని శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు అంటున్నారు. మొహెంజాదారో లిపి యింకా డిసైఫర్ (చదవడం) ఈనాటికి కాలేదు. అది సాధ్యపడితే భవిష్యత్తులో మన జిల్లా సాహిత్య చరిత్రలో ఎన్నో అద్భుతాలు బయటకొస్తాయి. ఈ బృహత్ శిలాయుగం నాటికి యినుము రాతి యుగపు మానవ సంస్కృతీ పరిణామంలో ఒక గుణాత్మకమైన పరివర్తన వచ్చింది. దానికి పూర్వం ఉన్న పాత కొత్త రాతియుగాల సంస్కృతీ, సభ్యతలను అధిగమించాడు. "కైరన్" లలో దొరికిన ఇనుపకత్తులు, కొడవళ్ళు దీనికి ప్రబల సాక్ష్యాలు. ఇనుము యుగారంభపు శ్మశానం నాగార్జున కొండలో కనిపించింది. ఇక్కడో విషయం మనవి చేయాలి. ఇనుమును కనిపెట్టడం, నాగలి వ్యవసాయం చేయడం ఉత్తర హిందూస్థానాని కన్నా మొదలే దక్షిణాన వున్నందున ప్రాంతంలో ప్రారంభమైందని ఆర్యశాఖ పరిశోధకుల

(ఆర్కియాలోజిస్టులు) పరిశోధన బలపర్చింది. ఆహారం సేకరించి కొని బ్రతికే దశ నుండి ఆహారం వుత్పత్తి చేసుకొనే దశకు ప్రయాణించింది సమాజం. పశువులను పెంచారు, పంటలను పండించారు, ఇళ్ళు కట్టుకున్నారు. బట్టలునేశారు. వేసుకున్నారు. అడవులను నరకడం జరిగింది. చెరువులు, కాల్వలు త్రవ్వడం జరిగింది. జీవిత పోరాటంలో మతం కూడ ప్రవేశించి సహాయం చేస్తూ వచ్చింది. చరిత్ర (యుగానికి) పూర్వయుగము సౌందర్యోపాసన చదవడం రాయడం మొదలయింది. ఈ దశకు రావడానికి ముందే పాత కొత్త రాతియుగాలలో నిప్పును కనిపెట్టడం, విల్లంబులు వాడటం వచ్చేసింది. మానవ సమాజ పరిణామమంతా బ్రతుకుతెరువు కోసం పనిముట్లను అభివృద్ధి చేసుకోవడం పునాదిగా సాగిందన్న విషయాన్ని మరవటానికి వీల్లేదు. నేటిదాకా సాగిన ఈ సామాజిక పరిణామం ఒక గంట అనుకుంటే, అందులో 59 నిమిషాలు ఆదిమ దశ నుండి పైకి రావడానికి పట్టింది. మిగిలిన ఒక నిమిషం మాత్రమే నాగరిక యుగం అని అంటారు "హైమన్‌లెవి" అనే శాస్త్రజ్ఞుడు. యంత్రయుగం అనేది 1 1/2 సెకండ్లు మాత్రమేనట అంటారు, ఈయనే తను 'సోషియల్ థింకింగ్' అన్న పుస్తకంలో.

స్థూలంగా పాత రాతియుగాన్ని మాతృస్వామిక దశకుగాను నూతన శిలాయుగాన్ని పితృస్వామిక సామాజిక దశ అనుకుంటే ఆ దశలో మానవ సమిష్టి జీవితం, సమిష్టిగానే జరుపుకునే ఆహార సేకరణ దానికోసం జరిపే ప్రకృతి ఉపాసనల్లో సమాజిక మంత్ర తంత్ర కలాపం (మాజిక్) యొక్క ప్రాముఖ్యతను కాదంటానికి వీల్లేదు. ఆ మంత్ర తంత్ర కలాపాలే వేటకు వెళ్ళేముందు జరిపే సామాజిక నాట్యాల్లో ప్రతిబింబిస్తుంది.

అలా సామూహికంగా చేసే సంగీత నాట్యాలు ఆహార సేకరణకు, ప్రధానమైన జంతువుల వేటకు దోహదం చేస్తున్న విశ్వాసం ఉండేది. ఆనాటి సమాజానికి సంగీత నాట్యానికి ఆలంబనగా కవితా రూపంలో పాట వుండక తప్పదు. ఆ పాటకు సృష్టికర్తలు గణ సభ్యులే. కుదురు (Class) తెగ (Tribe) ల సమిష్టి కృషి కూడా సామూహికమైన ఆట పాట కవితలను అవిభాజ్యంగా వుంచి అభివృద్ధి చేయటానికి దోహదం చేసాయి. తర్వాత తర్వాత ఆటవేరయింది. పాట వేరయింది. కవిత కూడ తనదారి తను చూచుకున్నది. దీనికి సమాజంలో వచ్చిన శ్రమ విభజన సంగీత నాట్య సాహిత్యాల్లో ప్రతిబింబించిందన్నమాట. అది వేరే విషయం.

పాట, పదానికి పూర్వం మంత్రం ఉండేది. దీనికి దృష్టాంతం సంస్కృతం ఒకటే కాదు. గ్రీకు, లాటిన్, సెమిటిక్ భాషల్లో గూడా దొరుకుతుంది. మానవుడు తన మాజిక్ శక్తుల ద్వారా తన అభీష్టాన్ని ప్రకృతిపై రుద్దడానికి ప్రయత్నిస్తాడు. ప్రకృతిలో పోరాటం భాగంగానే మంత్రం మొట్టమొదటి కవిత్వంగా వచ్చేసింది. కాని ఆ మంత్రాలు నేడు మనకు ప్రాచీనమైన తెలుగులో దొరకవు. మార్పులు చెందుతూ నేటి రూపంలో, నేటి భాషలో నిలిచిపోయాయి. దీనికి ఉదాహరణ ఏ పాము మంత్రమో, తేలు మంత్రమో చదివినా అవగాహన అవుతుంది. పార్సి, అరబ్బీ, ఉర్దూలు, ప్రచురితమైన తరువాత ఆ పదాలు గూడా మంత్రాల్లో ప్రవేశించాయి. ఈ మంత్రాల ప్రార్థనల్లో ఒక నిర్ణీతమైన పద్ధతి, విధానం అంటూ ఏమీ ఉండదు. తన మనసులోని భావాన్ని ధారావాహికంగా చెప్పివేయడమే తప్ప వేరే ఏమీలేదు. మన జిల్లా దేవరకొండ తాలూకా సరిహద్దులో ఉన్న చెంచులు పాత రాతియుగం ఆచారాలను పాటిస్తు ఉంటారు. వాళ్ళల్లో పురోహితవర్గం అంటూ శ్రమవిభజన ఏర్పడలేదు. గ్రామానికి ఉండే పెద్దకు కూడా అధికారం అంతగా లేదు. వాళ్ళు వేటకు వెళ్లే ముందు "గారల మైసమ్మ" అనే దేవతను ఇలా ప్రార్థిస్తారు: "అమ్మా! గారల మైసమ్మ, ఏమన్నా దొరికితే నిన్ను కొలుచుకుంటామమ్మా! తల్లీ- నిన్నే నమ్ముకున్నాం- దయ చూడు తల్లీ" అంటూ మనలాగా శుద్ధ వచనంలో చెప్పకుండా తూగూ, లయ, ఇత్యాదుల యుక్తంగా పాడుకుంటారు. వేటనుండి తిరిగి వచ్చాక "నీ దయ వలన దొరికింది తల్లీ, దండాలు!" అని చేతులెత్తి దండాలు చేస్తారు. ఋతువులో మొదటి పండు దొరికినప్పుడు, మొదటి ఇప్పపూవు నేల రాలేముందు, చెట్లు ఎక్కేముందు గారల మైసమ్మను పూజిస్తారు. ఒకప్పుడు చెంచుల్లాగే జీవితాల్ని గడిపిన మనం చాలా ముందుకు వెళ్లిపోయాం కాని చెంచులు ఇంకా రాతియుగంలోనే ఉన్నారు. ఒక విధంగా వారు మన పూర్వీకులు. నేటికి గూడా మన సమాజంలో చెట్టెక్కేటప్పుడు దండం పెట్టడం ఒక రివాజు అయింది. అలాగే కుప్ప కొట్టే ముందు ధాన్యలక్ష్మికి దండం పెట్టడం, కొబ్బరికాయలు కొట్టడం వగైరాలు ఆనాటి ఆచారాలు. ప్రకృతిని వశపరుచుకొనే పరికరాలు అనుభవంలోకి వచ్చాక కూడా పనిముట్లకు పెట్టేదండం, పూజా ఇత్యాదులు మంత్రయుక్తంగా వుండి ఉంటాయి. ఆ మంత్రాలు ఒకప్పుడు తెలుగులోనే ఉన్నాయి. కాని గీర్వాణం ముదిరి సంస్కృతం అవతారాలు ఎత్తాయి. ఇదేదో అభ్యుదయవాదుల, మార్క్సిస్టుల ఊహాగానం అనుకొని భుజాలు తడుముకొనేవాళ్ళకోసం బి. రామరాజుగారి వాక్యాలను ఉదహరిస్తారు. "తెలంగాణ జానపద గేయాలు" అన్నవారి వ్యాసంలో నాగన్న అన్న పాటను ఉదహరించారు. అది ఇలా సాగుతుంది :

**"ఊరికి ఉత్తరాన ఊడల మర్రికింద**
**కొమిర పుట్టాలో ఉన్న కోడే నాగన్న**
**కరిచి విషము పోసి, మరచి పన్నవు నాగా!**
**నాగన్నాదిగరా! నా తండ్రి దిగరా"**

ఇలా కొన్ని చరణాలు సాగుతాయి. మిత్రులు శ్రీ రామరాజుగారు దీన్ని ఒక పాము మంత్రం, ఒక మాన్ స్త్రీ మంత్రం నేర్చి ఉండినది. ఆమె విటుడిని ఒక నాడు పాము కరిచింది. పదిమంది ముందు

ప్రియుడి ఇంటికి వెళ్ళి మంత్రం వేయడానికి అభిమానం అడ్డం వచ్చింది. తన ఇంట్లోనే ఉండి ఏదో పని పాటలో నిమగ్నురాలైన దానిలా నటించి ఆ మంత్రాన్ని బిగ్గరగా పాట పాడిందట. దానితో ఆమె ప్రియుడికి విషం విరిగిందట. వాడు బ్రతికాడుట. కానీ తేలు మంత్రం, పాము మంత్రం అంతా విన్నారు కనుక మంత్రశక్తి మాయమయి పోయిందట. ఆనాటి నుండి ఈనాటి దాక అందరి నాలుకలమీద పాటగా మారిపోయింది. తెలంగాణాలో ఉన్న బొడ్డెమ్మ పండగ, బతకమ్మ పండగ వాటికి సంబంధించిన పాటలలోను, బైండ్లవారి 'ఎల్లమ్మ కథ' లోనూ మాతృస్వామ్య సమాజ లక్షణాలు, అవశేషాలు కనపడతాయి. వాటినన్నిటిని సామాజిక దృష్టితో పరిశీలించాలి. అలాగే మాతృపురాణం ఇత్యాదులు కూడా.

ఇదంతా ఎందుకంటే, జానపద సాహిత్యమంతటిలో విశిష్టత లేదని, కేవలం శృంగారమే ఉందని లొట్టలేస్తూ ఆనందించే భృగులకు కనువిప్పుగా జానపద కష్టసుఖాలు ప్రతిబింబించే పాటలకు, వాటి సేకరణకు, వాటిని సరి అయిన దృక్పథంతో ప్రదర్శించకపోవడం ఎంత అపచారమో చెప్పవీలులేదు. జానపదులు వారి కష్టసుఖాలను, వాటికి కారకులైన వారిని క్షమించి ఊరుకోలేదు. నోరు మూసుకోలేదు. గొంతెత్తి ఖండించారు. **ఉదాహరణకు :**

**"ఏటికి ఏతం పెట్టి ఎయిపుట్లు పండించి**
**ఎన్నడూ మెతుకెరగనన్న నేను గంజిలో**
**మెతుకెరగనన్న"**

అని సాగే ఈ పాటలో మిత్రులు రామరాజుగారి వ్యాస వాక్యార్థంలో చెప్పాలంటే పాటలో వున్న "కాకితన్ని పాయెరన్నా, కాకిపిల్లతన్ని పాయెరన్నా" అన్నచరణంలో, కాకి మరియు కాకి పిల్లను గ్రామాధికారి మరియు వాడి కుమారుడికి మారుగా సంకేత పరిచాడు ఈ జానపద కవి. అలాగే ఇంటికిపోతే వాడి ఆలుబిడ్డలను అవమాన పరిచారట. పనికి వెళుతుంటే పక్కలు విరగబడ్డాడు. ఈ పాటలో ప్రత్యక్షంగా కసిని వెళ్ళబోసుకోలేక పరోక్ష పద్ధతిని అవలంబించాల్సి వచ్చింది పాపం. ఆనాడు పౌరహక్కుల వెలుగులో ఈ మాత్రం గుండె బలం చెప్పుకోతగ్గది. వర్గ పోరాటాన్ని ప్రత్యక్షం చేసే ఎన్నో పాటలున్నాయి. రామదాసు యక్షగానం ఆడుతుంటే పెత్తందారులు వాళ్ళ ధోరణి, దోపిడి, కళ్ళకు కట్టినట్లుగా హాస్యగాళ్లు వర్ణిస్తుంటారు. (అనుకరిస్తుంటారు) గుమ్మడి కాయల దొంగలు భుజాలు తడుముకుంటారు. ఇప్పటికి ఇది ప్రత్యక్ష అనుభవం. కాని రైతు తిరుగుబాటు తత్త్వాన్ని ప్రతిబింబించే పాటలు కోకొల్లలున్నాయి. వాటిపై శ్రద్ధ యూనివర్సిటీ ప్రాంగణాల్లో పండిత, ప్రకాండులలో లేదు. ఎంతసేపు అధిక వర్గాల చెక్క భజనలు, కందుకూరి గురజాడలకు పూర్వం వున్న మూఢ విశ్వాసాలకు ప్రాణం పోసి వాటికి కుహనా జాతీయతా ముసుగుల్ని తొడిగి "తిమ్మిని బమ్మిని-బమ్మిని తిమ్మిగా" చేయడంతోనే బతుకులు తెల్లార్తున్నాయి. అయినా కొందరు యువకులు ఆదిమ యుగంలోనూ, మధ్య యుగాల్లోను వున్న ప్రజలయొక్క రైతాంగంయొక్క ప్రతిఘటనను వెలుగులోకి తెచ్చే పరిశోధనలు, ప్రయత్నాలు చేస్తున్నారు. అయినా ఈ ప్రయత్నాలు నిరంతరం సాగాల్సిందేకానీ ఇవి ఒక్కనాటితో పూర్తయే కర్తవ్యం కాదు.

జానపద కళారూపాల్లో అసందర్భమూ, నిర్జీవమూ అయిపోయిన వస్తువును మార్చి కొత్త వస్తువును చేర్చి వాటిని సజీవంగా వుంచడంకూడా అత్యవసరం. పాతవాటిని రికార్డు చేసి వుంచడం కూడా నేడు అవసరమే. వీటికి నేడు సాంకేతికంగా టేప్ రికార్డు, సినిమా, ఇత్యాదులు దోహదకారకాలు. అందుకే జానపద కళారూపాల సేకరణా, సంరక్షణా, యూనివర్సిటీలు సరియైన శాస్త్రీయ దృక్పథంతో పూనుకోవాలి. వీనిలోవున్న పాత, కొత్త రాతియుగాల మరియు ఇనుము యుగం యొక్క సామాజిక లక్షణాలను దాన్ని ప్రతిబింబించే సాహిత్యాన్ని వెలుగులోకి తీసుకురావాలి. నేటి పరిస్థితులలోను తీరని కోర్కెగావున్న ఆ కర్తవ్యాన్ని పునఃచరణం చేసుకుని ముందు తరాలకు ఈ కర్తవ్యాన్ని వదలడమే మనం చేయదగిన పని. ఈ కొన్ని విషయాలలో మనజిల్లా సాహిత్య చరిత్రయొక్క మధ్య యుగంలోకి ప్రవేశిద్దాం.

మన జిల్లా మధ్యయుగాల సాహిత్య చరిత్ర "బాదామీ కల్యాణి చాళుక్యుల" యుగంతో ప్రారంభమౌతుంది. ఎందుకంటే మన జిల్లాకు తూర్పు చాళుక్యులతో సంబంధంలేదు. తెలంగాణా, రాయల సీమలతోపాటు మొదట బాదామీ చాళుక్యుల పరిపాలన లోనూ, తరువాత "రాష్ట్రకూటుల" పరిపాలనలోనూ, మళ్ళీ కళ్యాణీ చాళుక్యుల పరిపాలనలో వుండి పోయింది ఆ తరువాత కాకతీయ యుగం, మహ్మద్ తుగ్లక్ దండయాత్రలతో, కాకతీయరాజ్యం పతనంతో, ముసునూరి నాయకుల పరిపాలనలోనూ, ఆ పిమ్మట రాచకొండ రాజ్యంలోనూ, ఆ రాజ్య పతనం తరువాత బహ్మనీలు, వారి తరువాత కుతుబ్‌షాహీలు కొంతకాలం మొగల్ పరిపాలనలో వుండి, అసఫ్ జాహీపరిపాలనలోకి పరోక్షంగా ఇంగ్లీషు సామ్రాజ్యవాదుల ఛత్రఛాయల్లోనూ, వుంటూ వచ్చింది. సెప్టెంబర్ 13, 1948 సం.న జిల్లాకు విముక్తి లభించి ఫ్యూడల్‌యుగం నుండి ప్రజాస్వామ్య యుగంలోకి అడుగుపెట్టింది. రైతాంగ సాయుధ ప్రతిఘటన కారణంగానూ, కేంద్ర ప్రభుత్వ పోలీసు చర్య కారణంగానూ, ఒక యుగం మారి ఇంకోయుగం వచ్చేసింది. జుత్తుకో ఓటును ఇచ్చిన ప్రజాతంత్రం, ఆర్థిక ప్రజాతంత్రమైన సామ్యవాదానికి దారితీయడం లేదు. సోషలిజం సాధనే నేడు ఎజెండాలో ఉంది. సోషలిజం పేరు చెప్పుకుంటే పుట్టగతులు లేవన్న విషయం పాలక వర్గాలకు కూడా బోధపడిపోయింది, ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా ప్రజాతంత్రం యుద్ధ నినాదమైతే, నేటి పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా సోషలిజం ప్రజా నినాదంగా ఉంది. సామాజిక బాధ్యతలను గుర్తించి రచయిత,

కవి, భూస్వామ్య రాచరిక వ్యతిరేక వర్గపోరాటంలో ప్రజాతంత్ర నినాదంతోనూ ఆచరణతోనూ నేడు సోషలిజం నినాదం దాని ఆచరణతోనూ సంబంధంలేదని మడికట్టుకొని త్రిశంకు స్వర్గంలో విహారాలు చేయలేదు. అలా "నన్ను ముట్టుకోకు నా మాలకాకి" అనుకునే సాహిత్యకారులు ఎవరైనా ఉంటే, వారికో నమస్కారం పారేసి, ఎదురుగా రాకపోవడమే ఉపకారమని సర్దుకొని వాళ్ళ ఖర్మానికి వాళ్ళను వదిలేయాల్సిందే. మారిన నేటి సామాజిక పరిస్థితుల్లో సాహిత్యం యొక్క ధ్యేయం మత్తునిచ్చే ఆనందం కాదు. అది చైతన్యానిచ్చేది. తట్టిలేపి కర్తవ్య కంకణ బద్ధుణ్ణి చేసే స్ఫూర్తి. ఎందుకంటే నేడు మానవుడు చరిత్రను వ్యాఖ్యానించడంతోనే సంతృప్తి పొందడం లేదు. దాన్ని దృఢ సంకల్పంతో మార్చే దీక్షా బద్ధుడైనాడు. ఇలా జగన్నాథ రథం సాగిపోతూనే ఉంది. సామాజిక సంబంధాల విషయానికొస్తే కొన్ని ప్రత్యేక లక్షణాలున్న ప్రాచ్య సమాజాల సమిష్టిగా ఉండే భూసంబంధాలపై ఆధారపడే దశనుండి స్వయం సంపూర్ణ గ్రామీణ వ్యవస్థ దశకు చేరుకున్న ఒక తరహా ఫ్యూడల్ వ్యవస్థ. బాదామీ చాళుక్య రెండవ పులకేశి దండ యాత్రలతో తెలుగు దేశంలో ఈ జిల్లాతో సహా సుప్రసిద్ధ చారిత్రకుడైన D.D. కోశాంభి మాటల్లో చెప్పాలంటే, పైనుంచి ధృవపరచబడిన ఫ్యూడలిజం విశ్వాస పాత్రులైన సేనా నాయకులకు భూములు జాగీర్లు ఈయడంతో ప్రారంభమైంది. అదే విధంగా క్రిందినుంచి ధృవపరచబడ్డ భూస్వామ్యం గ్రామ సమిష్టి భూములను రాజులు వారి పరివారం (రైతల సేద్యంలో ఉన్న వాటిని వదలి.) ఆక్రమించుకోవడంతో ప్రారంభమయింది. దీని కనుగుణంగానే శాతవాహన యుగంలోనూ, ఇక్ష్వాకుల యుగంలోనూ వున్న వర్తక శ్రేణులు, పారిశ్రామిక శ్రేణులు బలహీనపడ్డాయి. వడ్రంగులు, కమ్మరులు, కంసాలులు, (ఒకప్పుడు వీరు బౌద్ధ, జైనులు) వృత్తి శ్రేణులు ఛిన్నాభిన్నమై పట్టణాలను వదలి గ్రామాలకు పంపిణీ అయిపోయారు. అలాగే తెలికలు వగైరా.... బౌద్ధ, జైనారామాలకు వేల నాణాలిచ్చి శాశ్వత ధర్మ కార్యాల నిధులు, అఖండ దీపాలకు కావలసిన నేతికోసం గోవులు, బర్రెలు, మేకలు మరియు బంగారం ఇత్యాది విలువైన లోహాలతో ట్రస్ట్ నిధులు ఏర్పాటు చేసిన వృత్తి పనివాళ్ళ శ్రేణులు సముద్రాంతరయానం మానుకొన్నాయి. కృష్ణా, గోదావరీ నదీ జలాల్లో సాగే పడవ ప్రయాణాలు ఖరీదైపోయాయి. సముద్రాంతరయానం చేసే వారిని వెలికి గురిచేసే వైదిక మత పునరుద్ధరణ ఫలితమిది. ఈ మూఢత్వము పుణ్యమా అని సముద్ర వర్తకం అరబ్బుల చీనావారి వశమైపోయాయి. స్వేచ్ఛా సౌభ్రాతృత్వాల సందేశాలు సిలోను, మలేషియా, ఇండోనేషియా, వియత్నాం ఇత్యాది ప్రాంతాల కందించిన వృత్తుల శ్రేణుల సభ్యులు శ్లేష్మంలో ఈగల్లాగా, కూపస్థ మండూకాల్లాగా స్వయం సంపూర్ణ గ్రామీణావస్థలో కూరుకొని ఇరుక్కొనిపోయారు. భూస్వామ్య ప్రభువుల ప్రత్యక్ష దోపిడికి గురి అయ్యారు. ఈ విధంగా రైతాంగం, నాటి చేతి పరిశ్రమల వారు తమను నానా విధాల పన్నుల బాధకు దోపిడీకి గురిచేస్తూ అభివృద్ధిని అరికడుతున్న పాలక వర్గాలకు లొంగిపోలేదు. ప్రతి ఘటనగా కొందరు గ్రామాలొదిలిపోయారు. అడవుల్లో కాపురాలు పెట్టారు. పాలక వర్గాలు దిగివచ్చి పన్నులు తగ్గించేదాకా ఊరుకోలేదు. పాలక వర్గాల జులుం, దాని ప్రతిఘటనా ఫలితంగా పాలక వర్గం లొంగి కొన్ని సౌకర్యాలు కలిగించడం అన్నది కొన్ని శిలా శాసనాల ద్వారా మనకి తెలియ గలిగింది. ఈ పరిమితులు మించి పన్నులు విధించము అని వాగ్దానం చెయ్యాల్సి వచ్చింది ప్రభువులకు. అవన్నీ వచన రూపంలో శాసనాల కెక్కాయి. ఆనాటి వచనం ప్రజల సజీవ భాషలో ఉంటుంది కానీ, భారత భాగవతాల సంస్కృతంతో ప్రభావితమైన కృత్రిమ కృతక భాషలో ఉండదు. కొన్ని, కొన్ని పలుకుబడులు వ్యవహారం నుండి తొలగిపోయి అర్థం కాకుండాపోయాయి. ఈ శిలా శాసనాల్లో పద్య గద్యాలు తెలుగు, సంస్కృతి సమ్మిళితమైవున్నాయి.

ఇక్కడ ఒక విషయం గమనించాలి. శాతవాహన ఇక్ష్వాకుల యుగం తరువాత ప్రాకృతం రాజభాషగా ఉండలేదు. ఆ తర్వాత ప్రాకృతం స్థానాన్ని దేశభాష అయిన తెలుగు తీసుకోవడానికి బదులు వైదిక మత పునరుద్ధరణ కారణంగా సంస్కృతము రాజభాషగా వచ్చేసింది. అందుకే ఇక్ష్వాకు వంశపు రాజు 'మొహువ' (ఇది తమిళం) శాంతమూలుని కాలపు సగభాగం ప్రాకృతంలో ఉంటే మరో సగభాగం సంస్కృతంలో ఉన్నాయి. ఇక్ష్వాకుల కాలంవరకు శాసనాలు రాళ్ళమీద ఉండేవి. తరువాత రాగి రేకులమీదకి ఎక్కాయి. 'నాగార్జున కొండ' జగ్గయ్యపేట శాసనాలు 'బ్రాహ్మి' లిపిలో ఉంటే తరువాత శాసనాలు సంస్కృతమైనాసరే ప్రాచీన తెలుగు, కన్నడ లిపులలో ఉన్నాయి. విష్ణుకుండినుల రాజధాని ఇంద్రపాలనగరం రామన్నపేట తాలూకా తుమ్మలగూడెం సమీపంలో ఉంది. వారు శాసనాల ద్వారా కొంతవరకు బౌద్ధమతాన్ని ఆదరించినట్లు మనకు తెలుస్తుంది. విష్ణుకుండినుల నాణాలు భువన గిరిలో దొరికాయి. శాతవాహన నాణాలు కూడా రోమన్ నాణేలతోపాటు మన జిల్లాలో దొరికాయి. మన జిల్లాలో దొరికే శాసనాల్లో కన్నడ మరియు తెలుగు భాషా శాసనాలు కొలనుపాక, భువనగిరి, వాడపల్లి, నాగులపాడు, అనుముల అన్నారెడ్డి గూడెం ఇత్యాది గ్రామాల్లో దొరికిన శాసనాలు లిపి పరిణామాన్ని, భాషా పరిణామాన్ని, వివాదాస్పదంగా ఉన్న చారిత్రిక విషయాల్ని తెలియచేశాయి. కొలనుపాక, పానగల్లు శాసనాలు, రుద్రమదేవి, రుద్రదేవ మహారాజు రాజ్యం పేరుతో చేసిందని, గణపతి దేవుడి కూతురని, విదేశీయాత్రికులు రాసినట్లుగా గణపతి దేవుడి భార్య కాదని ధృవపరచాయి. అలాగే ఉత్తరాధికారి కాబోయేవాడు ఆనాటి రాజులతో కలసి రాజ్యాధికారం నడుపుతూ ఉండేవాడని తెలుపు తున్నాయి.

ఇక వచనాన్ని వదిలి కావ్య పరిశీలనానికి వస్తే మన జిల్లాలో మొదటి గ్రంథము పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్ర,

బసవపురాణం ఇత్యాది ద్విపద కావ్యాలు. సోమనాథుడు పూర్వం ఈ జిల్లాలో ఉండి 1953లో వరంగల్ జిల్లాలో కలిపివేసిన జనగామ తాలూకా పాలకుర్తి గ్రామ నివాసి. ఆయన సమాధి అక్కడ ఉంది. ఇప్పటికీ శివరాత్రికి గొప్ప జాతర జరుగుతుంది. ఆ జాతరకు సంబంధించిన వర్షచందాలు వసూళ్ళకు అక్కడి ధర్మకర్త మా అందరి దగ్గరకు వచ్చేవాడు. సోమనాథుడు క్రీ.శ. 1280 నుండి 1340 వరకు ఉన్నాడని చారిత్రకుల అంచనా. ఆయనకు పూర్వమున్న సాహిత్యం పురాణాల అనువాదాలను కావ్య పక్కీలో చేసినట్లుండేది. ఆ సాహిత్య ప్రయోజనం జైన, బౌద్ధ మతాల విప్లవ తుఫానుతోపాటు చెల్లాచెదురైన వర్ణాశ్రమాచార ధర్మాలను, వైదిక పురాణాలను పునరుద్ధరించడంతోపాటు ఆ వ్యవస్థకు కాపలాదారుగా రాచరికాన్ని నిలబెట్టడం తప్ప వేరే ఏమీకాదు. కావ్య పద్ధతికూడా సంస్కృత వ్యాకరణ ఛందస్సులపై ఆధారపడి ఉండేది. కానీ వీరశైవ మతావేశ ప్రేరకుడైన సోమనాథుడు వీటన్నిటిమీద తిరుగుబాటు చేశాడు. ఉరుతరగద్యపద్యోక్తులకు, సంస్కృత సమాసభూయిష్టమైన రచనకు ఒక దండం పెట్టి కమ్మనైన జాతి తెలుగును తన కావ్యాలకు ఆలంబనం చేసుకున్నాడు. పై వర్గాల మార్గకవితకు భిన్నంగా ప్రజానీకం గేయ ఛందస్సులను, జానపద గేయ సంపదను ఆదరించి దంపుళ్ళపాట అనుగుణ్యమైన తరువోజరగడలనుండి పరిణమించిన ద్విపదను పాడుకోవటానికి అందంగా ఉండేలా సంస్కరించాడు. అదే రీతిలో "పండితారాధ్యచరిత్ర", "బసవపురాణం" రచించి, వైదిక ధర్మాలమీద, వర్ణాశ్రమాచార విధానాలమీద కులభేదాల్ని, కొద్దీ గొప్పా తేడాలను కూల్చడానికి కంకణధారి అయ్యాడు. అంతకుముందే ఉన్న కథల్ని కావ్య వస్తువులుగా మలుచుకొన్నాడు. కథానాయకుడిగా మడివేలు మల్లయ్య (చాకలి), గిరిజనుడైన కన్నప్పను, మాలమాదిగలనుండి వచ్చిన భక్తులను తనకాలపు సమాజాన్ని కొంతలో కొంత తన వర్గ పరిమితిలో చిత్రీకరించాడు. సాహిత్యంలో శివకవుల ఫక్కీకి దారులు వేశాడు. వీరశైవమతావేశంలో కలం పట్టిన సోమనాథుడు రైతుల పక్షం నిలిచాడు అనుకుంటే శుద్ధ పొరపాటు చేసినవాళ్ళమౌతాము. మధ్యయుగాల పరిధిలోనే మత సిద్ధాంతాలను మార్చాలనుకొన్నాడు. కానీ మార్చలేకపోయాడన్నది చరిత్ర చెబుతున్న సత్యం. ఉత్పత్తి విధానాన్ని, ఉత్పత్తి సంబంధాలను మార్చకుండానే భూస్వామ్య వ్యవస్థ ఇంకో వ్యవస్థలోకి మారదన్నదే మనకి ఈనాడు తెలిసిన సత్యం. ఏది ఏమైనా తనకాలం దాని వాతావరణానికి భిన్నంగా ఆలోచించి అడుగు ముందుకు వేయడానికి, సమాజాన్ని మార్చడానికి ఒక ప్రయత్నం చేశాడు. దీన్ని చిన్న విషయం అనుకోవడానికి వీలులేదు. సాహిత్యాన్ని క్రొత్తదార్లకు తిప్పిన ఘనత తప్పకుండా సోమనాథుడికే దక్కుతుంది. కానీ తర్వాత విజృంభించిన మార్గ కవితలు, ప్రబంధ కవితలు రాచరికపు నీడల్లో ఉరుతర గద్యపద్యాలకు, చాంతాడు సమాసాల సొగసులకు, శ్లేష యమకాలతో, నానార్థాలకు, తానే టీకా తాత్పర్యం, దండాన్వయాలు చెప్పుకొనే దుర్దశకు దారితీశాయి. తలనుండి తోకవరకు, తోకనుండి తల వరకూ చదివినా చుక్కెదురుగా ఉండే చిత్ర కవిత్వాలకు, ఒకే పద్యం కడుపులో ఏడెనిమిది పద్యాలు కుక్కి కుక్కి, అర్థాన్ని, భావాన్ని, అందాన్ని డొక్కచింపే గర్భ కవిత్వపు సర్కసులకు దారితీశాయి. నిరోష్ఠ్య, నిర్వచనా అర్థాన్ని అధ్వాన్నపు టడవులలో విడిచేసి అచ్చ తెలుగు కబ్బాల హదావిడికి సాహిత్యాన్ని బలిపెట్టే పరిస్థితులు దాపురించాయి. అయినా ప్రజానీకం తనకు కావల్సిన సాహిత్యాన్ని సృష్టించుకొంటూపోతూనే ఉంది. అది కూడా మధ్యయుగాల పరిధితో దాటకుండానే అన్న విషయం మరిచి పోకూడదు. కానీ అది తాటాకుల కెక్కలేదు. రాజస్థానాల పండితులు దాన్ని దేవిడీమన్నా చేశారు.

దానికి ప్రోద్బలకారకమైంది భక్తి ఉద్యమం, అన్న విషయాన్ని మనం మరవకూడదు. ఈ భక్తి ఉద్యమమే ఆయా కవితల తాత్వికాంశగా ఉండిపోయింది. ఇంకో విధంగా చెప్పాలంటే రాచరికం యొక్క, వారి నాశ్రయించుకున్న పురోహితవర్గం యొక్క ఆశలను, ఆశయాల్నుకాక, ప్రజాస్వామ్యము యొక్క ఆశలు, ఆశయాల్ను, అభిమానాలను, ఆలోచనల్ను, వ్యక్తం చేశాయి. ఇవన్నీ ఫ్యూడల్ వర్గానికి వ్యతిరేకమైన రైతాంగ ప్రతిఘటనాంశాలు. ఈ దశలో ప్రజల భాషలో చక్కటి పాటలు వచ్చాయి. దేవాలయాలు, గానాలు, ఉత్సవాలు, యాత్రలు ఈ ఉద్యమానికి ప్రాణాలు. ప్రజల భాషయైన తెలుగులో సాహిత్యరచనా, శాసన రచన వచ్చింది అంటే గ్రామాల మధ్య సంబంధాలు పెరిగాయన్నమాట. వస్తుమార్పిడి ద్వారా బజార్లు ఏర్పడ్డాయన్నమాట. ప్రతి యాత్రాస్థలం వుత్సవ ప్రదేశం ఒక మార్కెటే. జానపద రూపాలలో సంగీతం, నృత్యం అత్యున్నత స్థానం అందుకున్నాయంటే, దానికి వీరశైవమే కారణం. వైష్ణవ, వీర వైష్ణవభక్తి ఉద్యమాలు తరువాత వచ్చాయి.

చాళుక్యయుగం తరువాత వచ్చిన కాకతీయ రాజ్యారంభం తెలుగు సాహిత్య చరిత్రలో నూతనాధ్యాయం. క్రీ.శ. 1150 నాటికే చాళుక్యుల కర్నాట ప్రభావం, చోళుల అధికార ప్రభావం (తమిళం) తగ్గిపోయింది. తెలుగుదేశం అంతా కాకతీయులు మొదటిసారిగా ఐక్యం చేశారు. గణపతి, రుద్రమ దేవికాలం నాటికి ఉన్నతస్థాయి చేరుకున్న ఫలితంగా తెలుగు, కన్నడం లిపులు వేరయిపోయి, ప్రత్యేక లిపులై పోయాయి. భాషలు కూడా వేరయిపోయి అయినా కాకతీయుల కాలంలో సంస్కృత కావ్యాలు, శాసనాలే యెక్కువ. కానీ తెలుగు శాసనాలు అస్తిత్వంలోకి వచ్చాయంటే, ఆ శాసనాల్లో వచనంతోపాటు పద్యాలు కూడా అస్తిత్వంలోకి వచ్చాయంటే పెరిగిపోతున్న తెలుగు భాషా ప్రాధాన్యాన్ని వర్ణించవచ్చు. నన్నయగారి కావ్య ఫక్కీకి అడ్డం కొట్టిన శివకవుల ప్రతిభ దాదాపు వంద సంవత్సరాలు సాగింది. నన్నయ మార్గంలో తెలుగు శాసనం క్రీ.శ. 1175 లో కానీ రాలేదు. అదే "బెక్కల్లు" తెలుగు శాసనం.

కాకతీయయుగం తరువాత రాచకొండ రాచయుగం ప్రారంభమౌతుంది. ఈ రాచకొండ రేచెర్ల పద్మనాయక రాజులకు రాజధానీ నగరం. వీరిదే ఒక శాఖ దేవరకొండను రాజధానిగా చేసుకుని పాలించరు. రాచకొండ నల్లగొండ తాలూకాలోని నారాయణపురం సమీపంలో ఒక కుగ్రామంగా పాడుబడిన కోటలు, దేవాలయాలతో నిండి పోయింది. రాచకొండ రాజులు స్వయంగా పండితులు, కవులు. కొండవీటి రాజ్యంతో పోటా పోటీలుపడి తమ ఆస్థానంలో కవులనూ, పండితులను సమీకరించుకున్నారు. కవులు, పండితులు కూడా ఎక్కడ రాజుల ఆస్థానాలుంటే అక్కడికే చేరుకునే వారు. సాహిత్య సృష్టికి కొంత తీరుబాటు అవసరం. అలాంటి తీరుబాటును మిగులు ఉత్పత్తి కేంద్రాలుగా వున్న రాజాస్థానాలు కల్పించగలిగాయి. కనకనే పూర్వయుగం కన్నా భూస్వామ్య యుగంలోనే కవుల సంఖ్యా, స్వభావం పెరిగింది. ఆ స్వభావం మారుతూ మారుతూ శ్రీనాధుడి కవితలో పరవశించి ప్రబంధ కవితకు దారులు తీసింది. రాజుల పట్టణాలే వ్యాపారానికి, సంస్కృత కళలకు కాణాచులయినాయి. ఈ యుగ ధర్మాన్ని అనుసరించే రాచకొండ రాజాస్థానంలో ఉద్దండ పండితులు, అలంకార శాస్త్రజ్ఞులు, కవులు కేంద్రీకృతమయ్యారు. రెండవ సర్వజ్ఞ సింగ భూపాలుడు (1384-1400) స్వయంగా నాటక కర్త, అలంకారికుడు, "సంగీత సుధాకరం" అనే సంగీత వ్యాఖ్యాన గ్రంథాన్నీ, "రసార్ణవ సుధాకరం" అనే అలంకార గ్రంథాన్ని సంస్కృతంలో వ్రాశాడు. "కందర్ప సంభవం" అనే భాణం, "రత్న పాంచాలిక" అనే నాటకాన్ని రచించాడు. తెలుగులో రచనలు చేశాడో లేదో చెప్పలేం కాని, తెలుగు కవిత్వంతో సంబంధంలేని వాడని అనటానికి వీలులేదు. "చమత్కార చంద్రిక" అనే లక్షణ గ్రంథాన్ని వ్రాసిన విశ్వేశ్వర కవి, పశుపతి నాగనాధ పండితుడు. "అమరకోశా" నికి వ్యాఖ్య వ్రాసిన బ్రహ్మకంటి అప్పయాచార్యుడు, 'లక్షణదీపిక', "హరిశ్చంద్ర చరిత్ర", "నవనాధ చరిత్ర" వంటి ద్విపదకావ్యాలు వ్రాసిన గౌరనకవి ఈ ఆస్థానంలో వారే. హరిశ్చంద్ర చరిత్రలో నేడు అందరినీ ఆకర్షించే "నక్షత్రక" పాత్రను అపూర్వంగానూ, అద్భుతంగాను చిత్రీకరించిన గౌరన, అప్పుల వాళ్లు పెట్టే బాధల్ని అనుభవించైనా యుంటాడు లేదా చూచైనా వుంటాడు అనుకోవడం ఎలాంటి సందేహానికి తావులేదు. అలాగే వేమనలాంటి వాళ్ళను ఉత్తేజపరచిన జైన, బౌద్ధ సాంప్రదాయ పర్యవసానమైన "నాథ" సంప్రదాయాన్ని "నవనాధ చరిత్ర" లో చిత్రించాడు.

అలాగే క్రీ.శ. 1421-1430 దాకా రాజ్యం చేసిన "రావు మాధాని" రాచకొండ రాజుల వంశీకుడే. రామాయణానికి "రాగవీయ వ్యాఖ్య" రచించాడంటారు. కానీ ఆ గ్రంథం కాలగర్భం నుండి బైటపడలేదు. ఈ విషయాన్ని హైదరాబాద్ దారిలో ఉన్న "దేవలమ్మ నాగారం" శాసనం మాత్రమే తెలియజేస్తుంది. భాస్కర రామాయణ శేషాన్ని పూరించిన "అయ్యలార్యుడు" రాచకొండ రాజ్యం వాడే. ఇతడు దేవరకొండ శాఖకు చెందిన పెద వేదగిరి నాయుడు ఆస్థాన కవి. ఈ అయ్యలార్యుడికొడుకే "హరిశ్చంద్ర చరిత్ర" మొదలైన ద్విపద కావ్యాలు రచించిన గౌరన. ఈ రాచకొండ వంశంలో చివరి సుప్రసిద్ధుడైన రాజు మూడవ సింగభూపాలుడు. ఈయన సర్వజ్ఞుడన్న బిరుదం కూడా శాసనాల్లో వాడుకున్నారు. రెండవ సింగ భూపాలునికి కూడా సర్వజ్ఞ బిరుదం ఉందని జన ప్రతీతి. మూడవ సింగ భూపాలుడు స్వయంగా కవి, పండితుడు. క్రీ.శ. 1420 నుండి 1470 వరకు రాజ్యం చేసాడు.

ఆంధ్రదేశం అంతా ఎదురులేని కవితావిహారం చేసిన కవి సార్వభౌముడు శ్రీనాథుడంతటివాడు కూడా ఈయనను దర్శించడానికి వచ్చినపుడు "ఎట్లు మెప్పించుదో కదా ఇంక మీద. రాహు సింగాంక భూపాలు ధీవిశాలు" అని శారదాంబతో మొరపెట్టుకున్నాడు. శ్రీనాథుడంతటివాడికే ఒక పిక్క వణికేదన్నమాట.

"ఈ మనుజేశ్వరాధములకు", "కర్ణాటకిరాత కీచకులకు" కావ్యాన్ని అంకితం చేయనని, అమ్మనని కంకణం కట్టుకున్న ఆత్మాభిమాని, కలాన్ని, హలాన్ని ఏకధాటిగా నడిపించిన బమ్మెర పోతన మొదట మొదట మూడవ సింగభూపాలుని ఆస్థానంలోని వాడే. "భోగినీ దండకాన్ని" శృంగార రసాత్మకంగా ఈయన పరంగానే వ్రాశాడు. కవితాపాకంలో భాగవత గ్రంథంతో పోల్చడానికి వీలులేకున్నా "వీరభద్ర విజయాన్ని" కూడా రచించాడు పోతన. ఆయన "బమ్మెర" గ్రామం ఇది వరకు నల్లగొండ జిల్లాలో ఉన్న జనగామ తాలూకా లోనిది. రాచరిక వ్యవస్థను చూసి అసహ్యించుకొనే మనస్తత్వాన్ని, పరిపక్వతనూ భాగవత రచనా కాలం, నాటికి పోతన సంతరించు కున్నాడు. "సత్కవుల్ హాలికులైన నేమి? గహనాంతర సీమల కంద మూలికే కౌద్దాలికులైన నేమి? నిజధార సుతోధర పోషణార్థమై" అన్న ధీమా పెంచుకొన్నాడు. భక్తి ప్రేరేపణతో ఆనాటి రాచరిక వ్యవస్థ పైన తిరుగుబాటు చేసిన రైతు మనస్తత్వాన్ని వెలిబుచ్చడం ద్వారా తన కాలానికన్నా ఒక అడుగుముందే ఉన్న క్రాంతదర్శి, భాగవతం నుండి ఒకటో రెండో పద్యాలు రానివాడు తెలుగు దేశంలో దొరకడు అంటే, పోతనగారి కవితా ప్రాచుర్యాన్ని అర్థం చేసుకోవచ్చు.

అలాగే సూర్యాపేట తాలూకా "పిల్లల మర్రి" గ్రామవాసి పిన వీరభద్రుడు "కాళిదాసు శాకుంతలాన్ని" తెలుగు కావ్యంగా మలిచాడు. జైమినీ "భాగవతా"న్ని తెనిగించాడు. వారి కుటుంబం పిల్లలమర్రి నుండి నెల్లూరు జిల్లాలోని సోమరాజు పల్లెకు వసల పోయింది. అక్కడనే స్థిరపడిపోయి ఆ తరువాత హంపీ విజయనగర రాజులైన "హరిహర బుక్కరాయల" ఆస్థానంలో నిలచిపోయారు. ఎక్కడికిపోయినా, ఏ చోటికిపోయినా తన గ్రామం పిల్లలమర్రి ఘనతను వేనోళ్ళ చాటాడు. "వాణి నా రాణి" అంటూ విజయగర్వాన్ని సంతరించుకున్న సుప్రసిద్ధ కవి శిఖామణి పిల్లలమర్రి పిన వీరభద్రుడు. ఉన్న ఊరిని వదలి

నెల్లూరు విజయనగరాల దాకా పోయాడంటే, "ఇల్లెళ్ళితే పిల్లి కరుస్తుంద"నే మనస్తత్వానికి విడాకులిచ్చిన బాపతు అన్నమాట. అయినా ఉత్త అభిమానానికి చెప్పుకోవలసిందే తప్ప పై వాళ్ళంతా అఖిలాంధ్రానికి సంబంధించిన కవులు.

సాహిత్యంలో రాచకొండ యుగం తరువాత "కుతుబు షాహీ" నవాబులయుగం ఆరంభమౌతుంది. ఈ రాజులు టర్క్‌మినియా ప్రాంతనివాసులైన ఫార్సీతోపాటు ఉర్దూలో కవిత్వం వ్రాశారు. తమ ఉర్దూ కవితలలో ఎన్నో తెలుగు పదాలను చొప్పించారు. ఇంతే కాక ఈ "కుతుబ్ షాహీ" యుగపు "ఇబ్రహీం కుతుబ్‌షా" వద్ద "మీర్జుమ్లా" (రెవిన్యూ మినిస్టర్) పదవిలో ఉన్న "అమీన్ ఖాన్"కు తన "యయాతి చరిత్ర" ను కృతి ఇచ్చాడు పొన్నిగంటి తెలగనార్యుడు. దీన్ని ప్రోత్సహించినవారు నల్లగొండ తాలూకా కనగల్లు గ్రామం వారైన మరింగంటి అప్పలాచార్యులు. ఈయనయే సింగరాచార్యుల అన్నగారు. పొన్నికంటి తెలగన్న, అద్దంకి గంగాధర కవి "యిబ్రాహీం కుతుబ్‌షా" ఆస్థాన కవులు.

మరింగంటి కవులది ఒక ప్రత్యేక కవితా శాఖ. వీరు ప్రబంధ యుగలక్షణాలను అవలంబించిన కవులు. వీరి కాలానికి పూర్వమే పెద్దనగారి "మనుచరిత్ర" తో ప్రబంధయుగం ప్రారంభమైంది.

ఈ మరింగంటి కుటుంబము నల్లగొండ జిల్లాలోని నల్లగొండ, మిర్యాలగూడ, సూర్యాపేట తాలూకాలేకాక కృష్ణాజిల్లా ముఖాసా కల్వకూరి దాకా వ్యాపించి ఉన్నారు. తరతరాలుగా కవిత్వం వీరి ఇంట నిలచి ఉంది. మరింగంటి కవులలో పేరెన్నికగన్నవాడు సింగరాచార్యులు. ఇబ్రహీం కుతుబ్‌షా కాలపువాడు. నరనగా శ్వతృపాల సబ్య గణజుడనని చెప్పుకున్నాడు. కాని ఈయన రచనలేవి నరాంకితాలు కావు. ఈయన పాండిత్యపు కండబలం, కవిత్వపు గుండెబలం ఉన్నవాడు. ఆశువులు, చాటువులు కోకొల్లలుగా చెప్పాడు. ఆ నాడు దారిదోపిడీలు సాగించే పెత్తందారులను తన పద్యాల ద్వారా శపించాడు. ఈయనగారు సంచారం వెళ్ళి వస్తున్న సందర్భంలో చకిలం తిమ్మయ్య అనే గ్రామ పెత్తందారు అప్పుడు ఒక సీస పద్యం వ్రాస్తూ చివరకు ఎత్తుగీతంలో "ఆశ లేకుండ చంద్రలాభి సమేతి దోచుకొని పోవువారల దుమ్ముచేత".... పైన బండెత్తివేయ" అని తిట్టుకవిత్వంలో దిట్ట అనిపించుకున్నాడు. ఈయన అష్టభాషా పండితుడు. తన కవిత్వంలో చాటువుల్లో పార్శీ. అరబ్బీ పదాలను ఆయాచోట్ల వాడేవాడు. "దశరథ రాజ నందన చరిత్ర" అనే పేరుతో రామాయణాన్ని నిర్యోష్ఠ నియమంతో (పఫ, బభ, మ, వ, ఉఊ,) ఇత్యాదులు లేకుండా రచించారు. అలాగే నల యాదవ రాఘవ పాండవీయం అనే నాలుగు అర్థాలు వచ్చే కావ్యాన్ని రచించాడు. ఈయన 1550 ప్రాంతంవాడు.

సింగరాచార్యుల తరువాత 1730 లో వేంకట నర్సింహాచార్యులు 13 గ్రంథాల దాకా రాశాడు. అందులో "చిలువ పడగ రేని ప్రేరణము" అనే పేరుతో అచ్చ తెలుగు ప్రబంధాన్ని రచించాడు.

మరింగంటి కవుల తాళ పత్ర గ్రంథాలన్ని వారి కుటుంబీకులవద్ద కనగల్లులో "తాళ పత్ర గ్రంథ నిలయం" ఒకటి సురక్షితంగా ఉంచింది. క్రిమికీటకాలనుండి కాపాడతారు, మాకివ్వాల్సిందని లక్ష్మణ రాయ పరిషత్ మండలి వారు ఆంధ్ర, సార్వస్వత పరిషత్ వారు అడిగినా కూడా ఈ మధ్యనే కీర్తి- శేషులైన మరింగంటి రంగాచార్యులుగారు ఎందుకోగాని అప్పగించడానికి ఒప్పుకోలేదు. ఆయనగారి మరణానంతరం ఇప్పుడా గ్రంథ నిలయం పరిస్థితి తెలియదు. ఈ మధ్యనే దశరథ రాజనందన చరిత్రను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రచురించారు. శ్రీ పెరుంబుదూరు రంగాచార్యగారు దాని పరిష్కర్త. (వీరి మరింగంటి కవుల కవిత్వ విశేషాలను వెలికి తీయడంలో చాలా కృషి చేశారు.) ఈ మధ్యనే మరింగంటి నర్సింహాచార్యుల కృతి "గోదావధూటి పరిణయం" అనే గ్రంథాన్ని నల్లగొండ మహిళా భక్త సమాజం వారు ప్రచురించారు. దీని సంపాదకులు శ్రీ మరింగంటి రంగాచార్యులుగారు. వీరి సంపాదకత్వంలో వెలువడిన "గోదా వధూటి పరిణయం" యధాతథంగా ప్రచురించారు. ఈ ప్రచురణ ద్వారా మనకు కుతుబ్ షాహీ సమీప కాలపు తెలుగు అవగాహన చేసుకోవడానికి కొంతలో కొంత తోడ్పడుతుంది. ఎందుకంటే, ఈయనగారికి పరిష్కర్తల తలకాయల్లో ఉండే చిన్నయసూరి వ్యాకరణ చాదస్తం తలకెక్కలేదు కనక పరిష్కరణ పేరుతో అసలు గ్రంథంలో వేలుపెట్టి, మూలాన్ని మార్చే పాపానికి ఒడిగట్టలేదు.

నల్లగొండవద్ద ఉన్న చర్లపల్లి గ్రామవాసి కర్పూరం కృష్ణమాచార్యులు భగవత్ గీతను ద్విపద కావ్యంగా వ్రాసి కేశవస్వామికి అంకితం ఇచ్చాడు. అలాగే మిర్యాలగూడెం తాలూకా "పేరూరి" గ్రామ నివాసి యమరగోటి ధర్మయ్య మేనల్లుడు సిరిప్రగడ ధర్మన్న "నల చరిత్ర" రాశాడు. శ్రీ ఆరుద్ర తన సమగ్రాంధ్ర సాహిత్యంలో పేరూరు అనే గ్రామాలు గుంటూరు, గోదావరి జిల్లాల్లో ఉన్నాయి. కాని ఏ గ్రామం అయినది నిర్ణయించ వీలులేదన్నారు. కాని ఆ పేరూరు మిర్యాలగూడా తాలూకాదేనని ఖచ్చితంగా చెప్పవచ్చును. ఎందుకంటే యమరగోటి వంశీకులు మిర్యాలగూడెం తాలూకాలో ఉన్నారు. సిరిప్రగడ వంశీకులు ఉన్నారు. కనక "నలచరిత్ర" వ్రాసిన ధర్మన్న అడ్రసు ఇలా తేలిపోయింది. కొలనుపాక గ్రామంలో రావూరి సంజీవయ్య లేక సంజీవ రాయుడు సీస పద్యాల శతకాన్ని "కొలనుపాక వీర నారాయణ ముకుంద విశ్వకుంద" అనే మకుటంతో రాశారు. దీనికి గోపరాజు రాయన్న ప్రేరకుడట. ఈయనగారు తన తెలుగు పద్యాలకు టీకా తాత్పర్యం దండాన్వయం తెలుగులో కాదు, సంస్కృతంలో రాసుకున్నాడట! ఇదే కాలంలో భువనగిరి షాపురంలో

దుర్గాన్ని నిర్మించి గోల్కొండ నవాబులను ఎదిరించాడని ప్రసిద్ధిగాంచిన సర్వాయి పాపడు ఉన్నాడు. ఆ వీరుడి జీవితాన్నే బుర్రకథ రూపంలో ఎవరో అజ్ఞాత కవి రచించాడు. అది నేటికి శారదగాళ్ళు, పిచ్చుకుంట్లగాళ్లు ఆయా తెగలవారు మౌఖిక రూపంలో చెపుతుంటారు. పై తెగల వారు ఎన్నో కథలను బుర్రకథల రూపంలో వివిధ సంగీత ఫక్కీలలో తెలుగు పలుకుబడులు, నుడికారాలతోను, మౌఖికరూపంలో భద్రపరిచి ఉంచారు. ఇవన్నీ రికార్డ్ అవుతే అడిగినన్ని భాషా విశేషాలు వాటి పరిణామాలు, సామాజిక పరిస్థితులు వెలుగులోకి వస్తాయి.

అలాగే ఈ కాలంలో ఎన్నో భజన కీర్తనలు, జాజరి పాటలు, కోలాట పాటలు, స్త్రీల పాటలు ప్రచురితమై ఉండేవని ప్రబంధాలవల్ల తెలుస్తూ ఉన్నది. కానీ పద్యమే కవిత్వము అన్న భ్రమలో ఉన్నవాడు వీటికి గ్రంథరూపం ఇవ్వలేదు- కాని మరింగంటి వారి యక్షగానాల్లో వీటి ఛాయలు మనకు కనపడతాయి. వాటిని అచ్చు వొత్తించడం కాలేదు. ఇతరులు కూడా యక్షగానాలు వ్రాసి ఉంటారు. మన జిల్లాలలో ఉన్న దాసరి భాగవతులు ఆడే వీధి నాటకాలు కూడా రికార్డు కావలసివుంది. తద్వారా కొంత సాహిత్య పరిణామం తెలిసివస్తుంది. యక్షగానాలు అన్నవి నన్నయ గారి కన్నా పూర్వం సాహిత్య కళా ప్రక్రియలు అని అర్థం చేసుకుంటే, వీటికి సంగీతం, సాహిత్యం, నాట్యాదుల పరిణామ క్రమంలో అర్థం చేసుకోవడంలో ఎంతో ప్రాధాన్యత ఉంది. తర్వాత వచ్చిన మొగల్ ఆసఫ్జాహి యుగంలో సాహిత్యాభివృద్ధి అంతగా జరుగలేదు. అందులోనూ చివరి ఆసఫ్జా మీర్ ఉస్మాన్ అలీఖాన్ తెలుగు భాషా సాహిత్యాలను అణచి పారేయడానికి కృషి చేసిన మత పిచ్చి తలకెక్కినవాడు. కనుకనే తెలుగు భాషా సాహిత్యాలు, సంస్కృతిని, రక్షించుకోడానికి పాటుపడాల్సొచ్చింది. దాని ఫలితమే అసఫ్జాహి పరిపాలన అంతమయి ప్రజాతంత్రం ఏర్పడింది. ఇదంతా ఆధునిక యుగానికి సంబంధించిన సాహిత్య చరిత్ర.

**ఆధునిక యుగం :**

మన జిల్లాలో ఆధునిక యుగం శ్రీ సభ్నవీసు వెంకట రామ నర్సింహారావుగారితో మొదలయింది. వీరు మాడపాటి హనుమంత రావు, సురవరం ప్రతాపరెడ్డిగార్లతో పాటు తెలంగాణాలో జాతీయ పునరుజ్జీవనానికి, భాషా సేవకు పాటు పడిన ప్రముఖుల్లో ఒకరు.

కందుకూరి వీరశలింగం గారి సంఘ సంస్కరణోద్యమం, సాహిత్యోద్యమంతో ప్రేరేపితులైనారు. "నీలగిరి" వారపత్రికను 1922లో స్థాపించారు. స్వంత ప్రెస్సుతోపాటు "సంస్కారిణీ" అనే గ్రంథమాలను స్థాపించి, కొన్ని పుస్తకాలను కూడా ప్రచురించారు. "బాలికా విలాపము" అనే నవలిక తప్ప వీరి పుస్తకాలు లభ్యం కావడంలేదు. నీలగిరి పత్రికలు కూడా లభ్యం కావడంలేదు. ప్రజా ప్రబోధానికి నడుంకట్టిన మొట్ట మొదటి వార్తాపత్రిక వీరిదే. ఇది తెలంగాణా, సర్కారు జిల్లాలోనూ ప్రచారంలో ఉండేది. పత్రిక నడుపుదాం అనుకున్నప్పుడే ఆయన భార్య చనిపోయింది. అచ్చుయంత్రం, పత్రికా ప్రచురణ, "అచ్చి" రాలేదని, మూసివేయమని పిరికి మందు పోసిన వాళ్ళను, మూఢాచార పరాయణులను లెక్కచేయకుండా పత్రికను, అచ్చుయంత్రాన్ని నిరాఘాటంగా 1925 వరకు నిర్వహించారు. భాషా సేవకు, సంఘ సంస్కరణకు పదునైన ఆయుధంగా పత్రికను వినియోగించారు. మాజీ ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు, ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావుగారు, కవి పండితుడైన సురవరం ప్రతాపరెడ్డిఆరు, మూడవ ఆంధ్ర మహాసభ అధ్యక్షులు పులిజాల రంగారావుగారు మొదలైన సుప్రసిద్ధులు నీలగిరి పత్రికలో వ్యాసాలు వ్రాశారు. కె. రాములు, శేషభట్టర్ వెంకట రామానుజా చార్యులు గద్య, పద్య రచనలు చేస్తుండేవారు. వెంకట రామానుజాచార్యులుగారు "ఆంధ్రనామ సంగ్రహము" అనే నిఘంటువుకు పేరడీగా కొన్ని పద్యాలు వ్రాశారు. మచ్చుకు ఒక పద్యం ఉదహరిస్తాను.

**కం. వేసారక శుష్కోప**
**న్యాసము లిడువాఁడు దేశనాయకుఁడనగా**
**భాసిలుఁ దద్భ్రోతకల కగు**
**వాసవముఖ వినుత, దేశభక్తులనంగన్**

సూర్యాపేటలో గవ్వ అమృతరెడ్డి, వారి సోదరులు జానకిరాములు రెడ్డి, మురహరరెడ్డిగార్లు తమ గ్రంథమాల ద్వారా కావ్యాలు-నాటకాలు ప్రచురించేవారు. నల్లగొండ సమీప గ్రామమైన చర్లపల్లి గ్రామ నివాసి చిదిరె మఠం వీరభద్రశర్మగారిని స్మరించకుండా ఉండలేను. వీరు గొప్ప పండితులు, కవి, గ్రంథకర్త. విభూతి అనే సాహిత్య మాసపత్రిక చాలాకాలం సికింద్రాబాదు నుండి నడిపారు. వీరిని కాశీ విశ్వేశ్వరాచార్య పీఠాధిపత్యం వరించింది. పీఠాధిపతిగా ఉంటూనే కాశీలో కాలధర్మం చెందారు. సనాతన వీర శైవాచార పరాయణులైనా, సంఘ సంస్కారాన్ని వ్యతిరేకించేవాడు కాదు. ఈనాటి అభ్యుదయ యుగంలో చెప్పుకోదగ్గ శిఖరాయమానుడు వట్టికోట ఆళ్వారుస్వామి. మన జిల్లా మాధవరం గ్రామానికి చెందినవాడు. అంత పెద్దగా చదువుకొనే అవకాశాన్ని కుటుంబ దారిద్ర్యం ఇవ్వకపోయినా, స్వయం కృషితోనే తెలుగు-ఉర్దూ భాషల్లో నిపుణత్వాన్ని సంపాయించుకున్నాడు. చాలాకాలం గోలకొండ పత్రికలో పనిచేశాడు. ఆంధ్ర మహాసభ ఉద్యమంలో పాల్గొన్నాడు. శ్రీ రావి నారాయణరెడ్డి, శ్రీ దేవులపల్లి వెంకటేశ్వరరావు, ఆరుట్ల సోదరులతోపాటు తెలంగాణా పోరాటంలో పాల్గొన్నాడు. అందరితోబాటు జైళ్ళు, లాఠీలు, నిర్బంధకాండ రుచి చూశాడు. "తెలుగుతల్లి" మాస పత్రికకు సంపాదకులుగా ఉన్నాడు. "జైలు లోపల" అన్నకథల సంపుటిని, "ప్రజల మనిషి" నవలను ప్రచురించాడు. తెలంగాణా జీవితాన్ని, పోరాటాలను చిత్రించిన

'గంగు' అనే నవలను పూర్తిగా ప్రకటించకుండానే కాలధర్మం చెందాడు. దేశోద్ధారక గ్రంథమాలకు సంపాదకుడుగా ఉండి ఎన్నో ఉత్తమ గ్రంథాలను ప్రచురించాడు. అభ్యుదయ రచయితల సంఘంలో అగ్రగామిగా ఉండి ఎంతో సేవ చేశాడు.

అయిటిపాయుల గ్రామమువారు అళ్వాల వెంకయ్యగారు వృత్తి రీత్యా వైద్యులైనా, జానపద కళారూపాల్లో ఎన్నో గేయాలు రచించారు. స్వయంగా మంచి గాయకుడు, నటుడు. వీరి గేయాలు మన జిల్లా ఆంధ్ర మహాసభ వేదికల నుండి ప్రచారం పొందాయి. కొన్ని అచ్చుయినట్లు కూడా జ్ఞాపకం. ఈ మధ్యనే గతించాడు.

ఉద్యమ రూపంలో సారస్వత సేవ సాగించిన సంస్థ నల్లగొండ జిల్లా సారస్వత పరిషత్తు. ఇది ఆంధ్ర పరిషత్తుకు శాఖ. ఎందరో యువకులను, కవులుగానూ, రచయితలుగానూ తీర్చిదిద్దింది. రామకృష్ణ హాస్టలే నేటి రామణి ఉన్నత పాఠశాల కార్యక్షేత్రంగా వందలమంది హాజరయ్యి సాహిత్య సమావేశాల్లో పాల్గొనేవారు. ఎందరో కవులు, కథకులు, తమ రచనలను వినిపించేవారు. సంసారిక జీవితాన్ని రమ్యంగా కథల్లో మలిచే నేర్పుగల సుప్రసిద్ధ కథకుడు కీ॥ శే॥ ధరణికోట శ్రీనివాసులుగారు పరిషత్తు సభ్యులు. "అన్నంలోకి" అన్న వీరి కథాసంపుటి ప్రచురణ కూడా జరిగింది. మునిమాణిక్యం నర్సింహారావుగారిచే "షభాష్" అనిపించుకున్నారు.

కవి, పండితుడు, అనువాదకుడు అయిన శ్రీ పైడిమర్రి సుబ్బారావుగారు బహుళ గ్రంథకర్త. ఆనాటి పెత్తందార్ల దౌర్జన్యాన్ని నిరసిస్తూ ఎన్నో కథలు వ్రాశాడు. నేటికి సాహిత్యం సాగిస్తున్నాడు.

శ్రీ యం.వి. గుప్తగారు, పి.వి. నర్సింహారావుగారు, గాదె మధుసూదన్‌రావుగారు ఇత్యాదులు ఉత్సాహంతో పాల్గొన్నారు. నేను కార్యదర్శిగా ఉండేవాన్ని.

శ్రీ దేవులపల్లి రామానుజారావుగారు సాహిత్య అకాడమీ అధ్యక్షులు, నేటి వృద్ధ యువక కవి శ్రీ కాళోజీగారు, కొందరు మా ఆహ్వానితుల్లోనివారు.

1945 ప్రాంతంలో "తొలిసంధ్య" అనే కావ్య సంకలనాన్ని, "ఉషస్సు" అనే కథా సంకలనాన్ని ఈ సంస్థ పక్షాన ప్రచురించడం జరిగింది. ఆనాడు ఉద్యోగరీత్యా నల్లగొండలో ఉన్న బూర్గుల రంగనాథరావుగారు, వెల్దుర్తి మాణిక్యరావుగారు, చాలా కాలం శాసన మండలిలో ఉపాధ్యాయ ప్రతినిధిగా ఉన్న ఉరుపుటూరి రాఘవాచార్యులగార్లు ఈ కార్యక్రమాల్లో పాల్గొనేవారు.

ఆంధ్ర సారస్వత పరిషత్తు మూడవ మహాసభ నల్లగొండ స్థానికంలో జరిగాయి. కీ॥ శే॥ లు గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు, జొన్నలగడ్డ సత్య నారాయణ మూర్తిగారు, బిదురు వేంకట శేషయ్య గారు, ఉస్మానియా మాజీ వైస్ చాన్సలర్ శ్రీ రావాడ సత్యనారాయణ గారు, శ్రీ మునిమాణిక్యం నర్సింహారావుగారు మొదలైన సుప్రసిద్ధు లెందరో పాల్గొనేవారు. అది మూడు రోజులు నిరంతరాయంగా సాగిన సాహిత్య తిరణాల. దీనికి అనుబంధంగా ఒక నాటక సంస్థ కూడా ఉండేది. నేటి సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు శ్రీ పీతాంబరాచార్యులు ఆ నాటక సంస్థలో సభ్యులుగా ఉండేవారు. చండూరులో జరిగిన సాహితీ మేఖల వార్షికోత్సవాలకు సారస్వత సభ్యులంతా నాటక దళంతో సహా పాల్గొన్నారు. కందుకూరి, గురజాడ, కొమఱ్ఱాజు వారి సాహిత్య కృషి గురించి ప్రత్యేక సమావేశాలు జరిగాయి. నల్లగొండ జిల్లా సారస్వత పరిషత్తు తర్వాత చెప్పుకోదగిన సాహితీ సంస్థ "చండూరు సాహితీ మేఖల". ఈ సంస్థ చండూరు ప్రాంతంలో సాహిత్య చైతన్యానికి ఎంతో కృషి చేసింది. దీనికి సుప్రసిద్ధ కవి పండితులు అంబటిపూటి వెంకటరత్నంగారు ప్రాణం లాంటివారు. వీరి సహచర్యంలో క్రీ॥ శే॥ పులిజాల హనుమంతరావు గార్ని, దవళా శ్రీనివాసరావుగార్ని, పాశంనారాయణ రెడ్డి వంటి వారెందరో సాహిత్య కృషి చేశారు. శ్రీ తాటిశెట్టి నర్సింహగుప్తగారు, మద్దోజు సత్యనారాయణచారిగారు, వారిలో కొందరు. ముఖ్యంగా పులిజాల గోపాల్‌రావుగారు చేయి తిరిగిన రచయిత. సుమారు 3 పుస్తకాలు ప్రచురించారు. అలాగే సాహితీ మేఖల సభ్యుల్లో ప్రధానంగా చెప్పుకోదగినవాడు కీ॥ శే॥ సిరిప్రగడ భార్గవరావుగారు. అంబడిపూటి వారు బాగా తీర్చిదిద్దిన శిష్యుడు. వీరి "భార్గవానందలహరి" సాహితీ మేఖల పక్షాన అంబటిపూడి వారి కావ్యనాటకాదులతోపాటు ప్రచురించడం జరిగింది. ఇంతేకాక మన ఆస్థానకవి డా॥ దాశరథి గారి "అగ్నిధార" ప్రథమ ప్రచురణ సాహితీ మేఖల పక్షాన్నే జరిగింది.

1946లో జరిగిన సాహితీమేఖల వార్షికోత్సవాలు బాగా పెద్ద ఎత్తున జరిగాయి. దేవులపల్లి రామానుజరావుగారు, కోదాటి నారాయణరావుగారు, ఆనాడు నిజాం ప్రభుత్వం వరంగల్లు జిల్లా నుండివెళ్ళగొట్టిన కాళోజీ నారాయణరావుగారి కవితాగానం, సన్మానం జరిగాయి. మూడు రోజులపాటు కవి సమ్మేళనంతో పాటు, కథకసమ్మేళనాలు, కొన్ని వేలమంది పాల్గొన్న సాహితీ సమావేశాలు ప్రజా చైతన్యం ఎంతగానో పెంచాయి. సాహితీ మేఖల సభ్యులందరి రచనల సంకలనం రాని కొరత కొరతగానే ఉండిపోయింది. సాహితీ మేఖల వార్షికోత్సవాలు మొదటివి చివరివి. వెట్టిచారికి వివిధ రూపాల కేంద్రీకరణను చిత్రీకరించిన "మావూళ్లో కూడానా!" అన్న కథ కూడా చండూరు సాహితీ మేఖల వార్షికోత్సవాల సమయంలోనే వ్రాయడం జరిగింది.

ఇదంతా పోలీసు చర్యకు పూర్వం నల్లగొండ జిల్లా సాహిత్య చరిత్ర.

నాటికీ నేటికి కొట్టవచ్చినట్లు ఒక తేడా కనిపిస్తుంది. ఆనాడు ఎవరో ఒక కవిమాత్రుడు ఉంటే ఈనాడు ఎందరో కవులు, కథకులు అన్ని వర్గాల నుండి అన్ని తాలూకాల నుండి వచ్చారు. సాహితీ క్షేత్రాన్ని

విశాలవంతం చేశారు. విస్తారంగా పంటలు పండిస్తున్నారు. రాశిలోనూ, వాసిలోనూ చెప్పుకోతగ్గ వాళ్ళు ఎందరో ఉన్నారు. ముందు ఇంకా ఈ సాహిత్య క్షేత్రం విశాలతరం, విశాలతమం కావాలనే గమ్యానికి ఇవన్నీ ఎన్నో దారులు. ఈ చరిత్ర గమనంలోని నల్లగొండ యువ రచయితల సమితి అగ్రభాగంలో ఉంది. నల్లగొండ సారస్వత పరిషత్తు వారసత్వాన్ని స్వీకరించింది. ఎన్నో సాహిత్య సమావేశాలు జరుపుతూ, ఎందరో రచయితలను సమీకరించింది. సమర్పణ, సంఘర్షణ, దర్పణం, సైరన్, మాలిక అనే కవితా కథల సంకలనాల్ని ప్రచురించింది. శ్రీ బి. రాములుగారి 'స్వాతంత్ర్యం వచ్చాక' 'మోదుగు పూలు" కావ్య సంకలనాల్ని, అలుగుపల్లి రామ చంద్రారెడ్డిగారి "ద్రాక్ష గుత్తులు" బాల సాహిత్యం సంబంధించిన యువ రచయితల సమితి పక్షాన ప్రచురించడం జరిగింది. శ్రీ బోయ జంగయ్య నడుస్తున్న చరిత్ర, గొబ్బిలు, లోకం కవితా కథా సంకలనాలు, సాహితీ మిత్రులు నల్లగొండ పక్షాన ప్రచురించడం జరిగింది. నడుస్తున్న చరిత్ర బోయ జంగయ్యగారి మినీ కవితల్లో ప్రత్యేక స్థానం కల్పించింది.

జిల్లా రచయితల సంఘం తరపున 'దర్పణం' అనే సాహితీ పత్రిక కొన్నాళ్ళు నడిచింది. దీనారాణిగారు 'సరయూ' అనే పుస్తకం వ్రాసేరు. అలాగే నల్లగొండ స్థానికంలో ఔత్సాహికులైన యువ రచయితలలో యం. కృష్ణమూర్తి, సి. హెచ్. కె. నాగేశ్వరరావు, బోయనపల్లి కిషన్‌రావు మొదలగువారు రచనలు చేయడంలో మంచి ఉత్సాహం చూపిస్తున్నారు.

యువ రచయితల సమితి ఉత్తేజంతో, సాహితీ మిత్రులు, నవోదయ కళామండలి, హనుమాన్ సాహితీ సంస్థ, తరుణ కల్ప సంచయం, నేడవి అస్తిత్వంలోకి వచ్చాయి. నల్లగొండ స్థానిక రచయితలలో యన్.కె. రామారావు కథారచనలో తనకంటూ ఒక శైలిని ఏర్పరచుకొని పాఠకులను కూర్చోబెట్టి చదివించే మంచి రచయిత. ఇతని రచనలలో ఏదో కొత్తదనం తొంగిచూస్తూ ఉంటుంది. ఇతని కలంనుంచి ఇంకా మంచివి వస్తాయని ఆశిద్దాం.

కవి, నటుడు అయిన శ్రీ పి. రాజరత్నంగారి సంపాదకత్వంలో "తొలి వెలుగు" అనే వారపత్రిక కొన్నాళ్ళు నడిచింది. ఆ తర్వాత శ్రీ కొమఙ్టాజు మురళీధరరావుగారు "ప్రతిధ్వని" పక్ష పత్రికను కొన్నాళ్ళు నడిపారు.

నల్లగొండ స్థానికంలోనే శ్రీ జగన్నాథంగారు "మూఢవిశ్వాసాలు" అనే మాసపత్రికను నడిపారు. నల్లగొండ యువ రచయితల సమితి కృషితో నల్లగొండ జిల్లా రచయితల మహాసభ రెండూ జరిగాయి. రెండవ మహాసభ సందర్భంలో "నవ్యపథం" అనే పేరుతో ప్రత్యేక సంచికను వెలువరించడం జరిగింది. మూడవ సభ సన్నాహాలు కూడా జయప్రదంగా ముగుస్తాయని ఆశిస్తాను. అలాగే గీతా విజ్ఞానసమితి వారి పక్షాన లలితకళాపరిషత్తు వారి వార్షికోత్సవాల సందర్భంలో జరిపిన పాటల పోటీలు, సాహిత్య సమావేశాలు వక్తృత్వ పోటీలు, వారు ప్రచురించిన సావనీరు చెప్పుకోతగ్గ పాత్రను నిర్వహించాయి.

ఇంతేగాక సంగీత సాహిత్యాలకు దోహదం చేస్తున్న "అన్నమాచార్యుల కళాసమితి", "త్యాగ రాజోత్సవ సమితి", జాతీయ సాహిత్య పరిషత్తు సాహిత్య పరిశోధక మండలి వారి కృషి రాశిలోనూ, వాసిలోనూ చెప్పుకోదగ్గ సేవ చేస్తున్నాయి. అలాగే వివిధ కాలేజీల సాహితీ సమావేశాలు మరియు వారు ప్రచురించే వార్షికోత్సవ సంచికలు కూడా చెప్పుకోదగ్గవి.

నీళ్ళతోపాటు సభ్యత- సంస్కృతులు పెరుగుతాయన్న ఉదాహరణ మిర్యాలగూడెం, హుజూర్ నగర్ తాలూకాలు.

మిర్యాలగూడెం నేడు పేరున్న సాహితీకేంద్రం. శేషు, చెన్నూరి నాగరాజు, రామకవచం, వనాల మోహనరావు, ఇత్యాదులతో కూడిన "స్పందన" సాహితీ సమితి సేవలు ఎన్నతగినవి. కొన్నాళ్లు "స్పందన" అనే పత్రికను నడిపారు. "ముళ్ళ గులాబీ" అనే కథాసంకలనాన్నీ, కావ్యసంకలనాల్ని ప్రచురించారు.

నవలా సాహిత్యానికి ఒక పెద్ద కంట్రిబ్యూషన్ నవల కళానిధి శ్రీ కోలాహలం లక్ష్మణరాజుగారు, 20 నవలలపైగా శరపరం పరగా వ్రాసి, అచ్చుబత్తించారు. మన జిల్లాలో అని నవలలు ప్రచురించిన వారు ఇంతవరకు ఎవరూ లేరు. ఈ మధ్యనే వారు కీర్తిశేషులైనారు. జగిన ఆదినారాయణ గుప్తగారి సంపాదకత్వంలో "విశ్వాభ్యుదయ" మాసపత్రిక నడిచింది.

సుప్రసిద్ధ జర్నలిస్ట్ చెన్నూరి నాగాజు సంపాదకత్వంలో "విపంచి" వారపత్రిక నడుస్తూంది.

వసంతరాయ్‌గారి సంపాదకత్వంలో "ప్రపంచశాంతి" అనే పత్రిక, "సాహితీమిత్ర" సాహితీపత్రిక శర్మగారి సంపాదకత్వంలో వెలువడుతున్నాయి.

శ్రీ రామశేషయ్యగారు మిర్యాలగూడెంలో పేరున్న సాహితీ మిత్రుడు.

సూర్యాపేట కేంద్రం భానుపురి కళామండలి ఎందరో కవులను, కథకుల్ని తయారు చేసింది. సమావేశాలు, నెలనెలా జరుగుతుంటాయి. దేవులపల్లి ప్రభాకర్‌రావుగారి సంపాదకత్వంలో "తేజోప్రభ" పక్ష పత్రిక ఎంతో సాహితీ సేవ చేస్తూంది. మరింగంటి పురుషోత్తమాచార్యులు, విద్వాన్ నాగం, డా॥ శర్మ, ఊరె నర్సింహారావుగార్లు, ఇత్యాదులు నిరంతరాయంగా సాహితీ సేవ చేస్తున్నారు. సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు, ముడుంబ సీతారామానుజాచార్యులు గారు ఇక్కడే ఉన్నారు. అకాల మరణం పొందిన కవులు. శ్రీ కోదాటి లక్ష్మీ నర్సింహారావు గారు పోలీసు చర్యకు పూర్వమే చనిపోయిన భావకవి.

హుజూర్‌నగర్ తాలూకా మునగాల పరగణా రేపాల గ్రామంలో సాహితీ సాంస్కృతిక కార్యక్రమాలు ఉటంకించకపోతే మన సాహిత్య చరిత్ర అసమగ్రం అవుతుంది. రేపాల నృసింహస్వామి కళ్యాణంతో పాటు సాహిత్య కళ్యాణాన్ని జోడించి నడుపుతున్నారు శ్రీ కె.యల్. నర్సింహారావుగారు. ఎన్నో నాటక పోటీలు, కవి సమ్మేళనాలు జరుగు తుంటాయి. వీరు స్వయంగా ఆకాశవాణిలో పనిచేసినవారు. ఎన్నో నాటకాల రచయితలు, ప్రయోక్తలు, నాటక అకాడమీ సభ్యులు కూడాను. సుప్రసిద్ధ గ్రంథాలయ ఉద్యమ నాయకుడు, సాహితీవేత్త కోదాటి నారాయణరావు ఇక్కడివారే. అలాగే మునగాల గ్రామం వారణాసి వెంకట నారాయణశాస్త్రిగారు కూడ బహుగ్రంథకర్త.

కోదాడు తాలూకా స్థానికంలో ఎన్నో సాహిత్య కార్యకలాపాలు సాగుతున్నాయి. దేవరకొండ స్థానికంలో రాచమల్ల దేవయ్యగారు, చంద్రమౌళిగారు, సాంస్కృతిక సాహితీ సమాఖ్య అనే సంస్థను స్థాపించి సాహిత్యాన్ని ఆరాధన చేస్తున్నారు. కొన్ని ప్రచురణలు కూడా చేశారు.

రామన్న పేట తాలూకాలో వెలువర్తి గ్రామానికి చెందిన శ్రీ బి.యన్. శాస్త్రిగారు తానే ఒక సంస్థగా, సాహితీ క్షేత్రంలోనూ, చారిత్రక పరిశోధనలోనూ ఎంతో కృషి చేస్తున్నారు. సురవరం ప్రతాపరెడ్డిగారి మార్గంలో ఆంధ్రుల సాంఘిక చరిత్ర వ్రాశారు. తెలంగాణలోని శాసనాల సంపుటిని ప్రచురించారు. విష్ణుకుండినుల చరిత్రకు సంబంధించిన ఎన్నో విశేషాలను వెలువరించారు. "మూసీ" అనే సాహిత్య పత్రికను, ఒక ప్రచురణ సంస్థను నడుపుతున్నారు. అలాగే ప్రజాకవి, కళాకారుడు అయిన సుద్దాల హనుమంతురావుగారు, సుద్దాల గ్రామ వాస్తవ్యులు. ఈ మధ్యనే వీరి గేయసంపుటి వెలువడింది. నిజాం వ్యతిరేక తెలంగాణా పోరాటంలో ఎందరో అజ్ఞాత కవులు మట్టిలో మాణిక్యాల్లాగా ఉద్భవించారు. "బండి వెనుక బండికట్టి" అనే పాట రాసిన యాదగిరి లాంటివారు ఎందరో ఉన్నారు. టి. రామాంజనేయులుగారి సంకలనంలో ఆనాటి ఎన్నో పాటలున్నాయి. కొన్నింటిని వి.ర.సం. మిత్రులు సేకరించి ప్రచురించారు. వాటిపై పరిశోధనా కృషి జరగాల్సి ఉంది, ఆ ఉద్యమ చరిత్ర ఎన్నో కథలకు, నవలలకు ముడిసరుకుగా ఉపయోగపడుతుంది.

ఈ చారిత్రక పరిశోధనా కృషిలో పేర్కొనదగిన ముఖ్యులు శ్రీ తేరాల సత్యనారాయణగారు. వీరు కాకతీయ యుగచరిత్ర, రాచకొండ చరిత్ర, ఇత్యాధి గ్రంథాలు రచించారు.

ఒక్క మాటలో చెప్పాలంటే పోలీసు చర్యకు పూర్వం జిల్లా మొత్తానికి ఒకే ఒక హైస్కూలు నల్లగొండ స్థానికంలో ఉండేది. అలాంటిది నేడు ప్రతీ 5 మైళ్ళకు ఒక్క హైస్కూలు ఏర్పడింది. ప్రతీ తాలూకాలో ఒక కళాశాల ఏర్పడింది. విద్యా విజ్ఞానాల ప్రసారాలు సాగుతున్నాయి. ప్రతీ ఉన్నత పాఠశాల, కళాశాల ఒక సాహిత్య సాంస్కృతిక కేంద్రాలుగా ఉన్నాయి. ఎందరో ఉపాధ్యాయులు సారస్వత సేవ చేస్తూనే ఉన్నారు. పుస్తకాలు వ్రాస్తున్నారు, ప్రచురిస్తున్నారు. ప్రతి తాలూకాలో ముద్రణాలయాలు విరివిగా ఉన్నాయి. వందల వేలాది పాఠకులు పెరిగిపోతున్నారు. సాహితీ క్షేత్రం విస్తరిస్తూ ఉంది. ఈ చరిత్ర రచనా ప్రయత్నం కేవలం స్థూలమైన Out lines మాత్రమే అని మనవి చేస్తున్నాను. రచయితలు తమ కార్యక్రమాల భోగట్టా పంపి సహాయం చేసిన పాపాన పోలేదు. తమ రచనలను పుస్తక ప్రదర్శనకు పంపలేదు. అలా పంపితే నాలాంటి వాళ్ళకు ఇలాంటి వ్యాసాలు వ్రాయడానికి ఎంతో ఉపకరించేది. కేవలం నా జ్ఞాపకాలు, పరిచయాలతో వ్రాసిన ఈ వ్యాసం రేపటి సాహితీ చరిత్రకారుడికి తోడ్పడక పోతుందా అన్న ఆశ ఈపాటి కృషికి దోహదం చేసింది.

మధురకవి ఎలమర్తి రమణయ్య

# ఉద్యమాలకు ఊత కందనవోలి కవుల కైత

"సీమ సింహద్వారం శ్రీశైల ముఖద్వారం
రాయలు ఏలిన నేల ఇది పౌరుషాల ఖిల్లా"

కర్నూలు జిల్లాను పరిచయం చేస్తూ ఓ కవి వ్రాసిన గేయంలోని పంక్తులివి. కుందేలే వేటకుక్కను తరిమిన పౌరుషాల పురిటిగడ్డ రాయలసీమ. కృష్ణరాయలు ఏలిన సీమకు ముఖద్వారంగా భాసిల్లిన కర్నూలు జిల్లాలో ఎన్నో ఉద్యమాలు వచ్చిన సందర్భంగా కవుల కలాలనుండి ఎన్నో కావ్యాలు గేయాలు పుట్టుకొచ్చాయి. జిల్లా సాహితీ ప్రస్థానానికి ఎన్నో వేల యేళ్ళ చరిత్ర ఉంది. "నాగబు" పదమే తెలుగులో మొదటి పదముగా భావించే తెలుగు సాహితీలోకాన్ని విస్మయపరిచేవిధంగా కర్నూలు సమీప గ్రామమైన "కన్నమడకల"లోని రాతిశాసనంలో "అంధిర" "లోహము" అనే పదాలు బయల్పడినవి.

శ్రీశైలంలో స్థిరపడి అక్కడే దేహత్యాగం చేసిన బౌద్ధాచార్యులు సిద్ధనాగార్జునులవారు 24 గ్రంథాలు వ్రాసిన గొప్ప సాహితీవేత్త కర్నూలు జిల్లా సాహితీరంగంలో ముందున్నదని తెలిపేవిధంగా లభ్యమైన ఆయన గ్రంథాలు లోహ శాస్త్రః, రసరత్నాకరః, కచ్ఛపుట తంత్ర, ఆరోగ్యమంజరీ, యోగసారః రసేంద్రమంగళః రతిశాస్త్రః రస కచ్ఛపుటః, సిద్ధనాగార్జునీయః గ్రంథాలు. ఇకపోతే ఆదిశంకరాచార్యులు శ్రీశైలంలో కొంతకాలం నివసించినట్లు తెలియుచున్నది. అంతేకాదు "సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలింగం శివలింగతం" అని మల్లి కార్జునుని స్తుతించారు. ఇక్కడే వారు "శివానందలహరి"ని రచించినట్లు పెద్దలు చెబుతున్నారు. ఈ విధంగా కర్నూలు జిల్లాలో అతి ప్రాచీన కాలంలోనే సాహిత్యానికి అంకురార్పణ జరిగిందని తెలుస్తోంది.

ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంగా ప్రసిద్ధిగాంచిన సిపాయిల తిరుగుబాటు (1857) కంటే ముందుగా 1801లోనే తెర్నెకలు యుద్ధంలో ముత్తుకూరి గౌడప్ప నాయకత్వంలో బ్రిటిష్ సైన్యంతో యుద్ధము చేసి వీరమరణం పొందారు వీరులిక్కడ. జానపదులు ఆ వీరోచిత పోరాటాన్ని కథలుగా పాడారు. అలాగే 1846 లోనే ఉయ్యాలవాడ నరసింహారెడ్డి అనే పాళెగాడు తెల్లదొరల నెదిరించి 500 మంది ఆంగ్లేయుల్ని వధించి చివరకు ఆంగ్లేయుల చేతిలో మరణించారు. ఆయన వీరోచిత పోరాటాన్ని బుర్రకథగా చెబుతున్నారు. "సైరానరసింహారెడ్డి" అంటూ గానం చేస్తున్నారు జానపదులు.

ఇకపోతే "వందేమాతరం" అంటూ నినాదం చేసి రాజమండ్రిలో ఉపాధ్యాయ శిక్షణా సంస్థనుంచి బహిష్కరణకు గురై వందేమాతర ఉద్యమంలో సింహంలా దూకి కర్నూలు జిల్లా తొలి రాజకీయఖైదీగా ఆంధ్రతిలక్‌గా వాసిగాంచిన గాడిచర్ల హరిసర్వోత్తమరావు పాత్రి కేయుడిగా సాహితీవేత్తగా రాణించారు. ఎడిటర్ అన్న పదానికి "సంపాదకుడు" అనే తెలుగు పదాన్ని అందించిన వేత్త వారు. జిల్లాలో గ్రంథాలయోద్యమం, వయోజనవిద్యా ఉద్యమం నడిపి స్వాతంత్ర్యోద్య మాన్ని బలోపేతం చేసిన స్వాతంత్ర్య సమరయోధులు వారు.

తెలుగు సాహిత్యంలో వచ్చిన భావకవిత్వం అభ్యుదయ కవిత్వం జిల్లాలోని రచయితల్ని కూడా కదిలించాయి. వనం శంకరశర్మ, మేడూరి దీక్షితుల వెంకటసుబ్బయ్య, ఎన్.వి.కృష్ణమూర్తి, వెంకటరావు, హీరాలాల్, రోశయ్య (పరాశర) ఎన్నో రచనలు చేశారు. జిల్లావాసి 'రసమయి' అధినేత సినారె ఏకలవ్యశిష్యుడు ఆ ఒరవడిలోనే "గీతా రామం" "హంసనృత్యం" వంటి రచనలు అందించారు. కారుణ్యం, దేశభక్తి అంశాలుగా ఎన్నో రచనలు టీచర్స్ ఫెడరేషన్ నాయకుడిగా పత్తికొండ లలితకళాసమితి స్థాపించి సాహితీ సేవలందించిన శర్మగారు సాహితీఖని గనివాసి అయిన కలుగొట్ల విజయాత్రేయ సాహితీ సౌరభాన్ని వెదజల్లే ప్రయత్నంగా ఎన్నో వేదికలు నిర్వ హించారు. నండూరి రామకృష్ణమాచార్యుల వంటి వారిని రప్పించి సత్కరించి సాహితీప్రసంగాన్ని రసజ్ఞలోకానికి వినిపింపచేశారు.

ప్రజలను చైతన్యపరులను చేయడానికి జిల్లాలో జరిగిన ఉద్య మాలకు జనవిజ్ఞానవేదిక నాయకత్వం వహించింది. వేదిక ఆధ్వర్యంలో జిల్లాలో కవులు సాహితీవేత్తలంతా కదలి కలిసివచ్చి ఆ ఉద్యమాల లక్ష్యాలను ప్రజలకందించే ప్రయత్నం చేశారు.

### ఆరోగ్య వ్యవసాయ జాతా

ఈ జాతా ప్రధానంగా రైతులెదుర్కొంటున్న సమస్యలను ప్రజలకు తెలియచేసే ప్రయత్నం చేసింది. ఈ జాతా రైతులకు, రైతు సమస్యలపట్ల ప్రభుత్వానికి ప్రజలకు అవగాహన కలిగించే ప్రయత్నం చేసింది. ఈ విషయంగా ఎన్నో గేయాలు వచ్చాయి. మచ్చునకొకటి

**విత్తనాలు ఎఱువులు కొనడానికి డబ్బులేదు**
**అప్పుజేసి కొన్నా అవి పుచ్చులూ కత్తలు**
**ఎట్టాగో పండించిన గిట్టుబాటు ధరలేదు**
**కొనబోతే కొఱవి ఆయె అమ్మబోతే అడవిఆయె**
**యాదేసిన గొంగళి ఆడనేఉన్నట్టు**
**రైతన్నా నీ బతుకు ఎదుగు బొదుగు లేదాయె ॥**

### అక్షరాస్యతా ఉద్యమం (అక్షరజ్యోతి)

అక్షరాస్యతా ఉద్యమం లక్ష్యం నిరక్షరాస్యులను, అక్షరాస్యులుగా చెయ్యడమే. ఇందుకోసం రాత్రిబడులు నడపడం దీనికి ప్రభుత్వం సంపూర్ణ అక్షరాస్యతాకార్యక్రమం చేపడితే జనవిజ్ఞానవేదిక అనే స్వచ్ఛంద సంస్థ సహకారం అందించింది. ఆ సంస్థ తరపున కవులు కళాకారులు సాంస్కృతిక కార్యక్రమాల్ని రూపొందించారు. ఆ సందర్భంగా జిల్లా కవులు వ్రాసిన రచనలు పరిచయం చేయడం కర్తవ్యంగా భావిస్తూ ఈక్రింద ఉదహరించడమైనది.

**పలకాబలపం పట్టుకొని బావయ్యో**
**రాత్రిబడికి నువ్వుబోతే బావయ్యో**
**నీవు చదివే తీరు చూసి బావయ్యో**
**ఈ కన్నెమనసు ఎన్న ఆయె బావయ్యో**

అని నన్నపనేని రమాదేవి కలంనుంచి జాలువారితే

**సంద్రంలో ముత్తెమల్లె సదువులోనె గ్యానముంది**
**సీకట్లో దీపమల్లె సిక్కులిప్పుయిద్దెయిది**
**ఆ కటికి రాదంటూ అలుసు సెయ్యమాకు నువ్వు**
**అసలిసుంటి అవకాసెం వొదులుకుంటెమళ్లిరాదు**

అంటూ విద్యయొక్క ప్రయోజనాన్ని ఆవిష్కరించాడు ఎలమర్తి రమణయ్య.

**అఆలు దిద్దాలనే ఆందోళన పడబోకు**
**సులభపద్ధతిలోనే చదువు నేర్పుతారంట**
**అదిగదిగో కదిలిందిర అక్షరసేన**
**రారమ్మని సైగచేసి పిలుపునందుకోవోయ్**

అంటూ వయోజనవిద్యాబోధన కష్టంగా ఉండదు. ఇష్టంగా ఉండటానికి సులభమైన బోధనాపద్ధతులున్నాయనే విషయాన్ని తన పాటద్వారా తెలిపాడు జి.బి. మద్దిలేటి

"గుడిలో లేడు దేవుడు బడిలోనే ఉన్నాడు దేవుడు" అంటూ విద్య నేర్పే గురువుల్ని దేవుళ్లుగా నాగరాజు సంభావిస్తే

"జనగణమని బడిగంట పిలుస్తుంది" అంటూ వాసు ఎలుగెత్తి పిలిచాడు. అక్షరాస్యతా ఉద్యమం గొప్ప సామాజిక ప్రయోజనం కలిగింది కనుక

**"మేధావిలోకమా మేలుకో మేలుకో**
**కళ్ళు తెరచి ఒక్కసారి నీవారిని చూసుకో"**

---

చిరునామా : మధురకవి ఎలమర్తి రమణయ్య, కరవాణి 9490131005.

శ్రీ పింగళి వేంకట కృష్ణారావు

# వికటకవి తెనాలి రామకృష్ణుడు

శ్రీకృష్ణదేవరాయల కీర్తిని నాటినుండి నేటికి మేనాటికి జనులందరి నోళ్లలో నిలిపిన, నిలిపించగల కవిదిగ్గజం తెనాలి రామకృష్ణుడు. అతడు కృష్ణాతీరంలోని తెనాలివాడు కావటం మనకు ఆనందదాయకం. ఈయనకు "కుమారభారతి" అన్న బిరుదున్నది. తండ్రి రామయమంత్రి తల్లి లక్కమాంబ లేక లక్ష్మమ్మ. ఈతని చిన్ననాటి పేరు రామలింగం. ఇంటిపేరు గార్లపాటివారు. విజయనగరం చేరిన తరువాత తెనాలి రామకృష్ణుడైనాడు. లింగపురాణము, ఉద్భటారాధ్య గ్రంథాలు రామలింగనామంతో రచింపబడ్డాయి. పాండురంగ విజయము, పాండురంగమహత్యము, ఘటికాచలమహత్యము అనే ఈ ఏడు గ్రంథాలలో ప్రస్తుతం మనకు లభిస్తున్నవి, ఉద్భటారాధ్య చరిత్ర, పాండురంగమహత్యము, ఘటికాచలమహత్యము అనే మూడు మాత్రమే. కాలాన్ని బట్టి వీటిలో ఉద్భటారాధ్యచరిత్ర మొదటిది, రెండవది పాండురంగమహత్యము, మూడవది ఘటికాచలమహత్యముగా విమర్శకులు నిర్ణయించారు. ఉద్భటారాధ్య చరిత్ర, కొండవీటి దుర్గాధ్యక్షుడైన నాదెండ్ల గోపమంత్రికి మంత్రి అయిన ఊరదేచమంత్రికి అంకితమివ్వబడింది. ఇది శైవగ్రంథము. పాండురంగమహత్యము విరూరి వేదాద్రి మంత్రికి అంకితము. ఘటికాచలమహత్యాన్ని ఈ కవి ఎవరికి అంకితము చేయలేదు. రామకృష్ణుడు మరణించిన తరువాత ఆయన మనుమడు దీనిని "ఖండోజి" అనేవాడికి అంకితం చేశాడు.

రామకృష్ణుడు రాయలవారి ఆస్థానకవి అవునా కాదా ? అని విమర్శకులు తర్జన భర్జనలు చేశారు. చివరకు ఈ కవి తన చిన్న వయసునాడు రాయల ఆస్థానమున ఉండి ఉండవచ్చని నిర్ధారణగా వచ్చారు.

శ్రీకృష్ణదేవరాయలు 1509లో పట్టాభిషిక్తుడయి, 1529లో పరమపదించాడు. ఈయన 1516లో కొండవీడును జయించి, దాని పాలనాబాధ్యతను తిమ్మరుసు కప్పగించాడు. తిమ్మరుసు ఆ దుర్గాధ్యక్షునిగా తన మేనల్లుడు నాదెండ్ల గోపమంత్రిని నియమించాడు. గోపనమంత్రి దగ్గర మంత్రి అయిన ఊరదేచమంత్రికి రామకృష్ణుడు ఉద్భటారాధ్య చరిత్రను అంకితం చేశాడు. ఈ సంబంధాలను పరిష్కరించికొని రామకృష్ణుడు ఈ కాలంలోనే రాయలవారి ఆస్థాన ప్రవేశం చేసి ఉండవచ్చని, ఉద్భటారాధ్య చరిత్రకు పీఠిక వ్రాసిన నిడుదవోలు 1516 ఉద్భటారాధ్య చరిత్ర రచనాకాలమని, 1516-1530 రాయల ఆస్థానమున అష్టదిగ్గజములలో ఒకడుగా చాటు కవితావిహారం చేశాడని, 1542 ప్రాంతం పాండురంగ మహత్యం రచనాకాలమని, జీవిత చరమాంకమైన 1560 ప్రాంతం ఘటికాచల మహత్యం రచనాకాలమని నిడుదవోలువారు అభిప్రాయపడ్డారు. ఇతర విమర్శగుల అభిప్రాయాలు కూడ మూడు నాలుగు సంవత్సరాల భేదంతో ఇలానే సాగాయి. రామకృష్ణుడు ఇరువది ముప్పది సంవత్సరాల వయస్సు నడుమ రాయల ఆస్థానంలో ఉన్నాడన్నది ఫలితాంశము.

రామకృష్ణుని గురించి లోకంలో ప్రచారంలో ఉన్నన్ని కథలు, మరే అష్టదిగ్గజకవులను గురించీ లేవు. అమాటకొస్తే, తెనాలి రామునివలె ప్రజల నోళ్లలో నానిన మరొక ఆంధ్రకవి లేడంటే అతిశయోక్తి కాదు. ఆయననుగురించి ఎన్నెన్నో చిత్రాతిచిత్రమైన హాస్యకథలు ప్రచారంలో ఉన్నాయి. సామాన్యులు ఆ కథల ద్వారా దర్శించే ఆ కవి స్వరూపస్వభావాలకు, ఆతని కావ్యాలను బట్టి ఊహించదగిన రూపానికి ఏమాత్రం పొంతన కుదరదు. నిత్యజీవితంలో హాస్యచతురినిగా ప్రజలకు సన్నిహితుడైన ఈ కవి, కావ్యజీవితంలో, గంభీరుడు, జాగృతుడు.

కవిస్వభావం కావ్యంలో ప్రతిబింబిస్తుందన్న పాశ్చాత్య విమర్శకుల అభిప్రాయం సంపూర్ణసత్యం కాదు. మన ప్రాచీన కవులు ధర్మబుద్ధి కలవారు. తమ కావ్యాలలో ఆయాపాత్రలకు తగిన సంభాషణలను గూర్చి రసపోషణ చేయటంలోను, దర్మంతో కూడిన ఆనందాన్ని అందించటంలోను మాత్రమే వారికి శ్రద్ధ. తమ స్వరూప స్వభావాన్ని ఆయాపాత్రలకు అద్దటం వారికి నచ్చని పని. అలా జరుగకుండా

వారు జాగరూకులై ఉండేవారు. తన వ్యక్తిగత లక్షణాలను, పాత్రలకంటించే నటుడు ఎలా ఉత్తమ నటుడుగాడో, తన స్వభావాన్ని పాత్రల్లో ఇమిడ్చే కవికూడ ఉత్తమకవి కాడు. రంగస్థలంపై ఉత్తమ నటుడు నటిస్తుంటే పాత్రే కనబడుతుందిగాని నటుడు కనబడడు. ఉత్తముడైన కవి ఒకవేళ తనలో ఏమైనా లోపాలు ఉన్నా అవి తన పాత్రలకు అంటకుండా జాగ్రత్త పడతాడు. లోకానికి ఆనందంతో కూడి ధర్మోపదేశం చేయటమే కవి లక్ష్యం. మంచతండ్రి, కాలకర్మవశాన ఏవో దురలవాట్లకు లోనయినా, తన కుమారుని, వాటి బారినపడకుండా రక్షించటానికే ప్రయత్నిస్తాడు. కావ్యసృష్టి చేసేటప్పుడు నిజజీవితంలో హాస్యచతురుడై ఉండవచ్చు. ఇతరులను అధిక్షేపించటం వెక్కిరించటం ఆయనకలవాటు కావచ్చు.
అంతమాత్రం చేత అతని కావ్యాల్లో అవి ప్రతిబింబించాలని లేదు. తమ గుణ అవగుణాల్ని పాత్రలకంటించి గ్రంథాలు రచించి, అవి గొప్పవని ప్రచారం చేసుకొనే లక్షణం గలవారు కారు మన పూర్వకవులు.

రామకృష్ణునికి "వికటకవి" అని చెరగని బిరుదొకటి జన బాహుళ్యంచేత ప్రసాదింపబడింది. జనశ్రుతిలోని హాస్యకథలను బట్టి ఆయన కావ్యాలలో కూడ హాస్యం ఉంటుందని, అందువల్లనే వికటకవి అన్న బిరుదు వచ్చిందని అందరూ భావిస్తున్నారు.

వికటకవిత్వం హాస్యకవిత్వం గాదు. "వికటం వికృతం బృహత్" అని త్రికాండశేషము. "విరుద్ధ క్రియా వికృతిః (విర్ధుమైన క్రియ)" అని నామలింగానుశాసనము. వికృతము అంటే, స్వభావవిరుద్ధమైనది, అని సూర్యరాయాంధ్ర నిఘంటువు. విరుద్ధము అంటే వంకర అని శబ్దార్థ చంద్రిక. వికటము అంటే వికృతమైనది, సుందరమైనది, గూఢమైనది, అంటూ అర్థాలు చెబుతున్నది సూర్యరాయాంధ్ర నిఘంటువు. వీటన్నిటిని పరిశీలించిన మీదట, వికటకవి అంటే, భావాలను సాధారణ పద్ధతిలోకాక, విలక్షణమైన పద్ధతిలో వ్యక్తీకరించు కవి అని భావించవచ్చు. ఆ పద్ధతికే వక్రోక్తి అని పేరు. హాస్యమొక రసం, వక్రోక్తి ఒక అలంకార కవితా శిల్ప విశేషం. రామకృష్ణుడు వక్రోక్తిని అభిమానించిన కవేగాని హాస్యగాడు కాదు. అయితే, కాలడ్డంపెట్టి, పడితే మొగము త్రిప్పుకొని నవ్వు కొంటెతనమున్న మాట నిజము. దాన్ని హాస్యరసమనకూడదు.

"స్వభావవిరుద్ధము చమత్కారసుందరము అయిన ఉక్తి విశేషమునకు వక్రోక్తి అనిపేరు" అని తన "సాహిత్య సోపానములు"లో దివాకర్ల వేంకటావధాని గారు వక్కాణించారు. "వక్రోక్తిః శ్లేష కాకుభ్యా మపరార్థ ప్రకల్పనమ్" అని "చంద్రాలోకం" శ్లేషచేతగాని కాసువు చేతగాని వేరొక అర్థం స్ఫురిస్తే అది వక్రోక్తి అలంకారం.

ఒక భర్త భార్యతో "ఏమే ! వంట ఇంట్లో ఏం చేస్తున్నావు ? నేను పండుకొన్నాను" అన్నాడు. ఆమె పండు కొన్నాను (ఫలంకొని తెచ్చాను) అని అర్థం చేసుకుని "మీరు తినండి, నాకు చేయి తీరికలేదు" అన్నది. శ్లేషచేత వేరొక అర్థం ఇక్కడ స్ఫురించింది.

మగడు భార్యతో "ఆలస్యంగా ఇంటికి వచ్చానని కోపమా ?" అన్నాడు "అబ్బే కోపంలేదు ఏమీలేదు. ఇంకా నాలుగు గంటలు తిరిగిరండి" అన్నది భార్య ఇది కాసువు. దీనివల్ల వ్యతిరేకార్థం వచ్చింది.

కావ్యానికి వక్రోక్తే ప్రాణమని భావించినవాడు "గుంతగడు" అనే లాక్షణికుడు. అతని గ్రంథం, వక్రోక్తి జీవితం. భోజుడు, భామహుడు అనేవారు కూడ వక్రోక్తి విశిష్టతను ప్రస్తావించారు. గుంతకుడు వక్రోక్తిని ఆరుభాగాలుగా విభజించాడు. 1. వర్ణవిన్యాసవక్రత 2. పదవపూర్వ వక్రత 3. ప్రత్యయ వక్రత 4. వాక్య వక్రత 5. ప్రకరణ వక్రత 6. ప్రబంధ వక్రత వీటన్నిటిని వివరించటం మొదలుపెడితే ఇది ఒక లక్ష్య లక్షణ వ్యాసమౌతుంది. అందువల్ల ఈ ఉపోద్ఘాతాన్ని చాలించి, రామకృష్ణుని కావ్యాలనుండి కొన్ని ఉదాహరణలను ఆస్వాదిద్దాం. ఏది ఏమైనా, అందరు పోయేదారిలో కాక భిన్నమైన దారిలో భావవ్యక్తీకరణం చేయటమే వక్రోక్తి అన్నది ఫలితాంశం.

**"అలఘు వచో విలాస సుగుణాకర రామయలింగ సత్కవీ"**
**ఉద్భట - 1ఆ. 26 స**

**"నను రామకృష్ణకవి గవి**
**జన సహకారావళీ వసంతోత్సవ సూ**
**క్తినిధి బిలిపించి..............." పాండు 1. ఆ. 22 ప**
**"భువిని విచిత్ర వాక్యరణి బొల్చిన తెన్నలి రామకృష్ణ స**
**త్కలి గులవజ్రపాణి" ఘటికా. అవతారిక 14 స**

మొదలైన రామకృష్ణునకు లభించిన ప్రశంసలన్ని అతని ఉక్తివైచిత్రి వైభవాన్ని తెలిపేవే.

మనం నేడు విరివిగా వాడుతున్న "నవ్యకవిత్వము" అన్న పదప్రయోగం కూడ రామకృష్ణుని యందే చేయబడింది.

**"స్కంధపురాణనీరనిధి కౌస్తుభమై ప్రభవించు దేవకీ**
**నందను సత్కథోద్యమము నవ్యకవిత్వ కళాకలాపమన్**
**కందనమున్ ఘటించి కడు గ్రొత్తగు సొమ్మొనరించి విష్ణుసే**
**వందులకించు నప్పరము వైష్ణవకోటి నలంకరింపుమా"**
**పాండు. 1ఆ.26స.**

ని విరూరి వేదాద్రిమంత్రి రామకృష్ణునితో అన్నాడు.

నవ్యకవిత్వ కళాకలాపమునందు రామకృష్ణుడు సమర్థుడని ఈ మాటలు చెబుతున్నాయి. పాండురంగమహత్య రచనచేత పరమవైష్ణవ

కోటిని అలంకరింపగలిగినవాడు రామకృష్ణుడని కూడ వేదాద్రి అభిప్రాయము, అభిమతము. అలాంటి కవి హాస్యగాడెలా అవుతాడు. అతడు కదు గడుసువాడు అప్పుడప్పుడు చిలిపివాడు.

ఇక ఇప్పుడు రామకృష్ణుని కృతులైన ఉద్భటారాధ్య చరిత్ర, పాండురంగమహత్యం, ఘటికాచల మహత్యములలో ఉక్తివైచిత్రి గల కొన్ని విషయాల్ని చూద్దాం.

ఉద్భటారాధ్య చరిత్రలో సూర్యాస్తమయ వర్ణనకు సంబంధించిన ఈ రెండు పద్యాలు రామకృష్ణుని ఉక్తివైచిత్రికి చక్కని ఉదాహరణలు.

**"మొదల పురందరాశ తగముట్టితి రాగముతోడ పద్మినిన్**
**పిదప చమత్కరించితివి వేడ్కకరంబులు సాచియింకనన్**
**పొదువగు మంచు దూఱుచు నపూర్వదిశాంగన కాలదాచినన్**
**తదమిత యావకద్రవము దాల్చెను నా నిను డొప్పె రక్తిమన్"**

**ఉద్భ ఆ.2.ప.33**

పురందర = ఇంద్రునియొక్క ; ఆశ = దిక్కును (తూర్పు) ; తగముట్టితి = మిక్కిలి ప్రేమతో కౌగలించావు ; పిదప = తరువాత ; పద్మినిన్ = పద్మము అనే కాంతను ; చమత్కరించితిని = సరసాల్లో ముంచావు ; వేడ్కకరంబులు సాచియింకనన్ = కోరికతో చేతులు (కిరణాలు) చాచినన్ను ; పొదువగుమంచు దూరుచు = కౌగలించుకోవద్దు, అని తిడుతూ ; అపూర్వ దిశాంగన = పడమటి దిక్కనే స్త్రీ. కాలదాచినన్ = కాలితో తన్నగా ; తదమిత యావకద్రము = పాదాలకు ఎక్కువగా అంటి ఉన్న లత్తుక (ఎర్రనిరంగు) తాల్చెనునా = అంటుకున్నదా అన్నట్లు ; ఇనుడొప్పెరకియన్ = సూర్యుడు ఎర్రగా ప్రకాశించాడు.

సూర్యుడు పడమరదిక్కనే కాంతను సమీపించాడు. అప్పుడామె "ఉదయం తూర్పు దిక్కనే కాంతను కూడావు ; మధ్యాహ్నం పద్మినీ కాంతతో కులికావు, రాత్రికి నేను కావలసివచ్చిందా ? నన్ను కౌగిలించకు" అంటూ కాలితో తన్నిందట ఆమె కాలి లత్తుక అంటటంవల్లనే సూర్యుడు ఎర్రగా ఉన్నాడు" అంటాడు తెనాలి రామలింగం.

ఉదయాన సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు, మధ్యాహ్నం సూర్యకాంతికి పద్మాలు వికసిస్తాయి. సాయంత్రం సూరుయడు పడమర అస్తమిస్తాడు. ఇది ప్రకృతి సహజం. ఈ విషయాన్ని అన్యకాంతలం దాసక్తి గల ఒక పురుషుడు స్ఫురించేటట్లు వర్ణించటం ఈ వికటకవికే చెల్లింది.

ఇలాటి పద్యమే ఘటికాచల మహత్యంలోనూ ఉన్నది. ఛందస్సులా భేదం తప్ప భావం ఒకటే.

**"మొదల పూర్వాశజెందితి పిదప పద్మి**
**నికిని కరములు సాచితి వికను తొలగు**
**మని యపూర్వాశ కాల దాచిన తదంఘ్రి**
**యావమన రాగ మిగురొత్తె నర్యుమేన"**

**ఘటికా. ఆ.2.ప.139**

పూర్వాశ = తూర్పుదిక్కు ; అర్యుడు = సూర్యుడు

పైది అస్తమించబోతూ ఎర్రగా వున్న సూర్యుని వర్ణన.

సూర్యాస్తమయవర్ణనను తెలిపే ఒకే భావంగల మరి రెండు పద్యాలు ఒకటి ఉద్భటారాధ్య చరిత్రలోను మరొకటి ఘటికాచల మహత్యంలోను ఉన్నవి.

**"ఉదయమునొందె సానులకు నొద్దిక బద్మినిదేర్చి తద్గృహం**
**బదవదసేసె దత్కువలయప్రభదూలిచెనట్టె వారుణిం**
**దుదిగనె నంచుదన్ జనులు తూలగనాడిన నింద యోర్వకో**
**గొదగొని పశ్చిమాంబునిధి గ్రుంకెసరోరుహమిత్రుడత్తరిన్"**

**ఉద్భ. ఆ.2.ప.34**

సానులు = పర్వతసానువులు, వారవనితలు – పద్మినులు = తామరపూలు, పద్మినీ జాతిస్త్రీలు – వారుణి = పడమరదిక్కు, సారాయి – కువలయము = భూమి – కలువ.

ఇలా రెండర్థాలు గల పదాలను వాడి కవి ఈ పద్యంలో శ్లేష ద్వారా అద్భుతమైన భావాన్ని చిత్రించాడు. ఇదే వక్రోక్తి. ఇదే వికట కవిత్వం.

"ఈ సూర్యగారికి సాని కొంపల్లోనే ప్రొద్దుపొడిచింది. తరువాత ఉత్తములైన పద్మినీజాతి స్త్రీలను కూడివారి ఇండ్లలో (అదవద) కలతలు సృష్టించాడు. వారికి (కువలయప్రభతూలిచె) భూమియందు గల మంచిపేరును చెడగొట్టాడు. చివరకు త్రాగుడుకు కూడ అలవాటు పడ్డాడు" అని ప్రజలు నిందిస్తుంటే ఓర్వలేక (సరోరుహమిత్రుడు) సూర్యుడు (పశ్చిమాంబునిధి క్రుంగెన్) పడమటి సముద్రంలో దూకాడు. ఇది వికటకవి అల్లిన కథ.

సూర్యుడు తూర్పు పర్వత సానువులలో ఉదయించి, పగలు పద్మాలను వికసింపజేసి, కలువలను ముకిళింపజేసి, సాయంత్రం ఎర్రగా మారి పడమటిదిక్కుకు చేరి సముద్రంలో క్రుంగాడు. ఇది, అసలు ప్రకృతి కథ.

**ఇలాంటి పద్యమే ఘటికాచల మహత్యంలోనూ ఉన్నది.**

**"ఉదయించినదిమొదలు మదిమోద మలవడ**
**కల వసూత్కరము సానును జేర్చె**
**ద్విజరాజ మండల తేజంబు మాయించి**

కువలయవృద్ధి తక్కువగజేసె
గురుతరస్తోమ విస్ఫురణంబు సందు గొం
దుల నిగూఢక్రియ నిలనొనర్చె
పుణ్యజనస్తోమముల పెంపుదూలించి
పద్మినీసతి బట్టి పగలుగూడె
ప్రబల నుగ్రప్రభుత తుదిరంగమదర
నంటె వారుణి తాతనునఖిలజనము
తూలనాడెదు నిందకు జాలకపర
వారినిధిబడెననగ్రుంకె వనజహితుడు" ఘటికా. ఆ.2.ప 141

ఈ పద్యం కూడా శ్లేషతో కూడుకున్నదే.

వసూత్కరము = 3 రణాలు ; బంగారు సంపద - దినజరాజ మండలము = చంద్రమండలము ; బ్రాహ్మణశ్రేష్ఠుల సమూహము - గురుతరస్తోమము = ఉత్తమగురువుల సమూహము, గొప్పదైన భాగ్యము - నిస్ఫురణము = మనోవికాసము ; విస్తరించినది - పుణ్యజనులు = రాక్షసులు, పుణ్యాత్ములు - తుదిరంగము = చివరిస్థితి -

ముందు సూర్యాస్తమయపరంగా భావం చూద్దాం. రవి ఉదయించిన దగ్గరనుండి తన కిరణాలచేత పర్వతసానువులకు వెలగింపజేసాడు. చంద్రమండలంయొక్క కాంతిని హరించాడు. కలువల వికాసం తగ్గించాడు. సందుగొందుల్లో ఉండే సాధువులైన ఉత్తమగురువులకు మనోవికాసం కలిగించాడు. రాక్షసులను నిరోధించాడు. పద్మాలను వికసింపజేశాడు. అలా లోకాన్ని పాలించి, చివరగ ఎర్రదనం వహించి (అపర) పడమరసముద్రంలో క్రుంగాడు.

ఈ పద్యములో స్ఫురించే మరొక వృత్తాంతం చూద్దాం. ఒకడు యౌవనం ఉదయించింది మొదలు బంగారు సంపదలను సాని కొంపలిగ తగలేశాడు. బ్రాహ్మణశ్రేష్ఠుల కీర్తిని చెడగొట్టి భూసంపదను ఖర్చుచేశాడు. గొప్ప సంపదను సందు గొందుల్లో రహస్యక్రీడా కలాపాలకు వ్యయంచేశాడు. పుణ్యాత్ములకు కళంకం కలిగేట్లు పగటి పూట స్త్రీ సంగమాన్ని ఆచరించాడు. ఇలా ఉత్తమమైన మనస్సునంతా గడిపి, త్రాగుబోతై లోకనిందకు గురై చివరగ అస్తమించాడు. ఇది అన్యాపదేశంగా కవి చెప్పిన మరొక విషయం. ఇలా శ్లేషతో అర్థాంతరాన్ని చెప్పడమే వక్రోక్తి.

మన్మథుడు శివభక్తుల జోలికి పోడని, ఉద్భటారాధ్య చరిత్రలో రామకృష్ణుడు రచించిన ఈ పద్యం ఆయన వికటకవిత్వానికి మచ్చు తునక.

"కేతువు నీటముంచి తమకించి ధనుర్లతమల్ల బెట్టి వి
ఖ్యాత బలంబు చెట్టులను గట్టి గుణంబున గల్గు పక్షముల్
వేతరలించి యంపగమివేడుక మూలకుద్రోచి యమ్మనో
జాతుడు తత్పురింగలుగు శైవులపై నెంతయున్"

ఉద్భట. ఆ. 1. ప 152

కేతువునటముంచి = మన్మథుని (కేతువు) ధ్వజముచే పదాన్ని నీటిలో వదలిపెట్టి ; ధనుర్లతమల్లబెట్టి = మదనుని ధనుస్సు చెరగగడదాన్ని పొలాలతో పాలుపెట్టి ; విఖ్యాత బలంబు చెట్టులగు గట్టి = తన సైన్యమైన కోయిలలకు చిలుకలను చెట్టయందుంచి ;

గుణంబున గల్గు పక్షముల్ వేతరలించి = మదనుని వింటినారి తుమ్మెదలబారు. వాటిని పటోవెళ్లగొట్టి ; అంపగమి = తన బాణాలైన పూలను ; మూలగుద్రోచి = స్త్రీలకొప్పులందు చేర్చి ; అమ్మనోజాతు + డు = ఆ మన్మథుడు ; తత్పురిగలుగు శైవుల పై జనలోగ నెంతయున్ = ఆ నగరంలోని శివభక్తుల జోలకి వెళ్లటానికి భయపడతాడు.

శివుని కంటి మంటకు బూడిదై తిరిగి బ్రతికిన మదనునికి శివుడంటేనేకాదు శివభక్తులన్నా భయమే - మదనుని సాధనాలు వాటి వాటి సహజస్థానాల్లో ఉన్నాయి. ఇది స్వభావోక్తి" మన్మథుని విషయంలో మాత్రం వక్రోక్తి. ఈ పద్యంలో భావవక్రత ఉన్నది.

ఆనందవర్థనుని ధ్వని సిద్ధాంతాన్ని అత్యధికులైన లాక్షణికులు అంగీకరించారు. కావ్యాత్మ ధ్వని అని ఆయన సిద్ధాంతం. దాంతో మిగిలి సిద్ధాంతాలన్నీ మరుగున పడిపోయాయి. వక్రోక్తి కేవలం ఒక అలంకారంగానే మిగిలి తక్కిన కవితాశిల్ప విశేషాలన్నీ ధ్వనిభేదాలుగా రూపుదిద్దుకున్నాయి. అలంకారాశిల్పంకూడ అలంకారధ్వనిగా చెప్పబడింది. నిడుదవోలు వెంకట్రావుగారు దీన్ని భావధ్వని అన్నారు.

పాండురంగమహత్యంలో తుంగభద్రను వర్ణిస్తూ రామకృష్ణుడు వ్రాసిన ఈ పద్యంలో చూడండి యెంత ఉక్తివైచిత్రి ఉన్నదో !

"గంగా సంగమ మిచ్చగించునె మదిన్ గావేరీ దేవేరిగా
అంగీకార మొనర్చునే యమునతో నానందముంబొందునే
రంగత్తుంగ తరంగ హస్తముల నారత్నాకరేంద్రుండు నీ
యంగంబంటి సుఖించునేని గుణభద్రా తుంగభద్రానదీ"

పాండు.ఆ.1.ప 139

తుంగభద్రానదీ ! నిన్ను కౌగిలించుకున్న తరువాత సముద్రుడు, గంగా సంగమాన్ని ఇష్టపడతాడా ? కావేరిని దేవేరిగా అంగీకరిస్తాడా? యమునతో ఆనందం పొందుతాడా ? ఇది ఈ పద్యభావం.

సముద్రుని భర్తగాను నదులను భార్యలుగాను కవులు వర్ణిస్తుం టారు. వాస్తవానికి గంగ, యమున, కావేరి, తుంగభద్రకంటె ప్రసిద్ధమైన నదులు. పెద్దవి కూడ. తుంగభద్ర కేవలం కృష్ణకు ఉపనది. మరి వాటిని కాకుండా సముద్రుడు తుంగభద్ర అంటే ఎక్కువ మక్కు ఎందుకు చూపుతాడు ?

ఇక్కడ రామకృష్ణుడు తుంగభద్రకు "గుణభద్ర" అని ఒక విశేషణం వేశాడు. భద్రము అంటే శుభము శ్రేష్ఠము అని అర్థాలున్నాయి. గుణభద్ర అంటే గుణములచేత శుభమైనది శ్రేష్ఠమైనది అని అర్థం. ఆ నదులకులేని శుభత్వం తుంగభద్రకేమున్నదో పర్యాలోచన చేద్దాం.

గంగ, ఆకాశంనుండి శివుని శిరస్సు, అక్కడనుండి హిమాలయం, అక్కడనుండి భూమి, ఆ తరువాత పాతాళం దాకా పడిపోయింది. ఇలా ఆమె పతనం సాగింది. యమున నల్లనిది. అంతేకాదు బలరాముని నాగలిచేత చీల్చబడింది. కావేరి కవేరుడను రుషి కుమార్తె. ఆమె అంశ అయిన లోపాముద్ర ; సముద్రుని మూడు దోసిళ్లతో మ్రింగిన అగస్త్యుని భార్య. తుంగభద్రకు ఇలాంటి విషయాలేమీ లేవు. అందుకే ఆమె గుణభద్ర. అంతేకాదు ఆమె తుంగ, అంటే ఎత్తయినది. భద్ర అంటే శుభమయినది. మరో విషయమేమంటే, ఈమె ఒకతెకాదు తుంగ, భద్ర ఇద్దరు కలిసి తుంగభద్ర. ఇన్ని గుణాలున్న తుంగభద్ర అంటే సముద్రుడు ఎక్కువ ప్రేమ చూపించటంలో ఆశ్చర్యమేముంది?

రామకృష్ణుని ఉక్తి వైచిత్రి ఇంత అద్భుతంగా ఉంటుంది. ఇక్కడ కాకువు ద్వారా వక్రోక్తి ఏర్పడింది.

వక్రోక్తి ముదిరితే వికటత్వం రామకృష్ణుని దశావతార వర్ణనలోని ఈ పద్యాన్ని చూడండి.

**"ప్రతిదిన కేశలుంచనపు రాయిడి నెట్టనబట్టకట్టిపై**
**బుతపుత మంచునున్న కురుబోదతలన ధరింప నోడియున్**
**సతమగు సొమ్ముగాన విడజాలవుగా శిఖిపింఛవల్లి సౌ**
**గత మతధుర్య ! దాని కటిగట్టుము పుట్టుము మిన్నకేటికిన్"**

**- పాండు. ఆ.2.ప. 64**

ఇది బుద్ధావతార వర్ణన. శ్రీకృష్ణునికి నెమలిపింఛం వదలిపెట్టలేని అలంకారం. బుద్ధావతారంలో నెత్తిపై వెంట్రుకలను పీకి కొనటంవల్ల తలబట్టకట్టింది. అందువల్ల ఆ పింఛాన్ని తలపై ధరించటానికి వీలుపడదు. "స్వామీ ! దాన్ని నీవు వదలిపెట్టలేవు. ఎలాగూ మొలబట్ట తలకెక్కింది. అందువల్ల ఆ నెమలిపింఛాన్ని మొలకు కట్టుకోవటం మేలు" అంటూ బుద్ధునికో సలహా యిచ్చాడు రామకృష్ణుడు. తనకు ప్రత్యక్షమైన విష్ణువును కొనియాడుతూ పుండరీకుడు పలికిన పలుకులని కాదు, రామకృష్ణుడు మహాభక్తునిచేత, తన ఇష్టదైవాన్ని స్తుతిస్తూ పలికించిన పలుకులవి. ఇది శ్లేషరూపకమైన వక్రోక్తి ఇదే రామకృష్ణుని వికటకవిత్వం.

పాండురంగమహత్యంలో రామకృష్ణుడు చేసిన శివవర్ణనం కడు చమత్కారమయింది.

**"ఉమపసపాడి మోము తడియొత్తిన హత్తిన తిన్న శాంక దృ**
**క్కమల దళాంజనాంక కులకంబుగ నిమ్మగుబేలగేలి వి**
**భ్రమగతి గప్పినాడనగ పచ్చని నల్లని చారలన్ మనో**
**రమమగు ద్వీపిరాడజిన రత్నము యత్నము మీరదాల్చుచున్"**

**ఆ.2.ప. 193**

శివుడు పచ్చని నల్లని చారలుగల పులిచర్మాన్ని ధరించాడు. అది పార్వతి పసు రాచుకొని స్నానంచేసి, తడిని తుడుచుకొనగా పసుపు, కాటుకలు అంటిన వస్త్రాన్ని, క్రీడా సమయంలో పొరపాటుగా ధరించాడా అన్నట్లున్నది. ఇది నవ్యవ్యక్తీకరణ.

భ్రష్టుడైన నిగమశర్మ, అక్క హితోపదేశాన్ని విన్నట్లే విని మంచినాడుగా నటిస్తూ ఒకరాత్రి సొమ్మంతా దోచుకుని పారిపోయాడు. అప్పుడు ఆ ఇంట్లో వారి దుఃఖాన్ని రామకృష్ణుడు కడు చమత్కారంగా వర్ణించాడు.

**"శోకించు వృద్ధ భూసురు దాత్మ పితృదత్త**
**దుర్భ ముద్రికకు చిత్తంబు కలగి**
**అత్తగారిచ్చిన హరి సుదరశనపు పే**
**రునుడ ముత్తయిదువ వనటబొందు**
**క్రొత్తగా చేయించుకొన్న ముక్కరగునై**
**యడలు దుర్వారయై యాడుబిడ్డ**
**జామాత వెతబొందు వ్యామోహియైనవ**
**గ్రహ కర్ణవేష్టన భ్రంశమునకు"**

**పాండు. ఆ.3.ప.50**

వంశంపరువు ప్రతిష్ఠలు పోయినందుకుకాక తండ్రి దర్భముడి ఉంగరం పోయిందుకు దుఃఖిస్తున్నాడు. తల్లి పుత్రుని యెడబాటుగ కాక, అత్తగారిచ్చిన హారం పోయినందుకు ఏడుస్తున్నది. ఏదో మేలు చేద్దామని వచ్చింది అక్క. ఆమె ఆభరణాలన్నీ పోయాయి. వాటిని గురించి కాక ఆమె క్రొత్తగా చేయించుకున్న ముక్కుపుడక కోసం ఏడుస్తున్నదట. ఇక దశమ గ్రహమైన జామాత (అల్లుడు) నవగ్రహమండలాలు పోయినందుకు ఏడుస్తున్నాడు.

వంశం నాశనమయినందుగుగాక ఇలా స్వల్పవిషయాలగవారు దుఃఖిస్తున్నట్లు చిత్రించటం వికటతనం. ఈ కరుణరసాత్మికమైన సన్నివేశాన్ని ఇలా చిత్రించటం ఈ కవి ప్రత్యేకత.

ఇదేమిటని, మనం ఆక్షేపించామనుకోండి, రామకృష్ణుని సమాధాన మేమిటో తెలుసా !

"ఆ ఇంటివారంతా డబ్బు మనుషులయ్యా ! డబ్బుమీద ఉన్న శ్రద్ధ నిగమశర్మమీద ఉంటే వాడెందుకు చెడిపోయేవాడు ? అసలు లోకంతీరే అంత. మనుషులకోసం ఎవరేడుస్తారు ? వారి సంపదకోసం ఏడుస్తారుగాని" అంటూ ఒక నవ్వునవ్వి అతడు వెళ్లిపోతాడు. అతని కత్తికి రెండువైపులా పదునే "వికటకవి"ని ఎటునుంచి చదివినా అదేమాట.

పాండురంగమహత్యంలో ఆయుత నియుతుల చరిత్ర ఒక రసవత్తరమైన ఘట్టం. అగస్త్యుని శిష్యులు అయుతుడు, నియుతుడు. చదువుకాగానే గురువుగారు వారిని గృహస్థాశ్రమం స్వీకరించమని ఆదేశించాడు. నియతుడు అంగీకరించాడు. అయుతుడు అంగీకరించక పల్కిన పల్కులు కదు చమత్కార సుందరాలు.

**"ఉర్వీధరము లెక్కి యురుకనే ! కుచకుంభ**

**యుగమెల్లగాక తానురుగు మనిన**

**వాడికైదువులపై వ్రాలనే ! నిదు చూపు**

**దాలొల్లగాక తా(వ్రాలుమనిన**

**మున్నీటసుడివడి మునగనే ! నతనాభి**

**గన నొల్లగాక తామునుగమనిన**

**బెడగారు కాలావి దొడుకనే ! నూగారు**

**తొడసొల్లగాక తా దొడుకుమనిన" ఆ.5.ప.184**

మా గురువుగారు దూకమంటే కొండలెక్కి దూకుతాను గాని స్త్రీల కుచములంటును, కత్తులపై పడమంటే పడతాను కాని స్త్రీల వాలుచూపులు భరించలేను. సముద్రంలో సుడిగుండంలో దూకమన్నా దూకుతాను గాని, స్త్రీల నాభిప్రదేశాన్ని చూడను. నల్లత్రాచును పట్టుకోమంటే పట్టుకుంటాను గాని స్త్రీ నాభి భాగం క్రిందగల నూగారును తడవను" ఇది అతని మాటలు. అతడు వాంఛించేది వైరాగ్యం, మనసంతా శృంగారం. మనసులోని భావాలు మాటల్లోకి వచ్చాయి. స్త్రీ సౌందర్యమంతా అతని మనోఫలకంపై మెరుస్తున్నది. దాన్ని బలవంతంగా మొండిగా, అదొక గొప్పగా నిరాకరిస్తున్నాడు అయితుడు. మానవసంసార్ని కాదని, గురువుగారి మాటకు పెడచెవిన పెట్టిన అతడు చివరకు ఒక కప్పగా పుట్టి, మరొక కప్పతో సంసారం చేయవలసివచ్చింది. ఇది కథలోని వక్రత.

అయుతుడు తపస్సు చేస్తున్నాడు. అతని తపస్సుయొక్క తీవ్రతను చూచి ఇంద్రుడు భయపడ్డాడు. ఆ సందర్భంలో ఇంద్రుని స్థితిని రామకృష్ణుడు వర్ణించిన తీరు చూడండి.

**"అత్తరి నిప్పు ద్రొక్కినటు కాదల తెల్లోనినట్టు లావ యు**

**వ్వెత్తుగ ద్రావినట్లు విభుదేశుడు మాకాకోగ్రనిష్ఠకున్**

**జిత్తమునందపించి యతి శీఘ్రగతిన్ క్షితి కేగుదెంచె ద**

**ద్వృత్తముమానిపింతునని వృద్ధమహీసురవేషధారియై"**

**పాండు.ఆ.5.ప.189**

అయుతుని తపస్సు చూచి, ఇంద్రుడికి నిప్పుత్రొక్కినట్లయిందట, నెత్తిపైన తేలుకుట్టినట్లయిందట, ఆవపిండి త్రాగినట్లయిందట. తేలు ఏ అవయవానికి కుడితే ఆ అవయవ సంధిదాకా పైకి విషం ఎక్కుతుంది. మరి తలమీద తేలు కుడితే విషం ఏ పైకి ఎక్కుతుంది? ఆవపిండి త్రాగితే ఆగకుండా విరేచనాలు పెడతాయి. తెనాలివారి వికటకవిత్వం ఇలా ఉంటుంది.

ఇంద్రుడు వృద్ధ బ్రాహ్మణుని రూపంలో అయుతుని దగ్గరకు వచ్చాడు. అయుతుడు, "తమరెవరు ? తమ నివాసమేది ?" అని అడిగాడు. అప్పుడు ఇంద్రుని సమాధానం చిత్రంగా ఉంటుంది.

"హిమాలయాలపై నా నివాసం ఉన్నది. అక్కడ అమృతంలాంటి జలం, పారిజాతవృక్షాలు ఉన్నాయి. అప్సరసలకది ఆటపట్టు, అంటూ చివరిగా "మదము లోభము క్రోధము మొల్లవచ్చుటన్" అంటాడు. అసలు ఇంద్రుడు ఈ మూడు లక్షణాలతోనే, అయుతుని తపస్సు చెడగొట్టటానికి వచ్చాడు. ఇదే తెనాలివారి వక్రోక్తి.

రామకృష్ణుని చివరి రచన అయిన ఘటికాచల మహత్యంలో కూడ కొన్ని ఉదాహరణలను ఆనందిద్దాం.

సప్తరుషులు శ్రీహరిని దర్శించే కోరికతో శతశృంగ పర్వతంపై తపస్సు చేస్తున్నారు. వారి తపం చెరపాలని ఇంద్రునికి బుద్ధి పుట్టింది. ఎవరు తపస్సు చేస్తున్నా, స్వర్గాధిపత్యం కోసమేనని అంతని భయం. రంభను పిలిపించాడు. ఆమెతో ఇంద్రుడు పలికిన పలుకులను కడచమత్కారంగా చిత్రించాడు రామకృష్ణుడు.

**"ఘనకుచకుంభ ! రంభ ! యొక కార్యము వార్యము మద్భుజాతటా**

**గ్రని శిత వజ్రధారగును గావున నిన్నిటు బిల్వబంచితిన్"**

అన్నాడు ఇంద్రుడు రంభతో.

ఒక కార్యమువార్యము మద్భుత తటాగ్ర నిశితవజ్రధారగును గావున = ఒక పనిని నా భుజాలనంటి ఉండే పదునైన వజ్రాయుధం నిరోధించలేదు. అందుకే నిన్ను పిలిపించాను" అంటూ చేసిన సంబోధనలోనే ఉన్నది వికటత్వం. "ఘనకుచకుంభరంభ" అన్నది ఆ సంబోధన. నీ బాహమూలవిస్తారములైన కుచకుంభములే సప్తరుషుల తపస్సును నివారించగలవు వాటి ముందు వజ్రాయుధం దిగదుడుపు అన్నది ఇక్కడి ధ్వని. అది ఈ కవి ఉక్తి వైచిత్రి.

రామకృష్ణుడు బోడిగుండుకు మోకాలికి ముడిపెట్టే రకం. భృగుమహర్షి ఆశ్రమం వర్ణించిన తీరు చూడండి.

**"మునిహోమానల ధూమము**

**మినువాకం గ్రుంకి వెడలు విబుధవధూటీ**

**జనముల నెఱి ముంగురులం**

**దనరున్ సాంబ్రాణి ధూపధారా రీతిన్"**

"మునుల హోమధూమాలు, ఆకాశగంగలో స్నానంచేసి వస్తున్న అప్సరసల ముంగురులకు సాంబ్రాణి పొగ అయ్యాయి" అంటూ ఓ

కవి వైరాగ్య సంపన్నులైన మునులుగ భోగపరాయణులైన అచ్చరలగ ముడిపెట్టిన ఈ కవి చాతుర్యం ప్రశంసనీయం.

జలక్రీడలాడుతున్న అప్సరసలను రామకృష్ణుడు వర్ణించిన తీరు అద్భుతం.

**"రమణి యొక్కతె కడు నిబ్బరముననీద**

**నిగ్గుదేరెడి చిన్నారి నెమ్మొగమ్ము**

**వేణి రాణించె జాబిల్లి వెరచి కనుక**

**కినుక వెనుగొను సింహికాతనయుకరణి"    ఆ.2.ప.131**

ఒక అచ్చర నీటిలో ఈదుతున్నది. కేశపాశమంతా నీటిపై తేలు తున్నది. ముందు ఆమె ముఖము ఆ వెనుక నీటిపై తేలుతున్న నల్లని వెంట్రుకలు. ఆ దృశ్యం తనకు పట్టుబడకుండా, నీటిలో మునుగుతున్న చంద్రుని, కోపంతో రాహువు వెంబడిస్తున్నట్లున్నది అపూర్వమైన వర్ణన.

ఒక అచ్చరమోమును "నిండు జాబిల్లి తల్లి" అని వర్ణించాడీ కవి. జాబిల్లి తల్లి ఎలా ఉంటుందో ఈ వికటకవికే తెలియాలి.

శబ్దప్రయోగంలోనూ ఎంతో చమత్కారం చూపించాడు రామ కృష్ణుడు. కొన్ని సందర్భాలలో అతని శబ్దప్రయోగం చదువరులకు భంగపాటు కలిగిస్తుంది.

నిగరు శర్మోపాఖ్యానంలో నిగమశర్మను వర్ణిస్తున్న పద్యం

**"తలగడు గంగమర్దనము......"** అంటూ మొదలవుతుంది.

చాలా తెలుగుమాటలు "డు"తో అంతమవుతాయి. ఆ అలవాటు చొప్పున "తలగడు గంగమర్దనము" అని చదువుతాం. ఈ తలగడు ఎవడు ? గంగమర్థనమేమిటి అని అర్థంకాక జుట్టు పీక్కుంటాం. అసలు పదాల విరుపు ఏమిటంటే, తలగడుగు = అభ్యంగస్నానము;

అంగమర్దనము = శరీరాన్ని మసాజు చేయించుకోవటం (ఆ.3.ప.9)

నిగమశర్మ తన భార్య మాలపడుచు మరణించిన సందర్భంలో దుఃఖించిన తీరు చూడండి

**"అని తన యాలని దనయా**

**విని గని మతికాని కుడువనేయాదు...."**

తనయాలిని "తనయాలిని" అని రెండుమార్లు ప్రయోగించి చదువరిని కంగారుపెడతాడు రామకృష్ణుడు. తన ఆలిని, తనయ+ఆలిని ఇలా విడదీయాలి. ఆలి అంటే సమూహం. తన భార్య తన పిల్లల సమూహం లేకుండా తిండి తిననని అతని భావం.

ఘటికాచలమహత్యంలో రుషులను సమీపించిన అప్సరసల మాటలు చూడండి.

**"దగ్గర బోరా దగ్గికి**

**వెగ్గలమైయున్న దౌర వీరలతేజం**

**బగ్గలిక పలుకు పలుకుట**

**సిగ్గులచేటయ్యె నేమిచేయుదమింకన్"    ఆ.2.ప.116**

"దగ్గరగపోరాదు + అగ్గికి ; వీరితేజము నెగ్గలమై (అధికమై) ఉన్నది. అగ్గలిక పలుకు పలుకుట (మనమే గొప్పవారమని చెప్పుట) సిగ్గుమాలిన పని" అన్నది ఈ పద్యభావం. ఇది పాండురంగవిభుని పదగుంభనము.

**నీటిలో ఈదుతున్న ఒక అప్సరసను కవి ఇలా వర్ణించాడు.**

**"తను బట్టలేని చెలులం**

**గని నవ్వుచు నోలయిడుచు కలకియొకతె" - ఆ.2.ప.132**

ఇది చదవగానే తను "అంటే శరీరమని స్ఫురించి, ఆమె దేహంపైన వస్త్రం లేదన్న భావం కలుగుతుంది. సందర్భంగూడ తగిందే గదా ! అంతలో రామకృష్ణయ్య "వ్యాకరణం చూడవయ్యా" అంటూ కిసుక్కున నవ్వుతాడు. అపుడు ఓహో "తనను పట్టలేని" అని చదువుకుంటాం.

ఒకచోట మునులను వర్ణిస్తూ "మునిలోకకొక వైరులు" అన్నాడు. కొక అంటే ఆడువారు ధరించే చీర అని వెంటనే స్ఫురిస్తుంది. వికటకవి కొంటెచూపు. అరె మనమనుగన్నది, వైరి సమాసంగదా ! కోకము అంటే చక్రవాకపక్షి. వాటికి వైరి చంద్రుడు. రాత్రి వాటికి కనులు కనపడవు. ఇంతగ ఆ మాటకర్థం మునిలోకచంద్రులని. ఇలా కాలడ్డంపెట్టి కవ్విస్తాడు రామకృష్ణుడు. వెదకాలే కాని ఇలాటి వక్రోక్తులు, చమత్కారాలు ఆయన కావ్యాల్లో కోకొల్లలు.

సంస్కృతాంధ్రాలను, శైవవైష్ణవాలను, భక్తిశృంగారాలను సమంగా కావ్యాల్లో నిర్వహించిన రెండువైపుల పదునున్న వికటకవి రామ కృష్ణుడు.

**"ఉదయంబస్తనగంబు సేతువు హిమవ్యూహంబును జుట్టిరా**

**విదితంబైన మహిన మహేంద్ర కవితా విద్యాబలప్రౌఢి నీ**

**కెదురేరీ సరసార్థ బోధ ఘటనా హేలా పరిష్కార ! శా**

**రద నీ రూపము రామకృష్ణ కవిచంద్రా ! సాంద్రకీర్తి సాంద్రా"**

డా॥ బల్లూరి ఉమాదేవి

# కర్నూలు జిల్లాలో స్త్రీల పాటలు - కన్నడ ప్రభావము

ప్రాచీనాంధ్ర చరిత్రను పరిశీలిస్తే తెలుగు కన్నడ ప్రాంతాలు ఒకే వంశానికి చెందిన రాజుల పాలనలో నున్నట్టు తెలుస్తుంది. అందుచేత ఆంధ్ర కర్ణాటక ప్రాంతాల ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు ఒకేవిధంగా అగుపిస్తాయి. కర్నూలు (ఆదోని) అనంతపురం జిలాలు వుండేవి. అందులో ఈ జిల్లాలకు సరిహద్దు జిల్లాగా వున్న బళ్ళారి జిల్లా ఒకటి. భాషా ప్రయుక్తంగా రాష్ట్రవిభజన సమయంలో బళ్ళారి కర్ణాటకు చేరగా ఆదోని తదితర ప్రాంతాలు ఆంధ్రప్రదేశ్‌కు చేరాయి. ఈ ప్రాంతాలలో వివిధ సందర్భాలలో స్త్రీలు పాడుకొనే పాటలను పరిశీలిస్తే భాషవేరు భావమొక్కటిగా అగుపిస్తుంది.

ముఖ్యంగా స్త్రీలు పాడుకొనే పాటల్లో పుట్టుక మొదలు ఆమె జీవితంలోనూ కుటుంబంలోనూ జరిగే ప్రతి ఘట్టానికి ప్రాధాన్యత వుంటుంది. ప్రతి ఘట్టానికి పాటలు పాడుకోవటం నాడు వాడుకలో వుండేది. బారసాల మొదలు పెళ్ళి అప్పగింతలు శ్రీమంతం వరకు (కర్ణవేధ, చౌలము, అక్షరాభ్యాసము, ఉపనయనము, సమర్తాడటం, వసుపు దంచే పాటలు, ఎదురుకోలు, వియ్యాలవవారిపైన) పాడుకొనేవారు. ఈ పాటలు స్త్రీలే వ్రాసి వుండవచ్చును. సంప్రదాయపు పాటలలో వస్తువు పౌరాణికమై వుంటుంది. ఈ వస్తు నిర్వహణలో స్త్రీ సహజమైన జానపద మనస్తత్వం వ్యక్తమౌతుంది. ఈ సంప్రదాయపు పాటలు శిష్ట సాహిత్యానికి జానపద సాహిత్యానికి మధ్యలో వున్నాయని చెప్పవచ్చు. ఆధునికకాలంలో కూడా పాటలు నేర్చుకోలేని మగువలు సాంప్రదాయక ఆచారాలను వదులుకోలేక ఆయా సందర్భాలలో పుస్తకాలు చూసి పాడుకోవడం నేటికీ కనిపిస్తుంది.

మన సంస్కృతిలో జానపద విజ్ఞానం ఒక భాగం. అందులో సాహిత్యమొక శాఖ. గేయాలు..కథలు, గేయకథలు అందులో అంతర్భాగాలు. వీటిలో గేయాలు గానాత్మకాలు. పాడుకోవడానికి వీలుగా నుండేవి. మానవులకు సుఖాలో బాధలో కలిగినప్పుడు వారి మనస్సు ఉద్విగ్నమౌతుంది. ఆ సమయంలో అప్రయత్నంగా వెలికివచ్చేవే గేయాలు. ఛందోబంధాలు లేకుండా రసపోషణకని యాతన పడక భాషాభేషజాలు లేకుండా స్వేచ్ఛగా వెలువడినవీ గేయాలు. వీనిని రెండు భాషలలోనూ చాలామంది పరిశోధకులు పలురకాలుగా వర్గీకరించారు. టేకుమళ్ళ అచ్యుతరావుగారు 4 రకాలుగా, శ్రీహరి ఆదిశేషువు గారు 9 రకాలుగా, బిరుదురాజు రామరాజుగారు 11 రకాలుగా R.V.S. సుందరం గారు8 రకాలుగా G.S. మోహన్‌గారు 2 రకాలుగాను వర్గీకరించారు. కన్నడంలోను వివిధ పరిశోధకులు ఇలాగే విభజించారు. పాటల సేకరణకై భారతదేశ మంతటా తిరిగి దేవేంద్ర సత్యార్థిగారు “ఈ గేయాలు మనదేశపు అమూల్య రత్నాలనీ, కరుణ రసంతో సహజసుందరంగా వ్యవహార జ్ఞానంతో కూడుకొన్నాయని” అన్నారు.

రెండు భాషల్లోని పాటలను పరిశీలిస్తే వీనికి అవినాభావ సంబంధమున్నట్లు గోచరిస్తుంది. ఒకే ప్రవాహంలో పుట్టినపాయల్లా ఒకే కొమ్మకు పూచిన పూవుల్లా ఒకే గర్భంలో పుట్టిన కవలపిల్లల్లా వున్నాయని చెప్పవచ్చు. స్థూలంగా జానపదగేయాలను నాలుగు రకాలుగా విభజించవచ్చు. 1. స్త్రీల పాటలు 2. పురుషుల పాటలు 3. ఉభయుల పాటలు సమాజంలో సగభాగం స్త్రీలే. గృహ నిర్వహణ లోనూ మగువలకే ప్రాధాన్యత ఎక్కువ. అందుకే ఇంటిని చూచి ఇల్లాలిని చూడమన్నారు. ఇంటిని చూస్తే ఇల్లాలి నైపుణ్యం ద్యోతక మౌతుంది. కేవలం ఇంటినేకాదు, దేశ సంస్కృతిని నాగరికతను తెలుసుకోవడంలో కూడా స్త్రీ జాతికి ప్రత్యేక ప్రతిపత్తి గలదు. మనుస్మృతిలో “యత్రనార్యంతు పూజ్యంతే రమంతే తత్ర దేవతా” అన్నారు. కేవలం ఇంటిపనుల నిర్వహణలోనే కాదు ఆనాటి స్త్రీలు తమ పిల్లలను గురుకులంలో ప్రవేశింపచేయడానికి ముందు విద్యా బుద్ధులు నేర్పేవారు.

జీవితమనే శకటానికి భార్యాభర్తలిద్దరూ రెండు చక్రాలవంటివారు. భార్యాభర్తల సహజీవనంతో సాగే కుటుంబంలో స్త్రీ ఉదయం లేచింది మొదలు రాత్రి పడుకొనే వరకు ఎడతెరపిలేని పనుల్లో నిమగ్నురాలై ఆ కష్టాన్ని మరవడానికి ఉల్లాసంగా వుండడానికి పలురకాల పాటలు పాడుకొంటూ కాలం గడుపుతుంది. అందులో సంప్రదాయానికి ముడిపెట్టి పెళ్ళి, పేరంటము, పండుగ, వ్రతము..నోము ఇలా కార్యక్రమాలనకనుగుణంగా పాటలు పాడుకొంటూ వుంటుంది. వీనిలో స్త్రీ పుట్టుక మొదలు ఆమె జీవితంలోనూ కుటుంబంలోనూ ప్రతి ఘట్టానికి ప్రాధాన్యత వుంది. పాటలు వున్నాయి. వీటిని స్త్రీలే ఎక్కువగా పాడుతుంటారు కనుక స్త్రీల పాటలుగనే వ్యవహారంలో వున్నాయి. తల్లినుండి పిల్లలకు కుటుంబసభ్యులకు ఒకరినుండి మరొకరికి అనుశ్రుతంగా వచ్చి సంప్రదాయపు పాటలుగా సాహిత్యంలో చోటుచేసుకున్నాయి. సంగీత సాహిత్యాలు సరస్వతీ స్తనద్వయాలని అంటారు. అట్టి సంగీత సాహిత్యాల కలయికే స్త్రీల పాటలుగా రూపొందాయి. వీనిని 5 రకాలుగా విభజించవచ్చు.

పుట్టుకతో ఆరంభమయ్యే స్త్రీ జీవితం బాల్యావస్థను దాటి పెద్దమనిషికావడం, వివాహం శ్రీమంతం పిల్లలు వాళ్ళ బాగోగులు ఇలా జీవిత చక్రం తిరుగుతూ వుంటుంది. సంఘజీవులమైన మనం ఏదో ఒక కారణంతో నలుగురితో కలిసి తిరగడం సహజం. అదే విధంగా స్త్రీలకు కూడా నలుగురితో కలిసి తిరగడానికి పెళ్ళిళ్ళు, పేరంటాలు, వ్రతాలు, నోములు తోడ్పడతాయి. అటువంటి సమయాల్లో సంర్భానుసారంగా పాటలు పాడి చివరన మంగళహారుతు లిచ్చి సంప్రదాయసిద్ధంగా పూర్తిచేసేవారు. దీనివల్ల స్త్రీలలో ఐకమత్యం పెరిగేది. నలుగురితో కలిసిపోయే మనస్తత్వం పెరిగేది. ఆచార వ్యవహారలలోని తేడాలను గమనించి కొత్తవి నేర్చుకొనవారు. వివిధ ప్రాంతాలనుండి వచ్చిన స్త్రీలు ఒకచోట చేరడంతో భావ వినిమయం, భాషా వినిమయం జరిగేది. స్త్రీవిద్య అంతగా లేని ఆ రోజుల్లో నీతిని ధర్మాన్ని లౌకిక జ్ఞానాన్ని పాటల ద్వారా బోధించేవారు. ఇవి స్త్రీ జాలికి విద్యా నిలయాలుగా వుండేవి. ఇందులో సంఘం జీవితం సమైక్యతా భావం యిమిడి వుంది. దేశ ప్రగతికి, నాగరికతకు ఇవే పట్టుగొమ్మలని చెప్పవచ్చును.

## రెండవ విభాగము : లాలిజోల పాటలు :

స్త్రీ జీవితానికి సార్థకతగా భావించే మాతృత్వాన్ని గురించి సంతానంలేని స్త్రీలకు సంఘంలో గల స్థానాన్ని గురించి వున్న పాటలను రెండు భాషలలోను గమనించవచ్చు. బిడ్డలు లేని గొడ్రాలి బతుకు-బట్టలు వ్యర్థమనే పాటలున్నాయి.

"బిడ్డలు లేరటే గొడ్రాల నీకు
ఆడితివి ఎన్నెన్నో తీర్థతానాలు"

'సింహాద్రి అప్పన్న గుళ్ళముందార' కొత్తచింతపండుగోనెల్ల చీకు. గొడ్రాలి వస్త్రీలు - అంటూ ఎత్తిపొడిస్తే కన్నడంలో ఇదే భావాన్ని వ్యక్తీకరిస్తు గొడ్రాలి పుట్టడం కంటే అడవిలో మట్టిగానో మానుగానో పుట్టడం మేలంటుంది. అంతేకాదు

"ముంజానె హుట్టాలిసంజీలి సాయాలి
బంజెంబ శబ్దవహోరలారె".

బంజి = గొడ్రాలు, ఉదయం పుట్టి సాయంత్రం మృతిచెందినా ఫరవాలేదు. తల్లి అన్పించుకొంటే చాలనుకొంటుంది. వ్రతాలు నోములు చేసి తల్లి అవుతుంది. బిడ్డ పుట్టాకామె ఆనందానికి అంతే వుండదు. కాకిపిల్ల కాకికి ముద్దన్నట్టు బిడ్డను రాముడితో కృష్ణునితో పోలుస్తూ పాటలు పాడి మురిసిపోతుంది.

"ఏడవకు ఏడవకు వెర్రినాతండ్రి
ఏడిస్తే నీకళ్ళ నీలాలు కారు"

అంటూ 'పాలైన కారవే అంటుంది.

కన్నడంలో

"ఆళబేడ కందయ్య హాలిన్న కాదిల్ల"
పాలింకా కాగలేదంటూ
"ఆడిబా నన కంద అంగాలు తొళదేను
టెంగినకాయ తిళినీర"

అంటుంది కొబ్బరినీళ్ళతో కాళ్ళు కడుగుతుందట.

వీధిలో ఎందరున్నా తల్లికి తన బిడ్డే గొప్ప

"వీధిలో నెందరున్న విసరదేగాలి
చిన్ని నా అబ్బాయి వీధి నిల్చుంటె
మొగిలి పూవుల గాలి ముత్యాలవాన" అని మురిసిపోతుంది.

ఇదే భావన కన్నడంలో

"కూసు ఇద్ద మనిగెబీసణికి యాతక్కె
కూసు కందమ్మ ఒళహారగె
ఒళహారగె ఆడిదరె బీసణికి గాళి సిళిదావు"

బీసణికి = విసనకర్ర బిడ్డింట్లో బయట తిరుగుతుంటే గాలివీస్తుంది విసనకర్ర అవసరం లేదంటుంది.

లాలిపాటలు పెద్దవి మూడు చరణాల నుంచి వందచరణాల వరకు వుంటాయి.

తె: "జోలల్లు పాడితే బాలురకు నిద్ర
నాగస్వరమూదితే నాగులకు నిద్ర
నిదురపోఅబ్బాయనిదురపోవయ్య
నిద్రకునూరేళ్ళునీకు వొయ్యేళ్ళూ

క : "జోగుళవ హాడిదరెఆలైసి కేళాను
హాలిన్వంబలవమరతాను
మరతానుకందయ్య గప్పుచుప్పాగి మలగ్యాను"

ఈ పాటల్లో తల్లి దేవతల ప్రశంసలతోపాటు సామాజిక పరిస్థితులు కట్టుబాట్లు సంబంధబాంధవ్యాలు పుట్టింటి గొప్పలు వుంటాయి.

క : "సీతదేవిని బయసి ఆత రావణ కెట్ట
ద్రౌపదినబయసిదుశ్శాస
చక్రబింవద కోటి హొక్కుతలికెట్ట అభిమన్య"
ఇట్టివి అసంఖ్యాకంగా వున్నాయి.

తె : "కస్తూరి రంగ రంగ నాయన్న కావేటి రంగరంగా' అని పాడితే
కన్నడంలో ఇదేరాగంతో
"లాలి శ్రీరంగ ధామ జగదొళగె లాలి సుజనరిగె ప్రేమ
లాలి కౌసల్య రామతూగిదళె లాలి పరిపూర్ణసోమ"
అని పాడుతుంది.

పెద్దపాటల్లో కూడా రామజననం, కృష్ణ జననం వంటివి రెండు భాషల్లో వున్నాయి. రెండు భాషలలో వున్న మరో పాట "త్రిమూర్తుల లాలి పాట" అత్రి మహర్షి భార్యను పరీక్షించదానికి వచ్చిన రతిమూర్తులను అనసూయ

"బాలలను చేసి పూచె శీల అనసూయ
శూలి హరి తమ్మిచూలులకు లాలీ" అంటూ పాడే తెలుగుపాట కన్నడంలో :

లాలి గౌరీప్రియినె లాలి నాల్మొగనే
లాలి లక్ష్మీ రమణి లాలి పరిపూర్ణ" అని పాడుతారు.

ఇలాంటివేకాక ఇంకా అత్తారింట్లో ఎలా వుండాలి. ఎటువంటి కొడుకుండాలి కోడలెలా వుండాలో వివరించే జోలపాటలున్నాయి.

మూడవ విభాగం పౌరాణికాలు :

భారతీయులకు రామాయణ భారత భాగవతాలు పూజ్యనీయ గ్రంథాలు. కష్టాలను తొలగించి ముక్తిమార్గం చూపే దారి దీపాలు. రామాయణానికి సంబంధించిన పాటలు సమగ్రహరామాయణం, సంక్షేపరామాయణం పేరుతో తెలుగులో వుంటే కిరు రామాయణ కించిత్ రామాయణ మొదలగునవి కన్నడంలో వున్నాయి. అలాగే లక్ష్మణ దేవరనవ్వు రెండు భాషల్లో వుంది. పాట చివర ఫలశ్రుతి కూడ చెప్పవడింది.

తె : "ఇది చదివి వ్రాసిన కలుగు
ఆయురారోగ్యములు కలుగు
పాపములించుక చేరవు సుమ్మి
భక్తితో యీపాటపాడినా విన్నా
కన్నడంలో ఫలశ్రుతి :
"శ్రీరామచరితెయ హేళికేళిదవరిగె
ఆయురారోగ్య ఐశ్వర్య బాహోదు
బరదు కరియలి బంజిగె మక్కళాగలి
కురుడగె కంగళుబరలి
ఋణహరియలి దారిద్ర్య బయలాగలి
శ్రీహరి నమ్మ హృదయదోళిరలి"
అనే ఫలశ్రుతి వుంది.

భారతమునకు చెందిన పాటలు కూడా రెండు భాషల్లో వున్నాయి.

ధర్మరాజు జూదము సుభద్రాకల్యాణము విశ్వరూప సందర్శనం పద్మవ్యూహం. కీచకవద మొదలైన పాటలున్నాయి. ఎన్ని కష్టాలొచ్చినా సహనంతో వుండాలని చివరకు ధర్మమే జయిస్తుందని చెప్పబడింది.

ఉదా : ధర్మరాజు జూదము

తె : "ఆడకుమీ జూదములు ఓడబోకయ్య"
అంటూ సహదేవుడు వారిస్తే
"సాటివారు పిలువ" పోకుండా వుండరాదంటూ జూదానికి వెళ్ళి ఓడిపోతాడు.

"పాంచాలి శిఖ బట్టి దుశ్శాసనుడు లాగ
కూర్చొంచ బడెనపుడు కుంతి దోలాలు
పాంచాలి చెంగుపట్టి దుశ్శాసనుండీడ్చె"

కన్నడంలో :

"ఇంద్రప్రస్థదల్లి కుంతినందన
రాజసూయాగవను ఆనందది
మాడిందరేశ గర్విసి"
అంటూ ప్రారంభమయ్యే పాటలో
"కరియ పురద నగరదల్లి కౌరవారు పాండవారు
ధరణి ఒత్తి యిట్టు జూజ వాడలు"

ఆటలో ఓడిపోగా దుశ్శాసనుడు వస్త్రాపహరణం చేయబోగా

"నిల్లు నిల్లు పాపి నిన్న రక్తదల్లి

ముడియ నద్దువె"

రక్తంతో కురులు తడుపుకొంటానని ప్రతిన పూనుతుంది.

కృష్ణుడు అక్షయంగా వలువలివ్వడంతో కృష్ణ స్తుతితో పాట ముగుస్తుంది చివర.

"ధర్మరాజు జూదం పాట పాడినా విన్నా

అష్ట ఐశ్వర్యముల రాజు యిచ్చు"

అనే ఫలశ్రుతితో ముగుస్తుంది. ఈ రెండు భాషల్లోని పాటలను పరిశీలిస్తే పురాణకథలను పాటలుగా మలచుకొన్న తీరు తెలుస్తుంది. దుర్జనులకు ఓటమి..సజ్జనులకు విజయం కోరె ప్రజల మనస్తత్వాలకు ఈ పాట ప్రతీకగా అగుపిస్తుంది. ఇటువంటిదే మరోపాట సుభద్రాకల్యాణము. తెలుగులో తాళ్ళపాక తిమ్మక్క రచించినదికాగా కన్నడంలో ఇదే పాట అనువాదమేమో అనిపిస్తుంది.

ఎంతటి వారికైనా స్త్రాల విషయంలో పోట్లాటలు సహజమంటూ నారదుడు సుందోపసుందుల కథను చెప్పి అలాకాకుండా వుండాలంటే

"ఒక్కొక్క యేడాది ఒక్కక్కరనగా

మక్కువతో నుండుమని మర్యాద చేసి"

ఒకవేళ ఆ సమయంలో మిగతావారక్కడికి వెళితే

"తిరమొప్ప యేడాది తీర్థములన్నీ"

తిరగాలంటాడు.

ఇదే పాట కన్నడంలో గణపతిస్తుతితో ఆరంభమౌతుంది. ఇక్కడ కూడ నారదుడు

"ఇందువదనె కృష్ణె యింద నిమ్మొళగె

బందీతు కలహగళు

సుందోపసుందరంతాగలాగొదు

వరుషవొంద కొబ్బ పురుషరంతాళ్వోదు"

వ్రతభంగమైతే

"సంవత్సరదలి బ్రహ్మాచారియందది

తీర్థయాత్ర చరిసోదు"

ఇలాంటి వేళలో బ్రాహ్మణుని గోసంరక్షణార్థమై విల్లమ్ములు తేవడానికి అర్జునుడక్కడికి వెళతాడు. వ్రత భంగమవగా భూప్రదక్షణకని వెళతాడు. చిత్రాంగదను ఉలూచిని వివాహమాడి ద్వారక వెళతాడు. రెండు భాషల్లోనూ ఇదే కథ పాటలా సాగుతుంది.

సన్యాసి వేషంలో వచ్చిన అర్జునుని చూసి సుభద్ర

"పరగ యింద్రప్రస్థ పట్టణంబనగా

పరగసంపదలచే పరగంగ వలయు"

"ధీరమానసులు కుంతిసుతులు యేగురు

రాజవరులలో అర్జునుండెలమి

ధారుణీ తీర్థములు దరుశింపగా నేగె"

అంటూ వారిని ఎక్కడైనా చూశారా అని అడుగుతుంది.

ఇదే భావం కన్నడంలో :

"అత్తియ మగ తీర్థయాత్రెయ గెందు

హస్తినాపుర బిట్టు హొరటలు

మత్తెల్లాదరూ కండీరా"

అని అడుగుతుంది. తెలుగుపాటలో 'ఇంద్రప్రస్థమని' కన్నడంలో 'హస్తినాపుర'మయింది.

"మానినీ నేనిపుడుఅర్జునుడ గనుము"

అంటే కన్నడంలో

"బందెనాయతి యాగి పార్థనెందు తిళి"

ఇరువురి వివాహంతో పాట పూర్తవుతుంది. తెలుగుపాటలో ఫలశ్రుతి వుండగా కన్నడ పాటలో లేదు.

ఇక భగవద్గీతకు సంబంధించిన పాటలు కూడ రెండు భాషల్లోనూ వున్నాయి.

తెలుగు : "యుద్ధమందు క్షత్రయులనెల్ల

చంపించి జయలక్ష్మిని కొనుమూ"

అంటూ కర్తవ్యవిముఖుడైన అర్జునునితో

"కర్తను నేను సుమ భోక్తనూ నేనూ"

అంటూ వివరించి విశ్వరూపం చూపగా

కన్నడంలో

"బంధుగళ గురుజనర కొంద పాతకిగె

ముందె బరువదునరక ఎందెన్న మనకె

బందిర్పుదీ యుద్ధ బేడ వెనగె"

అనే పార్థునితో

"ధరెయొళివె ఎరడు కర్మ జ్ఞాన పార్థ

అరియొ నానధికారి కర్మ గళ కర్త"

అంటూ

"తనవె క్షేత్ర విదరియొ నానె క్షేత్రజ్ఞ"

అంటూ బోధించి విశ్వరూపం చూపుతాడు.

ఇంకా శశిరేఖా పరిణయం, కీచకవధ, పద్మవ్యూహం వంటి పాటలు భారతానికి సంబంధించినవి వున్నాయి. భాగవతానికి సంబంధించిన పాటలు అసంఖ్యాకంగా వున్నాయి. కుచేలుని కథ, ధృవుని కథ, గజేంద్రమోక్షము వామనచరిత్ర మొదలైనవి. ఫలశ్రుతి రెండుభాషల్లోను చెప్పబడింది.

**వామన చరిత్ర :**

సంతానం కోసం ద్వాదశి వ్రతం చేసిన అదితిని వరం కోరమంటే

**"బలి నణచి దేవేంద్రు పట్నంబు నా**

**సుతుకు కట్టు"** అని కోరుతుంది.

దానికి శ్రీహరి

**"నీ గర్భమునందు వామనుడనై పుట్టి"**

బలిగర్వమణచి వేస్తానంటాడు.

**కన్నడంలో :**

**"అదితి దేవి పాయన వ్రతవ మాడిదళూ"**

అంటూ

**"పృథివి యెల్ల ఆక్రమిసువ స్వామి"**

వరం కోరమన్న బలితో తనకెవరూ లేరంటూ వుండడానికి

**"పృథివి మూడడుగుల దానమిమ్ము"**

అని అడుగుతాడు.

**కన్నడంలో :**

**"మూరు పాద భూమి దానవా కొడూ"**

అని కోరి మూడోపాదంతో బలిని అణిచివేయడం రెండు భాషల్లోని పాటలలో వర్ణింపబడింది.

భక్తితో పాడినవారికి విన్నవారికి ముక్తి దొరకుతుందనే ఫలశ్రుతి రెండుభాషల్లోని పాటల్లో చెప్పవడింది.

ఇంకా త్రిపురాసుర సంహారం, భస్మాసురకథ, వెంకటేశమహత్యం శివతాండవం మొదలైన పాటలు రెండు భాషల్లో గలవు.

శివతాండవం :

మూడు చరణాల పాట ఇది.

**తెలుగు : "శివుడు తాండవము చేయుచుండె**

**కైలాసమందునా జగదంబ ముందర"**

అంటూ ఆరంభమౌతుంది.

**"ఆడిదనే నాట్యవాడిదనే**

**రూఢి జనగళు కొండాడె**

**ఖళర వక్ష స్థళది"**

**తెలుగు : "భారతి వీణా శ్రుతి వాయింప**

**లయ తప్పక బ్రహ్మ తాళము వేయ**

**ఇంద్రుడు మురళి వాయింబ"**

నారాయణుడు మద్దెల వాయించినట్లు చెప్పబడింది.

**కన్నడంలో : "బసవ మద్దళె నుడిసుతిరె**

**వసుధీశ కృష్ణ కొళలూదె (మురళి)**

**ఎసవొ తుంబురరు గాన పాడుత్తిరలు"**

శివుడు నాట్యమాడాడట.

ఇంకా గోవు మహిమ, కపిలాస్తోత్ర అనే పేరుతో రెండు పాటలున్నాయి. గోవులో ఏఏ దేవతలు ఎక్కడెక్కడుంటారో చక్కగా రెండు భాషల్లోను చెప్పబడింది.

ఈ పాటను ఎప్పుడు పఠిస్తే ఏం ఫలమో వివరించే పాట యిది.

**తెలుగు : "శనివారం ఆదివారం గోవు మంత్రం**

**పఠించిన వారికి ఎనిమిది నాళ్ళ పాపం**

**అమావాస్య పున్నమి పఠిస్తే**

**పితురులు స్వర్గస్థులౌతారు**

**ఏకాదశి, ద్వాదశి పఠనం చేసిన వారికి**

**యమబాధ లేదు"**

అంటూ చివర్లో "కామధేనువు స్మరణ చేసిన

ప్రాతః కైలాసమే కాని

జన్మాదులు లేవు"

ఈ పాట పాడితే పునర్జన్మ వుండదనే ఫలశ్రుతి చెప్పబడింది.

**కన్నడంలో : అనువాదమేమో అనేట్టుగా వుంది**

**"భాను వారదదిన ఈకపిలా స్తోత్రవను**

**హేళి కేళిదవరిగె ఎంటు(8)దిన మాడిద**

**పాప పరిహార వాగ్వోదు"**

అంటూ ఈ పాట పాడితే

**"కాశి యొళగె కరుసహిత లక్ష కపిల**

**దాన మాడిదంథా ఫల బరువదు"**

కాశీక్షేత్రంలో లక్షావులను దూడలతోసహా ఇచ్చినంత ఫల మొస్తుందని చెప్పబడింది. ఇంకా చిన్న పాటలు చాలా వున్నాయి.

**నాల్గవ విభాగము :** భక్తి పాటలు.

భారతీయ సాహిత్యంలో భక్తిపాటలకు కొదవ లేదు. ఇందులో మేలుకొలుపులు, మంగళహారతులు, పూజ పాటలు నోముము వ్రతాలు సంవాదాలు వున్నాయి.

మేలుకొలుపులు :

నేటికి చాలామంది చాలాచోట్ల ఇవి పాడుకొంటూ పనులు చేసుకొంటున్నారు. జోలపాటలు నిద్రపుచ్చేవైతే మేలుకొలుపులు నిద్రలేపేవి.

గణపతి మేలుకొలుపు :

తెలుగు : "వేడుకలుచెలువారు తొండముతో
మెరిసేటి ఏకదంతముతో
గణపతీ లేవయ్య లేలే"

అని ప్రారంభమైతే

కన్నడంలో :

"బెనవా ఏళయ్య బెళగాయితు
ఏళు పార్వతి పుత్రనె వారివదననే
బహు విఘ్నగళ నాంత జయవంత
ఏళయ్య దురిత వనాంత గుణవంత"

అని పాడుకొంటారు.

అందరిని మేలుకొలిపే సూర్యుని మేలుకొలిపే పాటలు రెండుభాషల్లో వున్నాయి.

తె : "మేలుకొనుమో బాల భాస్కర
మేలుకొనుమో ఉదయభాస్కర
మేలుకొనుమో భాను మూర్తి"

అర్ఘ్యప్రధానం కోసం

"పెంపు తోడుత పెద్ద బ్రాహ్మలు
బ్రహ్మ చారులు వైష్ణవులును
సొంపుతోనది తీరముల కొచ్చిరి"

మేలుకో అంటే

కన్నడంలో : "ఏళయ్యసూర్య బారయ్యా
ఏళయ్య రథవ నేరువహోత్తు
ఏళు సాగరవన్ను సుత్తబేకు"

అని మేల్కొలుపుతున్నారు.

త్రిమూర్తి స్వరూపమే సూర్యుడంటే పాడే మేలుకొలుపు పాటలెన్నో వున్నాయి.

శివునకు మేలుకొలుపు పాటలు

తెలుగు : "మేలుకొనవే చంద్రశేఖర
మేలుకొనవె ఇంద్రవందిత
మేలుకొనవే ఫాలలోచన
నీలకంఠ హరహర మేలుకో"

కన్నడం :

"హరనె ఏళయ్య బెళగాయితు
ఏళుగంగాధరనే ఏళు చిన్మయనే
ఏళుగౌరియ మనోహర చంద్రశేఖరనే"

దేవతలు మేల్కొల్పడానికి వచ్చారనీ హారతి పళ్ళాలతో సిద్ధంగా వున్నారని తెలిపే పాట ఇది.

శ్రీరామునకు కృష్ణునకు మేలుకొలుపులు పాడే పాటలు చాలా వున్నాయి.

ఇందులో దశావతారాలు చోటుచేసుకున్నాయి.

తెలుగు : "మేలుకో కరుణాలవా జానకీలోల
భక్త పరిపాల మేలుకో
వాలాయమ్ముగ మమ్ము పాలించు వేళాయె
వైకుంఠవాసుడా మేలుకో"

మరో పాటలో

"సేవింతు కౌసల్య గర్భ రత్నాకరా
శ్రీరామమూర్తి మేలుకో"

కృష్ణుడు : "బంగారు చెంబుతో పన్నీరు పట్టుకు
పదతి రుక్మిణి వచ్చెను మేలుకో
రంగైన పావట కెంగేల పూసుకు
రమణి సత్యావచ్చె మేలుకో"

అంటూ ఎనిమిదిమంది భార్యలు దంతకాష్ఠాలు, అద్దం మొ. తీసుకువచ్చారని వీరితో పాటు రాధ, పదహారులేలమంది చ్చిరట !

మరో పాటలో

"మేలుకొనవే దీనరక్షక

అంటూ ప్రారంభమయ్యే ఈ పాటలో

"గంగ గౌతమి నర్మద
తుంగభద్ర కృష్ణవేణి కావేరి"

ఇంకా "మెరసి వచ్చిరి మేనకాదులు
నృత్యమిడగ మేలుకో"

మొదలైన నదులు కూడా పుణ్యతీర్థాలు తీసుకొచ్చాయని మేల్కొలుపుతున్నారు.

కన్నడంలో :

"ఏళు క్షీరాంబుధి శయన
ఏళూ ఈరేళు లోకద అరస

ఏళయ్య బెళగాయితు"

**దశావతారాల వర్ణన :**

"నీరొళగాడుత నిగమవ తందు

భార బెన్నలి పొత్తు - మత్స్య, కూర్మ

రెండో చరణంలో

"కొందు హిరణ్యాక్షన్న

తందు దాదేలి ధర

ఇలా ఒక్కో చరణంలో రెండు అవతారాలు వర్ణిస్తూ పాడే పాట.

మరో పాటలో

"ఏళు శ్రీహరియే ఏళయ్య

బెళగాయితు"

మిగతా పాటల్లో అవతారాలెత్తడానికి లెమ్మని పాడితే ఇందులో నిద్రకు కారణాలు చెపుతూ

"వేదవ తందు బలు బళలి మలగిదియా

మేదినియు పొత్తు బెన్ను నొందీతెందు"

వేదాలు తెచ్చి అలసి పడుకొన్నావా బరువు వీపున మోసి పడుకొన్నావా! లే లెమ్మంటున్నారు.

చివర "సప్తగిరియను సుత్త పదనొందు మలగిదియా"

అని అడుగుతున్నారు.

మరో పాట

"ఏళు నారాయణా ఏళు లక్ష్మీ రమణ

ఏళయ్య బెళగాయితు"

సముద్ర మథనం చేయాలి లెమ్మని లేపుతున్నారు.

ఇక ఇంట్లో మహిళలు

"ఉదయదొళేద్దు సవిదాడుత్త పాడుత్త

దధియ కడెయువరేళో

కేశవనామాల పాటలు రెండు భాషల్లో గలవు

**తెలుగు :** "కేశవా యని వాసిగా భక్తులు నిను

వర్ణించుచున్నారు మేలుకో"

**కన్నడంలో**

"ఈశ నిమ్మ చరణభజనె ఆశెయింద మాడువెనూ

దోషరాశి నాశ మాడు శ్రీశ కేశవా"

అంటూ పాడుతారు

వెంకటేశ్వరుని

"మేలుకో వెంకటేశ మేలుకో తిరుమలేశ

మేలుకో శ్రీనివాస మేలుకో"

కన్నడంలో

"ఏళు శ్రీనివాసదేవ

పద్మినీయరసా" అని లేపుతున్నారు.

గంగానదికి మేలుకొలుపు

"మేలుకో అకాశగంగా

మేలుకో శివకాశిగంగా

మేలుకో శంభురాణీ గంగా"

**చరణం :** "కడపకర్నూలు రాజ్యములో

ప్రజలందరూ వచ్చి నిల్చిరి

ఘనురాలవునీవమ్మ మేలుకో : :

**కన్నడంలో :**

"ఏళమ్మ బెళగాయితు

ఏళు గంగాదేవి ఏళు త్రివేణి భవాని

ఏళు ఉత్తర వాహినీ

అంటూ గంగనులేపి ఇంకా లేస్తే

"పంచముఖ నాగిద్దకాశి విశ్వేశ్వరస

అనంతసన్నిధజ గోయ్యువె"

శివుని సన్నిధికి తీసుకెళ్లామంటూ పాడేపాట.

ఇవి కాక గుమ్మడి పాట పేరుతో రెండుభాషల్లోను వుంది.

**మంగళహారతులు :**

మంగళహారతి పాటలు రెండు భాషలలో అందరు దేవతలకు చేసేవి.

**గణపతి :** "హారతి గొనుమా విఘ్నేశా

వేడెదను నిను శివతనయా"

**కన్నడం :** "ఆరుతి బెళగిరి పార్వతి సుతనిగె

నారియరు పరమాదరది"

ఇందులో వినాయకుడు గజముఖుడైన తీరు వివరింపబడింది.

**రాముడు :** "మంగళారుతిదే రాములకు

మంగళారుతిదె రఘునందనునకు

అనిల తనయునకు అభయమగిన

ఆది యంతయు లేని ఆనందరూపుకు :

మరోపాట సీతారాములకు

"హారతి ఇవ్వరారే సీతా రాములకు"

కన్నడంలో :

"శ్రీరామగె ఆరుతీయనూ
నారీయర నావు బెళగువెవు
దురుళ దశ శిరన అసువన్నె హీరి
సతిసహిత అయోధ్యగె మరళిదవగె"

మూడు చరణాలలోనూ రామాయణ కథ వివరించబడింది.

కృష్ణుడు : "గోపాలబాల గైకొనవేల
పరిమళ ఆరతి పరమప్రతీతితో

అంటూ ప్ ఆరంభమయ్యే పాటలో కృష్ణలీలలు వివరించబడింది.

మరొక పాటలో రుక్మిణి కల్యాణం వివరింపబడింది.

"సంగీతలోలనందునిబాల
మంగళహారతి గొనుమీవేళ"

కన్నడం : "ముత్తినారుతి ఎత్తి బెళిగిరె
కృష్ణమూరిగె లలనెయరు"

ఇందులో ద్రౌపది వలువలు, కుచేలునికథ వివరింపబడ్డాయి.

"బెళగువె నారుతియ పార్థన సారథిగె
రూపది మోహితగె"
"ఆరుతి బెళగిరె హరిగె భామె
రుక్మిణి సహిత శ్రీకృష్ణపగె"

దశావతారాలు ఆరతి

"హారతి గైకొనుమా రఘురామా
మగువ లక్ష్మితో రఘురాముడా"

మరోపాట అన్ని అవతారాలకు

"పదునాల్గు భువనంబులు కుక్షిలో
పొందుగ నిల్పిన పుండరీకాక్షా".

కేశవ నామాలకు

"హారతి గైనుమీ కృష్ణా కేశవ
నందనందన నారాయణ మాధవ"

కన్నడం :

"మంగళారతి సఖియరే నీవు బెళగిరె
కందర్ప జనకగె రంగనాథగె"

ఇందులో దశావతారాలవర్ణన గలదు.

ఇంకా శివునకు పార్వతికి, తులసికి, సీతకు, సావిత్రికి, ద్రౌపదికి... లవకుశలకు ఆరతి పాటలు రెండు భాషల్లో వున్నాయి. మంగళ మంటూ పాడే పాటలు, వ్రతాలపాటలు (మంగళగౌరి, వరలక్ష్మి, సత్యనారాయణ మొ:) రెండు భాషల్లో వున్నాయి.

ఐదవ విభాగము ఆచార ప్రదర్శకాలు. బారసాల మొదలు శ్రీమంతం వరకు పాటలు రెండు భాషల్లో వున్నాయి.

ఈవిధంగా పరస్పరం భావ వినిమయం చేసుకోవడం ఒకరినుండి మరొకరికి అందించడం

జాతీయ సమైక్యతకు చిహ్నాలుగా కన్పిస్తున్నాయి.

కొత్తనీరు వచ్చి పాతనీరు కొట్టుకుపోయినట్లు మార్పు మానవ సహజం. అందుకే ఆధునిక యుగంలో పాటలు పాడేవారి సంఖ్య తగ్గింది. ఇందుకు కారణాలు చాలా వున్నాయి. స్త్రీలు విద్యావంతులై ఉద్యోగాలకు వెళ్ళడం వలన తీరిక లేకపోవడం ముఖ్యకారణం.అంతేకాక ప్రతి ఇంట్లోను దూరదర్శన్‌లు, టేప్‌రికార్డర్‌లు ఫోన్‌లు వుండడంవలన ఉదయంనుండి రాత్రివరకు వాటిని చూస్తూ కాలం గడపడం వల్ల ఈ పాటల సరదా తగ్గిపోయింది.

పూర్వంమాదిరి పేరంటాలకు వెళ్ళే వారి సంఖ్య కూడా తగ్గిపోయింది. ఒకవేళ వెళ్ళినా మొక్కుబడిగా వెళ్ళి తాంబూలం అందుకు రావడం మామూలయింది. పెళ్ళి పేరంటాలలో పాటలు పాడటం ఛాందసంగా పూజలు మూఢనమ్మకాలుగా భావించేవారి సంఖ్య ఎక్కువవడంతో మిగిలినవారు తాము పాడటం నమోషిగా భావించి వచ్చిన పాటలు సైతం పాడటం మానేశారు.

సంస్కృతీ సంప్రదాయాలకు ఆలవాలమైన ఈ పాటలకు పర్వవైభవం కలగాలంటే విద్యావంతులైన స్త్రీలే నడుం బిగించాలి. ఆయా ప్రాంతాలలో వున్న పాటలను సేకరించి భద్రపరచి వాటివల్ల కలిగే ప్రయోజనాలను అందరికీ తెలియచేయాలి. అప్పుడే మన జాతి అమూల్య సంపదను బావితరాలకు అందించగలుగుతాం.

*చిరునామా : డా॥ బల్లూరి ఉమాదేవి,* కామవరం

శ్రీ చలపాక ప్రకాష్

# కర్నూలు, కృష్ణా, గుంటూరు జిల్లాల సాహితీవేత్తలు

'జలం'..!జలం లేనిదే అనంత జీవకోటి మనుగడ లేదు. జలం మానవ జీవనాడికి మూలాధారం. మనిషికి తాగు నీటికీ, సాగు నీటికి తన పంచప్రాణాల తర్వాత ఆరో ప్రాణంలాంటిది. అంతటి మనిషి జీవన పార్శ్వంలో మమేకమై ముడిపడి ఉన్న 'జలా'న్ని పూజించడం తప్పేమీ కాదు.జలాన్ని నిత్యం అనేక విధాలుగా వాడుకుంటున్న మనిషి రోజూ ఆచార వ్యవహారాల్లో కొందరు మాత్రమే ఆధ్యాత్మికరీతిలో పూజిస్తున్నారు. కానీ అనునిత్యం ఎంతో వేగవంతంగా పరిగెడుతున్న నేటి ఆధునిక మనిషి నిత్యం జలాన్ని పూజించుకునే సమయం దొరకక పోవచ్చు. కనీసం నదులకు వచ్చే పన్నెండేళ్ళ 'పుష్కరాలలోనైనా' ఓ పండుగగా చేసుకొని తరించడం మనిషి కనీస కర్తవ్యం, ఉత్తమ సంస్కారానికి నిదర్శనం.

కృష్ణానదికి ఈ ఏడు (2016) పుష్కరాలొస్తున్నాయి. గడిచిన పన్నెండేళ్ళ కాలంలో మానవ జీవనసరళిలో అనేక మార్పులు, కొత్త చేర్పులు జరుగుతున్నాయి. కాలంతోపాటే అనేక రంగాల్లో 'పాతనీరు' పోయి 'కొత్త నీరు' చేరుతూ వస్తుంది. అది జీవనది యొక్క ప్రత్యేక లక్షణం. అలాగే గడిచిన కాలంలో ఆయారంగాల్లోని ప్రముఖులు పుష్కర కాలంలో గతించి, కొత్తవారు ఆయా స్థానాల్ని భర్తీ చేస్తూ వస్తున్నారు. ఆ విధంగా గడిచిన 12 ఏళ్ళ కాలంలో ఎంతో కీర్తి గడించి కాలగర్భంలోకి చేరిన వారి గురించి, వారి స్థానాల్ని భర్తీ చేస్తూ నూతనత్వంతో పురోగమిస్తున్న సాహితీవేత్తల యొక్క కృషిని స్మరించుకుంటూ.. మన ముందుతరంవారికి మరింత ఉత్సాహాన్ని గుండె తలపులలో నింపి, ఉత్తేజితుల్ని చేసే ప్రయత్నమే ఈ వ్యాస రూపం. గలగల పారే కృష్ణమ్మ కాలి గజ్జెల సవ్వడులలో... బిరబిరా పారి ఎన్నో నోళ్ళలోంచి కడుపులలో దాక్కుంటున్న కృష్ణమ్మ తీర్చే దాహార్తికి పరవశించి, కలవరించి... కృష్ణానది పరివాహక ప్రాంతాలలో తమ కవితా, రచనా ధార(ణ)లతో నిరంతర సాహితీస్రవంతిగా సాగి పోతూ.. నిత్యం సాహితీ తపస్సులో మునిగి తేలుతూ.. లోక కళ్యాణాన్ని ఆర్థిస్తున్న ఎందరో మహానుభావులు. అందులో గుర్తున్నంతవరకూ కొందర్ని తలచుకుంటూంది ఈ 'కృష్ణా తరంగిణి'.

భారతదేశంలోని పెద్ద నదులలో నాలుగనదిగా చెప్పబడుతున్న 'కృష్ణానది', మహారాష్ట్రలోని మహాబలేశ్వరం పశ్చిమ కనుమల్లో పుట్టి కర్ణాటక, ఆంధ్రప్రదేశ్, తెలంగాణ ప్రాంతాలను తాకుతూ వచ్చి మళ్ళీ ఆంధ్రప్రదేశ్‌లోకి ప్రవేశించి కొన్ని ఉపనదులను కలుపుకుంటూ 1290 కిలోమీటర్లు ప్రయాణించి కృష్ణాజిల్లా హంసలదీవి దగ్గర బంగాళా ఖాతంలో కలుస్తున్నది. ఈ విధంగా తెలంగాణాలోని అలంపూర్‌లోని జోగులాంబను తాకుతూ కర్నూలుగుండా ఆంధ్రప్రదేశ్‌లోని విజయ వాడ కనకదుర్గమ్మ కొండ పక్కగా ప్రవహించే కృష్ణా పరివాహక ప్రాంతాన్ని పరిగణనలోకి తీసుకుంటూ కర్నూలు, కృష్ణా, గుంటూరు జిల్లాల్లోని సాహితీకారుల సృజనని చిన్నితరంగాలలో చూపే ప్రయత్నమిది.

## కర్నూలు జిల్లా

కర్నూలు జిల్లా సాహిత్యరంగంలో ఎక్కువగా మనకు పెద్ద తల కాయలు, డాక్టరేట్‌లు పొందినవారు, పద్యకవులే ఎక్కువగా కనిపిస్తారు.

కథా కవి, నవల ప్రక్రియల్లో బహుముఖ రూపాలలో కనిపించే ప్రథమ వరసలోని పేరు కాశీభట్ల వేణుగోపాల్. దళిత సాహిత్య రచనలో వెంకటకృష్ణది, బాల సాహిత్యంలో ఎం.హరికిషన్‌లది అంద వేసిన చేయి. ఇక్కడ ఎక్కువగా కావ్యరచన, ఆధ్యాత్మిక, చారిత్రక పరి శోధనా రచనలు ఎక్కువగా జరిగాయి.

భాషాసేవ, అనేక కావ్య, శతక, ఆధ్యాత్మిక సాహిత్యం అందించిన వారిలో- జె.ఎస్.ఆర్.కె.శర్మ, కె.ఎన్.ఎస్.రాజు, గన్నంరాజు సాయి బాబ, మద్దూరి రామమూర్తి, గుళ్ళూరు దత్తాత్రేయశర్మ, గొట్టిముక్కల సుబ్రహ్మణ్యశాస్త్రి, ఎతిరాజం నాగేశ్వరరావు, జ.బాలన్న, కె.కల్కూర, డా॥ శాంతమ్మ, చక్కిలం విజయలక్ష్మి, జంధ్యాల రఘుబాబు, డా॥ దండెబోయిన పార్వతి, డా॥ వెంకటేశ్వర్లు, డా॥ అధవాని హను మంతప్ప, డా॥ సంజీవరాయుడు, చిమ్మి జాన్ బర్నబాస్;

అవధానాలలో– మాచిరాజు శివరామరాజు; నవలా రచనలో– జి. ఉమా పతి, డా॥ శ్రీదేవి; విమర్శ, నాటక, కథా రచన ప్రక్రియలలో– వైద్యం వెంకటేశాచార్యులు, డా॥ అప్పజోడు వెంకట సుబ్బయ్య, కింగర మోహన్, టి.కె.విశాలాక్షి, డా॥ సుభాషిణి, తంగిరాల సుబ్రహ్మణ్యం, డా॥ గుర్రాల రవికృష్ణ (నంద్యాల),జి.పి.రామచంద్, జహీర్ అహమ్మద్, శేషపాణి, చంద్రమౌళి, ముఖ్యంగా కథా, హాస్యరచనల్లో 'వియోగి', దళిత కథలలో డా॥ పోతన, నాగమణి,యాత్రారచనలో పేరం ఇందిరా దేవి చేస్తున్న సాహిత్య కృషి గుర్తించతగ్గది.

కవిత్వ రచనలో– రమ్య, స్వరూప్ సిన్హా, డా॥ తంగిరాల మీరాసుబ్ర హ్మణ్యం, డా॥ మద్దిలేటి, టి.వెంకటేష్, వినయతుల్లా, సవ్వప్పగారి ఈరన్న, కె.ఎస్.స్వర్ణలత, ఇటీవల వినిపిస్తున్న కొత్త గొంతుక డి.చాంద్ బాషా, పల్లోలి శేఖరబాబు;

చారిత్రక పరిశోధనలో– డా॥ అల్లంరాజు విజయేంద్రనాథరావు, నారాయణస్వామి, అజీజ్, అనువాద రచనల్లో– ఆకుల కృష్ణ, అథోని బాష, డా॥ మద్దయ్య, మనో వైజ్ఞానిక సాహిత్య రచనలో శిష్టు కృష్ణ మూర్తి, రేడియో నాటకం బి.ఎస్.కుమార్, రంగస్థల సాహిత్య రచనలో పత్తి ఓబులయ్య;

బాలసాహిత్యం– డా॥ పి.ఎం. మద్దిలేటి, కె.వి.కృష్ణారావు, షేక్ హుస్సేన్;

విప్లవ సాహిత్యం– పినాకపాణి (దండకారణ్య కథలు), అరుణ్‌లు విశేష రచనలు అందించగా–

తెలుగునేలకి మంచి అనువాద సాహిత్యాన్ని అందించిన రంగ నాథ రామచంద్రరావు హైదరాబాద్‌కు వలసవెళ్ళిపోగా, సినీ రచయిత జనార్ధన మహర్షి, దివాకరబాబు, సాహిత్య ప్రకాష్, ఇటీవల దివంగ తులైన కథా రచయిత మైనంపాటి భాస్కర్ ఈ ప్రాంతానికి చెందిన వారే కావడం విశేషం!

డా॥ వసంత ప్రకాష్, ఎన్.వి.కృష్ణమూర్తి, చారిత్రక పరిశోధకులు గడియారం రామకృష్ణశర్మ, సంగీత విద్వాంసులు డా॥ పినాకపాణి, ఇసుకపల్లి సంజీవశర్మ, తాడంకి వెంకటలక్ష్మి నరసింహరావు, శ్రీరాగి రచయితలుగా మనమధ్య బ్రతుకున్నా ఈ పుష్కర కాలంలో భౌతికంగా దూరమయ్యారు.

## కృష్ణాజిల్లా

కృష్ణాజిల్లా అంటే ముందుగా గుర్తుకువచ్చే పేరు కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ. జ్ఞానపీఠాన్ని తెలుగువారికి అందించిన తొలి రచయిత విశ్వనాథ.ఈ గడ్డపై ఎందరో ప్రసిద్ధులు జన్మించి తెలుగు పతాకస్థాయిని ప్రపంచానికి చాటారు. ఒక ఎన్టీఆర్. ఒక ఏఎన్నార్. ఇలా చెప్పుకుంటూపోతే కోకొల్లలు. జిల్లా కేంద్రం మచిలీ పట్నం అయినా విజయవాడ నగరం నదీ పరివాహక ప్రాంతం, జంక్షన్ కావడం వలన కేంద్రబిందువు విజయవాడే అయింది.

అయితే గడిచిన గత పన్నెండేళ్ళ కాలంలో ఈ ప్రాంతంలో అత్యంత సాహితీసృజన చేస్తున్నవారిని పరిశీలిస్తే ముందుగా గుర్తుకు వచ్చే పేరు మండలి బుద్ధప్రసాద్. ఎందుకంటే ఆయన ఒక రాజకీయ వేత్తగానే కాక ఒక సాహితీవేత్తగా అసమాన కృషి సల్పి,జాతీయ, అంతర్జాతీయ తెలుగు రచయితల, తెలుగు మహాసభలు నిర్వహించి తెలుగువాడి సత్తాను ప్రపంచానికి చాటిన తీరు ఏ ఒక్క తెలుగు రచయితా మరిచిపోలేడు.ఆ తర్వాత ఈ ప్రాంతంలో సాహిత్య వాతా వరణాన్ని దశదిశలా చాటే కృషి చేసిన సాహితీ సంస్థ కృష్ణాజిల్లా రచయితల సంఘం.దీని అధ్యక్షులు గుత్తికొండ సుబ్బారావు ఒక కవి కావడం 'మనిషి కోసం.." అంటూ ఒక కవితా సంపుటి ప్రచురించి, రెండవ ముద్రణకు నోచుకోవడంతోపాటు కవులు, రచయితలను ప్రోత్సహించడంలో ఆయనది పైచేయి. ఈ సంఘానికే ప్రధాన కార్య దర్శి అయిన డా॥ జి.వి.పూర్ణచంద్ కూడా విశేష సాహితీ ప్రతిభను ప్రదర్శించి తెలుగు ప్రపంచానికి తన సాహితీ సేవలను విస్తారంగా అందిస్తున్నారు. సప్తసింధు, అమలిన శృంగారం వంటి ప్రసిద్ధ రచనలు వెలువరిచిన పూర్ణచంద్, వివిధ పత్రికలలో ఆరోగ్యం, తెలుగువారి ప్రత్యేక వంటలు వంటి అరుదైన విషయాలపై శీర్షికలు నిర్వహిస్తూ తెలుగువారి ఇంట మమేకమయ్యారు.

ఈ ప్రాంతం నుండి ఎంతో ప్రసిద్ధమైన రచనలు చేసి తెలుగు రచయిత సత్తాను చూపిన ప్రముఖ రచయితలలో పెద్దిభొట్ల సుబ్బ రామయ్య ఒకరు. సుబ్బరామయ్య కథలు, నవలలు వెలువడటంతో పాటు కేంద్రసాహిత్య అకాడమీ అవార్డును ఈ ప్రాంతానికి తీసుకు వచ్చిన ఘనులు సుబ్బరామయ్య. ఇంకా ప్రసిద్ధ కథా రచయితలలో భమిడిపాటి జగన్నాథరావు, పి.సత్యవతి, పన్నాల సుబ్రహ్మణ్యభట్టు వంటి మరికొందరు చెప్పుకోదగ్గ వారున్నారు. వాగ్గేయకారులు బాలాం త్రపు రజనీకాంతారావు, జానపద కళా సాహిత్యంలో కర్నాటి లక్ష్మీ నరసయ్య, మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి తెలుగువారందరికి సుపరిచి తమైన పేర్లు. స్త్రీవాద కవయిత్రిల్లో మందరపు హైమావతి, పాటి బండ్ల రజనిపేర్లు ప్రముఖంగా వినిసిస్తాయి. కాగా కథా, కవితా, విమర్శనా ప్రక్రియల్లో యార్లగడ్డ బాలగతంగాధరరావు, కోకా విమల కుమారి, కాటూరి రవీంద్రత్రివిక్రమ్, పొన్నాడ సత్యప్రకాశ్, బండ్ల మాధవరావులది అందెవేసి చేయి కాగా, తల్లాప్రగడ రవికుమార్, పి.ఎం. సుందరరావు, భమిడిపాటి బాలత్రిపురసుందరిలు బాల సాహి త్యంలో విశేష ప్రతిభ కనబరుస్తున్నారు.సెల్ సాహిత్యం పైనా, సభా ధ్యక్షతను అద్భుతరీతిలో నిర్వహించడంలో ప్రఖ్యాతిని సాధించిన గుమ్మా సాంబశివరావు, వేముల హజరత్తయ్యగుప్త, హిందీ సాహిత్య

అనువాదంలో డా॥ వెన్నా వల్లభరావులు తమ ప్రత్యేకతను సంత రింపజేసుకున్నారు.

అవధానం, పద్యకవితా ధారణలో పువ్వాడ తిక్కనసోమయాజి, డా॥ పాలపర్తి శ్యామలానందప్రసాద్, కొండపల్లి మాధవరావు దిట్టగా ఇక్కడ సాహితీప్రియులు చెప్పుకుంటారు. నాగళ్ళ గురుప్రసాదరావు జనపద కళా రూపాల సాహిత్యంపై కృషి చేసారు.

కృష్ణాజిల్లాలో యువసాహితీవేత్తలను తయారుచేయడంలో వి. శిరీష్ కుమార్ కార్యదర్శకత్వంలోని 'సాంస్కృతిసమాఖ్య' విశేష కృషి సల్పింది. ఆ తర్వాత మినీకవితా ఉద్యమంలో ఒకరైన కొల్లూరి సారధ్యం లోని 'ఎక్స్‌రే' సాహిత్య సాంస్కృతిక సేవా సంస్థ గత పన్నెండేళ్ళకుపైగా కొత్త రచయితలను తయారుజేయడంలో అత్యంత కృషి చేస్తూన్నది. 7 పదులు వయస్సు దాటినా ఏమాత్రం ఉత్సాహం తగ్గని సాహితీవేత్త లైన వీరభద్రశాస్త్రి, గబ్బిట దుర్గాప్రసాద్ (ఉయ్యూరు) లు ఎన్నో విశేష అంశాలపై పుస్తకాలు రాయడంతోపాటు 'వైజ్‌మెన్ క్లబ్ ద్వారాను, 'సరసభారతి' ద్వారాను ఎన్నో సాహిత్య కార్యక్రమాలు నిర్వహిస్తూ సాహిత్యరంగానికి ఇతోధిక సేవలను అందిస్తుండటం విశేషం. 'సాహితీమిత్రులు' సంస్థ ద్వారా ప్రచురణలు వెలువరిస్తూ కవితా; కథా వార్షికలు ఏటా ప్రచురించడం ద్వారా కాలాన్ని కవిత్వ ంలో భద్రపరుస్తూ, 'కవిత' పత్రికను నిర్వహిస్తున్న శ్రీశ్రీ విశ్వేశ్వరావు, శ్రీశ్రీ సాహిత్య నిధి ద్వారా శ్రీశ్రీ సాహిత్యాన్ని విశ్వవ్యాప్తం చేసే విశేష కృషిని సల్పుతున్న సింగంపల్లి అశోక్‌కుమార్‌ను తెలుగు సాహిత్య లోకంలో ప్రత్యేక గుర్తింపు ఉంది.

కథా, కవితా ప్రక్రియల్లో నేడు తెలుగునేలపై పోటీపడి ఈప్రాంత ఉనికిని ప్రఖ్యాతితెచ్చే విధంగా చాటుతున్నవారిలో, సి. హెచ్.వి. బృందా వనరావు, ఎరుకలపూడి గోపీనాథరావు, ఎం.కమలాకాంత్, తాతినేని వనజ, బి.వి.శివప్రసాద్, శర్మ.సి.హెచ్, కె.ఆంజనేయకుమార్‌ల పేర్లు వినవస్తాయి.

విశేషమైన పుస్తకాలు వెలువరించడంలో మువ్వల సుబ్బరామయ్య, అడపాదడపా రాస్తున్నవారిలో పి.మోహనరామ్‌ప్రసాద్, యశోద పూర్ణచంద్రరావు, ఎమ్.సి.దాస్, కోనేరు కల్పన, వి.శ్రీఉమామహేశ్వరి, వేలూరి కౌండిన్య వేలూరి, (కవితా సంపుటిలు, సంకలనాలు కూడా వెలువరించారు), లంకె జనార్ధన్, సుధారాణి, పాణిగ్రాహి రాజశేఖర్, పాణిగ్రాహి సుజాత, తేజస్విని, చింతా లక్ష్మీసుజాత, కవిత్వం రాసిన రేడియో నాటక రంగ ప్రముఖులు పి.పాండురంగారావు, మాదుగుల రామకృష్ణ,ఈ ప్రాంత కవిసమ్మేళనాలలో తరుచుగా కనిపించే సామినేని శైలజ, పంతుల వెంకటేశ్వరరావు, లక్కరాజు వాణీసరోజిని, సింహాద్రి వాణి, బి.ఆంజనేయరాజు, కె.రవికిరణ్, మునగంటి రామాచారి, గోళ్ళ నారాయణరావు, వడ్డాది లక్ష్మీసుభద్ర;

కథా, కవితా, 'నానీ ప్రక్రియల్లో' కోపూరి పుష్పాదేవి, అద్దూరి వెంటకరమణ, పుస్తకాలు కూడా ప్రచురించి ఈ ప్రాంతంలో ఆ ప్రక్రియ వ్యాప్తికి కృషి చేసారు. పి.పద్మావతిశర్మ, వలివేటి శివరామకృష్ణ చిరు ఆధ్యాత్మిక గ్రంథాలు విరివిగా ప్రచురిస్తూ వస్తున్నారు.

కవిగాను, పత్రికా సంపాదకుడిగా, పుస్తక ప్రచురణకర్తగా పరి చయం ఉన్నవారిలో కలిమిశ్రీ, 'అమ్మనుడి' సంపాదకులు, తెలుగుభాషో ద్యమ సమాఖ్య అధ్యక్షులు సామల రమేష్‌బాబు, విశాలాంధ్ర సంపా దకులు ముత్యాల ప్రసాద్, ప్రజాశక్తి బ్యూరో వెంకట్రావ్, 'కథాకళి' పత్రికా సంపాదకులు ఎమ్.రామారావు, మన ఆరోగ్యం సంపాదకులు నరసారెడ్డి, 64 కళలు డాట్‌కాం ద్వారా, కార్టూన్లు చిత్రకళపై వ్యాసాలు రాయడంలో టి.వి, కళాసాగర్, రావెళ్ళ శ్రీనివాస్ సిద్ధహస్తులు. ఎ.వి. ఎమ్ కార్టూనిస్టుగానే కాక, కాలమ్ కథలు, హాస్యకథలు పత్రికలలో ప్రచురించడంతోపాటు, సంకలనాలూ వెలువరించారు.

వ్యాస రచయితగా చోరగుడి జాన్సన్, తాటి శ్రీకృష్ణ, ఎ.బి.ఆనంద్, ఘంటా విజయకుమార్ (నందిగామ), 'చినుకు'సంపాదకుడిగానందూరి రాజగోపాల్, తమిరి పుల్లారావు, అన్నవరపు బ్రహ్మయ్య, పరిశోధనాత్మక వ్యాసరచయితగా ఈమని శివనాగిరెడ్డి కృషి ప్రత్యేకమైనది.

ఇంతకుముందు విజయవాడలో ఉండి సాహితీసేవలను అందిం చిన జి.విజయలక్ష్మి, నాగలూరి రవిబాబు, యలమర్తి అనూరాధ, మలిపెద్ది రాంబాబు,కవిగా తన ప్రత్యేకతను చాటుకున్న చిత్తలూరి సత్యనారాయణ, కథా, నవలా రచయిత సర్వజిత్ కూడా ఇతర ప్రాంతా లకు వలసవెళ్ళిపోయి అక్కడ కృషిసల్పుతున్న వారిలో ఉన్నారు.

ప్రజాసాహితీ, జనసాహితి ద్వారా కొత్తపల్లి రవిబాబు, దివికు మార్ సాహిత్య వ్యాసాలు, ఉపన్యాసాల ద్వారా పలుప్రాంతాలలో తమ ఉద్యమ స్వరాన్ని వినిపిస్తుండగా, కవి అరసవిల్లి కృష్ణ కవిత్వం రాయడంతోపాటు విప్లవ రచయితల సంఘంజిల్లా సభల నిర్వహణ బాధ్యతను భుజానకెత్తుకొని, 'అనేక' అనే పుస్తక విక్రయ కేంద్రాన్నీ నిర్వహిస్తున్నారు.

చలపాక ప్రకాష్ గత 12 ఏళ్ళగా వెలువడుతున్న 'రమ్యభారతి' సాహిత్య త్రైమాసపత్రిక సంపాదకునిగా, కవిగా, రచయితగా, కార్టూ నిస్ట్‌గా కృషి చేస్తూ ఇటీవల ఆంధ్రప్రదేశ్ రచయితల సంఘం ప్రధాన కార్యదర్శి బాధ్యతలను కూడా నిర్వహిస్తున్నారు.

శతాధిక గ్రంథకర్త సత్రీ, రెజీనా, ఎం.డి.ఖాన్, మంజు యన మదల, చలసాని వసుమతి, కె.వి.ఎల్.ఎన్. శర్మ, కాపూరి సత్యవతి, ఎర్రంశెట్టి పాప, తూములూరి రాజేంద్రప్రసాద్, దుట్టా శమంతకమణి, లంకా పూర్ణయ్య శాస్త్రి, సి.హెచ్.వి.ఎస్ బ్రహ్మానందరావు (మానస సాహిత్య సంస్థ), పెద్ది కృష్ణ, జింకా చక్రధర్, గేదెల మల్లేశ్వరరావు,

కిలిమి యోగేష్, నల్లగట్ల నందిని, విష్ణుభొట్ల రామకృష్ణ, టి.అమూల్య; ఇంకా కృష్ణాజిల్లా అవనిగడ్డ నుండి సింహాద్రి పద్మ, దివి ఝాన్సీ, గుడిసేవ విష్ణుప్రసాద్, జగ్గయ్యపేట నుండి ప్రముఖంగా వినిపించే యువస్వరం సరికొండ నరసింహరాజు, అజ్మీర్ వీరభద్రయ్య, పి.హనుమాన్ ప్రసాద్, నూజివీడు నుండి ప్రముఖంగా కవితావాణి వినిపించే శిఖా-ఆఖాశ్, బండి రుక్మిణీప్రసన్న, కె.బి.డి.ప్రసాదరావు, ఈమని శేషయ్య, తిరువూరు నుండి రేపాక రఘునందన్, గుడివాడ నుంచి బాలసాహిత్యం, నాటక రంగంపై విశేష కృషి సల్పుతున్న తాతా రమేష్‌బాబు, మినీ కవిత్వం ద్వారా వసుధ బసవేశ్వరరావు, కొడాలి సోమసుందర్, కంచికచర్ల నుండి బాలకోటయ్య, నందిగామ నుండి ప్రముఖ నవలా రచయిత్రి డి.సుజాతాదేవి, మచిలీపట్నం నుండి ప్రమిద పత్రిక సంపాదకులు బులుసు కామేశ్వరరావు, 'భావ తరంగిణి' భవిష్య, 'విజ్ఞాన సుధ' పాలెపు బాబు పత్రికా పరంగా సాహిత్య సేవ చేస్తుండగా, కొట్టి రామారావు కవిగా, రచయితగా, ఆంధ్రసారస్వతి సమితి నిర్వహకుడిగా ఎంతో సాహిత్య కృషిని అందిస్తున్నారు. నగర సాహితీప్రముఖుల్లో సోమంచి రామం, డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు, ముదిగొండ శాస్త్రి, వారణాసి సూర్యకుమారి, ఉమా సరస్వతి, ముదిగొండ సీతారామమ్మ, చలసాని సుబ్బారావు, ధన్వంతరి ఆచార్య, కథా రచనలో మేరీకృపాబాయి; వ్యక్తిత్వ వికాస సాహిత్యంలో విస్తృతంగా రచనలు అందిస్తున్న విడియాల చక్రవర్తి, లాల్ బహదూర్ శాస్త్రిలు బందరు సాహిత్య సేవలో మునిగి తేలుతుండగా, మచిలీపట్నం నుండి జిసనారా హైదరాబాద్‌కు, 'సాహితీమిత్రులు' డా॥ రావి రంగారావు ఎన్నో వైవిధ్య కార్యక్రమాలు చేస్తూ ప్రస్తుతానికి గుంటూరుకు వలస వెళ్ళి అక్కడ 'రావి రంగారావు కళా పీఠం ద్వారా, జనరంజక అవార్డులను ఔత్సాహిక కవులకు ప్రదానం చేస్తూ తన సాహిత్య కృషిని కొనసాగిస్తున్నారు.

**ఇటీవల ఈ ప్రాంతంనుండి రచనలు సాగిస్తూ భువి నుండి దివి కేగిన సాహితీ ప్రముఖులు:**

సినీనటులు, రచయిత మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, అవధానాలలో ప్రసిద్ధులు రాళ్ళబండి కవితాప్రసాద్, పలు పత్రికలలు నవలా, కథా రచయిత్రిగా పేర్గాంచిన కోగంటి విజయలక్ష్మి, గ్రంథాలయోద్యమ నాయకుడు దొండపాటి దేవదాస్, 'తెలుగు వెలుగు' ఎస్.ఎం. భాష, డా॥ బూదరాజు శ్యామసుందర్ మెరుగు రాధాకృష్ణమూర్తి, వై.కె.మూర్తిలను ఈ ప్రాంత సాహిత్యరంగం కోల్పోయింది.

**గుంటూరు జిల్లా:** గుంటూరు జిల్లా అనగానే గుంటూరు పచ్చి మిర్చి ఘాటు, ప్రఖ్యాత సాహితీవేత్త అంటే వినుకొండ నివాసి 'గబ్బిలం' గుఱ్ఱం జాషువా గుర్తుకువస్తారు. అస్పృస్యతపై తన కవితా బాణాన్ని ఎక్కుపెట్టిన జాషువా మార్గంలో ఆ నేల మీద 'సాహితీ విమర్శ' ఎక్కువ స్థాయిలో ప్రాణం పోసుకొని తెలుగు నేలపై తన విమర్శనా ఘాటునీ చవిచూపిస్తున్నది.

సాహిత్య విమర్శ అంటే ఈ జిల్లాలో ముందుగా గుర్తొచ్చే పేర్లు కడియాల రామమోహనరాయ్, ఆచార్య ఎస్.గంగప్ప, రావెల సాంబ శివరావులు. వీరు అనేక సాహిత్య సభల్లో అనేక అంశాలపై, పలు పత్రికలలో కూలంకషంగా విమర్శ చేసి మంచి విమర్శకులుగా పేరు గాంచారు. అదీకాక సంవత్సరకాలంలో తెలుగు పత్రికలలో ప్రచురితమైయే కవిత్వం, కథలపై 'ఇయర్ రౌండప్' రాయడంలో రామ మోహనరాయ్‌ది అందెవేసిన చెయ్యి.

ఆ తర్వాత కవిగా, విమర్శకునిగా పాపినేని శివశంకర్ పేరు బహు ప్రముఖం. 'అరసం' అని ముద్దుగా పిలుచుకునే అభ్యుదయ రచయితల సంఘం జాతీయ అధ్యక్షులు పెనుగొండ లక్ష్మీనారాయణది కూడా ఈ జిల్లాయే. లక్ష్మీనారాయణ విమర్శకునిగా, రంగస్థల సాహిత్యానికి పరివ్యాప్తికునిగా, అనేకమంది పాతతరం రచయితల రచనలు వెలుగుచూడడానికి పునః ముద్రణలు చేసి ప్రచారం చెయ్యడంలో అరసం బాధ్యునిగా ఆయన చేసిన సాహిత్య కృషి ఎనలేనిది. కవిగా అడిగోపుల వెంకటరత్నం పేరు ఎప్పటి నుంచో ఈ ప్రాంతంలో వినిపించేపేరు. కానీ ఆయన ఇటీవల తిరుపతికి వలస వెళ్ళిపోయినప్పటికీ అక్కడ నుంచి తన కవితా ప్రస్థానాన్ని కొనసాగిస్తూనే ఉన్నారు. ఈ ప్రాంత కథా సాహిత్యానికి ప్రసిద్ధతను కల్పించినవారు కె.చంద్ర శేఖరరావు, కాట్రగడ్డ దయానంద్ పేర్లు ప్రముఖంగా వినబడతాయి. ఇటీవల పలుప్రతికలలో కథా నవలా సాహిత్యరచనలో విస్తారంగా రాసి ప్రచారంలో ఉన్నవారు పోలీస్ అధికారి అయిన పి.వి.సునీల్ కుమార్ పేరు వినిపిస్తుంది.

ముస్లిం సాహిత్యంపై అవిరళ కృషి చేసినవారు తాడేపల్లికి చెందిన సయ్యద్ నశీర్ అహమ్మద్, వినుకొండకు చెందిన షేక్ కరీముల్లా. ముస్లిం కవిత్వం, విమర్శ ప్రచారం చేయడంలో కరీముల్లాది విలక్షణ శైలి. కాగా నశీర్ అహమ్మద్ ప్రచురించినంత లోతైన పరిశోధనాత్మక ముస్లిం సాహిత్యం, తెలుగు నేలపై మరెవ్వరూ చెయ్యలేదంటే అతిశయోక్తి కాదు.

కవిత్వంలో రెండు దశాబ్దాలుగా ఈ జిల్లాలో ఉత్సాహంగా కవిత్వం రాస్తున్నవారిలో దాచేపల్లికి చెందిన కోసూరి రవికుమార్, పిడుగురాళ్ళకు చెందిన వై.హెచ్.కె.మోహనరావు, చిలకలూరిపేటకు చెందిన పి.వి.రమణకుమార్, బాలసాహిత్యంలో తెనాలికి చెందిన షేక్ అబ్దుల్ హకీంజానిలు సాగిస్తున్న కృషి గుర్తించతగింది. మోహన రావు తరువాత చారిత్రక సాహిత్య పరిశోధకునిగా కూడా పుస్తకాలు వెలువరించి ఈ ప్రాంతానికి గుర్తింపు కలగజేసారు. రమణ కుమార్ కథకుడిగా, అనేక పత్రికలలో అను నిత్యం కనిపించి ఈ జిల్లాకు

గుర్తింపు తెస్తున్నారు.ఈ జిల్లా వాసి అయిన కవి సోమేపల్లి వెంకట సుబ్బయ్య నానీ ప్రక్రియ ప్రారంభం నుండి మూడవ వారిగా తెలుగు సాహిత్యరంగంలో ప్రాచుర్యం పొందారు. నానీ ప్రక్రియలో ఆ తర్వాత నాగిశెట్టి తాతయ్యనాయుడు ఎక్కువ నానీలు రాయగా, అప్పటికే కవిగా ప్రముఖుడైన కె.జె.రమేష్ 'గుంటూరు నానీలు' రాసి నానీ ప్రక్రియలో ప్రవేశించి ప్రాముఖ్యతను తీసుకొచ్చారు. పద్యకవితగా దుబ్బలదాసు ప్రముఖంగా వినబడగా,దుగ్గిరాలకు చెందిన పి.యోహాన్ జాషువా కళాపీఠం యువరచయితలకు అనేక పోటీలు నిర్వహించడం ద్వారా, పద్య కవిత్వ ఆరాధకునిగా ప్రఖ్యాతిను సాధించారు. దుగ్గిరాలకి చెందిన కథకుడు లలితానంద్, కవిగా మరోచలం పేర్లు కూడా ఆ ఊరికి ప్రత్యేక గుర్తింపు తీసుకువచ్చాయి.

ఈ ప్రాంతానికి సోమేపల్లి వారు గుంటూరు జిల్లాకి ఆర్డీఓ అధికారిగా రావడంతో ఇక్కడ సాహిత్య వాతావరణం మరింత ఉత్సాహంగా కొత్త రూపు, ఊపు సంతరింపచేసుకుందని చెప్పవచ్చు. 2007 సంవత్సరంలోవారు స్థాపించిన 'గుంటూరు జిల్లా రచయితల సంఘం' ద్వారా ఎందరో కొత్త రచయితలు, కవులు పుట్టుకొచ్చారు.. ఆ సంవత్సరం నుండి 'ప్రతినెలా రచనకోసం' అంటూ పెద్దా చిన్నా కలాలకి విరామం ఇవ్వని విధంగా తమ కలాల్ని ఝుళిపిస్తున్నారు. అందులో నుండి తర్ఫీదు పొంది రూపొందిన కవులలో, రచయితలలో షేక్ బషీరున్నీసాబేగం నేడు తెలుగు సాహిత్య రంగంలో వివిధ పోటీలలో బహుమతులు పొందే స్థాయికి ఎదిగారు. రచయిత్రులుగా డా॥ వి. నాగరాజ్యలక్ష్మి, డా॥ పి.వి.సుబ్బారావు, ఎం.బి.డి.శ్యామల, గోటేటి లలితా శేఖర్, తాటికోలపద్మావతి, ఎన్.వి.రత్నశర్మ పేర్లు ప్రముఖంగా నిలువగా, జమదగ్ని, ఎస్.ఎం.సుభానీ, సయ్యద్ జానీ భాష వివిధ పత్రికలలో పోటీలలో పాల్గొని గుంటూరు పతాకాన్ని ఎగురవెయ్యడంలో పోటీపడుతుండడం కనిపిస్తుంది. బుర్రి కుమారరాజా, షేక్ ఖాసీంబీ, ఖాజాబేగం, తార, పింగళి భాగ్యలక్ష్మి, వంగీపురపు శారదాదేవి, జమళ్ళమడక భవబూతిశర్మ, పిశపాటి నాగేశ్వరరావు (అమరావతి), లంకా మాధవి, ఎం.లలితకుమారి, ఎక్కంటిపద్మావతి, రావికంటి ఇందిరా మోహనదాస్, బొమ్ము ఉమామహేశ్వరరెడ్డి, కందిమళ్ళ సాంబశివరావు, రాపోలు పరమేశ్వరరావు (చేబ్రోలు), విడుదల సాంబశివరావు (చిలకలూరిపేట),చిల్లరమహేశ్వరరావు (పొన్నూరు) ఇటీవల తమ కవి గొంతులను ఎక్కువగా వినిపిస్తున్న పేర్లు.

ఇక తెనాలి నుండి కవిగా, నానీల కవిగా, వ్యాసకర్తగా బహుముఖత్వాన్ని చాటుతున్న కాకరపర్తి సుబ్రహ్మణ్యం, ఆళ్ళ నాగేశ్వరరావు ఎక్కువగా తెనాలి సాహిత్య గుబాళింపును పరివ్యాప్తం చేస్తుండగా సూరికుచ్చి భదరీనారాయణ అడపాదడపా తన సాహిత్యాన్ని అందిస్తున్నారు.

గ్రంథాలయోద్యమ సారధి, అనేక చరిత్ర వ్యాస రచనలు అందించి వెలుగులోకి తెచ్చిన వెలగా వెంకటప్పయ్య ఇటీవల మరణించడం తెలుగు సాహిత్యరంగానికి తీరని లోటుగా చెప్పక తప్పదు.

ఈ విధంగా కృష్ణమ్మ చెంత నిలబడి తెలుగువాడి సత్తాను దేశానికి, తద్వారా ప్రపంచ సాహిత్యానికి చాటుతున్న ప్రయత్నంలో తలెత్తుకు నిలబడే స్థాయిని కల్పిస్తున్నాయి ఈ మూడు జిల్లాలు.

*చిరునామా :* ***చలపాక ప్రకాష్,*** *పోస్ట్ బాక్స్ నెం.5, డోర్.నెం.11-57/1-32, రెండవ అంతస్తు, జె.ఆర్.కాంప్లెక్స్, రజకవీధి, విజయవాడ-520 001. సెల్: 9247475975. E-mail: Chalapaka@gmail.com*

శ్రీ అంగత వరప్రసాద్

# కృష్ణాజిల్లా భూగర్భ జలవనరులు

మనకు జలమే జీవం. జలమే జీవనం. జీవకోటి జీవనానికి ఆధారభూతమైన ఈ జలం అవనీతలంపై మూడింట నాలుగు వంతులు ఆక్రమించుకుని వున్నప్పటికి అది మనకు ప్రత్యక్షంగా ఉపయోగపడే రీతిలో లేదు. అయితే అంతులేని జలరాశి గలిగిన అంబుధిలో వున్న నీరు ఆవిరిరూపేణా ఆకాశం చేరి, మేఘాలుగా మారి, జీవకోటికి అవసరమైన మంచినీరు వర్షం రూపేణా భూమికి చేరుతుంది.

అలా వర్షం రూపేణా భూమికి చేరిన మంచినీరు జీవకోటికి వాగులు, వంకలు, ఏరులు, సెలయేరులు, ఉపనదులు, నదులు, మహానదుల రూపేణా అందుబాటులో వుంటుంది. మరికొంత నీరు చెరువులు, దొరువులు, సరస్సుల రూపేణా అందుబాటులో వుంటుంది. చెరువులు, దొరువుల్లో వుండే నీరు నిలకడ రూపంలో అందుబాటులో వుంటే... వాగులు, వంకలు, నదుల్లో వుండే నీరు ప్రవాహరూపంలో అందుబాటులో వుంటుంది.

ఇలా భూ ఉపరితలం మీద నదుల రూపేణా, చెరువుల రూపేణా వుండే నీరు మనం వున్నచోట అందుబాటులో వుండ వచ్చు లేదా వుండకపోవచ్చు. అది వున్నచోటి నుంచి ఆ నీటిని మనం వున్నచోటికి తెచ్చుకోవాలంటే కొంత వ్యయప్రయాస లకు లోనుకావల్సి వుంటుంది. అలా కాకుండా మనకు ఎక్కడ కావాలంటే అక్కడ అందుబాటులో వుండే నీరు మరొకటుంది. అదే భూమిలోపల రాతిపొరల్లో నిక్షిప్తమై వుండే నీరు. దానినే 'భూగర్భజలం' అంటాం.

మనమేదైనా ఇల్లో, స్థలమో, అపార్టుమెంటో కొనుక్కోవాలంటే ముందుగా మనం ఆలోచించేది అక్కడ బోరు పడుతుందా లేదా, నీళ్లు తక్కువలోతులోనే వుంటాయా లేదా, బోరుల్లో తియ్యటినీళ్లు పడతాయా లేదా అంటూ రకరకాలుగా భూగర్భజలం గురించే ఆలోచిస్తాం తప్ప.... అక్కడ నది వుందా, ఏరుందా, చెరువుందా.. అంటూ భూఉపరితలంపై దొరికే నీటి గురించి అస్సలు ఆలోచించం. అంటే మన నిత్య జీవితాన్ని, జీవనాన్ని ప్రభావితం చేసేది భూగర్భ జలమే. ఇంతగా మానవజీవితంపై ప్రభావం చూపే భూగర్భజల వనరులు మన కృష్ణాజిల్లాలో ఎలా వున్నాయో చూద్దాం.

కృష్ణాజిల్లా ఆంధ్రప్రదేశ్ ధాన్యాగారానికి ఇతోధికంగా పంట సిరులనందించే జిల్లాల్లో ఒకటి. భౌగోళికంగా 8,727 చ.కి.మీ. విస్తరించియున్న ఈ జిల్లాలో 1,034 మి.మీ. వర్షపాతంతో పాటు భూతల మరియు భూగర్భ జల వనరులు కూడా సమృద్ధి గానే వున్నాయి. అందులో భూగర్భజలవనరుల గురించి తెలుసు కుందాం.

భూమి లోపల వుండే రాతిపొరల్లో నిక్షిప్తమైయున్న నీటిని భూగర్భ జలం అంటాం. ఈ భూగర్భజల లభ్యత ఆ ప్రాంతంలో వుండే రాళ్ళు, రాతిపొరల మధ్య ఖాళీలు, రాళ్ళల్లో వుండే పగుళ్ళు, రాళ్ళల్లో వుండే రేణువుల పరిమాణం, రేణువుల మధ్య ఖాళీలు ... తదితర వాటి మీద ఆధారపడి వుంటుంది. కాబట్టి ఏ ప్రాంతంలోనైనా భూగర్భ జలాల లభ్యతకు అక్కడుండే రాతిపొరల లక్షణాలు కీలకం.

కృష్ణాజిల్లాలో ప్రధానంగా గట్టిరాతిపొరలు, మెత్తటి రాతి పొరలు మరియు ఒండ్రునేలలు అనే మూడు రకాలైన రాతిపొరలు వున్నాయి. ఇందులో మెత్తటి రాతిపొరలు మరియు ఒండ్రునేలలు భూగర్భ జలాలను పుష్కలంగా కలిగివుంటాయి. వీటితో పోల్చినపుడు గట్టిరాతి పొరల్లో కాస్త తక్కువగా వుంటాయి. పశ్చిమ కృష్ణాజిల్లా ప్రాంతమంతా గట్టిరాతిపొరలతో నిండివుండగా... ముసునూరులో పూర్తిగాను.... బాపులపాడు, నూజివీడు, ఆగిరిపల్లి, గన్నవరం మండలాల్లో పాక్షికం గాను మెత్తటి రాతి పొరలు ఆక్రమించుకుని వున్నాయి. తూర్పు కృష్ణా లోని డెల్టా ప్రాంతంలో మట్టి, సిల్ట్, ఇసుకతో కూడిన ఒండ్రుమట్టి పొర లున్నాయి.

### భూగర్భజలాన్ని ఎలా బయటకు తీయవచ్చు?

భూగర్భ నీటిని బయటకు తీయటానికి అనేక మార్గా లున్నాయి. స్థూలంగా చెప్పాలంటే... వాటిని బావులు లేదా బోరుల ద్వారా

బయటకు తీస్తారు. ఏ రకపు రాతిపొరలున్న ప్రాంతంలోనైనా భూమి పైపై పొరల్లో వున్న భూగర్భజలాన్ని బావుల ద్వారా వెలికితీయవచ్చు. త్రాగునీటికైతే ఒక మీటరు నుండి రెండు మీటర్ల వ్యాసంతోను, వ్యవసాయానికైతే 5 నుండి 8 మీటర్ల వ్యాసంతోను ఈ బావులను నిర్మిస్తారు. కృష్ణాజిల్లాలోని పడమటిప్రాంతంలో వున్న రాతిపొరల్లో ఈ బావులు 10 నుండి 20 మీటర్లు, డెల్టాప్రాంతంలో 4 నుండి 6 మీటర్ల లోతు త్రవ్వుతారు.

ఇలా కాకుండా ఎక్కువ లోతులో వున్న రాతిపొరలు లేదా ఒండ్రునేలల నుండి భూగర్భజలాన్ని వెలికితీయడానికి బోర్లు లేదా గొట్టపుబావులు లేదా ఫిల్టర్ పాయింట్స్ నిర్మిస్తారు. గట్టిరాతిపొరల నుండి బోర్ల ద్వారా, మెత్తటి రాతిపొరలనుండి గొట్టపుబావుల ద్వారా, ఒండ్రునేలల్లో వుండే ఇసుకపొరల నుండి ఫిల్టర్‌పాయింట్స్ ద్వారా భూగర్భజలాన్ని వెలికితీయవచ్చు. బోరుబావులు సాధారణంగా 70 నుండి 90 మీటర్లు, గొట్టపుబావులను 200 నుండి 250 మీటర్లు, ఫిల్టర్‌పాయింట్లను 6 నుండి 100 మీటర్ల లోతు వరకు నిర్మిస్తారు.

## బోరుబావికి, గొట్టపుబావికి, ఫిల్టర్ పాయింట్‌కి తేడా ఏమిటి?

పైన ఏ బావి ఏ రాతిపొరల్లో నిర్మిస్తారో తెలుసుకున్నాం. బోరు బావి నిర్మించే గట్టిరాతిపొరల్లో పైన కొన్ని అడుగుల వరకు ఈ రాతి పొరలు లూజుగా వుండి విరిగి పడిపోయే లక్షణం కలిగివుంటాయి. అలా రాతిపొరలు లూజుగా వున్నంతవరకు ఇనుము లేదా ప్లాస్టిక్‌తో తయారుచేసిన కేసింగ్ పైపులను దింపి ఆ రాతిపొరలు విరిగిపడి పోకుండా నిరోధిస్తారు. ఆపైన త్రవ్విన మిగిలిన బోరంతా కేసింగ్ పైపులు లేకుండానే నిర్మిస్తారు. ఈ రాతిపొరల్లో నుండి స్రవించే నీటిని మనం మోటార్ల సహాయంతో తోడుకుంటాం.

బోరుబావిలో విరిగిపడిపోయే లూజు రాతిపొరల వరకే కేసింగ్ పైపులు దించితే, దానికి భిన్నంగా గొట్టపుబావిలో మొత్తం బోరంతా కేసింగ్ పైప్ దింపుతారు. గొట్టపు బావులు నిర్మించే మెత్తటి రాళ్ళల్లో నీళ్ళున్న ఇసుకరాతిపొరలు, నీళ్ళు లేని ఇతర రాతిపొరలు ఒకదాని తరువాత ఒకటి పొరలు పొరలుగా వుంటాయి. ఇసుక రాతిపొరలున్న చోట సన్నటి రంధ్రాలు కలిగిన స్లాటెడ్ కేసింగ్ పైప్‌ను, ఇతర రాతిపొరలున్న చోట రంధ్రాలు లేని కేసింగ్ పైపును దించుతారు.

ఫిల్టర్ పాయింట్ నిర్మించే ఒండ్రునేలల్లో మట్టి, ఇసుక, సిల్ట్ పొరలు ఒకదాని తర్వాత ఒకటి వుంటాయి. ఏ ఇసుక రాతిపొర బాగా మందంగా వుండి, తగినంత నీటిని కలిగి వుంటుందో అంత వరకు బోరు నిర్మించి, మొత్తం బోరంతా కేసింగ్ పైప్‌ను దించుతారు. ఇసుకపొర తగిలినచోట మాత్రం రంధ్రాల కేసింగ్ పైప్‌ను అమర్చుతారు. ఫిల్టర్ పాయింట్లో సాధారణంగా ఒక ఇసుకరాతిపొరకు రంధ్రాల కేసింగ్ పైప్ అమర్చినా తగినంత నీరు వస్తుంది. అదే గొట్టపుబావిలో ఎక్కడెక్కడ ఇసుకపొర వస్తే ఆ పొరలన్నిటి దగ్గర రంధ్రాల కేసింగ్ పైప్‌ను అమర్చుతారు. ఇదీ ఫిల్టర్‌పాయింట్‌కు, గొట్టపుబావికి తేడా.

## భూగర్భజలాన్ని ఎలా అంచనా వేస్తారు?

భూమ్మీద చెరువుల్లోనో, కాలువల్లోనో, నదుల్లోనో వుండే నీరు అది మనకు కనిపిస్తుంది కాబట్టి ఏదో ఒక విధంగా అంచనా వేయవచ్చు. కానీ భూగర్భ జలం అంటే అది కనిపించని వనరు కదా. మరి ఆ కనిపించని నీటిని ఎలా అంచనా వేస్తారు? భూమిలోపల వున్న ఆ నీటిని అంచనా వేయడానికి అనేక విషయాల పైన సమాచారాన్ని సేకరించవలసి వుంటుంది. రాష్ట్రాన్ని పరిపాలనకు అనువుగా వుండే విధంగా జిల్లాలు, మండలాలు, గ్రామాలుగా విభజించుకున్నాం. నేలకైతే హద్దులు ఏర్పరచుకోగలం గానీ భూగర్భజలానికావిధంగా హద్దులేర్పరచు కోలేం కదా! అందుకే భూగర్భజలాలను అంచనా వేయాలంటే ముందుగా జిల్లానంతటినీ చిన్న చిన్న బేసిన్లుగా విభజించు కోవాలి. కృష్ణాజిల్లాన్ని భూగర్భజలవరంగా 57 బేసిన్లుగా విభజించారు. వీటినే 'హైడ్రోజియోలాజికల్ బేసిన్స్' లేదా 'గ్రౌండ్‌వాటర్ బేసిన్స్' అని అంటారు.

భూగర్భజలాశయానికి నీటిని అందించే ప్రధాన వనరు వర్షమే. వర్షం ద్వారా కురిసిన నీరు ఆ ప్రాంతంలో వున్న మట్టిపొరల ద్వారా క్రిందనున్న రాతిపొరల్లోకి ఇంకుతుంది. ఈ వర్షంతోపాటు కాలువల ద్వారా ప్రవహించే నీరు, చెరువుల్లో నిల్వవున్న నీరు.. ఈ రెండింటి ద్వారా పంటపొలాలకు సాగునీరు అందించినపుడు తద్వారా మరికొంత నీరు భూమిలోకి ఇంకుతుంది. వర్షపునీరు వాగుల్లో ప్రవహించేటపుడు కొంతనీరు, వాగుల్లో వేగాన్ని తగ్గించడానికి ఏర్పరచిన చెక్‌డ్యాములు, ఊటకుంటలు వంటి వాటిద్వారా మరికొంతనీరు భూమిలోకి ఇంకుతుంది. బోర్ల ద్వారా భూగర్భజలం తోడి పంటలకు పెట్టినపుడు తిరిగి కొంత నీరు పంటపీల్చుకోగా, మరికొంతనీరు తిరిగి భూమికి చేరుకుంటుంది. కాబట్టి ఒక ప్రాంతంలో ఎంత భూగర్భజలం సాలీనా భూగర్భంలోకి ఇంకుతుందో తెలుసుకోవాలంటే పైవివరాలన్నీ తెలుసుకుని తద్వారా భూగర్భజలాన్ని అంచనా వేస్తారు.

## కృష్ణాజిల్లాలో ఎంత భూగర్భ జలం వుంది ?

కృష్ణాజిల్లాలో భూగర్భజలశాఖ అంచనాల ప్రకారం జిల్లా వ్యాప్తంగా 1,98,145 హె.మీ. భూగర్భజలం అందుబాటులో వుంది.

అయితే జిల్లాలో వున్న 50 మండలాల్లో 13 మండలాల్లో వున్న భూగర్భజలం ఉప్పగా వుండటం చేత అది సాగుయోగ్యం కాకపోవటంచే ఆ మండలాలన్నీ ఉప్పునీటి మండలాలుగా నిర్ధారించబడ్డాయి. మిగిలిన మండలాలలో 1,36,295 హె.మీ. భూగర్భజలం అందుబాటులో వున్నట్లు, అందులోనుండి 54,812 హె.మీ. అనగా 40 శాతం వినియోగిస్తున్నట్లు, ఇంకా సాలీనా 81,483 హె.మీ. మిగులు వున్నట్లు భూగర్భజలశాఖ అంచనాలు తెలుపుతున్నాయి. హె.మీ. అంటే హెక్టారు మీటరు. ఒక హెక్టారు మీటరు అనగా కోటి లీటర్లు.

## వాటర్ లెవల్

ఆయా ప్రాంతాల్లో వున్న రాతిపొరల్లో వున్న భూగర్భజలం ఎంత పరిమాణంలో వుందో తెలుసుకోవటంతోపాటు అది బావులు లేదా బోర్లలో ఎంత లోతులో వుందో కూడా తెలుసుకోవలసిన ఆవశ్యకత ఎంతైనా వుంది. భూగర్భ జల లభ్యతా పరిమాణం ఎంత ముఖ్యమో అది అందుబాటులో వుండే లోతు కూడా అంతే ముఖ్యం.

ఎండాకాలంలో బావులు లేదా బోర్లలో నీళ్లు లోతుకు పోతాయని, వానాకాలంలో పైకి వస్తాయని అందరికీ తెలిసిన విషయమే అయినా అవి ఖచ్చితంగా ఏ కాలంలో ఎంత లోతులో వున్నాయి, కాలానుగుణంగా అవి ఏ రకమైన మార్పులకు లోనవుతున్నాయి అని శాస్త్రీయంగా తెలుసుకోవలసి వుంది. అలా తెలుసుకోవటానికి ప్రత్యేకంగా ఏర్పాటుచేయబడినవే పీజోమీటర్లు. పీజోమీటరు అంటే భూగర్భజలమట్టం ఎంత లోతులో వుందో తెలుసుకోటానికి ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన బోర్‌వెల్. అటువంటి పీజోమీటర్లను కృష్ణాజిల్లాలో భూగర్భజల పరిస్థితిని ప్రతిబింబించేలా 108 ప్రాంతాల్లో ఏర్పాటు చేయటం జరిగింది.

పీజోమీటర్ల ద్వారా తమ ప్రాంతంలోని వాటర్‌లెవల్‌ను ఇంటర్నెట్ సౌకర్యం కలిగిన స్మార్ట్ ఫోన్ ద్వారా ఎవరైనా తెలుసుకోవచ్చు. ఇంటర్‌నెట్ సౌకర్యం కలిగిన మీ కంప్యూటర్ లేదా స్మార్ట్‌ఫోన్‌లో http://core.ap.gov.in వెబ్‌సైట్ ద్వారా సి.యం.డ్యాష్‌బోర్డు ఓపెన్ చేసి అందులో గ్రౌండ్‌వాటర్ బాక్స్ మీద క్లిక్ చేయగానే మీకు వివరాలన్నీ కనిపిస్తాయి.

## బోరు ఎక్కడ వేయాలో తెలుసుకోవటమెలా?

భూతలం మీద వుండే నీరైతే మనకు కనిపిస్తుంది. చెరువులో అయితే ఎన్ని నీళ్లున్నాయో, నదుల్లో ఎన్ని నీళ్లు ప్రవహిస్తున్నాయో కూడా చూసి తెలుసుకోవచ్చు. మరి కనిపించని భూగర్భజలాన్ని ఎలా తెలుసుకుంటాం. శాస్త్రం అభివృద్ధి చెందని పూర్వకాలంలో కొన్ని అశాస్త్రీయ పద్ధతుల ద్వారా ఎక్కడ భూగర్భజలం లభ్యమవుతుందో అంతవరకు అంచనా వేసేవారు. ఇప్పుడు శాస్త్రం అభివృద్ధి చెందాక సాంకేతికత పెరిగిన తరువాత భూగర్భజలాన్ని కనిపెట్టడానికి రెసిస్టివిటి మీటర్ అనే పరికరం ద్వారా భూమి లోపలికి కరెంటును పంపించి, అక్కడున్న రాతిపొరల యొక్క లక్షణాలను అధ్యయనం చేసి, తద్వారా భూగర్భజలం అందుబాటులో వుందా లేదా, వుంటే బోరు ఎంత లోతు వేసుకోవాలి, ఎన్ని నీళ్లు వస్తాయి, వచ్చే నీళ్లు తియ్యగా వుంటాయా లేక సవ్వగా వుంటాయా.. అనేటువంటి విషయాలను తెలుసుకోవచ్చు. ఇందుకు ప్రతిజిల్లాలో వున్న భూగర్భ జల శాఖను సంప్రదిస్తే మిగిలిన వివరాలు పొందవచ్చు.

## భూగర్భజలం బ్యాంకు అక్కౌంట్ లాంటిదే

ఉదయాన్నే నిద్రలేవగానే ముందుగా మన ఇంటిలో వున్న బోరు నుంచి మోటారు ద్వారా నీళ్లు తోడుకుని పైనున్న వాటర్ ట్యాంకు నింపుకుని వాడుకోవటం ప్రారంభిస్తాం. అందుకోసం ప్రతి ఇంటి యజమాని తన డాబా మీద 1000 నుంచి 2000 లీటర్ల సామర్థ్యం గల వాటర్‌ట్యాంకును ఏర్పాటుచేసుకుంటారు. అదే అపార్టుమెంట్లలో అయితే ఈ ట్యాంకు సామర్థ్యం చాలా ఎక్కువగా వుంటుంది. రోజుకు 1000 నుండి 2000 లీటర్లు తోడుకుంటున్నామంటే నెలకు 30 వేల నుంచి 60 వేలు, సంవత్సరానికి 3 లక్షల నుండి 7 లక్షల లీటర్ల పైనే భూమిలోనుంచి తోడుకుంటున్నట్లే.

ఇంత నీటిని భూమిలోనుంచి తోడుకొనే మనం తిరిగి ఎంత నీటిని భూమిలోకి పంపిస్తున్నాం అని ఎవరూ ఆలోచించం. బ్యాంకు అక్కౌంట్‌లో డబ్బులు దాచుకుంటేనే తిరిగి తీసుకో గలుగుతాం. అలా దాయకుండా తీసుకుంటూ పోతుంటే చివరకు ఏమి జరుగుతుందో మనందరికి తెలుసు. కానీ భూగర్భజల విషయానికొచ్చేసరికి అది కూడా ఒక బ్యాంక్ అక్కౌంట్‌లాంటిదే అనేది తెలుసుకోకుండా, అది ఉచితంగా వచ్చేదే కదా, ఎంత తోడుకున్నా ఏమీ ఇబ్బంది లేదులే అన్నట్లుగా తోడేస్తున్నాం. కానీ భూగర్భజలం కూడా ఒక బ్యాంకు అక్కౌంట్ లాంటిదే. తోడుకుంటున్న మనమీదే తిరిగి నింపుకోవలసిన బాధ్యత కూడా వుంది.

## భూగర్భంలో జలాన్ని దాచుకుందాం

భూగర్భజలాన్ని దాచుకోటానికి వివిధ మార్గాలున్నాయి. భూగర్భ జల సంరక్షణ అనేది ప్రతి ఒక్కరి బాధ్యత. ప్రతి ఒక్కరు వ్యక్తిగత స్థాయిలో, కుటుంబస్థాయిలో, సామాజిక స్థాయిలో నీటిని సంరక్షించవచ్చు, అలాగే వాడకంలో పొదుపును పాటించవచ్చు. అను దినం మనం వివిధ కార్యకలాపాలకు ఎంతో నీటిని వినియో గిస్తుంటాం... అందులో మనకు తెలియకుండానే చాలా నీటిని వృధా చేస్తుంటాం.

ఇలా వృథా అయ్యే నీటిని అరికట్టగలిగి నట్లయితే అది జల సంరక్షణతో సమానమే. అలాగే మన ఇండ్లల్లో కురిసే వర్షపునీటిని వృథాగా బయటకు వదిలేస్తుంటాం. సంవత్సరానికి వెయ్యి మిల్లీ మీటర్లకు పైగా కురిసే కృష్ణాజిల్లాలో ప్రతి 100 చ.మీ.కు వర్షం ద్వారా కురిసే నీరు లక్ష లీటర్ల పైమాటే. ఆ లెక్కన మన ఇంటి ఆవరణలో కురిసే నీరు 200 గజాల స్థలంలో అయితే 2 లక్షల లీటర్లు, 300 గజాల స్థలమైతే 3 లక్షల లీటర్లు... ఇలా ఈ దామాషా ప్రకారం వర్షపునీరు కురుస్తూ వుంటుంది.

ప్రతి ఇంట్లో ప్రహరీగోడ ఆ చివర నుండి ఈ చివర వరకు నాపరాయి పరిచి నీళ్లు ఇంకే చోటు లేకుండా చేసేబదులు ఏదో ఒక మూల చిన్న ఇంకుడుగుంత త్రవ్వుకుంటే వృథాగా పోయే లక్షల లీటర్ల నీటిలో ఎంతో కొంత నీటిని తిరిగి భూగర్భంలో దాచుకో గలుగుతాం. ఇది భూగర్భజలం వాడుకునే ప్రతీ కుటుంబం విధిగా ఆచరించవలసిన కర్తవ్యం. ఇంకుడుగుంత యొక్క నమూనాను పటంలో చూపించటమైనది. ఇంకుడుగుంతపై మరిన్ని వివరాలకు భూగర్భ జల శాఖను సంప్రదించగలరు.

అలాగే వ్యవసాయ భూములనుండి ఎంతో ఎక్కువ పరిమాణంలో భూగర్భజలాన్ని తోడుకునే రైతులు తిరిగి భూగర్భజలాన్ని పెంపొందించటానికి ఎన్నో చర్యలు చేపట్టవచ్చు. వాగులు, వంకలకు అడ్డుకట్టలు వేయటం ; వాలుకు అడ్డంగా దుక్కిదున్నటం ; చెట్లు విరివిగా పెంచటం ; జీవగట్లు పెంచటం ; పరిగెత్తే నీటిని నడిచేలా... నడిచే నీటిని నిలిచేలా... నిలిచిన నీటిని భూమిలోకి ఇంకేలా చేయటం ప్రతి రైతు ఆచరించవలసిన కర్తవ్యం. వీటితోపాటు చేలో ఒక మూల చిన్న నీటికుంట త్రవ్వి వర్షపునీటిని అందులోకి మళ్ళించి, చేను దాటి బయటకు పోకుండా ఆ గుంతలో నిల్వవుంచుకోవాలి. తద్వారా నేలలో తేమ పెరుగుతుంది, భూగర్భజలం పెంపొందు తుంది. అవసరమైనప్పుడు సంక్లిష్ట దశలో పంటలు ఎండిపోకుండా ఈ నీటితో తడులందించినపుడు ఈ నీరే పంటసంజీవినిలా పనిచేస్తుంది. కాబట్టి ఇలా ప్రతి ఒక్కరూ భూగర్భజలాన్ని వాడుకోవటమేగాకుండా తిరిగి భూమిలో నింపుకునేలాగా కృషిచేద్దాం. భూగర్భజలం ప్రకృతి మనకు ప్రసాదించిన వరం. దాన్ని కాపాడుకోవాల్సింది మనమే.

# పుష్కర స్నానం

**నదీమతల్లికి నమస్కరించి, ఈ శ్లోకాలను చదివి నీళ్లలో మూడు మునకలు వేయాలి. ఒక శ్లోకం తీర్థరాజైన పుష్కరుడికి, మరో శ్లోకం దేవగురు బృహస్పతికి, మూడో శ్లోకం కృష్ణవేణీ మాతకు ప్రణమిల్లుతూ చదవాలి తీర్థరాజ నమస్తుభ్యం సర్వలోకైక సంశ్రయ తస్మాత్స్నానం కరోమ్యహం భవబంధ విముక్తయే (అని మొదటి మునక వేయాలి).**

**సురాచార్య నమస్తుభ్యం సర్వలోకైక పూజిత త్వయా సింహగతే దేవ గోదావర్యాం స్నానమాచరేత్ (అని రెండో మునక వేయాలి).**

**శుద్ధస్ఫటిక సంకాశాం ద్విభుజాం పద్మధారిణీం శివమూర్తిధరాం కృష్ణాం త్వాం ప్రణతోస్మ్యహం (అని మూడో మునక వేయాలి)**

శ్రీ పెద్ది సాంబశివరావు

# ఏక సంకేత ఖతులు (యూనికోడ్ ఫాంట్లు) తెలుగు భాషాపరిశోధనకు సరికొత్త ద్వారాలు

ఫాంట్లు అంటే అచ్చు వేయటానికి వాడే అక్షరాలు. ఇంతకు ముందు సీసంతో కరిగించిన ముక్కలను యిందుకు వాడేవారు. కంప్యూటరులో టైపు చేయటం వచ్చాక ఇంగ్లీష్‌లో చాలా రకాల ఫాంట్లు అందుబాటులోకి వచ్చాయి. ఇంగ్లీష్‌లో కొత్త రకం ఫాంట్ల రూపకల్పన సులభం. ఇంగ్లీష్ కీబోర్డులో కొన్ని మాత్రమే సరిపోతాయి. చిన్న అక్షరాలకు 26, పెద్ద అక్షరాలకు 26 కూడికలు, తీసివేతలు, సంఖ్యలు వంటివి కలిపి మొత్తం 90 మీటలే చాలు.

కాని తెలుగులో, ప్రాంతీయ భారతీయభాషల్లో ఫాంట్లు చేయాలంటే వెయ్యికి పైగా అక్షరాలను తయారు చేయాలి.ఇది చాలా కష్టం. తెలుగులో గుణింతాలు, సంయుక్త అక్షరాలు ఉంటాయి. వీటి అన్నీటికి సంకేతాలు కీబోర్డు మీద చూపటం వీలుకాదు.

కంప్యూటరు విజ్ఞానంతో పాటు విశ్వం చిన్నదై పోతుంది. భాషల మధ్య పరస్పర సంబంధాలను ఏర్పరచుకోవటానికి వీలుగా సాంకేతికతను ఉపయోగించుకోవాలని ఐక్యరాజ్యసమితి వంటి అంతర్జాతీయ సంస్థలు కృషి చేస్తున్నాయి. అందుకు అవి ప్రోత్సహిస్తున్నాయి. భాషల పరస్పర ఆదానప్రదానాలకు దోహదపడేవి యూనికోడ్ ఫాంట్లు. యూనికోడ్ ఫాంట్‌లను ఏకసంకేత ఖతులు అని అనవచ్చు. ప్రపంచంలో గల భాషలకు శబ్దాన్ని బట్టి ఒకో శబ్దానికి ఒక సంఖ్య కేటాయిస్తే ప్రపంచ భాషల అన్నిటి మధ్య అనుసంధానం సాధ్యమవుతుంది. ప్రపంచ స్థాయిలో ఒక్కొక్క అక్షరానికి ఒక సంఖ్య కేటాయిస్తారు. ఇలా చేయటం వల్ల ఒక భాషలో నుంచి మరో భాషలోనికి భాషాంతరీకరణ చేయటం సులభం అవుతుంది. ఉదాహరణకు అన్నమాచార్య కీర్తనలు తెలుగులో ఉన్నాయి. వాటిని యూనికోడ్‌లో టైపు చేసి తమిళంలోకి భాషాంతరీకరణ చేయవచ్చు. అప్పుడు తమిళం మాత్రమే చదవ గలిగినవారు కూడ ఆ సాహిత్యాన్ని చదువుకోగలుగుతారు. తిరిప్పావైను అన్ని భాషలలో చదువుకోవచ్చు.ఇలా ఏ ఇతర భారతీయ భాషలోకి / అంతర్జాతీయ భాషలోకి అయినా మార్చవచ్చు. వ్యాసంలో / పుస్తకంలో కోరుకున్న పదం ఎక్కడెక్కడ వుందో, ఎన్ని సార్లు వచ్చిందో, ఆ పదానికి ముందు, తరువాత ఏఏ పదాలు వచ్చాయో కంప్యూటరు ద్వారా తెలుసుకోవచ్చు.

ఇంతవరకు 'అను ఫాంట్లు' వాడుకలో వున్నవి. అయితే ఇవి కేవలం ముద్రణకు మాత్రమే పనిచేస్తాయి. ఏ భాషలో అయినా టైపు చేయటానికి యంత్రాలను / కంప్యూటర్‌లను వాడటం వల్ల ముద్రణలు వేగంగా, అందంగా ఉంటాయి. ఇంకా వీటిలోనే అదనపు సౌకర్యాలను కల్పించాలంటే ఇంతవరకు వ్యాప్తిలో గల ఖతులు నూతన అవసరాలకు ఉపయోగింపబడటం లేదు. ఉదాహరణకు ఒక జాబితాగా మనుషులు / వస్తువుల పేర్లను టైపు చేసి వాటిని అక్షరక్రమంలోa నుండి z వరకు / z నుండి a వరకు వరుసలో కూర్చమని (sort) అడిగితే ఇంగ్లీషులో ఆ పనిని కంప్యూటరు సెకనులలోనే చేసి పెడుతుంది. కాని ప్రాంతీయ భాషలను కంప్యూటరు ద్వారా టైపు చేసినప్పటికీ ఇలా అక్షరక్రమంలో మార్చటానికి వీలుకాదు. కనుక మానవశ్రమతోనే ఈ పని చేయాలి. అది చాలా వ్యయప్రయాసలతో కూడినది. సార్ట్ చేయవలసిన అంశాలు పెరిగే కొలది ఈ శ్రమభారం అవుతుంది, తప్పులు దొర్లే అవకాశాలు అధికం అవుతాయి.

ప్రపంచవ్యాప్తంగా ఏ భాషనయినా టైపు చేయటానికి వీలుగా సాంకేతికత ఇప్పుడు లభ్యమౌతుంది. అంతేకాక ఆ భాషలో మనకు కావలసిన, నచ్చిన రకాల ఖతులను కూడా ఎంపిక చేసుకోవచ్చును. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో అప్పటి ప్రభుత్వం, ప్రవాస భారతీయులు, సాంకేతిక నిపుణులు కలసి ప్రోత్సహించి 15 తెలుగు ఖతులను అష్టదిగ్గజాలు, యితర ప్రముఖుల పేర్లతో విడుదల చేశారు. ఇటువంటి ఖతులను ఇంకా కొన్నింటిని విడుదల చేయటానికి ప్రస్తుత ప్రభుత్వము శ్రద్ధ తీసుకోవాలి. అప్పుడు తెలుగు అక్షరాలు మరింత సుందర సుందరాలై కనుల ముందు సాక్షాత్కరిస్తాయి.

ఇంకా యూనికోడ్‌లో చేయటం వల్ల, ఒకే భాషలో టైపు చేసిన సమాచారాన్ని మరొక భాషాలిపి ద్వారా చదువుకోవటానికి వీలవుతుంది. కనుక యునెస్కో సంస్థవారు ప్రపంచభాషల మధ్య భాషాంత

రీకరణకు వీలు కలిగించే విధానాలను ప్రోత్సహించారు. అంతేకాక సాఫ్ట్‌వేర్‌లను కూడా పెద్ద వ్యాపారసంస్థలు, ఔత్సాహికులు కూడా తయారు చేయటం ప్రారంభించారు. ఇలా భాషాంతరీకరణ చేయటానికి వీలైన ఏకరూపత ఉన్నందున వీటిని యూనికోడ్‌ఖతులు అంటారు.

## నా అనుభవాలు

కొన్ని సంవత్సరాల క్రితం శంకరనారాయణ ఇంగ్లీష్ - తెలుగు నిఘంటువును ఆధునీకరించే అవకాశం నాకు కలిగింది. అప్పుడు ఆధునిక నిఘంటువులకు ఉండవలసిన లక్షణాలను స్థూలంగా అధ్యయనం చేశాను. అదే సమయంలో తెలుగులో నిఘంటువులను తెలుగు - ఇంగ్లీషు, తెలుగు, తెలుగు నుంచి యితర భాషలకు నిఘంటువులను తయారుచేయాలంటే తెలుగు పదాలను అక్షర క్రమంలో అ నుండి హ వరకు కూర్చగలిగిన సాంకేతికత నాకు సులువుగా దొరకలేదు. అవి లేకుండా ఈ కాలంలో నిఘంటువును నిర్మించటం సాధ్యం కాదు. గతంలో పదాలను అక్షరక్రమంలో కూర్చాలంటే ఒక్కొక్క పదాన్ని ఒక కార్డు మీద రాసి ఆ కార్డులను అక్షరక్రమంలో పేర్చి ముద్రణకు పంపేవారు. అందుకు చాలా సమయం పట్టేది.

ఇంగ్లీష్‌లో చేస్తున్నట్లుగా తెలుగులో కూడా పదాలను అక్షర క్రమంలో కూర్చగల సాఫ్ట్‌వేర్ టెక్నాలజి కోసం నేను తిరగని ఊరు, అడగని ఆచార్యులు, ఎక్కని గడపలేదు. చివరకు నా ప్రయత్నం ఫలించింది. హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలోని Computer Aided Language Translation Studies శాఖలో ప్రధాన ఆచార్యులు డా. గారపాటి ఉమామహేశ్వరావుగారు ఐదు నిమిషాలలో నాకు మంత్రోపదేశం చేసి, నా సమస్యకు పరిహారం చూపారు.

విండోస్-7 అప్పుడప్పుడే ప్రచారంలోకి వస్తుంది. దానిలో ప్రాంతీయ భాషలను కూడా టైపు చేయటానికి అవకాశం ఉంది. వాటిలో తెలుగు, ఇంకా 15 ఇతర భారతీయ ప్రాంతీయ భాషలు టైపు చేయవచ్చు. మనకు కావలసిన భాషను ప్రోగ్రాములో add చేసుకుంటే చాలు. అలా కలుపుకోవటానికి చిన్న ప్రక్రియ ఉంది.

కంప్యూటరులో control panel కు వెళ్లాలి. ఇందులో Region and Language అనే దానికి వెళ్లాలి. దాని ప్రక్కన గ్లోబు, గడియారం బొమ్మలు ఉంటాయి. దానిలో Format ను క్లిక్ చేయాలి.

అపుడు మౌస్‌ను జరుపుతూ కొన్ని వందల భాషల పట్టికను ఇంగ్లీషులో అక్షరక్రమంలో Scroll చేసుకోవచ్చు. Telugu India ను ఎంపిక చేసుకోవాలంటే add అనే ఆప్షనును క్లిక్ చేయాలి. దీనితో పాటు మన కరెన్సీ నోటు పైన ఉండే భాషల అన్నిటిలో వేటినైనా ఎంచుకోవచ్చు. ఇప్పుడు విండోస్ -10 లో Add a Language అని కావలసిన భాషను కలుపుకోవచ్చు. అందులో లభ్యమౌతున్న ప్రాంతీయ భాషలన్నిటికీ యూనికోడు ఖతులు వాడబడ్డాయి.

తెలుగు పదాలను అక్షరక్రమంలో కూర్చబడిన సాంకేతికత నాకు ప్రత్యక్షమయింది. ఐదు నిమిషాలలో కొత్త ప్రపంచాన్ని ఊహించుకోవటం మొదలయింది. కాని దానిని నా చేతికి చిక్కించుకోవటం మాత్రము అనుకున్నంత సులభంగా లేదు. మామూలుగా defaultలో ఇంగ్లీష్ కీబోర్డు ఉంటుంది. తెలుగు టైపు చేయాలంటే Alt + Shift కొడితే కీబోర్డు తెలుగుకు మారిపోతుంది. నీ సిస్టమ్‌లో టాస్క్‌బార్ మీద Te / తె అని కనిపిస్తుంది. మరల ఆల్ట్ + షిఫ్ట్ కొడితే Eng కు మారుతుంది. ఇలా ఒకే సిస్టమ్‌లో ఎన్ని ప్రాంతీయభాషలైనా కలుపుకోవచ్చు. అవసరం లేకపోతే తీసివేయవచ్చు. ఇలా మార్పులు చేయటానికి, టైపు చేయటానికి నెట్ అవసరం లేదు. దానికి కీబోర్డ్ డీ.ఓ.ఈ. విధానంలో అక్షరాలు ఉంటాయి. దీనినే ఇన్ స్క్రిప్ట్ అని కూడా అంటారు. ఇది తెలుగునే కాక అన్ని భారతీయభాషలకు ఉచ్చరణను బట్టి టైపు చేయటానికి వీలవుతుంది.

తెలుగు భాషను ఎంచుకొని ఆశాలత అని టైపు చేశామనుకొండి. హిందీ భాషకు మారి అదే మీటలను నొక్కటం వల్ల ఆ పేరు హిందీలో వస్తుంది. ఇలా అన్ని భారతీయ భాషల్లో టైపు చేయవచ్చు. పది రోజులు క్రమంగా టైపు చేస్తే భాషపైన కాస్త పట్టు దొరుకుతుంది. రెండు నెలల్లో ప్రావీణ్యము పెరుగుతుంది. తప్పులు తగ్గుతాయి. వేగం పెరుగుతుంది. ఇన్నాళ్లు పడిన శ్రమను మరచిపోతాము.

ఇపుడు నా చేతికి ఒక ఆయుధం దొరికింది. ఆయుధం ఉన్నవాడి ఆలోచనలు దానిని ఎట్లా ఉపయోగించాలా అనే ఉంటాయి. ప్రాథమిక తెలుగు - ఇంగ్లీష్ నిఘంటు నిర్మాణం ప్రారంభించాను. వెయ్యి ఇంగ్లీష్ మాటలకు తెలుగు అర్థాలు యక్స్ యల్ షీటులో రాశాను. ప్రతి పదాన్ని అది ఏ భాషా విభాగమో గుర్తించాను.

1. నిఘంటు నిర్మాణానికి ఇంగ్లీష్ పదం - భాషావిభాగం - తెలుగు అర్థం రాసి ఈ క్రమంలో టైపు చేసిన పిమ్మట ఆంగ్లపదాలను అక్షరక్రమంలో కూర్చాను. ఇంగ్లీష్ నిఘంటువు చేయగలనని ధైర్యం వచ్చింది. తరువాత తెలుగు మాట -భాషా విభాగం -ఇంగ్లీష్ అర్థం, వరుసలో సమాచారాన్ని మార్చాను. ఇప్పుడు తెలుగు అక్షరాలను అక్షర క్రమంలో కూర్చగా తెలుగు-ఇంగ్లీష్ నిఘంటువు తయారయింది. ఇలా వరుసలో కూర్చినప్పటికీ ఏ మాటకు ఎదురుగా ఆ మాట అర్థమే ఉంటుంది.

పరిణామక్రమంలో ఒకే సమాచారంతో రెండు భాషల నిఘంటువును చేసిన తరువాత మౌలిక సమాచారంతో మూడు భాషల నిఘంటువును ఎందుకు చేయగూడదా అనిపించింది. తెలుగు - ఇంగ్లీషులో ఇంతకు ముందు చేసిన 1000 పదాలకు హిందీ అర్థాలను హిందీ పండితుల సహాయంతో కలిపాను. దీనితో నాకు 9 నిఘంటువులు తయారయ్యాయి. ఇలా ఒక్కొక్క భాషను అదనంగా చేరుస్తూపోతే లభించే నిఘంటువుల సంఖ్య రెట్లుగా పెరుగుతుంది. 1.ఇం-తె,

2.తె-ఇం, 3,ఇం-హిం, 4.హిం-ఇం, 5.తె-హిం, 6.హిం-తె, 7.తె-హిం-ఇం, 8.హిం-తె-ఇం, 9.ఇం-తె-హిం.

2. ఈ అనుభవాన్ని పెద్ద ప్రాజెక్టుగా ఎలా చేయాలని ఆలోచిస్తుండగా తి.తి.దే. వారు కొన్ని దశాబ్దాల క్రితం ప్రచురించిన తాళ్ల పాక వారి సాహిత్యం తాళ్లపాక వారి కీర్తనలు 29 సంపుటాలు నా దృష్టికి వచ్చాయి. ఇందులో 14,700 కీర్తనలు ఉన్నాయి. ప్రతి సంపుటం చివర ఆ సంపుటంలో ఉన్న కీర్తనలకు విషయసూచికలు యిచ్చారు. ఏ కీర్తన కావాలన్నా అన్ని పుస్తకాలు వెదకవలసిందే. అపుడు నేను అన్ని కీర్తనలకు ఒకే విషయసూచికను యూనికోడులో చేశాను.

తరువాత ఇదే దిశలో అన్నమయ్య సాహిత్యాన్ని ఆరాధిస్తూ విశ్వ వ్యాప్త అన్నమయ్య భక్త బృందంగా గత 7 సంవత్సరాలుగా కృషి చేస్తున్న మిత్రులతో కలసి తాళ్లపాక వారి కీర్తనలను అన్నిటినీ తెరమీద చూపించగలిగాము.

తరువాత 14,700 కీర్తనలలో కోరుకున్న దానిని అంతర్జాలంలో చూసుకోవటానికి వీలుగా చేసి స్వామివారికి కైంకర్యం చేశాము. మా బృంద భాగస్వామియైన ఆంధ్రభారతి వెబ్ సైటులో మరో విశేషం చూపుతున్నారు. కీర్తనలను దేవనాగరి / తమిళం / కన్నడ / గుజరాతీ మున్నగు పది భారతీయ భాషల్లో కోరుకున్నదాని ద్వారా చదువుకోవటానికి వీలు కలిగించారు.

గుంటూరు బృందావన్ గార్డెన్స్, శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవాలయంలో, పుస్తకాభిమాని లంకా సూర్యనారాయణగారు సేకరించి, భద్రపరిచిన శ్రీఅన్నమయ్య ఆధ్యాత్మిక గ్రంథాలయంలో 60 వేలకు పైగా తెలుగు పుస్తకాలు, 50 వేల సంచికలు ఉన్నాయి. ఈ గ్రంథాలయాన్ని తి.తి.దే. వారు ఆదర్శ ఆధ్యాత్మిక గ్రంథాలయంగా అభివృద్ధి పరచటానికి అంగీకరించి గ్రాంట్ ఇస్తున్నారు.

3. ఇన్ని వేల పుస్తకాలకు తెలుగులోనే కేటలాగు చేయాలని ప్రయత్నించాము. అయితే అందుకు అవసరమైన సాఫ్ట్‌వేర్ ఎక్కడా లభించలేదు. అప్పుడు యూనికోడ్ ద్వారా మేమే స్వంతగా చేయగలిగాము. దీని ద్వారా పుస్తకం సంఖ్య / విషయం / పేరు / రచయిత / ప్రచురణ సంస్థ / ప్రచురణ సం.ము / పుటలు / వెలల వివరాల నమోదు చేశాము. దీనిద్వారా వీటిలో ఏ ఒక్క సమాచారం తెలిసినా మిగతా వాటిని తెలుసుకోవచ్చు. దాదాపు రెండు సంవత్సరాలు పట్టిన ఈ ప్రయత్నం పూర్తి అయిన తరువాత మాకే ఆశ్చర్యాన్ని కలిగించింది. భారతదేశంలో ఇంతవరకు ఏ ప్రైవేటు గ్రంథాలయంలో కూడా ప్రాంతీయభాషలో కేటలాగు తయారు కాలేదని తెలిసింది. విశ్వభారతి విశ్వవిద్యాలయంలో బెంగాలీలో, మంగుళూరు విశ్వవిద్యాలయంలో కన్నడలో మాత్రమే ఇలా చేశారని తెలిసింది. మా కృషిని వికీపీడియాలో అంతర్జాలంలో ఉంచాము.

ఇప్పుడు మేము వాడిన సాంకేతిక విజ్ఞానాన్ని తి.తి.దే.వారి గ్రంథాలయంలో గల 80 వేల పుస్తకాలకు అమలు చేయటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

4. కవిత్రయం రచించిన ఆంధ్రమహాభారత పదాలకు సమగ్ర నిఘంటువు ఇంతవరకు లేదు. తి.తి.దే.వారు ప్రచురించిన 15 సంపుటాలలో గల రెండు లక్షల పైగామాటలను, అర్థాలను యూనికోడ్‌లో 18 నెలలనుంచి టైపు చేస్తున్నాము. ఇది మరొక ఆరు నెలల్లో పూర్తి కావచ్చు. అప్పుడు ముగ్గురు కవులు విడివిడిగా వాడిన పదాలు, అందరూ వాడిన పదాలు వాటి అర్థాలను తెలుసుకోవచ్చు. ఈ పథకం అయితే భారత రచనాకాలం నాటి పదానికి నేటి అర్థాలు, నేటి పదాలకు నాటి అర్థాలు అనే రెండు నిఘంటువులను తయారుచేయవచ్చును. ముగ్గురు కవుల కాలాలలో వచ్చిన మార్పులను కూడా అధ్యయనం చేయవచ్చు. ఇలా ఈ అద్భుతాలన్నీ యూనికోడ్‌లో టైపు చేయటం వల్లనే సాధ్యం అవుతున్నాయి.

యూనికోడ్ ఖతులను వాడటం వల్ల చాలా సౌకర్యాలు ఉన్నాయి. ఉదాహరణకు ఇటీవలనే నోట్ ప్యాడ్ ప్లస్, ప్లస్ అనే సాఫ్ట్‌వేర్ విడుదల చేశారు. దీనిని ఎవరైనా ఉచితంగా దిగుమతి చేసుకోవచ్చు. తాళ్లపాక వారి సుమారు 15 వేల కీర్తనలు పంక్తులుగా విడగొట్టి దీనిలో ఉంచాము. అవన్నీ కలసి 2 లక్షల 30 వేల దాకా పంక్తులు అవుతాయి. వీటిలో ఏదైనా మనకు కావలసిన పదాన్ని ఎంచుకొని ఆ పదం ఉన్న పంక్తులను అన్నిటిని విడిగా చూపమంటే ఒక నిమిషంలోనే పట్టిక సిద్ధం అవుతుంది. నువ్వు అనే మాట కావాలనుకోండి. ఆ మాట మాత్రమే కావాలా, సుమారుగా దానితో కలిసే మాటలను కూడా చూపమంటారా అని, ఆ మాటకు ముందు / తరువాత ఏమైనా నిర్దిష్ట పదం ఉండాలా అని అడుగుతుంది. దీన్ని ఆధారంగా చేసుకొని తాళ్లపాక వారి సాహిత్యంలో పాదములు, నువ్వు, శరణం వంటి 25 పదాలను ఏయే పరిస్థితుల్లో వాడారో తెలుసుకోగలిగాము.

### పరిశోధన అవకాశాలు

మహాభారతం, భాగవతంవంటి ప్రాచీన గ్రంథాలకే కాక ఏ ప్రత్యేక / విశేష గ్రంథాలలో అయినా ఏ పదం ఎన్నిసార్లు ప్రయోగించబడిందో, ఏ పదాలతో కలిపి వాడబడిందో తెలుసుకోవచ్చు.

**చిరునామా :** *పెద్ది సాంబశివరావు, 505, యాగంటి మినీ అపార్ట్‌మెంట్, స్థంభాల గరువు, గుంటూరు - 522 006.*
*సంచారవాణి - 9441065414*

శ్రీమతి పి. హైమవతి

# తెలుగునాట శాస్త్రాభివృద్ధి - కృష్ణా పరివాహక ప్రాంత పాత్ర

ప్రాణికోటికి అవసరమైన ఆహారం,ఓషధుల లభ్యత, పారిశుద్ధ్య ప్రక్రియలు, ప్రకృతిలో వాతావరణ సమతుల్యత మొ॥న వాటికన్నింటికి మూలాధారం స్వచ్ఛమైన నీరు. భారతీయ వైద్యశాస్త్రవేత్తలు స్నాన పానాదుల్లో నీటి ప్రాధాన్యత, జలవనరులు, నేలనుబట్టి నీటికుండే లక్షణాలు త్రాగునీటిని శుభ్రపరచుకోవలసిన ఆవశ్యకత, అందుకు అనుసరించాల్సిన పద్ధతులు, జలపాన పద్ధతులు మొ॥న అనేకాంశాలను తమ గ్రంథాల్లో చొప్పించి వివరించారు. నదులు, బావులు, చెరువులు, మడుగులు లాంటి ఏ జలవనరునైనా వాడుకుని తప్పని సరిగా ప్రతినిత్యం స్నానమాచరించాలిగానీ, అయితే నదీస్నానం అన్నింటికంటే ఉత్తమమైనదనీ వైద్యగ్రంథాలు, ధర్మశాస్త్రాలు కూడా తెలియజేస్తున్నాయి. ప్రాచీన మధ్యయుగాల్లో దేవాలయాలే వైద్యాలయాలుగా ఉన్నాయి. ఆలయాలన్నీ నదీపరీవాహక ప్రాంతంలోనే వెలిశాయి. అది నేలమీదైనా సరే, కొండలపైన అయినా సరే - నీటి వనరుగల ఆలయాల్లోనే గొప్ప గొప్ప వైద్య పరిశోధనలు సాధ్యపడ్డాయి.

తెలుగునాట అనేక నదులు, వాటి ఉపనదులు ప్రవహిస్తుండటం వల్ల దీన్ని 'నదులరాష్ట్రం' అన్నారు. ముఖ్యంగా కృష్ణా- గోదావరి నదులు పాయలుగా చీలి రాష్ట్రంలో ప్రవహిస్తుండటంవల్ల ఇక్కడి నేలలు సస్య శ్యామలమయ్యాయి. తెలుగువారి సాంస్కృతిక, వైజ్ఞానిక వికాసానికి అవి ఎంతగానో దోహదపడ్డాయి. ముఖ్యంగా కృష్ణానదీ పరివాహక ప్రాంతంలో వైద్యశాస్త్రం వినూత్న ఆవిష్కరణలతో ఆనాటి దేశవిదేశీ పండితుల దృష్టి నాకర్షించింది. అందుకు దోహదపడిన అంశాలను పరిశీలిద్దాం.

పశ్చిమకనుమల్లో మహాబలేశ్వరం వద్ద పురుడు పోసుకుని కర్నాటకంలో పరవళ్ళు త్రొక్కి తెలుగునాట బిరబిరా పరుగులు తీస్తూ హంసల దీవిలో సుతారంగా సముద్రుణ్ణి కలుస్తున్న కృష్ణానదీ మహబూబ్‌నగర్ జిల్లాలోని సిద్ధేశ్వరంలో అడుగిడి, కర్నూలు- ప్రకాశం జిల్లాలను తాకుతూ గుంటూరు - కృష్ణా జిల్లాలను పావనం చేస్తున్నది. తుంగభద్ర, మూసి, భీమరథి, ఘటప్రభ, మలప్రభ దీని ఉపనదులు. ఇవి ఇక్కడి నేలల్ని సారవంతం చేసి వివిధ రకాల వ్యవసాయ, ఉద్యానవన, అటవీ ఉత్పత్తులను ఇబ్బడిముబ్బడిగా సాధించేటట్లు దోహదం చేస్తున్నాయి. ఆహారధాన్యాలు, ఓషధీ ద్రవ్యాలు మొ॥న వాటిని ఉపనదులపై పడవలద్వారా సముద్ర తీరాలకు చేర్చి, అక్కడనుండి విదేశాలకు ఎగుమతిచేసి తెలుగువారు విదేశీవిపణుల్లోనూ కీర్తిపతాకను ఎగురవేశారు. అంతేకాదు విదేశాలనుండి తిరిగివస్తూ వ్యాపారులు అనేక కొత్త ఔషధ ద్రవ్యాల, పండ్ల విత్తనాలను, మొలకలను తెచ్చి,అనుకూలమైన కృష్ణాతీర ప్రాంతాల్లో జామ, బత్తాయి, మిరప, ఖర్జూర, యాపిల్, పొగాకు, వాము, పిస్తా, బొప్పాయి, గులాబివంటి వాటిని నాటి అభివృద్ధి పరచారు. వాటిని ఔషధాలుగా ఉపయోగించే విధానాలను, శుద్ధి ప్రక్రియలను కనుగొన్నారు.

కొండలు, గుట్టలు దాటుకుంటూ ప్రవహించడం వల్ల కృష్ణాతీర ప్రాంతంలోని నల్లమల కొండలు,శ్రీపర్వతం, కొండపల్లి గుట్టలు, ఇంద్రకీలాద్రి కొండలు ప్రాచీన మధ్యయుగాల్లో ప్రభావవంతమైన మూలికలకు స్థావరాలుగా ప్రసిద్ధిచెందాయి. ఈ కొండచరియల్లో ఉన్న నున్న,నూజివీడు, ఉండవల్లి, వెలగపూడి, మందడం, మంగళగిరి, సీతానగరం వంటి ప్రాంతాలనుండి కూడా వర్తకులు విశేషంగా మూలికా ద్రవ్యాలను సేకరించి దేశవిదేశాల్లో అమ్మేవారు. కాకతీయులు, రెడ్డిరాజులు పరిపాలించే కాలంలో ఈ ప్రాంతాలనుండి సేకరించిన ఔషధ ద్రవ్యాలలో బహులాభసాటి వాణిజ్యం జరిగింది. క్రీ.శ. 14వ శతాబ్దిలోఅవచిదేవయ చెట్టి,తిప్పయచెట్టి, శ్వామిచెట్టి అనే వర్తకులు ఈ ప్రాంతాలనుండి మూలికలను స్వయంగా సేకరించి విశ్వవిపణిలో వీటికి గిరాకిని పెంచారు. అవచితిప్పయచెట్టిని శ్రీనాథ మహాకవి 'కిష్కింధాచలక్రీడావినోదు'డని ప్రశంసించాడు. కొత్త కొత్త మూలికా ద్రవ్యాలను సేకరిస్తూ ఇంద్రకీలాద్రిపై తిరగటం ఆయన కొకాట వంటిదని కొనియాడాడు. అక్కడ దొరికే మూలికా ద్రవ్యాల్లో 'రసాల, తమాల, తాళ, నీప, అర్జున, లోధిక, తిందుక, ఆమలక, పనస, ఆమ్ర, పాటలి, సర్ప (గంధి)కురంటక, చందన, నింబ, కేతకి,

భూర్జ,కపిత్థ, పూగ మొదలైన కొన్నింటిని శ్రీనాథుడు పేర్కొన్నాడు. 'నవనాథచరిత్ర' ను రచించిన గౌరన ఏలేశ్వరం ప్రాంతంలో ప్రముఖంగా లభించే మూలికలను ఇలా పేర్కొన్నాడు. 'పనస, చంపక, పారిభద్ర, రసాల, సాల,తిందుక, గంధసాల, హింతాల, ఖర్జూర, కేతకి, పిచుమంద, మందార, అలగరు, కటకపున్నాగ, నాగకేసర, నారంగ, పూగ, తింత్రిణి ఇత్యాది'.

ఇక నల్లమల కొండలపైనా, అడవుల్లోనూ లభించే ఔషధద్రవ్యాల గురించి చెప్పాలంటే ఒకగ్రంథం అవుతుంది. పండితారాధ్యచరిత్ర, బసవపురాణం, ఆనందకందం, రసరత్నాకరం, రసేంద్రమంగళం వంటి ఈ ప్రాంతరచనల్లోనే గాక ఇతర భారతీయ వైద్యశాస్త్రగ్రంథాల్లోను ఇక్కడ లభించే ఔషధద్రవ్యాల ప్రస్తావనలు కోకొల్లలు. మూలికా ద్రవ్యాలకే గాక లోహం వంటి అనేక రసౌషధద్రవ్యాలకు ఈ ప్రాంతం ప్రసిద్ధి పొందింది. అక్కడి గురువులకు, విద్యార్థులకు ఈ ప్రాంతం అత్యంత అనుకూలమైందిగా ఉండేది. అందుకే పరిశోధనలు గొప్పగా సాగాయి.

ఇక్కడ అడవుల్లో నివసించే చెంచులకు, కోయలకు మూలికలను గురించిన విజ్ఞానం ఎంతగా ఉండేదంటే వారు 'వసుమతి సుశ్రుత వ్యాఖ్యానపరులు' అని పాల్కురికి సోమనాథుడు వర్ణించాడు. ఏ నేలలో ఏ మూలికల రస, గుణ, వీర్య, విపాక, ప్రభావాదులు ఉంటాయో చెప్పగల్గటం వసుమతి వ్యాఖ్యాన పరత్వం. అంతేకాదు సుశ్రుతుడు వివరించిన శల్యశాలాక్యవిషతంత్రాలను ఎరిగినవారు అని అర్థం. అంటే ఈ నల్లమల అటవీ ప్రాంతంలో గిరిజన వైద్యం గొప్పగా అభివృద్ధి చెందింది అని అర్థమౌతుంది.

ఔషధాల పుష్కల లభ్యత వల్లనే కృష్ణా పరివాహకప్రాంతంలోని కొండలపై, నదీతీరాలపై అనేక దేవాలయాలు, మఠాలు వెలిశాయి. జైన, బౌద్ధ, శైవ, వైష్ణవ మార్గాలకు చెందిన ఈ ఆధ్యాత్మిక కేంద్రాలు ప్రజలకు విద్యా, వైద్య సేవలందించటంలో పోటీపడ్డాయి. శాతవాహనుల కాలంలో ఆచార్యనాగార్జునుడు మొదట అమరావతిని తర్వాత శ్రీపర్వత (నాగార్జునకొండ) సానువుల్లోని విజయపురిని గొప్ప ఆధ్యాత్మిక, విద్యా, వైద్యకేంద్రాలుగా అభివృద్ధి పరచి, ఆయా ప్రదేశాల్లో ఆరోగ్య, యోగా శిక్షణ కేంద్రాలను నెలకొల్పాడు. ఆసియా దేశాల విద్యార్థులకు, విద్యాసేవలందించాడు. అలాగే జైన మునులైన పూజ్యపాదాచార్యులు నాథ సాంప్రదాయానికి చెందిన సిద్ధులు, శైవమునులు కూడా తమతమ స్థావరాల్లో చేసిన కృషిని కళ్యాణకారకం, ఆనందకందం, నవనాథ చరిత్ర, బ్రహ్మేశ్వరపురాణం వంటి గ్రంథాలు వివరిస్తున్నాయి.

బెజవాడలోని ఉమామహేశ్వరాలయ శాసనాన్ని బట్టి అక్కడున్న శివుని, మహాసేనుని ఆలయాలకు అనుబంధంగా ఉన్న రెండు మఠాలు పేదలకు, రోగులకు సేవలందిస్తున్నాయని తెలుస్తుంది.[4] బ్రహ్మేశ్వర పురాణం, రసజలనిధి వంటి గ్రంథాలు ఆలంపురం (మహబూబ్ నగర్‌జిల్లా) లోని నవబ్రహ్మేశ్వరాలయం రసౌషధ నిర్మాణ ప్రయోగశాల అని సూచిస్తున్నాయి. ప్రాచీనకాలం నుండి అదొక గొప్ప విద్యా కేంద్రమని తెల్పే శాసనాలు లభించాయి. శ్రీశైలం, దాని పరిసర ఆలయాలు, శ్రీశైలం తూర్పు ముఖ ద్వారమైన త్రిపురాంతకం కూడా గొప్ప విద్యా కేంద్రాలుగా, మూలికా వాణిజ్య కేంద్రాలుగా ప్రసిద్ధి పొందాయి.

ఈ విధంగా కృష్ణానదీపరివాహక ప్రాంతం సహజవనరులతో విరాజిల్లటం వల్ల విద్యావైజ్ఞానిక ప్రగతి సుసాధ్యమైనది. ఉద్యానవనాలతో అడవులతో కిక్కిరిసి ఉండడం వల్ల వనౌషధులు, జాంతవ ద్రవ్యాలు, గైరికాదిధాతువులు, ఖనిజౌషధాలు పుష్కలంగా లభ్యమయ్యాయి. కృష్ణానదీతీరంలోని అడవులు, పర్వతప్రాంతాలు ప్రయోగశాలలకు ఆలవాలమయ్యాయి. నల్లమల అడవుల్లో నిరంతరం మునులు, సిద్ధులు తమ శిష్యులతో గూడి ప్రయోగాలు చేస్తుండేవారని నవనాథచరిత్ర, ఆయుర్వేదప్రకాశ వంటి గ్రంథాలు వర్ణిస్తున్నాయి. ఆ నిరంతర పరిశోధనవల్లనే వైద్యశాస్త్రం ఎంతోఅభివృద్ధి చెందింది. అనేక రచనలు సంస్కృతంలోను, తెలుగులోను వెలువడ్డాయి. అంతే కాదు ఔషధద్రవ్యాల గుణగణాలు, శుద్ధిక్రమం,చికిత్సల్లో ప్రభావం వంటి అంశాలతోకూడిన వైద్య నిఘంటువుల రచన కూడా జోరుగా సాగింది ఈ ప్రాంతంలోనే. ఇక్కడ జరిగిన పరిశోధన ఫలితాలతో కూడిన ప్రముఖవైద్య కేంద్రాలను పండితుల కృషిని పరిశీలిద్దాం :

## పరిశోధనలు - వైద్యశాస్త్రగ్రంథాలు

ఆంధ్రలో వైద్యశాస్త్ర పరిశోధన అనగానే తొలిగా గుర్తొచ్చేది ఆచార్య నాగార్జునుడే. ఈయన విద్యాభివృద్ధికి చేసిన కృషి అనితర సాధ్యం. సుదీర్ఘ కాలం పాటు జీవించి, సుదూర ప్రాంతాల్లో పర్యటనలు జరిపి అనేక గ్రంథాలను రచించాడు. ముఖ్యంగా వైద్యశాస్త్రాభివృద్ధికి ఆయన ఎంతో సేవ చేసాడు. తెలుగు గడ్డపైనే కాకుండా చైనా, టిబెట్ దేశాల్లో సైతం తన పరిశోధనా ఫలితాలను పంచాడు. ఈయన సుమారు 21 గ్రంథాలు రచించాడని ప్రతీతి. కానీ, అవన్నీ ఆయనవి కాకపోవచ్చు. కాని విలువైన గ్రంథాలు రచించాడనటంలో అతిశయోక్తి లేదు. టిబెట్‌లో ఈయన రచించిన గ్రంథం భద్రపరచబడింది. దాన్ని ముట్టుకుంటే పిండిలా చేతుల్లోకి వస్తుంది. 'ఆరోగ్యమంజరి' అనే గ్రంథం మనదేశంలో సుప్రసిద్ధమైనదిగా చెప్పబడింది. దేశవిదేశాల్నుండి వచ్చే వైద్యవిద్యార్థుల కోసం ఆయన ఒక ఆరోగ్యశాలను విజయపురిలో నిర్మించినట్లు నాగార్జునకొండ శాసనం వల్ల తెలుస్తుంది. ఆయుర్వేదంలో గాకుండా యోగశాస్త్రంలోనూ శిక్షణనిచ్చేవారని నాగార్జునకొండపై ఉన్న యోగ ప్రదర్శనశాల నమూనా స్పష్టం చేస్తుంది.

అక్కడ జరిపిన త్రవ్వకాల్లో ఘనీభవించిన రసాయన ద్రవ్యాలతో కూడిన గాజుకుప్పె ప్రయోగశాల అస్తిత్వానికి సాక్షి. అయితే వాలుకా యంత్రం, వాహకనాళికలకు బిగించిన గాజుకుప్పెలో గడ్డకట్టిన పదార్థాన్ని పరీక్షల నిమిత్తం పంపగా తిరిగిరాలేదని, వాటి చిరునామా లేకుండా పోయిందని ప్రత్యక్షసాక్షి వేటూరిశంకరశాస్త్రిగారు వాపోయారు. అక్కడికి సమీపంలోని ఏలేశ్వరంలోకూడా ఖనిజౌషధాల తయారీ ఆనవాళ్ళు లభించాయని రాష్ట్రపురావస్తుశాఖ మాజీ డైరక్టర్ కీర్తిశేషులు కృష్ణమశాస్త్రిగారన్నారు.నాగార్జునుని శిష్యుడు ఆత్రేయుడు పాతాళగంగ సమీపంలో రసౌషధ నిర్మాణప్రక్రియల్లో నిమగ్నమై యుండగా, అసూయాపరుల కుట్రకు బలై ప్రాణాలు కోల్పోయాడని సాహిత్యాధారాలు తెల్పుతున్నాయి.

క్రీ.శ. 6వ శతాబ్దినాటికి జగ్గయ్యపేట శాసనంలో భదంత నాగార్జునుని పేరు కన్పిస్తుంది. ఈయన క్రీ.శ. 480-550 సంవత్సరాల మధ్య జీవించాడు. బౌద్ధవైద్య సాంప్రదాయం భదంత సాంప్రదాయంగా పేరొందిందంటే ఈ నాగార్జునుడు వైద్య రంగానికి చేసిన సేవ ఎంత గొప్పదో అర్థమవుతుంది. వీరిద్దరేకాక రససిద్ధులైన మరొక నాగార్జునుడున్నాడు. గౌరవ 'నవనాధచరిత్ర' అ నాగార్జునుని నాథ సాంప్రదాయానికి చెందినవాడుగా చెప్పాడు. ఈయన సిద్ధ నాగార్జునుడుగా వైద్యలోకంలో సుప్రసిద్ధుడయ్యాడు. ఇతని కాలాన్ని గురించి వాదోపవాదాలున్నాయి. కొందరు క్రీ.శ. 6వ శతాబ్దివాడన్నారు. ఇంకొందరు క్రీ.శ.8వ శతాబ్ది వాడనగా మరికొందరు 11వ శతాబ్దివాడని వాదించారు.రసవాది అయిన ఒక నాగార్జునుని గురించి యాత్రికుడు హుమయూన్‌సాంగ్ వివరించటం వల్ల బహుశా భదంత నాగార్జునుడే 'రసకక్షవుటం' లోహశాస్త్రం వంటి గ్రంథాలను రచించి ఉండవచ్చని కొందరి వాదన.

హుయాన్‌సాంగ్ క్రీ.శ.7వ శతాబ్ది ప్రథమార్థంలోనే (క్రీ.శ.630-644) ఇక్కడికి వచ్చివెళ్ళటం,ఆయన తన గ్రంథంలో రసశాస్త్రంతో సహా అనేక శాస్త్రాల్లో పండితుడైన నాగార్జునుని పేర్కొనటం వల్ల శాతవాహన రాజు మిత్రుడైన నాగార్జునుని కంటె భిన్నుడైన 5వ శతాబ్ది నాటి భదంత నాగార్జునుడే రసశాస్త్ర, లోహశాస్త్రాల్లో పండితుడైనవాడని నమ్మటానికి ఎక్కువ ఆస్కారం ఉందని వీరి వాదన.క్రీ.శ 845 ప్రాంతానికి చెందిన ఉగ్రాదిత్యాచార్యుడు తనవైద్య గ్రంథమైన కళ్యాణ కారకంలో తనకు పూర్వుడైన భిక్షు నాగార్జునుడు రస, ఖనిజౌషధాల తయారీలో నిష్ణాతుడని పేర్కొంటూ అతనికి నమస్కరించటం దీనికి కూడా ఊతమిస్తున్నది.

హంసలదీవిలో జన్మించిన బౌద్ధతాత్వికవేత్త స్థవిరబుద్ధపాలితుడు కూడా వైద్యశాస్త్రంలో పండితుడే. ఈయన ఆచార్య నాగార్జునుని రచనల్ని నాగమిత్రుడనే పండితుని శిష్యుడైన సంఘరక్షితుని వద్ద అధ్యయనం చేశానని చెప్పుకున్నాడు. ఆ తర్వాత దంతపురిలో బౌద్ధారామంలో మహా బౌద్ధాచార్యుడిగా ఉంటూ మాధ్యమిక సిద్ధాంతంపై గొప్ప ఉపన్యాసాలిచ్చాడట. తత్త్వశాస్త్రంలో ఎంత ఘనుడో ఔషధ నిర్మాణ ప్రక్రియల్లోను అంతటి గొప్ప నేర్పరి అని 'గుటికాసిద్ధి' ని సాధించాడని బౌద్ధవాఙ్మయం వల్ల తెలుస్తుంది. గులిక, గుళిక అనేవి ఔషధమాత్రలకు సంబంధించిన పదాలు. ఖనిజాలను మూలికల సాయంతో శుద్ధిచేసి, ఖల్వంలో నూరి 40 రోజులు నిల్వ ఉంచి తీసే పద్ధతిని 'ఖజ్జలి' అంటారు. ఆ ఖజ్జలిని మాత్రల రూపంలో తయారుచేసి మోతాదును బట్టి ప్రయోగిస్తారు. బుద్ధపాలితుడు ఈ విధానంలో ప్రయోగాలు చేసి విజయాలు సాధించాడని తారానాధుని సమాచారం వల్ల స్పష్టమౌతుంది.

నల్గొండ జిల్లాలోని కృష్ణాతీరస్థ గ్రామమైన తుమ్మలగూడెంలో లభించిన ఒక శాసనం మాధవవర్మ కుమారుడు,ఇంద్రవర్మ మనుమడు అయిన గోవిందవర్మ (క్రీ.శ. 425-465) బౌద్ధ సన్యాసులకు, అక్కడి ఆరోగ్యశాలలో అవసరమైన మందుల తయారీ నిమిత్తం కొంత ధనాన్ని ఇతర ఏర్పాట్లను చేశాడని తెలియజేస్తున్నది.

కృష్ణానదికి ఉపనది అయినతుంగభద్రా తీరంలో వేదవతి - నాదవతి నదీపాయల మధ్య నెలకొన్న ఆలంపుర నవబ్రహ్మేశ్వరాలయం గొప్ప రససిద్ధుల స్థావరంగా పేరొందింది. ఇక్కడి నవబ్రహ్మల పేర్లు మూలికా విశేషాలతో ముడివడి ఉండటం గమనించవచ్చు. అవి :

1. వీర (బ్రహ్మ) = గజనిమ్మ
2. పద్మ (బ్రహ్మ) = తామర
3. విశ్వ (బ్రహ్మ) = అల్లం
4. కుమార (బ్రహ్మ) = కలబంద
5. అర్క (బ్రహ్మ) = జిల్లేడు
6. బాల (బ్రహ్మ) = కురువేరు
7. తారక (బ్రహ్మ) = బ్రహ్మజెముడు
8. గరుడ (బ్రహ్మ) = బిల్వము
9. స్వర్గ(బ్రహ్మ) = పారదం / రుద్రవీర్యం

రససిద్ధ సాంప్రదాయాభివృద్ధికి శైవులు చేసిన కృషి గొప్పది. అయితే తొలుత ఖనిజౌషధాల తయారీకి ప్రయోగాలుచేసి విజయం సాధించినది మాత్రం అహింసావాదులైన జైనులు, బౌద్ధులు అని చారిత్రక పరిశీలన స్పష్టం చేస్తుంది. తీరాంధ్రలో తొలిగా జైనముని కుందకుందాచార్యులు (క్రీ.పూ. 40 నుండి క్రీ.శ44) పూజ్య పాదాచార్యులు (క్రీ.శ.4వ శ) రేణుకాచార్యులు, ఉగ్రాదిత్యాచార్యుడు (క్రీ.శ.9వ శతాబ్ది) జైనమౌలిక సూత్రమైన అహింసావాదాన్ననుసరించి జీవపదార్థాలను మానవ ఆరోగ్య పరిరక్షణకై మందుల తయారీలో

ఉపయోగించరాదని నిర్ణయించుకొని నిర్జీవమైన ఖనిజాలను శుద్ధిచేసి ఔషధనిర్మాణంలో ఉపయోగించాలని అనేక ప్రయోగాలు చేసి విజయం సాధించారు. ఆచార్య నాగార్జునుడు, భదంత నాగార్జునుడు, స్థవిరబుద్ధ పాలితుడు, సిద్ధనాగార్జునాదులు సైతం దీని అభివృద్ధికి కృషి చేశారు. ఖనిజాలను శుద్ధిచేయటం నుండి తగు పాళ్ళలోకలిపి ఔషధ నిర్మాణం చేయటం, వాటితో సింధూరాది భస్మాలను తయారుచేయటం సాధారణమైన విషయం కాదు. ఔషధద్రవ్యాల సమ్మేళనంలో నిష్పత్తి అటు ఇటు అయితే ప్రమాదకరం. తయారీ క్రమంలో మెళకువగా లేకపోతే గాజుకుప్పెల్లో మిగిలేది శూన్యం. అందువల్ల ఈ రంగంలో పరిశోధన నిరంతరంగా జరిగింది. బౌద్ధజైన మతాల క్షీణత అనంతరం శైవులు ఈ పరిశోధనా కార్యక్రమాన్ని అంది పుచ్చుకున్నారు.

రససిద్ధ సాంప్రదాయాన్ని తొలుత పార్వతీదేవి రావణాసురుడికి నేర్పుగా అది పారంపర్యంగా అగస్త్యుని చేరిందని దక్షిణాదివారి విశ్వాసం. అందుకే దీన్ని అగస్త్య సాంప్రదాయం అనీ రససిద్ధసాంప్రదాయం అని అన్నారు. ఈ విధానంలో ప్రతీదీ పద్ధతి ప్రకారం కొన్నినియమ నిబంధనలను పాటిస్తూ ఔషధనిర్మాణం జరుగుతుంది. రసశాల ఏర్పాటు, వహ్నికర్మ, పేషణకర్మ, శస్త్రకర్మ, క్షాళనాది కర్మ,వేధకర్మ మొ॥న విధానాలను శాస్త్రోక్తంగా నిర్వహించటం, ప్రతినిత్యం రసలింగారాధన చేయటంవంటివి తప్పనిసరి. రసశాస్త్రాన్ని అనుసరించి పాదరసాన్ని శివుని వీర్యంగాను,గంధకాన్ని పార్వతీదేవి (యోగిని /జోగులాంబ) శోణితంగాను భావిస్తారు. అందుకే ఇక్కడ రసలింగం, జోగులాంబ ప్రత్యేకపూజలందుకుంటారు. మంథాన భైరవుడు రచించిన ఆనంద కందము, నిత్యానాథుడు రచించిన రసరత్నాకరము అనే రసశాస్త్ర గ్రంథాలు ఈ క్షేత్రమహాత్మ్యాన్ని గురించి, ఇక్కడ లభించే రసౌషధ ద్రవ్యాల గురించి, వాటిని గుర్తించే పద్ధతిని, శుద్ధిక్రియల గురించి వివరిస్తాయి. ఈ ఆలంపుర క్షేత్రాన్ని శ్రీశైల పశ్చిమముఖ ద్వారమని అంటారు.

## క్రీ.శ.12,13 శతాబ్దాల్లో....

కృష్ణాతీరప్రాంత శాసనాల్లో కూడా కొందరు వైద్య పండితుల ప్రస్తావనలున్నాయి. వారిని కూడా పరిగణనలోకి తీసుకుందాం. ఎందుకంటే వారు గొప్ప పండితులై గ్రంథాలు రచించి ఉండవచ్చు. కాని అవి మనకు లభ్యం కావటం లేదు. కొన్ని లభ్యమైనా గ్రంథకర్త ఎవరో సరిగా గుర్తించలేకపోతున్నాం. అందువల్ల మన దృష్టికి వచ్చిన వైద్య పండితుల కృషిని పక్కన పెట్టకూడదు గదా! క్రీ.శ. 1151,1155 సంవత్సరాలకు చెందిన రెండు బాపట్ల శాసనాలు [16] వైద్య పండితులైన సూర్యదేవ పండితుని, నాగదేవుని, సూరయను, అనంతభట్టును ప్రస్తావించాయి. వీరందరూ ఒకే కుటుంబ పరంపరకు చెందిన వైద్యోత్తములు. వారి గ్రామం 'శాలిబృహదంకురం' గా చెప్పబడింది.అది పెద్దవడ్లపూడి (శాలి = వడ్లు, బృహత్ = పెద్ద) కి సంస్కృతీకరణగా కనబడుతుంది. ఈ గ్రామం గుంటూరు పల్లవుల పాలనలోఉండడం వల్ల దాన్ని శాసనంలో తొండమండలంలోని అంతర్భాగంగా చెప్పటం జరిగింది.[17] ఈ శాసనంలో సూరియమంత్రి బ్రాహ్మక్షత్రియ వంశానికి చెందినవాడని పేర్కొని ఉంది. బహుశా అతడు సైనిక విభాగానికి చెందిన వైద్యుడు కావచ్చు. వెలనాటి గొంకరాజు వద్ద మంత్రి అనీ, కంతపు గ్రామ ప్రముఖుడని శాసనం ప్రస్తావించింది. క్రీ.శ. 1155 నాటి బాపట్ల శాసనం ఆయన భావనారాయణస్వామి ఆలయానికి చేసిన దానాన్ని నమోదుచేసింది. క్రీ.శ. 1151నాటి శాసనం ఈయన కుమారుడు అనంతభట్టు అదే ఆలయానికి చేసిన దానాన్ని గురించి తెల్పుతుంది. దీన్ని బట్టి ఈ కుటుంబీకులు కృష్ణాతీరాన గుంటూరు, కృష్ణాజిల్లాల ప్రాంతంలో వైద్యులుగా, వైద్యాధికారులుగా ఉండేవారని ఆర్థికంగా స్థితిమంతులని స్పష్టమౌతుంది.

శ్రీశైలం అతి ప్రాచీన కాలంనుండి గొప్ప వైద్య కేంద్రంగా గుర్తింపు పొందడం వల్ల భారతదేశంలోని ప్రతి వైద్యవేత్త తన జీవితకాలంలో ఒక్కసారైనా ఔషధాలగని అయిన శ్రీశైలాన్ని దర్శించాలని కోరుకునేవాడు. భారతీయ వైద్యులే కాదు చైనా, టిబెట్,నేపాల్, ఆఫ్ఘనిస్తాన్ మొ॥ న దేశాలనుండి కూడా వైద్యులు వచ్చి ఈ ప్రాంత వైద్యశాస్త్రాభివృద్ధిని ముఖ్యంగా ద్రవ్య గుణవిజ్ఞానాన్ని అధ్యయనం చేసేవారు. రసశాస్త్ర గ్రంథాలన్నింటిలో శ్రీశైల ప్రస్తావన లేకుండా ఉండదు. ఖనిజాలశుద్ధి, భస్మీకరణ వంటి విషయాల్లో ప్రయోగాలు నిర్వహించినది నల్లమల అడవుల్లోనే. పాదరసాన్ని భస్మీకరించిన ఘనత శ్రీశైలం సిద్ధులదే. మొండి వ్యాధుల్ని నయం చేసుకోవాలంటే శ్రీశైలం వెళ్ళాల్సిందేనని సుప్రసిద్ధ వైద్యపండితుడు భావమిశ్రుడు (క్రీ.శ.1480-1550) కూడా సలహా ఇచ్చాడు.

ప్రాచీనకాలంనాటి ధాన్యకటకం మధ్యయుగంలో అమరావతిగా ప్రసిద్ధిపొందింది. ప్రాచీనకాలం నుండి మధ్యయుగం వరకు ఆ ప్రాంతం వైద్య విజ్ఞానకేంద్రంగా సేవలందిస్తూనే ఉంది. సమీపంలోని మలకాపురం, మందడం, వెలగపూడి గ్రామాలు (నేటి రాజధాని ప్రాంతం) వనౌషధులకు ప్రసిద్ధిపొందాయి. అందుకే కాకతీయ రుద్రమదేవి తాను రాజుగా సర్వాధికారాలు స్వీకరించిన తొలి సంవత్సరంలో జరుపుకున్న పుట్టినరోజు సందర్భంగా ఈ గ్రామాలను శైవగురువు గోళకి మఠాధిపతి అయిన విశ్వేశ్వర శివాచార్యులకు దానం చేసింది. అక్కడొక ఆతురాలయాన్ని (ఆసుపత్రిని) జ్వరాలయం, ప్రసూతి ఆలయం అనే రెండు విభాగాలతో నిర్మింపజేసి దానికనుబంధంగా మూలికల సాగుకోసం ఉద్యానవనాలను దానం చేసింది. విశ్వేశ్వర శివాచార్యులు శస్త్రచికిత్సలో నిపుణుడు. శస్త్రచికిత్సలో 8 క్రియలుంటాయి. 1. ఛేద్యం (తెగకోయటం), 2. భేద్యం (చీల్చటం), 3. లేఖ్యం

(గీయటం), 4. వేధ్యం (గుచ్చటం), 5. ఏషం (వెదకటం), 6. ఆహార్యం (లోపలివాటిని బయటికి తీయటం), 7. విస్రావ్యం (స్రవింప చేయటం), 8. సీవ్యం (కుట్టటం) మొదటి, తుది క్రియల్ని నిర్వహించటానికి శస్త్రవైద్యుడు నిష్ణాతులు, సుశిక్షితులు అయిన సహాయకులను నియమించుకుంటాడు. మిగతా శస్త్రకర్మలను తానే స్వయంగా నిర్వహిస్తాడు. శస్త్రచికిత్సకు ముందు పరికరాలను పాయనం (స్టెరిలైజేషన్) చేసుకోవాలి. అందుకోసం అనుభవజ్ఞులైన పరిచారకులను నియమించాలి. ఈ ఏర్పాట్లనన్నింటిని విశ్వేశ్వర శివాచార్యులు చేసుకున్నట్లు శాసనంలో స్పష్టంగా ఉంది. శిరస్సు, ఉదరం, మర్మాంగాల (బీజాలు)కు నిర్వహించే శస్త్రకర్మల క్రమంలో ఆయా శరీర భాగాలను ఛేదించటానికి, తిరిగి కుట్లు వేయటానికి సుశిక్షితులైన వీరభద్రుల (మఠంలో పనిచేసే నిబద్ధ శైవ యువకులను వీరభద్రులంటారు) ను నియమించుకున్నాడు. అలాగే పంచకర్మలను నైపుణ్యంతో నిర్వహించగల కాయ చికిత్సకుణ్ణి (జనరల్ ఫిజీషియన్), కాయస్తుని (రికార్డ్ అసిస్టెంట్ కం కాంపౌండర్) పరికరాలను తయారుచేసే కమ్మరిని, మూలికలను సేకరించేవారిని, మందుల తయారీకి అవసరమైన పాత్రలను అందించే కుమ్మరిని ఇంకా ఇతర సేవకుల్ని నియమించాడు.

ఇంకా ఇటువంటి గోళకీమఠాలను కాళేశ్వరం, మంత్రకూటం, చంద్రవల్లి, నందపురం, కొమ్ముూరు, ఏలేశ్వరం, నివృత్తి (సంగమేశ్వరం), ఉత్తర సోమశిల తదితర ప్రాంతాల్లో నిర్మించి సేవలందించే ఏర్పాటు చేసినట్లు మలకాపురశాసనం తెలియజేస్తున్నది. ఆయా మఠాలకు కాకతీయ గణపతిదేవుడు చేసిన భూదానాలను బట్టి నీటిసదుపాయాల లభ్యతను బట్టి అవి కూడా గొప్ప విద్యా, వైద్యకేంద్రాలుగా ప్రసిద్ధిపొందాయని భావించవచ్చు.

## క్రీ.శ. 14వ శతాబ్దంలో....

కొండవీటి ప్రభువు ప్రోలయ వేమారెడ్డి వేయించిన క్రీ.శ.1340 నాటి మంచాళ్ళ శాసనంలో కూడా కొందరు వైద్యశాస్త్ర పండితులు పేర్లు కన్పిస్తున్నాయి. వారిలో కొండుభట్టు అనుభవజ్ఞుడైన వైద్యుడిగా కన్పిస్తాడు. కొండుభట్టు కుమారుడు రామచంద్రు పండితుడు భోజుని రామాయణ చంపూకావ్యానికి పద్మమంజూషి కావ్యాఖ్యను వ్రాశాడు. ఆ గ్రంథంలో కొండభట్టును "అపరధన్వంతరీ అవతారు"నిగా చెప్పాడు. అతడేదైనా వైద్యశాస్త్రగ్రంథం వ్రాసాడేమో పరిశీలించాల్సి ఉంది. అదే శాసనంలో పెద్దిభట్టు కుమారుడైన పొన్నుపల్లె విశ్వేశ్వరభట్టు కూడా దానగ్రహీతల్లో ఉన్నాడు. ఈయన 'మదన మహార్ణవము' అనే సంస్కృత వైద్యగ్రంథాన్ని రచించాడు.

## మంథాన భైరవుడు (క్రీ.శ. 14వ శతాబ్ది) :

మధ్యయుగాంధ్రలో రసవైద్య చరిత్రను ఒక మలుపు త్రిప్పినవారు మంథాన భైరవుడు, నిత్యనాథుడు. ఇద్దరూ శ్రీశైల ప్రాంతంలో అధ్యయనాలు చేసి, పరిశోధనలు చేసి, అనేక నూతన ఔషధాలను, చికిత్సా విధానాలను ఆవిష్కరించారు. మంథాన భైరవుడు 'ఆనందకందమ్' అనే గ్రంథాన్ని సంస్కృతంలో రచించాడు. ఈ గ్రంథం పార్వతీ పరమేశ్వర సంవాదరూపంలో ఉంది. శ్రీశైల మహాత్మ్యాన్ని గురించి, అక్కడి వాతావరణాన్ని గురించి, చుట్టూ ఉన్న తీర్థాలు, లతలు, వృక్షాలు, ఫలాలు, దుంపలు,పూలు, ఆకులు, గౌరికాదిధాతువులు మొ॥న వాటి లభ్యత, వాటి ఉపయోగాలు మొ॥న అంశాల గురించి వివరించాడు. శ్రీశైల మహాత్మ్యాన్ని గురించి సాక్షాత్తు భైరవుడు భైరవితో ఇలా అన్నాడట. "నేను ఈ పర్వతంపై నివసిస్తూ ఉండటం వల్ల ఈ పర్వతాన్ని నేనే. నాయీ స్థిరరూపం దేవతలచే ఆరాధింపబడుతున్నదని తెలిసికో. ఇక్కడ ఉన్నదే ఇతర చోట్ల ఉంది. ఇక్కడ లేనిది మరెక్కడా లేదని గ్రహించు. మంథాన భైరవుడు శ్రీశైలాన్ని గురించి లోకానికి ఏది తెలియజెయ్యాలని అనుకున్నాడోదాన్ని ఈ విధంగా బయట పెట్టాడు. శ్రీశైలం చుట్టూ నలమల అడవుల్లో అక్కడక్కడా నెలకొని ఉన్న ఘంటా సిద్ధేశ్వరం, చంద్రవాపి, కోకిలాబిలం, స్వర్గపురీశుడు, వజ్రేశ్వరసురేశ్వరులు, జ్యోతి సిద్ధవటం, కండలేశ్వరం, త్రిపురాంతకం మొ॥న చోట్లలో లభ్యమయ్యే విశిష్ట ఔషధ ద్రవ్యాలను, వాటి మహిమలను వివరించాడు. స్పర్శవేధశిలలు, పాదరసము,గంధకం, మైలతుత్తం, తగరం, శిలాజిత్తు, విషపాషాణాదుల వివరాలు, సేకరణ పద్ధతులు వివరించాడు. అనేక ఔషధ నిర్మాణ విధానాలను తెలిపాడు. తాంత్రిక పద్ధతుల పట్ల, మంత్రసిద్ధులపట్ల ప్రజలకున్న ఆసక్తిని బట్టి అటువంటి అనేక విషయాలను, వాజీకరణ, రసాయన ఔషధాలను వివరించాడు. ఈయన కాలాన్ని గురించి కచ్చితంగా తెలియకున్నా నిత్యనాథునికంటె కొంత (20-30 సం॥లు) పూర్వీకుడనే చెప్పాలి. నిత్యనాథుడు క్రీ.శ. 1350 ప్రాంతంవాడు.

## నిత్యనాథుడు (క్రీ.శ.1350) :

రసతంత్ర వైద్యుల్లో సుప్రసిద్ధుడు నిత్యనాథసిద్ధుడు. క్రీ.శ 4వ శతాబ్దిలో శ్రీశైల పరిసరాల్లో ఉంటూ అనేక ప్రయోగాలు చేసి రసతంత్ర వైద్యంలో నూతన ఆవిష్కరణలు చేశాడు. రసౌషధాలను మంత్ర సహితంగా రోగులపై ప్రయోగిస్తే సత్వర ఫలితాలిస్తాయని రసతంత్రజ్ఞుల నమ్మకం. ఈయన రచించిన గ్రంథం 'రసరత్నాకరమ్'. ఈ గ్రంథంలో తననుతాను పార్వతీ తనయుడనని పరిచయం చేసుకున్నాడు. నల్లమల అడవుల్ని ఔషధద్రవ్యాలకోసం జల్లెడ పట్టాడు. అక్కడి చెట్టు, పుట్ట, గుట్ట, మట్టి, నీరు, నింగి, గుళ్ళు, గూళ్లు అన్నీ వాటిలోని అణువణువూ

ఆయన నిశిత పరిశీలనకు గురైనవే. శ్రీశైలపు నాలుగు ముఖద్వారాల్లో సంచరించి అక్కడి వైద్య విశేషాలను గ్రంథస్థం చేశాడు. వస్తుగుణ పరిశోధనలోను, ఔషధనిర్మాణంలోను, ఔషధ ద్రవ్యాల శుద్ధిప్రక్రియ ల్లోను శాస్త్రీయపద్ధతుల్ని వివరించాడు. విషయబాహుళ్యం ఉన్నా కొన్ని చోట్ల అతిశయోక్తులు, మార్మిక, తాంత్రిక పద్ధతులు చోటు చేసుకోవడం వల్ల ఈయన రచన కొంత విమర్శకు గురైంది. అయినా అనేక విష యాల్లో సమకాలీన, తదనంతర రసవైద్యులకీ గ్రంథం ఎంతో మార్గదర్శ కమైంది. సమకాలీన సాహిత్యంలో ఈయన గొప్ప నాథసిద్ధుడిగా పేర్కొనబడ్డాడు.

'ఆయుర్వేదప్రకాశ' అనే గ్రంథాన్ని సంస్కృతంలో రచించిన ఉపా ధ్యాయ మాధవుడు శ్రీశైలప్రాంతంలో ఆయుర్వేద శాస్త్రాన్ని బోధించిన ఆచార్యుడిగా కన్పిస్తాడు. ఇతని రచన గురుశిష్య సంవాద రూపంలో ఉంది. రసప్రక్రియల గురించి శిష్యునికి బోధించే పద్ధతిలో విషయ వివరణ సాగింది. ఈ సంస్కృత గ్రంథంలో తెలుగు పదాల ప్రయోగం కన్పిస్తుంది. ఉదాహరణకు మేలిమి బంగారాన్ని 'వరకం' అని ప్రయో గించాడు. ఇది తెలుగుపదం. నేటికి తెలుగువారు 'వరకట్టడం' అంటే సానపైరుద్ది బంగారంలోని మేలిమిని తేల్చి చెప్పటం అనే అర్థంలో వాడతారు. 'నవనాథచరిత్ర' లో వర్ణించిన గురుశిష్యుల రసప్రక్రియల ప్రయోగాలను తలపించే వర్ణనలే ఆయుర్వేదప్రకాశలోను కన్పిస్తాయి. ఆంధ్రదేశంలో ఈ శాస్త్రప్రక్రియలపై వచ్చిన గ్రంథాల్లో ఇది కూడా విలువైనది.

## పులపాక తెలుగురాయలు (క్రీ.శ. 1365-1440):

కృష్ణాజిల్లాలోని శ్రీకాకుళానికి అత్యంత సమీపంలో ఉంది పులిపాక గ్రామం. శ్రీకాకుళంలో తెలుగు రాయలు (ఆంధ్రమహా విష్ణువు) కొలువై ఉన్నాడు. ఆయనపేరే ఆయనకు పెట్టారు తల్లిదండ్రులు. ఈయన సంస్కృతంలో రచించిన 'నిదానయోగ రత్నావళి' తాను సింగమదేశికుని పుత్రుడనని పరిచయం చేసుకున్నాడు.

శ్రీనాథుడు తనకు సమకాలికుడైన తెలుగు రాయల గురించి ప్రస్తావించాడు. తెలుగు రాయల మరణానికి చింతిస్తూ "రంభగూడె తెలుంగు రాయరాహుత్తుండు-కస్తూరికే రాజు ప్రస్తుతింతు' అని చింతించాడు. తెలుగు రాయలు బహుశా సైనికవైద్యాధికారి కావచ్చు. అశ్వకదళంలో వెళ్ళి యుద్ధరంగంలో అత్యవసరసేవలందించే వైద్యుడ వటం వల్ల 'రాహుత్తుండు' అనే విశేషణాన్ని వాడాడు.

శాసనాధికారాలను పరిశీలిస్తే జలసూత్రధారి అయిన సింగయ దేశికుడు క్రీ.శ. 1363 నాటి పోరు మామిళ్ళ శాసనంలో కన్పిస్తాడు. ఆరువేల నియోగి కుటుంబానికి చెందిన ఈయన కుమారుడే తెలుగు రాయలు అయి ఉండవచ్చు. సింగయదేశికుడు క్రీ.శ. 1363 నాటికి సుమారు 30 సంవత్సరాలవాడైతే దాదాపు ఆ కాలాన్ని తెలుగు రాయల జననకాలంగా తీసుకున్నా శ్రీనాథుడు పేర్కొన్న తెలుగు రాయలు ఇతడే అనుకోవాలి. ఒంట్లో ఏ నలత కల్గినా కస్తూరిమాత్రలు వంటివి ఇవ్వటం లేదా వాజీకరణ ద్రవ్యంగా కస్తూరిని ఇవ్వటం వంటి వాటితో శ్రీనాథుని ప్రాణరక్షకుడిగా, సఖుడిగా ఉన్నాడేమో, ఆయన మరణానికి చింతిస్తూ చాటుపద్యంలో చెప్పాడు. దీన్ని బట్టి తెలుగురాయలు క్రీ.శ 1360-1440 సం॥ల మధ్య జీవించినవాడిగా భావించవచ్చు.

మద్రాస్ ప్రాచ్యలిఖిత భాండాగారంలో పులపాక తెలుగురాయలు రచించిన 'నిదానయోగ రత్నావళి' ప్రతులు రెండున్నాయి. రచనాభాష సంస్కృతం అయినా లిపి మాత్రం తెలుగు. తెలుగు వ్యాఖ్యానం కూడా ఉంది. అయితే ఇవి అసలు ప్రతిని చూసి గ్రహించిన ప్రతులు కావచ్చు. రచయిత పేరును వ్రాయసకాడు 'తెల్కురాయలు' అని వ్రాశాడు. రచయిత వ్యాధి లక్షణాలను శాస్త్రీయంగా కనుగొనే పద్ధతుల్ని, చికిత్సా పద్ధతుల్ని తన గ్రంథంలో వివరించాడు.

## బసవరాజు (క్రీ.శ. 1470- 1535)

ఆంధ్ర వైద్యశాస్త్ర గ్రంథాల్లో తలమానికం 'బసవరాజీయం'. ఈ గ్రంథాన్ని రచించినవాడు నీలకంఠ కొట్టూరు బసవరాజు. ఈయన నమశ్శివాయ సుపుత్రుడనని, ఆరాధ్యరామదేశికుని శిష్యుడనని చెప్పు కున్నాడు. తాను కవిత్వ రచనలో దిట్టనని, వైద్యులకు తలమానికం వంటి వాడనని చెప్పుకున్నాడు. దానిలో ఏమాత్రం అతిశయోక్తి లేదని ఆయన రచనను చదివితే అర్థమౌతుంది. అనేక విధాలుగా ఈ గ్రంథం ప్రత్యేకమైనది. ఎక్కువగా ఉపయోగపడిన గ్రంథం కూడా అని ఘంటా పథంగా చెప్పొచ్చు.

ఈయన స్వస్థలం గురించి స్పష్టంగా ఇంతకుముందు చెప్పలేదు. కాని మనకిప్పుడు ఒక శాసనాధారం లభించింది. ఈయన తండ్రి గారి గురువు ఆరాధ్య రామదేశికుడు నిడిమామిడి గ్రామానికి చెందినవాడు. ప్రస్తుతం నిడిమామిడి గ్రామం కన్పించుటలేదు. బహుశా విజయవాడ సమీపంలోని నిడమానూరు దానికి భ్రష్టరూపం కావచ్చు. గుంటూరు జిల్లా చేజెర్ల (సత్తెనపల్లి దగ్గర) లోని శివాలయంలో ఈయన తండ్రి నమశ్శివాయ శ్రీకరణపు అధికారిగా పనిచేశాడు. ఆ ఆలయానికి సంబంధించిన ముఖ్య అధికారి ఈయనే. ఆ ఆలయానికి అను బంధంగా ఒక మఠం, అందులో గురువులు (శిష్యులు) విద్యార్థులు ఉన్నట్లు ఆ అందరి జీతభత్యాలకోసం పెద్దపాడు గ్రామాన్ని నమశ్శివా యవారికి కృష్ణదేవరాయలు ఆజ్ఞమేరకు క్రీ.శ.1517 (జూన్ 19న) లో సాళువ తిమ్మరుసు దానం చేసినట్లు చేజెర్ల శాసనం తెలియ జేస్తున్నది. ఆ గ్రామ ఆదాయాన్ని ఆలయ ఉద్యోగులకు, శిష్యులకు,

ఆశ్రమవాసులైన విద్యార్థుల పోషణకు, ఆలయంలో ప్రతిష్ఠితమైన కపోతేశ్వర, ఇష్టకామేశ్వర ఉత్సవదేవుడు, విష్ణువు, భైరవుడు, కుమార స్వాములకు ప్రసాదాలు; ఇతర కైంకర్యాలకు వాటాలు ఆ శాసనంలో స్పష్టంగా నమోదు చేశారు. గ్రంథాదిలో బసవరాజు కూడా అదే దేవుళ్ళకు అంటే విష్ణువు, శివుడు, బ్రహ్మ, సరస్వతి, విఘ్నేశ, కుమార స్వామి; భైరవులకు నమస్కరించే తొలిశ్లోకంతో గ్రంథరచనను ఆరంభించాడు. చేజెర్ల అప్పటికే వారికి సర్వమాన్య అగ్రహారంగా ఉన్నట్లు చెప్పబడింది. దీన్ని బట్టి కొటూరు కూడా ఆ పరిసర గ్రామమే అయి ఉండవచ్చు. చేజెర్ల మఠంలో ఇతర అధ్యాపకులు, విద్యార్థులు కూడా ఉన్నట్లు స్పష్టమౌతుంది.

బసవరాజీయంలోని మూలికలపేర్లు, రోగాలపేర్లు, గుంటూరు, కృష్ణాజిల్లాల మాండలికంలోనే ఉన్నాయి. **ఉదా :** గొడ్డుకాకరాకు, గువ్వగుత్తాకు, ఎలుకచెవి ఆకు, బుడ్డకాచాకు, బలురక్కసి, కోలముక్కి చెక్క, కొమ్మనపిండివేళ్ళు, దుచ్చేరు, గొల్లజిడ్కి (గొల్ల జిడ్డాకు); పులిసేరు ఆకు, చెన్నంగి ఆకు, ముసిమోరగడ్డ, కండ్లదూలమాడలు, చేరుపరి పాకు, నాగసరపుగడ్డ, అలముక్క బ్రహ్మదండి, వజ్రనీలి, మదనబుడత, కవ్వలదండి, వెలమసంధి, గాడిదగడపాకు, హంసపాది, రేవలచిన్ని, మాచికాయ, హస్తిపాల, హస్తికుండి మొ॥నవి. ఇవన్నీ కృష్ణాతీర గ్రామాల్లో దొరికేవి. సామాన్యులు గుర్తించి వాడుకునేవి. వీటికి సంస్కృత పేర్లు లేకపోవటం వల్ల బసవరాజు సంస్కృత శ్లోకాల్లో స్థానిక పేర్లతో పేర్కొన్నాడు.

తాను అధ్యయనం చేసిన గ్రంథాల చిట్టాను పొందుపరచాడు. అవి :చరకం, మాధవకల్పం, భైరవ కల్పం, వాగ్భటం, సిద్ధవిద్యాభూః, సిద్ధరసార్ణవం, భేషజకల్పం, జతూకకర్ణకం, మాధవీయం, అశ్వనీయం, ఆయుర్వేదం, సింధూర దర్పణం, పూజ్యపాదీయం, దేవీశాస్త్రం, చంద్రకల్పం; బ్రహ్మగారుడం, చింతామణి; జ్యోతిష్యం, కాశీఖండం, శారీరం, సూత్రం; నిత్యనాథీయం, నందినాథీయం, అగ్నిమతాంతరం, మతాంతరం, అన్యశాస్త్రం (యునానీ?) చికిత్సాసార, సిద్ధసంగ్రహం, కర్మవిపాకం, రేవణసిద్ధకల్పం. తాను తన రచనను సులభగ్రాహ్యమైన భాషలో, అవసరమైనచోట్ల తెలుగు పద్యాలతో, అదేసమయంలో సమగ్రతల వైద్యశాస్త్ర గ్రంథంగా వ్యాధుల లక్షణాల విపుల వివరణలతో రచిస్తున్నానని చెప్పుకున్నారు.

బసవరాజు అధ్యయనం చేసిన గ్రంథాల చిట్టాను పరిశీలిస్తే ఆయన 15వ శతాబ్ది ప్రథమార్థం కంటే ముందే తన రచనను పూర్తి చేశాడని తెలుస్తుంది. శ్రీనాథుడు రచించిన 'కాశీఖండం' (క్రీ.శ.1435) చదివానని పీఠికలో చెప్పుకోవడమే కాకుండా దానిలోని పద్యాలను ఉటంకించాడు. మేహరోగ చికిత్సల్లో ఫిరంగి చెక్క వాడకాన్ని తొలిగా ప్రతిపాదించినవాడు బసవరాజే. కాని అప్పటికింకా ఫిరంగరోగం (సిఫిలిస్) సమాజంలో ప్రవేశించలేదు. ఈరోగం పోర్చుగీసువారి సంపర్కంతో తీరాంధ్రలో సోకింది. పోర్చుగీసువారిని మనవారు 'ఫిరంగులు' అనేవారు. వారే తొలిగా చైనానుండి ఫిరంగిచెక్కను క్రీ.శ. 1500 ప్రాంతంలో ఇక్కడికి తెచ్చారు. దాన్ని మేహరోగాల్లో బసవరాజు మాట వైద్యులు ప్రయోగించి సత్ఫలితాలను సాధించారు. ఫిరంగులు తెచ్చిన మూలిక గనుక ఫిరంగిచెక్క అనీ; చైనా నుండి వచ్చింది గనుక 'చీనీజం' అనీ అన్నారు. భావమిశ్రుడు (క్రీ.శ.1480-1540) మొట్ట మొదటగా ఫిరంగరోగాన్ని గుర్తించి తనగ్రంథం 'భావప్రకాశ' లో వివరించాడు. రసౌషధాలే ఈ వ్యాధికి సరైనవని చెప్పినా ఫిరంగిచెక్క /చీనిజం వాడకాన్ని ఇతర మేహరోగాలతో పాటు సిఫిలిస్ లేదా సవా రోగానికి చికిత్సామూలికగా గుర్తించాడు. ఆయన రచన సుమారు క్రీ.శ 1500-35 ప్రాంతంలో జరిగి ఉంటే బసవరాజు సిఫిలీస్ ఇంకా సమాజంలో సోకకముందు అంటే క్రీ.శ 1500-1520 మధ్యకాలంలో తన రచనను పూర్తిచేసి ఉంటాడు.

బసవరాజీయం 25 అధ్యాయాలుగా ఉన్న విపులగ్రంథం. ఆయన వివరించిన నిదానం (డయాగ్నసిస్) విద్యార్థులకు సులువుగా అర్థమయ్యే టట్టున్నది. ముఖ్యంగా చికిత్సా ప్రక్రియల్లో కొత్త కొత్త ప్రయోగాలు చేయటంలో బసవరాజు దిట్ట అని ఈ రచనను చదివితే అర్థమౌతుంది. అత్యవసర పరిస్థితిలో స్వల్ప పరిమాణంలో విషపాషాణాదుల్ని సైతం ప్రయోగించి రోగి కోలుకుంటున్న దశలో విరుగుళ్ళనిచ్చి స్వస్థత చేకూర్చే నేర్పరి ఆయన. చిన్నపిల్లల్లో వచ్చే నీరుచవ్వ, కప్పనానుడు, జంతికపుండు వంటి వ్యాధుల్ని, స్త్రీలలో వచ్చే చీరె రోగచికిత్స వంటి వాటిని కృష్ణాతీరంలోని జానపదుల భాషలోనే వివరించి వాటికి చికిత్సా విధానాలను స్థానికంగా దొరికే ఔషధద్రవ్యాల ప్రయోగంతోనే వివరించాడు. ఔషధ తయారీ యంత్రాలను వివరించాడు.

పాదరసాన్ని భస్మీకరించి చికిత్సల్లో విరివిగా వాడాడు. సర్పవిషాన్ని సైతం అవసర సమయంలో ప్రయోగించటానికి వెనుకాడలేదు. ఔషధద్రవ్యాల శుద్ధిక్రియల్లో, ఔషధనిర్మాణంలోను కూడా అనేక పరిశోధనలు చేసి కొత్తవాటిని ఆవిష్కరించాడు. ఈయన కనుగొన్న కాంతవల్లభరసం, పూర్ణచంద్రోదయం అనే మందులకు సమాజంలో ఎంతటి విశేష ఆదరణ ఏర్పడిందంటే కవులు తమ కావ్యాల్లో సూర్యోదయ వర్ణనల్లోను, శృంగార సన్నివేశాల వర్ణనలోను ఈ గుళికలను ఉపమ, రూపకాలంకారపూరితంగా ప్రస్తావించారు. ఈరెండూ వాజీకరణౌషధాలు. ఇంకా ఈయన కనుగొన్న ఇతర ఔషధాలు : ఆనందభైరవి, మృత్యుంజయరసం, వైష్ణవీరసం, స్వచ్ఛంద భైరవి అనే సౌమ్యగుణం గల ఔషధాలుకాగా కాలకూటం, కాలాగ్ని, రుద్ర రసం, మృతసంజీవరసం, మృతోత్తపనరసం, తరుణార్కం, మహా తరుణార్కరసం, సమగరళతరుణార్కం, సూచికాముఖరసం (టీకా

వంటిది.) సూచికాభరణరసము (ఇంజెక్షన్ వంటిది) అనే ఔషధాలు, వాటి ప్రయోగ విధానం పూర్తిగా బసవరాజు కృషిఫలితాలే. అగ్ని కర్మల (చురకల) విషయంలో కూడా స్వానుభవాన్ని పురస్కరించుకొని కొత్తకొత్త చికిత్సా పద్ధతుల్ని వివరించాడు. ఇలా చెప్పుకుంటూపోతే అనేక విధాలుగా బసవరాజు పరిశోధనాఫలితాలు అనేకం వైద్యశాస్త్రం లోను ప్రజల అనుభవ వైద్యంలోను వచ్చి చేరాయి. అందుకే 'కృతౌచరకః ప్రోక్తః... కలౌబసవకఃస్మృతః' కృష్ణాతీర ప్రాంత వైజ్ఞానిక చరిత్రలో బసవరాజు వజ్రం లాంటివాడు.

## వీరకృష్ణుడు (క్రీ.శ.1525) :

మధ్యయుగంలో వచ్చిన మతోద్యమాలు సాంఘిక సంస్కరణకు, సాంస్కృతిక వికాసానికి కూడా దారితీసాయి. శైవులు, వైష్ణవులు తమ తమ మతశాఖలనభివృద్ధి చేసుకోవాలనే ప్రయత్నంలో భాగంగా సమాజసేవలో పోటీపడ్డారు. కులాల హెచ్చుతగ్గులను రూపు మాపాలనీ, అన్ని కులాలవారికి విజ్ఞానాన్నిపంచాలని, విద్యావంతులను చేయాలని ప్రయత్నించారు. ముఖ్యంగా వైద్యసేవల ద్వారా, విద్యా ప్రచారం ద్వారా ఎక్కువ మందిని తమ రెక్కల క్రిందికి తెచ్చుకోవాలని తాపత్రయపడ్డారు. దేవాలయాలు, మఠాలు కేంద్రాలుగా ఈ కార్య కలాపాలు ఎక్కువగా జరిగాయి. కొత్తగా చోటు చేసుకున్న ఈ పరిణామాల వల్ల చాలామంది కవులు, పండితులు, శూద్రకులాలనుండి కూడా వచ్చారు. వారిలో చెప్పుకోదగినవాడు వీరకృష్ణుడు. ఇతడు క్రీ.శ.16వ శతాబ్దివాడని ఈయన గురువు సుదర్శనాచార్యుని ప్రస్తావనలు దారిచూపుతాయి.

కర్నూలు జిల్లాకు చెందిన వీరకృష్ణుడు గోపదేవి, వీరరాఘవ దంపతుల పుత్రుడు. యాదవ కులస్తుడు. సుదర్శనాచార్యుల శిష్యుడు. సుదర్శనాచార్యుడు శ్రీశైల పూర్ణసంప్రదాయానికి చెందిన వైష్ణవగురువు. ఈయన విజయనగర అరవీటి రామరాయలకు కూడా గురువు. క్రీ.శ. 1523లో కృష్ణదేవరాయలచే సన్మానం పొందాడు. శ్రీశైలపూర్ణ వైష్ణవ పరంపరలో గొప్ప గురువులనేకులున్నారు. వీరు సమాజసేవలో భాగంగా కులసమానత్వాన్ని స్త్రీ పురుష సమానత్వాన్ని, వైద్యం వంటి విజ్ఞాన శాస్త్రాల ప్రాధాన్యతను సమాజంలో ప్రచారం చేశారు. అందువల్లనే వీరకృష్ణుడు తాను గోపదేవి పుత్రుడననీ తల్లిపరంగా పరిచయం చేసుకుని తన పేరులో తండ్రి పేరును కలిపి వీరరాఘవకృష్ణుడనని చెప్పుకున్నాడు. చాకలి, గొల్ల, మాల, సాలె, మొ॥న వారి జానపద వైద్యవిధానాలు అశాస్త్రీయాలనీ, అనుసరణీయాలు కావని నిరసించిన ఆ రోజుల్లో గొల్లకులంలో పుట్టిన వీరకృష్ణుడు వైద్యాన్ని శాస్త్రీయంగా అభ్యసించి సమాజసేవ చేయుటమే గాక గ్రంథరచన కూడా చేశాడు. ఆయన రచించిన 'కాయచికిత్సలు' అనే వైద్యగ్రంథం మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉంది.

వీరకృష్ణుడు ఒక వైష్ణవ మతంలోని వైద్యుడై ఉండవచ్చు. ఈ గ్రంథంలో మంత్రవాదరహస్యాలు, మార్మిక విద్యలు, ఇంద్రజాలం, తంత్రాలు, యంత్రాలు వివిధ వ్యాధుల చికిత్సలు వివరితమయ్యాయి. దీన్ని పరిశీలించిన సంపాదకులు 'ఈ గ్రంథం అనేక విలువైన చికిత్సలతో కూడిన గ్రంథం' అని పేర్కొన్నారు.

## చిలకమర్రి వేంకటాచార్యులు (క్రీ.శ. 1550)

ఈయన 'భేషజకల్పమ్' అనే సంస్కృత వైద్యగ్రంథాన్ని తెలుగులోకి అనువదించాడు. తాను శరణ్యా పాదాచార్యుని పుత్రుడనని, కందాళ రంగాచార్యుల శిష్యుడనని చెప్పుకున్నాడు. కందాళ రంగాచార్యులు భావనాచార్యుని పుత్రుడు. వీరి గురించిన సమాచారం ఇతర సాహిత్య గ్రంథాల్లోను, శాసనాల్లోను కన్పిస్తుంది. క్రీ.శ.16వ శతాబ్ద మధ్యభాగంలో అంటే సుమారు1550 ప్రాంతంలో వీరి జాడలు కన్పిస్తున్నాయి. కందాళ కుటుంబం శ్రీశైల పూర్ణకుటుంబం వలెనే విద్యావైద్యసేవలను ఆధ్యాత్మిక చింతనతో పాటు అందించాయి. గుంటూరు జిల్లా అనుమర్లపూడి గ్రామాన్ని కందాళ రంగాచార్యులు దానంగా పొంది గురువుగా, వైద్యుడిగా సేవలందించాడు. బహుశా చిలకమర్రి వేంకటాచార్యులు అక్కడే విద్య నభ్యసించారు. ఈయన రచించిన ఆంధ్రభేషజకల్పము తెలుగునాట బహుళప్రచారం పొందింది.

## తాడేపల్లి పానకాలరాయుడు (క్రీ.శ.1530-1590) :

ఈయన 'నేత్రదర్పణము' అనే కంటివైద్య గ్రంథాన్ని తెలుగులో రచించాడు. కొండవీటిసీమలోని తాడేపల్లి గ్రామం తన స్వస్థలమని వెంకన్న, మహాలక్ష్మమ్మల కుమారుడనని, సుబ్బారాయుడు, రంగామాత్యుడు తన తాతముత్తాతలనీ వెంకటపతిరాయలు, సీతాపతిరాయలు తన అన్నలనీ చెప్పుకున్నాడు. వీరందరూ రాజసన్మానాలను, అగ్రహారాలను పొందినవారని చెప్పాడు. బహుశా రాజవైద్యులుగానో, సైనిక శాఖలో వైద్యులుగానో పనిచేసి ఉంటారు. తాడేపల్లి మంగళగిరి సమీపంలో ఉన్నది. అక్కడ పానకాలరాయుడి (స్వామి) పేరునే తండ్రి వెంకటాచార్యుడు ఇతనికి పెట్టినట్లున్నది. మాతృభూమి అయిన కొండవీటిసీమపై, నృసింహస్వామిపై ఆయనకున్న అపారమైన గౌరవం, భక్తి విశ్వాసాలు ఆయన రచనల్లో వ్యక్తమవుతాయి.

కంటివైద్యంపై ప్రత్యేకంగా ఒక గ్రంథాన్ని రచించిన ఘనత పానకాల రాయునికి దక్కుతుంది. వైద్యశాస్త్ర ఉన్నతిని గురించి చెప్తూ పరోపకారానికి తావున్న వృత్తి గావటం వల్ల ఈ శాస్త్రం అన్ని శాస్త్రాల కంటే గొప్పదిగా వెలుగొందుతున్నదంటాడు. అన్నివైద్యశాస్త్రగ్రంథాలను చూసిన తర్వాత 'సర్వేంద్రియానాం నయనం ప్రధానం' అన్నారు. గనుక నేత్రవైద్యం పై ప్రత్యేక గ్రంథాన్ని జనులందరికీ సులభంగా అర్థమయ్యేటట్లు అద్దంలో కన్పించేటంత తేటతెల్లంగా తెలుగులో

వ్రాయాలని పూనుకున్నాడు. కట్లు, పట్లు, అంజనాలు, ఔషధాలు, నస్యాలు, ఆహార పథ్యాలు, తైలాలు, శస్త్రచికిత్సలు అనే ఎనిమిది విభాగాలుగా నేత్ర వైద్యశాస్త్రాన్ని వివరించానని మంగళాచరణ వాక్యంలో చెప్పాడు. అయితే ప్రస్తుతం మనకీ గ్రంథం పూర్తిగా లభ్యం కావటం లేదు. మొదటి 4 భాగాలుగా మాత్రమే దొరుకుతున్నాయి. శస్త్రచికిత్సల్లో నేత్రాలకు ధరించే అద్దాల గురించి చెప్పి ఉంటాడేమో తెలియదు. ప్రస్తుతం దొరుకుతున్న గ్రంథంలో మొదటి నాలుగు అధ్యాయాలు, గ్రంథంలోని చివరి పుట మాత్రమే ఉన్నాయి. కొంత భాగం పోయిందో లేక వారసులు శాస్త్రవిజ్ఞానాన్ని కుటుంబపరంగా రహస్యంగా ఉంచాలనుకున్నారో తెలియదు.

నేత్రదర్పణంలో పానకాలరాయుడు వృత్తి ఔన్నత్యాన్ని గురించి, వ్యాధుల నిర్ధారణ పరీక్షల గురించి, చికిత్సావిధానాల గురించి అనేక విషయాలు చర్చించాడు. నేత్రవ్యాధుల్లో అనేక కొత్త విషయాలను ఆవిష్కరించాడు. ఇంతకుక్రితం శార్ఙ్గధరుడు (క్రీ.శ.1360) 'శార్ఙ్గధర సంహిత' లో 76 రకాల కంటివ్యాధులను వివరించాడు. ఆ తర్వాత భావమిశ్రుడు (క్రీ.శ.1480-1540) 78 రకాలను గుర్తించి వివరించాడు. పానకాలరాయుడు తన పరిశోధనలో 96 రకాల వ్యాధుల్ని గుర్తించాడు. చికిత్సల్లో కూడా అనేక ప్రక్రియల్ని ఆవిష్కరించాడు. ఒక్క అంజనాల్లోనే 136 రకాలను వివరించాడు.

కృష్ణా పరీవాహక ప్రాంతంలో సాగిన శాస్త్రపరిశోధనానిబద్ధతకు, పరిశీలనాశక్తికి, సేవాతత్పరతకు అద్దంపట్టే గ్రంథం 'నేత్రదర్పణం'.

### త్రిమల్లభట్టు (క్రీ.శ.1550-1620) :

మధ్యయుగాంధ్రదేశ వైద్యులందరిలో బసవరాజు తర్వాత చెప్పుకోదగ్గవాడు త్రిమల్లభట్టు. ఈయన దాదాపు ఎనిమిది వైద్యగ్రంథాలను రచించాడు. అవి ధన్వంతరీయనిఘంటు, ఋతుచర్య, పద్ఋతువర్ణనమ్, శతశ్లోకి, మత్తమాణిక్యమాల, ద్రవ్యగుణశతశ్లోకి, యోగతరంగిణి (తెలుగులో), బృహద్యోగతరంగిణి (సంస్కృతం) ఈయన రచనల తాళపత్ర ప్రతులు భారతదేశంలోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారాలన్నింటిలోను కన్పిస్తాయి. దాన్నిబట్టి ఈయన రచనలకు దేశవ్యాప్తంగా ఎంతటి ప్రాచుర్యం ఉండేదో అర్థమౌతుంది.

త్రిమల్లభట్టు తాను త్రిలింగదేశంలోని త్రిపురాంతకం (నేటి ప్రకాశం జిల్లా) లో అవస్తంభసూత్రం, ఆర్వేలనియోగి కుటుంబంలో జన్మించాననీ, తాత సింగనభట్టు, తండ్రి వల్లభపండితుడనీ, రామయ్య, గోపయ్యలు తన తమ్ముళ్ళనీ పేర్కొన్నాడు.[43] ఈ కుటుంబమంతా వైద్య పండితులుగానే కన్పిస్తున్నారు. తమ్ముడు రామాపండిత వైద్యులుంగారు శ్రీరంగరాయదేవమహారాయలు రాజ్యం చేస్తుండగా గొబ్బూరి దేవమహారాజు నుండి నాదెండ్ల అగ్రహారాన్ని పొందినట్లు నాదెండ్ల శాసనం తెల్పుతుంది.

త్రిమల్లభట్టు రచనలన్నీ నాటి వైద్యులకు, విద్యార్థులకు కరదీపికలయ్యాయి. ఔషధద్రవ్యాల రస,వీర్య, గుణ, విపాక ప్రభావాదులను వివరించిన ధన్వంతరి నిఘంటువు నేటికీ ఉపయోగపడుతున్నది. దేశీయంగా లభ్యమయ్యే మూలికలను, ఇతర ఔషధ ద్రవ్యాలను కనుగొని చికిత్సల్లో ఉపయోగించుకోవటానికిది ఎంతో దోహదకారి. యోగ తరంగిణిలో త్రిమల్లభట్టు 81 తరంగాల్లో వివిధ జబ్బులకు చికిత్సలను వివరించాడు. ఇతడు తన రచనల్లో శార్ఙ్గధర సంహిత, మదనపాల నిఘంటు, లోలంబరాజీయము, భావప్రకాశ గ్రంథాల్లోని విషయాలను ప్రస్తావించాడు.

### అయిజ శ్రీనివాసాచార్యుడు (క్రీ.శ.1560-1625) :

అలంపురం సమీపంలోని అయిజగ్రామాన్ని అగ్రహారంగాపొందిన పండిత కుటుంబం శ్రీనివాసాచార్యులది. ఈయన 'చికిత్సా తిలకమ్' అనే వైద్యగ్రంథాన్ని సంస్కృతంలో రచించాడు. పూర్వ గ్రంథాలన్నింటిని అధ్యయనం చేసిన విజ్ఞానానికి తన ఆవిష్కరణను జోడించి చేసిన రచన ఇది. శాస్త్రంలో ఇంతకుముందు విపులంగా వివరించని వాటిని, అసలే వదిలేసిన అంశాలను ఒక క్రమపద్ధతిలో వైద్య పండితులకు, విద్యార్థులకు విపులంగా అర్థమయ్యేరీతిలో రచన సాగించాడు. ఈయన తెలుగు, కన్నడ ప్రాంతాల సరిహద్దు ప్రాంతానికి చెందినవాడవటం వల్ల సంస్కృత రచనలో తెలుగు, కన్నడపదాలు, మూలికల పేర్లు కన్పిస్తాయి.

సృష్టి, స్థితి,లయ కారకుడైన దైవం విష్ణుమూర్తి ధన్వంతరికి ఆయుర్వేదాన్ని బోధించగా, ధన్వంతరి దత్తాత్రేయుని అవతారమెత్తి అగ్నివేశాదులకు ఈ శాస్త్రాన్ని బోధించాడని పేర్కొన్నాడు. పంచకర్మ చికిత్సా విధానాన్ని విపులంగా వివరించాడు. పిల్లలవ్యాధుల వివరణ, చికిత్సలలో క్రితం రచనలకంటే మంచి అభివృద్ధి కన్పిస్తుంది. తల్లిపాల అమృతత్వాన్ని, చెవి, ముక్కు, గొంతు వ్యాధుల చికిత్సా విధానాలను చక్కగా వివరించాడు.

గ్రంథాంతగద్యలో తన గ్రంథాన్ని పరిశీలించి అంగీకరించాలని విజ్ఞులైన వైద్య పండితులను వేడుకోవటం ఆయన వినమ్రతను తెలియజేస్తుంది. మొత్తం 130 అధ్యాయాలతో ఉండవలసిన గ్రంథం కేవలం 40 అధ్యాయాలతో కూడిన సూత్రస్థానం ఒక్కటే లభిస్తుంది.

తోటలను పెంచి ఉద్యానవన కృషి చేయాలనుకునేవారికి 'ఉద్యాన వర్గ' అనే అధ్యాయం లభిస్తే ఎంతో ఉపయోగపడుతుంది. మధ్య యుగంలో రసవైద్యం బహుళ ప్రాచుర్యం పొందింది. అయితే ఆ ఔషధాలను తయారుచేయటం సామాన్యులకు సాధ్యం కాని పని. నిపుణులైన వైద్యుల పర్యవేక్షణలో అనుభవజ్ఞులైన వంటౌషధకారులు చేయాల్సిన పని. ఔషధద్రవ్యాలపాళ్ళలో అవకతవకలు జరిగినా,

తయారీ క్రమంలో పొరపాట్లు దొర్లినా ఫలితం ప్రమాదకరం. ఈ ఔషధాలు సత్వరఫలితాలనిస్తాయి గనుక, ఎక్కువకాలం నిల్వ ఉంటాయి. గనుక వీటికి ప్రాధాన్యత ఉండేది. క్రమక్రమంగా రాజకీయ పరిస్థితుల్లో మార్పు వచ్చి ఆదరణ కరువై రసౌషధ నిర్మాణం వెనుక బడింది. అందువల్ల తన కాలంనాటికి నెలకొన్న రాజకీయ, ఆర్థిక, సామాజిక పరిస్థితుల్ని దృష్టిలో ఉంచుకొని శ్రీనివాసాచార్యులు మూలికా వైద్యానికి ఎక్కువ ప్రాధాన్యతనిచ్చాడు.

## సోమయ(క్రీ.శ.1644) :

ఇతడు 'భిషగ్వరాంజనము' అనే వైద్య గ్రంథాన్ని తెలుగులో రచించి శివునికంకితమిచ్చాడు. ఇతనికి రససిద్ధ సాంప్రదాయం పట్ల అమిత గౌరవం ఉంది. అందుకే వైద్యవిజ్ఞానాన్ని తొలుత ధన్వంతరి అగస్త్యునికి బోధించినట్లు వ్రాశాడు. విశ్వబ్రాహ్మణవంశంలో చిన్నయ, కన్న మాంబల పుత్రుడిగా, రమా, పోలయల మనుమడిగా గానుకపల్లె (తిరువూరు మం., కృష్ణాజిల్లా) లో జన్మించాడు. ఇతడు తాను రచించిన గ్రంథంలో ఇచ్చిన తేదీని బట్టి (క్రీ.శ.1644) 17వ శతాబ్ది ప్రథమార్థం వాడని తెలుస్తుంది. ఈయన గురువు గానుగపల్లె పాపయ. బహుశా అది అగ్రహారగ్రామం కావచ్చు. దివ్యచింతామణి, రసప్రదీపక, బాహట గ్రంథాలను అధ్యయనం చేసిన అనంతరం తానీ గ్రంథాన్ని రచిస్తున్నట్లు దీన్ని ఆచంద్రార్కం వైద్య పండితులు ఆదరిస్తారని ఆశిస్తున్నానని వ్రాశాడు.

భిషగ్వరాంజనం మూడుఅశ్వాసాల గ్రంథం. మొదటి అశ్వాసంలో అష్టస్థానపరీక్ష, జ్వర, అజీర్ణాదులను లక్షణసహితంగా వివరించాడు. రెండో అశ్వాసంలో 34 రకాల మూలికా, ఖనిజ ఔషధాలను, శుద్ధి విధానాలను గురించి, వాటి ప్రభావాన్ని 11 రకాల భస్మాలు, సింధూరాల తయారీ గురించి వివరించారు. మూడో అశ్వాసంలో 26 రకాల సాంప్రదాయిక మిశ్రమ ఔషధాల గురించి, 41 రకాల కషాయాల గురించి వివరించాడు. ఈ గ్రంథాన్ని సమగ్రంగా పరిశీలించిన పండితులు సోమయ వివరించిన తాంత్రిక, చిత్త విభ్రమ రోగలక్షణాల పరిశీలనాక్రమం, రాగిని సింధూరంగా మార్చే ప్రక్రియ, మైకాని శుద్ధి చేసే విధానం వంటివి ఇతర వైద్యగ్రంథాల కంటె భిన్నంగా ఉన్నాయ న్నారు. తనకంటె ముందు రచించిన గ్రంథాలనుండి విషయసేకరణ చేసినా తన అనుభవంలో పరిశోధనలో కనుగొన్న విషయాలను ఇందులో పొందుపరచాడు. దీన్ని బట్టి సోమయ అంకితభావం గల వైద్యుడని తన వృత్తిలో నిశితపరిశీలన, పరిశోధనల ద్వారా అనేక నూతన విషయాలు కనుగొన్నాడని బోధపడుతుంది.

## తుళ్ళూరు శరభరాజు, మాధవార్యుడు (క్రీ.శ.17వ శతాబ్ది) :

వైద్యశాస్త్ర గ్రంథాల్లో పేరెన్నికగన్న రచన 'శరభరాజీయం'. దీన్ని రచించిన శరభరాజు కొమెరపూడి (గుంటూరుజిల్లా) గ్రామంలో కొలువై ఉన్న ఆంజనేయస్వామికి ఈ గ్రంథాన్ని అంకితమిచ్చాడు. కాకతీయ ప్రతాపరుద్రుని ప్రధానమంత్రి అయిన శివదేవయ్య ఈ వంశానికి మూలపురుషుడు. వీరు తుళ్ళూరు (నేటి రాజధాని) ను అగ్రహారంగా పొందటం వల్ల ఇంటిపేరు తుళ్ళూరు అయింది. ఇదిగాక ఇంకా 8 గ్రామాలను వీరు అగ్రహార గ్రామాలుగా పొందారు. అందులో కొమెర పూడి కూడా ఒకటికావచ్చు. ఈయన బాపమ్మ, వీరన్నల కుమారుడు.

శరభరాజు తన గ్రంథాన్ని పూర్తి చేయకముందే అకాలమరణం పొందడం వల్ల ఆయన కుమారుడు మాధవార్యుడు దీన్నిపూర్తిచేశాడు. ఈ గ్రంథం నాల్గు అశ్వాసాలు, 28 ప్రకరణలు కలిగి తెలుగు పద్యాలలో ఉంది. దీనిలో అష్టస్థానపరీక్ష, ద్రవ్యశుద్ధి, భస్మ, సింధూర ఔషధ నిర్మాణ ప్రక్రియలు,వస్తు, వృక్ష సంకేతనామాలు, ఘృత, రసాయన, లేహ్య, వటిక, చూర్ణ, తైలప్రకరణలు, వ్యాధులు – చికిత్సలు, పథ్యాపథ్యాలు వివరించబడ్డాయి. గనేరియా రోగాన్ని వప్పి (సెగ) రోగమని, సిఫిలిస్‌ని చంద్రకవ్రణమని, స్థావభవాని అనీ వాటి లక్షణాలను, చికిత్సలను వివరించాడు. ముఖ్యంగా సిఫిలిస్ వ్యాధిని నిశితంగా పరిశోధించి 18 రకాలు గుర్తించి వాటికిపేర్లు పెట్టి లక్షణాలను, చికిత్సలను వేర్వేరుగా సూచించాడు. ఈయన రచనపై బసవరాజు ప్రభావం ఎక్కువ. మౌలిక విషయాల్లో అతడినే అనుసరించాడు.

శరభరాజు కుమారుడు మాధవార్యుడు కూడా గొప్ప వైద్యుడు. 'వైద్యవిద్యాత్రినేత్ర' ఇతని బిరుదు. అంటే వైద్య శాస్త్ర విజ్ఞానంలో వైద్యేంద్రుడైన శివుని అంశ ఈయనలో ఉన్నదని ప్రజలునమ్మేవారు. ఈయన ముఖ్యంగా విషవైద్యంలో నిపుణుడని ఆయన రచనను బట్టి గ్రహించవచ్చు. తాను విషవైద్యంపై 'గదాసంజీవని' అనే గ్రంథాన్ని స్వతంత్రంగా రచించటమే కాక తండ్రి అసంపూర్తిగా వదిలిన శరభరాజీయాన్ని పూర్తిచేశాడు.

గ్రంథాదిలో తాను రోగలక్షణాలను, చికిత్సా పద్ధతులను, ఔషధ నిర్మాణ ప్రక్రియలను,రసయోగాలను, రక్తమోచనను, శస్త్రచికిత్సలను, రాజకర్మ, దానకర్మలను వివరించబోతున్నానని చెప్పాడు. కాని ప్రస్తుతం లభ్యమవుతున్న 'గదసంజీవని' లో సర్వరోగనిదానము, నాడీనిదానము, దోషత్రయప్రకరణము, అసీతివాత నిదానము, పైత్యరోగనిదానము, శ్లేష్మరోగనిదానము, రోగజ్వర నిదానమువంటి నిదానలక్షణ వివరణలతో కూడిన భాగమే దొరుకుతున్నది గాని మిగిలినది లభ్యం కాలేదు.

## ముదుంబి వేంకటాచార్యుడు (17వ శతాబ్ది) :

సంస్కృత 'రసప్రదీపక' ను తెలుగులోకి అనువదించిన వేంకటాచార్యుడు కృష్ణాతీరంలో వైద్యశాస్త్రాభివృద్ధికి కృషి చేసినవారిలో పేరెన్నికగన్నవాడు. ఈయన ముదుంబి వేదాంతాచార్యుల పుత్రుడు.వేదాద్రి లక్ష్మీనరసింహస్వామి పాదాల చెంత వైద్యవిద్య నభ్యసించినవాడు. వేదాద్రిలోని విద్యాకేంద్రంలో వైద్యశాస్త్ర అధ్యయనం ఆ రోజుల్లో గొప్ప

విషయంగా ఉండేది. క్రీ.శ. 14వ శతాబ్దిలోనే నరసింహ పండితుడనే వైద్యోత్తముడు 'నృసింహనిదానమ్' అనే సంస్కృతగ్రంథం రచించాడు. దీనిలోని నిదానానికి Diagnosis ఎక్కువ ప్రాధాన్యత నిచ్చి చికిత్సా ప్రక్రియల్ని వివరించటం జరిగింది. వేంకటాచార్యుని గురువు భట్టరు నరసింహాచార్యులు. ఆయన సాక్షాత్తు విష్ణుమూర్తి అవతారమైన శ్రీ ధన్వంతరి అంశ అనీ ఆయన కరుణాకటాక్షాల వల్లనే సంస్కృతాంధ్రాలలో గొప్ప పాండిత్యం సంపాదించగలిగానని వ్రాశాడు. తాను వైద్యశాస్త్రాధ్యయనంలో తొలిగా వృద్ధత్రయం అంటే చరక, సుశ్రుత, వాగ్భటుల రచనలను చదివానని పేర్కొన్నాడు. ముఖ్యంగా సుశ్రుతుని శారీరకము, వాగ్భటుని సూత్రస్థానము, అగస్త్యుని రసతంత్రాన్ని నిశితంగా అధ్యయనం చేశాడట. తర్వాత వృత్తిలో ప్రత్యక్ష అనుభవం పొందటానికి శిక్షణ తీసుకున్నానని అన్నాడు. అన్నట్లు బాహటాచార్యుడు రచించిన బాహట గ్రంథాన్ని (క్రీ.శ. 14వ శతాబ్ది) కూడా కూలంకషంగా అధ్యయనం చేశాననిచెప్పాడు. అంటే వాగ్భటాచార్యుని గ్రంథం కంటె భిన్నమైన వైద్యగ్రంథమిది.

దక్షిణాదికే ప్రత్యేకమైన రసవైద్యవిధానాన్ని వేంకటాచార్యుడు ప్రత్యేకశ్రద్ధతో అధ్యయనం చేశాడు. అంతేకాదు ఆ విషయంలో అనేక కొత్త కొత్త ప్రయోగాలు చేశాడు. ఆ అనుభవం అనురక్తి వల్లనే సంస్కృత రసప్రదీపకను తెలుగులోకి అనువదించి శాస్త్రపు విలువను ప్రజలకు తేటతెల్లం చేశాడు. మూలగ్రంథంలో లేని అనేక నూతన విషయాలను తన గ్రంథంలో వివరించాడు. ముఖ్యంగా పాదరస మారణ, శోధన ప్రక్రియల్లో తాను స్వయంగా తెలుసుకున్న విషయాలను సమకాలీనంగా అభివృద్ధి చెందిన మరికొన్ని విషయాలను తన గ్రంథంలో పొందుపరచాడు.

రసవైద్యాన్ని అశ్వనీదేవతలు ధన్వంతరికి చెప్పినట్లు, దానిని అగస్త్యుడు అత్రేయునికి బోధిస్తున్నట్లు వేంకటాచార్యుడు తన గ్రంథంలో విషయవివరణ చేశాడు. ఈ విషయం సంస్కృతగ్రంథంలో లేదు. సంస్కృతగ్రంథం నాలుగు అధ్యాయాలుగా ఉండగా తెలుగు రసప్రదీపక మూడు అధ్యాయాలుగా ఉంది. చివరి రెండు అధ్యాయాలను కలిపి వివరించాడు. మొదటి అధ్యాయంలో పాదరస అధఃపాతన ప్రక్రియ; రెండు రకాల సింధూరాలు కొత్తగా చేర్చినవిగా గుర్తించవచ్చు. సింధూర అనుపానాల్లో సంస్కృత మూలంలో వివరించిన 12 శ్లోకాలను తెలుగులోకి అనువదించకుండా వదిలివేశాడు. రెండో అధ్యాయంలో వివరించిన విమల, సస్యక, పాదరసాల శుద్ధిక్రమం మూలానికి భిన్నంగా; నిత్యనాథుని 'రసరత్నాకరమ్' లో వివరితమైన విధంగా ఉన్నాయి. మూడో అధ్యాయంలో నవరత్నాల వర్ణన, గుణాలు, వాటి ప్రభావం; శుద్ధిక్రమం వివరించాడు. వీటిలో చాలవరకు సంస్కృత మూలంలో లేవు. అలాగే మూలంలో ఉన్న సర్వపాషాణశుద్ధి వివరణ, నీలం, గోమేధికం, వైఢూర్యాదుల శుద్ధిక్రమం వేంకటాచార్యుని రచనలో కన్పించవు. ఈ విధంగా వేంకటాచార్యుడు సాంప్రదాయపద్ధతుల్ని గౌరవిస్తూనే సమకాలీన అవసరాలకనుగుణంగా దాదాపు సర్వస్వతంత్రంగా తెలుగు రసప్రదీపకను ఆవిష్కరించాడు. రసవైద్య విధానానికి బాగా ఆదరణ ఉన్న ఆరోజుల్లో వేంకటాచార్యుని రసప్రదీపక అందరికీ అందుబాటులోకి వచ్చి విద్యార్థులకు, పండితులకు ఉపయోగకరంగా బహుళ ప్రాచుర్యాన్ని పొందింది.

## పరహిత వైద్యులు

మధ్యాయుగాంధ్రదేశంలో ముఖ్యంగా కృష్ణాపరీవాహక ప్రాంతంలో పరహిత వైద్యులనేవారు ప్రత్యేకంగా కన్పిస్తారు. వీరిలో ఆత్రేయ, కాశ్యప అనే రెండు గోత్రాలవారున్నారు. వీరు అత్యవసర వైద్యసేవల్ని అందించే (ఎమర్జెన్సీ మెడిసన్) వైద్యులుగా చెప్పుకోవచ్చు. ఇక్కడి చిత్తడి నేలల్లో, పాములు, తేళ్ళు, జెర్రుల బెడద ఎక్కువ. వీటి కాటుకు బలైన వారికి అత్యవసరంగా ఉచిత వైద్య సేవలందించే వైద్యులే పరహితులని శాసన సమాచార నిశిత పరిశీలనలో తేలుతుంది. వీరు ప్రభుత్వం ఇచ్చిన భూదానాలు, గ్రామదానాలు స్వీకరించి విద్యాకేంద్రాలను నెలకొల్పి అందులో తమదైన పద్ధతిలో వైద్యవిద్యలో శిక్షణనిచ్చేవారు. క్రీ.శ. 1404నాటి పెదకోమటి వేమారెడ్డి వేయించిన పొన్నుమల్లె శాసనాన్ని బట్టి ఆ గ్రామాన్ని భాస్కరాచార్యుడనే పరహిత వైద్యునికి సర్వసస్యసమన్వితంగా వాపీకూప తటాకసహితంగా ఆచంద్రతారార్కం వంశపారంపర్యంగా అనుభవించేటట్లు దానం చేశాడని తెలుస్తుంది. క్రీ.శ. 1408లో ఆయనే సింగనార్యుడనే మరో పరహిత వైద్యునకు దానం చేశాడు. ఈ సింగనార్యుడు భాస్కరార్యుని మనుమడు, విళ్ళనార్యుని పుత్రుడు, బహుశా తాత అయిన భాస్కరార్యుని మరణంతో మనుమడైన సింగనార్యుని పొన్నుపల్లెలోని విద్యాపీఠానికి అధిపతిగా తిరిగి నియమిస్తూ పెదకోమటి వేమారెడ్డి ఈ శాసనం వేయించి ఉంటాడు. సింగనార్యుని అర్హతల గురించి చెప్తూ ఆయన అష్టాంగాయుర్వేదంలోను, తర్క, వ్యాకరణ, యోగ, వేదాంత శాస్త్రాల్లో నిష్ణాతుడని శాసనం పేర్కొన్నది. పొన్నుపల్లె గ్రామం కృష్ణాతీరంలోని దివిసీమలో ఉంది. పరహితపండితుడైన భాస్కరార్యుడు భూలోకధన్వంతరిగా మొదటి శాసనం చెప్తుంది.

ఈ రెండు శాసనాల సమాచారాన్ని బట్టి వీరి కుటుంబ సభ్యుల గురించి కొంత తెలుస్తుంది. కశ్యప గోత్రీకులైన పెరియవిళ్ళ, ఆయన కుమారుడు భాస్కరార్యుడు, ఆయన కుమారుడు విళ్ళయార్యుడు; విళ్ళయార్యుని కుమారుడు సింగనార్యుడు అనే వైద్య పండితుల శాస్త్రాభివృద్ధికి, ప్రజాసేవకు తమ జీవితాన్ని అంకితం చేశారని తెలుస్తుంది.

ఆత్రేయ గోత్రీకులైన కొందరు వైద్యులు కూడా తాము పరహితులమని చెప్పుకున్నారు. ప్రభువుల నుండి అగ్రహారాలను పొంది,

ప్రజలకు విద్యావైద్య సేవలందించారని శాసనాలు స్పష్టం చేస్తున్నాయి. రెడ్డిరాణి అనితల్లీదేవి కలువచేరు శాసనాన్ని బట్టి పరహిత పండితుల వంశంలో మొదట పరహితాచార్యుడు, మల్లినాథుడు, రెండవ పరహితా చార్యుడు, రామనాథుడు, ఆయన పుత్రులు మూడో పరహితుడు, దేవనార్యుడు, కాళనాథుడు, కాళనాథుని పుత్రులు నాల్గో పరహితుడు, రెండో దేవనార్యుడు, వరదార్యుడు అనేవారు ఆయుర్వేద వైద్యులై ముఖ్యంగా విషవైద్యంలో నిపుణులుగా పేరొందారని తెలుస్తుంది. నాల్గో పరహితుడు వీరభద్రారెడ్డి, అనితల్లీదేవిల నుండి కలువచేరు గ్రామాన్ని అగ్రహారంగా పొందాడు.

'పరహితవిద్య' అనే పదాన్ని ఆ రోజుల్లో వైద్యవిద్యకు పర్యాయ పదంగా వాడారు. యోగివేమన కూడా వైద్యులకు పర్యాయపదంగా 'లోకోపకారులు' అనే పదాన్ని ఉపయోగించాడు. అయితే అందరు వైద్యులు పరహితులు కారు. ఎవరైతే ప్రతిఫలాపేక్ష లేకుండా ప్రజలకు ఉచిత సేవలందిస్తారో వారు పరహితులుగా ప్రత్యేక గుర్తింపు పొందారు. బాధపడుతున్నది ఎటువంటివారైనా సరే, ఏ సామాజిక వర్గానికి కాని, ఆర్థిక స్థాయికి గాని చెందినవారైనా సరే ఆపత్సమ యంలో వెంటనే వైద్య సేవలందించే ధర్మం వీరిది అని శాసన సమా చారంలోని కథనాన్ని బట్టి తెలుస్తుంది. పొన్నపల్లి గ్రామగ్రహీత భాస్క రార్యుడు ఒక పాముకు శస్త్రచికిత్స నిర్వహించి ప్రాణాపాయ స్థితినుండి కాపాడాడుట. ఆ పాము ఒక కప్పను మింగి అది గొంతులో అడ్డంపడి బాధపడుతున్న సమయంలో చూసి ఈవిధమైన సేవలందించాడని, అప్పటినుండి పరహితుడని పేరు పొందాడని కథనం. అయితే ఇందులో నిబిడీకృతమైన అర్థాన్ని మాత్రమే మనమిక్కడ గ్రహించాలి. బాధలో ఉన్నవాడు ఎలాంటివాడైనా, ప్రాణం అత్యంత విలువైనది గనుక అత్యవసర ఉపశమనచర్యలు అందించి స్వస్థుని చేయటం మంచి వైద్యుని ధర్మం. ఇక్కడ ఎలాంటి ప్రతిఫలాపేక్ష లేదు. అదే ఇందులోని అంతరార్థం.

వైద్యులు తమ వృత్తిని సాగించాలన్నా, కుటుంబాన్ని పోషించు కోవాలన్నా, శిష్యులకు విద్యను నేర్పుతూ గురుకులంలో పోషించా లన్నా, మందులు తయారుచేయాలన్నా, సేవకులను పోషించాలన్నా ధనం అవసరం. అందుకే ప్రాంతీయ పాలకులు గ్రామాలను అగ్రహారా లుగా ఇచ్చి పోషించేవారు. ప్రతిగా ఆ వైద్యులు వృత్తి ధర్మంతో సమాజ సేవకు అంకితమయ్యేవారు, ఉచిత వైద్య సేవలందించేవారు. అందు వల్ల వారు ఏ ఒక్క కుటుంబానికో చెందినవారు కాదనేది స్పష్టం. అయితే వంశపారంపర్యంగా వృత్తి ధర్మాన్ని పాటించే సాంప్రదాయం ఉంది. వీరు మనుషులకే కాక ఇతర ప్రాణులకు కూడా సేవలందించే వారిగా కన్పిస్తారు.

పరహిత వంశానికి చెందిన వైద్య శ్రీనాథపండితుడు 'పరహిత సంహిత' అనే వైద్యశాస్త్ర గ్రంథాన్ని రచించాడు. ఈ గ్రంథంలోని అంశాలు ఇతర ఆయుర్వేద గ్రంథాల్లాగానే అష్టాంగ సమన్వితంగా ఉన్నాయి. అయితే ఈ గ్రంథంలో కొన్ని ప్రత్యేకాంశాలు కూడా వివ రించబడ్డాయి. త్రాగునీటిని శుభ్రపరచుకునే పద్ధతులు ఆహారపుటల వాట్లు ద్వారా ఆరోగ్యాన్నిఎలా పరిరక్షించుకోవచ్చు. ఏయే ఋతువుల్లో ఏయే ఆహారపదార్థాల్ని స్వీకరించాలి. వంటలు ఏవిధంగా వండు కోవాలి, ఏయే పదార్థాల్ని కలిపి వండుకోకూడదు, వేటిని కలిపి వండితే అమృతప్రాయంగా మారతాయి వంటి విషయాలు, రకరకాల పిండివంటల తయారీ మొ॥న అనేకాంశాలు విశిష్టమైనవిగా కన్పి స్తాయి. సమగ్ర ప్రజారోగ్య పరిరక్షణను త్రికరణశుద్ధిగా కోరుకునే ఒక వైద్యశాస్త్రవేత్త వివరణగా ఈ గ్రంథాన్ని పరిగణించవచ్చు.

ఇంకా వైద్య చింతామణి వంటి సుప్రసిద్ధ గ్రంథాలను రచించిన ఇంద్రగంటి వల్లభాచార్యుల వంటి గొప్ప గొప్ప పరిశోధకులు తెలుగు వారే అయినా వారి జన్మస్థలం ఖచ్చితంగా తెలియకపోవటం వల్ల ఇక్కడ ప్రస్తావించలేదు. 'వీరభట్టీయం' వంటి రచనలు చేసిందెవరో తెలియటం లేదు. ఇక్కడ సాగిన పరిశోధనలుబహుముఖంగా సాగాయి. సాంప్రదాయాన్ని గౌరవిస్తూనే కొత్త కొత్త పరిశోధనా ఫలితాలను ఆయా గ్రంథాల్లో ఆవిష్కరించారు. వ్యాధుల నిదానాన్ని Diagnosis చికిత్సలను , ఔషధనిర్మాణాన్ని, ప్రయోగాన్ని వివరించటంతో పాటు కొత్తగా చోటు చేసుకుంటున్న వ్యాధులను పరిశీలిస్తూ వాటిని వర్గీ కరిస్తూ వాటికి పేర్లు పెట్టి చికిత్సలకు రూపకల్పన చేశారు. ఖనిజాలను, ధాతువులను శుద్ధిచేసి వాడటంలో ఎంతోప్రగతిని సాధించారు. ఔషధ నిర్మాణంలో ఇతర వృత్తి నిపుణులను కూడా వాడుకోవటం వల్ల కాల క్రమంలో వంటౌషధ నిర్మాణకారులు ప్రత్యేకంగా గుర్తింపుపొందారు. వైద్యుల పర్యవేక్షణలో వీరు ఔషధాలను ముఖ్యంగా రసౌషధ నిర్మాణం చేసి అమ్మేవారు. విదేశీయాత్రికులు ఇటువంటి దుకాణాల గురించి వ్రాశారు. క్రీ.శ. 1500 ప్రాంతం "ఫిరంగ రోగం" అనే కొత్తవ్యాధి సమాజంలో ప్రవేశించినపుడు దాన్ని సమర్థవంతంగా ఎదుర్కొన్న ఘనత తెలుగు వైద్యులది. ఆ వ్యాధి ఈనాటి ఎయిడ్స్ రోగంలా సమాజాన్ని భయపెట్టింది. పోర్చుగీస్ సైనికులు కుటుంబాలతో రావటానికి అనుమతి లేదు. అందువల్ల వారు కోస్తాతీర ప్రాంతంలో అట్టడుగు వర్గాల స్త్రీల పట్ల దారుణంగా ప్రవర్తించివారితో లైంగిక సంబంధాలు పెట్టుకోవటం వల్ల వారినుండి ఈ వ్యాధి ఇక్కడి ప్రజలకు సంక్రమించింది. ఫిరంగుల (పోర్చుగీసులు) వల్ల సంక్రమించింది. గనుక దీన్ని ఫిరంగిరోగం (సిఫిలిస్) అన్నారు. ఇది ఒకరినుండి మరొ కరికి సోకే జబ్బు నేటి ఎయిడ్స్ వ్యాధిలాగా సమాజానికి పెద్ద బెడద అయి కూర్చుంది. అందువల్ల వైద్యులంతా దీన్ని అరికట్టే ప్రయత్నంలో

చికిత్సా విధానాలకు మార్గాలను అన్వేషించారు. రసౌషధాలు త్వరగా పనిచేస్తాయనే ఉద్దేశ్యంతో రసకర్పూరప్రక్రియల్ని ప్రయోగించారు. దాన్ని అదుపు చెయ్యాలంటే నిదానం ముఖ్యమైనది కాబట్టి ఆవైపు పరిశోధన చేసి క్రీ.శ.16వ శతాబ్ది ప్రథమార్థానికి 12 రకాలు, మధ్య భాగం నాటి 18 రకాల వ్యాధి లక్షణాలను కనుగొన్నారు. మానవ శరీరంలో వేర్వేరు భాగాల్లో ఏవిధంగా పొటమరిస్తుందో వివరించి దానికి తగ్గ చికిత్సలను అందించారు. ఇక్కడి ప్రజలకు శక్తివంతమైన మందులుండడం వల్ల పూర్తిగా నయం చేసుకోగల్గుతున్నారని, ఈ వ్యాధి గురించి వారికి భయం లేదని, అన్ని జబ్బుల్లాంటిదిగానే భావిస్తు న్నారని, సిగ్గుపడి దాచుకోకుండా నివారణ పొందుతున్నారని 16వ శతాబ్దికి చెందిన లిన్స్‌టెన్ (క్రీ.శ.1583-89) అనే డచ్ యాత్రికుడు వ్రాశాడు. జాన్‌ఫ్రయర్ (క్రీ.శ.1670) అనే ఆంగ్ల వైద్యుడు మచిలీ పట్నాన్ని సందర్శించాడు. ఇక్కడి వైద్యుల ఔషధ నిర్మాణ నైపుణ్యాన్ని మెచ్చుకున్నాడు.[55] ఇక్కడ లభించే మూలికలనే గాకుండా విదేశాలనుండి తెచ్చినమూలికల్ని, పువ్వుల్ని, పండ్లను కూడా గ్రహించి వాటి రస, గుణ, వీర్య, విపాక, ప్రభావాలను వివరిస్తూ నిఘంటువులను రూపొం దించారు. వాటిలో కొన్నింటిని క్రీ.శ.1530 నాటికే డచ్ భాషలోకి, తర్వాత ఇతర ఐరోపా భాషల్లోకి పాశ్చాత్య వైద్యులు అనువదించారు. ప్రజల ఆరోగ్య పరిరక్షణను దృష్టిలో ఉంచుకొని త్రాగే నీటినుండి వండేవంట వరకు పాటించాల్సిన నియమనిబంధనలను తమ గ్రంథాల్లో పొందుపరచారని కూడా పై పరిశీలన స్పష్టం చేస్తుంది.

## పాదసూచికలు

1. శ్రీనాథుని హరవిలాసము అధ్యాయము 7, పద్యం 3.
2. గౌరన నవనాథచరిత్ర, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాద్,పుట 14.
3. పండితారాధ్యచరిత్ర, పర్వతప్రకరణం, పుటలు 357-58
4. కృష్ణాజిల్లా గజిటీర్,పుట 34.
5. నవనాథచరిత్ర, పుట 202-296
6. పి.హైమవతి, మధ్యయుగాంధ్రదేశ వైద్యశాస్త్ర చరిత్ర, వరంగల్ 1993,పుట 79
7. వేటూరు శంకరశాస్త్రి ఆయుర్వేద ఇతిహాసం, తెలుగు అకాడమీ,హైదరాబాద్ 1987, పుట 122
8. మారేమండ రామారావు, శ్రీశైలం దేవాలయాలు, పురావస్తుశాఖ, హైదరాబాద్ 1969, పుట 5
9. వేటూరి శంకరశాస్త్రి, పైదే పుటలు 59,60
10. హైమవతి పి.ప్రాచీన మధ్యయుగాల్లోఆంధ్రదేశపు శాస్త్రవేత్తలు, భార్గవి పబ్లిషర్స్, వరంగల్, 1992, పుటలు 22,23
11. రామారావు భాగవతం, 'కళ్యాణకారకమ్' బుల్లెటిన్ ఆఫ్ ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హిస్టరీ ఆఫ్ మెడిసిన్, సంపుటి 2, పుట 208
12. కృష్ణశాస్త్రి 'ఆంధ్రలో బౌద్ధము' ఆంధ్ర సంగీత సాంస్కృతిక మహోత్సవ విశేష సంచిక, సికింద్రాబాద్, సెప్టెంబర్, 2001
13. నల్గొండజిల్లా శాసనాలు, ఆం.ప్ర. పురావస్తుశాఖ, హైదరాబాద్, తుమ్మలగూడెం శాసనం
14. పి.హైమవతి,మధ్యయుగాంధ్రదేశంలో వైద్యశాస్త్రం, భార్గవ పబ్లిషర్స్, 1993, పుట.46
15. ఐ. సంజీవరావు, 'రససిద్దాస్ ఆఫ్ ఆలంపూర్' బులెటిన్, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హిస్టరీ ఆఫ్‌మెడిసిన్, సంపుటి 13, పుటలు 40,41
16. దక్షిణభారతదేశ శాసనాలు, సంపుటి 6, సంఖ్యలు 127 & 156
17. స్పష్టత కోసం చూడండి : కుందూరి ఈశ్వరదత్తు, చారిత్రికభూగోళం
18. కె.బి.రెడ్డి, 'నాథ సిద్ధ సాంప్రదాయము,' భారతి, జూన్ 1985, పుట 17
19. భావప్రకాశ, రెండవభాగం, పుట878
20. వేటూరి శంకరశాస్త్రి, ఆయుర్వేద ఇతిహాసము, పుట 32
21. ఆంధ్రప్రదేశ్ శాసనాలు, నం.183, పుట 245 ఎస్-11, - 395
22. రెడ్డి సంచిక, అనుబంధం, పుటలు 3-9
23. ఎం.సూర్యనారాయణశాస్త్రి, సంస్కృత సాహిత్య చరిత్ర, ఆంధ్రసారస్వత పరిషత్తు, హైదరాబాద్ 1961, పుట 358
24. వేటూరి శంకరశాస్త్రి, ఆయుర్వేద ఇతిహాసము, పుటలు 119-120
25. మారేమండ రామారావు, శ్రీశైల దేవాలయాలు, పుట. 5

26. నవనాథచరిత్ర, పుట 267
27. భండార్కర్ ఓరియంటల్ రీసెర్చ్ ఇన్స్టిట్యూట్ లోని ప్రతుల సంఖ్యలు 19,20
28. చాటు పద్యమణిమంజరి, ముక్త్యాల పుట
29. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము, మద్రాసు సంఖ్యలు 13164-65
30. బసవరాజీయం, వావిళ్ళ రామస్వామిశాస్త్రులు & సన్స్, మద్రాస్,1948, పుటలు 1-6
31. పి.వి. పరబ్రహ్మశాస్త్రి, విజయనగరపాలకుల తెలుగు శాసనాలు, ఐ.సి.హెచ్. ఆర్. 2009, పుటలు 134-135
32. బసవరాజీయం పుటలు 817-18
33. పైదే, పుట 433
34. రసికజనమనోభిరామము, అధ్యాయం, 6 పద్యాలు 104& 157, మనుచరిత్ర, 3-25
35. బసవరాజీయం 6,7,8 అధ్యాయాలు
36. పైదే, పుట 6
37. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని సంపుటి 11 నం, 2442, పుటలు 2714- 2715
38. పైదే, పుట 2715
39. నరసింహపురాణం, అధ్యాయం 1, పద్యం 59
40. భారతి, సంపుటి 18, పుటలు 17-24
41. వి. సుబ్బారావు, శతక కవుల చరిత్ర, పుటలు 459-60
42. బులెటిన్, ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ హిస్టరీ ఆఫ్ మెడిసిన్, సంపుటి 4(1), 1974, పుటలు 10,11
43. పి.వి.శర్మ, ఆయుర్వేద కా వైజ్ఞానిక్ ఇతిహాస్, పుటలు 145-46
44. చికిత్సాతిలకమ్, మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము, 1953
45. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము, కాటలాగ్ సం.11, సంఖ్యలు 2453-55
46. పైదే. సంఖ్యలు డి 13116 & 13117
47. భారతి, జులై 1938, పుట 504
48. పైదే సంఖ్య డి. 2453
49. బులెటిన్, ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ హిస్టరీ ఆఫ్ మెడిసిన్, సంపుటి, పుటలు 125-127
50. ఆంధ్రపత్రిక, ఉగాది సంచిక 1924-25, పుట 291
51. పైదే, పుట 247
52. ఆంధ్రసారస్వత పరిషత్ పత్రిక, సంపుటి 1, పుటలు 93-113
53. రోగి నరసినట్టి లోకోపకారులు – భోగభాగ్యములను బొంది తుదను – పూర్వవాసనదెగి పురహరు గాంతురు – విశ్వదాభిరామ వినురవేమ
54. పరహిత సంహిత, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి, 1972
55. బులెటిన్, ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ హిస్టరీ ఆఫ్ మెడిసిన్, సంపుటి 2(4), 1964, పుట 249


చిరునామా : శ్రీమతి పి. హైమవతి, కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్

శ్రీ టి. శోభనాద్రి

# నీటిపారుదల సౌకర్యాలు

అనంత ప్రాణకోటికి నీరు ప్రాణాధారం. మానవ మనుగడకు ప్రధానమైనది త్రాగునీరు. రెండవది సాగునీరు. భూమిపై ప్రవహించే నదులు, వాగులు, వంకలు సాగునీటికి ప్రధాన వనరులు.

అసమాన రాజనీతి విశారదుడు, ఆర్థికవేత్త చాణుక్యుడు దేశమందలి రైతులకు ఎలా సాయపడవలసింది తెలిపినాడు.

"సమోదకం, అహార్యోదకంవా, సేతుంబంధయేత్, అన్వేషాం బధ్నతాం, భూమి మార్గోపకరణాత్, సంగ్రహం కుర్యాత్" అనగా రాజు స్వయంగా నీళ్ళతో నిండియుండే చెరువులను కట్టించాలి. వానియందు స్థిరముగా నీటి సదుపాయాలు కలిగించాలి.

వర్షాధారంతో కూడిన భూగర్భజలాలను కూడా పూర్వకాలంలో ప్రజలు ఉపయోగించు కొనేవారు. పూర్వకాలంలో రాజులు తమ ఏలుబడి ప్రాంతంలో భూ భౌతిక నైసర్గిక స్వరూపాలను గమనించి నీటిపారుదల, వాలు ననుసరించి నీరు నిల్వ ఉండేలాగున పెద్దపెద్ద చెరువులను నిర్మించారు. ఈ చెరువులలోనికి నీరు, నదులు, ఏరులు, వాగులనుండి మళ్లించేవారు.

12వ శతాబ్దిలోని కరికాల చోళుని వంశము వాడైన వరదరాజు సతీమణి చోళరాణి కొలుములమ్మ నంద్యాల చెరువును నిర్మించినది. గుంటూరు జిల్లా చేబ్రోలులో అనంత సరోవరం అనే చెరువు కలదని పశ్చిమ చాళుక్యుల శాసనం ఉన్నది. 13వ శతాబ్దిలో గణపతిదేవ మహారాజు త్రిపురాంతకం విశ్వనాథపురం చెరువు నిర్మించాడు. ప్రతాపరుద్రుని కాలంలో నిర్మింపబడిన రామప్ప చెరువు, పాకాల చెరువు, విజయనగర రాజుల కాలంలో నిర్మింపబడిన అనంతసాగరం, బుక్కసముద్రం చెరువులు గలవు. గజపతిరాజుల కాలంలో తెలుగు రాయుడు మార్కాపురం చెరువు నిర్మించాడు. ప్రకాశం జిల్లాలో కంభం చెరువు నిర్మింపబడింది.

పూర్వకాలంలో కుంటలు, చెరువులు త్రవ్వించడం పుణ్యకార్యంగా భావించేవారు. వాటిని సరైన స్థితిలో ఉంచడానికి ధర్మనిధులు ఏర్పరచేవారు. శ్రీ కృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదలో 'దేశ వైశాల్య మర్థసిద్ధికిని మూల, మిల యొకింతైన గుంటకాల్వలు రచించిన నయము, పేదకు నరి గోరినను నొసంగి, ప్రబలజేసిన, నర్థధర్మములు పెరుగు' అని ప్రబోధించాడు.

చెరువులు అనాదిగా ఆంధ్రప్రదేశ్‌లో సాగునీటికి త్రాగునీటికి ఉపయోగింపబడుచున్నవి. ప్రతి ఊరిలో ఒక చెరువు, ఒక దేవాలయం నిర్మింపబడినవనేది నిర్వివాదాంశం.

కోస్తా ఆంధ్ర, రాయలసీమ ప్రధానంగా వ్యవసాయధార ప్రాంతం, వ్యవసాయానికి నీరు ఎంతో అవసరం. నదులపై ఆనకట్టలు కట్టకముందు వ్యవసాయానికి చెరువులు బావులపై ఆధారపడినారు. మనకు వర్షపాతం ప్రధానంగా నైరుతి రుతుపవనాల ద్వారా జూన్ నుండి సెప్టెంబరు వరకు కురుస్తుంది. ఈశాన్య రుతుపవనం అక్టోబరు నుండి డిశెంబరు మాసం వరకు ఉంటుంది. వర్షాలు సమృద్ధిగ కురిసినప్పుడు, ఒక్కొక్క చెరువుకు ఆధారమైన వాగులు, ఏరుల ద్వారా చెరువు క్రింద సాగు అయ్యే మాగాణియే కాక, ప్రజల త్రాగునీటికి, పశువుల త్రాగునీటికి ఉపయోగపడతాయి. నీటిని నిల్వచేస్తే, భూగర్భ జలాలు మట్టం కూడా పెరిగి వేసవిలో బావులు, బోర్ల ద్వారా నీటి సదుపాయం ఏర్పడుతుంది.

ఇటీవలకాలంలో కాలువలద్వారా ప్రవహించే నీటితో వ్యవసాయం చేయుట మూలాన చెరువులను అశ్రద్ధ చేయటం జరుగుచున్నది. సరైన నిర్వహణ లేకపోవటం, పూడిక పెరగటం, పనికిరాని మొక్కలు పెరగటం, చెరువు పరివాహక ప్రాంతంలో భూమిని ఆక్రమించిన వ్యవసాయం చేయటం వలన అనేక అనర్థాలు కలుగుచున్నాయి.

నవ్యాంధ్రప్రదేశ్ నిర్మాణం సందర్భంగా కృష్ణాజిల్లాలోని బ్రహ్మయ లింగం చెరువు, రెడ్డిగూడెం రంగాపురం చెరువు, నరసాపురం చెరువు, విస్సన్నపేట చంద్రగూడెం చెరువు, గంపలగూడెం గుర్రపువాగు,

మురుసుమల్లి రిజర్వాయరు, పరిటాల, షేరు మహ్మద్‌పేట, జగ్గయ్య పేట చెరువులు, గుంటూరుజిల్లాలోని త్రిపురాంతకం మొదలైన ప్రధానమైన చెరువులను అభివృద్ధి చేయాలి. అదేవిధంగా సీమాంధ్ర జిల్లాలోని చెరువులను రిపేరు చేయాలి.

చిన్నవిగాని, పెద్దవిగాని, నీరులేనివి, పూడికతో నున్నవి బాగు చేయాలి. చెరువు అలుగులను, నీరు విడుదలచేసే తూములను అవసరమైనచో పునర్నిర్మించాలి. చెరువుకు నీరు వచ్చే వాగులు, వంకలలో ఉండే ఆటంకాలు తొలగించాలి. చెరువుపైభాగంలో (Foreshore) ఉండే భూమిని ఆక్రమణల నుంచి తొలగించాలి. చెరువు గట్లపై వీలైనచోట్ల చెట్లను పెంచితే నీడనివ్వటమేకాకుండా పర్యావరణానికి ఎంతో ఉపయోగం.

నవ్యాంధ్రప్రదేశ్‌లో వంశధార, నాగావళి, గోదావరి, కృష్ణ, పెన్న, స్వర్ణముఖి మొదలైన జీవనదులు, భూమిమీద నదుల ద్వారా ప్రవహించే నీటిని సద్వినియోగం చేసుకోవటానికి నదులపై ఆనకట్టలు రిజర్వాయర్లు నిర్మించుకొని అవసరమైనప్పుడు నీటిని వినియోగించుకొని భూమిని సాగుచేసి పంటలు పండించి, ఆంధ్రదేశాన్ని అన్నపూర్ణగా తీర్చిదిద్దినది మన రైతాంగమే.

కోస్తాంధ్ర జిల్లాలను సస్యశ్యామలం చేస్తూ గోదావరి, కృష్ణా డెల్టాలకు సాగునీరు, త్రాగునీరు అందించేవి గోదావరి కృష్ణానదులే. కృష్ణానదికి చిట్టచివరి భూములు కలిగి 13 లక్షల ఎకరాలు సాగుబడిలో సుసంపన్నమైన డెల్టా కృష్ణా డెల్టా. కృష్ణానదిపై ఆనకట్ట నిర్మింపబడిన తరువాత అనగా 1857 నుండి గత 157 సం. నుండి కృష్ణాడెల్టాలో సేద్యం చేస్తున్నారు. కృష్ణా, గోదావరి నదులపై ఆనకట్టలు నిర్మించడం ద్వారా పుష్కలసేద్యాన్ని సుసాధ్యం చేసిన మహనీయుడు సర్ ఆర్థర్ కాటన్. నదీతీర ప్రాంతాలైన గోదావరి కృష్ణాజిల్లాలను సస్యశ్యామలం చేసిన కర్మయోగి జనరల్ సర్ థామస్ కాటన్. కృష్ణానదిపై ఆనకట్ట 1852 నుండి 1855 సంవత్సరంలో కెప్టెన్ ఓర్ ఆధ్వర్యంలో కాటన్ మహాశయుడు నిర్మించాడు. ఆనకట్ట పొడవు 3715 అడుగులు. ఆనకట్ట నిర్మాణమునకై ఖర్చు రు. 6,62,536లు. ఆనకట్టను అనేక కష్టనష్టముల కోర్చి నిర్మించారు. ఆ రోజులలో ఆధునికమైన పరికరాలు లేవు. రవాణా సౌకర్యాలు లేవు. సాంకేతిక నిపుణులు లేరు. గుర్రాలపై నీటిలో పడవలపై ప్రయాణం, వీటన్నిటినీ అధిగమించి ఆనకట్ట కట్టిన సర్ ఆర్థర్‌కాటన్ ఆంధ్రులకు చిర స్మరణీయుడు.

కృష్ణానది వరదతాకిడి కూడా ఎక్కువే. 1952 మేలో కృష్ణానదికి విశేషమైన వరద వచ్చినప్పుడు వరద ఉధృతికి సీతానగరం వైపు ఆనకట్టకు గండిపడినది. గండి పడేనాటికి ఆనకట్ట వయస్సు 100 సం.లు. లక్షల ఎకరాలు సాగులో ఉన్న భూమికి నీరందకుండా పోయి పంటకు అపారనష్టం కలుగుననే ఉద్దేశ్యముతో 1952 మే 9వ తేదీన విజయవాడ నీటి పారుదల సర్కిలు సూపరింటెండింగ్ ఇంజనీరు శ్రీ వేపా కృష్ణమూర్తిగారు ధైర్యసాహసాలతో ప్రయత్నించటం, ప్రమాదవశాత్తు గండిలో పడి మరణించడం ఆనకట్ట చరిత్రలో దురదృష్టకరమైన విషయం. ముఖ్యమైన పనులను సామర్థ్యంతో తనంతట తాను చేయపూనుకునే తత్త్వం శ్రీ వేపా కృష్ణమూర్తిగారిది. సిమెంటు, ఇసుక బస్తాలను గండిలో వేసి పూడ్చటానికి ప్రయత్నంగా ఒక స్టీమరును ఎగువభాగాన లంగరు వేసి, దానికి దిగువున, ఆనకట్ట సమీపంలో పంటును త్రాళ్ళతో బిగించి, పంటు మీదనుండి బస్తాలు గండిలోకి వేయాలనే చేసిన ప్రయత్నం, గొలుసులు లేకుండా త్రాళ్ళతో బిగించిన పంటు తెగి, గండిలోనికి కొట్టుకుపోవడం, దానిపై వున్న వేపా కృష్ణమూర్తిగారు నదిలోపడి మరణించడం జరిగినది. కీ॥శే॥ వేపా కృష్ణమూర్తిగారు ప్రసిద్ధిచెందిన ఇంజనీరు.

కృష్ణాడెల్టా నీటిపారుదల వ్యవస్థను పటిష్టం చేయతలంపుతో కృష్ణానదిపై పాత ఆనకట్ట స్థానంలో బ్యారేజి నిర్మాణమునకు ప్రభుత్వం సంకల్పించినది. బ్యారేజి నిర్మాణము వలన హెచ్చు పరిమాణంలో నీటిని నిలువ చేయుటకు రోడ్డు బ్రిడ్జి వలన కృష్ణా, గుంటూరు జిల్లాలకు రవాణా సౌకర్యము ఏర్పరచుటకు వీలు కలిగినది. భారతదేశంలో భాషాప్రయుక్త రాష్ట్రంగా ఏర్పడిన మొదటిది ఆంధ్రరాష్ట్రం. 1953 సంవత్సరము అక్టోబరు 1న ఏర్పడినది. దానికి ప్రథమ ముఖ్యమంత్రి ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంపంతులు గారిచే 1954లో ప్రారంభించబడి 1957లో పూర్తిగావింపబడినది. ప్రకాశం పంతులుగారి పేరున ప్రకాశం బ్యారేజి అని పిలువబడుచున్నది.

బ్యారేజి నిర్మాణం బృహత్తర కార్యక్రమం. బ్యారేజి పాత ఆనకట్టకు 104 అడుగుల ఎగువన 70 ఖానాలతో 1232.92 మీటర్ల (4045 అడుగులు) పొడవున నిర్మింపబడినది. ప్రతి ఖానా వెడల్పు 40 అడుగులు. తలుపు ఎత్తు 12'-0" అడుగులు. మూడు వరుసల ఆర్.సి.సి. కాంక్రీటు బావులు 7'-0"×12'-0" అడుగుల సైజువి భూమిలో దించబడినవి. మొదటి వరుస 16'-0" లోతు తక్కినవి 20' లోతుగలవి దాచబడినవి. పునాది నిర్మాణం కష్టముతో కూడుకొనిన పని. ప్రతి పునాది బావి, నదీగర్భంలో 16 నుండి 20 అడుగుల లోతుకు దించుటకు అనుభవజ్ఞులైన 'మాప్లా'లనబడే కేరళ పనివాళ్లను గానన్ దంకర్ల కంపెనీ నియమించినది. హెల్మెట్, ఆక్సిజను గొట్టములు ధరించి బావిలో దిగి, ఇసుకను త్రవ్వి తోడివేస్తుంటే బావులు క్రిందికి నెమ్మదిగా దిగేవి. ఒక్కొక్క సమయంలో బావులు పునాదిలో దింపునప్పుడు ప్రక్కకు జరిగి మరల ఏతలు సరిచేయుటకు

ఇసుకబస్తాలు ఇనుప దూలాలు ఉపయోగించి అధికశ్రమకు గురికావలసివచ్చేది. రెగ్యులేటరు స్థంభములన్నీ 8 అడుగుల మందం, మూడువైపుల చెక్కబడిన రాళ్లతో నిర్మింపబడినవి. కావలసిన రాళ్లు గుంటూరుజిల్లా పేరిచెర్ల క్వారి నుండి తేబడినవి. కృష్ణా బ్యారేజి నిర్మాణంతో పాటు కృష్ణా పడమర మెయిన్ కాలువపై రెండు ఖానాలలో 121'-6" అడుగుల పొడవుతో 25 సంవత్సరకాలంలో పూర్తిచేయబడినది.

ఇంజనీరుగా నా ప్రథమ నియామకం 1955లో కృష్ణాబ్యారేజి డివిజను ఆఫీసులో. తక్కువ ఖర్చుతో శ్రమించి సకాలంలో పని పూర్తిచేయటం ఇంజనీర్ల ధ్యేయం. మా ఇంజనీరింగు విభాగం ఆఫీసులు, రేకుల షెడ్డులు, కనకదుర్గమ్మ కొండ దిగువున విశ్వేశ్వరస్వామి దేవస్థానం సమీపంలో మా ఆఫీసులు ఉండేవి. బ్యారేజి నిర్మాణ కార్యక్రమం సీతానగరం వైపు నుండి ప్రారంభించబడినది. రోజు ఉదయాన్నే 7 గం॥కు బయలుదేరి ఆఫీసువద్దకు వెళ్ళి, ఇప్పుడున్న వాటరు వర్క్సు దగ్గర రేవులో ప్రభుత్వం ఏర్పాటు చేసిన లాంచీలమీద కృష్ణ అవలి ఒడ్డుకు చేరి, పనిచేసి, సాయంత్రం తిరిగి రావటం దినచర్య. సమయపాలన ప్రధానం. ఆరోజుల్లో మాకు జీపులు లేవు. నిర్ణీత సమయానికి ఆఫీసువద్దకు చేరుటకు ఒక వ్యాను కూడా ఏర్పాటుచేయటం, ఆ వ్యాను మారటం, నగరునుండి బయలుదేరి సూర్యారావుపేట మీదుగా అందర్నీ కలుపుకొని వెళ్ళటం విశేషం. అవలి ఒడ్డున ఇప్పుడున్న సీతానగరం హెడ్ స్లూయిస్ ప్రక్కనే ఒక తాటియాకుల షెడ్డు మా ఆఫీసు. నిర్మానుష్యమైన ప్రదేశం. 'టీ' దుకాణం కూడా ఉండేది కాదు. ఆ రోజుల్లో జూనియర్ ఇంజనీరు (సూపర్వైజర్) నెల జీతం రూ. 100లు.

మూడున్నర సంవత్సరాల కాలంలో 2.85 కోట్ల రూపాయల తక్కువ ఖర్చుతో బ్యారేజి పూర్తిచేయుట వలన కృష్ణాజిల్లా సస్య శ్యామలమై 13.08 లక్షల ఎకరాల ఆయకట్టు వృద్ధిచెందినది. ఆంధ్ర ఇంజనీర్ల ప్రతిభకు తార్కాణం ప్రకాశం బ్యారేజి నిర్మాణమంటే అతిశయోక్తి కాదు ! కార్యదక్షత, నిర్మాణ సామర్థ్యంలో ఎవరికి తీసిపోమని నిరూపించిన నిర్మాణాలు ప్రకాశం బ్యారేజి, ప్రపంచంలో అతిపెద్ద మేసనరి డాము (రాతికట్టడం) నాగార్జున సాగర్ ప్రాజెక్టు. కాని వాని నిర్మాణంలో పాల్గొన్న ఇంజనీర్లు కీ॥శే॥లు జి.ఎ. నరసింహారావు, శ్రీ ఎ.పి.రంగనాధస్వామి, శ్రీ కోకా జగన్నాధరావు, శ్రీ జె.ఎ. ముర్రే, శ్రీ సి.సంజీవరావు, వీరితో పనిచేసిన అనేకమంది జూనియర్ ఇంజనీర్లు. ప్రతిభావంతులైన వారిని ప్రభుత్వం ప్రజలు విస్మరించడం విచారకరం.

ప్రకాశం బ్యారేజి నిర్మాణం తర్వాత కృష్ణాడెల్టా, దశలవారీగా అభివృద్ధి చెందుతూ 13,08,000 ఎకరాల (కృష్ణా తూర్పు డెల్టా 7,37,000 ఎకరాలు, కృష్ణా పశ్చిమ డెల్టా 5,71,000 లు ఎకరాలకు) విస్తరించింది. డెల్టాక్రింద ఖరీఫ్, రబి రెండు పంటలు పండించి, అధిక దిగుబడులతో, ఎకరాకు 35 బస్తాలు ధాన్యం పండిస్తున్నారు. కృష్ణానదికి కృష్ణా డెల్టా చివరిది. కృష్ణా డెల్టాకు కేటాయించినది 161 టి.యమ్.సిల నీరు. ఒక టి.యమ్.సి అంటే శతకోటి ఘనపుటడుగుల నీరు. 11576 క్యూసెక్కుల నీరు, 24 గంటలు ప్రవహిస్తే దానిని టియమ్సి అంటారు. లక్ష ఎకరాలకు 13 టియమ్సిల నీరు కావాలి అనేది పరిగణన (లెక్క) ఒక టియమ్సితో 10,000 ఎకరాలు సాగు అవుతుంది. అదే సూక్ష్మ సేద్యం ద్వారా ఒక టియమ్సితో 15వేల ఎకరాలు సాగవుతుంది.

వర్షాభావ పరిస్థితులు ఏర్పడినప్పుడు కృష్ణాడెల్టాకు సకాలంలో నీరందని పరిస్థితి ఉన్నది. నదికి ఎగువనున్న రాష్ట్రములవారు, ఆల్మట్టి మొదలైన ప్రాజెక్టులు కట్టడం వలన, ఇటీవలి కాలంలో కృష్ణాడెల్టా మనుగడ ప్రశ్నార్థకమైనది. ఈ సమస్యను అధిగమించుటకు, కృష్ణా బ్యారేజికి 85 కి.మీ. ఎగువన, నాగార్జునసాగర్ 115 కి.మీ దిగువన పులిచింతల ప్రాజెక్టు నిర్మాణం జరిగినది. ఈ ప్రాజెక్టు ప్రధానంగా, కృష్ణాడెల్టా ఆయకట్టును స్థిరీకరించుటకు, ప్రాజెక్టులో నిలవ వుంచిన నీటితో సకాలంలో నార్లు పెంచి, నాట్లు వేసుకొని, సాగుబడిని పరిరక్షించుటకు వీలగుతుంది.

పులిచింతల ప్రాజెక్టు సామర్థ్యం 4.77 టియమ్సిలు. పులిచింతల ప్రాజెక్టుకు ఆద్యులు శ్రీ రాజా వాసిరెడ్డి రామకృష్ణ మహేశ్వరప్రసాద్ (ముక్త్యాల రాజా)గారు. పులిచింతల ప్రాజెక్టును సాకారం చేసినది డాక్టర్ కె.యల్.రావుగారు. పులిచింతల ప్రాజెక్టును డాక్టర్ కె.ఎల్.రావ్ సాగర్ అనే పేరుతో పిలుస్తున్నారు. కె.ఎల్.రావు గారు కేంద్రప్రభుత్వ ఆధీనంలో జలవనరుల మరియు విద్యుత్ విభాగంలో ఉన్నతమైన పదవిలో ఉండి, అనేక ఒడిదుడుకులనధిగమించి, పులిచింతల ప్రాజెక్టు, నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణానికి, ఆనాటి రాజ్యసభ సభ్యులు శ్రీ మోటూరి సత్యనారాయణగారు, పార్లమెంటు సభ్యులు ఆచార్య రంగాగారు, శాసనసభ్యులు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారి తోడ్పాటుతో కృషిచేయటం జరిగింది. వారి కృషి చిరస్మరణీయం. నాగార్జునసాగర్ ద్వారా కుడికాల్వ క్రింద గుంటూరు ప్రకాశం జిల్లాలలో 11,180 ఎకరాలు ఎడమ కాలువ ద్వారా ఖమ్మం, పశ్చిమ గోదావరి, కృష్ణాజిల్లా క్రింద 10,30,000 ఎకరాలు సాగు అవుతున్నది.

అలాంటి మహోన్నత వ్యక్తులు, ఇంజనీర్లు నిర్మించి అందించిన ప్రాజెక్టుద్వారా ఏర్పడిన నీటిపారుదలను సక్రమంగా వినియోగించుకొనవలసిన బాధ్యత మనపై ఉన్నది. ఇటీవల ప్రణాళిక శాఖ

గణాంకాల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో కాలువల ద్వారా సాగు అవుతున్న విస్తీర్ణం 48.6% (28,00,000 ఎకరాలు). చెరువుల క్రింద సాగులో ఉన్న భూమి 37.6%. గోదావరిపై నిర్మాణంలో ఉన్న పోలవరం ప్రాజెక్టు కాలువల ద్వారా, 80 టి.యమ్.సిల నీరు లభ్యమై కృష్ణా, పశ్చిమ గోదావరి ఖమ్మం జిల్లాలో, సాగువిస్తీర్ణం పెరుగుతుంది.

కనుక వ్యవసాయరంగంలో ఇంకా అభివృద్ధి సాధించి నవ్యాంధ్ర ప్రదేశ్ ప్రబలశక్తిగా ఆవిర్భవించటానికి అందరూ కృషిచేయాలి.

నదుల ద్వారా ప్రవహించే నీరు సద్వినియోగం చేసుకొనేందుకు బ్యారేజీలు, ప్రాజెక్టులు, రిజర్వాయర్లు నిర్మించుకొని, నీరు నిలువ వుంచుకొని, అవసరమైనప్పుడు ఉపయోగించుకుంటున్నాము. మానవ మనుగడకు నీటి వినియోగం ప్రధానం. వర్షాలు కురిసినప్పుడు ఉరుకులు పరుగులతో వృధాగా సముద్రం పాలయ్యే జలాలను సద్వినియోగం చేసుకోవాలి. చెరువులు నింపాలి. ప్రతి నీటిచుక్కను ఒడిసి పట్టి ఆకట్టుకుంటే భూగర్భజలాల నీటిమట్టం పెరుగుతుంది. చెరువుగట్లపై, కాల్వగట్లపై నదీతీరాల్లో చెట్లను పెంచితే పర్యావరణ రక్షణ ఏర్పడుతుంది. కృష్ణా, గోదావరి, గుంటూరుజిల్లాలో 80 శాతం భూమి సేద్యానికి అనుకూలం. ప్రధాన పంట వరి గాక వేరుశనగ, చెఱకు, ప్రత్తి, మిర్చి, పసుపు మొదలైన వాణిజ్యపంటలు కూడా పండుతాయి. గ్రామీణ ప్రజల జీవన ప్రమాణాలు పెంచాలన్నా, రాష్ట్రానికి ఆదాయ వనరులు చేకూర్చాలన్నా, సాగునీటి వనరులను అభివృద్ధి చేయాలి. వ్యవసాయోత్పత్తి పెంచాలి. తక్కువ నీటితో ఎక్కువ దిగుబడి సాధించాలి.

నవ్యాంధ్రప్రదేశ్ నిర్మాణంలో ప్రజల భాగస్వామ్యం ప్రధానమైనది. అందరూ చిత్తశుద్ధితో, నిర్విరామంగా కృషిచేస్తే ఆంధ్రప్రదేశ్ స్వర్ణాంధ్ర ప్రదేశ్‌గా అనతికాలంనే రూపొందుతుంది.

# తారసహిత బృహస్పతికి అర్ఘ్య ప్రదానం

బృహస్పతే సురాధ్యక్ష సర్వదేవ నమస్కృత
గృహాణార్ఘ్యం మయాదత్తం సింహస్థో భార్యయా సహ
ఓం తారాసహిత బృహస్పతయే నమః
ఇదమర్ఘ్యం సమర్పయామి

*చిరునామా : శ్రీ టి. శోభనాద్రి, ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు (రిటైర్డు), ఇంటి నెం. 48-12-1, శ్రీనివాస నిలయం గుణదల, విజయవాడ-520 004, సెల్ : 9440524305*

శ్రీ అక్కినేని భవాని ప్రసాద్

# జలదాత - కృష్ణవేణి మాత

**ఉపోద్ఘాతము :**

ఒకనొకప్పుడు మానవసమాజం సంచార జీవనం సాగిస్తూ తమ పశువుల మందలతో సహా ఎక్కడ పుష్కలంగా నీరు, పశుగ్రాసం, లభిస్తాయో అక్కడ ఆగుతూ జీవనయాత్ర సాగించే వారు క్రమంగా నదీ తీరాల్లో స్థిర నివాసమేర్పరచుకొని వ్యవసాయాన్ని, పశుపోషణను ఆదాయ వనరులుగా మార్చుకొని తనదైన శైలిలో నివసించసాగారు. కాలక్రమేణా తమకంటూ ఒక జీవన విధానాన్ని, సంస్కృతి సాంప్రదాతూలను ఏర్పరచుకోవటం జరిగింది. ప్రాచిన ప్రపంచములో గొప్ప సంస్కృతులుగా విలసిల్లిన మొహంజోదారో, హరప్పా, ఈజిప్టు మొదలయనవన్నీ, నదీతీరాలలోనే ప్రారంభమై అభివృద్ధి చెందినవి. సకల మానవజాతి సంస్కృతికి ఆధార భూతమైనది. నీరు, అందు వల్లనే మాన పూర్వకులు నదీనదాలకు దైవత్వాన్ని ఆపాదించి, మాతృమూర్తి గా భావించి పూజించేవారు.

మానవ నాగరికతా పరిణామక్రమంలో నదులతో ఏర్పడిన అనుబంధం కాలక్రమేణా మారుతూ వచ్చింది. ప్రప్రథమంగా, నదులలో పారుచున్న నీటిని, మానవ అవసరాలైన దాహం తీర్చు కోవటానికి, స్నానము చేయటానికి ఉపయోగించేవారు, కాలక్రమేణా వ్యవసాయ మెలుకువలను నేర్చుకొని స్థిర నివాసాలను ఏర్పరచుకిని వేదకాలంలోనే నదులకు అనుబంధంగా పారే వాగులు వంకలపై అడ్డుకట్టలు వేసి నీటిని వ్యవసాయ రంగానికి మరల్చటం ప్రారంభ మైంది.

భారతదేశంలో అడువులను నరికి, వ్యవసాయ క్షేత్రాలను ఏర్పరచి మొదట గుర్రాలతో దుక్కిదున్నించి పంటలను, ముఖ్యంగా ఆహార పంటను పండించటం ప్రారంభించారు. తరువాత ఎద్దులను ఉపయోగించటం, ఊటబావులను తవ్వుకోవటం నదుల నుండి కాలువలను త్రవ్వుకొని వ్యవసాయానికి నీటిని అధికంగా వాడుకోవటం ప్రారంభమైంది. పండుగలు, పర్వదినాలు, పుణ్యస్నానాలు, రవాణా, ప్రయాణాలు అన్నీకూడా నదులతో ముడిపడ్డ అంశాలే ! కృష్ణా, గోదావరి డెల్టా ప్రాంతంలోని తెలుగువారి ఆర్థిక, సామాజిక, రాజకీయ మరియు సాంస్కృతిక రంగాలలో సాధించిన అభివృద్ధి కృష్ణా గోదావరి నదుల పుణ్యమే !

ఆదునిక కాలంలో నదులలో ప్రవహించే నీటిని, వ్యవసాయ రంగంలో పాటు పారిశ్రామిక అవసరాలను కూడా మళ్ళించటంలో నదులకు మానవులకు మధ్య ఉండే ఆత్మీయబంధం మార్పుచెందుతూ ఒక నూతన ఆధ్యాయాన్ని ప్రారంభించినట్లైంది.

నదీగమనాన్ని నిరోధించి, బ్రహ్మాండమైన ఆనకట్టలను నిర్మించి నదీ జలాలను కాలువల ద్వారా మళ్ళించి లక్షలాది ఎకరాలను సాగులోనికి తీసుకొచ్చారు. మౌలికంగా, వ్యవసాయానికి నీటి వాడకం అనే సూత్రం ఒకటే అయినా భారీ ఆనకట్టల నిర్మాణం కారణంగా నదులు తమ జీవవైవిధ్యాన్ని కోల్పోయినాయి. ఇసుక మేటలు వేయటం, నదీ గమనం మారటం, నీటి క్షమత తగ్గిపోవటం, క్రమంగా పొలాలు క్షారమయం కావటం జరుగుతోంది. నది పరివాహక ప్రాంత ప్రజలకు ఆయకట్టు ప్రాంతపు ప్రజలకు మధ్య వైషమ్యాలకు అపార్థాలకు దారి తీస్తున్నాయి. వ్యవసాయ రంగంలోని పరిణామాలకు తోడుగా నదీ తీర ప్రాంతాలలో నిర్మింపబడిన పరిశ్రమలు విడుదల చేస్తున్న ఉద్గారాల వలన నదుల పరిస్థితి దయనీయంగా మారింది.

మానవునికి నదులకు గల ఆత్మీయ బంధంలో భాగంగా 12సం॥ల ఒకసారి పుష్కరాలను నిర్వహించు కోవటం పరిపాటిగా మారింది. దాదాపు 12రోజులు పాటు జరిగే ఈ కార్యక్రమంలో కొన్ని లక్షల మంది నదిలో స్నానమాచరిచటం జరుగుతుంది. 2016 సం॥లో కృష్ణా నది పుష్కరాలను ఆగస్టు 12వ తేది నుండి 24వ తేది వరకు నిర్వహించాలని నిర్ణయించారు. ఈ సందర్భంగా కృష్ణా నదీ పూర్వాపరాలను తెలుసుకోవటం మనందరి విధి అని భావిస్తున్నాము.

### కృష్ణా నది - పుట్టుపూర్వోత్తరాలు

భారతదేశంలో ప్రవహించే నదులలో మూడవ పెద్దనది కృష్ణా నది. గంగా నది, గోదావరి నదులు ఒకటి, రెండు స్థానాలతో పెద్దనదులు గా భావిస్తున్నాము. కృష్ణానది మహారాష్ట్ర రాష్ట్రంలో ఉన్న పడమటి కనుమలలో మహాబలేశ్వరం వద్ద పుట్టి, మహారాష్ట్ర, కర్నాటక, తెలంగాణా మరియు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల గుండా షుమారు 1400 కి॥మీ॥ దూరం ప్రవహించి, చివరగా మన రాష్ట్రంలోని కృష్ణా జిల్లాలోని హంసలదీవి, ఏటిమొగల వద్ద బంగాళాఖాతంలో విలీనమౌతుంది నైఋతీ ఋతుపవనాల ప్రభావంవలన మరియు 14 ఉపనదుల నుండి లభించే నీటి ద్వారా కృష్ణా నదికి అపారమైన జలరాశి లభిస్తోంది.




1850 వ సం॥నికి పూర్వం, కృష్ణానదిపై భారీ ప్రాజెక్టు లేవి లేనందున ఆ నీరంతా సముద్రంలో కలసిపోతూ ఉండేది. 1850 వ సం॥ము నుండి 1958 మధ్యకాలములో, ఆంధ్రప్రదేశ్‌లో కృష్ణా డెల్టా కాలువలు, కర్నూలు జిల్లాలో కర్నూలు -కడప కాలువ, మహారాష్ట్రలో ముత్తా -నీరాకుడి కాలువ, కర్నాటకలో వాణీ విలాస్ సాగర్ మొ॥గు ప్రాజెక్టులు నిర్మింపబడినాయి.

1915-30 మధ్యకాలములో టాటాకంపెనీ వారు మహారాష్ట్రలో భీమా ఉపనది పై టాటా హైడల్ పవర్ ప్రాజెక్టును నిర్మించి విద్యుతు ఉత్పాదన చేపట్టటం జరిగింది. ఆ క్రమంలో టాటా హైడల్ పవర్ ప్రాజెక్టులో వినియోగించే నీటిని, ప్రాజెక్టు అవసరాలు తీరిన అనంతరము పశ్చిమ దిశగా మళ్ళించి ఆరేబియా సముద్రంలో విలీనం చేయటం జరుగుతోంది. ఆకాలంలో కృష్ణానదిలో నీటి లభ్యతకు సరిపొడా వినియోగము లేనందున రైపేరియన్ రాష్ట్రాల మధ్య వివాదాలకు ఆస్కారం లేకుండా మధ్య వివాదాలకు ఆస్కారం లేకుండా పోయింది. కాని కాలక్రమములో, పరీవాహక రాష్ట్రాలలో జనాభాతో పాటు, నీటి అవసరాలు పెరగటంతో, కృష్ణానదీ జలాలను పంచుకోవటం లో వివాదాలు ఏర్పడ్డాయి !

## కృష్ణానది దాని ఉపనదులు

### కృష్ణానది - దాని ఉపనదులు

కృష్ణానది యొక్క ముఖ్య ఉపనదులు మాతృనదిలో సంగమించే దూరం ఈ దిగువ పట్టికలో పొందుపరచటమైనది.

| క్రమ సంఖ్య | ఉపనది పేరు | కృష్ణా నది జన్మ స్థలం నుండి దూరం | రాష్ట్ర పరిధి |
|---|---|---|---|
| 1 | కోయినా(కుడివైపున) | 137 కీ.మీ. | మహరాష్ట్ర |
| 2 | దూద్‌గంగ (కుడివైపున) | 306 కీ.మీ. | మహారాష్ట్ర -కర్నాటక సరిహద్దు |
| 3 | ఘట ప్రభ (కుడివైపున) | 507 కీ.మీ. | కర్నాటక |
| 4. | మలప్రభ (కుడివైపున) | 542 కీ.మీ. | కర్నాటక |
| 5. | భీమా (ఎడమవైపున) | 789 కీ.మీ. | కర్నాటక-తెలంగాణా సరిహద్దు |
| 6. | ఊకబెట్టివాగు (కుడివైపున) | 810 కీ.మీ. | ఆంధ్రప్రదేశ్ |
| 7. | పెదవాగు 1(ఎడమవైపున) | 877 కీ.మీ. | తెలంగాణా |
| 8. | తుంగభద్ర (కుడివైపున) | 917 కీ.మీ. | ఆంధ్రప్రదేశ్ |
| 9. | దిండి(ఎడమవైపున) | 1076 కీ.మీ. | తెలంగాణా |
| 10. | పెదవాగు (ఎడమవైపున) | 1120 కీ.మీ. | తెలంగాణా |
| 11. | హాలియా (ఎడమవైపున) | 1133 కీ.మీ. | తెలంగాణా |
| 12. | మూసీ (ఎడమవైపున) | 1168 కీ.మీ. | తెలంగాణా |
| 13. | పాలేరు(ఎడమవైపున) | 1226 కీ.మీ. | తెలంగాణా |
| 14. | మున్నేరు (ఎడమవైపున) | 1270 కీ.మీ. | తెలంగాణా |

కృష్ణా నది పై నిర్మింపబడిన సాగునీటి ప్రాజెక్టులు :

| క్రమ సంఖ్య | ప్రాజెక్టుపేరు | కృష్ణానది జన్మస్థలం నుండి దూరం | రాష్ట్రం | ప్రాజెక్టు ఎత్తు |
|---|---|---|---|---|
| 1. | హిప్పగిరి బ్యారేజ్ | 490 కి.మీ. | కర్నాటక | |
| 2. | ఆల్మెట్టి డ్యాం | 526 కి.మీ. | కర్నాటక | 519.60 అడుగులు |
| 3. | నారాయన్నాపూర్ డ్యాం | 573 కి.మీ. | కర్నాటక | 492.25 అడుగులు |
| 4. | జూరాల డ్యాం | 848 కి.మీ. | తెలంగాణ | 318.52 అడుగులు |
| 5. | శ్రీశైలం డ్యాం | 1026 కి.మీ. | ఆంధ్రప్రదేశ్, తెలంగాణ | 269.75 అడుగులు |
| 6. | నాగార్జున సాగర్ డ్యాం | 1126 కి.మీ. | ఆంధ్రప్రదేశ్, తెలంగాణ | 179.83 అడుగులు |
| 7. | పులిచింతల డ్యాం | 1207 కి.మీ. | ఆంధ్రప్రదేశ్, తెలంగాణ | 53.24 అడుగులు |
| 8. | ప్రకాశం బ్యారేజి | 1311 కి.మీ. | ఆంధ్రప్రదేశ్ | 17.89 అడుగులు |

కృష్ణా నదీ పరివాహక ప్రాంత విస్తీర్ణం 2,58,948 చ॥కి॥ మీటర్లు గా ఉన్నది. మహారాష్ట్రలో 69,426 చ॥ కి.మీ(26.81 శాతం), కర్ణాటకలో 1,13,270 చ॥కి॥మీ॥(43.71శాతం) మరియు 76,252 చ॥కి॥మీటర్లు (29.45) అవిభక్త ఆంధ్రప్రదేశ్‌లోనూ ఉన్నది. ఆంధ్రప్రదేశ్ మరియు తెలంగాణా రాష్ట్రాలలోని పరివాహక విస్తీర్ణం ఈ క్రింద సూచింపబడినది.

| క్రమ సంఖ్య | జిల్లాపేరు | రాష్ట్రం | విస్తీర్ణం చ॥కి॥మీ | రాష్ట్రసాయి | విస్తీర్ణం చ॥కి॥మీ |
|---|---|---|---|---|---|
| 1. | మహబూబ్ నగర్ | తెలంగాణా | 17,697 | | |
| 2. | నల్గొండ | తెలంగాణా | 13,859 | | |
| 3. | హైదరాబాద్ | తెలంగాణా | 7,407 | | |
| 4. | వరంగల్ | తెలంగాణా | 6,553 | | |
| 5. | ఖమ్మం | తెలంగాణా | 5,183 | | |
| 6. | మెదక్ | తెలంగాణా | 1,497 | | |
| 7. | కరీంనగర్ | తెలంగాణా | 36 | | |
| | | | | **తెలంగాణ** | **52,232** |
| 1. | అనంతపురం | ఆంధ్రప్రదేశ్ | 4,514 | | |
| 2. | కర్నూలు | ఆంధ్రప్రదేశ్ | 10,167 | రాయలసీమ | 14,167 |
| 3. | గుంటూరు | ఆంధ్రప్రదేశ్ | 5,465 | | |
| 4. | కృష్ణా | ఆంధ్రప్రదేశ్ | 3,584 | కోస్తాంధ్ర | 9,319 |
| | | | | **ఆంధ్రప్రదేశ్** | **23,420** |

కృష్ణానది మొత్తం పరివాహక ప్రాంతంలో మహారాష్ట్రలో 26.81శాతం, కర్నాటక రాష్ట్రంలో 43.74శాతం, తెలంగాణా రాష్ట్రం 20.17శాతం, చివరిగా ఆంధ్రప్రదేశ్‌లో 9.28శాతం ఉన్నది.

## కృష్ణానదీ బేసిన్‌లో వర్షపాతం

కృష్ణా నదీ బేసిన్‌లో లభించే నీటి కంతటికి వర్షాధారమే మూలం. అధిక భాగం నైఋతీ ఋతుపవనాల వలన, (జూన్ మధ్యకాలం నుండి సెప్టెంబర్ అంతం వరకు) లభించే వర్షపాతం వలన అధిక నీరు లభిస్తుంది.

కృష్ణా నదీ బేసిన్‌లో లభించే నీటి కంతటికి వర్షాధారమే మూలం. అధిక భాగం నైబుతీ ఋతుపవనాల వలన, (జూన్ మధ్యకాలం నుండి సెప్టెంబర్ అంతం వరకు) లభించే వర్షపాతం వలన అధిక నీరు లభిస్తుంది.

కృష్ణా నదీ బేసిన్‌లో సగటు వర్షపాతం సుమారు 784 మి॥లీ॥ కాగా, అందులో 70 నుండి 75 శాతం జూన్ –సెప్టెంబర్ మాసాల మధ్యకాలంలో వర్షపాతం వలన నీరు లభిస్తుంది. జూన్, జూలై మాసాలలో లభించే వర్షపాతం నీరు ఖరఫ్ పంటకు కీలకమన్న విషయాన్ని గమనించాలి! అక్టోబర్ మధ్య నుండి తిరోగమించే నైబుతీ ఋతు పవనాల వలన బంగాళాఖాతంలో ఏర్పడే అల్పపీడన ప్రభావం కారణంగా, గుండ్రంగా వంపుతిరిగుతూ ఈశాన్య ఋతు పవనాలుగా మార్పుచెందుతుంది. అందువలనే అక్టోబర్, నవంబర్ నెలలలో తుఫానులు సంభవించి అధిక వర్షపు నీటిని తెస్తుంది.

## కృష్ణాజలాల విభజన - బచావత్ అవార్డు

కేంద్రప్రభుత్వము వారు అంతర్ రాష్ట్ర జలవివాదాల చట్టం 1956నను సరించి, 1969 సం॥లో జస్టిస్ ఆర్. ఎస్ బచావతన్ అధ్యక్షతన ఒక ట్రిబ్యునలేను ఏర్పరచి కృష్ణానదీ జలాలను, మహారాష్ట్ర కర్నాటక మరియు 23 జిల్లాలతో కూడిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల మధ్య ఏర్పడిన జలవివాదాలను సమీక్షించి రిపోర్డు ఇవ్వవసిందిగా ఆదేశించారు. బచావల్ ట్రిబ్యూనల్, ఆయా రాష్ట్రాల మధ్యజరిగిన చర్చలను, 1894 సం॥ము నుండి 1971-72 మధ్యకాలంలొ కృష్ణానదీలో ప్రవాహ పరిమాణాన్ని పరిగణన లోనికి తీసుకుని, 3రాష్ట్రాలకు నీటి పంపణి చేయటం జరిగింది. 1894 సం॥ నుండి 1971-72 సం॥ర మధ్య కాలంలో కృష్ణానదిలో ప్రవహించిన నీటి పరిమాణ వివరాలను ఈ క్రింది పట్టికలో పొందు పరవటమైనది.

## నీటి విభజన

బచావత్ ట్రిబ్యునల్, అంతర్జాతీయంగా అమలులో ఉన్న న్యాయ సూత్రాలను, భారతదేశంలో పాటింపబడుచున్న పూర్వ ఆచరణలను పరిగణనలోనికి తీసుకుని, అప్పటికే వినియోగం లో ఉన్న నీటి పథకాలకు రక్షణ కల్పిస్తూ నిర్ణయం తీసుకోవడమైనది.

అంతర్జాతీయ న్యాయ సూత్రాలననుసరించి, "ఎవరు మొదట నదీజలాలను సొంతం చేసుకుని వినియోగించుకుంటారో వారికి ఆ నదీ జలాల పై ప్రథమ ప్రాధాన్యత ఉంటుంది" ప్రథమ వినియోగదారునికి ప్రథమ హక్కు అనే నానుడి ఈ న్యాయ సూత్రాల సారాంశం.

ఈ న్యాయ సూత్రాలకనుగుణంగా 1960 సెప్టెంబర్ వరకు మూడు రాష్ట్రాలలో అమలులో ఉన్న మరియు నిర్మాణంలోను ఉన్న వివిధ నీటి ప్రాజెక్టులకు కేటాయించిన నీటికి రక్షణ కల్పించటమైనది. దీని ప్రకారం, మహారాష్ట్రకు 439.60 శ॥కో॥ఘ॥అ॥లు, కర్నాటకకు 504.56 శ॥కో॥ఘ॥అ॥లు మరియు 23 జిల్లాలతో కూడిన ఆంధ్రప్రదేశ్‌కు 749.16 శ॥కొ॥ఘ॥అ॥ల నీటిని కృష్ణానదీ వార్షిక ప్రవాహ పరిమాణం నుండి కేటాయిచడం జరిగింది. ఈ విధంగా మొత్తం 1693.31 శ॥కో॥ఘ॥అ॥ల నీటిని 3రాష్ట్రాలకు కేటా యించడం జరిగింది.

75 సం॥ల కాలవ్యవధిలో కృష్ణానదిలో ప్రవహించిన వార్షిక స్థూలనీటి ప్రవాహ పరిమాణాన్ని అనుసరించి 2060 శ॥కో॥ఘ॥అ॥ల నీరు లభ్యమౌతుందని నిర్ణయించి, అందులో 3రాష్ట్రాలలో అమలులో ఉన్న లేదా నిర్మాణంలో ఉన్న వివిద ప్రాజెక్టు లకు కేటాయించిన 1693.31 శ॥కో॥అ॥ల నీటిని మినహాయించి మిగిలిన 366.69 శ॥కో॥ఘ॥అ॥ల నీటిని మూడు రాష్ట్రాలలోని వివిధ ప్రాజెక్టుల అవసరాన్ని బట్టి కేటాయించింది. అంతిమంగా, 75 శాతం విశ్వసనీయతతో లభించే 2060 శ॥కో॥ఘ॥అ॥ల వార్షిక నదీ ప్రవాహ పరిమాణాన్ని మహారాష్ట్రకు 560 శ॥కో॥అ॥లు, కర్నాటక రాష్ట్రానికి 700 శ॥కో॥ఘ॥అ॥ల నీటిని కేటాయించింది.

ట్రిబ్యునల్ చేసిన పై కేటాయింపులలో ఆంధ్రప్రదేశ్‌కు ఎక్కువ వాటా లభించిందనీ, మహారాష్ట్ర, కర్నాటక రాష్ట్రాలు తమ అసంతృప్తిని తెలియ చేసాయి. అంతేకాక, 3రాష్ట్రాలలో ను కృష్ణానదీ బేసినలో ఉన్న జనాభాను సేద్యయోగ్యమైన భూమి, కరవు ప్రాంతాలను మరియు నదీ పరివాహక ప్రాంతాన్ని దృష్టిలో ఉంచుకుని నీటిని కేటాయించాలని కోరటం జరిగింది. దీనిపై ట్రిబ్యునల్ తమ వివరణను ఇస్తూ "సేద్య యోగ్యమైన భూమి, జనాభా, నదీ పరివాహక ప్రాంత విస్తీర్ణం మొ॥గు అంశాల ప్రాతిపదికగా చూసినపుడు ఆంధ్రప్రదేశ్‌కు చారిత్రకు కారణాలవలన రావలసిన దానికన్నా అదనంగా నీటి పరిమాణం లభించిన మాట వాస్తవమే, కాని ఆంధ్రప్రదేశ్ మిగిలిన రాష్ట్రాలకన్నా ఎంతో ముందుగా రంగ ప్రవేశం గావించి, విశేష వ్యయ ప్రయాసలతో ఎంతో విస్తీర్ణం గల భూమికి సాగునీటి సౌకర్యం కల్పించి తమ ఆర్థిక వ్యవస్థను బలపరచుకున్నది. అది ఆంధ్రప్రదేశ్ తప్పు కాదు, ఆ రాష్ట్రానికి పుష్కలంగా నీరందు బాటులో ఉండటంతో పాటు ప్రకృతి కూడా సహకరింరింది, అనిచెప్పి ట్రిబ్యునల్ మహారాష్ట్ర, కర్నాటక రాష్ట్రాల అభ్యర్థనలను త్రోసిపుచ్చటం జరిగింది. ఆంధ్రప్రదశ్‌కు కేటాయించబడిన 800 శ॥కో॥ఘ॥అ॥ల నీటి పరిమాణంలో శ్రీశైలం, నాగార్జున సాగర్ ఆవిరి రూపంలో తగ్గిపోయే మొత్తం 50శ॥కో॥ఘ॥అ॥లు పోనుమిగిలిన 750 శ॥కో॥ఘ॥అ॥ల నీటిలో తెలంగాణా ప్రాంతానికి 260.43 శ॥కో॥ఘ॥అ॥లు, రాయల

సీమ ప్రాంతానికి 122.70 శ॥కో॥ఘ॥అ॥లు కోస్తాంధ్ర ప్రాంతానికి 366.87 శ॥కో॥ఘ॥అ॥లు నీరు లభించింది. స్థూలంగా పరిశీలిస్తే, రక్షిత వినియోగం క్రింద ఆంధ్రప్రదేశ్‌కు కేటాయింపబడిన 749.16 శ॥కో॥ఘ॥అ॥ల వాటాపోను, అదనంగా శ్రీశైలం జలాశయంలో ఆవిరి రూపంలో తగ్గి పోయే నీటికి పరిహారంగా 33 శ॥కో॥ఘ॥అ॥లు, తెలంగాణా ప్రాంతంలోని జూరాల ప్రాజెక్టుకు 17.84 శ॥కో॥ఘ॥అ॥ల నీరు కేటాయించబడినది.

100 సం॥ల కాలావధిలో 25 సం॥ల కృష్ణానదికి ఆంధ్రప్రదేశ్ చివరి రాష్ట్రమైనందున తగినంత నీరు లభ్యం కాని పరిస్థితి ఏర్పడే అవకాశం ఉన్నది కనుక ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఎగువ రాష్ట్రాల వారు తమకు కేటాయించిన నీటిని వినియోగించుకొనగా నదిలో ప్రవహించే మిగులు జలాలను ఏవిధమైన హక్కులు కోరకుండా వినియోగించుకునే అవకాశం కల్పించబడినది.

## కృష్ణా డెల్టా

షుమారు 160 సం॥ల చరిత్ర కల్గినది. కృష్ణాడెల్టా, మొత్తం ఆయకట్టు 13,08,851 ఎకరాలు, తూర్పు డెల్టాక్రింద కృష్ణాజిల్లాలో 6,97,500 ఎ॥లు, ప॥గోదావరి జిల్లాలో 58,000 ఎ॥లు, పశ్చిమ డెల్టాక్రింద గుంటూరు జిల్లాలో 4,99,231 ఎకరాలు, ప్రకాశం జిల్లాలో 72,120 ఎ॥లు గా ఉన్నది. 1831-1838 సం॥ల మధ్యకాలంలో ఆనాటి గోదావరి, కృష్ణా మండలాలలో (ప్రస్తుత తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలు, కృష్ణా గుంటూరు మరియు ప్రకాశం జిల్లాలు) తీవ్ర దుర్భిక్ష పరిస్థితులు ఏర్పడినందున వేలాది మంది ప్రజలు మృత్యువాత పడినట్లు, అనేక మంది ప్రజలు వివిధ ప్రాంతాలకు వలసలు పోయినట్లు చరిత్ర చెబుతోంది. కాని, "నదీనాం సాగరోగతి:" అన్ననానుడిని నిరర్థకం చేసి గోదావరి, కృష్ణా నదుల జలాలను వ్యవసాయానికి అనువుగా మార్చిన అభినవ భగీరథుడు సర్.ఆర్థర్ థామస్ కాటన్, అనే బ్రిటిష్ అధికారి. ఆయన 1842-46 సం॥రాల మధ్య కాలంలో గోదావరి నదిపైన ధవళేశ్వరం వద్ద మొట్టమొదటి సారిగా ఆనకట్టను నిర్మించి గోదావరి నదీ జలాలను వ్యవసాయానికి మరల్చటం జరిగింది. దాని ఫలితాలను గమనించిన కృష్ణా మండలవాసులు బెజవాడ వద్ద కృష్ణానది పై ఆనకట్టను నిర్మించాలని ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వంపై వత్తిడిని పెంచేదిశగా పావులను కదపటం ప్రారంభించారు. సర్. ఆర్థర్ కాటన్ ప్రజల ఆకాంక్షను గమనించి, బెజవాడ వద్ద కృష్ణానది పై ఆనకట్టను నిర్మించి, ప్రప్రథమంగా 5.8 లక్షల ఎకరాలకు సాగు నీరందించే విధంగా ప్రణాళికలను రూపొందించి ఆనాటి బ్రిటీష్ ప్రభుత్వానికి నివేదించి అనుమతులను సాధించారు. కృష్ణా నదిపై ఆనకట్ట నిర్మాణ బాధ్యతలను కెప్టెన్ ఓర్‌కు అందించగా 1855 సం॥లో ఆనకట్ట నిర్మాణాన్ని పూర్తిగావించి 5.8 లక్షల ఎకరాలకు సాగు నీటి సౌకర్యం ఏర్పాటైంది.

కాలక్రమేణా కృష్ణా డెల్టా ఆయకట్టు 5.8 లక్షల ఎకరాల నుండి 13 లక్షల ఎ॥కు అభివృద్ధి చెందింది. బచావత్ ట్రిబ్యునల్ తీర్పునను సరించి కృష్ణా డెల్టాకు అంతర్జాతీయ న్యాయ సూత్రాల కనుగుణంగా 181.2 శ॥కో॥ఘ॥అ॥ల నీటిని కేటాయించటం జరిగింది. కాలక్రమేణా, రెండు రాష్ట్రాలలో ముఖ్యంగా మహారాష్ట్ర కర్నాటక రాష్ట్రాలలో కృష్ణానది దాని ఉపనదుల పైన అనేక నిర్మాణాలు (అధికారక మరియు అనధికారక) నిర్మాణం కారణంగా, డెల్టాకు తగిన కాలంలో అనగా జూన్ మొదటి వారంలో సాగు నీరందక రైతాంగం ఇబ్బందుల పాలంటం ప్రారంభమైంది. దీనికి తోడు మన రాష్ట్ర ప్రభుత్వం ప్రతి సం॥ము ఫిబ్రవరి నుండి మే నెల వరకు శ్రీశైలం మరియు నాగార్జున సాగర్ ప్రాజెక్టులలో నిలువ ఉంచవలసిన నీటిని విద్యుత్ ఉత్పత్తి కై వినియోగించటం కారణంగా, ఖరీఫ్ సీజన్ ప్రారంభం నాటికి నీరు లభించక సకాలంలో నారుమళ్ళీ వేయలేని పరిస్థితి ఏర్పడింది.

కృష్ణా నదిపై బెజవాడ వద్ద ఒక ఆనకట్టను నిర్మించినట్టయితే బ్రిటిష్ ప్రభుత్వానికి గణనీయమైన ఆదాయం లభిస్తుందని, ఆప్రాంతంలో తరచుగా సంభవిస్తున్న కరవు పరిస్థితుల నుండి ప్రజలకు రక్షణ కల్పించే అవకాశముందని ఆనాటి సర్వేయర్ జనరల్ మేజర్ అలెగ్జాండర్ బీట్సన్ ప్రభుత్వానికి సూచించారు. సదరు సూచనను సమగ్రంగా పరిశీలించి సమగ్రమైన నివేదికను అందచేయవలసిందగా 1792వ సం॥లో ఆనాటి మద్రాస్ ప్రెసిడెన్సీ మైకేల్ టాపింగ్ అనే అధికారిని ఆదేశించింది. టాపింగ్ 3సం॥ల పాటు సర్వేను నిర్వహించి మేజర్ బీట్సన్ సూచనలను బలపరుస్తూ నివేదిక నందచేశారు. కాని, ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వము నుండి ఏరకమైన స్పందన రాలేదు.

1882-83 సం॥ల మధ్యకాలంలో సంభవించిన 'డొక్కల కరువు' లేదా 'నందన నామ క్షామం' సంభవించినపుడు, కృష్ణా గోదావరి మండలాలు తల్లడిల్లిపోయాయి. ఒక్క గుంటూరు మండలంలోనే 3లక్షల మంది ప్రజలు ప్రాణాలను కోల్పోయారు, రెండు లక్షల పశువులు మృత్యువాతపడ్డాయి. బ్రిటిష్ ఖజానాకు కోటిరూపాయల పైబడి రెవెన్యూ నష్టం కలిగినట్లు తెలుస్తోంది. ఈ నేపథ్యంలో 1839 సం॥లో కెప్టెన ఎడ్వర్డ్ బకుల్ అనే ఇంజనీరు మరోసారి కృష్ణానది పై బెజవాడ వద్ద అనకట్టును నిర్మించాలనే ప్రతిపాదనను ప్రభుత్వం దృష్టికి తేవటం జరిగింది. బెజవాడ దగ్గర 1,900 అ॥ల వెడల్పు గల కృష్ణానది లోయలో 40 అ॥ల ఎత్తువరకు ఉవ్వెత్తున ఎగసిపడే కృష్ణా ప్రవాహంలో ఇసుక పునాదిపై ఆనకట్ట నిర్మాణం అసాధ్యమని బ్రిటిష్ ప్రభుత్వం భావించి ముందుకు రాలేదు.

అయితే 1847 వ సం॥లో గోదావరి నదిపై ధవళేశ్వరం వద్ద ఆనకట్ట నిర్మాణాన్ని చేపట్టిన ప్రభుత్వం, కృష్ణానదిపై ఆనకట్ట నిర్మాణానికి మౌనం దాల్చటం ప్రజలు సహించలేక పోయారు. ప్రభుత్వానికి శరపరంపరగా వినతి పత్రాలను సమర్పించటంతో

కృష్ణా నదీ బేసిన్‌లో సగటు వర్షపాతం సుమారు 784 మి॥లీ॥ కాగా, అందులో 70 నుండి 75 శాతం జూన్ –సెప్టెంబర్ మాసాల మధ్యకాలంలో వర్షపాతం వలన నీరు లభిస్తుంది. జూన్, జూలై మాసాలలో లభించే వర్షపాతం నీరు ఖరీఫ్ పంటకు కీలకమన్న విషయాన్ని గమనించాలి! అక్టోబర్ మధ్య నుండి తిరోగమించే నైఋతీ ఋతు పవనాల వలన బంగాళాఖాతంలో ఏర్పడే అల్పపీడన ప్రభావం కారణంగా, గుండ్రంగా వంపుతిరిగుతూ ఈశాన్య ఋతు పవనాలుగా మార్పుచెందుతుంది. అందువలనే అక్టోబర్, నవంబర్ నెలలలో తుఫానులు సంభవించి అధిక వర్షపు నీటిని తెస్తుంది.

## కృష్ణాజలాల విభజన - బచావత్ అవార్డు

కేంద్రప్రభుత్వము వారు అంతర్ రాష్ట్ర జలవివాదాల చట్టం 1956నను సరించి, 1969 సం॥లో జస్టిస్ ఆర్. ఎస్ బచావతన్ అధ్యక్షతన ఒక ట్రిబ్యునలేను ఏర్పరచి కృష్ణానదీ జలాలను, మహారాష్ట్ర కర్నాటక మరియు 23 జిల్లాలతో కూడిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల మధ్య ఏర్పడిన జలవివాదాలను సమీక్షించి రిపోర్టు ఇవ్వవసిందిగా ఆదేశించారు. బచావల్ ట్రిబ్యూనల్, ఆయా రాష్ట్రాల మధ్యజరిగిన చర్చలను, 1894 సం॥ము నుండి 1971-72 మధ్యకాలంలో కృష్ణానదీలో ప్రవాహ పరిమాణాన్ని పరిగణన లోనికి తీసుకుని, 3రాష్ట్రాలకు నీటి పంపణి చేయటం జరిగింది. 1894 సం॥ నుండి 1971-72 సం॥ర మధ్య కాలంలో కృష్ణానదిలో ప్రవహించిన నీటి పరిమాణ వివరాలను ఈ క్రింది పట్టికలో పొందు పరవటమైనది.

శతకోటి ఘనపు అడుగులలో

| క్ర.సం. | సంవత్సరం | స్థూలప్రవాహ పరిమాణం | అవరోహణక్రమంలో స్థూలప్రవాహ పరిమాణం | |
|---|---|---|---|---|
| | | | సంవత్సరం | స్థూలప్రవాహ పరిమాణం |
| 1 | 2 | 3 | 4 | 5 |
| 1. | 1894-95 | 2084 | 1956-57 | 4165 |
| 2. | 1895-96 | 2182 | 61-62 | 3755 |
| 3. | 1896-97 | 2611 | 16-17 | 3721 |
| 4. | 1897-98 | 2695 | 1959-60 | 3477 |
| 5. | 1898-99 | 2587 | 64-65 | 3389 |
| 6. | 1899-1900 | 1124 | 03-04 | 3160 |
| 7. | 1900-01 | 2795 | 58-59 | 3113 |
| 8. | 1901-02 | 2057 | 62-63 | 3075 |
| 9. | 1902-03 | 1869 | 60-61 | 3060 |
| 10. | 1903-04 | 3160 | 14-15 | 3049 |
| 11. | 1904-05 | 1770 | 17-18 | 3029 |
| 12. | 1905-06 | 1272 | 55-56 | 2969 |
| 13. | 1906-07 | 1891 | 33-34 | 2936 |
| 14. | 1907-08 | 2276 | 53-54 | 2919 |
| 15. | 1908-09 | 2472 | 31-32 | 2903 |
| 16. | 1909-10 | 2144 | 46-47 | 2840 |
| 17. | 1910-11 | 2422 | 1900-01 | 2795 |
| 18. | 1911-12 | 1451 | 63-64 | 2751 |
| 19. | 1912-13 | 1965 | 57-58 | 2730 |
| 20. | 1913-14 | 1809 | 70-71 | 2725 |
| 21. | 1914-15 | 3049 | 1932-33 | 2703 |
| 35. | 1928-29 | 2212 | 1915-16 | 2374 |
| 36. | 1929-30 | 1918 | 43-44 | 2333 |
| 37. | 1930-31 | 2196 | 24-25 | 2324 |
| 38. | 1931-32 | 2903 | 48-49 | 2311 |
| 39. | 1932-33 | 2703 | 27-28 | 2305 |
| 40. | 1933-34 | 2936 | 40-41 | 2287 |
| 41. | 1934-35 | 2085 | 1925-26 | 2281 |
| 42. | 1935-36 | 1927 | 07-08 | 2276 |
| 43. | 1936-37 | 1990 | 19-20 | 2270 |
| 44. | 1937-38 | 2046 | 28-29 | 2212 |

| క్ర.సం. | సంవత్సరం | స్థూలప్రవాహ పరిమాణం | అవరోహణక్రమంలో స్థూలప్రవాహ పరిమాణం | |
|---|---|---|---|---|
| | | | సంవత్సరం | స్థూలప్రవాహ పరిమాణం |
| 1 | 2 | 3 | 4 | 5 |
| 45. | 1938-39 | 2613 | 30-31 | 2196 |
| 46. | 1939-40 | 2194 | 39-40 | 2194 |
| 47. | 1940-41 | 2287 | 1895-96 | 2182 |
| 48. | 1941-42 | 1715 | 1926-27 | 2177 |
| 49. | 1942-43 | 2169 | 42-43 | 2169 |
| 50. | 1943-44 | 2333 | 21-22 | 2164 |
| 51. | 1944-45 | 2129 | 09-10 | 2144 |
| 52. | 1945-46 | 1960 | 71-72 | 2137 |
| 53. | 1946-47 | 2840 | 44-45 | 2129 |
| 54. | 1947-48 | 2526 | 68-69 | 2116 |
| 55. | 1948-49 | 2311 | 34-35 | 2085 |
| 56. | 1949-50 | 2544 | 1894-95 | 2084 |
| 57. | 1950-51 | 2629 | 1922-23 | 2063 |
| 58. | 1951-52 | 1970 | 65-66 | 2063 |
| 59. | 1952-53 | 1749 | 01-02 | 2057 |
| 60. | 1953-54 | 2919 | 37-38 | 2046 |

| | | | | |
|---|---|---|---|---|
| 61. | 1954-55 | 2439 | 36-37 | 1990 |
| 62. | 1955-56 | 2969 | 51-52 | 1970 |
| 63. | 1956-57 | 4165 | 12-13 | 1965 |
| 64. | 1957-58 | 2730 | 45-46 | 1960 |
| 65. | 1958-59 | 3113 | 66-67 | 1939 |
| 66. | 1959-60 | 3477 | 1935-36 | 1927 |
| 67. | 1960-61 | 3060 | 29-30 | 1918 |
| 68. | 1961-62 | 3755 | 06-07 | 1891 |
| 69. | 1962-63 | 3075 | 02-03 | 1869 |
| 70. | 1963-64 | 2751 | 13-14 | 1809 |
| 71. | 1964-65 | 3389 | 04-05 | 1770 |
| 72. | 1965-66 | 2063 | 1952-53 | 1749 |
| 73. | 1966-67 | 1939 | 41-42 | 1715 |
| 74. | 1967-68 | 2519 | 20-21 | 1690 |
| 75. | 1968-69 | 2116 | 11-12 | 1451 |
| 76. | 1969-70 | 2665 | 05-06 | 1272 |
| 77. | 1970-71 | 2725 | 1899-1900 | 1124 |
| 78. | 1971-72 | 2137 | 1918-19 | 1007 |

**స్థూల సగటు వార్షిక ప్రవాహ పరిమాణం = 2390**

**75 శాతంతో విశ్వసనీయ ప్రవాహ పరిమాణం = 2060**

### నీటి విభజన

బచావత్ ట్రిబ్యునల్, అంతర్జాతీయంగా అమలులో ఉన్న న్యాయసూత్రాలను, భారతదేశంలో పాటింపబడుచున్న పూర్వ ఆచరణలను పరిగణనలోనికి తీసుకుని, అప్పటికే వినియోగం లో ఉన్న నీటి పథకాలకు రక్షణ కల్పిస్తూ నిర్ణయం తీసుకోవడమైనది.

అంతర్జాతీయ న్యాయ సూత్రాలననుసరించి, "ఎవరు మొదట నదీజలాలను సొంతం చేసుకుని వినియోగించుకుంటారో వారికి ఆ నదీ జలాల పై ప్రథమ ప్రాధాన్యత ఉంటుంది" ప్రథమ వినియోగదారునికి ప్రథమ హక్కు అనే నానుడి ఈ న్యాయ సూత్రాల సారాంశం.

ఈ న్యాయ సూత్రాలకనుగుణంగా 1960 సెప్టెంబర్ వరకు మూడు రాష్ట్రాలలో అమలులో ఉన్న మరియు నిర్మాణంలోను ఉన్న వివిధ నీటి ప్రాజెక్టులకు కేటాయించిన నీటికి రక్షణ కల్పించటమైనది. దీని ప్రకారం, మహారాష్ట్రకు 439.60 శ॥కో॥ఘ॥ అ॥లు, కర్నాటకకు 504.56 శ॥కో॥ఘ॥అ॥లు మరియు 23 జిల్లాలతో కూడిన ఆంధ్రప్రదేశ్‌కు 749.16 శ॥కో॥ఘ॥అ॥ల నీటిని కృష్ణానదీ వార్షిక ప్రవాహపరిమాణం నుండి కేటాయిచడం జరిగింది. ఈ విధంగా మొత్తం 1693.31 శ॥కో॥ఘ॥అ॥ల నీటిని 3రాష్ట్రాలకు కేటాయించడం జరిగింది.

75 సం॥ల కాలవ్యవధిలో కృష్ణానదిలో ప్రవహించిన వార్షిక స్థూలనీటి ప్రవాహ పరిమాణాన్ని అనుసరించి 2060 శ॥కో॥ఘ॥అ॥ల నీరు లభ్యమౌతుందని నిర్ణయించి, అందులో 3రాష్ట్రాలలో అమలులో ఉన్న లేదా నిర్మాణంలో ఉన్న వివిద ప్రాజెక్టు లకు కేటాయించిన 1693.31 శ॥కో॥అ॥ల నీటిని మినహాయించి మిగిలిన 366.69 శ॥కో॥ఘ॥అ॥ల నీటిని మూడు రాష్ట్రాలలోని వివిధ ప్రాజెక్టుల అవసరాన్ని బట్టి కేటాయించింది. అంతిమంగా, 75 శాతం విశ్వసనీయతలో లభించే 2060 శ॥కో॥ఘ॥అ॥ల వార్షిక నదీ ప్రవాహ పరిమాణాన్ని మహారాష్ట్రకు 560 శ॥కో॥అ॥లు, కర్నాటక రాష్ట్రానికి 700 శ॥కో॥ఘ॥అ॥ల నీటిని కేటాయించింది.

ట్రిబ్యునల్ చేసిన పై కేటాయింపులలో ఆంధ్రప్రదేశ్‌కు ఎక్కువ వాటా లభించిందనీ, మహారాష్ట్ర, కర్నాటక రాష్ట్రాలు తమ అసంతృప్తిని తెలియ చేసాయి. అంతేకాక, 3రాష్ట్రాలలో ను కృష్ణానదీ బేసినలో ఉన్న జనాభాను సేద్యయోగ్యమైన భూమి, కరవు ప్రాంతాలను మరియు నదీ పరివాహక ప్రాంతాన్ని దృష్టిలో ఉంచుకుని నీటిని కేటాయించాలని కోరటం జరిగింది. దీనిపై ట్రిబ్యునల్ తమ వివరణను ఇస్తూ "సేద్యయోగ్యమైన భూమి, జనాభా, నదీ పరివాహక ప్రాంత విస్తీర్ణం మొ॥గు అంశాల ప్రాతిపదికగా చూసినపుడు ఆంధ్రప్రదేశ్‌కు చారిత్రకు కారణాలవలన రావలసిన దానికన్నా అదనంగా నీటి పరిమాణం లభించిన మాట వాస్తవమే, కాని ఆంధ్రప్రదేశ్ మిగిలిన రాష్ట్రాలకన్నా ఎంతో ముందుగా రంగ ప్రవేశం గావించి, విశేష వ్యయ ప్రయాసలతో ఎంతో విస్తీర్ణం గల భూమికి సాగునీటి సౌకర్యం కల్పించి తమ అర్థిక వ్యవస్థను బలపరచుకున్నది. అది ఆంధ్రప్రదేశ్ తప్పు కాదు, ఆ రాష్ట్రనికి పుష్కలంగా నీరందు బాటులో ఉండటంతో పాటు ప్రకృతి కూడా సహకరింరింది, అనిచెప్పి ట్రిబ్యునల్ మహారాష్ట్ర, కర్నాటక రాష్ట్రాల అభ్యర్థనలను త్రోసిపుచ్చటం జరిగింది. ఆంధ్రప్రదశ్‌కు కేటాయించబడిన 800 శ॥కో॥ఘ॥అ॥ల నీటి పరిమాణంలో శ్రీశైలం, నాగార్జున సాగర్ ఆవిరి రూపంలో తగ్గిపోయే మొత్తం 50శ॥కో॥ఘ॥అ॥లు పోనుమిగిలిన 750 శ॥కో॥ఘ॥అ॥ల నీటిలో తెలంగాణా ప్రాంతానికి 260.43 శ॥కో॥ఘ॥అ॥లు, రాయలసీమ ప్రాంతానికి 122.70 శ॥కో॥ఘ॥అ॥లు కోస్తాంధ్ర ప్రాంతానికి 366.87 శ॥కో॥ఘ॥అ॥లు నీరు లభించింది. స్థూలంగా పరిశీలిస్తే, రక్షిత వినియోగం క్రింద ఆంధ్రప్రదేశ్‌కు కేటాయింపబడిన

749.16 శ॥కో॥ఘ॥అ॥ల వాటాపోను, అదనంగా శ్రీశైలం జలాశయంలో ఆవిరి రూపంలో తగ్గి పోయే నీటికి పరిహారంగా 33 శ॥కో॥ఘ॥అ॥లు, తెలంగాణా ప్రాంతంలోని జూరాల ప్రాజెక్టుకు 17.84 శ॥కో॥ఘ॥అ॥ల నీరు కేటాయించబడినది.

100 సం॥ల కాలావధిలో 25 సం॥ల కృష్ణానదికి ఆంధ్రప్రదేశ్ చివరి రాష్ట్రమైనందున తగినంత నీరు లభ్యం కాని పరిస్థితి ఏర్పడే అవకాశం ఉన్నది కనుక ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఎగువ రాష్ట్రాల వారు తమకు కేటాయించిన నీటిని వినియోగించుకొనగా నదిలో ప్రవహించే మిగులు జలాలను ఏవిధమైన హక్కులు కోరకుండా వినియోగించుకునే అవకాశం కల్పించబడినది.

## కృష్ణా డెల్టా

షుమారు 160 సం॥ల చరిత్ర కల్గినది. కృష్ణాడెల్టా, మొత్తం ఆయకట్టు 13,08,851 ఎకరాలు, తూర్పు డెల్టాక్రింద కృష్ణాజిల్లాలో 6,97,500 ఎ॥లు, ప॥గోదావరి జిల్లాలో 58,000 ఎ॥లు, పశ్చిమ డెల్టాక్రింద గుంటూరు జిల్లాలో 4,99,231 ఎకరాలు, ప్రకాశం జిల్లాలో 72,120 ఎ॥లు గా ఉన్నది. 1831-1838 సం॥ల మధ్యకాలంలో ఆనాటి గోదావరి, కృష్ణా మండలాలలో (ప్రస్తుత తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలు, కృష్ణా గుంటూరు మరియు ప్రకాశం జిల్లాలు) తీవ్ర దుర్భిక్ష పరిస్థితులు ఏర్పడినందున వేలాది మంది ప్రజలు మృత్యువాత పడినట్లు, అనేక మంది ప్రజలు వివిధ ప్రాంతాలకు వలసలు పోయినట్లు చరిత్ర చెబుతోంది. కాని, "నదీనాం సాగరోగతిః" అన్ననానుడిని నిరర్ధకం చేసి గోదావరి, కృష్ణా నదుల జలాలను వ్యవసాయానికి అనువుగా మార్చిన అభినవ భగీరధుడు సర్.ఆర్థర్. ధామస్ కాటన్, అనే బ్రిటిష్ అధికారి. ఆయన 1842-46 సం॥రాల మధ్య కాలంలో గోదావరి నదిపైన ధవళేశ్వరం వద్ద మొట్టమొదటి సారిగా ఆనకట్టను నిర్మించి గోదావరి నదీ జలాలను వ్యవసాయానికి మరల్చటం జరిగింది. దాని ఫలితాలను గమనించిన కృష్ణా మండల వాసులు బెజవాడ వద్ద కృష్ణానది పై ఆనకట్టను నిర్మించాలని ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వంపై వత్తిడిని పెంచేదిశగా పావులను కదపటం ప్రారంభించారు. సర్. ఆర్థర్ కాటన్ ప్రజల ఆకాంక్షను గమనించి, బెజవాడ వద్ద కృష్ణానది పై ఆనకట్టను నిర్మించి, ప్రపధమంగా 5.8 లక్షల ఎకరాలకు సాగు నీరందించే విధంగా ప్రణాళికలను రూపొందించి ఆనాటి బ్రిటీష్ ప్రభుత్వానికి నివేదించి అనుమతులను సాధించారు. కృష్ణా నదిపై ఆనకట్ట నిర్మాణ బాధ్యతలను కెప్టెన్ ఓర్‌కు అందించగా 1855 సం॥లో ఆనకట్ట నిర్మాణాన్ని పూర్తిగావించి 5.8 లక్షల ఎకరాలకు సాగు నీటి సౌకర్యం ఏర్పాటైంది.

కాలక్రమేణా కృష్ణా డెల్టా ఆయకట్టు 5.8 లక్షల ఎకరాల నుండి 13 లక్షల ఎ॥కు అభివృద్ధి చెందింది. బచావత్ ట్రిబ్యునల్ తీర్పునను సరించి కృష్ణా డెల్టాకు అంతర్జాతీయ న్యాయ సూత్రాల కనుగుణంగా 181.2 శ॥కో॥ఘ॥అ॥ల నీటిని కేటాయించటం జరిగింది. కాలక్రమేణా, రెండు రాష్ట్రాలలో ముఖ్యంగా మహారాష్ట్ర కర్నాటక రాష్ట్రాలలో కృష్ణానది దాని ఉపనదుల పైన అనేక నిర్మాణాలు (అధికారక మరియు అనధికారక) నిర్మాణం కారణంగా, డెల్టాకు తగిన కాలంలో అనగా జూన్ మొదటి వారంలో సాగు నీరందక రైతాంగం ఇబ్బందుల పాలంటం ప్రారంభమైంది. దీనికి తోడు మన రాష్ట్ర ప్రభుత్వం ప్రతి సం॥ము ఫిబ్రవరి నుండి మే నెల వరకు శ్రీశైలం మరియు నాగార్జున సాగర్ ప్రాజెక్టులలో నిలువ ఉంచవలసిన నీటిని విద్యుత్ ఉత్పత్తి కై వినియోగించటం కారణంగా, ఖరీఫ్ సీజన్ ప్రారంభం నాటికి నీరు లభించక సకాలంలో నారుమళ్ళీ వేయలేని పరిస్థితి ఏర్పడింది.

కృష్ణా నదిపై బెజవాడ వద్ద ఒక ఆనకట్టను నిర్మించినట్టుయితే బ్రిటిష్ ప్రభుత్వానికి గణనీయమైన ఆదాయం లభిస్తుందని, ఆప్రాంతంలో తరచుగా సంభవిస్తున్న కరవు పరిస్థితుల నుండి ప్రజలకు రక్షణ కల్పించే అవకాశముందని ఆనాటి సర్వేయర్ జనరల్ మేజర్ అలెగ్జాండర్ బీట్సన్ ప్రభుత్వానికి సూచించారు. సదరు సూచనను సమగ్రంగా పరిశీలించి సమగ్రమైన నివేదికను అందచేయవలసిందగా 1792వ సం॥లో ఆనాటి మద్రాస్ ప్రెసిడెన్సీ మైకేల్ టాపింగ్ అనే అధికారిని ఆదేశించింది. టాపింగ్ 3సం॥ల పాటు సర్వేను నిర్వహించి మేజర్ బీట్సన్ సూచనలను బలపరుస్తూ నివేదిక నందచేశారు. కాని, ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వము నుండి ఏరకమైన స్పందన రాలేదు.

1882-83 సం॥ల మధ్యకాలంలో సంభవించిన 'డొక్కల కరువు' లేదా 'నందన నామ క్షామం' సంభవించినపుడు, కృష్ణా గోదావరి మండలాలు తల్లడిల్లిపోయాయి. ఒక్క గుంటూరు మండలంలోనే 3లక్షల మంది ప్రజలు ప్రాణాలను కొల్పోయారు, రెండు లక్షల పశువులు మృత్యువాతపడ్డాయి. బ్రిటిష్ ఖజానాకు కోటిరూపాయల పైబడి రెవెన్యూ నష్టం కలిగినట్లు తెలుస్తోంది. ఈ నేపధ్యంలో 1839 సం॥లో కెప్టెన ఎడ్వర్డ్ బకుల్ అనే ఇంజనీరు మరోసారి కృష్ణానది పై బెజవాడ వద్ద అనకట్టును నిర్మించాలనే ప్రతిపాదనను ప్రభుత్వం దృష్టికి తేవటం జరిగింది. బెజవాడ దగ్గర 1,900 అ॥ల వెడల్పు గల కృష్ణానది లోయలో 40 అ॥ల ఎత్తువరకు ఉవ్వెత్తున ఎగసిపడే కృష్ణా

ప్రవాహంలో ఇసుక పునాదిపై ఆనకట్ట నిర్మాణం అసాధ్యమని బ్రిటిష్ ప్రభుత్వం భావించి ముందుకు రాలేదు.

అయితే 1847 వ సం॥లో గోదావరి నదిపై ధవళేశ్వరం వద్ద ఆనకట్ట నిర్మాణాన్ని చేపట్టిన ప్రభుత్వం, కృష్ణానదిపై ఆనకట్ట నిర్మాణానికి మౌనం దాల్చటం ప్రజలు సహించలేక పోయారు. ప్రభుత్వానికి శరపరంపరగా వినతి పత్రాలను సమర్పించటంతో ప్రభుత్వం సివిల్ ఇంజనీరు హెచ్.ఎ.లేక్ ను కృష్ణా నదిపై ఆనకట్ట నిర్మాణానికి ప్రతిపాదనలను అందచేయాలని ఆదేశించింది.

తదనుగుణంగా, నదీ గర్భంలోని ఇసుకలో 11 అ॥ల లోతు పునాది బావులను ఏర్పరచి వాని మీద 15 అ॥ల ఎత్తుతో ఆనకట్ట గోడను, దానితో పాటు రహదారి సౌకర్యం కల్పించవచ్చని సూచించారు. అంతేకాక, గోదావరి డెల్టా కాలవలను కృష్ణా డెల్టా కాలవలతో అనుసంధానం గావిస్తే పడవల రాకపోకలకు అనువుగా వుంటుందని కూడా చెప్పటం జరిగింది.

ఈ క్రమంలో సివిల్ ఇంజనీరు హెచ్.ఎ.లేక్ సర్ ఆర్ధర్ ధామస్ కాటన్ తో చర్చించడ జరిగింది. కాటన్ అప్పటికే కావేరి నదిపై 13వ శతాబ్దంలోనే కరికాళ చోళ చక్రవర్తిచే కావేరి నదిపై నిర్మింపబడిన గ్రాండ్ ఆనకట్ట క్రాస్ సెక్షన్‌ను పరిశీలించి, అదే నమూనాతో కృష్ణా నదిపై బెజవాడ వద్ద ఆనకట్ట నిర్మించ వచ్చని సూచించినట్లుగా తెలుస్తోంది.

సర్ ఆర్ధర్ కాటన్ మరియు సివిల్ ఇంజనీరు హెచ్.ఎ.లేక్ ల సూచనలను ప్రభుత్వం ఆమోదించి 1851 వ సం॥లో ఆనకట్ట నిర్మాణానికి అనుమతులను మంజూరు చేసింది. గోదావరిపై ఆనకట్ట నిర్మాణంలో సర్.ఆర్ధర్ కాటన్ వద్ద శిక్షణ పొందిన కెప్టెన్ ఓర్ కృష్ణా ఆనకట్ట నిర్మాణ బాధ్యతలను చేపట్టి 1855 నాటికి పూర్తిగావించారు. ఈ ఆనకట్ట క్రింద మొదట 5.8 లక్షల ఎకరాలకు సాగు నీటి సౌరర్యం కల్పించబడింది. 1894 సం॥లో ఆనకట్ట తలపుల ఎత్తును మరో మూడు అడుగుల మేర పెంచటం కారణంగా ఆయకట్టు భూమి 8లక్షల ఎకరాలకు సాగునీటి సౌకర్యం కల్పించబడినది. మరల 1925వ సం॥లో మరో మూడు అడుగుల ఎత్తుకు ఆనకట్ట తలపుల ఎత్తును పెంచటంతో ఆయకట్ట 12లక్షల ఎకరాలకు పెరిగింది.

1851 సం॥లో ఆనాటి మద్రాసు రాష్ట్ర పభుత్వ పరిధిలో కృష్ణా, గోదావరి నదులపై ప్రాజెక్టులను నిర్మించి 465 శ॥కో॥ఘ॥అ॥ల నీటిని వినియోగించు కోవచ్చని కేంద్రప్రభుత్వ ప్రణాళికా విభాగం వారు నిర్ణయించారు. కాని, మద్రాస్ ప్రభుత్వం 800 శ॥కో॥ఘ॥అ॥ల నీటిని వినియోగించుకునే విధంగా ప్రణాళికలను తయారుచేసి కేంద్రప్రభుత్వానికి సమర్పించారు. ఆ ప్రణాళికలో ముఖ్యంగా కృష్ణానదీ జలాలను మొత్తంగా పెన్నార్ నదిలోనికి తరలించి తదుపరి పినాకినీ నది ద్వారా మద్రాస్ ప్రాంతానికి నీటిని తరలించాలనే ప్రయత్నం ప్రధానమైనది.

సదరు ప్రయత్నాలను గమనించిన ముక్త్యాల జమీందారు శ్రీరాజావాశిరెడ్డి రామకృష్ణ మహేశ్వర ప్రసాద్ గారు, కృష్ణానదిపై గతంలో బ్రిటిష్ అధికారులు కల్నల్ ఎల్లిస్ మరియు కల్నల్ మాలింగ్ లు1911 సం॥లో సూచించిన విధంగా కృష్ణానదిపై పులిచింతల వద్ద ప్రాజెక్టు నిర్మించి కృష్ణాడెల్టా భూములలో రెండవ పంట పండించుకునే అవకాశం కల్పించవచ్చునీ మరియు జగ్గయ్యపేట పరిసర ప్రాంతాలలో కొంత భూమికి నూతనంగా సాగునీటి సౌకర్యం కల్పించవచ్చునని సూచించటం జరిగింది. ఆక్రమంలోనే ఆయన కల్నల్ ఎల్లీస్, కల్నల్ మాలింగ్‌లు తయారు చేసిన ప్రాజెక్టు రిపోర్టును అనంతపురం కలక్టరేటు నుండి సంపాదించి ప్రభుత్వానికందచేశారు.

పులిచింతల వద్ద కృష్ణానదిపై ప్రాజెక్టు నిర్మాణ విషయంలో ప్రజలలోకూడ చైతన్యం కలిగించాలనే ఆకాంక్షతో జమిందారీ రద్దు చట్టం వలన తనకు లభించిన నష్టపరిహారపు సొమ్మును తన కుటుంబ సభ్యులందరి ఆమోదంతో ఖర్చుచేయటం జరిగింది. రోజుకు 30 గ్రామాల చొప్పున పర్యటించి సుమారు 38 వేల మైళ్ళు ప్రయాణించి ప్రజలకు ప్రాజెక్టు నిర్మాణ అవసరాన్ని వివరించి వారిని కార్యోన్ముఖులుగా తీర్చిదిద్దారు.

ఆసమయంలో కేంద్ర జలవనరుల విభాగంలో ప్రముఖ ఇంజనీరు డా॥ కె.ఎల్.రావు ఉన్నతమైన పదవిలో ఉన్న విషయాన్ని గమనించి ఆయనకు కల్నల్ ఎల్లిస్ రూపొందిచిన ప్రాజెక్టు రిపోర్టును అందచేయటం జరిగింది. ఆక్రమంలోనే ఆనాటి రాష్ట్రపతి బాబు రాజేంద్రప్రసాద్ గారి ద్వారా కేంద్రప్రభుత్వ ప్రణాళికా సంఘం వారు పులిచింతల వద్ద కృష్ణా నదిపై నిర్మింపతలపెట్టిన ప్రాజెక్టు విషయాన్ని పరిశిలించే ఏర్పాటు గావించారు. కాని ప్రణాళికా సంఘం వారు కృష్ణా-పెన్నార్ ప్రాజెక్టు వలన అధిక ప్రయోజనాలు చేకూర తాయని, పులిచింతల వద్ద ప్రాజెక్టు నిర్మాణం వలన పరి మితమైన ప్రయోజనాలు మాత్రమే కలుగుతాయని తెల్చిచెప్పటం జరిగింది. అపుడే కృష్ణా -పెన్నార్ ప్రాజెక్టుకు ప్రత్యామ్నాయంగా మరో భారీ ప్రాజెక్టు నిర్మించాలనే ఆలోచలకు అంకురార్పణ జరిగింది. ఆ ఆలోచనల ఫలితమే నాగార్జున సాగర్ ప్రాజెక్టు! ఈ మొత్తం

వ్యవహారంలో శ్రీరాజావాశిరెడ్డి రామకృష్ణ మహేశ్వర ప్రసాద్ గారికి శ్రీ కొరటాల సత్యనారాయణ, ఆచార్య రంగా, వావిలాల గోపాల కృష్ణయ్య మరియు నార్ల వెంకటేశ్వరరావు మొదలైన వారు అనేక విధాలుగా తోడ్పడినారు.

తదుపరి 1953 సం॥లో ఉమ్మడి మద్రాస్ రాష్ట్రనుండి వేరుపడి ఆంధ్రరాష్ట్రం ఏర్పడటం మరల 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడటం జరిగింది. భాషా ప్రయుక్త రాష్ట్రాలను ఏర్పాటు గావించటానికి కేంద్ర ప్రభుత్వంచే నియమింపబడిన ఫజల్అలీ కమీషన్ తమ రిపోర్టులో కృష్ణా-గోదావరి నదీ జలాలను సమగ్రంగా సద్వినియోగం గావించా లంటే ఆంధ్ర-తెలంగాణా ప్రాంతాలను కలిపి ఒక రాష్ట్రంగా ఏర్పరచాలని సూచించారు. అందుకు అనుగుణంగానే ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన పిదప మన రాష్ట్ర ప్రభుత్వం జూరాల, శ్రీశైలం, నాగార్జున సాగర్ మరియు పులిచింతల ప్రాజెక్టులను ఆధునిక దేవాలయాలుగా పరిగణిస్తూ నిర్మించుకుని లక్షలాది ఎకరాలలో ఆహారధాన్యాలను పండించుకొంటూ ఆంధ్రప్రదేశ్‌ను "భారతదేశ ధాన్యాగారం" అని పిలిచే విధంగా అభివృద్ధి చేసికొన్నాము.

# కృష్ణవేణి

ఈ యాషాఢ నవాంబుదార్భటులతో
నేకశ్రుతిం గల్పి త
ల్లీ! యీ రీతిగ నిత్య యౌవన సుధా
శ్రీరాగ మాలాపనల్
చేయం జాలితి వెన్నిమారు లిటులన్
జీర్ణించు నా బొంట్లకున్
ప్రాయంబింత చిగుర్ప నేర్పితివె
అంబా! కృష్ణవేణీనదీ!
నిన్నా మొన్నటి దాక ఎండ బడి
యెంతే జాలిగా జాలుగా
నున్నా వోపిక లేక నాకు వలెనే,
ఒక్కమ్మడిన్ నేడు సం
పన్నాత్మీయ మహా ప్రవాహమున
సివ్వా లాడుచున్నావు నే న
ని న్నీనాడును పోలి పొంగ గల
నంటే, తల్లి, కృష్ణాపగా!
నీ కూలంకష వా:ప్రపూరమున
నెన్నే బిందువుల్ కల్గునో
నీ కన్నేళ్ళ వయస్సు లే దటవె
వీనిం జూడు షట్త్రింసకున్,
వాకల్ కట్టుచు పొంగి పొంగి మరలన్
వర్షంబు వర్షంబునన్
నీ కౌమరము చాటెదే, ఇతడొ
క్షిణించెంగదే అప్పుడే!
నీ కల్లోల కరాబ్జ సంతతుల
మేనిం దాకనే చల్లగా
నా కాయం బిది ముంచి తేల్పవె
త్వదంభశ్శీకరాసార ధా
రాకేలిన్ తనియింపవే శ్రవణముల్
గాంధర్వ సంపత్తిచే
నా కౌమార మిగుర్చి నిల్పగదె
కృష్ణామాత! జన్మాంతరమున్
నీ పావనోదక మేపారగ్రోలిన
యమృత పానము జేసి యలరినట్లె
నీ సుందరాకృతి నింపార జూచిన
కందోయి ధన్యత గాంచినట్లె
నీ కటాక్షంబొగి నిసుమంత పొందిన
మహసిద్ధుల బ్రీతినందినట్లె
నీ గర్భమున నెమ్మి నేర్పుమై దోగిన
గగన వాహినిలోన గాంచినట్లె
కామితార్థ ప్రదాయిని కల్పవల్లి
కర్షకావళి పాలిటి కన్నతల్లి
ప్రజల భాగ్యాలముంచెడి పాలవెల్లి
దివిజ రూపిణి కృష్ణా నదీమతల్లి

శ్రీ పోలవరపు కోటేశ్వరరావు

# రైతు పోరాటాలు - కృష్ణా తీరం

విషయ ప్రాధాన్యత చాలా విశాలమైనది. రైతు పోరాటాల చరిత్ర అంతులేని కథ. ఐనా క్లుప్తంగా చెప్పటానికి ప్రయత్నిస్తాను.

భారతదేశంలో తొలి స్వాతంత్ర్య పోరాటం 1857లో సిపాయిల ఎదురుదాడిగా ప్రారంభమయింది. తిరుగుబాటు అణచివేయబడినా అది ప్రజల్లో ఉత్తేజాన్ని కల్గించింది. కంపెనీ పాలన పోయి, రాచరిక పాలన వచ్చినా అది పరిపాలన మాత్రమే!

1855లో జరిగిన సంతాల్ తిరుగుబాటు, 1860లో బీహార్, బెంగాలు రాష్ట్రాలలో నీలిమందు తోటల తెల్ల యజమానుల నిర్బంధ విధానాలకు వ్యతిరేకంగా నీలిమందు రైతులు జరిపిన పోరాటాలు, 1875 ప్రాంతంలో మరాఠా ప్రాంతపు వడ్డీ వ్యాపారులకు వ్యతిరేకంగా జరిగిన రైతు తిరుగుబాటు, ఆంధ్రలో ఏజెన్సీ గిరిజనుల తిరుగుబాటు రైతుల అసంఖ్యాక పోరాటాల్లో ముఖ్యమయినవి.

జాతీయ పోరాటంలో భాగంగా అశేష రైతు జనావళి జమీందారులను, మహారాజులను, బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఎదిరించసాగారు. తమకు జరుగుతున్న అన్యాయాలను దోపిడీవిధానాలను నిరసించి, నినదించి, ముందుకు కదిలారు.

1930లో పెట్టుబడి దేశాలలో బయలుదేరిన ఆర్థిక మాంద్యం సోవియెట్ దేశంలో మినహా ప్రపంచమంతా వ్యాపించింది. రైతులు పూర్తిగా దెబ్బతిన్నారు. ఆపైన రైతులుపోరాట మార్గాలనవలంబించారు.

భారతదేశమంతటా రైతుపోరాటాలు సాగాయి. ఆంధ్రదేశంలో 1937లో ఇచ్ఛాపురం నుండి మద్రాసు వరకు జరిగిన రైతు రక్షణ యాత్ర చారిత్రాత్మకమైనదని చెప్పవచ్చును. రైతుల కష్టాలను గురించి, తక్షణ కోర్కెలను గురించి మంత్రివర్గానికి విజ్ఞాపన పత్రం సమర్పించాలని రైతు నాయకులు నిర్ణయించారు. ఈ యాత్రాదళానికి ఆనాటి రైతుసంఘం అధ్యక్షులు శ్రీకొమ్మారెడ్డిసత్యనారాయణ, ఉపాధ్యక్షుడు పుల్లెల శ్యామసుందరరావు, కార్యదర్శి చలసాని వాసుదేవరావు నాయకత్వాన జమీందారీ రద్దును ప్రధాన సమస్యగా తీసుకొని, వివిధ ప్రాంతాల రైతుల సమస్యల నన్నిటిని క్రోడీకరించి తయారుచేశారు.

కృష్ణా, గోదావరి జిల్లాలలో రీసెటిల్‌మెంటు జరిగి భూమి పన్ను పెరిగింది. శాసనసభలో తీవ్రఆందోళన సాగింది. ప్రభుత్వం శ్రీ ఆరోగ్య స్వామి మొదలియారును అధ్యక్షునిగా శ్రీ రంగా గారిని కార్యదర్శిగా రీసెటిల్‌మెంట్ విచారణ కమిటీని నియమించింది.

1936 ఏప్రిల్ 11న అఖిల భారత రైతుసంఘం సంస్థాపన జరిగింది. ఆపైన రైతు ఉద్యమాలు విజృంభించాయి.

చిత్తూరుజిల్లాలో జరిగిన జమీందారీ, ఈనాందారీ వ్యతిరేక రైతు ఉద్యమం ఊపందుకుంది.

ఈ జిల్లాలో కుప్పం, పుంగనూరు, బండారుపాళెం, తుంబపాలెం, నావగింటిపాలెం, గుడిపాటిపాలెం, కల్లూరు, కాళహస్తి, కార్వేడు మొదలగు జమీందారులలో కార్వేటి జమీందారీ ప్రముఖమైనది. ఈ జమీందారులు చెరువులు చెడిపోతే బాగు చేయించేవారు కాదు. రైతులకు తమ భూములపై స్థిరమైన హక్కు వుండేది కాదు. జమీందారు ఎప్పటికప్పుడు పట్టాలను మారుస్తుండేవాడు. పొలంలోని చెట్లపైన గాని, ఇంటి పెరటిలోని చెట్లపైన గాని రైతుకు హక్కు వుండేది కాదు.

బంగారుపాలెం జమీందారీలో రైతుపొలాలలో వున్న చెట్లు ఎవరివిఅన్న విషయంపై రైతు పోరాటాలు జరిగాయి. తర్వాత ఆచార్య రంగాగారి నాయకత్వాన రైతు ఉద్యమం ఈ జిల్లాలో సంఘటిత పడింది. ఈ జమీందారులలో చెట్టినాడు జమీందారు కోటీశ్వరుడు ఇతన్ని రైతులు ఎదిరించారు. ఈనాం గ్రామాలలో "కోరు" ఇవ్వటం రైతులు ఆపివేశారు. సంఘటిత శక్తితో రైతులు చివరకు తమ హక్కులను సాధించుకోగలిగారు.

విశాఖ, శ్రీకాకుళం జిల్లాలలో రైతు పోరాటాలు జరిగాయి. ఒక్క బొబ్బిలి ఎస్టేటులోని నగదు శిస్తు యకరానికి డెబ్బది రూపాయలపైన వుండేది. ఇంకా అనేక పన్నులు, వెట్టిచాకిరి వుండేది. సంఘటనలు కూడా వెలుగుచూస్తున్నాయి. నెల్లూరు జిల్లాలో కుర్రు గ్రామస్థులు ఆక్వాకల్చర్ సంస్థలపై దాడిచేసి మదుగులను, పనిముట్లను నాశనం చేయటం చూస్తే వారి 'కడుపుమంట' ఎంతగా ఉందో అర్థమవుతోంది.

నిరసన ప్రభుత్వాలకు, న్యాయస్థానాలకు చేరింది. అడవీ సంరక్షణ మీద ప్రభుత్వం చట్టాన్ని తెచ్చింది. అది తీరప్రాంతంలో ఎంతశాతం హరితంగా (Green Belt) ఉండాలనే విషయాన్ని నిర్దేశించింది. అయితే చట్టాలలోని లొసుగులని స్వప్రయోజనాలకు వాడుకోవడంలో దిట్టలు చాలామంది ఉన్నారు. ఆ చట్టం రొయ్యల పెంపకం స్థల విస్తీర్ణము ఎంత ఉండాలో తెలుపకపోవడంతో, పర్యావరణానికి హాని ఎంతవిస్తీర్ణము దాటితే జరుగుతుందో ఇదమిత్థంగా తేల్చకపోవడంతో ఏక్వాకల్చర్ పెరుగుదలకు హద్దు లేకుండా పోయింది. తరిగిపోతున్న అడవులను తిరిగి పెంచాలంటే ఏక్వాకల్చర్ ద్వారా వచ్చే పన్నులు సరిపోవు. విషయం న్యాయస్థానానికి చేరింది. జమాఖర్చులు చూసిన న్యాయస్థానము ఏక్వాకల్చర్ ద్వారా వచ్చే ఆధాయానికి నాలుగు రెట్లు ఎక్కువగా పర్యావరణ పరిరక్షణకు ప్రభుత్వము ఖర్చుపెట్టాల్సి వస్తోం దని తేల్చి చెప్పింది. మరొక ఆసక్తికరమైన విషయం ఏమిటంటె ఉత్పత్తుల జరుగుచున్న ప్రాంతంలో వినియోగదారులు లేకపోవడం. జలచరాల ఉత్పత్తులలో అగ్రస్థానంలో ఉన్న ఇండోనేషియాలో ఆహార పదార్థలకొరత వలన మృత్యువువాత పడుతున్న వాళ్ళుఎక్కువే. అంటె చేపల ఉత్పత్తులనే వినియోగించాలని లేదు. ఏరకమైన ఆహారము దొరకటం లేదు. నిజానికి రొయ్యలు ఖరీదైనవి. పేదవాడు కొనలేడు. పేదవాడు కొనగలిగే ఆహారాన్ని ఈ రొయ్యల చెరువులు మింగి వేస్తున్నారు.

## బాగుపడిందెవరు? బాగుపడటమెలా?

పోనీ ఆక్వాకల్చర్‌ని వృత్తిగా చేసుకొన్నవాళ్ళు బాగున్నారా అంటే అదీలేదు. పశ్చిమగోదావరి జిల్లాలో గతరెండు పంటలలోను ఉత్పత్తి పడిపోయింది. చాలామంది 'రొయ్యలసాగు'ను మానుకొంటున్నారు. "రొయ్యలపెంపకం" ప్రారంభదశలో మాత్రమే లాభసాటిగా ఉన్నట్లు చాలామంది చెబుతున్నారు. ప్రారంభించిన అయిదారు సం॥లలోనే సుమారు మూడువేలకోట్ల పెట్టుబడి పెట్టడం జరిగింది. లక్షహెక్టార్ల వ్యవసాయక క్షేత్రాలు రొయ్యల చెరువులుగా మార్చబడ్డాయి. సాలీనా నాలుగువేల కోట్ల నష్టం వాటిల్లుతోంది కూడా. నాణ్యత గలిగిన రొయ్య పిల్లలు(సీడ్స్) దొరకకపోవడం, జలకాలుష్యం వలన వ్యాధులు పెరగడంతోబాటు జపాన్, అమెరికా మార్కెట్లు మందకొడిగా ఉండ టంతో పరిశ్రమ నష్టాల దిశగా నడుస్తోంది. దానితో నూతన కొను గోలు దారులు కోసం దారులు వెతుకుతున్నారు. చాలాసంస్థలు మధ్య వర్తులను ప్రక్కనపెట్టి తిన్నగా మార్కెట్లోకి ప్రవేశించే ఉద్దేశంలో ఉన్నారు.

చైనాలో ఉత్పత్తులలో అధిక భాగం చైనాలోనే అమ్ముతూండటం వలన అమెరిగా జపానులు మార్కెట్లు చైనామీద పెద్దగా ప్రభావాన్ని చూపలేవు. కానీ భారతదేశం అలాకాదు. అందుకే స్వంతగడ్డపై అమ్మ కాల దుకాణాలు తెరవాల్సిన పరిస్థితి ఏర్పడుతోంది.

Domestic Markets) అధునాతనపద్ధతులపై శిక్షణా కార్య క్రమాలు వంటివి విరివిగా ఏర్పాటు చెయ్యాలి. నిలువచేసె సదు పాయాలు మెరుగుపరచాలి. రొయ్యల చెరువులకు ప్రభుత్వం తిన్నగా నీటిని సరఫరా చెయ్యాలి. పన్నులు వసూలు చేసినంతగా నీటిని సర ఫరా చెయ్యటం లేదని వాపోయేవారు ఎందరో. రొయ్యల కొచ్చే రోగా లని నిర్ధారించటంకోసం పరిశోధనాశాలలను నెలకొల్పాలి. యాంటి బయాటిక్స్‌ను ఇష్టం వచ్చినట్లువాడకూడదు. ఎప్పటికప్పుడు సాంకేతిక సమాచారాన్ని అందించడానికి, సందేహాలను నివృత్తి చేయడానికి సెమి నార్లను నిర్వహించారు. ఈ విధంగా చేసే పరిశ్రమను పునరుద్ధరించవచ్చు.

## ముక్తాయింపు

రొయ్యలు మౌలిక ఆహారం ఎవరికీకాదు. ఇది ఒకఖరీదైన ఆహా రం మాత్రమే. (Luxury Food) ఎవరికో జిహ్వాచాపల్యం తగ్గించడం కోసం (కడుపునింపడము కూడా కాదు) ఎన్నో పొట్టలను పస్తు పెట్టాలా? ఖచ్చితంగా పెట్టకూడదు. ఇక్కడే ప్రజలు కొనగలిగే స్థాయిలో లేరుకాబట్టి తినలేరు. వేరెవరో తినడానికి తయారుచేసి అమ్మడంలో తప్పులేదు. కాని అందుకోసం నీవు తినగలిగే ఆహారాన్ని అందుబాటు ధర లలో సమకూర్చే భూములను రొయ్యల చెరువుగా మార్చట మెందుకు? ఇంటికి, వంటికి, పంటికి మంచినీరు కూడా దొరకక అలమటించడమెందుకు?

తక్షణం రొయ్యలపెంపక కేంద్రాలన్నింటికి నిపుణులచేత తనిఖీ చేయించి పర్యావరణ రక్షణ చేపట్టని వాటినిగుర్తించి లైసెన్సులు రద్దు చెయ్యాలి. ఋణసౌకర్యాలు నిలిపివేయాలి. ప్రపంచ బ్యాంక్ ఋణాలు ఇస్తోందంటే కారణం వినియోగదారులు అమెరికాలోనూ యూరప్‌దేశా లలోనూ ఉండటం, నష్టం జరిగేది వారికి కాదు కాబట్టి, క్రొత్త చెరువు లకు అనుమతులను తొందరపడి ఇవ్వరాదు.. దిగుబడినివ్వని చెరువు లను పంటభూములుగా మార్చేప్రయత్నంచేయాలి.

అన్నింటికన్నా ముందుగా ప్రతివ్యక్తికి సామాజిక బాధ్యతను అలవరచాలి. కొన్ని దేశాలలో ప్రతి పౌరుడు కొంతకాలం దేశ రక్షణకు పాటుబడాలి. కనీసం ఇక్కడ మనం చేసేపని మనకి లాభసాటిగా ఉండటమేకాదు తోటివారికి, సమాజానికి ఉపయోగపడుతుందా లేదా అని ఆలోచించే మనస్తత్వాన్ని అందరిలోనూ కలిగించాలి. పంటచేను విడిచి, రొయ్యచేను మరిగి, రైతన్నా...! అన్నదాత వనే నమ్మకాన్ని వమ్ముచేయకన్నా!

1940 మార్చి 27, 28 తేదీలలో అఖిలభారత రైతు మహాసభ పలాసాలో జరిగింది. ఈ సభకు అధ్యక్షులుగా రావలసిన రాహుల్

సాంకృత్యాయన్ రాలేకపోవటంతో స్వామి సహజానంద సరస్వతి అధ్యక్షత వహించారు. శ్రీ బంకిం ముఖర్జీ, ఇందులాల్ యాగ్నిక్, గదర్ విప్లవ వీరుడు సోహన్ సింగ్ ఖన్నా మొదలగువారు వచ్చారు. దీనితో జమీందారీ వ్యతిరేక ఉద్యమం ముందంజవేసింది. మందసా ఎస్టేటు రైతు పోరాటంలో జరిగిన కాల్పులలో చాలామంది చని పోయారు. వీరిలో శూసుమాను గున్నమ్మ ఒకరు. వీరగున్నమ్మగా ఈమె పేరు జిల్లా అంతటా మార్మోగింది. ఉద్యమం బలపడింది.

1945 మే నెల మొదటి వారంలో విశాఖ జిల్లా ప్రథమ రైతు మహాసభ అనకాపల్లి తాలూకా కసింకోట గ్రామంలో జరిగింది. ఈ సభనాటికే అనకాపల్లి తాలుకాతో పాటు విశాఖ, భీమునిపట్నం, చీపురుపల్లి తాలూకాలకు రైతు ఉద్యమం వ్యాపించింది. మందసా ఎస్టేటులోనే కొండ ప్రాంతపు సవరుల బాధలకు అంతేలేదు. పోడు వ్యవసాయానికి అనేక అడ్డంకులు కల్గించేవారు. అడవులలో బాటలు వేయాలి. రాజుగారి పొలాలలో ఉచితంగా చాకిరీ చేయాలి. రాజాగారు వేటకు వెళితే సమరులంతా వెంట వెళ్ళాలి. ఈ వెట్టి చాకిరికి వ్యతి రేకంగా మందసా, చీకటి మొదలైన ఎస్టేట్లలో రైతు ఉద్యమాలు కాలూని బలపడినాయి.

స్వాతంత్ర్యం వచ్చాక శ్రీకాకుళ గిరిజన పోరాటం అసామాన్య మైనది. గిరిజన రైతులు కొన్ని హక్కులు సాధించుకోగలిగారు.

1946లో శృంగవరపుకోట తాలూకా ఆలుమంద గ్రామంలో భూస్వాములు బలవంతంగా రైతులను భూములు నుండి వెళ్ళగొట్టే ఉద్దేశ్యంలో కాల్పులు జరిపారు. ముగ్గురు రైతులు వారి భూములలోనే చనిపోయారు. రైతులు ఎదిరించారు. ఉద్యమం పెరిగింది.

ఆచార్య రంగాగారు ఆంధ్రదేశంలో కిసాన్ ఉద్యమ నిర్మాత. రైతుల తరుపున రీసెటిల్‌మెంట్ ఉద్యమం ప్రారంభమయింది. ఆంధ్ర రాష్ట్ర రైతు రక్షణ సంఘం స్థాపించబడింది. దీని అధ్యక్షులు ఆచార్య రంగా, ప్రధాన కార్యదర్శులు శ్రీయుతులు గొట్టిపాటి బ్రహ్మయ్య, నూకల వీరరాఘవయ్య, ఉపాధ్యక్షుడు కాట్రగడ్డ మధుసూదనరావు. ఇంకా మరికొందరు బాధ్యత వహించారు. రైతు రక్షణకు ఆందోళన జరిగింది. ఫిర్కా, తాలూకా, జిల్లా సభలు జరిపారు. రైతులలో అపూర్వ సంఘటిత శక్తిని కూర్చగలిగారు.

దివితాలూకా మోపిదేవిలో నీటి తీరువా హెచ్చింపుపై బ్రహ్మయ్య గారి నాయకత్వాన సభ జరిగింది. మునగాలలో జమీందారీ రైతు సమస్యలు తీవ్రమయ్యాయి. పరిష్కర్తగా శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య "బ్రహ్మయ్య అవార్డు" ను యిచ్చారు.

గుంటూరు జిల్లా రైతు ఉద్యమంలో పెదనందిపాడు ఫిర్కాలో పర్వతనేని వీరయ్య చౌదరి నాయకత్వాన పన్నుల నిరాకరణ ఉద్యమాన్ని రైతులు చేపట్టారు. వల్లభాయి పటేలు నడిపిన బార్డోలీ శిస్తు నిరాకర ణోద్యమం నడిచింది. కన్నెగంటి హనుమంతు నాయకత్వాన పల్నా డులో అడవి పుల్లరి నిరాకరణోద్యమం రైతులు చేపట్టారు. తెల్లవాళ్ళ కాల్పులలో కన్నెగంటి హనుమంతు చనిపోయాడు.

పశ్చిమ గోదావరిలో రైతాంగ ఉద్యమం నడపటానికి శ్రీయుతులు దండు నారాయణ రాజు, రెబ్బా ప్రగడ మందేశ్వర శర్మ, మాగంటి బాపనీడు ప్రధాన పాత్ర వహించారు.

పశ్చిమ గోదావరి జిల్లా జమీన్ రైతు జిల్లా మహాసభ చింతలపూడి తాలూకా, ధర్మాజిగూడెంలో 7-1-1939న జరిగింది. కాళీపట్నం జమీందారు మొత్తం భూములను అమ్మకం పెట్టాడు. రైతులు ఎది రించారు. అఖిల భారత రైతుసంఘం అధ్యక్షులు స్వామిని సహజానంద సరస్వతి, ప్రధానకార్యదర్శి ఆచార్యరంగా మొదలగువారు రైతులపై పోలీసుల దురాగతాన్ని ఖండిస్తూ కాళీపట్నం రైతుపోరాటాన్ని బలపరచారు.

జమీందారుకు వ్యతిరేకంగా 'కలవలపల్లి' గ్రామరైతు పోరాటం జరిగింది. పెంద్యాల రైతులు అంబరుపేట, వీరపల్లి ఎస్టేటు జమీం దారులకు వ్యతిరేకంగా లంక భూముల కొరకు పోరాటం నడిపారు. 1974లో గోపాపురం జమీందారీ వ్యతిరేక పోరాటం, జీడిగుంట లంకపోరాటం జరిగాయి.

నెల్లూరుజిల్లాలో సగానికి పైగా జమీందారీ పాలన క్రింద పండేది. సూళ్ళూరుపేట, వెంకటగిరి, రాపూరు, కనిగిరి, పొదిలి, దర్శితాలూ కాలు వెంకటగిరి జమీందారీ పాలన క్రింద వుండేవి. ఇవిగాక సీతా రాంపురం, కాళహస్తి, చుండి మొదలగు చిన్న జమీందారులు కూడా వుండేవారు. జమీందార్ల దోపిడీకి వ్యతిరేకంగా రైతుపోరాటాలు జరిగాయి. వెట్టిచాకిరీకి వ్యతిరేకంగా అధిక శిస్తులు భరించలేక, చెరువులు బీడువారినా పట్టించుకోకపోవటం రైతులోకంలో ఎదిరించే స్వభావాన్ని పెంపొందించింది. కనిగిరి రైతుదండు చైతన్యాన్ని కల్గించింది.

కృష్ణాజిల్లాలో చల్లపల్లి జమీన్‌దారుకు వ్యతిరేకంగా రైతులు జరిపిన పోరాటం చాలా ముఖ్యమయినది.

1802లో దేవరకోట ఎస్టేటుకు శిస్తు వసూలు చేయుటకు సనదులు యిచ్చారు. ఈ ఎస్టేటు మూల పురుషుడయిన గుర్విణీడు దగ్గర నుండి (1835) ఆఖరివాడైన దుర్గాప్రసాద్ నాయుడు వరకు ఎస్టేటు భూములు నామమాత్రంగానే వున్నాయి. నాయుడుకు సంతానం లేదు. అందువలన మెరకపల్లి గ్రామం నుండి అంకినీడు అనునతనిని దత్తత తీసుకున్నారు. 1846లో ఈయన అధికారంలోకి వచ్చాడు. 1864వ సంవత్సరం నవంబరు ఒకటిన బందరు ఉప్పెన వచ్చింది. దివి ప్రాంతంలో చాలా భాగం ముంచివేసింది.

రాజా ఉప్పెనలో చనిపోయిన వారివి, నష్టపడిన వారివి రైతు భూములను తన పేర మార్పించుకున్నాడు.

పంటలు పోయినా రైతులు బీడు భూములతో సహా శిస్తులు కట్ట వలసి వచ్చేది. అభాగ్యరైతుల మెడపై బండకొయ్య ఎత్తి, చెవులు చిల్ల పెంకులతో నొక్కుతూ బాధించేవారు. మనకు శ్రీనాథుని "కవి రాజు కంఠంబు" గుర్తువస్తుంది.

1936లో పెదకళ్ళేపల్లి, మంగళాపురం, లక్ష్మీపురం పెదప్రోలు గ్రామాల మధ్య పశువులు మేయుటకు అరణ్య భూమిగా వున్న 5000 యకరాల భూమిని తనది కాకపోయినా ఆనాటి రాజా అమ్ముకున్నాడు. వనములు, తోటలను ఆక్రమించాడు. వక్కలగడ్డ, చిన్నాపురం, భోగిరెడ్డి పల్లి, ఎండకుదురు రైతులు ఎదిరించిపోరాడారు. గొట్టిపాటి బ్రహ్మయ్య గారి తండ్రి వీర రాఘవయ్యగారు రైతులతో పోరాటం నడిపాడు. కోర్టుల చుట్టూ తిప్పి బాధించిన రాజా చివరకు వోడిపోయాడు.

ప్రభుత్వం పెంచిన శిస్తులకు వ్యతిరేకంగా పోరాడిన యన్.జి. రంగా, దుగ్గిరాల బలరామకృష్ణయ్య, మొసలికంటి తిరుమలరావు జైలు పాలయ్యారు. శ్రీయుతులు కొల్లిసూరయ్య వల్లభనేని రామ బ్రహ్మం, ఆత్కూరి నాగేశ్వరరావు, డాక్టరు గురురాజు, కాజ బసవయ్య మొదలగువారిని గుడివాడ తాలూకా దాటి వెళ్లరాదని, శ్రీగొట్టిపాటి బ్రహ్మయ్యగారిని గుడివాడ, కైకలూరు తాలూకాలకు వెళ్ళగూడదని నెహ్రూ ప్రభుత్వం నిషేధించింది.

జమీందారు పోరంబోకు భూములను అమ్ముకున్నాడు. దీనికి వ్యతిరేకంగా కిసాన్ గొర్రెపాటి వెంకట సుబ్బయ్య, కాపూరి కోదండ రామయ్య, కొర్రపాటి రాజేశ్వరరావు, కొల్లి శేషయ్య గారి వంటి పెద్దలు నాయకత్వం వహించి పోరాటం నడిపారు.

1938లో ఆనాటి మద్రాస్ ప్రభుత్వం, రెవెన్యూ మంత్రి శ్రీ టంగు టూరి ప్రకాశం పంతులుగారి అధ్యక్షతన జమీందారీ ఎంక్వయిరీ కమిటీ వేసింది. వీరి రిపోర్టులో తెలుగు జిల్లాలలో 448 జమీందారీ లున్నాయని, ప్రభుత్వానికి కట్టవలసిన షేష్కషీ పోను 98 లక్షల రూపాయలు అదనంగా రైతుల నుండి వసూలు చేస్తున్నారని, వీరి క్రింద 88 లక్షల యకరాల భూమి వున్నదని తేల్చారు. ఇది ఆంధ్ర ప్రాంతంలో వున్న మొత్తం భూమిలో 23%. ఈ రిపోర్టునాటికి వసూలు చేయవలసిన లక్షా ఇరవైవేల రూపాయలకు గాను ఆరులక్షల రూపా యలు వసూలు చేయటమే గాక, 19,354 యకరాల స్వంత కమతం చల్లపల్లి జమీందారు పోగు చేసుకున్నాడు.

ముఖ్యమంత్రి సి.రాజగోపాలాచారి "జమీందారులకు భూమిపై ఎట్టి హక్కులేదని" 26-1-1939న అసెంబ్లీలో చెప్పాడు.

కృష్ణలో వున్న గాజుల్లంక, పోతార్లంక, దీని శివారు గ్రామం కిష్కింధ పాలెం, తిప్పలకట్ట, జవ్వలపాలెం, నడకుదురుశివారు, ఆముదాల్లంక గ్రామాలలో ప్రతి సంవత్సరం వరదల వలన లంక భూములు విరిగిపోయేవి. కొన్ని తేలేవి. విరిగిన భూములకు శిస్తులు కట్టేవారు కాదు. తేలిన లంకలు తనవేనని జమీందారు క్రమేణా 6వేల యకరాల భూమి స్వాధీనం చేసుకున్నాడు.

మొదట గాజుల్లంక గ్రామంలో రైతు పోరాటం ప్రారంభ మయింది. కళావెంకట్రావు రెవెన్యూమంత్రిగా "జమీందారీ భూముల అన్యాక్రాంతపు నిషేధ" పు ఆర్డినెన్స్ తెచ్చాడు.

గాజుల్లంకలో రైతులు రెల్లు కోస్తుండగా పోలీసులు కాల్పులు జరిపారు. ఏప్రిల్, 10,1947న శ్రీమతి బావిరెడ్డి వియ్యమ్మ, మత్తి సుబ్బారావు, తాడిశెట్టి వెంకటేశ్వర్లు, సనకా సుబ్బారావు కాల్పుల్లో చనిపోయారు. ఆరాత్రి ఉద్యమకారులు బూరల్తో సానుభూతి పాటలు పాడారు. "తెలుగు బిడ్డల రక్త మొలికింది. దివి సీమ కాలువై పారింది, కలిసింది కృష్ణలో, కృష్ణమ్మ ఎరుపెక్కెనూ, కన్నీటికెరటాల రొద గుండెనూ" ఈ పాట మ్యూజిక్ డైరెక్టర్‌గా పెరిగిన గోపాలంగారు వ్రాశారు.

ఈ రైతు పోరాటాలకు దివికమ్యూనిష్టులు ప్రోత్సాహాన్నందించారు. చంద్రరాజేశ్వరరావు ఉద్యమానికి స్ఫూర్తినిచ్చారు. చల్లపల్లి నారాయణ రావు, కావూరి కుటుంబరావు ఈ ఉద్యమానికి సారథ్యం వహించారు. నారాయణరావును పోలీసులు కాల్చి చంపారు.

1985లో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి యన్.టి.రామారావు ప్రభుత్వం, ఎస్టేట్ మిగులు భూములు 'తెలుగుమాగాణి సమారాధన' పేర, పేదలకు పట్టాలు యిచ్చింది.

ఆంధ్రదేశంలో అనేక రైతు పోరాటాలు జరిగాయి. రైతు రక్తం చిందని జమీందారీ భూములే లేవు. టెక్కలి తాలూకా అమాని రైతుల సత్యాగ్రహం, తిరువూరు తాలూకా రైతుపోరాటం, మెదక్ జిల్లాలో దొంతిదేశముఖుకు వ్యతిరేకంగా జరిగిన పోరాటం దేవర కొండ తాలూకా భూపోరాటం, నిజాంకు వ్యతిరేకంగా జరిగిన సాయుధ రైతు పోరాటం – ఇలా ఎన్నో చెప్పుకోవచ్చు.

1958లో బూటకపు సంస్కరణలకు వ్యతిరేకంగా రైతు సంఘ పోరాటం, 1962 జూన్‌లో ప్రభుత్వం పెంచిన శిస్తుకు వ్యతిరేకంగా జరిపిన రైతు పోరాటం – ఇలా ఎన్నో సంఘటనలున్నాయి. రైతులపై జరిగే అన్యాయపు వత్తిళ్ళు, శాసనాలు వ్యతిరేకించక తప్పదు. పోరాడక తప్పదు. రైతు సంఘాల నిత్య చైతన్యానికిది లక్షణం. హక్కుల సాధనకు అవలంబించవలసిన మార్గం ఇది.

ఎంత దోపిడీ జరిగినా, ఎన్ని బాధలు వెంటాడినా రైతు ఎప్పటికీ అజేయుడే.

శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్య

# మన నాట్యాచార్యుడు క్షేత్రయ్య

ఆంధ్రమాతకు అనుంగు పుత్రరత్నము లెందరో ఉద్భవించిరి. సూత్రకర్త ఆపస్తంబుడు, మతకర్త వల్లభాచార్యుడు మతోద్ధారకుడు కుమారిలభట్టు, వ్యాఖ్యాత మల్లినాథ సూరి, వేద భాష్యకర్త సాయణాచార్యుడు, అలంకార శాస్త్రకర్త పండితరాయలు, నాదోపాసకుడు త్యాగరాజు, పదకవితాపట్టభద్రుడు క్షేత్రయ్య ప్రభృతులు.

## ప్రభవించిన ప్రాంతం :

క్షేత్రయ్య ప్రభవించిన ప్రాంతం నాడూ నేడూ ప్రఖ్యాతమైనదే. ఈయన జన్మస్థానమగు మొవ్వకు అనతి దూరముననే ఆంధ్రుల ప్రాక్తన రాజధానియగు శ్రీకాకుళం, బౌద్ధుల పుణ్యక్షేత్రమగు ఘంటశాల, ప్రాచీనాంధ్ర నాట్యకళకు పుట్టినిల్లగు కూచిపూడి కలవు.

ఈ ప్రాంతం లీలాశుకుడు, నారాయణతీర్థులవంటి గీర్వాణభాషా కవులకును, శేషగిరి సుబ్రహ్మణ్యం, కాసుల పురుషోత్తం, ముక్తేవి పెరుమాళ్లయ్యవంటి ప్రాచీనాంధ్ర కవులకును, వేటూరి, పింగళి, కొడాలి ద్వయం మొదలగు ఆధునిక కవి పుంగవులకును ; హరి రామయ్య, ససర్ల దక్షిణామూర్తి శాస్త్రి, గంగాధర శాస్త్రి, గరికపర్తి కోటయ్య దేవర, చల్లపల్లి సీతారామయ్య శాస్త్రి, సుబ్బయ్య, పారుపల్లి రామకృష్ణయ్య, హరినాగభూషణం మొదలుగా గల గాంధర్వ విద్యా వేత్తలకును ; ఈమని,పారుపల్లి సోదరద్వయం, సి.ఎస్.ఆర్. తాండవ కృష్ణలవంటి నటశ్రేష్ఠులకును, అశ్వధాటిని బోలు మార్దంగిక శేఖరు లకును, పిచ్చి హరిసోదరులవంటి నాగస్వర కోవిదులకును ప్రభవ కారణమైన ప్రసిద్ధ భూమి.

## ప్రవేశించిన ప్రదేశం :

క్షేత్రయ్య పుట్టిన ప్రదేశము వలెనే ఆయన మెట్టిన ప్రదేశమును ప్రసిద్ధిగాంచినదే. ఉత్తర దేశమునుండి ఉబ్బెత్తుగా వచ్చుచున్న ముష్కర తుష్కర ఆక్రమణలను అరికట్టుటకును, హైందవమత రక్షణకును దీక్ష వహించిన విద్యారణ్యుడు ప్రతిష్ఠించిన విజయనగరము విద్యా నగరముగా మున్నూరేండ్లు మహాఖ్యాతి గాంచినది. విజయనగర సామ్రాజ్యమస్తమించగా ఆ సామ్రాజ్యలక్ష్మితోపాటు ఆంధ్ర సరస్వతి కూడా దక్షిణ దేశమరిగి ఆ సామ్రాజ్య సామంతులగు పుదుక్కోట, మధుర, తంజావూరులలో నెలకొనిన తెలుగు నాయకుల పరిపాలన క్రిందకు వచ్చిన ఆ పచ్చని సీమలలో విద్యావినోదములు పుష్పించినవి. ఆంధ్రప్రాంతంనుండి వ్యవసాయకులు వలస వెళ్లినట్లే కవులు, గాయకులు, అభినేత్రులు, శిల్పులు, ఉద్యోగులతోపాటు వలసపోయిరి. ఆ కళాజీవులచట ఆ ప్రభువులచే అనేక అగ్రహారములను పొంది అక్కడనే స్థిరనివాసమేర్పరచుకొనిరి. అందులో తంజపురి అన్నిట యశస్సు గాంచినది. రఘునాథ రాయలు, ఆయన కుమారుడు విజయరాఘవ నాయకుడు కృతి కర్తలు భర్తలు, విద్యావినోదములలో విఖ్యాతులు. విజయరాఘవునిపై వేల కొలది పదములు పాడి, చోళమండలమును శృంగారరస వాహినిలో ముంచి సమ్మోహమొనర్చిన క్షేత్రయ్య మువ్వ గోపాల పదముల పలుకుబడి గొప్పది.

## ఆరాధించిన దైవం :

క్షేత్రయ్య ఆరాధించిన దైవము ఎట్టివాడు ? ఆయన దైవము నిరాకారుడు, నిరంజనుడు కాదు. అవాఙ్మానసగోచరుడంతకంటె కాదు. సర్వజనసులభుడగు గొల్ల గోపబాలుడు – మువ్వగోపాలుడు.

మువ్వగోపాల శబ్దమునకు రెండు అర్థములు కలవు. ఒకటి మువ్వలు గల గోపాలుడు అనగా బాలగోపాలుడు. ఇందుకు నిదర్శనముగా కార్వేటి వేణుగోపాలస్వామికి మువ్వల వేణుగోపాలస్వామి అను నామాంతరముండుటే గాక, ఇనపురీ మువ్వ గోపాలుడనీ, కొవ్వూరు మువ్వగోపాలుడని దృష్టాంతములు కూడా గలవు.

కాని క్షేత్రయ్య దృష్టిలో మువ్వగోపాలుడన మువ్వపురీ నిలయుడగు గోపాలస్వామి అని, ఇందులకు ఆయన పదములలో పెక్కు నిదర్శనములు గాంచగలము.

"మువ్వపురీ విభుడైన గోపాల" క్షేత్రయ్య పదముల పుట 59

"మువ్వపురీ సామి" పుట 175

"మువ్వపురీ నిలయునితో కలసి" పుట 280

క్షేత్రయ్య పదములకే మువ్వగోపాల పదములని మరియొక మారు పేరు. ఆయన తన పదములను మువ్వగోపాల ముద్రాంకిత మొన ర్చుట వల్లనే అట్టి పేరు కలిగినది.

ఆరాధించిన దైవము గొల్ల గోపాలుడే. కాని అతడు రాధామనో హరుడు కాడు. సత్యభామాప్రియుడును కాడు. రుక్మిణీ వల్లభుడంతకంటె కాడు. అష్టమహిషీ మనోహరుడును కాడు.

గొల్లభామలచే క్రీడింపబడిన దక్షిణ నాయకుడు. నవ మన్మథా కారుడు. మన్మథమూర్తికే మన్మథమూర్తి.

క్షేత్రయ్య పెక్కు క్షేత్రములు దర్శించినను ప్రతి క్షేత్ర స్వామిలోను ఆయన పరికించినది మువ్వగోపాలుడే. ఆయన రమింపజేసిన రమణు లందరు గోపాలునితో సహచర్యమే కాదు, సకల క్రీడలొనర్చిన యాదవ కామినులు.

### పదము :

పదశబ్దమునకు సంగీతశాస్త్రములో ఒక రూఢార్థము గలదు. జావళీ, పదము, కృతిభిన్నములు. జావళీ కేవలము శృంగారరస భూయిష్ఠం. ఇది కేవలం ఇహసంబంధమైనది. భక్తికి విరుగుడుగా పుట్టినది. కృతి భగవత్సంబంధమైనది. భగవస్తోత్ర మిందలి వస్తువు. పరమ భాగవతులైన త్యాగరాజునవన్నీ కృతులే.

పదము ఈ రెంటికి మధ్యస్థమైనది. ఇందులో శృంగారము, భక్తి, పడుగు పేకలవలె ఉండును. ఈ శృంగారభక్తినే మధురభక్తి యందురు.

### క్షేత్రయ్య - పండితరాయలు :

ఈ మధురభక్తి గొప్పదనం రసగంగాధర కర్తయగు పండిత రాయలకే ఎరుక. పదకవితాపట్టభద్రుడగు క్షేత్రయ్యకే ఎరుక.

అతడుత్తరభారతమున మొగలాయి దర్బారులో ఆంధ్రులకు అఖండఖ్యాతి తెచ్చిన అలంకారశాస్త్రవేత్త. ఇతడు దక్షిణ దేశమున నాయకరాజుల పేరోలగములో ఆంధ్రులకు కీర్తిప్రతిష్ఠలు పాదుకొల్పిన అలంకారశాస్త్రవేత్త. అతడు లక్షణగ్రంథకర్త. ఇతడు లక్ష్య గ్రంథకర్త. అతనికి సముడు ఇతడు. ఇతనికి సముడు అతడు.

### ఆంధ్ర సంగీత త్రిమూర్తులు :

కవిత్రయమువలెనే మనకు ముగ్గురు వాగ్గేయకారులున్నారు. అందులో అన్నమాచార్యుడు ప్రథముడు. అన్నమయ్యను అందుకొని అధిగమించి త్యాగయ్యకు పథప్రదర్శకుడయ్యాడు క్షేత్రయ్య. అన్నమయ్య ఆంధ్రపదకవితాపితామహుడని, సంకీర్తనాచార్యుడని, హరికీర్తనా చార్యుడని ప్రసిద్ధిగలవాడు. కాని ఆయనది భజనపద్ధతి. ఆయన తిరుపతి వెంకటేశ్వరుని ఆరాధించిన పరమభక్తుడు.

త్యాగయ్య భక్తిపరవశుడై కృతులు పాడగా క్షేత్రయ్య రసపరవశుడై పదములు పాడెను. త్యాగయ్య నాదబ్రహ్మోపాసకుడు. క్షేత్రయ్య కళో పాసకుడు.

క్షేత్రయ్య - అన్నమాచార్యుడు, త్యాగయ్యలకంటె అధికుడనుట అతిశయోక్తి కాదు. కేవలము తెనుగు నుడికారము అందులో అధికంగా వ్యవహారికభాషలో గల మాధుర్యాన్ని క్షేత్రయ్య వెల్లడించినట్లు ఆంధ్ర సాహిత్యములో మరియొకరు వెల్లడించలేదు. తేనె లొలుకు తెనుగు సహజమాధుర్యాన్ని మనకు చవిజూపి మువ్వగోపాలుని మన ముంగి టకు తెచ్చి మురిపించి భావానికి తగిన రసం, రసానికి తగిన భావం శబ్దార్థాలవలె సంధించి అక్షయ యశస్సు సంపాదించిన అమరకవి క్షేత్రయ్య.

అన్నమాచార్యుని కీర్తనలకు సంగీతములోగల స్థానము సరసు లెరుగనిది కాదు. త్యాగయ్య గొప్పదనముగూర్చి చెప్పనక్కరలేదు. అయితే క్షేత్రయ్య ఘనతగాంచినవారెందరున్నారు ?

సంగీతమంటే ఈనాడు నాద ప్రధానమైనదిగా భావిస్తున్నారు. మన పెద్దలట్లు భావించలేదు. వారు సంగీతమంటే శబ్దము నాదము, అభినయము ఈ త్రివేణీ సమ్మేళనమన్నారు. మాట, పాట, ఆట కలయికే సంగీతము.

అన్నమాచార్యుని కీర్తనలు పాడతగినవి. కవులు శబ్ద బ్రహ్మాన్ని ఆరాధించినట్లే త్యాగయ్య నాదబ్రహ్మాన్ని ఆరాధించారు. ఆయనను కవి కాదనుటలేదు. కాని వాస్తవమైన విషయం ఆయన దృష్టి శబ్దంమీద కంటే నాదము మీద నిలిచింది; అక్షరరమ్యత పాటించినా అవి గాన ప్రధానములు.

క్షేత్రయ్య పదములు మన ప్రాచీనులు పేర్కొన్నట్లు త్రివేణీ సమ్మే ళనములు-అవి పాడతగినవే కాదు. ఆడతగినవి కూడా. ఈ పదములు కేవలం అభినయప్రధానమైనవి. అందుచే క్షేత్రయ్య గొప్ప గోచరించు చున్నది. ఆయన ఆంధ్ర నాట్యాచార్యుడు. ఆంధ్రులకు ఒక నాటకకళ కలదని నిరూపించిన భరతనాట్య ప్రవీణుడు. అభినయ దర్పణకర్త ఆంధ్రుడై కీర్తితెచ్చినట్లే అభినయమునకు అనువైన పదరచన చేసి ప్రతిష్ఠ తెచ్చాడు క్షేత్రయ్య.

రసాత్మకమైన వాక్యం కావ్యమైతే రసభరితమైన నాదం రాగం. రసవ్యంజకమైన హావలీలావిలాసములు గలది అభినయం. కవిత్వము, సంగీతము, అభినయము విరుద్ధములు కావు. పరస్పరాశ్రయములు ఏకకుటుంబ జనితములు. ఈ సంగతి నేటికాలమువారు గ్రహించాలి.

### క్షేత్రయ్య గొప్పదనం :

క్షేత్రయ్య గొప్పదనం గుర్తించలేదు, మన నవనాగరీకులు. ఆయన పదకర్తలలోనేగాక పద్యకవులకంటే కూడా కడుగొప్పవాడు.

"క్షేత్రయ్యకంటే రసవత్తరమైన కవిత్వాన్ని రచించిన పద్యకవు లంటూ వున్నారా ? ఈయన వెళ్ళిన శృంగారరసపోకడలు ఏ మహాకవి కవిత్వములోనూ కనపడవు ... "రేపు వత్తువూ గాని పోరా", వగైరా చూచుకోండి. క్షేత్రయ్య కవిత్వములో ఇలాంటివి వందలున్నాయి. క్షేత్రయ్య శృంగారభక్తి కోసము అవతరించిన మహాకవి. సంస్కృత ములో జయదేవ లీలాశుకనారాయణతీర్థులేజాతివారో క్షేత్రయ్య తెలుగులో అలాటివాడు" కృష్ణాపత్రిక (18-1-1941).

ఇవి నా మాటలు కావు. మరి ఒకరిమాటలంతకంటే కావు. తెలుగువారి ఇలవేల్పగు తిరుపతి వెంకటేశ్వర్లు తెలిపినది. ఉత్తరాది సంగీతాచార్యులు రాధకు అధిక ప్రాముఖ్యమిచ్చారు. మన మరొక నాట్యాచార్యుడు సిద్ధేంద్రయోగి సత్యభామకు ఆ స్థానం కల్పించాడు. లీలాశుకనారాయణతీర్థులు శ్రీకృష్ణునికి ప్రాముఖ్య మిచ్చారు. క్షేత్రయ్య యాదవ కామినులకు ఆ ప్రముఖస్థానమిచ్చారు.

గేయకవితా ప్రపంచంలో పాత్ర వైవిధ్యానికి పరిస్ఫుట రూప చిత్రణకు, భావ వ్యక్తీకరణకు, క్షేత్రయ్యకు సాటివారు లేరు.

ఈయన పదములలో ప్రదర్శించినది గోపాలుని కాదు. అసలు అతడు చాటుగా మాటుగా కనపడతాడు. మగవారిని ఆడించు సూత్ర ధారులు స్త్రీలే. స్త్రీ స్వభావమందలి వైవిధ్యం, అందచందాలు, ఇంత సుకుమారంగా, గంభీరంగా చిత్రించిన శిల్పి లేడు.

సాగరాంధ్రమున క్షేత్రయ్య, పార్వతాంధ్రమున సారంగపాణి, దక్షిణ దేశమున సభాపతయ్యలు వెలసి పదకవితకు ప్రాముఖ్యత తెచ్చిరి. ఈ త్రిమూర్తులలో క్షేత్రయ్య ప్రథముడే కాదు, ప్రముఖుడు కూడా. క్షేత్రయ్య పదములను అభినయించి ఆ మాదిరి పదరచన జేసినవాడు సభాపతయ్య. సారంగపాణి సంగతి సువిదితమే.

"కర్నాటక గానమున పలుకు పులకండము లొలుక మువ్వగోపాల పదములలోని శృంగారరసము దిగంతములకు ప్రాకిపోయి చుక్కలకు కలుపు సందేశమంపినది. తెలుగువారి జయదేవుడు క్షేత్రయ్య. గీత గోవింద మాధుర్యమును చవిజూపును మువ్వ గోపాలపదములు." (ద్వారం వెంకటస్వామినాయుడు, మార్చి, 1938 "భారతి")

ఆంధ్రులు లలితకళలన్నిటా ప్రసిద్ధులు. చిత్రలేఖనమునకు ఎల్లోరా లేపాక్షులే సాక్ష్యములు. శిల్పమునకు అమరావతి, అజంతా, హంపీలే నిదర్శనములు. అలంకారశాస్త్రమునకు విద్యానాథుడు, పండితరాయలే ప్రబల సాక్ష్యము. ఆంధ్రులలో కవి కానివాడుకన్పించుటలేదు అంటాడు హరీంద్ర నాథచటోపాధ్యాయ. అసలాంధ్రభాష అతిమధురమైనది. తెనుగనగా తేనె తెంపర వంటిది. దానిని మరింత మధురముగా మన వాగ్గేయకారులు చేసిరి. భరతఖండమంతటిలోకీ దాన్ని స్వర యుక్తముగా పఠించుటలో ఆంధ్రులకు సాటివారు లేరు.

ఆంధ్రులు మినహా అన్యులు పద్యములను పాడరు. మన పౌరాణి కులు గద్యమును కూడా పద్యమువలె పాడుట పరిగణించతగినది. కనుక మన సాంప్రదాయాన్ని, సాహిత్యాన్ని గ్రహించి రాల్గరిగించు గాంధర్వాన్ని చేబూని, ఈ లోకాన్ని గంధర్వలోకంగా మార్చాలి.

గాంధర్వవిద్య రాళ్ళను కరిగించు మాటటుంచి, రాతిచేతనే ఆడిం చాడు పాడించాడు రసమూర్తి ఆంధ్రశిల్పి. విద్యానగరములోని విఠలాల యమందలి ముఖమండపములందలి సప్తస్వరములు పలుకు శిలా నిర్మాణములను గాంచిన లలితకళలలో మన పూర్వుల ప్రాముఖ్య మును గుర్తించగలము.

క్షేత్రయ్య కవితాపట్టభద్రుడు వాగ్గేయకారుడు. అభినయ విద్యా విశారదుడు, కామకళాప్రవీణుడు, క్షేత్రజ్ఞుడు. ఇట్టి మహామహుని పదములన్ని పరిశోధించి ప్రతిభావంతములైన పీఠికలతో ముచ్చటగా ముద్రించి ఆంధ్రులకు అందుబాటులోనికి తెచ్చిన శ్రీ విస్సా అప్పారావు గారి కృషి వినుతింపతగినది.

ఆంధ్రదేశములో నృత్యానికి బీజమువేసి దానిని శాశ్వతము చేసి తెలుగువారికి కూడా ఇందులో ఒక ప్రత్యేక ప్రాముఖ్యము కల్పించిన వారు సిద్ధయ్య, క్షేత్రయ్యలు. మువ్వ గోపాలస్వామిపరంగా గోపికల ప్రణయం కథా వస్తువుగా తీసికొని క్షేత్రయ్య నృత్యం కడితే, సిద్ధేంద్ర యోగి కృష్ణునికి సత్యభామకు కలిగిన ప్రణయకలహము ఇతివృత్త ముగా తీసుకొని నృత్యం కట్టాడు.

ఈ మహామహుల నృత్యాలే ఆంధ్రదేశపు జాతీయనృత్యాలు. నృత్య కళలో మనకుకూడా ఒక స్థానం యీ నాట్యాచార్యులవల్లనే కలిగినది. ఆ స్థానం మాత్రం అత్యధికమైనది. దానిని ఇంతవరకు నిలబెట్టుచూ వచ్చినది మన కూచిపూడి. ఈ ప్రాచీనాంధ్ర నాట్యనిలయానికి ఈనాడు అన్నివిధములా చేయూత యివ్వవలసిన బాధ్యత ముక్కోటి ప్రజలపైన కలదు.

శ్రీమతి శారదా రామకృష్ణ

# కృష్ణాతీరంలో ఆంధ్రనాట్యం

ఒక సాహిత్యాన్ని విని లేక చదివి ఆనందించటానికి సహృదయం కావాలని, సంగీతాన్ని విని ఆనందించాలంటే రసహృదయం కావాలని, నాట్యాన్ని చూచి ఆనందించాలంటే రసహృదయం, కళా హృదయం కూడా ఉండాలని మన పెద్దలు పేర్కొని కళలన్నింటా నాట్యకళకు పెద్దపీట వేశారు. ఇదే నాట్యకళ యందలి ప్రత్యేకత విశిష్టత. కవికుల తిలకుడు కాళిదాసు – "నాట్యం భిన్నరుచేర్జనస్య బహుదాప్యేకం

సమారాధనం......" అని నాట్య కళను ప్రశంశించాడు.

భారతదేశం భిన్న శీతోష్ణస్థితి గతులకు నిలయమైనట్లే, వివిధ నాట్య సంప్రదాయాలకు నిలయం. మనదేశం చతుష్షష్టి కళలకు నిలయం. మన సంస్కృతిలో అంతర్లీనమైనవి సంగీతం, సాహిత్యం, శిల్పం, చిత్రలేఖనం, నాట్యం అనే ఐదు లలిత కళలు. ఈ లలిత కళలలో నాట్యం చివరగా చెప్పినప్పటికీ, మిగిలిన నాలుగు కళలూ ఈ నాట్యంలో నిబిడీ కృతమై యున్నందున ఈ నాట్యకళ ఒక సమాహార కళగా, సంపూర్ణ కళగా పేర్కొనబడి ఉన్నతస్థాయిలో వుండి ప్రథమ స్థానంలో నిలిచింది.

భారతదేశంలోని వివిధ నాట్యరీతులకు ఆధారమైనవి భరతుని "నాట్యశాస్త్రము", నంది కేశ్వరుని "అభినయ దర్పణం" ప్రధానమైనవి. చతుర్విధాభినయాల ప్రదర్శనలలో కొన్ని మార్పులు, చేర్పులతో, ఆయా ప్రాంతీయ నామాలు ఏర్పడినాయి.

తమిళ–కర్నాటక రాష్ట్రాలలో భరత నాట్యమని, కేరళలో మోహినీ యాట్టం– కథకళి, ఆంధ్రదేశంలో కూచిపూడి నృత్యమనీ – ఆంధ్రనాట్య మనీ, ఒరిస్సాలో ఒడిస్సీయనీ, ఉత్తరాదిన కథక్ అనీ, మణిపూర్‌లో మణిపురి నృత్యమని,బీహార్ తదితర చోట్ల సిరికేళానృత్యమనీ పిలువ బడుతున్నాయి. ఇవేకాక భారతదేశ మంతటా ఆయా ప్రాంతీయ జానపద నృత్యాలు విలసిల్లుతున్నాయి.

ఇక మన ఆంధ్రరాష్ట్రంలో ఆంధ్రనాట్యం, ఆంధ్రుల నాట్యాలుగా ప్రాశస్త్యం పొందాయి. ఆంధ్రుల నాట్యం – కూచిపూడినాట్యం జానపద నృత్యరీతులలో వివిధ రకాలు ఉన్నాయి. వీటన్నింటినీ ఆంధ్రుల నాట్యాలు – అనవచ్చు. ఇక ఆంధ్రనాట్యం ఆలయ సాంప్రదాయ నర్తనాలు, ఆస్థాన సాంప్రదాయ కేళికలు, ప్రబంధ నర్తనాలు – ఈ మూడు భాగాలు కలిపి ఆంధ్రనాట్యం ఆలయ సాంప్రదాయ నర్తనాలు, ఆస్థాన సాంప్రదాయ కేళికలు, ప్రబంధనర్తనాలు – ఈ మూడు భాగాలు కలిపి ఆంధ్రనాట్యంగా విరాజిల్లుతోంది. భగవంతుడు నృత్యగాన ప్రియుడైన కారణంగా – నృత్యగానములతో, భగవత్సేవార్థమై దేవాలయము లందు నియమింపబడినవారు "దేవదాసీలు". గుడిసేవ నిమిత్తమై నియమితులయ్యారు గనుక "గుడిచేటులు" అయ్యారు. చేటి అనగా దాసి, వారికి ప్రభువులు అనేక మాన్యాలిచ్చి పోషించేవారు.

"ఆంధ్రుల భరతనాట్యం" అనదగిన ఆంధ్రనాట్యం తెలుగునేల కింద విరాజిల్లుతున్న రీతి అపూర్వం. ఈ ఆంధ్రనాట్యం గురించి ప్రస్తావించే ముందు ఈ నాట్య పునరుద్ధరణ గావించిన మహోన్నత వ్యక్తి, మహనీయులు "భరత కళాప్రపూర్ణ", "పద్మశ్రీ", డా॥నటరాజ రామకృష్ణగారికి నమోవాక్యాలు.

నృత్యకళకే జీవితమర్పించిన ధన్యజీవులు డా॥ నటరాజ రామకృష్ణ గారు. వీరు ఇండోనేషియాలోని సుందర బాలిద్వీపంలో ఉన్నతమైన ఆంధ్రుల కుటుంబంలో పుట్టి, భారతదేశంలో మెట్టి, నాట్యకళకు ఆకర్షింప బడి, కుటుంబంలో ఆటంకం ఎదురవ్వగా, ఇల్లువదలి రామకృష్ణ మిషన్‌లో విద్యాభ్యాసం చేసి, అనంతరం బందారు సంస్థానాధీశుని ఆహ్వానంపై వెళ్ళి, అచట నాట్యం అభ్యసించి ఆస్థాన నాట్యాచార్యుల స్థితికి ఎదిగారు. వీరు వందనల్లూరు మీనాక్షి సుందరం పిళ్ళై వద్ద భరతనాట్యం, శ్రీకాళహస్తి ఆలయనర్తకి నాయుడుపేట రాజమ్మవద్ద

ఆగమ-ఆస్థాన నృత్యాలు, వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రి వద్ద కూచిపూడి నాట్యం, పిఠాపురంలోని పంచమాధవులలో ఒకరైన కుంతిమాధవుని ఆలయంలో నాట్యసేవ చేసిన పెండ్యేల సత్యభామ వద్ద "నవజనార్ధన పారిజాతం" (భామాకలాపం), లాస్య నర్తనరీతులు అభ్యసించి, తపోదీక్షగా సాధన చేశారు.

పూర్వము విద్వాంసు రాండ్రైన దేవదాసీలు, ఇతర నర్తకినులు ఈ విద్యను ఎక్కువగా ఆరాధించారు. శాస్త్రము, సంప్రదాయము రెండింటినీ చక్కగా గురుముఖంగా నెరిగినవారు. సంస్కృతాంధ్ర ములను అధ్యయనం చేసి, భరతశాస్త్రము, అలంకార శాస్త్రము, సంగీత శాస్త్రము, రస శాస్త్రములను చదివి, పిమ్మట అర్ధమెరిగి అభినయించెడివారు. ఇట్టి మహత్తర విద్య అప్పట్లో ఎంతో భక్తితో ఆరాధించబడింది. ఆనాటి రాజకీయ, సాంఘిక, ఆర్థిక పరిస్థితుల కారణంగా, ఈ విద్యకు విలువలు తగ్గటం వలన, భగవదారాధన, ఆత్మసాక్షాత్కారం, ఆధ్యాత్మిక ప్రబోధం, సాంస్కృతిక వికాసానికి దోహదం చేసే వాతావరణం లేనందున ఈ కళారీతినెరిగిన ఉత్తమ కళావేత్తలు కళారాధన మానివేశారు. ఈ కళను ప్రతిబింబించవలె నన్న అభినయించే కళావేత్తల కంటే, చూసే ప్రేక్షకులు ఉత్తమ సంస్కారము కల్గిన వారైయుండాలి. అంతటివారు సంఘములో తక్కువ గుటచే యీ కళల విలువ గుర్తించే వారు అరుదైనారు. ఆరాధించే వారూ కరువైనారు. ఈ కళారీతి మరుగున పడిపోయి పూర్తిగా అదృశ్య మయ్యేస్థితి యేర్పడింది. అట్టి దుస్థితిలో డా॥నటరాజ రామకృష్ణగారు ఈ అపూర్వ కళను పునరుద్ధరించుటకు కంకణం కట్టారు. అనేక ప్రాంతాలు పర్యటించి, ఎందరో నర్తకీమణులను సంప్రదించి, ఎన్నో విశిష్టతలను సేకరించి, మరలా ఈ అపూర్వ నాట్యానికి జీవకళను కల్పించారు. ఈ నాట్యకళ అప్పట్లో ఆగమనర్తనం, కేళిక, దాసి భరతం, దర్బారు ఆట, కబేరి ఆట, కర్నాటకం, నట్టువమేళం, చిన్నమేళం, మేజు వాణి అని వివిధ నామాలతో పిలువబడేది. 1970వ సంవత్స రంలో రాజమహేంద్రవరం (రాజమండ్రి)లో నటరాజ రామకృష్ణగారు అప్పటికి మిగిలిఉన్న వృద్ధనర్తకీ మణులను సమావేశపరచి ఒక సదస్సును ఏర్పాటుచేసి, వారందరి సూచనమేరకు ఈ అద్వితీయ నాట్యకళకు"ఆంధ్రనాట్యం" అని నామకరణం చేశారు. పేరు కొత్తదే అయినా ఈ సాంప్రదాయం అతి ప్రాచీనమైనది. అప్పటి నుండీ ఈ కళ ఆంధ్రనాట్యం అనుపేరుతో ప్రాచుర్యం పొందుతూ వచ్చింది. అటు పిమ్మట 1994వ సంవత్సరంలో నేను విజయవాడలో మరలా సదస్సు నిర్వహించి ప్రభుత్వగుర్తింపును తెచ్చి, పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం నుంచీ పరీక్షలు నిర్వహించునట్లు చేయడమైనది. ఈనాట్యాభివృద్ధిలో నాసేవ కొంతభాగం ఉండటం నా అదృష్టం. ఈ ఆంధ్రనాట్యం ప్రస్తుతం ఆగమవర్తనం, ఆస్థాన నర్తనం, ప్రబంధనర్తనం అని మూడు భాగాలు కలిపి, ఒకేవేదికపై ఒకేసారి ప్రదర్శించుటకు వీలుగా శాస్త్రోక్తంగా ఒక చక్కని ప్రణాళికతో ఏర్పాటుచేసి ప్రదర్శింప బడుతోంది. ఈ అపూర్వకళ మనరాష్ట్రంలోనే కాక, ఇతర రాష్ట్రాలలోను, ఇతర దేశాలలోనూ ప్రదర్శింపబడుతూ అభివృద్ధి చెందుచున్నది.

ఆగమశాస్త్రానుసారం నిర్మింపబడిన కొన్ని కొన్ని ఆలయాలలో నృత్యపూజ చేసిన విద్వాంసురాండ్రైన దేవదాసీలు, మరెందరో నర్తకీ మణులు ఎంతోమంది కలరు.అయితే కొన్ని శాసనాలలో ఈ దేవదాసీ లను దేవగణికలుగా పేర్కొన్నారు. 45 సంవత్సరాలకు పూర్వం నూతనంగా పేరిడిన సశాస్త్రీయ "ఆంధ్రనాట్యం", సంగీత, సాహిత్యం, సంస్కృతం, అలంకార శాస్త్రాలలో నిష్ణాతులైన ఈ నర్తకీమణులవద్ద నుంచీ సేకరించినదే. డా॥ నటరాజ రామకృష్ణగారు ఈ సంప్రదాయ నృత్య సేకరణకు అహర్నిశలూ కృషిచేసి సఫలీకృతులయ్యారు. గుంటూరు, కృష్ణా జిల్లాలలో ఈ ఆంధ్రనాట్యానికి చెందిన నర్తకిను లెందరో ఉన్నారు. ఆలయ నర్తనాలు ఉన్నచోట ఆస్థాన కేళికలు సహజంగా ఉండేవి. పల్నాటి సీమకంతకూ ప్రముఖమైన ఆలయం మాచెర్లలోని చెన్నకేశవుని ఆలయం. శివకేశవులు ఒక్కరే అని ప్రబోధించిన బ్రహ్మనాయుని మత సిద్ధాంతానికి ప్రతీకలు ఈ ఆలయాలు. "చంద్రవంక నదిలో స్నానం, చెన్నకేశుని సందర్శనం, చంద్రముఖి నాట్యం – ఈ మూడింటినీ సేవించనిదే తీర్థయాత్ర పరిపూర్ణం కాదు." అని పూర్వం ఒకనానుడి ఉండేది. అంటే చంద్రముఖి అంత ప్రసిద్ధమైన నర్తకి. అలాగే మాచెర్ల రాధ అనే గొప్ప నర్తకీమణి ఉండేది. ఈమె అభినయ శాస్త్ర పండితురాలు. ఈమె మాచెర్లలోని చెన్నకేశుని, వీరభద్రుని తన నృత్యకళతో ఆరాధించిన నర్తకీమణి.

మల్లమ్మ అనే నర్తకి బాపట్ల భావనారాయణ ఆలయంలో దేవ నర్తకిగా ఉండేది. ఈమె కుమార్తెలకుమాదేవి "కర్పూర వసంత రాయలు" బిరుదాంకితుడైన కొమరగిరి కొండవీటి రెడ్డి ప్రభువు కొలువులో ఆస్థాన నర్తకిగా ఉండేది.

మాచల్‌దేవి- ఈమె కాకతి ప్రతాపరుద్రుని ఆస్థాన నర్తకీమణి. కాకతి గణపతిదేవుని కాలంలో ఆస్థాననర్తకిగాప్రసిద్ధిగాంచిన ముద్దసాని మనుమరాలు. ఈమె మహా ఐశ్వర్యవంతురాలు. తమ వంశ చరిత్రను యక్షగానంగా రచన చేయించి, ఆడించి, సందర్శించి, సంతృప్తిచెందిన ఘనురాలు. అలానే బెజవాడలో కూడా మరొక మాచల్‌దేవి అనే

ప్రఖ్యాత నర్తకి ఉండేది. ఈమె గొప్పదానశీలి. క్రీ.శ.1437 ప్రాంతంలో తనకున్న భూములను ఎన్నో గ్రామాలకు దానం చేసింది, విజయవాడ పాతపట్టణంలోని శివాలయంలో గల శాసనాలపై ఈమె గురించి వుంది. అలానే నరసరావుపేటకు చెందిన పూవుల మహాలక్ష్మమ్మ అని ప్రసిద్ధనర్తకి ఉండేది. (ఈమెను బుల్లెమ్మగారని కూడా అనేవారట) ఈమె వద్దనే నాట్య విద్యనభ్యసించిన మరొక ప్రసిద్ధనర్తకి శిద్దాబత్తుని నాగమణెమ్మ. ఈమె షుమారు 1915-1920 మధ్యకాలానికి చెందిన వారు. క్రమంగా పెద్దల తరంమారి నాట్యరీతులలో శాస్త్రబద్ధంగా కొద్ది కొద్దిగా, కాలానుగుణంగా మార్పులు చేస్తూ, ప్రదర్శిస్తూ ప్రేక్షకుల మెప్పును పొందేవారు. ఈమె 1990లో స్వర్గస్థులైనారు. ఇలా ఇంకా ఎందరో నర్తకీమణులుండేవారు.

కృష్ణాసంగమస్థలి హంసలదీవిలో వేణుగోపాలస్వామి ఆలయం ఉంది. ఈ ఆలయంలో పూర్వం నృత్యపూజ జరిగేది. దివిసీమ ఒక దివ్యమైన సీమ. ఇదొక నృత్యకళాసీమ. ప్రసిద్ధమైన దేవాలయాలు, నృత్యకళా నిలయాలు, ఎందరో నిష్ణాతులైన నర్తకీమణులకు నిలయమీ దీవి. శ్రీకాకుళం ఆంధ్రమహావిష్ణు ఆలయం చాలా ప్రాచీనమైనది. ఈ ఆలయమే శ్రీకృష్ణదేవరాయ కృత "ఆముక్తమాల్యద" గ్రంధానికి నాంది పలికినది. ఇక్కడ ఎన్నో శాసనాలున్నాయి. ఈ ఆలయంలో నృత్యపూజ జరిగినట్లు ఈ శాసనాల వలన తెలుస్తున్నది. షుమారు 40,45 సంవత్సరముల క్రితం వరకూ వృద్ధులైన దేవనర్తకీమణులు ఇక్కడ ఉండేవారు.

నందికేశ్వరుని 'అభినయ దర్పణం' తరువాత అంత ప్రామాణిక గ్రంధంగానూ పరిగణింపబడుచున్న గొప్ప గ్రంథం "నృత్యరత్నావళి". ఈ గ్రంథకర్త జాయపసేనాని. కాకతీయ గణపతిదేవుని గజసైన్యాధిపతిగా ఉండిన ఈ జాయప, గణపతి దేవుని బావమరిది. ఇతను గండయామాత్యుని వద్ద నృత్యం నేర్చుకున్నాడు. ఆ కాలంలో తెలుగు దేశంలో ఉండిన అనేక ఇతర నృత్యాలతో పాటు పెరిగి నాట్యరీతి గురించి వ్రాశాడు. కాకతీయ వీరులు రణరంగంలో ప్రవేశించేముందు శివప్రేరణ కొరకు ఈ ప్రేరిణి తాండవాన్ని చేసేవారు. ఈ పేరిణి శివతాండవం, డా॥నటరాజ రామకృష్ణగారిచే తపోదీక్షగా పునరుద్ధరింపబడి, ఆంధ్రనాట్యంలో ఒక భాగంగా ప్రాశస్త్యంపొంది విరాజిల్లుచున్నది. జాయప ఇంకనూ 'గీతరత్నావళి' మొదలగు మరికొన్ని గ్రంథాలను కూడా రచించినట్లు ఈ గ్రంధంతోనే తెలియుచున్నది. అవనిగడ్డ, హంసలదీవి, నంగిగడ్డ, శ్రీకాకుళం, మోపిదేవి, మొవ్వ, తోట్లవల్లూరు, ఆగిరిపల్లి, మచిలీపట్నం, చిలకలపూడి మొదలైన ఎన్నో ఊళ్ళలోని ఆలయాలలో ఈ ఆంధ్రనాట్యం ఉండేది. అయితే దాన్ని ఆనాడు ఆంధ్రనాట్యం అనే పేరుతో పిలిచే వారు కాదు. అది ఒక 'దేశి' నాట్య రూపంగా ఉండేది.

ఏనాట్యకళకయినా అభినయం మకుటం వంటిది. భారతీయ నృత్యకళ ప్రపంచమునకు అందించిన అమూల్య సందేశం ఇది. ప్రకృతి హృదయాన్ని ప్రపంచానికి వివిధ రంగుల్లో, వివిధాలంకారాలతో, వివిధ సువాసనలు వెదజల్లుతూనే ప్రతిఫలించే దర్పణం. అట్టి ప్రసిద్ధి చెందిన అభినయ కళను కీ.శే.డా॥నటరాజ రామకృష్ణగారు ఆంధ్ర నాట్యంగా పునరుద్ధరింపజేసి, మావంటి నాట్యకళాకారులకు తగు శిక్షణనిచ్చి, ప్రదర్శింపచేస్తూ, ప్రచారం చేశారు. ఈ ఆంధ్రనాట్యానికి వారి జీవితాన్నే త్యాగం చేసిన ధన్యజీవి. కాని వారు పునరుద్ధరించిన, ఇంతటి ప్రాశస్త్యమైన ఆంధ్రనాట్యానికి ప్రభుత్వ ఆదరణ లేకపోవడం శోచనీయం. ప్రభుత్వ సంగీత నృత్య కళాశాల కోర్సులో ఆంధ్రనాట్యాన్ని ప్రవేశపెట్టి, మరికొన్ని ప్రచార కార్యక్రమాలు నిర్వహించి ఈ ఆంధ్ర నాట్యం అభివృద్ధి పరచాలని కోరుతున్నాను.

చిరునామా : శ్రీమతి శారదారామకృష్ణ, ప్రిన్సిపాల్, రామకృష్ణ నృత్య కళాక్షేత్రం, విజయవాడ, సెల్ : 9848185229

శ్రీ పి. ఉమామహేశ్వరపాత్రుడు

# భామాకలాపం

భామ అంటే కోపము గల స్త్రీ అని అర్థము. కలాపము అనగా విస్తరించి చెప్పటం. సత్యాదేవికిని, శ్రీకృష్ణస్వామి వారికిని మధ్య జరిగిన ప్రణయ కలహ వృత్తాంతాన్ని విస్తరించి చెప్పినదగుట చేతనే దీనిని "భామాకలాపము" అంటారని పండితుల అభిప్రాయము. దీని ప్రదర్శనా విధానము, దశ రూపకములకు ఉపరూపకములైన వాటిలో "శ్రీ గదితము"నకు ఇది సరిపోలికగా యున్నది.

స్వర్గలోకము నుండి తాను తెచ్చిన పారిజాత పుష్పమును నారదుడు శ్రీకృష్ణుడు రుక్మిణీ మందిరమున ఉన్న సమయమున ఇచ్చి, దీనిని ఎవరైతే నీకు అత్యంత ఇష్టులో వారికి ఇవ్వమని ఇరుకున పెడతాడు. తప్పని పరిస్థితిలో ఆ పారిజాతాన్ని శ్రీకృష్ణుడు రుక్మిణికి ఇస్తాడు. ఆ విషయమును మరల సత్యభామ చెవిన వేసి చల్లగా జారుకుంటాడు నారదుడు. అసలే సత్య 'భామ' ఇంకేముంది నారదుడు వేసిన గుగ్గిలానికి సత్యభామ కోపగ్రస్థయై శ్రీకృష్ణునిపై అలుగుతుంది. ఆమె అలుకను తీర్చడానికై శ్రీకృష్ణుడు ఇంద్రునితో తలపడి పారిజాత వృక్షాన్ని తెచ్చి సత్య ఇంట నాటుతాడు. ఈ కథను స్వామి సిద్ధేంద్రులు 'పారిజాతాపహరణము' అను యక్షగానంగా మలచారు. ఈ కథలో సత్యభామ పాత్రకు విశిష్టత కల్పించాలనే ఉద్దేశ్యముతో సత్యాకృష్ణుల ప్రణయ కలహమును ఆధారముగా చేసికొని శ్రీ సిద్ధేంద్రయోగివారు విస్తరించినదే 'భామా కలాపము'. అందుకే దీనిని "పారిజాతము" అనికూడా అంటారు.

ఇలా సిద్ధేంద్రుల వారి "భామా కలాపము" లోక వ్యాప్తి చెందిన తరువాత అనేకమంది దానికి అనేక మార్పులు చేసి మరల రచనలు చేసారు. వారికి కొందరు అంకిత చరణాలలో తమ పేర్లను వ్రాసుకున్నారు. వారిలో వేంకటకవి, బలరామ భక్త, మంగువారు, మజ్జి వేంకటనాయుడు మొదలైనవారి రచనలు మనకు లభ్యమవు తున్నాయి. మరికొంతమంది కవులు తమ పేర్లను కాక వారి ప్రాంత ఆరాధ్య దేవతల పేర్ల అంకిత చరణాలను రచించారు. అందులో కుంతి మాధవుడు, నెల్లిమర్ల మాధవుడు, కోరుకొండ నరసింహుడు, కేశవపురి మదన గోపాలుడు, రంగపురి వేంకటేశుడు, కలువాయి కృష్ణ మొ॥న దేవతామూర్తులకు అంకితముగా రచియింపబడిన అనేక రచనలు మనకు లభ్యమవుతున్నాయి. ఏది ఏమైనప్పటికిని వీటికి మూలము సిద్ధేంద్రుని భామా కలాపమేనని చెప్పుటలో సందేహము లేదు.

**"శ్రీమదుభయకవి రచిత అభినవ పారిజాత**
**నవరసాలంకార శోభిత శ్రీమత్**
**భారద్వజ గోత్ర తిమ్మయనామ సత్పుత్ర**
**వాధూలాన్వయగోత్ర శ్రీ**
**మత్కుందాళ వేంకటాచార్య కటాక్షాంచిత**
**శిష్యవర మంగుకులోద్భవ శ్రీ**
**జగన్నాథ నామదేయ శ్రీమాన్ మహాకవి**
**సిద్ధేంద్రయోగి కరుణా కటాక్ష**
**వీక్షితంబైన శ్రీ సత్యభామా విలాసంబను పారిజాత గ్రంథంబు".**

మంగువారిచే ప్రచురితమైన పై గద్యను తెలియజేస్తూ శ్రీ బాలాంత్రపు రజనీ కాంతారావుగారు స్వామి సిద్ధేంద్రుని భామాకలాప ప్రాచీనతను స్పష్టీకరించారు.

అంతేకాక వారి పరిశోధనలో మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలో సేకరించిన సిద్ధేంద్రయోగి విరచిత భామాకలాప తాళప్రతిలో గల సత్యభామదరువు మంగు జగన్నాథుడన్ పండితుడు ఎట్లా మార్చివ్రాసారో సవివరంగా తెలియజేశారు.

**సిద్ధేంద్రుల వారి రచన :**

ప॥ భామనే.... సత్యభామనే ...

చ॥ భామరో శృంగార జగదభిరామనే ముఖవిజితహేమ

ధామనే ద్వారకాపురాధ్యురామనే వయ్యారి సత్యా

మదన జనకుని వదలకును నాయెదను

నడుముకు సుదతిరో, మరు

కదన మరుదుగ సలిపి నెమ్మది ముదము

గదియగనున్న సత్యా ॥భామనే॥

**మంగు జగన్నాథ కవి రచన :**

ప॥ భామనే సత్యభామనే వయ్యారి సత్యాభామనే

చ॥ భామనే పదయారువేల కోమలులాలందరిలోను

రామరో గోపాలస్వామికి ప్రేమధామమైన ముద్దుల ॥భామనే॥

అయితే సిద్ధేంద్రులు రచించిన భామాకలాపము పరిపూర్ణముగా లభించకపోవుట, లభించినదానిలో కొంత లుప్తమై పోవుట కూడా ఇటువంటి రచనలకు అవకాశము కల్పించిన దేమో ! కాని మంగు జగన్నాథ పండితుడు సిద్ధేంద్రుని స్తుతించి తన కలాపమునకు సత్యభామా విలాసంబను పారిజాతగ్రంథమని పేరు పెట్టుట బహుదా ప్రశంసనీయము.

ఇక కూచిపూడి వారి భామా కలాపమునకు వస్తే ఈ భామా కలాపాన్ని కూచిపూడి వారు మూడు రాత్రులు ప్రదర్శించేవారట. మొదటి రాత్రి వేణీ వృత్తాంతము. దీనినే వేణీ ప్రబంధ ఘట్టం, జడపట్టు అనికూడా అంటారు. దీనిలో సత్యభామ జడయొక్క స్వరూపము. దాని ప్రాధాన్యత వివరింపబడతాయి. విశ్వకర్మచే సృష్టించబడిన ఈ జడలో సూర్యచంద్రులు, ఆదిశేషువు, 27 నక్షత్రములు, మూడు భువనములు, తొమ్మిది గ్రహములు ఉండగా క్షీరసాగర మథనములో అమృతము ఉద్భవించగా దానిని పంచుటకు శ్రీ మహావిష్ణువు మోహినీ అవతారము దాల్చినపుడు ఈ జడను ధరించాడని, తదనంతరం ఇంద్రుడు ఈ జడను భద్రపరచి నరకాసురుని సంహరించినపుడు శ్రీకృష్ణునికి ఇవ్వగా దానిని శ్రీకృష్ణుడు సత్యభామకు బహుమతిగా ఇచ్చినట్లు చెబుతారు. కనుక సత్యభామ పాత్ర పోషించే కళాకారులు ఆ జడను ధరించాలంటే తగిన పాండిత్యం ఉండాలని వారికి పాండిత్య పరీక్ష నిర్వహించేవారు. కనుక సత్యభామ రంగస్థల ప్రవేశానికి ముందు తెరను పట్టి దాని వెనుక నృత్తాని ప్రయోగించి జడను తెరపైకి ప్రేక్షకులకు కనపడేలా వేసేవారు. అంటే తనకు సకల శాస్త్ర పాండిత్యమున్నదని ప్రకటించుట అన్నమాట. అపుడు సభలోని విద్వాంసులు వారి ప్రజ్ఞను పరీక్షించి పాత్రధారి ఓటమి పొందినట్లయితే ఆ సభయందే వారి జడను కత్తిరించెడివారట. ఇలా మొదటిరోజున పాండితీ ప్రకర్ష జరిగిన పిమ్మట రెండవరోజు సత్యభామ రంగప్రవేశము.

ఒకానొకనాడు శ్రీకృష్ణుడు సత్యభామ మందిరమునకు వచ్చి ఆమె ఏడువారపు నగలను ఆమెకు అలంకరించి నిలువుటద్దము ముందు నిలిపి మనలో ఎవరు అందముగా ఉన్నారు అని ప్రశ్నిస్తాడు. సౌందర్య గర్విత అయిన సత్యభామ తానే అందగత్తెనని చెప్పడంతో అలిగి వెళ్ళిపోతాడు శ్రీకృష్ణుడు. ఈ చిన్న సంఘటనను ఆలంబన చేసుకుని సత్యభామ పాత్ర అష్టవిధ నాయికావస్థలను, దశకామావస్థలను, ముప్పది మూడు సంచారీ భావాలను, సప్త తాళాలతో, అష్టాదశ రాగాలలో (నాట, రేగుప్తి, అసావేరి, ఆహిరి, కాంభోజి, యరుకుల కాంభోజి, సావేరి, సారంగ, బిలహరి, కేదార గౌళ, కళ్యాణి, భైరవి, ఆనందభైరవి, వరాళి, తోడి, సౌరాష్ట్ర, శంకరాభరణం, భూపాల) దరువులు, వెన్నెల పదాలు, ద్విపదలు, కందార్థములు, సీసలు, గద్యలు, గతి విన్యాసములు, గమక విన్యాసములు వినికి పట్టు, సొమ్ముల పట్టు, మందుల పట్టు, మూర్ఛపట్టు, ఇలా మరెందు కనబడనివిధముగా పరిపుష్టి చేయబడి రసజ్ఞ హృదయ సమ్మోహన అస్త్రమై సాగుతుంది. ఇక మూడవ రాత్రి దూతిక రాయబారము వలన శ్రీకృష్ణుడు రావడము, కృష్ణ సత్యల సమాగమము. అయితే ఈ మూడురోజుల ఆట క్రమాన్ని తగ్గించి నేడు సుమారు మూడు గంటల నిడివికి తగ్గించి, వేణీభరతం, కృష్ణ సమాగమములను మినహాయించి ప్రదర్శిస్తున్నారు.

అయితే ఈ కలాప విద్యను అభ్యసించి ప్రఖ్యాతి గాంచిన స్త్రీ కళామూర్తులు కూడా కృష్ణా, ఉభయ గోదావరి జిల్లాలలోను, రాయలసీమలోను (ఇక్కడ పారిజాతాలనే పేర ప్రసిద్ధం) ఉన్నారు. వీరిలో పెండ్యాల సత్యభామ, పందిరి వేంకటరత్నం, అన్నాబత్తులు బులి వేంకటరత్నం, చాటపర్రు బాలాత్రిపురసుందరి, చదలవాడు సామ్రాజ్యం, దుగ్గిరాల జగదాంబ, చిత్తజల్లు వైదేహి, ఇందువదన మొ॥న వారు ఖ్యాతి గాంచారు.

ఇప్పుడు మనం చూస్తున్న కూచిపూడి వారి భామా కలాపం 'క్షీర నీర' న్యాయంలా స్వామి సిద్ధేంద్రుని కలాపములో మంగు జగన్నాథుల వారి రచన, బ్రహ్మశ్రీ వేదాంతం పార్వతీశంగారి రచన కలసి

కాలానుగుణ్య మార్పులతో సమకాలీన ప్రేక్షక జన మనోరంజకంగా ప్రదర్శింపబడుతుంది. సిద్ధేంద్రుల తరువాత ఈ కాలంలో మనం గొప్పగా చెప్పుకోవలసినవారు శ్రీ వేదాంతం పార్వతీశంగారు. కలాపములో లుప్తమైన చాలా భాగాన్ని వారు పూరించి కలాపానికి చక్కని పూర్ణత కలిగించారు.

కూచిపూడి భామాకలాప ప్రదర్శనలో ఉద్ధండులు "కలియుగ సత్యభామ" బిరుదాంకితులు శ్రీ వెంపటి వేంకట నారాయణగారు. వీరేకాక శ్రీ తాడేపల్లి పేరయ్యగారు, భాగవతుల నరసింహం గారు, చింతారామమూర్తి గారు, భాగవతుల విస్సయ్యగారు, ఏలేశ్వరపు వేంకటేశ్వర్లు గారు, వేదాంతం సత్యనారాయణ శర్మగారు మొ॥న వారు ప్రఖ్యాతులు.

నిన్నటి తరం వారైన శ్రీ వేదాంతం సత్యనారాయణ శర్మగారిది ఈ సందర్భములో ప్రత్యేకంగా స్మరించుకోవలసిన పాత్ర. 1935లో శ్రీ వేదాంత రత్తయ్యగారికి మూడవ సంతానంగా జన్మించిన శ్రీ సత్యనారాయణ శర్మ బాల్యము నందే ప్రహ్లాద, లవకుశ, లోహితాస్య మొ॥న పాత్రలలో అపార ప్రతిభను చాటుతూ పినతండ్రిగారైన శ్రీ వేదాంతం లక్ష్మి నారాయణ శాస్త్రిగారి వద్ద భరత విద్యను, శిష్ఠు బ్రహ్మయ్య శాస్త్రి గారి వద్ద శాస్త్రీయ సంగీతమును అభ్యసించి స్త్రీ పాత్ర పోషణ చేస్తూ భామగా, ఉషా సుందరిగా, దేవదేవిగా వారు చేసిన శైలి భావితరాలకు ఒక క్రొత్త బాణిగా అందించి, దేశవిదేశాలలో కూచిపూడి కీర్తి పతాకము ఎగురవేసి "పద్మశ్రీ"కి గౌరవాన్ని కలిగించిన అభినవ సత్యభామ శ్రీ వేదాంతం సత్యనారాయణ శర్మగారి గురించి చెప్పటం అంటే ఒక సాహసమే అవుతుంది.

ఇక ముఖ్యమైన విషయాన్ని ముగింపులో చెప్పుకుంటున్నాము. అసలు ఈ కలాప ప్రదర్శన అంతరార్ధం..? వినోదము, చక్షు ప్రీతి అనుకుంటే పొరపాటే. సత్యభామ జీవాత్మ, శ్రీకృష్ణుడు పరమాత్మ, జీవాత్మ పరమాత్మను చేరాలంటే జీవుడు నేను, నాది అనే అహమును వదులుకోవాలి. అందుకే వీరిద్దరి మధ్య ఒక పాత్ర. అదే మాధవి పాత్ర. ఆ పాత్ర సత్యభామ వద్ద మాధవిగాను, శ్రీకృష్ణుని వద్ద మాధవుని గాను ఉంటుంది. ఆ పాత్ర ద్వారా సత్యభామయొక్క సర్వాన్ని అంటే ఐశ్వర్య, అహంకారాలన్నింటిని త్యజియింపజేసి దాసోహగతికి చేర్చి అప్పుడు పరమాత్మకు దగ్గర చేస్తాడు. అప్పుడు జీవాత్మ పరమాత్మలో సంయోగం. అదియే ముక్తి. భక్తియే భగవంతుని చేరు మార్గం. అదే సిద్ధేంద్రుల లక్ష్యం. అందుకే వారు భాగవతులు. కాదు కాదు పరమ భాగవతోత్తములు.

భామా కలాపము గూర్చి ఎంత చెప్పుకున్నా సముద్రాన్ని దోసిలిలో పట్టినట్లే. అయితే దానిపై సమగ్ర పరిశోధన ఇంకా జరగవలసి ఉంది. తంజావూరు సరస్వతి మహలులో భామాకలాపం ఒక పాఠం ఉంది. దీనిని నరకూరి నారాయణ కవి రచించినట్లు తెలుస్తుంది.

*చిరునామా : పి. ఉమామహేశ్వరపాత్రుడు, ప్లాట్ నెం. 108/A , బ్యాంక్ కాలనీ, K.L.రావు పార్క్ రోడ్డు లంబాడిపేట, విజయవాడ - 9, 9848562074.*

డా॥ వేలూరి సుమిత్ర పార్థసారథి

# కృష్ణాతీరంలో మేటి నాట్య శిల్పాలు

**భా**రతదేశం పశ్చిమ కనుమలలోని సహ్యాద్రి పర్వతాలలో జన్మించిన కృష్ణానది తెలుగు రాష్ట్రాలలో మహబూబ్‌నగర్, కర్నూలు, నల్లగొండ, గుంటూరు, కృష్ణాజిల్లాలగుండా ప్రవహించి నదీనాం సాగరో గతిః అన్నట్లుగా బంగాళఖాత సముద్రంలో కలుస్తున్నది.

కృష్ణానది అపూర్వమైన చారిత్రక మరియు సాంస్కృతిక ప్రాముఖ్యతను కలిగి ఉంది. కృష్ణా పరీవాహక ప్రాంత సాంస్కృతిక నాగరికతాభి వృద్ధిలో దేవాలయ కట్టడాలు,దేవాలయ వాస్తు,ఆలయాలలోని అపురూప శిల్ప నిర్మాణము, వాటి సౌందర్యము ఎంతో ప్రసిద్ధిని గాంచాయి.

హైందవ దేవాలయాలు మరియు బౌద్ధ స్థూప,చైత్యములపై ఉన్న వివిధ శిల్పాలు స్థాన, ఆసీన, శయన, యాన,నృత్య భంగిమలలో మలచ బడ్డాయి. కొన్ని శిల్పాలు పరిచారికామూర్తిగా మలచబడితే కొన్ని శిల్పాలలో ఇతిహాసాలలోని వివిధ ఘట్టాలు నిర్మించబడ్డాయి. దేవాల యాలపై ఇలా ఎన్నిరకములు శిల్పాలున్నప్పటికీ అందరినీ ఆకర్షించేవి నాట్య శిల్పాలే. శివుడు,విఘ్నేశ్వరుడు, కృష్ణభగవానులు నటరాజస్వామి గాను, నృత్త గణపతిగాను, కాళీయమర్దన కృష్ణునిగాను వివిధ నృత్య భంగిమలలో, ఆభరణాది అలంకరణలతో మనో హరంగా మలచబడ్డారు.

మహబూబ్‌నగర్‌జిల్లా ఆలంపూరులోని నవబ్రహ్మ ఆలయాలు, నల్లగొండ జిల్లా పానగల్లులో పచ్చల సోమేశ్వర దేవాలయం, శ్రీశైలం లోని భ్రమరాంబ మల్లికార్జునస్వామి దేవాలయం, గుంటూరు లోని అమరావతి బౌద్ధస్తూపం, విజయవాడ మొగల్రాజపురంలోని గుహాలయాలు, ఇలా ఎన్నో మరెన్నో ప్రాచీన దేవాలయాలు విభిన్న నృత్య శిల్పాలతో అలరారుతున్నాయి.

ఈ దేవాలయములు లలితకళలకు ఆలవాలముగా భాసిల్లాయి. వేదవ్యాస మహర్షి రచించినదిగా భావింపబడుతున్న, శ్రీ విష్ణుధర్మోత్త మహాపురాణములో లలితకళలకు గల పరస్పర సంబంధం గూర్చి మార్కండేయ, వజ్ర సంవాదం ద్వారాతెలుస్తున్నది. శాస్త్రోక్త లక్షణములు గల దేవతా ప్రతిమ (శిల్ప) నిర్మాణమును తెలుసు కోవాలనే కోరికను వజ్రుడు మార్కండేయునికి తెలిపి తనకు ఆ విద్యను నేర్పింపుమని కోరతాడు. దానికి మార్కండేయుడు ముందుగా చిత్ర సూత్రమును అభ్యసించనిదే ప్రతిమాలక్షణము తెలుసుకొనుట కష్టమని పలుకు తాడు. అట్లయిన తనకుముందుగా చిత్రసూత్ర శాస్త్రమునే బోధించమని అభ్యర్థిస్తాడు. మార్కండేయ మహర్షి తిరిగి వజ్రునితో ఎవరైతే నృత్య శాస్త్రమును బాగుగా అభ్యసిస్తారో వారికే చిత్రసూత్రము అవగతమవు తుందని చెబుతాడు. అటుపిమ్మట నృత్యశాస్త్రమును అభ్యసించాలంటే ముందుగా ఆతోద్యములను క్షుణ్ణముగా నేర్చుకోవాలనీ, కానీ వాద్య విశేషముల గూర్చి తెలుసుకునే ముందు గీత శాస్త్రాన్ని (సంగీతము) నేర్చుకోవాలని ఉద్బోదిస్తాడు. ఈ సంవాదము ద్వారా సంగీతము, నృత్యము, ఆతోద్యము, శిల్పకళ, చిత్రసూత్రము అనే లలితకళలన్నీ పరస్పర అనుబంధాలై, పరస్పర ప్రేరకాలై ఒకదానితో ఒకటి అనుసంధా నింపబడి సమిష్టిగా అభివృద్ధిచెందిన కళలుగా తెలుస్తున్నది. శార్ఙ దేవుడు తన సంగీత రత్నాకరమను గ్రంథములో నృత్య ఆతోద్యములను తౌర్యత్రికమని పేర్కొన్నాడు.

## నటరాజ మూర్తి

నాట్యస్రష్టగా కొలువబడుతున్న శివుడు నటరాజుగాను, ఆయన ఆంగిక, వాచిక,ఆహార్య అభినయములే వరుసగా సృష్టిలోని భువనము, వాఙ్మయము, సూర్యచంద్రాది గ్రహములుగా విరాజిల్లు తున్నాయని కీర్తింపబడుతున్నాడు. శివుని నృత్తము శివతాండవము గానూ, ఆ తాండవముకలిక తాండవము,ఉమా తాండవముసంధ్యా తాండవము, సంహారతాండవము,త్రిపుర తాండవము, ఊర్ధ్వ తాండవము, ఆనంద తాండవము అని సప్తతాండవములుగా ప్రసిద్ధి కెక్కాయి. నాట్య శాస్త్రజ్ఞులు రచించిన నటరాజ విగ్రహ శిల్పమునకు కాశ్యప శిల్పశాస్త్ర ప్రోక్తముగా నిర్మించిన నటరాజ శిల్పమునకు కించిత్ బేధముండుట సహజము. నటరాజమూర్తి సర్వలోకాలకు హితము చేయు దేవతా మూర్తులలో ఉత్తమమైనదిగా కాశ్యప శిల్పశాస్త్రం పేర్కొన్నది. అలంపు రంలోని నటరాజస్వామి శిల్పాలు భిన్న భంగిమలలో శిల్ప, నాట్య శాస్త్రాలకు ఆలవాలంగా నిర్మింపబడ్డాయి.

ప్రథమ నటరాజ శిల్పం అష్టభుజాలు కలిగిన మూర్తి, తన కుడి హస్తములలో పైనుండి క్రిందకు వరుసగా ఢమరుకము, అన్నపాత్ర, గొడ్డలి మరియు చిన్ముద్ర ధరించి ఉండగా ఎడమహస్తమున అగ్ని, సర్పము, శూలములను ధరించి గజహస్తముతో చూపింపబడ్డాడు. నాట్యములో ఈ గజహస్తమునకే 'కరిహస్త'మనీ, డోలాహస్తమని పేరు. నటరాజస్వామి రెండు మోకాళ్లను కుంచించి అపస్మారుడనే రాక్షసునిపై (పురుషుని) నిలబడినట్టుగా ఉన్నది. ఎడమ పాదము సమపాదము కాగా కుడి పాదము మునివేళ్లపై ఆన్చి అపస్మారునిపై పెట్టబడి ఉన్నది. ఇలా మునివేళ్లపై ఆన్చిన పాదమునకు నాట్యమున కుంచిత పదమని పేరు. ఇట్టి నటరాజస్వామి పాదాల చెంత చండ అనే చర్మవాద్యమును, వేణువును వాయిస్తున్న గంధర్వులు ఉన్నారు.

మరొక నటరాజమూర్తి కొంత భిన్నమైన నృత్యభంగిమలో మలచ బడ్డాడు. ఈ నటరాజు చతుర్భుజాలతో ఉన్నాడు. ఈ మూర్తి తన ముందరి కుడిచేతిని ఎడమవైపుకుచాచి గజహస్తమును పట్టగా ఎడమ వైపు ముందరి హస్తముతో, వ్యాఖ్యాన ముద్రను ధరించాడు. పైకెత్త బడిన వెనుక రెండు చేతుల హస్తములలో చంద్రవంకను, సర్పమును ధరించాడు. ఈ మూర్తి అపస్మార పురుషునిపై కాక పద్మముపై నిలబడి యుండుట గమనించవచ్చు. ఎడమ పాదము సమపాదము కాగా కుడి పాదము కుంచిత పాదముతో ఉన్నది. ఈ మూర్తి పాదముల కిరువైపులా ఇద్దరు యక్షులు వేణువును, చండవాద్యముతో ఉండగా, స్వామి శిరస్సుకు ఇరువైపులా ఉన్న యక్షులు తమ చేతులలో చామరములు ధరించినట్టుగా మలచబడ్డారు.

మరొక నటరాజమూర్తి దేవాలయములో ఉపరితల గోడపై పైన పేర్కొన్న విధముగానే చూపబడ్డాడు. ఈ స్వామి చుట్టూ ఎనిమిది దిక్కులా అష్టదిక్పాలకులు వారి వారి వాహనములతో సహా చెక్కబడ్డారు. ఈ శిల్పాలన్నీ చతురస్రాకార ఫలకముపై మలచబడ్డాయి.

దేవాలయములో భగవంతునికి చేసే నిత్య ఆరాధనా క్రమంలో భగవంతుని ప్రీతి కోసం దేవదాసీలు నృత్యమును ప్రదర్శించి గీతమును ఆలపించిన తదనంతరం అర్చకులు మహామంత్రపుష్ప సమర్పణతో అర్చనను ముగిస్తారు. దేవాలయంలో మూలవిరాట్టుకు ఎదురుగా ధ్వజ స్తంభానికి ముందుగా నాట్య ప్రదర్శనకు అనువుగా ఒక మండపాన్ని నిర్మించాలని దేవాలయ వాస్తు శాస్త్రం చెబుతోంది. తదను గుణంగా నిర్మించిన మంటపంలో ఆయా మూలవిరాట్టు ననుసరించి(శైవ, వైష్ణవ మతాలననుసరించి) దేవదాసి భగవంతునికి పుష్పాంజలిని సమర్పి స్తుంది. బలిపీఠము వద్ద నర్తించేటపుడు ఇంద్ర, యమ, నైరుతి, వరుణ, వాయు, కుబేర, ఈశాన్యాది దిక్పాలకులకు నాట్యశాస్త్రములో పేర్కొనబడిన ఆయత, అవహిత్థ, అశ్వక్రాంత, వినివృత్త, ఇంద్ర, చండిక స్థానకములను ప్రదర్శిస్తూ పుష్పాంజలిని ప్రదర్శిస్తారు.

పైన వర్ణింపబడిన అష్టదిక్పాలక సహిత నటరాజమూర్తి చతురస్ర ఫలకం బహుశ ఈ దేవదాసీల నృత్య క్రమమునకు ఆధారంగా పేర్కొన వచ్చు.

ఇదేవిధమైన చతురస్ర ఫలక నటరాజమూర్తి శిల్పాలు కూడలి సంగమేశ్వర దేవాలయములో కూడా చూడవచ్చు.

సాధారణంగా నేడు చూస్తున్న నటరాజ విగ్రహానికి ఉన్నట్లుగా జ్వాల మాలా ప్రభామండలం అలంపురంలోని నటరాజు శిల్పాలలో కనబడదు.

నల్లగొండ జిల్లా పానగల్లులోని నటరాజు స్వామి శిల్పం కించిత్ బేధంతో నిర్మింపబడింది. స్వామి కుడిపాదం సమపాదం కాగా ఎడమ పాదం కుంచిత పదముగానూ, తన అష్టభుజాలలో త్రిశూలము, ఢమరు కము, శుకతుండ, అభయహస్తములు ధరించి ఉండగా ఎడమ చేత త్రిశూలము, సర్పము, అగ్ని ధరించి ముందరి చేయిని కరిహస్తముగా కుడివైపుకు సాచబడి ఉన్నది. కిరీటము, గ్రైవేయకము, బాహువల యాలు, కంకణాలు అర్ధోరుకమును ధరించిన స్వామి మెడలోని పుష్పహారము జంఘముల వరకూ వ్రేలాడునట్లుగా చూపించబడింది.

"చతుర తాండవం" చేస్తున్న నటరాజు శిల్పాలు తొమ్మిదవ శతాబ్దానికి చెందిన రూపాల సంగమేశ్వర దేవాలయంలో లభించింది. ఈ నటరాజు పాదాల కింద అపస్మార పురుషుడు కానీ, పద్మము కానీ లేదు. అష్టభుజములు కలిగి వైష్ణవ స్థానకములో ఉద్వాహిత కటిని కలిగిన ఈ నటరాజు స్వామి శిల్పం ఒక కుడ్య శిల్పం.

## నృత్యగణపతి శిల్పములు

నటరాజు నాట్య స్రష్ట అయితే, షోడశ నాట్యశాస్త్రకారులలోగణపతి కూడా ఒకరుగా పేర్కొనబడ్డాడు. గణపతి చర్మవాద్యమైన మృదంగానికి అధిపతిగా "విఘ్నేశం మురజాధిపం" అనీ, ముందుగా వినాయకుని ప్రార్థించి నాట్యం ప్రారంభించాలని నందికేశ్వరుడు తన అభినయ దర్పణంలో పేర్కొన్నాడు. ధనంజయుడు రచించిన దశరూపక మనే నృత్యశాస్త్ర గ్రంథంలో వినాయక స్తుతి చేస్తూ వినాయకుని కంఠం నీలకంఠునితాండవ సమయంలో మృదంగమవుతున్నదని పేర్కొన్నాడు. నృత్తరత్నావళి రచించిన జాయపసేనాని గ్రంథ ఆరంభంలో లలిత మాధుర్యంగా, ఉల్లాసంగా తన భర్త పరమేశ్వరునికి శృంగారాన్ని రహస్య రీతిలో ప్రస్ఫుటం చేస్తూ ఇంపుగా లాస్యం చేస్తున్న పార్వతీదేవి పక్కన వంకర నడకలతో నృత్తము చేసే గజాననుడు బ్రోచుగాక అని ప్రారంభించాడు.

అలంపూర్ సమీపంలో ఉన్న కూడలి సంగమేశ్వర దేవాలయంలో నటరాజ శిల్పంతో పాటుగా 'లలిత నృత్తాన్ని' చేస్తున్న ద్విభుజ గణపతి శిల్పం ఉన్నది. ఇది పశ్చిమ చాళుక్య రాజులు కట్టించిన దేవా లయము. నాట్యరీత్యా 'లలితము' అంటే ఎడమచేత కరిహస్తమును ప్రదర్శిస్తూ కుడిచేతిని వివర్తము చేయాలి. పాదములు హస్తములు ననుసరించి

మరల మరల పర్యాయముగా కుట్టితమొనర్చాలి. సవిలాసముగా చేసే నాట్యంలో లలితమును ప్రయోగిస్తారు.

శ్రీశైలం దేవాలయ కుడ్యాలపై నృత్త గణపతి శిల్పాలు అనేకం ఉన్నాయి. శ్రీశైలం దక్షిణ ప్రాకారం తూర్పు భాగంలో గల కుడ్య శిల్ప ఫలకంలో గల నృత్త గణపతి కుంచిత పాదాలతోనూ, చతుర్భు జాలతోనూ మలచబడ్డాడు. ఇదే కుడ్య ఫలకాలపైన మరియొక ప్రక్క ముందు చతుర్ముఖ బ్రహ్మ శిల్పము, అటు చివర నంది వాహనముపైన శివపార్వతుల శిల్పము, ఈ రెండు శిల్పాల మధ్య తన ఎలుక వాహనం పై నృత్యభంగిమలో ఉన్న గణపతి శిల్పము ఒకే ఫలకములో చిత్రించ బడి ఉన్నాయి. ఈ గణపతికి ద్విభుజములే ఉన్నాయి. గణపతి శిల్పం రెండుచేతులు పైకెత్తి వలయాకారములో చూపబడింది.

నల్లగొండ జిల్లా పానగల్లులోని పచ్చల సోమేశ్వర ఆలయం పశ్చిమ కుడ్యంపై గల నృత్య గణపతి ఒక సర్పము శిరస్సుపై నర్తిస్తున్న ట్లుగా ఉన్నది. శ్రీ కృష్ణుని కాళీయమర్దన ఘట్ట ప్రభావం చేత శిల్పి గణపతిని ఈ విధంగా మలిచి ఉండవచ్చు. నృత్త గణపతి పాదాల క్రింద తలతో మొదలైన పాము గణపతిని ఎడమవైపు నుండి పైకి వెళ్ళి చుట్టూ తిరిగి కుడివైపుకు క్రిందికి దిగి వలయాకారంలో ఉండి దాని తోక క్రిందకు వ్రేలాడబడి ఉంది. సర్పము పైన గణపతి ఎడమకాలు సమపాదముతోనూ, కుడిపాదము కుంచిత పాదము తోనూ ఉన్నాడు. గణపతి కటి భాగము 'ఉద్వాహిత' కటిని కలిగి ఉన్నది. అంటే, పార్శ్వమును కటితో పాటుగా మెల్లగా (పైకి లాగి ఉంచినచో) ఉన్నతము చేసిన అది ఉద్వాహిత కటి అనబడుతుంది. ఈ రకమైన కటి కదలికలను నాట్యంలో స్థూల వ్యక్తుల గతిని నిరూపిం చటంలో ప్రయుక్తమవ్వాలని భరతుడు నాట్యశాస్త్రంలో పేర్కొన్నాడు.

## కాళీయమర్దన కృష్ణుడు

మహబూబ్‌నగర్ జిల్లా చిన్నమరూర్‌లోని దేవాలయంపై కాళీయుడనే సర్పం తలపై నృత్యం చేస్తున్న బాలకృష్ణుని శిల్పం అద్భుతముగా మలచబడింది. ఈ ఆలయం 17వ శతాబ్దానికి చెందింది. బమ్మెర పోతన తెనుగించిన ఆంధ్ర మహాభాగవతములో కాళీయ సర్పమర్దన సమయంలో శ్రీ కృష్ణుని తాండవకేళీ విలాసమును మనోహరముగా వర్ణించాడు. కాళీయుని ఫణాభాగము రంగమంటపముగా, యమునా నదీ అలల ఘోష మృదంగ శబ్దముగా నర్తించాడని వర్ణించాడు పోతన. చినమరూర్‌లోని దేవాలయ కుడ్యంపై గల కాళీయ మర్దన శ్రీకృష్ణుని శిల్పం చతుర్భుజాలు కలిగి ఉండి వెనుక రెండు చేతులలో శంఖు చక్రాలను ధరించి, ముందరి ఎడమచేతితో కాళీయ సర్పము తోకను పట్టుకొని, కుడి హస్తముతో నాట్యములో చూపే అర్ధపతాక హస్తమును అభినయిస్తున్నట్లుగా ఉన్నది. కృష్ణుని కాళ్ళు మోకాళ్ళ వద్ద ప్రక్కకు తిప్ప కుంగి కూర్చున్నట్లుగా ఉంది. నాట్యం చేసేటపుడు కాళ్ల ప్రక్కకు తిప్పి సగము కూర్చొని నాట్యం చేయాలని భరతమునిచెప్పిన విషయం (చరణశ్చాను గచ్ఛాపి) ఇక్కడ శిల్పశాస్త్ర, నాట్యశాస్త్ర సమన్వయానికి సరిపోతున్నది. బాల కృష్ణుని కుడిపాదం కాళీయుని తలపై సమపాద ముగానూ,ఎడమ పాదము కుంచితపాదముగానూ ఉన్నది.ఈ తాండవ కృష్ణుని పాదముల కిరువైపుల ముకుళిత హస్తాలతో మోకరిల్లిన కాళీయుని భార్యలు ఉన్నారు. శ్రీ కృష్ణుని పాదాలకు ధరించిన గజ్జెల మువ్వలు సైతం ఆయన తాండవ కేళీ విలాసాన్ని ప్రకటించేవిధంగా ప్రస్ఫుటంగా చెక్కబడ్డాయి.

కర్నూలు జిల్లాలోని ప్రాతకోటలో 9వ శతాబ్దానికి చెందిన నాగేశ్వరస్వామి దేవాలయ కుడ్యముపై కాళీయమర్దనం చేస్తూ నాట్యం చేస్తున్న శ్రీ కృష్ణుడి శిల్పం లభించింది. ఇది దీర్ఘచతురస్రాకార కుడ్య శిల్ప ఫలకం.ఈ శిల్పంలో కాళీయుడిపై నృత్యభంగిమలో శ్రీకృష్ణుడితో పాటుగా శ్రీకృష్ణుని ఇతర బాల్యలీలా విశేషములు కూడా చూపబడ్డాయి. ఇది చాళుక్య శిల్పకళా రీతిని పోలి ఉన్నది.

## జగన్మోహిని శిల్పం

కర్నూలు జిల్లా మంచాలకట్టలో చాళుక్య శిల్పశైలిలో నిర్మింపబడ్డ దేవాలయ కుడ్యంపై అత్యంత రమణీయంగాను లాస్యయుతంగాను జగన్మోహినీ శిల్పం చెక్కబడింది. ద్విభుజాలు గల ఈ మోహినీ శిల్పం అమృత కలశాన్ని తన కుడి భుజము మీద పెట్టి కుడిచేతితో పట్టుకొని ఎడమ హస్తమును కటి హస్తముగా నిలిపి ఉన్నది. శృంగారిణియైన దివ్యాంగన వేషముతో కేశములను పక్క కొప్పుగా ధరించినట్లుగా చూపబడింది. వక్షస్థలము పైన కంచుకమును, ఊరువుల వరకు వస్త్రాన్ని ధరించి అశ్వక్రాంత స్థానకములో నిల్చొని ఉన్న ఈ శిల్పం ప్రక్కనే ధన్వంతరి శిల్పం కూడా ఉన్నది.

## నర్తకీమణులు, బృందనృత్యాల శిల్పాలు

నటరాజు, గణపతుల అనంతరం నాట్యశిల్పాలలో చెప్పదగినవి నాట్యకత్తెల శిల్పాలు, నాట్యబృందాలు, వాద్య బృందముల శిల్పాలు.

నాగార్జునకొండలో పురావస్తు శాఖ వారు జరిపిన త్రవ్వకాలలో నాట్య శిల్పాలు అనేకం లభించాయి. ఇక్కడ లభించిన బౌద్ధ శిల్పాలలో వీణను మీటుతున్న స్త్రీమూర్తి, ముగ్గురు స్త్రీలు కలసి బృంద నృత్యము చేస్తున్న శిల్పము లభించాయి.ఇక్కడ బయటపడ్డ ఆరుబయలు రంగస్థల అధ్యక్షిణియైన 'నరసిక' అనే నాట్యకత్తె ముద్రిక కూడా లభించింది.

గుంటూరులో నిర్మింపబడ్డ అమరావతి బౌద్ధ స్థూపంలో ఆనాటి శిల్పులు స్త్రీలను వివిధ శృంగార నాట్యభంగిమలలో అపురూప సౌంద ర్యంతో మలిచారు. బుద్ధభగవానుని అస్తికల చుట్టూ, కుసీనారమల్లులు నాట్యాది విశేషములతో శ్రద్ధాంజలి ఘటించినట్టుగా అమరావతి స్థూప శిల్పాలలో ఎంతో విపులంగా ఉన్నది.

## బృంద నాట్య శిల్పాలు

నర్తకులు వాద్య సహితముగా తాళలయాను సారులై రేచక అంగహారములను ప్రయోగిస్తూ ఒక అకృతిగా ఏర్పడడాన్ని 'పిండీ బంధము'అంటారు. ఇటువంటి పిండీబంధములు అనేకం అమరావతి స్తూపముపై చెక్కబడి ఉన్నాయి.

అమరావతి స్తూపము పైన బుద్ధుని ఉష్ణీషమును తీసుకువెళ్ళే ఘట్టము చిత్రీకరింపబడింది. అందులో కొందరు వాద్యములను వాయిస్తున్నారు. కొందరు నాట్యం చేస్తున్నట్టుగాను, కొందరు వివిధ భంగిమలలో నిల్చొని నమస్కరిస్తున్నట్టుగానూ శిల్పాలు చెక్కబడ్డాయి.

క్రీ.శ. ఒకటవ శతాబ్దంలో నిర్మింపబడ్డ అమరావతి శిల్పాలలో గల ధర్మచక్ర శిల్పం చుట్టూ వివిధ భంగిమలలో నర్తకీమణులు నర్తిస్తున్నట్టుగా ఉన్నది.

గుంటూరు జిల్లాలోని అమరావతి స్థూపంలో సౌందర్యానందంగా అభివర్ణించ బడుతున్న బృందనృత్య శిల్పం ఉన్నది. ఈ శిల్పంలో ఒక యువతి వేణువును ఊదుతున్నది. కొందరు యువతులు అలంకరించు కుంటున్నారు. కొందరు నృత్యం చేస్తుంటే మరికొందరు ఆ నృత్యాన్ని తిలకిస్తున్నట్టుగా అర్ధచంద్రాకృతిలో గల రాతిపై చెక్కబడి ఉన్నది.

అమరావతి స్థూపముపైనే ఉన్న మారధర్షణమనే శిల్పములో బుద్ధుని ఏకాగ్రతను భంగము చేయడానికి మారుని కుమార్తె నృత్యము చేస్తున్నట్టుగా చెక్కబడింది.

అమరావతి స్థూపాలపైగల నాట్య శిల్పాల ద్వారా నాడు వారు ధరించిన అనేక ఆభరణాలు, వస్త్రాలు, కేశాలంకరణల వివరాలు తెలుస్తున్నాయి. నాట్యానికి వినియోగించిన వివిధ తంత్రీ, చర్మ, ఘన, సుషిర వాద్యాల వివరాలు కూడా తెలుస్తున్నాయి.

గుంటూరు జిల్లా గోలి లోని బౌద్ధ స్థూపంలో విపంచిని మీటుతున్న స్త్రీమూర్తి శిల్పం లభించింది.

## కోలాట నృత్యాలు

ఈ కోలాట నృత్యానికే 'దండ లాసక' 'దండ లాసిక' 'దండ రాసకము' లని వివిధ పేర్లు ఉన్నాయి. ఇద్దరిద్దరు చొప్పున జట్లు జట్లుగా చేతిలో కోలలు ధరించి, కుడి ఎడమ ప్రక్కలకూ, గుండ్రముగా తిరుగుతూ కోలలను కలుపుతూ లయాత్మక ధ్వనిని కలుగచేస్తూ నట్టువ కత్తెలు చేసే నృత్యమే కోలాట నృత్యము. చూపరులకు కూడా ఉత్సాహ మును కలుగచేసే నృత్యాలలో కోలాటం ఒకటి. శాతవాహనులు మొదలు విజయనగర రాజుల కాలము వరకు నిర్మించిన ప్రతి దేవా లయము పైన ఈ కోలాట నృత్యం చేసే నట్టువకత్తెల శిల్పాలు అత్యంత రమణీయంగా మలచబడ్డాయి. శ్రీశైలం భ్రమరాంబ మల్లి కార్జున దేవాలయ కుడ్యాలపైన కోలాటం చేసే నర్తకీమణుల శిల్పాలు వివిధ భంగిమలలో ఉన్నాయి. రెండు కాళ్ళు ప్రక్కకు తిప్పి మోకాళ్ళపై కొంచెం కుంగి కూర్చుండి కింద ఒక కోలతోనూ, తలపైన ఒక కోల తోనూ నాట్యమాడుతున్నట్టుగా శిల్పాలున్నాయి. దేవాలయ కుడ్య శిలా ఫలకాలపైన కోలాట నృత్యం చేస్తున్న వరుస నర్తకీమణుల శిల్పాలు నల్గొండ జిల్లా పానుగల్లు పచ్చల సోమేశ్వరస్వామి ఆలయస్తంభాలపైన అద్భుతముగా చెక్కబడ్డాయి. స్తంభము చుట్టూ మనోహరమైన ఆభరణములు, ఆహార్యము ధరించి చేతిలో కోలలు ధరించి నర్తిస్తున్న నర్తకీమణుల శిల్పాలు దేవాలయ శోభను మరింత పెంచాయి. ఈ నర్తకీమణులు త్రిభంగిమలో ఉన్నట్లుగా కొన్నిచోట్ల చూపబడింది.

## ఇతరములు

బెజవాడ అక్కన్న మాదన్న గుహలకు కొద్దిదూరములో ఉన్న జమ్మిదొడ్డిలోని మండలస్తంభములపైనా, దూలముల మీద తొమ్మిదవ శతాబ్దానికి చెందిన పూర్వ చాళుక్యుల సంప్రదాయానికి చెందిన నాట్య చిత్రములు కొన్ని ఉన్నాయి.

కర్నూలు జిల్లా ప్రాతకోట దేవాలయ కుడ్యంపై దశరథుడు, అతని ముగ్గురు భార్యలూ రామలక్ష్మణుల జననాన్నీ తెలిపే శిల్పాలు న్నాయి. ఆ పక్కనే నర్తకీమణుల శిల్పాలు వరుసగా చెక్కబడి ఉన్నాయి. (నాట్యశాస్త్రకర్త అయిన భరతుడు నాట్య ప్రయోగసమయాలు పేర్కొంటూ పుత్ర జనన సమయాన్ని కూడా పేర్కొన్నాడు)

16వ శతాబ్దానికి చెందిన గణపురంలోని దేవాలయ కుడ్యంపైగల చిత్రాలలో నర్తకియొక్క శరీర కదలికను కరణ అంగహార సహితముగా చిత్రకారుడు రచించాడు. ఈ విధమైన శిల్ప చాతుర్యము చిదంబర నటరాజు స్వామి దేవాలయ కరణాలలో చూడవచ్చు. నాట్య ఆరంభం సూచిస్తూ నాట్యంలోని అంతిమ భంగిమను చూపించటం ఈ చిత్రంలోని విశేషం. ఈ చిత్రం పక్కనే తంత్రీ వాద్యాన్ని వాయిస్తున్న కళాకారుని చిత్రమున్నది.

ఇలా తెలుగు రాష్ట్రాలలో కృష్ణానదీ పరివాహక ప్రాంత దేవాలయా లలో మరెన్నో నాట్య శిల్పాలు నాటి చారిత్రక, సంస్కృతీ సంప్రదాయా లకూ, లలితకళలకు సాక్షీభూతాలుగా నేటికీ నిలిచి ఉన్నాయి.

Dr. G.S. MOHAN

# STUDY OF TELUGU FOLK LITERATURE

## A BRIEF ANALYSIS

It is very interesting to know that the study of folk literature is very much advanced among the various branches of folklore study in Andhra Pradesh. I would like to survey here the researches on the collection and study of folk literature in Andhra Pradesh

C.P. Brown was the first person to collect some ballads like Bobbili Katha, Kumara Ramudi Katha and Kamamma Katha in 1842 and showed much interest in Telugu Folk literature. In 1863 M.W. Car collected some Telugu proverbs and published them in a book form called Andhra Lokokti Chandrika. This is the first book on the collection of proverbs. Afterwards in 1863 Ravipati Guruvayuru collected and published some Telugu proverbs.

J.A. Boyal collected one historical ballad and five love songs and published it in Indian Antiquary Vol.3 in 1874. Even before this, in 1871 Charles E. Gover published Folk-songs of Southern India, but it did not contain Telugu folk-songs. The interest showed by the Englishmen had created much enthusiasm in the Telugu people and paved the way for collection and publication of Telugu folk literature.

The late Nandiraju Chalapati Rao published 3 volumes of songs of women in 1899 and 1903. In 1905 the late Sri Mangu Venkata Ranganatha Rao also published some women's songs. M.N. Venkata Swamy also collected some songs and published them as Some Telugu Folk-songs and Some Telugu Nursery Folk-songs and Catches. Tekumalla Achyutha Rao published some essays in book form as Andhra Padamulu, Patalu in 1924. According to him these essays were published in Krishna Patrika during the years 1916 and 1917.

It is to the credit of the late Nedumuri Gangadharam who started collecting the folk literature throughout the State and collected, 6,000 folk-songs. Tekumulla Kameswara Rao and the late Sripada Gopalakrishna Murthy (Krishna Sri) collected a number of songs and made a critical analysis of them. Their articles were published in some of the important magazines like Bharathi, Grihalakshmi, Kinnera, etc. Tekumalla Kame swara Rao published Patha Patalu, which is also called as Sampradayika Vignanamu- Vol.II and Sri Pada published Pallepadalu (1953), Streela Ramayanapu Patalu (1955) and Streela Pauranikapu Patalu (1963).

In 1954 Sri Hari Adiseshuvu published Janapada Geya Vangmaya Parichayamu which is the first ever published descriptive book on Telugu folk literature. Devulapalli Ramanuja Rao has also published some essays in his book Saraswatha Navaneethamu which was published in 1955.

Smt. Vinjamuri Seetha Devi who is now the programme executive in A.I.R. is the first woman get M. Litt. from the Madras University for her dissertation on Folk Music. Dr. B. Rama Raju is the first Doctorate in Telugu folk literature from the Osmania University in 1956. His thesis entitled Telugu Janapada Geya Sahityamu gives valuable material to all the folk-lorists regarding the folk literature in Andhra Pradesh. He had analysed the folk-songs and compared Telugu folk literature with that of classical literature and classified the material into groups and has given a descriptive analysis.

In 1957 Dr. S. V. Joga Rao did his Doctorate on Telugu Yakshaganamu from Andhra University. This is also a remarkable milestone in the Telugu folk research of Andhra Pradesh.

In 1960 under the editorship of Dr. B. Rama Raju, the late Nedumuri Gangadharam, the late Sripada Gopalakrishna Murthy and Dr. Tumati Donappa, published a volume in the name of Triveni which contains 'A Collection of Andhra Pradesh Folksongs'. These folk-songs are collected and edited region-wise like Telangana, Rayalaseema and Kosta Andhra Songs. Dr. Ramaraju collected and published Telangana Pallepatalu in 1968.

Karna Rajeswara Rao did his doctorate in Hindi on Folk-songs in Telugu from the Andhra University. Dr. Tangirala Venkata Subba Rao did his doctorate on Ballad Poetry in Telugu from S. V. University in 1969. The origin, development, definition, classification and contribution by the foreign and native scholars on the Telugu ballads were discussed in the thesis. Nearly 980 ballads have been mentioned.

Dr. Nayanikrishna Kumari did her doctorate from Osmania University in 1970 for her thesis, Telugulo Gadha Geyalu. Prof. Tumati Donappa collected many folk-songs of Rayalaseema and published in Telugulo Kotha Velugulu (1972) and Janapada Kala Sampada (1975). These two books are also valuable to the research scholars of Andhra Pradesh.

Alichippalu-Animuthyalu was published by Dr. Tangirala Venkata Subba Rao, Dr. R. V. S. Sundaram and Ghattamaraju Aswatthanarayana in 1972 which contains specimens of Telugu folk songs.

Dr. R. V. S. Sundaram got his Ph.D. degree from Mysore University in 1973 on his thesis Folk-songs in Telugu and Kannada. Dr. Y. Raghuma Reddy got his Ph.D. degree from Osmania University in 1974 on his thesis 'Folk-life in Folk-songs'.

The Sterling Publishers (Delhi) published Dr. Ramaraju's Folk-tales of Andhra Pradesh in 1974. A.P. Sangeeta Nataka Academy published Dr. Tangirala Venkata Subba Rao's Folk litt-ballads in 1975 and A.P. Sahitya Academy published Katama Raju Kathalu in two volumes in 1976 and 1978 respectively. Dr. Sundaram's Janapada Sahitya Swarupamu which was published in 1976 gives much folk literature information in general.

The present author has submitted his thesis on Songs of Women in Telugu (with special reference to Anantapur District) to the Bangalore University. He has also published a book in Kannada on 'Similar Proverbs in Kannada and Telugu'.

It is very interesting to know that Osmania and Bangalore University Telugu Departments have

the privilege of encouraging research in Telugu folk literature. Smt. Nayani Koteswari submitted her thesis on Prachurinchina Janapada Geyalalo Nighantu Kekkani Padalu to the Osmania University. The following research scholars are making research on the subjects noted against them in the Osmania University. Smt. Sumati working on Telugu Folk-tales, Smt. Hemalatha on Pauranika Gathalu, Smt. Vasundhara on Telugu Sahityamulo Pratibimbinche Mata Sampradayalu, Smt. P. Saraswathi on children's songs and G. Linga Reddy got his M. Phil for his dissertation 'Work Songs on Telangana'. He is submitting his thesis on the same subject shortly. G. Venkateswarlu is doing his M. Phil on Rayalaseema Bayalatalu in Bangalore University.

'Andhra Pradesh Janapada Sahitya Parishath' is established in 1972 as a private organisation. The branches are spreading throughout Andhra Pradesh districts of A.P. gradually.

This is in short the progress of research in folk literature in Telugu during the recent years. There may be others who may be working in the fieled, without my knowledge.

The above is only a bird's eye view. There is much to be done. Most of the scholars have shown their interest in the collection of Telugu folk-songs. There are main branches like folk tales, narrative folk-songs, prose narratives, proverbs and riddles which are to be tackled by the scholars. It is necessary to collect, analyse and publish them soon. There are main folklore items like folk arts, folk speech, social folk customs, folk games and recreations, folk medicine, folk material culture etc., which are to be collected and analysed. We do not know when the research scholars would take up the above items. Moreover it is very essential to establish a folklore museum and publish a journal on Telugu folk literature. I am sorry to state that nothing has been done so far in A.P. except in the collection of folk-songs.

Telugu folklorists will have to concentrate their attention in analysing the folk material in addition to their collection and publication. Whatever is collected should be theoritically analysed and compared with the folk literature of the neighbouring states. Then only the culture of India will be brought to the light to the foreigners and Indians. The A.P. Government can take steps in promoting folk literature at post-graduate and under-graduate levels by establishing a separate Folklore Academy in each State. This will solve many problems which are faced by the folklorists.

**Address** : ***Dr. G.S. Mohan,*** *Research Assistant, Department of Telugu, Bangalore University.*

శ్రీ ఎలమర్తి రమణయ్య

# కర్నూలు జిల్లా జానపద కళారూపాలు

జానపద కళలు జ్ఞానపద కళలకు మాతృకలు !

పూర్వకవులెందరో అప్పటికే ప్రజల నోళ్ళల్లో నానుతున్నటు వంటి ఎన్నో పదాలు,

ఏలలు, దరువులు, వెన్నెల పదాలు, రోకటి పదాలు తరువోజులు స్త్రీల పాటలు మున్నగువానిని తమ కావ్యాలలో ఉదహరించి యున్నారు. కొన్ని పద్యాలకు అవి స్ఫూర్తికావడం కూడా గమనార్హం.

జనపదం అంటే గ్రామం. జానపదులంటే గ్రామీణులు – పల్లీయులకు మానసికోల్లాసం కల్గించుటకు కావచ్చు. శారీరక శ్రమను మరపించుటకు కావచ్చు; తమవెతలు కథలుగా వినిపించుటకు కావచ్చు, అనేక రూపాలుగా రూపొందినవే జానపద కళారూపాలు. జిల్లాకు సంబంధించిన అలాంటి కళారూపాలేంటో తెలుసుకుందాం.

## వీధి భాగవతం :

### పాతకమూరి భాగవతులు

భాగవత, భరతనాట్య సంప్రదాయ ప్రవర్తకులలో వీరు అహోబి నృసింహస్వామి సన్నిధిలో నిత్యనాట్య సేవచేసేవారు.

“శ్రీ వెలయ పాలవారధి పవళించి జోజో” అన్న జోలపాట ఈ భాగవతులు రచించిందే అని తాళ్ళపాక అన్నమాచార్యులే పేర్కొన్నారు. వీరు క్రీ.శ. 1280 ప్రాంతం వారని నిడుదవోలు వెంకటరావుగారు ఎల్లోరా రచన – ‘కళలు పుట్టుపూర్వోత్తరాలు’ అనే పుస్తకానికి వ్రాసిన ఉపోద్ఘాతంలో చెప్పారు.

### కోటకొండ భాగవతులు

భాగవత కళను రాయలసీమలో విరివిగా ప్రచారం చేయవలెనన్న ఉద్దేశ్యంతో క్రీ.శ. 1700–1750 ప్రాంతంలో బనగానపల్లి నవాబు గారు కూచిపూడి నుంచి కొందరు కళాకారుల కుటుంబాలను ఆహ్వానించి కోటకొండ కప్పట్రాల వద్ద వీరికి భూములిచ్చి వారిచేత కర్నూలు జిల్లాలో భాగవత కళాప్రచారాన్ని ప్రోత్సహించారు. కూచిపూడి నుండి అలా తరలివచ్చిన కుటుంబాలో చల్లావారొకరు. వెలనాటి బ్రాహ్మణ కుటుంబానికి చెందినవారు. వీరిలో ముఖ్యుడు చల్లా భాగవతం దాసంబొట్లు. సిద్ధేంద్రయోగి నేర్పించిన ‘పారిజాతాప హరణాన్ని’ పారంపర్యంగా ప్రదర్శించిన వాళ్ళలో,ఇటీవల మరణించిన భరతశాస్త్రం లక్ష్మీనారాయణ శాస్త్రి ఒకరు. తొమ్మిదవ తరానికి చెందినవారు. వీరు భామాకలాపం, క్షేత్రయ్యపదాలు తరంగాలు అభిన యించడంలో దిట్ట. వీరిని ఈ ప్రాంతంలో కోట కొండ భాగవతులు అని అన్నారు. కూచిపూడి భాగవతులకు గోలకొండ నవాబు తానీషా అగ్రహారాన్ని దానం చేసినట్లు ; కోటకొండ భాగవతులకు బనగానపల్లి నవాబు 890 ఎకరాల భూమి సర్వహక్కులతో ఇచ్చారట.

కుటుంబంలో ప్రతి మగపిల్లవానికి అయిదో ఏట దేవాలయంలో ముక్కు కుట్టిస్తారు. ఉపనయనానంతరం గజ్జెకట్టించి మొదటి పాఠాన్ని బోధిస్తారు. విద్య పూర్తికాగానే చెన్నకేశవుని సన్నిధానంలో ప్రదర్శిస్తారు.

### జంగం వీధి భాగవతులు

ఈ వీధి భాగవతాన్ని శైవమతాచారులైన జంగం కుటుంబాల వాళ్ళు విస్తృతంగా పల్లెపల్లెలో ప్రదర్శించారని తెలుస్తుంది. ఈ ప్రక్రియలో హరిశ్చంద్ర ఇతివృత్తాన్ని కూడా ప్రదర్శించేవారని అందులో నక్షత్రకుని పాత్రవేసే యడవల్లి సిచ్చన్న అనే వ్యక్తి అప్పటికప్పుడు ఆశువుగా గానం చేసేవాడని చెబుతారు. అడవిలో ఒక పిల్లకాలువఅడ్డురాగా దీన్ని దాటిన తర్వాత హరిశ్చంద్రునితో ‘ఎంతవాడవురా రాజా! నను ముంచటా నికే చూసితివటరా!’ అంటూ ప్రజలను కడుపుబ్బ నవ్వించేవాడట.

### పగటివేషాలు - ఎర్రగుడి బింగిబాలయ్య

కర్నూలు జిల్లాలోని జానపదకళల్లో పేర్కొనదగింది పగటి వేషాలు. ఇవి యక్షగానానికి ప్రతిరూపాలు. జిల్లాలో పగటి వేషధారణలో

పేర్కొనదగినవారు గోరంట్ల యర్రగుడి బింగివాళ్ళు కీ.శే. మోతె బింగి బాలయ్యగారు కూచిపూడి వారివద్ద ఈ విద్యనభ్యసించారు. రాత్రిపూట రంగస్థలంపై విద్యుద్దీపాలు లేదా పెట్రోమాక్స్ దీపాలవెలుగుల్లో చక్కటి ఆహార్యం, మైక్ సదుపాయాలతో పద్యాలు పాడి మెప్పించే నాటకరంగా నికి ధీటుగా పగటిపూట వేషధారణతో ప్రజల్ని ఆకట్టుకోవడమన్నది సాధారణ విషయం కాదు.

లద్దగిరికి నాలుగైదు కిలోమీటర్ల దూరంలో యర్రగుడి గ్రామంలో ఉంటున్న బింగివాళ్ళు 10, 15 సం.లకు పూర్వం కళాకారులుగా జిల్లా ప్రజల అభిమానాన్ని చూరగొన్నవారు. ఏడాదికొకసారి లేదా మూడేండ్ల కొకసారి ఆయా గ్రామాల్లో వారి కళారీతులను ప్రదర్శించి సముచితరీతి పారితోషికాలు అందుకొనేవారు. కళాకారులుగా ఎంత వైభవంగా జీవించారో తెలియాలంటే స్వగ్రామంలో నివాసముంటున్న ఇంటిని, వేషధారణలో వాళ్ళు అలంకరించుకొనే వెండిపతకాలు, వెండిబెల్టు, బంగారు బొడ్డుగంట వంటి ఆభరణాలు చూస్తే చాలు. వేషానికి అనుగుణంగా శ్లోకాలను, పద్యాలను వాళ్ళు వల్లిస్తుంటే నిరక్షరాస్యులకే కాదు. అక్షరాస్యులకు సైతం ఆశ్చర్యం వేస్తుంది.

బింగిబాలయ్య కుమారుడిని కూడా అభిమానులు కర్నూలు జిల్లాను తమ కళాసామ్రాజ్యంగా ఏలిన కీ.శే బింగిబాలయ్యగానే భావిస్తారు. ఒకరకంగా ఆయన్ను చిన్న బింగిబాలయ్య అనొచ్చు. పక్షవాతానికి గురై ఇప్పుడిప్పుడే కోలుకుంటున్న బింగిబాలయ్యను 'జిల్లా దర్శిని' కలిసిన పుడు ఎన్నో ఆసక్తికరమైన విషయాలు తెలిసాయి. కర్నూలు జిల్లాలో కొన్ని గ్రామాలను వారి తండ్రిగారున్నప్పుడే వాళ్ళ బంధు వులకిచ్చాడట. ఇదేంటీ! గ్రామాలను ఇచ్చేయడానికి ఆయనేం రాజా? జాగీర్దారా? అని పతితులకు అనుమానం కలగవచ్చు. దానికి జవాబు జిల్లావాళ్ళ 'కళాసామ్రాజ్యం'. ఆ ప్రాంతాల్లో మరెవరైనా వేషాలు వేసి కళను ప్రదర్శిం చడానికి వీలులేదు. యర్రగుడి బింగివాళ్ళతో కలిసి వేషాలుకట్టాలి లేదా వారి అనుమతి తీసుకొని వేషాలు వేయాలి. అది ఆనవాయి తీగా వస్తున్న బింగివాళ్ళ హక్కు. ఆ హక్కును వదులుకోలేక, కళపై మక్కువ చావక, ఊళ్ళో అంతో ఇంతో పొలం ఉన్నా సేద్యం జోలికి పోక, తండ్రి బంధువులకిచ్చిన గ్రామాలు గాక, మిగిలిన ఊళ్ళల్లో నలుగురు తమ్ముళ్ళతో వేషాలు ప్రదర్శించి శభాష్ అనిపించుకున్నాడు బాలయ్య.

దాదాపు 32 వేషాలు ప్రదర్శించిన తర్వాత ప్రజల సంభావన కోసం ఊరంతా తిరిగేవాళ్ళు. జిల్లా ప్రముఖులలో ముఖ్యులైన కోట్ల వాళ్ళు వెయ్యిరూపాయల దాకా పారితోషికం ఇచ్చేవారని; మరో ప్రముఖ కుటుంబం కేయీ వాళ్ళు అవుదూడల్ని కళాభిమానంతో ఇనాముగా ఇచ్చేవారని; అమడగుంట్ల వాసారెడ్డిగారు తులమున్నర బొడ్డుగంట ఆకాలంలోనే చేయించాడని; అలాగే వదాన్యులు వెండి, బంగారు మొదలు ధనధాన్యము వారి శక్త్యానుసారం సంభావనలిచ్చే వారని చెప్పారు.

శక్తికి తగిన పారితోషికం ఇవ్వకపోతే, ఇచ్చేదాకా వదలని మొండిపట్టు వాళ్ళది. అలా బింగిపట్టు పడతారు గనుక వాళ్ళని 'బింగోళ్ళు' అని పిలుస్తారు ప్రతి పల్లెలో. వాస్తవానికి వాళ్ళది జంగం కులం. వాళ్ళు ప్రదర్శించే వేషాలు పోలీసువేషం – బైరాగివేషం (శుకరంభకైవల్యం) బాలింత వేషం – నారదగర్వభంగం (కృష్ణునివేషం) – చాకలి వేషం (చుక్కలూరిరామనాటకం). భీమాంజనేయ యుద్ధం (సౌగంధికా పహరణం). రామలక్ష్మణుల వేషం (జంబుమాలికావృత్తాంతం / పంచ వటి). అర్ధనారీశ్వర వేషం – వడ్డె వేషం (సగర పురాణం) బుడబుడకల వాండ్లవేషం– పఠాన్ వేషం (నవాబువేషం). మందులవేషం – సాతాని వేషం (నంబివేషం) బోడిబాపనమ్మ – భోగంవేషం.

వేషాలన్నీ మగవాళ్ళే తప్ప ఆడవాళ్ళు వేయరు. మగవాళ్ళు ఆడవాళ్ళలా జుట్టు పెంచుతారు. జులపాలైనా ఉంచుకుంటారు.

**అక్షీణ బాహువిక్రమ !**
**వీక్షించితి నొక్కపండు వృక్షాగ్రమునన్**
**చక్షులకు తోచుచుండె**
**భక్షించెద తెచ్చియిమ్ము పాండుతనూజా !**
**(భీమాంజనేయ యుద్ధం – హనుమంతుడు)**

**గొరవయ్యలు :**

వీర శైవాన్ని ప్రచారం చేయడానికి అనేక కళారూపాలు వచ్చాయి. అణిచివేత నుండి బయటపడటానికి అనేక కులాలు వీరశైవాన్ని అవలం బించాయి. కులపురాణం ప్రకారం కురవగొల్లలు గురువులుగా భావించే గొరవయ్యలు అలా శైవాన్ని తీసుకున్నవారు కావచ్చు. జంగమ దేవర ల్లాగే వీరుకూడా గతంలో సంచార జాతులు. ప్రతిసంవత్సరం దసరాకు ఆలూరు తాలూకా 'నెరనికి' గ్రామంలో మల్లయ్య, మల్లేశ్వరుడిని కొలుస్తారు. తమ పిల్లలకు గొరవయ్యగా దీక్ష ఇప్పిస్తారు. దీక్షలిచ్చే గురువులు పూజారులే. దీక్షాదానం పొందినవారికే నృత్యం నేర్పుతారు. లింగముద్ర వేస్తారు. కాబట్టి దీనిని ముద్రాదానం అనికూడా అంటారు.

గొరవయ్యల వేషం కూడా 'జంగమదేవర'లను పోలి ఉంటుంది. తలపై ఎలుగుబంటి చర్మంతో చేసిన కిరీటం. కిరీటంపై శివలింగం, త్రిశూలం చంద్రుడు వగైరా చిత్రించి ఉంటాయి. మెడలో రకరకాల పూసల పేర్లుంటాయి. నడుముకు కట్టు, జింకచర్మం సంచి ఉంటాయి. నల్లగొంగళిని ధరిస్తారు. భుజాలపై రంగురంగుల కండువాలు వేసి వీటిని నడుం కట్టులో బిగిస్తారు. అడ్డనామాలు చేతులకు రుద్రాక్షలు ఉంటాయి. ఒక చేతిలో త్రిశూలం మరో చేతిలో ఢమరుకంనోట్లో పిల్లన గ్రోవి, కాళ్ళకు గజ్జెలతో వేషం పూర్తవుతుంది. నృత్యం ప్రారంభంలోనో, ముగింపులోనో పాటలు పాడతారు. పాటలకు ఢమరుకాన్ని వాయిస్తారు.

ఎగురుతూ దుముకుతూ తీవ్రగతిలో అడుగులు వేస్తారు. చివరికి కుక్కల్లా ఒకరిపై ఒకరు అరుచుకుంటారు. అరుపుల్లో పోటీపడతారు.

అది చూసే ప్రేక్షకులకు ఒళ్ళు గగుర్పొడుస్తుంది. ఈ కళారూపానికి కర్నూలు జిల్లా కళారూపంగా గుర్తింపు ఉంది. పత్తికొండ ఆదోని ఆలూరు ప్రాంతంలో ఉన్న ఈ కళాకారుల్ని జ్ఞానపీఠపురస్కార గ్రహీత నాటి ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక మేళాకు ఆహ్వానించి సత్కరించడం విశేషం. గొరవయ్యలకు శ్రీశైలంలో విశేషప్రాధాన్యత లభిస్తుంది.

## బీరప్పడోలు

ఈ కళారూపం కూడా గొరవయ్యల వలె శైవమత ప్రచారంలో భాగంగానే వచ్చిందని చెప్పవచ్చు. బీరప్పడోలు ఒక పెద్ద ఢక్క ఆకారంలో ఉంటుంది. దాన్ని ఒక వ్యక్తి వాయిస్తూ ఒక వ్యక్తి పిల్లనగ్రోవి ఊదుతుంటే, మరొక వ్యక్తి తాళం వేస్తుంటే ప్రధాన కళాకారుడైన పురుషుడు ఆడవేషం వేసి చక్కగా జడ అల్లుకొని కాళ్ళకు గజ్జెలు గట్టి డోలు వాయిస్తూ నృత్యం చేస్తూ మొగ్గవాలుతాడు. ఈ కళారూపం ఎక్కువగా దళిత కులాలకు చెందినవాళ్ళే ప్రదర్శిస్తుంటారు. భాషా పరిజ్ఞానంతో పాత్రోచితంగా పద్యాలు, పాటలు పాడుతారు. డోను - పత్తికొండ ప్రాంతాల్లో ఈ కళాకారులు నివసిస్తున్నారు.

## నందికోలు సేవ

ఈ కళారూపం ఖచ్చితంగా శైవమతసాంప్రదాయానికి చెందినది. 'కోల' అంటే కర్ర. నంది బొమ్మలు చివరన ఉండే రెండు కర్రలు ముఖ్యంగా వెదురుబొంగులు భుజంపై పెట్టుకోవడానికి కర్రలకు మధ్య పిడి చేయించి ఉంటారు. మరో అర్థంలో ఈశ్వరుని భృత్యుడు 'నంది' కొలువడాన్ని నందికోలు సేవ కావచ్చని కూడా చెబుతారు. ఏమైనా పార్వతీ పరమేశ్వరుల సంకేతంగా భక్తులు చేరి ఒక నందికోలని భుజాన ఎత్తుకొని పార్వతీ పరమేశ్వరులను స్తుతిస్తూ 'అశ్వరభ, శరభ' అంటూ ఖడ్గాలను చదువుతూ తదనుగుణంగా అడుగులు వేస్తూ భావావేశంతో భక్తిపారవశ్యంతో ఊగిపోతుంటారు. ఆ ఆవేశంతోనే దవడకు గాని నాలుకకు గాని సూదిని గ్రుచ్చు కుంటారు. ఈ కళారూపాన్ని శివరాత్రి వంటి పండుగల సందర్భంగా ; శైవుల పెళ్ళిళ్ళ సందర్భంగా; తిరుణాళ్ళ సందర్భంగా శివాలయాల వద్దగాని, అమ్మవారి గుడి ముందుగాని జంగం వాళ్ళు లేదా శైవ సాంప్రదాయానికి చెందిన తొగట వీర క్షత్రియులు, పద్మసాలేవాళ్ళు గాని ప్రదర్శిస్తుంటారు. కర్నూలు, ఎమ్మిగనూరు, కోడుమూరు, పోలకల్, గూడురు నందవరం ప్రాంతాల్లో ఈ కళారూపాన్ని ప్రదర్శించేవాళ్ళున్నారు.

## కోలాటాలు

కోల అంటే కర్ర. చిన్న కర్రముక్కలను చక్కగా చెక్కి వాటికి రంగులు కూడా వేసి రెండుచేతులా రెండు కర్రలు పట్టుకొని కొంత మంది కళాకారులు (సంఖ్యకు పరిమితం లేదుకాని) ఒకరికొకరు కర్రలతో తాళం వేస్తూ ఆడుతూపాడుతూ కర్రలతోరకరకాల విన్యాసాలు ప్రదర్శిస్తారు. కొన్నిసార్లు ఈ కర్రలకు తాళ్ళుకట్టి ఆ తాళ్ళ కొసలన్నీ ఎత్తు ఒక కొమ్మకు కట్టివేసి కర్రలతో ఆడుతూ పాడుతూ ఆ తాళ్ళన్నీ పేనుకొనేలా - ఒక జడలా అల్లుకొనేలా ; చేయడం అప్రదక్షిణంగా తిరుగుతూ ఆ ముడిని విప్పేలా కోలాటాలు సాగించడాన్ని జడకోలాటం అంటారు. ఇందులో స్త్రీలు, పురుషులు జట్లుగా పాల్గొంటే అందుకను గుణమైన వస్త్రధారణ ఉంటుంది. ఈ కోలాటం ప్రదర్శనలో కనీస సంఖ్య ఇద్దరైతే గరిష్టసంఖ్యఅవసరాన్ని అందుబాటును బట్టి పెంచుతూ పోవచ్చు. కోలాటాలలో దేవుని ఊరేగింపు ముందు సాంప్రదాయ గీతాలనుండి అధునాతన సినిమా పాటలవరకూ పాడుతున్నారు. ముఖ్యంగా పల్లెటూళ్ళలో భజన పాటలు పాడడం, అందుకనుగుణంగా చిందులువేయడం; పండుగలు పబ్బాల్లో సరదాగా పాటలు పాడుతూ ఈ కోలాటాలు వేస్తారు. పాఠశాలలో బాలబాలికలకు ఈ కోలాటాలు నేర్పి పాఠశాల వార్షికోత్సవాలలో ప్రదర్శిస్తారు. ఈ కోలాట విన్యాసాలు కన్నులకు విందుగా ఉంటాయి. జిల్లా అంతటా పల్లెల్లో ఈ కళారూపం పండుగలతో జాతరలప్పుడు చూడవచ్చు. ఈ కోలాటాలను నేర్పడానికి దర్శకత్వానికి ఒక సూత్రధారి లేదా ప్రయోక్తవంటి ప్రధాన కళాకారుడుంటాడు. హార్మోనియం ప్రక్క వాయిద్యంగా ఉంటుంది.

## చెక్కభజన

కోలాటాల్లో కర్రలు చేతుల్లో ఉంటే చెక్కభజనల్లో ఒకే కొలతలో ఉన్న (సందుల్లో రెండు గుండ్రటి రేకులమర్చిన) చెక్కలుంటాయి. వాటిని లయబద్ధంగా కలిపి శబ్దం చేస్తూ 10-20 మంది కళాకారులతో కూడిన బృందాలు భక్తిరసప్రధానమైన పాటలు పాడుతాయి. ప్రధాన గాయకుడు, ఆయన పాటకు డోలు లేదా డప్పు వాయిస్తూ కళాకారులుంటారు. ఇప్పుడు భక్తిపాటలే కాదు ప్రభుత్వ కార్యక్రమాల ప్రచార గీతాలు కూడా చెక్కభజనల్లో చోటుచేసు కుంటున్నాయి. చేతుల్లోని చెక్కలతో లయానుగుణ శబ్దం చేస్తూ, చక్కగా ఆడుతూ పాడుతూ చేసే ఈ ప్రదర్శనలో కులకడం కూడా ఉంటుంది. దీన్ని 'కులుకు భజన' అంటారు. ఇది చూపరులకు ఆశ్చర్యాన్ని గొలుపుతుంది. ఆ కళపై దృష్టి సారిస్తే మనకు మధురానుభూతి కలుగుతుంది. ఇది మొదట్లో భక్తిరస ప్రధానంగానే మొదలైనా ఇప్పుడు అన్ని సందర్భాలలో సంబరాలలో ఈ ప్రదర్శనలు చూడవచ్చు.

## లంబాడి నృత్యం

కర్నూలు జిల్లా ఆళ్ళగడ్డ, నంద్యాల, ఆత్మకూరు తాలూకాల్లోని అడవి ప్రాంతాలతో పాటు పత్తికొండ తాలూకాల్లోని తాండాలలోను సుగాలీలు లేదా లంబాడీ అనే గిరిజనులు ఉన్నారు. వీరుచేసే లంబాడీనృత్యం వారి జీవన సరళిలో ఒక భాగం. పండుగలప్పుడు

ముఖ్యంగా హోలీపండగ సందర్భంగా గ్రామగ్రామాలలో సంచరిస్తూ లంబాడి నృత్యం చేస్తూ వీరు భత్యం సేకరిస్తుంటారు. జానపద నృత్యం పోటీలు అనగానే 'అరె హోర హోర' అని పాడుతూ బంజారా నృత్యాలు చేస్తుంటారు. అయితే ఈ నృత్యాలు ఇటీవల ప్రభుత్వపథకమైన పొదుపు కళాజాతల్లో కూడా ప్రవేశపెట్టడం జరిగింది. చేతులతో అభినయంచూపుతూ, కూర్చుంటూ లేస్తూ, బృందమంత ఒకేసారి ఆ విన్యాసాలను గుంపుగా చేస్తుంటే కనువిందుగా ఉంటుంది. నృత్యం కంటే వాళ్ళ దుస్తులు ఎంతో ఆకర్షణీయంగా ఉంటాయి. పత్తికొండ ప్రాంతానికి చెందిన శంకరమ్మ బృందం ఆనాటి ముఖ్యమంత్రిగారి చేత సన్మానమందడం మన జిల్లాకు గర్వకారణం.

## చెంచునృత్యం

సుగాలీలు వలె చెంచులు కూడా గిరిజనులు సుగాలీలు వ్యవసాయక వృత్తిలో స్థిరపడగా చెంచులు ఇప్పటికీ అటవీసంపదపై (తేనె, కలప, వెదురు వేట) ఆధారపడి జీవిస్తున్నారు. వీరు పండుగలు పబ్బాలకు, పెళ్ళిళ్ళలో జాతరల్లో చిందులు వేస్తుంటారు. వీరి నృత్యాలనే రేలారే అంటూ నగర వాసుల నాట్యపోటీల్లో ప్రవేశపెడుతున్నారు. పక్షి ఈకలతో కిరీటాల వంటివి అలంకరించుకొని గుంపుగా చిందులు వేయడమే చెంచునృత్యం.

## తప్పెట విందు

తప్పెట వాయిస్తూ చిందులు వేయడాన్ని 'తప్పెట చిందు' లేదా 'తప్పెట విందు' అంటారు.తప్పెట విందు అనే పదాన్ని సార్థకం చేస్తూ తప్పెటతో ఎన్నో లయవిన్యాసాలు చేస్తారు. ఊరేగింపులు, దేవర్లు జరిగేటప్పుడు వీటి ప్రాధాన్యత విస్మరింపరానిది. లయగతులతో రసజ్ఞుల హృదయాలను ఉర్రూతలూగించడానికి ఉత్సవవేళలో వాయించడం తప్పెటవిందులోని విశేషం. పిడుగుల వర్షం కురిసినట్లు పులి అడుగులు వేసినట్లు ; ధాన్యం జలజల రాలినట్లు ఎన్నోవిధాలుగా తప్పెట వాయించడం ఈ కళారూపం యొక్క ప్రత్యేకత - జిల్లాలో పోలకల్లు గూడూరు ప్రాంతాల్లో తప్పెట విందు అందించేమేటి కళాకారులు మనకు కనిపిస్తారు. గ్రామీణులకు ఇది రుచించినట్లుగా, మరే వాయిద్యాలు రుచించవు.

## బుర్రకథలు

తరతరాల సంస్కృతికి వారధిగా జానపదులభావాలకు వాహికగా ప్రత్యేకతను సంతరించుకున్న జానపద కళారూపం బుర్రకథ. ఒక శృంగార భావం - ఒక ఆధ్యాత్మిక చింతన, ఒక బాధ - ఒక విషాద సంఘటన జానపదగేయంగా రూపెత్తితే ఒక వీరగాథ ఒక దైన్యజీవితం - ఒక సామాజిక ఉద్యమం - ఒక దేవుని మహత్యం గేయరూపంగా, వచనంతో జతగా కొన్ని గంటలపాటు పాడుకొనే జానపదగేయ గాథ బుర్రకథ. తంబుర తీగలు మీటుతూ ప్రధాన కథకుడు కథాగానం చేస్తుంటే ఆ విశేషాలు జనం అర్థంచేసుకోవడానికి మధ్యమధ్య కథకుని సందేహాలు అడుగుతూ విషయాన్ని వివరించ డానికి హాస్యసృష్టికి ప్రయత్నాలు చేసే ఇద్దరు వంతలుంటారు. వీరిలో ఒకతను హాస్యపాత్ర వహిస్తాడు. అయితే ఇద్దరు వంతలు గుమ్మెట అనే వాయిద్యంపై పాటగాడికి లయసహకారం చేస్తారు. ఈ కథలు మొదట్లో భక్తిగాథలు, దేవుళ్ళ లీలలు కథలుగా చెప్పగా తరువాత వీరగాథలు ప్రచారం చేయడానికి తోడ్పడ్డాయి. మన జిల్లా తొలి తిరుగుబాటుదారుడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి పైన మహాదాత బుడ్డా వెంగళరెడ్డిపైన (రెడ్డీ బుడ్డ వెంగళరెడ్డి నీవేరా బంగారపు కడ్డీ) దైవందిన్న సంస్థానం వాళ్ళపైన, ఆదోని ప్రాంతానికి చెందిన ఆరె మరాఠీలపైన కథలు చెప్పడం జరిగింది. దీనివలన ఎన్నో ఏళ్ళ క్రింద జరిగిన సంఘటనలు మహనీయుల త్యాగాలు ప్రజలకందచేయడానికి వీలైనది. మన జిల్లాలో వామపక్ష ఉద్యమాలు ఈ బుర్రకథలను విజయ వంతంగా రాజకీయ ప్రచారానికి ఉపయోగించుకున్నవి. ఇలాంటి ప్రభుత్వపథకాలు ఆకాశ వాణిలో ప్రచారం చేసే కథకులుగా నాగరాజు దళం - వేలుగోడు శాస్త్రి; రాజకీయ బుర్రకథలను నేర్పించడంలో బొల్లారం సుంకులు దిట్ట.వారి సంస్థలో నేర్చుకున్న 9 సం.ల బాలికలు శకుంతల - శాంత-యశోదలు కథ చెబితే తరిమెల చంద్ర నీలం వంటి మేధావులు మెచ్చుకున్నారు.200 ప్రదర్శనలు ఇచ్చారు. ఇప్పుడు ఆనాటి అమ్మాయిలు 50 ఏళ్ళ మహిళలు.

బుర్రకథలు చక్కగా పాడటంలో నందికొట్కూరు తాలూకాకు చెందిన కీర్తిశేషులు తాటికొండ జమ్మన్న కర్నూలు నగరం బుధవార పేటకు చెందిన కీ.శే. దూపం భవానయ్య చెప్పుకోదగినవారు. భవానయ్య దైవం దిన్నె సంస్థానానికి చెందిన కథారచన కూడా చేసినట్లు చెబుతారు. అలాగే ప్రభుత్వ కుటుంబనియంత్రణ కథలు చెప్పడానికి ఎంపికైన దీపక్ వేణు, దూపం ప్రసాద్‌లతోపాటు ప్రస్తుతం కర్నూలు ఆకాశవాణిలో కథలు చెబుతున్న బజారన్న; ప్రభుత్వ పథకాలు ఆకాశవాణిలో ప్రచారం చేసే కథకులుగా నాగరాజు దళం ప్రభృతులు ఈ కళారూపాన్ని ప్రజారంజకం చేశారు. చేస్తున్నారు. ఇంకా వ్యాసకర్తదృష్టికి రానివాళ్ళు ఎందరో ఉండవచ్చు.

## హరికథలు

విజయనగర సంగీత కళాశాల అధ్యక్షులు హరికథా పితా మహులు శ్రీ మదజ్జాదాది భట్ల నారాయణదాసు గారు ఆంధ్రదేశమున హరికథా కళా ప్రక్రియకు ఆద్యులు. సర్వకళల సమాహారం హరికథ.

పురాణపఠనానికి సంగీత పరిజ్ఞానం మేళవిస్తే హరికథ అవుతుంది అనవచ్చు. రామాయణంలో పిడకలవేటలా అంటూ కొన్ని సందర్భాలను తృణీకరిస్తుంటాం అయితే హరికథలో పిట్టకథలు లేకపోతే రక్తి ఉండదు. కథకుడు – ఒక కవి, ఒక ఉపన్యాసకుడు, ఒక గాయకుడు, ఒక నటుడు,ఒక నృత్యకారుడు, ఇలాంటి హరికథలుచక్కగా చెప్పడంలో నందికొట్కూరు తాలూకా నెహ్రూనగర్ వాస్తవ్యులు కీ.శే. హరిదాసు వై. నాగభూషణంగారు పేరుగాంచారు. వారెందరికో ఈ విద్యనేర్పారు. కొందరు శిష్యులు ఆకాశవాణి కథకులుగా రాణిస్తున్నారు. కీ.శే. కంచు కంఠం శివరామకృష్ణ, గురుమూర్తి కీ.శే. ఆంజనేయులుగారు, ఎంతో కీర్తిపొందారు. ప్రస్తుతం టి.గణేష్ భాగవతార్ శ్రీమతి సరస్వతమ్మ, శ్రీమతి మంజుల వంటి వర్ధమాను లెందరో ఈ ప్రక్రియను జనబాహుళ్యం లోనికి తీసుకు పోతున్నారు. హరికథల్లో – సీతాకల్యాణం – శ్రీరామజననం (రామాయణం) ఉత్తరగోగ్రహణం – సుభద్రా పరిణయం (భారతం) రుక్మిణీ కళ్యాణం (భాగవతం) భక్తమయూరధ్వజ – చంద్రహాస (జైమినీ భారతం) కృష్ణగారడి వంటి కల్పనా కథలతోపాటు చారిత్రక, జాతీయ సేవాకార్యక్రమాలకు సంబంధించిన కథలెన్నో ఉన్నాయి.

## తోలు బొమ్మలాట

ఇది మన జిల్లాకు మాత్రమే చెందిన కళా రూపం కానప్పటికీ జిల్లా ప్రజలకు ఎంతో ఇష్టమైన కళారూపం.జిల్లాలో ఎన్నో కుటుంబాల వారు తోలుబొమ్మలాడించి ప్రజలకు వినోదాన్ని అందించి జీవించారు. ఇది చాలా ప్రాచీనకళ అని అనవచ్చు. నాటకానికి ప్రాథమిక రూపం అనికూడా చెప్పవచ్చు. రామాయణ భారత భాగవతాలలోని పాత్రలను తోలుబొమ్మలుగా తయారుచేసి, పలుచటి వస్త్రాన్ని తెరగా జేసి, తెరవెనుక నుండి బొమ్మలను ఆడిస్తూ తెరవెనుక దీపాన్ని పెట్టడం ద్వారా చీకట్లో బొమ్మలను కాంతివంతంగా చూపడం ద్వారా అద్భుత దృశ్యాలను ఆవిష్కరింపచేస్తారు. సినిమాలో ప్రొజెక్టర్‌తో తెరపై ప్రతిబింబింపచేసే పద్ధతికి ఇది మార్గదర్శకమైనదా అని అనిపిస్తుంది మనకు. ఈ బొమ్మలాటలో సూత్రధారి, బంగారక్క, కేతిగాడు, జుట్టు పోలిగాడు, పాత్రలు ప్రాణం అని చెప్పవచ్చు. ఈ పాత్రల ప్రభావం జనజీవనంలో ఎంతగా ఉందంటే ఎవడైనా అడ్డదిడ్డంగా మాట్లాడితే ఎవడ్రా ఈ కేతిగాడు? అని మనం ఈసడిస్తాము. రామాయణంలోని సీత పాతివ్రత్యం, రావణుని దుర్మార్గం – రామలక్ష్మణుల అనుబంధం హృదయాలకు హత్తుకు పోయేలా నవరసాలను ప్రదర్శించడం తోలు బొమ్మలాట ప్రత్యేకత. అందుకే పాశ్చాత్య దేశాలలో కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నమైపోతుంటే నిన్న మొన్నటిదాకా ఉమ్మడి కుటుంబవ్యవస్థ అవిచ్ఛిన్నంగా సాగడానికి ఈ కళారూపాలు అందించిన విలువలే కారణమన్నా ఆశ్చర్యం లేదు. తోలుబొమ్మలకు ఆదరణ తగ్గిపోవడంతో కళాకారులు నాటకరంగం వైపు సాగినారు.దాదాపు 300 కుటుంబాలు ప్రస్తుతం కోడుమూరు మండల కేంద్రంలో స్థిరనివాసమేర్పరచుకొని ప్లాస్టిక్ బిందెలు, తిరునాళ్లో ప్లాస్టిక్ బొమ్మలు అమ్ముకుంటూ జీవనం సాగిస్తున్నారు.

## ఉరుములవాళ్ళు - కొమ్ములవాళ్ళు

దేవర్లు జరిగేటప్పుడు భక్త్యావేశంతో జంతువుల బలులు చేసే సందర్భంలో వీరి వాయిద్యాలు తప్పట్లు, కొమ్ము వాయిద్యాలు మానసికోద్రేకాన్ని రేకెత్తిస్తాయి.

## తాశమేళుపులు

పీర్లపండుగ ; ముస్లిం పండుగల సందర్భంగా ఉరుసులు జరిగే సందర్భంగా ఈ వాయిద్యాలు వాయిస్తూ ఉంటారు.

## జాటిజాం

ఈ కళారూపంలో మహిళలు ప్రధాన పాత్ర వహిస్తారు. చప్పట్లు చరచుతూ అడుగులువేస్తూ నృత్యం చేస్తారు.

## జోనికావాళ్ళు (జోగోళ్ళు)

బుడబుడకలవాళ్ళు – కాటిపాపలు – బాలసంతులు సుంకులమ్మ వాళ్ళు విప్రవినోదులు వారిదైన శైలిలో ప్రజలకు వినోదాన్ని అందిస్తుండే వారు. క్రమంగా కనుమరుగౌతుండడం ఒక విషాదం.

(ఈ వ్యాసరచనకు దోహదమైన జనగానం పత్రికకు మరియు రాకెట్లవీరన్నగారికి కృతజ్ఞతలు)

శ్రీ టి. వెంకట్రావు

# కృష్ణా తీరంలో చిత్రకళ, శిల్పకళల పరిణామం

"ఎవరి ఇంట్లో వీణ, కుంచెలూ, గ్రంథాలూ వుంటాయో వారు నాగరీకులు" అన్నాడు వాత్స్యాయనుడు.

విద్య, విజ్ఞానం, క్రీడలూ, కళలూ యివన్నీ వున్న సమాజం నాగరికతతో వర్ధిల్లుతున్నట్లు భావిస్తాం. నాగరికతలు నదీ తీరాల లోనే వర్ధిల్లుతాయి. కృష్ణానదీ తీరం కూడా అట్లాంటిదే. కృష్ణానది యొక్క ముఖ్యమయిన ప్రాంతంలో కృష్ణాజిల్లా, గుంటూరు జిల్లా వున్నాయి. ఈ ప్రాంతాన్ని బ్రిటిష్‌వారు కృష్ణామండలం అనేవారు. కృష్ణానదికి ఉత్తరాన కృష్ణాజిల్లా, దక్షిణాన గుంటూరుజిల్లా వున్నాయి.

సుమారు రెండువేల సంవత్సరాల క్రితం ఈ ప్రాంతం శాతవాహన రాజ్యంలో కీలక మయిన ప్రాంతం. వాళ్ళ రాజధాని (ధాన్యకటకం) ఈ ప్రాంతంలోనేవుంది. వాళ్లు విదేశాలతో వ్యాపా రాలు చేసే రేవులు మచిలీపట్నం, మోటుపల్లి ఈ ప్రాంతంలోనే వున్నాయి. ఈ ప్రాంతం బౌద్ధమతానికి కీలకమైంది కూడాను. అమరావతి, జగ్గయ్యపేట, ఘంటసాల, భట్టిప్రోలు, నాగార్జునకొండ మొదలయినచోట్ల బౌద్ధ స్తూపాలతోను, బౌద్ధ ఆరామాలతోను విలసిల్లాయి. బంగాళాఖాతం నుండి (మచిలీపట్నంనుండి) నాగార్జు నకొండ (శ్రీ పర్వతం) వరకూ కృష్ణానదిలో నౌకా యానంకూడా జరుగుతు ఉండేది. తొలుత ధాన్య కటకంలోను తరువాత విజయ పురిలోనూ విశ్వవిద్యాలయాలు కూడా నిర్వహించబడ్డాయి. ఇక్కడ చదువు కోవడానికి సింహళంనుండీ, తామ్రపర్ణినుండీ, కాశ్మీరం నుండీకూడా విద్యార్థులు, బౌద్ధ సన్యాసులూ వచ్చేవారు. మచిలీ పట్నం (మసోలియా), మోటుపల్లి రేవుల నుండి, రోము,అలెగ్జాండ్రియాలకు,మలయా,చీనాలకుసరుకుల ఎగుమతులు, దిగు మతులు జరుగుతూ విదేశీ వర్తకం విస్తారంగా జరిగింది.

ఆకాలానికి చెందిన చాలాశిల్పసంపద మనకీ ప్రాంతంలో లభించింది. అమరావతి, నాగార్జున కొండ, ఘంటసాల స్తూపాల వద్ద బౌద్ధ శిల్పాలు విస్తారంగా దొరికాయి.ఎన్ని శిల్పాలు దొరికా యంటే-ఇక్కడ లభించిన శిల్పాలు కొన్ని లండన్ మ్యూజియంలోను,మరికొన్ని పారిస్ మ్యూజియం లోను, మరికొన్ని కలకత్తా మ్యూజియంలోను, ఇంకొన్ని మద్రాసు మ్యూజియంలోనూ వున్నాయి. మిగిలినవి నాగార్జునకొండ మ్యూజియం లోను, అమరావతి మ్యూజియంలోనూ వున్నాయి. ఆ శిల్పాలలో బుద్ధుని ప్రతి మలు, బుద్ధుని జీవిత ఘట్టాలు జాతక కథలు, ఆనాటి ప్రజల జీవిత దృశ్యాలూ చిత్రించబడ్డాయి. చిత్ర కళకు సంబంధించిన అంశాలు ప్రత్యక్షంగా లభించలేదుగానీ అది కూడా వాడుకలో వున్నట్లే భావించాలి. ఈ చిత్రకళ, శిల్పకళ రెండూ కలిసేవుం టాయి. రాతిమీద ముందుగా చిత్రకారుడు చిత్రంగీస్తాడు, దానిని శిల్పకారుడు చెక్కుతాడు అని బౌద్ధగ్రంథాలు వివరిస్తు న్నాయి. గనుక చిత్రకళకూడా వాడుకలో వున్నట్లే. రాతి పలకలమీద గీసిన చిత్రాలుకూడా మనకు లభించాయి. అమరావతిలోనూ, నాగార్జున కొండలోనూ లభించిన శిల్పాలలో శిల్పులు చెక్కక ముందు దశలో ఉన్న శిలలు కొన్ని లభించాయి.

ఆనాటి మనవాళ్ల శిల్పకళ చాలా వున్నత స్థాయిలో వుందని చెప్పవచ్చు. మానవ రూపాలు, భంగిమలూ, అలంకరణలు చాలా నైపుణ్యంగా చెక్కబడ్డాయి. అవి రాతిమీద చెక్కబడిన ఉబ్బెత్తు (రిలీఫ్)శిల్పాలు. స్థూపంగోడలకు అమర్చబడ్డాయి. అవిగాక బుద్ధుని రూపాలు నలువైపులా చెక్కబడ్డాయి. కూర్చుని వున్న బుద్ధుని రూపం మొట్టమొదటచెక్కబడినది అమరావతిలోనేఅంటారు. దాని నకలులే తరువాత కాలంలో టిబెట్ వరకూ వాడుకలోకి వచ్చాయి.

బౌద్ధ సాహిత్యంలో ఆనాటి చిత్రకారుల, శిల్పుల, స్తపతుల పేర్లుకూడా లభిస్తున్నాయి. వారిఆర్థికపరిస్థితి బాగుందనీ, గౌరవంగా జీవించారనీ అర్థమవుతుంది. దానాలు చేసినందువలన వాళ్ల పేర్లు శాసనాలలోకి ఎక్కి వుంటాయి.

అమరావతిలో దొరికిన ఒక ప్రాకృత శాసనంలో ఈ వాక్యం వుంది. 'చందుడనే పాషాణికుని (రాతిపనివాని) మామ అమరావతీ స్తూపనిర్మాణ సమయంలో ఒక కట్టడ భాగాన్ని దానం చేశాడు'. రకరకాల రాళ్లలక్షణాలు పరిశీలించి వాటినిసేకరించి వాటిని శిల్పు లకు అందించేవాళ్లు పాషాణికులు.

క్రీ.శ. 3వ శతాబ్దానికిచెందిన ఒక ఇక్ష్వాకుల శాసనంలో అక్కడి (నాగార్జున కొండ) 'చైత్య, విహార, బోధివృక్ష, శిలా మండప, ఉపత్థాన శాలలను విధికుడనే శిలావర్ధకి (శిల్పి) కట్టాడ'ని చెప్ప బడింది.

నాగార్జునకొండ మహాచైతన్య నిర్మాణాన్ని ఆనందుడు పర్యవే క్షించాడనీ, అతనొక బౌద్ధ భిక్షువనీచెప్పబడింది. మరో శాసనంలో 'చంధముఖ, (చంద్రముఖ), ధమ్మనంది (ధర్మనంది), నాగ అనే థేరులు (శిల్పులు) నాగార్జునకొండ చైత్యం, విహారం, బోధిరుక్క చైత్యం, చెఱువుల నిర్మాణాలను పర్యవేక్షించారు' అని వున్నది.

క్రీ.శ.1వశతాబ్దికి చెందిన ఒకఅమరావతి శాసనంలో 'నాద భూతిఅనే అవేశిని(అనుభవజ్ఞుడయిన శిల్పి)కుమార్తె స్తూప నిర్మాణా నికి కావలసిన ఒక శిలాస్తంభాన్ని దానం చేసిందని రాయ బడింది. అమరావతి స్తూపనిర్మాణంలో పాల్గొన్న శిల్పుల పనులను పర్యవేక్షిం చిన అనుభవమున్న బౌద్ధ శిల్పి నాదభూతి.

జగ్గయ్యపేటలో లభించిన బ్రాహ్మీ శాసనంలో ఒకబౌద్ధశిల్పి కుటుంబంలోని మొత్తం పేర్లు ఉన్నాయి. ఇక్కడి మహాచైతన్యానికి పర్యవేక్షక శిల్పి సిద్ధార్థుడు ఐదు స్తంభాలను దానంచేశాడు. అతను మహాకందుకూర నివాసి. అతని తండ్రి నాగచంద్రుడుకూడా పర్య వేక్షక శిల్పిగా పనిచేశాడని చెబుతూ ఆ కుటుంబంలోని వ్యక్తుల పేర్లను కూడా రాశారు. సిద్ధార్థుని తల్లి నాగిల, భార్య సముద్రా, అతని సోదరుడు బుద్ధి,అతని వదిన కృష్ణ, సిద్ధార్థుని కొడుకుమూలశ్రీ, అతని కూతురునాగబుద్ధ, అతని సోదరునిపిల్లలు నాగశ్రీ, చంద్రశ్రీ, సిద్ధార్థ.

శాతవాహనుల ఇక్ష్వాకుల తరువాత విష్ణు కుండినులు, తూర్పు చాళుక్యుల కాలంలోకూడా గుహలు, దేవాలయాలలో శిల్ప కళ వర్ధిల్లింది ఈ ప్రాంతంలో. బెజవాడలోని ఇంద్రకీలాద్రి పర్వతం లోని అక్కన్న, మాదన్న గుహలు, మొగల్రాజపురం గుహలు, ఉండవల్లి గుహలు మొదలగు చోట్ల నటరాజమూర్తి, త్రిమూర్తుల విగ్రహాలు ఏకశిలా విగ్రహాలూ కనుపించాయి. ఇవి క్రీ.శ. 5, 6 శతాబ్దాల నాటివి. ఇంకా అనేకచోట్ల శివాలయాలూ, వైష్ణవా లయాలూ నిర్మించబడినాయిగానీ వాటిలో శిల్పచాతుర్యం అంతగా కనుపించదు.

## మధ్యయుగాలు :

ఆ తరువాత సుమారు 10వశతాబ్దంనుండి ముస్లింల దండ యాత్రలవలన రాజకీయ అస్థిరత్వం వలన దేవాలయ నిర్మాణాలూ, శిల్పకళా, చిత్రకళా మరుగున పడిపోయాయి.

మచిలీపట్నంలో కలంకారీ పరిశ్రమలో మన జానపద కళా రీతులు, అలంకరణ రీతులలో చిత్రకళ కినిపించింది. తెల్లని గుడ్డపై నాలుగైదు రంగులలోనే లతలు, పక్షులు, జంతువుల చిత్రాలు, పౌరాణిక చిత్రాలు అద్దకం చేయబడేవి. ఆ రంగులు కూడా కాయల నుండి, చెట్ల వేళ్ళ నుండీ, ఆకులనుండీ తయారు చేయబడినవే. ఈ కలంకారీఅద్దకపు వస్త్రాలు విరివిగా ప్రజామోదం పొందాయి. ముస్లిం పరిపాలకులు సైతం మెచ్చేవారు. విదేశాలకు కూడా ఎగుమతి అయ్యేవి. కలంకారీ అద్దకపు చిత్రాలు ఆ కాలంలో ప్రాముఖ్యతనూ ప్రత్యేకతనూ చాటాయి. మన ప్రాంతానికి కీర్తిని చేకూర్చాయి.

మచిలీపట్నం కేంద్రంగా మరో పరిశ్రమకూడా ఆ కాలంలో విస్తారంగావుండేది. అదే తోలుబొమ్మలాట.చర్మాలపైనరాముడూ, సీత, ఆంజనేయస్వామి, దశకంఠుడు వగైరా చిత్రాలను చిత్రకారులు జానపద రీతిలో చిత్రించేవారు. ఇతర ప్రాంతాలకుకూడా ఎగుమతి అయ్యేవి.

మధ్య యుగాలలో మరో చేతి పరిశ్రమ కూడా మన ప్రాంతంలో అభివృద్ధయింది. అదే.:కొండపల్లి బొమ్మల పరిశ్రమ.కొండపల్లి కొండల లోని అడవిలో లభించే మెత్తటి పుణికి చెట్ల కర్రలు బొమ్మలు చెక్కడానికి వీలుగా వుండేవి. బొమ్మలు చెక్క ప్రకృతిలో లభించే సహజ మయిన రంగులు పూసేవారు కుంచెలతో. ఇందులో శిల్పకళ, చిత్రకళ ఇమిడి వుంది. రైతులు, పంతుళ్ళు, భటులు, మహిళలు, ఏనుగులు, గుర్రాలు, తాటిచెట్లు, ఇళ్లు, దేవాల యాలు, పక్షులు వగైరాబొమ్మలు అందంగా రూపొందేవి. విదేశీ యులుకూడా ముచ్చటపడి వీటినికొనుక్కెళ్ళేవారు. బ్రిటిష్ అధికార్లు ముచ్చటగా ఇంగ్లాండ్‌కు తీసుకెళ్లేవారు. ఈ కొండపల్లి బొమ్మల పరిశ్రమ వ్యాపారం బ్రిటిష్ వాళ్ల పరిపాలన కాలంలో వర్ధిల్లింది. ఇదీ మధ్య యుగాలలో మన ప్రాంతంలో వర్ధిల్లిన కళలు.

## ఆధునిక యుగం :

20వ శతాబ్దారంభంలో భారతదేశంలో చిత్రకళకు పునరుజ్జీవనం జరిగింది. ఆ రోజులలో బెంగాలు విభజనకు వ్యతిరేకంగా ఐక్య బెంగాలు రాష్ట్రం కోసం వందేమాతరం ఉద్యమం ప్రారంభ మయింది. దేశంలో జాతీయ భావాలు పెల్లుబికాయి. విదేశీ వస్త్రా లను, విదేశ వస్తువులను,విదేశీ విద్యను, విదేశీ కళలను భారతీ యులు ద్వేషించడం మొదలు పెట్టారు. అంతా స్వదేశీ ఖాదీ దుస్తులూ, స్వదేశీభాష, స్వదేశీ కళలను అభిమానించడం మొదలైంది.

ఆరోజులలో మనమచిలీపట్నంలో ఆంధ్ర జాతీయ కళాశాల ప్రారం భించబడింది. డాక్టర్ పట్టాభి సీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు, కె.హనుమంతరావు లాంటి పెద్దల చొరవతో అది ప్రారంభమయింది. ఇంజనీరింగ్ శాఖలతో పాటు రెండేళ్ల పెయింటింగ్ కోర్సు కూడా ప్రారంభించబడింది. మొదటి సంవత్సరంలో డ్రాయింగు- పెయింటింగ్, రెండవ సంవత్సరంలో తూర్పు దేశాల చిత్రకళ అనే అంశాలు నేర్పబడ్డాయి.

చిత్రకళా శాఖను తొలుత చిత్రకారుడు ఈరంకి వెంకట శాస్త్రి నిర్వహించారు. తరువాత బెంగాలు చిత్రకారుడు ప్రమోద్ కుమార్ చటర్జీగారు, ఆ తరువాత రమణేంద్రనాధ చక్రవర్తిగారలు అధ్యాపకు

లుగా నియమించబడ్డారు. వారిద్దరూ నందలాల్ బోస్ గారి శిష్యులే. వారి శిష్యరికంలో వేలూరి రామమూర్తి, గుర్రం మల్లయ్య, అడవి బాపిరాజు, కౌతా రామమోహనశాస్త్రి, కౌతా ఆనంద శాస్త్రి, తేజో మూర్తుల కేశవరావు పింగళి వెంకయ్య, పొట్లూరి హనుమంతరావు, మాధవపెద్ది గోఖలే, ఎస్.వి.యస్. రామారావు, అంకాల వెంకట సుబ్బారావుగారలు ప్రఖ్యాత చిత్ర కారులయ్యారు. వీరంతా జాతీయ భావాలుకలవారు. వీరిలో కొందరు స్వదేశీ ఉద్యమంలో పాల్గొని జైళ్లకు కూడా వెళ్లినవారు ఉన్నారు.

సాధారణంగా ఆనాటి చిత్రకారులు మనదేశ పురాణ గాథ లను, చారిత్రాత్మక ఘటనలను, చారిత్రక పురుషులను, జాతీయ అంశాలను, ఆనాటి ప్రజల జీవితాలను చిత్రిస్తూండేవారు. నీటి రంగులతో వాష్ టెక్నిక్‌తో చిత్రించేవారు. అందరూ ఒకే వరవడిలో చిత్రించకుండా రకరకాల ప్రత్యేకతలను ప్రదర్శించేవారు. వారికి త్రివర్ణ పతాక రూపకల్పనలో సహకరించిన చిత్రకారుడు ఈరంకి వెంకటశాస్త్రి.

బందరు వాస్తవ్యులు పింగళి వెంకయ్యగారు గాంధీగారి సలహాపై 1921లో మన జాతీయ జండాకు రూపకల్పన చేశారన్న విషయం అందరికీ తెలిసినదే. ఆయన జాతీయవాది. స్వాతంత్ర్య సమరయోధుడు.

అడవి బాపిరాజుగారు చిత్రకారుడేగాక కవి, రచయిత, న్యాయవాది, సినిమాల ఆర్ట్ డైరెక్టరు కూడాను. ఈయన "గౌరి పూజ", "శ్వేతతార", "సముద్రగుప్తుడు","భారతి","భరతమాత","సూర్యదేవ", "మృత్యుంజయ", "శివలాస్యం", "శబ్దబ్రహ్మ" మొదలైన చిత్రాలు చిత్రించారు. ఆంధ్ర జాతీయ కళాశాలకు రెండేళ్లు ప్రిన్సిపాలుగాకూడా చేశారు. 'శారద', 'మీజాన్', 'ఆంధ్ర పత్రికలకు ఇలస్ట్రేషన్లు వేశారు. 'సతీ అనసూయ', 'మీరాబాయ్', 'ధ్రువ విజయం' సినిమాలకు కళాదర్శకుడుగా వున్నారు. 'తుఫాను', 'గోనగన్నారెడ్డి', 'హిమబిందు', 'కోణంగి', 'అడవి శాంతశ్రీ', 'నారా యణరావు' మొదలైన నవలలురాశారు. కథలనూ, కవిత్వాలను కూడా రాశాడు. "అభినవాంధ్ర" అనబడే పత్రికను స్థాపించి నడి పారు. భీమవరం దగ్గరలోని సిరిపల్లెలో జన్మించిన ఈయన రాజ మండ్రి, బందరు, గుంటూరు, హైద్రాబాద్, మద్రాసులలో నివసిం చారు. భారతదేశమంతాపర్యటించాడు. స్వాతంత్ర్య సమరయోధుడు కూడాను.

మాధవపెద్ది గోఖలేగారు చిత్రకారుడుగాను, ఇలస్ట్రేటరు గాను, కథారచయిత, జర్నలిస్టు సినిమాల కళాదర్శకుడుగానూ పనిచేశారు. "బ్రహ్మనాయుడు", "శాంతి కపోతం", "హంపీ కథకులు", "అవ్వమను మరాలు","పావురాల జంట","యోధుడు","మల్లమ్మదేవి", "జటాయువు" మొదలయి నవి ప్రఖ్యాతిగాంచాయి. కమ్యూనిస్టు పత్రిక ప్రజాశక్తికి కార్టూన్‌లు వేశారు. చందమామ, ఆంధ్రపత్రిక, భారతిలాంటి పత్రికలకు కూడా పనిచేశారు. ఆ తరువాత మద్రాసువెళ్ళి చాలా సినిమాలకు కళాదర్శకుడుగా పని చేశారు. ప్రఖ్యాత సినిమాలు పాతాళభైరవి, మాయాబజార్‌లకు ఆయనే కళా దర్శకుడు. ఇంకా రైతుబిడ్డ, షావుకారు, కృష్ణార్జున యుద్ధం, పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి మొదలైన సినిమాలకు కూడా ఆర్ట్ డైరెక్టర్ చేశారు. గుంటూరు జిల్లాలోని బ్రాహ్మణ కోడూరులో ఆయన జన్మించారు. కమ్యూనిస్టుగాను, స్వాతంత్ర్య సమర యోధుడుగానూ వున్నారు. ఉప్పు సత్యాగ్రహం, వ్యక్తి సత్యా గ్రహాలలో పాల్గొని జైలు శిక్ష కూడా అనుభవించిన దేశభక్తుడు.

వేటూరి రామమూర్తిగారు ఉపాధ్యాయులు ప్రమోద కుమార చటోపాధ్యాయగారికి అభిమాన విద్యార్థి. "రామ్మూర్తియే అందరికన్నా ముందు వస్తాడు. అందరికన్నా ముందు వేస్తాడు" అని మెచ్చుకునే వారు. కాని రామ్మూర్తి కళా సేవకన్న జాతీయ సేవ మిన్న అని భావించి జాతీయ ఉద్యమంలోని దూకి గాంధీజీ అనుయాయిగా మారినారు. గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమం, ఖాదీ ప్రచారం మొదలైన కార్యక్రమాలలో నిమగ్నమయి చిత్రకళకు తగినంత సమయం కేటాయించ లేక పోయారు. ఆయన వేసిన చిత్రాలలో'శక్తి', 'మేఘనాధుడు' మొదలైనవి ప్రాచుర్యం పొందారు. ఆయనదొక విలక్షణమైన శైలి అని గురువు గారు అంటుండేవారు.

ఆంధ్ర జాతీయ కళాశాలలో రూపొందిన మరో ప్రముఖ చిత్రకారుడు గుర్రం మల్లయ్య గారు. ఆయన మాచర్ల వాస్తవ్యులు. ఆయన శాంతిని కేతన్‌లో మూడు నెలలు శిక్షణ పొందివచ్చారు. ఆయన సామాజిక జీవితాన్ని, మహిలలను చిత్రించేవారు. 'కుటీర పరిశ్రమ' పేరుతో నేతగాళ్ల కుటుంబం మొత్తం శ్రమిస్తున్న చిత్రం వేశారు. స్వదేశవస్త్రాలు, ప్రతియింటా రాట్నం నినదిస్తున్న రోజులు. ఆయన చిన్నతనంలో వేసిన 'ఉషాసుందరి' చిత్రం భారతిలో ప్రచు రింపబడింది. ఆయన పెయింటింగ్‌లు కృష్ణనది వరదలలో తడిసి పాడయిపోయాయి. ఆయన మాచర్లలో "నవయుగ చిత్రకళా సమితి"ని స్థాపించారు. ఆనాటి శారద పత్రికలో ప్రమోద కుమార చటోపాధ్యాయ గారి చిత్రాలు ముఖచిత్రాలుగానూ ఆయన శిష్యులు వేసినచిత్రాలు లోపలిపేజీలలోనూ తరచు ప్రచురింప బడుతుండేవి.

కౌతా రామమోహన శాస్త్రి, కౌతా ఆనంద మోహనశాస్త్రి అనబడే సోదరులు కూడా జాతీయ కాలేజీ చిత్రకారులే. వాళ్లనాన్న గారు కౌతా శ్రీరామశాస్త్రిగారు శారద పత్రికకు సంపాదకులు. ఆనంద మోహన శాస్త్రిగారు మైసూరులో కొంత కాలంవుండి వెంకలపు గారితో చిత్రాలు వేశారు. తరువాత అహమ్మదాబాద్‌లోని అంబాలా సారాబాయ్ ఇనిస్టిట్యూట్‌లో చిత్ర కళోపాధ్యాయుడుగా పనిచేశారు. రామమోహన శాస్త్రిగారు లండన్‌వెళ్లి రాయల్‌లో ప్రింట్ మేకింగ్‌లో శిక్షణ పొందారు. వీరిద్దరూ వేసిన స్కెచ్‌లు, చిత్రాలతో ఆల్బంలు ప్రింటయ్యాయి.

వినుకొండకు చెందిన పొట్లూరి హనుమంతరావు స్థానిక అంశాలతో చిత్రించారు. "మోటబావి"చిత్రంలో బావినుండి నీరును ఎద్దుల సాయంతో తోడే చిత్రాన్ని వేశారు. "పెళ్లి పల్లకి" లో వూరేగు

తున్న పెళ్లి కూతురుని, "గోరుముద్దలు" చిత్రంలో బిడ్డకు ముద్దలు తినిపిస్తున్న తల్లినీ చిత్రించారు. అంకాల వెంకట సుబ్బా రావుగారు జాతీయ కళాశాలలోనూ, శాంతిని కేతన్‌లోనూ శిక్షణ పొందారు. తొలి రోజులలో అతని చిత్రాలలో పురాణాలు, ఊహా లోకాలు కానవచ్చేవి. "తులసిదాస్", "శ్రీకృష్ణ", "సూర్యమాయ" వగైరా చిత్రాలు వేశారు. తరువాత రోజులలో రైతులను, పల్లెజీవితాన్ని, పండుగలను, మహిలలనూ చిత్రించారు. సన్నని రేఖలు వేయడం, లేతరంగులను పూయడం అతని ప్రత్యేకత, యువ చిత్రకారులకు నేర్పడం, వారి చిత్రాలను ప్రదర్శించడం చేస్తుండేవారు.

బందరు జాతీయ కళాశాలలో చిత్రకారులయిన ఎస్.వి. ఎస్.రామారావు, తేజోమూర్తుల కేశవరావులు మద్రాసువెళ్లి మద్రాసు ఆర్ట్ స్కూలులో దేవీ ప్రసాదరాయ్ చౌదరి వద్ద మరింత నేర్చుకున్నారు. తుదకు వీరిద్దరూ వ్యాపార కళకి అంకితమయ్యారు. వారి పెయింటిం గ్‌లుగానీ, ఇలస్ట్రేషన్లుగానీ ఆంధ్రత్వం తొణికిస లాడేటట్లు వేసేవారు.

బందరులోని ఆంధ్ర జాతీయ కళాశాలలో రూపొందిన చిత్రకారుల లో ఇంకా చాలామంది వున్నారు.మారేడి సూర్యనారాయణ, పి.సీతాదేవి, చదలవాడ కృష్ణయ్య, అనపిండి సోమేశ్వరరావు, బ్రహ్మానందం, జగన్నాథ రాజు, చావలి నాగేశ్వర రావు, యేకెలి సుబ్బారావు, ఆర్యదాసు, వేదుల వెంకట శాస్త్రి, చంద్రుపట్ల బాపి రాజు, జె.సి.శేఖర్, వై.సత్యనారాయణ రావు, ఎస్.వాసుదేవ్, గోలి శేషయ్య, పెండియాల వెంకటరామారావు, చంద్రుపట్ల రామారావు, సుసర్ల వెంకట రామయ్య వగైరాలు ఉన్నారు.

20వ శతాబ్దం ఆరంభంలో తెలుగు నాట చిత్రకళ ఉదయిం చింది బందరులోనే. ఆ తరువాత రాజమండ్రిలో మరింత లేటుగా హైదరాబాదులో ఆ వెలుగు ప్రసరించింది. కానీ యిప్పుడు ఐక్య ఆంధ్ర ప్రదేశ్‌లో మనది వెనుకబడిన ప్రాంతం చిత్రకళారంగంలో.

కృష్ణ యూనివర్సిటీవారు తమ విశ్వవిద్యాలయంలో చిత్ర కళా విభాగంఏర్పాటుచేసి చరిత్రను పునరావృతం చేయాలని మనం అందరం కోరుకుందాం.

### స్వాతంత్రానంతర చిత్రకళ :

కృష్ణాజిల్లాలో చిత్రకళ కోసం అంకితమయిన ప్రముఖ చిత్రకారుల గురించి పరిశీలిద్దాం.

మూడు రకాల చిత్రకారులున్నారు. ఈ జిల్లాలోనే పుట్టి ఈ జిల్లా లోనే పనిచేస్తున్నవారు, ఈ జిల్లాలో పుట్టి బయటకి వలస పోయిన వారూ, బయటనుండి మనజిల్లాలోకి వచ్చి స్థిరపడినవారు.

కొప్పాడ వేణుగోపాలరావుగారు మంచి చిత్రకారులు. గుడివాడలో వుండేవారు. ఈయన వద్ద నేర్చుకున్నవారు చాలా మంది చిత్రకళా ప్రముఖులయ్యారు. ఎస్.వి.రామారావ్, బి.ఎ.రెడ్డి, మొదలగువారున్నారు. తరువాత కొన్నాళ్లు విజయవాడలో పెయిం టింగ్ స్కూలు నడిపారు. వీరికుమారుడు శ్రీనివాస్ కళాదర్శినిలో టీచరుగా చేసారు.

వేలూరి రాధాకృష్ణమూర్తిగారు గన్నవరం తాలూక చిరి వాడలో జన్మించారు. మద్రాసు ప్రభుత్వ చిత్ర కళాశాలలో నేర్చు కున్నారు. ఉద్యోగరీత్య మధ్యప్రదేశ్‌లోని భోపాల్‌లో స్థిరపడ్డారు. ఈయన అక్కడ రిథమ్ ఆర్ట్ సొసైటీని స్థాపించారు. ఈయన లినో కట్ చిత్రాల ప్రవీణులు. రచయిత కూడాను.

ఎస్.వి.రామారావుగారు గుడివాడలో జన్మించారు. మద్రాసులో స్కూల్ ఆఫ్ ఆర్ట్సులో చదివారు.లండన్‌లో కూడా చిత్రకళ నేర్చుకున్నారు. పికాసో పెయింటింగ్‌ల సరసన వీరి పెయిం టింగ్ ప్రదర్శించబడింది. అమెరికాలో వెస్టర్న్ కెంటాక్ విశ్వవిద్యాల యంలో పెయింటింగ్ విభాగానికి అధిపతిగా ఉన్నారు. భారప్రభు త్వం ఈయనకు పద్మశ్రీ అవార్డు ఇచ్చింది. వీరు ఆధునిక చిత్ర కారులు.

చలసాని ప్రసాదరావు చిత్రకారుడు, రచయిత. భట్ల పెనమ ర్రులో జన్మించారు. హైద్రాబాద్‌లో ప్రభుత్వ చిత్రకళాశాల నుండి డిప్లొమా పొందారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార ప్రజా సంబం ధాల శాఖలో చిత్రకారుడుగా పనిచేశారు. 1975 నుండి ఈనాడు వారి మాసపత్రికలు విపుల, చతురలకు సంపాదకత్వం వహించారు. వీరి సంపాద కత్వంలో కళా సంపుటాలు 7 ప్రచురించబడ్డాయి. వీరి రచనలు "కాకతీయ శిల్పం", "ఆధునిక చిత్రకళ", "రష్యా చిత్రకళ" మొదలైనవి.

కె.ఎల్.ధర్ చిత్రకారుడు, శిల్పి, గుడవాడ మండలంలోని ముప్పవరంలో జన్మించారు. మద్రాసులోని చిత్ర కళాశాలలో డిప్లో మాపొందారు. మద్రాసు, హైదరాబాద్‌లలో సినిమాలకు కళాదర్శ కుడుగా పనిచేశారు. ఈయన నఖ చిత్రకారుడు గూడా! ఆంధ్ర జ్యోతి వార పత్రికకు ఇలస్ట్రేటరుగా కొన్నాళ్లు పనిచేశారు. వీరి శిల్పాలు విజయనగరం రాజాగారి బంగాళాలో వున్నాయి.

కొండిపర్తి శేషగిరిరావుగారు పెదనలోజన్మించారు. మినియే చర్ చిత్రాలు, వాష్ టెక్నిక్‌లో నీటిరంగుల చిత్రాలు వీరి ప్రత్యేకత. వీరు నాగార్జున సాగర్ పి.డబ్ల్యు.డి. విభాగంలో డ్రాఫ్ట్స్‌మన్‌గా పనిచేశారు. వీరు రచయిత కూడా."శాంతి కాంతి"అనే గ్రంథం ప్రాచుర్యం పొందింది.

వేముల కామేశ్వరరావు గన్నవరం తాలూకా మంతెన గ్రామంలో జన్మించారు. విజయవాడలో స్థిరపడ్డారు. బందరులోని జాతీయ కళాశాలలో చిత్రకళను అడవి బాపిరాజు, ధీరంకి వెంకట శాస్త్రిగారల వద్ద నేర్చుకున్నారు.విజయవాడలోని హిందూ హైస్కూలులో డ్రాయింగ్ టీచరుగా పనిచేశారు.సినిమా బ్యానర్లు వేశారు. పుస్తకాలకు ఇలస్ట్రేషన్స్ వేశారు. వీరి శిష్యులు చాలామంది డ్రాయింగ్ టీచర్లుగాను, లితో ఆర్టిస్టులుగానూ, కమర్షియల్ ఆర్టిస్టులుగాను పనిచేస్తున్నారు.

వి.వి.టోన్‌పేగారుఅనంతపూర్‌లో జన్మించారు. విజయ నగరంలో అంట్యాకుల పైడిరాజుగారి వద్ద చిత్రకళ నేర్చుకున్నారు. మచిలీ పట్టణంలో స్థిరపడ్డారు. "చిత్రకళా సంసద్"ను స్థాపించారు. ప్రపంచ

తెలుగు మహాసభల సందర్భంగా వీరు ఆచార్య నాగార్జు నుడి చిత్రాన్ని తైల వర్ణాలతో చిత్రించారు. చిత్రకళమీద అనేక రేడియో ప్రసంగాలు చేశారు.

ఆ రోజులలో విజయవాడలో సినిమా బ్యానర్ చిత్రకళ వుండేది. పది పదిహేనుషెడ్లుండేవి. పెద్ద పెద్ద గుడ్డ బ్యానర్లపైసినిమా బొమ్మలు చిత్రించబడేవి. సినిమా డిస్ట్రిబ్యూటర్ కంపెనీల ఖర్చుపై అవి నిర్వహిం చబడేవి. ఒకో షెడ్‌లో పదేసిమంది చిత్రకారు లతో పని జరిగేది. ఆ చిత్రాలు బహిరంగ ప్రదేశాలలో అమర్చేవారు. అవితడిచినా చెరిగిపోకుండా వుండటానికై ఆయిల్ కలర్స్‌తో చిత్రించేవారు. ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని ప్రాంతాలకు, ఊళ్లకు సినిమా థియేటర్లకు ఇక్కడినుండే ఇవి పంపబడేవి. మొదట కొందరు తమిళ చిత్రకారులు వలసవచ్చి ఈబ్యానర్లు చిత్రించే వారు. తరువాత మనవాళ్లు చాలామంది ఈ కళలో ఆరితేరారు. మాధవన్, సెల్వం,వేలాజం,జోసఫ్, ముత్తయ్య, బుచ్చయ్య, కాలే వజ్జె నాగేశ్వరరావు, మొదలైన అనేకులు ఈ కళలో కృషిచేశారు. ఆఫ్‌సెట్ ప్రింటింగ్‌లో పెద్ద పెద్ద పోస్టర్లు, ఫ్లెక్సీ బ్యానర్ ప్రింటింగ్ టెక్నాలజీ వచ్చిన తరువాత ఆ బ్యానర్ ఆర్ట్ తగ్గిపోయింది. రాజకీయ పార్టీల మీటింగ్ లకు నాయకుల కటౌట్‌ల తయారీలో ఈ కళ మిగిలింది. ఈకళలో జిడగంనాగేశ్వరరావు ప్రవీణుడు.ప్రస్తుతం హైద్రాబాద్‌లో స్థిరపడ్డాడు.

ఈనాడు చిత్రకళను రాజులో, మఠాలో పోషించడం లేదు. చిత్ర కారులు రకరకాలజీవనాధాలను వెతుక్కుని జీవిస్తున్నారు.కొందరు డ్రాయింగ్ టీచర్లుగా స్కూళ్లలో పనిచేస్తున్నారు. కొందరు పత్రికలకు కార్టూనిస్టు లుగా పనిచేస్తున్నారు. ఇంకొందరు పుస్తకాలకు, పత్రికలకు ఇలస్ట్రే టర్లుగా పనిచేస్తున్నారు కొందరు కమర్షియల్ ఆర్టిస్టులు.ఇటీవల చాలా మంది హైద్రాబాదుకు వలసపోయియానిమేషన్ సంస్థలలో (యానిమేషన్ పరిశ్రమలో)చిత్రకళా కార్మికులుగాపనిచేస్తున్నారు.కొందరు ఫొటోగ్రాఫర్లు అయ్యారు. ఇంకొందరు కంప్యూటర్ గ్రాఫిక్స్‌లో స్థిరపడ్డారు.

1961లో విజయవాడలో శ్రీ నార్ల వెంకటేశ్వరరావు, శ్రీ సంజీవదేవ్‌గార్ల ప్రోత్సాహంతో ఎం.ఎస్.మూర్తిగారు ఆంధ్ర అకా డమీ ఆఫ్ ఆర్ట్స్‌నుస్థాపించారు.ప్రతియేడూ చిత్రకళాపోటీలు ప్రదర్శ నలు నిర్వహించేవారు. మూర్తిగారు స్వయంగా చిత్రకారుడే.

నడింపల్లి సంజీవరావుగారు బెజవాడలోని గాంధీ హైస్కూలులో డ్రాయింగ్ టీచరుగా చేసేవారు. పుస్తకాలకు ముఖ చిత్రాలు, ఇలస్ట్రేషన్లు చిత్రించేవారు. ఆ తరువాత ప్రఖ్యాత పోర్ట్రయిట్ పెయింటరుగా రూపొందారు. వ్యక్తుల మూర్తి చిత్రాలను ఆయిల్ కలర్స్‌లో అద్భుతంగా చిత్రించేవారు.

వానపల్లి రాములు అని ఒక మంచిచిత్రకారుడు బెజవాడలో వుండేవాడు. ఆయన దేవాలయాలలోని గోడలపై పౌరాణిక చిత్రా లను ఆయిల్ కలర్స్‌లో, వార్నిష్ కలర్స్‌తో చిత్రించేవారు. ఆంధ్ర ప్రదేశ్‌లోని చాలా దేవాలయాలలో ఆయన చిత్రాలు వున్నాయి.

పి.సాల్మన్ రాజుగారు పశ్చిమ గోదావరిలో జన్మించారు. రాజమండ్రిలో డ్రాయింగ్‌నేర్చుకున్నారు. ఇంగ్లాండ్‌లోను, అమెరికా లోనూ ఉద్యోగాలుచేశారు.వుడ్ బ్లాక్ ప్రింటింగ్, బాతిక్‌లలో ప్రవీణుడు. విజయవాడలోని సువార్తవాణికి డైరెక్టరుగా చేశారు. ఈయన బైబుల్ కథలకు ఎన్నో చిత్రాలు వేశారు. ఆ చిత్రాలను జర్మనీ, జపాన్, డెన్‌మార్క్,స్విట్జర్లాండ్‌లలో పోస్టర్లుగాను, క్యాలండర్లుగానూ, పుస్తకాలకు ముఖ చిత్రాలుగానూ ఉపయోగించు కున్నారు విదేశీయులు. ఈయన క్రిష్టియన్ చిత్రకళకి అంకిత మయిన ఒక ఋషి.

టి.వెంకట్రావు (టీవీ) ఏలూరులో జన్మించారు. విద్యాభ్యాసం అయిన తరువాత విజయవాడలోని విశాలాంధ్ర దిన పత్రికలో కార్టూనిస్టుగా చేరారు. తరువాత చిత్రకారుడయ్యాడు. 1982లో విజయవాడలో అకాడమీ ఆఫ్ క్రియేటివ్ ఆర్ట్సను నెలకొల్పారు. దానికి ఆయన ప్రధాన కార్యదర్శి, ఎస్.సంజీవరావుగారు అధ్యక్షులు, పి.సాల్మన్ రాజుగారు గౌరవాధ్యక్షులు. 2007లో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం వారి బెస్ట్ కార్టూనిస్ట్ అవార్డు పొందారు. బెజవాడ మున్సిపల్ కార్పోరేషన్‌వారి స్వాతంత్ర్య పోరాట దృశ్య సదనంలో 54 కాన్వాసులపై స్వాతంత్ర్య సమర దృశ్యాలున్నాయి. అవి టీవీ గారు చిత్రించినవే.1980నుండి 2000కాలంలో చిత్రకళ కరెస్పాం డెన్స్ కోర్సుల కేంద్రం స్థాపించి ఆంధ్రప్రదేశ్‌లోని మారు మూల ప్రాంతాల ఔత్సాహికులకూ డ్రాయింగ్, పెయింటింగ్, కార్టూనింగ్ పాఠాలకు పోస్టు ద్వారా అందించారు. ఈయన రచయిత కూడాను "చిత్రకళ చరిత్ర", "డ్రాయింగ్ నేర్చుకోండి", "పెయింటింగ్ నేర్చుకోండి", "కార్టూన్‌లో నేర్చుకోండి", "చిత్ర కారులకు జామెట్రీ మరియు పెర్‌స్పెక్టివ్" అనబడే పుస్తకాలు వెలువడ్డాయి.

విశాఖజిల్లానుండి విజయవాడకు వలసవచ్చిన బాలి(శంకరావు) గారు పత్రికలకు, పుస్తకాలకు ఇలస్ట్రేషన్లు, కార్టూన్‌లు, అట్ట మీద బొమ్మలు వేస్తుండేవారు. ప్రస్తుతం ఆయన హైద్రా బాదులో స్థిరపడ్డారు. విజయవాడ ఆంధ్రజ్యోతిలో రెండున్నర శబ్దాలు చిత్రకారుడు, కార్టూ నిస్టుగాఉన్నారు. విజయవాడలోనే పుట్టి పెరిగిన సన్నాల వరప్రసాద రావు తొలుత బ్యానర్ ఆర్టిస్టుగా ప్రారంభమయి తరువాత ఆయిల్ పెయింటరుగా మారి పోర్ట్రయిట్ పెయింటరుగా స్థిరపడ్డారు. ఈయన ఆంధ్రా అకాడమీ ఆఫ్ ఆర్ట్స్‌కి కార్యదర్శిగా, ఉపాధ్యక్షులుగా పనిచేశారు.

మన కృష్ణాజిల్లాలో చిత్రకారులు వందలసంఖ్యలో వున్నారు. వారిలో ప్రముఖులు పదుల సంఖ్యలో వున్నారు. వారందరి గురించీ వ్రాయాలంటే ఒక వ్యాసంచాలదు. ఒక గ్రంథమవుతుంది. గనుక అన్ని వివరాలు యిక్కడ యివ్వలేకపోయాను.

మచిలీపట్నంలోని కృష్ణా యూనివర్శిటీలో ఫైనార్ట్స్ సెక్షన్‌ను ప్రారంభించి చిత్రకళ, శిల్ప కళలను పునరుద్ధరించాలని మనవి చేసుకుంటున్నాను.

డా॥ మీగడ రామలింగస్వామి

# బలిజేపల్లి - సత్యహరిశ్చంద్రీయం

"కావ్యేషు నాటకం రమ్యం - నాటకేషు శకుంతలా తత్రాపి చతుర్థోఽంకః - తత్రశ్లోక చతుష్టయమ్" ఈ శ్లోకం ఎంత ప్రత్యక్ష సత్యమో.

నాటకాల్లో పద్య నాటకం రమ్యం.

పద్యనాటకాల్లో గయోపాఖ్యానం, పాండవోద్యోగ విజయాలు, సత్యహరిశ్చంద్ర, చింతామణి రమ్యం.

ఈ నాలుగింటిలో సత్యహరిశ్చంద్ర రమ్యాతిరమ్యం.

అనేదికూడా అంతా సత్యం అని నేనంటాను. నేనేకాదు ఏ తెలుగువాడైనా ఇదే అంటాడు. దీనికి కారణం, ఆ రచనా సౌష్టవం, ఆ కథాకథనం, ఆ సంభాషణా చాతుర్యం, ఆ పద్యం బింకం, (సంస్కృతపదభూయిష్టం + సరళత్వం) ఆ భాషా పదమాధుర్యం, ఆ సందేశ రమ్యత్వం, ఆ వ్యక్తిత్వవికాస సంధానం, ఇలా చాలా ఉన్నాయి. ఇవన్నీ పుష్కలంగా 'సత్యహరిశ్చంద్ర' నాటకంలో ఉన్నాయి. ఇంత సర్వజనసమ్మోహనంగా ఈ నాటకాన్ని రచించింది ఎవరంటే... బహుముఖ ప్రజ్ఞాభాస్కరుడైన బరిజేపల్లి లక్ష్మీకాంతం.

మరి కృష్ణానదీ తీర సారమే అబ్బిందో, ఆ నదీమతల్లి గంగా తరంగ మాధుర్యం తనువెల్ల నింపుకున్నాడో ఏమోగాని ఆ లక్ష్మీ కాంతకవి, తన హరిశ్చంద్ర నాటకంలో ప్రతి అక్షరం రంగరించారు. పుట్టింది, పెరిగింది గుంటూరుజిల్లా బాపట్ల తాలూకా ఇటికంపాడు. మధ్యలో మదరాసు వెళ్ళి వచ్చినా, చివరికి చేరింది, శ్రీకాళహస్తికి. ఏదిఏమైనా తొలి, మలి జీవనదశలు గడిపింది, ఇక్కడే.

### బహుముఖ ప్రజ్ఞాభాస్వరుడు - బలిజేపల్లి :

కవిగా, నటునిగా, సినీనటునిగా, సినీరచయితగా, సంగీత విద్వాంసునిగా, స్వాతంత్ర్యసమరయోధునిగా, అవధానిగా తెలుగునాట బహుముఖ ప్రజ్ఞత్వంతో ప్రఖ్యాతం అయింది, బలిజేపల్లి వ్యక్తిత్వం.

ముందుతరం సినిమాలకు చెందిన బలిజేపల్లి, బాలనాగమ్మ, వరవిక్రయం, విశ్వమోహిని, జీవనముక్తి, రక్షరేఖ, భూకైలాస్, బ్రహ్మరథం మొదలగు సినిమాలకు, నటులుగా, రచయితగా, గేయపద్య రచయితగా పనిచేశారు.

సంగీతవిద్వాంసునిగా ఒకే రాగాన్ని తెల్లవార్లూ ఆలపించగల విద్వత్తు, గాత్ర సౌలభ్యం, కలిగిన సంగతవేత్త. ఇప్పుడు ప్రసిద్ధ పౌరాణిక నాటకాల్లో, కన్నడ, బేగడ, శహన, ఆనందభైరవి మొదలగు రాగాల బాణీలు బలిజేపల్లి స్వరపరిచినవే.

అవధానిగా కొన్నాళ్ళు అవధానాలు చేసి, సమకాలీన అవధానుల్లో ఒకరుగా గుర్తింపు పొందారు.

నటులుగా అనేక పాత్రలు నాటకాల్లో ధరించి అందంతో మిన్నగా పేరుపొందారు. అన్నింటికంటే హరిశ్చంద్రలో నక్షత్రక పాత్ర అంటే బాగా ఇష్టపడేవారట.

సహృదయంతో ఎలాంటి విమర్శన కూడా స్వీకరించేవారు. ఓసారి తను రాసిన హరిశ్చంద్రలో నక్షత్రక పాత్ర వేశారట. నాటకం అయింది. అంతా వీరిని బాగా మెచ్చుకొన్నారట. తన గానాన్ని కబాగా పొగిడారట. ఓ పెద్దాయన అసంతృప్తిగా బలిజేపల్లిని చూస్తున్నారట. వెంటనే నా వేషం ఎలా ఉంది ? అని అడిగారట. ఆయన రాగాలు తీయడం బాగులేదు. అని ఊరుకోకుండా ఈ హరిశ్చంద్ర నాటకంలో నువ్వు నక్షత్రక పాత్రవేయడం మానేస్తే ఈ నాటకం చాలాగొప్పగా ఉంటుంది అని అన్నాట్ట. బలిజేపల్లి మరి నక్షత్రకవేషం వేయకూడదని నిర్ణయించుకుని మానేశారట. అంతగొప్ప సహృదయులు.

స్వాతంత్ర్యసమరయోధునిగా, ఉప్పుసత్యాగ్రహంచేసి జైలుకు వెళ్ళివచ్చినవారు బలిజేపల్లి.

ముద్రణాలయాధిపతిగా, గుంటూరులో 1926లో చల్లపల్లి రాజావారి సహాయంతో ప్రసిద్ధమైన 'చంద్రికాముద్రణాలయాన్ని' స్థాపించి నడిపించారు.

కవిగా బలిజేపల్లి బుద్ధిమతీవిలాసం (1905) సత్య హరి శ్చంద్రీయము (1912), ఉత్తరరాఘనము (1910) సాత్రజి తీయము అనే నాటకాలు రచించారు.

ఇంత బహుముఖీయంగా జీవనాన్ని దిగ్విజయంగా ప్రశంసా ప్రాయంగా బరిజేపల్లి సాధించారు. కాబట్టే, 1930లో రంగూన్‌లో ఘనంగా సత్కరించి 'కవితాకళానిధి' అనే బిరుదాన్ని 1942లో చలనచిత్ర సంఘం వారు 'పుంభావ సరస్వతి' అని బిరుదంతో సన్మానించారు.

### సత్యహరిశ్చంద్రీయం - బలిజేంద్ర :

కవులు కావ్యాలు ఎన్ని రాసినా కొన్నిటివల్లే వారు శాశ్వతంగా కీర్తి శరీరాలతో ఆచంద్రతారార్కంగా నిలిచిపోతారు. బలిజేపల్లి కూడా ంతే. ఎంత లబ్ధి ప్రతిష్టులైనా కేవలం సత్యహరిశ్చంద్ర నాటకం వల్లే వారికి శాశ్వతత్వం కలిగింది, కలుగుతుంది.

ఈ హరిశ్చంద్రను సుమారు 30మంది వరకూ రాశారు. ముందుగా 1889లో కందుకూరి వీరేశలింగంగారు రాశారు. అప్పటి నుండి చాలామంది కవులు రాశారు. విశ్వనాథ సత్యనారాయణ వరకూ (కావ్యవేదహరిశ్చంద్ర) రాశారు. ఎవరెవరు ఎలా రాశారనేది ప్రస్తుతం అప్రమత్తం కాబట్టి దాని జోలికి నేను వెళ్ళను. కాని, ఐతరేయ బ్రాహ్మణంలో శునశ్శేపోపాఖ్యానంలో ఈ కథ ఉంది. తరువాత స్కాంద, మార్కండేయపురాణాల్లో ఉంది. గైరవ ద్విపదలో రాశాడు. శంకరకవి కూడా రాశాడు. ఇవన్నీ చిన్న చిన్న భేదాలతో ఉన్నాయి. ఈ విషయాన్ని కూడా పక్కనబెట్టి, బలిజేపల్లి రాసిన హరిశ్చంద్రకే ఎందుకింత ఆదరణ వచ్చింది. కొన్ని వేల ప్రదర్శనలతో, కొన్ని లక్షలమంది ప్రేక్షకులను ఈ నాటకం ఎందుకు ఆకట్టుకొంది ? ఇంకా పల్లె పల్లెలో పట్టణాల్లో ప్రతి పందిళ్ళలో ప్రదర్శింపబడుతూనే ఉంది. గయోపాఖ్యానం, ఉద్యోగ విజయాలు, చింతామణి మొదలగు నాటకాలు ప్రదర్శింపపడుతున్నా దీనికి ఉన్న ఆదరణ మహోన్నతంగా కనిపిస్తోంది. ఇంకా విచిత్రం ఏమిటంటే, ఆ బలిజేపల్లి రాసిన మిగతా నాటకాల గురించి చాలామందికి తెలియదు కూడా !

శ్రీ ఎస్. వెంకట్రావు

# జిల్లాకో సాంస్కృతిక సమభావన

దేశంలో భాషాప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుకు నాంది పలికిన ఆంధ్రప్రదేశ్ రెండుగా చీలిపోయింది. విభజన జరిగే వరకూ రాష్ట్రంలో విభజన, సమైక్యతపై చర్చ సాగింది. ఇప్పుడు అభివృద్ధి, వెనుకబడిన ప్రాంతాలు తదితర అంశాలపై చర్చ జరుగుతోంది.

ఈ సందర్భంగా సాంస్కృతిక రంగ అభివృద్ధి మీద కూడా చర్చ జరగాల్సి ఉంది. కొత్తగా ఏర్పడిన రెండు తెలుగు రాష్ట్రాలు తమ సాంస్కృతిక రంగాలను ఎలా అభివృద్ధి చేసుకోవాలి? గతంలో లాగా మళ్లీ రాజధానిలో ఒక 'లలిత కళా తోరణం', ఒక 'రవీంద్ర భారతి' నిర్మించి చేతులు దులుపుకుంటే సరిపోతుందా? ఒక 'శిల్పారామం' నిర్మించి టూరిస్టులను ఆకర్షిస్తే సరిపోతుందా? కొత్త రాష్ట్రాల్లో కొత్త పాలకుల ఆలోచనలు సినిమా, టివీ, టూరిజం వగైరా పరిధిని దాటి మరింత విస్తృతంగా, మరింత లోతుగా పోవాలంటే సాంస్కృతిక రంగాభివృద్ధిమీద పెద్ద చర్చ జరగాలి.

అటువంటి చర్చను ప్రారంభించేందుకు ఒక చిన్న ప్రతిపాదన ఉంది.

రాష్ట్రం ప్రాతిపదికగా కాకుండా కొత్త రాష్ట్రాల్లో జిల్లాల ప్రాతిపదికగా సాంస్కృతికాభివృద్ధి జరగాలి. దానికి గాను ప్రభుత్వాలు జిల్లా ప్రాతిపదికగా సాంస్కృతిక కేంద్రాల నిర్మాణానికి ఆలోచనలు చేయాలి. తెలుగు నేలపై ఏ ప్రాంతానికి ఆ ప్రాంతపు సాంస్కృతిక ప్రత్యేకతలు ఉన్నాయి. భాష ఒకటే అయినా యాసలు చాలా ఉన్నాయి. మాండలికాలున్నాయి. సాధారణ సంప్రదాయాలతో బాటు ప్రతి ప్రాంతానికీ ప్రత్యేకమైన సంప్రదాయాలున్నాయి. పెళ్లిళ్లు, పండుగలు, ఆహారం, ఆహార్యాల్లో తేడాలున్నాయి. వాటికి విభిన్న చారిత్రక నేపథ్యాలున్నాయి.

ఈ నిర్దిష్ట సంప్రదాయాలు కాలక్రమంలో ఒకదానితో ఒకటి ఇచ్చిపుచ్చుకుంటూ ఒక సాధారణత్వానికి దారితీయవచ్చు. అయితే అది ప్రజాస్వామ్య బద్ధమైన ఆదాన ప్రదానాల ద్వారా జరగాలి. అంతేకాని ఒక సంప్రదాయం మీద మరో ప్రాంత సంప్రదాయాన్ని బలవంతంగా రుద్దారనే భావన రానీయకూడదు. ప్రాంతీయ విద్వేషాలు ఏర్పడ్డానికి ఆర్థిక అసమానతలతోబాటు ఇటువంటి సాంస్కృతికాధిపత్య పోకడలు కూడా కారణమవుతాయి. 2 అందుకే రెండు తెలుగు రాష్ట్రాల్లో భవిష్యత్తులో సాంస్కృతికంగా సమతుల్యమైన అభివృద్ధి జరగాలంటే అభివృద్ధి వికేంద్రీకృతంగా ఉండాలి, ప్రజాతంత్రంగా ఉండాలి, లౌకికతత్వంతో కూడా ఉండాలి.

ఇటువంటి పంథాలో మన సాంస్కృతికాభివృద్ధి సాగాలంటే కొత్త రాష్ట్రాలు ప్రతి జిల్లాలోనూ ఒక సాంస్కృతిక కేంద్రాన్ని నిర్మించాలి. ఈ కేంద్రం...

ఆయా జిల్లా (లేక ప్రాంత) ప్రజల సాంస్కృతిక వారసత్వాన్ని పరిరక్షించేదై ఉండాలి. మన భాష, సాహిత్యాల పురాతన పత్రాల సేకరణ, పరిరక్షణ చేపట్టాలి. ఆ జిల్లా పరిధిలోని పురాతన వస్తువులు సేకరించాలి. వాటి వివరాలను గ్రంథస్థం చేయాలి. వాటి చారిత్రక పరిశోధన చేపట్టాలి. పురాతన కట్టడాలను పరిరక్షించే నిపుణులను కలిగి ఉండాలి. వాటి రక్షణ కోసం ప్రజలను చైతన్యపరిచే, సమీకరించే కేంద్రంగా ఉండాలి.

జిల్లా ప్రజలకు మన దేశ, రాష్ట్ర, స్థానిక పోరాట వారసత్వాన్ని తెలియజేసేదిగా ఉండాలి. దానికోసం ఆ కేంద్రంలో ప్రత్యేక ఎగ్జిబిషన్లు ఏర్పాటు చేయాలి. జిల్లా ప్రజలు నిత్యం దాన్ని సందర్శించేట్లు నిర్వహణ ఉండాలి. ఉదాహరణకు : మన స్వాతంత్ర్య పోరాటంతోబాటు ఆయా ప్రాంతాల్లో జరిగిన పోరాటాల చరిత్రను చార్టులు, మట్టి బొమ్మలు, సినిమాలు, చిత్రాలు ఇతర అనేక వైవిధ్యభరిత రూపాల్లో చూపించాలి. పిల్లా పెద్దలనూ, చదువుకున్న వారినీ, చదువు లేనివారినీ ఆకర్షించేట్లు, వారికి విషయపరిజ్ఞానాన్ని సులభంగా అందించేట్లు ఉండాలి.

శాస్త్రీయ, స్థానిక జానపద కళలపై అవగాహన కలిగించడంతో పాటు వాటి అభ్యాసానికి ఇవి కేంద్రాలుగా ఉండాలి.

సాహిత్యం, కథలు, కవిత్వం, సినిమాటోగ్రఫీ తదితర బౌద్ధిక సంస్కృతిని బాలల్లో పెంచే కేంద్రాలుగా, చదువుకునే పిల్లలు సెలవుల్లో

కళలు అభ్యసించేందుకు శిక్షణా కేంద్రాలుగా ఉండాలి. ప్రజలు అన్నిరకాల వాయిద్యాలు నేర్చుకునేందుకు సదుపాయం ఉండాలి.

జిల్లాలోని ఔత్సాహిక కళాకారుల ప్రదర్శనలకు ప్రోత్సాహమిచ్చే కేంద్రాలుగా ఉండాలి.

ఆయా ప్రాంతాల్లో దళితులు, గిరిజనుల్లోని ప్రత్యేకమైన కళలనూ, అంతరించిపోతున్న కళారీతులనూ పరిరక్షించి, ఆధునీకరించే కృషి ఇక్కడ జరగాలి.

పిల్లలకూ, పెద్దలకూ సైన్సు, సాంకేతిక పరిజ్ఞానంపై అవగాహన కలిగించే అనేక రకాల ఏర్పాట్లుండాలి. ప్రతి కేంద్రంలో ఒక నక్షత్ర దర్శనశాల ఉండాలి. ఒక దూరదర్శిని ఉండాలి. ఈ విశ్వం, భూమి, మనిషి పుట్టుక పరిణామాలకు సంబంధించిన విజ్ఞానాన్నీ, ఇంకా అనేక విజ్ఞాన శాస్త్ర సూత్రాలు, శాస్త్రవేత్తలు వారి కృషికి సంబంధించిన వివరాలు తెలిపే ఎగ్జిబిట్లు, సినిమాలు, స్లైడులు, చార్టులు, ఇతర అనేక సృజనాత్మక రీతులుండాలి.

ఇంకా, ఇంకా అనేక సాంస్కృతిక వారసత్వ రూపాల పరిరక్షణకూ, శిక్షణకూ, సృజనకూ ఈ కేంద్రాలు నిలయాలుగా ఉండాలి. ఒక్క మాటలో చెప్పాలంటే ఆయా జిల్లా కేంద్రాల్లో నిర్మించబడిన ఈ కేంద్రాలు దేశ, రాష్ట్ర కళాసాంస్కృతులతోపాటు ఆయా స్థానిక సంస్కృతుల పరిరక్షణా కేంద్రాలుగా ఉండాలి.

ఇదంతా చాలా పెద్ద పనా? భారీ నిధులతో కూడిన పనా? వనరులు సమీకరించడం కష్టంతో కూడుకున్న పనా? కాదు. ప్రజాసంస్కృతిని ప్రోత్సహిద్దామనే రాజకీయ చిత్తశుద్ధి ప్రభుత్వాలకు ఉంటే ఇదేమంత పెద్ద పనికాదు. ఇటువంటి సాంస్కృతిక కేంద్రం నిర్మించడానికి బహుశా ప్రతి జిల్లా కేంద్రంలో – ఆయా జిల్లాల పరిస్థితిని బట్టి – 30 నుండి 100 ఎకరాలవరకు భూమి సేకరించాల్సి రావచ్చు. జిల్లాలో ఉండే కొన్ని ప్రభుత్వ శాఖలను ఈ కేంద్రానికి అనుసంధానించవచ్చు. స్వచ్ఛంద సంస్థలు, ఇతర ప్రజా సంస్థల సహకారాన్ని సమీకరించాలి. ఆయా జిల్లాల్లో సాంస్కృతిక రంగంలో పనిచేస్తున్న మానవ వనరులను **ఉదాహరణకు** : కళాకారులను, కళాశిక్షకులు, పరిశోధకులు, పండితులు,ఇతర మేధావులను సమీకరించి వారిని ఒకే ఛత్రం కిందకు తీసుకురావాలి. రాష్ట్ర బడ్జెట్‌లో సాంస్కృతిక రంగానికి కేటాయింపులు పెంచి ఆ నిధులను జిల్లా సాంస్కృతిక కేంద్రాలకు కేటాయించడం ద్వారా వికేంద్రీకరించాలి. నిధుల ఖర్చు,సాంస్కృతిక కేంద్రాల నిర్వహణ కేవలం ప్రభుత్వ శాఖలకు అప్పగించకుండా ప్రజల భాగస్వామ్యం గల ఒక అటానమస్ సంస్థకు అప్పగించాలి. ఆ సంస్థ ప్రజాస్వామ్య బద్ధంగా పనిచేసేట్లు చూడాలి. ప్రతి జిల్లాకూ ఒక సాంస్కృతిక కేంద్రం ఏర్పాటు చేసి ప్రజాతంత్రయుతంగా నడపడం అనేది సాంస్కృతిక రంగంలో వికాసానికి తోడ్పడుతుంది. అన్ని ప్రాంతాలూ తమ తమ సంస్కృతీ సంప్రదాయాలను పరిరక్షించుకుని, పెంపొందించుకునే అవకాశం కల్పిస్తుంది. ఇటువంటి అంశంపై ఈ తరుణంలో మరింత చర్చ జరగడం చాలా అవసరం. కార్మికులుగా ఉన్నారు. ఉపాధి విషయానికి వస్తే... విజయవాడలో ఉన్న ఎంప్లాయిమెంట్ ఎక్ఛేంజ్‌లో సుమారు 2 లక్షల మంది నిరు ద్యోగులు తమ పేర్లను నమోదు చేసుకుని ఉన్నారు. ఏడాదికి నూరు ఉద్యోగాలు లభించడమే గగనకుసుమంగా ఉంది. ఉద్యోగాల కోసం కళ్లు కాయలు కాసేలా ఎదురు చూసీచూసీ 10వ తరగతి, ఆపైన చదువుకున్న వేలాది మంది నిరుద్యోగులు బ్యాంక్ అప్పులతోటి ఆటోలు కొనుక్కొని అస్తుబిస్తు జీవితాలు వెళ్లబుచ్చుతున్నారు. ఆటోలు తిప్పే వారిలో నూటికి 70మంది అద్దెకి తీసుకొని తిప్పుతున్నారు. రాత్రికి అద్దె చెల్లించి మిగిలిన రూ.200, అంతకు తక్కువ కష్టార్జితంతోనే ఇంటికి వెళ్లాల్సి వస్తోంది. నూటికి 80 మంది పేదసాదలకు ఉపాధి చేరువ కావాలంటే ఉపాధి హామీ చట్టం కల్పించే పనులతో పాటు, వ్యవసాయ పనులు లభించాలి. వారి బిడ్డలకు పరిశ్రమల్లో పనులు దొరకాలి. కానీ పరిశ్రమలసంఖ్య ఏళ్ల తరబడి పెరగడం లేదు. పైగా అనేకం మూతపడుతున్నాయి. అందువల్ల పెద్ద ఎత్తున నిరుద్యోగ సైన్యం పెరుగుతుంది. ప్రస్తుతం జిల్లాలో ప్రభుత్వ రంగ పరిశ్రమల్లో 7 వేలు,ప్రైయివేటు రంగ పరిశ్రమల్లో 30 వేల మంది మాత్రమే ఉపాధి పొందుతున్నారు. వ్యవసాయ, అసంఘటిత రంగ కార్మికులు లక్షల్లో ఉన్నారు.

జిల్లాలో మచిలీపట్నం బెల్, రాయనపాడు వ్యాగన్ వర్క్‌షాపు, ఇబ్రహీంపట్నంలోని ఎన్‌టివిటిపిఎస్, కొండపల్లి ఎపిహెచ్ఇఎల్, జగ్గయ్యపేట సమీపంలో విశాఖ ఉక్కు పరిశ్రమకు అనుబంధమైన లైమ్–మైనింగ్‌లు మాత్రమే ప్రభుత్వ రంగ సంస్థలుగా ఉన్నాయి. విజయవాడ, గుడివాడ, కొండపల్లి, ఆటోనగర్లలో చిన్న ఖార్ఖానాలు, ఫౌండ్రీలు, చిన్న పరిశ్రమలు ఉన్నాయి. జగ్గయ్యపేట, ఎనికేపాడు, సూరంపల్లి, పెద అవుటపల్లి, హనుమాన్‌జంక్షన్ చిన్న పారిశ్రామిక ప్రాంతాలుగా ఉన్నాయి. ప్యాకింగ్ పరిశ్రమలు జిల్లాలో 40 వరకూ ఉన్నాయి. రైసు మిల్లులు ట్రేడింగ్ 300, నాన్ ట్రేడింగ్ 900 ఉన్నాయి. వ్యవసాయం దెబ్బతినడం వల్ల అనేకం మూతపడ్డాయి. రైసు మిల్లులు, సినిమాహాళ్ళు కళ్యాణమండపాలుగా రూపుదిద్దుకుంటున్నాయి. ప్రస్తుతం జిల్లాలో 74 వరకూ పరిశ్రమలు మూతపడ్డాయి. వేలాది మంది ఉపాధి కోల్పోయారు. ఉన్న పరిశ్రమలూ అనేకం ఉత్పత్తిని తగ్గించేశాయి. ఈ కారణంగానూ ఉపాధి కొంత తగ్గిపోయింది. కొన్ని పరిశ్రమల్లో యాంత్రీకరణ, ప్రైవేటీకరణ కారణంగా కూడా పనులు కోల్పోయారు. బందరులో రోల్డ్ గోల్డ్ పరిశ్రమ సంక్షోభంలో పడింది. 10వేల మందికి ఉపాధి పోయింది. వ్యవసాయం సంక్షోభం కార

ఖంగా గుడివాడ ఆటోనగర్ మీద తీవ్రమైన ప్రభావం పడింది. నూజివీడు, జగ్గయ్యపేటలో ఆటోనగర్లకు స్థలాలు కేటాయించినా మౌలిక సదుపాయాలు రాలేదు.

జిల్లాలో ఉన్న అపారమైన వనరులను ఉపయోగించి పారిశ్రామికాభివృద్ధి చేయాల్సి ఉంది. అప్పుడే ఉపాధి అవకాశాలు లభిస్తాయి. బందరులో పోర్టుతోపాటు సముద్రతీర ప్రాంతంలో ఉన్న ఆయిల్, గ్యాస్ నిక్షేపాలను వెలికితీయాలి. ఆయిల్ రిఫైనరీ పరిశ్రమలను స్థాపించాలి. గ్యాస్ ఆధారిత పరిశ్రమలు పెంచవచ్చు. విజయవాడ పరిసరాల్లో పెద్ద పరిశ్రమలు స్థాపించాలి. అలా చేసినప్పుడు దానికి అనుబంధంగా అనేక చిన్న పరిశ్రమలు ఏర్పడతాయి. జగ్గయ్యపేట ప్రాంతంలో అపారంగా ఉన్న సున్నపురాళ్ల ఖనిజాల సంపద ఆధారంగా ప్రభుత్వ సిమెంట్ పరిశ్రమ నెలకొల్పాలి. ఆయా ప్రాంతాల్లో వ్యవసాయ ఉత్పత్తులు ఆధారంగా ఫుడ్ ప్రాసెసింగ్ యూనిట్లు రావాలి. తోళ్ల పరిశ్రమలను ఏర్పాటు చేయాలి. పట్టణాల్లో రెడీమేడ్ గార్మెంట్స్ తయారీ, గృహ పరిశ్రమలు ఏర్పాటు చేయాలి. నందిగామ, జగ్గయ్యపేట, వీరులపాడు, వత్సవాయి, పెనుగంచిప్రోలు, చందర్లపాడు, జి. కొండూరు మండలాల్లో పేపరు పరిశ్రమకు ఉపయోగపడే సూబాబుల్ కలప పండిస్తున్నారు. కాగితం, ప్లైవుడ్ పరిశ్రమలు స్థాపించవచ్చు. విజయవాడ, మచిలీపట్నం, గుడివాడల్లో చెత్త ఆధారంగా ప్రజల ఆరోగ్యానికి ఇబ్బంది లేకుండా విద్యుత్తు ప్లాంటులు నెలకొల్పవచ్చు. సముద్రతీర ప్రాంతంలో లభ్యమయ్యే ఉప్పునీరు ఆధారంగా సోడాయాష్ ప్లాంట్ ఏర్పాటు చేయవచ్చు. ఈ విధంగా ఆయా ప్రాంతాల్లో ఉన్న వనరుల ఆధారంగా పరిశ్రమలు ఏర్పాటు చేస్తే నిరుద్యోగ సమస్య చాలా వరకూ పరిష్కారమవుతుంది. జిల్లాలో విద్య, వైద్యం, ఉపాధి విషయాల్లో గుణాత్మకమైన మార్పు వచ్చినప్పుడే నిజమైన అభివృద్ధి ఆవిష్కృతమవుతుంది.

(ప్రజాశక్తి నవ్యాంధ్రప్రదేశ్ అభివృద్ధి ప్రత్యేక సంచిక సౌజన్యంతో)

# మహా సంకల్పం

ఇప్పుడు మీ సమస్త పాపాలు పరిహారం కావడానికి, మీ పితృదేవతలు సద్గతి పొందటానికి, మీ మనోభీష్టం నెరవేరడానికి పుణ్యస్నానాలు ఆచరించాలి. అందుకుగాను మహాసంకల్పం చెప్పకోవాలి. పుణ్యక్షేత్రాల్లో, ప్రత్యేక సందర్భాల్లో, ఏదేని కోరికతో చేసే స్నానాన్ని కామ్యస్నానం అంటారు. పుష్కరస్నానం కూడా కామ్యస్నానమే అవుతుంది.

డా॥ పి.వి.ఎన్. కృష్ణ

# కృష్ణాతీరంలో పద్య నాటక రంగం

ఆంధ్రప్రదేశంలో పవిత్ర కృష్ణవేణీ నదీతీరం సకల కళా నిలయం, ఏ ఇతర భాషా కాలుష్యం లేని స్వచ్ఛమైన స్పష్టమైన ప్రామాణిక తెలుగు విలసిల్లిన నేల ఇది. అచ్చమైన తెలుగు కళలు పుట్టి, పెరిగి, గుబాళించి, ప్రపంచఖ్యాతి గడించినది ఇక్కడినుంచే అంటే అతిశయోక్తికాదు.

కృష్ణానది ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కువభాగం కృష్ణా, గుంటూరు జిల్లాల సరిహద్దుగా ప్రవహిస్తోంది. ఈ పవిత్రజలపాన ప్రభావం చేతనేనేమో ఈ రెండు జిల్లాలు కళలకు ముఖ్యంగా నాట్య నాటకరంగాల పుట్టినిల్లు మెట్టినిల్లుగా అవతరించాయి. ప్రపంచ ప్రసిద్ధిగాంచిన కూచిపూడి నాట్య సంప్రదాయాన్ని సిద్ధేంద్రయోగి ఈ తీరంలో ప్రతిష్ఠించగా, ప్రపంచంలోనే ఎక్కడాలేని పద్యనాటక సంప్రదాయాల్ని కన్నదీ, పెంచి పోషించినదీ కృష్ణాతీరమే.

1880వ సం॥ వరకూ తెలుగులో ఎక్కడా స్వతంత్రంగా నాటకాలు ఆడిన ఆధారాలు లేవు. మొట్టమొదట 1880లో బందరు నోబుల్ కాలేజిప్రధానాంధ్రోపన్యాసకులైన శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి, 'మంజరీ మధు కరీయం' అనే తొలి తెలుగు నాటకాన్ని రచించారు. ఈ కాలంలోనే మహారాష్ట్ర ప్రాంతం నుండి "ధార్వాడ" నాటక సమాజాలవారు ఆంధ్రదేశమంతటా వారి మరాఠీ హిందీ నాటకాలను విజయవంతంగా ప్రదర్శించి, ప్రజలను ఉర్రూతలూగించినారు. ఆంధ్ర ప్రజలలో "నాటకం మనం కూడా ఆడాలి" అనే తృష్ణను రగిల్చిన ఘనత ధార్వాడ సమాజాలకే దక్కుతుంది. వారి స్ఫూర్తితో ఆంధ్ర దేశమంతటా నాటక సమాజాలు వెలిశాయి.

కృష్ణాతీరంలో మొదట "ఫస్ట్ కంపెనీ" అని పిలవబడే గుంటూరు నాటక సమాజం 1882లో స్థాపించబడి 1912 వరకూ కొనసాగింది. ఈ కంపెనీ ద్వారా ఉద్ధండులైన నటులు ఉద్భవించారు. నాటక రంగం పితామహునిగా పేరుపొందిన శ్రీ హరిప్రసాదరావు, శ్రీ కోపల్లి హనుమంతరావు, శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతం మొదలగు మహామహులు ఈ కంపెనీలోని వారే. వీరు బలిజేపల్లి రచించిన హరిశ్చంద్రతోపాటు, ధర్మవరం కృష్ణమాచార్యులవారి చిత్రనళీయం, విషాదసారంగధర మొదలగు నాటకాలను తెలుగునాట నాలుగు చెరగులా ప్రదర్శించారు. తరువాత 1885లో 'సెకండ్ కంపెనీ' అని పిలువబడే "విబుధరంజనీ శృంగారు హిందూ నాటక సమాజం శ్రీ కనకరత్నం శ్రేష్ఠి గారిచే స్థాపించబడింది. ఈ సంస్థ ప్రముఖనటులలో, శ్రీ మల్లాది గోవింద శాస్త్రి, శ్రీ నేతి సుబ్బరాయశాస్త్రి గార్లు ముఖ్యులు. తరువాత 1912లో శ్రీ యడవల్లి సూర్యనారాయణగారి నేతృత్వంలో అమెచ్యూర్ డ్రమెటిక్ క్లబ్ శ్రీ అద్దంకి శ్రీరామమూర్తిగారి ఆధ్వర్యంలో 1913లో స్టార్ థియేటర్‌లు స్థాపించబడినవి. వీరు ఉభయులూ అనేక పౌరాణిక నాటకాలను ప్రదర్శించి ఖ్యాతి గడించినారు. 1916లో "బాలమిత్ర నాటక సమాజం" శ్రీదంటు వెంకటకృష్ణయ్యగారిచే స్థాపించబడి 1930 వరకూ కొనసాగింది. ఈ సమాజం నుండి శ్రీ టి. రామకృష్ణా శాస్త్రి, శ్రీ కె. రఘురామయ్య, శ్రీ సూరిబాబు, శ్రీ అంజి మొదలగు నటులునూ మరియు దీనికి అనుబంధంగా ఉన్న 'నవలా నాటక సమాజం' అనే స్త్రీల నాటక సమాజం ద్వారా శ్రీమతుల దాసరి కోటిరత్నం, పసుపులేటి కన్నాంబ, ఆదోని అమ్మణీబాయ్, దాసరి యామినీ పూర్ణతిలకం మొదలగు నటీమణులు నాటకాలతోపాటు సినీరంగంలో కూడా ప్రఖ్యాతిని ఆర్జించారు.

తరువాత హిందూకాలేజి డ్రమెటిక్ అసోసియేషన్ మొదలగు సంస్థలు కొన్ని వెలసి నాటకపోటీలు నిర్వహించేవారు. ఆ పోటీలలో శ్రీ వేమూరు రామయ్య, ప్రముఖ సినీనటులు శ్రీ ధూళిపాళ సీతారామ శాస్త్రి, కళాప్రపూర్ణ పీసపాటి నరసింహమూర్తి, మొదలగువారు బహుమానాలను పొందారు. వీరేకాక గుంటూరు ప్రాంతం నుండి అనేక సమాజాల ద్వారా శ్రీ మందపాటి రామలింగేశ్వరరావు, శ్రీ టి. పుండరీకాక్షయ్య, ఎమ్.వి.ఎస్. శాస్త్రి, పెళ్ళూరి శేషగిరిరావు, జి. వరలక్ష్మి, ఛాయాదేవి, కళావాచస్పతి కొంగర జగ్గయ్య, గుమ్మడి వెంకటేశ్వరరావు, బాలయ్య, తారాబాయి మొదలగు అనేకమంది నటీనటులు నాటక మరియు సినీరంగాలలో రాణించారు.

# కృష్ణాతీరంలో పద్య నాటక రంగం

ఇక కృష్ణాతీరంలో తెనాలి పట్టణం నాటకరంగంలో నేటికీ మకుటాయమానంగా భాసిల్లుతున్నది. ఇక్కడ 1912లో 'రామవిలాస్ సభ' అనే నాటక సమాజాన్ని స్థాపించారు. ఈ సమాజంలో ప్రసిద్ధిగాంచిన నటులు శ్రీ గోవిందరాజుల సుబ్బారావు, దుర్యోధన పాత్ర అనితర సాధ్యంగా పోషించిన మాధవపెద్ది వెంకటరామయ్య, ఆంధ్రనాటక రంగం నుండి పద్మశ్రీ అందుకున్న తొలి నటుడు శ్రీ స్థానం నరసింహారావు, శ్రీ పులిపాటి వెంకటేశ్వర్లు మొదలగు నటులు ఈ సమాజంవారే వీరు నటించిన వేదం వారి ప్రతాపరుద్రీయం, గురజాడవారి కన్యాశుల్కం, శ్రీపాదవారి 'బొబ్బిలి' నాటకాలు జగత్ప్రసిద్ధిగాంచాయి. వీరేకాక ఈ ప్రాంతంనుండి శ్రీ కృష్ణ పాత్రకు 'ట్రెండ్ సెట్టర్' అయిన శ్రీ అబ్బూరి వరప్రసాద్‌రావు, శ్రీ ఎ.వి.సుబ్బారావు, బాలనాగమ్మలో మాయలఫకీర్ శ్రీ వల్లూరి వెంకట రామయ్య, నాటకరంగంనుండి సినీ రంగానికి వెళ్ళిన శ్రీ వేమూరు గగ్గయ్య, సి.ఎస్.ఆర్. ఆంజనేయులు, సీతాకుమారి, రత్నమాల, కె.సావిత్రి మొదలగు నటీనటులు ఈ రంగాన్ని సుసంపన్నం చేసారు.

ఇక కృష్ణానది ఇవతలి ఒడ్డు అయిన కృష్ణాజిల్లాకు వస్తే ఈ జిల్లాలో నాటకరంగం గురించి మొట్టమొదట ప్రస్తావించవలసినది 'మైలవరం బాలభారతి'. ఆ రోజుల్లో మైలవరం జమీందారు శ్రీ రాజా సూరానేని వేంకట పాపయారావు బహద్దరు గారు తెలుగునాట ఉన్న ప్రసిద్ధిచెందిన నటులందరినీ రప్పించి వారికి జీతాలు ఏర్పాటు చేసి, ఒక బ్రహ్మాండమైన హాలును నిర్మించి, సురభివారి సెట్టింగులకు దీటుగా అన్ని హంగులతో నాటకాలను నిర్విరామంగా ఆడించారు. ఆనాడు ఈ సమాజనాటకానికి 3 రోజులముందే టికెట్లు రిజర్వు చేసుకునేవారు. ఈసమాజంలో శ్రీ యడవల్లి, శ్రీ ఉప్పులూరు సంజీవ రావు, శ్రీ గురజానాయుడు, శ్రీ పారుపల్లి సుబ్బారావు, శ్రీ జొన్నవిత్తుల శేషగిరిరావు, శ్రీ కపిలవాయి రామనాథశాస్త్రి, శ్రీ నిడుముక్కల సుబ్బారావు మొదలగు మహామహులు పనిచేసారు. కానీ ఆనాటి నటుల ధనదాహం అనైక్యతా కారణంగా రాజావారి ఆస్తి కళామతల్లికి నీరాజనం అర్పించిన హారతికర్పూరంవలె దేదీప్యమానంగా వెలిగి హరించుకుపోయినది. నాటినుండి నేటివరకూ ఏ పద్యనాటకాన్ని ప్రారంభించడానికైనా ముందు పాడే ప్రార్థనాగీతం 'పరబ్రహ్మ, పర మేశ్వర పురుషోత్తమ సదానంద' గీతాన్ని రచించినవారు కృష్ణాజిల్లా నందిగామ ప్రాంతవాసి శ్రీ చందాల కేశవదాసు కాగా ట్యూన్ చేసిన సంగీత విద్వాంసుడు పాటల్ల కాంతయ్య కూడా ఈ సమాజంలోనివాడే కావడం విశేషం.

తరువాత విజయవాడ 1948లో 'ఆంధ్ర ఆర్ట్సు థియేటర్' స్థాపించబడి జాతీయస్థాయి నటీనటులను అందించింది. సినీ రచయిత అనిశెట్టి, ప్రముఖ దర్శకుడు వి. మధుసూదనరావు, కళాప్రపూర్ణ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, రక్తకన్నీరు నాగభూషణం, కర్నాటి లక్ష్మీ నరసయ్య, ఆదిశేషయ్య మొదలగు గొప్ప కళాకారులనెందరినో అందించి నేటికీ సజీవంగా ఉంది. అలాగే 1947లో విజయవాడలో 'నేషనల్ ఆర్ట్సు థియేటర్' నటరత్న ఎన్.టి.రామారావు, ఎన్. త్రివిక్రమరావు, ఎ. పుండరీకాక్షయ్య, సుంకర కనకారావు, శ్రీమతులు వహీదా రహమాన్, సావిత్రి, కమలకుమారి మొదలగు మహానటీనటులతో తేజరిల్లి, వీరిలో చాలామంది సినీరంగప్రవేశం కారణంగా చిత్ర నిర్మాణ సంస్థగా రూపొందింది. తరువాత 1962లో సత్యనారాయణపురం సాయిబాబా నాట్యమండలి. శ్రీ సూరిబాబు రాజరాజేశ్వరి నాట్యమండలి, శ్రీ బందా కనకలింగేశ్వరరావు, బి.వి. రంగారావు, శ్రీ వేమవరపు శ్రీధరరావుగారు నాట్యభారతిని స్థాపించి అనేక పౌరాణిక నాటకాలకు ప్రాణం పోసారు. వీరు కాక విజయవాడ నుండి కె. నాగేశ్వరరావు, కందుకూరి చిరంజీవిరావు, సూరవరపు, మల్లాది సూర్యనారాయణ, సి. రామ్మోహనరావు, అన్నాప్రగడ లక్ష్మీకాంతరావు, డి.వి. నరసరాజు, అబ్బూరి కమల, విన్నకోట రామన్నపంతులు, ఉషాబాల, ఋష్యేంద్రమణి, కనకం, డా॥ గరికపాటి రాజారావు మొ॥వారు ఇక్కడ ప్రభవించిన వేలాది కళాకారులలో కొందరు మాత్రమే. తరువాతికాలంలో రంగస్థల నటసార్వభౌమునిగా వెలుగొందిన ఆచంట వెంకటరత్నం నాయుడు దుర్యోధన జలంధర పాత్రలు, గుమ్మడి జయరాజు భవానీ శంకరుడు, కె. హరిప్రసాదరావు శ్రీ కృష్ణుని పాత్రలు ఆంధ్రదేశాన్ని ఉర్రూతలూగించియని చెప్పవచ్చు. వీరి సమకాలికులుగా వెలుగొందిన శ్రీ ఉప్పలూరి రాజారావు, శ్రీ జి. ప్రభాకరరావు, శ్రీ సీతంరాజు రామకృష్ణ, శ్రీ పృథ్వి వెంకటేశ్వర్లు, శ్రీ బండి కోటేశ్వరరావు, శ్రీ అరిగల జేమ్సు, శ్రీ సుదర్శనరావు, శ్రీ మెండు గోవర్ధనరావు మొదలగువారంతా పరమపదించినా జన హృదయాలను ఇప్పటికీ మధిస్తూనే ఉన్నారు.

ఇక ముఖ్యపట్టణమైన బందరులో 1884లో జాబిలి థియేటర్, దేవరసు వెంకట సుబ్బారావు, బాలకృష్ణయ్యగార్లచే స్థాపించబడింది. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, ఇవటూరి నాగభూషణం మొ॥వారు ఈ సమాజంలోనివారే. 1919లో శ్రీ డి.వి. సుబ్బారావు "ఇండియన్ డ్రమటిక్ కంపెనీ" స్థాపించి దిగ్విజయంగా నాటకాలాడారు. 1947లో ముట్నూరి కృష్ణారావుగారు 'వసంతవని' స్థాపించారు. ఇదిగాక నేషనల్ థియేటర్, రాయల్ హిందూ థియేటర్, ఛత్రపూర్ జగన్మోహన్ థియేటర్, భువనరంజని, శారదావిలాస్ నాటక సమాజం మొదలగు ఎన్నో సమాజాలు తెలుగునేలను కళాసంపన్నం చేశాయి. ఇప్పటికి శ్రీ జె. జగన్‌మోహనరావు, గాంధి, శ్రీ జనార్థన్ గౌడ్ మొదలగువారు ఈ ప్రాంతం నుండి నాటకాలు ఆడుతున్నవారిలో ముఖ్యులు.

ఆంధ్రనాటకరంగంలో ఎందరో మహామహులను అందించిన ఆంధ్ర నాటక కళాపరిషత్ గుడివాడ పట్టణంలో 1929లో స్థాపించబడి పని చేస్తోంది. దుక్కిపాటి మధుసూధనరావు, కాజ వెంకట్రామయ్య, ఎర్రోజు మాధవాచార్యులు, త్రిపురనేని వరప్రసాదరావు, పోలవరపు సూర్యప్రకాశరావుగార్లు దీన్ని స్థాపించారు. శ్రీ ఎం.ఆర్.అప్పారావు నూజివీడు జమిందారు, దీనికి పోషకులుగా ఉన్నారు. 1935 రామ విలాస సభ,1942 ప్రభాకర నాట్యమండలి, కళాప్రభ,విశ్వకళా సమితి, మొదలగు సంస్థలు వెలిసాయి. జంధ్యాల గౌరీనాథ శాస్త్రి, గానగంధర్వ శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు, దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు గ్రహీత డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు సరసీరుహం, పెండ్యాల నాగేశ్వరరావు, కైకాల సత్యనారాయణ, గిరిజ, బి.ఎం.సూరి మొదలగు వారుగుడివాడ ప్రాంతం నుండి నాటకాల ద్వారా సినీరంగంలోకి ప్రవేశించి ధృవతారలుగా వెలుగొందారు. వీరేకాక శ్రీ ఆర్.ఎ. నాయుడు, శ్రీ కొడాలి వీరాంజనే యులు, శ్రీ వల్లూరు శ్రీహరిరావు, శ్రీ గొట్టాపు కృష్ణ, శ్రీ విశ్వేశ్వరరావు, శ్రీ దగ్గుమిల్లి ప్రసాద్ మొద లగువారు ఈ ప్రాంతంలో అద్భుతమైన నాటకాలను ప్రదర్శిస్తున్న మహామహులని చెప్పవచ్చు.

ఇదంతా పూర్వరంగం. ప్రస్తుతం నాటకరంగానికి పూర్వవైభవం లేదు. సినిమా, టివీల ప్రభావంచే నాటకాన్ని ఓపిగ్గా కూర్చుని చూసే వారు తగ్గిపోయారు. ప్రస్తుతం పౌరాణిక నాటక పద్యాలను పోషిస్తున్నది ఉత్సవ పందిళ్ళు.కాగా సాంఘిక నాటకాలను పోషిస్తున్నది ఔత్సాహిక పరిషత్తులు మాత్రమే. ఎప్పుడైతే నాటకరంగానికి పోషకులు కరువై నారో నాటకాల నాణ్యత తగ్గుముఖం పట్టింది. ఒకనాడు గ్రూపు నాటకాలను టిక్కెట్లు రిజర్వ్ చేసుకుని మరీ చూసేవారు. కానీ ఈనాడు పెద్ద పెద్ద నటీనటులను సమ్మేళన పరిచి నాటకం ఆడించినా టిక్కెట్లు బతిమాలి అంటకట్టవలసిన స్థితికి దిగజారింది.

పరిస్థితులు ఇలా ఉన్నా కృష్ణాతీరంలో నాటకరంగాన్ని ప్రజలు ఆదరిస్తూనే ఉన్నారు. వేలాదిమంది ప్రజలను రంగస్థలం ముందుకు రప్పించి వారిని మంత్రముగ్ధులను చేయగల నటీనటులు, సంగీత దర్శకులు, సాంకేతిక వర్గం నాటక సమాజాలు ఇంకా ఇక్కడ విరాజిల్లు తూనే ఉన్నాయి. 1998లో అప్పటి తెలుగుదేశం ప్రభుత్వం ఆధ్వ ర్యంలో నందినాటకోత్సవాలు ప్రారంభించి క్రమం తప్పకుండా జరుపుతూ నాటక కళను ప్రోత్సహించడం వలన నాటకం కొత్తరూపు సంతరించుకుంది. ముఖ్యంగా పద్యనాటక విభాగంలో పాతుకు పోయిన అతి ఆలాపనలు, సుదీర్ఘనాటకాల స్థానంలో భాష, భావ యుక్తంగా పద్యపఠనం, సందర్భోచిత నటన, రంగాలంకరణ, దీపా లంకరణ విభాగాల్లో అధునాతన సాంకేతికతలు కలిగిన నాటకాలు వచ్చాయి. పద్యనాటకవిభాగంలో అనేక ప్రయోగాలు చేసిన డా॥రామన్ ఫౌండేషన్‌వారి శ్రీ సాయిబాబా నాట్యమండలి "ప్రథమ స్వాతంత్ర్య మహాసంగ్రామం – 1887", "శ్రీ ఖడ్గ తిక్కన", "ఉషా పరిణయం", "శ్రీమాధవవర్మ", "పృథ్వీరాజ్‌రాసో" మొదలగు నాటకాల ద్వారా 17 నంది అవార్డులు సాధించి ఈ కృష్ణాతీరానికి తలమానికంగా నిలిచింది. ఈ నాటకాల రచయిత, దర్శకుడు, నటుడు డా॥ పి.వి. ఎన్.కృష్ణ వ్యక్తిగతంగా 11 నందులను గెలుచుకున్నారు. అలాగే అంత ర్జాతీయ రంగస్థల నటులుగా పేరుతెచ్చుకుని "వేమన", "శ్రీనాథుడు", "శ్రీకృష్ణతులా భారం" మొదలగు నాటకాలకు నంది అవార్డులు గెలుచుకున్న శ్రీ గుమ్మడి గోపాలకృష్ణ, నాటకరంగ మేధావులుగా కీర్తించబడుతున్న శ్రీ జి.ఎస్.ఎన్.శాస్త్రి, శ్రీ బుర్రా సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ డి.ఎస్.దీక్షిత్, శ్రీ తుర్లపాటి రాధాకృష్ణమూర్తిలు హైదరాబాద్‌లో స్థిరపడినా కృష్ణాతీరంలో జన్మించి ఈ ప్రాంతంలో నాటకరంగంలో ఓనమాలు దిద్దుకుని ప్రపంచస్థాయి కీర్తిని సంపాదించారు.

ఇంకా ఈ ప్రాంతంలో కీ॥శే॥ ఏ.వి.సుబ్బారావుగారి కుమారులైన శ్రీ ఎ.వెంకటేశ్వరరావు, శ్రీ ఎ.కోటేశ్వరరావు, శ్రీ ఆదినారాయణలు, కీ॥శే॥ ఆచంట వెంకటరత్నం నాయుడు కుమారుడు ఆచంట బాలాజీ నాయుడు, కీ॥శే॥ కె.హరిప్రసాదరావుగారి కుమారుడు కె.గణేష్‌కుమార్, కీ॥శే॥ గుమ్మడి జయరాజుగారి కుమారుడు గుమ్మడి జీవన్‌కుమార్, డి.వి.సుబ్బారావుగారి మనుమడు జూ॥ డి.వి.సుబ్బారావు, శ్రీ ఉప్పు లూరి రాజారావుగారి మనుమడు శ్రీ ఉప్పులూరి రఘురామశర్మ మొదలగువారు తాత,తండ్రులకు ధీటుగా పద్యనాటక రంగాన్నే వృత్తిగా ప్రవృత్తిగా ఎంచుకుని నాటక వారసత్వాన్ని నిలబెడుతున్న మహా మహులని చెప్పవచ్చు.

వీరేకాక ఈ నాటకరంగాన్ని సుసంపన్నం చేసినవారిలో శ్రీ ఉప్పల పాడు సైదులు, శ్రీ కె.వి.ఎన్. ఆచార్యులు, శ్రీ బోయిన వెంక టేశ్వరరావు, నాటకరంగంలో స్త్రీ పాత్ర అనే అంశంపై పి.హెచ్.డి. చేసిన డా॥ శామనపూడి వెంకటేశ్వరరావు, శ్రీ ఉప్పులూరి లక్ష్మీ నారాయణ, శ్రీ సి.హెచ్.బాబూరావు, శ్రీ వేమూరి నాగేశ్వరశర్మ, శ్రీ సి.హెచ్.జగదీష్, శ్రీ ఎం.వెంకటేశ్వర్లు, శ్రీ ఎల్.ఎస్.ఆర్.కె.ప్రసాద్, శ్రీ ఎమ్.శ్రీరాములు, శ్రీ ఎమ్. సాంబశివరావు, శ్రీ జి.రమణయ్య, శ్రీ శ్రీనివాస నాయక్, శ్రీ సి.హెచ్.రాజన్న, శ్రీ పలగాని రాంబాబు మొదలగువారు ప్రముఖు లుగా చెప్పవచ్చు. ఇక నటీమణులలో శ్రీమతులు లక్ష్మీకరుణ, లక్ష్మీ కామేశ్వరి, విజయలక్ష్మీ, విజయదుర్గ, జ్యోతి, అనూరాధ, ఎం.లక్ష్మీ,

కోటేశ్వరి, అనూరాధ, విజయదుర్గ మొదలగువారు ఇప్పటికీ తమ హావభావాలతో నాటకరంగంలో రాణి స్తున్నవారే. అలాగే ఎంతోమంది నాటక కళాకారులను తయారుచేసి నాటకరం గానికి మూలస్థంభాలుగా నిలిచిన హార్మోనియం విద్వాంసులు కీ॥శే॥ రామానుజ సూరి, నరసింహా చార్యులు చింతా ఆంజనేయులు, కె.ఆర్.కె. శాస్త్రి, బి.కృపారావు, విల్సన్, రత్నారావు, భుజంగరావు గార్లు కీర్తిశేషులయినా వారి సుస్వరాలు మాత్రం ప్రజల గుండెల్లో నేటికీ మ్రోగుతూనే ఉన్నాయి. ప్రస్తుతంలో శ్రీ సి.హెచ్. నాగేశ్వరరావు, శ్రీ ఎ.పరబ్రహ్మాచారి, శ్రీ యజ్ఞనారాయణ, శ్రీ పి.వి.రమణమూర్తి, శ్రీ బి.గంగాధరరావు, శ్రీ వెంకటేశ్వరరావు, శ్రీ కనకారావు, శ్రీ సూర్యనారాయణ, శ్రీ ఎ.వి. ప్రసాదరావు, శ్రీ వాసు, శ్రీ చంద్రశేఖరరావు, శ్రీ జమ్మిబాబు, శ్రీ కె. రామయ్య మొదలగువారు ఈ ప్రాంతంలో ప్రభవించి నాటకాలకు బాణీలు కడుతున్న హార్మో నియం విద్వాంసులు.

ఇంకొక ముఖ్య విశేషం విజయవాడలో దేశంలో ఎక్కడా లేని విధంగా గత 50 సం॥లుగా కేవలం పోలీసువారిచే ఒక పద్యనాటక సమాజం నిర్వహించబడుతూ ప్రతి సం॥ విజయదశమినాడు కురు క్షేత్రం నాటకాన్ని ప్రదర్శిస్తారు. ఆ నాటకాన్ని చూడటానికి సాక్షాత్తూ కనకదుర్గమ్మ మేళతాళాలతో ఊరేగుతూ వచ్చి ఆ నాటకంలో చివరి విజయాంకాన్ని చూచి వెళ్ళడం అనే సంప్రదాయం 60 సం॥లుగా ఇక్కడ కొనసాగుతోంది.

అంతేగాక విజయవాడ హనుమంతరాయ గ్రంథాలయం, రామ్మో హన లైబ్రరీలో ఉన్నన్ని పురాతన పద్యనాటక పుస్తకాలు ఇంకెక్కడా లేవని చెప్పవచ్చు.

పైన నేను ఉదహరించిన నాటకరంగం గురించిన విషయాలు, నిండు కృష్ణానదియంత నాటకరంగ చరిత్రలో పురిషెడు పవిత్ర జలం మాత్రమే. వేలాదిమంది నటీనటులు, సంగీతవాద్య సహకారులు, ఆహార్యరంగాలంకరణ కళాకారులు, దర్శకులు, గాయకులు, కళా పోషకులు ఎందరో ఈ నాటకరంగ ప్రాభవానికి కృషిచేసినా గణుతి కెక్కినవారు కొందరే. కానీ దుర్భర దారిద్ర్యంతో కళనే వృత్తిగా స్వీకరించి సమిధలై కాలిపోతూ వెలుగు పంచుతున్నవారు ఎందరో ఎందరెందరో. వారికి కొంత సహకారం ప్రభుత్వం ధార్మిక సంస్థలు, అందించటం తక్షణ కర్తవ్యముగా భావించాలి. అలాగే తెలుగు సాహిత్యంలో అనేక కోట్ల పద్యాలు ఉన్నా వాటిని సామాన్యుని నాలుకపై నర్తింపజేయగల శక్తి ఒక పద్యనాటకానికి మాత్రమే ఉన్నది. మన తెలుగువారికి మాత్రమే సొంతమైన ఈ పద్యనాటకరంగం కాపాడబడాలన్నా, ఈ రంగం పట్ల యువత మొగ్గుచూపాలన్నా, దానిలో వారికి ఉపాధి కల్పించబడవలసిన అవసరము ఉన్నది. అలాగే తెలుగులో పద్య నాటకము పాఠశాల, కళాశాల స్థాయిలలో పాఠ్యాంశాలుగా చేర్చి ప్రోత్సహించగలిగితే 11 పుష్కరాల మన తెలుగు సాంస్కృతిక వార సత్వ సంపద అయిన పద్య నాటకరంగం అఖండ కృష్ణవేణీ ప్రవా హంవలే కొత్త వంపుసొంపులతో అవిచ్ఛిన్నంగా ప్రవహిస్తూ తెలుగు హృదయక్షేత్రంలో ఆనందానుభూతులను పండిస్తూనే ఉంటుంది.

*(నాకు తెలిసిన పెద్దల ద్వారా సేకరించిన పై విషయాల్లో నేను స్థలాభావం చేత చాలామందిని ప్రస్తావించలేకపోయాను. ఎవరినీ ఉద్దేశపూర్వకంగా వదిలివేయడం జరగలేదని గ్రహించి తప్పులున్నచో మన్నించవలసినదిగా పాఠకులకు మనవి)*

**చిరునామా :** డా॥ పి.వి.ఎన్. కృష్ణ, *డోర్ నెం. 42-69-22, అజిత్‌సింగ్‌నగర్, విజయవాడ. సెల్ : 9440900592, 9441030937.*

డా॥ కందిమళ్ల సాంబశివరావు

# కృష్ణాతీరంలో నాటక సమాజాలు

నాటకం జనజీవనదర్పణం. నాటకం మానవ హృదయ స్పందనల ఆవిష్కరణం. నాటకం ఆలోచనల క్షీరసాగరమథనం. నాటకం సమస్యల మత్తేభాలపై ఎక్కుపెట్టిన అంకుశం. నాటకం నవత.. భవితల అంకురం. నాటకం మనోతంత్రులను మీటే సాధనం. నాటకం అస్తవ్యస్థ వ్యవస్థపై సంధించిన ఆయుధం. నాటకం రచయిత మనోక్షేత్రంలో పురుడుపోసుకొని అక్షరాల ఆకృతితో నటీనటుల అభినయవేదికపై చీకటి వెలుగుల రంగేళీతో సామాజికునికి కొంత ఉల్లాసం, మరికొంత ఉత్తేజం.. ఇంకొంత ఉద్రేకం కలిగించే పదునైన రూపకం. నాటకం విభిన్న పాత్రల సమ్మేళనం. ఆ పాత్రధారుల సమిష్టి కృషికి సంకేతం.ఆ పాత్రధారుల మేలికలయికే నాటకసమాజం. ఒక పౌరాణిక ఇతివృత్తాన్నో, ఊహాతీతమైన వాస్తవ విరుద్ధ ఇతివృత్తాన్నో లేదా సమాజదర్పణమైన అంశాన్నో రచయిత ఆయాపాత్రల ముఖతః విన్పిస్తే ఆ పాత్రలకు జీవం పోసి ప్రాణప్రతిష్ట చేసి అభినయించేవాడు కళాకారుడు. అటువంటి కళాకారుల సమూహమే నాటక సమాజం. ఆంగ్లంలోని **ASSOCIATION** అనే పదానికి సమానార్థంగా సమాజము లేదా సంస్థ అనే పదాన్ని లోకంలో ప్రయోగిస్తున్నారు.

తెలుగు నాటకానికి పురుడు పోసిన వైతాళికుడు కందుకూరి వీరేశలింగంతోనే తెలుగు నాటిక సమాజం కూడా ఆవిర్భవించింది. మిత్రుల ప్రోత్సాహంతో 1880 నవంబర్ ; డిసెంబర్ ప్రాంతాలలో రాజమహేంద్రవరంలో కళాశాల విద్యార్థుల నాటక సమాజాన్ని నెలకొల్పారు. విజయనగరం బాలికా పాఠశాలలో వ్యవహారధర్మబోధిని నాటకాన్ని తొలిసారిగా ప్రదర్శించారు. ఈ సమాజంలో కందుకూరితో పాటు సోమంచి శంకరం ; అడవిగొల్లు కనకరాజు అనే ఔత్సాహికులు సభ్యులుగా ఉన్నారు. ధార్వాడి నాటక సమాజం విడిచి వెళ్లిన పాకలలో రత్నావళి, చమత్కార రత్నావళి నాటకాలను ప్రదర్శించారు. తొలి తెలుగు నాటకకర్త కందుకూరి నాటక సమాజ నిర్వహణలోని కష్టాలను తన స్వీయచరిత్రలో ఈవిధంగా పేర్కొన్నారు. “ఈ నాటక ప్రయోగము వలన సహితము పట్టణములో సంక్షోభము కలుగకపోలేదు. ఈ నాటకమునందలి పాత్రలు విస్తారముగా పాఠశాలలోని విద్యార్థులు సంరక్షకులు తమ బాలురచేత వేషములు వేయించినందుకయి నామీద నభియోగము తెచ్చెదమని నన్ను బెదిరించిరి. నాటక ప్రదర్శనము వలన విశేష లాభము కలుగుననియూ,నీతి వృద్ధియగుననియూ నేను దలచియుండిననూవిద్యార్థులునాటకములాడుటయందలి యుత్సాహము చేత తమ పాఠములయందు శ్రద్ధను జూపునట్లు కనపడినందున నాటక సమాజములయందుట తర్వాత నేనంతగా నాదరము చూపుచు రాలేదు. (స్వీయచరిత్ర 1వ భాగము పుట 175-176) అని పేర్కొన్నారు.

తెలుగు నాటక సమాజాల చరిత్రను డాక్టర్ సి.యస్.ఆర్. అప్పారావు ఐదు దశలుగా విభజించారు. ప్రథమ దశ లేదా ఆరంభయుగము (1880-86). ద్వితీయ దశ లేదా వికాస యుగము (1886-1912) తృతీయ దశ లేదా స్వర్ణయుగము (1912-1928) చతుర్థదశ లేదా సంధియుగము (1928-1944) పంచమ దశ లేదా నవ్యయుగము (1944-1960) ఆయా యుగాలలోను నాటక సమాజాల స్వరూప స్వభావాలను రేఖామాత్రంగా తెలుసుకొనవలసి ఉంది. ప్రథమ దశలో కేవలం విద్యార్థులు; ఉపాధ్యాయులు ప్రత్యేకించి తెలుగు పండితులు కలిసి సమాజాలుగా ఏర్పడ్డారు. నాటక సమాజ ఆవిర్భావానికి కారకులైన తెలుగు పండితులే నాటక కర్తలు కూడా కావడం విశేషం. వారే దర్శకులుగా కూడా వ్యవహరించేవారు. నాటక సమాజాలకు స్థానికంగా ఉన్న పెద్దల హార్దిక, ఆర్థిక తోడ్పాటు పూజ్యమని చెప్పవచ్చు. ఎక్కువ మంది తల్లిదండ్రులు తమ పిల్లలను నాటకాలలో వేషాలు వేయడానికి అంగీకరించేవారుకాదు. విద్యార్థులు చాటుమాటుగానాటకాల్లో నటించే వారు. రెండవదశలో ధనవంతులు, ఉద్యోగస్తులు నాటక సమాజాలను ఆదరించారు. నాటక రచయితలతోపాటు ఉన్నతోద్యోగులు కూడా

నాటకాల్లో నటించేవారు. అంతకుముందు పుట్టిన నాటక సమాజాలు బలపడగా కొత్తగా ఏర్పడిన సమాజాలు కట్టుదిట్టమైన పునాదులమీద అవిర్భవించాయి. ప్రతి నాటక సమాజానికి ఒక రచయిత ఉండేవారు. 1900 ప్రాంతంలో పలు నాటక సమాజాలు స్వంత నాటక సమాజాలను ఏర్పాటుచేసుకొన్నాయి. ఔత్సాహిక దశనుండి వృత్తి నాటకరంగం నడిచింది. నాటకమంటే సమాజంలో విపరీతమైన గౌరవం ఏర్పడింది.

తృతీయ దశలో అనేక నాటక సమాజాలు వ్యాపారమార్గంలో నడిచాయి. ప్రతిభ, ప్రజలలో ఉన్న మోజు ఆధారంగా నటీనటులకు జీతభత్యాలను ఏర్పాటుచేశారు. వేలాదిరూపాయలతో సీనరీ సెట్టింగులను తయారుచేసినాటకాలను ఆర్భాటంగా ప్రదర్శించారు. తొలిదశలో బళ్ళారి; మద్రాసు ప్రాంతాలలో పాటలూ ; పద్యాలకు ప్రాధాన్యం ఉండగా తృతీయ దశలో సర్కారు ప్రాంతంలో అవి వ్యాప్తి చెందాయి. హార్మోనియం, తబలా వంటి సంగీత వాయిద్య పరికరాల వినియోగం పెరిగిపోయింది. నాలుగవ దశలో వ్యాపార సమాజాలు చెల్లాచెదరై పోయాయి. కాంట్రాక్స్ దశ దూసుకువచ్చింది. క్షీణదశలో నాటకం కొట్టుమిట్టాడింది. ఈ దశలో అటు బళ్లారిరాఘవ ఇటు ఆంధ్రనాటక కళాపరిషత్ నాటకరంగాన్ని మలుపుతిప్పారు. నవ్యదశలో ఔత్సాహిక నాటక సమాజాలు విశేషంగా అభివృద్ధి చెందాయి. ఈ ఐదు దశలతో పాటు ఆధునిక దశ (1930 నుండి నేటివరకు) ఎన్నో ప్రయోగాలకు నాటక సమాజాలు పెద్దపీటవేశాయి. నటులకు సమాజంలో విశేషమైన గౌరవ ప్రతిష్టలు పెరిగాయి. పోటీ నాటకాల ప్రభంజనంలో నాటక సమాజాలు ఎన్నో నూతన మార్గాలకు బీజం వేశాయి. ఈ నేపథ్యంలో కృష్ణాతీరంలో వెలసిన నాటక సమాజాల చరిత్రను విహంగవీక్షణంగా పరిశీలించవలసి ఉంది.

## హిందూనాటక సమాజం

యావదాంధ్ర దేశంలో సంచరించి తెలుగు నాటక మాధుర్యాన్ని ప్రేక్షకులకు చవిచూపించిన తొలి నాటక సమాజం హిందూ నాటక సమాజం. ధార్వాడ నాటక సమాజం గుంటూరులో ప్రదర్శించిన నాటకాల మూలంగా స్థానికంగా ఉన్న కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి ఆసక్తిగల విద్యార్థులతో పాటు ఒక నాటక సమాజాన్ని స్థాపించారు. ఉత్తర సర్కారు ప్రాంతంలో ఏర్పడిన ఈ నాటక సమాజంలో కొండా వెంకటప్పయ్య పంతులు; తోలేటి అప్పారావు; పాతూరి శ్రీరాములు; భాగవతుల చెన్నకృష్ణయ్య; వంటివారు సభ్యులుగాఉండేవారు. పాతూరి శ్రీరాములు ఆధ్వర్యంలో గుంటూరు అగ్రహారంలోని ఏడుగొందుల సందు వద్ద నాటకశాలను నిర్మించారు. ఈ సమాజం ప్రదర్శించి కొండుభోట్ల రచించిన ద్రౌపదీ వస్త్రాపహరణంవిశేషప్రజాదరణను పొందింది. ఈ సంస్థ రాష్ట్రవ్యాప్తంగా ప్రదర్శనలివ్వగా మిగిలిన ధనంతో పూర్వం దేరాహాలుగా పిలవబడే ప్రదేశంలో నాటకశాలను నిర్మించారు. ఈ హాలును ఫస్ట్ కంపెనీహాలు,సీనియర్ హిందూ థియేటర్‌గా పిలిచేవారు. కాలక్రమంలో హిందూ నాటక సమాజాన్ని గుంటూరు ఫస్ట్ కంపెనీ పేరుతో పిలిచేవారు. ఈ సమాజంలో హరిప్రసాదరావు; కోపల్లె హనుమంతరావు; కొండా వెంకటప్పయ్య పంతులు; పత్రి శీనప్ప బలిజేపల్లి లక్ష్మీకాంత కవి నటులుగా ఉండేవారు.

### గుంటూరు సెకండ్ కంపెనీ - (విబుధరంజనీ శృంగార హిందూ నాటక సమాజం)

గుంటూరు ఫస్ట్ కంపెనీతోపాటు గుంటూరులోనే వెలసిన విబుధ రంజనీశృంగార హిందూ నాటక సమాజం అనేక నాటకాలను పోటా పోటీగా ప్రదర్శించి పేరుపొందింది. 1895లో చేస కనకరత్నంశ్రేష్ఠి ఈ సమాజాన్ని స్థాపించారు. గుంటూరులో వెలసిన రెండవ నాటక సమాజం కావడంతో దీనిని సెకండ్ కంపెనీగా పిలిచేవారు. పొన్నాడ చంద్రధరం, పలు శేషగిరిరావు ఈ సంస్థకు అధ్యక్ష కార్యదర్శులు. కనకరత్నం శ్రేష్ఠి ఫస్ట్ కంపెనీ నాటక శాల సమీపంలోనే నాటకశాలను నిర్మించారు. మల్లాది గోవిందశాస్త్రి; మందపాటి నరసింహారావు వంటివారు ఈ సమాజసభ్యులు. హరిశ్చంద్ర, సారంగధర, ద్రౌపదీ స్వయంవరం నాటకాలను మల్లాది గోవిందశాస్త్రి ప్రధాన పాత్రధారిగా ఈ సమాజం ప్రదర్శించింది.

## శ్రీరామ విలాససభ

పెద్దిభొట్ల రామయ్య తెనాలిలో ఈ నాటక సమాజాన్ని సంగీత నేషనల్ మనోరంజనీ విలాస సభ పేరుతో స్థాపించారు. భాగవతుల రాజగోపాలం ఈ నాటక సమాజాన్ని నాటకశాలను కొనుగోలు చేసిన సందర్భంలోరామయ్య షరతు మేరకు శ్రీరామవిలాససభగా మార్చారు. ఈ సంస్థకు త్రిపురారిభొట్ల వీరరాఘవస్వామి; తల్లావజ్జల శివశంకర శాస్త్రి భాగవతుల రాజగోపాలం దర్శకులుగా వ్యవహరించారు. మాధవపెద్ది స్థానం; పెద్దిభొట్ల, పులిపాటి; పిల్లలమర్రి; వంగర; లింగమూర్తి వంటి మహామహులు ఈ సమాజంలో నటించారు. ఈ సమాజం ప్రతాపరుద్రీయం ; బొబ్బిలియుద్ధం ; రోషనార, శ్రీకృష్ణతులాభారం; షోరాబ్ రుస్తుం; కన్యాశుల్కం; వేనరాజు, సారంగధర, హరిశ్చంద్ర, చంద్రగుప్త వంటి నాటకాలను అద్భుతంగా ప్రదర్శించింది.

### శ్రీకృష్ణ విలాస సభ

కొంగర జగ్గయ్య తండ్రి సీతారామయ్య దుగ్గిరాలలో 1918లో ఈ సమాజాన్ని స్థాపించారు. ఆ కాలంలోనే అన్ని హంగులతో నాటక శాలను కూడా నిర్మించి నాటకాలను ప్రదర్శించారు. బళ్లారి రాఘవ గుంటూరుజిల్లా పర్యటనకు విచ్చేసినప్పుడు తొలి ప్రదర్శన ఈ హాలులోనే ప్రదర్శించాడు. అనంతరకాలంలో సీతారామయ్య ఈ సమాజాన్ని సీతారామవిలాసనసభగా మార్చి రామదాసు, ప్రతాపరుద్రీయం, పృథ్వీరాజు, హరిశ్చంద్రవంటి నాటకాలను ప్రదర్శించారు. ఈ సమాజంలో స్థానం మాధవపెద్ది, పర్వతనేని వీరయ్య చౌదరి, ముదిగొండ వంటివారు కొంతకాలం సభ్యులుగా ఉన్నారు.

### శ్రీకృష్ణ హిందూ థియేటర్

చుండూరి హనుమంతరావు; సాంబయ్య, మాణిక్యం భాగస్వాము లుగా 1920లో ఈ సంస్థను తెనాలిలో ప్రారంభించారు. ఈ సంస్థ తెనాలిలో స్వంత హాలును కూడా నిర్మించి భక్తప్రహ్లాద, శ్రీకృష్ణలీలలు; సతీసావిత్రి వంటి నాటకాలను ప్రదర్శించింది. మల్లాది గోవిందశాస్త్రి వేమురి గగ్గయ్య, మోదుకూరి సుబ్బారావు వంటివారు ఈ సమాజంలో నటించారు.

### నటాలి నాటక సంస్థ

ప్రఖ్యాత రచయిత, నటుడు, దర్శకుడైన అబ్బూరి రామకృష్ణారావు 1943లో తెనాలిలో నటాలి నాటక సంస్థను నెలకొల్పారు. ఈ సంస్థలో వంగర; పులిపాటి; ముదిగొండ లింగమూర్తి; వంటివారు నటించారు. బలిచేపల్లి, జలసూత్రం వంటివారు ఈ సంస్థకు సలహాదారులు. కన్యాశుల్కం, ప్రతిమసుందరి, మృచ్ఛకటికం, ముఖ్యమంత్రి వంటి నాటకాలను ఈ సంస్థ ప్రదర్శించింది.

### జనతా ఆర్ట్ థియేటర్

కన్నెగంటి నాసరయ్య నేతాజీ నాట్యమండలిని తెనాలిలో స్థాపించి ఇదా ప్రపంచం నాటకాన్ని 1950 ప్రాంతంలో రాష్ట్రవ్యాప్తంగా ప్రదర్శించారు. అనంతరం ఈ సంస్థను జనతా ఆర్ట్ థియేటర్గా మార్చి, ఎవరిదీ తప్పు ; ఆర్టిస్ట్, భయం, అన్నాచెల్లెలు, రైలు ప్రమాదం వంటి నాటకాలను ప్రదర్శించారు. మొక్కపాటి కృష్ణమోహన్ నీతి పరమేశ్వర శర్మ; కన్నెగంటి రాధ వంటివారు ఈ సమాజ సభ్యులు.

### ఆంధ్రక్రాంతి థియేటర్

తెనాలికి సమీపంలోని పెదరావూరు గ్రామంలో ఈ సమాజాన్ని గుమ్మడి కుటుంబరావు స్థాపించారు. యన్.జి.ఓ;. ఈ నాథ, పరివర్తన, కప్పులు,విశ్వశాంతి, ఎవరు దొంగ, ప్రగతి వంటి నాటకాలూ; నాటికలను ప్రదర్శించింది. కొడాలి గోపాలరావు, కాకుమాను సుబ్బారావు, కోసూరి పున్నయ్య వంటివారు ఈ సమాజం ప్రదర్శించిన నాటకాల్లో నటించారు. బొల్లిముంత శివరామకృష్ణ; ఆలూరి భుజంగరావు, నటరాజన్ వంటి వారు ఈ సంస్థ సలహాదారులు.

### వెంకటేశ్వర నాట్యమండలి

ఈ సమాజాన్ని వల్లూరి వెంకట్రామయ్య 1952లో కొలకలూరులో స్థాపించారు. డి.వి. సుబ్బారావు, బండారు రామారావు, రేబాలరమణ, ఆకుల వెంకయ్య; డి.వి. సుబ్బారావు, కాళిదాసు కోటేశ్వరరావు, రామకుమారి వంటివారు ఈ సమాజంలో నటించారు. బాలనాగమ్మ, భక్త శబరి, కట్ట బ్రహ్మన, మోహినీ భస్మాసుర, రామ రావణయుద్ధం వంటి నాటకాలను ఈ సంస్థ ప్రదర్శించింది.

### స్టార్ థియేటర్

1941లో ధూళిపాళ సీతారామశాస్త్రి ఈ సంస్థను గుటూరులో నెలకొల్పారు. పాపరాజు రమణారావు ; ముప్పవరపు భీమారావు, జొన్నలగడ్డ కోటిరెడ్డి వంటివారు ఈ సమాజ సభ్యులు. పాండవోద్యోగ విజయాలు,పరశురామ,గయోపాఖ్యానం,లంకేశ్వర వంటి నాటకాలను ఈ సంస్థ ప్రదర్శించింది.

### ఎమెచ్యూర్ డ్రమెటిక్ క్లబ్

మహానటుడైన యడవల్లి సూర్యనారాయణ1912లో ఈ సమాజాన్ని స్థాపించారు. ప్రసన్న యాదవం, గయోపాఖ్యానం, బొబ్బిలి యుద్ధం, వంటి నాటకాలను ఈ సమాజం ప్రదర్శించింది. యడవల్లి, వంగల ఆంజనేయులు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య వంటివారు ఈ సమాజ సభ్యులు.

### సంఘసేవా నాట్యమండలి

జాతీయ నాటక కవి దామరాజు పుండరీకాక్షుడు ఈ సంస్థను 1920లో గుంటూరులో స్థాపించారు. గాంధీ మహోదయం, గాంధీ విజయం, పాంచాల పరాభవం, సంస్కారిణి; పాంచాల పరాభవం వంటి నాటకాలను ఈ సంస్థ ప్రదర్శించింది. ఈ సంస్థ ప్రదర్శించిన నాటకాలపై బ్రిటీష్‌వారు దాడులు చేయడం, జైళ్లలో నిర్బంధించడం; నాటక రచనలపై నిషేధం విధించడం వంటివి ఎన్నో జరిగాయి. పత్రి శ్రీనివాసరావు; బసవరాజు సుబ్బారావు; నిడుముక్కల సుబ్బారావు,

దైతాగోపాలం, పెద్దిబొట్ల చలపతిరావు, కడియాల రత్తయ్య, పర్వతనేని వీరయ్య చౌదరి వంటివారు ఈ సమాజం ప్రదర్శించిన నాటకాల్లో నటించారు. ఉన్నవ; కొండా; దుగ్గిరాల వంటి ప్రముఖులు కూడా ఈ సమాజంలో నటించారు.

### బాలమిత్ర నాటక సమాజం

దంటు వెంకట కృష్ణయ్య1916 ఈ నాటక సమాజాన్ని గుంటూరులో స్థాపించాడు. కొప్పరపు సుబ్బారావు ఈ సమాజ నిర్వహణలో ప్రముఖ పాత్రను పోషించాడు. 1920 తరువాత ఈ సంస్థ పేరును నవలా నాటక సమాజంగా మార్చి స్త్రీ, పురుష పాత్రలను స్త్రీలే పద్ధతిలో 1930 వరకూ నడిపారు. టి. రామకృష్ణశాస్త్రి, మాస్టర్ కళ్యాణి, సూరిబాబు, మాస్టర్ అంజి, నవలా సమాజంలో దాసరి కోటిరత్నం, పసుపులేటి కన్నాంబ, అమ్మణీబాయి, యామినీ పూర్ణ తిలక, అంజనీబాయి వంటి నటీమణులు నటించారు.

### ఆంధ్రవిజ్ఞాన లలితకళాపరిషత్తు

మందపాటి రామలింగేశ్వరరావు 1953లో ఈ నాటక సంస్థను గుంటూరులో స్థాపించారు. అనేక పౌరాణిక, చారిత్రక, సాంఘిక నాటకాలను ఈ సంస్థ ప్రదర్శించింది. హరిప్రసాదరాయ నాట్య గోష్టులను అనేక సంవత్సరాలను నిర్వహించటంతో పాటు నాటక పోటీలను కూడా ఈ సమాజం నిర్వహించింది.

### హిందూ కాలేజి డ్రమేటిక్ అసోసియేషన్

గుంటూరు హిందూ కళాశాలలో అధ్యాపకులు, విద్యార్థులు కలిసి ఈ సంస్థను స్థాపించారు. కళాశాలలో పలు నాటకాలను ప్రదర్శించడం తోపాటు అంతర్ కళాశాలల నాటక పోటీలను కూడా ఈ సంస్థ నిర్వహించింది. పిల్లలమర్రి హనుమంతరావు, ముక్కాముల అమరేశ్వర రావు, వేమూరి రామయ్య, ముక్కాముల కృష్ణమూర్తి, ధూళిపాళవంటి వారు ఈ సమాజ సభ్యులు.

### ఫైనార్ట్స్ థియేటర్

1953లో బాపట్లలో కె.యస్.టి. శాయి ఈ సంస్థను స్థాపించారు. పి.యల్. నారాయణ, సీతాలత, పాండురంగ విఠల్, రెడ్డయ్య, పూలనాగేశ్వరరావు వంటివారు ఈ సమాజసభ్యులు. సంఘం చెక్కిన శిల్పం ; భోగిమంటలు, మహనీయులు, పులీమేక వంటి నాటకాలను ఈ సంస్థ ప్రముఖంగా ప్రదర్శించింది.

### శ్రీ వెంకటేశ్వర ఆర్ట్ థియేటర్

నటుడు, దర్శకుడైన బయ్యవరపు వెంకటేశ్వరరావు 1952లో ఈ సంస్థను గుంటూరులో స్థాపించారు. వరకట్నం, అపరాధి, అన్నాచెల్లెలు,. మండువా లోగిలి, ఆడది, రిక్షావాడు వంటి నాటకాలూ, నాటికలను ఈ సంస్థ ప్రదర్శించింది. వై. శంకరరావు, మాకినేని పూర్ణ, అంజిబాబు, ఆర్లరెడ్డి వంటివారు ఈ సమాజ సభ్యులు.

### శాస్త్రీయం

ప్రముఖ నటుడు,దర్శకుడైన జి.యస్.ఆర్.కె. శాస్త్రి1981లో ఈ సంస్థను గుంటూరులో స్థాపించారు. వేముల మోహనరావు, నాయుడు గోపి, డి. రామకోటేశ్వరరావు, నారాయణపాత్రుడు వంటివారు ఈ సమాజసభ్యులు. అసురగణం, డియర్ ఆడియన్స్ సిన్సియర్లీ యువర్స్, దహతి మమమానసం,తర్జని,రసరాజ్యంవంటి అద్భుతమైన నాటకాలను ఈ సంస్థ వివిధ పరిషత్తులలో ప్రదర్శించి బహుమతులను పొందారు.

### ది అమెచ్యూర్స్ డ్రమెటిక్ అసోసియేషన్

నటుడు, దర్శకుడైన మల్లాది శివ 1971లో ఈ సమాజాన్ని చిలకలూరిపేటలో స్థాపించారు. కొల్లా రాధాకృష్ణ, ఐ. రాజ్‌కుమార్, డి. రామకోటేశ్వరరావు, రంగన్న, మారుతీరామశర్మ, కమలనాభుడు వంటివారు ఈ సమాజసభ్యులు. వీరు పాయ్, పంజా, బ్రతకనివ్వండి, జరుగుతున్న చరిత్ర, ప్రేమాలయం, రాజీనామా, సర్పయాగం వంటి నాటికలను ప్రదర్శించారు. 1990 నుండి షేక్ షఫీ ఈ సమాజ బాధ్యతలను స్వీకరించి వాయిదాల పెళ్లి, కాకి సందేశం, పోచ్, వడ్లగింజలో బియ్యపుగింజ వంటి హాస్య నాటికలను ప్రదర్శించారు.

### స్నేహలత

1978లో నటుడు దర్శకుడు కొల్లా రాధాకృష్ణ చిలకలూరిపేటలో ఈ సమాజాన్ని స్థాపించారు. ఈ సంస్థ ద్వారా ఛీఛీ, కుందేటి కొమ్ము, కేకు క్షమయాధరిత్రి, ప్రార్థన, ముఖచిత్రం వంటి నాటికలను ప్రదర్శించారు.

### సాగరి

ప్రముఖ నటుడు, దర్శకుడు ఐ.రాజ్‌కుమార్ 1986లో ఈ సంస్థను చిలకలూరిపేటలో స్థాపించారు. దండమయా విశ్వంభర, అభినవ వేమన,మృగమైదానం, పృథ్వీసూక్తం, జాతిస్మరామి, నల్లరేగడి, వఱుదు, ఖడ్గసృష్టి, నల్లసముద్రం, ఆకుపచ్చ సూర్యుడు వంటి నాటికలతో వివిధ పరిషత్తులలో ప్రదర్శించి బహుమతులు పొందారు.

## గంగోత్రి

ప్రముఖనటుడు, దర్శకుడు నాయుడు గోపి 1987లో ఈ సమాజాన్నిపెదకాకాని కేంద్రంగా స్థాపించారు. శ్వేతపత్రం, ఎడారికోయిల, వానప్రస్థం, హింసధ్వని, అంబోతు, డొక్కా సీతమ్మ, మానససరోవరం, కాదు సుమాకల, నరవాహనం, పల్నాటియుద్ధం, గురురాఘవేంద్ర చరిత్ర వంటి నాటకాలూ, నాటికలను ప్రదర్శించి బహుమతులు పొందారు.

## రసఝురి

ప్రముఖ నటుడు, దర్శకుడు వైయస్. కృష్ణేశ్వరరావు 1986లో ఈ సమాజాన్ని పొన్నూరులో నెలకొల్పారు. వ్యవస్థ, రోజూ చస్తున్న మనిషి, గొంగళి పురుగు, పక్కింట్లో పుట్టింది,ఐదో గది,సంపద, వంటి నాటకాలూ, నాటికలను విస్తృతంగా ప్రదర్శించి బహుమతులను పొందారు.

## నెచ్చెలి

ప్రముఖ నటుడు, రచయిత సుము నాగభూషణం ఈ సమాజాన్ని 1970లో గుంటూరులో స్థాపించారు. కాలజ్ఞానం, ప్రకటన, ఇట్లు సామాన్యుడుకొత్తకలం, ఆదిపర్వం, అవినీతి ఎన్నాళ్లు వంటి నాటికలను విస్తృతంగా ప్రదర్శించి బహుమతులను పొందారు.

## యల్.వి.ఆర్. క్రియేషన్స్

1992లో యల్.వి.ఆర్. అండ్ సన్స్‌క్లబ్ రీడింగ్‌రూమ్ సాంస్కృతిక సంస్థగా గుంటూరులో ప్రారంభించారు. గుమ్మడి శ్రీమన్నారాయణ, నుసుమ కోటి శివ, రామకృష్ణ, చంద్రమౌళి వంటివారి సారథ్యంలో మేలుకొలుపు; జారుడుమెట్లు, ఉత్తమ పంచాయితీ, రేపేంది, నథింగ్ బట్ ట్రూత్ వంటి నాటకాలూ నాటికలను ప్రదర్శించాడు.

## కల్పనా కళానికేతన్

ప్రముఖ నటుడు, దర్శకుడు కె.వి. ప్రసాద్ సారథ్యంలో 1980లో నర్సరావుపేటలో ఈ సంస్థను ప్రారంభించారు. విషపుష్పాలు, చిచ్చు, భువనఘోష, సంచలనం, శేషార్థం, జగన్నాథ రథచక్రాలు, షట్కర్మ యుక్తా వంటి నాటకాలను ప్రదర్శించారు.

## అభినయ ఆర్ట్స్

ప్రఖ్యాత నటుడు, దర్శకుడు యన్.రవీంద్రరెడ్డి 1976 లో అభినయ సంస్థను గుంటూరులో ప్రారంభించారు. సృష్టి, ఛీఛీ, పడమట పొడిచిన పొద్దు, సరికొత్త మనుషులు, అమ్మకోముద్దు, రెండు నిశ్శబ్దాల మధ్య వంటి నాటికలు ప్రదర్శించి బహుమతులను పొందారు.

## అరవిందా ఆర్ట్స్

ప్రసిద్ధ నటుడు, దర్శకుడు సాయికుమార్ అరవిందా ఆర్ట్స్ సంస్థను తాడేపల్లిలో 1996లో స్థాపించారు. క్షతగాత్రగానం, ధ్వంసరచన, ఏకాకి నౌక చప్పుడు, రామకృష్ణపరమహంస, వంటి నాటకాలూ, నాటికలను విజయవంతంగా ప్రదర్శించారు.

## శ్రీసాయి ఆర్ట్స్

ప్రముఖ నటుడు గోపరాజు రమణ కొలకలూరులో శ్రీ సాయి ఆర్ట్స్ సంస్థను 1983లో స్థాపించారు. ఒక్క మాటే చాలు, నాలుగు గోడల మధ్య, బైపాస్ వంటి నాటకాలను గోపరాజు విజయ్ దర్శకత్వంలో ప్రదర్శించి బహుమతులు పొందారు.

## రంగంయాత్ర

నటుడు, దర్శకుడు కరణం సురేష్ ఈ సమాజాన్ని గుంటూరులో నెలకొల్పారు. సత్యాగ్రహి, చదువు, అనంతం, ఎక్కడ ఉన్నా ఏమైనా వంటి నాటకాలు, నాటికలను ప్రదర్శించారు.

## బందరు నేషనల్ థియేట్రికల్ సొసైటీ

1880-82 ప్రాంతంలో బందరులో దేవరసు వెంకటశివరావు బాలకృష్ణ ఈ సమాజాన్ని నెలకొల్పారు. ఈ సమాజం శారదావిలాస్ అనే నాటకశాలను నిర్మించింది. నాదెళ్ల పురుషోత్తమ కవి ఈ సమాజానికి అనేక నాటకాలను రచించారు. ఈ సమాజంలో ఈమని లక్ష్మణస్వామి, వెంపటి వెంకటేశ్వర్లు,వంగలఆంజనేయులు వంటివారు నటులు.

## బందరు హిందూ థియేటర్

1884లో దేవరసు సుబ్బారావు, తురగా పురుషోత్తం, రామిని బ్రహ్మయ్య, చివుకుల కృష్ణయ్యలు బందరులో ఈ సమాజాన్ని స్థాపించారు. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు విద్యార్థి దశలో ఈ సమాజంలో స్త్రీ, పాత్రలను ధరించారు.

## మైలవరం కంపెనీ

మైలవరం రాజా సూరానేని వెంకట పాపారావు 1913లో మైలవరంలో బాలభారతీ సమాజాన్నిస్థాపించారు. 1917లో బెజవాడలో మైలవరం నాటకశాలను నిర్మించిన అనంతరం ఈ సంస్థ కార్యస్థానం బెజవాడకు మార్చారు. పేరెన్నికగన్న నటులకు నెలజీతాలను ఇచ్చి సమాజంలో నటింపచేశారు. ఆర్కెస్ట్రాను రంగస్థలం ముందుభాగంలో మొదటగా ఏర్పాటుచేసిన ఘనత మైలవరం కంపెనీకి దక్కుతుంది.

ఉప్పులూరి, పోరుపల్లి, దైతాగోపాలం, అద్దంకి శ్రీరామమూర్తి వంటి మహానటులతో ఈ సమాజం అనేక నాటకాలను ప్రదర్శించింది. రాజా వారి ఆర్థిక పరిస్థితి కుంటుపడడంతో కపిలవాయి రామనాథశాస్త్రి ఈ నాటక సమాజ నిర్వాహణా బాధ్యతలను చేపట్టారు.

## రాయల్ థియేటర్

1904 బందరులో మంజులూరి కృష్ణారావు, పింగళి నరసయ్య పింగళి లక్ష్మీకాంతం, బుర్రా రాఘవాచారి,వేమూరి రామారావు వంటి ప్రముఖులు రాయల్ థియేటర్ నాటక సమాజాన్ని ప్రారంభించారు.

## ఎక్సెల్షియర్ నాటక సమాజం

ముదినేపల్లిలో కోడూరి అచ్చయ్య దర్శకులుగా దుక్కిపాటి మధుసూధనరావు, అక్కినేని నాగేశ్వరరావు, పెండ్యాల నాగేశ్వరరావు వంటివారు ఎక్సెల్షియర్ నాటక సమాజాన్ని నెలకొల్పారు. తెలుగుతల్లి, ఆశాజ్యోతి వంటి నాటకాలలో అక్కినేని స్త్రీ పాత్రలను ధరించారు.

## నేషనల్ ఆర్ట్ థియేటర్

విజయవాడ కేంద్రంగా నందమూరి తారకరామారావు నేషనల్ ఆర్ట్ థియేటర్‌ను ప్రారంభించారు. ఈ నాటక సమాజంలో నందమూరితో పాటు కొంగర జగ్గయ్య, సావిత్రి, కె.వి.యస్. శర్మ, అట్లూరి పుండరీ కాక్షయ్య వంటివారు సభ్యులు.చేసినపాపం, రాచుమల్లు దౌత్యం వంటి నాటకాలనుప్రదర్శించారు. ఆంధ్రనాటక కళాపరిషత్ నాటికల పోటీలను ప్రారంభించిన తొలి సంవత్సరం చేసిన పాపం నాటికలో బౌద్ధ భిక్షువు పాత్రను పోషించిన యన్.టి.రామారావు ఉత్తమ నటుని బహుమతిని పొందారు.

## లిటిల్ థియేటర్

తెలుగు నాటకరంగంలో ప్రయోగాలకు పెద్దపీట వేసిన కొప్పరపు సుబ్బారావు విజయవాడలో లిటిల్ థియేటర్‌ను స్థాపించారు. ఈ సంస్థ ఆధ్వర్యంలో నాటకశిక్షణా శిబిరాలను నిర్వహించారు. ఇనుపతెరలు, కోషనార, రాణాప్రతాప్, తారాశశాంకం, అనే నాటకాలను రాష్ట్రవ్యాప్తంగా ప్రదర్శించారు.

## ర.స.న. సమాఖ్య

తెలుగు నాటకరంగంలో గుణాత్మకమైన నాటకాలను ప్రదర్శించి ఎందరో ఔత్సాహికులను నాటకరంగంవైపు ఆకర్షించడంలో ర.స.న సమాఖ్య పాత్రఎంతైనా ఉంది.విజయవాడలో ఈ సంస్థనుకె. వెంకటేశ్వర రావు స్థాపించారు. రసజ్ఞులు, సహృదయులు, నటీనటులలోని మొదటి అక్షరాలను స్వీకరించి సంస్థకు వెంకటేశ్వరరావు ఈ నామకరణం చేశారు. ఇనుప తెరలు, ఫణి, మాఊరు, దయ్యం, మాష్టర్జీ, ఆకాశరామన్న, అతిథి, దొంగవీరుడు, రాగరాగిణి, నాబాబు, కనకపుష్యరాగం వంటి గొప్ప నాటకాలను ఈ సమాజం ప్రదర్శించింది.

## ఆంధ్రా ఆర్ట్స్ అకాడమీ

కర్నాటి లక్ష్మీనరసయ్య నెలకొల్పిన ఈ సమాజం ద్వారా ఛైర్మన్ ప్రెసిడెంట్ పట్టయ్య, తుఫాన్ వంటినాటకాలూ,నాటికలను నిర్వహించారు. స్వర్ణోత్సవాలనుజరుపుకొన్న ఈ సమాజం,నెలవారీ నాటక ప్రదర్శనలు, నాటిక పోటీలు, జానపద కళోత్సవాలను నిర్వహించింది.

## గురజాడ కళామందిర్

1972 నటుడు, రచయిత యం. సంజీవి ఈ సంస్థను విజయవాడలో నెలకొల్పారు. పగడం పగిలింది, నీరుపోయ్, సమాధానం కావాలి, ఈ చరిత్ర ఏ సిరాతో, దేశం మోసపోయినప్పుడు, రాజ్యహింస, మనుధర్మం, గబ్బిలం వంటి నాటికలూ, నాటకాలను ప్రదర్శించారు.

## సుమధుర కళానికేతన్

హెచ్.వి.ఆర్.కె. ప్రసాద్, భాస్కర శర్మ తదితరులు నెలకొల్పిన సుమధుర కళానికేతన్ పలు హాస్యనాటికలను ప్రదర్శించడంతోపాటు గత రెండు దశాబ్దాలుగా విజయవాడలో హాస్యనాటికల పోటీలను నిర్వహిస్తుంది.

## శ్రీ సాయిబాబా నాట్యమండలి

1962లోఅన్నాప్రగడ లక్ష్మీకాంతరావుఈ సంస్థను విజయవాడలో స్థాపించారు. డాక్టర్ రామన్ ఫౌండేషన్ సంయుక్త ఆధ్వర్యంలో ఈ సంస్థ డాక్టర్ పి.వి.యన్. కృష్ణ సారథ్యంలో శ్రీకృష్ణరాయబార, ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం, శ్రీ ఖడ్గ తిక్కన, మాధవవర్మ, పృథ్వీరాజ్ వంటి నాటకాలను గొప్పగా ప్రదర్శించింది.

## కళాంజలి

బి.యస్.ఆర్.మూర్తి సారథ్యంలో విజయవాడలో స్థాపించిన ఈ సంస్థ సిద్ధార్థ, గాంధీనగర్, మనీషి, కొడుకుపుట్టాల వంటి నాటకాలూ, నాటికలను ప్రదర్శించింది.

## ప్రజానాట్యమండలి

1943లో ఆవిర్భవించిన ప్రజానాట్యమండలి నాటకరంగానికి చేసిన సేవ చిరస్మరణీయమైనది.జానపద కళారూపాల పునరుద్ధరణతో పాటు ప్రజల ఇతివృత్తాలతో నాటకాలను ప్రదర్శించి కొత్తదనానికి బాటలు వేసింది. ప్రజానాట్య మండలి కార్యకలాపాలకు కేంద్రస్థానం కృష్ణాజిల్లా,

ప్రజానాట్యమండలి రాష్ట్ర దళం, కృష్ణాజిల్లా దళాలు విజయవాడ కేంద్రం గానే నాటకాలను రూపొందించాయి. రాష్ట్రదళానికి డాక్టర్ గరికపాటి రాజారావు, కృష్ణాజిల్లా దళానికి కోడూరి అచ్చయ్య దర్శకులుగా వ్యవహరించారు. మిక్కిలినేని, మాచినేని, కర్నాటి, కోసూరి పున్నయ్య, షేక్‌నాజర్, చదలవాడ, పెరుమాళ్లు వంటి ప్రజానటులు ప్రదర్శించిన నాటకాలు చైతన్యానికి చిరునామాగా నిలిచాయి.సుంకర,వాసిరెడ్డి, రచించిన మా భూమి, ముందడుగు వంటి నాటకాలు సంచనాలను సృష్టించాయి.

## న్యూ స్టార్ మోడ్రన్ థియేటర్

యువరక్తంలో యంయస్ చౌదరి న్యూ స్టార్ మోడరన్ థియేటర్ వందమందికి పైగా బాలనటులు, యువనటులతో విజయవాడలో నెలకొల్పిన సమాజం. పిపీలకం, ఐదుగురిలో ఆరవవాడు, గిలిగిలి దుంతనక్క, జజ్జనకరి జనారె, సింభవామి పదేపదే వంటి నాటకాలూ నాటికలను ప్రదర్శించారు.

## యంగ్ థియేటర్ ఆర్గనైజేషన్

వాసుదేవరావు అనే నవయువకుడు తన ఈడు కుర్రాళ్లతో స్థాపించి యంగ్ థియేటర్ ఆర్గనైజేషన్ నవ్యతకు దారులు వేసింది. ఓ హోయ్ ఓ హోయ్ భీం,నారీప్రస్థానం, అనగనగా,నచ్చావోయ్‌నారాయణ, అశ్వరథ శరభ, ప్రేమకు వేళాయెరా వంటి నాటకాలూ, నాటికలను ప్రదర్శించారు.

మానవతా నాటకసమాజాన్ని పలుచోట్ల నెలకొల్పిన జరుగుల రామారావు కృషి ప్రశంసనీయమైనది. ఎందరో గ్రామీణ ఔత్సాహిక నటులను వెలుగులోనికి తెచ్చిన జరుగుల పాత్ర గణనీయమైనది. ఫిరంగిపురం కేంద్రంగా ఉషోదయ కళానికేతన్‌ను నెలకొల్పిన నటుడు, రచయిత, దర్శకుడు చెరుకూరి సాంబశివరావు గారడి, యాది, బృందావనం వంటి విజయవంతమైన నాటకాలను ప్రదర్శించారు. అంఅః, అదాలత్ వంటి గొప్ప ప్రదర్శనలిచ్చిన అనంత హృదయరాజ్, ఎన్నో హాస్యనాటికలను ప్రదర్శించిన బి.వి. చంద్రశేఖర రావు, పుట్టలో వేలెడితే కుట్టనా వంటి నాటికలను ప్రదర్శించిన ఇండియన్ ఆర్ట్స్ (సత్తెనపల్లి) వ్యవస్థాపకుడు గోళ్లపాటి నాగేశ్వరరావు, మూడు దశాబ్దాలకు పైగా ఎ.వి. సుబ్బారావు, కుటుంబసభ్యులు నిర్వహిస్తున్న పూర్ణిమా నాట్యమండలి (తెనాలి) తదితర నాటక సమాజాల పాత్ర గణనీయమైనది. ఆదునిక తెలుగు నాటకరంగంలో అప్రహతిహతంగా సాగుతున్న పరిషత్తుల ప్రస్థానంలో వందలాది నాటక సమాజాలు తమదైన శైలిలో కృషిచేశాయి. చేస్తున్నాయి. వర్తమాన నాటకరంగంలో పేరెన్నికగన్న నటుడు, దర్శకుడు, ప్రధాన బాధ్యునిగా నాటక సమాజాలకు కర్తృత్వం వహించడం గమనార్హం. నాటక సమాజాలు పోటాపోటీగా నాటకాలను విభిన్న ప్రయోగాలతో తెలుగు నాటకరంగాన్ని కొత్తపుంతలు తొక్కిస్తున్నారు.

**శ్రీ ఎస్.వి.రామారావు**

# కృష్ణాతీరం అందించిన సినీ ప్రముఖులు

కృష్ణానదీ జలాలతో పునీతమై, సస్యశ్యామలమై విరజిల్లిన ప్రాంతాన్ని భౌగోళికంగా ప్రభుత్వం 'కృష్ణాజిల్లా'గా గుర్తించింది. కృష్ణా పుష్కరాల సందర్భంగా ఆ జిల్లాలో జన్మించి ప్రజలకు ప్రీతిపాత్రమైన 'సినిమా' కళలో రాణించిన ప్రముఖులను రేఖామాత్రంగా పరిచయం చేసే ప్రయత్నమే యీ వ్యాసం.

వ్యాపారపరంగా కృష్ణాజిల్లాలోని విజయవాడ గుండెకాయ వంటిది. ఇందుకు సినీ పరిశ్రమ మినహాయింపు కాదు. ఆ జిల్లాకు కేంద్రమైన మచిలీపట్నం (బందరు) మరో సాంస్కృతిక కూడలి గుడివాడ కూడాప్రాముఖ్యత సంతరించుకొన్నవే.

తెలుగులోమూకీ చిత్రాల (భీష్మప్రతిజ్ఞ) నిర్మాతగా వినుతికెక్కిన ప్రముఖుడు రఘుపతి వెంకయ్య మచిలీపట్నానికి చెందినవారు. వారి పేరిట ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఓ పురస్కారాన్ని యేర్పరచి సినీ ప్రముఖులకు అందజేస్తున్నది. వీరి కుమారుడు ఆర్.ఎస్.ప్రకాష్‌మూకీలతో బాటుటాకీ చిత్రాలకు(చండిక, లంకాదహనం) దర్శకత్వం వహించారు.

తెలుగు సినీ చరిత్రకు సంబంధించి మూల స్తంభాలుగా, త్రిమూర్తులుగా పేర్కొనదగిన వ్యక్తులు నటులుగా, కథానాయకులుగా రాణించిన అక్కినేని నాగేశ్వరరావు, నందమూరి తారక రామారావు వారికి గాత్రాన్ని అందించి మధుర గాయకునిగా వినుతికెక్కిన ఘంటసాల వెంకటేశ్వరరావు ఆ ముగ్గురూ పద్మశ్రీలే కారణజన్ములు. వారు గుడివాడ ప్రాంతీయులు. అక్కినేని జన్మస్థలం వెంకటరాఘవా పురం. నందమూరిపుట్టింది నిమ్మకూరులో, ఘంటసాల ఊపిరి పోసుకున్నది చౌటుపల్లిలో, ఆ ముగ్గురు నటులుగానే గాక నిర్మాతలుగా కూడా వినుతికెక్కారు.

**నిర్మాతలు, దర్శకులు :**

సినీ నిర్మాణంలో కీలకవ్యక్తి డబ్బు పెట్టుబడి పెట్టే నిర్మాత కాగా ఆ చిత్రానికి తెరపై రూపాన్నిచ్చేది దర్శకుడు. సినీ వ్యాపారానికి కూడలి వంటిది విజయవాడ. అక్కడ జన్మించినవారిలో ముందుగా చెప్పుకోవలసినది మారుతీటాకీసు అధినేత పోతన శ్రీనివాసరావు. వీరు సరస్వతి సినీటోన్ పతాకంపై 'పృధ్వీపుత్ర'చిత్రాన్ని1933లో రూపొందించారు. ఈ చిత్రం ద్వారానే ఈలపాట రఘురామయ్య సినీరంగ ప్రవేశం చేసారు. శ్రీనివాసరావుగారి తనయులు దూండిగా ప్రసిద్ధి చెందిన దూండీశ్వరరావు - బాబ్జి నిర్మాతలే! భాస్కర్ పిక్చర్స్ అధినేత కోవెలమూడి భాస్కరరావు (బ్రతుకుతెరువు), జలరుహ నిర్మాత (రాజనందిని) మిద్దె జగన్నాధరావు. వీరి కుమారులు చంద్రకుమార, జీవన్‌కుమార్, వెంకటరమణకుమార్ జీవితమే ఒక నాటకం, కొంటెకాపురం చిత్రాలు అందించారు. మధు పిక్చర్స్ అధినేత పర్వతనేనిమల్లికార్జునరావు (మంచి కుటుంబం), నవయుగ సారధి భాగస్వామి కాట్రగడ్డ శ్రీనివాసరావు జగపతి డిస్ట్రిబ్యూటర్ వెంకటేశ్వరరావు (వెంకటేశ్వర వ్రతమహాత్యం) నిర్మాతలే! కుదరవల్లి శ్రీరామారావు (కె.ఎస్.రామారావు) క్రియేటివ్ కమర్షియల్ పేరిట రేడియో పబ్లిసిటి ప్రారంభించి తర్వాత నిర్మాతగా చిరంజీవితో(అభిలాష, ఛాలెంజ్, రాక్షసుడు)హిట్‌చిత్రాలు అందించారు. యువ చిత్రఅధినేత కాట్రగడ్డ మురారి ఉత్తమ అభిరుచితో విలక్షణ చిత్రాలు (త్రిశూలం) నిర్మించారు. నిర్మాతల చరిత్రను గ్రంథ రూపంలో వెలువరించారు.

సుప్రసిద్ధ దర్శకులు కళాతపస్వి కె.విశ్వనాధ్ సంచలన చిత్రాల దర్శకుడు రామ్‌గోపాలవర్మ (శివ, క్షణక్షణం), కె.బాపయ్య (ద్రోహి, ఎదురులేని మనిషి) విజయవాడ వాస్తవ్యులే!

ఇక మచిలీపట్నం(బందరు) ప్రముఖుల్లో ముందుగా చెప్పుకోవలసింది పి.వి.దాసు (పినపాల వెంకటదాసు) 1936లో వచ్చిన మాయాబజార్ చిత్రరూపశిల్పి. పి.ఎస్.ఆర్.పిక్చర్స్ పేరిట తెలుగు,

తమిళ, హిందీ భాషల్లో దాదాపు ఇరవై సినిమాలు తీసిన నిర్మాత పింజల సుబ్బారావు బందరు వాస్తవ్యుడే! సాధికారికంగా పౌరాణిక చిత్రాలను రూపొందించిన సోదరులు చిత్రపు నరసింహారావు (సీతాకళ్యాణం) చిత్రపు నరసింహారావు (భక్తశబరి) బందరు నుంచి వచ్చినవారే! ఆ పట్టణం అందించిన మరో ఆణిముత్యం'పౌరాణిక బ్రహ్మ'గా వినుతికెక్కిన కమలాకర కామేశ్వరరావు

గుడివాడ నుంచి వచ్చిన అట్లూరి పూర్ణచంద్రరావు (రౌడీరాణి), వై.వి.ఎస్.చౌదరి (దేవదాసు)

ఇక విజయవాడ, గుడివాడ పరిసర గ్రామాల నుంచి వెళ్లి సినిమా పరిశ్రమను ఉద్ధరించిన మహామహులెందరో

కోలవెన్నుకు చెందిన వెలమూడి సూర్యప్రకాశరావు ముందు నటుడిగా(పత్ని)రాణించి మహనీయుడుఎల్.వి.ప్రసాద్‌ను గృహప్రవేశం ద్వారా పరిచయం చేసారు. ప్రకాష్ స్టూడియోస్ పతాకంపై ద్రోహి, కన్నతల్లి, రేణుకాదేవి మహత్యం వంటి చిత్రాలను అందించారు. దర్శకునిగా ఆయన కీర్తి కిరీటంలో కలికితురాయి ప్రేమ్‌నగర్. వీరి పెద్దబ్బాయి కృష్ణమోహన్‌రావు నిర్మాత. రెండో కుమారుడు సినీపరిశ్రమ గర్వించదగ్గ దర్శకుడు కె.రాఘవేంద్రరావు. అదే గ్రామానికి చెందిన ఎ.ఎస్.ఆర్. ఆంజనేయులు, కంచెర్ల నారాయణరావు వీరి కుమారుడు కె.సి.శేఖర్‌బాబు నిర్మాతలే!

చల్లపల్లికి చెందిన రాజా యార్లగడ్డ శివరామకృష్ణప్రసాద్ సహాయంతో సారథి పతాకంపై మాలపిల్ల, రైతుబిడ్డ వంటి చిత్రాలనందించిన వైతాళికుడు గూడవల్లి రామబ్రహ్మం నందమూరులో జన్మించారు.

ఎన్.టి.ఆర్. స్వగ్రామమైన నిమ్మకూరులో జన్మించిన ప్రముఖ నిర్మాతలు విశ్వశాంతి విశ్వేశ్వరరావు (కంచుకోట), అట్లూరి పుండరీ కాక్షయ్య (మహామంత్రి తిమ్మరుసు), ఎస్. వెంకటరత్నం(యమగోల) ఈయన ఛాయాగ్రాహకునిగా జీవితం ప్రారంభించారు. రంగస్థలంపై రాణించి, సినీరంగ ప్రవేశం చేసిన గరికపాటి రాజారావుది పోరంకి.

పునాదిపాడుకు చెందిన అనుమోలు వెంకట సుబ్బారావు ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ పతాకంపై ఇల్లరికం, కులగోత్రాలు వంటి పాతిక చిత్రాలు నిర్మించారు.

ముదునూరులో జన్మించిన ప్రముఖ నిర్మాత దర్శకుడు కె.ప్రత్యగాత్మ (భార్యాభర్తలు) వీరి సోదరుడు హేమంబరధరరావు (కథానాయకుడు), వీరి కుమారుడు వాసు (గోపాలరావుగారి అమ్మాయి) చినపాలపర్రు వాస్తవ్యులు తమ్మారెడ్డి కృష్ణమూర్తి రవీంద్ర ఆర్ట్ పతాకంపై లక్షాధికారి, ధర్మదాత వంటి చిత్రాలు నిర్మించగా వీరి తనయుడు భరద్వాజ నిర్మాత గానే గాక దర్శకునిగా కూడా రాణించారు (అత్తా నీ కొడుకు జాగ్రత్త)

పెదమద్దాలి అందించిన నిర్మాతలు వైజయంతి మూవీస్ చలసాని అశ్వనీదత్ (జగదేకవీరుడు అతిలోకసుందరి), చలసాని గోపి (అడవిదొంగ)

నూజివీడుకు చెందిన మీర్జాపురం రాజా శోభనాచల పతాకంపై (కీలుగుర్రం) పలు చిత్రాలు నిర్మించారు.

కపిలేశ్వరపురం అందించిన నిర్మాత దర్శకులుతాతినేని ప్రకాశరావు (చరణదాసి), తాతినేని రామారావు (ఆలుమగలు)

పెదపారుపుడిలో జన్మించిన చెరుకూరి రామోజిరావు అటు పత్రికా రంగం(ఈనాడు, సితార) లోను, ఇటు సినీరగం (రామోజి ఫిల్మ్‌సిటి, ఉషాకిరణ్‌మూవీస్) లోనూ సంచలనాలు సృష్టించారు.

ఇంకా నిర్మాత దర్శకులయిన టి.క్రాంతికుమార్(గన్నవరం), కానూరి రంజిత్‌కుమార్, కైకాల నాగేశ్వరరావు (కౌతరం), నవభారత్ బాబూరావు (ఘంటసాల), భీమవరపు బుచ్చిరెడ్డి (పామర్రు), జి.డి.ప్రసాదరావు, వీరి కుమారుడు నటుడు నిర్మాత జి.వి.నారాయణరావు (కురుమద్దాలి) వై.హరికృష్ణ (లక్ష్మిచిత్ర), కోగంటి కోటేశ్వరరావు)ఇందుపర్తి), శివలెంక కృష్ణప్రసాద్ (పమిడిముక్కల) కె.ఎల్. నారాయణ (గొన్నూరు) వీరంతా కృష్ణావాసులే! ఈడ్పుగల్లులో జన్మించిన వి.మధుసూదనరావు విక్టరీ దర్శకునిగా పేరొందారు.

స్వయంగా కొన్ని చిత్రాలు (ఆత్మకథ) నిర్మించారు.

## సంగీత సాహిత్యాలు :

బహు భాషాకోవిదుడైన రచయిత మల్లాది రామకృష్ణశాస్త్రి బందరు శివార్లలో గల చిట్టిగూడూరులో జన్మించారు.

భరణివారి చిత్రాలు (చక్రపాణి) రచయిత రావూరు సత్యనారాయణరావు లది మచిలీపట్నం. మహారధిగా పేరొందిన రచయిత త్రిపురనేని బాలగంగాధరరావుది పసుమర్రు. గీతరచయిత జాలాది రాజారావుది గుడివాడ తాలూకా దొండపాడు. అటురంగస్థలంపైన యిటు సినీరంగంలోనూ రచియతలుగా రాణించిన డి.వి.నరసరాజు. జంధ్యాల రచయిత, నటుడు తోటపల్లి మధు (దేవాంతకుడు – మాయాబజార్)సంగీత దర్శకులు పి.ఆదినారాయణరావు (అంజలీ పిక్చర్స్ అధినేత), ఓగిరాల రామచంద్రరావు (గుణసుందరికథ), విజయవాడ నుంచి వచ్చినవారే! స్టార్ రచయితలుగా పేరొందిన పరచూరి బ్రదర్స్‌లో పెద్దవాడయిన వెంకటేశ్వరరావు చినపారు పూడిలోనూ చిన్న వారయిన గోపాలకృష్ణ ఉయ్యూరులోనూ జన్మించారు.

సంగీత దర్శకులు పెండ్యాల నాగేశ్వరరావు (కాటూరు), తాతినేని చలపతిరావు (కపిలేశ్వరపురం), మాస్టర్ వేణు (బందరు), రమేష్ నాయుడు (కొండపల్లి) కృష్ణా జిల్లా నుంచి వచ్చినవారే! కదిలికాపురిగా పేరొందిన పెదకళ్ళేపల్లి ఒక సంగీత దర్శకుని (సుసర్ల దక్షిణామూర్తి), ఒక గీత రచయిత (వేటూరి సుందరరామమూర్తి)ను అందించింది. వీరు జాతీయ స్థాయిలో ఉత్తమ గీతరచయితగా కేంద్రప్రభుత్వ పురస్కారాన్ని అందుకున్నారు.

నటభూషణ శోభన్‌బాబు కుంటముక్కల గ్రామంలో జన్మించారు. గుడివాడ అందించిన కారెక్టర్ ఆర్టిస్టులు హేమలత, నిర్మలమ్మ, పుష్పకుమారి, వాణిబాల, ఆహుతిప్రసాద్, విజయవాడ నుంచి చిత్ర సీమలో గుణచిత్ర నటులుగా రాణించినవారు మిక్కిలినేని, అన్నపూర్ణ, లక్ష్మీరాజ్యం, యు.సుబ్బరాయశర్మ, పుచ్చ పూర్ణానందం, విన్నకోట రామన్నపంతులు, విజయరాం, రామచంద్రకాశ్యప.

తెలుగుసినీరంగానికే గర్వకారణమైన సావిత్రికృష్ణాజిల్లా చిర్రావూరు నివాసి. కారెక్టరు ఆర్టిస్టులుగా రాణించిన పెరుమాళ్ళు (ఉంగుటూరు), టి.చలపతిరావు (బల్లిపర్రు), నూతన్‌ప్రసాద్ (కైకలూరు), కోట శ్రీనివాసరావు కోట శంకరరావు(కంకిపాడు), నవరస నటనా సార్వభౌమునిగా వినుతికెక్కిన కైకాల సత్యనారాయణ (కౌతరం), కృష్ణాజిల్లాకు పేరు తెచ్చినవారే!

**సాంకేతిక రంగం :**

గుడివాడకు చెందిన వి.ఎస్.ఆర్. స్వామి ఛాయాగ్రాహకునిగా రాణించి కలియుగస్త్రీ నిర్మించారు. వారి వద్ద పనిచేసిన తేలప్రోలు వాసి ఎస్.గోపాలరెడ్డి కెమరామెన్‌గా (శివ) రాణించి ఉత్తమ అభిరుచితో చిత్రాలు (హల్లోబ్రదర్) నిర్మించి ఒక చిత్రానికి దర్శకత్వం (మై ఆటోగ్రాఫ్ స్వీట్‌మెమోరీస్) వహించారు.

నాట్యకళకు ప్రసిద్ధి కూచిపూడి. అక్కడ నుంచి వచ్చిన వెంపటి పెదసత్యం,చినసత్యం, పసుమర్తి కృష్ణమూర్తి నృత్య దర్శకులుగా రాణించగా, వేదాంతం రాఘవయ్య మరో అడుగు ముందుకేసి దర్శకునిగా (దేవదాసు, సువర్ణసుందరి) తన ప్రతిభ ప్రదర్శించారు.

సినీ విశ్లేషకులుగా రాణించిన కాట్రగడ్డ నర్సయ్య, ఈడ్పుగంటి లక్ష్మణరావు, పద్మశ్రీ పురస్కారాన్ని అందుకున్న తుర్లపాటి కుటుంబరావు విజయవాడ వాస్తవ్యులే! ఈనాటి జిల్లాల పంపిణీ వ్యవస్థ రాక ముందు విజయ, నవయుగ,పూర్ణ, చమ్రియ, లక్ష్మీ ఫిలింస్, అన్నపూర్ణ ఫిలింస్ మొదలైన సంస్థలు పంపిణీ రంగంలో విశేష కృషి చేశారు.

శ్రీ తల్లాప్రగడ రవికుమార్

# బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి పరిశోధనలు - పరిశీలన

ఇది పవిత్ర కృష్ణవేణీ నదీమతల్లికి పుష్కర సంరంభ సమయం! కృష్ణానదీ పుణ్యజలరాశులతో పునీతమై అద్వితీయ ప్రముఖమైనది కృష్ణాజిల్లా! అందుకే ఈ జిల్లాకు ' కృష్ణా' అనే సార్థక నామధేయం స్థిరపడి విశ్వవిఖ్యాతమైనది. 'అచట పుట్టిన చివురు కొమ్మైన చేవ' అన్నట్లు ఇక్కడ పుట్టిన ప్రతి వ్యక్తీ తన ప్రత్యేక నాట్య నాటకాలలో, స్వాతంత్ర్య సంగ్రామ రంగంలో.. యిలా అనేకానేక యవనికల మీద అసంఖ్యాకులైన ప్రతిభామూర్తులు జన్మించి తాము పుట్టిన కృష్ణా తీరానికీ, భారతదేశానికీ మించి ప్రపంచ వ్యాప్తంగా ప్రసిద్ధి వహించారు.

అలాంటి ప్రాతఃస్మరణీయులైన పెద్దలలో బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి మహోదయులు తెలుగు సాహిత్య జగత్తులో రవిప్రభలు ప్రసరించిన ప్రజ్ఞా ప్రభాకరులు. అంతటి మహనీయులైన బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిని ఈ కృష్ణా పుష్కర పవిత్ర సమయాన స్మరించడం, వారొనరించిన సాహితీ సేవను స్థాలీపులాక న్యాయంగా గుర్తుచేసుకోవడం తెలుగు వారమైన మనందరికీ అతి ముఖ్య కర్తవ్యం.

కాలగర్భంలో నిబిడీకృతమైన అత్యంత ప్రాచీనమైన, అతి విలువైన తెలుగు వాఙ్మయాన్ని త్రవ్వితీసి పరిశోధించి పరిష్కరించి భావి తరాలకు తెలుగు సారస్వత వెలుగులు పంచిన వారిలో అగ్రగణ్యులు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి మహోదయులు. ప్రభాకరశాస్త్రి సాహిత్య చతుర్ముఖులు. బహుముఖీయమైన ప్రతిభారోచిస్సులు వెలయించిన పండితవరేణ్యులు, ప్రాతఃస్మరణీయులు.

శతాబ్దాలుగా మరుగున పడివున్న, తాళ -తామ్ర పత్రాలలో నిక్షిప్తమై శిథిలం కాబోతున్న ఎన్నెన్నో సారస్వత, చారిత్ర విశేషాలను జీవిత చరమాంకం వరకూ ఎంతో శ్రమకోర్చి ప్రచురింపజేసి భావి తరాల సాహిత్యపరులకు, విమర్శకులకూ చుక్కాని వంటి ఆధారాలు సిద్ధం చేసిన పుణ్యపురుషులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

ప్రపంచానికి, భారతీయులకు మరీ ముఖ్యంగా తెలుగుజాతికి అన్నమాచార్య అనే వాగ్గేయకారుని పరిచయం చేసింది వేటూరి ప్రభాకరశాస్త్రిగారే! దినమున కొక్క కృతి చొప్పున 32వేల కృతులను వేంకటేశ్వరుని పదసన్నిధిన పూజా పుష్పాలుగా సమర్పించి అనర్ఘమైన సాహితీ సంపదనూ, తెలుగు పలుకుబడులను గుప్తనిధులుగా అందించిన అన్నమయ్యను పొందిన తెలుగుజాతిది ఎంత అదృష్టమో అన్నమయ్యను కనుగొన్న వేటూరి ప్రభాకరశాస్త్రిగారంటే తెలుగుజాతికి అంత గౌరవం!

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి 126వ జయంతిని పురస్కరించుకుని ఆ మహానుభావుని పరిశోధనలమీద స్థాలీపులాక న్యాయంగానైనా నాలుగు మాటలు ముచ్చటించుకునే అవకాశం లభించడం ఈ రచయితకెంతటి మహద్భాగ్యం!

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 1888 వ సంవత్సరం, ఫిబ్రవరి 7వ తేదీన కృష్ణాజిల్లా, దివితాలూకా పెదకళ్ళేపల్లి గ్రామంలో జన్మించారు. శ్రీవత్స గోత్రీకులు వెలనాటి బ్రాహ్మణోత్తములైన శ్రీ వేటూరి సుందరశాస్త్రిగారు తండ్రి – తల్లి శ్రీమతి శేషమ్మ! నలుగురు అన్నదమ్ములలో ప్రభాకరశాస్త్రిగారు రెండవవారు. మూడవ సోదరుడైన చంద్రశేఖర శాస్త్రిగారి తనయుడే ప్రఖ్యాత సినీగీత రచయిత డా॥ వేటూరి సుందర రామమూర్తిగారు!

వేటూరి ప్రభాకరశాస్త్రిగారి బాల్యం పెదకళ్ళేపల్లిలోని వీధి బడిలో సాగింది. శ్రీ మద్దూరి రామావధానులు గారి వద్ద సంస్కృతం, తెలుగు వాఙ్మయాలను నేర్చుకుని వాటిపై అనురాగాన్నీ ప్రేమనూ పెంచుకున్నారు. చల్లపల్లి వాస్తవ్యులు మహాతపస్సంపన్నులైన అద్దేపల్లి సోమనాథశాస్త్రుల వారి వద్ద తర్కశాస్త్రాధ్యయనం చేశారు. అటుపైన బందరులో తిరుపతి వెంకట కవులలో ఒకరైన వెంకటశాస్త్రిగారి సన్నిధిన అవధాన విద్యను ఔపాసన పట్టి వారితో కలిసి ఎన్నో

అష్టావధాన, శతావధానాలలో విరివిగా పాల్గొన్నారు ప్రభాకరశాస్త్రిగారు.

అటుపైన 1906వ సంవత్సరంలో శాస్త్రిగారి మకాం మద్రాసుకు మారింది. తెలుగు భాషోద్యమానికి మూలపురుషులైన కందుకూరి వీరేశలింగం పంతులుగారు, గురజాడ అప్పారావు, గిడుగు రామ్మూర్తి పంతులు గారితో గాఢమైన సాహితీమైత్రి లభించింది వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి, మద్రాసు ఓరియంటల్ లైబ్రరీలోని గ్రంథాలను ఆకళింపు చేసుకుంటూ అందులోనే ఉద్యోగం కుదరడంతో శాస్త్రిగారి పరిశోధనా జీవితానికి బాటలు ఏర్పడ్డాయి.

గొప్ప చరిత్ర పరిశోధకులైన శ్రీమానపల్లి రామకృష్ణకవి గారితో కలిసి ద్రవిడ దేశ పర్యటన చేసి అనేక ప్రాచీన గ్రంథాలను పరిశోధించారు. అటుపైన మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో పండితపదవి నలంకరించి ప్రాచీన గ్రంథ సేకరణార్థం దేశంలోని నలుదిక్కులూ పర్యటించారు. మాదుగుల, పార్వతీపురం, పర్లాకిమిడి, బరంపురం, సోమగుండం యిలా... కృష్ణా,గుంటూరు మండలాల్లో ప్రతిగ్రామం పరిశోధనల నిమిత్తమై శోధించారు.

## వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పరిశోధనలు - పరిశీలన

తన నిగూఢ, సశాస్త్రీయ పరిశోధనల ద్వారా ఎన్నెన్నో అమూల్యమైన సారస్వత వాఙ్మయ,చారిత్రక విషయాలను నిరూపణచేసి జాతికి అందించారు వేటూరి వారు. వారి పరిశోధనలను స్థూలంగా రెండు విభాగాలుగా చెప్పుకోవచ్చు.

అవి **1. సారస్వత వాఙ్మయం**

**2. చారిత్రక శాసనాలు**

ఇప్పుడు వీటి గురించి సోదాహరణంగా విశ్లేషించుకుందాం!

**సారస్వత వాఙ్మయం :** స్వయంగా కవివరేణ్యులు - అవధాన దురంధరులైన వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కేవలం పరిశోధనలనే కాక, అసంపూర్ణంగా లేదా లుప్తమై పోయిన గ్రంథ భాగాలను కవి ఆత్మను అవలోకించి సహజపాండితీ ప్రతిభతో ఆయా గ్రంథాలను పరిష్కరించి, సంస్కరించి సమగ్రరూపంలో ప్రచురించారు.

**1. బసవపురాణ పరిశోధన :** బసవపురాణ కృతికర్త పాల్కురికి సోమనాథుడు. శివసారస్వత వాఙ్మయంలో ముఖద్వారం వంటి రచనయిది. పాల్కురికి సోమనాథుడు జంగమ కులానికి చెందినవాడని పండితుల సాహితీవేత్తల అప్పటి అభిప్రాయం. కానీ శాస్త్రిగారు ఆ వాదాన్ని త్రోసిపుచ్చి పాల్కురికి తన యితర రచనలైన పండితారాధ్య చరిత్ర, చతుర్వేదసారమనే గ్రంథాలలో తాను 'చతుర్వేదపారగుడ'ని హరితసగోత్రుడనీ పేర్కొన్న గ్రంథభాగాలను వెలికితీసి, పరిశోధించి సశాస్త్రీయంగా ధృవీకరించారు.

ఆయా గ్రంథాల ఆధారంగా విజయవాడను పాలించిన బిజ్జలుడు జైనమతస్థుడు కాడనీ, క్రీ.శ. 1195 అట్లూరు శాసనము ఆధారంగా నిరూపించారు. ఆంధ్రవాఙ్మయచరిత్రలో 'శివకవులు' అనే వారున్నారని మొదటగా పేర్కొన్నది వేటూరి ప్రభాకరశాస్త్రిగారే.

**2. సుగ్రీవ విజయము :** కందుకూరి రుద్రకవి రచించిన యక్షగాన కృతి అయిన "సుగ్రీవ విజయము" ను 1939లో పరిష్కరించి "మధురకవితలు" అనే పీఠిక రాశారు శాస్త్రిగారు. తెలుగుజాతి విస్మరించిన యక్షగాన సంప్రదాయాన్ని త్రవ్వి తలకెత్తుకుని తిరిగి అందించిన వారిలో వేటూరి ప్రభాకరశాస్త్రిగారిది అద్వితీయమైన పాత్ర.

**3. ఉద్భటారాధ్య చరిత్ర :** తెనాలిరామలింగ కవి రచించిన ఈ ఉద్భటారాధ్య చరిత్ర శిథిలావస్థలో ఉండగా దానిని సంస్కరించి, మెరుగులు దిద్ది మూలప్రతికి దీటుగా సిద్ధపరచి 1925 వ సంవత్సరంలో ప్రచురించారు. 'రామలింగకవి' 'రామకృష్ణకవి' యిద్దరు కవులు కాదనీ - యిద్దరూ ఒకటే అనీ, తెనాలి రామకృష్ణకవి అసలు యింటిపేరు "గార్లపాటి" అనీ యితడు క్రీ.శ.1565 ప్రాంతం వాడనీ నిగ్గుతేల్చారు శాస్త్రిగారు.

**4. హరవిలాసము :** శ్రీనాథకృతమైన హరవిలాస కావ్యంలో పేర్కొన్న అనేక ప్రాంతాలను భౌగోళికంగా గుర్తించి వివరించారు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. **1) రమణా** - ఇది బర్మాదేశంలో ఒక భాగం **2) యాంప**-ఇది యిప్పటి జాఫ్నా. **3) తరుణాసిరి** - యిది మలయా ద్వీపంలోని ప్రధాన నగరం పేరు. **4) జోణంగి** - మలబార్ తీర ద్వీపాలలో ఒకటి; **5) హురుమంజి** - పారశీక సముద్ర తీరంలోని హుర్మజ్; **6) పంజార** - సమత్రా ద్వీపంలో వున్న పజ్జార్ **7) తవాయి** - మలయా ద్వీపకల్పంలో గల రేవుపట్టణం.

**5. రంగనాథ రామాయణము :** రంగనాథరామాయణమనే ఈ ప్రజారంజకమైన ద్విపద కావ్యం నేడు సమగ్రంగా తెలుగు పాఠకులకు లభించిందంటే అందుకు వేటూరి వారి పరిశోధన సంస్కరణలే ప్రధాన కారణం. రంగనాథరామాయణాన్ని గోన బుద్ధారెడ్డి అనే కవి రచించాడని డా॥ కట్టమంచి రామలింగారెడ్డి, ఆచార్య పింగళి

లక్ష్మీకాంతం వంటి ఉద్దండ పండితుల వాదం కాగా, రంగనాథ రామాయణ కృతికర్త గోనబుద్ధారెడ్డి కాదనీ, రంగనాథుడు అనే కవి అనీ, 'లక్షణ శిరోమణి' అనే లక్షణ గ్రంథంలో 'అచ్చవిల్లి రంగన్న' అనే పేరుతో రంగనాథరామాయణంలోని ద్విపదలు ఉదహరించడం ఆధారాలుగా ప్రకటించారు వేటూరివారు.

**6. ధనుర్విద్యావిలాసము :** తెలుగు వాఙ్మయంలో కృష్ణకవి, కృష్ణమాచార్యుడు అనే యిద్దరు కవులున్నారు. 747 పద్యాలతో 3 అశ్వాసాలతో వున్న '**ధనుర్విద్యావిలాసం**' అనే గ్రంథం ఎవరు రచించారనే మీమాంస వుండేది. అయితే వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అనేక గ్రంథాలు, శాసనాలు పరిశీలించి కృష్ణమాచార్యుడు, కృష్ణకవి ఇద్దరు కాదన్నారు. ఇద్దరూ ఒక్కరే అని సిద్ధాంతీకరించారు. కృష్ణమాచార్యుడనే ఈ కవి శకుంతలా పరిణయం అనే మరో గ్రంథాన్ని కూడా రచించాడనీ, ఆగ్రంథాన్ని వేంకటాద్రినాయుడు అనే ఆయన ప్రోద్బలంతో ఈ పని కోదండరామస్వామికి అంకితం చేశాడని, ధనుర్విద్యా విలాస గ్రంథాన్ని కూడా ఈ పని కోదండరామస్వామికే అంకితమిచ్చాడనీ వెల్లడి చేశారు.

**7. సారసంగ్రహ గణితము : 'సారసంగ్రహ గణితం'** అనే గణితశాస్త్ర గ్రంథాన్ని పావులూరి మల్లన్న అనే రచయిత రచించాడనీ, ఈ గ్రంథంలో పరికర్మ, వివిధ రకాలైన గణిత సమస్యలనూ ఈ రచయిత పరిష్కరించి గ్రంథస్తం చేశాడనీ, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 1912లో పరిశోధించి ప్రపంచానికి వెల్లడి చేశారు. ఈ గ్రంథం మధ్యయుగ కాలంలో ఆంధ్ర, జైన వాఙ్మయంలో బహుళ ప్రచారాన్ని పొందిందని కనుగొన్నారు. 'పావులూరి గణితం' అని లోకవ్యవహారాలలో ఈ గ్రంథానికి పేరుంది.

**8. కాటమరాజు కథ :** ఎంతో ప్రసిద్ధి పొందిన 'కాటమరాజుకథ' ను వెలికి తీసి వెలుగులోకి తెచ్చింది ప్రభాకరశాస్త్రిగారే! నెల్లూరు, గుంటూరు మండలాల్లో ప్రజలనోళ్ళలో పాటలుగా గీతాలుగా ప్రచారంలో వుండే గొల్లసుద్దుల్లో ప్రధానమైనది 'కాటమరాజుకథ' స్థానిక చరిత్రలు కూలంకషంగా పరిశోధించి ఈ 'కాటమరాజుకథ' అనేది ద్విపద ప్రబంధ కావ్యంలోని కథా సంగ్రహమనీ, దీనిని 'పిన ఎల్లయ' అనే కవి రచించాడనీ శాస్త్రిగారు మొదటగా తెలిపారు. అలాగే భక్తవత్సలుడు అనే కవి కూడా కాటమరాజుకథను రచించాడని శాస్త్రిగారు వెల్లడి చేశారు.

'ఆంధ్రకామందకము' అనే కావ్యాన్ని జక్కరాజు వెంకటకవి రచించాడనీ, ఈ గ్రంథం క్రీ.శ. 14వ శతాబ్దానికి ముందటిదని వేటూరివారు పరిశోధించి కనుగొన్నారు.

పూర్వకాలంలో అర్థశాస్త్రం అనే పేరుతోనే రాజనీతి విషయాలు కూడా చర్చించబడేవి. అలాటి ఎన్నో గ్రంథాలను శాస్త్రిగారు శోధించి పరిష్కరించారు. వాటిలో మచ్చుకు కొన్ని నీతిశాస్త్రగ్రంథాలు - ముద్రామాత్య, పంచతంత్ర, బద్దెభూపాల, చాణక్య, ధౌమ్య, విదుర, ధృతరాష్ట్ర, బలభద్ర, కామందక, గజాంకుశ, నీతిసార, నీతిభూషణ, క్షేమేంద్ర, భోజరాజ విభూషణ, పురుషార్థసార,భారత రామాయణాది కావ్యాలు, పురాణేతిహాసాలు, కందనామాత్య నీతి తారావళి, లోకోక్తి చాటుప్రబంధాలు - ఇవన్నీ 14వ శతాబ్దిలో మడికి సింగన సంకలనం చేసిన 'సకల నీతి సమ్మతము' అనే పేర శతాబ్దాలుగా మరుగున పడి వున్న వాఙ్మయ భాండాగారాన్ని మథించి పరిశోధన చేశారు శాస్త్రిగారు.

కేవలము కృతులను సంస్కరించడమేకాక కృతికర్తల, కృతిభర్తల కాలనిర్ణయం, సంబంధ బాంధవ్యాల నిగ్గు తేల్చడం, ఆధారాలతో సహానిరూపించడం కేవలం వేటూరి ప్రభాకరశాస్త్రి వంటి సిద్ధ సంకల్పులకు తప్ప యితరుల వల్ల సాధించగలిగే విషయాలు కావు.

## తాళ్ళపాక అన్నమాచార్యుని వాఙ్మయ పరిశోధన

వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పరిశోధనాత్మక జీవితంలో తాళ్ళపాక అన్నమాచార్యులు వారి సంకీర్తలను ఎన్నో వ్యయప్రయాసలకోర్చి వెలికితీసి తెలుగుజాతికి అందించడం అనేది అతి ముఖ్యమైనది. తిరుపతికి చుట్టుప్రక్కల అనేక గ్రామాలలో, దుర్గమ అరణ్య ప్రాంతాలలో పర్యటించి అన్నమయ్య సంకీర్తనలకు సంబంధించిన ఎన్నో రాగి రేకులను సేకరించారు ప్రభాకరశాస్త్రిగారు. అలా సేకరించిన రాగి రేకులమీది అన్నమాచార్య కీర్తనను పరిశోధించి పరిష్కరించి ముందు తరాల వారు రాగయుక్తంగా గానం చేయడానికి వీలుగా సంస్కరించిన వారు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

అలా "తాళ్ళపాక అన్నమాచార్యుడు" అనే తెలుగు సంకీర్తనా చార్యుడిని తెలుగుజాతికి సాక్షాత్కరింపచేసిన ఘనత దక్కించుకున్నది వేటూరి ప్రభాకరశాస్త్రిగారే!

వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పరిశోధనా జీవితంలో యితర పరిశోధనల్నీ ఒక ఎత్తు అయితే ప్రపంచ యవనిక మీద అన్నమాచార్యను ఆవిష్కరిస్తూ సాగిన పరిశోధనా ప్రక్రియ మరో పార్శ్వమై,

పండిత - పామర ప్రజాకోటిలో వేటూరి ప్రభాకరశాస్త్రిగారిని యశో చిరంజీవుల్ని చేసింది అనడంలో అతిశయోక్తి ఎంతమాత్రమూ లేదు.

తెలుగు తొలికవయిత్రి ఎవరయి వుంటారని పరిశోధించి వెల్లడిచేసిన కీర్తి వేటూరివారిదే. తొలి తెలుగు కవయిత్రి 'తిమ్మక్క' ఈవిడ సంకీర్తనాచార్యుడైన అన్నమయ్య మొదటి భార్య! ఇందుకు తగిన ఆధారాలను శాస్త్రిగారు శ్రీకాళహస్తి రాజావారి ఆస్థానం నుండి సంపాదించారు.

ఇక 1918వ సంవత్సరంలో 'ప్రబంధరత్నావళి' అనే పుస్తకంలో తాళ్ళపాక అన్నమాచార్యుడి రచన 'వేంకటేశ్వరశతకము' ను ప్రచురించేసరికి ఆంధ్రదేశములో సాహితీ లోకంలో పెద్ద కలకలమే పుట్టింది. 1925లో 'భారతి' పత్రికలో అన్నమయ్యే రచించిన వేంకటేశ్వర వచనములు కొన్నింటిని పరిశోధించి, వెలికితీసి ప్రచు రించారు శాస్త్రిగారు.

అన్నమయ్య వాఙ్మయ పరిశోధనలో ఎడతెగని పరిశోధనా కృషి ఫలితంగా అన్నమయ్య రచనలైన వెంకటేశ్వర వచనములు పూర్తి పాఠాన్ని 1945లో, శృంగార డమరుకమును 1949లో, అన్నమా చార్య చరిత్రను 1949లో, తాళ్ళపాక వారి సంకీర్తనలు 4,5 సంపుటాలను 1947లో, సుభద్రాకల్యాణమును1950లో పరిశోధించి ప్రకటించారు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

శాస్త్రిగారి ఈ అమూల్య పరిశోధనలు తిరుమల తిరుపతి దేవస్థానం వారు అన్నమాచార్య వాఙ్మయ పీఠాన్ని ఏర్పరచటానికి పునాదులు ఏర్పడేలా చేశాయి. తిరుమల తిరుపతి దేవస్థానం ఆధ్వర్యంలో అప్పటి మద్రాసు హైకోర్టు న్యాయమూర్తి శ్రీ పి.వి. రాజమన్నార్ అధ్యక్షతన 1948 సంవత్సరంలో తిరుపతిలో అన్నమయ్య జయంతి ఉత్సవాలను ప్రప్రథమంగా నిర్వహించింది. టి.టి.డి ఆ సభలో ప్రఖ్యాత కర్నాటక సంగీత విదుషీమణి శ్రీమతి టంగుటూరి సూర్యకుమారి మృదుమధురమైన గానం ద్వారా అన్నమయ్య కీర్తనల్లో ఒకటి మొదటిసారిగా ఆంధ్రజాతికి కర్ణపేయంగా ఆలపించి అందించిన మధురఘడియలు చరిత్రలో చిరస్థాయిగా నిలచిపోయాయి!

**క్రీడాభిరామము :** వేటూరి వారి కన్నాముందు, శ్రీనాథుని కృతి అయిన క్రీడాభిరామ గ్రంథాన్ని మానవల్లి రామకృష్ణ కవిగారు కొంత పరిష్కరించినా అది అసమగ్రంగానే వుండింది. శాస్త్రిగారు తునా తునకలై శిథిలజీర్ణావస్థకు చేరిన తాళపత్ర ప్రతులెన్నిటినో పరిశీ లించి ఎన్నో తప్పుల్ని చక్కదిద్ది శుద్ధప్రతిని సమగ్రంగా సిద్ధం చేశారు.

**చాటు పద్యమణిమంజరి :** తెలుగు సాహిత్యంలో పద్యాలకు ప్రత్యేకస్థానం వుంది. చేతి వృత్తులవారు కార్మికులు కర్షకులు యితర పామర జనుల నోటిద్వారా బహుళ ప్రచారాన్నిపొందిన అనేక చాటుపద్యాలు ఆంధ్రదేశం నాలుగు చెరగులా కోకొల్లలుగా వున్నాయి. వాటిలో కొన్ని మాత్రమే తాళపత్రప్రతుల్లో కుదురుకున్నాయి. వేటూరి వారు అనేక తాళపత్ర గ్రంథాలను సంశోధించి, ప్రజలతో మమేకమై ముఖతః వారు పాడినవి ఎత్తి రాసుకుని కొన్ని వందల, వేల చాటు పద్యాలను గ్రంథరూపంలోకి తెచ్చి చాటు పద్యభాండాగారాన్ని ముందు తరాలకు అందించారు. అలా ఏర్చికూర్చిన చాటుపద్యాలను కొన్నిటిని 1913లో 'చాటుపద్యమణిమంజరి' ప్రప్రథమంగా ప్రచురించారు. క్రమేణా ఆ సంఖ్య నాలుగు సంపుటాలుగా విస్తృతి చెందింది.

**పరిశోధనాత్మక వ్యాసాలు :** తాను శోధించి ఆవిష్కరించిన పరిశోధనాంశా లన్నిటినీ వ్యాసరూపంలో వేటూరి వారు ప్రకటించారు. వాటిలో కొన్ని **1) భాషాతత్త్వ పరిశీలనలు 2) ఛందస్సు స్వరూప నిరూపకాలు 3) శబ్ద తత్త్వ నిరూపకాలు 4) శైవత్మకాలు 5) కాలనిర్ణయాత్మకాలు 6) దేశి సాహిత్యం 7) ఆంధ్రలిపి సంస్కరణ 8) ప్రాచీన కవులు - కృతులు.**

ఇలా వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చేసిన అనన్య పరిశోధనాత్మక సాహితీ సృజన బహుముఖాలుగా విస్తరించి విజృంభించింది. వ్యాస విస్తరణభీతి చేత కొన్నిటిని మాత్రమే విహంగవీక్షణ మాత్రంగా యిక్కడ చెప్పుకోవడం సాధ్యపడింది.

## చారిత్రక శాసనాలు

వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సాహిత్య వాఙ్మయ పరిశోధన అయినా, చారిత్రక పరిశోధన అయినా దేశంలోని వివిధ ప్రాంతాలలో పర్యటించి, శోధించి లభ్యమైన శాసనాల ఆధారంగానే సాగింది. స్థానిక చరిత్ర సంపుటాలు అవి ముద్రితాలైనా అముద్రితాలైనా విడిచిపెట్టక సాధించి ఆకళింపు చేసుకున్నారు. తంజావూరు సరస్వతీ మహల్‌లోని గ్రంథాలు వేలకొద్దీ పరిశీలించారు.

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు శోధించి ప్రకటించిన శాసనాధారిత చరిత్ర పరిశోధనలలో కొన్ని -

తంజావూరు ఆంధ్రరాజుల చరిత్ర, శృంగార శ్రీనాథము, అన్నమయ్య జననకాల నిర్ణయం, తంజావూరు రాజుల విగ్రహాలు, నాగార్జునుని కాల నిర్ణయం, శ్రీకాకుళక్షేత్రం, నాగబుశాసనము,

లక్ష్మీపుర శాసనం, పల్లవ నరసింహవర్మ ప్రథమ శాసనం, ఇవికాక కపిలేశ్వరశాసనము, అహదనకర శాసనము, ఏకమూరు శాసనము, అనంతరం తామ్రశాసనం, నందిగామ తాలూకా శాసనాలు, ముక్త్యాల శాసనము, చిల్లర శాసనములు మొదలైన అసంఖ్యాకమైన ఎన్నో శాసనాలు, తాళపత్ర గ్రంథాలు, యితర లభ్యపడిన ఆధారాలన్నింటినీ ఎంతో శ్రమించి శోధించి, పరిష్కరించి ప్రచురించడం ద్వారా తెలుగుజాతికి అనితర సాధ్యమైన సేవ చేశారు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి వరేణ్యులు.

అపారమైన వాఙ్మయపరిశోధనానిధిని మేలైన మెండైన వాసిలోనూ, రాశిలోనూ భావితరాలకు అందించి, ఆధ్యాత్మిక ఆత్మతత్త్వ చైతన్యాన్ని మాస్టర్ సి.వి.వి. యోగమార్గం ద్వారా పొంది అసంఖ్యాకమైన శిష్య ప్రశిష్యులకు పంచారు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

"పూర్ణమదః పూర్ణమిదం.." అన్నట్లు భృక్తరహిత తారక రాజయోగ పరిపూర్ణత్వం సాధించిన ప్రభాకరులు 1950వ సంవత్సరం ఆగష్టు 29వ తేదీన యశఃకాయులయ్యారు.

# మహాసంకల్పం ఇలా చెప్పుకోండి

ఓం మమోపాత్త దురితక్షయ ద్వారా శ్రీమహావిష్ణోరాజ్ఞాయా
ప్రవర్తమానస్య ఆద్య బ్రహ్మణః ద్వితీయపరార్థే
శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే, కలియుగే,
ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే,
మేరోర్దక్షిణ దిగ్భాగే, శ్రీశైలస్య ... ప్రదేశే
(మీరు స్నానమాచరిస్తున్న క్షేత్రం శ్రీశైలానికి ఏ దిక్కున ఉందో చెప్పుకోవాలి.
ఉదా : విజయవాడవారు ఈశాన్యప్రదేశే)
హరిహరాది సమస్తదేవతా సన్నిధౌ, అస్మిన్ వర్తమాన

*చిరునామా : - తల్లాప్రగడ రవికుమార్, ప్రధాన కార్యదర్శి, వేటూరి సాహితీ సమితి, విజయవాడ. ఫోన్ నెం. 9397831065*

-శ్రీ యం. బ్రహ్మానందశాస్త్రి

# కథాగాన కళాప్రపూర్ణ ములుకుట్ల సదాశివశాస్త్రి

కళలకు కాణాచి తెనాలి. రంగస్థల నటులు, రాజకీయ ధురంధరులు, హరికథకులు, నాట్యవిశారదులు, కవులు, గాయకులు ఎందరెందరో తెనాలి కీర్తి పతాకాన్ని దేశవిదేశాలలో ఎగురవేసినారు. అట్టి మహనీయులలో శ్రీ ములుకుట్ల సదాశివశాస్త్రిగారు అగ్రగణ్యులు.

హరికథా పితామహులు శ్రీమదజ్జాడ ఆదిభట్లనారాయణ దాసవర్యులు. వారి ప్రియ శిష్యులు హరికథా కేసరి కీ.శే.శ్రీ నేతిలక్ష్మి నారాయణ భాగవతులు. వారి ప్రియ శిష్యులు కీ.శే.శ్రీ ములుకుట్ల సదా శివశాస్త్రి గారు.

కంచి పరమాచార్యులు. శృంగేరి పీఠాధీశ్వరులు పుష్పగిరి పీఠాధిపతులు, పూజ్యులు శ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రి గారి వంటి మహనీయులెందరో శ్రీ శాస్త్రి గారి కథాగానం విని వారిని ప్రశంసించటం శాస్త్రిగారి ప్రతిభకు నిదర్శనం. వారు గానం చేయని పుణ్యక్షేత్రంగాని, గాన సభలు గాని లేవనటం అతిశయోక్తి కాదు. రాష్ట్ర రాష్ట్రేతర ప్రాంతాలలో (చెన్నై, ముంబై, కలకత్తా, ఖర్గపూర్, బరంపూర్, భూపాల్) కథాగానం చేసినవ్యక్తి. ముంబై ఆంధ్రమహాసభలో 55,57, 61,84 సంవత్సరాలలో కథాగానం శ్రీ సదాశివశాస్త్రి గారి ప్రతిభ బహుముఖీనం.

**ఆదర్శ ఉపాధ్యాయులు :**

ప్రకాశం జిల్లా, ఇంకొల్లు గ్రామంలో 1915 సెప్టెంబరు 30వ తేదీన శ్రీ వీరరాఘవశాస్త్రి, వేంకట సుబ్బమ్మ దంపతుల గర్భ శుక్తిముక్తా ఫలంగా శాస్త్రిగారు జన్మించారు. తండ్రి వీరరాఘవశాస్త్రిగారు గొప్ప పౌరాణికులు. మాతామహులు తాడిగడప శేషయ్య గారు ప్రముఖ తరంగ విద్వాంసులు. ఈ విధంగా సంగీత సాహిత్యములు రెండు మాతాపితృవంశముల నుండి శ్రీ శాస్త్రిగారికి వారసత్వంగా సంక్రమించాయి. ఇంకొల్లు పాఠశాలలో శ్రీ మల్లానజ్జల సుబ్బరామశాస్త్రులు గారి యొద్ద దశాబ్దకాలం తర్క వ్యాకరణాలంకార శాస్త్రధ్యయనం. 1937 సంవత్సరంలో మదరాసు విశ్వవిద్యాలయం నుండి 'విద్వాన్' పట్టా పొంది 1942 నుండి మూడు దశాబ్దాలు తెనాలి తాలూకా హైస్కూలులో ఆంధ్రోపాధ్యాయులుగా పనిచేసి ఎనలేని కీర్తిని గడించారు. తెనాలి తాలూకా హైస్కూలు యాజమాన్యం శ్రీసదాశివ శాస్త్రిగారు మా పాఠశాల ఉపాధ్యాయులని గర్వంగా చెప్పుకొనేవారు.

**సంగీత ఉపాధ్యాయులు :**

గాయక సార్వభౌమ శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులు, గాన విద్యాసుందరి బెంగుళూరి నాగరత్నమ్మగారల దగ్గర కర్నాటక సంగీతంలో సుశిక్షితులై సంగీత పరీక్షలలో ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణులైనారు.

శ్రీ మహాలక్ష్మి సంగీత విద్యాలయం స్థాపించి ఎందరికో సంగీత విద్యను ప్రసాదించారు. ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీ వారు తెనాలిలో హరికథా గురుకులం నెలకొల్పి శ్రీ శాస్త్రిగారిని కులపతిగా నియమించారు.

హరికథకులలో శ్రీ శాస్త్రిగారిది ఒక విశిష్ట స్థానము. శ్రీ త్యాగరాజస్వామి జీవితచరిత్రను గానం చేయటంలో అతనికతడె. 1975 రేడియో సంగీత సమ్మేళన కార్యక్రమంలో శ్రీ రామసాక్షాత్కారం (త్యాగరాజస్వామి చరిత్రను) గానం చేసి హరికథా కళకు గుర్తింపును తెచ్చారు. హరికథా లోకానికే గర్వకారకులైనారు. 1958 ఏప్రియల్, 1977 ఫిబ్రవరి నెలల్లో జాతీయ సంగీత కార్యక్రమాల్లో పాల్గొని భక్తమార్కండేయ కథాగానం చేశారు. 1984 అక్టోబరులో దివంగత ప్రధాని

శ్రీమతి ఇందిరాగాంధి ఆత్మశాంతి కోసం విజయవాడ కేంద్రం వారు శ్రీ సదాశివశాస్త్రిని ఆహ్వానించి కథాగానం చేయించటం శ్రీ శాస్త్రిగారి ప్రతిభకు నిదర్శనం. భక్త సిరియాళ కథాగానం చేశారా సందర్భంగా.

**భక్తిరంజని :**

శ్రీ శాస్త్రిగారి కీర్తిని దశదిశలా వ్యాపింపచేసిన మరొక కార్యక్రమం ఆకాశవాణి విజయవాడ, హైదరాబాదు, విశాఖ పట్టణం కేంద్రాల నుంచి ప్రసారమైన భక్తిరంజని, ప్రశాంతమైన ప్రభాత సమయంలో రేడియో పెట్టగానే "రామా నీవాడ సుమీ, రామా నీదయరాదా, లేరానాపాలి శ్రీ వీరరాఘవ, దొరవలె కూర్చున్నాడు. మొదలైన కీర్తనలు వింటూ భక్తి తన్మయాన్ని పొందినవారెందరో వారు భక్తిరంజనిలో గానం చేసినవి. తూము నరసింహదాసు కీర్తనలు, ద్వాదశజ్యోతిర్లింగ స్తోత్రం, దేవీస్తుతి, శివస్తుతి, శ్రీ కనకదుర్గా సుప్రభాతం, వాసుదాసు కీర్తనలు, సప్తర్షికృత శ్రీరామ స్తవరాజం మొదలైనవి ఎంతో ప్రజాదరణను పొందాయి.

**సంస్కృత నాటకాలు :**

ఒకప్పుడు ఆకాశవాణి కేంద్రంనుండి సంస్కృత నాటకాలు ప్రసారమయ్యేవి. భాస, కాళిదాస, భట్టునారాయణ, శ్రీహర్షవంటి ప్రముఖ రచయితల సంస్కృత నాటకాలను పింగళి లక్ష్మీకాంతం గారి ఆధ్వర్యంలో ప్రసారమయ్యేవి. ఎన్నో సంవత్సరాలు అన్వేషించగా సంగీత సాహిత్యాలలో నిష్ణాతులై మృధుమధురంగా శ్లోకాలను చక్కని వాచకంతో గానం చేయగల శ్రీ శాస్త్రిగారు మాకు లభ్యమైనారని పింగళి లక్ష్మీకాంతం గారెంతగానో సంతసించి శ్రీ శాస్త్రిగారిని ప్రశంసించారు.

**శ్రీ శాస్త్రిగారు పొందిన గౌరవాలు పురస్కారాలు :**

1981 నవంబరులో అప్పటి ఆంధ్రసంగీత నాటక అకాడమీ ఆధ్వర్యంలో అనంతపురంలో శ్రీ శాస్త్రిగారి ఆధ్వర్యంలో సంగీతోత్సవంలో డాక్టరు మంగళంపల్లి బాలమురళీకృష్ణ కథాగాన కళాప్రపూర్ణ బిరుదంతో సత్కరించినారు. బందరులో శ్రీ శాస్త్రిగారు గానం చేసిన త్యాగరాజ చరిత్రను విని శాస్త్రిగారికి సంగీత సాహిత్యాలలో ఉన్న వైదుష్యాన్ని గుర్తించి ప్రముఖ సంగీత విద్వాంసులు శ్రీహరి నాగభూషణం గారు శ్రీ సదాశివశాస్త్రిగారిని "సంగీతసాహిత్య భూషణు"లని కీర్తించినారు.

1982వ సంవత్సరంలో రాజమహేంద్రవరం – శ్రీ త్యాగరాజ నారాయణ దాసు సేవాసమితి – నిర్వహించే త్యాగరాజ ఉత్సవాలలో ఆ సంస్థ శాశ్వత అధ్యక్షులైన డా॥మంగళంపల్లి బాలమురళీకృష్ణ గారి చేతులమీదుగా సువర్ణ సుమాభిషేక సన్మానం – "హరికథాక్షీరసాగర" బిరుదప్రదానం.

**ఆకాశవాణి హరికథకులు :**

ఆకాశవాణి విజయవాడ, హైదరాబాదు, కడప, విశాఖపట్నం కేంద్రం నుండి శ్రీ శాస్త్రిగారు ఎన్నో కథలను గానం చేశారు. వైవిధ్యభరితమైన కథలు చెప్పటం శ్రీ శాస్త్రిగారి ప్రత్యేకత. గీతగోవిందం, తరిగొండ వెంగమాంబ, రాజరాజేశ్వరి, కార్తీక, మహాత్మ్యం – దక్షయజ్ఞం, పంచాక్షరీ ప్రభావం, సోమవార వ్రత మహిమ – మొదలైన కథలను గానం చేసి తన ప్రతిభను చాటుకొన్నారు. శ్రీ నారాయణ దాస సద్గురువర్యులు రచించిన హరికథామృతం – సంస్కృత కథను గానం చేయటం – శ్రీ శాస్త్రిగారికి సంస్కృత భాషలోనున్న అభినివేశానికి నిదర్శనం. జై మిని భారతం – శివకథలు, దేవీకథలు – మోక్ష గుండ రామాయణం – ఇలా ఎన్నో కథలను గానం చేసిన ఏకైక హరి కథకులు. రామదర్శనం, రామసేవ, నామకుసుమార్చన ఎల్.పి. రికార్డులు ఇచ్చినారు.

శ్రీ శాస్త్రిగారి ఇలవేల్పు శ్రీ చదలూరు మహాలక్ష్మి అమ్మవారిని స్తుతిస్తూకథాగానం ప్రారంభించే వారు.

వృద్ధాప్యంలో గూడా ఏ మాత్రం గాత్ర మాధుర్యం తగ్గకుండా కథాగానం చేస్తూ నిరంతర రామ నామస్మరణం చేస్తూ 83 సంవత్సరాల వయస్సులో 1998–జనవరి–3వ తేదీ ప్రదోష సమయంలో తుదిశ్వాస విడిచారు. వారి శతజయంతి సందర్భంగా వారిశిష్యులు ప్రశిష్యులు – అభిమానులు – కుటుంబసభ్యులు వారికి ఘననివాళులు అర్పిస్తున్నారు. ఆదర్శప్రాయమైన శ్రీ సదాశివశాస్త్రి గారి జీవన విధానము హరిదాస లోకమునకు అనుసరణీయం.

డాక్టర్ నాగభైరవ ఆదినారాయణ

# కమ్మని కవి - తుమ్మల

ఉత్తమ వాగ్మినా నొప్పారె నురక గ
   ర్జించియా కాదు వర్జించి నుడులు
అతిలోక బల సమం చితుడయ్యె గండలు
   పెంచియా కాదలయించి యొడలు
చిరజయశ్రీ దురంధురుడయ్యె రిపుల ఖం
   డించియా కాదు పండించి కృపలు
అమృతత్వమందె యాగము లాచరించి యా
   కాదు నిష్కామ యోగము వరించి
అతడు సామాన్యుడెట్లు ? వీరతకపూర్వ
జీవములు వోసి వాసి తెచ్చిన మహాత్ము
డతడు నడచిన బాటల యందు నడచి
పందయును విక్రమక్రమాస్పందుడయ్యె

ఇది జాతిపిత గాంధీజీని వర్ణించే పద్యం. ప్రబంధ పద్ధతిలో ఆకార వర్ణన చేయకుండా, వ్యక్తిత్వాన్ని వర్ణిస్తూ రచింపబడిన పద్యమిది. ఒక విషయాన్ని సాధించడానికి ఏది అవసరమో, దాని మూలంగా కాకుండా తద్విరుద్ధమైన పనుల ద్వారా ఆ విషయాన్ని సాధించడం గాంధీ వ్యక్తిత్వంగా ఈ పద్యంలో వర్ణింపబడింది. ఈ పద్యాన్ని రచించింది మహాత్ముని ఆస్థానకవిగా కట్టమంచి రామలింగారెడ్డిగారే ప్రశంసింపబడిన తుమ్మల సీతారామమూర్తిగారు.

సీతారామమూర్తిగారు 1901 డిసెంబరు 25వ తేదీన జన్మించారు. బడికొకపూట, మడికొకపూటగా చదువుకున్నారు. తుమ్మల వారు పతిగపంట, శబల, పైరపంట, సమదర్శి, రాష్ట్ర గానము, ఉదయగానము, సర్వోదయగానము అనే ఖండకావ్యాలను, ఆత్మార్పణము, ధర్మజ్యోతి అనే లఘు కావ్యాలను, ఆత్మకథ, మహాత్మ కథ అనే మహా కావ్యములతోపాటు భర్తృహరి సుభాషితాలకు అనువాదాన్ని, నేను నా కథలు అనే పేరుతో స్వీయగాథను రచించారు. సొమ్ము కోసం తన కవితా కన్యకలను అమ్ముకోకుండా ధర్మమార్గాను వర్తులైన వారికి మాత్రమే అంకితం చేయాలనే నియమాన్ని ఏర్పరుచుకోవడం, ఆ నియమాన్ని తుదముట్ట పాటించడం తుమ్మలవారి గొప్పతనం.

గాంధీజీ "My experiments with truth" అనే స్వీయ చరిత్రను వేలూరి శివరామశాస్త్రిగారు 'ఆత్మకథ' అనే పేరుతో తెనిగించారు. ఆ గద్యకు తుమ్మలవారు 'ఆత్మకథ' పద్యరూపంలో వ్రాశారు. ఈ ఆత్మకథలో గాంధీజీ జీవితము క్రీ.శ. 1921 వరకు వర్ణింపబడింది. చరిత్రకు భంగం కలుగకుండా రసపోషణ చేయడంలో తుమ్మల ఈ గ్రంథం విషయంలో విజయం సాధించారు. ఆత్మకథలో చెప్పని గాంధీజీ జీవిత చరిత్ర మహాత్మకథ. ఈ రచనలో తుమ్మల పరిపాలనలో భారతీయులనుభవించిన కష్టములను పలుమార్లు వర్ణించారు.

తుమ్మలవారికి తిక్కన కవితా శైలి అభిమానపాత్రమైనది. అలతి అలతి తుని యల కాహళ సంధించినట్లు రచన చేయడం తిక్కన కావ్యశైలి. తుమ్మలవారు కూడా తిక్కన లాగానే చిన్న చిన్న వాక్యాలతో రచన చేయడం మహాత్మ కథలో కనిపిస్తుంది. టంగుటూరి ప్రకాశం పంతులు సైమన్ కమీషన్‌కు వ్యతిరేకంగా రొమ్ము చూపుతూ ముందుకు దూకు సన్నివేశంలో పద్యమిది.

ఎవడా కాల్చెడివాడు; కాల్పవలె నా యీ రొమ్ముపై; నీ శవం
బవలోకింపక పోవనేనిపుడు; నన్నాపంగ నెవ్వాని కు
న్నవి గుండెల్; నిటలాక్షుడడ్డు పడినన్ నాథాకకుంజాల; దీ
యవనిన్ భీరులు లేరు; లేరుపరగర్వాగస్సహిష్ణుల్ శతుల్

ఈ పద్యంలోని ఏడు వాక్యములు తుమ్మలవారి నాటకీయ శైలిని తెలియజేస్తున్నాయి.

తుమ్మలవారి లఘు కావ్యాలలో ఒకటి ఆత్మార్పణము. ఇందులోని కథ భారతంలో ప్రసిద్ధమైన లుబ్ధక కపోతోపాఖ్యానంలోని కథే. అతిథి

సేవ,ప్రేమ, పాతివ్రత్యములను బోధించే కథ ఇది. బోయని ఆకలి తీర్చడానికి ఆత్మార్పణ చేసిన కపోతము, దానిని అనుసరించి అగ్నిలో దూకిన కపోతి కథఇది. లఘు కావ్యాలలో రెండవది ధర్మజ్యోతి. ఆశకు లోనుకాక మిత్ర ధర్మాన్ని నెరవేర్చిన ధర్మమూర్తి అయిన నారయ్య కథ ఇది. ఈ ధర్మమూర్తి నారయ్య తుమ్మలవారికి కన్నతండ్రి. కడు దారిద్ర్యాన్ని అనుభవిస్తూ కూడా. స్నేహితుడిచ్చిన బంగారాన్ని దాచి, అతనికి తిరిగి ఇచ్చిన ఉత్తముని కోసం ఆరంభించిన భూదాన జ్ఞానాన్ని చరిత్ర ఇందు వర్ణింపబడినది. వినోబాభావే పేదలను రక్షించడం గురించి చేసిన రచన. సర్వోదయగానము. వీనితోపాటు పతిగపంట, పైరపంట, శబల, సమదర్శి, రాష్ట్రగానము, ఉదయగానము అనే ఖండకావ్యములలో తుమ్మలవారి దేశభక్తి, సుజన స్తుతి, రైతులపట్ల అభిమానము, తెలుగు నేలపై గల మమకారము, ఆంధ్రుల సంస్కృతీ సంప్రదాయముల పట్ల అభిమానము మొదలైన ఉత్తమ లక్షణములు గోచరిస్తాయి.

తుమ్మల స్వయంగా రైతు. రైతుల కష్టసుఖాలు తెలిసిన వ్యక్తి కావడంతో ఆయన రైతు కష్టాలను, దీన స్థితిని కళ్ళకు కట్టినట్లు వర్ణించిన కర్షకకవి.

బిందెలతోడ పాల్పిందెదుగాని నీ
    కంచంబు లోనికి గంజినీళ్ళె
కొండంత నసుప్రత్తి పండింతు గాని నీ
    కాయంబు మూయంగ కప్పడం బె
పలుపుట్ల వద్ద గాదెల నింతుగాని నీ
    క్షుద్బాధ నడగింప చోళ్ళ జావె
కమ్మని శాకముల్ కాయింతుగాని నీ
    కూరకై కటికి సాంబారు పొడుమె

అంటూ రైతులు ఎంతకష్టపడినా, సుఖాలు మాత్రం దక్కవని బాధపడ్డాడు.

తుమ్మల వారు తెలుగువారి ముఖ్యపండుగైన సంక్రాంతి సౌందర్యమును రమణీయంగా వర్ణించారు. ప్రకృతిలో కనిపించేవస్తు సముదాయంతో సంక్రాంతి లక్ష్మి సోయగాన్ని వర్ణించిన విధం సరససుందరంగా ఉంది.

కొసరి నూరిన పచ్చి పసపు పూత మొగాన
    గుమ్మడి పూదుమారమ్ము నద్ది
కందరేగడ నారబండి కన్పండులై
    పొలుచు మిర్యపు పండు బొట్టుపెట్టి
వలిపమ్మునకు నొక్కవాసి హెచ్చైనట్టి
    నునుమంచు తెరచీర నూలు కొల్పి
బంతిపూవులకు చేమంతి నెయ్యము గూర్చి
    కబరీభరమ్ము చక్కన కుదిర్చి
పంట కళ్ళాలు మును బరాబరులు సేయ
గూడు కట్టిన తెలిమబ్బు గొడుగు నీడ
కదలివచ్చెను భాగ్యాల కదలివోలె
మకరసంక్రాంతి లక్ష్మి హేమంత వీథి

దేశమాత పరాయి పాలనలో అల్లాడుతూ ఉంటే, ఆమె బాని సత్వాన్ని తొలగించలేని బ్రతుకు వ్యర్థమని తుమ్మల భావించాడు.

మాతృదేశం బన్యమను జేశ్వరుని చేత
    చిక్కి స్వాతంత్ర్యంబు దక్కి తనదు
జాతీయతను బాసి చేతోగతం బైన
    తలపు వెలువరింప దగిన హక్కు
నెడసి లోలోపలనే క్రుళ్ళి కుములుచు
    నీచ దాస్యమున మునింగి పిరికి
తనము వరించి నితాంత కష్టపరంప
    రలనీగి దారిద్ర్యమలకు దిక్కు
లేక శోకించువేళ తల్లి మొఱ నాల
కించి మైపులకింప చలించి కొంచె
మేని నామెకు తోడ్పడలేని బిడ్డ
బ్రతుకదేటికి ధాత్రికి బరువుచేటు

కులమత ద్వేషాలను తుమ్మల నిరసించారు. జ్ఞానం ఎవడిసొత్తే అతడే బ్రాహ్మణుడని అంటారు తుమ్మల.

ఎఱుక లేని వార లెల్లరు శూద్రులే
ఉన్నవారలంద రుర్వి సురులే
చచ్చువాద మికను జాలించి మేలెంచి
కన్నువిప్పరయ్యా! అన్నలార!

ఆపదలో ఉన్నవారికి సాయం చేయడమే గొప్పదని, అలాంటి మానవులలోనే మాధవుడుంటాడని తుమ్మల భావించాడు.

కోవెలలో గంగానది
రేవులలో రామకోటి రేఖలలో లే
దేవాని యెదద కరుణకు
నావాలం బతని యంద హరి వసియించున్

తుమ్మలవారికి ఆంధ్రాభిమానము హెచ్చు. ఆంధ్రదేశపు మట్టి తనకు బంగారమని, ఆంధ్రదేశపునీరు తనకు అమృతమని అంటారు ఆయన. ఆంధ్రుల చరిత్రలోని గొప్ప సంఘటనలను వర్ణిస్తూ, ఆంధ్రుల పౌరుషాన్ని ప్రశంసిస్తూ, ఆంధ్రుల ప్రత్యేకతను గుర్తుచేస్తూ తుమ్మల ఎన్నో పద్యాలు రచించారు. అవన్నీ చదివితే ఆంధ్రుల యెడదలు ఉప్పొంగుతాయి.

**ఒకనాడాంధ్ర ధరా విరోధి నరపాలో దగ్రసేనా శిరః**
**ప్రకరంబుల్ విదళించి తద్రుధిరధారా నిర్ఘ్ఝర స్నాతులై**
**కకుబంతంబుల మేర లెత్తిన పతాకన్ నేడు చిత్తంబులో**
**నొకమారెంచుదు రక్తమగ్ని సఖమై యుప్పొంగి ఘూర్ణిల్లగన్**

ఆంధ్రునిగా పుట్టిన ప్రతివాడు ఆంధ్రునిగా బ్రతికి, ఆంధ్రునిగా మరణించాలంటారు తుమ్మల.

**ఆంధ్రుడవై జన్మించితి**
**వాంధ్రుడవై యనుభవింపు మీ యుర్వీ భవం**
**బాంధ్రుడవై మరణింపుమి**
**ఆంధ్రత్వము లేని బ్రతుకు నాశింపకుమీ!**

తుమ్మలవారు క్రాంతదర్శి. రాష్ట్రం ఏర్పడిన తరువాత నాయకులైన వారు ఎలా ఉంటారో ముందే ఊహించారు. అలాంటి వారిని అస్పృశ్యులుగా చూడాలంటారు తుమ్మల

**మతమేలా? కులమేల ? కల్పితము లీమర్యాద లీ శాస్త్రముల్**
**కతలంచుం బ్రవచించి పెత్తనము రాగా నాకు నా మామకున్**
**పితకుం బడకు బావకున్ మరిదికిన్ పీఠంబు తెమ్మంచు సి**
**బ్బితి వోనాడిన వాడొకండె మనకస్పృశ్యుండవాచ్యుండికన్**

రాష్ట్రం వచ్చినప్పుడు అందరికీ సౌకర్యాలు అందవని, ఓర్పు వహించాలని, గుణవంతులకు తప్ప కులవంతులకు పెత్తనం అప్పగించకూడదని తుమ్మల అంటారు.

**మూడుకోట్ల ప్రజలు మూగిన యింటిలో**
**మంచిపీట లెంతమంది కుందు**
**చాపనున్నవారు నాపలా? సైరణ**
**చూపు వారె కీర్తి కోపు వారు**
**దొడ్డ తలపులున్న రెడ్డి కైనను మాల**
**బిడ్డకైన నిమ్ము పెత్తనమ్ము**
**కులము లింక నిల్వ గలవటోయి! వేరు**
**పరువు పడియె వాని పరువు సెడియె**

విద్యార్థులను రాజకీయాల్లోకి లాగి వారిని చెడగొట్టవద్దని తుమ్మల నాయకులకు హితవు చెప్పాడు.

వసుధ కెట్టి బెట్ట వచ్చిన పసివాని
ముట్టరాదు రెచ్చగొట్టరాదు
విలువ హెచ్చు గాక విలయం బయగుగాన్
విత్తనాల సంచి విప్పరాదు

రాష్ట్రాభిమానంతో పాటు దేశాభిమానం కూడా అంతగా ఉండాలని తుమ్మల ప్రబోధించాడు.

**మన కాంధ్రత్వము ప్రాణము**
**తనువు సుమీ భారతీయ ధర్మము, యావ**
**న్మనుజాభ్యుదయ ప్రవణత**
**మనుజా! విను, వజ్ర కవచమై దిటవొసగున్**

ఇంతగొప్ప కవిత్వం వ్రాసిన తుమ్మలను ఆంధ్రదేశం కనకాభిషేకాలతో సత్కరించింది. ఆంధ్రవిశ్వవిద్యాలయం కళాప్రపూర్ణతో సన్మానించింది. బాలకవి, అవధానపండిత, సరసకవిశేఖర, ఆశుకవీంద్ర, విద్వత్కవి సామ్రాట్టు, జాతీయ కవిబ్రహ్మ, అభినవ తిక్కన మొదలయిన బిరుదులతో ఆంధ్రులు గౌరవించినా, ఆయన తనకు తాను ఇచ్చుకున్నా బిరుదు తెనుగులెంక. తెలుగు భాషాభిమానాన్ని ప్రదర్శిస్తూ, సరసమైన కవిత్వం చెప్పిన తుమ్మల సీతారామమూర్తి 'కమ్మని కవి' నిజంగా కమ్మనికవే!

శ్రీ అంబికానాథ్,
శ్రీ హర్షవర్ధనరాజు

# కవిత్వపు అంతర్గోళాలను అనుసృజించిన కవి దుర్గానంద్

తనదైన సృజనాత్మకమైన, మౌలికమైన నూత్న సాహిత్య మార్గాన్ని వేసిన కవి దుర్గానంద్. పద్యంగద్య శైలిల్లో అనుపమాన ప్రతిభను కనబర్చిన అరుదైన మహోన్నత సాహిత్య శిఖం ఆయన. నాలుగు దశాబ్దాల పైచిలుకు పద్యం, వ్యాసం, గేయం, నాటకం, నవల, భాషాపరిశోధన, వ్యాకరణం, నిఘంటు నిర్మాణం ఇలా విభిన్నమైన సాహిత్య ప్రక్రియా రీతుల్లో నిరంతరం శ్రమించి తన మేథస్సును, రక్తాన్ని అక్షరాలుగా మార్చిన కవిశ్రేష్ఠుడు.

శ్రీదుర్గానంద్ (చక్రాల దుర్గానందరాజు) 12, జనవరి, 1927వ సంవత్సరంలో మోదుకూరు, తెనాలి తాలూకా, గుంటూరు జిల్లాలో జన్మించారు. తల్లిదండ్రులు అనసూయమ్మ, కోటేశ్వరరాజు. ఆయన ప్రాథమిక ఉన్నత విధ్యాభ్యాసం మోదుకూరు, పరిసర ప్రాంతాల్లోనే జరిగింది. విద్యార్జనే ధ్యేయంగా కల్గివున్న ఆయన తన 17వ యేట(1946) లాహోర్ రావల్పిండి (నేటిపాకిస్తాన్) వెళ్ళి అక్కడ సంస్కృత విద్యాపీఠాల్లో హిందీ, సంస్కృం, ఋగ్వేదంలో గంభీరమైన అధ్యయనం చేశారు. తరువాత బి.ఎ. సాహిత్యరత్న పాసైయ్యారు. 1948లో లాహోర్‌నుండి తిరిగివచ్చిన పిమ్మట కృష్ణాజిల్లాలోని గాంధీ ఆశ్రమంలోనూ, కొండపల్లి, తెనాలి, రాజమండ్రి, హైదరాబాద్, కొత్తగూడెంలలో హిందీ పండిట్‌గా, ప్రధానాచార్యుడిగా హిందీ భాషాభివృద్ధికై పనిచేశారు. 1967లో స్వర్గీయ ఎమ్.ఆర్. అప్పారావుగారి ఆహ్వానం మేరకు నూజివీడు ధర్మా అప్పారావు కళాశాలకు బదిలీ అయ్యి హిందీ లెక్చరర్‌గా 18 ఏళ్ళపాటు పనిచేసి ఉద్యోగ విరమణ చేశారు.

**సాహిత్యసేవ :** తమ పదిహేనవ యేటనుంచే కవిత్వం వ్రాయడం మొదలు పెట్టారు. అప్పటి ఢంకా, స్వతంత్ర, జ్యోతి, గోసేవ వంటి తెలుగు పత్రికల్లో, ఆజ్‌కల్, సాహిత్య సందేశ్, అజంతా దక్కన్ హిందీ వంటి హిందీ పత్రికల్లో పద్యాలు, వ్యాసాలు వ్రాసేవారు. ఆయనవి 30కిపైగా రేడియోరివ్యూలు కూడా వున్నాయి.

ఆయన తొలికావ్యం అంతర్గోళాలు (1956)అభ్యుదయ కవిత్వంగా ప్రయోగవాద దృక్కోణంలో రచించారు. తొలి అభ్యుదయ పద్యప్రబంధంగా 'మధూలిక'(1958) గేయకథా ప్రేమకావ్యం ఋూనాప్రణయ గాథ (1959) ఆధ్యాత్మిక రహస్య వాద గేయకవిత చింతన, శృంఖల, అట్లాగే కొల్లేటి వ్యథిత ఇతి వృత్తంగా తీసుకొని భీతాంగన (1981)1201 పద్యాల బృహత్ కావ్యాన్ని సృజించారు.

జాషువాగారి ఫరదేసీని హిందీలోనికి, రవీంద్రుని గీతాంజలి, సురదాస్ పదావళిని సూరదాసు పదాలుగా తెలుగులోనికి అనువదించారు. (సూరదాసు పదాలకు ఆంధ్ర సాహిత్య అకాడమి అవార్డు వచ్చింది). మానవసమాజం, చరిత్ర, తత్త్వచింతనల పట్ల ఆయన దృక్పథం, పరిశీలన విలక్షణమైనది. ఆయన వ్రాసిన డ్రీమ్స్ కాలనీ సృజనకర్త, శంఖారావం, ఘెరావ్ కవితలు మొదలైన దూరదృష్టితో కూడిన ఉత్తేజిత రచనల్లో అది స్పష్టంగా కాన వస్తుంది.

ప్రభుత్వపాలన, లోపభూయిష్ఠమైన ఆర్థిక విధానాల ద్వారా నష్టపోయే సామాన్య ప్రజానీకం తరుపున దండెత్తడమేకాదు ఆ సమస్యలకు పరిష్కార మార్గాలను తమదైన శైలిలో నిర్దేశించారు. నూతన ఆర్థిక సిద్ధాంత ప్రతిపాదనలు చేశారు. ఫ్రీమెండ్, ఫ్రీఫుడ్, కమ్యూనిజం + గాడ్, స్పాట్ ఎడ్యుకేషన్ క్విట్ కరెన్సీ అన్నవి ఆయన సామాజిక స్వప్నాల్లో కొన్ని వ్యాకరణం, భాషా పరిశోధన దిశగా హిందీ ఇంగ్లీషు గ్రామర్, పద ప్రయోగ నిఘంటువు (పుష్పవృష్టి)లను రూపొందించించారు. వ్యాకరణం భాషా బోధన పరంగా ఆయన ప్రతిపాదనలు గ్రాహ్యములు.

ఆయన ఉభయ భాషా ప్రవీణుడు అవడంవలన అఖిల భారత రచయితల స్థాయిలో మంచిస్థానాన్ని కల్గివున్నారు. ఆయన భావాలు, ఆలోచనలు తెలుగు, హిందీ, ఆంగ్లభాషల్లో సుమారు మూడువేల పేజీల సాహిత్య సృజన అముద్రితంగా వుంది.

ఆయన మే7,1985లో తుదిశ్వాస విడిచారు. బహు ముఖమైన, సృజనశీలమైన ఆయన దృక్పథం అనుసరణీయం.

*చిరునామా : అంబికానాథ్, హర్షవర్ధనరాజు, ఫ్లాట్ నెం-406, ఎస్.వి.ఎస్ హోమ్స్, సాయినగర్, గన్నవరం, కృష్ణాజిల్లా 521101, సెల్ 9441519210*

శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్

# కేమోటాలజిపిత డా॥ కొలచల సీతారామయ్య

కృష్ణాజిల్లా పుల్లేరుకాలువ ప్రక్కనున్న ఉయ్యూరుకు ఒక కిలో మీటరు దూరంలో ఉన్న యాకమూరు గ్రామంలో 15-7-1899న కొలచల వెంకట కృష్ణశాస్త్రి, మూర్తమ్మ దంపతులకు జన్మించిన ఏడు గురు సంతానంలో చివరివారు శ్రీ సీతారామయ్యగారు. పెద్దగా ఆదాయం లేని మధ్యతరగతి సంసారం. కుటుంబం వారందరికీ సీతారామయ్యగారు తాసిల్దార్ కావాలని కోరిక. కాని ఈయనకు మాత్రం ఉన్నత చదువులు చదివి కొత్త విషయాలు కనిపెట్టి చదువుకు సార్ధకత కలిగించాలని ఉండేది. దానికి తగ్గ ఆర్థిక స్తోమత లేదని తెలిసినా మనసులో అది బలీయంగా ఉండిపోయింది. మద్రాస్ వెళ్లి చదువుకోవాలని ఉందని చెబితే నడిచి వెడితే అభ్యంతరం లేదన్న తండ్రిమాట మన్నించి రామయ్య గారు రోడ్డున పడి నడిచి మద్రాస్ చేరారు. తండ్రిగారిపై ఉన్న అచంచల భక్తీ విశ్వాసాలను జీవితాంతం కొనసాగించారు. అక్కడ మదనపల్లిలో డాక్టర్ అనీబిసెంట్ నేషనల్ యూనివర్సిటి పెట్టిన పరీక్షలన్నీ పాసై సీటు సాధించారు. క్రీడలపై బాగా ఆసక్తి ఉండేది. మంచి రన్నర్, లాంగ్ జంపర్ కూడా. యూని వర్సిటీ బెస్ట్ ఎత్లేట్ రామయ్యగారే. కష్టపడి చదివి బి.ఎస్.సి. పాసైనారు. ఈ యూనివర్సిటి తర్వాత మద్రాస్‌లోని అడయార్‌కు మారింది.

తండ్రి మరణం సంగతి తెలిసి స్టీమర్ ఎక్కి ఉయ్యూరు చేరి, దినవారాల తర్వాత "నా అన్నయ్య" అని ఆప్యాయంగా పిలుచుకొనే మూడో అన్నయ్య అనంతరామయ్యగారితో తాను అమెరికా వెళ్లి కెమిస్ట్రీ చదువుకోవాలను కొంటున్నానని చెప్పారు. ఆయనకు ఇష్టం లేక పోయినా, రామయ్యగారి పట్టుదలకు అంగీకరించక తప్పలేదు. రామయ్యగారు ఇండియాలో ఉండరని, ఇతర దేశాలలో రాణిస్తారని జాతకం ద్వారా ముందే తెలుసుకొన్న తండ్రి రెండు వేల రూపాయలు కష్టపడి దాచి అందజేయమని చెప్పారు. అన్నగారిచ్చిన ఆ డబ్బు తీసుకొని మద్రాస్ చేరారు. అక్కడ ఒక టీచర్ పరిచయమై కొలంబో మీదుగా వెళ్ళే "మర్చంట్ షిప్" కెప్టెన్‌తో చెప్పి ఎక్కించాడు. తనలాగే కెమిస్ట్రీ మీద అభిరుచి ఉన్న ఒక స్టూడెంట్ తనతో వస్తానంటే సరేనని, తన డబ్బును డాలర్లుగా మార్చటానికి నమ్మి ఇచ్చేశారు. వాడు మళ్ళీ పత్తాలేడు. చేతిలో చిల్లిగవ్వ లేదు. విషయం తెలిసిన టీచర్, మిత్రుల ద్వారా కొంత డబ్బు వసూలు చేసి కొలంబో దాకా టికెట్ కొనిచ్చి పంపాడు. కొలంబో చేరి ఆ స్టూడెంట్ ఇంటికి వెళ్లి విచారిస్తే వారికి ఆ సంగతేమీ తెలియదన్నారు. అవాక్కయ్యారు రామయ్య. తన దౌర్భాగ్యం గురించి కెప్టెన్‌కు చెప్పుకొన్నారు. వాడు తిట్టినా, సాను భూతితో బొగ్గు నిల్వచేసే గది-కోల్ స్టాక్‌లో కూచోమని చెప్పి, చెప్పిన పనులన్నీ చేస్తే ఏదో కొంత డబ్బు ముట్ట చెబుతానని అమెరికా తీసుకు వెళ్ళడానికి ఒప్పుకొన్నాడు. చేసేది ఏమీలేక రామయ్యగారు సరేనన్నారు. ఎర్ర సముద్రం, సూయజ్ కాలువ, జిబ్రాల్టర్ జలసంధి దాటి అనంత అట్లాంటిక్ సముద్రంపై ప్రయాణం చేశారు. కెప్టెన్ చెప్పిన పనులన్నీ చేసినా, అన్నమాట నిలబెట్టుకోకుండా వాడు రూపాయి - సారీ డాలరు కూడా ఇవ్వక ఎగనామం పెట్టాడు. ఏ ఆధారపత్రాలు లేకుండా అమెరికా చేర్చటమే గొప్ప అని చెప్పి న్యూయార్క్‌కు చేర్చాడు.

1922లో చికాగోలో ఆటం క్వార్టర్ - కు దరకాస్తు చేసి, ఇక్కడ కూడా వారు ఫిజిక్స్ కెమిస్ట్రి, గణితంలలో పెట్టిన నాలుగు మేజర్ క్వార్టర్లలో పాసై అద్వితీయంగా నిలిచారు. రామయ్యగారి అనుభవం, జ్ఞానం అత్యద్భుతం అని భావించి 1924 జనవరి 1న గ్రాడ్యుయేట్ స్కూల్‌కు బదిలీ చేశారు. ఏదో ఒక పని చేస్తే కానీ చదవటం కష్టం అని గ్రహించి డిగ్నిటీ ఆఫ్ లేబర్‌గా భావించి బరువులు మోస్తూ, రెస్టారెంట్‌లో కిచెన్‌లో, అడ్డమైన చాకిరీ చేస్తూ, కొంత సంపాదిస్తూ చదివారు. అర్ధాకలితో ఉన్నా, వచ్చిన డబ్బు పుస్తకాలు కొనటానికి సరిపోతున్నా, అధైర్యపడక, పట్టుదల వదలక, ఉండటానికి ఆవాసమూ లేక రాత్రిళ్ళు పార్కులలో గడిపారు. ఆయనది భారీ బలమైన శరీరం. "గజేంద్ర రామయ్య" అనేవారు. కనుక ఏ వ్యాధులూ ఆయన దరి చేరలేక నీరసంగా ఉన్నా విన్నది అంతా "ఫొటోగ్రాఫిక్ మెమరీ" లాగా మెదడులో ఉండిపోయేది. చదవాలి, సాధించాలి అన్నవే ఆయ నకు మంత్రాలయ్యాయి. అదే తపన, అదే ధ్యాస, శ్వాస. 25 ఏళ్ళ

వయసులో 10-6-1924న తన అభిమాన విషయమైన కెమిస్ట్రిలో మాస్టర్ డిగ్రీ సాధించారు. రామయ్యగారి మేధస్సుకు, సునిశిత జ్ఞానానికి, అభిరుచికి, తపనకు ప్రొఫెసర్లు అబ్బుర పడేవారు. ఇతాకాలో ఉన్న కార్నెల్ యూనివర్సిటిలోను, న్యూయార్క్‌లోను పి.హెచ్.డి. కి అర్హత పొంది చేరారు. రామయ్యగారిలో ఉన్న స్పార్క్‌ను గుర్తించి, పి.హెచ్.డి.కి రామయ్య అర్హులని స్పెషల్ కమిటీ నిర్ధారించింది. ఇప్పుడు కూడా రామయ్యగారు తోటమాలిగా ఫాక్టరీలో ఫర్నేస్ మాన్‌గా కష్టపడుతూనే ఉన్నారు. రోజు రోజుకూ జీవితం దుర్భరంగానే ఉంది. అయినా ధైర్యం కోల్పోకుండా, వెనకడుగు వేయకుండా మరింత దీక్షతో ముందుకు సాగారు. దట్ ఈజ్ రామయ్య. చిన్నగదిలో అద్దెకుంటూ కాలక్షేపం చేశారు. తనతో చేరిన వారందరి కంటే ఒక ఏడాది ముందే పి.హెచ్.డి. పొందారు రామయ్యగారు.

డిప్లొమో చేతికిరాగానే లూబ్రికేంట్స్ తయారు చేసే న్యూయార్క్‌లోని ఒక ప్రసిద్ధ సంస్థ "సోనే బారన్ సన్స్"లో ఉద్యోగం వచ్చింది. లేబరేటరి బాధ్యతలు రామయ్యగారికి అప్పగించారు. బ్రూక్లిన్ లో నివాసముండేవారు. అప్పటికే టిక్సో ట్రఫి కొలచే పద్ధతిలోను, మోటార్ ఆయిల్ జీవితాన్ని పెంచే పద్ధతిలోను చేసిన కృషికి రెండు పేటెంట్ హక్కులు పొందారు. ఇక్కడ ఇంజన్ రొటేషన్ సామర్థ్యం పెంచటానికి, ఆయుష్షును పెంచటానికి అనేక పరిశోధనలు చేసి విజయం సాధించారు. వీటన్నిటికి పేటెంట్ హక్కులు తీసుకోనీకుండా కంపెనీ అడ్డుపడింది. మూడేళ్ళ తర్వాత మూడు హక్కులను మాత్రమే పొందగలిగారు. "వేల్వేరి కిట్టేన్" అనే సమర్ధమైన మోటార్‌ను సృష్టించారు. లూబ్రికేంట్స్‌పై రామయ్యగారి కృషి ఎంతో పేరు ప్రఖ్యాతులు తెచ్చి పెట్టింది. కంపెనీకి బఫర్ ఆఫర్లొచ్చాయి. కంపెనీ తనను వాడుకొంటోంది కాని గౌరవించటం లేదని గ్రహించారు. అప్పటికే సోవియట్ రష్యా సాధిస్తున్న అభివృద్ధి, ఆ దేశం ఇతర దేశ సైంటిస్ట్‌లకు పలుకుతున్న ఆహ్వానం అర్ధంచేసుకొని, ఆ దేశ పునర్నిర్మాణంలో తానూ భాగస్వామి కావాలని నిర్ణయించుకొని రష్యా "భూతల స్వర్గ"మని భావించి రష్యా వెళ్ళటానికి నిశ్చయించుకొన్నారు.

తనకు అమెరికాలో అన్ని విధాలా సాయంచేసిన అమ్మాయి "సారా"ను వలచి వలపింపజేసుకొని వివాహమాడారు. జీవికా జీవులుగా మెలిగారు. కాని ఆమె అవసరమైన సమయాలలో సరైన నిర్ణయాలు తీసుకోలేకపోయేది. ఇప్పుడు కూడా తనతో రష్యా రమ్మని కోరితే ఆమె ఒప్పుకోలేదు. ఆమెను అతికష్టం మీద వదిలి 17-12-1930న ఒంటరిగా రష్యా చేరారు. రామయ్యగారికి రష్యా "రెడ్ కార్పెట్ స్వాగతం" పలికింది. డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఫ్యుయేల్స్ అండ్ ఆయిల్స్‌కు అంటే "నామి"కు అధిపతిని చేసి, అత్యున్నత పదవీ గౌరవాన్ని అందజేసింది. స్వీయ ప్రతిభతో అన్ని పరిస్థితులలో పనిచేసే ప్రత్యేక కిరోసిన్ ఇంధనాన్ని, తేలిక రకం టాంక్‌లను రామయ్య కనిపెట్టారు. ఈ టాంక్‌లు రెండవ ప్రపంచ యుద్ధంలో రష్యాకు గొప్ప విజయాలు సాధించి పెట్టాయి. రామయ్యగారి కీర్తి ఖండాంతరాలలో వ్యాపించింది. ఇదొక మేజర్ సైంటిఫిక్ విజయం. దీనితర్వాత డీకే నామి, డి కే -2 అనే అధునాతన యంత్రసృష్టి చేశారు. సర్వ శ్రేష్ఠమైన రష్యన్ టాంక్‌ను, ప్లాస్టిక్ స్పేస్‌ను కనిపెట్టారు లూబ్రికేంట్స్‌లో విప్లవమే సృష్టించారు. "The lubricant is a special plastic medium" అంటే కందెన నూనె స్వతంత్ర వ్యక్తిత్వం, ధర్మం ఉన్న మాధ్యమం అని నిర్వచించారు. అందుకే ఆయనకు "కెమోటాలజి పిత" అన్నారు. తర్వాత ఇదే ట్రైబోకెమిస్ట్రీగా పిలువబడింది కనుక ఫాదర్ ఆఫ్ ట్రైబోకెమిస్ట్రీ కూడా రామయ్యగారే. మూడుసార్లు జర్మనీ బాంబుదాడులు నుండి తప్పించుకొని బతికి బయటపడ్డారు. రష్యా ప్రగతి రధానికి రామయ్య చక్రమై, చరిత్ర సృష్టించారు. టెక్నికల్ సైన్సులో మాస్టర్ డిగ్రీని, డాక్టరేట్‌ను ఒకేసారి అందుకొన్నారు. లూబ్రికేంట్స్‌పై 70 పేపర్లు రాసి ప్రచురించారు.

ఓల్గా తీరంలోని మాస్కో నగరంలో కాపురముండేవారు. "కాత్యా" అనే అతి పేద పల్లెటూరి అమ్మాయిని వివాహం చేసుకొని ఆమెద్వారా రష్యా వేషభాషలు నేర్చుకొని లీలావతి నీలవేణి అనే ఇద్దరమ్మాయిల తండ్రి అయ్యారు. ఒకరకంగా రామయ్యగారు ఆనాటి రెండు అగ్ర రాజ్యాలైన అమెరికా రష్యాల ముద్దుల అల్లుడయ్యారన్నమాట. ఒక చిన్న అపార్ట్‌మెంట్‌లో ఉండేవారు. ఇంత గొప్ప సైంటిస్ట్ అయినా వర్కర్‌లాగా తలపై టోపీతోనే ఉండేవారు. అందరితోనూ కలిసిమెలసి ఉండటం, పెద్దలయెడ వినయం, ఆయన లక్షణాలు. మూర్తీభవించిన సంస్కారం రామయ్యగారిది. మాస్కోలో తెలుగు నేర్పేవారు. తెలుగు-రష్యన్ డిక్షనరీ తయారు చేశారు. ఏటుకూరి బలరామ మూర్తిగారు ఇంగ్లీష్‌లో రాసిన "A brief survey of the History of the people of Andhra" పుస్తకాన్ని రామయ్యగారు తెలుగులోకి అనువదించారు. ఆంధ్ర ప్రాంతం నుండి రష్యా వచ్చిన వారందరికీ, యువజన బృందానికీ తన ఇంట్లో ఆతిధ్యమిస్తే, భార్య కాత్యా తెలుగు భోజనం వండి, ఆప్యాయంగా వడ్డించి అన్నపూర్ణలా,ఆ రామయ్యకు సీతమ్మలా, అపర కాత్యాయనీ స్వరూపంగా సహకరించేది. రష్యా వచ్చిన ఆంధ్రావారికి సంభాషణలో తెలుగు పదం దొరక్క ఇబ్బంది పడితే రామయ్యగారు వెంటనే సరైనపదం సూచించి ఆశ్చర్య పరచేవారు. భాష మీద అంత పట్టు ఉండేది ఆయనకు. రామయ్యగారి రష్యన్ పేరు "కాన్ స్టాంటిన్ సెర్గియో విచ్" అయినా, రామయ్యగానే ప్రసిద్ధులు. తెలుగులో ప్రాచీన, ఆధునిక కవుల కవిత్వం అంతా వాచో విదేయం. సంభాషణలలో వాటిని ఉదాహరిస్తూ గొప్ప ప్రసంగాలు చేసేవారు. మన దేశపు భారత రత్నతో సమానమైన అత్యున్నత సోవియెట్ రష్యా పురస్కారాన్ని అందుకొన్నారు రామయ్య.

42 ఏళ్ళ తర్వాత రామయ్యగారు 1963 ఏప్రిల్ 22న ఇండియా వచ్చి, జూన్ 5 వరకు 42 రోజులు మాత్రమే ఉండి, స్వగ్రామానికి చేరి బంధువులతో గడిపి, పుణ్యక్షేత్ర సందర్శన చేసి, మహా సంస్థలను దర్శించి, భారత్‌అభివృద్ధిని గమనించి ఉయ్యూరులో మే 21న ఘనంగా పౌర సన్మానం అందుకొన్నారు. మద్రాస్, హైదరాబాద్, బొంబాయిలలో అపూర్వ గౌరవ సత్కారాలందుకొని స్వచ్ఛమైన తెలుగు మాటలతో, పాటలు పద్యాలు శ్లోకాలతో తలంటి, సంధ్యావందనం, పూజా పున స్కారాలతో అందరిని ఆశ్చర్యపరచారు. తన మాతృదేశం ఇండియా ఏ విధంగా రూపు మార్చుకోన్నదో చూడాలన్న ఆకాంక్ష తనను ఇండియాకు రప్పించిందని చెప్పారు. మాతృభూమి తనను అమృతమయిగా, అమృత మాయిగా ఆదరించినందుకు ఉప్పొంగిపోయారు. యువత నవ భారత నిర్మాణానికి నిజమైన స్తంభాలన్నారు. ఇండియా నుంచి వెళ్ళిన సుమారు 14 సంవత్సరాల తర్వాత 29-9-1977న 78 ఏళ్ళ రామయ్యగారు మరణించారు. ఆయన చితాభస్మాన్ని మాస్కో క్రిమేటోరియం చాపెల్‌లో భద్రపరచారు.

రామయ్యగారిది విలక్షణ వ్యక్తిత్వం. ఎప్పటికప్పుడు తాను సరైన దారిలో ప్రయాణం చేస్తున్నానా లేదా అని ప్రశ్నించుకొని, సమాధానపడి, తనది "రాజమార్గమే"నని తృప్తిపడి ముందుకు సాగారు. ఈ "సెల్ఫ్ చెకింగ్" ఆయన్ను ఉన్నత శిఖరారోహణం చేయించింది. ఆనాడు ఇలా స్వతంత్రంగా ఎదిగి పైకొచ్చి, అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన సైంటిస్ట్ లలో శ్రీ ఎల్లాప్రగడ సుబ్బారావుగారు, శ్రీరామయ్యగారూ ఇద్దరే కన్పిస్తారు. ప్రఖ్యాత శాస్త్రవేత్త 'ఐన్‌స్టీన్' – థీరీ ఆఫ్ రిలేటివిటి" సిద్ధాంతాన్ని కనిపెట్టి, తన సిద్ధాంతాలన్నిటినీ ఏకీకృతం చేసి "యూనిటీ సిద్ధాంతం" తయారు చేయాలనుకొని, పూర్తి కాకుండా మరణించాడు. అలాగే రామయ్యగారు కూడా సృజనశీలి, పదార్థాలలో ఘన, ద్రవ, వాయు, స్థితులే కాక ప్లాస్మా అనే నాల్గవ స్థితి కూడా ఉందని, థెర్మో న్యూక్లియర్ చర్యలలో ప్లాస్మా ఏర్పడుతుందని చెప్పారు. 'తన సూత్రాలనన్నిటినీ ఏకం చేసి, ఏక సూత్రత సాధించే లోపే రామయ్యగారు కూడా మరణించటం దురదృష్టం. రష్యాలో పని చేశాను అనేవారుకాదు "సేవచేశా" నని వినమ్రంగా చెప్పేవారు. రష్యా సాధించిన అభివృద్ధి "ఒక మిరకిల్" అనేవారు. ఇండియా–రష్యాలకు సహాయం చేయటమే "నా విధి" అనేవారు. భవిష్యత్తులో రష్యా భారతదేశ అభివృద్ధికి పూర్తిగా సహకరిస్తుందని చెప్పేవారు. అలాగే జరిగిందన్నది మనకు తెలిసిన చారిత్రిక సత్యం. భవిష్యత్తులో ప్రపంచమంతా "మాతృదేశం" అవుతుందని విశ్వసించారు. మనం అందరం ఒకే మూలం అంటే కుదురు ఉన్నవాళ్ళం అని గుర్తు చేసేవారు. ప్రకృతిని నిర్లక్ష్యం చేయరాదని ఆనాడే హితవు చెప్పారు. దేని కోసమో ఆశించకుండా ప్రయోజనకరమైన కార్యంలో పని చేయాలన్నది ఆయన సిద్ధాంతం. ఇంత ప్రసిద్ధి చెందినా రామయ్యగారి గురించి, పరిశోధనల గురించి ఎవరికీ పెద్దగా తెలియదు. 1940లో అమెరికాలోని కాలిఫోర్నియా నుండి బిఎస్‌డి డిగ్రీపొందిన శ్రీ మాగంటి బాపినీడు గారి సంపాదకత్వంలో వచ్చిన "ఆంధ్ర సర్వస్వం"లో రామయ్యగారి గురించి సంక్షిప్తంగా ఉంది. తర్వాత బ్లిట్జ్ పత్రిక, సోవియట్ లాండ్ పత్రికలలో కొంత సమాచారం వచ్చింది. 1936 లేక 39లో ఒక్కసారి మాత్రమే ఆయన రష్యాలో ఉన్నారని దక్కన్ క్రానికల్ పేపర్లో "చాట్ వుడ్ హాల్" రాసిన వ్యాసంద్వారా కుటుంబానికి తెలిసింది. 1947 భారత్ స్వాతంత్ర్యం పొందిన తర్వాత రామయ్యగారి అన్నగారు శ్రీ గాయత్రి అనంత రామయ్యగారు ఆనాటి రష్యా రాయబారి విజయలక్ష్మీ పండిట్‌కు ఫోన్‌చేసి తమ్ముడి యోగ క్షేమాలు తెలుసుకొంటూ, ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ,రామయ్యగారి విశేషాలను యాకమూరు, ఉయ్యూరు ప్రజలకు తెలియజేస్తే, వారు తమలో తాము చెప్పుకొంటూ హృదయంలో రామయ్యగారిని సుస్థిరం చేసుకొన్నారు. అందుకే ఉయ్యూరుకు చెందిన ప్రపంచ ప్రముఖ ఆర్థిక వేత్త శ్రీ ఆరిగపూడి ప్రేంచంద్‌గారు రామయ్యగారిని "The Unknown pioneer"- "అజ్ఞాత మార్గదర్శి" అన్నారు. రామయ్యగారి పెద్దల్లుడు "ఘెన్ శాంఘిన్ బేర్జేవ్ స్కి" రష్యన్ భాషలో రామయ్యగారి పై మొట్టమొదటి సారిగా పుస్తకం రాశాడు. దాని ఆధారంగా ఆంగ్లంలో శ్రీమతి ఆచలా జైన్ "A wreath for Dr.Ramayya" రాయగా, శ్రీ ఎస్.పి.కే. గుప్తా సంపాదకత్వంలో వెలువడింది. దీన్ని ఆధారం చేసుకొని "కేమోటాలజిపిత కొలచల సీతారామయ్య" అనే పేరుతో "పుల్లేరు నుండి ఓల్గా దాకా" అనే ఉపశీర్షికతో నేను తెలుగులో రాశాను. రామయ్యగారిపై వచ్చిన మొట్టమొదటి తెలుగు పుస్తకం ఇదే. రామయ్యగారిని ఉయ్యూరులో 1963లో చూసి, మాట్లాడిన అదృష్టం నాది. సీతారామయ్య గారి మనవరాలు, పెద్దమ్మాయి కుమార్తె ఎనస్థీషియా తాతగారి మూలాలను వెతుక్కొంటూ ఇండియావచ్చి, ఉయ్యూరు యాకమూరు చూసి పులకించి మనసంతా ఆనందాన్ని నింపుకొని వెళ్ళింది. ధ్యేయాన్ని ఏర్పరచుకొని దాని సాధనకై కష్టనష్టాలను ఎదుర్కొంటూ, ఎక్కడ ఉన్నా మాతృదేశాన్ని, మూలాలను మరచి పోరాదు అన్నది రామయ్యగారి నుండి అందరూ నేర్చుకొని స్ఫూర్తి పొందాలి.

*చిరునామా : శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్, 12-7-16, సరసభారతి అధ్యక్షులు, 2-405, శివాలయం వీధి,*
*ఉయ్యూరు - 521 165, సెల్ : 9989066375*

శ్రీ యం.వి. చలపతిరావు

# శ్రీ గడియారం రామకృష్ణశర్మ బహుముఖీన సేవలు

## కేంద్ర సాహిత్య అకాడెమీ బహుమతి గ్రహీత

శ్రీ గడియారం రామకృష్ణశర్మ బహుముఖప్రజ్ఞావంతుడు. వారు కవి, బాల సాహిత్యకారులు, క్షేత్రదేశ, జీవితచరిత్రకారులు, సాహిత్య, వాస్తుశిల్ప, ధార్మిక గ్రంథాల రచయిత, శాసన పరిశోధకులు, ప్రాచీన గ్రంథాల పరిష్కర్త, అనువాదకులు, సాహిత్యమాసపత్రిక సంపాదక నిర్వాహకులు. వీటన్నింటినీమించి స్వాతంత్ర్యసమరయోధులు, గ్రంథాలయ స్థాపకులు, దేవాలయ ధర్మకర్త, జీర్ణదేవాలయాల ఉద్ధారకులు. ఆంధ్రసాహిత్యపరిషత్ ద్వారా మాతృభాష తెలుగుకు సేవ చేసారు. సంఘసంస్కర్త. ఇన్ని విశిష్ట గుణాలున్న ఈ సాహితీమూర్తి తెలుగు వాడైనందుకు గర్వకారణం.

శ్రీ శర్మగారి కుటుంబం కడపజిల్లా పులివెందుల తాలూకాలోని నెమళ్ళదిన్నె అగ్రహారానికి చెందినది. ఆ తర్వాత శ్రీ శర్మగారు అలంపూరు చేరారు. అక్కడ సంస్కృత విద్యాభ్యాసంలో భాగంగా రఘువంశ కావ్యపఠనం ప్రారంభించి, ఆ చిరుప్రాయంలోనే కవిత్వ రచన నారంభించి, చిన్నతనంనుండి తనకు ఆంజనేయునిపట్ల ఉన్న భక్తిని పురస్కరించుకొని ఆయనను స్తుతిస్తూ రెండాశ్వాసాల కావ్యం వ్రాయ నారంభించారు. వీరి కవితాధారను గమనించి శ్రేయోభిలాషి ఒకరు శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారిని ఆశ్రయించమని సలహా ఇవ్వటంతో శ్రీ వేలూరివారి వద్ద చేరి మేఘసందేశం, మాఘుని శిశుపాలవధ, జయదేవుని చంద్రాలోకం, కిరాతార్జునీయం అభ్యసించారు. స్నేహితుడు, శ్రీ దుంపల రామరెడ్డి సహకారం వల్ల చాలా గ్రంథాలు చదివారు. ఈ సమయంలోనే 1942లో శ్రీరామకృష్ణ స్మారక గ్రంథాలయాన్ని ప్రారంభించారు.

ఆ తదుపరి సంఘసంస్కరణల్లో భాగంగా బాలవితంతు వివాహాలు నిర్వహించారు. "తాను బాలవితంతు వివాహాలు నిర్వహిస్తూ, తానెందుకు చేసుకోడు ?" అని మిత్రులు ఒత్తిడి చేయగా కమలమ్మ అన్న బాల వితంతువును వివాహం చేసుకొన్నారు.

1943లో శ్రీ శర్మగారు నిజాం ఆంధ్రసారస్వత పరిషత్ స్థాపనకు కృషిచేసారు. 1947లో భారతదేశం స్వతంత్రదేశంగా అవతరించిన తర్వాత నిజాం సంస్థానం ఇండియన్ యూనియన్‌లో విలీనానికి పూర్వం జరిగిన ఉద్యమంలో శ్రీ శర్మగారు కర్నూలులో రేడియో స్టేషన్‌ను నెలకొల్పేందుకు కృషిచేసి, దాని నిర్వహణలో ప్రముఖపాత్ర వహించారు. నైజాం సంస్థానం ఇండియన్ యూనియన్‌లో విలీనమైన తర్వాత శ్రీ శర్మగారు తాలూకా అధ్యక్షునిగా, మిలిటరీ ప్రభుత్వానికి సలహాదారునిగా వ్యవహరించిన సమయంలో ఏవో కారణాలవల్ల ముస్లింగా మతాంతరీకరణం చెందిన ఓ యువతిని సంస్కరించి హిందూమతంలోనికి చేర్చారు. ఆ సమయంలోనే ముస్లింలు ఆక్రమించుకొని బాలఖిల్లా మసీదుగా మార్చిన "అర్క బ్రహ్మాలయాన్ని' శుభ్రం చేయించి, రికార్డుల్లో 'అర్క బ్రహ్మాలయంగా నమోదు చేయించారు. వారు ఆంధ్రసారస్వత పరిషత్ భారతదేశంలోని ఇతర రాష్ట్రాలకు కూడా విస్తరించేందుకు కృషిచేసారు. పరిషత్ ఆధ్వర్యంలో వయోజన విద్యావ్యాప్తికి శక్తిమేర కృషిచేసారు.

ఇలాంటి క్లిష్టపరిస్థితుల్లో శ్రీ శర్మగారు "సుజాత" అన్న మాస పత్రికను, ఇతరులు నిరుత్సాహపరిచినప్పటికీ మూడు సంవత్స రాలు నడిపి, ఆ తర్వాత నిలిపివేసారు. ఆలంపూరు, పరిసరగ్రామాల్లో ఉన్న శిల్పాలను ఆలంపూరు చేర్చి, మ్యూజియం ఏర్పరచి శిల్ప సంపదను పరిరక్షించారు. ఈ సందర్భంలోనే ఆలంపూరులో హైస్కూలును ప్రారంభించేందుకు తన శాయశక్తులను వినియోగించారు.

ఆలంపూరంలో ఆంధ్రసారస్వత పరిషత్ సప్తమ వార్షికోత్సవాలను ఉపరాష్ట్రపతి, శ్రీ రాధాకృష్ణన్‌గారిచే ప్రారంభింపజేసి ఘనంగా నిర్వహించారు. ఆ తర్వాత ఆలంపూరులోని వివిధ దేవాలయాలకు ధర్మకర్తృత్వం వహించి, ముస్లింల ఆక్రమణలో ఉన్న ఆలయాలను స్వాధీనం చేసుకొని జీర్ణాలయాలను ఉద్ధరించారు. ఈ తరుణంలోనే వేద-సంస్కృత పాఠశాలను ప్రారంభించి సనాతన భారతీయ సంస్కృతి వ్యాప్తికి దోహదం చేసారు.

1958లో జరిగిన ఆంధ్రసారస్వతపరిషత్ ప్రధాన కార్యదర్శిగా ఎన్నికై, పరిషత్‌కు భవనాలునిర్మించారు. గ్రంథాలయం ఏర్పాటు చేయటం, పండితశిక్షణ కళాశాల, ప్రాచ్యకళాశాలల ప్రారంభం, ప్రచురణ, విక్రయాల విభాగాలను నెలకొల్పేందుకు తమ శక్తి యుక్తులను వినియోగించారు. ఆ పరిషత్ రజతోత్సవాలు నిర్వహించి, సాహిత్యవేదిక ఏర్పాటుచేసి, ప్రతి నెల సాహిత్య విషయాలపై ప్రసం గాల్లో భాగంగా శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులచే క్షేత్రయ్య, త్యాగ రాజు, గోపన్నలపై ప్రసంగింపజేసి, వాటిని "తెలుగు పద కవిత" అన్న శీర్షికన రజతోత్సవ సంచికలో ప్రచురింపజేసారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఆధ్వర్యంలో రూపొందింపబడిన క్రియాపద నిఘంటు నిర్మాణంలో సంపాదకవర్గ సభ్యునిగా వ్యవహరించి, దాని ప్రచురణలో భాగస్వాములయ్యారు.

ఒక అకాడమీ సమావేశంలో మద్రాసులోని వ్రాతప్రతుల గ్రంథా లయంలో ఉన్న మెకంజీకైఫీయతుల్లో ముఖ్యమైన కైఫియతులను ఎత్తి వ్రాయించి ఒక సంపుటంగా ప్రచురించాలని నిశ్చయించి, ఆ కార్య భారాన్ని శ్రీశర్మగారి భుజస్కంధాలపై ఉంచగా మద్రాసులో ఉన్న యూనివర్శిటీ లైబ్రరీ, అడియార్ లైబ్రరీలో ఉన్నవాటిని వ్రాసుకొని హైదరాబాద్‌కు చేర్చిఆంధ్రదేశంలోని ఊళ్ళకు ఆ పేరు ఎలా వచ్చాయి, వాటి చరిత్రం, ఆ గ్రామాల్లోని దేవాలయాల వివరాలు, సంప్రదాయ పూజా ఉత్సవాదులు,గ్రామాల్లోని కులాలు, జనుల ఆచారాలు, చేతి వృత్తులు, కుటీరపరిశ్రమలు, వర్తకవాణిజ్యాలు, శాసనాల పాఠాలు, పండితుల ఇళ్ళలోనిగ్రంథాల పట్టికలు, మఠాల వివరాలు, భావితరాల వారికి తెలిసేలా చేశారు. ఇంతేకాక ఊళ్ళను పొలిమేరల్లోని దోమలు, పక్షులు, జంతువులు, గనులు, స్థలపురాణాల నకళ్ళు, గ్రామపాలన ఆలయాల నిర్వహణలాంటి వివరాలన్నీ, ఉన్న ఆ కైఫియత్‌లను సేకరించారు.

అకాడెమీ తాను వ్రాయించి తెప్పించిన మెకంజీ కైఫియదుల 'డిస్క్రిప్టివ్ కేటలాగ్'లను తయారుచేసి, వాటికి సూచికలను వ్రాసి ఇచ్చారు. మొత్తంమీద వీరు 30 సంపుటాలకు కేటలాగులను వ్రాసి ఇచ్చారు. సాహిత్య అకాడెమీవారు సమకాలిక భారతీయ సాహిత్య చరిత్రలను ప్రచురించే కార్యక్రమంలో వీరు దక్షిణ భారతసాహిత్య సంపుటం కొరకు కన్నడ సాహిత్యచరిత్రను పరిశోధించి రచించారు.

అకాడెమీ 50 ప్రాచీనకావ్యాలను పరిష్కరించి విపుల పీఠికతో పునరుద్ధరణ చేయించాలన్న సంకల్ప ప్రణాళికలో భాగంగా శ్రీ శర్మగారు మంచన రచించిన "కేయూరబాహుచరిత్ర"ను కొఱవి గోపరాజు రచించిన "సింహాసన ద్వాత్రింశిక" కావ్యాల పాఠపరిష్కరణం చేసి, విపుల పీఠికలు వ్రాసి ఇచ్చారు.

కృష్ణానదీతీరంలో అలంపూరు తాలూకాలోని యాఫలదేవి గ్రామం వర్షాకాలంలోఅధిక ప్రవాహాలు వచ్చినప్పుడుకృష్ణాజలాలవల్ల దిగ్బంధా నికి లోనయ్యేది. గ్రామప్రజలు చాలా కష్టపడుతూండటంలో శ్రీ శర్మగారు,పానుగంటి రామచంద్రారెడ్డి, ఈశ్వరరెడ్డిగార్లు ఆ ఊరివారికి కొత్త ఊరు కట్టుకోవాలని సలహా ఇచ్చి, టౌన్ ప్లానర్‌ను తీసుకొనివచ్చి, స్థలం చూపించి, ఊరి ప్లాను అంచనాలు వేయించి, వ్యవసాయమంత్రి శ్రీ కొండా వెంకటరెడ్డిగారి ద్వారా కొల్లాపురంఅడవులనుండి ఉచితంగా కలప,ఆర్థికమంత్రి శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డిగారి ద్వారాఆర్థిక సహాయం ఋణాలు ఇప్పించి గ్రామనిర్మాణాన్ని పూర్తిచేసారు.

హైదరాబాద్‌లోని రీజినల్ హిస్టారికల్ రికార్డ్స్ సర్వే కమిషన్ ప్రజల దగ్గర ఉండే చారిత్రక పత్రాలు సంపాదించి భద్రపరుస్తుంది. ఆ కమిషన్‌లో నియమింపబడ్డ శర్మగారు చిందరవందరగా పారవేయ బడి ఉన్న సగం ఫారసీలో సగం తెలుగులో వ్రాయబడిన సంతకంతో, ముద్రవేసి, శివాజీ తండ్రి "షాజీ"కి బీజాపూర్ నవాబు దక్షిణదేశంలోని నాయక్ రాజులనుండి "చౌత్" పన్నులు వసూలు చేసే అధికారాన్నిచ్చిన పత్రాన్ని భద్రపరిచారు.

న్యూఢిల్లీలోని కేంద్రసాహిత్య అకాడెమీ దక్షిణప్రాంతశాఖలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ ప్రతినిధిగా నియమింపబడి ఇతర భాషాగ్రంథాలను తెలుగులోకి, తెలుగు గ్రంథాలను ఇతర భాషల్లోకి అనువాదం చేయించారు.

శ్రీశైలం విద్యుత్‌ప్రాజెక్ట్‌వల్ల మునకకు గురయ్యే మహాక్షేత్రాల్లోని దేవాలయాలను పునర్నిర్మింప సంకల్పించినప్పుడు ప్రభుత్వం ఒక హైపవర్ కమిటీని 1973లో నియమించింది. ఆ కమిటీలో శ్రీ శర్మ గారు అలంపూరు దేవాలయాల ప్రతినిధిగా నియమితులై సంగమేశ్వర ఆలయాన్ని తెచ్చి అలంపూర్‌లోను,పాపనాశేశ్వరదేవాలయాలను ఎగువ స్థలాల్లోను, సోమేశ్వర, సిద్ధేశ్వర, అగస్త్యేశ్వరదేవాలయాలను యధా తథంగా నిర్మింపజేసే బాధ్యతలను నిర్వహించారు.అలాగే కృష్ణా తీరం లోని మంచాల కట్ట జటప్రోలు దేవాలయాలనుఒకసమూహంగా పెంట్లవెల్లి దగ్గర పునర్నిర్మింపజేయటం,ప్రాగాటూరు దేవాలయాలనుకొత్త ఊళ్ళోను, రంగాపురం దేవాలయాన్ని పిల్లలమఱ్ఱిలోను పునర్ని ర్మించే బాధ్యతలను నిర్వహించారు.అలంపూర్ దేవాలయాలను రక్షించే విషయంలో వాటిని ఉన్నచోటనే రక్షించి,వాటితోపాటు ఊరును కూడా రక్షించేందుకు కృషిచేసి, అందుకు ప్రభుత్వం కోటి రూపాయల ఖర్చుతో ఊరుచుట్టూ రెండు కిలోమీటర్ల పొడవు రక్షణగోడను నిర్మింపజేసే బాధ్యతలనూ నిర్వహించారు.

అలంపూరులోని దేవాలయాల్లో వివిధ రాజవంశీయులు వేయిం చిన శిలాశాసనాలను అధ్యయనం చేసి ఆ క్షేత్రచరిత్ర గురించి పుస్తకం వ్రాయాలని సంకల్పించి మల్లంపల్లి సోమశేఖరశర్మగారు మొదలైన వారు ప్రకటించిన శాసనాల ప్రతిబింబాలు, పాఠాలను, వ్యాఖ్యాలను, ప్రాచీన విపులను స్వయంపరిజ్ఞానంతో చదివి "ఆలంపూరు శిథిలాలు" అన్న చిన్న పుస్తకం వ్రాసి 1946లో ప్రచురించాడు. అలంపూరు తాలూకాలో "పల్లెపాడు" గ్రామంలో ఒక రైతు పొలం దున్నుదుండగా,

భూమిలో నుంచి కుండలో వరిపొట్టు పోసి దానిలో భద్రపరిచిన మూడురేకుల సంస్కృత శాసనం వెలువడగా శుభ్రంచేసి, అధ్యయనం చేసారు. అది రెండవ పులకేశి మనుమడు వినయాదిత్యుని శాసనం. దాన్ని విపుల వ్యాఖ్యానంతో "వినయాదిత్యుని పల్లెపాడు తామ్రశాసనం" పేరుతో పుస్తకరూపంలో ప్రచురించారు. అటుపిమ్మట రెండవ పులకేశి కుమారుడు ఒకటవ విక్రమాదిత్యుడు వేయించిన సంస్కృతంలో ఉన్న తామ్రశాసనాన్ని భారతిలో వ్యాఖ్యానంతో ప్రకటించారు. లక్ష్మణరాయ పరిశోధకమండలి అధ్యక్షులు, మునగాల జమీందారు, శ్రీ రాజా నాయని రంగారావుగారి కోరికపై "తెలంగాణ శాసనాలు" రెండవ భాగాన్ని కేంద్రప్రభుత్వ ఆర్థికసహాయంతో ప్రకటించారు. మహబూబ్‌నగర్‌లోని ఉమా మహేశ్వరంలో ఉన్న శాసనాలు, ఆలయనిర్మాణ విశేషాలు, ధార్మిక విశేషాలతో ఆ క్షేత్రచరిత్ర వ్రాసి ఆ పుస్తకాన్ని ప్రచురించారు. అలాగే మహబూబ్‌నగర్ దగ్గరి "మన్యంకొండ" క్షేత్రానికి వెళ్ళి దాని చరిత్రను అందినంతవరకూ వ్రాసి ప్రచురించారు.

శ్రీ శర్మగారు, వారి పినతండ్రి రామప్పగారి ప్రోత్సాహంతో చంద్రహాసుని కథను రెండాశ్వాసాల కావ్యంగా రచించారు. ఆంధ్రమహాసభావేదికల మీద ఆనాటి పరిస్థితులను గురించి చదివిన పద్యాలు వారి షష్టిపూర్తి సందర్భంలో "పాంచజన్యం" పేరిట 1979లో ప్రచురించబడ్డాయి. అలంపూరు మహాక్షేత్రం అలంపురక్షేత్రము దక్షిణ వారణాసి, బ్రహ్మేశ్వరక్షేత్రమహోత్సవము అన్న పుస్తకాలను వ్రాసి ప్రచురించారు. "శ్రీ జోగులాంబా మహాశక్తి" పేరుతో శాక్తేయాన్ని సంక్షిప్తంగా పరిచయం చేస్తూ ఒక చిన్న గ్రంథాన్ని రచించారు.

పాశ్చాత్య చరిత్రకారులు వ్రాసిన మనదేశ చరిత్రలో విభిన్న విషయాలను వారి దృష్టి కోణంతో వ్రాసి హిందూ యుగానికి తక్కువ ప్రాధాన్యం ఇచ్చారని భావించి 130 పేజీల్లో భారతదేశ చరిత్ర రచించి హిందూ, బౌద్ధయుగాలకు 60 పేజీలు కేటాయించి వాటికి ఉచిత ప్రాధాన్యాన్ని కల్పించారు. కేంద్రసాహిత్య అకాడెమీవారు ప్రతి భారతీయభాషలోని ఒక ప్రాచీనకావ్యాన్ని ఎన్నుకొని తక్కిన భారతీయ భాషల్లోకి అనువదింప జేసే ప్రణాళికాభాగంలో రన్న కవి రచించిన "సాహస భీమసేన విజయ"ను శ్రీ కంతయ్య అనువదించారు. దీని తర్వాత ఎమ్.ఎస్. శేషగిరిరావు గారి కథా సంకలనం "కన్నడ సణ్ణక తెగళు"ను తెలుగులోకి అనువదించారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు సమకాలీన భారతీయ భాషాచరిత్రలను వ్రాయించి ప్రచురించే పని ప్రారంభించినపుడు శ్రీ శర్మగారికి కన్నడ సాహిత్య చరిత్రను వ్రాసే బాధ్యతనివ్వగా ఆ భాషాచరిత్రను సులభంగా అర్థమయ్యేటట్లు సంగ్రహంగా వ్రాసి ఇచ్చారు. హైదరాబాద్‌లోని విశిష్ట సాహిత్యసంస్థ "యువభారతి" భారతీయ భాషా సాహిత్యాల్లో ఒక్కొక్క దాని వైశిష్ట్యాలు వ్రాయించి ప్రచురించాలన్న సంకల్పంలో భాగంగా "కన్నడ సాహిత్య సౌరభాన్ని" కన్నడ సాహిత్య విశిష్టతలను వివరిస్తూ రచించారు. అలంపూరుకు నాలుగుమైళ్ళ దూరంలో లింగనవాయి గ్రామంలో నిత్యానందాశ్రమవాసి నిత్యానందస్వామి 30-11-1959 తేదీన రాత్రి జీవసమాధి అయ్యారు. వారి ఆరాధనలో ఒకమారు వారి భక్తులు కోరగా వారి చరిత్రను వ్రాసారు.

కర్నూలులోని శంకరమఠం నిర్వాహకులు ఎం.డి.వై. రామమూర్తి ప్రతి సంవత్సరం శ్రీశ్రీ మాధవ విదారణ్యస్వామి జయంతిని జరిపేవారు. ఒక సంవత్సరం ఆ జయంతి సభను కర్నూలులోని శ్రీ వివేకానంద సంస్కృతోన్నత పాఠశాలలో జరిపినప్పుడు ఆ పాఠశాలోపాధ్యాయులు విదారణ్యస్వామి చరిత్రను వ్రాసి ఇమ్మని కోరగా వారి చరిత్రను రచించారు. దీన్ని శర్మగారి మిత్రులు, రామచంద్ర గుమాస్తే గారు కన్నడంలోకి అనువాదం చేసారు.

1975లో హైదరాబాద్‌లో ప్రపంచం తెలుగు మహాసభలు జరిగినప్పుడు రాష్ట్రప్రభుత్వం ఆంధ్రసంస్కృతిని తెలిపే 70 గ్రంథాలను వ్రాయించింది.అందులో శ్రీ శర్మగారు "మన వాస్తుసంపద" అన్న పుస్తకాన్ని వ్రాయగా, దాన్ని ప్రచురించటం జరిగింది. వీరు "భారతీయ వాస్తువిజ్ఞాన సర్వస్వము"ను రచించి ఆర్థికసహాయం కొరకు ఆంధ్ర సాహిత్య అకాడెమీని అర్థించగా వారు వేయి రూపాయలు శాంక్షను చేయగా ఆ విజ్ఞాన సర్వస్వాన్ని క్లుప్తీకరించి "భారతీయ వాస్తు విజ్ఞానము" అన్న చిన్న గ్రంథాన్ని ముద్రించారు. ఈ గ్రంథానే హంపి, కన్నడ విశ్వవిద్యాలయంలో శాసన పరిశోధనా విభాగంలోని శర్మగారి మిత్రుడు దేవరకొండారెడ్డి, "వాస్తువిద్యా" అన్న పేరుతో అనువదించి ప్రచురించారు.

ధర్మం అంటే ఏమిటి? వర్ణాశ్రమాలు అంటే ఏమిటి? కర్మ భక్తి యోగ, జ్ఞాన ప్రయోజనం,సంస్కారాల ప్రయోజనం, సామాజిక జీవనం, దేవాలయాలు,ధర్మసంస్కరణ మొదలైన విషయాలనుగురించి సులభంగా తెలిసే భాషలో "హిందూధర్మం" అన్న పుస్తకాన్ని వ్రాయగా కర్నూలులోని "హిందూధర్మ మండలి" ప్రచురించింది. దానిలో మార్పులు, చేర్పులు చేసి శ్రీ శర్మగారే "పరివ్రాజకుడు", అన్న పేరున కన్నడంలోకి అనువదించారు. లఘు నిత్యకర్మానుష్ఠానం, స్త్రీల పూజావిధులు అన్న పుస్తకాలను కూడా వ్రాసారు. సంస్కృతంలో రచింపబడిన శ్రీమదలంపురక్షేత్ర మాహాత్మ్యాన్ని పరిష్కరించి, విపుల పీఠికతో ప్రచురించారు.

*చిరునామా : శ్రీ యం.వి. చలపతిరావు, విశ్రాంత ఆంగ్లోపన్యాసకుడు, న్యూకాలనీ, ప్లాట్‌నం. 8, 9వ లైను, భారతీనగర్, విజయవాడ-8.*

**శ్రీ కమ్ముల రవి గంగాధర శేషకుమార్**

# కృష్ణాతీరంలో కాటన్ సేవలు

'**అ**పరభగీరథుడు' గా చరిత్రకెక్కిన సర్ ఆర్థర్ కాటన్ తెలుగువారందరికీ చిరస్మరణీయుడు. దేశాన్ని రక్షించే మిలటరీ అధికారిగా మరియు దేశాన్నిపోషించే రైతులపాలిట ఆత్మ బంధువుగా కాటన్ స్థానం సమున్నతమైనదన్నది జగమెరిగిన సత్యం. ముఖ్యంగా కృష్ణా పరివాహక ప్రాంతంలో కాటన్ చేసిన సేవలు మరువరానివి, విశేషమైనవి. అందుకే ఈనాటికికూడా పుష్కరాలవంటి పలు సందర్భాల్లో "నిత్యగోదావరీస్నాన పుణ్య దోయోమహామతి: స్మరామ్యాంగ్లేయ దేశీయం కాటనుంతం భగీరథం" అని కృష్ణా, గోదావరి ప్రాంత ప్రజలందరి చేత సగర్వంగా స్మరించుకునేంతటి దార్శనికుడు. సుమారు వెయ్యికి పైగా విగ్రహాలు వందకుపైగా ఆయనగురించిన రచనలు, లక్షలాది మంది ప్రజల గుండెల్లో సముచిత/ సుస్థిరస్థానం మొదలగు అంశాలు ఆయన ఘనతకు ఆనవాళ్ళు. "కాటన్ మహాశయుడు" అని సంబోధింపబడుతున్నట్లుగానే కాటన్ మహా మనీషి. కాటన్ ఆశయం మహాశయం. ఆ సదాశయ సాధనలో భాగంగా కృష్ణా, గోదావరి, కావేరి తీరప్రాంత కర్షకలోకపు కష్టనష్టాలను అరికట్టగలిగే ఆనకట్టలు కట్టగలిగిన కర్మయోగి. ఈస్టిండియా కంపెనీవారి పరిపాలనా దృక్పథాన్ని లాభార్జన కోసమే కాకుండా ప్రజాసంక్షేమం, మౌలిక సదుపాయాల కల్పనలవైపు మళ్ళించడంలో విజయం సాధించిన మానవతా మూర్తి. నేడు వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు చేపడుతున్న పలురకాల నీటిపారుదల పథకాలకు, ప్రాజెక్టులకు వాటి నిర్మాణ, నిర్వహణ ప్రణాళికా రూపకల్పనలకు కాటన్‌గారి విధివిధానాలే స్ఫూర్తి/ ఆదర్శమని చెప్పడం కాదనలేని సత్యం.

సర్‌ఆర్థర్ థామస్ కాటన్ 1803మే 15వ తేదీన ఇంగ్లండు లోని ఆక్స్‌ఫోర్డ్‌షైర్‌లో తల్లిదండ్రులకు పదోసంతానంగా జన్మించినా పదికాలాలపాటు పూజలందుకొనేలా సేవలందించిన సేవాప్రపూర్ణుడు. కృష్ణా తీరప్రాంతాలలోకెల్లా కీలకమైన కృష్ణానది ఆనకట్ట నిర్మాణం వెనుక ఉన్న నేపథ్యాన్ని ఆవశ్యకతను పరిశీలిస్తే కాటన్ చేసిన కృషి, ఎంత ఘనమైనదో ద్యోతకమౌతుంది. 1757 ప్లాసీయుద్ధంలో విజయానంతరం ఈస్టిండియా కంపెనీవారి దోపిడీ, పీడనలతో కూడిన వలసవాద పాలన బెంగాల్‌ప్రాంతం నుంచి మొదలుకొని భారతదేశమంతా విస్తరించడం ప్రారంభ మయ్యింది. ఇందులో భాగంగానే '1766 ఒడంబడిక' ప్రకారం మద్రాసు ప్రెసిడెన్సీలో ఉత్తర సర్కారులుగా పిలవబడే అయిదు జిల్లాలూ (శ్రీకాకుళం, రాజమండ్రి, ఏలూరు, ముస్తఫా నగర్, మర్తూజానగర్ గా పేరు మార్చబడిన గుంటూరు, కొండ వీడు ప్రాంతం) ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వం వారి వశం కావడం జరిగింది. అప్పటినుండి ఈ ప్రాంతాన్ని నేరుగా పాలిస్తూ, ఈ ప్రాంతాల ద్వారా అధిక ఆదాయాన్ని, భూమి శిస్తును రాబట్టు కోవడం ప్రారంభమయ్యింది అయితే తరచూ సంభవించే అతివృష్టి, అనావృష్టిల ప్రభావాన్ని తగ్గించేందుకు కృష్ణానదిపై ఒక ఆనకట్టను నిర్మించాల్సిన అవసర ముందని 1798లోనే కంపెనీకి ప్రతిపాదించింది కెప్టెన్ బకిల్. అయితే ప్రజా సంక్షేమాన్ని పూర్తిగా విస్మరించి, లాభార్జనే ధ్యేయంగా పాలిస్తున్న కంపెనీ బకిల్ ప్రతిపాదనను పట్టించుకోలేదు. ఈ నేపథ్యంలో 1811లో నెల్లూరు కరువు, 1823లో ఆంధ్రాకరువు, 1832-33, 1833-34 సాగు సంవత్సరాల్లో సంభవించిన గుంటూరు, రాజమండ్రి కరువు మొదలగు దుర్భర, విపత్కర కాటక పరిస్థితుల్లో కంపెనీ ఆదాయం గణనీయంగా పడిపోయింది. భయంకర క్షామ పరిస్థితుల కారణంగా ఒక కృష్ణాడెల్టా ప్రాంతంలోనే 40% మంది ప్రజలు ఆకలితో అలమటించి, అలమటించి అశువులు బాశారు. విపరీతమైన ఆస్తినష్టం, జననష్టం సంభ వించాయి. జనాభా తగ్గడంతోపాటు 1814-1823 సంవత్సరాల మధ్య సగటు ఆదాయం రు.18,72,172లు ఉండగా,

1829-1852ల మధ్యకాలంలో ఎంతో కొంత పెరగాల్సింది పోయి, కేవలం 16,12,286లు మాత్రమే వసూలుకావడం గమనార్హం. ఈ పరిస్థితుల్లో నియమింపబడిన మౌంట్ గోమరి కమిటి సూచించిన నీటి పారుదల సౌకర్యాల అభివృద్ధి ప్రతిపాదన నివేదిక బుట్టదాఖ లయ్యింది. 1839లో కెప్టెన్‌లేక్‌లు కూడా కృష్ణానదిపై ఆనకట్ట నిర్మించాల్సిన ఆవశ్యకతను నొక్కిచెప్పగా ఫలితం లేకపోయింది.

సరిగ్గా ఇలాంటి పరిస్థితుల్లో, సర్ ఆర్థర్ కాటన్ కృష్ణానదిపైన ఆనకట్ట నిర్మాణానికి సంబంధించిన ప్రతిపాదనలను ఆమోదింప జేసేందుకు నడుంకట్టాడు. అప్పటికే గోదావరి నదిపై ధవళేశ్వరం సమీపంలో నాలుగు ఆనకట్టలతో కూడిన బ్యారేజీని కేవలం లక్షన్నర పౌండ్ల స్వల్ప వ్యయంతో, శరవేగంగా నిర్మించి (1850-1852) కంపెనీవారి ప్రశంసలనూ ప్రజల మన్ననలనూ చూరగొన్న కాటన్ ప్రవేశంతో విషయం మొత్తం సానుకూలంగా మారింది. 'మేజర్' ర్యాంకులో ఉన్న కాటన్ ఈస్ట్ఇండియా కంపెనీవారి 'బోర్డు ఆఫ్‌డైరెక్టర్స్' వద్ద తనదైనశైలిలో వాదించి ఒప్పించడంతో 'కెప్టెన్‌లేక్' ప్రతిపాదనలకు మోక్షం లభించింది. తత్ఫలితంగా కృష్ణానదికి విజయవాడ వద్ద ఆనకట్ట కట్టేందుకు మార్గం సుగమమయ్యింది. ఆవిధంగా ఈస్టిండియా కంపెనీవారి నుంచి 5-1-1850 అధికారికంగా అనుమతి లభించడంలో కాటన్ కృషి విశేషమైనది. తద్వారా బెజవాడ వద్ద ఆనకట్ట కట్టేందుకు కారకుడయ్యాడు.

కృష్ణానదికి విజయవాడ వద్ద ఆనకట్ట నిర్మాణ నిర్వహణ బాధ్యతలను ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వం కెప్టెన్ అలెగ్జాండర్ ఆర్ కి అప్పగించడం జరిగింది. అలెగ్జాండర్ ఆర్ మరెవరో కాదు, కాటన్ ఆధ్వర్యంలో జరిగిన ధవళేశ్వరం బ్యారేజీ నిర్మాణంలో కీలక పాత్రవహించిన మిలటరీ ఇంజనీరు. గోదావరి బ్యారేజి నిర్మాణానికి ముందు కాటన్ 1848 జూన్ నుంచి 1850 సెప్టెంబరు మధ్యకాలంలో అనారోగ్య కారణంతో సెలవుపెట్టి విదేశాలకు వెళ్ళిన కాలంలో ఇన్‌ఛార్జిగా వ్యవహరించిన నిర్మాణ నిపుణుడు. సరైన రహదార్లుగానీ, ఏవిధమైనటువంటి వాహనాలు గానీ లేని, ఆ రోజుల్లో తన మార్గదర్శి కాటన్‌లానే కెప్టెన్ ఆర్ కూడా గుఱ్ఱంపైనే తిరుగుతూ, కృష్ణా ఆనకట్ట నిర్మాణపనులన్నింటినీ పర్యవేక్షించేవాడు. ఇప్పటి గాంధీహిల్‌పైన నివసించేవాడని చెప్తారు. కాటన్ సోదరుడు F.C.కాటన్, ధవళేశ్వరం బ్యారేజీ నిర్మాణంలో కాటన్‌కు కుడి భుజంలా సహకరించి, డిప్యూటీ ఇంజనీరుగా ప్రమోషన్ పొందిన గోదావరి వాసి 'వీణం వీరన్న' వంటివారి సహకారం తక్కువేమీ కాదు. కాటన్‌గారి శిష్యుడైన అలెగ్జాండర్ ఆర్ ఆధ్వర్యంలో 1852లో ప్రారంభమై 1855లో పూర్తయ్యిన 1224 మీటర్ల పొడవుగల కృష్ణానది ఆనకట్ట కృష్ణాతీర ప్రాంతవాసుల పాలిట వర మయ్యింది. కృష్ణా ఆనకట్ట నిర్మాణంలో అలెగ్జాండర్ ఆర్ కి అన్ని విషయాల్లోనూ మార్గాన్ని మార్గదర్శకత్వాన్ని, కార్యరూప ప్రణాళిక నిర్దేశకత్వాన్ని ప్రత్యక్షంగా, పరోక్షంగా అందించడంలో కాటన్ పాత్ర అపురూపమైనది, మహోన్నతమైనది.

కాటన్ కార్యదక్షతకు గీటురాయిగా నిలిచేమరో అద్భుతం కావేరీ నదిపై తమిళనాడులోని తంజావూరు జిల్లాలో నిర్మించిన కొల్లిడం ఆనకట్ట. సుమారు రెండువేల సంవత్సరాలనాటిదిగా భావిస్తున్న కల్లనాయ్ ఆనకట్ట పద్ధతిలోనే 'కొల్లిడంఏరు' కు దిగువున ఆనకట్టను నిర్మించడం కాటన్ ప్రతిభాపాటవాలకు నిదర్శనంగా నిలుస్తుంది. కొల్లిడం ఏరు కావేరీనది పాయల్లో కీలకమైనది. ఈ ఆనకట్టవలన కొల్లిడంఏరు, వెన్నేరు, పుత్తేరు, కావేరివంటి నాలుగు ప్రవాహాలకు సంయుక్తంగా ఉపకరించే ఒక బృహత్తరమైన ప్రాజెక్టు ఏర్పడినట్లయింది. అర్ధచంద్రాకారంగా కనిపిస్తూ ఉండే ఈ ఆనకట్టల సముదాయం ద్వారా సుమారు 70,000 ఎకరాల కావేరీ డెల్టా ప్రాంతానికి మేలు కలిగింది. తరచూ కరువూ, కాటకాలకు లోనయ్యే తంజావూరు, మధుర్తై మొదలగు ప్రాంతాలకు నీటి పారుదలను స్థిరీకరించడం కాటన్ సాధించిన ఘనవిజయం.

కాటన్ జీవిత విశేషాలన్నీ ప్రజాసంక్షేమం, సామాజిక వనరుల పురోభివృద్ధి వంటి బృహత్తర సేవాదృక్పదంతేనే ముడిపడి ఉన్నాయి. పదిహేనేళ్లకే ఆర్మీకేడెట్‌గా, పదహారేళ్ళకే సెకండ్‌లెఫ్టినెంట్‌గానూ నియమింపబడిన కాటన్ పందొమ్మిదేళ్ళ వయస్సుకే (1821) బ్రిటీష్ ఇండియా ఉద్యోగిగా భారతదేశానికి రావడం జరిగింది. 1822లో భారత, శ్రీలంకల మధ్య ఉన్న పాంబన్ జలసంధిని, లోతుచేసేపనిలో అసిస్టెంటు ఇంజనీరుగా సేవలందించడంతోపాటు, 1824లో బర్మాయుద్ధ సమయంలో సైన్యంలో చేరి అక్కడ కూడా మన్ననలు పొందాడు. 1827లో మద్రాసులో ట్యాంకు డిపార్ట్‌మెంటులో సూపరింటెండెంటు ఇంజనీర్‌గా పనిచేస్తూనే, 1828లో కెప్టెన్ హోదాను పొందాడు. 1828-1839ల మధ్య కావేరీనది గురించిన సర్వే చేయించడం, మద్రాసు నౌకాశ్రయ నిర్మాణం వంటి కార్యక్రమాలలో నిమగ్నమయ్యాడు. 1840లో కృష్ణానదిపై ఆనకట్ట నిర్మించడం అవసరమేనని, ప్రయత్నిస్తే సాధ్యమేనని నివేదికను చేసి నివేదించాడు.

ఇదేకాలంలో విశాఖపట్టణం నౌకాశ్రయ నిర్మాణ ప్రాజెక్టుపై కసరత్తు చేసి, దాని నిర్మాణానికి నాందిపలికాడు. 1846లో ధవళేశ్వరం ఆనకట్ట నిర్మాణానికి ఆమోదాన్ని సాధించి, 1847 ఏప్రిల్‌లో పనులు ప్రారంభింపజేశాడు. ఒకవైపు ధవళేశ్వరం ఆనకట్ట పనులు చేస్తూనే, కృష్ణానది ఆనకట్ట పునాదులత్రవ్వకం, నిర్మాణ పనులపై పరిశీలన, సర్వే జరిపించి, తగిన సూచనలతో కూడిన నివేదికను తయారుచేసి, కంపెనీ ప్రభుత్వానికి అంద జేశాడు.

కాటన్ 1860లో రిటైర్ కావడం, అదే సమయంలో బ్రిటీషు ప్రభుత్వం 'సర్' బిరుదునిచ్చి గౌరవించిన తరువాత కూడా కాటన్‌లోని సేవాభిలాష తగ్గలేదు. ఆయనలోని దృఢసంకల్పం ఏమాత్రం చెక్కుచెదరలేదు. కృష్ణానది ఉపనదుల్లో ప్రధానమైన తుంగభద్ర మీద ఆనకట్టను నిర్మించాలని సంకల్పించాడు. అందుకోసం తగిన అధ్యయనాన్ని చేసి, సర్వేలు నిర్వహించి, ప్రతిపాదనలను తయారుచేశాడు. బ్రిటీష్ ఇండియా ప్రభుత్వ కాలంలోనే కార్యాచరణజరగాల్సి ఉన్నా యితర కారణాలవల్ల నిర్మాణం జరగలేదు. ఈ ప్రతిపాదనలు, డిజైన్‌లే తదుపరి కాలంలో తుంగభద్ర డ్యామ్ నిర్మాణానికి దిక్సూచిల మాదిరిగా ఉపయోగపడ్డాయి. తుంగభద్రలాగానే భీమానదికి కూడా నీటి పారుదల వ్యవస్థ మెరుగయ్యేలా సూచనాత్మక ప్రణాళికలు సిద్ధం చేశాడు. అదే స్ఫూర్తితో భారతదేశ ప్రధాన నదులన్నింటినీ అనుసంధానం చేసేందుకు అవసరమైన బృహత్తర ప్రణాళికను రూపొందించాడు. ఇందులో భాగంగానే ఒడిశాలోని నదీ పరి వాహక ప్రాంతాలపైన సంబందిత వ్యవస్థలపైన స్వీయ పర్య వేక్షణలో పరిశోధనలు జరిపి, తన దార్శనికతను చాటు కున్నాడు. ఈనాటికి కాటన్ రూపొందించిన బ్లూప్రింట్/డిజైన్‌లే ప్రధాన ఆధారంగా ఉపకరిస్తున్నాయన్నది అతిశయోక్తి కాదు. కాటన్‌ది ఏదో పరిమితమైన లక్ష్యంకాదు. సుధీర్ఘమైన విశాలాశయం. కృష్ణా గోదావరి వంటి ఆనకట్టల నిర్మాణపు ప్రతిపాదనలన్నీ బ్రిటీషు వారికి అంతిమంగా ఆదాయాన్ని విశేషంగా పెంచు తాయని పైకి వాదించినప్పటికీ నిజానికి కాటన్ ఉద్దేశ్యం భారతీయ రైతాంగానికి, ప్రజానీకానికీ మేలు చేసేందుకేనన్నది సుస్పష్టం. గోదావరి కృష్ణాజలాల అనుసంధానానికి నాందిగా రెండు నదుల ప్రధాన కాలువలను ఏలూరువద్ద సంగమమయ్యేలా ఆరోజుల్లోనే ప్రయత్నించి, విజయం సాధించాడు.

కాటన్ చేసిన బృహత్తరసేవల్లో ప్రముఖమైనది కడప-కర్నూలు కాలువ నిర్మాణం.దీనిద్వారా కృష్ణానదీ జలాలను రాయలసీమకు అందేలా కృషిచేశాడు. ఇందుకోసం 1863 నుంచి 1870వరకూ కడప-కర్నూలు కాలువ నిర్మాణపనులను పర్యవేక్షిస్తూ కె.సి.కెనాల్ రూపం తెచ్చి, జీవంపోశాడు. పెన్నా, తుంగభద్రలను అనుసంధానం చేసేందుకు తోడ్పడిన ఈ కె.సి.కెనాల్ రాయలసీమ ప్రాంతానికి ఎంతగానో ఉపకరించింది. ఈ విధంగా జలరవాణాతోపాటు నీటిపారుదల వసతి, తద్వారా ప్రజలకు త్రాగునీరు, సాగునీరు అందేందుకు అనువైన ప్రతీ నదీస్వరూపాన్ని అధ్యయనం చేసి, తగిన 'డిజైన్'లను రూపొందించి నిర్మాణం చేపట్టాలన్న ధ్యేయమే తన పరమావధిగా జీవితాంతం కృషిచేశాడు. కాటన్ చేసిన సేవలకుగుర్తుగా 1877లో "కె.సి.యస్.ఐ" అనే హోదాతో కూడిన 'నైట్‌హుడ్' బిరుదును పొందాడు. 1899లో స్వర్గస్తులైన కాటన్ భారతీయుల గుండెల్లో మాత్రం సజీవంగా నిలిచాడు.

బ్రిటీష్ వలసవాద బాణీని కాదని, వారందరిలో 'మానవీయ కోణాన్ని' ఆవిష్కరింపజేసేలా, ఆచరించి చూపిన కాటన్ నిజమైన/పరిపూర్ణ విశ్వనరుడు. ఎందుకంటే కాటన్‌కు తర, తమ బేధం లేదు. బ్రిటన్ ఒకటి, భారతదేశమొగటీ కాదు. జాతి, వర్ణ, దేశ, ప్రాంతం వంటి భేదాభిప్రాయాలుగానీ, సంకుచిత భావాలుగానీ లేవు. విధినిర్వహణే దైవారాధనగా జీవించిన కాటన్‌కు అందరూ తనవాళ్ళే అందుకే ఖండాలు దాటి భారత దేశానికొచ్చినా, నిస్వార్థంగా భూమితల్లికి సేవలందించాడు. భారతదేశ తూర్పుతీర వాసులైన గోదావరీ, కావేరీ కృష్ణాతీర ప్రాంతీయులందరికీ ప్రాత:స్మరణీయుడయ్యాడు. ఒక్కమాటలో చెప్పాలంటే కాటన్ పుడమితల్లి ముద్దుబిడ్డ. ముఖ్యంగా కృష్ణానదీ తీర ప్రాంతాల్లోని ప్రజానీకానికి మహోపకారం చేసిన మహ నీయునిగా కాటన్‌గారి స్థానం అజరామరం.

శ్రీ నవులూరి రమేశ్‌బాబు

# ఒక శతాబ్దపు 'సారస్వత కృష్ణా తరంగిణి'

కృష్ణానదీ పరీవాహక ప్రాంతమైన తెలుగు జిల్లాలు 'మహబూబ్‌నగర్, కర్నూల్, నల్గొండ, గుంటూరు, కృష్ణా. ఈ 5 జిల్లాలలో ప్రసరించిన సారస్వత స్రవంతిని తెలుసుకోవడానికి కూడా ఇక్కడ ఒక పరిమితిని ఎంచుకున్నాం. అది ఒక శతాబ్దం. 1801 నుంచి 1900 వరకు మాత్రమే 1901ఆ తర్వాతివారు ఈ శతాబ్దంలో ఉండరు అని గ్రహించ ప్రార్థన. ఇక మహబూబ్‌నగర్ జిల్లాకే పాలమూరు జిల్లా అని కూడా పేరు. ఈ 5 జిల్లాల్లో కవి పోషకములైన సంస్థానాలలో ముఖ్యమైనవి. వనపర్తి, గద్వాల, కొల్లాపూర్, అనెగొంది, ముక్త్యాల, మునగాల, నూజివీడు ఆయా సంస్థానాలలో కవి పండితపోషణ ఇతోధికంగా జరిగింది. కావ్యరచన చేసిన సంస్థానాధీశులు కూడా ఉన్నారు. అందినంతవరకు చూద్దాం.

**అక్కిరాజు ఉమాకాంతం :** గుంటూరు జిల్లా, పల్నాటి తాలూకా 'వేమవరం'గ్రామంలో 1889లో జన్మించారు. టిప్పుసుల్తాన్, పల్నాటి వీరుల కథలు, షేక్‌స్పియర్ నాటక కథలు, రసమీమాంస, ఆంధ్ర చంద్రాలోక వివరణ, సంస్కృత వ్యాకరణ ప్రదీపానికి ఆంధ్ర వివరణ, పాణినీయం, నైషధ తత్త్వ జిజ్ఞాస, తెలుగుదేశమందలి చండాలురు, నేటికాలపు కవిత్వం వీరి రచనలు.

**అద్దేపల్లి కృష్ణశాస్త్రి :** శ్రీ అద్దేపల్లి కృష్ణశాస్త్రిగారు కృష్ణాజిల్లా దివిసీమలోని 'టేకుపల్లి' గ్రామంలో 1846 సం॥లో జన్మించారు. 1892సం॥లో శ్రీ సత్యనారాయణస్వామిని అన్నవరంలో ప్రతిష్టించిన మహనీయులు. మన కృష్ణశాస్త్రిగారే. 'జగన్మోహన' మంత్రం సంబంధ గ్రంథం ఒకటి రచించారు. సంస్కృత భాషలలో వీరు రచించిన గ్రంథాలకు లెక్కలేదు.'శ్రీసత్యనారాయణ స్వామి వ్రతవిధానం "ఏకశ్లోక వ్యాఖ్యానం" "అలంకార ముక్తావళి", "తర్కామృత తరంగిణి" అనే గ్రంథాలు వాటిలో కొన్ని.

**అడవి బాపిరాజు :** జాతీయ కవి, చిత్రకారుడు, సంపాదకుడు, శిల్పి,కథకుడు, నవలాకారుడు, వక్త, అయిన శ్రీ అడవిబాపిరాజు 1895లో ప.గో.జిల్లా భీమవరం సమీపంలోని 'సరిపల్లె' గ్రామంలో జన్మించారు. 'ఉప్పొంగిపోయింది గోదావరి' తెప్పున్న ఎగసింది గోదావరీ........, 'లేపాక్షి బసవయ్య లేచిరావయ్యా.........', 'బావా బావా పన్నీరు.....' మొదలైన జనరంజకమైన పాటలు ఈయన వ్రాసినవే. 1942లో హైదరాబాదులోని 'మీజాన్' పత్రికకు సంపాదకులుగా పనిచేశారు. పాటల సంపుటాలు, తొలకరి, గోధూళి హారతి,

**కథలు :** అంజలి, రాగమాలిక, తరంగిణి: **నవలికలు :** జాజిమల్లి, నరుడు, జాబిల్లి, రేడియో **నాటికలు :** ఆంధ్రసామ్రాజ్ఞి, కృతి సమర్పణ, దుక్కిటెద్దులు, ఉషాసుందరి,నారాయణరావు, శైలబాల, పారిజాతం, నవోదయం, ఏరువాక; **నవలలు :** నారాయణరావు, తుఫాను, గోనగన్నారెడ్డి, కోనంగి, హిమబిందు, అడవిశాంతిశ్రీ, అంశుమతి, నరుడు, జాజిమల్లి, మధురవాణి; **కథా సంపుటాలు :** తరంగిణి, రాగమాలిక, అంజలి తూలికానృత్యం, భోగీర లోయ వింధ్యాచలం మొదలైనవి

**అడవి సాంబశివరావు :** సాంబశివరావు కృష్ణాజిల్లా, కైకలూరు సమీపాన గల 'బొమ్మినంపాడు' గ్రామంలో 1864లో జన్మించారు. వీరు 'భుజంగనృపాల శతకము, అశ్వలక్షణసార సంగ్రహము, శుద్ధాంధ్రమేఘ సందేశము, అంగలూరు గ్రామ భూగోళము, జగన్నాధీయము, ఆంధ్రమత్స్యపురాణము, బిల్వానాధీయము, సాత్రాజితీ పరిణయము, హైమవతీ పరిణయము, సత్యనారాయణ చరిత్ర, అద్వైత మతాదర్శము అనే గ్రంథాలు రచించారు.

**అనివిళ్ళ వెంకటశాస్త్రి :** అనివిళ్ళ వెంకటశాస్త్రి తూ.గో.జిల్లా 'కాకరపఱ్ఱు' గ్రామంలో 1818 సం॥లో జన్మించాడు. 'బాలకాళిదాస' బిరుదాంకితుడైన శ్రీ అనివిళ్ళ వెంకటశాస్త్రి గారు సర్వ శాస్త్ర పారంగతులు.'అంకారసుధాసింధు, రస ప్రపంచం, చిత్ర చమత్కార మంజరి, సూర్యశతకం, రాసాడు. కృష్ణాజిల్లా 'మీర్జాపుర జమీందారై' శ్రీమేకా నరసప్పారావు ఆస్థానంలో ఉండి, అప్పరాయ యశశ్చంద్రో దయం' అనే అలంకార గ్రంథాన్ని రచించి ఆ జమీందారుకే అంకిత మివ్వగా,

అందుకు ఆయన వల్లూరు పల్లె (కృష్ణాజిల్లా లోని ప్రస్తుత 'వల్లూరి పాలెం') ను ఈ కవికి మాన్యంగా ఇచ్చారు. వెంకటశాస్త్రి సంస్కృతంలో 'చిత్రబంధరామాయణం' అనే విద్దూరమైన రచన చేశారు. ఇతర

**రచనలు :** మహేశ్వర మహాకావ్యం, సతీస్తోత్రం, భాస్కర ప్రశస్తి, రుక్మిణీ పరిణయ నాటకం.

**అబ్బూరి రామకృష్ణారావు :** భావకవితకు పాదుపోసిన ప్రముఖులలో ఒకరు, కవి పండితుడు, మేధావి, నటుడు, ప్రయోక్త శ్రీ అబ్బూరి రామకృష్ణారావు 1896 మే 20న జన్మించారు. వీరు రచించిన తొలి భావరూపకం 'నదీసుందరి' శ్రీ అబ్బూరి, శూద్రకుని 'మృచ్ఛకటిక'ను తెలిగించి, ప్రదర్శించారు కూడా 'జలాంజలి, మల్లికాంబ, ఊహాగానం, పూర్వప్రేమ' వంటి కావ్యాలు; కాపుపాట, అప్రాప్త మనోహరి, చెరకాలం, వీరు రచించిన గేయకావ్యాలు, సాహిత్యవివేచన (విమర్శ) ఇంకా కొన్ని ఖండకావ్యాలూ, రవీంద్రుని నవలలు అనువాదాలు రచించారు.

**అయ్యంకి వెంకటరమణయ్య :** గ్రంథాలయోద్యమ పితామహుడైన పద్మశ్రీ వెంకట రమణయ్య తూర్పు గోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకా 'కొంకుదురు' గ్రామంలో 1890 సంవత్సరంలో జన్మించాడు. ప్రభుత్వం 1968 నుంచి ప్రతిసంవత్సరం జాతీయ గ్రంథాలయ వారోత్సవము (నేషనల్ లైబ్రరీ వీక్) ను నిర్వహిస్తుంది. జాతీయ గ్రంథాలయ వారోత్సవ దినము గా జరుపుతున్నారు. భారత ప్రభుత్వం 1972లో పురస్కారం అందుకున్నారు. వీరు అనేక గ్రంథాలయ యాత్రలను నిర్వహించి 'ప్రజా గ్రంథాలయమే ప్రజల విశ్వ విద్యాలయం' అని చాటి చెప్పారు.

**అయ్యదేవర కాళేశ్వరరావు :** శ్రీ కాళేశ్వరరావు గారు కృష్ణాజిల్లా 'నందిగామ' లో 22-1-1881 న జన్మించారు. వీరు కారాగారంలో ఉండగా 'ఫ్రెంచి విప్లవ చరిత్ర' అమెరికా సంయుక్త రాష్ట్రాల చరిత్ర, తురుష్క ప్రజాస్వామికం. చీనా జాతీయోద్యమ చరిత్ర, ఉపనిషత్ పాఠాలు, ఈజిప్టు చరిత్ర, అను పుస్తకాలను రచించారు. వేదాంతం, రాజకీయాలపై వీరు అనేక రచనలు చేశారు. 'నాజీవిత కథ' అనే రచన, ఆనాటి ఆంధ్రోద్యమానికి ప్రతిబింబం. పారిభాషిక పదకోశ నిర్మాతలలో వీరు ఒకరు. వీరు 'నా జీవితం – నవ్యాంధ్రము' అనే పేరుతో స్వీయ చరిత్రను 1959లో రచించారు.

**అలుకూరి మల్లికార్జున శాస్త్రి :** రాయచూరు మండలం 'అలుకూరు' గ్రామంలో 1871లో జన్మించారు. 'ఖచరమణి పేటి' అనే గ్రంథం వాసుదేవానంద అనే అలంకార శాస్త్రం; జ్యోతిశ్శాస్త్ర సుధర్మసారము రచించారు.

**అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి :** ప్రఖ్యాత ఆశుకవి, శతావధాని అయిన 'అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి' గుంటూరుజిల్లా, కాకుమాను మండలం, 'గార్లపాడు' గ్రామంలో 1883 సంవత్సరంలో జన్మించాడు.

**రచనలు :** తెలుగు కావ్యాదర్శము, ఆంధ్రభాషా విలాపము, శిథిలాంధ్ర వైభవము, శివతత్వ సుధానిధి, దైవబలము, కావ్యనాటకాది పరిశీలనము, సీత, మాఘపురాణము, జీవన్ముక్తి –విదేహ ముక్తి, సుగుణోపాసన – నిర్గుణోపాసన, యజ్ఞోపవీత తత్త్వదర్శనము, రుద్రాక్షాది మాలలు– ఫలములు,మేఘము, ఆంధ్రధ్వని' మొదలైనవి.

**ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజి :** శ్రీ సోమయాజి గారు 25-8-1845 న కృష్ణాజిల్లా 'నూజివీడు'లో జన్మించారు. శ్రీ సోమ యాజుల వారితో వేదములకు అర్థము వ్రాయించమని 'మాక్సు ముల్లర్' ఆనందగజపతి రాజా వారికి సలహా ఇచ్చాడట.అంటే వీరి ఖండాంతర ఖ్యాతి విదితమౌతుంది. వీరు 'వైశ్య ధర్మ ప్రకాశిక' అన్న సూక్త టీకా తాత్పర్యము, తైత్తిరీయ సంహిత' మొదలగు కావ్యాలు రచించారు. 'పశువధాఖండనం' (ఆంగ్లగ్రంథం) 'వేదమతము' రచించారు. 'ఎడ్వర్డ్' మహారాజు వీరికి అర్థాసనాన్నిచ్చి గౌరవించారు.

**ఆదిపూడి ప్రభాకరామాత్యులు :** గుంటూరు జిల్లా 'ఆదిపూడి'గ్రామంలో 1871లో జన్మించారు. వీరు గద్వాల పిఠాపురం, పోలవరం మొదలైన సంస్థానాలు సందర్శించి సత్కరింపబడ్డారు. 'భారత దృశ్య ప్రబంధం' ఆంధ్ర పరాశర స్మృతి, కవిరాజ దర్పనం, పౌండరీకం, గద్వాల ప్రభాకరం' అనే కావ్యాలు; 'జగదీశ శతకము, శ్రీహరి శతకము' రచించారు.

**ఆదిపూడి సోమనాథరావు :** బహుభాషా పండితులు, రచయిత, భక్తాగ్రేసరులు అయిన శ్రీ సోమనాథరావుగారు 1867లో కృష్ణాజిల్లా 'చల్లపల్లి' లో జన్మించారు.

**రచనలు :** జపానుదేశ చరిత్ర, దయానంద సరస్వతి చరిత్ర, సత్యార్థప్రకాశిక, ఆంధ్రరఘువంశము, ఆంధ్రకుమార సంభవము, విజయేంద్రవిజయము, శ్రీకృష్ణదేవరాయ చరిత్ర, కేనోపనిషత్తు, కంబరామాయణము, గీతాంజలి, కిన్నరీ విజయము, (పద్మకావ్యం) బుధభూషణము, సర్వమాన్య శతకము, లోకపావన శతకము, రామమోహననాటకం. ఆంగ్లభాషలో 'థామస్ మూర్' రచించిన 'పారడైజ్ అండ్ దిపెరి' అనే గ్రంథాన్ని 'కిన్నరీ విజయము' అనే కావ్యంగా 'గీతమాలిక' గా అనువదించారు.

**ఈడ్పుగంటి రాఘవేంద్రరావు :** స్వాతంత్ర్య ప్రియులైన శ్రీ ఈడ్పుగంటి రాఘవేంద్రరావు గారు కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాలోని 'పెదమద్దాలి' గ్రామంలో 1890 సం॥లో జన్మించారు. వీరు గొప్ప పండితుడు. రసాయనశాస్త్రం మొదలు ఖగోళశాస్త్రం వరకు పంచాయితీ నుండి పార్లమెంటు విషయాలవరకు అనేక అంశాలపై

కొన్ని గ్రంథాలు హిందీ భాషలో వెలువరించారు. శ్రీరావుగారు తమ 'జీవిత చరిత్ర' కూడా రచించారు.

**ఉన్నవ లక్ష్మీనారాయణ :** తెలుగు నవలా సాహిత్య వైతాళికులు, సాహిత్యం ద్వారా హరిజనోద్ధరణకు కృషి చేసిన ప్రముఖ న్యాయవాది అయిన శ్రీ ఉన్నవ వారు గుంటూరు జిల్లా,సత్తెనపల్లి తాలూకా 'వేములూరుపాడు' గ్రామంలో 1877లో జన్మించారు. 'మాలపల్లి' అనే విప్లవాత్మకమైన నవలా రచన చేశారు. ఉన్నవ ఈ నవలలో చరమగీతం, సమతాధర్మం అనే గేయకవితల్ని సామాన్య ప్రజల కోసం, వాడుకభాషలో జానపదగేయ రీతిలో రచించాడు.

**ఉమారంగనాయకులు :** ఉమా రంగనాయకులు నాయుడు సంపాద కత్వంలో 1872లో కృష్ణాజిల్లా మచిలీపట్నం నుంచీ 'పురుషార్థ ప్రదాయిని' పత్రిక వెలువడింది. ఈ పత్రికలో శాస్త్రం, భాష, మతం, వైద్యం, వర్తకం, కళలు, విద్యావిషయాలు, దేశకాల జీవితచరిత్రలూ మొదలైన విషయాలకు ప్రాధాన్యమిచ్చారు.

**కనుపర్తి వరలక్ష్మమ్మ :** స్త్రీ స్వాతంత్ర్యం గురించి కూడా ఆలోచించి, రచనలు చేసిన శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ 1896లో 'బాపట్ల' లో జన్మించారు. 'లేడీస్ క్లబ్' రాణి మల్లమ్మ, మహిళా మహోదయం, పునఃప్రతిష్ట వంటి నాటికలు,'ద్రౌపదీ మానసంరక్షణ, సత్యా ద్రౌపది సంవాదం (ఈ రెండూ ద్విపద రచనలు) నాదు మాట, ఓటు పురాణం, అనే పద్య రచనలు; 'అపరాధిని, వసుమతి, వరద రాజేశ్వరి' అనే రచనలు; ' కన్యాశ్రమం' అనే కథల సంపుటి వెలువరిం చారు. 'శారదా లేఖలు' మా ఊరు, పెన్షన్ పుచ్చుకున్న నాటి రాత్రి, కథ ఎట్లా ఉండాలి, 'ఉన్నవ దంపతులు' మొదలైన రచనలు; 'నమో ఆంధ్ర మాతా' పేరుతో గేయాలు రాసారు. గాంధీ మీద 'దండకం' కూడా రచించారు. పిల్లల పాటలు, నవలలు, పిట్టకథలు, జీవిత చరిత్రలు, కథలు అనే ప్రక్రియలో రచనలు చేశారు. వరలక్ష్మమ్మ కథలు కొన్ని తమిళ, కన్నడ, హిందీ భాషలలోకి అనువాదమయ్యాయి.

**కల్లూరి చంద్రమౌళి :** శ్రీ చంద్రమౌళి గుంటూరుజిల్లా, మోపఱ్ఱు గ్రామంలోజన్మించారు.సంస్కృతాంధ్రాంగ్లభాషా విశారదులు. 'రామాయణ సుధా లహరి, భారతీయ ప్రతిభ, భాగవత సుధ, వివేకానమ్ద స్వామి, సీతా మహాసాధ్వి, ఉజ్జ్వల,తరంగిణి, వేద సుధాకరం, యుగసమీక్ష, నానాదేశ రాజ్యాంగములు, రైతు రాజ్యాంగ నిర్మాణ సంఘం రచించారు.

**కవికొండల పురుషోత్తమ యోగి :** శ్రీ యోగి, కృష్ణాజిల్లా మచిలీపట్నంలో 21-4-1892 న జన్మించారు. ఈయన త్యాగరాజ జీవితామృతము, శ్రీ భద్రగిరి రఘురామ శతకము, శ్రీ సూర్యోపాసనం, శ్రీ త్యాగరాజ శతకం రచించారు.

**కాంచనపల్లి కనకాంబ :** కనకాంబ గారు 3-9-1893 పల్నాటి సీమలోని 'దుర్గి'గ్రామంలో జన్మించారు. కృష్ణాజిల్లా విజయవాడలోని శ్రీ తిరుమ శ్రీనివాసత్రిలింగ మహావిద్యా పీఠము ' నందుండి, విశేష కృషి చేశారు.

**ఈమె రచనలు :** ఈమె తొలి రచన 12వ యేట రచించిన 'రంగ శతకము' ఇక 'రాధ, గౌతమబుద్ధ చరితము(ఈ 2 గద్య కావ్యాలు); అమృతవల్లి (నవల) పాండవోదంతము (గద్య) కాశీయాత్ర చరిత్రము, శ్రీ జీవయాత్ర (ఆధ్యాత్మికకావ్యం, వైదాంతిక నాటకము, పద్యముక్తా వళి, హంస విజయము,అంబాస్తవము ) అమృత సారము, ఆనంద సారము, రామాయణ కథాసంగ్రహము (సంస్కృత గద్యం), అభిజ్ఞాన శాకుంతల నాటకము, అమృతానంద బోధసారము, హంస విజయము, రంగశతకము, అమృతవల్లి (నవల) గౌతమబుద్ధ చరితము, పాండవోదంతము (గద్య) కాశీయాత్ర చరిత్రము, జీవ యాత్ర (ఆధ్యాత్మిక కావ్యం) వైదాంతిక నాటకము, పద్య ముక్తావళి, శాకుంతల నాటకము, రామాయణ కథాసంగ్రహం (సంస్కృత గద్యం), అంబాస్తవము, అమృతానంద బోధసారము, ఆనందసారము, కొన్ని కథలు, తోయమాలి ప్రాసారిక (పద్య సంపుటి) కాళిదాసు 'అభిజ్ఞాన శాకుంతలము' సంస్కృత నాటకాన్ని ఆంధ్రీక రించారు. కొన్ని కథలు, ఒక పద్యసంపుటి రచించారు.

**కాటూరి వేంకటేశ్వరరావు :** కవి, రచయిత, వక్త అయిన శ్రీ వెంకటేశ్వరరావు 1895లో కృష్ణాజిల్లా 'కాటూరు' గ్రామంలో జన్మించి,పింగళి-కాటూరి జంట కవులై, నవ్యకవులై సాహిత్య సామ్రాజ్య మేలారు.'సంక్రాంతి, తొలకరి, నవ్యమార్గానికి చెందిన జానపద కావ్యాలు, సౌందరనందం, వరలక్ష్మీ వ్రతం, పౌలస్త్య హృదయం' జంటగా రచించారు.'బగ్‌బౌరలు' ఆంగ్లనవలాంధ్రీ కరణ, ప్రతిజ్ఞాయౌ గంధరాయణం, నల్లకలువ ఆంగ్లం నుంచీ తెలుగు సేత) స్వప్న వాసవ దత్త' ఇవి కాటూరి వారి పేరనే ఉన్న కృతులు. ఇంకా 'గుడిగంటలు, మావాళ్ళు, మువ్వగోపాలా, నిగమశర్మ, శ్రీనివాస కళ్యాణము, తెలుగు కావ్యమాల, నాగార్జున కొండ, మువ్వగోపాల (శ్రవ్యనాటికలు) ప్రతిజ్ఞా యౌగంధరామాయణము, స్వప్న వాసవదత్తము (భాసుని కృతకి తెలుగు సేతలు) మన వారసత్వము (కబీర్) చిరంజీవి ఇందిరకు (నెహ్రూ లేఖలు) పన్నీటి జల్లు (ఖండకావ్యముల సంపుటి), జగద్గురు బోధలు (కంచి పీఠాధిపతి బోధనలు) సాహిత్య దర్శనము నాటకాలు వీరి సొంత రచనలు. మువ్వగోపాల పదముల (క్షేత్రయ్య కృతులు) రవికుమార్తోద కలిసి, శ్రీ విశ్వేశ్వర శతకము (వేమూరి వెంకటరాయ శర్మతో కలిసి రచించారు.

**కానుకొలను నాయనప్పకవి :** నాయనప్పకవి 1816లో బందరులోని 'చింతగుంటపాలెం' లో జన్మించారు. ఇతనికి 'వెంకట

దాసు' అని కూడా పేరు. 'శ్రీమత్తంత్రిణీపుర పట్టాభిరామ శతకము' ను రచించారు.

**కాశీ కృష్ణాచార్యులు :** నడయాడే సరస్వతిగా ఖ్యాతిగాంచిన ఆంధ్ర ప్రదేశ్ ఆస్థానకవి శ్రీకాశీ కృష్ణాచార్యుల వారుకృష్ణాజిల్లా 'మచిలీపట్నం'లో 1872లో జన్మించారు. సంస్కృత సాహిత్యా ధ్యయనం చేశారు. తర్కం, పాణినీయ వ్యాకరణం,వేదాంతశాస్త్రం, సంగీతం, వీణా, వేణు, వాయులీన, మృదంగ వాద్యాలలో నిష్ణాతు లయ్యారు. ఇంకా కుమ్మరి, కమ్మరి, నేత,వడ్రంగం ఇలా మొత్తం 16 కళలలో ప్రావీణ్యం సంపాదించి, తనకు రానివిద్య లేదనిపించుకు 'కళా ప్రపూర్ణులు' అయ్యారు. పందొమ్మిదోయేట గుంటూరులో ప్రథమ శతావధానం చేసిన ప్రతిభాశాలి వీరు. వీరి శతావధానాలు శతాధికం; అష్టావధానాలకు అవధి లేదు. ఆంధ్రేతరప్రాంతాలలో సంస్కృతావధానాలు, ఆంధ్రప్రాంతంలో ఆంధ్రవధానాలు చేశారు. బాలభోదిని ని-3 భాగాలు, క్రియాధర్మం, సంవాదం, వాల్మీకి చరితం, ఆంధ్ర సంస్కృత నిఘంటువు, గోష్ఠీవన మహాత్మ్యం (తెలుగులో, సంస్కృతంలో) అవధాన యాత్ర, దేవీదేవతలపై అష్టకాలు, దండకాలు, శతకాలు, స్తోత్రాలు అనేకానేకం రచించారు. ఒకసారి నెల్లూరులో అరగంటలో శ్రీరంగనాయక శతకాన్ని రచించి పండితులనే ఆశ్చర్య చకితుల్ని చేశారు.

**కాశీనాధుని నాగేశ్వరరావు :** ప్రముఖ దేశభక్తుడు, దానశీలి అయిన శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు కృష్ణాజిల్లా, గుడివాడ తాలూక, యలకుర్రు లో 1876లో జన్మించారు. 1908 సెప్టెంబరు 9న బొంబాయి నుంచీ వారపత్రికగా 'ఆంధ్రపత్రిక' ప్రారంభించారు. 1911 లో స్వగ్రామంలో శ్యామలాంబా ధర్మవిద్యాలయం స్థాపించారు. తన పత్రికను1914లో మద్రాసుకు తరలించి 'దినపత్రిక' చేశారు. ఇది ఆంధ్రరాష్ట్రోద్యమానికి అసదృశంగా తోడ్పడింది. దీనితో పాటు 1924లో వెలువరింపబడిన సారస్వతానుబంధం సాహితీ వికాసానికి కారణమైంది. వీరు 1924 నుంచీ సాహిత్యం, కళలు, శాస్త్ర అంశాలూ ప్రధానంగా వెలువరించిన 'భారతి' మాసపత్రిక - ప్రాచ్య పరిశోధనకు, కళారాధనకు, ఆంధ్రభాషా వికాసానికి, దేశభక్తి ప్రబోధానికి వేదిక అయింది. 1932లో 'ఆంధ్రవిజ్ఞాన సర్వస్వం' రెండవ కూర్పును ప్రకటించారు. 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహాన్ని రచించడమే గాక, పెక్కు గ్రంథాలకు పీఠికలు రాశారు. 1931లో పంతులుగారు భగవద్గీతకు వ్యాఖ్యానం రచించారు. తిరుమల వెంకట రంగాచార్యులు సహాయంతో 'పారిభాషిక పదకోశము' అనే నిఘంటువును ప్రకటించారు.

**కాశీనాధుని వీర మల్లయారాధ్యుడు :** మల్లయ 1880లో కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకా, 'ఎలకుర్రు' లో జన్మించాడు. 'మేనకా కుశిక సంవాదం', సంగీత హరిశ్చంద్ర, సంగీత తారా చంద్రీయము, గాంధీ మహాత్మ ప్రబోధిని, తపాలా నాటకం, వ్యవహార బోధిని, స్త్రీ విద్య, కన్యకా పరమేశ్వరీ విలాసం, తమలపాకు - పోక సంవాదం, జ్ఞానవతీ విలాసము, తెనాలి రామకృష్ణుని వికృత కథలు, గయోపాఖ్యానము, నీతి కథామంజరి, జయంత జయపాలీయము, కుశలవ పట్టాభిషేకము,పర్వదిన మహాత్మ్యము,సీతా మనోహరము, పూర్వ హైందవ స్త్రీల చరిత్రము, (రెండు భాగాలు) పుష్కరమాహాత్మ్యము, రాఘవ మారుతీయము, శశిరేఖా పరిణయము, స్త్రీ సాహసము మల్లయగారి రచనలు.

**కిలాంబి గోపాలకృష్ణమాచార్యులు :** కృష్ణాజిల్లా నూజివీడు సంస్థాన విద్వాంసుడైన శ్రీగోపాల కృష్ణమాచార్యులు1915 ప్రాంతంలో పీఠికాపుర మహారాజ చరితం అనే సంస్కృత కావ్యం 10 సర్గలతో, 550 పద్యాలతో రచించారు.

**కిళాంబి వేంకట శేషాచార్యులు :** శ్రీ శేషాచార్యులు కృష్ణాజిల్లా కొండపల్లి సమీపాన గల కవులూరు గ్రామంలో 1867లో జన్మించారు. వీరు ఉత్తరాంధ్ర మహాభారతము, మతత్రయాచార దీపిక, కొండపల్లి చరిత్రము, సత్యాద్రౌపదీ సంవాదము అనే గ్రంథాలు రచించారు.

**కురుగంటి సీతారామయ్య :** శ్రీ కురుగంటి సీతారామయ్య గారు 1890లో తెనాలి తాలూక, వేమూరు గ్రామంలో జన్మించారు. 'బెజవాడ' చేరారు. సీతారామయ్యగారు చదువుకుంటూనే, 1914లో అలంకార తత్త్వ విచారం రచించారు. రచనలు : నవ్యాంధ్ర సాహిత్య వీధులు, శ్రీ కురుగంటి వ్యాసలహరి, షడ్దర్శనములు, శాతకర్ణి, ఆదర్శ ప్రభువు, కురుగంటి కథావళి, తంజాపురాంధ్ర నాయకరాజ చరిత్రము, **Tanjore Nayaks** వ్యాసలహరి, షడ్దర్శనములు ఇంకా అముద్రిత గ్రంథాలు చాలా ఉన్నాయి.

**కురుగంటి సుబ్రహ్మణ్యచయనులు :** చయనం చేసి చయనులుగా మారిన శ్రీ కురుగంటి సుబ్బారావు (సుబ్రహ్మణ్యం) గారు 1830లో కృష్ణాజిల్లా 'బందరు'లో జన్మించారు.అనేక ఆధ్యాత్మిక గ్రంథాలు రచించారు. బ్రహ్మసూత్ర,పురుషసూక్త, తైత్తిరీయ, గీతాభాష్య కర్తలు వీరు.

**కురుగంటి సుబ్రహ్మణ్యశాస్త్రి :** వీరు గుంటూరుజిల్లా తెనాలి తాలూక.'వేమూరు' గ్రామంలో 1841లో జన్మించారు. తీర్థీయ సూత్ర భాష్యము, అద్వైతానంద లహరి, భగవద్గీతా తాత్పర్య దీపిక, బ్రహ్మ సూత్ర, తాత్పర్యదీపిక,చాందోగ్యోపనిషద్భాష్యము, పంచోపనిష త్తాత్పర్య దీపిక రచించారు.

**కురుగంటి సూర్యనారాయణ శాస్త్రి :** శ్రీ సూర్యనారాయణ శాస్త్రి కృష్ణాజిల్లా 'కైంకర్యపురి' (కైకలూరు) గ్రామంలో 1860లో జన్మించారు. వీరు కుమారసంభవము, అనర్ఘరాఘవము, కవిచరిత్ర,

కామదహన నాటకము దత్తాత్రేయ మహాత్మ్యము, దశావతార చరిత్ర నాటకము, దేవసేనా పరిణయ నాటకము,దక్షయజ్ఞ ధ్వంస నాటకము, నియోగి, వైదికభేద నిర్ణయము, సుబ్రహ్మణ్య విజయము, హరిశ్చంద్ర చంపువు" మొదలైన రచనలు చేశారు.

**కురుగంటి శ్రీరామశాస్త్రి :** శ్రీరామశాస్త్రిగారు 1900లో కృష్ణాజిల్లా 'బందరు'లో జన్మించారు. శ్రీరామశాస్త్రిగారు 'తర్క సంగ్రహ సర్వస్వం,పారిభాషిక పదకోశం రచించారు. తర్కశాస్త్రంలో ఉద్దండులుగా యావద్భారత ఖ్యాతి గడించారు.

**కూచి నరసింహం :** ప్రముఖ సంస్కృతాంధ్ర పండితులు కవి, రచయిత, కూచి నరసింహం గారు1866లో కృష్ణా నదికి దక్షిణ తీరంలో గల'కుంచెనపల్లి' గ్రామంలో జన్మించారు. శిశిరకుమార ఘోష ఆంగ్లములో రచించిన గ్రంథాన్ని బట్టి 'గౌరాంగచరిత్రము' పద్య కావ్యంగాసంతరించారు. 'వనవాసి' 'రూపలత' మున్నగు నాటకములు, వచనకృతులు బెక్కులు రచించారు. ప్రముఖ ఆంగ్ల నాటకకర్త 'విలియం షేక్స్పియర్' నాటకాలను వీరు తెలుగులోకి అనువదించారు.

**కొండా వెంకటప్పయ్య :** గొప్పకవి, వక్త 'దేశభక్త' బిరుదాంకితుడు అయిన శ్రీ కొండావెంకటప్పయ్యగారు, 1866లో 'పాత గుంటూరు' లో జన్మించారు. 'కృష్ణాపత్రిక' ప్రప్రథమ సంపాదకులు

**రచనలు :** "డచ్ రిపబ్లిక్‌రైజ్" అనే గ్రంథాన్ని, శ్రీవేంకటేశ్వర సేవానందలహరి అన్నశతకాన్ని రచించాడు. ఆధునిక రాజ్యాంగ సంస్థలు అనే గ్రంథం కూడా రాశారు.

**కొత్త భావయ్య చౌదరి :** కవి, పరిశోధకులు అయిన శ్రీ భావయ్య గుంటూరు జిల్లా 'సంగం జాగర్లమూడి' లో 1897లో జన్మించారు. వీరు 'కమ్మవారి చరిత్ర, రెడ్ల చరిత్ర, నగర పట్టాభిషేక నాటకం, దేవరహస్యాలు,ఆంధ్రరాజులు, సంగభూపాలీయం, శంకర శతకం, కల్పవల్లి, పుణ్యవిజయం, సిద్ధార్థ శతకం, పశ్చిమ చాళుక్య రాజ్య చరిత్ర, గాంధీయిజం ఇంకా అనేకచారిత్రకవ్యాసాలు రచించారు.

**కొడాలి ఆంజనేయులు :** స్వాతంత్ర్య సమరయోధునిగా, రచయితగా, జాతీయవాదిగా, 'సత్యాంజనేయ' కవులలో ఒకరుగా, ఖ్యాతులైన శ్రీఆంజనేయులుగారు కృష్ణాజిల్లా దివితాలూకా లోని 'కొడాలి' గ్రామంలో జన్మించారు. 1920లో అవతార పరివర్తనము అనే దేశభక్తి నాటకం విశ్వనాథతో జంటగా రాశారు. ఆంజనేయులు గారు ఒక్కరే. 'అజ్ఞాత సత్యాగ్రహి, నిరీక్షణము' అనే ఖండ కావ్యాలు; సహకారోద్యమం, గ్రామస్థుల అర్థశాస్త్రం, కాంగ్రెస్ చరిత్ర మొదటి భాగం (పట్టాభివారి History of Congress) కాంగ్రెస్ చరిత్ర రెండవ భాగం,యుద్ధము-కమ్యూనిస్టులు -కాంగ్రెస్, గాంధీ- గాంధీతత్త్వము, సర్దార్ పటేల్, ఖాదీ అర్థశాస్త్రం" మొదలైనవి ఆంజనేయులుగారి స్వతంత్ర రచనలు. కొడాలివారి "Gandhiji in Andhra Pradesh" అనే గ్రంథానికి సంపాదకత్వం నిర్వహించారు. ఆంజనేయులుగారు సుమారు5 సం.పాటు కొల్లిపర సూరయ్య గారు నడిపిన 'సాహితి' అనే పత్రికకు సంపాదకత్వం నిర్వహించారు.

**కొప్పవరపు సుబ్బారావు :** వీరు గుంటూరు జిల్లా కొప్పరపు అగ్ర హారంలో1896లో జన్మించారు. 14వ ఏట వినుకొండ లో అష్టావధానం చేశారు. నమో హిందూమాతా... అనే రికార్డులను తయారు చేశారు. 'చండిక, కృష్ణాలీలలు, చదువుకున్న భార్య,' చిత్రాలకు గేయాలు రాశారు. మావూరు, 5 చక్రాల బండి,పంచవర్ష ప్రణాళికా ప్రచార నాటకాలు రచించారు.

**కొమర్రాజు (బండారు) అచ్చమాంబ :** మహిళాభ్యుదయానికి కృషి చేసిన తొట్టతొలి విదుషీమణి అయిన శ్రీమతి బండారు అచ్చమాంబ గారు 1874లో, కృష్ణాజిల్లా 'పెనుగంచిప్రోలు' లో జన్మించారు. సాధారణమైన చదువు చదువుకొని అసాధారవ్యక్తిగా లోకోత్తర రచనలు చేసిన రచయిత్రి అచ్చమాంబ. గురజాడ అప్పారావు కన్నా పదేళ్ళ ముందే 1902 నవంబరు నెలలో రాసిన కథ 'ధనత్రయో దశి' ని హిందూ సుందరి పత్రికలో ప్రచురించారు. ప్రథమ స్త్రీవాద చరిత్ర కారిణి.

**రచనలు, కథలు :** గుణవతియగు స్త్రీ, లలితాశారదులు, జానకమ్మ, దంపతుల ప్రథమ కలహము, సత్పాత్రదానము, స్త్రీవిద్య, భార్యాభర్తలసంవాదము, అద్దమును సత్యవతియును బీదకుటుంబము, ఇంతదాకా అలభ్యంగా వుండిన 'ప్రేమా పరీక్షణము' 'ఎఱువుల సొమ్ము బఱువుల చేటు' అనే కథలు సంగిశెట్టి శ్రీనివాస్‌కు లభించాయి.

**ఇతర పుస్తకాలు :** అబలా సచ్చరిత్ర రత్నమాల (రెండు భాగాలు) ఒక శతకం కూడా రాశారని తెలుస్తోంది.

**కొమర్రాజు వెంకట లక్ష్మణరావు :** లక్ష్మణరావు గారు కృష్ణాజిల్లా నందిగామ సమీపంలోని పెనుగంచిప్రోలులో 1877లో జన్మించారు. అనేక ప్రాంతాలలో చదవడం వల్ల 'మరాఠీ, గుజరాతీ, బెంగాలీ, కన్నడం, తమిళం, హిందీ, సంస్కృతం, తెలుగు భాషలలో నిష్ణాతుడయ్యాడు. శివాజీ చరిత్ర అనేచారిత్రక గ్రంథం రాశారు. తరువాత 1906లో మునగాలరాజా, అయ్యదేవర, గాడిచర్ల (అందరూ సీమాంధ్రులే) కలిసి "విజ్ఞానచంద్రికా గ్రంథమండలి"ని హైదరాబాదులో స్థాపించారు. ఎంతటి క్లిష్టమైన విజ్ఞాన విషయమైనా మాతృభాషలో బోధిస్తే సులభగ్రాహ్యా మౌతుందని విశ్వసించారు. అందుకే దేశ చరిత్రలు, పదార్థ, విజ్ఞాన, రసాయన, జీవ, వృక్ష శాస్త్రాలకు సంబంధించిన 30 గ్రంథాలను విజ్ఞానచంద్రికా గ్రంథమండలి 1911 నాటికి ప్రచురించింది. మల్లంపల్లి, చిలుకూరి, ఆచంటలాంటి మహామహుల వ్యాసాలతో 'ఆంధ్రవిజ్ఞాన సర్వస్వం' రెండువేల పేజీలతో,3 భాగాలుగా

తన అనారోగ్యాన్ని లెక్కచేయకుండా ప్రచురించారు. 1907లో హిందూ మహాయుగం (క్రీ.శ1000 వరకు) 1908లో మహమ్మదీయ మహా యుగం (క్రీ.శ: 1000 నుండి 1560 వరకు) మహాపురుషుల జీవిత చరిత్రలు, రావిచెట్టు రంగారావు జీవితచరిత్ర రచించారు.

**కోకా శ్రీరామారావు నాయుడు :** శ్రీ రామారావు1872లో కృష్ణాజిల్లా 'బందరు' లో జన్మించారు. వీరు కథాసంగ్రహము,ఆంధ్రకవి కుసుమమాలిక, ఆదిమ చక్రవర్తీయము, కీచకవధ, ఆనందసాగరము, దశరథ నిర్యాణము, రామాయణసారము, హరిశ్చంద్రోపాఖ్యానము, విద్వద్దర్పణము అనే రచనలు చేశారు.

**కోటగిరి వెంకట కృష్ణారావు :** గంపలగూడెం కుమారరాజా, కళాప్రపూర్ణ శ్రీవెంకట కృష్ణారావు 1890లో కృష్ణాజిల్లా నూజివీడులో జన్మించాడు. కుమారరాజావారు"పాదుషాపరాభవం,యౌవన నిగర్హణం, ఘోషా, వ్యాసఖండన మండనము," "శృంగార తిలకము, ప్రణయా దర్శము, యౌవననిగర్హణము,చాటు పద్యములు, శ్రీకృష్ణరాయనాటకా వళి, అభినవ పాండవీయము, పాదుషా పరాభవము, బొబ్బిలి విజయము, ప్రణయాదర్శణము" (అను నాలుగు నాటకాల సంపుటం) మాతృదేశము, మోక్షమార్గము, వేదవతి, విధి (పద్యకావ్యము) దేవదాసి (నాటకము) ఘోషావ్యాస ఖండనము మొదలగు రచనలుచేశాడు. అనేక చాటుపద్యాలు రచించారు. కృష్ణరాయ గ్రంథమాల అనే సంస్థను స్థాపించి, చాలా కృతులు ప్రకటించారు.

**కోట వెంకటాచలం :** భారత చరిత్ర భాస్కర, విమర్శకాగ్రేసర, పండిత అని విఖ్యాతులైన శ్రీకోట వెంకటాచలంగారు కృష్ణాజిల్లా, గన్నవరం తాలూకా (మేడూరు సమీపంలోని) మధునాపురం అగ్రహారం లో 1885లో జన్మించారు.

**వీరి రచనలు :** చారిత్ర కాంశాలపై విశేషకృషి చేసిన ప్రతిభా మూర్తి.గరసంహితలోని 'యుగ పురాణం' ఆధారంగా 'ఆంధ్రులెవరు? అనే గ్రంథంలో పౌరాణిక చరిత్రను గురించి అపారమైన కృషి చేసిన మహనీయుడు. వీరి భారతీయ చారిత్రక కాల నిర్ణయంలో ముఖ్య ఘట్టాలు" అనే గ్రంథం ప్రతి భారతీయుడు చదివి తీరవలసిన గ్రంథం. మహాభారత యుద్ధ కాల నిర్ణయం కూడా వీరి ప్రముఖ రచన. దీనిలో లభ్యమైన శాసనా ధారాలన్నీ ఉటంకించారు. శ్రీవెంకటాచలంగారు 'అద్వైతబోధిని' అనే వేదాంతగ్రంథాన్ని, స్వాభావికాహీరమునుగూర్చి "నిర్విచార జీవనములు" అనే గ్రంథాన్ని రచించారు. వీరింకా 'జంబూ ద్వీపము' ఆర్యుల ధ్రువ నివాస ఖండనము, బ్రహ్మాండ సృష్టి విజ్ఞానము, ప్రాచీన హిందూమతం చరిత్ర పార్ట్ -1, ప్రాచీన హిందూ మతం - చరిత్ర పార్ట్ -2, నేపాల్ చరిత్ర, కాశ్మీరు చరిత్ర, క్రోనాలజీ, భారత క్రోనాలజీ ప్లాట్, బుద్ధుని మిలింద,అంతియోక, యుగపురాణం, విక్రమాదిత్య, శాలివాహన అనే భారత యుగాలు, చారిత్రాత్మక యుద్ధము, అగ్నివంశ క్షత్రియులు లేక నియోగి బ్రాహ్మణ ప్రభువులు, అభాస క్రైస్తవం, అద్వైత బోధిని, ఆంధ్రుల పుట్టుపూర్వోత్తరములు, కలియుగ రాజ వంశములు, కలిశక విజ్ఞానం, ధ్రువనివాస ఖండనము మొదలైన రచనలు చేశారు.

**కోలవెన్ను రామకోటేశ్వరరావు :** వక్త, ఆంధ్రాంగ్ల గ్రంథ రచయిత, గ్రంథాలయోద్యమ పెద్దదిక్కుగా ఉన్న శ్రీరామ కోటేశ్వరావు గారు గుంటూరుజిల్లా నర్సరావుపేట లో 1894లో జన్మించారు. 1927లో త్రివేణి పత్రికను ప్రారంభించారు. వీరింకా మహారాష్ట్ర వీరులు, కౌంట్ కేవర్ ఆఫ్ ఇటలీ (ప్రధాని కేవర్ చరిత్ర) మొదలైన గ్రంథాలు రాశారు. 1928లో త్రివేణి అనే ఆంగ్ల పత్రికను ప్రారంభించి జీవితాంతం కొనసాగించిన 'తెలుగు వెలుగు' శ్రీ కోటేశ్వరరావుగారు.

**కోరాడ రామకృష్ణయ్య :** చారిత్రక పరిశోధకులు, నిరాడం బరులు, అయిన శ్రీరామకృష్ణయ్యగారు 1891లో కృష్ణాజిల్లా 'బందరు'లో జన్మించారు.

**వీరి రచనలు :** ఆంధ్రభారత కవితా విమర్శనము, కాళిదాసుని కళాప్రతిభలు, సారస్వతవ్యాసములు, సంధి, భాషోత్పత్తి క్రమము - భాషా చరిత్ర,భాషా చారిత్రక వ్యాసాలు, దక్షిణ దేశ భాషా సారస్వత ములు దేశి మున్నగు రచనలు చేశారు.

**కోరాడ రామచంద్రశాస్త్రి :** శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రిగారు 1816లో, కేశన కుఖ్ఖిలో జన్మించారు. కృష్ణాజిల్లా బందరు వచ్చి నోబిల్ పాఠశాల, కళాశాలలో తెలుగు పండితునిగా చేరి, ఇక్కడే స్థిరపడ్డారు. తొలి తెలుగు నాటకం, ప్రప్రథమ స్వతంత్ర రచన 'మంజరీ మధుకరీయము'1908లో బందరునుండి ప్రచురించారు. ఇంకా 'దేవీ విజయము' త్రిపురాసుర విజయము, ఉన్మత్త రాఘవము, నయ ప్రదీపము, రథాంగదూతము, శాకుంతలము (ఆంధ్రీకరణము) పరశురామ విజయము (గద్య) శృంగార సుధార్ణవము (బాణం) కవనా నందము (బాణం), ఉపమావళి,రామచంద్ర విజయము (వ్యాయోగం) కుమారోదయము, అనే గ్రంథాలు రచించారు. 'ఉత్తరరామ చరితం, వేణీసంహారం, ముద్రారాక్షసం, శాకుంతలం' తెనిగించారు. మేఘ సందేశం తర్వాతి కథను 'ఘనవృత్తము, దేవీ విజయము, శృంగార సుధార్ణవము, ఉపమావళి" మొదలైన సంస్కృత గ్రంథాలు రచించారు. శ్రీ శాస్త్రిగారు 22 సంస్కృత గ్రంథాలు, 7 తెలుగు కావ్యాలు, 4 అనువాదాలు, 2 స్వతంత్ర తెలుగు రచనలు చేశారు. మొత్తం 31 గ్రంథాలు రచించారు.

**కోవెల రాఘవాచార్యులు :** శ్రీ కోవెలవారు కృష్ణాజిల్లా 'పెదముత్తేవి' గ్రామంలో 1830లో జన్మించారు. వీరు ఆగిరిపల్లి

శోభనాచల స్వామి మీద, శ్రీకాకుళాంధ్ర మహావిష్ణువు మీద, పెదముత్తేవి లక్ష్మీపతిస్వామి మీద 'యమకప్రాధాన్యంతో గేయాలనూ; ఏకాంకసేవా ప్రబంధాలనూ రచించారు. ఇంకా వ్యాఘ్ర నరసింహునిపై 'కందపద్యశతకం' కూడా రచించాడు.

**గరికపాటి లక్ష్మీకాంతయ్య:** కవి, సంస్కృతాంధ్ర పండితులు అయిన శ్రీలక్ష్మీకాంతయ్య కృష్ణాజిల్లా 'ఇందుపల్లి' గ్రామంలో అన్నం భట్టు వంశంలో గరికపాటి వారింట 1900 లోజన్మించారు. వీరు సంస్కృతంలో హరస్తుతి, కీరసందేశమ్, అష్టకపంచకమ్, జలధి జానందలహరి, భవానీ శంకరస్తుతి, పుష్పాంజలి, శ్రీశృంగగిరి జగద్గురు చరిత్ర సంగ్రహమ్, శ్రీవిద్యా శంకర భారతీ విజయః, శ్రీనారాయణతీర్థ యతీంద్ర చరిత్రమ్, శ్రీ వేంకటేశ్వర స్తుతి, భవ్య భారతమ్, విశ్వకవి, భరతోపాఖ్యానమ్, ధ్రువోపాఖ్యానమ్, శ్రీరామ చరితమ్, జయదేవ చరితమ్, గాంధీవిజయమ్, సంస్కృత కావ్యకథా (వచనమ్) మున్నగునవి; తెలుగులో శ్రీశారదా వ్యాస మణిహారం, సంస్కృత కావ్య కథలు (15) రచించారు.

**గాడిచర్ల హరిసర్వోత్తమరావు :** సర్వోత్తమరావు గారు 1883లో కడపజిల్లా 'సింహాద్రిపురం' లో జన్మించారు. విద్యార్జన చివరలో ఆంగ్లప్రిన్స్‌పాల్తోపడక, విద్యకు స్వస్తి చెప్పి, రాజకీయ రంగంలో ప్రవేశించారు. కోపల్లె, డా.పట్టాభి. ముట్నూరులతో కలిసి కృష్ణాజిల్లాబందరులో జాతీయకళాశాల స్థాపించారు. తరువాత 1907 సం.లో బెజవాడ వచ్చి 'స్వరాజ్య'పత్రికను ప్రారంభించి సంపాద కీయాలు రాశారు. ఆపై ఆంధ్రపత్రికకు మొదటి సంపాదక బాధ్యతను స్వీకరించారు. 'ఎడిటరు' ను మొదటగా 'సంపాదకుడు' అన్నది వీరే.

**గాదేపల్లి వీర రాఘవశాస్త్రి :** వీరు కర్నూలు జిల్లా మార్కాపురం తాలూకా 'ఎర్రగొండపాలెం'లో 1891లో జన్మించారు.

**రచనలు :** చమత్కార కవిత్వం, త్రిపురాంతక స్థల మహత్త్యం, శ్రీ సత్య వరలక్ష్మీ వ్రత చరిత్ర, అహోబిల మహాత్మ్యం, మార్కండేయ చరిత్ర (హరికథ) రామభూపతీ శతకం, విఘ్నేశ్వర శతకం,సోమేశ్వర శతకం, చెన్నకేశవ శతకం, ఆర్యవిద్యా ప్రబోధిని, ముకుందమాల.

**గుడిపాటి వెంకటచలం :** సాంఘిక మూఢ దురాచారాలపై కత్తిగట్టి వచన సాహిత్య విప్లవకారునిగా తన కలాన్ని చేబట్టిన శ్రీ వెంకట చలం మద్రాసులో 1894లో జన్మించారు. మొదట్లో చలం కొన్ని బ్రహ్మగీతములు రాశాడు. తరువాత "పాపం, శశిరేఖ, చిత్రాంగి, సావిత్రి, మైదానం" మొదలైన రచనలు సంఘంలో తీవ్ర సంచలనం సృష్టించాయి. "స్త్రీ" అనే వ్యాస సంపుటి - స్త్రీ స్వేచ్ఛ, స్వాతంత్ర్యాల ఆవశ్యకతా వివరణ అన్ని వర్గాలవారిని ఆలోచింపచేసింది. చలం రచించిన నవలలు, కథలు, కథానికలు, నాటకాలు, వ్యాసాలు, లేఖా సాహిత్యం, స్వీయచరిత్ర, పీఠికలు, అనువాదాలు మొదలైన ఆంగ్ల రచయితల ప్రభావం చాలా ఉంది. వీరి నవలలో 'శశిరేఖ,దైవమిచ్చిన భార్య, అమీనా, మైదానం, వివాహం, బ్రాహ్మణీకం,అరుణ, జీవికా ధర్మం, ముఖ్యమైనవి. కొత్త రూపుతో చలం రాసిన పౌరాణిక నాటకాలు చాలా ఉన్నాయి. చలం ఎన్నో వ్యాసాలు రచించారు తెలుగు సాహిత్యంలో ప్రేమలేఖలు, మ్యూజింగ్స్ అనే ప్రక్రియలు రూపకల్పన చేసిన రచయిత చలమే. చలం సుమారు 30 నాటకాలు, శతాధికంగా చిన్న కథలు రచించారు. రవీంద్రుని గీతాంజలికి చలం రాసిన పీఠికకు సాహిత్యంలో ప్రత్యేక స్థానం ఉంది.

**గుడిపూడి ఇందుమతీదేవి :** పండిత వంశంలో పుట్టిన శ్రీమతి ఇందుమతీ దేవిగారు 'మతుకుమల్లి' వారి ఆడపడుచు. 1890 సం॥లో పాతగుంటూరు లో జన్మించారు. తరువాత కృష్ణాజిల్లా 'విజయ వాడ'లో స్థిరపడ్డారు. ఈమె రచించిన

**ప్రబంధములు :** లక్షణా పరిణయం, అంబరీష విజయం.

**శతకములు :** తరుణీ శతకం, రాజేశ్వరీ శతకం, నీతి తారావళి, నరసింహ శతకం

**పద్యఖండికలు :** లోకావలోకనం, సోదరి, గోవిలాసం, ఆంజనేయ స్తుతి, జన్మభూమి, నర్మదానాటకం, గాంధీ కీర్తనలు, రామకథా మంజరి, **పాటలు :** సీతారాముల పాటలు, గాంధీ పాటలు, రామాయణ గానసుధ

**అనువాదాలు :** తిరువాయిమొళి,

**గురజాడ రాఘవశర్మ :** ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, బహుగ్రంథ రచయిత, 'కవి శేఖరులు' అయిన శ్రీ రాఘవశర్మగారు 1899 లో కృష్ణాజిల్లాలోని 'గురజాడ' గ్రామంలో జన్మించారు.

**రచనలు :** కల్పలత (1953), ముకుందమాల, వాసుదేవ శతకం (కృష్ణా! వాసుదేవ ప్రభూ! మకుటం) శ్రీలక్ష్మీ దివ్యగుణ వైశిష్ట్యము (స్తుతికావ్యం) అంజలి (కామకోటి పరమాచార్య మహిమ) బాపూజీ, కాళరాత్రి (పద్మకావ్యం) సువర్చలాంజనేయం, నవకాళి, స్వాతంత్ర్య పథము, జాతీయగీతాలు (1973)

**గుఱ్ఱం జాషువా :** కవికోకిల, కవితా విశారద, పద్మభూషణ్ జాషువా గుంటూరు జిల్లా 'వినుకొండ'లో 1895లో జన్మించారు. వీరు తెరచాటు, మీరాబాయి, ధ్రువ విజయము' అనే దృశ్యకావ్యాలు; ఫిరదౌసి, నాగార్జున సాగర్, ముంతాజ్‌మహల్, క్రీస్తు చరిత్ర, అనే కావ్యాలు; కుచేలోపాఖ్యానము, చిన్న నాయకుడు, అనే గద్య కావ్యాలు; 7 ఖండకావ్యాలు, అనాథ, స్వప్నకథ, సాలీడు, గబ్బిలము (రెండు భాగాలు) కాందిశీకుడు, నేతాజీ, బాపూజీ, స్వయంవరం, రాష్ట్రపూజ, కొత్తలోకం, ముసాఫిరులు,నాకథ (మూడు భాగాలు) రచించారు.

**గొట్టిపాటి బ్రహ్మయ్య :** ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు. రాజకీయ నాయకుడు అయిన కళాప్రపూర్ణ బ్రహ్మయ్యగారు 1889లో కృష్ణాజిల్లా 'ఘంటసాల'లో జన్మించారు. జాతివెలుగులు, కాలచక్రం, మనకర్తవ్యం, నా జీవన నౌక గొట్టిపాటి బ్రహ్మయ్యగారి రచనలు.

**గొట్టిపాటి వెంకటసుబ్బయ్య :** దివిసీమ పండితత్రయంగా ప్రసిద్ధులైన ముగ్గురిలో ఒకరైన "శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్య గారు కృష్ణాజిల్లా 'ఘంటసాల' లో 1898లో జన్మించారు. సీతాచరిత్రము, శరద్దర్శనం మన జమీందారులు "గాంధీమహాత్ముని నిర్బంధం, గీతా భూమిక, నవ్వులు, పువ్వులు, ఆటలు, బొమ్మలాటలు, నవ్వు లాటలు, పొడుపు కథలు, నీతులు - రీతులు, త్రయోదశ మహా పురుషుల జీవిత చరిత్రలు "ఘంటసాల చరిత్ర" (1-2 భాగాలు) అక్షరాభిషేకం, నా మిత్రులు, నేను జాతి నిర్మాతలు 30 గ్రంథాలు రచించారు.

**గోవిందరాజుల సుబ్బారావు:** వైద్యులు, సాహిత్య ప్రియులు, రచయిత, శ్రీ గోవిందరాజులు సుబ్బారావు, 1895 సంవత్సరంలో కృష్ణాజిల్లా 'మచిలీపట్నం'లో జన్మించారు. వీరు ఆంగ్లంలో "ఇనార్గానిక్ ఎవల్యూషన్" అనే ఒక వైజ్ఞానిక గ్రంథాన్ని రచించారు.

**గౌరావఝుల రామకృష్ణ సీతారామ సోదరకవులు :** గౌరావఝుల రామకృష్ణ సీతారామ సోదరకవులు జంటకవులుగా ప్రసిద్ధి చెందారు. వీరు 'కర్నూలు' పట్టణంలో జన్మించారు. వీరిలో గౌరావఝుల రామకృష్ణ శాస్త్రి(1900-1970) పెద్దవాడు. రెండవవారు 'గౌరావఝుల సీతారామశాస్త్రి (1904-1972) ఈ ఇరువురు సోదర కవులు పెక్కు శతావధానాలు చేశారు.

**రచనలు :** శ్రీ కాశీవిశ్వనాథ శతకము, పయిడిపాటి మహాలక్ష్మి శతకము, వెంకటేశ్వర శతకము, శ్రీకృష్ణ కథామృతము, సుబ్రహ్మణ్యేశ్వ రీయము, శ్రీరామ నిర్యాణ నాటకము, కాఫీ పురాణము.

**జ్ఞానాంబ (మాంబ):** తపస్విని, తత్త్వవేత్రి, కవయిత్రి, జ్ఞానమాంబ 1895లో కృష్ణాజిల్లా 'బెజవాడ' లోజన్మించారు. జ్ఞాన విషయాల్ని బోధించేది. 12వ యేటనే సన్యాసం పుచ్చుకున్నారు. నిజజ్ఞానాధిక్యం వల్ల ఆమెకు 'జ్ఞానాంబ' నామకరణం చేశారు. ఆమె

**రచనలు :** శ్రీరంగావధూత, శ్రీసీతారామావధూతల చరిత్రలు పద్యకావ్యాలుగా, చంద్రమ్మ కథ, అనేక పాటలు రచించారు. ఇంకా దేవుడు, విజ్ఞానామృతం, కాళీ ప్రసాదిని, సత్ప్రభు శతకము, గార్గి" మొదలైన రచనలు చేశారు. అనువాదాలు : "మైత్రేయి" ఒకానొక వైదిక కథ, సీతానాథ తత్త్వభూషణుల ఆంగ్ల గ్రంథానికి జ్ఞానాంబ అనువాదం.

**చందాల కేశవదాసు :** సహజకవి, అష్టావధాని, హరికథకులు అయిన శ్రీకేశవదాసు నల్లగొండజిల్లా 'జిక్కేపల్లి' అనే గ్రామంలో 1876లో జన్మించారు. వీరు అశుకవితలల్లారు. అష్టావధానాలు చేశారు. వీరు కనకతార నాటకం, పాదుకా పట్టాభిషేకం, అంబరీష చరిత్ర మొదలైన హరికథలను ఆశువుగా జనరంజకంగా చెప్పేవారట. భజనలు, కీర్తనలు, మంగళహారతులు వందలసంఖ్యలో రచించారు.

**చామర్తి రాజశేఖరరావు :** వీరు పాఠశాలలో చదువుతూనే ఆశుకవిత, అవధానాలు ప్రారంభించారు. విజయధ్వజము (నవల) పాంచాలీ సాంత్వనం, సోమవార మహాత్మ్యం, బృందావనం (కావ్యాలు) చంద్రహాస విలాసం (ప్రబంధం), విజయనగర సామ్రాజ్య స్థాపన (నాటకం) రచించారు.

**చింతా సుందరరామశాస్త్రి :** శ్రీ సుందరరామశాస్త్రి 1860 ప్రాంతంలో 'బందరు' లో నివసించారు. సంస్కృతాంధ్ర రహస్య దర్పణము అనే అద్భుత నిఘంటువును (A mirror or Sanskrit and Telugu Words in their various establishments forms for the use of school and private students) నిర్మించారు. ఇది బందరులోనే ప్రచురింపబడింది.

**చిట్టా బాలకృష్ణశాస్త్రి :** శ్రీబాలకృష్ణశాస్త్రి 1870లో బందరులో జన్మించారు. 'మచిలీపట్టణ చరిత్ర' అనే గ్రంథాన్ని 1922లో ముద్రించారు.

**చిన్నమాంబాదేవి (రాణి) :** పద్మనాయక వంశస్థురాలైన 'రాణీ చిన్నమాంబ' కృష్ణాజిల్లా 'నూజివీడు' ప్రభువైన మేకా వెంకట రంగయ్యప్పారావు పుత్రిక, పిఠాపురం ప్రభువు సూర్యరాయమహీపతి బహద్దరు వారి ధర్మపత్ని. ఈమె ఉపన్యాసమాలిక, రామాయణ సంగ్రహము, ఉపనిషత్కాలక్షేప సారములు ఇంకా కొన్ని వచన గ్రంథాలు రచించారు.

**చిల్లరిగె యోగానందకవి :** శ్రీ యోగానంద కవిగారు 1880వ సం॥లోకృష్ణాజిల్లా గుడివాడ తాలూక'అంగలూరు' గ్రామంలో జన్మించారు. అష్టావధాని, ఆశుకవితాప్ర వీణులు అయినవీరు, "జ్ఞానవతి, కనకవల్లి,దేవయాని వివాహము, సంపూర్ణ రామాయణము" మొదలైన గ్రంథాలు రచించారు.

**చెన్నాప్రగడ భానుమూర్తి :** గొప్ప సంస్కృత విద్వాంసుడు, రచయిత అయిన శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తి పశ్చిమగోదావరి జిల్లా,కాళీపట్నం గ్రామంలో జన్మించారు. "విజయవాడ"లోని మిషన్ హైస్కూల్లో ఉపాధ్యాయుడిగా పనిచేశాడు. 1908లో తొలి గ్రంథంగా, "భారత ధర్మదర్శనము"ను రచించారు.

**రచనలు :** హేమలత (నాటకము) భారతధర్మ దర్శనము, బాలచంద్ర చరిత్రము, మండపాలచరిత్రము, ప్రియదర్శిక (నాటకము)

**చెన్నాప్రగడ వాసుదేవ మూర్తి :** శ్రీ వాసుదేవ మూర్తి కృష్ణాజిల్లా 'బందరు'లో 1880లో జన్మించారు.'భారత ధర్మ దర్శనము'

అనే గ్రంథం రచించారు. ఆంధ్ర జాతీయ కళాశాల స్థాపనకు ముందే నియమనిబంధనలు తయారుచేశారు.

**చెరకువాడ (వెంకట) నరసింహం పంతులు :** "ఆంధ్ర మెగస్తనీస్, ఉపన్యాస కేసరి" అయిన చెరుకువాడ నరసింహం పంతులు గారు కృష్ణాజిల్లా దివి తాలూకా, చిరువోలులంక లో 1887లో జన్మించారు.

**వీరి రచనలు :** శాసనసభలు, స్వరాజ్య దర్పణము, ఈశ్వర చంద్ర విద్యాసాగర్ జీవిత చరిత్ర,మల్లు తానుల మహాసభ" మొదలైనవి.

**చెరుకూరి కాళహస్తీశ్వరశర్మ :** శ్రీ కాళహస్తీశ్వర శర్మగారు 21-10-1899న కృష్ణాజిల్లా విజయవాడ తాలూక, తోట్లవల్లూరు లో జన్మించారు.

**వీరి రచనలు :** "అమరుక కావ్యం, వెండిపూలు, గ్రామ జీవనము, వ్యాస భారతము, ముకుందమాల" మొదలైనవి ముద్రిత గ్రంథాలు. "బౌద్ధ రామాయణం, అనార్కలి, శ్రీశారదాగమం, పరిష్కారం, ఝాన్సీ రాణి అనే అముద్రిత గ్రంథాలు రచించారు. 15వ ఏటనే కవిత్వం చెప్పనేర్చిన అష్టావధాని.

**చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి :** మచిలీపట్నంలో అధ్యాపకులుగా ఉన్న కాలంలో తమ ప్రతిశిష్యుణ్ణి కవిగా రూపొందించిన బ్రహ్మశ్రీ వెంకట శాస్త్రిగారు. 1870లో తూర్పుగోదావరి జిల్లా'కడియం' గ్రామంలో జన్మించారు. గోణము కట్టుటాది బుధకోటి నుతింప గవిత్వము చెప్ప గల్గిన వేంకటశాస్త్రి తిరుపతి శాస్త్రి తో కలసి విద్యార్థి దశలోనే ధాతు రత్నాకరం,శృంగారశృంగాటకం (వీధినాటకం)కాశీసహస్రం" జంటగా రచించారు.స్వయంగా వైరాగ్య శతకమనే అప్పయ్యదీక్షితులవారి కృతిని అనువదించారు. దివాకర్ల తిరుపతి శాస్త్రి మరణించాక, దివాకరా స్తమయం రచించారు, భోజరాజీయం లోని గోవ్యాఘ్ర సంవాదాన్ని 'గోదేవి'గా బొబ్బిలి పట్టాభిషేకం కావ్యంగా, సుశీల, సతీజాతకం (స్మృతిరచనలు) కథలు -గాథలు (సారస్వత విశేషాలు) రచించారు. ఈ వ్యాసాల్లో లేని అంశం లోకంలో లేదంటే ఆశ్చర్యం లేదు. వీరి

**రచనలు :** శ్రవణానందం, కామేశ్వరీ శతకం, ఆరోగ్య కామేశ్వరీ (కావ్యం) ఆరోగ్య భాస్కరస్తవం, మృత్యుంజయ స్తవం, సౌభాగ్య కామేశ్వరీ స్తవం, బాలరామాయణం,(10 అంశాల నాటకం) సువర్ణ పాత్రిక, కొన్ని ప్రహసనాలు, గీరతం, గుంటూరు సీమ, జయంతి మొదలైనవెన్నో

**అనువాదాలు :** బుద్ధచరిత్ర (కరుణరసాత్మకానువాదం) ముద్రారాక్షసం, మృచ్ఛకటికం, పాండవోద్యోగ విజయాలు, విక్రమాంక చరిత్ర (గద్యం) మొదలైనవి.

**అన్యాపదేశ రచనలు :** లోపాఖ్యానం, బిదాగ్రామ సింహం, మల్లేశ్వర విజ్ఞప్తి, రాసభ కుమారుడు మొదలైనవి.

**చేబ్రోలు సరస్వతీ దేవి :** కవి కలహంసి సరస్వతీ దేవి 1882లో, నల్గొండజిల్లా 'నీలగిరి' లో జన్మించారు. ఈమె కృష్ణాజిల్లా 'నూజివీడు' జమీందారులైన రాజా గోపాలమనాయుని తండ్రి. ఈమె భర్త చేబ్రోలు రాజగోపాలం. ఈమె సరస్వతీ రామాయణం, సరస్వతీ శతకం, సత్యనారాయణ వ్రతకల్పం, ఉత్తరరామ చరిత, ఆత్మోపదేశం, పతివ్రతా శతకం, భాష్పాకులిత, దమయంతి తెలుగు తల్లి రచించారు

**జంగా హనుమయ్య చౌదరి :** శ్రీ హనుమయ్యగారు 1888 లో కృష్ణాజిల్లా 'వీరులపాడు' గ్రామంలో జన్మించారు. ప్రాచీన విద్యార్థి, అభిమాన దుర్యోధన, దుశ్శాసన గర్వభంగం, అర్జునుడు, భగవన్నుతి, జమలాపురం వెంకటేశ్వరుడు, శుద్ధాంధ్ర నిర్వచన సత్యావిజయం, జానకీ పరిణయ నాటకం అనే నాటకం మొదలైన రచనలు చేశారు. ఇంకా "ఏకలవ్య కథావిమర్శనం, దాస్యము, దొంగ, చంద్రధిక్కారము, తద్దినములు,లేఖిని మున్నగు ఎన్నో అముద్రితగ్రంథాలు కూడా రాశారు.

**జంధ్యాల శివన్నశాస్త్రి :** శ్రీ శివన్నశాస్త్రి 1836 డిసెంబరు 5న కృష్ణాజిల్లా గుడివాడ సమీపాన గల 'కొర్నిపాడు' లో జన్మించారు.

**రచనలు :** వర విక్రయం, కన్యావిక్రయం, దుర్గాదాసు, కాళిదాస భవభూతులు, హిందీ - తెలుగు నిఘంటువు, తెలుగు - హిందీ నిఘంటువు, హిందీ - తెలుగు వ్యాకరణము, అముద్రితాలు : శృంగార సప్తశతి, భార్గవరామ విజయము, దర్పదళనము, రఘువంశము, కుమార సంభవము, మేఘసందేశము ఈ మూడు వచన రచనలు. ఇంకా ప్రజ భాషా వ్యాకరణము కూడా రచించారు.

**జిల్లేపల్లి హనుమంతురావు :** శ్రీ హనుమంతరావు 1867లో కృష్ణాజిల్లా 'శ్రీకాకుళం'లో జన్మించారు. వీరు 'యతి ప్రాస తత్త్వ నిర్ణయము, శివోద్వాహం, శ్రీ శంకరాచార్య చరిత్ర, శ్రీమద్భా గవత సారం (గీతా తత్త్వము) పుష్పదంతుని మహిమ్ను స్తోత్రానికి వ్యాఖ్య, తులసీ రామాయణానువాదము, సుందరకాండ, విలియం కాపర్ రచనను 'మాతల్లి చిత్తరువు' గా తెనిగించారు. షేక్స్పియర్ సింబలీస్ ను సుసేన విజయంగా అనువదించారు.

**టేకుమళ్ళ రాజగోపాలరావు :** విద్యావేత్త, దార్శనికుడు, కవి, పండితుడు, గ్రంథాలయోద్ధారకుడు అయిన రాజగోపాలరావు గారు 1876లో తూ.గో.జిల్లా పెద్దాపురంలో జన్మించారు. కృష్ణాజిల్లా విజయవాడలో స్థిరపడ్డారు.

**రచనలు :** త్రివిక్రమ విలాసము, లలిత, కనకవల్లి అనే చారిత్రక నవలలు; విహంగయానము (సైన్స్ ఫిక్షన్) రామలింగడు,కాళిదాసు, కృష్ణదేవరాయలు, స్త్రీ చరితా కదంబము, సారస్వత వ్యాసములు 2 భాగాలు. పశుశాస్త్రము, అర్థశాస్త్రము, ఆహారశాస్త్రము, మొదలైన తెలుగు గ్రంథాలే కాక Andhra literary history, Buddhist history

ఆంగ్లగ్రంథాలు కూడా రచించారు. యుద్ధమల్లుని బెజవాడ శాసనము మద్యాక్కరలు అనే అంశంపై పరిశోధన చేశారు. దక్షిణ భారత భాషలలో తెలుగు అతి ప్రాచీన భాషగా నిర్థారించారు. ఈయన 'పరిశోధన పత్రిక (South Indian Research) ను నడిపారు. 'ఆంధ్రదేశ చరిత్ర' ఒక సంపుటం ప్రచురించారు. వీరు 'తెలుగు' శబ్దం మీద చేసిన పరిశోధనలో తెలుగువారు టిబెట్‌దేశం నుంచి వచ్చినట్లు ఋజువు చేశారు.

**తల్లావఝ్ఝుల శివశంకరస్వామి :** భావకవిత్వోద్యమ సారథి అయిన శివశంకర్ 1892లో గుంటూరుజిల్లా 'కాజ' గ్రామంలో, నారాయణ తీర్థులవారి వంశంలో జన్మించారు. వీరు పాళీ, బెంగాలీ, లాటిన్,ఫ్రెంచ్ భాషలుకూడా అభ్యసించారు.'హృదయేశ్వరి, వకుళమాల, కావ్యావళి, రత్నాకరము, నీరద, రఘునాథజీ, రాజపుత్ర జీవనసంధ్య, అరక్షణీయ, మాధవీ కంకణము, కాంచనమాల, కావ్యాలు రాశారు. గేయనాటికలకు ఆద్యులై వీరు'పద్మావతీ చరణ చారణచక్రవర్తి, దీక్షిత దుహిత' రచించారు. బెంగాలీ నుంచీ ఎన్నో నవలలు అనువదించారు. తన కుమారునితో కలసి 'జాతక కథలు, కథాసరిత్సాగరము' రచించారు. స్వయంగా సంస్కృత వ్యాకరణ దర్శన చరిత్ర రచించారు.

**తిరుమల గుదిమెళ్ళ వరదాచార్యులు :** ప్రాచ్యవిద్యల ప్రాభవాన్నిఇనుమడింప జేయడం కోసం అహరహంశ్రమించి, కాసుకాసు ఖర్చు చేసుకున్న శ్రీమత్ తిరుమల గుదిమెళ్ళ వరదా చార్యులవారు కృష్ణాజిల్లా బందరు సమీపంలోని 'చిట్టిగూడూరు'లో 1892లో జన్మించారు. 'చిట్టిగూడూరు'లో శ్రీ నారసింహ సంస్కృత కళాశాలను స్థాపించారు.గాయత్రీ శత గీతావళి, వింశతిదయ శ్లోక కావ్యమ్, శతకసప్తమ్ (వేమన, కృష్ణ కాళహస్తీశ్వర,భాస్కర, శ్రీకాకుళాంధ్ర దేవ మొదలైన 7 తెలుగు శతకాలను సంస్కృతంలోకి అనువదించారు) తులనాత్మక భాషాశాస్త్రంపై సంస్కృతంలో భాషా శాస్త్ర సంగ్రహమ్ అనే గ్రంథం రాశారు. దాదాపు తెలుగులోని ప్రఖ్యాత శతకాలన్నిటినీ సంస్కృతీకరించారు.

**తెల్కపల్లి రామచంద్రశాస్త్రి :** వీరు మహబూబ్‌నగర్ జిల్లా, కోడేరు మండలం, 'రాజాపురం' గ్రామంలో 1900లో జన్మించాడు. వీరి మొదటి రచన 27 ఆర్యవృత్తాలతో కూడిన 'భారతీ తారామాల' అనే 'శారదాస్తుతి' బందరులో చదువుచున్నప్పుడే రచించాడు. వీరింకా కవితాకాంతా స్వయంవరం (ఖండకావ్యం) శారదా నవరత్నమాలిక, లలితాస్తవఝరి (50 శ్లోకాలు) హయగ్రీవ శతకం, ఉమామహేశ్వర సుప్రభాతం,శ్రీహనుమత్సుప్రభాతం, మామిళ్ళ పల్లి లక్ష్మీనరసింహ సుప్రభాతం, గురుపీఠతత్త్వ దర్శనం, శివానందాష్టకం, గణేశ పంచ రత్నాలు, అయ్యప్ప స్తుతి, కలిశతకం, రవీంద్ర తపఃఫలము, ధూమ శకట ప్రమాదం, చ్యవనోపాఖ్యానం, సుకన్యాస్తవం, మృత్యుశకటం.

**త్రిపురనేని రామస్వామి చౌదరి :**హేతువాదిగా, మానవతా వాదిగా, జాతీయవాది, కవిరాజుగా పేరొందిన శ్రీరామస్వామిగారు కృష్ణాజిల్లా 'అంగలూరు' లో 1888లో జన్మించారు. 1911లో విద్యార్థి దశలోనే "రాణాప్రతాప్, కురుక్షేత్రం" నాటకాలు రచించారు. జాతీయ వాదిగా "వీరగంధము తెచ్చినారము వీరుడెవ్వడొ తెల్పుడీ" అన్నారు.

**రచనలు :** సూతపురాణం, శంభుక వధ, ఖూనీ, వివాహవిధి, కుప్పు స్వామి శతకం, చెన్నకేశవ శతకం, పల్నాటి పౌరుషం, కురుక్షేత్ర సంగ్రామం, రాణాప్రతాప్, అంపకం, మాలదాసరి, నరకం, సూతాశ్రమ గీతాలు, భగవద్గీత మొదలైనవి.

**త్రివేణి :** శ్రీమతి త్రివేణి 1870వ సం॥లోజన్మించారు. ప్రతివాది భయంకర వేంకటాచార్యుల (కృష్ణాజిల్లా నూజివీడు) వారి భార్య. "లక్ష్మీనాథ సహస్రము, రంగనాథ సహస్రము, శ్రీరంగాభ్యు దయము, తత్వముద్రాభద్రోదయము, శుక సందేశము, భృంగసందేశము" మొదలైన సంస్కృత గ్రంథాలు రచించారు.

**దామరాజు పుండరీకాక్షుడు :** శ్రీ పుండరీకాక్షుడుగారు 1898లో గుంటూరు జిల్లా 'పాటిబండ' గ్రామంలో జన్మించారు. స్వస్థలం కృష్ణాజిల్లా "నూజివీడు".

**రచనలు :** "గాంధీ మహోదయం (3 అంకాల నాటకం) గాంధీ విజయం (5 అంకాల నాటకం 2-10-1946 క్విట్ ఇండియా) పంజాబు దురంతములు, గుంటూరు గొప్ప (జంగం కథ) కలియుగ ప్రహ్లద (హరికథ) స్వరాజ్య మహాసభ, సంస్కారిణి (నాటకం), ఓట్ల ప్రహసనం (నాటకం) కమాలు పాషా జీవితం (తెలుగు, ఇంగ్లీషు) కలియుగ భారతం (సాంఘిక నాటకం, రణభేరి, భగవాన్ నారద, కుంభ రాణా, తారాశశాంకం, కలియుగ కురుక్షేత్రం, శ్రీనాథపోతన, స్వాతం త్ర్యోద్యమ స్మృతులు, స్వరాజ్య సౌధం" ఇదా స్వరాజ్యం, నిలువీత, విజయాంధ్ర) "అనే ఖండకావ్యాలు, 'కలియుగ భారతం,భగవాన్ నారద, కుంభరాణా, తారాశశాంకం' మొదలైన 10 పద్య రచనలు చేశారు.

**దాసు (వేమూరి) శారదాంబ :** శ్రీమతి 'శారదాంబ' 1881లో కృష్ణాజిల్లా "అల్లూరు"లో జన్మించారు. ఈయమ అపర శారదాదేవి వలె గీర్వాణాంధ్ర భాషలలో సంగీత సాహిత్యాలలో, వీణావాదనలో కడు సమర్థురాలు. 'నాగ్నజితీ పరిణయం,మాధవ శతకం" రచించారు. ఇందులో ఆనాటి దురాచారాలను వివరించారు. 18 ఏళ్ళ వయస్సుకే మరణించారు.

**దాసు శ్రీరామకవి :** ప్రసిద్ధ కవి, పండితులు, ప్లీడరు, శ్రీరామ కవి 1846 గుడివాడ తాలూకా, "కూరాడ" గ్రామంలో జన్మించారు. 'అనల్ప జల్పితా కల్పవల్లి' పత్రిక నడుపుతూ విధవావివాహం, నౌకాయానం, మొదలైన విషయాల గూర్చి వివరణ లిచ్చారు. ఆచారని రుక్తి, దురా చార పిశాచ భంజని అనే ధర్మశాస్త్ర సంబంధగ్రంథాలు రాశారు. 'వైశ్యధర్మ దీపిక, పతిత సంసర్గ ప్రాయశ్చిత్త విషయకోప న్యాసం" రాశారు. ఇంకా "భృంగరాజ మహిమ, దేవీభాగవతం,

శాకుంతలం, మాళవికాగ్నిమిత్రం, ఉత్తరరామచరితం, మహావీర చరిత్ర, మాలతీ మాధవం, ముద్రారాక్షసం, రత్నావళీ, జానకీ పరిణయం" తెలుగు లోనికి అనువదించారు. స్వతంత్ర నాటకాలు మంజరీ మధుకరీయము, మనో లక్ష్మీవిలాస నాటకం,కురంగ గౌరీశంకర నాటిక" మొత్తం 32 గ్రంథాలు రచించారు.

**దిగవల్లి వెంకట శివరావు :** చరిత్ర పరిశోధకులు, రచయిత, న్యాయవాది, స్వాతంత్ర్య సమరయోధుడు అయిన, శ్రీ దిగవల్లి వేంకటశివరావు 14-02-1898 న కాకినాడలో జన్మించారు.

**శివరావుగారి రచనలు :** బ్రిటీష్ రూల్ ఇన్ ఇండియా, ఆంగ్ల రాజ్యాంగము, కథలు, గాథలు.

**ముద్రిత గ్రంథములు :** పోతన వేమనల యుగము, హిందూ ధర్మ సంగ్రహము, హిందువుల ఋణములు - అన్యాక్రాంతములు, దక్షిణాఫ్రికా, నీలాపనింద, భారత దేశమున బ్రిటీష్ రాజ్యతంత్రము, సత్యాగ్రహచరిత్ర, నిర్భాగ్య భారతము,దరిద్రనారాయణీయము, బార్డోలీ సత్యాగ్రహ విజయము, బ్రిటీష్ వస్తు బహిష్కరణము, విదేశీ వస్త్ర బహిష్కరణము,సత్యాగ్రహ బోధిని, ఆంధ్రపౌరుషము, పాంచజన్యము, అధినివేశ స్వరాజ్యము, భారతదేశ స్థితిగతులు, సహకార వస్తునిలోద్య మము, వ్యవహార కోశము; నవీన ఆర్థికనీతి, నూతన ఇండియా రాజ్యాంగము,నవీన రష్యా ఆర్థికనీతి, రాష్ట్రీయపరిపాలనము, భారత దేశమున బ్రిటీష్ రాజ్య తంత్రయుగము అంకుల్‌టామ్ కథ, ఆంగ్ల రాజ్యాంగము, ఫెడరేషన్ నిజస్వరూపము (డా.భోగరాజు పట్టాభి సీతారామయ్య గారితో కలిసి వ్రాసినది) ఏనుగుల వీరస్వామయ్య గారి కాశీ యాత్ర చరిత్ర, సన్యాసుల స్వాతంత్ర్య సమరములు, మన ఆంధ్రత్వము, ప్రజా ప్రభుత్వము, మనపోలీసు వ్యవస్థ, విస్మృతాంధ్రము, విశాలాంధ్రము, వీరేశలింగము, వెలుగు నీడలు.

**దీపాల పిచ్చయ్యశాస్త్రి :** వీరు గుంటూరు జిల్లా 'బొమ్మరాజు పల్లి"గ్రామంలో 1894లో జన్మించారు.వీరు సారస్వత సంపుటి, శబ్ద పల్లవ ధాతుకోశం, శ్రీసత్య సాయి వచనామృతం అనే గ్రంథాలు రచించారు.

**దీవి గోపాలాచార్యులు :** ఇరవయ్యో శతాబ్దపు తొలిరోజుల్లో ఆయుర్వేద వైద్య విధానానికి పట్టుగొమ్మ "భిషఙ్మణి" అయిన శ్రీదివి గోపాలాచార్యులు గారు కృష్ణాజిల్లా దివితాలూకా 'బావదేవరపల్లి' స్వగ్రామం. బందరులో 1872 అక్టోబరు 10న జన్మించారు. 'ఆయుర్వే దాంగ శల్య తంత్రం' అనే గ్రంథం రచించారు. వివిధ భారతీయ భాషల్లోని ముఖ్యమైన వైద్యశాస్త్ర గ్రంథాలను సేకరించి 22 గ్రంథాలను తెనిగించారు. వాటిలో 'మాధవ నిధానం, అర్క ప్రకాశిక, ఆయుర్వేద వైద్య పరిభాష, రస ప్రదీపిక, భేష కల్పము" అనే ప్రాచీన హిందు వైద్యగ్రంథాలకు, చరక, శుశ్రుతాదుల సంస్కృత గ్రంథాలకు, తెలుగులో చక్కని వ్యాఖ్యానాలు జోడించి, వివరించారు. పాశ్చాత్య పద్ధతిలో ఆయుర్వేద ఔషధాలపై పరిశోధన చేసి వాటిలోని పాళ్ళను సిద్ధాంతీక రించారు. 1919లో శ్రీ ధన్వంతరి పక్షపత్రికను స్థాపించారు.

**దుగ్గిరాల గోపాలకృష్ణయ్య :** స్వాతంత్ర్య పోరాటంలో పేరెన్నికగన్న 'రామదండు' నాయకుడు ఆంధ్రరత్న - గోపాలకృష్ణయ్య గారు, కృష్ణాజిల్లా, నందిగామ తాలూకా పెనుగంచిప్రోలులో 1889లో జన్మించారు. నందికేశ్వరుడు రచించిన అభినయ దర్పణం అనే గ్రంథాన్ని "The Mirror of Gesture" అన్న పేరుతో సంస్కృతం నుండి ఆంగ్లంలోకి అనువదించాడు.

**దుగ్గిరాల రాఘవ చంద్రయ్య సచ్ఛాస్త్రి :** మంచివక్త, గొప్ప విమర్శకులు, నాటక రచయిత, దేశ, భాషా సేవకులు, దుగ్గిరాల రాఘవచంద్రయ్య సచ్ఛాస్త్రి అని ప్రసిద్ధి చెందిన శ్రీ రాఘవ చంద్రయ్య చౌదరిగారు 1893సం॥లో కృష్ణాజిల్లా 'అంగలూరు' లో చౌదరులైన పండితవంశంలోజన్మించారు. విద్యార్థి దశలో'విజయనగర సామ్రాజ్యం' అనే చారిత్రక వ్యాసమును వ్రాశారు. 'చిత్తరంజన్‌దాస్ జీవితము, గాంధీజీ శతకము' మున్నగు దేశభక్తి ప్రేరకాలైన కొన్ని గ్రంథాలు రచించారు. 'నెహ్రూ పట్టాభిషేకము'అను నాటకము రచించి 'ఉత్తర భారతము' అని నామకరణం చేశారు. వెంకటేశ్వర శతకము సంస్కృతములో రచించారు.

**ధూపాటి వెంకట రమణాచార్యులు (శేషాద్రి రమణ కవులు) :** గుంటూరు మండలం (ఓడరేవు) కొమ్మాలపాడు గ్రామంలో, 1893లో జన్మించారు. వీరు "ప్రణయిని, ఋతుసంహారం, ప్రద్యుమ్న విజయం, భావపురి మాహాత్మ్యం, అళువందారుస్తోత్రం, కృష్ణవింశతి, శేషాద్రి రమణ కవులవివాహ చరిత్ర,గుణవతీ విలాసం, స్వర్ణమేఖల, మందార మంజరి,అర్జునపరాభవ నాటకం రచించారు. "పాపారాయ నిర్యాణం, వసుంధర, పోతరాజు- వేమన,ఉదయలక్ష్మి, నిజాం రాష్ట్ర ప్రశంస, అన్నయ మంత్రి, రెడ్డికుల నిర్ణయ చంద్రిక, నీతి గీతములు, స్త్రీబోధ శతకం,భక్తవత్సల శతకం, సూర్యశతకం, ఆంధ్రవీరులు, ఆంధ్ర మంత్రులు, భక్తమంజరి, వ్యాకరణ సర్వస్వం, కుశలవులు, పురాణకథా మంజరి, నీతికథలు, కొండపల్లి ముట్టడి, రామాయణ కథలు" ప్రచురించారు. విచిత్రవివాహం, చంద్రవంక, సుశీల అనే నాటకాలు, సమర్థరామదాస స్వామి చరిత్ర (పద్యకృతి) ఉత్తరుడు నాటకం రాశారు. 60-80 కృతులు, వందలసంఖ్యలో వ్యాసాలూ రచించారు.

**ధూపాటి శేషాచార్యులు (శేషాద్రి రమణకవులు) :** గుంటూరు మండలం (ఓడరేవు) కొమ్మాలపాడు గ్రామంలో 1890లో జన్మించారు.

**చారిత్రక కృతులు :** ఆంధ్రమంత్రులు, ఆంధ్రవీరులు (రెండు భాగాలు 1929, 1931), రెడ్డికుల నిర్ణయచంద్రిక : **చారిత్రక**

**నవలలు** : కొండపల్లి ముట్టడి, వసుంధర, **నాటకాలు** : పాపారాయ నిర్యాణము అను బొబ్బిలి సంగ్రామము (1927), అర్జున పరాభవం, చంద్రహాస చరిత్ర (1928), మందారమంజరి; పద్యకృతులు : మానస బోధామృతము, సూర్యశతకము, నీతిగీతములు, ఋతుసంహారము, విక్రమోర్వశీయము, నిజాం రాష్ట్ర ప్రశంస, సమర్థ రామదాస స్వామి, శతకాలు : సూర్యశతకము, సర్వలోకేశ్వర శతకము, భక్తవత్సల శతకము, రామదాస స్వామి శతకము.

**దోమా వెంకటస్వామి గుప్త :** హరికథా రచయిత, కవి, నాటకకర్త, విమర్శకుడు, శతకకర్త, నవలారచయిత, శ్రీ గుప్తగారు 1899 సం॥లో 'కర్నూలు'లో జన్మించారు.

**రచనలు :** శ్రీ బ్రహ్మవైవర్త మహాపురాణము, శ్రీ పరకాల విలాసము, ప్రేమాభిరామము, శ్రీకన్యకా పురాణము, అవధాన కవితామంజరి, శ్రీగోమాతృ గౌరవము, శ్రీ చంద్రకళా సుదర్శనము, దూతాంగదము, శ్రీకృష్ణదేవరాయల చరిత్రము, (విమర్శ) ఝంఝా మారుతము (విమర్శ), విమలానందము (నవల) చంద్రిక (నవల), త్రిపురదాసు చరిత్ర (హరికథ), శ్రీలక్ష్మీనృసింహద్వరీయం (శతకము), శ్రీవీర రాఘవ శతకము, శ్రీ కామేశ్వరి శతకము, శ్రీ గంగాలహరి (అనువాదం), ముకుందమాల (అనువాదం), మూకపంచ శతి (అనువాదం), రోహిదాసు, శ్రీబ్రహ్మేశ్వర పురాణము, గౌతమీ క్షేత్ర మహాత్మ్యము,సుజనత్రయము, ఆత్మబోధ, సంసారిపాట్లు, యాజ్ఞవల్క్య చరిత్ర, సిరియాళు చరిత్ర, దిలీపుని చరిత్రము, శ్రీసాయి స్తవమంజరి, ఆదవాని యవధానము, శ్రీసాయి గురుచరిత్రము, దీన కల్పద్రుమము, మహాత్మాగాంధీ శతకము, తిలక్ శతకము.

**నండూరి వెంకటసుబ్బారావు :** శ్రీ నండూరి వెంకట సుబ్బారావు గారు 1896 సం॥లో పశ్చిమగోదావరి జిల్లా 'వసంతవాడ' లో జన్మించారు. వీరి ప్రసిద్ధగేయాలు 'ఎంకిపాటలు' హాస్యరచనలో ప్రఖ్యాతి గాంచారు. అనేక రేడియో నాటకాలు రాశారు.

**నందగిరి వెంకట అప్పారావు పంతులు :** శ్రీ అప్పారావు పంతులు కృష్ణాజిల్లా 'అంగలూరు'లో 19-8-1968 న జన్మించారు. వీరు 'ఆంధ్రమేఘ సందేశము, శ్రీమద్రామాయణాద్భుతోత్తరకాండము, నిర్గద్య చతురముఖీ విలాసము, మైరావణ చరిత్ర, శుద్ధాంధ్ర భీమసేన విజయము, గంగిరెద్దు,బాలతొడవు, సీతారామశతకము, గోపికాప్రియ శతకము, చండమార్తాండశతకము, దీన సంరక్షణ శతకము, రామలిం గేశ్వరశతకము, శ్రుతశైల శతకము, హనుమత్ శతకము, విప్రపురి ఆదికేశవ సీస శతకము, బ్రహ్మపుత్రాభ్యుదయము మొదలైనవి రచించారు.

**నాదెళ్ళ పురుషోత్తమ (శాస్త్రి) కవి :** హిందీ నాటకకర్త, బహు భాషావేత్త, వేద పండితులు, శతాధిక గ్రంథకర్త, బుధవిధేయుని పత్రికా సంపాదకులు అయిన శ్రీ పురుషోత్తమ కవిగారు 1863 ఏప్రిల్‌లో దివి తాలూకా 'సీతారామపురం అగ్రహారం'లో జన్మించారు. 16వ ఏటనే 1879లో 'అహల్యాసంక్రందనం అనే యక్షగానం, సీతా రామ శతకం, దుర్మతి చరిత్ర' అనే కావ్యాలు; ధర్వాడ సమాజం వారు అడుగగా, 'కళాసురవధము' అనే హిందీనాటకం రాసిచ్చారు. తర్వాత పంచాక్షరి మహిమ అనే మరో హిందీ నాటకం రాశారు. ధార్వాడ వారికి వారానికొకటి చొప్పున హిందీ నాటకాలను రచించి ఇచ్చేవారు. ఇంకా 'అద్భుతోత్తర రామాయణం, గురుభక్తి ప్రభావం, కృష్ణానదీ మహాత్మ్యం, ఆంధ్రీకృతాష్టావక్రగీత, సోమేశ్వరీయం, మహేంద్ర పురాణం' మొదలైన 15 ఆంధ్రప్రబంధాలు; 10 తెలుగు నాటకాలు; 32 హిందీ నాటకాలు; 10 శతకాలు; 5 స్తోత్రాలు, 11 అభివర్ణనాలు; 10 కీర్తన గ్రంథాలు; 5 నిఘంటువులు; 6 శాస్త్ర గ్రంథాలు; 9 వచన గ్రంథాలు; ఇంకా విద్యార్థీ, బాలికానుకూల గ్రంథాలు9 రచించారు. తెలుగులో హరిశ్చంద్ర, పారిజాతాప హరణం, సారంగధర, ద్రౌపదీవస్త్రాపహరణం, చంద్రహాస, స్త్రీల మీటింగు నాటి హరికథ ప్రహసనం, హిందీ- కళాసురవధ, పంచాక్షరీ మహిమ, సుభద్రాపరిణయము, శంబూక వధ, శారదోపాఖ్యానం, రావణాసుర సంహారం, చిత్ర కందపద్య రత్నాకరము వంటి రచనలు చేశారు.

**నాదెళ్ళ మేథా దక్షిణమూర్తి (శాస్త్రి) :** సంస్కృతాంధ్ర భాషలలో అద్భుత కవిత్వం చెప్పగల ధీశాలి అయిన శ్రీ మేథా దక్షిణమూర్తిగారు కృష్ణాజిల్లా, 'బందరు'లో 1885లో జన్మించారు. దక్షిణామూర్తిగారు సంస్కృతంలో 'ఆత్రేయ స్తోత్రార్థః, అష్టకమాలా, నానాదేవతా స్తోత్రాశ్లోకాః' రచించారు.వీరి తండ్రిగారి రచనలలోని విశేష విషయాలు గుర్చి "ఉత్తమ యోగి వృత్తము" అనే కూర్పు రచించారు. ఇంకా తెలుగులో "హనుమద్రామాయణం, ఉత్తమ జీవయాత్ర, ఉత్తమ నీతి భాస్కరము, పితృచరిత్రము, పరమహంస ప్రబోధము, ముక్తికాంతా మణి శతకము, శ్రీ గురుదత్త సరస్వతీయము, శ్రీమద్దత్త పురాణము, శ్రీదత్త భావ సుధారసము, శ్రీకృష్ణ సందేశము, ఉత్తమయోగి వృత్తము, ఆంధ్రకవి ప్రశంస, హోలిక ప్రశంస, యశోవిహారము, సీతారామ సుప్రభాతము, సీతారామతారావళి, దశమగ్రహ తారావళి, వేదాంత డిండిమము, శ్రీ వేమ యోగీయము, అవధాన నిధానము" రచించారు.

**నాదెళ్ళ వెంకట నృసింహకవి :** కృష్ణాజిల్లా మేడూరు సమీప గ్రామమైన 'మధునాపురం'లో 1835లో జన్మించాడు. ఇతనికి బంధ, చిత్ర కవిత్వాలపై మిక్కిలి మక్కువ ఉండేది. అయినా ప్రబంధ, గేయ కవిత్వం కూడా రచించారు. "చిత్ర చరిత్రము" అనే హాస్యరస ప్రధాన గ్రంథం రచించారు.

**నిరాఘాటం యామినీ పూర్ణ తిలకం :** గుంటూరు జిల్లా "పీసపాడు" గ్రామంలో 1887 లో జన్మించారు. వీరు మద్రాసు

చేరి, హిందూయువతి పక్ష పత్రికను 'విశ్వజనని' మాసపత్రికను స్థాపించారు. వేంకటేశ్వర శతకమ్ రచించారు.

**నోరి గురులింగ శాస్త్రి :** గుంటూరు జిల్లా 'రేపల్లె'లో 1858లో జన్మించారు. ఇతిహాస తరంగణి పేరుతో 'అష్టాదశ పురాణాలు, కర్మవిపాకం, వాస్తు రత్నావళి, కృష్ణా వాస్తుశాస్త్రం, జాతకసార సంగ్రాహం, నీతిసారం, జైమిని సూత్రాలు, వైద్యశాస్త్ర శతశ్లోకి, భోజచరిత్ర మున్నగునవి రచించారు.

**నోరినరసింహశాస్త్రి :** ప్రముఖ తెలుగు కవి, తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు, కన్నడ భాషలలో అభినివేశం గల నృసింహశాస్త్రి గారు గుంటూరులో 1900లో జన్మించారు.

**రచనలు** : 'దేవి భాగవతం (3 వాల్యూములు), భావనాటికలు, రుద్రమదేవి, కర్పూర ద్వీపయాత్ర (పిల్లల నవల), శబ్దవేది (చిన్నఆట), సాహిత్యవ్యాసాలు, గీతమాలిక, భాగవతావరణము (పద్యనాటిక), సోమనాథ విజయము, భాగవతావరణము, సర్పసత్రం, కన్యాకుమారి, వరాగమనము, ఆత్మమృతి, తేనెతుట్టె, పతంగయాత్ర, స్వయంవరం, షణ్ణవతి (ఇత్యాది శ్రవ్యనాటికలు), నారాయణభట్టు, రుద్రమదేవి, మల్లారెడ్డి, ధూర్జటి, వాఘీర కవి సార్వభౌముడు, కవిద్వయం(నవలలు); వధూసర, మరు విషయం, పరీక్షా ఫలితం, గానభంగం" మొదలైన కథలు రచించారు.

**పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి :** శ్రీఆదినారాయణ శాస్త్రిగారు కృష్ణాజిల్లా 'బందరు'లో 1900లో జన్మించారు. 'వాత్సాయన కామసూత్రాల సవ్యాఖ్యానం, 'గౌతమధర్మసూత్రాలు, సర్వమంగళ వ్యాఖ్య, ధృతరాష్ట్రుని పశ్చాత్తాపం, జైనుల మతకథలు, శ్రీ వేమనయోగి జీవితము, ఆంధ్రకావ్యమీమాంస, కౌటిల్యుని అర్థశాస్త్రానికి తెలుగు వ్యాఖ్యను, ఆంధ్రలిపి పరిణామం అను గ్రంథాన్ని రచించారు.

**పర్యం వాసుదేవ పరబ్రహ్మశాస్త్రి :** శ్రీ వాసుదేవ పరబ్రహ్మ శాస్త్రిగారు 1824లో జన్మించారు. ఇతడు 1851లో "వ్యవహార దర్పణము" రచించాడు.

**పరకాల స్వామి – కృష్ణబ్రహ్మ తంత్ర :** పూర్వాశ్రమలో హోసదుర్గం కృష్ణమాచార్యులు అనే గల వీరు కర్నూలు జిల్లా 'పీపలి' గ్రామంలో జన్మించారు. వనపర్తి, గద్వాల, ఆత్మకూరు సంస్థానాల్లో సన్మానింపబడ్డారు. వీరు 'రామేశ్వర విజయ చంపువు (ప్రబంధం) ఆత్మకూరు ఆస్థానంలో 'శ్రీనివాస విలాస చంపువు' చెప్పారు. హమ్స సందేశ వ్యాఖ్య, అలంకార మణిహారం, కార్తికోత్సవ దీపిక, లక్ష్మీ సహస్రానికి వ్యాఖ్యానం, నృసింహ విలాసచంపువు, పరకాల గురు విజయమ్, నృసింహ విలాసం, శ్రీలక్ష్మీ సహస్రం, విశ్రాంత రాఘవం, ఉన్మత్త పాండవం, శ్రీమద్రామాయణ వైభవం రచించారు.

**పల్నాటి సోదరకవులు :** (కన్నెగంటి ప్రభులింగాచార్యులు 1900–1946; కన్నెగంటి చినలింగాచార్యులు 1903–1968; కన్నె గంటి వీరభద్రాచార్యులు 1919–1974) : గుంటూరు జిల్లా పల్నాడు లోని "తక్కెళ్ళపాడు" గ్రామంలో ఈ ముగ్గురు అన్నదమ్ములు జన్మించారు. వీరు సంస్కృతాంధ్రాలలో గొప్ప పాండిత్యం సంపాదిం చారు. అర్థశతాబ్ది కాలం అసంఖ్యాకంగా అష్టావధానాలు, శతావ ధానాలు నిర్వహించారు.అఖండ ఖ్యాతి నార్జించారు.

**పాటిబండ్ల వెంకట్రామయ్య చౌదరి :** శ్రీ వెంకట్రామయ్య గారు 1893 వ సంllలో కృష్ణాజిల్లా 'వీరులపాడు'లో జన్మించారు. 'దీనరక్షా నిధీ' అనే శతకాన్ని, రాజావాసిరెడ్డి వెంకటాద్రినాయుడు అనే నవలను రచించారు. 'బ్రహ్మవైవర్తపురాణాన్ని' కొంతవరకు తెనిగించారు.

**పావులూరి శంకరనారాయణ శ్రేష్ఠి :** పావులూరి మల్లన వంశీకుడైన ఈయన 'నూజివీడు'లో జన్మించారు. ఎస్.రామానుజ చెట్టి ప్రోత్సాహంతో ఇంగ్లీష్ –తెలుగు నిఘంటువును తయారుచేశారు. తరువాత 'తెలుగు– ఇంగ్లీష్; ఇంగ్లీష్ – తమిళ;" నిఘంటువులను తయారుచేశారు.

**పాపట్ల కాంతయ్య :** పాపట్ల కాంతయ్య నాటక కవి, హిందుస్తానీ సంగీతవిద్వాంసుడు, వాగ్గేయకారుడు "స్వరసింహ" బిరుదాంకితుడైన కాంతయ్య కృష్ణాజిల్లా "జగ్గయ్యపేట"లో 1880లో జన్మించారు."ద్రౌపదీ మానసంరక్షణం(1936)" వంటి కొన్ని తొలినాటి సినిమాలకు పాటల సృష్టికల్పన కూడా చేశారు. "చింతామణి" నాటక సమాజాలకుకాంతయ్య పాటలు రాశారు. అనంతరం మైలవరం కంపెనీలో వాగ్గేయకారుడిగా చేరి "ప్రహ్లాద, శాకుంతల, సావిత్రి" మొదలయిన నాటకాలను పాటలు రాసి చాలా పేరు తెచ్చుకున్నారు. ప్రార్థనాగీతం, "పరబ్రహ్మ పరమేశ్వర" ఈయన స్వరపరచినదే.

**పింగళి లక్ష్మీకాంతం :** శతావధాని, మహానటులు, పరిశోధక పండితులు, ఆకాశవాణి ప్రయోక్త, బహుగ్రంథ రచయిత, శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు 1894లో కృష్ణాజిల్లా, (స్వగ్రామం చల్లపల్లి తాలూక, చిట్టూర్పు) బందరు తాలూక 'అర్తమూరు' గ్రామంలో జన్మించారు.

**రచనలు :** ఆంధ్రసాహిత్యచరిత్ర, సాహిత్య శిల్ప సమీక్ష, మధుర పండితరాజము, సంస్కృత కుమార వ్యాకరణము, గంగాలహరి, తేజోలహరి, ఆత్మాలహరి, గౌతమ వ్యాసాలు, గౌతమ నిఘంటువు (ఇంగ్లీష్–తెలుగు) నా రేడియో ప్రసంగాలు,మానవులందరు సోదరులు (మహాత్మాగాంధీప్రవచనాలకు అనువాదం) తొలకరి, సౌందరనందము (1932) పింగళి కాటూరి కవుల జంటకృతి, ఆంగ్లేయ దేశ చరిత్రము (1931) "పల్నాటి వీర చరిత్ర" ను పరిష్కరించాడు.

**పింగళివెంకయ్య :** భారతజాతి యావత్తు గౌరవ వందనాలు

చేసి, జాతీయ పతాకాన్ని నిర్మించిన, ప్రపంచంలో భారత కీర్తి పతాకను రెపరెపలాడించిన బహుముఖ ప్రజ్ఞాశాలి దేశభక్తుడు అయిన శ్రీ పింగళి వెంకయ్య గారు 1878లో కృష్ణాజిల్లా 'భట్ల పెనుమర్రు' గ్రామంలో జన్మించారు. వ్యవసాయశాస్త్రం అనే గ్రంథం వ్రాశారు. 'బంధరు ఓడరేవు' సన్‌యత్‌సేన్ జీవిత చరిత్రను రచించి, ప్రచురించారు. 1916లో తన అనుభవాల్ని A National Flag for India అనే గ్రంథంలో రాశారు. "వజ్రపు తల్లిరాయి" అని కనుగొన్నారు. 1916లో లక్నోలో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ మహాసభలలో, పింగళి రూపొందించిన, రాట్నంతో ఉన్న "జాతీయ జెండా"ను ఎగురవేశారు. తర్వాత గాంధీజీ కోరిక మేరకు కొద్దిపాటి మార్పులతో విజయవాడ సభలో సమర్పించారు. మూడురంగులతో, అశోకచక్రంతో, ముచ్చటగా ఉండి భక్తి, శ్రద్ధలతో ప్రజల మన్ననలను పొంది, ఎంతో ప్రాచుర్యం పొందింది. కేసరి రంగు– త్యాగ, ధైర్య, సాహసాలకు; తెలుపు –ధర్మ, శాంతి, సత్యాలకు; ఆకుపచ్చ– విశ్వాస, శౌర్యాలకు, పాడిపంట సౌభాగ్యానికి ప్రతీకలుగా నిలిచాయి. నాటినుండి పింగళి వెంకయ్య – జెండా వెంకయ్య అయ్యారు.

**పురాణం సూరిశాస్త్రి :** ప్రఖ్యాత న్యాయవాది, నటులు, కవి, రచయిత అయిన శ్రీ సూరి శాస్త్రిగారు కృష్ణాజిల్లా బందరు తాలూకలోని 'తరకటూరు'గ్రామంలో 1890లో జన్మించారు. వీరు "నాట్యాంబుజం, నాట్యకోశం, నాట్యోత్పలం, విమర్శక పారిజాతం, ఆంధ్రనాటక సంస్కరణలు" అనే గ్రంథాలు రాశారు. కృష్ణా పత్రికలో నాటక సంబంధ వ్యాసాలనేకం రాశారు.

**పోకూరి కాశీపత్యవధాని :** పల్నాటిసీమలోని, మాచర్ల వద్దగల 'బొదిలివీడు'లో 1892లో జన్మించారు. అష్టావధానాలు, శతావ ధానాలుఅవలీలగాచేసేవారు. 'సారంగధరీయము (త్ర్యర్థికావ్యం, సారంగధ– తారాచంద్ర– శివపార్వతుల చరితాసమన్వయంతో) నిరోష్ఠ్య, నిర్గద్య శుద్ధాంధ్ర హరిశ్చంద్ర కథ, శౌరి శైశవ లీల, సిద్ధయోగి చరిత్ర, బ్రహ్మంగారి చరిత్ర, సత్రశాల మల్లేశ్వరశతకం, శ్రీశైల మల్లేశ్వర శతకం" మొదలైన 60 కృతులు రచించారు.

**ప్రతాప వెంకటేశ్వర్లు :** శ్రీ వెంకటేశ్వర్లు గుంటూరుజిల్లా బాపట్ల తాలూకాలోని 'మన్నవ' గ్రామంలో, 1892లో జన్మించారు. తెనాలి సంస్కృత శ్రీరావూరి శ్రీరామకవితో కలిసి అనేకానేక అవధానాలు చేశారు. రామేశ్వర కవులు హనుమన్నక్షత్రమాల, వేణుగోపాల తారావళి, సారంగధర" మొదలయినవి జంటగా రచించారు.

**ప్రతివాది భయంకర కృష్ణమాచార్యులు :** కృష్ణమాచార్యుల వారు 1887 సం॥లో కృష్ణాజిల్లా 'విజయరాయి' గ్రామంలో జన్మించారు. వీరు ఆంధ్రగీర్వాణాలలో మంచి కవిత్వం చెప్పగలరు. "సంస్కృత శబ్ద ప్రవేశం" సంస్కృత శబ్ద సుబోధకము , సావిత్రీ విజయము (నాటిక) వీరిరచనలు.

**బలిజేపల్లి లక్ష్మీకాంతకవి :** వీరు గుంటూరుజిల్లా బాపట్ల తాలూక 'ఇటికంపాడు' గ్రామంలో 1881లో జన్మించారు. "సత్యహరి శ్చంద్రీయ నాటకం, ఉత్తర రాఘవనాటకం, శివానందలహరి శతకం, స్వరాజ్య సమస్య, బ్రహ్మరథం, మణిమంజూష (నవలలు) బుద్ధిమతీ విలాసం, సుందరకాండ రచించారు.

**బసవరాజు వెంకట అప్పారావు :** ఆంధ్రాకీట్స్ అని పేరు పొందిన "భావకవి, గేయకవి శ్రీ బసవరాజు అప్పారావుగారు 1894 డిసెంబరు 13న కృష్ణాజిల్లా "నూజివీడు" లో జన్మించారు. ప్రాచ్య పాశ్చాత్య అలంకారికుల సిద్ధాంతాల సమీక్షతో ఆంధ్ర కవిత్వ చరిత్ర రాశారు. 'వాయుసందేశం' అనే కావ్యం, ఆంధ్రరత్న ద్యుతులు' ఆంధ్రరత్న దుగ్గిరాల జీవితచరిత్ర "అరేబియన్ నైట్స్ కథల అనువాదం, మరెన్నో సాహితీ వ్యాసాలు, కవితలు రచించారు. వీరి గీతికలలో శ్రీశైలయాత్ర...తాజ్‌మహల్, కుతుబ్‌మీనార్లు చెప్పుకోదగినవి. వీరి ***"గుత్తి వంకాయకూరోయి బావా / కోరివండినానోయ్ బావా..."*** రుచిచూడని తెలుగు వాడుండడు. "*కొల్లాయి గట్టితేనేమి మాగాంధి కోమటై పుట్టితే నేమి*" అనే గీతం బహుళ ప్రాచుర్యం పొందింది.

**బుక్కపట్టణం రాఘవాచార్యులు :** శ్రీ రాఘవాచార్యులు 1840 సం॥లో కృష్ణాజిల్లా పామర్రు మండలం, "ఉరుటూరు" గ్రామంలో జన్మించాడు. కొంతకాలం 'నూజివీడు' లో నివసించారు. వీరి తండ్రి శ్రీనివాస తాతాచార్యులు. "ఆంధ్రుల చరిత్ర" అనే గ్రంథాన్ని రచించారు. తెలుగులో చరిత్ర రచనకు శ్రీకారం చుట్టింది వీరే. నాటి ప్రదర్శనలను, దుయ్యబడుతూ సంగీత ఇంద్రసభ, నాటక దీపిక" అనే ప్రహసనాలను, 'కువలయాశ్వవిజయము' చొక్కామీళ, ధనమా? గుణమా? కరుణ, మూడుముళ్ళ ముచ్చట, మీరాబాయి, చిత్రరథవీధి, భలే చింతామణి మొదలైననాటకాలను వ్రాశాడు. ఇతడు సినిమా రంగంలో కూడా ప్రవేశించి 'శ్రీకృష్ణలీలలు, బాలయోగిని' సినిమాలకు మాటలు, పాటలు వ్రాశారు.

**బూర్గుల రామకృష్ణారావు :** మహబూబ్‌నగర్‌జిల్లా 'పడకల్లు' గ్రామంలో 1899లో జన్మించారు. 'ఉమర్‌ఖయ్యాం రుబాయీలు, పండిత రాయల లహరులు 5 తెలుగు పద్యగ్రంథాలుగా అనువదించారు. 'సారస్వత వ్యాసముక్తావళి' కూడా రచించారు.

**బెల్లంకొండ రామరాయ కవి :** గుంటూరుజిల్లా నరసరావుపేట పరిసరగ్రామమైన 'పమిడిపాడు' లో 1875లో జన్మించారు. 16 ఏళ్ళ వయసులో 'రుక్మిణీపరిణయం,రమా పరిణయం' రాశారు. తర్వాత సిద్ధాంత కౌముదికి శరద్రాత్రి వ్యాఖ్య, గీతాభాష్యార్క

ప్రకాశిక, వేదాంత ముక్తావళి, శంకరాశంకర భాష్య విమర్శ, సిద్ధాంత సింధువు,వేదాంత కౌస్తుభము,సముద్రమధన చంపువు; మొదలైన మొత్తం 143 గ్రంథాలు స్తోత్రాలు, శతకాలు,68 అష్టక స్తోత్రాలు రచించారు.

**బోడేపూడి వెంకటరావు :** గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా "జిల్లేపల్లి; గ్రామంలో 1900లో జన్మించారు. వీరు 'ఆంధ్రతేజము (ఖండకావ్యము), తృషావర్తము (లఘుకావ్యం), కాశీక్షేత్రము (కావ్యం), కవితా వాటిక (ఖండ కవితలు), గంగాలహరి, చారుచర్య" అనువదించారు. బోరెల్లి వీరులు, ఆదర్శవీరులు (వీరగాథలు) వరదరాజేశ్వరి (నవలిక) రచించారు.

**భమిడిపాటి అప్పయ్యశాస్త్రి :** ఉభయభాషాప్రవీణ, అష్టావధాని, శతావధాని సంస్కృతాంధ్రాలలో అఖండ పండితులైన అప్పయ్యశాస్త్రిగారు ప.గో.జిల్లా భీమవరం తాలూక "పర్ణపురం" (ఆకివీడు) లో 1888 జన్మించారు. కృష్ణాజిల్లా గుడివాడ తాలూక "సిద్ధాంతాగ్రహారం"లో నివాసమున్నారు. వీరి సంస్కృత రచనలు : "రామతారక తారావళి, హనుమద్విజయము"; కాగా ఆంధ్రరచనలు: "రామశతకము, నాగేశ్వరశతకము, మీరాబాయి చరిత్రము (హరికథ), అనిరుద్ధ వివాహము (నాటిక),ఆంధ్రరఘువంశము(కావ్యం), అన్నదాన మహిమ (వచనరచన),భారతము, హరికథా వాచకము, కీర్తన శతకము, వేదాద్రి లక్ష్మీనరసింహగర్భవృత్త సామరస్యం" మొదలైనవి.

**భాగవతులు రామయ్య :** వీరు కృష్ణాజిల్లా 'కూచిపూడి' లో 1850లో జన్మించారు. యక్షగానాలు రచించారు. 'ఆత్మయజ్ఞము' అనే గొల్లభామా కలాపాన్ని రచించిన ఆధ్యాత్మిక యోగి.

**భావరాజు వెంకటకృష్ణారావు :** చారిత్రక పరిశోధకులు, కథకులు, అయిన శ్రీ భావరాజు వెంకట కృష్ణారావు గారు 1895లో కృష్ణాజిల్లా 'కైకలూరు' లోజన్మించారు. శ్రీకృష్ణారావు పలుచరిత్ర గ్రంథాలు, నాటకాలు రచించారు.వారి రచనలలో ప్రాచీనాంధ్ర నౌకాజీవనము,రాజరాజనరేంద్రుడు, ఆంధ్రదేశము, విదేశయాత్రికులు, ఎర్లీడైనస్టీస్ ఆఫ్ ఆంధ్రా కంట్రీ(ఎ.డి. 200-625),అప్పాజీ (నాటకం), శ్రీనాథుని యింట విందు (నాటకం), హిస్టరీ ఆఫ్ ది ఈస్టర్న్ చాళుక్యాస్ ఆఫ్ వేంగీ (ఎ.డి.610-1210), ఆంధ్రదేశము విదేశయాత్రికులు' ప్రముఖమైనవి. ఆయన నూరుకు పైగా వ్యాసాలు రాశారు. చరిత్ర, శాసనాలకుసంబంధించినవ్యాసాలను ఆంగ్ల పత్రికల్లోనూ ప్రకటించారు. భావరాజు వెంకట కృష్ణారావు గారు రచించిన "ఎర్లీ డైనాస్టీస్ ఆఫ్ ఆంధ్రా కంట్రీ, హిస్టరీ ఆఫ్ ది ఈస్టన్ చాళుక్యాస్" అనే ఆంగ్ల గ్రంథాలు, చరిత్ర రచనకు నేటికీ ఒజ్జబంతులుగా నిలిచాయి.

**భోగరాజు పట్టాభి సీతారామయ్య :** మహామేధావి, భారత స్వాతంత్ర్య సంగ్రామంలో అగ్రశ్రేణికి చెందిన జాతీయ నాయకులలో ఒకరైన 'శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్య' గారు 1880 గుండు గొలను గ్రామంలో జన్మించారు.కృష్ణాజిల్లా బందరులో వైద్యవృత్తి నిర్వహించారు.1919లో 'జన్మభూమి' అనే వారపత్రికను ప్రారంభించి, చాలా ఏళ్ళు నడిపారు. ఈయన "భారత జాతీయ కాంగ్రెస్ చరిత్ర" ను ఆంగ్లంలో రచించారు. కాంగ్రెస్ చరిత్రకు నేటికీ ఇదే ప్రమాణ గ్రంథం. ఇంకా వీరు 'Constitution of the World; The economic conquest of India or the British empire Ltd.,: Socialisom & Gandhi isom ; National education; Indian Nationalisom; Linguistic prorineces in India; History of the Indian National Congress; Hindu Home rediscovered; Feather & Ttores; I too have spuns' గాంధీయిజం, అనే పుస్తకాలు కూడా రచించారు. 'ఇండియన్ రిపబ్లిక్' అనే దినపత్రిక : తెలుగు సహకార పత్రికలను కూడా శ్రీ భోగరాజు నిర్వహించారు.

**మంగళగిరి ఆనందకవి :** మంగళగిరిలో జన్మించిన, తిమ్మయామాత్యపుత్రుడు అయిన 'మంగళగిరి ఆనందకవి' కృష్ణాజిల్లా 'బందరు పట్టణము' లో 1840లో స్థిరనివాస మేర్పరుచుకొన్నాడు. "విజయనందన విలాసము" అనే మూడాశ్వాసాల ప్రబంధాన్ని రచించి 'దాట్ల వేంకటకృష్ణ నరపాలునికీ; "వేదాంతరసాయనము" అనే నాలుగాశ్వాసాల పద్యకావ్యాన్నీ రచించి, ధరణిదాస మంత్రికి కృతి ఇచ్చాడు. ఈ రెండూ క్రైస్తవ మత ప్రచార గ్రంథాలు.

**మందుముల నరసింగరావు :** మహబూబ్‌నగర్ జిల్లా 'చేవెళ్ళ' గ్రామంలో 1896లో జన్మించారు. స్వగ్రామం 'తలకొండపల్లి' ఉర్దూ, పార్శీ భాషలు కూడా నేర్చారు. 50 సంవత్సరాల హైదరాబాదు పేరుతో స్వీయచరిత్ర రాశారు.

**మతకుపల్లి నరసింహం :** "మతుకుపల్లి నరసింహం" అనే కవి "తోట్లవల్లూరు" జమీందారు.బొమ్మదేవర నాగన్న వద్ద ఆస్థాన కవి, పరీక్షాధికారిగా ఉండేవాడు.ఈయన "అజచరిత్ర" (అనే ఇందు మతీ పరిణయం) పుండ్రనిర్ణయ చంద్రిక (పుండ్ర సూర్యోదయకాల మహా ప్రళయ దుర్దిన సహితంగా) శ్రీలక్ష్మీ నృసింహ త్రిశతి స్తోత్రం, ఆంధ్ర మేఘసందేశం, ఆంధ్ర సిద్ధాంత కౌముది, చెన్నపురీ విలాసం, భరత శాస్త్ర సర్వస్వం, సంగీతసార సంగ్రహం' అనే గ్రంథాలు రచించారు.

**మల్లంపల్లి మల్లికార్జునారాధ్యులు :** మల్లికార్జునారాధ్యుల వారు కృష్ణాజిల్లా, గుడివాడ తాలూక, 'ఎలకుఱ్ఱు' గ్రామంలో 'భ్రమరాంబా, వీర మల్లేశ్వరా రాధ్యులనే దంపతులకు జన్మించారు. సత్యవత్యు పాఖ్యానము, దురభిప్రాయ ఖండన నిరసనము, భోగేశ్వర మహాత్మ్యము వీరి రచనలు.

**మల్లాది అచ్యుతరామశాస్త్రి :** నాటక చక్రవర్తి, శ్రీ అచ్యుత రామశాస్త్రిగారు 1872లో కృష్ణాజిల్లా 'మచిలీపట్నం'లో జన్మించారు.

వీరు సంస్కృతాంధ్ర భాషలలో గొప్ప కవులు. వీరు 30 నాటకాలు రచించారు. వాటిలో ద్రౌపదీ వస్త్రాపహరణము, సతీ సక్కుబాయి, శ్రీరామ రాజ్య వియోగము, రత్నమాల, భక్తచొకామిళ, అహల్య, సంగీత సత్యామోద చంద్రోదయము, భక్త కుచేల, శ్రీకృష్ణ లీలలు, చంద్రకాంత్, రామదూత" మొదలైనవి.

**మల్లాది రామకృష్ణచయనులు :** సంస్కృత పండిత ప్రవరునిగా పేరెన్నిక గన్న వ్యాఖ్యాన సరస్వతి శ్రీ మల్లాది రామకృష్ణ చయనులు గుంటూరు జిల్లా సత్తెనపల్లిలో 1885లో జన్మించారు. 'బాలబోధిని, భ్రమమంజరి' అనే వేదాంత గ్రంథాలను సంస్కృతంలో రచించారు. 'ప్రాయశ్చిత్తం' అనే విమర్శనాగ్రంథాన్ని, మహాభారత కథా తత్త్వ నిర్ణయం' అనే గ్రంథాన్ని శ్రీ చయనులు రచించారు.

**మాడపాటి హనుమంతురావు :** బహుభాషా వేత్త, మంచికవి, రచయిత, ఆంధ్రపితామహ, ఆంధ్రపితామహుడు బహుభాషా పండితుడు, రచయిత అయిన 'పద్మభూషణ్' మాడపాటి హనుమంతరావు కృష్ణాజిల్లా, నందిగామ తాలూకాలోని 'పొక్కునూరు' గ్రామంలో 1885లో జన్మించారు. మాడపాటివారు 'హృదయశల్యం, రాణీసారందా,ముసలిదాని ఉసురు, నేనే,అగ్నిగుండం, నాడు నీ పంతం, నేడు నా పంతం, ఆత్మార్పణం, తప్పు,ఎవరికి, విధి ప్రేరణం అనే కథలు 'మల్లికాగుచ్చం'పేరుతో1911లో పుస్తకరూపం దాల్చాయి. 'తెలంగాణా ఆంధ్రోద్యమం' అనే గ్రంథం, రైతాంగ జీవితంపై తొలి కథానిక ఎవరికి? రచించారు.తెలుగు, ఉర్దు, ఇంగ్లీష్ భాషలలో దిట్ట అయిన శ్రీమాడపాటి, బంకించంద్ర చటర్జీ రచించిన 'ఆనందమఠ్'ను తెలుగు లోకి అనువదించారు. శ్రీ ప్రేంచంద్ హిందీ రచనలన్నిటినీ తెలుగు చేసిన ప్రథములు వీరే. వాటిలో 'ఇక కావలసినదేమి' ముఖ్యమైనది. 'నిజాం రాష్ట్ర ఆంధ్రులు, తెలంగాణా-ఆంధ్ర ఉద్యమాలు" అనే రెండు సంపుటాలను రచించారు. చరిత్ర పరిశోధకులకు నేటికీ ఇది ప్రామాణికమే. 'మహాభారత సమీక్షణము, గ్యారిబాల్డిచరితం, రోమన్ సామ్రాజ్య చరితము' మొదలైన అముద్రిత రచనలూ ఉన్నాయి. వీరు తెలంగాణ, నీలగిరి, దేశబంధు, సుజాత, గోలకొండ, ముషీర్ దక్కన్ మొదలైన పత్రికలకు సంపాదకీయాలు, వ్యాసాలు, కథలు రాశారు.

**మాడభూషి వెంకటాచార్య కవి :** అవధాన రచనలో ప్రప్రథమంగా అష్టావధాన, శతావధాన రచనా సంవిధానాన్ని ఆంధ్ర దేశానికి పరిచయం చేసి, విస్తృత ప్రచారం కల్పించిన ఘనాపాఠి శ్రీ మాడభూషి వెంకటాచార్యులు 1835 లో కృష్ణాజిల్లా నూజివీడులో జన్మించారు. వీరు ఏకసంథాగ్రాహి మాత్రమే గాదు, తాను ఒకసారి విన్న పద్యాన్ని వెంటనే విలోమంగా చెప్పగలరట. అంటే వీరిది ఋషిమేథ, వీరు అష్టభాషా వ్యస్తాక్షరి కూడా నిర్వహించారు. రచించిన గ్రంథములు : 'భరతాభ్యుదయము (ప్రబంధము), వామననాటకము, పుష్పబాణవిలాసము (ఆంధ్రీకృతి), హంససందేశము, మదనమోహన చరిత్ర (వచనము), బృహద్వైద్యరత్నాకరము (వైద్యగ్రంథం), రామావధూటీ నక్షత్రమాల (27 శృంగార రసమయ సీస పద్యాలు) ఆనందగజపతీంద్ర శతకము (42 సీస పద్యాలు లభించాయి) వ్రాసినవి 65 సీసములు

**మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి :** శ్రీ బుచ్చి సుందరరామశాస్త్రి 1892 సం॥లో గుంటూరు జిల్లా 'బ్రాహ్మణ కోడూరు' గ్రామంలో జన్మించారు. 'అంటరానివా రెవరోకారు, మావెంటరాని వారే' అనే గేయం, ప్రణయలీల,పంచవటి (ఖండకావ్యాలు) శారద, ఉమర్ ఖయ్యాం (కావ్యాలు)

**మానికొండ సత్యనారాయణశాస్త్రి :** శుద్ధగాంధేయవాది, స్వాతంత్ర్య సమరయోధులు, రాజకీయనాయకులు, ప్రముఖ రచయిత, పత్రికా సంపాదకులు అయిన శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రి 1895లో కృష్ణాజిల్లా గుడివాడ తాలూక 'ఉరుటూరు' గ్రామంలో జన్మించారు. తిలక్ రాసిన గ్రంథాలను 'వేదకాల నిర్ణయం' పేరుతోను; 'వైదికవిజయము' అనే పేరుతో తెనిగించారు. బి.డి.బసు గారి 'దిరైజ్ ఆఫ్ క్రిస్టియన్ పవర్' ను బ్రిటీష్ మహాయుగము గా ఆంధ్రీకరించారు. వీరు స్వయంగా తెలుగులో "తిలక్ జీవిత చరిత్ర, నా స్మృతి పథం, అర్థశాస్త్ర పాఠాలు,గ్రామ పరిశ్రమల నిరూపణము, తెలుగు వాల్మీకము, తూర్పు కృష్ణా జాతీయోద్యమ చరిత్ర" అనే గ్రంథాలను, ఆంగ్లంలో Village Republics లాంటి ఎన్నో గ్రంథాలను రచించారు. వీరు 'సత్యాగ్రహి 'గ్రామ స్వరాజ్య' వార పత్రికలకు సంపాదకులుగా పనిచేశారు.

**మామిడి సారంగపాణి :** శ్రీ సారంగపాణిగారు 1845 సం॥లో కృష్ణాజిల్లా 'బందరు'లో జన్మించారు. వీరు మామిడి వెంకయ్యగారి వంశీకులే. 1879లో 'మచిలీ బందరుచరిత్ర' అనే గ్రంథాన్ని రచించారు.

**మారేపల్లి రామచంద్రశాస్త్రి :** రామచంద్రకవిగా ప్రసిద్ధులైన శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు 1874లో కృష్ణాజిల్లా, 'కనకవల్లి' గ్రామంలో జన్మించారు. 'పశ్చాత్తాప మహాత్మ్యము, తెలుగు నుడికడలి, నన్నయ్యనుడులు,ఆర్య దండయాత్ర,కన్యకాంబికావిజయము, కిరాతార్జునీయం, కుమారాస్త్ర విద్యాసందర్శనము,ద్రౌపదీ స్వయంవరము, ధీర హరిశ్చంద్రము, ప్రతాపచంద్రగుప్తము, ప్రహ్లాద విజయము, బిల్హణీయము, మృచ్ఛకటికము, రాజ్యలాభము, విజయ విలాసము, గ్రంథాలయ చరిత్ర, జాతీయ విద్యా ప్రణాళిక, ఋగ్వేద సంహిత, కథా రత్నాకరము, తెలుగుసంధ్యావందనము, తెలుగు తోబట్టువులు, సుడిగండాలు, మొదలైన-27 నాటకాలు,40 అనువాదాలు,3 హరికథలు రచించారు.

**మిన్నికంటి గురునాథశర్మ :** గుంటూరుజిల్లా, నరసరావు పేట తాలూక, 'ఏలూరు'లో 1897లో జన్మించారు. పోతరాజు

విశ్వనాథ కవితో కలిసి 'గురువిశ్వనాథకవులు' పేరుతో జంటగా కవిత్వం చెప్పారు. 'చంద్రికా వివాహము, కామాక్షి' నాటకాలు; శ్రీమద్భాగవతం, సూక్తినిధి, శ్రీదత్తాత్రేయ వ్రతకల్పము,దత్తాత్రేయ శతకము, శివగీత, గౌరీకల్యాణము, అడవిపువ్వులు,ఆంధ్రశ్రుతి గీతాలు మొదలైనవి జంటగా సాహిత్యంతోపాటు భక్తి, వేదాంత రచనలు కూడా చేశారు.

**ముట్నూరి కృష్ణారావు :** ప్రజాశ్రేయస్సే లక్ష్యంగా పత్రికా సంపాదకత్వాన్ని నిర్వహించిన ఘనులు శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు 1879లో కృష్ణాజిల్లా 'ముట్నూరు' గ్రామంలో జన్మించారు. గాంధీ మహాత్ముడు'అతనికంటిలో ఆధ్యాత్మిక తేజంనాకుగోచరిస్తోంది అన్నారు. కృష్ణారావుగారు 'లోవెలుగులు, వెలుగు జిలుగులు,సమీక్ష' అనే వీరి రచనలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు సేకరించి, 1979లో 'ముట్నూరి కృష్ణారావు వ్యాసాలు' అనే సంపుటిని ప్రచురించింది.

**ముత్తరాజు సుబ్బారావు :** సుప్రసిద్ధ రచయిత అయిన శ్రీ ముత్తరాజు సుబ్బారావుగారు కృష్ణాజిల్లా బందరులో 1870 సం॥లో జన్మించారు. 'శ్రీకృష్ణతులాభారం' వీరి ప్రముఖ రచన. వీరు రాజశ్రీ భక్త మార్కండేయ, ఉత్తర రామచరిత్ర, కచదేవయాని, చంద్రగుప్త, రణతిక్కన మొదలైన నాటకాలు రాశారు.

**ముదిగొండ కోటయ్య శాస్త్రి :** ఆరాధ్య శైవ ప్రవర్తకులైన ద్వాదశారాధ్యులలో ఒకరు, ఉద్భటారాధ్య వంశీయులు శ్రీ కోటయ్య శాస్త్రి1898లో జన్మించారు.వీరు తెలుగులో కృష్ణాపుష్కర మహాత్మ్యము, శైవ చింతామణి శకము,చాణక్య నీతి దర్పణము, శివగీతాసంగ్రహము, విఘ్నేశ్వర చరిత్ర, శైవసర్వస్వము, దీక్షా కౌముది, సిద్ధాంత కిరణాలు; సంస్కృతంలో శివధర్మ ప్రదీపిక రచించారు.

**ముదిగొండ నాగలింగశాస్త్రి :** శ్రీ శాస్త్రి గుంటూరుజిల్లా 'తాడికొండ' లో1876లో జన్మించారు. విద్యాభ్యాస కాలంలోనే, రక్షారు ద్రాక్ష, చండమార్తాడ్మ' అనే ఖండకావ్యాలు; తరువాత కారణోత్తరం, చంద్రోత్తరం, జ్ఞానోత్తరం, ముకుటోత్తరం' తాత్పర్య సహితంగా ప్రకటించారు. ఇంకా బ్రహ్మపథమ్, వేదాంతార్థ పరిష్కార తారహారం, నలప్రవాసం, నలవివాహమ్, నవరస కాదంబరి, 'శివచింత మణిప్రభ' గ్రంథ వ్యాఖ్యానం రచించారు.

**ముదిగొండ సుబ్రహ్మణ్యశాస్త్రి :** వీరు గుంటూరు జిల్లా 'ఇనగల్లు' గ్రామంలో జన్మించారు. తెనాలిలో పుస్తకాల షాపు ఉండేది. 1958లో కృష్ణాపత్రికను సర్వహక్కులూ తీసుకొని, 15 ఏళ్ళు వారపత్రికగా, మంచి ప్రమాణాలతో ప్రచురించారు. వజ్రోత్సవ వేదుకలు చేశారు.

**మునిమాణిక్యం నరసింహారావు :** మునిమాణిక్యం నరసింహారావు తెనాలి తాలూకా, సంగంజాగర్లమూడి గ్రామంలో 1898లో జన్మించారు.

**రచనలు :** కాంతం కథలు (తెలుగు సాహిత్యంలో ఒక మణిపూస), దాంపత్యోపనిషత్తు, గృహప్రవేశం, హాస్య కుసుమావళి, మాణిక్య వచనావళి, స్తుతి – ఆత్మస్తుతి, తెలుగు హాస్యం, హాస్య ప్రసంగాలు, రుక్కుతల్లి, జానకీ శర్మ, యథార్థ దృశ్యాలు, మంచివాళ్ళ మాటతీరు, తగూ నెంబరు త్రీ ఇతర కథలు, ఇల్లు, ఇల్లాలు, కాంతం వృద్ధాప్యం, దాంపత్యజీవితము,కాంతం కైఫీయతు.

**మేకా రామచంద్ర అప్పారావు :** శ్రీరామచంద్ర అప్పారావు కృష్ణాజిల్లా 'నూజివీడు'లో 1875లో జన్మించారు. నీలిరత్నాలు, వసంతగీత, ఉపాసన, వాలుజడ వారి రచనలు.

**మేకా వెంకటాద్రి అప్పారావు :** సంస్కృతాంధ్రాంగ్ల భాషా పండితులు,కవిపోషకులు,భాగవతోత్తములు, కవి, సంస్కృత, పర్షియా భాషలలో పండితుడు కూడా అయిన శ్రీ మేకా వెంకటాద్రి అప్పారావు 29-4-1893న కృష్ణాజిల్లా నూజివీడు ప్రభువుల వంశంలో, శనివారపుపేట లో జన్మించారు. బాల్యం నుంచీ కవితా వ్యాసంగం అలవరచుకొన్నారు.రాజా వెంకటాద్రి అప్పారావు, ఉయ్యూరు జమీందారు, సంస్కృతాంధ్ర భాషలలో పాండిత్యాన్ని సంపాదించాడు.

**రచనలు :** ఈయన తెలుగులో 'దుర్యోధనాంతము, ఆంధ్ర వీరలక్ష్మీ విజయము' వంటి నాటకాలు రచించాడు. 'రాజ్యలక్ష్మీ పరిణయం' అనే సంస్కృత నాటకాన్ని రచించాడు. జయదేవుని గీతా గోవిందాన్ని 'ఆంధ్రాష్టపదులు' పేరుతోను, షాహనామాను తెలుగులోకి అనువదించాడు Ramadasu రామదాసు రచించాడు. "గోవర్ధనోద్ధరణము, పృథ్వీరాయుని యంతము, స్నేహలత, శ్రీశోభనాచల మహాత్మ్యము, జ్యోతిర్లీల" అనే గ్రంథాలు రచించారు.

**యోగి లక్ష్మి కాంతానంద :** వీరు గుంటూరు జిల్లా, తెనాలి తాలూక 'కొత్త రెడ్డిపాలెం' లో 1888లో జన్మించారు. వీరు ఆబాల్య రామభక్తులు.పీష్వా నారాయణరావు వధ నాటకం రాశారు. సన్యసించి, లక్ష్మీకాంతానంద యోగి అయ్యారు.సంస్కృతాంధ్రాలలోపెక్కు శతకాలు, స్తోత్రాలు, వ్యాఖ్యానాలు, వేదాంత రచనలు, 'శక్తిగీత' రచించారు

**రఘుపతి వెంకటరత్నం నాయుడు :** రఘుపతి వెంకటరత్నం నాయుడు 1862 అక్టోబర్ 1న సుబేదారు అప్పయ్య నాయుడు–శేషమ్మ దంపతులకు కృష్ణాజిల్లా 'మచిలీపట్నం'లో జన్మించారు. డాక్టర్ మిల్లర్ శిష్యరికంలో చెన్నపురి క్రైస్తవ కళాశాల నుండి పట్టభద్రుడై ఆంగ్ల సాహిత్యంపై పట్టు సాధించారు. 1886 నుండి "బ్రహ్మప్రకాశిక" "దిఫెలో వర్కర్, పీపుల్స్ ఫ్రెండ్" అనే ఆంగ్ల పత్రికలకు సంపాదకత్వం వహించి, సాంఘిక సమస్యలమీద అనేక ప్రబోధాత్మకమైన ఉత్తేజకరమైన రచనలు చేశారు.

**రాయప్రోలు సుబ్బారావు :** కవి, భావకవితా పితామహుడు అయిన శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు 1892లో గుంటూరుజిల్లా 'గార్లపాడు' గ్రామంలో జన్మించారు. 1908లో విద్యార్థి దశనుంచీ, పద్యాలు, గేయాలు రాయడం ప్రారంభించారు. అనంతరం కృష్ణాజిల్లా విజయవాడకు వచ్చి మేనమామ 'అవ్వారి సుబ్రహ్మణ్యం' తో కలిసి అవధాన ప్రదర్శనలు, ఆశుకవితా ప్రదర్శనలు ప్రారంభించారు. శ్రీ రాయప్రోలు హెల్మెట్ కావ్యాన్ని "లలిత" గా తెలిగించారు. ఉమర్ ఖయ్యాం రుబాయిలను 'మధుకలశం' పేరుతో ప్రచురించారు, ఇంకా వీరు 'మిశ్రమంజరి, ఆంధ్రావళి, జడకుచ్చులు, వనమాల' అనే ఖండకావ్యాలు రాశారు. వీరు రాసిన 'తృణకంకణం, స్నేహలతాదేవి, మాధురీ దర్శనం' కావ్యాలు తెలుగు సాహిత్యంలో అజరామరంగా నిలిచిపోయాయి. ఆదిశంకరుల 'భజగోవిందం, సౌందర్యలహరి' శ్లోకాలను అనువదించారు.

**రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ :** కవి పండిత విమర్శకులైన శ్రీశర్మ అనంతపురం జిల్లా, కళ్యాణదుర్గం తాలూక 'రాళ్ళపల్లి' గ్రామంలో 1893 లో జన్మించారు. 1912లో 'సమీరాబాయి' అనే ఖండకావ్యం రాశారు. వీరింకా 'శాలివాహన గాథా సప్తసతి సారం, నృత్య రత్నావళి అనువాదం, అనేక గ్రంథాలు పరిష్కరించారు. చాలా పీఠికలు రాశారు. ఎన్నో విమర్శనా వ్యాసాలు రచించారు.

**రాళ్ళబండి సీతారామశాస్త్రి (శ్రీశ్రీశ్రీ విద్యాశంకర భారతీస్వామి) :-** శ్రీ సీతారామశాస్త్రిగారు 26-10-1895న కృష్ణాజిల్లా మచిలీపట్నం లో జన్మించారు. వీరు 'పాంచజన్యం' వార పత్రికను నడిపారు. ఉపనిషత్కౌముది, బ్రహ్మ సూత్ర, నపుత్ర (1,2 భాగాలు) శంకర మహావాక్య రత్నావళి, ఉపనిషత్సూక్తి ముక్తావళి' అనే తెలుగు గ్రంథాలు Goodman & Creation అనే ఆంగ్ల గ్రంథాన్ని రచించారు.

**లింగం వీరభద్రయ్య చౌదరి :** లింగం వీరభద్రయ్య చౌదరిగారు కృష్ణాజిల్లా , 'పెడసనగల్లు' స్వగ్రామం కాగా, గుడివాడ తాలూకా'అంగలూరు'లో 25-6-1898నజన్మించారు. 'న్యాయచరిత్ర' (మూడు భాగాలు) మారిన కాలం, స్వవిషయం (3 భాగాలు) తాంబూలం - నైవేద్యం, ఆదర్శాలు -అనుమానాలు, అనుచితాలు - అనురాగాలు, అభిప్రాయాలు - ఆలోచనలు, Reflections on the West అనేవి వీరు రచించిన గ్రంథాలు.

**వనం శంకరశర్మ :** వీరు కర్నూలుజిల్లా పత్తికొండ గ్రామస్థులైన వనం కృష్ణయ్యగారికి దత్తులుగా వచ్చారు. శంకరశర్మగారు కవి, పత్రికా సంపాదకులు, 'ఇంద్రావతి, శారద, హితవాది' పత్రికలు నడిపారు. 'శ్రీమహాత్మాగాంధీ శతకం, రామరాజు చరిత్ర, రాకా చరిత్ర, మృత్యుంజయ చరిత్ర (హరికథ) జ్యోతిష్య విజ్ఞాన ఫల చంద్రిక, సంసార యాత్ర (సాంఘిక నాటకం) భక్త పుండరీక (భక్తిరస నాటకం) దేశభక్తి జగన్మాయ (2 నాటకాలు), అప్పుల తిప్పలు (ఏకాంకిక) రచించారు.

**వడ్డెపాటి నిరంజనశాస్త్రి :** వీరు గుంటూరు జిల్లా తెనాలి తాలూకా 'దుగ్గిరాల' గ్రామంలో 1877లో జన్మించారు. 18వ ఏట వీరబ్రహ్మంగారి చరిత్రను 'కల్యంధ కౌముది' పేరుతో శ్రవ్యకావ్యంగా రచించారు. తరువాత 'కుమారాభ్యుదయము, భీష్మోదయము, ధర్మపాల చరిత్రము, (ఈ రెండు ప్రబంధాలు) మాఘమహాత్మ్యం (అనువాదం), సూర్యశతకం, సుబ్బరాయ తారావళి, బ్రహ్మానందతారావళి, బ్రహ్మానంద లీలలు (నాటకాలు) విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము (మహాగ్రంథం) రచించారు.

**వల్లూరి జగన్నాథ పండితులు :** దివాన్ బహద్దూర్ జగన్నాధం పంతులుగారు కృష్ణాజిల్లా 'తోట్లవల్లూరు' గ్రామంలో 1845లో జన్మించారు. మహాభాష్యమును, బ్రహ్మసూత్రములను 'ఆంధ్రశారక' అనే పేరుతో కంద పద్యాలలో తెనిగించారు.

**వల్లూరి సూర్యనారాయణరావు :** శ్రీ వల్లూరి సూర్యనారాయణ గారు 1866 సం॥లో కృష్ణాజిల్లా 'పెదముద్దాలి' గ్రామంలో జన్మించారు. బి.ఎ., ఎల్.ఎల్.బి చదివారు. 1930లో వీరు 'సూర్యనారాయణీయము' అనే పేరుతో 'స్వీయచరిత్ర' వ్రాసుకున్నారు. ఇది తెలుగులో రెండవది. వీరు ఆంధ్రపత్రికకు అనేక వ్యాసాలు; కొన్ని గ్రంథాలూ రాశారు. వానిలో 'వర్ణాశ్రమ ధర్మ పరిణామం, అంతర్జాతీయ ధర్మశాస్త్రం, నానాదేశ రాజ్యాంగ విధానం, మన స్వాతంత్ర్యము' ముఖ్యమైనవి.

**వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాదు :** జయంతిపురం రాజా అని ప్రసిద్ధి పొందిన వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాదు కృష్ణాజిల్లా జగ్గయ్యపేట దగ్గరి 'ముక్త్యాల' వాస్తవ్యుడు. ధమ్మపదము, గీతామృతము, బౌద్ధసంస్కృతి, మంగళసూత్రం, పరిణామ లిపి, ఆర్షకుటుంబం, నీతి నీరాజనం, భగవద్గీత, ప్రయోగమాల, ప్రసాదన యోగాలు అనే పుస్తకాలు రచించారు.

**వాసిరెడ్డి వెంకటసుబ్బయ్య :** వీరు గుంటూరు జిల్లా 'వడ్లమూడి' లో 1900లో జన్మించారు. 'మహతి' ఉత్తమ సాహిత్య పత్రికా సంపాదకులు. భామినీ విలాసం, గాథాసప్తశతి, అక్రూరుడు, సఖి, నలుపితామహులు, హాలకవితాహేల, గాథామృతం, ప్రాకృతిక విలాసం, కృతులు, గేయాలు రచించారు.

**వావిలాల వాసుదేవశాస్త్రి :** శ్రీ వాసుదేవ శాస్త్రి 1851 జూన్ 1న గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా 'కారుమూరు' గ్రామంలో జన్మించారు. తేటతెలుగు, తేటగీతులలో తొలి స్వతంత్ర సాంఘిక నాటకమైన 'నందకరాజ్యం' నాటకాన్ని 1889లో రచించారు.

భజగోవింద శ్లోకాల నాంధ్రీకరించారు. ఎ.కౌపర్ రాసిన 'మదర్స్ పిక్చర్స్' అనే కావ్యాన్ని, 'మాతృస్వరూప స్మృతి గాను; రఘువంశం 6 సర్గలను అనువదించారు.

**విశ్వనాథ సత్యనారాయణ, ప్రథమాంధ్ర జ్ఞానపీఠి :** తెలుగు సాహిత్యం ఉద్భవించిన నాటినుంచి, మహాకవుల కోవలో తాను 13వ వాడినని సహజోక్తిగా చెప్పుకొన్న అత్యంత ధీరులు. కవిసమ్రాట్టు, అఖండ ప్రతిభాజీవి, కవితా కృషీవలుడు, శతాధిక గ్రంథకర్త, ప్రప్రథమాంధ్ర జ్ఞానపీఠి' అయిన శ్రీ విశ్వనాథ 1894లో కృష్ణాజిల్లా, 'నందమూరు' గ్రామంలో జన్మించారు. ప్రజ్ఞానిధి శ్రీ విశ్వనాథ, 'మాక్లీదుర్గంలో కుక్క, అనే కథ అధిక ప్రచారాన్ని, ఆదరణనీ పొంది,అనేక భాషల్లోకి అనువదింపబడింది.అలాగే 'ముగ్గురు బిచ్చగాళ్లు, రాజు' అనే రెండు కథలు పాలనాయంత్రాంగ విమర్శ నాత్మకాలైన, ధ్వనిరూప రచనలు. వీరు 25 కావ్యాలు, 15 నాటకాలు, 88 నవలలు, 9 విమర్శనాగ్రంథాలు, ఎన్నో కథలు, 200 వరకు ఖండికలు, 100 కు పైగా పీఠికలు రచించారు. తెలుగులోనూ, ఆంగ్లంలోనూ వ్యాసాలు రాశారు. సంస్కృతంలో 8 రచనలు చేశారు. భారత జీవన విధానాన్ని త్రికరణశుద్ధిగా ప్రచారం చేశారు. తన ప్రతిభాపాటవంతో, శిల్ప నైపుణ్యంతో పాశ్చాత్యపు ఉచ్చులో నుంచీ భావిభారతాన్ని పరిరక్షించే ప్రయత్నం చాలా తీవ్రంగా చేశారు. అందుకే ఆయన యుగకర్త, వైతాళికుడు. శ్రీ విశ్వనాథ మన పురాణాలలోని చారిత్రక విషయాల నాధారంగా వారి కల్పనాశక్తిని జోడించి వ్రాసిన 12 నవలలు - చరిత్రలో గల నూతన కోణాలను పరిచయం చేస్తాయి. భారతయుద్ధం నుంచి శాలివాహనుని వరకు 10 రాజవంశాలను విశ్వనాథ ఇతివృత్త కేంద్రాలుగా గ్రహించి, 'పురాణవైర గ్రంథమాల' నిర్మించారు. 1. భగవంతుని మీద పగ, 2. నాస్తికధూమం 3. ధూమరేఖ, 4.పులిమ్రుగ్గు 5. చంద్రగుప్తుని స్వప్నం, 6. నందోరాజా భవిష్యతి, 7. అశ్వమేధ, 8. నివేదిత, 9.హెలీనా, 10.వేదవతి, 11. నాగసేనుడు, 12. అమృత వల్లి. వీరు పిల్లలకోసం "పరీక్ష" అనే సాంఘిక నవల రాశారు. ప్రాచీనాధుని కాంధ్ర సాహిత్య చరిత్రలో వీరు చేపట్టని సాహిత్య ప్రక్రియ లేదు. రసావతారమెత్తిన 'అలౌకిక ప్రతిభ' వీరి కథలో, కావ్యంలో, కవితలో, నవలలో,నాటకంలో,పాటలో,పద్యంలో,శతకంలో, అనువాదాల్లో, పీఠికల్లో, విమర్శలో, వ్యాఖ్యానంలో, వ్యాసంలో, ఉపన్యాసంలో - భారతీయ సంప్రదాయమూలాలను ప్రతిబింబింపచేసింది. వీరి జీవన తత్వ సర్వస్వ పేటిక అయిన 'శ్రీమత్‌రామాయణ కల్పవృక్షానికి' 1980 సం॥లో తొలి తెలుగు "జ్ఞానపీఠ" అవార్డు లభించింది. శ్రీ విశ్వనాథ సంస్కృతభాషలో 'అమృత శర్మిష్టమ్, గుప్త పాశుపతమ్" వంటి నాటకాలను, ఇంకా 6 రచనలు కూడా చేశారు. శ్రీ విశ్వనాథ వారు "జ్ఞానపీఠ" అవార్డు అందుకున్న ప్రథమాంధ్రులు.

**విశ్వనాథ వెంకటేశ్వర్లు :** శ్రీ వెంకటేశ్వర్లు గారు 1898లో కృష్ణాజిల్లా 'నందమూరు'లో జన్మించారు. వెంకటేశ్వర్లు గారు పండిత కవులు. వీరు 'కాళిందీ పరిణయం, పరాప్రాసాదం' అనే రెండు పద్యకావ్యాలురచించారు. ఇంకా 'ఓరుగల్లు నంది, అహం, సత్యవతి, సేతు బంధనము, మహేశ్వర శతకము, శ్రీరామచంద్ర ప్రభు శతకము, దక్షిణేశ్వర ముని' రచించారు.

**వెంపరాల సూర్యనారాయణశాస్త్రి :** ప్రముఖ తెలుగు కవి శ్రీ సూర్యనారాయణశాస్త్రి 1896లో కృష్ణాజిల్లా 'ఇందుపల్లి' గ్రామంలో జన్మించారు. <u>వీరి రచనలు</u> : 1. వెంకటేశ్వర శతకము, 2. మునిత్రయ చరిత్రము. 3. శ్రీ శంకర విజయము (విఖ్యాత ప్రబంధము), 4. శబర శంకర విలాసము. 5. మదాలసా విలాసము, 6. మునిత్రయ చరిత్ర, ప్రౌఢార్థాప్రచురమైన రుచికావ్యము. ఈ రెండు కృతులను శాస్త్రిగారికి మహాకవితాపట్టము గట్టించుటకు జాలియున్నవి.

**వెత్సా వెంకటశేషయ్య :** ప్రాంతంలో బందరు పట్టణంలో నివసించిన శ్రీ వెంకట శేషయ్య 'సంస్కృతాంధ్ర నిఘంటువు' రాశారు. దీనిని 1893లో బందరులో ప్రచురించారు. దీనిలో 18 వేల పదాలకు తెలుగులో అర్థాలివ్వబడ్డాయి.

**వెల్లాల సదాశివశాస్త్రి :** వీరు మెహబూబ్‌నగర్ జిల్లా జటప్రోలు సంస్థానంలోని 'అయ్యవారి పల్లె' గ్రామంలో 1861లో జన్మించారు. అలంపురం గ్రామంలో విద్యాభ్యాసం చేశారు. విద్యార్థి దశలోనే 'కన్యకాంబా చంపూ కావ్యం, ఉద్వాహాభాస విరాస' గ్రంథాలు రాశారు. వెంకటగిరి సంస్థానానికి వెళ్ళి, కావ్యాలంకార సంగ్రహ విమర్శ, వెలుగోటి వారి వంశ చరిత్ర రచించారు. జటప్రోలు వారి గురించి సురభి వంశ చరిత్ర; ఇంకా చంద్రికాపరిణయ వ్యాఖ్యానం, పిత్రాజ్య చంద్రిక, కంఠీరవ విమర్శనం, వీరభద్రీయ ఖండనము, ఖండనాభాస నిరాసనము, నామిరెడ్డి చరిత్ర రచించారు.

**వేటూరి ప్రభాకరశాస్త్రి :** కవి, పండితుడు, విమర్శకులు, చారిత్రకవేత్త, పరిశోధనలో అద్వితీయుడు, ప్రాచీన గ్రంథ పరిష్కర్త అయిన ప్రజ్ఞాప్రభాకరులు 1888లో కృష్ణాజిల్లా - దివిసీమ లోని 'పెదకళ్ళేపల్లి' గ్రామంలో జన్మించారు. <u>వీరి రచనలు</u> : <u>గ్రంథ పరిష్కరణలు</u> :- క్రీడాభిరామం, ఉత్తర హరివంశం, బసవపురాణం; సంకలనాలు : చాటుపద్య మణిమంజరి, ప్రథమభాగం, ప్రబంధ రత్నావళి, చాటుపద్యమణి, మంజరి - ద్వితీయభాగం, బాలభాష, గాంధి రామాయణము : <u>ఖండకావ్యములు</u> :.. 1. కపోత కథ, 2. చిన్ననాటి చేష్టలు, 3. విశ్వాసము, 4.దివ్యదర్శనము, 5. కడుపు తీపు, 6. మూన్నాళ్ళ ముచ్చట, 8. అలవాటు, 9.మాతృశ్రీ 10. సీతాఫలము మొదలగునవి. మధుర కవిత, నూతన వర్షము; <u>అనిబద్ధ రచనలు</u> : జీవితానుభూతులు, ఆరాధ్యమూర్తులు, కవిప్రశస్థులు,

రాజప్రశస్తులు, ఆశువులు; కథలు : నీతినిధి, కపోతకథ, మూన్నాళ్ళ ముచ్చట; చరిత్ర రచనలు : తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర, దీనికి 'తొడిమ', అనే పీఠిక, రెడ్డిరాజుల చరిత్ర : అనువాదాలు :- భాస శ్రీహర్ష మహేంద్రవిక్రమవర్మల, బోధాయనుల నాటకాలు, గాథాసప్త శతి, గోవర్ధన సప్తసతి, భజగోవింద శ్లోకములు, మధ్యమ వ్యాయోగం; రూపకానువాదాలు :- కర్ణభారము, ప్రతిమ; గ్రంథరచనలు : శృంగార శ్రీనాథము, కనకాభిషేకము; స్వీయచరిత్ర : ప్రజ్ఞాప్రభాకరము.

**వేదాంతం జగన్నాధాచార్యులు :** గుంటూరుజిల్లా 'చందోలు' గ్రామంలో 1894లో జన్మించారు. వీరు వేంకటేశ్వర వైభవం, వైఖానస కల్ప సూత్రం రచించారు.

**వేదాల తిరువెంగళాచార్యులు :** గుంటూరుజిల్లా రేపెల్లె తాలూకా, పెద్దవరం అగ్రహారం లో 1895లో జన్మించారు. సంస్కృ తాంధ్ర భాషా పండితులు. 'ఆంధ్రధ్వన్యాలోకం, కావ్యాలంకార సూత్ర వృత్తి, రస గంగాధరం, వ్యక్తి వివేకం (అనువాదం) కావ్యప్రకాశిక (అనువాదం) రామకృష్ణుని కవిత్వం, భారత భాగవతోపన్యాసములు, రాజ్యప్రదానము (నవల), జాతక కథలు, గోపికావల్లభ శతకం, చతుశ్శత తత్త్వసారము రచించారు.

**వేమవరపు రామదాసు పంతులు :** శ్రీ రామదాసు గారు 1873లో కృష్ణాజిల్లా 'బందరు' లో జన్మించారు. 'పీష్వా నారాయణరావు వధ' అనే తెలుగు నాటకాన్ని Medras Estates land Act కు ఆంగ్ల వ్యాఖ్యానం రచించారు.

**వేమూరి రత్తయ్య :** శ్రీ రత్తయ్య 1894లో కృష్ణాజిల్లా 'ఘంటసాల' గ్రామంలో జన్మించారు. హిందూధర్మ రహస్యం అనే ఒక ఉద్గ్రంథాన్ని రచించారు.

**వేమూరి రాంజీరావు పంతులు :** నేను నీలా చేయలేక పోయాను అని గాంధీగారిచే ప్రశంసించబడిన శ్రీ రాంజీరావు బందరు 'చింతగుంటపాలెం'లో 1891లో జన్మించారు. హరిజనోద్ధరణకై 'దీనబంధు' పత్రికను నడిపారు. చిన్నచిన్న కథలు, వ్యాసాలు, పద్యాలు స్వయంగా తానే వ్రాసేవారు రాంజీ. విద్యార్థులతో చేతివ్రాత పత్రిక 'తిరుగుబోతు' ను రాయించేవారు.

**వేమూరి రామచంద్ర సోమయాజి :** రామచంద్ర సోమయాజి కృష్ణానదీతీరంలోని 'తోట్లవల్లూరు' గ్రామంలో 1809వ సం॥లో జన్మించారు. సంస్కృతాంధ్ర భాషా సాహిత్య ఖని. అక్కడే నివాసముంటూ అనేకమంది శిష్యులకు బోధిస్తూ, పోషిస్తూ, విద్యాదానం, అన్నదానం చేసిన మహనీయులు. తక్కువ గ్రంథాలే రచించారు. బోధనపై ఉన్న మక్కువ రచనపైన లేదు. జంధ్యాల శివన్న శాస్త్రి లాంటి వారెందరో వీరికి శిష్యులు.

**వేమూరి శ్రీనివాసరావు :** శ్రీనివాసరావుగారు 1880 సం॥లో కృష్ణాజిల్లా బందరులో జన్మించారు. పూర్వగాధాలహరి అనే అనన్య సామాన్యగ్రంథాన్ని ప్రకటించారు. 18పురాణాలు, భారత రామాయణాది కావ్యేతిహాసాల కథలు సేకరించి, అకారాది క్రమంలో రచించారు.

**వేలూరి చంద్రశేఖరం :** శ్రీ చంద్రశేఖరం 1900లో కృష్ణాజిల్లా 'చిరివాడ'లో జన్మించారు. వీరు 'కంచనమాల, అచలాయ తనము, తత్సమ చంద్రిక, దివ్యజీవనము, సత్యకామ జాబాలి' అనే గ్రంథాలు రచించారు.

**వేలూరి శివరామశాస్త్రి :** బహుముఖ ప్రజ్ఞా పాటవాలు కల్గిన మనిషి. మహాపండితులు, కవిశేఖరులు, తత్త్వవేత్త, జ్ఞాన తపస్వి, బహుభాషా వేత్త, విద్వత్కవి, దార్శనికుడు, శతావధాని, బహుశాస్త్రవేత్త, సంస్కృతాంధ్రాంగ్ల వంగ ఫ్రెంచి భాషలలో పండితులు అయిన శ్రీ శివరామశాస్త్రిగారు 1892లో కృష్ణాజిల్లా 'చిరివాడ'లో జన్మించారు. **శాస్త్రిగారి రచనలు :** తెలిసినంతలో శ్రీ శాస్త్రిగారి మొదటి రచన "నాస్తిక దర్శనము" కథాషట్కము, పేర 6 కథలు, 'కథాసప్తకము' పేరుతో 7 కథలు,'కథాభారతి శీర్షికతో 11 కథలు, మరికొన్ని కథలు శీర్షికలో 11 కథలు మొత్తం 35 కథలు రచించారు. అగ్ని, మాతృ హృదయము, నిష్కాసనము, కుక్కపిల్ల, నాగటిచాలు వంటి అత్యుత్తమ ఖండకావ్యాలురచించారు. షేక్స్పియర్10 నాటకాలను అనువదించారు. 'బుక్స్' అని ఋగ్వేదాన్ని తెలుగులోకి అనువదించారు. 'మణిమేఖల' వీరి ప్రత్యేక నవల.'వ్యాసవాణి (సాహిత్య వ్యాసాలు) చిట్టచివరి రచన 'శ్రీ అరవిందుల పురుషోత్తమ తత్త్వవ్యాసాలు, **రచనలు :-** ఉత్తర హరివంశ విమర్శనము, ముక్తాలత, తాలుకుట్టనము, కృతకసూత్రము, మాధవవర్మ, ఉపగుప్త, బెడాలోపాఖ్యానము, ఆత్మకథ (మహాత్మాగాంధీ జీవితానువాదము) **కథలు- గాథలు :** ఏకావళి, రాముని బుద్ధి మంతనం, తీరని కోరికలు, బాపన పిల్ల, కథాషట్కము, కథాసప్తకము.

**శరణు రామస్వామి చౌదరి :** గుంటూరు జిల్లా 'అమృత లూరు' గ్రామంలో 1900లో జన్మించారు. 'కేతరిన్ జీవిత చరిత్ర, గారిబాల్డి జీవితం వీరి రచనలు.

**శిష్టా నరసింహశాస్త్రి :** శ్రీ నరసింహశాస్త్రి గారు 1870లో కృష్ణాజిల్లా 'బందరు'లో జన్మించారు. వేదవేదాంగాలను క్షుణ్ణంగా అభ్యసించారు. శ్రీ శాస్త్రిగారు బ్రహ్మసూత్ర, శంకరభాష్యాలకు వ్యాఖ్యలు రాశారు.

**శిష్టా రామకృష్ణశాస్త్రి :** శ్రీ రామకృష్ణశాస్త్రిగారు కృష్ణాజిల్లా 'బందరు'లో 1900లో జన్మించారు. వీరు 'ఆంధ్రవాఙ్మయ చరిత్ర సర్వస్వం, నాటక విమర్శనము, ఆంధ్రనాటక కళ, నాటక విమర్శ,

వీరశైవాంధ్ర వాఙ్మయము ఇంకా అనేక విమర్శనా వ్యాసములు రచించారు.

**శిష్టా లక్ష్మీ కాంతశాస్త్రి :** అష్టావధాని శ్రీ లక్ష్మీకాంత శాస్త్రిగారు 1890లో కృష్ణాజిల్లా 'బందరు'లో జన్మించారు. వీరు కూడా,మంచి విమర్శకులూ, కవులూ,తిరుపతి వెంకట కవులను గూర్చి రచించిన గ్రంథం-అకాడమీ బహూకృతి అందుకుంది. రాయలయుగ కవులను గూర్చి,తంజావూరు కవులను గురించీ గ్రంథాలురచించారు. స్వయంగా శ్రీ విశ్వనాథ 'సువర్ణ ఘంటాకం కణాన్ని' వీరి చేతికలంకరించారు.

**శ్రీరాం వీరబ్రహ్మకవి :** విద్వత్కవి, వివిధ సాహిత్య ప్రక్రియల రచయిత, సహస్రావధాని,అయిన శ్రీరాంవీరబ్రహ్మ కవిగారు 1884లో కృష్ణాజిల్లా జన్మించారు. బాల్యంలోనే శ్రీవిరాట్ ప్రభు శతకము రచించారు.

**వీరి రచనలు :** కొండవీటి విజయం, శ్రీకాళహస్తీశ్వర విలాసం, తుకారాం (పద్యకావ్యాలు)భక్తామృతము, అన్యాపదేశము, నానారాజన్య చరితము, పిఠాపురం సంస్థాన చరిత్ర, పల్లవరాజ చరిత్ర, వినోదిని, వాసంతిక, చంద్రకాంత,జపానీయము, సంసార శోభ, చైనీయము (నాటకాలు, నాటికలు) ప్రియ దర్శిక, రుచీ దేవి (నవలలు) శివకేశవా భేద స్తుతి, భ్రమరాంబా స్తోత్రము (శతకములు) మార్కండేయ విలాసము, పాదుకా పట్టాభిషేకము, పంచవర్ణ ప్రణాళికా ప్రచారిణి (హరికథలు) ప్రపంచ పోరుడు (వచనము) రాధాకృష్ణన్ చరిత్ర, గిల్ట్ శాస్త్రము, సమస్యావళి అనే రచనలు చేసి, రచయితగా ఖ్యాతి నార్జించారు. వీనిలో 'జపానీయము' ఉద్రేక పూరితమైన నాటకం. ఇది విదేశీ వస్త్రబహిష్కర ణకు ప్రేరణ నిచ్చింది. అనేక సంస్కరణలకు నాంది పలికింది.

**సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి :** లాక్షణికులు, సహజకవి శ్రీ సూర్యనారాయణశాస్త్రిగారు కృష్ణాజిల్లా గుడివాడ సమీప గ్రామమైన 'చిరివాడ' లో 1897లో ఫిబ్రవరిలో జన్మించారు. కావ్యాలం కార సంగ్రహవ్యాఖ్య 700 పుటలు పరిమితి గల గ్రంథాలు రాశారు. సప్తశతీసారము, జాతక కథాగుచ్ఛము, వివేకానందము, వాసవదత్త' మొదలయినవీరి పద్యరచనలు.కావ్యాలంకారసంగ్రహం (సవ్యాఖ్యానం) జాతక కథా గుచ్ఛం1,2 భాగాలు, కీర సందేశం,పువ్వులతోట (ఖండకావ్య సంపుటి) కావ్యమంజరి, నడుమంత్రపు సిరి (అధిక్షేపం) ఆంధ్రప్రబంధ కవులు, ద్వంద్వ యుద్ధం, కథాకదమ్బము, నడమంత్రపు సిరి, శతపత్రములు, స్మరగీతి, నవ్వులతోట, ఖడ్గతిక్కన, అమృతఫలములు, వాసవదత్త, రేణుకా విజయం, వివేకానందం మొదలైనవి; వ్యాకరణ సర్వస్వం, అనే సమగ్ర వ్యాకరణ గ్రంథం రచించారు.

**సర్వా వెంకటశేషయ్య శాస్త్రి :** శ్రీ వెంకట శేషయ్య గారు 1900లో కృష్ణాజిల్లా 'కాజ'గ్రామంలో జన్మించారు. రచనలు : "సర్వాత్మ రామాయణము" ప్రసిద్ధమైనది. ఇంకా పుణ్యశ్లోకులు, పంచతంత్ర హితోపదేశ కథామంజరి, హరి విజయము, సర్వవేదాంత సార సంగ్రహము, రత్నప్రభ, త్రివేణి (నాటకం) మున్నగునవి రచించారు. "ఫిల్గ్రిమ్స్ ప్రోగ్రెస్" ను అనువదించారు.

**సీతారామ యతీంద్రులు (శ్రీమాన్ ముత్తీవి సీతారామానుజాచార్యులు)** : భగవదనుగ్రహప్రాభవంతో విరాజిల్లిన శ్రీశ్రీశ్రీ సీతారామ యతీంద్రులు (పూర్వాశ్రమనామం శ్రీమాన్ ముత్తీవి సీతారామాను జాచార్యులు) కృష్ణాజిల్లా, దివితాలూకా 'పెదముత్తీవి' గ్రామంలో 1906లో జన్మించారు. సంస్కృతాంధ్ర హిందీ భాషలలో కృషి చేసి, వాటిలో సామర్థ్యం సంపాదిం చారు. యౌవనంలో స్వాతంత్ర్యోద్యమ బాటననుసరించారు. సుందర కాండ (ద్విపదకావ్యం) యతీంద్ర లేఖలు, అమృతవాహిని (భగవద్గీత వ్యాఖ్యానం) మధురవాణి మున్నగునవి వీరి ముఖ్యమైన రచనలు.

**సూర్యదేవర రాఘవయ్య చౌదరి :** గుంటూరుజిల్లాలో కృష్ణాతీరంలో గల 'కొల్లూరు' గ్రామంలో 1880లో వీరు జన్మించారు. 'కమ్మవారి చరిత్రము' బ్రాహ్మణేతర విజయము, బ్రాహ్మణేతర సంఘ దర్పము, స్వసంఘ పౌరోహిత్యము, వర్ణ విభాగ దర్పణము, విప్ర చరిత్రము, పంచముల చరిత్రము, ఆర్యకవి కుతంత్రము, రామాయణ విమర్శనము రచించారు.

**హరినాగభూషణము :** త్యాగరాజు గురువుల వంశీయుడై, ప్రముఖ వాగ్గేయకారులు, 'సంగీతం ఒక మహాతపస్సు' అని నమ్మిన నాదోపాసకుడైన -శ్రీహరి నాగభూషణం గారు 1884 డిసెంబరు 24న కృష్ణాజిల్లా 'హరిపురం'లో జన్మించారు. వీరు 13వ ఏటనే 'మలయమారుతం, ఆనందభైరవి, రీతిగౌళ' రాగాలలో వర్ణాలు రచించారు. 'అమృత వర్షిణి' రాగంలో 12 కృతులు రచించారు. సంస్కృతం, తెలుగులలో అనేక కృతులనూ, శ్రీరామ రాఘవ స్తవము' అనే సంస్కృతాంధ్ర శతకాలనూ రచించారు. త్యాగరాజ చరిత్ర, శంకర విజయం, శ్రీరామకృష్ణోపాఖ్యానం, పాదుకా పట్టాభిషేకం" మొదలైన హరికథలను రచించి, భక్త జనాహ్లాదనకరంగా గానం చేసిన భక్తవరేణ్యుడు. సంస్కృతాంధ్రాలలో త్యాగయోగం అనే "Is music a science or Art?" "The Philosophy of Thyagaraja", Karnatik Music", అనే వ్యాసాలు "త్రివేణి" పత్రికలో వ్రాశారు.

*చిరునామా : శ్రీ నవులూరి రమేష్‌బాబు, తెలుగు పండితులు, సెల్ : 9676768484*

# గూడవల్లి రామబ్రహ్మం

**(1898-1946)**

**ఆంధ్రదేశ చలనచిత్ర పరిశ్రమ వికాసానికి కృషి చేసిన వారిలో ప్రముఖులు గూడవల్లి రామబ్రహ్మం :**

వీరు కృష్ణాజిల్లా నందమూరులో జన్మించారు. చిన్నప్పటినుంచీ లలిత కళలలో అభిరుచి, సాహితీ పరుల సహవాసం, ప్రజోద్యమాలలో ఉత్సాహం కలవారు. వీరు ఇంటర్మీడియట్ చదువుతుండగా, దేశ వ్యాప్తమైన విద్యాలయ బహిష్కరణ తనను ఆకర్షించగా వీరు చదువు చాలించారు. సత్యాగ్రహోద్యమ సందర్భంలో తెనాలిలో సత్యాగ్రహ శిబిరంలో ఉత్సాహంతో పాల్గొన్నారు. కమ్మవారి చరిత్ర రాయాలని చెన్నై వెళ్ళి అక్కడ జస్టిస్ పార్టీ వారి 'సమదర్శిని' అనే ద్వైవారపత్రికకు సంపాదకులుగా పనిచేసి, తరువాత కృష్ణాజిల్లా ప్రజామిత్ర పక్షం వారి వారపత్రిక 'ప్రజామిత్ర'ను విజయవాడ నుండి చెన్నై తెప్పించి, దానిని ప్రశంసాపాత్రంగా దాదాపు పది ఏళ్లు నడిపించారు. వీరి సంపాదకత్వంలో 'ప్రజామిత్ర' విజ్ఞాన వికాసాలకు, కళాభిరుచికి, అభ్యుదయ భావాలకు ఆనాటి ఆంధ్రవారపత్రికలలో అగ్రగణ్యమైంది. ఆరోజులలోనే సుప్రసిద్ధ సినిమా డైరక్టరు సి.వి.దాసు 'వేల్ పిక్చర్స్' అనే సంస్థ స్థాపించి చిత్ర నిర్మాణం చేస్తుండేవారు. అతని పరిచయం వల్ల వీరికి చలనచిత్ర రంగంలో ప్రవేశం కలిగింది. దాసు సహ వాసంలో లభించిన చిత్రనిర్మాణ విజ్ఞానంతో వీరు సరస్వతీ టాకీసు (విజయవాడ) వారి 'ద్రౌపదీ వస్త్రాపహరణ' నిర్మాణంలో హెచ్.ఎం.రెడ్డి తోను, 'బాలయోగిని' చిత్ర నిర్మాణంలో డైరక్టరు కె.సుబ్రహ్మణ్యంతోను కలిసి కృషి చేశారు. తద్వారా మంచి సాంకేతిక జ్ఞానం అలవడింది. వీరికి పరిచితులైన కవులు, గాయకులు, నటకులు అనేకులను, తన సమర్థతతో నమ్మకం గల ధనికమిత్రులను అండగా చేసుకుని వీరు 'సారథి ఫిలింస్' అనే పేరుతో ఒక చిత్ర నిర్మాణ సంస్థను చెన్నైలో స్థాపించారు. ఆనాటి ప్రజాసమస్యలచే కథా వస్తువులుగా తీసుకుని ప్రతిభాద్యోతకాలైన చిత్రాలను నిర్మించారు. 'మాలపిల్ల'లో హరిజన సమస్యను, 'రైతుబిడ్డ'లో జమీందారి సమస్యను విశదీకరించడమే వీరి అభ్యుదయ దృష్టికి ప్రబల నిదర్శనం. ఆ రెండు చిత్రాలు ఆనాడు ప్రజలలో గొప్ప సంచలనం కలుగ జేశాయి. నాటి బ్రిటీషుప్రభుత్వం 'రైతు బిడ్డ' చిత్ర ప్రదర్శనల మీద ఆంక్షను కూడా విధించింది. తరువాత వీరు కొన్ని ఇతర సినిమా సంస్థలకు 'అప వాదు' 'ఇల్లాలు' చిత్రాలను డైరక్టు చేసి ఇచ్చారు. ఆ తరువాత స్వతంత్రంగా శారదా ఫిలింస్ స్థాపించి, 'పంతులమ్మ' మొదలగు చిత్రాలు తీశారు. 'పల్నాటి యుద్ధం' నిర్మిస్తుండగా రాచకురుపు వల్ల వీరు పరమపదించారు. ఉదార బుద్ధి ఉన్నవారు అవటం వల్ల వీరు చాలామంది కళాకారులను, కవులను సత్కరించి ప్రోత్సహిస్తుండేవారు. లలితమైన అభిరుచులు, మంచి కలుపుగోలుతనం ఉన్న వారగుట చేత ఆనాడు వీరి కార్యా లయం ఆంధ్ర కవులకు, కళాకారులకు సమావేశ స్థలంగా ఉండేది. ఏచిన్న విషయాన్నయినా కొంత ఆడంబరంతో జరిపించి చెన్నైలోని ఆంధ్రే తరుల దృష్టిని ఆకర్షించే నేర్పు వీరికి అపారం. సినిమా రంగంలో వీరు సంపాదించిన పేరు వల్ల వీరు స్వల్పకాలంలోనే మద్రాసు మోషన్ పిక్చర్స్ ప్రొడ్యూసర్స్ కంబైన్ అనే నిర్మాతల సంస్థకు మేనేజింగ్ డైరక్టర్ కాగలిగారు. ఆంధ్రచలన చిత్రాలు ఉత్తమ స్థాయిలో ఉంటాయి. అనే ప్రఖ్యాతి ఇతర ప్రాంతాలలో వ్యాపించేటట్లు చేసిన అగ్రగాములలో వీరు ఒకరు. 'మాలపిల్ల' 'రైతుబిడ్డ'లలో అభ్యుదయ దృష్టి, పత్ని, పల్నాటియుద్ధములలో చారిత్రక దృష్టి, 'అపవాదు' 'ఇల్లాలు' సంఘ సంస్కరణ దృష్టి, అన్నిటిలోను, లలిత కళాదృష్టి ప్రకటించి వీరు బహుముఖ ప్రశంసలు అందుకున్నారు.

డా॥ పి. విజయకుమార్

# స్వాతంత్ర్య సమర సింహం ఉయ్యాలవాడ నారసింహారెడ్డి

ఉయ్యాలవాడ నారసింహారెడ్డి భారత ప్రథమస్వాతంత్ర్యసంగ్రామ వీరుడు. ఝాన్సీలక్ష్మీబాయి కన్నా 11 సంవత్సరాలు ముందే కుంఫిణీ ప్రభుత్వంపై రేనాటిసీమలో తిరుగుబాటు జెండా ఎత్తిన మహావీరుడు. ఉయ్యాలవాడ నారసింహారెడ్డి కేవలం రేనాటిసీమకు, రాయలసీమకి, ఆంధ్రదేశానికి పరిమితమైన వీరుడు కాడు ; యావత్తు భారతదేశానికి సంబంధించిన స్వాతంత్ర్యసమరయోధుడు! తొలి తిరుగుబాటు బావుటా!

భారతదేశపు దక్షిణాపథం 1800 ప్రాంతంలో సమస్యల సుడి గుండంలో సంద్రమైంది. ముస్లిం నవాబుల దండయాత్రలతో దద్దరి ల్లింది. వలసపాలకుల చేతిలో విలవిలలాడింది. కొత్త పన్నుల విధా నంతో రైతుల వెన్ను విరిగింది. వలసపాలకుల వంచనా విధానంలో ప్రజారక్షక పాలెగాళ్ళ పాలనా వ్యవస్థ ధ్వంసమైది. వలసవాదుల పరాయి పాలన ప్రజల పాలిట శాపంలా దాపురించింది. పరాయి పాలకుల దోపిడి పతాకస్థాయికి చేరింది. ప్రజల ఆవేదనలోంచి ఓ ఆవేశం దావా నలంలా ఉప్పొంగింది. నల్దిక్కులు పిక్కటిల్లేలా ఓ సీమ సమరసింహం గర్జించింది. వలసవాదులైన పరాయి పాలకులపై ధ్వజమెత్తిన ఉగ్ర నరసింహమే ఉయ్యాలవాడ నారసింహారెడ్డి.

ఉయ్యాలవాడ నారసింహారెడ్డి కర్నూలుజిల్లా, రూపనగుడి గ్రామంలో జన్మించాడు. ఉయ్యాలవాడలో పెరిగి పెద్దవాడయ్యాడని జానపద వీరగాథల వలన తెలుస్తుంది. ఉయ్యాలవాడ గ్రామం ఈనాటి కర్నూలు జిల్లాలో ఉంది. ఉయ్యాలవాడకు పాలెగాడుగా నారసింహారెడ్డి తండ్రి పెద్దమల్లారెడ్డి ఉండేవాడు. నారసింహారెడ్డి తాతగారు నొస్సం జమీందారు అయిన జయరామిరెడ్డి నిస్సంతు కావడంతో నారసింహారెడ్డిని దత్తత తీసుకున్నాడు. తండ్రి తరుపున నెలకు 11 రూపాయల 10 అణాల, 8 పైసలు భరణంగా వచ్చేది. అయితే తాతగారైన, జయరామి రెడ్డి నిస్సంతుగా మరణించాడనే నెపంతో ఆయనకు ఇస్తూ వచ్చిన భరణాన్ని ఆయన మరణంతో బ్రిటిష్ ప్రభుత్వం రద్దుచేసింది.

ఉయ్యాలవాడ నారసింహారెడ్డి 19వ శతాబ్ది పూర్వార్థంలో రేనాటి సీమనేలిన మహావీరుడు. వీరికి 2000 సైన్యం ఉండేది. కడప, కర్నూలు, అనంతపురం, బళ్లారి జిల్లాలలో 66 గ్రామాలకు అధిపతి ఉయ్యాల వాడ నారసింహారెడ్డి. రూపనగుడి, ఉయ్యాలవాడ, ఉప్పులూరు, గుళ్ళదుర్తి, గిద్దలూరు మొదలైన గ్రామాల్లో నారసింహారెడ్డి నిర్మించిన కోటలు, నగరులు ఈనాటికీ వున్నాయి. ఉప్పులూరు సంస్థానాధీశులైన 'పేరావారు' నారసింహారెడ్డి మూలపురుషులని రేనాటి సీమలోని పెద్దలవలన తెలుస్తోంది.

కర్నూలు జిల్లా నందికొట్కూరు తాలూకాలోని 'చెలిమళ్ళ రుద్ర వరం' అనే గ్రామంలో 'పిచ్చుగుంట్లు' అనే జానపదవృత్తి గాయకులు నారసింహారెడ్డి వంశీకులని యాచించి బ్రతికేవారని తేలింది. తంగిరాల సుబ్బారావుకి పరిశోధన కారణంగా లభించిన వంశవృక్షంలో కూడా నారసింహారెడ్డి మూలపురుషులు 'పేరా' వారనే కనిపిస్తుంది. ఉప్పు లూరు సంస్థానాధిపతి అయిన పేరా లక్ష్మిరెడ్డి మూలపురుషుడనీ, అతనికి ఎనిమిదవ తరంవాడు నారసింహారెడ్డి అనీ, ఇతని తల్లిపేరు 'సీతమ్మ' అనీ, భార్యపేరు 'సిద్ధమ్మ' అనీ ఈ వంశవృక్షంలో ఉంది. దీన్నిబట్టి ఇంటిపేరు పేరావారై ఉండాలి. కాని 'పిచ్చుగుంట్లు' వారు పాడుతున్న 'వీరగాథానిక'లో నారసింహారెడ్డి ఇంటిపేరు 'మద్దెల' వారనీ, తండ్రిపేరు పెద్ది'రెడ్డి' అనీ తాతపేరు 'జయరామిరెడ్డి' అనీ కనిపిస్తుంది.

**"తండ్రి పేరే పెద్దిరెడ్డి – తాత పేర్ జయరామిరెడ్డి**
**ఇంటిపేరే మద్దేలోళ్ళు – తాతపేర్ నరసింహారెడ్డి**
**వొహువా ! నరసింహారెడ్డి !, నీ పేరంటో –రాజా నరసింహారెడ్డి!**

పై ఆధారాలను బట్టి 'మద్దెలవారి' ఇంటి నుండి 'పేరువారి' ఇంటికి దత్తు వచ్చి ఉండవచ్చని పరిశోధకుల భావన.

18వ శతాబ్దపు తొలిరోజుల్లో రాయలసీమలో పాలెగాళ్ల వ్యవస్థ ఉండేది. 'పాలెం' అంటే దండు ఉండే ప్రాంతం అని అర్థం. కడప

జిల్లాలోన 80 మంది పాలెగాళ్ళుండేవారు. నిజాంనవాబు రాయలసీమ ప్రాంతాలను బ్రిటీషువారికి అప్పగించడంతో పాలెగాళ్లు బ్రిటీషు ప్రభుత్వం అధికారంలోకి వచ్చారు. నారసింహారెడ్డి తాతల కాలం నుండి వీరికి పన్నులు వసూలు చేసే అధికారం ఉండేది. ఆ క్రమంలో పన్నులు వసూలు చేసే బాధ్యత ఉయ్యాలవాడ నారసింహారెడ్డికి వచ్చింది. వీరినే ఆ కాలంలో 'పాలెగాళ్లు' అనేవాళ్లు. పాలెగాళ్లకి సైన్యం, అనేక కోటలుండేవి. పాలెగాళ్లు ఆ ప్రాంతాన్ని పరిరక్షిస్తూ,రక్షణ కవచంలా ఉండి మకుటంలేని మహారాజుల్లా ఉండేవారు.

పాలెగాళ్లు ప్రజల రక్షణతో పాటు సంక్షేమకార్యక్రమాలు నిర్వహించి రాయలసీమను పాడిపంటల సీమగా మార్చడంలో ప్రధాన బాధ్యత వహించారు. పాలెగాళ్ల వ్యవస్థ వంశపారంపర్యంగా వచ్చేది కాదు. స్థానికులే తమ ప్రాంత రక్షణ కోసం కత్తిపట్టి పాలెగాళ్లు అయ్యేవాళ్లు. సీమలో ఇతర పాలెగాళ్లు, సంస్థానాల అధిపతులను ఏకం చేసిన తిరుగుబాటు అగ్గి రాజేసిన ధీరుడు ఉయ్యాలవాడ నారసింహారెడ్డి, పాలెగాళ్ల వ్యవస్థను నిర్మూలించడానికి, అణచివేతకు బ్రిటీష్ వాళ్లు పథకరచన చేశారు. పాలెగాళ్ల పాలనను సాయుధ ముఠాలుగా చిత్రించారు. సాయుధంగా అణచివేత ప్రయత్నాలు ముమ్మరం చేశారు. వారి ఆస్తులు జప్తుచేశారు. 'రైత్వారీవిధానం' ప్రవేశపెట్టి, పాలెగాళ్ల వ్యవస్థను బలహీనం చేయాలని అనుకున్నారు. 1820లో మద్రాసు గవర్నర్‌గా వచ్చిన థామస్ మన్రో రైత్వారీ విధానం తెచ్చాడు. అధికశిస్తు వేసి వారిని అణచాలన్నదే మన్రో అభిమతం. అయితే రైత్వారీ విధానంలో పండిన పంట ఆధారంగా పన్నులు విధించేవాళ్లు కాదు. భూసారాన్ని బట్టి పన్నులు ముందే నిర్ణయించేవారు. ఈ విధానంలో పంటలో వచ్చిన సగభాగం కంటే ఎక్కువే పన్నులు రూపంలో చెల్లించాల్సి వచ్చేది. పన్నులు వసూలు క్రూరంగా ఉండేది. పన్ను వసూలులో మన్రో హింసామార్గాన్నైనా అమలుపరచడానికి వెనుకాడలేదు. ఇలా దోపిడి పతాకస్థాయికి చేరింది. ఈ అన్యాయాలకు, అక్రమాలకు సహించలేకపోయాడు ఉయ్యాలవాడ నారసింహారెడ్డి. ప్రజల దుర్భర పరిస్థితులకు చలించిపోయాడు. ఆవేశంతో రగిలాడు. సీమసింహమై విజృంభించాడు. దాదాపు 5000 సైన్యంతో బ్రిటీష్ సైన్యంపై గెరిల్లా యుద్ధానికి సిద్ధమయ్యాడు.

బ్రిటీష్ వాళ్లకి వ్యతిరేకంగా ఎందరో జమిందారులను నారసింహారెడ్డి కూడగట్టాడు వీరిలో వనపర్తి జమిందారు రాజా రామేశ్వరరావు, మునగాల జమిందారు రామకృష్ణారెడ్డి, జటప్రోలు సంస్థానాధిపతి రాజా లక్ష్మణరాయుడు, అవుకు జమిందారు, పెనుగొండ పాలకులు, బనగానపల్లి నవాబులున్నారు. తన నైపుణ్యంతో ప్రత్యక్ష పోరులో వందల కొద్ది గ్రామాల ప్రజలను భాగస్వాములను చేశాడు. వలస పాలకులపై ఆగ్రహంతో ఊగిపోతున్న నారసింహారెడ్డికి వారిపై విరుచుకుపడే అవకాశం రానేవచ్చింది. శిస్తురూపంలో వస్తున్న సొమ్మును కోవెలకుంట్ల తహశీల్దారుకు చెల్లించి తనకు రావలసిన రొక్కాన్ని తేవాల్సిందిగా తలారిని పంపాడు నారసింహారెడ్డి. అయితే తహశీల్దారు ఆంగ్లేయుల అండతో ఎవరినీ లెక్కచేసేవాడు కాదు. సొమ్మును తీసుకొని నారసింహారెడ్డి మాకింద బంటు, ఆ బంటుకి మరో బంటా అంటూ గేలిచేసి అవమానించాడు. నారసింహారెడ్డే స్వయంగా వచ్చి జీతం తీసుకెళ్లాలని ఆదేశించాడు. తలారి ద్వారా విషయం తెలుసుకొని నారసింహారెడ్డి అగ్రహోదగ్రుడయ్యాడు. పళ్లు పటపటకొరికి, వాడికి శిస్తు ఎందుకు కట్టాలి. ఇచ్చిన పన్ను వెనక్కి తెమ్మని తలారిని తిప్పి పంపాడు. సొమ్ము వెనక్కివ్వకపోతే తహశీల్దారు తల నరుకుతానని చెప్పిరమ్మన్నాడు. తహశీల్దారు భయపడి కార్యాలయానికి బ్రిటిష్ సైన్యం కాపలా పెట్టుకున్నాడు. నారసింహారెడ్డి సైన్యంతో దండెత్తి తహశీల్దారు తల నరికాడు. ఖజానా కొల్లగొట్టాడు. తన సైన్యాన్ని తర్వాత జిల్లా కంభంవైపు తరలించాడు. కలెక్టరు ఈ దాడిని ఖండించి ఉపేక్షిస్తే ఇలాంటి దాడులు పునరావృతమవుతాయన్నాడు.

కలెక్టరు నారసింహారెడ్డిపైకి కెప్టెన్, వాట్సన్‌ల నేతృత్వంలో నొస్సం కోటపైకి దాడులకు పంపించాడు.ఆ దాడిలో ఫిరంగుల దాడికి 'నొస్సం' కోట నేలమట్టమయింది. ఆ పన్నాగాన్ని కనిపెట్టిన నారసింహారెడ్డి తన స్థావరాన్ని వేరే చోటికి మార్చాడు. బ్రిటిష్ ప్రభుత్వం ఉయ్యాలవాడ తలకి భారీ నజరానా ప్రకటించింది. ఈ విషయం తెలుసుకున్న ఉయ్యాలవాడ నారసింహారెడ్డి ఆచూకీ తెలిపితే ఉయ్యాలవాడలో ఆవేశం కట్టలు తెంచుకొంది. తన తలకు వెలకట్టిన కుచ్చితులకు గుణపాఠం చెప్పాలనుకున్నాడు. అదే సమయంలో గిద్దలూరులో బసచేసిన బ్రిటిష్ సైన్యంపైకి జూలై 23, 1846లో నారసింహారెడ్డి దాడిచేసి, భారీ విధ్వంసం సృష్టించి బ్రిటీష్ వాళ్ళకి కొరకరాని కొయ్య అయ్యాడు. బ్రిటిష్ వాళ్లు నిఘా పెట్టి నారసింహారెడ్డి కదలికలను గమనించారు. రామభద్రుని పల్లె సమీపంలో జగన్నాథకొండపై ఉయ్యాలవాడ స్థావరం ఏర్పరచుకొన్నాడన్న సమాచారంతో సైన్యం అక్టోబర్ 6, 1846 రాత్రి వేళలో మూకుమ్మడి దాడిచేసి ఫిరంగి గుళ్లతో దొంగదెబ్బతీసింది. అప్పుడు సీమసింహాన్ని ప్రాణాలతో బ్రిటీష్ సైన్యం పట్టుకుంది. ఇనుప సంకెళ్లతో బంధించి వీధుల్లో ఊరేగించింది. తమ పాలనపై ఎదురు తిరిగితే ఇదే గతి అని ప్రజలకు చాటిచెప్పింది. ప్రజల పక్షాలన నిలబడ్డ నాయకునిపై హత్య, దోపిడీ కుట్రలు నెట్టి, మరణశిక్ష విధించింది. కోవెలకుంట్ల సమీపంలో 2వేలమంది ప్రజల సమక్షంలో

ఫిబ్రవరి 22, 1847 సోమవారం ఉదయం 7 గంటలకు కలెక్టర్ కాక్రేన్ నారసింహారెడ్డిని ఉరితీయించాడు. కోవెలకుంట్ల కోట గుమ్మానికి నారసింహారెడ్డి తల 30 ఏళ్లు అంటే 1877 దాకా వేలాడిందని చరిత్రకారుల భావన. తన పుట్టిన గడ్డకోసం, ప్రజల కోసం ఉరికొయ్యలనే ఉయ్యాల చేసుకొన్న ఉయ్యాలవాడ నారసింహారెడ్డి అజరామరుడు.

పాణ్యం నరసరామయ్య 'స్వాతంత్ర్య వీరుడు' కావ్యంలో ఉయ్యాలవాడ నారసింహారెడ్డి గూర్చిన పద్యాలు పరిశీలిద్దాం.

మ॥ అమితోద్దండ దురంత పీడనకులోనై, భారతీయ ప్రజా
సముదాయం బొనరించినట్టి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామరం
గముకన్నం బది యేండ్ల కున్మునుపె, యాంగ్ల ప్రాజ్య సామ్రాజ్యసై
న్యముపై గత్తిని దూసినట్టి నరసింహారెడ్డి సామాన్యుడే !

సీ॥ కలికితురాయి గొల్కొలుపు పట్టురుమాలు
గట్టిన యుత్త మాంగంబుతోడ
వైష్ణవ భక్తి భావము చాటు నూర్ధ్వపుం
డ్రము నీటుగొలుపు ఫాలంబుతోడ
క్రేవల కెంజాయ రేక లింపారు నా
తత దీర్ఘ ధవళ నేత్రముల తోడ
చిఱునిమ్మకాయల నిరువైపు నిల్పుకో
జాలిన గుబురు మీసముల తోడ

గీ॥ వైరి హంవీర విదళన ప్రళయకాల
దండ నిభ ఖడ్గకలిత హస్తంబుతోడ
ప్రజకు భయభక్తి సంభ్రమ భావములను
గొలుపు వర్చస్సు తోడ నబ్బులియుడలరు

1847లో నారసింహారెడ్డి బలిదానం వృథాకాలేదు. నారసింహారెడ్డి ఈ విప్లవ మార్గాన్ని 1857లో ఝాన్సీలక్ష్మీబాయి, తాంతియాతోపే, దాదాసాహెబ్ మొదలైన వీరులు భారతదేశమంతటికీ వ్యాపింపచేశారు. సరిగ్గా నారసింహారెడ్డి బలిదానం తరువాత వంద వసంతాలకి భారతదేశానికి దాస్యశృంఖలాలు తొలగి స్వేచ్ఛా స్వాతంత్ర్యం సిద్ధించింది.

ఉపయుక్త గ్రంథాలు :

1. రేనాటి సూర్యచంద్రులు - ఆచార్య తంగిరాల సుబ్బారావు.
2. సుప్రసిద్ధుల జీవిత విశేషాలు - జానమద్ది హనుమచ్ఛాస్త్రి
3. ఉయ్యాలవాడ నారసింహారెడ్డి గూర్చి, ఆడియో, వీడియో, ప్రింట్ మీడియా సమీక్షలు.

# నీరాజనం

ఓం సప్తర్షిపుణ్యఫలదాయిన్యై నమః
నీరాజనం సమర్పయామి
(అమ్మవారికి భక్తితో నమస్కరించి నారికేళంపై
కర్పూరంతో హారతి సమర్పించండి)

చిరునామా : డా॥ పి. విజయకుమార్, అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలుగు శాఖాధ్యక్షులు, సిల్వర్‌జూబ్లీ ప్రభుత్వ కళాశాల, కర్నూలు - 518 002. విద్యుల్లేఖ : vijaymanusha@gmail.com

శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్

# సూరి భగవంతం

డాక్టర్ సూరి భగవంతం కృష్ణాజిల్లా ఆగిరిపల్లిలో 14-10-1909న జన్మించారు. ప్రాథమిక విద్య తరువాత హైదరాబాద్ నిజాం కాలేజిలో చదివి సైన్స్‌లో డిగ్రీ పొందారు. సి.వి. రామన్ పరిశోధనకు ప్రేరణ పొంది ఆయనతో 1928లో కలకత్తా వెళ్లి ఆయనతో ఉన్నారు. రామన్‌కు నోబెల్ పురస్కారం లభించిన తర్వాత భగవంతంగారిని తన భవిష్యత్ పరిశోధనలకు సహాయకునిగా తీసుకొన్నారు. అప్పుడే మద్రాస్ యూనివర్సిటి నుండి మాస్టర్స్ డిగ్రీ అందుకొన్నారు.

1933లో రామన్ ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్‌లో చేరిన తర్వాత భగవంతంగారిని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో లెక్చరర్‌గా చేరటానికి సిఫార్సు చేశాడు. క్రమంగా ప్రొఫెసర్ హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్ పదోన్నతులను పొంది 1941లో విశ్వవిద్యాలయ కాలేజి ప్రిన్సిపాల్ అయ్యారు. యూనివర్సిటి ఆయనకు డి.ఎస్.సి ప్రధానం చేసింది. "ది దీరీ ఆఫ్ గ్రూప్స్ అండ్ ఇట్స్ ఫిజికల్ అప్లికేషన్స్" అనే ప్రసిద్ధ గ్రంథాన్ని వెంకటరాయుడుతో కలిసి రాశారు. ఈ పుస్తకం మూడుసార్లు పునరుద్ధరణ పొంది రష్యన్ భాషలోకి అనువదింప బడింది. స్పెక్ట్రోస్కోపిస్ట్‌లందరినీ, వారి పరిశోధనలతో సహా ఈ పుస్తకంలో వర్ణించి చెప్పారు. రెండవ గ్రంథంగా "స్కాటరింగ్ ఆఫ్ లైట్ అండ్ రామన్ ఎఫెక్ట్" రాశారు. మూడవ పుస్తకం "క్రిస్టల్ సిమెట్రీ అండ్ ఫిజికల్ ప్రాపర్టీస్". ఇవికాక ఆయన రాసిన రిసెర్చ్ పేపర్లు 300 దాకా ఉన్నాయి.

భారత స్వాతంత్ర్యానంతరం ఆనాటి కేంద్రమంత్రి వి.కె. కృష్ణ మీనన్ వద్ద 1948 నుండి ఒక ఏడాదిపాటు లండన్‌లోని భారత హై కమీషన్‌లో సైంటిఫిక్ సలహాదారుగా ఉన్నారు. ఐరోపా దేశాలలో పర్యటించి సైంటిఫిక్ విషయాలపై ప్రసంగాలు చేశారు. 1949లో ఇండియాకు తిరిగి వచ్చి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఫిజిక్స్ శాఖాధ్యక్షులుగా చేరి పనిచేశారు. ఆయన మార్గదర్శకత్వంలో 12 మంది పరిశోధనలు చేసి పి.హెచ్.డి పొందారు. 1952లో వైస్‌చాన్సలర్ అయ్యారు. 1957లో బెంగుళూర్‌లోని "ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్"కు డైరెక్టర్ అయి అయిదేళ్ళు సేవలు అందించారు. తరువాత కేంద్రప్రభుత్వంలో రక్షణమంత్రి వి.కె. కృష్ణమీనన్ వద్ద సైటిఫిక్ అడ్వైజర్ పదవిలో ఉన్నారు. సంస్కృత, ఆంధ్ర భాషలలో భగవంతంగారి పాండిత్యం అమోఘం మంచి హాస్య చతురోక్తులతో ప్రసంగించే నేర్పు ఆయనకు ఉండేది.

భగవంతంగారు "డిఫెన్స్ రీసెర్చ్ అండ్ డెవలప్‌మెంట్ ఆర్గనైజేషన్" (డి.ఆర్.డి.వో) డైరెక్టర్ పదవిని 1962లో చేబట్టారు. భారత్-చైనా యుద్ధం తర్వాత రక్షణమంత్రి చవాన్ వద్ద ఈ పదవిలో కొనసాగారు. తొమ్మిదేళ్ళ ఈ పదవీకాలంలో మిసైల్స్, విమానాలు, ఎరోజీన్స్, టాంకులు, ఎలక్ట్రానిక్ యుద్ధ పరికరాలు, భారీ ప్రేలుడు పదార్థాలు, జలాంతర్గాములు మొదలైన యుద్ధ వాహనాల అభివృద్ధి, పరిశోధనల కోసం భారతదేశంలో అనేక ప్రయోగశాలల స్థాపనలో ముఖ్య భూమిక పోషించారు. ఆధునిక యుద్ధవిధానంలో శాస్త్ర సాంకేతికతలను ప్రవేశపెట్టి సైనిక అధికారులకు అత్యుత్తమ శిక్షణనిచ్చే కార్యక్రమం చేబట్టి ప్రశంసలనందుకొన్నారు. అనేక శాస్త్ర సాంకేతిక సంస్థలకు భగవంతంగారు గౌరవ సలహాదారుగా ఉన్నారు. 1969లో భగవంతంగారు పదవీ విరమణ చేశారు. 2009లో ఆయన జన్మదిన వేడుకలను ఉస్మానియా విశ్వవిద్యాలయం ఘనంగా నిర్వహించింది. 6-2-1989న 79 ఏళ్ళ వయసులో మార్గదర్శి సూరి భగవంతం గారు మరణించారు.

*చిరునామా : గబ్బిట దుర్గాప్రసాద్, రిటైర్డ్ హెడ్ మాష్టర్, శివాలయం వీధి, 12-7-16, ఉయ్యూరు. సెల్ : 9989066375З.*

ఆచార్య కొలకలూరి ఇనాక్

# అమరావతి ఖ్యాతి - మాదిగల స్మృతి

అమరావతి ప్రాశస్త్యం గూర్చి అధ్యక్ష కవితోపన్యాసికలో వీలయినంత సమగ్రంగా పేర్కొన్నాను. ఇప్పుడు అమరావతి పుట్టక పూర్వం మాదిగలు దాని నిర్మాణంలో ప్రఖ్యాతిలో వహించిన పాత్ర గూర్చి వివరించటం లక్ష్యం.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిర్వహించిన కవి సమ్మేళనం (21.3.2015) అధ్యక్షుడిగా చేసిన ప్రసంగంలో చారిత్రకంగా అమరావతి నిర్వహించిన పాత్ర – దాని వైశిష్ట్యం ప్రస్తావించాను.

తెలంగాణ ప్రత్యేకరాష్ట్రంగా ఏర్పడ్డాక, రాయలసీమ నాలుగు జిల్లాలతో కూడిన సర్కారు తొమ్మిది జిల్లాల ఆంధ్రప్రదేశ్‌కు నూత్న రాజధాని నిర్మించుకోవలసి వచ్చిన అవసరం ఆంధ్రులందరికీ అవగత పూర్వకమే!

అందుకోసమే ఏర్పాటుచేసిన కమీషన్ పలు అంశాలు పరిశీలించి కొన్ని ప్రాంతాల ఆనుకూల్యం గుర్తించింది. ప్రజలు తమ తమ అభీష్టాల మేరకు రాష్ట్ర రాజధాని నిర్మించదగ్గ ప్రాంతాలు కొన్ని ప్రతిపాదించారు. ప్రభుత్వం ఒక నిర్ణయం తీసుకొనే దశ వచ్చింది.

ఆ సమయంలో ఈ ఆంధ్రప్రదేశ్‌కు వచ్చిన తొట్టతొలి ఉగాది పర్వదినం అనంతవరంలో 21.3.2015న ప్రభుత్వం జరిపింది. దీనితో ప్రజల ఊహాగానాలు, రాజధాని విషయంలో, ప్రారంభమయ్యాయి.

శ్రీమన్మథనామ ఉగాది పర్వదిన సందర్భంలో ఏర్పాటుచేసిన కవిసమ్మేళనం, విజయవాడ, ఘంటసాల సంగీత కళాశాల ప్రాంగణంలో జరిగింది. ఆరోజే ప్రపంచ కవితా దినోత్సవం కావటం ఒక అద్భుత సందర్భం. ఈ ఆంధ్రప్రదేశ్ జరిపిన మొట్టమొదటి ఉగాది పర్వదినం కావటం పరమానందకర ప్రత్యేక విశేషం.

**'ఈ త్రివేణీ సంగమానికి అధ్యక్షుణ్ణి కావటం**
**నా అర్హత కంటే మీ ఔదార్యం మిక్కుటం'**

అని నేను సవినయంగా అభినందించాను.

'ఏనాటి నుంచో ప్రపంచాంధ్రుల రాజకీయరాజధాని విజయవాడ శ్రీపర్వత విశ్వవిద్యాలయ కాలంనుంచి విద్యాకేంద్రం గుంటూరు' ఈ రెండు సోదరీ నగరాల ముద్దుల కూతురుగా రాజధాని నిర్మాణం కావటం తథ్యం. అది ఎక్కడ? తుళ్ళూరా? అనంతవరమా? అమరావతా? – ఈ మూడింటిలో ఒకటి నిశ్చయమనే ఆశాజనకమైన వాతావరణం ఏర్పడింది.

అప్పుడు ఈ ప్రాంతంలోని 'తెలుగునేల పునరుపయోగంలో పూర్ణ సహకార పులకాంకితులైన అన్నదాతలకు' అభినందనలు తెలిపి, భూమిని సేకరణ చేయకుండా, సమీకరణ చేసిన ప్రభుత్వాన్ని ప్రశంసించి , ఇక ఇక్కడే రాజధాని అని గుర్తించటం ఆనందదాయకమే!

అమరావతి పట్టణచారిత్రక ప్రాశస్త్యం, ఔన్నత్యం తెలిపి, ఆంధ్రుల నూత్న రాజధాని 'అమరావతి' అయితే బాగుంటుందని నా ఆశను, అభిమతాన్ని, అభీష్టాన్ని తెలిపాను. ఆ నాటి నా కవిత్వం ఆంధ్రజ్యోతి, నా అధ్యక్ష కవితోపన్యాసిక ఆంధ్రప్రభ ప్రచురించాయి.

**"కొత్తగా పుట్టే రాజధాని పురుడు పోసుకొనే చోటు**
**'అమరావతి' అయితే చారిత్రక గౌరవం నిలుస్తుంది.**
**అమరావతీ! ఆంధ్రుల రాజధానీ! వర్ధిల్లుతల్లీ!**
**నిర్మించే రాజధాని నిక్కచ్చిగా ఇక్కడెక్కడైనా**
**రూపొందే మహాదీప్తికి 'అమరావతి' అనే పేరు**
**సార్థక నామధేయం**
**ఔచితీ మంతం**
**శ్రేయస్కరం**
**శోభావహం**
**శుభకరం"** అని ఆశాసూచన చేశాను.

సరిగ్గా పదిరోజులకు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీనారా చంద్రబాబు నాయుడుగారు నూత్నరాజధాని పేరు 'అమరావతి' అని ప్రకటించారు. సమీకృత భూభాగంలో పని ప్రారంభించే ఏర్పాట్లు మొదలయ్యాయి. నేనూ, అందరితోపాటు ఆనందించాను.

## 2. గాథా సప్తశతి

అమరావతి పట్టణమంటే నాకు అమితప్రేమ. ఇందుకు కారణం అది ప్రాచీనమైన పట్టణం కావటమే. అంతకు పూర్వం పుట్టి ఇప్పటికీ నిలచి ఉన్న పట్టణం మరొకటి ఆంధ్రప్రదేశ్ లేకపోవటమే. ఇది క్రీ.పూ. 500 సంవత్సరాలకంటే ముందునుంచి ఆంధ్రుల అస్తిత్వానికి మూలస్థానంగా ఉంది. ధాన్యకటకం - ధనకటకం - ధరణికోట పూర్వవైభవం పూర్తిగా నిలుపుకోవలసి ఉంది.

శాతవాహన చక్రవర్తి హాలుడు సంకలనం చేసిన ఏడువందల గాథల రసవత్ రచన 'గాథాసప్తశతి'. అది ఆంధ్రుల జీవితానికి, అమరావతి, ధాన్యకటకం అస్తిత్వానికి దర్పణం. శాలివాహన శకకర్త అయిన హాలుడు ఆంధ్రరాజు. ధాన్యకటకం, ఆహారాలు ఐదింటిలో ఒక దానికి రాజధాని. శాతవాహనులు తమ రాజ్యాన్ని ఐదు ఆహారాలుగా విభజించారు. ఆహారమంటే రాష్ట్రం. ఒక రాష్ట్ర రాజధాని ధాన్యకటకం. ఆహార పాలకుడి పేరు అమాత్యుడు. రాజుకు సలహాలు, సూచనలు చేసే మంత్రిమండలి పేరు రాజామాత్య సభ. రాజునిర్ణయం అమలుచేసే కార్యాలయం పేరు 'అక్షపటల'.

శాతవాహన చక్రవర్తికి శాతవాహన, సాతవాహన, శాలివాహన, సాలాహణ, శాల, హాల, కవివత్సల, ఆధ్యరాజు అనేవి కవిత్వంలో నామాంతరాలు. ఆయా పేర్లతో హాలుడు గాథలు వ్రాశాడు.

హాలుడు స్త్రీల ప్రోత్సాహకుడు, స్త్రీలను, అంతఃపురస్త్రీలను, గాథలు వ్రాయమని కోరాడు. వాటిని గాథాసప్తశతిలో నిక్షిప్తం చేశారు. కనీసం ఒక్కగాథ అయినా వ్రాసిన స్త్రీలు అనేకులున్నారు. వాళ్ళలో ముఖ్యులు. రేవా, సహాయీ, వద్ధావహీ, అణులచ్చీ, ససిప్పహా, రోహ, అసుద్ధి (?) నాధా, మాధవి. వీళ్ళ గాథలు స్త్రీ హృదయ కోమలత్వాన్ని, సౌకుమార్యాన్ని, మాధుర్యాన్ని నింపుకొన్నాయి.

రెడ్డిరాజు, పెదకోమటి వేమభూపతి (వేమారెడ్డి) నూటనాలుగు గాథల్ని సంస్కృత భాషలో వ్యాఖ్యానించి, 'శాలివాహన గాధాసప్తశతి' సారం వెలువరించాడు. దీనికి దిగుమర్తి సీతారామస్వామి 'భావదీపిక' తెలుగులో అందించాడు. హాలుడి గాథల భాష ప్రాకృతం.

కట్టమంచి రామలింగారెడ్డి, రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మను ప్రోత్సహించి, 'గాథాశప్తశతి'ని అనువదింపజేశాడు. ఏడువందల గాథలూ కాదుగానీ, నాలుగు వందల గాథలు పద్యరూపంలో తెలుగులోకి అనూదితాలయ్యాయి.

ఇందులోని జీవితం ఆంధ్రుల జీవితం. అదీ ధాన్యకటకం, అమరావతి పరిసర ప్రాంతవాసుల దైనందిన జీవితం. గాథల్లో ప్రస్తుతమైన పరిసరాలు పల్లెలు. ప్రజలు పల్లెవాసులు. ఈ పల్లెలు, ఈ పల్లెప్రజలు, నూరేళ్ళ పూర్వమున్న తెలుగు పల్లెలుగానే ఉంటాయి. ఈ ప్రాంతంలో ఆనాడు మాదిగల అధిక సంఖ్యాకులు. ఈ సంస్కృతి మాదిగ సంస్కృతిలాగా కనిపిస్తుంది.

'గాథాశప్తశతి'లో విభిన్నవృత్తుల ప్రస్తావన ఉంది. నాటికి కులాలు లేవు. అన్నివృత్తులతో పాటు చర్మకారుల జీవితం ఉంది. ప్రధానంగా ప్రజలు, పొలాలు- పంటలు -పల్లెలు, ప్రకృతి జీవితం పరమ అద్భుతంగా గోచరిస్తుంది. స్త్రీ పురుష సంబంధం అంత స్వేచ్ఛగా ఉండటం మనం అన్ని చోట్లా చూడటం సాధ్యం కాదు.

ప్రతి గాథా ఒక శృంగార ప్రబంధం. 2500 సంవత్సరాల,ఆ ప్రాంతం నాటి ఆంధ్రుల రసికతా ప్రియత్వానికి ఈ గాథలు ప్రత్యక్ష సాక్ష్యాలు.

ఈ ప్రాకృతగాథల్ని సంస్కృత లాక్షణికులు తమ అలంకార, లక్షణ గ్రంథాలలోకి ఉదాహరణాలుగా తీసుకొన్నారు. ప్రధానంగా ధ్వనికి, శృంగార భావ, విభావ అనుభావ సంచారీ భావాల వివరణకు ఇవి పనికి వచ్చాయి. తెలుగువాళ్ళ జీవితం అందించిన గాథలు సంస్కృతా లంకారికులకు అమృతప్రాయంగా అంది వచ్చాయి. మన జీవిత ప్రభావం సంస్కృత లక్షణ గ్రంథాలలో ఇంతగా ఉండటం ఆంధ్రులకు గర్వకారణం.

(ఆధారం నా 'గాథాసప్తశతి - ఆంధ్రుల సామాజిక జీవనం')

## 3. శాతవాహనులు

శాతవాహనులు దాదాపు 500ఏళ్ళు ఆంధ్ర సామ్రాజ్యం పాలించారు. క్రీ.పూ. 250 ఏళ్ళ నుంచి క్రీ.శ. 250 ఏళ్ళ దాకా రమారమిగా వాళ్ళ పాలన ఉంది. అయిదు ప్రధానమైన నగరాలుగా ప్రఖ్యాతిపొందాయి. అవి రాజ్యమంతటా విస్తరించాయి. అందులో ఒకటి ధాన్యకటకం. పన్నులరూపంలో వసూలయిన ధాన్యం నిలువ ఉంచిన చోటు. క్రమంగా అది ధనకటకంగా పేరు పొందింది. ఒక ఆహార రాష్ట్ర రాజధాని ఉన్నత స్థితికి వచ్చి శాతవాహనుల రాజ్యానికి రాజధాని అయ్యాక అది ధరణికోటగా ప్రఖ్యాతిని పొందింది. ఇప్పటికీ అది ధరణికోటగా పిలవబడుతూ ఉంది.

అది ధాన్యకటకంగా ఉన్నప్పుడు దాని కాపలా ప్రజలు, చర్మ కారులు. వీళ్ళు ప్రభువులకు విశ్వాసపాత్రులు. ఇప్పటికి నమ్ముకొన్న ఉత్తమ యజమానికి భక్తివిశ్వాసాలు చూపే నమ్మినబంట్లు వీళ్ళు. అది ధనకటకమయ్యేసరికి చర్మకారులు సైనికులుగా నిలిచారు. ఆపైన ధరణికోట చర్మకారుల సొంత ఆవాస భూమి. అనంతరం అన్ని వృత్తుల ప్రజల నివాస నగరంగా వ్యాప్తి చెందింది.

ధరణికోట, అమరావతి, మౌర్యులకాలానికి వ్యాపారకేంద్రాలుగా, ఉత్పత్తి ప్రాంతాలుగా, బౌద్ధభిక్ష ఆరామాలుగా, శ్రీపర్వత విశ్వ విద్యాలయ కేంద్రాలుగా ప్రసిద్ధి పొందాయి. ప్రజలు తక్కువ. పంటలు

ఎక్కువ. ప్రజలు చాలామంది రైతులు. ప్రభువులకు పంటలో ఆరోవంతు సిస్తుగా చెల్లించేవాళ్ళు. వసూలయిన పంటనిలువ ఉంచిన చోటు ధాన్యకటకం. అవసరానికి మించిన పంటను అమ్మేవాళ్ళు. అమ్మకాలుండటంతో ఇతర ప్రాంతాలనుంచి అమరావతికి రాకపోక లుండేవి. ఒక వైపు బౌద్ధమతం, మరోవైపు విద్య విదేశీయుల్ని కూడా ఆకర్షించాయి. బ్రాహ్మణ విద్య ఆర్యులు, బ్రాహ్మణులకే పరిమితం కాగా, బౌద్ధుల విద్య సార్వత్రికమైంది. అన్ని వృత్తుల ప్రజలు విద్యావంతులయ్యారు.

ఉత్తర భారతదేశం నుంచి దక్షిణ భారతదేశానికి ఎత్తైన వింధ్య పర్వతాలు, దక్కను పీఠభూమి కాకుండా రాకపోకలకు పడమట, తూర్పు సముద్ర మార్గాలు అనుకూలంగా గుర్తించారు వాళ్ళు. అమరావతి ఔత్తరాహులకు అనేక కారణాలవల్ల చేరవలసిన పట్టణ మయింది. ఆంధ్రప్రాంతంలో వాళ్ళకు నాటి రహదారులు కృష్ణా గోదావరీ నదులు. ఉజ్జయిని నుంచి అమరావతికి రావటానికి వాళ్ళు భోకర్‌దాన్, కోటిలింగాల, ధూలికట్ట, పెద్దబంకూరు, మీదుగా అమరావతికి చేరేవాళ్ళు. అదే తిరుగుప్రయాణం మార్గంగా కూడా ఉండేది. మరో మార్గంలో నాసిక్, కొండాపూర్, నాగార్జునకొండ మీదుగా అమరావతికి రాకపోకలుండేవి. నాడు భిన్న వ్యవహారాలకు అమరావతి చేరవలసిన పట్టణమయింది.

తూర్పు, మధ్యధరా సముద్ర ప్రాంతంనుంచి వచ్చేపోయే యవనులవల్ల శాతవాహన సామ్రాజ్యంలో అమ్మకాలు కొనుగోళ్ళు చేసే వ్యాపారం విరివిగా సాగేది. మెసపటోమియా, బాబిలోనియా, సుమేరియా, అలగ్జాండ్రియా దేశాల నగరాల నాగరికతా సంస్కృతుల వినిమయం కావటానికి అమరావతి కేంద్రంగా నిలిచింది.

నాటికే శాతవాహన సామ్రాజ్యానికి రోమ్‌నుంచి రోమన్లు, ఈజిప్టు నుంచి యూదులు, అలగ్జాండ్రియా నుంచి గ్రీకులు, ఉత్తర ఆఫ్రికానుంచి నీగ్రోలు శ్రీలంక నుంచి సింహళీయులు రాకపోకలు కొనసాగించేవాళ్ళు. అయితే బౌద్ధమతదృష్టి, కాకుంటే అమరావతితో వ్యాపారం, లేదంటే శ్రీపర్వత విశ్వవిద్యాలయంలో అధ్యయనం వాళ్ళ లక్ష్యాలుగా ఉండేవి.

నేడు సెయింట్ థామస్‌గా పేర్కొనబడుతున్న క్రైస్తవ మత వ్యాపకుడు, ఏసుక్రీస్తు 12మంది శిష్యులతో ఒకడైనవ్యక్తి, క్రీ.శ.40వ సంవత్సర ప్రాంతంలో, రానున్న ప్రమాదం నుంచి తప్పించు కోవడానికి, జెరూషలేం వదిలిపెట్టి, లెబనాన్, ఇరాన్‌ల మీదుగా పయనించి, ఆఫ్ఘనిస్తాన్ దాటి, ఉత్తర – పడమటి భారత భూభాగంలో ప్రవేశించి, సింధునది లోయదాటి, ఉజ్జయిని నుంచి అమరావతి దాకావచ్చి, ఇక్కడ నిలవక, కేరళరాష్ట్రంలో ప్రవేశించి, చాలాకాలం అక్కడ నివసించి, అవసానదశలో మద్రాసుచేరి, మైలాపూర్‌లోని లజ్‌కార్నర్‌లో కాలం చేశాడు. శాతవాహన చక్రవర్తుల పాలనలో అమరావతిని దర్శించిన సెయింట్‌థామస్ బౌద్ధమత అహింస సిద్ధాంతం, క్రైస్తవమత ప్రేమ సిద్ధాంతానికి ఎంత దగ్గర సంబంధం కలిగి ఉందో గుర్తించి ఉంటాడు. సిరియన్ క్రైస్తవులని పిలవబడే కేరళ క్రైస్తవులకు, కేరళలో అతి ప్రాచీన క్రైస్తవ మత ప్రచారం జరగటానికి, యూదులు పెద్ద సంఖ్యలో కేరళ చేరటానికి సెయింట్‌థామస్ మూలకారణమని, మార్గదర్శి అని భావింపవచ్చు. శాతవాహనుల కాలంలో, భారతీయేతరుల్లో గ్రీకులు, శకులు ఎక్కువగా ఆంధ్రదేశంలో నివసించారు. బుద్ధుడి జీవితసందర్భాలు, విభిన్నజన్మల కథారీతులు చెప్పే జాతకకథలు అమరావతి ప్రాంతంలో సృష్టింప బడటంతో పాటు, శాతవాహనుల కాలంలో వ్యాప్తి చెందాయి.

క్రీస్తు శకారంభానికే స్తూపనిర్మాణ దశలు, శిల్పకళా రీతులు, అమరావతి, ఘంటసాల, నాగార్జునకొండలలో వికాశదశను చేరు కొన్నాయి. ఈ శిల్పకళా సామ్రాజ్యమంతా బౌద్ధమత సంబంధమే కలిగి ఉంది. అమరావతి స్తూప శిల్పరీతులు అన్నీ స్థానిక సామగ్రి, స్థానిక శిల్పుల చాతుర్యం మీదే ఆధారపడి ఉన్నాయి. అందుకే దీనికి 'అమరావతి శిల్పరీతి' అని ప్రపంచ ప్రసిద్ధి వచ్చింది.

గాంధారశిల్ప గ్రీకునాగరికత ప్రభావం బుద్ధవిగ్రహనిర్మాణం భిన్న భంగిమలలో బుద్ధుడి స్వరూపాలు మీద ఉందని విజ్ఞులు అభిప్రాయ పడుతున్నారు. ఏథెన్స్ మాతరూపంతో బుద్ధుడితల్లి మూర్తిని పోలి ఉంటుందని ప్రసిద్ధి. అపోలో దేవత ముఖానికి, బుద్ధుడి ముఖ కవళికలకు శిల్పకళా నిపుణులు పోలికలు చూపెట్టారు. గ్రీకు దేవతలు బుద్ధుడికి వందనమాచరిస్తున్న దృశ్యాలు మిక్కుటమే! గాంధారంలో గ్రీసీయో – రోమన్ శిల్పశైలి కనిపించినా, దాని ప్రభావం అమరావతి స్తూపశిల్పాల మీద లేదు. ఈ శిల్పచాతుర్యం ఆంధ్రులకే ప్రత్యేకం, కాబట్టి దీనిని అమరావతి శిల్పరీతిగా ప్రపంచమంతా గుర్తించింది.

## 4. మాతృపూజ

తల్లిని పూజించటం ద్రావిడ సంప్రదాయమే! ఇది దక్షిణ భారత దేశంలో బౌద్ధమతంమీద ప్రభావం చూపినట్లుగా కనిపిస్తుంది. బుద్ధుడి తల్లిని, బౌద్ధమతంలో పూజించటం, అమరావతి స్తూపశిల్పాలలో గోచరిస్తుంది. ఇంద్రుణ్ణి, వరుణ్ణి, మిత్రుణ్ణి పూజించే ఆర్యులు, ఆరంభంలో స్త్రీలను, గౌరవించటం, తల్లిని ఆరాధించటం దేవతల్ని పూజించటం, పనిగా పెట్టుకోలేదు. క్రమంగా ద్రావిడ జాతి, బౌద్ధ మత ప్రభావాలతో స్త్రీమూర్తుల్ని పురుషసహితంగా ఆరాధింపసాగారు ఆర్యులు. బౌద్ధాన్ని జయించటానికి, బౌద్ధం లోని అహింసను గ్రహించి, యజ్ఞయాగాదుల హింసను త్యజించారు. మాంసాహారులైన ఆర్యులు శాకాహారులుగా మారారు. ఆవు మాంసభక్షణ మాని, గోమాతను

పూజించే స్థాయికి చేరుకొన్నారు. ఆర్యులు దేవుళ్ళలో కలిసి ఉన్న దేవతల్ని ఆరాధించటం వెనుక కూడా ద్రావిడ – బౌద్ధ జీవన దృక్పథమే ప్రతిబింబిస్తుంది. గౌతమీపుత్రశాతకర్ణి పేరులోని గౌతమి తల్లి, గౌరవానికి గుర్తు.

## 5. శైవ ప్రాధాన్యం

విస్తృతంగా వ్యాపించి ఉన్న బౌద్ధారామాల దగ్గర చిన్నచిన్న శైవ వైష్ణవ పూజాస్థలాలు, శాతవాహనుల కాలంలోనే ప్రారంభమయ్యాయి. ఇవి ప్రాచీన గ్రీసు దేశస్థ దేవాలయాలను పోలి ఉండటాన్ని బట్టి, వీటిని ఆర్యులు మొదలుపెట్టారు కాబట్టి, ఆర్యులు ఎక్కడనుంచి వచ్చారో కొంత తెలుస్తుంది. ఈ గుళ్ళు కుషానులు మృతిచెందిన రాజుల్ని గౌరవిస్తూ, దైవీయ భావనతో కట్టించిన నిర్మాణాలను పోలి ఉండేవి. జైన బౌద్ధ నిర్మాణాల సన్నిధిలో శైవ, వైష్ణవ దేవాలయాలు ప్రారంభించినా క్రమంగా భారతీయమైన శైవం ప్రాధాన్యం సంత రించుకోసాగింది.

పంచారామాలలో ఒకటైన అమరేశ్వరాలయం 10వ శతాబ్ది నాటికే అమరావతిలో సుప్రతిష్ఠితమయింది. ఇది అద్భుతమైన శివలింగం. మూడు అంతస్తులకు వ్యాపించి ఉంది. నాడిది పంచ ప్రాకార విస్తృతమయిందేకాని నేడిది మూడు ప్రాకారాలకే పరిమితమైన శైవాలయం.

శాతవాహనులు తమ పాలన ప్రారంభంలో హిందూ రాజులు. అంతఃపుర కాంతలు బౌద్ధమతానుయాయులు అయినందువల్ల హిందూ బౌద్ధమతాలు విస్తరిల్లాయి. క్రమక్రమంగా బౌద్ధమతవ్యాప్తి రాజ్య పాలనను ప్రభావితం చేసింది.

## 6. బౌద్ధమతవ్యాప్తి

శాతవాహనుల కాలంలో బౌద్ధం విశిష్టంగా వ్యాపించింది. బౌద్ధ మహాయానం స్థాపించిన మహామేధావి నాగార్జునుడు. నాగార్జునుడి పేరుతో అనేకులున్నారో, లేక పోతే ఈ నాగార్జునుడే ఇన్ని విద్యలు తెలిసిన సమర్థుడో, సందేహించటమే కాని, స్పష్టంగా చరిత్రకారులు తేల్చలేదు. ఇనుమును బంగారంగా మార్చు విద్య తెలిసిన ఒక నాగార్జునుడు ఉండేవాడని, 'రస రత్నాకరం' అనే గ్రంథం రచించాడని చెబుతారు. ఇతడికి నాగార్జున సిద్ధుడని పేరు ఉండేది. హిందూ సన్యాసిగా ఒక నాగార్జునుణ్ణి గూర్చి ప్రస్తావిస్తారు. ఈ ముగ్గురూ వేరు వేరు వ్యక్తులా కారా అన్నది అస్పష్టం. మహాయాన బౌద్ధ ప్రవర్తకుడు, శ్రీపర్వత విశ్వవిద్యాలయ ఆచార్యుడు, పాలకుడు, మాధ్యమికకారికల ద్వారా శూన్యవాద స్థాపకుడు, సుహృల్లేఖ రచయిత ఒకే నాగార్జునుడనేది స్పష్టం. గౌతమీపుత్ర శాతకర్ణి, నాగార్జునుడికి శిష్యుడని, తర్వాత మిత్రుడని, ఆపైన చక్రవర్తిఅని, బౌద్ధరామాలకు విరివిగా నిధులు దానం చేసిన విజ్ఞుడని ప్రసిద్ధి.

హిందూమత రాజరికంలో హింస అనివార్యం. బౌద్ధంలో అహింస పరమధర్మం. ఈ రెండు మతాలు ఏకకాలంలో శాతవాహన సామ్రాజ్యంలో ప్రజాభీష్ట నిర్ణాయకశక్తులుగా ఉండటంతో ఈ పరిపాలన ఇన్నేళ్ళు నిరాఘాటంగా కొనసాగింది.

శ్రీలంకకు వెళ్ళి బౌద్ధమత ప్రతిష్ఠ కావించిన అశోకుడి పుత్రుడు మహేంద్రుడు శ్రీపర్వత విశ్వవిద్యాలయంలో విద్యార్థి. ఎందరో విదేశీ విద్యార్థులు వచ్చినా, శ్రీలంక నుంచి వచ్చి, నాగార్జునుడికి ఆర్యదేవుడు ప్రథమశిష్యుడై వర్ధిల్లాడు. విశ్వవిద్యాలయంలో ఉత్తీర్ణుడై, శూన్యవాద స్థాపనలో విశిష్టుడై, దేశమంతటా ఈవాద ప్రచారం చేసి, ఆంధ్రదేశానికి, నాగార్జునుడికి ఖ్యాతితెచ్చిన లక్ష్యసిద్ధుడు విద్యాశుద్ధుడు ఆర్యదేవుడు. ఆర్యదేవుడు ఆర్యులకు దేవుడితో సమానమని కొందరు భావించగా, దేవుడైన ఆర్యుడుగా కొందరు ఊహించారు. ఇతణ్ణి అనార్యుడని, శ్రీలంక వాసిఅని ఆర్యులకు ఆరాధ్యుడని నిర్ణయింపవచ్చు. రెండుమతాల మైత్రితో, విశ్వవిద్యాలయవిద్యతో అమరావతి స్తూపంతో, అమరావతి విశ్వవిఖ్యాతమయింది. బౌద్ధమతతాత్త్వికుడు మేధావి నాగార్జునుడు అహింసకు ప్రాతినిధ్యం వహించగా, మూడు సముద్రాల మధ్య భూమి నేలుతూ పాటలీపుత్రం కోట కొమ్మున ఆంధ్ర రాజుల జెండా ఎగురవేసిన గౌతమీపుత్ర శాతకర్ణి హింసాత్మక రాజధర్మం నిర్వహించగా ఆంధ్రరాజులైన శాతవాహనులు 500ఏళ్ళు రాజ్యపాలన చేయగలిగారు.

## 7. శాతవాహనుల పాలన

శాతవాహనులు మౌర్యులకు సామంతరాజులుగా ప్రారంభమైన ఆంధ్రరాజులు. కౌటిల్యుడి అర్థశాస్త్రాన్ని, మౌర్యుల కేంద్రీకృతపాలనను ఆదర్శంగా తీసుకొన్నప్పటికీ వాటిని అవసరమైనంత కాలం గ్రహించి, అనంతరం త్యజించి, వికేంద్రీకృత పాలన కొనసాగించి, గొప్ప ఫలితాలు సాధించారు. మౌర్య చక్రవర్తుల సామంతరాజులు, అనతి కాలంలో స్వతంత్ర చక్రవర్తులుగా పరిణామం పొందారు. రాజ్యాన్ని 'ఆహారాలు'గా –రాష్ట్రాలుగా, దానికున్న ప్రధాన నగరాలను 'నిగమం' గా, గ్రామాధికారిని గ్రామిణి, గ్రామణిగా, ఏర్పాటు చేసి పాలించారు. పాలనలో వికేంద్రీకరణ విధానం శాతవాహన చక్రవర్తులకు కలసి వచ్చిన విధానం.

అశోకచక్రవర్తి, తమ సామంతులైన శైవమత నైష్ఠికులైన, శాత వాహనులు పాలించే రాజ్యానికి, బౌద్ధ భిక్షువును, మహాదేవుణ్ణి పంపించాడు. మత ప్రచారదృష్టి ఉన్న భిక్షువు, చైత్యకవాదమనే మహా సాంఘికవాదం ప్రారంభించాడు. ఇతడు రాజుల రాజుల అంతఃపుర

స్త్రీలను గౌరవించి, బౌద్ధమతం స్వీకరింపజేశాడు. వాళ్ళిచ్చిన దానాలతో బౌద్ధారామాలు నిర్వహించాడు.

రాణి నాగనిక వేయించిన నానాఘట్ శాసనం, గౌతమీబాలశ్రీ వేయించిన నాసిక్ శిలాశాసనం నాటి అంతఃపుర స్త్రీల ప్రత్యేకతను, స్వేచ్ఛను ప్రాముఖ్యాన్ని చాటుతూ ఉన్నాయి. మాతృమూర్తిని గౌరవించిన ఈ ఆంధ్రరాజులు ద్రావిడ సంప్రదాయ పరిరక్షకులు. 'గాథాసప్తశతి', వాత్స్యాయనుడి కామసూత్రాలు, స్త్రీల స్వేచ్ఛను, చైతన్యాన్ని, సౌందర్యాన్ని, దాంపత్య శోభను తెలుపుతాయి. అమరావతిలోనే కాక, కార్లే, నాసిక్ శిల్పాల్లో స్త్రీల రూపురేఖలు, హావభావాలు చూస్తే స్త్రీలెంత స్వేచ్ఛను అనుభవించారో, పురుషులెంత రసికతా ప్రియులో, శిల్పులెంత సౌందర్యమయంగా నాటి సమాజ అస్తిత్వానికి అద్భుత నైపుణ్యంతో అద్దం పట్టారో అర్థమవుతుంది.

అనంతరం అనేక రాజవంశాలు ఆంధ్రదేశాన్ని పరిపాలించాయి. పల్లవులు, ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు, శాలంకాయనులు. చాళుక్యులు, వాకాటకులు ఈ దేశాన్ని పరిపాలించారు. చోళ, చేర, పాండ్య రాజవంశాలు తమిళ దేశానికే పరిమితమైనా ఆంధ్రదేశం సరిహద్దుల్ని సంచలింపజేశారు. కాకతీయుల, రెడ్డిరాజుల కాలంతో, ఆపైన ముస్లింల పాలనలో ఆంధ్రదేశం విస్తృతంగా వికసించింది. ఈస్టిండియా కంపెనీకి, ఆపైన బ్రిటీష ప్రభుత్వానికి ఒకవైపు, మరోవైపు నైజాం నవాబుకు తెలుగు భూభాగం మీద పెత్తనం ఏర్పడకపూర్వం 200 సంవత్సరాలు వాసిరెడ్డి వంశస్థులైన కమ్మరాజుల సుప్రతిష్ఠిత పరిపాలన కొనసాగింది. రాజావాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు అరి వీరభయంకరుడు. స్వర్గంలోని అమరావతిలాగా, భూమ్మీది అమరావతి తన 'సుధర్మ' భావన సింహాసనం నుంచి సంపూర్ణ స్వాతంత్ర్యంతో పరిపాలించాడు.

రెండు వేలకంటే ఎక్కువకాలం తెలుగు ప్రజల రాజవంశాల సామ్రాజ్యాల రాజధానిగా ఉన్న అమరావతి మళ్ళీ ఆంధ్రప్రదేశ్‌కు రాజధానిగా నిర్ణయం కావటం హర్షదాయకమయింది. ఆమోదం వెల్లివిరిసింది. అమరావతి ప్రాచీనత, ప్రాశస్త్యం, ప్రాభవం, ప్రఖ్యాతి, దాని విశిష్టత స్థూలంగా అధ్యక్ష కవితోపన్యాసికలో ప్రస్తావించాను. చరిత్రలో అమరావతి స్థానం విశదీకరించే వ్యాసం ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 27.6.1962 సంచికలో విపులంగా వ్రాశాను. దానిలోని కొన్ని భాగాలు సమాచారం కోసం సౌకర్యం కోసం ఇక్కడ పొందుపరుస్తున్నాను.

## 8. ఆసియాకు అందాలుదిద్ది, జ్ఞానభిక్ష పెట్టిన అమరావతి

సూర్యభగవానుని కరస్పర్శతో పరామర్శపొంది, కాంతికళికలు చిలకరిస్తూ, కళాకౌముది వెండిపూతలతో మెరుగు పలుకులు గులకరిస్తూ, దివారాత్రాలు దీప్తిమంతంగా వెలుగొందే పుణ్యకళాక్షేత్రం అమరావతి.

అమరావతి అలనాడు ప్రపంచానికే విద్యాకళా తత్త్వభిక్ష పెట్టిన బౌద్ధ పీఠంగాను, తర్వాత శక్తిపీఠంగాను, అటు తర్వాత శైవమత సంబంధమైన పంచారామాలలో ప్రధానమయినదిగాను ప్రసిద్ధి పొందింది. నిసర్గ సౌందర్యంతో కళకు దైవత్వం ప్రతిష్ఠించుకొన్న అమరావతి చిరంజీవి.

అమరావతి అతిప్రాచీనమైన పుణ్యక్షేత్రం. ఇది గుంటూరుకు ఉత్తరంగా కృష్ణా తీరంలో ఉన్న శిధిల సమూహం. శాతవాహనుల కాలంనుంచి అమరావతి ప్రసక్తి చరిత్రలో ప్రస్ఫుటమవుతుంది. ఆంధ్రుల గర్వకారణంగా రాజధాని అయి విలిసిల్లింది. ఆనాడు ఆంధ్రదేశం స్వర్గంగాను అమరావతి ముఖ్యపట్టణంగానూ ఉండేవి. కర్మకారులు కనుక రాష్ట్రం పేరుతో శాతవాహనులకు సామంత రాజులుగా ఉండి ఆంధ్రదేశం పరిపాలించిన దినాలలో వేల్లగిరీ స్తూపాలతో పాటు అమరావతిలో బౌద్ధశిల్పం ఆధిక్యాన్ని ఆర్జించింది. కృష్ణానదిలో స్నానం అమరేశ్వరస్వామి పూజ, బౌద్ధస్తూపాలు దర్శించటం అమరావతిలో ప్రత్యేకతలు. కాశీకి వెళ్ళి గంగలో స్నానం చేసి పూజలు జరిపితే కలిగే పుణ్యం, కృష్ణలో స్నానం చేసి దీపారాధనచేస్తే కలుగుతుందని ఇక్కడి వారు భావిస్తూఉంటారు.

కృష్ణానది నిండుగా, గంభీరంగా ఒడ్డులు తాకుతూ ప్రవహిస్తున్నప్పుడు నౌకావిహారం హృదయంలో ఉల్లాసమూ, మనస్సులో భక్తీ రెంటినీ కలిగిస్తుంది. ఆ ప్రాంతంలో కృష్ణ కోపతాపాలకు అవకాశం లేదు. పడవమీద నది నీటిలోకి పోయి, క్షేత్రప్రాకారాల వైపు చూస్తే కలిగే ఆనందమూ, మంజుల మానసంలో తృప్తీ స్వచ్ఛంగా ఉంటాయి. పడవషికారు తరవాత స్నానం చేసి తడిబట్టలతో దేవ దర్శనం చేసుకొని ప్రతి ప్రాకారంలోనూ ఉన్న ఇతరేతర దైవ మూర్తుల సందర్శనం ముగించుకుంటారు యాత్రికులు.

బౌద్ధస్తూపాల అవశేషాలు అమరేశ్వర దేవాలయానికి కొంచెం దూరంగా ఉంటాయి. వాటిని దర్శించటం ఉత్సాహంగా దిగులుగా ఉంటుంది. స్తూప నిర్మాణంలో ఉన్న శిల్పకళ జగత్తుకు భిక్ష పెట్టిన స్థితి స్పష్టంగా కనబడుతూ ఉంటుంది. ఆ శిల్పాల పుట్టు పూర్వోత్తరాలు వెలుగులోకి ఎలా వచ్చిందీ తెలుసుకోవాలని కోర్కె కలుగుతుంది. రాజావాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు అమరావతిని రాజధాని చేసుకున్న తర్వాత జనం ఇళ్ళు కట్టించుకోవటానికి రాళ్ళు కావలసి పురాతనమయిన దిబ్బలు అనుకోకుండా త్రవ్వించటంతో 'దీపాలదిన్నె' వెలుతురులోకి వచ్చింది. దీనిలో బౌద్ధస్తూపం శతాబ్దాల తరబడి మరుగునపడి ఉంది. తవ్వినవాళ్ళకు దాని విలువ తెలియకపోవడంతో చాలాభాగం దుర్వినియోగం అయింది.

మెకంజీ (1797) ఆ శిల్పాలు చూచి, విలువ గుర్తించి పత్రికలలో వ్యాసాలు వ్రాసి, ప్రాచుర్యం ప్రసాదించాడు. అప్పటినుంచి వాటి అభివృద్ధి ప్రారంభమయింది. అంతటితో శిల్పకళ చిందులాడుతూ ఉండే రాళ్ళు కొన్ని కలకత్తా చేరాయి. మరికొన్ని మచిలీపట్టణం వెళ్ళాయి. మద్రాసు పోయిన శిల్పాలలో కొన్ని ఇంగ్లండు, ప్రయాణం చేశాయి. ఆ శిల్పాల తీరు చూచి పెర్గుసన్ అనే ప్రఖ్యాతచరిత్రకారుడు విమర్శకుడు వ్రాసి ప్రచురించిన గ్రంథంలో అమరావతి శిల్పకళకు ప్రపంచఖ్యాతి లభ్యమయింది. బౌద్ధాంధ్ర శిల్పచక్రవర్తుల మతదృష్టి వల్లనే కాక కళాస్పర్థ వల్ల మాత్రమే వాళ్ళ శిల్పాలకు విశ్వవిఖ్యాతి కలిగింది.

## 9. స్తూప స్వరూపం

ఇప్పుడు అమరావతిలో ఉన్న స్తూపం ఉత్తమ కళాభాగాలుపోగా మిగిలిన స్వరూపం. దీనిని మెకంజీ చారిత్రకంగా పునర్నిర్మించాడు. స్తూపం పాలరాతి కట్టడం. ప్రాచీనతా శిల్ప ప్రశస్తి తెలియని వెంకటాద్రి నాయుడు పని మనుష్యులు, పాల రాళ్ళను పగలగొట్టి, కాల్చి సున్నం చేసుకున్నారని వదంతి. స్తూపం మీద ఉన్న బొమ్మలు ఆధారం చేసుకొని ఆనాటి ఆంధ్రుల వస్త్రాలు, ఆభరణాలు, అలంకారాలు తెలుసుకోవచ్చు.

స్థూలంగా స్తూప రూపం ఇలా చెప్పుకోవచ్చు. ఒక పెద్ద వృత్తం లాగా గుండ్రంగా గోడ ఉంటుంది. దానికి నాలుగు పక్కలా సింహ ద్వారాలు ఉంటాయి. దానిలోపల ఎత్తుగా బోర్లించిన అర్ధగోళం ఆకారంలో 'అండము', దాని అంచులమీద చుట్టూ వేదికలు నిర్మింపబడి ఉంటాయి. వేదికను అనుకొని సింహద్వారాలకు ఎదురుగా నాలుగు 'అయక వేదికలు', ఒక్కొక్క దానిపైన ఐదు ఆయక స్తంభాలు ఉంటాయి. ఆయక స్తంభాలు ఆంధ్ర బౌద్ధమతస్తూప విశిష్టతలు. వృత్తానికీ, అండానికీ మధ్య ప్రదక్షిణ పథం ఉంటుంది. అర్ధగోళం పైన హార్మిక, ఆపైన ఛత్రం ఉంటాయి.

ప్రతి పాలరాతిమీద బుద్ధుని జీవితానికి సంబంధించినవి, పూర్వ జన్మకు సంబంధించినవి కొన్ని ఘట్టాలు చిత్రించబడ్డాయి. హీనయానమూ, మహాయానమూ రెంటికీ ఆధిక్యం ఉంది. ఈ శిల్పకళ దాదాపు క్రీస్తు పూర్వం రెండువందల సంవత్సరాల నాటిదని విజ్ఞులు ఊహిస్తున్నారు.

మార్దవం, సౌకుమార్యం, ఈ శిల్పాల విశిష్టత, ఈ స్తూప శిల్ప రచనలో స్త్రీ చిత్రాలు వినూత్నాలు. ఒక స్త్రీ శిల్పంతో పోలిక కలిగి, మరొకటి లేనేలేదు. స్త్రీ పురుషుల చిత్రాలు అనుగుణ భావస్ఫోరకాలై, జీవకళ చిప్పిలుతూ ఉన్నాయి.

ఆ కాలంలో భారతీయ శిల్పకళకు అమరావతి కళ శిరోభూషణమనీ, అంతేకాక ప్రపంచానికే దీక్షగా, శిల్పంలో 'అమరావతి శిల్ప రీతి' అని విశిష్ట సంప్రదాయం ఒకటి ఏర్పడిందని విజ్ఞులు తెలుపుతున్నారు.

## 10. ధరణికోట

శాతవాహనుల రాజధాని ధాన్యకటకం. అది ఇప్పటి ధరణికోట. ఇది అమరావతికి ఆనుకొని ఉంది. అప్పటిలో అమరావతి ఐశ్వర్య నిలయం. ఆంధ్ర శౌర్యానికి ఆలవాలం. బౌద్ధుల శిల్పకళకు ఆకరం. ఆనాడే ఆంధ్రుల ఔన్నత్యం అన్ని దేశాలకూ అర్థమయింది.

శాతవాహనులు బౌద్ధమత ప్రచారం చేసినా, శైవ ధర్మానికి ఆటపట్టయిన అమరావతి క్షేత్రం చెక్కు చెదరకుండా ఉండటంతో వారి పరమత సహనత ప్రత్యక్షంగా కనబడుతూ ఉంటుంది.

ఆ కాలంలో అమరావతిలో ఒక విశ్వవిద్యాలయం ఉండేది. ధాన్యకటక విశ్వవిద్యాలయం (శ్రీపర్వత విద్యాపీఠం) అని దాని పేరు. చతుష్షష్ఠి, కళలు నేర్పబడేవి. వివిధ దేశాలనుంచి విద్యార్థులు వస్తూ ఉండేవారు. లలితకళలు, ప్రాముఖ్యం పొందాయి. అందులోనూ శిల్పానికి ఆధిక్యం ఉంది. బౌద్ధమతస్థుల ప్రచారానికి అనుగుణంగా శిల్పకళ అభివృద్ధి పొందింది. ఆ కళానైపుణ్యం చరిత్రకళ అతీతంగా ప్రతిబింబించింది.

నాగార్జునుని ఆచార్యత్వంతో విశ్వవిద్యాలయం నడుపబడిన సమయంలో తయారయిన శిల్పకళా ఖండికలు ప్రపంచ కీర్తి నార్జించుకొన్నాయి. పురాతత్వజ్ఞులు నాగార్జునసాగర్ త్రవ్వకాలలో వెలుగులోకి తెచ్చిన శిల్పాలు ఆనాటి శిల్పజ్ఞతను చాటుతూ ఉన్నాయి. శాతవాహనుల రాజ్యపాలన కాలంలో బౌద్ధమతం ఉన్నత శిఖరాలనధిగ మించినా, హైందవ ధర్మానికి ప్రతీకగా నిలచిన అమరావతి క్షేత్ర ప్రశస్తి, ప్రజల ఆదరాభిమానాలు తగ్గలేదు.

సముజ్వల చరిత్రకు పంటపొలమైన అమరావతి క్రీ.శ. నాల్గవ శతాబ్దం నుండి బౌద్ధమతంలో వచ్చిన తాంత్రిక పద్ధతి కారణంగానూ, వైదికమత ప్రాబల్యం కారణంగానూ జీర్ణస్థితికి వచ్చింది. శాతవాహనుల రాజ్యమంతరించి, వల్లవులు, విష్ణుకుండినులు, చాళుక్యులు, వాకాటకులు మొదలగు వంశాలవారు పౌరాణిక మతాన్ని ప్రేమించి ప్రచారంచేశారు. వర్ణ వ్యవస్థ అర్థరహితమై తరతమభావాలు, ప్రజల్లో రేకెత్తి బౌద్ధయుగంనాటి ఆ విజ్ఞాన వైభవం, కళాసంపత్తి, వీరవిక్రమం,ఆ సంస్కృతి అన్నీ సన్నగిల్లిపోయినాయి. ఏడవ శతాబ్దములో హ్యూయన్‌త్సాంగ్ అనే చీనా యాత్రికుడు వచ్చేటప్పటికే ధాన్యకటకంలో బౌద్ధ వైభవం క్షీణదశలో ఉన్నట్లు తెలుస్తుంది.

## 11. చరిత్ర గతి

కోట కేతరాజు ధరణికోటను రాజధానిగా చేసుకొని, ఆంధ్రదేశం

పరిపాలించిన కాలంలో అమరావతి తిరిగి ప్రతిష్ఠ పొందింది. ఆ రాజ్యం క్షీణించటంతో క్షేత్రం మళ్ళీ పతనం చెందింది.

ఆపైన కొండవీటిని రెడ్డిరాజులు పరిపాలించినప్పుడు పునఃప్రతిష్ఠ జరిగింది. అనవేమారెడ్డి, స్వామివారిని సందర్శించి నిత్యనైవేద్య దీపారాధన ఏర్పాటు చేశాడు.

అప్పటికే అమరావతి హైందవులకు పుణ్యక్షేత్రమై ఉత్తమ స్థాయినందుకొని ఆంధ్రదేశంలో పవిత్ర పుణ్యతీర్థమై భారతావని అంతటిని ఆకర్షించే స్థితికి చేరుకుంది.

విజయనగర మహాసామ్రాజ్యం పరిపాలించిన విద్వత్కవి, కవి పండిత పోషకుడు, రాజకవి, కవిరాజు అయిన శ్రీకృష్ణదేవరాయలు అమరావతిని దర్శించి పూజించటంతో క్షేత్ర మాహాత్మ్యం మరో బంగారు రంగు శృంగారించుకుంది.

హైదరాబాదు నవాబు అయిన నాజరుద్దౌలా ముఖ్యమంత్రి చందూలాల్ అమరావతి పుణ్యక్షేత్రం దర్శించి నిత్య నైవేద్య దీపారాధనకు నవాబుచేత కొంత భూమి ఇప్పించాడు. అంతకుముందే నవాబుకు స్వామివారు కలలో దర్శనమిచ్చారట. పై చరిత్రకు క్షేత్రంలో శాసనాధారాలు ఉన్నాయి.

## 12. అమరేశ్వరాలయం

క్షేత్రం అంతా పది ఎకరాల విస్తీర్ణంతో ఉంటుంది. ప్రాకారాలు సమబాహు చతుర్భుజాలులాగా ఉంటాయి. నాల్గు పక్కల నాల్గు ద్వారాలు ఉన్నాయి. అవి ఒకదాని కొకటి ఎదురుగా తిన్నగా ఉన్నాయి. క్షేత్ర నిర్మాణంలో గొప్పతనం ఏమిటీ అంటే వాస్తు శాస్త్ర పరిజ్ఞానం ఉన్న వ్యక్తుల కళా విశిష్టత కనబడటం.

కాలక్రమంగా కళ్యాణ తిలకం దిద్దుకుంటూ దినదినమూ ప్రవర్థమాన మౌతున్న వందలాది యాత్రికులతో విలసిల్లుతూ వచ్చిన అమరావతి నేడు కృష్ణానది దక్షిణ భాగంలో ఒడ్డునే -గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకాలో ఒక చినగ్రామంగా ఉంది.

అమరేశ్వర దేవాలయం పంచప్రాకారాల పరివేష్ఠితం అంటారు. కాని మూడు ప్రాకారాలే స్పష్టంగా కనబడుతూ ఉంటాయి. ఆ ప్రాకరాలలో అనేక దేవ దేవతాగణం పూజలందుకుంటూ ఉంటుంది. గాలిగోపురం చుట్టూ పది ఆమడల దూరం కనిపిస్తుంది అంటారు. అది చాలా ఎత్తుగా ఉంటుంది. అది మొదటి ప్రాకారంలో ప్రణవే శ్వరుడు, శంకరాచార్యుడు, కాశీ విశ్వేశ్వరుడు, అన్నపూర్ణాదేవి, ఉమా మహేశ్వరుడు, దత్తాత్రేయులు, జ్వాలాముఖి అమ్మవారు, అగస్త్యే శ్వరుడు, పార్థివేశ్వరుడు, సోమేశ్వరుడు, నాగేంద్రుడు, మహిషాసుర మర్దని అమ్మవారు, కోసలేశ్వరుడు , వీరభద్రుడు ఉన్నారు.

ప్రతి దేవునికీ పూజలు చేస్తూ, నమస్కరిస్తూ, ముందుకు నడుస్తూ ఉంటే మొదటి ప్రాకారం పూర్తయిపోతుంది. పచ్చని గరికమీద తెల్లని మంచుతుంపరలు వెండి తుంపులు లాగా మెరుస్తూ ఉంటాయి. అక్కడ నడుస్తూ ఉంటే శరీరం పులకరిస్తూ ఉంటుంది. వాయు వీచికల్లో దోబూచులాడుతూ తిరిగే పరమాత్మ సమాశ్లేషం కారణం అయి ఉండవచ్చు.

రెండో ప్రాకారంలో విఘ్నేశ్వరుడు, కాలభైరవుడు, కుమారస్వామి, హనుమంతుడు, గణపతి కాక శమీవృక్షం కూడా ఉండటం చూడవచ్చు. ఈ ప్రాకారం మొదటిదానికంటే చిన్నది. ప్రతిదేవుని ఎదుటా ప్రార్థన చేసే పద్ధతి అందుకు అవసరమయిన ఉత్ప్రేరకాలు ఉన్నాయి. భగవంతుని గురించి ఆలోచించే మనస్సు కంటే అక్కడ కలిగే తన్మయీభావం హృదయానికే బాగా గుర్తు ఉంటుంది. పరమాత్మ సన్నిధిలో ఆత్మ పొందే అనుభూతి పరంపరలు ఆ ప్రాంతంలో కలుగుతూ ఉంటాయి.

మూడో ప్రాకారంలోని ఆవరణం మొదటి రెండు ప్రాకారాల కంటే చిన్నది అయితే ఎత్తుగా ఉంటుంది. చల్లని నీడలు ప్రసాదించే చెట్లు, ఆహ్లాదం కలిగించే కృష్ణవేణీ తరంగాలు, ప్రాకారాలలో పచ్చని గరిక, అన్నిటి కంటే దైవదర్శనంతో హృదయంలో కలిగే భక్తి భావం, అనుభావ, విభావాలతో అభివృద్ధి చెంది, రసస్థితి సమీపిస్తూ, అమరేశ్వర దర్శనంతో పరాకాష్ఠ నందుకుంటుంది.

అందులో మల్లేశ్వరస్వామి, విశ్వేశ్వరుడు, వేణుగోపాలస్వామి, నాగేంద్రుడు, చండీశ్వరుడు, కాళహస్తీశ్వరుడు, నందీశ్వరుడు ఉన్నారు. వారికి పూజలు జరుగుతూ ఉంటాయి. అక్కడ ముఖ్యమయిన విధి కృష్ణవేణిని ప్రార్థించటం. మరొకటి నవగ్రహాల పూజ.

అమరావతి యాత్రకు పోవటమంటే అమరేశ్వరస్వామి పూజ కొరకే. ఆ పూజ ఇక్కడే జరుగుతుంది. భస్మం ధరించి అమరేశ్వర ప్రార్థన, ఆపైన జ్యోతిర్లింగ స్తోత్రం ఒక్కసారే జరిపించాలి. తరువాత సమీపంలో ఉన్న బాలచాముండికా అమ్మవారిని దర్శించాలి.

ఏనాడో పుణ్యక్షేత్రంగా వెలసిన అమరావతి క్రమక్రమంగా పరిణామం పొంది అనేక దేవతలకు ఆలవాలమయింది. అందువల్ల అమరావతి పూర్వచరిత్ర, క్షేత్రం పుట్టుక గమనించాలి.

అమరులు నివసించిన ప్రదేశం కావటం వల్ల ఆ ఊరికి అమరావతి అని వాడుక కలిగింది. అమరులు స్వర్గంలోని అమరావతి విడిచిపెట్టి, ఆంధ్రదేశంలోని అమరావతిలో ఎందుకు నివసించారూ అంటే అందుకొక పూర్వగాథ ఉంది.

పూర్వం తారకుడికీ ఇంద్రుడికీ చాలా సంవత్సరాలు యుద్ధం జరిగింది. అందులో దేవసేనలే ఓడిపోయాయి. దేవతలు భయపడి పారిపోయి శ్రీమహావిష్ణువు శరణు జొచ్చారు.

శివభక్తుడయిన తారకుని చంపలేననీ, శంకరుని ప్రార్థించడం కర్తవ్య మనీ శ్రీమహావిష్ణువు తెలియజేశాడు. అప్పుడు అందరూ ఈశ్వరుని దగ్గరకు వెళ్ళి ఆయనకు పూజ చేశారు. ఈశ్వరుడు తన భక్తుని తాను చంపలేనని దుష్టత్వం కలిగి ఉన్నాడు కాబట్టి చనిపోవాలనీ, అందుకు తన అంశలో జన్మించిన కుమారస్వామిని సేనాపతిగా చేసి తారకునితో యుద్ధం చేయమని తెలియజేశాడు.

యుద్ధం జరిగింది. వేలాది రాక్షస సైనికులు మరణించారు. కుమారస్వామి బాణ ప్రయోగం వల్ల ఎంతసేపటికీ తారకాసురుడు చనిపోకపోవటం గమనించి కుమారస్వామి శక్తిని ప్రయోగించాడు. అప్పటికీ తారకుడు మూర్ఛపోయి తిరిగి బ్రతికాడే కాని మరణించలేదు. దేవతలు కైలాసపతికి ఈ విషయం తెలియజేశారు. తారకుడి కంఠంలో శివలింగం ఉందనీ, అందులోనే అతని ప్రాణాలు ఉన్నాయనీ, అది భిన్నం చేస్తే అతను చనిపోతాడనీ, భిన్నమయి పడిపోయిన శివలింగ శకలాలు పెరుగుతూ ఉంటాయని, వాటిని ప్రతిష్ఠించి దేవతలు పూజించాలని అప్పుడు మాత్రమే పెరగటం ఆగిపోతుందనీ శివుడు చెప్పాడు.

మహేశ్వరుడి వాక్పరిపాలన చేసి కుమారస్వామి తారకుని కంఠంలోని శివలింగాన్ని ఛేదించాడు. అయిదు శకలాలయి భూమ్మీద పడ్డాయి. అవి పడిన తావులు పుణ్యక్షేత్రాలయ్యాయి. పంచారామాలుగా ప్రసిద్ధి పొందాయి. అందులో పెద్దదయిన శకలం పడిన తావులో ప్రతిష్ఠచేసి పూజలు చేస్తూ దేవతలు నివసించటం వల్ల ఆ క్షేత్రానికి అమరావతి అని పేరు కలిగింది.

అమరావతిలోని స్వామివారి నామధేయం అమరేశ్వరుడనే ఆ పేరు వినగానే ఇంద్రుడు గుర్తుకు వస్తాడు. అయితే ఇంద్రుడి ప్రస్తావన ఏమీ లేదు. ఏమీ లేకపోనూ లేదు. జ్యోతిర్లింగం ప్రతిష్ఠ చేసింది ఇంద్రుడు. అయితే దేవుడు ఈశ్వరుడు. అమరులకు అమరత్వం కలిగించిన ఈశ్వరుడు ఈశ్వరుడై ప్రతిష్ఠ పొందటం వల్ల ఆ స్వామి వారి పేరు అమరేశ్వరుడుగా రూపొందింది.

మూడు ప్రాకారాలు కలిగిన అమరావతి పుణ్యక్షేత్రంలోనే త్రిమూర్తులలో మూడవ వాడయిన శివునికి, సృష్టి, స్థితి లయలలో మూడవ దాని అధినేత అయిన శివునికి సంబంధించిన శ్రీఅమరేశ్వర స్ఫటిక లింగం పదమూడు గజాల ఎత్తు కలిగి, మూడు అడుగుల కైవారంతో మూడు అంతస్తుల పైనున్న గర్భాలయంలోకి చొచ్చుకుపోయి ప్రకాశిస్తూ ఉంటుంది.

కోటికొక్క దేవుడుగా ముక్కోటి దేవతలకు ప్రతినిధులుగా ముప్పది మంది దేవతలు అమరావతీ పుణ్యక్షేత్రంలోని మూడు ప్రాకారాలలోనూ ఉన్నారు.

స్వామి అభిషేకం చేయటానికి భక్తులు మెట్లెక్కి పైకి వెళ్ళుతుంటారు. ఇరవైమంది ఒకేసారి అభిషేకం చేయటానికి అవకాశం ఉంది. స్వామిశిరంపైన మానవుల పూజలు, పాదాలపైన దేవతల పూజ జరుగుతుందని ప్రతీతి. ఉత్తరంగా ఉన్న చిన్నద్వారం నుంచి దేవతలు వచ్చి స్వామిని పూజించి వెళుతూ ఉంటారని భక్తుల నమ్మకం.

ఎన్నో వందల సంవత్సరాల క్రిందట జన్మించి, చరిత్ర తాకిడికి తట్టుకొని ఒకనాడు ప్రపంచంలో ప్రఖ్యాతి పొంది ఉత్తమ అభిజాత్యమూ, ఉన్నత ఆకర్షణమూ కలిగి విశిష్ట క్షేత్ర మాహాత్మ్యంతో విలసిల్లి అభివృద్ధి పొందిన అమరావతి పుణ్యస్థలి ఈనాడు నామమాత్రంగా మిగిలిపోయి, ఏదో జరుగక తప్పదన్నట్లు దీపారాధన జరుగుతూ, కొడిగట్టే స్థితికి వచ్చి, యాత్రికుల సంఖ్య దినదినానికి తగ్గిపోతూ, క్షీణించి పోతూ ఉన్నది. ఈసమయంలో ఆంధ్రులు తమ నాగరికతకూ, సంస్కృతికి, సభ్యతకూ, సంస్కారానికీ చిహ్నమయిన అమరావతిని పునఃప్రతిష్ఠ చేసుకొని నిత్యనైవేద్య దీపారాధన విరివిగా జరిపించుకోవాలని కోరుకోవాలి" కోరుకొన్నామిప్పుడు. ఆ కోరిక నెరవేరే స్థితిని చేరుకొంది.

## 13. వాసిరెడ్డి వంశపాలన

అమరావతికి ప్రజల్లో విశేష గౌరవం, ఆంగ్లేయ పాలకుల గుర్తింపు. అమరావతి స్తూపానికి ప్రపంచ ప్రఖ్యాతి కలిగిన సమయం, రాజావాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు వంశ పరిపాలన కాలం. దాదాపు 200 ఏళ్ళు ఈ రాజవంశం పరిపాలన కొనసాగించింది. అందులో వేంకటాద్రి నాయుడి కాలం విశిష్టదశను చేరుకొంది. అటు నైజాం నవాబుకు, ఇటు ఈస్టిండియా కంపెనీ నియమించిన గుంటూరు కలెక్టరుకు సింహస్వప్నంగా నాయుడు జీవించాడు. ఇతడు స్వాతంత్ర్య కాంక్ష, వ్యక్తిగత ప్రతిష్ఠ, ఆంధ్రుల జీవితం చైతన్యంతో నింపింది. ఆ చరిత్ర పూర్వాపరాలు విపులంగా తెలియటం అవసరమే!

వాసిరెడ్డి వీరి యింటి పేరు. వాసిరెడ్డి వాళ్ళు కమ్మకులస్థులు, వీరిది వల్లుట్ల గోత్రం. గో+త్రం=గోవును కాపాడటం, గోవును కాపాడే మునికి సంబంధించినదిగా ఉంటుంది మామూలుగా గోత్రం. ముని, మునిజనం, మునివంశం, ఇలా వంశాభివృద్ధి వల్ల గోత్రం విస్తృత మవుతుంది. సగోత్ర వివాహం ఉండదు. అదీ మారింది. గుళ్ళో దేవుడికి వివరంగా విషయం చెప్పటానికి గోత్రం కావాలి. బ్రాహ్మ ణులకు గోత్రం ఉంటుంది. అది పాలకులకు వ్యాపించింది. ఏ మునిగోత్రం లేనివాళ్ళు ఏదో ప్రసిద్ధి వల్ల గోత్రనామం పొందుతారు. సామ్యం వల్ల గోత్రం ఆపాదించుకొంటారు. గోత్రం లేనివాళ్ళు చాలామంది ఉంటారు. మాదిగలు గోత్రం పెట్టుకోరు. వాసిరెడ్డి వాళ్ళ గోత్రం వల్లుట్ల. దాని ప్రసిద్ధికి కారణం స్పష్టం కావాలి.

వాసిరెడ్డి వాళ్ళ పూర్వీకులు వాసిలిలో నివసించారు. అందువల్ల వాసిరెడ్డి వాళ్ళు అయ్యారని ఒక ఆలోచన. అయినా కమ్మకులస్థులకు రెడ్డిపదం ఇంటిపేరులో ఎలా చేరింది? ఇది 14వ శతాబ్ది దాకా చరిత్రకు తెలియటం లేదు. "జగనొబ్బ గండ బిరుదాదులు, వాసిరెడ్డి నామము అనవేమారెడ్డి వలన వచ్చినవి". 1430 ప్రాంతంలో వాసిరెడ్డి పోతినీడు పీఠికాపుర పాలకుడు. రాజమండ్రిని పరిపాలించిన కాటయవేమారెడ్డి, వీరభద్రారెడ్డిరాజుల సామంత రాజు. పోతినీడి కొడుకు పేరు, వేమారెడ్డి పేరిట, వేమయ్యగా ఏర్పడింది. రెడ్డిపదంతో ఉన్న పదిగృహనామాలు, రెడ్డిరాజులను అనుసరించి వచ్చి ఉండవచ్చునని, వాసిరెడ్డి గృహ నామం, అనవేమారెడ్డి, కాటయవేమారెడ్డి రాజుల కాలంలో ఏర్పడి ఉంటుందని కొడాలి లక్ష్మీనారాయణ శ్రీరాజావాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు' గ్రంథంలో ఊహించాడు.

సాధారణంగా రాజు అన్న అర్థంలో ణేడు -ణేని- రేని - నేని అనేది కమ్మకులస్థుల గృహనామాంతంలో ఉంటుంది. ఇంటిపేరు ణేని పదంతో ఉండటం సామాన్య మయినప్పుడు అలా లేని వాసిరెడ్డి పేరు ఆలోచింపవలసి ఉంది. రాజరికం నుంచి పరిణామం చెంది, కమ్మవాళ్ళు మామూలు ప్రజలయినప్పుడు వేరు వేరు ఇళ్ళపేర్లు, గోత్రాలు ఏర్పడ్డాయి. చౌదరి పదం ఉద్యోగపదం. గ్రామాలలో స్థానిక వ్యాపారాల లావాదేవీలు చూచే ఉద్యోగం పేరది. కాలక్రమాన బిరుదంగా మారింది. ఇప్పుడది కులం గుర్తుగా చెలామణి అవుతూ ఉంది. 1580 ప్రాంతంనుంచి చౌదరి పదం కనిపిస్తుంది. నాయకుడు పదంనుంచి, నాయడు, నాయుడు పదాలు ఏర్పడ్డాయని, తంజావూరును పాలించిన నాయకరాజులు, నాయుల్లని అంటారు. నాయుడు పదం, బలిజ, తెలగ, కాపు, కులాల వాళ్ళు గ్రహించటంతో దానికి పర్యాయంగా కమ్మ కులస్థులు చౌదరి పదం కూడా గ్రహించినట్టు అర్థమవుతూ ఉంది.

## 14. వాసిరెడ్డి వంశవృక్షం

వాసిరెడ్డి వంశవృక్షం లభ్యమయిన మేరకు స్థూలంగా ఈవిధంగా గుర్తింపవచ్చు. వాసిరెడ్డి సదాశివరాయలు 1545 నుంచి 70 దాకా పరిపాలించాడు. శ్రీగిరి మల్లికార్జునుడు - వీరపనీడు - రామనచౌదరి - చినపద్మనాభుడు, చినరామలింగన - జగ్గభూపాలుడు - వేంకటాద్రి నాయుడు - జగన్నాథబాబు, రామనాథబాబు కాలక్రమంలో రాజ్యం పరిపాలించారు.

చింతపల్లిలో పాలనం 1668లో ఆరంభమయింది. చిన పద్మ నాభుడు చింతపల్లిలో కోటను 1710 లో నిర్మించాడు. అప్పుడీ సంస్థానం కొండవీటిలో భాగంగా ఉండేది. రాజావాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు 1797లో అమరావతికి చేరి కోట నిర్మింపజేశాడు. వాసిరెడ్డి వేంకటాద్రినాయుడి సంస్థానంలోని, మచిలీపట్నం ప్రాంతం నైజాం నవాబు అధీనంలో, గుంటూరు ప్రాంతం ఈస్టిండియా కంపెనీ పరిపాలనలో ఉండేవి. అందువల్ల అటు గోల్కొండ సుల్తానుకు, ఇటు ఈస్టిండియా కంపెనీకి కప్పం కడుతూ ఉండేవాడు నాయుడు.

రామనచౌదరి వాసిరెడ్డి సంస్థానాధీశుడుగా 1668 నుంచి పాలించాడు.

| కాలం | పేరు | పాలించిన సంవత్సరాలు |
|---|---|---|
| 1668-86 | రామన్న(చౌదరి) | 18 |
| 1686-1712 | చినపద్మనాభుడు(రామన) | 27 |
| 1712-1714 | బుచ్చిరాఘవయ్య | 3(2?) |
| 1714-1722 | చంద్రమౌళి | 8 |
| 1722-1727 | పెద నరసయ్య | 5 |
| 1727-1738 | పెద సూరన్న | 11 |
| 1738-1740 | చిన సూరన్న | 3(2?) |
| 1740-1758 | చిననరసభూపతి | 18 |
| 1758-1760 | చినరామలింగం | 3(2?) |
| 1760-63 | నాగన్న | 3 |

నాగన్నకు ఇద్దరు కొడుకులు. రామన్న, జగ్గన్న, ఇద్దరికీ సంస్థానం పంచి ఇచ్చాడు నాగన్న.

| | | |
|---|---|---|
| 1763-1783 | రామన్న | 20 |
| 1763-1765 | జగ్గన్న | 3(2?) |

మూడేళ్ళకే జగ్గన్న మృతి చెందాడు. ఇతని సంస్థానం కూడా రామన్న పాలించాడు. జగ్గన్నకొడుకు వేంకటాద్రినాయుడు. తండ్రి, అతడితోపాటు తల్లి గతించినప్పుడు నాయుడు నాలుగేళ్ళ వాడు. మైనరు. మైనరు సంస్థానం కూడా రామన్న పరిపాలించాడు. జగ్గన్న రామన్నల సంస్థానాలు, మేజరయిన నాయుడు వశం చేసుకొన్నాడు. 1783 నుంచి 1816 దాకా పాలించాడు. దాయాదుల్ని అణిచి వేశాడు. బందిఖానాలో ఉంచాడు. నాయుడికి కొడుకుల్లేరు. దత్త పుత్రులకు సంస్థానం రెండు భాగాలు చేసి పంచి యిచ్చాడు. సమమైన భాగాలు. సమదాయం, జగన్నాథ బాబుకు గ్రామాలెక్కువని, రామ నాథ బాబుకు ఆదాయం ఎక్కువని పరస్పరం గుర్రుపెట్టుకొని అవిభక్త సంస్థానానికి వారసుణ్ణి నేనంటే నేనంటూ సివిలు కోర్టుల చుట్టూ ముప్పై ఏళ్ళు తిరిగారు. వీళ్ళ వారసులు ఇప్పుడూ ఉన్నారు.

## 15. రాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు

వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు 27.4.1761న జన్మించాడు. 1765లో తల్లిదండ్రులు గతించారు. పెదతండ్రి రామన్న పెంపకంలో పెరిగాడు. బాల్యంలోనే దానశీలిగా కనిపించాడు. దుబారా చేస్తాడని

పెదతండ్రి భయపడటం న్యాయమే! దుబారా చేయలేదు. పెద్దయ్యాక గౌరవ మర్యాదల కోసం, పేరు ప్రఖ్యాతుల కోసం ధనం బాగా వెచ్చించాడు. 17 ఏళ్ళ వయసులో 1778లో వెర్రెమాంబను సొంత ఇష్టంతో, ఎవరి సంప్రదింపులు లేకుండా, తనే వర్తమానం పంపి, సంబంధం కుదుర్చుకొని, పెళ్ళి పెద్దల సమక్షంలో చేసుకొన్నాడు. 1783లో పట్టాభిషేకం జరిగింది. కొంత పెద్ద తండ్రి ఇష్టం. కొంత దౌర్జన్యం. వెర్రెమాంబకు రాజ్యలక్ష్మి పుట్టింది. కొడుకులేడు. పుత్ర సంతానం కోసం 1785లో మళ్ళీ పెళ్ళి చేసుకొన్నాడు. రెండో భార్య పేరు పార్వతి.

1780 ప్రాంతం నుంచి 1788 దాకా చాలా దుండగాలు చేశాడు. కవులు సాహసకృత్యాలన్నారు. ఇతర సంస్థానాల ప్రభువులు క్రూరత్వం అన్నారు. పెదతండ్రిని పదవీభ్రష్టుణ్ణి చేయటం, వారసులు, దాయాదులు అయిన చంద్రమౌళి నాగన్నలను కారాగారంలో పడేయటం, జ్ఞాతి అయిన ముక్త్యాల సంస్థానాధీశుడైన లక్ష్మీపతిని నిర్వీర్యుణ్ణి చేయటం, కోట కూల్చటం, విలువైన పత్రాలు, సంపదతో పాటు, దోచుకోవటం, నందిగామదాకా కొల్ల గొట్టుకొంటూ పోవటం, ఆరంభంలోని కొన్ని సాహసకార్యాలు, కాదంటే దుండగాలు. నైజాం నవాబుకుగానీ, ఈస్టిండియా కంపెనీకిగానీ, నాయుడంటే నమ్మకం లేదు. సందేహాలు, అనుమానాలు అనేకం. వాళ్ళు ఇతడి శక్తియుక్తులకు, సైనిక సామర్థ్యానికి భయపడుతూ, ఏ చర్యకూ పూనుకోకుండా భయభక్తులతో తగ్గి ఉండేవాళ్ళు.

1970లో చెంచులు సంస్థానంలో చేరినట్లు, 1791 నుంచి 94 దాకా నిర్మాణ కార్యక్రమాలు జరిపించినట్లు, 1794లో వాళ్ళు హత్యకు గురయినట్లు స్పష్టమవుతుంది. 1.7.1795న చింతపల్లి కోటను కుంఫినీ అధికారులు రెండు దళాల సైన్యాన్ని పంపి వశం చేసుకున్నారు. రాజు పాలనకు అడ్డులేదు. కాని అకృత్యాలకు అడ్డుకట్టగా సైన్యం నిలిచింది. 1795 సెప్టెంబరులో దసరా ఉత్సవాలు నాయుడు చింతపల్లి కోటలోనే జరుపుకొన్నాడు. 15.10.1795న, చంద్రమౌళిని, ఆపైన నాగన్నను కుంఫినీ సైనిక దళాలు, నాయుడి ఇష్టంతో నిమిత్తం లేకుండా, విముక్తిల్ని చేశాయి. వాళ్ళకు ప్రతిమాసం భృతి చెల్లించే ఏర్పాటు చేయించాయి. వాళ్ళు కోరినచోట ఉండే వసతి సౌకర్యం ఏర్పాటు, గుంటూరు జిల్లా కలెక్టరు చేయించాడు. మరేమయినా అకృత్యాలు దాయాదులకు గానీ, కంపెనీకిగానీ చేస్తాడని సందేహించి, దాయాదుల విడుదలకు ముందే 1795 సెప్టెంబరులో వేంకటాద్రి నాయుణ్ణి గుంటూరు తీసుకువచ్చి సైన్య పర్యవేక్షణకింద ఉంచారు. చింతపల్లి పోరాదని ఆంక్షలు విధించారు. చేబ్రోలు పోవచ్చునని అనుమతి ఇచ్చారు. సంస్థానానికి ప్రభువు వేంకటాద్రి నాయుడే, కాని ఏంచేయాలన్నా కలెక్టరు అనుమతి తీసుకోవాలి (మచిలీపట్టణం నుంచి వేరుచేసి 1794లో గుంటూరు జిల్లాను ఏర్పాటు చేశారు). చెప్పకుండా ఏమయినా చేస్తే, కలెక్టరుకు తెలిస్తే సంజాయిషీ అడుగుతాడు. జవాబు చెప్పవలసి ఉంటుంది.

వేంకటాద్రి నాయుడు ఆంగ్లేయుల్ని ఎదుర్కోవటం కష్టమని గుర్తించాడు. వాళ్ళ అనుమతితోనే రాజుగా ప్రవర్తిల్లటానికి అంగీకరించాడు. కంపెనీ అన్ని ఏర్పాట్లు చేయగా, తిరుపతి యాత్ర 10.3. 1796న ప్రారంభించాడు. పల్లకిలో ప్రయాణం. మూణ్ణెల్లకు తిరిగి వచ్చాడు. 1797 ఫిబ్రవరిలో అమరావతీ నగర రాజప్రాసాదంలో ప్రవేశించాడు.

దాయాది, వారసుడు అయిన చంద్రమౌళికి కుమారుడు జగన్నాథ బాబు 1797 సెప్టెంబరులో జన్మించాడు. 1798లో వేంకటాద్రి అతణ్ణి దత్తత తీసుకొన్నాడు. 1803లో అచ్చమ్మ, రంగాంబలను తెచ్చి అతడికిచ్చి పెళ్ళిచేశాడు.

వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు తన సంస్థానంలో కలుపుకొన్న ముక్త్యాల జమీని కలెక్టరు 1801లో చంద్రమౌళికి ఇప్పించాడు. నాయుడికి ఇవ్వక తప్పలేదు.

దాయాది, వారసుడు అయిన నాగన్నకు కుమారుడు రామనాథబాబు 1800లో జన్మించాడు. 1801లో ఇతణ్ణి దత్తత తీసుకొన్నాడు నాయుడు.

వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడి ఆరోగ్యం, భగందర వ్యాధివల్ల, బాగుండేదికాదు. ఆంగ్ల వైద్యం అంగీకరించలేదు. సంప్రదాయ వైద్యంతో పట్టీలు వేసుకొంటూ ఉండేవాడు. జబ్బు తగ్గలేదు. 1804లో టీకాల మందులు తన సంస్థానంలో అంగీకరించలేదు. కొన్ని ఆంగ్ల వ్యాస రచనలో టీకాలమందులో సంస్థానంలో అంగీకరించినట్లు తెలపటం కనిపిస్తుంది. కంపెనీవాళ్ళంటే నాయుడికి సందేహం. మనస్థిమితం తక్కువగా ఉండేది.

రాజ్య సుస్థిరతకోసం తాను చేసిన మంచిపనులు, స్వేచ్ఛా ప్రవృత్తి, స్వాతంత్ర్య కాంక్ష అటు గోల్కొండకు, ఇటు కంపెనీకి చెడ్డ పనులుగా కనిపించి ఆంక్షలు పెరిగాయి. సంజాయిషీలివ్వవలసి వచ్చింది. జవాబుదారీతనం నెత్తిన పడటం అతణ్ణి బాగా బాధించేది.

కళలతో, కవులతో 'సుధర్మ'లో కొలువుదీరి, గోష్ఠులు ఏర్పాటు చేయించి, కవుల్ని కళాకారుల్ని పోషించి, మర్యాద మన్ననలు పొంది సంతృప్తిగా సుఖంగా జీవించేవాడు. బుచ్చి వెంకు వంటి భోగంకవిని, చిందుతొక్కే, తప్పెట వాయించే మాదిగ కళాకారుల్ని, వీధి బాగవతుల్ని నాయుడు ప్రోత్సహించి, పోషించాడు.

నైజాం నవాబుతో, ఈస్టిండియా కంపెనీతో సత్సంబంధాలు కొనసాగిస్తూ 1797 నుంచి 1816 దాకా ప్రశాంతంగా జీవించాడు.

1815 నవంబరులో పిండారీల దోపిడీ జరిగింది. సైన్యం విజయ వంతంగా వాళ్ళను పారద్రోలింది.

అప్పటికి యువరాజులకు 18, 15 సంవత్సరాల వయస్సు వచ్చింది. సంస్థానం ఇద్దరికీ సమానంగా పంచి 16.9.1816న స్వర్గస్థుడయ్యాడు నాయుడు.

కొంత వాదవివాదాలున్నప్పటికీ రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు 55 ఏళ్ళు బ్రతికాడు. అందగాడు. స్ఫురద్రూపి, సాహసి, స్వాతంత్ర్యం స్వేచ్ఛ కోరుకొన్నాడు. ఐదడుగుల ఎత్తు. చామనఛాయ . శత్రువుల్ని శాసించాడు. ప్రభువుల్ని ధిక్కరించాడు. దుర్మార్గుల్ని అంతం చేశాడు. సన్మార్గుల్ని కాపాడాడు, నమ్మిన వాళ్ళను అందలం ఎక్కించాడు. దాయాదుల్ని వారసుల్ని, అంతం చేయకపోయినా అడ్డులేకుండా చూచుకొన్నాడు. యుక్తులెక్కువ. సందేహించటం మొదట సర్దుకొనటం తర్వాత చేసేవాడు. భయాన్ని జయించటానికి దాడి చేసేవాడు. ఇష్టాన్ని సాధించలేకపోతే ఇనిష్టాన్ని అంగీకరించేవాడు.

## 16. భుజంగరాయుడు

రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు సుఖంగా జీవించటానికి ఎన్ని ఒడిదుడుకులు వచ్చినా తట్టుకొని నిలవటానికి సైన్యాధ్యక్షుడు భుజంగరాయుడు ప్రధాన కారకుడు. అతడి శక్తియుక్తులు సంస్థాన సంరక్షణ మూలాలయ్యాయి.

"వీరసింగు, రామసింగు, భద్రసింగు, భుజంగరావు మొదలగు హరిజనులు, కోటోజీ, సర్సోజీ, రామోజీ మున్నగు మరాఠా సర్దారు లీయన సైన్యములో నుండిరి" (పుట: 109, రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు. రచయిత శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ.)

పూర్వం మాదిగల్ని సింహాలనేవాళ్ళు కాబట్టి సింగు సింహ శబ్దభవం కాబట్టి, ముగ్గురు సింగులతో పాటు, భుజంగరావును కూడా సింగు అనకపోవటం నాకు ఆసక్తి కలిగించింది. నాయుడి కాలంలో పంచములుగా మాలమాదిగలుగా పిలవబడేవాళ్ళను ఈ గ్రంథ రచనా కాలానికి (1963) హరిజనులనటం సామాన్యమయింది. మరాఠా సైనికులు నాయుడి సైన్యంలో ఉన్నారు.

భుజంగరావు, వీరసింగు, రామసింగు, కోటోజీ, నరసోజీ మున్నగు యోధాగ్రేసరులు వీరి సేవలో నుండిరి' (పుట: 232 అదే) గ్రంథ రచయిత, అందరితోపాటు భుజంగరావును కూడా యోధాగ్రేసరు డన్నాడు. మిగతా వాళ్ళ పేర్లకంటే ముందుగా భుజంగరాయుడి పేరు వ్రాయటంవల్ల ప్రాధాన్యంకూడా అర్థమవుతూ ఉంది.

"కొందఱు చెంచుదొరలు మహారణ్యములఁ దిరుగుచు స్త్రీ పురుషాదుల హింసించుచు, సొమ్ముల నపహరించుచు, బాటసారుల భీతిల్లఁ జేయుచుఁ దిరుగుచుండిరి. ప్రజలెల్లరు భీతిల్లి నాయనికి దొంగల బాధల మనవి చేసికొనిరి. నాయఁడీ దుర్మార్గములనెల్ల విని తన సేనాధిపతి యగు భుజంగరావును బిలిచి యరణ్యంబులకేగి, సామదానంబులఁజెంచు వారలఁ దోడ్కొని రమ్మని పంపెను. ఆ సేనాధిపతి వెళ్లి చెంచుల పెద్దయగు రామదాసుతో నెమ్మదిగా సంభాషించి, వేంకటాద్రి ప్రభుఁడు వారికే కొఱంత లేకుండా చూచునని చెప్పగా నమ్మి వారు నాయని చెంతకుఁజేరిరి. ఇట్లు వచ్చినవారు 500 అని, వీరి నాయకుడు జిల్లాల కృష్ణా నాయకుడని వంశ చరిత్ర" (పుటలు: 108, 109 అదే)

ఇప్పటికి భుజంగరాయుడు సేనాధిపతి అయ్యాడని స్పష్ట మయింది. చెంచులు దొంగలని, ప్రజలకు దొంగతనాల వల్ల సుఖ శాంతులు లేవని, వాళ్ళను చంపాలనే నాయుడు పిలిపించాడు. సామదానాలతో పిలుచుకురమ్మన్నాడు. చంపటానికే విందుకు పిలిపించాడని కల్నల్ మెకంజీ సమాచారం.

చంపే ఉద్దేశం ఉందని భుజంగరాయుడికి తెలిసినట్లుగా స్పష్టం కాలేదు. వాళ్ళు రాజును నమ్ముతారా? అంత తెలివిలేకుండా వున్నారా? నమ్మకపోతే ఏంచేస్తారు? ఆహ్వానం తిరస్కరిస్తారు. తిరస్కరిస్తే ఏమవుతుంది? బలం ప్రయోగిస్తారు. ఎవరు? రాజు. ఎవరితో? సైన్యంతో. సైన్యాధిపతి భుజంగరాయుడు సుప్రసిద్ధ యోధాగ్రేసరుడు. అతడిమాట కాదంటే సైన్యం వస్తుంది. ప్రాణహాని జరుగుతుంది. ఈ 'సామం' అంగీకరిస్తే 'దానం' మేలు కలిగించ వచ్చు. అందుకు అంగీకరింపవచ్చు.

అంగీకరించకపోతే? తిరగబడవచ్చు! ఎవరిమీద? భుజంగ రాయుడి మీద! కొట్టవచ్చు. తిట్టవచ్చు. చంపవచ్చు. ఆ యోధాగ్రేసరుణ్ణి చంపలేమన్న భయం ఉంటే ఉండవచ్చుకాని అయిదు వందల మంది ఒక్కణ్ణి చంపటం కష్టంకాదు. సైన్యాధిపతిని చంపి బతకలేమన్న భయం ఉండవచ్చు. ఏమయినా కానీ అని తెగిస్తే భుజంగరాయుడికి ప్రాణభయం, చావు ఖాయం.

శత్రుశిబిరం వంటి అడవిలోకి భుజంగరాయుడు ప్రవేశించటం వల్ల అతడి సాహసం, ధైర్యం, తెగువ, వీరత్వం తెలుస్తాయి. అవసరమైతే వాళ్ళతో తాను యుద్ధం చేయగలడన్న ధీమా తెలుస్తుంది. ఒక్కణ్ణే వెళ్ళి ప్రాణాలతో తిరిగిరాగలనన్న అతడి ఆత్మవిశ్వాసం తెలుస్తుంది.

అన్నింటిని మించి, వాళ్ళతో సంభాషించి, వాళ్ళ మేలు చెప్పి, వాళ్ళను ఒప్పించి, తనతోపాటు వాళ్ళను కోటకు తీసుకురావటం విశేష శక్తి సామర్థ్యాలకు నిదర్శనంగా కనిపిస్తుంది.

దొంగలైన చెంచులను, రాజును, రాజరికాన్ని నమ్మని వాళ్ళను, ఏ సంప్రదింపులకైనా వ్యతిరేకంగా ఉండేవాళ్ళను, మాటలతో

వాగ్దానాలతో, అనుకూలంగా మార్చి కోటకు తోడ్కొని రావటంలో భుజంగరాయుడి వాక్‌శక్తి, సంభాషణ చాతుర్యం, మాట నేర్పు అర్థ మౌతాయి. మంత్రాంగం నైపుణ్యం తెలుస్తుంది. చర్చలతో పరిష్కారం సాధించే శక్తియుక్తులు విశదమవుతాయి.

అడవులలో నుంచి, మైదానాల్లోకి గిరిజనుల్ని వెంటతేగలగటం నేటికీ అసాధ్యంగా ఉన్నదాన్ని, భుజంగరాయుడు సుసాధ్యం చేయటం అద్భుతమే! అది ప్రజాస్వామ్యంకాదు, అభివృద్ధి ప్రణాళికలు లేవు. ఎన్ని చెప్పినా నేటికీ గిరిజనులు మైదానాల మనుష్యుల్ని నమ్మరు. నాయకుల్ని అసలు నమ్మరు. మీకు కాలనీ కట్టిస్తున్నామన్నా రారు. మామూలు మనుష్యుల్నే నమ్మనివాళ్ళు రాజుల్ని రాజప్రతినిధుల్ని, రాజరికాన్ని, సైన్యాధిపతిని అసలు నమ్మరు. అసలు మాట్లాడరు. ప్రమాదమని శంకిస్తే ప్రాణం తీస్తారు. అదీ సందర్భం. అక్కడికి ఒక్క సేనాని నిరాయుధుడుగా (ఆయుధంతో ఉంటే అవస్థే) నిస్సైన్యంగా (సైన్యమంటే యుద్ధమే) వెళ్ళి వాళ్ళను ఒప్పించి వెంట తీసుకురావటం వెనుక-భుజంగ రాయుడికి ఉన్న సర్వశక్తులకంటే అతీతంగా-అతడు ప్రేమమూర్తిగా కనిపించటంవల్ల, వాళ్లందరు ప్రేమకు లొంగిపోవటం తెలిసివస్తుంది. ఇది ప్రేమ విజయం. సైన్య వ్యూహ విజయంకాదు. భుజంగరాయుడు విశేష ప్రేమమూర్తిగా కనిపిస్తాడు. బైబిల్‌లో మోజెస్ ఇజ్రాయేలీయుల్ని పాలు, తేనెలు ప్రవహించే సురక్షిత ప్రాంతానికి తీసుకుపోవటంలాగా కనిపిస్తుంది. ఇది భుజంగరాయుడి ప్రేమ విజయం.

నేను చిన్నతనంలో విన్న కథలో రాయుడు 500 మంది చెంచుల్ని బంధించిన బలశాలిగా వర్ణింపబడ్డాడు. నిజానికి ఆలోచించిన కొద్దీ, భుజంగరాయుడు శారీరక బలశాలిగా కంటే మానసిక బలశాలిగా; మానసిక బలశాలిగా కంటే, హార్దిక బలశాలి అయిన ప్రేమమూర్తిగా కనిపించి, చిన్ననాటి ఆశ్చర్యం స్థానంలో ఒక విరాట్ ప్రేమమూర్తి దర్శనం కలిగింది.

"వీరలెల్లరు చింతపల్లిలో నుండి కొలువుకూటమ్మున రాజసేవ చేయుచుండిరి" (పుట : 109 అదే)

చంపాలని రప్పించిన వాళ్ళను రాజసేవలో వినియోగించటం వెనుక భుజంగరాయుడి ప్రేమ పనిచేసి ఉండాలి.

"ఒకనాడు రాజువెంటఁ దనసైన్యముతోఁ జెంచు నాయకుఁడగు జెల్లా కృష్ణా నాయకుఁడరణ్యమునకేగెను. అచటఁగూడ వారు తమ సహజ వృత్తిని మానరైరి. తమ సమక్షముననే చెంచులట్ల స్వైరవిహారమొనర్చుట నాయఁడు చూచి భయపడెను. మఱునాడు సభలో జరిగిన విషయమంతయుఁ జెప్పి పెద్దల యభిప్రాయము గైకొని మాయోపాయమున వారి దుదముట్టింప నిశ్చయించెను" (పుట: 109 పైదే)

సభలో ఈ విషయం ప్రస్తావించటం రాజు చాకచక్యానికి నిదర్శనం కాదు. ఆ పరిస్థితుల్లో సమాచారం చెంచులకు తెలిసిపోతుంది. సభలో ప్రస్తావించాడు కాబట్టి సేనానికి తెలిసింది. ప్రేమమూర్తి అయిన భుజంగరాయుడు తెలిసి తెలిసి వాళ్ళను చంపనిస్తాడా? చంపనీయడు. చంపనీయకపోతే ఏంచేసి ఉంటాడు? దానికి ఆధారం భుజంగ రాయుడు 108 కొలనులు, 108 గుడులు కట్టించటం.

"నగరిలో నుండియు వారి సహజ గుణమును వీడక, యథాప్రకారము తమ దుష్కృతముల సాగించుచు, స్వేచ్ఛా విహారాసక్తులై సంచరించుచుండిరి. చెంచులు చేయు చేష్టలంగని నగరవాసులు భయపడి ప్రభువుతో విన్నవించుకొనిరి" (పుట: 109 అదే).

వేంకటాద్రి ఈ పైన ఏంచేశాడన్నది చరిత్ర. రాయుడు ఏంచేసి ఉంటాడన్నది హేతు సహితం. రాజును వారించాడని, హెచ్చరించాడని జానపద కథ. ఈ కథా సందర్భం రాయుడి జీవితంలో ప్రముఖ ఘట్టం. కావ్య పరిణామానికి, ఈ నాటకీయత ప్రముఖ సన్నివేశం. శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ వ్రాసిన చారిత్రకాంశాలకు వాసిరెడ్డి వంశచరిత్ర ఆధారం. దాన్ని వ్రాసింది వాసిరెడ్డి వేంకట సుబ్బదాసు. తమ వంశ చరిత్ర వ్రాసిన వ్యక్తి ఇచ్చిన సమాచారం కాబట్టి విలువనీయదగింది. కవుల అతిశయోక్తులకది ఆకరం కాదు. ఈస్టిండియా కంపెనీ వాళ్ళ రికార్డుల సమాచారం, వాళ్ళ ఆగ్రహానికి ప్రతిబింబంగా ఉంటుంది. కాబట్టి అదీ విశ్వసనీయంకాదు. కల్నల్ కాలిన్ మెకంజీ స్థానిక చరిత్రలోని అసమగ్ర చారిత్రక విషయం ఆధారపడదగింది కాదు. కాబట్టి శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ ఇచ్చిన సమాచారం నమ్మదగ్గది. నా చిన్ననాటి కథలతో సంవదిస్తూ ఉంది కాబట్టి స్వీకరణ యోగ్యం.

వేంకటాద్రి నాయుణ్ణి పిచ్చిగా ప్రేమించే ప్రేమమూర్తి భుజంగ రాయుడు, అతడి దుర్మార్గాన్ని సహించాడా? సహిస్తే భుజంగరాయుణ్ణి అర్థం చేసుకోవటంలో సమస్య ఉత్పన్నం అవుతుంది, తాను ఆవేశపడి, ఆ తీవ్రతలో ఏమయినా చేస్తే, తాను సాధింపదలచిన పరమ ప్రయోజనం దెబ్బతింటుందని అనివార్యమైన ఒక దురాగతాన్ని అంగీకరించాడా? చెంచుల్ని హతమారుస్తానని అంటే రాయుడు వ్యతిరేకిస్తాడు కాబట్టి తెలివైన రాజు ఏంచేశాడు? గృహనిర్బంధంలో ఉంచాడు.

ఇకిప్పుడు, చిన్ననాటి కతలన్నీ చారిత్రకాంశాలుగా గోచరింప సాగాయి. ఇంతవరకు తలాతోకాలేని పుక్కిటి పురాణాలుగా కొట్టేసిన భుజంగరాయుడి కథల్ని నేనే నమ్మసాగాను. కాని అన్ని అద్భుతాలు అంతగా వాస్తవమవుతాయా అని సందేహం వెంటాడుతూనే ఉంది. కాల్పనికుడుగా జానపద గాథా నాయకుడుగా అనాదరణకు గురైన

రాయుడి జీవితం చారిత్రకంగా కనిపించసాగింది. ఇతరేతర ఆధారాలు ఏమీ లభించకపోయినా భుజంగరాయుడు మహనీయుడుగా కనిపించసాగాడు.

భుజంగరాయుడు, జానపదగాథల ఆధారంగా ప్రథమ స్వాతంత్ర్య పోరాట సమయానికి (1856-57) నాటికి 90 ఏళ్ళవాడు, 1860లో 93వ ఏట పరమపదించాడు. 1767లో పుట్టి ఉండాలి. ఈ ఊహ చరిత్రతో సంవదించాలి.

నాయుడి జీవిత వివరాలు బాగా లభిస్తాయి. రాయుడి జీవితాంశాలు లభించవు. ఆస్థాన కవులు రాజును స్తుతిస్తారు. సైన్యాధిపతిని స్తుతించరు. పంచముడు కాబట్టి ప్రస్తావించరు. జానపదగాథలు ఆధారంగా చూస్తే వాళ్ళను విమర్శిస్తాడు కాబట్టి, భుజంగ రాయుణ్ణి వాళ్ళు ప్రస్తావించరు. ఇది మూకుమ్మడి మౌనసహనం.

పర్యాటకులు, సందర్శకులు కుంఫినీదొరలు, ఆంగ్లేయ చారిత్రకులు, మెకంజీ బ్రౌనులాంటి వాళ్ళు దేశానికి, భాషకు తమకు సాధ్యమయిన సేవ చేశారు. చేయించారు. స్థానిక చరిత్రల్లో మెకంజీ గ్రామాల చరిత్రలు, రాజుల చరిత్రలు తెలిపాడు. వాళ్ళకు రాజులు ముఖ్యం. ప్రజల అంతముఖ్యం కాదు. అటువంటి సందర్భాలలో కూడా సైన్యాధికారుల సమాచారం లభించదు. మంత్రులు ఎక్కడయినా ప్రస్తావన పొందారు. ఎదురుతిరిగి చనిపోయిన వీరులు అల్లూరి సీతారామరాజు, తాండ్రపాపారాయుడు వంటి వాళ్ళ జీవితం ప్రాసంగికంగా వస్తుంది. ఎదురుతిరిగి పోరాడినవాళ్ళను, కప్పం ఎగ్గొట్టిన వాళ్ళను వాళ్ళు బాగానే గుర్తుపెట్టుకొన్నారు. భుజంగ రాయుడు ఆ కోవకు రాడు.

భుజంగరాయుడి పోరాటం పరాయి వాళ్లతో కాదు. సొంత వాళ్ళతో. రాజులు, నాటి బ్రాహ్మణులు పంచముల్ని దోచుకోవటం, అవమానించటం, హింసించటం మీద అతడి తిరుగుబాటు. ఇది ఆ రోజుల్లో ఆంగ్లేయులకు అక్కరలేని పోరాటం, అయితే ఇది రాజులకు అణచవలసిన పోరాటం. భుజంగరాయుణ్ణి ఎవరూ అణచలేదు. అయితే అతణ్ణి అనంతర కాలానికి తెలియనీయకుండా అణగార్చ గలిగారు. అంతగా, శాంతంగా ప్రతిఘటించి పరమార్థం సాధించిన భుజంగరాయుడు తన అస్తిత్వానికి అర్థం, తన పోరాటానికి ఋజువు అయిన కవిత్వం అనంతర కాలానికి అందించే ప్రయత్నం చేసి ఉండవలసింది.

## 17. చారిత్రక భుజంగరాయుడు

భుజంగరాయుడు స్వర్గస్థుడయ్యే నాటికి 93 ఏళ్లవాడు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంనాటికి 90 ఏళ్ళవాడు. అతడి జనన సంవత్సరం 1767.

నాయుడు 1761లో పుట్టగా, రాయుడు 1767లో పుట్టాడు. 1794లో చంపబడ్డ చెంచుల్ని రాయుడు 4 సంవత్సరాలు కాపాడాడు కాబట్టి, వాళ్ళను కోటకు తీసుకువచ్చింది. 1790లో. 1790లో సైన్యాధ్యక్షుడుగా భుజంగరాయు దున్నాడంటే మూడు నాలుగేండ్ల క్రితమే సైన్యంలో చేరి ఉండవచ్చు. అంటే 1786, 87 ప్రాంతంలో చేరి ఉంటే అప్పటికి 19, 20 ఏళ్ళ ప్రాయం వాడు రాయుడు.

1790లోనే చెంచుల్ని రాజు చంపి ఉండాలి. కానీ రాయుడు వాళ్ళను తన పర్యవేక్షణలో సైన్యంలో చేర్చి ఉంటాడు. 1791 ప్రాంతంలో శ్రీశైల యాత్రకు పోయేటప్పుడు అడవిప్రాంతం పరిచయమయిన చెంచుల్ని వెంటతీసుకుని పోతే వాళ్ళు భీతావహంగా ప్రవర్తించటంవల్ల 1791లోనే వాళ్ళను చంపించి ఉండేవాడు నాయుడు. గుళ్ళు గోపురాలు, కొలనులు నిర్మించే పనిపెట్టి, రాజుకు అభయం ఇస్తూ, వాళ్ళను కోటకు దూరంగా తీసుకొని పోయిన మూడేళ్ళు పుణ్య నిర్మాణాలు చేయించాడు రాయుడు. 1794 ప్రారంభంలో తిరిగి చింతపల్లికి ససైన్యంగా రాయుడు వచ్చాడు. అప్పుడు జరగవలసింది జరిగిపోయింది.

1795లో కుంపినీ సైన్యం చింతపల్లి కోటలో చేరి, వేంకటాద్రి నాయుణ్ణి తీసుకుపోయి, గుంటూరులో సైన్య పర్యవేక్షణలో ఉంచినప్పుడు రాయుడు అమరావతి కోట నిర్మాణం, నగర నిర్మాణం చేశాడు. 1796లో వేంకటాద్రి నాయుడు తిరుపతి పోతూ, రాజప్రతినిధిగా రాయుణ్ణి నియమించాడు. అప్పటి నుంచి రాజకీయ ప్రశాంత జీవనం ఉన్నప్పుడు కూడా దైనందిన రాజ కార్యకలాపాలు రాయుడు పర్యవేక్షించాడు.

అమరావతి నగర ప్రవేశం 1797లో జరిగింది. అప్పటి రాయుడికి ముప్పైఏళ్ళు. రాజు క్షేమంగా, రాజ్యం సుస్థిరంగా ఉన్నప్పుడు, రాయుడు, రాజు, తల్లిదండ్రుల మాట మన్నించి, పెళ్ళికి ఒప్పుకొన్నాడు.

అప్పటికి సేనానిగా, మంత్రిగా, కవిగా, రాజప్రతినిధిగా అంచెలంచెలుగా పెరిగిన రాయుడు తన జీవిత ధ్యేయమయిన పంచములను అందరితో సర్వసమానులుగా గుర్తింపజేసే శాసనం ఇప్పించాడు. నాయుడు తన మరణ సమయంలో యువరాజులకు రాజ్యం చెరిసగం ఇస్తూ, ఇద్దరికీ రాజకీయపు సలహాదారుగా రాయుణ్ణి నియమించాడు. 1816లో నాయుడు పరమపదించాడు. యువరాజులిద్దరూ రాజులై సంస్థానాలు పాలించారు.

నాయుడు రాయుణ్ణి అంతగా వృద్ధి పొందనివ్వటానికి, చివరికి తమ్ముడుగా గుర్తించటానికి, యువరాజులకు పినతండ్రి అంతటి స్థానం ఇవ్వటానికి కారణాలు ఏమై ఉంటాయి? నాయుడిది ప్రేమించే స్వభావం. అందువల్ల రాయుణ్ణి ఆదరించాడు. అభివృద్ధికి రానిచ్చాడు.

ఇతన్నే ఎందుకు ప్రేమించాడు? అతనూ సంపూర్ణ ప్రేమ స్వరూపి, శాంతిమూర్తి కాబట్టి. అంతగా ప్రేమించే శాంతిప్రియులు రాజ్యంలో కరువయ్యారా? కరువు కాలేదు. మరెందుకు ఇతణ్ణే ప్రేమించాడు? సమర్థుడు కాబట్టి. ఏమిటి సామర్థ్యం? తననూ, తన రాజ్యాన్ని యువరాజుల్ని కాపాడేంత సామర్థ్యం. అంతసామర్థ్యం ఉన్న ఇతరులెవరూ లేరా? ఉంచవచ్చు. అంత సామర్థ్యమూ ఉండి నమ్మకస్థుడుగా, విశ్వసనీయుడుగా, ఆధారపడదగ్గవాడుగా ఉండటమే కారణం. అటువంటి వాళ్ళు మరెవ్వరూ లేరా? ఉండవచ్చు. కానీ దురూహలు లేని, అత్యాశలు లేని, అపకారం ఊహించనుకూడా ఊహించని, అధికారం కోసం హాని తలపెట్టని, అంతసమర్థుడై ఉండి కూడా సేవ చేసే స్వామిభక్తి పరాయణుడుగా ఉన్నాడు కాబట్టి రాజు విశ్వసించాడు. రాయుణ్ణి ప్రోత్సహించాడు.

కీడెంచి మేలెంచమనే వాళ్ళు, రాయుణ్ణి దూరం చేసుకొంటే తనను తానుగాక, సంరక్షించే ఇతర సమర్థులు లేకుండా పోతారనీ, అందువల్ల ఆదరించాలనీ; అతణ్ణి దూరం చేసుకొంటే, శత్రువులు అంతటి సమర్థుడి సేవలు ఉపయోగించుకొన్నా, అతడికేకోపం వచ్చినా, రాజ్య సుస్థిరత సందేహాస్పద మవుతుందనీ ఎవరైనా భావిస్తారు. రాయుడికి నిరంతరం ఆధిక్యం, ప్రాధాన్యం ఇవ్వటం వెనుక అతడి సామర్థ్యంతో పాటు రాజు అవసరం కూడా దాగి ఉంది. రాజు అవసరం దాగి ఉందంటే, అతను లేకపోతే కష్టాలు కలుగుతాయన్న భయంకానీ, అతను ఉంటే సమస్యలు తలెత్తవన్న విశ్వాసంకానీ ఉండి ఉంటాయని అర్థం.

రాయుడికి కొన్ని లక్షణాలు ఉన్నాయి. అవి నెరవేరాలంటే తన సామర్థ్యంతో పాటు రాజు అండదండలు కావాలి. సహజంగా ప్రేమమూర్తి, శాంతస్వభావి అయిన రాయుడు నాయుణ్ణి నమ్మాడు. నాయుడూ అతణ్ణి విశ్వసించాడు. ఈ సంబంధం ప్రేమగా మారింది. ప్రేమ సోదరభావానికి దారితీసింది. రాజ్యాధికారం కంటే సోదరాధికారం మిన్నగా నిలిచింది. అందువల్లే రాయుడేమన్నా, ఏం చేసినా నాయుడు అంగీకరించాడు. సమర్థించాడు. అసలు శిక్షించవలసిన రాయుణ్ణి రక్షించిన నాయుడికి, తమ్ముడులేని లోపం, మహావీరుడయిన రాయుణ్ణి చూడగానే, తీరినట్లయి ఉంటుంది. ఆ ప్రేమ అంకురించి తర్వాత పెరిగి పెద్దదై శాఖోపశాఖలుగా విస్తరిల్లింది. రాయుడివల్ల తనకుగాని, సంస్థానానికి గాని ప్రమాదం కలగదని, మేలు కలుగుతుందని రాజు భావించాడు. ఈ భావన వమ్ము కాలేదు. మునుముందు కూడా వమ్ముకాదని నాయుడికి విశ్వాసం నిజమని రుజువయింది.

రాయుణ్ణి ప్రేమతో తప్ప జయించటం సాధ్యంకాదన్న సత్యం రాజు గుర్తించాడు. అతణ్ణి జయించాడు. జయింపబడటాన్ని కోరుకొనటంలో రాయుడి విజయం దాగి ఉంది.

ఆత్మాభిమానం, ఆత్మగౌరవం రాయుడి బలమైన లక్షణాలు. ముక్కుసూటి మనిషి, భయంలేని అసమాన పరాక్రమశాలి. సత్యం ఎదుట సర్వం దిగదుడుపే. అతను చేయదలచిందాన్ని ఏ శక్తీ ఆపలేదు. ఆంతర్యాలు, సందర్భాలు సునాయాసంగా గ్రహించగలడు. అనుకొన్నది చెబుతాడు, చేస్తాడు. అందుకే ఎంతగా అడ్డం తిరిగినా, ఏంచేసినా, నా మేలుకే అని నాయుడు అతణ్ణి మన్నించసాగాడు. ఏ పరిస్థితుల్లోనూ తేజోవధ జరగదని ఇద్దరికీ అర్థమయింది.

ఏ ప్రమాదంలేని శక్తిమంతుణ్ణి చేరదీసి ప్రోత్సహించి తనంతటివాణ్ణి చేసినా, తనకు లోబడే ఉంటాడు, తనకు మేలే చేస్తాడు. తనకు సుఖసంతోషాలు కలిగిస్తాడని నాయుడు గుర్తించాడు.

అందువల్ల రాయుడి మాటకు తిరుగులేకుండా పోయింది. చేతకు ఆటంకం కలగలేదు. యజమానిగా మారాడు. అందుకు తగ్గట్టు వ్యవహరించాడు. రాయుడి పరాక్రమం, ఆత్మవిశ్వాసం, ఆత్మగౌరవం, స్వామి భక్తి, సేవాభావం, రాజుపట్ల విశ్వాసం, అతణ్ణి ఆ స్థితికి తెచ్చాయి.

స్వామిభక్తి, సేవాదృష్టి మాత్రమే అచంచలంగా ఉన్నా, అణగదొక్కబడేవాడు. పరాక్రమం, ఆత్మవిశ్వాసం, ఆత్మగౌరవం ఉండి, మాటలుండి చేతల్లేకపోతే, నిబద్ధత లేకపోతే, బ్రతుకు అర్థం పర్థం లేకుండా తెల్లారిపోయేది. అన్నీ ఉన్నా అచంచల బ్రహ్మచారిగా ముప్ఫై ఏళ్ళ దాకా ఉండటం, 17 ఏళ్ళకే పెళ్ళి పెళ్ళి అని వెంపర్లాడిన నాయుడికి ఆశ్చర్యంగా ఉండి ఉంటుంది. ఇటువంటి రాయుడిమీద నాయుడికి పిచ్చి ప్రేమ పుట్టమంటే పుట్టదూ? పుట్టింది. పుట్టిన ప్రేమ పూచి కాసి పండింది.

వాళ్ళిద్దరి అభిప్రాయాలు కొన్ని సందర్భాలలో కలవ్వు. కానీ ఆత్మీయతానురాగాలు ఏ పరిస్థితుల్లోనూ చెడవు. మేలయిన ఈ కుదిరిక ఆంధ్ర సంస్థాన వైభవం పెంచింది. పంచముల ప్రాభవం నిలిపింది.

రాయుడి శాంతచర్యలు లేకపోతే, మనశ్శాంతి లేకుండా చేసే భగందరవ్యాధి వల్ల కానీ, మగపిల్లలులేని లోపంవల్ల కానీ, కూతురు చనిపోవటంవల్ల గానీ, భార్యా వియోగంవల్ల గానీ, పిల్లల్లేని భార్యవల్ల కానీ, నైజాం నవాబు పోటువల్ల గానీ, కుంఫినీ కుయుక్తుల వల్ల గానీ, నాయుడు నిరంకుశుడిగా ప్రమాదకారిగా అదుపుతప్పిన, అడ్డమాకలులేని క్రూర జీవిగా మారి ఉండేవాడు.

శారీరకంగా, మానసికంగా అంత బలశాలి అయినవాడు, అంత యుద్ధ నిపుణుడు, అంత ఆవేశపరుడు, ఆలోచనాత్ముడు, అంత విద్యావేత్త అయిన రాయుడు, అంత శాంతంగా, అంత సహనంగా ఉండటం ఆశ్చర్యకరమే! కులం తెచ్చియిచ్చే అనర్హత, ధనరాహిత్యం తలకు చుట్టే దయనీయ దీనస్థితి లేకపోతే, రాయుడు ఇంత

శాంతచిత్తుడయ్యేవాడా? ఈ శాంత చిత్తతే అతణ్ణి మహోన్నతుణ్ణి చేసింది. రాయుడంతటి సమర్థుడికి నాయుడికి ప్రేమ వశుడయి నందువల్ల నాయుడి వ్యక్తిత్వం వికసించింది. సాటి సంస్థానాల్లో నాయుడంటే భయం రాయుడివల్ల కలిగింది. ఇంత ఇష్టం లేకున్నా నైజాం నవాబు కానీ, కుంఫినీ కలెక్టరు కానీ రాజు వైపు కన్నెత్తి చూడలేకపోయారు. రాయుడు సేనాపతే కాదు, రాజుకు నమ్మిన బంటు అన్న ఖ్యాతి రాజు పీఠం సుస్థిరం చేసింది. భుజంగరాయుడి వైవిధ్య భరిత జీవితం, వేంకటాద్రి నాయుడి వైభవ సహిత జీవితం అందంగా పడుగుపేకల్లా అల్లుకుపోయి గొప్ప కలనేత కనిపించింది.” (ఉపోద్ఘాతం-ఆది ఆంధ్రుడు కావ్యం. పుటలు: 23-48)

## 18. మాదిగల స్మృతి

శాతవాహనుల కాలం నుంచి రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడి కాలం దాకా చర్మకారులు/మాదిగలు నిర్వహించిన పాత్ర వైశిష్ట్యం తెలపటం ప్రస్తుతాంశం. ఆంధ్రదేశ చరిత్రతో ముడిపడ్డ భారతదేశ చరిత్రలో, ప్రాచీన కాలంలో నుంచి చర్మకారుల పురోగతి స్థూలంగా పరిశీలించటం కర్తవ్యమే!

ప్రాచీనకాలం నుంచి దేశ సంస్కృతిలో చర్మకారులు ప్రధాన భాగానికి వారసులు. అన్ని రాష్ట్రాల్లో వ్యాపించిన ప్రముఖ సమూహ ప్రజలు వీళ్ళు. ఒక్కోరాష్ట్రంలో ఒక్కో పేరుతో పిలవబడుతూ ఉన్నా ఎక్కువ రాష్ట్రాల్లో చమార్ (చర్మకార వ్యావహారిక రూపం)లని, ఆంధ్ర, కర్నాటక, తెలంగాణా రాష్ట్రాల్లో మాదిగలనే పేర్కొనబడుతున్నారు. వేట, ఆహార సేకరణ కాలంనుంచి అడవుల్ని నమ్ముకొన్న భూమిపుత్రులు వీళ్ళు. వీళ్ళను ఆదివాసులని ఆదిమజాతులని కూడా పేర్కొనేవాళ్ళు. ఇప్పుడాపేర్లు వీళ్ళకు లేకుండా ఇతరులకు ముఖ్యంగా తెగలవాళ్ళకు ఉద్దిష్టమయ్యాయి. వీళ్ళను మూలవాసులని ఇప్పటికీ పిలుస్తారు.

## 19. జాంబ పురాణం

జాంబపురాణమని ఒక పుక్కిటి పురాణం ఉంది. జాంబవంతుడు మాదిగల మూలపురుషుడని అది చెబుతుంది. దాన్ని చరిత్రగా భావించి కొన్నిచోట్ల డక్కలివాళ్ళు, కొన్నిచోట్ల మాదిగదాసులు, దాన్ని చెబుతూ మాదిగల్ని యాచిస్తూ ఉంటారు.

జాంబవంతుడు త్రిమూర్తులకే తాత అని మాదిగలు విశ్వసిస్తారు. జాంబవంతుడి సంతానం కామధేనువును కోసుకు తినటం వల్ల, గొడ్డుమాంసం, అది చచ్చిన గొడ్డయినా, చంపిన గొడ్డయినా వీళ్ళ ఆహారంగా మారిందని నమ్ముతారు. ఇప్పటికి కామధేనువు, కల్పవృక్షం ఉన్నాయని నమ్మే ఆర్యులు ఆ చచ్చిన గొడ్డు ఎలా బ్రతికిందో చెప్పరు.

జాంబవంతుడు జంబూ ద్వీపవాసి అని, భారతదేశానికి పూర్వమాపేరు ఉండేదని అంటారు. ఈ దేశంలో అరవైతొమ్మిదికి పైగా ఉన్న చిల్లర తెగల్లో భరత తెగ పెద్దది. ఇది ఉత్తర దేశంలో ఎక్కువభాగంలో అతి ప్రాచీనకాలంలో వ్యాపించింది. ఆ తెగ పేరిట ఈ దేశం భారతదేశ మయింది. రాముడి తమ్ముడు భరతుడు కానీ, శకుంతలా దుష్యంతుల కొడుకు భరతుడు కానీ, జడభరతుడు కానీ మరొకడు కానీ ఈ పేరు రావటానికి కారణం కాదు. విభిన్నరాజుల పాలన కాలంలో దీనిని భరతవర్షం అని కూడా పిలిచేవాళ్ళు. ఆర్యులరాకతో ఈ దేశం ఆర్యావర్తమయింది. సింధునదీలోయ ప్రాంతం హిందూ దేశంగా ప్రస్తావించ బడింది. ఆపైన పాలించిన రాజులు దీన్ని ఇండియా అన్నారు. మా జాంబవంతుడి దేశం జంబూద్వీపం అతి ప్రాచీనం కాబట్టి, అతడి సంతతి, వారసులు అతి ప్రాచీన భారతీయులు నమ్ముతుంటారు మా వాళ్ళు.

కామధేనువు చర్మం వినియోగంలోకితెచ్చిన నాటినుంచి వీళ్ళు చర్మకారులు. మహామేధావి, యుద్ధవిద్యానిపుణుడు, జనాకర్షక మూర్తి అయిన శ్రీకృష్ణుణ్ణి, తమ సోదరి భర్తగా, బావగా పిలుస్తారు చర్మకారులు.

రామాయణం రంకు, భారతం బొంకు, పురాణాలు పుక్కిటి పురాణాలనే చర్మకారులు, జాంబపురాణం తమ కులపురాణంగా గౌరవప్రదంగా భావించటం విశేషమే!

## 20. చర్మ రసాయనక చర్య

నాడు చచ్చిన గొడ్డుమాంసం తినటం, గొడ్డు చర్మం ఊనటం, చెప్పులు కుట్టటం, డప్పుకొట్టటం, తప్పెట కప్పటం -చర్మ నిర్మితమైన సమస్త వస్తుజాలం సమకూర్చటం బహుకాలం తమ వృత్తిగా, కొన్ని సందర్భాలలో హక్కుగా భావించారు చర్మకారులు.

పశువుల తోలు ఒలవటం, ఒకకళ. లేదా వృత్తి నైపుణ్యం. ఇది అతి ప్రాచీనకాలం నుంచి ఉంది. తోలు ఊనటం ఒక విద్య. కరక్కాయ, తంగేడు చెక్కలు, సున్నం తగిన పాళ్ళలో గెల్లగాబులో ఊనటం ఒక ప్రయోగశాల కృత్యం. ఈ ప్రయోగ కర్తలు శాస్త్రజ్ఞులుగా చర్మకారులు విశ్వసిస్తారు. మళ్ళీ మాట్లాడితే అతి ప్రాచీన శాస్త్రజ్ఞులుగా భావిస్తారు. పచ్చితోలును పనికివచ్చే తోలుగా మార్చటంలో జరిగే రసాయనచర్య వల్ల, ఆది శాస్త్రవేత్తలు సైంటిస్ట్లు చర్మకారులని గర్వపడతారు. చర్మకారుల కళాకారులు కాకపోతే, తోలులోని సలప సజ్జు తీసేసి, చర్మం రెండు పక్కలా ఉన్న అనవసర భాగాలు నేర్పుగా తీసి మధ్యనున్న పల్చటి గట్టి పొరను వేరుచేసి చెక్కపలక మీద కప్పి, లాగి, మూసి, కాకపెట్టి వాయించితే కంగుమనేట్టు చేయగలగటం, అందరికి సాధ్యమయ్యే పనికాదు.

చర్మ నిర్మితమైన డప్పు -తప్పెట, అతి ప్రాచీనమైన వాద్య పరికరం. ఇది భారతదేశ మంతటా ఉంది. చర్మకారుడికే దీన్ని చేయటం వాయించటం వచ్చు. ఎవరైనా నేర్చుకోవచ్చు. కానీ ఆరోజుల్లో దాని సృష్టికర్తల్లాగే అదీ అస్పృశ్యం. ఎందుకంటే అది చర్మనిర్మితం కాబట్టి. జననానికైనా, మరణానికైనా, పెళ్ళికయినా, పేరంటానికయినా, వినోదానికైనా, విజ్ఞానానికైనా, మేలుకయినా, కీడుకయినా, బ్రాహ్మణుడి మంత్రానికి, చర్మకారుడి డప్పుకూ అవసరం అనివార్యం. సవాలక్ష సామాజిక సందర్భాలలో డప్పు కొట్టడం, తప్పెట వాయించటం. దండోరా వేయటం వీళ్ళ వృత్తిలో భాగం. చర్మకారుల తోలు లేకుండా ప్రాచీన వాద్య పరికరాలు లేవు. ఇప్పటికీ సగానికి పైగా అన్ని అన్నీ చర్మనిర్మితాలే. సమర్థులు అన్ని రాగాలు, దరువులు, ఏలలు, పాటలు డప్పుమీద పలికించగలరు. ఇంత వైవిధ్యమున్న ధ్వని సృజనం అన్ని వాయిద్య పరికరాలకు ఉండదు. అది ఇతర, ముఖ్య సమర్థులకైనా సాధ్యంకాదు.

## 21. చర్మకారుల సోదరుడు

శివుణ్ణి అందరూ దేవుడంటారు, లయకారుడంటారు. చర్మకారులు శివుణ్ణి మా గురువు, దైవం అంటారు. మరీ పెద్దలు మా అన్న అంటారు. శివుణ్ణి గిరిజనుడని నృశాస్త్ర పండితులు భావిస్తారు.

శివతాండవానికి, మాదిగల సిందు -చిందు-లకు పోలికలెక్కువ. మాదిగల నృత్య కళారూపానికి, సంగీత వాద్య రూపానికి డప్పుకు - చిందుకు ప్రత్యేక ప్రాధాన్యం ఉంది. డప్పు వాయించటం చిందువేయటం అందరికీ అంత సులువుగా రావు. చిందు పరాకాష్ట పేరిణి నృత్యం. పేరిణి శివతాండవ జన్యం. పేరిణిని అందరూ చేయలేరు. అది పురుషులకే పరిమితం. ఆరోగ్యం, బలిష్ఠమైన దేహదారుఢ్యం కళా నైపుణ్యముంటే తప్ప పేరిణి నృత్యం చేయలేరు. చచ్చినప్రాణిని, ఉపయోగకరమైతే, ఉపయోగించటం, లేకపోతే బూడిద చేయటం చర్మకారులపని. గొడ్డు చస్తే ఉపయోగకరం. మనిషి మరణిస్తే నిరుపయోగ శవం. శవాన్ని బూడిద చేయటానికే వల్లకాడు ఉద్దిష్టం. చర్మకారులే ఆ కట్టెలమీద ఈ కాష్టాన్ని కాల్చేది. వీళ్ళనే కాటికాపరులనీ అంటారు. కాటిలో నివాసముండి,దాన్ని కాపాడేది వీళ్ళే! వీళ్ళ అనుమతిలేకుండా, ఏ శవమూ కాలదు. వల్లకాటి వాసులైన వాళ్ళు చర్మకారులైన కాటికాపరులు, శివుడూ స్మశానవాసి. కాటికాపరి, చర్మకారుల సోదరుడు.

శివుడి శౌర్యం, పరాక్రమం వల్ల చర్మకారులకు ఆరాధ్యుడు. శివారాధన చర్మకారుల నిత్యకృత్యం. వీళ్ళు ప్రాచీనకాలం నుంచి శైవులే! మళ్ళీ మాట్లాడితే వీరశైవులు. శైవభక్తి వీళ్ళను లింగధారుల్ని చేసి, లింగాయతుల్ని చేసి కర్ణాటక రాష్ట్రంలో అస్పృశ్యతను అధిగమించే స్థితికి తెచ్చింది.

శివుడికి ఇద్దరు భార్యలున్నట్లే చర్మకారులకూ ఇద్దరు భార్యలు సాధారణంగా పూర్వముండే వాళ్ళు. వాళ్ళను, శివుళ్ళాగే అయితే నెత్తిన, కాకుంటే గుండెలో నిలుపుకొంటారు. ఇద్దరాడవాళ్ళకు, చర్మకారుడు భర్త అయ్యాడనటం కంటే, ఇద్దరు స్త్రీలు అతడికి భార్యలయ్యారనటం వాస్తవం. పార్వతి శివుడి కోసం తపస్సు చేసింది.

## 22. స్త్రీ ఆరాధన

బ్రాహ్మణులు అదనపు స్త్రీలను స్వీకరించకుండా వాళ్ళను, పరిత్యజించే మార్గాలు కనిపెట్టారు. వదిలించుకోవటం వీలు కానప్పుడు, బలవంతపు అయోగ్యతను అంటగడతారు. అయితే సతితో చావు. కాకపోతే ముండమోసి బ్రతికుండగా చావు. చర్మకారుల స్త్రీలు భర్తృహీనలుగా ఏ వయస్సులోనూ ఉండరు. వాళ్ళకు భర్త అక్కర లేకపోతే ఒంటరిగా ఉండవచ్చుకాని, నిర్బంధ వైధవ్యం మాదిగల్లో లేదు. మారుమనువు ఎప్పుడూ ఉంది.

ద్రావిడులు, చర్మకారులు స్త్రీలను గౌరవించినంతగా ఆర్యులు, బ్రాహ్మణులు గౌరవించరు. చర్మకారులు స్త్రీలను ఏ దశలోనూ అస్పృశ్యలుగా చూడరు. సంతానానికి తండ్రి స్పర్శ సుఖం లేకుండా చేయరు. ఆర్యులు, స్త్రీలను, సంతానాన్ని కూడా అస్పృశ్యంగా చూడటం ఆశ్చర్యకరంగా ఉంటుంది.

ద్రావిడులు స్త్రీలను పూజిస్తారు. స్త్రీలను గయ్యాళి గంపలు, కయ్యాలకంపలు అనటం ద్రావిడుల్లో ఉండదు. అందువల్లనే కావచ్చు, ఆ స్థితి వల్ల మాదిగల్లో ద్రావిడ వారసత్వసంపదగా గౌరవమర్యాద మన్ననలుంటాయి. భారతదేశమంతటా ఉన్న చర్మకారులు భార్యా విధేయులు, భార్యాభక్తులు. స్త్రీల అణచివేత, అసమానత మాదిగలు పాటించరు. సర్వసమానంగా ఉన్న స్త్రీ, పురుషుడికి దానం చేసే సుఖ సంతోషాలు, అణిగిమణిగి భయభక్తుల్లో కుమిలి, కునారిల్లే స్త్రీ ఎలా ఇవ్వగలుగుతుంది?

భార్యను, తల్లిని, చెల్లిని బాగా గౌరవించి ప్రేమించిన రావణుడి కథ, ఆర్యులు సృష్టించిన వాల్మీకి రామాయణంలో కంటే ద్రావిడుడు చిత్రించిన కంబ రామాయణంలో అద్భుతంగా కనిపిస్తుంది. ద్రావిడులకు రావణుడు ఉదాత్త నాయకుడు. రావణున్ని నాయకుణ్ణి చేసి, రాముణ్ణి, ప్రతినాయకుణ్ణి చేసి, రావణాయణం ద్రావిడులు, ముఖ్యంగా తమిళులు, వ్రాయటం, చరిత్రే! రావణుణ్ణి దశకంతు డనటం, అతడి తెలివితేటలకు శక్తి సామర్థ్యాలకు, మండోదరి అనటం, ఆమె ఆరోగ్యానికి, శూర్పణఖ అనటం ఆమె సౌందర్యానికి శృంగార యోగ్యత గుర్తులు. ఆర్యులు శత్రువుల్ని రాక్షసులనటం, వాళ్ళను చంపటానికే! శత్రు శిబిరాలని త్రిపురాలను దగ్ధంచేసినట్లు.

ద్రావిడస్త్రీలు పురుషులతో సమంగా కాయకష్టం చేసే ఆరోగ్య సంపన్నులు, కొన్ని సందర్భాలలో పురుషులకంటే ఎక్కువగా కష్టపడ గలిగే ఆరోగ్యం ఉండేవాళ్ళు స్త్రీలు. బలంగా కండపుష్టితో గుండె పుష్టితో ఉండటం ద్రావిడస్త్రీల లక్షణం. శారీరక ఆరోగ్యం ఉన్న చోట మానసిక సామర్థ్యం వికసిస్తుంది. వీళ్ళంత ధైర్యంగా ప్రేమగా అందరూ, ముఖ్యంగా ప్రథమ వర్ణం స్త్రీలు ఉంటే ఎంత బాగుంటుంది! చర్మకారుణ్ణి, ఆర్యస్త్రీలు పెళ్ళి చేసుకోవటం వల్లే, అస్పృశ్యులు అధికమయ్యారు.

ఆర్యస్త్రీలు చర్మకారుణ్ణి కోరుకొన్నంత విరివిగా, ఆర్య పురుషులు చర్మకార స్త్రీలకు వాంఛింపలేరు. వాంఛించినా దాంపత్య జీవితం అనుభవించలేరు. శారీరకశ్రమ చేయలేని జాతులు, చేయగలిగిన జాతులతో సమంగా దాంపత్య యోగ్యత కలిగి ఉండవు. దాంపత్య జీవిత సౌందర్యం వేరు, సంతానప్రాప్తి వేరు. ఆర్యపురుషులిద్దరు, రామలక్ష్మణులు, అమిత సౌందర్యవతి విశేష దాంపత్య యోగ్యురాలు, రావణుడి చెల్లెల్ని అవమానించటం సౌందర్య హత్యచేయటం వెనుక రహస్యం ఆమె స్త్రీత్వ యోగ్యతను గుర్తించటమే! భరించలేక పోవటమే! మా శివుణ్ణి పరమభక్తితో పూజించే రావణుడు మా ద్రావిడుడే, మా పుణ్య పురుషుడే! మా ముత్తాతే స్త్రీలను గౌరవించే తాను సీతను తాకకుండా బంధించటం భారతదేశం గుర్తించింది. వాల్మీకి రామాయణమే అంగీకరించింది. ఇది ఆర్యుల వర్ణవ్యవస్థ దక్షిణ భారత దేశంలో వ్యాపించక పూర్వమున్న జీవితం. అప్పుడు వృత్తులున్నాయి కాని కులాలు లేవు. చర్మకారులు రాజ్యపాలన చేయటం చరిత్రకు తెలిసిన సంగతే!

## 23. మాదిగ రాజులు

వీరబాహుడు -పెద్దింటివాడు - అనగా మాదిగ కులస్థుడు. సత్యహరిశ్చంద్రుణ్ణి కొనగలిగినంతే సంపన్నుడు. కాటి కాపరే కాదు, ప్రజలకాపరి కూడా. ప్రజల రాజునుకొని, కాటికాపరి వృత్తి ప్రసాదించగలిగిన నిర్ణాయకశక్తి వీరబాహుడు, ఇంతటి చక్రవర్తిని నామరూపాల్లేకుండా చేయగలగటం ఆర్యుల కుట్ర జీవితాలకు సాధ్యమే.

బలి చక్రవర్తి కొంపలో కుట్ర ప్రతిష్ఠించి మహారాజును దారుణంగా హత్య చేయటం, పురాణం కాదు, చరిత్ర. రావణుడి తమ్ముడిని మభ్యపెట్టి రావణుణ్ణి అంతం చేయటం ఇతిహాసమే. చరిత్ర. నరసింహావతారం వామనావతారం, మా శివభక్తుల్ని అంతం చేయటానికి ఆర్యుల పన్నిన కుట్రలో భాగాలే.

ప్రతి రాజును, అతను ఏ వృత్తి వాడయినా, క్షత్రియుడని ప్రతిపాదించి, వర్ణవ్యవస్థను అంగీకరింపచేసి, తమ వశం చేసుకోవటం ఆర్యనీతి. ఆ ప్రతిపాదన అంగీకరించని రాజులు రాక్షసులు, పాములు, దేశద్రోహులు, ప్రతిభారతీయ బలమైన పాలకవంశాన్ని, తమకు అనుకూలమైతే వర్థిల్లనీయటం, ప్రతికూలమైతే, అంతం చేసే కుట్రపన్ని, దాన్ని నెరవేర్చటం ఆర్యుల పద్ధతి.

ఆర్యులు అల్ప సంఖ్యాకులు. ఇంత బలమైన వర్గంగా ఎలా మారగలిగారు? భారతీయుల్ని స్వర్గనరక ప్రచారంతో బాధించి వశపరుచుకోవటం, లొంగనివాళ్ళను వశులైన వాళ్ళతో, ఉసికొల్పి, యుద్ధం చేయించి, ఓడించటం, ఒకరికొకర్ని బానిసల్ని చేసి, అందరికీ తాను యజమాని కావటం. అన్నింటికి మూలం తాను దేవుడి ప్రతినిధినని నమ్మించటం ఆర్యుడి వ్యూహం.

## 24. వలస - చైతన్యం

కూటికోసమో, గూటికోసమో, గుడ్డకోసమో, ఆలమందల గడ్డి కోసమో, గ్రీసు, పాలస్తీనా, ఇరాన్‌లమీదుగా వచ్చిన ఆర్యులు ఇక్కడ బ్రతకటానికి, కూటికోసం కోటివిద్యలు అన్నట్లుగా, కోటిన్నర విద్యలు శక్తులు ఆర్జించారు. ఏ దేశ ప్రజలైనా మరో దేశంలో ప్రవేశిస్తే అక్కడ నిలదొక్కుకోవటానికి అనేకమైన యుక్తులు పన్ని జీవించి సంపన్నులౌతారు. ఒకనాడు రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్యమన్న కూత ఈ నీతినే తెలుపుతుంది. భిన్నదేశాల జాతుల వ్యక్తులు అమెరికాలో ప్రవేశించి, భూమి పుత్రుల్ని అంతం చేసి, తమ ఆధిక్యం ప్రతిష్ఠించటం, ప్రపంచాన్ని శాసించటం, మనం చూస్తున్న చరిత్ర. చైనా ప్రజలు సమీపంలోని చిన్న చిన్న దేశాలలోకి వలసవచ్చి పాలకులైన విధానం వర్తమానమే! ఏ కారణం వల్లనైనా స్వస్థలం వీడి పరస్థలం చేరిన వ్యక్తి, వ్యక్తుల సమూహం అక్కడ నిలదొక్కుకోవటానికి స్థిరపడటానికి. అభివృద్ధి చెందటానికి పడే ఆరాటం, చేసే పోరాటం నేటికీ అనుభవైకవేద్యాలే! వలస వచ్చిన శక్తియుక్తి సంపన్నులు నిలదొక్కుకోవటానికి, వెలుగొందటానికి చేయని సాహసం, అకృత్యం ఉండవు.

స్వదేశీయులు బేఫర్వాగా ఉంటారు. వలస వచ్చిన విదేశీయులు తమ మనుగడకోసం అడ్డమైన అగచాట్లు పడతారు. అట్లా యుక్తులు, కుయుక్తులు, కుట్రలు, విజయవంతంగా నిర్వహించిన వాళ్ళు ఆర్యులు. సంస్కృతభాషను సృష్టించారు.

వేదవాఙ్మయరాశి పుట్టించారు. ఇతిహాస పురాణస్రష్టలయ్యారు. దైవ ప్రతినిధులుగా ప్రవర్తించారు. అడ్డమొచ్చిన జైన బౌద్ధమతాలను నామమాత్రావశిష్టం కావించారు. రాజుల్ని వశం చేసుకొని మాట చెల్లించుకొన్నారు. మాట మన్నించమని వాళ్ళను అంతం చేశారు. ఆకలయినవాడికి ఆలోచనలు ఎక్కువగా వచ్చినట్లు, అవసరమైనప్పుడు, అవసరం లేనప్పుడు కూడా వీళ్ళ అరాచకాల ఆలోచనలు అధికంగా

చేశారు. సమాజాన్ని విడదీశారు. విడదీసి పాలించటం ఆంగ్లేయులకు వీళ్ళే నేర్పారు. తమ ఆధిపత్యం అంగీకరింపని నందవంశం నాశనం చేసి మౌర్యవంశం ప్రతిష్ఠించారు. కుటిలుడు కుటిల మనస్కుడు, కౌటిల్యుడు ఉత్కృష్ట అర్థశాస్త్రం రాశాడు. చాణక్యుడి మాటవింటే మౌర్యులుంటారు, లేకుంటే అంతరిస్తారు అనే స్థితిని దేశమంతా గుర్తించి అంగీకరించే దశను కల్పించారు.

## 25. మౌర్యులు

మురి చర్మకారవనిత. మౌర్యులు చర్మకార స్త్రీ సంతతి. వీళ్ళు వర్ణవ్యవస్థను అంగీకరించటం, ఆపాదిత క్షత్రియత్వం ఆమోదించటం, రాజ్యపాలన చేయటం చరిత్రకు సుపరిచితాలే! వీళ్ళ కాలంలో బౌద్ధం అభివృద్ధిచెందింది. చక్రవర్తి అశోకుడు హింసను వీడి అహింసను గ్రహించి, ప్రజామోద పాలకుడయ్యాడు. అశోకధర్మచక్రం మన జాతీయపతాకంలో నిలిచేస్థాయి వచ్చింది.

బి.పి.మౌర్య, షెడ్యూల్డ్ కులం యం.పి. తన పూర్వీకుల చిహ్నంగా మౌర్యపేరు తన పేరుగా నిలుపుకొన్నాడు. అశోకుణ్ణి దేశమంతా స్తుతిస్తుంది. అతడిపాలన ప్రజల్ని కన్నబిడ్డలాగా చూసింది. అశోకుడి పేరిట ప్రసిద్ధమైన ధర్మచక్రం. జాతీయ పతాకంలో పింగళివెంకయ్య పెట్టిన చరఖాను, పట్టాభి గాంధీ ఆనందంగా ఆమోదించినా, అంబేద్కరు తొలగింపజేసి, ధర్మచక్రం ప్రతిష్ఠింప చేయగలిగాడు. అశోకుడంటే గౌరవమే కాదు. మురి అంటే భక్తి ఈ చర్యవెనుక ఉన్న సత్యమని అప్పటికి అందరూ గుర్తించలేదు. ఇప్పటికి మురి వారసులు తెలుసుకోలేదు.

అమరావతిని అభివృద్ధి చేసిన, అమరావతి స్తూపంగా పిలవబడే బౌద్ధస్తూపం నిర్మింపచేసిన శాతవాహనులు మౌర్యచక్రవర్తులకు సామంతరాజులు. ఆ వంశం అంతరించాక వీళ్ళు స్వాతంత్ర్యం పొంది సామ్రాజ్యంగా విస్తరించుకొని చక్రవర్తులయ్యారు. వీళ్ళు తమంత తాము ఆంధ్రరాజులమని ప్రకటించుకొన్నారు. శైవం అంగీకరిస్తూనే బౌద్ధమత ప్రోత్సాహానికి, విస్తృతికి కారకులయ్యారు.

వీళ్ళకాలంలో చర్మకారులు విశేషగౌరవ ప్రపత్తులు పొందారు. శాతవాహన చక్రవర్తి హాలుడు సంకలనం చేసిన గాథాసప్తశతిలో చర్మకారుల ఔన్నత్యం ప్రకటితమయింది. వీళ్ళు నిర్మింపజేసిన అమరావతిలోని బౌద్ధస్తూపంలో చర్మకారులు సుప్రతిష్ఠిత భాగ స్వాములుగా ఉన్నారు. నేటి ఆంధ్రరాష్ట్ర రాజలాంఛనమైన పూర్ణ కుంభం చర్మకారులు బౌద్ధస్తూపంలో ప్రతిష్ఠించిన అద్భుత శిల్ప సౌందర్య పరాకాష్ఠకు ప్రతిరూపమే! శాతవాహనులు క్షత్రియులు కారు. ఆర్యుల వర్ణవ్యవస్థను అంగీకరింపలేదు. బౌద్ధమతాన్ని ప్రోత్సహించారు. హిందూ బౌద్ధ ధర్మసమన్వయంగా, హింసాహింసల మధ్యస్థంగా రాజ్యపాలనం చేసినవీళ్ళు, చర్మకార సంబంధమున్న మౌర్యులవల్ల ప్రతిష్ఠితులైన వాళ్ళు కాబట్టి చర్మకార జీవనానికి సన్నిహితులుగా కనిపిస్తున్నారు.

విదేశాలనుంచి వచ్చిన గ్రీకులు, అరబ్బులు, హూణులు, కుషానులు అనార్యులే! అనార్య పాలకులే. భారతీయ రాజులైన నంద, మౌర్య, గుప్త చక్రవర్తులు భారతీయులైన మంగలి, మాదిగ, వైశ్యకులాల వాళ్ళు. మనదేశంలో రాజులున్నారు. క్షత్రియపదం, పలుకుబడి, పదవి అన్నీ కల్పితాలు. సామాజిక వాస్తవాలు కాదు. భారతదేశాన్ని పాలించిన మొగల్‌చక్రవర్తులకు క్షత్రియపదం వర్తించదు. అలాగ్గే ఆంగ్లేయులకూ అది చెల్లదు.

ఒక సమర్థుణ్ణి, యుద్ధవీరుణ్ణి, రాజ్యస్థాపకుణ్ణి క్షత్రియుడిగా పేర్కొని, సూర్యవంశమో, చంద్రవంశమో అంటగట్టటం ఆర్యుల రాజనీతి, కుట్రలోభాగం. ఆరాజు తమ చెప్పుచేతల్లో ఉండేట్టు మంత్రతంత్రాలు, యజ్ఞయాగాదులు నిర్వహించటం వాళ్ళ వృత్తి ధర్మం.

## 26. రాజరికం

శివాజీని రాజుగా ప్రకటించటానికి, సింహాసనం అధిష్ఠింపచేసే తతంగం నిర్వహించటానికి ముందు ఉపనయనం చేయాలి. క్షత్రియత్వం ప్రకటించాలి. సూర్యవంశమో, చంద్రవంశమో ఆపాదించాలి. వాళ్ళకే బాగా తెలిసిన కారణాలవల్ల బ్రాహ్మణులు దాన్ని తిరస్కరించారు. రాజ్యాన్ని సంపాదించుకొన్న శివాజి రాజు కావటానికి బ్రాహ్మణుల అండకావలసి వచ్చింది. అందుకు యోగ్యుడైన బెంగాలీ బ్రాహ్మణుణ్ణి పిలిపించారు. వచ్చి, కావలసిన తతంగమంతా చేశాడు. దండిగా దక్షిణ పుచ్చుకొన్నాడు. బెంగాలు చేరలేదు. మధ్యలో హత్యకు గురయ్యాడు. కానీ శివాజీ రాజయ్యాడు. బ్రాహ్మణ దృక్పథానికి వ్యతిరేకి అయినవాడు, బ్రాహ్మణుడైనా బ్రతకడు.

అన్య దేశీయులు భారతదేశ చక్రవర్తులైతే వాళ్ళ దగ్గర ఆర్యులు మంత్రులుగా చేరటం. ఉన్నత ఉద్యోగులు కావటం చరిత్ర చెప్పిన సత్యమే! పాలకుల అండతో ప్రాపకంతో అభివృద్ధి చెందటం వీళ్ళకు వెన్నతో పెట్టిన విద్య. నేటికీ భారత ప్రజాస్వామ్యంలో నూటికి ముగ్గురు కూడా లేనివాళ్ళు ప్రభుత్వ నిర్వహణలో ప్రధానపాత్ర పోషించటం జగమెరిగిన వాస్తవమే!

ప్రజాస్వామ్యంలో బ్రాహ్మణులకు – శూద్రులకు మధ్య అధికారం ఆసులో కండెలోలాగా అటొకసారి,ఇటొకసారి తిరుగుతూ ఉంది. ఈ శూద్రుల చేతుల్లో ప్రభుత్వాలు అధికారాలు ఎక్కువకాలం ఉండవు. ఆర్యవంశస్థుల పలుకుబడిలోకి, ఏలుబడిలోకి అవి అనువర్తనం చెందే అవకాశం ఎక్కువ. జాగ్రత్త లేకపోతే శూన్యమే వారసత్వం.

## 27. నాగార్జునుడు

నాగార్జునుడు, మహాయాన బౌద్ధప్రవక్త. శూన్యవాదస్రష్ట. బౌద్ధమత వ్యాపకుడు. శ్రీపర్వత విశ్వవిద్యాలయాచార్యుడు, పాలకుడు. గౌతమీపుత్ర శాతకర్ణికి గురువు. మిత్రుడు, పాలితుడు. నాగార్జునకొండ నాగార్జునసాగర్ ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం ఈ నాగార్జునుడి పేరుమీద వెలుగొందాయి. ఇతడు బౌద్ధమత ప్రచారంలో ప్రసిద్ధుడు. దానికి దోహదకారి. విదేశీయ విద్యార్థుల్ని ఆకర్షించిన మేధావి, తాత్త్వికుడు, తత్త్వవేత్త, దార్శనికుడు.

నాగార్జునుణ్ణి బ్రాహ్మణుడని, బౌద్ధమతం స్వీకరించాడని సుప్రసిద్ధ చారిత్రక గ్రంథ రచయిత్రి రొమిల్లా థాపర్ అభిప్రాయపడింది. ఆంగ్లేయులు భారతదేశ చరిత్రను ఆంగ్లేయుల దృష్టికోణంనుంచి రాశారని, అసలు చరిత్ర అదికాదని భారతీయులు భావించినట్లే, బ్రాహ్మణులు రాసిన చరిత్ర బ్రాహ్మణ దృష్టికోణం నుంచి పుడుతుందని, అసలు చరిత్రకంటే ఇది భిన్నంగా ఉంటుందని, మాకొద్దీ నల్లదొరతనం అన్నవాళ్ళు గుర్తించారు.

నాటి మధ్యప్రదేశ్ అంతటా వ్యాపించిన నాగజాతి, ఆర్యుల వర్ణవ్యవస్థను తిరస్కరించటం, వాళ్ళిచ్చే క్షత్రియత్వం నాటి నాగజాతిపాలకులు స్వీకరించకపోవటం వాళ్ళది బలమైన యుద్ధ వీరుల రాజ్యం కావటం, ఆర్యాధిక్యం అంగీకరించకపోవటం ఆర్యుల దక్షిణాపథ దండయాత్రకు బలమైన ప్రతిబంధకం కావటంవల్ల నాగజాతిని అయితే లొంగదీసుకోవటం, లేకపోతే అంతం చేయటం వాళ్ళకుచారిత్రక అవసరమయింది.లొంగటం లేదు కాబట్టి చంపటం అనివార్యమయింది.

ఆర్యులు సృష్టించిన సంస్కృతభాషలో నాగశబ్దం సర్ప పర్యాయ పదంగా చూపించి, పాముల్ని చంపటం న్యాయమని సామాన్యుల్ని నమ్మించి, సర్పయాగం ప్రారంభించి నాగజాతిని అంతం చేయటానికి పూనుకొన్నారు, ఆర్యులు. నాగజాతి ప్రజలు తిరుగులేని యుద్ధ నిపుణులైనా, మోసాలు, కుతంత్రాలు, కుట్రల ముందు నిలవలేక స్వస్థలం వీడి వలస పోవలసి వచ్చింది. ఇప్పటి నాగాలాండ్ దాని తోడి సప్త సోదరీ రాజ్యాలుగా ఏర్పడ్డ వాటిలోకి వెళ్ళి వాళ్ళు స్థిరపడ్డారు. కొందరు దక్షిణ భారతదేశానికి వలస వచ్చారు. నాగజాతి కాల క్రమంలో ద్రావిడజాతితో కలిసి పోయింది. ద్రావిడులు నాగజాతీయుల గుణరూపరేఖల సంగమంగా ప్రజలు మారారు. ద్రావిడుల శరీరవర్ణ పరిణామం ఈ సంగమం వల్ల కలిగినట్లు భావించటం కద్దు. నాగజాతికి, చర్మకారులకు నాడు అన్నదమ్ముల సంబంధం ఉండేది. నాగార్జునుడు ఈ రెండు జాతుల చైతన్యమూర్తి.

నాగార్జునుడి శాంతం, గౌతమీపుత్ర శాతకర్ణి పరాక్రమం, సక్రమ సమన్వయం పొందటం వల్ల శాతవాహన రాజ్యపాలన ప్రజామోదం పొందింది.

అమరావతి స్తూపం శాతవాహన చక్రవర్తుల నిర్మాణమే అయినా,మార్గ నిర్దేశకుడు నాగార్జునుడు, ఈ స్తూప శిల్పాలలోని పూర్ణకుంభం ఆంధ్రప్రదేశ్ రాజలాంఛనంగా స్వీకరించింది. అది అమరావతి స్తూపానికి ఒక చర్మకారుడు దానం చేసి శిలాఫలకం.

కొందరు చరిత్రకారులు అమరావతి స్తూపం మీద చర్మకారుడు చేసిన దానం, శిల్పశిల, ఉందని రాశారు. పూర్ణ కుంభం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వరాజలాంఛనమనీ తెలిపారు. కానీ చర్మకారుడి సృష్టి పూర్ణకుంభమని చెప్పరు. అబద్ధం చెప్పరు. నిజమూ చెప్పరు. వాస్తవం గుంభనంగా దాచిపెడతారు. అందుకే బ్రాహ్మణ చరిత్రగ్రంథాలు బ్రాహ్మణ జీవితానుకూలంగా ఉంటాయి. ఇతర జాతుల జీవితాలను, వాస్తవాలను, వాళ్ళకిష్టం లేకపోతే మరుగున పడేస్తారని బాధపడటం ఇటువంటి సందర్భాల వల్లే!

ఆచార్య బిరుదురాజు రామరాజు, శ్రీకార్తికేయశర్మ, డా.చిలుమూరి శ్రీనివాసరావు మొదలైన పలువురు చర్మకారులు అమరావతి బౌద్ధ స్తూపం మీద ప్రతిష్ఠించిన పూర్ణకుంభం గూర్చి తెలిపారు.

## 28. పూర్ణకుంభం

పూర్ణకుంభానికి తొలినాటినుంచి ప్రసిద్ధంగా ఉన్న పదం పూర్ణఘట పటం. దీన్ని బర్గెసా మహాశయుడు 1881లో గుర్తించి వ్యాసం రాశాడు. ఆ రచనను హోకట్స్ ప్రచురించాడు. ఇది దాచేపల్లి ముగ్గు రాయితో చేయబడినట్లు గాను, 4' x 2" x 3' కొలతలు కలిగిన ఫలకంగాను, క్రీ.శ. 2-3 శతాబ్దానికి చెందినట్లుగానూ భావించారు. 1976లో ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం సాంఘిక సంక్షేమశాఖ పక్షాన హరిజన కాన్ఫరెన్స్ ఏర్పాటు చేసింది. అప్పటి సావనీర్‌లో ఆచార్య బిరుదురాజు రామరాజు పూర్ణ కలశ ప్రదాత పేరిట వ్రాసిన వ్యాసం ఆసక్తి కలిగించింది. దీన్ని ప్రదానం చేసింది చర్మకారుడని స్పష్టంగా వ్రాయటం సంతోషం కలిగించింది.

డా.సురగాలి తిమోతి జ్ఞానానందకవి 'షెడ్యూలు కులాలు అంట రానివా?' అనే పుస్తకంలో శ్రీ కార్తికేయశర్మను ఉటంకిస్తూ 'అమరావతీ మహాస్థూపమునకు చర్మకారుడొనర్చిన దానము' పేరిట వ్రాసిన వ్యాసముంది.

డా.చిలుమూరి శ్రీనివాసరావు, 'మాదిగల చరిత్ర-సంస్కృతి' గ్రంథంలో ఈ పూర్ణఘటపటం గూర్చి ఇచ్చిన వివరణ ఉంది.

ఆ పూర్ణ ఘటపటం కింద ఉన్న ప్రాకృత శాసనమిది.

వరుస-1

సిద్ధంచయ కారస నాగఘరియపు తన విధికస
సంఘ తుకస సభయకస సభాతుకస పుతస చనాగన
సమధు తకస సనతిమితా బంధవస దేయదం మ

వరుస-2

పుణ ఘట కపచో"

"ఈ ప్రకృత శాసనానికి అర్థము:

సిద్ధం గృహపతి నాగునికొడుకు-చర్మకారుడు ఐన వీధిక-తన తల్లి, భార్య, తమ్ములు, కొడుకు నాగుడు, కూతుళ్ళు, దాయాదులు, స్నేహితులు బంధువర్గముల దేయ ధర్మముగా ఈ పూర్ణ ఘట పటమును గావించెను.

ఈ పూర్ణ ఘటశిల్పము విలక్షణమైనదే గాక అమరావతీ శిల్ప సంపదకు శోభస్కరమై 'ఆంధ్రుల ప్రాచీన శిల్పశైలి' సర్వమంగళ కరముగా నిలిచినది"

దీనిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రాజలాంఛనంగా గ్రహించింది. సచివాలయంలో దీని నకలు 27.7.2008న ప్రతిష్ఠించారు. అలతి మార్పులతో హైదరాబాద్‌లోని పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం దీనిని విశ్వవిద్యాలయ చిహ్నంగా మునుపే స్వీకరించింది.

దీనిని చర్మకారుడు-విధిక దానం చేశాడని, మరొక పశువుల కాపరి కూడా ఒక శిల్పస్తంభమును దానం చేశాడని తెలుస్తూ ఉంది. ఈ పూర్ణకలశం శిల్ప సంపదతో విరాజిల్లుతూ ఉందని, అమరావతీ శిల్పరీతికి ఆలవాలంగా ఉందని, ఇది శాతవాహనుల కాలం నాటిదని, బౌద్ధమత నేపథ్యంతోడి శిల్పమేనని స్పష్టమవుతుంది.

పూర్ణ కలశ ప్రదాత విధిక. అతడి తండ్రి నాగన, అతడి కొడుకు నాగన. భుజంగ రాయుడి తండ్రి నాగన. నాగార్జునుడి కాలం నాటిదీ పూర్ణకలశం. నాటి చర్మకారులు-నేటి మాదిగల-ప్రాభవం ప్రకటిస్తుందీ పూర్ణకుంభం.

దీనిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రాజలాంఛనంగా స్వీకరించటం మాదిగల ఒకనాటి వైభవాన్ని గుర్తించి అంగీకరించినట్లే! నాడు చరిత్ర, మతం, శిల్పం, సంస్కృతి, నాగరికతల నిర్మాతలు మాదిగలు. నాడు వాళ్ళు అభివృద్ధి చెందిన ఆదిఆంధ్రులు. నేడు అభివృద్ధి చెందవలసిన పంచములు దళితులు. నాటి ఔన్నత్యం నుంచి, నేటి పతనానికి, దీని నుంచి పొందుతున్న ఉత్థానానికి, సాక్ష్యం చరిత్ర. ఈ నేల మీద కాలుమోపిన విదేశీయులు, ఇతర ప్రాంతాలవాళ్ళు వశం చేసుకొన్న సంపద, చారిత్రకంగా కోల్పోయిన పంచములదే! నాటి వైభవం, అనంతర కాలంలో దోపిడీలవల్ల, నేటి దయనీయ స్థితికి దిగజారింది. మళ్ళీ పునరుజ్జీవనం జరుగుతుంది.

ఈ పూర్ణ ఘటపటం అమరావతీ స్తూపం మీద చర్మకారుడి దానంగా ఉంది. ఈ స్తూపం క్రీ.పూ.300 నాడు మొదలై, క్రీ.శ.300 నాటికి పూర్తయినట్లు చరిత్రకారులు భావిస్తున్నారు. అశోకుడి, శాతవాహనుల ఇక్ష్వాకుల శాసనాల ఆధారంగా స్తూప కాలనిర్ణయం చేశారు.

ఈ స్తూప నిర్మాణం జరిగేనాటికి ధరణికోట శాతవాహనుల రాజధాని. శాతవాహనుల సామ్రాజ్యం విశాలంగా వ్యాపించిందని, పాటలీపుత్రం కూడా వీళ్ళ సామ్రాజ్యంలో చేరిందని చరిత్రకారులు చెబుతున్నారు.

జైన బౌద్ధ మతాలను నామరూపాలు లేకుండా చేయటంలో కృతకృత్యులైన వైదిక మతానుయాయులు హిందూమత ప్రాభవం నిలపటానికి క్రీ.శ.10వ శతాబ్దికాలంలో అమరేశ్వరాలయం నిర్మింపజేసినట్లు చరిత్రకారుల ఊహ. చరిత్ర పొడుగునా పలువురు పాలకులు దీని జీర్ణోద్ధరణ చేశారు.

ఈ అమరేశ్వరాలయం దగ్గర రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు కోట నిర్మాణం చేయించాడు. నగరం ఏర్పడింది. అప్పటి నుంచి విశేష ప్రజావానం అమరావతిపట్టణం. అమరావతి పేరు అమరేశ్వరాలయం ఉండటంతో పాటు, తాను దేవేంద్రుడని, తన రాజధాని అమరావతి అని, తన కొలువు సుధర్మ అని నాయుడు భావించటంవల్ల కూడా స్థిరపడింది. నాయుడి కాలంలో స్తూపం ప్రపంచ దృష్టిని ఆకర్షించింది. మెకంజీ, ఫెర్గుసన్ వంటి ప్రసిద్ధులైన చారిత్రక దృష్టి కలవాళ్ళు ఈ స్తూపాన్ని అమరావతీ స్తూపమన్నారు. ఇది నాయుడి కాలం నుంచి తవ్వకాలకు గురై, శిల్ప కళాఖండాలు, లండను, మద్రాసు, కలకత్తా, మచిలీపట్టణం చేరిపోయాయి. మిగిలిన వాటి ప్రాభవం స్థానికుల దుర్వినియోగంవల్ల తగ్గిపోగా శేషమే విశేషంగా ఉంది.

రెండున్నర వేలేళ్ళకు పైగా తెలుగు నేలను పునీతం చేసిన శిల్ప సంపదకు పుట్టినల్లు ఈ స్తూపం.

స్తూపంలోని శిల్పాలు పూర్తిగా బౌద్ధమత సంబంధమైనవి. బుద్ధుడి జననం నుంచి నిర్యాణం దాకా భిన్నదశలను, స్థితులను తెలిపే శిల్పాలతో ఒప్పుతూ ఉంది స్తూపం.

అనంతరం అపరబుద్ధుడు, బౌద్ధశాఖా నిర్మాత, మాధ్యమిక కారికాకర్త, శూన్యవాద స్థాపకుడు, నాగార్జునాచార్యుడు అమరావతీ స్తూప నిర్మాణంలో విశేష కృషి చేశాడు.

పాతికమంది చారిత్రక దార్శనికులు, చరిత్రకారులు, కళాచరిత్ర కారులు, కలెక్టర్లు, బౌద్ధులు, శిల్ప మార్మికులు గత 250 ఏళ్ల నుంచి స్తూపవిషయంలో అనేక వ్యాసాలు వ్రాశారు.

ఇది ధరణికోట స్తూపం. ఇది నిర్మాణం ప్రారంభమైన రెండువేల ఏళ్ళకు అమరావతికి గౌరవం కలిగింది. కానీ ఈ శిల్పానికి అమరావతి శిల్పమని, స్తూపానికి అమరావతీ స్తూపమని ప్రసిద్ధిరావటం వెనుక

అమరేశ్వరుడి అనుగ్రహమే ఉన్నట్లుంది. ధరణికోట, ద్రావిడుల, శాతవాహనుల, నాగజాతి ప్రభావం వెనక్కు తగ్గినట్లుగా ఉంది.

బౌద్ధ శిల్ప సౌందర్యంలోని నాగ తేజస్సు గాని, నాగ పూజ గాని, నాగజాతి వైశిష్ట్యంకాని, ఇప్పుడెవరూ వెలికి తీసేట్టుగా కనిపించటం లేదు. భుజంగరాయుడు, అతడి తండ్రి నాగన్న నాగజాతి వైశిష్ట్య దర్శనానికి దోహదం చేశారు. నేటికీ నాగపూజ, నాగ పంచమి జరుగుతున్నాయి.

ప్రపంచం సరిగ్గా మేల్కొని రోజుల్లో మేల్కొన్న నేల తెలుగు గడ్డ. అప్పుడంతా ద్రావిడులే! తరువాతి ద్రావిడ దేశంలోని దేవాలయ శిల్పాలకు మూలరూపాలు అమరావతీ స్తూపం నుంచి, అమరావతీ రీతి నుంచి భిన్న శాఖాభేదాలతో అవతరించాయని చెబుతున్నారు. దక్షిణ భారతదేశమంతా దేవాలయ వాస్తు శిల్ప సామ్రాజ్యం విస్తరించింది.

ఇంత ప్రాచీనమైన అమరావతీరీతి శిల్పం గ్రీకు నుంచి, గాంధారశిల్పం నుంచి తెలుగువాళ్ళు ఎరువు తెచ్చుకున్నారని కొందరు భ్రమిస్తుంటారు. కాని వాస్తవం ఈ శిల్ప నైపుణ్యమే ప్రపంచం గ్రహించింది. "This is the most interesting monument of antiquity east of Greece! Without being so enthusiastic as this and giving to Amravati the superiority over Nineveh, Jerusalem and the pyramids, one must admit that the marbles are of very great interest".

(pp 166, 167, Kistna District Manual)

ఈ స్తూపంలో దాదాపు 12000 నుంచి 14000 దాకా శిల్పాలున్నాయి. ఇంత విస్తృత శిల్ప సామ్రాజ్యం ఎక్కడా లేదనుకోవటానికి, ఒక్కచోట తప్ప, ఆంధ్రుడు గర్వపడతాడు. "Except the great frieze at Nakhou Vat in Cambodia, there is not in any other part of the world a mass of sculpture equal in extent to what this must have been when complete" (P 27, Appendix No x 11 of Madras presidency Manual).

నాటి మానవ నాగరికతను సంస్కృతిని ప్రతిబింబించే వస్తువులు, పనిముట్లు, ఆభరణాలు, అలంకరణ రీతుల గూర్చి అత్యద్భుతంకంటే తక్కువ మాటలతో చెప్పలేం. స్త్రీ పురుషుల బొమ్మలు, శరీర సౌందర్యం, ఆకృతుల్లోని రామణీయకం వాళ్ళ హృదయాలను, అనుభూతుల్ని విశేషంగా చూపుతాయి. శిల్పులు మగవాళ్ళు ఎక్కువగా ఉండి ఉంటారు. ఆడవాళ్ళ బొమ్మలు శిల్పించటంలో సౌందర్యం సమస్తం రంగరించారు.

"అమరావతీ స్తూప శిల్పములలోని స్త్రీ చిత్ర రచన అత్యద్భుతమైనది. ఒక స్త్రీ చిత్రమును పోలినదింకొకటి ఎంత వెదికనను కనబడదు"

(పుట: 39. అమరావతి స్తూపము, విజ్ఞాన సర్వస్వము-సంస్కృతి సంపుటం)

'అమరావతి శిల్పంలోని స్త్రీమూర్తులు సజీవస్వరూపాలు. తన్మయ స్వరూపిణులు అమరావతి శిలావనితలు రాతిలోని గీతాలు... ఆమెలోని లయ మయపు వంపులు...' (పుట: 27, రసరోచన, సంజీవదేవ్) చూచి సంజీవదేవ్‌తన్మయుడయ్యాడు. ఒక గొప్ప చిత్రకారుడికింత తన్మయత్వం కలిగించిన శిల్ప సౌందర్యం తనివితీరా దర్శించటానికి రెండు కళ్ళు చాలవు.

ఈ శిల్పాలు మానవాతీత శక్తి నిర్మించిందని, దేవతా హస్తం ఉందని కవులు భ్రమించేంత అద్భుత శిల్పరాశి కలది అమరావతీ స్తూపం.

తెలుగు నేలమీదికి వైదికార్యులు రాకపూర్వం, వర్ణవ్యవస్థ లేని పూర్వం, బ్రాహ్మణ ప్రాబల్యం ప్రాకక పూర్వం, క్షత్రియ వైశ్యులు లేనినాడు, రాష్ట్ర కూటులతోడి రెడ్డిరాజులు పాలించకపూర్వం, కాకతీయులతోడి కమ్మ ప్రభువులు పాలించకముందు, శాతవాహనులకు సామంతులుగా ఎరుకల, యానాది, చెంచు, మాల, మాదిగ, కుమ్మరి, కమ్మరి, చాకలి, మంగలి, తెలగ, బలిజ, కాపు వంటి అనేక వృత్తుల వాళ్ళు, జాతుల వాళ్ళు పాలించిన, జీవించిన ప్రాంతంలో పుట్టిన అమరావతీ స్తూపం ఆంధ్రుల వారసత్వ సంపద. ఇది ఆది ఆంధ్రుల సంపద. ఆదిమవాసుల తెగల సంపద. పైన పేర్కొన్నవి ఇప్పుడు కులాలుగా ప్రసిద్ధం. అప్పుడు కులాలుగా ప్రసిద్ధంకావు. వృత్తులుగా ప్రసిద్ధం. ఆయా వృత్తుల వాళ్ళు ఈ నేలను పునీతం చేశారు.

చర్మకారులు, పశువుల కాపరులు (వృత్తిపేర్లు కావు) అమరావతీ స్తూపానికి శిల్పశిలా దానం చేయగలిగారంటే వాళ్ళ సంపదను గూర్చి గౌరవం కలుగుతుంది. దానంచేయనిచ్చారంటే నాటి సమాజ జీవన సౌభాగ్యం అర్థమవుతుంది. నాటి ఆదిఆంధ్రులు నేడు అనాథాంధ్రులయ్యారు. ఈ దౌర్భాగ్యానికి చరిత్ర సాక్ష్యం పలుకుతుంది. ఈ నేలమీదికి వచ్చిన భిన్న ప్రాంతాల జనం సంపన్నులుగావటం ఈ నేలమీది ఆదిమవాసులు దారిద్ర్యంతో పతనం కావటం చరిత్రచేసిన పరాభవం. ఈ పరాభవం, ఇలాగ్గ, ఎల్లకాలం ఉండకూడదు, (ఆదిఆంధ్రుడు కావ్యం. పుటలు: 41-46. ఆచార్య కొలకలూరి ఇనాక్)

## 29. భుజంగ రాయుడి వైశిష్ట్యం

భుజంగరాయుడంటే నాకెందుకు ఇంత విపరీతమైన అభిమానం కలిగింది? బాల్యంలో ఆపైన అప్పుడప్పుడు అతడి కథలు వినటంవల్ల, అవి చెప్పిన అరక అత్తోటి రత్నకవి అందంగా, ఆత్మీయంగా పాడ చెప్పటంవల్ల, మా తల్లీ రాయుణ్ణి ఆరాధనతో ప్రస్తుతించటంవల్ల,

తల్లంటే నాకు దేవుళ్లకంటే గొప్ప దేవత కావటంవల్ల, రాయుడిమీద అభిమానం, ఇష్టం, ప్రేమ, గౌరవం ఏర్పడి ఉండవచ్చు.

అంతేకాదు, మాదిగ కులస్థుడు, ఆరోజుల్లో సంప్రదాయాంధ్ర సంస్కృత సాహిత్య పండితుడు కావటం, సేనాని, కవి, మంత్రి, రాజ ప్రతినిధి, రాజుకు సలహాదారుడు కావటం, మేధావి, ఆలోచనా పరుడు, దేశభక్తుడు, స్వామిభక్తుడు, అత్యంత విశ్వసనీయుడు కావటం చాలా గొప్ప విషయాలు. మాదిగ మహనీయుడు ఆస్థాయికి చేరుకోవటం చాలా అరుదు. మాదిగల్లో సమర్థులు యౌవనంలో ఆగ్రహావేశాలతో కొందరు అంతరిస్తారు. కొందరు మానినీ మదిరామత్తులై చైతన్యం కోల్పోతారు. ఆగ్రహాన్ని, ఆవేశాన్ని, జెండాలుగా ఎగరేస్తూ శాంత చిత్తులుగా, ఆలోచనాపరులుగా అందరూ ఉండలేకపోతారు. మాదిగ లంతగా ప్రేమించే మధుర హృదయులు అరుదే! రేపటిని గురించి ఆలోచించకపోవటం, ఉన్నవన్నీ దానం చేయటం హక్కులుగా భావిస్తారు వీళ్ళు. ఈ గుణాలే వీళ్ళకు శాపాలుగా మారతాయి. ఆ నేపథ్యం నుంచి వచ్చిన రాయుడు అంత విశిష్టుడుగా పెరగటం అసామాన్య విషయమే!

అంతే అయితే అందరూ ఒక నమస్కారం పారేసి ఊరకుందురు. మేలు చేసినవాణ్ణి మనుషులు పూజిస్తారు. స్వాతంత్ర్యం సాధించాడని గాంధీమీద చాలామందికి గౌరవం. రాజ్యాంగంలో దళితులకు హక్కులు కల్పించాడని అంబేద్కరు అంటే గౌరవం. వాళ్ళను పూజిస్తారు. ఎంత గొప్ప వాళ్లయినా తమకేం చేశారో, దానిమీదే వాళ్ళకిచ్చే మర్యాద మన్నన నిలుస్తాయి.

పంచములు గుడులలోకి పోవచ్చు రావచ్చు ననీ, కొలనులో నీళ్ళు తాగవచ్చుననీ, అందులో స్నానం చేయవచ్చుననీ, కోటలోకి స్వేచ్ఛగా పోవచ్చుననీ, పంచములు అందరితో అన్ని విషయాలలో సర్వసమానమని శాసనం వేయించటం, దాన్ని ఆచరించపచేయటం, పంచములకు ఆనందాన్ని కలిగించింది. ఈ శాసనం అన్నం పెట్టదు. ఇళ్ళివ్వదు. భూములివ్వదు. బర్రెలివ్వదు, గొర్రెలివ్వదు. ఆత్మవిశ్వాసం ఇస్తుంది-ఆత్మగౌరవం ప్రతిష్ఠిస్తుంది. మానవ సమానత్వానికి మార్గం ఏర్పరుస్తుంది. ఇది పంచములకు ప్రాణ ప్రదమయింది. ఇది భుజంగరాయుడి జీవిత కృషి. దీనికి అతడు చాలా త్యాగాలు చేశాడు. దీనికోసమే పరమ పరాక్రమశాలి, ప్రసన్నశాంత చిత్తుడుగా మారాడు. ఈ వ్యక్తిత్వానికి గుర్తింపే ఈ కథలు గాథలు. ఈ మహాత్ముడి పూజే వీటి ప్రచారం. ఈ మహనీయుడి స్మరణే ఇది జనాళి నాల్కల మీద నర్తించటం.

అంటరానితనం రద్దని, అందరూ సమానమని, నాయుడు శాసనం చేశాడని జానపద గాథ. అది చరిత్రగా నిరాధారం. అది దొరికితే చరిత్ర స్పష్టమవుతుంది. ఎప్పుడో దొరుకుతుంది. ఎవరో వెలుగులోకి తెస్తారు. ఇప్పుడూ అంటరానితనం నేరమని చట్టం ఉంది. అది ఉల్లంఘనలోనే ఎక్కువగా అమలు అవుతూ ఉంది.

అప్పుడు నాయుడు శాసనం చేశాడు. ఎందుకు చేశాడు? రాయుడు కోరాడని! ఎవరో కోరితే రాజులు శాసనాలు చేస్తారా? తనకు కావలసిన వాళ్ళు కోరితే కాదనలేక చేయవచ్చు. ఆ శాసనం చేయాలని రాజుకే అనిపించవచ్చు. శాసనం వల్ల, దూరీకరణం పొందిన పంచములు సన్నిహితులు కావచ్చు. ఈ శాసనంవల్ల సన్నిహితులు దూరమూ కావచ్చు. రాజు ఇవన్నీ చూచుకోవాలి. శాసనం చేయకపోతే, రాయుడు దూరమవుతాడా? శత్రువవుతాడా? ప్రమాదికారిగా మారతాడా? రాయుడి అర్హత శాసన ఆవిర్భావానికి మూలం. రాయుడు అడక్కపోతే రాజు శాసనం చేసేవాడు కాడేమో!

## 30. వాసిరెడ్డి వంశసాహిత్యం

దిట్టకవి రామచంద్ర 1800లో వ్రాసిన 'వాసిరెడ్డి వంశచరిత్ర' అమరవాది రామన కృతమైన 'వాసిరెడ్డీయము' (1835) శ్రీవిష్ణుభొట్ల శ్రీరామశాస్త్రి 'వేంకటాద్రీంద్ర చరిత్రము (1930) పద్యకావ్యాలు అలభ్యంగా ఉన్నాయి. కొడాలి లక్ష్మీనారాయణ వచనంలో వ్రాసిన రాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు (1963)వాసిరెడ్డి వేంకట సుబ్బదాసు కావ్యం 'వాసిరెడ్డి వంశచరిత్ర' (1914) లభిస్తున్నాయి.

ఈ కావ్యంలో భుజంగరాయుణ్ణి వాసిరెడ్డి వంశచరిత్రమును గూర్చి ఉన్న చతుర్థాశ్వాసములోని సందర్భం ఉదాహరిస్తున్నాను.

**"వ. వారిందగు రీతి నీ సామ వాక్యంబుల చేతన,**
**యెటులేనిఁ దోడ్కొని రమ్మన నప్పుడా**
**భుజంగరావను పంచముండతి బలవిభవాతిశయంబున,**
**నా తేని సేనాధిపతియై, యుండెంగాన,**
**తేనియాజ్ఞ శిరసావహించి, వనికిం జేరెనయ్యెడ.14**

**ఉ. కాంచె భుజంగరావుపథికప్రకరాతి కఠోర దుష్క్రియా**
**భ్యంచిత కాననాంతర విహారిసురారి సమాన దంభప**
**ద్యాంచల సంచరత్కుమతి యాపన సాధనహస్త నిస్తులా**
**వంచన కుంచితాటవిక వైరుల ధీరుల జెంచువారలన్ 15**

**తే॥ మానవంతుడు మేటి సేనాని యపుడు**
**శాంతరసముట్టిపడ వారి సరసం జేరి**
**యందు శ్రీరామదాసను నధికుఁ గాంచి**
**మన్నన వచించె యుక్తమౌ మాటలపుడు 16"**

ఇందులో వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు చెంచులను 'యెటులేని' తోడ్కొని రమ్మనటముంది. భుజంగరావు పంచముడని, సేనాధిపతి అని, సేనాని అని, మానవంతుడని, 'శాంతరసముట్టిపడ' సంభాషిం చాడని స్పష్టమవుతుంది.

చెంచుల్ని ఐదువందలమందిని హతమార్చగా మూడు వేల సైన్యంలోని చాలామంది రాజు చేతలకు భయపడి పరారయ్యారు. రాజు సేనానిని, హననకాండకు అడ్డుపడకుండా, గృహనిర్బంధం కావించాడు. అంతకు పూర్వమే మాదిగ భుజంగరాయుణ్ణి సేనానిగా చేయటంతో కోపించి, కమ్మ కులస్థులైన దళపతులు సైన్యవృత్తి నుంచి నిష్క్రమించారు. సైన్యం సన్నబడింది. బలహీనమైంది. అప్పుడు హైదరాబాదునుంచి నైజాము నవాబు సైన్యం, ఇటు గుంటూరు నుంచి కలెక్టరు బలగంలోని రెండు కంపెనీల సైన్యం చింతపల్లిని ముట్టడించి, రాజును బంధించి, గుంటూరులో కొత్తపేటలో, పాత పోష్టాఫీసు భవనంలో గృహ నిర్బంధంలో ఉంచారు.

గృహనిర్బంధం నుంచి విముక్తుడైన భుజంగరాయుడు కలెక్టరును కలిసి, అకృత్యాలు జరగవన్న హామీ ఇచ్చి, రాజుకు స్వేచ్ఛ కలిగించాడు. చింతపల్లి కోటకు వెళ్ళటానికి బుద్ధి పుట్టని రాజు, అమరావతిలో కోట నిర్మింపచేయమని సేనానితో చెప్పి తిరుపతి యాత్రకు పోయాడు. అమరావతి కోట, నగర నిర్మాణానికి కావలసిన సైన్యశక్తి తగ్గింది. సైనికుల్ని నియమించుకోవాలంటే రాజు కలెక్టరును, నైజాం నవాబును అడగాలి. అది రాజుకూ ఇష్టంలేదు. సేనానికీ కష్టంగా ఉంది.

కోట నిర్మాణానికి కూలీలను నియమించటం తప్పలేదు. ఇప్పుడు మాదిగ సేనాని దగ్గర పనిచేయటానికి ద్విజులుకానీ, ఉన్నత వర్గాల వాళ్ళు అనబడే శూద్రులు కానీ, సిద్ధం కాలేదు. ఎక్కువగా మాదిగలు కొందరు విభిన్న వృత్తి కులాల వాళ్ళు కూలీలుగా చేరారు. నిర్మాణ కార్యక్రమం ముగిసిపోగా, ఈ కూలీలే సైనికులయ్యారు. సైన్యశక్తి పెరిగింది.

అమరావతి నిర్మాణంలో ప్రధాన భూమిక పోషించినవాళ్ళు మాదిగ యువకులు. వీళ్ళకు తోడు విభిన్నవృత్తి కులాల సమర్థులు తోడయ్యారు. ఇప్పుడు సైన్యంలో సగం కంటే ఎక్కువ మాదిగలు అమరావతి రాజ్యపరిరక్షకులయ్యారు.

## 31. శాసనం

రాజావాసిరెడ్డి వేంకటాద్రినాయుఁడు అమరావతిలో సింహాసన మధిష్ఠించాక, భుజంగరాయుడి కోరికమేరకు, శాసనం చేశాడు. ఇది ఆ శాసన పద్యరూపం.

మాదిగల్ గుడులసమ్మతి పొంది పూజింప
సర్వశక్తుల నిచ్చు శాసనమ్ము
మాదిగల్ కొలనుల మజ్జనాదులు చేయ
సకల హక్కులనిచ్చు శాసనమ్ము
మాదిగల్ కోటకున్ మరల, వచ్చుటం ప్ర
శస్త యుక్తులనిచ్చు శాసనమ్ము
మాదిగల్ స్పృశ్యులై మహి సర్వసములౌచు
సత్యరంగమునిచ్చు శాసనమ్ము
శాసనమ్మింక ప్రశ్నింప సాధ్యపడదు
శాసనమ్మింక ధిక్కార సరణినాపు
శాసనమ్మింక భూప్రజాచరణ కోరు
శాసనమ్మింక నమలుగా సత్యమగును.

(ఆది ఆంధ్రుడు కావ్యం.ప.401. పుట. 190)

ఈ శాసనం 1797-1800 మధ్యకాలంలో ప్రదత్తం చేయ బడింది. అంతకు పూర్వం అంటరానితనం నిర్మూలించిన ప్రభువులు మృగ్యం. సాహు మహరాజు సాహసచర్యలు కూడా అనంతర కాలానికి చెందినవే. మానవులందరితో మాదిగలకు సమానత్వం మిచ్చిన ప్రథమాంధ్ర రాజు వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు. ఇప్పించేంత కృషి చేసిన త్యాగశీలి మాదిగ భుజంగరాయుడు.

ఈ కాలంలో శైవభక్తీ, వైష్ణవభక్తీ కలగలిసిపోయిన హరి హరాద్వైతం, నాయుడికి మానసిక ప్రశాంతి కోసం, ఇష్టమయింది. యజ్ఞయాగాదులు విరివిగా చేశాడు. బ్రాహ్మణుల్ని పోషించాడు. మాదిగల్ని మన్నించాడు. బంగారుఆవును చేసి, దాని గర్భంలో కూర్చుని దాని నుంచి వెలువడితే, గోవుకు పుట్టిన వాడవుతాడు అని గోగర్భ ముఖం చేస్తే సర్వసౌఖ్యాలు లభిస్తాయని, అనారోగ్యం అంతరిస్తుందని బ్రాహ్మణులు చెబితే చేశాడు. ప్రయోజనం రాజుకేమి కలిగిందో తెలియదుకాని, బంగారం బ్రాహ్మణులకు లభించింది. స్వర్ణగోవును బ్రాహ్మణులకు దానం చేస్తున్నప్పుడు అమరావతి ధరణికోటల్లోని మాదిగలు వచ్చి, బంగారు ఆవుకు ప్రాణం లేదు కాబట్టి, అది చచ్చిన గొడ్డుతో సమానమని, దాన్ని తీసుకుపోయే బాధ్యత తమదని, దాన్ని తమకు ఇవ్వకపోతే బ్రాహ్మణులకిస్తే, ఇకపైన చచ్చిన గొడ్లనన్నింటిని బ్రాహ్మణులకే ఇవ్వాలని, తమను తీసుకు పొమ్మని ఆజ్ఞగా చెప్పకూడదని వాదించారు. వాళ్ళ వాదనలోని బలం గుర్తించిన నాయుడు యజ్ఞఫలం తాను పొందుతాననుకొని, స్వర్ణగోవును బ్రాహ్మణులకు, దానివిలువ డబ్బును మాదిగలకు ఇచ్చాడని జానపద గాథ ప్రచారంలో ఉంది. దీన్ని కొడాలి లక్ష్మీనారాయణ కూడా వ్రాసిపెట్టాడు.

ఇంతేకాదు, మాదిగలు మురికికాళ్ళతో దేవాలయంలోకి ప్రవేశిస్తే దేవాలయం మలినమవుతుందని, దోషం తగులుతుందని వాళ్ళ ప్రవేశం నిషేధించమని రాజును కోరితే, రాజు, వాళ్ళు మురికి కాళ్ళతో రారాదని, శుభ్రంగా కడుక్కొన్న చెప్పులకాళ్ళతో రావచ్చునని, దేవా లయంలో దేన్నీ తాకరాదని, చెప్పుల్లేని కాళ్ళతో రారాదని నిర్ణయించా డని జానపదకథ. దీన్ని కొడాలి లక్ష్మీనారాయణ వ్రాసి ఉంచలేదు.

ఇది వాస్తవమయినా, కాకపోయినా, మాదిగల కిష్టమైన జానపద గాథ. తాను నిర్వహించిన అన్నదానాలలో కూడా అందరినీ సహపంక్తిలో కూర్చోబెట్టించేవాడనీ, మాదిగల్ని దూరం చేసేవాడు కాదని, బ్రాహ్మనాయుడి చాపకూడు వేంకటాద్రినాయుడికి ఆదర్శమని మౌఖిక సంప్రదాయ ప్రసిద్ధం. ఏతావాతా మాదిగలంటే నాయుడికి మమకారం ఉందని ఊహ.

అమరావతి బౌద్ధస్తూపమే జీర్ణమై, కాలగర్భంలో కొంత, ప్రజోప యోగంలో కొంత, ప్రభువుల ఆదరణలో కొంత మచిలీపట్టణంలో, మద్రాసులో, లండన్‌లో ఉండిపోయినట్లే చాలా శాసనాలు అలభ్యంగా ఉన్నాయి. కొలకలూరులో గుడిలో భద్రంగా ఉన్నదన్న శిలాశాసన ప్రతి కూడా ఎవరి అరుగు మీదకో చేరింది.

నాకు చిన్నతనం నుంచి భుజంగరాయుడు తెలుసు. అతడి శక్తియుక్తులు, వ్యవహారదక్షత, శాంతస్వభావం, సైన్యశక్తి ఆత్మగౌరవం మాదిగ అభివృద్ధి కాంక్ష కథలు కథలుగా జానపద గాథలుగా తెలుసు. భుజంగరాయుడు ఇంటిపేరు కొలకలూరి అని తెలిసి నాకు ఆనందం గర్వం.

## 32. కొలకలూరి భుజంగరాయుడు

ఆది ఆంధ్రుడు కావ్యం, భుజంగరాయుడి జీవితం గ్రహించి, నాయకుణ్ణి చేసి నేను వ్రాశాను. ఆది ఆంధ్ర పదం - మాలమాదిగ, పదాలకు బదులుగా - ఆత్మగౌరవ చిహ్నంగా, గుర్తింపబడాలన్న కాంక్ష 1917నుంచి ఈ జనంలో ప్రబలింది. ఉద్యమం జరిగింది. ఈ కావ్యం ఆ ఆత్మ గౌరవ ఉద్యమ స్వభావం గుర్తు తెస్తే తెస్తుందికానీ, మాదిగలు ప్రాచీనాంధ్రులని తెలపటానికే ఈ కావ్యం 'ఆదిఆంధ్రుడు' నేను వ్రాశాను.

ఆచార్య ముదిగొండ శివప్రసాద్ కీ.శే. డా.కవితాప్రసాద్. శ్రీపొత్తూరి వేంకటేశ్వరరావు రాజావాసిరెడ్డి వేంకటాద్రినాయుడి ఆస్థానంలో వివిధ పదవుల్లో ప్రసిద్ధులైన వాళ్ళను తమవంశస్థులుగా గుర్తించి ఆనందిస్తుంటే సాహిత్యం సృష్టిస్తుంటే నేను ఆ ఆనందం పంచుకోవాలని ఇప్పుడు భావిస్తున్నాను.

కొలకలూరి భుజంగరాయుడు మా వంశంలో పూర్వీకుడని, నాకు క్షుణ్ణంగా తెలుసు. ప్రత్యేకంగా గౌరవం భక్తి ఉన్నాయి. మాకు అతడి జీవితం సమస్తం గర్వకారణమని తెలుసు. నా వంటి వందలవేల మందికి ముది ముత్తాతఅవుతాడని కూడా తెలుసు.

భుజంగరాయుడు ముదిముత్తాత కాక పూర్వం గొప్ప సేనాని. మహత్తర శాంతమూర్తి. విశేష ప్రజ్ఞాశాలి. రాజనీతినిపుణుడు. అంటరానితనం నిర్మూలన శాసనం కోసం అనేక త్యాగాలు సలిపి కృషిచేసిన పుణ్యాత్ముడు. అంతటి ఉదాత్త మానవోత్తముణ్ణి గూర్చి కావ్యం వ్రాస్తున్నప్పుడు సంచలత్ దివ్యభావనాంకుర ప్రేరణతో పులకితుణ్ణయ్యాను. మా ముది ముత్తాత అన్నది నా ఆత్మ ప్రలోభం తప్ప అల్ప విషయమే. దాన్ని ప్రస్తావించి నా చిన్నతనాన్ని పెద్దది చేసుకోవటం ఎందుకని అప్పుడు మానేశాను. కొలకలూరి భుజంగరాయుడని వ్రాయలేదు. భుజంగరాయుడని మాత్రమే పేర్కొన్నాను. కాని ఇప్పుడు ఇందరి ప్రేరణతో నా చిన్నతనం కూడా నాకు మన్ననే అని గుర్తించి ప్రస్తావించాను.

అంతటి విశిష్టుడు, ప్రసిద్ధుడు, సమర్థుడు, శాంత సంపన్నుడు, తేజశ్శాలి, మా ముది ముత్తాత అని చెప్పుకోవటం ఔచిత్యమే కాదు, అవసరం న్యాయం కూడా అని గుర్తించినందుకే ఈ ప్రస్తావన.

మహాకవి గుర్రం జాషువా కవి శిష్యుడు, మత్కుణ కావ్యకర్త, నూతక్కి అబ్రహాం 6.5.1992న, మాతల్లి కొలకలూరి విశ్రాంతమ్మ ద్వితీయవర్ధంతి సభలో చదివిన 'నివాళులు' లోని ఈ పద్యం ఎప్పుడూ సగౌరవంగా గుర్తుకు తెచ్చుకొంటూ ఉంటాను.

**మునుపు భుజంగరావును ప్రపూర్ణ యశోధను డాంధ్రభూమిపై**
**ఘనతర కీర్తిగాంచిన అఖండ దళాధిపుడయ్యు కొలకలూర్**
**దినమణి వంశ సింహమయి తీవిగ నిల్చినవారి కోవకున్**
**మనుముడుగాదె ధీయుతుడు మాన్యుడి నాకిల ధన్యజన్ముడౌ.**

భుజంగరావు కొలకలూరి దినమణి వంశ సింహమనటం అది గుంటూరు -బెజవాడ ప్రాంతాల మాదిగలకు గర్వకారణంగా ఉండటం, నాకు సంతోషదాయకంగా ఉండేది. మాఅమ్మ కొలకలూరి విశ్రాంతమ్మ, మామామ అరక - అత్తోట రత్నకవి - భుజంగ రాయుణ్ణి గూర్చి మాకు గర్వం కలిగేట్టు అనేక కథలు గాథలు చెప్పారు. ఆదిఆంధ్రుడు కావ్యంలో వాటి ప్రతిఫలనం ఉంది. భుజంగరాయుడు దళపతి నుంచి పదోన్నతి పొంది సేనాని అయిన చరిత్ర నూతక్కి అబ్రహాం కవి దాకా వచ్చినట్లు లేదు.

రాజుకీర్తి సుద్దు రాజిల్లి వినవాయె
రమ్యగీతి నురలు రసములట్లు
గుడులు గోపురాల కొలకులూరినయట్లు
రాజ యశము దిశల తేజరిల్లె (ప.202. ఆదిఆంధ్రుడు. పు.121)

కనుల నీరొల్క రాయుండు కదలకుండె
కొలుకులూర తుడుచు చేయి యిలకు దిగును
స్వాంత పరిపూర్ణ సంతోషనది దేలి
మాటలనుమర్చి మూగగా మారినాడు
(ప.404. ఆది ఆంధ్రుడు. పు.191)

మొదట పద్యం 108 గుడులు, కొలనులు భుజంగరాయుడు నిర్మించిన సందర్భంలో ప్రసక్తమయింది. రెండో పద్యం అంటరాని

తనం నిర్మూలించిన శాసనం ప్రకటించిన రాజు పదిగ్రామ సుక్షేత్రాల పంటహక్కు దానమిచ్చిన సమయంలో సువ్యక్తమయింది.

కొలకులు + ఊరు అంటే కొలనులు నిండు అని అర్థం. కొలికి+లు+ఊరు అంటే కన్నీరు కార్చు అని భావం. కొలకలూరు ఊరికి, మాయింటి పేరుకు మూలం కొలకులూరు నా, కొలుకులూరు నా అని నాకు ఆలోచన ఉండేది. సిద్ధనామం. కొలకలూరు. దీన్ని స్వీకరించటమే యోగ్యం. అయితే కవి భుజంగ రాయుడి ఇంటిపేరు, కొలకులూరు అనీ, కొలుకులూరు అనీ భంగ్యతరంగా కవి -ఇనాక్ ప్రతిపాదించాడని సహృదయులు భావిస్తూ ఉన్నప్పటికీ ఇప్పుడు స్పష్టంగా భుజంగరాయుడి ఇంటిపేరు కొలకలూరి అనీ. అతడూ మా ముది ముత్తాత అనీ, ఏడుతరాల పూర్వం మా వంశస్థుడనీ ఇప్పుడు స్మరించటం విశదీకరించటం పట్టరాని ఆనందానికి కారణమవుతుంది.

## 33.1. మాదిగల సేవ

అమరావతి ధాన్యకటకంగా ఉన్నప్పుడు దానికి కాపలా కాసిన వాళ్ళు మాదిగలు. ధనకటకమయినప్పుడు దాన్ని కాపాడిన సైనికులు మాదిగలు. అది ధరణికోట అయినప్పుడు దాని పాలకులు మాదిగలు. బౌద్ధస్తూపం నిర్మించిన కూలీలు, శిల్పులు మాదిగలు. బౌద్ధమత వ్యాప్తికి మూల పురుషులు మాదిగలు.

అమరేశ్వరాలయం ఆరాధ్యమైనప్పుడు శైవులయిన వాళ్ళు మాదిగలు. శైవం వీరశైవంగా, వైష్ణవ వీరవైష్ణవంగా మారినప్పుడు శైవాన్ని కాపాడిన బాహు విక్రమ పరాక్రమ బలాఢ్యులు మాదిగలు, భిన్నరాజుల కొలువుల్లో విభిన్న సైన్యపదవులు నిర్వర్తించినవాళ్ళు మాదిగలు. శ్రీకృష్ణదేవరాయల కొలువులో మాదిగల సైన్యవిభాగానికి మాదిగ దండనాయకుణ్ణి గూర్చి ప్రాచీనాంధ్ర చరిత్ర రచయిత నీల కంఠశాస్త్రి విశదం చేశాడు. అమరావతి కోటను నగరాన్ని నిర్మించి, సైన్యంలో ప్రముఖ పాత్ర వహించినవాళ్ళు మాదిగలు. వీళ్ళ సైన్యాధ్యక్షుడు మాదిగ. వీళ్ళ మహాకవి జాషువా మాదిగల వారసుడు. మాదిగల ప్రాభవం జాతి కృతజ్ఞతతో స్మరించి, గుర్తించి, గర్వించ వలసిన సందర్భమిది.

అమరావతి చుట్టుపక్కల గ్రామాలలో అధిక సంఖ్యాకులుగా నివసించే రైతుకూలీలు చాలా మంది మాదిగలే! ఈజనసంఖ్య దృష్టితోనే అమరావతిని ఆనుకొని ఉన్న తాడికొండ యస్.సి రిజర్వుడు నియోజకవర్గమయింది. స్వాతంత్ర్యం పొందిన భారత దేశంలో.

అమరావతిని తలుచుకొంటుంటే ధరణికోట మాదిగల వైభవం. గుర్తుకు వస్తుంది. దీనిని ఈ ఆంధ్రప్రదేశ్‌కు రాజధాని చేస్తున్న సందర్భం మాదిగల అస్తిత్వానికి అర్థం కల్పిస్తున్నట్లు స్పష్టమై సంతోషం తాండ విస్తుంది. అమరావతిని నిర్మించటానికి శత్రువుల బారినుంచి రక్షించటానికి శ్రమించిన మాదిగ వీరుల్ని స్మరించటం భావ్యం.

## 33.2. జాషువా స్మృతి

అమరావతి సంస్థానంలో భాగంగా, అప్పటికి అడవి ప్రాంత మయినా, వినుకొండ ఉండేది, వినుకొండ దగ్గరి -చాట్రగడ్డపాడులో పుట్టి, గుంటూరు పట్టణంలో, జిల్లాలో నివసించి, తెలుగు పద్యానికి ఎప్పుడూలేని సౌందర్యం ప్రతిష్ఠించిన గుర్రం జాషువా మాదిగలకే కాదు, యావదాంధ్ర దేశానికి గర్వకారణమైన మహాకవి. ప్రజలు మాట్లాడేభాషకు, మాదిగ పల్లెపట్టుల పలుకుబడి నుడికారపు తెలుగు అందానికి పద్యం దానం చేసిన ప్రసిద్ధుడు జాషువా. మాకవి, మహాకవి మాదిగకవి అని మాకు గర్వం. నేను విశ్వనరుణ్ణని తనను గూర్చి తాను చెప్పుకొన్నా, మాదిగకవి అని మాత్రమే మన్నించే మహాత్ములున్న ఆంధ్రరాష్ట్రంలో మా కులం పేరుతో మేం గర్వపడటం అన్యాయం కాదు. అందరికీ కులమే ఉనికి, మనికి, చిరునామా కావటం అన్యాయమే అయినా, అనివార్యమైనప్పుడు కులం చెప్పుకోవటానికి భయపడటం, భంగపడటం అనవసరమే. తప్పు అని, ఇష్టం లేక కులంపేరు చెప్పుకోకుండా మర్యాదగా ఉండే మాదిగల్ని పిరికి సన్నాసులని అవమానించే సమాజంలో ఎంతో కాలం అలా ఉండకుండా, నిర్భయంగా కులం చెప్పుకొని కులం ఉనికితో బతుకు తున్న నలుగురితో ఆస్తిపాస్తుల సంగతెలా ఉన్నా, ఇందులో నైనా మేము మీతో సమానమేనని మాదిగకులం బాహాటంగా చెప్పుకొనే స్థాయికి ఎదిగిన సందర్భంలో ఆదిఆంధ్రులంటే ఎవరికైనా సంతోషమే.

## 33.3. అమరావతి - రాజధాని

అమరావతిని నేటి ఆంధ్రప్రదేశ్‌కు రాజధాని చేయటం వల్ల, దాన్ని అతిప్రాచీన కాలంనుంచి కాపాడుతూ, అలంకరిస్తూ సంపద్వంతం చేస్తూ వస్తున్న మాదిగల శ్రమశక్తిని, భుజబలాన్ని బుద్ధి సౌందర్యాన్ని కళాభిజ్ఞతను, విజ్ఞతను, దేశభక్తిని గుర్తించినట్లయిందని గ్రహిస్తున్న మాది విశేష ఆనందం.

ఈ సంతోషం మనసులో ఉండటం వల్లే, ఎవరి ఆనందం వాళ్ళ కున్నట్లుగానే, ఎవరి కారణాలు వాళ్ళకున్నట్లుగానే ఇక్కడ నిర్మించే రాజధానికి 'అమరావతి' పేరు శ్రేయమని నా అభిజాత్య బలంతో కవి సమ్మేళనంలో కోరాను.

ప్రజల అభీష్టాన్నీ, ప్రభుత్వ అవసరాలను, రాష్ట్ర అభివృద్ధిని, భారతదేశ ప్రగతిని, ప్రపంచ ప్రతిఫలనాన్ని లక్ష్యంగా పెట్టుకొని, అమరావతిని రాజధానిగా చేసిన రాష్ట్ర ప్రభుత్వానికి మాదిగగా మాదిగల పక్షాన, తెలుగు రచయితగా మహాంధ్ర సృజన జనం పక్షాన అభినందనలు తెలియజేస్తున్నాను.

శ్రీ రామోజీరావు

# ఇది తెలుగుకే గండం !

రేపటి పౌరుల నాల్కలపై మృదుమధురంగా మాతృభాష విరితేనెలు చిలుకుతుంటే మురిపెంగా చూడాలని అభిలషించేవారి పాలిట శరాఘాతమనదగ్గ పరిణామమిది. తెలుగు గడ్డ మీద కొన్నాళ్ళుగా, వార్షిక పరీక్షల ఫలితాలు వెలువడే వేళ - ఒక దుర్భర దృశ్యం పునరావృతమవుతోంది. పుట్టినప్పటినుంచీ పరిచయం కలిగిన భాషలో ఇక్కడి విద్యార్థులెందరో పరీక్షల గండం గట్టెక్కలేక చతికిలపడుతుండటం నమ్మశక్యంకాని చేదు నిజం. తెలుగులో అత్తెసరు మార్కులైనా తెచ్చుకోలేక డీలాపడుతున్న విద్యార్థుల సంఖ్య ఇరు రాష్ట్రాల్లోనూ వేలల్లో ఉండటం తీవ్రంగా ఆందోళనపరుస్తోంది. కొంతమంది తెలుగులో సైతం పదికి పది సాధించడం పట్టుదలతో అద్భుతాలు సుసాధ్యమేననీ చాటుతుండగా, మరోపక్క కనీస మార్కులైనా రాబట్టలేని వాళ్లు మాతృభాషాధ్యయనం పట్ల దారుణ అలసత్వాన్ని కళ్లకు కడుతున్నారు. తెలుగుతల్లికి ఏకకాలంలో ఓ కంట ఆనంద బాష్పాలు, మరోకంట విషాదాశ్రువులు అనుభవమవుతున్నాయి.

ఇటీవలి పదో తరగతి పరీక్షల్లో ఒక్క కర్నూలు జిల్లా విద్యార్థులే వెయ్యిమందికిపైగా తెలుగులో తప్పారు. ఉపాధ్యాయుల కొరత లేని జిల్లా పరిషత్తు పాఠశాలల్లో సైతం ఫలితాల సాధనలో తెలుగు మసకబారింది. భాగ్యనగర విద్యార్థులు మాతృభాషలో కన్నా ఆంగ్లంలోనే మెరుగనిపించారు. పదో తరగతి అనుత్తీర్ణుల జాబితాలో గణితం, సామాన్యశాస్త్రాల తరవాతి స్థానం ప్రథమ భాషదే ! గుంటూరు లాంటి జిల్లాలో త్రైమాసిక, అర్ధసంవత్సర పరీక్షలప్పుడే తెలుగులో వందలాది విద్యార్థుల మందకొడితనం వెల్లడైంది. ఒక్క పదో తరగతిలోనే అనేకమంది తమతమ భేదాలతో ఇంటర్మీడియట్ విద్యార్థులూ, తక్కిన సబ్జెక్టుల్లో మార్కులకు దీటుగా తెలుగులో రాబట్టలేకపోవడం, పురిటిగడ్డపైనే మాతృభాష పునాది బీటలు వారుతున్నదనడానికి ప్రబల సంకేతం. నాలుగేళ్ల వ్యవధిలో ఇక్కడి విద్యార్థుల సామర్థ్యస్థాయి కుంగిపోయిందని 'అసర్ (వార్షిక విద్యాస్థాయి నివేదిక) సోదాహరణంగా ధ్రువీకరించింది.

ప్రాథమిక తరగతుల్లో విద్యార్థుల తెలుగు పాటవం దుర్బలమవుతున్నకొద్దీ పది, ఇంటర్ స్థాయిలోనూ అనుత్తీర్ణత శాతం పెచ్చరిల్లుతోంది. ఎందుకీ దుస్థితి దాపురించిందన్న ప్రశ్నకు సమాధానాల కోసం వేరే అన్వేషించనక్కర్లేదు. శిశువు జన్మించిన ఆరు నెలల్లోపే అమ్మభాషకు స్పందిస్తూ గ్రహణశక్తిని పెంపొందించుకుంటాడు. ఈ సహజ బలిమిని కాలదన్ని వేరే భాషల్లో అభ్యసనానికి చేసే ఏర్పాట్లు పేగుబంధాన్ని బలహీనపరుస్తున్నాయి. అలా మొదలైన పరాయీకరణే పిల్లల విద్యావికాస పునాదిని గుల్లబారుస్తోంది. పదోతరగతికి వచ్చేసరికి తెలుగులో ఉత్తీర్ణులు కాని వారి శాతం పెరగడానికి మరెన్నో కారణాలు పుణ్యం కట్టుకుంటు న్నాయి. వాటిలో ప్రధానమైంది, భాషా పండితుల కొరత అధ్యాపక సిబ్బంది ఉన్నచోట్లా, బోధనపై కనీస అవగాహన లేనివాళ్లు పదోన్నతుల పేరిట కొలువు తీరడం - ఇంకో సమస్య. సార్వత్రిక విద్యావిధానంలో తెలుగు స్నాతకోత్తర పట్టా సంపాదించినా బోధన నైపుణ్యాల లేమివల్ల, ఉండీ ఉపయోగంలేని సిబ్బంది పోగుపడుతున్నారు. ఈ వరస భాగోతాలకు పాలకుల అలసత్వం, తమ బిడ్డలకు తెలుగు రాకున్నా కోల్పోయేది ఏముందిలెమ్మన్న అభిప్రాయం అసంఖ్యాక తల్లిదండ్రుల్లో నెలకొనడం యథాశక్తి పుణ్యం కట్టుకుంటున్నాయి. పాలనలో, బోధనలో, నియామకాల్లో తెలుగుకు సమధిక ప్రాధాన్యం కల్పించేలా ప్రభుత్వ విధానాలు పదును తేలితే రేపటి పౌరుల మాతృభాషాధ్యయనానికి తల్లిదండ్రుల తోడ్పాటు సహజంగానే చేకూరుతుంది !

విత్తును బట్టే చెట్టు. అధికారిక ఉత్తర ప్రత్యుత్తరాలు, సర్కారీ నియామకాల్లో అమ్మభాషకు పెద్దపీట వేస్తున్న తమిళనాడు, కర్ణాటక, మహారాష్ట్రలాంటి రాష్ట్రాల్లో విద్యార్థులు ప్రాంతీయ భాషల్లో చురుగ్గా రాణిస్తున్నారు. అన్ని రంగాల్లోనూ మాతృభాష విస్తృత వ్యాప్తికి, ప్రాభవ

దీప్తికి అక్కడి ప్రభుత్వాల క్రియాశీలక చొరవే ఊపిరులూదుతోంది. అమ్మభాషలో అభ్యసించే పిల్లల గ్రహణశక్తి అనుమడించి ఉత్తరోత్తరా వారి ఉత్పాదకత ఇంతలంతలయ్యే అవకాశం ఉందన్న అధ్యయనాల సారాన్ని ఒంటపట్టించుకున్న ప్రభుత్వాలు – చేతల్లో ప్రాప్తకాలజ్ఞత నిరూపించుకుంటున్నాయి. వాటితో పోలిస్తే రెండు తెలుగు రాష్ట్రాలూ ఇక ఎంతమాత్రం వెనకబడి ఉండే వీల్లేదు !

సృజనాత్మక యోచనలకు, అద్భుత ఆవిష్కరణలకు మాతృభాషపై గట్టి పట్టు విశేషంగా దోహదపడుతుందన్న తెలివిడి – ఇరు రాష్ట్రాల్లోనూ అధికారభాషకు గొడుగుబట్టే నిర్ణయాత్మక సంస్కరణలకు ఒరవడి దిద్దాలి. తొలిదశ విద్యాభ్యాసంలో అమ్మభాషకే అగ్రతాంబూల మివ్వాలి. ప్రభుత్వ ఉద్యోగాలకు, కీలకాధికార స్థానాల్లో నియామకాలకు తెలుగులో రాయడం, చదవడం కనీస అర్హతగా నిర్ణయించి, బోధన ప్రమాణాల మెరుగుదలకూ పాటుపడాలి. తెలుగుభాష పరిరక్షణకు అన్నివిధాల చర్యలూ తీసుకుంటున్నామన్న ప్రభుత్వాలు వాస్తవిక కార్యాచరణలో నిబద్ధత, చిత్తశుద్ధి నిరూపించుకుంటేనే – మన తెలుగు మళ్లీ వెలుగులీనుతుంది !

# ధ్యానం

పుష్కర స్నానం కోసం నదిలోకి నేరుగా దిగకండి. గట్టుపై నుంచి దిగేముందు చిటికెడు మట్టిని తీసుకోండి. ఒకవేళ మీరు స్నానం చేస్తున్న మట్టి లేకపోతే పిసరంత పసుపును చేతిలోకి తీసుకోండి. ఈ శ్లోకంతో, ఆ మట్టిని లేదా పసుపును నీళ్లలోకి విడిచిపెట్టండి. ఆ తర్వాతనే భక్తిశ్రద్ధలతో కృష్ణవేణీ మాతకు నమస్కరించి, నదిలోకి దిగి ఈ శ్లోకాన్ని పఠించండి

పిప్పలాదాత్సముత్పన్నే కృత్యేలోకే భయంకరే
మృత్తికాంతే మయాదత్త మహారార్థం ప్రకల్పయం

శ్రీ మండలి బుద్ధప్రసాద్

# కృష్ణం వందే జీవనాధారం...

**సర్వ వేదమయం సాక్షాద్బ్రహ్మ విష్ణుశివాత్మికాం**
**ఫలదాం సర్వతీర్థానాం కృష్ణా త్వాం ప్రణతోస్మ్యహం**

సర్వ దేవాతామయి, సాక్షాత్తూ బ్రహ్మ విష్ణు శివ మూర్త్యాత్మిక, సర్వఫలప్రది, సర్వతీర్థ స్వరూపయగు కృష్ణకు నమస్కరిస్తున్నాను.. అని పురాణాలు కృష్ణమ్మను స్తుతించాయి. అటువంటి కృష్ణానది ఒడ్డున జన్మ నొందటం, జీవించటం అంటే ఎంతో అదృష్టం చేసుకుంటేనే అంతటి భాగ్యం దొరుకుతుంది.

ఎక్కడో మహారాష్ట్ర సహ్యాపర్వతాల్లో మహాబలేశ్వరంలో పుట్టిన కృష్ణానది ఇక్కడ మా దివ్య దివిసీమలో హంసలదీవిలో సాగరంతో సంగమిస్తోంది. 1400 కిలోమీటర్ల సుదీర్ఘ ప్రయాణం కృష్ణమ్మది. మా పులిగడ్డ వద్ద రెండుపాయలుగా చీలి ఒక పాయ హంసలదీవి దగ్గర, వేరొక పాయ నాచుగుంట దగ్గర మహాసాగర ప్రవేశం చేస్తోంది.

1859లో బ్రిటిష్‌వాళ్ళు కృష్ణానది కొన భాగాన సాగరసంగమం చేస్తున్న ఈ ప్రాంతానికి కృష్ణాజిల్లా అనే పేరుపెట్టి, జిల్లాకొక ప్రత్యేక గుర్తింపు తెచ్చారు. సర్ చార్లెస్ ట్రెవరీయన్స్ ఘనత ఇది. కృష్ణాడెల్టా రూపకర్తలైన సర్‌ఆర్థర్ కాటన్, చార్లెస్ ఆర్, ప్రభృతులు మాకు చిర స్మరణీయులు.

అవనిగడ్డలో మా ఇంటికి అతి దగ్గరగా కృష్ణానది ప్రవహిస్తోంది. దాన్ని అక్కడ కొత్తపేట రేవు అని పిలుస్తారు. కృష్ణతో పెనవేసుకున్న కుటుంబం మాది. సంస్కృతీ, భక్తీ కృష్ణమ్మ గలగలల్లో నిత్యం ధ్వనిస్తుంటాయి. క్షేత్రయ్య పద గలగలలు, సిద్ధేంద్రయోగి నృత్య గలగలలు నిత్యం రవళిస్తూ ఉంటాయి. ప్రాక్ శిలాయుగం నాటినుండీ ఈ నేలమీద క్రమ పరిణామ దశల్లో వర్ధిల్లిన మహోన్నత నాగరికత ఘనతని పాడుకుంటూ కృష్ణమ్మ పరుగులిడుతుంటుంది.

సశ్యశ్యామలమైన దివిసీమను నేను చూశాను. ఉగ్ర రూపమెత్తిన కృష్ణమ్మనూ చూశారు. మా చిన్నప్పుడు కృష్ణమ్మకు భీకరమైన వరదలు వచ్చేవి. ఇళ్ళూ వాకిళ్ళూ కొట్టుకుపోయేవి మా అమ్మావాళ్ళు కృష్ణమ్మ దగ్గర పసుపూ కుంకుమ పెట్టటం నేనెరుగుదును. వరదలు వచ్చిన ప్రతిసారీ సేవాకార్యక్రమాల్లో మునిగిపోవటం మాకు నిత్యకృత్యం అయ్యింది.

**తల్లీ ! నీ పాదతీర్థము త్రావినాము,**
**నీదు బిడ్డల గుండెల నిండ నీవు**
**ధారవోతువు కరుణాసుధారసమ్ము**
**ఇంద్రకీలాచలమ్మెంత యెత్తో అంత**
**లోతు నీ గుండె ! మా దివ్యమాతవమ్మ !**
**కృష్ణవేణమ్మ ! తెలుగమ్మ ! తృష్ణవాపి**
**మాకు జ్ఞానదానము జేసి మనుపుమమ్మ !"** అని దాశరథి వ్రాసి నట్టు నదీ జలాలను కమ్మగా త్రాగిన ఆ తీపి జ్ఞాపకాలు దివి ప్రజలకు నేటికీ మిగిలి ఉన్నాయి.

కృష్ణాతీరం అంటే తెలుగుదనానికి పుట్టినిల్లు. కృష్ణాతీరాన తెలుగు భాషకొక దేవుడు వెలిశాడు. ఆయన ఆంధ్రజాతి దేవుడు. ఆంధ్రమహావిష్ణువు ఆయన పేరు. తెలుగుభాషా వేలుపు. మా దివిసీమ శ్రీకాకుళంలో వెలిశాడు. మన భాషకొక దేవుడు ఉండటం తెలుగు వారికి దక్కిన అదృష్టం. ఆయన కృష్ణ ఒడ్డున దివిసీమలో నెలకొనటం ఈ ప్రాంతీయుల పూజాఫలం. కాసుల పురుషోత్తమ కవి వ్రాసిన ఆంధ్రనాయక శతకం కమనీయం. మహనీయం. శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణు దేవాలయ ప్రాభవానికి పాటుపడే అవకాశం నాకు కలిగింది. అది నా భాగ్యం.

శ్రీ కృష్ణదేవరాయలు క్రీ.శ. 1516లో కొండపల్లి కోట ముట్టడి విరామంలో బాసదేవర, తెలుగు రాయుడు అయిన శ్రీకాకుళ ఆంధ్రమహావిష్ణు దేవాలయాన్ని సందర్శించాడు. ఏకాదశి ఉపవాసం

ఉండి అక్కడే బస చేశాడు. ఆ రాత్రి ఆంధ్రవిష్ణువు కలలో కన్పించి, తన భక్తురాలైన ఆండాళ్ళు చరిత్రని తెలుగులో కావ్యంగా వ్రాయమని ఆదేశించాడు. 'దేశబాషలందు తెలుగు లెస్స' అని ప్రకటించిన సందర్భం అది. బాసదేవుడి ఆదేశాన్ని ౘెదల దాల్చి, రాయలు తన కావ్యానికి 'ఆముక్తమాల్యద' అని ఇక్కడే నామకరణం చేసుకున్నాడు.

ఆముక్త మాల్యద మంటపంలో కృష్ణదేవరాయలు కూర్చుని గ్రంథ రచన చేస్తున్న భంగిమలో ఒక కాంశ్యవిగ్రహాన్ని నెలకొల్పటం, ఆంధ్ర ప్రదేశ్ సాంస్కృతిక శాఖ పక్షాన ప్రతి యేడాది అక్కడ కృష్ణదేవరాయ మహోత్సవాలు జరిగేలా ఏర్పాటుచేసే అవకాశం కూడా నాకు కలిగాయి.

అవనిగడ్డ నుండి విజయవాడకు ప్రయాణం ఒకప్పుడు అనేక గంటలు పట్టేది. 130 కోట్లతో కరకట్టని వెడల్పు చేయించి రెండులైన్ల రహదారి ఏర్పరిచాక ఇప్పుడు మాకు విజయవాడ మరింత దగ్గరయ్యింది. అంతేకాదు నదీతీర గ్రామాలకు ముంపు ప్రమాదాన్ని తప్పించి ఈ రహదారి ఒక రక్షణ కవచంగా ఉపయోగపడ్తోందికూడా ! ఒక ప్రజాప్రతినిధిగా ఇది నాకు ఎంతో సంతృప్తినిచ్చిన సేవ ।

కృష్ణాతీరంలో నాగరికతా వైభవం అనగానే గుర్తుకొచ్చేది దివి సీమలో ఘంటసాల. క్రీస్తుశకం తొలి శతాబ్దాలనాటి టోలమీ కంటకోశ్శిలగా పేర్కొన్నది. ఈ ఘంటసాలనేనని ప్రఖ్యాత చరిత్ర కారుడు కీ.శే. వి.వి. కృష్ణశాస్త్రిగారు స్పష్టంగా పేర్కొన్నారు. మైసోలియా అనే ప్రాంతంలో మైసోలోస్ అనే నది ఒడ్డున ఈ ఓడరేవు పట్టణం ఉన్నదట. మైసోలియా అంటే మహిష మండలం అనీ, మైసోలోస్ అంటే కృష్ణానది అనీ చారిత్రకవేత్తలు నిర్ధారించారు. శాతవాహనుల కాలంలో కణ్ణబెణ్ణ పేరుతో కూడా కృష్ణానదిని పిలిచేవారని శాసనా ధారాలు చెప్తున్నాయి. అప్పటికే కంటకశైలం అనే ఘంటసాల ప్రముఖ వాణిజ్య కేంద్రంగా ఉండేదిట. కంటకశైలంలో మహాచైత్యం (బౌద్ధ స్తూపం) గురించి ప్రాచీన శాసనాలు అనేకం వర్ణించాయి. భారతీయ సర్వేక్షణవారు నా విజ్ఞప్తి మేరకు బౌద్ధస్తూపాన్ని పునర్ని ర్మించటం, అక్కడ దొరికిన శిల్ప సంపదను భద్రపరిచిన మ్యూజియాన్ని నా చేత ప్రారంభించే మహదవకాశం నాకు దక్కింది.

హంసలదీవికి పౌరాణిక ప్రాధాన్యత ఉంది. గంగాదేవి పాప పంకిలం అయి, బ్రహ్మదేవుని ప్రార్థించింది. కృష్ణాసాగర సంగమంలో స్నానంచేస్తే, పునీత వౌతావని బ్రహ్మ చెప్పినప్పుడు, గంగాదేవి కాకి రూపంలో వచ్చి ఇక్కడ స్నానం చేసి హంసగా మారిందట. నీచస్థితినుండి హంసలా ఉన్నతస్థితికి మార్చే పవిత్ర సంగమ ప్రాంతం కాబట్టి ఇది హంసలదీవిగా పేరొందిందని స్థలపురాణం చెప్తోంది. "హంససోపాహం" మనందరం హంసలమే నంటుంది వేదాంతం. మనలోని ఆ పరమహంస తత్వాన్ని గుర్తించలేక కాకిలా బతుకు తున్నాడని ఈ హంసలదీని మనకు గుర్తుచేస్తుంది. ఆత్మపరమాత్మలు ఐక్యం కావటంగా ఈ సాగరసంగమాన్ని భక్తులు భావిస్తారు.

కోడూరు మండలం హంసలదీవి కృష్ణా సాగరసంగమ తీరానికి మాఘశుద్ధ పౌర్ణమినాడు స్నానాలు ఆచరించేందుకు దేశ విదేశాల నుండి భక్తులు తరలి వస్తారు. నవ దంపతులు కొంగుముడులతో పుణ్యాస్నానాలచరిస్తారు. రుక్మిణి సత్యభామ సమేత శ్రీ వేణు గోపాలస్వామి వార్షిక బ్రహ్మోత్సవాలు, స్వామివారి కల్యాణోత్సవాలు నిర్వహిస్తారు. విజయవాడ శ్రీదుర్గామల్లేశ్వరస్వామి వార్ల దత్తత దేవాలయం ఇది.

కృష్ణమ్మ ఇక్కడ నిశ్చలంగా, నిర్మలంగా ఉప్పొంగుతూ, ఉరకలేస్తూ సాగరుడు తన కౌగిట చేర్చుకునే పవిత్ర దృశ్యం తన్మయుల్ని చేస్తుంది. నరనారీ సంబంధాన్ని గుర్తుచేస్తుంది. తెలివాహ అంటే నేల నొలికిన నూనెలా ప్రవహించేదని, ఈ లక్షణం కృష్ణానదికే ఉందని, క్రీస్తు శకారంభం నాటి బౌద్ధగ్రంథాల్లో కనిపించే తెలివాహ నది. ఈ కృష్ణానదేనని రాయ్‌చౌదరి అనే చరిత్రవేత్త ప్రకటించిన విషయం ఇక్కడ ఋజువౌతుంది. తెలివాహ ఒడ్డున ఆంధ్రనగరి గురించి బౌద్ధ గ్రంథాల్లో ఉంది. సంగమస్థలి నుండి కృష్ణకు ఆ ఒడ్డునా ఈ ఒడ్డునా కృష్ణ, గుంటూరు జిల్లాల్లో ప్రసిద్ధ ప్రాచీన ఆంధ్రనగరాలు అనేకం ఉన్నాయి.

మొన్నమొన్నటిదాకా వ్యయప్రయాసలకోర్చి, పడవల మీద, కాలినడకన, బళ్ళు కట్టుకుని ఇసుకలో సంగమస్థలిదాకా యాత్రికులు వెళ్ళవలసి వచ్చేది. 1992 పుష్కరాలకు నేను పడవలోనే వెళ్ళి అక్కడ పుష్కరస్నానం చేశాము. 2004 పుష్కరాల సమయానికి సాగరసంగమానికి రహదారి నిర్మింపచేయగలిగాము. ఇప్పుడు నేరుగా హంసలదీవి వరకూ వెళ్ళవచ్చు. ప్రతిరోజు వందలాదిమంది ఇక్కడకు వచ్చి ఈ పవిత్ర ప్రదేశాన్ని సందర్శిస్తున్నారు.

శ్రీపాద వల్లభుడు, వాసుదేవానంద సరస్వతి లాంటి ప్రముఖులు ఇక్కడ స్నానమాచరించారని గ్రంథాలలో ఉంది. భావజవిలాస ! హంసలదీవి వాస ! లలిత కృష్ణాబ్ధి సంగమస్థల విహార ! పరమ కరుణా స్వభావ ! గోపాలదేవ అంటూ హంసలదీవిన నిలిచిన వేణుగోపాలుడిపైన కాసుల పురుషోత్తమకవి ఒక శతకం వ్రాశారు.

మహోన్నత వారసత్వానికి మా ప్రాంతం నెలవు. కృష్ణ పేరు వినగానే కూచిపూడి నాట్య వైభవం, సిద్ధేంద్రయోగి మానసపుత్రిక సత్యభామ వాల్జడను వయ్యారంగా తిప్పుతూ మనకళ్ళముందు నిలుస్తుంది. త్యాగబ్రహ్మ సంగీత పరంపరను, కర్నాటక సంగీతాన్ని తెలుగునాట దేదీప్యమానం చేసిన స్వరబ్రహ్మలు సుసర్ల దక్షిణామూర్తి

(పెదకళ్ళేపల్లి), పారుపల్లి రామకృష్ణయ్య (శ్రీకాకుళం), హరినాగ భూషణం (హరిపురం) సంగీత మూర్తిత్రయం దివిసీమలో జనన మొంది, సంగీతాభిమానులకు ప్రాతః స్మరణీయులైనారు.

ఆయుర్వేదోద్ధారకుడు దీవి గోపాలాచార్యులవారు, పరిశోధనా పరమేశ్వరుడు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, దివి ఖ్యాతిని ఇనుమడింప చేసిన ప్రముఖులు. అమరగాయకుడు పద్మశ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు, కృష్ణమ్మ తల్లి ఒడిలో ఆడి పాడినవారే !

కాకతీయులకాలంలో కృష్ణాముఖద్వారం వద్ద చిన్నరాజ్యం దివిసీమ. అయ్యప్రభువులు ఈ సీమని పాలించేవాళ్ళు. క్రీ.శ. 1210 ప్రాంతాలలో కాకతీయ గణపతిదేవుడు ఈ దివిసీమను జయించాడు. రాకుమార్తెలు నారాంబ, పేరాంబలను వివాహమాడారు. యువరాజు 'జాయప'ను కాకతీయ సామ్రాజ్యానికి గజసైన్యాధ్యక్షుణ్ణి చేశాడు. గణపేశ్వర శాసనం ఈ చరిత్రను నిర్ధారిస్తోంది.

జాయప సేనాని యోధుడే కాదు, సంగీత నృత్య రీతుల లోతెరిగిన వాడు. నాట్యంలో మార్గరీతులు, దేశీ రీతులు, దేవదాసీల నృత్యాలు, నాట్యమండపాలలో చేయాల్సిన నృత్యాలు వర్గీకరించి నృత్య రత్నావళి గ్రంథాన్ని వ్రాశాడు. ఇటీవలే గణపేశ్వరం దేవాలయంలో జాయప సేనాని విగ్రహాన్ని ప్రతిష్ఠింపచేశాము.

ఆ కాలంలోనే తూర్పు గాంగ ప్రభువు ఒకటవ నరసింహ దగ్గర దండనాయకుడిగా ఉన్న అనంతపాలుడు శ్రీకాకుళంలో ఆంధ్రవిష్ణువు దేవాలయాన్ని పునర్నిర్మించాడని ప్రతీతి.

అవనిగడ్డలో శ్రీ లక్ష్మీనారాయణస్వామి దేవాలయాన్ని తెలుగు చోళులు నిర్మించారని చెప్తారు. ఈ దేవాలయం రథాకారంలో కనిపించే గొప్ప నిర్మాణం. కోణార్క సూర్యదేవాలయానికన్నా ముందే రథాకారంలో ఏర్పడిన దేవాలయంగా దీన్ని చరిత్రవేత్తలు చెప్తారు. నా చిన్నప్పుడు ఆ దేవాలయ ప్రాంగణానికి వెళ్ళి అక్కడ కూర్చుంటే ఎంతో ప్రశాంతత లభించేది. 99 అడుగుల ఎత్తున అందమైన గాలిగోపురాన్ని ఆశ్చర్యంగా పరికిస్తూండేవాణ్ణి. 32 స్తంభాలమీద చెక్కిన సుందరమైన రామాయణ, భారత శిల్పాలతో ముఖమంటపాన్ని ఎన్నిసార్లు చూసినా తనివితీరేది కాదు. ఇద్దరు నర్తకీమణులు ఒకరి చేతిలో మరొకరి పాదాలు పట్టుకొని ఉన్న అద్భుతమైన నాట్య విన్యాసంతో కూడిన శిల్పాలు అరుదైనవి. ఈ నాట్య భంగిమపై పరిశోధన జరగవలసి ఉంది. పై కప్పులో ఒక రాతి గొలుసును ఒకే రాతి మీద చెక్కిన శిల్పి నైపుణ్యం ఆశ్చర్యపరిచేది.

14-4-1929న మహాత్మాగాంధి అవనిగడ్డకు వచ్చారు. గాంధీజీ పడవమీద కృష్ణానదిని దాటిన కమనీయ సన్నివేశాన్ని ముట్నూరి కృష్ణారావుగారు కృష్ణాపత్రికలో ఈ విధంగా కన్నులకు కట్టేలా వ్రాశారు.

"అవనిగడ్డ వద్ద ఏరు దాటుతున్నప్పుడు కనిపించిన దృశ్యం వర్ణనా తీతము. సుమారు పదివేల జనం ఇరుగట్టుల మీద నిలబడి మహాత్ముని రాకకోసం నిర్నిమేష నయనాలతో నిరీక్షిస్తున్నారు. మహాత్ముని మోటారు దృక్పథంలో పడటంతోనే జనంలో కలిగిన కోలాహలం వర్ణింపనలవి కాదు. సూర్యుడస్తమిస్తున్నాడు. ఆ సంధ్యా రాగం కనులపండుగగా ఉండేది. ఆ సమయంలో ఏరు పోటులో ఉండటంతో మహాత్ముని నావతోపాటు జనులెల్లరు అన్నివైపులనుంచీ నీటిలో నడవసాగారు. నదీగర్భమంతా జన సంకీర్ణమయింది. నీరు కనపడలేదు. కృష్ణానది జనరూపం దాల్చి ఒక గట్టునుంచి ఇంకొక గట్టుకు ప్రవహిస్తున్నదా అన్నట్టు తోచింది. ఆ మహాత్ముని హృదయాంతరాళంలో ఆ ముహూర్తంలో ఎటువంటి భావాలు ఉత్తుంగ తరంగితాలవుతుండేవో తెలీదు. మహాత్ముడు తన నయన జ్యోతులను పైకెత్తి సంధ్యాదేవికి నీరాజనా లర్పిస్తున్నట్టు తోచింది. వెనక శ్రీరామచంద్రుడు అయోధ్యపురి నుంచి దండకారణ్యానికి సరయూనదిని దాటటాన్ని గురించి వాల్మీకి వర్ణించిన దృశ్యం అందరికీ జ్ఞప్తికి వచ్చింది".

మహాత్ముని పాద స్పర్శతో పావనమైన ప్రాంతంలోనే 1969లో మా నాన్న గాంధీ క్షేత్రాన్ని స్థాపించి వారి మహనీయ ఆశయ వ్యాప్తికి నడుం కట్టారు.

1965లో అనుకుంటాను, కంచి పరమాచార్య నడిచే దైవం చంద్రశేఖర సరస్వతి అవనిగడ్డ వచ్చి కొన్ని రోజులు ఉన్నారు. కృష్ణానది మా ఇంటికి దగ్గరగా ఉండటంతో ప్రతిరోజూ ఆయన కృష్ణలో స్నానం ఆచరించటానికి మా ఇంటి ముందునుండే నడిచి వెళ్ళేవారు. ఆయన నదికి వెళ్ళి తిరిగి వచ్చేప్పుడూ మా ఇంటిముందు నిలబడి స్వామి వారికి కాళ్ళు కడిగి హారతులు ఇచ్చే పనులు నేను చేసేవాణ్ని.

ఒకరోజు స్వామివారు నది నుండి తిరిగి రావటం చాలా ఆలస్యం అయ్యింది. ఆయనకోసం ఎదురుచూస్తూ నేను గుమ్మంలో నిలబడే ఉన్నాను. ఆయన స్నానమాచరిస్తూ నదిదగ్గర స్పృహ తప్పి పడిపోయారని, సేద తీరాక వచ్చారనీ అప్పుడు తెలిసింది. అంత అలసటలోనూ పాదప్రక్షాళనం హారతి ఇచ్చే అవకాశాన్ని నాకు ఇచ్చారాయన అదొక అద్భుతం. కృష్ణాతరంగ పంక్తిన్ ద్రొక్కి త్రుళ్ళింత నాంధ్రనౌకలు నాట్యమాడునాడు "అంటూ కృష్ణమ్మ స్మృతులను నెమరేసుకున్న కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు మా నాన్న మండలి వెంకట కృష్ణారావుగారితో "మనది కృష్ణయొడ్డు జాతి" అన్నారు. కృష్ణమ్మతో మా జీవితాలు అలా పెనవేసుకుని సాగాయి.

కృష్ణమీద పులిగడ్డ-పెనుమూడి వారధి మా నాన్నగారి చిరకాల వాంఛ. ఆ వంతెన కోసం తన జీవితకాలం తపించారాయన. అది నా హయాంలో పూర్తికావటం నాకు ఆనందం కలిగించే విషయం.

ఇప్పుడు గుంటూరు జిల్లాయే కాదు, మద్రాసు కూడా అవనిగడ్డకు ఎంతో దగ్గరయ్యింది.

కృష్ణాడెల్టా ఆధునీకరణ, కరకట్ట మీద రహదారి, హంసలదీవి సాగరసంగమ రహదారి నిర్మాణాలు ప్రజాప్రతినిధిగా నన్ను చరితార్థుణ్ణి చేశాయి. దివిసీమల్లో కోట్ల రూపాయలతో దివిసీమలో అనేక చిన్నా పెద్దా దేవాలయాల జీర్ణోద్ధరణ చేయించగలిగాము. ఆంధ్రవిష్ణు దేవాలయానికి పురావైభవం సాధించగలిగాము. మోపిదేవి శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి పులిగడ్డ శ్రీ వెంకటేశ్వర దేవాలయం, పెదకళ్ళేపల్లి నాగేశ్వరాలయం ఇంకా ఎన్నో ప్రసిద్ధ ప్రాచీన దేవాలయాల జీర్ణోద్ధరణ జరిగింది. అంతా కృష్ణమ్మ ఆశీర్వాద బలమే ననుకుంటాను.

తెలుగువారి అన్నపూర్ణ కృష్ణాతీరం. కృష్ణ ఒడ్డునే ఉన్నప్పటికీ దివిసీమ అతివృష్టి, అనావృష్టి పీడిత ప్రాంతంగానే మిగిలిపోతుంది. 1936లో పులిగడ్డ దగ్గర ఒక ఆక్విడక్టుని నిర్మించారు. దానికి ముందు పంపింగ్ స్కీము ఉండేది. 1975లో మా నాన్నగారు మండలి వెంకట కృష్ణారావుగారు ఆక్విడక్టుని విస్తరింపచేయటంతో తీరప్రాంతంలోని బీడు భూములన్నీ పంటచేలుగా మారాయి. రైతు కడగండ్లు కొంతవరకూ తీరాయి. ఎన్ని ప్రకృతి వైపరీత్యాలు ఎదురైనా చలించని ఆత్మస్థైర్యంతో దివి రైతులు వ్యవసాయాన్నే జీవనాధారంగా చేసుకున్నారు.

మా చిన్నప్పుడు కృష్ణమ్మ పరవళ్ళు తొక్కుతూ, గలగలా పాడుతూ ప్రవహించేది. కానీ, నేడు ఆ ప్రవాహ పోకడలేవీ కానరావు. ఇసుక పర్రలు తప్ప నీటిచుక్కల జాడ లేని స్థితి తాండవిస్తోంది. కరువు కరాళ నృత్యం అంటే ఎలా ఉంటుందో నది కొన భాగాన స్పష్టంగా కనిపిస్తుంది.

నది మీద ఆధారపడి సకాలంలో పంటలు పండించే భూమిని "నదీమాతృక"లంటారు. ఆ నదీమతల్లి కరుణిస్తేనే మన జీవితాలు సుఖవంతంగా సాగుతాయి.

ప్రకృతిని ఆరాధించటం భారతీయ ధర్మం. పృథ్వి, అప్, తేజో వాయు, ఆకాశాలనే పంచ మహాభూతాలను దైవస్వరూపాలుగా భావించటం మన సంస్కృతి. జీవధారలైన నదులను జలదేవతా స్వరూపాలుగానూ, వృక్షాలను వనదేవతలు గానూ నిత్యం పూజించటం మన సంస్కృతిలో ఒక ఉన్నతి.

సంస్కృతి, సాంప్రదాయాలు జీవన విధానాలకు సంబంధించనవే ! పన్నెండేళ్ళకొకసారి నదుల పుష్కరాలు నదీ జలాల పరిరక్షణను మనకు గుర్తుచేసే సందర్భాలే ! నదుల పట్ల మన భక్తిని, గౌరవాన్ని, ఆత్మీయతను ప్రదర్శించుకునే సందర్భాలు కూడా ! పుష్కరాల సందర్భాల్లో జరిగే మంత్రాలతో కూడిన అంశాలు మాత్రమే మత పరమైనవి. అవి మినహాయిస్తే పుష్కరోత్సవాలలో పాల్గొనటం అనేది అన్య మతస్థులకూ నదీజలాల పట్ల గౌరవాన్ని ప్రదర్శించే ఒక మంచి అవకాశంగా భావిస్తాను.

కులమతాలకు అతీతంగా జీవధారలను కాలుష్యం బారినుండి రక్షించుకొంటూ, జలవనరులను పొదుపు చేసుకోవటం నేటి అవసరం. త్రాగు, సాగు నీటి అవసరాలకు ఆరోగ్యప్రదంగా నదిని అందరం కలిసి కాపాడుకోవటమే కృష్ణాపుష్కర సందేశంగా భావిస్తున్నాను.

మనం నదులనుండి సంస్కారాన్ని సంగమకళను నేర్చుకుని మన జీవితాలను నదివలె నిర్మలంగా, నిశ్చలంగా సాగించినట్లైతే నది చివరకు సాగరుని చేరినట్టు మనమూ జీవితాన్ని సారవంతం చేసుకోగలము.

చిరునామా : *శ్రీ మండలి బుద్ధప్రసాద్, ఉపసభాపతి, ఆంధ్రప్రదేశ్ శాసనసభ.*

**శ్రీ గొల్లపూడి మారుతీరావు**

# విజయవాడతో నా బంధుత్వం

**1968** కృష్ణాపుష్కరాలకు నేను విజయవాడలో ఉన్నాను. ఆలిండియా రేడియోలో ఉద్యోగం. కవిత్వం 'నిర్మాతి నూత్న సమయం' అన్నారు కావ్యకంఠ గణపతిశాస్త్రి. కాలాన్ని నా నాటకంతో గుర్తుపెట్టుకోవాలంటే నా 'కళ్లు' నాటిక రచనాకాలం.

అంతకుముందు విచిత్రమైన పరిస్థితులలో విజయవాడ వచ్చాను. మరో పదేళ్ల ముందు ఆంధ్రా విశ్వవిద్యాలయంలో బీయస్సీ ఆనర్స్ చదువుతున్నాను. నాటకరంగంలో, ముఖ్యంగా ఆంధ్ర విశ్వ విద్యాలయంలో మేమంతా కె.వి.గోపాలస్వామిగారి శిష్యులం. నటుడిగా నా హవా చెల్లుతున్న రోజులు. ఏదో నాటిక రిహార్సల్స్ జరుగుతున్నాయి. ఇంతలో రేడియోనుంచి రిజిస్ట్రార్‌గారికి ఒక ఉత్తరం వచ్చింది. అంతర్విశ్వవిద్యాలయ నాటక రచనా పోవులకు ఒక నాటికను పంపాలని. ఆ నాటికను విజయవాడ రేడియో స్టేషన్‌లో రికార్డు చెయ్యాలి. శలవుదినాలు. ఎక్కువమందిని గోపాలస్వామిగారు సంప్రదించే అవకాశం లేదు. నేను అందుబాటులో ఉన్న మనిషిని. ఉత్తరం చూపించారు. నేను ఎగిరి గెంతేశాను. నేను నాటికతో రెడీ అన్నాను. 'అయితే తీసుకుపో' అన్నారు. అంతే. దూకేశాను. నాటిక పేరు 'అనంతం'. ఇప్పుడు నరసాపూర్‌లో ప్రసిద్ధ న్యాయవాది నిడుబ్రోలు రామచంద్రరావు. తర్వాత నేవీలో (?) పనిచేసిన భూపతిరావు నాకు గుర్తున్న పేర్లు. ముమ్మరంగా రిహార్సల్స్ చేసి రైలెక్కాం. విజయవాడ కొత్త, రేడియో కొత్త. రేడియో నాటిక కొత్త, రికార్డింగు కొత్త. ఒక్కటే తెలిసిన ప్రపంచం - ఉత్సాహం. దుర్గాప్రసాద్ గారని డెక్కన్ రేడియో నుంచి వచ్చిన ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ నాటికను రికార్డు చేశారు. మధ్యలో ఆగకుండా చెయ్యాలన్నారు. ఇది బుకాయింపు రేడియోకి ఆ సూత్రం వర్తించదు. అయినా నాటకాలు వేసే కుర్రాళ్లం. దూకుతూ మైకు ముందు నాటికను ప్రదర్శించాం. ఆయనే నిర్ఘాంతపోయాడు. మరో నిర్ఘాంతపోయిన వ్యక్తి అక్కడ ఉన్నారు. అప్పుడు అనౌన్సరుగా పనిచేస్తున్న రచయిత్రి లత అప్పుడావిడ ఒక మాట అన్నారు-మీరుండాల్సింది ఇక్కడ - అని. తదాస్తు. కేవలం నాలుగు సంవత్సరాలలో రేడియోలో చేరి 20 ఏళ్లు పనిచేశాను. దుర్గాచలంగారు తర్వాత నాకు సన్నిహితులయ్యారు. ఏతావాతా - నా 'అనంతం' నాటికకు అంతర్విశ్వవిద్యాలయ నాటిక రచనా పోటీలలో ప్రథమ బహుమతి వచ్చింది. ఢిల్లీలో అప్పటి సమాచార శాఖ మంత్రి చేతులమీదుగా బహుమతిని పుచ్చుకున్నాను. ఆడియన్సులో ఇద్దరే తెలుగువాళ్లు. ప్రముఖ నటుడు కె. వేంకటేశ్వం రావు, పురాణం సుబ్రహ్మణ్య శర్మ. ఇది విజయవాడతో తొలి పరిచయం.

నా ఆనర్స్ చదువయి ఢిల్లీలో కొన్నాళ్లు ఉన్నాక - అప్పటి ఆంధ్ర ప్రభ సంపాదకులు నీలంరాజు వెంకట శేషయ్యగారికి పరిచయలేఖ నార్లగారు వ్రాసి ఇవ్వగా, మరో మూడు లేఖలు - కపిల కాశీపతి, తెన్నేటి విశ్వనాథం, పురిపండా అప్పలస్వామిగార్లవి పట్టుకుని విజయ వాడలో దిగాను. అప్పటికి 'రాగరాగిణి' రచన చేస్తున్నాను. కె. వెంకటేశ్వరరావు కోసం. పూర్ణానందం సత్రంలో రచన సమాఖ్య ఆఫీసు గదిలో నా మకాం. మూడోరోజుకే నా జేబులో ఉన్న 25 రూపాయలు ఎవరో కొట్టేశారు. అప్పుడు 'చీకటిలో చీలికలు' రాస్తున్నాను. నవోదయా మేనేజరు ప్రకాశరావుగారు. వారికి నా గోడు వినిపించాను. గాంధీనగర్‌లోని శాంతి కేఫ్‌లో నెల భోజనానికి టిక్కెట్ల పుస్తకం తెప్పించారు. ఆ రోజుల్లో నెల రోజుల భోజనం టిక్కెట్ల పుస్తకం 15 రూపాయలని గుర్తు. అవసరమైనప్పుడు నవోదయా సొరుగు తెరిచి అయిదురూపాయలు తీసుకునేవాడిని రసన సమాఖ్యలో మకాం. శాంతికేఫ్ ప్రొప్రయిటర్ ముఖ్య ప్రాణరావు అనే ఉడిపి బ్రాహ్మణుడు. వెంకటేశ్వరరావు భక్తుడు. పొద్దుటే ఆ కేఫ్‌కి తువాలు, సబ్బుతో వచ్చి స్నానం చేసి, ఫలహారం చేసి వెళ్లేవాడిని. తర్వాత ప్రకాశరావుగారు కాంగ్రెస్ ఆఫీసు రోడ్డులో ఒక టైర్ల కంపెనీ పెరట్లో ఒక చిన్న గదిని ఏర్పాటుచేశారు. రోజూ నేను రాసిన నవల (చీకటిలో చీలికలు) అధ్యాయం విని ఇంటికి వెళ్లేవారు. (ఇప్పుడు గత కొద్ది సంవత్సరాలుగా మంచంమీద ఉన్నారు) నాకు-బహుశా పదిరూపాయలు పెట్టి ఒక మడత కుర్చీ కొన్నారు. అది నా పెళ్లయి, పిల్లలు పుట్టేదాకా నాతో రేడియో బదిలీలలో ఊళ్లు తిరిగింది. అడపా తడపా రమ్మనప్పుడల్లా వెళ్లి శేషయ్యగారిని కలుస్తూండేవాడిని. మరో ఆరునెలలకి - 1959 చివర్లో - నాకు ఆంధ్రప్రభలో ఉద్యోగం ఇచ్చారు. ఇప్పుడున్న

ఖిలాపురం స్థలంలోనే ఆంధ్రప్రభ ఆఫీసు. నా జీవితంలో మొదటి ఉద్యోగం అలా విజయవాడలో ప్రారంభమయింది. సరిగ్గా 15 రోజుల్లో చిత్తూరు బదిలీ. ఆంధ్రప్రభ చిత్తూరు ఎడిషన్ ప్రారంభం. అదొక చరిత్ర.

ప్రకాశం బేరేజీ 1957లో ప్రారంభమయింది. బేరేజీ కింద - ఒక పక్కగా కార్లు, సైకిళ్లు వెళ్లే మార్గం, నీళ్లు అంతగా లేని రోజుల్లో అక్కడి రాళ్లమీద కూర్చుని - నది మీదనుంచి వచ్చే గాలి చల్లదనాన్ని అనుభవించడం గుర్తుంది. ఇప్పుడు బేరేజీ మీద కారు వెళ్లినప్పుడల్లా ఆ సాయంకాలాలు గుర్తుకు వస్తాయి.

మళ్లీ 1968కి రేడియో ఉద్యోగిగా ముగ్గురు పిల్లలతో విజయవాడలో దిగాను. అప్పటికి నేను సినీ రచయితను అయ్యాను (డాక్టర్ చక్రవర్తి, ఆత్మగౌరవం రిలీజయాయి) ప్రయాగ నరసింహశాస్త్రిగారింట్లో మకాం - లబ్బీపేటలో పశువుల ఆసుపత్రి పక్క రోడ్డులో. ఇప్పుడు ఆ రోడ్డు చివర కాలవ మీద వంతెన వచ్చింది. దరిమిలాను నార్ల ఆ యింట్లో ఉన్నారు. నేను మూడిళ్ల ఇవతల. పురాణం సుబ్రహ్మణ్య శర్మ ఆంధ్రజ్యోతి వీక్లీ ఎడిటర్‌గా చేరారు. నార్లగారి ఆహ్వానం మేరకు నేనూ, పురాణం వారితో కూర్చుని గురజాడ వ్రాత ప్రతులను పరిష్కరించే పనిచేశాం. అదొక గొప్ప జ్ఞాపకం. నేనూ, నండూరి రామమోహనరావు, పురాణం, కొమ్మూరి వేణుగోపాలరావుతో ఎన్నో సాయంకాలాలు రేడియోలో మరెన్నో జ్ఞాపకాలు.

రాచకొండ నరసింహమూర్తిగారితో ఆత్మీయస్నేహం. మరిచి పోలేని జ్ఞాపకం ఒకటుంది. రాచకొండవారి ఆఖరి పిల్ల - నెలల పిల్ల బాగులేదు. కొమ్మూరి ఆసుపత్రిలో చేర్చాలన్నాడు. రాచకొండ దగ్గర డబ్బుల్లేవు. 20 రూపాయలు ఇచ్చాను. అమెరికన్ ఆసుపత్రిలో చేర్చారు. ఉదయమే నన్ను నిద్దర లేపారు. "పిల్ల ఉంటుందని నమ్మకం లేదు. మీరు నా పక్కన ఉంటే ధైర్యంగా ఉంటుంది" అన్నారు. బట్టలేసుకుని, నా విక్కీ మోపెడ్ మీద ఇద్దరం బయలుదేరాం. రాత్రి పిల్ల పోయింది. చేతిలో డబ్బులేదు. పదిరూపాయలు ఇచ్చాను. "పిల్లని నేనే పంపించేస్తే తృప్తిగా ఉంటుంది" అన్నారు. ఆయనతో వెళ్లడానికి మనుషులెవరూ కనిపించలేదు. తల్లిదండ్రులుండగా నేను శ్మశానానికి వెళ్లకూడదు. "నేనే అంతా చేసుకువస్తాను. మీరు కృష్ణానది వరకూ నాతో రండి చాలు" అన్నారు రాచకొండ. ఆయన రిక్షాలో పిల్ల శరీరంతో. నేను వెనుక మోపెడ్‌మీద. నేను కృష్ణ గట్టున నిలబడ్డాను. మరో అరగంటకి వచ్చారు కళ్లు తుడుచుకుంటూ. "శరీరం మంచుముద్దలాగ ఉంది. ఎంతచక్కని ముక్కు అనుకున్నారు అమ్మాయిది. చేతుల్లోంచి దించుతూంటే మమకారంతో నరాలు కొట్టుకున్నాయి. ఆమె తల దగ్గర నరం కదిలేసరికి ఆమె తలలో నరం కదులుతోందా అని నా మనస్సు పీకింది. వెధవ మమత" - ఇవీ ఆయన మాటలు. కృష్ణమ్మ తల్లి ఎందరి దుఃఖార్తి మీద ముసుగు కప్పిందో ! ఎందరి కన్నీళ్లు తుడిచిందో ! మనిషిని సముదాయించ డానికి పెద్ద ఊతం కృష్ణమ్మ.

రేడియోలో బందా, కందుకూరి రామభద్రరావు, బాలాంత్రపు రజనీకాంతరావు, జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి, డాక్టర్ జి. వి. కృష్ణారావు, వింజమూరి శివరామారావు, ఉషశ్రీ, శంకరమంచి సత్యం, శ్రీరంగం గోపాలరత్నం, దండమూడి రామమోహనరావు, అన్నవరపు రామస్వామి, దత్తాడ పాండురంగరాజు, వింజమూరి లక్ష్మి, వి.బి. కనకదుర్గ, ప్రయాగ నరసింహ శాస్త్రి, ఆమంచర్ల గోపాలరావు, నండూరి సుబ్బారావు, సి. రామమోహనరావు వంటి హేమా హేమీలతో సహజీవనం. నేనూ, పురాణం, కొమ్మూరి కలిసి 'ఇడియట్' అనే గొలుసునవల రాశాం. "మీ మూడో ఇడియట్ ఎలా వున్నాడు ?" అని పలకరించేది యద్దనపూడి సులోచనారాణి. నాతో కలిసి మొదటి సినిమాకు సహ రచయిత. నాతో కలిసి ఉత్తమ సినీ కథారచయితగా మొదటి నంది అవార్డు అందుకున్న రచయిత్రి. ఆ రోజుల్లోనే పుంఖాను పుంఖంగా సినీ రచన. భలేరంగడు, చెల్లెలికాపురం, పాపం పసివాడు, మరపురాని తల్లి - యిలాగ. నాటకరంగంలో తిరుగులేని విజయకేతనం ఎగరేసిన రోజులు. ఆ రోజుల్లో పాత విజయవాడలో టెలిఫోన్ శాఖ ఉత్సవాలలో అనుకుంటాను - ఆ పోటీలలో నాటికలన్నీ నావే. రోజుకి 30 గంటల కృషి. అప్పటి విజయవాడ జీవితం మరొక అద్భుతమైన ప్రస్థానానికి పెద్ద సంకేతం.

ఆనాటి కృష్ణాపుష్కరాల జ్ఞాపకాలు - రాజకీయాలు కలుషితం చేయని కృష్ణమ్మ పరవళ్లు, కారుషెడ్డులాంటి చిన్న వాటాలో నా భార్యాపిల్లలు, నదీస్నానంతో పుణ్యాన్ని సంపాదించుకోవాలని వచ్చిన నా బంధువర్గం - భౌతికంగా కుదించుకున్నా ఆత్మీయంగా విశాల మయిన జ్ఞాపకాల కాలం.

తర్వాత 'నిప్పులాంటి మనిషి' రజతోత్సవ పండగలో ఎన్టీఆర్ చేతులమీదుగా జ్ఞాపికను అందుకున్న జ్ఞాపకాలు, ప్రపంచ తెలుగు మహాసభల్లో పాల్గొన్న సందర్భాలు, అద్భుతమయిన విజయవాడ పుస్తక ప్రదర్శనలకి ముఖ్య అతిథిగా రాక, సభలు తెలుగు సాహిత్యంలో మొదటి ఆడియో నవల 'పిడికెడు ఆకాశం' ఆవిష్కరణ, మండలి కృష్ణారావు పురస్కార సభ, మండలి బుద్ధ ప్రసాద్‌గారి షష్టిపూర్తి ఉత్సవాలకు అధ్యక్షత, రేడియో నాటకాలు - రాగరాగిణి, నవంబరు 11 నిర్వహణ - ఎన్నో ఎన్నో విజయవాడ జ్ఞాపకాలు.

అయిదు పుష్కరాల తర్వాత - 2016 పుష్కరాల నాటికి - జీవితం ఎంత దూరం ప్రయాణం చేసింది ! ఎంత ముమ్మరంగా సాగింది ! ఆనాటి బంధువులు దాదాపు అందరూ లేరు. ఇప్పుడు నేను వారి వయస్సులో ఉన్నాను. అయినా కృష్ణమ్మ నిరంతర స్రోతస్విని. అలా పారుతూనే ఉంది. మన జీవితాలను, జీవన గమనాన్ని కొలవడానికి పుష్కరం ఒక గుర్తు. ఒక జ్ఞాపకం. ఒక మజిలీ. ఒక ప్రస్థానం.

డాక్టర్ కానుకొల్లు బాలకృష్ణ

# కొడాలి కవిత్రయం

**పరిచయం :** 20వ శతాబ్దపు ప్రథమభాగం మనదేశచరిత్రలో ఎంతో వైవిధ్యం, వైశిష్ట్యం కలిగిన కాలం. అది సామాజిక, రాజకీయ, సాహిత్య ఉద్యమాలు ఉవ్వెత్తున ఎగసిన కాలం. ముఖ్యంగా ఒకవైపు స్వాతంత్ర్యోద్యమం, మరొకవైపు కాల్పనికోద్యమం కవుల ఊహాశక్తికి అదను కల్పించాయి. అవి కవుల కలాలకు పనికల్పించడమే గాక వాటికి పదునుపెట్టాయి కూడా. దేశం నలుచెరగులా ముఖ్యంగా ఆంధ్రదేశంలోని అన్నివైపులా కవులు దేశభక్తిప్రేరక రచనలతో ఆంధ్రసాహిత్యాన్ని సుసంపన్నం చేశారు.

అట్లా ఆధునికాంధ్ర కవితావనంలో భావకవితా సుమాలు పూయించిన కొడాలి వంశజులైన శ్రీ కొడాలి ఆంజనేయులుగారు, శ్రీ కొడాలి వెంకట సుబ్బారావుగారు, శ్రీ కొడాలి వెంకట రాజారావు గారు ఈ ముగ్గురు కవుల సాహిత్య సమీక్షే ఈ వ్యాసం.

## కొడాలి ఆంజనేయులు (1897-1982)

'సత్యాంజనేయకవులుగా కొంతకాలం జంటకవనం సాగించిన రీవారిలో ఒకరు కవిసమ్రాట్ సత్యనారాయణగారు కాగా మరొకరు కొడాలి ఆంజనేయులుగారు. వీరు కృష్ణాజిల్లా సీమప్రాంతంలోని కొడాలి గ్రామంలో జన్మించారు. ఐదేళ్ళపాటు 'సాహితీ' పత్రికకు సంపాదకత్వం వహించారు. 'సత్యాంజనేయకవుల' ఖండకావ్యాలు 'కృష్ణాపత్రిక'లో ప్రచురితమయ్యాయి. స్వాతంత్రోద్యమంలో ఎంతో ఉత్సాహంతో పాల్గొని నాలుగు సంవత్సరాలు జైలుశిక్ష అనుభవించిన దేశభక్తుడు కొడాలి. వీరు కొంతకాలం 'హరిజన సేవాసంఘానికి' ఆంధ్రరాష్ట్ర రాజకీయ బాధితుల సంఘానికి' అధ్యక్షులుగా ఉన్నారు.

ఆంజనేయులు స్వీయానుభవాలతో 'అజ్ఞాన సత్యాగ్రహం' అనే ఖండకావ్యాన్ని రచించారు. విశ్వనాథతో కలిసి 1920లో వీరు రచించిన 'అవతార పరివర్తనం' అనే నాటకం దేశభక్తులలో జాతీయోద్యమ స్ఫూర్తిని రగిలించింది. అతివాద జాతీయనాయకుడు, లోకనాయక్‌గా ప్రఖ్యాతి పొందిన బాలగంగాధరతిలక్ మరణించిన తరువాత జాతీయోద్యమ నాయకత్వాన్ని గాంధీజీ చేపట్టడం నాటకంలోని ఇతివృత్తం. ఈ నాటకం ప్రజలలో కలిగించిన దేశభక్తి చైతన్యాన్ని గమనించిన ఆనాటి ఆంగ్లప్రభుత్వం దీని రాతప్రతిని స్వాధీనం చేసుకున్నది. ఇంకా రాధ, దెబ్బతిన్న లేడి, అంధబాలిక, నీరాజనము, జైలులో చెట్లు, నిరీక్షణము, పెళ్ళికూతురు వాటి కవితాఖండికలు, సన్యాసి పద్యాలు మొదలైనవి వీరి ప్రసిద్ధ సాహిత్య రచనలు.

కవి, దేశభక్తుడు అయిన ఆంజనేయులు సాహిత్య రచనలే కాక రాజకీయశాస్త్ర సంబంధ రచనలు కూడా ఎన్నో చేశారు. భోగరాజు పట్టాభి సీతారామయ్య ఆంగ్లంలో రచించిన కాంగ్రెసు చరిత్రను తేటతెలుగులో రెండుభాగాలుగా (1938, 1948) అనువదించారు. ఇంకా సహకారోద్యమం, నిరీక్షణ, గ్రామస్థుల అర్థశాస్త్రం, యుద్ధము-కమ్యూనిస్టులు-కాంగ్రెస్ గాంధీ-గాంధీతత్త్వము, సర్దార్‌పటేల్, ఖాదీ అర్థశాస్త్రం, ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ మొదలైనవి వీరి ఇతర రచనలు.

వీరి పద్య రచనలు చాలావరకూ సంస్కృతసమాసాలలో సంప్ర దాయకరీతిలో ఉన్నప్పటికీ కొన్నిచోట్ల సరళమైన దేశీయశైలి కూడా కనిపిస్తుంది. "పశ్చిమ ముఖాంత గహ్వరము నందు...." వంటి సంస్కృతసమాసాలే కాక "పూలతావులతోడ కర్పూర దీప గీతముల తోడ....." వంటి తేటతెలుగు పదబంధాలు కూడా వీరి రచనలలో కనబడతాయి. వీరి వచన రచనలు మాత్రం సరళగ్రాంధికంలో ఉంటాయి.

'సన్యాసి' ఖండికలోని కింది పద్యం వారి మృదువైన ఊహకు

**"దివ్య కుసుమాంగి యానెలు దీసి యిచ్చు**
**వేదముల పాకు మదుపులు కాదటంచు**
**హరిణ శాబమ్ములకు తృణా-కురము లిడగ**
**మనసుపుట్టెనె యెంత యమాయకుడవు"**

కవిత్వం కంటే దేశభక్తే గొప్పదిగా భావించిన ఆంజనేయులు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనడం వల్ల నాలుగేళ్ళపాటు జైలుశిక్ష అనుభవించారు. జైలులో ఉన్నప్పుడు వీరు రచించిన 'జైలులో చందమామ' అప్పటివారి దయనీయస్థితిని కళ్ళకు కడుతుంది.

**"రాతిగుండెలు గలిగిన రాచభటుల**
**కర్ణశాఘాతముల మేను కందిపోయె**
**శీతల హిమాంబు కణముల చిల్కరించు**
**అమృత కిరణాల స్పృశియింపు మయ్యమమ్మ"**

తమ జంటకవిత్వం 'మధు ఝురీభ్రమరరుతి' వంటిదని విశ్వనాథ కల్పవృక్ష అవతారికలో వర్ణించారు. అంతేకాక ఆంజనేయులే గనుక తోడు ఉన్నట్లయితే తామిద్దరం కలిసి పోతన లాగా కలకండల వంటి కవిత్వాన్ని సృష్టించేవారమని శ్లాఘించారు. కింది పద్యం ఆంజనేయులుగారి సాహిత్య వ్యక్తిత్వాన్ని చక్కగా ఆవిష్కరిస్తుంది.

**'తన మృదుజిహ్వపై రవలు దాల్చిన నూఁగునిగారపుంజిగుల్**
**చను కవితాసతిన్ విడచి సాధుమహాహవశీలుఁడా మహా**
**త్ముని యసిలేని సేనఁబడి పోయెదు వానిఁ గొడాలి యంజనే**
**యుని మును నాకు జంటకవియున్ బ్రియమిత్రము**
**సంస్మరించుచున్**

**(శ్రీమద్రామాయణ కల్పవృక్షము - అవతారిక - 22)**

కొడాలి వెంకట సుబ్బారావు (1904-1932)

**"శిలలు ద్రవించి యేడ్చునవి జీర్ణములైనవి తుంగభద్రలో**
**పల గుడిగోపురంబులు సభాస్థలు లైనవి కొండముచ్చు గుం**
**పులకు చరిత్రలో మునిగిపోయిన దాంధ్రవసుంధరాధిపో**
**జ్జ్వల విజయప్రతాపరభసం బొక స్వప్నకథావిశేషమై**

**(హంపీక్షేత్రం - రాళ్ళు - 1)**

ఇది ఆధునికాంధ్ర సాహిత్యంలో 'సుప్రసిద్ధ పద్యాలలో ఒకటి. ఆంధ్రుల గతవైభవచిహ్నాలు ఎలా నశిస్తున్నాయో వర్ణిస్తూ తన ఆవేదనను అపూర్వంగా అక్షరబద్ధం చేసిన ఈ పద్యంలో కవి కావ్యవస్తువునూ, తన్నిర్వహణావిధానమూ నిక్షేపించారు.

కృష్ణాజిల్లా దివి తాలూకా పెదకళ్ళేపల్లి గ్రామంలో డిసెంబరు 12, 1904న జన్మించిన సుబ్బారావుగారు పెదకళ్ళేపల్లి, మచిలీపట్నం, రాజమండ్రి మద్రాసులలో చదువుకున్నారు. చదువు పూర్తయ్యాక తన తండ్రి శివరామకృష్ణారావుగారి లాగానే ఆంధ్రపత్రికా సంపాదకవర్గంలో చేరారు. తరువాత బందరులోని నోబుల్ కళాశాలలో చరిత్ర, తెలుగు ముఖ్యాంశాలుగా బి.ఏ. ఉత్తీర్ణులయ్యారు. కళాశాల చదువు పూర్తయ్యాక అక్కడి హిందూ హైస్కూలులో తెలుగు పండితులుగా పనిచేశారు. ఎందరో విద్యార్థుల అభిమానాన్ని సంపాదించారు. తరువాత 1929 సం॥ నుంచి గుంటూరు క్రిస్టియన్ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా ఆమరణాంతం పనిచేశారు. వీరికి క్రీడలన్నా, నటనన్నా అభిమానం మెండు.

గురుదక్షిణ, హంపీక్షేత్రం, ఆహుతి(నాటకం) వీరి ప్రసిద్ధ రచనలు. వీరి రచనలలో దేశభక్తి ప్రధానాంశం. దీనికి అప్పటి దేశ సామాజిక, రాజకీయ స్థితిగతులు ముఖ్య భూమికలు. గురజాడ, రాయప్రోలు పూయించిన దేశభక్తి కవిత్వాన్ని విశ్వనాథ, బసవరాజు, బాపిరాజు, జాషువా, కొడాలి కవులు వికసింపజేశారు.

తెలుగులో భావకవిత్వా ఉద్యమానికి ఆద్యులు రాయప్రోలు సుబ్బారావుగారు. భావకవిత్వం ఆత్మాశ్రయరీతికి చెందినది. దేశభక్తి కవిత్వం, ప్రకృతికవిత్వం, స్మృతి కావ్యం, ప్రణయ కవిత్వం, భక్తి కవిత్వం అనేవి భావకవిత్వ శాఖలు. వీటిలో అన్ని శాఖలలోనూ కవిత్వం చెప్పినప్పటికీ కొడాలివారిలో ప్రధానంగా కనిపించేది దేశభక్తి కవిత్వమే. ఈ రకం రచనలలో 'గతవైభవపునరుద్ధరణ' ముఖ్యలక్షణం.

### ప్రణయకవిత్వం :

భావకవితాయుగంలో చాలామంది కవులు ప్రణయకవిత్వాన్ని ఆశ్రయించారు. ప్రణయకవిత్వంలో సాధారణంగా కవి 'ఊహ ప్రేయసి'ని సృష్టించుకొని ఆమెపైగల ప్రణయభావాన్నో, విరహ భావాన్నో రమణీయంగా వర్ణిస్తాడు. నండూరి వారి 'ఎంకి', కృష్ణశాస్త్రి గారి 'ఊర్వశి' బాపిరాజుగారి 'శశికళ' లాగానే కొడాలివారికి 'చెంచు' ఊహాప్రేయసి. 'గురుదక్షిణ'లోని కింది పద్యంలో వీరి ముగ్ధ ప్రణయతత్వం, స్నిగ్ధహృదయం, మధురస్మృతి చిత్రణ కన్పిస్తాయి.

**"కష్టసౌఖ్యంబు లననేమొ కనగలేని**
**బాల్యమందున హర్ష ప్రభావ చరిత**
**మూఢహృదయాల దాగుడు మూతలాడు**
**నపుడు నే దొంగనైతినన్నీ రోష మావహింప......."**

**(- గురుదక్షిణ - నా చెంచు ఖండిక)**

'ఏనాటి ఋణములో' అన్న ఖండికలో కొడాలివారు కులపాలికా ప్రణయతత్వాన్ని పోషించారు. "వనజాస్యన్ సుకుమారి చారు కుసుమ ప్రాయంపు శాతోదరిన్..." అనే పద్యంలో ఆమె తన భార్య కావడమే తన మహాభాగ్యంగా గర్వకారణంగా వర్ణిస్తాడు కవి. ఈ పద్యం శ్రీనాథుని "రమణిన్ పల్లవపాణిన్ పద్మనయనన్ రాకేందు బింబాననన్......" అనే పద్యాన్ని స్ఫురింపజేస్తుంది.

**భక్తికవిత్వం :**

ఇది మధురభక్తి ప్రధానమైనది. ఇందులో భగవంతుడు ప్రియుడుగా, కవి తాను ప్రియురాలుగా ఊహించుకొని వర్ణన చేయడం విశేషం. ఇది సాధారణంగా గోపికాకృష్ణుల ప్రణయ కలహాలను, విరహ వేదనతో కూడిన ప్రణయతత్త్వాన్ని ఆవిష్కరిస్తుంది. కొడాలివారిలో మార్మికత, తాత్వికత ఎక్కువగా కనిపిస్తాయి. 'ఏలగోపాలబాల' అనే ఖండికను కొడాలివారు మధురభక్తి స్ఫోరకంగా రచించారు.

**"చెంత రమ్మని ప్రార్థింప చేరరావు**
**తలచి మొరపెట్టి పిలిచిన పలుకబోవు**
**సుఖము లందు చున్నప్డు చూడరావు**
**కష్టదశలందు కనులకు గానబడవు"**
**(-గురుదక్షిణ - ఏలగోపాలబాలఖండిక)**

**స్మృతికావ్యం (ఎలిజీ)**

తనకు అత్యంత ఆత్మీయులు, మిత్రులు, బంధువుల వియోగం వల్ల కలిగే బాధను వ్యక్తపరిచే భావసంపుటులే స్మృతికావ్యం. కొడాలి వారి 'మాయమ్మ' అనే మాతృ స్మృతి గీతం ఈ కోవలోనిదే. ఇందులో 'మాయమ్మ మాకిత్తువా', 'అనుభవిస్తున్నానురా' 'అదెనాకు సంతృప్తి' అనే మూడు శీర్షికలు ఉన్నాయి. మాతృవియోగవేదనను, కన్నతల్లితోటి తన చిన్ననాటి అనుభవాలను, కరుణ రసాత్మకంగా చిత్రించారు కవి.

**"కాసేపు కూసేపు కాదు యీ యనుభవము**
**కడతేరి నీలోన కలిసి పోయేదాక**
**కలక వేయుచు నుందురా ! దైవమా !**

కడుపు మండుచు నుందురా" అంటూ విలపించారు. శోకమన్నది 'ఎలిజీ'కి ప్రత్యేక లక్షణం. ఎలిజీ స్మృతి సంబంధి. హంపీక్షేత్రం సైతం స్మృతి పూర్వకంగా, కరుణరసాత్మకంగా రచించినదే.

**దేశభక్తి కవిత్వం :**

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ స్ఫూర్తితో రగిలిన జాతీయోద్యమ బీజాలు భావకవితా యుగంలో విస్తరించి తెలుగుజాతికి, తెలుగు కవిత్వానికి సరికొత్త ఒరవడిని సమకూర్చాయి. దేశభక్తి కవిత్వంలో కవులంతా గతవైభవాన్ని స్మరించగా కొడాలివారు గతవైభవాన్ని స్మరించడమేకాక ప్రస్తుత దీనస్థితిని కూడా కరుణరసాత్మకంగా వర్ణించారు.

కవిత్వం గురించి కొడాలివారి అభిప్రాయాలు ఆలోచించదగినవి. "ఆనందదాయకమగు కవిత్వమును యిట్లుండవలెనని శాసించు అధికార మెవ్వరికిని లేదు. ఆనందమునకు అంతులేదు. పరిమితి లేదు. తత్సంబంధియగు కవిత్వమునకు కట్టుబాటులు లేవు. లేని యధికారముల తెచ్చిపెట్టుకొనుటయె లక్షణముల యుత్పత్తిని కారణము. అయినను కాకపోయినను అది మా యూహ. లక్షణములను గుణగణములను తనకు తగిన వాటిని కవియే యేర్పరచు కొనును. ఒక కవి గుణగణము లింకొక కవికి యుండ నవసరము లేదు. ఎవరి రసోద్రేక ఫలిత లక్షణ గుణగణములు వారివి" అని 'గురుదక్షిణ' గ్రంథాది మనవి మాటల్లో చెప్పిన ఈ పలుకులు కొడాలి స్వతంత్రప్రవృత్తిని తెలియజేస్తున్నాయి.

వీరికి చాలా ఇష్టమైన కవి పోతన. తన 'గురుదక్షిణ'ను పోతనకే అంకితం చేశారు. ఆంధ్రభాషాప్రపంచంలో సద్విమర్శకులు ప్రబంధ యువతుల నడుములా ఉన్నారని (శూన్యమని) విమర్శకుని కూడా వీరు అందంగా విమర్శించారు.

**"ఆంధ్రత్వ మాంధ్ర భాషా చనాఽల్పస్యతపసఃఫలమ్"** అన్న సూక్తిని కొడాలివారు అక్షరాలా నమ్మి ఆచరించినట్లు వారి రచనల్లో కనిపించే ఆంధ్రాభిమానం ద్వారా అవగతమవుతుంది. వీరిలో ఆంధ్రదేశాభిమానం, జాత్యభిమానం, భాషాభిమానం, ఆంధ్రరాజులపై అభిమానం, కవిత్వంపైన అభిమానం మెండుగా నిండుగా కనిపిస్తాయి. వీరికి హంపీ ప్రస్తుతస్థితి "బ్రతికియు వేయి, ప్రాణములు బాసియు వేయి, మదే భమన్నట్లు'గా తోచింది.

గురుదక్షిణలో "హరిదాసులకైన యంతరాయములొడ్డు" అనే పద్యంలో ఆంధ్రలక్ష్మి సిరిసంపదల గొప్పదనాన్ని, సస్యశ్యామల సౌభాగ్యాన్ని కీర్తించారు కవి. తుంగభద్రా, కృష్ణా, గోదావరీ, ఐరావతీనదీ పరివేష్టితమైన ఆంధ్రదేశ సోయగాన్ని "ఊగులాడితివంట ఉవ్వెత్తుగా నీవు తుంగభద్రా భంగములను...." అనే పద్యంలో చిత్రించారు.

"వేయికి చాలుపో తెలుగు వీరుండొకండని "తెలుగు వీరుల శౌర్యాన్ని పౌరుషాన్ని శ్లాఘించారు.

డిండిమభట్టు అనే మదించిన ఏనుగును కవిరాజైన శ్రీనాథుడు మృగరాజై వాదంలో ఓడించాడు. అప్పుడు అక్కడ ఉన్న సభ్యులు అందరూ "...తెలుగు కావ్య సరస్వతి నూపురంబు మ్రోయు దినము లింక నున్నవ...."ని పలికారని చెప్పడం కవికి తెలుగుభాషపై కల మమకారానికి తార్కాణం.

**"గౌతమీగర్భపంకం బెండబెట్టిన....."** పద్యంలో కొడాలివారు ఆంధ్రరాజుల శౌర్య ప్రతాపాలను వర్ణించారు. ఔచిత్య కల్పనలతో చారిత్రక పురుషులైన తిమ్మరుసు, విద్యారణ్యుల గాథలను వర్ణించి వారిపట్ల తనకు గల గౌరవాన్ని చాటారు. వీరు హంపీక్షేత్రంలో

శ్రీనాథుడినీ, శ్రీకృష్ణదేవరాయలనూ, 'గురుదక్షిణ'తో పోతననూ కీర్తించారు.

"జనని సంస్కృతంబె సకల భాషలకును" అన్నారు పూర్వులు. కానీ అటువంటి ఆ సంస్కృతభాషే తన పోకడలు తెలుగు కవిత్వంలో ఉండడం చూసి మురిసిపోయినట్లు ఇలా వర్ణించారు.

**"భాస్కరకర ప్రచార సంపర్కహీను**
**లాంధ్రకవితా మహాకాంతురలసి బ్రతుకు**
**దివ్య గీర్వాణ భాషాసతీ లలామ**
**మాంధ్ర కవితా విలాసము లరసి మురియు"**

కొడాలివారి రచనలు అన్నీ ముఖ్యంగా ఖండకావ్యాలు. హంపీక్షేత్ర కావ్యంలోని వస్తువు చారిత్రాత్మకం. గురుదక్షిణ, చారిత్రక, పౌరాణిక, సాంఘికేతి వృత్తాలను కల్గి ఉన్న కావ్యం. ఈ మూడురకాల ఇతివృత్తాలనూ వీరు సమానగౌరవంతో నిర్వహించారు. చారిత్రక పాత్రలలో రాయలు, హరిహర బుక్కరాయలు మొదలైనవారి గురించి లోకంలో ఉన్న కథలను గ్రహించి వారికి అప్రతిష్ట కలగకుండా వారిని ఆదర్శమూర్తులుగా తీర్చిదిద్దారు వారు. పౌరాణిక పాత్రలలో పరశురాముని పాత్ర చిత్రణలో ప్రసిద్ధమార్గాన్ని అనుసరించినా, కుంభకర్ణ విభీషణులు, ఊర్వశీవిభాండకుల పాత్రచిత్రణలో స్వతంత్ర మార్గాన్ని అనుసరించారు.

కొడాలివారు అలతి అలతి తేటతెలుగు పదాలలో ఒకవైపు, సంస్కృత పదగుంఫనలతో మరోవైపు పద్యం చెప్పగల దిట్ట. "ఒక కొండ కొక కొండ ఊపిరాడగ నీని ఉరిత్రాటి యుచ్చులా నొప్పు నొకట...." వంటి తేలిక తెలుగు పదాలతోనే కాక "పరిభా వ్యాజముతోన చుట్టుకొని పంప్రాస్రోత మాత్మీయ సుందరనీలాకృతి తత్పురాద్రి చలనబద్ధస్వాంగయై...." అనే దీర్ఘసంస్కృత సమాసాలతో కూడా పద్యం చెప్పగలరు.

వీరి రచనలలో మహారాజ, అదేలనో, వేళనసుమీ, సమ్మతుల మొదలైన వ్యావహారిక పదాలతోపాటు పచ్చీసు, పరజా, షికారు వంటి అన్యదేశ్య పదాలు కూడా కనబడతాయి.

వీరు ఎక్కువగా వృత్త జాత్యుపజాతులతో కృతులు వెలయించినా 'మాయమ్మ' అనే గేయకృతి ఖండిక కూడా రచించారు. వీరిగురు దక్షిణలో

**"నిర్మలంబుగనున్న కోనేటి నీడ**
**కళలు నిండిన చంద్రుడు కాంతి గులుక**
**చూచుచుండెను నెమ్మోము సోయగంబు**
**కాంతుదేతేర నూత్న వికాసమంది"** - ఇలా స్వాభావికంగా కనిపించే ప్రకృతికాంత హంపీక్షేత్రంలోని

**"ఒక కొండ కొకకొండ ఊపిరాడగనీని**
**ఉరిత్రాటియుచ్చు "లా" నొప్పునొకట...."**

అనే పద్యంలో మనోనయనాలకు సజీవంగా కనబడుతుంది.

ఆధునికాంధ్ర సాహిత్యంలో వచన కవిత్వానికి పోటీగా పద్య కవిత్వాన్ని నిలబెట్టినవారు కరుణశ్రీ, జాషువా, దాశరథి కవులు. అదేవిధంగా స్వతంత్రమైన శైలితో, లయాత్మక నడకతో పద్యానికి నూతన శోభను చేకూర్చారు కొడాలివారు. అందుకే ప్రముఖ సినీగేయకవి అయిన వేటూరివారు వీరిని భావకవితాశుకునిగా అభివర్ణించారు.

ఆదర్శవంతమైన వ్యక్తిత్వం కలిగిన సుబ్బారావుగారు సహృదయులు, స్నేహశీలి. పెద్దలు, పిన్నలు వీరికి అనతికాలంలోనే మిత్రులయ్యేవారు. వయసులో పెద్దవారైనా విశ్వనాథవారు వీరికి స్నేహితులు. సాధారణంగా సౌమ్యుడైన విశ్వనాథకు కొడాలి సుబ్బారావు స్నేహంవల్లనే గడుసుదనం అబ్బిందని పెద్దల గమనిక. బందరులోని నోబెల్ కళాశాలలో వీరికి పింగళివారు ఆంగ్రోప న్యాసకులు. కొడాలవారు సద్విమర్శకులు. మాటల్లోనైనా, చేతల్లోనైనా వీరికి నిర్భయం సహజగుణం. "ఒకసారి బందరు హాస్పటలులో, హాస్టలు గేటు మూసి మడతమంచపు ఇనుపచువ్వ చేగొని నాల్గువందల రౌడీల నడ్డగించినవాడు కవి అన్న విశ్వనాథ వారి మాటలు అందుకు నిదర్శనాలు. వీరు గుంటూరులో విశ్వనాథ, నాయని, చలం మొదలైన సమకాలీన కవులతో 'కవితా గోష్ఠులు' నిర్వహించేవారు.

కవిగా, విమర్శకులుగా, ఉపాధ్యాయులుగా, నటులుగా, జ్యోతిశ్శాస్త్రవేత్తలుగా అచిరకాలంలోనే ఖ్యాతిగడించి తన జన్మభూమి అయిన పెదకళ్ళేపల్లి ఆంధ్రజాతి కీర్తి ప్రతిష్ఠలను ఇనుమడింపజేసిన సుబ్బారావుగారు తీవ్రజ్వరంతో ఆగస్టు 11, 1932 న అతిపిన్న వయసులో మరణించారు.

వీరి కుమారులైన డా॥ కొడాలి నాగేశ్వరరావుగారు సుప్రసిద్ధ వైద్యులు. వారుకూడా 'జైభారత్' అనే నాటక రచనతో కీర్తిపొందడం విశేషం.

### కొడాలి వెంకట రాజారావు (1916-1997)

వీరు కొడాలి శివరామకృష్ణారావు గారి మూడవ కుమారులు. 'హంపీ' సుబ్బారావుగారి కనిష్ఠ సోదరులు. వీరు 1936 నుంచి 1986 వరకు అంటే ఏభైఏళ్ళపాటు పెదకళ్ళేపల్లి గ్రామ కరణంగా విధులు నిర్వహించారు. ఆంధ్రజ్యోతి (1937), స్మరచక్రవర్తి(1951) శతకత్రయం (1993), సాహితీసుమ సౌరభాలు (1995), సూరి

పాటల మరియు కవితాగుచ్ఛము (1995) బుద్ధుని కథ (ఏకాంకిక) మొదలైనవి వీరి ప్రసిద్ధ రచనలు.

'ఆంధ్రజ్యోతి'లో పోతన, శ్రీకృష్ణదేవరాయలు, బాలచంద్రుడు మొదలైన తెలుగు ప్రముఖుల గురించిన ఖండికలు ఉన్నాయి. రతీ మన్మథుల లీలా విశేషాలను మనోహరంగా వర్ణిస్తూ రచించిన గేయ సంపుటే స్మరచక్రవర్తి. రచనాకాలం తెలియని బుద్ధుని కథ ఒక ఏకాంకిక. లిఖితరూపంలోనే ఉన్నా ఈ మూడు రచనలనూ వారి కుమారులు శ్రీ కొడాలి కుటుంబరావుగారు, శ్రీ కొడాలి వెంకటేశ్వర రావుగారూ ముద్రించడానికి పూనుకోవడం ముదావహం.

## శతకత్రయము :

ఈ గ్రంథం 'శ్రీకదళీపుర (పెదకళ్ళేపల్లి) శ్రీ దుర్గానాగేశ్వరశతకం, శ్రీ మదనగోపాల శతకం, శ్రీ ప్రసన్నాంజనేయ శతకం అనే మూడు శతకాల సంపుటి.

పెదకళ్ళేపల్లిలో వెలసిన శ్రీ దుర్గానాగేశ్వరస్వామి స్వయంభూ లింగరూపుడు. ఇది కర్కోటక క్షేత్రంగానూ, విశిష్టక్షేత్రంగానూ, విశ్వామిత్ర క్షేత్రంగానూ ప్రసిద్ధిచెందింది. ఉత్తరంగా ప్రవహించే కృష్ణానదీతీరంలోని ఈ పుణ్యక్షేత్రం దక్షిణకాశీగా కూడా ఖ్యాతి గడించింది.

'నాగేశ్వరా !' అనే మకుటంతో ఉన్న ఈ శతకాన్ని రాజారావుగారు శార్దూల, మత్తేభ వృత్తాలలో రచించారు. ఇందులో శివుని లీలలను వర్ణించారు. "శైవారాధనచే లభించునని..." అనే పద్యంలో శివుని ఆరాధిస్తే ఫలితం బూడిద మాత్రమేనని విష్ణువును ఆరాధిస్తే ఐహికానంద మాధుర్యం కలుగుతుందని కవి వ్యాజస్తుతి చేశారు. ఇక్కడ కవి తాను కోరేది పారలౌకికానందమని సూచించారు. "జననంబుల్మరణంబులవ్వి...." పద్యంలో పునర్జన్మ రాహిత్యం కోసం శివుణ్ణి వేడుకున్నారు కవి.

పెదకళ్ళేపల్లిలోని శ్రీ దుర్గా నాగేశ్వరక్షేత్రమునకు శ్రీ మదన గోపాలస్వామి క్షేత్రపాలకుడు. శ్రీ మదన గోపాలశతకంలో "పరమాత్మా ! కదళీపురీ మదనగోపాలా ! జగన్మోహనా !" మకుటకం. ఇది సంపూర్ణ మకుటం. ఈ శతకం భాగవతకథా సారముతో ఒప్పి ఉన్నది. శతకం మొత్తం మత్తేభవృత్తంలోనే నడిచింది.

"పరమోచ్ఛ్రుంగల కృష్ణవేణి....." పద్యంలో కృష్ణానది మదన గోపాలుని కరుణాభావము చేతనే భూమికి వచ్చిన దివ్యనదిగా కవి భావించారు. "అరిగెన్వేటకు...." పద్యంలో శమంతకమణి ఘట్టంలోని శ్రీకృష్ణుని లీలలను వర్ణించారు.

శ్రీ ప్రసన్నాంజనేయ శతకం మకుటరహితం. ఇందులోని ఛందస్సు కందం. ఇందులో కవి హనుమంతుణ్ణి చాతుర్వేద విశారదునిగా, ఆర్తత్రాణ పరాయణునిగా కీర్తిస్తూ ఆంజనేయుని దివ్య కథాగానం చేశారు.

## సాహితీ సుమసౌరభాలు :

ఈ పొత్తంలో కవి తన జీవితంలో దర్శించిన స్థలాలనూ వ్యక్తులనూ నాయకులనూ క్షేత్రాలనూ ఆచారాలనూ ఆయా విశేషాలనూ పద్యరూపంలో వర్ణించారు. "తెలుగు కవిత్వమందసలు...." పద్యంలో విశ్వనాథవారి తేనెలూరు రసాల ధారల పలుకులను కీర్తించారు. తన అగ్రజుడు హంపీక్షేత్ర కావ్యకర్త అయిన సుబ్బారావుగారు "ఆంధ్ర సాహితిని విచ్చిన రేకుల పండువెన్నెల" అంటూ ప్రస్తుతించారు.

"కాశీపుర ప్రాశస్త్యం" ఖండికలో పారుపల్లివారు, పింగళివారు, ఘంటసాలవారు, వేటూరివారు మొదలైన మహామహులు ఒకనాడు ఈ పురంలో తారాడారని అంటూ తన గ్రామవైశిష్ట్యాన్ని చాటిచెప్పారు.

## సూక్తిపాటలు మరియు గేయకవితాగుచ్ఛం :

1934-37 సంవత్సరాల మధ్యకాలంలో అప్పుడప్పుడూ పత్రికలలో ప్రచురించిన గేయాలసంపుటే ఈ గ్రంథం. ఇందులో మొదటిభాగం సూరిపాటలు. ఈ భాగంలో 'సూరి' అనే కవి ముద్ర కనిపిస్తుంది. ఇవి జానపద గేయబాణీలో ఉంటాయి. రెండవభాగమైన 'గేయకవితాగుచ్ఛం'లోని 'గంధర్వగాయకుడు' అన్న ఖండికలో ఘంటసాల గానమాధుర్యాన్ని, ఆయనతో తనకు గల సాన్నిహిత్యాన్ని గురించి లయబద్ధగానాంజలి ఘటించారు కవి. అటు కవిత్వం లోనూ, ఇటు వ్యక్తిత్వంలోనూ సుబ్బారావుగారి వారసత్వాన్ని పుణికి పుచ్చుకున్న రాజారావుగారు 1997లో పరమపదించారు.

## ముగింపు :

ఈ విధంగా కొడాలి వంశంలో జన్మించిన ఈ ముగ్గురు కవులూ 'స్వతంత్రమార్గంలో రచనలు చేసినప్పటికీ భావకవిత్వమే వీరి కృతులలోని అంతస్సూత్రం. ఇట్లా ఆత్మాశ్రయరీతితో దేశభక్తిని పెంచే జాతి దేశభాషాభిమానాలనూ కలిగించే రచనలను అన్నింటినీ పరిశీలించి నప్పుడు మాత్రమే తెలుగు సాహిత్య చరిత్ర సమగ్రమౌతుంది.

*చిరునామా : డాక్టర్ కానుకొల్లు బాలకృష్ణ, తెలుగు విభాగాధిపతి, శ్రీ రాజారంగయ్యప్పారావు చుండూరు వెంకటరెడ్డి ప్రభుత్వ డిగ్రీకళాశాల, విజయవాడ.*

శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు

# సంగీత 'ప్రసార భారతి'

ఈ శతాబ్దపు తొలి దశాబ్దాలలో దక్షిణ భాషా ప్రాంతాల సమైక్య సాంస్కృతిక కేంద్రమయిన మద్రాసుకు వెళ్ళి కచ్చేరీలు చేసి మెప్పు పొందిన గాయకులకే దేశం అంతటా గౌరవం లభించేది. ఆంధ్ర ప్రదేశం విజయనగరం, బొబ్బిలీ, పిఠాపురం వంటి జమీందారీలు ఆస్థాన సంగీత విద్వాంసులను పోషించీ, వారి కచ్చేరీలు ఏర్పాటు చేసీ, సన్మానించడం జరుగుతూండేది. ఈ బాధ్యతలను తరువాత జిల్లాలోని సాంస్కృతిక కేంద్రాలలోని రసికులైన సంగీత సభల నిర్వాహకులు తమ చేతులలోకి తీసుకున్నారు. ఆయా జిల్లా కేంద్రాలలో సంగీత సభలు ఏర్పాటు అవుతూ వుండేవి. అటువంటి సభా నిర్వాహకులలో కాకినాడ సరస్వతీ గానసభ 1960లో స్వర్ణ ఉత్సవం జరుపుకొంది.

భారతదేశానికి స్వాతంత్ర్యం లభించిన సంవత్సరం 1947 (ఆగస్టు 15) అది జరిగి ఈ నాటికి సుమారు యాభై, అరవైయేళ్ళకు పైబడింది. కడిచిన పదేళ్ళలో మన శాస్త్రీయ సంగీతాన్ని ప్రజలకు సన్నిహితం చేయడానికి ప్రభుత్వం ఆకాశవాణి, దూరదర్శన్ విభాగాలను రెండింటినీ సమైక్యంచేసి, 'ప్రసారభారతి' సంస్థగా రూపొందించి రాజధానియైన ఢిల్లీలోను, వివిధ రాష్ట్రాలలోని ప్రధాన కేంద్రాలలోను సంస్థకి విస్తృత వ్యాప్తి కలుగజేస్తూ, క్రియాత్మకంగా పనులు జరిపించే ఏర్పాట్లు ఎక్కువగా జరిగాయి.

రాష్ట్ర రాజధాని ప్రధాన కేంద్రం అయిన హైదరాబాదూ, విజయవాడా, విశాఖపట్టణాల ద్వారా ఎఫ్.ఎం కేంద్రాలు నెలకొల్పి ప్రసారాలు కానిస్తున్నారు. వీటిని రెయిన్‌బో కేంద్రాలూ, లేక ఇంద్ర ధనుష్ కేంద్రాలుగా పేర్కొన్నారు.

ఆదిలాబాద్ కేంద్ర ఎ.ఎం. ప్రసారమూ, కొత్తగూడెంలో ఎఫ్.ఎం ప్రసారం, అనంతపూర్, కర్నూల్, తిరుపతి, వరంగల్, నిజామాబాద్, మార్కాపురం కేంద్రాలలో సి.ఎం. ప్రసారాలూ వెలువడుతున్నాయి.

ఢిల్లీ, హైదరాబాదులో ఆర్చైవ్స్ తయారుచేసి, సరఫరా చెయ్యడానికి ఢిల్లీలోని ట్రాన్స్క్రిప్షన్ అండ్ ప్రోగ్రాం ఎక్స్చేంజ్ సర్వీస్ ద్వారా ఢిల్లీలో 60 ఆల్బమ్‌లూ, రికార్డింగ్‌లూ విడుదల చేసి, కావలసిన శ్రోతలకు సరసమైన ధరలకు అందుబాటు అయ్యే ఏర్పాటు జరిగాయి.

శ్రోతలకు కుతూహలమూ, కోరికా పుట్టించే సీడీలు– బేగం అఖ్తర్, మల్లికార్జున్ మన్సూర్, బిస్మిల్లాఖాన్ (షహ్నాయి), హరిప్రసాద్ చౌరాసియా(వేణువూ), సూఫియానా కలాం (కవ్వాలీ), కర్ణాటక సంగీత పంచరత్నకృతులూ, మణి కృష్ణస్వామి, ముసిరి సుబ్రహ్మణ్య అయ్యర్, ఎం.డి.రామనాథన్, ఎం.ఎస్.సుబ్బలక్ష్మి, వోలేటి వెంకటేశ్వర్లు శాస్త్రీయ కచేరీ సంగీతమూ, ద్వారం వారి వయొలిన్, మైసూర్ టి. చౌడయ్య, ఎం.ఎల్. వసంతకుమారీ, అరియకుడి రామానుజయ్యం గార్ తెలుగు, కన్నడ, తమిళ మళయాళ భాషలలో లలిత సంగీతము సి.డిలూ, ఎస్.జానకి పాటలూ, జేసుదాసు పాటలూ, స్వాతి తిరునాళ్ రచనలూ, కాళింగరావు అనే కన్నడ లలిత సంగీత కళాకారుని సి.డి.లూ, పురందర దాసు కృతులూ, మదురై మణి అయ్యర్ శాస్త్రీయ సంగీత కచ్చేరీ సి.డి.లూ, పాల్ఘాట్ కె.వి. నారాయణస్వామి, వోలేటి వెంకటేశ్వర్లూ, నేదునూరి, శ్రీపాద పినాకపాణిగార్ల సిడీలూ, రజని లలితగేయాలూ, అన్నమాచార్యులు కీర్తనల ఆల్బమ్ సి.డిలూ వీటన్నిటినీ ప్రసారభారతి హైదరాబాదు ఆర్చైవ్స్ కేంద్రం ద్వారా విడుదల చేశారు.

ఈ శతాబ్దపు తొలి దశాబ్దాలలో దక్షిణ భాషా ప్రాంతాల సమైక్య సాంస్కృతిక కేంద్రమయిన మద్రాసుకు వెళ్ళి కచ్చేరీలు చేసి మెప్పు పొందిన గాయకులకే దేశం అంతటా గౌరవం లభించేది.

ఈ బాధ్యతలను తరువాత తరువాత జిల్లాలోని సాంస్కృతిక కేంద్రాలలోని రసికులైన సంగీత సభల నిర్వాహకులు తమ చేతులలోకి తీసుకున్నారు.

ఆయా జిల్లా కేంద్రాలలో సంగీత సభలు ఏర్పాటు అవుతూ వుండేవి. అటువంటి సభా నిర్వాహకులలో కాకినాడ సరస్వతీ గానసభ 1960లో స్వర్ణ ఉత్సవం జరుపుకొంది.

పురందరదాసుకంటే ఏభై ఏళ్ళు ముందువాడయిన తాళ్లపాక అన్నమాచార్యుల సంకీర్తలను 1940లో తిరుపతి దేవస్థానం సంకీర్తన

భాండాగారంలో వేటూరి ప్రభాకర శాస్త్రిగారి శిష్యులు కనుగొన్నారు. వీటిలో అన్నమాచార్యులవీ, ఆయన కుమారుడై పెదతిరుమలా చార్యులవీ, అల్లుడయిన రేవణూరి వారి రచనలూ, మనుమడైన తిరువెంగళనాధుడూ మొదలగువారి రచనలను కనుగొన్నారు.

మద్రాసుకాక, అదనంగా విజయవాడ రేడియో కేంద్రం-1948లో పూర్తిగా తెలుగు భాషా ప్రసారాలకై ఏర్పడింది. 1953లో ఆంధ్ర రాష్ట్రమూ, 1956లో ఆంధ్రప్రదేశ్‌కు రాజధానిగా హైదరాబాద్‌లో రేడియో కేంద్రమూ ఏర్పడ్డాయి. ఆ వెంటనే, కడప, విశాఖపట్టణం రేడియో కేంద్రాలు నెలకొన్నాయి.

ప్రతి సంపూర్ణ స్వతంత్ర రేడియో కేంద్రమూ వారం వారమూ ఒక సంగీత కచేరీ, వారం వారమూ ఒకసారి ఒక ప్రాంతీయ కళాకారుణ్ణి, మిగిలిన దక్షిణాత్య కేంద్రాలన్నింటికీ వినిపించే సంగీత సభా, అన్ని రాష్ట్రాలకీ వినిపించే కచేరీలు ఏర్పాటు చేయడం ద్వారా దేశంలో శాస్త్రీయ సంగీతం ప్రసారం అయ్యే సౌకర్యాలకు అభివృద్ధి కలిగింది.

విద్యార్థులకూ విద్యార్థినులకూ సంగీత నృత్యాలను నేర్పే పాఠశాలలూ కళాశాలలూ ఎక్కువయ్యాయి. విజయనగరం, బొబ్బిలి, పిఠాపురం, కాకినాడ, రాజమండ్రి, మచిలీపట్నం, విజయవాడ వంటి పట్టణాలలో సమర్థులైన విద్వాంసులు గురువులుగా కొనసాగే గురుకుల కేంద్రాలు ఏర్పడ్డాయి. ఈ కేంద్రాలనుంచి అయిదారేళ్లకు గాయక విద్వాంసులు నేర్పరులుగా సుశిక్షితులుగా వెలువడుతూండేవారు. విశ్వవిద్యాలయాలలో కళాశాలల్లో పట్ట పరీక్షలకూ, సంగీతం ముఖ్యవిషయంగా స్వీకరించిన విద్వాంసులు తయారవుతూ వచ్చారు.

రాష్ట్రంలోని జిల్లా కేంద్రాలలోను మారుమూల గ్రామాలలోను త్యాగరాజ గానసభలు ఏర్పాటుచేసి, ప్రతిఏటా, గణపతి నవరాత్రులూ దసరా నవరాత్రులూ శ్రీ రామనవమి సప్తాహాలు జరిపించి, మదరాసు, బెంగుళూరు, తిరువేంద్రం వంటి దక్షిణాది కేంద్రాల నుంచి గాయక విద్వాంసులను ఆహ్వానించి, సంగీత సభలు ఏర్పాటుచేసి, వారిచేత కచేరీలు జరిపించేవారు.

అటువంటి విద్వాంసులలో ప్రసిద్ధుడు, డాక్టర్ శ్రీపాద పినాకపాణి. సంగీతంలో తనకు తానే ఒక సంస్థ అనదగిన గౌరవాదారాలకు పాత్రుడయిన విద్వత్శిరోమణి. ఘనులైన మన విద్వాంసులకు నలుగురైదు గురికి స్వయం గురువూ!

దక్షిణాది- అంటే మద్రాసులో పేరుకెక్కిన నల్గురైదుగురు విద్వాంసుల- బాణీలను ఆ విద్వాంసుల కంటె ఆదర్శప్రాయముగా తన బాణీగా మద్రాసులోని విద్వాంసులే విని, మెచ్చుకొనేలాగ పాడగల విద్వత్నాయకమౌళి పినాకపాణిగారు. కీర్తిశేషులు వోలేటి, శ్రీరంగం గోపాలరత్నం గార్లకు, మిగిలిన సజీవ గాయకులలో నేదునూరి, నూకల వంటి మన ప్రథమ శ్రేణికి చెందిన గాయక విద్వాంసులకు ఆ శ్రేణికి వారు చెందేటట్లు చేయగలిగిన శిక్షణాదక్షుడు పాణీగారు.

రాగం,కృతీ, నెరవలూ స్వరమూ పాడడంలో రాగ రూప ప్రదర్శనలో ఇతరులకు ఎవ్వరికీ దొరకని సంకేతాలనూ ప్రదర్శించగల సామర్థ్యం ఆయన గాత్రధర్మంలో నిభృతమై ఉంది. పాణీగారి బాణీకికర్ణాటక శైలీ స్వచ్ఛతను పాటించే అనుంగు శిష్యుడు నేదునూరి కృష్ణమూర్తిది పుష్టికరమైన పురుషగాత్రం! అభిమాన శ్రోతలకు ఆదర్శపాత్రుడైన నేదునూరి-సభా సంప్రదాయాలను ఎరిగిన సమర్థ విద్వాంసులలో అత్యంత విజయశీలి! కడచిన 20, 30 ఏళ్ళలో అతడు విజయనగరం, సికింద్రాబాదు, తిరుపతి, విజయవాడ సంగీత కళాశాలల ప్రిన్సిపాల్‌గా ఆంధ్ర విశ్వవిద్యాలయపు గౌరవ ఆచార్యుడుగా పనిచేసి రిటైర్ అయిన ఘనాపాఠి!

కీర్తిశేషుడయిన వోలేటి వెంకటేశ్వర్లు ప్రపంచంలోని ఏ దేశపు సంగీతమైనా రాగమైనా ఒక్కసారి వింటే చాలు. ఆ రాగాల స్వర స్థానాలను పట్టుకొని, ఆ రాగాల బాణీని సొంత బాణీయా అనిపించేలాగ పాడగలిగేవాడు. అలా పాడగలగడం చాలా అరుదూ అపురూపమూ! బడేగులాం అలీఖాన్, గజల్సు పాడే గులాం అలీ, నజాకత్ అలీ, సలామత్ అలీ వంటి వివిధ దేశాల ప్రప్రథమ శ్రేణి గాయకులు ఎటువంటి శైలిలో పాడినా ఆ బాణీని, సొంతంగా చేసుకొని పాడగలిగేవాడు. ఏ దేశపు ఉత్తమ గాయకులయినా ఏ క్లిష్టమైన శైలిలో పాడినా, ఆ పద్ధతులన్నిటినీ సొంతం చేసుకుని స్వంత శైలి ఏర్పరచుకున్నాడాయన. మహామహోపాధ్యాయ నూకల చినసత్యనారాయణ - ద్వారం, మంగళంపల్లి పట్టాభిరామయ్య వంటి గురువుల ప్రభావంతో తన వ్యక్తిత్వం విశిష్టంగా కనబడేలా పాడగల చతురుడు! మహామహోపాధ్యాయుడని ఊరికే అన్నారా? కచ్చేరీ గాయకుడికి కావలసిన శ్రోతలను ఆకర్షించే విన్యాసాలకు అవసరమైన గాత్ర సంపదా అన్నీ సిద్ధించిన కొద్దిమందిలో ఒకడు. గతించిన 30 ఏళ్లలో, సికిందరాబాద్, విజయవాడ, హైదరాబాద్ సంగీత కళాశాలల ప్రిన్సిపాల్‌గా సేవ చేసి,1994లో తిరుపతి సంగీత కళాశాలలో తెలుగు విశ్వవిద్యాలయం హైదరాబాద్‌లో ఆచార్య పదవీ నిర్వహించారు.

నాగస్వర విద్వాంసుడయిన కీర్తిశేషులు షైడిస్వామి శిష్యుడుగా రాటుదేలిన కీ.శే. ఎమ్.ఎస్. బాలసుబ్రహ్మణ్య శర్మ రాజమండ్రిలోను, ఆ తర్వాత తిరుపతిలోను గంభీరమూ గౌడమూ అనిపించుకున్న ద్రుత కాలపు బిరకాలను తన గాత్రంలో అప్రయత్న సౌలభ్యంతో పలికించ గలిగేవాడు.

బాలప్రాయంలోనే ప్రథమశ్రేణి గాయక విద్వాంసుడిగా సంగీత సభా ప్రఖ్యాతీ, పండిత ప్రశస్తీ పెద్దల ముద్దూ సంపాదించి, అపురూప

గాన యోగిగా విఖ్యాతి పొంది, మధ్య వయస్సు దాటుతూంటే సర్వకళా సంపూర్ణత్వమూ సాంప్రదాయిక జ్ఞానంలో విద్వత్కళా ప్రదర్శనలో అధ్యాపకత్వంలో వాగ్గేయకారత్వంలో కొరలేవీ లేని గురుపీఠంగా నిలదొక్కుకున్నవాడు మంగళంపల్లి బాల మురళీకృష్ణ. వేర్వేరు ఆకాశవాణి నిలయాలలో సంగీత ప్రయోక్తగా పనిచేసి, లలిత శాస్త్రీయ రేడియో నాటక సంగీతాలను పెంచి, పోషించి,విజయవాడలో సంగీత కళాశాలకు ప్రిన్సిపాల్‌గా పదవి నిర్వహించి, తరువాత మదరాసులో తన పేరనే మురళీరవళి అని వెలయించిన సంస్థకు నిర్వాహకుడయి, నాద మాధురీ సమ్మోహకుడుగా, సభారంజక కళారహస్యాలను ఎరుకగలిగి ప్రయోగించగలిగిన వేత్తగా ఒకనాడు సమ్యక్ సంప్రదాయజ్ఞుడుగాను, మరోనాడు సొంత వాగ్గేయ రచనలను స్వయంగా కనుక్కొని పెంపు వహింపజేసిన నూతన రాగాలతో దేశీయ శ్రోతలను దాదాపు నాలుగు స్థాయిలను అశ్రమంగా ఆడుతూ పాడుతూ పలికించ గల సంగీత కళానిధిగా గౌరవ బిరుదం సంపాదించి మద్రాసు మ్యూజిక్ అకాడమీకి అధ్యక్షత 80ల లోనే నిర్వహించగలిగిన మేధాశాలి బాల మురళీకృష్ణ!

ఆకాశవాణి సంగీత నాటకాలలోను, కూచిపూడి యక్షగానాలలోను ప్రఖ్యాతి పొందిన గానవాల్లభ్యంతో విజయవాడ ఆకాశవాణిలోను, తదుపరి కుమారి శ్రీరంగం గోపాలరత్నంసికింద్రాబాదు, హైదరాబాదు ప్రభుత్వ సంగీత కళాశాల ప్రిన్సిపాల్‌గా పదవీ నిర్వహణ చేసి, పేరు ప్రఖ్యాతులు పొంది, అకాల మరణం పాలయినా, శక్తిమంతమైన ఘంటలాగా నినదించే కంఠారావంతో ప్రదర్శన చాతురీ క్రియాత్మకతా సాహసికతా విశదమయే గాన చాతుర్యం గోపాలరత్నానిది! ఆమె అకాల మృతి తీర్చలేని లోటు సంగీత పిపాసువులకు!

లలిత హరిప్రియలూ, జోగులాంబా, శిష్టా వసుంధరా, అరుంధతీ సర్కార్, ఇందిరా కామేశ్వరావు తమ తమ సంగీత సభలలో నానాటికీ పేరుకెక్కుతున్నారు. రేవతీ రత్నస్వామి తన తండ్రి చిత్తూరి పేరు మరింతనిలబెడుతుంది. జయలక్ష్మీ సంతానం,మణికృష్ణస్వామి, టి.టి. సీత, వింజమూరి లక్ష్మి శ్రోత్ర హృదయాలలో స్థిరముద్ర వేసుకుంటున్నారు.

తమ లలిత ప్రదర్శనా చాతుర్యాలవల్ల పాకాల సావిత్రి, వి.బి.కనకదుర్గ, వేదవతీ ప్రభాకరరావు, జొన్నలగడ్డ శారద, కోవెల శాంత తమ సీనియారిటీని నిలబెట్టుకుంటున్నారు. కచ్చేరీలను, సంగీత నాటకాలను చక్కగా నిర్వహించుకుంటూ పేరు చేసుకుంటున్న శిష్టా శారద అకాల మరణం విజయవాడ శ్రోతలకు తీర్చలేని లోటు.

మన సంగీత వాద్యాలన్నింటిలోను తనకు విశిష్ట స్థానం సంపాదించుకున్నది వీణ! వీణను మీటుతున్నవైనం పైకి గల పూజ్యభావమిది. ఆయా వర్ణనల్లో భారత రామాయణాది కథాంశాలను వ్యక్తం చేస్తాడు కవి. కథల విషయానికి వస్తే, ఈ కావ్యంలో నరసింహస్వామి, పొదిలెమ్మ, నిర్మామేశ్వరుడు పొదిలెలో వెలసిన కథలు ప్రధానంగా చెప్పబడినాయి ఇవి, భారతదేశంలో బహుళ వ్యాప్తిలో ఉన్న వైష్ణవం, శాక్తేయం, శైవం అను మతాలను తెలియపరుస్తున్నాయి. తన పుట్టిన ఊరును వర్ణిస్తూ భారతీయ సంస్కృతిని కవి వ్యక్తం చేసిన తీరు ఈ కావ్యంలో కన్పిస్తుంది.

కావ్యారంభంలో కవి ఇట్లా చెప్పినాడు-'నీ పొదిలె నీకు గొప్పయితే, మా పుట్టిన ఊళ్లు మాకు గొప్ప కదా. ఈ నీ కావ్యరచనల వల్ల 'విశ్వ శుభాలేం కలుగుతాయి' అని ఎవరైనా ప్రశ్నిస్తారేమో అని చెప్పి, కవి ఇట్లా సమాధానం చెప్పుతాడు. ఈ జన్మ భూమి కావ్యాన్ని చదువుతున్నప్పుడు మీ పుట్టిన ఊళ్లు మీ మనసుల్లో మెదిలితే చాలు ఈ కావ్య ప్రయోజనం నెరవేరినట్లే. ఒక ఊరును గురించి చెప్తే, దేశంలోని అన్ని ఊళ్లను గురించి చెప్పినట్లే. ఒక చెట్టుమీది ఒక పండు రుచి ఆ చెట్టుమీది మిగిలిన పండ్ల రుచి ఒకేరకంగానే ఉంటుంది. చెట్టు భారతదేశం. చెట్టుమీద పండ్లు దేశంలోని గ్రామాలు. పండ్ల రుచి భారతీయ సంస్కృతి.

"సర్వ భారతీయ సంస్కృతిక ప్ర
తీకలే పవిత్ర దేశమ్ములోని గ్రా
మమ్ములెల్ల నొక్క మ్రానిపండ్లు"

భారతీయ సంస్కృతిని వర్ణించిన కావ్యం నాయని జన్మభూమి.
(2010 ఆంధ్రభూమి స్వర్ణోత్సవ సంచిక సౌజన్యం)

డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు

# కృష్ణవేణి తీరం - సంగీత ప్రాశస్త్యం

గౌతమీనది జలధారకవనమొసగు
కలిమితోనిచ్చు కావేరి గాన విద్య
కృష్ణవేణమ్మ రెండింటికేల గూర్చి
ఉభయధారల పోషించు అభయదాయి

\- నా 'స్నేహగీతలు'

ప్రవాహతరంగ పరిశోభితమైన కృష్ణవేణి ద్రోణి-శృంగ సమాశ్రిత చలనంలో నాదపూర్ణస్వరూపిణిగా శోభిల్లింది. ఫలితంగా కృష్ణాతీరం నాదస్వరూపమైన సంగీతానికి, నాదరూప శాశ్వతస్థితికారిణి అయిన సాహిత్యానికి ఆటపట్టై అమృతాన్ని వర్షించి ప్రపంచానికి ఆనంద దాయిని అయింది. త్రిమూర్త్యాత్మకమైన జలస్వరూపం, నాదస్వరూపం ఏకాత్మకమైనాయి.

"నాదోపాసయాదేవా బ్రహ్మవిష్ణుమహేశ్వరః"

ఆంధ్రదేశాన్ని అన్నపూర్ణగా చేసిన గోదావరి కృష్ణవేణి నదులు సహ్యాద్రి పర్వత సానువుల్లో జన్మించి ప్రపంచాన్ని పునీతం చేశాయి.

"గోదావరీ భీమరథీ కృష్ణవేణ్యాదికాస్తథా
సహ్యాపాదోద్భవానద్యఃస్మృతాఃపాపభయావహః ॥"

అని విష్ణుపురాణం చెబుతుంది. అలాగే

"కృష్ణావిష్ణుతన్ స్సాక్షాద్వేణీదేవోమహేశ్వరః
తయోః సంగమో యత్రకోటితీర్థసమస్మృతః"

అనే ప్రమాణాన్ననుసరించి శ్రీమన్నారాయణుని శరీరం నుంచి 'కృష్ణ' సదాశివుని శరీరం నుంచి 'వేణి' నదులుద్భవించి హరిహర నాధరూపం తో కృష్ణవేణి ప్రవహిస్తుందనీ, ఈ నది జన్మస్థలం కోటితీర్థ సమానమని తెలుస్తుంది.

సహ్యాద్రి ఉత్తర శృంగానికి బ్రహ్మనగమనే పేరుంది. అక్కడ బ్రహ్మ తపస్సు చేసి విష్ణు సాక్షాత్కారం పొంది 'కృష్ణ' నదిని వరంగా పొందినట్లు ప్రాంతీయగాథ. అలాగే బ్రహ్మశిఖరానికి చేరువలో మరో ఎత్తైన శిఖరానికి వేదనగమని పేరు. అక్కడే శివాంశతో వేణినది ఉద్భవించింది. ఇవి రెండూ మహారాష్ట్రలోని 'సతారా' పట్టణానికి సమీపంలో కలసి 'కృష్ణవేణి'గా మారి, ప్రవహించిన ప్రాంతాన్నంతా పునీతం చేస్తూ, దివిసీమలో హంసలదీవి వద్ద సాగరంతో సంగమించింది.

వ్యాసుడు మహాభారతంలో కృష్ణానదిని
"సదానిరామయాం కృష్ణాం మందగాం మందగామినీం"

అని ప్రస్తుతించాడు. కృష్ణానది జలాలకు స్వచ్ఛత్వం, రుచిత్వం, దీపనత్వం (ఉద్దీపన (లేదా) ప్రేరణ) పాచనత్వం (పక్వత, జీర్ణత) అనే లక్షణాలున్నట్లు బుధులు చెప్పారు. ఈ గుణాలతోపాటు అమేయ నాద సౌందర్యాన్ని ప్రపంచానికి పంచగల ప్రవిస్తర లేదా ప్రసారిత శక్తి కృష్ణానదీ తరంగధారల్లో దాగి ఉందనుట సత్యం. శాస్త్రీయంగా చూసినా భౌతిక ధ్వని ప్రయోగాలు నీటిలోని ద్రోణి, శృంగాల ద్వారా తరంగ దైర్ఘ్యాన్ని నిరూపిస్తారు కదా !

కృష్ణానది మహారాష్ట్రలో సతారాజిల్లాలో విస్తరించిన సహ్యాద్రి పర్వతాల్లోని మహబలేశ్వరం వద్ద జన్మించింది. 1836 మీటర్ల ఎత్తు నుంచి దూకుతున్న వీచికల్లో ఎన్ని జలతరంగాలు ఏఏ ప్రాకృతిక శ్రుతుల్లో మారుమోగుచున్నాయో గాని కృష్ణాతీరంలో అనంతమైన నాద సౌందర్యం నవనవోన్మేషమై వెల్లివిరిసింది. రాతి శిఖలమీద తుళ్ళితుళ్ళి దొర్లిపడుతున్న పయోఊర్మికల చలనంలో ఏఏ లయలు ఉప్పొంగి ఢమరుకధ్వనుల్లో కలసి మోగాయోగాని కృష్ణాతీరంలో అమరలోకాన్ని తలదన్నే నాట్య సంగీతం వివిధ లయాన్వితమై వికసించింది. ప్రపంచంలోని అన్ని ప్రాంతాలకంటే మిన్న అనిపించు కోవడమేగాక అన్నిరకాల సంగీతాలకూ ఆధారప్రాయమైనదని పించుకున్న భారతీయశాస్త్రీయసంగీతం కృష్ణాతీరంలో మూడు పువ్వు లారుకాయలుగా వెలుగుచూసింది. గోముఖంనుంచి ప్రవహించడంలో

ఈ మహాప్రవాహం ఒదిగి ఒదిగి ఏ 'నడలు' పోయిందో గాని తాళ వాద్య సంగీతం కూడా తన్మయదీప్తితో వృద్ధిచెందింది.

సాధ్యమైనంతవరకూ కృష్ణానదీ తీరంలో ప్రవేశించిన సంగీత ప్రాశస్త్యాన్ని ఈ వ్యాసంలో వివరిస్తాను. అయితే పాఠకులు ఇక్కడొక సంగతి గుర్తుంచుకోవాలి. ఆధునిక కాలంలో అనేకమైన శాస్త్రీయ సంగీత పరికరాలు సంగీతాన్ని నిక్షిప్తంచేసి అనంతర తరాలకు పంచుతున్నాయి గాని పోయిన యుగాల్లో ఆ వసతి లేదు. సంగీతానికి పూర్వాపరాలు నిశ్శబ్దం ఒక ప్రదర్శన ప్రారంభానికి ముందు, ప్రదర్శన పూర్తయిన తరువాత పాఠకుడి దగ్గర ఏమీ ఉండదు. కనుక సంగీతానికి చెందిన చాలా విషయాలు చరిత్రకి దొరకడంలేదు. అనుభవం నుంచి అందినంతలో సమగ్రంగానే చెప్పడానికి ప్రయత్నిస్తాను. సహృదయులు ఆదరణతో స్వీకరించి ఆశీర్వదింతురుగాక !

మహారాష్ట్రలోని సతారా, సాంగ్లి జిల్లాలనుంచి కృష్ణానది ప్రవహిస్తున్న కూతవేటు దూరంలో కొల్హాపూర్ జిల్లా కూడా రెండు ప్రాంతాలను స్పృశిస్తూ సమాంతరంగా సాగుతుంది. ఈ మూడు జిల్లాల్లో దేశానికే తలమానికమనదగిన గొప్ప హిందుస్తానీ సంగీత క్షేత్రాలున్నాయి. మనదేశంలోని ఉత్తర రాష్ట్రాలన్నిటా హిందుస్తానీ సంగీతం, దక్షిణాది రాష్ట్రాలు నాలుగింట కర్నాటక సంగీతం ప్రాచుర్యంలో ఉంది. మొదట భారతదేశమంతటా ఒకే సంగీతం ఉండేది. క్రీ.శ. 1300 ప్రాంతంలో ఢిల్లీ సింహాసనాన్ని అధిష్టించిన అల్లా-ఉద్-దీన్ ఖిల్జీ ఆస్థానంలో ఖురాన్ చదవడం కోసం నియోగించ బడిన అమీర్‌ఖుస్రూ (అబ్దుల్ హసన్ యమిన్ ఉద్-దీన్ ఖుస్రూ) అనే పారశీకుడు సంగీతంలో అసాధారణ మేధావి. భారతీయ సంగీతానికి పారశీక సంగీతాన్ని మేళవించి హిందుస్తానీ సంగీత రూపాన్ని తెచ్చిన గొప్ప ప్రజ్ఞావంతుడు. ఖుస్రూ కొన్ని హిందుస్తానీ వాద్యాలను కూడా రూపకల్పన చేశాడు. దేశంలో అంతగా ప్రచారంలో లేని "త్రితంత్రి" వాద్యాన్ని మార్చి 'సితార్'గా రూపకల్పన చేశాడు. 'ఫకావాజ్' అనే శుద్ధ మద్దళాన్ని విభజించి 'తబ్లా'గా రూపొందించాడు. సారంగి, సరోద్ వాద్యాలకొక స్థిరమైన రూపాన్ని కల్పించాడు. ఇపుడా సంగీతం ఉత్తరాది అన్ని రాష్ట్రాలలోను విశేష ప్రాచుర్యం పొందింది. అంతకుముందున్న అసలు భారతీయ సంగీతం కేవలం దక్షిణాది నాలుగు రాష్ట్రాలకే కర్నాటక సంగీతం పేరుతో పరిమితమైపోయింది. అయితే ఇక్కడ చిత్రమేమిటంటే కర్నాటక రాష్ట్రంలో కృష్ణానదీ పరీవాహ ప్రాంతం మాత్రం హిందుస్తానీ సంగీతం వ్యాపించడం. ఈ వ్యాసంలో వివరాలు తెలియజేస్తాను.

కృష్ణ జన్మక్షేత్రమైన మహాబలేశ్వరంలో స్వామి శివానంద నిర్వహించిన, తరువాతకాలంలో ఆయన పేరుమీద నిర్వహిస్తున్న సంగీతోత్సవాలు ప్రపంచ ప్రసిద్ధి పొందాయి. స్వామి నిర్వహణలో 'అంధ్' గ్రామంలోను, ముంబాయి వంటి నగరాల్లో జరిగే 'స్వామి శివానంద సంగీత ప్రతిష్ఠాన్' సభలు కూడా ప్రపంచప్రసిద్ధి పొందాయి. ఈ సభల్లో పండిట్ విష్ణుదిగంబర్ ఫలూస్కర్, బాబా అల్లాఉద్దీన్ ఖాన్, ఉస్తాద్ అబ్దుల్ కరీంఖాన్, బడే గులాం ఆలీఖాన్ వంటి ఎందరో సంగీత దిగ్గంతులు పాల్గొని గోముఖ ధారల్లో తడిసి తరించారు. ఉస్తాద్ కరీం ఖాన్ ఢిల్లీ రేడియోలో మాట్లాడుతూ "శివానం ప్రతిష్టాన్ సభలు గొప్ప ఆనందానుభూతి కలిగిస్తాయి. మహాబలేశ్వరంలో ఒక రాగం పాడితే చాలు ఆ రాగం కృష్ణాతరంగాల్లో లీనమై సాగరాన్ని చేరి ప్రపంచమంతా వ్యాపిస్తుంది" అన్నారు. శివానందప్రతిష్టలో గానం చెయ్యడం కృష్ణాబాయి దేవాలయాన్ని దర్శించుకోవడం ఆనాటి కళాకారులు గొప్ప అదృష్టంగా భావించేవారు. నేటికీ ఈ సభలు జరుగుతూనే ఉన్నాయి. ఈనాటి అంతర్జాతీయ కళాకారులు పాల్గొంటూనే ఉన్నారు.

ఈ జిల్లాలోనే మహాబలేశ్వరానికి దగ్గరలో వాయ్ (Wai) నగరమున్నది. ఈ నగరం మధ్యగా కృష్ణవేణి ప్రవహిస్తుంది. ఈ నగరంలో వందల దేవాలయాలున్నాయి. దాదాపు అన్నీ నదీతీరంలోనే ఉన్నాయి. ఇది పురాతనకాలంలో పాండవులు అజ్ఞాతవాసం చేసిన విరాటనగరం. ఆ కాలంలోనే ఈ నగరం గొప్ప సంగీతనాట్యకళా నెలవు. అర్జునుడు బృహన్నల అనే నాట్యాచార్యుని రూపంలో విరాట రాకుమారికి నాట్యం నేర్పిచడమే కాక, ఆయన నాట్యశాస్త్రం రాసినట్లు భరతుడు చెప్పాడు. ఈ వాయ్ నగరంలోని ప్రముఖ దేవాలయాలు ఎందరో కళాకారుల్ని పోషించినట్లు తెలుస్తుంది. ప్రఖ్యాత తబ్లా విద్వాంసుడు అహమ్మద్ జాన్ తిరఖ్వా పూనా రేడియోకిచ్చిన ఇంటర్వ్యూలో "వాయ్ నగర దేవాలయం ఇచ్చిన బత్యం కొంతకాలం నాకు ఆధారంగా ఉంది" అని చెప్పాడు. ఇక్కడ మాఘమాసంలో 5 రోజులపాటు కృష్ణవేణి ఉత్సవాలు జరుగుతాయి. సామాజిక వ్యత్యాసాలకు అతీతంగా జరిగే ఈ ఉత్సవాల్లో సంగీత ప్రవాహం ప్రత్యేకమైన ఆకర్షణ. దేశంలోని ఎందరో ప్రముఖ విద్వాంసులు ఈ ఉత్సవాల్లో పాల్గొంటున్నారు.

సతారా జిల్లాలోని కోయ్‌నగర్, రహమత్‌పూర్, ఫత్‌తాన్ నగరాల్లో కూడా సంగీత పోషణకి ఎంతో దోహదపడ్డాయి. అందులోని ఫల్‌తాన్ నగర జాబాలేశ్వర దేవాలయంలో పండిట్ కేశవ్ బువా ఇంగ్లే, ఆయన శిష్యులు బిక్కిబువా, గండుబువా అనే 'అవుద్' ఘరానాకి చెందిన విద్వాంసులు ఆస్థాన విద్వాంసులు. కేశవ్‌బువా వి.డి. పలూస్కర్ శిష్యుడు. కృష్ణాతీరంలోని 'పంచగాని' నగరం రాజదర్బారులో పండిట్

భావనరావు బాలాసాహెబ్ అనే అవుద్ ఘరానా కళాకారుడున్నట్లు తెలుస్తుంది. వివరాలంతగా దొరకలేదు.

సతారా, సాంగ్లి జిల్లాలను సంధానపరుస్తూ రెండింటికీ వెన్నెముకలా సాగే జిల్లా కొల్హాపూర్. ఈ నగరాన్ని కరవీరపురమని, ఈ ప్రాంతాన్ని కరవీరదేశమని పూర్వం పిలిచేవారు. తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఇతిహాసంలో ఈ నగరం ప్రాధాన్యత సంతరించుకుంది. భృగు మహర్షి వైకుంఠవాసుని లక్ష్మీనివాసమైన హృదయస్థానాన్ని తన్నిన కారణంగా అవమాన పీడిత అయిన శ్రీమహాలక్ష్మి వైకుంఠం వదలి కరవీరపురం చేరి తపస్సు చేసుకుందన్నట్లు పురాణ గాథ. ఈ నగరంలోని మహాలక్ష్మి దేవాలయం దేశంలోనే గొప్పదిగా చెబుతారు.

కొల్హాపూర్‌లోని మరో విశేషం ఛత్రపతి శివాజీ వంశీకుడైన రాజరిక ఛత్రపతి శ్రీషాహుమహరాజ్. ఆయన అభినవభోజరాజు. ఆయన కాలంలో కొల్హాపూర్ కళాపూర్ (City of Fin Arts) గా పిలువబడింది. ముఖ్యంగా సంగీతం కృష్ణానదితో పోటీపడి ప్రవహించిందంటే అతిశయోక్తి కాదు.

సాహుమహారాజ్ ఆస్థానాన్ని గురించి చెప్పుకునే ముందు హిందూస్తానీ సంగీతంలోని వివిధ ఘరానా (సంప్రదాయం)లను రేఖామాత్ర పరిచయం చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. హిందూస్తానీ సంగీతంలో విద్వాంసుని పేరుని బట్టి గాక అతడు నివసించిన ఊరును సంప్రదాయానికి పేరుగా ధరించడం జరిగింది. అక్బర్ ఆస్థాన పండితుడైన తాన్‌సేన్‌తో ప్రారంభమైన గ్వాలియర్ ఘరానా అన్నిటా పురాతనమైంది. రాగాన్ని స్పష్టంగాను సరళంగాను పలికించడం, శ్రోతలకు అందుబాటులో రాగం, రచన కూడా సాగడం ఇందులోని విశేషం. లక్నోలో పుట్టి గ్వాలియర్ చేరిన ఉస్తాద్ నతన్‌పీర్ భక్ష్ అనే గాయకుడు, ఆయన మనమలు హద్దూఖాన్ హస్సూఖాన్‌లు ఈ శైలిని ఎక్కువ ప్రచారం చేశారు.

మరో ముఖ్యమైన సంప్రదాయం కిరానా ఘరానా హర్యానాలోని కురుక్షేత్ర సమీపంలోని 'కిరానా' అనే గ్రామానికి చెందిన నాయక్ ధోందూ, నాయక్ బన్నూ సోదరులు ఈ సంప్రదాయానికి ఆద్యులు. ఇదే గ్రామానికి చెందిన కాలేఖాన్ అనే విద్వాంసుని కుమారుడు ఉస్తాద్ అబ్దుల్ కరీంఖాన్ ఈ ఘరానాను విశ్వవ్యాప్తం చేసిన మహా విద్వాంసుడు. ఖయాల్, ఠుమ్రీలు పాడే పద్ధతిలో నైపుణ్యం పెంచారు. ఆనంద ఆహ్లాదభరితంగా తాదాత్మ్యం కలిగిస్తూ సాగే గాయన పద్ధతి ఈ కిరానాఘరానా దేశంలో చాలా భాగం ఈ ఘరానానే అనుసరిస్తున్నారు.

మరోపేరు పొందిన ఘరానా ఆగ్రాఘరానా. ఈ పద్ధతి దూకుడు గాను బలమైన గమకాలతోను, అనేక పోకడల లయలతోను అనుసరించడానికి క్లిష్టంగా ఉంటుంది. ధ్రుపద్ మాథుర్ పద్ధతిలోసాగే ఈ సంప్రదాయానికి ఘగ్గే ఖుదాబక్ష్ అనే గాయకుడు ఆద్యుడుగా చెప్పవచ్చు. ఉస్తాద్ ఫయాజ్‌ఖాన్ ఈ ఘరానాని విశ్వవ్యాప్తం చేసిన ఘనుడు.

రాజస్థాన్‌లోని జైపూర్ ఘరానా కూడా చాలా ముఖ్యమైన సంప్రదాయం. రాజస్థాన్ చరిత్రలో జైపూర్ కళలకు ప్రధాన పట్టణం. ఈ ఘరానా రూప శిల్పి ఉస్తాద్ అల్లాదియాఖాన్. సంక్లిష్టమైన 'తాన్'లు పాడడం, అపూర్వరాగాలు మిళితం చేసి పాడడం, ఆశ్చర్యపరిచే సంగతులతో 'ఖయాల్' గానంచేయడం ఈ సంప్రదాయంలో ప్రత్యేకతలు.

పశ్చిమ పంజాబ్ (పాకిస్తాన్)లోని లాహోర్ సమీపంలో 'కాసుర్' అనే చిన్నపట్టణంలో నివసించే విద్వాంసుడు ఆలీబక్ష్‌ఖాన్, అతని అన్న 'పాటియాలా'కి చెందిన కలీఖాన్ కలసి 'పాటియాలా ఘరానా' నేర్పరచారు. ఆలీభక్ష్ కుమారుడు మహావిద్వాంసుడు ఉస్తాద్ బడే గులాం ఆలీఖాన్ ఈ ఘనాకి గొప్ప కీర్తి తెచ్చాడు. పంజాబీ జానపద పోకడలతో మెరుపువేగంగా గానం చేయడం వీరి ప్రత్యేకత.

ఇంకా రాంపూర్ సహన్వాస్‌ఘరానా, బనారస్ ఘరానా, మేవతి ఘరాన, ఇండోర్ ఘరానా వంటి అనేక సంప్రదాయాలు వెలుగు చూశాయి.

ఇక అసలు విషయానికొస్తే ఈ సంప్రదాయాల్లోని ప్రధాన గాయకులందరూ సాహు మహారాజ్ ఆస్థానంలో అంతో యింతో ఆశ్రయాన్ని పొంది అనుభవించినవారే. కృష్ణాతీరం ఇన్ని సంప్రదాయాలకూ ఎంతో కొంత ఊపిరిపోసిందనే చెప్పవచ్చు.

సాహు మహారాజ్ యాదృచ్ఛికంగా సంగీతం విని పరవశుడై తన ఆస్థానానికి రావలసిందిగా ఆహ్వానించిన గాయకుడు ఉస్తాద్ అల్లాది యాఖాన్ ఈయన జైపూర్ ఘరానా సృష్టికర్త. సంగీతంలో మేరు సమానుడు. ఆనాటి ఏ కళారాధకులు అల్లాదియాఖాన్‌ను "Mount Everest of Hindustani Music" అని పిలిచేవారు. ఈయన స్వగ్రామం రాజస్థాన్‌లోని ఉన్వారా అనే గ్రామం. ఈయన పూర్వీకులు గాయకులే గాని వ్యవసాయం చేసి జీవించేవారు. రాజర్షి సాహు మహరాజ్ ఈయన్ని రప్పించి తన ఆస్థాన విద్వాంసుణ్ణి చేయడమే గాక కొల్లాపూర్ మహాలక్ష్మి అమ్మవారి దేవాలయంలో 'ఆరతి' సమయంలో సంప్రదాయ భజనలు గానం చేయదానికి కూడా నియమించాడు. ఆ మహారాజు మానవతా విలువలు, మత సామరస్యం ఎంతో పాటించిన గొప్ప ధీరుడు. అమ్మవారి దేవాలయంలో

అల్లాదియాఖాన్ గానం చేస్తుంటే అమ్మవారిని తాను కళ్ళతో చూస్తున్నట్లే భావలోకాల్లో మునిగిపోయేవారుట. ఆ రోజుల్లో 'వాయ్' నగరం, మహాబలేశ్వరం మొదలైన కృష్ణానదీపరీవాహక ప్రాంతాలన్నీ సాహు ఆధీనంలో ఉండేవి. అందుచేత అక్కడున్న అన్ని ముఖ్య ప్రదేశాల్లోనూ అల్లా దియాఖాన్ గానం మారుమ్రోగిందని చెప్పవచ్చు. అల్లా దియాఖాన్ చరిత్రలో కృష్ణవేణి స్పర్శకొక అధ్యాయం ఉన్నదంటే ఈ ప్రవాహం ఆయన గానానికి ఎంత ఆలంబన అయిందో ఊహించు కోవచ్చు.

అల్లాదియాఖాన్ ఉన్యారా వదలి తన సోదరుడు ఉస్తాద్ హైదర్ ఖాన్, కుమారులు నసీరుద్దీన్ ఖాన్ (బడ్‌జీఖాన్), బద్రొద్దీన్‌ఖాన్ (మంజీఖాన్) షంషుద్దీన్ ఖాన్ (బుర్జీ ఖాన్)లతో సహ కొల్హాపూర్ వచ్చేశాడు. నలభై సంవత్సరాల వయసుకు ముందే వచ్చిన ఖాన్ సాహెబ్ తొంభై ఏళ్ళు దాటిందాకా ఇక్కడే ఉన్నాడంటే మహారాజు ఆయన్నెంత గొప్పగా ఆదరించాడో తెలుస్తుంది. ఖాన్ సాహెబ్ కొల్హాపూర్ తానీబాయికి, తన కుమారులకి, తమ్ముని కుమారునికి నత్తన్‌ఖాన్‌కి సంగీతం బోధించాడు. ఈ ప్రాంతంలో అల్లాదియా అనంతరం వీరంతా గొప్ప గాయకులు. 90వ దశకంలో ఖాన్‌సాహెబ్ బొంబాయి వెళ్ళాక ఆయన చిన్నకొడుకు బుర్జీఖాన్‌ని అమ్మవారి దేవాలయంలో గానం చేయడానికి నియోగించాడు. అల్లాదియా కుటుంబం సాహు ఆస్థానంలోకి రావడంవల్లనే సతారా, సాంగ్లీ, కొల్లాపూర్ ప్రాంతాల్లో గొప్ప కళాకారులుద్భవించారని చెప్పవచ్చు.

కిరానా ఘరానాకి చెందిన ఉస్తాద్ అబ్దుల్ కరీంఖాన్ సాహూ సంస్థానంలో కొంతకాలమే గడిపినా, జీవితాంతం మహారాజుతో సత్సంబంధాలున్నాయి. అంతేకాదు వేరు వేరు ఘరానాలకు చెందిన వారైనా కరీంఖాన్, అల్లాదియాఖాన్‌లకూ మధ్య మంచి స్నేహసంబంధా లున్నాయి. హిందుస్తానీ సంగీతానికి సున్నితత్వాన్ని నాజూకుతనాన్ని అద్దిన వాడు కరీంఖాన్. మహారాజులనుంచి సామాన్యులవరకు హిందూస్తానీ సంగీతాన్ని అభిమానించేవాళ్ళంతా కరీంఖాన్ అభిమానులే. ఖాన్‌సాహెబ్ బరోడా ఆస్థానంలో ఎక్కువకాలం ఉన్నా సాహు ఆహ్వానంతో తరచూ ఈయన ఆస్థానానికి వచ్చేవాడు. సాహు మహరాజు కరీం, అల్లారియాలను హిందుస్తానీ సంగీత సూర్య చంద్రులుగా అభివర్ణించాడు. ఈ విషయాన్ని "History of Chatrapatries" అనే గ్రంథం నిక్షిప్తం చేసింది. కరీంఖాన్ శిష్యురాలు, భార్య (ఆశ్రిత) అయిన తారాబాయితో పూణేలో నివసించిన కాలమంతా సాహు పోషణలోనే ఉన్నారు.

కొల్హాపూర్ ఆస్థానంలో గ్వాలియర్ ఘరానాకు చెందిన పండిట్ బాలకృష్ణ బువా ఇచల్ రంజీకర్, పండిట్ రామకృష్ణబువా వాజ అనే గొప్ప విద్వాంసుడుండేవారు. ఇందులో రామకృష్ణబువా వాజెవాయ్ నగరంలోని కృష్ణాతీరంలోనే నివసించేవాడు. బాలకృష్ణబువా కొల్హాపూర్ రావడం వల్ల సాంగ్లీ, సతారా జిల్లాల్లో ఎందరో మహా గాయకులుద్భ వించారు. అందులో విష్ణుదిగంబర్ పలూస్కర్ ఒకరు. అలాగే పాటియాలా ఘరానాకు చెందిన ఉస్తాద్ బడే గులాం ఆలీఖాన్ సాహు జరిపే ప్రతి ఉత్సవంలోనూ పాల్గొనేవాడు. ముఖ్యంగా వాయ్ నగరంలో జరిగే కృష్ణవేణి మాత ఉత్సవాల్లో తప్పక ప్రత్యక్షమయ్యే వాడు. ఈయన బాపూజీ అభిమాన గాయకుడు. ఠుమ్రీలు అద్భుతంగా పాడేవాడు. విదుషి గంగూబాయ్ హంగల్ కర్నాటక యూనివర్సిటీ విద్యార్థికిచ్చిన ఇంటర్వ్యూలో "బడే గులాం సాబ్ సాహు రాజా దగ్గర పాడే ఠుమ్రీలు కృష్ణా ప్రవాహంలో కలసి మా దగ్గర తేలేవి" అని చమత్కరించడం గమనార్హం.

సాహు సహృదయత గురించి ఆనాడు ప్రచారంలో ఉన్న ఒక సందర్భం జ్ఞాపకం చేస్తాను. ఆరోజుల్లో ఒక సంస్థానానికి పదిమంది విద్వాంసులొస్తే, ఆ రాజు అందరినీ తనకిష్టమైన ఏదో ఒక రాగాన్ని పాడమని ఆదేశించేవాడు. అందరు విద్వాంసులు రాజాజ్ఞ పాటించి ఒకే రాగాన్ని ప్రధానంగా గానం చేసేవారు. ప్రేక్షకులు మహారాజు కూడా ఎవరు గొప్పగా పాడారో నిగ్గు తేల్చేవారు. కాని సాహు అలా చేసేవాడు కాదు. వచ్చేవాళ్ళంతా గొప్పవాళ్ళే గనుక, ఎవరెవరు ఏయే రాగాలు పాడడంలో ఖ్యాతి గడించినారో తెలుసుకొని, వారిని ఆ రాగాలే పాడమని కోరేవాడు. అక్కడ పోటీ భావన గాక రసౌచిత్యం చోటుచేసుకునేది. ఒక్కొక్కసారి మహారాజు, విద్వాంసులు ఎవరికీ తెలియకుండా సాధన చేసి దాచుకున్న రాగాలు అడిగి మరీ పాడించేవాడు. ఆ విషయంలో విద్వాంసులు కూడా ఆశ్చర్యపోయే వారట.

సాహు ఆశ్రయం పొందిన మరికొందరు విద్వాంసుల పేర్లు చెప్పి ముందు నడుస్తాను. పాకిస్తాన్ ప్రభుత్వం చేత సంగీత మహా రాణిగా కీర్తించబడిన రోషనారాబేగం, రాజా రవివర్మ సరస్వతి చిత్రానికి మోడల్‌గా నిలిచిన అంజనీబాయి మాల్పేకర్, జైపూర్ ఘరానాకి చెందిన మధుర గాయని మొగుబాయ్ కుర్డేకర్, మోతీలాల్ నెహ్రూ దిలిప్‌బాయి (ఆశ్రిత)ల కుమార్తె ప్రముఖనటి నర్గీస్ తల్లి జద్దన్‌బాయి (భారతీయ సినిమారంగంలో మొదటి సంగీత దర్శకురాలు), విశ్వకవి ఠాగూర్‌చేత స్వరశ్రీ (సుర్‌శ్రీ)గా కీర్తించబడిన కేసర్‌బాయి కేర్కర్, పండిట్ వినాయకరావు పట్వర్ధన్, పండిట్ ఓంకారనాథ ఠాకూర్, పండిట్ నారాయణరావ్ వ్యాస్ వంటి గాయకులు, బాబా ఉస్తాద్ అల్లాఉద్దీన్ ఖాన్, ఉస్తాద్ అహ్మద్‌జాన్ తిరఖ్వా వంటి ఎందరో వాద్య సంగీత కళాకారులు మహర్షి రాజాసాహు ఛత్రపతి వారి ఆదరణకు

నోచుకున్నవారే. ఆయన నెలకొల్పిన గాయన సమాజ్‌దేవర్ క్లబ్, కరవీర్ గాయన సమాజ్ అనే రెండు సంస్థలు నేటికీ పనిచేస్తున్నాయి. ఉత్తర భారతాన అవి రెండు అత్యంత గౌరవ సంస్థలు.

సతారా, కొల్హాపూరులు దాటి మరో అడుగు ముందుకేస్తే కృష్ణా జలాలతో పవిత్రమైన మరో జిల్లా సాంగ్లీ. ఆనాడు సాంగ్లీ నగరానికి సాంస్కృతిక కేంద్రంగా మంచి గుర్తింపు ఉండేది. City of gold అని పిలిచారు. సాంగ్లీ ప్రాంతంలో పుట్టిన గొప్ప విద్వాంసుడు పండిట్ విష్ణు దిగంబర్ పలుస్కర్ హిందూస్తానీ శాస్త్రీయసంగీతానికి గణనీయమైన సేవలందించిన 'గంధర్వ విద్యాలయ వ్యవస్థాపకులు పలూస్కర్. వీరి అసలు ఇంటిపేరు గాడ్‌గిల్ (godgil) కాని వీరి కుటుంబం సాంగ్లీ సమీపంలోని 'పలస్' (Palus) గ్రామానికి వలస రావడంతో ఈయనకు పలూస్కర్ ఇంటిపేరైంది. పలూస్కర్ కొల్హాపూర్ అధీన విద్వాన్ బాలకృష్ణ బువా ఇచల్ కరంజేకర్ శిష్యుడు మహా విద్వాంసుడు. ఋషి జీవితం గడిపినవాడు. గొప్ప గురువుగా కీర్తి పొందాడు. విష్ణు నెలకొల్పిన గంధర్వ విద్యాలయం శాఖోపశాఖలై నేటికీ గొప్ప సంగీత సేవ చేస్తున్నాయి. ఈయనకు గొప్ప శిష్యులున్నారు. పండిట్ వినాయకరావు ఫట్వర్ధన్, పండిట్ ఓంకార నాథ ఠాకూర్, పండిట్ నారాయణరావ్ వ్యాస్ ఈయన శిష్యులు.

అమరగాయకుడు, మహాత్మాగాంధీ ఆస్థాన గాయకుడు అయిన దత్తాత్రేయ విష్ణుఫలూస్కర్, విష్ణు దిగంబర్ కుమారుడు గొప్ప గాన కళాకోవిదుడు తండ్రిదగ్గరే విద్యాభ్యాసం చేశాడు. ఇంకా తండ్రిగారి శిష్యులందరినీ మార్గదర్శకులుగా సంగీత సాధన చేశాడు. వైష్ణవజనతో గీతానికి సంగీతం కూర్చి గాంధీగారి ఆశ్రమంలో గానం చేసి దర్బారీ గాయకుడైనాడు. గాంధీగారి ప్రేరణతో రామ్‌ధున్ (రఘుపతిరాఘవ రాజారాం) సంగీతం కూర్చి HMV కంపెనీవారికి రికార్డు ఇచ్చాడు. ఈ రికార్డే తరువాతి వారందరికీ గానం చేయడానికి ఆధారమైంది. ఆరోజులలో డి.వి. పలూస్కర్‌ని "బాపూరావ్" అని పిలిచేవారు.

కృష్ణానదీ తరంగాలే పుట్టుకగా, మెట్టిన పుణ్యక్షేత్రంగా నిలిచి ప్రపంచ ప్రఖ్యాతి పొందిన మహానుభావుడు 'బాలగంధర్వ'. ఈయన అసలుపేరు నారాయణరావు రాజహంస. ఈయన పటాన్ తాలూకాలోని 'నాగథానె అనే గ్రామంలో అన్నపూర్ణాదేవి, శ్రీపాద రాజా దంపతులకు జన్మించాడు. పండిట్ భాస్కరబువాభఖ్లే, గోవిందరావు తాంబేగార్ల శిక్షణతో సంగీత కళావిశారదుడైనాడు. ఈయన చిన్న వయసులో ఉండగా వీరు ప్రదర్శించిన నాటకం చూసి, లోకమాన్య బాలగంగాధరతిలక్ 'బాలగంధర్వ' అంటూ కీర్తించడంతో వీడికి బాలగంధర్వ శాశ్వత సార్థక నామమయింది. మరాఠీ నాటకరంగంలో ఇంత అద్భుతంగా ఆడవేషాలు ధరించి అమృతగానాన్ని ప్రపంచానికందించినవారు మరొకరు లేరు. ఈయన 'కిర్లోస్కర్ నాటకమండలి' స్థాపించి పాతికకిపైగా నాటకాలు సాధన చేసి, వాడవాడలా ప్రదర్శించి తన అద్భుత నటనతోపాటు అమరగానాన్ని కూడా వినిపించాడు. తెలుగు నాటకరంగంలో గొప్ప నాయకనటుడైన జొన్నవిత్తుల శేషగిరి రావుగారిని 'ఆంధ్ర బాలగంధర్వ' అని పిలిచేవారు.

భారతీయ సినిమారంగంలో తిరుగులేని గాయని, లతామంగేష్కర్ సోదరి అయిన ఆషాభోంస్లే సాంగ్లీలోనే జన్మించారు. ఈమె తండ్రి దీనానాథ్ మంగేష్కర్ మరాఠీ నాటకాల్లో నటిస్తూ సాంగ్లీలో ఉండేవాడు. 16 సంవత్సరాల వయసులోనే గణపతిరావు భోస్లేని పెళ్ళాడి ఆషాభోంస్లే అయింది. బాలీవుడ్ క్వీన్‌గా పేరుపొందడమే గాక వేలపాటలు పాడి గిన్నీస్‌బుక్‌లో నమోదయింది. దాదాసాహెబ్ ఫాల్కే, పద్మవిభూషణ్ వంటి లెక్కకు అందనన్ని పురస్కారాలు అందుకున్నారు.

ఇంతమంది గొప్పవాళ్ళ మధ్య ఇంకెంతమంది కృష్ణాతీర కళాకారులు చరిత్రకందకుండా వెళ్ళిపోయారో తెలియదు. కోయన, యర్ల, పంచగంగ, వరుణ నదులతో విలీనమై ప్రవాహం పెరిగి ముందుకు సాగి కృష్ణవేణి కొల్హాపూర్ జిల్లాలోని 'కరండవాడ' దగ్గర కర్నాటకరాష్ట్రంలో బీజాపూర్ జిల్లాలో ప్రవేశిస్తుంది. ఉత్తర కర్నాటకలో తూర్పు వాహినిగా బీజాపూర్, బెలగాం, ధార్వాడ, గుల్బర్గా ప్రాంతాల్లో ప్రయాణించి తెలంగాణ రాష్ట్రం వైపు కొస్తుంది.

అదేమిచిత్రమోగాని దక్షిణాది రాష్ట్రాల్లో అన్నిచోట్లా కర్నాటక సంగీతమే వ్యాప్తిచెందినవ్వటికీ, కర్నాటకలోని కృష్ణవేణీ పరీవాహప్రాంతం మాత్రం హిందుస్తానీ సంగీతమే వ్యాప్తి చెందింది అందునా మొత్తం భారతదేశాన్నంతటినీ ప్రభావితం చేయగల మహామహులు ఇక్కడ జన్మించడం విశేషం.

ఐదుగా విభజించబడిన బహమనీ సామ్రాజ్యాల్లో బీజాపూర్ ప్రధానమైనది. క్రీ.శ. 1490 ప్రాంతంలో పాలించిన యూసఫ్ ఆదిల్‌షా బహమన్ మంచి సంగీత పిపాసి. స్వయంగా టాంబొరిన్, ఉద్ (ఖురాన్ గానంలో ఉపయోగించే చర్మవాద్యాలు) వాద్యాల్లో ప్రవీణుడు. ఆయన అనంతరం రాజైన ఇస్మాయిల్ ఆదిల్ షా బహమెన్ అనేకసార్లు మధ్య ఆసియా సంగీత విభావరులు ఏర్పాటుచేసిన రసికుడు. 1580 నుంచి అర్థ శతాబ్దం పాటు కర్నాటక బహమనీ సామ్రాజ్యాన్ని బీజాపూర్ రాజధానిగా పాలించిన ఇబ్రహీం ఆదిల్షాబహమన్ II గొప్ప సంగీత కోవిదుడు. మధురమైన కంఠమున్న గాయకుడు. మంచి కవి సూఫీ సిద్ధాంతాలను గాయన పద్ధతుల్లో అంటే గజల్, ఖవాలి వంటి ఛందస్సుల్లో స్వయంగా రాసి, గానం చేసి మెప్పించేవాడు. ఆయన సంగీత పాటవానికి ఢిల్లీ సుల్తానులు కూడా ఆశ్చర్యాన్ని ప్రకటించినట్లు చరిత్ర చెబుతుంది. 1580లో

రాజ్యాన్ని స్వీకరించాక ఆదిల్షా II వార్ధక్యంలోనున్న తాన్‌సేన్‌ని మారు వేషంలో గ్వాలియర్ వెళ్ళి దర్శించి ఆయన గానం విని కానుకలు సమర్పించినట్లు తెలుస్తుంది.

ఇబ్రహీం ఆదిల్షా II ఆస్థానంలో మూడువేలమందికి పైగా సంగీత కళాకారులున్నట్లు బహమనీ సామ్రాజ్యచరిత్ర రాజధానికి సమీపంలో మహారాజు 'నవరస్ పూర్' అనే ఒక నగరాన్ని నిర్మించాడు. 'నవ్‌రస్ అంటే సంగీత సభ అని అరబిక్‌లో అర్థం. ఈ నగరంలో గొప్ప సౌధాన్ని నిర్మించి దానికి సంగీతమహల్ అని పేరు పెట్టాడు. ఆ మహల్‌లో నవరస్ నిర్వహణకు సమీపంలోని కొన్ని భూముల్ని కేటాయించి అందులో వచ్చే ఆదాయాన్ని ఉపయోగించేవారట. బహుశా ఆ ప్రాంతంలో బహమనీ సుల్తానుల పోషణవల్ల సంగీతం అభివృద్ధి జరిగింది గనుక అక్కడ హిందూస్తానీ సంగీతం అభివృద్ధి జరిగియుండవచ్చు. ఇంకొక విశేషమేమిటంటే రాజులు రాజ్యాలు అంతరించిపోయినా నేటికి "నవరస్‌పూర్ మ్యూజిక్ ఫెస్టివల్" మాత్రం జరుగుతూనే ఉంది. ఎంతోమంది కళాకారులు నేటికీ ఈ ఫెస్టివల్‌లో పాల్గొంటున్నారు.

కర్నాటకలో చెప్పదగిన హిందూస్తానీ కళాకారులో ఒకరు మన విద్వాన్ కుమారగంధర్వ. సంగీతంలో సామర్థ్యం సంపాదించిన గొప్పవాళ్ళంతా గంధర్వాంశసంభూతులే. అయితే హిందూస్తానీ సంగీతరంగంలో గంధర్వులుగా పిలువబడినవాళ్ళు కూడా లేకపో లేదు. అది రసిక శ్రోతల గాఢాభిమానానికి నిదర్శనం. ఉస్తాద్ రహ్మత్ ఖాన్‌ని 'భూగంధర్వ' అని పిలిచేవారు. ఆయన మహారాష్ట్రలోని 'రంగ్ మంచ్' నాటకాలకు సంగీతం సమకూర్చేవాడు. ఈయన శిష్యులు ఈయన పేరుతో ఒక నాటకమండలినే స్థాపించారు. అదే ప్రసిద్ధి పొందిన 'గంధర్వ నాటకమండలి'. భాస్కరబువాభక్లే ఈ సంస్థ సంగీత పర్యవేక్షకుడు. సతారా సాంగ్లీ ప్రాంతాల్లో ఈ సంస్థ బాగా పేరుపొందిన 'రంగ్‌మంచ్'. అలాగే నారాయణరావు రాజహంసని 'బాలగంధర్వ' అని పిలిచినట్లు ముందే చెప్పుకున్నాం. ధార్వాడ ప్రాంతంలోని 'కుంద్‌గోల్'కు చెందిన రామచంద్రకుంద్ గోళ్ కర్ షాన్ షి అనే విద్వాంసుని 'సవాయ్ గంధర్వ' అని పిలిచారు. ఈయన 'కిరానా ఘరానా'కి చెందిన ఉస్తాద్ అబ్దుల్ కరీంఖాన్ శిష్యుడు. గొప్ప గురువుగా లోకప్రసిద్ధుడు. ఈనాడు దేశంలో అనేక ప్రాంతాల్లో సవయ్ గంధర్వ సంగీతోత్సవాలు ప్రతిష్ఠాత్మకంగా నిర్వహిస్తున్నారు. అలాగే 'సౌదాగర్ నాగనాథ్ కోరే' అనే విద్వాంసుని అభిమానులు 'చోటాగంధర్వ' అని పిలుస్తున్నారు.

మనం ఇప్పుడు చెప్పుకునేవారు కుమార్ గంధర్వ. ఈయన అసలుపేరు శివపుత్ర సిద్ధరామయ్య కోం కలినాథ్. ఈయన బెలగాం సమీపంలోని 'సులేభావి' అనే గ్రామంలో 1924లో జన్మించాడు. ప్రొ. బి. ఆర్. దేవధర్, అంజనీబాయి మాల్పేకర్ ఈయన సంగీత గురువులు. ఈయన బాల్యంనుంచి బాలగంధర్వ, ఉస్తాద్ కరీంఖాన్‌ల సంగీతాన్ని దృష్టిలోనుంచుకొని సాధన చేసి, తన కృషితో తనదైన ఒక ప్రత్యేక బాణి నిర్మించుకున్నాడు. దేవధర్ స్కూలుకు చెందిన భానుమతి కౌన్స్ అనే సంగీతజ్ఞురాలిని వివాహం చేసుకున్నాడు. కొంతకాలం తరువాత ఆమె చనిపోవడంతో వసుంధర కోంకలి అనే ఆమెను వివాహం చేసుకొని, మధ్యప్రదేశ్‌లో 'దేవాస్' అనేచోట స్థిర పడ్డాడు. కుమార్ గంధర్వ నిర్గుణ సంగీతం గానం చేయడంలో తనంత వాడు లేడనిపించుకున్నాడు. కేంద్ర సంగీత నాటక పురస్కారంతోపాటు 1977లో పద్మభూషణ్, 1990లో పద్మవిభూషణ్ పురస్కారాలందు కున్నాడు. ఈయన శ్రీమతి వసుంధర కూడా గొప్ప విదుషీమణి. ఆమె సంగీత నాటక అకాడమీ పురస్కారం పద్మశ్రీ పురస్కారాలందు కున్నారు. కుమార్ గంధర్వ 1992లో 'దివస్'లో మృతి చెందారు. వారి కుమారుడు ముకుల్ శివపుత్ర, శిష్యులు మధుప్ ముద్గల్, శుభాముద్గల్, విజయ్, సత్యశీల్ మంచి విద్వాంసులు. మనుమడు భువనేష్ యువకళాకారుడు.

కృష్ణాతీరంనుంచి హిందూస్తానీ సంగీత ప్రపంచంలో మేరు శిఖరాలందుకున్న మరో ఆణిముత్యం గంగూబాయ్ హంగల్. ఈమె అంబాబాయ్, చిక్కూరావ్‌నడిగర్ దంపతులకు ధార్వాడలో 1918లో జన్మించారు. ఈమె తల్లి కర్నాటక సంగీత విద్వాంసురాలు. ఈమె సాంగ్లీలో కృష్ణాచార్య హల్గర్, దత్తోపంత్ దేశాయ్‌ల దగ్గర హిందూస్తానీ నేర్చుకొని కుందగోళ్ వెళ్ళి కిరానాఘరానాకి చెందిన సవాయ్ గంధర్వ సాన్నిధ్యంలో మహావిద్వాంసులైనారు. ఈమె భర్త గురుగావ్ కౌత్‌గీ ఈమె కుమార్తె కృష్ణ హంగల్ మంచి సంగీత విద్వాంసురాలు. గంగూబాయ్ కర్నాటక యూనివర్సిటీలో హానరరీ ప్రొఫసర్‌గా పని చేస్తూ దేశవిదేశాల్లో ఎన్నో కచ్చేరీలు చేశారు. ఆమె కిరానా ఘరానాకు చెందిన అందులో తనదిగా ఒక ప్రత్యేకముద్ర కనిపిస్తుంది. కేంద్ర సంగీత నాటక అకాడమీ అవార్డుతోపాటు 1996లో ఫెలోషిప్ కూడా అందుకున్నారు. 1971లో పద్మభూషణ్ 2002లో పద్మవిభూషణ్ లతో సత్కరించబడ్డారు. 2009లో ఆమె మరణానంతరం కర్నాటక ప్రభుత్వం "డా. గంగూబాయ్ హంగల్ మ్యూజిక్ అండ్ పర్‌ఫామింగ్ ఆర్ట్స్ యూనివర్సిటీ" కి ఆమెపేరు ఏర్పాటుచేశారు.

కృష్ణాతీరంలో పుట్టి భారతదేశ ఖ్యాతిని ఖండాంతరాలకు వ్యాపింపచేసిన మరో మహావిద్వాంసుడు భీమసేన్ జోషి. ఈయన గదగ్ (ధార్వాడ) సమీపంలోని రోన్ (Ron) గ్రామంలో గోదావరీ బాయ్ గురురాజ్‌జోషి దంపతులకు 1922లో జన్మించాడు. ఇల్లు

వదలివెళ్ళి ఉస్తాద్ హఫీజ్ ఆలీఖాన్ (అంజాద్ ఆలీఖాన్ తండ్రి) దగ్గర కొంతకాలం సంగీతం నేర్చుకోగలిగాడు. చివరకు కుందగోళ్ చేరి సవాయ్ గంధర్వ శిష్యరికంలో సంపూర్ణ విద్యావంతుడైనాడు. కఠోర సాధన చేసి కిరానాఘరానాలో ప్రధాన గాయకుడైనాడు. అద్భుతమైన అకారసాధన చేసి ఎంత క్లిష్టమైన సంగతులనైనా అవలీలగా పలికించగలడు. ఎంత క్లిష్టమైన రాగమైనా సుదీర్ఘంగా పాడగల దిట్ట. ఆయన సతీమణి వత్సలాబాయి కూడా సంగీతంలో గొప్ప కీర్తి గలిగిన గాయని. ఈయన దేశవిదేశాల్లో తన సంగీతాన్ని వినిపించి భారతీయ సాంస్కృతిక వైభవాన్ని చాటినాడు. కేంద్ర సంగీత నాటక అకాడమీ పురస్కారంతోపాటు ఫెలోషిప్ అందుకున్న పద్మశ్రీ, పద్మభూషణ్, పద్మవిభూషణ్‌లతోపాటు భారతదేశ అత్యున్నత పురస్కారం 'భారతరత్న' అందుకున్న ఘనుడు. 'మిలేసుర్ తుమ్హారా' 'జనగణమన' వంటి దేశభక్తి గీతాలు ఆయన దేశమాతకు సమర్పించి రత్నాభరణాలు.

అలాగే కృష్ణాతీరంలోని మాన్సూర్ గ్రామంలో పుట్టిన మరో మహావిద్వాంసుడు మల్లికార్జున మాన్సూర్. ఈయన ఉస్తాద్ అల్లాదియాఖాన్, ఆయన కొడుకులు మంజీఖాన్, బుజ్జీఖాన్‌ల దగ్గర సంగీతాభ్యాసం చేసి జైపూర్ ఘరానాలో ముఖ్య గాయకుడైనాడు. దేశవిదేశాల్లో తన సంగీతాన్ని వినిపించాడు. ఈయన సంగీత నాటక అకాడమీ అవార్డుతోపాటు ఫెలోషిప్ అందుకున్నాడు. పద్మశ్రీ, పద్మవిభూషణ్, పద్మభూషణ్ గౌరవాలు పొందాడు. ఈయన గాయన విద్యకు చెందిన అనేక గ్రంథాలు రచించి కృతకృత్యుడైనాడు. ఈయన కుమారులు రాజశేఖర మన్సూర్ కూడా మంచి గాయకుడు.

ఇంకా గదగ్‌లో జన్మించి సంగీత సాహిత్యాలు ప్రపంచానికి పంచిన పండిట్ పుట్టరాజ్ గవాయ్, హసంగిలో జన్మించిన పండిట్ గణపతిభట్ హసంగి, గురురావ్ దేశపాండే, గదగ్ వాసులైన పండిట్ నచికేత్ శర్మ, పండిట్ సంజీవ్ చిమ్మల్గీ, పండిట్ మాధవ్ గుడి, విదుషి సంగీతా కులకర్ణి మొదలైనవారు హిందుస్తానీ శాస్త్రీయ సంగీతాన్ని పరిపుష్టి గావించిన కృష్ణాతీరవాసులు.

బెలగాంలో జన్మించిన మధుర గాయని, బుర్జీఖాన్ శిష్యుడు. శాస్త్రీయ, లలిత శాస్త్రీయ రంగాలలో గొప్ప గాయని విదుషి శోభా గుర్తు (భానుమతీ షిరోద్కర్) కర్నాటక సంగీతరంగానికి ఒక ఆభరణం.

ఇలా ఎందరెందరో సంగీత విద్వాంసులు నాదతరంగాలతో శర వేగంగా కర్నాటకలో ప్రవహిస్తూ దూద్‌గంగ, ఘటప్రభ, మలప్రభ, భీమ, ఇంద్రాణి వంటి చిన్న పెద్ద ఉపనదుల్ని తనలో కలుపుకొని తూర్పు దిక్కుగా ప్రయాణించి రాయచూర్ సమీపంలోని 'దోసుగర్' వద్ద తెలంగాణ రాష్ట్రంలో ప్రవేశించింది.

కృష్ణానది తెలంగాణా రాష్ట్రంలో మహబూబ్‌నగర్, నల్గొండ జిల్లాల్లో ప్రవహించింది. తెలంగాణలో ఎందుచేతనో జానపద కళలు అభివృద్ధిచెందినంతగా సంప్రదాయ కళలు అభివృద్ధి చెందలేదు. కాకతీయుల ప్రభావంతో ఒక శిల్పకళ మాత్రం సంప్రదాయపరంగా అభివృద్ధి చెందింది. శాస్త్రీయ సంగీతరంగం మాత్రం పూర్తిగా కనిపించ డంలేదు. గోల్కొండ నిజాం ప్రభువుల ప్రభావంతో తెలంగాణలో హిందుస్తానీ సంగీతం కొంత చోటుచేసుకున్నా అది హైదరాబాద్‌కే పరిమితమైంది. ఎంతో కొంత నాట్యకళ కూడా అభివృద్ధి చెందినట్లు తెలుస్తుంది గాని శాస్త్రీయ సంగీతరంగమే పూర్తిగా వదలివేయబడింది. ఈ విషయమై పరిశోధనలో భాగంగా రెండు జిల్లాల్లో తిరిగితే కొన్ని ఆచార్య కుటుంబాలు సంగీత పరిచయ మున్నవారు కనిపించారు. కాని వారు ఎన్నడూ కచేరీల స్థాయి దాకా వచ్చిన వారు కాదు. ఇక్కడి దేవాలయాల్లో కొందరు నాదస్వర విద్వాంసులు పనిచేస్తున్నా వారంతా కోస్తా తీరంనుంచి వచ్చినవారే. మరొకప్రక్క రాయలసీమ కళలకు స్వర్ణయుగంగా వెలుగుతున్నా ఎందుచేతనో శాస్త్రీయ సంగీతం ఈ ప్రాంతవాసులకు అంతగా పట్టింది గాదు. భవిష్యత్ పరి శోధకులకు ఏవైనా కొన్ని చరిత్రలు లభిస్తే సంతోషం. నా ప్రయత్న లోపంలేదు.

తెలంగాణలో మున్నేరుని కలుపుకొని కర్నూలుజిల్లాలో ఉత్తర ప్రాంతంలో ప్రవహిస్తూ సంగమేశ్వరం దగ్గర కృష్ణానది ప్రధాన ఉపనది అయిన తుంగభద్రానదిని తనలో కలుపుకుంటుంది.

ఆంధ్రప్రాంతం సంగీతానికి ఆధునికయుగంలో ఒక పుష్కరకాలం కర్నూలే ప్రధానకేంద్రమయింది. ఉత్తరాంధ్రం నుంచి కర్నూలు జనరల్ హాస్పిటల్‌లో డాక్టర్‌గా పనిచేయడానికి వచ్చిన డా. శ్రీపాద పినాకపాణి వైద్యరంగంలో రాణిస్తూనే కర్నూలు పట్టణాన్ని సంగీత క్షేత్రంగా మార్చాడు. ద్వారం వెంకటస్వామి నాయుడు, అరియక్కుడి రామాను జయ్యర్‌ల సహచర్యంతో గొప్ప కళాకారుడుగా రూపొందిన పినాకపాణి తనదైన ఒక ప్రత్యేక బాణీని తయారుచేసికున్నారు. అదే ఆంధ్రదేశంలో ప్రసిద్ధమైన 'పాణిబాణి'. ఈయన శిష్యరికంలో దిగ్గంతులైన విద్వాంసు లెందరో ఉన్నారు. అనకాపల్లిలో జన్మించి హైదరాబాదుని సంగీత నెలవు చేసిన డా. నూకల చిన్న సత్య నారాయణ, విశాఖలో సంగీత సేద్యం చేసి మేలి రత్నాలు పండించిన నేదునూరి కృష్ణమూర్తి, తెలుగు నాట స్త్రీ గొంతుకకు ప్రత్యేక గౌరవం కల్పించిన డా. శ్రీరంగం గోపాల రత్నం, అచ్చమైన సాంప్రదాయరీతిలో ఉభయ సంగీతాలూ అభ్యసించి ఆంధ్రా బడే గులాం అనిపించుకున్న ఓలేటి వెంకటేశ్వర్లు కర్నూలు సంగీత క్షేత్రంలో మొలకెత్తి పెరిగి పుష్పించి ఫలించినవారే. ఇంకా ఈ ప్రాంతంలో అనేకమంది మంగ ళాద్య కళాకారుల్ని కూడా

గుర్తించవచ్చు. గుంటూరుజిల్లాకు చెందిన కర్లపాలెం చంద్రమౌళి కర్నూలులో శారదా సంగీత నాట్యకళాశాల స్థాపించి, కొన్నాళ్ళు నిర్వహించి ప్రభుత్వానికి అప్పగించాడు.

పంచనదీసంగమ ప్రవాహమైన తుంగభద్రతో సంగమించి మహా ప్రవాహంగా విజయపురి వద్ద ఆంధ్రభూమిలో అడుగుపెడుతుంది. ఇక్కడ మునీ, పాలేరులు కృష్ణానదిలో కలసి ఆ నది ముచ్చట తీర్చాయి. ఆంధ్రదేశంలో కృష్ణానది దక్షిణభాగమంతా గుంటూరు (గర్తపురి) జిల్లా. ఉత్తర భాగం కృష్ణాజిల్లా. ఏ నది పుణ్యతరంగా వీచికల్లో వ్యాస ప్రారంభంనుంచి తడుస్తూ వచ్చాయో ఆ నదిపేరుతో వెలసిన మండలం కృష్ణాజిల్లా.

ఆంధ్రనాట కృష్ణాతీరంలో మూడు గొప్ప విశేషాలున్నాయి. అందులో ఒకటి కృష్ణాలీలాతరంగిణి రాసి ప్రపంచానికి సంగీత కృష్ణా తరంగాలనిచ్చిన మహర్షి శివనారాయణ తీర్థులు. ఈయన తన సంగీత రచనలో అపరజయదేవుడై బాలకృష్ణుని లీలలు వర్ణించి పాడడమేగాక తన రచనలను 'తరంగాలు' అని పేరుపెట్టడంలో ఈయనకు కృష్ణానది స్పర్శ ఎంత ఉన్నదో తెలియగలదు. మధురసంస్కృత పదజాలంతో కృష్ణ సంకీర్తనలకు ఒక నూతనత్వం తెచ్చిన తీర్థులు కృష్ణానదికి దక్షిణాన గుంటూరు మండలంలోని 'కాజ' గ్రామానికి చెందినవాడు. ఈయన అసలుపేరు తల్లావజ్ఝల గోవిందశాస్త్రి. కృష్ణానది దాటి అత్తవారింటికి వెళుతూ వరదకు గురై ఆతుర సన్యాసం స్వీకరించి గట్టెక్కి భార్య అనుమతితో కాశీకి వెళ్ళి పూర్తి సన్యాస దీక్షితుడై శివనారాయణ తీర్థులుగా జగత్ప్రసిద్ధుడైనాడు.

కృష్ణాతీరం ఉత్తర భాగాన వెలసిన మరొక దివ్యవాగ్గేకారుడు క్షేత్రయ్య. ఈయన స్వగ్రామం కృష్ణాతీరంలోని 'మొవ్వ' గ్రామం. అసలుపేరు వరదయ్య. మొవ్వలో వెలసిన గోపాలదేవుని అనుగ్రహంతో నిరక్షరాస్యుడైన వరదయ్య గొప్ప వాగ్గేయకారుడై, క్షేత్ర దర్శనంతో క్షేత్రయ్యగా ప్రసిద్ధిపొందాడు. తెలుగులో అన్నమయ్య తరువాత అంతటి వాగ్గేయకారుడు క్షేత్రయ్య. ఈయన పదాలు భావరస సమున్నతమై, రాగనిక్షిప్త గానయోగ్యత కలిగి ఉండడమేగాక నాట్యానికి అత్యంత అనుకూలమైన రచనలు. ఈయన షుమారు 4500 పదాలు రాసినట్లు తెలుస్తున్నా 400 మాత్రం దొరుకుతున్నాయి.

కృష్ణాతీరంలోని మరోవిశేషం "కూచిపూడి". కృష్ణవేణి అలల లయలు ఆసాంతం నిక్షిప్తం చేసుకున్న అమోఘ విద్య కూచిపూడి నాట్యం. ప్రపంచంలోనే ఒక గ్రామం పేరుతో వెలసిన ఏకైక బృహత్తర నాట్య విశేషం. దీనికి ఆద్యుడు, ఆరాధ్యుడు సిద్ధేంద్రయోగి. ఆయన రాసిన 'భామాకలాపం' ఆయన వాగ్గేయకార ప్రతిభను చాటిచెప్పే యక్షగానం ఆయన శివనారాయణతీర్థుల వారి శిష్యుడని ప్రతీతి.

కృష్ణాతీరంలో వెలసిన ఈ వాగ్గేయ త్రిమూర్తులు ముగ్గురూ శ్రీ కృష్ణార్చన చేసినవారు కావడం విశేషం. ఈ ముగ్గురూ శ్రీకృష్ణ సాక్షాత్కారం పొందినవారేనని లోక ప్రసిద్ధి.

కృష్ణాతీరంలో మరో ముఖ్య విశేషం కర్నాటక సంగీతానికి అన్నీ తానే అయిన సద్గురు త్యాగరాజస్వామి సంగీత సంప్రదాయం ఇక్కడ ప్రతిష్టింపగల్గడం. త్యాగరాజు ప్రియ శిష్యుడు సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రి (1860-1917) ఈ కార్యసాధకుడు. కృష్ణానది పాయల మధ్య ఏర్పడిన దివిసీమలోని పెదకళ్ళేపల్లి వీరి స్వగ్రామం. దక్షిణామూర్తి త్యాగరాజు శిష్యుడైన ఆకుమళ్ళ వెంకటసుబ్బయ్య (మానాంబు చావడి)గారి వద్ద శిష్యరికం చేశాడు. ప్రత్యక్షంగా త్యాగరాజు నెరిగినవాడు. పట్నం సుబ్రహ్మణ్య అయ్యర్ మహావైద్యనాథ అయ్యర్ వంటి గొప్పవాళ్ళ సహపాఠి. చివరగా తిరువోత్తియూర్ త్యాగయ్య వద్ద కూడా సంగీతం అభ్యసించాడు. వీరివలన త్యాగరాజ సంగీత సంప్రదాయంతోపాటు, తమిళనాడు సంగీత ప్రస్థానంలోని గమనాగమన స్థితిగతులు కూడా ఆంధ్రదేశానికి తెలిశాయి.

ఈయన శిష్యుడు సద్గురు సార్వభౌముడు పారుపల్లి రామకృష్ణయ్య పంతులు (1883-1951) తొలి ఆంధ్ర వల్లభుని రాజధాని కృష్ణాతీర శ్రీకాకుళం. ఆయన కార్యక్షేత్రం విజయవాడగా మారింది. ఇక్కడ ఎంతోమంది శిష్యులను తీర్చిదిద్దారు.

బందరుకు చెందిన గరగపర్తి కోటయ్యదేవర (1801-1924) అనేక సంస్థానాలు తిరిగి జయపత్రాలందుకున్న గొప్ప విద్వాంసులు. ఘంటసాలకు చెందిన చల్లపల్లి సీతారామయ్య, సుబ్బయ్య సోదరులు గద్వాల సంస్థాన ఆస్థాన విద్వాంసుడు జగ్గయ్యపేటకు చెందిన పాపట్ల కాంతయ్య (1877-1921) మంచి విద్వాంసుడేగాక వాగ్గేయకారుడు కూడ. పరిటాలకు చెందిన పురాణం కనకయ్య (1899-1950) వారి శిష్యులు పిరాట్ల శంకరశాస్త్రి (1884-1951) గొప్ప గాయకులు. వీరిద్దరూ గుంటూరులో నివసించారు. గుడివాడకు చెందిన పాలపర్తి సీతారామయ్య (1880-1932) బందరులో నివసించిన మంచి గాయకుడు.

దివి తాలూకా హరిపురానికి చెందిన హరినాగభూషణం (1884-1959) గొప్ప జంత్ర గాత్ర విద్వాంసుడు, వాగ్గేయకారుడు. బరోడా సంస్థానంలో తన సంగీత విద్యను ప్రదర్శించే 'గాయకరత్న'

బిరుదునందుకున్నాడు. చిలకలపూడి వెంకటేశ్వర శర్మ (1895-1964) శ్రీకాకుళం గ్రామానికి చెందిన విద్వాంసుడు. సంస్కృతంలోని 'సంగీత పారిజాతము' 'చతుర్దండి ప్రకాశిక' 'సంగీత మార్తాండము' అనే గ్రంథాల ఆంధ్రీకరించి ఆంధ్ర సంగీత లోకానికి మేలుచేశారు. మోపిదేవికి చెందిన చేబ్రోలు వెంకటరత్నం ఆరోజుల్లో పేరున్న కళాకారుడు.

పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారి శిష్యరికంలో రూపు దిద్దుకున్న గొప్ప సంగీత విద్వాంసుడు డా. మంగళంపల్లి బాల మురళీ కృష్ణ. ఆంధ్ర సంగీతరంగానికే కాదు మొత్తం కర్నాటక సంగీత ప్రపంచానికే ఆధునికయుగ అధికర్త బాలమురళి. ఈయన తండ్రి పట్టాభిరామయ్య వేణు విద్వాంసులు. ఈయనకూడా పారుపల్లి వారి శిష్యుడే. బాలమురళి కేవల గంధర్వగాయకుడే కాదు, గొప్ప వాగ్గేయ కారుడు కూడ. కర్నాటక సంగీత చరిత్రలో మొత్తం 72 మేళకర్తల్లోను వాగ్గేయరచనలు చేసిన ఏకైక వాగ్గేయకారుడు. అద్భుతమైన భావ గీతాలు రాశాడు. అసమానమైన తిల్లానాలు రాశాడు. ఈయన కీర్తనలు జనకరాగమంజరి రాగాంగరవళి పేర్లతో బహుళ ప్రజాదరణ పొందాయి. గణపతి, మహతి, సర్వశ్రీ, లవంగి వంటి అనేక రాగాలను సృష్టించాడు. సాధారణ లక్షణాలకు విరుద్ధంగా నాలుగు, మూడు స్వరాలతో రాగాలు సృష్టించిన ఘనుడు. తెలుగు, సంస్కృతం, తమిళం, కన్నడం, మళయాళభాషల్లో వాగ్గేయ రచనలు చేశాడు. ఈయన రచనలు దేశవ్యాప్తంగా అందరూ గానం చేస్తున్నారు. ఈయన విద్యాభ్యాసంనుంచి వాగ్గేయరచన వరకూ కర్మక్షేత్రం విజయవాడలోనే సాగింది. ఈయన కేంద్ర సంగీత నాటక అకాడమీ పురస్కారం, ఫెలోషిప్‌తోపాటు అన్ని పద్మ అవార్డులు అందుకున్నారు.

ఈయన అనంతరం విజయవాడలో ఓలేటి వెంకటేశ్వర్లు, ముసునూరి వెంకటరమణమూర్తి, పెమ్మరాజు సూర్యారావు మంగపతి రావు సోదరులు, శ్రీరంగం గోపాలరత్నం, యన్.సి.వి. జగన్నాథా చార్యులు, వి.బి. కనకదుర్గ, వింజమూరి లక్ష్మి, మల్లాది సూరిబాబు మొదలైన వారెందరో బంగారు దుర్గమ్మ నీడన కృష్ణవేణి సానువులో తమ సంగీతాన్ని పండించుకుంటున్నారు. ఆధునికుల్లో మోదుమూడి సుధాకర్, మల్లాది సోదరులు, విష్ణుబోట్ల సోదరీమణులు, మందాకృష్ణ మోహన్ మొదలగువారు ముఖ్యులు.

ద్వారం వెంకటస్వామి నాయుడుగారితో (విజయనగరం) తెలుగువారి సంగీతవైభవం ప్రపంచఖ్యాతి పొందింది. అయితే ఆ వాద్యంలో కృష్ణాతీరం వెనకబడిలేదు. ముందుతరంలో పారుపల్లి రామకృష్ణయ్య పంతులు, సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రి, హరినాగ భూషణం, బాలమురళీకృష్ణ గాత్ర సంగీతంతోపాటు వయోలిన్ వాద్యంలో కూడా గొప్పవారు. వీరుగాక వారణాసి బలరామయ్య బ్రహ్మయ్య సోదరులు (వడాల అగ్రహారం సరిదే సుబ్బారావు), నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు, నేతి శ్రీరామశకత దత్తాడ పాండురంగ రాజు, కంభంపాటి లక్ష్మీనారాయణ శాస్త్రి, కె.వి.రెడ్డి మొదలైనవారంతా విజయవాడలో నివసించిన ప్రసిద్ధ వయోలిన్ విద్వాంసులు.

నాయుడుగారి తరువాత తిరిగి మంచి కీర్తిపొందిన వయోలిన్ కళాకారులు అన్నవరపు రామస్వామి. వీరు పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారి ముఖ్య శిష్యులు. గురువుగారి వలెనే ఎందరో శిష్యులకు విద్యాదానం చేసిన ధన్యులు. విజయవాడలోనే నివసించిన అరిపిరాల సత్యనారాయణమూర్తి వయోలిన్ కళాకారులేగాక 'సంగీత కళా ప్రదర్శన' 'సంగీత లక్షణ సంగ్రహం' అనే గ్రంథాలు రచించాడు. ఇంకా జి.వి. రామకుమార్ కొమాండూరి శేషాద్రి, పాలపర్తి నాగేశ్వరరావు, ఎం.ఎస్. బాబు, యస్. జగన్మోహనరావు, అంపోలు మురళీకృష్ణ, బి.వి. దుర్గాభవాని, విష్ణుభొట్ల కృష్ణవేణి మొదలగువారు విజయవాడకు చెందిన వయోలిన్ కళాకారులు.

ప్రఖ్యాత వేణు విద్వాంసులు డా. ప్రపంచం సీతారాం విజయ వాడలో జన్మించారు. అన్నవరపు రామస్వామి శిష్యులు కూడా. అయ్యగారి శ్యామసుందర్ రామవరపు సుబ్బారావు మొదలైన వీణ విద్వాంసులు ఎక్కువకాలం విజయవాడలోనే నివసించారు. నాదస్వర చక్రవర్తి అనిపించుకున్న దాలిపర్తి పిచ్చిహరి బందరుకు చెందిన విద్వాంసుడు. వారి తమ్ముడు సూర్యనారాయణ గుడివాడ రాఘవులు, కంచెర్ల సుబ్బ నారాయణ, దెందులూరు నాగయ్య కృష్ణాతీరంలోని ప్రతిభావంతులైన నాదస్వర విద్వాంసులు.

కృష్ణానదీ పరీవాహ సౌభాగ్యంలో నాద మాధుర్యమేకాదు లయాత్మక సౌందర్యం కూడా అలఘు ప్రమాణంలోనే అభివృద్ధి చెందింది. బందరుకు చెందిన అశ్వధాటి రామమూర్తి గొప్ప మృదంగ విద్వాం సుడు. విజయవాడలో ఈయన కాశీనాథుని నాగేశ్వరరావుగారి అధ్యక్ష తన చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి ద్వారా 'మార్దంగి కాచార్య' బిరుదు నందుకున్నాడు. గుడివాడ సమీపంలోని 'దింటకుర్ర' గ్రామానికి చెందిన పోట్లూరి వీర రాఘవయ్య చౌదరి మృదంగం, కంజీర వాద్యాల్లో ప్రవీణుడు. వడాలి అగ్రహారానికి చెందిన వారణాసి ఘంటయ్య మంచి మృదంగ విద్వాంసుడు ఈయన గజారోహణం చేసిన ఘనుడు.

ఇంకా క్రొవ్విడి హనుమంతరావు, ఎల్లాసోమన్న, నర్రా గోపాల కృష్ణయ్య, మహాదేవు రాధాకష్ణంరాజు, జొన్నలగడ్డ సింహాచల శాస్త్రి మృదంగ వాద్యంలో గట్టివారు. పుదుక్కోటై మృదంగ సంప్ర దాయాన్ని కృష్ణాతీరంలో నెలకొల్పినవారు దండమూడి రామమోహన రావు. ఈయన పళిని సుబ్రహ్మణ్యం శిష్యులు. కృష్ణాజిల్లాలోనే జన్మించిన డా. ఎల్లా వెంకటేశ్వరరావు ప్రయోగశీలి అయిన మృదంగ విద్వాం సులు పద్మశ్రీ పురస్కారాన్ని అందుకున్నారు.

ఇంకా కృష్ణాతీరంలో దండమూడి సుమతి రామమోహనరావు, మహాదేవు లక్ష్మీనారాయణరాజు, ఎన్.ఎస్. కల్యాణరామన్, బి.వి. యస్. ప్రసాదు, కె. సద్గురు చరణ్, పారుపల్లి సుబ్బరాయపల్గుణ్, సాగిరిధర్ ఈనాడు వెలుగుతున్న మృదంగ కళాకారులు. చదలవాడ కృష్ణమూర్తి, ముదునూ రాధాకృష్ణమూర్తి, వడ్లమూడి బాలాజి, విష్ణుభోట్ల ఉదయశంకర్, స్టీవెన్ రాజ్ అమ్ముల ప్రసాద్, యం. విజయ కుమార్ మంచి మృదంగ విద్వాంసులు. డోలు వాద్యంలో అన్నవరపు బసవయ్య, అన్నవరపు గోపాలం, విజయవాడ కన్నారావు అలుగోలు సత్యనారాయణ ముఖ్యులు.

కృష్ణానది దక్షిణతీరంలో పరుచుకున్న గుంటూరు మండలంలో కూడా దిగ్దంతులైన కర్నాటక సంగీత విద్వాంసులు ఎందరో ఉన్నారు. గుంటూరులో నివసించిన మహావాది వెంకటప్పయ్య శాస్త్రి అమర గాయకుడు ఇంకా రాజనాల వెంకటప్పయ్య శాస్త్రి (ప్రత్తిపాడు), వారణాసి రామసుబ్బయ్య (పొన్నూరు) నారుమంచి జానకిరామయ్య, సీతారామయ్య, సుబ్బారావు (పెదరావూరు), నిరాఘాటం కృష్ణయ్య (గుంటూరు), దుడ్డు సీతారామయ్య (బాపట్ల) పురాణం కనకయ్య (గుంటూరు), బలిజేపల్లి సీతారామయ్య (గుంటూరు) తాడిగడప శేషయ్య (పొన్నూరు), పర్వతనేని వీరయ్య చౌదరి (పెదనందిపాడు) రామినేని వీరయ్యచౌదరి (బ్రాహ్మణ కోడూరు) వీరంతా తెలిసినంతలో తొలితరం గాత్ర సంగీత విద్వాంసులు. వింజమూరి వరదరాజ అయ్యంగార్ తమిళనాడులో కూడా మెప్పుపొందిన గొప్ప గాత్ర విద్వాంసులు, వాగ్గేకారులు ఉప్పలపాటి అంకయ్య (పెనుగుదురు పాడు)గారు మార్గతాళాల్లో పల్లవులు పాడిన ఘనులు.

గుంటూరు నెలవుగా జీవించిన చదలవాడ కుమారస్వామి, చదల వాడ సుబ్బయ్య మంచి వయోలిన్ విద్వాంసులు. “సంగీత విద్యా దర్పణము” అనే అత్యుత్తమ పాఠ్యగ్రంథాన్ని వెలయించిన ఉమ్మడిశెట్టి వెంకటస్వామినాయుడు గొప్ప వయొలిన్ విద్వాంసుడు. ఈయన గుంటూరువాడే. కొమాండూరి అనంతాచార్యులు, తిరుమలాచార్యులు సోదరులు (గుంటూరు), టి.యస్.సి.వి. నారాయణాచార్యులు (గుంటూరు) అద్దంకి సింగరాచార్యులు (గుంటూరు) వీరంతా మంచి వీణ కళాకారులు. వర్ధిష్ణు కళాకారుల్లో పెరవలినందకుమార్ (వయొలిన్) బి. సురేష్‌బాబు (మృదంగం) పెరవలి జయభాస్కర్ (మృదంగం) మార్టూరు హరిబాబు (ఘటం) జి. జానకి (గానం) మొదలైనవారు ముఖ్యులు. ఈ వ్యాసకర్త డోలు, ఘటం వాద్యాల్లో ఉన్నతశ్రేణి కళాకారుడేగాక సాహిత్య కృషీవలుడు. ప్రముఖ డోలు విద్వాంసులు భూసురపల్లి ఆదిశేషయ్య వ్యాసకర్త తండ్రి, గురువు.

నాదస్వర వాద్యంలో కృష్ణానది దక్షిణతీరంలోనూ గొప్ప విద్వాంసు లున్నారు. రావిపూడి నాగయ్య (కోయవారిపాలెం), తిరువళ్ళూరు రామదాసువారి కుమారులు యతిరాజులు - సుబ్రహ్మణ్యం (గుంటూరు) కాకుమాను రామచంద్రయ్య సిరిపురం పాపన్న, షేక్ చినపీరు సాహెబ్, ఆదం సాహెబ్ సోదరులు (చిలకలూరిపేట) గొప్ప విద్వాంసులు. ఇంకా వేల్పూరు సోదరులు (తెనాలి) మార్టూరు వెంకటేశ్వర్లు హైమవతి దంపతులు (తెనాలి), అట్లూరి వీరభద్రయ్య (సత్తెనపల్లి) మొదలైనవారు మంచి నాదస్వర కళాకారులు. అలాగే డోలు వాద్యంలో ముట్లూరు తిరుపతిస్వామి ముఖ్యుడు.

కృష్ణానది ఉభయపార్శ్వాలా సంగీతంలో గొప్ప ప్రవేశమున్న హరికథా కళాకారులున్నారు. వారిలో నేతి లక్ష్మీనారాయణ (విజయ వాడ) అమ్ముల విశ్వనాథం (దివితాలూక నంగేగడ్డ), బుర్రా శివరామ కృష్ణశర్మ (విశ్వనాథ పల్లి) కూచిభొట్ల కోటేశ్వరరావు (విశ్వనాథపల్లి) ముసునూరి సూర్యనారాయణ (విజయవాడ), పొడుగు పాండు రంగదాసు (కొండి పర్రు), కోట సచ్చిదానంద శాస్త్రి (గుంటూరు) ములుకూట్ల సదాశివశాస్త్రి (తెనాలి) వీరగంధం వెంకటసుబ్బారావు (తెనాలి) మొదలైనవారు ముఖ్యులు. ఆధునికుల్లో సింహాచల శాస్త్రి (గుంటూరు) చెప్పదగినవాడు.

అలాగే సంగీత ప్రధానంగా కీర్తినార్జించిన నాటక కళాకారులు కృష్ణాతీరంలో చాలామంది కనిస్తారు. వారిలో కపిలవాయి రామనాథ శాస్త్రి, రామతిలకం (విజయవాడ), జొన్నవిత్తుల శేషగిరిరావు (స్థాయి పుర అగ్రహారం), అద్దంకి శ్రీరామమూర్తి (విజయవాడ), పారుపల్లి సుబ్బారావు సత్యనారాయణ సోదరులు (శ్రీకాకుళం) దేవరకొండ వెంకటసుబ్బారావు (బందరు) పువ్వుల సూరిబాబు (బొమ్మలూరు) మొదలైనవారు ప్రధానులు.

భీమవరపు నరసింహారావు (గుంటూరు), బాలాంత్రపు రజనీ కాంతరావు (విజయవాడ), సుసర్ల దక్షిణామూర్తి (పెదకళ్ళేపల్లి)

ఆదినారాయణరావు (విజయవాడ) మొదలైనవారు కృష్ణాతీరం నుంచి వచ్చిన మంచి సంగీతదర్శకులు. విశ్వవిఖ్యాత నేపథ్య గాయకుడు ఘంటసాల వెంకటేశ్వరరావు గుడివాడ సమీపంలోని చౌటుపల్లిలో జన్మించాడు. విజయవాడ సంగీత కళాశాలకు ఆయన పేరు పెట్టడం ముదావహం.

ఇలా ఎందరో కళాకారుల సంగీత ప్రస్థానానికి నెలవై, వారి సాదన సంపత్తికి ఆధారమై, వారి వైభవానికి శోపానమై, ఆయా విద్వాంసుల నాద, స్వర ప్రస్తారాల ధ్వనిలో తన ఊర్మికల శీతల శోభను మేళవించి, ప్రపంచాన్ని పునీతం చేసి, ఆనంద తరంగిత హృదయంలో హంసలదీవి చేరి సాగర సంగమంలో జీవాత్మ పరమాత్మ సంధానాన్ని బోధించిన పవిత్ర కృష్ణవేణి నదీమతల్లికి నమస్కరిస్తున్నాను.

"సురభి సంగీత సౌభాగ్య శోభనంది
అలల లయలందు దీప్యమౌకలలదేలి
నడల నడకల హొయలుతో కదలిచేరె
కృప తరంగిత పూతమౌ కృష్ణవేణి".

\- స్నేహగీతలు

## దాసు శ్రీరాములు

ఆంధ్రాంగ్ల ములుఁగాక నమర భాషనునేర్చి
లాయరు వృత్తిలో రాటుఁదేలె
జావళీలు పదాలు స్వరజతుల్ రచియించి
స్థిరమైన సంగీత సేవఁజేసె
'సాత్రాజి తీవిలా సం' బను యక్షగా
నమ్ముతో కవియౌచు నతుల నందె
'తెలుగునాడు'ను తెల్గు 'దేవి భాగవతము'న్
గావించి జగతి ప్రఖ్యాతి నొందె
'సూర్య శతక' మాది సుందర రచనల
'బుద్ధ' నాటకాది పుణ్యకృతుల
భాసురముగ వ్రాసె 'దాసుశ్రీరాములు'
కీర్తి కళలరాణి! కృష్ణవేణి!

\- స్మితశ్రీ చిత్తజల్లు నాగేశ్వరరావు

చిరునామా : డాక్టర్ భూసురుపల్లి వేంకటేశ్వర్లు, 9848361627.

ఆచార్య ఎస్. గంగప్ప

# కృష్ణానదీ తీరం - తెలుగు వాగ్గేయకారులు

కృష్ణానదీ తీరంలో వెలసిన తెలుగు వాగ్గేయకారులు, పదకర్తలు మహనీయులెందరో ప్రసిద్ధి కెక్కారు. వారు తమ కవిత ద్వారా ప్రజా సముదాయానికి చేసిన సేవను గూర్చి తెలుసుకోవడం ఎంతైనా అవసరం. తెలుగులో పద పద్య కవితల్లో పదమే ముందు పుట్టింది. ఈ పద సాహిత్యమే పామర ప్రజానీకంలో ముక్తికి సాధనమైన భక్తి, నీతి వైరాగ్యాది వేదాంత ధోరణులను వివరించింది.

భక్తి భావన భారతీయ తత్త్వం. భక్తి ప్రచారార్థమే పద కవిత ప్రారంభమైంది. జనపదాలలోని పామర ప్రజానీకం తమకు తగిన రీతిలో ఆడిపాడుకొన్నారు. దీన్ని జానపదం అన్నాము. ఈ జానపద కవితలకు కర్తలెవరో తెలియదు. పైపెచ్చు లిఖితం కాలేదు. మౌఖికం మాత్రమే. రాజపోషణ లేదు. అయినా ప్రజల్లో పుట్టిన ఈ జానపదం 'ముఖేముఖే సరస్వతీ!' అన్నట్లు ఒకరినుండి మరొకరికి వ్యాపించింది. బ్రతికి బట్టగట్టింది ప్రజల నాలుకలపై ఈ జానపదమే తదనంతరం నిబద్ధీకరింపబడి పదసాహిత్యమైంది. దానికి రాగతాళాలతో వాగ్గేయరూపంలో వాగ్గేయకారుల వల్ల తెలుగులో ఎంతో విస్తృతి పొందింది.

తాళ్ళపాక అన్నమాచార్యులు (1408-1503) తెలుగులో మొదటి పదకర్త. ప్రథమ వాగ్గేయకారుడు. అయనకు పదకవితా పితామహుడనీ, సంకీర్తనాచార్యుడనీ బిరుదులున్నాయి. ఆ మహనీయుడు అనిబద్ధమైన జానపదగేయరీతులను నిబద్ధం చేసి పదకవితను వెలయించాడు. తిరుమల శ్రీ వెంకటేశ్వర మకుటంతో 32 వేల సంకీర్తనలు రచించి ప్రసిద్ధి కెక్కాడు. తదనంతరం అతనిపుత్రుడు పెద తిరుమలాచార్యుడు, మనుమడు చిన తిరుమలాచార్యుడు పదకర్తలుగా వెలిశారు. ఆ వెనుక క్షేత్రయ్య మొదలుకొని పదకర్తలెందరో కృష్ణాతీరంలో వెలసి, పదకవితలల్లి ప్రజా సముదాయానికి భక్తి, నీతి, వైరాగ్యాది మార్గాలను చూపి ప్రజలలో చైతన్యం తీసుకొని రావడానికి ప్రయత్నించాడు.

కృష్ణానదీ తీరంలో వెలసిన మొట్టమొదటగా పేర్కొనదగ్గ తెలుగు మహా వాగ్గేయకారుడు క్షేత్రయ్య. క్షేత్రయ్య శృంగార,మధుర భక్తి మార్గాల్లో పదరచన చేసిన వాగ్గేయకారుడు అభినయాచార్యుడు. అలాగే నారాయణతీర్థులు, సిద్ధేంద్రయోగి నరసింహదాసు ఎడ్లరామదాసు మొదలైన మరికొంతమంది పదకర్తలు. తదనంతరం దాసు శ్రీరాములు, తుమురాడ సంగమేశ్వరశాస్త్రి, ప్రయాగ రంగశర్మ, కొచ్చెర్ల కోట రామరాజు, పాపట్ల కాంతయ్య, పురాణం కనకయ్య శాస్త్రి, పిరుట్ల శంకరయ్య శాస్త్రి, హరినాగభూషణం, ఓగిరాల వీర రాఘవశాస్త్రి, తిరుమల నల్ల చక్రవర్తుల వేంకటనారాయణాచార్యులు, శొంఠి సీతారామయ్య మొదలైనవారు అధునాతన వర్గంలోని తెలుగు వాగ్గేయకారులు. జాతి గర్వించే తెలుగు ఉత్తమ వాగ్గేయకారులు డా॥ బాలాంత్రపు రజనీకాంతరావు, డా॥ మంగళంపల్లి బాల మురళీకృష్ణగారు. వీరు జీవ ద్వాగ్గేయకార సత్తములు. ఇంకా కాలజ్ఞాన తత్వకర్తలు. పోతులూరి వీరబ్రహ్మం, ఆయన శిష్యుడు దూదేకుల సిద్ధయ్య, ఇంకా యక్షగానకర్తలు, హరికథా వాగ్గేయకారులు ఎందరో వెలిశారు. అత్యాధునిక బుర్రకథా ప్రవర్తకుడు 'బుర్రకథా పితామహ' షేక్‌నాజర్ మొదలైనవారిని స్మరించుకోవలసినది.

పైని పేర్కొన్న కొందరు ప్రసిద్ధులైన తెలుగు వాగ్గేయకారుల జీవితవిశేషాలను సంగ్రహంగా తెలుసుకొని, వారు చేసిన సేవలను వివరించడం ఈ వ్యాసోద్దేశం :

కృష్ణానదీ తీరంలో వెలసిన తెలుగు వాగ్గేయకారుల్లో ప్రప్రథమంగా పేర్కొనదగ్గ మహావాగ్గేయకారుడు, పదకర్త, అభినయాచార్యుడు, క్షేత్రయ్య. క్షేత్రయ్య కృష్ణాజిల్లా మువ్వలో వెలసిన మువ్వగోపాలునిపై పదరచన చేసి పదకర్తగా, వాగ్గేయకారుడుగా, అభినవచార్యుడుగా ప్రసిద్ధి కెక్కాడు. ఇతని కాలం 1599-1675 మధ్యలో పుట్టి పెరిగినా తంజావూరు వీర రాఘవనాయకుని ఆస్థానంలో ఉండేవాడు. రఘునాధనాయకుని తుపాకుల కృష్ణప్ప నాయకుని గోల్కొండ పాదుషా

ఆస్థానాల్లోనూ ఉన్నట్లు తెలియవచ్చింది. క్షేత్రయ్య పదాలు అంటే శృంగార పదాలు అర్థం. ఇందులో అష్టవిధనాయక శృంగారంతోపాటు మధురభక్తి పూరితంగా క్షేత్రయ్య పద రచన చేసి ఖ్యాతి గడించాడు. ఇది భాగవత్ భక్తినిరూపికమైంది. ముఖ్యంగా క్షేత్రయ్య నాయక అయి మువ్వగోపాలుని ప్రియునిగా భావించి వర్ణించిన మధుర భక్తి అనన్య సామాన్యం. ఒక్క ఉదాహరణ :

**'చూడరె! అది నడిచే హొయలు! సుదతి చేయుజాడలు,**
**ఆడది కులకాంత అత్తితోటికోడలు! అలగోపాలుని**
**ఉరికి వెడలెను"**

– అనే పదంలో భాగవతంలోని గోపికా మధురభక్తిని స్పష్టం చేశారు క్షేత్రయ్య. ఇంతేకాక క్షేత్రయ్య పదాలు అభినయానుకూలమైనవి. ఆనాటి నుంచి పదాభినయం ప్రాముఖ్యం వహించినది.

క్షేత్రయ్య సమకాలికుడు నారాయణ తీర్థులు. ఇతనికాలం 1580-1680. కూచిపూడిలో అత్యంత సంబంధమున్న వాగ్గేయ కారుడు. సంస్కృతంలో శ్రీకృష్ణలీలాతీరాతరంగణి, తెలుగులో పారిజాతాపహరణం రచించాడు. మధుర భక్తిరసరమ్య రచనలు. స్వామి శివశంకరస్వామిగారు తాము నారాయణ తీర్థుల వంశీకుల మనీ, గుంటూరు జిల్లా కాజవారి నివాసస్థలమనీ వివరించారు. దక్షిణ దేశం వెళ్ళి తదనంతరం ఉత్తరదేశం మీదుగా కాజలో, కూచిపూడిలో స్థిరపడినా, చివరికి దక్షిణదేశంలోని తిరుపుందుర్తిలో సిద్ధి పొందినట్లు తెలుస్తుంది.

నారాయణతీర్థులు శ్రీకృష్ణలీలాతరంగణిలో భక్తి, శృంగారం, మధురభక్తి నిండి అభినయానుకూలంగా ప్రత్యేకించి కూచిపూడి అభినయానుకూలంగా రచించాడు. తీర్థుల కృతి జయదేవుని గీత గోవిందకావ్యం లాంటిది. భాగవత మధుర భక్తికి పెద్ద పీట వేశాడు. అదే ఆత్మ పరమాత్మల కలయికకై చేసే ప్రయత్నం.

**"ఆత్మారామాః పరమానంద నిత్యతృప్తాః పునఃపునః**
**ఆత్మానుభూతింగాయంత్యః కృష్ణకర సతాః నమః"**

– గోపికలు శ్రీకృష్ణునిలో అభేదం పొంది ఆత్మారామలై పరమాత్మ స్వరూపమ్ విహారస్థానంగా పరమానంద రసం వల్ల శాశ్వతమైన తృప్తి గలిగి సుఖాన్ని గానం చేస్తున్నారని అర్థం. ఇదే భాగవత మధురభక్తి తీర్థులనగానే 'కృష్ణంకలమసఖీసుందరం" తరంగ గుర్తుకు రావలసిందే!

కూచిపూడి నాట్యానికి మూలపురుషుడు సిద్దేంద్రయోగి. ఇతడు నారాయణ తీర్థుల శిష్యుడు; భామాకలాపం, గొల్ల కలాపం అనే కలాప రచనలు చేసి పరంపరగా అభినయ రీతులకు ప్రాముఖ్యం తెచ్చారు. ఈ భామాకలాపం విద్వాంసులైన బ్రాహ్మణ కుటుంబంలోని స్త్రీలుగా పురుషులు మాత్రమే ప్రదర్శనలు ఇవ్వాలన్న ఆంక్ష ఉండేది. ఈ కూచిపూడి నృత్యంలో నారాయణ తీర్థుల తరంగాలతో పాటు, క్షేత్రయ్య పదాలు ఒకభాగంగా అభినయించడం సర్వసాధారణం. అవి సీమలో కూచిపూడి, పెదపూడి, మొవ్వ, ఘంటసాల, శ్రీకాకుళం – అనే ప్రసిద్ధ క్షేత్రాలు ఉన్నాయి.

సిద్ధేంద్రయోగి మూలాన ప్రత్యేకమైన నాట్యలాడి కూచిపూడి నాట్యం ప్రచారంలోకి వచ్చి ప్రసిద్ధి పొందింది. సిద్ధేంద్రయోగి భామాకలాపం, గొల్లకలాపం రచించి అభినయింపచేస్తూ వచ్చారు. శృంగారం, భక్తి, మధుర భక్తితో నిండి ఉంటుంది. భామాకలాపం, గొల్ల కలాపంలో వేదాంత ధోరణి విదితమవుతుంది.

తూము నరసింహదాసు చాలా ప్రసిద్ధ పదకర్త. ఇతడు గుంటూరు నివాసి. త్యాగరాజు (1767-1847) కు సమకాలికుడు. భద్రాచల రామదాసు భక్తుడై అపర రామదాసులాగానే కీర్తన రచన చేసి భక్తిని ప్రకటించుకొన్నాడు. తూము నరసింహదాసు ముద్రతో కీర్తనలు అనేకం రచించాడు. భద్రాచలంలోనే రామచంద్రునితో ఐక్యమైనట్లు తెలుస్తుంది. ఈ పదకర్త భజన పద్ధతిలో కీర్తనలు రచించారు. కొన్ని రామదాసు కీర్తనలలోని పల్లవులను స్వీకరించినట్లు ప్రసిద్ధవిషయమే. భజన చేసేవిధము తెలియండి అనే కీర్తన భజన కూటములలో వినిపిస్తా ఉంటుంది. "రామామృతమే నీకు రక్షకమనుకోకే మనసా" మొదలైన కీర్తనలు చాలా ప్రసిద్ధి పొంది ప్రచారంలో ఉన్నాయి.

తత్త్వ కర్తల్లో ప్రసిద్ధుడైన వీర బ్రహ్మేంద్రస్వామి తరువాత అంతటి ప్రసిద్ధుడు తత్త్వకర్త ఎడ్ల రామదాసు 19వ శతాబ్ది చివరి భాగానికి చెందినవాడు. ఎడ్లరామదాసు 119 కీర్తనలు రచించారు. సాంఖ్యయోగ తార్కికామనస్కయోగం" అనేపేరుతో ప్రకటితం. దీనితో పాటు ఆయన శిష్యులు రచించిన కొన్ని కీర్తనలతో ఎడ్ల రామదాసు చరిత్ర పేర ప్రకటితం. ఇవి బాగాప్రసిద్ధి పొందాయి. ఇందులో కీర్తనలు, భజన కీర్తనలు ఉన్నాయి. ఈశ్వరాజగదీశ్వరా! పరమేశ్వరా! కరుణించరా!" "జీవమా! మేలుకొనవే; అనుమానమెందుకే మనసా! ఈ తనువు నిత్యముగాదు హంసా! దీని భావము తెలియవలెనన్న

నీలోను బ్రహ్మము" మొదలైన కీర్తనలు, తత్త్వాల్లా, వేదాంత ధోరణిలో ప్రసిద్ధి ప్రచారమూ పొందాయి.

హరినాగభూషణంగారు 'జమునాట' అనే నూతన రాగాన్ని సృష్టించి, రామాయని పిలిచిన పలుకవేమి? నామాటలు వినరావో!" అనే కీర్తన రచించి ప్రసిద్ధుడయ్యారు. ఇంకా అనేక కీర్తనలు రచించారు.

కాగా జీవద్వాగ్గేయకారులు మహనీయనీయులిద్దరు. డా॥ బాలాత్రిపుర రజనీకాంతరావుగారు సంగీత సాహిత్యాలలో ప్రసిద్ధులు. వారి "కొండనుంచి కడలిదాకా" సంగీత గేయ రూపకం చాలా ప్రసిద్ధిపొందింది. ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర తెలుగులోను, క్షేత్రయ్యను గూర్చి ఆంగ్లంలోను, రచించి కీర్తి గడించారు. ఇటీవలే శతవసంతాలు వేడుకలు ఘనంగా జరుపుకొన్న పూర్ణపురుషులు.

ఇంక ఆంధ్రదేశమే కాదు భారతదేశము గర్వించదగ్గ మహోన్నత వాగ్గేయకారుడ, సంగీతవేత్త, 'పద్మభూషణ్' డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణగారు 'జనకరాజకృతిమంజరి" అనే తమ 72 మేళకర్త రాగాలను స్వరపరచి 'రాగాలోరవళి' అనే ప్రసిద్ధ నామంతో 1983లో ప్రకటించారు. సంస్కృతాంధ్ర భాషల్లోనే గాక తమిళంలోను కీర్తనలు రచించారు. వాగ్గేయకారుడు ప్రయాగరహ శర్మగారి దౌహిత్రులు వీరు. పారుపల్లి రామకృష్ణయ్య పంతుల శిష్యులు. బాలమురళీకృష్ణ గారు నూతనంగా 'మోహనాంగి'రాగం కృతిని సృష్టించారు.

మోహనాంగిరాగం - రూపక తాళం

పల్లవి : నీ నామమె నా జీవము - సుధామధురము

అనుపల్లవి : నీ....... నీ మాట గీతమై

నిను తలచి పులకించి ఫలియించెను జన్మము ॥నీ నామమే॥

చరణం : పునీతమై సునాదమై - భావమెల్ల వినోదమై

జనార్ధన మనోహరి - మోహనాంగి రాగరవళి - సునీల మురళీకృతి ॥నీనామ॥

ఇలాగా బాలమురళీకృష్ణగారు ప్రసిద్ధి కెక్కిన విషయం విదితమవుతుంది.

ఈ విధంగా కృష్ణానదీ తీరంలో ఎందరో పదకర్తలు, వాగ్గేయకారులు వెలసి ప్రజలకు ముక్తికి ప్రధానమైన భక్తిని ప్రబోధించారు. ప్రసిద్ధ వాగ్గేయకారుడు క్షేత్రయ్య మొదలుకొని పద్మభూషణ్ బాలమురళీకృష్ణ వరకు తెలుగులో వెలసి అద్భుతమైన భారతీయ తాత్త్వికతను సుసంపన్నం చేశారు. ప్రజలలో భక్తిభావం నెలకొల్పి తద్వారా ముక్తికి మార్గదర్శనం చేయడానికి ఉపకరింప చేయడం వారి లక్ష్యం. వాగ్గేయకారుల సేవలు విస్మరించరానివి.

**ఉపకరించిన గ్రంథాలు**


1. ఆంధ్రవాగ్గేయ కారచరిత్రము : మొదటి భాగము ; రెండవభాగము : 2001

**శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు**

2. క్షేత్రయ్య పదసాహిత్యం : 1974 : ఆచార్య ఎస్. గంగప్ప
3. తెలుగులో పదకవిత : 1983 : ఆచార్య ఎస్. గంగప్ప
4. తెలుగులో వాగ్గేయకారుడు : 1983 : ఆచార్య ఎస్. గంగప్ప

**యువభారతి ప్రచురణ**

5. అన్నమాచార్య ప్రముఖ వాగ్గేయకారులు : తులనాత్మక అధ్యయనం : 1992 : ఆచార్య ఎస్. గంగప్ప.

డాక్టర్ వేమూరి సత్యవతి

# రావూరి భరద్వాజగారు - పాకుడురాళ్ళు

భారతదేశంలో అత్యంత ప్రతిష్ఠాకరమైన "జ్ఞానపీఠ" బహుమతిని మూడవసారి తెలుగు సాహిత్యంలో లభింపచేసిన నవల పాకుడురాళ్ళు!

"డబ్బుతో నన్ను కట్టేస్తున్నారు! అసలు ఈ ప్రపంచాన్నే డబ్బు కట్టేస్తున్నది! ఈ మాటలు పాకుడు రాళ్ళు నవలలోవే! ఇందులో ఏముంది ప్రత్యేకత? అందరికీ తెలిసిన అంశమేకదా అనిపిస్తుంది! కానీ ఈ నవలా రచయిత రావూరి భరద్వాజగారు కేవలం డబ్బు ప్రాధాన్యతని చెప్పటం కోసం ఈ నవల వ్రాయలేదు! కొన్ని కోట్లమంది ఎంతో ఆసక్తిగా గమనించే సినిమాలు సినిమాతార తళుకు-బెళుకుల అందాలు - నిర్మాణాలు - ఎన్నో భ్రమలతో అందులోకి వెళ్ళాక వెనక్కి తిరిగి రాలేని విలువల పతనం గురించి విపులంగా అనేక అంశాలను వివరించారు. తెరపై నటనలే కాదు, నటులుగా రాణించటానికి, వృత్తిలో పురోగమించటానికి ఎన్ని సార్లు మనసు చంపుకోవాలో, నటించాలో, నాటకాలాడాలో, నయగారాలు పోవాలో, కుతంత్రాలు, కుట్రలు, ఎత్తులకి పై ఎత్తులతో అనుక్షణం అప్రమత్తతతో వుండాలో తెలియచేశారు. ఈ నవలని ఇంత ఉన్నతం చేయటానికి కారణం ప్రపంచాన్ని డబ్బుకట్టేయటం కాకుండా అంతకుమించి దయ, మంచితనం, స్నేహం, అభిమానం, మానవత్వం ఇలాంటి వాటితో ప్రపంచం కట్టివేయబడితే ఎంత బాగుంటుంది? అనే ఒక వేదన నవలలో ధ్వనిస్తుంది.

ఇంకో విచిత్రమైన విశేషం ఏమిటంటే పాకుడు రాళ్ళు నవలా రచయిత 7వ తరగతి వరకు మాత్రమే చదువుకున్నారు! 1927 జులై 5న మల్లిక - కోటయ్య దంపతుల సంతానమైన భరద్వాజగారి బాల్యం గుంటూరు జిల్లా తాడికొండలో ఒక పల్లెటూళ్ళో గడిచింది. ఎనిమిదవ తరగతిలో ఇనస్పెక్షన్ జరిగే రోజు చినిగిన లాగు వేసుకున్నందుకు మాస్టారు కొట్టటంతో బడిమానేసిన పేదరికం! పుస్తకాలు నోట్సులు కొనలేని పేదరికం! ఇంట్లో నుంచి వెళ్ళి అదే వూళ్ళో చెరువు నీళ్ళుతాగుతూ, పొలాల్లో వేరుశనగ కాయలు, జొన్నవిత్తులు తింటూ గడపటం. భయంకరమైన దరిద్రం నుంచి పొట్ట నింపలేక ఆకలితో వుండే పస్తులు - అనుభవాలతో ఎన్నెన్నో పాఠాలు నేర్చుకోవటం జరిగింది!

ఎలా? ఆ పద్యం మనుచరిత్రలోదిట! ఎలా చదవాలి?! లైబ్రరీకెళ్ళి పుస్తకం అడిగినా ఇంటికివ్వరు. ఏగుడిలోనో కూర్చుని చదవాలంటే ఎలా? నెలకి పావలా కట్టాలి! దిగులుగా వున్న భరద్వాజని కొల్లూరి వెంకటేశ్వర్లు అనే మిత్రుడు పలకరించి 5 రూపాయలిచ్చాడు. దానితో 12 నెలలకి 3 రూపాయలు లైబ్రరీలో కట్టి రసీదు+రెండు రూపాయలు వెంకటేశ్వర్లుకి అప్పుచెప్పాక భరద్వాజ అన్ని పుస్తకాలను ఔపోసన పట్టి నిఘంటువులు, నానార్థాలు, పర్యాయపదాల సాయంతో విజ్ఞానవంతులయ్యారు! ఆ పల్లెలోనే నినాదాలు ఇవ్వటం, పోస్టర్లు అంటించటం దగ్గర నుంచి కూలిపనులు కలుపు తీయటం పొట్టకూటి కోసం ఎన్నో పనులు చేస్తూ, "అడుక్కు తినటానికి కూడా పనికిరావు" అన్న చోటనే చిన్న చిన్నగా రేషన్ షాపులో తూకాలు తూయటంలాంటి పనులు చేసి క్రమంగా నీతి - నిజాయితీలను దయాగుణాన్ని ఆర్ద్రతను వదలకుండా జీవిత పాఠాలు నేర్చుకున్నారు! కులాలు వర్ణాలు పట్ల ఒక ఏవగింపు అనేక సంఘటనల వలన కలిగింది. 'జమీన్ రైతులో చిన్న ఉద్యోగం ఆత్రేయగారు మానేసి భరద్వాజకిప్పించారు. దీనబంధు, జ్యోతి, రేరాణి, సినిమా, యువ ఇలా అనేక పత్రికలలో పని చేసి ఆ రంగంలోని అనేక అంశాలను పాఠాలుగా నేర్చుకున్నారు. త్రిపురనేని గోపీచంద్‌గారి సాయంతో విద్యార్హతలు లేకున్నా రచయితగా గల శక్తితో ఆకాశవాణిలో స్క్రిప్ట్ రచయితగా చేరి పదవీ విరమణ వరకూ ఆకాశవాణిలోనే వున్నారు.

యస్.యస్.యల్.సి. పాసయ్యాడనీ, 60 రూపాయల జీతం అనీ అబద్ధాలు చెప్పి మేనమామ ఒక సంబంధం కుదిర్చి 1948లో కాంతమ్మతో పెళ్ళి చేశారు. మనసు తెల్సుకుని అనుకూలంగా అనురాగంగా తల్లి వాత్సల్యంతో చూచుకునే జీవన సహచరి 1986లో గతించారు. చేసిన మేలు మరచిపోని కృతజ్ఞతతో భరద్వాజగారు తన కుమారులు పెద్దవానికి ఆలపాటి రవీంద్రనాథ్‌గారి పేరు రవీంద్రనాథ్ అనీ రెండవ కుమారునికి త్రిపురనేని గోపీచంద్ గారి పేరు గోపీచంద్ అనీ, డాక్టర్ గావి బాలసుందర్ రావుగారి పేరు మూడవ కుమారునికి బాలాజీ అనీ నాల్గవ కుమారునికి తండ్రిపేరైన కోటయ్య అని వచ్చేలా పెట్టారు. ఒకనాడు ఆకలితో వున్న తనకి అన్నంపెట్టిన మాలపద్దక్క పేరును కూతురుకి పద్మ అని పెట్టుకున్నారు.

85 దాకా రచనలు చేయటమే కాక "జ్ఞాపకాలు, వ్యాసాలు, జర్నలిస్టుగారచనలు స్క్రిప్టు రచయితగారేడియో ప్రొడ్యూసర్‌గా కథా రచయితగా, కవితా సృజనకర్తగా, వ్యాస కర్తగా నాటక ప్రయోక్తగా ఇలా ఎన్నో వ్రాశారు. మొదటి రచన విమల, అనే కథ ప్రజామిత్ర

వారపత్రికలో 1946లో రచించారు. అప్పటి నుంచీ రచనలు చేస్తూనే వచ్చారు. గతంలో తానునుభవించిన సంఘ టనలు, అవమానాలు తాను ఎదగటానికి ఇటువంటి రచనలు చేయ టానికి పాఠాలుగా పనికి వచ్చాయనుకునే పరిపక్వత భరద్వాజ గారిది.

"పాకుడు రాళ్ళు" గురించి రావూరు భరద్వాజగారు తాను గమనించిన వాస్తవ సంఘటనలను ఆధారం చేసుకునే రచించారు. "మాయ జలతారు" అని ఇదే కథా వస్తువుగా ముందుగా కథ వ్రాయటం జరిగింది! మల్లంపల్లి వారు ఈ కథని చదివి 10 మందిని కూచోబెట్టి వందమందికి సరిపడా వడ్డించినట్టుంది. అన్నారట! ఒక నవలగా విస్తృతంగా వ్రాయాల్సిన కథా వస్తువు చిన్నగా కథ వ్రాశా రనటం ఆలోచింప చేసింది! కృష్ణా పత్రికవారు ఏదైన వ్రాయమని అడిగినపుడు పాకుడు రాళ్ళు నవల సీరియల్‌గా 10,12 వారాల కథగా అలా పెంచుతూ వ్రాయటం జరిగింది. శీలావీర్రాజుగారు 'పాకుడు రాళ్ళు' అని పేరు పెట్టారు. అర్థవంతంగా ! అనేకమైన బెదిరింపుల ఫోన్లు, చంపుతామని బెదిరింపులు వచ్చినా ఈ పాకుడు రాళ్ళు నవలని చాలా సాహసంతో వ్రాయటం జరిగింది.

"ఇటువంటి మాటలూ, ఇవే మాటలు తనిప్పటికి లక్షాతొంభై సార్లు విన్నది. తన దగ్గరకొచ్చిన ప్రతి వెధవ సన్నాసీ ఈ మాటల న్నాడు" ఇలాంటి స్వగతాలతో కథానాయిక మంజరి మనసు ఆవి ష్కరించబడుతుంది. ఆమె అంతర్మధనం ముచ్చట కలిగిస్తుంది. సినిమా రంగంలో సాంకేతికాంశాలూ దానిని చక్రవర్తులై ఏలుతున్న నిర్మాతలు, డిస్ట్రిబ్యూటర్లు, దర్శకులు, ఇంకా అనేక ఇతరాంశాలూ ఎన్నో మార్పులు చాలా వచ్చి వుండవచ్చు కానీ "పాకుడు రాళ్ళు" నవలలోని అనేక ఆర్థికాంశాలు, నటీమణుల పేర్లు అపఖ్యాతిపాలు చేస్తామని బ్లాక్ మెయిలింగ్ చేసేవాళ్ళు, ఒక సినిమాకి సంతకం పెడితే తర్వాత కొన్ని అవకాశాలివ్వాలనే ఒప్పందాలు, నటీమణుల శరీరాల్ని జీవితా లని శాసించే కొందరు, అసలు విషయం తెలియకుండా ఇక్కడా అక్కడా చెప్పుడు మాటలు చెప్పేవాళ్ళు, సినిమాల మోజుతో భర్తా ఇల్లూ పిల్లల్ని వదిలి వచ్చి మోసపోతున్న తాయారులాంటి వాళ్ళుఅవే మోసాలు, అవే నాటకాలు, అవే భేషజాలు సినిమాయా ప్రపంచంలో పరిస్థితులు అలానే వుంటున్నాయి. వుంటాయి కాబట్టి పాకుడు రాళ్ళు సీరియల్‌గా వచ్చి ఇన్నేళ్ళయినా, 53 సంవత్సరాల క్రితం ప్రచు రింపబడినా జీవకళలో వస్తుపరంగా, అంతర్లోక మథనానికి, ఏకాం తానికి అక్షరరూపంగా భరద్వాజగారు మలచిన శైలి ఆకట్టుకుంటుంది! ఇందులో పాత్రల్లాగా పాపపుణ్యాలు, దయా దాక్షిణ్యాల ప్రసక్తి లేకుండా ఆనందానుభూతులకి, ధనమిచ్చే సౌఖ్య సంతోషాలకి మాత్రమే జీవన సమరంచేసి ఏదో సాలెపురుగు గూటిలోనో, నక్క జిత్తుకో చిత్తుగా ఓడిపోయి, ఓటమి భరించలేక విషాదాంతపు ఆత్మహత్యలు చేసు కోవటం పునరావృతమౌతూనే వుంటుంది! ఉంటోంది! హీరోయిన్‌లే కాదు ఉదయకిరణ్‌లాంటి అందమైన హీరోలు కూడా ఇటువంటి ముగింపులే పలికారు.

భారత దేశానికి స్వరాజ్యం వచ్చిన 1947 ఆగష్టు 15వ తేదీ పావలాకి కానీ భోజనం రాదు కనుక రెండు అణాలు మాత్రమే చేతిలో ఉన్న రావూరి భరద్వాజ పెన్నానదినీళ్ళు తాగి ఆకలి తీర్చుకున్నారట. ఒక తమ్ముడుని, చెల్లిని వైద్యం చేయించే పరిస్థితి లేక చిన్నతనంలోనే పోగొట్టుకున్నారట! ఆరు దశాబ్దాలుగా వివిధ ప్రక్రియలలో రచనలు చేసిన రావూరి భరద్వాజగారు 7వ తరగతి మాత్రమే చదివి గ్రంథా లయంలో పుస్తకాలని చదివి మంచి రచయితగా గౌరవ డాక్టరేట్‌ల నందుకున్నారు. కళాప్రపూర్ణ గౌరవం పొందారు. రాష్ట్ర సాహిత్య అకా డమీ, కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతులందుకున్నారు. అత్యున్నత పురస్కారం 2013లో 'జ్ఞానపీఠ' బహుమతి గౌరవం పొందారు.

ఆ సందర్భంగా ముఖాముఖీలలో 'మంజరి' పూర్తి కల్పిత పాత్ర కాదనీ, ఎందరో నటీమణుల సమాహారం 'మంజరి' అంటారు. మంగమ్మకి స్ఫూర్తి ఒకరినీ తర్వాత కాలంలో "నాక్కావాల్సిన మంచి పాత్ర ఇవ్వు! నీక్కావల్సింది తీసుకో" అనటం చివరికి ఎటువంటి విషాదాంతపు ముగింపు నిస్తుందో తెలియ చెప్పారు.

తనని ఎంతగానో గౌరవించి, ప్రేమించిన భార్య 'కాంతమ్మ'ని స్నేహార్ద్రతతో రచనలలో తలచుకున్నారు.

'జీవన సమరం' రచన కూడా చిలకజోస్యం, చెప్పేవారు. చెవుల్లో గువిలి తీసేవారూ, గిన్నెల చిల్లులకి మాట్లువేసేవారు ఇలాంటి వాళ్ళ జీవితాలు వాళ్ళు పొట్ట తెరువుకి చేసే జిమ్మిక్కులు చాలా పరిశీలించి వ్రాశారు.

ఎంత ఆకలితో వున్నా, ఆదరణ లేకున్నా, అవమానాలు పడినా, అతి చిన్న ఉద్యోగాలు, కూలిపనులు చేసినా చిన్నవయసునుంచీ వక్ర మార్గం పట్టకుండా స్వాభిమానంతో విలువలతో జీవించిన వ్యక్తిగా నిగర్విగా రావూరి భరద్వాజ వ్యక్తిత్వం, శైలి అందరినీ ఆకట్టు కుంటుంది.

నాలుగుసార్లు మళ్ళీ మళ్ళీ ముద్రించబడిన పాకుడురాళ్ళు నవలల్లో మంజరి, చలపతి, కళ్యాణి, రాజమణి, తాయారు, వసంత, రావుగారు, మూర్తి, చంద్రం, శర్మ, చివరగా మాధవరావు అంతా సజీవపాత్రలు 50 సంవత్సరాల తర్వాత కూడా కన్పించటంలోనే భరద్వాజగారి మానవ నైజాలను పరిశీలించిన అనుభవం తెలుస్తుంది!

ఒక రచయితగా "బీదవాళ్ళకి ఇవ్వటం కాదు, బీదతనం వాళ్ళం దరికి రాకుండా వాళ్ళని తయారు చేయాలి! అందరినీ సంతృప్తిపరిచే మార్పురావాలి! ఆనందాశ్రువులుండాలి! దుఃఖాశ్రువులుకాదు. అని కోరుకున్న జ్ఞానపీఠ పురస్కార గ్రహీత రావూరి భరద్వాజగారి మాటల్ని నిజం చేయగల నాయకులు, సంస్కర్తలు రావాలని కోరుకుందాం!

*చిరునామా : డా॥ వేమూరి సత్యవతి, M.A.Phd., 40-1-1/18, స్రవంతి అపార్ట్‌మెంట్స్, మొగల్రాజపురం రోడ్, లబ్బీపేట, విజయవాడ. email :* ***satyavathi.vasavya@gmail.com***

శ్రీ వీరాజీ

# కృష్ణాపుష్కర హేళ !

ఈ సారి పుష్కరాలకి చాలా ప్రత్యేకతలున్నాయ్! ఆంధ్రా, తెలంగాణా రాష్ట్రాలు రెండూ విడివిడిగా ఎవరి ఉత్సాహాన్ని వాళ్ళ ప్రదర్శిస్తూ - పుష్కరాలకు మార్చి నుంచే ఆయత్తమైనారు.

దేశంలోనే మూడో పెద్ద నది అయిన కృష్ణ 1300 కిలో మీటర్ల నిడివి గలది. మహారాష్ట్ర, కర్ణాటకా, తెలంగాణా, ఆంధ్రా రాష్ట్రాలను సస్యశ్యామలం చేస్తూ నదిగానే గాక జలవిద్యుత్ ప్రాజెక్టులకు కూడా పేర్గాంచిన కృష్ణానదీ పడమటి కనుమలలో పుట్టి భారతమాతకొక వడ్డాణంలాగా అడ్డంగా ప్రవహించి తూర్పు కనుమల దాకా - మరాఠీ, కన్నడ, తెలుగు జాతుల్ని పునీతుల్నీ, పులకితుల్నీ చేస్తూ - 'హంసలదీవి' దగ్గర సాగరసంగమం అవుతున్నది.

కృష్ణానదీ మహాబలేశ్వరం దగ్గర 'జోర్' అనే గ్రామందరి పుట్టి నందుకు - మొదటి నుంచీ ఉరవళ్ళు పరవళ్ళుగానే దేశంలో పడమర, తూర్పుదిక్కుల్ని అందుకుంటున్నది. నిజానికి కృష్ణవేణీ నది అనేక ఉపనదుల సంగమం. మనిషి నదులు అనుసంధానం మొదలు పెట్టక ముందే స్వయంగా నదులే సంగమమై మానవాళి కల్యాణానికి సంగ మించి మనిషికి తిండీ, దారి, విద్యుత్ శక్తీయిస్తున్నాయి. కృష్ణానది శాతవాహనులకి, ఇక్ష్వాకులకీ కూడా అత్యంత ప్రియమైన నది.

కృష్ణానదీ తీరాన మన ప్రాంతంలో బెజవాడ లేదా విజయవాడయే అతి పెద్ద కీలకమయిన నగరం. ఇప్పుడు అమరావతి ప్రాంతంలో ఆంధ్ర రాజధానీ నగరం నిర్మాణం జరుగుతూ వున్నందున - అమరలింగేశ్వరస్వామి ఆలయనగరం, అమరావతీ తీరం వెలుగులోకి వచ్చింది. శుభం! ఇక్కడ ఒక బుద్ధవిగ్రహం స్థాపించడం జరిగింది. దానికి దగ్గర "ధ్యాన బుద్ధా" పుష్కర ఘాట్‌లు నిర్మించారు.

**అతి పెద్ద ఘాట్ :**

కృష్ణాతీరంలో బెజవాడ దుర్గాఘాట్ అతి పెద్దది. రైల్వేస్టేషన్‌కీ, బస్‌డిపోకీ, నగరంలోని యితర ప్రాంతాల దేవాలయాలకీ తీరం అవతల గుంటూరు జిల్లాకీ యీ ఘాట్ అతి అనువుగా, సులువుగా, సదుపాయంగా యీ సారి మరింత ఘనంగా నిర్మిస్తున్నారు. పుష్కరుడు విచ్చేసి గురు, కన్యారాశి సంగమంలో నదిలో విడిసి వున్న తరువాత, ఆగష్టు 12 నుండి 23 దాకా మాత్రమే భక్తుల సందడి, సంబరం వుంటుంది. దేశం నలుమూలల నుంచీ బెజవాడ రావడం, రైలు మీదైనా, బస్సుమీదైనా, యిప్పుడు విమానాలు మీద కూడా రావడం సదుపాయంగా వుంటుంది. కనుక పైగా జగజ్జనని వాసి కెక్కిన దుర్గమ్మ ఇంద్రకీలాద్రిపై విరాజమానమై వున్నది కనుక బెజవాడ నగరం - దాని పరిసరాలలో గుంటూరు జిల్లాలో గల దేవాలయాలకీ శోభ, జనతొక్కిడీ కూడా మళ్ళీ ఏడాది చివర జరిగే అంత్య పుష్కర వేళదాకా యినుమడిస్తూనే వుంటాయి.

**బెజవాడ ప్రాముఖ్యత :**

ప్రకాశం బ్యారేజీకి సాగర్, శ్రీశైలం ప్రాజెక్టులకున్నంత ప్రాము ఖ్యత వున్నది. కృష్ణానదికి మన తెలుగు రాష్ట్రాలు రెండింటా విడివిడిగా పుష్కరాలు పవిత్ర సంబరాలు, సమారాధనలు సాగు తూండటం యిదే తొలిసారి. తెలంగాణాలో రెండు జిల్లాలు, ఆంధ్రాలో కృష్ణా, గుంటూరు, కర్నూలు, రాయలసీమలలో పుష్కర వైభవం కోట్లాది భక్తులను వారి జన్మజన్మల పాపాలనూ ప్రక్షాళనం చేస్తూ తరింప జేస్తుంది. కృష్ణవేణీనదిలోతు (75 అడుగుల గరిష్టం) కూడా ఎక్కువ. ఆయకట్టు కూడా చాలా ఎక్కువ. తాజాగా 'పట్టిసీమ' ఎత్తిపోతల పథకంతో, కృష్ణా, గోదావరీ నదుల మరోరకమయిన సంగమం బెజవాడ 'గట్టెనుక' జరుగుతున్నది. ఒకరకంగా యీ సారి పుష్కరాలలో భక్తులు యీ అతిపెద్ద ప్రాచీన రెండింటి జలాల సంగమంలో కూడా స్నానాలు చేస్తున్నారని అనుకోవచ్చును. కృష్ణకి అతి పెద్ద ఉపనదులు - తుంగభద్ర, భీమానదులు.

### కృష్ణమ్మ తల్లికీ కోటిదండాలు !

'కృష్ణమ్మ తల్లికి కోటిదండాలు' అంటూ జనం పరవశులై మ్రొక్కుతారు. అతిశయోక్తి లేదు. అన్నంపెట్టే, వెల్తురునిచ్చే విశాల సుదీర్ఘ పరీవాహిక ప్రాంతం వున్న యీ నది భారతమాతకు కటి సూత్రమే! (వడ్డాణం) జూరాల తెలంగాణా దగ్గర మొదలెట్టి – కృష్ణమ్మ కోడూరు దగ్గర హంసలదీవి దాకా–కోట్లాది జనాలకి ఇహపర భోగాలను ప్రసాదిస్తున్నది. నాగార్జున సాగర్‌ని మించిన అన్నదాత మరొకటి లేదు.

దేశం మొత్తం మీద లభించే ఫలసాయంలో 40.4% పంట కృష్ణవేణీ మాత వరప్రసాదమే! అందుకే యీ పుష్కరాలకు రెండు తెలుగు రాష్ట్రాలు ప్రభుత్వాలు – ఉదారంగా కోట్లాది రూపాయలతో ఏర్పాట్లు – దీక్షా, దక్షతలతో పూర్తి చేశాయ్.

ప్రభుత్వ యంత్రాంగానికీ, ఏర్పాట్లు చేసే సిబ్బందికీ చేతినిండా పని. అయితే దానికితగ్గ ప్రతిఫలమూ దక్కుతాయి. కృష్ణాతీరస్థ నగరాలకు ముఖ్యంగా విజయవాడకు కొత్త నిర్మాణాలు, రోడ్లు, రాకపోకల సదుపాయాలు కూడా జరుగుతున్నాయి. సందట్లో సడేమియాలం అన్నట్లు జేబు దొంగలు, దొంగ సాధువులు, ఘరానా ముష్టివాళ్ళు వీళ్లంతా దిగడుతున్నారప్పుడే – వాళ్లది దబాయింపు సెక్షన్!

బెజవాడ ప్లాట్‌ఫామ్ దేశంలోనే అతి పెద్ద రెండవ ప్లాట్‌ఫామ్. దానికి అన్ని దిక్కులలోని రాష్ట్రాల రాజధానుల నుంచీ రైళ్లు వస్తూనే వుంటాయి. అందరికీ అందుబాటు అయిన "బెజవాడ కనకదుర్గమ్మ దర్శనం కూడా యిప్పిస్తుంది భక్త జనాలకు.

### గుడి మీద ప్రమాదాలు !

అమ్మ ముగ్గురమ్మల మూలపుటమ్మయే గానీ ఇంద్రకీలాద్రి కొండ చరియలు బులబులగ్గా వుండి క్రింది జనాల మీదికి దొర్లిపడే ప్రమాదం సదా వుంటుంది. రోడ్డు మార్గంలో లోగడ జన త్రొక్కిసలాటలో జన నష్టం జరిగిన సందర్భాలున్నాయి. ఇది ఒక నిత్యనూతనమైన సమస్య.

అమ్మవారి వాహనం జూలు సింహం బజ్జొని వున్నట్లు కొండ దారి మలుపులో వుంటుంది. దాన్ని వలలో పెట్టినట్లు దానికో పెద్ద జల్లెడవల తొడిగారు. అంటేనే కొండదారి ముప్పునకు "హోషియార్" అని చెబుతున్నట్లు కదా, అర్థం? మంత్రులకు లిఫ్ట్ వుంది. భక్తులకు జవసత్వాలు వున్నవారికి వందల వాలు మెట్లున్నాయ్. మల్లిఖార్జున స్వామి గుడివైపు అడ్డ దారికి తక్కువ మెట్లుంటాయ్. కొండమీద నుంచి కృష్ణా తీరం రద్దీ రెండూ కలిపి ఓహోమని మనం తిలకించవచ్చును. ఈసారి ప్రాజెక్టులకు జనాదరణ బాగా లభించొచ్చును. ఇరిగేషన్, మునిసిపాలిటి, రోడ్స్, కమ్యూనికేషన్స్, అన్నింటికీ మించి టూరిజం, పోలీసు డిపార్ట్‌మెంట్లకు దేని కేటాయింపూ దేని కోటా దానికి ఏర్పాటు అయిపోయాయి.

### దారిపొడుగునా తర్పణమే !

గురుడు, ఆ వెనుక పుష్కరుడూ, పుష్కరునితో పాటు గాయత్రీ సరస్వతీ సమేతుడైన బ్రహ్మ మొదలు చిల్లర మల్లర దేవుళ్ల దాకా అందరూ కృష్ణమ్మ ఒడిలో పన్నెండు రోజులుంటారు. పితృదేవతలు కూడా యిప్పుడు కృష్ణమ్మ ఒడిలో విడిసి వుంటారు. తొమ్మిదవ రోజన పిండ ప్రదానాలు, తర్పణలుతప్ప మరో దృశ్యం కనబడదు. ఈ కర్మ కాండలు జరిపించడానికి అధికారికంగా గుర్తింపు కార్డులున్న బ్రాహ్మణులు కొన్ని వేలమంది–నాలుగు రాళ్ళు వెనకేసుకునే విధంగా కష్టపడతారు. దేవతలు, పితృదేవతలు, ఇల దేవతలయిన – వి.వి.ఐ.పి.లు, సినీమాతారలు, సెలబ్రిటీలు అందరికీ కావాలి పుష్కరాలు.

ఉభయ రాష్ట్రాల తెలుగు వాళ్లు మురిసిపోయే పుష్కరాలకి రెండు చోట్లా స్నానం ఆచరించి మోక్షం సంపాదించే అవకాశం ఉమ్మడి గవర్నర్‌గారికుంది. ముఖ్యమంత్రులు కూడా అక్కడాయనా, యిక్కడీయనా ఓ మున్క వేస్తే తెలుగువాడు 'జయహో' అంటాడు. పైన దేవుళ్ళ, క్రింద వేలాది సి.సి.కెమేరాలు చూస్తుండగా, బురదగా వుంది అనుకోకుండా మూడు మున్కలు వేస్తే ఏడు జన్మల పాపాలు పోతాయ్ అంటున్నాయి మన ధర్మశాస్త్రాలు జయహో!!

చిరునామా : వీరాజీ, 101-ఎస్.వి.ఎస్. నెస్ట్, 12-13-853/28, గోకుల్ నగర్, తార్నాక, హైదరాబాదు - 500 017,
సెల్ : 9290099512

డాక్టర్ రెంటాల జయదేవ

# కృష్ణా తీరంలో తెలుగు సినిమా

సినిమాకూ... తెలుగువారికీ మధ్య విడదీయరాని అనుబంధం. నూరేళ్ళ పైచిలుకు క్రితం 'ఫిల్మ్' అనేది రాక ముందు, సినిమా అనే మాధ్యమం ఇంత ప్రాచుర్యం కాక ముందు పరిస్థితి ఏమో కానీ, ఇప్పుడు మాత్రం సినిమా అనేది తెలుగువాడి జీవితంలో ఒక విడదీయలేని అంతర్భాగం. గమనిస్తే... గడచిన శతాబ్ద కాలంలో బహుశా ఈ ఆధునిక మాధ్యమం ప్రభావితం చేసినంతగా తెలుగు జనజీవితాన్ని మరేదీ ప్రభావితం చేయలేదేమో! మరీ ముఖ్యంగా తీరాంధ్ర ప్రజలకు, అందులోనూ కృష్ణా పరివాహక ప్రాంత ప్రజలకు సినిమా అనేది ఒక విజ్ఞానం... ఒక వినోదం... రోజువారీ విసుగు నుంచి బయటపడేసే ఒక మహత్తర ఔషధం... కాస్తంత ఖాళీ సమయం దొరికితే కుటుంబంతో, మిత్రులతో కలసి గడిపేందుకు ఒక కాలక్షేపం... నిజజీవిత సమస్యల నుంచి దూరంగా ఊహాలోకాల్లోకి తీసుకెళ్ళి, మూడు గంటల పాటు మైమరపించే మానసిక లేపనం... ఒక్కోసారి మత్తుమందు. అందుకే, ఇవాళ తెలుగునాట జీవితంలో ఒక సినిమా అయినా చూడనివారు, ఏదో ఒక సందర్భంలోనైనా దాని గురించి మాట్లాడనివారు ఒక్కరంటే ఒక్కరైనా ఉండరంటే అతిశయోక్తి కాదు! ఇంకా చెప్పాలంటే, తెలుగు సమాజంలో, మరీ ముఖ్యంగా ఇటు సర్కారు జిల్లాల్లో, అటు రాయలేలిన సీమ ప్రాంతంలో – 'సిన్మా చూడనివాడు దున్నపోతై పుట్టున్...' అని 'కన్యాశుల్కం'లోని గిరీశం పాత్ర డైలాగ్‌ను మార్చి చెప్పాల్సిన పరిస్థితి. దీనికి కారణాలు ఒకటి కాదు... అనేకం. చరిత్ర పరిశీలిస్తే... మూకీ సినిమాల కాలం నుంచి సినీ రంగ బీజాలు తీరాంధ్ర ప్రాంతంలో ఉన్నాయి. టాకీ సినిమాల మీదుగా ఇవాళ్టి డిజిటల్ సినిమా దాకా అదే పరిస్థితి.

**తొలి రోజుల నుంచి...**

లోతుల్లోకి వెళితే – తెలుగు సినీ పరిశ్రమకు తొలి రాజధాని విజయవాడ అంటే అతిశయోక్తి కాదు. ఫిలిమ్ పంపిణీ వ్యాపారంలో, ప్రదర్శనశాలల్లో విజయవాడ ప్రాంతం మొదటి నుంచి ఆంధ్రదేశానికి అగ్రగామి. ఆ మాటకొస్తే తెలుగు సినిమాల నిర్మాణ కేంద్రం ఎక్కడున్నా (ఒకప్పటి మద్రాసులో, ఇప్పుడు హైదరాబాద్‌లో) సినీ పరిశ్రమపై తీరాంధ్ర సినిమా వ్యాపారస్థుల, మరీ ముఖ్యంగా బెజవాడ ఫిలిమ్ వ్యాపారస్థుల ప్రభావం ఎక్కువే. ఈ ప్రాంతపు పెట్టుబడిదారుల డబ్బు, ఇక్కడి నుంచే నట – సాంకేతిక నిపుణుల లాంటి మానవ వనరులు సినీ పరిశ్రమలో ఎక్కువ ఉండడమే దీనికి కారణం. ఆంధ్ర ప్రాంతంలోని ఏ చిన్న ఊరికెళ్ళినా రైస్ మిల్లుల లాంటి సినిమా హాళ్ళు, సినిమా హాళ్ళ లాంటి రైస్ మిల్లులు సగర్వంగా ఆ ప్రాంతపు ఉనికిని చాటుతుంటాయని సామాజిక – రాజకీయ విశ్లేషకులు స్వర్గీయ కె. బాలగోపాల్ చాలా ఏళ్ళ క్రితమే పేర్కొన్నారు. "కృష్ణా – గోదావరి డెల్టా ప్రాంతంలో వ్యవసాయంలో వచ్చిన లాభమంతా అయితే అటు వ్యవసాయ ఆధారిత పరిశ్రమల్లోకో, లేదంటే ఇటు సినిమా నిర్మాణం, పంపిణీ, ప్రదర్శన రంగాల్లోకో పెట్టుబడుల రూపంలో ప్రవహిస్తూ వచ్చింది" అని అప్పట్లో ఆయన విశ్లేషించారు.

తెలుగు నాట తొలి పర్మినెంట్ థియేటర్ (విజయవాడలోని అప్పటి 'శ్రీమారుతీ సినిమా' హాలు) దగ్గర నుంచి ఇటీవలి మల్టీప్లెక్స్‌లు, నవ్యాంధ్ర అవతరించాక ఆరుబయట కారులో కూర్చొని సినిమాలు చూసేందుకు ఇప్పుడు కొత్తగా వచ్చిన డ్రైవ్-ఇన్ థియేటర్లు, ఆర్టీసీ బస్‌స్టాండ్‌లలో వెలుస్తున్న మినీ థియేటర్ల విప్లవం దాకా చాలా వాటికి కృష్ణా – గుంటూరు ప్రాంతమే ఫస్ట్ అయింది. 'బెస్ట్' అనిపించుకుంది. ఎన్నో పదుల అడుగుల ఎత్తైన తెరపై 'కదిలే బొమ్మలు' చూపే ఐ-మ్యాక్స్ థియేటర్ కూడా నవ్యాంధ్రప్రదేశ్‌లో తొలిసారిగా విజయవాడలోనే త్వరలో వెలుస్తోంది.

## ప్రదర్శన రంగం 95 ఏళ్ళ క్రితమే...

## బెజవాడలో తొలి పర్మినెంట్ సినిమా హాలు!

ఇవాళంటే మల్టీప్లెక్సులు, డిజిటల్ ప్రొజెక్షన్‌తో కూడిన అధునాతన చిత్ర ప్రదర్శన శాలలు, సినిమా హాలులో కింద నుంచి పై కప్పు దాకా ఉన్న తెరపై పే...ద్ద బొమ్మతో కనపడే 'ఐ-మ్యాక్స్' థియేటర్ వచ్చేశాయి. మరి, సినిమాలను కనిపెట్టిన తొలి రోజుల్లో మాటేమిటి? తెర మీద బొమ్మలు మాటలైనా నేర్వని ఆ మూగ చిత్రాల కాలంలో సినిమా హాలంటే...? పెద్ద విషయం. డేరాలు, పాకల్లో చిత్ర ప్రదర్శనలు జరిగిన ఆ తొలి రోజుల్లో తెలుగు నేలపై తొట్టతొలిసారిగా ఓ పర్మినెంట్ హాలు వెలసింది. అదీ కృష్ణాతీరంలోనే వెలసింది. అదే – విజయవాడలోని వన్‌టౌన్ ప్రాంతంలో, గాంధీజీ మునిసిపల్ హైస్కూల్‌కు సమీపంలోని అప్పటి ప్రసిద్ధ 'శ్రీమారుతీ సినిమా' హాలు. విజయవాడ రైల్వేస్టేషన్‌కు పడమటి దిక్కున ఇప్పుడు కాన్వెంట్ వీధిగా పిలుచుకుంటున్న సందులో నెలకొన్న ఈ సినిమా హాలు డెబ్భై అయిదేళ్ళ పైగా నడిచి, 2000వ సంవత్సరంలో బహుళ అంతస్థుల వాణిజ్య భవన సముదాయంగా మారిపోయింది. రూపం మారినా, సరిగ్గా 95 ఏళ్ళ క్రితం 1921లో మొదలై, ఇవాళ్టికీ ఆనాటి బెజవాడ సినీ ప్రియుల మదిలో నిలిచిపోయిన ఆంధ్రదేశపు తొలి సినిమా హాలు అది...

## మొదట నాటకాలు! ఆపైన సినిమాలు!!

నిజానికి, 1921లో ప్రారంభమైనప్పుడు ఈ హాలు పేరు – 'శ్రీమారుతీ మోతే హాలు'. మొదట నాటక ప్రదర్శనాలతో ఆరంభమై, ఆ పైన చిత్ర ప్రదర్శనలకూ వేదికగా మారిన హాలు ఇది. నిజానికి, ఈ హాలును మొదట కట్టింది – ఏలూరుకు చెందిన మోతే నారాయణరావు జమీందారు. అందుకే, హాలు పేరులో 'మోతే' అని ఉందన్నమాట. కళాప్రియులైన నారాయణరావు ఆధ్వర్యంలో 'శ్రీసీతారామాంజనేయ నాటక సమాజం' నడిచేది. అందుకే ప్రధానంగా నాటకాల కోసం నారాయణరావు ఈ 'శ్రీమారుతీ' హాలును నిర్మించారు. అప్పట్లో "నూతనముగా నిర్మింపబడిన" ఈ "నాటకశాలను" బెజవాడ వాసీ, అప్పట్లో తాలూకా బోర్డు ప్రెసిడెంటుగా ఉన్న డిస్ట్రిక్ట్ కోర్టు వకీలు సి. కొళందరెడ్డి బి.ఏ. ప్రారంభించారు. 1921 అక్టోబర్ 23వ తేదీ ఆదివారం సాయంత్రం 4.30 గంటలకు ఈ హాలు తెరిచారు. ఆ ప్రారంభ దినాన శ్రీ సీతారామాంజనేయ నాటక సమాజం వారితో 'ప్రహ్లాద' నాటకం ప్రదర్శింపజేశారు. ఇందులో నాటకాలే కాకుండా, ముఖ్యమైన సభలు, సమావేశాలు జరిగేవి. ఇలా నాటకాలు, సభలు జరిగే నాటకశాలల్లోనే మూకీ చిత్రాలనీ ప్రదర్శించేవారు. 'ప్రహ్లాద' నాటకంతో మొదలైన ఈ హాలులోనే ఆ తరువాత బెజవాడలో మొదటిసారిగా తొలి పూర్తి తెలుగు టాకీ 'భక్త ప్రహ్లాద' (1932 ఫిబ్రవరి, మార్చి ప్రాంతంలో బెజవాడలో విడుదల) కూడా ప్రదర్శితమైంది. ఆ మాటకొస్తే, తొలి భారతీయ టాకీ 'ఆలమ్ ఆరా' 1931 మార్చి 14న దేశంలో తొలిసారిగా ప్రేక్షకుల ముందు కొచ్చినప్పుడు, సరిగ్గా అదే రోజున బెజవాడ 'మారుతీ'లోనూ ఆ చిత్రం విడుదలైనట్లు సినీ ప్రముఖులు పేర్కొనడం విశేషం.

## తెలుగునాట థియేటర్లు... తొలినాళ్ళు...

1920ల నుంచి 1930 ప్రాంతం వరకు తెలుగునాట ఎక్కువగా పాశ్చాత్య మూగ చిత్రాల ప్రభావమే ఉండేది. తెలుగు నేల మీద విజయవాడ, రాజమండ్రి మొదలైన కొన్నిచోట్ల టూరింగ్ సినిమాలు ప్రదర్శిస్తుండేవారు. అప్పట్లో ఆ పాశ్చాత్య మూగ చిత్రాల ప్రింటునూ, అలాగే వాళ్ళ సినిమా ప్రొజెక్టర్‌నూ అద్దెకు తెచ్చుకొని, ఊరిలోని మోతుబరుల గోదాముల్లోనో, ధాన్యం మిల్లుల్లోనో చిత్ర ప్రదర్శనలు వేస్తుండేవారు. నాటకాల హాళ్ళను కూడా ఈ చిత్ర ప్రదర్శనలకు వినియోగించేవారు. ఆ పరిస్థితుల్లో పోతిన శ్రీనివాసరావు, సి. పుల్లయ్య, జి. మంగరాజు, కాజ వెంకట్రామయ్య లాంటి వాళ్ళు ఆంధ్రదేశంలో థియేటర్ల ఉద్యమానికి నాంది పలికారు. బెజవాడలో 'శ్రీమారుతీ' (1921) తరువాత రాజమండ్రిలో నిడమర్తి సూరయ్య – ఆయన సోదరులు నిడమర్తి కృష్ణమూర్తి తదితరులు నిర్మించిన 'శ్రీకృష్ణా పిక్చర్ ప్యాలెస్' (1924), బందరులో పి.వి. దాసు స్థాపించిన 'మినర్వా హాలు' (1925), ఏలూరులో మోతే కృష్ణారావు నెలకొల్పిన 'పాండురంగా టాకీస్', కాకినాడలో సి. పుల్లయ్య నిర్మించిన 'సిటీ బయోస్కోప్' హాలు (ఇదే 'మినర్వా'?), బళ్ళారిలో గోపాలరావు ('స్టార్ సినిమా'), విశాఖపట్నంలో జి.కె. మంగరాజు నిర్మించిన 'పూర్ణా థియేటర్' (నిజానికి 1920లలో సి. పుల్లయ్యతో కలసి ఈ సెమీ పర్మినెంట్ థియేటర్‌ను 'ఏడు నూతుల సత్రం' ఉన్నచోట కట్టారు. అందుకే దీన్ని 'ఏడు నూతుల హాలు' అని కూడా పిలిచేవారు. 1930లో 'శ్రీకృష్ణా సినిమా'గా మొదలైన ఈ హాలు, 1933లో పూర్తిగా మంగరాజు యాజమాన్యం కిందకు వచ్చింది. ఆయన దాన్ని పర్మినెంట్ సినిమా హాలుగా మార్చి, 'పూర్ణా థియేటర్' అని పేరు పెట్టారు) – ఇవన్నీ 1921 నుంచి 1930 మధ్యకాలంలో సీమాంధ్ర ప్రాంతంలో ఉద్యమస్ఫూర్తితో వెలసినవే. అలా ఆంధ్రదేశంలో 'శ్రీమారుతీ సినిమా' హాలు నిర్మాణంతో సినిమా హాళ్ళ శకం మొదలైంది.

తొలి రోజుల్లో సినిమా ప్రదర్శన ఓ పెద్ద తతంగం. ప్రొజెక్టర్లను అద్దెకు తెచ్చుకొని, సినిమా ప్రింట్లతో సహా వాటిని ఊరూరా తిప్పుతూ, గ్రామాల్లో సైతం ప్రదర్శనలిచ్చేవారు. అప్పట్లో ఆ ప్రొజెక్టర్లను చేతితో నడపాల్సి వచ్చేది. హాలు బయట జనం ఎక్కువగా ఉంటే, మళ్ళీ ఆ జనం రెండో ఆట మొదలయ్యే దాకా ఉంటారో, ఉండరోనన్న అనుమానంతో, ప్రొజెక్టర్‌ను గబగబా నడిపేవారు. అలా బయటి జనాన్ని బట్టి ప్రొజెక్టర్ స్పీడుగా నడవడమో, స్లోగా నడవడమో జరిగేవట! అంటే, సినిమా ఎక్కువ సేపు ఉంటుందా, లేక తక్కువ సేపట్లోనే అయిపోతుందా అన్నది ఆ ప్రొజెక్టర్ నడిపేవారి చేతి మాహాత్మ్యం, దయాదాక్షిణ్యాల మీద ఆధారపడేదన్న మాట!

## మూకీల్లో... వ్యాఖ్యాత, వ్యాఖ్యానమే ఊపిరి

అలాగే, ఆ మూకీల రోజుల్లో చలనచిత్రాల ప్రదర్శనంటే పెద్ద హంగామా ఉండేది. ప్రదర్శిస్తున్న ఫిల్ముకు ప్రచారం కోసం రంగు రంగుల జెండాలతో, గంపెడు కరపత్రాలతో, బ్యాండు వాద్యాలతో ఎద్దు బండి ఊరేగింపు జరిపేవారు. ఆ బండి మీదే సంగీత వాద్య పరికరాలు పెట్టి, వాయిస్తూ, జనం దృష్టిని ఆకర్షించేవారు. మాటలు లేని మూగ చిత్రాల్లో వన్నెలూ, చిన్నెలూ ఏర్పరచి, ప్రేక్షకులలో సదభిప్రాయం కల్పించే పని అసాధారణమైనది. ఆ బాధ్యత అంతా సినిమాను తర్జుమా చేసి, ప్రేక్షక జనరంజకంగా కథాకథనాన్ని వ్యాఖ్యానించే 'ఇంటర్‌ప్రెటర్'ది. సినిమా హాలులో ప్రేక్షకులే సర్వాధికారులు గనక, వారి భావానికి అనుగుణంగా మూగ నటీనటుల పాత్రలను తర్జుమాదారే పోషించి, ప్రేక్షకులలో ఆ రసానుభూతిని కలిగించాలి. ఆ మూగ సినిమాల వ్యాఖ్యాత ఉద్యోగం అంత ఆషామాషీ కాదు. ఆ బాధ్యతల్లో మెప్పు పొందిన వారు కొందరే. అసలు ఫిల్ము కన్నా ఈ వ్యాఖ్యాతల వినోదమే మరింత బాగుండి, వాళ్ళ కోసమని మూకీలకు జనం వెళ్ళిన సందర్భాలూ ఉండేవి. అందుకే, ఈ వ్యాఖ్యాతలకు అప్పట్లో చాలా గిరాకీ ఉండేదట! ఆ రోజుల్లో ఇలా వ్యాఖ్యాతలుగా పనిచేసిన వారిలో అనంతర కాలంలో నటుడిగా ప్రసిద్ధికెక్కిన కస్తూరి శివరావు, హనుమంతరావు, పీస కొండలరావు తదితరులున్నారు. వీరందరూ తీరాంధ్ర ప్రాంతం వారు. అప్పట్లో 'ఇంటర్‌ప్రెటర్'గా ప్రసిద్ధులు. కానీ, వ్యాఖ్యానం అవసరం లేకుండా తెర మీది బొమ్మలే మాట్లాడడం మొదలుపెట్టి, 'టాకీ'లు వచ్చేసరికి 'ఇంటర్‌ప్రెటర్' కీర్తిశేషుడయ్యాడు.

## మూకీల నాటి నుంచే మారుతీ హాలు

నిజానికి, శ్రీమారుతీ హాలు నిర్మాణానికి ఆర్థికంగా వెన్నుదన్ను మోతే నారాయణరావు జమీందారు అయినప్పటికీ, ఆ హాలును ఏర్పాటు చేయడంలో ప్రధాన పాత్ర పోషించింది - పోతిన శ్రీనివాసరావు పాత్రుడు. అందుకు కారణం లేకపోలేదు. పోతిన శ్రీనివాసరావుకు అంతకు ముందు కొన్నేళ్ళ నుంచే సినిమాలతో సంబంధం ఉండేది. 1895 ఫిబ్రవరి ప్రాంతంలో జన్మించిన పోతిన శ్రీనివాసరావుకు 1919లోనే సొంతంగా సి.ఎస్. ప్రెస్ అనే ముద్రణాలయం ఉండేది. ఆ ప్రింటింగ్ ప్రెస్‌లో టూరింగు సినిమాల వాళ్ళకు కావాల్సిన పబ్లిసిటీని ప్రింటు చేసి, ఇస్తూ ఉండేవారు. ఆ అనుబంధం పెరిగి, కాలక్రమంలో ఆయనకే ఒక సినిమా హాలు నడపాలనే సంకల్పం కలిగింది.

సినిమా పట్ల పోతిన శ్రీనివాసరావు ఆసక్తి వెనుక కూడా ఆసక్తికరమైన నేపథ్యం ఉందని చెబుతారు. 1918 ప్రాంతంలో మలయాళీలు కొందరు సర్కస్‌ల లాగా మూకీ చిత్రాలు ప్రదర్శించేవారట! చుట్టూ దడి కట్టిన ప్రాంగణంలో పెట్రోమాక్స్ లైట్లు ఏర్పాటు చేసి, చేతితో ప్రొజెక్టర్‌ను తిప్పడం ద్వారా ఈ చిత్రాలను చూపేవారట! మలయాళీలు జరిపిన ఈ బయోస్కోప్ ప్రదర్శనల్ని 'జోస్ బయోస్కోప్'లనేవారు. ఆ బయోస్కోప్ కంపెనీల మలయాళీలు, ప్రింటింగ్ ప్రెస్ నడిపే శ్రీనివాసరావుకు బెజవాడలో బిల్లులు బాకీ పడ్డారు. తీరా ఆ అప్పు తీర్చలేక, బాకీ నిమిత్తం కొన్ని ప్రొజెక్టర్లు, ప్రింట్లు ఆయనకే ఇచ్చేశారు. అప్పట్లోనే బెజవాడలో మైలవరం రాజా గారి నాటక థియేటర్ ఉండేది. (తరువాత 1940లో అదే 'సరస్వతీ పిక్చరు ప్యాలెస్'గా సినిమా హాలు అయింది). 1920 ప్రాంతంలో ఆ నాటకాల శాలలోనే 'బాలభారతీ సినిమా' పేరుతో మధ్య మధ్యలో పోతిన శ్రీనివాసరావు సినిమా ప్రదర్శనాలు ఇస్తూ ఉండేవారు.

అయితే, అది వారికి తృప్తినివ్వలేదు. పూర్తిగా తన సూచనల మేరకు నడిచే ఒక హాలు ఉంటే బాగుంటుందని అనిపించింది. అదిగో అలా 'శ్రీమారుతీ మోతే హాలు'కు అంకురార్పణ జరిగింది. మోతే వారి అండదండలతో, శ్రీనివాసరావు ఆ హాలును ఏర్పరచారు. 1921 అక్టోబర్ 23న నాటకశాలగా ఇది ప్రారంభమైంది. అలాగే, 'మారుతీ సినిమా' కన్నా ముందే, 1920లో రఘుపతి వెంకయ్య ఇంజన్ డైనమోతో కూడిన ఓ టూరింగ్ టాకీస్‌ను బెజవాడలో నడిపినట్లు చెబుతారు.

అప్పట్లో సినిమాలు పెద్ద సంఖ్యలో నిర్మాణమయ్యేవి కావు కాబట్టి, హాలును పూర్తిగా ఫిల్ముల ప్రదర్శనకే పరిమితం చేయకుండా, అటు నాటకాలు, ఇటు సందు దొరికినప్పుడల్లా సైలెంటు చిత్రాలు ప్రదర్శిస్తూ ఉండేవారు. భారతదేశంలో సైలెంటు

చిత్రాల నిర్మాణం అప్పుడప్పుడే పైకి వస్తున్న కాలం అది. దాంతో, అందుబాటులో ఎక్కువగా ఉండే ఇంగ్లీషు చిత్రాలనే విడుదల చేసేవారు. అందులోనూ పోటీ ఉండేది. అందువల్ల హాలు మెయింటెనెన్స్ కావడమే అంతంత మాత్రంగా ఉండేది. అయినా, పట్టు విడవకుండా ప్రదర్శనాలు ఇస్తూ ఉండేవారు. అలా తెలుగు నేలపై బెజవాడలో తొలిసారిగా ఓ పర్మినెంట్ సినిమా థియేటర్ వెలసింది. తెలుగు నేలపై మొట్టమొదటి పర్మినెంట్ సినిమా ఎగ్జిబిటర్‌గా పోతిన శ్రీనివాసరావు చలనచిత్ర చరిత్రలో స్థానం పొందారు.

## మూగచిత్రాల ముచ్చట్లు

విజయవాడ పరిసర ప్రాంతాల్లో ఆ మూకీల ప్రదర్శనలను చూసినవారి కథనం ప్రకారం 1920 ప్రాంతంలో సీరియల్ చిత్రాలను ఎక్కువగా చూపేవారు. అన్నీ మూగ చిత్రాలే. పాత్రధారుల సైగలను బట్టే కథ తెలుసుకోవాల్సి వచ్చేది. ఆ తరువాత రోజుల్లో ఇలాంటి మూగ చిత్రాలకు కొత్త ఆకర్షణ వచ్చి చేరింది. అది ఏమిటంటే – తెరకు దగ్గరలో సంగీత వాద్య బృందాన్ని (ఆర్కెస్ట్రా) పెట్టడం! తెర మీది దృశ్యాలకు అనుగుణంగా ఆ ఆర్కెస్ట్రాతో సంగీతం, ధ్వనులు వినిపించడం! అప్పట్లో అలా ఆర్కెస్ట్రాలో పనిచేసినవాళ్ళలో కొందరు 1950ల చివరి నాటికి కూడా 'మారుతీ' టాకీసులో పనిచేస్తూ వచ్చారని ఆ సంగతులు తెలిసినవారి కథనం. ఆ సినిమాల ప్రదర్శనలో విరామ సమయంలో డ్యాన్సులు పెట్టేవారు. అప్పట్లో ఎక్కువగా ప్రదర్శిస్తూ వచ్చిన ఆ విదేశీ దిగుమతి చిత్రాలకు జనాన్ని ఆకర్షించడం కోసం, 'కదిలే తంతాను', 'అమ్మ నా కొడకా!' అంటూ స్థానిక భాషలో చాలా విచిత్రంగా పేర్లు పెట్టేవారట! ప్రచారం సంగతికొస్తే, పాత పత్రికల మీద సిరాతో రాసిన పోస్టర్లను పబ్లిసిటీకి వాడేవారు. అలాగే, మేళతాళాలతో కరపత్రాలు పంచిపెట్టేవారు. హాలులో అన్నిటి కన్నా దిగువ తరగతి అయిన నేల టికెట్టు అప్పట్లో ఒక అణా ఉండేదట!

## టాకీలకు 'మారుతి'తోనే శ్రీకారం!

అలాంటి మూకీ చిత్రాల తరువాత బెజవాడకు టాకీ చిత్రాలను రప్పించిన ఘనత కూడా పోతిన శ్రీనివాసరావుదే! ఆ సినిమాలు ప్రదర్శితమైందీ – శ్రీమారుతీ సినిమాలోనే! ఆ మాటకొస్తే, బెజవాడలో మొట్టమొదటి టాకీ సినిమా హాలు కూడా 'మారుతీ'నే! విదేశాల నుంచి టాకీలు దిగుమతి అయిన తరువాత, కొన్నాళ్ళకు భారతదేశంలోనూ ఆ శబ్దచిత్రాల నిర్మాణం మొదలైంది. తొట్టతొలి పూర్తి నిడివి భారతీయ టాకీ 'ఆలం ఆరా' 1931 మార్చి 14న విడుదలైంది. 'ఆలమ్ ఆరా'ను బొంబాయిలోని 'మెజెస్టిక్ సినిమా' హాలులో విడుదల చేశారు. హిందీ, ఉర్దూ భాషల సమ్మిశ్రమమైన ఆ హిందుస్థానీ చిత్రం సరిగ్గా అదే రోజున తెలుగు నేలపై బెజవాడలోనూ విడుదలైనట్లు, పైపెచ్చు అదీ 'శ్రీమారుతీ సినిమా' హాలులోనే విడుదలైనట్లు సినిమా పెద్దలు పేర్కొనడం విశేషం. ఇదంతా పోతిన శ్రీనివాసరావు కృషికి నిదర్శనం.

ఇలా స్వదేశీ టాకీలను ఆయన బెజవాడకు తీసుకురావడం వెనుక కూడా ఆయన పడ్డ శ్రమ అంతా ఇంతా కాదు. సైలెంట్ చిత్రాలను ప్రదర్శిస్తున్న రోజుల్లో జర్మనీ నుంచి మిస్టర్ హోల్ అనే వ్యక్తి టాకీ చిత్రాన్ని తీసుకొని కలకత్తా వచ్చారు. శ్రీనివాసరావు ఆ హోల్ గారిని కలుసుకున్నారు. పర్యవసానంగా బెజవాడలోని తమ థియేటర్‌లో ప్రథమ టాకీ చిత్రాన్ని విడుదల చేశారు. అప్పట్లో దేశీయమైన చెటర్జీ సౌండ్ మిషన్ అయిన టాకీ యంత్రాన్ని ఉపయోగిస్తుండేవారు. చిత్రాల ఎంపికలో, ప్రచారంలో, ప్రదర్శనలో నాణ్యతకు ప్రాధాన్యమిచ్చే శ్రీనివాసరావుకు ఆ దేశీయ సౌండ్ మిషన్ ఏమంత ఉపయోగకరంగా కనిపించలేదు. టాకీలను ప్రేక్షకులు కళ్ళారా చూడడమే కాకుండా, మాటలు, పాటలు విని ఆనందించాలంటే నాణ్యమైన టాకీ మిషన్ కావాలనుకున్నారు. దాంతో, 'ఆర్.సి.ఏ. – పి.జి. 59' మోడల్ అయిన సౌండ్ మిషన్‌ను ప్రత్యేకంగా తెప్పించి, తమ 'మారుతీ సినిమా'లో బిగించారు.

ఇక, తొలి సంపూర్ణ తెలుగు టాకీ 'భక్త ప్రహ్లాద' 1931 చివరలో నిర్మాణం ప్రారంభించుకుంది. 1932 జనవరి 22న సెన్సారైన ఆ చిత్రం ఫిబ్రవరి 6న బొంబాయిలో ఫస్ట్ రిలీజైంది. ఆ తరువాత కొన్ని వారాలకు ఆంధ్రదేశానికి వచ్చింది. అప్పుడు ఆ చిత్రం కూడా బెజవాడలో మొట్టమొదటిసారిగా ప్రదర్శితమైంది – 'మారుతీ'లోనే! అదీ పోతిన శ్రీనివాసరావు చలవే! ఆ తరువాత కూడా ఆయన భారతదేశంలో ప్రసిద్ధి పొందిన 'ప్రభాత్' మొదలైన కంపెనీల చిత్రాలను తెప్పించి, విడుదల చేసేవారు. విదేశీ చిత్రాలతో పాటు, దేశంలోని వివిధ భాషా చిత్రాలను కూడా బెజవాడ సినీ ప్రియులు ఆస్వాదించేందుకు అవకాశం కల్పించేవారు.

## బెజవాడలో తొలినాటి సినిమా హాళ్ళు

'మారుతీ' వెలసిన దాదాపు ఎనిమిదేళ్ళకు 1929 (బహుశా ఆగస్టు?)లో బెజవాడలో రెండో సినిమా హాలైన 'శ్రీదుర్గాకళా మందిరం' నిర్మాణమైంది. నిజానికి, అది కూడా నాటకశాలగానే ఆరంభమైంది. మొదట్లో నాటకాలు, నృత్యప్రదర్శనలు, తోలుబొమ్మ లాటలు ప్రదర్శించేవారు. అయితే, కొద్దినెలలకే (సుమారు 1929

నవంబర్ (ప్రాంతం కావచ్చు) నుంచి సైలెంట్ సినిమాలను సైతం ప్రదర్శించడం మొదలుపెట్టింది. అయితే, టాకీ చిత్రాల ప్రదర్శనకు అనువుగా 'దుర్గాకళామందిరం' మారింది కూడా 'మారుతీ' తరువాతే! 1932 డిసెంబర్ తొలినాళ్ళలో కానీ బెజవాడలోని దుర్గాకళామందిరంలో "శాశ్వతంగా" టాకీ యంత్రాన్ని అమర్చ లేదు. "అప్పట్లో మారుతీ సినిమా హాలు హిందీ, ఇంగ్లీషు చిత్రాలకూ, స్టంట్ చిత్రాలకూ ప్రసిద్ధం. ఇక, శ్రీదుర్గా కళామందిర మేమో ప్రధానంగా తెలుగు చిత్రాలనే ప్రదర్శించేది" అని విజయవాడలో పుట్టిపెరిగిన ఎనిమిదిన్నర పదుల పై చిలుకు వయసు హోమియో డాక్టర్ పి.ఆర్.సి.హెచ్. సూర్యప్రకాశరావు తెలిపారు.

"ఆ రోజుల్లో మారుతీ, దుర్గాకళామందిరాల్లో అతి తక్కువ తరగతి టికెట్ ధర బేడ! అంటే 2 అణాలు!! దుర్గాకళామందిరంలో సంగతి నాకు బాగా గుర్తు. ఆనుకోవడానికి లేని బెంచీ మీద కూర్చొని సినిమా చూడాలంటే, టికెట్ – బేడ. అదే 4 అణాలైతే, ఆనుకోవడానికి వీలున్న బెంచీ! 7 అణాలైతే, కుర్చీ! అదే 11 అణాలు చెల్లిస్తే, మేడ (బాల్కనీ)లో కూర్చొని సినిమా చూడవచ్చు" అని ఆయన గుర్తు చేసుకున్నారు. "విజయవాడలోని గాంధీ నగరంలో ఇప్పుడు అలంకార్ థియేటర్ ఉన్న చోట అప్పుడు బాగా ఖాళీ జాగా ఉండేది. అక్కడ 'రామా టూరింగ్ టాకీస్' పేరిట ఓ టూరింగ్ సినిమా నడిచేది. అణా కానీ టికెట్‌తో స్టంట్ సినిమాలు చూపేవారు. ఆ తరువాత కొన్నాళ్ళకు ఆ జాగాకు కొంచెం పక్కగా దాదాపు ఎకరం స్థలంలో 'శ్రీరామా టాకీస్' నిర్మాణం జరిగింది" అని ఆయన వివరించారు. ఇప్పటికీ అక్కడే కొనసాగుతున్న 'శ్రీరామా టాకీస్' 1940 అక్టోబర్ 25న ఆరంభమైంది. అప్పటి బ్రిటీషు కలెక్టర్ డన్‌లప్??? ఆ హాలును ప్రారంభించారు. తొలి రోజుల్లో ఆ హాలులో నాటకాల ప్రదర్శనలు కూడా విరివిగా జరిగేవి. శ్రీరామా టాకీస్ అధినేత టి. అశ్వత్థనారాయణ గారు ఫిల్మ్ ఛాంబర్‌లో కీలక పాత్ర పోషించారు. తరువాతి రోజుల్లో రాజేశ్వరి పిక్చర్స్, శ్రీ ప్రొడక్షన్స్ బ్యానర్ల కింద సుందర్‌లాల్ నహతాతో పాటు నిర్మాతగా మారి, అనేక విజయవంతమైన సినిమాలు నిర్మించారు.

ఇక, ఇందాకే చెప్పుకున్నట్లు 1940లోనే 'శ్రీరామా టాకీస్' నిర్మాణం కన్నా కొద్దిగా ముందే, బెజవాడలోని మైలవరం రాజా గారి నాటక థియేటర్ కాస్తా 'సరస్వతీ పిక్చరు ప్యాలెస్'గా సినిమా హాలు అయింది. అలాగే, విజయవాడ గాంధీనగరంలో బ్రాహ్మణ కులానికి చెందిన ప్రముఖులు దాసు త్రివిక్రమరావు కుటుంబానికి 'వాణీ ప్రెస్' పేరిట ప్రసిద్ధమైన ముద్రణాలయం ఉండేది. తరువాతి రోజుల్లో 'గద్దే' వారు ఆ ప్రెస్‌ను కొట్టేసి, 1940 నాటి కల్లా 'లక్ష్మీ టాకీస్' కట్టారు. (అదే 1995లో రెండు థియేటర్లు కూడా ఉన్న వాణిజ్య సముదాయమైన 'స్వర్ణ కాంప్లెక్స్'గా రూపు మార్చుకుంది. ఆ తరువాత 2001 మధ్య నాటికి అందులో మూడో థియేటర్ కూడా తెరిచారు. 'స్వర్ణ', 'శ్రీవెంకటేశ్వర', 'శ్రీవెంకట స్వర్ణ' ప్యాలెస్‌లనే మూడు థియేటర్ల కాంప్లెక్స్‌గా వెలుగుతోంది). ఇక, 1943–44లో విజయవాడలో 'శ్రీ లీలామహల్' థియేటర్ నిర్మాణమైంది. బెజవాడలోని సరస్వతీ పిక్చరు ప్యాలెస్ సహా చల్లపల్లి, బందరు, గుంటూరు మొదలైన ప్రాంతాల్లో గొలుసుకట్టు థియేటర్లతో 'శ్రీసరస్వతీ థియేటర్ సర్క్యూట్' నడిపిన రాజా వాసిరెడ్డి కుటుంబానికి చెందిన ప్రసాద్ బ్రదర్స్‌దే ఈ 'లీలామహల్' కూడా! ఇక, 'లక్ష్మీ టాకీస్' దగ్గరలో 1948లో దోనేపూడి ఈశ్వర వెంకటేశ్వర్లు గారు 'శ్రీ జైహింద్ టాకీస్' నిర్మించారు. ఇదంతా బెజవాడలో తొలినాళ్ళ సినిమా హాళ్ళ చరిత్ర. 1950ల నాటికి వచ్చేసరికి – బెజవాడ పౌరులు తమ వినోద, విజ్ఞాన, కాలక్షేపాలకు మరి ఏ ఇతర కళల కన్నా ఎక్కువగా సినిమా కళ మీదే ఆధారపడసాగారు. 1958 నాటికే ప్రతిరోజూ దాదాపు 30 వేల మందిని ఆకర్షించే 12 సినిమా హాళ్ళు బెజవాడలో ఉన్నాయి. దాన్నిబట్టి తీరాంధ్ర ప్రాంతంలో అప్పటికే సినిమాకున్న క్రేజు అర్థం చేసుకోవచ్చు.

## అరుదైన చరిత్రకు సాక్షి... ఆ థియేటర్!

మూకీల రోజుల్లో మొదలై, ఇప్పటికీ నడుస్తున్న సినిమా హాళ్ళు తెలుగు గడ్డ మీద చాలా కొద్దిగా ఉన్నాయి. వాటిలో విజయవాడ లోని శ్రీదుర్గాకళామందిరం ఒకటి కావడం విశేషం. అగ్ర హీరో అక్కినేని నాగేశ్వరరావు కథానాయక పాత్ర పోషించిన తొలి చిత్రం ('శ్రీసీతారామ జననము' –1944), మరో అగ్ర హీరో ఎన్టీ రామారావు నటించిన తొలి చిత్రం ('మనదేశం' –1949), ఆఖరి చిత్రం ('శ్రీనాథ కవిసార్వభౌముడు' –1993) ప్రదర్శించిన హాలు ఇదే. ఎన్టీరామారావు కెరీర్‌లోని అత్యధిక శాతం చిత్రాలు, వాటి అఖండ విజయాలతో అనుబంధమున్న అరుదైన చరిత్ర ఈ సినిమా హాలు సొంతం. ఆయన మీద అభిమానంతో వ్యాపారవేత్త కోగంటి సత్యనారాయణ (సత్యం) ఈ థియేటర్‌ను కొనుగోలు చేసి, ఆనాటి పాత చిత్రాలను ప్రదర్శిస్తూ ఇప్పటికీ నడుపుతున్నారు.

## కృష్ణాతీరం... తొలి దర్శక - నిర్మాత

సృజనశీలురూ, ఏ రంగంలోనైనా మార్గదర్శకులుగా నిలిచే వారూ ఎప్పుడూ ఒకే పనితో సంతృప్తి పడిపోరు. ఎప్పటికప్పుడు ఏదో కొత్తదనం కోసం అన్వేషిస్తుంటారు. పోతిన శ్రీనివాసరావు కూడా అదే పని చేశారు. 'మారుతీ సినిమా' హాలులో చలనచిత్రాల

ప్రదర్శనతో సరిపెట్టుకొని, కూర్చోలేదాయన. 1933లో ఆయన స్వయంగా చిత్ర నిర్మాణంలోకి దిగారు. సరస్వతీ సినీటోన్ పతాకంపై తొలి టాకీగా 'పృథ్వీపుత్ర' అనే తెలుగు చిత్రాన్ని తానే నిర్మాత, దర్శకుడిగా రూపొందించారు. అలా ప్రదర్శకుడి స్థాయి నుంచి ప్రొడ్యూసర్ స్థాయికి ఎదిగారు. 1933 జూలై ద్వితీయార్ధానికి ఈ చిత్రం పూనాలో చిత్రీకరణ జరుపుకొంటున్నట్లు పత్రికల్లో వార్తలు వచ్చాయి. 1933 డిసెంబర్ 20 బుధవారం నాడు మద్రాసులో కినిమా సెంట్రల్ హాలులో (తరువాత 'మురుగన్' టాకీస్‌గా పేరు మారిన ఈ హాలు, 2011 చివరి వరకు ఉంది. ఆ తరువాత రియల్ ఎస్టేట్ దెబ్బకు కనుమరుగైంది) ఈ 'పృథ్వీపుత్ర' విడుదలైంది. 'పారిజాతాపహరణము', 'నరకాసుర వధ' అని కూడా పేర్లున్న ఈ చిత్రం ప్రజలను బాగా ఆకర్షించింది. ఇందులో సుప్రసిద్ధ ఆంధ్ర నటులైన దొమ్మేటి సూర్యనారాయణ, పారుపల్లి సత్యనారాయణ, కె. రఘురామయ్య, మిస్ కనకవల్లి ప్రధాన పాత్రలు పోషించారు. విజయవాడ హిందూ హైస్కూలులో తెలుగు పండిట్‌గా చాలాకాలం పనిచేసిన రచయిత, 'ద్రౌపదీ వస్త్రాపహరణం' తదితర నాటకాల కర్త అయిన మల్లాది అచ్యుత రామశాస్త్రి ఈ 'పృథ్వీపుత్ర' చిత్రానికి సంభాషణలు రచించారు. మొత్తం మీద కృష్ణాతీరం నుంచి ఒక దర్శక – నిర్మాత వెళ్ళి, తీసిన తొలి తెలుగు టాకీ ఇదే!

ఆ తరువాత 1940ల ప్రథమార్ధంలో పోతిన శ్రీనివాసరావు మద్రాసులో మీర్జాపురం రాజా గారికి చెందిన శ్రీశోభనాచలా స్టూడియో మేనేజ్‌మెంట్ తీసుకున్నారు. సొంత సూపర్‌విజన్‌లో 'భీష్మ' చిత్రాన్ని కూడా నిర్మింపజేయించారు. అది కూడా ప్రజల మన్ననలకు పాత్రమైంది. అలా ఆయన ఎగ్జిబిటర్‌గా మొదలుపెట్టి, నిర్మాతగా, దర్శకుడిగా ఎదిగారు. చాలామందికి తెలియని విషయం ఏమిటంటే, ఆయన కొంతకాలం పాటు డిస్ట్రిబ్యూటర్‌గా కూడా వ్యవహరించారు. 1940ల తొలి సగంలోనే ఆయన కొన్ని చిత్రాలతో డిస్ట్రిబ్యూషన్ కంపెనీని కూడా స్థాపించారు. అలా సినీ పరిశ్రమలోని నిర్మాణం, పంపిణీ, ప్రదర్శన విభాగాలు మూడింటిలోనూ తొలి రోజుల్లోనే స్వయంగా అనుభవం, సముద్ర మంత పరిజ్ఞానం సంపాదించిన ఘనుడు ఆయన. కాగా, 1946 నాటికే ఇంతవరకు "ఇండియాలో ఒకే మేనేజ్‌మెంట్, ఒకే ఎగ్జిబిటర్ కింద 25 సంవత్సరాల నుండి నడుస్తున్న సినిమా హాలు 'శ్రీమారుతీ సినిమా' ఒక్కటే" అని యాజమాన్యం ప్రకటనలిచ్చింది.

## తెలుగుగడ్డపై తమిళ సినిమాలు... ట్రాన్స్‌లేటర్లు!

అప్పట్లో 'మారుతీ'లో ఏదైనా సినిమా వస్తే వారాల కొద్దీ ఆడేవి. హాలు బయట అట్టే ఖాళీ జాగా లేకపోవడంతో, కాస్తంత ఇరుకుగా అనిపించినా, ఎంతోమంది ప్రత్యేకంగా ఈ హాలుకొచ్చి సినిమాలు చూసేవారు. 1950లకు పూర్వం డబ్బింగ్ ప్రక్రియ తెలుగులోకి రాకపోవడంతో, తమిళ, హిందీ చిత్రాలు సైతం అనువాదం కాకుండా యథాతథంగానే ప్రదర్శితమయ్యేవి. అలా 'మారుతీ'లో తెలుగుతో పాటు తమిళ చిత్రాలు కూడా విస్తృతంగా విడుదలయ్యేవి. జెమినీ వారి సంచలనాత్మక తమిళ చిత్రం 'చంద్రలేఖ' 16 వారాలకు పైగా 'మారుతీ సినిమా'లో ఆడిన రికార్డుంది. దాన్నిబట్టి, ఆ హాలుకూ, అప్పట్లో పరభాషా చిత్రాలకూ తెలుగునాట ఉన్న ప్రాచుర్యం గ్రహించవచ్చు. విశేషం ఏమిటంటే, 1980ల దాకా కూడా బెజవాడలో తమిళ సినిమాలు ప్రతి ఆదివారం ఉదయం ప్రత్యేక ప్రదర్శనలుగా ఆడేవి. విచిత్రమైన సింగిల్ కలర్ వాల్‌పోస్టర్ల మీద తమిళ, తెలుగుల్లో సినిమా పేర్లతో, వన్‌టౌన్ ప్రాంతంలోని శేష్‌మహల్ థియేటర్, టూటౌన్‌లోని శాంతి థియేటర్ లాంటి చోట్ల ఈ తమిళ సినిమాల షోలు జరిగేవి. ఆ ఒక్క షో ఈ ప్రాంతంలో రైల్వే తదితర ఉద్యోగాల్లో స్థిరపడ్డ తమిళులకు పెద్ద కాలక్షేపం. మరో గమ్మత్తు ఏమిటంటే, 'మారుతీ'లో ప్రథమ శతదినోత్సవ చిత్రం 'మంగమ్మ శపథం', రజతోత్సవం జరుపుకొన్న మొదటి చిత్రం 'చంద్రలేఖ' – రెండూ జెమినీ వారి తమిళ చిత్రాలే కావడం గమనార్హం. 'చంద్రలేఖ' శతదినోత్సవమైన 1948 ఆగస్టు 18 నాడు బెజవాడ పౌరులు పోతిన శ్రీనివాసరావుకు అఖండ సన్మానం చేశారు. జెమినీ సంస్థ అధినేత ఎస్.ఎస్. వాసన్ ఆ సభకు అధ్యక్షత వహించడం విశేషం.

మూకీ సినిమాల ప్రదర్శనలో లాగానే ఈ పరభాషా చిత్రాలకు సైతం కథాకథనాలను ప్రేక్షకులకు అర్థమయ్యేలా వివరించేందుకు హాలు మధ్యలో అనువాదకుణ్ణి పెట్టేవారు. ఈ ట్రాన్స్‌లేటర్లు సంభాషణలను క్లుప్తంగా చెప్పడమే కాక, మధ్య మధ్య చిలవలూ పలవలూ అల్లుతూ, వ్యాఖ్యానాలు చెప్పేవారు. ఒక్కొక్క ట్రాన్స్‌లేటరు తన చమత్కారాలతో ప్రేక్షకులను సంతోషపెట్టగలిగేవాడు. మరి కొందరు మోటుమాటలతో జుగుప్స కలిగించడం కూడా జరిగేది. పరభాషా చిత్రాలు తెలుగులోకి అనువాదమవడం మొదలయ్యాక, 1950 ప్రాంతం నుంచి ఇక హాళ్ళలో ట్రాన్సులేటర్లను పెట్టడం ఆపేశారు. విజయవాడలో అయితే సరస్వతీ పిక్చర్ ప్యాలెస్ వారు మున్ముందుగా ఈ ట్రాన్స్‌లేటర్ల విధానం మానేశారు. ఆ తరువాత మిగతా హాళ్ళూ ఆ దోవలో నడిచాయి.

## ఒక థియేటర్... ఒకే యజమాని... ఒక చెరగని రికార్డు

పోతిన శ్రీనివాసరావు ఆ తరువాత 1958లో విజయవాడలో

వన్‌టౌన్ ప్రాంతంలోనే కొత్తపేటలో 'శ్రీనివాస మహల్' అనే మరో హాలును అత్యాధునికంగా నిర్మించారు. అటు 'శ్రీమారుతీ సినిమా', ఇటు 'శ్రీనివాస మహల్' - ఈ రెండు థియేటర్లలో చాలా చిత్రాలు శతదినోత్సవాలు జరుపుకొన్నాయి. 1960లు, '70ల దాకా 'మారుతీ' సినిమా ఓ వెలుగు వెలిగింది. అప్పట్లో నవయుగ, రాజశ్రీ లాంటి ప్రసిద్ధ చలనచిత్ర పంపిణీ సంస్థల చిత్రాలు ఎక్కువగా 'మారుతీ'లో వచ్చేవి. పోతిన శ్రీనివాసరావు పెద్ద కుమారుడు బెనర్జీ ఈ హాళ్ళ నిర్వహణలో ప్రత్యేక శ్రద్ధ, సామర్థ్యం కనబరిచారు. పట్టుదలతో కష్టపడి పనిచేయడం, నీతి నిజాయతీ, సాహసోపేత గుణం, అందరూ ఓ కట్టుగా ఉండే లక్షణం ఉన్న 'నగరాలు' కులస్థులు వివిధ రంగాల్లో విజయవాడ పురోభివృద్ధికి ఎంతో దోహదం చేశారు. ఆ కులదీపకులుగా పోతిన శ్రీనివాసరావు, బెనర్జీ ప్రభ కూడా వెలిగిపోయిందంటే అతిశయోక్తి కాదు. ఇక, శ్రీనివాసరావు మరో కుమారుడైన దూండీ చలనచిత్ర నిర్మాతగా ప్రత్యేక ముద్ర వేశారు.

ఏకధాటిగా ఒకే యాజమాన్యం కింద 75 ఏళ్ళ పైచిలుకు నడిచిన 'మారుతీ' సినిమా హాలును పడగొట్టి, 2000 ప్రాంతంలో బహుళ అంతస్థుల వాణిజ్య భవనం నిర్మించారు. ఆ పైన 'శ్రీనివాస మహల్' యాజమాన్యం సైతం పోతిన వారి కుటుంబం నుంచి చేతులు మారింది. ఏమైనా, తెలుగు గడ్డపై తొలి శాశ్వత సినిమా థియేటర్‌గా 'మారుతీ', చిత్ర ప్రదర్శకుడు - నిర్మాతగా పోతిన శ్రీనివాసరావులకు తెలుగు చలనచిత్ర చరిత్రలో తరగని, చెరగని స్థానం ఉంది.

## చిత్ర నిర్మాణ రంగం - స్టూడియో విభాగం

## మచిలీపట్నం నుంచి మద్రాసు దాకా..!

తెలుగు సినిమాకు మద్రాసు కేంద్రంగా ఉన్నప్పుడు అక్కడ మన తెలుగువాళ్ళు స్టూడియోలు నిర్మించారు. మద్రాసులో ఫోటోగ్రాఫర్‌గా, ఆ తరువాత సినిమా ప్రదర్శన, నిర్మాణ రంగాల్లో స్థిరపడ్డ కృష్ణాజిల్లా మచిలీపట్నం వాడైన రఘుపతి వెంకయ్యా నాయుడు ఆ విషయంలో మనకు ఆద్యుడు. మద్రాసులో మొదటి పర్మనెంట్ సినిమాహాలు 'గెయిటీ' (1914) కట్టింది కూడా ఆయనే! కృష్ణాతీరం నుంచి వెళ్ళిన ఆయన మూకీల రోజుల్లోనే మద్రాసులో పరశువాక్కమ్‌లోని గ్లోబ్ థియేటర్ వెనకాల 'స్టార్ ఆఫ్ ది ఈస్ట్' అనే ఓ అధునాతన స్టూడియో పెట్టి, కుమారుడు ఆర్. ప్రకాశ్ దర్శకత్వంలో 'భీష్మ ప్రతిజ్ఞ', 'గజేంద్ర మోక్ష', 'భక్త నందన్', 'సముద్ర మథనం' లాంటి మాటలు లేని మూగ సినిమాలు తీశారు.

ఇక, తెరపై బొమ్మలు మాట్లాడే సాంకేతికతతో టాకీలు వచ్చాక పరిస్థితి మారింది. తొలి రోజుల్లో మన తెలుగు టాకీలన్నీ అప్పట్లో సాంకేతికంగా సినిమాకు పట్టుగొమ్మలైన బొంబాయి, కలకత్తా, కొల్హాపూర్ లాంటి ఉత్తరాది ప్రాంతాల్లోని స్టూడియోల్లో చిత్రీకరణ జరుపుకొనేవి. తమిళ టాకీలదీ అదే పరిస్థితి. శ్రమ, ఖర్చుతో కూడుకున్న ఈ అవస్థల నుంచి తప్పించడానికి అప్పటి ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికి రాజధాని అయిన మద్రాసులో టాకీ స్టూడియోలు రావడం 1934లో మొదలైంది. తమిళుల తొలి స్టూడియో శ్రీనివాస సినీటోన్ తరువాత మద్రాసులో ఏర్పాటైన రెండో స్టూడియో - వేల్ పిక్చర్స్ స్టూడియో. మన కృష్ణాజిల్లా మచిలీపట్నం వాడే అయిన తెలుగు వ్యక్తి పి.వి. దాస్ తన తమిళ మిత్రుల ఆర్థిక భాగస్వామ్యంతో మద్రాసులోనే 'వేల్ పిక్చర్స్ స్టూడియో' పెట్టారు. 1934 జూలై 31న ఆ స్టూడియో ప్రారంభమైంది. మద్రాసులోని తేనాంపేట ప్రాంతంలో ఇప్పటి వీనస్ కాలనీ (ఒకప్పుడు వీనస్ స్టూడియో)కి దగ్గరలో పిఠాపురం రాజా వారికి 'డన్‌మోర్ హౌస్' అనే పెద్ద బంగళా ఉండేది. ఆ బంగళాలో ఈ స్టూడియోను నెలకొల్పారు. అలా ఆ స్టూడియోలో తీరాంధ్రుల హస్తం చాలా ఉందన్న మాట! ఈ సంస్థ తొలి ప్రయత్నంగా తెలుగు టాకీ 'సీతా కల్యాణము' (1934 అక్టోబర్‌లో రిలీజ్) నిర్మించింది. అప్పటి దాకా ఉత్తర భారతదేశంలోని నగరాల్లో రూపొందుతున్న తెలుగు చిత్రాలకు భిన్నంగా, దక్షిణ భారతదేశంలోనే తయారైన తొలి తెలుగు సినిమాగా ఈ 'సీతా కల్యాణము' చరిత్ర సృష్టించింది. మద్రాసులో నిర్మాణమైన తొలి తెలుగు టాకీగా రికార్డుకెక్కింది.

## సీమ, తీరాంధ్రుల పెట్టుబడులతో స్టూడియోలు

ఆ తరువాత మద్రాసులో ఏర్పాటైన రెండో "తెలుగు స్టూడియో" కూడా కృష్ణాజిల్లా వారి పెట్టుబడే! కృష్ణాజిల్లాకు చెందిన మీర్జాపురం రాజా (వెంకట్రామయ్య అప్పారావు బహద్దూర్) వారు కట్టిన ఆ స్టూడియో - 'జయా ఫిల్మ్స్' (1937). మద్రాసులోని ఆళ్వారుపేటలోనే ఎల్డామ్స్ రోడ్‌కు సమీపంలో తమ కార్యాలయం, స్టూడియో పెట్టారు. తొలి చిత్రంగా 'కృష్ణ - జరాసంధ' (1938 మార్చి 17న) ప్రేక్షకులకు అందించారు. ఆ తరువాత కాలంలో రాజా వారే తమ కంపెనీ పేరును 'జయా ఫిల్మ్స్ లిమిటెడ్' నుంచి 'శోభనాచల పిక్చర్స్ లిమిటెడ్'గా (1941) మార్చారు. అలా 'జయా' స్టూడియో కాస్తా 'శోభనాచల' స్టూడియోగా పేరు మార్చుకొని, చిత్ర నిర్మాణంలో ప్రసిద్ధమైంది. ఆ తరువాత 1955 నుంచి 'వీనస్ స్టూడియో'గా పనిచేసింది.

ఆంధ్రదేశంలోనే రాయలసీమ నుంచి వచ్చిన దర్శక - నిర్మాతల లెక్కన చూస్తే... 1939లోనే 'శ్రీశారదా రాయలసీమ ఫిలిమ్స్'

పేరిట మద్రాసులోని కెథడ్రల్ ప్రాంతంలో మరో స్టూడియో ప్రయత్నం సాగి, అర్ధంతరంగా ముగిసిపోయింది. అయితే, బి.ఎన్. రెడ్డి తదితరుల 'వాహినీ స్టూడియో' (1949), హెచ్.ఎం. రెడ్డి 'రోహిణీ స్టూడియో' (1953) లాంటివి ఆ తరువాత కాలంలో మద్రాసులో వెలిశాయి. ఇక, ఆసియాలోనే అతి ముఖ్యమైన, అతి పెద్ద సినిమా స్టూడియోగా 'విజయ - వాహినీ' విస్తరణలో నాగిరెడ్డితో పాటు తీరాంధ్రుడైన చక్రపాణి ఆలోచన జతపడింది. మళ్ళీ తీరాంధ్రుల విషయానికొస్తే - అటు తర్వాత ఏ. రామయ్య 'స్టార్ కంబైన్స్' స్టూడియో (1946), భానుమతి - రామకృష్ణల 'భరణీ స్టూడియో' (1950-51), దర్శక - నిర్మాతలైన కె.ఎస్. ప్రకాశరావు 'ప్రకాశ్ స్టూడియో' (1951-52), ఎల్వీ ప్రసాద్ 'ప్రసాద్ స్టూడియో' (1965) లాంటివన్నీ అప్పటికి మద్రాసు కేంద్రంగా సాగిన తెలుగు సినీ రంగంలో కోస్తా ఆంధ్రుల పెట్టుబడులే.

## తెలుగుగడ్డపై తొలి స్టూడియో!

మరి, భౌగోళికంగా మన తెలుగుగడ్డ నడిబొడ్డున స్టూడియోలు కట్టే ప్రయత్నం జరగలేదా? అంటే ఎందుకు జరగలేదు. జరిగింది! మన దేశానికి స్వాతంత్ర్యం రావడానికి పూర్వమే, ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో మనమంతా భాగంగా ఉన్నప్పుడే తెలుగుగడ్డపై చిత్ర నిర్మాణశాలలైన 'స్టూడియోలు' వెలిశాయి.

మళ్ళీ ఒక్కసారి కొద్దిగా వెనక్కి వెళితే... మద్రాసులో మన పి.వి. దాస్ 'వేల్ పిక్చర్స్ స్టూడియో' పెట్టాక... పూర్తిగా తెలుగు వారి యాజమాన్యంలో, వారి సొంత పెట్టుబడితో, ఆంధ్రదేశం నడిబొడ్డున స్టూడియో ఆవిర్భవించడానికి మరో రెండేళ్ళు పట్టింది. 1936 తొలినాళ్ళ పరిస్థితి ఏమిటంటే, తెలుగు నాట సినిమాలు తీసే నిర్మాతలు హెచ్చుగా ఉన్నా, వాటిని తయారు చేసే స్టూడియోలు మాత్రం మచ్చుకైనా లేవు. తమిళులు మాత్రం ఆ విషయంలో ముందంజ వేసి, కొన్ని స్టూడియోలను నిర్మించుకున్నారు. తమిళులతో చేతులు కలిపి, పి.వి. దాస్ తదితర ఆంధ్రులు కూడా భాగస్వాములుగా వేల్ స్టూడియో 1934లో అవతరించినా, 1936 ప్రథమార్ధంలో దాసు మరణించడంతో, తరువాత అది క్రమేపీ తమిళుల చేతుల్లోకి వెళ్ళిపోయింది. ఇక, సినిమా పట్ల ఉత్సాహం ఉన్న కొందరు అంతకు కొద్ది నెలల ముందు బెజవాడలో ఓ స్టూడియో నిర్మించాలని యోచించారు. అయితే, ఎందుకనో కొద్ది రోజుల్లోనే ఆ ఆలోచన అటకెక్కింది.

ఆ పరిస్థితుల్లో తొలి పూర్తి తెలుగు టాకీ 'భక్త ప్రహ్లాద' రిలీజైన నాలుగేళ్ళకే 1936 ప్రాంతంలో తెలుగు గడ్డపై తొట్టతొలి సినిమా స్టూడియో నెలకొంది. అదే - గోదావరీ తీరంలోని రాజమండ్రిలో 'శ్రీదుర్గా సినీటోన్ కంపెనీ'! ఇక, ఆ స్టూడియోలో నిర్మాణమైన తొలి చిత్రం - 'సంపూర్ణ రామాయణము' (1936 జూన్‌లో రిలీజ్). ఆంధ్రదేశంలో తయారైన తొలి టాకీ అదే! నిడమర్తి వారి కుటుంబమే అటు స్టూడియోనూ, ఇటు ఈ సినిమానూ - రెంటినీ నిర్మించింది. ఈ నిర్మాణాల వెనుక పెద్ద కథే ఉంది.

## ఇప్పటికీ నడుస్తున్న ప్రాచీన హాలు!

నిడమర్తి కృష్ణమూర్తి, సూరయ్య తదితరులు ఆరుగురు అన్నదమ్ములు. వారి తండ్రి గారి పేరు - నిడమర్తి జలదుర్గా ప్రసాదరాయడు. ఆయనను అందరూ 'దుర్గయ్య' అని పిలిచేవారు. ఆ రోజుల్లో దుర్గయ్య గారు పెద్ద ప్లీడర్. కొన్నేళ్ళపాటు రాజమండ్రి మునిసిపల్ సంఘం చైర్మన్ కూడా! కుమారులైన కృష్ణమూర్తి, సూరయ్యలు ఇద్దరూ సినిమాల్లోకి దిగి, ఆనుపానులు తెలుసుకున్నారు. నిడమర్తి వారి కుటుంబం 1924 ప్రాంతంలో రాజమండ్రిలో 'శ్రీకృష్ణా పిక్చర్ ప్యాలెస్' అనే సినిమా హాలు కట్టింది. అప్పుడు మొదలైన ఆ హాలు 1983లో 'శ్రీసాయికృష్ణా ఏ.సి' అని పేరు మార్చుకొని ఇప్పటికీ నడుస్తోంది. ఆంధ్రదేశంలోని మొట్టమొదటి పర్మనెంట్ సినిమా థియేటరైన 1921 నాటి విజయవాడ 'శ్రీమారుతీ' 2000ల నాటికి అదృశ్యమైపోయింది. అయితే, రాజమండ్రి 'శ్రీకృష్ణా' మాత్రం ఇప్పటికీ, ఆగకుండా నడుస్తుండడం విశేషం. తెలుగునాట ఇప్పటికీ కొనసాగుతున్న అతి ప్రాచీన సినిమా హాలు ఇదే!

ఆ తరువాత నిడమర్తి సోదరులు 1930ల మధ్యలో చిత్ర నిర్మాణం చేపట్టాలని భావించారు. అందుకు తగిన స్టూడియోను కూడా ఉన్న ఊళ్ళోనే, తామే ఏర్పాటు చేసుకోవాలని భావించారు. రాజమండ్రిలోని ఆల్కాట్ గార్డెన్స్ ప్రాంతంలో దాదాపు 14 ఎకరాల స్థలంలో ఓ పాత డచ్ బంగళా దుర్గయ్య గారికి ఉండేది. దానిలోనే స్టూడియో పెట్టారు. పురప్రముఖుడూ, స్వయానా తండ్రీ అయిన దుర్గయ్య పేరు కూడా వచ్చేలా స్టూడియోకు 'శ్రీదుర్గా సినీటోన్ కంపెనీ' అని పేరు పెట్టారు. అలా తెలుగునేలపై తొలి స్టూడియో వెలసింది.

## తెలుగునాట తయారైన తొలి టాకీ!!

ఆ సంస్థకు యజమానులైన నిడమర్తి వి. కృష్ణమూర్తి, ఆయన సోదరులు తమ తొలి ప్రయత్నంగా "తెలుగు మాట్లాడు ఫిల్ము" 'సంపూర్ణ రామాయణము' నిర్మించారు. అదే తెలుగు గడ్డపై నిర్మాణమైన తొలి చిత్రంగా రికార్డుల్లోకి ఎక్కింది. ఈ చిత్రాన్ని వారు

తమ సొంత స్టూడియోలో నిర్మించడమే కాక, "న్యూ ఫిడెలిటోన్ సిస్టమ్‌లో రికార్డు" చేశారు. నిడమర్తి సూరయ్య ప్రొడక్షన్ మేనేజర్‌గా వ్యవహరించగా, నిడమర్తి వి. కృష్ణమూర్తి బిజినెస్ మేనేజర్‌గా బాధ్యతలు నిర్వహించారు. ఈ చిత్రానికి ఇవటూరి నాగభూషణ రావు, ఎన్.బి. నారాయణలు దర్శకత్వం వహించారు. వారికి సహాయకుడిగా డి. నరసింహారావు పనిచేశారు.

దుర్గయ్య గారి మనుమడూ, సూరయ్య గారి పెద్ద భార్య సత్యవతికి ఏకైక సంతానమూ అయిన నిడమర్తి సత్యనారాయణ మూర్తి (మళ్ళీ బాపు – రమణలతో 'సంపూర్ణ రామాయణం' చిత్రం తీసిన నిర్మాత)కు కూడా మొదటి నుంచి సినీ రంగం మీద ఆసక్తి ఉండేది. 1930లలోనే ఆయన బొంబాయి వెళ్ళి, సౌండ్ రికార్డింగ్, రేడియో ఇంజనీరింగ్ చదివి, రాజమండ్రికి తిరిగొచ్చారు. ఆ యౌవన కాలంలోనే ఆయన తన తండ్రి సూరయ్య తదితరులతో కలసి తమ స్టూడియో వ్యవహారాల్లో చురుగ్గా పాల్గొన్నారు.

తెలుగు దేశంలో ఆరంభమైన ఆ తొలి స్టూడియోలో అప్పటికి అత్యాధునికమైన సాంకేతిక సామగ్రి మొత్తాన్నీ తెప్పించారు. "అప్పట్లో మద్రాసులో కూడా సరైన సినీ సాంకేతిక సామగ్రి ఉండేది కాదు. బొంబాయి నుంచి సాంకేతిక సామగ్రి తెప్పించాం. బొంబాయి నుంచి ఓ వ్యాన్ తెప్పించాం. అందులోనే సౌండ్ రికార్డింగ్ ఎక్విప్‌మెంట్ అంతా ఉండేది. షూటింగ్ జరిగే ప్రాంతంలోనే ఆ వ్యాన్ ఉంచి, శబ్దం రికార్డు చేసేవాళ్ళం. మా దగ్గర 'బెల్ అండ్ హోవెల్' కెమెరా ఒకటి ఉండేది. శబ్దం, దృశ్యం – రెండూ నడిచేలా, మూవీయోలా ఎడిటింగ్ సామగ్రి కూడా ఉండేది" అని ఎన్.ఎస్. మూర్తిగా సినీ లోకంలో పరిచితులైన నిడమర్తి సత్యనారాయణ మూర్తి తన చివరి రోజుల్లో ఈ వ్యాసకర్తకు ఇచ్చిన భేటీలో చెప్పారు. పైగా, ఆ రోజుల్లో షూటింగ్ చేసిన ఫిల్మును రాజమండ్రిలోనే స్టూడియోలో డెవలప్ చేసి, ప్రాసెసింగ్ చేసే వారంటే ఆశ్చర్యం కలుగుతుంది. "పెద్ద డ్రమ్ములు రెండు ఉండేవి. డెవలప్ చేసిన ఫిల్మును అంతా ఆ డ్రమ్ముకు చుట్టి, ఆరబెట్టేవాళ్ళం. అలా మా స్టూడియో అన్ని వసతులతో సర్వసమగ్రంగా ఉండేది" అని ఆయన నవ్వేశారు.

"అప్పట్లో షూటింగ్‌కు తగిన వెలుతురు కోసం, షూటింగ్ జరిగే స్థలంలో పై కప్పు లేకుండా చూసేవాళ్ళం. తెల్లటి వస్త్రాలు ఆ పై కప్పు దగ్గర కట్టేవాళ్ళం. ఆ వస్త్రాల మీదుగా వచ్చే సూర్యకాంతి షూటింగ్‌కు ఉపకరించేది" అని ఎన్.ఎస్. మూర్తి చెప్పుకొచ్చారు. 'సంపూర్ణ రామాయణము' నిర్మాణం కోసం కెమేరామన్ (గోవింద్ భట్వావలే), సౌండ్ రికార్డిస్టు (పి.ఎల్. కపూర్), ఫిల్మ్ ప్రాసెసర్లు (కె.ఎం. పార్లకర్, జె.పి. జోషీ), ఎడిటర్ (విఠల్ ఆర్. ప్రభు) – ఇలా సాంకేతిక నిపుణులందరినీ బొంబాయి నుంచి రాజమండ్రికి రప్పించి, అక్కడే బస ఏర్పాట్లు కల్పించారు. "ఆ సినిమాను దాదాపు 2 నెలల కాలవ్యవధిలో ఏకబిగిన చిత్రీకరించాం. సినిమా తుది నిడివి 15 వేల అడుగుల పై మాటే! ఆ రోజుల్లోనే ఆ చిత్ర నిర్మాణానికి రూ. 60 వేలు ఖర్చయింది. కానీ, అనుభవ రాహిత్యం వల్ల ఆ సినిమాను సరైన రీతిలో తీయలేకపోయాం, సక్రమంగా వ్యాపారం చేయలేకపోయాం" అని ఆయన ఈ వ్యాసకర్తకు వివరించారు.

## పురిటిలోనే సంధి

నిజానికి, నిడమర్తి వి. కృష్ణమూర్తి, సోదరులు తమ శ్రీదుర్గా సినీటోన్ కంపెనీలో తదుపరి ప్రయత్నాలుగా 'పాంచాలీ కల్యాణము', 'సారంగధర' చిత్రాలను కూడా నిర్మించాలని భావించారు. ఆ మేరకు 'సంపూర్ణ రామాయణము' ప్రచారంలో ప్రకటనలు కూడా వేశారు. కానీ, తొలి చిత్రమైన 'సంపూర్ణ రామాయణము' విఫలం కావడంతో తరువాతి ప్రయత్నాలకు పురిటిలోనే సంధి కొట్టింది. "స్వతంత్ర చిత్ర నిర్మాతలకు అన్ని సదుపాయాలతో స్టూడియోను అద్దెకు ఇస్తా"మనే ప్రకటన కూడా చేశారు.

చిత్ర పరాజయం, ధన నష్టంతో ఆ స్టూడియో ఆట్టే కాలం యజమానుల చేతిలో లేదు. కాకినాడ ప్రాంతం వాడైన ప్రముఖ దర్శకుడు చిత్తజల్లు పుల్లయ్య స్టూడియోను ఏడాదికి కొన్ని వేల రూపాయల చొప్పున అద్దెకు తీసుకొన్నారు. 'ఆంధ్రా టాకీస్' అని పేరు పెట్టి, 'శ్రీసత్య–నారాయణ', 'చల్ మోహనరంగా', 'కాసులపేరు', 'మోహినీ భస్మాసుర' (1938) చిత్రాలను నిర్మించారు. "మా తొలి సినిమా విడుదలయ్యాక, నష్టం వల్ల స్టూడియోను మూసేశాక, దర్శకుడు సి. పుల్లయ్య, కలకత్తా 'చమ్రియా టాకీస్' సంస్థ జనరల్ మేనేజర్ గులాబ్‌చంద్ కలసి మా స్టూడియోను అద్దెకు తీసుకొన్నారు. 'శ్రీసత్య–నారాయణ' (1938) చిత్రం తీశారు" అని ఎన్.ఎస్. మూర్తి అప్పటి సంగతులను గుర్తు చేసుకున్నారు. కానీ, సి. పుల్లయ్య చేతుల్లోనూ ఆ స్టూడియో ఎంతో కాలం సమర్థంగా నడవలేదు. చివరకు నిడమర్తి సోదరులు స్టూడియోను శాశ్వతంగా మూసివేశారు. ఇంతలో రెండో ప్రపంచ యుద్ధం వచ్చింది. ప్రతీ వస్తువు ధరా పెరిగింది. దాంతో, కాస్తంత నష్టమైనా భర్తీ చేసుకోవడం కోసం స్టూడియో యాజమాన్యం "అందులోని సాంకేతిక సామగ్రిని విక్రయించే"యాల్సి వచ్చింది.

## తెలుగునాట రెండో ప్రయత్నం... విశాఖలో 'ఆంధ్రా సినీటోన్'!

ఆ తరువాత తెలుగుగడ్డపై రెండో స్టూడియోగా విశాఖ

పట్నంలో 'ఆంధ్రా సినీటోన్' స్టూడియో 1936 జూన్‌లో స్థాపితమైంది. విశాఖపట్నానికి చెందిన రావు బహదూర్ గొట్టుముక్కల జగన్నాథరాజు, నరసింహరాజు, కంచెర్ల రామ బ్రహ్మం మొదలైన ప్రముఖులు ఈ స్టూడియోను నిర్మించారు. విశేషం ఏమిటంటే, ఈ స్టూడియో పెట్టినవారిలో ఒకరైన పారిశ్రామికవేత్త కంచర్ల రామబ్రహ్మంది కూడా కృష్ణాజిల్లా బందరే! కంచర్ల శ్రీరామమూర్తి గారి కుమారులైన ఈయన వ్యాపారం, కాంట్రాక్టుల నిమిత్తం విశాఖపట్నం వెళ్ళిపోయి, అక్కడే స్థిరపడి, ఆ చుట్టుపక్కలి పారిశ్రామిక సంస్థలన్నిటిలో భాగస్వామిగా ఎదిగారు. ఇక, జయపూర్ మహారాజా, కిర్లంపూడి రాజా కూడా ఈ 'ఆంధ్రా సినీటోన్ లిమిటెడ్' సంస్థ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్లలో ఉన్నారు. బొబ్బిలి రాజా ఆర్.ఎస్.ఆర్.కె. రంగారావు, చిక్కవరం జమీందార్ ఆర్.జె.కె. రంగారావులు కూడా ఈ స్టూడియో నిర్మాణానికి సాయం చేసినట్లు చెబుతారు. ఏమైనా, అప్పట్లో సరికొత్త యంత్రాలను అమెరికా మొదలైన దేశాల నుంచి కొని తెచ్చి, స్టూడియోను నవనాగరికంగా తయారుచేసి, చిత్ర నిర్మాణం సాగించారట! అప్పట్లోనే ఇది సౌండ్ ప్రూఫ్ స్టూడియో అట!

విశాఖపట్నంలో మనోహరమైన ప్రకృతి దృశ్యాలున్న సీతమ్మధార ప్రాంతంలో ఈ స్టూడియోను నెలకొల్పారు. ఆ రోజుల్లో అక్కడ కొండలూ, లోయలే తప్ప నివాసాలే ఉండేవి కావు. సహజ సుందరమైన చిత్రీకరణకు అది కూడా తోడ్పడింది. తెలుగు, బెంగాలీ భాషల్లో 'భక్త జయదేవ' (1938) చిత్రాన్ని అక్కడే ఆ స్టూడియో యజమానులు నిర్మించారు. 'పాశుపతాస్త్రం' (1939) లాంటి చిత్రాలూ అక్కడే తయారయ్యాయి. కానీ, విభేదాలు, నిర్వహణ లోపాలతో ఆ స్టూడియో కూడా అనతికాలంలోనే మూత బడింది. అప్పులు తీర్చడం కోసం యంత్రసామగ్రి మొదలైనవి అమ్ముకోవాల్సి వచ్చింది. విశాఖపట్నంలోని సీతమ్మ ధారలో ఈ స్టూడియో ప్రాంగణంలోనే 1974లో 'ఈనాడు' దిన పత్రిక ప్రారంభమై, చాలాకాలంగా అక్కడ నుంచే నడుస్తూ వచ్చింది.

## విజయవాడలో... కొన్నాళ్ళు ఓ స్టూడియో!

నిజానికి, ఇంకా లోతుగా వెళితే, ఈ రెండు స్టూడియోలు కట్టడాని కన్నా కృష్ణా పరివాహక ప్రాంతం సినీ స్టూడియోల నిర్మాణానికి అనువైనదని సినీ ప్రముఖులు భావించారు. ఆ దిశగా ఆలోచనలు చేశారు. విజయవాడ, కొండపల్లి ప్రాంతంలో స్టూడియో నిర్మాణానికి ప్రయత్నాలూ జరిగాయి. కానీ, అవి ఎందుకో ఫలించ లేదు. రెండో ప్రపంచ యుద్ధ సమయంలో అనివార్య పరిస్థితుల్లో విజయవాడలో ఒక తాత్కాలిక స్టూడియో లాంటిది వచ్చింది.

అప్పట్లో ఆ యుద్ధ ప్రభావం మద్రాసులోని తెలుగు చిత్రసీమపై పడింది. దాంతో, సుమారు 1942–'43 ప్రాంతంలో పలువురు సినీ నిర్మాణానికి తాత్కాలికంగా స్వస్తి చెప్పి, మద్రాసు ఖాళీ చేసి, ఆంధ్ర ప్రాంతాలకు వెళ్ళిపోయారు. 'శోభనాచల' స్టూడియో అధినేత– నిర్మాత మీర్జాపురం రాజా వారు కూడా మద్రాసు నుంచి విజయవాడకు మకాం మార్చారు. తమ శోభనాచల స్టూడియోను తాత్కాలికంగా విజయవాడకు తరలించారు. "అప్పట్లో మేము మద్రాసులో స్టూడియోకు తాళాలు వేసేసి, బెజవాడ వెళ్ళిపోయాం. అక్కడ బందరు రోడ్డులో తాత్కాలికంగా కార్యాలయం పెట్టాం. సత్యనారాయణపురం ఏరియాలో నటులు పి. సూరిబాబు – రాజేశ్వరి నివాసం ఎదురుగా ఉన్న ఇంట్లో కాపురం పెట్టాం. ఆ సమయంలోనే బెజవాడ శివార్లలోని గుణదల ప్రాంతంలో మీర్జాపురం రాజా వారికి ఉన్న సువిశాలమైన తోటల్లో తాత్కాలికంగా షెడ్ వేసి, స్టూడియో లాగా పెట్టాం. అక్కడే మా 'శోభనాచల' వారి 'సంసార నారది' (1944) సినిమా మొత్తం తీశాం" అని 90వ పడిలో ఉన్న తొలితరం నటి – నిర్మాత, మీర్జాపురం రాజా వారి భార్య సి. కృష్ణవేణి ఈ వ్యాసకర్తకు ఇచ్చిన ఇంటర్వ్యూలో తెలిపారు. అంటే, ఆ రకంగా కొన్నాళ్ళపాటు విజయవాడలో ఒక సినిమా స్టూడియో నడిచిందన్న మాట!
అయితే, ఆ తరువాత మళ్ళీ అందరూ మద్రాసు బాటే పట్టారు. విజయవాడలో సినిమా స్టూడియోల నిర్మాణం ప్రతిపాదన పదేపదే తెర పైకి వచ్చినా, ఎందుకనో ఆచరణలోకి మాత్రం రాలేదు. ఆ తరువాత ఏర్పడ్డ తెలుగు వారి స్టూడియోలన్నీ, తీరాంధ్ర ప్రాంత పెట్టుబడులతో మద్రాసుకే ప్రధానంగా పరిమితమయ్యాయి.

## హైదరాబాద్‌కు... కోస్తా సినీ సారథ్యం

'ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర' అవతరణ (1953 అక్టోబర్ 1)తో మళ్ళీ తెలుగునాట సినీరంగ విస్తరణకు కొత్త ఉత్సాహం వచ్చింది. నైజామ్ ఏరియాతో కలసి విశాల 'ఆంధ్రప్రదేశ్' (1956 నవంబర్ 1) ఏర్పాటు, రాజధానిగా హైదరాబాద్ వైపు మొగ్గతో అందరూ తీరాంధ్రలో కాకుండా, మళ్ళీ భాగ్యనగరిలో అదృష్ట పరీక్షకు దిగారు. నిజానికి 1920ల తొలిరోజుల్లో మూకీ సినిమాలప్పుడే హైదరాబాద్‌లో సినిమా, స్టూడియో నిర్మాణ ప్రయత్నాలు జరిగాయి. కలకత్తా నుంచి హైదరాబాద్‌కు వచ్చిన బెంగాలీయుడైన నట – దర్శక – నిర్మాత ధీరేన్ గంగూలీ అప్పట్లో ఒక స్టూడియో పెట్టి, మూకీ చిత్రాలు నిర్మించారు. కానీ, ఆ తరువాత ఆ ప్రయత్నాలేవీ పెద్దగా ముందుకు సాగలేదు. 1946 ప్రారంభంలో మహాదేవ్ సింగ్ అనే ప్రసిద్ధ వ్యాపారి హైదరాబాద్‌లో మరో ప్రయత్నం

చేశారు. (చాలామంది చరిత్రకారులు ఆయన పేరును 'మహావీర్ సింగ్' అని కూడా పేర్కొన్నారు). తొలినాళ్ళ తెలుగు చిత్రాలైన 'సతీ అనసూయ - ధ్రువ విజయము' (1936), 'మీరాబాయి' (1940)లకు కళాదర్శకుడైన కోస్తా తెలుగువాడు, చిత్రకారుడు, రచయిత అడివి బాపిరాజు అప్పట్లో హైదరాబాద్‌లో 'మీజాన్' పత్రికకు సంపాదకత్వం వహిస్తున్నారు. ఆయనతో తెలుగు చిత్ర నిర్మాణం తలపెట్టారు మహ దేవ్ (లేదా వీర్) సింగ్. స్టూడియో నిర్మించడానికి అడివి బాపిరాజుతో కలసి అన్వేషించి, స్థలం, భవనం సేకరించారని చరిత్రకారుల మాట! బొంబాయి నుంచి యంత్ర సామగ్రి కూడా తెప్పించి, హైదరాబాద్‌లో ఫిలిమ్ స్టూడియో నిర్మాణం చేపట్టారు. కానీ, రజాకార్ ఉద్యమం వల్ల ఆ ప్రయత్నానికి పురిటిలోనే సంధి కొట్టింది.

ఇంతలో మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. హైదరాబాద్‌ను పాలిస్తున్న నిజామ్ ప్రభువు మొదట తలాయించినా, చివరకు యూనియన్ సైన్యాలకు తలొగ్గి, భారతదేశంలో తన సంస్థానాన్ని విలీనం చేశారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుంచి తెలుగువారు 'ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం' సాధించుకున్నారు. ఆంధ్ర, తెలంగాణ ప్రాంతాలు కలసి, 'విశాలాంధ్ర ప్రదేశ్'గా అవతరించాయి. అయితే, రాజమండ్రి, విశాఖపట్నాలలో 1930ల ద్వితీయార్ధంలో ఏర్పాటైన స్టూడియోలు అప్పటికి చాలా కాలం క్రితమే మూతబడిపోయాయి. హైదరాబాద్‌లోనూ స్టూడియోలు లేవు. దాంతో, అప్పటి దాకా ఉమ్మడి మద్రాసు రాష్ట్ర రాజధానిగా కొనసాగిన మద్రాసులో ఉన్నవే తప్ప, తెలుగు గడ్డపై తెలుగు వాళ్ళ సినీ స్టూడియో అంటూ లేకుండా పోయింది. తెలుగు వారికి సువిశాలమైన రాష్ట్రం ఏర్పడుతున్న నేపథ్యంలో, మన ప్రాంతంలో మనకంటూ ఓ స్టూడియో ఉండాలని కృష్ణా తీరానికి చెందిన చల్లపల్లి రాజా వారి సోదరుడూ, 'శ్రీసారథీ పిక్చర్స్' నిర్వహణ సారథీ అయిన వై. రామకృష్ణ ప్రసాద్ చొరవ తీసుకున్నారు. ఫలితంగా, విశాల ఆంధ్రప్రదేశ్ ఆవిర్భావాని కన్నా దాదాపు ఎనిమిది నెలల ముందే కాబోయే రాజధాని హైదరాబాద్‌లో 'శ్రీసారథీ స్టూడియోస్'ను స్థాపించారు. 1956 మార్చి 9న ఈ స్టూడియో శంకుస్థాపన జరిగింది. నిర్మాణం పూర్తి చేసుకొని, 1958 జూన్ 1న స్టూడియో ప్రారంభమై, పనిచెయ్యడం మొదలుపెట్టింది.

అలా ఆంధ్రుల పెట్టుబడితో హైదరాబాద్‌లో 'శ్రీసారథీ స్టూడియో' వచ్చింది. వెరసి, తొలి ప్రయత్నమైన 'మహావీర్ సింగ్ స్టూడియో' తరువాత హైదరాబాద్‌లో వెలసిన రెండో స్టూడియో 'సారథీ'యే అనుకోవాలి. సారథీ ఫిలిమ్స్ అధినేత వై. రామకృష్ణ ప్రసాద్ ఆధ్వర్యంలో, సి.వి.ఆర్. ప్రసాద్ పర్యవేక్షణలో ఈ చిత్రనిర్మాణశాల వెలసింది. ఆ రకంగా 'విశాలాంధ్రప్రదేశ్'లో తొలి స్టూడియో కట్టిన గౌరవం కూడా కృష్ణాతీర ప్రాంతీయులకు దక్కింది. దాదాపు పదకొండున్నర ఎకరాల విస్తీర్ణమున్న 'శ్రీసారథీ స్టూడియోస్' పుణ్యమా అని హైదరాబాద్‌లో మరోసారి చిత్ర నిర్మాణం మొదలైంది. ఆ స్టూడియోలో నిర్మాణమైన తొలి చిత్రం 'మా ఇంటి మహాలక్ష్మి'. హైదరాబాద్‌లో నిర్మాణమైన తొలి తెలుగు చిత్రం కూడా అదే! పూర్తిగా భాగ్యనగరంలోనే, అందులోనూ ఆ స్టూడియోలో తీసిన ఈ తొలి టాకీ కూడా తీరాంధ్రులు నిర్మించినదే. గుత్తా రామినీడు దర్శకత్వంలో గుమ్మడి, జమున, హరనాథ్ నటించిన 'మా ఇంటి మహాలక్ష్మి' (1959 జూన్ 11న రిలీజ్)ని నవశక్తి ఫిలిమ్స్ పి. గంగాధరరావు నిర్మించారు. అప్పుడు సినిమా షూటింగ్ కోసం జూనియర్ ఆర్టిస్టులను చెన్నై నుంచి తీసుకురావడం ఖర్చు; శ్రమతో కూడుకున్న పని కాబట్టి, స్థానిక కార్మిక నాయకుడు (తరువాతి రోజుల్లో రాష్ట్ర ముఖ్యమంత్రి) అయిన టి. అంజయ్య సహాయంతో స్థానిక ప్రతిభావంతులకు ఈ చిత్రంలో అవకాశమిచ్చారు. అక్కడ నుంచి చిత్రనిర్మాణంలో భాగ్యనగర భాగస్వామ్యం అంచెలంచెలుగా పెరుగుతూ వచ్చింది.

## పంపిణీ రంగం - నిర్మాతలే... పంపిణీదారులు

చలనచిత్ర పంపిణీ రంగానికి కూడా కోస్తా తీరం పెట్టింది పేరు. తెలుగునాట తెలుగువారు స్థాపించిన తొలి సినీ పంపిణీ సంస్థ కూడా ఈ ప్రాంతం నుంచి వచ్చినదే. నిజానికి, దక్షిణ భారతదేశంలో మొట్టమొదటి చలనచిత్ర పంపిణీ సంస్థ - 'ఎగ్జిబిటర్స్ ఫిల్మ్ సర్వీస్' (1928) అని చరిత్రకారుల మాట. కాగా, తెలుగు వారు స్థాపించిన తొలి ఫిల్మ్ డిస్ట్రిబ్యూషన్ కంపెనీ - 'క్వాలిటీ పిక్చర్స్' (1934).

చరిత్రలోకి వెళితే - మొదట్లో చిత్ర నిర్మాతలే సినిమాల డిస్ట్రిబ్యూషన్ కూడా చూసుకొనేవారు. కాలక్రమేణా వారు ఆ బాధ్యతల్ని డిస్ట్రిబ్యూషన్ వ్యాపారస్థులకు అప్పగించడం ప్రారంభించారు. అలా తెలుగునాట ప్రారంభమైన మొదటి మూడు సంస్థలు - 'సెలెక్ట్ పిక్చర్స్ సర్క్యూట్' (బెంగుళూరు), 'రాయల్ టాకీ డిస్ట్రిబ్యూటర్స్' కంపెనీ (మదురై), 'చమ్రియా టాకీ డిస్ట్రిబ్యూటర్స్' (కలకత్తా). ఈ మూడు కంపెనీలూ తెలుగువాళ్ళు కానివారు ప్రారంభించినవే! విశేషం ఏమిటంటే - ఇవాళ్టి సుప్రసిద్ధ హిందీ చిత్ర నిర్మాణ సంస్థ 'రాజశ్రీ పిక్చర్స్' స్థాపకులైన ప్రముఖ నిర్మాత స్వర్గీయ తారాచంద్ బర్జాత్యా అప్పట్లో ఈ 'చమ్రియా టాకీ డిస్ట్రిబ్యూటర్స్'కు మద్రాసులో బ్రాంచ్ మేనేజర్‌గా వ్యవహరించేవారు! బెజవాడలో ఆ సంస్థ బ్రాంచ్‌కి, తర్వాతి

కాలంలో ప్రముఖ నిర్మాతగా ఎదిగిన సుందర్‌లాల్ నహతా జనరల్ మేనేజర్‌గా పనిచేశారు!

## తెలుగువారి తొలి డిస్ట్రిబ్యూషన్ కంపెనీ

ఇక, మన తెలుగువారి పెట్టుబడితో, వారే యజమానులుగా, మన తెలుగు ప్రాంతంలోనే (విశాఖపట్నంలో) వెలసిన మొట్టమొదటి ఫిల్మ్ డిస్ట్రిబ్యూటింగ్ సంస్థ – 'క్వాలిటీ పిక్చర్స్'. విశాఖపట్నం ప్రాంతానికి చెందిన వ్యాపారవేత్త జి.కె. మంగరాజు ఈ కంపెనీని స్థాపించారు. డిస్ట్రిబ్యూషన్ నిర్వహిస్తూనే, చిత్ర నిర్మాణంలోకి కూడా వచ్చారు. పుణెకు వెళ్ళి, తమ 'క్వాలిటీ పిక్చర్స్' పతాకంపైనే 'దశావతారాలు' (1937) అనే పౌరాణిక చిత్రం తీశారు. ఆ తరువాత విశాఖ కన్నా సినీ వాణిజ్యకేంద్రమైన విజయవాడ వెసులుబాటుగా ఉంటుందని, సంస్థ కార్యస్థానాన్ని 1941లో అక్కడకు మార్చారు. తెలుగుతో పాటు హిందీ, ఇంగ్లీష్ చిత్రాల్నీ విరివిగా డిస్ట్రిబ్యూట్ చేస్తూ వచ్చారు. ఆ పైన తమ సంస్థకు 'పూర్ణా పిక్చర్స్' ప్రైవేట్ లిమిటెడ్‌గా పేరు మార్చారు. ఈ 'పూర్ణా పిక్చర్స్' అలా 1940ల తొలినాళ్ళ నుంచి 1980ల మధ్యభాగం వరకు తెలుగు సినీపరిశ్రమలోని డిస్ట్రిబ్యూషన్ శాఖలో ఓ మూలస్తంభంగా వెలిగింది. తెలుగునాట పలు హిందీ, ఇంగ్లీషు చలనచిత్రాల పంపిణీకి పట్టుగొమ్మగా నిలిచింది.

## బర్మా, సిలోన్లకు బెజవాడ పంపిణీ

తొలిరోజుల్లో 'తెలుగు టాకీకి వేగుచుక్క'గా వ్యవహరించిన వ్యాపారవేత్త పారేపల్లి వెంకట శేషయ్య, బెజవాడలో 'సరస్వతీ బుక్‌డిపో' పేరిట పుస్తకాల షాపు నిర్వహిస్తున్న తన మిత్రుడు కురుకూరు సుబ్బారావుల భాగస్వామ్యంలో, కొందరు మిత్రుల సహకారంతో 1936లో విజయవాడలో మరో డిస్ట్రిబ్యూషన్ కంపెనీ వెలసింది. అదే – 'సరస్వతీ టాకీస్'. అప్పటికే చిత్ర నిర్మాణం పట్ల ఆసక్తి, సినీ రంగంలో కొంత అనుభవం ఉన్న గూడవల్లి రామబ్రహ్మంను కూడా కలుపుకొని, ఇటు డిస్ట్రిబ్యూషన్‌తో పాటు అటు చిత్ర నిర్మాణానికి కూడా ఆ సంస్థ ముందుకు ఉరికింది. 'ద్రౌపదీ వస్త్రాపహరణం' (1936), 'కనకతార' ('37) చిత్రాలను నిర్మించింది ఈ బెజవాడ వాసుల సంస్థే! తరువాతి కాలంలో గూడవల్లి రామబ్రహ్మం 'సరస్వతీ టాకీస్' సంస్థ నుంచి బయటకు వచ్చేసినా, అయన దర్శకుడయ్యాక రూపొందించిన సినీ ఆణి ముత్యాలైన 'మాలపిల్ల' (1938), 'రైతుబిడ్డ' ('39), 'ఇల్లాలు' ('40), 'పత్ని' ('42) తదితర చిత్రాలను ఈ 'సరస్వతీ టాకీస్ లిమిటెడ్' సంస్థే డిస్ట్రిబ్యూట్ చేసింది. ఆ రోజుల్లో ఈ సంస్థ బెంగుళూరులో కూడా ఒక బ్రాంచ్ పెట్టుకొని, అనేక చిత్రాలను మొత్తం బ్రిటీషు పాలనలోని ఇండియా మొత్తానికీ, బర్మా, సిలోన్ (శ్రీలంక)లకు కూడా పంపిణీ చేయడం గమనించాల్సిన విషయం. హిందీ చిత్రాల్ని కూడా ఈ సంస్థ డిస్ట్రిబ్యూట్ చేసింది.

## మద్రాసు, బెంగుళూరు, నెల్లూరుల నుంచి...

1940 నాటి సంగతి గమనిస్తే – అప్పట్లో మద్రాసు కేంద్రంగా పనిచేస్తున్న 'అరోరా ఫిల్మ్ కార్పొరేషన్', 'జనరల్ ఫిల్మ్ డిస్ట్రిబ్యూటర్స్', ఎస్.ఎస్. వాసన్ 'జెమినీ పిక్చర్స్ సర్క్యూట్' లాంటి అనేక ఫిల్మ్ డిస్ట్రిబ్యూషన్ కంపెనీలు మన తెలుగు సినిమాల్ని వివిధ ప్రాంతాల్లో పంపిణీ చేస్తుండేవి. వేల్ పిక్చర్స్ స్టూడియో పక్షాన తీసిన సొంత సినిమాల డిస్ట్రిబ్యూషన్ నిమిత్తం మద్రాసు నుంచే 'వేల్ మురుగన్ ఫిల్మ్ సర్వీస్' నడిచేది. కాగా, బెంగుళూరు కేంద్రస్థానంగా నడిచిన 'గుడ్విన్ పిక్చర్స్' బెజవాడ గాంధీనగర్‌లో బ్రాంచ్ తెరిచి, తెలుగు ఫిల్మ్ డిస్ట్రిబ్యూషన్ జరిపింది. తెలుగు వారి సంస్థల సంగతికొస్తే – నెల్లూరు నుంచి 'ఫేమస్ ఫిల్మ్స్ సర్క్యూట్' సంస్థ ఆంధ్రా – సీడెడ్ (రాయలసీమ ప్రాంతాన్ని సినీవ్యాపార పరిభాషలో పిలిచే పేరు) జిల్లాల్లో మన సినిమాల డిస్ట్రిబ్యూషన్ నిర్వహించింది. నెల్లూరు నుంచే 'శ్రీరామా ఫిలిమ్స్' ఉండేది. మద్రాసు నుంచి 'స్టార్ కంబైన్స్', వాహినీ వారు నిర్మించే సొంత సినిమాల కోసం బి.ఎన్. రెడ్డి 'వాహినీ పిక్చర్స్' పంపిణీదారులుగా వ్యవహరించేవారు.

## సత్యనారాయణపురం నుంచి 'మహాత్మా గాంధీ'!

ఇక, తెలుగువాడైన గుంటూరు నరసింహారావు అనే వ్యక్తి మద్రాసులో 'హేమలతా పిక్చర్స్' పేరుతో డిస్ట్రిబ్యూషన్ కంపెనీ పెట్టి, 'మహాత్మా గాంధీ' (1941) అనే డాక్యుమెంటరీ చిత్రం తెలుగు వెర్షన్‌ను ఆంధ్రా, నైజామ్, మైసూరు ప్రాంతాలన్నిటిలో పంపిణీ చేశారు. గాంధీ బతికి ఉండగా ఆయనపై తెలుగు, తమిళ, ఇంగ్లీషు వెర్షన్‌లలో తీసి, టికెట్ రేట్ల మీద సినిమా హాళ్ళలో ప్రదర్శించి, బాక్సాఫీస్ వద్ద ప్రయోగం చేసిన తొలి డాక్యుమెంటరీ ఇదే. ఈ చిత్రం తమిళ వెర్షన్‌కు ప్రముఖ కర్ణాటక సంగీత విద్వాంసురాలు డి.కె. పట్టమ్మాళ్ నేపథ్య సంగీతం సమకూర్చడం, తెలుగు వెర్షన్‌లో టంగుటూరి సూర్యకుమారి, నాగయ్య లాంటి ప్రసిద్ధులు పాటలు పాడడం విశేషం. గమనించాల్సిన విషయం ఏమిటంటే, ఈ 'హేమలతా పిక్చర్స్' బ్రాంచ్ ఆఫీసు బెజవాడలో సత్యనారాయణపురంలో ఉండేది.

## కేంద్ర బిందువులుగా బెజవాడ, గుంతకల్లు

ఆంధ్ర ప్రాంతంలో ఫిల్మ్ డిస్ట్రిబ్యూషన్ రంగ పరిణామక్రమాన్ని

జాగ్రత్తగా గమనిస్తే – మొదట్లో నంద్యాల, చిత్తూరు, విశాఖపట్నం, నెల్లూరు, భీమవరం, రాజమండ్రి లాంటి పట్టణాల్లో కూడా డిస్ట్రిబ్యూషన్ కేంద్రాలు చెదురుమదురుగా ఉంటూ ఉండేవి. 1953 మార్చి నాటికి నిడదవోలు లాంటి చిన్న పట్నంలో భవానీ పిక్చర్స్ (మేనేజింగ్ పార్ట్‌నర్ రాఘవరావు) – ఇలా రకరకాల చోట్ల నుంచి సినీ పంపిణీ సంస్థలు పనిచేసేవి. కానీ, చిత్ర పరిశ్రమలో పెట్టుబడులు పెరిగినకొద్దీ... విజయవాడ, గుంతకల్లు పట్టణాలు ప్రధానంగా డిస్ట్రిబ్యూటింగ్ కేంద్రాలుగా అభివృద్ధి అయ్యాయి. సినిమా పంపిణీ సంస్థలు ఆ రెండు పట్టణాల్లోనే కేంద్రీకృతం కావడమనేది 1950వ సంవత్సరం నాటికి స్పష్టమైంది.

## సినీ పంపిణీ రాజధానిగా బెజవాడ

గణాంకాల ప్రకారం చూస్తే, 1950లో దాదాపు 21 డిస్ట్రిబ్యూషన్ కంపెనీలు ఉంటే, రెండేళ్ళలో దాదాపు మూడు రెట్లయ్యాయి. లెక్కగా చెప్పాలంటే, 1952 కల్లా 57కు పెరిగాయి. అంటే డిస్ట్రిబ్యూషన్ రంగం చకచకా ఎంతగా అభివృద్ధి చెందిందో తెలుస్తోంది. వాటిలో ఏకంగా దాదాపు అరవై శాతం సంస్థలు విజయవాడ పట్టణంలో ఉండేవి. 1953 ప్రథమార్ధానికి 33 ఫిల్మ్ పంపిణీ సంస్థలతో విజయవాడలోని గాంధీనగర్, గవర్నర్‌పేట ప్రాంతాలు ఫిల్మ్ డిస్ట్రిబ్యూషన్‌కు చిరునామా అయ్యాయి. సెలెక్ట్ పిక్చర్స్ సర్క్యూట్, అప్పటికే దాదాపు 200 చిత్రాలు డిస్ట్రిబ్యూట్ చేసిన 'చమ్రియా డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీ', వివిధ భాషా చిత్రాల్ని 100 దాకా పంపిణీ చేసిన 'పూర్ణా పిక్చర్స్', వాహినీ ప్రొడక్షన్స్ వారి చిత్రాలన్నిటితో కలిపి 12 చిత్రాలను డిస్ట్రిబ్యూట్ చేసిన 'వాహినీ పిక్చర్స్', విజయా ప్రొడక్షన్స్ – ఏ.వి.ఎం. ప్రొడక్షన్స్ వారి 20 చిత్రాలు పంపిణీ చేసిన 'విజయ పిక్చర్స్', సుమారు 50 చిత్రాలు పంపిణీ చేసిన 'నవయుగ ఫిలిమ్స్', అప్పటికి 50 చిత్రాలు డిస్ట్రిబ్యూట్ చేసిన 'రాజశ్రీ పిక్చర్స్', సరస్వతీ ఫిలిమ్స్, జనరల్ ఫిలిమ్ డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీ, గుడ్విన్ పిక్చర్స్ కార్పొరేషన్ లాంటి పేరున్న సంస్థలన్నీ బెజవాడలో కొలువుతీరాయి. ఇవి కాక ఇంకా – జనత పిక్చర్స్, మిత్రా డిస్ట్రిబ్యూటర్స్, ప్రీమియర్ పిక్చర్స్ లిమిటెడ్, శాంతి పిక్చర్స్, ప్రభాత్ పిక్చర్స్ లిమిటెడ్, భారత్ పిక్చర్స్, వినోదా పిక్చర్స్ సర్క్యూట్, నేషనల్ ఆర్ట్స్ డిస్ట్రిబ్యూటర్స్, రాధాకృష్ణ ఫిలిమ్స్, మహాలక్ష్మి పిక్చర్స్, దుర్గా ఆర్ట్స్ పిక్చర్స్, గీతా ఫిలిమ్ డిస్ట్రిబ్యూటర్స్, గోకుల్ కృష్ణా ఫిలిమ్స్, నరసు పిక్చర్స్ లిమిటెడ్, శ్రీనివాస ఫిలిమ్స్, స్టాండర్డ్ పిక్చర్స్, రీగల్ టాకీ డిస్ట్రిబ్యూటర్స్, నారాయణ పిక్చర్స్, వేణుగోపాల పిక్చర్స్, సిల్వర్‌స్క్రీన్, ఫెయిర్‌ప్లే పిక్చర్స్, పద్మ పిక్చర్స్, శ్రీసీతారాం పిక్చర్స్ – ఇలా మొత్తం 33 డిస్ట్రిబ్యూటింగ్ సంస్థలకు కేరాఫ్ అడ్రస్ విజయవాడే! ఇక, గుంతకల్‌లో చమ్రియా, నవయుగ ఫిలిమ్స్, పూర్ణా, విజయ, భవానీ, రాజశ్రీ, మహాత్మా, భారత్, శాంతి పిక్చర్స్ – ఇలా 9 డిస్ట్రిబ్యూటింగ్ సంస్థలు ఉండేవి. విజయవాడ కేంద్రస్థానమైన పూర్ణా పిక్చర్స్ సంస్థ లాంటివి అప్పటికే గుంతకల్లుతో పాటు సికింద్రాబాద్, విశాఖపట్టణం, మద్రాసుల్లోనూ బ్రాంచ్‌లు పెట్టి, ఆఫీసులు నడపడం గమనించాల్సిన విషయం.

1953లో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం వచ్చినప్పటి నుంచి ఈ డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీల సంఖ్య ఇంకా పెరగసాగింది. గణాంకాల్లో చెప్పాలంటే, 1953 సంవత్సరానికి పూర్వపు ఆంధ్ర రాష్ట్రంలో 58 డిస్ట్రిబ్యూషన్ సంస్థలు (వీటిలో తెలుగువారివి 52) ఉన్నాయి. ఇక, తెలంగాణ, ఆంధ్ర ప్రాంతాలు కలిసేసరికి ఆ సంఖ్య రెట్టింపు దాటింది. 1957లో 'విశాల ఆంధ్రప్రదేశ్' అంతటా కలిపి ఫిల్మ్ డిస్ట్రిబ్యూషన్ సంస్థలు 126 (వీటిలో తెలుగువారివి 67) అయ్యాయి. ఇలా ఆంధ్రప్రదేశ్ అవతరణతో ఫిల్మ్ డిస్ట్రిబ్యూషన్ వ్యాపారం విస్తృతం అయింది. పెట్టుబడి కూడా రెండు కోట్ల నుంచి నాలుగు కోట్లకు పెరిగింది. అయితే, హైదరాబాద్‌లో ఆ రోజుల్లో (1959 నాటికి) 53 డిస్ట్రిబ్యూషన్ సంస్థలుంటే, వాటిలో 37 వరకూ పూర్తిగా హిందీ చిత్రాలనే డిస్ట్రిబ్యూట్ చేస్తుండేవి. పైగా, పూర్వపు హైదరాబాద్ స్టేట్ నుంచి విడదీయబడిన మరాఠ్వాడా, కర్ణాటక ప్రాంతాలకే ఎక్కువగా సినిమాల్ని పంపిణీ చేసేవి. హైదరాబాద్ నగరంలోని ఈ డిస్ట్రిబ్యూషన్ సంస్థల అధిపతుల్లో అధికశాతం మంది హైదరాబాద్ నగరవాసులే!

## బెజవాడ డిస్ట్రిబ్యూటర్లు 'సై' అంటేనే...

ఏమైనా, 1950ల నుంచి తెలుగు సినీ రంగంలో డిస్ట్రిబ్యూషన్ శాఖ పలుకుబడి, ప్రాధాన్యం బాగా పెరుగుతూ వచ్చాయి. పంపిణీ సంస్థలు 1956లో 120 చిల్లర ఉంటే, 1968 నాటికి 300కు పైగా పెరిగిపోయాయి. 1950ల నుంచి 1980ల దాకా దాదాపు మూడు దశాబ్దాల పాటు చిత్ర నిర్మాణానికి కావాల్సిన పెట్టుబడిని నిర్మాతలకు సమకూరుస్తూ వచ్చినవి ఈ డిస్ట్రిబ్యూషన్ సంస్థలే. తెలుగు చలనచిత్ర నిర్మాణానికి అండగా నిలిచినవీ, ఎలాంటి చిత్రాలు రావాలో, వ్యాపార రీత్యా ఎలాంటివి కావాలో పూర్తిగా నిర్ణయించినవీ అవే! విజయవాడలో కేంద్రీకృతమైన నవయుగ, లక్ష్మి ఫిలిమ్స్, పూర్ణా పిక్చర్స్, అన్నపూర్ణా ఫిలిమ్స్, తారకరామా ఫిలిమ్స్, శ్రీ ఫిలిమ్స్, లక్ష్మీచిత్ర, శాయికృష్ణా ఫిలిమ్స్ లాంటి పెద్ద డిస్ట్రిబ్యూషన్ కంపెనీలే ఆ రకంగా తెలుగు సినిమాకు ఆయువుపట్టు

అయ్యాయి. ఈ కంపెనీలు పచ్చ జెండా ఊపితేనే, సినిమాలు శ్రీకారం చుట్టుకొనేవి. స్క్రిప్ట్ దశ నుంచి షూటింగ్, రిలీజ్‌ల ముందు దాకా ప్రతి దశలో బెజవాడ డిస్ట్రిబ్యూటర్ల మాటే శిలాశాసనం. కొండొకచో అది అతిగానూ తయారైంది. ఆ మాట అటుంచితే, ఇలా సినీ నిర్మాణ, పంపిణీ, ప్రదర్శన విభాగాలన్నిటికీ కృష్ణా తీరం కీలకమవడంతో ఈ ప్రాంతంపై సినిమాల ప్రభావం సహజంగానే ఎక్కువైంది. అలా నిర్మాత, దర్శకుల నుంచి నటీనట, సాంకేతిక బృందం దాకా ఎక్కువ మంది ఈ ప్రాంతం నుంచే సినీ రంగం వైపు ఆకర్షితులయ్యారు. తెలుగు సినిమాపై బలమైన ముద్ర వేశారు.

## కొత్త ట్రెండ్‌లకు కేరాఫ్ అడ్రస్ కృష్ణా తీరం!

తెలుగు సినీరంగంలో అనేక సరికొత్త ధోరణులకు కృష్ణాతీరం చిరునామా. అయితే, కాలగతిలో తెలుగు సినిమా మద్రాసు నుంచి తెలుగునేల పైకే తరలిరావాలని అప్పటి మన ముఖ్యమంత్రులు, ప్రభుత్వాధినేతలు చేసిన విన్నపాలు, ఇచ్చిన రాయితీలు, ప్రోత్సాహకాలు చాలానే ప్రభావం చూపాయి. అలా మద్రాసు నుంచి హైదరాబాద్‌కు తరలివచ్చిన పెద్దలతో అప్పటి సమైక్య ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రాజధాని అయిన భాగ్యనగరంలో కొత్త స్టూడియోల నిర్మాణం జరిగింది. అలా హైదరాబాద్‌లో చిత్ర పరిశ్రమ కేంద్రీకృతమైన ట్రెండ్‌కు కూడా ఈ తీర వాసులే తెర తీశారు.

## తీరాంధ్ర పెట్టుబడులు... స్టూడియో నిర్మాతల... ఛలో హైదరాబాద్!

హైదరాబాద్‌లో సినీపరిశ్రమ పురోగతిని గమనించిన నట - దర్శక - నిర్మాత ఎన్టీ రామారావు పెద్దయెత్తున పెట్టుబడి పెట్టి, అబిడ్స్ ప్రాంతంలో ఎన్.టి.ఆర్. ఎస్టేట్‌లో రెండు నాణ్యమైన సినిమా థియేటర్ల నిర్మాణం చేశారు. అవే - రామకృష్ణా సినీ థియేటర్స్. ఆ పైన అక్కినేని నాగేశ్వరరావు 'అన్నపూర్ణా స్టూడియోస్' (1976 జనవరి 14న ప్రారంభం), ఎన్టీ రామారావు 'రామకృష్ణా సినీ స్టూడియోస్' (1976 జూన్ 7న ప్రారంభం) కట్టారు. అప్పటికే మద్రాసులో స్టూడియో కట్టేసిన దర్శక - నిర్మాత ఎల్వీ ప్రసాద్ హైదరాబాద్‌లో 'ప్రసాద్ కలర్ ఫిల్మ్ లేబరేటరీ' (1976) పెట్టారు. ఆ తరువాత హీరో కృష్ణ కట్టిన 'పద్మాలయా స్టూడియో' (1983), కొండల్ని పిండి చేసి నిర్మాత రామానాయుడు పెట్టిన 'రామానాయుడు స్టూడియో' (1988), బీడు భూముల్లో భారీ సినిమా కలలు పండించేందుకు లెక్కలేనన్ని ఎకరాల్లో కోట్ల కరెన్సీ పోసి, హాలీవుడ్ పంథాలో మీడియా టైకూన్ రామోజీరావు నిర్మించిన 'రామోజీ ఫిల్మ్ సిటీ' (1996) - ఇవన్నీ కూడా తీరాంధ్ర ప్రాంతపు వ్యక్తుల నుంచి హైదరాబాద్‌కు ప్రవహించిన సినిమా పెట్టుబడులే! మధ్యలో స్థానికంగా హైదరాబాద్‌లోనే 1960లలో 'సదరన్ మూవీటోన్' స్టూడియో (అదే ఆ తరువాత 'అజంతా' స్టూడియోగా మారింది), ప్రముఖ వ్యాపారవేత్త బాదం రామస్వామి కట్టిన 'భాగ్యనగర్ స్టూడియోస్' (1977 అక్టోబర్ 21న ప్రారంభం) లాంటివి కూడా రాకపోలేదు. వాటి కృషినీ విస్మరించలేం. అయితే, హైదరాబాద్‌లో 'సదరన్ మూవీటోన్' స్టూడియోను 'అజంతా' స్టూడియోగా ప్రారంభించి, నిర్వహించింది రాయలసీమ వారు. కడప జిల్లాకు చెందిన సీతారామరెడ్డి, రామకృష్ణారెడ్డి అనే ఇద్దరు 1964లో జహనుమా ప్యాలెస్‌ను కొనుగోలు చేసి, 'అజంతా స్టూడియో'గా ప్రారంభించారు. దాదాపు 100 ఎకరాల విస్తీర్ణంలో శోభాయమానంగా వెలిగిన ఆ స్టూడియోలో నిర్మాణమైన తొలి తెలుగు సినిమా 'లలితా-శివజ్యోతి' వారి కలర్ చిత్రం 'రహస్యం' (1967). తెలుగువారందరి రాజధాని కావడంతో తీరాంధ్ర, రాయలసీమ వాసుల పెట్టుబడులు, ప్రయత్నాలు హైదరాబాద్‌లో ఎక్కువగా సాగాయన్నది గమనించాలి.

ఇక, మళ్ళీ చాలా ఏళ్ళ తరువాత ఆంధ్ర ప్రాంతంలో మరో స్టూడియో వెలసింది. 2008 ఆగస్టులో విశాఖపట్నం సమీపంలో మళ్ళీ మరో స్టూడియోగా 'రామానాయుడు స్టూడియో' శాఖ వచ్చింది. భవిష్యత్తులో సమైక్యాంధ్ర ప్రదేశ్ రెండుగా విభజన కావడం తప్పదని ముందుగానే గ్రహించడం వల్లనో ఏమో ఈ తరంలో అందరి కన్నా ముందే రామానాయుడు విశాఖ తీరంలో అలా జెండా పాతారు. ఇదీ స్థూలంగా తెలుగు నాట స్టూడియోల కథ.

## మంగళగిరి మిస్ అయిన 'పద్మాలయా' స్టూడియో!

ఆ మాటకొస్తే, హీరో కృష్ణ మొదట్లో విజయవాడ దగ్గర మంగళగిరి ప్రాంతంలోనే 'పద్మాలయా స్టూడియో' కట్టాలని అనుకున్నారు. ఆయన సొంత సినిమా అయిన గ్రామీణ కుటుంబకథా చిత్రం 'పాడిపంటలు' విజయవాడ దగ్గరలోని మానికొండ గ్రామంలోనే అధిక భాగం చిత్రీకరణ జరుపుకొంది. వందో సినిమా 'అల్లూరి సీతారామరాజు' (1974)తో వచ్చిన ఇమేజ్ ఫలితంగా, ఆ తర్వాత వరుసగా 14 ఫ్లాప్‌లు చూసిన కృష్ణ కెరీర్‌ను మళ్ళీ ఘన విజయాల పట్టాలు ఎక్కించింది - ఈ 'పాడిపంటలు' సినిమానే! 1976 జనవరి 14న సంక్రాంతికి విడుదలైన 'పాడిపంటలు' ఘనవిజయ సంరంభంలో కృష్ణ తెలుగు సినీవాణిజ్య రాజధాని విజయవాడకు వచ్చారు. అప్పుడు ఆయన మంగళగిరి

ప్రాంతంలో 'పద్మాలయా స్టూడియో' నెలకొల్పాలని, తగిన స్థలం కోసం అన్వేషణ చేశారు. అంతేకాకుండా, అందుకు సంబంధించి విజయవాడలోని హనుమాన్‌పేటలో కార్యాలయం కూడా ఏర్పాటుచేశారు. కానీ, ఆ తరువాత కారణాలు ఏమైనా చివరకు హైదరాబాద్‌లోనే ఆ స్టూడియో స్థాపించారు. లేదంటే, ఇవాళ నవ్యాంధ్ర రాజధాని ప్రాంతంలో భాగమైన మంగళగిరి ఏరియా ఈ పాటికి ఇటు చిత్ర నిర్మాణానికి కూడా కేంద్రమై ఉండేది.

### స్టూడియోలు లేకున్నా... బెజవాడలో బోలెడు షూటింగ్‌లు!

స్టూడియో ఇక్కడ కట్టకపోయినా, 1982 ద్వితీయార్ధంలో అభ్యుదయ రాజకీయ చిత్రంగా నిర్మాణమైన తన 200వ సినిమా 'ఈనాడు'ను హీరో కృష్ణ మళ్ళీ విజయవాడ, గుంటూరు, తెనాలి ప్రాంతాల్లోనే చిత్రీకరించారు. విజయవాడలో కృష్ణా నదిపై ఉన్న ప్రకాశం బ్యారేజ్ మీద, అలాగే గాంధీనగర్‌లోని లేపాక్షి షోరూమ్ – అలంకార్ థియేటర్ మధ్య సెంటర్‌లో జనసందోహం నడుమ ఆ సినిమా క్లయిమాక్స్ సన్నివేశాల్ని భారీయెత్తున చిత్రీకరించారు. 'నేడే ఈనాడే ప్రజాయుద్ధ సంరంభం...'ను క్లయిమాక్స్ పాటగా షూటింగ్ చేశారు. ఇవన్నీ కృష్ణా తీరంలో సినిమాల చిత్రీకరణకు కొన్ని ఉదాహరణలు. అలాగే, నటుడు కొంగర జగ్గయ్య 'పదండి ముందుకు' లాంటి సినిమాలు 1960ల తొలి రోజుల్లోనే సినిమా కెమేరాల్ని తెనాలి పరిసర ప్రాంతాలకు తెచ్చి, షూటింగ్ చేసిన విషయం ఇక్కడ గుర్తు చేసుకోవాలి.

కలర్ సినిమాలొచ్చిన తరువాత కృష్ణాతీరంలో షూటింగ్ జరిగిన సినిమాలు చాలానే ఉన్నాయి. గుంటూరు జిల్లా రేపల్లె దగ్గర పెదపులివర్రులో పుట్టినా, విజయవాడలోనే పెరిగిన 'కళాతపస్వి' కె. విశ్వనాథ్ 1980లలో తరచూ విజయవాడ పరిసరాల్లో తన సినిమాల చిత్రీకరణ జరిపారు. ఆయన దర్శకత్వంలో వచ్చిన 'సప్తపది'లోని 'నెమలికి నేర్పిన నడకలివి...' పాట విజయవాడలోని పత్రికా ప్రముఖుల సమక్షంలో తుమ్మలపల్లి వారి క్షేత్రయ్య కళాక్షేత్రంలో చిత్రీకరించినదే. అసలు ఆ సినిమాలో అత్యధిక భాగం కృష్ణా నది ఒడ్డునే గుంటూరు జిల్లా అమరావతి పుణ్యక్షేత్రంలో చిత్రీకరించారు. అలాగే, చంద్రమోహన్, సులక్షణ జంటగా ఆయన తీసిన 'శుభోదయం' చిత్రంలో వచ్చే పెళ్ళి సీను బెజవాడ గాంధీనగర్‌లో 'రైస్ మిల్లర్స్ అసోసియేషన్ హాలు'లో తీసిందే. గమ్మత్తేమిటంటే, సరిగ్గా ముప్ఫై ఆరేళ్ళ క్రితం, 1980 సెప్టెంబర్‌లో కృష్ణా పుష్కరాల వేళలోనే ఈ షూటింగ్ జరగడం! ఇక, పన్నెండేళ్ళ క్రితం గడచిన కృష్ణా పుష్కరాలు వచ్చిన 2004లోనే కె. విశ్వనాథ్ నటించి, దర్శకత్వం వహించగా, సంగీత దర్శకుడు విద్యాసాగర్ బాణీలు కూర్చిన 'స్వరాభిషేకం' పాటల విడుదల వేడుక కూడా విజయవాడలో జరగడం విశేషం. ఆ ఏడాది ఆగస్టు చివరి నుంచి సెప్టెంబర్ ప్రథమార్ధం దాకా పుష్కరాలు జరిగితే, అక్టోబర్ ప్రథమార్ధంలో ఘంటశాల వెంకటేశ్వరరావు ప్రభుత్వ సంగీత, నృత్యకళాశాలలో సంగీత, సాహిత్య, సినీ ప్రముఖుల మధ్య ఈ 'స్వరాభిషేకం' పాటల పండుగ జరిగింది. ఆ తరువాత ఆ సినిమాకే ఉత్తమ సంగీత దర్శకుడిగా జాతీయ అవార్డు విద్యాసాగర్‌ను వరించింది.

విజయవాడకు చెందిన ప్రముఖ పంపిణీ సంస్థ లక్ష్మీఫిలిమ్స్ నిర్మించిన హీరో కృష్ణ 'వజ్రాయుధం' షూటింగ్ 1980ల ప్రథమార్ధంలో కృష్ణానదీ మధ్యంలోని భవానీద్వీపంలో జరగడం వార్తల్లో విశేషమైంది. దర్శకులు కె. రాఘవేంద్రరావు 'కృష్ణమ్మ కలిపింది పెనవేసుకున్నట్లు...' అంటూ ఆ సినిమాలో ప్రత్యేకంగా ఒక యుగళ గీతమే తీశారు. అప్పటి నుంచి ఇటీవలి బాలకృష్ణ 'లక్ష్మీనరసింహా', రవితేజ 'కృష్ణ' దాకా చాలా సినిమాలే విజయవాడ కృష్ణా తీరంలో, దుర్గ గుడి, ప్రకాశం బ్యారేజ్ పరిసరాల్లో షూటింగ్ జరుపుకొన్నాయి. జానపద చిత్రబ్రహ్మ బి. విఠలాచార్య దర్శకత్వంలో వచ్చిన 'కనకదుర్గ పూజా మహిమ', 'కదలివచ్చిన కనకదుర్గ', కోడి రామకృష్ణ రూపొందించిన 'దేవుళ్ళు' లాంటి భక్తిరస ప్రధాన చిత్రాలు బెజవాడ కనకదుర్గ గుడి, గుడి నెలకొన్న కొండ పరిసరాల్ని సెల్యులాయిడ్ మీదకు ఎక్కించాయి. బెజవాడలో 1960లలో నెలకొల్పిన గాంధీ స్మారక స్తూపంతో 'గాంధీ హిల్'గా ప్రసిద్ధమైన కొండ కూడా సినిమా చిత్రీకరణలో భాగమైంది. ఆ మధ్య తరుణ్, ఇలియానా జంటగా వచ్చిన 'శశిరేఖా పరిణయం' చిత్రంలో దర్శకుడు కృష్ణవంశీ విజయవాడ పరిసరాల్లో షూటింగ్ చేయడమే కాకుండా, ఏకంగా నగరం గొప్పతనాన్నీ, ఈ నగరం వేదికగా సాహిత్య, సాంస్కృతిక, సామాజిక, సినీ, రాజకీయ రంగాల్లో కృషి చేసిన పలువురు ప్రముఖులను ప్రస్తావిస్తూ, హీరో నోట పెద్ద డైలాగే చెప్పించారు. ఇప్పటికీ 'యూ' ట్యూబ్ మొదలు వాట్సప్ దాకా చాలాచోట్ల ఈ విజయవాడ గొప్పతనం డైలాగ్ చాలా పాపులర్.

### మనం తీసిన తొలి సినిమాకే... కెమేరాలో కొండపల్లి, చల్లపల్లి అందాలు!

నిజానికి చరిత్రలోకి వెళితే... వీటన్నిటి కన్నా ముందే, అసలు తెలుగుగడ్డపై స్టూడియోలు రావడాని కన్నా ముందే, తొలి పూర్తి తెలుగు టాకీ 'భక్త ప్రహ్లాద' రిలీజైన రెండేళ్ళకే సినిమా కెమేరా కృష్ణా తీరానికి వచ్చింది. మొదట్లో ఉత్తరాదిలోని బొంబాయి, కలకత్తా

కంపెనీలే, అవీ తమ ఊళ్లలోనే తెలుగు సినిమాలు తీసేవి. ఆ తర్వాత కొద్దికాలానికి దక్షిణాదిలో మద్రాసులో మనవాళ్ళే తెలుగు సినిమా తీయడం మొదలుపెట్టారు. అలా ఉత్తరాది వారి డబ్బులతో కాకుండా, తెలుగు వారి పెట్టుబడితో, దక్షిణాదిన, అదీ మద్రాసులో నిర్మాణమైన తొలి తెలుగు చిత్రం 'సీతా కల్యాణము' (1934). తెలుగువారు తీసిన ఈ తొలి సినిమాకే విజయవాడ పరిసరాల్లో షూటింగ్ జరగడం విశేషం. వేల్ పిక్చర్స్ పక్షాన ఆ సంస్థలో భాగస్వామి అయిన బందరు వాస్తవ్యులు పి.వి. దాసు ఈ సినిమా నిర్మించారు. రామాయణ గాథ అయిన ఈ పౌరాణిక చిత్రంలోని కొన్ని సన్నివేశాలను బెజవాడ సమీపంలోని కొండపల్లి దగ్గర అడవుల్లో ఔట్‌డోర్‌లో చిత్రీకరించారు.

ఇక, ఈ 'సీతా కల్యాణము'లో వచ్చే ఊరేగింపు సీన్లు, జనక మహారాజు రాజాస్థానం వగైరా సీన్లన్నీ బెజవాడ సమీపంలో చల్లపల్లి సంస్థానంలో తీశారు. చల్లపల్లి రాజా గారి అశ్వదళం, ఏనుగులు, ఒంటెలు వగైరా జంతువులన్నిటినీ ఊరేగింపు సీనుల్లో ఉపయోగించారు. సినిమా నిర్మాణానికి రాజా గారు ఇంతగా సహకరించడమే కాకుండా, నటీనట బృందానికి చాలా సహాయం చేశారు. చివరలో వీడ్కోలు విందు కూడా ఇచ్చి పంపారు!

## తొలి తెలుగు ఔట్‌డోర్ షూటింగూ ఇక్కడే!

ఇవాళంటే సినిమాల్లో అవుట్‌డోర్ షూటింగ్‌లు అలవాటై పోయాయి కానీ, టాకీలు వచ్చిన ఆ తొలి రోజుల్లోనే అడవులు, కొండలు, గుట్టల్లో షూటింగ్‌ల కోసం మన కొండపల్లి అందాలను సెల్యులాయిడ్‌లో బంధించడం ఇవాళ చారిత్రక విశేషమే. ఆ రకంగా తెలుగునాట ఔట్‌డోర్ షూటింగ్‌కు ఈ 'సీతా కల్యాణము' శ్రీకారం చుట్టింది. అలా తెలుగు సినిమా చరిత్రలో ఆ ఫస్ట్ ఔట్‌డోర్ షూటింగ్ క్రెడిట్ కూడా కృష్ణా తీరానికీ, ఇవాళ్టి నవ్యాంధ్ర రాజధాని ప్రాంతానికే దక్కిందన్న మాట!

## ఒకే ఊళ్ళో... పలు హాళ్ళలో రిలీజ్‌కు ట్రెండ్‌సెట్టర్!

ఇవాళ ప్రతి సినిమా కొన్ని వందల థియేటర్లలో ఒకేసారి రిలీజవడం చూస్తున్నాం. ఒకే ఊళ్ళో ఒకటికి పది హాళ్ళలో, వీలుంటే ఊళ్ళో ఉన్న అన్ని హాళ్ళలో అదే సినిమాను ఏకకాలంలో ప్రదర్శిస్తున్న తీరు గమనిస్తున్నాం. తొలి వారంలోనే వీలైనన్ని వసూళ్ళు సంపాదించుకొనేందుకు వీలైన ఈ 'ఏకకాలంలో పలు థియేటర్లలో రిలీజ్' సంస్కృతి కూడా తెలుగునాట మొదలైంది – కృష్ణా తీరంలోనే! దానికీ ఓం ప్రథమం – ఈ 'సీతా కల్యాణము' (1934 అక్టోబర్ 6న రిలీజ్) సినిమానే! అప్పట్లో బెజవాడలో 'మారుతీ సినిమా', 'శ్రీదుర్గాకళామందిరం' – ఈ రెండే హాళ్ళుండేవి. "ఈ రెండు హాళ్ళలోనూ ఏకకాలంలో ఇదే సినిమా విడుదలైంది. నాకు తెలిసి అలా ఒకే కేంద్రంలో ఎక్కువ థియేటర్లలో సినిమా రిలీజు కావడమనేది తెలుగులో ఆ సినిమాతోనే మొదలు!" అని అప్పట్లో తన 15 ఏళ్ళ వయస్సులో ఆ సినిమా చూసిన సంగతులను తొలినాళ్ళలో సినీ జర్నలిస్టుగా కూడా వ్యవహరించిన 92 ఏళ్ళ సీనియర్ పాత్రికేయుడు స్వర్గీయ మద్దాలి సత్యనారాయణ శర్మ (ఎం.ఎస్. శర్మగా ప్రసిద్ధులు) ఈ వ్యాసకర్తకు గతంలో ఇచ్చిన ఇంటర్వ్యూలో గుర్తు చేసుకున్నారు.

## ప్రచార రంగం

సినిమా పబ్లిసిటీకీ, తీరాంధ్ర ప్రాంతానికీ కూడా అవినాభావ సంబంధం. అనేక కొత్త రకం పబ్లిసిటీ పోకడలకు తెలుగునాట ఇది కేంద్రం.

## పబ్లిసిటీలో కొత్త పుంతలు ఇక్కడే!

వేల్ పిక్చర్స్ వారి 'శ్రీకృష్ణలీలలు' (1935) విడుదలప్పుడు మన మచిలీపట్నం వాడైన ఆ చిత్ర దర్శక, నిర్మాత పి.వి. దాసు ఆ చిత్రం ప్రచార విషయంలో మరో కొత్త పుంత తొక్కారు. ప్రత్యేకంగా విమానం అద్దెకు తీసుకొని, ప్రముఖ పట్టణాలలో గగనతలం నుంచి కిందకు సినిమా ప్రచార కరపత్రాలను వెదజల్లే ఏర్పాట్లు చేశారు. ఆ రోజుల్లో విమానమే వింత అయితే, విమానంలో నుంచి కరపత్రాలను జారవిడవడం మరో అదో పెద్ద వింత. ఆ వినూత్న ప్రచార వ్యూహం జనంలో పెద్ద క్రేజును సృష్టించింది. "ఆ తరువాత అదే ప్రచార వ్యూహాన్ని 'ద్రౌపదీ వస్త్రాపహరణము' (1936), 'విజయదశమి' (లేక 'కీచకవధ' – 1937) లాంటి అనేక చిత్రాలు అనుసరించాయి. 'శ్రీకృష్ణలీలలు', 'ద్రౌపదీ వస్త్రాపహరణము' చిత్రాలకు గగనతలం నుంచి కరపత్రాలు జారవిడవడం గుడివాడలో నేను చూశాను" అని ఆ సంగతులను స్వర్గీయ ఎం.ఎస్. శర్మ గుర్తు చేసుకున్నారు.

'సీతా కల్యాణము', 'శ్రీకృష్ణలీలలు' తరువాత వేల్ పిక్చర్స్ పక్షాన మూడో తెలుగు ప్రయత్నంగా, స్వీయ దర్శకత్వంలో 'శశిరేఖా పరిణయము' ('మాయాబజార్' – 1936) చిత్రాన్ని పి.వి. దాసు ప్రారంభించారు. అయితే, షూటింగ్ సగంలో ఉండగానే, 1936 మే 10వ తేదీన దాసు హఠాన్మరణం చెందారు. వేల్ పిక్చర్స్ మేనేజింగ్ డైరెక్టర్ ఎం.టి. రాజన్ ఆ చిత్రాన్ని పూర్తి చేసి, విడుదల చేశారు. ఆ సినిమా చివరన "రిమెంబర్ ఇట్ ఈజ్ ఏ వేల్ పిక్చర్స్ ప్రొడక్షన్" అంటూ ఆంగ్లంలో టైటిల్ కార్డు వేశారు. తెలుగు చిత్రాలకు అలా వేయడం కూడా అదే ప్రథమం. "అలాగే

'మాయాబజార్' విడుదలకు ముందు మచిలీపట్నంలో "ప్రైడ్ ఆఫ్ బందర్... కమింగ్ సూన్" అంటూ ఆంగ్లంలో ఊరంతా పోస్టర్లు అంటించారు. అది జనంలో ఆకర్షణ, ఆసక్తి రేపింది. ఆ తరువాత అక్కడే 'మాయాబజార్' కొత్త పోస్టర్ అంటించారు. ఆ పబ్లిసిటీ కూడా అందరి నోటా చర్చనీయాంశమైంది" అని ఎం.ఎస్. శర్మ చెప్పారు.

ఆ చిత్రం విడుదలైనప్పుడు తెలుగు చిత్రాల పబ్లిసిటీలో మరో కొత్త హంగు వచ్చి చేరింది. ఘటోత్కచుడి విగ్రహాలను తయారు చేసి, సినిమా హాళ్ళకు పంపారు. 'మాయాబజార్'ను ప్రదర్శిస్తున్న ప్రతి హాలులో ఆ విగ్రహాలను ఏర్పాటుచేశారు. "బందరు, గుడివాడల్లోని హాళ్ళలో, బెజవాడ శ్రీదుర్గాకళామందిరంలో అలా విగ్రహాలతో వినూత్న పబ్లిసిటీకి నేను ప్రత్యక్ష సాక్షిని" అని ఎం.ఎస్. శర్మ తెలిపారు. 'శ్రీవేంకటేశ్వర మాహాత్మ్యం' (1939) లాంటి తదుపరి చిత్రాల మొదలు నిన్న మొన్నటి నాగార్జున 'శ్రీరామదాసు' (2006) దాకా తెలుగు సినిమాలకు హాళ్ళలో దేవతా విగ్రహాలు పెట్టడం చూస్తూనే ఉన్నాం. ఆ ప్రచారానికి తెలుగు నాట శ్రీకారం చుట్టింది వేల్ పిక్చర్స్ 'మాయాబజార్' అన్నమాట!

## ప్రఖ్యాత పబ్లిసిటీ డిజైనర్లూ... తీరాంధ్రులే!

తెలుగు సినీ రంగానికీ, తీరాంధ్ర ప్రాంతానికీ మొదటి నుంచి ముడి వేసుకున్న అనుబంధం వల్లనో ఏమో కానీ, టాకీలు వచ్చాక తెలుగు సినిమాల పబ్లిసిటీకి కోస్తా జిల్లాల్లో ప్రత్యేకంగా కృషి జరిగినట్లు కనిపిస్తుంది. సినిమాల తొలి రోజుల్లో ఆ చిత్రానికి పనిచేసిన ఆర్ట్ డైరెక్టర్లే పబ్లిసిటీకి కావాల్సిన పోస్టర్లు, పేపర్ డిజైన్లు చేసేవారు. కళా దర్శకులు టి.వి.ఎస్. శర్మ, ఎస్.వి.ఎస్. రామారావు, కె. నాగేశ్వరరావు లాంటి వాళ్ళు అందుకు ఉదాహరణ. వీళ్ళ ముగ్గురే కాదు, అప్పటి ఆర్టిస్టులు చాలామంది అప్పట్లో బందరు జాతీయకళాశాలలో చిత్రలేఖనంలో శిక్షణ పొందినవారే. 1930 – '40లలో 'ద్రౌపదీ వస్త్రాపహరణం', 'చిత్రనళీయం', 'మాలపిల్ల', 'మాయల మరాఠీ', 'భాగ్యలక్ష్మి', 'యోగి వేమన', 'బాలరాజు' లాంటి చిత్రాలకు ఎస్.వి.ఎస్. రామారావు ఆర్ట్ డైరెక్టర్‌గా పనిచేశారు. 'మాయల మరాఠీ' (అను 'శాంత... బాలనాగమ్మ') చిత్రానికి దర్శకత్వం కూడా చేశారు.

టి.వి.ఎస్. శర్మది నెల్లూరు జిల్లా పొదిలి తాలూకాలోని ఓ కుగ్రామం. హీరో ఎన్టీయార్‌ను వెండితెర వేల్పును చేసిన రాముడు, కృష్ణుడు, భీష్ముడు, దుర్యోధనుడు మొదలైన పౌరాణిక పాత్రల రూపురేఖల స్కెచ్‌లన్నీ టి.వి.ఎస్. శర్మ హస్తకళా నైపుణ్యాలే. శర్మ గారు, మచిలీపట్నానికి చెందిన వ్యక్తి – కమర్షియల్ ఆర్ట్‌లో ఆరితేరిన ఆర్ట్ డైరెక్టర్ అయిన కాకుమాను నాగేశ్వరరావు (నాగ్) లాంటి వాళ్ళు అప్పట్లో ప్రముఖ పబ్లిసిటీ ఆర్టిస్టులు. 'విజయా' వారి 'షావుకారు', 'పాతాళభైరవి', 'మిస్సమ్మ' లాంటి సూపర్‌హిట్ సినిమాల పోస్టర్లపై 'నాగ్' అనే ఆ సంతకం ఇవాళ్టికీ విలక్షణంగా గుర్తొస్తుంది. ఆ తరువాత ఈ పబ్లిసిటీ డిజైనింగ్ రంగంలో విశేష కృషి చేసిన వ్యక్తులు – కేతా (శర్మ గారి శిష్యులు), కె. రామదాస్ (నాగ్ గారి శిష్యులు). ఈ ఇద్దరూ పాలకొల్లు సమీప గ్రామాల నుంచి సినీ రంగానికి వచ్చినవాళ్ళే. కేతా 'రూపకళ' అనే సంస్థను స్థాపించి, ఎంతోమందికి చిత్రకళ నేర్పారు. తొలి 30 ఏళ్ళ కళా జీవితంలోనే దాదాపు 400 చిత్రాలకు పబ్లిసిటీ డిజైన్లు రాశారు. అలాగే, 1970ల నుంచి సినీ పబ్లిసిటీ రంగాన్ని ఒక ఊపు ఊపేసిన పబ్లిసిటీ ఆర్టిస్టులు ఈశ్వర్, గంగాధర్, ఎ.ఎన్. మూర్తి తదితరులు కూడా కేతా సహాయ సహకారాలతో అభివృద్ధి అయినవాళ్ళే! మొత్తం మీద గమనిస్తే – ఈ ప్రచార చిత్రకళాకారులందరూ కూడా తీరాంధ్ర ప్రాంతం నుంచి సినీ రంగంలోకి వచ్చి, స్థిరపడినవాళ్ళే! ఆ రోజుల్లోనే కాదు... ఇవాళ ఆధునిక డిజిటల్ యుగంలో కంప్యూటర్లలో పోస్టర్, పబ్లిసిటీ డిజైనింగ్ చేస్తున్న సమయంలో లంక భాస్కర్ మొదలు కె.వి. సురేశ్, సురేశ్ బుజ్జి, పి.ఎ. రంగా, కొసనా విజయకుమార్, కృష్ణ, రమేశ్‌వర్మ తరం దాకా చాలామంది ఆంధ్రదేశంలోని కోస్తా జిల్లాల నుంచి సినీసీమ ఉన్న మద్రాసుకు చేరినవాళ్ళే! ఒకరిద్దరు మినహా మిగతా అందరూ అక్కడ నుంచి చిత్రసీమతో పాటు హైదరాబాద్‌కూ తరలివచ్చినవాళ్ళే!

## బెజవాడ నుంచే... పేపర్ పబ్లిసిటీ!

ఇప్పటిలాగా బయ్యర్ల వ్యవస్థ, ఫలానా ఏరియాకు అవుట్‌రైట్‌గా సినిమా ప్రదర్శన హక్కుల అమ్మకాలు – కొనుగోళ్ళ బిజినెస్ రాని టైమ్‌లో దాదాపు 1990ల తొలినాళ్ళ దాకా డిస్ట్రిబ్యూటర్లదే రాజ్యం. అలా సినిమా డిస్ట్రిబ్యూషన్ వ్యవస్థ మాటే చెల్లుబాటైన సమయంలో– విజయవాడలో గాంధీనగర్ నిండా వీధి వీధికీ ఈ సినిమా డిస్ట్రిబ్యూషన్ కంపెనీలే! మద్రాసు నుంచి వచ్చే ప్రింట్లు, పబ్లిసిటీ మెటీరియల్ తెచ్చుకొనేందుకూ, ఊళ్ళోని థియేటర్లకు తిప్పేందుకూ వీలుగా అన్నీ రైల్వేస్టేషన్‌కు దగ్గరలోనే ఉండేవి. తెలుగు సినిమా నిర్మాణానికి అక్కడ మద్రాసు కేంద్రమైతే, సినిమా వ్యాపారానికి ఇక్కడ విజయవాడ కేంద్రం. నవయుగ ఫిలిమ్స్, లక్ష్మీ ఫిలిమ్స్, పూర్ణా పిక్చర్స్, విజయా పిక్చర్స్, శ్రీఫిలిమ్స్ లాంటి ప్రసిద్ధ సంస్థలు సహా అన్ని డిస్ట్రిబ్యూషన్ ఆఫీస్‌లకూ హెడ్డాఫీసు బెజవాడే! పంపిణీ సంస్థలన్నీ విజయవాడలోనే ఉండడం, దినపత్రికల మెయిన్ ఎడిషన్లకు కూడా విజయవాడే కేంద్రస్థానం కావడంతో – సినిమాకు

సంబంధించిన ప్రెస్ పబ్లిసిటీ అంతా కూడా ఇక్కడ నుంచే నిర్వహించేవారు. పేపర్లలో వచ్చే సినిమా అడ్వర్‌టైజ్‌మెంట్ల వ్యవహారమంతా అడ్వర్‌టైజింగ్ ఏజెన్సీలు నిర్వహించేవి. అటు నిర్మాత లేదా డిస్ట్రిబ్యూటర్‌కూ, ఇటు పత్రికలకూ మధ్య వారధిగా ఉంటూ పత్రికల్లో సినిమా డిజైన్ల అడ్వర్‌టైజ్‌మెంట్లు ప్రచురించే బాధ్యత మొత్తం అవే చూసుకొనేవి. ఈ పని చేసిపెట్టినందుకు గాను ఆ ప్రకటనల సొమ్ములో నుంచి కొంత మొత్తం కమీషన్‌గా పుచ్చుకొనేవి. ఆ రోజుల్లో ప్రతీ పెద్ద ఫిల్మ్ డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీ సొంతంగా తామే అడ్వర్‌టైజింగ్ ఏజెన్సీలు నడిపేవి. అలా నడిపి, ఆ కమీషన్ కూడా తామే పొందేవి. అలా పంపిణీదారులే ఏర్పాటు చేసుకున్న అడ్వర్‌టైజింగ్ ఏజెన్సీలు ప్రధానంగా అయిదారు విజయవాడలోనే ఉండేవి.

నవయుగ, శ్రీఫిలిమ్స్ తరఫున 'ఎన్.వి.కె.ఆర్. అండ్ సన్స్' అడ్వర్‌టైజింగ్ ఏజెన్సీ ఉండేది. నిమ్మగడ్డ వెంకట కృష్ణారావు, ఆయన కుమారులు కలసి దాదాపు 40 ఏళ్ళ పాటు నిరాఘాటంగా ఆ ఏజెన్సీని నడిపారు. విజయా పిక్చర్స్ పక్షాన 'విజయా పబ్లిసిటీస్' ఉండేది. విజయా పిక్చర్స్ పంపిణీ సంస్థ అధినేత చెరుకూరి పూర్ణచంద్రరావు కుమారుడు భాస్కరరావు దాన్ని నిర్వహిస్తుండే వారు. అప్పటి 'ఆంధ్రజ్యోతి' పత్రిక గ్రూప్ అధిపతి కె.ఎల్.ఎన్. ప్రసాద్‌దే లక్ష్మీ ఫిలిమ్స్. ఆ డిస్ట్రిబ్యూషన్ సంస్థకు అనుబంధంగా 'లక్ష్మీ పబ్లిసిటీస్' ఉండేది. అటు సినీ పరిశ్రమ వర్గీయులకూ, ఇటు పత్రికా రంగ ప్రముఖులకూ తలలో నాలుకలా వ్యవహరిస్తూ, సినిమా తారలందరికీ ఆత్మీయ 'బాబాయ్' అయిన స్వర్గీయ ఈదుపుగంటి లక్ష్మణరావు 'లక్ష్మీ పబ్లిసిటీస్' వ్యవహారాలన్నీ నడిపేవారు. ఇక, అన్నిటికన్నా సీనియర్ డిస్ట్రిబ్యూషన్ కంపెనీ అయిన పూర్ణా పిక్చర్స్‌కు అనుబంధ సంస్థగా 'నవరంగ్ పబ్లిసిటీస్' ఉండేది. 'పూర్ణా' అధినేత కామరాజుకు తోడల్లుడైన కంచర్ల వెంకటేశ్వర్లు ఆ అడ్వర్‌టైజింగ్ సంస్థ పక్షాన పబ్లిసిటీ అంతా చూసేవారు.

ఇవే కాకుండా చెరుకూరి ప్రకాశరావు (తరువాతి కాలంలో 'వీరాంజనేయ', 'బాలభారతం' చిత్రాల నిర్మాత) సారథ్యంలోని 'రేవతి' పబ్లిసిటీస్, వి.కె. వెంకట్రావ్ నడిపిన వి.కె. అడ్వర్‌టైజింగ్స్, రాజా ఎ. మోహన్ నిర్వహించిన 'సువర్ణా ఏజెన్సీస్', నిమ్మగడ్డ రాంబాబు తదితరులు నడిపిన ప్రసిద్ధ ఎన్.వి.కె.ఆర్. అడ్వర్‌టైజర్స్, కృష్ణాజీ నడిపిన 'వాణీ అడ్వర్‌టైజర్స్'??? లాంటివెన్నో కృష్ణాతీరాన్ని సినిమా పబ్లిసిటీకి పెట్టనికోట చేశాయి. ఈ పబ్లిసిటీ ఏజెన్సీలకు కావాల్సిన డిజైన్లు, ప్రచార కార్టూన్ చిత్రాలు, స్ట్రిప్‌లు వేయడానికి బెజవాడలో స్థానికంగా ప్రముఖ పబ్లిసిస్ట్ – ఆర్టిస్ట్ 'గీతా' సుబ్బారావు లాంటి చేయి తిరిగిన ఆర్టిస్టులు ఎంతోమంది ఉండేవారు.

## రేడియో పబ్లిసిటీకీ బెజవాడే!

విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో వాణిజ్య ప్రసార విభాగం ఉండడంతో, రేడియోలో సినిమా పబ్లిసిటీకి కూడా కృష్ణాతీరమే కేంద్రమైంది. 1987 ప్రాంతానికి వచ్చేసరికి ప్రేక్షకులను చేరాలంటే పత్రికా ప్రచారం కన్నా రేడియోలోని 'వివిధ భారతి' ప్రచారం ఎక్కువ ఫలితాలు ఇస్తుందనే భావం ఏర్పడింది. బీదవారి గుడిసెలలోకి కూడా ఈ రేడియో ప్రచారం చొచ్చుకుపోతుందనే అభిప్రాయం కొనుగోలుదారుల్లో నెలకొంది. దాంతో, ఆల్ ఇండియా రేడియో 'విజయవాడ–బి' కేంద్రం ('వివిధ భారతి') నుంచి శ్రోతలు కోరిన సినిమా పాటల 'జనరంజని' కార్యక్రమంతో పాటు మధ్య మధ్యలో కొద్ది క్షణాల పాటు ఉండే ప్రత్యేక సినిమా స్పాట్‌లు (వాణిజ్య ప్రకటనలు), ఒక్కో సినిమాపై పది – పదిహేను నిమిషాల దాకా వచ్చే ప్రత్యేక ప్రాయోజిత కార్యక్రమాలు ఇబ్బడిముబ్బడి అయ్యాయి. సినీప్రియులైన శ్రోతలు వీటి కోసం రేడియో సెట్‌లకు చెవులప్పగించేవారు. చివరకు 'సంపూర్ణ రామాయణం' లాంటి రీ–రిలీజ్ పాత సినిమాలకు కూడా 1987 నాటికి రేడియోలో ప్రచారం చేయడం గమనించవచ్చు. ఈ రేడియో పబ్లిసిటీ కోసం 'క్రియేటివ్ కమర్షియల్స్' (ఇప్పటి ప్రముఖ సినీ నిర్మాత కె.ఎస్. రామారావుది) లాంటి కొన్ని ప్రత్యేక సంస్థలూ విజయవాడ నుంచి జోరుగా నడిచేవి.

## ఊరంతా కటౌట్లు, పెయింటింగ్ బ్యానర్లే!

ఇవాళ డిజిటల్ ప్రింటింగ్ వచ్చాక సినిమా నుంచి రాజకీయాల దాకా ఏ ప్రచారానికైనా, ఎక్కడ చూసినా ఫ్లెక్సీలు, వినైల్ బ్యానర్‌లే! పర్యావరణ హితం కాని ఇవేవీ రాక ముందు దాదాపు 2000ల ప్రథమార్ధం దాకా సినిమా పబ్లిసిటీ అంటే భారీ కటౌట్లు, క్లాత్ బ్యానర్ల మీద కలర్‌ఫుల్ పెయింటింగ్‌లు! నగరాల్లోని ముఖ్యమైన కూడళ్ళలో, సినిమా థియేటర్ల దగ్గర పెద్ద సైజులో వీటిని ఏర్పాటు చేసేవాళ్ళు. దారిన పోయే వాళ్ళందరికీ ప్రత్యేక ఆకర్షణగా నిలిచే ఈ ఆయిల్ పెయింటింగ్ బ్యానర్లు, కటౌట్లు... కుంచెను నమ్ముకొన్న నిపుణులైన కళాకారులు ఎందరికో కడుపు నిండా అన్నం పెట్టిన అన్నపూర్ణ స్వరూపాలు.

అప్పట్లో మద్రాసు తరువాత ఈ రకమైన బ్యానర్ల పబ్లిసిటీకి కేంద్రం బెజవాడే! సినిమా డిస్ట్రిబ్యూషన్ ఆఫీసులన్నీ బెజవాడలోనే

ఉండడంతో, ఈ సినిమా శాఖ కృష్ణాతీరంలోనే కేంద్రీకృతమైంది. 1990ల మధ్య దాకా విజయవాడ గాంధీనగర్‌లోని కొన్ని వీధుల్లో, భారీ కారు షెడ్లు, గ్యారేజ్‌ల లాంటి స్థలాల్లో ఎంతోమంది ఆర్టిస్టులు తమ కళానైపుణ్యంతో సినీ తారల రూపాలకు కటౌట్లలో ప్రాణం పోస్తూ కనిపించేవారు. సినీ ప్రియుల కలలకు కళ్ళెదుటే రూపురేఖలిచ్చేవారు. ముందుగా క్యాన్వాస్ మీద గ్రాఫ్ గీసుకొని, స్కెచ్ వేసుకొనేవారు. అప్పుడు పెయింటింగ్ మొదలుపెట్టేవారు. చాలా శ్రమతో కూడుకున్న ఈ పనికి సమయం కూడా బాగానే పట్టేది. ఒక ఎడమ చేతిలో చిన్న సినిమా స్టిల్ పట్టుకొని, దాన్ని పదే పదే చూస్తూనే కుడి చేతిలోని కుంచెతో కొన్ని పదుల అడుగుల ఎత్తయిన బొమ్మగా తదేక దీక్షతో తీర్చిదిద్దే ఆ వర్ణచిత్ర కళాస్రష్టల్నీ, వారి చేతుల్లో ఊపిరి పీలుస్తున్న తారల ముఖాలనూ దగ్గరగా చూడడం అప్పట్లో బెజవాడ పిల్లలకూ, పెద్దలకూ ఒక అద్భుత స్వప్నలోక సందర్శనం. కడుపు చేత పట్టుకొని, చాలీచాలని రోజు వారీ జీతం కోసం అలా సినిమా పబ్లిసిటీ బొమ్మలు గీసే ఉద్దండులైన కళాకారులు, గుండ్రంగా అందంగా బ్యానర్లపై అక్షరాలు రాసే లెటరింగ్ ఆర్టిస్టులు, వాళ్ళ అర్ధాకలినైనా తీర్చి, ఆ మాత్రమైనా పోషించిన రకరకాల 'ఆర్ట్స్' సంస్థలు బెజవాడ కనకదుర్గమ్మ పాదాల చెంత అప్పట్లో కోకొల్లలు.

అప్పట్లో ముత్తయ్య, ఖాజా ఆర్ట్స్, నటరాజ్ ఆర్ట్స్, విజయా ఆర్ట్స్, జోసఫ్ ఆర్ట్స్, అలాగే పి.ఎ. రంగా ఆర్ట్స్ లాంటి బ్యానర్ పబ్లిసిటీ కంపెనీలు, ఆరితేరిన ఆర్టిస్టులతో బెజవాడ 'కళ కళ'లాడుతూ ఉండేది. ఈ కటౌట్లు, ఆయిల్ పెయింటింగ్ బ్యానర్లు బెజవాడలో తయారై, ఇక్కడ నుంచే చుట్టుపక్కల ఊళ్ళకూ సరఫరా అయ్యేవి. ఇప్పుడు వినైల్ ప్రింటింగ్ వచ్చాక, ఆయిల్ బ్యానర్ స్థానాన్ని వినైల్ బ్యానర్ ఆక్రమించింది. ఆర్ట్ సంస్థలు, బ్యానర్ ఆర్టిస్టులు కనుమరుగై, ఊరంతా వినైల్ ప్రింటర్స్ వెలిశారు.

## పోస్టర్ల ప్రింటింగ్‌కు పెట్టింది పేరు!

దక్షిణాదిలో సినిమా పోస్టర్ల నాణ్యమైన ప్రింటింగ్ అంటే - తమిళనాడులోని మద్రాసు, శివకాశి తరువాత ఇవాళ్టికీ గుర్తొచ్చే పేరు తెలుగునాట విజయవాడే! అదీ - కృష్ణా తీరంలోని 'నేషనల్ లితో ప్రింటర్స్' సంస్థే! ఇవాళ దక్షిణ భారతదేశంలోనే నాణ్యమైన పోస్టర్ ప్రింటింగ్ ప్రెస్‌గా 'నేషనల్ లితో ప్రింటర్స్' స్థానం సంపాదించుకుంది. నిజం చెప్పాలంటే, అసలు ప్రచురణ రంగానికే పెట్టింది పేరు - కృష్ణా తీరం... అందులోనూ విజయవాడ! మామూలు లెటర్‌ప్రెస్‌లు, కాలితో తొక్కుతుంటే కాగితాల మీద ప్రింటయ్యే 'ట్రెడిల్ మిషన్' ప్రెస్‌ల దగ్గర నుంచి ఆధునిక ఆఫ్‌సెట్, లితో ప్రెస్‌ల దాకా బెజవాడలో లేనివి లేవు. కాలగతితో ప్రింటింగ్‌లో వచ్చిన మార్పులన్నిటికీ ఈ ప్రాంతం సాక్షీభూతంగా నిలిచింది. సినిమా పోస్టర్ల ప్రింటింగ్ విషయంలోనూ అదే జరిగింది.

మొదట్లో మన తెలుగు సినిమా పోస్టర్లన్నీ మద్రాసులోనే ప్రింటయ్యేవి. మద్రాసులో 1930ల చివరలోనే దర్శక - నిర్మాత బి.ఎన్. రెడ్డి పెట్టిన 'బి.ఎన్.కె. ప్రెస్' (గూడవల్లి రామబ్రహ్మం గారి 'ప్రజామిత్ర' పత్రిక, 'ఆంధ్రజ్యోతి' మాసపత్రిక, పిల్లల పత్రిక 'చందమామ') ఫేమస్. ఆ తరువాత ఆ ప్రెస్ బాధ్యతలన్నీ చూసుకుంటూ నిర్మాత నాగిరెడ్డి 1952లో 'ప్రసాద్ ప్రాసెస్' పేరిట బ్లాక్ మేకింగ్ సెక్షన్ పెట్టారు. అది విజయవంతమయ్యాక, 1955లో పోస్టర్ ప్రింటింగ్ కోసం అదే పేరుతో లితో ప్రింటింగ్ ప్రెస్ ప్రారంభించారు. ఆ తరువాత ఆఫ్‌సెట్ ప్రింటింగ్ ప్రెస్‌గా దాన్ని పెంపొందించారు. ఆసియాలోనే అత్యుత్తమ ప్రింటింగ్ ప్రెస్ అన్న పేరు తెచ్చుకొని, పెద్ద పెద్ద కంపెనీల పోస్టర్స్ అన్నీ ప్రింట్ చేసే స్థాయికి చేరింది. అప్పట్లో హిందీ మొదలు ఉత్తరాదిలోని ఇతర భాషా సినిమాల పోస్టర్ డిజైన్లు, మన దక్షిణాదిలోని తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ సినిమాల పోస్టర్ డిజైన్లు అన్నీ మద్రాసులోని వడపళని ఆర్కాట్ రోడ్డులో నెలకొన్న 'ప్రసాద్ ప్రాసెస్'లోనే ప్రింటయ్యేవి.

మద్రాస్ పోస్టర్ ప్రింటర్ల తర్వాత మళ్ళీ అంతపేరున్నది విజయవాడ 'నేషనల్ లితో ప్రింటర్స్'కే! ఇవాళ్టికీ తెలుగు సినిమా పోస్టర్ల చుట్టూ ఉండే తెల్లటి అంచు మీద గమనిస్తే, ఒక మూల చిన్న అక్షరాల్లో 'నేషనల్ లితో ప్రింటర్స్' అనే పేరు నల్లగా మెరుస్తుంటుంది. 1952లో ఎల్. నరసరాజు, సూరెడ్డి రామబ్రహ్మం, పిన్నమనేని బాలగంగాధర తిలక్ కలసి ఈ సంస్థను ప్రారంభించారు. రామబ్రహ్మం కుమారుడు సూరెడ్డి వెంకటేశ్వరరావు (పెదబాబు) సారథ్యంలో ఉన్నతోన్నత శిఖరాలకు చేరిన ఈ ప్రెస్ భారీ, మల్టీకలర్ పోస్టర్ల ప్రింటింగ్‌లో ఇవాళ్టికీ నంబర్ వన్. విజయవాడ గాంధీనగర్- నాగేశ్వరరావు పంతులు రోడ్డులోని చిన్న బిల్డింగ్‌లో మొదలైన చిన్న ఆఫీసు, భారీ యంత్రాలన్నీ పట్టేలా సాంబమూర్తి రోడ్డులో తరువాత కట్టుకున్న పెద్ద బిల్డింగ్, ఇప్పటికీ వాటి మీద ఒంపులు తిరిగిన ఇంగ్లీషు అక్షరాల్లో 'నేషనల్ లితో ప్రింటర్స్' అనే పేరు చూసినప్పుడల్లా ఎవరికైనా చటుక్కున సినిమా పోస్టర్ల మీద చదివిందే గుర్తుకొస్తుంది. నిజానికి, విజయవాడలో 'కె.ఎన్.సి. లితో ప్రెస్', 'జూపిటర్ లితో ప్రెస్', 'పనోరమా లితో ప్రెస్', అలాగే 'లక్ష్మీఫిలిమ్స్' చిట్టబ్బాయి - ఆయన కుమారుడు రామకృష్ణ నడిపిస్తూ వచ్చిన 'విజయదుర్గా

ఆఫ్‌సెట్ ప్రింటర్స్', ముమ్మనేని సుబ్బారావు గారి 'పద్మనాభ ప్రింటర్స్' - ఇలా సినిమా పోస్టర్ ప్రింటింగ్‌కు ప్రసిద్ధమైన ప్రెస్‌లు చాలా ఉండేవి. అయితే, పీకలు తెగ కోసే పోటీ వాతావరణంలో శివకాశిలోని ప్రింటర్లు నిర్మాతలకు ముందుగా ఎదురు డబ్బిచ్చి, సాగిస్తున్న ప్రలోభపూర్వక వ్యాపారం బెజవాడ ప్రింటర్స్‌ను చావుదెబ్బ తీసింది. దాంతో, పైన చెప్పిన ప్రెస్‌లన్నీ మూతబడ్డాయి. ఆ వరుసలోనే మరో పేరున్న ప్రెస్ అయిన 'సుధాకర్ లితో ప్రెస్'ను కూడా మూసివేసి, అక్కడ సినిమా హాలు కట్టారు. విజయవాడలోని 'జయరామ్' ఏ.సి. థియేటర్ అదే! ఇక, 'దినకర్ లితో' ప్రెస్ లాంటివి శివకాశి పోటీ దెబ్బతో, పోస్టర్ ప్రింటింగ్ వదిలేసి, స్టేషనరీ వర్క్‌కే పరిమితమయ్యాయి. ఇన్ని ఆటుపోట్లను కూడా తట్టుకొంటూ సినిమా పోస్టర్ల ప్రింటింగ్‌లో గడచిన 64 ఏళ్ళుగా విజయవాడ జెండాను 'నేషనల్ లితో ప్రింటర్స్' సంస్థ సగర్వంగా ఎగరేస్తోంది.

## ఈ తీరం నుంచి ఆ తారాపథానికి... వన్నె తెచ్చిన తారా తోరణం!

మూకీల కాలం నాటి తెలుగు సినిమా పితామహుడు రఘుపతి వెంకయ్య నాయుడు నుంచి టాకీ సినిమాల అగ్ర హీరోలు ఎన్టీయార్, ఏయన్నార్, నటయశస్వి ఎస్వీ రంగారావు, ఆంధ్రుల అందాల కథానాయకుడు శోభన్‌బాబు, 'నవరస నటనా సార్వభౌమ' కైకాల సత్యనారాయణల మీదుగా హాస్య చిత్రాలకు చిరునామాగా మారిన రాజేంద్రప్రసాద్, ఇవాళ్టి యువ హీరోలు నాని, శర్వానంద్, సుధీర్‌బాబుల దాకా - అందరూ తీరాంధ్ర నుంచి, బెజవాడ పరిసరాల నుంచి సినీ రంగానికి వెలుగు జిలుగులు అద్దినవారే. రంగస్థలం నుంచి సినిమాల్లోకి వచ్చిన సి.ఎస్.ఆర్. ఆంజనేయులు, మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, విన్నకోట రామన్నపంతులు, జి.ఎస్.ఆర్. మూర్తి, నిర్మలమ్మ, అన్నపూర్ణ, హాస్యం పండించిన పుచ్చా పూర్ణానందం, సుత్తివేలు, సుత్తివీరభద్రరావు, 'పద్మశ్రీ' కోట శ్రీనివాసరావు, ఇటీవలి గుండు హనుమంతరావు - ఇలా చాలామంది విజయవాడ వాసులే!

సినీ కథానాయికల్లో తెనాలి నుంచి కాంచనమాల, ఏలూరులో పుట్టినా బెజవాడలో స్థిరపడ్డ పసుపులేటి కన్నాంబ (బెజవాడ సత్యనారాయణపురంలో ఆమె ఇల్లు 'కన్నాంబ మేడ'గా జనంలో బాగా పాపులర్), సావిత్రి, రాజసులోచన, జమున, శారద, హిందీ సినిమాల దాకా ఎదిగిన వహీదా రహమాన్ - ఇలా చాలామంది తారలు కృష్ణాతీరం నుంచి వచ్చినవాళ్ళే!

దర్శకుల్లో పి.వి. దాసు, ఎల్వీ ప్రసాద్, చిత్రపు నరసింహారావు, గూడవల్లి రామబ్రహ్మం, చిత్రపు నారాయణమూర్తి, కె.ఎస్. ప్రకాశరావు, వేదాంతం రాఘవయ్య, పౌరాణిక చిత్రబ్రహ్మ కమలాకర కామేశ్వరరావు, 'కళాతపస్వి' కె. విశ్వనాథ్, వరుస విజయాల పరుసవేది వి. మధుసూదనరావు, తాతినేని ప్రకాశరావు, తాతినేని రామారావు, ప్రత్యగాత్మ, కె. హేమాంబరధరరావు, కమర్షియల్ ఫార్ములా సినిమాకు మార్గదర్శి కె. రాఘవేంద్రరావు, స్త్రీ జన పక్షపాతి క్రాంతికుమార్, తమ్మారెడ్డి భరద్వాజ - అందరూ కృష్ణా తీర వాసులే. ఆ తరం నుంచి రామ్‌గోపాల్‌వర్మ మీదుగా ఇప్పటి వి.ఎన్. ఆదిత్య, ఇంద్రగంటి మోహనకృష్ణ దాకా ఎంతోమంది విజయవాడలో ఓనమాలు దిద్దినవారే! కమర్షియల్ చిత్రాల వై.వి.ఎస్. చౌదరి, కాలేజీ కుర్రకారు మెచ్చే న్యూ ఏజ్ బాయ్స్ - గర్ల్స్ లవ్‌స్టోరీల మారుతి కూడా గుడివాడ, బందరు బ్యాచే!

చిత్ర నిర్మాతల్లో అప్పటి 'సారథీ' అధినేతలు చల్లపల్లి రాజా వారు, 'శోభనాచల' మీర్జాపురం జమీందారు మొదలు డి.ఎల్. నారాయణ, నవయుగ ఫిలిమ్స్ స్థాపించి దాదాపు 2 వేలకు పైగా సినిమాలు పంపిణీ చేసి, పలు చిత్రాలకు పరోక్ష నిర్మాత అయిన కాట్రగడ్డ శ్రీనివాసరావు, 'అన్నపూర్ణా' దుక్కిపాటి మధుసూదనరావు, 'ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్' ఏ.వి. సుబ్బారావు, నందమూరి త్రివిక్రమరావు, అట్లూరి పుండరీకాక్షయ్య, తమ్మారెడ్డి కృష్ణమూర్తి, డూండీ, పోతిన బెనర్జీ, వి.బి. రాజేంద్రప్రసాద్, 'విశ్వశాంతి' యు. విశ్వేశ్వరరావు, 'పి.ఎస్.ఆర్. పిక్చర్స్' పింజల సుబ్బారావు, 'యువచిత్ర' కాట్రగడ్డ మురారి, కె. దేవీవరప్రసాద్, కె.సి. శేఖర్‌బాబు, 'వైజయంతీ మూవీస్' సి.అశ్వినీదత్, 'ఉషాకిరణ్ మూవీస్' రామోజీరావు, అట్లూరి పూర్ణచంద్రరావు, 'ఆర్.కె. ప్రొడక్షన్స్' కె. కృష్ణమోహనరావు, 'గోపీ మూవీస్' చలసాని గోపి, 'క్రియేటివ్ కమర్షియల్స్' కె.ఎస్. రామారావు, 'లక్ష్మీచిత్ర' వై. హరికృష్ణ, 'వసుధాచిత్ర' కాట్రగడ్డ ప్రసాద్, 'సప్తపది' తీసిన జ్యోతీ ఆర్ట్స్ భీమవరపు బుచ్చిరెడ్డి, 'శ్రీదేవీ మూవీస్' శివలెంక కృష్ణప్రసాద్, 'శ్రీరంజిత్ మూవీస్' కె. రంజిత్ కుమార్, వారి అబ్బాయి కె.దామోదర్ ప్రసాద్, ఉప్పలపాటి సూర్యనారాయణబాబు లాంటి అగ్ర నిర్మాతలందరూ కృష్ణాతీరం నుంచి, అందులోనూ ఎక్కువమంది విజయవాడ నుంచి వెళ్ళి, సినీరంగంలో విజయకేతనం ఎగరేసినవాళ్ళే!

సినీ సంగీతంలోనూ ముద్ర వేసిన కర్ణాటక సంగీత విద్వన్మణి మంగళంపల్లి బాలమురళీకృష్ణ, గాన గంధర్వుడు ఘంటసాల

వెంకటేశ్వరరావు, సంగీత దర్శకుడు ఆదినారాయణరావు, కెమేరామన్ వి.ఎస్.ఆర్. స్వామి, ఎడిటర్ సోదరులు కోటగిరి గోపాలరావు, కోటగిరి వెంకటేశ్వరరావు లాంటి పేరున్న టెక్నీషియన్లు కృష్ణా మండలం నుంచి పైకి వచ్చినవారే. 'బాహుబలి' లాంటి చిత్రాలతో జాతీయ అవార్డులు సాధించి, దక్షిణాది అంతటా విజువల్ ఎఫెక్ట్సుకు మారుపేరైన తాజా సంచలనం వి. శ్రీనివాస్ మోహన్ విజయవాడ వాడే!

'కవి సమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణ, గీత రచయితల్లో మల్లాది రామకృష్ణశాస్త్రి తరం నుంచి వేటూరి, జొన్నవిత్తుల, భువనచంద్ర, సామవేదం షణ్ముఖశర్మ దాకా, సినీ కథ, మాటల రచయితల్లో బెజవాడ ముత్యాలంపాడు వాసి డి.వి. నరసరాజు, బెజవాడలోనే పుట్టిపెరిగిన జంధ్యాల, తోటపల్లి మధు, సాయినాథ్, దివాకర్‌బాబు, ఓంకార్ - ఇలా చాలామంది కృష్ణాతీర వాసులే. దానికి తోడు ప్రధాన పత్రికా కార్యాలయాల నుంచి నాటకాలు, సినిమాలతో సహా ప్రసార, ప్రచార మాధ్యమాల దాకా అన్నీ తీరాంధ్ర ప్రాంతంలో, ప్రధానంగా విజయవాడ ప్రాంతంలో నెలకొనడం, ఈ ప్రాంతం వారితో నిండిపోవడం చరిత్రకెక్కిన సత్యం. అందుకే, ఇప్పటికీ నాటకాలు, సినిమాలు రాతలోనూ, మాటలోనూ కృష్ణా తీర భాషను బలంగా సొంతం చేసుకున్నాయి.

## కట్టూబొట్టూ... కళారూపాలు... కాస్ట్యూమ్స్!

తెలుగులో సాంఘిక చిత్రాలు తీయడం మొదలైన 1936 నుంచి తెరపై మన సామాజిక జీవితాన్నీ, కట్టూబొట్టునూ చూపించాల్సి వచ్చింది. తొలి తెలుగు సాంఘిక చిత్రం 'ప్రేమ విజయము' నిర్మించిన సూత్రధారి కృత్తివెంటి నాగేశ్వరరావు పుట్టింది కూడా కృష్ణాజిల్లా బందరులోనే! రాజమండ్రిలో ఎదిగి, ప్రసిద్ధ గున్నేశ్వరరావు నాటక కంపెనీ అభివృద్ధికి కృషి చేసిన ఆయన కథ మరో చరిత్ర. అప్పటి సాంఘిక నాటకాలు, సినిమాల్లో వాస్తవమైన తెలుగు వాతావరణం సృష్టించడానికి కూడా మళ్ళీ కృష్ణా తీరవాసుల పంచకట్టు, తలపాగా చుట్టు ఆధారమయ్యాయి. అప్పటికి మన సినిమాలు తీస్తున్న మద్రాసు పరిసరాల్లోని పొలాలు, బండ్లు, ఎద్దులు, వాటి మెడపట్టెలు, చర్నాకోలాలు, నాగళ్ళు వేరు. కాబట్టి, ప్రసిద్ధ దర్శక - నిర్మాత గూడవల్లి రామబ్రహ్మం మన రైతు జీవన సమస్యలపై 'రైతుబిడ్డ' (1939 ఆగస్టు 27 రిలీజ్) లాంటివి చిత్రీకరిస్తున్నప్పుడు శ్రమించి, మన తెలుగు వాతావరణం ప్రతిబింబించే వస్తువులు సేకరించారు. మద్రాసులోని స్టూడియోలో తెరపై రైతులుగా నటించే జూనియర్ ఆర్టిస్టులతో మన తెలుగువారిలా పంచెకట్టు, తలపాగా కట్టించడానికి నానాతంటాలూ పడ్డారు. అలా కృష్ణాతీరం రైతుల పంచెకట్టే తెలుగు తెరపై రోల్‌మోడల్ అయింది.

ఆ తరువాత కృష్ణాతీరంలోని గ్రామాల నుంచి అగ్రహీరోలుగా ఎదిగిన ఎన్టీయార్, ఏయన్నార్‌లు తమ తలపాగా చుట్టుతో తెలుగు సినిమా రైతు అంటే మళ్ళీ 'కృష్ణా రైతు' రూపాన్నే చెరగని ముద్రగా వేశారు. ఆ తరువాత సినీ సీమకు తరలివెళ్ళిన ప్రజాకళాకారులైన నటుడు మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, దర్శకుడు వి. మధుసూదన రావు తదితరులు కూడా తీర ప్రాంత కళారూపాలకూ, గ్రామీణ రూపాలకూ వీలైనప్పుడల్లా అద్దం పట్టారు. ఆ మాటకొస్తే, కృష్ణాతీర ప్రాంతమైన కూచిపూడి గ్రామం నుంచి జగత్ప్రసిద్ధమైన కూచిపూడి నాట్యకళారూపం కూడా గూడవల్లి రామబ్రహ్మం 'రైతుబిడ్డ' సినిమా ద్వారా సినిమాల్లోకి నడిచొచ్చింది. ఆ చిత్రంలో వేదాంతం రాఘవయ్య చేసిన 'దశావతార' నృత్య ప్రదర్శన కూచిపూడికి దక్కిన తొలి సినీ గౌరవం.

రెడీమేడ్ దుస్తుల హవా, బొంబాయి నుంచి ఖరీదైన స్టయిలిస్ట్‌ల దుస్తుల దాడి మొదలవక ముందు బ్లాక్ అండ్ వైట్ యుగం నుంచి కలర్ శకంలోకి సినిమా మారాక కూడా సినిమా హీరోలకు దుస్తులు కుట్టి, వాటిని తెలుగునాట జనం ఫ్యాషన్ చేసిన ఘనత కృష్ణాతీరంలోని విజయవాడదే! ఎన్టీయార్‌తో బెల్‌బాటమ్ ప్యాంట్లు, చిత్రమైన పెద్ద కాలర్ చొక్కాలు, కోటు, సూటు కాస్ట్యూమ్స్ కట్టించింది విజయవాడలోని యాక్స్ టైలర్స్ అధినేత వాలేశ్వరరావు బృందమే! ఆ రకంగా సినీ ప్రభావమున్న తెలుగునేల వేషభాషలపై కృష్ణాతీరానిది గణనీయమైన ప్రభావమే!

## అభిరుచి పెంచిన సినిమా జర్నలిజమ్, జర్నలిస్టులు

సినిమా వ్యాపారానికే కాదు... సినిమా జర్నలిజమ్‌కీ కృష్ణాతీరంలోని బెజవాడ నిన్న మొన్నటి దాకా పెట్టింది పేరు. సినిమా వ్యాపారంతో పాటు సినిమా సంబంధ సమావేశాలు, ఇష్టాగోష్ఠులు, అభినందన సభలు, చలనచిత్ర విజయయాత్రలు, శతదినోత్సవాల లాంటి అన్నిటికీ ఒకప్పుడు కేరాఫ్ అడ్రస్ విజయవాడే! ఏ కొత్త సినిమా రిలీజైనా ఆ సినిమా హిట్టా, ఫట్టా తెలుసుకోవడానికి బెజవాడ టాక్ బారోమీటర్. అలా ఇక్కడి జనజీవితంలో, నగర జీవనశైలిలో సినిమా ప్రభావం ఇంకి పోయింది. నిజం చెప్పాలంటే, ఇవాళ్టికీ కృష్ణాతీరంలోని విజయవాడ ప్రాంత ప్రజల మాటల్లో రోజులో ఏదో ఒక సందర్భంలో సినిమా ప్రస్తావన రాకుండా ఉండదంటే అతిశయోక్తి కాదు.

అటు పత్రికల ప్రధాన కార్యాలయాలు, ఇటు పంపిణీ సంస్థలు, ప్రదర్శనశాలలు, ప్రచారసంస్థలు - అన్నీ ఇక్కడే ఉండడంతో

సినిమా పత్రికలు, సినీ విమర్శకులు, సినిమా సమీక్షలకు కూడా విజయవాడ కార్యస్థానంగా చాలాకాలం పాటు వెలిగింది. అప్పటి 'జ్యోతిచిత్ర' నుంచి ఇప్పటి 'తార – సితార' దాకా విజయవాడ నుంచి వచ్చిన సినిమా పత్రికలెన్నో! జొన్నలగడ్డ రాధాకృష్ణమూర్తి, రెంటాల గోపాలకృష్ణ ('ఆంధ్రప్రభ'), తుర్లపాటి కుటుంబరావు ('ఆంధ్రజ్యోతి'), వీరాజీ ('ఆంధ్రపత్రిక'), పి.ఎస్.రావు ('ఇండియన్ ఎక్స్‌ప్రెస్'), బొమ్మారెడ్డి ('ప్రజాశక్తి') లాంటి ఉద్దండులైన రచయితలు, మెయిన్‌స్ట్రీమ్ జర్నలిస్టులు ఇటు ఫిల్మ్ జర్నలిజమ్‌లో కూడా తమ కలం ఝళిపించారు. తమ పాళీకి రెండు వైపులా పదునే అని నిరూపించారు. ఆ పెద్ద తరం నుంచి తెలకపల్లి రవి ('ప్రజాశక్తి'), ఓంకార్ ('స్వాతి'), కృష్ణాజీ లాంటి అప్పటి నవతరం వరకు ఎంతోమంది విజయవాడ నుంచి సినీ పత్రికా రచనకు వన్నె తెచ్చారు.

సినిమా రిలీజయ్యాక 'నవయుగ ఫిలిమ్స్' కాట్రగడ్డ నరసయ్య, 'లక్ష్మీఫిలిమ్స్' ఈదృగంటి లక్ష్మణరావు తదితరులు ఆ చిత్ర నటీనటులు, దర్శక, నిర్మాతలతో పెట్టే 'గెట్ టుగెదర్'లు బెజవాడకు మరో ప్రత్యేక ఆకర్షణ. పాత బస్టాండ్ దగ్గరి ఖరీదైన మమత, మనోరమ హోటళ్ళ దగ్గర నుంచి చల్లపల్లి బంగళా దగ్గరి 'స్వర్ణా' ప్యాలెస్, గవర్నర్‌పేటలోని నటరాజ్, బందరు రోడ్డులోని స్టార్ హోటల్ కాంధారి హోటల్ (ఇప్పటి పేరు 'మురళీ ఫార్చ్యూన్') దాకా – ఊళ్ళోని అన్ని పెద్ద హోటళ్ళూ ఈ సినిమా సభలతో కళకళలాడుతుండేవి. విజయవాడలో పెట్టే ఏ సినిమా అభినందన సభ అయినా రెంటాల, తుర్లపాటి, వీరాజీ త్రయం అధ్యక్ష, ముఖ్య అతిథి స్థానాల్లో లేకుండా జరిగేది కాదనేది ఇప్పటికీ ఆ తరం సినిమావాళ్ళు గుర్తుచేసుకుంటూ ఉంటారు. సినీ రంగం మొదట మద్రాసులో ఉన్నా, తరువాత హైదరాబాద్‌లో కొలువు తీరినా – తెలుగు సినీ జర్నలిజమ్‌లో అధిక సంఖ్యాకులు ఇప్పటికీ ఈ తీరప్రాంతం నుంచి వచ్చినవాళ్ళే కావడం గమనించాల్సిన విషయం. విజయవాడ కేంద్రంగా 1980లలో 'విజయవాడ ఫిలిమ్ జర్నలిస్ట్స్ అసోసియేషన్' (విఫ్జా) ప్రత్యేకంగా క్రియాశీలంగా నిలిచింది. తుర్లపాటి లాంటి వారి ప్రోత్సాహంతో 1960ల నాటికే 'సినీ ఫ్యాన్స్ అసోసియేషన్' లాంటి ఉత్తమాభిరుచి గల సంస్థలూ వచ్చాయి. ఇక, ఎన్టీయార్, ఏయన్నార్ లాంటి అగ్ర హీరోలు, కృష్ణ, శోభన్‌బాబు, కృష్ణంరాజు లాంటి నవ తరం హీరోలు, చంద్రమోహన్ లాంటి అప్పటి చిన్న హీరోలు, ఇంకా పలువురు ఇతర నటీనటులకు విజయవాడ, గుంటూరు, తెనాలి తదితర ప్రాంతాల్లో ఏర్పాటైన అభిమాన సంఘాలకైతే లెక్కే లేదు. ఎవరి సినిమా రిలీజైనా, కరపత్రాలు, రికార్డుల హంగామాతో వాల్‌పోస్టర్లు, సినిమా హాళ్ళ ముందు తోరణాలు, భారీ కటౌట్లకు నిండుగా పొడవాటి పూమాలలు – ఇలా ఊరంతా సందడే సందడి. విజయవాడ ప్రేక్షకులకు సినిమా అంటే ఎంత పిచ్చి ప్రేమ అంటే, గంటకు ఇంత అని అద్దె చెల్లించి, గాంధీనగర్ లాంటి ఏరియాల్లో సినిమా మ్యాగజైన్లు చదివే సామాన్య ప్రజానీకం అక్కడ ఇప్పటికీ కనిపిస్తారు.

అలాగే, ఉత్తమ చలనచిత్రాలను ప్రోత్సహించి, ప్రజల్లో కళాభిరుచిని పెంచడం కోసం తెనాలిలో డాక్టర్ పాటిబండ్ల దక్షిణామూర్తి లాంటి సినీ, సాంస్కృతిక ప్రియులు, కళాకారులు కలసి 1973 సెప్టెంబర్‌లో 'ఉత్తమ చలనచిత్రాభిమానుల సంఘం' (క్లాసికల్ ఫిల్మ్ ఫ్యాన్స్ అసోసియేషన్) కూడా ప్రత్యేకంగా నెలకొల్పారు. కొన్నేళ్ళ పాటు ఈ సంఘం ఇతోధిక సేవలు అందించింది. దర్శక – నిర్మాత 'పద్మభూషణ్' బి.ఎన్. రెడ్డి అభినందన సంచిక లాంటి అక్షర కృషి కూడా చేసింది. ఉత్తమ చిత్రాల పట్ల అభిరుచిని పెంచాలనే లక్ష్యంతో 1975లో విజయవాడలో ఫిలిమ్ సొసైటీ ఏర్పడి, చాలాకాలం విజయవంతంగా పనిచేసింది. ఇక, భారత – సోవియట్ రష్యా స్నేహ సంబంధాల్లో భాగంగా 'ఇస్కస్' ఫిలిమ్ సొసైటీ లాంటివీ ముమ్మరంగా కృషి చేశాయి. బెజవాడలో వినాయకచవితి, దసరా సంబరాల్లో భాగంగా, వీధుల్లో పందిళ్ళు వేశారంటే రాత్రి వేళ రోడ్డు మీదే 16 ఎం.ఎం. ప్రొజెక్టర్లతో సినిమా ప్రదర్శనలు ప్రత్యేక ఆకర్షణగా వెలిగాయి.

## సినిమా ఫైనాన్షియర్లు

సినిమాలకూ, సినిమా నిర్మాణ సంస్థలకూ, స్టూడియోలకూ ఆర్థికంగా వెన్నుదన్నుగా నిలవడం తీరాంధ్ర ప్రాంత వాసుల శ్రీమంతులకూ, వ్యవసాయ కామందులకూ ఆది నుంచీ అలవాటే. 1930లలో చల్లపల్లి రాజా, పిఠాపురం రాజా, నూజివీడు జమీందారులకు సినిమాలతో ఉన్న అనుబంధం అందుకు చారిత్రక ఉదాహరణ. ఇక, బెజవాడ నుంచి 'సరస్వతీ టాకీస్' పేరుతో పారేపల్లి వెంకట శేషయ్య లాంటివాళ్ళు ముందుకొచ్చారు. అయితే, చిత్ర నిర్మాణానికి అవసరమైన ఆర్థిక వనరుల్ని నిర్మాతకు అధిక వడ్డీకి అప్పుగా ఇచ్చే సినిమా ఫైనాన్స్ వ్యాపారం మాత్రం ఎక్కువగా రాయలసీమ ప్రాంతం నుంచే జరుగుతూ వచ్చింది. 1940లలోనే బి.ఎన్. రెడ్డి 'వాహినీ' సంస్థకు ఆర్థిక మూలస్తంభంగా నిలిచింది రాయలసీమలోని తాడిపత్రికి చెందిన ఆనాటి ఆబ్కారీ వ్యాపారి మూలా నారాయణస్వామి. అప్పటి నుంచి ఇవాళ్టి సత్యరంగయ్య, సింగనమల రమేశ్ లాంటి వారి దాకా అందరూ అనంతపురం

తదితర రాయలసీమ ప్రాంతాల నుంచి సినిమా ఫైనాన్షియర్లుగా కొనసాగుతున్నవారే. కొన్ని వందల తెలుగు చిత్రాల నిర్మాణానికి తెర వెనుక ఆర్థిక సహాయం చేసినవారే.

## సినిమా సంస్థలు - కృష్ణాతీరంలోనే కార్మిక శంఖారావం

ఏ పరిశ్రమకైనా వెన్నెముక కార్మికులే. సినీ పరిశ్రమకైనా అంతే! కొన్ని కోట్లమందికి వినోదం పంచే ఈ సినీ పరిశ్రమలో పనిచేసేవారి బాగోగుల కోసం, వారికి నిర్ణీత జీతభత్యాల కోసం పోరాడేందుకు కార్మిక శంఖం పూరించింది కూడా తీరాంధ్ర ప్రాంతమే. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన 1953 చివరి నాటికే తెలుగు సినిమా పరిశ్రమలో దాదాపు 6 వేల మందికి పైగా పనిచేస్తున్నారని ఒక లెక్క. వారిలో నటీనటులు, టెక్నీషియన్లు, ఆఫీసు పనివారు, ఫిల్మ్ రిప్రజెంటేటివ్‌లు, సినిమా హాళ్ళ వద్ద ఉండే గేట్ కీపర్లు వగైరా అంతా ఉన్నారు. కానీ, అప్పట్లో ఈ పరిశ్రమలో పనిచేసే కార్మికులకు నిర్ణీతమైన జీతాలంటూ ఉండేవి కావు. ఉద్యోగానికి భద్రత లేదు. ప్రావిడెంట్ ఫండ్ లాంటివీ ఉండేవి కావు. ఇలాంటి వాటితో పాటు కార్మికుల రకరకాల కనీస హక్కుల కోసం ఆందోళన చేయడానికి 'ఆంధ్రా సినీ ఎంప్లాయీస్ అసోసియేషన్' బెజవాడలో ప్రారంభమైంది. అలా సినిమా కార్మికుల హక్కుల సాధన కోసం మొదట గొంతు విప్పింది కూడా కృష్ణాతీరమే! ఇక, సినీ ప్రదర్శనదారుల సంక్షేమం కోసం 'ఆంధ్రా ఫిల్మ్ ఎగ్జిబిటర్స్ అసోసియేషన్' (1955) - ఇలా వివిధ శాఖల వారి పక్షాన అండగా నిలిచే సంఘాలూ పురుడు పోసుకున్నాయి.

## బెజవాడలోనే మొదలు...

నిర్మాణ, స్టూడియో, పంపిణీ, ప్రదర్శన రంగాలు నాలుగింటినీ ఒకే గొడుగు కిందకు తెచ్చి, వాటి సమాహారమైన తెలుగు చిత్ర పరిశ్రమ మొత్తానికీ ప్రాతినిధ్యం వహించే సంస్థల విషయానికి వస్తే - అందరికీ మొదట గుర్తొచ్చే పేరు 'ఫిల్మ్ ఛాంబర్'. ప్రస్తుతం మొత్తం తెలుగు సినీరంగానికి ప్రతినిధిగా కీలకపాత్ర పోషిస్తున్న 'తెలుగు చలనచిత్ర వాణిజ్య మండలి'కి కూడా అసలు బీజం పడింది - కృష్ణాతీరంలో బెజవాడలోనే! అదెలా జరిగిందన్న దానికి కొద్దిగా చరిత్రలోకి వెళ్ళాలి. ముందుగా - దక్షిణ భారతదేశంలోని వివిధ ప్రాంతీయ భాషా సినీ పరిశ్రమలకు పెద్ద తలకాయగా వ్యవహరించడం కోసం 1939 మే 1న 'దక్షిణ భారత చలనచిత్ర వాణిజ్య మండలి' (సౌతిండియన్ ఫిల్మ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్ - ఎస్.ఐ.ఎఫ్.సి.సి)ను మద్రాసులో రిజిస్టర్ చేశారు. అప్పటి నుంచి దక్షిణాది చిత్ర పరిశ్రమ విషయాల్లో అది కేంద్రబిందువైంది. ఆ తరువాత రెండేళ్ళకే - నిజామ్ ప్రభువు ఏలుబడిలోని నైజామ్ రాష్ట్రంలో సినీ పంపిణీదారులపై వేసిన నిరంకుశ సుంకాన్ని ఎదుర్కోవడం కోసం 1941లో 'హైదరాబాద్ స్టేట్ ఫిల్మ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్' హైదరాబాద్ నగరంలో ఏర్పాటైంది. హైదరాబాద్ సంస్థాన ప్రాంతంలోని సినీ వాణిజ్య వ్యవహారాల్లో అది కీలక పాత్ర పోషించింది. ఆ సమయంలోనే 1942లో బెజవాడ (ఇప్పటి విజయవాడ)లో డిస్ట్రిబ్యూటర్లు, ఎగ్జిబిటర్లు అందరితో కలసి 'ది బెజవాడ ఫిల్మ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్' ఏర్పాటైంది. ఆ పైన ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుంచి విడిగా తెలుగు వారికి ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటు కానున్న పరిస్థితుల్లో, బెజవాడలోని ఈ ఛాంబర్ తన పేరు మార్చుకుంది. అలా 1953 జనవరిలో విజయవాడ కేంద్రంగా 'ఆంధ్రా ఫిల్మ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్' శ్రీకారం చుట్టుకుంది. సిహెచ్. పూర్ణచంద్రరావు అధ్యక్షులుగా, ఎస్.కె.ఎన్. అయ్యంగార్ కార్యదర్శిగా బెజవాడలోని గాంధీనగర్‌లో రాజశ్రీ పిక్చర్స్ వారి కార్యాలయమే కేరాఫ్ అడ్రస్‌గా అప్పట్లో ఈ కొత్త సంస్థ వెలసింది. అటుపైన ప్రత్యేక 'ఆంధ్ర రాష్ట్ర' అవతరణ, ఆనక 1956లో తెలంగాణ ప్రాంతం కూడా కలిసి, విశాల 'ఆంధ్రప్రదేశ్' అవతరణ జరిగాయి.

## హైదరాబాద్ తరలించిందీ మనాళ్ళే!

విశాల ఆంధ్రప్రదేశ్ అవతరణతో 1957లో ఆంధ్రా ఛాంబర్‌ను, హైదరాబాద్ ఛాంబర్‌లో విలీనం చేయాలనే ప్రతిపాదన వచ్చింది. కానీ, అది ఆచరణ సాధ్యం కాదని భావించడంతో అడుగు ముందుకు పడలేదు. ఆ తరువాత 1960లలో హైదరాబాద్ ఫిల్మ్ ఛాంబర్ విలీనం కోసం సమగ్రమైన ప్రతిపాదనలు చేసి, ఆంధ్రా ఛాంబర్‌కు పంపింది. కానీ, అదీ వెంటనే తేలలేదు. ఆ తరువాత కొన్నేళ్ళకు, తీరాంధ్రలోని పెద్ద మనుషులైన మనవాళ్ళే 'ఆంధ్ర ఫిల్మ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్' ప్రధాన కార్యాలయాన్ని బెజవాడ నుంచి హైదరాబాద్‌కు తరలించారు. 1979లో 'ఆంధ్రప్రదేశ్ ఫిల్మ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్'ను చేశారు. అయితే, 1941లో మొదలైన 'హైదరాబాద్ స్టేట్ ఫిల్మ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్' మాత్రం అప్పటికీ, ఇప్పటికీ ప్రత్యేకంగానే తన మనుగడను కొనసాగిస్తూ వస్తోంది. ఒకప్పటి నైజామ్ రాష్ట్రంలో భాగమైన ప్రాంతాలకు (తెలంగాణలోని అయిదు జిల్లాలు, మహారాష్ట్రలో ఏడు ప్రాంతాలు, ఉత్తర కర్ణాటకలో మూడు ప్రాంతాలకు) పరిమితమై, తన కార్యకలాపాలను నిర్వహిస్తూ వచ్చింది. ఆ పరిమిత ప్రాంతాల్లో సినీ వాణిజ్య కార్యకలాపాలకు హైదరాబాద్ స్టేట్ ఛాంబర్ పెద్ద అయితే, ఆ తెలుగు ప్రాంతాలు పోగా మిగిలిన విశాల ఆంధ్ర

ప్రదేశ్‌లోని ప్రాంతాలన్నిటి సినీ కార్యకలాపాలకు ఏ.పి. ఫిల్మ్ ఛాంబర్ పెద్ద తలకాయ.

## 'తెలంగాణ'గా పేరు మార్చుకున్న 'హైదరాబాద్'!

కానీ, తీరా 2014లో ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర అవతరణతో తెలుగు సినీ పరిశ్రమ ఒకటే అయినా, తెలుగు రాష్ట్రాలు మాత్రం రెండు అయ్యాయి. ఫలితంగా పరిస్థితి మళ్ళీ మొదటికి వచ్చింది. తెలంగాణ ఆవిర్భావానికి ముందే, సమైక్య రాష్ట్రంలోని ప్రత్యేక పరిస్థితులను ఆసరాగా చేసుకొని, 'హైదరాబాద్ స్టేట్ ఫిల్మ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్' చాలా ముందుగా కళ్ళు తెరిచింది. 2010లోనే పేరు మార్చుకుంది. 'ది తెలంగాణ ఫిల్మ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్'గా నవీన నామకరణం చేసుకుంది. తెలంగాణ అంటూ ఈ పేరు మార్పు వెనుక కూడా ఒక కథ ఉంది. ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు గురించి 2009 డిసెంబర్ 9న అప్పటి కేంద్ర హోమ్ మంత్రి పి. చిదంబరం చేసిన ప్రకటనతో భావోద్వేగ పరిస్థితులను ఆసరాగా తీసుకొని, 'తెలంగాణ' అనే మకుటంతో పంపిణీదారులు, ప్రదర్శకుల సంఘాల పేరిట రకరకాల సంస్థలు తలెత్తడం మొదలుపెట్టాయి. ప్రభుత్వం, పరిశ్రమ గుర్తింపు లేని ఈ కొత్త సంస్థల గందరగోళాన్ని నివారించి, 70 ఏళ్ళుగా ఉన్న అసలైన సంస్థ ఉనికిని చాటుకొనేందుకే 'ది తెలంగాణ ఫిల్మ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్'గా పేరు మార్చారు. గందరగోళాన్ని నివారించడం కోసం పేరు మార్చుకున్నప్పటికీ, 'ది తెలంగాణ ఫిల్మ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్' అన్న కొత్త పేరు పక్కనే బ్రాకెట్లలో 'హైదరాబాద్ స్టేట్ ఫిల్మ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్' అంటూ మొదటి నుంచీ ఉన్న పేరునూ, 'స్థాపితం – 1941, నిజామ్ ఫిల్మ్ సర్క్యూట్' అనే వివరాన్నీ కూడా కొనసాగిస్తున్నారు.

## మళ్ళీ కేరాఫ్ బెజవాడ దిశగా..?

ఇక 2014లో తెలంగాణ రానే వచ్చాక మరో పంచాయతీకి తెర లేచింది. ఆంధ్ర, తెలంగాణ వారంతా కలసి హైదరాబాద్‌లో పెంచుకున్న ఏ.పి. ఫిల్మ్ ఛాంబర్ ఆస్తిపాస్తుల్లో ఏ ప్రాంతం వారిది ఎంత వాటా అనే దాకా వ్యవహారం వెళ్ళింది. దాంతో, అప్పటి దాకా 'ఆంధ్రప్రదేశ్ ఫిల్మ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్'గా ఉన్న పేరును కాస్తా ప్రాంతానికి అతీతంగా, భాష పేరు మీద తెలివిగా 'తెలుగు ఫిల్మ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్'గా 2015లో??? మార్చాల్సి వచ్చింది. ఈ పర్యవసానాలతో మొదటి నుంచి ఉన్న విజయవాడ కార్యాలయానికి తోడుగా, విశాఖపట్నం, తిరుపతి లాంటి చోట్ల కూడా ఇప్పటికే శాఖా కార్యాలయాలు ఏర్పాటు చేసుకున్న ఒకప్పటి ఏ.పి. ఫిల్మ్ ఛాంబర్, మరోమాటలో చెప్పాలంటే ఇప్పటి 'తెలుగు ఫిల్మ్‌ఛాంబర్' క్రమంగా తీరాంధ్ర ప్రాంతం వైపు తొంగిచూస్తోంది. తాజాగా ఈ 2016 జూలై 22న తెలుగు ఫిల్మ్ ఛాంబర్ అధ్యక్ష పదవి ఎన్నికలు సాక్షాత్తూ విజయవాడలో జరగడం ఇందుకు ప్రత్యక్ష ఉదాహరణ. తెలుగు సినిమాకు అటు ప్రభుత్వం దగ్గర, ఇటు ఇతర జాతీయ ట్రేడ్‌బాడీల దగ్గర ప్రాతినిధ్యం వహించే ఛాంబర్ లాంటి ఉన్నత సంస్థకు – బెజవాడలో ఎన్నికలు జరగడం చాలా ఏళ్ళ విరామం తరువాత ఇదే తొలిసారి అన్నది గమనార్హం. ప్రత్యేక తెలంగాణ రావడంతో సినీసీమ హైదరాబాద్ నుంచి తీరాంధ్ర ప్రాంతానికి తరలి వచ్చేస్తుందా అని చర్చోపచర్చలు జరుగుతున్న పరిస్థితుల్లో ఈ ఎన్నికల నిర్వహణ పరిణామం కేవలం యాదృచ్ఛికమని అమాయకంగా అనుకోలేం.

## భవిష్యత్తు ఏమిటి?

నిజం చెప్పాలంటే, 1976 తరువాత నుంచి తెలుగు సినీ పరిశ్రమనూ, పెట్టుబడులనూ తీరాంధ్ర ప్రాంతం తనకు తానే క్రమంగా దూరం చేసుకుంది. ఇక్కడి పెట్టుబడుదారులు, కాకలు తీరిన సినిమా పెద్దలు తమ పెట్టుబడులన్నీ హైదరాబాద్‌లో కేంద్రీకరించారు. సినిమా ప్రదర్శన హక్కుల్ని జిల్లాల వారీగా అమ్మడమనే కొత్త సంస్కృతి వచ్చాక డిస్ట్రిబ్యూషన్ సంస్థలూ తమ పట్టును జారవిడుచుకున్నాయి. ఈ వ్యాపార వికేంద్రీకరణ హంగామాలో... అప్పటి దాకా సినిమా పంపిణీ, ప్రదర్శన, ప్రచారం – ఈ మూడు రంగాల్లో తీరాంధ్ర ప్రాంతానికి ఉన్న ఏకచ్ఛత్రాధిపత్యం కాస్తా తెలియకుండానే జారిపోయింది. అప్పటి దాకా పెరట్లోనే ఉన్న సినిమా వ్యాపారాన్ని పబ్లిక్‌గా పందేరం చేశారు.

మరోపక్క రాజకీయ, వ్యాపార, సాహితీ, సాంస్కృతిక కేంద్రమైన విజయవాడనే అప్పటి దాకా కేంద్ర కార్యాలయంగా చేసుకొని నడుస్తున్న దినపత్రికలు కూడా 1980లకి వచ్చేసరికి భాగ్య అన్వేషణలో నగరం బాట పట్టాయి. దాంతో, పత్రికా మేధావులు, ఆలోచనాపరుల భాగ్యనగర వలస అనివార్యమైంది. దాంతో, 1990ల తొలినాటికి పత్రికల వెంటే సినిమా పబ్లిసిటీ కూడా అప్పటి సమైక్యాంధ్ర ప్రదేశ్ రాజధానిని కేంద్రంగా చేసుకోవాల్సి వచ్చింది. తీరాంధ్ర నుంచి, మరీ ముఖ్యంగా కృష్ణాతీరం నుంచి వెళ్ళిన సినిమా పెద్దలంతా హైదరాబాద్‌లో స్టూడియోలు కట్టారు.

అదే సమయంలో మద్రాసులో సినీ కార్మికుల సమ్మెలకు 1964 నాటి నుంచి హైదరాబాద్‌లో ప్రభుత్వాలు ఎర చూపుతూ వచ్చిన

ఋణాలు, సబ్సిడీలు, రాయితీలు, అన్నిటికీ మించి సినిమావాళ్ళకు స్థలాల కేటాయింపులు ప్రధాన ఆకర్షణగా మారి, అయస్కాంతంలా అందరినీ హైదరాబాద్ వైపు లాగాయి. నిజం చెప్పాలంటే, స్థానికంగా చలనచిత్ర నిర్మాణాన్ని ప్రోత్సహించాలని 1962లో అప్పటి సమైక్య ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిర్ణయించింది. ఆ క్రమంలో సినీ పరిశ్రమను ప్రోత్సహించడం కోసం ఉత్తమ చిత్రాలకు ఏటా 'నంది అవార్డు'లు ఇచ్చే సంప్రదాయాన్ని 1964లో ప్రవేశపెట్టింది. ఇక, 1975లో హైదరాబాద్‌లో ఫిల్మ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్‌ను ఏర్పాటుచేసింది. ఇలా మద్రాసు, హైదరాబాద్ మధ్య పోటీ సాగుతుండగానే స్థలాలకు ఆకర్షితులైన తీరాంధ్ర పెద్దల స్టూడియోల నిర్మాణం హైదరాబాద్‌లో పెరిగింది. సరిగ్గా ఆ సమయంలోనే 1983లో సాక్షాత్తూ సినీ రంగం నుంచే వచ్చిన అగ్ర నటుడు, అప్పటి దాకా మద్రాసు కేంద్రంగా గడిపిన కృష్ణాతీర వాసి ఎన్టీరామారావు తెలుగు రాష్ట్రానికి ముఖ్యమంత్రి అయ్యారు. హైదరాబాద్‌కు తరలి వచ్చారు. ఆ పైన 1986లో హైదరాబాద్‌లో అంతర్జాతీయ ఫిలిమ్ ఉత్సవ్ నిర్వహణ లాంటివి కొత్త ఊపు తెచ్చాయి.

ఆ తరువాతి పాలకులు ఎలాగైనా తెలుగు సినీ పరిశ్రమను భాగ్యనగరానికి తీసుకురావాలని సంకల్పిస్తే, హైదరాబాద్‌లో నెలకొన్న స్టూడియోలు తాము సజావుగా నడవాలంటే, తమకు వీలైనంత పని దక్కాలని. అందుకు తగ్గట్లుగా ప్రభుత్వ నిర్ణయాల్ని ప్రభావితం చేశాయి. దాంతో, 1990ల నాటికి సినిమా షూటింగ్ తెలుగుగడ్డపై జరిగిందా, లేదా అన్నదాన్ని బట్టి ప్రభుత్వం వేసే వినోదపు పన్ను విధింపులో 'స్థానిక - స్థానికేతర' తేడాలను తీసుకొచ్చారు. చిత్ర నిర్మాణానికిచ్చే రాయితీలకూ షరతులు పెట్టారు. సరిగ్గా ఆ కాలంలోనే మద్రాసులో మళ్ళీ సినీ కార్మికుల సమ్మె దీర్ఘకాలం సాగింది. ఇలాంటి అనేకానేక పరిణామాలన్నీ కలగలిసి, తెలుగు సినీ వృక్షాన్ని కూకటివేళ్ళతో సహా చెన్నపట్నం నుంచి పెకలించి, భాగ్యనగరికి తరలించాయి.

### సినిమాలోనూ విభజన సెగ

హైదరాబాద్‌కు తెలుగు సినీ పరిశ్రమ తరలింపు 1997 నాటికి అధికారికంగా, 2000ల తొలినాటికి ఆచరణాత్మకంగా పూర్తయింది. అంతకు ముందు దాకా కళాభిరుచితో వ్యాపారం చేసేవాళ్ళు, తీరాంధ్ర ప్రాంతపు జమీందార్లు, భూస్వాములు, వ్యవసాయ కుటుంబాల పెట్టుబడులు సినీ రంగంలో ఎక్కువగా ఉంటే, క్రమంగా పరిస్థితి మారింది. మద్యం వ్యాపారంతో, కొత్తగా వచ్చిన రియల్ ఎస్టేట్ విజృంభణతో ఒళ్ళు వంచకుండానే ఒడిలోకి వచ్చిపడ్డ డబ్బున్న నడమంత్రపు శ్రీమంతులు - సమాజంలో ఒక హోదా కోసం, ఇమేజ్ ఉన్న స్టార్స్ సరసన నిల్చొని తమ ఇమేజ్ పెంచుకోవడం కోసం సినీరంగం వైపు ఆశతో రావడం పెరిగింది. అలా కళను వ్యాపారం డామినేట్ చేయడం ఇంకాస్త ఎక్కువైంది. పెట్టుబడులు, పెట్టుబడిదారుల స్వరూప స్వభావాలు మారాయి.

అయితే, వీటన్నిటి మధ్యే ఎలాగోలా హైదరాబాద్‌లో సినీ పరిశ్రమ కాస్తంత స్థిరపడిందని ఊపిరి పీల్చుకొనే లోగా, 2000 తొలినాళ్ళ నుంచి 'ప్రత్యేక తెలంగాణ' వాదం మళ్ళీ రాజుకుంది. 'కేంద్రం ఇచ్చేనా!', 'తెలంగాణ వచ్చేనా... చచ్చేనా!' అని ఎవరికి వారు అనుకుంటూ తీరాంధ్ర పెట్టుబడిదారులూ, మేధావులూ తాపీగా గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్నారు. భవిష్యత్తును ఊహించి, ఈ ప్రాంతంపై దృష్టి సారించాల్సింది పోయి, మీనమేషాలు లెక్కించారు. తీరా తెలంగాణ తెలుగు సోదరులు తమ వాదాన్ని పోరాటంగా మలిచి, దాన్ని ఉద్యమంగా మార్చి, ఆ ఉద్యమ స్ఫూర్తితో ప్రత్యేక రాష్ట్రాన్ని సాధించుకున్నాక, సమైక్యాంధ్ర ప్రదేశ్ ప్రయోగం సంపూర్ణంగా విఫలమని తేలాక, కొత్త రాజధానితో సహా 'నవ్యాంధ్ర ప్రదేశ్'ను మళ్ళీ శ్రమించి ఇటుక మీద ఇటుక పేర్చి నిర్మించుకోవాల్సిందే అని కళ్ళు తెరుచుకున్నాక... ఇక ఇప్పుడు కాలిన చేతులకు ఆకులు వెతుక్కొనే పనిలో పడ్డారు - తీరాంధ్ర మేధావులు.

హైదరాబాద్‌తో సహా ప్రత్యేక 'తెలంగాణ' రాష్ట్రం 2014 జూన్ 2న అధికారికంగా అవతరించడంతో, కొత్త రాజధాని, కొత్త ఉనికి వెతుక్కుంటూ 'ఆంధ్రప్రదేశ్' రాష్ట్రం, ప్రభుత్వం కృష్ణాతీరం వైపు చూడసాగాయి. ఈ క్రమంలో మొదటి నుంచి సీమాంధ్ర ప్రజల ప్రాబల్యం ఎక్కువగా ఉన్న తెలుగు సినీ పరిశ్రమ కూడా ఈ విభజిత ఆంధ్రప్రదేశ్‌తో పాటు కొత్త చిరునామాను వెతుక్కుంటుందా అన్నది అందరి నోటా చర్చనీయాంశమైంది. వెరసి, బొంబాయిలో పుట్టి, మద్రాసులో పెరిగి, హైదరాబాద్‌లో ఎదిగి ఒదిగిన దాదాపు రూ. 1200 కోట్ల రూపాయల విలువైన తెలుగు సినీ పరిశ్రమ ఇప్పుడు మరో కొత్త కూడలిలో ఉంది. ఇక్కడ నుంచి దాని ప్రయాణం ఎటు? భవిష్యత్తు ఏమిటి? సినీసీమ కూడా విడిపోతుందా లాంటి ఎన్నెన్నో జవాబు లేని ప్రశ్నలు. ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర సాధన కోసం పోరాటం సాగుతున్న సమయంలో సినిమా షూటింగ్‌ల మొదలు అనేక విషయాల్లో ఎదురైన చేదు అనుభవాల రీత్యా, తీరాంధ్ర సినిమావారిని హైదరాబాద్ నుంచి తరిమివేస్తారేమోనన్న అనుమానాలూ, భయాలూ కూడా విస్తరించాయి. కానీ, కొద్ది రోజుల్లోనే అవి కొంత సర్దుకున్నాయి.

నిజానికి, ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుంచి తెలుగువారు ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రంగా 1953లో విడిపోయినప్పుడూ ఇలాంటి చర్చే జరిగింది. అనేక అనుమానాలు, భయాలు వచ్చాయి. "ఆంధ్ర రాష్ట్ర అవతరణతో సినీ పరిశ్రమలో ఏవో మార్పులు వస్తాయనీ, మద్రాసు నగరంలో తెలుగు వారి స్టూడియోలకూ, తెలుగు చిత్రాల నిర్మాణానికీ స్థానం ఉండదనీ, 'ఎవరో' తెలుగు చిత్ర నిర్మాతలనూ, తెలుగు నటీనటులనూ ఆంధ్రదేశానికి తరిమివేస్తారనీ జన సామాన్యంలో అపోహలున్నట్టు కనిపిస్తుంది..." అని ప్రముఖ రచయిత, సినీ - సామాజిక విశ్లేషకుడు కొడవటిగంటి కుటుంబరావు అప్పట్లోనే ('తెలుగు స్వతంత్ర' వారపత్రిక, 1953 అక్టోబర్ 2 సంచిక) రాశారు. కానీ, ఆ అపోహల్ని పటాపంచలు చేస్తూ, ఆ తరువాత దాదాపు మరో 40 ఏళ్ళ పైచిలుకు తెలుగు సినీరంగం మద్రాసు కేంద్రంగానే నడిచింది. ఆ తరువాత కూడా మద్రాసు పొమ్మనలేదు కానీ, హైదరాబాద్ పాలకులు 'రా...రమ్మంటూ' ఇచ్చిన తాయిలాలే ఆకర్షణగా మన సినిమా భాగ్యనగరానికి చిరునామా మార్చుకుంది.

మధ్యలో 1969లో 'ప్రత్యేక తెలంగాణ' ఉద్యమం, ఆ తర్వాత 1971లో 'జై ఆంధ్ర' ఉద్యమం సందర్భాల్లో తెలుగు సినిమాకు రాజకీయాల సెగ తగిలినా, తాజాగా 2014లో ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం ఆవిర్భవించే ముందు జరిగిన ఉద్యమం మాత్రం పరిశ్రమలో కాక పుట్టించింది. సినీ పరిశ్రమకు మళ్ళీ చిరునామా మార్పు తప్పదా అనే అనుమానం కలిగింది. హైదరాబాద్‌లోనే ఉన్నప్పటికీ తెలుగు సినీరంగం చాలాకాలంగా కొన్ని కులాలకూ, ప్రాంతాలకూ, అయిదారు కుటుంబాల గుత్తాధిపత్యానికీ పరిమిత మైందనీ, తెలంగాణ వారి పట్ల విచక్షణ చూపుతున్నారనీ, వారికి చాలాకాలంగా అన్యాయం జరిగిందనీ కొందరిలో ఓ బలమైన భావన నెలకొంది. అయితే, సీమాంధ్ర ప్రాంతం నుంచి వచ్చి హైదరాబాద్‌లో స్థిరపడ్డ అగ్ర నిర్మాత కె.ఎస్. రామారావు లాంటి వారే కాక, తెలంగాణకు చెందిన ప్రముఖ నిర్మాత, పంపిణీదారు 'దిల్' రాజు కూడా ఆ భావన సరైనది కాదని వాదిస్తూ వచ్చారు. డిస్ట్రిబ్యూటర్‌గా మొదలై, 2002లో నిర్మాతగా ఎదిగిన 'దిల్' రాజు సైతం గడచిన పన్నెండేళ్ళలో తనకు ఎలాంటి వివక్షా ఎదురుకాలేదన్నారు.

అయితే, ఇప్పటికీ మించిపోయిందేమీ లేదు. ఇవాల్టికీ ఒక్క విజయవాడలోనే 40కి పైగా థియేటర్లున్నాయి. కొత్తగా వెలుస్తున్న మల్టీప్లెక్స్‌లతో స్క్రీన్‌ల సంఖ్య ఇంకా ఇంకా పెరుగుతోంది. అలాగే, 88 దాకా డిస్ట్రిబ్యూటింగ్ సంస్థలూ బెజవాడలో ఉన్నాయి. అలా కృష్ణాతీరం ఇప్పటికి సినిమా పరిశ్రమకు ఒక మూలస్తంభమే. దానికి తోడు కొత్త రాష్ట్రానికి సరికొత్త రాజధానిగా అవతరించాక, ఈ ప్రాంతం ప్రాధాన్యం కూడా అంతకంతకూ పెరుగుతోంది.

- 1990ల నుంచి చాలా కాలంగా హైదరాబాద్ కేంద్రంగానే సినిమాల పబ్లిసిటీ, ప్రమోషన్‌లు చేస్తూ వచ్చిన తెలుగు సినీ రంగం తాజాగా మారిన పరిస్థితికీ, వేరుపడ్డ తెలుగు ప్రజల భావోద్వేగాలకూ, మానసికస్థితికీ తగ్గట్లుగా ఇప్పుడిప్పుడే తన ఆట కూడా మారుస్తోంది. 'నవ్యాంధ్ర ప్రదేశ్'ను విడి మార్కెట్‌గా గుర్తించడం మొదలుపెట్టింది. అందుకు తగ్గ కొత్త ప్రమోషన్ గేమ్ ప్లాన్‌తో ముందుకొస్తోంది. కాస్తంత పెద్ద సినిమా ఏదైనా, దానికి సంబంధించిన పాటల విడుదల వేడుకో, సినిమా విజయోత్సవమో కొత్త 'నవ్యాంధ్ర ప్రదేశ్' రాష్ట్రంలో చేయడం మొదలైంది. 2015లో తిరుపతిలో హీరో ప్రభాస్ 'బాహుబలి', ఈ 2016లో వైజాగ్‌లో అల్లు అర్జున్ 'సరైనోడు', విజయవాడలో నారా రోహిత్ '???' ఆడియో వేడుకలు, అలాగే గుంటూరులో దర్శకుడు త్రివిక్రమ్ 'అ..ఆ..' చిత్ర విజయోత్సవం జరగడమే అందుకు తాజా ఉదాహరణలు. 2016 మధ్యనాటికి వచ్చేసరికి విజయవాడలో పుట్టిపెరిగిన దర్శకుడు ఇంద్రగంటి మోహనకృష్ణ తన తాజా చిత్రం 'నాని... జెంటిల్‌మన్' బృందంతో కోస్తా జిల్లాల్లో చిత్రవిజయోత్సవ యాత్రలు చేయడం, గోదావరి జిల్లాలో తమ కుటుంబ మూలాలున్న కామెడీ హీరో 'అల్లరి' నరేశ్ తన కొత్త సినిమా 'సెల్ఫీరాజా' ప్రీ-రిలీజ్ ప్రమోషన్‌లో భాగంగా తెలంగాణలోని వరంగల్‌తో పాటు, నవ్యాంధ్రలోని విజయవాడ, విశాఖపట్నం, తిరుపతి తదితర పట్నాల్లో తిరగడం, సెల్ఫీలు దిగడం మళ్ళీ అంతకంతకూ పెరుగుతున్న ఆంధ్ర ప్రాంత ప్రాధాన్యానికి పట్టి చూపుతున్నాయి.

ఇవన్నీ కేవలం యాదృచ్ఛికమనో, మార్కెట్ వ్యూహంతో సంబంధం లేకుండా జరుగుతున్నవనో అనుకొంటే అమాయకత్వమే! కొత్త రాష్ట్రం వచ్చి, అమరావతి సమీపంలో కొత్త రాజధానికి శంకుస్థాపన జరగడం... హీరో బాలకృష్ణ తన నూరో చిత్రానికి ఈ ప్రాంతం నుంచే సువిశాల సామ్రాజ్యాన్ని స్థాపించిన తెలుగు చక్రవర్తి 'గౌతమీపుత్ర శాతకర్ణి' కథను ఎంచుకోవడం కేవలం కాకతాళీయమని కొట్టిపారేయలేం! వీటన్నిటి నేపథ్యంలో సినీ వ్యాపారంలో తీరాంధ్ర ప్రాంతానికి మళ్ళీ పురా వైభవం వచ్చే సూచనలు కనిపిస్తున్నాయి.

నవ్యాంధ్రప్రదేశ్, తెలంగాణ - రెండూ సోదర తెలుగు రాష్ట్రాలే అయినప్పటికీ, రాష్ట్ర విభజన నేపథ్యంలో సినీ పరిశ్రమను తామే

సొంతం చేసుకోవాలని ఏ రాష్ట్రానికి ఆ రాష్ట్రం ఒకదానితో మరొకటి పోటీ పడుతున్నాయి. హైదరాబాద్‌లో సీమాంధ్రుల స్టూడియో స్థలాలను నాగళ్ళతో దున్నిస్తామంటూ వీరావేశంతో ఊగిపోయిన ఉద్యమకారులే ఇవాళ అధికారంలోకి వచ్చాక, ఆ ముచ్చటే లేదంటున్నారు. పెట్టుబడులను ఆకర్షించేలా ప్రోత్సాహకాలు ఇస్తామంటున్నారు. హైదరాబాద్ శివార్లలో రామోజీ ఫిల్మ్‌సిటీకి దాపులో ఉన్న చరిత్రాత్మ రాచకొండ ప్రాంతంలో వేలకొద్దీ ఎకరాల్లో ప్రత్యేక ఫిల్మ్‌సిటీ నిర్మాణానికి తెలంగాణ ప్రభుత్వం యోచన చేస్తోంది. అక్కడ స్పోర్ట్స్ సిటీ వగైరాలతో పాటు సుమారు 2 వేల ఎకరాల విస్తీర్ణంలో ఫిల్మ్ సిటీ నిర్మిస్తామనీ, 'ఫిల్మ్ నగర్-2' పేరిట సినీ పరిశ్రమలోని 24 శాఖల వారికీ చదరపు గజం రూపాయికే స్థలం ఇస్తామనీ తెలంగాణ ముఖ్యమంత్రి కె.చంద్రశేఖరరావు 2015లోనే ప్రకటించారు. వీటన్నిటికీ తోడు తెలంగాణ సర్కార్‌లో కీలకపాత్ర పోషిస్తున్న మంత్రులు, సామంతులతో పాటు యువరాజు కూడా తెలుగు సినీ రంగంతో తెర వెనుక సంబంధాలు పెట్టుకున్నట్లు గుసగుసలు వినిపిస్తున్నాయి. చిత్ర నిర్మాణం, పంపిణీ, ప్రదర్శనల్లో వారి పెట్టుబడుల గురించి, అవసరం అవుతున్న వారి ఆశీస్సుల గురించి కృష్ణానగర్‌లో కథలు కథలుగా చెప్పుకుంటున్నారు. అలా తెలంగాణ సర్కార్ సినీ పరిశ్రమనీ, పరిశ్రమలోని సీమాంధ్రుల్నీ హైదరాబాద్‌కు కట్టుబడి ఉండేందుకు వరాల జల్లు కురిపిస్తోంది.

ఇక, నవ్యాంధ్రప్రదేశ్ పాలకులు కూడా తెలుగు సినీ పరిశ్రమను సుందర ప్రకృతితో పాటు సముద్రతీరం లాంటి సహజ సౌకర్యాలున్న విశాఖపట్నానికి తరలించుకు రావాలని శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. తరలింపు కాకపోతే, కనీసం హైదరాబాద్‌కు ప్రత్యామ్నాయంగా మరో సినీ స్థావరంగా విశాఖపట్నాన్ని ఆంధ్రప్రదేశ్ పటంలో చూపాలని కృషిచేస్తున్నారు. ఇప్పటికే విశాఖపట్నంలో రామానాయుడు స్టూడియో శాఖ ఉంది. విశాఖకు సినీసీమ తరలివస్తే - స్థలాలతో సహా ప్రాథమిక వసతి సౌకర్యాలన్నీ కల్పిస్తామంటూ తాయిలాలూ చూపుతున్నారు. తక్కువ రేటుకే ప్రభుత్వమిచ్చే స్థలాలను తీసుకోవడం వల్ల ఎంత భారీ లాభం కలుగుతుందో హైదరాబాద్ ఫిల్మ్‌నగర్‌లోని ప్రతి గజం చెప్పకనే చెబుతోంది. మరి, అప్పటికీ సీమాంధ్ర సినీ వర్గాలు తాజాగా స్థలాలు దక్కే విశాఖను కాదని, హైదరాబాద్‌నే అంటిపెట్టుకొని ఉంటాయా అన్నది అనుమానం.

నిజం చెప్పాలంటే, గతంలో అప్పటి సమైక్య ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖరరెడ్డి విశాఖలో దాదాపు 360 ఎకరాల స్థలాన్ని నిర్ణీత రేటుకు కొనుగోలు ప్రాతిపదికపై చిత్ర పరిశ్రమాభివృద్ధికి కేటాయించారు. కానీ, అప్పట్లో 'ప్రత్యేక తెలంగాణ' వస్తుందని మన సినీ వర్గీయులు, ఆ ధర మార్కెట్ రేటు కన్నా ఎక్కువ ఉందంటూ పెద్దగా ఆసక్తి చూపలేదు. ఆ రోజున రూ. 50 లక్షలున్న స్థలం రేటు 2014లో 'ప్రత్యేక తెలంగాణ' రావడంతో కోటిన్నర, రెండు కోట్ల స్థాయికి చేరిపోయింది. అందుకే, ఇప్పుడు గనక విశాఖలో స్థలం కేటాయిస్తామంటే, సినిమావాళ్ళు ఎగబడడం ఖాయం.

మరోపక్క ఇలాంటి పరిస్థితి ఏదైనా వస్తే ఉపయోగపడుతుంది లెమ్మని ముందుగానే విశాఖలో స్థలాలు, పొలాలు కొనుక్కున్న యువ సమ్రాట్‌లూ, నట సింహాలకు లెక్క లేదు. స్టూడియో ఏర్పాటుకు వీలుగా స్థానిక రాజకీయ నేతలతో స్థల సేకరణ దోస్తీని ఇప్పటికే కొనసాగిస్తున్న మెగా సినీ కుటుంబాల హంగామాకు లోటు లేదు. ఇది ఇలా ఉండగా, విశాఖలోని తమ సొంత స్టూడియోలోనే తమ సురేశ్ ప్రొడక్షన్స్ తాలూకు 50 ఏళ్ళ సినీ ప్రస్థానాన్నీ, స్వర్గీయ రామానాయుడు సినీ విజయాలనూ భావితరాలకు ప్రదర్శించేలా తెలుగు సినిమాకు సంబంధించి ఒక శాశ్వత మ్యూజియమ్‌ను ఏర్పాటుచేస్తున్నట్లు ఈ 2016 జూన్‌లో రామానాయుడు కుటుంబ సభ్యులు ప్రకటించారు. ఇవన్నీ ఏ పరిణామానికి సూచికలో ప్రత్యేకించి విడమర్చి చెప్పనక్కర్లేదు.

అలాగే, హైదరాబాద్‌లో సినిమా వారితో పాటు బడాబాబులెందరికో సభ్యత్వమున్న 'ఫిల్మ్‌నగర్ కల్చరల్ సొసైటీ' భాగ్యనగరంలోని 'ఫిల్మ్ నగర్ కల్చరల్ క్లబ్' (ఎఫ్.ఎన్.సి.సి)కి శాఖగా విశాఖపట్నంలోనూ ఒక స్థావరం కోసం ముందుగానే తుండుగుడ్డ వేసింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కూడా అయినవారికి అండగా నిలిచి, 2016 జనవరి కల్లా విశాఖపట్నంలోని కాపులపద్ద ప్రాంతంలో 15 ఎకరాల స్థలం కేటాయించింది. ఆ స్థలంలో దాదాపు 40 గదులు, ఒక కన్వెన్షన్ సెంటర్, హెల్త్ స్పా మొదలైనవి నిర్మించాలన్నది సొసైటీ యోచన. సినీ రంగంలోకి రాదలుచుకున్న ఔత్సాహికుల కోసం ఒక యాక్టింగ్ స్కూల్ కూడా పెట్టాలనే ప్రతిపాదన ఉంది. స్కూలు మాటెలా ఉన్నా, దాదాపు రూ. 85 కోట్లు ఖర్చవుతుందని చెబుతున్న ఈ సోకాల్డ్ 'కల్చరల్ సెంటర్' అనే క్లబ్ ప్లాన్ వల్ల ఒరిస్సా, తమిళనాడులోని ఆ యా భాషల సినీ పరిశ్రమల వారు తమ సినిమాల షూటింగ్‌కు విశాఖపట్నాన్ని ఎంచుకొనేందుకు వీలు కలుగుతుందనేది ఈ ఫిల్మ్‌నగర్ సొసైటీ పెద్దల వాదన. 2016 ఫిబ్రవరి నాటికి వారు ఈ వాదనను బలంగానే ప్రచారంలో పెట్టారు. అయితే, నిబంధనలకు విరుద్ధంగా నిర్మాణాలుసాగించిన హైదరాబాద్ ఎఫ్.ఎన్.సి.సి.లో 2016 జూలై

ఆఖరులో జరిగిన భవన ప్రమాదం, వచ్చిన అప్రతిష్ఠతో విశాఖ ప్రతిపాదన ఆచరణ రూపం పొందడానికి కొంత ఆలస్యం కావచ్చు. మరోపక్క ఇప్పటికీ దక్షిణాది సినీ రంగానికి పెద్ద దిక్కు లాంటి మద్రాసుకు దగ్గరలో, తమిళనాడు సరిహద్దులో నెల్లూరు జిల్లా తడ దగ్గర ఒక కొత్త స్టూడియో నిర్మాణానికి ఆలోచన కూడా జరుగుతోంది. ప్రత్యేక ఆర్థిక మండలి (సెజ్) అయిన 'శ్రీసిటీ'లో ఇతరుల భాగస్వామ్యంతో స్టూడియో కట్టాలని అగ్ర నిర్మాత - పంపిణీదారు డి. సురేశ్‌బాబు 2015 ప్రథమార్ధంలో ప్రణాళికా రచన చేశారు. ప్రస్తుతానికి కాగితాల మీదే ఉన్న ఈ ప్రయత్నం ఎప్పటికి కార్యరూపం ధరిస్తుందో చూడాలి.

మొత్తానికి, తెలుగు గడ్డ రెండు రాష్ట్రాలై నవీన ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డాక, సీమాంధ్రలోనూ సినీ పరిశ్రమ వసతుల కోసం స్వీయ ప్రయోజనాల్ని దృష్టిలో పెట్టుకొంటూనే ఎవరి ప్రయత్నాలు వారు చేస్తున్నారు. ఎవరెన్ని చెప్పినా, ఏం చేసినా - నీరు పల్లానికే ప్రవహిస్తుందన్నట్లు, ఎక్కడ లాభసాటిగా ఉంటే, అక్కడి సినీ పరిశ్రమ వెలుగు చూపుతుందన్న విషయంలో ఎవరికీ అనుమానం లేదు. "రెండు తెలుగు రాష్ట్రాల్లో ఎక్కడ రాయితీలు, ప్రోత్సాహకాలు ఎక్కువగా ఉంటే, అటువైపు వెళ్ళి దర్శక, నిర్మాతలు సినిమాలు తీస్తారు" అని 'తెలుగు చలనచిత్ర నిర్మాతల మండలి' ప్రధాన కార్యదర్శి టి. ప్రసన్నకుమార్ చేసిన వ్యాఖ్యలే అందుకు నిదర్శనం. వెరసి, ఇప్పుడు తెలుగు సినీసీమ పరిస్థితి 'నారీ నారీ నడుమ మురారి'! చివరకు, పరిశ్రమను ఎవరు ఎటువైపు ఎక్కువ లాగగలుగుతారన్నది ఇప్పటికైతే బేతాళప్రశ్నే! దాన్ని పక్కనపెడితే, ఈ మొత్తం వ్యవహారంలో తీరాంధ్ర ప్రాంతం మళ్ళీ పాత సినీ వైభవాన్ని ఎంతో కొంత పొందడం మాత్రం ఖాయం!

తెలుగు సినీ పరిశ్రమ మొత్తం హైదరాబాద్ నుంచి అమరావతికో, విశాఖపట్నానికో, కెమేరాలో కనువిందు చేసే కోనసీమ అందాలకు చిరునామా అయిన రాజమండ్రికో తరలి వచ్చేస్తుందని అనుకోలేం. గతంలో మద్రాసు నుంచి హైదరాబాద్‌కు సినీరంగం తరలివచ్చినప్పుడు కూడా అక్కడి తెలుగు పరిశ్రమ ఆనవాళ్ళేమీ పూర్తిగా అదృశ్యం కాలేదు. డబ్బింగ్ సినిమాలు, సంగీత, నృత్య విభాగాలు, స్టంట్‌మెన్లు, సెట్ డిజైనర్ల విషయంలో ఇప్పటికీ మద్రాసు మీదే తెలుగు సినిమా ఆధారపడుతోంది. అలాగే, ఇప్పటికే స్టూడియోలు, రికార్డింగ్, డబ్బింగ్, విజువల్ ఎఫెక్ట్స్ వసతులు - అన్నీ ఉన్న హైదరాబాద్‌ను వదిలేసి, ఇక్కడ దుకాణం మూసేసి, మన సినీ రంగం పూర్తిగా నవీన ఆంధ్రప్రదేశ్‌కు తరలివస్తుందనుకోవడం, అక్కడ కొత్తగా దుకాణం తెరుస్తుందనుకోవడం అత్యాశే. ఇటు తెలుగు సినిమాకు ఒక కీలకమైన మార్కెట్ అయిన నైజామ్ ఏరియాను పరిశ్రమ దూరం చేసుకోలేదు. అటు కొత్త చోట స్థానికంగా ప్రాథమిక వసతిసౌకర్యాల కల్పన, సినీరంగానికి సంబంధించిన 24 శాఖల్లో స్థానికంగా ప్రతిభావంతుల అందుబాటు రాత్రికి రాత్రి సాధ్యమయ్యేదీ కాదు.

అయితే, ఉన్నంతలో పరిశ్రమ కొంత వికేంద్రీకరణ జరిగే అవకాశమైతే కచ్చితంగా ఉంది. అది మరీ దూరంలో ఏమీ లేదు. చిత్రీకరణ, పోస్ట్ ప్రొడక్షన్ వసతులు, ప్రచార పర్యవేక్షణ - ఇలా ప్రతి దానికీ ఎక్కడికక్కడ స్థానిక ప్రాథమ్యాలు పెరిగి, ఆ విభాగాల్లో కొన్ని శాఖలు కొత్త చోట్ల వేళ్ళూనుకోవచ్చు. ఏమైనా, అంతా తెలుగు ప్రాంతమే కాబట్టి, తీస్తున్నది తెలుగు వారిని ఉద్దేశించిన తెలుగు సినిమాయే కాబట్టి - రెండు తెలుగు రాష్ట్రాల్లోనూ మన సినీ రంగం స్థిరపడడం అనివార్యం. స్థానిక సంస్కృతి, సమస్యలు, భాష, యాసలకు ప్రాధాన్యమిస్తూ, కొత్త నీరు వచ్చి, సరికొత్త సినిమాలూ వస్తాయి. అలా రాగల రోజుల్లో నవ్యాంధ్ర తీరంలో తెలుగు సినిమాకు నూతన ఉషోదయం ఖాయమనిపిస్తోంది. కృష్ణా తీరవాసులు కళ్ళు కాయలు కాచేలా చూస్తున్న ఈ పరిణామానికి మరో పుష్కరకాలం పట్టవచ్చు. అనుభవంలోకి రావడం ఆలస్యమైతే కావచ్చేమో కానీ, పెట్టుబడులు పెట్టే ఇక్కడి సినిమా పెద్దలు అనుకుంటే ఆచరణ మాత్రం అసాధ్యం కానేకాదు!

**శ్రీ ఎన్.సిహెచ్.బుచ్చయాచార్యులు**

# ఘంటసాల వెంకటేశ్వరరావు ప్రభుత్వ సంగీత, నృత్య కళాశాల సంగీత ప్రాభవం

## సంగీత కళాశాల

తొలి ప్రిన్సిపాల్ డా॥ బాలమురళీకృష్ణ కాగా నేదునూరి కృష్ణమూర్తి, నూకల చినసత్యనారాయణ, ద్వారం భావనారాయణరావు, కర్లపాలెం చంద్రమౌళి వంటివారు తరువాత ప్రిన్సిపాల్స్‌గా ఇక్కడ పనిచేసిన కాలంలో కృష్ణా ప్రాంత సంగీత వైభవం మరింత వికసించింది.

**చావలి కృష్ణమూర్తి :**

చిలకలపూడి వెంకటేశ్వరశర్మ గారి శిష్యుడైన చావలి కృష్ణమూర్తి గుంటూరు జిల్లాకు చెందినవారు. గాత్ర విద్వాంసులు. సంగీత కళాశాలలో సిద్ధాంత బోధకులుగా పనిచేశారు. ఆకాశవాణిలో 'ఎ' గ్రేడ్ గుర్తింపు పొందిన విద్వాంసులు. గంభీరమైన కంఠస్వరంతో పూర్వశాస్త్ర పద్ధతిలో రాగం, తానం, పల్లవులు, కృతులు మంచి మనోధర్మంతో గానం చేసేవారు.

**ముసునూరి వెంకటరమణమూర్తి :**

వీరు పారుపల్లి వారి శిష్యులు. వీరి తండ్రిగారు ముసునూరి సూర్యనారాయణగారు గొప్ప హరికథకులు. తొలుత ఆకాశవాణిలో పనిచేసి, నాటి ప్రిన్సిపాల్ బాలమురళి కోరికపై సంగీత కళాశాల అధ్యాపకులుగా చేరారు. ఆకాశవాణిలో 'ఎ' గ్రేడ్ కళాకారులు. అనేక సభలలో చక్కని శైలితో కచేరీలు చేసి, కీర్తి ప్రతిష్టలు సంపాదించారు. పెమ్మరాజు సూర్యారావుతో కలసి జంట గాత్ర కచేరీలు చేయడమే కాక, ఆకాశవాణి భక్తిరంజని, లలిత సంగీతం, రూపకాలు, యక్షగానాలులో పాల్గొన్నారు.

**మహాదేవు రాధాకృష్ణరాజు :**

పొట్లూరి రాఘవయ్య చౌదరి గారి శిష్యులైన రాజు గారు మహావిద్వాంసులకు సహకార వాద్యం అందించి, అధ్యాపకులుగా అసంఖ్యాకమైన శిష్యులను తీర్చిదిద్దారు. 'నాదభగీరధ' బిరుదు నందుకున్నారు. వీరి కుమారుడు, శిష్యులు ఎందరో ఆకాశవాణి, సంగీత కళాశాలల్లో ఉపాధి పొందారు. వీరు రచించిన 'మృదంగ బోధిని' నాటికి నేటికీ కూడా ఆధారభూతమైనది.

**గద్దె వెంకటరామ కుమారి :**

వీరు కూడా పారుపల్లి వారి శిష్యురాలే. గాత్రం అధ్యాపకురాలుగా కళాశాలలో క్రమశిక్షణతో పనిచేశారు. వయొలిన్ కూడా వాయించేవారు. గురుభక్తి – శిష్యవాత్సల్యం మెండుగా కలిగిన సహృదయురాలు.

**అయ్యగారి సోమేశ్వరరావు :**

వీరిది గుంటూరు జిల్లా. గాయకీ శైలితో కూడిన మంచి వీణావాద్య పద్ధతి వీరిది. వీరి కుటుంబ సభ్యులందరూ వైణికులే. వీణావాద్యంలోను, సంగీత శాస్త్రంలోను లోతైన జ్ఞానం కలిగిన వీరు అనారోగ్యంతో నడి వయస్సులోనే మరణించారు.

**పెమ్మరాజు సూర్యారావు :**

పారుపల్లి వారి శిష్యులు మద్దులపల్లి ల× నృసింహశాస్త్రి గారి వద్ద సంగీతం నేర్చుకుని, బాలమురళి గారి దగ్గర మెరుగులు దిద్దుకున్నారు. శాస్త్రీయ, లలిత సంగీతాలలో ప్రజ్ఞావంతులు. సంగీత కళాశాలలో శాస్త్ర బోధకులుగా పనిచేసి, తాత్కాలిక ప్రిన్సిపాల్ హోదాలో పదవీ విరమణ చేశారు. ఆకాశవాణి, దూరదర్శన్‌లలో గుర్తింపు పొంది, డా॥ వెంపటి చినసత్యం గారు రూపొందించిన అనేక నృత్యరూపకాలకు రెండు దశాబ్దాలపాటు నేపథ్య గానం చేసి దేశ విదేశాలలో పర్యటించారు. ఎనిమిది పదుల వయస్సు దాటిన వీరు నేటికీ సంగీత కచేరీలు చేస్తున్నారు. హిందూ పత్రికకు సాంస్కృతిక విలేకరిగా కూడా ఉన్నారు. వీరు సంగీత రత్న బిరుదు పొందారు.

**కోటిపల్లి సూర్యప్రకాశరావు :**

కళాశాలలో వాయులీన అధ్యాపకులుగా పనిచేసి వందలాది మందికి చక్కటి శిక్షణనిచ్చారు. గాత్రసంగీతంలో కూడా దిట్ట. ఎందరో మహా విద్వాంసులకు సమర్ధవంతమైన సహకారం అందించారు. మనోధర్మ సంగీతానికి సంబంధించిన గణిత ప్రక్రియలో వీరి పాటవం చాలా విశేషంగా ఉండేది. ఆకాశవాణిలో జంత్ర గాత్ర విద్వాంసులుగా

గుర్తింపు పొందారు. 'సంగీత కళాప్రవీణ', 'నాద భగీరథ' వీరి బిరుదులలో ప్రముఖమైనవి. వీరి శిష్యులు ప్రస్తుత సంగీత రంగంలో ప్రముఖంగా ఉన్నారు.

**కె.వి.రెడ్డి :**

ద్వారం వారి సంప్రదాయంలో వయొలిన్ విద్యను అభ్యసించి, సంగీత కళాశాలలో వయొలిన్ విభాగంలో అధ్యాపకులుగా పనిచేసి ఎంతో మందిని తీర్చిదిద్దారు. 'సంగీత కోవిధ' బిరుదుపొందారు. కళాశాలకు సొంత భవనం ఏర్పడడంలో వీరి కృషి ప్రధానమైనది. ఆకాశవాణిలో గుర్తింపు పొందిన కళాకారులు. వీరి శిష్యులు అనేకమంది ఉన్నత స్థానాలకు ఎదిగారు.

**జె.వి.యస్. రావు :**

కళాశాలలో హిందూస్థానీ సంగీత విభాగంలో అధ్యాపకులుగా పనిచేశారు. హిందుస్థానీ సంప్రదాయంలో గొప్ప విద్వాంసునిగా పేరుగడించారు. ఈ ప్రాంతంలో అరుదైన హిందుస్థానీ సంగీత ప్రచారానికి ఎనలేని సేవచేశారు. వీరి శిష్యులు కొంతమంది చలన చిత్ర రంగంలో మంచి గుర్తింపు పొందారు. ఆకాశవాణి 'ఎ' గ్రేడ్ గాయకులు.

**అయ్యగారి శ్యామసుందర్ :** సంగీత కుటుంబంలో జన్మించిన శ్యామసుందర్ ఈ కళాశాలలో గాత్రం నేర్చుకుని తండ్రిగారి వద్ద వీణ అభ్యసించి, వీణ అధ్యాపకుడిగా, అనంతరం ప్రిన్సిపాల్‌గా పనిచేసి, 2006 లో పదవీ విరమణ చేశారు. వందలాదిమందిని వీణావాద్యంలో తీర్చిదిద్దారు. దేశవ్యాప్తంగా అనేక సభలలో కచేరీలు చేశారు, చేస్తున్నారు. కేంద్ర సంగీత నాటక అకాడమి పురస్కార గ్రహీత అయిన వీరు ఆకాశవాణి ఉన్నతశ్రేణి కళాకారునిగా గుర్తింపు పొందారు. తొలుత చలనచిత్ర రంగంలో కూడా పనిచేశారు.

**దండమూడి సుమతీ రామమోహనరావు :**

సంగీత కళాశాలలో పనిచేసిన నిడుమోలు రాఘవయ్య గారు మృదంగ విద్వాంసులు. ఆయన డోలు, ఘటం, కంజిర వంటి వాద్యాలలో ప్రవీణులు, ఆకాశవాణి గుర్తింపు పొందిన కళాకారులు. ఆయన కుమార్తె సుమతి తండ్రిగారి వద్ద, రాధాకృష్ణరాజు గారి దగ్గర, పిదప దండమూడి వారి వద్ద మృదంగ విద్యనభ్యసించారు. సంగీత కళాశాలలో భరతనాట్య విభాగంలో అధ్యాపకురాలిగా పనిచేసిన సుమతి ఏకైక మహిళా విదుషీమణిగా గుర్తింపు పొందారు. టాప్ గ్రేడ్ కళాకారిణి, కేంద్ర సంగీత నాటక అకాడమి పురస్కార గ్రహీత. దేశవ్యాప్తంగా అనేక సభలలో మృదంగ సహకారం అందించడమే కాక లయ విన్యాస ప్రదర్శనలతో మెప్పిస్తున్నారు. ప్రముఖ విద్వాంసులైన బాలమురళీకృష్ణ లాంటి వారికి సైతం మృదంగ సహకారం అందించారు. దండమూడి రామమోహనరావు గారి సంస్మృతిగా 'లయవేదిక' సంస్థను నిర్వహిస్తున్నారు.

**ముదునూరి రాధాకృష్ణమూర్తి :**

వీరు మహదేవు రాధాకృష్ణరాజు గారి వద్ద మృదంగం నేర్చుకుని, తదుపరి పళని సుబ్రహ్మణ్య పిళ్ళే గారి వద్ద కూడా శిక్షణ పొందారు. మృదంగ విభాగంలో అధ్యాపకులుగా పనిచేసిన ముదునూరి అనేకమంది శిష్యులను తయారుచేశారు. ప్రత్యేకంగా నాట్యకార్యక్రమాలకు ఎంతో సమర్థవంతంగా మృదంగ సహకారం అందించి, ఆ రంగంలో విశేషమైన ఖ్యాతి గడించారు. ఆకాశవాణి గుర్తింపు పొంది పలువురు ప్రముఖులకు మృదంగ సహకారం అందించారు.

**కొమాండూరి శేషాద్రి :**

గుంటూరుకు చెందిన శేషాద్రి అనంతాచార్యులు, తిరుమలాచార్యులు, వింజమూరి వరదరాజయ్యంగార్, ఆర్.విశ్వేశ్వరన్, యం.చంద్రశేఖరన్ గురువర్యుల దగ్గర గాత్రం, వీణ, వయొలిన్, నేర్చుకుని కళాశాల వయొలిన్ విభాగంలో అధ్యాపకులుగా పనిచేశారు. గాత్రం, సంగీత శాస్త్రంలో కూడా ఎంతో ప్రతిభావంతులు. సంగీతంలో స్నాతకోత్తర పట్టభద్రులు, గ్రంథకర్త. పలు సభలలో కచేరీలు చేయడం, ప్రసంగాలు చేయడంతో పాటు పత్రికలకు వ్యాసాలు వ్రాయడం వీరి దినచర్య. ఆకాశవాణి కేంద్రంలో ఉన్నతశ్రేణి కళాకారునిగా గుర్తింపు పొందిన వీరు ప్రముఖులెందరికో వయొలిన్ సహకారం అందించారు. బహుముఖ ప్రజ్ఞాశాలి. ఎందరినో తీర్చిదిద్దిన సద్గురువు. ఎన్నో సభలలో గౌరవింపబడ్డారు. రాష్ట్ర ప్రభుత్వం నుండి 'కళారత్న', 'సప్తగిరి సంగీత విద్వన్మణి' వంటి బిరుదులు అనేకం అందుకున్నారు. వీరి కుమారులు కె.వి.కృష్ణ తిరుపతి సంగీత కళాశాలలో వయొలిన్ అధ్యాపకులుగా పనిచేస్తున్న విద్వాంసులు. పెద్ద కుమారుడు రాజన్ కూడా వయొలిన్ వాద్యంలో ప్రతిభావంతుడు.

ఇంకా కళాశాలలో వి.నాగరత్నమ్మ, లంకా వెంకటేశ్వర్లు, పాలపర్తి నాగేశ్వరరావు, వడ్లమూడి బాలాజీ, డి.సుభద్ర, కె.వి.బ్రహ్మానందం, వి.వి.ఎల్.నరసింహారావు, పెమ్మరాజు రాజగోపాలరావు, శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరం, సి.వి.కిట్టప్ప, రేవతీ రత్నస్వామి, చిట్టా బాలవరప్రసాద్, మంగతాయారు, కె. కూర్మనాథ్ తదితరులు సేవలందించారు.

ప్రస్తుతం కె.యస్.గోవిందరాజన్ (ప్రిన్సిపాల్), వి.కృష్ణవేణి, ఎన్.సిహెచ్.బుచ్చయాచార్యులు, మండా కృష్ణమోహన్, మురమళ్ళ విజయకుమార్, పారుపల్లి సుబ్బరాయ ఫల్గుణ్, కె.ల× నరసమ్మ, వి.అమృత కుమార్, జి.స్టీవెన్‌రాజు, జి.కృష్ణమూర్తి, అంపోలు శోభాల సేవలందిస్తున్నారు.

శ్రీ టేకుమళ్ళ వెంకటప్పయ్య

# పాల్కురికి సోమనాథుని కాలంనాటి కృష్ణాతీర క్షేత్రాలు

ఒక దేశ సంస్కృతి, నాగరికతలను ప్రతిబింబించేది ఆ దేశపు సాహిత్యమే. ఆ సాహిత్యం ఎంత పటిష్టంగా వుంటే ఆ దేశపు సంస్కృతి అంత నిర్దుష్టంగా ఉంటుంది అనడంలో ఎటువంటి అనౌచిత్యమూ లేదు. వాల్మీకి, వ్యాసమహర్షి, కాళిదాసు, రవీంద్రనాథ్ ఠాగూర్ మొదలైన మహాకవుల మహత్తరమైన రచనల కారణంగా భారతీయ సాహిత్యానికి ప్రపంచవ్యాప్తంగా గుర్తింపు వచ్చింది.అందువల్ల, సమాజ జీవితాన్ని అర్థం చేసుకోవడానికి సాహిత్యం ఓ ప్రధాన సాధనమని తెలుస్తుంది. ఒక భాషలో ఉన్న సాహిత్యౌన్నత్యం, సజీవతలే ఆ భాష మాట్లాడే జాతికి గౌరవం చేకూరుస్తాయి. ఒక జాతి నాగరికమైనదా లేక అనాగరికమైనదా నిర్ణయించేది కూడా సాహిత్యమే! జాతి సామాజిక స్థితి గతులకు సాహిత్యపు తీరుతెన్నులకు విడదీయరాని సంబంధం ఉంటుంది.

సామాజిక పరిస్థితుల్ని బట్టి సాహిత్య దృక్పథం కూడా అనేక కొత్త పుంతలు త్రొక్కుతూ ఉంటుంది. మన తెలుగు ప్రాచీన సాహిత్యంలో ఎక్కువ భాగం మత దృక్పథంతోనే వెలువడినవే. జైన, బౌద్ధ మత ప్రభావం మితిమీరిపోయినపుడు వైదిక మత పునరుద్ధరణ కోసం తూర్పు చాళుక్య చక్రవర్తి రాజరాజ నరేంద్రుని ప్రోద్బలంతో నన్నయ మహాభారతాన్ని రచించపూనుకొన్నాడు. ఓరుగల్లుని పాలించిన కాకతీయులు మొదట జైన మతాభిలాషులైనా తర్వాత బసవన్న స్థాపించిన వీర శైవ మతాన్ని అనుసరించారు. వీరశైవం అనేక సంఘ సంస్కరణలకు నాంది పలికింది. ముఖ్యంగా కుల విధానాన్ని వ్యతిరేకించింది. సమాజ పరిస్థితులకు చక్కగా ప్రతిస్పందించిన శివ కవులు చరిత్రలో చిరస్మరణీయులు. వారిలో పాల్కురికి సోమనాథుడు అగ్రగణ్యుడు. నాటి సమాజాన్ని పాల్కురికి తన రచనల్లో చాలా వివరంగా వర్ణించాడు. శైవమత ప్రచారం కోసం జన సామాన్యానికి చేరువగా, జన సామాన్య జీవనం ప్రతిబింబించే విధంగా వెలువరించిన స్వతంత్ర గ్రంథాలకు సోమనే ఆద్యుడు. వెయ్యేండ్ల తెలుగు సాహిత్య చరిత్రలో పాల్కురికి ఒక ప్రత్యేకమైన స్థానం ఉంది. దక్షిణ భారతదేశంలో సమాజాన్ని అత్యంత ప్రభావితం చేసిన బసవేశ్వరుని సమాజ సంస్కరణ విప్లవాలకు భాష్యాలు వెలయించిన మహాకవి. ఆరుద్ర 'సమగ్రాంధ్ర సాహిత్యం'లో "తెలుగు తోటలో మొదటి కోకిల కంఠమెత్తి తెలుగువాళ్లకోసం తెలుగు ఛందస్సులో పాటలు పాడింది. అతడు పాడిన తెలుగు ఛందస్సు పేరు ద్విపద. తెలుగుజాతి అతనికిచ్చిన దివ్యాయుధం ద్విపద. తెలుగు జాతికి అతడిచ్చిన గొప్ప కానుక కూడా ద్విపదే. పాల్కురికి సోమనాథుడు పుట్టకపోతే పాడుకొనేందుకు తెలుగువాళ్లకి ఛందస్సు ఇంతగా రాణించేది కాదేమో ! ప్రజల కోసం అతడు పుట్టాడు. ప్రజలే అతన్ని అమరకవిని చేశారు అన్న మాటలు అక్షర సత్యం. సోమన ఎంతో శ్రమించి ద్విపదల ద్వారా కవిత్వాన్ని రాజాస్థానాల నుండి సామాన్య ప్రజానీకానికి అందుబాటులోకి తెచ్చినా తర్వాతి కాలంలో తిక్కన మొదలైన కవులు మరలా కవిత్వాన్ని రాజాస్థానాల బాట పట్టించి సామాన్య ప్రజలకు దూరం చేయడం విచారించదగ్గ పరిణామం.

పాల్కురికి సోమనాథుని (క్రీ.శ.1160-1240) జన్మస్థలం ప్రస్తుతం నల్గొండ జిల్లాలోని పాలకుర్తి ప్రాంతం. శ్రీశైల మల్లికార్జున స్వామికి పరమభక్తుడైన సోమన కాకతీయుల కాలానికి చెందిన మహాపండితుడు. తెలుగులో యాత్రా కథనాలకు ఆద్యుడు. పాల్కురికి ఆంధ్ర, కన్నడ, తమిళ దేశాలు విస్తృతంగా పర్యటించాడు. "పండితారాధ్య చరిత్ర" ఆయన అతి గొప్ప రచన. ఇది గొప్ప యాత్ర రచనగా ప్రస్తుతించబడింది. ఆ గ్రంథంలోని పర్వత ప్రకరణం శ్రీశైల పర్వతం పైనున్న సందర్శనా స్థలాల గురించే కాక ఆ కృష్ణాతీర పరిసరప్రాంతాలలో ఉన్న గొప్ప గొప్ప యాత్రాస్థలాలను గురించి తెలియజేస్తుంది. డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు 1939లో శ్రీ పండితారాధ్య చరిత్ర ఉపోద్ఘాతంలో ఆయన పేర్కొన్న 408 యాత్రాస్థలాల జాబితా ఇచ్చారు. వీటిల్లో 45 స్థలాలు మాత్రం పాల్కురికి మరో రచన అయిన "బసవ పురాణం"లోనివని తెలిపారు.

శ్రీశైల మల్లికార్జున స్వామికి పరమభక్తుడైన సోమన కృష్ణాతీరం వెంబడి, ఆ పరిసర ప్రాంతాలలోని పరీవాహక ప్రాంతాలలోగల అనేక పుణ్యక్షేత్రాలను దర్శించారు. క్రీ.శ. 12వ శతాబ్దంలో బసవేశ్వరుడు వీరశైవం అనే మతశాఖ ఆవిర్భవించడానికి మూలకారకుడు. ఆయన జ్ఞాని అయింది, సమాధి అయింది మహబూబ్ నగర్ జిల్లాలోని కూడలి సంగమేశ్వరంలో. ఈ జిల్లాలోని ఉమామహేశ్వర క్షేత్రంలో ప్రారంభమయ్యే నల్లమల పర్వతరాజాన్ని వీరశైవుడైన మల్లికార్జున పండితారాధ్యుడు దర్శించగా ఆయనకు ఆ పర్వతం పెద్ద శివలింగ రూపంలో

సాక్షాత్కరించగా దాన్ని తన పాదాలతో తొక్కుతూ ఎక్కడానికి ఇష్టపడక తన శిష్యుడు దోనమ రాజయ్యను శ్రీశైల క్షేత్రమును, దాని పరివార ఆలయాలను దర్శించుకుని రమ్మని పంపించాడు. ఆయన శ్రీశైల ఉత్తర ద్వార క్షేత్రమైన ఉమామహేశ్వరంతో ప్రారంభించి సుమారు 400 తీర్థక్షేత్రాలను దర్శించినట్లు పర్వత ప్రకరణంలో ఉంది. కాగా వాటిలో కొన్ని స్థలాలు ప్రస్తుతం తెలుసుకోవడానికి వీలులేకుండా పేర్లు మారిపోగా, మరికొన్ని నాగార్జునసాగర్, శ్రీశైలం ప్రాజెక్టుల నిర్మాణ సమయంలో మునిగిపోయి కాలగర్భంలో కలిసిపోయాయి. అవి నల్గొండజిల్లా ఏలేశ్వరం, మహబూబ్‌నగర్ జిల్లా మల్లేశ్వరం (కొల్లాపురం) ప్రాంతాల్లో ఉండేవని ఆ ప్రాంతం వారంటారు. దోసమ రాజయ్య స్వయంగా తిరిగి చూసినట్లు, మరికొన్ని మల్లికార్జున దేవుడు మారువేషంలో ఆయనను తిప్పి చూపినట్లు పాల్కురికి సోమన పర్వత ప్రకరణంలో వివరించాడు. శ్రీ నాగలూటి శేషనాథాచార్యుని శ్రీపర్వత పురాణం, స్కాంద పురాణాంతర్గత శ్రీశైల ఖండం, శ్రీ ఉమామహేశ్వర జీర్ణోద్ధారణం తదితర గ్రంథాలు, శాసనాలు చదివితే ఆ నాటి గ్రామ గ్రామాలు, పుణ్యక్షేత్ర ప్రదేశాలు, వివిధ శైవ తీర్థ, క్షేత్రాల విషయంలో సమన్వయం కుదురుతుందని ఆ ప్రాంతాలు విస్తృతంగా పర్యటించిన పర్యాటక నిపుణుడు డాక్టర్ ద్యావనపల్లి సత్యనారాయణగారు అంటారు. శ్రీశైలానికి సిరిగిరి, శ్రీగిరి, శ్రీపర్వతము, మొదలైన నామాలుండేవని వివిధ గ్రంథాలలో ఉంది. శ్రీ అనగా సంపద, శైలమంటే పర్వతం కనుక శ్రీశైలమంటే సంపద్వంతమైన పర్వతమని అర్థం. క్రీ.శ 1313 లోని ఒక శాసనాన్ని అనుసరించి దీనికి శ్రీ కైలాసము అనే పేరూ ఉన్నట్టు తెలుస్తోంది. ఆ శాసనములో పరమ శివుడు శ్రీ కైలాసము పైన నివసించారని ఉంది.

సోమనాథుడు పర్వత ప్రకరణంలో "ఉరుతర శ్రీపర్వతోత్తర ద్వార / పరమహత్వంబు దద్వార వాస్తవ్యు/డైన మహేశ్వరోద్యల్లింగ మూర్తి" అంటూ ఆరంభించి శ్రీ ప్రదక్షిణ మార్గ గిరిని/రూపిత లింగ మూర్తు లను దీర్ధముల/శ్రీపర్వతంబు జూచితిగదే కలయ/ మీ పండితయ్య కర్మిలి నట్లజెప్పు" అంటూ పరిసర ప్రాంతాలలోని క్షేత్రాల జాబితా సుమారు 135 ద్విపద పద్యాల్లో చెప్పాడు.

> "ఉరుతర శ్రీపర్వతోత్తర ద్వార
> పరమహత్త్వంబు దద్వార వాస్తవ్యు
> డైన మహేశ్వరోద్యల్లింగ మూర్తి
> మానితంబగు గుప్తమాహేశ్వరంబు
> జరుకేశ్వరంబును సంధ్యా సమాధి
> గరుడేశ్వరంబును గాలప్రద్వేశ్వ
> రంబు బాప వినాశనంబు గణేశ్వ
> రంబు దేవ ప్రదేశ్వరంబు సిద్ధేశ్వ
> రంబును నీల హ్రదంబును నాగ
> బంచి యేకాదశ భవ్య తీర్థములు
>
> *(మల్లికార్జున పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణం – పుట 277)*

శ్రీశైల పర్వత పరిసరప్రాంతాలలో సోమనాథుడు పేర్కొన్న వానిలో నేటికీ సజీవంగా నిలిచి పన్నెండవ శతాబ్ది ఆంధ్ర చరిత్రకు అద్దం పడుతున్న కొన్ని పుణ్యక్షేత్రాలను, వాని ప్రస్తుత పరిస్థితిని సమీక్షిద్దాం.

**ఉమామహేశ్వరం :** ఇది శ్రీశైలానికి ఉత్తరద్వారం. రోడ్డు మార్గం నుండి 12 కి.మీ. లోనికి వెళితే దట్టమైన అటవీప్రాంతంలో ఉమామహేశ్వర శివాలయం కనిపిస్తుంది. అర్ణవ ఘోషణం (పెద్ద వాద్యం) అనబడే మహేశ్వరపురాన్ని వర్ణిస్తూ పాల్కురికి "ఆ పురంలో పగలు రాత్రులంతా పెద్ద వాయిద్య, బహు వాయిద్య ఘోషలె విన్పిస్తుంటాయి" అన్నాడు. నల్లమల అడవుల ప్రారంభంలో ఉన్న ఉమామహేశ్వర క్షేత్రాన్ని పద్మనాయకరాజు మాదానాయకుడు 14వ శతాబ్దంలో శిల్పకళా శోభాయమానంగా తీర్చిదిద్ది భక్తులకు అనేక వసతులు ఏర్పాటుచేశాడు. శ్రీశైలానికి ఉత్తర ద్వారా క్షేత్రంగా కీర్తించబడుతున్న ఈ క్షేత్రం నుంచి కృష్ణానది తీరం వరకు నల్లమల అడవుల గుండా భక్తులు సురక్షితంగా శ్రీశైలం చేరుకోవడానికి వీలుగా సుమారు 40 కిలోమీటర్ల దూరం రాతిమెట్లు జాతర రేవు వరకు కట్టించారు. ఇన్ని శతాబ్దాల అనంతరం పెద్ద వాద్యం ఇప్పుడు శిథిలమై ఉమామహేశ్వర ప్రధానాలయం నుంచి పాపనాశనం అనే చిన్న జలపాతం వైపు నడుస్తుంటే ఎడమ పక్కన కన్పిస్తుంది. అంత పెద్ద వాద్యం ప్రపంచంలోనే మరొకటి ఉండి ఉండదు. దాని పొడవు సుమారు నాలుగు గజాలుండగా, ఎత్తు రెండు గజాలుంది. ఒక ఇనుప కమ్మీకి ఏనుగు తోలును వాయిద్య పొరలుగా చుట్టినట్లు కన్పిస్తుంది.

**కుబేరేశ్వరం :** ఆనాటి కుబేరేశ్వరాన్ని ఇప్పుడు ధనబండగా పిలుస్తున్నారు. ఇది రంగాపురం నుంచి ఉమామహేశ్వరం వైపు వెళ్తున్న పుడు అటవీ ప్రాంతపు దారికి కుడివైపున కన్పిస్తుంది. ఇది ఒక పెద్ద పరుపు బండ. ఈ బండ తూర్పువైపున కుబేరుని శిల్పం చెక్కి ఉంది. దీనికి ఉత్తరాన ఇటుకలతో నిర్మించిన కుబేరేశ్వరాలయం ఉంది.

**సిద్ధేశ్వరం :** ఈ సిద్ధేశ్వర ఆలయం హైదరాబాదు నుంచి అచ్చం పేట మీదుగా శ్రీశైలం వైపు ప్రయాణిస్తున్నపుడు నల్లమల కొండల ప్రారంభంలో పారే ఒక వాగు కుడి ఒడ్డున ఉంది. 1975 సం.లో ఒక అటవీశాఖ అధికారి ఈ శిథిల ఇటుకల ఆలయాన్ని చూసి శిథిలా లను అటూ ఇటూ తన్నుతూ లింగాన్ని కూడా తన్నగా అది విరిగి పోయిందట. ఆ తరువాత మనశ్శాంతి లేక ఆ అధికారి తన తప్పును తెలుసుకొని ప్రాయశ్చిత్తంగా శిథిల ఆలయ స్థానంలో ఒక షెడ్‌ను కట్టించాడట. అదే ఇప్పుడు ఉంది.

**కుర్వ దారులు :** సోమనాథుడు పేర్కొన్నట్లుగానే ఆనాడు దోన మయ్య ఎక్కిన కొండను స్థానికులు ఇప్పటికి కుర్వ గానే పిలవడం ఆనందించదగ్గ విషయం. ఆ కుర్వను సగం దూరం ఎక్కిన తరువాత కుంచెన్ మలుపు అనే స్థలం వస్తుంది. ఇక కుంచెన్ మలుపు నుంచి ఎడమవైపు కుర్వ పైకి ప్రయాణించే బాటలో ప్రయాణిస్తే మల్లికార్జునం వస్తుందని సోమనాథుడు పేర్కొన్నాడు. ఇప్పుడు అక్కడినుంచి కుడివైపు చూస్తే గుట్ట కింది నుంచి రెండు బాటలు కనిపిస్తాయి. ఆ మలుపు వైపు కొంతదూరం ప్రయాణించి మధ్యలో కలిసిపోతుండడాన్ని గమ

నించవచ్చు. ఆ రెండు బాటలూ చిన్న రాతి గోడలవలె, పచ్చని చెట్ల మధ్య సాగే తెల్లని పాపిటవలె అందంగా కన్పిస్తున్నాయి ఇప్పటికీ.

**గుప్త మల్లికార్జునము :** కుర్వను పూర్తిగా ఎక్కితే దోనమయ్య ఎక్కిన బాట గుప్త మల్లికార్జున క్షేత్రం గుండానే సాగుతుంది.

**శివపురద్వారం :** ఆనాటి శివపురం కాలగర్భంలో కలిసిపోయినా దాని ద్వారం మాత్రం ఇప్పుడు కుంచెన్ మలుపు దాటిన తరువాత రోడ్ పక్కన గుట్టదరి వైపు కన్పిస్తుంది.

**చతుర్ముఖ బసవేశ్వరం :** ఆనాటి చతుర్ముఖ బసవేశ్వర లింగాలయం ఈనాడు లేదు. 19-07-2005 తేదీనాడు మున్ననూరు తండాకు చెందిన వశ్యానాయక్ అనే వ్యక్తి ఇల్లు కట్టుకోవడానికి పునాది తవ్వుతుండగా అడుగు లోతున చతుర్ముఖ బసవేశ్వర లింగం బయట పడిందట. రెండున్నర అడుగుల పొడవు వెడల్పులతో ఉన్న నునుపైన నల్లని అందమైన పానవట్టంపైన అడుగు ఎత్తు శివలింగం, దానికి నాలుగువైపులా గోముఖాలు అందంగా శిల్పించబడి ఉన్నాయి. దేశంలోనే చాలా అరుదైన శివలింగమిది. పాల్కురికి వర్ణించిన చతుర్ముఖ బసవేశ్వర లింగమిదే.

బిలం అనే ప్రదేశం ఉండేది. అది ఒక గుహ ప్రదేశ మార్గం. ఆ గుహ ఎంత దూరం పోతుందో ఎవరికీ తెలియదు. కన్యాసిద్ధనాథుని భవనం లేదా ప్రాసాదం మన్ననూరు తండాలో ఉన్న వేణుగోపాల ఆలయం ముందున్న ప్రాసాదం అయ్యుంటుందని అక్కడివారు అంటారు.

**మందాకిని నది :** బసవేశ్వర లింగమున్న మన్న నూరుకు దక్షిణంగా కొమ్మన్ పెంట ప్రాంతంలోని లోయలో మందవాగు (మందాకిని నది) పారుతున్నది. దాని ఒడ్డున ఒక అద్భుతమైన శివ లింగముంది. ఇదే పాల్కురికి పేర్కొన్న ఇంద్రేశుడు అయివుండవచ్చు.

**గోమాతృ పంచకం/నాగపంచి/మాతంగేశ్వరం :** పర్వత ప్రకరణంలో ఈ మూడు క్షేత్రాలనూ వివిధ సందర్భాల్లో పేర్కొనబడినా మూడూ ఒకటేనని క్షుణ్ణంగా పరిశీలించినవారికి అర్థమవుతుంది. ఉమామహేశ్వరం దగ్గరి తూర్పున నాగపంచి ఉందని పేర్కొనడంతో ఈ క్షేత్రాన్ని గుర్తించడం సులువైందని డా.ధ్యానవల్లి పేర్కొన్నారు. ఈ క్షేత్రాన్నిప్పుడు "మమ్మాయిబోళ్ళు" అని రంగాపురం స్థానికులు పిలుస్తున్నారు.

**గుప్త మహేశ్వరం :** ఆ పేరుతో శివలింగం ఇప్పుడు అక్కడ లేదు. దుండగుల చేతుల్లో ధ్వంసమైన గుప్త మహేశ్వర శిథిలాలయం మాత్రం ఉమామహేశ్వరానికి తూర్పున అటవీ దారి దగ్గర పారే గుప్తమహేశ్వర వాగు కుడి తీరాన ఉంది.

**చరుకేశ్వరం :** ప్రస్తుతం ఈ ఆలయం శిథిలమయిపోయింది. దీని శిథిలాలు, గోడలు, బురుజులు ఇప్పుడు మన్ననూరులోని విజయ గోపాలాలయం ముందు కన్పిస్తున్నాయి.

**సంధ్యా సమాధి :** ఉమామహేశ్వర సమీప గ్రామమైన రంగాపూర్ శివారులో ఉన్న చంద్రబండకు తూర్పున ఉంది. నలువైపులా మెట్లతో ఉన్న అందమైన కోనేరులో ఇప్పటికీ నిండా నీళ్ళున్నాయి.దానికి వాయువ్యంలో ఒక ప్రముఖుని సమాధి.దానిపైన ఒక శాసనం కూడా ఉన్నది.

**దేవప్రహదేశ్వరం/రామేశ్వరం :** పాల్కురికి పేర్కొన్న మరో తీర్థం దేవప్రహదేశ్వరం. చంద్రబండనే స్థానికులు దేవరబండ అనికూడా పిలుస్తారు. పాల్కురికి పేర్కొన్న మరో తీర్థం రామేశ్వరం కూడా ఆ దేవరబండనే అని స్థానికులు అంటున్నారు.

**కాలప్రహదేశ్వరం :** ఈ ప్రదేశాన్ని ప్రస్తుతం కాలాపానీ అని పిలుస్తున్నారు. ప్రస్తుతం మన్ననూరు చౌరస్తా నుంచి శ్రీశైలం వైపు ప్రయాణిస్తున్నప్పుడు కుడివైపున ఒకరి ఇంటి ఆవరణలో బావి రూపంలో ఉంది.

**వేద పర్వతం/అశ్వమేధ శిలోచ్ఛయం :** మన్ననూరు శివారులో ఉన్న ప్రతాపరుద్ర కోట మీద ఆ రాజులు యజ్ఞాలు చేయడానికై స్నానం చేసే అవభృథ స్నానవాటిక ఇప్పటికీ కనిపిస్తూ ఉంది. కాబట్టి అశ్వమేధ శిలోచ్ఛయము లేదా వేద పర్వతం ఇదే అని స్థానికులు ధృవపరుస్తున్నారు.

**శ్వేతాద్రి :** అశ్వమేధ పర్వతానికి ఎదురుగా పడమటి దిక్కున ఉన్న కుప్పగుట్ట. తూర్పువైపు తెల్లని పరుపు బండలు విశాలంగా ఉండటం వల్ల దీన్ని తెల్లకొండ అని అంటారు. సంస్కృతీకరించి దాన్నే శ్వేతాద్రి అంటారు.

**గుండ శిఖరి :** మన్ననూరు నుంచి శ్రీశైలం వైపు ప్రయాణం చేస్తుండగా సుమారు పది కిలోమీటర్ల దూరంలో పులిమడత అనే ప్రదేశం రోడ్డుకు కుడివైపున వస్తుంది. అక్కడినుంచి సుమారు అర కిలోమీటరు దూరంలో లొద్ది అనే గుండం,కిలోమీటరు దూరంలో గుండం అనే ప్రదేశం వస్తాయి. వీటిల్లో మొదటిది ఒక శిఖర పర్వతం కిందగా, రెండవది దానిమీద ఉన్నాయి కాబట్టి పాల్కురికి పేర్కొన్న గుండశిఖరి ఇదే అంటారు.

పండితారాధ్య చరిత్రలో 12, 13వ శతాబ్దులకు చెందిన తెలుగు వారి జీవితాన్ని సవివరంగా వర్ణించారు పాల్కురికి, శ్రీశైల క్షేత్ర మహిమ, దాని ప్రాచీనత పండితారాధ్య చరిత్ర ద్వారా తెలుసుకోవచ్చు. ఆ గ్రంథంలలో సరోమన తెలుగుదేశంలోని ఆనాటి ఆటలు, పాటలు, విద్యలు, వినోదాలు, వస్త్రాలు, వీణలు, రాగాలు, నేత్రరోగాలు, రతి శాస్త్ర రహస్యాలు, ఆభరణాలు, కావ్య నాటకాలంకార శాస్త్ర విషయాలు, కవితా మర్మములు, భాషలు, నదులు, కొండలు, గ్రామాలు, సామెతలు మొదలైన ఎన్నో విషయాలను తెలిపాడు. ఇంకా ఆనాడు పిల్లలు ఏయే ఆటలు ఆడేవారో సకలేశ్వర మాది రాజయ్య కథలో సవిస్తరంగా వివరించాడు. దాగుడుమూతలాట, గోరంటలాట, సరిగుంజులాట, కుందెన గుడి, గుడి గుంజంబులాట, సిట్లపోట్లాట, సేరబొంతలాట, అప్పల విందులయాట, దప్పట్లాట, రాగుంజు, గుంజులాట, దిగు దిగు దిక్కొనునాట మొదలైనవి. రెండు మూడు దశాబ్దాల క్రితం నాటి ఆటలే కనుమరుగయ్యాయి. ఇక ఎనిమిది శతాబ్దాల క్రితం ఉన్న ఆటలను మనం వూహించనుకూడా వీలులేని దుస్థితి. "సమకాలీన సమాజానికి అద్దం పట్టడమే ఉత్తమ సాహిత్య లక్షణాలలో ప్రధానమైతే సోమనాథుని రచనలు దానికి నిలువుటద్దం పడతాయి" అన్న ఆరుద్ర మాటలు అక్షర సత్యాలు.

డాక్టర్ మహతీశంకర్ జంధ్యాల

# తిరుపతి వేంకటకవుల పాండవ నాటకాలు

తిరుపతి వేంకటకవుల నాటకాలలో మకుటాయమానమైనవి పాండవనాటకాలు అందులోను "ఉద్యోగవిజయాలు" లేదా "రాయబారం" పద్యాలు తెలుగునాట ఇంటింటా వాడవాడలా మారు మ్రోగాయి - మారు మ్రోగుతూనే వుంటాయి. మహాభారతం కవిబ్రహ్మ తిక్కన నాటకీయ శిల్పానికి బంగారుగని! మహాకవిగా, మహామంత్రిగా తన అఖండా ప్రతిభా సామర్థ్యాలతో రసవత్కవితం పండించిన కవి బ్రహ్మ పద్యాలు పండితలోకాన్ని అలరిస్తూవుండగా - తిరుపతి కవుల పద్యాలు పండితులనూ, పామరులను అందరినీ అలరింపజేస్తాయి. తిక్కన భారతమంటే తెలుగు వారికెంత గౌరవమో - తిరుపతికవుల పద్యాలన్నా అంత ఆదరం - ఒకవైపున ధర్మమహాతదవు, అంటే పాండవపక్షం - మరొకవైపున రోషమయ మహాతరువు - అంటే - కౌరవపక్షం నిలిచి - కురుక్షేత్ర సంగ్రామ సేవలు జగత్ప్రళయాన్ని సృష్టించనున్న తరుణంలో శ్రీకృష్ణ పరమాత్మ ముఖ్యంగా లోక కల్యాణార్థమై చేసిన సంధి ప్రయత్నమే ఈ నాటకాలలోని ఇతివృత్తం-

"కావ్యేషు నాటకం రమ్యమ్" - నాటకాంతం హి సాహిత్యమ్" -అని సాహిత్య సృష్టిలో నాటక రచన కవిప్రతిభకు గీటురాయని పండితుల అభిప్రాయం - అందులోనూ రంగస్థలం మీద ప్రదర్శింప బడినపుడే నాటకరచనకం సార్థకత - ఒక నాటకం ప్రదర్శించే వేళ, ఎదురుగా కూర్చున్న రసజ్ఞలోకం ఎంతగా పరవశించిపోయి బ్రహ్మానంద సహోదరమైన రసానందం అనుభవిస్తుందో - కవి అంతగా విజయం సాధించాడని అర్థం.

తిరుపతి వేంకటకవుల నాటక పద్యాలూ - పద్యచరణాలూ తెలుగువారి నిత్యజీవితంలో వివిధ సన్నివేశాలలో వినిపిస్తుంటాయి. నలుగురు కలిపి ప్రయాణం చేస్తున్నారనుకోండి తాము వెళ్తుతున్న వూరు అల్లంత దూరంలో కనపడగానే - "అదిగో ద్వారక" అని తెలుగువాడి నోటివెంట అప్రయత్నంగా వెలువడుతుంది. కొత్తగా బావగారు వస్తే - "బావా, యెప్పుడు వచ్చితీవు" అని తీయగా పలకరిస్తాడు తెలుగువాడు - ఏమాద్యమాన్నయినా ప్రారంభించి - నిరాఘాటంగా కొనసాగుతుంటే "జెండాపైకపిరాజు" అన్న పద్యం అందుకుంటాడు. విషాద సన్నివేశంలో చచ్చిరి సోదరుల్ సుతులు" అన్న పద్యం తెలుగువాడి గుండెగుడిలో ప్రతిధ్వనిస్తుంది. ఎవరైనా ఒక ప్రశాంతచిత్తుడు - ఆకస్మికంగా ఏదో ఒక కారణం మీద ఆగ్రహిస్తే - "అలుగుటయే యెరుంగని" అంటూ మిత్రులు వ్యాఖ్యానిస్తారు. ఇలాగే - "అరవిందాక్షుడు- శేషశాయి" "కౌరవ పాండవుల్ పెనగు కాలము చేరువయయ్యె" - నందకుమార! యుద్ధమున నారథమందు వశింపుమయ్య" - "ఉన్నది పుష్టి మానవులకున్" - "సేవా ధర్మము సూతధర్మము" - ఇలా ఎన్నో ఎన్నెన్నో పద్యాలు తెలుగు దేశంలో ప్రతినిత్యమూ వింటుంటాం - తెలుగువారి జీవితంలో ఇంతగా పెనవేసికొని పోయి - మాటలలో - సామెతలుగా - జాతీయులుగా - నానుడులుగా -ప్రతిధ్వనించడం గమనిస్తే తెలుగు వారి మీద తిరుపతి కవుల నాటకాల ప్రభావం ఎంతటిదో స్పష్టమవుతుంది - కవితా శిల్పంతో పాటుగా - ప్రదర్శనా సౌలభ్యంలో పాండవ నాటకాలలోని పద్యాలు ఎంత విశిష్టమైనవో తెలుస్తుంది.

> **"అదిగో, ద్వారక! ఆలమందలదిగో - నందందు గోరాడు. న**
> **య్యదియే కోట . అదే అగడ్త, అమె రథ్యల్, వారలే యాదవుల్!**
> **యదుసింహుడు వసించుమేడ అదిగో - నాలాన దంతావళా**
> **భ్యుదయంబై పరమందురాంతర తురంగోచ్చండమై పర్వెడున్"**

- పాండవోద్యోగ నాటక ప్రదర్శన ఈ పద్యంలో ప్రారంభమవుతుంది. ఈ పద్యంలో అర్జునుడి శ్రీకృష్ణ భక్తికీ - రమణీయకల్పనకూ ఎంత ప్రాధాన్యం వుందో, నాటక ప్రదర్శన సౌలభ్యానికి కూడా అంత ప్రాధాన్యం వుంది. అన్నగారి అజ్ఞమీద యుద్ధంలో సహాయం అర్థించడానికై వస్తున్నాడు అర్జునుడు. నరుడు నారాయణుడి పరమ భక్తుడు. అల్లంతదూరంలో ద్వారకను చూడగానే - అప్రయత్నంగా "అదిగో-ద్వారక" అంటూ ప్రకటిస్తాడు. ఆలమందలు గోపాలుని ధనం - ఎక్కడ ధర్మముంటే, అక్కడ గోధనం వుంటుంది. శ్రీకృష్ణుడి

ధర్మచరితానికి ఆలమందలు సజీవచిహ్నాలు. కోట ప్రభుత్వానికి చిహ్నం – అగడ్తలు రక్షణకు మారుపేరు. యాదవవీరుల రాజ్యరమకు ఆ రెండూ స్థిరమైన చిహ్నాలు. రథ్యాలు యాదవ రథసైన్యాన్ని సూచిస్తాయి. యాదవులు శ్రీకృష్ణుని బలగం. శ్రీకృష్ణుడు దుష్టశిక్షణకు ప్రతీక–శ్రీకృష్ణుడి మేడ చేరాలంటే – నడిమధ్యవున్న గజశాలలూ – అశ్వశాలలూ దాటాలి. ఆ శాలలు శ్రీకృష్ణుడి సైన్య విస్తారానికి చిహ్నాలు – ఇలా అంచెలంచెలుగా చూస్తున్న వాటిని చిన్న చిన్నవాక్యాలలో చిత్రించడం ఒక శిల్పం – అర్జునుడి శ్రీకృష్ణభక్తికి ఇవి పతకాలు – "ఆలాన దంతావళాభ్యుదయంబై వరమందురాంతర తురంగో చ్చండమై పర్వెదున్" అన్న దీర్ఘ సమాసం శ్రీకృష్ణుడి బల సంపదను సూచిస్తుంది. పద్యాన్ని పాడుతున్న పాత్ర రాగ ప్రస్తారానికి మార్గం చూపిస్తున్నది. ఏనుగులూ, గుర్రాలూ ఎంత పొడుగ్గావున్నా – వాటిని శాసించే సింహం అన్నిటికంటే అగ్రభాగంలో వుంది.

ఇక నాటక ప్రదర్శన దృష్టితో చూస్తే – అర్జునపాత్ర రంగం మీద ఒకవైపునుండి ప్రవేశించి, మరొకవైపునుండి నిష్క్రమించాలి. అర్జునపాత్రధారి "అదిగోద్వారక" అంటూ ప్రారంభించి – క్రమంగా ఆలమందలనూ, అగడ్తనూ, రథ్యలనూ, యాదవులనూ, గమనిస్తే ముందుసాగుతూ – చివరకు యదుసింహుని అంత:పురంలో ప్రవేశించాలి. – ఆ అభిమానికి కావలసినంత అవకాశం కల్పించారు ఈ పద్యంలో తిరుపతి కవులు.

మొదటి అంకంలో వున్న పాత్రలు మూడు – అర్జునుడు, సుయోధనుడు, కృష్ణుడు. జగన్నాటక సూత్రధారి ఐన శ్రీకృష్ణుడు కపట నిద్రలో నుండి మేలుకొన్నాడు, సహాయార్థమై వచ్చి తన పాదాల దగ్గర కూర్చోవడంలోనే అర్జునుడి శ్రీకృష్ణభక్తి వెల్లడవుతున్నది. అందుకే ఆయనను పలకరించిన తీరువేరు –తలవైపున ఠీవిగా దర్పంగా కూర్చున్న దుర్యోధనుణ్ణి పల్కరించిన తీరువేరు – కుశల ప్రశ్నలు వేయడం కూడా ఆయా పాత్రల స్వభావాలకు అనుగుణంగా సాగుతుంది – వినండి :

> **"ఎక్కడ నుండి రాకయిట? కెల్లరునున్ సుఖులే కదా! యశో**
> **భాక్కులు నీదు నన్నలును, భవ్యమనస్కులు నీదు తమ్ములున్**
> **చక్కగ నున్నవారె? భుజశాలి వృకోదరు – డగ్రజాజ్ఞకున్**
> **దక్కగ నిల్చి – శాంతు గతి – తేను చరించునె తెల్పు,మార్జునా!**

అంటూ ఎంతో ఆప్యాయంగా, ప్రేమానురాగాలతో అడుగుతాడు – పార్థుడి అన్నలు యశోభాక్కులట – తమ్ములు భవ్యమనస్కులట! వృకోదరుడు భుజశాలిమాట! భీమసేనుడు అమ్మగారి ఆజ్ఞవల్లశాంత వృత్తిలో నడుచుకుంటున్నాడా? అని అడుగుతాడు ఈ రకంగా పాండవులను ప్రశంసించే వాక్యాలు దుర్యోధనుడికి కడుపుమండాలి.

ఇక దుర్యోధనుణ్ణి పలకరించే తీరు ఎంత విచిత్రంగా – వ్యంగ్యంగా వున్నదో చూడండి –

> **"బావా! యెప్పుడు వచ్చితీవు? సుఖులే భ్రాతల్ సుతుల్ చుట్టముల్**
> **నీవాల్లభ్యము పట్టు కర్ణుడును, మన్నీలున్ సంఖోపేరులే?**
> **మీవంశోన్నతి గోరు భీష్ముడును, మీ కుల్గోరు ద్రోణాది భూ**
> **దేవుల్ సేమముమై నెసంగుదురె? నీ తేజంబు హెచ్చించుచున్"**

"బావా!" అని అనడంలో పైకి బంధుత్వం – లోపల పరిహాసం! "ఎప్పుడు వచ్చితీవు" అంటంలో అభిమాన ధనుడవైన నీవు ఇక్కడికి వచ్చి – ఇంతసేపు పడిగాపులు పడివుండవలసిన దుస్థితి ఏమి దాపురించిందన్నది వ్యంగ్యం! పాండవులకు విశేషణాలున్నాయి గాని, దుర్యోధనుడి తమ్ములకు, సుతులకు ఎటువంటె విశేషణాలూ లేవు" తన వాల్లభ్యము పట్టే కణ్ణుణ్ణి, మన్నీలను "సేవకులు"గా ప్రకటించాడు. అంటే కర్ణుడా, మగిలిన రాజులు నీకు నమస్కారాలు పెట్టేవారేకాని, నీ మేలుకోరేవారు కారని వ్యంగ్యం! వారు "సుఖులే– సుఖోపేతురే" అని అడగడంలో – వారు కేవలం భోగాలను వాంఛించే వారు మాత్రమేనని ధ్వని. "వారు సేసేమముపై నెసంగుదురె? నీ తేజంబు హెచ్చించుచున్" బీష్మ ద్రోణాదులను గురించి అడగడంలో – వారిద్దరూ క్షేమంగా వుంటేనే నీ తేజస్సు హెచ్చుతుందని హితవు పలికాడు. వినే వారికి ఇవి కుశల ప్రశ్నలా? లేక కశాఘాతాలా? అనిపించక తప్పదు.

నాటకం రక్తికట్టాలంటే రసపోషణ ముఖ్యం – భీముణ్ణి శ్రీకృష్ణుడు రెచ్చగొట్టే సందర్భంలో హాస్యరౌద్రరసాలు ఎలా చమత్కారంగా సమ్మేళనం చెందాయో చూడండి.

> **"నిదురపోవు చుంటిదొ? లేక, బెదరి పల్కు**
> **చుంటివో? కాక! నీవు కొల్లింటి భీమ**
> **సేనుడవె కాదో!యెన్నడే, చెవులు వినని**
> **కనులు చూడని శాంతంబు గానవచ్చె" –**

అంటూ శాంతి వాక్యాలు పలుకుతున్న భీముని శ్రీకృష్ణుడు ఎలా పరిహాసం చేశాడో గమనించండి. భీముడెంత బలవంతుడో – అంత అమాయకుడు. అతనికి కోపం సహజమైన అలంకారం కాని, శాంతంకాదు నిదురపోతున్నావా?లేక బెదిరిపోయి మాట్లాడుతున్నావా? – అని ఎత్తిపొడుస్తూ కృష్ణుడు చేసిన అవహేళనను భరించలేకపోయాడు భీముడు. పట్టరాని ఆగ్రహంతో యుద్ధానికే భయపడి పోతున్నానో – అన్నగారి మాటకు కట్టుబడి వున్నానో తెలిసికొనలేక పోతివిగదా? అని కృష్ణుడి మీద విజృంభించాడు.

**"అంబుధులింకుగాక - ప్రళయాంతము వచ్చిన వచ్చుగాక -లో కంబులు సూర్యచంద్రు లడగం తలకిందగుగాక - గొప్ప క ష్టంబులు మూడుగాక - పెనుసంపద పెంపరుగాక - యెట్టికు త్యంబుల నెందునేనడుగుదాటరు పాండవు - లన్నమాటకున్"**

పాండవు లందరిదీ ఒకేమాట - ఒకే బాట- కౌరవులలో ఒక్కొక్కరిదీ ఒక్కొక్కబాట! "అడుగుదాటరు పాండవులన్నమాటకున్" అనే వాక్యం ఈ పద్యానికి ప్రాణం." అన్న మాటకున్" అని వినగానే - శ్రోతలమనస్సు ఒక్కసారిగా వికసిస్తుంది.

ఇక కోపమెరుపుగా ఒక్క విషయం చెప్పాలి - రాయబారంలో శ్రీకృష్ణుని నోటివెంట వెలువడిన "చెల్లియొ చెల్లకో" - "అలుగుటయే యెరంగని" జెండాపై కపిరాజు" - సంతోషంబున సంధి సేయుదురె" - అనే నాలుగు పద్యాలు తెలుగు కవితా సరస్వతి కంఠసీమలో మణిహారాలు - తెలుగు నేలలో పశువుల కాపరుల దగ్గర నుంచీ పండిత ప్రకాండులవరకూ "వందే కృష్ణం జగద్గురుమ్" - అన్నట్లుగా పారాయణమంత్రాలుగా విలసిల్లుతుంటాయి. పాండవనాటకాల ప్రశస్తికీ, ప్రాచుర్యానికీ శ్రీకృష్ణపాత్రధారులైన మహాగాయకులు ఎంతో దోహదం చేశారు. బెల్లంకొండవారు - బందా -పీసపాడి-జబ్బారి-రఘురామయ్య ఎ.వి.సుబ్బారావు - షణ్ముఖి - సైదులు - ఇలా ఒకరా ఇద్దరా- ఎందరెందరో ఒక్కొక్కరూ ఒక్కొక్క విలక్షణమైన బాణీలో వారివాణిని వినిపించి తెలుగువారి హృదయాలను రసప్లావితం చేశారు. కాగా శ్రీకృష్ణుని అపూర్వరూపరేఖా విలాసాలను మనముందు సాక్షాత్కరింపజేసినవారు నందమూరి తారకరామారావు గారు పాండవనాటకాలలోని కవితాశిల్ప విశేషాలను - గాన మాధుర్యాన్నీ ఎన్నని వివరించగలం? ఆ తిరుపతి వేంకటేశ్వరస్వామి మహీ మాదు లను వర్ణించడం ఎంత సాధ్యమో - ఈ తిరుపతి వేంకట కవుల కవితావైభవాన్ని వివరించడం కూడా - అంతే సాధ్యమవు తుందని మనవి చేస్తున్నాను.

**"జయంతితే సుకృతినో రస సిద్ధాః కవీశ్వరాః"**

ఆచార్య నందిపాటి సుబ్బారావు

# అమరావతిలో భూగర్భజలాల అభివృద్ధి

నీరు లేనిదే మనిషిలేడు. మనిషి శరీరంలో మూడోముకోర. రే. దేశ ఆర్థికవ్యవస్థ కూడా నీటిమీదే ఆధారపడును. నీటిని రే. గా సృష్టించలేం. ఉన్న నీటిని మరల, మరల ఉపయోగించుచు.గామే. ఏ ప్రాంతమైన అభివృద్ధి చెందాలంటే మనిషి ఆరోగ్యంగా ఉండాలి. ఆరోగ్యమన్నది తాగునీటి నాణ్యత మీదా ఆధారపడునునుంటటే తాగునీటి నాణ్యత ప్రమాణాలకు లోబడియున్న నీటిని మాత్రమే సుసు కోవాలి. అలాలేని నీటిని కాలుష్యబారిన పడిన దానిగా పరిగణ తరు. కలుషితమైన నీటివలన అనారోగ్యం తథ్యం. ప్రపంచంలో పతతం వ్యాధులు, మూడోవంతు మరణాలకు మూలకారణం - కలుషితమైన తాగునీరే. ప్రపంచంలో వేల సంవత్సరాల క్రితం నదీ పరీవాహక ప్రాంతంలో ఏర్పడిన సింధు నాగరికత ఈనాటికి కూడా ప్రాపాముఖ్యమే. కారణం - నదీపరివాహక ప్రాంతంలో దొరికే మంచినీటినాణ్యత. అందుకే, ఆ వెల్లివిరిసిన నాగరికత ముందు తరాలకు ఆదర్శమైనది.

ఆంధ్రప్రదేశ్ రాజదాని "అమరావతి" కృష్ణానదీ పరీవాహక ప్రాంతంలో సుమారు 217 చ॥కి॥మీటర్ల సువిశాలమైన వైశాల్యంలో విస్తరించింది. గుంటూరు జిల్లాలోని తుళ్ళూరు, మంగళగిరిగిడుడేపల్లి మండలాలలోని మొత్తం 31 గ్రామాలను కలుపుతూ రాజధాని ఏర్పాటైనది. 2011 సంవత్సరపు జాతీయ జనాభా లెక్కల ప్రకారం రాజధాని జనాభా 1,03,000 భూవిజ్ఞాన శాస్త్రపరంగా, రాజధానికి ఈశాన్య ప్రాంతంలో కృష్ణానదికి ఆనుకొనియున్న ప్రాంతం "నదీ ఒండలి (River Alluvium) తో, మిగిలిన నైఋతి ప్రాంతం తూర్పు కనుమల అంతర్భాగమైన "ఛార్నోకైట్ సముదాయం (Charnockite Group)" అనే శిలలతో విస్తరించియున్నది.

రాజధాని అమరావతి ప్రాంతంలోని 28 గ్రామాలనుండి 28 భూగర్భజలాలను సేకరించి, వాటిని రసాయనిక విశ్లేషణ చేయటమైనది. భారతీయ తాగునీటి ప్రమాణాల సంస్థ (BIS) సూచించిన దాని ప్రకారం లీటరు తాగునీటిలో (PH) 6.5-9.2, కరిగిన మొత్తం లవణాలు (Total dissolved solids) 2,000 మి.గ్రా.లు, మొత్తం కఠినత (Total Hardness) 600 మి.గ్రా.లు, కాల్షియం 200 మి.గ్రా.లు, మెగ్నీషియం 100 మి.గ్రా.లు, సోడియం 200 మి.గ్రాలు, క్లోరైడ్ 1,000 మి.గ్రాలు, సల్ఫేటు 400 మి.గ్రాలు, నైట్రేటు 45 మి.గ్రాలు, ఫ్లోరైడు 1.5 మి.గ్రాలకు మించి యుండరాదు.

రాజధాని ప్రానితంలో దొరికే భూగర్భజలాలలో కరిగిన మొత్తం లవణాలు, 7 గ్రాములలో, మొత్తం కఠినత, 9 గ్రామాలలో కాల్షియం, 15 గ్రామాలలో మెగ్నీషియం, 12 గ్రామాలలో సోడియం, 15 గ్రామాలలో క్లోరైడ్, 2 గ్రామాలలో నైట్రేటు, 1 గ్రాంలో యుండవలసిన తాగునీటి నాణ్యత ప్రమాణాల పరిమితుల కంటే అధికంగా యున్నాయి. దానివలన, జీర్ణశయాంతర చికాకు (Gastrointestinal irritation) నీటి సరఫరా చేసే పరికరాలపై పెచ్చులు ఏర్పడటం (Seale formation on water distribution structines) అధిక రక్తపోటు (Hypertension) నీళ్ళు ఉప్పగా యుండటం (Salty taste) బ్లూబేబి వ్యాధి (Blue baby disease) రావటానికి అవకాశముంది. అయితే, ఈ భూగర్భజలాలలో పి. హెచ్, సల్ఫేటు ఫ్లోరైడు మోతాదులు తాగటానికి సూచించిన నీటి నాణ్యత ప్రమాణాల పరిమితులను మించలేవు.

ప్రధానంగా, రాజధాని అమరావతికి ఈశాన్యప్రాంతంలోని బోరు పాలెం,లింగాయపాలెం, ఉద్ధండరాయుని పాలెం, మోదలింగాయ పాలెం, తాళ్ళాయపాలెం, వెంకటాయపాలెం, ఉండవల్లి గ్రామాలలో దొరికే భూగర్భజల నాణ్యత తాగటానికి పూర్తిగా అనుకూలంగా యున్నది. అంటే, ఈ గ్రామాలలో దొరికే లీటరు భూగర్భజలాలలో కరిగిన మొత్తం లవణాలు 2,000 మి.గ్రా.లకు మించిలేవు.

కారణం - ఈ ప్రాంతంలో నదీ ఒండలి యుండటం, అందులో ఎక్కువ శాతం యిసుకను, తక్కువ శాతం మట్టినికలిగి యుండటం వలన జలసంబంధ లక్షణాలైన సాంద్రత (Porosity) పారగమ్యత (Permeability) లు ఎక్కువగా యుండటం చేత పడిన వర్షపు నీరు

సులభంగా భూఉపరితలం నుంచి భూగర్భంలోనికి చొచ్చుకొనిపోయి, భూగర్భజలంగా మారుతుంది. అంతే కాకుండా, ఈ ప్రాంతంలో భూగర్భజలాలు ఒక చోట నుంచి మరొక చోటకు తేలికగా ప్రవహించుటవలన నీరు బాగుగా పలుచనకు (dilution) గురి యగును. ఫలితంగా, ఈ ప్రాంతంలో దొరికే భూగర్భజలాలు తాగటానికి అనుకూలంగా యున్నాయి. అయితే, మిగిలిన రాజధాని ప్రాంతం (నైఋతివైపు)లోని భూ ఉపరితలం నల్లరేగడినేలను కలిగి యుండటం, అక్కడ భూగర్భంలోని శిలలలో తక్కువగా పగుళ్ళు యుండటం కారణంగా జలసంబంధ లక్షణాలైన సాంద్రత, పార గమ్యతలు కూడా తక్కువ స్థితిలో యుండటం చేత పడిన వర్షపు నీరు భూఉపరితలం నుంచి భూగర్భంలోనికి తక్కువ స్థాయిలో చొచ్చుకొనిపోవటం, భూగర్భంలో నీరు ఒకచోట నుంచి మరొక చోటకు అదేవిధంగా తక్కువ స్థాయిలో ప్రవహించుట చేత నీరు పసిరాగ పలుచనకు గురికాక ఈ నైఋతి ప్రాంతంలో దొరికే భూగర్భ జలాలు చప్పగా,ఉప్పగా, యుండి తాగటానికి అనుకూలంగా లేవు. అంటే, ఈ ప్రాంతంలోని లీటరు నీటిలో కరిగిన మొత్తం లవణాలు 2,000 మి.గ్రా.లకు మించి అధికంగా యున్నాయి. మరియు, అనంతవరం, అబ్బరాజుపాలెం, మందడం, మలకపేట గ్రామాలలో లీటరు భూగర్భజలంలో కరిగిన మొత్తం లవణాలు యింకా అధికంగా అంటే 3,000 మి.గ్రా.లకు మించి యున్నాయి.

సాధారణంగా, లీటరు నీటిలో నైట్రేటు 10 మి.గ్రాలకు మించి తాగునీటిలోయుంటే, అది "మానవ చర్యల మూలంగా ఏర్పడిన జలకాలుష్యాన్ని (man-made pollution) సూచిస్తుంది. రాజధాని అమరావతి ప్రాంతంలోని 17 గ్రామాలలో నైట్రేటు లీటరు నీటిలో 10 మి.గ్రా.లకు మించి యున్నది. దీనికి ప్రధానకారణం – ఈ ప్రాంతంలో అధికపంట దిగుబడుల కోసం అవసరానికి మించి అధికమోతాదులలో రసాయనిక ఎరువులను వినియోగించటమే.

నీటినిర్వహణ చర్యలు

పైన తెలిపిన శాస్త్రీయ కారణాల ప్రకారం, రాజధాని అమరావతి ఈశాన్య ప్రాంతంలోని గ్రామాలలో దొరికే భూగర్భజలాల నాణ్యత తాగటానికి పూర్తిగా అనుకూలంగా, మిగిలిన నైఋతి ప్రాంతంలోని గ్రామాలలో దొరికే భూగర్భ జలాల నాణ్యత ప్రతికూలంగా యున్నాయి. కాబట్టి ఈశాన్య ప్రాంతంలోని నీటిని సంరక్షణ చేయ టానికి, నైఋతి ప్రాంతంలోని నీటి నాణ్యతను మెరుగు పరచటానికి నీటి నిర్వహణ చర్యలను పాటించటం తప్పనిసరి. మరియు, రానున్న రోజులలో రాజధాని ప్రాంతంలో జనాభా పెరగడం ఖాయం. దీనికి అనుగుణంగా నీటి వినియోగం కూడా భారీస్థాయిలో పెరుగుతుంది.

**తాగునీటి నాణ్యత ప్రమాణాలు**

| రసాయనిక పెరామీటర్లు | లీటరు తాగునీటిలో యుండ వలసిన నీటి నాణ్యత ప్రమాణాల | నాణ్యత ప్రమాణాల పరిమితులు పరిమి తులను మించిన గ్రామాలు |
|---|---|---|
| పి. హెచ్. | 6.5–9.2 | – |
| కరిగిన మొత్తం లవణాలు | 2,000 మి.గ్రా | 7 |
| మొత్తం కఠినత | 600 మి.గ్రా | 9 |
| కాల్షియం | 200 మి.గ్రా | 15 |
| మెగ్నీషియం | 100 మి.గ్రా | 12 |
| సోడియం | 200 మి.గ్రా | 15 |
| క్లోరైడు | 1,000 మి.గ్రా | 2 |
| సల్ఫేటు | 400 మి.గ్రా | – |
| నైట్రేటు | 45 మి.గ్రా | 1 |
| ఫ్లోరైడు | 1.5 మి.గ్రా | – |

అందువలన, ఎప్పటికప్పుడు భూగర్భజలాల మట్టాలను కొలిచే "ఫిజియోమీటర్ల" ను ఎక్కువగా రాజధాని ప్రాంతంలో ఏర్పాటు చేయాలి. వీటి ద్వారా, గ్రామాలలోని భూగర్భజల మట్టాల హెచ్చు తగ్గులను సులువుగా గమనించవచ్చు. వీటికి అనుగుణంగా, తగినన్ని భూగర్భజలాల పున:పురణాకి (Groundwater recharge) కావలసిన నిర్మాణాలు, సంరక్షణ చర్యలు చేపట్టటానికి మార్గాలు సులువగును. ఈ చర్యలవలన భూగర్భజలాలు పెరగటమే కాకుండా, నిదానంగా భూగర్భజలాల నాణ్యత కూడా చాలా వరకు మెరుగు పడుటకు అవకాశముంది. రాజధాని ఈశాన్య ప్రాంతంలోని నదీతీరంలో ఎటువంటి సిమెంటు కట్టడాలు (Concrete jungles) నిర్మించరాదు. ఈ ప్రాంతాన్ని ఉపరితల, భూగర్భజలాల సంయుక్తవినియోగం (Conjuctive use of surface and ground waters) కోసం వదలి పెట్టటం వలన ఇంకా నీటివనరులు పెరగగలవు. మరియు, ఈ ప్రాంతంలో అశాస్త్రీయ యిసుక తవ్వకాలను పూర్తిగా అరికట్టపోతే, భూగర్భజలాలు అడుగంటే ప్రమాదమున్నది. కాబట్టి, వర్షపు నీటి సంరక్షణకై అవలంభించవలసిన నిర్మాణ ప్రణాళికలను ప్రధానంగా శిలలున్న నైఋతి ప్రాంతంలో తక్షణమే అమలు చేయవలసిన అవశ్యకతఎంతైనాయున్నది. ఈలాంటి నీటి నిర్వహణ చర్యలు అమలు చేస్తే, భవిష్యత్తులో పెరిగే జనాభాకు అనుగుణంగా భూగర్భజలాలు లభ్యతను పెంచవచ్చును. ఎలాంటి నీటి సమస్యలు తలెత్తకుండా యుంటాయి.

**చిరునామా :** ***ఆచార్య నందిపాటి సుబ్బారావు,*** భూవిజ్ఞానశాస్త్ర విభాగం, ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్టణం – 530003, 9848486967

